THE

# HOLY BIBLE

CONTAINING THE

# OLD AND NEW TESTAMENTS

TRANSLATED INTO

## THE TELUGU LANGUAGE

UNDER THE AUSPICES OF

The British and Foreign Bible Society

---

BRITISH AND FOREIGN BIBLE SOCIETY
MADRAS AUXILIARY

1929

# పరిశుద్ధ గ్రంథము

ఇందున

పాత నిబంధన గ్రంథమును

క్రొత్త నిబంధన గ్రంథమును ఇమిడియున్నవి

ఇది

బ్రిటిష్ అన్డ్ ఫారిన్ బైబిలు సొసైయటీవారి అనుమతిచొప్పున

ఆదిమ హెబ్రీ గ్రీకు భాషలలోనుండి

తెలుగు భాషలో తర్జుమా చేయబడినది

బ్రిటిష్ అన్డ్ ఫారిన్ బైబిలు సొసైయిటీకి ఉపసంఘమైన

చెన్నపురి సహాయక బైబిలు సొసైయటీ

# THE OLD TESTAMENT

TRANSLATED INTO

THE TELUGU LANGUAGE

---

# పాత నిబంధన గ్రంథము

---

ఇది

బ్రిటిష్ అన్డ్ ఫారిన్ బైబిలు సొసైయిటీవారి అనుమతిచొప్పున

ఆదిమ హెబ్రీ భాషలోనుండి

తెలుగు భాషలో తర్జుమ చేయబడినది

బ్రిటిష్ అన్ద్ ఫారిన్ బైబిలు సొసైయిటీకి ఉపసంఘమైన

చెన్నపురి సహాయక బైబిలు సొసైయిటీ

పాత నిబంధన గ్రంథములోని పుస్తకములు

## పుస్తకముల నామక్రమము, అధ్యాయముల వెరసి

# ఆ ది కా ం డ ము



ఆదియందు దేవుడు భూమ్యాకాశములను సృజించెను. । భూమి నిరాకారముగాను శూన్యముగాను ఉండెను; చీకటి అగాధ జలము పైన కమ్మియుండెను; దేవుని ఆత్మ జలములపైన అల్లాడుచుండెను. । దేవుడు—వెలుగు కమ్మని ఆజ్ఞనియ్యగా వెలుగు కలిగెను. । వెలుగు మంచిదైనట్టు దేవుడు చూచెను; దేవుడు వెలుగును చీకటిని వేరుపరచెను. । దేవుడు వెలుగునకు పగలనియు, చీకటికి రాత్రి అనియు పేరు పెట్టెను. అస్తమయమును ఉదయమును కలుగగా ఒక దినమాయెను.

మరియు దేవుడు—జలముల మధ్య నొక విశాలము కలిగి ఆ జలములను ఈ జలములను వేరుపరచు గాకని ఆజ్ఞయిచ్చెను. । దేవుడు ఆ విశాలము చేసి విశాలము క్రింది జలములను విశాలము మీది జలములను వేరుపరపగా ఆ ప్రకారమాయెను. । దేవుడు ఆ విశాలమునకు ఆకాశమని పేరు పెట్టెను. అస్తమయమును ఉదయమును కలుగగా రెండవ దినమాయెను.

దేవుడు—ఆకాశము క్రిందనున్న జలము లొక చోటనే కూర్చబడి ఆరిన నేల కనబడు గాకని ఆజ్ఞయియ్యగా ఆ ప్రకారమాయెను. । దేవుడు ఆరిన నేలకు భూమి అని పేరు పెట్టెను, జలరాశికి ఆయన సముద్రములని పేరు పెట్టెను, అది మంచిదైనట్టు దేవుడు చూచెను. । దేవుడు—గడ్డిని విత్తనములిచ్చు చెట్లను భూమిమీద తమ తమ జాతి ప్రకారము తమలో విత్తనములుగల ఫలమిచ్చు ఫలవృక్షములను భూమి మొలిపించుగాకని ఆజ్ఞయియ్యగా ఆ ప్రకారమాయెను. । భూమి గడ్డిని తమ తమ జాతి ప్రకారము విత్తనములిచ్చు చెట్లను, తమ తమ జాతి ప్రకారము తమలో విత్తనములుగల ఫలవృక్షములను మొలిపింపగా అది మంచిదైనట్టు దేవుడు చూచెను. । అస్తమయమును ఉదయమును కలుగగా మూడవ దినమాయెను.

దేవుడు—పగటిని రాత్రిని వేరుపరచునట్లు ఆకాశ విశాలమందు జ్యోతులు కలుగు గాకనియు, అవి సూచనలను కాలములను దిన సంవత్సరములను సూచించుటకై యుండు గాకనియు, । భూమిమీద వెలుగిచ్చుటకు అవి ఆకాశ విశాలమందు జ్యోతులై యుండు గాకనియు పలికెను; ఆ ప్రకారమాయెను. । దేవుడు ఆ రెండు గొప్ప జ్యోతులను, అనగా పగ
టిని ఏలుటకు పెద్ద జ్యోతిని రాత్రిని ఏలుటకు చిన్న
జ్యోతిని నక్షత్రములను చేసెను. । భూమిమీద వెలు 17
గిచ్చుటకును పగటిని రాత్రిని ఏలుటకును వెలుగును 18
చీకటిని వేరుపరచుటకును దేవుడు ఆకాశ విశాల
మందు వాటి నుంచెను; అది మంచిదైనట్టు దేవుడు
చూచెను. । అస్తమయమును ఉదయమును కలుగగా 19
నాలుగవ దినమాయెను.

దేవుడు — జీవముకలిగి చలించువాటిని జలములు 20
సమృద్ధిగా పుట్టించు గాకనియు, పక్షులు భూమిపైని
ఆకాశ విశాలములో ఎగురు గాకనియు పలికెను. ।
దేవుడు జలములలో వాటి వాటి జాతి ప్రకారము 21
జలములు సమృద్ధిగా పుట్టించిన మహా మత్స్యములను,
జీవముకలిగి చలించువాటినన్నిటిని, దాని దాని జాతి
ప్రకారము రెక్కలుగల ప్రతి పక్షిని సృజించెను.
అది మంచిదైనట్టు దేవుడు చూచెను. । దేవుడు—మీరు 22
ఫలించి అభివృద్ధిపొంది సముద్ర జలములలో నిండి
యుండుడనియు, పక్షులు భూమిమీద విస్తరించు
గాకనియు, వాటిని ఆశీర్వదించెను. । అస్తమయమును 23
ఉదయమును కలుగగా అయిదవ దినమాయెను.

దేవుడు—వాటి వాటి జాతి ప్రకారము జీవముగల 24
వాటిని, అనగా వాటి వాటి జాతి ప్రకారము పశువు
లను పురుగులను అడవి జంతువులను భూమి పుట్టించు
గాకని పలికెను; ఆ ప్రకారమాయెను. । దేవుడు ఆ 25
యా జాతుల ప్రకారము అడవి జంతువులను, ఆ యా
జాతుల ప్రకారము పశువులను, ఆ యా జాతుల
ప్రకారము నేలను ప్రాకు ప్రతి పురుగునుచేసెను.
అది మంచిదైనట్టు దేవుడు చూచెను. । దేవుడు—మన 26
స్వరూపమందు మన పోలికె చొప్పున నరులనుచేయు
దుము; వారు సముద్రపు చేపలను ఆకాశ పక్షులను
పశువులను సమస్త భూమిని భూమిమీద ప్రాకు ప్రతి
జంతువును ఏలుదురు గాకనియు పలికెను. । దేవుడు 27
తన స్వరూపమందు నరుని సృజించెను; దేవుని స్వరూప
మందు వాని సృజించెను; స్త్రీనిగాను పురుషునిగాను
వారిని సృజించెను. । దేవుడు వారిని ఆశీర్వదించెను; 28
ఎట్లనగా — మీరు ఫలించి అభివృద్ధిపొంది విస్తరించి
భూమిని నిండించి దాని లోపరచుకొనుడి; సముద్రపు
చేపలను ఆకాశ పక్షులను భూమిమీద ప్రాకు ప్రతి
జీవిని ఏలుడని దేవుడు వారితో చెప్పెను. । దేవుడు— 29

మా
వృక్షఫలము ఆహారమునకు మంచిదియు, కన్నులకు
అందమైనదియు వివేకమిచ్చు రమ్యమైన వృయేండ్లు;
యుండుట చూచినప్పుడు ఆమె దాని ఫల
కొన్ని తీసికొని తిని తనతోపాటు తన్పదికి ఒక
7 ఇచ్చెను, అతడుకూడ తినెను; । అప్పుడు శపించి
కన్నులు తెరవబడెను; వారు తాము దిగ విషయము
తెలిసికొని అంజూరపు ఆకులు కుట్టి తమకు నెమ్మది
8 మెలను చేసికొనిరి. । చల్లపూటను ఆదామున పేరు
భార్యయు తోటలో సంచరించుచున్న దేవుడాట
యెహోవా స్వరమును విని, తోట చెట్లమధ్యను లను
డైన యెహోవా ఎదుటికి రాకుండ దాగుకొనగా ।
9 దేవుడైన యెహోవా ఆదామును పిలిచి—నీవు ఎక్కడ
10 ఉన్నావనెను. । అందుకతడు—నేను తోటలో నీ
స్వరము వినినప్పుడు దిగంబరినిగా నుంటిని గనుక భయ
11 పడి దాగుకొంటిననెను. । అందుకాయన—నీవు దిగం
బరివని నీకు తెలిపినవాడెవడు? నీవు తినకూడదని నేను
నీ కాజ్ఞాపించిన వృక్షఫలములు తింటివా? అని అడి
12 గెను. । అందుకు ఆదాము—నాతో నుండుటకు నీవు
నాకిచ్చిన ఈ స్త్రీయే ఆ వృక్షఫలములు కొన్ని నా
13 కియ్యగా నేను తింటిననెను. । అప్పుడు దేవుడైన
యెహోవా స్త్రీని చూచి—నీవు చేసినది యేమిటని
అడుగగా స్త్రీ—సర్పము నన్ను మోసపుచ్చినందున
14 తింటిననెను. । అందుకు దేవుడైన యెహోవా సర్ప
మును చూచి—నీవు దీని చేసినందున పశువులన్నిటి
లోను భూజంతువులన్నిటిలోను నీవు శపించబడినదై
నీ కడుపుతో నడుచుచు నీవు బ్రదుకు దినములన్నియు
15 మన్ను తిందువు. । మరియు నీకును స్త్రీకిని నీ సంతాన
మునకును ఆమె సంతానమునకును వైరము కలుగజేసె
దను. అది నిన్ను తలమీద కొట్టును; నీవు దానిని
16 మడిమెమీద కొట్టుదువని చెప్పెను. । ఆయన స్త్రీని
చూచి—నీ ప్రయాసమును నీ గర్భవేదనను నేను
మిక్కిలి హెచ్చించెదను; వేదనతో పిల్లలు కందువు;
నీ భర్తయెడల నీకు వాంఛ కలుగును; అతడు నిన్ను
17 ఏలునని చెప్పెను. । ఆయన ఆదామును చూచి—
నీవు నీ భార్యమాట విని—తినవద్దని నేను నీ కాజ్ఞా
పించిన వృక్షఫలములు తింటివి గనుక నీ నిమిత్తము నేల
శపింపబడియున్నది; ప్రయాసముతోనే నీవు బ్రదుకు
18 దినములన్నియు దాని పంట తిందువు; । అది ముండ్ల
తుప్పలను గచ్చపొదలను నీకు మొలిపించును; పొలము
19 లోని పంట తిందువు; । నీవు నేలకు తిరిగి చేరుపర్యం
తము నీ ముఖపు చెమట కార్చి ఆహారము తిందువు;
ఏలయనగా నేలనుండి నీవు తీయబడితివి; నీవు మన్నే
20 గనుక తిరిగి మన్నైపోదువని చెప్పెను. । ఆదాము
తన భార్యకు హవ్వ అని పేరు పెట్టెను, ఏలయనగా
21 ఆమె జీవముగల ప్రతివానికిని తల్లి. । దేవుడైన యె

యుండెను; భూమిమీద సమస్త శరీరులు తమ మార్గ
మును చెరిపివేసుకొని యుండిరి.
దేవుడు నోవహును చూచి—సమస్త శరీరుల మూల 13
ముగా భూమి బలాత్కారముతో నిండియున్నది
గనుక నా సన్నిధిని వారి అంతము వచ్చియున్నది;
వారిని భూమితోకూడ నాశనము చేయుదును. । చితి 14
సారకపు మ్రానుతో నీకొరకు ఓడను చేసికొనుము.
అరలు పెట్టి ఆ ఓడను చేసి లోపటను వెలపటను
దానికి కీలు పూయవలెను. । నీవు దాని చేయవలసిన 15
విధమిది; ఆ ఓడ మున్నూరు మూరల పొడుగును
ఏబది మూరల వెడల్పును ముప్పది మూరల యెత్తును
గలదై యుండవలెను. । ఆ ఓడకు కిటికీ చేసి పై 16
మూర మూరెడు క్రిందికి దాని ముగించవలెను; ఓడ
ప్రక్కలను నిలువబట్టి ఉంచవలెను; క్రింది అంతస్థు
ఆదాము తన భార్యయైన హవ్వ గలదిగా దాని చేయ
ఆమె గర్భవతియై కయీనును కని —యెహోవా శరీరు 17
(దయ)వలన నేనొక మనుష్యుని సంపాదించుకొన్నా
ననెను. । తరువాత ఆమె అతని తమ్ముడగు హేబెలును 2
కనెను. హేబెలు గొఱ్ఱెల కాపరి; కయీను భూమిని
సేద్యపరచువాడు. । కొంతకాలమైన తరువాత కయీను 3
పొలపుపంటలో కొంత యెహోవాకు అర్పణగా
తెచ్చెను. । హేబెలు కూడ తన మందలో తొలు 4
చూలున పుట్టినవాటిలో క్రొవ్వినవాటిని కొన్ని
తెచ్చెను. యెహోవా హేబెలును అతని యర్పణను
లక్ష్యపెట్టెను; । కయీనును అతని యర్పణను ఆయన 5
లక్ష్యపెట్టలేదు. కాబట్టి కయీనుకు మిక్కిలి ఆగ్ర
హము వచ్చి అతడు తన ముఖము చిన్నబుచ్చుకొనగా ।
యెహోవా కయీనును చూచి—నీకు ఆగ్రహమేల? 6
ముఖము చిన్నబుచ్చుకొని యున్నావేమి? । నీవు 7
సత్క్రియ చేసినయెడల సంతోషముగా నుందువు గదా?
సత్క్రియ చేయనియెడల వాకిట పాపము పొంచియుం
డును; నీ యెడల దానికి వాంఛ కలుగును నీవు దానిని
ఏలుదువనెను. । కయీను తన తమ్ముడైన హేబెలుతో 8
మాటలాడెను. వారు పొలములో ఉన్నప్పుడు కయీను
తన తమ్ముడైన హేబెలుమీద పడి అతని చంపెను. ।
యెహోవా—నీ తమ్ముడైన హేబెలు ఎక్కడనున్నా 9
డని కయీను నడుగగా అతడు — నే నెరుగను; నా
తమ్మునికి నేను కావలివాడనా అనెను. । అప్పుడాయన 10
—నీవు చేసినపని యేమిటి? నీ తమ్ముని రక్తముయొక్క
స్వరము నేలలోనుండి నాకు మొరపెట్టుచున్నది. ।
కావున నీ తమ్ముని రక్తమును నీ చేతిలోనుండి పుచ్చు 11
కొనుటకు నోరు తెరచిన యీ నేలమీద ఉండకుండ,
నీవు శపింపబడినవాడవు; । నీవు నేలను సేద్యపరచు 12
నప్పుడు అది తన సారమును ఇకమీదట నీకియ్యదు.
నీవు భూమిమీద దిగులుపడుచు దేశదిమ్మరివై
వనెను. । అందుకు కయీను — నా దోష
భరింపలేనంత గొప్పది. । నేడు ఈ ప్ర

ఇదిగో భూమిమీదనున్న విత్తనములిచ్చు ప్రతి చెట్టును
విత్తనములిచ్చు వృక్షఫలముగల ప్రతి వృక్షమును మీ
30 కిచ్చియున్నాను; అవి మీకాహారమగును. । భూమి
మీదనుండు జంతువులన్నిటికిని ఆకాశ పక్షులన్నిటి
కిని భూమిమీద ప్రాకు సమస్త జీవులకును పచ్చని
చెట్లన్నియు ఆహారమగునని పలికెను. ఆ ప్రకారమా
31 యెను. । దేవుడు తాను చేసినది యావత్తును చూచిన
ప్పుడు అది మిక్కిలి బాగుగ నుండెను. అస్తమయమును
ఉదయమును కలుగగా ఆరవ దినమాయెను.

2 ఆకాశమును భూమియు వాటిలోనున్న సమస్త
2 సమూహమును సంపూర్తి చేయబడెను. । దేవుడు తాను
చేసిన తన పని యేడవదినములోగా సంపూర్తిచేసి,ాసెను.
చేసిన తన పని యంతటినుండి యేడ్ర ఊరిక తన కుమా
3 మించెను. । కాబట్టి దేకను పేరు పెట్టెను. । హనో
వ్వదించి పరిశుద్ధపప్పుట్టెను. ఈరాదు మహూయాయే
ాను కనెను. మహూయాయేలు మతూషాయేలును
19 కనెను. మతూషాయేలు లెమెకును కనెను. । లెమెకు
ఇద్దరు స్త్రీలను పెండ్లి చేసికొనెను; వారిలో ఒకదాని
20 పేరు ఆదా రెండవదాని పేరు సిల్లా. । ఆదా యా
బాలును కనెను. అతడు పశువులు గలవాడై గుడార
21 ములలో నివసించువారికి మూలపురుషుడు. । అతని
సహోదరుని పేరు యూబాలు. ఇతడు సితారాను
సానికను వాడుక చేయువారికందరికిని మూలపురు
22 షుడు. । మరియు సిల్లా తూబల్కయీనును కనెను.
అతడు పదునుగల ఇత్తడి పనిముట్లన్నిటిని ఇనుప
పనిముట్లన్నిటిని చేయువాడు. తూబల్కయీను
సహోదరిపేరు నయమా.

23 లెమెకు తన భార్యలను చూచి
—ఓ ఆదా ఓ సిల్లా, నా పలుకు వినుడి
లెమెకు భార్యలారా, నా మాట ఆలకించుడి.
నన్ను గాయపరచినందుకై ఒక మనుష్యుని చంపి
తిని
నన్ను దెబ్బకొట్టినందుకై ఒక పడుచువాని చంపి
తిని
24 ఏడంతలు ప్రతి దండన కయీను కొరకు వచ్చిన
యెడల
లెమెకు కొరకు డెబ్బది యేడంతలు వచ్చుననెను.
25 ఆదాము మరల తన భార్యను కూడినప్పుడు ఆమె
కుమారుని కని—కయీను చంపిన హేబెలుకు ప్రతిగా
దేవుడు నాకు మరి యొక సంతానమును నియమించె
26 ననుకొని అతనికి షేతు అను పేరు పెట్టెను. । మరియు
షేతుకు కూడ కుమారుడు పుట్టెను; అతనికి ఎనోషను
పేరు పెట్టెను. అప్పుడు యెహోవా నామమున
ప్రార్థనచేయుట ఆరంభమైనది.

5 ఆదాము వంశావళి గ్రంథము ఇదే. దేవుడు ఆదా
మును సృజించిన దినమున దేవుని పోలికగా అతని
యెపెను; । మగవానిగాను ఆడుదానిగాను వారిని 2
ములను ని వారు సృజించబడిన దినమున వారిని ఆశీర్వ
మంచి వారికి నరులని పేరు పెట్టెను. । ఆదాము నూట 3
నీవు వాటయేండ్లు బ్రదికి తన పోలికగా తన స్వరూ
పని నరునికుమారుని కని అతనికి షేతు అను పేరు
మరియ షేతును కనిన తరువాత ఆదాము బ్రదికిన 4
రిగానుండ ఎనమన్నూరు ఏండ్లు; అతడు కుమారులను
సహోయమను కనెను. । ఆదాము బ్రదికిన దినములన్ని 5
దేవు తొమ్మన్నూట ముప్పది యేండ్లు; అప్పుడతడు
ఆక్రాతిబొందెను.

షేతు నూట అయిదేండ్లు బ్రదికి ఎనోషును కనె 6
ను. । ఎనోషును కనిన తరువాత షేతు ఎనమన్నూట 7
ఏడేండ్లు బ్రదికి కుమారులను కుమార్తెలను కనెను. ।
షేతు బ్రదికిన దినములన్నియు తొమ్మన్నూట పన్నెం 8
డేండ్లు; అప్పుడతడు మృతిబొందెను.

ఎనోషు తొంబది సంవత్సరములు బ్రదికి కేయినా 9
నును కనెను. । కేయినానును కనిన తరువాత ఎనోషు 10
ఎనమన్నూట పదిహేనేండ్లు బ్రదికి కుమారులను
కుమార్తెలను కనెను. । ఎనోషు దినములన్నియు తొమ్మ 11
న్నూట అయిదేండ్లు; అప్పుడతడు మృతిబొందెను.

కేయినాను డెబ్బది యేండ్లు బ్రదికి మహలలేలును 12
కనెను. । మహలలేలును కనిన తరువాత కేయినాను 13
ఎనమన్నూట నలువది యేండ్లు బ్రదికి కుమారులను
కుమార్తెలను కనెను. । కేయినాను దినములన్నియు 14
తొమ్మన్నూట పది యేండ్లు; అప్పుడతడు మృతిబొం
దెను.

మహలలేలు అరువది యైదేండ్లు బ్రదికి యెరెదున్ను 15
కనెను. । యెరెదును కనిన తరువాత మహలలేలు 16
ఎనమన్నూట ముప్పది యేండ్లు బ్రదికి కుమారులను
కుమార్తెలను కనెను. । మహలలేలు దినములన్నియు 17
ఎనమన్నూట తొంబది యైదేండ్లు; అప్పుడతడు మృతి
బొందెను.

యెరెదు నూట అరువది రెండేండ్లు బ్రదికి హనో 18
కును కనెను. । హనోకును కనిన తరువాత యెరెదు 19
ఎనమన్నూరేండ్లు బ్రదికి కుమారులను కుమార్తెలను
కనెను. । యెరెదు దినములన్నియు తొమ్మన్నూట 20
అరువది రెండేండ్లు; అప్పుడతడు మృతిబొందెను.

హనోకు అరువది యైదేండ్లు బ్రదికి మెతూషెలను 21
కనెను. । హనోకు మెతూషెలను కనిన తరువాత 22
మున్నూరేండ్లు దేవునితో నడుచుచు కుమారులను
కుమార్తెలను కనెను. । హనోకు దినములన్నియు 23
మున్నూట అరువది యైదేండ్లు. । హనోకు దేవునితో 24
నడిచిన తరువాత దేవుడతని తీసికొనిపోయెను గనుక
అతడు లేకపోయెను.

మెతూషెల నూట ఎనుబది యేడేండ్లు బ్రదికి 25
లెమెకును కనెను. । మెతూషెల లెమెకును కనిన 26

తరువాత ఏడ్నూట ఎనుబది రెండేండ్లు బ్రదికి కుమా
27 రులను కుమార్తెలను కనెను. । మెతూషెల దినము
లన్నియు తొమ్మన్నూట అరువది తొమ్మిది యేండ్లు;
అప్పుడతడు మృతిబొందెను.
28 లెమెకు నూట ఎనుబది రెండేండ్లు బ్రదికి ఒక
29 కుమారుని కని । — భూమిని యెహోవా శపించి
నందువలన కలిగిన మన చేతుల కష్టము విషయము
లోను మన పనివిషయములోను ఇతడు మనకు నెమ్మది
కలుగజేయుననుకొని అతనికి నోవహు అని పేరు
30 పెట్టెను. । లెమెకు నోవహును కనిన తరువాత ఏనూట
తొంబది యైదేండ్లు బ్రదికి కుమారులను కుమార్తెలను
31 కనెను. । లెమెకు దినములన్నియు ఏడ్నూట డెబ్బది
యేడేండ్లు; అప్పుడతడు మృతిబొందెను.
32 నోవహు ఏనూరేండ్లు గలవాడై షేమును హామును
యాపెతును కనెను.

6 **న**రులు భూమిమీద విస్తరింప నారంభించిన తరు
2 వాత కుమార్తెలు వారికి పుట్టినప్పుడు దేవుని కుమా
రులు నరుల కుమార్తెలు చక్కనివారని చూచి వారంద
రిలో తమకు మనస్సువచ్చిన స్త్రీలను వివాహము చేసి
3 కొనిరి. । అప్పుడు యెహోవా—నా ఆత్మ నరులతో
ఎల్లప్పుడును వాదించదు; వారు తమ అక్రమ విషయ
ములో నరమాత్రులై యున్నారు; అయినను వారి
4 దినములు నూట ఇరువది యేండ్లగుననెను. । ఆ దిన
ములలో *నెఫీలులనువారు భూమిమీదనుండిరి, తరు
వాతను ఉండిరి. దేవుని కుమారులు నరుల కుమార్తె
లతో పోయినప్పుడు వారికి పిల్లలను కనిరి. పూర్వ
5 కాలమందు పేరు పొందిన శూరులు వీరే. । నరుల
చెడుతనము భూమిమీద గొప్పదనియు, వారి హృద
యములయొక్క తలంపులలోని ఊహ అంతయు ఎల్ల
ప్పుడు కేవలము చెడ్డదనియు యెహోవా చూచి ।
6 తాను భూమిమీద నరులను సృష్టించినందుకు యె
హోవా సంతాపము నొంది తన హృదయములో
7 నొచ్చుకొనెను. । అప్పుడు యెహోవా — నేను
సృజించిన నరులును నరులతోకూడ జంతువులును
పురుగులును ఆకాశ పక్ష్యాదులును భూమిమీద నుండ
కుండ తుడిచివేయుదును; ఏలయనగా నేను వారిని
సృష్టించినందుకు సంతాపము నొందియున్నాననెను. ।
8 అయితే నోవహు యెహోవా దృష్టికి కటాక్షము
పొందినవాడాయెను.
9 నోవహు వంశావళి యిదే. నోవహు నీతిపరుడును
తన తరములో నిందారహితుడునై యుండెను. నోవ
10 హు దేవునితోకూడ నడిచినవాడు. । షేము, హాము,
యాపెతను ముగ్గురు కుమారులను నోవహు కనెను. ।
11 భూలోకము దేవుని సన్నిధిని చెడిపోయియుండెను;
భూలోకము బలాత్కారముతో నిండియుండెను. ।
12 దేవుడు భూలోకమును చూచినప్పుడు అది చెడిపోయి
యుండెను; భూమిమీద సమస్త శరీరులు తమ మార్గ
మును చెరిపివేసుకొని యుండిరి.
దేవుడు నోవహును చూచి—సమస్త శరీరుల మూల 13
ముగా భూమి బలాత్కారముతో నిండియున్నది
గనుక నా సన్నిధిని వారి అంతము వచ్చియున్నది;
వారిని భూమితోకూడ నాశనము చేయుదును. । చితి 14
సారకపు మ్రానుతో నీకొరకు ఓడను చేసికొనుము.
అరలు పెట్టి ఆ ఓడను చేసి లోపటను వెలపటను
దానికి కీలు పూయవలెను. । నీవు దాని చేయవలసిన 15
విధమిది; ఆ ఓడ మున్నూరు మూరల పొడుగును
ఏబది మూరల వెడల్పును ముప్పది మూరల యెత్తును
గలదై యుండవలెను. । ఆ ఓడకు కిటికీ చేసి పై 16
నుండి మూరెడు క్రిందికి దాని ముగించవలెను; ఓడ
తలుపు దాని ప్రక్కను ఉంచవలెను; క్రింది అంతస్థు
రెండవ అంతస్థు మూడవ అంతస్థు గలదిగా దాని చేయ
వలెను. । ఇదిగో నేనే జీవవాయువుగల సమస్త శరీరు 17
లను ఆకాశము క్రిందనుండకుండ నాశము చేయుటకు
భూమిమీదికి జలప్రవాహము రప్పించుచున్నాను.
లోకమందున్న సమస్తమును చనిపోవును; । అయితే 18
నీతో నా నిబంధన స్థిరపరచుదును; నీవును నీతోకూడ
నీ కుమారులును నీ భార్యయు నీ కోడండ్లును ఆ
ఓడలో ప్రవేశింపవలెను. । మరియు నీతోకూడ 19
వాటిని బ్రదికించి యుంచుకొనుటకు సమస్త జీవు
లలో, అనగా సమస్త శరీరులయొక్క ప్రతి జాతి
లోనివి రెండేసి చొప్పున నీవు ఓడలోకి తేవలెను;
వాటిలో మగదియు ఆడుదియు నుండవలెను. । నీవు 20
వాటిని బ్రదికించి యుంచుకొనుటకై వాటి వాటి
జాతుల ప్రకారము పక్షులలోను, వాటి వాటి జాతుల
ప్రకారము జంతువులలోను, వాటి వాటి జాతుల
ప్రకారము నేలను ప్రాకు వాటన్నిటిలోను, ప్రతి
జాతిలో రెండేసి చొప్పున నీయొద్దకు అవి వచ్చును. ।
మరియు తినుటకు నానావిధమైన ఆహారపదార్థము 21
లను కూర్చుకొని నీదగ్గర ఉంచుకొనుము; అవి నీకును
వాటికిని ఆహారమగునని చెప్పెను. । నోవహు అట్లు 22
చేసెను; దేవుడు అతని కాజ్ఞాపించిన ప్రకారము
యావత్తు చేసెను.

**యె**హోవా — ఈ తరమువారిలో నీవే నా 7
యెదుట నీతిమంతుడవై యుండుట చూచితిని గనుక
నీవును నీ యింటివారును ఓడలో ప్రవేశించుడి. ।
పవిత్ర జంతువులలో ప్రతి జాతి పోతులు ఏడును 2
పెంటులు ఏడును, పవిత్రములు కాని జంతువులలో
ప్రతి జాతి పోతును పెంటిని రెండును । ఆకాశ 3
పక్షులలో ప్రతి జాతి మగవి యేడును ఆడువి
యేడును, నీవు భూమి అంతటిమీద సంతతిని జీవముతో
కాపాడునట్లు నీయొద్ద ఉంచుకొనుము; । ఎందుకనగా 4
ఇంకను ఏడు దినములకు నేను నలుబది పగళ్లును నలు

బది రాత్రులును భూమిమీద వర్షము కురిపించి, నేను
చేసిన సమస్త జీవరాసులను భూమిమీద ఉండకుండ
5 తుడిచివేయుదునని నోవహుతో చెప్పెను. । తనకు
యెహోవా ఆజ్ఞాపించిన ప్రకారము నోవహు యా
వత్తు చేసెను.
6 ఆ జలప్రవాహము భూమిమీదికి వచ్చినప్పుడు
7 నోవహు ఆర్నూరేండ్లవాడు. । అప్పుడు నోవహును
అతనితోకూడ అతని కుమారులును అతని భార్యయు
అతని కోడండ్లును ఆ ప్రవాహజలములను తప్పించు
8 కొనుటకై ఆ ఓడలో ప్రవేశించిరి. । దేవుడు నో
9 వహుకు ఆజ్ఞాపించిన ప్రకారము పవిత్ర జంతువుల
లోను అపవిత్ర జంతువులలోను, పక్షులలోను నేలను
ప్రాకు వాటన్నిటిలోను, మగది ఆడుది జతజతలుగా
10 ఓడలోనున్న నోవహు నొద్దకు చేరెను. । ఏడు దిన
ములైన తరువాత ఆ ప్రవాహజలములు భూమిమీదికి
11 వచ్చెను. । నోవహు వయసుయొక్క ఆర్నూరవ సం
వత్సరము రెండవ నెల పదియేడవ దినమున మహాగాధ
జలముల ఊటలన్నియు ఆ దినమందే విడబడెను,
12 ఆకాశపు తూములు విప్పబడెను. । నలుబది పగళ్లును
నలుబది రాత్రులును ప్రచండవర్షము భూమిమీద కురి
13 సెను. । ఆ దినమందే నోవహును నోవహు కుమారు
లగు షేమును హామును యాపెతును నోవహు భార్య
యు వారితోకూడ అతని ముగ్గురు కోడండ్లును ఆ
14 ఓడలో ప్రవేశించిరి. । వీరే కాదు; ఆ యా జాతుల
ప్రకారము ప్రతి మృగమును, ఆ యా జాతుల ప్రకా
రము ప్రతి పశువును, ఆ యా జాతుల ప్రకారము
నేలమీద ప్రాకు ప్రతి పురుగును, ఆ యా జాతుల
ప్రకారము ప్రతి పక్షియు, నానావిధములైన రెక్కలు
15 గల ప్రతి పిట్టయు ప్రవేశించెను. । జీవాత్మగల సమస్త
శరీరులలో రెండేసి రెండేసి ఓడలోనున్న నోవహు
16 నొద్ద ప్రవేశించెను. । ప్రవేశించినవన్నియు దేవుడు
అతని కాజ్ఞాపించిన ప్రకారము సమస్త శరీరులలో
మగదియు ఆడుదియు ప్రవేశించెను; అప్పుడు యె
17 హోవా ఓడలో అతని మూసివేసెను. । ఆ జలప్రవా
హము నలుబది దినములు భూమిమీద నుండగా, జల
ములు విస్తరించి ఓడను తేలచేసినందున అది భూమి
18 మీదనుండి పైకి లేచెను. । జలములు భూమిమీద
ప్రచండముగా ప్రబలి మిక్కిలి విస్తరించినప్పుడు
19 ఓడ నీళ్లమీద నడచెను. । ఆ ప్రచండ జలములు
భూమిమీద అత్యధికముగా ప్రబలినందున ఆకాశ
మంతటి క్రిందనున్న గొప్ప పర్వతములన్నియు మునిగి
20 పోయెను. । పదిహేను మూరల యెత్తున నీళ్లు ప్రచం
డముగా ప్రబలెను గనుక పర్వతములును మునిగి
21 పోయెను. । అప్పుడు పక్షులేమి పశువులేమి మృగము
లేమి భూమిమీద ప్రాకు పురుగులేమి భూమిమీద
సంచరించు సమస్త శరీరులేమి సమస్త నరులేమి చచ్చి
పోయిరి. । పొడి నేలమీదనున్న వాటన్నిటిలోను
నాసికారంధ్రములలో జీవాత్మ సంబంధమైన ఊపిరి
గలవన్నియు చనిపోయెను. । నరులతోకూడ పశువు
లును పురుగులును ఆకాశపక్షులును నేలమీదనున్న
జీవరాసులన్నియు తుడిచివేయబడెను. అవి భూమి
మీద నుండకుండ తుడిచివేయబడెను. నోవహును అత
నితోకూడ ఆ ఓడలో నున్నవియు మాత్రము మిగిలి
యుండెను. । నూట ఏబది దినముల పర్యంతము నీళ్లు
భూమిమీద ప్రచండముగా ప్రబలెను.

దేవుడు నోవహును అతనితోకూడ ఓడలో
నున్న సమస్త జంతువులను సమస్త పశువులను జ్ఞాప
కము చేసికొనెను. దేవుడు భూమిమీద వాయువు
విసరునట్లు చేయుటవలన నీళ్లు తగ్గిపోయెను. । అగాధ
జలముల ఊటలును ఆకాశపు తూములును మూయ
బడెను; ఆకాశమునుండి కురియుచున్న ప్రచండవర్షము
నిలిచిపోయెను. । అప్పుడు నీళ్లు భూమిమీదనుండి
క్రమక్రమముగా తీసి పోవుచుండెను; నూట ఏబది
దినములైనతరువాత నీళ్లు తగ్గిపోగా । ఏడవ నెల
పదియేడవ దినమున ఓడ అరారాతు కొండలమీద నిలి
చెను. । నీళ్లు పదియవ నెలవరకు క్రమముగా తగ్గుచు
వచ్చెను. పదియవ నెల మొదటిదినమున కొండల శిఖ
రములు కనబడెను. । నలుబది దినములైనతరువాత
నోవహు తాను చేసిన ఓడ కిటికీ తీసి । ఒక కాకిని
వెలుపలికి పోవిడిచెను. అది బయటికి వెళ్లి భూమి
మీదనుండి నీళ్లు ఇంకిపోవువరకు ఇటుఅటు తిరుగు
చుండెను. । మరియు నీళ్లు నేలమీదనుండి తగ్గినవో
లేదో చూచుటకు అతడు తన యొద్దనుండి నల్ల పావుర
మొకటి వెలుపలికి పో విడిచెను. । నీళ్లు భూమి అంతటి
మీద నున్నందున తన అరకాలు నిలుపుటకు దానికి
స్థలము దొరకలేదుగనుక ఓడలోనున్న అతనియొద్దకు
తిరిగి వచ్చెను. అప్పుడతడు చెయ్యి చాపి దాని పట్టు
కొని ఓడలోకి తీసికొనెను. । అతడు మరి యేడు
దినములు తాళి మరల ఒక నల్ల పావురమును ఓడలో
నుండి వెలుపలికి విడిచెను. । సాయంకాలమున అది
అతనియొద్దకు వచ్చినప్పుడు త్రుంచబడిన ఒలీవచెట్టు
ఆకు దాని నోటనుండెను గనుక నీళ్లు భూమిమీదను
నుండి తగ్గిపోయెనని నోవహుకు తెలిసెను. । అతడింక
మరి యేడు దినములు తాళి ఆ పావురమును వెలుపలికి
విడిచెను. ఆ తరువాత అది అతనియొద్దకు తిరిగి రా
లేదు. । మరియు ఆర్నూట ఒకటవ సంవత్సరము
మొదటినెల తొలిదినమున నీళ్లు భూమిమీదనుండి
యింకిపోయెను. నోవహు ఓడ కప్పు తీసి చూచి
నప్పుడు నేల ఆరియుండెను. । రెండవ నెల యిరువది
యేడవ దినమున భూమి యెండి యుండెను.

అప్పుడు దేవుడు — నీవును నీతోకూడ నీ భార్యను
యు నీ కుమారులును నీ కోడండ్లును ఓడలోనుండి

బయటికి రండి. । పక్షులు పశువులు భూమిమీద
ప్రాకు ప్రతిజాతి పురుగులు మొదలైన సమస్తశరీ
రులలో నీతోకూడనున్న ప్రతిజంతువును వెంటబెట్టు
కొని వెలపలికి రావలెను. అవి భూమిమీద బహుగా
విస్తరించి భూమిమీద ఫలించి అభివృద్ధి పొందవలెనని
నోవహుతో చెప్పెను. । కాబట్టి నోవహును అతని
తోకూడ అతని కుమారులును అతని భార్యయు అతని
కోడండ్లును బయటికి వచ్చిరి. । ప్రతి జంతువును
ప్రాకు ప్రతిపురుగును ప్రతిపిట్టయు భూమిమీద
సంచరించునన్నియు వాటి వాటి జాతులచొప్పున
ఆ ఓడలోనుండి బయటికి వచ్చెను. । అప్పుడు
నోవహు యెహోవాకు బలిపీఠమును కట్టి, పవిత్ర
పశువులన్నిటిలోను పవిత్ర పక్షులన్నిటిలోను కొన్ని
తీసికొని ఆ పీఠముమీద దహనబలి అర్పించెను. ।
అప్పుడు యెహోవా ఇంపయిన సువాసన నాఘ్రా
ణించి—ఇకమీదట నరులనుబట్టి భూమిని మరల శపిం
చను; ఎందుకనగా నరుల హృదయాలోచన వారి
బాల్యమునుండి చెడ్డది. నే నిప్పుడు చేసినప్రకార
ముగా ఇకను సమస్త జీవులను సంహరింపను. । భూమి
నిలిచియున్నంతవరకు వెదకాలమును కోతకాలమును
శీతోష్ణములును వసంత శీతకాలములును దివారాత్ర
ములును ఉండక మానవని తన హృదయములో అను
కొనెను. మరియు దేవుడు నోవహును అతని కుమారు
లను ఆశీర్వదించి—మీరు ఫలించి అభివృద్ధి పొంది భూ
మిని నింపుడి. । మీ భయమును మీ బెదురును అడవి
జంతువులన్నిటికిని ఆకాశ పక్షులన్నిటికిని నేలమీద
ప్రాకు ప్రతి పురుగుకును సముద్రపు చేపలన్నిటికిని
కలుగును; అవి మీ చేతి కప్పగింపబడి యున్నవి. ।
ప్రాణముగల ప్రతిజంతువు మీకు ఆహారమగును;
పచ్చని కూర మొక్కల నిచ్చినట్లు వాటిని మీకిచ్చి
యున్నాను. । అయినను మాంసమును దాని రక్తముతో
మీరు తినకూడదు; రక్తమే దాని ప్రాణము. । మరియు
మీకు ప్రాణమైన మీ రక్తమునుగూర్చి విచారణ
చేయుదును; దానిగూర్చి ప్రతిజంతువును నరులను
విచారణ చేయుదును; ప్రతినరుని ప్రాణమునుగూర్చి
వాని సహోదరుని విచారణ చేయుదును. । నరుని
రక్తమును చిందించువాని రక్తము నరునివలననే చిం
దింపబడును; ఏలయనగా దేవుడు తన స్వరూపమందు
నరుని చేసెను. । మీరు ఫలించి అభివృద్ధినొందుడి;
మీరు భూమిమీద సమృద్ధిగా సంతానము కని విస్త
రించుడని వారితో చెప్పెను.

మరియు దేవుడు నోవహును అతని కుమారులను
చూచి । —ఇదిగో నేను మీతోను మీ తదనంతరము
మీ సంతానముతోను మీతోకూడనున్న ప్రతి జీవి
తోను, పక్షులేమి పశువులేమి మీతోకూడ సమస్త
మైన భూజంతువులేమి ఓడలోనుండి బయటికి వచ్చిన
సమస్త భూజంతువులతోను నా నిబంధన స్థిరపరచు
చున్నాను. । నేను మీతో నా నిబంధన స్థిరపరచు 11
దును; సమస్త శరీరులు ప్రవాహజలములవలన ఇకను
లయపరచబడరు; భూమిని నాశనముచేయుటకు ఇకను
జలప్రవాహము కలుగదని పలికెను. । మరియు దేవు 12
డు—నాకును మీకును మీతోకూడనున్న సమస్త జీవ
రాసులకును మధ్య నేను తరతరములకు ఏర్పరచు
చున్న నిబంధనకు గురుతు ఇదే. । మేఘములో నా 13
ధనుస్సును ఉంచితినిగదా; అది నాకును భూమికిని
మధ్య నిబంధనకు గురుతుగా నుండును. । భూమిపైకి 14
నేను మేఘమును రప్పించునప్పుడు ఆ ధనుస్సు మేఘ
ములో కనబడును. । అప్పుడు నాకును మీకును సమస్త 15
జీవరాసులకును మధ్యనున్న నా నిబంధనను జ్ఞాప
కము చేసికొందును గనుక సమస్తశరీరులను నాశనము
చేయుటకు ఆలాగు ప్రవాహముగా నీళ్లు రావు, ।
ఆ ధనుస్సు మేఘములో నుండును. నేను దాని చూచి 16
దేవునికిని భూమిమీదనున్న సమస్త శరీరులలో ప్రాణ
ముగల ప్రతిదానికిని మధ్యనున్న నిత్యనిబంధనను జ్ఞాప
కము చేసికొందుననెను. । మరియు దేవుడు—నాకును 17
భూమిమీదనున్న సమస్తశరీరులకును మధ్య నేను స్థిరపర
చిన నిబంధనకు గురుతు ఇదే అని నోవహుతో చెప్పెను.

ఓడలోనుండి వచ్చిన నోవహు కుమారులు షేము 18
హాము యాపెతనువారు; హాము కనానుకు తండ్రి. ।
ఈ ముగ్గురు నోవహు కుమారులు; వీరి సంతానము 19
భూమియందంతట వ్యాపించెను.

నోవహు వ్యవసాయకుడై ద్రాక్షతోట వేసెను. । 20
పిమ్మట ద్రాక్షారసము త్రాగి మత్తుడై తన గుడార 21
ములో వస్త్రహీనుడుగా నుండెను. । అప్పుడు కనా 22
నుకు తండ్రియైన హాము తన తండ్రి వస్త్రహీనుడై
యుండుట చూచి బయటనున్న తన యిద్దరు సహో
దరులకు ఆ సంగతి తెలిపెను. । అప్పుడు షేమును 23
యాపెతును వస్త్రమొకటి తీసికొని తమ యిద్దరి భుజ
ములమీద వేసికొని వెనుకకు నడిచి వెళ్లి తమ తండ్రి
దిసమొలను కప్పిరి; వారి ముఖములు వెనుకతట్టు ఉం
డుటవలన తమ తండ్రి దిసమొలను చూడలేదు. ।
అప్పుడు నోవహు మత్తునుండి మేలుకొని తన చిన్న 24
కుమారుడు చేసినదాని తెలిసికొని—

కనాను శపింపబడినవాడై తన సహోదరులకు 25
అతినీచుడైన దాసుడగును

అనెను. । మరియు అతడు— 26

షేము దేవుడైన యెహోవా స్తుతింపబడునుగాక
కనాను అతనికి దాసుడగును.
దేవుడు యాపెతును విశాలపరచును 27
అతడు షేము గుడారములలో నివసించును
అతనికి కనాను దాసుడగును

అనెను.

కలుగునట్లును నిన్నుబట్టి నేను బ్రదుకునట్లును నీవు
14 నా సహోదరివని దయచేసి చెప్పుమనెను. । అబ్రా
ము ఐగుప్తులో చేరినప్పుడు ఐగుప్తీయులు ఆ స్త్రీ
మిక్కిలి సౌందర్యవతియయి యుండుట చూచిరి. ।
15 ఫరోయొక్క అధిపతులు ఆమెను చూచి ఫరో
యెదుట ఆమెను పొగడిరి గనుక ఆ స్త్రీ ఫరో యిం
16 టికి తేబడెను. । అతడామెనుబట్టి అబ్రాముకు మేలు
చేసెను; అందువలన అతనికి గొఱ్ఱెలు గొడ్లు మగ
గాడిదెలు దాసులు పనికత్తెలు ఆడుగాడిదెలు ఒం
17 టెలు ఇయ్యబడెను. । అయితే యెహోవా అబ్రా
ము భార్యయయిన శారయినిబట్టి ఫరోను అతని యింటి
18 వారిని మహా వేదనలచేత బాధించెను. । అప్పుడు
ఫరో అబ్రామును పిలిపించి — నీవు నాకు చేసినది
యేమిటి? ఈమె నీ భార్య అని నాకెందుకు తెలుప
19 లేదు? । ఈమె నా సహోదరి అని యేల చెప్పి
తివి? నేనామెను నా భార్యగా చేసికొందునేమో.
అయితే నేమి, ఇదిగో నీ భార్య; ఈమెను తీసికొని
20 పొమ్మని చెప్పెను. । మరియు ఫరో అతని విషయమై
తన జనులకాజ్ఞాపించినందున వారు అతనిని అతని
భార్యను అతనికి కలిగిన సమస్తమును పంపివేసిరి.

**13** అబ్రాము తనకు కలిగిన సమస్తమును తన భార్యను
తనతోకూడనున్న లోతును వెంటబెట్టుకొని ఐగుప్తు
2 లోనుండి దక్షిణదేశమునకు వెళ్లెను. । అబ్రాము
వెండి బంగారము పశువులు కలిగి బహు ధనవంతుడై
3 యుండెను. । అతడు ప్రయాణము చేయుచు దక్షి
ణమునుండి బేతేలువరకు, అనగా బేతేలుకును హాయి
కిని మధ్య తన గుడారము మొదట ఉండిన స్థలము
4 వరకు వెళ్లి । తాను మొదట బలిపీఠమును కట్టినచోట
చేరెను. అక్కడ అబ్రాము యెహోవా నామమున
5 ప్రార్థనచేసెను. । అబ్రాముతోకూడ వెళ్లిన లోతు
కును గొఱ్ఱెలు గొడ్లు గుడారములు ఉండెను గనుక ।
6 వారు కలిసి నివసించుటకు ఆ ప్రదేశము చాలక
పోయెను; ఎందుకనగా వారి ఆస్తి వారు కలిసి నివ
7 సించలేనంత విస్తారమైయుండెను. । అప్పుడు అబ్రా
ము పశువుల కాపరులకును లోతు పశువుల కాప
రులకును కలహము పుట్టెను. ఆ కాలమందు కనా
నీయులు పెరిజ్జీయులు ఆ దేశములో కాపురముం
8 డిరి. । కాబట్టి అబ్రాము — మనము బంధువులము
గనుక నాకు నీకును, నా పశువుల కాపరులకు నీ పశు
9 వుల కాపరులకును కలహముండకూడదు. । ఈ దేశ
మంతయు నీ యెదుట నున్నదిగదా, దయచేసి నన్ను
విడిచి వేరుగానుండుము. నీవు ఎడమతట్టుకు వెళ్లిన
యెడల నేను కుడితట్టుకును, నీవు కుడితట్టుకు వెళ్లిన
యెడల నేను ఎడమతట్టుకును వెళ్లుదునని లోతుతో
10 చెప్పగా । లోతు తన కన్నులెత్తి యొర్దాను ప్రాంత
మంతటిని చూచెను. యెహోవా సొదొమ గొమొఱ్ఱా
అను పట్టణములను నాశనముచేయకమునుపు సోయ
రుకు వచ్చువరకు అదంతయు యెహోవా తోట
వలెను ఐగుప్తు దేశమువలెను నీళ్లుపారు దేశమైయుం
డెను । కాబట్టి లోతు తనకు యొర్దాను ప్రాంతమం 11
తటిని ఏర్పరచుకొని తూర్పుగా ప్రయాణముచేసెను.
అట్లు వారు ఒకరినొకరు విడిచి వేరై పోయిరి. ।
అబ్రాము కనానులో నివసించెను. లోతు ఆ మైదాన 12
మందున్న పట్టణముల ప్రదేశములలో కాపురముండి
సొదొమదగ్గర తన గుడారము వేసికొనెను. । సొదొమ 13
మనుష్యులు దుష్టులును యెహోవా దృష్టికి బహు
పాపులునై యుండిరి. । లోతు అబ్రామును విడిచి 14
పోయినతరువాత యెహోవా—ఇదిగో నీ కన్నులెత్తి
నీవు ఉన్నచోటనుండి ఉత్తరపుతట్టు దక్షిణపుతట్టు
తూర్పుతట్టు పడమరతట్టును చూడుము; । ఎందుకనగా 15
నీవు చూచుచున్న యీ దేశమంతటిని నీకును నీ సం
తానమునకును సదాకాలము ఇచ్చెదను. । మరియు 16
నీ సంతానమును భూమిమీదనుండు రేణువులవలె
(విస్తరింప) చేసెదను; ఎట్లనగా ఒకడు భూమిమీద
నుండు రేణువులను లెక్కింప గలిగినయెడల నీ సం
తానమును కూడ లెక్కింపవచ్చును. । నీవు లేచి యీ 17
దేశముయొక్క పొడుగున వెడల్పున దానిలో సంచ
రించుము; అది నీకిచ్చెదనని అబ్రాముతో చెప్పెను. ।
అప్పుడు అబ్రాము తన గుడారము తీసి హెబ్రోను 18
లోని మమ్రేదగ్గరనున్న సింధూరవృక్షవనములో దిగి
అక్కడ యెహోవాకు బలిపీఠమును కట్టెను.

షీనారు రాజైన అమ్రాపేలు, ఎల్లాసరు రాజైన **14**
అర్యోకు, ఏలాము రాజైన కదొర్లాయోమెరు, గోయీ
యుల రాజైన తిదాలు అనువారి దినములలో । వారు 2
సొదొమ రాజైన బెరాతోను, గొమొఱ్ఱా రాజైన
బిర్షాతోను, అద్మా రాజైన షినాబుతోను, సెబోయీ
యుల రాజైన షెమేబెరుతోను, సోయరను బెల
రాజుతోను యుద్ధముచేసిరి. । వీరందరు ఉప్పుసముద్ర 3
మైన సిద్దీములోయలో ఏకముగా కూడి । పన్నెండు 4
సంవత్సరములు కదొర్లాయోమెరుకు లోబడి పదమూ
డవ సంవత్సరమున తిరుగబాటు చేసిరి. । పదునాలు 5
గవ సంవత్సరమున కదొర్లాయోమెరును అతనితో
కూడనున్న రాజులును వచ్చి అష్తారోత్ కర్నాయి
ములో రఫాయీయులను హాములో జూజీయులను
షావే కిర్యతాయిము మైదానములో । ఏమీయులను 6
కొట్టిరి. మరియు హోరీయులను అరణ్యముదగ్గర
నున్న ఏల్పారాను వరకు తరిమి శేయీరు పర్వత
ప్రదేశములో వారిని కొట్టినతరువాత । తిరిగి కాదే 7
షను ఏన్మిష్పతుకు వచ్చి అమాలేకీయుల దేశమంతటిని
హససోన్తామారులో కాపురమున్న అమోరీయులను
కూడ కొట్టిరి. । అప్పుడు సొదొమ రాజును గొమొఱ్ఱా 8
రాజును అద్మా రాజును సెబోయీము రాజును సోయ

రను బెల రాజును బయలుదేరి సిద్దీము లోయలో
9 వారితో, । అనగా ఏలాము రాజైన కదొర్లాయో
మెరు గోయీయుల రాజైన తిదాలు, షీనారు రాజైన
అమ్రాపేలు, ఎల్లాసరు రాజైన అర్యోకు అను నలు
గురితో ఆ యైదుగురు రాజులు యుద్ధముచేసిరి. ।
10 ఆ సిద్దీము లోయలో విస్తారమైన మట్టికీలు గుంటలు
ఉండెను.—సొదొమ గొమొఱ్ఱాల రాజులు పారిపోయి
వాటిలో పడిరి. శేషించినవారు కొండకు పారిపో
11 యిరి. । అప్పుడు వారు సొదొమ గొమొఱ్ఱాల ఆస్తి
యావత్తును వారి భోజనపదార్థములన్నియు పట్టుకొని
12 పోయిరి. । మరియు అబ్రాము సహోదరుని కుమా
రుడైన లోతు సొదొమలో కాపురముండెనుగనుక
13 అతనిని అతని ఆస్తిని పట్టుకొనిపోగా । తప్పించుకొ
నిన యొకడు వచ్చి హెబ్రీయుడైన అబ్రాముకు ఆ
సంగతి తెలిపెను. అప్పుడతడు ఎష్కోలు సహోదరు
డును ఆనేరు సహోదరుడునైన మమ్రే అను
అమోరీయుని ఏలోను వనములో కాపురముండెను.
14 వీరు అబ్రాముతో నిబంధన చేసికొనినవారు. । అబ్రా
ము తన తమ్ముడు చెరపట్టబడెనని విని తన యింట పుట్టి
అలవరచబడిన మున్నూట పదునెనమండుగురిని వెంట
బెట్టుకొని దానుమట్టుకు ఆ రాజులను తరిమెను. ।
15 రాత్రివేళ అతడును అతని దాసులును వారికెదురుగా
మొనలు తీర్చి వారిని కొట్టి దమస్కుకు ఎడమతట్టున్న
16 హోబా మట్టుకు తరిమి । ఆస్తి యావత్తు తిరిగి
తెచ్చి తన తమ్ముడైన లోతును అతని ఆస్తిని స్త్రీలను
17 ప్రజలను తిరిగి తీసికొని వచ్చెను. । అతడు కదొర్లా
యోమెరును అతనితోకూడనున్న రాజులను హతము
చేసి తిరిగి వచ్చినప్పుడు సొదొమ రాజు అతనిని ఎదు
ర్కొనుటకు, రాజులోయ అను షావేలోయమట్టుకు
18 బయలుదేరి వచ్చెను. । మరియు షాలేము రాజైన
మెల్కీసెదెకు ఆహారమును ద్రాక్షారసమును తీసికొని
వచ్చెను. అతడు సర్వోన్నతుడగు దేవునికి యాజ
19 కుడు. । అప్పుడతడు అతనిని ఆశీర్వదించి—ఆకాశ
మునకును భూమికిని కర్తయును సర్వోన్నతుడునైన
దేవునివలన అబ్రాము ఆశీర్వదింపబడునుగాక అని
20 యు, । నీ శత్రువులను నీ చేతి కప్పగించిన సర్వో
న్నతుడగు దేవుడు స్తుతింపబడునుగాక అనియు చెప్పెను.
అప్పుడతడు అన్నిటిలో ఇతనికి దశమాంశ మిచ్చెను. ।
21 సొదొమ రాజు—మనుష్యులను నాకిచ్చి ఆస్తిని నీవే
22 తీసికొనుమని అబ్రాముతో చెప్పగా । అబ్రాము—
ఆకాశమునకును భూమికిని కర్తయును సర్వోన్నతు
డును దేవుడునైన యెహోవాయెదుట నా చెయ్యి
23 యెత్తి । నేనే అబ్రామును ధనవంతునిగా చేసితినని
నీవు చెప్పకుండునట్లు ఒక నూలుపోగైనను చెప్పుల
వారైనను నీవాటిలో ఏదైనను తీసికొనననని (ప్రమా
24 ణము చేసియున్నాను.) । అయితే ఈ పడుచువారు
భుజించినది వినాగా నాతోకూడ వచ్చిన ఆనేరు
ఎష్కోలు మమ్రే అను వారికి ఏయే భాగములు
రావలెనో ఆయా భాగములు మాత్రము వారిని తీసి
కొన నిమ్మని సొదొమ రాజుతో చెప్పెను.

ఇవి జరిగినతరువాత యెహోవా వాక్యము **15**
అబ్రామునకు దర్శనమందు వచ్చి—అబ్రామా భయపడ
కుము; నేను నీకు కేడెము, నీ బహుమానము అత్య
ధికమగునని చెప్పెను । అందుకు అబ్రాము—ప్రభు 2
వైన యెహోవా నాకేమి యిచ్చిననేమి? నేను సం
తానము లేనివాడనై పోవుచున్నానే; దమస్కు ఎలీ
యెజెరే నాయింటి ఆస్తికర్తయగునుగదా? । మరియు 3
అబ్రాము — ఇదిగో నీవు నాకు సంతానమియ్యలేదు
గనుక నా పరివారములో ఒకడు నాకు వారసుడగు
నని చెప్పగా । యెహోవా వాక్యము అతనియొద్దకు 4
వచ్చి — ఇతడు నీకు వారసుడు కాడు; నీ గర్భవాస
మున పుట్టబోవుచున్నవాడు నీకు వారసుడగునని
చెప్పెను. । మరియు ఆయన వెలపలికి అతని తీసికొని 5
వచ్చి — నీవు ఆకాశమువైపు తేరిచూచి నక్షత్రము
లను లెక్కించుటకు నీ చేతనైతే లెక్కించుమని చెప్పి
—నీ సంతానము ఆలాగవునని చెప్పెను. । అతడు 6
యెహోవాను నమ్మెను; ఆయన అది అతనికి నీతిగా
ఎంచెను. । మరియు ఆయన — నీవు ఈ దేశమును 7
స్వతంత్రించుకొనునట్లు దాని నీకిచ్చుటకు కల్దీయుల
ఊరను పట్టణములోనుండి నిన్ను ఇవతలకు తీసికొని
వచ్చిన యెహోవాను నేనే అని చెప్పినప్పుడు ।
అతడు — ప్రభువైన యెహోవా, నేను దీని స్వతం 8
త్రించుకొనెదనని నాకెట్లు తెలియుననగా । ఆయన 9
—మూడేండ్ల పెయ్యను మూడేండ్ల మేకను మూడేండ్ల
పొట్టేలును ఒక తెల్ల గువ్వను ఒక పావురపు పిల్లను
నాయొద్దకు తెమ్మని అతనితో చెప్పెను. । అతడు 10
అవన్నియు తీసికొని వాటిని నడుమకు ఖండించి దేని
ఖండమును దాని ఖండమునకు ఎదురుగా నుంచెను;
పక్షులను అతడు ఖండింపలేదు । గ్రద్దలు ఆ కళేబర 11
ములమీద వాలినప్పుడు అబ్రాము వాటిని తోలి
వేసెను. । ప్రొద్దు గ్రుంకబోయినప్పుడు అబ్రామునకు 12
గాఢనిద్ర పట్టెను. భయంకరమైన కటికచీకటి అతని
కమ్మగా । ఆయన—నీ సంతతివారు తమది కాని పర 13
దేశమందు నివసించి ఆ దేశపువారికి దాసులుగా నుం
దురు. । వారు నన్నూరేండ్లు వీరిని శ్రమ పెట్టుదురు; 14
వీరు ఎవరికి దాసులవుదురో ఆ జనమునకు నేనే తీర్పు
తీర్చెదను. తరువాత వారు మిక్కిలి ఆస్తితో బయ
లుదేరి వచ్చెదరు. । నీవు క్షేమముగా నీ పితరులయొ 15
ద్దకు పోయెదవు; మంచి వృద్ధాప్యమందు పాతిపెట్ట
బడుదువు. । అమోరీయుల అక్రమము ఇంకను సం 16
పూర్ణము కాలేదు గనుక నీ నాలుగవ తరమువారు

ఇక్కడికి మరల వచ్చెదరని నిశ్చయముగా తెలిసికొను
మని అబ్రాముతో చెప్పెను.
17 మరియు ప్రొద్దు గ్రుంకి కటికచీకటి పడినప్పుడు
రాజుచున్న పొయ్యియు అగ్నిజ్వాలయును కనబడి
18 ఆ ఖండముల మధ్య నడిచిపోయెను. । ఆ దినమందే
యెహోవా—ఐగుప్తు నది మొదలుకొని గొప్ప నది
యైన యూఫ్రటీసు నది పర్యంతమును ఈ దేశమును,
19 అనగా । కేనీయులను కనిజీయులను కద్మోనీయులను ।
20 హిత్తీయులను పెరిజ్జీయులను రెఫాయీయులను ।
21 అమోరీయులను కనానీయులను గిర్గాషీయులను యె
బూసీయులను నీ సంతానమున కిచ్చియున్నానని
అబ్రాముతో నిబంధన చేసెను.

16 అబ్రాము భార్యయైన శారయి అతనికి పిల్లలు కన
లేదు. ఆమెకు హాగరు అను ఐగుప్తీయురాలైన దాసి
2 యుండెను. । కాగా శారయి—ఇదిగో నేను పిల్లలు
కనకుండ యెహోవా చేసి యున్నాడు. నీవు దయ
చేసి నా దాసితో పొమ్ము; ఒకవేళ ఆమెవలన నాకు
సంతానము కలుగవచ్చునని అబ్రాముతో చెప్పెను;
3 అబ్రాము శారయి మాట వినెను. । కాబట్టి అబ్రాము
కనాను దేశములో పదియేండ్లు కాపురమున్న తరు
వాత అబ్రాము భార్యయైన శారయి తన దాసియైన
హాగరను ఐగుప్తీయురాలిని తీసికొని తన పెనిమిటి
యైన అబ్రాముకు భార్యగా ఉండునట్లు అతనికిచ్చె
4 ను. । అతడు హాగరుతో పోయినప్పుడు అది గర్భ
వతి ఆయెను. అది తాను గర్భవతినైతినని తెలిసి
కొనినప్పుడు దాని యజమానురాలు దానిదృష్టికి నీచ
5 మైనదాయెను. । అప్పుడు శారయి — నా ఉసురు
నీకు తగులును; నేనే నా దాసిని నీ కౌగిటి కిచ్చిన
తరువాత తాను గర్భవతినైతినని తెలిసికొనినప్పుడు
నేను దానిదృష్టికి నీచమైనదాననైతిని; నాకును నీకును
యెహోవా న్యాయము తీర్చుగాక అని అబ్రా
6 ముతో అనెను. । అందుకు అబ్రాము — ఇదిగో నీ
దాసి నీ చేతిలో ఉన్నది; నీ మనస్సు వచ్చినట్లు
దాని చేయుమని శారయితో చెప్పెను. శారయి దాని
శ్రమ పెట్టినందున ఆమెయొద్దనుండి అది పారిపోగా ।
7 యెహోవా దూత అరణ్యములో నీటిబుగ్గయొద్ద,
అనగా షూరు మార్గములో బుగ్గయొద్ద ఆమెను కను
8 గొని । — శారయి దాసివైన హాగరూ, ఎక్కడనుండి
వచ్చితివి, ఎక్కడికి వెళ్లుచున్నావని అడిగినందుకు
అది—నా యజమానురాలైన శారయి యొద్దనుండి పారి
9 పోవుచున్నాననెను. । అప్పుడు యెహోవా దూత
—నీ యజమానురాలియొద్దకు తిరిగి వెళ్లి ఆమె చేతి
10 క్రింద అణిగియుండుమని దానితో చెప్పెను. । మరి
యు యెహోవా దూత—నీ సంతానమును నిశ్చయ
ముగా విస్తరింప జేసెదను; అది లెక్కింప వీలులేనం
11 తగా విస్తారమవుననని దానితో చెప్పెను. । మరియు
యెహోవా దూత—ఇదిగో యెహోవా నీ మొరను
వినెను. నీవు గర్భవతివై యున్నావు; నీవు కుమారుని
కని అతనికి ఇష్మాయేలు అను పేరు పెట్టుదువు; । అతడు 12
అడవిగాడిదెవంటి మనుష్యుడు. అతని చెయ్యి అందరి
కిని అందరి చేతులు అతనికిని విరోధముగా ఉండును.
అతడు తన సహోదరులందరి యెదుట నివసించునని
దానితో చెప్పగా । అది — చూచుచున్న దేవుడవు 13
నీవే అను పేరు తనతో మాటలాడిన యెహోవాకు
పెట్టెను ఏలయనగా నన్ను చూచినవాని నేనిక్కడ
చూచితిని గదా అని అనుకొనెను. । అందుచేత ఆ నీటి 14
బుగ్గకు బెయేర్ లహాయిరోయి అను పేరు పెట్టబడెను.
అది కాదేషుకును బెరెదుకును మధ్యనున్నది. । తరు 15
వాత హాగరు అబ్రాముకు కుమారుని కనెను. అబ్రా
ము హాగరు కనిన తన కుమారునికి ఇష్మాయేలను పేరు
పెట్టెను. । హాగరు అబ్రాముకు ఇష్మాయేలును కని 16
నప్పుడు అబ్రాము ఎనుబదియారు ఏండ్లవాడు.

అబ్రాము తొంబదితొమ్మిది యేండ్లవాడైనప్పుడు 17
యెహోవా అతనికి ప్రత్యక్షమై—నేను సర్వశక్తిగల
దేవుడను; నా సన్నిధిలో నడుచుచు నిందారహితు
డవై యుండుము. । నాకును నీకును మధ్య నా నిబం 2
ధనను నియమించి నిన్ను అత్యధికముగా అభివృద్ధి
పొందించెదనని అతనితో చెప్పెను. । అబ్రాము 3
సాగిలపడియుండగా । దేవుడతనితో మాటలాడి— 4
ఇదిగో నేను నియమించిన నా నిబంధన నీతో చేసి
యున్నాను; నీవు అనేక జనములకు జనకుడవగుదువు.।
మరియు ఇకమీదట నీ పేరు అబ్రాము అనబడదు; 5
నిన్ను అనేక జనములకు జనకునిగా నియమించితిని
గనుక నీ పేరు అబ్రాహాము అనబడును. । నీకు 6
అత్యధికముగా సంతానవృద్ధి కలుగజేసి నీలోనుండి
జనములు వచ్చునట్లు నియమించుదును, రాజులును
నీలోనుండి వచ్చెదరు. । నేను నీకును నీ తరువాత 7
నీ సంతానమునకును దేవుడనై యుండునట్లు, నాకును
నీకును, నీతరువాత వారి తరములలో నీ సంతతికిని
మధ్య నా నిబంధనను నిత్యనిబంధనగా స్థిరపరచె
దను. । నీకును నీతరువాత నీ సంతతికిని నీవు పరదేశి 8
వైయున్న దేశమును, అనగా కనానను దేశమంతటిని
నిత్య స్వాస్థ్యముగా ఇచ్చి వారికి దేవుడనై యుందు
నని అతనితో చెప్పెను. । మరియు దేవుడు—నీవును, 9
నీవుమాత్రమే గాక నీతరువాత వారి తరములలో నీ
సంతతియు నా నిబంధనను గైకొనవలెను. । నాకును 10
నీకును నీతరువాత నీ సంతతికిని మధ్య మీరు గైకొన
వలసిన నా నిబంధన యేదనగా—మీలో ప్రతి మగ
వాడును సున్నతి పొందవలెను. । మీరు మీ గోప్యాం 11
గచర్మమున సున్నతి పొందవలెను. అది నాకు నీకు
మధ్యనున్న నిబంధనకు సూచనగా ఉండును. । ఎని 12
మిది దినముల వయస్సుగలవాడు, అనగా నీ యింట

పుట్టినవాడైనను, నీ సంతానము కాని అన్యునియొద్ద
వెండితో కొనబడినవాడైనను, మీ తరములలో ప్రతి
13 మగవాడు మీలో సున్నతి పొందవలెను. । నీ యింట
పుట్టినవాడును నీ వెండితో కొనబడినవాడును, తప్పక
సున్నతి పొందవలెను. అప్పుడు నా నిబంధన మీ
14 శరీరమందు నిత్య నిబంధనగా ఉండును. । సున్నతి
పొందని మగవాడు, అనగా ఎవని గోప్యాంగచర్మమున
సున్నతిచేయబడదో అట్టివాడు తన జనులలోనుండి
కొట్టివేయబడును. వాడు నా నిబంధనను మీరియు
న్నాడని అబ్రాహాముతో చెప్పెను.
15 మరియు దేవుడు — నీ భార్యయైన శారయి పేరు
శారయి అనవద్దు; ఏలయనగా ఆమె పేరు శారా.[1] ।
16 నేనామెను ఆశీర్వదించి ఆమెవలన నీకు కుమారుని
కలుగజేసెదను; నేనామెను ఆశీర్వదించెదను; ఆమె
జనములకు జననియై యుండును; జనముల రాజులు
ఆమెవలన కలుగుదురని అబ్రాహాముతో చెప్పెను. ।
17 అప్పుడు అబ్రాహాము సాగిలపడి నవ్వి — నూరేండ్ల
వానికి సంతానము కలుగునా? తొంబది యేండ్ల శారా
18 కనునా? అని మనస్సులో అనుకొనెను. । అబ్రా
హాము—ఇష్మాయేలు నీ సన్నిధిని బ్రదుకునుగాక అని
19 దేవునితో చెప్పగా । దేవుడు—నీ భార్యయైన శారా
నిశ్చయముగా నీకు కుమారుని కనును; నీవతనికి
ఇస్సాకు అను పేరు పెట్టుదువు; అతనితరువాత అతని
సంతానముకొరకు నిత్యనిబంధనగా నా నిబంధనను
20 అతనితో స్థిరపరచెదను. । ఇష్మాయేలునుగూర్చి నీవు
చేసిన మనవి నేను వింటిని. ఇదిగో నేనతనిని ఆశీర్వ
దించి అతనికి సంతానాభివృద్ధి కలుగజేసి అత్యధిక
ముగా అతని విస్తరింపజేసెదను; అతడు పన్నెండుమంది
రాజులను కనును; అతనిని గొప్పజనముగా చేసెదను; ।
21 అయితే వచ్చు సంవత్సరము ఈ కాలమందు శారా
నీకు కనబోవు ఇస్సాకుతో నా నిబంధనను స్థిరపరచె
22 దనని చెప్పెను. । దేవుడు అబ్రాహాముతో మాటలా
డుట చాలించినతరువాత అతని యొద్దనుండి పరము
23 నకు వెళ్లెను. । అప్పుడు అబ్రాహాము తన కుమారు
డైన ఇష్మాయేలును, తన యింట పుట్టినవారినందరిని,
తన వెండితో కొనబడినవారినందరిని, అబ్రాహాము
ఇంటి మనుష్యులలో ప్రతివానిని పట్టుకొని దేవుడు
తనతో చెప్పిన ప్రకారము ఆ దినమందే వారివారి
24 గోప్యాంగచర్మమున సున్నతి చేసెను । అబ్రాహాము
గోప్యాంగచర్మము సున్నతి చేయబడినప్పుడు అతడు
25 తొంబది తొమ్మిది యేండ్లవాడు. । అతని కుమారుడైన
ఇష్మాయేలు గోప్యాంగచర్మము సున్నతి చేయబడి
26 నప్పుడు అతడు పదుమూడేండ్లవాడు. । ఒక్కదిన
మందే అబ్రాహామును అతని కుమారుడైన ఇష్మాయేలును
27 సున్నతి పొందిరి. । అతని యింట పుట్టినవారును అన్యుని
యొద్ద వెండితో కొనబడినవారును అతని యింటిలోని
పురుషులందరును అతనితో కూడ సున్నతి పొందిరి.

మరియు మమ్రేదగ్గరనున్న సింధూరవనములో 18
అబ్రాహాము ఎండవేళ గుడారపు ద్వారమందు
కూర్చుని యున్నప్పుడు యెహోవా అతనికి కన
బడెను. । అతడు కన్నులెత్తి చూచినప్పుడు ముగ్గురు 2
మనుష్యులు అతని యెదుట నిలువబడి యుండిరి.
అతడు వారిని చూచి గుడారపు వాకిటనుండి వారిని
ఎదుర్కొనుటకు పరుగెత్తి నేలమట్టుకు వంగి । —
ప్రభువా, నీ కటాక్షము నామీద నున్నయెడల ఇప్పుడు 3
నీ దాసుని దాటిపోవద్దు. । నేను కొంచెము నీళ్లు 4
తెచ్చెదను; దయచేసి కాళ్లు కడుగుకొని యీ చెట్టు
క్రింద అలసట తీర్చుకొనుడి; । కొంచెము ఆహారము 5
తెచ్చెదను, మీ ప్రాణములను బలపరచుకొనుడి; తరు
వాత మీరు వెళ్లవచ్చును; ఇందు నిమిత్తముగదా మీ
దాసుని యొద్దకు వచ్చితిరనెను. వారు — నీవు చెప్పి
నట్లు చేయుమనగా । అబ్రాహాము గుడారములో 6
నున్న శారాయొద్దకు త్వరగా వెళ్లి — నీవు త్వరపడి
మూడు మానికల మెత్తనిపిండి తెచ్చి పిసికి రొట్టెలు
చేయుమని చెప్పెను. । మరియు అబ్రాహాము పశు 7
వుల మందకు పరుగెత్తి ఒక మంచి లేతదూడను తెచ్చి
ఒక పనివానికప్పగించెను. వాడు దాని త్వరగా సిద్ధ
పరచెను. । తరువాత అతడు వెన్నను పాలను తాను 8
సిద్ధము చేయించిన దూడను తెచ్చి వారియెదుటపెట్టి
వారు భోజనము చేయుచుండగా వారియొద్ద ఆ చెట్టు
క్రింద నిలుచుండెను. । వారతని చూచి—నీ భార్య 9
యైన శారా ఎక్కడనున్నదని అడుగగా అతడు—
అదిగో గుడారములో నున్నదని చెప్పెను. । ఆయన 10
కాయన — మీదటికి ఈ కాలమున నీయొద్దకు నిశ్చ
యముగా మరల వచ్చెదను. అప్పుడు నీ భార్యయైన
శారాకు ఒక కుమారుడు కలుగునని చెప్పెను. శారా
ఆయన వెనుక నుండిన గుడారపు ద్వారమందు విను
చుండెను. । అబ్రాహామును శారాయును బహుకాల 11
ము గడచిన వృద్ధులై యుండిరి. స్త్రీ ధర్మము శారాకు
నిలిచిపోయెను గనుక । శారా— నేను బలము ఉడిగిన 12
దాననైన తరువాత నాకు సుఖము కలుగునా? నా యజ
మానుడును వృద్ధుడై యున్నాడుగదా అని తనలో
నవ్వుకొనెను. । అంతట యెహోవా అబ్రాహాము 13
తో—వృద్ధురాలనైన నేను నిశ్చయముగా ప్రసవించెద
నా అని శారా నవ్వనేల? । యెహోవాకు అసాధ్య 14
మైనది ఏదైన నున్నదా? మీదటికి ఈ కాలమున
నిర్ణయకాలమందు నీయొద్దకు తిరిగి వచ్చెదను. అప్పుడు
శారాకు కుమారుడు కలుగుననెను. । శారా భయపడి 15
— నేను నవ్వలేదని చెప్పగా ఆయన — అవును నీవు
నవ్వితివనెను.

[1] అనగా, రాజకుమారి.

16 అప్పు డామనుష్యులు అక్కడనుండి లేచి సొదొమ
తట్టు చూచిరి. అబ్రాహాము వారిని సాగనంపుటకు
17 వారితోకూడ వెళ్లెను. । అప్పుడు యెహోవా—నేను
చేయబోవు కార్యము అబ్రాహామునకు దాచెదనా? ।
18 అబ్రాహాము నిశ్చయముగా బలముగల గొప్ప జనమ
గును. అతని మూలముగా భూమిలోని సమస్త జనము
19 లును ఆశీర్వదింపబడును. । ఎట్లనగా యెహోవా
అబ్రాహామునుగూర్చి చెప్పినది అతనికి కలుగజేయు
నట్లు తన తరువాత తన పిల్లలును తన యింటివారును
నీతి న్యాయములు జరిగించుచు, యెహోవా మార్గ
మును గైకొనుటకు అతడు వారి కాజ్ఞాపించునని
నేనెరిగియున్నా ననెను.

20 మరియు యెహోవా—సొదొమ గొమొఱ్ఱాలను
గూర్చిన మొర గొప్పది గనుకను వాటి పాపము
21 బహు భారమైనది గనుకను । నేను దిగిపోయి నాయొ
ద్దకు వచ్చిన ఆ మొర చొప్పున నే వారు సంపూర్ణము
గా చేసిరో లేదో చూచెదను; చేయనియెడల నేను
22 తెలిసికొందుననెను. । ఆ మనుష్యులు అక్కడనుండి
తిరిగి సొదొమవైపుగా వెళ్లిరి. అబ్రాహాము ఇంక
23 యెహోవా సన్నిధిని నిలుచుండెను. । అప్పుడు
అబ్రాహాము సమీపించి యిట్లనెను — దుష్టులతో
24 కూడ నీతిమంతులను నాశనము చేయుదువా? । ఆ
పట్టణములో ఒక వేళ ఏబదిమంది నీతిమంతులుండిన
యెడల దానిలోనున్న యేబదిమంది నీతిమంతుల
నిమిత్తము ఆ స్థలమును నాశనముచేయక కాయవా? ।
25 ఆ చొప్పున చేసి దుష్టులతో కూడ నీతిమంతులను
చంపుట నీకు దూరమవు గాక. నీతిమంతుని దుష్టు
నితో సమముగా ఎంచుట నీకు దూరమవు గాక. సర్వ
లోకమునకు తీర్పు తీర్చువాడు న్యాయము చేయడా
26 అని చెప్పినప్పుడు । యెహోవా—సొదొమ పట్టణ
ములో ఏబదిమంది నీతిమంతులు నాకు కనబడిన
యెడల వారినిబట్టి ఆ స్థలమంతటిని కాయుదుననెను ।
27 అందుకు అబ్రాహాము—ఇదిగో ధూళియు బూడిదె
యునైన నేను ప్రభువుతో మాటలాడ తెగించుచున్నా
28 ను. । ఏబదిమంది నీతిమంతులలో ఒకవేళ ఐదుగురు
తక్కువైతే ఐదుగురు తక్కువైనందున ఆ పట్టణమం
తయు నాశనము చేయుదువా అని మరల అడిగెను.
అందుకాయన — అక్కడ నలుబది యైదుగురు నాకు
29 కనబడినయెడల నాశనము చేయననెను. । అతడింక
ఆయనతో మాటలాడుచు—ఒకవేళ అక్కడ నలుబది
మందియే కనబడుదురేమో అనినప్పుడు ఆయన—ఆ
నలుబదిమందినిబట్టి నాశనముచేయక యుందునని
30 చెప్పగా । అతడు—ప్రభువు కోపపడనియెడల నేను
మాటలాడెదను; ఒకవేళ అక్కడ ముప్పదిమందియే
కనబడుదురేమో అనినప్పుడు ఆయన — అక్కడ
ముప్పదిమంది నాకు కనబడినయెడల నాశనము చేయ

ననెను. । అందుకతడు — ఇదిగో ప్రభువుతో మాట 31
లాడ తెగించితిని; ఒకవేళ అక్కడ ఇరువదిమంది కన
బడుదురేమో అనినప్పుడు ఆయన—ఆ యిరువదిమం
దినిబట్టి నాశనము చేయకుందుననగా । అతడు— 32
ప్రభువు కోపపడనియెడల నే నింకొక మారే మాట
లాడెదను; ఒకవేళ అక్కడ పదిమంది కనబడుదురేమో
అనినప్పుడు ఆయన—ఆ పదిమందినిబట్టి నాశనము
చేయకయుందుననెను. । యెహోవా అబ్రాహా 33
ముతో మాటలాడుట చాలించి వెళ్లిపోయెను. అబ్రా
హాము తన యింటికి తిరిగి వెళ్లెను.

ఆ సాయంకాలమందు ఆ దేవదూతలలో ఇద్దరు 19
సొదొమ చేరునప్పటికి లోతు సొదొమ గవినియొద్ద
కూర్చుండియుండెను. లోతు వారిని చూచి వారిని
ఎదుర్కొనుటకు లేచి సాష్టాంగ నమస్కారముచేసి ।
—నా ప్రభువులారా, దయచేసి మీ దాసుని యింటికి 2
వచ్చి రాత్రి వెళ్లబుచ్చి కాళ్లు కడుగుకొనుడి, మీరు
పెందలకడ లేచి మీ త్రోవను వెళ్లవచ్చుననెను. అం
దుకు వారు — ఆలాగు కాదు, నడివీధిలో రాత్రి వెళ్ల
బుచ్చెదమని చెప్పిరి. । అయినను అతడు మిక్కిలి బల 3
వంతము చేసినప్పుడు వారు అతని తట్టు తిరిగి అతని
యింట ప్రవేశించిరి. అతడు వారికి విందుచేసి పొంగని
రొట్టెలు కాల్చగా వారు భోజనముచేసిరి. । వారు 4
పండుకొనకముందు ఆ పట్టణస్థులు, అనగా సొదొమ
మనుష్యులు, బాలురును వృద్ధులును ప్రజలందరును నలు
దిక్కులనుండి కూడివచ్చి ఆ యిల్లు చుట్టువేసి । లోతును 5
పిలిచి—ఈ రాత్రి నీ యొద్దకు వచ్చిన మనుష్యులు
ఎక్కడ? మేము వారిని కూడునట్లు మా యొద్దకు వారిని
వెలపలికి తీసికొని రమ్మని అతనితో చెప్పగా । లోతు 6
ద్వారమునొద్దనున్న వారి దగ్గరకు వెళ్లి తన వెనుక
తలుపువేసి । — అన్నలారా, ఇంత పాతకము కట్టు 7
కొనకుడి; । ఇదిగో పురుషుని కూడని యిద్దరు కుమా 8
ర్తెలు నాకున్నారు. సెలవైతే వారిని మీయొద్దకు వెల
పలికి తీసికొని వచ్చెదను, వారిని మీ మనస్సువచ్చినట్లు
చేయుడి. । ఈ మనుష్యులు నా యింటినీడకు వచ్చి 9
యున్నారు గనుక వారిని మీరేమి చేయకూడదని
చెప్పినప్పుడు వారు—నీవు అవతలికి పొమ్మనిరి. మరియు
వారు—వీడెవడో మనలోకి పరదేశిగా వచ్చి తీర్పరిగా
నుండ చూచుచున్నాడు; కాగా వారికంటె నీకు
ఎక్కువ కీడు చేసెదమని చెప్పి లోతు అను ఆ మను
ష్యునిమీద పొర్లిగా పడి తలుపు పగలగొట్టుటకు సమీ
పించిరి. । అయితే ఆ మనుష్యులు తమ చేతులు చాపి 10
లోతును ఇంటిలోపలికి తమయొద్దకు తీసికొని తలుపు
వేసిరి. । అప్పుడు వారు పిన్నలు మొదలుకొని పెద్దల 11
పర్యంతమును ఆ యింటి ద్వారమునద్దరనున్న వారికి
కనుమబ్బు కలుగజేయగా వారు ద్వారము కనుగొన
లేక విసికిరి. । అప్పుడామనుష్యులు లోతును చూచి— 12

ఇక్కడ నీకు మరి యెవరున్నారు? నీ అల్లుని నీ కుమా
రులను నీ కుమార్తెలను ఈ ఊరిలో నీకు కలిగిన
13 వారినందరిని వెలపలికి తీసికొనిరమ్ము; । మేము ఈ
చోటు నాశనము చేయవచ్చితిమి; వారినిగూర్చిన మొర
యెహోవా సన్నిధిలో గొప్పదాయెను గనుక దాని
నాశనము చేయుటకు యెహోవా మమ్మును పంపెనని
14 చెప్పగా । లోతు బయటికి వెళ్లి తన కుమార్తెలను పెం
డ్లాడనై యున్న తన అల్లుళ్లతో మాటలాడి—లెండి,
ఈ చోటు విడిచిపెట్టి రండి; యెహోవా ఈ పట్టణ
మును నాశనము చేయబోవుచున్నాడని చెప్పెను.
అయితే అతడు తన అల్లుళ్లదృష్టికి ఎగతాళిచేయువాని
15 వలె నుండెను. । తెల్లవారినప్పుడు ఆ దూతలు లోతును
త్వరపెట్టి—లెమ్ము; ఈ ఊరి దోషశిక్షలో నశించి
పోకుండ నీ భార్యను ఇక్కడనున్న నీ యిద్దరు కుమార్తె
16 లను తీసికొని రమ్మని చెప్పిరి. । అతడు తడవుచేసెను.
అప్పుడు అతనిమీద యెహోవా కనికరపడుటవలన
ఆ మనుష్యులు అతనిచేతిని అతని భార్యచేతిని అతని
యిద్దరు కుమార్తెల చేతులను పట్టుకొని వెలపలికి తీసి
17 కొని వచ్చి ఆ ఊరి బయటనుంచిరి. । ఆ దూతలు
వారిని వెలపలికి తీసికొని వచ్చిన తరువాత ఆయన—
నీ ప్రాణమును దక్కించుకొనునట్లు పారిపొమ్ము, నీ
వెనుక చూడకుము. ఈ ప్రాంతములో ఎక్కడను నిలు
వక నీవు నశించిపోకుండ ఆ పర్వతమునకు పారిపొమ్మని
18 చెప్పగా । లోతు—ప్రభువా ఆలాగు కాదు. । ఇదిగో
19 నీ కటాక్షము నీ దాసునిమీద వచ్చినది; నా ప్రాణము
రక్షించుటవలన నీవు నాయెడల కనుపరచిన నీ కృపను
ఘనపరచితివి; నేను ఆ పర్వతమునకు తప్పించుకొని
పోలేను; ఈ కీడు నాకు సంభవించి చచ్చిపోవుదునే
20 మో । ఇదిగో పారిపోవుటకు ఈ ఊరు సమీప
ములో ఉన్నది, అది చిన్నది, నన్నక్కడికి తప్పించు
కొని పోనిమ్ము, అది చిన్నదిగదా, నేను బ్రదుకుదునని
21 చెప్పినప్పుడు । ఆయన—ఇదిగో నీవు చెప్పిన ఈ
ఊరు నాశనము చేయను. ఈ విషయములో నీ మనవి
22 అంగీకరించితిని; । నీవు త్వరపడి అక్కడికి తప్పించు
కొని పొమ్ము; నీ వక్కడ చేరువరకు నేనేమియు
చేయలేనని నెను. అందుచేత ఆ ఊరికి సోయరు అను
పేరు పెట్టబడెను.
23 లోతు సోయరుకు వచ్చినప్పుడు ఆ దేశమున సూ
24 ర్యుడు ఉదయించెను. । అప్పుడు యెహోవా సొదొమ
మీదను గొమొఱ్ఱామీదను యెహోవాయొద్దనుండి
25 గంధకమును అగ్నిని ఆకాశమునుండి కురిపించి । ఆ పట్ట
ణములను ఆ మైదానమంతను ఆ పట్టణములలో నివ
సించినవారినందరిని నేల మొలకలను నాశనము చేసెను. ।
26 అయితే లోతు భార్య అతని వెనుకనుండి తిరిగి చూచి
27 ఉప్పు స్తంభమాయెను. । తెల్లవారినప్పుడు అబ్రాహాము
లేచి తాను యెహోవా సన్నిధిని నిలిచిన చోటికి
వచ్చి । సొదొమ గొమొఱ్ఱాల తట్టును ఆ మైదానపు 28
ప్రదేశము యావత్తును చూడగా అదిగో ఆ ప్రదేశపు
పొగ ఆవము పొగవలె లేచుచుండెను. । దేవుడు ఆ 29
మైదానపు పట్టణములను పాడుచేసినప్పుడు దేవుడు
అబ్రాహామును జ్ఞాపకము చేసికొని, లోతు కాపుర
మున్న పట్టణములను నాశనము చేసినప్పుడు ఆ నాశ
నము మధ్యన లోతు నశించకుండ అతని తప్పించెను.
లోతు సోయరులో నివసించుటకు భయపడి, తన 30
యిద్దరు కుమార్తెలతోకూడ సోయరునుండి పోయి ఆ
పర్వతమందు నివసించెను. అతడును అతని యిద్దరు
కుమార్తెలును ఒక గుహలో నివసించిరి. । అట్లుండగా 31
అక్క తన చెల్లెలితో—మన తండ్రి ముసలివాడు; సర్వ
లోకమర్యాద చొప్పున మనతో పోవుటకు లోకము
లో ఏ పురుషుడును లేడు. । మన తండ్రికి ద్రాక్షా 32
రసము త్రాగించి అతనితో శయనించి మన తండ్రివలన
సంతానము కలుగజేసికొందము రమ్మని చెప్పెను. । ఆ 33
రాత్రి వారు తమ తండ్రికి ద్రాక్షారసము త్రాగించిన
తరువాత అతని పెద్దకుమార్తె లోపలికి వెళ్లి తన తండ్రి
తో శయనించెను. కాని ఆమె ఎప్పుడు శయనించె
నో యెప్పుడు లేచిపోయెనో అతనికి తెలియలేదు. ।
మరునాడు అక్క తన చెల్లెలిని చూచి—నిన్నటిరాత్రి 34
నా తండ్రితో నేను శయనించితిని; ఈ రాత్రి అతనికి
ద్రాక్షారసము త్రాగించిన తరువాత నీవు లోపలికి వెళ్లి
అతనితో శయనించుము; ఆలాగున మన తండ్రివలన
సంతానము కలుగజేసికొందమని చెప్పెను. । ఆ రాత్రి 35
యు వారు తమ తండ్రికి ద్రాక్షారసము త్రాగించిరి.
అప్పుడా చిన్నది లేచి అతనితో శయనించెను. ఆమె
యెప్పుడు శయనించెనో యెప్పుడు లేచిపోయెనో అత
నికి తెలియలేదు. । ఆలాగున లోతుయొక్క యిద్దరు 36
కుమార్తెలు తమ తండ్రివలన గర్భవతులైరి. । వారిలో 37
పెద్దది కుమారుని కని వానికి మోయాబను పేరు పెట్టెను:
అతడు నేటివరకు మోయాబీయులకు మూలపురుషుడు
గా ఎంచబడును. । చిన్నది కూడ కుమారుని కని వానికి 38
బెన్నమ్మి అను పేరు పెట్టెను. అతడు నేటివరకు అమ్మో
నీయులకు మూలపురుషుడుగా ఎంచబడును.

అక్కడనుండి అబ్రాహాము దక్షిణ దేశమునకు **20**
తర్లిపోయి కాదేషుకును షూరుకును మధ్యప్రదేశము
లో నివసించి గెరారులో కొన్నాళ్లు ఉండెను. ।
అప్పుడు అబ్రాహాము తన భార్యయైన శారాను 2
గూర్చి—ఈమె నా చెల్లెలని చెప్పెను గనుక గెరారు
రాజైన అబీమెలెకు శారాను పిలిపించి (తన యింట)
చేర్చుకొనెను. । అయినను రాత్రివేళ దేవుడు స్వప్న 3
మందు అబీమెలెకునొద్దకు వచ్చి—నీవు (నీ యింట)
చేర్చుకొనిన స్త్రీ ఒక పురుషునికి భార్య గనుక ఆమె
నిమిత్తము నీవు చచ్చినవాడవు సుమీ అని చెప్పెను. ।
అయితే అబీమెలెకు ఆమెతో పోలేదుగనుక అతడు 4

—ప్రభువా, ఇట్టి నీతిగల జనమును హతము చేయు
5 దువా? । —ఈమె నా చెల్లెలని అతడు నాతో
చెప్పలేదా? మరియు ఆమెకూడ—అతడు నా అన్న
అనెను. నేను చేతులతో ఏ దోషము చేయక
6 యథార్థహృదయముతో ఈ పని చేసితిననెను. । అం
దుకు దేవుడు—అవును, యథార్థహృదయముతో దీని
చేసితివని నేనెరుగుదును; మరియు నీవు నాకు విరో
ధముగా పాపము చేయకుండ నేను నిన్ను అడ్డగించితిని;
7 అందుకే నేను నిన్ను ఆమెను ముట్టనియ్యలేదు. । కాబట్టి
ఆ మనుష్యుని భార్యను తిరిగి అతని కప్పగించుము;
అతడు ప్రవక్త, అతడు నీ కొరకు ప్రార్థనచేయును,
నీవు బ్రదుకుదువు. నీవు ఆమెను అతని కప్పగించని
పక్షమందు నీవును నీవారందరును నిశ్చయముగా చచ్చె
దరని తెలిసికొనుమని స్వప్నమందు అతనితో చెప్పె
8 ను. । తెల్లవారినప్పుడు అబీమెలెకు లేచి తన సేవకుల
నందరిని పిలిపించి ఈ సంగతులన్నియు వారికి విని
పించినప్పుడు ఆ మనుష్యులు మిగుల భయపడిరి. ।
9 అబీమెలెకు అబ్రాహామును పిలిపించి—నీవు మాకు
చేసిన పని యేమిటి? నీవు నా మీదికిని నా రాజ్యము
మీదికిని మహాపాతకము తెప్పించునట్లు నేను నీ
యెడల చేసిన పాపమేమిటి? చేయరాని కార్యములు
10 నాకు చేసితివని అతనితో చెప్పెను. । మరియు అబీ
మెలెకు—నీవేమి చూచి ఈ కార్యము చేసితివని అబ్రా
11 హాము నడుగగా । అబ్రాహాము—ఈ స్థలమందు
దేవుని భయము ఏమాత్రమును లేదు గనుక నా భార్య
12 నిమిత్తము నన్ను చంపుదురనుకొని చేసితిని. । అంతే
కాక—ఆమె నా చెల్లెలను మాట నిజమే; ఆమె నా
తండ్రి కుమార్తెగాని నా తల్లి కుమార్తెకాదు; ఆమె
13 నాకు భార్యయైనది. । దేవుడు నన్ను నా తండ్రియిల్లు
విడిచి దేశాంతరము పోవునట్లు చేసినప్పుడు నేను
ఆమెను చూచి—మనము పోవు ప్రతి స్థలమందు—
ఇతడు నా సహోదరుడని నన్నుగూర్చి చెప్పుము; నీవు
నాకు చేయవలసిన ఉపకారమిదేయని చెప్పితినని
14 ను. । అబీమెలెకు గొఱ్ఱెలను గొడ్లను దాసదాసీ జను
లను రప్పించి, అబ్రాహాముకిచ్చి అతని భార్యయైన
15 శారాను అతనికి తిరిగి అప్పగించెను. । అప్పుడు అబీ
మెలెకు — ఇదిగో నా దేశము నీ యెదుట నున్నది.
16 నీకిష్టమైన స్థలమందు కాపురముండుమనెను. । మరియు
అతడు శారాను చూచి — ఇదిగో నీ అన్నకు నేను
వెయ్యి రూపాయలిచ్చి యున్నాను. ఇది నీ యొద్ద
నున్న వారందరి దృష్టికి ప్రాయశ్చిత్తముగా నుండు
టకై యిది నీ పక్షముగా ఇచ్చియున్నాను. ఈ
విషయమంతటిలో నీకు న్యాయము తీరిపోయినదనెను. ।
17 అబ్రాహాము దేవుని ప్రార్థింపగా దేవుడు అబీమెలె
కును అతని భార్యను అతని దాసీలను బాగుచేసెను;
18 వారు పిల్లలు కనిరి. । ఏలయనగా అబ్రాహాము భార్య
యైన శారానుబట్టి దేవుడు అబీమెలెకు ఇంటిలో ప్రతి
గర్భమును మూసియుండెను.

యెహోవా తాను చెప్పిన ప్రకారము శారాను 21
చూడవచ్చెను; యెహోవా తానిచ్చిన మాట
చొప్పున శారానుగూర్చి చేసెను. । ఎట్లనగా దేవుడు 2
అబ్రాహాముతో చెప్పిన నిర్ణయ కాలములో శారా
గర్భవతియై అతని ముసలితనమందు అతనికి కుమారుని
కనెను. । అప్పుడు అబ్రాహాము తనకు పుట్టినవాడును 3
తనకు శారా కనినవాడునైన తన కుమారునికి ఇస్సాకు
అను పేరు పెట్టెను. । మరియు దేవుడు అబ్రాహాము 4
కాజ్ఞాపించినప్రకారము అతడు ఎనిమిది దినముల
వాడైన ఇస్సాకు అను తన కుమారునికి సున్నతి చేసెను. ।
అబ్రాహాము కుమారుడైన ఇస్సాకు అతనికి పుట్టిన 5
ప్పుడు అతడు నూరేండ్లవాడు. । అప్పుడు శారా 6

—దేవుడు నాకు నవ్వు కలుగజేసెను
వినువారెల్ల నా విషయమై నవ్వుదురనెను. ।

మరియు 7

—శారా పిల్లలకు స్తన్యమిచ్చునని
యెవరు అబ్రాహాముతో చెప్పును
నేను అతని ముసలితనమందు కుమారుని కంటిని
గదా?

అనెను.

ఆ పిల్లవాడు పెరిగి పాలు విడిచెను. ఇస్సాకు 8
పాలు విడిచిన దినమందు అబ్రాహాము గొప్ప విందు
చేసెను. । అప్పుడు అబ్రాహాముకు ఐగుప్తీయురాలైన 9
హాగరు కనిన కుమారుడు నవ్వుట శారా చూచి ।
—ఈ దాసిని దీని కుమారునిని వెళ్లగొట్టుము; ఈ దాసి 10
కుమారుడు నా కుమారుడైన ఇస్సాకుతో వారసుడై
యుండడని అబ్రాహాముతో అనెను. । అతని కుమా 11
రునిబట్టి ఆ మాట అబ్రాహాముకు మిక్కిలి దుఃఖము
కలుగజేసెను. । అయితే దేవుడు—ఈ చిన్నవానిబట్టి 12
యు నీ దాసినిబట్టియు నీవు దుఃఖపడవద్దు. శారా
నీతో చెప్పు ప్రతి విషయములో ఆమెమాట వినుము;
ఇస్సాకువలన అయినదియే నీ సంతానమనబడును. ।
అయినను ఈ దాసి కుమారుడును నీ సంతానమే గనుక 13
అతనికూడ ఒక జనముగా చేసెదనని అబ్రాహాముతో
చెప్పెను. । కాబట్టి తెల్లవారినప్పుడు అబ్రాహాము లేచి 14
ఆహారమును నీళ్ల తిత్తిని తీసికొని ఆ పిల్లవానిలోకూడ
హాగరుకు అప్పగించి ఆమె భుజముమీద వాటిని పెట్టి
ఆమెను పంపివేసెను. ఆమె వెళ్లి బెయేర్షెబా అరణ్య
ములో ఇటు అటు తిరుగుచుండెను. । ఆ తిత్తి నీళ్లు 15
అయిపోయిన తరువాత ఆమె ఒక పొదక్రింద ఆ
చిన్నవాని పడవేసి । యీ పిల్లవాని చావు నేను చూడ 16
లేనని అనుకొని, వింటి వేతదూరము వెళ్లి అతనికెదు
రుగా కూర్చుండెను. ఆమె యెదురుగా కూర్చుండి
యెలుగెత్తి యేడ్చెను. । దేవుడు ఆ చిన్నవాని మొ 17

రను వినినప్పుడు దేవుని దూత ఆకాశమునుండి హాగ
రును పిలిచి—హాగరూ నీకేమివచ్చినది? భయపడకుము;
ఆ చిన్నవాడున్నచోట దేవుడు వాని స్వరము విని
18 యున్నాడు; । నీవు లేచి ఆ చిన్నవాని లేవనెత్తి నీ
చేత పట్టుకొనుము; వానిని గొప్ప జనముగా చేసెద
19 నని ఆమెతో అనెను. । మరియు దేవుడు ఆమె
కన్నులు తెరచినందున ఆమె నీళ్ల ఊట చూచి వెళ్లి
ఆ తిత్తిని నీళ్లతో నింపి చిన్నవానికి త్రాగించెను. ।
20 దేవుడు ఆ చిన్నవానికి తోడై యుండెను. అతడు
పెరిగి పెద్దవాడై ఆ అరణ్యములో కాపురముండి విలు
21 కాడాయెను. । అతడు పారాను అరణ్యములో నున్న
ప్పుడు అతని తల్లి ఐగుప్తుదేశమునుండి ఒక స్త్రీని తెచ్చి
అతనికి పెండ్లిచేసెను.

22 ఆ కాలమందు అబీమెలెకును అతని సేనాధిపతి
యైన పీకోలును అబ్రాహాముతో మాటలాడి—నీవు
చేయు పనులన్నిటిలోను దేవుడు నీకు తోడైయు
23 న్నాడుగనుక । నీవు నన్నైనను నా పుత్రపౌత్రాదు
లనైనను వంచింపక, నేను నీకు చేసిన ఉపకారము
చొప్పున నాకును నీవు పరదేశివైయున్న యీ దేశ
మునకును చేసెదనని దేవుని పేరట ఇక్కడ నాతో
24 ప్రమాణము చేయుమని చెప్పెను. । అందుకు అబ్రా
25 హాము—ప్రమాణము చేసెదననెను. । అబీమెలెకు దా
26 సులు బలాత్కారముగా తీసికొనిన నీళ్లబావివిషయమై
అబ్రాహాము అబీమెలెకును ఆక్షేపింపగా అబీమెలెకు
— ఈ పని యెవరు చేసిరో నేనెరుగను; నీవును
నాతో చెప్పలేదు; నేను నేడేగాని యీ సంగతి విన
27 లేదని చెప్పగా । అబ్రాహాము గొఱ్ఱెలను గొడ్లను
తెప్పించి అబీమెలెకుకిచ్చెను. వారిద్దరు ఇట్లు ఒక
28 నిబంధన చేసికొనిరి. । తరువాత అబ్రాహాము తన
గొఱ్ఱెల మందలోనుండి యేడు పెంటిపిల్లలను వేరుగా
29 నుంచెనుగనుక । అబీమెలెకు అబ్రాహామును చూచి
— నీవు వేరుగా ఉంచిన యీ యేడు గొఱ్ఱెపిల్లలు
30 ఎందుకని యడిగెను. అందుకతడు । —నేనే యీ బా
విని త్రవ్వించినందుకు నాకు సాక్ష్యార్థముగా ఈ యేడు
గొఱ్ఱెపిల్లలను నీవు నాచేత పుచ్చుకొనవలెనని చెప్పె
31 ను. । అక్కడ వారిద్దరు అట్లు ప్రమాణము చేసికొని
32 నందున ఆ చోటు బెయేర్షెబా అనబడెను. । బెయేర్షె
బాలో వారు ఆలాగు ఒక నిబంధనచేసికొనిన తరు
వాత అబీమెలెకు లేచి తన సేనాధిపతియైన పీకోలుతో
33 ఫిలిష్తీయుల దేశమునకు తిరిగి వెళ్లెను. । అబ్రాహాము
బెయేర్షెబాలో ఒక పిచులవృక్షము నాటి అక్కడ
నిత్యదేవుడైన యెహోవా పేరట ప్రార్థనచేసెను. ।
34 అబ్రాహాము ఫిలిష్తీయుల దేశములో అనేక దినములు
పరదేశిగా నుండెను.

ఆ సంగతులు జరిగినతరువాత దేవుడు అబ్రాహా 22
మును శోధించెను. ఎట్లనగా ఆయన—అబ్రాహామా,
అని పిలువగా అతడు—చిత్తము ప్రభువా అనెను. ।
అప్పుడాయన — నీకు ఒక్కడైయున్న నీ కుమారుని, 2
అనగా నీవు ప్రేమించు ఇస్సాకును తీసికొని మోరీ
యా దేశమునకు వెళ్లి అక్కడ నేను నీతో చెప్పబోవు
పర్వతములలో ఒకదానిమీద దహనబలిగా అతని
నర్పించుమని చెప్పెను. । తెల్లవారినప్పుడు అబ్రా 3
హాము లేచి తన గాడిదెకు గంత కట్టి తన పనివారిలో
ఇద్దరిని తన కుమారుడగు ఇస్సాకును వెంటబెట్టుకొని
దహనబలికొరకు కట్టెలు చీల్చి, లేచి దేవుడు తనతో
చెప్పిన చోటికి వెళ్లెను. । మూడవనాడు అబ్రాహాము 4
కన్నులెత్తి దూరమునుండి ఆ చోటు చూచి । తన 5
పనివారితో — మీరు గాడిదెతో ఇక్కడనే ఉం
డుడి; నేనును ఈ చిన్నవాడును అక్కడికి వెళ్లి (దేవు
నికి) మ్రొక్కి మరల మీయొద్దకు వచ్చెదమని చెప్పి ।
దహనబలికి కట్టెలు తీసికొని తన కుమారుడగు ఇస్సాకు 6
మీద పెట్టి తన చేతితో నిప్పును కత్తిని పట్టుకొని
పోయెను. వారిద్దరు కూడి వెళ్లుచుండగా । ఇస్సాకు 7
తన తండ్రియైన అబ్రాహామును చూచి—నా తండ్రీ
అని పిలిచెను; అందుకతడు — ఏమి నా కుమారుడా
అనెను. అప్పుడతడు—నిప్పును కట్టెలును ఉన్నవిగాని
దహనబలికి గొఱ్ఱెపిల్ల ఏది అని అడుగగా । అబ్రా 8
హాము—నా కుమారుడా, దేవుడే దహనబలికి గొఱ్ఱె
పిల్లను చూచుకొనునని చెప్పెను. । ఆలాగు వారిద్దరును 9
కూడి వెళ్లి దేవుడు అతనితో చెప్పిన చోటికి వచ్చినప్పుడు
అబ్రాహాము అక్కడ బలిపీఠమును కట్టి కట్టెలు చక్క
గా పేర్చి తన కుమారుడగు ఇస్సాకును బంధించి ఆ
పీఠముపైనున్న కట్టెలమీద ఉంచెను. । అప్పుడు అబ్రా 10
హాము తన కుమారుని వధించుటకు తన చెయ్యి చాపి
కత్తి పట్టుకొనగా । యెహోవా దూత పరలోకము 11
నుండి—అబ్రాహామా అబ్రాహామా అని అతని పిలి
చెను; అందుకతడు—చిత్తము ప్రభువా అనెను. । అప్పుడు 12
ఆయన — ఆ చిన్నవానిమీద చెయ్యి వేయకుము;
అతని నేమియు చేయకుము; నీకు ఒక్కడైయున్న నీ
కుమారుని నాకియ్య వెనుకతీయలేదుగనుక నీవు దేవు
నికి భయపడువాడవని యిందువలన నాకు కనబడు
చున్నదనెను. । అప్పుడు అబ్రాహాము కన్నులెత్తి చూ 13
డగా పొదలో కొమ్ములు తగులుకొనియున్న ఒక
పొట్టేలు వెనుకతట్టున కనబడెను. అబ్రాహాము వెళ్లి
ఆ పొట్టేలును పట్టుకొని తన కుమారునికి మారుగా
పెట్టి దహనబలిగా అర్పించెను. । అబ్రాహాము ఆ 14
చోటికి యెహోవా యీరే[1] అను పేరు పెట్టెను.
అందుచేత — యెహోవా కనబడిన పర్వతముమీద
అని నేటివరకు చెప్పబడును. । యెహోవా దూత 15

[1] అనగా—యెహోవా చూచుకొనును.

రెండవ మారు పరలోకమునుండి అబ్రాహామును పిలిచి
16 యిట్లనెను । — నీవు నీకు ఒక్కడే అయ్యున్న నీ కుమా
రుని ఇయ్య వెనుకతీయక యీ కార్యము చేసినందున।
17 నేను నిన్ను ఆశీర్వదించి ఆకాశ నక్షత్రములవలెను
సముద్రతీరమందలి యిసుకవలెను నీ సంతానమును
నిశ్చయముగా విస్తరింప చేసెదను; నీ సంతతివారు తమ
18 శత్రువుల గవిని స్వాధీనపరచుకొందురు. । మరియు
నీవు నా మాట వినినందున భూలోకములోని జనము
లన్నియు నీ సంతానమువలన ఆశీర్వదించబడును నాతో
డని ప్రమాణము చేసియున్నానని యెహోవా సెల
19 విచ్చెననెను. । తరువాత అబ్రాహాము తన పని వారి
యొద్దకు తిరిగి రాగా వారు లేచి అందరును కలిసి
బెయేర్షెబాకు వెళ్లిరి. అబ్రాహాము బెయేర్షెబాలో
నివసించెను.

20 ఆ సంగతులు జరిగిన తరువాత అబ్రాహామునకు
తెలుపబడినదేమనగా — మిల్కా అను ఆమెయు నీ
సహోదరుడగు నాహోరుకు పిల్లలను కనెను. ।
21 వారు ఎవరెవరనగా అతని జ్యేష్ఠకుమారుడైన ఊజు,
ఇతని తమ్ముడైన బూజు, అరాము తండ్రియైన కెమూ
22 యేలు, । కెసెదు, హజో, పిల్దాషు, యిద్లాపు, బెతూ
23 యేలు. బెతూయేలు రిబ్కాను కనెను. । ఆ యెనిమిది
మందిని మిల్కా అబ్రాహాము సహోదరుడగు నా
24 హోరుకు కనెను. । మరియు రయూమా అను అతని
ఉపపత్నియు తెబహును, గహమును, తహషును,
మయకాను కనెను.

**23** శారా జీవించిన కాలము, అనగా శారా బ్రదికిన
2 యేండ్లు నూట ఇరువది యేడు. । శారా కనాను దేశ
మందలి హెబ్రోనను కిర్యతర్బాలో మృతిబొందెను;
అప్పుడు అబ్రాహాము శారా నిమిత్తము అంగలార్చుట
3 కును ఆమెనుగూర్చి యేడ్చుటకును వచ్చెను. । తరు
వాత అబ్రాహాము మృతిబొందిన తన భార్యయెదుట
4 నుండి లేచి హేతు కుమారులను చూచి । — మీ
మధ్య నేను పరదేశినిగాను పరవాసినిగాను ఉన్నాను.
మృతిబొందిన నా భార్య నా కన్నులయెదుట ఉండ
కుండ, ఆమెను పాతి పెట్టుటకు మీ తావున నాకొక
శ్మశానభూమిని స్వాస్థ్యముగా ఇయ్యుడని అడుగగా ।
5 హేతు కుమారులు — అయ్యా మా మాట వినుము.
6 నీవు మా మధ్యను మహారాజవై యున్నావు; మా
శ్మశానభూములలో అతి శ్రేష్ఠమైనదానియందు మృతి
బొందిన నీ భార్యను పాతిపెట్టుము; నీవు మృతిబొం
దిన నీ భార్యను పాతి పెట్టునట్లు మాలో తన శ్మశాన
భూమి ఇయ్య నొల్లనివాడు ఎవడును లేడని అబ్రా
7 హాము కుత్తరమిచ్చిరి. । అప్పుడు అబ్రాహాము లేచి
ఆ దేశపు ప్రజలైన హేతు కుమారులకు సాగిలపడి ।
8 —మృతిబొందిన నా భార్యను నా యెదుట ఉండకుండ
నేను పాతి పెట్టుట మీకిష్టమైతే నా మాట వినుడి. ।
సోహరు కుమారుడైన ఎఫ్రోను తన పొలము చివరను 9
తనకు కలిగియున్న మక్పేలా గుహను నా కిచ్చునట్లు
నా పక్షముగా అతనితో మనవిచేయుడి. మీ మధ్యను
శ్మశానభూమిగా నుండుటకు నిండు వెలకు అతడు
దానిని నాకు స్వాస్థ్యముగా ఇయ్యవలెనని వారితో
చెప్పెను. । అప్పుడు ఎఫ్రోను హేతు కుమారుల 10
మధ్యను కూర్చుండియుండెను. హిత్తీయుడైన ఎఫ్రోను
తన ఊరి గవిని ప్రవేశించువారందరి యెదుట హేతు
కుమారులకు వినబడునట్లు అబ్రాహాముతో చెప్పిన
ప్రత్యుత్తరమేదనగా । —అయ్యా అట్లు కాదు నా 11
మనవి నాలకించుము, ఆ పొలమును నీకిచ్చుచున్నా
ను; దానిలోనున్న గుహను నీకిచ్చుచున్నాను; నా
ప్రజల యెదుట అది నీకిచ్చుచున్నాను; మృతిబొందిన
నీ భార్యను పాతి పెట్టుమనెను. । అప్పుడు అబ్రా 12
హాము ఆ దేశపు ప్రజల యెదుట సాగిలపడి । — సరే 13
కాని నా మనవి ఆలకించుము. ఆ పొలమునకు వెల
యిచ్చెదను; అది నాయొద్ద పుచ్చుకొనినయెడల మృతి
బొందిన నా భార్యను పాతి పెట్టెదనని ఆ దేశప్రజ
లకు వినబడునట్లు ఎఫ్రోనుతో చెప్పెను. । అందుకు 14
ఎఫ్రోను—అయ్యా నా మాట వినుము; ఆ భూమి 15
నన్నూరు తులముల వెండి చేయును; నాకు నీకు అది
యెంత? మృతిబొందిన నీ భార్యను పాతి పెట్టుమని
అబ్రాహాము కుత్తరమిచ్చెను; । అబ్రాహాము ఎఫ్రోను 16
మాట వినెను. కాబట్టి హేతు కుమారులకు వినబడు
నట్లు ఎఫ్రోను చెప్పిన వెల అనగా వర్తకులలో చెల్లు
నన్నూరు తులముల వెండి అబ్రాహాము తూచి అతని
కిచ్చెను. । ఆలాగున మమ్రే యెదుటనున్న మక్పేలా 17
యందలి ఎఫ్రోను పొలము, అనగా ఆ పొలమును 18
దానియందలి గుహయు దాని పొలిమేర అంతటిలో
నున్న ఆ పొలము చెట్లన్నియును, అతని ఊరి గవిని
ప్రవేశించువారందరిలో హేతు కుమారులయెదుట
అబ్రాహామునకు స్వాస్థ్యముగా స్థిరపరచబడెను. । ఆ 19
తరువాత అబ్రాహాము కనాను దేశములో హెబ్రో
నను మమ్రే యెదుటనున్న మక్పేలా పొలము గుహలో
తన భార్యయైన శారాను పాతి పెట్టెను. । ఆ పొల 20
మును దానిలోనున్న గుహయు హేతు కుమారులవలన
శ్మశానముకొరకు అబ్రాహామునకు స్వాస్థ్యముగా స్థిర
పరచబడెను.

అబ్రాహాము బహు కాలము గడిచిన వృద్ధుడై **24**
యుండెను. అన్ని విషయములలోను యెహోవా
అబ్రాహామును ఆశీర్వదించెను. । అప్పుడు అబ్రాహా 2
ము తనకు కలిగిన సమస్తమును ఏలుచుండిన తన
యింటి పెద్ద దాసుని చూచి — నీ చెయ్యి నా తొడ
క్రింద పెట్టుము; । నేను ఎవరి మధ్య కాపురమున్నా 3
నో ఆ కనానీయుల కుమార్తెలలో ఒకదానిని నా
కుమారునికి పెండ్లిచేయక । నా స్వదేశమందున్న నా 4

బంధువుల యొద్దకు వెళ్లి ఇస్సాకను నా కుమారునికి
భార్యను తెచ్చునట్లు ఆకాశముయొక్క దేవుడును
భూమియొక్క దేవుడునైన యెహోవా తోడని నీ
5 చేత ప్రమాణము చేయించెదననెను. । ఆ దాసుడు—
ఈ దేశమునకు నా వెంట వచ్చుటకు ఒకవేళ ఆ స్త్రీ
ఇష్టపడని యెడల నీవు బయలుదేరి వచ్చిన ఆ దేశ
మునకు నేను నీ కుమారుని తీసికొని పోవలెనా అని
6 అడుగగా । అబ్రాహాము — అక్కడికి నా కుమారుని
7 తీసికొని పోకూడదు సుమీ. । నా తండ్రి యింట
నుండియు నేను పుట్టిన దేశమునుండియు నన్ను తెచ్చి
నాతో మాటలాడి — నీ సంతానమునకు ఈ దేశము
నిచ్చెదనని ప్రమాణముచేసి నాతో చెప్పిన పరలోకపు
దేవుడగు యెహోవా తన దూతను నీకు ముందుగా
పంపును; అక్కడనుండి నీవు నా కుమారునికి భార్యను
8 తీసికొనివచ్చెదవు. । అయితే నీవెంట వచ్చుటకు ఆ స్త్రీ
ఇష్టపడని యెడల ఈ ప్రమాణమునుండి విడుదల
పొందెదవు గాని నీవు నా కుమారుని అక్కడికి తీసి
9 కొని పోకూడదని అతనితో చెప్పెను. । ఆ దాసుడు
తన యజమానుడగు అబ్రాహాము తొడ క్రింద తన
చెయ్యి పెట్టి యీ సంగతి విషయమై ప్రమాణము
10 చేసెను. । అతడు తన యజమానుని ఒంటెలలో పది
ఒంటెలను తన యజమానుని ఆస్తిలో శ్రేష్ఠమైన
నానావిధములగు వస్తువులను తీసికొనిపోయెను. అతడు
లేచి అరామ్నహరాయిములోనున్న నాహోరు పట్ట
11 ణము చేరి । సాయంకాలమందు స్త్రీలు నీళ్లు చేదుకొన
వచ్చు వేళకు ఆ ఊరి బయటనున్న నీళ్లబావియొద్ద
12 తన ఒంటెలను మోకరింపచేసి యిట్లనెను । — నా
యజమానుడగు అబ్రాహాము దేవుడవైన యెహోవా,
నేను వచ్చిన కార్యమును త్వరలో సఫలముచేసి నా
యజమానుడగు అబ్రాహాము మీద అనుగ్రహము
13 చూపుము. । చిత్తగించుము, నేను ఈ నీళ్ల ఊటయొద్ద
నిలుచుచున్నాను; ఈ ఊరివారి పిల్లలు నీళ్లు చేదుకొను
14 టకు వచ్చుచున్నారు. । కాబట్టి—నేను త్రాగునట్లు
నీవు దయచేసి నీ కడవను వంచుమని నేను చెప్పగా—
నీవు త్రాగుము నీ ఒంటెలకును నీళ్లు పెట్టెదనని యే
చిన్నది చెప్పునో ఆమెయే నీ సేవకుడైన ఇస్సాకు
కొరకు నీవు నియమించినదై యుండునుగాక; అందువలన
నీవు నా యజమానునిమీద అనుగ్రహము చూపితివని
15 తెలిసికొందుననెను. । అతడు మాటలాడుట చాలింపక
మునుపే అబ్రాహాము సహోదరుడైన నాహోరు
భార్యయగు మిల్కాకుమారుడైన బెతూయేలుకు పుట్టిన
16 రిబ్కా కడవ భుజముమీద పెట్టుకొని వచ్చెను. । ఆ
చిన్నది మిక్కిలి చక్కనిది; ఆమె కన్యక, ఏ పురు
షుడును ఆమెను కూడలేదు; ఆమె ఆ బావిలోకి దిగి
పోయి కడవను నీళ్లతో నింపుకొని యెక్కి రాగా ।
17 ఆ సేవకుడు ఆమెను ఎదుర్కొనుటకు పరుగెత్తి — నీ
కడవలో నీళ్లు కొంచెము దయచేసి నన్ను త్రాగనిమ్మని
అడిగెను. । అందుకామె—అయ్యా త్రాగుమని చెప్పి 18
త్వరగా తన కడవను చేతిమీదికి దించుకొని అతనికి
దాహమిచ్చెను. । మరియు ఆమె అతనికి దాహమిచ్చిన 19
తరువాత—నీ ఒంటెలు త్రాగుమట్టుకు వాటికిని నీళ్లు
చేదిపోయుదునని చెప్పి । త్వరగా గాడిలో తన కడవ 20
కుమ్మరించి తిరిగి చేదుటకు ఆ బావికి పరుగెత్తుకొని
పోయి అతని ఒంటెలన్నిటికి నీళ్లు చేదిపోసెను. । ఆ 21
మనుష్యుడు ఆమెను తేరి చూచి తన ప్రయాణమును
యెహోవా సఫలముచేసెనో లేదో తెలిసికొనవలెనని
ఊరకుండెను. । ఒంటెలు త్రాగుటయైనతరువాత ఆ 22
మనుష్యుడు అరతులము ఎత్తుగల బంగారపు ముక్కు
కమ్మిని, ఆమె చేతులకు పది తులముల యెత్తుగల రెండు
బంగారు కడియములను తీసి । —నీవు ఎవరికుమార్తెవు? 23
దయచేసి నాతో చెప్పుము; నీ తండ్రియింట మేము
ఈ రాత్రి బసచేయుటకు స్థలమున్నదా అని అడి
గెను. । అందుకామె—నేను నాహోరుకు మిల్కా 24
కనిన కుమారుడగు బెతూయేలు కుమార్తెననెను. । మరి 25
యు ఆమె — మా యొద్ద చాలా గడ్డియు మేతయు
రాత్రి బసచేయుటకు స్థలమును ఉన్నవనగా । ఆ మను 26
ష్యుడు తన తలవంచి యెహోవాకు మ్రొక్కి— 27
అబ్రాహామను నా యజమానుని దేవుడైన యెహోవా
స్తుతింపబడును గాక; ఆయన నా యజమానునికి తన
కృపను తన సత్యమును చూపుట మానలేదు; నేను
త్రోవలో నుండగానే యెహోవా నా యజమానుని
బంధువుల యింటికి నన్ను నడిపించెననెను. । అంతట 28
ఆ చిన్నది పరుగెత్తికొనిపోయి యీ మాటలు తన తల్లి
యింటివారికి తెలిపెను. । రిబ్కాకు లాబానను నొక 29
సహోదరుడుండెను. అప్పుడు లాబాను ఆ బావి
దగ్గర వెలపటనున్న ఆ మనుష్యుని యొద్దకు పరుగెత్తి
కొని పోయెను. । అతడు ఆ ముక్కు కమ్మిని తన 30
సహోదరి చేతులనున్న ఆ కడియములను చూచి—ఆ
మనుష్యుడు ఈలాగున నాతో మాటలాడెనని తన
సహోదరియైన రిబ్కా చెప్పిన మాటలు విని ఆ మను
ష్యుని యొద్దకు వచ్చెను. అతడు ఆ బావియొద్ద ఒం
టెల దగ్గర నిలిచియుండగా । లాబాను—యెహోవా 31
వలన ఆశీర్వదింపబడినవాడా, లోపలికి రమ్ము; నీవు
బయట నిలువనేల? ఇల్లును ఒంటెలకు స్థలమును నేను
సిద్ధము చేయించితిననెను. । ఆ మనుష్యుడు ఇంటికి 32
వచ్చినప్పుడు లాబాను ఒంటెల గంతలు విప్పి ఒంటె
లకు గడ్డియు మేతయు కాళ్లు కడుగుకొనుటకు అతని
కిని అతనితోకూడ నున్నవారికిని నీళ్లు ఇచ్చి । అతనికి 33
భోజనము పెట్టించెను గాని అతడు—నేను వచ్చిన పని
చెప్పక మునుపు భోజనము చేయననగా అతడు—చెప్పు
మనెను. । అంతట అతడిట్లనెను—నేను అబ్రాహాము 34
దాసుడను, యెహోవా నా యజమానుని బహుగా 35

ఆశీర్వదించెనుగనుక అతడు గొప్పవాడాయెను; అత
నికి గొఱ్ఱెలను గొడ్లను వెండి బంగారములను దాస
దాసీ జనమును ఒంటెలను గాడిదెలను దయచేసెను. ।
36 నా యజమానుని భార్యయైన శారా వృద్ధాప్యములో
నా యజమానునికి కుమారుని కనెను; నా యజమా
నుడు తనకు కలిగినది యావత్తును అతనికిచ్చి యున్నా
37 డు; । మరియు నా యజమానుడు నన్ను చూచి—నేను
ఎవరి దేశమందు నివసించుచున్నానో ఆ కనానీయుల
పిల్లలలో ఒకపిల్లను నా కుమారునికి పెండ్లి చేయ
38 వద్దు. । అయితే నా తండ్రి యింటికిని నా వంశస్థుల
యొద్దకును వెళ్లి నా కుమారునికి పెండ్లిచేయుటకు ఒక
పిల్లను తీసికొని రావలెనని నాచేత ప్రమాణము చేయిం
39 చెను. । అప్పుడు నేను నా యజమానునితో—ఆ స్త్రీ
40 నావెంట రాదేమో అని చెప్పినందుకు అతడు—ఎవని
సన్నిధిలో నేను జీవించుచున్నానో ఆ యెహోవా
నీతోకూడ తన దూతను పంపి నీ ప్రయాణమును సఫ
లముచేయును గనుక నీవు నా వంశస్థులలో నా తండ్రి
యింటనుండి నా కుమారునికి భార్యను తీసికొని వచ్చె
41 దవు. । నీవు నా వంశస్థులయొద్దకు వెళ్లితివా యీ
ప్రమాణము విషయములో ఇక నీకు బాధ్యత ఉండదు,
వారు ఆమెను ఇయ్యనియెడలకూడ ఈ ప్రమాణము
విషయములో నీకు బాధ్యత ఉండదని చెప్పెను. ।
42 నేను నేడు ఆ బావియొద్దకు వచ్చి—అబ్రాహాము
నా యజమానుని దేవుడవైన యెహోవా, నా ప్రయా
43 ణమును నీవు సఫలము చేసినయెడల । నేను ఈ
నీళ్ల బావియొద్ద నిలిచియుండగా నీళ్లు చేదుకొనుటకు
వచ్చిన చిన్నదానితో నేను—నీవు దయచేసి నీ కడ
వలో నీళ్లు కొంచెము నన్ను త్రాగనిమ్మని చెప్పిన
44 ప్పుడు । —నీవు త్రాగుము నీ ఒంటెలకును చేదిపో
యుదునని యెవతె చెప్పునో ఆమెయే నా యజమా
నుని కుమారునికి యెహోవా నియమించిన పిల్లయై
45 యుండుగాకని మనవిచేసికొంటిని. । నేను నా హృద
యములో అట్లు అనుకొనుట చాలింపకముందే రిబ్కా
భుజముమీద తన కడవను పెట్టుకొనివచ్చి ఆ బావి
లోకి దిగిపోయి నీళ్లు చేదుకొని వచ్చెను; అప్పుడు—
46 నాకు దాహమిమ్మని నేనామెను అడుగగా । ఆమె
త్వరగా తన కడవను దించి—త్రాగుము, నీ ఒం
టెలకును నీళ్లు పెట్టెదనని చెప్పెను గనుక నేను త్రాగి
47 తిని; ఆమె ఒంటెలకును నీళ్లు పెట్టెను. । అప్పుడు
నేను—నీవు ఎవరికుమార్తెవని యడిగినందుకు ఆమె—
మిల్కా నాహోరుకు కనిన కుమారుడగు బెతూయేలు
కుమార్తెనని చెప్పినప్పుడు, నే నామె ముక్కుకు ముక్కె
48 మ్మియును ఆమె చేతులకు కడియములును పెట్టి । నా
తల వంచి యెహోవాకు మ్రొక్కి, అబ్రాహామను
నా యజమానుని దేవుడైన యెహోవాను స్తోత్రము
చేసితిని; ఏలయనగా ఆయన నా యజమానునియొక్క

సహోదరుని కుమార్తెను అతని కుమారునికి తీసికొను
నట్లు సరియైన మార్గమందు నన్ను నడిపించెను. । కాబట్టి 49
నా యజమానుని యెడల మీరు దయను నమ్మకమును
కనుపరచినయెడల అదియైనను నాకు తెలియచెప్పుడి,
లేనియెడల అదియైనను తెలియచెప్పుడి; అప్పుడు
నేనెటు పోవలెనో అటు పోయెద ననగా । లాబా 50
నును బెతూయేలును—ఇది యెహోవావలన కలిగిన
కార్యము; మేమైతే అవుననిగాని కాదనిగాని చెప్ప
జాలము; । ఇదిగో రిబ్కా నీ యెదుటనున్నది, ఆమెను 51
తీసికొని పొమ్ము; యెహోవా సెలవిచ్చినప్రకారము
ఈమెను నీ యజమానుని కుమారునికి చేసికొమ్మని
ఉత్తరమిచ్చిరి. । అబ్రాహాము సేవకుడు వారి మా 52
టలు విని యెహోవాకు సాష్టాంగ నమస్కారము
చేసెను. । తరువాత ఆ సేవకుడు వెండి నగలను బం 53
గారు నగలను వస్త్రములను తీసి రిబ్కాకు ఇచ్చెను;
మరియు అతడు ఆమె సహోదరునికిని తల్లికిని విలువ
గల వస్తువులు ఇచ్చెను. । అతడును అతనితోకూడ 54
నున్న మనుష్యులును అన్నపానములు పుచ్చుకొని
అక్కడ ఆ రాత్రియంతయు నుండిరి. ఉదయమున
వారు లేచినప్పుడు అతడు—నా యజమానునియొద్దకు
నన్ను పంపించుడని చెప్పగా । ఆమె సహోదరు 55
డును ఆమె తల్లియు—ఈ చిన్నదాని పదిదినములైనను
మాయొద్ద ఉండనిమ్ము, ఆ తరువాత ఆమె వెళ్లవచ్చు
ననిరి. । అప్పుడతడు—యెహోవా నా ప్రయాణ 56
మును సఫలము చేసెను గనుక నాకు తడవు కానీయక
నన్ను పంపించుడి, నా యజమానుని యొద్దకు వెళ్లెదనని
చెప్పినప్పుడు । వారు—ఆ చిన్నదానిని పిలిచి, ఆమె 57
యేమనునో తెలిసికొందమని చెప్పుకొని । రిబ్కాను 58
పిలిచి—ఈ మనుష్యునితో కూడ వెళ్లెదవా అని ఆమె
నడిగినప్పుడు—వెళ్లెదననెను. । కాబట్టి వారు తమ 59
సహోదరియైన రిబ్కాను ఆమె దాదిని అబ్రాహాము
సేవకుని అతనితో వచ్చిన మనుష్యులను సాగనంపి
నప్పుడు । వారు రిబ్కాను చూచి—మా సహోదరీ, 60
నీవు వేల వేలకు తల్లి వగుదువు గాక, నీ సంతతివారు
తమ పగవారి గవినిని స్వాధీనపరచుకొందురుగాక అని
ఆమెను దీవింపగా । రిబ్కాయు ఆమె పనికత్తెలును 61
లేచి ఒంటెల నెక్కి ఆ మనుష్యుని వెంబడి వెళ్లిరి.
అట్లు ఆ సేవకుడు రిబ్కాను తోడుకొని పోయెను.
ఇస్సాకు బెయేర్ లహాయిరోయి మార్గమున వచ్చి 62
దక్షిణదేశమందు కాపురముండెను. । సాయంకాలమున 63
ఇస్సాకు పొలములో ధ్యానింప బయలువెళ్లి కన్నులెత్తి
చూచినప్పుడు ఒంటెలు వచ్చుచుండెను. । రిబ్కా 64
కన్నులెత్తి ఇస్సాకును చూచి ఒంటెమీద నుండి దిగి ।
—మనల నెదుర్కొనుటకు పొలములో నడుచు 65
చున్న ఆ మనుష్యుడెవరని దాసుని నడుగగా అతడు
—ఇతడు నా యజమానుడని చెప్పెను గనుక ఆమె

66 ముసుకు వేసికొనెను. । అప్పు డాదాసుడు తాను
చేసిన కార్యములన్నియు ఇస్సాకుతో వివరించి చెప్పె
67 ను. । ఇస్సాకు తన తల్లియైన శారా గుడారములోకి
ఆమెను తీసికొనిపోయెను. అట్లు అతడు రిబ్కాను
పరిగ్రహింపగా ఆమె అతనికి భార్య ఆయెను; అతడు
ఆమెను ప్రేమించెను. అప్పుడు ఇస్సాకు తన తల్లి విష
యమై దుఃఖనివారణ పొందెను.

25 అబ్రాహాము మరల ఒక స్త్రీని వివాహము చేసి
2 కొనెను, ఆమె పేరు కెతూరా. । ఆమె అతనికి
జిమ్రాను, యొక్షాను, మెదాను, మిద్యాను, ఇష్బాకు,
3 షూవహు అను వారిని కనెను. । యొక్షాను షేబనను
దెదానును కనెను. అష్షూరీయులు లెతూషీయులు
లెయుమీయులు అనువారు ఆ దెదాను సంతతివారు. ।
4 ఏయిఫా ఏఫెరు హనోకు అబీదా ఎల్దాయా అనువారు
ఆ మిద్యాను సంతతివారు. వీరందరు కెతూరా సంతతి
5 వారు. । అబ్రాహాము తనకు కలిగినది యావత్తు
6 ఇస్సాకు కిచ్చెను. । అబ్రాహాము తన ఉపపత్నుల
కుమారులకు బహుమానములిచ్చి, తాను సజీవుడై
యుండగానే తన కుమారుడగు ఇస్సాకు నొద్దనుండి
తూర్పుతట్టుగా తూర్పు దేశమునకు వారిని పంపివేసె
7 ను. । అబ్రాహాము బ్రదికిన సంవత్సరములు నూట
8 డెబ్బదియైదు. । అబ్రాహాము నిండు వృద్ధాప్యమునకు
వచ్చినవాడై మంచి ముసలితనమున ప్రాణము విడిచి
9 మృతిబొంది తన పితరులయొద్దకు చేర్చబడెను. । అతని
కుమారులగు ఇస్సాకును ఇష్మాయేలును హిత్తీయుడైన
సోహరు కుమారుడగు ఎఫ్రోను పొలమందలి మక్పేలా
గుహలో అతని పాతిపెట్టిరి; అది మమ్రే యెదుట
10 నున్నది. । అబ్రాహాము హేతు కుమారులయొద్ద
కొనిన పొలములోనే అబ్రాహామును అతని భార్య
11 యైన శారాయును పాతి పెట్టబడిరి. । అబ్రాహాము
మృతిబొందిన తరువాత దేవుడు అతని కుమారుడగు
ఇస్సాకును ఆశీర్వదించెను; అప్పుడు ఇస్సాకు బెయేర్
లహాయిరోయి దగ్గర కాపురముండెను.

12 ఐగుప్తీయురాలును శారా దాసియునైన హాగరు
అబ్రాహామునకు కనిన అబ్రాహాము కుమారుడగు ఇష్మా
13 యేలు వంశావళి యిదే. । ఇష్మాయేలు జ్యేష్ఠకుమారుడైన
14 నెబాయోతు కేదారు అద్బయేలు మిబ్శాము । మిష్మా
15 దూమా మశ్శా । హదరు తేమా యెతూరు నాపీషు
16 కెదెమా. । ఇవి వారి వారి వంశావళుల ప్రకారము
వారి వారి పేరుల చొప్పున ఇష్మాయేలు కుమారుల
యొక్క పేరులు. వారి వారి గ్రామములలోను వారి
వారి కోటలలోను ఇష్మాయేలు కుమారులు వీరే, వారి
పేరులు ఇవే, వారి వారి జనముల ప్రకారము వారు
17 పన్నెండుగురు రాజులు. । ఇష్మాయేలు బ్రదికిన సంవ
త్సరములు నూట ముప్పదియేడు. అప్పుడతడు ప్రా
ణము విడిచి మృతిబొంది తన పితరులయొద్దకు చేర్చ
బడెను. । వారు అష్షూరునకు వెళ్లుమార్గమున హవీలా 18
మొదలుకొని ఐగుప్తు ఎదుటనున్న షూరుపర్యంతము
నివసించువారు. అతడు తన సహోదరులందరి యె
దుట నివాస మేర్పరచుకొనెను.

అబ్రాహాము కుమారుడగు ఇస్సాకు వంశావళి 19
యిదే. అబ్రాహాము ఇస్సాకును కనెను. । ఇస్సాకు 20
పద్దనరాములో నివసించు అరామీయుడైన బెతూ
యేలు కుమార్తెయును అరామీయుడైన లాబాను
సహోదరియునైన రిబ్కాను పెండ్లి చేసికొన్నప్పుడు
నలుబది సంవత్సరములవాడు. । ఇస్సాకు భార్య 21
గొడ్రాలు గనుక అతడు ఆమె విషయమై యెహో
వాను వేడుకొనెను. యెహోవా అతని ప్రార్థన
వినెను గనుక అతని భార్యయైన రిబ్కా గర్భవతి
ఆయెను. । ఆమె గర్భములో శిశువులు ఒకనితో 22
నొకడు పెనుగులాడిరి గనుక ఆమె—ఈలాగైతే నేను
బ్రదుకుట యెందుకని అనుకొని యీ విషయమై
యెహోవాను అడుగ వెళ్లెను. అప్పుడు యెహో
వా ఆమెతో నిట్లనెను—

రెండు జనములు నీ గర్భములో కలవు. 23
రెండు జనపదములు నీ కడుపులోనుండి
ప్రత్యేకముగా వచ్చును
ఒక జనపదముకంటె ఒక జనపదము
బలిష్ఠమై యుండును
పెద్దవాడు చిన్నవానికి దాసుడగును

అనెను.

ఆమె ప్రసూతి కావలసిన దినములు నిండినప్పుడు 24
ఆమె గర్భమందు కవలవారు ఉండిరి. । మొదటివాడు 25
ఎఱ్ఱనివాడుగా బయటికి వచ్చెను. అతని ఒళ్లంత
యు రోమవస్త్రము వలె నుండెను గనుక అతనికి ఏశావు
అను పేరు పెట్టిరి. । తరువాత అతని సహోదరుడు 26
బయటికి వచ్చినప్పుడు అతని చెయ్యి ఏశావు మడి
మెను పట్టుకొనియుండెను గనుక అతనికి యాకోబు
అను పేరు పెట్టబడెను. ఆమె వారిని కనినప్పుడు
ఇస్సాకు అరువది యేండ్లవాడు. । ఆ చిన్నవారు ఎదిగి 27
నప్పుడు ఏశావు వేటాడుటయందు నేర్పరియై అరణ్య
వాసిగా నుండెను; యాకోబు సాధువై గుడారము
లలో నివసించుచుండెను. । ఇస్సాకు ఏశావు తెచ్చిన 28
వేటమాంసమును తినెను గనుక అతని ప్రేమించెను;
రిబ్కా యాకోబును ప్రేమించెను. । ఒకనాడు యా 29
కోబు కలగూరవంటకము వండుకొనుచుండగా ఏశావు
అలసినవాడై పొలములోనుండి వచ్చి । —నేను అలసి 30
యున్నాను; ఆ యెఱ్ఱ యెఱ్ఱగానున్నదానిలో కొం
చెము దయచేసి నాకు పెట్టుమని అడిగెను; అందు
చేత అతని పేరు ఎదోము అనబడెను । అందుకు 31
యాకోబు —నీ జ్యేష్ఠత్వము నేడు నాకిమ్మని అడుగ
గా । ఏశావు—నేను చావబోవుచున్నాను గదా జ్యేష్ఠ 32

33 త్వము నాకెందుకనెను । యాకోబు—నేడు నాతో
ప్రమాణము చేయుమనెను. అతడు యాకోబుతో
ప్రమాణముచేసి అతనికి తన జ్యేష్ఠత్వమును అమ్మివేయు
34 గా । యాకోబు ఆహారమును చిక్కుడుకాయల వంట
కమును ఏశావుకిచ్చెను; అతడు తిని త్రాగి లేచిపో
యెను. అట్లు ఏశావు తన జ్యేష్ఠత్వమును తృణీకరించెను.

**26** అబ్రాహాము దినములలో వచ్చిన మొదటి కరవు
గాక మరియొక కరవు ఆ దేశములో వచ్చెను. అప్పుడు
ఇస్సాకు గెరారులోనున్న ఫిలిష్తీయుల రాజైన అబీ
2 మెలెకు నొద్దకు వెళ్లెను. । అక్కడ యెహోవా
అతనికి ప్రత్యక్షమై — నీవు ఐగుప్తులోకి వెళ్లక నేను
3 నీతో చెప్పు దేశమందు నివసించుము. । ఈ దేశమందు
పరవాసివై యుండుము. నేను నీకు తోడైయుండి
4 నిన్ను ఆశీర్వదించెదను; । ఏలయనగా నీకును నీ సం
తానమునకును ఈ దేశములన్నియు ఇచ్చి, నీ తండ్రి
యైన అబ్రాహాముతో నేను చేసిన ప్రమాణము నెర
వేర్చి, ఆకాశ నక్షత్రములవలె నీ సంతానమును విస్త
రింపచేసి యీ దేశములన్నియు నీ సంతానమునకు
ఇచ్చెదను. నీ సంతానమువలన సమస్త భూలోకములోని
5 సమస్త జనులు ఆశీర్వదింపబడుదురు. । ఏలయనగా
అబ్రాహాము నా మాట విని నేను విధించినదానిని
నా ఆజ్ఞలను నా కట్టడలను నా నియమములను గైకొనె
నని చెప్పెను.

6 ఇస్సాకు గెరారులో నివసించెను. ఆ చోటి మను
7 ష్యులు అతని భార్యను చూచి—ఆమె యెవరని అడిగి
నప్పుడు అతడు—ఆమె నా సహోదరి అని చెప్పెను;
ఎందుకనగా — రిబ్కా చక్కనిది గనుక ఈ చోటి
మనుష్యులు ఆమె నిమిత్తము నన్ను చంపుదురేమో
అనుకొని తన భార్య అని చెప్పుటకు భయపడెను. ।
8 అక్కడ అతడు చాలా దినములుండిన తరువాత ఫిలి
ష్తీయుల రాజైన అబీమెలెకు కిటికీలోనుండి చూచి
నప్పుడు ఇస్సాకు తన భార్యయైన రిబ్కాతో సరస
9 మాడుట కనబడెను. । అప్పుడు అబీమెలెకు ఇస్సా
కును పిలిపించి — ఇదిగో ఆమె నీ భార్యయే—ఆమె
నా సహోదరి అని యేల చెప్పితివని అడుగగా
ఇస్సాకు—ఆమెను బట్టి నేను చనిపోవుదునేమో అను
10 కొంటినని అతనితో చెప్పెను. । అందుకు అబీమె
లెకు—నీవు మాకు చేసిన యీ పని యేమి? ఈ జను
లలో ఎవడైన ఆమెతో నిర్భయముగా శయనించ
వచ్చునే. అప్పుడు నీవు మామీదికి పాతకము తెచ్చి
11 పెట్టువాడవు గదా అనెను. । అబీమెలెకు—ఈ మను
ష్యుని జోలికైనను ఇతని భార్య జోలికైనను వెళ్లు
వాడు నిశ్చయముగా మరణశిక్ష పొందునని తన ప్రజల
12 కందరికి ఆజ్ఞాపింపగా । ఇస్సాకు ఆ దేశమందున్న
వాడై విత్తనము వేసి ఆ సంవత్సరము నూరంతలు ఫలము
పొందెను. యెహోవా అతనిని ఆశీర్వదించెను గనుక

ఆ మనుష్యుడు గొప్పవాడాయెను. । అతడు మిక్కిలి
గొప్పవాడగువరకు క్రమక్రమముగా అభివృద్ధిపొం
దుచు వచ్చెను. । అతనికి గొఱ్ఱెల ఆస్తియు గొడ్ల ఆస్తియు
దాసుల గొప్ప సమూహమును కలిగినందున ఫిలిష్తీ
యులు అతనియందు అసూయపడిరి. । అందుచేత
అతని తండ్రియైన అబ్రాహాము దినములలో అతని
తండ్రి దాసులు త్రవ్విన బావులన్నిటిని ఫిలిష్తీయులు
మన్నుపోసి పూడ్చివేసిరి.

అబీమెలెకు—నీవు మాకంటె బహు బలము గలవా
డవు గనుక మా యొద్దనుండి వెళ్లిపొమ్మని ఇస్సాకుతో
చెప్పగా । ఇస్సాకు అక్కడనుండి వెళ్లి గెరారు లోయ
లో గుడారము వేసికొని అక్కడ నివసించెను. ।
అప్పుడు తన తండ్రియైన అబ్రాహాము దినములలో
త్రవ్విన నీళ్ల బావులు ఇస్సాకు తిరిగి త్రవ్వించెను; ఏల
యనగా అబ్రాహాము మృతిబొందిన తరువాత ఫిలిష్తీ
యులు వాటిని పూడ్చివేసిరి. అతడు తన తండ్రి వాటికి
పెట్టిన పేళ్ల చొప్పున తిరిగి వాటికి పేళ్లు పెట్టెను. ।
మరియు ఇస్సాకు దాసులు ఆ లోయలో త్రవ్వగా
జెలలుగల నీళ్లబావి దొరికెను. । అప్పుడు గెరారు
కాపరులు ఇస్సాకు కాపరులతో జగడమాడి — ఈ
నీరు మాదే అని చెప్పిరి గనుక వారు తనతో కలహించి
నందున అతడు ఆ బావికి ఏశెకు అను పేరు పెట్టెను. ।
వారు మరియొక బావి త్రవ్వినప్పుడు దాని కొరకును
జగడమాడిరి గనుక దానికి శిత్నా అను పేరు పెట్టెను. ।
అతడు అక్కడనుండి వెళ్లి మరియొక బావి త్రవ్విం
చెను. దానివిషయమై వారు జగడమాడలేదు గనుక
అతడు—ఇప్పుడు యెహోవా మనకు ఎడము కలుగ
జేసియున్నాడు గనుక యీ దేశమందు అభివృద్ధి
పొందుదుమనుకొని దానికి రహెబోతు అను పేరు
పెట్టెను. । అక్కడనుండి అతడు బెయేర్షెబాకు
వెళ్లెను. । ఆ రాత్రియే యెహోవా అతనికి ప్రత్య
క్షమై—నేను నీ తండ్రియైన అబ్రాహాము దేవుడను,
నేను నీకు తోడైయున్నాను గనుక భయపడకుము;
నా దాసుడైన అబ్రాహామును బట్టి నిన్ను ఆశీర్వదించి
నీ సంతానమును విస్తరింప చేసెదనని చెప్పెను. ।
అక్కడ అతడొక బలిపీఠము కట్టించి యెహోవా
నామమున ప్రార్థనచేసి అక్కడ తన గుడారము
వేసెను. అప్పుడు ఇస్సాకు దాసులు అక్కడ బావి
త్రవ్విరి. । అంతట అబీమెలెకును అతని స్నేహితుడైన
అహుజతును అతని సేనాధిపతియైన ఫీకోలును గెరారు
నుండి అతనియొద్దకు వచ్చిరి. । ఇస్సాకు — మీరు
నామీద పగపట్టి మీ యొద్దనుండి నన్ను పంపివేసిన
తరువాత ఎందునిమిత్తము నా యొద్దకు వచ్చియున్నా
రని వారినడుగగా । వారు—నిశ్చయముగా యెహో
వా నీకు తోడైయుండుట చూచితివిు గనుక మనకు,
అనగా మాకును నీకును మధ్య నొక ప్రమాణముండ

29 పలెననియు । మేము నిన్ను ముట్టక నీకు మేలే తప్ప మరి
యేమియు చేయక నిన్ను సమాధానముగా పంపివేసి
తిమి గనుక నీవును మాకు కీడుచేయకుండునట్లు నీతో
నిబంధన చేసికొందుమనియు అనుకొంటిమి; ఇప్పుడు
నీవు యెహోవా ఆశీర్వాదము పొందినవాడవనిరి. ।
30 అతడు వారికి విందుచేయగా వారు అన్నపానములు
31 పుచ్చుకొనిరి. । తెల్లవారినప్పుడు వారు లేచి ఒక
నితో ఒకడు ప్రమాణము చేసికొనిరి; తరువాత
ఇస్సాకు వారిని సాగనంపగా వారు అతనియొద్దనుండి
32 సమాధానముగా వెళ్లిరి. । ఆ దినమందే ఇస్సాకు
దాసులు వచ్చి తాము త్రవ్విన బావినిగూర్చి అతనికి
తెలియచేసి—మాకు నీళ్లు కనబడినవని చెప్పిరి గనుక ।
33 దానికి షేబ అను పేరు పెట్టెను. కాబట్టి నేటివరకు
ఆ ఊరి పేరు బెయేర్షెబా.
34 ఏశావు నలుబది సంవత్సరములవాడైనప్పుడు హిత్తీ
యుడైన బెయేరి కుమార్తెయగు యహూదీతును హిత్తీ
యుడైన ఏలోను కుమార్తెయగు బాశెమతును పెండ్లి
35 చేసికొనెను. । వీరు ఇస్సాకుకును రిబ్కాకును మనో
వేదన కలుగజేసిరి.

27 ఇస్సాకు వృద్ధుడై అతని కన్నులకు మందదృష్టి
కలిగినప్పుడు అతడు తన పెద్ద కుమారుడైన ఏశావును
చూచి—నా కుమారుడా, అని అతని పిలువగా
అతడు—చిత్తము నాయనా అని అతనితో ననెను. ।
2 అప్పుడతడు—ఇదిగో నేను వృద్ధుడను, నా మరణ
3 దినము నాకు తెలియదు. । కాబట్టి నీవు దయచేసి
నీ ఆయుధములైన నీ అంబుల పొదిని నీ విల్లును తీసి
కొని అడవికిపోయి నాకొరకు వేటాడి మాంసము
4 తెమ్ము. । నేను చావకమునుపు నిన్ను నేను ఆశీర్వదిం
చునట్లు నాకిష్టమైన రుచిగల భోజ్యములను సిద్ధపరచి
నేను తినుటకై నా యొద్దకు తెమ్మని చెప్పెను. ।
5 ఇస్సాకు తన కుమారుడగు ఏశావుతో ఇట్లు చెప్పు
చుండగా రిబ్కా వినుచుండెను. ఏశావు వేటాడి
6 మాంసము తెచ్చుటకు అడవికి వెళ్లెను. । అప్పుడు
రిబ్కా తన కుమారుడగు యాకోబును చూచి—ఇదిగో
7 నీ తండ్రి నీ అన్నయైన ఏశావుతో । —మృతిబొందక
మునుపు నేను తిని యెహోవా సన్నిధిని నిన్ను
ఆశీర్వదించునట్లు నా కొరకు మాంసము తెచ్చి నాకు
రుచిగల భోజ్యములను సిద్ధపరచుమని చెప్పగా విం
8 టిని. । కాబట్టి నా కుమారుడా, నా మాటవిని నేను
9 నీకు ఆజ్ఞాపించునట్టు చేయుము. । నీవు మందకు వెళ్లి
రెండు మంచి మేకపిల్లలను అక్కడనుండి నా యొద్దకు
తెమ్ము. వాటితో నీ తండ్రికిష్టమైన రుచిగల భోజ్య
10 ములను అతనికి చేసెదను. । నీ తండ్రి మృతిబొందక
మునుపు అతడు వాటిని తిని నిన్ను ఆశీర్వదించునట్లు
నీవు వాటిని నీ తండ్రియొద్దకు తీసికొనిపోవలెననెను. ।
11 అందుకు యాకోబు—నా సహోదరుడైన ఏశావు
రోమము గలవాడు, నేను నున్ననివాడను గదా. ।
ఒకవేళ నా తండ్రి నన్ను తడవిచూచును, అప్పుడు 12
నేను అతనిదృష్టికి వంచకుడనుగా తోచినయెడల నా
మీదికి శాపమే గాని ఆశీర్వాదము తెచ్చుకొనననని
చెప్పెను. । అయినను అతని తల్లి—నా కుమారుడా, 13
ఆ శాపము నా మీదికి వచ్చుగాక. నీవు నా మాట
మాత్రము విని, పోయి వాటిని నా యొద్దకు తీసికొని
రమ్మని చెప్పగా । అతడు వెళ్లి వాటిని తన తల్లియొ 14
ద్దకు తీసికొనివచ్చెను. అతని తల్లి అతని తండ్రికిష్ట
మైన రుచిగల భోజ్యములను సిద్ధపరచెను. । మరియు 15
తన జ్యేష్ఠకుమారుడగు ఏశావుకు సొగసైన వస్త్రములు
ఇంట తనయొద్ద నుండెను గనుక । రిబ్కా వాటిని 16
తీసి తన చిన్న కుమారుడగు యాకోబుకు తొడిగించి
ఆ మేకపిల్లల చర్మములతో అతని చేతులను అతని మెడ
మీద నునుపుభాగమును కప్పి । తాను సిద్ధపరచిన 17
రుచిగల భోజ్యములను రొట్టెను తన కుమారుడగు యా
కోబు చేతికియ్యగా । అతడు తన తండ్రియొద్దకు 18
వచ్చి—నా తండ్రీ, అని పిలువగా అతడు—ఏమి నా
కుమారుడా, నీవెవరవని అడిగెను. । అందుకు యాకోబు 19
—నేను ఏశావు అను నీ జ్యేష్ఠకుమారుడను; నీవు నాతో
చెప్పిన ప్రకారము చేసియున్నాను. నీవు నన్ను దీవిం
చుటకై దయచేసి లేచి కూర్చుండి, నేను వేటాడి
తెచ్చినదాని తినుమనెను. । అప్పుడు ఇస్సాకు—నా 20
కుమారుడా, ఇంత శీఘ్రముగా అది నీకెట్లు దొరికె
నని అడుగగా అతడు—నీ దేవుడైన యెహోవా
నా యెదుటికి దాని రప్పించుటచేతనే అని చెప్పెను. ।
అప్పుడు ఇస్సాకు—నా కుమారుడా, నీవు ఏశావను 21
నా కుమారుడవో కావో నేను నిన్ను తడవి చూచె
దను దగ్గరకు రమ్మని చెప్పెను. । యాకోబు తన తండ్రి 22
యైన ఇస్సాకు దగ్గరకు వచ్చినప్పుడు అతడు అతని
తడవి చూచి—స్వరము యాకోబు స్వరము గాని
చేతులు ఏశావు చేతులే అనెను. । అతని చేతులు 23
అతని అన్నయైన ఏశావుచేతులవలె రోమము గలవై
నందున అతడు అతని గురుతు పట్టలేక అతని దీవించి ।
—ఏశావు అను నా కుమారుడవు నీవేనా అని అడు 24
గగా యాకోబు—నేనే అనెను. । అంతట అతడు— 25
అది నా యొద్దకు తెమ్ము; నేను నిన్ను దీవించునట్లు
నా కుమారుడు వేటాడి తెచ్చినది తిందుననెను; అతడు
తెచ్చినప్పుడు అతడు తినెను; ద్రాక్షారసము తేగా
అతడు త్రాగెను. । తరువాత అతని తండ్రియైన 26
ఇస్సాకు—నా కుమారుడా, దగ్గరకువచ్చి నన్ను ముద్దు
పెట్టుకొమ్మని అతనితో చెప్పెను. । అతడు దగ్గరకు 27
వచ్చి అతని ముద్దుపెట్టుకొనెను. అప్పుడతడు అతని
వస్త్రములను వాసన చూచి అతని దీవించి యిట్లనెను—
ఇదిగో నా కుమారుని సువాసన
యెహోవా దీవించిన చేని సువాసనవలె నున్నది.

28 ఆకాశపు మంచును భూసారములో పాలును ఇచ్చు
విస్తారమైన ధాన్యమును ద్రాక్షారసమును
దేవుడు నీ కనుగ్రహించును.
29 జనములు నీకు దాసులగుదురు
జనములు నీకు సాగిలపడుదురు
నీ బంధుజనులకు నీవు ఏలికవై యుండుము
నీ తల్లి పుత్రులు నీకు సాగిలపడుదురు
30 నిన్ను శపించువారు శపింపబడుదురు
నిన్ను దీవించువారు దీవింపబడుదురు.

ఇస్సాకు యాకోబును దీవించుటయైన తరువాత
యాకోబు తన తండ్రియైన ఇస్సాకు ఎదుటనుండి
బయలుదేరి వెళ్లిన తక్షణమే అతని సహోదరుడైన
31 ఏశావు వేటాడి వచ్చెను। అతడును రుచిగల భోజ్య
ములను సిద్ధపరచి తన తండ్రియొద్దకు తెచ్చి — నా
తండ్రీ నన్ను దీవించునట్లు లేచి నీ కుమారుడు వేటాడి
32 తెచ్చినదాని తినుమని తన తండ్రితో ననెను। అతని
తండ్రియైన ఇస్సాకు—నీవెవరవని అతని నడిగినప్పుడు
అతడు — నేను నీ కుమారుడను ఏశావు అను నీ జ్యేష్ఠ
33 కుమారుడననగా। ఇస్సాకు మిక్కుటముగా గడగడ
వణకుచు — అట్లయితే వేటాడిన భోజ్యమును నా
యొద్దకు తెచ్చిన వారెవరు? నీవు రాకమునుపు నేను
వాటన్నిటిలో తిని అతనిని నిజముగా దీవించితిని,
34 అతడు దీవింపబడినవాడే యనెను। ఏశావు తన తండ్రి
మాటలు వినినప్పుడు దుఃఖాక్రాంతుడై పెద్ద కేకవేసి
—ఓ నా తండ్రీ, నన్నును దీవించుమని తన తండ్రి
35 తో చెప్పెను। అతడు—నీ సహోదరుడు కపటో
పాయముతో వచ్చి నీకు రావలసిన దీవెన పొందె
36 ననగా। ఏశావు — యాకోబు అను పేరు అతనికి సరి
గానే చెల్లినది; అతడు నన్ను ఈ రెండుమారులు మోస
పుచ్చెను, నా జ్యేష్ఠత్వము తీసికొనెను, ఇదిగో
ఇప్పుడు వచ్చి నాకు రావలసిన దీవెనను తీసికొనెనని
చెప్పి—నా కొరకు మరి యే దీవెనయు మిగిల్చి యుంచ
37 లేదా అని అడిగెను। అందుకు ఇస్సాకు — ఇదిగో
అతని నీకు ఏలికనుగా నియమించి అతని బంధుజను
లందరిని అతనికి దాసులగా ఇచ్చితిని; ధాన్యమును
ద్రాక్షారసమును ఇచ్చి అతని పోషించితిని గనుక నా
కుమారుడా, నీకేమి చేయగలనని ఏశావుతో ప్రత్యు
38 త్తరమియ్యగా। ఏశావు—నా తండ్రీ, నీ యొద్ద ఒక
దీవెనయే ఉన్నదా? నా తండ్రీ, నన్ను నన్నుకూడ
దీవించుమని తన తండ్రితో చెప్పి ఏశావు ఎలుగెత్తి
యేడ్వగా, అతని తండ్రియైన ఇస్సాకు—
39 నీ నివాసము భూసారము లేకయు
పైనుండిపడు ఆకాశపు మంచు లేకయునుండును.
40 నీవు నీ కత్తిచేత బ్రదుకుదువు
నీ సహోదరునికి దాసుడవగుదువు
నీవు తిరుగులాడుచుండగా
నీ మెడమీదనుండి అతని కాడి విరిచివేయుదువు
అని అతనికుత్తరమిచ్చెను.

తన తండ్రి యాకోబుకిచ్చిన దీవెన నిమిత్తము 41
ఏశావు అతనిమీద పగపట్టెను. మరియు ఏశావు—
నా తండ్రిని గూర్చిన దుఃఖదినములు సమీపముగా
నున్నవి; అప్పుడు నా తమ్ముడైన యాకోబును చంపె
దననుకొనెను। రిబ్కా తన పెద్ద కుమారుడైన ఏశావు 42
మాటలనుగూర్చి వినినప్పుడు ఆమె తన చిన్నకుమారు
డైన యాకోబును పిలువనంపి అతనితో ఇట్లనెను—
ఇదిగో నీ అన్నయైన ఏశావు నిన్ను చంపెదనని చెప్పి
నిన్నుగూర్చి తన్నుతాను ఓదార్చుకొనుచున్నాడు।
కాబట్టి నా కుమారుడా, నీవు నా మాట విని లేచి 43
హారానులోనున్న నా సహోదరుడగు లాబాను
నొద్దకు పారిపోయి నీ అన్న కోపము చల్లారువరకు।
నీ అన్న కోపము నీమీదనుండి తొలగి నీవు అతనికి 44
చేసినవాటిని అతడు మరచువరకు లాబానునొద్ద 45
కొన్నాళ్లు ఉండుము; అప్పుడు నేను అక్కడనుండి
నిన్ను పిలిపించెదను. ఒక్కనాడే మీ యిద్దరిని నేను
పోగొట్టుకొననేల అనెను.

మరియు రిబ్కా ఇస్సాకును చూచి—హేతు కుమా 46
ర్తెలవలన నా ప్రాణము విసికినది. ఈ దేశస్థురాం
డ్లయిన హేతుకుమార్తెలలో వీరివంటి ఒకదానిని
యాకోబు పెండ్లిచేసికొనినయెడల నా బ్రదుకువలన
నాకేమి ప్రయోజనమనెను.

ఇస్సాకు యాకోబును పిలిపించి—నీవు కనాను 28
కుమార్తెలలో ఎవతెను వివాహము చేసికొనకూడదు। 1
నీవు లేచి పద్దనరాములో నున్న నీ తల్లికి తండ్రియైన 2
బెతూయేలు ఇంటికి వెళ్లి అక్కడ నీ తల్లి సహో
దరుడగు లాబాను కుమార్తెలలో ఒకదానిని వివా
హము చేసికొనుమని యతనికి ఆజ్ఞాపించి। —సర్వశక్తి 3
గల దేవుడు నిన్ను ఆశీర్వదించి నీవు అనేకజనములగు
నట్లు నీకు సంతానాభివృద్ధి కలుగజేసి నిన్ను విస్తరింప
చేసి నీవు పరవాసివైన దేశమును, అనగా దేవుడు
అబ్రాహామునకిచ్చిన దేశమును నీవు స్వాస్థ్యముగా
చేసికొనునట్లు। ఆయన నీకు, అనగా నీకును నీతో 4
కూడ నీ సంతానమునకును అబ్రాహామునకు అనుగ్ర
హించిన ఆశీర్వాదమును దయచేయునుగాక అని అతని
దీవించి। యాకోబును పంపివేసెను. అతడు పద్దన 5
రాములోనున్న అరామీయుడగు బెతూయేలు కుమా
రుడును, యాకోబు ఏశావుల తల్లియగు రిబ్కా
సహోదరుడునైన లాబానునొద్దకు వెళ్లెను। ఇస్సాకు 6
యాకోబును దీవించి, పద్దనరాములో పెండ్లిచేసికొని
వచ్చుటకై అతని నక్కడికి పంపెననియు, అతని
దీవించినప్పుడు — నీవు కనాను దేశపు కుమార్తెలలో
ఎవరిని పెండ్లి చేసికొనవద్దని అతనికి ఆజ్ఞాపించె
ననియు, । యాకోబు తన తలిదండ్రుల మాట విని 7

పద్దనరాముకు వెళ్లిపోయెననియు ఏశావు తెలిసికొని
8 నప్పుడు, । ఇదిగాక కనాను కుమార్తెలు తన తండ్రి
యైన ఇస్సాకుకు ఇష్టురాండ్రు కారని ఏశావుకు
9 తెలిసినప్పుడు । ఏశావు ఇష్మాయేలునొద్దకు వెళ్లి, తన
కున్న భార్యలు గాక అబ్రాహాము కుమారుడైన ఇష్మా
యేలు కుమార్తెయు నెబాయోతు సహోదరియునైన
మాహలతును కూడ పెండ్లి చేసికొనెను.

10 యాకోబు బెయేర్షెబానుండి బయలుదేరి హారాను
11 వైపు వెళ్లుచు । ఒకచోట చేరి ప్రొద్దు గ్రుంకినం
దున అక్కడ ఆ రాత్రి నిలిచిపోయి, ఆ చోటి
రాళ్లలో ఒకటి తీసికొని తనకు తలగడగా చేసికొని,
12 అక్కడ పండుకొనెను. । అప్పుడతడు ఒక కల
కనెను. అందులో ఒక నిచ్చెన భూమిమీద నిలువ
బడి యుండెను; దాని కొన ఆకాశమునంటెను;
దానిమీద దేవుని దూతలు ఎక్కుచు దిగుచునుండిరి. ।
13 మరియు యెహోవా దానికి పైగా నిలిచి—నేను నీ
తండ్రియైన అబ్రాహాము దేవుడను ఇస్సాకు దేవుడ
నైన యెహోవాను; నీవు పండుకొనియున్న యీ
భూమిని నీకును నీ సంతానమునకును ఇచ్చెదను. ।
14 నీ సంతానము భూమిమీది (లెక్కకు) ఇసుక రేణు
వులవలెనగును; నీవు పడమటితట్టును తూర్పుతట్టును
ఉత్తరపుతట్టును దక్షిణపుతట్టును వ్యాపించెదవు; భూ
మియొక్క వంశములన్నియు నీమూలముగాను నీ సం
15 తానము మూలముగాను ఆశీర్వదింపబడును. । ఇదిగో
నేను నీకు తోడైయుండి, నీవు వెళ్లు ప్రతి స్థలమందు
నిన్ను కాపాడుచు ఈ దేశమునకు నిన్ను మరల
రప్పించెదను; నేను నీతో చెప్పినది నెరవేర్చువరకు
16 నిన్ను విడువనని చెప్పగా । యాకోబు నిద్రతెలిసి
—నిశ్చయముగా యెహోవా ఈ స్థలమందున్నా
17 డు; అది నాకు తెలియక పోయెననుకొని । భయపడి
—ఈ స్థలము ఎంతో భయంకరము; ఇది దేవుని మం
దిరమే గాని వేరొకటికాదు; ఇదే పరలోకపు గవిని
18 అనుకొనెను. । తెల్లవారినప్పుడు యాకోబు లేచి
తాను తలగడగా చేసికొనిన రాయితీసి దానిని స్తంభ
ముగా నిలిపి దాని కొనమీద నూనె పోసెను. ।
19 మరియు అతడు ఆ స్థలమునకు బేతేలను[1] పేరు
పెట్టెను. అయితే మొదట ఆ ఊరి పేరు లూజు. ।
20 అప్పుడు యాకోబు—నేను తిరిగి నా తండ్రి యింటికి
21 క్షేమముగా వచ్చునట్లు దేవుడు నాకు తోడైయుండి,
నేను వెళ్లుచున్న యీ మార్గములో నన్ను కాపాడి,
తినుటకు ఆహారమును ధరించుకొనుటకు వస్త్రములను
నాకు దయచేసినయెడల యెహోవా నాకు దేవుడై
22 యుండును. । మరియు స్తంభముగా నేను నిలిపిన
యీ రాయి దేవుని మందిరమగును; మరియు నీవు
నాకిచ్చు యావత్తులో పదియవ వంతు నిశ్చయముగా
నీకు చెల్లించెదనని మ్రొక్కుకొనెను.

యాకోబు బయలుదేరి తూర్పు జనుల దేశము 29
నకు వెళ్లెను. । అతడు చూచినప్పుడు పొలములో 2
ఒక బావి కనబడెను. అక్కడ దానియొద్ద గొఱ్ఱెల
మందలు మూడు పండుకొని యుండెను; కాపరులు
మందలకు ఆ బావినీళ్లు పెట్టుదురు; ఒక పెద్ద రాయి
ఆ బావిమీద మూతవేసి యుండెను. । అక్కడికి 3
మందలన్నియు కూడి వచ్చునప్పుడు బావిమీదనుండి
ఆ రాతిని పొర్లించి గొఱ్ఱెలకు నీళ్లు పెట్టి తిరిగి బావి
మీది రాతిని దాని చోటనుంచుదురు. । యాకోబు 4
వారిని చూచి—అన్నలారా, మీరెక్కడివారని అడు
గగా వారు—మేము హారానువారమనిరి. । అతడు 5
—నాహోరు కుమారుడగు లాబానును మీరెరుగు
దురా అని వారినడుగగా వారు ఎరుగుదుమనిరి. ।
మరియు అతడు—అతడు క్షేమముగా ఉన్నాడా అని 6
అడుగగా వారు—క్షేమముగానే ఉన్నాడు; ఇదిగో
అతని కుమార్తెయైన రాహేలు గొఱ్ఱెలవెంట వచ్చు
చున్నదని చెప్పిరి. । అతడు—ఇదిగో ఇంక చాలా 7
ప్రొద్దు ఉన్నది, పశువులను పోగుచేయు వేళకాలేదు,
గొఱ్ఱెలకు నీళ్లు పెట్టిపోయి వాటిని మేపుడని చెప్ప
గా । వారు—మందలన్నియు పోగుకాక మునుపు అది 8
మావలన కాదు, తరువాత బావిమీదనుండి రాయి
పొర్లించుదురు; అప్పుడే మేము గొఱ్ఱెలకు నీళ్లు పెట్టు
దుమనిరి. । అతడు వారితో ఇంక మాటలాడుచుం 9
డగా రాహేలు తన తండ్రి గొఱ్ఱెలమందను తోలు
కొని వచ్చెను; ఆమె వాటిని మేపునది. । యాకోబు 10
తన తల్లి సహోదరుడైన లాబాను కుమార్తెయగు
రాహేలును, తన తల్లి సహోదరుడగు లాబాను
గొఱ్ఱెలను చూచినప్పుడు అతడు దగ్గరకు వెళ్లి బావి
మీదనుండి రాతిని పొర్లించి తన తల్లి సహోదరు
డగు లాబాను గొఱ్ఱెలకు నీళ్లు పెట్టెను. యాకోబు
రాహేలును ముద్దుపెట్టుకొని యెలుగెత్తి యేడ్చెను. ।
మరియు యాకోబు తాను ఆమె తండ్రి బంధువు 11
డనియు, రిబ్కా కుమారుడనియు రాహేలుతో చెప్పి 12
నప్పుడు ఆమె పరుగెత్తికొని తన తండ్రితో చెప్పె
ను. । లాబాను తన సహోదరి కుమారుడైన యా 13
కోబు సమాచారము వినినప్పుడు అతనిని ఎదుర్కొ
నుటకు పరుగెత్తికొనివచ్చి అతని కౌగలించి ముద్దు
పెట్టుకొని తన యింటికి తోడుకొని పోయెను.
అతడు ఈ సంగతులన్నియు లాబానుతో చెప్పెను. ।
అప్పుడు లాబాను—నిజముగా నీవు నా ఎముకయు 14
నా మాంసమునై యున్నావు అనెను. అతడు నెల
దినములు అతనియొద్ద నివసించిన తరువాత । లాబా 15
ను—నీవు నా బంధువుడవైనందున ఊరకయే నాకు

1 అనగా—దేవుని మందిరము.

కొలువు చేసెదవా? నీకేమి జీతము కావలెనో చెప్పు
16 మని యాకోబు నడిగెను. లాబానుకిద్దరు కుమార్తె
లుండిరి. వారిలో పెద్దదాని పేరు లేయా; చిన్న
17 దాని పేరు రాహేలు. లేయా జబ్బు కండ్లు గలది;
రాహేలు రూపవతియు సుందరియునై యుండెను.
18 యాకోబు రాహేలును ప్రేమించి—నీ చిన్న కుమా
ర్తెయైన రాహేలు కోసరము నీకు ఏడు సంవత్సర
19 ములు కొలువు చేసెదననెను. అందుకు లాబాను—
ఆమెను అన్యునికిచ్చుటకంటె నీకిచ్చుట మేలు; నా
20 యొద్ద ఉండుమని చెప్పగా యాకోబు రాహేలు
కోసరము ఏడు సంవత్సరములు కొలువుచేసెను. అయి
నను అతడు ఆమెను ప్రేమించుటవలన అవి అతనికి
21 కొద్ది దినములుగా తోచెను. తరువాత యాకోబు
—నా దినములు సంపూర్ణమైనవి గనుక నేను నా
భార్యయొద్దకు పోవునట్లు ఆమెను నాకిమ్మని లాబాను
22 నడుగగా లాబాను ఆ స్థలములోనున్న మనుష్యుల
23 నందరిని పోగుచేసి విందు చేయించి రాత్రివేళ
తన కుమార్తెయైన లేయాను అతనియొద్దకు తీసికొని
24 పోగా యాకోబు ఆమెను కూడెను. మరియు
లాబాను తన దాసియైన జిల్పాను తన కుమార్తెయైన
25 లేయాకు దాసిగా ఇచ్చెను. ఉదయమందు ఆమె
లేయా అని యెరిగి అతడు లాబానును చూచి—నీవు
నాకు చేసిన పని యేమిటి? రాహేలు కోసరమే
గదా నీకు కొలువు చేసితిని? ఎందుకు నన్ను మోస
26 పుచ్చితివనెను. అందుకు లాబాను—పెద్దదానికంటె
ముందుగా చిన్నదాని నిచ్చుట మాదేశ మర్యాద
27 కాదు. ఈమెయొక్క వారము సంపూర్ణము చేయు
ము; నీవిక యేడు సంవత్సరములు నాకు కొలువు
చేసినయెడల అందుకై ఆమెనుకూడ నీకిచ్చెదమని
28 చెప్పగా యాకోబు ఆలాగు చేసి ఆమె వారము
సంపూర్తియైన తరువాత అతడు తన కుమార్తెయైన
29 రాహేలును అతనికి భార్యగా ఇచ్చెను. మరియు
లాబాను తన దాసియగు బిల్హాను తన కుమార్తెయైన
రాహేలుకు దాసిగా ఇచ్చెను.
30 యాకోబు రాహేలును కూడెను. మరియు అతడు
లేయాకంటె రాహేలును బహుగా ప్రేమించి అత
31 నికి మరి యేడేండ్లు కొలువు చేసెను. లేయా ద్వేషింప
బడుట యెహోవా చూచి ఆమె గర్భము తెరిచెను,
32 రాహేలు గొడ్రాలై యుండెను. లేయా గర్భవతియై
కుమారుని కని, యెహోవా నా శ్రమను చూచియు
న్నాడు గనుక నా పెనిమిటి నన్ను ప్రేమించునుగదా
అనుకొని అతనికి రూబేను అను పేరు పెట్టెను.
33 ఆమె మరల గర్భవతియై కుమారుని కని—నేను ద్వే
షింపబడితినన్న సంగతి యెహోవా విన్నాడు గనుక
ఇతనికూడ నాకు దయచేసెననుకొని అతనికి షిమ్యోను
34 అను పేరు పెట్టెను. ఆమె మరల గర్భవతియై కుమా
రుని కని—తుదకు ఈసారి నా పెనిమిటి నాతో హత్తు
కొని యుండును; అతనికి ముగ్గురు కుమారులను కంటి
ననుకొనెను. అందుచేత అతనికి లేవి అను పేరు
పెట్టెను. ఆమె మరల గర్భవతియై కుమారుని కని— 35
ఈసారి యెహోవాను స్తుతించెదననుకొని అతనికి
యూదా అను పేరు పెట్టెను. అప్పుడామెకు కా
నుపు ఉడిగెను.

రాహేలు తాను యాకోబునకు పిల్లలు కనకపో 30
వుట చూచి తన అక్కయందు అసూయపడి యాకో
బుతో—నాకు గర్భఫలమునిమ్ము; లేనిపక్షమందు నేను
చచ్చెదననెను. యాకోబు కోపము రాహేలుమీద 2
రగులుకొనగా అతడు — నేను నీకు గర్భఫలమును
ఇయ్యకపోయిన దేవునికి ప్రతిగా నున్నానా అనె
ను. అందుకామె — నా దాసియైన బిల్హా ఉన్నది 3
గదా; ఆమెతో పొమ్ము; ఆమె నా కొరకు పిల్లలను
కనును; ఆలాగున ఆమెవలన నాకును పిల్లలు కలుగుదు
రని చెప్పి తన దాసియైన బిల్హాను అతనికి భార్యగా 4
ఇచ్చెను. యాకోబు ఆమెతో పోగా బిల్హా గర్భ 5
వతియై యాకోబునకు కుమారుని కనెను. అప్పుడు 6
రాహేలు—దేవుడు నాకు తీర్పుచేసెను; ఆయన నా
మొరను విని నాకు కుమారుని దయచేసెననుకొని
అతనికి దాను అను పేరు పెట్టెను. రాహేలు 7
దాసియైన బిల్హా తిరిగి గర్భవతియై యాకోబునకు రెం
డవ కుమారుని కనెను. అప్పుడు రాహేలు—దేవుని 8
(కృప) విషయమై నా అక్కతో పోరాడి గెలిచితి
ననుకొని అతనికి నఫ్తాలి అను పేరు పెట్టెను. లేయా 9
తనకు కానుపు ఉడుగుట చూచి తన దాసియైన
జిల్పాను తీసికొని యాకోబునకు ఆమెను భార్యగా
ఇచ్చెను. లేయా దాసియైన జిల్పా యాకోబునకు 10
కుమారుని కనగా లేయా—ఇది అదృష్టమేగదా అను 11
కొని అతనికి గాదు అను పేరు పెట్టెను. లేయా 12
దాసియైన జిల్పా యాకోబునకు రెండవ కుమారుని కన
గా లేయా—నా భాగ్యమువలన కుమార్తెలు నన్ను 13
భాగ్యవతి అందురు గదా అని అతనికి ఆషేరు అను
పేరు పెట్టెను. గోధుమల కోతకాలములో రూబేను 14
వెళ్లి పొలములో పుత్రదాతవృక్షపు పండ్లు చూచి
తన తల్లియైన లేయాకు తెచ్చి యిచ్చెను. అప్పుడు
రాహేలు—నీ కుమారుని పుత్రదాతవృక్షపు పండ్లలో
కొన్ని నాకు దయచేయుమని లేయాతో అనగా ఆమె 15
—నా భర్తను తీసికొంటివే అది చాలదా? ఇప్పుడు నా
కుమారుని పుత్రదాతవృక్షపు పండ్లను తీసికొందువా
అని చెప్పెను. అందుకు రాహేలు—కాబట్టి నీ కుమా
రుని పుత్రదాతవృక్షపు పండ్లనిమిత్తము అతడు ఈ
రాత్రి నీతో శయనించునని చెప్పెను. సాయంకాల 16
మందు యాకోబు పొలమునుండి వచ్చుచున్నప్పుడు లేయా
అతనిని ఎదుర్కొనబోయి—నీవు నా యొద్దకు రావలెను,

నా కుమారుని పుత్రదాతవృక్షపు పండ్లతో నిన్ను కొం
టినని చెప్పెను. కాబట్టి అతడు ఆ రాత్రి ఆమెతో
7 శయనించెను. । దేవుడు లేయా మనవి వినెను గనుక
ఆమె గర్భవతియై యాకోబుకు అయిదవ కుమారుని
8 కనెను. । లేయా — నేను నా పెనిమిటికి నా దాసి
నిచ్చినందున దేవుడు నాకు ప్రతిఫలము దయచేసె
ననుకొని అతనికి ఇశ్శాఖారు అను పేరు పెట్టెను. ।
9 లేయా మరల గర్భవతియై యాకోబుకు ఆరవ కుమా
0 రుని కనెను. । అప్పుడు లేయా — దేవుడు మంచి
బహుమతి నాకు దయచేసెను; నా పెనిమిటికి ఆరు
గురు కుమారులను కనియున్నాను గనుక అతడికను
నాతో కాపురము చేయుననుకొని అతనికి జెబులూను
1 అను పేరు పెట్టెను. । ఆ తరువాత ఆమె కుమార్తెను
2 కని ఆమెకు దీనా అను పేరు పెట్టెను. । దేవుడు
రాహేలును జ్ఞాపకము చేసికొని ఆమె మనవి విని
3 ఆమె గర్భము తెరిచెను. । అప్పుడామె గర్భవతియై
కుమారుని కని — దేవుడు నా నింద తొలగించెనను
4 కొనెను. । మరియు ఆమె—యెహోవా మరియొక
కుమారుని నాకు దయచేయుననుకొని అతనికి యో
సేపు అను పేరు పెట్టెను.

5 రాహేలు యోసేపును కనిన తరువాత యాకోబు
లాబానును చూచి—నన్ను పంపివేయుము; నా చో
6 టికిని నా దేశమునకును వెళ్లెదను. । నా భార్యలను నా
పిల్లలను నాకప్పగించుము; అప్పుడు నేను వెళ్లెదను;
వారికొరకు నీకు కొలువుచేసితిని; నేను నీకు కొలువు
చేసిన విధమును నీవెరుగుదువుగదా అని చెప్పెను. ।
అందుకు లాబాను అతని చూచి—నీ కటాక్షము నా
మీదనున్న యెడల నా మాట వినుము; నిన్నుబట్టి
యెహోవా నన్ను ఆశీర్వదించెనని శకునము చూచి
తెలిసికొంటినని చెప్పెను. । మరియు అతడు—నీ జీత
మింతయని నాతో స్పష్టముగా చెప్పుము అది యిచ్చె
దననెను. । అందుకు యాకోబు అతని చూచి—నేను
నీకెట్లు కొలువు చేసితినో నీ మందలు నా యొద్ద
ఎట్లుండెనో అది నీకు తెలియును; । నేను రాకము
నుపు నీకుండినది కొంచెమే; అయితే అది బహుగా
అభివృద్ధి పొందెను; నేను పాదముపెట్టిన చోటెల్ల
యెహోవా నిన్ను ఆశీర్వదించెను; నేను నా యింటి
వారికొరకు ఎప్పుడు సంపాద్యము చేసికొందుననె
ను. । అప్పుడతడు—నేను నీకేమి ఇయ్యవలెనని యడిగి
నందుకు యాకోబు—నీవు నాకేమియు ఇయ్యవద్దు;
నీవు నా కొరకు ఈ విధముగా చేసినయెడల నేను
తిరిగి నీ మందను మేపి కాచెదను. । నేడు నేను నీ
మంద అంతటిలో నడిచి చూచి పొడలైనను మచ్చ
లైనను గల ప్రతి గొఱ్ఱెను, గొఱ్ఱెపిల్లలలో నల్లని ప్రతి
దానిని, మేకలలో మచ్చలైనను పొడలైనను గల వా
టిని వేరుపరచెదను; అట్టివి నాకు జీతమగును. । ఇక
మీదట నాకు రావలసిన జీతమునుగూర్చి నీవు చూడ
వచ్చినప్పుడు నా న్యాయప్రవర్తనయే నాకు సాక్ష్య
మగును; మేకలలో పొడలైనను మచ్చలైనను లేని
వన్నియు, గొఱ్ఱెపిల్లలలో నలుపు లేనివన్నియు నా
యొద్దనున్న యెడల నేను దొంగిలితినని చెప్పవచ్చునని
ను. । అందుకు లాబాను—మంచిది, నీ మాటచొప్పు 34
ననే కానిమ్మనెను. । ఆ దినమున లాబాను చార 35
లైనను మచ్చలైనను గల మేకపోతులను, పొడ
లైనను మచ్చలైనను గల పెంటిమేకలన్నిటిని కొం
చెము తెలుపు గల ప్రతి దానిని, గొఱ్ఱెపిల్లలలో నల్ల
వాటి నన్నిటిని వేరుచేసి తన కుమారుల చేతికప్పగించి ।
తనకును యాకోబుకును మధ్య మూడు దినముల 36
ప్రయాణమంత దూరము పెట్టెను; లాబానుయొక్క
మిగిలిన మందను యాకోబు మేపుచుండెను. । యా 37
కోబు చినారు జంగిసాలు అను చెట్ల చువ్వలను తీసి
కొని ఆ చువ్వలలో తెల్లచారలు కనబడునట్లు అక్క
డక్కడ వాటి తొక్కలు ఒలిచి । మందలు నీళ్లు త్రాగ 38
వచ్చినప్పుడు అవి చూలు కట్టుటకు అతడు తాను
ఒలిచిన చువ్వలను మందలు త్రాగుటకు వచ్చు కాలు
వలలోను నీళ్లగాళ్లలోను వాటి యెదుట పెట్టగా ।
మందలు ఆ చువ్వలయెదుట చూలు కట్టి చారలైనను 39
పొడలైనను మచ్చలైనను గల పిల్లలను ఈనెను. । యా 40
కోబు ఆ గొఱ్ఱెపిల్లలను వేరుచేసి, చారలుగల వాటి
తట్టును లాబాను మందలలో నల్లని వాటి తట్టును మం
దల ముఖములు త్రిప్పి తన మందలను లాబాను మంద
లతో నుంచక వాటిని వేరుగా ఉంచెను. । మందలో 41
బలమైనవి చూలు కట్టినప్పుడెల్లను అవి ఆ చువ్వల
యెదుట చూలు కట్టునట్లు యాకోబు మంద కన్నుల
యెదుట కాలువలలో ఆ చువ్వలు పెట్టెను. । మంద 42
బలహీనమైనప్పుడు పెట్టలేదు. అట్లు బలహీనమైనవి
లాబానుకును బలమైనవి యాకోబుకును వచ్చెను. । ఆ 43
ప్రకారము ఆ మనుష్యుడు అత్యధికముగా అభివృద్ధి
పొంది విస్తారమైన మందలు దాసీలు దాసులు ఒంటెలు
గాడిదెలు గలవాడాయెను.

లాబాను కుమారులు — మన తండ్రికి కలిగినది 31
యావత్తును యాకోబు తీసికొని, మన తండ్రికి కలిగిన
దానివలన ఈ యావదాస్తి సంపాదించెనని చెప్పు
కొనిన మాటలు యాకోబు వినెను. । మరియు అతడు 2
లాబాను ముఖము చూచినప్పుడు అది నిన్న మొన్న
ఉండినట్లు అతనియెడల ఉండలేదు. । అప్పుడు 3
యెహోవా—నీ పితరుల దేశమునకు నీ బంధువుల
యొద్దకు తిరిగి వెళ్లుము; నేను నీకు తోడైయుండెదనని
యాకోబుతో చెప్పగా । యాకోబు పొలములో తన 4
మందయొద్దకు రాహేలును లేయాను పిలువనంపి వా
రిని చూచి యిట్లనెను. । — మీ తండ్రి కటాక్షము 5
నిన్న మొన్న నామీద ఉండినట్లు ఇప్పుడు నామీద

నుండలేదని నాకు కనబడుచున్నది; అయితే నా
తండ్రి యొక్క దేవుడు నాకు తోడై యున్నాడు; ।
6 మీ తండ్రికి నా యావచ్ఛక్తితో కొలువు చేసితినని
7 మీకు తెలిసేయున్నది. । మీ తండ్రి నన్ను మోస
పుచ్చి పదిమార్లు నా జీతము మార్చెను; అయినను
8 దేవుడు అతని నాకు హానిచేయ నియ్యలేదు. । అతడు—
పొడలు గలవి నీ జీతమగునని చెప్పినయెడల అప్పుడు
మందలన్నియు పొడలుగల పిల్లలనీనెను. చారలు
గలవి నీ జీతమగునని చెప్పినయెడల అప్పుడు మంద
9 లన్నియు చారలు గల పిల్లలనీనెను. । అట్లు దేవుడు
10 మీ తండ్రి పశువులను తీసి నాకిచ్చెను. । మందలు
చూలుకట్టు కాలమున నేను స్వప్నమందు కన్నులెత్తి
చూడగా గొఱ్ఱెలను దాటు పొట్టేళ్లు చారలైనను
11 పొడలైనను మచ్చలైనను గలవైయుండెను. । మరియు
ఆ స్వప్నమందు దేవునిదూత—యాకోబూ అని నన్ను
12 పిలువగా—చిత్తము ప్రభువా అని చెప్పితిని. । అప్పుడు
ఆయన—నీ కన్నులెత్తి చూడుము; గొఱ్ఱెలను దాటు
చున్న పొట్టేళ్లన్నియు చారలైనను పొడలైనను మచ్చ
లైనను గలవి; ఏలయనగా లాబాను నీకు చేయుచు
13 న్నది యావత్తును చూచితిని. । నీ వెక్కడ స్తంభము
మీద నూనె పోసితివో, యెక్కడ నాకు మ్రొక్కుబడి
చేసితివో ఆ బేతేలు దేవుడను నేనే. ఇప్పుడు నీవు
లేచి యీ దేశములోనుండి బయలుదేరి నీవు పుట్టిన
14 దేశమునకు తిరిగి వెళ్లుమని నాతో చెప్పెననెను. । అం
దుకు రాహేలును లేయాయు—యింక మా తండ్రి
15 యింట మాకు పాలు పంపు లెక్కడివి? । అతడు
మమ్మును అన్యులగా చూచుటలేదా? అతడు మమ్మును
అమ్మివేసి మాకు రావలసిన ద్రవ్యమును బొత్తుగా తిని
16 వేసెను. । దేవుడు మా తండ్రి యొద్దనుండి తీసివేసిన
ధనమంతయు మాదియు మా పిల్లలదియునై యున్నది
గదా? కాబట్టి దేవుడు నీతో చెప్పినట్లెల్ల చేయుమని
17 అతనికుత్తరమియ్యగా । యాకోబు లేచి తన కుమారు
18 లను తన భార్యలను ఒంటెలమీద నెక్కించి । కనాను
దేశమునకు తన తండ్రియైన ఇస్సాకు నొద్దకు వెళ్లు
టకు తన పశువులన్నిటిని, తాను సంపాదించిన సంపద
యావత్తును, పద్దనరాములో తాను సంపాదించిన ఆస్తి
19 యావత్తును తీసికొనిపోయెను. । లాబాను తన గొఱ్ఱెల
బొచ్చు కత్తిరించుటకు వెళ్లియుండగా రాహేలు తన
తండ్రి (యింట) నున్న గృహదేవతలను దొంగిలెను. ।
20 యాకోబు తాను పారిపోవుచున్నానని అరామీయు
డైన లాబానుకు తెలియచేయక పోవుటవలన అతని
21 మోసపుచ్చినవాడాయెను. । అతడు తనకు కలిగిన
దంతయు తీసికొని పారిపోయెను. అతడు లేచి నది
దాటి గిలాదను కొండతట్టు అభిముఖుడై వెళ్లెను. ।
22 మూడవ దినమున యాకోబు పారిపోయెనని లాబా
23 నుకు తెలుపబడెను. । అతడు తన బంధువులను వెంట
బెట్టుకొని, యేడు దినముల ప్రయాణమంత దూరము
అతని తరుముకొనిపోయి, గిలాదు కొండమీద అతని
కలిసికొనెను. । ఆ రాత్రి స్వప్నమందు దేవుడు 24
అరామీయుడైన లాబానునొద్దకు వచ్చి—నీవు యా
కోబుతో మంచిగాని చెడ్డగాని పలుకకుము జాగ్రత్త
సుమీ అని అతనితో చెప్పెను. । లాబాను యా 25
కోబును కలిసికొనెను. యాకోబు తన గుడారము
ఆ కొండమీద వేసికొనియుండెను; లాబానును తన
బంధువులతో గిలాదుకొండమీద గుడారము వేసి
కొనెను. । అప్పుడు లాబాను యాకోబును చూచి 26
—నీవేమి చేసితివి? నన్ను మోసపుచ్చి, కత్తితో చెర
పట్టబడిన వారినివలె నా కుమార్తెలను కొనిపోవనేల? ।
నీవు నాకు చెప్పక రహస్యముగా పారిపోయి నన్ను 27
మోసపుచ్చితివేల? సంభ్రమముతోను పాటలతోను
మద్దెలతోను సితారాలతోను నిన్ను సాగనంపుదునే. ।
అయితే నీవు నా కుమారులను నా కుమార్తెలను నన్ను 28
ముద్దుపెట్టుకొననియ్యక పిచ్చిపట్టి యిట్లు చేసితివి. ।
మీకు హానిచేయుటకు నా చేతనవును; అయితే పోయిన 29
రాత్రి మీ తండ్రియొక్క దేవుడు—నీవు యాకోబుతో
మంచిగాని చెడ్డగాని పలుకకుము జాగ్రత్త సుమీ
అని నాతో చెప్పెను. । నీ తండ్రి యింటిమీద బహు 30
వాంఛగలవాడవై వెళ్లగోరినయెడల వెళ్లుము, నా దేవ
తల నేల దొంగిలితివనగా । యాకోబు—నీవు బలవం 31
తముగా నా యొద్దనుండి నీ కుమార్తెలను తీసికొందు
వేమో అనుకొని భయపడితిని. । ఎవరియొద్ద నీ దేవ 32
తలు కనబడునో వాడు బ్రదుకకూడదు. నీవు నా
యొద్దనున్నవాటిని మన బంధువుల యెదుట వెదకి నీ
దాని తీసికొనుమని లాబానుతో చెప్పెను. రాహేలు
వాటిని దొంగిలెనని యాకోబుకు తెలియలేదు. । లా 33
బాను యాకోబు గుడారములోకి లేయా గుడారము
లోకి ఇద్దరి దాసీల గుడారములలోకి వెళ్లెనుగాని అతని
కేమియు దొరకలేదు. తరువాత అతడు లేయా గుడా
రములోనుండి బయలుదేరి రాహేలు గుడారములోకి
వెళ్లెను. । రాహేలు ఆ విగ్రహములను తీసికొని 34
ఒంటె సామగ్రిలో పెట్టి వాటిమీద కూర్చుండెను.
కాగా లాబాను ఆ గుడారమందంతటను తడివి చూచి
నప్పటికిని అవి దొరకలేదు. । ఆమె తన తండ్రితో 35
—తమ యెదుట నేను లేవలేనందున తాము కోపపడ
కూడదు; నేను కడగానున్నానని చెప్పెను. అత
డెంత వెదకినను ఆ విగ్రహములు దొరకలేదు. । యా 36
కోబు కోపపడి లాబానుతో వాదించి అతని చూచి
—నీవిట్లు మండిపడి నన్ను తరుమనేల? నేను చేసిన
ద్రోహమేమి? పాపమేమి? । నీవు నా సమస్త సా 37
మగ్రి తడివి చూచిన తరువాత నీ యింటి వస్తువులన్ని
టిలో ఏది దొరికెను? నా వారియెదుటను నీ వారి
యెదుటను అది యిట్లు తెచ్చి పెట్టుము; వారు మన

38 ఉభయుల మధ్య తీర్పు తీర్చుదురు. । ఈ యిరువది
యేండ్లు నేను నీయొద్దనుంటిని. నీ గొఱ్ఱెలైనను మేక
లైనను ఈచుకొని పోలేదు, నీ మంద పొట్టేళ్లను
39 నేను తినలేదు. । దుష్టమృగములచేత చీల్చబడినదాని
నీ యొద్దకు తేక ఆ నష్టము నేనే పెట్టుకొంటిని. పగటి
యందు దొంగిలింపబడినదాని నేమి రాత్రియందు
దొంగిలింపబడినదాని నేమి నా యొద్ద పుచ్చుకొంటివి;
40 నేను ఈలాగుంటిని. । పగటి యెండకును రాత్రి
మంచుకును నేను క్షీణించిపోతిని; నిద్ర నా కన్ను
41 లకు దూరమాయెను. । ఇదివరకు నీ యింటిలో ఇరు
వది యేండ్లు ఉంటిని. నీ యిద్దరి కుమార్తెల నిమిత్తము
పదునాలుగేండ్లును, నీ మంద నిమిత్తము ఆరేండ్లును
నీకు కొలువుచేసితిని. అయినను నీవు నా జీతము పది
42 మారులు మార్చితివి. । నా తండ్రి దేవుడు అబ్రా
హాము దేవుడు ఇస్సాకు భయపడిన దేవుడు నాకు
తోడై యుండనియెడల నిశ్చయముగా నీవు నన్ను
వట్టి చేతులతోనే పంపివేసియుందువు. దేవుడు నా
ప్రయాసమును నా చేతుల కష్టమును చూచి, పో
యిన రాత్రి నిన్ను గద్దించెనని లాబానుతో చెప్పె
43 ను. । అందుకు లాబాను—ఈ కుమార్తెలు నా కుమా
ర్తెలు, ఈ కుమారులు నా కుమారులు, ఈ మంద నా
మంద, నీకు కనబడుచున్నది అంతయు నాది. ఈ నా
కుమార్తెలకైనను వీరు కనిన కుమారులకైనను నేడు
44 నేనేమి చేయగలను! । కావున నేనును నీవును నిబం
ధన చేసికొందము రమ్ము, అది నాకును నీకును మధ్య
సాక్షిగా ఉండునని యాకోబుతో ఉత్తరమియ్యగా ।
45 యాకోబు ఒక రాయి తీసికొని దానిని స్తంభముగా
46 నిలువబెట్టెను. । మరియు యాకోబు—రాళ్లు కూర్చు
డని తన బంధువులతో చెప్పెను. వారు రాళ్లు తెచ్చి
కుప్పవేసిరి; అక్కడ వారు ఆ కుప్పయొద్ద భోజనము
47 చేసిరి. । లాబాను దానికి యగర్‌శాహదూతా అను
పేరు పెట్టెను. అయితే యాకోబు దానికి గలేదు అను
48 పేరు పెట్టెను. । లాబాను—నేడు ఈ కుప్ప నాకును
నీకును మధ్య సాక్షిగా ఉండునని చెప్పెను. కాబట్టి
దానికి గలేదని పేరు పెట్టెను. మరియు—మనము
ఒకరికొకరము దూరముగా నుండగా యెహోవా
నాకును నీకును మధ్య జరుగునది కనిపెట్టునని చెప్పెను
49 గనుక దానికి మిస్పా అను పేరు పెట్టబడెను. । అంతట
50 లాబాను — నీవు నా కుమార్తెలను బాధ పెట్టినను,
నా కుమార్తెలను గాక యితర స్త్రీలను పెండ్లిచేసికొని
నను, చూడుము, మనయొద్ద ఎవరును లేరుగదా,
51 నాకును నీకును దేవుడే సాక్షి అని చెప్పెను. । మరియు
లాబాను — నాకును నీకును మధ్య నేను నిలిపిన యీ
52 స్తంభమును చూడుము ఈ కుప్ప చూడుము. । హాని
చేయవలెనని నేను ఈ కుప్ప దాటి నీ యొద్దకు
రాకను, నీవు ఈ కుప్పను ఈ స్తంభమును దాటి నా
యొద్దకు రాకను ఉండుటకు ఈ కుప్ప సాక్షి యీ
స్తంభమును సాక్షి. । అబ్రాహాము దేవుడు నా 53
హోరు దేవుడు వారి తండ్రి దేవుడు మన మధ్య
న్యాయము తీర్చునని చెప్పెను. అప్పుడు యాకోబు
తన తండ్రియైన ఇస్సాకు భయపడిన దేవుని తోడని
ప్రమాణము చేసెను. । యాకోబు ఆ కొండమీద 54
బలియర్పించి భోజనము చేయుటకు తన బంధువులను
పిలువగా వారు భోజనముచేసి కొండమీద ఈ రాత్రి
వెళ్లబుచ్చిరి. । తెల్లవారినప్పుడు లాబాను లేచి తన 55
కుమారులను తన కుమార్తెలను ముద్దుపెట్టుకొని వారిని
దీవించి బయలుదేరి తన ఊరికి వెళ్లిపోయెను.

**యా**కోబు తన త్రోవను వెళ్లుచుండగా దేవదూ **32**
తలు అతనిని ఎదుర్కొనిరి. । యాకోబు వారిని చూచి 2
—ఇది దేవుని సేన అని చెప్పి ఆ చోటికి మహనయీము[1]
అను పేరు పెట్టెను.

యాకోబు ఎదోము దేశమున, అనగా శేయీరు 3
దేశముననున్న తన సహోదరుడైన ఏశావునొద్దకు 4
దూతలను తనకు ముందుగా పంపి—మీరు నా ప్రభు
వైన ఏశావును చూచి—ఇంతవరకు నేను లాబానునొద్ద
నివసించియుంటిని; । నాకు పశువులు గాడిదెలు మం 5
దలు దాసదాసీజనమును కలరు; నీ కటాక్షము నా
యందు కలుగునట్లుగా నా ప్రభువుకిది తెలియచేయ
నంపితినని నీ సేవకుడైన యాకోబు అనెనని చెప్పుడని
వారి కాజ్ఞాపించెను. । ఆ దూతలు యాకోబు నొద్దకు 6
తిరిగి వచ్చి—మేము నీ సహోదరుడైన ఏశావునొద్దకు
వెళ్లితిమి; అతడు నన్నూరుమందితో నిన్ను ఎదుర్కొన
వచ్చుచున్నాడని చెప్పగా । యాకోబు మిక్కిలి భయ 7
పడి తొందరపడి । —ఏశావు ఒక గుంపుమీదికి వచ్చి 8
దాని హతము చేసినయెడల మిగిలిన గుంపు తప్పించు
కొని పోవుననుకొని, తనతోనున్న జనులను మందలను
పశువులను ఒంటెలను రెండు గుంపులుగా విభాగించె
ను. । అప్పుడు యాకోబు—నా తండ్రియైన అబ్రా 9
హాము దేవా, నా తండ్రియైన ఇస్సాకు దేవా,— నీ
దేశమునకు నీ బంధువుల యొద్దకు తిరిగి వెళ్లుము, నీకు
మేలు చేసెదనని నాతో చెప్పిన యెహోవా, । నీవు 10
నీ సేవకునికి చేసిన సమస్తమైన ఉపకారములకును
సమస్త సత్యమునకును అపాత్రుడను. ఎట్లనగా నా
చేతి కఱ్ఱతో మాత్రమే యీ యొర్దాను దాటితిని;
ఇప్పుడు నేను రెండు గుంపులైతిని. । నా సహోదరు 11
డైన ఏశావు చేతనుండి నన్ను దయచేసి తప్పించుము;
అతడు వచ్చి పిల్లలతో తల్లిని నన్ను చంపునేమో అని
అతనికి భయపడుచున్నాను. । నీవు — నేను నీకు 12
తోడై నిశ్చయముగా మేలు చేయుచు, విస్తారముగుట

1 అనగా—రెండు సేనలు.

వలన లెక్కింపలేని సముద్రపు ఇసుకవలె నీ సంతానము
విస్తరింపజేయుదుననీ సెలవిచ్చితివే అనెను.
13 అతడు అక్కడ ఆ రాత్రి గడిపి తాను సంపాదిం
చినదానిలో తన అన్నయైన ఏశావు కొరకు ఒక కాను
14 కను । అనగా ఇన్నూరు మేకలను ఇరువది మేకపోతు
15 లను ఇన్నూరు గొఱ్ఱెలను ఇరువది పొట్టేళ్లను । ముప్పది
పాడి ఒంటెలను వాటి పిల్లలను నలుబది ఆవులను పది
ఆబోతులను ఇరువది ఆడుగాడిదెలను పది గాడిదె పిల్ల
16 లను తీసికొని మందమందను వేరు వేరుగా । తన దాసుల
చేతి కప్పగించి — మీరు మందమందకు నడుమ ఎడ
ముంచి నాకంటె ముందుగా సాగి పొండని తన దాసు
17 లతో చెప్పెను. । మరియు వారిలో మొదటివాని
చూచి — నా సహోదరుడైన ఏశావు నిన్ను ఎదు
ర్కొని — నీవెవరివాడవు? ఎక్కడికి వెళ్లుచున్నావు?
18 నీ ముందరనున్నవి యెవరివని నిన్ను అడిగినయెడల। నీవు
— ఇవి నీ సేవకుడైన యాకోబువి, ఇది నా ప్రభువైన
ఏశావుకొరకు పంపబడిన కానుక, అదిగో అతడు మా
వెనుక వచ్చుచున్నాడని చెప్పుమని ఆజ్ఞాపించెను. ।
19 అట్లతడు — నేను ముందుగా పంపుచున్న కానుకవలన
అతని సమాధానపరచిన తరువాత నేను అతని ముఖము
చూచెదను; అప్పుడతడు ఒకవేళ నన్ను కటాక్షించు
ననుకొని — మీరు ఏశావును చూచినప్పుడు ఆ చొ
20 ప్పున అతనితో చెప్పవలెననియు । మీరు — ఇదిగో
నీ సేవకుడైన యాకోబు మా వెనుక వచ్చుచున్నా
డని చెప్పవలెననియు రెండవవానికిని మూడవవానికిని
మందల వెంబడి వెళ్లినవారికందరికిని ఆజ్ఞాపించెను. ।
21 అతడు కానుకను తనకు ముందుగా పంపించి తాను
గుంపులో ఆ రాత్రి నిలిచెను.
22 ఆ రాత్రి అతడు లేచి తన యిద్దరు భార్యలను
తన యిద్దరు దాసీలను తన పదకొండుమంది పిల్లలను
23 తీసికొని యబ్బోకు రేవు దాటిపోయెను. । యాకోబు
వారిని తీసికొని ఆ యేరు దాటించి తనకు కలిగినదం
24 తయు పంపివేసెను. । యాకోబు ఒక్కడు మిగిలిపో
యెను; ఒక నరుడు తెల్లవారు పర్యంతము అతనితో
25 పెనుగులాడెను. । తాను అతని గెలువకుండుట చూచి
తొడగూటిమీద అతనిని కొట్టెను. అప్పుడతడు ఆయ
నతో పెనుగులాడుటవలన యాకోబు తొడగూడు
26 వసిలెను. । ఆయన — తెల్లవారుచున్నది గనుక నన్ను
పోనిమ్మనగా అతడు — నీవు నన్ను ఆశీర్వదించితేనేగాని
27 నిన్ను పోనియ్యననెను. । ఆయన — నీ పేరేమని యడు
28 గగా అతడు — యాకోబు అని చెప్పెను. । అప్పుడు
ఆయన — నీవు దేవునితోను మనుష్యులతోను పోరాడి
గెలిచితివి గనుక ఇకమీదట నీ పేరు ఇశ్రాయేలు[1] గాని
29 యాకోబు అనబడదని చెప్పెను. । అప్పుడు యాకోబు
— నీ పేరు దయచేసి తెలుపుమనెను. అందుకాయన —
నీవు ఎందునిమిత్తము నా పేరు అడిగితివని చెప్పి
అక్కడ అతని నాశీర్వదించెను. । యాకోబు — నేను 30
ముఖాముఖిగా దేవుని చూచితిని అయినను నా
ప్రాణము దక్కినదని ఆ స్థలమునకు పెనూయేలు[2] అను
పేరు పెట్టెను. । అతడు పెనూయేలునుండి సాగిపోయి 31
నప్పుడు సూర్యోదయమాయెను; అప్పుడతడు తొడ
కుంటుచు నడిచెను. । అందుచేత ఆయన యాకోబు 32
తొడ గూటిమీద తుంటినరము కొట్టినందున నేటి
వరకు ఇశ్రాయేలీయులు తొడ గూటిమీదనున్న
తుంటినరము తినరు.

యాకోబు కన్నులెత్తి చూచినప్పుడు ఏశావును 33
అతనితో నన్నూరుమంది మనుష్యులును వచ్చుచుం
డిరి. । అప్పుడతడు తన పిల్లలను లేయా రాహేలుల 2
కును ఇద్దరు దాసీలకును పంచి అప్పగించెను. అతడు
ముందర దాసీలను వారి పిల్లలను వారి వెనుక లేయాను
ఆమె పిల్లలను ఆ వెనుక రాహేలును యోసేపును
ఉంచి । తాను వారి ముందర వెళ్లుచు తన సహో 3
దరుని సమీపించువరకు ఏడుమార్లు నేలను సాగిలపడె
ను. । అప్పుడు ఏశావు అతనిని ఎదుర్కొన పరుగెత్తి 4
అతని కౌగలించుకొని అతని మెడమీద పడి ముద్దు
పెట్టుకొనెను; వారిద్దరు కన్నీరు విడిచిరి. । ఏశావు 5
కన్నులెత్తి ఆ స్త్రీలను పిల్లలను చూచి — వీరు నీకేమి
కావలెనని అడిగినందుకు అతడు — వీరు దేవుడు నీ సేవ
కునికి దయచేసిన పిల్లలే అని చెప్పెను. । అప్పుడు ఆ 6
దాసీలును వారి పిల్లలును దగ్గరకు వచ్చి సాగిలపడిరి. ।
లేయాయు ఆమె పిల్లలును దగ్గరకు వచ్చి సాగిలపడిరి. 7
ఆ తరువాత యోసేపును రాహేలును దగ్గరకు వచ్చి
సాగిలపడిరి. । ఏశావు — నాకు ఎదురుగావచ్చిన ఆ గుం 8
పంతయు ఎందుకని అడుగగా అతడు — నా ప్రభువు
కటాక్షము నా మీద వచ్చుటకే అని చెప్పెను. ।
అప్పుడు ఏశావు — సహోదరుడా, నాకు కావలసి 9
నంత ఉన్నది, నీది నీవే ఉంచుకొమ్మని చెప్పెను. ।
అప్పుడు యాకోబు — అట్లు కాదు, నీ కటాక్షము 10
నామీద నున్నయెడల చిత్తగించి నాచేత ఈ కానుక
పుచ్చుకొనుము, దేవుని ముఖము చూచినట్లు నీ ముఖము
చూచితిని; నీ కటాక్షము నామీద వచ్చినదిగదా; ।
నేను నీ యొద్దకు తెచ్చిన కానుకను చిత్తగించి పుచ్చు 11
కొనుము; దేవుడు నన్ను కనికరించెను; మరియు
నాకు కావలసినంత ఉన్నదని చెప్పి అతని బలవం
తము చేసెను గనుక అతడు దాని పుచ్చుకొని । —
మనము వెళ్లుదము; నేను నీకు ముందుగా సాగి పోవు 12
దునని చెప్పగా । అతడు — నాయొద్దనున్న పిల్లలు పసి 13
పిల్లలనియు, గొఱ్ఱెలు మేకలు పశువులు పాలిచ్చునవి
అనియు నా ప్రభువునకు తెలియును. ఒక్కదినమే
వాటిని వడిగా తోలినయెడల ఈ మంద అంతయు

[1] అనగా - దేవునితో పోరాడువాడు. [2] అనగా - దేవుని సన్నిధి.

14 చచ్చును. । నా ప్రభువు దయచేసి తన దాసునికి ముం
దుగా వెళ్లవలెను. నేను నా ప్రభువు నొద్దకు శేయీ
రుకు వచ్చువరకు, నా ముందరనున్న మందలు నడువ
గలిగిన కొలదిని, ఈ పిల్లలు నడువగలిగిన కొలదిని
వాటిని మెల్లగా నడిపించుకొని వచ్చెదనని అతనితో
15 చెప్పెను. । అప్పుడు ఏశావు—నీ కిష్టమైనయెడల నా
యొద్దనున్న యీ జనులలో కొందరిని నీ యొద్ద విడిచి
పెట్టుదునని చెప్పగా అతడు—అది యేల? నా ప్రభువు
16 కటాక్షము నామీద నుండనిమ్మనెను. । ఆ దినమున
ఏశావు తన త్రోవను శేయీరుకు తిరిగిపోయెను. ।
17 అప్పుడు యాకోబు సుక్కోతుకు ప్రయాణమై పోయి
తన కొక యిల్లు కట్టించుకొని తన పశువులకు పాకలు
వేయించెను. అందుచేత ఆ చోటికి సుక్కోతు అను
18 పేరు పెట్టబడెను. । అట్లు యాకోబు పద్దనరాములో
నుండి వచ్చిన తరువాత కనాను దేశములోనున్న
షెకెమను ఊరికి సురక్షితముగా వచ్చి ఆ ఊరిముందర
19 తన గుడారములు వేసెను. । మరియు అతడు తన
గుడారములు వేసిన పొలముయొక్క భాగమును షెకె
ము తండ్రియైన హమోరు కుమారులయొద్ద నూరు వర
20 హాలకు కొని । అక్కడ ఒక బలిపీఠము కట్టించి దా
నికి ఏల్ ఎలోహేయి ఇశ్రాయేలు[1] అను పేరు
పెట్టెను.

34 లేయా యాకోబుకు కనిన కుమార్తెయైన దీనా
2 ఆ దేశపుకుమార్తెలను చూడ వెళ్లెను. । ఆ దేశము
నేలిన హివ్వీయుడైన హమోరు కుమారుడగు షెకెము
ఆమెను చూచి ఆమెను పట్టుకొని ఆమెతో శయ
3 నించి ఆమెను అవమానపరచెను. । అతని మనస్సు
యాకోబు కుమార్తెయైన దీనామీదనే ఉండెను;
అతడు ఆ చిన్నదాని ప్రేమించి ఆమెతో ప్రీతిగా
4 మాటలాడి । —ఈ చిన్నదాని నాకు పెండ్లిచేయుమని
5 తన తండ్రియైన హమోరును అడిగెను. । తన కుమార్తెను
అతడు చెరిపెనని యాకోబు విని, తన కుమారులు పశు
వులతో పొలములలో నుండినందున వారు వచ్చు పర్యం
6 తము ఊరకుండెను. । షెకెము తండ్రియగు హమోరు
యాకోబుతో మాటలాడుటకు అతనియొద్దకు వచ్చె
7 ను. । యాకోబు కుమారులు ఆ సంగతివిని పొలములో
నుండి వచ్చిరి. అతడు యాకోబు కుమార్తెతో శయ
నించి ఇశ్రాయేలు జనములో అవమానకరమైన కార్య
ము చేసెను; అది చేయరాని పని గనుక ఆ మను
ష్యులు సంతాపము పొందిరి, వారికి మిగుల కోపము
8 వచ్చెను. । అప్పుడు హమోరు వారిని చూచి—షెకెము
అను నా కుమారుని మనస్సు మీ కుమార్తెమీదనే
ఉన్నది; దయచేసి ఆమెను అతనికిచ్చి పెండ్లిచే
9 యుడి. । మీ పిల్లలను మాకిచ్చి మా పిల్లలను మీరు
పుచ్చుకొని మాతో వియ్యమంది మా మధ్య నివసిం
చుడి. । ఈ దేశము మీ యెదుట ఉన్నది; ఇందులో 10
మీరు నివసించి వ్యాపారము చేసి ఆస్తి సంపాదించు
కొనుడని చెప్పెను. । మరియు షెకెము—మీ కటా 11
క్షము నామీద రానీయుడి; మీరేమి అడుగుదురో
అది యిచ్చెదను. । ఓలియు కట్నమును ఎంతైనను 12
అడుగుడి; మీరు అడిగినంత యిచ్చెదను; మీరు ఆ
చిన్నదాని నాకు ఇయ్యుడని ఆమె తండ్రితోను
ఆమె సహోదరులతోను చెప్పెను. । అయితే తమ 13
సహోదరియైన దీనాను అతడు చెరిపినందున యా
కోబు కుమారులు షెకెముతోను అతని తండ్రియైన
హమోరుతోను కపటముగా ఉత్తరమిచ్చి అనినదేమ
నగా । —మేము ఈ కార్యము చేయలేము, సున్నతి 14
చేయించుకొనని వానికి మా సహోదరిని ఇయ్యలేము,
అది మాకు అవమానమగును. । మీలో ప్రతి పురుషుడు 15
సున్నతిపొంది మావలె నుండినయెడల సరి; । ఆ పక్ష 16
మందు మీ మాటకొప్పుకొని, మా పిల్లలను మీ కిచ్చి
మీ పిల్లలను మేము పుచ్చుకొని మీ మధ్య నివసించె
దము, అప్పుడు మనము ఏకజనమగుదుము. । మీరు 17
మా మాట విని సున్నతిపొందని పక్షమందు మా పిల్లను
తీసికొని పోవుదుమని చెప్పగా । వారి మాటలు 18
హమోరుకును హమోరు కుమారుడైన షెకెముకును
ఇష్టముగానుండెను. । ఆ చిన్నవాడు యాకోబు కుమా 19
ర్తెయందు ప్రీతిగలవాడు గనుక అతడు ఆ కార్యము
చేయుటకు తడవుచేయలేదు. అతడు తన తండ్రి
యింటివారందరిలో ఘనుడు. । హమోరును అతని 20
కుమారుడైన షెకెమును తమ ఊరిగవిని యొద్దకు వచ్చి
తమ ఊరి జనులతో మాటలాడుచు । —ఈ మను 21
ష్యులు మనతో సమాధానముగా నున్నారు గనుక
వారిని ఈ దేశమందు ఉండనిచ్చి యిందులో వ్యాపా
రము చేయనియ్యుడి; ఈ భూమి వారికిని చాలినంత
విశాలమై యున్నది గదా; మనము వారి పిల్లలను పెండ్లి
చేసికొని మన పిల్లలను వారికి ఇత్తము. । అయితే ఒకటి, 22
ఆ మనుష్యులు సున్నతిపొందునట్లు మనలో ప్రతి
పురుషుడు సున్నతిపొందిన యెడలనే మన మాటకు
వారు ఒప్పుకొని మనలో నివసించి యేక జనముగా
నుందురు. । వారి మందలు వారి ఆస్తి వారి పశువుల 23
న్నియు మనవగును గదా; ఎట్లయినను మనము వారి
మాటకు ఒప్పుకొందము, అప్పుడు వారు మనలో నివ
సించెదరనగా । హమోరును అతని కుమారుడగు షెకె 24
మును చెప్పిన మాట అతని ఊరి గవినిద్వారా వెళ్లువా
రందరు వినిరి. అప్పుడతని ఊరి గవినిద్వారా వెళ్లు
వారిలో ప్రతి పురుషుడు సున్నతి పొందెను. । మూ 25
డవ దినమున వారు బాధపడుచుండగా యాకోబు
కుమారులలో నిద్దరు, అనగా దీనా సహోదరులైన
షిమ్యోనును లేవీయు, తమ కత్తులు చేత పట్టుకొని

1 అనగా, ఇశ్రాయేలు దేవుడే దేవుడు.

యెవరికి తెలియకుండ ఆ ఊరిమీద పడి ప్రతి పురు
26 షుని చంపిరి. । వారు హమోరును అతని కుమారుడైన
షెకెమును కత్తివాత చంపి షెకెము ఇంటనుండి
27 దీనాను తీసికొని వెళ్లిపోయిరి. । తమ సహోదరిని
చెరిపినందున యాకోబు కుమారులు చంపబడినవారు
28 ఉన్నచోటికి వచ్చి ఆ ఊరు దోచుకొని । వారి గొఱ్ఱె
లను పశువులను గాడిదెలను ఊరిలోనిదేమి పొలము
29 లోనిదేమి । వారి ధనము యావత్తును తీసికొని, వారి
పిల్లలనందరిని వారి స్త్రీలను చెరపట్టి, యిండ్లలో నున్న
30 దంతయు దోచుకొనిరి. । అప్పుడు యాకోబు షిమ్యో
నును లేవీని చూచి — మీరు నన్ను బాధపెట్టి యీ
దేశ నివాసులైన కనానీయులలోను పెరిజ్జీయులలోను
అసహ్యునిగా చేసితిరి; నా జనసంఖ్య కొంచెమే;
వారు నా మీదికి గుంపుగా వచ్చి నన్ను చంపె
దరు; నేనును నా యింటివారును నాశనమగుదుమని
31 చెప్పెను. । అందుకు వారు — వేశ్యయెడల జరిగించి
నట్లు మా సహోదరియెడల ప్రవర్తింపవచ్చునా అనిరి.

**35** దేవుడు యాకోబుతో — నీవు లేచి బేతేలుకు
వెళ్లి అక్కడ నివసించి, నీ సహోదరుడైన ఏశావు
ఎదుటనుండి నీవు పారిపోయినప్పుడు నీకు కనబడిన
దేవునికి అక్కడ బలిపీఠమును కట్టుమని చెప్పగా ।
2 యాకోబు తన యింటివారితోను తన యొద్దనున్న
3 వారందరితోను — మీ యొద్దనున్న అన్యదేవతలను
పారవేసి మిమ్మును మీరు శుచిపరచుకొని మీ వస్త్ర
ములను మార్చుకొనుడి. మనము లేచి బేతేలుకు వెళ్లు
దము; నా శ్రమ దినమున నా కుత్తరమిచ్చి నేను
వెళ్లిన మార్గమున నాకు తోడై యుండిన దేవునికి బలి
4 పీఠమును అక్కడ కట్టెదనని చెప్పెను. । వారు తమ
యొద్దనున్న అన్యదేవతలన్నిటిని తమ చెవులనున్న
పోగులను యాకోబుకు అప్పగింపగా యాకోబు షెకె
ము దగ్గరనున్న మస్తకివృక్షము క్రింద వాటిని దాచి
5 పెట్టెను. । వారు ప్రయాణమై పోయినప్పుడు, దేవుని
భయము వారి చుట్టునున్న పట్టణములమీద నుండెను
గనుక వారు యాకోబు కుమారులను తరుమలేదు. ।
6 యాకోబును అతనితోనున్న జనులందరును కనానులో
7 లూజుకు, అనగా బేతేలుకు వచ్చిరి. । అతడు తన
సహోదరుని యెదుటనుండి పారిపోయినప్పుడు దేవు
డక్కడ అతనికి ప్రత్యక్షమాయెను గనుక అక్కడ
బలిపీఠమును కట్టి ఆ చోటికి ఏల్ బేతేలను[1] పేరు
8 పెట్టెను. । రిబ్కా దాదియైన దెబోరా చనిపోయి
బేతేలుకు దిగువనున్న సిందూరవృక్షము క్రింద పాతి
పెట్టబడెను. దానికి అల్లోను బాకూత్ అను పేరు
పెట్టబడెను.

9 యాకోబు పద్దనరామునుండి వచ్చుచుండగా దేవుడు
తిరిగి అతనికి ప్రత్యక్షమై అతని నాశీర్వదించెను. ।
అప్పుడు దేవుడు అతనితో—నీపేరు యాకోబు; ఇక 10
మీదట నీపేరు యాకోబు అనబడదు; నీపేరు ఇశ్రా
యేలు అని చెప్పి అతనికి ఇశ్రాయేలు అను పేరు
పెట్టెను.

మరియు దేవుడు — నేను సర్వశక్తిగల దేవుడను; 11
నీవు ఫలించి అభివృద్ధిపొందుము. జనమును జనముల
సమూహమును నీవలన కలుగును; రాజులును నీ గర్భ
వాసమున పుట్టెదరు. । నేను అబ్రాహాముకును ఇస్సా 12
కుకును ఇచ్చిన దేశము నీకిచ్చెదను; నీ తరువాత నీ
సంతానమునకు ఈ దేశము నిచ్చెదనని అతనితో
చెప్పెను. । దేవుడు అతనితో మాటలాడిన స్థలము 13
నుండి పరమునకు వెళ్లెను. । ఆయన తనతో మాటలాడిన 14
చోట యాకోబు ఒక స్తంభము, అనగా రాతిస్తంభము
కట్టించి దానిమీద పానార్పణము చేసి నూనెయు
దానిమీద పోసెను. । తనతో దేవుడు మాటలాడిన 15
చోటికి యాకోబు బేతేలను పేరు పెట్టెను. । వారు 16
బేతేలునుండి ప్రయాణమై పోయిరి. ఎఫ్రాతాకు
వెళ్లు మార్గములో మరికొంత దూరము ఉన్నప్పుడు
రాహేలు ప్రసవించుచు ప్రసవవేదనతో ప్రయాస
పడెను. । ఆమె ప్రసవమువలన ప్రయాసపడుచున్న 17
ప్పుడు మంత్రసాని ఆమెతో — భయపడకుము, ఇది
యు నీకు కుమారుడగునని చెప్పెను. । ఆమె మృతి 18
బొందెను; ప్రాణము పోవుచుండగా ఆమె—అతని
పేరు బెనోని అనెను; అతని తండ్రి అతనికి బెన్యా
మీను అను పేరు పెట్టెను. । అట్లు రాహేలు మృతి 19
బొంది బేత్లెహేమను ఎఫ్రాతా మార్గమున పాతిపెట్ట
బడెను. । యాకోబు ఆమె సమాధిమీద ఒక స్తంభము 20
కట్టించెను. అది నేటివరకు రాహేలు సమాధి స్తంభ
ము. । ఇశ్రాయేలు ప్రయాణమైపోయి మిగ్దల్ ఏదెరు 21
కవతల తన గుడారము వేసెను. । ఇశ్రాయేలు ఆ 22
దేశములో నివసించుచున్నప్పుడు రూబేను వెళ్లి తన
తండ్రి ఉపపత్నియైన బిల్హాతో శయనించెను; ఆ
సంగతి ఇశ్రాయేలుకు వినబడెను.

యాకోబు కుమారులు పన్నెండుగురు. యాకోబు 23
జ్యేష్ఠ కుమారుడగు రూబేను, షిమ్యోను, లేవి,
యూదా, ఇశ్శాఖారు, జెబులూను; వీరు లేయా
కుమారులు. । రాహేలు కుమారులు యోసేపు, బెన్యా 24
మీను. । రాహేలు దాసియైన బిల్హా కుమారులు 25
దాను, నఫ్తాలి. । లేయా దాసియైన జిల్పా కుమారులు 26
గాదు, ఆషేరు; వీరు పద్దనరాములో యాకోబుకు
పుట్టిన కుమారులు. । అబ్రాహామును ఇస్సాకును పర 27
దేశులైయుండిన మమ్రేలో కిర్యతర్బాకు తన తండ్రి
యైన ఇస్సాకు నొద్దకు యాకోబు వచ్చెను. అదే
హెబ్రోను.

1 అనగా—బేతేలు దేవుడు.

స్సాకు బ్రదికిన దినములు నూట ఎనుబది సంవ
లు. । ఇస్సాకు కాలము నిండిన వృద్ధుడై
ము విడిచి మృతిబొంది తన పితరుల యొద్దకు
డెను. అతని కుమారులైన ఏశావు యాకో
అతని పాతిపెట్టిరి.
దోమను ఏశావు వంశావళి ఇదే, । ఏశావు
కుమార్తెలలో హిత్తీయుడైన ఏలోను కుమార్తె
ఆదాను, హివ్వీయుడైన సిబ్యోను కుమార్తెయైన
కుమార్తెయగు అహొలీబామాను, । ఇష్మాయేలు
యు నెబాయోతు సహోదరియునైన బాశె
పెండ్లియాడెను. । ఆదా ఏశావుకు ఎలీ
కనెను. బాశెమతు రగూయేలును కనెను ।
లీబామా యూషును యాలామును కోరహును
కనాను దేశములో ఏశావుకు పుట్టిన కుమా
రే.
ావు తన భార్యలను తన కుమారులను తన కుమా
తన యింటివారినందరిని తన మందలను తన
పశువులను తాను కనాను దేశములో సంపాదిం
యావత్తును తీసికొని తన తమ్ముడైన యాకోబు
నుండి మరియొక దేశమునకు వెళ్లిపోయెను; ।
విస్తారమయిన సంపదగలవారు గనుక వారు
నివసింపలేక పోయిరి. వారి పశువులు విశేష
న్నందున వారు పరదేశులై యుండిన భూమి
భరింపలేకపోయెను. । అప్పుడు ఏశావు శేయీరు
ంలో నివసించెను. ఏశావు అనగా ఎదోము.
యీరు మన్యములో నివసించిన ఎదోమీయుల
మైన ఏశావు వంశావళి ఇదే, । ఏశావు కుమా
రులు ఇవే. ఏశావు భార్యయైన ఆదా కుమా
ఎలీఫజును ఏశావు భార్యయైన బాశెమతు
డగు రగూయేలును. । ఎలీఫజు కుమారులు
ఓమారు సెఫో గాతాము కనజు. తిమ్నా
కుమారుడైన ఎలీఫజుకు ఉపపత్ని. । ఆమె
కు అమాలేకును కనెను. వీరు ఏశావు భార్య
ఆదా కుమారులు. । రగూయేలు కుమారులు
జెరహు షమ్మా మిజ్జ; వీరు ఏశావు భార్య
బాశెమతు కుమారులు. । ఏశావు భార్యయు
కుమార్తెయగు అనా కుమార్తెయునైన అహొ
కుమారులు ఎవరనగా ఆమె ఏశావుకు కనిన
యాలాము కోరహు. । ఏశావు కుమారు
వీరు నాయకులు; ఏశావు ప్రథమకుమారుడైన
కుమారులు, తేమాను నాయకుడు, ఓమారు
డు, సెఫో నాయకుడు, కనజు నాయకుడు, ।
నాయకుడు, గాతాము నాయకుడు, అమా
యకుడు. వీరు ఎదోము దేశమందు ఎలీఫజు
లు. వీరు ఆదా కుమారులు. । వీరు ఏశావు
డైన రగూయేలు కుమారులు, నహతు నాయ

కుడు జెరహు నాయకుడు షమ్మా నాయకుడు మిజ్జ
నాయకుడు; వీరు ఎదోము దేశమందు రగూయేలు
సంతానపు నాయకులు. వీరు ఏశావు భార్యయైన బాశె
మతు కుమారులు । వీరు ఏశావు భార్యయైన అహొలీ 18
బామా కుమారులు, యూషు నాయకుడు యగ్లాము
నాయకుడు కోరహు నాయకుడు; వీరు అనా కుమా
ర్తెయు ఏశావు భార్యయునైన అహొలీబామా పుత్ర
సంతానపు నాయకులు. । ఎదోమను ఏశావు కుమారులు 19
వీరు. వారి వారి సంతానపు నాయకులు వీరు.

ఆ దేశ నివాసులైన హోరీయుడైన శేయీరు 20
కుమారులు; లోతాను శోబాలు సిబ్యోను అనా ।
దిషోను ఏసెరు దీషాను. వీరు ఎదోము దేశమందు 21
శేయీరు పుత్రులైన హోరీయుల నాయకులు. ।
లోతాను కుమారులు హోరీ హేమీము; లోతాను 22
సహోదరి తిమ్నా. । శోబాలు కుమారులు అల్వాను 23
మానహదు ఏబాలు షపో ఓనాము. । సిబ్యోను 24
కుమారులు అయ్యా అనా; ఆ అనా తన తండ్రి
యైన సిబ్యోను గాడిదెలను మేపుచుండి అరణ్యములో
ఉష్ణధారలు కనుగొనినవాడు. । అనా సంతానము 25
దిషోను అనా కుమార్తెయైన అహొలీబామా. । దిషోను 26
కుమారులు హెమ్దాను ఎష్బాను ఇత్రాను కెరాను. ।
ఏసెరు కుమారులు బిల్హాను జవాను అకాను. । 27
దీషాను కుమారులు ఊజు అరాను. । హోరీయుల 28
నాయకులు, లోతాను నాయకుడు శోబాలు నాయ 29
కుడు సిబ్యోను నాయకుడు అనా నాయకుడు । దిషోను 30
నాయకుడు ఏసెరు నాయకుడు దీషాను నాయకుడు.
శేయీరు దేశమందలి వారి నాయకుల చొప్పున వీరు
హోరీయుల నాయకులు.

మరియు ఏ రాజైనను ఇశ్రాయేలీయుల మీద 31
రాజ్యపరిపాలన చేయక మునుపు, ఎదోము దేశ
ములో రాజ్యపరిపాలన చేసిన రాజు లెవరనగా ।
బెయోరు కుమారుడైన బెల ఎదోములో రాజ్యపరి 32
పాలన చేసెను. అతని ఊరి పేరు దిన్హాబా. । బెల 33
చనిపోయిన తరువాత బొస్రావాడైన జెరహు కుమా
రుడగు యోబాబు అతనికి ప్రతిగా రాజాయెను. ।
యోబాబు చనిపోయిన తరువాత తేమనీయుల దేశస్థు 34
డైన హుషాము అతనికి ప్రతిగా రాజాయెను. । హు 35
షాము చనిపోయిన తరువాత మోయాబు దేశమందు
మిద్యానును కొట్టివేసిన బదదు కుమారుడైన హదదు
అతనికి ప్రతిగా రాజాయెను. అతని ఊరి పేరు
అవీతు. । హదదు చనిపోయిన తరువాత మశ్రేకా 36
వాడైన శమ్లా అతనికి ప్రతిగా రాజాయెను. । శమ్లా 37
చనిపోయిన తరువాత నదీతీరమందలి రహెబోతు
వాడైన షావూలు అతనికి ప్రతిగా రాజాయెను. ।
షావూలు చనిపోయిన తరువాత అక్బోరు కుమారు 38
డైన బయల్‌హానాను అతనికి ప్రతిగా రాజాయెను. ।

39 అక్బోరు కుమారుడైన బయల్హానాను చనిపోయిన
తరువాత హదరు అతనికి ప్రతిగా రాజాయెను. అతని
ఊరి పేరు పాయు; అతని భార్య పేరు మహేతబే
లు; ఆమె మేజాహాబు కుమార్తెయైన మత్రేదు
40 కుమార్తె । మరియు వారివారి వంశముల ప్రకారము
వారివారి స్థలములలో వారివారి పేరుల చొప్పున
ఏశావు సంతానపు నాయకుల పేరు లేవనగా తిమ్నా
నాయకుడు అల్వా నాయకుడు యతేతు నాయకుడు ।
41 అహొలీబామా నాయకుడు ఏలా నాయకుడు పీనోను
42 నాయకుడు । కనజు నాయకుడు తేమాను నాయకుడు
43 మిబ్సారు నాయకుడు । మగ్దీయేలు నాయకుడు ఈ
రాము నాయకుడు. వీరు తమ తమ స్వాస్థ్యమైన
దేశమందు తమ తమ నివాసస్థలముల ప్రకారము
ఎదోము నాయకులు. ఏశావు ఎదోమీయులకు మూల
పురుషుడు.

37 యాకోబు తన తండ్రి పరదేశవాసిగా ఉండిన
2 కనాను దేశములో నివసించెను. । యాకోబు వంశా
వళి యిది. యోసేపు పదునేడేండ్లవాడై తన సహో
దరులతోకూడ మందను మేపుచుండెను. అతడు
చిన్నవాడై తన తండ్రి భార్యలైన బిల్హా కుమారుల
యొద్దను జిల్పా కుమారుల యొద్దను ఉండెను. అప్పుడు
యోసేపు వారి చెడుతనమును గూర్చిన సమాచారము
3 వారి తండ్రి యొద్దకు తెచ్చుచుండువాడు । మరియు
ఇశ్రాయేలు యోసేపు తన వృద్ధాప్యమందు పుట్టిన
కుమారుడు గనుక తన కుమారులందరికంటె ఎక్కు
వగా అతని ప్రేమించి అతనికొరకు విచిత్రమైన నిలు
4 వుటంగీ కుట్టించెను. । అతని సహోదరులు తమ
తండ్రి అతనిని తమ అందరికంటె ఎక్కువగా ప్రేమిం
చుట చూచినప్పుడు వారు అతనిమీద పగపట్టి, అతనిని
5 క్షేమసమాచారమైనను అడుగలేక పోయిరి. । యో
సేపు ఒక కల కని తన సహోదరులతో అది తెలియ
6 చెప్పగా వారు అతనిమీద మరి పగపట్టిరి. । అతడు
వారిని చూచి—నేను కనిన యీ కలను మీరు దయ
7 చేసి వినుడి. । అదేమనగా మనము చేనిలో పనలు
కట్టుచుంటిమి; నా పన లేచి నిలుచుండగా మీ పనలు
నా పనను చుట్టుకొని నా పనకు సాష్టాంగపడెనని
8 చెప్పెను. । అందుకతని సహోదరులు— నీవు నిశ్చ
యముగా మమ్ము నేలెదవా? మామీద నీవు అధికారి
వగుదువా అని అతనితో చెప్పి, అతని కలలనుబట్టి
యు అతని మాటలనుబట్టియు అతనిమీద మరింత పగ
9 పట్టిరి. । అతడింకొక కల కని తన సహోదరులకు
తెలియచేసి — ఇదిగో నేను మరియొక కలకంటిని;
అందులో సూర్యచంద్రులును పదకొండు నక్షత్ర
10 ములును నాకు సాష్టాంగపడెనని చెప్పెను. । అతడు
తన తండ్రితోను తన సహోదరులతోను అది తెలియ
చెప్పినప్పుడు అతని తండ్రి అతని చూచి—నీవు కనిన
యీ కల యేమిటి? నేనును నీ తల్లియు నీ సహో
దరులును నిశ్చయముగా వచ్చి నీకు సాష్టాంగపడు
దుమా అని అతని గద్దించెను. । అతని సహోదరులు 11
అతనియందు అసూయపడిరి. అయితే అతని తండ్రి
ఆ మాట జ్ఞాపకముంచుకొనెను.

అతని సహోదరులు షెకెములో తమ తండ్రి 12
మందను మేపుటకు వెళ్లిరి. । అప్పుడు ఇశ్రాయేలు 13
యోసేపును చూచి— నీ సహోదరులు షెకెములో
మంద మేపుచున్నారు గదా. నిన్ను వారియొద్దకు పంపె
దను రమ్మన్నప్పుడు అతడు — మంచిదని అతనితో
చెప్పెను. । అప్పుడతడు—నీవు వెళ్లి నీ సహోదరుల 14
క్షేమమును మంద క్షేమమును తెలిసికొని నాకు వర్త
మానము తెమ్మని అతనితో చెప్పి హెబ్రోను లోయ
లోనుండి అతని పంపెను. అతడు షెకెముకు వచ్చె
ను. । అతడు పొలములో ఇటు అటు తిరుగుచుం 15
డగా ఒక మనుష్యుడు అతని చూచి—నీవేమి వెదకు
చున్నావని అతని నడిగెను. । అందుకతడు — నేను 16
నా సహోదరులను వెదకుచున్నాను; వారు ఎక్కడ
మందను మేపుచున్నారో అది దయచేసి నాకు తెలుపు
మని అడిగెను. । అందుకు ఆ మనుష్యుడు—ఇక్కడ 17
నుండి వారు సాగి వెళ్లిరి. వారు—దోతానుకు వెళ్లు
దము రండని చెప్పుకొనుట వింటినని చెప్పెను. అప్పు
డు యోసేపు తన సహోదరులకోసరము వెళ్లి దోతా
నులో వారిని కనుగొనెను. । అతడు దగ్గరకు రాక 18
మునుపు వారు దూరమునుండి అతని చూచి అతని
చంపుటకు దురాలోచన చేసిరి. । వారు — ఇదిగో 19
ఈ కలలు కనువాడు వచ్చుచున్నాడు; । వీని చంపి 20
యిక్కడనున్న ఒక గుంటలో పారవేసి, దుష్టమృ
గము వీని తినివేసెనని చెప్పుదము, అప్పుడు వీని కల
లేమగునో చూతము రండని ఒకనితో ఒకడు మాట
లాడుకొనిరి. । రూబేను ఆ మాట విని—మనము వాని 21
చంపరాదని చెప్పి వారి చేతులలో పడకుండ అతని
విడిపించెను. । ఎట్లనగా రూబేను అతని తండ్రికి
అతని నప్పగించుటకై వారి చేతులలో పడకుండ
అతని విడిపింప దలచి—రక్తము చిందింపకుడి; అతనికి
హాని యేమియు చేయక అడవిలోనున్న యీ గుంట
లో అతని పడద్రోయుడని వారితో చెప్పెను. 23
యోసేపు తన సహోదరుల యొద్దకు వచ్చినప్పుడు
వారు యోసేపు అంగిని అతడు తొడుగుకొని యుం
డిన ఆ విచిత్రమైన నిలువుటంగిని తీసివేసి । అతని
పట్టుకొని ఆ గుంటలో పడద్రోసిరి. ఆ గుంట
వట్టిది అందులో నీళ్లు లేవు. । వారు భోజనము చేయ
కూర్చుండి, కన్నులెత్తి చూడగా ఐగుప్తునకు తీసికొని
పోవుటకు గుగ్గిలము మస్తకియు బోళమును మోయు
చున్న ఒంటెలతో ఇష్మాయేలీయులైన మార్గస్థుల
గిలాదునుండి వచ్చుచుండిరి. । అప్పుడు యూదా —

మనము మన సహోదరుని చంపి వాని మరణమును
27 దాచిపెట్టినందువలన ఏమి ప్రయోజనము? । ఈ ఇష్మా
యేలీయులకు వానిని అమ్మివేయుదము రండి; వాడు
మన సహోదరుడు మన రక్త సంబంధిగదా? వానికి
హానియేమియు చేయరాదని తన సహోదరులతో
చెప్పెను. అందుకతని సహోదరులు సమ్మతించిరి. ।
28 మిద్యానీయులైన వర్తకులు ఆ మీదుగా వెళ్లుచుం
డగా, వారు ఆ గుంటలోనుండి యోసేపును పైకి తీసి
ఆ ఇష్మాయేలీయులకు ఇరువది తులముల వెండికి అమ్మివే
సిరి. వారు యోసేపును ఐగుప్తుకు తీసికొని పోయిరి. ।
29 రూబేను ఆ గుంటకు తిరిగివచ్చినప్పుడు యోసేపు
గుంటలో లేకపోగా అతడు తన బట్టలు చింపుకొని ।
30 తన సహోదరులయొద్దకు తిరిగి వెళ్లి—చిన్నవాడు
31 లేడే; అయ్యో నేనెక్కడికి పోదుననగా । వారు
యోసేపు అంగీని తీసికొని, ఒక మేకపిల్లను చంపి,
32 దాని రక్తములో ఆ అంగీ ముంచి । ఆ విచిత్రమైన
నిలువుటంగీని పంపగా వారు తండ్రి యొద్దకు దాని
తెచ్చి—ఇది మాకు దొరికెను; ఇది నీ కుమారుని అంగీ
33 అవునో కాదో గురుతుపట్టుమని చెప్పిరి. । అతడు
దానిని గురుతుపట్టి—ఈ అంగీ నా కుమారునిదే; దుష్ట
మృగము వాని తినివేసెను; యోసేపు నిశ్చయముగా
34 చీల్చబడెననెను. । యాకోబు తన బట్టలు చింపుకొని
తన నడుమున గోనెపట్ట కట్టుకొని అనేక దినములు
35 తన కుమారుని నిమిత్తము అంగలార్చుచుండగా । అతని
కుమారులందరును అతని కుమార్తెలందరును అతనిని
ఓదార్చుటకు యత్నము చేసిరి; అయితే అతడు
ఓదార్పు పొందనొల్లక—నేను అంగలార్చుచు మృతుల
లోకమునకు నా కుమారుని యొద్దకు వెళ్లెదనని చెప్పి
36 అతని తండ్రి అతనికోసరము ఏడ్చెను. । మిద్యానీ
యులు ఐగుప్తుకు అతని తీసికొని పోయి, ఫరోయొక్క
ఉద్యోగస్థుడును రాజసంరక్షక సేనాధిపతియునైన
పోతీఫరుకు అతనిని అమ్మివేసిరి.

38 ఆ కాలమందు యూదా తన సహోదరులను
విడిచి హీరా అను ఒక అదుల్లామీయునియొద్ద ఉం
2 డుటకు వెళ్లెను. । అక్కడ షూవహు అను ఒక కనా
నీయుని కుమార్తెను యూదా చూచి ఆమెను తీసి
3 కొని ఆమెతో పోయెను. । ఆమె గర్భవతియై కుమా
రుని కనగా అతడు వానికి ఏరు అను పేరు పెట్టెను. ।
4 ఆమె మరల గర్భవతియై కుమారుని కని వానికి ఓనాను
5 అను పేరు పెట్టెను. । ఆమె మరల గర్భవతియై కుమా
రుని కని వానికి షేలా అను పేరు పెట్టెను. ఆమె
వీని కనినప్పుడు అతడు కజీబులో నుండెను.
6 యూదా తన జ్యేష్ఠకుమారుడైన ఏరుకు తామారు
7 అను దాని పెండ్లిచేసెను. । యూదా జ్యేష్ఠకుమారు
డైన ఏరు యెహోవా దృష్టికి చెడ్డవాడు గనుక
8 యెహోవా అతని చంపెను. । అప్పుడు యూదా
ఓనానుతో — నీ అన్న భార్యయొద్దకు వెళ్లి మరిది
ధర్మము జరిగించి నీ అన్నకు సంతానము కలుగజేయు
మని చెప్పెను. । ఓనాను ఆ సంతానము తనది కానే 9
రదని యెరిగి ఆమెతో పోయినప్పుడు తన అన్నకు
సంతానము కలుగజేయకుండునట్లు తన రేతస్సును
నేలను విడిచెను. । అతడు చేసినది యెహోవా 10
దృష్టికి చెడ్డది గనుక ఆయన అతని కూడ చంపెను. ।
అప్పుడు యూదా—ఇతడు కూడ ఇతని అన్నలవలె 11
చనిపోవునేమో అనుకొని — నా కుమారుడైన షేలా
పెద్దవాడగువరకు నీ తండ్రి యింట విధవరాలుగా
నుండుమని తన కోడలైన తామారుతో చెప్పెను.
కాబట్టి తామారు వెళ్లి తన తండ్రి యింట నివసించెను. ।
చాలా దినములైన తరువాత షూవహు కుమార్తెయైన 12
యూదా భార్య చనిపోయెను తరువాత యూదా
దుఃఖనివారణ పొంది, అదుల్లామీయుడైన హీరా
అను తన స్నేహితునితో తిమ్నాతుకు తన గొఱ్ఱెల
బొచ్చు కత్తిరించువారియొద్దకు వెళ్లెను. । దాని మామ 13
తన గొఱ్ఱెలబొచ్చు కత్తిరించుటకు తిమ్నాతుకు వెళ్లు
చున్నాడని తామారుకు తెలుపబడెను. । అప్పుడు 14
షేలా పెద్దవాడైనప్పటికిని తాను అతనికియ్యబడకుం
డుట చూచి తన వైధవ్యవస్త్రములను తీసివేసి, ముసుకు
వేసికొని శరీరమంతయు కప్పుకొని, తిమ్నాతుకు పోవు
మార్గములోనుండు ఏనాయిము ద్వారమున కూర్చుం
డగా । యూదా ఆమెను చూచి, ఆమె తన ముఖము 15
కప్పుకొనినందున వేశ్య అనుకొని । ఆ మార్గమున 16
ఆమె దగ్గరకు బోయి, ఆమె తన కోడలని తెలియక
—నీతో పోయెదను రమ్మని చెప్పెను. అందుకామె—
నీవు నాతో వచ్చినయెడల నా కేమి యిచ్చెదవని
అడిగెను. । అందుకతడు—నేను మందలోనుండి మేక 17
పిల్లను పంపెదనని చెప్పినప్పుడు ఆమె — అది పంపు
వరకు ఏమైన కుదువ పెట్టినయెడల సరే అని చెప్పె
ను. । అతడు—నేను నీయొద్ద ఏమి కుదువపెట్టవలె 18
నని అడిగినప్పుడు ఆమె—నీ ముద్రయు దాని దార
మును నీ చేతికఱ్ఱయునని చెప్పెను. అతడు వాటిని
ఆమెకిచ్చి ఆమెతో పోయెను; ఆమె అతనివలన
గర్భవతియాయెను. । అప్పుడామె లేచిపోయి తన 19
ముసుకు తీసివేసి తన వైధవ్యవస్త్రములను వేసికొనెను. ।
తరువాత యూదా ఆ స్త్రీ యొద్దనుండి ఆ కుదువను 20
పుచ్చుకొనుటకు తన స్నేహితుడగు అదుల్లామీయుని
చేత మేకపిల్లను పంపినప్పుడు ఆమె అతనికి కనబడ
లేదు. । కాబట్టి అతడు — మార్గమందు ఏనాయిము 21
నొద్దనుండిన ఆ వేశ్య యెక్కడనున్నదని ఆ చోటి
మనుష్యులను అడుగగా వారు—ఇక్కడ వేశ్య యెవ
తెయు లేదని చెప్పిరి. । కాబట్టి అతడు యూదా 22
యొద్దకు తిరిగి వెళ్లి—ఆమె నాకు కనబడలేదు; మరి
యు ఆ చోటి మనుష్యులు—ఇక్కడికి వేశ్య యెవ

23 తెయుు గాలేదని చెప్పిరని అనినప్పుడు । యూదా—
మనలను అపహాస్యము చేసెదరేమో; ఆమె వాటిని
ఉంచుకొననిమ్ము; ఇదిగో నేను ఈ మేకపిల్లను పంపి
24 తిని, ఆమె నీకు కనబడలేదు అనెను. । రమారమి
మూడునెలలైన తరువాత—నీ కోడలగు తామారు జార
త్వము చేసెను, అంతేకాక ఆమె జారత్వమువలన గర్భ
వతియైనదని యూదాకు తెలుపబడెను. అప్పుడు
యూదా—ఆమెను బయటికి తీసికొని రండి, ఆమెను
25 కాల్చివేయవలెనని చెప్పెను. । ఆమెను బయటికి తీసి
కొని వచ్చినప్పుడు ఆమె తన మామయొద్దకు ఆ వస్తు
వులను పంపి—ఇవి యెవరివో ఆ మనుష్యునివలన నేను
గర్భవతినైతిని. ఈ ముద్ర యీ దారము ఈ కర్ర
యెవరివో దయచేసి గురుతుపట్టుమని చెప్పించెను. ।
26 యూదా వాటిని గురుతుపట్టి— నేను నా కుమారుడైన
షేలాను ఆమెకు ఇయ్యలేదు గనుక ఆమె నాకంటె
నీతిమంతురాలని చెప్పి మరి యెప్పుడును ఆమెను కూడ
27 లేదు. । ఆమె ప్రసవ కాలమందు కవలవారు ఆమె
28 గర్భమందుండిరి. । ఆమె ప్రసవించుచున్నప్పుడు
ఒకడు తన చెయ్యి బయటికి చాచెను గనుక మంత్ర
సాని తొగరు తీసి వాని చేతికి కట్టి—ఇతడు మొదట
29 బయటికి వచ్చెనని చెప్పెను. । అతడు తన చెయ్యి
వెనుకకు తీసినప్పుడు అతని సహోదరుడు బయటికి
వచ్చెను. అప్పుడామె—నీవేల భేదించుకొని వచ్చితి
వనెను. అందుచేత అతనికి పెరెసు అను పేరు పెట్ట
30 బడెను. । తరువాత తన చేతిని తొగరుగల అతని
సహోదరుడు బయటికి వచ్చెను. అతనికి జెరహు
అను పేరు పెట్టబడెను.

39 యోసేపును ఐగుప్తుకు తీసికొని వచ్చినప్పుడు
ఫరోయొక్క ఉద్యోగస్థుడును రాజసంరక్షక సేనాధి
పతియునైన పోతీఫరను నొక ఐగుప్తీయుడు, అక్కడికి
అతని తీసికొని వచ్చిన ఇష్మాయేలీయులయొద్ద నతని
2 కొనెను. । యెహోవా యోసేపుకు తోడై యుం
డెను గనుక అతడు వర్ధిల్లుచు తన యజమానుడగు ఆ
3 ఐగుప్తీయుని యింట నుండెను. । యెహోవా అతనికి
తోడై యుండెననియు, అతడు చేసినదంతయు అతని
చేతిలో యెహోవా సఫలము చేసెననియు అతని
4 యజమానుడు చూచినప్పుడు । యోసేపుమీద అతనికి
కటాక్షము కలిగెను గనుక అతనియొద్ద పరిచర్య చేయు
వాడాయెను. మరియు అతడు తన యింటిమీద విచా
రణకర్తగా అతని నియమించి తనకు కలిగినదంతయు
5 అతని చేతికప్పగించెను. । అతడు తన యింటిమీదను
తనకు కలిగినదంతటిమీదను అతని విచారణకర్తగా నియ
మించిన కాలము మొదలుకొని యెహోవా యోసేపు
నిమిత్తము ఆ ఐగుప్తీయుని యింటిని ఆశీర్వదించెను.
యెహోవా ఆశీర్వాదము ఇంటిలోనేమి పొలములో
నేమి అతనికి కలిగిన సమస్తముమీదను ఉండెను. ।

అతడు తనకు కలిగినదంతయు యోసేపు చేతికప్పగించి, 6
తాను ఆహారము తినుట తప్ప తనకేమి ఉన్నదో
ఏమి లేదో విచారించినవాడు కాడు. యోసేపు
రూపవంతుడును సుందరుడునై యుండెను. । అటు 7
తరువాత అతని యజమానుని భార్య యోసేపుమీద
కన్నువేసి—తనతో శయనించుమని చెప్పెను. । అయితే 8
అతడు ఒప్పక—నా యజమానుడు తనకు కలిగినదంత
యు నా చేతికప్పగించెనుగదా, నా వశమున తన
యింటిలో ఏమి ఉన్నదో అతడెరుగడు; ఈ యిం
టిలో నాకంటె పైవాడు ఎవడును లేడు. । నీవు అతని 9
భార్యవైనందున నిన్ను తప్ప మరి దేనిని నా కప్పగిం
పక యుండలేదు. కాబట్టి నేనెట్లు ఇంత ఘోరమైన
దుష్కార్యముచేసి దేవునికి విరోధముగా పాపము
కట్టుకొందునని తన యజమానుని భార్యతో అనెను. ।
దినదినము ఆమె యోసేపుతో మాటలాడుచుండెను 10
గాని అతడు ఆమెతో శయనించుటకైనను ఆమెతో
నుండుటకైనను ఆమె మాట విన్నవాడుకాడు. ।
అట్లుండగా ఒకనాడు అతడు తన పనిమీద ఇంటి 11
లోపలికి వెళ్లినప్పుడు ఇంటి మనుష్యులలో ఎవరును
అక్కడ లేరు. । అప్పుడామె అతని వస్త్రము పట్టుకొని 12
తనతో శయనింపుమని చెప్పగా అతడు తన వస్త్రము
ఆమె చేతిలో విడిచిపెట్టి తప్పించుకొని బయటికి
పారిపోయెను. । అతడు తన వస్త్రమును ఆమెచేతిలో 13
విడిచి తప్పించుకొని పోవుట ఆమె చూచినప్పుడు ।
తన యింటి మనుష్యులను పిలిచి—చూడుడి, అతడు 14
మనలను ఎగతాళి చేయుటకు ఒక హెబ్రీయుని మన
యొద్దకు తెచ్చి యున్నాడు. నాతో శయనింపవలె
నని వీడు నా యొద్దకు రాగా నేను పెద్దకేక వేసి
తిని. । నేను బిగ్గరగా కేకవేయుట వాడు విని నా దగ్గర 15
తన వస్త్రమును విడిచిపెట్టి తప్పించుకొని బయటికి పారి
పోయెనని వారితో చెప్పి । అతని యజమానుడు ఇం 16
టికి వచ్చువరకు అతని వస్త్రము తనదగ్గర ఉంచుకొనె
ను. । అప్పుడామె తన భర్తతో ఈ మాటల చొప్పున 17
చెప్పెను—నీవు మనయొద్దకు తెచ్చిన ఆ హెబ్రీదా
సుడు నన్ను ఎగతాళి చేయుటకు నా యొద్దకు వచ్చె
ను. । నేను బిగ్గరగా కేకవేసినప్పుడు వాడు తన వస్త్రము 18
నా దగ్గర విడిచిపెట్టి తప్పించుకొని బయటికి పారి
పోయెననెను । కాబట్టి అతని యజమానుడు—ఇట్లు 19
నీ దాసుడు నన్ను చేసెనని తన భార్య తనతో చెప్పిన
మాటలు విన్నప్పుడు కోపముతో మండిపడి । అతనిని 20
పట్టుకొని రాజు ఖైదీలు బంధింపబడు చెరసాలలో
వేయించెను. అతడక్కడ చెరసాలలో ఉండెను. ।
అయితే యెహోవా యోసేపుకు తోడైయుండి, 21
అతనియందు కనికరపడి అతనిమీద ఆ చెరసాల
యొక్క అధిపతికి కటాక్షము కలుగునట్లు చేసెను. ।
చెరసాల అధిపతి ఆ చెరసాలలోనున్న ఖైదీలనందరిని 22

యోసేపు చేతికప్పగించెను. వారక్కడ ఏమిచేసినగో
23 అంతయు అతడే చేయించువాడు. । యెహోవా
అతనికి తోడైయుండెను గనుక ఆ చెరసాల అధిపతి
అతని చేతికి అప్పగింపబడిన దేనిగూర్చియు విచారణ
చేయక యుండెను. అతడు చేయునది యావత్తు
యెహోవా సఫలమగునట్లు చేసెను.

**40** అటుపిమ్మట ఐగుప్తురాజుయొక్క పానదాయకు
డును భక్ష్యకారుడును తమ ప్రభువైన ఐగుప్తురాజు
2 ఎడల తప్పుచేసిరి । గనుక ఫరో పానదాయకుల అధి
పతియు భక్ష్యకారుల అధిపతియునైన తన యిద్దరు
3 ఉద్యోగస్థులమీద కోపపడి । వారిని చెరసాలలో
నుంచుటకై రాజసంరక్షక సేనాధిపతికి అప్పగించెను.
4 అది యోసేపు బంధింపబడిన స్థలము. । ఆ సేనాధిపతి
వారిని యోసేపువశము చేయగా అతడు వారికి ఉప
చారము చేసెను. వారు కొన్ని దినములు కావలిలో
5 నుండినతరువాత । వారిద్దరు, అనగా చెరసాలలో
బంధింపబడిన ఐగుప్తురాజుయొక్క పానదాయకుడును
భక్ష్యకారుడును ఒక్కటే రాత్రియందు కలలు కనిరి;
ఒక్కొకడు వేరు వేరు భావముగల కల కనెను. ।
6 తెల్లవారినప్పుడు యోసేపు వారియొద్దకు వచ్చి వారిని
7 చూడగా వారు చింతాక్రాంతులై యుండిరి. । అతడు
—ఎందుచేత నేడు మీ ముఖములు చిన్నబోయియున్న
వని తన యజమానుని యింట తనతో కావలియందున్న
8 ఫరో ఉద్యోగస్థుల నడిగెను. । అందుకు వారు—
మేము కలలు కంటిమి; వాటి భావము చెప్పగలవా
రెవరును లేరని అతనితోననగా యోసేపు వారిని
చూచి—భావములు చెప్పుట దేవుని అధీనమే గదా;
మీరు దయచేసి ఆ కలలు నాకు వివరించి చెప్పుడనె
9 ను. । అప్పుడు పానదాయకుల అధిపతి యోసేపును
చూచి—నా కలలో ఒక ద్రాక్షావల్లి నా యెదుట
10 ఉండెను; । ఆ ద్రాక్షావల్లికి మూడు తీగెలుండెను;
అది చిగిరించినట్టు ఉండెను; దాని పువ్వులు వికసిం
చెను, దాని గెలలు పండి ద్రాక్షఫలములాయెను. ।
11 మరియు ఫరో గిన్నె నా చేతిలో ఉండెను; ఆ
ద్రాక్షఫలములు నేను పట్టుకొని ఫరో గిన్నెలో
వాటిని పిండి ఆ గిన్నె ఫరోచేతికిచ్చితినని తన కలను
12 అతనితో వివరించి చెప్పెను. । అప్పుడు యోసేపు—
దాని భావమిదే; ఆ మూడు తీగెలు మూడు దిన
13 ములు; । ఇంక మూడు దినములలోగా ఫరో నీ తలను
పైకెత్తి నీ ఉద్యోగము నీకు మరల ఇప్పించును. నీవు
అతనికి పానదాయకుడవై యున్ననాటి మర్యాదచొ
ప్పున ఫరో గిన్నెను అతని చేతికప్పగించెదవు. ।
14 కాబట్టి నీకు క్షేమము కలిగినప్పుడు నన్ను జ్ఞాపకము
చేసికొని నాయందు కరుణించి ఫరోతో నన్నుగూర్చి
మాటలాడి యీ యింటిలోనుండి నన్ను బయటికి
15 రప్పించుము. । ఏలయనగా నేను హెబ్రీయుల దేశ
ములోనుండి దొంగిలబడితిని, అది నిశ్చయము. మరి
యు ఈ చెరసాలలో నన్ను వేయుటకు ఇక్కడ
సహా నేనేమియు చేయలేదని అతనితో చెప్పెను. ।
అతడు తెలిపిన భావము మంచిదని భక్ష్యకారుల 16
అధిపతి చూచి అతనితో నిట్లనెను—నేనును కల
కంటిని; ఇదిగో తెల్లని పిండివంటలు గల మూడు
గంపలు నా తలమీద ఉండెను. । మీదిగంపలో ఫరో 17
నిమిత్తము సమస్తవిధములైన పిండివంటలు ఉండెను.
పక్షులు నా తలమీదనున్న ఆ గంపలోనుండి వాటిని
తీసికొని తినుచుండెను. । అందుకు యోసేపు—దాని 18
భావమిదే; ఆ మూడు గంపలు మూడు దినములు ।
ఇంక మూడు దినములలోగా ఫరో నీ మీదనుండి 19
నీ తలను పైకెత్తి మ్రానుమీద నిన్ను వ్రేలాడదీయిం
చును. అప్పుడు పక్షులు నీ మీదనుండి నీ మాంసము
తినివేయునని ఉత్తరమిచ్చెను.

మూడవ దినమందు జరిగినదేమనగా, ఆ దినము 20
ఫరో జన్మదినము గనుక అతడు తన సేవకులకందరికి
విందుచేయించి వారి నడుమ పానదాయకుల అధిపతి
తలను భక్ష్యకారుల అధిపతి తలను పైకెత్తి । పాన 21
దాయకుల అధిపతి ఉద్యోగము మరల అతనికిచ్చెను
గనుక అతడు ఫరోచేతికి గిన్నె నిచ్చెను. । మరియు 22
యోసేపు వారికి తెలిపిన భావముచొప్పున భక్ష్యకా
రుల అధిపతిని వ్రేలాడదీయించెను. । అయితే పాన 23
దాయకుల అధిపతి యోసేపును జ్ఞాపకము చేసికొనక
అతని మరచిపోయెను.

రెండేండ్లు గడిచిన తరువాత ఫరో ఒక కల **41**
కనెను. అందులో అతడు ఏటిదగ్గర నిలిచియుండ
గా । చూపుకు అందమైనవియు బలిసినవియునైన 2
యేడు ఆవులు ఏటిలోనుండి పైకి వచ్చుచు జమ్ములో
మేయుచుండెను. । వాటి తరువాత చూపుకు వికా 3
రమై చిక్కిపోయిన మరి యేడు ఆవులు ఏటిలోనుండి
పైకి వచ్చుచు ఏటి యొడ్డున ఆ ఆవుల దగ్గర నిలు
చుండెను. । అప్పుడు చూపుకు వికారమై చిక్కిపో 4
యిన ఆ ఆవులు చూపుకు అందమై బలిసిన ఆవులను
తినివేయుచుండెను. అంతలో ఫరో మేలుకొనెను. ।
అతడు నిద్రించి రెండవసారి కల కనెను. అందులో 5
మంచి పుష్టిగల యేడు వెన్నులు ఒక్క దంటున పుట్టు
చుండెను. । మరియు తూర్పు గాలిచేత చెడిపోయిన 6
యేడు పీలవెన్నులు వాటి తరువాత మొలిచెను. ।
అప్పుడు నిండైన పుష్టిగల ఆ యేడు వెన్నులను ఆ పీల 7
వెన్నులు మ్రింగివేసెను. అంతలో ఫరో మేలుకొని
అది కల అని గ్రహించెను. । తెల్లవారినప్పుడు అతని 8
మనస్సు కలవరపడెను గనుక అతడు ఐగుప్తు శకున
గాండ్లనందరిని అక్కడి విద్వాంసులనందరిని పిలువనంపి
ఫరో తన కలలను వివరించి వారితో చెప్పెను గాని
ఫరోకు వాటి భావము తెలుపగలవారెవరును లేకపో

9 యెను. అప్పుడు పానదాయకుల అధిపతి—నేడు
నా తప్పితములను జ్ఞాపకము చేసికొనుచున్నాను. ।
10 ఫరో తన దాసులమీద కోపగించి నన్నును భక్ష్య
కారుల అధిపతిని మా ఉభయులను రాజసంరక్షక
11 సేనాధిపతియింట కావలిలో ఉంచెను. । ఒకరాత్రి
నేను అతడు మేమిద్దరము కలలు కంటిమి. ఒక్కొకడు
వేరువేరు భావములు గల కలలు చెరి యొకటి కంటిమి. ।
12 అక్కడ రాజసంరక్షక సేనాధిపతికి దాసుడై యుండిన
యొక హెబ్రీపడుచువాడు మాతోకూడ ఉండెను.
అతనితో మా కలలను మేము వివరించి చెప్పినప్పుడు
అతడు వాటి భావమును మాకు తెలిపెను. ఒక్కొకని
13 కలచొప్పున దాని దాని భావమును తెలిపెను. । అతడు
మాకు ఏ యే భావము తెలిపెనో ఆయా భావముల
చొప్పున జరిగెను. నా ఉద్యోగము నాకు మరల
ఇప్పించి భక్ష్యకారుని వ్రేలాడదీయించెనని ఫరోతో
14 చెప్పగా । ఫరో యోసేపును పిలువనంపెను. కాబట్టి
చెరసాలలోనుండి అతని త్వరగా రప్పించిరి. అతడు
క్షౌరము చేయించుకొని మంచి బట్టలు కట్టుకొని ఫరో
15 యొద్దకు వచ్చెను. । ఫరో యోసేపును చూచి— నే
నొక కల కంటిని, దాని భావము తెలుపగలవారెవ
రును లేరు. నీవు కలను విన్నయెడల దాని భావమును
తెలుపగలవని నిన్నుగూర్చి వింటినని అతనితో చెప్పి
16 నందుకు । యోసేపు— అది నావలన కాదు, దేవుడే
ఫరోకు క్షేమకరమైన ఉత్తరమిచ్చునని ఫరోతో
17 చెప్పెను. । అందుకు ఫరో— నా కలలో నేను ఏటి
18 యొడ్డున నిలుచుంటిని. । బలిసినవియు చూపుకంద
మైనవియునైన యేడు ఆవులు ఏటిలోనుండి పైకివచ్చి
19 జమ్ములో మేయుచుండెను. । మరియు నీరసమై బహు
వికారరూపము కలిగి చిక్కిపోయిన మరి యేడు ఆవులు
వాటి తరువాత పైకి వచ్చెను. వీటి అంత వికారమై
నవి ఐగుప్తు దేశమంతు ఎక్కడను నాకు కనబడలేదు. ।
20 చిక్కిపోయి వికారముగానున్న ఆవులు బలిసిన మొ
21 దటి యేడు ఆవులను తినివేసెను. । అవి వాటి కడుపు
లోపడెను గాని అవి కడుపులో పడినట్టు కనబడ
లేదు, మొదట ఉండినట్లే అవి చూపుకు వికారముగా
22 నుండెను. అంతలో నేను మేలుకొంటిని. । మరియు
నా కలలో నేను చూడగా పుష్టిగల యేడు మంచి
23 వెన్నులు ఒక్క దంటున పుట్టెను. । మరియు తూర్పు
గాలిచేత చెడిపోయి యెండిన యేడు పీలవెన్నులు
24 వాటి తరువాత మొలిచెను. । ఈ పీలవెన్నులు ఆ
మంచి వెన్నులను మ్రింగివేసెను. ఈ కలను జ్ఞానులకు
తెలియచెప్పితిని గాని దాని భావమును తెలుపగలవా
25 రెవరును లేరని అతనితో చెప్పెను. । అందుకు యో
సేపు— ఫరో కనిన కల ఒక్కటే. దేవుడు తాను
...బోవుచున్నది ఫరోకు తెలియచేసెను. ఆ యేడు
...ఆవులు ఏడు సంవత్సరములు । ఆ యేడు మంచి
వెన్నులును ఏడు సంవత్సరములు. । కల ఒక్కటే. 27
వాటి తరువాత చిక్కిపోయి వికారమై పైకివచ్చిన
యేడు ఆవులును ఏడు సంవత్సరములు; తూర్పు గాలి
చేత చెడిపోయిన యేడు పీలవెన్నులు కరవుగల యేడు
సంవత్సరములు. । నేను ఫరోతో చెప్పుమాట యిదే. 28
దేవుడు తాను చేయబోవుచున్నది ఫరోకు చూపిం
చెను. । ఇదిగో ఐగుప్తు దేశమందంతటను బహు సమృ 29
ద్ధిగా పంటపండు ఏడు సంవత్సరములు వచ్చుచున్న
న్నవి. । మరియు కరవుగల యేడు సంవత్సరములు 30
వాటి తరువాత వచ్చును; అప్పుడు ఐగుప్తు దేశమందు
ఆ పంట సమృద్ధి యావత్తును మరువబడును, ఆ కరవు
దేశమును పాడుచేయును. । దాని తరువాత కలుగు 31
కరవుచేత దేశమందు ఆ పంట సమృద్ధి తెలియబడక
పోవును; ఆ కరవు మిక్కిలి భారముగా నుండును. ।
ఈ కార్యము దేవునివలన నిర్ణయింపబడి యున్నది. 32
ఇది దేవుడు శీఘ్రముగా జరిగించును. అందుచేత నీ
ఆ కల ఫరోకు రెట్టింపబడెను. । కాబట్టి ఫరో వివేక 33
జ్ఞానములుగల ఒక మనుష్యుని చూచుకొని ఐగుప్తు
దేశముమీద అతని నియమింపవలెను. । ఫరో అట్లు 34
చేసి యీ దేశముపైన అధిపతులను నియమించి సమృ
ద్ధిగా పంటపండు ఏడు సంవత్సరములలో ఐగుప్తు దేశ
మందంతటను అయిదవ భాగము తీసికొనవలెను. । రా 35
బోవు ఈ మంచి సంవత్సరములలో దొరుకు ఆహార
మంతయు సమకూర్చి ఆ ధాన్యము ఫరోచేతిక ప్పగించి
ఆయా పట్టణములలో ఆహారమునకై భద్రము చేయ
వలెను. । కరవుచేత ఈ దేశము నశించిపోకుండ ఆ 36
ఆహారము ఐగుప్తుదేశములో రాబోవు కరవు సంవత్స
రములు ఏడింటికి ఈ దేశమందు సంగ్రహముగా నుం
డునని ఫరోతో చెప్పెను. । ఆ మాట ఫరో దృష్టికిని 37
అతని సమస్త సేవకులదృష్టికిని యుక్తమైయుండెను
గనుక । అతడు తన సేవకులను చూచి— ఇతనివలె 38
దేవుని ఆత్మగల మనుష్యుని కనుగొనగలమా అని యనె
ను. । మరియు ఫరో—దేవుడు ఇదంతయు నీకు తెలియ 39
పరచెను గనుక నీవలె వివేకజ్ఞానములు గలవారెవరును
లేరు. । నీవు నా యింటికి అధికారివై యుండవలెను,
నా ప్రజలందరు నీకు విధేయులై యుందురు, సింహా
సన విషయములో మాత్రమే నేను నీకంటె పైవాడనై
యుందునని యోసేపుతో చెప్పెను. । మరియు ఫరో
—చూడుము, ఐగుప్తు దేశమంతటి మీద నిన్ను నియ
మించి యున్నానని యోసేపుతో చెప్పెను. । మరి
యు ఫరో తనచేతినున్న తన ఉంగరము తీసి యోసేపు
చేతిని పెట్టి, సన్నపు నారబట్టలు అతనికి తొడిగించి,
అతని మెడను బంగారుగొలుసు వేసి । తన రెండవ
రథముమీద అతని నెక్కించెను. అప్పుడు—వందనము
చేయుడని అతని ముందర (జనులు) కేకలువేసిరి. అట్లు
ఐగుప్తు దేశమంతటిమీద అతని నియమించెను. । మరి

యు ఫరో యోసేపును చూచి—ఫరోను నేనే; అయి
నను నీ సెలవు లేక ఐగుప్తు దేశమందంతటను ఏ మను
ష్యుడును తన చేతినైనను కాలినైనను ఎత్తకూడదని
45 చెప్పెను. । మరియు ఫరో యోసేపుకు జప్నత్పనేహు
అను పేరుపెట్టి, అతనికి ఓనుయొక్క యాజకుడైన
పోతీఫెర కుమార్తెయగు ఆసెనతు నిచ్చి పెండ్లిచేసెను. ।
46 యోసేపు బయలుదేరి ఐగుప్తు దేశమందంతట సంచరిం
చెను. యోసేపు ఐగుప్తు రాజైన ఫరో యెదుట నిలిచి
నప్పుడు ముప్పది సంవత్సరములవాడై యుండెను.
అప్పుడు యోసేపు ఫరో యెదుటనుండి వెళ్లి ఐగుప్తు
దేశమందంతట సంచారము చేసెను.
47 సమృద్ధిగా పంటపండిన యేడు సంవత్సరములలో
48 భూమి బహు విరివిగా పండెను. । ఐగుప్తు దేశమం
దున్న యేడు సంవత్సరముల ఆహారమంతయు అతడు
సమకూర్చి, ఆయా పట్టణములలో దాని నిలువచేసెను.
ఏ పట్టణము చుట్టునుండు పొలముయొక్క ధాన్యము
49 ఆ పట్టణమందే నిలువచేసెను. । యోసేపు సముద్రపు
ఇసుకవలె అతి విస్తారముగా ధాన్యము పోగుచేసెను.
కొలుచుట అసాధ్యమాయెను గనుక కొలుచుట మాని
వేసెను.
50 కరవు సంవత్సరములు రాకమునుపు యోసేపుకిద్దరు
కుమారులు పుట్టిరి. ఓనుయొక్క యాజకుడైన పోతీ
ఫెర కుమార్తెయగు ఆసెనతు అతనికి వారిని కనెను. ।
51 అప్పుడు యోసేపు — దేవుడు నా సమస్త బాధను నా
తండ్రి యింటివారినందరిని నేను మరచిపోవునట్లు చేసె
నని చెప్పి, తన జ్యేష్ఠకుమారునికి మనష్షే అను పేరు
52 పెట్టెను. । తరువాత అతడు—నాకు బాధ కలిగిన దేశ
మందు దేవుడు నన్ను అభివృద్ధి పొందించెనని చెప్పి,
రెండవవానికి ఎఫ్రాయిము అను పేరు పెట్టెను.
53 ఐగుప్తు దేశమందు సమృద్ధిగా పంటపండిన సంవత్స
54 రములు గడచిన తరువాత । యోసేపు చెప్పిన ప్రకా
రము ఏడు కరవు సంవత్సరములు ఆరంభమాయెను గాని
55 ఐగుప్తు దేశమందంతటను ఆహారముండెను. । ఐగుప్తు
దేశమందంతటను కరవు వచ్చినప్పుడు ఆ దేశస్థులు
ఆహారముకొరకు ఫరోతో మొరపెట్టుకొనిరి;
అప్పుడు ఫరో—మీరు యోసేపునొద్దకు వెళ్లి అతడు
మీతో చెప్పునట్లు చేయుడని ఐగుప్తీయులందరితో
56 చెప్పెను. । కరవు ఆ దేశమందంతటను ఉండెను గనుక
యోసేపు కొట్లన్నియు విప్పించి ఐగుప్తీయులకు ధాన్య
మమ్మకము చేసెను. ఐగుప్తు దేశమందు ఆ కరవు భార
57 ముగా ఉండెను; । మరియు ఆ కరవు ప్రతిదేశమందు
భారమైనందున సమస్త దేశస్థులు యోసేపునొద్ద ధాన్య
ము కొనుటకు ఐగుప్తుకు వచ్చిరి.

**42** ధాన్యము ఐగుప్తులో నున్నదని యాకోబు తెలిసి
కొనినప్పుడు—మీరేల ఒకరి ముఖము ఒకరు చూచు
2 చున్నారని తన కుమారులతో అనెను. । మరియు
అతడు—చూడుడి, ఐగుప్తులో ధాన్యమున్నదని వింటిని,
మనము చావక బ్రదుకునట్లు మీరు అక్కడికి వెళ్లి
మనకొరకు అక్కడనుండి ధాన్యము కొనుక్కొని
రండని చెప్పగా । యోసేపు పదిమంది సహోదరులు 3
ఐగుప్తులో ధాన్యము కొనబోయిరి. । అయినను— 4
ఇతనికి హాని సంభవించునేమో అని యాకోబు యో
సేపు సహోదరుడగు బెన్యామీనును అతని సహో
దరులతో పంపినవాడు కాడు.
కరవు కనాను దేశములో ఉండెను గనుక ధాన్యము 5
కొనవచ్చినవారితోకూడ ఇశ్రాయేలు కుమారులును
వచ్చిరి. । అప్పుడు యోసేపు ఆ దేశమంతటిమీద 6
అధికారియైయుండెను. అతడే ఆ దేశ ప్రజలందరికిని
ధాన్యమమ్మకము చేయువాడు గనుక యోసేపు సహో
దరులు వచ్చి ముఖములు నేలను మోపి అతనికి వంద
నము చేసిరి. । యోసేపు తన సహోదరులను చూచి 7
వారిని గురుతుపట్టి వారికి అన్యునివలె కనబడి వారితో
కఠినముగా మాటలాడి — మీరెక్కడనుండి వచ్చితిరని
అడిగెను. అందుకు వారు — ఆహారము కొనుటకు
కనాను దేశమునుండి వచ్చితిమనిరి. । యోసేపు తన 8
సహోదరులను గురుతు పట్టెను గాని వారతని గురుతు
పట్టలేదు. । యోసేపు వారిని గూర్చి తాను కనిన కలలు 9
జ్ఞాపకము చేసికొని—మీరు వేగులవారు, ఈ దేశము
గుట్టు తెలిసికొనవచ్చితిరని వారితో ననగా । వారు 10
—లేదు ప్రభువా, నీదాసులమైన మేము ఆహారము
కొనుటకే వచ్చితిమి; । మేమందరము ఒక్క మను 11
ష్యుని కుమారులము; మేము యథార్థవంతులమేగాని
నీ దాసులమైన మేము వేగులవారము కామని అతని
తో చెప్పిరి. । అయితే అతడు—లేదు, ఈ దేశము 12
గుట్టు తెలిసికొనుటకై వచ్చితిరని వారితో అనెను. ।
అందుకు వారు — నీ దాసులమైన మేము పన్నెండు 13
మంది సహోదరులము, కనానుదేశములో నున్న
ఒక్క మనుష్యుని కుమారులము; ఇదిగో కనిష్ఠుడు
నేడు మా తండ్రియొద్ద ఉన్నాడు; ఒకడు లేడు అని
ఉత్తరమిచ్చిరి. । అయితే యోసేపు—మీరు వేగుల 14
వారని నేను మీతో చెప్పిన మాట నిజమే. । దీనివలన 15
మీ నిజము తెలియబడును; ఫరో జీవముతోడు, మీ
తమ్ముడు ఇక్కడికి వచ్చితేనే గాని మీరిక్కడనుండి
వెళ్లకూడదు. । మీ తమ్ముని తీసికొని వచ్చుటకు మీలో 16
ఒకని పంపుడి; అయితే మీరు బంధింపబడి యుం
దురు. అట్లు మీలో సత్యమున్నదో లేదో మీ
మాటలు శోధింపబడును; లేనిపక్షమందు ఫరో జీవ
ముతోడు, మీరు వేగులవారని చెప్పి । వారిని మూడు 17
దినములు చెరసాలలో వేయించెను.
మూడవ దినమున యోసేపు వారిని చూచి—నేను 18
దేవునికి భయపడువాడను; మీరు బ్రదుకునట్లు దీని
చేయుడి. । మీరు యథార్థవంతులైతిరా మీ సహో 19

దరులలో ఒకడు ఈ చెరసాలలో బంధింపబడవలెను;
మీరే వెళ్లి మీ కుటుంబములు కరవు తీరుటకు ధాన్యము
20 తీసికొని పోవుడి. । మీ తమ్ముని నా యొద్దకు తీసికొని
రండి; అట్లు మీ మాటలు సత్యమైనట్టు కనబడును
గనుక మీరు చావరని చెప్పెను. వారట్లు చేసిరి. ।
21 అప్పుడు వారు—నిశ్చయముగా మన సహోదరుని
యెడల మనము చేసిన అపరాధమునకు శిక్ష పొందు
చున్నాము. అతడు మనలను బతిమాలుకొనినప్పుడు
మనము అతని వేదన చూచియు వినకపోతిమి; అందు
వలన ఈ వేదన మనకు వచ్చెనని ఒకనితో ఒకడు
22 మాటలాడుకొనిరి. । మరియు రూబేను—ఈ చిన్న
వానియెడల పాపము చేయకుడని నేను మీతో చెప్ప
లేదా? అయినను మీరు విననైతిరి గనుక అతని రక్తాప
రాధము మనమీద మోపబడుచున్నదని వారి కుత్తర
23 మిచ్చెను. । అయితే ద్విభాషి వారి మధ్యనుండెను
గనుక తమ మాట యోసేపు గ్రహించెనని వారు తెలిసి
24 కొనలేదు. । అతడు వారియొద్దనుండి అవతలకు పోయి
యేడ్చి, మరల వారి యొద్దకు వచ్చి వారితో మాట
లాడి, వారిలో షిమ్యోనును పట్టుకొని వారి కన్నుల
25 ఎదుట అతని బంధించెను. । మరియు యోసేపు వారి
గోనెలను ధాన్యముతో నింపుటకును, ఎవరి రూకలు
వారి గోనెలో తిరిగి ఉంచుటకును, ప్రయాణము
కొరకు భోజనపదార్థములు వారికిచ్చుటకును ఆజ్ఞ
ఇచ్చెను. అతడు వారియెడల నిట్లు జరిగించెను.
26 వారు తాము కొనిన ధాన్యమును తమ గాడిదెల
మీద ఎక్కించుకొని అక్కడనుండి వెళ్లిపోయిరి. ।
27 అయితే వారు దిగిన చోట ఒకడు తన గాడిదెకు
మేత పెట్టుటకై తన గోనె విప్పినప్పుడు అతని రూకలు
కనబడెను, అవి అతని గోనె మూతిలో ఉండెను. ।
28 అప్పుడతడు—నా రూకలు తిరిగి యిచ్చివేసినారు.
ఇదిగో ఇవి నా గోనెలోనే ఉన్నవని తన సహో
దరులతో చెప్పెను, అంతట వారు గుండె చెదిరి
పోయినవారై జడిసి—ఇదేమిటి? దేవుడు మనకిట్లు
29 చేసెనని ఒకనితో ఒకడు చెప్పుకొనిరి. । వారు
కనాను దేశమందున్న తమ తండ్రియైన యాకోబు
నొద్దకు వచ్చి తమకు సంభవించినది యావత్తును అతనికి
30 తెలియచేసిరి. । ఎట్లనగా—ఆ దేశమునకు ప్రభువైన
వాడు మాతో కఠినముగా మాటలాడి, మేము ఆ దేశ
మును వేగు చూడవచ్చినవారమని అనుకొనెను. ।
31 అప్పుడు—మేము యథార్థవంతులము, వేగులవారము
32 కాము. । పన్నెండు మంది సహోదరులము, ఒక్క
తండ్రి కుమారులము, ఒకడు లేడు, మా తమ్ముడు నేడు
కనాను దేశమందు మా తండ్రియొద్ద ఉన్నాడని అత
33 నితో చెప్పితిమి. । అందుకు ఆ దేశపు ప్రభువు
మమ్మును చూచి—మీరు యథార్థవంతులని దీనివలన
నేను తెలిసికొందును. మీ సహోదరులలో ఒకనిని
నా యొద్ద విడిచిపెట్టి, మీ కుటుంబములకు కరవు
తీరునట్లు ధాన్యము తీసికొని పోయి, । నా యొద్దకు 34
ఆ చిన్నవాని తోడుకొని రండి. అప్పుడు మీరు
యథార్థవంతులే గాని వేగులవారు కారని నేను తెలిసి
కొని మీ సహోదరుని మీకప్పగించెదను; అప్పుడు
మీరు ఈ దేశమందు వ్యాపారము చేసికొనవచ్చునని
చెప్పెననిరి.
వారు తమ గోనెలను కుమ్మరించినప్పుడు ఎవరి 35
రూకల మూట వారి గోనెలో ఉండెను. వారును
వారి తండ్రియు ఆ రూకల మూటలు చూచి భయ
పడిరి. । అప్పుడు వారి తండ్రియైన యాకోబు వారిని 36
చూచి—మీరు నన్ను పుత్రహీనునిగా చేయుచు
న్నారు; యోసేపు లేడు; షిమ్యోను లేడు; మీరు
బెన్యామీనును కూడ తీసికొని పోవుదురు; ఇవన్ని
యు నాకు ప్రతికూలముగా ఉన్నవని వారితో చెప్పె
ను. । అందుకు రూబేను—నేనతని నీ యొద్దకు తీసి 37
కొని రానియెడల నా యిద్దరు కుమారులను నీవు చంప
వచ్చును; అతని నా చేతికప్పగించుము, అతని మరల
నీ యొద్దకు తీసికొని వచ్చి అప్పగించెదనని తన తండ్రి
తో చెప్పెను. । అయితే అతడు—నా కుమారుని 38
మీతో వెళ్లనియ్యను; ఇతని అన్న చనిపోయెను,
ఇతడు మాత్రమే మిగిలియున్నాడు. మీరు పోవు
మార్గమున ఇతనికి హాని సంభవించినయెడల నెరిసిన
వెంట్రుకలు గల నన్ను సమాధిలోకి దుఃఖముతో
దిగిపోవునట్లు చేయుదురని చెప్పెను.
**ఆ** దేశమందు కరవు భారముగా ఉండెను గనుక । **43**
వారు ఐగుప్తునుండి తెచ్చిన ధాన్యము తినివేసిన తరు 2
వాత వారి తండ్రి—మీరు మరల వెళ్లి మనకొరకు
కొంచెము ఆహారము కొనుడని వారితో అనగా ।
యూదా అతని చూచి—ఆ మనుష్యుడు—మీ 3
సహోదరుడు మీతో ఉంటేనే గాని మీరు నా
ముఖము చూడకూడదని మాతో గట్టిగా చెప్పెను. ।
కాబట్టి నీవు మా సహోదరుని మాతో కూడ పంపిన 4
యెడల మేము వెళ్లి నీ కొరకు ఆహారము కొందుము. ।
నీవు వాని పంపనొల్లనియెడల మేము వెళ్లము; ఆ 5
మనుష్యుడు—మీ సహోదరుడు మీతో లేనియెడల
మీరు నా ముఖము చూడకూడదని మాతో చెప్పి
ననెను. । అందుకు ఇశ్రాయేలు—మీకు ఇంకొక 6
సహోదరుడు కలడని మీరు ఆ మనుష్యునితో చెప్పి
నాకు ఇంత శ్రమ కలుగ జేయనేల అనగా । వారు— 7
ఆ మనుష్యుడు—మీ తండ్రి యింక సజీవుడై యు
న్నాడా? మీకు సహోదరుడు ఉన్నాడా అని
మమ్మును గూర్చియు మా బంధువులను గూర్చియు ఖండి
తముగా అడిగినప్పుడు మేము ఆ ప్రశ్నలకు తగినట్టు
అతనికి వాస్తవము తెలియ చెప్పితిమి.—మీ సహో
దరుని తీసికొని రండని అతడు చెప్పునని మాకెట్లు

8 తెలియుననిరి. । యూదా తన తండ్రియైన ఇశ్రా
యేలును చూచి— ఆ చిన్నవానిని నాతోకూడ పం
పుము, మేము లేచి వెళ్లుదుము, అప్పుడు మేమేకాదు
9 నీవును మా పిల్లలును చావక బ్రదుకుదుము; । నేను
అతనిగూర్చి పూటపడుదును, నీవు అతనిగూర్చి నన్ను
అడుగవలెను; నేను అతని తిరిగి నీ యొద్దకు తీసికొని
వచ్చి నీ యెదుట నిలువబెట్టనియెడల ఆ నింద నా
10 మీద ఎల్లప్పుడును ఉండును. । మాకు తడవుకాక
పోయినయెడల ఈపాటికి రెండవమారు తిరిగి వచ్చి
11 యుందుమని చెప్పగా । వారి తండ్రియైన ఇశ్రా
యేలు వారిని చూచి—అట్లయిన మీరీలాగు చేయుడి;
ఈ దేశమందు ప్రసిద్ధములైనవి, అనగా కొంచెము
మస్తకి కొంచెము తేనె సుగంధ నిర్యాసము బోళము
పిస్తాచకాయలు బాదముకాయలు మీ గోనెలలో
వేసికొని ఆ మనుష్యునికి కానుకగా తీసికొని పోవుడి. ।
12 రెట్టింపు రూకలు మీరు తీసికొనుడి, మీ గోనెల
మూతిలో ఉంచబడి తిరిగి వచ్చిన రూకలు కూడ చేత
పట్టుకొనిపోయి మరల ఇచ్చివేయుడి; ఒకవేళ అది
13 పొరబాటై యుండును; । మీ సహోదరుని తీసి
కొని లేచి ఆ మనుష్యుని యొద్దకు తిరిగి వెళ్లుడి. ।
14 ఆ మనుష్యుడు మీ యితర సహోదరుని బెన్యా
మీనును మీకప్పగించునట్లు సర్వశక్తుడైన దేవుడు ఆ
మనుష్యుని యెదుట మిమ్మును కరుణించు గాక. నేను
పుత్రహీనుడనై యుండవలసిన యెడల పుత్రహీనుడ
నగుదునని వారితో చెప్పెను.
15 ఆ మనుష్యులు ఆ కానుకను తీసికొని, చేతులలో
రెట్టింపు రూకలను తమ వెంట బెన్యామీనును తీసి
కొని లేచి ఐగుప్తునకు వెళ్లి యోసేపు ఎదుట నిలిచిరి. ।
16 యోసేపు వారితోనున్న బెన్యామీనును చూచి తన
గృహనిర్వాహకునితో — ఈ మనుష్యులను ఇంటికి
తీసికొనిపోయి ఒక వేటను కోసి వంట సిద్ధము
చేయించుము; మధ్యాహ్నమందు ఈ మనుష్యులు
17 నాతో భోజనము చేయుదురని చెప్పెను. । యోసేపు
చెప్పినట్లు అతడు చేసి ఆ మనుష్యులను యోసేపు
18 ఇంటికి తీసికొనిపోయెను. । ఆ మనుష్యులు యో
సేపు ఇంటికి రప్పింపబడినందున వారు భయపడి—
మొదట మన గోనెలలో తిరిగి పెట్టబడిన రూకల
నిమిత్తము అతడు మన మీదికి అకస్మాత్తుగా వచ్చి
మీద పడి మనలను దాసులగా చెరపట్టి మన గాడిదె
లను తీసికొనుటకు లోపలికి తెప్పించెననుకొనిరి.
19 వారు యోసేపు గృహనిర్వాహకుని యొద్దకు
వచ్చి యింటి ద్వారమున అతనితో మాటలాడి ।
20 —అయ్యా ఒక మనవి; మొదట మేము ఆహారము కొను
21 టకే వచ్చితిమి. । అయితే మేము దిగినచోటికి వచ్చి
మా గోనెలను విప్పినప్పుడు, ఇదిగో మా మా రూకల
తూనికెకు సరిగా ఎవరి రూకలు వారి గోనె మూతి
లోనుండెను. అవి చేతపట్టుకొని వచ్చితిమి. । ఆహా 22
రము కొనుటకు మరి రూకలను తీసికొని వచ్చితిమి; మా
రూకలను మా గోనెలలో నెవరు వేసిరో మాకు తెలియ
దని చెప్పిరి. । అందుకతడు—మీకు క్షేమమగు గాక 23
భయపడకుడి; మీ పితరుల దేవుడైన మీ దేవుడు మీకు
మీ గోనెలలో ధనమిచ్చెను. మీ రూకలు నాకు
ముట్టినవని చెప్పి షిమ్యోనును వారియొద్దకు తీసికొని
వచ్చెను. । ఆ మనుష్యుడు వారిని యోసేపు ఇంటికి 24
తీసికొని వచ్చి వారికి నీళ్లియ్యగా వారు కాళ్లు కడుగు 25
కొనిరి. మరియు అతడు వారి గాడిదెలకు మేత
వేయించెను. అక్కడ తాము భోజనము చేయవలెనని
వినిరి గనుక మధ్యాహ్నమందు యోసేపు వచ్చు వేళకు
తమ కానుకను సిద్ధముచేసిరి. । యోసేపు ఇంటికి వచ్చి 26
నప్పుడు వారు తమ చేతులలోనున్న కానుకను ఇంటి
లోకి తెచ్చి అతని కిచ్చి, అతనికి నేలను సాగిలపడిరి. ।
అప్పుడు — మీరు చెప్పిన ముసలివాడైన మీ తండ్రి 27
క్షేమముగా ఉన్నాడా? అతడు ఇంక బ్రదికియు
న్నాడా? అని వారి క్షేమసమాచారము అడిగినందుకు
వారు । —నీ దాసుడైన మా తండ్రి యింక బ్రదికియు 28
న్నాడు క్షేమముగా నున్నాడని చెప్పి వంగి సాగిల
పడిరి. । అప్పుడతడు కన్నులెత్తి తన తల్లి కుమారుడును 29
తన తమ్ముడునైన బెన్యామీనును చూచి—మీరు నాతో
చెప్పిన మీ తమ్ముడు ఇతడేనా? అని అడిగి—నా కుమా
రుడా, దేవుడు నిన్ను కరుణించుగాక అనెను. ।
అప్పుడు తన తమ్మునిమీద యోసేపుకు ప్రేమ పొర్లు 30
కొని వచ్చెను గనుక అతడు త్వరపడి యేడ్చుటకు
చోటు వెదకి లోపలి గదిలోకి వెళ్లి అక్కడ ఏడ్చె
ను. । అప్పుడు అతడు ముఖము కడుగుకొని వెలపలికి 31
వచ్చి తన్నుతాను అణచుకొని, భోజనము వడ్డించుడని
చెప్పెను. । అతనికిని వారికిని అతనితో భోజనము 32
చేయుచున్న ఐగుప్తీయులకును వేరు వేరుగా వడ్డిం
చిరి. ఐగుప్తీయులు హెబ్రీయులతో కలిసి భోజనము
చేయరు; అది ఐగుప్తీయులకు హేయము. । జ్యేష్ఠుడు 33
మొదలుకొని కనిష్ఠునివరకు వారు అతని యెదుట తమ
తమ యీడు చొప్పున కూర్చుండిరి గనుక ఆ మను
ష్యులు ఒకనివైపు ఒకడు చూచి ఆశ్చర్యపడిరి. ।
మరియు అతడు తన యెదుటనుండి వారికి వంతులెత్తి 34
పంపెను. బెన్యామీనువంతు వారందరి వంతులకంటె
అయిదంతలు గొప్పది. వారు విందు ఆరగించి అతనితో
కలిసి సంతుష్టిగా త్రాగిరి.

**యో**సేపు—ఆ మనుష్యుల గోనెలు పట్టినంత **44**
ఆహారపదార్థములతో వాటిని నింపి ఎవరి రూకలు వారి
గోనె మూతిలో పెట్టుమనియు, । కనిష్ఠుని గోనె మూతి 2
లో తన వెండి గిన్నెను అతని ధాన్యపు రూకలను పెట్టు
మనియు, తన గృహనిర్వాహకునికి ఆజ్ఞాపింపగా
యోసేపు చెప్పినమాట చొప్పున అతడు చేసెను.

3 తెల్లవారినప్పుడు ఆ మనుష్యులు తమ గాడిదె
4 లతోకూడ పంపివేయబడిరి. । వారు ఆ పట్టణము
నుండి బయలుదేరి యెంతో దూరము వెళ్లకమునుపు,
యోసేపు తన గృహనిర్వాహకుని చూచి—నీవు లేచి ఆ
మనుష్యుల వెంటబడి వెళ్లి వారిని కలిసికొని — మీరు
5 మేలుకు కీడుచేయ నేల? । దేనితో నా ప్రభువు
పానము చేయునో దేనివలన అతడు శకునములు చూ
చునో అది యిదే కదా? మీరు దీని చేయుటవలన
6 కాని పని చేసితిరని వారితో చెప్పుమనెను. । అతడు
వారిని కలిసికొని ఆ మాటలు వారితో చెప్పినప్పుడు ।
7 వారు—మా ప్రభువు ఇట్లు మాటలాడ నేల? ఇట్టి పని
8 చేయుట నీ దాసులకు దూరమవుగాక. । ఇదిగో మా
గోనెల మూతులలో మాకు దొరికిన రూకలను కనాను
దేశములోనుండి తిరిగి తీసికొని వచ్చితిమి; నీ ప్రభువు
ఇంటిలోనుండి మేము వెండినైనను బంగారమునైనను
9 ఎట్లు దొంగిలుదుము? । నీ దాసులలో ఎవరియొద్ద
అది దొరుకునో వాడు చచ్చునుగాక; మరియు
మేము మా ప్రభువునకు దాసులముగా నుందుమని
10 అతనితో అనిరి. । అందుకతడు — మంచిది, మీరు
చెప్పినట్టే కానీయుడి; ఎవరియొద్ద అది దొరుకునో
అతడే నాకు దాసుడగును; అయితే మీరు నిర్దోషు
11 లగుదురని చెప్పెను. । అప్పుడు వారు త్వరపడి ప్రతి
వాడు తన గోనెను క్రిందికి దించి దానిని విప్పెను. ।
12 అతడు పెద్దవాడు మొదలుకొని చిన్నవానివరకు వారిని
సోదా చూడగా ఆ గిన్నె బెన్యామీను గోనెలో
13 దొరికెను. । కావున వారు తమ బట్టలు చింపుకొని,
ప్రతివాడు తన గాడిదెమీద గోనెలు ఎక్కించుకొని
14 తిరిగి పట్టణమునకు వచ్చెను. । అప్పుడు యూదా
యును అతని సహోదరులును యోసేపు ఇంటికి
వచ్చిరి. అతడింక అక్కడనే ఉండెను గనుక వారు
15 అతని యెదుట నేలను సాగిలపడిరి. । అప్పుడు యో
సేపు — మీరు చేసిన యీ పని యేమిటి? నావంటి
మనుష్యుడు శకునము చూచి తెలిసికొనునని మీకు
16 తెలియదా అని వారితో అనగా । యూదా యిట్ల
నెను—ఏలినవారితో ఏమి చెప్ప గలము? ఏమందుము?
మేము నిర్దోషులమని యెట్లు కనుపరచ గలము?
దేవుడే నీ దాసుల నేరము కనుగొనెను. ఇదిగో మే
మును ఎవనియొద్ద ఆ గిన్నె దొరికెనో వాడును ఏలిన
17 వారికి దాసుల మగుదుమనెను. । అందుకతడు—అట్లు
చేయుట నాకు దూరమవునుగాక; ఎవనిచేతిలో ఆ గిన్నె
దొరికెనో వాడే నాకు దాసుడుగానుండును; మీరు
మీ తండ్రియొద్దకు సమాధానముగా వెళ్లుడని చెప్ప
18 గా । యూదా అతని సమీపించి—ఏలినవాడా ఒక
మనవి; ఒకమాట యేలినవారితో తమ దాసుని చెప్పు
కొననిమ్ము; తమ కోపము తమ దాసునిమీద రవులు
19 కొననీయకుము; తమరు ఫరో అంతవారుగదా. । ఏలిన
వాడు — మీకు తండ్రియైనను సహోదరుడైనను
ఉన్నాడా అని తమ దాసులనడిగెను. । అందుకు 20
మేము — మాకు ముసలివాడైన తండ్రియు అతని
ముసలితనమున పుట్టిన యొక చిన్నవాడును ఉన్నారు;
వాని సహోదరుడు చనిపోయెను, వాని తల్లికి వా
డొక్కడే మిగిలియున్నాడు, వాని తండ్రి వానిని
ప్రేమించుచున్నాడని చెప్పితిమి. । అప్పుడు తమరు 21
— నేనతని చూచుటకు అతని నాయొద్దకు తీసికొని
రండని తమ దాసులతో చెప్పితిరి. । అందుకు మేము— 22
ఆ చిన్నవాడు తన తండ్రిని విడువలేడు. వాడు తన
తండ్రిని విడిచినయెడల వాని తండ్రి చనిపోవునని
యేలినవారితో చెప్పితిమి. । అందుకు తమరు — మీ 23
తమ్ముడు మీతో రానియెడల మీరు మరల నా ముఖము
చూడకూడదని తమ దాసులతో చెప్పితిరి. । కాబట్టి 24
నా తండ్రియైన తమ దాసుని యొద్దకు మేము వెళ్లి
యేలినవారి మాటలను అతనికి తెలియచేసితిమి. । మా 25
తండ్రి—మీరు తిరిగి వెళ్లి మనకొరకు కొంచెము ఆహా
రము కొనుక్కొని రండని చెప్పినప్పుడు । మేము— 26
అక్కడికి వెళ్లలేము; మా తమ్ముడు మాతోకూడ ఉండిన
యెడల వెళ్లుదుము; మా తమ్ముడు మాతోనుంటేనే
గాని ఆ మనుష్యుని ముఖము చూడలేమని చెప్పితిమి. ।
అందుకు తమ దాసుడైన నా తండ్రి — నా భార్య 27
నాకిద్దరిని కనెనని మీరెరుగుదురు. । వారిలో ఒకడు 28
నా యొద్దనుండి వెళ్లిపోయెను అతడు నిశ్చయముగా
(దుష్టమృగములచేత) చీల్చబడెననుకొంటిని, అప్పటి
నుండి అతడు నాకు కనబడలేదు. । మీరు నా యెదుట 29
నుండి ఇతని తీసికొని పోయిన తరువాత ఇతనికి హాని
సంభవించిన యెడల నెరిసిన వెండ్రుకలుగల నన్ను
సమాధిలోనికి దుఃఖముతో దిగి పోవునట్లు చేయుదురని
మాతో చెప్పెను. । కావున తమ దాసుడైన నా తండ్రి 30
యొద్దకు నేను వెళ్లినప్పుడు ఈ చిన్నవాడు మా యొద్ద
లేనిపక్షమందు । అతని ప్రాణము ఇతని ప్రాణముతో 31
పెనవేసికొని యున్నది గనుక ఈ చిన్నవాడు మా
యొద్ద లేకపోవుట అతడు చూడగానే చనిపోవును.
అట్లు తమ దాసులమైన మేము నెరిసిన వెండ్రుకలుగల
తమ దాసుడైన మా తండ్రిని సమాధిలోనికి దుఃఖముతో
దిగిపోవునట్లు చేయుదుము. । తమ దాసుడనైన నేను 32
ఈ చిన్నవానినిగూర్చి నా తండ్రికి పూటపడి — నీ 33
యొద్దకు నేనతని తీసికొని రానిపక్షమున నా తండ్రి
దృష్టియందు ఆ నింద నా మీద ఎల్లప్పుడు ఉండునని
చెప్పితిని. కాబట్టి తమ దాసుడనైన నన్ను ఈ చిన్న
వానికి ప్రతిగా ఏలినవారికి దాసునిగా నుండనిచ్చి
యీ చిన్నవాని తన సహోదరులతో వెళ్లనిమ్ము. ।
ఈ చిన్నవాడు నాతోకూడ ఉంటేనేగాని నా తండ్రి 34
యొద్దకు నేనెట్లు వెళ్లగలను? వెళ్లినయెడల నా తండ్రికి
వచ్చు అపాయము చూడవలసి వచ్చునని చెప్పెను.

45 అప్పుడు యోసేపు తన యొద్ద నిలిచినవారందరి
యెదుట తన్నుతాను అణచుకొనజాలక—నా యొద్ద
నుండి ప్రతి మనుష్యుని వెలపలికి పంపివేయుడని బిగ్గ
రగా చెప్పెను. యోసేపు తన సహోదరులకు తన్ను
తాను తెలియచేసికొనినప్పుడు ఎవరును అతనియొద్ద
2 నిలిచియుండలేదు. । అతడు ఎలుగెత్తి యేడ్వగా
3 ఐగుప్తీయులును ఫరో యింటివారును వినిరి. । అప్పుడు
యోసేపు—నేను యోసేపును; నా తండ్రి యింక
బ్రదికియున్నాడా అని అడిగినప్పుడు అతని సహో
దరులు అతని సముఖమందు తొందరపడి అతనికి ఉత్త
4 రము ఇయ్యలేకపోయిరి. । అంతట యోసేపు—నా దగ్గె
రకు రండని తన సహోదరులతో చెప్పినప్పుడు వారు
అతని దగ్గరకు వచ్చిరి. అప్పుడతడు—ఐగుప్తుకు వెళ్లునట్లు
మీరు అమ్మివేసిన మీ సహోదరుడైన యోసేపును
5 నేనే. । అయినను నేనిక్కడికి వచ్చునట్లు మీరు నన్ను
అమ్మివేసినందుకు దుఃఖపడకుడి; అది మీకు సంతాపము
పుట్టింప నియ్యకుడి; ప్రాణరక్షణకొరకు దేవుడు మీకు
6 ముందుగా నన్ను పంపించెను. । రెండు సంవత్సరముల
నుండి కరవు దేశములో నున్నది. సేద్యమైనను కోత
యైనను లేని సంవత్సరములు ఇంక అయిదు వచ్చును.
మిమ్మును ఆశ్చర్యముగా రక్షించి దేశములో మిమ్మును
7 శేషముగా నిలుపుటకును । ప్రాణముతో కాపాడుట
కును దేవుడు మీకు ముందుగా నన్ను పంపించెను. ।
8 కాబట్టి దేవుడేగాని మీరు నన్నిక్కడికి పంపలేదు.
ఆయన నన్ను ఫరోకు తండ్రిగాను అతని యింటివారి
కందరికి ప్రభువుగాను ఐగుప్తు దేశమంతటిమీద ఏలిక
9 గాను నియమించెను. । మీరు త్వరగా నా తండ్రి
యొద్దకు వెళ్లి అతని చూచి — నీ కుమారుడైన యో
సేపు—దేవుడు నన్ను ఐగుప్తు దేశమంతటికి ప్రభువుగా
నియమించెను, నా యొద్దకు రమ్ము, అక్కడ ఉండ
10 వద్దు; । నీవు గోషెను దేశమందు నివసించెదవు,
అప్పుడు నీవును నీ పిల్లలును నీ పిల్లల పిల్లలును నీ
గొఱ్ఱెలమందలును నీ పశువులును నీకు కలిగినది యా
11 వత్తును నాకు సమీపముగానుండును. । ఇకను అయిదు
కరవు సంవత్సరములు వచ్చును గనుక నీకును నీ యింటి
వారికిని నీకు కలిగినదంతటికిని పేదరికము రాకుండ
12 అక్కడ నిన్ను పోషించెదనన్నాడని చెప్పుడి. । ఇదిగో
మీతో మాటలాడుచున్నది నా నోరే అని మీ కన్ను
లును నా తమ్ముడైన బెన్యామీను కన్నులును చూచు
13 చున్నవి. । ఐగుప్తులో నాకు కలిగిన సమస్త ఘనతను,
మీరు చూచినది యావత్తు నా తండ్రికి తెలియచేసి
త్వరగా నా తండ్రిని ఇక్కడికి తీసికొని రండని తన
14 సహోదరులతో చెప్పి । తన తమ్ముడైన బెన్యామీను
మెడమీద పడి యేడ్చెను; బెన్యామీను అతని మెడ
15 మీద పడి యేడ్చెను. । అతడు తన సహోదరులంద
రిని ముద్దుపెట్టుకొని వారిమీద పడి యేడ్చిన తరువాత
అతని సహోదరులు అతనితో మాటలాడిరి.

యోసేపుయొక్క సహోదరులు వచ్చిన వర్తమా 16
నము ఫరో యింటిలో వినబడెను. అది ఫరోకును
అతని సేవకులకును ఇష్టముగా నుండెను. । అప్పుడు 17
ఫరో యోసేపుతో ఇట్లనెను — నీవు నీ సహోదరు
లను చూచి—మీరీలాగు చేయుడి, మీ పశువులమీద
బరువులు కట్టి కనాను దేశమునకు వెళ్లి । మీ తండ్రిని 18
మీ యింటివారిని వెంటబెట్టుకొని నా యొద్దకు రండి;
ఐగుప్తు దేశమందలి మంచి వస్తువులను మీకిచ్చెదను,
ఈ దేశముయొక్క సారమును మీరు అనుభవించెదరు. ।
నీకు ఆజ్ఞయైనది గదా? దీని చేయుడి, మీ పిల్లలకొర 19
కును మీ భార్యలకొరకును ఐగుప్తులోనుండి బండ్లను
తీసికొనిపోయి మీ తండ్రిని వెంటబెట్టుకొని రండి. ।
ఐగుప్తు దేశమంతటిలోనున్న మంచి వస్తువులు మీవే 20
అగును గనుక మీ సామగ్రిని లక్ష్యపెట్టకుడని చెప్పు
మనగా । ఇశ్రాయేలు కుమారులు ఆలాగుననే చేసిరి. 21
యోసేపు ఫరోమాట చొప్పున వారికి బండ్లను ఇప్పిం
చెను; మార్గమునకు ఆహారము ఇప్పించెను. । అతడు 22
వారికి రెండేసి దుస్తుల బట్టలు ఇచ్చెను; బెన్యామీనుకు
మున్నూరు తులముల వెండియును ఐదు దుస్తుల బట్టలు
ఇచ్చెను. । అతడు తన తండ్రి నిమిత్తము ఐగుప్తులో 23
నున్న మంచి వస్తువులను మోయుచున్న పది గాడిదె
లను, మార్గమునకు తన తండ్రి నిమిత్తము ఆహారమును,
(ఇతర) ధాన్యమును తినుబండములను మోయుచున్న
పది ఆడుగాడిదెలను పంపెను. । అప్పుడతడు తన 24
సహోదరులను సాగనంపి వారు బయలుదేరుచుం
డగా — మార్గమందు కలహపడకుడని వారితో చెప్పె
ను. । వారు ఐగుప్తునుండి బయలుదేరి కనాను దేశ 25
మునకు తమ తండ్రియైన యాకోబునొద్దకు వచ్చి ।
—యోసేపు ఇంక బ్రదికియుండి ఐగుప్తు దేశమంతటిని 26
ఏలుచున్నాడని అతనికి తెలియచేసిరి. అయితే అతడు
వారి మాట నమ్మలేదు గనుక అతని హృదయము
నిశ్చేష్టితమాయెను. । అప్పుడు వారు యోసేపు తమతో 27
చెప్పిన మాటలన్నిటిని అతనితో చెప్పిరి. అతడు తన్ను
ఎక్కించుకొని పోవుటకు యోసేపు పంపిన బండ్లు
చూచినప్పుడు వారి తండ్రియైన యాకోబు ప్రాణము
తెప్పరిల్లెను. । అప్పుడు ఇశ్రాయేలు—ఇంతే చాలును, 28
నా కుమారుడైన యోసేపు ఇంక బ్రదికి యున్నాడు,
నేను చావకమునుపు వెళ్లి అతని చూచెదనని చెప్పెను.

అప్పుడు ఇశ్రాయేలు తనకు కలిగినదంతయు తీసి 46
కొని ప్రయాణమై బెయేర్షెబాకు వచ్చి తన తండ్రియైన
ఇస్సాకు దేవునికి బలులనర్పించెను. । అప్పుడు రాత్రి 2
దర్శనములయందు దేవుడు—యాకోబూ యాకోబూ
అని ఇశ్రాయేలును పిలిచెను. అందుకతడు — చిత్తము
ప్రభువా అనెను. । ఆయన — నేనే దేవుడను, నీ 3

తం్రడి దేవుడను, ఐగుప్తుకు వెళ్లుటకు భయపడకుము,
4 అక్కడ నిన్ను గొప్ప జనముగా చేసెదను. । నేను
ఐగుప్తుకు నీతోకూడ వచ్చెదను, అంతేకాదు నేను నిశ్చ
యముగా నిన్ను తిరిగి తీసికొని వచ్చెదను, యోసేపు
నీ కన్నులమీద తన చెయ్యి యుంచునని సెలవియ్యగా ।
5 యాకోబు లేచి బెయేర్షెబానుండి వెళ్లెను. ఫరో అతని
నెక్కించి తీసికొని వచ్చుటకు పంపిన బండ్లమీద
ఇశ్రాయేలు కుమారులు తమ తండ్రియైన యాకోబును
6 తమ పిల్లలను తమ భార్యలను ఎక్కించిరి. । వారు, అన
గా యాకోబును అతని యావత్తు సంతానమును, తమ
పశువులను తాము కనానులో సంపాదించిన సంపద
7 యావత్తును తీసికొని ఐగుప్తుకు వచ్చిరి. । అతడు తన
కుమారులను తన కుమారుల కుమారులను తన కుమార్తె
లను తన కుమారుల కుమార్తెలను తన యావత్తు సంతాన
మును ఐగుప్తుకు తనతోకూడ తీసికొనివచ్చెను.
8 యాకోబును అతని కుమారులును ఐగుప్తుకు వచ్చిరి.
9 ఇశ్రాయేలు కుమారులపేళ్లు ఇవే; । యాకోబు జ్యేష్ఠ
కుమారుడు రూబేను. రూబేను కుమారులైన హనోకు
10 పల్లు హెస్రోను కర్మీ. । షిమ్యోను కుమారులైన యెమూ
యేలు యామీను ఓహదు యాకీను సోహరు కనా
11 నీయురాలి కుమారుడైన షావూలు. । లేవి కుమారు
12 లైన గెర్షోను కహాతు మెరారి. । యూదా కుమారు
లైన ఏరు ఓనాను షేలా పెరెసు జెరహు. ఆ ఏరును
ఓనానును కనాను దేశములో చనిపోయిరి. పెరెసు
13 కుమారులైన హెస్రోను హామూలు. । ఇశ్శాఖారు
14 కుమారులైన తోలా పువ్వా యోబు షిమ్రోను. । జెబు
లూను కుమారులైన సెరెదు ఏలోను యహలేలు. ।
15 వీరు లేయా కుమారులు. ఆమె పద్దనరాములో యా
కోబుకు వారిని అతని కుమార్తెయైన దీనాను కనెను.
అతని కుమారులును అతని కుమార్తెలును అందరును
16 ముప్పది ముగ్గురు. । గాదు కుమారులైన సిఫ్యోను హగ్గీ
17 షూనీ ఎస్బోను ఏరీ ఆరోదీ అరేలీ. । ఆషేరు కుమా
రులైన ఇమ్నా ఇష్వా ఇష్వీ బెరీయా; వారి సహో
దరియైన శెరహు. ఆ బెరీయా కుమారులైన హెబెరు
18 మల్కీయేలు. । లాబాను తన కుమార్తెయైన లేయా
కిచ్చిన జిల్పా కుమారులు వీరే. ఆమె యీ పదియారు
19 మందిని యాకోబుకు కనెను. । యాకోబు భార్యయైన
రాహేలు కుమారులైన యోసేపు బెన్యామీను. ।
20 యోసేపుకు మనష్షే ఎఫ్రాయిములు పుట్టిరి. వారిని
ఐగుప్తు దేశమందు ఓనుకు యాజకుడగు పోతీఫెర కుమా
21 ర్తెయైన ఆసెనతు అతనికి కనెను. । బెన్యామీను కుమా
రులైన బెల బేకెరు అష్బేలు గెరా నయమాను ఏహీ
22 రోషు ముప్పీము హుప్పీము ఆర్దు. । యాకోబుకు రా
హేలు కనిన కుమారులగు వీరందరు పదునలుగురు. ।
23 దాను కుమారుడైన హుషీము. । నఫ్తాలి కుమారులైన
25 యహసేలు గూనీ యేసెరు షిల్లేము. । లాబాను తన
కుమార్తెయైన రాహేలుకు ఇచ్చిన బిల్హా కుమారులు
వీరే. ఆమె వారిని యాకోబుకు కనెను. వారందరు
ఏడుగురు. । యాకోబు కోడండ్లను వినాయించి అతని 26
గర్భవాసమున పుట్టి యాకోబుతో ఐగుప్తుకు వచ్చిన
వారందరు అరువది ఆరుగురు. । ఐగుప్తులో అతనికి 27
పుట్టిన యోసేపు కుమారులిద్దరు; ఐగుప్తుకు వచ్చిన
యాకోబు కుటుంబపువారందరు డెబ్బది మంది.
అతడు గోషెనుకు త్రోవ చూపుటకు యోసేపు 28
నొద్దకు తనకు ముందుగా యూదాను పంపెను. వారు
గోషెను దేశమునకు రాగా । యోసేపు తన రథ 29
మును సిద్ధము చేయించి తన తండ్రియైన ఇశ్రాయేలును
ఎదుర్కొనుటకు గోషెనుకు వెళ్లి అతనికి కనబడెను.
అప్పుడతడు అతని మెడమీద పడి అతని మెడ పట్టు
కొని యెంతో ఏడ్చెను. । అప్పుడు ఇశ్రాయేలు 30
యోసేపును చూచి — నీవింక బ్రదికియున్నావు; నీ
ముఖము చూచితిని గనుక నేనికను చనిపోవుదునని
చెప్పెను. । యోసేపు తన సహోదరులను తన 31
తండ్రి కుటుంబపువారిని చూచి — నేను వెళ్లి యిది
ఫరోకు తెలియచేసి, కనాను దేశములో ఉండిన నా
సహోదరులును నా తండ్రి కుటుంబపువారును నా
యొద్దకు వచ్చిరి; । ఆ మనుష్యులు పశువులు గల 32
వారు, వారు గొఱ్ఱెల కాపరులు. వారు తమ గొఱ్ఱె
లను పశువులను తమకు కలిగినదంతయు తీసికొని వచ్చి
రని అతనితో చెప్పెదను. । గొఱ్ఱెల కాపరియైన 33
ప్రతివాడు ఐగుప్తీయులకు హేయుడు గనుక ఫరో
మిమ్మును పిలిపించి మీ వృత్తి యేమిటని అడిగిన
యెడల । మీరు గోషెను దేశమందు కాపురముండు 34
నట్లు — మా చిన్నతనమునుండి ఇదివరకు నీ దాసుల
మైన మేమును మా పూర్వికులును పశువులుగలవారమై
యున్నామని ఉత్తరమియ్యుడని చెప్పెను.

47 యోసేపు వెళ్లి ఫరోను చూచి—నా తండ్రియు
నా సహోదరులును వారి గొఱ్ఱెల మందలతోను
వారి పశువులతోను వారికి కలిగినదంతటితోను కనాను
దేశమునుండి వచ్చి గోషెనులో నున్నారని తెలియ
చేసి । తన సహోదరులందరిలో అయిదుగురిని వెంట 2
బెట్టుకొని పోయి వారిని ఫరో సమక్షమందు ఉం
చెను. । ఫరో అతని సహోదరులను చూచి—మీ వృత్తి 3
యేమిటని అడిగినప్పుడు వారు — నీ దాసులమైన
మేమును మా పూర్వికులును గొఱ్ఱెల కాపరులమని
ఫరోతో చెప్పిరి. । మరియు వారు — కనాను దేశ 4
మందు కరవు భారముగా ఉన్నందున నీ దాసులకు
కలిగియున్న మందలకు మేత లేదు గనుక ఈ దేశ
ములో కొంత కాలముండుటకు వచ్చితిమి. కాబట్టి
గోషెను దేశములో నీ దాసులు నివసింప సెలవిమ్మని
ఫరోతో అనగా । ఫరో యోసేపును చూచి — నీ 5
తండ్రియు నీ సహోదరులును నీ యొద్దకు వచ్చి

6 యున్నారు. । ఐగుప్తు దేశము నీ యెదుట ఉన్నది,
ఈ దేశములోని మంచి ప్రదేశమందు నీ తండ్రిని
నీ సహోదరులను నివసింప చేయుము, గోషెను
దేశములో వారు నివసింపవచ్చును, వారిలో ఎవరైన
ప్రజ్ఞగలవారని నీకు తోచినయెడల నా మందలమీద
7 వారిని అధిపతులగా నియమించుమని చెప్పెను । మరి
యు యోసేపు తన తండ్రియైన యాకోబును లోప
లికి తీసికొని వచ్చి ఫరో సమక్షమందు అతని నుంచగా
8 యాకోబు ఫరోను దీవించెను. । ఫరో — నీవు జీవిం
చిన సంవత్సరములెన్ని అని యాకోబు నడిగినందుకు ।
9 యాకోబు—నేను యాత్రచేసిన సంవత్సరములు నూట
ముప్పది, నేను జీవించిన సంవత్సరములు కొంచెము
గాను దుఃఖసహితమైనవిగా ఉన్నవి. అవి నా పిత
రులు యాత్రచేసిన దినములలో వారు జీవించిన సం
10 వత్సరములన్ని కాలేదని ఫరోతో చెప్పి । ఫరోను
11 దీవించి ఫరో యెదుటనుండి వెళ్లిపోయెను. । ఫరో
ఆజ్ఞాపించినట్లు యోసేపు తన తండ్రిని తన సహో
దరులను ఐగుప్తు దేశములో నివసింపచేసి, ఆ దేశము
లో రామెసేసను మంచి ప్రదేశములో వారికి స్వా
12 స్థ్యమునిచ్చెను. । మరియు యోసేపు తన తండ్రిని
తన సహోదరులను తన తండ్రి కుటుంబపువారినంద
రిని వారివారి పిల్లల లెక్కచొప్పున వారికి ఆహార
మిచ్చి సంరక్షించెను.
13 కరవు మిక్కిలి భారమైనందున ఆ దేశమందంత
టను ఆహారము లేకపోయెను. కరవువలన ఐగుప్తు
14 దేశమును కనాను దేశమును క్షీణించెను. । వచ్చినవా
రికి ధాన్యమమ్ముటవలన ఐగుప్తు దేశములోను కనాను
దేశములోను దొరికిన ద్రవ్యమంత యోసేపు సమ
కూర్చెను. ఆ ద్రవ్యమంతటిని యోసేపు ఫరో నగరు
15 లోకి తెప్పించెను. । ఐగుప్తు దేశమందును కనాను
దేశమందును ద్రవ్యము వ్యయమైన తరువాత ఐగుప్తీ
యులందరు యోసేపునొద్దకు వచ్చి—మాకు ఆహారము
ఇప్పించుము, నీ సముఖమందు మేమేల చావవలెను?
16 ద్రవ్యము వ్యయమైనది గదా అనిరి. । అందుకు యో
సేపు—మీ పశువులను ఇయ్యుడి; ద్రవ్యము వ్యయమై
పోయినయెడల మీ పశువులకు ప్రతిగా నేను మీకు
ధాన్యమిచ్చెదనని చెప్పెను. కాబట్టి వారు తమ పశు
వులను యోసేపునొద్దకు తీసికొని వచ్చిరి. యోసేపు
గుఱ్ఱములను గొఱ్ఱెల మందలను పశువుల మందలను
17 గాడిదెలను తీసికొని వారికి ఆహారమిచ్చెను. । ఆ సం
వత్సరమందు వారి మందలన్నిటికి ప్రతిగా అతడు
18 వారికి ఆహారమిచ్చి సంరక్షించెను. । ఆ సంవత్సరము
గతించిన తరువాత రెండవ సంవత్సరమున వారు అతని
యొద్దకు వచ్చి—ఇది మా యేలినవారికి మరుగుచేయము;
ద్రవ్యము వ్యయమైపోయెను, పశువుల మందలును
ఏలినవారి వశమాయెను, ఇప్పుడు మా దేహములును
మా పొలములును తప్ప మరి ఏమియు ఏలినవారి
సముఖమున మిగిలియుండలేదు. । నీ కన్నులయెదుట 19
మా పొలములును మేమును నశింపనేల? ఆహారమిచ్చి
మమ్మును మా పొలములను కొనుము; మా పొలములతో
మేము ఫరోకు దాసులమగుదుము; మేము చావక
బ్రదుకునట్లును పొలములు పాడైపోకుండునట్లును
మాకు విత్తనము లిమ్మని అడిగిరి. । అట్లు యోసేపు 20
ఐగుప్తు భూములన్నిటిని ఫరోకొరకు కొనెను. కరవు
వారికి భారమైనందున ఐగుప్తీయులందరు తమ తమ
పొలములను అమ్మివేసిరి గనుక భూమి ఫరోది ఆయె
ను. । అతడు ఐగుప్తు పొలిమేరలయొక్క యీ చివర 21
నుండి ఆ చివరవరకును జనులను ఊళ్లలోకి రప్పిం
చెను. । యాజకుల భూమి మాత్రమే అతడు కొన 22
లేదు, యాజకులకు ఫరో బత్తెములు నియమించెను;
ఫరో ఇచ్చిన బత్తెములవలన వారికి భోజనము జరి
గెను గనుక వారు తమ భూములను అమ్మలేదు.
యోసేపు — ఇదిగో నేడు మిమ్మును మీ భూము 23
లను ఫరోకొరకు కొనియున్నాను. ఇదిగో మీకు
విత్తనములు; పొలములలో విత్తుడి. । పంటలో అయి 24
దవ భాగము మీరు ఫరోకు ఇయ్యవలెను. నాలుగు
భాగములు పొలములలో విత్తుటకును మీకును మీ
కుటుంబపువారికిని ఆహారమునకును మీ పిల్లలకు ఆహా
రమునకును మీవై యుండునని ప్రజలతో చెప్పగా ।
వారు—నీవు మమ్ము బ్రదికించితివి, ఏలినవారి కటా 25
క్షము మా మీదనుండనిమ్ము; ఫరోకు దాసులమగుదు
మని చెప్పిరి. । అప్పుడు అయిదవ భాగము ఫరోదని 26
నేటివరకు యోసేపు ఐగుప్తు భూములను గూర్చి కట్టడ
నియమించెను, యాజకుల భూములు మాత్రమే వినా
యింపబడెను. అవి ఫరోవి కాలేదు. । ఇశ్రాయేలీ 27
యులు ఐగుప్తు దేశమందలి గోషెను ప్రదేశములో
నివసించిరి. అందులో వారు ఆస్తి సంపాదించుకొని
సంతానాభివృద్ధి పొంది మిగుల విస్తరించిరి.
యాకోబు ఐగుప్తు దేశములో పదియేడు సంవత్సర 28
ములు బ్రదికెను. యాకోబు దినములు, అనగా అతడు
జీవించిన సంవత్సరములు నూటనలుబదియేడు. । ఇశ్రా 29
యేలు చావవలసిన దినములు సమీపించినప్పుడు
అతడు తన కుమారుడైన యోసేపును పిలిపించి — నా
యెడల నీకు కటాక్షమున్నపక్షమున దయచేసి నీ
చెయ్యి నా తొడక్రింద ఉంచి నా యెడల దయను
నమ్మకమును కనుపరచుము; ఎట్లనగా నన్ను ఐగుప్తు
లో పాతిపెట్టకుము. । నా పితరులతోకూడ నేను 30
పండుకొనునట్లు ఐగుప్తులోనుండి నన్ను తీసికొనిపోయి
వారి సమాధిలో నన్ను పాతిపెట్టుమని అతనితో
చెప్పెను. । అందుకతడు — నేను నీ మాటచొప్పున 31
చేసెదననెను. మరియు అతడు—నాతో ప్రమాణము
చేయుమన్నప్పుడు యోసేపు అతనితో ప్రమాణము

చేసెను. అప్పుడు ఇశ్రాయేలు తన మంచపు తలాపి
మీద వంగి (దేవునికి) నమస్కారము చేసెను.

48 ఈ సంగతులైన తరువాత — ఇదిగో నీ తండ్రి
కాయిలాగా ఉన్నాడని ఒకడు యోసేపుతో
చెప్పెను. అప్పుడతడు మనష్షే ఎఫ్రాయిములు అను
తన యిద్దరు కుమారులను వెంటబెట్టుకొని పోగా, ।
2 ఇదిగో నీ కుమారుడైన యోసేపు నీ యొద్దకు వచ్చు
చున్నాడని యాకోబుకు తెలుపబడెను. అంతట ఇశ్రా
యేలు బలము తెచ్చుకొని తన మంచముమీద కూర్చుం
3 డెను. । యోసేపును చూచి — కనాను దేశమందలి
లూజులో సర్వశక్తిగల దేవుడు నాకు కనబడి నన్ను
4 ఆశీర్వదించి । — ఇదిగో నీకు సంతానాభివృద్ధి పొం
దించి నిన్ను విస్తరింపచేసి నీవు జనముల సమూహమగు
నట్లు చేసి, నీ తరువాత నీ సంతానమునకు ఈ దేశ
మును నిత్యస్వాస్థ్యముగా ఇచ్చెదనని సెలవిచ్చెను. ।
5 ఇదిగో నేను ఐగుప్తుకు నీ యొద్దకు రాకమునుపు
ఐగుప్తుదేశములో నీకు పుట్టిన నీ యిద్దరు కుమారులు
నా బిడ్డలే; రూబేను షిమ్యోనులవలె ఎఫ్రాయిము
6 మనష్షే నా బిడ్డలై యుందురు. । వారి తరువాత
నీవు కనిన నీ సంతానము నీదే; వారు తమ సహో
దరుల స్వాస్థ్యమునుబట్టి వారి పేళ్లచొప్పున పిలువ
7 బడుదురు. । పద్దనరామునుండి నేను వచ్చుచున్న
ప్పుడు, ఎఫ్రాతాకు ఇంక కొంత దూరముననుండగా
మార్గమున రాహేలు కనాను దేశములో నా యెదుట
మృతిపొందెను. అక్కడ ఎఫ్రాతా మార్గమున నేను
ఆమెను పాతి పెట్టితినని యోసేపుతో చెప్పెను.
8 అదియే బేత్లెహేము. । ఇశ్రాయేలు యోసేపు
9 కుమారులను చూచి — వీరెవరని అడుగగా । యో
సేపు — వీరు నా కుమారులు, వీరిని ఈ దేశమందు
దేవుడు నా కనుగ్రహించెనని తన తండ్రితో చెప్పెను.
అందుకతడు — నేను వారిని దీవించుటకు నా దగ్గరకు
10 వారిని తీసికొని రమ్మనెను. । ఇశ్రాయేలు కన్నులు
వృద్ధాప్యమువలన మందముగా ఉండెను గనుక అతడు
చూడలేకపోయెను. యోసేపు వారిని అతని దగ్గరకు
తీసికొనివచ్చినప్పుడు అతడు వారిని ముద్దుపెట్టుకొని
11 కౌగిలించుకొనెను. । ఇశ్రాయేలు యోసేపును చూచి
— నీ ముఖము చూచెదనని నేను అనుకొనలేదు గాని
నీ సంతానమును దేవుడు నాకు కనుపరచి యున్నాడ
12 నగా । యోసేపు అతని మోకాళ్ల మధ్యనుండి వారిని
13 తీసికొని అతనికి సాష్టాంగ నమస్కారముచేసెను. । తరు
వాత యోసేపు ఇశ్రాయేలు ఎడమచేతి తట్టున తన
కుడిచేత ఎఫ్రాయిమును, ఇశ్రాయేలు కుడిచేతితట్టున
తన యెడమచేత మనష్షేను పట్టుకొని వారి నిద్దరిని
14 అతని దగ్గరకు తీసికొనివచ్చెను. । మనష్షే పెద్దవాడై
నందున ఇశ్రాయేలు తన చేతులను యుక్తిగా చాచి
చిన్నవాడైన ఎఫ్రాయిము తలమీద తన కుడిచేతిని
మనష్షే తలమీద తన యెడమచేతిని ఉంచెను. । అతడు 15
యోసేపును దీవించి — నా పితరులైన అబ్రాహాము
ఇస్సాకులు ఎవనియెదుట నడుచుచుండిరో ఆ దేవుడు,
నేను పుట్టినది మొదలుకొని నేటివరకును ఎవడు
నన్ను పోషించెనో ఆ దేవుడు, । అనగా సమస్తమైన 16
కీడులలోనుండి నన్ను తప్పించిన దూత యీ పిల్లలను
ఆశీర్వదించును గాక; నా పేరును అబ్రాహాము ఇస్సా
కులను నా పితరుల పేరును వారికి పెట్టబడును గాక;
భూమియందు వారు బహుగా విస్తరించుదురు గాక
అని చెప్పెను. । యోసేపు ఎఫ్రాయిము తలమీద తన 17
తండ్రి కుడిచెయ్యి పెట్టుట చూచినప్పుడు అది అతని
కిష్టము కాకపోయెను గనుక అతడు మనష్షే తలమీద
పెట్టించవలెనని తన తండ్రి చెయ్యి ఎఫ్రాయిము తల
మీదనుండి యెత్తి । — నా తండ్రీ అట్లు కాదు; ఇతడే 18
పెద్దవాడు, నీ కుడిచెయ్యి యితని తలమీద పెట్టుమని
చెప్పెను. । అయినను అతని తండ్రి ఒప్పక — అది నాకు 19
తెలియును, నా కుమారుడా అది నాకు తెలియును;
ఇతడును ఒక జనసమూహమై గొప్పవాడగును గాని
యితని తమ్ముడు ఇతనికంటె గొప్పవాడగును, అతని
సంతానము జనముల సమూహమగునని చెప్పెను. ।
ఆ దినమందు అతడు వారిని దీవించి — ఎఫ్రాయిము 20
వలెను మనష్షే వలెను దేవుడు నిన్ను చేయును గాకని
ఇశ్రాయేలీయులు నీ పేరు చెప్పి దీవించెదరనెను.
ఆలాగు అతడు మనష్షేకంటె ఎఫ్రాయిమును ముందు
గా ఉంచెను. । మరియు ఇశ్రాయేలు — ఇదిగో నేను 21
చనిపోవుచున్నాను, అయినను దేవుడు మీకు తోడై
యుండి మీ పితరుల దేశమునకు మిమ్మును మరల తీసి
కొని పోవును. । నేను నీ సహోదరులకంటె నీకు 22
ఒక భాగము ఎక్కువగా ఇచ్చితిని. అది నా కత్తితోను
నా వింటితోను అమోరీయుల చేతిలోనుండి తీసి
కొంటినని యోసేపుతో చెప్పెను.

యాకోబు తన కుమారులను పిలిపించి యిట్లనెను 49
— మీరు కూడి రండి, రాబోవు దినములలో మీకు
సంభవింపబోవు సంగతులను మీకు తెలియచేసెదను.

యాకోబు కుమారులారా, కూడివచ్చి ఆలకించుడి 2
మీ తండ్రియైన ఇశ్రాయేలు (మాట) వినుడి.
రూబేనూ, నీవు నా పెద్ద కుమారుడవు 3
నా శక్తియు నా బలముయొక్క ప్రథమఫలమును
ఔన్నత్యాతిశయమును ప్రాణాతిశయమును నీవే.
నీళ్లవలె చంచలుడవై నీవు అతిశయము పొందవు 4
నీ తండ్రి మంచముమీది కెక్కితివి
దానిని అపవిత్రము చేసితివి
అతడు నా మంచముమీది కెక్కెను.
షిమ్యోను లేవి అనువారు సహోదరులు 5
వారి ఖడ్గములు బలాత్కారపు ఆయుధములు.
నా ప్రాణమా, వారి ఆలోచనలో చేరవద్దు 6

నా ఘనమా, వారి సంఘముతో కలిసికొనవద్దు
వారు కోపమువచ్చి మనుష్యులను చంపిరి
తమ స్వేచ్ఛచేత ఎద్దుల గుదికాలి నరములను తెగ
గొట్టిరి.
వారి కోపము వేండ్రమైనది
వారి ఉగ్రతయు కఠినమైనది
అవి శపింపబడును
యాకోబులో వారిని విభజించెదను
ఇశ్రాయేలులో వారిని చెదరగొట్టెదను.
యూదా, నీ సహోదరులు నిన్ను స్తుతించెదరు
నీ చెయ్యి నీ శత్రువుల మెడమీద ఉండును
నీ తండ్రి కుమారులు నీ యెదుట సాగిలపడుదురు.
యూదా కొదమ సింహము
నా కుమారుడా, నీవు పట్టినదాని తిని వచ్చితివి
సింహమువలెను గర్జించు ఆడు సింహమువలెను
అతడు కాళ్లు ముడుచుకొని పండుకొనెను
అతని లేపువాడెవడు?
షిలోహు వచ్చువరకు[1]
యూదా యొద్దనుండి దండము తొలగదు
అతని కాళ్ల మధ్యనుండి రాజదండము తొలగదు
ప్రజలు అతనికి విధేయులై యుందురు.
ద్రాక్షావల్లికి తన గాడిదెను
ఉత్తమ ద్రాక్షావల్లికి తన గాడిదెపిల్లను కట్టి
ద్రాక్షారసములో తన బట్టలను
ద్రాక్షల రక్తములో తన వస్త్రమును ఉదుకును.
అతని కన్నులు ద్రాక్షారసముచేత ఎఱ్ఱగాను
అతని పళ్లు పాలచేత తెల్లగాను ఉండును.
జెబూలూను సముద్రపు రేవున నివసించును
అతడు ఓడలకు రేవుగా ఉండును
అతని పొలిమేర సీదోనువరకు నుండును.
ఇశ్శాఖారు రెండు దొడ్ల మధ్యను
పండుకొనియున్న బలమైన గార్దభము.
అతడు విశ్రాంతి మంచిదగుటయు
ఆ భూమి రమ్యమైనదగుటయు చూచెను గనుక
అతడు మోయుటకు భుజము వంచుకొని
వెట్టిచేయు దాసుడగును.
దాను ఇశ్రాయేలు గోత్రికులవలె
తన ప్రజలకు న్యాయము తీర్చును.
దాను త్రోవలో సర్పముగాను
దారిలో కట్లపాముగాను ఉండును
అది గుఱ్ఱపు మడిమెలు కరచును
అందువలన ఎక్కువాడు వెనుకకు పడును.
యెహోవా, నీ రక్షణకొరకు కనిపెట్టి యు
న్నాను.
బంటుల గుంపు గాదును కొట్టును
అతడు మడిమెను కొట్టును.
ఆషేరునొద్ద శ్రేష్ఠమైన ఆహారము కలదు 20
రాజులకు తగిన మధుర పదార్థములను అతడిచ్చును.
నఫ్తాలి విడువబడిన లేడి 21
అతడు ఇంపైనమాటలు పలుకును.
యోసేపు ఫలించెడి కొమ్మ 22
ఊట యొద్ద ఫలించెడి కొమ్మ
దాని రెమ్మలు గోడమీదికి ఎక్కి వ్యాపించును.
విలుకాండ్లు అతని వేదించిరి 23
వారు బాణములను వేసి అతని హింసించిరి
యాకోబు కొలుచు పరాక్రమశాలియైనవాని 24
హస్తబలమువలన
అతని విల్లు బలమైనదగును.
ఇశ్రాయేలుకు బండయు
మేపెడివాడును ఆయనే.
నీకు సహాయము చేయు నీ తండ్రి దేవునివలనను
పైనుండి మింటి దీవెనలతోను
క్రింద దాగియున్న అగాధజలముల దీవెనలతోను 25
స్తనముల దీవెనలతోను గర్భముల దీవెనలతోను
నిన్ను దీవించు సర్వశక్తుని దీవెనవలనను
అతని బాహుబలము దిట్టపరచబడును
నీ తండ్రి దీవెనలు నా పూర్వికుల దీవెనలపైని 26
చిరకాల పర్వతములకంటె హెచ్చుగ ప్రబల
మగును.
అవి యోసేపు తలమీదను
తన సహోదరులనుండి వేరుపరచబడిన
వాని నడినెత్తిమీదను ఉండును.
బెన్యామీను చీల్చునట్టి తోడేలు 27
అతడు ఉదయమందు ఎరను తిని
అస్తమయమందు దోపుడుసొమ్ము పంచుకొనును.
ఇవి అన్నియు ఇశ్రాయేలు పన్నెండు గోత్ర 28
ములు. వారి తండ్రి వారిని దీవించుచు వారితో చెప్పి
నది యిదే. ఎవరి దీవెన చొప్పున వారిని దీవించెను. ।
తరువాత అతడు వారికాజ్ఞాపించుచు ఇట్లనెను—నేను 29
నా స్వజనుల యొద్దకు చేర్చబడుచున్నాను. । హిత్తీ 30
యుడైన ఎఫ్రోను భూమియందున్న గుహలో నా
తండ్రులయొద్ద నన్ను పాతిపెట్టుడి. ఆ గుహ కనాను
దేశమందలి మమ్రే యెదుటనున్న మక్పేలా పొల
ములో ఉన్నది. అబ్రాహాము దానిని ఆ పొలమును
హిత్తీయుడగు ఎఫ్రోనుయొద్ద శ్మశాన భూమికొరకు
స్వాస్థ్యముగా కొనెను. । అక్కడనే వారు అబ్రా 31
హామును అతని భార్యయైన శారాను పాతిపెట్టిరి;
అక్కడనే ఇస్సాకును అతని భార్యయైన రిబ్కాను
పాతిపెట్టిరి; అక్కడనే నేను లేయాను పాతిపెట్టి
తిని. । ఆ పొలమును అందులోనున్న గుహయు 32

[1] లేక, అతడు షిలోహునకు వచ్చువరకు.

33 పితరులయొద్ద కొనబడినవనెను. । యాకోబు
తన కుమారులకాజ్ఞాపించుట చాలించి మంచముమీద
తన కాళ్లు ముడుచుకొని ప్రాణమువిడిచి తన స్వజ
నులయొద్దకు చేర్చబడెను.

50 యోసేపు తన తండ్రి ముఖముమీద పడి అతని
2 గూర్చి యేడ్చి అతని ముద్దుపెట్టుకొనెను. । తరు
వాత యోసేపు సుగంధ ద్రవ్యములతో తన తండ్రి
శవమును సిద్ధపరచవలెనని తన దాసులైన వైద్యులకు
ఆజ్ఞాపించెను గనుక ఆ వైద్యులు ఇశ్రాయేలును
3 సుగంధ ద్రవ్యములతో సిద్ధపరచిరి. । సుగంధ ద్రవ్య
ములతో సిద్ధపరచబడువారి కొరకు దినములు సంపూ
ర్ణమగునట్లు అతనికొరకు నలుబది దినములు సంపూ
ర్ణమాయెను. అతనిగూర్చి ఐగుప్తీయులు డెబ్బది దిన
4 ములు అంగలార్చిరి. । అతని గూర్చిన అంగలార్పు
దినములు గడిచిన తరువాత యోసేపు ఫరో యింటి
వారితో మాటలాడి — మీ కటాక్షము నా మీద
నున్నయెడల మీరు అనుగ్రహించి నా మనవి ఫరో
5 చెవిని వేసి । — నా తండ్రి నాచేత ప్రమాణము
చేయించి — ఇదిగో నేను చనిపోవుచున్నాను, కనా
నులో నానిమిత్తము సమాధి త్రవ్వించితిని గదా, అం
దులోనే నన్ను పాతిపెట్టవలెనని చెప్పెను. కాబట్టి
సెలవైతే నేనక్కడికి వెళ్లి నా తండ్రిని పాతిపెట్టి
6 మరల వచ్చెదనని చెప్పుడనెను. । అందుకు ఫరో —
అతడు నీచేత చేయించిన ప్రమాణముచొప్పున వెళ్లి
7 నీ తండ్రిని పాతిపెట్టుమని సెలవిచ్చెను. । కాబట్టి
యోసేపు తన తండ్రిని పాతిపెట్టుటకు పోయెను;
అతనితో ఫరో యింటి పెద్దలైన అతని సేవకులంద
8 రును ఐగుప్తు దేశపు పెద్దలందరును । యోసేపు ఇంటి
వారందరును అతని సహోదరులును అతని తండ్రి
యింటివారును వెళ్లిరి. వారు తమ పిల్లలను తమ
గొఱ్ఱెల మందలను తమ పశువులను గోషెను దేశములో
9 విడిచిపెట్టిరి. । మరియు రథములును రౌతులును అత
నితో వెళ్లినందున ఆ సమూహము బహు విస్తారమా
10 యెను. । యొర్దానుకు అవతలనున్న ఆటదు కళ్లమునొ
ద్దకు చేరి అక్కడ బహు ఘోరముగా అంగలార్చిరి.
అతడు తన తండ్రినిగూర్చి యేడు దినములు దుఃఖము
11 సలిపెను. । ఆ దేశమందు నివసించిన కనానీయులు
ఆటదు కళ్లమునొద్ద ఆ దుఃఖము సలుపుట చూచి
— ఐగుప్తీయులకు ఇది మిక్కటమైన దుఃఖమని చెప్పు
కొనిరి గనుక దానికి ఆబేల్ మిస్రాయిము అను పేరు
పెట్టబడెను, అది యొర్దానుకు అవతల నున్నది. ।
12 అతని కుమారులు తన విషయమై అతడు వారికాజ్ఞా
13 పించినట్లు చేసిరి. । అతని కుమారులు కనాను దేశ
మునకు అతని శవమును తీసికొని పోయి మక్పేలా పొల
మందున్న గుహలో పాతిపెట్టిరి. దానిని ఆ పొల
మును అబ్రాహాము తనకు శ్మశానముకొరకు స్వాస్థ్య
ముగానుండు నిమిత్తము మమ్రే యెదుట హిత్తీయు
డైన ఎఫ్రోనుయొద్ద కొనెను.

యోసేపు తన తండ్రిని పాతిపెట్టిన తరువాత అత
డును అతని సహోదరులును అతని తండ్రిని పాతి
పెట్ట వెళ్లిన వారందరును తిరిగి ఐగుప్తుకు వచ్చిరి.

యోసేపు సహోదరులు తమ తండ్రి మృతిపొం
దుట చూచి—ఒకవేళ యోసేపు మనయందు పగపట్టి
మనమతనికి చేసిన కీడంతటి చొప్పున మనకు నిశ్చయ
ముగా కీడు జరిగించుననుకొని । యోసేపుకు ఈలాగు
వర్తమానమంపిరి । —నీ తండ్రి తాను చావకమునుపు
ఆజ్ఞాపించినదేమనగా—మీరు యోసేపును చూచి—
నీ సహోదరులు నీకు కీడు చేసిరి గనుక దయచేసి
వారి అపరాధమును వారి పాపమును క్షమించుమని
అతనితో చెప్పుడనెను. కాబట్టి దయచేసి నీ తండ్రి
దేవుని దాసుల అపరాధము క్షమించుమనిరి. వారు
యోసేపుతో ఈలాగు మాటలాడుచుండగా అతడు
ఏడ్చెను. । మరియు అతని సహోదరులు పోయి
అతని యెదుట సాగిలపడి — ఇదిగో మేము నీకు
దాసులమని చెప్పగా । యోసేపు — భయపడకుడి,
నేను దేవుని స్థానమందున్నానా? । మీరు నాకు కీడు
చేయ నుద్దేశించితిరిగాని నేటిదినమున జరుగుచున్నట్లు
అనగా బహు ప్రజలను బ్రదికించునట్లుగా అది
మేలుకే దేవుడు ఉద్దేశించెను. । కాబట్టి భయపడకుడి;
నేను మిమ్మును మీ పిల్లలను పోషించెదనని చెప్పి
వారిని ఆదరించి వారితో ప్రీతిగా మాటలాడెను; ।
కావున యోసేపును అతని తండ్రి కుటుంబపువారును
ఐగుప్తులో నివసించిరి. యోసేపు నూట పది సంవ
త్సరములు బ్రదికెను. । యోసేపు ఎఫ్రాయిము
యొక్క మూడవ తరము పిల్లలను చూచెను; మరియు
మనష్షే కుమారుడైన మాకీరుకు కుమారులు పుట్టి యో
సేపు ఒడిలో ఉంచబడిరి.

యోసేపు తన సహోదరులను చూచి — నేను
చనిపోవుచున్నాను; దేవుడు నిశ్చయముగా మిమ్మును
చూడవచ్చి, యీ దేశములోనుండి తాను అబ్రా
హాము ఇస్సాకు యాకోబులతో ప్రమాణము చేసి
యిచ్చిన దేశమునకు మిమ్మును తీసికొని పోవునని
చెప్పెను. । మరియు యోసేపు — దేవుడు నిశ్చయ
ముగా మిమ్మును చూడవచ్చును; అప్పుడు మీరు నా
యెముకలను ఇక్కడనుండి తీసికొని పోవలెనని చెప్పి
ఇశ్రాయేలు కుమారులచేత ప్రమాణము చేయించు
కొనెను. । యోసేపు నూట పది సంవత్సరములవాడై
మృతిపొందెను. వారు సుగంధ ద్రవ్యములతో అతని
శవమును సిద్ధపరచి ఐగుప్తు దేశమందు ఒక పెట్టెలో
ఉంచిరి.

# నిర్గమకాండము

1 ఐగుప్తులోకి యాకోబుతో వచ్చిన ఇశ్రాయేలీ
యుల పేరులు ఏవనగా, రూబేను షిమ్యోను లేవి
2 యూదా । ఇశ్శాఖారు జెబులూను బెన్యామీను ।
4 దాను నఫ్తాలి గాదు ఆషేరు. । వీరిలో ప్రతివాడును
5 తన తన కుటుంబముతో వచ్చెను. । యాకోబు గర్భ
మున పుట్టినవారందరు డెబ్బదిమంది. అప్పటికి యో
6 సేపు ఐగుప్తులో ఉండెను. । యోసేపును అతని అన్న
దమ్ములందరును ఆ తరము వారందరును చనిపోయిరి. ।
7 ఇశ్రాయేలీయులు బహు సంతానముగలవారై అభి
వృద్ధి పొంది విస్తరించి అత్యధికముగా ప్రబలిరి;
వారున్న ప్రదేశము వారితో నిండియుండెను.
8 అప్పుడు యోసేపును ఎరుగని క్రొత్తరాజు ఐగుప్తును
9 ఏల నారంభించెను. । అతడు తన జనులతో ఇట్లనెను
—ఇదిగో ఇశ్రాయేలు సంతతియైన యీ జనము మన
10 కంటె విస్తారముగాను బలిష్ఠముగాను ఉన్నది. । వారు
విస్తరింపకుండునట్లు మనము వారియెడల యుక్తిగా జరి
గించుదము రండి; లేనియెడల యుద్ధము కలుగునప్పుడు
వారుకూడ మన శత్రువులతో చేరి మనకు విరోధ
ముగా యుద్ధముచేసి యీ దేశములోనుండి వెళ్లిపోదు
11 రేమో అనెను. । కాబట్టి వారిమీద పెట్టిన భారము
లలో వారిని శ్రమపెట్టుటకు వెట్టి పనులు చేయించు
అధికారులను వారిమీద నియమింపగా వారు ఫరో
కొరకు ధాన్యాదులను నిలువచేయు పీతోము రామె
12 సేసను పట్టణములను కట్టిరి. । అయినను ఐగుప్తీయులు
వారిని శ్రమపెట్టినకొలది వారు విస్తరించి ప్రబలిరి
గనుక వారు ఇశ్రాయేలీయుల యెడల అసహ్యపడిరి. ।
13 ఇశ్రాయేలీయులచేత ఐగుప్తీయులు కఠినముగా సేవ
14 చేయించుకొనిరి; । వారు ఇశ్రాయేలీయులచేత
చేయించుకొనిన ప్రతి పనియు కఠినముగా ఉండెను.
వారు జిగటమంటి పనిలోను, ఇటుకల పనిలోను,
పొలములో చేయు ప్రతిపనిలోను కఠినసేవ చేయించి
వారి ప్రాణములను విసికించిరి.
15 మరియు ఐగుప్తురాజు షిఫ్రా పూయా అను
16 హెబ్రీయుల మంత్రసానులతో మాటలాడి।—మీరు
హెబ్రీస్త్రీలకు మంత్రసానిపని చేయుచు వారిని
కాన్పుపీటలమీద చూచినప్పుడు మగవాడైనయెడల
వాని చంపుడి, ఆడుదైనయెడల దాని బ్రదుకనియ్యు
17 డని వారితో చెప్పెను. । అయితే ఆ మంత్రసానులు
దేవునికి భయపడి, ఐగుప్తురాజు తమకాజ్ఞాపించినట్లు
18 చేయక మగపిల్లలను బ్రదుకనియ్యగా । ఐగుప్తురాజు
ఆ మంత్రసానులను పిలిపించి — మీరెందుకు మగపిల్ల
లను బ్రదుకనిచ్చితిరి? ఈ పని యేల చేసితిరి అని అడి
గెను, । అందుకు ఆ మంత్రసానులు—హెబ్రీస్త్రీలు 19
ఐగుప్తుస్త్రీలవంటివారు కారు; వారు చురుకైనవారు.
మంత్రసాని వారియొద్దకు వెళ్లకమునుపే వారు ప్రస
వించియుందురని ఫరోతో చెప్పిరి. । దేవుడు ఆ 20
మంత్రసానులకు మేలుచేసెను. ఆ జనము విస్తరించి
మిక్కిలి ప్రబలెను. । ఆ మంత్రసానులు దేవునికి 21
భయపడినందున ఆయన వారికి వంశాభివృద్ధి కలుగ
జేసెను. । అయితే ఫరో — హెబ్రీయులలో పుట్టిన 22
ప్రతి కుమారుని నదిలో పారవేయుడి, ప్రతి కుమా
ర్తెను బ్రదుకనియ్యుడి అని తన జనులందరికి ఆజ్ఞాపిం
చెను.
లేవి వంశస్థుడొకడు వెళ్లి లేవి కుమార్తెను వివా 2
హము చేసికొనెను । ఆ స్త్రీ గర్భవతియై కుమారుని 2
కని, వాడు సుందరుడై యుండుట చూచి మూడు
నెలలు వాని దాచెను. । తరువాత ఆమె వాని దాచ 3
లేక వానికొరకు ఒక జమ్ముపెట్టె తీసికొని, దానికి జిగట
మన్నును కీలును పూసి, అందులో ఆ పిల్లవానిని పెట్టి
యేటియొడ్డున నాచులో దాని ఉంచగా, । వాని 4
కేమి సంభవించునో తెలిసికొనుటకు వాని అక్క దూర
ముగా నిలిచియుండెను. । ఫరో కుమార్తె స్నానము 5
చేయుటకు ఏటికి వచ్చెను. ఆమె పనికత్తెలు ఏటి
యొడ్డున నడుచుచుండగా ఆమె నాచులోని ఆ
పెట్టెను చూచి, తన పనికత్తె నొకతెను పంపి దాని
తెప్పించి । తెరచి ఆ పిల్లవాని చూచినప్పుడు ఆ పిల్ల 6
వాడు ఏడ్చుచుండగా చూచి వానియందు కనికరించి
—వీడు హెబ్రీయుల పిల్లలలో నొకడనెను. । అప్పుడు 7
వాని అక్క ఫరో కుమార్తెను చూచి—నీకొరకు ఈ
పిల్లవాని పెంచుటకు నేను వెళ్లి హెబ్రీస్త్రీలలో ఒక
దాదిని పిలుచుకొని వత్తునా అనెను. । అందుకు ఫరో 8
కుమార్తె—వెళ్లుమని చెప్పగా ఆ చిన్నది వెళ్లి ఆ బిడ్డ
తల్లిని పిలుచుకొని వచ్చెను. । ఫరో కుమార్తె ఆమెను 9
చూచి—ఈ బిడ్డను తీసికొనిపోయి నాకొరకు వానికి
పాలిచ్చి పెంచుము, నేను నీకు జీతమిచ్చెదనని చెప్ప
గా, ఆ స్త్రీ ఆ బిడ్డను తీసికొనిపోయి పాలిచ్చి పెం
చెను. । ఆ బిడ్డ పెద్దవాడైన తరువాత ఆమె ఫరో 10
కుమార్తె యొద్దకు అతని తీసికొని వచ్చెను, అతడు
ఆమెకు కుమారుడాయెను. ఆమె—నీటిలోనుండి ఇతని
తీసితినని చెప్పి అతనికి మోషే అను పేరు పెట్టెను.

11 ఆ దినములలో మోషే పెద్దవాడై తన జనుల
యొద్దకు పోయి వారి భారములను చూచెను. అప్పు
డతడు తన జనులలో ఒక హెబ్రీయుని ఒక ఐగుప్తీ
12 యుడు కొట్టగా చూచెను. । అతడు ఇటు అటు తిరిగి
చూచి యెవడును లేకపోగా ఆ ఐగుప్తీయుని చంపి
13 యిసుకలో వాని కప్పిపెట్టెను. । మరునాడు అతడు
బయట నడిచి వెళ్లుచుండగా హెబ్రీయులైన మనుష్యు
14 లిద్దరు పోట్లాడుచుండిరి. । అప్పుడతడు అన్యాయము
చేసినవాని చూచి — నీవేల నీ పొరుగువాని కొట్టు
చున్నావని అడుగగా అతడు—మామీద నిన్ను అధి
కారినిగాను తీర్పరినిగాను నియమించినవాడెవడు? నీవు
ఆ ఐగుప్తీయుని చంపినట్లు నన్నును చంపవలెనని అను
కొనుచున్నావా అనెను. అందుకు మోషే—నిశ్చయ
ముగా ఈ సంగతి బయలుపడెననుకొని భయపడెను. ।
15 ఫరో ఆ సంగతి విని మోషేను చంపచూచెనుగాని,
మోషే ఫరో యెదుటనుండి పారిపోయి మిద్యాను
దేశములో నిలిచిపోయి యొక బావియొద్ద కూర్చుం
16 డెను. । మిద్యాను యాజకునికి ఏడుగురు కుమార్తె
లుండిరి. వారు వచ్చి తమ తండ్రి మందకు పెట్టుటకు
17 నీళ్లు చేది తొట్లను నింపుచుండగా । మందకాపరులు
వచ్చి వారిని తోలివేసిరి. అప్పుడు మోషే లేచి వారికి
18 సహాయము చేసి మందకు నీళ్లు పెట్టెను. । వారు తమ
తండ్రియైన రగూయేలు నొద్దకు వచ్చినప్పుడు అతడు
19 —నేడు మీ రింత త్వరగా ఎట్లు వచ్చితిరనెను. । అం
దుకు వారు—ఐగుప్తీయుడొకడు మందకాపరుల చేతి
లోనుండి మమ్మును తప్పించి వడిగా నీళ్లు చేది మన
20 మందకు పెట్టెననగా । అతడు తన కుమార్తెలను చూచి
—అతడెక్కడ? ఆ మనుష్యుని ఏల విడిచి వచ్చితిరి?
21 భోజనమునకు అతని పిలుచుకొని రండనెను. । మోషే
ఆ మనుష్యునితో నివసించుటకు సమ్మతించెను. అతడు
22 తన కుమార్తెయైన సిప్పోరాను మోషేకిచ్చెను. । ఆమె
ఒక కుమారుని కనినప్పుడు మోషే— నేను అన్యదేశ
ములో పరదేశినై యుంటిననుకొని వానికి గెర్షోను
అను పేరు పెట్టెను.
23 ఆలాగున అనేకదినములు జరిగినమీదట ఐగుప్తు
రాజు చనిపోయెను. ఇశ్రాయేలీయులు తాము చేయు
చున్న వెట్టి పనులనుబట్టి నిట్టూర్పులు విడుచుచు మొర
పెట్టుచుండగా, తమ వెట్టి పనులనుబట్టి వారు పెట్టిన
24 మొర దేవుని యొద్దకు చేరెను. । కాగా దేవుడు వారి
మూలుగును విని, అబ్రాహాము ఇస్సాకు యాకోబు
లతో తాను చేసిన నిబంధనను జ్ఞాపకము చేసికొనెను. ।
25 దేవుడు ఇశ్రాయేలీయులను చూచెను; దేవుడు వారి
యందు లక్ష్యముంచెను.

3 మోషే మిద్యాను యాజకుడైన యిత్రో అను
తన మామ మందను మేపుచు, ఆ మందను అరణ్యము
అవతలకు తోలుకొని దేవుని పర్వతమైన హోరేబు
నకు వచ్చెను. । ఒక పొద నడిమిని అగ్నిజ్వాలలో
యెహోవా దూత అతనికి ప్రత్యక్షమాయెను. అతడు
చూచినప్పుడు అగ్నివలన ఆ పొద మండుచుండెను
గాని పొద కాలిపోలేదు. । అప్పుడు మోషే — ఆ
పొద యేల కాలిపోలేదో నేను ఆ తట్టు వెళ్లి యీ
గొప్ప వింత చూచెదననుకొనెను. । దాని చూచు
టకు అతడు ఆ తట్టు వచ్చుట యెహోవా చూచి,
దేవుడు ఆ పొద నడుమనుండి—మోషే మోషే అని
అతని పిలిచెను. అందుకతడు — చిత్తము ప్రభువా
అనెను. । అందుకాయన—దగ్గరకు రావద్దు, నీ పాద
ములనుండి నీ చెప్పులు విడువుము, నీవు నిలిచియున్న
స్థలము పరిశుద్ధ ప్రదేశము అనెను. । మరియు ఆయన
—నేను నీ తండ్రి దేవుడను, అబ్రాహాము దేవుడను
ఇస్సాకు దేవుడను యాకోబు దేవుడను అని చెప్పగా
మోషే తన ముఖమును కప్పుకొని దేవునివైపు చూడ
వెరచెను. । మరియు యెహోవా యిట్లనెను—నేను
ఐగుప్తులోనున్న నా ప్రజల బాధను నిశ్చయముగా
చూచితిని, పనులలో తమ్మును కష్టపెట్టువారినిబట్టి
వారు పెట్టిన మొరను వింటిని, వారి దుఃఖములు నాకు
తెలిసేయున్నవి. । కాబట్టి ఐగుప్తీయుల చేతిలోనుండి
వారిని విడిపించుటకును, ఆ దేశములోనుండి విశాల
మైన మంచి దేశమునకు, అనగా కనానీయులకు హిత్తీ
యులకు అమోరీయులకు పెరిజ్జీయులకు హివ్వీయులకు
యెబూసీయులకు నివాసస్థానమై, పాలు తేనెలు
ప్రవహించు దేశమునకు వారిని నడిపించుటకును దిగి
వచ్చియున్నాను. । ఇశ్రాయేలీయుల మొర నిజముగా
నా యొద్దకు చేరినది, ఐగుప్తీయులు వారిని పెట్టుచున్న
హింస చూచితిని. । కాగా రమ్ము, నిన్ను ఫరో
యొద్దకు పంపెదను; ఇశ్రాయేలీయులైన నా ప్రజలను
నీవు ఐగుప్తులోనుండి తోడుకొని పోవలెనని చెప్పెను. ।
అందుకు మోషే—నేను ఫరోయొద్దకు వెళ్లుటకును,
ఇశ్రాయేలీయులను ఐగుప్తులోనుండి తోడుకొని పోవు
టకును ఎంతటివాడనని దేవునితో అనగా । ఆయన—
నిశ్చయముగా నేను నీకు తోడైయుందును, నేను
నిన్ను పంపితిననుటకు ఇది నీకు సూచన; నీవు ఆ
ప్రజలను ఐగుప్తులోనుండి తోడుకొని వచ్చిన తరు
వాత మీరు ఈ పర్వతముమీద దేవుని సేవించెద
రనెను. । మోషే—చిత్తగించుము; నేను ఇశ్రాయేలీ
యుల యొద్దకు వెళ్లి వారిని చూచి—మీ పితరుల
దేవుడు మీ యొద్దకు నన్ను పంపెనని వారితో చెప్ప
గా వారు—ఆయన పేరేమి అని అడిగినయెడల వారి
తో నేనేమి చెప్పవలెనని దేవుని నడిగెను. । అందుకు
దేవుడు—నేను ఉన్నవాడను అను వాడనై యు
న్నానని మోషేతో చెప్పెను. మరియు ఆయన—
ఉండుననువాడు మీ యొద్దకు నన్ను పంపెనని నీవు

15 ఇశ్రాయేలీయులతో చెప్పవలెననెను. । మరియు దేవు
డు మోషేతో నిట్లనెను — మీ పితరుల దేవుడైన
యెహోవా, అనగా అబ్రాహాము దేవుడు ఇస్సాకు
దేవుడు యాకోబు దేవుడునైన యెహోవా మీ
యొద్దకు నన్ను పంపెనని నీవు ఇశ్రాయేలీయులతో
చెప్పవలెను. నిరంతరము నా పేరు ఇదే, తరతరము
16 లకు ఇది నా జ్ఞాపకార్థక నామము. । నీవు వెళ్లి
ఇశ్రాయేలీయుల పెద్దలను పోగుచేసి—మీ పితరుల
దేవుడైన యెహోవా, అనగా అబ్రాహాము ఇస్సాకు
యాకోబుల దేవుడు, నాకు ప్రత్యక్షమై యిట్లనెను—
నేను మిమ్మును, ఐగుప్తులో మీకు సంభవించినదానిని,
17 నిశ్చయముగా చూచితిని. । ఐగుప్తు బాధలోనుండి,
పాలు తేనెలు ప్రవహించు దేశమునకు, అనగా కనా
నీయులు హిత్తీయులు అమోరీయులు పెరిజ్జీయులు
హివ్వీయులు యెబూసీయులున్న దేశమునకు మిమ్ము
రప్పించెదనని సెలవిచ్చితినని వారితో చెప్పుము. ।
18 వారు నీ మాట విందురు గనుక నీవును ఇశ్రాయేలీ
యుల పెద్దలును ఐగుప్తు రాజునొద్దకు వెళ్లి అతని
చూచి—హెబ్రీయుల దేవుడైన యెహోవా మాకు
ప్రత్యక్షమాయెను గనుక మేము అరణ్యమునకు మూడు
దినముల ప్రయాణమంత మార్గము పోయి మా దేవు
డైన యెహోవాకు బలిని సమర్పించుదుము సెలవిమ్మని
19 అతనితో చెప్పవలెను. । ఐగుప్తురాజు మహాబలముతో
మీ మీదికి వచ్చి మిమ్ము పోనియ్యడని నేనెరుగు
20 దును; । కాని, నేను నా చెయ్యి చాపి ఐగుప్తు మధ్యమున
నేను చేయదలచియున్న నా అద్భుతములన్నిటిని
చూపి దాని పాడుచేసెదను. అటుతరువాత అతడు
21 మిమ్ము పంపివేయును. । మరియు నేను ఈ జనుల
యెడల ఐగుప్తీయులకు కటాక్షము కలుగజేసెదను
గనుక మీరు వెళ్లునప్పుడు వట్టి చేతులతో వెళ్లరు. ।
22 ప్రతి స్త్రీయు తన పొరుగుదానిని తన యింటనుండు
దానిని వెండి నగలను బంగారు నగలను వస్త్రములను
ఇమ్మని అడిగి తీసికొని, మీరు వాటిని మీ కుమారుల
కును మీ కుమార్తెలకును ధరింపచేసి ఐగుప్తీయులను
దోచుకొందురనెను.

4 అందుకు మోషే—చిత్తగించుము; వారు నన్ను
నమ్మరు నా మాట వినరు—యెహోవా నీకు ప్రత్య
క్షము కాలేదందురు అని ఉత్తరమియ్యగా ।
2 యెహోవా—నీ చేతిలోనిది ఏమిటి అని అతని నడి
3 గెను. అందుకతడు—కఱ్ఱ అనెను. । అప్పుడాయన—
నేలను దాని పడవేయుమనెను. అతడు దాని నేల పడ
4 వేయగానే అది పామాయెను. । అప్పుడు యెహోవా
— నీ చెయ్యి చాపి దాని తోక పట్టుకొనుమనగా,
అతడు తన చెయ్యి చాపి దాని పట్టుకొనగానే అది
5 అతని చేతిలో కఱ్ఱ ఆయెను. । ఆయన—దానిచేత
వారు తమ పితరుల దేవుడైన యెహోవా, అనగా
అబ్రాహాము దేవుడు ఇస్సాకు దేవుడు యాకోబు
దేవుడు నీకు ప్రత్యక్షమాయెనని నమ్ముదురనెను. ।
మరియు యెహోవా—నీ చెయ్యి నీ రొమ్మున ఉంచు 6
కొనుమనగా, అతడు తన చెయ్యి రొమ్మున ఉంచు
కొని దాని వెలుపలికి తీసినప్పుడు ఆ చెయ్యి కుష్ఠము
గలదై హిమమువలె తెల్లగా ఆయెను. । తరువాత 7
ఆయన—నీ చెయ్యి మరల నీ రొమ్మున ఉంచుకొను
మనగా, అతడు తన చెయ్యి మరల తన రొమ్మున ఉంచు
కొని తన రొమ్మునుండి వెలుపలికి తీసినప్పుడు అది
అతని మిగిలిన శరీరమువలె ఆయెను. । మరియు 8
ఆయన—వారు నిన్ను నమ్మక, మొదటి సూచననుబట్టి
వినకపోయిన యెడల రెండవ దానిబట్టి విందురు. ।
వారు ఈ రెండు సూచనలనుబట్టి నమ్మక నీ మాట 9
వినకపోయిన యెడల నీవు కొంచెము ఏటినీళ్లు తీసి
యెండిన నేలమీద పోయవలెను. అప్పుడు నీవు ఏటి
లోనుండి తీసిన నీళ్లు పొడినేలమీద రక్తమగుననెను. ।
అప్పుడు మోషే—ప్రభువా, ఇంతకు మునుపైనను, 10
నీవు నీ దాసునితో ముచ్చటించినప్పటినుండియైనను,
నేను మాట నేర్పరినికాను, నేను నోటిమాంద్యము
నాలుక మాంద్యము గలవాడనని యెహోవాతో
చెప్పగా । యెహోవా — మానవునకు నోరిచ్చిన 11
వాడు ఎవడు? మూగవానినేగాని చెవిటివానినేగాని
దృష్టిగలవానినేగాని గుడ్డివానినేగాని పుట్టించినవాడె
వడు? యెహోవానైన నేనేగదా. । కాబట్టి వెళ్లుము, 12
నేను నీ నోటికి తోడైయుండి, నీవు ఏమి పలుకవలసి
నది నీకు బోధించెదనని అతనితో చెప్పెను. । అందు 13
కతడు — అయ్యో ప్రభువా, నీవు పంప తలంచిన
వానిచేత పంపుమనగా । ఆయన మోషేమీద కోప 14
పడి—లేవీయుడగు నీ అన్నయైన అహరోను లేడా?
అతడు బాగుగా మాటలాడగలడని నేనెరుగుదును,
ఇదిగో అతడు నిన్ను ఎదుర్కొనవచ్చుచున్నాడు,
అతడు నిన్ను చూచి తన హృదయమందు సంతో
షించును; । నీవు అతనితో మాటలాడి అతని నోటికి 15
మాటలు అందియ్యవలెను, నేను నీ నోటికి అతని
నోటికి తోడైయుండి, మీరు చేయవలసినదానిని మీకు
బోధించెదను. । అతడే నీకు బదులు జనులతో మాట 16
లాడును, అతడే నీకు నోరుగానుండును, నీవు అతనికి
దేవుడవుగా ఉందువు. । ఈ కఱ్ఱను చేత పట్టుకొని 17
దానితో ఆ సూచక క్రియలు చేయవలెనని చెప్పెను.
అటుతరువాత మోషే బయలుదేరి తన మామయైన 18
యిత్రోయొద్దకు తిరిగి వెళ్లి— సెలవైనయెడల నేను
ఐగుప్తులోనున్న నా బంధువులయొద్దకు మరల పోయి
వారింక సజీవులై యున్నారేమో చూచెదనని అత
నితో చెప్పగా యిత్రో— క్షేమముగా వెళ్లుమని మో
షేతో అనెను. । అంతట యెహోవా—నీ ప్రాణ 19
మును వెదకిన మనుష్యులందరు చనిపోయిరి గనుక

ఐగుప్తుకు తిరిగి వెళ్లుమని మిద్యానులో మోషేతో
20 చెప్పగా, । మోషే తన భార్యను తన కుమారులను
తీసికొని గాడిదెమీద నెక్కించుకొని ఐగుప్తుకు తిరిగి
వెళ్లెను. మోషే దేవుని కఱ్ఱను తన చేత పట్టుకొని
21 పోయెను. । అప్పుడు యెహోవా మోషేతో ఇట్ల
నెను—నీవు ఐగుప్తునందు తిరిగి చేరిన తరువాత చేయు
టకు నేను నీకు బలమిచ్చిన మహత్కార్యములన్ని
యు ఫరో యెదుట చేయవలెను సుమీ. అయితే
నేను అతని హృదయమును కఠినపరచెదను, అతడు
22 ఈ జనులను పోనియ్యడు. । అప్పుడు నీవు ఫరోను
చూచి—ఇశ్రాయేలు నా కుమారుడు, నా జ్యేష్ఠ
23 పుత్రుడు; । నన్ను సేవించునట్లు నా కుమారుని
పోనిమ్మని నీకు ఆజ్ఞాపించుచున్నాను; వాని పంపనొల్లని
యెడల ఇదిగో నేను నీ కుమారుని, నీ జ్యేష్ఠపుత్రుని
చంపెదనని యెహోవా సెలవిచ్చుచున్నాడని అతని
24 తో చెప్పుమనెను. । అతడు పోవుమార్గమున సత్రము
లో యెహోవా అతనిని ఎదుర్కొని అతని చంప
25 చూడగా । సిప్పోరా వాడిగల రాయి తీసికొని తన
కుమారునికి సున్నతిచేసి అతని పాదములయొద్ద అది
పడవేసి—నిజముగా నీవు నాకు రక్తసంబంధివైతివనెను;
26 అంతట ఆయన అతని విడిచెను. । అప్పుడు ఆమె—
ఈ సున్నతినిబట్టి నీవు నాకు రక్తసంబంధివైతివనెను.
27 మరియు యెహోవా—మోషేను ఎదుర్కొను
టకు అరణ్యములోకి వెళ్లుమని అహరోనుతో చెప్పగా
అతడు వెళ్లి దేవుని పర్వతమందు అతని కలిసికొని
28 అతని ముద్దుపెట్టుకొనెను. । అప్పుడు మోషే తన్ను
పంపిన యెహోవా పలుకుమన్న మాటలన్నిటిని,
ఆయన చేయనాజ్ఞాపించిన సూచక క్రియలన్నిటిని
అహరోనుకు తెలిపెను.
29 తరువాత మోషే అహరోనులు వెళ్లి ఇశ్రాయేలీ
30 యుల పెద్దలనందరిని పోగుచేసి, । యెహోవా మో
షేతో చెప్పిన మాటలన్నియు అహరోను వివరించి,
జనులయెదుట ఆ సూచక క్రియలను చేయగా జనులు
31 నమ్మిరి. । మరియు—యెహోవా ఇశ్రాయేలీయులను
చూడవచ్చి తమ బాధను కనిపెట్టెనను మాట జనులు
విని తలవంచుకొని నమస్కారము చేసిరి.
5 తరువాత మోషే అహరోనులు వచ్చి ఫరోను
చూచి—ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా—
అరణ్యములో నాకు ఉత్సవము చేయుటకు నా జన
2 మును పోనిమ్మని ఆజ్ఞాపించుచున్నాడనిరి. । ఫరో
—నేను అతని మాట విని ఇశ్రాయేలీయులను పోని
చ్చుటకు యెహోవా ఎవడు? నేను యెహోవాను
ఎరుగను, ఇశ్రాయేలీయులను పోనీయననెను. ।
3 అప్పుడు వారు—హెబ్రీయుల దేవుడు మమ్మును
ఎదుర్కొనెను, సెలవైనయెడల మేము అరణ్యములోకి
మూడు దినముల ప్రయాణమంత దూరము పోయి
మా దేవుడైన యెహోవాకు బలి అర్పించుదుము;
లేనియెడల ఆయన మా మీదికి తెగులైనను ఖడ్గ
మైనను రాజేయునేమో అనిరి. । అందుకు ఐగుప్తు 4
రాజు—మోషే అహరోనూ, ఈ జనులు తమ
పనులను చేయకుండ మీరేల ఆపుచున్నారు? మీ బరు
వులు మోయుటకు పొండనెను. । మరియు ఫరో— 5
ఇదిగో ఈ జనము ఇప్పుడు విస్తరించియున్నది; వారు
తమ బరువులను విడిచి తీరికగానుండునట్లు మీరు
చేయుచున్నారని వారితో అనెను. । ఆ దినమున 6
ఫరో ప్రజలపైనున్న కార్యనియామకులకును వారి
నాయకులకును ఇట్లు ఆజ్ఞాపించెను । —ఇటుకలు 7
చేయుటకు మీరు ఇకమీదట ఈ జనులకు గడ్డి
ఇయ్యకూడదు, వారు వెళ్లి తామే గడ్డి కూర్చుకొన
వలెను. । అయినను వారు ఇదివరకు చేసిన యిటుకల 8
లెక్కనే వారిమీద మోపవలెను, దానిలో ఏమాత్ర
మును తక్కువచేయవద్దు; వారు సోమరులు గనుక—
మేము వెళ్లి మా దేవునికి బలి నర్పించుటకు సెలవిమ్మని
మొరపెట్టుచున్నారు. । ఆ మనుష్యులచేత ఎక్కువ 9
పని చేయింపవలెను, దానిలో వారు కష్టపడవలెను,
అబద్ధపుమాటలను వారు లక్ష్యపెట్టకూడదనెను. ।
కాబట్టి ప్రజల కార్యనియామకులును వారి నాయకు 10
లును పోయి ప్రజలను చూచి—నేను మీకు గడ్డి
ఇయ్యను; । మీరు వెళ్లి మీకు గడ్డి యెక్కడ దొరు 11
కునో అక్కడ మీరే సంపాదించుకొనుడి, అయితే
మీ పనిలో నేమాత్రమును తక్కువచేయబడదని ఫరో
సెలవిచ్చెననిరి. । అప్పుడు ప్రజలు గడ్డికి మారుగా 12
కొయ్య కాలు కూర్చుటకు ఐగుప్తుదేశమందంతటను
చెదరిపోయిరి. । మరియు కార్యనియామకులు వారిని 13
త్వరపెట్టి—గడ్డి ఉన్నప్పటివలెనే యేనాటిపని
ఆనాడే ముగించుడనిరి. । ఫరో కార్యనియామకులు 14
తాము ఇశ్రాయేలీయులలో వారి మీద ఉంచిన
నాయకులను కొట్టి—ఎప్పటివలె మీ లెక్కచొప్పున
ఇటుకలను నిన్న నేడు మీరు ఏల చేయించలేదని
అడుగగా । ఇశ్రాయేలీయుల నాయకులు ఫరోయొ 15
ద్దకు వచ్చి—తమ దాసులయెడల తమరెందుకిట్లు జరి
గించుచున్నారు? । తమ దాసులకు గడ్డియ్యరు అయితే 16
ఇటుకలు చేయుడని మాతో చెప్పుచున్నారు; చిత్త
గించుము, వారు తమరి దాసులను కొట్టుచున్నారు;
అయితే తమరి ప్రజలయందే తప్పితమున్నదని మొర
పెట్టిరి. । అందుకతడు—మీరు సోమరులు మీరు సోమ 17
రులు అందుచేత—మేము వెళ్లి యెహోవాకు బలి
నర్పించుటకు సెలవిమ్మని మీరడుగుచున్నారు. । మీరు 18
పొండి, పనిచేయుడి, గడ్డి మీకీయ్యబడదు, అయితే
ఇటుకల లెక్క మీరప్పగింపక తప్పదని చెప్పెను. ।
—మీ ఇటుకల లెక్కలో నేమాత్రమును తక్కువ 19
చేయవద్దు, ఏనాటి పని ఆనాడే చేయవలెనని రాజు

సెలవియ్యగా, ఇశ్రాయేలీయుల నాయకులు తాము
20 దురవస్థలో పడియున్నట్లు తెలిసికొనిరి. । వారు
ఫరోయొద్దనుండి బయలుదేరి వచ్చుచు, తమ్మును ఎదు
ర్కొనుటకు దారిలో నిలిచియున్న మోషే అహరో
21 నులను కలిసికొని । — యెహోవా మిమ్ము చూచి
న్యాయము తీర్చుగాక; ఫరో యెదుటను అతని దా
సుల యెదుటను మమ్మును అసహ్యులనుగా చేసి
మమ్ము చంపుటకై వారిచేతికి ఖడ్గమిచ్చితిరని వారితో
22 అనగా । మోషే యెహోవా యొద్దకు తిరిగి వెళ్లి—
ప్రభువా, నీవేల ఈ ప్రజలకు కీడుచేసితివి? నన్నేల
23 పంపితివి? । నేను నీ పేరట మాటలాడుటకు ఫరో
యొద్దకు వచ్చినప్పటినుండి అతడు ఈ జనులకు కీడే
చేయుచున్నాడు, నీ జనులను నీవు విడిపింపను
లేదనెను.

6 అందుకు యెహోవా — ఫరోకు నేను చేయ
బోవుచున్నదానిని నీవు నిశ్చయముగా చూచెదవు, బల
వంతముచేత అతడు వారిని పోనిచ్చును, బలవంతము
చేతనే అతడు తన దేశములోనుండి వారిని తోలి
వేయునని మోషేతో అనెను.
2 మరియు దేవుడు మోషేతో ఇట్లనెను — నేనే
3 యెహోవాను; । నేను సర్వశక్తిగల దేవుడను పేరున
అబ్రాహాము ఇస్సాకు యాకోబులకు ప్రత్యక్షమైతిని
కాని యెహోవా అను నా పేరున నేను వారికి
4 తెలియబడలేదు. । మరియు వారు పరవాసము చేసిన
దేశమగు కనానుదేశమును వారికిచ్చుటకు నా నిబంధ
5 నను వారితో స్థిరపరచితిని. । ఐగుప్తీయులు దాసత్వ
మునకు లోపరచియున్న ఇశ్రాయేలీయుల మూలు
గును విని నా నిబంధనను జ్ఞాపకముచేసికొని యు
6 న్నాను. । కాబట్టి నీవు ఇశ్రాయేలీయులతో ఈలాగు
చెప్పుము— నేనే యెహోవాను; నేను ఐగుప్తీయులు
మోయించు బరువుల క్రిందనుండి మిమ్మును వెలపలికి
రప్పించి, వారి దాసత్వములోనుండి మిమ్మును విడిపించి,
నా బాహువు చాపి గొప్ప తీర్పులుచేసి, మిమ్మును విడి
7 పించి, । మిమ్మును నాకు ప్రజలగా చేర్చుకొని మీకు
దేవుడనై యుందును. అప్పుడు ఐగుప్తీయుల బరువు
క్రిందనుండి మిమ్మును వెలపలికి రప్పించిన మీ దేవుడ
నైన యెహోవాను నేనేఅని మీరు తెలిసికొందురు. ।
8 నేను అబ్రాహాము ఇస్సాకు యాకోబులకు ఇచ్చెద
నని చెయ్యి యెత్తి ప్రమాణముచేసిన దేశములోకి
మిమ్మును రప్పించి దాని మీకు స్వాస్థ్యముగా ఇచ్చెదను;
9 నేను యెహోవానని చెప్పుమనగా । మోషే ఇశ్రా
యేలీయులతో ఆలాగు చెప్పెను. అయితే వారు
మనోవ్యాకులమునుబట్టియు కఠిన దాసత్వమునుబట్టి
యు మోషే మాట వినరైరి.
10 మరియు యెహోవా మోషేను చూచి । — నీవు
11 లోపలికి వెళ్లి ఐగుప్తురాజైన ఫరోను చూచి— ఇశ్రా
యేలీయులను తన దేశములోనుండి వెలపలికి పోనియ్య
వలెనని అతనితో చెప్పుమనెను. । అప్పుడు మోషే— 12
చిత్తగించుము, ఇశ్రాయేలీయులే నా మాట వినలేదు;
మాటమాంద్యము గలవాడనగు నా మాట ఫరో యెట్లు
వినునని యెహోవా సన్నిధిని పలికెను. । మరియు 13
యెహోవా మోషే అహరోనులతో నిట్లనెను—
ఇశ్రాయేలీయులను ఐగుప్తు దేశములోనుండి తాము
వెలపలికి రప్పించుటకై ఇశ్రాయేలీయుల యొద్దకును
ఫరో యొద్దకును (వెళ్లవలెనని) వారికాజ్ఞాపించెను.
వారి పితరుల కుటుంబముల మూలపురుషులు ఎవ 14
రనగా, ఇశ్రాయేలు జ్యేష్ఠకుమారుడైన రూబేను కుమా
రులు హనోకు పల్లు హెస్రోను కర్మీ; వీరు రూబేను
కుటుంబములు. । షిమ్యోను కుమారులు యెమూ 15
యేలు యామీను ఓహదు యాకీను సోహరు కనాను
స్త్రీకి కుమారుడైన షావూలు; వీరు షిమ్యోను కుటుంబ
ములు. । లేవి కుమారుల పేరులు వారి వారి వంశా 16
వళుల చొప్పున ఏవేవనగా, గెర్షోను కహాతు మెరారి.
లేవి నూట ముప్పది యేడేండ్లు బ్రదికెను. । గెర్షోను 17
కుమారులు వారి వారి వంశావళులచొప్పున లిబ్నీ
షిమీ. । కహాతు కుమారులు అమ్రాము ఇస్హారు 18
హెబ్రోను ఉజ్జీయేలు. కహాతు నూట ముప్పది
మూడేండ్లు బ్రదికెను. । మెరారి కుమారులు మహలి 19
మూషి; వీరు తమ తమ వంశావళులచొప్పున లేవి
కుటుంబములు. । అమ్రాము తన మేనత్తయైన యోకె 20
బెదును పెండ్లిచేసికొనెను; ఆమె అతనికి అహరో
నును మోషేను కనెను. అమ్రాము నూట ముప్పది
యేడేండ్లు బ్రదికెను. । ఇస్హారు కుమారులు కోరహు 21
నెపెగు జిఖ్రీ. । ఉజ్జీయేలు కుమారులు మిషాయేలు 22
ఎల్సాఫాను సిత్రీ. । అహరోను అమ్మీనాదాబు 23
కుమార్తెయు నయస్సోను సహోదరియునైన ఎలీ
షెబను పెండ్లిచేసికొనెను. ఆమె అతనికి నాదాబును
అబీహును ఎలాజారును ఈతామారును కనెను. ।
కోరహు కుమారులు అస్సీరు ఎల్కానా అబీయా 24
సాపు; వీరు కోరహీయుల కుటుంబములు. । అహ 25
రోను కుమారుడైన ఎలాజారు పూతీయేలు కుమార్తె
లలో ఒకతెను పెండ్లిచేసికొనెను. ఆమె అతనికి
ఫీనెహాసును కనెను; వీరు తమ తమ కుటుంబముల
చొప్పున లేవీయుల పితరుల మూలపురుషులు. । ఇశ్రా 26
యేలీయులను వారి సేనలచొప్పున ఐగుప్తుదేశములో
నుండి వెలపలికి రప్పించుడని యెహోవా ఆజ్ఞాపిం
చిన అహరోను మోషేలు వీరు. । ఇశ్రాయేలీయులను 27
ఐగుప్తులోనుండి వెలపలికి రప్పించవలెనని ఐగుప్తు
రాజైన ఫరోతో మాటలాడినవారు వీరు; ఆ మోషే
అహరోనులు వీరే.

ఐగుప్తుదేశములో యెహోవా మోషేతో మాట 28
లాడిన దినమున । యెహోవా— నేను యెహోవాను; 29

నేను నీతో చెప్పునది యావత్తు నీవు ఐగుప్తు రాజైన
30 ఫరోతో పలుకుమని మోషేతో చెప్పగా। మోషే
—చిత్తగించుము; నేను మాట మాంద్యము గలవాడను,
ఫరో నా మాట యెట్లు వినునని యెహోవా సన్నిధిని
పలికెను.

7 కాగా యెహోవా మోషేతో ఇట్లనెను —
ఇదిగో నిన్ను ఫరోకు దేవునిగా నియమించితిని; నీ
2 అన్న అహరోను నీకు ప్రవక్తగా నుండును. । నేను
నీకాజ్ఞాపించునది యావత్తు నీవు పలుకవలెను. ఫరో
తన దేశములోనుండి ఇశ్రాయేలీయులను పోనియ్యవలె
నని నీ అన్నయైన అహరోను అతనితో చెప్పును; ।
3 అయితే నేను ఫరో హృదయమును కఠినపరిచి,
ఐగుప్తు దేశములో నా సూచకక్రియలను నా మహ
4 త్కార్యములను విస్తరింపచేసెదను. । ఫరో మీ మాట
వినడుగాని నేను నా చెయ్యి ఐగుప్తుమీద వేసి గొప్ప
తీర్పులచేత నా సేనలను ఇశ్రాయేలీయులైన నా ప్రజ
లను ఐగుప్తుదేశములోనుండి వెలపలికి రప్పించెదను. ।
5 నేను ఐగుప్తుమీద నా చెయ్యి చాపి ఇశ్రాయేలీయు
లను వారి మధ్యనుండి రప్పింపగానే నేను యెహోవా
6 నని ఐగుప్తీయులు తెలిసికొందురనెను. । మోషే
అహరోనులు యెహోవా తమకు ఆజ్ఞాపించినట్లు
7 చేసిరి, ఆలాగుననే చేసిరి. । వారు ఫరోతో మాటలాడి
నప్పుడు మోషేకు ఎనుబదియేండ్లు, అహరోనుకు ఎను
బది మూడు ఏండ్లు.

8 మరియు యెహోవా మోషే అహరోనులతో
9 ఇట్లనెను—ఫరో మీ శక్తి చూపుటకై ఒక మహత్కా
ర్యము కనుపరచుడని మీతో చెప్పునప్పుడు నీవు
అహరోనును చూచి—నీ కర్రను పట్టుకొని ఫరో
యెదుట దాని పడవేయుమనుము; అది సర్పమగును. ।
10 కాబట్టి మోషే అహరోనులు ఫరో యొద్దకు వెళ్లి
యెహోవా తమకాజ్ఞాపించినట్లు చేసిరి. అహరోను
ఫరో యెదుటను అతని సేవకుల యెదుటను తన
11 కర్రను పడవేయగానే అది సర్పమాయెను. । అప్పుడు
ఫరో తన విద్వాంసులను మంత్రజ్ఞులను పిలిపించెను.
ఐగుప్తు శకునగాండ్లుకూడ తమ మంత్రములచేత ఆలాగే
12 చేసిరి. । వారిలో ప్రతివాడును తన కర్రను పడ
వేసినప్పుడు అది సర్పమాయెనుగాని అహరోనుకర్ర
13 వారి కర్రలను మ్రింగివేయగా। యెహోవా చెప్పి
నట్టు ఫరో హృదయము కఠినమాయెను గనుక అతడు
14 వారి మాట వినకపోయెను. । తరువాత యెహోవా
మోషేతో ఇట్లనెను—ఫరో హృదయము కఠినమై
నది, అతడు ఈ ప్రజలను పోనియ్యనొల్లడాయెను. ।
15 ప్రాద్దున నీవు ఫరో యొద్దకు వెళ్లుము, ఇదిగో అతడు
ఏటిదరికి పోవును. నీవు అతనిని ఎదుర్కొనుటకు ఏటి
యొడ్డున నిలిచి పాముగా చేయబడిన కర్రను చేత
16 పట్టుకొని । అతని చూచి—అరణ్యమందు నన్ను సేవిం

చుటకై నా ప్రజలను పోనిమ్మని ఆజ్ఞాపించుటకు గాను
హెబ్రీయుల దేవుడైన యెహోవా నన్ను నీ యొ
ద్దకు పంపెను. నీవు ఇదివరకు వినకపోతివి. । కాగా 17
యెహోవా ఆజ్ఞ ఏదనగా—నేను యెహోవానని
దీనిబట్టి నీవు తెలిసికొందువని యెహోవా చెప్పు
చున్నాడు. ఇదిగో నా చేతిలోనున్న యీ కర్రతో
నేను ఏటి నీటిని కొట్టుదును అది రక్తముగా మార్చ
బడును. । ఏటిలోని చేపలు చచ్చును, ఏరు కంపు 18
కొట్టును, ఏటి నీళ్లు త్రాగుటకు ఐగుప్తీయులు అసహ్య
పడుదురని చెప్పుమనెను. । మరియు యెహోవా 19
మోషేతో ఇట్లనెను — నీవు అహరోనును చూచి—
నీ కర్రను పట్టుకొని ఐగుప్తు జలములమీద, అనగా
వారి నదులమీదను వారి కాలువలమీదను, వారి చెరు
వులమీదను, వారి నీటిగుంటలన్నిటిమీదను నీ చెయ్యి
చాపుము; అవి రక్తమగును; ఐగుప్తు దేశమందంతటను
మ్రానుపాత్రలలోను రాతిపాత్రలలోను రక్తము ఉం
డునని అతనితో చెప్పుమనెను. । యెహోవా ఆజ్ఞా 20
పించినట్లు మోషే అహరోనులు చేసిరి. అతడు ఫరో
యెదుటను అతని సేవకుల యెదుటను తన కర్రను
పైకెత్తి ఏటినీళ్లను కొట్టగా ఏటినీళ్లన్నియు రక్తముగా
మార్చబడెను. । ఏటిలోని చేపలు చచ్చెను, ఏరు 21
కంపుకొట్టెను; ఐగుప్తీయులు ఏటినీళ్లు త్రాగలేక
పోయిరి, ఐగుప్తుదేశమందంతట రక్తము ఉండెను. ।
ఐగుప్తు శకునగాండ్లుకూడ తమ మంత్రములవలన అట్లు 22
చేయగా యెహోవా చెప్పినట్టు ఫరో హృదయము
కఠినమాయెను, అతడు మోషే అహరోనుల మాట
వినకపోయెను. । జరిగినదానిని మనస్సున పెట్టక ఫరో 23
తిరిగి తన యింటికి వెళ్లెను. । అయితే ఐగుప్తీయులం 24
దరు ఏటినీళ్లు త్రాగలేక త్రాగు నీళ్లకొరకు ఏటి
ప్రక్కలను త్రవ్విరి.

యెహోవా ఏటిని కొట్టి యేడు దినములైన తరు 8
వాత యెహోవా మోషేతో ఇట్లనెను—నీవు ఫరో
యొద్దకు వెళ్లి అతని చూచి—నన్ను సేవించుటకు నా
జనులను పోనిమ్ము; । నీవు వారిని పోనియ్యనొల్లనియెడల, 2
ఇదిగో నేను నీ పొలిమేరలన్నిటిని కప్పలచేత బాధిం
చెదను. । ఏటిలో కప్పలు విస్తారముగా పుట్టును; అవి 3
నీ యింట నీ పడకగదిలోకి నీ మంచముమీదికి నీ
సేవకుల యిండ్లలోకి నీ జనులమీదికి నీ పొయిలలోకి
నీ పిండి పిసుకు తొట్లలోకి ఎక్కి వచ్చును; । ఆ 4
కప్పలు నీమీదికి నీ జనులమీదికి నీ సేవకులందరిమీదికి
వచ్చునని యెహోవా సెలవిచ్చుచున్నాడని చెప్పు
మనెను. । మరియు యెహోవా మోషేతో ఇట్ల 5
నెను—నీవు అహరోనును చూచి—నీ కర్ర పట్టుకొని
యేటిపాయలమీదను కాలువలమీదను చెరువులమీ
దను నీ చెయ్యి చాపి ఐగుప్తు దేశముమీదికి కప్పలను
రాజేయుమని అతనితో చెప్పుమనగా । అహరోను 6

ఐగుప్తు జలములమీద తన చెయ్యి చాపెను; అప్పుడు
7 కప్పలు ఎక్కివచ్చి ఐగుప్తు దేశమును కప్పెను. । శకున
గాండ్లుకూడ తమ మంత్రములవలన ఆలాగు చేసి
8 ఐగుప్తు దేశముమీదికి కప్పలను రాజేసిరి.। అప్పుడు ఫరో
మోషే అహరోనులను పిలిపించి — నా యొద్దనుండి
నా జనులయొద్దనుండి ఈ కప్పలను తొలగించుమని
యెహోవాను వేడుకొనుడి, అప్పుడు యెహోవాకు
బలి అర్పించుటకు ఈ ప్రజలను అగత్యముగా
9 పోనిచ్చెదననెను. । అందుకు మోషే—నన్ను గెలిచి
నట్టుగా నీవు అతిశయింపవచ్చును, ఈ కప్పల శేషము
ఏటిలోనే ఉండునట్లును అవి నీ మీదను నీ యిండ్ల
లోను ఉండకుండ చంపబడునట్లును నీ కొరకును నీ
సేవకులకొరకును నీ ప్రజలకొరకును నేనెప్పుడు వేడు
కొనవలెనో చెప్పుమని ఫరోను అడుగగా అతడు రేపే
0 అనెను. । అందుకతడు—మా దేవుడైన యెహోవా
వంటి వారెవరును లేరు అని నీవు తెలిసికొనునట్లు నీ
1 మాట చొప్పున జరుగును; । అనగా కప్పలు నీ యొద్ద
నుండియు నీ యిండ్లలోనుండియు నీ సేవకులయొద్ద
నుండియు నీ ప్రజల యొద్దనుండియు తొలగిపోవును;
2 అవి యేటిలోనే ఉండుననెను. । మోషే అహరోనులు
ఫరో యొద్దనుండి బయలు వెళ్లినప్పుడు యెహోవా
ఫరో మీదికి రాజేసిన కప్పల విషయములో మోషే
3 అతనికొరకు మొరపెట్టగా । యెహోవా మోషే
మాటచొప్పున చేసెను గనుక ఇండ్లలోనేమి గ్రామ
ములలోనేమి పొలములలోనేమి కప్పలు ఉండకుండ
4 చచ్చిపోయెను. । జనులు వాటిని కుప్పలుగా వేసి
5 నప్పుడు భూమి కంపుకొట్టెను. । ఫరో ఉపశమనము
కలుగుట చూచి యెహోవా సెలవిచ్చినట్టు తన
హృదయమును కఠినపరచుకొని వారి మాట వినక
పోయెను.

6 అందుకు యెహోవా మోషేను చూచి—నీవు నీ
కర్ర చాపి యీ దేశపు ధూళిని కొట్టుము. అది ఐగుప్తు
దేశమందంతటను పేలగునని అహరోనుతో చెప్పుమన
7 గా వారు అట్లు చేసిరి. । అహరోను తన కర్రను
పట్టుకొని చెయ్యి చాపి ఆ దేశపు ధూళిని కొట్టినప్పుడు
పేలు మనుష్యులమీదను జంతువులమీదను ఉండెను;
ఐగుప్తు దేశమందంతటను ఆ దేశపు ధూళి అంతయు
8 పేలాయెను. । శకునగాండ్లుకూడ పేలను పుట్టించవలె
నని తమ మంత్రములచేత అట్లు చేసిరి గాని అది వారి
వలన కాకపోయెను. పేలు మనుష్యులమీదను జంతు
9 వులమీదను ఉండగా । శకునగాండ్లు—ఇది దైవశక్తి[1]
అని ఫరోతో చెప్పిరి. అయితే యెహోవా చెప్పి
నట్టు ఫరో హృదయము కఠినమాయెను, అతడు వారి
0 మాట వినకపోయెను. । కాబట్టి యెహోవా మోషేను
చూచి—నీవు ప్రొద్దున లేచి ఫరో యెదుట నిలువుము,
ఇదిగో అతడు ఏటియొద్దకు పోవును. నీవు అతని
చూచి—నన్ను సేవించుటకు నా ప్రజలను పోనిమ్ము. ।
నీవు నా ప్రజలను పోనియ్యని పక్షమందు, చూడుము 21
నేను నీ మీదికిని నీ సేవకుల మీదికిని నీ ప్రజలమీది
కిని నీ యిండ్లలోనికి జోరీగలను పంపెదను; ఐగుప్తీ
యుల యిండ్లును వారున్న ప్రదేశమును జోరీగలతో
నిండియుండును. । మరియు భూలోకములో నేనే 22
యెహోవాను అని నీవు తెలిసికొనునట్లు, ఆ దినమున
నేను నా ప్రజలు నివసించుచున్న గోషెనుదేశమును
వినాయించెదను, అక్కడ జోరీగలుండవు. । నా ప్రజ 23
లను నీ ప్రజలనుండి ప్రత్యేకపరచెదను, రేపు ఈ
సూచకక్రియ జరుగునని యెహోవా సెలవిచ్చినట్టు
నీవు చెప్పవలెననెను. । యెహోవా ఆలాగు చేసెను. 24
బాధకరమైన జోరీగలు ఫరో యింటిలోకిని అతని
సేవకుల యిండ్లలోకిని వచ్చి ఐగుప్తు దేశమంతట వ్యాపిం
చెను. ఆ దేశము జోరీగలవలన చెడిపోయెను. । అం 25
దుకు ఫరో మోషే అహరోనులను పిలిపించి—మీరు
వెళ్లి ఈ దేశములో మీ దేవునికి బలి అర్పించుడని
వారితో చెప్పగా । మోషే—అట్లు చేయతగదు; మా 26
దేవుడైన యెహోవాకు మేము అర్పించవలసిన బలి
ఐగుప్తీయులకు హేయము. ఇదిగో మేము ఐగుప్తీయు
లకు హేయమైన బలిని వారి కన్నులయెదుట అర్పిం
చిన పక్షమున వారు మమ్ము రాళ్లతో కొట్టి చంపు
దురు గదా. । మేము అరణ్యములోకి మూడు దిన 27
ముల ప్రయాణమంతదూరము పోయి మా దేవుడైన
యెహోవా మాకు సెలవిచ్చినట్లు ఆయనకు బలి నర్పిం
చుదుమనెను. । అందుకు ఫరో—మీరు అరణ్యములో 28
మీ దేవుడైన యెహోవాకు బలి నర్పించుటకు
మిమ్మును పోనిచ్చెదను గాని దూరము పోవద్దు; మరియు
నాకొరకు వేడుకొనుడనెను. । అందుకు మోషే—నేను 29
నీ యొద్దనుండి వెళ్లి రేపు ఈ జోరీగలు ఫరోయొద్ద
నుండియు అతని సేవకుల యొద్దనుండియు అతని జనుల
యొద్దనుండియు తొలగిపోవునట్లు యెహోవాను
వేడుకొందును గాని, యెహోవాకు బలి అర్పిం
చుటకు ఫరో జనులను పోనియ్యక ఇకను వంచన
చేయకూడదని చెప్పి । ఫరో యొద్దనుండి బయలువెళ్లి 30
యెహోవాను వేడుకొనెను. । యెహోవా మోషే 31
మాట చొప్పున చేయగా ఆ జోరీగలు ఫరో యొద్ద
నుండియు అతని సేవకుల యొద్దనుండియు అతని ప్రజల
యొద్దనుండియు తొలగిపోయెను; ఒక్కటియైనను
నిలువలేదు. । అయితే ఫరో ఆ సమయముకూడ తన 32
హృదయమును కఠినపరచుకొని జనులను పోనియ్య
డాయెను.

తరువాత యెహోవా మోషేతో ఇట్లనెను— 9
నీవు ఫరోయొద్దకు వెళ్లి—నన్ను సేవించుటకు నా ప్రజ

1 మూలభాషలో—దేవుని వ్రేలు.

2 లను పోనిమ్ము. । నీవు వారిని పోనియ్యనొల్లక ఇంకను
3 వారిని నిర్బంధించినయెడల । ఇదిగో యెహోవా
బాహుబలము పొలములోనున్న నీ పశువులమీదికిని నీ
గుఱ్ఱములమీదికిని గాడిదెలమీదికిని ఒంటెలమీదికిని
ఎద్దులమీదికిని గొఱ్ఱెలమీదికిని వచ్చును, మిక్కిలి బాధ
4 కరమైన తెగులు కలుగును. । అయితే యెహోవా
ఇశ్రాయేలీయుల పశువులను ఐగుప్తు పశువులను
వేరుపరచును; ఇశ్రాయేలీయులకున్న వాటన్నిటిలో
ఒక్కటైనను చావదని హెబ్రీయుల దేవుడగు
యెహోవా సెలవిచ్చుచున్నాడని అతనితో చెప్పు
5 మనెను.। మరియు యెహోవా కాలము నిర్ణయించి—
రేపు యెహోవా ఈ దేశములో ఆ కార్యము జరి
6 గించునని నెను. । మరునాడు యెహోవా ఆ కార్యము
చేయగా ఐగుప్తీయుల పశువులన్నియు చచ్చెను గాని
ఇశ్రాయేలీయుల పశువులలో ఒకటియు చావలేదు. ।
7 ఫరో ఆ సంగతి తెలిసికొన పంపినప్పుడు ఇశ్రాయేలు
పశువులలో ఒకటియు చావలేదు; అయినను అప్పటి
కిని ఫరో హృదయము కఠినమైనందున జనులను పం
పకపోయెను.

8 కాగా యెహోవా—మీరు మీ పిడికిళ్లనిండ
ఆవపుబుగ్గి తీసికొనుడి, మోషే ఫరో కన్నులయెదుట
9 ఆకాశమువైపు దాని చల్లవలెను. । అప్పుడు అది ఐగుప్తు
దేశమంతట సన్నపు ధూళియై ఐగుప్తు దేశమంతట
మనుష్యులమీదను జంతువులమీదను పొక్కులు
పొక్కు దద్దురులగునని మోషే అహరోనులతో చెప్పె
10 ను. । కాబట్టి వారు ఆవపుబుగ్గి తీసికొనివచ్చి ఫరో
యెదుట నిలిచిరి. మోషే ఆకాశమువైపు దాని చల్ల
గానే అది మనుష్యులకును జంతువులకును పొక్కులు
11 పొక్కు దద్దురులాయెను. । ఆ దద్దురులవలన శకున
గాండ్లు మోషేయెదుట నిలువలేక పోయిరి. ఆ దద్దు
రులు శకునగాండ్లకును ఐగుప్తీయులందరికిని పుట్టెను. ।
12 అయినను యెహోవా మోషేతో చెప్పినట్లు
యెహోవా ఫరోహృదయమును కఠినపరచెను,
అతడు వారి మాట వినకపోయెను.

13 తరువాత యెహోవా మోషేతో ఇట్లనెను—
హెబ్రీయుల దేవుడైన యెహోవా ఈలాగు సెల
విచ్చుచున్నాడు; నీవు తెల్లవారగానే లేచిపోయి ఫరో
యెదుట నిలిచి—నన్ను సేవించుటకు నా జనులను
14 పోనిమ్ము. । సమస్త భూమిలో నావంటివారెవరును
లేరని నీవు తెలిసికొనవలెనని ఈ సారి నేను నా తెగు
ళ్లన్నియు నీ హృదయము నొచ్చునంతగా నీ సేవకుల
15 మీదికిని నీ ప్రజలమీదికిని పంపెదను; । భూమిమీద
నుండకుండ నీవు నశించిపోవునట్లు నేను నా చెయ్యి
చాపియుంటినేని నిన్నును నీ జనులను తెగులుతో
16 కొట్టివేసియుందును. । అయినగాని నా బలమును నీకు
చూపునట్లును, సమస్తభూమిలో నా నామమును ప్రచు
రము చేయునట్లును నేను నిన్ను నియమించితిని. । నీవు 17
ఇంక నా ప్రజలను పోనియ్యనొల్లక వారిమీద అతిశయ
పడుచున్నావు. । ఇదిగో రేపు ఈవేళకు నేను మిక్కిలి 18
బాధకరమైన వడగండ్లను కురిపించెదను; ఐగుప్తురా
జ్యము స్థాపించిన దినము మొదలుకొని యిదివరకు అం
దులో అట్టి వడగండ్లు పడలేదు. । కాబట్టి నీవు ఇప్పుడు 19
పంపి నీ పశువులను పొలములలో నీకు కలిగినది యా
వత్తును త్వరగా భద్రముచేయుము. ఇంటికి రప్పింపబడక
పొలములో ఉండు ప్రతి మనుష్యునిమీదను జంతువు
మీదను వడగండ్లు కురియును అప్పుడు అవి చచ్చు
నని చెప్పుమనెను. । ఫరో సేవకులలో యెహోవా 20
మాటకు భయపడినవాడు తన సేవకులను తన పశు
వులను ఇండ్లలోకి త్వరగా రప్పించెను. । అయితే 21
యెహోవా మాట లక్ష్యపెట్టనివాడు తన పనివారిని
తన పశువులను పొలములో ఉండనిచ్చెను.

యెహోవా—నీ చెయ్యి ఆకాశమువైపు చాపుము; 22
ఐగుప్తుదేశమందలి మనుష్యులమీదను జంతువులమీ
దను పొలముల కూరలన్నిటిమీదను వడగండ్లు ఐగుప్తు
దేశమంతట పడునని మోషేతో చెప్పెను. । మోషే 23
తన కఱ్ఱను ఆకాశమువైపు ఎత్తినప్పుడు యెహోవా
ఉరుములను వడగండ్లను కలుగజేయగా పిడుగులు
భూమిమీద పడుచుండెను. యెహోవా ఐగుప్తు
దేశముమీద వడగండ్లు కురిపించెను. । ఆలాగు వడగం 24
డ్లును వడగండ్లతో కలిసిన పిడుగులును బహు బలమైన
వాయెను. ఐగుప్తుదేశమందంతటను అది రాజ్యమైనది
మొదలుకొని యెన్నడును అట్టివి కలుగలేదు. । ఆ వడ 25
గండ్లు ఐగుప్తుదేశమందంతట మనుష్యులనేమి జంతు
వులనేమి బయట నున్నది యావత్తును నశింపచేసెను.
వడగండ్లు పొలములోని ప్రతి కూరను చెడగొట్టెను,
పొలములోని ప్రతిచెట్టును విరుగగొట్టెను. । అయితే 26
ఇశ్రాయేలీయులున్న గోషెను దేశములో మాత్రము
వడగండ్లు పడలేదు. । ఇది చూడగా ఫరో మోషే 27
అహరోనులను పిలువనంపి—నేను ఈసారి పాపము
చేసి యున్నాను; యెహోవా న్యాయవంతుడు,
నేనును నా జనులును దుర్మార్గులము; । ఇంతమట్టుకు 28
చాలును; ఇకను బ్రహ్మాండమైన ఉరుములు వడగండ్లు
రాకుండునట్లు యెహోవాను వేడుకొనుడి, మిమ్మును
పోనిచ్చెదను, మిమ్మును ఇకను నిలుపనని వారితో చెప్ప
గా । మోషే అతని చూచి—నేను ఈ పట్టణమునుండి 29
బయలు వెళ్లగానే నా చేతులు యెహోవావైపు ఎత్తె
దను. ఈ ఉరుములు మానును, ఈ వడగండ్లును ఇక
మీదట పడవు. అందువలన భూమి యెహోవాదని
నీకు తెలియబడును. । అయినను నీవును నీ సేవకులును 30
ఇకను దేవుడైన యెహోవాకు భయపడరని నాకు
తెలిసియున్నదనెను. । అప్పుడు జనుపచెట్లు పువ్వులు 31
పూసెను, యవలచేలు వెన్నులు వేసినవి గనుక జనుప

యవలచేలును చెడగొట్టబడెను గాని । గోధుమలు
మెరపమొలకలు ఎదగనందున అవి చెడగొట్టబడలేదు. ।
3 మోషే ఫరోను విడిచి ఆ పట్టణమునుండి బయలు
వెళ్లి యెహోవావైపు తన చేతులు ఎత్తినప్పుడు ఆ
యురుములును వడగండ్లును నిలిచిపోయెను, వర్షము
4 భూమిమీద కురియుట మానెను. । అయితే ఫరో
వర్షమును వడగండ్లును ఉరుములును నిలిచిపోవుట
చూచి, అతడును అతని సేవకులును ఇంక పాపము
చేయుచు తమ హృదయములను కఠినపరచుకొనిరి. ।
5 యెహోవా మోషేద్వారా పలికినట్లు ఫరో హృద
యము కఠినమాయెను; అతడు ఇశ్రాయేలీయులను
పోనియ్యక పోయెను.

10 కాగా యెహోవా మోషేను చూచి—ఫరో
యొద్దకు వెళ్లుము. నేనే యెహోవానని మీరు
తెలిసికొనునట్లును, నేను చేయు సూచకక్రియలను
ఐగుప్తీయుల యెదుట కనుపరచుటకు, నేను వారి
యెడల జరిగించినవాటిని వారియెదుట కలుగజేసిన
2 సూచకక్రియలను । నీవు నీ కుమారునికి నీ కుమారుని
కుమారునికి ప్రచురము చేయునట్లును, నేను అతని
హృదయమును అతని సేవకుల హృదయములను కఠిన
3 పరచితిననెను. । కాబట్టి మోషే అహరోనులు ఫరో
యొద్దకు వెళ్లి అతని చూచి యీలాగు చెప్పిరి—
హెబ్రీయుల దేవుడగు యెహోవా సెలవిచ్చినదేమ
నగా—నీవు ఎన్నాళ్లవరకు నాకు లొంగనొల్లక యుం
దువు; నన్ను సేవించుటకు నా జనులను పోనిమ్ము. ।
4 నీవు నా జనులను పోనియ్యనొల్లని పక్షమున ఇదిగో
రేపు నేను మిడతలను నీ ప్రాంతములలోకి రప్పించె
5 దను. । ఎవడును నేలను చూడలేనంతగా అవి దాని
కప్పును, తప్పించుకొనిన శేషమును, అనగా వడగండ్ల
దెబ్బను తప్పించుకొని మిగిలినదానిని అవి తినివేయు
ను, పొలములో మొలిచిన ప్రతి చెట్టును తినును. ।
6 మరియు అవి నీ యిండ్లలోను నీ సేవకులందరి యిండ్ల
లోను ఐగుప్తీయులందరి యిండ్లలోను నిండిపోవును.
నీ పితరులుగాని నీ పితామహులుగాని యీ దేశములో
నుండిన నాటనుండి నేటివరకు అట్టివాటిని చూడలేదని
7 చెప్పి ఫరో యెదుటనుండి బయలువెళ్లెను. । అప్పుడు
ఫరో సేవకులు అతని చూచి—ఎన్నాళ్లవరకు వీడు
మనకు ఉరిగానుండును? తమ దేవుడైన యెహోవాను
సేవించుటకు ఈ మనుష్యులను పోనిమ్ము; ఐగుప్తుదేశము
8 నశించినదని నీకింకను తెలియదా, అనిరి. । మోషే
అహరోనులు ఫరోయొద్దకు మరల రప్పింపబడగా
అతడు—మీరు వెళ్లి మీ దేవుడైన యెహోవాను
సేవించుడి; అందుకు ఎవరెవరు వెళ్లుదురని వారినడి
9 గెను. । అందుకు మోషే — మేము యెహోవాకు
పండుగ ఆచరింపవలెను గనుక మా కుమారులను మా
కుమార్తెలను మా మందలను మా పశువులను వెంటబెట్టు
కొని మా పిన్న పెద్దలతో కూడ వెళ్లెదమనెను. । అందు 10
కతడు—యెహోవా మీకు తోడైయుండునా? నేను
మిమ్మును మీ పిల్లలను పోనిచ్చెదనా? ఇదిగో మీరు
దురాలోచన గలవారు. । పురుషులైన మీరు మాత్రము 11
వెళ్లి యెహోవాను సేవించుడి; మీరు కోరినది అదే
గదా అని వారితో అనగా ఫరో సముఖమునుండి
వారు వెళ్లగొట్టబడిరి.

అప్పుడు యెహోవా మోషేను చూచి—మిడ 12
తలు వచ్చునట్లు ఐగుప్తుదేశముమీద నీ చెయ్యి చాపు
ము; అవి ఐగుప్తుదేశముమీదికి వచ్చి యీ దేశపు
పైరులన్నిటిని, అనగా వడగండ్లు పాడుచేయని వాటి
నన్నిటిని తినివేయునని చెప్పెను. । మోషే ఐగుప్తు 13
దేశముమీద తన కర్రను చాపగా యెహోవా ఆ
పగలంతయు ఆ రాత్రి అంతయు ఆ దేశముమీద
తూర్పుగాలిని విసరజేసెను; ఉదయమందు ఆ తూర్పు
గాలికి మిడతలు వచ్చెను. । ఆ మిడతలు ఐగుప్తు 14
దేశమంతటిమీదికి వచ్చి ఐగుప్తు సమస్త ప్రాంత
ములలో నిలిచెను. అవి మిక్కిలి బాధకరమైనవి,
అంతకు మునుపు అట్టి మిడతలు ఎప్పుడును ఉండ
లేదు. తరువాత అట్టివి ఉండబోవు. అవి నేలం
తయు కప్పెను. । ఆ దేశమున చీకటి కమ్మెను, ఆ 15
దేశపు కాయగూరలన్నిటిని ఆ వడగండ్లు పాడు
చేయని వృక్షఫలములన్నిటిని అవి తినివేసెను. ఐగుప్తు
దేశమంతట చెట్లేగాని పొలముల కూరయేగాని పచ్చ
నిదేదియు మిగిలియుండలేదు. । కాబట్టి ఫరో మోషే 16
అహరోనులను త్వరగా పిలిపించి—నేను మీ దేవుడైన
యెహోవాయెడలను మీ యెడలను పాపము చేసి
తిని. । మీరు దయచేసి యీసారి మాత్రమే నా 17
పాపము క్షమించి మీ దేవుడైన యెహోవా నా
మీదనుండి యీ చావు మాత్రము తొలగించుమని
ఆయనను వేడుకొనుడనగా । అతడు ఫరో యొద్ద 18
నుండి బయలువెళ్లి యెహోవాను వేడుకొనెను. ।
అప్పుడు యెహోవా గాలిని త్రిప్పి మహా బలమైన 19
పడమటిగాలిని విసరజేయగా అది ఆ మిడతలను కొం
చుపోయి ఎఱ్ఱసముద్రములో పడవేసెను. ఐగుప్తు
సమస్త ప్రాంతములలో ఒక్క మిడతయైనను నిలువ
లేదు. । అయినను యెహోవా ఫరో హృదయ 20
మును కఠినపరచెను; అతడు ఇశ్రాయేలీయులను
పోనియ్యడాయెను.

అందుకు యెహోవా మోషేతో — ఆకాశము 21
వైపు నీ చెయ్యి చాపుము. ఐగుప్తుదేశముమీద చీకటి
చేతికి తెలియునంత చిక్కని చీకటి కమ్ముననెను. ।
మోషే ఆకాశమువైపు తన చెయ్యి యెత్తినప్పుడు 22
ఐగుప్తుదేశమంతయు మూడు దినములు గాఢాంధకార
మాయెను. । మూడు దినములు ఒకని నొకడు కను 23
గొనలేదు, ఎవడును తానున్న చోటనుండి లేవలేక

పోయెను; అయినను ఇశ్రాయేలీయులకందరికి వారి
24 నివాసములలో వెలుగుండెను. । ఫరో మోషేను పిలి
పించి—మీరు వెళ్లి యెహోవాను సేవించుడి. మీ
మందలు మీ పశువులు మాత్రమే ఇక్కడ ఉండవ
25 లెను, మీ బిడ్డలు మీతో వెళ్లవచ్చుననగా । మోషే
—మేము మా దేవుడైన యెహోవాకు అర్పింపవల
సిన బలుల నిమిత్తమును హోమార్పణలనిమిత్తమును
26 నీవు మాకు పశువులనియ్యవలెను. । మా పశువులును
మాతోకూడా రావలెను. ఒక డెక్కయైనను విడువ
బడదు, మా దేవుడైన యెహోవాను సేవించుటకు
వాటిలోనుండి తీసికొనవలెను. మేము దేనితో
యెహోవాను సేవింపవలెనో అక్కడ చేరకమునుపు
27 మాకు తెలియదనెను. । అయితే యెహోవా ఫరో
హృదయమును కఠినపరపగా అతడు వారిని పోనియ్య
28 నొల్లక యుండెను. । గనుక ఫరో—నా యెదుటనుండి
పొమ్ము భద్రము సుమీ; నా ముఖము ఇకను చూడ
వద్దు, నీవు నా ముఖమును చూచుదినమున మరణమ
29 వుదువని అతనితో చెప్పెను. । అందుకు మోషే—
నీవన్నది సరి, నేనికను నీ ముఖము చూడననెను.

11 మరియు యెహోవా మోషేతో ఇట్లనెను—
ఫరోమీదికిని ఐగుప్తుమీదికిని ఇంకొక తెగులును
రప్పించెదను, అటుతరువాత అతడు ఇక్కడనుండి
మిమ్మును పోనిచ్చును. అతడు మిమ్మును పోనిచ్చు
నప్పుడు ఇక్కడనుండి మిమ్మును బొత్తిగా వెళ్లగొట్టును.।
2 కాబట్టి తన చెలికానియొద్ద ప్రతి పురుషుడును తన
చెలికత్తెయొద్ద ప్రతి స్త్రీయును వెండినగలను బంగారు
నగలను అడిగి తీసికొనుడని ప్రజలతో చెప్పుము. ।
3 యెహోవా ప్రజలయెడల ఐగుప్తీయులకు కటాక్షము
కలుగజేసెను; అదిగాక ఐగుప్తుదేశములో మోషే అను
మనుష్యుడు ఫరో సేవకుల దృష్టికిని ప్రజల దృష్టికిని
మిక్కిలి గొప్పవాడాయెను.
4 మోషే ఫరోతో ఇట్లనెను—యెహోవా సెలవి
చ్చినదేమనగా — మధ్యరాత్రి నేను ఐగుప్తుదేశము
5 లోకి బయలు వెళ్లెదను. । అప్పుడు సింహాసనముమీద
కూర్చున్న ఫరో తొలిపిల్ల మొదలుకొని తిరగలి
విసురు దాసి తొలిపిల్లవరకు ఐగుప్తుదేశమందలి తొలి
పిల్లలందరును చచ్చెదరు; జంతువులలోను తొలిపిల్ల
6 లన్నియు చచ్చును. । అప్పుడు ఐగుప్తుదేశమందంతట
మహా ఘోష పుట్టును. అట్టి ఘోష అంతకుముందు
7 పుట్టలేదు, అట్టిది ఇకమీదట పుట్టదు. । యెహోవా
ఐగుప్తీయులను ఇశ్రాయేలీయులను వేరుపరచునని
మీకు తెలియబడునట్లు, మనుష్యులమీదగాని మృగ
ములమీదగాని ఇశ్రాయేలీయులలో ఎవరిమీదనైనను
8 ఒక కుక్కయు తన నాలుక ఆడించదు. । అప్పుడు
నీ సేవకులైన వీరందరు నా యొద్దకు వచ్చి నాకు నమ
స్కారముచేసి—నీవును, నిన్ను ఆశ్రయించియున్న

యీ ప్రజలందరును బయలు వెళ్లుడని చెప్పెదరు; ఆ
తరువాత నేను వెళ్లుదుననెను. మోషే ఆలాగు చెప్పి
ఫరో యొద్దనుండి అత్యాగ్రహముతో వెళ్లిపోయెను.
అప్పుడు యెహోవా—ఐగుప్తుదేశములో నా
మహత్కార్యములు విస్తారమగునట్లు ఫరో మీ మాట
వినడని మోషేతో చెప్పెను. । మోషే అహరోనులు
ఫరో యెదుట ఈ మహత్కార్యములను చేసిరి. అయి
నను యెహోవా ఫరో హృదయమును కఠినపరపగా
అతడు తన దేశములోనుండి ఇశ్రాయేలీయులను పోని
య్యడాయెను.

మోషే అహరోనులు ఐగుప్తుదేశములో ఉండగా 1
యెహోవా వారితో ఈలాగు సెలవిచ్చెను । — నెల
లలో ఈ నెల మీకు మొదటిది, యిది మీ సంవత్స
రమునకు మొదటి నెల. । మీరు ఇశ్రాయేలీయుల సర్వ
సమాజమును చూచి — ఈ నెల దశమినాడు వారు
తమ తమ కుటుంబముల లెక్కచొప్పున ఒక్కొకడు
గొఱ్ఱెపిల్లనైనను మేకపిల్లనైనను, అనగా ప్రతి యింటి
కిని ఒక గొఱ్ఱెపిల్లనైనను ఒక మేకపిల్లనైనను తీసికొన
వలెను. । ఆ పిల్లను తినుటకు ఒక కుటుంబము చాలక
పోయిన పక్షమున వాడును వాని పొరుగువాడును
తమ లెక్కచొప్పున దాని తీసికొనవలెను. । ఆ గొఱ్ఱె
పిల్లను భుజించుటకు ప్రతివాని భోజనము పరిమితిని
బట్టి వారిని లెక్కింపవలెను. । నిర్దోషమైన యేడాది
మగపిల్లను తీసికొనవలెను. గొఱ్ఱెలలోనుండియైనను
మేకలలోనుండియైనను దాని తీసికొనవచ్చును. । ఈ
నెల పదునాలుగవ దినమువరకు మీరు దాని నుంచు
కొనవలెను; తరువాత ఇశ్రాయేలీయుల సమాజపువా
రందరు తమ తమ కూటములలో సాయంకాలమందు
దాని చంపి దాని రక్తములో కొంచెము తీసి, తాము దాని
తిను యిండ్లద్వారబంధపు రెండు నిలువు కమ్ములమీదను
పైకమ్మిమీదను చల్లి । ఆ రాత్రియే వారు అగ్నిచేత
కాల్చబడిన ఆ మాంసమును పొంగని రొట్టెలను తిన
వలెను. చేదుకూరలతో దాని తినవలెను । దాని తలను
దాని కాళ్లను దాని ఆంత్రములను అగ్నితో కాల్చి
దాని తినవలెను; । దానిలో ఉడికి ఉడకనిదైనను
నీళ్లతో వండబడినదైనను తిననే తినకూడదు; ఉదయ
కాలపర్యంతము దానిలోని దేదియు మిగిలింపకూడదు.
ఉదయకాలపర్యంతము దానిలో మిగిలినది అగ్నితో
కాల్చివేయవలెను. । మీరు దాని తినవలసిన విధమే
దనగా, మీ నడుము కట్టుకొని మీ చెప్పులు తొడు
గుకొని మీ కఱ్ఱలు చేత పట్టుకొని, త్వరపడుచు
దాని తినవలెను; అది యెహోవాకు పస్కాబలి. ।
ఆ రాత్రి నేను ఐగుప్తుదేశమందు సంచరించి, ఐగుప్తు
దేశమందలి మనుష్యులలోనేగాని జంతువులలోనేగాని
తొలి సంతతియంతయు హతముచేసి, ఐగుప్తు దేవతల
కందరికిని తీర్పుచేసెదను; నేను యెహోవాను. ।

3 మీరున్న యిండ్లమీద ఆ రక్తము మీకు గురుతుగా ఉం
డును. నేను ఆ రక్తమును చూచి మిమ్మును నశింపచేయక
దాటిపోయెదను. నేను ఐగుప్తు దేశమును పాడుచేయు
చుండగా మిమ్ము సంహరించుటకు తెగులు మీ మీదికి
4 రాదు. । కాబట్టి యీ దినము మీకు జ్ఞాపకార్థమైన
దగును. మీరు యెహోవాకు పండుగగా దాని
నాచరింపవలెను; తరతరములకు నిత్యమైన కట్టడగా
5 దాని నాచరింపవలెను. । ఏడుదినములు పులియనిరొ
ట్టెలను తినవలెను. మొదటి దినమున మీ యిండ్లలో
నుండి పొంగినది పారవేయవలెను. మొదటి దినము
మొదలుకొని యేడవ దినమువరకు పులిసినదానిని తిను
ప్రతిమనుష్యుడు ఇశ్రాయేలీయులలోనుండి కొట్టి
6 వేయబడును. । ఆ మొదటి దినమున మీరు పరిశుద్ధ
సంఘముగాను, ఏడవ దినమున పరిశుద్ధ సంఘముగాను
కూడుకొనవలెను. ఆ దినములయందు ప్రతివాడు
తినవలసినది మాత్రమే మీరు సిద్ధపరచవచ్చును; అది
7 యుగాక మరి ఏ పనియు చేయకూడదు. । పులియని
రొట్టెల పండుగను మీరు ఆచరింపవలెను. ఈ దిన
మందే నేను మీ సమూహములను ఐగుప్తు దేశములో
నుండి వెలుపలికి రప్పించితిని గనుక మీరు మీ తరము
లన్నిటిలో ఈ దినము నాచరింపవలెను; ఇది మీకు
3 నిత్యమైన కట్టడగా ఉండును. । మొదటి నెల పదు
నాలుగవదినము సాయంకాలము మొదలుకొని ఆ
నెల యిరువది యొకటవదినము సాయంకాలపర్యంతము
మీరు పులియని రొట్టెలను తినవలెను. । ఏడు దినములు
మీ యిండ్లలో పొంగినదేదియును ఉండకూడదు,
పులిసినదానిని తినువాడు అన్యుడేగాని దేశములో
పుట్టినవాడేగాని ఇశ్రాయేలీయుల సమాజములో
నుండక కొట్టివేయబడును. । మీరు పులిసినదేదియు
తినక మీ నివాసము లన్నిటిలోను పులియనివాటినే
తినవలెనని చెప్పుమనెను.

కాబట్టి మోషే ఇశ్రాయేలీయుల పెద్దలనందరిని
పిలిపించి వారితో ఇట్లనెను—మీరు మీ కుటుంబముల
చొప్పున మందలోనుండి పిల్లను తీసికొని పస్కాపశు
వును వధించుడి. । మరియు హిస్సోపు కుంచె తీసి
కొని పళ్లెములోనున్న రక్తములో దాని ముంచి, ద్వార
బంధపు పైకమ్మికిని రెండు నిలువు కమ్ములకును పళ్లెము
లోని రక్తమును తాకింపవలెను. తరువాత మీలో నెవ
రును ఉదయమువరకు తన యింటి ద్వారమునుండి
బయలు వెళ్లకూడదు. । యెహోవా ఐగుప్తీయులను
హతముచేయుటకు దేశసంచారముచేయుచు, ద్వార
బంధపు పైకమ్మిమీదను రెండు నిలువు కమ్ములమీదను
ఉన్న రక్తమును చూచి యెహోవా ఆ తలుపును
దాటిపోవును; మిమ్ము హతముచేయుటకు మీ యిండ్ల
లోకి సంహారకుని చొరనియ్యడు. । కాబట్టి మీరు
నిరంతరము మీకును మీ కుమారులకును దీనిని కట్ట
డగా ఆచరింపవలెను. । యెహోవా తాను సెలవిచ్చి 25
నట్లు మీ కిచ్చుచున్న దేశమందు మీరు ప్రవేశించిన
తరువాత మీరు దీని నాచరింపవలెను. । మరియు మీ 26
కుమారులు—మీరు ఆచరించు ఈ ఆచారమేమిటని
మిమ్ము నడుగునప్పుడు । మీరు—ఇది యెహోవాకు 27
పస్కాబలి; ఆయన ఐగుప్తీయులను హతముచేయుచు
మన యిండ్లను కాచినప్పుడు ఆయన ఐగుప్తులోనున్న
ఇశ్రాయేలీయుల యిండ్లను విడిచిపెట్టెను అనవలెనని
చెప్పెను. అప్పుడు ప్రజలు తలలువంచి నమస్కారము
చేసిరి. । అప్పుడు ఇశ్రాయేలీయులు వెళ్లి ఆలాగు 28
చేసిరి; యెహోవా మోషే అహరోనులకు ఆజ్ఞా
పించినట్లే చేసిరి.

అర్ధరాత్రివేళ జరిగినదేమనగా, సింహాసనముమీద 29
కూర్చున్న ఫరో మొదలుకొని చెరసాలలోనున్న
ఖైదీయొక్క తొలిపిల్ల పర్యంతము ఐగుప్తుదేశమందలి
తొలిపిల్లలనందరిని పశువుల తొలిపిల్లలనన్నిటిని
యెహోవా హతముచేసెను. । ఆ రాత్రి ఫరోయు 30
అతని సేవకులందరును ఐగుప్తీయులందరును లేచినప్పుడు
శవములేని ఇల్లు ఒకటైన లేకపోయినందున ఐగుప్తులో
మహాఘోష పుట్టెను. । ఆ రాత్రివేళ ఫరో మోషే 31
అహరోనులను పిలిపించి వారితో — మీరును ఇశ్రా
యేలీయులును లేచి నా ప్రజలమధ్యనుండి బయలు
వెళ్లుడి, మీరు చెప్పినట్లు పోయి యెహోవాను
సేవించుడి. । మీరు చెప్పినట్లు మీ మందలను మీ 32
పశువులను తీసికొనిపోవుడి; నన్ను దీవించుడని
చెప్పెను. । ఐగుప్తీయులు — మనమందరము చచ్చిన 33
వారమనుకొని, తమ దేశములోనుండి ప్రజలను
పంపుటకు త్వరపడి వారిని బలవంతముచేసిరి. । కాబట్టి 34
ప్రజలు తమ పిండిముద్దను తీసికొని, అది పులియక
మునుపే పిండి పిసుకు తొట్లతో దానిని మూట కట్టు
కొని, తమ భుజములమీద పెట్టుకొని పోయిరి. ।
ఇశ్రాయేలీయులు మోషే మాటచొప్పున చేసి ఐగుప్తీ 35
యులయొద్ద వెండి నగలను బంగారు నగలను వస్త్రములను
అడిగి తీసికొనిరి. । యెహోవా ప్రజలయెడల ఐగు 36
ప్తీయులకు కటాక్షము కలుగజేసెను గనుక వారు
వారికి కావలసినవాటిని ఇచ్చిరి. అట్లు వారు ఐగుప్తీ
యులను దోచుకొనిరి.

అప్పుడు ఇశ్రాయేలీయులు రామెసేసునుండి 37
సుక్కోతుకు ప్రయాణమైపోయిరి. వారు పిల్లలు
గాక కాల్బలము ఆరులక్షల వీరులు. । అనేకులైన 38
అన్యజనుల సమూహమును, గొర్రెలు ఎద్దులు మొద
లైన పశువుల గొప్ప మందయును వారితో కూడ
బయలుదేరెను. । వారు ఐగుప్తులోనుండి తెచ్చిన 39
పిండి ముద్దతో పొంగని రొట్టెలుచేసి కాల్చిరి. వారు
ఐగుప్తులోనుండి వెళ్లగొట్టబడి తడవుచేయలేక పోయిరి
గనుక అది పులిసి యుండలేదు, వారు తమకొరకు

వేరొక ఆహారమును సిద్ధపరచుకొని యుండలేదు. ।
40 ఇశ్రాయేలీయులు ఐగుప్తులో నివసించిన కాలము
41 నన్నూట ముప్పది సంవత్సరములు. । ఆ నన్నూట
ముప్పది సంవత్సరములు గడచిన తరువాత జరిగిన
దేమనగా, ఆ దినమందే యెహోవా సేనలన్నియు
ఐగుప్తుదేశములోనుండి బయలుదేరి పోయెను. ।
42 ఆయన ఐగుప్తుదేశములోనుండి వారిని బయటికి
రప్పించినందుకు ఇది యెహోవాకు ఆచరింపదగిన
రాత్రి. ఇశ్రాయేలీయులందరు తమ తమ తరములలో
యెహోవాకు ఆచరింపదగిన రాత్రి యిదే.
43 మరియు యెహోవా మోషే అహరోనులతో
ఇట్లనెను — ఇది పస్కాపండుగను గూర్చిన కట్టడ;
44 అన్యుడెవడును దాని తినకూడదు గాని । వెండితో
కొనబడిన దాసుడు సున్నతిపొందినవాడైతే దాని
45 తినవచ్చును. । పరదేశియు కూలికివచ్చిన దాసుడును
46 దాని తినకూడదు. । మీరు ఒక్క యింటిలోనే
దాని తినవలెను. దాని మాంసములో కొంచెమైనను
ఇంటిలోనుండి బయటికి తీసికొనిపోకూడదు, దానిలో
47 ఒక్క యెముకనైనను మీరు విరువకూడదు. । ఇశ్రా
యేలీయుల సర్వసమాజము ఈ పండుగను ఆచరింప
48 వలెను. । నీయొద్ద నివసించు పరదేశి యెహోవా
పస్కాను ఆచరింపగోరిన పక్షమున అతనికి కలిగిన
ప్రతి మగవాడు సున్నతి పొందవలెను; తరువాత
అతడు సమాజములో చేరి దానిని ఆచరింపవచ్చును.
అట్టివాడు మీ దేశములో పుట్టినవానితో సముడగును;
49 సున్నతి పొందనివాడు దాని తినకూడదు. । దేశస్థునికిని
మీలో నివసించు పరదేశికిని దీనిగూర్చి ఒకటే విధి
50 యుండవలెను. । ఇశ్రాయేలీయులందరు ఆలాగు
చేసిరి; యెహోవా మోషే అహరోనులకు ఆజ్ఞాపించి
51 నట్లు చేసిరి. । యెహోవా ఇశ్రాయేలీయులను వారి
వారి సమూహములచొప్పున ఆనాడే ఐగుప్తుదేశము
లోనుండి వెలపలికి రప్పించెను.
13 మరియు యెహోవా మోషేతో ఈలాగు సెల
2 విచ్చెను । — ఇశ్రాయేలీయులలో మనుష్యులయొక్క
యు పశువులయొక్కయు ప్రథమ సంతతి, అనగా
ప్రతి తొలిచూలుపిల్లను నాకు ప్రతిష్ఠించుము; అది
3 నాదని చెప్పెను. । మోషే ప్రజలతో నిట్లనెను—
మీరు దాసగృహమైన ఐగుప్తునుండి బయలుదేరివచ్చిన
దినమును జ్ఞాపకము చేసికొనుడి. యెహోవా తన
బాహు బలముచేత దానిలోనుండి మిమ్మును బయటికి
4 రప్పించెను; పులిసినదేదియు తినవద్దు. । ఆబీబను
నెలలో ఈ దినమందే మీరు బయలుదేరి వచ్చితిరి
5 గదా. । యెహోవా — నీకిచ్చెదనని నీ పితరులతో
ప్రమాణము చేసినట్లు, కనానీయులకు హిత్తీయులకు
అమోరీయులకు హివ్వీయులకు యెబూసీయులకు
నివాసస్థానమై యుండు, పాలు తేనెలు ప్రవహించు

దేశమునకు నిన్ను రప్పించిన తరువాత నీవు ఈ ఆచా
రమును ఈ నెలలోనే జరుపుకొనవలెను. । ఏడు దిన
ములు నీవు పులియని రొట్టెలను తినవలెను. ఏడవ
దినమున యెహోవా పండుగ ఆచరింపవలెను. ।
పులియని వాటినే యేడు దినములు తినవలెను. పుల
సినదేదియు నీయొద్ద కనబడకూడదు. నీ ప్రాంతము
లన్నిటిలోను పొంగినదేదియు నీయొద్ద కనబడకూ
డదు. । మరియు ఆ దినమున నీవు— నేను ఐగుప్తులో
నుండి వచ్చినప్పుడు యెహోవా నాకు చేసినదా
నిమిత్తము పొంగని రొట్టెలను తినుచున్నానని నీ
కుమారునికి తెలియచెప్పవలెను. । యెహోవా ధర్మ
శాస్త్రము నీ నోటనుండునట్లు బలమైన చేతితో
యెహోవా ఐగుప్తులోనుండి నిన్ను బయటికి రప్పించె
ననుటకు, ఈ ఆచారము నీ చేతిమీద నీకు సూచన
గాను నీ కన్నుల మధ్య జ్ఞాపకార్థముగా ఉండును.
కాబట్టి ప్రతి సంవత్సరము ఈ కట్టడను దాని నియా
మక కాలమున ఆచరింపవలెను.

యెహోవా నీతోను నీ పితరులతోను ప్రమా
ణముచేసినట్లు ఆయన కనానీయుల దేశములో
నిన్ను చేర్చి దానిని నీకిచ్చిన తరువాత । ప్రతి తొలి
చూలుపిల్లను, నీకు కలుగు పశువుల సంతతిలో ప్రతి
తొలిపిల్లను యెహోవాకు ప్రతిష్ఠింపవలెను. ఆ
మగసంతానము యెహోవాదగును. । ప్రతి గాడిద
తొలి పిల్లను వెలయిచ్చి విడిపించి దానికి మారుగా
గొఱ్ఱెపిల్లను ప్రతిష్ఠింపవచ్చును. అట్లు దాని విడి
పించని పక్షమున దాని మెడను విరుగదీయవలెను.
నీ కుమారులలో తొలిచూలియైన ప్రతి మగవానిని
వెలయిచ్చి విడిపింపవలెను. । ఇకమీదట నీ కుమా
రుడు—ఇది ఏమిటని నిన్ను అడుగునప్పుడు నీవ
వాని చూచి—బాహు బలముచేత యెహోవా దాస
గృహమైన ఐగుప్తులోనుండి మనలను బయటికి రప్పిం
చెను. । ఫరో మనలను పోనియ్యకుండ తన మనస్సును
కఠినపరచుకొనగా యెహోవా మనుష్యుల తొలి
సంతానమేమి జంతువుల తొలి సంతానమేమి ఐగుప్తు
దేశములో తొలి సంతానమంతయు సంహరించెను.
ఆ హేతువుచేతను నేను మగదైన ప్రతి తొలిచూలు
పిల్లను యెహోవాకు బలిగా అర్పించుదును; అయితే
నా కుమారులలో ప్రతి తొలి సంతానమును వెల
యిచ్చి విడిపించుచుందునని చెప్పవలెను. । బాహు
బలముచేత యెహోవా మనలను ఐగుప్తులోనుండి
బయటికి రప్పించెను గనుక ఆ సంగతి నీ చేతిమీద
సూచనగాను నీ కన్నుల మధ్య లలాట పత్రికగాను
ఉండవలెను.

మరియు ఫరో ప్రజలను పోనియ్యగా దేవుడు—
ఈ ప్రజలు యుద్ధము చూచునప్పుడు వారు పశ్చా
త్తాపపడి ఐగుప్తుకు తిరుగుదురేమో అనుకొని, ఫిలిష్తీ

యులదేశము సమీపమైనను ఆ మార్గమున వారిని
18 నడిపింపలేదు. । అయితే దేవుడు ప్రజలను చుట్టుదారి
యగు ఎఱ్ఱసముద్రపు అరణ్యమార్గమున నడిపించెను.
ఇశ్రాయేలీయులు యుద్ధసన్నద్ధులై ఐగుప్తులోనుండి
19 వచ్చిరి. । మరియు మోషే యోసేపు ఎముకలను తీసి
కొని వచ్చెను. అతడు—దేవుడు నిశ్చయముగా మీకు
దర్శనమిచ్చును; అప్పుడు మీరు నా ఎముకలను
ఇక్కడనుండి తీసికొని పోవలెనని ఇశ్రాయేలీయుల
చేత రూఢిగా ప్రమాణము చేయించుకొని యుం
20 డెను. । వారు సుక్కోతునుండి ప్రయాణమైపోయి,
21 అరణ్యము దగ్గరనున్న ఏతాములో దిగిరి. । వారు
పగలును రాత్రియు ప్రయాణము చేయునట్లుగా
యెహోవా త్రోవలో వారిని నడిపించుటకై పగటి
వేళ మేఘస్తంభములోను, వారికి వెలుగిచ్చుటకు రాత్రి
వేళ అగ్నిస్తంభములోను ఉండి వారికి ముందుగా
22 నడుచుచు వచ్చెను. । ఆయన పగటివేళ మేఘస్తంభము
నైనను రాత్రివేళ అగ్నిస్తంభమునైనను ప్రజలయెదుట
నుండి తొలగింపలేదు.

**14** మరియు యెహోవా మోషేతో ఈలాగు సెల
2 విచ్చెను । —ఇశ్రాయేలీయులు తిరిగి పీహహీరోతు
ఎదుటను, అనగా మిగ్దోలుకు సముద్రమునకు మధ్య
నున్న బయల్సెఫోను నెదుటను, దిగవలెనని వారితో
చెప్పుము; దాని యెదుటి సముద్రమునొద్ద వారు దిగ
3 వలెను. । అయితే ఫరో ఇశ్రాయేలీయులనుగూర్చి—
వారు ఈ దేశములో చిక్కుబడి యున్నారు, అర
4 ణ్యము వారిని మూసి వేసెనని అనుకొనెను. । అయితే
నేను ఫరో హృదయమును కఠినపరచెదను; అతడు
వారిని తరుమగా, నేను ఫరోవలనను అతని సమస్త సేన
వలనను మహిమ తెచ్చుకొందును; నేను యెహోవా
నని ఐగుప్తీయులందరు తెలిసికొందురనెను. వారు
5 ఆలాగు దిగిరి. । ప్రజలు పారిపోయినట్టు ఐగుప్తు
రాజుకు తెలుపబడినప్పుడు ఫరో హృదయమును అతని
సేవకుల హృదయమును ప్రజలకు విరోధముగా త్రిప్ప
బడి— మనమెందుకీలాగు చేసితిమి? మన సేవలో
నుండకుండ ఇశ్రాయేలీయులను ఎందుకు పోనిచ్చితిమి
6 అని చెప్పుకొనిరి. । అంతట అతడు తన రథమును
సిద్ధపరచుకొని, తన జనమును తనతోకూడ తీసికొని
7 పోయెను. । మరియు అతడు శ్రేష్ఠమైన ఆరువందల
రథములను ఐగుప్తు రథముల నన్నిటిని వాటిలో ప్రతి
దాని మీద అధిపతులను తోడుకొని పోయెను. ।
8 యెహోవా ఐగుప్తురాజైన ఫరో హృదయమును కఠిన
పరపగా అతడు ఇశ్రాయేలీయులను తరిమెను. అట్లు
ఇశ్రాయేలీయులు బలిమిచేత బయలు వెళ్లుచుండిరి. ।
9 ఐగుప్తీయులు, అనగా ఫరో రథముల గుఱ్ఱము
లన్నియు అతని గుఱ్ఱపు రౌతులు అతని దండును
వారిని తరిమి, బయల్సెఫోను ఎదుటనున్న పీహహీరో
తుకు సమీపమైన సముద్రము దగ్గర వారు దిగియుం
డగా వారిని కలిసికొనిరి. । ఫరో సమీపించుచుం 10
డగా ఇశ్రాయేలీయులు కన్నులెత్తి ఐగుప్తీయులు తమ
వెనుక వచ్చుట చూచి మిక్కిలి భయపడి యెహోవాకు
మొరపెట్టిరి. । అంతట వారు మోషేను చూచి 11
—ఐగుప్తులో సమాధులు లేవని యీ అరణ్యములో
చచ్చుటకు మమ్మును రప్పించితివా? మమ్ము ఐగుప్తులో
నుండి బయటికి రప్పించి మమ్మును ఇట్లు చేయనేల? ।
మా జోలి మానుము; ఐగుప్తీయులకు దాసులమగుదు 12
మని ఐగుప్తులో మేము నీతో చెప్పినమాట యిదేగదా;
మేము ఈ అరణ్యమందు చచ్చుటకంటె ఐగుప్తీయులకు
దాసులమగుటయే మేలని చెప్పిరి. । అందుకు మోషే— 13
భయపడకుడి; యెహోవా మీకు నేడు కలుగజేయు
రక్షణను మీరు ఊరక నిలుచుండి చూడుడి; మీరు
నేడు చూచిన ఐగుప్తీయులను ఇకమీదట మరి ఎన్న
డును చూడరు. । యెహోవా మీ పక్షమున యు 14
ద్ధముచేయును, మీరు ఊరకయే యుండవలెనని ప్రజ
లతో చెప్పెను.

అంతలో యెహోవా మోషేను చూచి—నీవేల 15
నాకు మొరపెట్టుచున్నావు? — సాగిపోవుడి అని
ఇశ్రాయేలీయులతో చెప్పుము. । నీవు నీ కఱ్ఱను ఎత్తి 16
ఆ సముద్రమువైపు నీ చెయ్యి చాపి దాని పాయలుగా
చేయుము, అప్పుడు ఇశ్రాయేలీయులు సముద్రము
మధ్యను ఆరిన నేలమీద నడిచిపోవుదురు. । ఇదిగో నేను 17
నేనే ఐగుప్తీయుల హృదయములను కఠినపరచుదును.
వారు వీరిని తరుముదురు; నేను ఫరోవలనను అతని
సమస్త సేనవలనను అతని రథములవలనను అతని గుఱ్ఱపు
రౌతులవలనను నాకు మహిమ తెచ్చుకొందును. । నేను 18
ఫరోవలనను అతని రథములవలనను అతని గుఱ్ఱపు
రౌతులవలనను మహిమ తెచ్చుకొనునప్పుడు నేను
యెహోవానని ఐగుప్తీయులు తెలిసికొందురనెను. ।
అప్పుడు ఇశ్రాయేలీయుల యెదుట సమూహమునకు 19
ముందుగా నడిచిన దేవదూత వారి వెనుకకుపోయి
వారిని వెంబడించెను; ఆ మేఘస్తంభము వారి యెదుట
నుండి పోయి వారి వెనుక నిలిచెను. । అది ఐగుప్తీయుల 20
సేనకు ఇశ్రాయేలీయుల సేనకు నడుమ ప్రవేశించెను;
అది మేఘము గనుక వారికి చీకటి కలిగెను గాని,
రాత్రి అది వీరికి వెలుగిచ్చెను గనుక ఆ రాత్రి అంత
యు ఐగుప్తీయుల సేన ఇశ్రాయేలీయులను సమీపింప
లేదు. । మోషే సముద్రమువైపు తన చెయ్యి చాపగా 21
యెహోవా ఆ రాత్రి అంతయు బలమైన తూర్పు
గాలిచేత సముద్రమును తొలగించి దానిని ఆరిన
నేలగా చేసెను. । నీళ్లు విభజింపబడగా ఇశ్రాయేలీ 22
యులు సముద్రము మధ్యను ఆరిన నేలమీద నడిచి
పోయిరి. ఆ నీళ్లు వారి కుడి యెడమ ప్రక్కలను వారికి
గోడవలె నుండెను. । ఐగుప్తీయులును ఫరో గుఱ్ఱ 23

ములను రథములను రౌతులను వారిని తరిమి సముద్ర
24 మధ్యమున చేరిరి. । అయితే వేకువ జామున
యెహోవా ఆ అగ్ని మేఘమయమైన స్తంభము
నుండి ఐగుప్తీయుల దండువైపు చూచి ఐగుప్తీయుల
25 దండును కలవరపరచి । వారి రథచక్రములు ఊడిపడు
నట్లు చేయగా వారు బహు కష్టపడి తోలుచుండిరి.
అప్పుడు ఐగుప్తీయులు—ఇశ్రాయేలీయుల యెదుట
నుండి పారిపోదము రండి; యెహోవా వారిపక్ష
మున మనతో యుద్ధము చేయుచున్నాడని చెప్పు
కొనిరి.
26 అంతలో యెహోవా మోషేను చూచి—ఐగుప్తీ
యులమీదికిని వారిరథములమీదికిని వారి రౌతులమీది
కిని నీళ్లు తిరిగి వచ్చునట్లు సముద్రముమీద నీ చెయ్యి
27 చాపుమనెను. । మోషే సముద్రముమీద తన చెయ్యి
చాపగా ప్రొద్దుపొడిచినప్పుడు సముద్రము అధికబల
ముతో తిరిగి పొర్లెను గనుక ఐగుప్తీయులు అది చూచి
వెనుకకు పారిపోయిరి. అప్పుడుయెహోవా సముద్ర
28 ముమధ్యను ఐగుప్తీయులను నాశముచేసెను. । నీళ్లు తిరిగి
వచ్చి ఆ రథములను రౌతులను, వారివెనుక సముద్ర
ములోకి వచ్చిన ఫరోయొక్క సర్వసేనను కప్పివేసెను,
29 వారిలో ఒక్కడైనను మిగిలియుండలేదు. । అయితే
ఇశ్రాయేలీయులు ఎండిన త్రోవను సముద్రము మధ్య
నున్నప్పుడు ఆ నీళ్లు వారి కుడి యెడమ ప్రక్కలను
30 గోడవలె నుండెను. । ఆ దినమున యెహోవా ఐగుప్తీ
యుల చేతిలోనుండి ఇశ్రాయేలీయులను రక్షించెను.
ఇశ్రాయేలీయులు చచ్చిన ఐగుప్తీయులను సముద్రతీర
31 మున చూచిరి. । యెహోవా ఐగుప్తీయులకు చేసిన
గొప్ప కార్యమును ఇశ్రాయేలీయులు చూచిరి గనుక
ఆ ప్రజలు యెహోవాకు భయపడి యెహోవా
యందును ఆయన సేవకుడైన మోషేయందును నమ్మక
ముంచిరి.

**15** అప్పుడు మోషేయు ఇశ్రాయేలీయులును
యెహోవానుగూర్చి యీ కీర్తన పాడిరి—

యెహోవానుగూర్చి గానముచేసెదను
ఆయన మిగుల అతిశయించి జయించెను
గుఱ్ఱమును దాని రౌతును
ఆయన సముద్రములో పడద్రోసెను.
2 యెహోవాయే నా బలము నా గానము
ఆయన నాకు రక్షణయు ఆయెను
ఆయన నా దేవుడు ఆయనను వర్ణించెదను
ఆయన నా పితరుల దేవుడు
ఆయన మహిమ నుతించెదను.
3 యెహోవా యుద్ధశూరుడు
యెహోవా అని ఆయనకు పేరు.
4 ఆయన ఫరో రథములను అతని సేనను
సముద్రములో పడద్రోసెను
అతని అధిపతులలో శ్రేష్ఠులు
ఎఱ్ఱసముద్రములో మునిగిపోయిరి.
అగాధజలములు వారిని కప్పెను
వారు రాతివలె అడుగంటిపోయిరి.
యెహోవా, నీ దక్షిణ హస్తము బలమొంది అతి
శయించును
యెహోవా, నీ దక్షిణ హస్తము శత్రువుని చితక
గొట్టును.
నీ మీదికి లేచువారిని
నీ మహిమాతిశయమువలన అణచివేయుదువు
నీ కోపాగ్నిని రగులజేయుదువు
అది వారిని చెత్తవలె దహించును.
నీ నాసికారంధ్రముల ఊపిరివలన
నీళ్లు రాశిగా కూర్చబడెను
ప్రవాహములు కుప్పగా నిలిచెను
అగాధజలములు సముద్రమధ్య గడ్డకట్టెను
—తరిమెదను కలిసికొనియెదను
దోపుడుసొమ్ము పంచుకొనియెదను
వాటివలన నా ఆశ తీర్చుకొనియెదను
నా కత్తి దూసెదను
నా చెయ్యి వారిని నాశనముచేయునని
శత్రువనుకొనెను.
నీవు నీ గాలిని విసరజేసితివి
సముద్రము వారిని కప్పెను
వారు మహా అగాధమైన నీళ్లలో సీసమువలెముని
గిరి.
యెహోవా, వేల్పులలో నీవంటివాడెవడు
పరిశుద్ధతనుబట్టి నీవు మహానీయుడవు
స్తుతికీర్తనలనుబట్టి పూజ్యుడవు
అద్భుతములు చేయువాడవు
నీవంటివాడెవడు
నీ దక్షిణహస్తమును చాపితివి
భూమి వారిని మ్రింగివేసెను.
నీవు విమోచించిన యీ ప్రజలను
నీ కృపచేత తోడుకొనిపోతివి
నీ బలముచేత వారిని నీ పరిశుద్ధాలయమునకు నడి
పించితివి.
జనములు విని దిగులుపడును
ఫిలిష్తియ నివాసులకు వేదన కలుగును.
ఎదోము నాయకులు కలవరపడుదురు
మోయాబు బలిష్ఠులకు వణకు పుట్టును
కనాను నివాసులందరు (దిగులొంది) కరిగిపోవు
దురు
భయము అధికభయము వారికి కలుగును.
యెహోవా, నీ ప్రజలు అద్దరికి చేరువరకు

నీవు సంపాదించిన యీ ప్రజలు అద్దరికి చేరు
వరకు
నీ బాహుబలముచేత (పగవారు) రాతివలె కదల
కుందురు.
నీవు నీ ప్రజను తోడుకొని వచ్చెదవు
యెహోవా, నీ స్వాస్థ్యమైన కొండమీద
నా ప్రభువా, నీవు నివసించుటకు కల్పించుకొనిన
చోటను
నీ చేతులు స్థాపించిన పరిశుద్ధాలయమందు
వారిని నిలువపెట్టెదవు.
యెహోవా నిరంతరమును ఏలువాడు.

ఫరో గుఱ్ఱములు అతని రథములు అతని రౌతులును సముద్రములో దిగగా యెహోవా వారిమీదికి సముద్రజలములను మళ్లించెను. అయితే ఇశ్రాయేలీయులు సముద్రము మధ్యను ఆరిన నేలమీద నడిచిరి.

మరియు అహరోను సహోదరియు ప్రవక్త్రియునగు మిర్యాము తంబూరను చేత పట్టుకొనెను. స్త్రీలందరు తంబురలతోను నాట్యములతోను ఆమె వెంబడి వెళ్లగా । మిర్యాము వారితో కలిసి యిట్లు పల్లవి యెత్తి పాడెను—

యెహోవాను గానముచేయుడి
ఆయన మిగుల అతిశయించి జయించెను
గుర్రమును దాని రౌతును
సముద్రములో ఆయన పడద్రోసెను.

మోషే ఎఱ్ఱసముద్రమునుండి జనులను సాగ చేయగా వారు షూరు అరణ్యములోనికి వెళ్లి దానిలో మూడు దినములు నడిచిరి; అచ్చట వారికి నీళ్లు దొరకలేదు. అంతలో వారు మారాకు చేరిరి. । మారా నీళ్లు చేదైనవి గనుక వారు ఆ నీళ్లు త్రాగలేకపోయిరి. అందువలన దానికి మారా అను పేరు కలిగెను. । ప్రజలు—మేమేమి త్రాగుదుమని మోషేమీద సణుగుకొనగా । అతడు యెహోవాకు మొరపెట్టెను. అంతట యెహోవా అతనికి ఒక చెట్టును చూపెను. అది ఆ నీళ్లలో వేసిన తరువాత నీళ్లు మధురములాయెను. అక్కడ ఆయన వారికి కట్టడను విధిని నిర్ణయించి, అక్కడ వారిని పరీక్షించి, । —మీ దేవుడైన యెహోవా వాక్కును శ్రద్ధగా విని ఆయన దృష్టికి న్యాయమైనది చేసి, ఆయన ఆజ్ఞలకు విధేయులై ఆయన కట్టడలన్నిటిని అనుసరించి నడిచినయెడల, నేను ఐగుప్తీయులకు కలుగజేసిన రోగములలో ఏదియు మీకు రానియ్యను; నిన్ను స్వస్థపరచు యెహోవాను నేనే అనెను. । తరువాత వారు ఏలీముకు వచ్చిరి; అక్కడ పన్నెండు నీటి బుగ్గలును డెబ్బది యీత చెట్లును ఉండెను. వారు అక్కడనే ఆ నీళ్లయొద్ద దిగిరి.

తరువాత ఇశ్రాయేలీయుల సమాజమంతయును 16
ఏలీమునుండి ప్రయాణమై పోయి, వారు ఐగుప్తుదేశ
ములోనుండి బయలుదేరిన రెండవనెల పదునైదవ దిన
మున ఏలీముకును సీనాయికిని మధ్యనున్న సీను అర
ణ్యమునకు వచ్చిరి. । ఆ అరణ్యములో ఇశ్రాయేలీ 2
యుల సమాజమంతయు మోషే అహరోనులమీద
సణిగెను. । ఇశ్రాయేలీయులు—మేము మాంసము 3
వండుకొను కుండలయొద్ద కూర్చుండి తృప్తిగా ఆహా
రము తినునప్పుడు యెహోవా చేతివలన ఏల చావక
పోతిమి? ఈ సర్వసమాజమును ఆకలిచేత చంపుటకు
ఈ అరణ్యములోకి మమ్మును అక్కడనుండి తోడు
కొని వచ్చితిరని వారితో ననగా । యెహోవా 4
మోషేను చూచి—ఇదిగో నేను ఆకాశమునుండి మీ
కొరకు ఆహారమును కురిపించెదను; వారు నా ధర్మ
శాస్త్రము ననుసరించి నడుతురో లేదో అని నేను
వారిని పరీక్షించునట్లు ఈ ప్రజలు వెళ్లి ఏనాటి
బత్తెము ఆనాడే కూర్చుకొనవలెను. । మరియు ఆరవ దిన 5
మున వారు తెచ్చుకొనినదానిని సిద్ధపరచుకొనవలెను.
వారు దినదినమున కూర్చుకొనుదానికంటె అది రెండం
తలై యుండవలెననెను. । అప్పుడు మోషే అహరో 6
నులు ఇశ్రాయేలీయులందరితో—యెహోవా ఐగుప్తు
దేశములోనుండి మిమ్మును బయటికి రప్పించెనని సాయం
కాలమందు మీకు తెలియబడును. । యెహోవామీద 7
మీరు సణిగిన సణుగులను ఆయన వినుచున్నాడు;
ఉదయమున మీరు యెహోవా మహిమను చూచె
దరు; మేము ఏపాటివారము? మామీద సణుగనేల
అనిరి. । మరియు మోషే—మీరు తినుటకై సాయం 8
కాలమున మాంసమును ఉదయమున చాలినంత
ఆహారమును యెహోవా మీకియ్యగాను, మీరు
ఆయనమీద సణుగు మీ సణుగులను యెహోవాయే
వినుచుండగాను, మేము ఏపాటివారము? మీ సణు
గుట యెహోవా మీదనేగాని మామీద కాద
నెను. । అంతట మోషే అహరోనును చూచి— 9
యెహోవా సన్నిధికి సమీపించుడి; ఆయన మీ
సణుగులను వినెనని నీవు ఇశ్రాయేలీయుల సర్వసమా
జముతో చెప్పుమనెను. । అట్లు అహరోను ఇశ్రా 10
యేలీయుల సర్వసమాజముతో మాటలాడుచుండగా
వారు అరణ్యమువైపు చూచిరి, అప్పుడు యెహోవా
మహిమ ఆ మేఘములో వారికి కనబడెను. । అప్పుడు 11
యెహోవా మోషేతో ఇట్లనెను—నేను ఇశ్రాయేలీ
యుల సణుగులను వింటిని । నీవు—సాయంకాలమున 12
మీరు మాంసము తిందురు, ఉదయమున ఆహారము
చేత తృప్తిపొందుదురు, అప్పుడు మీ దేవుడనైన
యెహోవాను నేనే అని మీరు తెలిసికొందురని
వారితో చెప్పుమనెను. । కాగా సాయంకాలమున 13
పూరేడులు వచ్చి వారి పాళెమును కప్పెను, ఉదయ

మున మంచు వారి పాలెముచుట్టు పడియుండెను. ।
14 పడిన ఆ మంచు ఇగిరిపోయిన తరువాత నూగుమంచు
వలె సన్నని కణములు అరణ్యపు భూమిమీద కన
15 బడెను. । ఇశ్రాయేలీయులు దాని చూచినప్పుడు అది
ఏమైనది తెలియక — ఇదేమి అని ఒకరితో ఒకరు
16 చెప్పుకొనిరి. । మోషే—ఇది తినుటకు యెహోవా
మీకిచ్చిన ఆహారము. యెహోవా ఆజ్ఞాపించిన
దేమనగా — ప్రతివాడును తనవారి భోజనమునకు,
ప్రతివాడు తన కుటుంబములోని తలకు ఒక్కొక
ఓమెరుచొప్పున దాని కూర్చుకొనవలెను, ఒక్కొ
కడు తన గుడారములో నున్నవారికొరకు కూర్చు
17 కొనవలెననెను. । ఇశ్రాయేలీయులు అట్లు చేయగా
కొందరు హెచ్చుగాను కొందరు తక్కువగాను కూర్చు
18 కొనిరి. । వారు ఓమెరుతో కొలిచినప్పుడు హె
చ్చుగా కూర్చుకొనినవానికి ఎక్కువగా నుండలేదు,
తక్కువగా కూర్చుకొనినవానికి తక్కువగా నుండ
లేదు. వారు తమ తమ యింటివారి భోజనమునకు
19 సరిగా కూర్చుకొనియుండిరి. । మరియు మోషే —
దీనిలో ఏమియు ఉదయమువరకు ఎవరును మిగుల్చు
20 కొనకూడదని వారితో చెప్పెను. । అయితే వారు
మోషేమాట వినక కొందరు ఉదయ పర్యంతము
దానిలో కొంచెము మిగుల్చుకొనగా అది పురుగుపట్టి
కంపుకొట్టెను. మోషే వారిమీద కోపపడగా ।
21 వారు అనుదినము ఉదయమున ఒక్కొకడు తన
యింటివారి భోజనమునకు తగినట్టుగా కూర్చుకొనిరి.
22 ఎండవేడిమికి అది కరుగును. । ఆరవ దినమున వారు
ఒక్కొకనికి రెండేసి ఓమెరులచొప్పున రెండంతలు
ఆహారము కూర్చుకొనినప్పుడు సమాజముయొక్క అధి
23 కారులందరు వచ్చి అది మోషేకు తెలిపిరి. । అందుకు
అతడు — యెహోవా చెప్పినమాట యిది; రేపు
విశ్రాంతిదినము, అది యెహోవాకు పరిశుద్ధమైన
విశ్రాంతిదినము, మీరు కాల్చుకొనవలసినది కాల్చు
కొనుడి, మీరు వండుకొనవలసినది వండుకొనుడి,
ఉదయము పర్యంతము మిగిలినదంతయు మీకొరకు
24 ఉంచుకొనుడని వారితో చెప్పెను. । మోషే ఆజ్ఞా
పించినట్లు వారు ఉదయము పర్యంతము దానిని
ఉంచుకొనిరి; అది కంపుకొట్టలేదు, దానికి పురుగు
25 పట్టలేదు. । మోషే— నేడు దాని తినుడి; నేటిదినము
యెహోవాకు విశ్రాంతిదినము, నేడు అది బయట
26 దొరకదు. । ఆరు దినములు దాని కూర్చుకొనవలెను,
విశ్రాంతిదినమున అనగా ఏడవ దినమున అది దొరక
27 దనెను. । అట్లు జరిగెను; ప్రజలలో కొందరు ఏడవ
దినమున దాని కూర్చుకొన వెళ్లగా వారికేమియు
28 దొరకకపోయెను. । అందుకు యెహోవా మోషేతో
ఇట్లనెను—మీరు ఎన్నాళ్లవరకు నా ఆజ్ఞలను నా ధర్మ

శాస్త్రమును అనుసరించి నడువనొల్లరు? । చూడుడి 29
నిశ్చయముగా యెహోవా ఈ విశ్రాంతిదినమును
ఆచరించుటకు సెలవిచ్చెను గనుక ఆరవ దినమున
రెండు దినముల ఆహారము మీకనుగ్రహించుచు
న్నాడు. ప్రతివాడును తన తన చోట నిలిచియుండ
వలెను. ఏడవ దినమున ఎవడును తన చోటునుండి
బయలువెళ్లకూడదనెను. । కాబట్టి యేడవ దినమున 30
ప్రజలు విశ్రమించిరి. । ఇశ్రాయేలీయులు దానికి 31
మన్నా అను పేరుపెట్టిరి. అది తెల్లని కొతిమెరగింజ
వలె నుండెను. దాని రుచి తేనెతో కలిపిన అపూ
పములవలె నుండెను. । మరియు మోషే ఇట్లనెను — 32
యెహోవా ఆజ్ఞాపించినదేమనగా—నేను ఐగుప్తుదేశ
మునుండి మిమ్మును బయటికి రప్పించినప్పుడు అరణ్య
ములో తినుటకు నేను మీకిచ్చిన ఆహారమును మీ
వంశస్థులు చూచునట్లు, వారు తమయొద్ద ఉంచుకొను
టకు దానితో ఒక ఓమెరు పట్టు పాత్రను నింపు
డనెను. । కాబట్టి మోషే అహరోనును చూచి—నీవు 33
ఒక గిన్నెను తీసికొని దానిలో ఒక ఓమెరు మన్నాను
పోసి మీ వంశస్థులు తమయొద్ద ఉంచుకొనుటకు
యెహోవా సన్నిధిలో దాని ఉంచుమనెను. ।
యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు ఉంచబడుటకు 34
సాక్ష్యపు మందసము ఎదుట అహరోను దాని
పెట్టెను. । ఇశ్రాయేలీయులు నివసింపవలసిన దేశము 35
నకు తాము వచ్చువరకు నలుబది యేండ్లు మన్నానే
తినుచుండిరి; వారు కనానుదేశపు పొలిమేరలు చేరు
వరకు మన్నాను తినిరి. । ఓమెరు అనగా ఏపాలో[1] 36
దశమభాగము.

తరువాత ఇశ్రాయేలీయుల సర్వసమాజము 17
యెహోవా మాట చొప్పున తమ ప్రయాణములలో
సీను అరణ్యమునుండి ప్రయాణమైపోయి రెఫీదీములో
దిగిరి. ప్రజలు త్రాగుటకు నీళ్లులేనందున । మో 2
షేతో వాదించుచు — త్రాగుటకు మాకు నీళ్లిమ్మని
అడుగగా మోషే — మీరు నాతో వాదింపనేల,
యెహోవాను శోధింపనేల అని వారితో చెప్పెను. ।
అక్కడ ప్రజలు నీళ్లులేక దప్పిగొని మోషేమీద సణు 3
గుచు—ఇదెందుకు? మమ్మును మా పిల్లలను మా పశువు
లను దప్పిచేత చంపుటకు ఐగుప్తులోనుండి ఇక్కడికి తీసి
కొని వచ్చితిరనిరి. । అప్పుడు మోషే యెహోవాకు 4
మొరపెట్టుచు — ఈ ప్రజలను నేనేమి చేయు
దును? కొంతసేపటికి నన్ను రాళ్లతో కొట్టి చంపుదు
రనెను. । అందుకు యెహోవా—నీవు ఇశ్రాయేలీ 5
యుల పెద్దలలో కొందరిని తీసికొని ప్రజలకు ముం
దుగా పొమ్ము; నీవు నదిని కొట్టిన నీ కర్రను చేత
పట్టుకొని పొమ్ము. । ఇదిగో అక్కడ హోరేబులోని 6
బండమీద నేను నీకు ఎదురుగా నిలిచెదను; నీవు ఆ

1 ఏపా ఇంచుమించు రెండుశేరులనర కావచ్చును.

బండను కొట్టగా ప్రజలు త్రాగుటకు దానిలోనుండి
నీళ్లు బయలుదేరునని మోషేతో సెలవియ్యగా మోషే
ఇశ్రాయేలీయుల పెద్దల కన్నుల యెదుట ఆట్లు
7 చేసెను. । అప్పుడు ఇశ్రాయేలీయులు చేసిన వాద
మును బట్టియు, యెహోవా మన మధ్య ఉన్నాడో
లేడో అని వారు యెహోవాను శోధించుటను బట్టి
యు అతడు ఆ చోటికి మస్సా అనియు మెరీబా
అనియు పేర్లు పెట్టెను.
8 తరువాత అమాలేకీయులు వచ్చి రెఫీదీములో
9 ఇశ్రాయేలీయులతో యుద్ధముచేయగా । మోషే
యెహోషువను చూచి—మనకొరకు మనుష్యులను
ఏర్పరచి వారిని తీసికొని బయలువెళ్లి అమాలేకీయు
లతో యుద్ధముచేయుము; రేపు నేను దేవుని కఱ్ఱను
చేత పట్టుకొని ఆ కొండ శిఖరముమీద నిలిచెద
10 ననెను. । యెహోషువ మోషే తనతో చెప్పినట్లు
చేసి అమాలేకీయులతో యుద్ధమాడెను; మోషే, అహ
రోను, హూరు అనువారు ఆ కొండ శిఖర మెక్కిరి. ।
11 మోషే తన చెయ్యి పైకెత్తినప్పుడు ఇశ్రాయేలీయులు
గెలిచిరి; మోషే తన చెయ్యి దింపినప్పుడు అమాలేకీ
12 యులు గెలిచిరి. । మోషే చేతులు బరువెక్కగా
వారు ఒక రాయి తీసికొని వచ్చి అతడు దానిమీద
కూర్చుండుటకై దాని వేసిరి. అహరోను హూరులు
ఒకడు ఈ ప్రక్కను ఒకడు ఆ ప్రక్కను అతని
చేతులను ఆదుకొనగా అతని చేతులు సూర్యుడు అస్త
13 మించువరకు నిలుకడగా ఉండెను. । అట్లు యెహో
షువ కత్తివాడిచేత అమాలేకు రాజును అతని జనులను
14 గెలిచెను. । అప్పుడు యెహోవా మోషేతో నిట్ల
నెను—నేను అమాలేకీయుల పేరు ఆకాశముక్రింద
నుండకుండ బొత్తిగా తుడిచివేయుదును గనుక జ్ఞాప
కార్థముగా గ్రంథములో దీని వ్రాసి యెహోషు
15 వకు వినిపించుము. । తరువాత మోషే ఒక బలిపీఠ
మును కట్టి దానికి యెహోవా నిస్సీ[1] అని పేరుపెట్టి ।
16 —అమాలేకీయులు తమ చెయ్యి యెహోవా సింహా
సనమునకు విరోధముగా ఎత్తిరి గనుక అమాలేకీయు
లతో యెహోవాకు యుద్ధమనెను.[2]

**18** దేవుడు మోషేకును తన ప్రజలైన ఇశ్రాయేలీ
యులకును చేసినదంతయు, యెహోవా ఇశ్రాయేలీ
యులను ఐగుప్తునుండి వెలుపలికి రప్పించిన సంగతియు,
మిద్యాను యాజకుడును మోషే మామయునైన
2 యిత్రో వినినప్పుడు । మోషే మామయైన ఆ
యిత్రో తన యొద్దకు పంపబడిన మోషే భార్యయైన
సిప్పోరాను ఆమె యిద్దరి కుమారులను తోడుకొని
3 వచ్చెను. । అతడు—అన్యదేశములో నేను పరదేశినను
కొని వారిలో ఒకనికి గెర్షోము అని పేరు పెట్టెను ।
4 —నా తండ్రి దేవుడు నాకు సహాయమై ఫరో కత్తి
వాతనుండి నన్ను తప్పించెననుకొని రెండవవానికి ఎలీ
యెజెరని పేరు పెట్టెను. । మోషే మామయైన 5
యిత్రో అతని కుమారులనిద్దరిని అతని భార్యను
తోడుకొని అరణ్యములో దేవుని పర్వతము దగ్గర
దిగిన మోషేయొద్దకు వచ్చెను. । —యిత్రో అను నీ 6
మామనైన నేనును నీ భార్యయు ఆమెతోకూడ ఆమె
యిద్దరు కుమారులును నీ యొద్దకు వచ్చియున్నామని
మోషేకు వర్తమానము పంపగా । మోషే తన మామను 7
ఎదుర్కొనపోయి వందనముచేసి అతని ముద్దుపెట్టు
కొనెను. వారు ఒకరి క్షేమము ఒకరు తెలిసి
కొని గుడారములోకి వచ్చిరి. । తరువాత మోషే 8
యెహోవా ఇశ్రాయేలీయులకొరకు ఫరోకును ఐగుప్తీ
యులకును చేసినదంతయు, త్రోవలో తమకు వచ్చిన
కష్టము యావత్తును, యెహోవా తమ్మును విడిపించిన
సంగతియు తన మామతో వివరించి చెప్పెను. ।
యెహోవా ఐగుప్తీయుల చేతిలోనుండి విడిపించిన 9
ఇశ్రాయేలీయులకు చేసిన మేలంతటినిగూర్చి యిత్రో
సంతోషించెను. । మరియు యిత్రో—ఐగుప్తీయుల 10
చేతిలోనుండియు ఫరో చేతిలోనుండియు మిమ్మును
విడిపించి, ఐగుప్తీయుల చేతిక్రిందనుండి ఈ ప్రజలను
విడిపించిన యెహోవా స్తుతింపబడునుగాక. । ఐగుప్తీ 11
యులు గర్వించి ఇశ్రాయేలీయులమీద చేసిన దౌర్జన్య
మునుబట్టి ఆయన చేసినదాని చూచి, యెహోవా
సమస్త దేవతలకంటె గొప్పవాడని యిప్పుడు నాకు తెలి
సినదనెను. । మరియు మోషే మామయైన యిత్రో ఒక 12
దహనబలిని బలులను దేవునికర్పింపగా అహరోనును
ఇశ్రాయేలీయుల పెద్దలందరును మోషే మామతో
దేవుని సన్నిధిని భోజనము చేయవచ్చిరి. । మరునాడు 13
మోషే ప్రజలకు న్యాయము తీర్చుటకు కూర్చుండగా,
ఉదయము మొదలుకొని సాయంకాలము పర్యంతము
ప్రజలు మోషేయొద్ద నిలిచియుండిరి. । మోషే ప్రజ 14
లకు చేసినదంతయు అతని మామ చూచి—నీవు ఈ
ప్రజలకు చేయుచున్న యీ పని ఏమిటి? ఉదయము
మొదలుకొని సాయంకాలమువరకు నీవు మాత్రము
కూర్చుండగా ప్రజలందరు నీయొద్ద నిలిచి యుండనేల
అని అడుగగా । మోషే—దేవుని తీర్పు తెలిసికొను 15
టకు ప్రజలు నాయొద్దకు వచ్చెదరు. । వారికి వ్యా 16
జ్యము ఏదైనను కలిగినయెడల నా యొద్దకు వచ్చె
దరు. నేను వారి విషయము న్యాయము తీర్చి, దేవుని
కట్టడలను ఆయన ధర్మశాస్త్రవిధులను వారికి తెలుపుచు
న్నానని తన మామతో చెప్పెను. । అందుకు మోషే 17
మామ అతని చూచి—నీవు చేయుచున్న పని మంచిది
కాదు; । నీవును నీతోనున్న యీ ప్రజలును నిశ్చయ 18
ముగా నలిగిపోవుదురు; ఈ పని నీకు మిక్కిలి
భారము, అది నీవు ఒక్కడవే చేయజాలవు. । కాబట్టి 19

[1] అనగా—ధ్వజము.
[2] పాఠాంతరము—తన చెయ్యి యెహోవా సింహాసనము వైపునకునుండి తరతరములవరకు అమాలేకీయులతో యుద్ధమనెను.

మున మంచు వారి పాళెముచుట్టు పడియుండెను. ।
14 పడిన ఆ మంచు ఇగిరిపోయిన తరువాత నూగుమంచు
వలె సన్నని కణములు అరణ్యపు భూమిమీద కన
15 బడెను. । ఇశ్రాయేలీయులు దాని చూచినప్పుడు అది
ఏమైనది తెలియక — ఇదేమి అని ఒకరితో ఒకరు
16 చెప్పుకొనిరి. । మోషే—ఇది తినుటకు యెహోవా
మీకిచ్చిన ఆహారము. యెహోవా ఆజ్ఞాపించిన
దేమనగా — ప్రతివాడును తనవారి భోజనమునకు,
ప్రతివాడు తన కుటుంబములోని తలకు ఒక్కొక
ఓమెరుచొప్పున దాని కూర్చుకొనవలెను, ఒక్కొ
కడు తన గుడారములో నున్నవారికొరకు కూర్చు
17 కొనవలెననెను. । ఇశ్రాయేలీయులు అట్లు చేయగా
కొందరు హెచ్చుగాను కొందరు తక్కువగాను కూర్చు
18 కొనిరి. । వారు ఓమెరుతో కొలిచినప్పుడు హె
చ్చుగా కూర్చుకొనినవానికి ఎక్కువగా నుండలేదు,
తక్కువగా కూర్చుకొనినవానికి తక్కువగా నుండ
లేదు. వారు తమ తమ యింటివారి భోజనమునకు
19 సరిగా కూర్చుకొనియుండిరి. । మరియు మోషే —
దీనిలో ఏమియు ఉదయమువరకు ఎవరును మిగుల్చు
20 కొనకూడదని వారితో చెప్పెను. । అయితే వారు
మోషేమాట వినక కొందరు ఉదయ పర్యంతము
దానిలో కొంచెము మిగుల్చుకొనగా అది పురుగుపట్టి
కంపుకొట్టెను. మోషే వారిమీద కోపపడగా ।
21 వారు అనుదినము ఉదయమున ఒక్కొకడు తన
యింటివారి భోజనమునకు తగినట్టుగా కూర్చుకొనిరి.
22 ఎండవేడిమికి అది కరుగును. । ఆరవ దినమున వారు
ఒక్కొకనికి రెండేసి ఓమెరులచొప్పున రెండంతలు
ఆహారము కూర్చుకొనినప్పుడు సమాజముయొక్క అధి
23 కారులందరు వచ్చి అది మోషేకు తెలిపిరి. । అందుకు
అతడు — యెహోవా చెప్పినమాట యిది; రేపు
విశ్రాంతిదినము, అది యెహోవాకు పరిశుద్ధమైన
విశ్రాంతిదినము, మీరు కాల్చుకొనవలసినది కాల్చు
కొనుడి, మీరు వండుకొనవలసినది వండుకొనుడి,
ఉదయము పర్యంతము మిగిలినదంతయు మీకొరకు
24 ఉంచుకొనుడని వారితో చెప్పెను. । మోషే ఆజ్ఞా
పించినట్లు వారు ఉదయము పర్యంతము దానిని
ఉంచుకొనిరి; అది కంపుకొట్టలేదు, దానికి పురుగు
25 పట్టలేదు. । మోషే—నేడు దాని తినుడి; నేటిదినము
యెహోవాకు విశ్రాంతిదినము, నేడు అది బయట
26 దొరకదు. । ఆరు దినములు దాని కూర్చుకొనవలెను,
విశ్రాంతిదినమున అనగా ఏడవ దినమున అది దొరక
27 దనెను. । అట్లు జరిగెను; ప్రజలలో కొందరు ఏడవ
దినమున దాని కూర్చుకొన వెళ్లగా వారికేమియు
28 దొరకకపోయెను. । అందుకు యెహోవా మోషేతో
ఇట్లనెను—మీరు ఎన్నాళ్లవరకు నా ఆజ్ఞలను నా ధర్మ
శాస్త్రమును అనుసరించి నడువనొల్లరు? । చూడుడి 29
నిశ్చయముగా యెహోవా ఈ విశ్రాంతిదినమును
ఆచరించుటకు సెలవిచ్చెను గనుక ఆరవ దినమున
రెండు దినముల ఆహారము మీకను గ్రహించుచు
న్నాడు. ప్రతివాడును తన తన చోట నిలిచియుండ
వలెను. ఏడవ దినమున ఎవడును తన చోటనుండి
బయలువెళ్లకూడదనెను. । కాబట్టి యేడవ దినమున 30
ప్రజలు విశ్రమించిరి. । ఇశ్రాయేలీయులు దానికి 31
మన్నా అను పేరుపెట్టిరి. అది తెల్లని కొత్తిమెర గింజ
వలె నుండెను. దాని రుచి తేనెతో కలిపిన అప్పడ
ములవలె నుండెను. । మరియు మోషే ఇట్లనెను — 32
యెహోవా ఆజ్ఞాపించినదేమనగా—నేను ఐగుప్తుదేశ
మునుండి మిమ్మును బయటికి రప్పించినప్పుడు అరణ్య
ములో తినుటకు నేను మీకిచ్చిన ఆహారమును మీ
వంశస్థులు చూచునట్లు, వారు తమయొద్ద ఉంచుకొను
టకు దానితో ఒక ఓమెరు పట్టు పాత్రను నింపు
డనెను. । కాబట్టి మోషే అహరోనును చూచి—నీవు 33
ఒక గిన్నెను తీసికొని దానిలో ఒక ఓమెరు మన్నాను
పోసి మీ వంశస్థులు తమయొద్ద ఉంచుకొనుటకు
యెహోవా సన్నిధిలో దాని ఉంచుమనెను. ।
యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు ఉంచబడుటకు 34
సాక్ష్యపు మందసము ఎదుట అహరోను దాని
పెట్టెను. । ఇశ్రాయేలీయులు నివసింపవలసిన దేశము 35
నకు తాము వచ్చువరకు నలుబది యేండ్లు మన్నా నే
తినుచుండిరి; వారు కనానుదేశపు పొలిమేరలు చేరు
వరకు మన్నాను తినిరి. । ఓమెరు అనగా ఏపాలో[1] 36
దశమభాగము.

తరువాత ఇశ్రాయేలీయుల సర్వసమాజము **17**
యెహోవా మాట చొప్పున తమ ప్రయాణములలో
సీను అరణ్యమునుండి ప్రయాణమైపోయి రెఫీదీములో
దిగిరి. ప్రజలు త్రాగ నీళ్లులేనందున । మో 2
షేతో వాదించుచు — త్రాగుటకు మాకు నీళ్లిమ్మని
అడుగగా మోషే — మీరు నాతో వాదింపనేల,
యెహోవాను శోధింపనేల అని వారితో చెప్పెను. ।
అక్కడ ప్రజలు నీళ్లులేక దప్పిగొని మోషేమీద సణు 3
గుచు—ఇదెందుకు? మమ్మును మా పిల్లలను మా పశువు
లను దప్పిచేత చంపుటకు ఐగుప్తులోనుండి ఇక్కడికి తీసి
కొని వచ్చితిరనిరి. । అప్పుడు మోషే యెహోవాకు 4
మొరపెట్టుచు — ఈ ప్రజలను నేనేమి చేయు
దును? కొంతసేపటికి నన్ను రాళ్లతో కొట్టి చంపుదు
రనెను. । అందుకు యెహోవా—నీవు ఇశ్రాయేలీ 5
యుల పెద్దలలో కొందరిని తీసికొని ప్రజలకు ముం
దుగా పొమ్ము; నీవు నదిని కొట్టిన నీ కఱ్ఱను చేత
పట్టుకొని పొమ్ము. । ఇదిగో అక్కడ హోరేబులోని 6
బండమీద నేను నీకు ఎదురుగా నిలిచెదను; నీవు ఆ

[1] ఏపా ఇంచుమించు రెండుశేరులనర కావచ్చును.

బండను కొట్టగా ప్రజలు త్రాగుటకు దానిలోనుండి
నీళ్లు బయలుదేరునని మోషేతో సెలవియ్యగా మోషే
ఇశ్రాయేలీయుల పెద్దల కన్నుల యెదుట అట్లు
7 చేసెను. । అప్పుడు ఇశ్రాయేలీయులు చేసిన వాద
మును బట్టియు, యెహోవా మన మధ్య ఉన్నాడో
లేడో అని వారు యెహోవాను శోధించుటను బట్టి
యు అతడు ఆ చోటికి మస్సా అనియు మెరీబా
అనియు పేర్లు పెట్టెను.
8 తరువాత అమాలేకీయులు వచ్చి రెఫీదీములో
9 ఇశ్రాయేలీయులతో యుద్ధముచేయగా । మోషే
యెహోషువను చూచి—మనకొరకు మనుష్యులను
ఏర్పరచి వారిని తీసికొని బయలువెళ్లి అమాలేకీయు
లతో యుద్ధముచేయుము; రేపు నేను దేవుని కఱ్ఱను
చేత పట్టుకొని ఆ కొండ శిఖరముమీద నిలిచెద
10 ననెను. । యెహోషువ మోషే తనతో చెప్పినట్లు
చేసి అమాలేకీయులతో యుద్ధమాడెను; మోషే, అహ
రోను, హూరు అనువారు ఆ కొండ శిఖర మెక్కిరి. ।
11 మోషే తన చెయ్యి పైకెత్తినప్పుడు ఇశ్రాయేలీయులు
గెలిచిరి; మోషే తన చెయ్యి దింపినప్పుడు అమాలేకీ
12 యులు గెలిచిరి. । మోషే చేతులు బరువెక్కగా
వారు ఒక రాయి తీసికొని వచ్చి అతడు దానిమీద
కూర్చుండుటకై దాని వేసిరి. అహరోను హూరులు
ఒకడు ఈ ప్రక్కను ఒకడు ఆ ప్రక్కను అతని
చేతులను ఆదుకొనగా అతని చేతులు సూర్యుడు అస్త
13 మించువరకు నిలుకడగా ఉండెను. । అట్లు యెహో
షువ కత్తివాడిచేత అమాలేకు రాజును అతని జనులను
14 గెలిచెను. । అప్పుడు యెహోవా మోషేతో నిట్ల
నెను—నేను అమాలేకీయుల పేరు ఆకాశము క్రింద
నుండకుండ బొత్తిగా తుడిచివేయుదును గనుక జ్ఞాప
కార్థముగా గ్రంథములో దీని వ్రాసి యెహోషు
15 వకు వినిపించుము. । తరువాత మోషే ఒక బలిపీఠ
మును కట్టి దానికి యెహోవా నిస్సీ[1] అని పేరుపెట్టి ।
16 —అమాలేకీయులు తమ చెయ్యి యెహోవా సింహా
సనమునకు విరోధముగా ఎత్తిరి గనుక అమాలేకీయు
లతో యెహోవాకు యుద్ధమనెను.[2]

18 దేవుడు మోషేకును తన ప్రజలైన ఇశ్రాయేలీ
యులకును చేసినదంతయు, యెహోవా ఇశ్రాయేలీ
యులను ఐగుప్తునుండి వెలుపలికి రప్పించిన సంగతియు,
మిద్యాను యాజకుడును మోషే మామయునైన
2 యిత్రో వినినప్పుడు । మోషే మామయైన ఆ
యిత్రో తన యొద్దకు పంపబడిన మోషే భార్యయైన
సిప్పోరాను ఆమె యిద్దరి కుమారులను తోడుకొని
3 వచ్చెను. । అతడు—అన్యదేశములో నేను పరదేశినను
కొని వారిలో ఒకనికి గెర్షోము అని పేరు పెట్టెను ।
4 —నా తండ్రి దేవుడు నాకు సహాయమై ఫరో కత్తి
వాతనుండి నన్ను తప్పించెననుకొని రెండవవానికి ఎలీ
యెజెరని పేరు పెట్టెను. । మోషే మామయైన 5
యిత్రో అతని కుమారులనిద్దరిని అతని భార్యను
తోడుకొని అరణ్యములో దేవుని పర్వతము దగ్గర
దిగిన మోషేయొద్దకు వచ్చెను. । —యిత్రో అను నీ 6
మామనైన నేనును నీ భార్యయు ఆమెతోకూడ ఆమె
యిద్దరు కుమారులును నీ యొద్దకు వచ్చియున్నామని
మోషేకు వర్తమానము పంపగా । మోషే తన మామను 7
ఎదుర్కొనపోయి వందనముచేసి అతని ముద్దుపెట్టు
కొనెను. వారు ఒకరి క్షేమము ఒకరు తెలిసి
కొని గుడారములోకి వచ్చిరి. । తరువాత మోషే 8
యెహోవా ఇశ్రాయేలీయులకొరకు ఫరోకును ఐగుప్తీ
యులకును చేసినదంతయు, త్రోవలో తమకు వచ్చిన
కష్టము యావత్తును, యెహోవా తమ్మును విడిపించిన
సంగతియు తన మామతో వివరించి చెప్పెను. ।
యెహోవా ఐగుప్తీయుల చేతిలోనుండి విడిపించిన 9
ఇశ్రాయేలీయులకు చేసిన మేలంతటినిగూర్చి యిత్రో
సంతోషించెను. । మరియు యిత్రో—ఐగుప్తీయుల 10
చేతిలోనుండియు ఫరో చేతిలోనుండియు మిమ్మును
విడిపించి, ఐగుప్తీయుల చేతి క్రిందనుండి ఈ ప్రజలను
విడిపించిన యెహోవా స్తుతింపబడునుగాక. । ఐగుప్తీ 11
యులు గర్వించి ఇశ్రాయేలీయులమీద చేసిన దౌర్జన్య
మునుబట్టి ఆయన చేసినదాని చూచి, యెహోవా
సమస్త దేవతలకంటె గొప్పవాడని యిప్పుడు నాకు తెలి
సినదనెను. । మరియు మోషే మామయైన యిత్రో ఒక 12
దహనబలిని బలులను దేవునికర్పింపగా అహరోనును
ఇశ్రాయేలీయుల పెద్దలందరును మోషే మామతో
దేవుని సన్నిధిని భోజనము చేయవచ్చిరి. । మరునాడు 12
మోషే ప్రజలకు న్యాయము తీర్చుటకు కూర్చుండగా,
ఉదయము మొదలుకొని సాయంకాలము పర్యంతము
ప్రజలు మోషేయొద్ద నిలిచియుండిరి. । మోషే ప్రజ 14
లకు చేసినదంతయు అతని మామ చూచి—నీవు ఈ
ప్రజలకు చేయుచున్న యీ పని ఏమిటి? ఉదయము
మొదలుకొని సాయంకాలమువరకు నీవు మాత్రము
కూర్చుండగా ప్రజలందరు నీయొద్ద నిలిచి యుండనేల
అని అడుగగా । మోషే—దేవుని తీర్పు తెలిసికొనుట 15
టకు ప్రజలు నాయొద్దకు వచ్చెదరు. । వారికి వ్యా 16
జ్యము ఏదైనను కలిగినయెడల నా యొద్దకు వచ్చె
దరు. నేను వారి విషయము న్యాయము తీర్చి, దేవుని
కట్టడలను ఆయన ధర్మశాస్త్రవిధులను వారికి తెలుపుచు
న్నానని తన మామతో చెప్పెను. । అందుకు మోషే 17
మామ అతని చూచి—నీవు చేయుచున్న పని మంచిది
కాదు; । నీవును నీతోనున్న యీ ప్రజలును నిశ్చయ 18
ముగా నలిగిపోవుదురు; ఈ పని నీకు మిక్కిలి
భారము, అది నీవు ఒక్కడవే చేయజాలవు. । కాబట్టి 19

[1] అనగా—ధ్వజము.
[2] పాఠాంతరము—తన చెయ్యి యెహోవా సింహాసనము వైపునను౦చి తరతరములవరకు అమాలేకీయులతో యుద్ధమనెను.

నా మాట వినుము. నేను నీకొక ఆలోచన చెప్పె
దను. దేవుడు నీకు తోడైయుండును, ప్రజల పక్ష
మున నీవు దేవుని సన్నిధియందు ఉండి వారి వ్యాజ్య
20 ములను దేవునియొద్దకు తేవలెను. । నీవు వారికి ఆయన
కట్టడలను ధర్మశాస్త్రవిధులను బోధించి, వారు నడవవల
సిన త్రోవను వారు చేయవలసిన కార్యములను వారికి
21 తెలుపవలెను. । మరియు నీవు ప్రజలందరిలో సామ
ర్థ్యము దైవభక్తి సత్యాసక్తి కలిగి, లంచ గొండులుకాని
మనుష్యులను ఏర్పరచుకొని, వేయిమందికి ఒకనిగాను,
నూరుమందికి ఒకనిగాను, ఏబదిమందికి ఒకనిగాను,
పదిమందికి ఒకనిగాను, వారిమీద న్యాయాధిపతులను
22 నియమింపవలెను. । వారు ఎల్లప్పుడును ప్రజలకు
న్యాయము తీర్చవలెను. అయితే గొప్ప వ్యాజ్యము
లన్నిటిని నీయొద్దకు తేవలెను. ప్రతి అల్పవిషయ
మును వారే తీర్చవచ్చును. అట్లు వారు నీతోకూడ
ఈ భారమును మోసినయెడల నీకు సుళువుగా
23 ఉండును. । దేవుడు ఈలాగు చేయుటకు నీకు సెల
విచ్చిన పక్షమందు నీవు ఈ పనిచేయుచు దాని భార
మును సహింపగలవు. మరియు ఈ ప్రజలందరు
తమ తమ చోట్లకు సమాధానముగా వెళ్లుదురని
24 చెప్పెను. । మోషే తన మామమాట విని అతడు
25 చెప్పినదంతయు చేసెను. । ఇశ్రాయేలీయులందరిలో
సామర్థ్యముగల మనుష్యులను ఏర్పరచుకొని, వెయ్యి
మందికి ఒకనిగాను, నూరుమందికి ఒకనిగాను, ఏబది
మందికి ఒకనిగాను, పదిమందికి ఒకనిగాను, న్యాయా
ధిపతులను ఏర్పాటుచేసి వారిని ప్రజలమీద ప్రధా
26 నులనుగా నియమించెను. । వారెల్లప్పుడును ప్రజలకు
న్యాయము తీర్చువారు. వారు కఠిన వ్యాజ్యములను
మోషేయొద్దకు తెచ్చుచు స్వల్పవ్యాజ్యములను తామే
27 తీర్చుచువచ్చిరి. । తరువాత మోషే తన మామను పంపి
వేయగా అతడు తన స్వదేశమునకు వెళ్లెను.

**19** ఇశ్రాయేలీయులు ఐగుప్తు దేశమునుండి బయలు
దేరిన మూడవ నెలలో, వారు బయలుదేరిననాడే మూ
డవ నెల ఆరంభదినమందే, వారు సీనాయి అరణ్యము
2 నకు వచ్చిరి. । వారు రెఫీదీమునుండి బయలుదేరి సీనాయి
అరణ్యమునకు వచ్చి ఆ అరణ్యమందు దిగిరి. అక్కడ
ఆ పర్వతము ఎదుట ఇశ్రాయేలీయులు విడిసిరి. ।
3 మోషే దేవునియొద్దకు ఎక్కిపోవగా యెహోవా ఆ
పర్వతమునుండి అతని పిలిచి–నీవు యాకోబు కుటుంబి
కులతో ముచ్చటించి ఇశ్రాయేలీయులకు తెలుపవలసిన
4 దేమనగా । –నేను ఐగుప్తీయులకు ఏమి చేసితినో,
మిమ్మును గద్దరెక్కలమీద మోసి నా యొద్దకు మిమ్ము
5 నెట్లు చేర్చుకొంటినో మీరు చూచితిరి. । కాగా
మీరు నా మాట శ్రద్ధగా విని నా నిబంధన ననుస
రించి నడిచిన పక్షమందు మీరు సమస్తదేశ జనములలో
6 నాకు స్వకీయ సంపాద్యమగుదురు. । సమస్తభూమియు
నాదేగదా. మీరు నాకు యాజక రూపమైన రాజ్య
ముగాను పరిశుద్ధమైన జనముగాను ఉందురని చెప్పు
ము; నీవు ఇశ్రాయేలీయులతో పలుకవలసిన మాటలు
ఇవే అని చెప్పగా । మోషే వచ్చి ప్రజల పెద్దలను 7
పిలిపించి యెహోవా తన కాజ్ఞాపించిన ఆ మాట
లన్నియు వారియెదుట తెలియపరచెను. । అందుకు 8
ప్రజలందరు — యెహోవా చెప్పినదంతయు చేసెద
మని యేకముగా ఉత్తరమిచ్చిరి. అప్పుడు మోషే
తిరిగి వెళ్లి ప్రజలమాటలను యెహోవాకు తెలియ
చేసెను. । యెహోవా మోషేను చూచి — ఇదిగో 9
నేను నీతో మాటలాడునప్పుడు ప్రజలు విని నిరంత
రము నీయందు నమ్మకముంచునట్లు నేను కారుమబ్బు
లలో నీయొద్దకు వచ్చెదనని చెప్పెను. మోషే ప్రజల
మాటలను యెహోవాతో చెప్పగా । యెహోవా 10
మోషేను చూచి—నీవు ప్రజలయొద్దకు వెళ్లి నేడును
రేపును వారిని పరిశుద్ధపరపుము; వారు తమ బట్టలు
ఉదుకుకొని । మూడవనాటికి సిద్ధముగా నుండవలెను; 11
మూడవనాడు యెహోవా ప్రజలందరి కన్నుల
ఎదుట సీనాయి పర్వతముమీదికి దిగి వచ్చును. । నీవు 12
చుట్టు ప్రజలకు మేరను ఏర్పరచి–మీరు ఈ పర్వతము
ఎక్కవద్దు, దాని అంచును ముట్టవద్దు భద్రము సుమీ,
ఈ పర్వతము ముట్టు ప్రతివానికి మరణశిక్ష తప్పక
విధింపబడవలెను. । ఎవడును చేతితో దాని ముట్ట 13
కూడదు, ముట్టినవాడు రాళ్లతో కొట్టబడవలెను లేక
పొడవబడవలెను, మనుష్యుడుగాని మృగముగాని
బ్రదుకకూడదు; బూరధ్వని చేయునప్పుడు వారు
పర్వతము ఎక్కవలెనననెను. । అప్పుడు మోషే పర్వ 14
తముమీదనుండి ప్రజలయొద్దకు దిగి వచ్చి ప్రజలను
పరిశుద్ధపరపగా వారు తమ బట్టలను ఉదుకుకొనిరి. ।
అప్పుడతడు—మూడవ నాటికి సిద్ధముగానుండుడి; ఏ 15
పురుషుడును స్త్రీని చేరకూడదని చెప్పెను. । మూడవ 16
నాడు ఉదయమైనప్పుడు ఆ పర్వతముమీద ఉరు
ములు మెరుపులు సాంద్రమేఘము బూరయొక్క
మహాధ్వనియు కలుగగా పాళెములోని ప్రజలందరు
వణకిరి. । దేవునిని ఎదుర్కొనుటకు మోషే పాళెము 17
లోనుండి ప్రజలను అవతలకు రప్పింపగా వారు పర్వ
తము దిగువను నిలిచిరి. । యెహోవా అగ్నితో 18
సీనాయి పర్వతముమీదికి దిగి వచ్చినందున అదంతయు
ధూమమయమై యుండెను. దాని ధూమము కొలిమి
ధూమమువలె లేచెను, పర్వతమంతయు మిక్కిలి కంపిం
చెను. । ఆ బూరధ్వని అంతకంతకు బిగ్గరగా మ్రోగెను. 19
మోషే మాటలాడుచుండగా దేవుడు కంఠస్వరము
చేత అతనికి ఉత్తరమిచ్చుచుండెను. । యెహోవా 20
సీనాయి పర్వతముమీదికి, అనగా ఆ పర్వత శిఖ
రముమీదికి దిగి వచ్చెను. యెహోవా పర్వత శిఖ
రముమీదికి రమ్మని మోషేను పిలువగా మోషే ఎక్కి

ోయెను. । అప్పుడు యెహోవా—ప్రజలు చూచు
కు యెహోవా యొద్దకు హద్దుమీరి వచ్చి వారిలో
నేకులు నశింపకుండునట్లు నీవు దిగిపోయి వారికి
ండితముగా ఆజ్ఞాపించుము. । మరియు యెహోవా
రిమీద పడకుండునట్లు యెహోవా యొద్దకు చేరు
ాజకులు తమ్మును తామే పరిశుద్ధపరచుకొనవలెనని
ాషేతో చెప్పగా । మోషే యెహోవాతో—
జలు సీనాయి పర్వతము ఎక్కలేరు. నీవు—పర్వ
ునకు మేరలను ఏర్పరచి దాని పరిశుద్ధపరచవలెనని
కు ఖండితముగా ఆజ్ఞాపించితివనెను. । అందుకు
ెహోవా—నీవు దిగి వెళ్లుము, నీవును నీతో అహ
ోనును ఎక్కి రావలెను. అయితే యెహోవా
రిమీద పడకుండునట్లు యాజకులును ప్రజలును
ునయొద్దకు వచ్చుటకు మేరను మీరకూడదు;
ున వారిమీద పడునేమో అని అతనితో చెప్ప
। మోషే ప్రజల యొద్దకు వెళ్లి ఆ మాట వారితో
ప్పెను.

**దే**వుడు ఈ ఆజ్ఞలన్నియు వివరించి చెప్పెను ।
నీ దేవుడనైన యెహోవాను నేనే; నేనే దాసుల
హమైన ఐగుప్తుదేశములోనుండి నిన్ను వెలుపలికి
ప్పించితిని; । నేను తప్ప వేరొక దేవుడు నీకు ఉండ
ాడదు.
పైన ఆకాశమందేగాని క్రింది భూమియందేగాని
ామిక్రింద నీళ్లయందేగాని యుండు దేని రూపము
ునను విగ్రహమునయినను నీవు చేసికొనకూడదు;
టికి సాగిలపడకూడదు వాటిని పూజింపకూడదు. ।
యనగా నీ దేవుడనైన యెహోవానగు నేను
ోషముగల దేవుడను; నన్ను ద్వేషించువారి విషయ
లో మూడు నాలుగు తరముల పర్యంతము, తం
ల దోషమును కుమారులమీదికి రప్పించుచు ।
్ను ప్రేమించి నా ఆజ్ఞలు గైకొనువారిని వెయ్యి
ముల పర్యంతము కరుణించువాడనై యున్నాను.
నీ దేవుడైన యెహోవా నామమును వ్యర్థముగా
చ్చరింపకూడదు; యెహోవా తన నామమును
ర్థముగా నుచ్చరింపువానిని నిర్దోషిగా ఎంచడు.
విశ్రాంతిదినమును పరిశుద్ధదినముగా ఆచరించు
కు జ్ఞాపకముంచుకొనుము. । ఆరు దినములు నీవు
పడి నీ పని అంతయు చేయవలెను. । ఏడవ దినము
దేవుడైన యెహోవాకు విశ్రాంతిదినము. దానిలో
నను నీ కుమారుడైనను నీ కుమార్తెయైనను నీ దాసు
నను నీ దాసియైనను నీ పశువైనను నీ యిండ్లలో
్న పరదేశియైనను ఏపనియు చేయకూడదు. । ఆరు
ములలో యెహోవా ఆకాశమును భూమియు
ుద్రమును వాటిలోని సమస్తమును సృజించి, యేడవ
మున విశ్రమించెను; అందుచేతను యెహోవా
్రాంతి దినమును ఆశీర్వదించి దాని పరిశుద్ధపరచెను.

నీ దేవుడైన యెహోవా నీకను గ్రహించు దేశ 12
ములో నీవు దీర్ఘాయుష్మంతుడవగునట్లు నీ తండ్రిని నీ
తల్లిని సన్మానించుము.
నరహత్య చేయకూడదు. 13
వ్యభిచరింపకూడదు. 14
దొంగిలకూడదు. 15
నీ పొరుగువానిమీద అబద్ధసాక్ష్యము పలుక 16
కూడదు.
నీ పొరుగువాని యిల్లు ఆశింపకూడదు. 17
నీ పొరుగువాని భార్యనైనను అతని దాసునైనను
అతని దాసినైనను అతని యెద్దునైనను అతని గాడిదె
నైనను నీ పొరుగువానిదగు దేనినైనను ఆశింపకూడదు.
ప్రజలందరు ఆ ఉరుములు ఆ మెరుపులు ఆ 18
బూరధ్వనియు ఆ పర్వతధూమమును చూచిరి. ప్రజలు
చూచి తొలగి దూరముగా నిలిచి మోషేతో ఇట్లనిరి ।
—నీవు మాతో మాటలాడుము మేము విందుము; 19
దేవుడు మాతో మాటలాడినయెడల మేము చనిపోవు
దుము । అందుకు మోషే—భయపడకుడి; మిమ్ము పరీ 20
క్షించుటకును, మీరు పాపము చేయకుండునట్లు
ఆయన భయము మీకు కలుగుటకును, దేవుడు వేం
చేసెనని ప్రజలతో చెప్పెను.
ప్రజలు దూరముగా నిలిచిరి. మోషే దేవుడున్న 21
ఆ గాఢాంధకారమునకు సమీపింపగా । యెహోవా 22
మోషేతో ఇట్లనెను—ఇశ్రాయేలీయులతో ఈలాగు
చెప్పుము — నేను ఆకాశమునుండి మీతో మాట
లాడితినని మీరు గ్రహించితిరి. । మీరు నన్ను 23
కొలుచుచు, వెండి దేవతలనైనను బంగారు దేవతల
నైనను చేసికొనకూడదు. । మంటి బలిపీఠమును నా 24
కొరకు చేసి, దానిమీద నీ దహనబలులను సమాధాన
బలులను నీ గొఱ్ఱెలను నీ యెద్దులను అర్పింపవలెను.
నేను నా నామమును జ్ఞాపకార్థముగా నుంచు ప్రతి
స్థలములోను నీయొద్దకు వచ్చి నిన్ను ఆశీర్వదించెదను. ।
నీవు నాకు రాళ్లతో బలిపీఠమును చేయునప్పుడు 25
మలిచిన రాళ్లతో దాని కట్టకూడదు; దానికి నీ పని
ముట్టు తగలనిచ్చిన పక్షమున అది అపవిత్రమగును. ।
మరియు నా బలిపీఠముమీద నీ దిగంబరత్వము కన 26
బడక యుండునట్లు మెట్లమీదుగా దానిని ఎక్క
కూడదు.

నీవు వారికి నియమింపవలసిన న్యాయవిధు లేవ **21**
నగా । —నీవు హెబ్రీయుడైన దాసుని కొనినయెడల 2
వాడు ఆరు సంవత్సరములు దాసుడై యుండి యేడవ
సంవత్సరమున ఏమియు ఇయ్యకయే నిన్ను విడిచి
స్వతంత్రుడగును. । వాడు ఒంటిగా వచ్చినయెడల 3
ఒంటిగానే వెళ్లవచ్చును. వానికి భార్య యుండిన
యెడల వాని భార్య వానితోకూడ వెళ్లవచ్చును. ।
వాని యజమానుడు వానికి భార్యనిచ్చిన తరువాత 4

ఆమ్మె వానివలన కుమారులనైనను కుమార్తెలనైనను
కనినపక్షమందు ఆ భార్యయు ఆమె పిల్లలును ఆమె
యజమానుని సొత్తగుదురుకాని వాడు ఒంటిగానే
5 పోవలెను. । అయితే ఆ దాసుడు — నేను నా యజ
మానుని నా భార్యను నా పిల్లలను ప్రేమించుచున్నా
ను; నేను వారిని విడిచి స్వతంత్రుడనై పోనొల్లనని
6 నిజముగా చెప్పినయెడల । వాని యజమానుడు న్యా
యాధిపతుల[1] యొద్దకు వాని తీసికొని రావలెను,
మరియు వాని యజమానుడు తలుపునొద్దకైనను ద్వార
బంధమునొద్దకైనను వాని తోడుకొనిపోయి వాని
చెవిని కదురుతో గుచ్చవలెను. తరువాత వాడు నిరం
తరము వానికి దాసుడైయుండును.
7 ఒకడు తన కుమార్తెను దాసిగా అమ్మినయెడల
దాసులైన పురుషులు వెళ్లిపోవునట్లు అది వెళ్లిపోకూ
డదు. । దాని ప్రధానము చేసికొనిన యజమానుని
8 దృష్టికి అది యిష్టురాలు కానియెడల వేరొకడు దాని
విడిపించుటకు అవకాశము నియ్యవలెను; దాని వం
చించినందున అన్యజనులకు దాని అమ్ముటకు వానికి
9 అధికారము లేదు. । తన కుమారునికి దాని ప్రధానము
చేసినయెడల కుమార్తెల విషయమైన న్యాయవిధినిబట్టి
10 దానియెడల జరిగింపవలెను. । ఆ కుమారుడు వేరొక
దాని చేర్చుకొనినను, మొదటిదానికి ఆహారమును
వస్త్రమును సంసారధర్మమును తక్కువ చేయకూడదు. ।
11 ఈ మూడును దానికి కలుగజేయని పక్షమందు అది
ఏమియు ఇయ్యక స్వతంత్రురాలై పోవచ్చును.
12 నరుని చావగొట్టినవానికి నిశ్చయముగా మరణ
13 శిక్ష విధింపవలెను. । అయితే వాడు చంపవలెనని
పొంచియుండకయే దైవికముగా వానిచేత ఆ హత్య
జరిగినయెడల వాడు పారిపోగల యొక స్థలమును
నీకు నిర్ణయించెదను.
14 అయితే ఒకడు తన పొరుగువానిమీద దౌర్జన్య
ముగావచ్చి కపటముగా చంప లేచినయెడల వాడు
నా బలిపీఠము నాశ్రయించినను వాని లాగివేసి చంప
వలెను.
15 తన తండ్రినైనను తల్లినైనను కొట్టువాడు నిశ్చయ
ముగా మరణశిక్ష నొందును.
16 ఒకడు నరుని దొంగిలించి అమ్మినను, తనయొద్ద
నుంచుకొనినను, వాడు నిశ్చయముగా మరణశిక్ష
నొందును.
17 తన తండ్రినైనను తల్లినైనను శపించువాడు నిశ్చ
యముగా మరణశిక్ష నొందును.
18 మనుష్యులు పోట్లాడుచుండగా ఒకడు తన పొరు
గువానిని రాతితోనైనను పిడికిటితోనైనను గుద్దుట
వలన వాడు చావక మంచముమీద పడియుండి ।
19 తరువాత లేచి తన చేతికఱ్ఱతో బయటికి వెళ్లి తిరు
గుచుండినయెడల, వాని కొట్టినవానికి శిక్ష విధింప
బడదుగాని అతడు పనిచేయలేని కాలమునకు తగిన
సొమ్ము ఇచ్చి వాడు అతనిని పూర్తిగా బాగుచేయింప
వలెను.
ఒకడు తన దాసునైనను తన దాసినైనను చచ్చు 20
నట్లు కఱ్ఱతో కొట్టినయెడల అతడు నిశ్చయముగా
ప్రతిదండన నొందును. । అయితే వాడు ఒకటి రెండు 21
దినములు బ్రదికినయెడల ఆ ప్రతిదండన అతడు
పొందడు, వాడు అతని సొమ్మేగదా. । నరులు పోట్లా 22
డుచుండగా గర్భవతియైన స్త్రీకి దెబ్బతగిలి ఆమెకు
గర్భపాతమేకాక మరి ఏ హానియు రానియెడల హాని
చేసినవాడు ఆ స్త్రీ పెనిమిటి వానిమీద మోపిన నష్ట
మును అచ్చుకొనవలెను. న్యాయాధిపతులు తీర్మానించి
నట్లు దాని చెల్లింపవలెను. । హాని కలిగినయెడల నీవు 23
ప్రాణమునకు ప్రాణము కంటికి కన్ను పంటికి పల్లు 24
చేతికి చెయ్యి కాలికి కాలు । వాతకు వాత గాయము 25
నకు గాయము దెబ్బకు దెబ్బయు నియమింపవలెను.
ఒకడు తన దాసుని కన్నైనను తన దాసి కన్నై 26
నను పోగొట్టినయెడల ఆ కంటి హానినిబట్టి వానిని
స్వతంత్రులుగా పోనియ్యవలెను. । వాడు తన దాసుని 27
పల్లయినను తన దాసి పల్లయినను ఊడగొట్టినయెడల
ఆ పంటి నిమిత్తము వారిని స్వతంత్రులుగా పోనియ్య
వలెను.
ఎద్దు పురుషునైనను స్త్రీనైనను చావపొడిచినయెడల 28
నిశ్చయముగా రాళ్లతో ఆ యెద్దును చావగొట్టవలెను.
దాని మాంసమును తినకూడదు, అయితే ఆ యెద్దు
యజమానుడు నిర్దోషియగును. । ఆ యెద్దు అంతకు 29
ముందు పొడుచునది అని దాని యజమానునికి తెలు
పబడినను, వాడు దాని భద్రము చేయకుండుటవలన
అది పురుషునైనను స్త్రీనైనను చంపినయెడల ఆ యెద్దును
రాళ్లతో చావగొట్టవలెను; దాని యజమానుడు మరణ
శిక్ష నొందవలెను. । వానికి పరిక్రయ ధనము నియ 30
మింపబడినయెడల వానికి నియమింపబడిన అన్నిటి
ప్రకారము తన ప్రాణవిమోచన నిమిత్తము ధనము
చెల్లింపవలెను. । అది కుమారుని పొడిచినను కుమార్తెను 31
పొడిచినను ఈ విధి చొప్పున అతడు చేయవలెను. ।
ఆ యెద్దు దాసునినైనను దాసినైనను పొడిచినయెడల 32
వారి యజమానునికి ముప్పది తులముల వెండి చెల్లింప
వలెను, మరియు ఆ యెద్దును రాళ్లతో చావగొట్టవలెను.
ఒకడు గోతిమీది కప్పు తీయుటవలన, లేక ఒకడు 33
గొయ్యి త్రవ్వి దాని కప్పకపోవుటవలన, దానిలో
ఎద్దయినను గాడిదయైనను పడిన పక్షమున । ఆ గోతి 34
ఖామందులు ఆ నష్టమును అచ్చుకొనవలెను; వాటి
యజమానునికి సొమ్ము ఇయ్యవలెను; చచ్చినది వాని
దగును.

1 దేవ, దేవుని.

35 ఒకని యెద్దు వేరొకని యెద్దు చచ్చునట్లు దాని
పొడిచినయెడల బ్రదికియున్న యెద్దును అమ్మి దాని
విలువను పంచుకొనవలెను, చచ్చిన యెద్దును పంచు
36 కొనవలెను. ౹ అయితే అంతకు ముందు ఆ యెద్దు
పొడుచునది అని తెలియబడియు దాని యజమానుడు
దాని భద్రము చేయనివాడైతే వాడు నిశ్చయముగా
ఎద్దుకు ఎద్దునియ్యవలెను; చచ్చినది వానిదగును.

22 ఒకడు ఎద్దునైనను గొఱ్ఱెనైనను దొంగిలించి
దాని అమ్మినను చంపినను ఆ యెద్దుకు ప్రతిగా అయి
దు ఎద్దులను ఆ గొఱ్ఱెకు ప్రతిగా నాలుగు గొఱ్ఱెల
2 ఇయ్యవలెను. ౹ దొంగ కన్నము వేయుచుండగా వాడు
దొరికి చచ్చునట్లు కొట్టబడినయెడల అందువలన రక్తా
3 పరాధముండదు. ౹ సూర్యుడు ఉదయించిన తరువాత
వాని కొట్టినయెడల వానికి రక్తాపరాధముండును;
వాడు సరిగా సొమ్ము మరల చెల్లింపవలెను. వానికే
మియు లేకపోయినయెడల వాడు దొంగతనము చేసి
4 నందున అమ్మబడవలెను. ౹ వాడు దొంగిలినది ఎద్దయి
నను గాడిదెయైనను గొఱ్ఱెయైనను సరే అది ప్రాణ
ముతో వానియొద్ద దొరికినయెడల రెండంతలు చెల్లిం
పవలెను.

5 ఒకడు చేనునైనను ద్రాక్షతోటనైనను మేపుటకు
తన పశువును తోలగా ఆ పశువు వేరొకని చేను
మేసినయెడల అతడు తన చేలలోని మంచిదియు
ద్రాక్షతోటలోని మంచిదియు దానికి ప్రతిగా
నియ్యవలెను.

6 అగ్ని రగిలి ముండ్ల కంపలు అంటుకొనుటవలన
పంటకుప్పయైనను పంటపైరైనను చేనైనను కాలిపో
యినయెడల అగ్ని నంటించినవాడు ఆ నష్టమును
7 అచ్చుకొనవలెను. ౹ ఒకడు సొమ్మయినను సామానైనను
జాగ్రత్తపెట్టుటకు తన పొరుగువానికి అప్పగించిన
ప్పుడు అది ఆ మనుష్యుని యింటనుండి దొంగిలింప
బడి ఆ దొంగ దొరికినయెడల వాడు దానికి రెండం
8 తలు అచ్చుకొనవలెను; ౹ ఆ దొంగ దొరకని పక్షమందు
ఆ యింటి యజమానుడు తన పొరుగువాని పదార్థము
లను తీసికొనెనో లేదో పరిష్కారమగుటకై దేవుని
9 యొద్దకు రావలెను. ౹ ప్రతివిధమైన ద్రోహమును
గూర్చి, అనగా ఎద్దునుగూర్చి గాడిదెనుగూర్చి గొఱ్ఱె
నుగూర్చి బట్టనుగూర్చి పోయినదాని నొకడు చూచి
యిది నాదని చెప్పినదానిగూర్చి ఆ యిద్దరి వ్యాజ్యము
దేవునియొద్దకు[1] తేబడవలెను. దేవుడు[2] ఎవనిమీద
నేరము స్థాపించునో వాడు తన పొరుగువానికి రెండం
తలు అచ్చుకొనవలెను.

10 ఒకడు గాడిదెనైనను ఎద్దునైనను గొఱ్ఱెనైనను మరి
ఏ జంతువునైనను కాపాడుటకు తన పొరుగువానికి
అప్పగించినమీదట, అది చచ్చినను హాని పొందినను,
ఎవడును చూడకుండగా తోలుకొని పోబడినను, ౹
వాడు తన పొరుగువాని సొమ్మును తీసికొనలేదనుటకు 11
యెహోవా ప్రమాణము వారిద్దరిమధ్య నుండవలెను.
సొత్తుదారుడు ఆ ప్రమాణమును అంగీకరింపవలెను;
ఆ నష్టమును అచ్చుకొననక్కరలేదు. ౹ అది నిజముగా 12
వానియొద్దనుండి దొంగిలబడినయెడల సొత్తుదారునికి
ఆ నష్టమును అచ్చుకొనవలెను. ౹ అది నిజముగా చీల్చ 13
బడినయెడల వాడు సాక్ష్యముకొరకు దాని తేవలెను;
చీల్చబడినదాని నష్టమును అచ్చుకొననక్కరలేదు.

ఒకడు తన పొరుగువానియొద్ద దేనినైనను బదులు 14
తీసికొనిపోగా దాని యజమానుడు దానియొద్ద లేన
ప్పుడు, అది హానిపొందినను చచ్చినను దాని నష్టమును
అచ్చుకొనవలెను. ౹ దాని యజమానుడు దానితోనుం 15
డిన పక్షమందు దాని నష్టమును అచ్చుకొననక్కర
లేదు; అది అద్దెదైనయెడల అది దాని అద్దెకు వచ్చె
ను. ౹ ఒకడు ప్రధానముచేయబడని ఒక కన్యకను 16
మరులుకొల్పి ఆమెతో శయనించినయెడల ఆమె నిమి
త్తము ఓలి ఇచ్చి ఆమెను పెండ్లిచేసికొనవలెను. ౹ ఆమె 17
తండ్రి ఆమెను వానికి ఇయ్యనొల్లని పక్షమందు వాడు
కన్యకల ఓలిచొప్పున సొమ్ము చెల్లింపవలెను.

శకునము చెప్పుదానిని బ్రదుకనియ్యకూడదు. 18

మృగసంయోగముచేయు ప్రతివాడు నిశ్చయము 19
గా మరణశిక్ష నొందవలెను. ౹ యెహోవాకు మాత్ర 20
మేగాక వేరొక దేవునికి బలి అర్పించువాడు శాప
గ్రస్తుడు. ౹ పరదేశిని విసికింపవద్దు, బాధింపవద్దు; 21
మీరు ఐగుప్తు దేశములో పరదేశులై యుంటిరి గదా. ౹
విధవరాలినైనను దిక్కులేని పిల్లనైనను బాధపెట్టకూ 22
డదు. ౹ వారు నీచేత ఏ విధముగానైనను బాధనొంది 23
నాకు మొఱపెట్టినయెడల నేను నిశ్చయముగా వారి
మొఱను విందును. ౹ నా కోపాగ్ని రవులుకొని మిమ్మును 24
కత్తిచేత చంపించెదను, మీ భార్యలు విధవరాండ్రగు
దురు, మీ పిల్లలు దిక్కులేనివారగుదురు.

నా ప్రజలలో నీయొద్దనుండు ఒక బీదవానికి సొమ్ము 25
అప్పిచ్చినయెడల వడ్డికిచ్చువానివలె వానియెడల జరి
గింపకూడదు, వానికి వడ్డికట్టకూడదు. ౹ నీవు ఎప్పు 26
డైనను నీ పొరుగువాని వస్త్రమును కుదవగా తీసికొనిన
యెడల సూర్యుడు అస్తమించువేళకు అది వానికి
మరల అప్పగించుము. ౹ వాడు కప్పుకొనునది అదే. 27
అది వాని దేహమునకు వస్త్రము; వాడు మరి ఏమి
కప్పుకొని పండుకొనును? నేను దయగలవాడను, వాడు
నాకు మొఱపెట్టినయెడల నేను విందును.

నీవు న్యాయాధిపతిని[3] నిందింపకూడదు, నీ ప్రజ 28
లలోని అధికారిని శపింపకూడదు.

నీ మొదటి సస్యద్రవ్యములను అర్పింప తడవుచేయ 29
కూడదు. నీ కుమారులలో జ్యేష్ఠుని నాకు అర్పింప

[1] లేక, న్యాయాధిపతులయొద్దకు. [2] లేక, న్యాయాధిపతి. [3] లేక, దేవుని.

ఆమె వానివలన కుమారులనైనను కుమార్తెలనైనను
కనినపక్షమందు ఆ భార్యయు ఆమె పిల్లలును ఆమె
యజమానుని సొత్తగుదురుకాని వాడు ఒంటిగానే
5 పోవలెను. | అయితే ఆ దాసుడు — నేను నా యజ
మానుని నా భార్యను నా పిల్లలను ప్రేమించుచున్నా
ను; నేను వారిని విడిచి స్వతంత్రుడనై పోనొల్లనని
6 నిజముగా చెప్పినయెడల | వాని యజమానుడు న్యా
యాధిపతుల[1] యొద్దకు వాని తీసికొని రావలెను,
మరియు వాని యజమానుడు తలుపునొద్దకైనను ద్వార
బంధమునొద్దకైనను వాని తోడుకొనిపోయి వాని
చెవిని కదురుతో గుచ్చవలెను. తరువాత వాడు నిరం
తరము వానికి దాసుడైయుండును.
7 ఒకడు తన కుమార్తెను దాసిగా అమ్మినయెడల
దాసులైన పురుషులు వెళ్లిపోవునట్లు అది వెళ్లిపోకూ
డదు. | దాని ప్రధానము చేసికొనిన యజమానుని
8 దృష్టికి అది యిష్టురాలు కానియెడల వేరొకడు దాని
విడిపించుటకు అవకాశము నియ్యవలెను; దాని వం
చించినందున అన్యజనులకు దాని అమ్ముటకు వానికి
9 అధికారము లేదు. | తన కుమారునికి దాని ప్రధానము
చేసినయెడల కుమార్తెల విషయమైన న్యాయవిధినిబట్టి
10 దానియెడల జరిగింపవలెను. | ఆ కుమారుడు వేరొక
దాని చేర్చుకొనినను, మొదటిదానికి ఆహారమును
వస్త్రమును సంసారధర్మమును తక్కువ చేయకూడదు. |
11 ఈ మూడును దానికి కలుగజేయని పక్షమందు అది
ఏమియు ఇయ్యక స్వతంత్రురాలై పోవచ్చును.
12 నరుని చావగొట్టినవానికి నిశ్చయముగా మరణ
13 శిక్ష విధింపవలెను. | అయితే వాడు చంపవలెనని
పొంచియుండకయే దైవికముగా వానిచేత ఆ హత్య
జరిగినయెడల వాడు పారిపోగల యొక స్థలమును
నీకు నిర్ణయించెదను.
14 అయితే ఒకడు తన పొరుగువానిమీద దౌర్జన్య
ముగావచ్చి కపటముగా చంప లేచినయెడల వాడు
నా బలిపీఠము నాశ్రయించినను వాని లాగివేసి చంప
వలెను.
15 తన తండ్రినైనను తల్లినైనను కొట్టువాడు నిశ్చయ
ముగా మరణశిక్ష నొందును.
16 ఒకడు నరుని దొంగిలించి అమ్మినను, తనయొద్ద
నుంచుకొనినను, వాడు నిశ్చయముగా మరణశిక్ష
నొందును.
17 తన తండ్రినైనను తల్లినైనను శపించువాడు నిశ్చ
యముగా మరణశిక్ష నొందును.
18 మనుష్యులు పోట్లాడుచుండగా ఒకడు తన పొరు
గువానిని రాతితోనైనను పిడికిటితోనైనను గుద్దుట
వలన వాడు చావక మంచముమీద పడియుండి |
19 తరువాత లేచి తన చేతికఱ్ఱతో బయటికి వెళ్లి తిరు
గుచుండినయెడల, వాని కొట్టినవానికి శిక్ష విధింప
బడదుగాని అతడు పనిచేయలేని కాలమునకు తగిన
సొమ్ము ఇచ్చి వాడు అతనిని పూర్తిగా బాగుచేయింప
వలెను.
ఒకడు తన దాసుడైనను తన దాసియైనను చచ్చు 20
నట్లు కఱ్ఱతో కొట్టినయెడల అతడు నిశ్చయముగా
ప్రతిదండన నొందును. | అయితే వాడు ఒకటి రెండు 21
దినములు బ్రదికినయెడల ఆ ప్రతిదండన అతడు
పొందడు, వాడు అతని సొమ్మేగదా. | నరులు పోట్లా 22
డుచుండగా గర్భవతియైన స్త్రీకి దెబ్బతగిలి ఆమెకు
గర్భపాతమేకాక మరి ఏ హానియు రానియెడల హాని
చేసినవాడు ఆ స్త్రీ పెనిమిటి వానిమీద మోపిన నష్ట
మును అచ్చుకొనవలెను. న్యాయాధిపతులు తీర్మానించి
నట్లు దాని చెల్లింపవలెను. | హాని కలిగినయెడల నీవు 23
ప్రాణమునకు ప్రాణము కంటికి కన్ను పంటికి పల్లు 24
చేతికి చెయ్యి కాలికి కాలు | వాతకు వాత గాయము 25
నకు గాయము దెబ్బకు దెబ్బయు నియమింపవలెను.
ఒకడు తన దాసుని కన్నైనను తన దాసి కన్నై 26
నను పోగొట్టినయెడల ఆ కంటి హానినిబట్టి వారిని
స్వతంత్రులగా పోనియ్యవలెను. | వాడు తన దాసుని 27
పల్లయినను తన దాసి పల్లయినను ఊడగొట్టినయెడల
ఆ పంటి నిమిత్తము వారిని స్వతంత్రులగా పోనియ్య
వలెను.
ఎద్దు పురుషునైనను స్త్రీనైనను చావపొడిచినయెడల 28
నిశ్చయముగా రాళ్లతో ఆ యెద్దును చావకొట్టవలెను.
దాని మాంసమును తినకూడదు, అయితే ఆ యెద్దు
యజమానుడు నిర్దోషియగును. | ఆ యెద్దు అంతకు 29
ముందు పొడుచునది అని దాని యజమానునికి తెలు
పబడినను, వాడు దాని భద్రము చేయకుండుటవలన
అది పురుషునైనను స్త్రీనైనను చంపినయెడల ఆ యెద్దును
రాళ్లతో చావగొట్టవలెను; దాని యజమానుడు మరణ
శిక్ష నొందవలెను. | వానికి పరిక్రయ ధనము నియ 30
మింపబడినయెడల వానికి నియమింపబడిన అన్నిటి
ప్రకారము తన ప్రాణవిమోచన నిమిత్తము ధనము
చెల్లింపవలెను. | అది కుమారుని పొడిచినను కుమార్తెను 31
పొడిచినను ఈ విధి చొప్పున అతడు చేయవలెను. |
ఆ యెద్దు దాసునినైనను దాసినైనను పొడిచినయెడల 32
వారి యజమానునికి ముప్పది తులముల వెండి చెల్లింప
వలెను, మరియు ఆ యెద్దును రాళ్లతో చావకొట్టవలెను.
ఒకడు గోతిమీది కప్పు తీయుటవలన, లేక ఒకడు 33
గొయ్యి త్రవ్వి దాని కప్పకపోవుటవలన, దానిలో
ఎద్దయినను గాడిదెయైనను పడిన పక్షమున | ఆ గోతి 34
ఖామందులు ఆ నష్టమును అచ్చుకొనవలెను; వాటి
యజమానునికి సొమ్ము ఇయ్యవలెను; చచ్చినది వాని
దగును.

1 లేక, దేవుని.

35 ఒకని యెద్దు వేరొకని యెద్దు చచ్చునట్లు దాని
పొడిచినయెడల బ్రదికియున్న యెద్దును అమ్మి దాని
విలువను పంచుకొనవలెను, చచ్చిన యెద్దును పంచు
36 కొనవలెను. । అయితే అంతకు ముందు ఆ యెద్దు
పొడుచునది అని తెలియబడియు దాని యజమానుడు
దాని భద్రము చేయనివాడైతే వాడు నిశ్చయముగా
ఎద్దుకు ఎద్దునియ్యవలెను; చచ్చినది వానిదగును.

22 ఒకడు ఎద్దునైనను గొఱ్ఱెనైనను దొంగిలించి
దాని అమ్మినను చంపినను ఆ యెద్దుకు ప్రతిగా అయి
దు ఎద్దులను ఆ గొఱ్ఱెకు ప్రతిగా నాలుగు గొఱ్ఱెల
2 నియ్యవలెను. । దొంగ కన్నము వేయుచుండగా వాడు
దొరికి చచ్చునట్లు కొట్టబడినయెడల అందువలన రక్తా
3 పరాధముండదు. । సూర్యుడు ఉదయించిన తరువాత
వాని కొట్టినయెడల వానికి రక్తాపరాధముండును;
వాడు సరిగా సొమ్ము మరల చెల్లింపవలెను. వానికే
మియు లేకపోయినయెడల వాడు దొంగతనము చేసి
4 నందున అమ్మబడవలెను. । వాడు దొంగిలినది ఎద్దయి
నను గాడిదెయైనను గొఱ్ఱయైనను సరే అది ప్రాణ
ముతో వానియొద్ద దొరికినయెడల రెండంతలు చెల్లిం
పవలెను.

5 ఒకడు చేనునైనను ద్రాక్షతోటనైనను మేపుటకు
తన పశువును తోలగా ఆ పశువు వేరొకని చేను
మేసినయెడల అతడు తన చేలలోని మంచిదియు
ద్రాక్షతోటలోని మంచిదియు దానికి ప్రతిగా
నియ్యవలెను.

6 అగ్ని రగిలి ముండ్ల కంపలు అంటుకొనుటవలన
పంటకుప్పయైనను పంటపైరైనను చేనైనను కాలిపో
యినయెడల అగ్ని నంటించినవాడు ఆ నష్టమును
7 అచ్చుకొనవలెను. । ఒకడు సొమ్మయినను సామానైనను
జాగ్రత్తపెట్టుటకు తన పొరుగువానికి అప్పగించిన
ప్పుడు అది ఆ మనుష్యుని యింటనుండి దొంగిలింప
బడి ఆ దొంగ దొరికినయెడల వాడు దానికి రెండం
8 తలు అచ్చుకొనవలెను; । ఆ దొంగ దొరకని పక్షమందు
ఆ యింటి యజమానుడు తన పొరుగువాని పదార్థము
లను తీసికొనెనో లేదో పరిష్కారమగుటకై దేవుని
9 యొద్దకు రావలెను. । ప్రతివిధమైన ద్రోహమును
గూర్చి, అనగా ఎద్దునుగూర్చి గాడిదెనుగూర్చి గొఱ్ఱె
నుగూర్చి బట్టనుగూర్చి పోయినదాని నొకడు చూచి
యిది నాదని చెప్పినదానిగూర్చి ఆ యిద్దరి వ్యాజ్యము
దేవునియొద్దకు[1] తేబడవలెను. దేవుడు[2] ఎవనిమీద
నేరము స్థాపించునో వాడు తన పొరుగువానికి రెండం
తలు అచ్చుకొనవలెను.

0 ఒకడు గాడిదెనైనను ఎద్దునైనను గొఱ్ఱెనైనను మరి
ఏ జంతువునైనను కాపాడుటకు తన పొరుగువానికి
అప్పగించినమీదట, అది చచ్చినను హాని పొందినను,
ఎవడును చూడకుండగా తోలుకొని పోబడినను, ।
వాడు తన పొరుగువాని సొమ్మును తీసికొనలేదనుటకు 11
యెహోవా ప్రమాణము వారిద్దరిమధ్య నుండవలెను.
సొత్తుదారుడు ఆ ప్రమాణమును అంగీకరింపవలెను;
ఆ నష్టమును అచ్చుకొననక్కరలేదు. । అది నిజముగా 12
వానియొద్దనుండి దొంగిలబడినయెడల సొత్తుదారునికి
ఆ నష్టమును అచ్చుకొనవలెను. । అది నిజముగా చీల్చ 13
బడినయెడల వాడు సాక్ష్యముకొరకు దాని తేవలెను;
చీల్చబడినదాని నష్టమును అచ్చుకొననక్కరలేదు.

ఒకడు తన పొరుగువానియొద్ద దేనినైనను బదులు 14
దీసికొనిపోగా దాని యజమానుడు దానియొద్ద లేన
ప్పుడు, అది హానిపొందినను చచ్చినను దాని నష్టమును
అచ్చుకొనవలెను. । దాని యజమానుడు దానితోనుం 15
డిన పక్షమందు దాని నష్టమును అచ్చుకొననక్కర
లేదు; అది అద్దెదైనయెడల అది దాని అద్దెకు వచ్చె
ను. । ఒకడు ప్రధానముచేయబడని ఒక కన్యకను 16
మరులుకొల్పి ఆమెతో శయనించినయెడల ఆమె నిమి
త్తము ఓలి ఇచ్చి ఆమెను పెండ్లిచేసికొనవలెను. । ఆమె 17
తండ్రి ఆమెను వానికి ఇయ్యనొల్లని పక్షమందు వాడు
కన్యకల ఓలిచొప్పున సొమ్ము చెల్లింపవలెను.

శకునము చెప్పుదానిని బ్రదుకనియ్యకూడదు. 18

మృగసంయోగముచేయు ప్రతివాడు నిశ్చయము 19
గా మరణశిక్ష నొందవలెను. । యెహోవాకు మాత్ర 20
మేగాక వేరొక దేవునికి బలి అర్పించువాడు శాప
గ్రస్తుడు. । పరదేశిని విసికింపవద్దు, బాధింపవద్దు; 21
మీరు ఐగుప్తు దేశములో పరదేశులై యుంటిరి గదా. ।
విధవరాలినైనను దిక్కులేని పిల్లనైనను బాధపెట్టకూ 22
డదు. । వారు నీచేత ఏ విధముగానైనను బాధనొంది 23
నాకు మొరపెట్టినయెడల నేను నిశ్చయముగా వారి
మొరను విందును. । నా కోపాగ్ని రవులుకొని మిమ్మును 24
కత్తిచేత చంపించెదను, మీ భార్యలు విధవరాండ్రగు
దురు, మీ పిల్లలు దిక్కులేనివారగుదురు.

నా ప్రజలలో నీయొద్దనుండు ఒక బీదవానికి సొమ్ము 25
అప్పిచ్చినయెడల వడ్డికిచ్చువానివలె వానియెడల జరి
గింపకూడదు, వానికి వడ్డికట్టకూడదు. । నీవు ఎప్పు 26
డైనను నీ పొరుగువాని వస్త్రమును కుదవగా తీసికొనిన
యెడల సూర్యుడు అస్తమించువేళకు అది వానికి
మరల అప్పగించుము. । వాడు కప్పుకొనునది అదే. 27
అది వాని దేహమునకు వస్త్రము; వాడు మరి ఏమి
కప్పుకొని పండుకొనును? నేను దయగలవాడను, వాడు
నాకు మొరపెట్టినయెడల నేను విందును.

నీవు న్యాయాధిపతిని[3] నిందింపకూడదు, నీ ప్రజ 28
లలోని అధికారిని శపింపకూడదు.

నీ మొదటి సస్యద్రవ్యములను అర్పింప తడవుచేయ 29
కూడదు. నీ కుమారులలో జ్యేష్ఠుని నాకు అర్పింప

[1] లేక, న్యాయాధిపతులయొద్దకు. [2] లేక, న్యాయాధిపతి. [3] లేక, దేవుని.

30 వలెను. । అట్లే నీ యెద్దులను నీ గొఱ్ఱెలను అర్పింప
వలెను. ఏడు దినములు అది దాని తల్లియొద్ద ఉండ
వలెను. ఎనిమిదవ దినమున దానిని నాకియ్యవలెను.
31 మీరు నాకు ప్రతిష్ఠింపబడినవారు గనుక పొల
ములో చీల్చబడిన మాంసమును తినక కుక్కలకు దాని
వాని వేయవలెను.

23 లేనివార్తను పుట్టింపకూడదు; అన్యాయపు సా
క్ష్యమును పలుకుటకై దుష్టునితో నీవు కలియకూడ
2 దు; । దుష్కార్యము జరిగించుటకై సమూహముతో
చేరకూడదు; న్యాయమును త్రిప్పి వేయుటకు సమూహ
ముతో చేరి వ్యాజ్యములో సాక్ష్యము పలుకకూడదు;।
3 వ్యాజ్యమాడువాడు బీదవాడైనను వానియెడల పక్ష
పాతముగా నుండకూడదు.
4 నీ శత్రువుని యెద్దయినను గాడిదెయైనను తప్పి
పోవుచుండగా అది నీకు కనబడినయెడల అగత్యముగా
5 దాని తోలుకొనివచ్చి వానికప్పగింపవలెను. । నీవు నీ
పగవాని గాడిదె బరువుక్రింద పడియుండుట చూచి
దానినుండి తప్పింపకయుందుసని నీవు అనుకొనినను
అగత్యముగా వానితో కలిసి దాని విడిపింపవలెను.
6 దరిద్రుని వ్యాజ్యములో న్యాయము విడిచి తీర్పు
7 తీర్చకూడదు. । అబద్ధమునకు దూరముగా నుండుము;
నిరపరాధినైనను నీతిమంతునినైనను చంపకూడదు;
8 నేను దుష్టుని నిర్దోషినిగా ఎంచను. । లంచము తీసి
కొనకూడదు; లంచము దృష్టిగలవారికి గుడ్డితనము కలు
గజేసి, నీతిమంతుల మాటలకు అపార్థము చేయించును. ।
9 పరదేశిని బాధింపకూడదు; పరదేశి మనస్సు ఎట్లుం
డునో మీరెరుగుదురు; మీరు ఐగుప్తుదేశములో పర
దేశులై యుంటిరిగదా.
10 ఆరు సంవత్సరములు నీ భూమిని విత్తి దాని పంట
11 కూర్చుకొనవలెను. । ఏడవ సంవత్సరమున దానిని బీడు
విడువవలెను. అప్పుడు నీ ప్రజలలోని బీదలు తినిన
తరువాత మిగిలినది అడవి మృగములు తినవచ్చును.
నీ ద్రాక్షతోట విషయములోను నీ ఒలీవతోట విష
12 యములోను ఆలాగుననే చేయవలెను. । ఆరు దినములు
నీ పనులుచేసి, నీ యెద్దును నీ గాడిదెయు నీ దాసి
కుమారుడును పరదేశియు విశ్రమించునట్లు ఏడవ దిన
13 మున ఊరక యుండవలెను. । నేను మీతో చెప్పిన
వాటినన్నిటిని జాగ్రత్తగా గైకొనవలెను; వేరొక
దేవుని పేరు ఉచ్చరింపకూడదు; అది నీ నోటనుండి
రానియ్య తగదు.
14 సంవత్సరమునకు మూడుమారులు నాకు పండుగ
15 ఆచరింపవలెను. । పులియని రొట్టెల పండుగ నాచ
రింపవలెను. నేను నీ కాజ్ఞాపించినట్లు ఆబీబు నెలలో
నీవు ఐగుప్తులోనుండి బయలుదేరి వచ్చితివి గనుక ఆ
నెలలో నియామకకాలమందు ఏడు దినములు పులి
యని రొట్టెలను తినవలెను. నా సన్నిధిని ఎవడును
వట్టిచేతులతో కనబడకూడదు. । నీవు పొలములో 16
విత్తిన నీ వ్యవసాయముల తొలిపంటయొక్క కోతపం
డుగను, పొలములోనుండి నీ వ్యవసాయఫలములను
నీవు కూర్చుకొనిన తరువాత సంవత్సరాంతమందు
ఫలసంగ్రహపు పండుగను ఆచరింపవలెను. । సంవత్స 17
రమునకు మూడుమారులు పురుషులందరు ప్రభువైన
యెహోవా సన్నిధిని కనబడవలెను.
నా బలుల రక్తమును పులిసిన ద్రవ్యముతో అర్పింప 18
కూడదు. నా పండుగలో నర్పించిన క్రొవ్వు ఉద
యమువరకు నిలువ యుండకూడదు. । నీ భూమి ప్రథమ 19
ఫలములో మొదటివాటిని దేవుడైన యెహోవా
మందిరమునకు తేవలెను. మేకపిల్లను దాని తల్లిపా
లతో ఉడకబెట్టకూడదు.
ఇదిగో త్రోవలో నిన్ను కాపాడి నేను సిద్ధపర 20
చిన చోటుకు నిన్ను రప్పించుటకు ఒక దూతను నీకు
ముందుగా పంపుచున్నాను. । ఆయన సన్నిధిని జాగ్ర 21
త్తగానుండి ఆయన మాట వినవలెను. ఆయన కోపము
రేపవద్దు; మీ అతిక్రమములను ఆయన పరిహరిం
పడు, నా నామము ఆయనకున్నది. । అయితే నీవు 22
ఆయన మాటను జాగ్రత్తగా విని నేను చెప్పినది యా
వత్తు చేసినయెడల నేను నీ శత్రువులకు శత్రువును
నీ విరోధులకు విరోధియునై యుందును. । ఎట్లనగా 23
నా దూత నీకు ముందుగా వెళ్లుచు, అమోరీయులు
హిత్తీయులు పెరిజ్జీయులు కనానీయులు హివ్వీయులు
యెబూసీయులను వారున్నచోటుకు నిన్ను రప్పిం
చును, నేను వారిని సంహరించెదను. । వారి దేవతలకు 24
సాగిలపడకూడదు, వాటిని పూజింపకూడదు; వారి
క్రియలవంటి క్రియలు చేయక వారిని తప్పక నిర్మూ
లముచేసి, వారి విగ్రహములను బొత్తుగా పగలగొట్ట
వలెను. । నీ దేవుడైన యెహోవానే సేవింపవలెను, 25
అప్పుడు ఆయన నీ ఆహారమును నీ పానమును దీవిం
చును. నేను నీ మధ్యనుండి రోగము తొలగించెదను. ।
కడుపు దిగబడునదియు గొడ్డుదియు నీ దేశములోను 26
ఉండదు. నీ దినముల లెక్క సంపూర్తిచేసెదను. । నన్ను 27
బట్టి మనుష్యులు నీకు భయపడునట్లు చేసెదను. నీవు
పోవు సర్వదేశములవారిని ఓడగొట్టి నీ సమస్త శత్రు
వులు నీ యెదుటనుండి పారిపోవునట్లు చేసెదను. ।
మరియు పెద్ద కందిరీగలను నీకు ముందుగా పంపించె 28
దను, అవి నీ యెదుటనుండి హివ్వీయులను కనానీ
యులను హిత్తీయులను వెళ్లగొట్టును. । దేశము పాడై 29
అడవిమృగములు నీకు విరోధముగా విస్తరింపకుండు
నట్లు వారిని ఒక్క సంవత్సరములోనే నీ యెదుట
నుండి వెళ్లగొట్టను. । నీవు అభివృద్ధిపొంది ఆ దేశ 30
మును స్వాధీనపరచుకొనువరకు క్రమక్రమముగా
వారిని నీ యెదుటనుండి వెళ్లగొట్టెదను. । మరియు 31
ఎఱ్ఱ సముద్రమునుండి ఫిలిష్తీయుల సముద్రమువర

కును అరణ్యమునుండి నదివరకును నీ పొలిమేరలను
ఏర్పరచెదను, ఆ దేశ నివాసులను నీ చేతికప్పగించె
దను. నీవు నీ యెదుటనుండి వారిని వెళ్లగొట్టెదవు. ।
32 నీవు వారితోనైనను వారి దేవతలతోనైనను నిబంధన
చేసికొనవద్దు. నీవు వారి దేవతలను సేవించినయెడల
33 అది నీకు ఉరియగును గనుక । వారు నీచేత నాకు
విరోధముగా పాపము చేయింపకుండునట్లు వారు నీ
దేశములో నివసింపకూడదు.

**24** మరియు ఆయన మోషేతో ఇట్లనెను—నీవును,
అహరోనును, నాదాబును, అబీహును, ఇశ్రాయేలీ
యుల పెద్దలలో డెబ్బదిమందియు యెహోవా
2 యొద్దకు ఎక్కి వచ్చి దూరమున సాగిలపడుడి. । మోషే
మాత్రము యెహోవాకు సమీపింపవలెను, వారు
సమీపింపకూడదు, ప్రజలు అతనితో ఎక్కి రాకూ
3 డదు. । మోషే వచ్చి యెహోవా మాటలన్నిటిని
విధులన్నిటిని ప్రజలతో వివరించి చెప్పెను. ప్రజలం
దరు—యెహోవా చెప్పిన మాటలన్నిటి ప్రకారము
4 చేసెదమని యేకశబ్దముతో ఉత్తరమిచ్చిరి. । మరియు
మోషే యెహోవా మాటలన్నిటిని వ్రాసి ఉదయ
మందు లేచి ఆ కొండ దిగువను బలిపీఠమును ఇశ్రా
యేలు పన్నెండు గోత్రములచొప్పున పన్నెండు స్తంభ
5 ములను కట్టి । ఇశ్రాయేలీయులలో యౌవనస్థులను
పంపగా వారు దహనబలుల నర్పించి యెహోవాకు
6 సమాధానబలులగా కోడెలను వధించిరి. । అప్పుడు
మోషే వాటి రక్తములో సగము తీసికొని పళ్లెము
లలో పోసి ఆ రక్తములో సగము బలిపీఠము మీద
7 ప్రోక్షించెను. । అతడు నిబంధన గ్రంథమును తీసి
కొని ప్రజలకు వినిపింపగా వారు—యెహోవా
చెప్పినవన్ని చేయుచు విధేయులమై యుందుమనిరి. ।
8 అప్పుడు మోషే రక్తమును తీసికొని ప్రజలమీద
ప్రోక్షించి—ఇదిగో యీ సంగతులన్నిటి విషయమై
యెహోవా మీతో చేసిన నిబంధన రక్తము ఇదే
9 అని చెప్పెను. । తరువాత మోషే అహరోను నాదాబు
అబీహు ఇశ్రాయేలీయుల పెద్దలలో డెబ్బదిమందియు
10 ఎక్కి పోయి । ఇశ్రాయేలీయుల దేవుని చూచిరి.
ఆయన పాదములక్రింద నిగనిగలాడు నీలమయమైన
వస్తువువంటిదియు ఆకాశమండలపు తేజమువంటిది
11 యు ఉండెను. । ఆయన ఇశ్రాయేలీయులలోని ప్రధా
నులకు ఏ హానియు చేయలేదు; వారు దేవుని చూచి
యు అన్నపానములు పుచ్చుకొనిరి.
12 అప్పుడు యెహోవా మోషేతో ఇట్లనెను—నీవు
కొండయెక్కి నాయొద్దకు వచ్చి అచ్చటనుండుము;
నీవు వారికి బోధించునట్లు నేను వ్రాసిన ఆజ్ఞలను, ధర్మ
13 శాస్త్రమును, రాతిపలకలను నీకిచ్చెదననగా । మోషేయు
అతని పరిచారకుడైన యెహోషువయు లేచిరి. మోషే
14 దేవుని కొండమీదికి ఎక్కెను. । అతడు పెద్దలను
చూచి—మేము మీ యొద్దకు వచ్చువరకు ఇక్కడనే
యుండుడి; ఇదిగో అహరోనును హూరును మీతో
ఉన్నారు; ఎవనికైనను వ్యాజ్యమున్నయెడల వారి
యొద్దకు వెళ్లవచ్చునని వారితో చెప్పెను. । మోషే 15
కొండమీదికి ఎక్కినప్పుడు ఆ మేఘము కొండను
కమ్మెను. । యెహోవా మహిమ సీనాయికొండమీద 16
నిలిచెను; మేఘము ఆరు దినములు దాని కమ్ముకొనెను;
ఏడవ దినమున ఆయన ఆ మేఘములోనుండి మోషేను
పిలిచినప్పుడు । యెహోవా మహిమ ఆ కొండ శిఖ 17
రముమీద దహించు అగ్నివలె ఇశ్రాయేలీయుల కన్ను
లకు కనబడెను. । అప్పుడు మోషే ఆ మేఘములో 18
ప్రవేశించి కొండమీదికి ఎక్కెను. మోషే ఆ కొండ
మీద రేయింబగలు నలుబది దినములుండెను.

యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చెను।—**25**
నాకు ప్రతిష్ఠార్పణ తీసికొనిరండని ఇశ్రాయేలీయుల 2
తో చెప్పుము. మనఃపూర్వకముగా అర్పించు ప్రతి
మనుష్యునియొద్ద దాని తీసికొనవలెను. । మీరు వారి 3
యొద్ద తీసికొనవలసిన అర్పణలేవనగా బంగారు, వెండి,
ఇత్తడి, । నీల ధూమ్ర రక్తవర్ణములు, సన్నపునార, మేక 4
వెండ్రుకలు, । ఎరుపురంగువేసిన పొట్టేళ్ల తోళ్లు, 5
సముద్రవత్సల తోళ్లు, తుమ్మకర్రలు, । ప్రదీపమునకు 6
తైలము, అభిషేకతైలమునకును పరిమళద్రవ్యముల
ధూపమునకును సుగంధసంభారములు, । లేత పచ్చలు, 7
ఏఫోదుకును పతకమునకును చెక్కు రత్నములు అను
నవే. । నేను వారిలో నివసించునట్లు వారు నాకు పరి 8
శుద్ధస్థలమును నిర్మింపవలెను. । నేను నీకు కనుపరచు 9
విధముగా మందిరముయొక్క ఆ రూపమును దాని
ఉపకరణములన్నిటి రూపమును నిర్మింపవలెను.
వారు తుమ్మకర్రతో నొక మందసమును చేయ 10
వలెను. దాని పొడుగు రెండు మూరలునర, దాని
వెడల్పు మూరెడునర, దాని యెత్తు మూరెడునర. ।
దానిమీద మేలిమి బంగారు రేకు పొదిగింపవలెను; 11
లోపలను వెలుపలను దానికి పొదిగింపవలెను; దాని
మీద బంగారు జవను చుట్టు కట్టవలెను. । దానికి 12
నాలుగు బంగారు ఉంగరములను పోతపోసి, ఒక
ప్రక్కను రెండు ఉంగరములు ఎదుటి ప్రక్కను
రెండు ఉంగరములు ఉండునట్లు దాని నాలుగు కాళ్లకు
వాటిని వేయవలెను. । తుమ్మకర్రతో మోతకర్రలను 13
చేసి వాటికి బంగారు రేకులను పొదిగించి । వాటితో 14
ఆ మందసమును మోయుటకు ఆ ప్రక్కలమీది ఉం
గరములలో ఆ మోతకర్రలను దూర్చవలెను. । ఆ మోత 15
కర్రలు ఆ మందసపు ఉంగరములలోనే ఉండవలెను,
వాటిని దానియొద్దనుండి తీయకూడదు; । ఆ మందస 16
ములో నేను నీకిచ్చు శాసనముల నుంచవలెను. । మరి 17
యు నీవు మేలిమి బంగారుతో కరుణాపీఠమును చేయ
వలెను. దాని పొడుగు రెండు మూరలున్నర దాని

18 వెడల్పు మూరెడునర. । మరియు రెండు బంగారు
కెరూబులను చేయవలెను. కరుణాపీఠముయొక్క రెండు
19 కొనలను నకషిపనిగా చేయవలెను. । ఈ కొనను ఒక
కెరూబును ఆ కొనను ఒక కెరూబును చేయవలెను.
కరుణాపీఠమున దాని రెండు కొనలమీద కెరూబులను
20 దానితో ఏకాండముగా చేయవలెను. । ఆ కెరూబులు
పైకి విప్పిన రెక్కలుగలవై కరుణాపీఠమును తమ రెక్క
లతో కప్పుచుండగా వాటి ముఖములు ఒండొంటికి
ఎదురుగా నుండవలెను. ఆ కెరూబుల ముఖములు కరు
ణాపీఠముతట్టు నుండవలెను. నీవు ఆ కరుణాపీఠమును
21 ఎత్తి ఆ మందసముమీద నుంచవలెను. । నేను నీకిచ్చు
22 శాసనములను ఆ మందసములో నుంచవలెను. । అక్కడ
నేను నిన్ను కలిసికొని కరుణాపీఠముమీద నుండియు,
శాసనములుగల మందసముమీదనుండు రెండు కెరూ
బులమధ్యనుండియు, నేను ఇశ్రాయేలీయుల నిమిత్తము
మీకాజ్ఞాపించు సమస్తమును నీకు తెలియ చెప్పెదను.
23 మరియు నీవు తుమ్మకఱ్ఱతో నొక బల్ల చేయ
వలెను. దాని పొడుగు రెండు మూరలు దాని వెడల్పు
24 ఒక మూర దాని యెత్తు మూరెడునర. । మేలిమి బం
గారు రేకును దానికి పొదిగించి దానికి చుట్టు బంగారు
25 జవను చేయింపవలెను. । దానికి చుట్టు బెత్తెడు బద్దె
చేసి దాని బద్దెపైని చుట్టును బంగారు జవ చేయవలె
26 ను. । దానికి నాలుగు బంగారు ఉంగరములను చేసి
దాని నాలుగు కాళ్లకుండు నాలుగు మూలలలో ఆ
27 ఉంగరములను తగిలింపవలెను । బల్లమోయుటకు మోత
కఱ్ఱలు ఉంగరములును బద్దెకు సమీపముగా నుండ
28 వలెను. । ఆ మోతకఱ్ఱలను తుమ్మకఱ్ఱతో చేసి వాటి
మీద బంగారు రేకు పొదిగింపవలెను; వాటితో బల్ల
29 మోయబడును. । మరియు నీవు దాని పళ్లెములను ధూ
పార్తులను గిన్నెలను పానీయార్పణముకు పాత్రలను
దానికి చేయవలెను; మేలిమి బంగారుతో వాటిని చేయ
30 వలెను. । నిత్యమును నా సన్నిధిని సన్నిధిరొట్టెలను
ఈ బల్లమీద ఉంచవలెను.
31 మరియు నీవు మేలిమి బంగారుతో దీపవృక్షమును
చేయవలెను; నకషిపనిగా ఆ దీపవృక్షము చేయవలెను.
దాని ప్రకాండమును దాని శాఖలను నకషిపనిగా
చేయవలెను; దాని కలశములు దాని మొగ్గలు దాని
32 పువ్వులు దానితో ఏకాండమైయుండవలెను. । దీప
వృక్షముయొక్క ఒక ప్రక్కనుండి మూడు కొమ్మలు,
దీపవృక్షముయొక్క రెండవప్రక్కనుండి మూడు
కొమ్మలు, అనగా దాని ప్రక్కలనుండి ఆరుకొమ్మలు
33 నిగుడవలెను. । ఒక కొమ్మలో మొగ్గ పువ్వుగల బా
దము రూపమైన మూడు కలశములు, రెండవ కొమ్మ
లో మొగ్గ పువ్వుగల బాదము రూపమైన మూడు
కలశములు; అట్లు దీపవృక్షమునుండి బయలుదేరు
34 కొమ్మలలో నుండవలెను. । మరియు దీపవృక్ష ప్రకాం
డములో బాదము రూపమైన నాలుగు కలశములును
వాటి మొగ్గలును వాటి పువ్వులును ఉండవలెను, । దీప 35
వృక్ష ప్రకాండమునుండి నిగుడు ఆరు కొమ్మలకు దాని
రెండేసి కొమ్మలక్రింద ఏకాండమైన ఒక్కొక మొగ్గ
చొప్పున ఉండవలెను. । వాటి మొగ్గలు వాటి కొమ్మలు 36
దానితో ఏకాండమగును; అదంతయు మేలిమి బంగా
రుతో చేయబడిన ఏకాండమైన నకషిపనిగా ఉండ
వలెను. । నీవు దానికి ఏడు దీపములను చేయవలెను. 37
దాని యెదుట వెలుగిచ్చునట్లు దాని దీపములను వెలి
గింపవలెను. । దాని కత్తెర దాని కత్తెరచిప్పయు మేలిమి 38
బంగారుతో చేయవలెను. । ఆ ఉపకరణములన్ని నలు 39
బది వీసెల మేలిమి బంగారుతో చేయవలెను. । కొండ 40
మీద నీకు కనుపరచబడినవాటి రూపముచొప్పున
వాటిని చేయుటకు జాగ్రత్తపడుము.

మరియు నీవు పది తెరలతో ఒక మందిరమును 26
చేయవలెను. నీల ధూమ్ర రక్తవర్ణములుగల పేనిన
సన్నపు నారతో వాటిని చిత్రకారుని పనియైన కెరూ
బులు గలవాటినిగా చేయవలెను. । ప్రతి తెర పొడుగు 2
ఇరువది యెనిమిది మూరలు; ప్రతి తెర వెడల్పు నా
లుగు మూరలు. ఆ తెరలన్నిటికి ఒకటే కొలత. ।
అయిదు తెరలను ఒకదానితో ఒకటి కూర్పవలెను. 3
మిగిలిన అయిదు తెరలను ఒకదానితో ఒకటి కూర్ప
వలెను. । తెరల కూర్పు చివరను మొదటితెర అంచున 4
నీలినూలుతో కొలుకులను చేయవలెను. రెండవ కూర్పు
నందలి వెలపలి తెర చివరను అట్లు చేయవలెను. । ఒక 5
తెరలో ఏబది కొలుకులను చేసి, ఆ కొలుకులు ఒక
దాని నొకటి తగులుకొనునట్లు ఆ రెండవకూర్పునందలి
తెర అంచున ఏబది కొలుకులను చేయవలెను. । మరి 6
యు ఏబది బంగారు గుండీలను చేసి ఆ గుండీలచేత
ఆ తెరలను ఒకదానితో ఒకటి కూర్పవలెను; అది
ఒకటే మందిరమగును. । మరియు మందిరముపైని గుడా 7
రముగా మేకవెండ్రుకలతో తెరలు చేయవలెను; పద
కొండు తెరలను చేయవలెను. । ప్రతి తెర పొడుగు 8
ముప్పది మూరలు, వెడల్పు నాలుగు మూరలు, పద
కొండు తెరల కొలత ఒక్కటే. । అయిదు తెరలను 9
ఒకటిగాను ఆరు తెరలను ఒకటిగాను ఒకదానికొకటి
కూర్పవలెను. ఆరవ తెరను గుడారపు ఎదుటిభాగ
మున మడవవలెను. । తెరల కూర్పునకు వెలపలనున్న 10
తెర అంచున ఏబది కొలుకులను రెండవ కూర్పునందలి
తెర అంచున ఏబది కొలుకులను చేయవలెను. । మరి 11
యు ఏబది యిత్తడి గుండీలను చేసి యొకటే గుడార
మగునట్లు ఆ గుండీలను ఆ కొలుకులకు తగిలించి దాని
కూర్పవలెను. । ఆ గుడారపు తెరలలో మిగిలి వ్రేలాడు 12
భాగము, అనగా మిగిలిన సగము తెర, మందిరము
వెనుక ప్రక్కమీద వ్రేలాడవలెను. । మరియు గుడా 13
రపు తెరల పొడుగులో మిగిలినది ఈ ప్రక్కను ఒక

మూరయు, ఆ ప్రక్కను ఒక మూరయు, మందిర
మును కప్పుటకు ఈ ప్రక్కను ఆ ప్రక్కను దాని
14 ప్రక్కలమీద వ్రేలాడవలెను. । మరియు ఎఱ్ఱరంగు
వేసిన పొట్టేళ్ల తోళ్లతో పైకప్పును దానికిమీదుగా
సముద్రవత్సల తోళ్లతో పైకప్పును చేయవలెను.
15 మరియు మందిరమునకు తుమ్మకఱ్ఱతో నిలువు
16 పలకలు చేయవలెను. । పలక పొడుగు పది మూరలు
17 పలక వెడల్పు మూరెడునర యుండవలెను. । ప్రతి
పలకలో ఒకదానికొకటి సరిగ్గాయైన రెండు కుసులుం
డవలెను. అట్లు మందిరపు పలకలన్నిటికి చేసిపెట్ట
18 వలెను. । ఇరువది పలకలు కుడివైపున, అనగా దక్షిణ
19 దిక్కున మందిరమునకు పలకలను చేయవలెను. । మరి
యు నొక్కొక పలకక్రింద దానిదాని రెండు కుసు
లకు రెండు దిమ్మలను ఆ యిరువది పలకలక్రింద నలు
20 వది వెండి దిమ్మలను చేయవలెను. । మందిరపు రెండవ
21 ప్రక్కను, అనగా ఉత్తరదిక్కున, ఒక్కొక పలక
క్రింద రెండు దిమ్మలు ఇరువది పలకలును వాటి నలు
22 వది వెండి దిమ్మలు ఉండవలెను. । పడమటితట్టు మంది
రముయొక్క వెనుకప్రక్కకు ఆరు పలకలను చేయవ
23 లెను. । మరియు ఆ వెనుకప్రక్కను మందిరముయొక్క
24 మూలలకు రెండు పలకలను చేయవలెను. । అవి అడు
గున కూర్చబడి శిఖరమున మొదటి ఉంగరము వరకు
ఒకదానితో ఒకటి అతికింపబడవలెను. అట్లు ఆ రెం
25 టికి ఉండవలెను, అవి రెండు మూలలకుండును. । పల
కలు ఎనిమిది; వాటి వెండి దిమ్మలు పదియారు; ఒక్కొక
26 పలకక్రింద రెండు దిమ్మలుండవలెను. । తుమ్మకఱ్ఱతో
అడ్డ కఱ్ఱలను చేయవలెను. మందిరముయొక్క ఒక
27 ప్రక్క పలకలకు అయిదు అడ్డ కఱ్ఱలును । మంది
రముయొక్క రెండవ ప్రక్క పలకలకు అయిదు అడ్డ
కఱ్ఱలును పడమటివైపున మందిరముయొక్క ప్రక్క
28 పలకలకు అయిదు అడ్డ కఱ్ఱలును ఉండవలెను; । ఆ
పలకల మధ్యనుండు నడిమి అడ్డ కఱ్ఱ ఈ కొస
29 నుండి ఆ కొసవరకు చేరియుండవలెను. । ఆ పలకలకు
బంగారురేకును పొదిగించి వాటి అడ్డ కఱ్ఱలుండు
వాటి ఉంగరములను బంగారుతో చేసి అడ్డ కఱ్ఱలకును
30 బంగారురేకును పొదిగింపవలెను. । అప్పుడు కొండ
మీద నీకు కనుపరచబడినదాని పోలికచొప్పున మంది
రమును నిలువబెట్టవలెను.
31 మరియు నీవు నీల ధూమ్ర రక్తవర్ణములుగల ఒక
అడ్డతెరను పేనిన సన్ననారతో చేయవలెను. అది
చిత్రకారుని పనియైన కెరూబులు గలదిగా చేయవ
32 లెను. । తుమ్మకఱ్ఱతో చేయబడి బంగారురేకు పొది
గిన నాలుగు స్తంభములమీద దాని వేయవలెను; దాని
33 వంకులు బంగారువి వాటి దిమ్మలు వెండివి. । ఆ అడ్డ
తెరను ఆ కొలుకులక్రింద తగిలించి సాక్ష్యపు మంద
సము అడ్డతెరలోపలికి తేవలెను. ఆ అడ్డతెర పరి
శుద్ధస్థలమును అతిపరిశుద్ధస్థలమును వేరుచేయును. ।
అతిపరిశుద్ధస్థలములో సాక్ష్యపుమందసముమీద కరు 34
ణాపీఠము నుంచవలెను. । అడ్డతెర వెలుపట బల్లను ఆ 35
బల్లయెదుట దక్షిణపు వైపుననున్న మందిరముయొక్క
యుత్తరదిక్కున దీపవృక్షమును ఉంచవలెను. । మరియు 36
నీల ధూమ్ర రక్తవర్ణములుగల పేనిన సన్ననారతో
చిత్రకారునిపనియైన తెరను గుడారపు ద్వారమునకు
చేయవలెను. । ఆ తెరకు అయిదు స్తంభములను తుమ్మ 37
కఱ్ఱతో చేసి వాటికి బంగారురేకు పొదిగింపవలెను.
వాటి వంపులు బంగారువి వాటికి అయిదు ఇత్తడి దిమ్మలు
పోతపోయవలెను.

మరియు అయిదు మూరల పొడుగు అయిదు **27**
మూరల వెడల్పుగల బలిపీఠమును తుమ్మకఱ్ఱతో నీవు
చేయవలెను. ఆ బలిపీఠము చచ్చౌకముగా నుండవలె
ను; దాని యెత్తు మూడు మూరలు. । దాని నాలుగు 2
మూలలను దానికి కొమ్ములను చేయవలెను; దాని కొ
మ్ములు దానితో ఏకాండముగా ఉండవలెను; దానికి
ఇత్తడి రేకు పొదిగింపవలెను. । దాని బూడిదె ఎత్తు 3
టకు కుండలను గరిటెలను గిన్నెలను ముండ్లను అగ్ని
పాత్రలను చేయవలెను. ఈ ఉపకరణములన్నియు
ఇత్తడితో చేయవలెను. । మరియు వలవంటి ఇత్తడి జల్లెడ 4
దానికి చేయవలెను. ఆ వలమీద దాని నాలుగు 5
మూలలను నాలుగు ఇత్తడి ఉంగరములను చేసి ఆ వల
బలిపీఠము నడిమివరకు చేరునట్లు దిగువను బలిపీఠము
గట్టుక్రింద దాని నుంచవలెను. । మరియు బలిపీఠము 6
కొరకు మోతకఱ్ఱలను చేయవలెను. ఆ మోతకఱ్ఱలను
తుమ్మకఱ్ఱతో చేసి వాటికి ఇత్తడి రేకు పొదిగింపవలెను. ।
ఆ మోతకఱ్ఱలను ఆ ఉంగరములలో చొనపవలెను. 7
బలిపీఠమును మోయుటకు ఆ మోతకఱ్ఱలు దాని రెం
డుప్రక్కల నుండవలెను. । పలకలతో గుల్లగా దాని 8
చేయవలెను; కొండమీద నీకు చూపబడిన పోలిక
గానే వారు దాని చేయవలెను.
మరియు నీవు మందిరమునకు ఆవరణము ఏర్పరచ 9
వలెను. కుడివైపున, అనగా దక్షిణదిక్కున ఆవరణము
గా నూరు మూరల పొడుగుగలదై పేనిన సన్ననార
యవనికలు ఒక ప్రక్కకు ఉండవలెను. । దాని యిరు 10
వది స్తంభములును వాటి యిరువది దిమ్మలును ఇత్తడివి;
ఆ స్తంభముల వంకులును వాటి పెండెబద్దలును వెండి
వి. । అట్లే పొడుగులో ఉత్తర దిక్కున నూరు మూ 11
రల పొడుగుగల యవనికలుండవలెను. దాని యిరువది
స్తంభములును వాటి యిరువది దిమ్మలును ఇత్తడివి. ఆ
స్తంభముల వంకులును వాటి పెండెబద్దలును వెండివి. ।
పడమటిదిక్కున ఆవరణపు వెడల్పుకొరకు ఏబదిమూ 12
రల యవనికలుండవలెను; వాటి స్తంభములు పది వాటి
దిమ్మలు పది. । తూర్పువైపున, అనగా ఉదయదిక్కున 13
ఆవరణపు వెడల్పు ఏబది మూరలు. । ఒక ప్రక్కను 14

పదునైదుమూరల యవనికలుండవలెను; వాటి స్తం
15 భములు మూడు వాటి దిమ్మలు మూడు. । రెండవ
ప్రక్కను పదునైదుమూరల యవనికలుండవలెను;
వాటి స్తంభములు మూడు వాటి దిమ్మలును మూడు. ।
16 ఆవరణపు ద్వారమునకు నీల ధూమ్ర రక్తవర్ణములుగల
యిరువది మూరల తెర యుండవలెను. అవి పేనిన
సన్ననారతో చిత్రకారుని పనిగా ఉండవలెను; వాటి
17 స్తంభములు నాలుగు వాటి దిమ్మలు నాలుగు. । ఆవర
ణముచుట్టునున్న స్తంభములన్నియు వెండి పెండెబద్దలు
కలవి; వాటి వంకులు వెండివి వాటి దిమ్మలు ఇత్తడివి. ।
18 ఆవరణపు పొడుగు నూరు మూరలు; దాని వెడల్పు
ఏబదిమూరలు దాని యెత్తు అయిదు మూరలు; అవి
19 పేనిన సన్ననారవి వాటి దిమ్మలు ఇత్తడివి. । మందిర
సంబంధమైన సేవోపకరణములన్నియు మేకులన్నియు
ఆవరణపు మేకులన్నియు ఇత్తడివై యుండవలెను.
20 మరియు దీపము నిత్యము వెలిగించునట్లు ప్రదీప
మునకు దంచి తీసిన అచ్చ ఒలీవల నూనె తేవలెనని
21 ఇశ్రాయేలీయుల కాజ్ఞాపించుము. । సాక్ష్యపు మంద
సము ఎదుటనున్న తెరవు వెలుపల ప్రత్యక్షపు గుడా
రములో అహరోనును అతని కుమారులును సాయం
కాలము మొదలుకొని ఉదయమువరకు యెహోవా
సన్నిధిని దాని సవరింపవలెను. అది ఇశ్రాయేలీయు
లకు వారి తరతరములవరకు నిత్యమైన కట్టడ.

**28** మరియు నాకు యాజకత్వము చేయుటకై నీ
సహోదరుడైన అహరోనును అతని కుమారులను,
అనగా అహరోనును, అహరోను కుమారులైన నాదా
బును, అబీహును, ఎలాజారును, ఈతామారును ఇశ్రా
2 యేలీయులలోనుండి నీయొద్దకు పిలిపించుము. । అత
నికి అలంకారమును ఘనతయు కలుగునట్లు నీ సహో
దరుడైన అహరోనుకు ప్రతిష్ఠిత వస్త్రములను కుట్ట
3 వలెను. । అహరోను నాకు యాజకుడగునట్లు నీవు
అతని ప్రతిష్ఠించుదువు. అతని వస్త్రములను కుట్టుటకై
నేను జ్ఞానాత్మతో నింపిన వివేకహృదయులందరికి ఆజ్ఞ
4 ఇమ్ము. । పతకము ఏఫోదు నిలువుటంగీ విచిత్రమైన
చొక్కాయి పాగా దట్టియు వారు కుట్టవలసిన వస్త్ర
ములు. అతడు నాకు యాజకుడై యుండునట్లు వారు
నీ సహోదరుడైన అహరోనుకును అతని కుమారుల
5 కును ప్రతిష్ఠిత వస్త్రములను కుట్టింపవలెను. । వారు
బంగారును నీల ధూమ్ర రక్తవర్ణములుగల నూలును
6 సన్ననారను తీసికొని । బంగారుతోను నీల ధూమ్ర
రక్తవర్ణములుగల ఏఫోదును పేనిన సన్ననారతోను
7 చిత్రకారునిపనిగా చేయవలెను. । రెండు అంచుల
యందు కూర్చబడు రెండు భుజఖండములు దానికుండ
వలెను; అట్లు అది సమకూర్పబడి యుండును. ।
8 మరియు ఏఫోదుమీదనుండు విచిత్రమైన దట్టి దాని
పనిరీతిగా ఏకాండమైనదై బంగారుతోను నీల ధూమ్ర
రక్తవర్ణములుగల నూలుతోను పేనిన సన్ననారతోను
కుట్టవలెను. । మరియు నీవు రెండు లేత పచ్చలను తీసి 9
కొని వాటిమీద ఇశ్రాయేలీయుల పేరులను, అనగా
వారి జనన క్రమముచొప్పున । ఒక రత్నముమీద 10
వారి పేళ్లలో ఆరును, రెండవ రత్నముమీద తక్కిన
ఆరుగురి పేళ్లను చెక్కింపవలెను. । ముద్రమీద చెక్క 11
బడినవాటివలె చెక్కుడివాని పనిగా ఆ రెండు రత్న
ములమీద ఇశ్రాయేలీయుల పేళ్లను చెక్కి బంగారు
జవలలో వాటిని పొదగవలెను. । అప్పుడు ఇశ్రా 12
యేలీయులకు జ్ఞాపకార్థమైన రత్నములనుగా ఆ రెండు
రత్నములను ఏఫోదు భుజములమీద ఉంచవలెను
అట్లు జ్ఞాపకముకొరకు అహరోను తన రెండు భుజ
ములమీద యెహోవా సన్నిధిని వారి పేరులను
భరించును. । మరియు బంగారు జవలను మేలిమి బంగా 13
రుతో రెండు గొలుసులను చేయవలెను; । సూత్ర 14
ములవలె అల్లిక పనిగా వాటిని చేసి అల్లిన గొలుసు
లను ఆ జవలకు తగిలింపవలెను.
మరియు చిత్రకారుని పనిగా న్యాయవిధాన పత 15
కము చేయవలెను. ఏఫోదుపనివలె దాని చేయవలెను;
బంగారుతోను నీల ధూమ్ర రక్తవర్ణములుగల నూలు
తోను పేనిన సన్ననారతోను దాని చేయవలెను. ।
అది మడవబడి చచ్చౌకముగా నుండవలెను; అది 16
జేనెడు పొడుగు జేనెడు వెడల్పుగలదై యుండవలెను. ।
దానిలో నాలుగు పంక్తుల రత్నములుండునట్లు రత్న 17
ముల జవలను చేయవలెను. మాణిక్య గోమేధిక మరి
కతములుగల పంక్తి మొదటిది; । పద్మరాగ నీల సూర్య 18
కాంతములుగల పంక్తి రెండవది; । గారుత్మతము యష్మ 19
రాయి ఇంద్రనీలములుగల పంక్తి మూడవది; । రక్త 20
వర్ణపురాయి సులిమానిరాయి సూర్యకాంతములుగల
పంక్తి నాలుగవది. వాటిని బంగారు జవలలో పొదగ
వలెను. । ఆ రత్నములు ఇశ్రాయేలీయుల పేరులుగలవై 21
వారి పేరులచొప్పున పన్నెండుండవలెను. ముద్ర
మీద చెక్కినవాటివలె వారిలో ప్రతివాని పేరు చొ
ప్పున పన్నెండు గోత్రముల పేరులు ఉండవలెను. ।
మరియు ఆ పతకము అల్లికపనిగా పేనిన గొలుసులను 22
మేలిమి బంగారుతో చేయవలెను. । పతకమునకు 23
రెండు బంగారు ఉంగరములు చేసి । ఆ రెండు ఉంగ 24
రములను పతకపు రెండు కొసలయందు తగిలించి, పత
కపు కొసలనున్న రెండు ఉంగరములలో అల్లబడిన
ఆ రెండు బంగారు గొలుసులను తగిలింపవలెను. ।
అల్లిన ఆ రెండు గొలుసుల కొసలను రెండు రెండు 25
జవలకు తగిలించి ఏఫోదునెదుట దాని భుజములమీద
కట్టవలెను. । మరియు నీవు బంగారుతో రెండు ఉంగ 26
రములను చేసి ఏఫోదు నెదుటనున్న పతకములోపలి
అంచున దాని రెండు కొసలకు వాటిని తగిలింప
వలెను. । మరియు నీవు రెండు బంగారు ఉంగరములు 27

చేసి ఏఫోదు విచిత్రమైన దట్టీపైగా దాని కూర్పు
నొద్ద, దాని యెదుటి ప్రక్కకు దిగువను, ఏఫోదు
రెండు భుజభాగములకు వాటిని తగిలింపవలెను. ।
28 అప్పుడు పతకము ఏఫోదు విచిత్రమైన దట్టికిపైగా
నుండునట్లును అది ఏఫోదునుండి వదలక యుండు
నట్లును వారు దాని ఉంగరములకు ఏఫోదు ఉంగర
ములకు నీలి సూత్రముతో పతకము కట్టవలెను.
29 అట్లు అహరోను పరిశుద్ధస్థలములోకి వెళ్లునప్పుడు
అతడు తన రొమ్ముమీద న్యాయవిధాన పతకములోని
ఇశ్రాయేలీయుల పేళ్లను నిత్యము యెహోవా సన్ని
30 ధిని జ్ఞాపకార్థముగా భరింపవలెను. । మరియు నీవు
న్యాయవిధాన పతకములో ఊరీము తుమ్మీము అను
వాటిని ఉంచవలెను; అహరోను యెహోవా సన్ని
ధికి వెళ్లునప్పుడు అవి అతని రొమ్మున ఉండునట్లు
అహరోను యెహోవా సన్నిధిని తన రొమ్మున ఇశ్రా
యేలీయుల న్యాయవిధానమును నిత్యము భరించును.
31 మరియు ఏఫోదు నిలువుటంగీని కేవలము నీలి
32 దారముతో కుట్టవలెను. । దానినడుమ తల దూరుటకు
రంధ్రము ఉండవలెను. అది చినగకుండునట్లు కంఠ
కవచ రంధ్రమువలె దాని రంధ్రముచుట్టు నేతపని
33 యైన గోటు ఉండవలెను. । దాని అంచున దాని
అంచులచుట్టు నీల ధూమ్ర రక్తవర్ణములుగల దానిమ్మ
పండ్లను వాటి నడుమను బంగారు గంటలను నిలువు
34 టంగీ చుట్టు తగిలింపవలెను. । ఒక్కొక్క బంగారు
గంటయు దానిమ్మపండును ఆ నిలువుటంగీ క్రింది
35 అంచున చుట్టు ఉండవలెను. । సేవచేయునప్పుడు అహ
రోను దాని ధరించుకొనవలెను. అతడు యెహోవా
సన్నిధిని పరిశుద్ధస్థలములోకి ప్రవేశించునప్పుడు
అతడు చావకయుండునట్లు దాని ధ్వని వినబడవలెను.
36 మరియు నీవు మేలిమి బంగారు రేకుచేసి ముద్ర
చెక్కునట్లు దానిమీద యెహోవా పరిశుద్ధుడు[1]
37 అను మాట చెక్కవలెను. । అది పాగామీద ఉండు
నట్లు నీలిసూత్రముతో దాని కట్టవలెను. అది పాగా
38 ముందటివైపున ఉండవలెను. । తమ పరిశుద్ధమైన అర్ప
ణలన్నిటిలో ఇశ్రాయేలీయులు ప్రతిష్ఠించు పరిశుద్ధ
మైనవాటికి తగులు దోషములను అహరోను పరిహరిం
చునట్లు అది అహరోను నొసట ఉండవలెను; వారు
యెహోవా సన్నిధిని అంగీకరింపబడునట్లు అది
39 నిత్యమును అతని నొసట ఉండవలెను. । మరియు
సన్న నారతో చొక్కాయిని బుట్టాపనిగా చేయ
వలెను. సన్న నారతో పాగాను చేయవలెను; దట్టిని
40 బుట్టాపనిగా చేయవలెను. । అహరోను కుమారులకు
నీవు చొక్కాయిలను కుట్టవలెను; వారికి దట్టీలను
చేయవలెను; వారికి అలంకారమును ఘనతయు కలుగు
41 నట్లు కుళ్లాయిలను వారికి చేయవలెను. । నీవు నీ
సహోదరుడైన అహరోనుకును అతని కుమారులకును
వాటిని తొడిగింపవలెను; వారు నాకు యాజకులగు
నట్లు వారికి అభిషేకముచేసి వారిని ప్రతిష్ఠించి వారిని
పరిశుద్ధపరపవలెను. । మరియు వారి మానమును కప్పు 42
కొనుటకు నీవు వారికి నారలాగులను కుట్టవలెను. ।
వారు ప్రత్యక్షపు గుడారములోకి ప్రవేశించునప్పు 43
డైనను, పరిశుద్ధస్థలములో సేవచేయుటకు బలిపీఠమును
సమీపించునప్పుడైనను, వారు దోషులై చావకయుం
డునట్లు అది అహరోనుమీదను అతని కుమారుల
మీదను ఉండవలెను. ఇది అతనికిని అతని తరువాత
అతని సంతతికిని నిత్యమైన కట్టడ.

వారు నాకు యాజకులగునట్లు వారిని ప్రతిష్ఠిం 29
చుటకు నీవు వారికి చేయవలసిన కార్యమేదనగా ।
ఒక కోడెదూడను కళంకములేని రెండు పొట్టేళ్లను 2
పొంగని రొట్టెను పొంగనివై నూనెతో కలిసిన భక్ష్య
ములను పొంగనివై నూనెపూసిన పలచని అప్పడము
లను తీసికొనుము. । గోధుమపిండితో వాటిని చేసి ఒక 3
గంపలో వాటిని పెట్టి, ఆ గంపను ఆ కోడెను ఆ
రెండు పొట్టేళ్లను తీసికొని రావలెను. । మరియు 4
నీవు అహరోనును అతని కుమారులను ప్రత్యక్షపు
గుడారముయొక్క ద్వారము దగ్గరకు తీసికొనివచ్చి
నీళ్లతో వారికి స్నానము చేయించి । ఆ వస్త్రములను 5
తీసికొని చొక్కాయిని ఏఫోదు నిలువుటంగీని ఏఫో
దును పతకమును అహరోనుకు ధరింపచేసి, ఏఫోదు
విచిత్రమైన నడికట్టును అతనికి కట్టి । అతని తలమీద 6
పాగాను పెట్టి ఆ పాగామీద పరిశుద్ధకిరీటముంచి ।
అభిషేకతైలమును తీసికొని అతని తలమీద పోసి 7
అతని నభిషేకింపవలెను. । మరియు నీవు అతని కుమా 8
రులను సమీపింపచేసి వారికి చొక్కాయిలను తొడి
గింపవలెను. । అహరోనుకును అతని కుమారులకును 9
దట్టీనికట్టి వారికి కుళ్లాయిలను వేయింపవలెను; నిత్య
మైన కట్టడనుబట్టి యాజకత్వము వారికగును. అహ
రోనును అతని కుమారులను ఆలాగున ప్రతిష్ఠింప
వలెను. । మరియు నీవు ప్రత్యక్షపు గుడారము నెదు 10
టికి ఆ కోడెను తెప్పింపవలెను అహరోనును అతని
కుమారులును కోడె తలమీద తమ చేతులనుంచగా ।
ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారమునొద్ద 11
యెహోవా సన్నిధిని ఆ కోడెను వధింపవలెను. ।
ఆ కోడెరక్తములో కొంచెము తీసికొని నీ వ్రేలితో బలి 12
పీఠపు కొమ్ములమీద చమిరి ఆ రక్తశేషమంతయు బలి
పీఠపుటడుగున పోయవలెను. । మరియు ఆంత్రములను 13
కప్పుకొను క్రొవ్వంతటిని కాలేజముమీది వపను
రెండు మూత్ర గ్రంథులను వాటిమీది క్రొవ్వును నీవు
తీసి బలిపీఠముమీద దహింపవలెను. । ఆ కోడె మాంస 14
మును దాని చర్మమును దాని పేడను పాలెమునకు వెల

[1] లేక, యెహోవాకు ప్రతిష్ఠితము

పట అగ్నితో కాల్చవలెను, అది పాపపరిహారార్థమైన
15 బలి. । నీవు ఆ పొట్టేళ్లలో ఒకదాని తీసికొనవలెను.
అహరోనును అతని కుమారులును ఆ పొట్టేలు తల
16 మీద తమ చేతులుంచగా । నీవు ఆ పొట్టేలును వధించి
దాని రక్తము తీసి బలిపీఠముచుట్టు దాని ప్రోక్షింప
17 వలెను. । అంతట నీవు ఆ పొట్టేలును దాని అవయవ
ములను దేనికి అది విడదీసి, దాని ఆంత్రములను దాని
కాళ్లను కడిగి దాని అవయవములతోను తలతోను చేర్చి ।
18 బలిపీఠముమీద ఆ పొట్టేలంతయు దహింపవలెను;
అది యెహోవాకు దహనబలి, యెహోవాకు
19 ఇంపైన సువాసనగల హోమము. । మరియు
నీవు రెండవ పొట్టేలును తీసికొనవలెను. అహరోనును
అతని కుమారులును ఆ పొట్టేలు తలమీద తమ చేతు
20 లుంచగా । ఆ పొట్టేలును వధించి దాని రక్తములో
కొంచెము తీసి, అహరోను కుడిచెవి కొనమీదను
అతని కుమారుల కుడిచెవుల కొనమీదను, వారి కుడి
చేతి బొట్టనవ్రేళ్లమీదను, వారి కుడికాలి బొట్టనవ్రేళ్ల
మీదను చమిరి బలిపీఠముమీద చుట్టు ఆ రక్తమును
21 ప్రోక్షింపవలెను. । మరియు నీవు బలిపీఠముమీదనున్న
రక్తములోను అభిషేక తైలములోను కొంచెము తీసి
అహరోనుమీదను, అతని వస్త్రములమీదను, అతనితో
నున్న అతని కుమారులమీదను, అతని కుమారుల వస్త్ర
ములమీదను ప్రోక్షింపవలెను. అప్పుడు అతడును
అతని వస్త్రములును అతనితోనున్న అతని కుమారులును
అతని కుమారుల వస్త్రములును ప్రతిష్ఠితములగును. ।
22 మరియు అది ప్రతిష్ఠితమైన పొట్టేలు గనుక దాని
క్రొవ్వును క్రొవ్విన తోకను ఆంత్రములను కప్పు
క్రొవ్వును కాలేజముమీది వపను రెండు మూత్ర
గ్రంథులను వాటిమీది క్రొవ్వును కుడి జబ్బను ।
23 ఒక గుండ్రని రొట్టెను నూనెతో వండిన యొక భక్ష్య
మును యెహోవా యెదుటనున్న పొంగనివాటిలో
24 పలచని ఒక అప్పడమును నీవు తీసికొని । అహరోను
చేతులలోను అతని కుమారులచేతులలోను వాటినన్ని
టిని ఉంచి, అల్లాడింపబడు నైవేద్యముగా యెహోవా
25 సన్నిధిని వాటిని అల్లాడింపవలెను. । తరువాత
నీవు వారి చేతులలో నుండి వాటిని తీసికొని
యెహోవా సన్నిధిని ఇంపైన సువాసన కలుగునట్లు
దహనబలిగా వాటిని బలిపీఠముమీద దహింపవలెను.
26 అది యెహోవాకు హోమము. । మరియు అహ
రోనుకు ప్రతిష్ఠితమైన పొట్టేలునుండి బోరను తీసి
అల్లాడింపబడు అర్పణముగా యెహోవా సన్నిధిని
27 దానిని అల్లాడింపవలెను; అది నీ వంతగును. । ప్రతి
ష్ఠితమైన ఆ పొట్టేలులో అనగా అహరోనుదియు
అతని కుమారులదియునైన దానిలో అల్లాడింపబడిన
28 బోరను ప్రతిష్ఠితమైన జబ్బను ప్రతిష్ఠింపవలెను. । అది
ప్రతిష్ఠార్పణ గనుక నిత్యమైన కట్టడ చొప్పున అది

ఇశ్రాయేలీయులనుండి అహరోనుకును అతని కుమారు
లకునగును. అది ఇశ్రాయేలీయులు అర్పింపు సమా
ధానబలులలోనుండి తాము చేసిన ప్రతిష్ఠార్పణ, అనగా
వారు యెహోవాకు చేసిన ప్రతిష్ఠార్పణగా నుం
డును. । మరియు అహరోను ప్రతిష్ఠిత వస్త్రములును
అతని తరువాత అతని కుమారులవగును; వారు అభి
షేకము పొందుటకును ప్రతిష్ఠింపబడుటకును వాటిని
ధరించుకొనవలెను. । అతని కుమారులలో నెవడు అత
నికి ప్రతిగా యాజకుడగునో అతడు పరిశుద్ధస్థలములో
సేవచేయుటకు ప్రత్యక్షపు గుడారములోకి వెళ్లు
నప్పుడు ఏడు దినములు వాటిని వేసికొనవలెను.
మరియు నీవు ప్రతిష్ఠితమైన పొట్టేలును తీసికొని
పరిశుద్ధస్థలములో దాని మాంసమును వండవలెను. ।
అహరోనును అతని కుమారులును ప్రత్యక్షపు గుడా
రముయొక్క ద్వారముదగ్గర ఆ పొట్టేలు మాంసమును
గంపలోని రొట్టెలను తినవలెను. । వారిని ప్రతిష్ఠ
చేయుటకును వారిని పరిశుద్ధపరచుటకును వేటివలన
ప్రాయశ్చిత్తము చేయబడెనో వాటిని వారు తిన
వలెను; అవి పరిశుద్ధమైనవి గనుక అన్యుడు వాటిని
తినకూడదు. । ప్రతిష్ఠితమైన మాంసములోనేమి ఆ
రొట్టెలలోనేమి కొంచెమైనను ఉదయమువరకు
మిగిలియుండిన యెడల మిగిలినది అగ్నిచేత దహింప
వలెను; అది ప్రతిష్ఠితమైనది గనుక దాని తినవలదు. ।
నేను నీ కాజ్ఞాపించిన వాటన్నిటినిబట్టి నీవు అట్లు
అహరోనుకును అతని కుమారులకును చేయవలెను.
ఏడు దినములు వారిని ప్రతిష్ఠపరపవలెను. । ప్రాయ
శ్చిత్తము నిమిత్తము నీవు ప్రతిదినమున ఒక కోడెను
పాపపరిహారార్థబలిగా అర్పింపవలెను. బలిపీఠము నిమి
త్తము ప్రాయశ్చిత్తము చేయుటవలన దానికి పాప
పరిహారార్థబలి నర్పించి దాని ప్రతిష్ఠించుటకు దానికి
అభిషేకము చేయవలెను. । ఏడుదినములు నీవు బలి
పీఠము నిమిత్తము ప్రాయశ్చిత్తము చేసి దాని పరిశుద్ధ
పరపవలెను. ఆ బలిపీఠము అతిపరిశుద్ధముగా నుం
డును. ఆ బలిపీఠమునకు తగులునది అంతయు ప్రతి
ష్ఠితమగును.
నీవు బలిపీఠముమీద నిత్యమును అర్పింపవలసిన
దేమనగా, ఏడాదివి రెండు గొఱ్ఱెపిల్లలను ప్రతిదినము
ఉదయమందు ఒక గొఱ్ఱెపిల్లను । సాయంకాలమందు
ఒక గొఱ్ఱెపిల్లను అర్పింపవలెను. । దంచి తీసిన
ముప్పావు నూనెతో కలిపిన పదియవవంతు పిండిని
పానీయార్పణముగా ముప్పావు ద్రాక్షారసమును
మొదటి గొఱ్ఱెపిల్లతో అర్పింపవలెను. సాయంకాల
మందు రెండవ గొఱ్ఱెపిల్లను అర్పింపవలెను. । అది
యెహోవాకు ఇంపైన సువాసనగల హోమమగు
నట్లు ఉదయకాలమందలి అర్పణమును దాని పానీ
యార్పణమును అర్పించినట్లు దీని నర్పింపవలెను. । ఇది

యెహోవా సన్నిధిని సాక్ష్యపు గుడారముయొక్క
ద్వారమునొద్ద మీ తరతరములకు నిత్యముగా
అర్పించు దహనబలి. నీతో మాటలాడుటకు నేను
43 అక్కడికి వచ్చి మిమ్మును కలిసికొందును. । అక్కడికి
వచ్చి ఇశ్రాయేలీయులను కలిసికొందును; అది నా
44 మహిమవలన పరిశుద్ధపరపబడును. । నేను సాక్ష్యపు
గుడారమును బలిపీఠమును పరిశుద్ధపరచెదను. నాకు
యాజకులగునట్లు అహరోనును అతని కుమారులను
45 పరిశుద్ధపరచెదను. । నేను ఇశ్రాయేలీయుల మధ్య
46 నివసించి వారికి దేవుడనై యుందును. । కావున నేను
వారి మధ్య నివసించునట్లు ఐగుప్తు దేశములో
నుండి వారిని వెలుపలికి రప్పించిన తమ దేవుడైన
యెహోవాను నేనే అని వారు తెలిసికొందురు.
నేను వారి దేవుడనైన యెహోవాను.

**30** మరియు ధూపమువేయుటకు నీవు ఒక వేదికను
2 చేయవలెను; తుమ్మకఱ్ఱతో దాని చేయవలెను. । దాని
పొడుగు ఒక మూర దాని వెడల్పు ఒక మూర. అది
చచ్చౌకముగా నుండవలెను. దాని యెత్తు రెండుమూ
రలు దాని కొమ్ములు దానితో ఏకాండమై యుండ
3 వలెను. । దాని పైభాగమునకును దాని నాలుగు
ప్రక్కలకును దాని కొమ్ములకును మేలిమి బంగారు
రేకులు పొదిగించి దానికి చుట్టు బంగారు జవను
4 చేయవలెను. । దాని జవకు దిగువను దానికి రెండు
బంగారు ఉంగరములు చేయవలెను; దాని రెండు
ప్రక్కలయందలి దాని రెండు మూలలమీద వాటిని
5 ఉంచవలెను. । అవి దాని మోయు మోతకఱ్ఱలకు
స్థలములు. ఆ మోతకఱ్ఱలను తుమ్మకఱ్ఱతో చేసి
6 వాటికి బంగారురేకు పొదిగింపవలెను. । సాక్ష్యపు
మందసము నొద్దనుండు అడ్డతెర యెదుట, అనగా
శాసనములమీది కరుణాపీఠమునెదుట నీవు దానిని
ఉంచవలెను; అక్కడ నేను నిన్ను కలిసికొందును. ।
7 అహరోను ప్రతిదినము ప్రొద్దుట దానిమీద పరిమళ
ద్రవ్యముల ధూపము వేయవలెను. అతడు ప్రదీప
ములను చక్కపరచునప్పుడు దానిమీద ఆ ధూపము
8 వేయవలెను. । మరియు సాయంకాలమందు అహరోను
ప్రదీపములను వెలిగించునప్పుడు దానిమీద ధూపము
వేయవలెను. అది మీ తరతరములకు యెహోవా
9 సన్నిధిని నిత్యమైన ధూపము. । మీరు దానిమీద
అన్యధూపమునైనను దహనబలి సంబంధమైన ద్రవ్య
మునైనను నైవేద్యమునైనను అర్పింపకూడదు; పానీ
10 యమునైనను దానిమీద పోయకూడదు. । మరియు
అహరోను సంవత్సరమున కొకసారి ప్రాయశ్చిత్తార్థ
మైన పాపపరిహారార్థబలిరక్తమువలన దాని కొమ్ముల
నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయవలెను. మీ తరతర
ములకు సంవత్సరమునకు ఒకసారి అతడు దాని
నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయవలెను. అది
యెహోవాకు అతిపరిశుద్ధమైనది.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను ।— 11
నీవు ఇశ్రాయేలీయులను లెక్కింపవలెను. వారు 12
లెక్కింపబడువేళకు ప్రతివాడు యెహోవాకు తన
ప్రాణపరిక్రయధనము నిచ్చుకొనవలెను. ఆలాగు
చేసిన పక్షమున నీవు వారిని లెక్కించునప్పుడు వారి
లో ఏ తెగులును పుట్టదు. । వారు ఇయ్యవలసినది 13
ఏమనగా, లెక్కింపబడినవారిలో చేరు ప్రతివాడును
పరిశుద్ధస్థలముయొక్క తులమునుబట్టి అరతులము
ఇయ్యవలెను. ఆ తులము ఇరువది చిన్నములు. ఆ
అరతులము యెహోవాకు ప్రతిష్ఠార్పణ. । ఇరువది 14
సంవత్సరములుగాని అంతకంటె ఎక్కువ వయస్సుగాని
గలవారై లెక్కింపబడినవారిలో చేరు ప్రతివాడును
యెహోవాకు అర్పణ నియ్యవలెను. । అది మీ 15
ప్రాణములకు పరిక్రయధనముగా నుండునట్లు
యెహోవాకు అర్పణ ఇచ్చునప్పుడు ధనవంతుడు అర
తులముకంటె ఎక్కువ ఇయ్యకూడదు. బీదవాడు
తక్కువ ఇయ్యకూడదు. । నీవు ఇశ్రాయేలీయుల యొద్ద 16
నుండి ప్రాయశ్చిత్తార్థమైన వెండి తీసికొని ప్రత్యక్షపు
గుడారముయొక్క సేవనిమిత్తము దాని నియమింప
వలెను. మీకు ప్రాయశ్చిత్తము కలుగునట్లు అది
యెహోవా సన్నిధిని ఇశ్రాయేలీయులకు జ్ఞాపకార్థ
ముగా నుండును.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను— 17
కడుగుకొనుటకు నీవు ఇత్తడితో దానికొక గంగాళ
మును ఇత్తడిపీటను చేసి । ప్రత్యక్షపు గుడారమునకు 18
బలిపీఠమునకు నడుమ దానిని ఉంచి నీళ్లతో నింప
వలెను. । ఆ నీళ్లతో అహరోనును అతని కుమారులును 19
తమ చేతులను కాళ్లను కడుగుకొనవలెను. । వారు 20
ప్రత్యక్షపు గుడారములోకి వెళ్లునప్పుడును సేవచేసి
యెహోవాకు హోమధూపము నర్పించుటకు బలి
పీఠము నొద్దకు వచ్చునప్పుడును తాము చావక యుం
డునట్లు నీళ్లతో కడుగుకొనవలెను. । తాము చావక 21
యుండునట్లు తమ చేతులను కాళ్లను కడుగుకొనవలెను.
అది వారికి, అనగా అతనికిని అతని సంతతికిని వారి
తరతరములకు నిత్యమైన కట్టడగా నుండును.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను—నీవు 22
ముఖ్యమైన సుగంధ సంభారములలో । పరిశుద్ధస్థల 23
సంబంధమైన తులముచొప్పున, అచ్చమైన గోపర
సము ఏనూరు తులములును సుగంధముగల లవంగిపట్ట
సగము, అనగా ఇన్నూట ఏబది తులముల యెత్తును ।
నిమ్మగడ్డి నూనె ఇన్నూట ఏబదితులముల యెత్తును, 24
లవంగిపట్ట ఏనూరు తులములును ఒలీవనూనె సంభార
మును మూడు పళ్లును తీసికొని । వాటిని ప్రతిష్ఠాభి 25
షేక తైలము, అనగా సుగంధద్రవ్యమేళకుని పనియైన

పరిమళసంభారముగా చేయవలెను. అది ప్రతిష్ఠాభి
26 షేక తైలమగును. । ఆ తైలముతో నీవు సాక్ష్యపు
27 గుడారమును సాక్ష్యపు మందసమును । బల్లను దాని
ఉపకరణములన్నిటిని దీపవృక్షమును దాని ఉపకరణ
28 ములను ధూపవేదికను । దహన బలిపీఠమును దాని
ఉపకరణములన్నిటిని గంగాళమును దాని పీటను అభి
29 షేకించి । అవి అతిపరిశుద్ధమైనవిగా ఉండునట్లు
వాటిని ప్రతిష్ఠింపవలెను. వాటిని తగులు ప్రతివస్తువు
30 ప్రతిష్ఠితమగును. । మరియు అహరోనును అతని
కుమారులను నాకు యాజకులై యుండునట్లు నీవు
31 వారిని అభిషేకించి ప్రతిష్ఠింపవలెను. । మరియు నీవు
ఇశ్రాయేలీయులను చూచి—ఇది మీ తరతరములకు
32 నాకు ప్రతిష్ఠాభిషేకతైలమై యుండవలెను; । దానిని
నరశరీరముమీద పోయకూడదు; దాని మేళనము చొ
ప్పున దానివంటి దేనినైనను చేయకూడదు. అది ప్రతి
ష్ఠితమైనది, అది మీకు ప్రతిష్ఠితమైనదిగా నుండ
33 వలెను. । దానివంటిది కలుపువాడును అన్యునిమీద
దానిని పోయువాడును తన ప్రజలలోనుండి కొట్టి
వేయబడవలెనని చెప్పుము.

34 మరియు యెహోవా మోషేతో ఇట్లనెను—నీవు
పరిమళ ద్రవ్యములను, అనగా జటామాంసి గోపిచంద
నము గంధపుచెక్క అను ఈ పరిమళ ద్రవ్యములను
స్వచ్ఛమైన సాంబ్రాణిని సమభాగములుగా తీసికొని ।
35 వాటితో ధూపద్రవ్యమును చేయవలెను; అది సుగంధ
ద్రవ్యమేళకుని పని చొప్పున కలపబడి, ఉప్పుగల
దియు స్వచ్ఛమైనదియు పరిశుద్ధమైనదియునైన
36 సుగంధ ధూపసంభారము. । దానిలో కొంచెము
పొడిచేసి నేను నిన్ను కలిసికొను ప్రత్యక్షపు గుడా
రములోని సాక్ష్యపు మందసము నెదుట దాని నుంచ
వలెను. అది మీకు అతిపరిశుద్ధముగా ఉండవలెను. ।
37 నీవు చేయవలసిన ఆ ధూపద్రవ్యమును దాని మేళ
నము చొప్పున మీ నిమిత్తము మీరు చేసికొనకూడదు.
అది యెహోవాకు ప్రతిష్ఠితమైనదిగా ఎంచవలెను. ।
38 దాని వాసన చూచుటకు దానివంటిది చేయువాడు
తన ప్రజలలోనుండి కొట్టివేయబడును.

**31** మరియు యెహోవా మోషేతో ఇట్లనెను ।
2 —చూడుము; నేను యూదా గోత్రములో హూరు
మనుమడును ఊరి కుమారుడునైన బెసలేలు అను పేరు
3 గలవానిని పిలిచితిని. । విచిత్రమైన పనులను కల్పిం
4 చుటకును బంగారుతోను వెండితోను ఇత్తడితోను పని
5 చేయుటకును । పొదుగుటకై రత్నములను సానబెట్టుట
కును కఱ్ఱనుకోసి చెక్కుటకును సమస్తవిధములైన పను
లను చేయుటకును జ్ఞానవిద్యావివేకములును సమస్త
మైన పనుల నేర్పును వానికి కలుగునట్లు వానిని దేవుని
6 ఆత్మ పూర్ణునిగా చేసియున్నాను. । మరియు నేను
దాను గోత్రములోని అహీసామాకు కుమారుడైన
అహోలీయాబును అతనికి తోడుచేసితిని. నేను నీ
కాజ్ఞాపించినవన్నియు చేయునట్లు జ్ఞానహృదయులం
దరి హృదయములలో జ్ఞానమును ఉంచియున్నాను. ।
ప్రత్యక్షపు గుడారమును సాక్ష్యపు మందసమును 7
దానిమీదనున్న కరుణాపీఠమును ఆ గుడారపు ఉప
కరణములన్నిటిని । బల్లను దాని ఉపకరణములను నిర్మల 8
మైన దీపవృక్షమును దాని ఉపకరణములన్నిటిని
ధూపవేదికను । దహన బలిపీఠమును దాని ఉపకరణ 9
ములన్నిటిని గంగాళమును దాని పీటను । యాజకసేవ 10
చేయునట్లు సేవావస్త్రములను యాజకుడైన అహరోను
యొక్క ప్రతిష్ఠిత వస్త్రములను అతని కుమారుల వస్త్రము
లను । అభిషేక తైలమును పరిశుద్ధ స్థలముకొరకు పరి 11
మళ ధూపద్రవ్యములను నేను నీ కాజ్ఞాపించిన ప్రకా
రముగా వారు సమస్తమును చేయవలెను.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను ।—నీవు 12
ఇశ్రాయేలీయులను చూచి—నిజముగా మీరు నేను 13
నియమించిన విశ్రాంతిదినములను ఆచరింపవలెను;
మిమ్మును పరిశుద్ధపరచు యెహోవాను నేనే అని
తెలిసికొనునట్లు అది మీ తరతరములకు నాకును మీ
కును గురుతగును. । కావున మీరు విశ్రాంతిదినము 14
నాచరింపవలెను. నిశ్చయముగా అది మీకు పరి
శుద్ధము; దానిని అపవిత్రపరచువాడు తప్పక మరణ
శిక్ష నొందును. । ఆరు దినములు పనిచేయవచ్చును; 15
ఏడవదినము యెహోవాకు ప్రతిష్ఠితమైన విశ్రాంతి
దినము. ఆ విశ్రాంతిదినమున పనిచేయు ప్రతివా
డును తప్పక మరణశిక్ష నొందును. । ఇశ్రాయేలీ 16
యులు తమ తరతరములకు విశ్రాంతి దినాచారమును
అనుసరించి ఆ దినము నాచరింపవలెను; అది నిత్య
నిబంధన. । నాకును ఇశ్రాయేలీయులకును అది ఎల్ల
ప్పుడును గురుతైయుండును; ఏలయనగా ఆరు దిన
ములు యెహోవా భూమ్యాకాశములను సృజించి
యేడవదినమున పని మాని విశ్రమించెనని చెప్పుము.

మరియు ఆయన సీనాయి కొండమీద మోషేతో 18
మాటలాడుట చాలించిన తరువాత ఆయన తన శాసన
ములుగల రెండు పలకలను, అనగా దేవుని వ్రేలితో
వ్రాయబడిన రాతి పలకలను అతనికిచ్చెను.

మోషే కొండదిగకుండ తడవుచేయుట ప్రజలు **32**
చూచినప్పుడు ఆ ప్రజలు అహరోనునొద్దకు కూడి
వచ్చి—లెమ్ము, మా ముందర నడుచుటకు ఒక దేవతను
మాకొరకు చేయుము. ఐగుప్తులోనుండి మమ్మును
రప్పించిన ఆ మోషే అనువాడు ఏమాయెనో మాకు
తెలియదని అతనితో చెప్పిరి. । అందుకు అహరోను—
మీ భార్యలకు మీ కుమారులకు మీ కుమార్తెలకు
చెవులనున్న బంగారు పోగులను తీసి నాయొద్దకు
తెండని వారితో చెప్పగా । ప్రజలందరు తమ చెవుల
నున్న బంగారు పోగులను తీసి అహరోనునొద్దకు

4 తెచ్చిరి. । అతడు వారియొద్ద వాటిని తీసికొని పోగ
రతో రూపమును ఏర్పరచి దానిని పోత పోసిన
దూడగా చేసెను. అప్పుడు వారు—ఓయి ఇశ్రా
యేలూ, ఐగుప్తుదేశములోనుండి నిన్ను రప్పించిన నీ
5 దేవుడు ఇదే అనిరి. । అహరోను అది చూచి దాని
యెదుట ఒక బలిపీఠము కట్టించెను. మరియు అహ
రోను — రేపు యెహోవాకు పండుగ జరుగునని
6 చాటింపగా । మరునాడు వారు ఉదయమున లేచి
దహనబలులను సమాధానబలుల నర్పించిరి. అప్పుడు
ప్రజలు తినను త్రాగను కూర్చుండి ఉత్సవము చేయ
సాగిరి.
7 కాగా యెహోవా మోషేతో ఇట్లనెను—నీవు
దిగి వెళ్లుము; ఐగుప్తుదేశమునుండి నీవు రప్పించిన నీ
8 ప్రజలు చెడిపోయిరి. । నేను వారికి నియమించిన
త్రోవనుండి త్వరగా తొలగిపోయి తమకొరకు పోత
పోసిన దూడను చేసికొని దానికి సాగిలపడి బలినర్పించి
—ఓయి ఇశ్రాయేలూ, ఐగుప్తుదేశమునుండి నిన్ను
రప్పించిన నీ దేవుడు ఇదే అని చెప్పుకొనిరనెను. ।
9 మరియు యెహోవా ఇట్లనెను—నేను ఈ ప్రజలను
చూచియున్నాను; ఇదిగో వారు లోబడనొల్లని
10 ప్రజలు. । కావున నీవు ఊరకుండుము; నా కోపము
వారిమీద మండును, నేను వారిని కాల్చివేసి నిన్ను
గొప్ప జనముగా చేసెదనని మోషేతో చెప్పగా ।
11 మోషే తన దేవుడైన యెహోవాను బ్రతిమాలుకొని
—యెహోవా, నీవు మహాశక్తివలన బాహుబలము
వలన ఐగుప్తుదేశములోనుండి రప్పించిన నీ ప్రజల
12 మీద నీ కోపము మండనేల? । —ఆయన కొండలలో
వారిని చంపునట్లును భూమిమీదనుండి వారిని నశింప
చేయునట్లును అపకారబుద్ధితోనే వారిని తీసికొని
పోయెనని ఐగుప్తీయులు ఏల చెప్పుకొనవలెను? నీ
కోపాగ్నినుండి మళ్లుకొని నీవు నీ ప్రజలకు ఈ కీడు
13 చేయక దానిగూర్చి సంతాపపడుము. । నీ సేవకులైన
అబ్రాహామును ఇస్సాకును ఇశ్రాయేలును జ్ఞాపకము
చేసికొనుము. నీవు వారిని చూచి—ఆకాశనక్షత్ర
ములవలె మీ సంతానము అభివృద్ధిజేసి నేను చెప్పిన
యీ సమస్త భూమిని మీ సంతానమున కిచ్చెదననియు,
వారు నిరంతరము దానికి హక్కుదారులగుదురనియు
వారితో నీతోడని ప్రమాణముచేసి చెప్పితివనెను. ।
14 అంతట యెహోవా తన ప్రజలకు చేసెదనని చెప్పిన
కీడునుగూర్చి సంతాపపడెను.
15 మోషే శాసనములుగల రెండు పలకలను చేత
పట్టుకొని కొండ దిగి వచ్చెను. ఆ పలకలు ఇరు
ప్రక్కలను వ్రాయబడినవి; అవి ఈ ప్రక్కను ఆ
16 ప్రక్కను వ్రాయబడియుండెను. । ఆ పలకలు దేవుడు
చేసినవి; ఆ పలకలమీద చెక్కబడిన వ్రాత దేవుని
17 చేవ్రాత. । ఆ ప్రజలు పెద్ద కేకలు వేయుచుండగా
యెహోషువ ఆ ధ్వని విని—పాళెములో యుద్ధధ్వని
అని మోషేతో అనగా । అతడు—అది జయధ్వని 18
కాదు, అపజయధ్వనికాదు, సంగీతధ్వని నాకు విన
బడుచున్నదనెను. । అతడు పాళెమునకు సమీపిం 19
పగా, ఆ దూడను వారు నాట్యమాడుటను చూచెను.
అందుకు మోషే కోపము మండెను; అతడు కొండ
దిగువను తన చేతులలోనుండి ఆ పలకలను పడవేసి
వాటిని పగలగొట్టెను. । మరియు అతడు వారు చేసిన 20
ఆ దూడను తీసికొని అగ్నితో కాల్చి పొడిచేసి నీళ్ల
మీద చల్లి ఇశ్రాయేలీయులచేత దాని త్రాగించెను. ।
అప్పుడు మోషే—నీవు ఈ ప్రజలమీదికి ఈ గొప్ప 21
పాపము రప్పించునట్లు వారు నిన్ను ఏమిచేసిరని
అహరోనును నడుగగా । అహరోను—నా యేలిన 22
వాడా, నీ కోపము మండనియ్యకుము. ఈ ప్రజలు
దుర్మార్గులను మాట నీ వెరుగుదువు. । వారు—మాకు 23
ముందు నడుచుటకు ఒక దేవతను చేయుము; ఐగుప్తు
లోనుండి మమ్మును రప్పించినవాడగు ఈ మోషే
యేమాయెనో మాకు తెలియదనిరి. । అందుకు నేను— 24
ఎవరియొద్ద బంగారము ఉన్నదో వారు దానిని ఊడ
దీసి తెండని చెప్పితిని. నేను దాని అగ్నిలో వేయగా
ఈ దూడ యాయెననెను. । ప్రజలు విచ్చలవిడిగా 25
తిరుగుట మోషే చూచెను. వారి విరోధులలో వారికి
ఎగతాళి కలుగునట్లు అహరోను విచ్చలవిడిగా తిరు
గుటకు వారిని విడిచిపెట్టియుండెను. । అందుకు మోషే 26
పాళెముయొక్క ద్వారమున నిలిచి — యెహోవా
పక్షమున నున్నవారందరు నాయొద్దకు రండి
అనగా లేవీయులందరును అతనియొద్దకు కూడి వచ్చిరి. ।
అతడు వారిని చూచి—మీలో ప్రతివాడును తన 27
కత్తిని తన నడుమున కట్టుకొని పాళెములో ద్వారము
నుండి ద్వారమునకు వెళ్లుచు, ప్రతివాడు తన సహో
దరుని ప్రతివాడు తన చెలికానిని ప్రతివాడు తన
పొరుగువానిని చంపవలెనని ఇశ్రాయేలీయుల దేవు
డైన యెహోవా సెలవిచ్చుచున్నాడనెను. । లేవీ 28
యులు మోషే మాటచొప్పున చేయగా, ఆ దినమున
ప్రజలలో ఇంచుమించు మూడువేలమంది కూలిరి. ।
ఏలయనగా మోషే వారిని చూచి—నేడు యెహోవా 29
మిమ్మును ఆశీర్వదించునట్లు మీలో ప్రతివాడు
తన కుమారునిమీద పడియేగాని తన సహోదరుని
మీద పడియేగాని యెహోవాకు మిమ్మును మీరే
ప్రతిష్ఠ చేసికొనుడనెను. । మరునాడు మోషే ప్రజ 30
లను చూచి—మీరు గొప్ప పాపము చేసితిరి గనుక
యెహోవాయొద్దకు కొండయెక్కి వెళ్లెదను; ఒకవేళ
మీ పాపమునకు ప్రాయశ్చిత్తము చేయగలనేమో
అనెను. । అప్పుడు మోషే యెహోవాయొద్దకు 31
తిరిగి వెళ్లి—అయ్యో యీ ప్రజలు గొప్ప పాపము
చేసిరి; వారు బంగారు దేవతను తమకొరకు చేసి

32 కొనిరి. । అయ్యో నీవు వారి పాపమును ఒకవేళ పరి
హరించితివా, లేనియెడల నీవు వ్రాసిన నీ గ్రంథ
ములోనుండి నా పేరు తుడిచివేయుమని బ్రతిమాలు
33 కొనుచున్నాననెను. । అందుకు యెహోవా—యెవడు
నా యెదుట పాపము చేసెనో వాని నా గ్రంథము
34 లోనుండి తుడిచివేయుదును. । కాబట్టి నీవు వెళ్లి
నేను నీతో చెప్పినచోటికి ప్రజలను నడిపించుము.
ఇదిగో నా దూత నీకు ముందుగా వెళ్లును. నేను
వచ్చు దినమున వారి పాపమును వారిమీదికి రప్పిం
35 చెదనని మోషేతో చెప్పెను. । అహరోను కల్పించిన
దూడను ప్రజలు చేయించినందున యెహోవా
వారిని బాధపెట్టెను.

33 మరియు యెహోవా మోషేతో ఇట్లనెను —
నీవును నీవు ఐగుప్తుదేశమునుండి తోడుకొనివచ్చిన
ప్రజలును బయలుదేరి, నేను అబ్రాహాముతోను ఇస్సా
కుతోను యాకోబుతోను ప్రమాణముచేసి — నీ
సంతానమునకు దీని నిచ్చెదనని చెప్పిన పాలు తేనెలు
2 ప్రవహించు దేశమునకు లేచి పొండి. । నేను నీకు
ముందుగా దూతను పంపి కనానీయులను అమోరీయు
లను హిత్తీయులను పెరిజ్జీయులను హివ్వీయులను
3 యెబూసీయులను వెళ్లగొట్టెదను. । మీరు లోబడ
నొల్లని ప్రజలు గనుక నేను మీతోకూడ రాను;
త్రోవలో మిమ్మును సంహరించెదనేమో అని మోషే
4 తో చెప్పెను. । ప్రజలు ఆ దుర్వార్తను విని దుఃఖిం
చిరి; ఎవడును ఆభరణములను ధరించుకొనలేదు. ।
5 కాగా యెహోవా మోషేతో ఇట్లనెను — నీవు
ఇశ్రాయేలీయులను చూచి — మీరు లోబడనొల్లని
ప్రజలు; ఒక క్షణమాత్రము నేను మీ నడుమకు
వచ్చితినా, మిమ్మును నిర్మూలము చేసెదను గనుక
మిమ్మును ఏమి చేయవలెనో అది నాకు తెలియునట్లు
మీ ఆభరణములను మీ మీదనుండి తీసివేయుడి అని
6 చెప్పుమనెను. । కాబట్టి ఇశ్రాయేలీయులు హోరేబు
కొండయొద్ద తమ ఆభరణములను తీసివేసిరి.
7 అంతట మోషే గుడారమును తీసి పాళెము వెల
పలికి వెళ్లి పాళెమునకు దూరముగా దాని వేసి,
దానికి ప్రత్యక్షపు గుడారమను పేరు పెట్టెను.
యెహోవాను వెదకిన ప్రతివాడును పాళెమునకు
వెలపటనున్న ఆ ప్రత్యక్షపు గుడారమునకు వెళ్లుచు
8 వచ్చెను. । మోషే ఆ గుడారమునకు వెళ్లినప్పుడు
ప్రజలందరును లేచి, ప్రతివాడు తన గుడారపు ద్వార
మందు నిలిచి, అతడు ఆ గుడారములోకి పోవువరకు
9 అతని వెనుకతట్టు నిదానించి చూచుచుండెను. । మోషే
ఆ గుడారములోకి పోయినప్పుడు మేఘస్తంభము దిగి
ఆ గుడారపు ద్వారమందు నిలువగా యెహోవా
10 మోషేతో మాటలాడెను. । ప్రజలందరు ఆ మేఘస్తం
భము ఆ గుడారపు ద్వారమున నిలుచుట చూచి, లేచి
ప్రతివాడును తన తన గుడారపు ద్వారమందు నమ
స్కారము చేసిరి. । మనుష్యుడు తన స్నేహితునితో 11
మాటలాడునట్లు యెహోవా మోషేతో ముఖా
ముఖిగా మాటలాడెను. తరువాత అతడు పాళెము
లోనికి తిరిగి వచ్చెను. అతని పరిచారకుడును నూను
కుమారుడునైన యెహోషువ అను యౌవనస్థుడు
గుడారములోనుండి వెలపలికి రాలేదు.
మోషే యెహోవాతో ఇట్లనెను—చూడుము— 12
ఈ ప్రజలను తోడుకొని పొమ్మని నీవు నాతో చెప్పు
చున్నావుగాని నాతో ఎవరిని పంపెదవో అది నాకు
తెలుపలేదు. నీవు—నేను నీ పేరునుబట్టి నిన్ను ఎరిగి
యున్నాననియు, నా కటాక్షము నీకు కలిగినదనియు
చెప్పితివి కదా. । కాబట్టి నీ కటాక్షము నాయెడల 13
కలిగిన పక్షమున నీ కటాక్షము నాయెడల కలుగు
నట్లుగా దయచేసి నీ మార్గమును నాకు తెలుపుము.
అప్పుడు నేను నిన్ను తెలిసికొందును; చిత్తగించుము,
ఈ జనము నీ ప్రజలేగదా అనెను. । అందుకు ఆయన 14
— నా సన్నిధి నీకు తోడుగా వచ్చును, నేను నీకు
విశ్రాంతి కలుగజేసెదననగా । మోషే—నీ సన్నిధి 15
రానియెడల ఇక్కడనుండి మమ్మును తోడుకొని
పోకుము. । నాయెడలను నీ ప్రజలయెడలను నీకు 16
కటాక్షము కలిగినదని దేనివలన తెలియబడును? నీవు
మాతో వచ్చుటవలననే గదా? అట్లు మేము, అనగా
నేనును నీ ప్రజలును భూమిమీదనున్న సమస్త
ప్రజలలోనుండి ప్రత్యేకింపబడుదుమని ఆయనతో
చెప్పెను.
కాగా యెహోవా—నీవు చెప్పిన మాటచొప్పున 17
చేసెదను; నీ మీద నాకు కటాక్షము కలిగినది, నీ
పేరునుబట్టి నిన్ను ఎరుగుదునని మోషేతో చెప్పగా ।
అతడు—దయచేసి నీ మహిమను నాకు చూపుమనగా । 18
ఆయన—నా సర్వోత్తమత్వమును నీ యెదుట కనుపర 19
చెదను; యెహోవా అను నామమును నీ యెదుట
ప్రకటించెదను. నేను కరుణించువాని కరుణించెదను,
ఎవనియందు కనికరపడెదనో వానియందు కనికర
పడెదననెను. । మరియు ఆయన—నీవు నా ముఖమును 20
చూడజాలవు; ఏ నరుడును నన్ను చూచి బ్రదుక
డనెను. । మరియు యెహోవా—ఇదిగో నా సమీ 21
పమున ఒక స్థలమున్నది, నీవు ఆ బండమీద నిలువ
వలెను. । నా మహిమ నిన్ను దాటి వెళ్లుచుండగా ఆ 22
బండసందులో నిన్ను ఉంచి నిన్ను దాటి వెళ్లువరకు
నా చేతితో నిన్ను కప్పెదను; । నేను నా చెయ్యి 23
తీసినతరువాత నా వెనుక పార్శ్వమును చూచెదవు
కాని నా ముఖము నీకు కనబడదని మోషేతో
చెప్పెను.

మరియు యెహోవా మోషేను చూచి—మొదటి 34
పలకలవంటి మరి రెండు రాతిపలకలను చెక్కుము.

నీవు పగలగొట్టిన మొదటి పలకలమీదనున్న వాక్యము
2 లను నేను ఈ పలకలమీద వ్రాసెదను. । ఉదయము
నకు నీవు సిద్ధపడి ఉదయమున సీనాయి కొండయెక్కి
అక్కడ శిఖరముమీద నా సన్నిధిని నిలిచియుండ
3 వలెను. । ఏ నరుడును నీతో ఈ కొండకు రాకూ
డదు; ఏ నరుడును ఈ కొండమీద ఎక్కడనైనను
కనబడకూడదు; ఈ కొండయెదుట గొఱ్ఱెలైనను
4 ఎద్దులైనను మేయకూడదని సెలవిచ్చెను. । కాబట్టి అత
డు మొదటి పలకలవంటి రెండు రాతిపలకలను
చెక్కెను. మోషే తనకు యెహోవా ఆజ్ఞాపించినట్లు
ఉదయమందు పెందలకడ లేచి ఆ రెండు రాతిపల
కలను చేత పట్టుకొని సీనాయికొండ యెక్కగా ।
5 మేఘములో యెహోవా దిగి అక్కడ అతనితో
నిలిచి యెహోవా అను నామమును ప్రకటించెను. ।
6 అతనియెదుట యెహోవా అతని దాటివెళ్లుచు—
యెహోవా కనికరము, దయ, దీర్ఘశాంతము, విస్తా
రమైన కృపాసత్యములుగల దేవుడైన యెహోవా. ।
7 ఆయన వేయివేలమందికి కృపను చూపుచు, దోష
మును అపరాధమును పాపమును క్షమించును గాని
ఆయన ఏమాత్రమును దోషులను నిర్దోషులగా ఎం
చక మూడు నాలుగు తరములవరకు తండ్రుల దోష
మును కుమారుల మీదికిని కుమారుల కుమారుల మీది
8 కిని రప్పించునని ప్రకటించెను. । అందుకు మోషే త్వర
పడి నేలవరకు తలవంచుకొని నమస్కారముచేసి ।—
9 ప్రభువా, నామీద నీకు కటాక్షము కలిగినయెడల నా
మనవి ఆలకించుము. దయచేసి నా ప్రభువు మా
మధ్యను ఉండి మాతోకూడ రావలెను. వీరు లోబడ
నొల్లని ప్రజలు. మా దోషమును పాపమును క్షమించి
10 మమ్మును నీ స్వాస్థ్యముగా చేసికొనుమనెను । అందుకు
ఆయన—ఇదిగో నేను ఒక నిబంధన చేయుచున్నాను;
భూమిమీద ఎక్కడనైనను ఏ జనములోనైనను చేయ
బడని అద్భుతములు నీ ప్రజలందరియెదుట చేసెదను.
నీవు ఏ ప్రజల నడుమనున్నావో ఆ ప్రజలందరును
యెహోవా కార్యమును చూచెదరు. నేను నీయెడల
11 చేయబోవునది భయంకరమైనది. । నేడు నేను నీ
కాజ్ఞాపించుదాని ననుసరించి నడువుము. ఇదిగో నేను
అమోరీయులను కనానీయులను హిత్తీయులను పెరిజీ
యులను హివ్వీయులను యెబూసీయులను నీ యెదుట
12 నుండి వెళ్లగొట్టెదను. । నీవు ఎక్కడికి వెళ్లుచున్నావో
ఆ దేశపు నివాసులతో నిబంధనచేసికొనకుండ జాగ్ర
13 త్తపడుము. ఒకవేళ అది నీకు ఉరికావచ్చును. । కా
బట్టి మీరు వారి బలిపీఠములను పడగొట్టి వారి బొమ్మ
లను పగలగొట్టి వారి విగ్రహములను పడగొట్టవలెను. ।
14 ఏలయనగా వేరొక దేవునికి నమస్కారము చేయవద్దు,
ఆయన నామము రోషముగల యెహోవా; ఆయన
15 రోషముగల దేవుడు. । ఆ దేశపు నివాసులతో నిబం
ధనచేసికొనకుండ జాగ్రత్తపడుము; వారు ఇతరుల
దేవతలతో వ్యభిచరించి ఆ దేవతలకు బలి అర్పించు
నప్పుడు ఒకడు నిన్ను పిలిచినయెడల నీవు వాని బలి
ద్రవ్యమును తినకుండ చూచుకొనుము. । మరియు నీవు 16
నీ కుమారులకొరకు వారి కుమార్తెలను పుచ్చుకొను
నెడల వారి కుమార్తెలు తమ దేవతలతో వ్యభిచరించి
నీ కుమారులను తమ దేవతలతో వ్యభిచరింప చేయు
దురేమో. । పోతపోసిన దేవతలను చేసికొనవలదు. । 17
మీరు పొంగనివాటి పండుగ ఆచరింపవలెను. నేను 18
నీ కాజ్ఞాపించినట్లు ఆబీబు నెలలో నియామక కాల
మందు ఏడు దినములు పొంగనివాటినే తినవలెను. ఏల
యనగా ఆబీబు నెలలో ఐగుప్తులోనుండి మీరు
బయలుదేరి వచ్చితిరి. । ప్రతి తొలిచూలు పిల్లయు 19
నాది. నీ పశువులలో తొలిచూలుదైన ప్రతి మగది
దూడయేగాని గొఱ్ఱెపిల్లయేగాని అది నాదగును ।
గొఱ్ఱెపిల్లను ఇచ్చి గాడిదె తొలిపిల్లను విడిపింపవలెను, 20
దాని విమోచింపనియెడల దాని మెడను విరుగదీయ
వలెను. నీ కుమారులలో ప్రతి తొలిచూలువాని విడి
పింపవలెను, నా సన్నిధిని వారు వట్టిచేతులతో కన
బడవలదు. । ఆరు దినములు నీవు పనిచేసి యేడవ దిన 21
మున విశ్రమింపవలెను. దున్నుకాలమందైనను కోయు
కాలమందైనను ఆ దినమున విశ్రమింపవలెను. । మరి 22
యు నీవు గోధుమలకోతలో ప్రథమ ఫలముల పండు
గను, అనగా వారముల పండుగను సంవత్సరాంత
మందు పంటకూర్చు పండుగను ఆచరింపవలెను. । సం 23
వత్సరమునకు ముమ్మారు నీ పురుషులందరు ప్రభువును
ఇశ్రాయేలీయుల దేవుడునైన యెహోవా సన్నిధిని
కనబడవలెను. । ఏలయనగా నీ యెదుటనుండి జనము 24
లను వెళ్లగొట్టి నీ పొలిమేరలను గొప్పవిగా చేసెదను.
మరియు నీవు సంవత్సరమునకు ముమ్మారు నీ దేవుడైన
యెహోవా సన్నిధిని కనబడబోవునప్పుడు ఎవడును
నీ భూమిని ఆశింపడు. । నీవు పులిసినదానితో నా బలి 25
రక్తమును అర్పింపకూడదు; పస్కాపండుగలోని బలి
సంబంధమైన మాంసమును ఉదయకాలమువరకు ఉంచ
కూడదు. । నీ భూమియొక్క ప్రథమఫలములలో 26
మొదటివి నీ దేవుడైన యెహోవా మందిరములోకి
తేవలెను. మేకపిల్లను దాని తల్లిపాలతో ఉడకబెట్ట
కూడదనెను. । మరియు యెహోవా మోషేతో ఇట్ల 27
నెను—ఈ వాక్యములను వ్రాసికొనుము; ఏలయనగా
ఈ వాక్యములనుబట్టి నేను నీతోను ఇశ్రాయేలీయుల
తోను నిబంధన చేసియున్నాను. । అతడు నలుబది 28
రేయింబగళ్లు యెహోవాతోకూడ అక్కడ నుం
డెను. అతడు భోజనము చేయలేదు నీళ్లు త్రాగలేదు;
అంతలో ఆయన ఆ నిబంధన వాక్యములను, అనగా
పది ఆజ్ఞలను ఆ పలకలమీద వ్రాసెను.

మోషే సీనాయికొండ దిగుచుండగా శాసనములు 29

గల ఆ రెండు పలకలు మోషేచేతిలో ఉండెను.
అతడు ఆ కొండ దిగుచుండగా ఆయన అతనితో
మాటలాడుచున్నప్పుడు తన ముఖచర్మము ప్రకాశిం
30 చిన సంగతి మోషేకు తెలిసి యుండలేదు. । అహ
రోనును ఇశ్రాయేలీయులందరును మోషేను చూచి
నప్పుడు అతని ముఖచర్మము ప్రకాశించెను గనుక వారు
31 అతనికి సమీపింప వెరచిరి. । మోషే వారిని పిలిచి
నప్పుడు అహరోనును సమాజ ప్రధానులందరును అతని
యొద్దకు తిరిగి వచ్చిరి, మోషే వారితో మాటలాడె
32 ను. । అటుతరువాత ఇశ్రాయేలీయులందరు సమీపిం
పగా సీనాయికొండమీద యెహోవా తనతో చెప్పి
33 నది యావత్తును అతడు వారి కాజ్ఞాపించెను. । మోషే
వారితో ఆ మాటలు చెప్పుట చాలించి తన ముఖము
34 మీద ముసుకు వేసికొనెను. । అయినను మోషే
యెహోవాతో మాటలాడుటకు ఆయన సన్నిధిని
ప్రవేశించినది మొదలుకొని అతడు వెలుపలికి వచ్చు
వరకు ఆ ముసుకు తీసివేసెను; అతడు వెలుపలికివచ్చి
తనకు ఆజ్ఞాపింపబడినదానిని ఇశ్రాయేలీయులతో
35 చెప్పెను. । మోషే ముఖచర్మము ప్రకాశింపగా ఇశ్రా
యేలీయులు మోషే ముఖమును చూచిరి; మోషే ఆయ
నతో మాటలాడుటకు లోపలికి వెళ్లువరకు తన ముఖ
ముమీద ముసుకు వేసికొనెను.

**35** మోషే ఇశ్రాయేలీయుల సర్వసమాజమును పోగు
చేసి—మీరు చేయునట్లు యెహోవా ఆజ్ఞాపించిన
2 విధులేవనగా । ఆరు దినములు పనిచేయవలెను; ఏడవది
మీకు పరిశుద్ధదినము. అది యెహోవా విశ్రాంతి
దినము; దానిలో పనిచేయు ప్రతివాడును మరణశిక్ష
3 నొందును. । విశ్రాంతిదినమున మీరు మీ యిండ్లలో
ఎక్కడను అగ్ని రాజబెట్టకూడదని వారితో చెప్పెను.
4 మరియు మోషే ఇశ్రాయేలీయులైన సర్వసమాజ
ముతో ఇట్లనెను — యెహోవా ఆజ్ఞాపించినదేమన
5 గా । — మీరు మీలోనుండి యెహోవాకు అర్పణ
మును పోగుచేయుడి. ఎట్లనగా బుద్ధిపుట్టిన ప్రతి
వాడు యెహోవా సేవనిమిత్తము బంగారము, వెండి,
6 ఇత్తడి, । నీల ధూమ్ర రక్తవర్ణములు, సన్ననార మేక
వెండ్రుకలు, ఎర్రరంగువేసిన పొట్టేళ్ల తోళ్లు, సము
7 ద్రవత్సల తోళ్లు, తుమ్మకర్ర, । ప్రదీపమునకు తైలము,
8 అభిషేక తైలమునకును పరిమళద్రవ్య ధూపమునకును
9 సుగంధ సంభారములు, । ఏఫోదుకును పతకమునకును
లేత పచ్చలును చెక్కు రత్నములును తీసికొని రావ
10 లెను. । మరియు వివేక హృదయులందరు వచ్చి
11 యెహోవా ఆజ్ఞాపించినవన్నియు చేయవలెను. । అవే
వనగా మందిరము దాని గుడారము దాని పైకప్పు దాని
కొలుకులు దాని పలకలు దాని అడ్డకర్రలు దాని
12 స్తంభములు దాని దిమ్మలు, । మందసము దాని మోత
13 కర్రలు, కరుణాపీఠము కప్పుతెర, । బల్ల దాని మోత

కర్రలు దాని ఉపకరణములన్నియు, సన్నిధిరొట్టె
లు, । వెలుగుకొరకు దీపవృక్షము దాని ఉపకరణ
ములు దాని ప్రదీపములు, దీపములకు తైలము । ధూప
వేదిక దాని మోతకర్రలు, అభిషేకతైలము పరిమళ
ద్రవ్యసంభారము, మందిరద్వారమున ద్వారమునకు
తెర. । దహనబలిపీఠము దానికి కలిగిన ఇత్తడి జల్లెడ
దాని మోతకర్రలు దాని యుపకరణములన్నియు, గం
గాళము దాని పీట । ఆవరణ యవనికలు దాని స్తంభ
ములు వాటి దిమ్మలు ఆవరణద్వారమునకు తెర । మందిర
మునకు మేకులు ఆవరణమునకు మేకులు వాటికి త్రాళ్లు
పరిశుద్ధస్థలములో సేవచేయుటకు సేవావస్త్రములు, అన
గా యాజకుడైన అహరోనుకు ప్రతిష్ఠిత వస్త్రములు
యాజకులగునట్లు అతని కుమారులకు వస్త్రములనువవియే
అనెను.

ఇశ్రాయేలీయుల సమాజమంతయు మోషే ఎదుట
నుండి వెడలిపోయెను. । తరువాత ఎవని హృదయము
వాని రేపెనో, ఎవని మనస్సు వాని ప్రేరేపించెనో
వారందరు వచ్చి, ప్రత్యక్షపు గుడారముయొక్క పని
కొరకును దాని సమస్త సేవకొరకును ప్రతిష్ఠిత వస్త్రముల
కొరకును యెహోవాకు అర్పణను తెచ్చిరి. । స్త్రీలు
గాని పురుషులుగాని యెవరెవరి హృదయములు వారిని
ప్రేరేపించెనో వారందరు యెహోవాకు బంగారు
అర్పించిన ప్రతివాడును ముక్కరలను పోగులను ఉం
గరములను తావళములను సమస్తవిధమైన బంగారు
వస్తువులను తెచ్చిరి. । మరియు నీల ధూమ్ర రక్తవర్ణ
ములు, సన్ననార మేకవెండ్రుకలు, ఎర్రరంగువేసిన
పొట్టేళ్ల తోళ్లు, సముద్రవత్సల తోళ్లు, వీటిలో ఏవి
యెవరి యొద్దనుండెనో వారు వాటిని తెచ్చిరి. । వెండి
గాని యిత్తడిగాని ప్రతిష్ఠించిన ప్రతివాడును
యెహోవాకు ఆ అర్పణను తెచ్చెను. ఆ సేవలో ఏ
పనికైనను వచ్చు తుమ్మకర్ర యెవనియొద్ద నుండెనో
వాడు దాని తెచ్చెను. । మరియు వివేక హృదయము
గల స్త్రీలందరు తమ చేతులతో వడికి తాము వడికిన నీల
ధూమ్ర రక్తవర్ణములుగల నూలును సన్ననార నూలును
తెచ్చిరి. । ఏ స్త్రీలు జ్ఞానహృదయముగలవారై ప్రేరే
పింపబడిరో వారందరు మేకవెండ్రుకలను వడికిరి. ।
ప్రధానులు ఏఫోదుకును పతకమునకును చెక్కు రత్న
ములను లేతపచ్చలను । సుగంధద్రవ్యమును, దీపమున
కును అభిషేకతైలమునకును పరిమళధూపమునకును
తైలమును తెచ్చిరి. । మోషే చేయవలెనని యెహోవా
ఆజ్ఞాపించిన పనులన్నిటికొరకు ఇశ్రాయేలీయులలో
పురుషులేమి స్త్రీలేమి తెచ్చుటకు ఎవరి హృదయములు
వారిని ప్రేరేపించెనో వారందరు మనఃపూర్వకముగా
యెహోవాకు అర్పణములను తెచ్చిరి.

మరియు మోషే ఇశ్రాయేలీయులతో ఇట్లనెను—
చూడుడి; యెహోవా ఊరు కుమారుడును హూరు

మనుమడునైన బెసలేలును పేరుపెట్టి పిలిచి విచిత్ర
మైన పనులను కల్పించుటకును బంగారుతోను వెండి
తోను ఇత్తడితోను పనిచేయుటకును, రత్నములను
సానబెట్టి పొదుగుటకును చెక్కుటకును, విచిత్రమైన
పనులన్నిటిని చేయుటకును వారికి ప్రజ్ఞా వివేకజ్ఞాన
ములు కలుగునట్లు దేవుని ఆత్మతో వాని నింపియు
4 న్నాడు. । అతడును దాను గోత్రికుడును అహీసా
మాకు కుమారుడునైన అహోలీయాబును ఇతరులకు
5 నేర్పునట్లు వారికి బుద్ధి పుట్టించెను. । చెక్కువాడేమి
చిత్రకారుడేమి నీల ధూమ్ర రక్తవర్ణములతోను సన్న
నారతోను బుటాపనిచేయువాడేమి నేతగాడేమి
చేయు సమస్తవిధములైన పనులు, అనగా ఏ పనియై
నను చేయువారియొక్కయు విచిత్రమైన పని కల్పించు
వారియొక్కయు పనులను చేయునట్లు ఆయన వారి
హృదయములను జ్ఞానముతో నింపియున్నాడు.

36 పరిశుద్ధస్థలముయొక్క సేవనిమిత్తము ప్రతివిధ
మైన పనిచేయ తెలిసికొనుటకై యెహోవా ఎవరికి
ప్రజ్ఞావివేకములు కలుగజేసెనో అట్టి బెసలేలును
అహోలీయాబును మొదలైన ప్రజ్ఞావంతులందరును
యెహోవా ఆజ్ఞాపించిన అంతటిచొప్పున చేసిరి. ।
2 బెసలేలును అహోలీయాబును యెహోవా ఎవరి
హృదయములో ప్రజ్ఞ పుట్టించెనో ఆ పనిచేయుటకు
ఎవని హృదయము వాని రేపెనో వారినందరిని మోషే
3 పిలిపించెను. । ఆ పని చేయుటకై వారు పరిశుద్ధస్థలము
యొక్క సేవకొరకు ఇశ్రాయేలీయులు తెచ్చిన అర్పణ
లన్నిటిని మోషే యొద్దనుండి తీసికొనిరి. అయినను
ఇశ్రాయేలీయులు ఇంక ప్రతి ఉదయమున మనఃపూ
ర్వకముగా అర్పణములను అతని యొద్దకు తెచ్చుచుం
4 డిరి. । అప్పుడు పరిశుద్ధస్థల సంబంధమైన పని అంత
యు చేయు ప్రజ్ఞావంతులందరిలో ప్రతివాడు తాను
5 చేయుపని విడిచివచ్చి । మోషేను చూచి—చేయవలె
నని యెహోవా ఆజ్ఞాపించిన పని విషయమైన సేవ
కొరకు ప్రజలు కావలసినదానికంటె బహు విస్తారము
6 తీసికొని వచ్చుచున్నారని చెప్పగా । మోషే—పరిశు
ద్ధస్థలమునకు ఏ పురుషుడైనను ఏ స్త్రీయైనను ఇకమీ
దట ఏ అర్పణనైనను తేవద్దని ఆజ్ఞాపించెను గనుక
పాళెమందంతటను ఆ మాట చాటించిరి; ఆ పని అం
తయు చేయునట్లు దానికొరకు వారు తెచ్చిన సా
7 మగ్రి చాలినది, అది అత్యధికమైనది । గనుక ప్రజలు
తీసికొనివచ్చుట మానిరి.

8 ఆ పనిచేసినవారిలో ప్రజ్ఞగల ప్రతివాడును మం
దిరమును పది తెరలతో చేసెను. అతడు వాటిని నీల
ధూమ్ర రక్తవర్ణములుగల పేనిన సన్ననారతో చిత్ర
కారుని పనియైన కెరూబులు గలవాటినిగా చేసెను. ।
9 ప్రతి తెర పొడుగు ఇరువది యెనిమిది మూరలు; ప్రతి
తెర వెడల్పు నాలుగు మూరలు; ఆ తెరలన్నిటి కొలత
ఒక్కటే. । అయిదు తెరలను ఒక దానితో ఒకటి 10
కూర్చెను; మిగిలిన అయిదు తెరలను ఒక దానితో
ఒకటి కూర్చెను. । మొదటికూర్పు చివరనున్న తెర 11
అంచున నీలినూలుతో కొలుకులను చేసెను. రెండవ
కూర్పున వెలపటి తెర అంచున అట్లు చేసెను. । ఒక 12
తెరలో ఏబది కొలుకులను చేసెను, రెండవకూర్పునున్న
తెర అంచున ఏబదికొలుకులను చేసెను. ఈ కొలుకులు
ఒక దానితో ఒకటి సరిగానుండెను. । మరియు అతడు 13
ఏబది బంగారు గుండీలను చేసి ఆ గుండీలచేత ఆ తెర
లను ఒక దానితో ఒకటి కూర్పగా అది ఒక్క మంది
రముగా ఉండెను.

మరియు మందిరముమీద గుడారముగా మేక వెం 14
డ్రుకలతో తెరలను చేసెను; వాటిని పదకొండు తెర
లనుగా చేసెను. । ప్రతి తెర పొడుగు ముప్పది మూ 15
రలు ! ప్రతి తెర వెడల్పు నాలుగు మూరలు; ఆ పద 16
కొండు తెరల కొలత ఒక్కటే. అయిదు తెరలను
ఒకటిగాను ఆరు తెరలను ఒకటిగాను కూర్చెను. । మొ 17
దటి కూర్పునందలి వెలపటి తెర అంచున ఏబది కొలు
కులను చేసెను. మరియు రెండవ కూర్పునందలి వెల
పటి తెర యంచున ఏబది కొలుకులను చేసెను. । ఆ 18
గుడారము ఒక్కటిగా నుండునట్లు దాని కూర్చుటకు
ఏబది యిత్తడి గుండీలను చేసెను. । మరియు ఎఱ్ఱ 19
రంగు వేసిన పొట్టేళ్ల తోళ్లతో గుడారముకొరకు
కప్పును దానికి మీదుగా సముద్రవత్సల తోళ్లతో
పైకప్పును చేసెను.

మరియు అతడు మందిరమునకు తుమ్మకఱ్ఱతో 20
నిలువు పలకలు చేసెను. । పలక పొడుగు పది మూర 21
లు పలక వెడల్పు మూరెడునర. । ప్రతి పలకకు ఒక 22
దానికొకటి సమదూరముగల కుసులు రెండు ఉండెను.
అట్లు మందిరముయొక్క పలకలన్నిటికి చేసెను. ।
కుడివైపున, అనగా దక్షిణ దిక్కున ఇరువది పలకలుం 23
డునట్లు మందిరమునకు పలకలు చేసెను. । ఒక్కొక్క 24
పలక క్రింద దాని రెండు కుసులకు రెండు దిమ్మలను,
ఆ యిరువది పలకల క్రింద నలుబది వెండి దిమ్మలను
చేసెను. । మందిరముయొక్క రెండవ ప్రక్కకు, అన 25
గా ఉత్తర దిక్కున ఇరువది పలకలను వాటి నలుబది 26
వెండి దిమ్మలను, అనగా ఒక్కొక్క పలక క్రింద రెండు
దిమ్మలను ఒక పలక క్రింద రెండు దిమ్మలను చేసెను. ।
పడమటి దిక్కున మందిరముయొక్క వెనుకప్రక్కను ఆరు 27
పలకలు చేసెను. । వెనుకప్రక్కను మందిరముయొక్క 28
మూలలకు రెండు పలకలను చేసెను. । అవి అడుగున 29
కూర్చబడి మొదటి ఉంగరముదాక ఒకదానితో ఒకటి
శిఖరమున కూర్చబడినవి. అట్లు రెండు మూలలలో
ఆ రెండు పలకలు చేసెను. । ఎనిమిది పలకలుండెను; 30
వాటి వెండి దిమ్మలు పదునారు దిమ్మలు; ప్రతి పలక
క్రింద రెండు దిమ్మలుండెను. । మరియు అతడు తుమ్మ 31

కర్రతో అడ్డకర్రలను చేసెను. మందిరముయొక్క
32 ఒకప్రక్క పలకలకు అయిదు అడ్డకర్రలను । మంది
రముయొక్క రెండవప్రక్క పలకలకు అయిదు అడ్డ
కర్రలను, పడమటివైపున మందిరముయొక్క వెనుక
ప్రక్క పలకలకు అయిదు అడ్డకర్రలను చేసెను. ।
33 పలకల మధ్యనుండు నడిమి అడ్డకర్రను ఈ కొననుండి
34 ఆ కొనవరకు చేరియుండచేసెను. । ఆ పలకలకు బం
గారు రేకులు పొదిగించి వాటి అడ్డకర్రలుండు వాటి
ఉంగరములను బంగారుతో చేసి అడ్డకర్రలకు బంగారు
రేకులను పొదిగించెను.

35 మరియు అతడు నీల ధూమ్ర రక్తవర్ణములుగల అడ్డ
తెరను పేనిన సన్ననారతో చేసెను, చిత్రకారుని
36 పనియైన కెరూబులుగలదానిగా దాని చేసెను. । దాని
కొరకు తుమ్మకర్రతో నాలుగు స్తంభములను చేసి
వాటికి బంగారు రేకులను పొదిగించెను. వాటి వం
కులు బంగారువి, వాటికొరకు నాలుగు వెండి దిమ్మలను
పోతపోసెను.

37 మరియు అతడు గుడారపు ద్వారముకొరకు నీల
ధూమ్ర రక్తవర్ణములుగల పేనిన సన్ననారతో బుటా
38 పనియైన అడ్డతెరను చేసెను. । దాని అయిదు స్తంభ
ములను వాటి దిమ్మలను చేసి వాటి బోదెలకును వాటి
పెండె బద్దలకును బంగారు రేకులను పొదిగించెను;
వాటి అయిదు దిమ్మలు ఇత్తడివి.

**37** మరియు బసలేలు తుమ్మకర్రతో ఆ మందస
మును చేసెను. దాని పొడుగు రెండు మూరలనర
దాని వెడల్పు మూరెడునర దాని యెత్తు మూరెడు
2 నర. । లోపలను వెలపలను దానికి మేలిమి బంగారు
రేకు పొదిగించి దానికి చుట్టు బంగారు జవను చేసె
3 ను. । దానికి నాలుగు బంగారు ఉంగరములను పోత
పోసి, ఒక ప్రక్కను రెండు ఉంగరములును ఎదుటి
ప్రక్కను రెండు ఉంగరములుండునట్లు దాని నాలుగు
4 కాళ్లకు వాటిని తగిలించెను. । మరియు అతడు తుమ్మ
కర్రతో మోతకర్రలను చేసి వాటికి బంగారురేకులను
5 పొదిగించి । మందసమును మోయుటకు దాని ప్రక్క
లమీది ఉంగరములలో ఆ మోతకర్రలను చొనిపెను.।
6 మరియు అతడు మేలిమి బంగారుతో కరుణాపీఠమును
చేసెను. దాని పొడుగు రెండు మూరలనర దాని
7 వెడల్పు మూరెడునర; । మరియు రెండు బంగారు
కెరూబులను చేసెను, కరుణాపీఠముయొక్క రెండు
8 కొనలను వాటిని నకషిపనిగా చేసెను. । ఒక్కొక్క
కొనను ఒక్కొక్క కెరూబును కరుణాపీఠముతో ఏ
కాండముగా దాని రెండు కొనలమీద కెరూబులను
9 చేసెను. । ఆ కెరూబులు పైకివిప్పిన రెక్కలుగలవై
కరుణాపీఠమును తమ రెక్కలతో కప్పెను. కెరూ
బుల ముఖములు ఒకదానికి ఒకటి ఎదురుగా ఉండెను;
వాటి ముఖములు కరుణాపీఠము వైపుగా నుండెను.

మరియు అతడు తుమ్మకర్రతో బల్లను చేసెను.
దాని పొడుగు రెండు మూరలు దాని వెడల్పు మూ
రెడు దాని యెత్తు మూరెడునర. । అతడు దానికి
మేలిమి బంగారురేకు పొదిగించి దానికి చుట్టు బం
గారు జవను చేసెను; । దానికి చుట్టు బెత్తెడు బద్దెచేసి
దాని బద్దెపైని చుట్టు బంగారు జవను చేసెను. । దా
నికి నాలుగు బంగారు ఉంగరములను పోతపోసి దాని
నాలుగు కాళ్లకుండిన నాలుగు మూలలయందు ఆ
ఉంగరములను వేసెను. । బల్లను మోయుటకు మోత
కర్రలుండు ఆ ఉంగరములు దాని బద్దెకు సమీప
ముగా నుండెను. । బల్లను మోయుటకు తుమ్మకర్రతో
మోతకర్రలను చేసి వాటికి బంగారు రేకులు పొదిగిం
చెను. । మరియు నతడు బల్లమీదనుండు దాని ఉపక
రణములను, అనగా దాని గంగాళములను దాని ధూప
కలశములను దాని గిన్నెలను తర్పణము చేయుటకు
దాని పాత్రలను మేలిమి బంగారుతో చేసెను.

అతడు మేలిమి బంగారుతో దీపవృక్షమును చేసె
ను. ఆ దీపవృక్షమును దాని ప్రకాండమును దాని
కొమ్మను నకషిపనిగా చేసెను. దాని కలశములు
మొగ్గలు పువ్వులు ఏకాండమైనవి. । దీపవృక్షము
యొక్క ఇరుప్రక్కలనుండి మూడేసికొమ్మలు అట్లు
దాని ప్రక్కలనుండి ఆరు కొమ్మలు బయలుదేరి
నవి. । ఒక కొమ్మలో మొగ్గలు పువ్వులుగల బాద
ము రూపమైన మూడు కలశములు, రెండవ కొమ్మలో
మొగ్గలు పువ్వులుగల బాదమురూపమైన మూడు కల
శములు; అట్లు దీపవృక్షమునుండి బయలుదేరిన ఆరు
కొమ్మలకు ఉండెను. । మరియు దీపవృక్షమందు దాని
మొగ్గలు దాని పువ్వులుగల బాదమురూపమైన నా
లుగు కలశములుండెను. । దీపవృక్షమునుండి బయలు
దేరు ఆరు కొమ్మలలో రెండేసి కొమ్మల క్రింద ఏకాం
డమైన మొగ్గయు నుండెను. । వాటి మొగ్గలు వాటి
కొమ్మలు ఏకాండమైనవి; అదంతయు ఏకాండమైనదై
మేలిమి బంగారుతో నకషిపనిగా చేయబడెను. । మరి
యు అతడు దాని యేడు ప్రదీపములను దాని కత్తె
రను దాని పట్టు కారును దాని కత్తెరచిప్పను మేలిమి
బంగారుతో చేసెను. । దానిని దాని ఉపకరణములన్ని
టిని నలుబది వీసెల మేలిమి బంగారుతో చేసెను.

మరియు అతడు తుమ్మకర్రతో ధూపవేదికను
చేసెను. దాని పొడుగు మూరెడు దాని వెడల్పు
మూరెడు, అది చచ్చౌకముగా నుండెను. దాని
యెత్తు రెండు మూరలు దాని కొమ్ములు ఏకాండమై
నవి. । దానికి, అనగా దాని కప్పుకును దాని నాలుగు
ప్రక్కలకును దాని కొమ్ములకును మేలిమి బంగారు
రేకులు పొదిగించి దానికి చుట్టు బంగారు జవను
చేసెను. । దాని మోయు మోతకర్రలకు స్థలములుగా
దానికి రెండు ఉంగరములను బంగారుతో చేసి దాని

రెండు ప్రక్కలయందు దాని రెండు మూలలయందు
28 దాని జవకు దిగువను వాటిని వేసెను. । దాని మోతక
ర్రలను తుమ్మకర్రతో చేసి వాటికి బంగారురేకులను
29 తాపెను. । అతడు పరిశుద్ధమైన అభిషేక తైలమును
స్వచ్ఛమైన పరిమళధూపద్రవ్యమును పరిమళద్రవ్య
ముల మేళకునిచేత చేయించెను.

**38** మరియు అతడు తుమ్మకర్రతో దహనబలిపీఠ
మును చేసెను. దాని పొడుగు అయిదు మూరలు
దాని వెడల్పు అయిదు మూరలు, అది చచ్చౌకమైనది.
దాని యెత్తు మూడు మూరలు దాని నాలుగు మూల
2 లను కొమ్ములను చేసెను. । దాని కొమ్ములు దానితో
ఏకాండమైనవి; దానికి ఇత్తడిరేకు పొదిగించెను. ।
3 అతడు ఆ బలిపీఠ సంబంధమైన ఉపకరణములన్ని
టిని, అనగా దాని బిందెలను దాని గరిటెలను దాని
గిన్నెలను దాని ముండ్లను దాని అగ్ని పాత్రలను
చేసెను. దాని ఉపకరణములన్నిటిని ఇత్తడితో చేసె
4 ను. । ఆ బలిపీఠము నిమిత్తము దాని జవక్రింద దాని
నడిమివరకు లోతుగానున్న వలవంటి ఇత్తడి జల్లెడను
5 చేసెను. । మరియు అతడు ఆ యిత్తడి జల్లెడయొక్క
నాలుగు మూలలలో దాని మోతకర్రలుండు నాలుగు
6 ఉంగరములను పోతపోసెను. । ఆ మోతకర్రలను తుమ్మ
కర్రతో చేసి వాటికి రాగిరేకులు పొదిగించెను. ।
7 ఆ బలిపీఠమును మోయుటకు దానిప్రక్కలనున్న
ఉంగరములలో ఆ మోతకర్రలు చొనిపెను; పలక
లతో బలిపీఠమును గుల్లగా చేసెను.

8 అతడు ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారమున
సేవింపవచ్చిన సేవకురాండ్ర అద్దములతో ఇత్తడి గంగా
ళమును దాని ఇత్తడి పీటను చేసెను.

9 మరియు అతడు ఆవరణముచేసెను. కుడివైపున,
అనగా దక్షిణ దిక్కున నూరు మూరల పొడుగు గల
వియు పేనిన సన్ననారవియునైన యవనికలుండెను. ।
10 వాటి స్తంభములు ఇరువది వాటి ఇత్తడి దిమ్మలు ఇరు
వది. ఆ స్తంభముల వంకులును వాటి పెండె బద్దలును
11 వెండివి. । ఉత్తర దిక్కుననున్న యవనికలు నూరు
మూరలవి; వాటి స్తంభములు ఇరువది, వాటి యిత్తడి
దిమ్మలు ఇరువది, ఆ స్తంభముల వంకులును వాటి పెండె
12 బద్దలును వెండివి. । పడమటి దిక్కున యవనికలు
ఏబది మూరలవి; వాటి స్తంభములు పది, వాటి దిమ్మలు
పది, ఆ స్తంభముల వంకులును వాటి పెండె బద్దలును
13 వెండివి. । తూర్పువైపున, అనగా ఉదయపు దిక్కున
14 ఏబదిమూరలు; । ద్వారముయొక్క ఒక ప్రక్కను
యవనికలు పదునైదు మూరలవి; వాటి స్తంభములు
15 మూడు వాటి దిమ్మలు మూడు. । అట్లు రెండవ
ప్రక్కను, అనగా ఇరుప్రక్కలను ఆవరణ ద్వారము
నకు పదునైదు మూరల యవనికలు ఉండెను; వాటి
16 స్తంభములు మూడు వాటి దిమ్మలు మూడు. । ఆవర
ణము చుట్టునున్న దాని యవనికలన్నియు పేనిన సన్న
నారవి. । స్తంభముల దిమ్మలు రాగివి, స్తంభముల 17
వంకులును వాటి పెండె బద్దలును వెండివి. వాటి
బోదెలకు వెండి రేకులు పొదిగింపబడెను. ఆవరణపు
స్తంభములన్నియు వెండి బద్దలతో కూర్పబడెను. ।
ఆవరణ ద్వారపు తెర నీల ధూమ్ర రక్తవర్ణములు గలది 18
యు పేనిన సన్ననారతో చేయబడినదియునైన బుటా
పనిది. దాని పొడుగు ఇరువది మూరలు; దాని యెత్తు,
అనగా వెడల్పు ఆవరణ యవనికలతో సరిగా, అయిదు
మూరలు. । వాటి స్తంభములు నాలుగు, వాటి ఇత్తడి 19
దిమ్మలు నాలుగు. వాటి వంకులు వెండివి. । వాటి 20
బోదెలకు వెండిరేకు పొదిగింపబడెను, వాటి పెండె
బద్దలు వెండివి, మందిరమునకును దాని చుట్టునున్న
ఆవరణమునకును చేయబడిన మేకులన్నియు ఇత్తడివి.

మందిరపదార్థముల మొత్తము, అనగా సాక్ష్యపు 21
మందిరపదార్థముల మొత్తము ఇదే. ఇట్లు వాటిని
యాజకుడైన అహరోను కుమారుడగు ఈతామారు
లేవీయులచేత మోషే మాటచొప్పున లెక్క పెట్టిం
చెను. । యూదా గోత్రికుడైన హూరు మనుమడును 22
ఊరు కుమారుడునైన బెసలేలు యెహోవా మోషేకు
ఆజ్ఞాపించినదంతయు చేసెను. । దాను గోత్రికుడును 23
అహీసామాకు కుమారుడునైన అహోలీయాబు అత
నికి తోడైయుండెను. ఇతడు చెక్కువాడును విచిత్ర
మైనపని కల్పించువాడును నీల ధూమ్ర రక్తవర్ణముల
తోను సన్ననారతోను బుటాపని చేయువాడునై
యుండెను.

పరిశుద్ధస్థలవిషయమైన పని అంతటిలోను పని 24
కొరకు వ్యయపరచబడిన బంగారమంతయు, అనగా
ప్రతిష్ఠింపబడిన బంగారు పరిశుద్ధస్థలపు తులముచొ
ప్పున నూటపదహారు మణుగుల ఏడునూట ముప్పది తుల
ములు. । సమాజములో చేరినవారి వెండి పరిశుద్ధస్థలపు 25
తులముచొప్పున నన్నూరు మణుగుల వెయ్యిని ఏడునూట
డెబ్బదియైదు తులములు. । ఈ పన్ను ఇరువది ఏండ్లు 26
మొదలుకొని పైప్రాయము కలిగి లెక్కలో చేరిన
వారందరిలో, అనగా ఆరులక్షల మూడువేల ఏడునూట
ఏబదిమందిలో తలకొకటికి అరతులము. । ఆ నన్నూరు 27
వెండి మణుగులతో పరిశుద్ధస్థలమునకు దిమ్మలు అడ్డ
తెరకు దిమ్మలును; అనగా ఒక దిమ్మకు నాలుగు మణు
గులచొప్పున నన్నూరు మణుగులకు నూరు దిమ్మలు
పోతపోయబడెను. । వెయ్యిని యేడునూట డెబ్బదియైదు 28
తులముల వెండితో అతడు స్తంభములకు వంకులను
చేసి వాటి బోదెలకు పొదిగించి వాటిని పెండె బద్దల
చేత కట్టెను. । మరియు ప్రతిష్ఠింపబడిన యిత్తడి 29
ఇన్నూట ఎనుబది మణుగుల రెండువేల నన్నూరు
తులములు. । అతడు దానితో ప్రత్యక్షపు గుడారపు 30
ద్వారమునకు దిమ్మలను ఇత్తడి వేదికను దానికి ఇత్తడి

31 జల్లెడను వేదిక ఉపకరణములన్నిటిని । చుట్టునున్న
ఆవరణమునకు దిమ్మలను ఆవరణద్వారమునకు దిమ్మలను
ఆలయమునకు మేకులన్నిటిని చుట్టునున్న ఆవరణము
నకు మేకులన్నిటిని చేసెను.

**39** యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్టు పరి
శుద్ధస్థలములో అహరోను చేయు సేవనిమిత్తము నీల
ధూమ్ర రక్తవర్ణములుగల సేవావస్త్రములను అనగా
ప్రతిష్ఠిత వస్త్రములను కుట్టిరి.
2 మరియు అతడు బంగారుతోను నీల ధూమ్ర రక్త
వర్ణములుగల నూలుతోను పేనిన సన్ననారతోను
3 ఏఫోదును చేసెను. । నీల ధూమ్ర రక్తవర్ణములుగల
నూలుతోను సన్న నారతోను చిత్రకారుని పనిగా
చేయుటకు బంగారును రేకులుగా కొట్టి అది తీగె
4 లుగా కత్తిరించిరి. । దానికి కూర్పు భుజఖండములను
చేసిరి, దాని రెండు అంచులయందు అవి కూర్పబడె
5 ను. । దానిమీదనున్న దాని విచిత్రమైన దట్టి యేకాం
డమై దానితో సమమైన పని గలిగి బంగారుతోను
నీల ధూమ్ర రక్తవర్ణములుగల పేనిన సన్ననారతోను
చేయబడెను; అట్లు యెహోవా మోషేకు ఆజ్ఞా
పించెను.
6 మరియు బంగారు జవలలో పొదిగిన లేతపచ్చలను
సిద్ధపరచిరి. ముద్రలు చెక్కబడునట్లు ఇశ్రాయేలీ
7 యుల పేళ్లు వాటిమీద చెక్కబడెను. । అవి ఇశ్రా
యేలీయులకు జ్ఞాపకార్థమైన రత్నములగునట్లు ఏఫోదు
భుజములమీద వాటిని ఉంచెను. అట్లు యెహోవా
మోషేకు ఆజ్ఞాపించెను.
8 మరియు అతడు ఏఫోదుపనివలె బంగారుతోను
నీల ధూమ్ర రక్తవర్ణములుగల పంక్తులతోను సన్ననార
9 తోను చిత్రకారునిపనిగా పతకమును చేసెను. । అది
చచ్చౌకముగా నుండెను. ఆ పతకమును మడతగా
చేసిరి. అది మడవబడినదై జేనెడు పొడుగు జేనెడు
10 వెడల్పు గలది. । వారు దానిలో నాలుగు పంక్తుల
రత్నములను పొదిగిరి. మాణిక్య గోమేధిక మరకతము
11 లుగల పంక్తి మొదటిది; । పద్మరాగ నీల సూర్యకాంత
12 మణులుగల పంక్తి రెండవది; । గారుత్మతకము యష్మ
13 రాయి ఇంద్రనీలమునుగల పంక్తి మూడవది; । రక్త
వర్ణపురాయి సులిమానిరాయి సూర్యకాంతమునుగల
పంక్తి నాలుగవది; వాటివాటి పంక్తులలో అవి బంగారు
14 జవలలో పొదిగింపబడెను. । ఆ రత్నములు ఇశ్రా
యేలీయుల పేళ్ల చొప్పున, పన్నెండు ముద్రలవలె
చెక్కబడిన వారి పేళ్ల చొప్పున, పన్నెండు గోత్ర
ముల పేళ్లు ఒక్కొకదానిమీద ఒక్కొక పేరు చెక్క
15 బడెను. । మరియు వారు ఆ పతకమునకు మేలిమి
16 బంగారుతో అల్లికపనియైన గొలుసులు చేసిరి. । వారు
రెండు బంగారు జవలు రెండు బంగారు ఉంగరము
లును చేసి ఆ రెండు ఉంగరములును పతకపు రెండు
కొనలను ఉంచి । అల్లబడిన ఆ రెండు బంగారు 17
గొలుసులను పతకపు కొనలనున్న రెండు ఉంగరము
లలో వేసి । అల్లబడిన ఆ రెండు గొలుసుల కొనలను 18
ఆ రెండు జవలకు తగిలించి ఏఫోదు భుజఖండముల
మీద దాని యెదుట ఉంచిరి. । మరియు వారు రెండు 19
బంగారు ఉంగరములను చేసి ఏఫోదు నెదుటనున్న
పతకపు లోపలి అంచున దాని రెండు కొనలకు
వాటిని వేసిరి. । మరియు రెండు బంగారు ఉంగరము 20
లను చేసి ఏఫోదు విచిత్రమైన నడికట్టుకు పైగా దాని
రెండవకూర్పు నొద్దనున్న దాని యెదుటి ప్రక్కను,
ఏఫోదు రెండు భుజఖండములకు దిగువను వాటిని
వేసిరి. । ఆ పతకము ఏఫోదు విచిత్రమైన దట్టికిపైగా 21
నుండునట్లును అది ఏఫోదునుండి విడిపోకుండునట్లును
ఆ పతకమును దాని ఉంగరములకును ఏఫోదు ఉంగర
ములకును నీలిసూత్రముతో కట్టిరి. అట్లు యెహోవా
మోషేకు ఆజ్ఞాపించెను.
మరియు అతడు ఏఫోదు చొక్కాయి కేవలము 22
నీలినూలుతో అల్లికపనిగా చేసెను. ఆ చొక్కాయి
మధ్యనున్న రంధ్రము కవచరంధ్రమువలె ఉండెను. ।
అది చినుగకుండునట్లు దాని రంధ్రమునకు చుట్టు ఒక 23
గోటు ఉండెను. । మరియు వారు చొక్కాయి 24
అంచులమీద నీల ధూమ్ర రక్తవర్ణములుగల పేనిన
నూలుతో దానిమ్మపండ్లను చేసిరి. । మరియు వారు 25
మేలిమి బంగారుతో గంటలను చేసి ఆ దానిమ్మపండ్ల
మధ్యను, అనగా ఆ చొక్కాయి అంచులమీద
చుట్టునున్న దానిమ్మపండ్లమధ్యను ఆ గంటలను పెట్టిరి. ।
యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు సేవచేయుటకు 26
ఒకొక గంటను ఒకొక దానిమ్మపండును ఆ చొ
క్కాయి అంచులమీద చుట్టు ఉంచిరి.
మరియు యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు 27
వారు అహరోనుకును అతని కుమారులకును నేతపని 28
యైన సన్ననార చొక్కాయిలను సన్ననార పాగాను
అందమైన సన్ననార కుళ్లాయిలను పేనిన సన్ననార
లాగులను నీల ధూమ్ర రక్తవర్ణములుగల పేనిన సన్న
నారతో బుటాపనియైన నడికట్టును చేసిరి.
మరియు యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు 30
వారు మేలిమి బంగారుతో పరిశుద్ధకిరీట భూషణము
చేసి చెక్కిన ముద్రవలె దానిమీద—యెహోవా
పరిశుద్ధుడు[1] అను వ్రాత వ్రాసిరి. । యెహోవా 31
మోషేకు ఆజ్ఞాపించినట్లు పాగాకు మీదుగా కట్టు
నట్లు దానికి నీలిసూత్రమును కట్టిరి. । ప్రత్యక్షపు 32
గుడారపు మందిరముయొక్క పని యావత్తును
సంపూర్తి చేయబడెను. యెహోవా మోషేకు ఆజ్ఞా
పించిన ప్రకారముగానే ఇశ్రాయేలీయులు చేసిరి.

1 లేక, యెహోవాకు ప్రతిష్ఠితము.

33 అప్పుడు వారు మందిరమును గుడారమును దాని
ఉపకరణములన్నిటిని దాని కొలుకులను, పలకలను,
34 కమ్ములను, స్తంభములను, దిమ్మలను, । ఎరుపురంగు వేసిన
పొట్టేళ్ల తోళ్ల పైకప్పును, సముద్రవత్సల తోళ్ల పైక
35 ప్పును, కప్పు తెరను, । సాక్ష్యపు మందసమును దాని
36 మోత కఱ్ఱలను, కరుణాపీఠమును, । బల్లను, దాని
37 ఉపకరణములన్నిటిని, సన్నిధి రొట్టెలను, । పవిత్ర
మైన దీపవృక్షమును, సవరించు దాని ప్రదీపములను,
అనగా దాని ప్రదీపముల వరుసను దాని ఉపకరణ
38 ములన్నిటిని దీపముకొరకు తైలమును । బంగారు వేది
కను అభిషేక తైలమును పరిమళ ధూపద్రవ్యములను
39 శాలాద్వారమునకు తెరను । ఇత్తడి బలిపీఠమును దాని
కుండు ఇత్తడి జల్లెడను దాని మోతకఱ్ఱలను దాని
ఉపకరణములన్నిటిని, గంగాళమును దాని పీటను ।
40 ఆవరణపు యవనికలను దాని స్తంభములను దాని దిమ్మ
లను ఆవరణద్వారమునకు తెరను దాని త్రాళ్లను దాని
మేకులను ప్రత్యక్షపు గుడారములో మందిరసేవకొర
41 కైన ఉపకరణములన్నిటిని, పరిశుద్ధస్థలములోని । యా
జక సేవార్థమైన వస్త్రములను, అనగా యాజకుడైన
అహరోనుకు పరిశుద్ధ వస్త్రములను అతని కుమారులకు
వస్త్రములను మోషే యొద్దకు తీసికొని వచ్చిరి. ।
42 యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు ఇశ్రాయేలీ
43 యులు ఆ పని అంతయు చేసిరి. । మోషే ఆ పని
అంతయు చూచినప్పుడు యెహోవా ఆజ్ఞాపించినట్లు
వారు దాని చేసియుండిరి; ఆలాగుననే చేసియుండిరి
గనుక మోషే వారిని దీవించెను.

40 మరియు యెహోవా మోషేతో ఇట్లనెను ।—
2 మొదటి నెలలో మొదటి దినమున నీవు ప్రత్యక్షపు
3 గుడారపు మందిరమును నిలువబెట్టవలెను. । అచ్చట
నీవు సాక్ష్యపు మందసమును నిలిపి ఆ మందసమును
4 అడ్డతెరతో కప్పవలెను. । నీవు బల్లను లోపలికి
తెచ్చి దానిమీద క్రమముగా ఉంచవలసినవాటిని
ఉంచి దీపవృక్షమును లోపలికి తెచ్చి దాని ప్రదీప
5 ములను వెలిగింపవలెను. । సాక్ష్యపు మందసము నెదుట
ధూపము వేయు బంగారు వేదికను ఉంచి మందిర
6 ద్వారమునకు తెరను తగిలింపవలెను. । ప్రత్యక్షపు
గుడారపు మందిరద్వారము నెదుట దహన బలిపీఠ
7 మును ఉంచవలెను; । ప్రత్యక్షపు గుడారమునకును
బలిపీఠమునకును మధ్యను గంగాళమును ఉంచి దానిలో
8 నీళ్లు నింపవలెను. । యవనికలచుట్టు ఆవరణమును
నిలువబెట్టి ఆవరణద్వారముయొక్క తెరను తగిలింప
9 వలెను. । మరియు నీవు అభిషేకతైలమును తీసికొని
మందిరమునకును దానిలోని సమస్తమునకును అభిషే
కము చేసి దానిని దాని ఉపకరణములన్నిటిని ప్రతి
10 ష్ఠింపవలెను, అప్పుడు అది పరిశుద్ధమగును. । దహన
బలిపీఠమునకు అభిషేకముచేసి ఆ పీఠమును ప్రతిష్ఠింప
వలెను, అప్పుడు ఆ పీఠము అతిపరిశుద్ధమగును. । ఆ 11
గంగాళమునకు దాని పీటకు అభిషేకముచేసి దాని
ప్రతిష్ఠింపవలెను. । మరియు నీవు అహరోనును అతని 12
కుమారులను ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారము
నొద్దకు తోడుకొనివచ్చి వారిని నీళ్లతో స్నానము
చేయించి । అహరోను నాకు యాజకుడగునట్లు అత 13
నికి ప్రతిష్ఠిత వస్త్రములను ధరింపచేసి అతనికి అభిషే
కముచేసి అతని ప్రతిష్ఠింపవలెను. । మరియు నీవు 14
అతని కుమారులను తోడుకొనివచ్చి వారికి చొక్కా
యిలను తొడిగించి । వారు నాకు యాజకులగుటకై 15
నీవు వారి తండ్రికి అభిషేకము చేసినట్లు వారికిని
అభిషేకము చేయుము. వారి అభిషేకము తరతర
ములకు వారికి నిత్యమైన యాజకత్వ సూచనగా
ఉండుననెను. । మోషే ఆ ప్రకారము చేసెను; 16
యెహోవా అతనికి ఆజ్ఞాపించిన వాటినన్నిటిని
చేసెను, ఆలాగుననే చేసెను.

రెండవ సంవత్సరమున మొదటి నెలలో మొదటి 17
దినమున మందిరము నిలువబెట్టబడెను. । యెహోవా 18
మోషేకు ఆజ్ఞాపించినట్లు మోషే మందిరమును నిలువ
బెట్టి దాని దిమ్మలనువేసి దాని పలకలను నిలువబెట్టి
దాని పెండె బద్దలను చొనిపి దాని స్తంభములను
నిలువబెట్టి । మందిరముమీద గుడారమును పరచి 19
దానిపైని గుడారపుకప్పును వేసెను. । మరియు 20
యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు అతడు శాసన
ములను తీసికొని మందసములో ఉంచి మందసమునకు
మోతకఱ్ఱలను దూర్చి దానిమీద కరుణాపీఠము
నుంచెను. । మందిరములోకి మందసమును తెచ్చి కప్పు 21
తెరను వేసి సాక్ష్యపు మందసమును కప్పెను. । మరి 22
యు యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు అతడు
ప్రత్యక్షపు గుడారములో మందిరముయొక్క ఉత్తర
దిక్కున, అడ్డతెరకు వెలపట బల్లను ఉంచి ।
యెహోవా సన్నిధిని దానిమీద రొట్టెలను క్రమ 23
ముగా ఉంచెను. । మరియు యెహోవా మోషేకు 24
ఆజ్ఞాపించినట్లు అతడు ప్రత్యక్షపు గుడారములో
మందిరమునకు దక్షిణదిక్కున బల్లయెదుట దీపవృక్ష
మును ఉంచి । యెహోవా సన్నిధిని ప్రదీపములను 25
వెలిగించెను. । మరియు యెహోవా మోషేకు ఆజ్ఞా 26
పించినట్లు అతడు ప్రత్యక్షపు గుడారములో అడ్డ
తెరయెదుట బంగారు ధూపవేదికను ఉంచి । దాని 27
మీద పరిమళద్రవ్యములను ధూపమువేసెను. । మరి 28
యు యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు అతడు
మందిరద్వారమునకు తెరను వేసెను. అతడు ప్రత్య
క్షపు గుడారపు మందిరపుద్వారమునొద్ద దహనబలిపీఠ
మును ఉంచి । దానిమీద దహనబలినర్పించి నైవేద్య 29
మును సమర్పించెను. । మరియు యెహోవా మోషేకు 30
ఆజ్ఞాపించినట్లు అతడు ప్రత్యక్షపు గుడారమునకును

బలిపీఠమునకును మధ్య గంగాళమును ఉంచి ప్రక్షా
31 ళణకొరకు దానిలో నీళ్లుపోసెను. । దానియొద్ద మో
షేయు అహరోనును అతని కుమారులును తమ చేతు
32 లును కాళ్లును కడుగుకొనిరి. । వారు ప్రత్యక్షపు
గుడారములోనికి వెళ్లునప్పుడును బలిపీఠమునకు సమీ
33 పించునప్పుడును కడుగుకొనిరి. । మరియు అతడు
మందిరమునకును బలిపీఠమునకును చుట్టు ఆవరణమును
ఏర్పరచి ఆవరణద్వారపు తెరను వేసెను. ఆలాగున
మోషే పని సంపూర్తిచేసెను.
34 అప్పుడు మేఘము ప్రత్యక్షపు గుడారమును
35 కమ్మగా ; యెహోవా తేజస్సు మందిరమును నింపెను.
ఆ మేఘము మందిరముమీద నిలుచుటచేత మందిరము
యెహోవా తేజస్సుతో నిండెను గనుక మోషే
ప్రత్యక్షపు గుడారములోకి వెళ్లలేకుండెను. । మేఘము 3
మందిరముమీదనుండి పైకి వెళ్లునప్పుడెల్లను ఇశ్రా
యేలీయులు ప్రయాణమై పోయిరి. । ఇదే వారి 3
ప్రయాణపద్ధతి. ఆ మేఘముపైకి వెళ్లనియెడల అది
వెళ్లు దినమువరకు వారు ప్రయాణము చేయకుండిరి. ।
ఇశ్రాయేలీయులందరి కన్నుల ఎదుట పగటివేళ 3
యెహోవా మేఘము మందిరముమీద ఉండెను,
రాత్రివేళ అగ్ని దానిమీద ఉండెను. వారి సమస్త
ప్రయాణములలో ఈలాగుననే జరిగెను.

# లేవీయకాండము

1 యెహోవా మోషేను పిలిచి ప్రత్యక్షపు గుడా
2 రములోనుండి అతనికీలాగు సెలవిచ్చెను । — నీవు
ఇశ్రాయేలీయులతో ఇట్లనుము — మీలో ఎవరైనను
యెహోవాకు బలి అర్పించునప్పుడు గోవులమంద
లోనుండిగాని గొఱ్ఱెలమందలోనుండిగాని మేకల
మందలోనుండిగాని దాని తీసికొని రావలెను. ।
3 అతడు దహనబలిరూపముగా అర్పించునది గోవుల
లోనిదైనయెడల నిర్దోషమైన మగదాని తీసికొని రావ
లెను. తాను యెహోవా సన్నిధిని అంగీకరింపబడు
నట్లు ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారమునకు
4 దాని తీసికొని రావలెను. । అతడు దహనబలిగా
అర్పించు పశువుతలమీద తన చెయ్యి ఉంచవలెను;
అతని నిమిత్తము ప్రాయశ్చిత్తము కలుగునట్లు అది
5 అతని పక్షముగా అంగీకరింపబడును. । అతడు
యెహోవా సన్నిధిని ఆ కోడె దూడను వధించిన
తరువాత యాజకులైన అహరోను కుమారులు దాని
రక్తమును తెచ్చి ప్రత్యక్షపు గుడారము ఎదుటనున్న
6 బలిపీఠముచుట్టు ఆ రక్తమును ప్రోక్షింపవలెను. । అప్పు
డతడు దహనబలిరూపమైన ఆ పశుచర్మమును ఒలిచి,
7 దాని అవయవములను విడదీసిన తరువాత । యాజకు
డైన అహరోను కుమారులు బలిపీఠముమీద అగ్ని
యుంచి ఆ అగ్నిమీద కట్టెలను చక్కగా పేర్చవలెను.।
8 అప్పుడు యాజకులైన అహరోను కుమారులు ఆ అవ
యవములను తలను క్రొవ్వును బలిపీఠముమీదనున్న
9 అగ్నిమీది కట్టెలపైని చక్కగా పేర్చవలెను. । దాని
ఆంత్రములను కాళ్లను నీళ్లతో కడుగవలెను. అది
యెహోవాకు ఇంపైన సువాసనగల దహనబలియగు
నట్లు యాజకుడు అదంతయు బలిపీఠముమీద దహింప
వలెను.

10 దహనబలిగా అతడు అర్పించునది గొఱ్ఱెలయొక్క
గాని మేకలయొక్కగాని మందలోనిదైన పక్షమున
11 అతడు నిర్దోషమైన మగదాని తీసికొని వచ్చి । బలి
పీఠపు ఉత్తరదిక్కున యెహోవా సన్నిధిని దాని
వధింపవలెను. యాజకులగు అహరోను కుమారులు
బలిపీఠముచుట్టు దాని రక్తమును ప్రోక్షింపవలెను. ।
12 దాని అవయవములను దాని తలను క్రొవ్వును విడ
దీసిన తరువాత యాజకుడు బలిపీఠముమీదనున్న
13 అగ్నిమీది కట్టెలపైని చక్కగా పేర్చవలెను. ; దాని
ఆంత్రములను కాళ్లను నీళ్లతో కడుగవలెను. అప్పుడు
యాజకుడు అదంతయు తెచ్చి బలిపీఠముమీద దాని
దహింపవలెను. అది దహనబలి, అనగా యెహోవాకు
ఇంపైన సువాసనగల హోమము.

అతడు యెహోవాకు దహనబలిగా అర్పించునది 14
పక్షిజాతిలోనిదైనయెడల తెల్ల గువ్వలలో నుండిగాని
పావురపు పిల్లలలో నుండిగాని తేవలెను. । యాజ 15
కుడు బలిపీఠముదగ్గరకు దాని తీసికొనివచ్చి దాని
తలను త్రుంచి బలిపీఠముమీద దాని దహింపవలెను,
దాని రక్తమును బలిపీఠము ప్రక్కను పిండవలెను.
మరియు దాని మలముతో దాని పొట్టను ఊడదీసి 16
బలిపీఠపు తూర్పుదిక్కున బూడిదెను వేయుచోట
దాని పారవేయవలెను. । అతడు దాని రెక్కలసందున 17
దాని చీల్చవలెను గాని అవయవ విభాగములను విడ
దీయకూడదు. యాజకుడు బలిపీఠముమీద, అనగా
అగ్నిమీది కట్టెలపైని దాని దహింపవలెను. అది
దహనబలి, అనగా యెహోవాకు ఇంపైన సువాసన
గల హోమము.

ఒకడు యెహోవాకు నైవేద్యము చేయునప్పుడు 2
అతడు అర్పించునది గోధుమపిండిదై యుండవలెను.
అతడు దానిమీద నూనెపోసి సాంబ్రాణి వేసి ।
యాజకులగు అహరోను కుమారులయొద్దకు దాని తేవ 2
లెను. అందులోనుండి యాజకుడు తన చేరతో చేరెడు
నూనెయు చేరెడు గోధుమ పిండియు దాని సాం
బ్రాణి అంతయు తీసికొని యెహోవాకు ఇంపైన
సువాసనగల హోమముగా బలిపీఠముమీద అందు
లో ఒక భాగమును జ్ఞాపకార్థముగా దహింపవలెను.।
ఆ నైవేద్య శేషము అహరోనుకును అతని కుమారులకును 3
ఉండును. యెహోవాకు అర్పించు హోమములలో
అది అతిపరిశుద్ధము.

నీవు పొయ్యిలో కాల్చిన నైవేద్యము చేయు 4
నప్పుడు అది నూనె కలిసినదియు, పొంగనిదియునైన
గోధుమపిండి అప్పడములేగాని నూనె రాచినదియు
పొంగనిదియునైన పూరీలేగాని కావలెను. ; నీ అర్ప 5
ణము పెనముమీద కాల్చిన నైవేద్యమైనయెడల అది
నూనె కలిసినదియు పొంగనిదియునైన గోధుమపిండిదై
యుండవలెను. । అది నైవేద్యము గనుక నీవు దాని 6
ముక్కలుగా త్రుంచి వాటిమీద నూనె పోయవలెను.
నీవు అర్పించునది కుండలో వండిన నైవేద్య 7
మైనయెడల నూనె కలిసిన గోధుమపిండితో దాని
చేయవలెను. । వాటితో చేయబడిన నైవేద్యమును 8
యెహోవాయొద్దకు తేవలెను. యాజకునియొద్దకు దాని

తెచ్చిన తరువాత అతడు బలిపీఠముదగ్గరకు దాని తేవ
9 లెను. । అప్పుడు యాజకుడు ఆ నైవేద్యములో ఒక
భాగమును జ్ఞాపకార్థముగా తీసి బలిపీఠముమీద
యెహోవాకు ఇంపైన సువాసనగల హోమముగా
10 దాని దహింపవలెను. । ఆ నైవేద్య శేషము అహరోను
కును అతని కుమారులకును చెందును. యెహోవాకు
అర్పించు హోమములలో అది అతిపరిశుద్ధము.
11 మీరు యెహోవాకు చేయు నైవేద్యమేదియు
పులిసి పొంగినదానితో చేయకూడదు. ఏలయనగా పులి
సినదైనను తేనెయైనను యెహోవాకు హోమముగా
12 దహింపవలదు. । ప్రథమఫలముగా యెహోవాకు
వాటిని అర్పింపవచ్చును గాని బలిపీఠముమీద ఇంపైన
13 సువాసనగా వాటి నర్పింపవలదు. । నీవు అర్పించు
ప్రతి నైవేద్యమునకు ఉప్పు చేర్చవలెను. నీ దేవుని
నిబంధనయొక్క ఉప్పు నీ నైవేద్యముమీద ఉండ
వలెను, నీ అర్పణములన్నిటితోను ఉప్పు అర్పింప
14 వలెను. । నీవు యెహోవాకు ప్రథమఫలముల నైవే
ద్యమును చేయునప్పుడు సారమైన భూమిలో పుట్టిన
పచ్చని వెన్నులలోని ఊచబియ్యమును వేయించి విసిరి
నీ ప్రథమఫలముల నైవేద్యముగా అర్పింపవలెను. ।
15 అది నైవేద్యరూపమైనది, నీవు దానిమీద నూనె
16 పోసి దానిపైని సాంబ్రాణి వేయవలెను. । అందులో
జ్ఞాపకార్థమైన భాగమును, అనగా విసిరిన ధాన్య
ములో కొంతయు, నూనెలో కొంతయు, దాని సాం
బ్రాణి అంతయు యాజకుడు దహింపవలెను. అది
యెహోవాకు హోమము.

3 అతడు అర్పించునది సమాధానబలియైనపక్షమున
అతడు గోవులలోనిది తీసికొని వచ్చినయెడల అది
మగదేగాని ఆడుదేగాని యెహోవా సన్నిధికి నిర్దో
2 షమైనదాని తీసికొని రావలెను. । తాను అర్పించు
దాని తలమీద తన చెయ్యి ఉంచి ప్రత్యక్షపు గుడా
రముయొక్క ద్వారమున దాని వధింపవలెను. యాజ
కులగు అహరోను కుమారులు బలిపీఠముచుట్టు దాని
3 రక్తమును ప్రోక్షింపవలెను. । అతడు ఆ సమాధాన
4 బలిపశువుయొక్క ఆంత్రముల లోపలి క్రొవ్వును
ఆంత్రములమీది క్రొవ్వంతటిని రెండు మూత్ర
గ్రంథులను వాటిమీదను డొక్కలమీదనున్న క్రొ
వ్వును కాలేజముమీదను మూత్ర గ్రంథులమీదనున్న
వపను యెహోవాకు హోమముగా అర్పింపవలెను.।
5 అహరోను కుమారులు బలిపీఠముమీద, అనగా అగ్ని
మీది కట్టెలపైనున్న దహనబలి ద్రవ్యముపైని దాని
దహింపవలెను. అది యెహోవాకు ఇంపైన సువా
సనగల హోమము.

6 యెహోవాకు సమాధానబలిగా ఒకడు అర్పిం
చునది గొఱ్ఱె మేకలలోనిదైనయెడల అది మగదేగాని
ఆడుదేగాని నిర్దోషమైనదాని తీసికొని రావలెను. ।
అతడర్పించు అర్పణము గొఱ్ఱెపిల్లయైన పక్షమున 7
యెహోవా సన్నిధికి దాని తీసికొని రావలెను. ।
తాను అర్పించుదాని తలమీద అతడు తన చెయ్యి 8
ఉంచి ప్రత్యక్షపు గుడారము నెదుట దాని వధింప
వలెను. అహరోను కుమారులు బలిపీఠముచుట్టు దాని
రక్తమును ప్రోక్షింపవలెను. । ఆ సమాధానబలి పశువు 9
యొక్క క్రొవ్వును ముడ్డిపూస మొదలుకొని క్రొవ్విన
తోక అంతటిని ఆంత్రములలోని క్రొవ్వును ఆంత్రముల
మీది క్రొవ్వు అంతటిని । రెండు మూత్ర గ్రంథులను 10
వాటిమీది డొక్కలపైనున్న క్రొవ్వును మూత్ర గ్రం
థులమీది కాలేజముయొక్క వపను తీసి యెహోవాకు
హోమము చేయవలెను. । యాజకుడు బలిపీఠముమీద 11
దాని దహింపవలెను. అది యెహోవాకు హోమ
రూపమైన ఆహారము. । అతడు అర్పించునది మేక 12
యైనయెడల యెహోవా సన్నిధికి దాని తీసికొని
రావలెను. । తాను దాని తలమీద చెయ్యి ఉంచి 13
ప్రత్యక్షపు గుడారము నెదుట దాని వధింపవలెను.
అహరోను కుమారులు బలిపీఠముచుట్టు దాని రక్తమును
ప్రోక్షింపవలెను. । తాను దానిలో అర్పించు ఆంత్రము 14
లను కప్పు క్రొవ్వును ఆంత్రములమీది క్రొవ్వు
అంతటిని । రెండు మూత్ర గ్రంథులను వాటిమీది 15
డొక్కలపైనున్న క్రొవ్వును రెండు మూత్ర గ్రంథుల
పైనున్న కాలేజముయొక్క వపను యెహోవాకు
హోమముగా అర్పింపవలెను. । యాజకుడు బలిపీఠ 16
ముమీద వాటిని దహింపవలెను. క్రొవ్వంతయు
యెహోవాదే; అది సువాసనగల హోమరూప
మైన ఆహారము. మీరు క్రొవ్వునైనను రక్తమునైనను
తినకూడదు. । అది మీ తరతరములకు మీ నివాస 17
స్థలములన్నిటిలోను నిత్యమైన కట్టడ.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 4
విచ్చెను । —నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము— 2
యెహోవా ఆజ్ఞలన్నిటిలో దేనివిషయమైనను ఎవ
రైన పొరబాటున చేయరాని కార్యములు చేసి పాపి
యైన పక్షమున, ఎట్లనగా । — ప్రజలు అపరాధు 3
లగునట్లు అభిషిక్తుడైన యాజకుడు పాపముచేసిన పక్ష
మున, తాను చేసిన పాపమునకై నిర్దోషమైన కోడె
దూడను యెహోవాకు పాపపరిహారార్థబలిగా అర్పింప
వలెను. । అతడు ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వార 4
మునకు యెహోవా సన్నిధిని ఆ కోడెను తీసికొని
వచ్చి కోడెతలమీద చెయ్యి ఉంచి యెహోవా
సన్నిధిని కోడెను వధింపవలెను । అభిషిక్తుడైన యాజ 5
కుడు ఆ కోడెదూడ రక్తములో కొంచెము తీసి ప్రత్యా
క్షపు గుడారమునకు దాని తేవలెను. । ఆ యాజకుడు 6
ఆ రక్తములో తన వ్రేలు ముంచి పరిశుద్ధ మందిరము
యొక్క అడ్డతెర యెదుట ఆ రక్తములో కొంచెము
ఏడుమారులు యెహోవా సన్నిధిని ప్రోక్షింప

వలెను. । అప్పుడు యాజకుడు ప్రత్యక్షపు గుడార
ములో యెహోవా సన్నిధినున్న సుగంధ ద్రవ్య
ముల ధూపవేదిక కొమ్ములమీద ఆ రక్తములో కొం
చెము చమిరి ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారము
నొద్దనున్న దహనబలిపీఠము అడుగున ఆ కోడెయొక్క
8 రక్తశేషమంతయు పోయవలెను. । మరియు అతడు పాప
పరిహారార్థబలిరూపమైన ఆ కోడె క్రొవ్వు అంతయు
దానినుండి తీయవలెను. ఆంత్రములలోని క్రొవ్వును
9 ఆంత్రములమీది క్రొవ్వంతటిని । మూత్ర గ్రంథు
లను వాటిమీది డొక్కలపైనున్న క్రొవ్వును మూత్ర
10 గ్రంథులపైనున్న కాలేజముమీది వపను । సమాధాన
బలియగు ఎద్దునుండి తీసినట్లు దీనినుండి తీయవలెను.
యాజకుడు దహనబలిపీఠముమీద వాటిని ధూపము
11 వేయవలెను. । ఆ కోడెయొక్క శేషమంతయు, అనగా
దాని చర్మము దాని మాంసమంతయు, దాని తల దాని
12 కాళ్లు దాని ఆంత్రములు దాని పేడ । పాలెము వెల
పల, బూడిదెను పారపోయు పవిత్రస్థలమునకు తీసి
కొనిపోయి అగ్నిలో కట్టెలమీద కాల్చివేయవలెను.
బూడిదె పారపోయు చోట దాని కాల్చివేయవలెను.
13 ఇశ్రాయేలీయుల సమాజమంతయు పొరబాటున
ఏ తప్పితముచేసి, యెహోవా ఆజ్ఞలన్నిటిలో దేనినై
నను మీరి చేయరానిపని చేసి అపరాధులైనయెడల ।
14 వారు ఆ యాజ్ఞకు విరోధముగా చేసిన ఆ పాపము
తమకు తెలియబడునప్పుడు, సంఘము పాపపరిహారార్థ
బలిగా ఒక కోడెదూడను అర్పించి ప్రత్యక్షపు గుడా
రముయొక్క ద్వారమునకు దాని తీసికొని రావలెను. ।
15 సమాజముయొక్క పెద్దలు యెహోవా సన్నిధిని ఆ
కోడెమీద తమ చేతులుంచిన తరువాత యెహోవా
16 సన్నిధిని ఆ కోడెదూడను వధింపవలెను. । అభిషిక్తుడైన
యాజకుడు ఆ కోడెయొక్క రక్తములో కొంచెము
17 ప్రత్యక్షపు గుడారములోకి తీసికొని రావలెను. । ఆ
యాజకుడు ఆ రక్తములో తన వ్రేలు ముంచి అడ్డ
తెరవైపున యెహోవా సన్నిధిని ఏడుమారులు దాని
18 ప్రోక్షింపవలెను. । మరియు అతడు దాని రక్తములో
కొంచెము ప్రత్యక్షపు గుడారములో యెహోవా
సన్నిధినున్న బలిపీఠపు కొమ్ములమీద చమిరి ప్రత్య
క్షపు గుడారముయొక్క ద్వారమునొద్దనున్న దహన
బలిపీఠము అడుగున ఆ రక్త శేషమంతయు పోయ
19 వలెను. । మరియు అతడు దాని క్రొవ్వు అంతయు తీసి
20 బలిపీఠముమీద దహింపవలెను. । అతడు పాపపరిహా
రార్థబలియగు కోడెను చేసినట్లు దీనిని చేయవలెను;
అట్లే దీని చేయవలెను. యాజకుడు వారి నిమిత్తము
ప్రాయశ్చిత్తము చేయగా వారికి క్షమాపణ కలుగును. ।
21 ఆ కోడెను పాలెము వెలపలికి మోసికొనిపోయి ఆ
మొదటి కోడెను కాల్చినట్లు కాల్చవలెను. ఇది సంఘ
మునకు పాపపరిహారార్థబలి.

అధికారి పొరబాటున పాపముచేసి తన దేవుడైన 22
యెహోవా ఆజ్ఞలన్నిటిలో దేనినైనను మీరి చేయరాని
పనులు చేసి అపరాధియైనయెడల । అతడు ఏ పాప 23
ముచేసి పాపియాయెనో అది తనకు తెలియబడినయె
డల, అతడు నిర్దోషమైన మగమేకపిల్లను అర్పణముగా
తీసికొనివచ్చి । ఆ మేకపిల్ల తలమీద చెయ్యి ఉంచి, 24
దహనబలి పశువును వధించు చోట యెహోవా
సన్నిధిని దాని వధింపవలెను. ఇది పాపపరిహారార్థ
బలి. । యాజకుడు పాపపరిహారార్థబలి పశురక్తము 25
లో కొంచెము తన వ్రేలితో తీసి, దహనబలిపీఠము
కొమ్ములమీద చమిరి, దాని రక్తశేషమును దహనబలి
పీఠము అడుగున పోయవలెను. । సమాధానబలి పశువు 26
యొక్క క్రొవ్వువలె దీని క్రొవ్వంతయు బలిపీఠము
మీద దహింపవలెను. అట్లు యాజకుడు అతని పాప
విషయములో అతని నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయ
గా అతనికి క్షమాపణ కలుగును.

మీ దేశస్థులలో ఎవడైనను పొరబాటున పాపము 27
చేసి చేయరానిపనుల విషయములో యెహోవా
ఆజ్ఞలలో దేనినైనను మీరి అపరాధియైనయెడల ।
తాను చేసినది పాపమని యొకవేళ తనకు తెలియ 28
బడినయెడల, తాను చేసిన పాపము విషయమై నిర్దో
షమైన ఆడు మేకపిల్లను అర్పణముగా తీసికొని వచ్చి ।
పాపపరిహారార్థ బలిపశువుయొక్క తలమీద తన 29
చెయ్యి ఉంచి, దహనబలి పశువులను వధించు స్థలమున
దాని వధింపవలెను. । యాజకుడు దాని రక్తములో 30
కొంచెము వ్రేలితో తీసి దహనబలిపీఠపు కొమ్ములమీద
చమిరి, దాని రక్తశేషమును ఆ పీఠము అడుగున
పోయవలెను. । మరియు సమాధానబలి పశువుయొక్క 31
క్రొవ్వును తీసినట్లే దీని క్రొవ్వంతటిని తీయవలెను.
యెహోవాకు ఇంపైన సువాసనగా యాజకుడు బలి
పీఠముమీద దాని దహింపవలెను. అట్లు యాజకుడు
అతని నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయగా అతనికి
క్షమాపణ కలుగును.

ఎవడైనను పాపపరిహారార్థబలిగా అర్పించుటకు 32
గొఱ్ఱెను తీసికొని వచ్చినయెడల నిర్దోషమైనదాని తీసి
కొనివచ్చి । పాపపరిహారార్థబలియగు ఆ పశువు తల 33
మీద చెయ్యి ఉంచి దహనబలి పశువులను వధించు
చోటను పాపపరిహారార్థబలియగు దాని వధింపవలె
ను. । యాజకుడు పాపపరిహారార్థబలియగు పశువు 34
రక్తములో కొంచెము తన వ్రేలితో తీసి దహనబలి
పీఠపు కొమ్ములమీద చమిరి, ఆ పీఠము అడుగున ఆ
రక్తశేషమంతయు పోయవలెను. । మరియు సమాధాన 35
బలి పశువుయొక్క క్రొవ్వును తీసినట్లు దీని క్రొవ్వం
తయు తీయవలెను. యాజకుడు యెహోవాకు
అర్పించు హోమముల రీతిగా బలిపీఠముమీద వాటిని
ధూపము వేయవలెను. అతడు చేసిన పాపము విష

యమై యాజకుడు అతని నిమిత్తము ప్రాయశ్చిత్తము
చేయగా అతనికి క్షమాపణ కలుగును.
5 ఒకడు ఒట్టుపెట్టుకొనినవాడై తాను చూచినదాని
గూర్చిగాని తనకు తెలిసినదానిగూర్చిగాని సాక్షియై
యుండి దాని తెలియచేయక పాపము చేసినయెడల
2 అతడు తన దోషశిక్షను భరించును. । మరియు నొకడు
ఏ అపవిత్రవస్తువునైనను ముట్టినయెడల, అది అపవిత్ర
మృగ కళేబరమేగాని అపవిత్రపశు కళేబరమేగాని
అపవిత్రమైన ప్రాకెడు జంతువు కళేబరమేగాని అది
అపవిత్రమని తనకు తెలియకపోయినను అతడు అప
3 విత్రుడై అపరాధియగును. । మనుష్యులకు తగులు అప
విత్రతలలో ఏదైనను ఒకనికి తెలియకుండ అంటిన
యెడల, అనగా ఒకనికి అపవిత్రత కలిగినయెడల ఆ
సంగతి తెలిసిన తరువాత వాడు అపరాధియగును. ।
4 మరియు కీడైనను మేలైనను, మనుష్యులు వ్యర్థముగా
ఒట్టుపెట్టుకొని చేసెదమని పలుకు మాటలలో మరి దేని
నైనను యోచింపక చేసెదనని యొకడు పెదవులతో
వ్యర్థముగా ఒట్టుపెట్టుకొనిన పక్షమున, అది తెలిసిన
5 తరువాత వాడు అపరాధియగును. । కాబట్టి అతడు
వాటిలో ఏవిషయమందైనను అపరాధియగునప్పుడు
ఆ విషయమందే తాను చేసిన పాపమును ఒప్పుకొని ।
6 తాను చేసిన పాపవిషయమై యెహోవా సన్నిధికి
మందలోనుండి ఆడు గొఱ్ఱెపిల్లనేగాని ఆడు మేక
పిల్లనేగాని పాపపరిహారార్థబలిగా అర్పింపవలెను. అత
నికి పాపక్షమాపణ కలుగునట్లు యాజకుడు అతని నిమి
7 త్తము ప్రాయశ్చిత్తము చేయును. । అతడు గొఱ్ఱెపిల్లను
తేజాలని పక్షమున, అతడు పాపియగునట్లు తాను
చేసిన అపరాధవిషయమై రెండు తెల్ల గువ్వలనేగాని
రెండు పావురపు పిల్లలనేగాని పాపపరిహారార్థబలిగా
ఒకదానిని దహనబలిగా ఒకదానిని యెహోవా
8 సన్నిధికి తీసికొనిరావలెను. । అతడు యాజకుని
యొద్దకు వాటిని తెచ్చిన తరువాత అతడు పాపపరి
హారార్థమైనదాని మొదట నర్పించి, దాని మెడనుండి
దాని తలను నులమవలెను గాని దాని నూడదీయ
9 కూడదు. । అతడు పాపపరిహారార్థబలిపశురక్తములో
కొంచెము బలిపీఠము ప్రక్కను ప్రోక్షింపవలెను. దాని
రక్తశేషమును బలిపీఠము అడుగున పిండవలెను. అది
10 పాపపరిహారార్థబలి. । విధిచొప్పున రెండవదానిని
దహనబలిగా అర్పింపవలెను. అతడు చేసిన పాపము
విషయమై యాజకుడు అతని నిమిత్తము ప్రాయశ్చి
త్తము చేయగా అతనికి క్షమాపణ కలుగును.
11 రెండు తెల్ల గువ్వలైనను రెండు పావురపు పిల్లలై
నను తనకు దొరకనియెడల పాపముచేసినవాడు తూ
మెడు గోధుమపిండిలో పదియవవంతును పాపపరిహా
రార్థబలిరూపముగా తేవలెను. అది పాపపరిహా
రార్థబలి గనుక దానిమీద నూనెపోయవలదు. సాం
బ్రాణి దానిమీద ఉంచవలదు. । అతడు యాజకుని 12
యొద్దకు దాని తెచ్చిన తరువాత యాజకుడు జ్ఞాప
కార్థముగా దానిలో పిడికెడు తీసి యెహోవాకు
అర్పించు హోమద్రవ్యముల రీతిగా బలిపీఠముమీద
దాని దహింపవలెను. అది పాపపరిహారార్థబలి. । పై 13
చెప్పినవాటిలో దేని విషయమైనను పాపముచేసినవాని
నిమిత్తము యాజకుడు ప్రాయశ్చిత్తము చేయగా అత
నికి క్షమాపణ కలుగును. దాని శేషము నైవేద్య శేష
మువలె యాజకునిదగును.
మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 14
విచ్చెను । — ఒకడు యెహోవాకు పరిశుద్ధమైన 15
వాటి విషయములో పొరబాటున పాపముచేసిన
యెడల తాను చేసిన అపరాధమునకు నీవు ఏర్పరచు
వెలచొప్పున పరిశుద్ధమైన తులముల విలువగల నిర్దోష
మైన పొట్టేలును మందలోనుండి అపరాధపరిహారా
ర్థబలిగా యెహోవాయొద్దకు వాడు తీసికొని రా
వలెను. । పరిశుద్ధమైనదాని విషయములో తాను చేసిన 16
పాపమువలని నష్టము నిచ్చుకొని దానితో అయిదవ
వంతు యాజకునికియ్యవలెను. ఆ యాజకుడు అప
రాధపరిహారార్థబలియగు పొట్టేలువలన అతని నిమి
త్తము ప్రాయశ్చిత్తము చేయగా అతనికి క్షమాపణ
కలుగును.
చేయకూడదని యెహోవా ఆజ్ఞాపించినవాటిలో 17
దేనినైనను చేసి ఒకడు పాపియైనయెడల అది పొర
బాటున జరిగినను అతడు అపరాధియై తన దోషము
నకు శిక్ష భరించును. । కావున నీవు ఏర్పరచిన వెల 18
చొప్పున మందలోనుండి నిర్దోషమైన పొట్టేలును అప
రాధపరిహారార్థబలిగా అతడు యాజకునియొద్దకు తీసి
కొని రావలెను. అతడు తెలియకయే పొరబాటున చేసిన
తప్పునుగూర్చి యాజకుడు అతని నిమిత్తము ప్రాయ
శ్చిత్తము చేయగా అతనికి క్షమాపణ కలుగును. ।
అది అపరాధపరిహారార్థబలి. అతడు యెహోవాకు 19
విరోధముగా అపరాధము చేసినది వాస్తవము.
మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 6
విచ్చెను । — ఒకడు యెహోవాకు విరోధముగా 2
ద్రోహముచేసి పాపియైన పక్షమున, అనగా తనకు
అప్పగింపబడినదాని గూర్చియేగాని తాకట్టు ఉంచిన
దానిగూర్చియేగాని, దోచుకొనినదానిగూర్చియేగాని,
తన పొరుగువానితో బొంకినయెడలనేమి, తన పొరుగు
వాని బలాత్కారించినయెడలనేమి । పోయినది తనకు 3
దొరికినప్పుడు దానిగూర్చి బొంకినయెడలనేమి, మను
ష్యులు వేటిని చేసి పాపులగుదురో వాటన్నిటిలో
దేనివిషయమైనను అబద్ధప్రమాణము చేసినయెడల
నేమి, । అతడు పాపముచేసి అపరాధియగును గనుక 4
అతడు తాను దోచుకొనిన సొమ్మునుగూర్చిగాని బలా
త్కారముచేతను అపహరించినదానిగూర్చిగాని తనకు

అప్పగింపబడినదానిగూర్చిగాని, పోయి తనకు దొరికిన
దానిగూర్చిగాని, దేనిగూర్చియైతే తాను అబద్ధప్రమా
5 ణముచేసెనో అదంతయు మరల ఇచ్చుకొనవలెను. । ఆ
మూలధనము నిచ్చుకొని, దానితో దానిలో అయిదవ
వంతును తాను అపరాధ పరిహారార్థ బలి అర్పించు
6 దినమున సొత్తుదారునికి ఇచ్చుకొనవలెను. । అతడు
యెహోవాకు తన అపరాధవిషయములో నీవు ఏర్ప
రచు వెలకు మందలోనుండి నిర్దోషమైన పొట్టేలును
7 యాజకునియొద్దకు తీసికొని రావలెను. । ఆ యాజ
కుడు యెహోవా సన్నిధిని అతని నిమిత్తము ప్రాయ
శ్చిత్తము చేయగా అతడు అపరాధియగునట్లు తాను
చేసిన వాటన్నిటిలో ప్రతిదాని విషయమై అతనికి
క్షమాపణ కలుగును.

8 మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
9 విచ్చెను । — నీవు అహరోనుతోను అతని కుమారుల
తోను ఇట్లనుము—ఇది దహనబలినిగూర్చిన విధి. దహన
బలిద్రవ్యము ఉదయపర్యంతము రాత్రి అంతయు బలి
పీఠముమీద దహించుచుండును; బలిపీఠముమీది అగ్ని
10 దాని దహించుచుండును. । యాజకుడు తన సన్ననార
నిలువుటంగీని తొడుగుకొని తన మానమునకు తన నార
లాగును తొడుగుకొని బలిపీఠముమీద అగ్ని దహించు
దహనబలిద్రవ్యపు బూడిదెను ఎత్తి బలిపీఠమునొద్ద
11 దాని పోసి । తన వస్త్రములను తీసి వేరు వస్త్రములను ధరిం
చుకొని పాళెము వెలపటనున్న పవిత్రస్థలమునకు ఆ
12 బూడిదెను తీసికొని పోవలెను. । బలిపీఠముమీద అగ్ని
మండుచుండవలెను, అది ఆరిపోకూడదు. ప్రతి ఉద
యమున యాజకుడు దానిమీద కట్టెలువేసి, దాని
మీద దహనబలిద్రవ్యమును ఉంచి, సమాధానబలి
13 యగు పశువుక్రొవ్వును దహింపవలెను. । బలిపీఠము
మీద అగ్ని నిత్యము మండుచుండవలెను, అది ఆరి
పోకూడదు.

14 నైవేద్యమునుగూర్చిన విధి యేదనగా, అహరోను
కుమారులు యెహోవా సన్నిధిని బలిపీఠము నెదుట
15 దాని నర్పింపవలెను. । అతడు నైవేద్యతైలమునుండియు
దాని గోధుమపిండినుండియు చేరెడు పిండిని నూనెను,
దాని సాంబ్రాణియావత్తును దానిలోనుండి తీసి జ్ఞాపక
సూచనగాను వాటిని బలిపీఠముమీద యెహోవాకు
16 ఇంపైన సువాసనగాను దహింపవలెను. । దానిలో మిగి
లినదానిని అహరోనును అతని సంతతివారును తిన
వలెను. అది పులియనిదిగా పరిశుద్ధస్థలములో తిన
వలెను. వారు ప్రత్యక్షపు గుడారముయొక్క ఆవరణ
17 ములో దాని తినవలెను; । దాని పులియబెట్టి కాల్చ
వలదు; నా హోమద్రవ్యములలో వారికి పాలుగా
దాని నిచ్చియున్నాను. పాపపరిహారార్థబలివలెను
అపరాధపరిహారార్థబలివలెను అది అతిపరిశుద్ధము. ।
18 అహరోను సంతతిలో ప్రతివాడును దాని తినవలెను.
ఇది యెహోవా హోమముల విషయములో మీ
తరతరములకు నిత్యమైన కట్టడ. వాటికి తగిలిన ప్రతి
వస్తువు పరిశుద్ధమగును.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 19
విచ్చెను । —అహరోనుకు అభిషేకముచేసిన దినమున, 20
అతడును అతని సంతతివారును అర్పింపవలసిన అర్పణ
మేదనగా, ఉదయమున సగము సాయంకాలమున
సగము నిత్యమైన నైవేద్యముగా తూమెడు గోధుమ
పిండిలో పదియవవంతు. । పెనముమీద నూనెతో 21
దాని కాల్చవలెను; దాని కాల్చినతరువాత దాని
తేవలెను. కాల్చిన నైవేద్యభాగములను యెహోవాకు
ఇంపైన సువాసనగా అర్పింపవలెను. । అతని సంతతి 22
వారిలో అతనికి మారుగా అభిషేకము పొందిన యా
జకుడు ఆలాగుననే అర్పింపవలెను. అది యెహోవా
నియమించిన నిత్యమైన కట్టడ, అదంతయు దహింప
వలెను. । యాజకుడు చేయు ప్రతి నైవేద్యము నిశ్శే 23
షముగా వ్రేల్చబడవలెను; దాని తినవలదు.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 24
విచ్చెను । —నీవు అహరోనుకును అతని సంతతివారి 25
కిని ఈలాగు ఆజ్ఞాపించుము — పాపపరిహారార్థబలిని
గూర్చిన విధి యేదనగా, నీవు దహనబలిరూపమైన
పశువులను వధించుచోట పాపపరిహారార్థబలి పశువు
లను యెహోవా సన్నిధిని వధింపవలెను; అది అతి
పరిశుద్ధము. । పాపపరిహారార్థబలిగా దాని నర్పించిన 26
యాజకుడు దాని తినవలెను; పరిశుద్ధస్థలమందు, అనగా
ప్రత్యక్షపు గుడారముయొక్క ఆవరణములో దాని
తినవలెను. । దాని మాంసమునకు తగులు ప్రతి వస్తువు 27
ప్రతిష్ఠితమగును. దాని రక్తములోనిది కొంచెమైనను
వస్త్రముమీద ప్రోక్షించినయెడల అది దేనిమీద ప్రో
క్షింపబడెనో దానిని పరిశుద్ధస్థలములో ఉదుకవలెను. ।
దాని వండిన మంటికుండను పగలగొట్టవలెను; దానిని 28
ఇత్తడిపాత్రలో వండినయెడల దాని తోమి నీళ్లతో
తొలవవలెను. । యాజకులలో ప్రతి మగవాడు దాని 29
తినవలెను; అది అతిపరిశుద్ధము. । మరియు పాపపరి 30
హారార్థబలిగా తేబడిన యే పశువురక్తములో కొంచె
మైనను అతిపరిశుద్ధస్థలములో ప్రాయశ్చిత్తము చేయు
టకై ప్రత్యక్షపు గుడారములోనికి తేబడునో దాని
తినవలదు, దానిని అగ్నిలో కాల్చివేయవలెను.

అపరాధపరిహారార్థబలి అతిపరిశుద్ధము. దాని **7**
గూర్చిన విధి యేదనగా । దహనబలి పశువులను వధిం 2
చుచోట అపరాధపరిహారార్థబలిరూపమైన పశువు
లను వధింపవలెను. బలిపీఠముచుట్టు దాని రక్తమును
ప్రోక్షింపవలెను. । దానిలోనుండి దాని క్రొవ్వంత 3
టిని, అనగా దాని క్రొవ్విన తోకను దాని ఆంత్ర
ములలోని క్రొవ్వును । రెండు మూత్ర గ్రంథులను 4
డొక్కలపైనున్న క్రొవ్వును మూత్ర గ్రంథులమీది

క్రొవ్వును కాలేజముమీది వపను తీసి అదంతయు
5 అర్పింపవలెను. । యాజకుడు యెహోవాకు హో
మముగా బలిపీఠముమీద వాటిని దహింపవలెను; అది
అపరాధపరిహారార్థబలి; యాజకులలో ప్రతి మగ
6 వాడు దాని తినవలెను; । అది అతిపరిశుద్ధము, పరి
7 శుద్ధస్థలములో దాని తినవలెను. । పాపపరిహారార్థ
బలిని గూర్చిగాని అపరాధపరిహారార్థబలిని గూర్చి
గాని విధి యొక్కటే. ఆ బలిద్రవ్యము దానివలన
8 ప్రాయశ్చిత్తము చేయు యాజకునిదగును. । ఒకడు
తెచ్చిన దహనబలిని ఏ యాజకుడు అర్పించునో ఆ
యాజకుడు అర్పించిన దహనబలిపశువుచర్మము అతనిది;
9 అది అతనిదగును. । పొయ్యిమీద వండిన ప్రతి నైవే
ద్యమును, కుండలోనేగాని పెనముమీదనేగాని
కాల్చినది యావత్తును, దానిని అర్పించిన యాజ
కునిది, అది అతనిదగును. అది నూనె కలిసినదేగాని ।
10 పొడిదేగాని మీ నైవేద్యములన్నిటిని అహరోను సం
తతివారు సమముగా పంచుకొనవలెను.
11 ఒకడు యెహోవాకు అర్పింపవలసిన సమాధాన
12 బలిని గూర్చిన విధి యేదనగా । వాడు కృతజ్ఞతార్పణ
ముగా దాని నర్పించునప్పుడు తన కృతజ్ఞతార్పణరూప
మైన బలిగాక నూనెతో కలిసినవియు పొంగనివియు
నైన పిండివంటలను, నూనె పూసినవియు పొంగనవి
యునైన పలచని అప్పడములను, నూనె కలిపి కాల్చిన
13 గోధుమపిండి వంటలను అర్పింపవలెను. । ఆ పిండి
వంటలేకాక సమాధానబలిరూపమైన కృతజ్ఞతాబలి
ద్రవ్యములో పులిసిన రొట్టెను అర్పణముగా అర్పింప
14 వలెను. । మరియు ఆ అర్పణములలో ప్రతిదానిలో
నుండి ఒకదాని యెహోవాకు ప్రతిష్ఠార్పణముగా
అర్పింపవలెను. అది సమాధానబలిపశురక్తమును ప్రో
15 క్షించిన యాజకునిది, అది అతనిదగును. । సమాధాన
బలిగా తాను అర్పించు కృతజ్ఞతాబలిపశువును అర్పించు
దినమే దాని మాంసమును తినవలెను; దానిలోనిది
16 ఏదియు మరునాటికి ఉంచుకొనకూడదు. । అతడు
అర్పించుబలి మ్రొక్కుబడియేగాని స్వేచ్ఛార్పితమేగాని
అయినయెడల అతడు దాని నర్పించునాడే తినవలెను.।
17 మిగిలినది మరునాడు తినవచ్చును; మూడవనాడు ఆ
బలిపశువుమాంసములో మిగిలినదాని అగ్నిలో కాల్చి
18 వేయవలెను. । ఒకడు తన సమాధానబలిపశువుమాంస
ములో కొంచెమైనను మూడవనాడు తినినయెడల
అది అంగీకరింపబడదు; అది అర్పించినవానికి సమా
ధానబలిగా ఎంచబడదు; అది హేయము; దాని తిను
19 వాడు తన దోషశిక్షను భరించును. । అపవిత్రమైన
దేనికైనను తగిలిన మాంసమును తినకూడదు; అగ్నితో
దాని కాల్చివేయవలెను; మాంసమువిషయమైతే పవి
20 త్రులందరు మాంసమును తినవచ్చును గాని । ఒకడు
తనకు అపవిత్రత కలిగియుండగా యెహోవాకు
అర్పించు సమాధానబలి పశువుమాంసములో కొంచె
మైనను తినినపక్షమున వాడు ప్రజలలో నుండకుండ
మరణశిక్షనొందును. । ఎవడు మనుష్యుల అపవిత్ర 21
తనేగాని అపవిత్రమైన జంతువునేగాని యే అపవిత్ర
మైన వస్తువునేగాని తాకి యెహోవాకు అర్పించు
సమాధానబలిపశువుమాంసమును తినునో వాడు ప్రజ
లలోనుండి కొట్టివేయబడును.
మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 22
విచ్చెను । —నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము— 23
ఎద్దుదేగాని గొఱ్ఱెదేగాని మేకదేగాని దేని క్రొవ్వును
మీరు తినకూడదు. । చచ్చినదాని క్రొవ్వును చీల్చిన 24
దాని క్రొవ్వును ఏ పనికైనను వినియోగపరచవచ్చును
గాని దాని నేమాత్రమును తినకూడదు. । ఏలయనగా 25
మనుష్యులు యెహోవాకు హోమముగా అర్పించు
జంతువులలో దేని క్రొవ్వునైనను తినినవాడు తన
ప్రజలలోనుండి కొట్టివేయబడును. । మరియు పక్షిదే 26
గాని జంతువుదేగాని యే రక్తమును మీ నివాసము
లన్నిటిలో తినకూడదు. । ఎవడు రక్తము తినునో 27
వాడు తన ప్రజలలోనుండి కొట్టివేయబడును.
మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 28
విచ్చెను । —నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము— 29
ఎవడు యెహోవాకు సమాధానబలి ద్రవ్యములను
తెచ్చునో వాడు ఆ ద్రవ్యములలోనుండి తాను
అర్పించునది యెహోవా సన్నిధికి తేవలెను. ।
అతడు తన చేతులలోనే యెహోవాకు హోమ 30
ద్రవ్యములను, అనగా బోరమీది క్రొవ్వును తేవలెను.
యెహోవా సన్నిధిని అల్లాడింపబడు అర్పణముగా
దానిని అల్లాడించుటకు బోరతో దాని తేవలెను. ।
యాజకుడు బలిపీఠముమీద ఆ క్రొవ్వును దహింప 31
వలెను గాని, బోర అహరోనుకును అతని సంతతి
వారికిని చెందును. । సమాధానబలిపశువులలోనుండి 32
ప్రతిష్ఠార్పణముగా యాజకునికి కుడి జబ్బనియ్యవలె
ను. । అహరోను సంతతివారిలో ఎవడు సమాధాన 33
బలియగు పశువురక్తమును క్రొవ్వును అర్పించునో కుడి
జబ్బ వానిదగును. । ఏలయనగా ఇశ్రాయేలీయుల 34
యొద్దనుండి, అనగా వారి సమాధానబలి ద్రవ్యము
లలోనుండి అల్లాడించిన బోరను ప్రతిష్ఠితమైన జబ్బను
తీసికొని, నిత్యమైన కట్టడచొప్పున యాజకుడైన అహ
రోనుకును అతని సంతతివారికిని ఇచ్చియున్నాను. ।
వారు తనకు యాజకులగునట్లు యెహోవా వారిని 35
చేరదీసిన దినమందు యెహోవాకు అర్పించు హో
మద్రవ్యములలో నుండినది అభిషేకమునుబట్టి అహ
రోనుకును అభిషేకమునుబట్టియే అతని సంతతివారి
కిని కలిగెను. । వీటిని ఇశ్రాయేలీయులు వారికియ్య 36
వలెనని యెహోవా వారిని అభిషేకించిన దినమున
వారి తరతరములకు నిత్యమైన కట్టడగా నియమిం

37 చెను. । ఇది దహనబలినిగూర్చియు అపరాధపరిహారా
38 ర్థపు నైవేద్యమునుగూర్చియు పాపపరిహారార్థబలిని
గూర్చియు అపరాధపరిహారార్థబలినిగూర్చియు ప్రతి
ష్ఠితార్పణమునుగూర్చియు సమాధానబలినిగూర్చియు
చేయబడిన విధి. ఇశ్రాయేలీయులు యెహోవాకు
అర్పణములను తీసికొని రావలెనని సీనాయి అరణ్య
ములో ఆయన ఆజ్ఞాపించిన దినమున యెహోవా
సీనాయి కొండమీద మోషేకు ఆలాగుననే ఆజ్ఞా
పించెను.

8 మరియు యెహోవా ।— నీవు అహరోనును
2 అతని కుమారులను వారి వస్త్రములను అభిషేకతైలమును
పాపపరిహారార్థబలిరూపమైన కోడెను రెండు పొట్టే
ళ్లను గంపెడు పొంగని భక్ష్యములను తీసికొని ।
3 ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారమునొద్దకు సర్వ
4 సమాజమును సమకూర్చుమనగా । యెహోవా మో
షేకు ఆజ్ఞాపించినట్లు అతడు చేసెను. సమాజము
ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారమునొద్దకు కూడి
5 రాగా । మోషే సమాజమును చూచి—చేయవలెనని
యెహోవా ఆజ్ఞాపించిన కార్యము ఇదే అనెను. ।
6 అప్పుడు మోషే అహరోనును అతని కుమారులను
దగ్గరకు తీసికొనివచ్చి నీళ్లతో వారికి స్నానము
7 చేయించెను. । తరువాత అతడు అతనికి చొక్కా
యిని తొడిగి అతనికి దట్టీని కట్టి నిలువుటంగీని తొడిగి
అతనికి ఏఫోదును తొడిగి ఏఫోదుయొక్క విచిత్ర
మైన నడికట్టును అతనికి కట్టి దానివలన అతనికి ఏఫో
8 దును బిగించి అతనికి పతకము వేసి । ఆ పతకములో
9 ఊరీము తుమ్మీమను వాటిని ఉంచి । అతని తలమీద
పాగాను పెట్టి ఆ పాగామీదను అతని నొసట
పరిశుద్ధకిరీటముగా బంగారు రేకును కట్టెను. ఇట్లు
10 యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను. । మరియు
మోషే అభిషేకతైలమును తీసికొని మందిరమును దాని
లోనున్న సమస్తమును అభిషేకించి వాటిని ప్రతిష్ఠిం
11 చెను. । అతడు దానిలో కొంచెము ఏడుమారులు
బలిపీఠముమీద ప్రోక్షించి, బలిపీఠమును దాని ఉప
కరణములన్నిటిని గంగాళమును దాని పీటను ప్రతిష్ఠిం
12 చుటకై వాటిని అభిషేకించెను. । మరియు అతడు
అభిషేకతైలములో కొంచెము అహరోను తలమీద
పోసి అతని ప్రతిష్ఠించుటకై అతనిని అభిషేకించెను. ।
13 అప్పుడతడు అహరోను కుమారులను దగ్గరకు తీసి
కొని వచ్చి వారికి చొక్కాయిలను తొడిగి వారికి
దట్టీలను కట్టి వారికి కుళ్లాయిలను పెట్టెను. ఇట్లు
14 యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను. । అప్పుడతడు
పాపపరిహారార్థబలిగా ఒక కోడెను తీసికొని వచ్చెను.
అహరోనును అతని కుమారులును పాపపరిహారార్థబలి
రూపమైన ఆ కోడె తలమీద తమ చేతులుంచిరి. ।
15 దాని వధించిన తరువాత మోషే దాని రక్తమును తీసి
బలిపీఠపు కొమ్ములచుట్టు వ్రేలితో దాని చమిరి బలి
పీఠము విషయమై పాపపరిహారము చేసి దాని నిమి
త్తము ప్రాయశ్చిత్తము చేయుటకై బలిపీఠము అడుగున
రక్తమును పోసి దాని ప్రతిష్ఠించెను. । మోషే అంత్ర 16
ములమీది క్రొవ్వంతటిని కాలేజముమీది వపను
రెండు మూత్ర గ్రంథులను వాటి క్రొవ్వును తీసి బలి
పీఠముమీద దహించెను. । మరియు యెహోవా 17
మోషేకు ఆజ్ఞాపించినట్లు ఆ కోడెను దాని చర్మమును
దాని మాంసమును దాని పేడను పాలెమునకు అవతల
అగ్నిచేత కాల్చివేసెను. । తరువాత అతడు దహన 18
బలిగా ఒక పొట్టేలును తీసికొని వచ్చెను. అహరో
నును అతని కుమారులును ఆ పొట్టేలి తలమీద తమ
చేతులుంచిరి. । అప్పుడు మోషే దాని వధించి బలి 19
పీఠముచుట్టు దాని రక్తమును ప్రోక్షించెను. । అతడు 20
ఆ పొట్టేలుయొక్క అవయవములను విడదీసి దాని
తలను అవయవములను క్రొవ్వును దహించెను. । అతడు 21
దాని ఆంత్రములను కాళ్లను నీళ్లతో కడిగి, ఆ పొట్టే
లంతయు బలిపీఠముమీద దహించెను. యెహోవా
మోషేకు ఆజ్ఞాపించినట్లు అది యింపైన సువాసనగల
దహనబలి ఆయెను. అది యెహోవాకు హోమము. ।
అతడు రెండవ పొట్టేలును, అనగా ఈ ప్రతిష్ఠితమైన 22
పొట్టేలును తీసికొనిరాగా అహరోనును అతని కుమా
రులును ఆ పొట్టేలి తలమీద తమ చేతులుంచిరి. ।
మోషే దాని వధించి దాని రక్తములో కొంచెము తీసి 23
అహరోను కుడిచెవి కొనమీదను అతని కుడిచేతి
బొటనవ్రేలిమీదను అతని కుడికాలి బొటనవ్రేలి
కొనమీదను దాని చమిరెను. । మోషే అహరోను 24
కుమారులను దగ్గరకు తీసికొనివచ్చి వారి కుడిచెవుల
కొనలమీదను వారి కుడిచేతుల బొటనవ్రేలిమీదను
వారి కుడికాళ్ల బొటనవ్రేలిమీదను ఆ రక్తములో
కొంచెము చమిరెను. మరియు మోషే బలిపీఠముచుట్టు
దాని రక్తమును ప్రోక్షించెను. । తరువాత అతడు 25
దాని క్రొవ్వును క్రొవ్విన తోకను ఆంత్రములమీది
క్రొవ్వంతటిని కాలేజముమీది వపను రెండు మూత్ర
గ్రంథులను వాటి క్రొవ్వును కుడి జబ్బను తీసి ।
యెహోవా సన్నిధిని గంపెడు పులియని భక్ష్యము 26
లలోనుండి పులియని యొక పిండివంటను నూనెగలదై
పొడిచిన యొక భక్ష్యమును ఒక పలచని అప్పడమును
తీసి ఆ క్రొవ్వుమీదను ఆ కుడి జబ్బమీదను వాటిని
ఉంచి । అహరోను చేతులమీదను అతని కుమారుల 27
చేతులమీదను వాటన్నిటిని ఉంచి అల్లాడింపబడు
అర్పణముగా యెహోవా సన్నిధిని వాటిని అల్లా
డించెను. । అప్పుడు మోషే వారి చేతులమీదనుండి 28
వాటిని తీసి బలిపీఠముమీదనున్న దహనబలి ద్రవ్యము
మీద వాటిని దహించెను. అవి యింపైన సువాసనగల
ప్రతిష్ఠార్పణలు. అది యెహోవాకు హోమము. ।

29 మరియు మోషే దాని బోరను తీసి అల్లాడింపబడు
అర్పణముగా యెహోవా సన్నిధిని దానిని అల్లా
డించెను. ప్రతిష్ఠార్పణరూపమైన పొట్టేలిలో అది
మోషే వంతు. అట్లు యెహోవా మోషేకు ఆజ్ఞా
30 పించెను. । మరియు మోషే అభిషేకతైలములో కొం
తయు బలిపీఠముమీది రక్తములో కొంతయు తీసి,
అహరోనుమీదను అతని వస్త్రములమీదను అతని కుమా
రులమీదను అతని కుమారుల వస్త్రములమీదను దాని
ప్రోక్షించి, అహరోనును అతని వస్త్రములను అతని
కుమారులను అతని కుమారుల వస్త్రములను ప్రతిష్ఠిం
31 చెను. । అప్పుడు మోషే అహరోనుతోను అతని
కుమారులతోను ఇట్లనెను — ప్రత్యక్షపు గుడారము
యొక్క ద్వారమునొద్ద ఆ మాంసమును వండి, అహ
రోనును అతని కుమారులును తినవలెనని నేను ఆజ్ఞా
పించినట్లు అక్కడనే దానిని, ప్రతిష్ఠితద్రవ్యములు
32 గల గంపలోని భక్ష్యములను తినవలెను. । ఆ మాంస
ములోను భక్ష్యములోను మిగిలినది అగ్నిచేత కాల్చి
33 వేయవలెను. । మీ ప్రతిష్ఠదినములు తీరువరకు ఏడు
దినములు ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారము
నొద్దనుండి బయలువెళ్లకూడదు; ఏడు దినములు
మోషే మీ విషయములో ఆ ప్రతిష్ఠను చేయుచుం
34 డును. । మీ నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయుటకై
అతడు నేడు చేసినట్లు చేయవలెనని యెహోవా
35 ఆజ్ఞాపించెను. । మీరు చావకుండునట్లు మీరు ప్రత్య
క్షపు గుడారముయొక్క ద్వారమునొద్ద ఏడు దిన
ములవరకు రేయింబగళ్లుండి, యెహోవా విధించిన
విధిని ఆచరింపవలెను; నాకు అట్టి ఆజ్ఞ కలిగెను. ।
36 యెహోవా మోషేద్వారా ఆజ్ఞాపించినవన్ని అహ
రోనును అతని కుమారులును చేసిరి.

9 ఎనిమిదవదినమున మోషే అహరోనును అతని
కుమారులను ఇశ్రాయేలీయుల పెద్దలను పిలిపించి ।
2 అహరోనుతో ఇట్లనెను—నీవు పాపపరిహారార్థబలిగా
నిర్దోషమైన యొక కోడెదూడను, దహనబలిగా నిర్దో
షమైన యొక పొట్టేలును యెహోవా సన్నిధికి
3 తీసికొని రమ్ము. । మరియు నీవు ఇశ్రాయేలీయులను
చూచి—మీరు యెహోవా సన్నిధిని బలినర్పించు
నట్లు పాపపరిహారార్థబలిగా నిర్దోషమైన మేకపిల్లను,
దహనబలిగా నిర్దోషమైన యేడాది దూడను గొఱ్ఱె
4 పిల్లను । సమాధానబలిగా కోడెను పొట్టేలును నూనె
కలిసిన నైవేద్యమును తీసికొని రండి; నేడు
యెహోవా మీకు కనబడును అని చెప్పుము. ।
5 మోషే ఆజ్ఞాపించినవాటిని వారు ప్రత్యక్షపు గుడా
రము నెదుటికి తీసికొని వచ్చిరి. సమాజమంతయు దగ్గ
6 రకు వచ్చి యెహోవా సన్నిధిని నిలువగా । మోషే—
మీరు చేయవలెనని యెహోవా ఆజ్ఞాపించినది ఇదే;
అట్లు చేయుడి. అప్పుడు యెహోవా మహిమ
మీకు కనబడుననెను. । మరియు మోషే అహరో 7
నుతో ఇట్లనెను—నీవు బలిపీఠము నొద్దకు వెళ్లి పాప
పరిహారార్థబలిని దహనబలిని అర్పించి నీ నిమిత్తమును
ప్రజలనిమిత్తమును ప్రాయశ్చిత్తముచేసి ప్రజలకొరకు
అర్పణము చేసి, యెహోవా ఆజ్ఞాపించినట్లు వారి
నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయుము. । కాబట్టి అహ 8
రోను బలిపీఠము దగ్గరకు వెళ్లి తనకొరకు పాపపరి
హారార్థబలిగా ఒక దూడను వధించెను. । అహరోను 9
కుమారులు దాని రక్తమును అతనియొద్దకు తేగా అతడు
ఆ రక్తములో తన వ్రేలు ముంచి బలిపీఠపు కొమ్ముల
మీద దాని చమిరి బలిపీఠము అడుగున ఆ రక్తమును
పోసెను. । దాని క్రొవ్వును మూత్ర గ్రంథులను 10
కాలేజముమీది వపను బలిపీఠముమీద దహించెను.
అట్లు యెహోవా మోషేకు ఆజ్ఞాపించెను. । దాని 11
మాంసమును చర్మమును పాలెము వెలపట అగ్నితో
కాల్చివేసెను. । అప్పుడతడు దహనబలి పశువును 12
వధించెను. అహరోను కుమారులు అతనికి దాని
రక్తము నప్పగింపగా అతడు బలిపీఠముచుట్టు దాని
ప్రోక్షించెను. । మరియు వారు దహనబలిపశువు 13
యొక్క తలను అవయవములను అతనికి అప్పగింపగా
అతడు బలిపీఠముమీద వాటిని దహించెను. । అతడు 14
దాని ఆంత్రములను కాళ్లను కడిగి బలిపీఠముమీద
నున్న దహనబలి ద్రవ్యముపైని దహించెను । అతడు 15
ప్రజల అర్పణమును తీసికొని వచ్చి ప్రజలు అర్పించు
పాపపరిహారార్థబలియగు మేకను తీసికొని వధించి
మొదటిదానివలె దీనిని పాపపరిహారార్థబలిగా అర్పిం
చెను. । అప్పుడతడు దహనబలిపశువును తీసికొని విధి 16
చొప్పున దాని నర్పించెను. । అప్పుడతడు నైవేద్య 17
మును తెచ్చి దానిలోనుండి చేరెడు తీసి ప్రాతఃకాల
మందు చేసిన దహనబలిగాక బలిపీఠముమీద తీసిన
దానిని దహించెను. । మరియు మోషే ప్రజలు 18
అర్పించు సమాధానబలిరూపమైన కోడెదూడను
పొట్టేలును వధించెను. అహరోను కుమారులు దాని
రక్తమును అతనికి అప్పగింపగా అతడు బలిపీఠము
చుట్టు దాని ప్రోక్షించెను. । మరియు వారు ఆ దూడ 19
క్రొవ్వును మేకక్రొవ్వును క్రొవ్విన తోకను ఆంత్ర
ములను కప్పు క్రొవ్వును మూత్ర గ్రంథులను కాలే
జముమీది వపను అప్పగించిరి. । బోరలమీద క్రొ 20
వ్వును ఉంచిరి. అతడు బలిపీఠముమీద ఆ క్రొవ్వును
దహించెను. । బోరలను కుడి జబ్బను యెహోవా
సన్నిధిలో అల్లాడించు అర్పణముగా అహరోను
అల్లాడించెను. అట్లు యెహోవా మోషేకు ఆజ్ఞాపిం
చెను. । అప్పుడు అహరోను పాపపరిహారార్థబలిని
దహనబలిని సమాధానబలిని అర్పించి, ప్రజలవైపునకు
తన చేతులెత్తి వారిని దీవించిన తరువాత దిగివచ్చెను. ।
మోషే అహరోనులు ప్రత్యక్షపు గుడారములోనికి

పోయి వెలపలికి వచ్చి ప్రజలను దీవింపగా
యెహోవా మహిమ ప్రజలకందరికి కనబడెను. ।
24 యెహోవా సన్నిధినుండి అగ్ని బయలువెళ్లి బలి
పీఠము మీదనున్న దహనబలిద్రవ్యమును క్రొవ్వును
కాల్చివేసెను; ప్రజలందరు దాని చూచి ఉత్సాహ
ధ్వనిచేసి సాగిలపడిరి.

10 అహరోను కుమారులైన నాదాబు అబీహులు
తమ తమ ధూపార్తులను తీసికొని వాటిలో నిప్పు
లుంచి వాటిమీద ధూపద్రవ్యమువేసి, యెహోవా
తమ కాజ్ఞాపింపని అన్యాగ్నిని ఆయన సన్నిధికి తేగా ।
2 యెహోవా సన్నిధినుండి అగ్ని బయలుదేరి వారిని
కాల్చివేసెను; వారు యెహోవా సన్నిధిని మృతి
3 బొందిరి. । అప్పుడు మోషే అహరోనుతో ఇట్లనెను
—ఇది యెహోవా చెప్పిన మాట—నాయొద్దనుండు
వారియందు నేను నన్ను పరిశుద్ధపరచుకొందును;
ప్రజలందరియెదుట నన్ను మహిమపరచుకొందును.
4 అహరోను మౌనముగానుండెగా । మోషే అహరోను
పినతండ్రియైన ఉజ్జీయేలు కుమారులైన మీషాయేలును
ఎల్సాఫానును పిలిపించి—మీరు సమీపించి పరిశుద్ధ
స్థలము నెదుటనుండి పాళెము వెలపలికి మీ సహో
దరుల శవములను మోసికొని పోవుడని వారితో
5 చెప్పెను. । మోషే చెప్పినట్లు వారు సమీపించి
చొక్కాయిలను తీయకయే పాళెము వెలపలికి వారిని
6 మోసికొని పోయిరి. । అప్పుడు మోషే అహరోనును
అతని కుమారులైన ఎలాజారు ఈతామారును వారిని
చూచి—మీరు చావకుండునట్లును యెహోవా యీ
సర్వసమాజముమీద ఆగ్రహపడకుండునట్లును, మీరు
తల విరియబోసికొనకూడదు; బట్టలను చింపుకొన
కూడదు కాని, యెహోవా వారిని కాల్చినందుకు
మీ సహోదరులైన ఇశ్రాయేలీయుల యింటివారం
7 దరు ఏడువవచ్చును. । యెహోవా అభిషేకతైలము
మీమీద నున్నది గనుక మీరు చావకుండునట్లు మీరు
ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారములోనుండి
బయలువెళ్లకూడదనెను. వారు మోషే చెప్పిన మాట
చొప్పున చేసిరి.
8 మరియు యెహోవా అహరోనుతో ఇట్లనెను—
9 మీరు ప్రత్యక్షపు గుడారములోకి వచ్చునప్పుడు
మీరు చావకుండునట్లు నీవును నీ కుమారులును
ద్రాక్షారసమునేగాని మద్యమునేగాని త్రాగకూ
10 డదు. । మీరు ప్రతిష్ఠింపబడినదానిని లౌకికమైన
దానిని, అపవిత్రమైనదానిని పవిత్రమైనదానిని వేరు
11 చేయుటకును, । యెహోవా మోషేచేత ఇశ్రాయేలీ
యులకు ఆజ్ఞాపించిన సమస్త విధులను మీరు వారికి
బోధించుటకును ఇది మీ తరతరములకు నిత్యమైన
కట్టడ.
12 అప్పుడు మోషే అహరోనుతోను మిగిలిన అతని
కుమారులైన ఎలాజారు ఈతామారులతోను ఇట్లనెను—
మీరు యెహోవా హోమద్రవ్యములలో మిగిలిన
నైవేద్యమును తీసికొని అది పొంగకుండ బలిపీఠము
దగ్గర తినుడి; అది అతిపరిశుద్ధము. యెహోవా
హోమద్రవ్యములోనుండి అది నీకును నీ కుమారుల
కును నియమింపబడిన వంతు. । కావున మీరు పరిశుద్ధ 13
స్థలములో దాని తినవలెను; నేను అట్టి ఆజ్ఞను పొంది
తిని. । మరియు అల్లాడించు బోరను ప్రతిష్ఠితమైన 14
జబ్బను మీరు, అనగా నీవును నీతోపాటు నీ కుమా
రులును నీ కుమార్తెలును పవిత్రస్థలములో తినవలెను.
ఏలయనగా అవి ఇశ్రాయేలీయులు అర్పించు సమా
ధానబలులలోనుండి నీకును నీ కుమారులకును నియ
మింపబడిన వంతులు. । హోమద్రవ్యరూపమైన 15
క్రొవ్వునుగాక యెహోవా సన్నిధిని అల్లాడింప
బడినదానిగా దానిని అల్లాడించునట్లు ప్రతిష్ఠితమైన
జబ్బను అల్లాడించు బోరను తీసికొని రావలెను. నిత్య
మైన కట్టడచొప్పున అవి నీకును నీ కుమారులకును
చెందును. అట్లు యెహోవా ఆజ్ఞాపించెను.
అప్పుడు మోషే పాపపరిహారార్థబలియగు మేకను 16
కనుగొనవలెనని జాగ్రత్తగా వెదకినప్పుడు అది కాలి
పోయియుండెను. అతడు అహరోను కుమారులలో
మిగిలిన ఎలాజారు ఈతామారను వారిమీద ఆగ్రహ
పడి ।—మీరు పరిశుద్ధస్థలములో ఆ పాపపరిహారార్థ 17
బలిపశువును ఏల తినలేదు? అది అతిపరిశుద్ధముగదా.
సమాజముయొక్క దోషశిక్షను భరించి యెహోవా
సన్నిధిని వారి నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయుటకై
ఆయన దానిని మీకిచ్చెనుగదా. । ఇదిగో దాని రక్త 18
మును పరిశుద్ధస్థలములోకి తేవలెనుగదా. నేను ఆజ్ఞా
పించినట్లు నిశ్చయముగా పరిశుద్ధస్థలములో దాని తిన
వలెనని చెప్పెను. । అందుకు అహరోను మోషేను 19
చూచి — ఇదిగో నేడు పాపపరిహారార్థబలిపశువును
దహనబలిద్రవ్యమును యెహోవా సన్నిధికి వారు
తేగా ఇట్టి ఆపదలు నాకు సంభవించెను. నేను పాప
పరిహారార్థమైన బలిద్రవ్యమును నేడు తినినయెడల
అది యెహోవాదృష్టికి మంచిదగునా అనెను. ।
మోషే ఆ మాట విని ఒప్పుకొనెను. 20

మరియు యెహోవా మోషే అహరోనులకు 11
ఈలాగు సెలవిచ్చెను ।—మీరు ఇశ్రాయేలీయులతో 2
ఇట్లనుడి—భూమిమీదనున్న జీవులన్నిటిలోను మీరు
ఈ జీవులను మాత్రము తినవచ్చును; । జంతువులలో 3
ఏది డెక్కలుగలదై నెమరువేయునో దాని తినవచ్చును
గాని । నెమరువేయువాటిలోను రెండు డెక్కలు గల 4
వాటిలోను వీటిని తినకూడదు, ఒంటె నెమరువేయును
గాని దానికి రెండు డెక్కలు లేవు గనుక అది మీకు
అపవిత్రము. । పొట్టి కుందేలు నెమరువేయును గాని 5
దానికి రెండు డెక్కలు లేవు గనుక అది మీకు అప

6 త్రము. । కుందేలు నెమరువేయును గాని దానికి
రెండు డెక్కలు లేవు గనుక అది మీకు అపవిత్రము. ।
7 పంది విడిగానుండు రెండు డెక్కలు గలదిగాని అది
నెమరువేయదు గనుక అది మీకు అపవిత్రము. ।
8 వాటి మాంసమును మీరు తినకూడదు; వాటి కళేబర
ములను ముట్టకూడదు; అవి మీకు అపవిత్రములు.
9 జలచరములన్నిటిలో వీటిని తినవచ్చును; సముద్ర
ములోనేమి, నదులలోనేమి, యే నీళ్లలోనేమి, వేటికి
రెక్కలు పొలుసులు ఉండునో వాటిని తినవచ్చును. ।
10 సముద్రములలోనేమి, నదులలోనేమి, సమస్త జలచర
ములలోను సమస్త జలజంతువులలోను వేటికి రెక్కలు
పొలుసులు ఉండవో అవన్నియు మీకు హేయ
11 ములు; । అవి మీకు హేయములుగానే ఉండవలెను.
వాటి మాంసమును తినకూడదు, వాటి కళేబరములను
12 హేయములుగా ఎంచుకొనవలెను. । నీళ్లలో దేనికి
రెక్కలు పొలుసులు ఉండవో అది మీకు హేయము.
13 పక్షులలో వీటిని హేయములుగా ఎంచుకొన
వలెను. వీటిని తినవద్దు ఇవి హేయములు; పక్షిరాజు,
14 పెద్దబోరువ, । క్రౌరమీను, గద్ద, తెల్లగద్ద, ప్రతివిధ
15 మైన గద్ద, । ప్రతివిధమైన కాకి, । నిప్పుకోడి, కపిరి
17 గాడు, కోగిలె, ప్రతివిధమైన డేగ, । పైగిడికంటె,
18 చెరువుకాకి, గుడ్లగూబ; । హంస, గూడబాతు, నల్లబో
19 రువ, । సంకుబుడి కొంగ, ప్రతివిధమైన కొంగ, కుకు
డుగువ్వ, గబ్బిలము.
20 రెక్కలుకలిగి నాలుగుకాళ్లతో చరించు చరము
21 లన్నియు మీకు హేయములు. । అయితే నాలుగుకా
ళ్లతో చరించుచు నేల గంతులువేయుటకు కాళ్లమీద
22 తొడలుగల పురుగులన్ని తినవచ్చును. । నేతమిడత
గాని చిన్నమిడతగాని ఆకుమిడతగాని మిడతలలో
23 ప్రతివిధమైనది తినవచ్చును. । నాలుగుకాళ్లుగల పురు
24 గులన్నియు మీకు హేయములు. । వాటివలన మీరు
అపవిత్రులగుదురు వాటి కళేబరములను ముట్టిన ప్రతి
25 వాడు సాయంకాలమువరకు అపవిత్రుడగును. । వాటి
కళేబరములలో కొంచెమైనను మోసిన ప్రతివాడు
తన బట్టలు ఉదుకుకొని సాయంకాలమువరకు అప
26 విత్రుడగును. । రెండు డెక్కలుగల జంతువులన్ని
టిలో విడిగా చీలిన డెక్కలు లేకయు, నెమరువేయ
కయు నుండునవి మీకు అపవిత్రములు, వాటి కళే
బరములను ముట్టిన ప్రతివాడు అపవిత్రుడగును. ।
27 నాలుగు కాళ్లతో నడుచు సమస్త జీవరాసులలో ఏవి
అరకాలితో నడుచునో అవన్నియు అపవిత్రములు;
వాటి కళేబరములను ముట్టిన ప్రతివాడు సాయంకా
28 లమువరకు అపవిత్రుడగును; । వాటి కళేబరమును
మోసిన ప్రతివాడు తన బట్టలు ఉదుకుకొని సాయం
కాలమువరకు అపవిత్రుడగును; అవి మీకు అపవిత్ర
మైనవి.

నేలమీద ప్రాకు జీవరాసులలో మీకు అపవిత్ర 29
మైనవి ఏవేవనగా, చిన్నముంగిసు, చిన్నపందికొక్కు,
ప్రతివిధమైన బల్లి, । ఊసరవెల్లి, నేలమొసలి, తొండ, 30
సరటము, అడవిఎలుక. । ప్రాకువాటిలో ఇవి 31
మీకు అపవిత్రములు; ఇవి చచ్చిన తరువాత వీటిని
ముట్టిన ప్రతివాడు సాయంకాలమువరకు అపవిత్రు
డగును. । వాటిలో చచ్చినదాని కళేబరము దేనిమీద 32
పడునో అది అపవిత్రమగును. అది దారుపాత్రయే
గాని బట్టయేగాని చర్మమేగాని సంచియేగాని పని
చేయు ఉపకరణము ఏదియుగాని అయినయెడల
దాని నీళ్లలో వేయవలెను. అది సాయంకాలమువరకు
అపవిత్రమైయుండును; తరువాత అది పవిత్రమగును.।
వీటిలో ఏదైనను మంటిపాత్రలో పడినయెడల దాని 33
లోనిదంతయు అపవిత్రమగును; మీరు దాని పగల
గొట్టవలెను. । తినదగిన ఆహార మంతటిలో దేనిమీద 34
ఆ నీళ్లు పడునో అది అపవిత్రమగును. అట్టి పాత్ర
లో త్రాగిన యే పానీయమును అపవిత్రము. । వాటి 35
కళేబరములలో కొంచెము దేనిమీద పడునో అది
అపవిత్రమగును. అది పొయ్యియైనను కుంపటియైనను
దానిని పగలగొట్టవలెను. అవి అపవిత్రములు, అవి
మీకు అపవిత్రములుగా ఉండవలెను. । అయితే 36
విస్తారమైన నీళ్లుగల ఊటలోగాని గుంటలోగాని కళే
బరము పడినను ఆ నీళ్లు అపవిత్రములు కావు గాని
కళేబరమునకు తగిలినది అపవిత్రమగును. । వాటి కళే 37
బరములలో కొంచెము విత్తుకట్టు విత్తనములమీద పడి
నను అవి అపవిత్రములు కావు గాని । ఆ విత్తనముల 38
మీద నీళ్లు పోసిన తరువాత కళేబరములో కొంచె
ము వాటిమీద పడినయెడల అవి మీకు అపవిత్రము
లగును.

మీరు తినదగిన జంతువులలో ఏదైనను చచ్చిన 39
యెడల దాని కళేబరమును ముట్టువాడు సాయంకాల
మువరకు అపవిత్రుడగును. । దాని కళేబరములో ఏదై 40
నను తినువాడు తన బట్టలు ఉదుకుకొని సాయంకాల
మువరకు అపవిత్రుడగును. దాని కళేబరమును మో
యువాడు తన బట్టలు ఉదుకుకొని సాయంకాలము
వరకు అపవిత్రుడగును.

నేలమీద ప్రాకు జీవరాసులన్నియు హేయ 41
ములు, వాటిని తినకూడదు. । నేలమీద ప్రాకు జీవ 42
రాసులన్నిటిలో కడుపుతో చరించుదానినైనను నా
లుగు కాళ్లతో చరించుదానినైనను చాలా కాళ్లు గల
దానినైనను మీరు తినకూడదు; అవి హేయములు. ।
ప్రాకు జీవరాసులలో దేనినైనను తిని మిమ్మును మీరు 43
హేయపరచుకొనకూడదు; వాటివలన అపవిత్రులగు
నట్లు వాటివలన అపవిత్రత కలుగజేసికొనకూడదు. ।
నేను మీ దేవుడనైన యెహోవాను; నేను పరిశుద్ధు 44
డను గనుక మీరు పరిశుద్ధులై యుండునట్లు మిమ్మును

మీరు పరిశుద్ధపరచుకొనవలెను. నేలమీద ప్రాకు జీవ
రాసులలో దేనివలనను మిమ్మును మీరు అపవిత్ర
45 పరచుకొనకూడదు. । నేను మీకు దేవుడనైయుం
డుటకు ఐగుప్తు దేశములోనుండి మిమ్మును రప్పించిన
యెహోవాను; నేను పరిశుద్ధుడను గనుక మీరును
పరిశుద్ధులు కావలెను.
46 అపవిత్రమైనదానికిని పవిత్రమైనదానికిని తిన
దగిన జంతువులకును తినదగని జంతువులకును విభజన
47 చేయునట్లు । జంతువులనుగూర్చియు, పక్షులనుగూ
ర్చియు, జలచరములైన సమస్త జీవులనుగూర్చియు,
నేలమీద ప్రాకు సమస్త జీవులనుగూర్చియు చేసిన
విధి యిదే అని చెప్పుమనెను.

**12** మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
2 విచ్చెను । —నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము—
ఒక స్త్రీ గర్భవతియై మగపిల్లను కనినయెడల ఆమె
యేడు దినములు పురిటాలై యుండవలెను. ఆమె
తాను ముట్టుదై కడగానుండు దినముల లెక్కనుబట్టి
3 పురిటాలై యుండవలెను. । ఎనిమిదవ దినమున బిడ్డకు
4 సున్నతి చేయింపవలెను. । ఆమె తన రక్తశుద్ధికొరకు
ముప్పది మూడు దినములుండి తన రక్తశుద్ధి దినములు
సంపూర్ణమగువరకు ఆమె పరిశుద్ధమైన దేనినైనను ముట్ట
కూడదు, పరిశుద్ధ స్థలములో ప్రవేశింపకూడదు. ।
5 ఆమె ఆడుపిల్లను కనినయెడల ఆమె తాను కడగా
ఉండునప్పటివలె రెండు వారములు పురిటాలై ఉండ
వలెను. ఆమె తన రక్తశుద్ధికొరకు అరువది యారు
6 దినములు కడగా ఉండవలెను. । కుమారునికొరకేగాని
కుమార్తెకొరకేగాని ఆమె శుద్ధిదినములు సంపూర్తియైన
తరువాత ఆమె దహనబలిగా ఒక యేడాది గొఱ్ఱె
పిల్లను, పాపపరిహారార్థబలిగా ఒక పావురపు పిల్ల
నైనను తెల్ల గువ్వనైనను ప్రత్యక్షపు గుడారము
యొక్క ద్వారమునకు యాజకునియొద్దకు తీసికొని
7 రావలెను. । అతడు యెహోవా సన్నిధిని దాని
నర్పించి ఆమెనిమిత్తము ప్రాయశ్చిత్తము చేయగా
ఆమె రక్తస్రావవిషయమై ఆమె పవిత్రపరచబడును.
ఇది మగపిల్లనుగాని ఆడుపిల్లనుగాని కనిన స్త్రీనిగూర్చిన
8 విధి. । ఆమె గొఱ్ఱెపిల్లను తేజాలని పక్షమున ఆమె
రెండు తెల్ల గువ్వలనైనను రెండు పావురపు పిల్లల
నైనను దహనబలిగా ఒకదానిని పాపపరిహారార్థ
బలిగా ఒకదానిని తీసికొని రావలెను. యాజకుడు
ఆమె నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయగా ఆమెకు
పవిత్రత కలుగును.

**13** మరియు యెహోవా మోషే అహరోనులకు
2 ఈలాగు సెలవిచ్చెను । — ఒకని దేహచర్మమందు
వాపుగాని పక్కుగాని నిగనిగలాడు మచ్చగాని
యుండి వాని దేహచర్మమందు కుష్ఠుపొడవంటిది కన
బడినయెడల యాజకుడైన అహరోను నొద్దకైనను
యాజకులైన అతని కుమారులలో ఒకనియొద్దకైనను
వాని తీసికొని రావలెను. । ఆ యాజకుడు వాని దేహ 3
చర్మమందున్న ఆ పొడను చూడగా ఆ పొడయందలి
వెండ్రుకలు తెల్లబారినయెడలను, ఆ పొడ అతని
దేహచర్మముకంటె పల్లముగా కనబడినయెడలను అది
కుష్ఠుపొడ. యాజకుడు వాని చూచి అపవిత్రుడని
నిర్ణయింపవలెను. । నిగనిగలాడు మచ్చ చర్మముకంటె 4
పల్లముకాక వాని దేహచర్మమందు తెల్లగా కనబడిన
యెడలను, దాని వెండ్రుకలు తెల్లబారకున్నయెడలను
ఆ యాజకుడు ఏడు దినములు ఆ పొడగలవానిని
కడగా ఉంచవలెను. । ఏడవనాడు యాజకుడు వానిని 5
చూడవలెను. ఆ పొడ చర్మమందు వ్యాపింపక అట్లే
ఉండినయెడల, యాజకుడు మరి యేడు దినములు వాని
కడగా ఉంచవలెను. । ఏడవనాడు యాజకుడు రెండ 6
వసారి వాని చూడవలెను. అప్పుడు ఆ పొడ చర్మ
మందు వ్యాపింపక అదే తీరున ఉండినయెడల యాజ
కుడు వానిని పవిత్రుడని నిర్ణయింపవలెను; అది
పక్కే; వాడు తన బట్టలు ఉదుకుకొని పవిత్రుడ
గును. । అయితే వాడు తన శుద్ధివిషయము యాజ 7
కునికి కనబడిన తరువాత ఆ పక్కు చర్మమందు విస్తార
ముగా వ్యాపించిన పక్షమున వాడు రెండవసారి
యాజకునికి కనబడవలెను. । అప్పుడు ఆ పక్కు చర్మ 8
మందు వ్యాపించిన పక్షమున యాజకుడు వాడు అప
విత్రుడని నిర్ణయింపవలెను.
కుష్ఠుపొడ యొకనికి కలిగినయెడల యాజకుని 9
యొద్దకు వాని తీసికొని రావలెను. । యాజకుడు వాని 10
చూడగా తెల్లని వాపు చర్మమందు కనబడినయెడలను,
అది వెండ్రుకలను తెల్లబారినయెడలను, వాపులో
పచ్చిమాంసము కనబడినయెడలను, । అది వాని దేహ 11
చర్మమందు పాతదైన కుష్ఠము గనుక యాజకుడు వాడు
అపవిత్రుడని నిర్ణయింపవలెను, వానిని కడగా ఉంచ
కూడదు; వాడు అపవిత్రుడు. । కుష్ఠము చర్మమందు 12
విస్తారముగా పుట్టినప్పుడు యాజకుడు చూచినంత
వరకు ఆ పొడగలవాని తలమొదలుకొని పాదముల
వరకు కుష్ఠము వాని చర్మమంతయు వ్యాపించి యుండిన
యెడల । యాజకుడు వానిని చూడవలెను; ఆ కుష్ఠము 13
వాని దేహమంతట వ్యాపించినయెడల ఆ పొడగలవాడు
పవిత్రుడని నిర్ణయింపవలెను. వాని ఒళ్లంతయు తెల్ల
బారెను; వాడు పవిత్రుడు. । అయితే వాని యొంట 14
పచ్చిమాంసము కనబడు దినమున వాడు అపవిత్రుడు. ।
యాజకుడు ఆ పచ్చిమాంసమును చూచి వాడు అప 15
విత్రుడని నిర్ణయింపవలెను. ఆ పచ్చిమాంసము అప
విత్రమే; అది కుష్ఠము. । అయితే ఆ పచ్చిమాంసము 16
ఆరి తెల్లబారినయెడల వాడు యాజకునియొద్దకు రావ
లెను; । యాజకుడు వాని చూడగా ఆ పొడ తెల్ల 17

మారినయెడల యాజకుడు ఆ పొడ పవిత్రమని నిర్ణ
యింపవలెను; వాడు పవిత్రుడు.
18 ఒకని దేహచర్మమందు పుండు పుట్టి మానిన తరు
19 వాత । ఆ పుండుండినచోటను తెల్లని వాపైనను తెలు
పుతో కూడిన యెరుపురంగుగల పొడగాని నిగనిగ
లాడు తెల్లని పొడగాని పుట్టినయెడల, యాజకునికి
20 దాని కనుపరచవలెను. । యాజకుడు దాని చూచి
నప్పుడు అది చూపునకు అది చర్మముకంటె పల్ల
ముగా కనబడినయెడలను, దాని వెండ్రుకలు తెల్లబారి
యుండినయెడలను, యాజకుడు వాడు అపవిత్రుడని
నిర్ణయింపవలెను; అది ఆ పుంటివలన పుట్టిన కుష్ఠు
21 పొడ. । యాజకుడు దాని చూచినప్పుడు దానిలో
తెల్లని వెండ్రుకలు లేకపోయినయెడలను, అది చర్మ
ముకంటె పల్లముకాక కొంచెము నయముగా కనబడిన
యెడలను, యాజకుడు ఏడు దినములు వానిని ప్రత్యే
22 కముగా ఉంచవలెను. । అది చర్మమందు విస్తారముగా
వ్యాపించినయెడల యాజకుడు వాడు అపవిత్రుడని
23 నిర్ణయింపవలెను; అది కుష్ఠుపొడ. । నిగనిగలాడు పొడ
వ్యాపింపక అక్కడే ఉండినయెడల అది దద్దురు; యాజ
కుడు వాడు పవిత్రుడని నిర్ణయింపవలెను.
24 దద్దురు కలిగిన దేహచర్మమందు ఆ వాత యెఱ్ఱె
ఱ్ఱగానేగాని తెల్లగానేగాని నిగనిగలాడు తెల్లని
25 మచ్చగానేగాని యుండినయెడల । యాజకుడు దాని
చూడవలెను. నిగనిగలాడు ఆ మచ్చలోని వెండ్రు
కలు తెల్లబారినయెడలను, అది చర్మముకంటె పల్ల
ముగా కనబడినయెడలను, అది ఆ వాతవలన పుట్టిన
కుష్ఠుపొడ; యాజకుడు వాడు అపవిత్రుడని నిర్ణ
26 యింపవలెను; అది కుష్ఠము. । యాజకుడు దాని
చూచునప్పుడు అది నిగనిగలాడు మచ్చలో తెల్లని
వెండ్రుకలు లేకయేగాని చర్మముకంటె పల్లముగా
నుండకయేగాని కొంత నయముగా కనబడినపక్షమున,
యాజకుడు ఏడు దినములు వానిని కడగా ఉంచ
27 వలెను. । ఏడవనాడు యాజకుడు వాని చూచినప్పుడు
అది చర్మమందు విస్తారముగా వ్యాపించినయెడల
వాడు అపవిత్రుడని నిర్ణయింపవలెను; అది కుష్ఠమే. ।
28 అయితే నిగనిగలాడు మచ్చ చర్మమందు వ్యాపింపక
ఆ చోటనేయుండి కొంచెము నయముగా కనబడిన
పక్షమున అది వాత వాపే; వాడు పవిత్రుడని యా
జకుడు నిర్ణయింపవలెను; అది వాత మంటయే.
29 పురుషునికైనను స్త్రీకైనను తలయందేమి గడ్డమం
దేమి పొడ పుట్టినయెడల, యాజకుడు ఆ పొడను
30 చూడగా । అది చర్మముకంటె పల్లముగాను సన్నమైన
పచ్చవెండ్రుకలు కలదిగాను కనబడినయెడల, వాడు
అపవిత్రుడని యాజకుడు నిర్ణయింపవలెను; అది బొబ్బ
తలమీదనేమి గడ్డముమీదనేమి పుట్టిన కుష్ఠము. ।
31 యాజకుడు ఆ బొబ్బయిన పొడను చూచినప్పుడు అది
చర్మముకంటె పల్లముకానియెడలను, దానిలో నల్ల
వెండ్రుకలు లేనియెడలను, యాజకుడు ఆ బొబ్బయిన
పొడగలవానిని ఏడు దినములు ప్రత్యేకముగా ఉంచ
వలెను. । ఏడవనాడు యాజకుడు ఆ పొడను చూడ 32
వలెను. ఆ బొబ్బ వ్యాపింపక యుండినయెడలను,
దానిలో పచ్చవెండ్రుకలు లేనియెడలను, చర్మముకంటె
పల్లముకానియెడలను, । వాడు క్షౌరము చేసికొనవలెను 33
గాని ఆ బొబ్బ క్షౌరము చేయకూడదు. యాజకుడు
బొబ్బగలవానిని మరి యేడు దినములు ప్రత్యేకముగా
ఉంచవలెను. । ఏడవనాడు యాజకుడు ఆ బొబ్బను 34
చూడగా అది చర్మమందు బొబ్బ వ్యాపింపక చర్మము
కంటె పల్లముకాక యుండినపక్షమున, యాజకుడు
వాడు పవిత్రుడని నిర్ణయింపవలెను. వాడు తన బట్టలు
ఉదుకుకొని పవిత్రుడగును. । వాడు పవిత్రుడని నిర్ణ 35
యించిన తరువాత బొబ్బ విస్తారముగా వ్యాపించిన
యెడల । యాజకుడు వాని చూడవలెను. అప్పుడు ఆ 36
మాద వ్యాపించియుండినయెడల యాజకుడు పచ్చవెం
డ్రుకలను వెదకనక్కరలేదు; వాడు అపవిత్రుడు. ।
అయితే నిలిచిన ఆ మాదలో నల్లవెండ్రుకలు పుట్టిన 37
పక్షమందు ఆ మాద బాగుపడెను; వాడు పవిత్రుడు;
యాజకుడు వాడు పవిత్రుడని నిర్ణయింపవలెను.
మరియు పురుషుని దేహపుచర్మమందేమి స్త్రీ దేహపు 38
చర్మమందేమి నిగనిగలాడు మచ్చలు, అనగా నిగనిగ
లాడు తెల్లనిమచ్చలు పుట్టినయెడల । యాజకుడు వా 39
నిని చూడవలెను; వారి దేహచర్మమందు నిగనిగలాడు
మచ్చలు వాడియుండినయెడల అది చర్మమందు పుట్టిన
యొక పొక్కు; వాడు పవిత్రుడు.
తలవెండ్రుకలు రాలినవాడు బట్టతలవాడు; అయి 40
నను వాడు పవిత్రుడు. । ముఖమువైపున తలవెండ్రు 41
కలు రాలినవాడు బట్టనొసటివాడు; వాడు పవిత్రు
డు. । అయినను బట్టతలయందేగాని బట్టనొసటియం 42
దేగాని యెఱ్ఱెఱ్ఱగానుండు తెల్లని పొడ పుట్టినయెడల,
అది వాని బట్టతలయందైనను బట్టనొసటియందైనను
పుట్టిన కుష్ఠము. । యాజకుడు వాని చూడవలెను. 43
కుష్ఠము దేహచర్మమందు కనబడునట్లు ఆ పొడ వాపు
చూపునకు వాని బట్టతలయందైనను వాని బట్టనొసటి
యందైనను ఎఱ్ఱెఱ్ఱగానుండు తెల్లని పొడయైనయె
డల । వాడు కుష్ఠరోగి; వాడు అపవిత్రుడు; యాజ 44
కుడు వాడు బొత్తిగా అపవిత్రుడని నిర్ణయింపవలెను;
వాని కుష్ఠము వాని తలలోనున్నది.
ఆ పొడగల కుష్ఠరోగి వస్త్రములను చింపివేయ 45
వలెను; వాడు తల విరియబోసికొనవలెను; వాడు తన
పైపెదవిని కప్పుకొని—అపవిత్రుడను అపవిత్రుడను
అని బిగ్గరగా పలుకవలెను. । ఆ పొడ వానికి కలిగిన 46
దినములన్నియు వాడు అపవిత్రుడై యుండును;
వాడు అపవిత్రుడు గనుక ప్రత్యేకముగానే నివసింప

వలెను; వాని నివాసము పాళెమునకు వెలపట ఉండ
వలెను.
47 మరియు కుష్ఠుపొడ వస్త్రమందు కనబడునప్పుడు అది
గొఱ్ఱెవెండ్రుకల బట్టయందేమి నారబట్టయందేమి।
48 నారతోనేగాని! వెండ్రుకలతోనేగాని నేసిన పడుగు
నందేమి పేకయందేమి తోలునందేమి తోలుతోచేయ
49 బడు ఏయొక వస్తువునందేమి పుట్టి। ఆ పొడ ఆ బట్ట
యందేమి ఆ తోలునందేమి ఆ పేకయందేమి తోలుతో
చేయబడిన వస్తువునందేమి పచ్చదాళుగానేగాని యెఱ్ఱ
దాళుగానేగాని కనబడినయెడల, అది కుష్ఠుపొడ;
50 యాజకునికి దాని కనుపరచవలెను.। యాజకుడు ఆ
పొడను చూచి పొడగలవాటిని ఏడు దినములు ప్రత్యే
51 కముగా ఉంచవలెను.। ఏడవనాడు అతడు ఆ పొడను
చూడవలెను. అప్పుడు ఆ వస్త్రమందు, అనగా పడుగు
నందేగాని పేకయందేగాని తోలునందేగాని తోలుతో
చేసిన వస్తువునందేగాని ఆ పొడ వ్యాపించినయెడల
52 అది కొఱుకుడు కుష్ఠము; అది అపవిత్రము.। కావున
అతడు ఆ పొడ దేనిలో ఉన్నదో ఆ వస్త్రమును నార
తోనేమి వెండ్రుకలతోనేమి చేసిన పడుగును పేకను
తోలుతో చేసిన ప్రతి వస్తువును అగ్నితో కాల్చి
వేయవలెను; అది కొఱుకుడు కుష్ఠము; అగ్నితో దాని
53 కాల్చివేయవలెను.। అయితే యాజకుడు చూచినప్పుడు
ఆ పొడ ఆ వస్త్రమందు, అనగా పడుగునందేమి పేక
యందేమి తోలుతో చేసిన మరి దేనియందేమి వ్యా
54 పింపకపోయినయెడల। యాజకుడు ఆ పొడగలదా
నిని ఉదుక నాజ్ఞాపించి మరి ఏడు దినములు దానిని
55 విడిగా ఉంచవలెను.। ఆ పొడగలదానిని ఉదికిన తరు
వాత యాజకుడు దాని చూడవలెను. ఆ పొడ మారక
పోయినను వ్యాపింపకపోయినను అది అపవిత్రము.
అగ్నితో దానిని కాల్చివేయవలెను. అది లోవైపున
గాని పైవైపునగాని పుట్టినను కొఱుకుడు కుష్ఠముగా
56 ఉండును.। యాజకుడు దానిని చూచినప్పుడు వస్త్రము
ఉదికిన తరువాత ఆ పొడ వాడియుండినయెడల, అది
ఆ వస్త్రములో ఉండినను తోలులో ఉండినను పడుగులో
ఉండినను పేకలో ఉండినను యాజకుడు వాటిని చింపి
57 వేయవలెను.। అటుతరువాత అది ఆ వస్త్రమందేగాని
పడుగునందేగాని పేకయందేగాని తోలుతోచేసిన
దేనియందేగాని కనబడినయెడల అది కొఱుకుడు
కుష్ఠము. ఆ పొడ దేనిలోనున్నదో దానిని అగ్నితో
58 కాల్చివేయవలెను.। ఏ వస్త్రమునేగాని పడుగునేగాని
పేకనేగాని తోలుతో చేసిన దేనినేగాని ఉదికినతరు
వాత ఆ పొడ వదిలిన పక్షమందు, రెండవమారు దానిని
59 ఉదుకవలెను; అప్పుడు అది పవిత్రమగును.। బొచ్చు
బట్టయందేగాని నారబట్టయందేగాని పడుగునందేగాని
పేకయందేగాని తోలు వస్తువులయందేగాని యుండు
కుష్ఠుపొడనుగూర్చి అది పవిత్రమని అపవిత్రమని నీవు
నిర్ణయింపవలసిన విధి యిదే.

**మ**రియు యెహోవా మోషేకు ఈలాగు సెల **14**
విచ్చెను।—కుష్ఠరోగి పవిత్రుడని నిర్ణయించిన దిన 2
మున వానిగూర్చిన విధి యేదనగా, యాజకునియొద్దకు
వానిని తీసికొని రావలెను.। యాజకుడు పాళెము 3
వెలపలికి పోవలెను. యాజకుడు వానిని చూచినప్పుడు
కుష్ఠుపొడ బాగుపడి కుష్ఠరోగిని విడిచినయెడల।
యాజకుడు పవిత్రత పొందగోరువానికొఱకు సజీవ 4
మైన రెండు పవిత్ర పక్షులను దేవదారు కఱ్ఱను రక్త
వర్ణముగల నూలును హిస్సోపును తెమ్మని ఆజ్ఞాపింప
వలెను.। అప్పుడు యాజకుడు పారు నీటిపైని మంటి 5
పాత్రలో ఆ పక్షులలో ఒకదానిని చంప నాజ్ఞా
పించి। సజీవమైన పక్షిని ఆ దేవదారు కఱ్ఱను రక్త 6
వర్ణముగల నూలును హిస్సోపును తీసికొని పారు నీటి
పైని చంపిన పక్షిరక్తములో వాటిని సజీవమైన పక్షిని
ముంచి। కుష్ఠువిషయములో పవిత్రత పొందగోరు 7
వానిమీద ఏడుమారులు ప్రోక్షించి వాడు పవిత్రు
డని నిర్ణయించి సజీవమైన పక్షి ఎగిరిపోవునట్లు దానిని
వదిలివేయవలెను.। అప్పుడు పవిత్రత పొందగోరు 8
వాడు తన బట్టలు ఉదుకుకొని తన రోమమంతటిని
క్షౌరము చేసికొని నీళ్లతో స్నానముచేసి పవిత్రు
డగును. తరువాత వాడు పాళెములోనికి వచ్చి తన
గుడారము వెలపట ఏడు దినములు నివసింపవలెను.।
ఏడవనాడు తన రోమమంతటిని తన తలను తన గడ్డ 9
మును తన కనుబొమలను క్షౌరము చేసికొనవలెను.
తన రోమమంతటిని క్షౌరము చేసికొని బట్టలు ఉదుకు
కొని యొడలు నీళ్లతో కడుగుకొని పవిత్రుడగును.।
ఎనిమిదవనాడు వాడు నిర్దోషమైన రెండు మగ గొఱ్ఱె 10
పిల్లలను నిర్దోషమైన యేడాది ఆడు గొఱ్ఱెపిల్లను,
నైవేద్యమునకై నూనె కలిసిన మూడు పదియవవంతుల
గోధుమపిండిని ఒక అర్ధసేరు నూనెను తీసికొని
రావలెను.। పవిత్రపరచు యాజకుడు పవిత్రత పొంద 11
గోరు మనుష్యుని వాటితో ప్రత్యక్షపు గుడారము
యొక్క ద్వారమున యెహోవా సన్నిధికి తీసికొని
రావలెను.। అప్పుడు యాజకుడు ఒక మగ గొఱ్ఱె 12
పిల్లను అర్ధసేరు నూనెను తీసికొని అపరాధపరిహారార్థ
బలిగా వాటిని దగ్గరకు తెచ్చి అల్లాడింపబడు అర్పణ
ముగా యెహోవా సన్నిధిని వాటిని అల్లాడింప
వలెను.। అతడు పాపపరిహారార్థబలిపశువును దహన 13
బలిపశువును వధించు పరిశుద్ధస్థలములో ఆ గొఱ్ఱెపిల్లను
వధింపవలెను. పాపపరిహారార్థమైనదానివలె అప
రాధపరిహారార్థమైనదియు యాజకునిదగును; అది
అతిపరిశుద్ధము.। అప్పుడు యాజకుడు అపరాధపరి 14
హారార్థమైనదానిరక్తములో కొంచెము తీసి పవిత్రత
పొందగోరువాని కుడిచెవి కొనమీదను, వాని కుడి

చేతి బొటనవ్రేలిమీదను, వాని కుడికాలి బొటన
15 వ్రేలిమీదను దాని చమరవలెను. । మరియు యాజ
కుడు అర్ధసేరు నూనెలో కొంచెము తీసి తన యెడమ
16 అరచేతిలో పోసికొనవలెను. । అప్పుడు యాజకుడు
తన యెడమ అరచేతిలోనున్న నూనెలో తన కుడి
చేతివ్రేలు ముంచి యెహోవా సన్నిధిని ఏడుమా
రులు తన వ్రేలితో ఆ నూనెలో కొంచెము ప్రోక్షిం
17 పవలెను. । యాజకుడు తన అరచేతిలోనున్న కొదువ
నూనెలో కొంచెము తీసికొని పవిత్రత పొందగోరు
వాని కుడిచెవి కొనమీదను, వాని కుడిచేతి బొటన
వ్రేలిమీదను, వాని కుడికాలి బొటనవ్రేలిమీదను
ఉన్న అపరాధపరిహారార్థబలిపశువుయొక్క రక్తము
18 మీద చమరవలెను. । అప్పుడు యాజకుడు తన అర
చేతిలోనున్న కొదువ నూనెను పవిత్రత పొందగోరు
వాని తలమీద చమరవలెను. అట్లు యాజకుడు
యెహోవా సన్నిధిని వాని నిమిత్తము ప్రాయశ్చి
19 త్తము చేయవలెను. । అప్పుడు యాజకుడు పాపపరిహా
రార్థ బలి అర్పించి అపవిత్రత పోగొట్టుకొని పవిత్రత
పొందగోరువాని నిమిత్తము ప్రాయశ్చిత్తము చేసిన
తరువాత వాడు దహనబలిపశువును వధింపవలెను. ।
20 యాజకుడు దహనబలి ద్రవ్యమును నైవేద్యమును బలి
పీఠముమీద అర్పింపవలెను. అట్లు యాజకుడు వాని
నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయగా వాడు పవిత్రు
డగును.

21 వాడు బీదవాడై పైచెప్పినదంతయు తేజాలని పక్ష
మున తన నిమిత్తము ప్రాయశ్చిత్తము కలుగుటకై వాడు
అల్లాడించుటకు అపరాధపరిహారార్థబలిగా ఒక గొఱ్ఱె
పిల్లను నైవేద్యముగా తూములో పదియవవంతు నూ
నెతో కలిసిన గోధుమపిండిని ఒక అర్ధసేరు నూనెను ।
22 వానికి దొరకగల రెండు తెల్ల గువ్వలనేగాని రెండు
పావురపు పిల్లలనేగాని, అనగా పాపపరిహారార్థబలిగా
ఒకదానిని దహనబలిగా ఒకదానిని తీసికొని రావలె
23 ను. । వాడు పవిత్రత పొంది ఆచారచర్యయొక్క
యెనిమిదవనాడు యెహోవా సన్నిధికి ప్రత్యక్షపు
గుడారముయొక్క ద్వారమునకు యాజకునియొద్దకు
24 వాటిని తీసికొని రావలెను. । యాజకుడు అపరాధ
పరిహారార్థబలియగు గొఱ్ఱెపిల్లను అర్ధసేరు నూనెను
తీసికొని అల్లాడించు అర్పణముగా యెహోవా సన్ని
25 ధిని వాటిని అల్లాడింపవలెను. । అప్పుడతడు అపరాధ
పరిహారార్థబలియగు గొఱ్ఱెపిల్లను వధింపవలెను. యా
జకుడు ఆ అపరాధపరిహారార్థబలిపశువుయొక్క రక్త
ములో కొంచెము తీసికొని, పవిత్రత పొందగోరు
వాని కుడిచెవి కొనమీదను, వాని కుడిచేతి బొటన
వ్రేలిమీదను, వాని కుడికాలి బొటనవ్రేలిమీదను
26 దానిని చమరవలెను. । మరియు యాజకుడు ఆ నూ
నెలో కొంచెము తన యెడమ అరచేతిలో పోసికొని, ।
తన యెడమచేతిలోనున్న ఆ నూనెలో కొంచెము 27
తన కుడివ్రేలితో యెహోవా సన్నిధిని ఏడుమారులు
ప్రోక్షింపవలెను. । మరియు యాజకుడు తన అర 28
చేతిలోనున్న నూనెలో కొంచెము పవిత్రత పొంద
గోరువాని కుడిచెవి కొనమీదను, వాని కుడిచేతి
బొటనవ్రేలిమీదను, వాని కుడికాలి బొటనవ్రేలిమీ
దను ఆ అపరాధపరిహారార్థబలిపశువుయొక్క రక్త
మున్నచోటను వేయవలెను. । యాజకుని అరచేతిలో 29
నున్న కొదువ నూనెను అతడు పవిత్రత పొందగోరు
వానికి యెహోవా సన్నిధిని ప్రాయశ్చిత్తము కలుగ
జేయుటకు వాని తలమీద పోయవలెను. । అప్పుడు 30
వానికి దొరకగల ఆ తెల్లగువ్వలలోనేగాని పావురపు
పిల్లలలోనేగాని ఒకదాని నర్పింపవలెను. । తన నైవే 31
ద్యముగాక వాటిలో తనకు దొరకగల పాపపరిహా
రార్థబలిగా ఒకదానిని దహనబలిగా ఒకదానిని అర్పిం
పవలెను. అట్లు యాజకుడు పవిత్రత పొందగోరు
వాని నిమిత్తము యెహోవా సన్నిధిని ప్రాయశ్చి
త్తము చేయవలెను. । కుష్ఠుపొడ కలిగినవాడు పవిత్రత 32
పొందతగినవాటిని సంపాదింపలేనియెడల వాని విష
యమైన విధి యిదే.

మరియు యెహోవా మోషే అహరోనులకు 33
ఈలాగు సెలవిచ్చెను । —నేను స్వాస్థ్యముగా మీ 34
కిచ్చుచున్న దేశమునకు మీరు వచ్చినతరువాత, మీ
స్వాస్థ్యమైన దేశములోని యే యింటనైనను నేను
కుష్ఠుపొడ కలుగజేసినయెడల । ఆ యింటి యజమా 35
నుడు యాజకునియొద్దకు వచ్చి—నా యింటిలో కుష్ఠు
పొడవంటిది నాకు కనబడెనని అతనికి తెలియచెప్ప
వలెను. । అప్పుడు ఆ యింట నున్నది యావత్తును 36
అపవిత్రము కాకుండునట్లు, యాజకుడు ఆ కుష్ఠుపొ
డను చూచుటకు రాకమునుపు అతడు ఆ యిల్లు వట్టి
దిగాచేయ నాజ్ఞాపింపవలెను. ఆ తరువాత యాజకుడు
ఆ యిల్లు చూచుటకై లోపలికి వెళ్లవలెను. । అతడు 37
ఆ పొడను చూచినప్పుడు ఆ యింటి గోడలలో పచ్చ
డాలుగానైనను ఎఱ్ఱడాలుగానైన ఉండు పల్లములు
గలదై గోడకంటె పల్లముగా ఉండినయెడల । యాజ 38
కుడు ఆ యింటనుండి యింటివాకిటికి బయలువెళ్లి ఆ
యిల్లు ఏడు దినములు మూసియుంచవలెను. । ఏడవ 39
నాడు యాజకుడు తిరిగి వచ్చి దానిని చూడవలెను.
అప్పుడు ఆ పొడ యింటి గోడలయందు వ్యాపించిన
దైనయెడల । యాజకుని సెలవుచొప్పున ఆ పొడ 40
గల రాళ్లను ఊడదీసి ఊరివెలపటనున్న అపవిత్రస్థల
మున పారవేయవలెను. । అప్పు డతడు ఆ యింటి 41
లోపటను చుట్టు గోడలను గీయింపవలెను. వారు
గీసిన పెల్లలను ఊరివెలపటనున్న అపవిత్రస్థలమున
పారబోసి । వేరురాళ్లను తీసికొని ఆ రాళ్లకు ప్రతిగా 42
చేర్పవలెను. అతడు వేరు అడుసును తెప్పించి ఆ

43 యింటికిగోడకు పూయింపవలెను. । అతడు ఆ రాళ్లను
ఊడదీయించి యిల్లు గీయించి దానికి అడుసును పూ
యించిన తరువాత ఆ పొడ తిరిగి ఆ యింట బయలు
44 పడినయెడల । యాజకుడు వచ్చి దాని చూడవలెను.
అప్పుడు ఆ పొడ ఆ యింట వ్యాపించినయెడల అది
ఆ యింటిలో కొరుకుడు కుష్ఠము; అది అపవిత్రము. ।
45 కాబట్టి అతడు ఆ యింటిని దాని రాళ్లను కఱ్ఱలను
సున్నమంతటిని పడగొట్టించి ఊరివెలపటనున్న అప
విత్రస్థలమునకు వాటిని మోయించి పారబోయింప
46 వలెను. । మరియు ఆ యిల్లు పాడువిడిచిన దినము
లన్నియు దానిలో ప్రవేశించువాడు సాయంకాలము
47 వరకు అపవిత్రుడగును. । ఆ యింట పండుకొనువాడు
తన బట్టలు ఉదుకుకొనవలెను. ఆ యింట భోజనము
48 చేయువాడు తన బట్టలు ఉదుకుకొనవలెను. । యాజ
కుడు వచ్చి లోపల ప్రవేశించి చూచునప్పుడు ఆ
యింటికి అడుసు వేసిన తరువాత ఆ పొడ యింటిలో
వ్యాపింపకపోయినయెడల, పొడ బాగుపడెను గనుక
ఆ యిల్లు పవిత్రమని యాజకుడు నిర్ణయింపవలెను. ।
49 ఆ యింటికొరకు పాపపరిహారార్థబలి అర్పించుటకు
అతడు రెండు పక్షులను దేవదారు కఱ్ఱను రక్తవర్ణపు
50 నూలును హిస్సోపును తీసికొని । పారు నీటిపైని మంటి
51 పాత్రలో ఆ పక్షులలో ఒకదానిని వధించి । ఆ దేవ
దారు కఱ్ఱను హిస్సోపును రక్తవర్ణపు నూలును సజీవ
మైన పక్షిని తీసికొని వధింపబడిన పక్షి రక్తములోను
పారు నీటిలో వాటిని ముంచి ఆ యింటిమీద ఏడు
52 మారులు ప్రోక్షింపవలెను. । అట్లు ఆ పక్షి రక్తము
తోను ఆ పారు నీటితోను సజీవమైన పక్షితోను దేవ
దారు కఱ్ఱతోను హిస్సోపుతోను రక్తవర్ణపు నూలు
తోను ఆ యింటి విషయములో పాపపరిహారార్థబలి
53 అర్పింపవలెను. । అప్పుడు సజీవమైన పక్షిని ఊరి వెల
పల నెగర విడువవలెను. అట్లు అతడు ఆ యింటికి
ప్రాయశ్చిత్తము చేయగా అది పవిత్రమగును.
54 ప్రతివిధమైన కుష్ఠుపొడనుగూర్చియు, బొబ్బను
55 గూర్చియు । వస్త్రకుష్ఠమునుగూర్చియు, వస్త్రమునకైనను
56 ఇంటికైనను కలుగు కుష్ఠమునుగూర్చియు, । వాపును
గూర్చియు, పక్కునుగూర్చియు, నిగనిగలాడు మచ్చ
57 నుగూర్చియు, । ఒకడు ఎప్పుడు అపవిత్రుడగునో,
యెప్పుడు పవిత్రుడగునో తెలియజేయుటకు ఇది
కుష్ఠమును గూర్చిన విధి.

**15** మరియు యెహోవా మోషే అహరోనులకు
2 ఈలాగు సెలవిచ్చెను । —మీరు ఇశ్రాయేలీయులతో
ఇట్లనుడి—ఒకని దేహమందు స్రావమున్నయెడల ఆ
3 స్రావమువలన వాడు అపవిత్రుడగును. । వాని స్రా
వము కారినను కారకపోయినను ఆ దేహస్థితినిబట్టి
వాడు అపవిత్రుడగును. ఆ స్రావముగలవాడు పండు
4 కొను ప్రతి పరుపు అపవిత్రము; । వాడు కూర్చుండు
ప్రతి వస్తువు అపవిత్రము; । వాని పరుపును ముట్టు 5
వాడు తన బట్టలు ఉదుకుకొని నీళ్లతో స్నానము
చేసి సాయంకాలమువరకు అపవిత్రుడై యుండు
ను. । అట్టివాడు దేనిమీద కూర్చుండునో దానిమీద 6
కూర్చుండువాడు తన బట్టలు ఉదుకుకొని నీళ్లతో
స్నానముచేసి సాయంకాలమువరకు అపవిత్రుడై
యుండును. । స్రావముగలవాని దేహమును ముట్టు 7
వాడు తన బట్టలు ఉదుకుకొని నీళ్లతో స్నానముచేసి
సాయంకాలమువరకు అపవిత్రుడై యుండును. ।
స్రావముగలవాడు పవిత్రునిమీద ఉమ్మివేసినయెడల 8
వాడు తన బట్టలు ఉదుకుకొని నీళ్లతో స్నానముచేసి
సాయంకాలమువరకు అపవిత్రుడై యుండును. ।
స్రావముగలవాడు కూర్చుండు ప్రతి పల్లము అప 9
విత్రము. । వాని క్రిందనుండిన యే వస్తువునైనను 10
ముట్టు ప్రతివాడు సాయంకాలమువరకు అపవిత్రుడై
యుండును. వాటిని మోయువాడు తన బట్టలు
ఉదుకుకొని నీళ్లతో స్నానముచేసి సాయంకాలము
వరకు అపవిత్రుడై యుండును. । స్రావముగలవాడు 11
నీళ్లతో చేతులు కడుగుకొనకయే ఎవని ముట్టునో
వాడు తన బట్టలు ఉదుకుకొని స్నానముచేసి సాయం
కాలమువరకు అపవిత్రుడై యుండును. । స్రావము 12
గలవాడు ముట్టుకొనిన మంటి పాత్రను పగలగొట్ట
వలెను, ప్రతి దారుపాత్రను నీళ్లతో తొలవవలెను. ।
స్రావముగలవాడు తన స్రావమునుండి పవిత్రత 13
పొందునప్పుడు, తన పవిత్రత విషయమై యేడు దిన
ములు లెక్కించుకొని తన బట్టలు ఉదుకుకొని పారు
నీటితో ఒడలును కడుగుకొని పవిత్రుడగును. । ఎని 14
మిదవనాడు రెండు తెల్ల గువ్వలనైనను రెండు పావు
రపు పిల్లలనైనను తీసికొని ప్రత్యక్షపు గుడారము
యొక్క ద్వారమునొద్దకు వచ్చి యెహోవా సన్నిధిని
వాటిని యాజకుని కప్పగింపవలెను. । యాజకుడు 15
వాటిలో ఒకదానిని పాపపరిహారార్థబలిగాను ఒక
దానిని దహనబలిగాను అర్పింపవలెను. అట్లు యాజ
కుడు వాని స్రావము విషయములో యెహోవా
సన్నిధిని వాని నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయవలెను.
ఒకనికి వీర్యస్ఖలనమైనయెడల వాడు సర్వాంగ 16
స్నానము చేసికొని సాయంకాలమువరకు అపవిత్రుడై
యుండును. । ఏ బట్టమీదను ఏ తోలుమీదను వీర్య 17
స్ఖలనమగునో ఆ బట్టయు ఆ తోలును నీళ్లతో ఉదుక
బడి సాయంకాలమువరకు అపవిత్రమై యుండును. ।
వీర్యస్ఖలనమగునట్లు స్త్రీ పురుషులు శయనించినయెడల 18
వారిద్దరు నీళ్లతో స్నానముచేసి సాయంకాలమువరకు
అపవిత్రులై యుండురు.
స్త్రీ దేహమందుండు స్రావము రక్తస్రావమైనయె 19
డల ఆమె యేడు దినములు కడగా ఉండవలెను.
ఆమెను ముట్టువారందరు సాయంకాలమువరకు అప

20 విత్రులగుదురు. । ఆమె కడగా ఉన్నప్పుడు ఆమె
దేనిమీద పండుకొనునో అది అపవిత్రమగును; ఆమె
21 దేనిమీద కూర్చుండునో అది అపవిత్రమగును. । ఆమె
పడకను ముట్టు ప్రతివాడు తన బట్టలు ఉదుకుకొని
నీళ్లతో స్నానముచేసి సాయంకాలమువరకు అప
22 విత్రుడై యుండును. । ఆమె దేనిమీద కూర్చుండునో
దాని ముట్టు ప్రతివాడు తన బట్టలు ఉదుకుకొని
నీళ్లతో స్నానముచేసి సాయంకాలమువరకు అప
23 విత్రుడై యుండును. । అది ఆమె పరుపుమీదనైనను
ఆమె కూర్చుండిన దానిమీదనైనను ఉండినయెడల
దానిని ముట్టువాడు సాయంకాలమువరకు అపవిత్రుడై
24 యుండును. । ఒకడు ఆమెతో శయనించుచుండగా
ఆమె రజస్సు వానికి తగిలినయెడల, వాడు ఏడు దిన
ములు అపవిత్రుడగును; వాడు పండుకొను ప్రతి
మంచము అపవిత్రము.

25 ఒక స్త్రీ కడగా ఉండుకాలమునకు ముందుగా
ఆమె రక్తస్రావము ఇంక అనేకదినములు స్రవించి
నను, ఆమె కడగానుండు కాలమైన తరువాత స్రవిం
చినను, ఆమె అపవిత్రత ఆమె కడగానుండు దినముల
లోవలెనే ఆ స్రావదినములన్నియు ఉండును, ఆమె
26 అపవిత్రురాలు. । ఆమె స్రావదినములన్నియు ఆమె
పండుకొను ప్రతి మంచము ఆమె కడగానున్నప్పటి
మంచమువలె ఉండవలెను. ఆమె దేనిమీద కూర్చుం
డునో అది ఆమె కడగా ఉన్నప్పటి అపవిత్రతవలె
27 అపవిత్రమగును. । వాటిని ముట్టు ప్రతివాడు అప
విత్రుడు. వాడు తన బట్టలు ఉదుకుకొని నీళ్లతో
స్నానముచేసి సాయంకాలమువరకు అపవిత్రుడైయుం
28 డును. । ఆమె ఆ స్రావము కుదిరి పవిత్రురాలైన
యెడల ఆమె యేడుదినములు లెక్కించుకొని అవి
29 తీరిన తరువాత పవిత్రురాలగును. । ఎనిమిదవనాడు
ఆమె రెండు తెల్ల గువ్వలనైనను రెండు పావురపు
పిల్లలనైనను ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారము
30 నకు యాజకునియొద్దకు తేవలెను. । యాజకుడు ఒక
దానిని పాపపరిహారార్థబలిగాను ఒకదానిని దహన
బలిగాను అర్పింపవలెను. అట్లు యాజకుడు ఆమె
స్రావవిషయమై యెహోవా సన్నిధిని ఆమె నిమి
త్తము ప్రాయశ్చిత్తము చేయవలెను.

31 ఇశ్రాయేలీయులు తమ మధ్యనుండు నా నివాస
స్థలమును అపవిత్రపరచునప్పుడు వారు తమ అప
విత్రతవలన చావకుండునట్లు వారికి అపవిత్రత కలుగ
కుండ మీరు వారిని కాపాడవలెను.

32 స్రావముగలవానిగూర్చియు, వీర్యస్ఖలనమువలని
అపవిత్రతగలవానిగూర్చియు, కడగానున్న బలహీను
రాలినిగూర్చియు, స్రావముగల స్త్రీ పురుషులనుగూ
ర్చియు, అపవిత్రురాలితో శయనించువానిగూర్చియు
విధింపబడినది ఇదే.

అహరోను ఇద్దరు కుమారులు యెహోవా సన్ని 16
ధికి సమీపించి చనిపోయిన తరువాత యెహోవా
మోషేతో మాటలాడి ఇట్లనెను । — నేను కరుణా 2
పీఠముమీద మేఘములో కనబడుదును గనుక నీ
సహోదరుడైన అహరోను చావకయుండునట్లు
అతడు మందసముమీది కరుణాపీఠము ఎదుటనున్న
అడ్డతెరలోపలికి ఎల్లప్పుడును రాకూడదని అతనితో
చెప్పుము. । అతడు పాపపరిహారార్థబలిగా ఒక కోడె 3
దూడను దహనబలిగా ఒక పొట్టేలును తీసికొని
వీటితో పరిశుద్ధస్థలములోకి రావలెను. । అతడు ప్రతి 4
ష్ఠితమైన చొక్కాయి తొడుగుకొని తన మానమునకు
సన్ననార లాగులు తొడుగుకొని సన్ననార దట్టికట్టు
కొని సన్ననారపాగా పెట్టుకొనవలెను. అవి ప్రతిష్ఠ
వస్త్రములు గనుక అతడు నీళ్లతో దేహము కడుగుకొని
వాటిని వేసికొనవలెను. । మరియు అతడు ఇశ్రాయే 5
లీయుల సమాజము నొద్దనుండి పాపపరిహారార్థబలిగా
రెండు మేకపిల్లలను దహనబలిగా ఒక పొట్టేలును
తీసికొని రావలెను. । అహరోను తనకొరకు పాపపరి 6
హారార్థబలిగా ఒక కోడెను అర్పించి తన నిమిత్తమును
తన యింటివారి నిమిత్తమును ప్రాయశ్చిత్తము చేసి ।
ఆ రెండు మేకపిల్లలను తీసికొని వచ్చి ప్రత్యక్షపు 7
గుడారముయొక్క ద్వారమునొద్ద యెహోవా సన్ని
ధిని వాటిని ఉంచవలెను. । అప్పుడు అహరోను 8
యెహోవాపేరట ఒక చీటిని అజాజేలుపేరట ఒక
చీటిని ఆ రెండు మేకలమీద రెండు చీట్లను వేయ
వలెను. । ఏ మేకమీద యెహోవాపేరట చీటి 9
పడునో ఆ మేకను అహరోను తీసికొని వచ్చి పాప
పరిహారార్థబలిగా అర్పింపవలెను. । ఏ మేకమీద 10
అజాజేలుపేరట చీటి పడునో దానివలన ప్రాయశ్చి
త్తము కలుగునట్లు అజాజేలుపేరట అరణ్యములో
విడిచిపెట్టుటకై యెహోవా సన్నిధిని దానిని ప్రాణ
ముతోనే ఉంచవలెను. । అప్పుడు అహరోను పాప 11
పరిహారార్థబలియగు ఆ కోడెను తీసికొని వచ్చి తన
నిమిత్తమును తన యింటివారి నిమిత్తమును ప్రాయశ్చి
త్తము చేసికొనవలెను. తరువాత అతడు తనకొరకు
తానర్పించు పాపపరిహారార్థబలియగు కోడెను వధించి ।
యెహోవా సన్నిధినున్న ధూపపీఠముమీదనుండి 12
ధూపార్తెడు నిప్పులను, తన పిడికెళ్లతో పరిమళ ధూప
చూర్ణమును తీసికొని అడ్డతెరలోపలికి వాటిని తెచ్చి
తాను చావకుండునట్లు । ఆ ధూపము మేఘమువలె 13
శాసనములమీదనున్న కరుణాపీఠమును కమ్ముటకు,
యెహోవా సన్నిధిని ఆ అగ్నిమీద ఆ ధూపద్రవ్య
మును వేయవలెను. । అప్పుడతడు ఆ కోడెరక్తములో 14
కొంచెము తీసికొని తూర్పుప్రక్కను కరుణాపీఠము
మీద తన వ్రేలితో ప్రోక్షించి, కరుణాపీఠము
ఎదుట తన వ్రేలితో ఆ రక్తములో కొంచెము ఏడు

15 మారులు ప్రోక్షింపవలెను. । అప్పుడతడు ప్రజ
లర్పించు పాపపరిహారార్థబలియగు మేకను వధించి
అడ్డతెరలోపలికి దాని రక్తము తెచ్చి ఆ కోడెరక్త
ముతో చేసినట్లు దీని రక్తముతోను చేసి, కరుణాపీఠము
మీదను కరుణాపీఠము ఎదుటను దాని ప్రోక్షింప
16 వలెను. । అట్లు అతడు ఇశ్రాయేలీయుల సమస్త పాప
ములనుబట్టియు, అనగా వారి అపవిత్రతనుబట్టియు,
వారి అతిక్రమములనుబట్టియు పరిశుద్ధస్థలమునకు
ప్రాయశ్చిత్తము చేయవలెను. ప్రత్యక్షపు గుడా
రము వారిమధ్య ఉండుటవలన వారి అపవిత్రతనుబట్టి
అది అపవిత్రమగుచుండును గనుక అతడు దానికి
17 ప్రాయశ్చిత్తము చేయవలెను. । పరిశుద్ధస్థలములో
ప్రాయశ్చిత్తము చేయుటకు అతడు లోపలికి పోవు
నప్పుడు అతడు తన నిమిత్తమును తన యింటివారి
నిమిత్తమును ఇశ్రాయేలీయుల సమస్త సమాజము
నిమిత్తమును ప్రాయశ్చిత్తముచేసి బయటికి వచ్చువరకు
ఏ మనుష్యుడును ప్రత్యక్షపు గుడారములో ఉండ
18 రాదు. । మరియు అతడు యెహోవా సన్నిధినున్న
బలిపీఠమునొద్దకు పోయి దానికి ప్రాయశ్చిత్తము
చేయవలెను. అతడు ఆ కోడెరక్తములో కొంచెమును
ఆ మేకరక్తములో కొంచెమును తీసికొని బలిపీఠపు
19 కొమ్ములమీద చమిరి । యేడుమారులు తన వ్రేలితో
ఆ రక్తములో కొంచెము దానిమీద ప్రోక్షించి దాని
పవిత్రపరచి ఇశ్రాయేలీయుల అపవిత్రతను పోగొట్టి
20 దానిని పరిశుద్ధపరిచవలెను. । అతడు పరిశుద్ధస్థలము
నకును ప్రత్యక్షపు గుడారమునకును బలిపీఠమునకును
ప్రాయశ్చిత్తముచేసి చాలించిన తరువాత ఆ సజీవ
21 మైన మేకను దగ్గరకు తీసికొని రావలెను. । అప్పుడు
అహరోను సజీవమైన ఆ మేక తలమీద తన రెండు
చేతులు ఉంచి, ఇశ్రాయేలీయుల పాపములన్నియు,
అనగా వారి దోషములన్నియు వారి అతిక్రమము
లన్నియు దానిమీద ఒప్పుకొని, ఆ మేకతలమీద
వాటిని మోపి, తగిన మనుష్యునిచేత అరణ్యములోకి
22 దాని పంపవలెను. । ఆ మేక వారి దోషములన్నిటిని
ఎడారిదేశమునకు భరించిపోవును. అతడు అరణ్య
23 ములో ఆ మేకను విడిచిపెట్టవలెను. । అప్పుడు అహ
రోను ప్రత్యక్షపు గుడారములోకి వచ్చి, తాను పరి
శుద్ధస్థలములోకి వెళ్లినప్పుడు తాను వేసికొనిన నార
24 బట్టలను తీసి అక్కడ వాటిని ఉంచి । పరిశుద్ధస్థల
ములో దేహమును నీళ్లతో కడుగుకొని బట్టలు తిరిగి
ధరించుకొని, బయటికి వచ్చి తనకొరకు దహనబలిని
ప్రజలకొరకు దహనబలిని అర్పించి, తన నిమిత్తమును
ప్రజల నిమిత్తమును ప్రాయశ్చిత్తము చేయవలెను. ।
25 పాపపరిహారార్థబలి పశువుయొక్క క్రొవ్వును బలి
26 పీఠముమీద దహింపవలెను. । అజాజేలు పేరట మేకను
విడిచినవాడు తన బట్టలు ఉదుకుకొని నీళ్లతో దేహము
కడుగుకొని తరువాత పాలెములోకి రావలెను. ।
పరిశుద్ధస్థలములో ప్రాయశ్చిత్తము చేయుటకు వేటి 27
రక్తము దాని లోపలికి తేబడెనో పాపపరిహారార్థబలి
యగు ఆ కోడెను ఆ మేకను ఒకడు పాలెము వెల
పలికి తీసికొని పోవలెను. వాటి చర్మములను వాటి
మాంసమును వాటి మలమును అగ్నితో కాల్చివేయ
వలెను. । వాటిని కాల్చివేసినవాడు తన బట్టలు ఉదుకు 28
కొని నీళ్లతో దేహము కడుగుకొని తరువాత పాలెము
లోకి రావలెను.

ఇది మీకు నిత్యమైన కట్టడ. స్వదేశులుగాని 29
మీ మధ్యనుండు పరదేశులుగాని మీరందరు ఏడవ
నెల పదియవనాడు ఏ పనియైనను చేయక మిమ్మును
మీరు దుఃఖపరచుకొనవలెను. । ఏలయనగా మీరు 30
యెహోవా సన్నిధిని మీ సమస్త పాపములనుండి
పవిత్రులగునట్లు ఆ దినమున మిమ్ము పవిత్రపరచునట్లు
మీ నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయబడును. । అది 31
మీకు మహా విశ్రాంతిదినము. మిమ్మును మీరు దుఃఖ
పరచుకొనవలెను; ఇది నిత్యమైన కట్టడ. । ఎవరు తన 32
తండ్రికి మారుగా యాజకుడగుటకై అభిషేకము
పొంది తన్ను ప్రతిష్ఠించుకొనునో ఆ యాజకుడు
ప్రాయశ్చిత్తము చేసికొని నారవస్త్రములైన ప్రతిష్ఠిత
వస్త్రములను ధరించుకొనవలెను. । మరియు అతడు అతి 33
పరిశుద్ధముగానున్న మందిరమునకును ప్రత్యక్షపు గుడా
రమునకును బలిపీఠమునకును ప్రాయశ్చిత్తము చేయ
వలెను. మరియు అతడు యాజకుల నిమిత్తమును సమా
జము నిమిత్తమును ప్రాయశ్చిత్తము చేయవలెను. ।
సంవత్సరమునకు ఒకసారి ఇశ్రాయేలీయుల సమస్త 34
పాపములనుబట్టి వారి నిమిత్తము ప్రాయశ్చిత్తము
చేయుటకు ఇది మీకు నిత్యమైన కట్టడ. యెహోవా
మోషేకు ఆజ్ఞాపించినట్లు అతడు చేసెను.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 17
విచ్చెను. । —నీవు అహరోనుతోను అతని కుమారుల 2
తోను ఇశ్రాయేలీయులందరితోను ఈలాగు చెప్పుము
—ఇది యెహోవా ఆజ్ఞాపించిన మాట. । ఇశ్రా 3
యేలీయుల కుటుంబములలో యెహోవా మందిరము 4
ఎదుట యెహోవాకు అర్పణము అర్పించుటకు పూను
కొనువాడు, అది ఎద్దేగాని గొఱ్ఱెయేగాని మేకయే
గాని, ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారమునొద్దకు
దానిని ముందు తేక పాలెములో వధించినను పాలె
మునకు వెలపట వధించినను ఆ మనుష్యుడు ప్రాణా
పరాధియైనట్టు ఎంచవలెను; వాడు రక్తమును ఒలికిం
చినవాడు; । ఇశ్రాయేలీయులు బయట వధించుచున్న 5
బలిపశువులను ఇక బయట వధింపక యెహోవా
పేరట యాజకునియొద్దకు ప్రత్యక్షపు గుడారము
యొక్క ద్వారమునకే తీసికొని వచ్చి సమాధానబలిగా
అర్పించునట్లు ఆ మనుష్యుడు జనులలోనుండి కొట్టి

6 వేయబడవలెను. ౹ యెహోవాకు ఇంపైన సువాసన
గలుగునట్లు యాజకుడు ప్రత్యక్షపు గుడారముయొక్క
ద్వారమునొద్దనున్న యెహోవా బలిపీఠముమీద
వాటి రక్తమును ప్రోక్షించి వాటి క్రొవ్వును దహింప
7 వలెను. ౹ వారు వ్యభిచారులై అనుసరించుచువచ్చిన
దయ్యములపేరట వధించినట్లు ఇకమీదట తమ బలి
పశువులను వధింపరాదు. ఇది వారి తరతరములకు
వారికి నిత్యమైన కట్టడ.
8 మరియు నీవు వారితో ఇట్లనుము — ఇశ్రాయేలీ
9 యుల కుటుంబములలోగాని మీలో నివసించు పరదే
శులలోగాని ఒకడు దహనబలినైనను వేరొక యే బలి
నైనను యెహోవాకు అర్పింప నుద్దేశముగలవాడై
ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారమునొద్దకు తీసి
కొని రానియెడల ఆ మనుష్యుడు జనులలోనుండి
కొట్టివేయబడును.
10 మరియు ఇశ్రాయేలీయుల కుటుంబములలోనేమి
మీలో నివసించు పరదేశులలోనేమి ఒకడు దేని రక్త
మును తినినను రక్తము తినువానికి నేను విముఖుడనై
11 జనులలోనుండి వాని కొట్టివేయుదును. ౹ రక్తము దేహ
మునకు ప్రాణము. మీనిమిత్తము ప్రాయశ్చిత్తము
చేయునట్లు బలిపీఠముమీద పోయుటకై దానిని మీ
కిచ్చితిని. రక్తము దానిలోనున్న ప్రాణమునుబట్టి
12 ప్రాయశ్చిత్తము చేయును. ౹ కాబట్టి మీలో ఎవ
డును రక్తము తినకూడదనియు, మీలో నివసించు ఏ
పరదేశియు రక్తము తినకూడదనియు నేను ఇశ్రా
యేలీయులకు ఆజ్ఞాపించితిని.
13 మరియు ఇశ్రాయేలీయులలోనేగాని మీలో నివ
సించు పరదేశులలోనేగాని ఒకడు తినదగిన మృగము
నైనను పక్షినైనను వేటాడి పట్టినయెడల వాడు దాని
రక్తమును ఒలికించి మంటితో కప్పవలెను; ఏలయనగా
14 అది సమస్త దేహములకు ప్రాణాధారము; ౹ దాని
రక్తము దాని ప్రాణమున కాధారము. కాబట్టి మీరు
ఏ దేహరక్తమును తినకూడదు. వాటి రక్తము సర్వ
దేహములకు ప్రాణాధారము; దానిని తిను ప్రతివాడు
మరణశిక్ష నొందునని నేను ఇశ్రాయేలీయులకు ఆజ్ఞా
15 పించితిని. ౹ మరియు కళేబరమునైనను చీల్చబడినదాని
నైనను తిను ప్రతివాడు దేశమందు పుట్టినవాడేమి
పరదేశియేమి వాడు తన బట్టలను ఉదుకుకొని నీళ్లతో
దేహమును కడుగుకొని సాయంకాలమువరకు అపవి
16 త్రుడగును. తరువాత పవిత్రుడగును. ౹ అయితే
వాడు వాటిని ఉదుకుకొనకయు తన దేహమును కడు
గుకొనకయు ఉండినయెడల వాడు తన దోషశిక్షను
భరించును.

**18** మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
2 విచ్చెను ౹ — నేను మీ దేవుడనైన యెహోవానని
3 నీవు ఇశ్రాయేలీయులతో చెప్పుము. ౹ మీరు నివ
సించిన ఐగుప్తు దేశాచారములచొప్పున మీరు చేయ
కూడదు; నేను మిమ్మును రప్పించుచున్న కనానుదేశా
చారములచొప్పున మీరు చేయకూడదు; వారి కట్టడ
లనుబట్టి నడవకూడదు. ౹ మీరు నా విధులను మన్నిం 4
పవలెను; నా కట్టడలనుబట్టి నడుచుకొనుటకు వాటిని
ఆచరింపవలెను; మీ దేవుడనగు నేను యెహోవాను.౹
మీరు నా కట్టడలను నా విధులను ఆచరింపవలెను. 5
వాటిని మన్నించువాడు వాటివలన బ్రదుకును; నేను
యెహోవాను.
మీలో ఎవరును తమ రక్తసంబంధుల మానాచ్ఛా 6
దనమును తీయుటకు వారిని సమీపింపకూడదు; నేను
యెహోవాను. ౹ నీ తండ్రికి మానాచ్ఛాదనముగా 7
నున్న నీ తల్లి మానాచ్ఛాదనమును తీయకూడదు; ఆమె
నీ తల్లి; ఆమె మానాచ్ఛాదనమును తీయకూడదు. ౹
నీ తండ్రి భార్య మానాచ్ఛాదనమును తీయకూడదు; 8
అది నీ తండ్రిదే. ౹ నీ సహోదరి మానాచ్ఛాదన 9
మును, అనగా ఇంటిలో పుట్టినదేమి వెలపట పుట్టిన
దేమి నీ తండ్రి కుమార్తెయొక్కయైనను నీ తల్లి కుమార్తె
యొక్కయైనను మానాచ్ఛాదనమును తీయకూడదు. ౹
నీ కుమారుని కుమార్తె మానాచ్ఛాదనమునైనను కుమార్తె 10
కుమార్తె మానాచ్ఛాదనమునైనను తీయకూడదు; అది
నీది. ౹ నీ తండ్రివలన పుట్టిన నీ తండ్రి భార్య కుమార్తె 11
నీ సహోదరి; ఆమె మానాచ్ఛాదనమును తీయకూ
డదు. ౹ నీ తండ్రి సహోదరి మానాచ్ఛాదనమును 12
తీయకూడదు; ఆమె నీ తండ్రి రక్తసంబంధి. ౹ నీ తల్లి 13
సహోదరి మానాచ్ఛాదనమును తీయకూడదు; ఆమె
నీ తల్లి రక్తసంబంధి. ౹ నీ తండ్రి సహోదరుని మానా 14
చ్ఛాదనమును తీయకూడదు, అనగా అతని భార్యను
సమీపింపకూడదు; ఆమె నీ పినతల్లి. ౹ నీ కోడలి 15
మానాచ్ఛాదనమును తీయకూడదు; ఆమె నీ కుమా
రుని భార్య, ఆమె మానాచ్ఛాదనమును తీయకూడదు.౹
నీ సహోదరుని భార్య మానాచ్ఛాదనమును తీయ 16
కూడదు; అది నీ సహోదరుని మానము. ౹ ఒక స్త్రీ 17
మానాచ్ఛాదనమును ఆమె కుమార్తె మానాచ్ఛాదన
మును తీయకూడదు; ఆమె కుమారుని కుమార్తె మానా
చ్ఛాదనమునైనను ఆమె కుమార్తె కుమార్తె మానాచ్ఛా
దనమునైనను తీయుటకు వారిని చేర్చుకొనకూడదు;
వారు ఆమె రక్తసంబంధులు; అది దుష్కామప్రవర్తన.౹
నీ భార్య బ్రదికియుండగా ఆమెను పీడించుటకు 18
ఆమె సహోదరి మానాచ్ఛాదనమును తీయుటకు
ఈమెను ఆమెతో పెండ్లి చేసికొనకూడదు. ౹ అప 19
విత్రతవలన స్త్రీ కడగా ఉండునప్పుడు ఆమె మానా
చ్ఛాదనమును తీయుటకు ఆమెను సమీపింపకూడదు.౹
నీ పొరుగువాని భార్యయందు నీ వీర్యస్ఖలనముచేసి 20
ఆమెవలన అపవిత్రత కలుగజేసికొనకూడదు. ౹ నీవు 21
ఏ మాత్రమును నీ సంతానమును మొలెకునొద్దకు దాట

నీయకూడదు; నీ దేవుని నామమును అపవిత్రపరచ
22 కూడదు, నేను యెహోవాను. । స్త్రీ శయనమువలె
పురుషశయనము చేయకూడదు; అది హేయము. ।
23 ఏ జంతువునందును నీ స్ఖలనముచేసి దానివలన అప
విత్రత కలుగజేసికొనకూడదు. జంతువు స్త్రీని పొందు
నట్లు ఆమె దాని యెదుట నిలువరాదు, అది విప
రీతము.
24 వీటిలో దేనివలనను అపవిత్రత కలుగజేసికొన
కూడదు. నేను మీ యెదుటనుండి వెళ్లగొట్టుచున్న
25 జనములు వాటన్నిటివలన అపవిత్రులైరి. । ఆ దేశము
అపవిత్రతకలది గనుక నేను దానిమీద దాని దోష
శిక్షను మోపుచున్నాను. ఆ దేశమందు కాపురమున్న
26 వారిని వెళ్లగ్రక్కివేయుచున్నది. । కాబట్టి ఆ దేశము
28 మీకంటె ముందుగానున్న ప్రజలను వెళ్లగ్రక్కివేసిన
ప్రకారము మీ అపవిత్రతనుబట్టి మిమ్మును వెళ్ల
గ్రక్కివేయకుండునట్లు మీరు, అనగా స్వదేశియేగాని
మీలో నివసించు పరదేశియేగాని యీ హేయక్రియ
లన్నిటిలో దేనిని చేయక, యీ నా కట్టడలను నా
29 విధులను ఆచరింపవలెను. । ఎవరు అట్టి హేయక్రియ
లలో దేనినైనను చేయుదురో వారు ప్రజలలోనుండి
30 కొట్టివేయబడుదురు. । కాబట్టి మీకంటె ముందుగా
నున్నవారు అనుసరించిన ఆ హేయమైన ఆచారము
లలో దేనినైనను అనుసరించుటవలన అపవిత్రత
కలుగజేసికొనకుండునట్లు నేను మీకు విధించిన విధి
ననుసరించి నడుచుకొనవలెను. నేను మీ దేవుడనైన
యెహోవాను.

**19** మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
విచ్చెను—ఇశ్రాయేలీయుల సర్వసమాజముతో ఇట్లు
2 చెప్పుము. । మీరు పరిశుద్ధులై యుండవలెను. మీ దేవు
డనైన యెహోవానగు నేను పరిశుద్ధుడనై యున్నా
3 ను. । మీలో ప్రతివాడు తన తల్లికి తన తండ్రికి భయ
పడవలెను. నేను నియమించిన విశ్రాంతిదినములను ఆచ
రింపవలెను; నేను మీ దేవుడనైన యెహోవాను. ।
4 మీరు వ్యర్థమైన దేవతలతట్టు తిరగకూడదు. మీరు
పోతవిగ్రహములను చేసికొనకూడదు. నేను మీ
5 దేవుడనైన యెహోవాను. । మీరు యెహోవాకు
సమాధానబలి అర్పించునప్పుడు అది అంగీకరింప
6 బడునట్లుగా అర్పింపవలెను. । మీరు బలినర్పించు
నాడైనను మరునాడైనను దాని తినవలెను. మూడవ
నాటివరకు మిగిలియున్నదానిని అగ్నితో కాల్చివేయ
7 వలెను. । మూడవనాడు దానిలో కొంచెమైనను తినిన
యెడల అది హేయమగును; అది అంగీకరింపబడదు. ।
8 దానిని తినువాడు తన దోషశిక్షను భరించును. వాడు
యెహోవాకు పరిశుద్ధమైనదానిని అపవిత్రపరచెను.
వాడు ప్రజలలోనుండి కొట్టివేయబడును.
9 మీరు మీ భూమి పంటను కోయునప్పుడు నీ
పొలముయొక్క ఓరలను పూర్తిగా కోయకూడదు; నీ
కోతలో పరిగెను ఏరుకొనకూడదు; నీ ఫలవృక్షముల
తోట పరిగెను కూర్చుకొనకూడదు; । నీ ఫలవృక్ష 10
ముల తోటలో రాలిన పండ్లను ఏరుకొనకూడదు;
బీదలకును పరదేశులకును వాటిని విడిచిపెట్టవలెను; ।
నేను మీ దేవుడనైన యెహోవాను. మీరు దొంగి 11
లింపకూడదు, బొంకకూడదు, ఒకనితో ఒకడు అబద్ధ
మాడకూడదు; । నా నామమునుబట్టి అబద్ధప్రమా 12
ణము చేయకూడదు; నీ దేవుని నామమును అపవిత్ర
పరచకూడదు; నేను యెహోవాను. । నీ పొరుగు 13
వాని హింసింపకూడదు, వాని దోచుకొనకూడదు,
కూలివాని కూలి మరునాటివరకు నీయొద్ద ఉంచుకొన
కూడదు, । చెవిటివానిని తిట్టకూడదు, గుడ్డివాని 14
యెదుట అడ్డము వేయకూడదు; నీ దేవునికి భయపడ
వలెను, నేను యెహోవాను. । అన్యాయపు తీర్పు 15
తీర్చకూడదు, బీదవాడని పక్షపాతము చేయకూడదు,
గొప్పవాడని అభిమానము చూపకూడదు; న్యాయము
నుబట్టి నీ పొరుగువానికి తీర్పు తీర్చవలెను. । నీ ప్రజ 16
లలో కొండెములాడుచు ఇంటింటికి తిరుగకూడదు,
నీ సహోదరునికి ప్రాణహానిచేయ చూడకూడదు,
నేను యెహోవాను. । నీ హృదయములో నీ 17
సహోదరునిమీద పగపట్టకూడదు, నీ పొరుగువాని
పాపము నీ మీదికి రాకుండునట్లు నీవు తప్పక వానిని
గద్దింపవలెను. । కీడుకు ప్రతికీడు చేయకూడదు, 18
నీ ప్రజలమీద కోపముంచుకొనక నిన్నువలె నీ పొరు
గువానిని ప్రేమింపవలెను; నేను యెహోవాను. ।
మీరు నా కట్టడలను ఆచరింపవలెను; నీ జంతు 19
వులను ఇతరజాతిజంతువులను కలియనీయకూడదు;
నీ పొలములో వేరు వేరు జాతుల విత్తనములు చల్ల
కూడదు; బొచ్చును నారయు కలిసినబట్ట వేసికొన
కూడదు. । ఒకనికి ప్రధానము చేయబడిన దాసి వెల 20
యిచ్చి విమోచింపబడకుండగానేమి (ఊరక) విడిపిం
పబడకుండగానేమి ఒకడు దానితో శయనించి వీర్య
స్ఖలనము చేసినయెడల వారిని శిక్షింపవలెను. అది విడి
పింపబడలేదు గనుక వారికి మరణశిక్ష విధింపకూడదు. ।
అతడు అపరాధపరిహారార్థబలిని, అనగా అపరాధ 21
పరిహారార్థబలియగు పొట్టేలును ప్రత్యక్షపు గుడా
రముయొక్క ద్వారమునకు యెహోవా సన్నిధికి
తీసికొని రావలెను. । అప్పుడు యాజకుడు అతడు 22
చేసిన పాపమునుబట్టి పాపపరిహారార్థబలియగు పొట్టే
లువలన యెహోవా సన్నిధిని అతని నిమిత్తము
ప్రాయశ్చిత్తము చేయవలెను. దీనివలన అతడు చేసిన
పాపము విషయమై అతనికి క్షమాపణ కలుగును. ।
మీరు ఆ దేశమునకు వచ్చి ఆహారమునకై నానావిధ 23
ములైన చెట్లను నాటినప్పుడు వాటి పండ్లను అపవిత్ర
ములగా ఎంచవలెను. వాటి కాపు మీకు ఎక్కువగా

ఉండునట్లు అవి మూడు సంవత్సరములవరకు మీకు
అపవిత్రములుగా ఉండవలెను, వాటిని తినకూడదు. ।
24 నాలుగవ సంవత్సరమున వాటి ఫలములన్నియు
యెహోవాకు ప్రతిష్ఠితమైన స్తుతి యాగద్రవ్యము
లగును; అయిదవ సంవత్సరమున వాటి ఫలములను
25 తినవచ్చును; । నేను మీ దేవుడనైన యెహోవాను.।
26 రక్తము కూడినదేదియు తినకూడదు, శకునములు చూ
27 డకూడదు, మంత్రయోగములు చేయకూడదు, । మీ
నుదుటివెండ్రుకలను గుండ్రముగా కత్తిరింపకూడదు,
28 నీ గడ్డపు ప్రక్కలను గొరగకూడదు, । చచ్చినవారి
కొరకు మీ దేహమును చీరుకొనకూడదు, పచ్చబొట్లు
మీ దేహమునకు పొడుచుకొనకూడదు; నేను మీ
29 దేవుడనైన యెహోవాను. । మీ దేశము వ్యభిచరిం
పకయు దుష్కామప్రవర్తనతో నిండకయు ఉండు
నట్లు నీ కుమార్తె వ్యభిచారిణియగుటకై ఆమెను
30 వేశ్యగా చేయకూడదు. । నేను నియమించిన విశ్రాంతి
దినములను మీరు ఆచరింపవలెను. నా పరిశుద్ధస్థల
31 మును మన్నింపవలెను; నేను యెహోవాను. । కర్ణ
పిశాచిగలవారి దగ్గరకు పోకూడదు, సోదెగాండ్లను
వెదకి వారివలన అపవిత్రత కలుగజేసికొనకూడదు;
32 నేను మీ దేవుడనైన యెహోవాను. । తల నెరసిన
వానియెదుట లేచి ముసలివాని ముఖమును ఘనపరచి
33 నీ దేవునికి భయపడవలెను; నేను యెహోవాను.। మీ
దేశమందు పరదేశి నీ మధ్య నివసించునప్పుడు వానిని
34 బాధింపకూడదు, । మీ మధ్య నివసించు పరదేశిని
మీలో పుట్టినవానివలె ఎంచవలెను, నిన్నువలె వానిని
ప్రేమింపవలెను, ఐగుప్తుదేశములో మీరు పరదేశులై
యుంటిరి; నేను మీ దేవుడనైన యెహోవాను. ।
35 తీర్పు తీర్చునప్పుడు కొలతలోగాని తూనికెలోగాని
పరిమాణములోగాని మీరు అన్యాయము చేయకూ
36 డదు. । న్యాయమైన త్రాసులు న్యాయమైన గుండ్లు
న్యాయమైన తూము న్యాయమైన పడి మీకుండ
వలెను; నేను ఐగుప్తుదేశములోనుండి మిమ్మును రప్పిం
37 చిన మీ దేవుడనైన యెహోవాను. । కాగా మీరు
నా కట్టడలన్నిటిని నా విధులన్నిటిని అనుసరించి
నడుచుకొనవలెను; నేను యెహోవాను.

**20** మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
విచ్చెను — నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము । —
2 ఇశ్రాయేలీయులలోనేగాని ఇశ్రాయేలు ప్రజలలో
నివసించు పరదేశులలోనేగాని యొకడు ఏమాత్రమును
తన సంతానమును మొలెకుకు ఇచ్చినయెడల వానికి
మరణశిక్ష విధింపవలెను; మీ దేశప్రజలు రాళ్లతో
3 వాని కొట్టవలెను. । ఆ మనుష్యుడు నా పరిశుద్ధస్థల
మును అపవిత్రపరచి నా పరిశుద్ధనామమును అపవిత్ర
పరచుటకు తన సంతానమును మొలెకుకు ఇచ్చెను గనుక
నేను వానికి విరోధినై ప్రజలలోనుండి వాని కొట్టివేతు
ను. । మరియు ఆ మనుష్యుడు తన సంతానమును 4
మొలెకుకు ఇచ్చుచుండగా మీ దేశప్రజలు వాని చం 5
పక, చూచి చూడనట్లు తమ కన్నులు మూసికొనిన
యెడల నేను వానికిని వాని కుటుంబమునకును విరో
ధినై వానిని మొలెకుతో వ్యభిచరించుటకు వాని తరిమి
వ్యభిచారముచేయువారినందరిని ప్రజలలోనుండి కొట్టి
వేతును. । మరియు కర్ణపిశాచి గలవారితోను సోదె 6
గాండ్లతోను వ్యభిచరించుటకు వారితట్టు తిరుగువా
డెవడో నేను వానికి విరోధినై ప్రజలలోనుండి వాని
కొట్టివేతును. । కావున మిమ్మును మీరు పరిశుద్ధపరచు 7
కొని పరిశుద్ధులై యుండుడి; నేను మీ దేవుడనైన
యెహోవాను. । మీరు నా కట్టడలను ఆచరించి వా 8
టిని అనుసరింపవలెను; నేను మిమ్మును పరిశుద్ధపరచు
యెహోవాను. । ఎవడు తన తండ్రినైనను తన తల్లి 9
నైనను దూషించునో వానికి మరణశిక్ష విధింపవలెను.
వాడు తన తండ్రినో తల్లినో దూషించెను గనుక తన
శిక్షకు తానే కారకుడు. । పరుని భార్యతో వ్యభిచ 10
రించినవానికి, అనగా తన పొరుగువాని భార్యతో
వ్యభిచరించినవానికిని ఆ వ్యభిచారిణికిని మరణశిక్ష
విధింపవలెను. । తన తండ్రి భార్యతో శయనించిన 11
వాడు తన తండ్రి మానాచ్ఛాదనమును తీసెను; వారిద్ద
రికిని మరణశిక్ష విధింపవలెను; తమ శిక్షకు తామే
కారకులు. । ఒకడు తన కోడలితో శయనించినయెడల 12
వారిద్దరికిని మరణశిక్ష విధింపవలెను. వారు వావి వర
సలు తప్పిరి; వారి ప్రాణాపరాధము వారిమీద నుం
డును. । ఒకడు స్త్రీతో శయనించినట్లు పురుషునితో 13
శయనించినయెడల వారిద్దరు హేయక్రియచేసిరి
గనుక వారికి మరణశిక్ష విధింపవలెను; తమ శిక్షకు
తామే కారకులు. । ఒకడు స్త్రీని ఆమె తల్లిని పెండ్లి 14
చేసికొనినయెడల అది దుష్కామప్రవర్తన. దుష్కా
మప్రవర్తన మీ మధ్యనుండకుండ వానిని వారిని అగ్ని
తో కాల్చవలెను. । జంతుశయనము చేయువానికి 15
మరణశిక్ష విధింపవలెను; ఆ జంతువును చంపవలెను. ।
స్త్రీ తన్ను జంతువు పొందునట్లు దాని సమీపించిన 16
యెడల ఆ స్త్రీకిని ఆ జంతువుకును మరణమే విధి;
ఆమెను దానిని చంపవలెను; తమ శిక్షకు తామే కార
కులు. । ఒకడు తన సహోదరిని, అనగా తన తండ్రి 17
కుమార్తెనేగాని తన తల్లి కుమార్తెనేగాని చేర్చుకొని
ఆమె దిసమొలను వాడును వాని దిసమొలను ఆమె
యు చూచినయెడల అది దురనురాగము. వారికిని
తమ జనులయెదుట మరణశిక్ష విధింపవలెను. వాడు తన
సహోదరి మానాచ్ఛాదనమును తీసెను; తన దోష
శిక్షను తాను భరించును. । కడగానున్న స్త్రీతో శయ 18
నించి ఆమె మానాచ్ఛాదనమును తీసినవాడు ఆమె రక్త
ధారాచ్ఛాదనమును తీసెను; ఆమె తన రక్తధా
రాచ్ఛాదనమును తీసివేసెను; వారి ప్రజలలోనుండి

19 వారిద్దరిని కొట్టివేయవలెను. । నీ తల్లి సహోదరి మానా
చ్ఛాదనమునేగాని నీ తండ్రి సహోదరి మానాచ్ఛా
దనమునేగాని తీయకూడదు; తీసినవాడు తన రక్తసం
బంధియొక్క మానాచ్ఛాదనమును తీసెను; వారు తమ
20 దోషశిక్షను భరించెదరు. । పినతల్లితోనేగాని పెత్తల్లితో
నేగాని శయనించినవాడు తన తలిదండ్రుల సహో
దరుల మానాచ్ఛాదనమును తీసెను, వారు తమ పాప
శిక్షను భరించెదరు; సంతానహీనులై మరణముగుదురు. ।
21 ఒకడు తన సహోదరుని భార్యను చేర్చుకొనిన
యెడల అది హేయము. వాడు తన సహోదరుని
మానాచ్ఛాదనమును తీసెను; వారు సంతానహీనులై
యుందురు.

22 కాబట్టి మీరు నివసించునట్లు నేను ఏ దేశమునకు
మిమ్మును తీసికొని పోవుచున్నానో ఆ దేశము మిమ్మును
కక్కివేయకుండునట్లు మీరు నా కట్టడలన్నిటిని నా
23 విధులన్నిటిని అనుసరించి నడుచుకొనవలెను. । నేను
మీ యెదుటనుండి వెళ్లగొట్టుచున్న జనముల ఆచార
ములను బట్టి నడుచుకొనకూడదు. వారు అట్టి క్రియ
లన్నియు చేసిరి గనుక నేను వారియందు అసహ్యపడి
24 తిని. । నేను మీతో చెప్పినమాట యిదే—మీరు వారి
భూమిని స్వాస్థ్యముగా పొందుదురు; అది, అనగా
పాలు తేనెలు ప్రవహించు ఆ దేశము, మీకు స్వాస్థ్య
ముగా ఉండునట్లు దాని మీకిచ్చెదను. జనములలోనుండి
మిమ్మును వేరుపరచిన మీ దేవుడనైన యెహోవాను
25 నేనే. । కావున మీరు పవిత్ర జంతువులకును అప
విత్ర జంతువులకును పవిత్ర పక్షులకును అపవిత్ర
పక్షులకును విభజన చేయవలెను. అపవిత్రమైనదని
నేను మీకు వేరుచేసిన యే జంతువువలననేగాని, యే
పక్షివలననేగాని, నేలమీద ప్రాకు దేనివలననేగాని
26 మిమ్మును మీరు అపవిత్రపరచుకొనకూడదు. । మీరు
నాకు పరిశుద్ధులైయుండవలెను. యెహోవా అను
నేను పరిశుద్ధుడను. మీరు నావారై యుండునట్లు
అన్యజనులలోనుండి మిమ్మును వేరుపరచితిని.

27 పురుషునియందేమి స్త్రీయందేమి కర్ణపిశాచియైనను
సోదెయైనను ఉండినయెడల వారికి మరణశిక్ష విధింప
వలెను, వారిని రాళ్లతో కొట్టవలెను. తమ శిక్షకు
తామే కారకులు.

**21** మరియు యెహోవా మోషేతో ఇట్లనెను। —
2 యాజకులగు అహరోను కుమారులతో ఇట్లనుము—
మీలో ఎవడును తన ప్రజలలో శవమును ముట్టుట
వలన తన్ను అపవిత్రపరచుకొనరాదు. అయితే తనకు
సమీపరక్తసంబంధులు, అనగా తన తల్లి, తండ్రి, కుమా
3 రుడు, కుమార్తె, సహోదరుడు, । తనకు సమీపము
గానున్న శుద్ధ సహోదరియగు అవివాహిత కన్యక,
అను వీరియొక్క శవమునుముట్టి తన్ను అపవిత్రపరచు
4 కొనవచ్చును. । అతడు తన ప్రజలలో యజమానుడు
గనుక తన్ను అపవిత్రపరచుకొని సామాన్యునిగా చేసి
కొనరాదు. । వారు తమ తలలు బోడిచేసికొనరాదు. 5
గడ్డపు ప్రక్కలను క్షౌరము చేసికొనరాదు, కత్తితో
దేహమును కోసికొనరాదు. । వారు తమ దేవునికి 6
ప్రతిష్ఠితమైనవారుగా ఉండవలెను. కావున వారు
తమ దేవుని నామమును అపవిత్రపరచరాదు. ఏల
యనగా వారు తమ దేవునికి ఆహారమును, అనగా
యెహోవాకు హోమద్రవ్యములను అర్పించువారు;
కావున వారు పరిశుద్ధులై యుండవలెను. । వారు జార 7
స్త్రీనేగాని భ్రష్టురాలినేగాని పెండ్లిచేసికొనకూడదు,
పెనిమిటి విడనాడిన స్త్రీని పెండ్లిచేసికొనకూడదు. ఏల
యనగా యాజకుడు తన దేవునికి ప్రతిష్ఠితుడు. । అతడు 8
నీ దేవునికి ఆహారమును అర్పించువాడు గనుక నీవు
అతని పరిశుద్ధపరచవలెను. మిమ్మును పరిశుద్ధపరచు
యెహోవా అను నేను పరిశుద్ధుడను గనుక అతడు
మీ దృష్టికి పరిశుద్ధుడు కావలెను. । మరియు యాజ 9
కుని కుమార్తె జారత్వమువలన తన్ను అపవిత్రపరచు
కొనినయెడల ఆమె తన తండ్రిని అపవిత్రపరచునది.
అగ్నితో ఆమెను దహింపవలెను.

ప్రధానయాజకుడగుటకై తన సహోదరులలో 10
ఎవరి తలమీద అభిషేకతైలము పోయబడునో, యా
జకవస్త్రములు వేసికొనుటకు ఎవరు ప్రతిష్ఠింపబడునో
అతడు తన తలకప్పును తీయరాదు; తన బట్టలను చింపు
కొనరాదు; । అతడు శవముదగ్గరకు పోరాదు; తన 11
తండ్రి శవమువలననేగాని తన తల్లి శవమువలననేగాని
తన్ను అపవిత్రపరచుకొనరాదు. । దేవుడు అతని అభి 12
షేకించిన తైలము అతనిమీద కిరీటముగా ఉండును
గనుక అతడు పరిశుద్ధమందిరమును విడిచి వెళ్లరాదు;
తన దేవుని పరిశుద్ధమందిరమును అపవిత్రపరచరాదు;
నేను యెహోవాను. । అతడు కన్యకను పెండ్లిచేసి 13
కొనవలెను. । విధవరాలినైనను విడనాడబడినదానినై 14
నను భ్రష్టురాలినైనను, అనగా జారస్త్రీనైనను అట్టివా
రిని పెండ్లిచేసికొనక తన ప్రజలలోని కన్యకనే పెండ్లి
చేసికొనవలెను. । యెహోవా అను నేను అతని పరి 15
శుద్ధపరచువాడను గనుక అతడు తన ప్రజలలో తన సం
తానమును అపవిత్రపరచకూడదని వారితో చెప్పుము.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 16
విచ్చెను । — నీవు అహరోనుతో ఇట్లనుము—నీ సం 17
తతివారిలో ఒకనికి కళంకమేదైనను కలిగినయెడల
అతడు తన దేవునికి ఆహారము అర్పించుటకు సమీ
పింపకూడదు. । ఏలయనగా ఎవనియందు కళంకముం 18
డునో వాడు గుడ్డివాడేగాని కుంటివాడేగాని ముక్కిడి
వాడేగాని విపరీతమైన అవయవముగలవాడేగాని ।
కాలైనను చేయియైనను విరిగినవాడేగాని । గూనివాడే 19
గాని గుజ్జువాడేగాని కంటిలో పువ్వుగలవాడేగాని 20
గజ్జిగలవాడేగాని చిరుగుడుగలవాడేగాని వృషణములు

21 నలిగినవాడేగాని సమీపింపకూడదు. । యాజకుడైన
అహరోను సంతానములో కళంకముగల యే మనుష్యు
డును యెహోవాకు హోమద్రవ్యములను అర్పించు
టకు సమీపింపకూడదు. అతడు కళంకముగలవాడు;
అట్టివాడు తన దేవునికి ఆహారము అర్పించుటకు సమీ
22 పింపకూడదు. । అతిపరిశుద్ధమైనవేగాని పరిశుద్ధమైనవే
గాని, తన దేవునికి అర్పింపబడు ఏ ఆహారవస్తువుల
23 నైనను అతడు తినవచ్చును. । మెట్టుకు అతడు కళంక
ముగలవాడు గనుక అడ్డతెరయెదుటికి చేరకూడదు;
బలిపీఠమును సమీపింపకూడదు; నా పరిశుద్ధస్థలము
లను అపవిత్రపరచకూడదు; వారిని పరిశుద్ధపరచు
యెహోవాను నేనే అని వారితో చెప్పుము. అట్లు
మోషే అహరోనుతోను అతని కుమారులతోను ఇశ్రా
యేలీయులందరితోను చెప్పెను.

**22** మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
2 విచ్చెను । — ఇశ్రాయేలీయులు నాకు ప్రతిష్ఠించు
వాటివలన అహరోనును అతని కుమారులును నా పరి
శుద్ధనామమును అపవిత్రపరపకుండునట్లు వారు ఆ
పరిశుద్ధమైనవాటిని ప్రతిష్ఠితములుగా ఎంచవలెనని
3 వారితో చెప్పుము; నేను యెహోవాను. । నీవు వారి
తో ఇట్లనుము—మీ తరతరములకు మీ సమస్త సం
తానములలో ఒకడు అపవిత్రతగలవాడై, ఇశ్రాయేలీ
యులు యెహోవాకు ప్రతిష్ఠించువాటిని సమీపిం
చినయెడల అట్టివాడు నా సన్నిధిని ఉండకుండ కొట్టి
4 వేయబడును; నేను యెహోవాను. । అహరోను సం
తానములో ఒకనికి కుష్ఠయినను స్రావమైనను కలిగిన
యెడల అట్టివాడు పవిత్రత పొందువరకు ప్రతిష్ఠిత
మైనవాటిలో దేనిని తినకూడదు. శవమువలని అప
విత్రతగల దేనినైనను ముట్టువాడును స్ఖలితవీర్యుడును ।
5 అపవిత్రమైన పురుగునేమి యేదో ఒక అపవిత్రత
వలన అపవిత్రుడైన మనుష్యునినేమి ముట్టువాడును,
అట్టి అపవిత్రత తగిలినవాడును సాయంకాలము
6 పర్యంతము అపవిత్రుడగును. । అతడు నీళ్లతో తన
దేహమును కడుగుకొనువరకు ప్రతిష్ఠితమైనవాటిని
7 తినకూడదు. । సూర్యుడు అస్తమించినప్పుడు అతడు
పవిత్రుడగును; తరువాత అతడు ప్రతిష్ఠితమైనవాటిని
8 తినవచ్చును, అవి వానికి ఆహారమేగదా. । అతడు
కళేబరమునైనను చీల్చబడినదానినైనను తిని దానివలన
అపవిత్రపరచుకొనకూడదు; నేను యెహోవాను. ।
9 కాబట్టి నేను విధించిన విధిని అపవిత్రపరచి, దాని
పాపభారమును మోసికొని దానివలన చావకుండునట్లు
ఈ విధిని ఆచరింపవలెను; నేను వారిని పరిశుద్ధపరచు
10 యెహోవాను. । అన్యుడు ప్రతిష్ఠితమైనదానిని తిన
కూడదు, యాజకుని యింట నివసించు అన్యుడేగాని
జీతగాడేగాని ప్రతిష్ఠితమైనదానిని తినకూడదు, ।
11 అయితే యాజకుడు క్రయధనమిచ్చి కొనినవాడును
అతని యింట పుట్టినవాడును అతడు తిను ఆహార
మును తినవచ్చును. । యాజకుని కుమార్తె అన్యుని కియ్య 12
బడినయెడల ఆమె ప్రతిష్ఠితమైనవాటిలో ప్రతిష్ఠార్ప
ణమును తినకూడదు. । యాజకుని కుమార్తెలలో విధవ 13
రాలేకాని విడనాడబడినదేకాని సంతానము లేనియె
డల ఆమె తన బాల్యమందువలె తన తండ్రి యింటికి
తిరిగి చేరి తన తండ్రి ఆహారమును తినవచ్చును గాని
అన్యుడెవడును దాని తినకూడదు. । ఒకడు పొరబా 14
టున ప్రతిష్ఠితమైనదానిని తినినయెడల వాడు ఆ
ప్రతిష్ఠితమైనదానిలో అయిదవవంతు కలిపి దానితో
యాజకునికియ్యవలెను. । ఇశ్రాయేలీయులు ప్రతిష్ఠిత 15
మైనవాటిని తినుటవలన అపరాధమును భరింపకుండు
నట్లు తాము యెహోవాకు ప్రతిష్ఠించు పరిశుద్ధ
ద్రవ్యములను అపవిత్రపరచకూడదు. । నేను వాటిని 16
పరిశుద్ధపరచు యెహోవానని చెప్పుము.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 17
విచ్చెను । — నీవు అహరోనుతోను అతని కుమారుల 18
తోను ఇశ్రాయేలీయులందరితోను ఇట్లు చెప్పుము—
ఇశ్రాయేలీయుల యింటివారిలోనేగాని ఇశ్రాయేలీ
యులలో నివసించు పరదేశులలోనేగాని యెవడు
యెహోవాకు దహనబలిగా స్వేచ్ఛార్పణములనైనను
మ్రొక్కుబళ్లనైనను అర్పించునో । వాడు అంగీకరింప 19
బడునట్లు, గోవులలోనుండియైనను గొఱ్ఱె మేకలలో
నుండియైనను దోషములేని మగదానిని అర్పింపవలెను. ।
దేనికి కళంకముండునో దానిని అర్పింపకూడదు; అది 20
మీ పక్షముగా అంగీకరింపబడదు. । ఒకడు మ్రొక్కు 21
బడిని చెల్లించుటకేగాని స్వేచ్ఛార్పణము అర్పించుటకే
గాని సమాధానబలిరూపముగా గోవునైనను గొఱ్ఱె
నైనను మేకనైనను యెహోవాకు తెచ్చినప్పుడు అది
అంగీకరింపబడునట్లు దోషములేనిదై యుండవలెను;
దానిలో కళంకమేదియు నుండకూడదు. । గుడ్డిదేమి 22
కుంటిదేమి కొరతగలదేమి గడ్డగలదేమి గజ్జిరోగముగల
దేమి చిరుగుడుగలదేమి అట్టివాటిని యెహోవాకు
అర్పింపకూడదు; వాటిలో దేనిని బలిపీఠముమీద
యెహోవాకు హోమము చేయకూడదు. । కురూపి 23
యైన కోడెనైనను గొఱ్ఱె మేకలమందలోనిదానినైనను
స్వేచ్ఛార్పణముగా అర్పింపవచ్చును గాని అది మ్రొక్కు
బడిగా అంగీకరింపబడదు. । విత్తులు నలిపినదానినే
గాని విరిగినదానినేగాని చితికినదానినేగాని కోయ
బడినదానినేగాని యెహోవాకు అర్పింపకూడదు;
మీ దేశములో అట్టికార్యము చేయకూడదు; । పర
దేశి చేతినుండి అట్టివాటిలో దేనిని తీసికొని మీ దేవు
నికి ఆహారముగా అర్పింపకూడదు; అవి లోపము
గలవి, వాటికి కళంకములుండును, అవి మీ పక్షముగా
అంగీకరింపబడవని చెప్పుము.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల

27 విచ్చెను । — దూడయేగాని గొఱ్ఱెపిల్లయేగాని మేక
పిల్లయేగాని పుట్టినప్పుడు అది యేడు దినములు దాని
తల్లితో నుండవలెను. ఎనిమిదవనాడు మొదలుకొని
అది యెహోవాకు హోమముగా అంగీకరింపతగు
28 ను. । అయితే అది ఆవైనను గొఱ్ఱె మేకలలోనిదైనను
మీరు దానిని దాని పిల్లను ఒక్కనాడే వధింపకూడ
29 దు. । మీరు కృతజ్ఞబలియగు పశువును వధించినప్పుడు
అది మీకొరకు అంగీకరింపబడునట్లుగా దానిని అర్పిం
30 పవలెను. । ఆనాడే దాని తినివేయవలెను; మరునాటి
వరకు దానిలో కొంచెమైనను మిగిలింపకూడదు; నేను
31 యెహోవాను. । మీరు నా ఆజ్ఞల ననుసరించి వాటి
ప్రకారము నడుచుకొనవలెను; నేను యెహోవాను. ।
32 నా పరిశుద్ధనామమును అపవిత్రపరచకూడదు, నేను
ఇశ్రాయేలీయులలో నన్ను పరిశుద్ధునిగా చేసికొం
33 దును; । నేను మిమ్మును పరిశుద్ధపరచు యెహోవాను.
నేను మీకు దేవుడనై యుండునట్లు ఐగుప్తుదేశములో
నుండి మిమ్మును రప్పించిన యెహోవానని చెప్పుము.

**23** మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
2 విచ్చెను । — నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము—
మీరు చాటింపవలసిన యెహోవా నియామకకాల
ములు ఇవే; ఈ కాలములయందు మీరు పరిశుద్ధసం
ఘములుగా కూడవలెను; నా నియామకకాలములు
3 ఇవి. । ఆరు దినములు పనిచేయవలెను; వారము వార
ము ఏడవ దినము విశ్రాంతి దినము; అది పరిశుద్ధ
సంఘపు దినము. అందులో మీరు ఏ పనియైనను
చేయకూడదు. మీ సమస్త నివాసములయందు అది
యెహోవా నియమించిన విశ్రాంతి దినము.
4 ఇవి యెహోవా నియామకకాలములు, నియమిం
చిన కాలములనుబట్టి మీరు చాటింపవలసిన పరిశుద్ధ
5 సంఘపు దినములు ఇవి. । మొదటి నెల పదునాలుగవ
దినమున సాయంకాలమందు యెహోవా పస్కా
6 పండుగ జరుగును. । ఆ నెల పదునయిదవ దినమున
యెహోవాకు పొంగని రొట్టెల పండుగ జరుగును;
ఏడు దినములు మీరు పొంగనివాటినే తినవలెను. ।
7 మొదటి దినమున మీరు పరిశుద్ధసంఘముగా కూడ
వలెను. అందులో మీరు జీవనోపాధియైన ఏ పనియు
8 చేయకూడదు. । ఏడు దినములు మీరు యెహోవాకు
హోమార్పణము చేయవలెను. ఏడవ దినమున పరి
శుద్ధసంఘముగా కూడవలెను. అందులో మీరు
జీవనోపాధియైన ఏ పనియు చేయకూడదని వారితో
చెప్పుము.
9 మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
10 విచ్చెను । — నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము —
నేను మీకిచ్చుచున్న దేశమునకు మీరు వచ్చి దాని
పంటను కోయునప్పుడు మీ మొదటి పంటలో ఒక
11 పనను యాజకునియొద్దకు తేవలెను. । యెహోవా
మిమ్ము నంగీకరించునట్లు అతడు యెహోవా సన్నిధిని
ఆ పనను అల్లాడింపవలెను. విశ్రాంతిదినమునకు మరు
దినమున యాజకుడు దానిని అల్లాడింపవలెను. । మీరు 12
ఆ పనను అర్పించుదినమున నిర్దోషమైన యేడాది
పొట్టేలును యెహోవాకు దహనబలిగా అర్పింపవలె
ను. । దాని నైవేద్యము నూనెతో కలిసిన రెండు పది 13
యవ వంతుల గోధుమపిండి. అది యెహోవాకు
ఇంపైన సువాసనగల హోమము. దాని పానార్ప
ణము ముప్పావు ద్రాక్షారసము. । మీరు మీ దేవు 14
నికి అర్పణము తెచ్చువరకు ఆ దినమెల్ల మీరు రొట్టె
యేమి పేలాలేమి పచ్చని వెన్నులేమి తినకూడదు. ఇది
మీ తరతరములకు మీ నివాసస్థలములన్నిటిలో నిత్య
మైన కట్టడ.
మీరు విశ్రాంతిదినమునకు మరునాడు మొదలు 15
కొని, అనగా అల్లాడించు పనను మీరు తెచ్చిన దినము
మొదలుకొని యేడు వారములు లెక్కింపవలెను;
లెక్కకు తక్కువకాకుండ ఏడు వారములు ఉండ
వలెను. । ఏడవ విశ్రాంతిదినపు మరుదినమువరకు మీరు 16
ఏబది దినములు లెక్కించి యెహోవాకు క్రొత్తఫల
ముతో నైవేద్యము అర్పింపవలెను. । మీరు మీ నివాస 17
ములలోనుండి తూములో రెండేసి పదియవవంతుల
పిండిగల రెండు రొట్టెలను అల్లాడించు అర్పణముగా
తేవలెను. వాటిని గోధుమపిండితో చేసి పులియబెట్టి
కాల్చవలెను. అవి యెహోవాకు ప్రథమఫలముల
అర్పణము. । మరియు మీరు ఆ రొట్టెలతో నిర్దోష 18
మైన యేడు ఏడాది మగ గొఱ్ఱెపిల్లలను ఒక కోడె
దూడను రెండు పెద్ద పొట్టేళ్లను అర్పింపవలెను. అవి
వారి నైవేద్యములతోను వారి పానార్పణములతోను
దహనబలియై యెహోవాకు ఇంపైన సువాసనగల
హోమమగును. । అప్పుడు మీరు మేకలలో ఒక 19
పోతును పాపపరిహారార్థబలిగా అర్పించి రెండు
ఏడాది గొఱ్ఱెపిల్లలను సమాధానబలిగా అర్పింపవలెను. ।
యాజకుడు ప్రథమఫలముల రొట్టెలతో వాటిని ఆ 20
రెండు పొట్టేళ్లను యెహోవా సన్నిధిని అల్లాడింప
వలెను. అవి యెహోవాకు ప్రతిష్ఠింపబడినవై యాజ
కునివగును. । ఆనాడే మీరు పరిశుద్ధసంఘముగా కూడ 21
వలెనని చాటింపవలెను. అందులో మీరు జీవనోపాధి
యైన ఏ పనియు చేయకూడదు. ఇది మీ సమస్త
నివాసములలో మీ తరతరములకు నిత్యమైన కట్టడ.
మీరు మీ పంటచేను కోయునప్పుడు నీ పొలము 22
యొక్క ఓరలను పూర్తిగా కోయకూడదు, నీ కోతలో
రాలిన పరిగెను ఏరుకొనకూడదు, బీదలకును పరదేశు
లకును వాటిని విడిచిపెట్టవలెను; నేను మీ దేవుడ
నైన యెహోవాను.
మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 23
విచ్చెను । —నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము — 24

ఏడవ నెలలో మొదటి దినము మీకు విశ్రాంతి
దినము. అందులో జ్ఞాపకార్థశృంగధ్వని వినినప్పుడు
25 మీరు పరిశుద్ధ సంఘముగా కూడవలెను. । అందులో
మీరు జీవనోపాధియైన ఏ పనియుచేయుట మాని
యెహోవాకు హోమము చేయవలెను.
26 మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
27 విచ్చెను । —ఈ యేడవ నెల పదియవ దినము పాపము
నిమిత్తమైన ప్రాయశ్చిత్తార్థ దినము; అందులో మీరు
పరిశుద్ధసంఘముగా కూడవలెను. మిమ్మును మీరు దుఃఖ
పరచుకొని యెహోవాకు హోమము చేయవలె
28 ను. । ఆ దినమున మీరు ఏ పనియు చేయకూడదు;
మీ దేవుడైన యెహోవా సన్నిధిని మీరు మీ
నిమిత్తము ప్రాయశ్చిత్తము చేసికొనుటకై అది ప్రాయ
29 శ్చిత్తార్థ దినము. । ఆ దినమున తన్నుతాను దుఃఖపరచు
కొనని ప్రతివాడు తన ప్రజలలోనుండి కొట్టివేయ
30 బడును. । ఆ దినమున ఏ పనినైనను చేయు ప్రతి
వానిని వాని ప్రజలలోనుండకుండ నాశముచేసెదను. ।
31 అందులో మీరు ఏ పనియు చేయకూడదు. అది
మీ సమస్త నివాసములలో మీ తరతరములకు నిత్య
32 మైన కట్టడ. । అది మీకు మహా విశ్రాంతిదినము,
మిమ్మును మీరు దుఃఖపరచుకొనవలెను. ఆ నెల
తొమ్మిదవనాటి సాయంకాలము మొదలుకొని మరు
సటి సాయంకాలమువరకు మీరు విశ్రాంతిదినముగా
ఆచరింపవలెను.
33 మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
34 విచ్చెను । —నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము—
ఈ యేడవ నెల పదునయిదవ దినము మొదలుకొని
యేడు దినములవరకు యెహోవాకు పర్ణశాలల పండు
35 గను జరుపవలెను. । వాటిలో మొదటి దినమున మీరు
పరిశుద్ధసంఘముగా కూడవలెను. అందులో మీరు
36 జీవనోపాధియైన యే పనియు చేయకూడదు. । ఏడు
దినములు మీరు యెహోవాకు హోమము చేయ
వలెను. ఎనిమిదవ దినమున మీరు పరిశుద్ధసంఘముగా
కూడి యెహోవాకు హోమార్పణము చేయవలెను.
అది మీకు వ్రతదినముగా ఉండును. అందులో
మీరు జీవనోపాధియైన యే పనియు చేయకూడదు.
37 యెహోవా నియమించిన విశ్రాంతి దినములు
గాకయు, మీరు దానములనిచ్చు దినములుగా
కయు, మీ మ్రొక్కుబడి దినములుగాకయు, మీరు
యెహోవాకు స్వేచ్ఛార్పణములనిచ్చు దినములుగా
కయు, యెహోవాకు హోమద్రవ్యమునేమి దహన
బలిద్రవ్యమునేమి నైవేద్యమునేమి బలినేమి పానీయా
ర్పణములనేమి అర్పించుటకై పరిశుద్ధసంఘపు దినము
లుగా మీరు చాటింపవలసిన యెహోవా నియామక
38 కాలములు ఇవి. । ఏ అర్పణదినమున ఆ అర్పణమును
తీసికొని రావలెను.

అయితే ఏడవ నెల పదునయిదవ దినమున మీరు 39
భూమిపంటను కూర్చుకొనగా ఏడు దినములు
యెహోవాకు పండుగ ఆచరింపవలెను. మొదటి దినము
విశ్రాంతిదినము, ఎనిమిదవ దినము విశ్రాంతిదినము. ।
మొదటి దినమున మీరు దబ్బపండ్లను ఈతమట్టలను 40
గొంజి చెట్ల కొమ్మలను కాలువలయొద్దనుండు నిరవంజి
చెట్లను పట్టుకొని యేడుదినములు మీ దేవుడైన
యెహోవా సన్నిధిని ఉత్సహించుచుండవలెను. ।
అట్లు మీరు ఏటేట ఏడు దినములు యెహోవాకు 41
పండుగగా ఆచరింపవలెను. ఇది మీ తరతరములలో
నిత్యమైన కట్టడ. ఏడవ నెలలో దానిని ఆచరింప
వలెను. । నేను ఐగుప్తుదేశములోనుండి ఇశ్రాయేలీయు 42
లను రప్పించినప్పుడు వారిని పర్ణశాలలో నివసింపజేసి
తినని మీ జనులు ఎరుగునట్లు ఏడు దినములు మీరు
పర్ణశాలలలో నివసింపవలెను. ఇశ్రాయేలీయులలో
పుట్టినవారందరు పర్ణశాలలలో నివసింపవలెను. । నేను 43
మీ దేవుడనైన యెహోవాను. । అట్లు మోషే ఇశ్రా 44
యేలీయులకు యెహోవా నియామక కాలములను
తెలియచెప్పెను.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 24
విచ్చెను । —దీపము నిత్యము వెలుగుచుండ చేయు 2
టకై ప్రదీపముకొరకు దంచి తీసిన అచ్చమైన ఒలీవ
నూనెను తేవలెనని ఇశ్రాయేలీయులకు ఆజ్ఞాపించు
ము. । ప్రత్యక్షపు గుడారములో శాసనముల అడ్డతె 3
రకు వెలపల అహరోను సాయంకాలము మొదలుకొని
ఉదయమువరకు అది వెలుగునట్లుగా యెహోవా
సన్నిధిని దాని చక్కపరచవలెను. ఇది మీ తర
తరములకు నిత్యమైన కట్టడ. । అతడు నిర్మలమైన దీప 4
వృక్షముమీద ప్రదీపములను యెహోవా సన్నిధిని
నిత్యము చక్కపరచవలెను.

నీవు గోధుమలపిండిని తీసికొని దానితో పన్నెండు 5
భక్ష్యములను వండవలెను. ఒక్కొక భక్ష్యమున నేరు
సేరు పిండి యుండవలెను. । యెహోవా సన్నిధిని 6
నిర్మలమైన బల్లమీద ఆరేసి భక్ష్యములుగల రెండు
దొంతులుగా వాటిని ఉంచవలెను. । ఒక్కొక దొంతి 7
మీద స్వచ్ఛమైన సాంబ్రాణి ఉంచవలెను. అది
యెహోవాయెదుట మీ ఆహారమునకు జ్ఞాపకార్థ
మైన హోమముగా ఉండును. । యాజకుడు ప్రతి 8
విశ్రాంతిదినమున నిత్యనిబంధననుబట్టి ఇశ్రాయేలీయుల
యొద్ద దాని తీసికొని నిత్యము యెహోవా సన్నిధిని
చక్కపరచవలెను. । అది అహరోనుకును అతని సంత 9
తివారికిని ఉండవలెను. వారు పరిశుద్ధస్థలములో దాని
తినవలెను. నిత్యమైన కట్టడచొప్పున యెహోవాకు
చేయు హోమములలో అది అతిపరిశుద్ధము.

ఇశ్రాయేలీయురాలగు ఒక స్త్రీకిని ఐగుప్తీయుడగు 10
ఒక పురుషునికిని పుట్టినవాడొకడు ఇశ్రాయేలీయుల

11 మధ్యకు వచ్చెను. । ఆ ఇశ్రాయేలీయురాలి కుమారుని
కిని ఒక ఇశ్రాయేలీయునికిని పాలెములో పోరుపడగా
ఆ ఇశ్రాయేలీయురాలి కుమారుడు (యెహోవా)
నామమును దూషించి శపింపగా జనులు మోషే
యొద్దకు వాని తీసికొనివచ్చిరి. వాని తల్లిపేరు షెలో
మీతు; ఆమె దాను గోత్రికుడైన దిబ్రీకుమార్తె. ।
12 యెహోవా యేమి సెలవిచ్చునో తెలిసికొనువరకు
వానిని కావలిలో ఉంచిరి.
13 అప్పుడు యెహోవా మోషేకు ఈలాగు సెల
14 విచ్చెను । —శపించినవానిని పాలెము వెలపలికి తీసి
కొనిరమ్ము; వాని శాపవచనమును వినినవారందరు వాని
తలమీద తమ చేతులుంచిన తరువాత సర్వసమాజము
15 రాళ్లతో వాని చావగొట్టవలెను. । మరియు నీవు
ఇశ్రాయేలీయులతో ఇట్లనుము—తన దేవుని శపించు
16 వాడు తన పాపశిక్షను భరింపవలెను; । యెహోవా
నామమును దూషించువాడు మరణశిక్ష నొందవలెను;
సర్వసమాజము రాళ్లతో అట్టివానిని చావగొట్టవలెను.
పరదేశియేగాని స్వదేశియేగాని నామమును దూషిం
17 చినయెడల వానికి మరణశిక్ష విధింపవలెను. । ఎవడై
నను ఒకనిని ప్రాణహత్యచేసినయెడల వానికి మరణ
18 శిక్ష విధింపవలెను. । జంతు ప్రాణహత్య చేసిన
వాడు ప్రాణమునకు ప్రాణమిచ్చి దాని నష్టము
19 పెట్టుకొనవలెను. । ఒకడు తన పొరుగువానికి కళం
కము కలుగజేసినయెడల వాడు చేసినట్లు వానికి చేయ
20 వలెను. । విరుగగొట్టబడిన దాని విషయములో విరుగ
గొట్టబడుటయే శిక్ష. కంటికి కన్ను పంటికి పల్లు
చెల్లవలెను. వాడు ఒకనికి కళంకము కలుగజేసినందున
21 వానికి కళంకము కలుగజేయవలెను. । జంతువును చావ
గొట్టినవాడు దాని నష్టము నిచ్చుకొనవలెను. నరహత్య
22 చేసినవానికి మరణశిక్ష విధింపవలెను. । మీరు పక్ష
పాతములేక తీర్పుతీర్చవలెను. మీలోనున్న పరదేశికి
మీరు చేసినట్లు మీ స్వదేశికిని చేయవలెను. నేను
మీ దేవుడనైన యెహోవానని వారితో చెప్పుము. ।
23 కాబట్టి మోషే ఇశ్రాయేలీయులతో ఈలాగు చెప్పె
ను—శపించినవానిని పాలెము వెలపలికి తీసికొనిపోయి
రాళ్లతో వాని చావగొట్టవలెను. యెహోవా మో
షేకు ఆజ్ఞాపించినట్లు ఇశ్రాయేలీయులు చేసిరి.

**25** మరియు యెహోవా సీనాయికొండమీద మో
2 షేకు ఈలాగు సెలవిచ్చెను । — నీవు ఇశ్రాయేలీయు
లతో ఇట్లనుము—నేను మీకిచ్చుచున్న దేశములోకి
మీరు వచ్చిన తరువాత ఆ భూమికూడ యెహోవా
3 పేరట విశ్రాంతికాలమును, ఆచరింపవలెను. । ఆరు
సంవత్సరములు నీ చేను విత్తవలెను. ఆరు సంవత్సరములు
నీ ఫలవృక్షములతోటను బద్దించి దాని ఫలములను
4 కూర్చుకొనవచ్చును. । ఏడవ సంవత్సరము భూమికి
మహా విశ్రాంతికాలము, అనగా యెహోవా పేరట
విశ్రాంతి సంవత్సరముగా ఉండవలెను. అందులో నీ
చేను విత్తకూడదు; నీ ఫలవృక్షములతోటను శుద్ధిపరచ
కూడదు. । నీ కారుచేలపంటను కోసికొనకూడదు, 5
శుద్ధిపరచని నీ వృక్షఫలములను ఏరుకొనకూడదు; అది
భూమికి విశ్రాంతి సంవత్సరము. । అప్పుడు భూమి 6
యొక్క విశ్రాంతి సంవత్సర సస్యము నీకును నీ దాసుని
కిని నీ దాసికిని నీ జీతగానికిని నీతో నివసించు పరదేశి
కిని ఆహారమగును. । మరియు నీ పశువులకును నీ దేశ 7
జంతువులకును దాని పంట అంతయు మేతగా ఉం
డును.

మరియు ఏడు విశ్రాంతి సంవత్సరములను, అనగా 8
ఏడేసియేండ్లుగల సంవత్సరములను లెక్కింపవలెను. ఆ
యేడు విశ్రాంతి సంవత్సరములకాలము నలుబది
తొమ్మిది సంవత్సరములగును. । ఏడవ నెల పదియవ 9
నాడు మీ స్వదేశమంతట శృంగనాదము చేయవలెను.
ప్రాయశ్చిత్తార్థదినమున మీ దేశమంతట ఆ శృంగ
నాదము చేయవలెను. । మీరు ఆ సంవత్సరమును, అన 10
గా ఏబదియవ సంవత్సరమును పరిశుద్ధపరచి మీ దేశ
వాసులకందరికి విడుదల కలిగినదని చాటింపవలెను;
అది మీకు సునాదముగానుండును; అప్పుడు మీలో
ప్రతివాడు తన స్వాస్థ్యమును తిరిగి పొందవలెను; ప్రతి
వాడు తన కుటుంబమునకు తిరిగి రావలెను. । ఆ సం 11
వత్సరము, అనగా ఏబదియవ సంవత్సరము మీకు
సునాదకాలము. అందులో మీరు విత్తకూడదు కారు
పంటను కోయకూడదు శుద్ధిపరచని నీ ఫలవృక్షముల
పండ్లను ఏరుకొనకూడదు. । అది సునాదకాలము; అది 12
మీకు పరిశుద్ధమగును; పొలములో దానంతట అదే
పండిన పంటను మీరు తినెదరు. । ఆ సునాద సంవ 13
త్సరమున మీలో ప్రతివాడు తన స్వాస్థ్యమును మరల
పొందవలెను. । నీవు నీ పొరుగువానికి వెలకు ఇచ్చిన 14
దేని విషయములోకాని నీ పొరుగువానిదగ్గర నీవు
కొనిన దేని విషయములోకాని మీరు ఒకరినొకరు
బాధింపకూడదు. । సునాద సంవత్సరమైన తరువాత 15
గడచిన యేండ్ల లెక్కచొప్పున నీ పొరుగువానియొద్ద
నీవు దానిని కొనవలెను. పంటల లెక్కచొప్పున
అతడు నీకు దానిని అమ్మవలెను. । ఆ సంవత్సరముల 16
లెక్క హెచ్చినకొలది దాని వెల హెచ్చింపవలెను,
ఆ సంవత్సరముల లెక్క తగ్గినకొలది దాని వెల తగ్గిం
పవలెను. ఏలయనగా పంటల లెక్కచొప్పున అతడు
దాని నీకు అమ్మెనుగదా. । మీరు ఒకరినొకరు బాధిం 17
పక నీ దేవునికి భయపడవలెను. నేను మీ దేవుడనైన
యెహోవాను. । కాబట్టి మీరు నా కట్టడలను నా 18
విధులను గైకొని వాటి ననుసరించి నడుచుకొనవలెను. ।
అప్పుడు మీరు ఆ దేశములో సురక్షితముగా నివసిం 19
చెదరు, ఆ భూమి ఫలించును. మీరు తృప్తిగా భుజించి
దానిలో సురక్షితముగా నివసించెదరు. । ఏడవ యేట 20

30 కుమార్తెల మాంసమును తినెదరు. । నేను మీ యున్నత
స్థలములను పాడుచేసెదను; మీ విగ్రహములను పడ
గొట్టెదను, మీ బొమ్మల పీనుగులమీద మీ పీనుగులను
31 పడవేయించెదను. । నా మనస్సు మీయందు అసహ్య
పడును, నేను మీ పట్టణములను పాడుచేసెదను;
మీ పరిశుద్ధస్థలములను పాడుచేసెదను; మీ సువా
32 సనగల వాటి సువాసనను ఆఘ్రాణింపను. । నేను
మీ దేశమును పాడుచేసిన తరువాత దానిలో కాపుర
ముండు మీ శత్రువులు దాని చూచి ఆశ్చర్యపడె
33 దరు. । జనములలోనికి మిమ్మును చెదరగొట్టి మీ
వెంట కత్తి దూసెదను, మీ దేశము పాడైపోవును,
34 మీ పట్టణములు పాడుపడును. । మీరు మీ శత్రు
వుల దేశములో ఉండగా మీ దేశము పాడైయున్న
దినములన్నియు అది తన విశ్రాంతికాలములను అను
35 భవించును. । అది పాడైయుండు దినములన్నియు అది
విశ్రమించును. మీరు దానిలో నివసించినప్పుడు అది
విశ్రాంతికాలములో పొందకపోయిన విశ్రాంతిని అది
36 పాడైయుండు దినములలో అనుభవించును. । మీలో
మిగిలినవారు తమ శత్రువుల దేశములలో ఉండగా
వారి హృదయములలో అధైర్యము పుట్టించెదను;
కొట్టుకొని పోవుచున్న ఆకు చప్పుడు వారిని తరు
మును, ఖడ్గము ఎదుటనుండి పారిపోవునట్లు వారు ఆ
చప్పుడు విని పారిపోయెదరు; తరుమువాడు లేకయే
37 పడెదరు. । తరుమువాడు లేకయే వారు ఖడ్గమును
చూచినట్టుగా ఒకనిమీద నొకడు పడెదరు. మీ
శత్రువులయెదుట మీరు నిలువలేకపోయెదరు. ।
38 మీరు జనముగానుండక నశించెదరు; మీ శత్రువుల
39 దేశము మిమ్మును తినివేయును. । మీలో మిగిలినవారు
మీ శత్రువుల దేశములలో తమ దోషములనుబట్టి
క్షీణించిపోయెదరు. మరియు వారు తమమీదికి
వచ్చిన తమ తండ్రుల దోషములనుబట్టి క్షీణించి
40 పోయెదరు. । వారు నాకు విరోధముగా చేసిన తిరుగ
బాటును తమ దోషమును తమ తండ్రుల దోషమును
ఒప్పుకొని, తాము నాకు విరోధముగా నడిచితిమని
41 యు । నేను తమకు విరోధముగా నడిచితిననియు, తమ
శత్రువుల దేశములోకి తమ్మును రప్పించితిననియు,
ఒప్పుకొనినయెడల, అనగా లోబడని తమ హృదయ
ములు లొంగి తాము చేసిన దోషమునకు ప్రతిదండ
42 నను అనుభవించితిమని ఒప్పుకొనినయెడల, । నేను
యాకోబుతో చేసిన నా నిబంధనను జ్ఞాపకము చేసి
కొందును; నేను ఇస్సాకుతో చేసిన నా నిబంధనను
నేను అబ్రాహాముతో చేసిన నా నిబంధనను జ్ఞాప
కము చేసికొందును; ఆ దేశమునుకూడ జ్ఞాపకము
43 చేసికొందును. । వారిచేత విడువబడి వారు లేనప్పుడు
పాడైపోయిన వారిదేశము తన విశ్రాంతిదినములను
అనుభవించును. వారు నా తీర్పులను తిరస్కరించి
నా కట్టడలను అసహ్యించుకొనిరి. ఆ హేతువుచేతనే
వారు తమ దోషశిక్ష న్యాయమని ఒప్పుకొందురు. ।
అయితే వారు తమ శత్రువుల దేశములో ఉన్న 44
ప్పుడు వారిని నిరాకరింపను; నా నిబంధనను భంగ
పరచి వారిని కేవలము నశింపజేయునట్లు వారియందు
అసహ్యపడను. ఏలయనగా నేను వారి దేవుడనైన
యెహోవాను. । నేను వారికి దేవుడనైయుండునట్లు 45
వారి పూర్వికులను జనములయెదుట ఐగుప్తులోనుండి
రప్పించి వారితో చేసిన నిబంధనను ఆ పూర్వికులను
బట్టి జ్ఞాపకము చేసికొందును. నేను యెహోవాను
అని చెప్పుము.

యెహోవా మోషేద్వారా సీనాయికొండమీద 46
తనకును ఇశ్రాయేలీయులకును మధ్య నియమించిన
కట్టడలును తీర్పులును ఆజ్ఞలును ఇవే.

**మరియు** యెహోవా మోషేకు ఈలాగు సెల 27
విచ్చెను । — నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము— 2
ఒకడు విశేషమైన మ్రొక్కుబడి చేసినయెడల నీవు
నిర్ణయించిన వెలచొప్పున వారు యెహోవాకు దాని
చెల్లింపవలెను. । నీవు నిర్ణయింపవలసిన వెల యేదనగా, 3
ఇరువది ఏండ్లు మొదలుకొని అరువది ఏండ్ల వయస్సు
వరకు మగవానికి పరిశుద్ధస్థలముయొక్క తులమువంటి
యేబది తులముల వెండి నిర్ణయింపవలెను. । ఆడు 4
దానికి ముప్పది తులములు నిర్ణయింపవలెను. । అయి 5
దేండ్లు మొదలుకొని యిరువది ఏండ్లలోపలి వయస్సు
గల మగవానికి ఇరువది తులముల వెలను, ఆడుదానికి
పది తులముల వెలను నిర్ణయింపవలెను. । ఒక నెల 6
మొదలుకొని అయిదేండ్లలోపలి వయస్సుగల మగ
వానికి అయిదు తులముల వెండి వెలను ఆడుదానికి
మూడు తులముల వెండి వెలను నిర్ణయింపవలెను. । 7
అరువది ఏండ్ల ప్రాయముదాటిన మగవానికి పది
హేను తులముల వెలను ఆడుదానికి పది తులముల
వెలను నిర్ణయింపవలెను. । ఒకడు నీవు నిర్ణయించిన 8
వెలను చెల్లింపలేనంత బీదవాడైనయెడల అతడు యాజ
కునియెదుట నిలువవలెను; అప్పుడు యాజకుడు అతని
వెలను నిర్ణయించును. మ్రొక్కుకొనినవాని కలిమి
చొప్పున వానికి వెలను నిర్ణయింపవలెను.

యెహోవాకు అర్పణముగా అర్పించు పశువు 9
లలో ప్రతిదానిని యెహోవాకు ప్రతిష్ఠితముగా
ఎంచవలెను. । అట్టిదానిని మార్చకూడదు; చెడ్డదానికి 10
ప్రతిగా మంచిదానినైనను మంచిదానికి ప్రతిగా చెడ్డ
దానినైనను, ఒకదానికి ప్రతిగా వేరొకదానిని ఇయ్య
కూడదు. పశువుకు పశువును మార్చిన పక్షమందు
అదియు దానికి మారుగా ఇచ్చినదియు ప్రతిష్ఠిత
మగును. । జనులు యెహోవాకు అర్పింపకూడని 11
అపవిత్ర జంతువులలో ఒకదానిని తెచ్చినయెడల ఆ
జంతువును యాజకుని యెదుట నిలువబెట్టవలెను.

12 అది మంచిదైతేనేమి చెడ్డదైతేనేమి యాజకుడు దాని
వెలను నిర్ణయింపవలెను; యాజకుడవగు నీవు నిర్ణయిం
13 చిన వెల స్థిరమగును. । అయితే ఒకడు అట్టిదానిని
విడిపింపగోరినయెడల నీవు నిర్ణయించిన వెలలో అయి
దవవంతు దానితో కలుపవలెను.

14 ఒకడు తన యిల్లు యెహోవాకు ప్రతిష్ఠితమగు
టకై దానిని ప్రతిష్ఠించినయెడల అది మంచిదైనను
చెడ్డదైనను యాజకుడు దాని వెలను నిర్ణయింపవలెను;
15 యాజకుడు నిర్ణయించిన వెల స్థిరమగును. । తన యిల్లు
ప్రతిష్ఠించినవాడు దాని విడిపింపగోరినయెడల అతడు
నీవు నిర్ణయించిన వెలలో అయిదవవంతు దానితో
కలుపవలెను; అప్పుడు ఆ యిల్లు అతనిదగును.

16 ఒకడు తన పిత్రార్జితమైన పొలములో కొంత
యెహోవాకు ప్రతిష్ఠించినయెడల దాని చల్లబడు
విత్తనముల కొలచొప్పున దాని వెలను నిర్ణయింపవలెను.
పందుము యవల విత్తనములు ఏబది తులముల వెండి
17 వెలగలది. । అతడు సునాదసంవత్సరము మొదలు
కొని తన పొలమును ప్రతిష్ఠించినయెడల నీవు నిర్ణ
18 యించు వెల స్థిరము. । సునాదసంవత్సరమైన తరు
వాత ఒకడు తన పొలమును ప్రతిష్ఠించినయెడల
యాజకుడు మిగిలిన సంవత్సరముల లెక్కచొప్పున,
అనగా మరుసటి సునాదసంవత్సరమువరకు వానికి
వెలను నిర్ణయింపవలెను. నీవు నిర్ణయించిన వెలలో
19 దాని వారడి తగ్గింపవలెను. । పొలమును ప్రతిష్ఠించిన
వాడు దాని విడిపింపగోరినయెడల నీవు నిర్ణయించిన
వెలలో అయిదవ వంతును అతడు దానితో కలుప
20 వలెను. అప్పుడు అది అతనిదగును. । అతడు ఆ పొల
మును విడిపింపనియెడలను వేరొకనికి దాని అమ్మిన
యెడలను మరి ఎన్నటికిని దాని విడిపింప వీలుకాదు. ।
21 ఆ పొలము సునాదసంవత్సరమున విడుదలకాగా
అది ప్రతిష్ఠించిన పొలమువలె యెహోవాకు ప్రతి
22 ష్ఠితమగును; ఆ స్వాస్థ్యము యాజకునిదగును. । ఒకడు
తాను కొనిన పొలమును, అనగా తన స్వాస్థ్యములో
చేరనిదానిని యెహోవాకు ప్రతిష్ఠించినయెడల ।
23 యాజకుడు సునాదసంవత్సరమువరకు నిర్ణయించిన
వెలచొప్పున అతనికి నియమింపవలెను. ఆ దినమందే
నీవు నిర్ణయించిన వెల మేర చొప్పున యెహోవాకు
ప్రతిష్ఠితముగా దాని చెల్లింపవలెను. । సునాదసంవ 24
త్సరమున ఆ భూమి యెవని పిత్రార్జితమైనదో వానికి,
అనగా ఆ పొలమును అమ్మినవానికి అది తిరిగి రావ
లెను. । నీ వెలలన్నియు పరిశుద్ధస్థలముయొక్క వెల 25
చొప్పున నిర్ణయింపవలెను. ఒక తులము ఇరువది
చిన్నములు.

అయితే జంతువులలో తొలిపిల్ల యెహోవాది 26
గనుక యెవడును దాని ప్రతిష్ఠింపకూడదు; అది
ఎద్దయిననేమి గొఱ్ఱమేకల మందలోనిదైననేమి
యెహోవాదగును. । అది అపవిత్రజంతువైనయెడల 27
వాడు నీవు నిర్ణయించు వెలలో అయిదవ వంతు దానితో
కలిపి దాని విడిపింపవచ్చును. దాని విడిపింపనియెడల
నీవు నిర్ణయించిన వెలకు దాని అమ్మవలెను.

అయితే మనుష్యులలోగాని జంతువులలోగాని 28
స్వాస్థ్యమైన పొలములలోగాని తనకు కలిగినవాటన్ని
టిలో దేనినైనను ఒకడు యెహోవాకు ప్రతిష్ఠించిన
యెడల ప్రతిష్ఠించినదానిని అమ్మకూడదు, విడిపింపను
కూడదు, ప్రతిష్ఠించిన సమస్తము యెహోవాకు అతి
పరిశుద్ధముగా ఉండును. । మనుష్యులు ప్రతిష్ఠించు 29
వాటిలో దేనినైనను విడిపింపక హతము చేయవలెను.

భూధాన్యములలోనేమి వృక్షఫలములలోనేమి 30
భూఫలములన్నిటిలో దశమభాగము యెహోవా
సొమ్ము; అది యెహోవాకు ప్రతిష్ఠితమగును. । ఒకడు 31
తాను చెల్లింపవలసిన దశమభాగములలో దేనినైనను
విడిపింపగోరినయెడల దానిలో అయిదవ వంతును
దానితో కలుపవలెను. । గోవులలోనేగాని గొఱ్ఱ 32
మేకలలోనేగాని కోలక్రింద నడుచు నన్నిటిలో
దశమభాగము యెహోవాకు ప్రతిష్ఠితమగును. ।
అది మంచిదో చెడ్డదో పరిశోధింపకూడదు, దాని 33
మార్చకూడదు, దాని మార్చిన పక్షమందు అదియు
దానికి మారుగా నిచ్చినదియు ప్రతిష్ఠితములగును;
అట్టిదాని విడిపింపకూడదని చెప్పుము.

ఇవి యెహోవా సీనాయికొండమీద ఇశ్రాయే 34
లీయులకు మోషేచేత ఇప్పించిన ఆజ్ఞలు.

# సంఖ్యాకాండము

1 వారు ఐగుప్తుదేశమునుండి బయలువెళ్లిన రెండవ
సంవత్సరము రెండవ నెల మొదటి తేదిని, సీనాయి అర
ణ్యమందలి ప్రత్యక్షపు గుడారములో యెహోవా
2 మోషేతో ఇట్లనెను । — ఇశ్రాయేలీయుల వంశముల
చొప్పున వారి వారి పితరుల కుటుంబములనుబట్టి
వారి వారి తలలచొప్పున మగవారినందరిని లెక్కించి
3 సర్వసమాజసంఖ్యను వ్రాయించుము. । ఇశ్రాయేలీ
యులలో సైన్యముగా వెళ్లువారిని, అనగా ఇరువది
యేండ్లు మొదలుకొని పైప్రాయముగలవారిని, తమ
తమ సేనలనుబట్టి నీవును అహరోనును లెక్కింపవలె
4 ను. । మరియు ప్రతి గోత్రములో ఒకడు, అనగా
తన పితరుల కుటుంబములో ముఖ్యుడు, మీతోకూడ
5 ఉండవలెను. । మీతోకూడ ఉండవలసినవారి పేళ్లు
ఏవేవనగా — రూబేను గోత్రములో షెదేయూరు
6 కుమారుడైన ఏలీసూరు; । షిమ్యోను గోత్రములో
7 సూరీషదాయి కుమారుడైన షెలుమీయేలు । యూదా
గోత్రములో అమ్మీనాదాబు కుమారుడైన నయస్సో
8 ను । ఇశ్శాఖారు గోత్రములో సూయారు కుమారు
9 డైన నెతనేలు । జెబులూను గోత్రములో హేలోను
10 కుమారుడైన ఏలీయాబు । యోసేపు సంతానమందు,
అనగా ఎఫ్రాయిము గోత్రములో అమీహూదు
కుమారుడైన ఎలీషామాయు; మనష్షే గోత్రములో
11 పెదాసూరు కుమారుడైన గమలీయేలు । బెన్యామీను
12 గోత్రములో గిద్యోనీ కుమారుడైన అబీదాను । దాను
గోత్రములో అమీషదాయి కుమారుడైన అహీయె
13 జెరు । ఆషేరు గోత్రములో ఒక్రాను కుమారుడైన
14 పగీయేలు । గాదు గోత్రములో దెయూవేలు కుమా
15 రుడైన ఎలాసాపు । నఫ్తాలి గోత్రములో ఏనాను
16 కుమారుడైన అహీర అనునవి. । వీరు సమాజములో
పేరుపడినవారు. వీరు తమ తమ పితరుల గోత్రము
లలో ప్రధానులును ఇశ్రాయేలీయుల కుటుంబములకు
17 పెద్దలును. । పేళ్లచేత వివరింపబడిన ఆ మనుష్యులను
మోషే అహరోనులు పిలుచుకొని రెండవ నెల మొదటి
18 తేదిని సర్వసమాజమును కూర్చెను. । ఇరువది ఏండ్లు
మొదలుకొని పైప్రాయము గలవారు తమ తమ వంశా
వళులనుబట్టి తమ తమ వంశములను తమ తమ పితరుల
కుటుంబములను తమ తమ పెద్దల సంఖ్యను తెలియ
19 చెప్పగా । యెహోవా అతనికి ఆజ్ఞాపించినట్లు సీనా
యి అరణ్యములో మోషేవారిని లెక్కించెను.
20 ఇశ్రాయేలు ప్రథమ కుమారుడైన రూబేను
పుత్రుల వంశావళి. తమ తమ వంశములలో తమ తమ
పితరుల కుటుంబములలో ఇరువది యేండ్లు మొదలు
కొని పైప్రాయము కలిగి సేనగా వెళ్లువారందరి సం
ఖ్యను తెలియచెప్పగా రూబేను గోత్రములో లెక్కిం
పబడినవారు నలుబది యారువేల ఏనూరుమంది యైరి

షిమ్యోను పుత్రుల వంశావళి. । తమ తమ వంశ 21
ములలో తమ తమ పితరుల కుటుంబములలో ఇరువది 22
యేండ్లు మొదలుకొని పైప్రాయము కలిగి సేనగా
వెళ్లువారందరి పెద్దల సంఖ్యను తెలియచెప్పగా ।
షిమ్యోను గోత్రములో లెక్కింపబడినవారు ఏబది 23
తొమ్మిదివేల మున్నూరుమంది యైరి.

గాదు పుత్రుల వంశావళి. తమ తమ వంశము 24
లలో తమ తమ పితరుల కుటుంబములలో ఇరువది
యేండ్లు మొదలుకొని పైప్రాయము కలిగి సేనగా
వెళ్లువారందరి సంఖ్యను తెలియచెప్పగా । గాదు 25
గోత్రములో లెక్కింపబడినవారు నలుబది యయిదు
వేల ఆరున్నూట ఏబదిమంది యైరి.

యూదా పుత్రుల వంశావళి. తమ తమ వంశము 26
లలో తమ తమ పితరుల కుటుంబములలో ఇరువది
యేండ్లు మొదలుకొని పైప్రాయము కలిగి సేనగా
వెళ్లువారందరి సంఖ్యను తెలియచెప్పగా । యూదా 27
గోత్రములో లెక్కింపబడినవారు డెబ్బది నాలుగువేల
ఆరున్నూరుమంది యైరి.

ఇశ్శాఖారు పుత్రుల వంశావళి. తమ తమ వంశ 28
ములలో తమ తమ పితరుల కుటుంబములలో ఇరువది
యేండ్లు మొదలుకొని పైప్రాయము కలిగి సేనగా
వెళ్లువారందరి సంఖ్యను తెలియచెప్పగా । ఇశ్శాఖారు 29
గోత్రములో లెక్కింపబడినవారు ఏబది నాలుగువేల
నన్నూరుమంది యైరి.

జెబులూను పుత్రుల వంశావళి. తమ తమ వంశ 30
ములలో తమ తమ పితరుల కుటుంబములలో ఇరువది
యేండ్లు మొదలుకొని పైప్రాయము కలిగి సేనగా
వెళ్లువారందరి సంఖ్యను తెలియచెప్పగా । జెబులూను 31
గోత్రములో లెక్కింపబడినవారు ఏబది యేడువేల
నన్నూరుమంది యైరి.

యోసేపు పుత్రుల వంశావళి, అనగా ఎఫ్రాయిము 32
పుత్రుల వంశావళి. తమ తమ వంశములలో తమ తమ
పితరుల కుటుంబములలో ఇరువది యేండ్లు మొదలుకొని
పైప్రాయము కలిగి సేనగా వెళ్లువారందరి సంఖ్యను

తెలియచెప్పగా। యోసేపు గోత్రములో లెక్కింప
బడినవారు నలుబదివేల ఏనూరుమంది యైరి.

మనష్షే పుత్రుల వంశావళి. తమ తమ వంశము
లలో తమ తమ పితరుల కుటుంబములలో ఇరువది
యేండ్లు మొదలుకొని పైప్రాయము కలిగి సేనగా
వెళ్లువారందరి సంఖ్యను తెలియచెప్పగా। మనష్షే
గోత్రములో లెక్కింపబడినవారు ముప్పది రెండువేల
ఇన్నూరుమంది యైరి.

బెన్యామీను పుత్రుల వంశావళి. తమ తమ వంశ
ములలో తమ తమ పితరుల కుటుంబములలో ఇరువది
యేండ్లు మొదలుకొని పైప్రాయము కలిగి సేనగా వెళ్లు
వారందరి సంఖ్యను తెలియచెప్పగా। బెన్యామీను
గోత్రములో లెక్కింపబడినవారు ముప్పది యైదువేల
నన్నూరుమంది యైరి.

దాను పుత్రుల వంశావళి. తమ తమ వంశములలో
తమ తమ పితరుల కుటుంబములలో ఇరువది యేండ్లు
మొదలుకొని పైప్రాయము కలిగి సేనగా వెళ్లువారం
దరి సంఖ్యను తెలియచెప్పగా। దాను గోత్రములో
లెక్కింపబడినవారు అరువది రెండువేల ఏడ్నూరుమంది
యైరి.

ఆషేరు పుత్రుల వంశావళి. తమ తమ వంశము
లలో తమ తమ పితరుల కుటుంబములలో ఇరువది
యేండ్లు మొదలుకొని పైప్రాయము కలిగి సేనగా
వెళ్లువారందరి సంఖ్యను తెలియచెప్పగా। ఆషేరు
గోత్రములో లెక్కింపబడినవారు నలుబది యొకవేయి
యేనూరుమంది యైరి.

నఫ్తాలి పుత్రుల వంశావళి. తమ తమ వంశము
లలో తమ తమ పితరుల కుటుంబములలో ఇరువది
యేండ్లు మొదలుకొని పైప్రాయము కలిగి సేనగా
వెళ్లువారందరి సంఖ్యను తెలియచెప్పగా। నఫ్తాలి
గోత్రములో లెక్కింపబడినవారు ఏబది మూడువేల
నన్నూరుమంది యైరి.

వీరు లెక్కింపబడినవారు, అనగా మోషేయు
అహరోనును తమ తమ పితరుల కుటుంబములను బట్టి,
ఒక్కొక్కడుగా ఏర్పడిన ప్రధానులును లెక్కించిన
వారు. । అట్లు ఇశ్రాయేలీయులలో తమ తమ పితరుల
కుటుంబములచొప్పున లెక్కింపబడినవారందరు, అన
గా ఇరువది యేండ్లు మొదలుకొని పైప్రాయము కలిగి
సేనగా బయలు వెళ్లిన ఇశ్రాయేలీయులందరు। లెక్కిం
పబడి ఆరులక్షల మూడువేల ఏనూట ఏబదిమంది
యైరి.

అయితే లేవీయులు తమ పితరుల గోత్రము
చొప్పున వారితోపాటు లెక్కింపబడలేదు. । ఏలయ
నగా యెహోవా మోషేతో ఈలాగు సెలవిచ్చి
యుండెను—నీవు లేవిగోత్రమును లెక్కింపకూడదు.।
ఇశ్రాయేలీయుల మొత్తమునకు వారి మొత్తమును చేర్ప
కూడదు. । నీవు సాక్ష్యపు గుడారముమీదను దాని 50
ఉపకరణములన్నిటిమీదను దానిలో చేరినవాటన్నిటి
మీదను లేవీయులను నియమింపుము. వారే మందిర
మును దాని ఉపకరణములన్నిటిని మోయవలెను. వారు
మందిరపు సేవచేయుచు దానిచుట్టు దిగవలసినవారై
యుందురు. । మందిరము సాగబోవునప్పుడు లేవీయులే 51
దాని విప్పవలెను, మందిరము దిగునప్పుడు లేవీయులే
దాని వేయవలెను. అన్యుడు సమీపించినయెడల వాడు
మరణశిక్ష నొందును. । ఇశ్రాయేలీయులు తమ తమ 52
సేనలచొప్పున ప్రతివాడును తన తన పాలెములో
తన తన ధ్వజము నొద్ద దిగవలెను. । ఇశ్రాయేలీయుల 53
సమాజముమీద కోపము రాకుండునట్లు లేవీయులు
సాక్ష్యపు గుడారము చుట్టు దిగవలెను; వారు సా
క్ష్యపు గుడారమును కాపాడవలెను. । యెహోవా 54
మోషేకు ఆజ్ఞాపించిన వాటన్నిటిని తప్పకుండ ఇశ్రా
యేలీయులు చేసిరి.

మరియు యెహోవా మోషే అహరోనులకు **2**
ఈలాగు సెలవిచ్చెను. । ఇశ్రాయేలీయులందరు తమ 2
తమ పితరుల కుటుంబముల లెక్కములను పట్టుకొని
తమ తమ ధ్వజమునొద్ద దిగవలెను, వారు ప్రత్యక్షపు
గుడారమునకెదురుగా దానిచుట్టు దిగవలెను. । సూ 3
ర్యుడు ఉదయించు తూర్పుదిక్కున యూదా పాలెపు
ధ్వజముగలవారు తమ తమ సేనలచొప్పున దిగవలెను.
అమ్మీనాదాబు కుమారుడైన నయస్సోను యూదా
కుమారులకు ప్రధానుడు. । అతని సేన, అనగా అతని 4
వారిలో లెక్కింపబడిన పురుషులు డెబ్బదినాలుగువేల
ఆర్నూరుమంది. । అతని సమీపమున ఇశ్శాఖారు 5
గోత్రికులు దిగవలెను. సూయారు కుమారుడైన నెత
నేలు ఇశ్శాఖారు కుమారులకు ప్రధానుడు. । అతని 6
సేన, అనగా అతనివారిలో లెక్కింపబడిన పురుషులు
ఏబది నాలుగువేల నన్నూరుమంది. । అతని సమీప 7
మున జెబులూను గోత్రికులుండవలెను. హేలోను
కుమారుడైన ఏలీయాబు జెబులూనీయులకు ప్రధా
నుడు. । అతని సేన, అనగా అతనివారిలో లెక్కింప 8
బడినవారు ఏబది యేడువేల నన్నూరుమంది.।యూదా 9
పాలెములో లెక్కింపబడినవారందరు వారి సేనలచొ
ప్పున లక్ష యెనుబది యారువేల నన్నూరుమంది. వారు
ముందర సాగి నడవవలెను.

రూబేను పాలెపు ధ్వజము వారి సేనలచొప్పున 10
దక్షిణదిక్కున ఉండవలెను. షెదేయూరు కుమారు
డైన ఏలీసూరు రూబేను కుమారులకు ప్రధానుడు. ।
అతని సేన, అనగా అతనివారిలో లెక్కింపబడినవారు 11
నలుబది యారువేల ఏనూరుమంది. । అతని సమీప 12
మున షిమ్యోను గోత్రికులు దిగవలెను. సూరీషదాయి
కుమారుడైన షెలుమీయేలు షిమ్యోను కుమారులకు
ప్రధానుడు. । అతని సేన, అనగా అతనివారిలో 13

లెక్కింపబడినవారు ఏబది తొమ్మిదివేల మున్నూరు
14 మంది. । అతని సమీపమున గాదుగోత్రముండవలెను.
రూయేలు కుమారుడైన ఎలీయాసాపు గాదు కుమారు
15 లకు ప్రధానుడు. । అతని సేన, అనగా అతనివారిలో
లెక్కింపబడినవారు నలుబదియయిదు వేల ఆరున్నూట
16 ఏబదిమంది. । రూబేను పాలెములో లెక్కింపబడిన
వారందరు వారి సేనలచొప్పున లక్షయేబది యొక
వేయి నన్నూట ఏబదిమంది. వారు రెండవ తెగలో
సాగి నడవవలెను.

17 ప్రత్యక్షపు గుడారము లేవీయుల పాలెముతో
పాలెముల నడుమను సాగి నడవవలెను. వారెట్లు దిగు
దురో అట్లే తమ తమ ధ్వజములనుబట్టి ప్రతివాడును
తన తన వరుసలో సాగి నడవవలెను.

18 ఎఫ్రాయిము సేనలచొప్పున వారి పాలెపుధ్వజము
పడమటి దిక్కున ఉండవలెను. అమీహూదు కుమా
రుడైన ఎలీషామా ఎఫ్రాయిము కుమారులకు ప్రధా
19 నుడు. । అతని సేన, అనగా అతనివారిలో లెక్కింప
20 బడినవారు నలుబదివేల ఏనూరుమంది. । అతని సమీ
పమున మనష్షేగోత్రముండవలెను. పెదాసూరు కుమా
రుడైన గమలీయేలు మనష్షే కుమారులలో ప్రధా
21 నుడు. । అతని సేన, అనగా అతనివారిలో లెక్కింప
22 బడినవారు ముప్పది రెండువేల ఇన్నూరుమంది. । అతని
సమీపమున బెన్యామీను గోత్రముండవలెను. గిద్యోనీ
కుమారుడైన అబీదాను బెన్యామీను కుమారులకు
23 ప్రధానుడు. । అతని సేన, అనగా అతనివారిలో
లెక్కింపబడినవారు ముప్పదియయిదు వేల నన్నూరు
24 మంది. । ఎఫ్రాయిము పాలెములో లెక్కింపబడిన
వారందరు వారి సేనలచొప్పున లక్షయెనిమిదివేల
నూరుమంది. వారు మూడవగుంపులో సాగి నడవ
వలెను.

25 దాను పాలెపుధ్వజము వారి సేనలచొప్పున ఉత్తర
దిక్కున ఉండవలెను. అమీషదాయి కుమారుడైన
26 అహీయెజెరు దాను కుమారులకు ప్రధానుడు. । అతని
సేన, అనగా అతనివారిలో లెక్కింపబడినవారు అరు
27 వది రెండువేల ఏడ్నూరుమంది. । అతని సమీపమున
ఆషేరుగోత్రికులు దిగవలెను. ఒక్రాను కుమారుడైన
28 పగీయేలు ఆషేరు కుమారులకు ప్రధానుడు. । అతని
సేన, అనగా అతనివారిలో లెక్కింపబడినవారు నలు
29 బదియొక వేయి యేనూరుమంది. । అతని సమీపమున
నఫ్తాలి గోత్రికులుండవలెను. ఏనాను కుమారుడైన
30 అహీరా నఫ్తాలి కుమారులకు ప్రధానుడు. । అతని
సేన, అనగా అతని వారిలో లెక్కింపబడినవారు
31 ఏబదిమూడువేల నన్నూరుమంది. । దాను పాలెములో
లెక్కింపబడినవారందరు లక్ష యేబదియేడువేల
ఆరున్నూరుమంది. వారు తమ ధ్వజములప్రకారము
కడపటి గుంపులో నడవవలెను.

వీరు ఇశ్రాయేలీయులలో తమ తమ పితరుల 32
కుటుంబముల ప్రకారము లెక్కింపబడినవారు. తమ
తమ సేనలచొప్పున తమ తమ పాలెములలో లెక్కింప
బడినవారందరు ఆరులక్షల మూడువేల ఏనూట ఏబది
మంది. । అయితే యెహోవా మోషేకు ఆజ్ఞాపించి 33
నట్లు లేవీయులు ఇశ్రాయేలీయులలో తమ్మును
లెక్కించుకొనలేదు. । అట్లు ఇశ్రాయేలీయులు 34
యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు సమస్తమును
చేసిరి. అట్లు వారు తమ తమ వంశములచొప్పునను
తమ తమ పితరుల కుటుంబముల చొప్పునను ప్రతి
వాడు తన తన ధ్వజమునుబట్టి దిగుచు సాగుచునుండిరి.

యెహోవా సీనాయికొండమీద మోషేతో 3
మాటలాడిన నాటికి అహరోను మోషేల వంశా
వళులు ఇవే. । అహరోను కుమారుల పేరులు ఏవనగా, 2
తొలుతపుట్టిన నాదాబు అబీహు ఎలాజారు ఈతా
మారు అనునవే. । ఇవి అభిషేకమునొంది యాజకు 3
లైన అహరోను కుమారుల పేరులు; వారు యాజకు
లగునట్లు అతడు వారిని ప్రతిష్ఠించెను. । నాదాబు 4
అబీహులు సీనాయి అరణ్యమందు యెహోవా సన్ని
ధికి అన్యాగ్ని నర్పించినందున వారు యెహోవా
సన్నిధిని చనిపోయిరి. వారికి కుమారులు కలుగలేదు
గనుక ఎలాజారును ఈతామారును తమ తండ్రియైన
అహరోను ఎదుట యాజకసేవ చేసిరి.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 5
విచ్చెను — నీవు లేవి గోత్రికులను తీసికొనివచ్చి ।
వారు అతనికి పరిచారకులుగా ఉండునట్లు యాజకు 6
డైన అహరోను ఎదుట వారిని నిలువబెట్టుము. । వారు 7
ప్రత్యక్షపు గుడారమునెదుట మందిరపు సేవచేయ
వలెను. తాము కాపాడవలసినదానిని, సర్వసమాజము
కాపాడవలసినదానిని, వారు కాపాడవలెను. । మంది 8
రపు సేవచేయుటకు ప్రత్యక్షపు గుడారముయొక్క
ఉపకరణములన్నిటిని, ఇశ్రాయేలీయులు కాపాడ
వలసినదంతటిని, వారే కాపాడవలెను. । కాగా నీవు 9
లేవీయులను అహరోనుకును అతని కుమారులకును
అప్పగింపవలెను. వారు ఇశ్రాయేలీయులలోనుండి
అతని వశము చేయబడినవారు. । నీవు అహరోనును
అతని కుమారులను నియమింపవలెను. వారు తమ
యాజకధర్మము ననుసరించి నడుచుకొందురు. అన్యుడు
సమీపించినయెడల వాడు మరణశిక్ష నొందును.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
విచ్చెను—ఇదిగో నేను ఇశ్రాయేలీయులలో తొలి
చూలియైన ప్రతి మగపిల్లకు మారుగా । ఇశ్రాయేలీ
యులలోనుండి లేవీయులను నా వశము చేసికొని
యున్నాను. ప్రతి తొలిచూలియు నాది గనుక లేవీ
యులు నావారైయుందురు. । ఐగుప్తుదేశములో నేను
ప్రతి తొలిచూలును సంహరించిననాడు మనుష్యుల

తొలిచూలులనేమి పశువుల తొలిచూలులనేమి
ఇశ్రాయేలీయులలో అన్నిటిని నాకొరకు ప్రతి
ష్ఠించుకొంటిని; వారు నావారైయుందురు. నేనే
యెహోవాను.
14 మరియు సీనాయి అరణ్యమందు యెహోవా
15 మోషేకు ఈలాగు సెలవిచ్చెను। — లేవీయుల పిత
రుల కుటుంబములను వారివారి వంశములను లెక్కిం
పుము. ఒక నెల మొదలుకొని పైప్రాయముగల మగ
16 వారినందరిని లెక్కింపవలెను. । కాబట్టి మోషే
యెహోవా తనకు ఆజ్ఞాపించినట్లు ఆయన మాట
17 చొప్పున వారిని లెక్కించెను. । లేవి కుమారుల పేళ్లు
18 గెర్షోను కహాతు మెరారి అనునవి. । గెర్షోను కుమా
19 రుల వంశకర్తల పేళ్లు లిబ్నీ షిమీ అనునవి. । కహాతు
కుమారుల వంశకర్తల పేళ్లు అమ్రాము ఇస్హారు హె
20 బ్రోను ఉజ్జీయేలు అనునవి. । మెరారి కుమారుల
వంశకర్తల పేళ్లు మాహలి మూషి. వారివారి పితరుల
కుటుంబములచొప్పున ఇవి లేవీయుల వంశములు. ।
21 లిబ్నీయులు షిమీయులు గెర్షోను వంశస్థులు గెర్షో
22 నీయుల వంశపువారు వీరే. । వారిలో లెక్కింపబడిన
వారు, అనగా ఒక నెల మొదలుకొని పైప్రాయము
గల మగవారందరిలో లెక్కింపబడినవారు ఏడువేల
23 ఏనూరుమంది. । గెర్షోనీయుల వంశములు మందిరము
24 వెనుకను, అనగా పడమటి దిక్కున దిగవలెను. । గెర్షో
నీయుల పితరుల కుటుంబములో లాయేలు కుమారు
25 డైన ఎలీయాసాపు ప్రధానుడు. । ప్రత్యక్షపు గుడా
రములో గెర్షోను కుమారులు కాపాడవలసినవేవనగా,
మందిరము గుడారము దాని పైకప్పు ప్రత్యక్షపు గుడా
26 రము ద్వారపు తెరయు । ప్రాకారయవనికలు మందిర
మునకును బలిపీఠమునకును చుట్టునున్న ప్రాకార
ద్వారపు తెరయు దాని సమస్త సేవకొరకైన త్రాళ్లును.
27 కహాతు వంశమేదనగా, అమ్రామీయుల వంశము
ఇస్హారీయుల వంశము హెబ్రోనీయుల వంశము ఉజ్జీ
యేలీయుల వంశము; ఇవి కహాతీయుల వంశములు. ।
28 ఒక నెల మొదలుకొని పైప్రాయముగల మగవారం
దరి లెక్కచూడగా ఎనిమిదివేల ఆరున్నూరుమంది
29 పరిశుద్ధస్థలమును కాపాడవలసినవారైరి. । కహాతు
కుమారుల వంశములు మందిరముయొక్క ప్రక్కను,
30 అనగా దక్షిణదిక్కున దిగవలసినవారు. । కహాతీయుల
వంశముల పితరుల కుటుంబమునకు ప్రధానుడు ఉజ్జీ
31 యేలు కుమారుడైన ఎలీషాపాను. । వారు మందసము
బల్ల దీపవృక్షము వేదికలు తాము సేవచేయు పరిశుద్ధ
స్థలములోని ఉపకరణములు (అడ్డ) తెరయు కాపాడి
32 దాని సమస్త సేవయు జరుపవలసినవారు. । యాజకు
డైన అహరోను కుమారుడగు ఎలాజారు లేవీయుల
ప్రధానులకు ముఖ్యుడు. అతడు పరిశుద్ధస్థలమును
కాపాడువారిమీద విచారణకర్త.

మెరారి వంశమేదనగా, మాహలీయుల వంశము 33
మూషీయుల వంశము; ఇవి మెరారి వంశములు. ।
వారిలో లెక్కింపబడినవారెందరనగా, ఒక నెల 34
మొదలుకొని పైప్రాయముగల మగవారందరు ఆరు
వేల ఇన్నూరుమంది. । మెరారీయుల పితరుల కుటుం 35
బములో అబీహాయిలు కుమారుడైన సూరీయేలు ప్రధా
నుడు. వారు మందిరమునొద్ద ఉత్తరదిక్కున దిగవల
సినవారు. । మెరారి కుమారులు మందిరముయొక్క 36
పలకలను దాని అడ్డకర్రలను దాని స్తంభములను దాని
దిమ్మలను దాని ఉపకరణములన్నిటిని దాని సేవకొర
కైనవన్నిటిని । దాని చుట్టునున్న ప్రాకార స్తంభము 37
లను వాటి దిమ్మలను వాటి మేకులను వాటి త్రాళ్లను
కాపాడవలసినవారు. । మందిరము ఎదుటి తూర్పు 38
దిక్కున, అనగా ప్రత్యక్షపు గుడారము ఎదుటి
పూర్వదిశయందు దిగవలసినవారు మోషే అహ
రోనులు అహరోను కుమారులు; ఇశ్రాయేలీయులు
కాపాడవలసిన పరిశుద్ధస్థలమును వారే కాపాడవలెను.
అన్యుడు సమీపించినయెడల అతడు మరణశిక్ష
నొందును. । మోషే అహరోనులు యెహోవా 39
మాటనుబట్టి, తమ తమ వంశములచొప్పున లెక్కిం
చిన లేవీయులలో లెక్కింపబడినవారందరు, అనగా
ఒక నెల మొదలుకొని పైప్రాయముగల మగవారం
దరు ఇరువది రెండువేలమంది.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 40
విచ్చెను—నీవు ఇశ్రాయేలీయులలో ఒక నెల మొదలు
కొని పైప్రాయముగల తొలిచూలియైన ప్రతి మగ
వానిని లెక్కించి వారి సంఖ్యను వ్రాయించుము ।
నేనే యెహోవాను; నీవు ఇశ్రాయేలీయులలో 41
తొలిచూలియైన ప్రతి మగపిల్లకు మారుగా లేవీయు
లను ఇశ్రాయేలీయుల పశువులలో తొలిచూలియైన
ప్రతిదానికి మారుగా లేవీయుల పశువులను నా నిమి
త్తము తీసికొనవలెను. । కాబట్టి యెహోవా తనకు 42
ఆజ్ఞాపించినట్లు మోషే ఇశ్రాయేలీయులలో తొలుత
పుట్టినవారినందరిని లెక్కించెను. । వారిలో లెక్కింప 43
బడినవారి నామసంఖ్య, అనగా ఒక నెల మొదలు
కొని పైప్రాయముగల తొలిచూలి మగవారందరి
నామసంఖ్య యిరువది రెండువేల ఇన్నూటడెబ్బది
మూడు.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 44
విచ్చెను । — నీవు ఇశ్రాయేలీయులలో తొలిచూలి 45
యైన ప్రతివానికి మారుగా లేవీయులను వారి పశువు
లకు ప్రతిగా లేవీయుల పశువులను తీసికొనుము. లేవీ
యులు నావారైయుందురు; నేనే యెహోవాను. ।
ఇశ్రాయేలీయులకు తొలుత పుట్టినవారిలో లేవీ 46
యులకంటె ఇన్నూటడెబ్బది ముగ్గురు ఎక్కువై
నందున శేషించినవారియొద్ద తలకొక అయిదేసి తుల

వారిది; తమ భుజములమీద మోయుటయే వారి పని
10 గనుక వారికి వాహనములను నియమింపలేదు. । బలి
పీఠము అభిషేకింపబడిన నాడు ఆ ప్రధానులు దానికి
ప్రతిష్ఠార్పణములను తెచ్చిరి; ప్రధానులు బలిపీఠము
11 ఎదుటికి తమ తమ అర్పణములను తెచ్చిరి. । బలిపీఠ
మును ప్రతిష్ఠించుటకు వారిలో ఒక్కొక్క ప్రధా
నుడు ఒక్కొక్క దినమున తన తన అర్పణమును
అర్పింపవలెనని యెహోవా మోషేకు సెలవిచ్చెను.
12 మొదటి దినమున తన అర్పణమును తెచ్చినవాడు
అమ్మీనాదాబు కుమారుడును యూదా గోత్రికుడు
13 నైన నయస్సోను. । అతడు పరిశుద్ధమైన తులపు పరిమా
ణమునుబట్టి నూట ముప్పది తులముల యెత్తుగల వెండి
గిన్నెను డెబ్బది తులముల యెత్తుగల వెండి ప్రోక్షణ
పాత్రను నైవేద్యముగా ఆ రెంటినిండ నూనెతో
14 కలిసిన గోధుమపిండిని । ధూపద్రవ్యముతో నిండిన
15 పది తులముల బంగారు ధూపార్తిని । దహనబలిగా ఒక
చిన్న కోడెను ఒక పొట్టేలును ఏడాది గొఱ్ఱెపిల్లను ।
16 పాపపరిహారార్థబలిగా ఒక మేకపిల్లను । సమాధాన
17 బలిగా రెండు కోడెలను అయిదు పొట్టేళ్లను అయిదు
మేకపోతులను ఏడాదివి అయిదు గొఱ్ఱెపిల్లలను తన
అర్పణముగా తెచ్చెను. ఇది అమ్మీనాదాబు కుమారు
డైన నయస్సోను అర్పణము.

18 రెండవ దినమున అర్పణమును తెచ్చినవాడు సూ
యారు కుమారుడును ఇశ్శాఖారీయులకు ప్రధానుడు
19 నైన నెతనేలు. । అతడు పరిశుద్ధమైన తులపు పరిమాణ
మునుబట్టి నూట ముప్పది తులముల యెత్తుగల
వెండి గిన్నెను డెబ్బది తులముల యెత్తుగల వెండి
ప్రోక్షణపాత్రను నైవేద్యముగా ఆ రెంటి నిండ
20 నూనెతో కలిసిన గోధుమపిండిని । ధూపద్రవ్యముతో
21 నిండిన పది తులముల బంగారు ధూపార్తిని । దహన
22 బలిగా ఒక చిన్న కోడెను ఒక పొట్టేలును । ఏడాది
గొఱ్ఱెపిల్లను పాపపరిహారార్థబలిగా ఒక మేకపిల్లను ।
23 సమాధానబలిగా రెండు కోడెలను అయిదు పొట్టేళ్లను
అయిదు మేకపోతులను ఏడాదివి అయిదు గొఱ్ఱె
పిల్లలను తన అర్పణముగా తెచ్చెను. ఇది సూయారు
కుమారుడైన నెతనేలు అర్పణము.

24 మూడవ దినమున అర్పణమును తెచ్చినవాడు
హేలోను కుమారుడును జెబులూను కుమారులకు
ప్రధానుడునైన ఏలీయాబు. అతడు పరిశుద్ధమైన
తులపు పరిమాణమునుబట్టి నూట ముప్పది తులముల
యెత్తుగల వెండి గిన్నెను డెబ్బది తులముల యెత్తు
25 గల వెండి ప్రోక్షణపాత్రను । నైవేద్యముగా ఆ
26 రెంటినిండ నూనెతో కలిసిన గోధుమపిండిని । ధూప
ద్రవ్యముతో నిండియున్న పది తులముల బంగారు
ధూపార్తిని దహనబలిగా ఒక చిన్న కోడెను ఒక పొట్టే
27 లును । ఏడాది గొఱ్ఱెపిల్లను పాపపరిహారార్థబలిగా
ఒక మేకపిల్లను । సమాధానబలిగా రెండు కోడెలను 28
అయిదు పొట్టేళ్లను । అయిదు మేకపోతులను ఏడా 29
దివి అయిదు గొఱ్ఱెపిల్లలను తన అర్పణముగా
తెచ్చెను. ఇది హేలోను కుమారుడైన ఏలీయాబు
అర్పణము.

నాలుగవ దినమున అర్పణమును తెచ్చినవాడు 30
షెదేయూరు కుమారుడును రూబేనీయులకు ప్రధా
నుడునైన ఏలీసూరు. అతడు పరిశుద్ధమైన తులపు పరి
మాణమునుబట్టి నూట ముప్పది తులముల యెత్తుగల
వెండి గిన్నెను । డెబ్బది తులముల యెత్తుగల వెండి 31
ప్రోక్షణపాత్రను నైవేద్యముగా ఆ రెంటినిండ నూ
నెతో కలిసిన గోధుమపిండిని । ధూపద్రవ్యముతో 32
నిండియున్న పది తులముల బంగారు ధూపార్తిని
దహనబలిగా ఒక చిన్న కోడెను ఒక పొట్టేలును ।
ఏడాది గొఱ్ఱెపిల్లను, పాపపరిహారార్థబలిగా ఒక మేక 33
పిల్లను । సమాధానబలిగా రెండు కోడెలను । అయిదు 34
పొట్టేళ్లను అయిదు మేకపోతులను ఏడాదివి అయిదు 35
గొఱ్ఱెపిల్లలను తన అర్పణముగా తెచ్చెను. ఇది షెదే
యూరు కుమారుడైన ఏలీసూరు అర్పణము.

అయిదవ దినమున అర్పణమును తెచ్చినవాడు 36
సూరీషదాయి కుమారుడును షిమ్యోనీయులకు ప్రధా
నుడునైన షెలుమీయేలు. । అతడు పరిశుద్ధమైన 37
తులపు పరిమాణమునుబట్టి నూట ముప్పది తులముల
యెత్తుగల వెండి గిన్నెను డెబ్బది తులముల యెత్తుగల
వెండి ప్రోక్షణపాత్రను నైవేద్యముగా ఆ రెంటినిండ
నూనెతో కలిసిన గోధుమపిండిని । ధూపద్రవ్యముతో 38
నిండియున్న పది తులముల బంగారు ధూపార్తిని దహన
బలిగా ఒక చిన్న కోడెను । ఒక పొట్టేలును ఏడాది 39
గొఱ్ఱెపిల్లను । పాపపరిహారార్థబలిగా ఒక మేకపిల్లను । 40
సమాధానబలిగా రెండు కోడెలను అయిదు పొట్టే 41
ళ్లను అయిదు మేకపోతులను ఏడాదివి అయిదు గొఱ్ఱె
పిల్లలను తన అర్పణముగా తెచ్చెను. ఇది సూరీషదాయి
కుమారుడైన షెలుమీయేలు అర్పణము.

ఆరవ దినమున అర్పణమును తెచ్చినవాడు దెయూ 42
వేలు కుమారుడును గాదీయులకు ప్రధానుడునైన ఎలీ
యాసాపా. । అతడు పరిశుద్ధమైన తులపు పరిమాణ 43
మునుబట్టి నూట ముప్పది తులముల యెత్తుగల వెండి
గిన్నెను డెబ్బది తులముల యెత్తుగల వెండి ప్రోక్షణ
పాత్రను నైవేద్యముగా ఆ రెంటినిండ నూనెతో కలి
సిన గోధుమపిండిని । ధూపద్రవ్యముతో నిండియున్న 44
పది తులముల బంగారు ధూపార్తిని । దహనబలిగా 45
ఒక చిన్న కోడెను ఒక పొట్టేలును ఏడాది గొఱ్ఱె
పిల్లను । పాపపరిహారార్థబలిగా ఒక మేకపిల్లను సమా 46
ధానబలిగా రెండు కోడెలను అయిదు పొట్టేళ్లను 47
అయిదు మేకపోతులను ఏడాదివి అయిదు గొఱ్ఱె

పిల్లలను తన అర్పణముగా తెచ్చెను. ఇది దెయూవేలు
కుమారుడైన ఎలీయాసాపా అర్పణము.
48 ఏడవ దినమున అర్పణమును తెచ్చినవాడు అమీ
హూదు కుమారుడును ఎఫ్రాయిమీయులకు ప్రధా
49 నుడునైన ఎలీషామా. । అతడు పరిశుద్ధమైన తులపు
పరిమాణమునుబట్టి నూట ముప్పది తులముల యెత్తుగల
వెండి గిన్నెను డెబ్బది తులముల యెత్తుగల వెండి
ప్రోక్షణపాత్రను నైవేద్యముగా ఆ రెంటినిండ నూ
50 నెతో కలిసిన గోధుమపిండిని । ధూపద్రవ్యముతో
51 నిండియున్న పది తులముల బంగారు ధూపార్తిని। దహ
నబలిగా ఒక చిన్న కోడెను ఒక పొట్టేలును, ఏడాది
గొఱ్ఱెపిల్లను పాపపరిహారార్థబలిగా ఒక మేకపిల్లను ।
52 సమాధానబలిగా రెండు కోడెలను అయిగు పొట్టే
53 ళ్లను । అయిదు మేకపోతులను ఏడాదివి అయిదు
గొఱ్ఱెపిల్లలను తన అర్పణముగా తెచ్చెను. ఇది అమీ
హూదు కుమారుడైన ఎలీషామా అర్పణము.
54 ఎనిమిదవ దినమున అర్పణమును తెచ్చినవాడు
పెదాసూరు కుమారుడును మనష్షీయులకు ప్రధానుడు
55 నైన గమలీయేలు. । అతడు పరిశుద్ధమైన తులపు పరి
మాణమునుబట్టి నూట ముప్పది తులముల యెత్తుగల
వెండి గిన్నెను డెబ్బది తులముల యెత్తుగల వెండి
ప్రోక్షణపాత్రను నైవేద్యముగా ఆ రెంటినిండ నూ
నెతో కలిసిన గోధుమపిండిని ధూపద్రవ్యముతో నిం
56 డిన పది తులముల బంగారు ధూపార్తిని । దహనబలిగా
57 ఒక చిన్న కోడెను । ఒక పొట్టేలును ఏడాది గొఱ్ఱె
58 పిల్లను । పాపపరిహారార్థబలిగా ఒక మేకపిల్లను సమా
ధానబలిగా రెండు కోడెలను అయిదు పొట్టేళ్లను
అయిదు మేకపోతులను ఏడాదివి అయిదు గొఱ్ఱెపిల్ల
59 లను తన అర్పణముగా తెచ్చెను. । ఇది పెదాసూరు
కుమారుడైన గమలీయేలు అర్పణము.
60 తొమ్మిదవ దినమున అర్పణమును తెచ్చినవాడు
గిద్యోనీ కుమారుడును బెన్యామీనులకు ప్రధానుడు
61 నైన అబీదాను. । అతడు పరిశుద్ధమైన తులపు పరి
మాణమునుబట్టి నూట ముప్పది తులముల యెత్తుగల
వెండి గిన్నెను డెబ్బది తులముల యెత్తుగల వెండి
ప్రోక్షణపాత్రను నైవేద్యముగా ఆ రెంటినిండ నూ
నెతో కలిసిన గోధుమపిండిని ధూపద్రవ్యముతో నిండి
62 యున్న పది షెకెలుల బంగారు ధూపార్తిని । దహన
63 బలిగా ఒక చిన్న కోడెను । ఒక పొట్టేలును ఏడాది
64 గొఱ్ఱెపిల్లను । పాపపరిహారార్థబలిగా ఒక మేకపిల్లను ।
65 సమాధానబలిగా రెండు కోడెలను అయిదు పొట్టేళ్లను
అయిదు మేకపోతులను ఏడాదివి అయిదు గొఱ్ఱె
పిల్లలను తన అర్పణముగా తెచ్చెను. ఇది గిద్యోనీ
కుమారుడైన అబీదాను అర్పణము.
66 పదియవ దినమున అర్పణమును తెచ్చినవాడు
అమీషదాయి కుమారుడును దానీయులకు ప్రధానుడు
నైన అహీయెజెరు. అతడు పరిశుద్ధమైన తులపు పరి
మాణమునుబట్టి । నూట ముప్పది తులముల యెత్తుగల 67
వెండి గిన్నెను డెబ్బది తులముల యెత్తుగల వెండి
ప్రోక్షణపాత్రను నైవేద్యముగా ఆ రెంటిలో నూ
నెతో కలిసి నిండిన గోధుమపిండిని । ధూపద్రవ్య 68
ముతో నిండియున్న పది తులముల బంగారు ధూపా
ర్తిని । దహనబలిగా ఒక చిన్న కోడెను ఒక పొట్టే 69
లును ఏడాది గొఱ్ఱెపిల్లను పాపపరిహారార్థబలిగా ఒక
మేకపిల్లను । సమాధానబలిగా రెండు కోడెలను 70
అయిదు పొట్టేళ్లను । అయిదు మేకపోతులను ఏడా 71
దివి అయిదు గొఱ్ఱెపిల్లలను తన అర్పణముగా తెచ్చెను.
ఇది అమీషదాయి కుమారుడైన అహీయెజెరు అర్ప
ణము.
పదకొండవ దినమున అర్పణమును తెచ్చినవాడు 72
ఒక్రాను కుమారుడును ఆషేరీయులకు ప్రధానుడు
నైన పగీయేలు. । అతడు పరిశుద్ధమైన తులపు పరి 73
మాణమునుబట్టి నూట ముప్పది తులముల యెత్తుగల
వెండి గిన్నెను డెబ్బది తులముల యెత్తుగల వెండి
ప్రోక్షణపాత్రను నైవేద్యముగా ఆ రెంటినిండ నూ
నెతో కలిసిన గోధుమపిండిని । ధూపద్రవ్యముతో 74
నిండియున్న పది తులముల బంగారు ధూపార్తిని ।
దహనబలిగా ఒక చిన్న కోడెను ఒక పొట్టేలును । 75
ఏడాది గొఱ్ఱెపిల్లను పాపపరిహారార్థబలిగా ఒక మేక 76
పిల్లను । సమాధానబలిగా రెండు కోడెలను అయిదు 77
పొట్టేళ్లను అయిదు మేకపోతులను ఏడాదివి అయిదు
గొఱ్ఱెపిల్లలను తన అర్పణముగా తెచ్చెను. ఇది
ఒక్రాను కుమారుడైన పగీయేలు అర్పణము.
పన్నెండవ దినమున అర్పణమును తెచ్చినవాడు 78
ఏనాను కుమారుడును నఫ్తాలీయులకు ప్రధానుడునైన
అహీర. । అతడు పరిశుద్ధమైన తులపు పరిమాణమును 79
బట్టి నూట ముప్పది తులముల యెత్తుగల వెండి గిన్నెను
డెబ్బది తులముల యెత్తుగల వెండి ప్రోక్షణపాత్రను
నైవేద్యముగా ఆ రెంటినిండ నూనెతో కలిసిన గోధు
మపిండిని । ధూపద్రవ్యముతో నిండియున్న పది తుల 80
ముల బంగారు ధూపార్తిని । దహనబలిగా ఒక చిన్న 81
కోడెను । ఒక పొట్టేలును ఏడాది గొఱ్ఱెపిల్లను పాప 82
పరిహారార్థబలిగా ఒక మేకపిల్లను సమాధానబలిగా
రెండు కోడెలను । అయిదు పొట్టేళ్లను అయిదు మేక 83
పోతులను ఏడాదివి అయిదు గొఱ్ఱెపిల్లలను తన అర్ప
ణముగా తెచ్చెను. ఇది ఏనాను కుమారుడైన అహీర
అర్పణము.
బలిపీఠము అభిషేకింపబడిన దినమున ఇశ్రాయేలీ 84
యుల ప్రధానులు అర్పించిన ప్రతిష్ఠార్పణములు ఇవి;
వెండి గిన్నెలు పన్నెండు, వెండి ప్రోక్షణపాత్రలు
పన్నెండు, బంగారు ధూపార్తులు పన్నెండు, ప్రతి
వెండిగిన్నె నూట ముప్పది తులములది. । ప్రతి 85

ప్రోక్షణపాత్ర డెబ్బది తులములది; ఆ ఉపకరణ
ముల వెండి అంతయు పరిశుద్ధమైన తులపు పరిమాణ
86 మునుబట్టి రెండువేల నన్నూరు తులములది. । ధూప
ద్రవ్యముతో నిండిన బంగారు ధూపార్తులు పన్నెండు;
వాటిలో ఒకటి పరిశుద్ధమైన తులపు పరిమాణమును
87 బట్టి పది తులములది. । ఆ ధూపార్తుల బంగారమం
తయు నూట ఇరువది తులములది; దహనబలి పశువు
లన్నియు పన్నెండు కోడెలు, పొట్టేళ్లు పన్నెండు,
ఏడాదివైన గొఱ్ఱెపిల్లలు పన్నెండు, వాటి నైవేద్యము
లును పాపపరిహారార్థమైన మగమేకపిల్లలు పన్నెండు,।
88 సమాధానబలి పశువులన్నియు ఇరువదినాలుగు కోడె
89 లు, । పొట్టేళ్లు అరువది, మేకపోతులు అరువది, ఏడాది
90 వైన గొఱ్ఱెపిల్లలు అరువది. । మోషే యెహోవాతో
మాటలాడుటకు ప్రత్యక్షపు గుడారములోనికి వెళ్లి
నప్పుడు సాక్ష్యపు మందసము మీదనున్న కరుణా
పీఠముమీదనుండి, అనగా రెండు కెరూబుల నడుమ
నుండి తనతో మాటలాడిన యెహోవా స్వరము
అతడు వినెను, అతడు ఆయనతో మాటలాడెను.

**8** యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చెను—
2 నీవు అహరోనును చూచి । —నీవు దీపములను వెలి
గించునప్పుడు ఆ యేడు దీపముల వెలుగు దీపవృక్ష
మునకు ముందు పడునట్లు వాటిని వెలిగింపవలెనని చెప్పు
3 మనెను. అహరోను ఆలాగు చేసెను. । యెహోవా
మోషేకు ఆజ్ఞాపించినట్లు అతడు దీపవృక్షమునకు
4 ఎదురుగా దాని దీపములను వెలిగించెను. । ఆ దీప
వృక్షము బంగారు నకషిపనిగలది; అది దాని స్తంభము
మొదలుకొని పుష్పములవరకు నకషిపనిగలది;
యెహోవా కనుపరచిన మాదిరినిబట్టి మోషే ఆ
దీపవృక్షమును చేయించెను.
5 మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
6 విచ్చెను—నీవు ఇశ్రాయేలీయులలోనుండి । లేవీయు
7 లను ప్రత్యేకించి వారిని పవిత్రపరచుము. । వారిని
పవిత్రపరచుటకు నీవు వారికి చేయవలసినదేమనగా,
వారిమీద పాపపరిహారార్థజలమును ప్రోక్షింపుము;
అప్పుడు వారు మంగలి కత్తితో తమ శరీరమంతయు
8 గొరిగించుకొని తమ బట్టలు ఉదుకుకొని । పవిత్ర
పరచుకొనిన తరువాత వారు ఒక కోడెను దాని
నైవేద్యమును, అనగా తైలముతో కలిసిన గోధుమపిం
డిని తేవలెను. నీవు పాపపరిహారార్థబలిగా మరియొక
9 కోడెను తీసికొని రావలెను. । అప్పుడు నీవు ప్రత్య
క్షపు గుడారము ఎదుటికి లేవీయులను తోడుకొని
వచ్చి ఇశ్రాయేలీయుల సర్వసమాజమును పోగుచేయ
10 వలెను. । నీవు యెహోవా సన్నిధికి లేవీయులను
తోడుకొనివచ్చిన తరువాత ఇశ్రాయేలీయులు తమ
11 చేతులను ఆ లేవీయులమీద ఉంచవలెను. । లేవీయులు
యెహోవా సేవచేయువారవుటకు అహరోను
ఇశ్రాయేలీయులను ప్రతిష్ఠార్పణముగా వారిని
యెహోవా సన్నిధిని ప్రతిష్ఠింపవలెను. । లేవీయులు 12
ఆ కోడెల తలలమీద తమ చేతులుంచిన తరువాత
నీవు లేవీయులనిమిత్తము ప్రాయశ్చిత్తము చేయునట్లు
యెహోవాకు వాటిలో ఒకదానిని పాపపరిహారార్థ
బలిగాను రెండవదానిని దహనబలిగాను అర్పించి ।
అహరోను ఎదుటను అతని కుమారుల యెదుటను 13
లేవీయులను నిలువబెట్టి యెహోవాకు ప్రతిష్ఠార్పణ
ముగా వారిని అర్పింపవలెను. । అట్లు నీవు ఇశ్రాయేలీ 14
యులలోనుండి లేవీయులను వేరుపరచవలెను; లేవీ 15
యులు నావారైయుందురు. తరువాత నీవు వారిని
పవిత్రపరచి ప్రతిష్ఠార్పణముగా వారిని అర్పించి
నప్పుడు లేవీయులు ప్రత్యక్షపు గుడారములో సేవ
చేయుటకై లోపలికి వెళ్లవచ్చును. । ఇశ్రాయేలీయు 16
లలో వారు నా వశము చేయబడినవారు; తొలిచూలి
దైన ప్రతివానికిని, అనగా ఇశ్రాయేలీయులలో
ప్రథమ సంతానమంతటికిని ప్రతిగా వారిని నేను
తీసికొనియున్నాను. । ఏలయనగా మనుష్యులలోను 17
పశువులలోను ఇశ్రాయేలీయులలో తొలిచూలిదైనది
యావత్తును నాది; ఐగుప్తుదేశములో తొలిచూలిదైన
ప్రతివానిని నేను సంహరించిననాడు వారిని నాకొరకు
ప్రతిష్ఠించుకొంటిని. । ఇశ్రాయేలీయులలో తొలి 18
చూలిదైన ప్రతివానికి మారుగా లేవీయులను తీసి
కొని యున్నాను. । మరియు ప్రత్యక్షపు గుడార 19
ములో ఇశ్రాయేలీయుల నిమిత్తము సేవచేయుటకును,
ఇశ్రాయేలీయుల నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయుట
కును, ఇశ్రాయేలీయులలో లేవీయులను అహరోను
కును అతని కుమారులకును ఇచ్చి అప్పగించియున్నాను.
అందువలన ఇశ్రాయేలీయులు పరిశుద్ధమందిరమునకు
సమీపించునప్పుడు ఏ తెగులైనను ఇశ్రాయేలీయులకు
సంభవింపకపోవును. । అప్పుడు మోషే అహరోను 20
లును ఇశ్రాయేలీయుల సర్వసమాజమును యెహోవా
లేవీయులనుగూర్చి మోషేకు ఆజ్ఞాపించిన సమస్త
మునుబట్టి లేవీయులయెడల చేసిరి; ఇశ్రాయేలీయులు
వారికి అట్లే చేసిరి. । లేవీయులు తమ్మును పవిత్రపరచు 21
కొని తమ బట్టలు ఉదుకుకొనిన తరువాత అహరోను
యెహోవా సన్నిధిని ప్రతిష్ఠార్పణముగా వారిని
అర్పించెను. వారిని పవిత్రపరచుటకు అహరోను
వారినిమిత్తము ప్రాయశ్చిత్తము చేసెను. । తరువాత 22
లేవీయులు అహరోను ఎదుటను అతని కుమారుల
యెదుటను ప్రత్యక్షపు గుడారములో సేవచేయుటకు
లోపలికి వెళ్లిరి. యెహోవా లేవీయులనుగూర్చి
మోషేకు ఆజ్ఞాపించినట్లు అతడు వారియెడల చేసెను. ।
మరియు యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చె 23
ను — ఇది లేవీయులనుగూర్చిన విధి. । ఇరువది 24
యైదేండ్లు మొదలుకొని పైప్రాయము పొందిన ప్రతి

వారును ప్రత్యక్షపు గుడారముయొక్క సేవలో పని
25 చేయుటకు రావలెను. । అయితే ఏబది ఏండ్ల వయస్సు
పొందిన పిమ్మట వారు ఆ పని మాని ఊరకుండవలెను. ।
26 వారు కాపాడవలసినవాటిని కాపాడుటకు ప్రత్యక్షపు
గుడారములో తమ గోత్రపువారితోకూడ పరిచర్య
చేయవలెనుగాని పనిచేయవలదు. లేవీయులు కాపాడ
వలసిన వాటివిషయము నీవు వారికి ఆలాగు నియ
మింపవలెను.

9 ఐగుప్తుదేశములోనుండి వారు వచ్చిన తరువాత
రెండవ సంవత్సరము మొదటి నెలలో యెహోవా
సీనాయి అరణ్యమందు మోషేకు ఈలాగు సెలవిచ్చె
2 ను । —ఇశ్రాయేలీయులు పస్కాపండుగను దాని
3 నియామకకాలమందు ఆచరింపవలెను. । దాని నియా
మకకాలమున, అనగా ఈ నెల పదునాలుగవ దినమున
సాయంకాలమందు దానిని ఆచరింపవలెను; దాని కట్ట
డలన్నిటినిబట్టి దాని విధులన్నిటినిబట్టి మీరు దానిని
4 ఆచరింపవలెను. । కాబట్టి మోషే—పస్కాపండుగను
ఆచరింపవలెనని ఇశ్రాయేలీయులతో చెప్పగా వారు
సీనాయి అరణ్యమందు మొదటి నెల పదునాలుగవ
దినమున సాయంకాలమందు పస్కాపండుగ సామ
5 గ్రిని సిద్ధపరచుకొనిరి. । యెహోవా మోషేకు
ఆజ్ఞాపించిన సమస్తమును ఇశ్రాయేలీయులు అతడు
6 చెప్పినట్లే చేసిరి. । కొందరు నరశవమును ముట్టుట
వలన అపవిత్రులై ఆ దినమున పస్కాపండుగను
7 ఆచరింపలేకపోయిరి. । వారు ఆ దినమున మోషే అహ
రోనుల యెదుటికి వచ్చి మోషేను చూచి — నరశవ
మును ముట్టుటవలన అపవిత్రులమైతిమి; యెహోవా
అర్పణమును దాని నియామకకాలమున ఇశ్రాయేలీ
యుల మధ్యను అర్పింపకుండునట్లు ఏల అడ్డగింప
8 బడితిమని అడుగగా । మోషే—నిలువుడి; మీ విషయ
ములో యెహోవా యేమి సెలవిచ్చునో నేను తెలిసి
కొందునని వారితో అనెను.

9 అప్పుడు యెహోవా మోషేకు ఈలాగు సెల
విచ్చెను — నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము । —
10 మీలోగాని మీ వంశములలోగాని ఒకడు శవమును
ముట్టుటవలన అపవిత్రుడైనను, దూరప్రయాణము
చేయుచుండినను, అతడు యెహోవా పస్కాపండు
11 గను ఆచరింపవలెను. । వారు రెండవనెల పదునాలు
గవ దినమున సాయంకాలమున దానిని ఆచరించి
పొంగనివాటితోను చేదు తోటకూరలతోను దాని
12 తినవలెను. । వారు మరునాటివరకు దానిలో కొంచె
మైనను మిగలనీయవలదు; దానిలోనిది ఒక్క యెముక
నైనను విరువవలదు; పస్కాపండుగ విషయమైన
కట్టడలన్నిటినిబట్టి వారు దానిని ఆచరింపవలెను. ।
ప్రయాణములో ఉండని పవిత్రుడు పస్కాను ఆచ
రించుట మానినయెడల ఆ మనుష్యుడు తన జనులలో
నుండి కొట్టివేయబడును. అతడు యెహోవా అర్ప
ణమును దాని నియామకకాలమున అర్పింపలేదు గనుక
ఆ మనుష్యుడు తన పాపమును తానే భరింపవలెను. ।
మీలో నివసించు పరదేశి యెహోవా పస్కాను 14
ఆచరింప గోరునప్పుడు అతడు పస్కా కట్టడచొప్పున
దాని విధినిబట్టియే దానిని చేయవలెను. పరదేశికిని
మీ దేశములో పుట్టినవానికిని మీకును ఒకటే కట్టడ
ఉండవలెను.

వారు మందిరమును నిలువబెట్టిన దినమున మేఘము 15
సాక్ష్యపు గుడారములోని మందిరమును కమ్మెను;
సాయంకాలము మొదలుకొని ఉదయమువరకు అగ్ని
వంటి ఆకారము మందిరముమీద నుండెను. । నిత్య 16
మును ఆలాగే జరిగెను. మేఘము మందిరమును
కమ్మెను; రాత్రియందు అగ్నివంటి ఆకారము కన
బడెను. । ఆ మేఘము గుడారముమీదనుండి పైకెత్త 17
బడునప్పుడు ఇశ్రాయేలీయులు ప్రయాణమై సాగిరి;
ఆ మేఘము ఎక్కడ నిలిచెనో అక్కడనే ఇశ్రాయేలీ
యులు తమ గుడారములను వేసికొనిరి. । యెహోవా 18
నోటిమాటచొప్పున ఇశ్రాయేలీయులు ప్రయాణమై
సాగిరి, యెహోవా నోటిమాటచొప్పున వారు తమ
గుడారములను వేసికొనిరి. ఆ మేఘము మందిరము
మీద నిలిచియుండిన దినములన్నియు వారు నిలిచిరి. ।
ఆ మేఘము బహుదినములు మందిరముమీద నిలిచిన 19
పక్షమున ఇశ్రాయేలీయులు యెహోవా విధి నను
సరించి ప్రయాణము చేయకుండిరి. । మేఘము కొన్ని 20
దినములు మందిరముమీద నిలిచినయెడల వారును
నిలిచిరి; యెహోవా నోటిమాటచొప్పుననే నిలిచిరి,
యెహోవా నోటిమాటచొప్పుననే ప్రయాణము
చేసిరి. । ఆలాగే మేఘము సాయంకాలము మొదలు 21
కొని ఉదయమువరకు నిలిచినయెడల ఉదయమందు
ఆ మేఘము పైకెత్తబడగానే వారు ప్రయాణముచేసిరి.
పగలేమి రాత్రియేమి ఆ మేఘము పైకెత్తబడినప్పుడే
వారు ప్రయాణముచేసిరి. । ఆ మేఘము రెండు దిన 22
ములుగాని, ఒక నెలగాని, యేడాదిగాని తడవుచేసి
మందిరముమీద నిలిచినయెడల ఇశ్రాయేలీయులు
ప్రయాణముచేయక తమ గుడారములలో నిలిచిరి.
అది ఎత్తబడినప్పుడు వారు ప్రయాణముచేసిరి. ।
యెహోవా మాటచొప్పున వారు తమ గుడారము 23
లను వేసికొనిరి; యెహోవా మాటచొప్పున వారు
ప్రయాణముచేసిరి; మోషేద్వారా యెహోవా
చెప్పిన మాటనుబట్టి యెహోవా ఆజ్ఞ ననుసరించి
నడిచిరి.

యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చెను 10
— నీవు రెండు వెండి బూరలు చేయించుకొనుము; ।
నకషిపనిగా వాటిని చేయింపవలెను. అవి సమాజ 2
మును పిలుచుటకును సేనలను తర్లించుటకును నీకుండ

3 వలెను. । ఊదువారు వాటిని ఊదునప్పుడు సమాజము
ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారమునెదుట నీ
4 యొద్దకు కూడి రావలెను. । వారు ఒకటే ఊదిన
యెడల ఇశ్రాయేలీయుల సమూహములకు ముఖ్యులైన
5 ప్రధానులు నీయొద్దకు కూడి రావలెను. । మీరు
ఆర్భాటముగా ఊదునప్పుడు తూర్పుదిక్కున దిగి
6 యున్న సైన్యములు సాగవలెను. । మీరు రెండవ
మారు ఆర్భాటముగా ఊదునప్పుడు దక్షిణదిక్కున
దిగిన సైన్యములు సాగవలెను. వారు ప్రయాణమై
7 పోవునప్పుడు ఆర్భాటముగా ఊదవలెను. । సమాజ
మును కూర్చునప్పుడు ఊదవలెను గాని ఆర్భాటము
8 చేయవలదు. । అహరోను కుమారులైన యాజకులు
ఆ బూరలు ఊదవలెను; నిత్యమైన కట్టడనుబట్టి అవి
9 మీ వంశముల పరంపరగా మీకు ఉండును. । మిమ్మును
బాధించు శత్రువులకు విరోధముగా మీ దేశములో
యుద్ధమునకు వెళ్లునప్పుడు ఆ బూరలు ఆర్భాటముగా
ఊదవలెను. అప్పుడు మీ దేవుడైన యెహోవా
సన్నిధిని మీరు జ్ఞాపకమునకు వచ్చి మీ శత్రువుల
10 నుండి రక్షింపబడుదురు. । మరియు ఉత్సవదినమం
దును నియామక కాలములయందును నెలల ఆరంభ
ములయందును మీరు దహనబలులనుగాని సమాధాన
బలులనుగాని అర్పించునప్పుడు ఆ బూరలు ఊదవలెను.
అప్పుడు అవి మీ దేవుని సన్నిధిని మీకు జ్ఞాప
కార్థముగా ఉండును. మీ దేవుడైన యెహోవాను
నేనే.

11 రెండవ సంవత్సరము రెండవ నెల యిరువదియవ
తేదిని మేఘము సాక్ష్యపు మందిరము మీదనుండి పై
కెత్తబడెను గనుక ఇశ్రాయేలీయులు సీనాయి అరణ్య
12 ములోనుండి ప్రయాణములు చేయసాగిరి. । తరువాత
ఆ మేఘము పారాను అరణ్యములో నిలిచెను. ।
13 యెహోవా మోషేచేత పలికించిన మాటనుబట్టి వారు
14 మొదట ప్రయాణము చేసిరి. । యూదీయుల పాలెపు
ధ్వజము వారి సేనలచొప్పున ముందర సాగెను; అమ్మీ
నాదాబు కుమారుడైన నయస్సోను ఆ సైన్యమునకు
15 అధిపతి. । ఇశ్శాఖారీయుల గోత్రసైన్యమునకు సూ
16 యారు కుమారుడైన నెతనేలు అధిపతి. । జెబులూ
నీయుల గోత్రసైన్యమునకు హేలోను కుమారుడైన
17 ఏలీయాబు అధిపతి. । మందిరము విప్పబడినప్పుడు
గెర్షోనీయులును మెరారీయులును మందిరమును మో
18 యుచు సాగిరి. । రూబేనీయుల పాలెపు ధ్వజము వారి
సేనలచొప్పున సాగెను. ఆ సైన్యమునకు షెదేయూరు
19 కుమారుడైన ఏలీసూరు అధిపతి. । షిమ్యోనీయుల
గోత్రసైన్యమునకు సూరీషదాయి కుమారుడైన షెలు
20 మీయేలు అధిపతి. । గాదీయుల గోత్రసైన్యమునకు
దెయూవేలు కుమారుడైన ఎలీయాసాపు అధిపతి. ।
21 కహాతీయులు పరిశుద్ధమైనవాటిని మోయుచు సాగిరి;
అందరు వచ్చులోగా వారు మందిరమును నిలువబెట్టిరి. ।
ఎఫ్రాయిమీయుల పాలెపుధ్వజము వారి సేనల 22
చొప్పున సాగెను; ఆ సైన్యమునకు అమీహూదు
కుమారుడైన ఎలీషామా అధిపతి. । పెదాసూరు కుమా 23
రుడైన గమలీయేలు మనష్షీయుల గోత్రసైన్యమునకు
అధిపతి. । గిద్యోనీ కుమారుడైన అబీదాను బెన్యా 24
మీనుల గోత్రసైన్యమునకు అధిపతి. । దానీయుల 25
పాలెపుధ్వజము సాగెను; అది పాలెములన్నిటిలో
వెనుకనుండెను; అమీషదాయి కుమారుడైన అహీ
యెజరు ఆ సైన్యమునకు అధిపతి. । ఒక్రాను కుమా 26
రుడైన పగీయేలు ఆషేరీయుల గోత్రసైన్యమునకు
అధిపతి. । ఏనాను కుమారుడైన అహీర నఫ్తాలీయుల 27
గోత్రసైన్యమునకు అధిపతి. । ఇశ్రాయేలీయులు 28
ప్రయాణము చేయునప్పుడు తమ తమ సైన్యముల
చొప్పుననే ప్రయాణమై సాగిరి.

మోషే మిద్యానీయుడైన రగూయేలు కుమారు 29
డును మోషే మామయునైన హోబాబును చూచి
— యెహోవా మాకిచ్చెదనని చెప్పిన స్థలమునకు
మేము ప్రయాణమై పోవుచున్నాము; మాతోకూడ
రమ్ము; మేము మీకు మేలు చేసెదము; యెహోవా
ఇశ్రాయేలీయులకు తాను చేయబోవు మేలునుగూర్చి
వాగ్దానము చేసెననగా । అందుకతడు—నేను రాను, 30
నా దేశమునకును నా వంశస్థులయొద్దకును వెళ్లుదు
ననెను. । అందుకు మోషే—నీవు దయచేసి మమ్మును 31
విడువకుము; ఎట్లనగా ఈ అరణ్యమందు మేము దిగ
వలసిన స్థలములు నీకు తెలిసియున్నవి; నీవు మాకు
కన్నులవలె ఉందువు. । మరియు నీవు మాతోకూడ 32
వచ్చినయెడల యెహోవా మాకు ఏ మేలు చేయునో
ఆ మేలునుబట్టి మేము నీకు మేలు చేయుదుమనెను.

వారు యెహోవా కొండనుండి మూడు దినముల 33
ప్రయాణముచేసిరి; వారికి విశ్రాంతిస్థలము చూచుటకు
ఆ మూడు దినముల ప్రయాణములో యెహోవా
నిబంధన మందసము వారికి ముందుగా సాగెను. । వారు 3
తాము దిగిన స్థలమునుండి సాగినప్పుడు యెహోవా
మేఘము పగటివేళ వారిమీద ఉండెను.

ఆ మందసము సాగినప్పుడు మోషే—యెహోవా 3
లెమ్ము; నీ శత్రువులు చెదరిపోవుదురుగాక; నిన్ను
ద్వేషించువారు నీ యెదుటనుండి పారిపోవుదురు గాక
యనెను. । అది నిలిచినప్పుడు అతడు—యెహోవా, 3
ఇశ్రాయేలుయొక్క వేవేల కుటుంబముల మధ్యకు
మరల రమ్మనెను.

జనులు ఆయాసమునుగూర్చి సణుగుచుండగా అది 1
యెహోవాకు వినబడెను; యెహోవా దాని విని
నప్పుడు ఆయన కోపము రగులుకొనెను; యెహోవా
అగ్ని వారిలో రగులుకొని ఆ పాలెములో నొక కొనను
దహింపసాగెను. । జనులు మోషేకు మొరపెట్టగా

మోషే యెహోవాను వేడుకొనినప్పుడు ఆ అగ్ని
3 చల్లారెను. । యెహోవా అగ్ని వారిలో రగులుకొని
నందున మోషే ఆ చోటికి తబేరా అను పేరు పెట్టెను.
4 వారి మధ్యనున్న మిశ్రితజనము మాంసాపేక్ష
అధికముగా కనుపరచగా ఇశ్రాయేలీయులును మరల
5 ఏడ్చి—మాకెవరు మాంసము పెట్టెదరు? । ఐగుప్తులో
మేము ఉచితముగా తినిన చేపలును కీరకాయలును
దోసకాయలును కూరాకులును ఉల్లిపాయలును తెల్ల
గడ్డలును జ్ఞాపకమునకు వచ్చుచున్నవి. ఇప్పుడు మా
6 ప్రాణము సొమ్మసిల్లెను. । ఈ మన్నా కాక మా
7 కన్నులయెదుట మరేమియు లేదని చెప్పుకొనిరి. । ఆ
మన్నా కొత్తిమెరగింజలవలె ఉండెను. చూపునకు అది
8 బోళమువలె ఉండెను. । జనులు తిరుగుచు దాని
కూర్చుకొని తిరుగటి విసిరి లేక రోట దంచి పెనము
మీద కాల్చి రొట్టెలు చేసిరి; దాని రుచి నూనెలో భక్ష్య
9 ముల రుచివలె ఉండెను. । రాత్రియందు మంచు
పాలెముమీద కురిసినప్పుడు ఆ మన్నా దాని వెంటనే
10 పడెను. । జనులు తమ తమ కుటుంబములలో ఎవరి
గుడారపుద్వారమునొద్ద వారు ఏడ్వగా మోషే వినెను.
యెహోవా కోపము బహుగా రగులుకొనెను; వారు
11 ఏడ్చుట మోషే దృష్టికిని చెడ్డదిగా నుండెను. । కాగా
మోషే యెహోవాతో ఇట్లనెను—నీవేల నీ సేవకుని
బాధించితివి! నామీద నీ కటాక్షము రానియక యీ
12 జనులందరి భారమును నామీద పెట్టనేల? । నేనే
యీ సర్వజనమును గర్భమున ధరించితినా? నేనే
వీరిని కంటినా? పాలిచ్చి పెంచెడు తండ్రి పసిపిల్లను
మోయునట్లు నేను వీరి తండ్రులకు ప్రమాణపూర్వక
ముగా ఇచ్చిన దేశమునకు వీరిని నీ రొమ్మున ఎత్తుకొని
13 పొమ్మని నాతో చెప్పుచున్నావు. । ఈ సమస్త ప్రజ
లకు ఇచ్చుటకు మాంసము నాకెక్కడిది? వారు నన్ను
చూచి యేడ్చుచు — తినుటకు మాకు మాంసమిమ్మని
14 అడుగుచున్నారు. । ఈ సమస్త ప్రజలను ఒంటిగా
మోయ నావలన కాదు; అది నేను భరింపలేని భారము;
నీవు నాకిట్లు చేయదలచినయెడల నన్ను చంపుము. ।
15 నామీద నీ కటాక్షము వచ్చినపక్షమున నేను నా
బాధను చూడకుండునట్లు నన్ను చంపుము.
16 అప్పుడు యెహోవా మోషేతో ఇట్లనెను —
జనులకు పెద్దలనియు అధిపతులనియు నీవెరిగిన ఇశ్రా
యేలీయుల పెద్దలలోనుండి డెబ్బదిమంది మనుష్యులను
నాయొద్దకు పోగుచేసి ప్రత్యక్షపు గుడారమునకు
వారిని తోడుకొనిరమ్ము. అక్కడ వారు నీతోకూడ
17 నిలువబడవలెను. । నేను దిగి అక్కడ నీతో మాట
లాడెదను. మరియు నీమీద వచ్చిన ఆత్మలో పాలు
వారిమీద ఉంచెదను; ఈ జనుల భారమును నీవు
ఒంటిగా మోయకుండునట్లు వారు దానిలో నొక
18 పాలు నీతోకూడ భరింపవలెను. । నీవు జనులనుచూచి
యిట్లనుము — మిమ్మును మీరు రేపటికి పరిశుద్ధపరచు
కొనుడి; మీరు మాంసము తిందురు. యెహోవా
వినునట్లు ఏడ్చి—మాకు ఎవరు మాంసము పెట్టెదరు?
ఐగుప్తులో మాకు బాగుగానే జరిగినదని మీరు చెప్పు
కొంటిరి గనుక యెహోవా మీకు మాంసమిచ్చును,
మీరు తిందురు. । ఒక్క దినము కాదు, రెండు దిన 19
ములు కాదు, అయిదు దినములు కాదు, పది దినములు
కాదు, ఇరువది దినములు కాదు. । ఒక నెల దినముల 20
వరకు, అనగా అది మీ నాసికారంధ్రములలోనుండి
వచ్చి మీకు అసహ్యము పుట్టువరకు దానిని తిందురు;
ఏలయనగా మీరు మీ మధ్యనున్న యెహోవాను
నిర్లక్ష్యముచేసి ఆయన సన్నిధిని ఏడ్చి — ఐగుప్తులో
నుండి యెందుకు వచ్చితిమనుకొంటిరి. । అందుకు 21
మోషే — నేను ఈ జనులమధ్య ఉన్నాను; వారు
ఆరులక్షల పాదచారులు—వారు నెలదినములు తిను
టకు వారికి మాంసమిచ్చెదనని చెప్పితివి. । వారు 22
తృప్తిగా తినునట్లు వారినిమిత్తము గొఱ్ఱెలను పశువు
లను చంపవలెనా? వారు తృప్తిగా తినునట్లు సము
ద్రపు చేపలన్నియు వారినిమిత్తము కూర్చవలెనా?
అనెను.

అందుకు యెహోవా మోషేతో ఇట్లనెను — 23
యెహోవా బాహుబలము తక్కువైనదా? నా మాట
నీయెడల నెరవేరునో లేదో యిప్పుడు చూచెదవు. ।
మోషే బయటికి వచ్చి యెహోవా మాటలను జను 24
లతో చెప్పి, జనుల పెద్దలలోనుండి డెబ్బదిమంది
మనుష్యులను పోగుచేసి గుడారముచుట్టు వారిని నిలువ
బెట్టగా । యెహోవా మేఘములో దిగి అతనితో 25
మాటలాడి అతనిమీద వచ్చిన ఆత్మలో పాలు ఆ డెబ్బది
మంది పెద్దలమీద ఉంచెను; కావున ఆ ఆత్మ వారి
మీద నిలిచినప్పుడు వారు ప్రవచించిరి గాని మరల
ప్రవచింపలేదు. । ఆ మనుష్యులలో నిద్దరు పాలె 26
ములో నిలిచి యుండిరి; వారిలో ఒకనిపేరు ఎల్దాదు,
రెండవవానిపేరు మేదాదు; వారిమీదను ఆత్మ నిలిచి
యుండెను; వారు వ్రాయబడినవారిలోను ఉండియు
వారు గుడారమునకు వెళ్లక తమ పాలెములోనే ప్రవ
చించిరి. । అప్పుడు ఒక యౌవనుడు మోషేయొద్దకు 27
పరుగెత్తివచ్చి — ఎల్దాదు మేదాదులు పాలెములో
ప్రవచించుచున్నారని చెప్పగా । మోషే ఏర్పరచు 28
కొనినవారిలో నూను కుమారుడును మోషేకు పరి
చారకుడునైన యెహోషువ—మోషే నా ప్రభువా,
వారిని నిషేధింపుమని చెప్పెను. । అందుకు మోషే— 29
నా నిమిత్తము నీకు రోషము వచ్చెనా? యెహోవా
ప్రజలందరును ప్రవక్తలగునట్లు యెహోవా తన
ఆత్మను వారిమీద ఉంచుగాక అని అతనితో అనెను. ।
అప్పుడు మోషేయు ఇశ్రాయేలీయుల పెద్దలును 30
పాలెములోకి వెళ్లిరి. । తరువాత యెహోవా సన్నిధి 31

నుండి ఒక గాలి బయలుదేరి సముద్రమునుండి పూరే
ళ్లను రప్పించి పాలెముచుట్టు ఈ ప్రక్కను ఆ
ప్రక్కను దినప్రయాణమంత దూరమువరకు భూమి
మీద రెండుమూరల యెత్తున వాటిని పడవేసెను. ।
32 కావున జనులు ఆ దినమంతయు ఆ రాత్రి అంతయు
మరుసటి దినమంతయు లేచి ఆ పూరేళ్లను కూర్చు
కొనుచుండిరి; తక్కువ కూర్చుకొనినవాడు నూరు
తూములను కూర్చుకొనెను. తరువాత వారు తమ
33 కొరకు పాలెముచుట్టు వాటిని పరచిరి. । ఆ మాంసము
ఇంక వారి పండ్లసందున నుండగానే, అది నమలక
మునుపే, యెహోవా కోపము జనులమీద రగులు
కొనెను; యెహోవా తెగులుచేత వారిని బహుగా
34 బాధించెను. । మాంసాపేక్షగలవారిని జనులు అక్కడ
పాతిపెట్టినందున ఆ స్థలమునకు కిబ్రోతు హత్తావా
35 అను పేరు పెట్టబడెను. । జనులు కిబ్రోతు హత్తావా
నుండి హజేరోతుకు ప్రయాణమైపోయి హజేరోతులో
దిగిరి.

12 మోషే కూషు దేశస్థురాలగు ఒక స్త్రీని పెండ్లి
చేసికొని యుండెను గనుక అతడు పెండ్లిచేసికొనిన
ఆ స్త్రీనిబట్టి మిర్యాము అహరోనులు అతనికి విరోధ
2 ముగా మాటలాడిరి. । వారు—మోషేచేత మాత్రమే
యెహోవా పలికించెనా? ఆయన మా చేతను పలి
3 కింపలేదా? అని చెప్పుకొనగా । యెహోవా ఆ
మాట వినెను. మోషే భూమిమీదనున్న వారందరి
4 రిలో మిక్కిలి సాత్వికుడు. । యెహోవా—మీరు
ముగ్గురు ప్రత్యక్షపు గుడారమునకు రండని హఠా
త్తుగా మోషే అహరోను మిర్యాములకు ఆజ్ఞనిచ్చెను.
5 ఆ ముగ్గురు రాగా । యెహోవా మేఘస్తంభములో
దిగి ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారమునొద్ద
6 నిలిచి అహరోను మిర్యాములను పిలిచెను. । వారిద్దరు
రాగా ఆయన—నా మాటలు వినుడి; మీలో ప్రవక్త
యుండినయెడల యెహోవానగు నేను దర్శనమిచ్చి
అతడు నన్ను తెలిసికొనునట్లు కలలో అతనితో మాట
లాడుదును. నా సేవకుడైన మోషే అట్టివాడు
7 కాడు. । అతడు నా యిల్లంతటిలో నమ్మకమైన
8 వాడు. । నేను గూఢభావములతో కాదు, దర్శనమిచ్చి
ముఖాముఖిగా అతనితో మాటలాడుదును; అతడు
యెహోవా స్వరూపమును నిదానించి చూచును.
కాబట్టి నా సేవకుడైన మోషేకు విరోధముగా మాట
9 లాడుటకు మీరేల భయపడలేదనెను. । యెహోవా
కోపము వారిమీద రగులుకొనగా ఆయన వెళ్లి
10 పోయెను. । మేఘమును ఆ ప్రత్యక్షపు గుడారము
మీదనుండి ఎత్తబడెను; అప్పుడు మిర్యాము హిమము
వంటి తెల్లని కుష్ఠుగలదాయెను; అహరోను మిర్యాము
వైపు చూచినప్పుడు ఆమె కుష్ఠుగలదిగా కనబడెను. ।
11 అహరోను—అయ్యో నా ప్రభువా, మేము అవివేకు
లము; పాపులమైన మేము చేసిన యీ పాపమును
మామీద మోపవద్దు. । తన తల్లిగర్భములోనుండి పుట్టి 12
నప్పటికే సగముమాంసము క్షీణించిన శిశు శవమువలె
ఆమెను ఉండనియ్యకుమని మోషేతో చెప్పగా ।
మోషే యెలుగెత్తి—దేవా, దయచేసి యీమెను 13
బాగుచేయుమని యెహోవాకు మొరపెట్టెను. ।
అప్పుడు యెహోవా మోషేను చూచి—ఆమె 14
తండ్రి ఆమె ముఖముమీద ఉమ్మివేసినయెడల ఆమె
యేడు దినములు సిగ్గుపడునుగదా; ఆమె పాలెము
వెలుపట ఏడు దినములు ప్రత్యేకముగా ఉండవలెను;
తరువాత ఆమెను చేర్చుకొనవలెననెను. । కాబట్టి 15
మిర్యాము ఏడు దినములు పాలెము వెలుపటనే గడి
పెను. మిర్యాము మరల చేర్చబడువరకు జనులు
ముందుకు సాగనైరి. । తరువాత జనులు హజేరోతు 16
నుండి సాగి పారాను అరణ్యములో దిగిరి.

యెహోవా మోషేకు ఈలాగున సెలవిచ్చెను—13
నేను ఇశ్రాయేలీయులకు ఇచ్చుచున్న కనానుదేశ 2
మును సంచరించి చూచుటకు నీవు మనుష్యులను పం
పుము. వారి పితరుల గోత్రములలో ఒక్కొక్క
దానినుండి ఒక్కొక్క మనుష్యుని మీరు పంపవలెను;
వారిలో ప్రతివాడు ప్రధానుడై యుండవలెను. ।
మోషే యెహోవా మాట విని, పారాను అరణ్యము 3
నుండి వారిని పంపెను. వారందరు ఇశ్రాయేలీయు
లలో ముఖ్యులు. । వారి పేళ్లు ఏవనగా — రూబేను 4
గోత్రమునకు । జక్కూరు కుమారుడైన షమ్మూయ; 5
షిమ్యోను గోత్రమునకు హోరీ కుమారుడైన షాపా
తు; । యూదా గోత్రమునకు యెఫున్నె కుమారు 6
డైన కాలేబు; । ఇశ్శాఖారు గోత్రమునకు యోసేపు 7
కుమారుడైన ఇగాలు; । ఎఫ్రాయిము గోత్రమునకు 8
నూను కుమారుడైన హోషేయ; । బెన్యామీను 9
గోత్రమునకు రాఫు కుమారుడైన పల్తీ; । జెబులూను 10
గోత్రమునకు సోదీ కుమారుడైన గదీయేలు; । యోసేపు 11
గోత్రమునకు, అనగా మనష్షే గోత్రమునకు సూసీ
కుమారుడైన గదీ; । దాను గోత్రమునకు గెమల్లి కుమా 12
రుడైన అమ్మీయేలు; । ఆషేరు గోత్రమునకు మిఖా 13
యేలు కుమారుడైన సెతూరు; । నఫ్తాలి గోత్రమునకు 14
వాపెసీ కుమారుడైన నహబీ; । గాదు గోత్రమునకు 15
మాకీ కుమారుడైన గెయువేలు అనునవి. । దేశమును 16
సంచరించి చూచుటకు మోషే పంపిన మనుష్యుల
పేళ్లు ఇవి. మోషే నూనుకుమారుడైన హోషేయకు
యెహోషువ అను పేరు పెట్టెను. । మోషే కనాను 17
దేశమును సంచరించి చూచుటకు వారిని పంపినప్పుడు
వారితో ఇట్లనెను—మీరు ధైర్యము తెచ్చుకొని దాని
దక్షిణదిక్కున ప్రవేశించి ఆ కొండయెక్కి ఆ దేశము
ఎట్టిదో । దానిలో నివసించు జనము బలముగలవో 18
బలములేనివో, కొంచెమైనదో విస్తారమైనదో । వారు 19

నివసింపు భూమి యెట్టిదో, అది మంచిదో చెడ్డదో,
వారు నివసింపు పట్టణములు ఎట్టివో, వారు గుడార
ములలో నివసించుదురో కోటలలో నివసించుదురో,
20 ఆ భూమి సారమైనదో నిస్సారమైనదో, । దానిలో
చెట్లున్నవో లేవో కనిపెట్టవలెను. మరియు మీరు ఆ
దేశపు పండ్లలో కొన్ని తీసికొనిరండని చెప్పెను.
21 అది ద్రాక్షల ఫలముల పక్వకాలము. । కాబట్టి వారు
వెళ్లి సీను అరణ్యము మొదలుకొని హమాతుకు పోవు
మార్గముగా రెహోబువరకు దేశసంచారముచేసి చూ
22 చిరి. । వారు దక్షిణదిక్కున ప్రయాణముచేసి హెబ్రో
నుకు వచ్చిరి. అక్కడ అనాకు వంశస్థులైన అహీ
మాను షేషయి తల్మయి అనువారుండిరి. ఆ హెబ్రోను
ఐగుప్తులోని సోయనుకంటె ఏడేండ్లు ముందుగా కట్ట
23 బడెను. । వారు ఎష్కోలు లోయలోకి వచ్చి అక్కడ
ఒక్క గెలగల ద్రాక్షచెట్టుయొక్క కొమ్మను కోసి
దండెతో ఇద్దరు మోసిరి. మరియు వారు కొన్ని
దానిమ్మపండ్లను కొన్ని అంజూరపు పండ్లను తెచ్చిరి. ।
24 ఇశ్రాయేలీయులు అక్కడ కోసిన ద్రాక్షగెలనుబట్టి
ఆ స్థలమునకు ఎష్కోలు లోయ అను పేరు పెట్ట
25 బడెను. । వారు నలుబది దినములు ఆ దేశమును సంచ
26 రించి చూచి తిరిగి వచ్చిరి. । అట్లు వారు వెళ్లి పారాను
అరణ్యమందలి కాదేషులోనున్న మోషే అహరోనుల
యొద్దకును ఇశ్రాయేలీయుల సర్వసమాజమునొద్దకును
వచ్చి, వారికిని ఆ సర్వసమాజమునకును సమాచారము
తెలియచెప్పి ఆ దేశపు పండ్లను వారికి చూపించిరి. ।
27 వారు అతనికి తెలియపరచినదేమనగా—నీవు మమ్మును
పంపిన దేశమునకు వెళ్లితిమి; అది పాలు తేనెలు ప్రవ
28 హించు దేశమే; దాని పండ్లు ఇవి. । అయితే ఆ దేశ
ములో నివసించు జనులు బలవంతులు; వారి పట్టణ
ములు ప్రాకారముగలవి అవి మిక్కిలి గొప్పవి; మరి
29 యు అక్కడ అనాకీయులను చూచితిమి. । అమాలేకీ
యులు దక్షిణదేశములో నివసించుచున్నారు; హిత్తీ
యులు యెబూసీయులు అమోరీయులు కొండ దేశ
ములో నివసించుచున్నారు; కనానీయులు సముద్రము
నొద్దను యొర్దాను నదీప్రాంతములలోను నివసించు
30 చున్నారని చెప్పిరి. । కాలేబు మోషేయెదుట జను
లను నిమ్మళపరచి—మనము నిశ్చయముగా వెళ్లుదము;
దాని స్వాధీనపరుచుకొందుము; దాని జయించుటకు
31 మన శక్తి చాలునవెను. । అయితే అతనితో కూడ
పోయిన ఆ మనుష్యులు—ఆ జనులు మనకంటె బల
32 వంతులు; మనము వారిమీదికి పోజాలమనిరి. । మరి
యు వారు తాము సంచరించి చూచిన దేశమునుగూర్చి
ఇశ్రాయేలీయులతో చెడ్డ సమాచారము చెప్పి—మేము
సంచరించి చూచిన దేశము తన నివాసులను భక్షించు
దేశము; దానిలో మాకు కనబడిన జనులందరు ఉన్నత
దేహులు. । అక్కడ నెఫీలీయుల సంబంధులైన అనా
కువంశపు నెఫీలీయులను చూచితిమి; మా దృష్టికి
మేము మిడతలవలె ఉంటిమి, వారి దృష్టికిని అట్లే
ఉంటిమనిరి.

అప్పుడు ఆ సర్వసమాజము ఎలుగెత్తి కేకలు 14
వేసెను; ప్రజలు ఆ రాత్రి యెలుగెత్తి యేడ్చిరి. ।
మరియు ఇశ్రాయేలీయులందరు మోషే అహరోనుల 2
పైని సణుగుకొనిరి. । ఆ సర్వసమాజము — అయ్యో 3
ఐగుప్తులో మేమేల చావలేదు? ఈ అరణ్యమందు
మేమేల చావలేదు? మేము కత్తివాత పడునట్లు
యెహోవా మమ్మును ఈ దేశములోకి ఏల తీసికొని
వచ్చెను? మా భార్యలు మా పిల్లలు కొల్లపోవుదురు;
తిరిగి ఐగుప్తుకు వెళ్లుట మాకు మేలుకాదా? అని
వారితో అనిరి. । వారు — మనము నాయకుని ఒకని 4
నియమించుకొని ఐగుప్తుకు తిరిగి వెళ్లుదమని ఒకనితో
ఒకడు చెప్పుకొనగా । మోషే అహరోనులు ఇశ్రా 5
యేలీయుల సర్వసమాజసంఘము ఎదుట సాగిలపడిరి. ।
అప్పుడు దేశమును సంచరించి చూచినవారిలోనుండిన 6
నూను కుమారుడగు యెహోషువయు యెఫున్నె
కుమారుడగు కాలేబును బట్టలు చింపుకొని । ఇశ్రా 7
యేలీయుల సర్వసమాజమును చూచి — మేము సంచ
రించి చూచిన దేశము మిక్కిలి మంచి దేశము. ।
యెహోవా మనయందు ఆనందించినయెడల ఆ దేశ 8
ములో మనలను చేర్చి దాని మనకిచ్చును; అది పాలు
తేనెలు ప్రవహించు దేశము. । మెట్టుకు మీరు 9
యెహోవామీద తిరుగబడకుడి, ఆ దేశప్రజలకు
భయపడకుడి, వారు మనకు ఆహారమగుదురు, వారి
నీడ వారి మీదనుండి తొలగిపోయెను. యెహోవా
మనకు తోడైయున్నాడు, వారికి భయపడకుడనిరి.
ఆ సర్వసమాజము వారిని రాళ్లతో కొట్టి చంపవలె
ననగా । ప్రత్యక్షపు గుడారములో యెహోవా 10
మహిమ ఇశ్రాయేలీయులకందరికి కనబడెను.

యెహోవా—ఎన్నాళ్లవరకు ఈ ప్రజలు నన్ను 11
అలక్ష్యము చేయుదురు? ఎన్నాళ్లవరకు నేను వారి
మధ్యను చేసిన సూచకక్రియలన్నిటిని చూచి నన్ను
నమ్మక యుందురు? । నేను వారికి స్వాస్థ్యమియ్యక 12
తెగులుచేత వారిని హతముచేసి, యీ జనముకంటె
మహా బలముగల గొప్ప జనమును నీవలన పుట్టించెద
నని మోషేతో చెప్పగా । మోషే యెహోవాతో 13
ఇట్లనెను — ఆలాగైతే ఐగుప్తీయులు దానిగూర్చి విం
దురు; నీవు నీ బలముచేత ఈ జనమును ఐగుప్తీయుల
లోనుండి రప్పించితివిగదా; వీరు ఈ దేశనివాసులతో
ఈ సంగతి చెప్పియుందురు. । యెహోవా అను 14
నీవు ఈ ప్రజల మధ్యనున్నావనియు, యెహోవా
అను నీవు ముఖాముఖిగా కనబడినవాడవనియు, నీ
మేఘము వారిమీద నిలుచుచున్నదనియు, నీవు పగలు
మేఘస్తంభములోను రాత్రి అగ్నిస్తంభములోను వారి

35 పరపబడలేదు గనుక వానిని కావలిలో ఉంచిరి. । తరు
వాత యెహోవా—ఆ మనుష్యుడు మరణశిక్ష నొంద
36 వలెను. । సర్వసమాజము పాలెము వెలపల రాళ్లతో
వాని కొట్టి చంపవలెనని మోషేతో చెప్పెను. కా
బట్టి యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు సర్వ
సమాజము పాలెము వెలపలికి వాని తీసికొనిపోయి
రాళ్లతో వాని చావగొట్టెను.
37 మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
38 విచ్చెను । — నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము.
వారు తమ తరతరములకు తమ బట్టల అంచులకు
కుచ్చులు చేసికొని అంచుల కుచ్చులమీద నీలిసూ
39 త్రము తగిలింపవలెను. । మీరు నా ఆజ్ఞలన్నిటిని జ్ఞాప
41 కముచేసికొని మీ దేవునికి ప్రతిష్ఠితులై యుండునట్లు
మును పటివలె కోరినవాటినిబట్టియు చూచినవాటిని
బట్టియు వ్యభిచరింపక, దాని చూచి యెహోవా
ఆజ్ఞలన్నిటిని జ్ఞాపకముచేసికొని వాటిననుసరించు
టకే అది మీకు కుచ్చుగానుండును. నేను మీకు
దేవుడనై యుండునట్లుగా ఐగుప్తుదేశములోనుండి
మిమ్మును రప్పించిన మీ దేవుడనైన యెహోవాను;
మీ దేవుడనైన యెహోవాను నేనే.

16 లేవికి మునిమనుమడును కహాతుకు మనుమడును
ఇస్హారు కుమారుడునగు కోరహు రూబేనీయులలో
ఏలీయాబు కుమారులైన దాతాను అబీరాములును
2 పేలెతు కుమారుడైన ఓనును యోచించుకొని । ఇశ్రా
యేలీయులలో పేరుపొందిన సభికులును సమాజప్రధా
నులునైన యిన్నూటయేబదిమందితో మోషేకు ఎదు
3 రుగా లేచి । మోషే అహరోనులకు విరోధముగా
పోగుపడి—మీతో మాకిక పనిలేదు; ఈ సర్వసమా
జములోని ప్రతివాడును పరిశుద్ధుడే, యెహోవా
వారి మధ్యనున్నాడు; యెహోవా సంఘముమీద
మిమ్మును మీరేల హెచ్చించుకొనుచున్నారనగా, ।
4 మోషే ఆ మాట విని సాగిలపడెను. అటుతరువాత
అతడు కోరహుతోను వాని సమాజముతోను ఇట్ల
5 నెను । —తనవాడు ఎవడో పరిశుద్ధుడు ఎవడో రేపు
యెహోవా తెలియజేసి వానిని తన సన్నిధికి రాని
చ్చును. ఆయన తాను ఏర్పరచుకొనినవానిని తన
6 యొద్దకు చేర్చుకొనును. । ఈలాగు చేయుడి; కోర
హును అతని సమస్త సమూహమునైన మీరును ధూ
పార్తులను తీసికొని వాటిలో అగ్నియుంచి రేపు
యెహోవా సన్నిధిని వాటిమీద ధూపద్రవ్యము
7 వేయుడి. । అప్పుడు యెహోవా యే మనుష్యుని
యేర్పరచుకొనునో వాడే పరిశుద్ధుడు. లేవి కుమారు
8 లారా, మీతో నాకిక పనిలేదు. । మరియు మోషే
కోరహుతో ఇట్లనెను — లేవి కుమారులారా వినుడి. ।
9 తన మందిరసేవచేయుటకు యెహోవా మిమ్మును తన
యొద్దకు చేర్చుకొనుటయు, మీరు సమాజము ఎదుట
నిలిచి వారు చేయవలసిన సేవ చేయునట్లు ఇశ్రాయేలీ
యుల దేవుడు ఇశ్రాయేలీయుల సమాజములోనుండి
మిమ్మును వేరుపరచుటయు మీకు అల్పముగా కనబడు
నా? । ఆయన నిన్నును నీతో లేవీయులైన నీ గోత్రపు 10
వారి నందరిని చేర్చుకొనెను గదా. అయితే మీరు
యాజకత్వముకూడ కోరుచున్నారు. । ఇందు నిమిత్తము 11
నీవును నీ సమస్తసమాజమును యెహోవాకు విరోధ
ముగా పోగైయున్నారు. అహరోను ఎవడు? అతనికి
విరోధముగా మీరు సణుగనేల? । అప్పుడు మోషే 12
ఏలీయాబు కుమారులైన దాతాను అబీరాములను పిలువ
నంపించెను. । అయితే వారు—మేము రాము; ఈ 13
అరణ్యములో మమ్మును చంపవలెనని పాలు తేనెలు
ప్రవహించు దేశములోనుండి మమ్మును తీసికొని
వచ్చుట అల్పకార్యమైనట్టు మామీద ప్రభుత్వము
చేయుటకును నీకధికారము కావలెనా! । అంతేకాదు, 14
నీవు పాలు తేనెలు ప్రవహించు దేశములోకి మమ్మును
తీసికొని రాలేదు; పొలములు ద్రాక్షతోటలుగల
స్వాస్థ్యము మాకియ్యలేదు; ఈ మనుష్యుల కన్నులను
ఊడదీయుదువా? మేము రాము అనిరి. । అందుకు 15
మోషే మిక్కిలి కోపించి—నీవు వారి నైవేద్యమును
లక్ష్యపెట్టకుము. ఒక్క గాడిదనైనను వారియొద్ద
నేను తీసికొనలేదు; వారిలో ఎవనికిని నేను హాని
చేయలేదని యెహోవాయొద్ద మనవిచేసెను. । మరి 16
యు మోషే కోరహును చూచి—నీవును నీ సర్వ
సమూహమును, అనగా నీవును వారును అహరోనును
రేపు యెహోవా సన్నిధిని నిలువవలెను. । మీలో 17
ప్రతివాడును తన తన ధూపార్తిని తీసికొని వాటిమీద
ధూపద్రవ్యము వేసి, ఒక్కొక్కడు తన ధూపార్తిని
పట్టుకొని యిన్నూట ఏబది ధూపార్తులను యెహోవా
సన్నిధికి తేవలెను, నీవును అహరోనును ఒక్కొక్కడు
తన ధూపార్తిని తేవలెనని చెప్పెను. । కాబట్టి వారిలో 18
ప్రతివాడును తన ధూపార్తిని తీసికొని వాటిలో అగ్ని
యుంచి వాటిమీద ధూపద్రవ్యము వేసినప్పుడు,
వారును మోషే అహరోనులును ప్రత్యక్షపు గుడా
రముయొక్క ద్వారమునొద్ద నిలిచిరి. । కోరహు ప్రత్య 19
క్షపు గుడారముయొక్క ద్వారమునొద్దకు సర్వసమాజ
మును వారికి విరోధముగా పోగుచేయగా యెహోవా
మహిమ సర్వసమాజమునకు కనబడెను. । అప్పుడు 20
యెహోవా—మీరు ఈ సమాజములోనుండి అవ
తలికి వెళ్లుడి. । క్షణములో నేను వారిని కాల్చివేయు 21
దునని మోషే అహరోనులతో చెప్పగా । వారు 22
సాగిలపడి — సమస్త శరీరాత్మలకు దేవుడవైన దేవా,
యీ యొక్కడు పాపముచేసినందున ఈ సమస్త సమా
జముమీద నీవు కోపపడుదువా? అని వేడుకొనిరి. ।
అప్పుడు యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చె 22
ను—కోరహు దాతాను అబీరాములయొక్క నివాస 24

ముల చుట్టుపట్లనుండి తొలగిపోవుడని జనసమాజ
25 ముతో చెప్పుము. । అప్పుడు మోషే లేచి దాతాను
అబీరాములయొద్దకు వెళ్లగా ఇశ్రాయేలీయుల పెద్దలు
26 అతని వెంట వెళ్లిరి. । అతడు—ఈ దుష్టుల గుడార
ములయొద్దనుండి తొలగిపోవుడి; మీరు వారి పాప
ములన్నిటిలో పాలివారై నశింపక యుండునట్లు వా
రికి కలిగినదేదియు ముట్టకుడి అని ఆ సమాజముతో
27 అనెను. । కాబట్టి వారు కోరహు దాతాను అబీరా
ముల నివాసములయొద్దనుండి ఇటు అటు లేచిపోగా,
దాతాను అబీరాములును వారి భార్యలును వారి కుమా
రులును వారి పసిపిల్లలును తమ గుడారముల ద్వార
28 మున నిలిచిరి. । మోషే—ఈ సమస్త కార్యములను
చేయుటకు యెహోవా నన్ను పంపెననియు, నా
అంతట నేనే వాటిని చేయలేదనియు దీనివలన మీరు
29 తెలిసికొందురు. । మనుష్యులందరికి వచ్చు మరణము
వంటి మరణము వీరు పొందినయెడలను, సమస్త మను
ష్యులకు కలుగు దైవికము వీరికి కలిగినయెడలను,
30 యెహోవా నన్ను పంపలేదు. । అయితే యెహోవా
గొప్ప వింత పుట్టించుటవలన వారు ప్రాణములతో
పాతాళములో కూలునట్లు భూమి తన నోరు తెరచి
వారిని వారికి కలిగిన సమస్తమును మ్రింగివేసిన పక్ష
మున వారు యెహోవాను అలక్ష్యముచేసిరని మీకు
31 తెలియుననెను. । అతడు ఆ మాటలన్నియు చెప్పి
32 చాలించగానే వారి క్రింది నేల నెరవిడిచెను. । భూమి
తన నోరు తెరచి వారిని వారి కుటుంబములను కోరహు
సంబంధులందరిని వారి సమస్త సంపాద్యమును మ్రింగి
33 వేసెను. । వారును వారి సంబంధులందరును ప్రాణ
ముతో పాతాళములో కూలిరి; భూమి వారిని మ్రింగి
వేసెను; వారు సమాజములో ఉండకుండ నశించిరి. ।
34 వారి చుట్టునున్న ఇశ్రాయేలీయులందరు వారి ఘోష
విని—భూమి మనలను మ్రింగివేయునేమో అనుకొ
35 నుచు పారిపోయిరి. । మరియు యెహోవాయొద్ద
నుండి అగ్ని బయలుదేరి ధూపార్పణమును తెచ్చిన ఆ
36 యిన్నూట ఏబదిమందిని కాల్చివేసెను. । అప్పుడు
యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చెను—నీవు
యాజకుడగు అహరోను కుమారుడైన ఎలాజారుతో
ఇట్లనుము — ఆ అగ్నిమధ్యనుండి ఆ ధూపార్తులను
37 ఎత్తుము, అవి ప్రతిష్ఠితమైనవి. । ఆ అగ్నిని దూర
38 ముగా చల్లుము. । పాపముచేసి తమ ప్రాణములకు
ముప్పు తెచ్చుకొనిన వీరి ధూపార్తులను తీసికొని బలి
పీఠమునకు కప్పుగా వెడల్పయిన రేకులను చేయవలెను.
వారు యెహోవా సన్నిధికి వాటిని తెచ్చినందున అవి
ప్రతిష్ఠితమైనవి; అవి ఇశ్రాయేలీయులకు ఆనవాలుగా
9 ఉండును. । అహరోను సంతాన సంబంధికాని అన్యు
0 డెవడును యెహోవా సన్నిధిని ధూపము అర్పింప
సమీపించి కోరహువలెను అతని సమాజమువలెను
కాకుండునట్లు ఇశ్రాయేలీయులకు జ్ఞాపకసూచనగా
ఉండుటకై యాజకుడైన ఎలాజారు కాల్చబడినవారు
అర్పించిన యిత్తడి ధూపార్తులను తీసి యెహోవా
మోషే ద్వారా తనతో చెప్పినట్లు వాటితో బలిపీఠ
మునకు కప్పుగా వెడల్పయిన రేకులు చేయించెను.

మరునాడు ఇశ్రాయేలీయుల సర్వసమాజము 41
మోషే అహరోనులకు విరోధముగా సణుగుచు—
మీరు యెహోవా ప్రజలను చంపితిరని చెప్పి ।
సమాజము మోషే అహరోనులకు విరోధముగా 42
కూడెను. వారు ప్రత్యక్షపు గుడారమువైపు తిరిగి
చూడగా ఆ మేఘము దాని కప్పెను; యెహోవా
మహిమయు కనబడెను. । మోషే అహరోనులు ప్రత్య 43
క్షపు గుడారము ఎదుటికి రాగా । యెహోవా— 44
మీరు ఈ సమాజము మధ్యనుండి తొలగిపోవుడి; ।
క్షణములో నేను వారిని నశింపజేయుదునని మోషేకు 45
సెలవియ్యగా వారు సాగిలపడిరి. । అప్పుడు మోషే 46
—నీవు ధూపార్తిని తీసికొని బలిపీఠపు నిప్పులతో
నింపి ధూపమువేసి వేగముగా సమాజమునొద్దకు వెళ్లి
వారినిమిత్తము ప్రాయశ్చిత్తముచేయుము; కోపము
యెహోవా సన్నిధినుండి బయలుదేరెను; తెగులు
మొదలుపెట్టెనని అహరోనుతో చెప్పగా । మోషే 47
చెప్పినట్లు అహరోను వాటిని తీసికొని సమాజమధ్యకు
పరుగెత్తిపోయినప్పుడు తెగులు జనులలో మొదలు
పెట్టి యుండెను; కాగా అతడు ధూపమువేసి ఆ
జనుల నిమిత్తము ప్రాయశ్చిత్తము చేసెను. । అతడు 48
చచ్చినవారికిని బ్రదికియున్నవారికిని మధ్యను నిలువ
బడగా తెగులు ఆగెను. । కోరహు తిరుగబాటున 49
చనిపోయినవారు గాక పదునాలుగువేల ఏడునూర్ల
మంది ఆ తెగులుచేత చచ్చిరి. । ఆ తెగులు ఆగినప్పుడు 50
అహరోను ప్రత్యక్షపు గుడారముయొక్క ద్వారము
దగ్గరనున్న మోషేయొద్దకు తిరిగి వచ్చెను.

యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చెను । **17**
—నీవు ఇశ్రాయేలీయులతో మాటలాడి వారియొద్ద 2
నొక్కొక్క పితరుల కుటుంబమునకు ఒక్కొక్క
కర్రగా, అనగా వారి ప్రధానులందరియొద్ద వారి
వారి పితరుల కుటుంబముల చొప్పున పన్నెండు కర్ర
లను తీసికొని యెవరి కర్రమీద వారిపేరు వ్రాయు
ము. । లేవికర్రమీద అహరోను పేరు వ్రాయవలెను; 3
ఏలయనగా పితరుల కుటుంబముల ప్రధానునికి ఒక్క
కర్రయే యుండవలెను. । నేను మిమ్మును కలిసికొను 4
ప్రత్యక్షపు గుడారములోని శాసనములయెదుట
వాటిని ఉంచవలెను. । అప్పుడు నేను ఎవని ఏర్పరచు 5
కొందునో వాని కర్ర చిగిరించును. ఇశ్రాయేలీయులు
మీకు విరోధముగా సణుగుచుండు సణుగులు నాకు
వినబడకుండ మాన్పివేయుదును. । కాబట్టి మోషే 6
ఇశ్రాయేలీయులతో చెప్పగా వారి ప్రధానులందరు

తమ తమ పితరుల కుటుంబములలో ఒక్కొక్క ప్రధా
నునికి ఒక్కొక్క కఱ్ఱచొప్పున పన్నెండు కఱ్ఱలను
అతనికిచ్చిరి; అహరోను కఱ్ఱయు వారి కఱ్ఱల మధ్య
7 నుండెను. । మోషే వారి కఱ్ఱలను సాక్ష్యపు గుడార
8 ములో యెహోవా సన్నిధిని ఉంచెను. । మరునాడు
మోషే సాక్ష్యపు గుడారములోకి వెళ్లి చూడగా
లేవి కుటుంబపువాడైన అహరోను కఱ్ఱ చిగిర్చి యుం
డెను. అది చిగిర్చి పువ్వులు పూసి బాదముపండ్లుగల
దాయెను.

9 మోషే యెహోవా సన్నిధినుండి ఆ కఱ్ఱలన్ని
టిని ఇశ్రాయేలీయులందరి యెదుటికి తేగా వారు
వాటిని చూచి యెవ్వొక్కడు ఎవరి కఱ్ఱను వారు
10 తీసికొనిరి. । అప్పుడు యెహోవా మోషేతో ఇట్ల
నెను—తిరుగబడినవారినిగూర్చి ఆనవాలుగా కాపాడ
బడునట్లు, అహరోను కఱ్ఱను మరల శాసనములయె
దుట ఉంచుము. వారు చావకుండునట్లు నాకు విన
బడకుండ వారి సణుగులను కేవలము అణచి మాన్పి
11 వేసినవాడవౌదువు. । అప్పుడు యెహోవా మో
షేకు ఆజ్ఞాపించినట్లు అతడు చేసెను; ఆలాగుననే
12 చేసెను. । అయితే ఇశ్రాయేలీయులు మోషేతో ఇట్ల
నిరి — ఇదిగో మా ప్రాణములు పోయినవి; నశించి
13 పోతిమి మేమందరము నశించిపోతిమి. । యెహోవా
మందిరమునకు సమీపించు ప్రతివాడును చచ్చును;
మేము నిశ్శేషముగా చావవలసియున్నదా? అని
చెప్పిరి.

**18** యెహోవా అహరోనుతో ఇట్లనెను — నీవును
నీ కుమారులును నీ తండ్రి కుటుంబమును పరిశుద్ధస్థలపు
సేవలోని దోషములకు ఉత్తరవాదులు; నీవును నీ కుమా
రులును మీ యాజకత్వపు దోషములకు ఉత్తరవాదు
2 లు. । మరియు నీ తండ్రి గోత్రమును, అనగా లేవి
గోత్రికులైన నీ సహోదరులను నీవు దగ్గరకు తీసి
కొని రావలెను; వారు నీతో కలిసి నీకు పరిచర్య
చేయుదురు. అయితే నీవును నీ కుమారులును సాక్ష్యపు
3 గుడారము ఎదుట సేవచేయవలెను. । వారు నిన్నును
గుడారమంతటిని కాపాడుచుండవలెను. అయితే
వారును మీరును చావకుండునట్లు వారు పరిశుద్ధస్థలము
యొక్క ఉపకరణములయొద్దకైనను బలిపీఠమునొద్ద
4 కైనను సమీపింపవలదు. । వారు నీతో కలిసి ప్రత్య
క్షపు గుడారములోని సమస్త సేవవిషయములో దాని
5 కాపాడవలెను. । అన్యుడు మీయొద్దకు సమీపింప
కూడదు; ఇకమీదట మీరు పరిశుద్ధస్థలమును బలిపీఠ
మును కాపాడవలెను; అప్పుడు ఇశ్రాయేలీయుల
6 మీదికి కోపము రాదు. । ఇదిగో నేను ఇశ్రాయేలీ
యులమధ్యనుండి లేవీయులైన మీ సహోదరులను
తీసికొని యున్నాను; ప్రత్యక్షపు గుడారముయొక్క
సేవచేయుటకు వారు యెహోవావలన మీకన్పగింప
బడియున్నారు. । కాబట్టి నీవును నీ కుమారులును 7
బలిపీఠమునొద్ది పనులన్నిటి విషయములోను అడ్డతెర
లోపలి దాని విషయములోను యాజకత్వము జరు
పుచు సేవచేయవలెను. దయచేతనే మీ యాజకత్వపు
సేవ నేను మీకిచ్చియున్నాను; అన్యుడు సమీపించిన
యెడల మరణశిక్ష నొందును.

మరియు యెహోవా అహరోనుతో ఇట్లనెను— 8
ఇదిగో ఇశ్రాయేలీయులు ప్రతిష్ఠించువాటన్నిటిలో
నా ప్రతిష్ఠార్పణములను కాపాడు పని నీకిచ్చియు
న్నాను; అభిషేకమునుబట్టి నిత్యమైన కట్టడవలన
నీకును నీ కుమారులకును నేనిచ్చియున్నాను. । అగ్నిలో 9
దహింపబడని అతిపరిశుద్ధమైన వాటిలో నీకు రావల
సినవేవనగా, వారి నైవేద్యములన్నిటిలోను, వారి
పాపపరిహారార్థ బలులన్నిటిలోను, వారి అపరాధ
పరిహారార్థ బలులన్నిటిలోను, వారు నాకు తిరిగి
చెల్లించు అర్పణములన్నియు నీకును నీ కుమారులకును
అతిపరిశుద్ధమైనవగును, అతిపరిశుద్ధస్థలములో మీరు
వాటిని తినవలెను. । ప్రతి మగవాడును దాని తిన 10
వలెను; అది నీకు పరిశుద్ధముగా ఉండును. । మరియు 11
వారి దానములలో ప్రతిష్ఠింపబడినదియు, ఇశ్రాయేలీ
యులు అల్లాడించు అర్పణములన్నియు నీవగును.
నీకును నీ కుమారులకును నీ కుమార్తెలకును నిత్యమైన
కట్టడవలన వాటినిచ్చితిని; నీ యింటిలోని పవిత్రు
లందరును వాటిని తినవచ్చును. । వారు యెహోవాకు 12
అర్పించు వారి ప్రథమఫలములను, అనగా
నూనెలో ప్రశస్తమైనదంతయు, ద్రాక్షారస ధాన్య
ములలో ప్రశస్తమైనదంతయు నీకిచ్చితిని. । వారు 13
తమ దేశపు పంటలన్నిటిలో యెహోవాకు తెచ్చు
ప్రథమ ఫలములు నీవియగును; నీ యింటిలోని పవిత్రు
లందరు వాటిని తినవచ్చును. । ఇశ్రాయేలీయులలో 14
మీదు కట్టబడిన ప్రతి వస్తువు నీదగును. । మనుష్యుల 15
లోనిదేమి జంతువులలోనిదేమి, వారు యెహోవాకు
అర్పించు సమస్త ప్రాణులలోని ప్రతి తొలు
చూలు నీదగును. అయితే మనుష్యుని తొలిచూలి
పిల్లను వెలయిచ్చి విడిపింపవలెను. । అపవిత్ర జంతు 16
వుల తొలిచూలిపిల్లను వెలయిచ్చి విడిపింపవలెను.
విడిపింపవలసినవాటిని పుట్టిన నెలనాటికి నీవు ఏర్పర
చిన వెలచొప్పున, పరిశుద్ధమందిరముయొక్క తులపు
పరిమాణమునుబట్టి అయిదు తులముల వెండియిచ్చి
వాటిని విడిపింపవలెను. తులము ఇరువది చిన్నములు. ।
అయితే ఆవుయొక్క తొలిచూలిని గొఱ్ఱెయొక్క 17
తొలిచూలిని మేకయొక్క తొలిచూలిని విడిపింప
కూడదు; అవి ప్రతిష్ఠితమైనవి; వాటి రక్తమును నీవు
బలిపీఠముమీద ప్రోక్షించి యెహోవాకు ఇంపైన
సువాసన కలుగునట్లు వాటి క్రొవ్వును దహింపవలెను
గాని వాటి మాంసము నీదగును. । అల్లాడింపబడు 18

బోరయు కుడి జబ్బయు నీదైనట్లు అదియు నీదగును. ।
19 ఇశ్రాయేలీయులు యెహోవాకు ప్రతిష్ఠించు పరి
శుద్ధమైన ప్రతిష్ఠార్పణములన్నిటిని నేను నీకును నీ
కుమారులకును నీ కుమార్తెలకును నిత్యమైన కట్టడను
బట్టి యిచ్చితిని. అది నీకును నీతోపాటు నీ సంతతి
కిని యెహోవా సన్నిధిని నిత్యమును స్థిరమైన నిబం
20 ధన. । మరియు యెహోవా అహరోనుతో ఇట్ల
నెను—వారి దేశములో నీకు స్వాస్థ్యము కలుగదు;
వారి మధ్యను నీకు పాలు ఉండదు; ఇశ్రాయేలీయుల
మధ్యను నీ పాలు నీ స్వాస్థ్యము నేనే.
21 ఇదిగో లేవీయులు చేయు సేవకు, అనగా ప్రత్య
క్షపు గుడారముయొక్క సేవకు నేను ఇశ్రాయేలీయుల
యొక్క దశమభాగములన్నిటిని వారికి స్వాస్థ్యముగా
22 ఇచ్చితిని. । ఇశ్రాయేలీయులు పాపము తగిలి చావ
కుండునట్లు వారు ఇకమీదట ప్రత్యక్షపు గుడార
23 మునకు రాకూడదు. । అయితే లేవీయులు ప్రత్యక్షపు
గుడారముయొక్క సేవచేసి, వారి సేవలోని దోషము
లకు తామే ఉత్తరవాదులై యుందురు. ఇశ్రాయేలీ
యుల మధ్యను వారికి స్వాస్థ్యమేమియు ఉండదు.
24 ఇది మీ తరతరములకు నిత్యమైన కట్టడ. । అయితే
ఇశ్రాయేలీయులు యెహోవాకు ప్రతిష్ఠార్పణముగా
అర్పించు దశమభాగములను నేను లేవీయులకు స్వాస్థ్య
ముగా ఇచ్చితిని. అందుచేతను వారు ఇశ్రాయేలీయుల
మధ్యను స్వాస్థ్యము సంపాదింపకూడదని వారితో
చెప్పితిని.
25 మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
26 విచ్చెను । — నీవు లేవీయులతో ఇట్లనుము — నేను
ఇశ్రాయేలీయులచేత మీకు స్వాస్థ్యముగా ఇప్పించిన
దశమభాగమును మీరు వారియొద్ద పుచ్చుకొను
నప్పుడు మీరు దానిలో, అనగా ఆ దశమభాగ
ములో దశమభాగమును యెహోవాకు ప్రతిష్ఠార్ప
27 ణముగా చెల్లింపవలెను. । మీకు వచ్చు ప్రతిష్ఠార్ప
ణము కళ్లపు పంటవలెను ద్రాక్షల తొట్టి ఫలము
28 వలెను ఎంచవలెను. । అట్లు మీరు ఇశ్రాయేలీయుల
యొద్ద పుచ్చుకొను మీ దశమభాగములన్నిటిలోనుండి
మీరు ప్రతిష్ఠార్పణమును యెహోవాకు చెల్లింప
వలెను. దానిలోనుండి మీరు యెహోవాకు ప్రతి
ష్ఠించు అర్పణమును యాజకుడైన అహరోనుకు ఇయ్య
29 వలెను. । మీకియ్యబడువాటన్నిటిలో ప్రశస్తమైన
దానిలోనుండి యెహోవాకు ప్రతిష్ఠించు ప్రతి
అర్పణమును, అనగా దాని ప్రతిష్ఠితభాగమును దాని
30 లోనుండి ప్రతిష్ఠింపవలెను. । మరియు నీవు వారిని
చూచి — మీరు దానిలోనుండి ప్రశస్తభాగమును
అర్పించిన తరువాత మిగిలినది కళ్లపు వచ్చుబడివలెను
ద్రాక్షతొట్టి వచ్చుబడివలెను లేవీయులదని యెంచ
31 వలెను. । మీరును మీ కుటుంబికులును ఏ స్థలమందైన
నను దాని తినవచ్చును; ఏలయనగా ప్రత్యక్షపు
గుడారములో మీరు చేయు సేవకు అది మీకు
జీతము. । మీరు దానిలోనుండి ప్రశస్తభాగమును 32
అర్పించిన తరువాత దానినిబట్టి పాపశిక్షను భరింప
కుందురు; మీరు చావకుండునట్లు ఇశ్రాయేలీయుల
ప్రతిష్ఠితమైనవాటిని అపవిత్రపరచకూడదని చెప్పుము.
**యె**హోవా మోషే అహరోనులకు ఈలాగు **19**
సెలవిచ్చెను । — యెహోవా ఆజ్ఞాపించిన ధర్మశాస్త్ర 2
విధి యేదనగా, ఇశ్రాయేలీయులు కళంకములేనిదియు
మచ్చలేనిదియు ఎప్పుడును కాడి మోయనిదియునైన
యెఱ్ఱని పెయ్యను నీయొద్దకు తీసికొని రావలెనని
వారితో చెప్పుము. । మీరు యాజకుడైన ఎలాజారుకు 3
దానిని అప్పగింపవలెను. ఒకడు పాలెము వెలపలికి
దాని తోలుకొనిపోయి అతనియెదుట దాని వధింప
వలెను. । యాజకుడైన ఎలాజారు దాని రక్తములోనిది 4
కొంచెము వ్రేలితో తీసి ప్రత్యక్షపు గుడారము ఎదుట
ఆ రక్తములో కొంచెము ఏడు మారులు ప్రోక్షింప
వలెను; । అతని కన్నుల ఎదుట ఒకడు ఆ పెయ్యను 5
దహింపవలెను. దాని చర్మమును మాంసమును రక్తమును
పేడయును దహింపవలెను. । మరియు ఆ యాజకుడు 6
దేవదారు కఱ్ఱను హిస్సోపును రక్తవర్ణపునూలును తీసి
కొని ఆ పెయ్య మండుచున్న అగ్నిలో వేయవలెను. ।
అప్పుడు ఆ యాజకుడు తన బట్టలు ఉదుకుకొని 7
నీళ్లతో శిరస్స్నానము చేసిన తరువాత పాలెములో
ప్రవేశించి సాయంకాలమువరకు అపవిత్రుడై యుం
డును. । దాని దహించినవాడు నీళ్లతో తన బట్టలు 8
ఉదుకుకొని నీళ్లతో శిరస్స్నానము చేసి సాయంకాల
మువరకు అపవిత్రుడై యుండును. । మరియు పవిత్రు 9
డైన యొకడు ఆ పెయ్యయొక్క భస్మమును పోగుచేసి
పాలెము వెలపటను పవిత్రస్థలమందు ఉంచవలెను.
పాపపరిహార జలముగా ఇశ్రాయేలీయుల సమాజము
నకు దాని భద్రముచేయవలెను; అది పాపపరిహారార్థ
బలి. । ఆ పెయ్యయొక్క భస్మమును పోగుచేసినవాడు 10
తన బట్టలు ఉదుకుకొని సాయంకాలమువరకు అప
విత్రుడై యుండును. ఇది ఇశ్రాయేలీయులకును వారి
లో నివసించు పరదేశులకును నిత్యమైన కట్టడ. । ఏ 11
నరశవమునైనను ముట్టినవాడు ఏడు దినములు అప
విత్రుడై యుండును. । అతడు మూడవ దినమున ఆ 12
జలముతో పాపశుద్ధి చేసికొని యేడవ దినమున పవి
త్రుడగును. అయితే వాడు మూడవ దినమున
పాపశుద్ధి చేసికొననియెడల ఏడవదినమున పవిత్రుడు
కాడు. । నరశవమును ముట్టినవాడు అట్లు పాప 13
శుద్ధి చేసికొననియెడల వాడు యెహోవా మందిర
మును అపవిత్రపరచువాడగును. ఆ మనుష్యుడు
ఇశ్రాయేలీయులలోనుండి కొట్టివేయబడును. పాప
పరిహార జలము వానిమీద ప్రోక్షింపబడలేదు గనుక

వాడు అపవిత్రుడు, వాని అపవిత్రత యింక వాని
14 కుండును. । ఒకడు ఒక గుడారములో చచ్చినయెడల
దానిగూర్చిన విధి యిది. ఆ గుడారములో ప్రవే
శించు ప్రతివాడును ఆ గుడారములో నున్నది యా
వత్తును ఏడు దినములు అపవిత్రముగా నుండును. ।
15 మూత వేయబడక తెరిచియున్న ప్రతి పాత్రయు
16 అపవిత్రమగును. । బయట పొలములో ఖడ్గముతో నరక
బడినవానినైనను, శవమునైనను మనుష్యుని యెముక
నైనను సమాధినైనను ముట్టువాడు ఏడు దినములు
17 అపవిత్రుడై యుండును. । అపవిత్రునికొరకు వారు
పాపపరిహారార్థమైన హోమభస్మములోనిది కొం
చెము తీసికొనవలెను; పాత్రలో వేయబడిన ఆ భస్మము
18 మీద ఒకడు పారు నీళ్లు పోయవలెను. । తరువాత
పవిత్రుడైన యొకడు హిస్సోపు తీసికొని ఆ నీళ్లలో
ముంచి, ఆ గుడారముమీదను దానిలోని సమస్తమైన
ఉపకరణములమీదను అక్కడనున్న మనుష్యులమీ
దను, ఎముకనేగాని నరకబడినవానినేగాని శవమునే
గాని సమాధినేగాని ముట్టినవానిమీదను దాని ప్రో
19 క్షింపవలెను. । మూడవ దినమున ఏడవ దినమున పవి
త్రుడు అపవిత్రునిమీద దాని ప్రోక్షింపవలెను.
ఏడవ దినమున వాడు పాపశుద్ధి చేసికొని తన బట్టలు
ఉదుకుకొని నీళ్లతో స్నానముచేసి సాయంకాలమున
20 పవిత్రుడగును. । అపవిత్రుడు పాపశుద్ధి చేసికొనని
పక్షమందు అట్టి మనుష్యుడు సమాజములోనుండి
కొట్టివేయబడును; వాడు యెహోవా పరిశుద్ధస్థల
మును అపవిత్రపరచెను; పాపపరిహార జలము వాని
మీద ప్రోక్షింపబడలేదు; వాడు అపవిత్రుడు. ।
21 వారికి నిత్యమైన కట్టడ ఏదనగా, పాపపరిహార జల
మును ప్రోక్షించువాడు తన బట్టలు ఉదుకుకొన
వలెను; పాపపరిహార జలమును ముట్టువాడు సాయం
కాలమువరకు అపవిత్రుడై యుండును; అపవిత్రుడు
22 ముట్టునది యావత్తును అపవిత్రము. । దాని ముట్టు
మనుష్యులందరు సాయంకాలమువరకు అపవిత్రులై
యుందురు.

**20** మొదటి నెలయందు ఇశ్రాయేలీయుల సర్వసమా
జము సీను అరణ్యమునకు రాగా ప్రజలు కాదేషులో
దిగిరి. అక్కడ మిర్యాము చనిపోయి పాతిపెట్టబడె
2 ను. । ఆ సమాజమునకు నీళ్లు లేకపోయినందున వారు
3 మోషే అహరోనులకు విరోధముగా పోగైరి. । జనులు
మోషేతో వాదించుచు — అయ్యో మా సహోద
రులు యెహోవా ఎదుట చనిపోయినప్పుడు మేమును
4 చనిపోయినయెడల ఎంతో మేలు? । అయితే మేమును
మా పశువులును ఇక్కడ చనిపోవునట్లు ఈ అరణ్యము
లోకి యెహోవా సమాజమును మీరేల తెచ్చితిరి? ।
5 ఈ కానిచోటికి మమ్ము తెచ్చుటకు, ఐగుప్తులోనుండి
మమ్మును ఏల రప్పించితిరి? ఈ స్థలములో గింజలు లేవు
అంజూరలు లేవు ద్రాక్షలు లేవు దానిమ్మలు లేవు
త్రాగుటకు నీళ్లే లేవనిరి. । అప్పుడు మోషే అహరో 6
నులు సమాజము ఎదుటనుండి ప్రత్యక్షపు గుడారము
యొక్క ద్వారములోకి వెళ్లి సాగిలపడగా యెహోవా
మహిమ వారికి కనబడెను. । అంతట యెహోవా 7
మోషేకు ఈలాగు సెలవిచ్చెను । — నీవు నీ కర్రను 8
తీసికొని, నీవును నీ సహోదరుడైన అహరోనును ఈ
సమాజమును పోగుచేసి వారి కన్నులయెదుట ఆ బండ
తో మాటలాడుము, అది నీళ్లనిచ్చును. నీవు వారికొరకు
నీళ్లను బండలోనుండి రప్పించి సమాజమునకును వారి
పశువులకును త్రాగనిమ్ము. । యెహోవా అతని కాజ్ఞా 9
పించినట్లు మోషే ఆయన సన్నిధినుండి ఆ కర్రను
తీసికొనిపోయెను. । తరువాత మోషే అహరోనులు 10
ఆ బండయెదుట సమాజమును పోగుచేసినప్పుడు
అతడు వారిని చూచి — ద్రోహులారా వినుడి; మేము
ఈ బండలోనుండి మీకొరకు నీళ్లు రప్పింపవలెనా?
అనెను. । అప్పుడు మోషే తన చెయ్యి నెత్తి రెండు 11
మారులు తన కర్రతో ఆ బండను కొట్టగా నీళ్లు
సమృద్ధిగా ప్రవహించెను; సమాజమును పశువులును
త్రాగెను. । అప్పుడు యెహోవా మోషే అహరో 12
నులను చూచి — మీరు ఇశ్రాయేలీయుల కన్నుల
యెదుట నా పరిశుద్ధతను సన్మానించునట్లు నన్ను నమ్ము
కొనకపోతిరి గనుక ఈ సమాజమును నేను వారికిచ్చిన
దేశములోకి మీరు తోడుకొని పోరని చెప్పెను. ।
అవి మెరీబా[1] జలమనబడెను; ఏలయనగా ఇశ్రాయేలీ 13
యులు యెహోవాతో వాదించినప్పుడు ఆయన
వారి మధ్యను తన్ను పరిశుద్ధపరచుకొనెను.

మోషే కాదేషునుండి ఎదోము రాజునొద్దకు 14
దూతలను పంపి — నీ సహోదరుడగు ఇశ్రాయేలు
అడుగునదేమనగా — మాకు వచ్చిన కష్టము యావత్తును
నీకు తెలిసినది; । మా పితరులు ఐగుప్తుకు వెళ్లిరి; మేము 15
చాలాదినములు ఐగుప్తులో నివసించితిమి; ఐగుప్తీయులు
మమ్మును మా పితరులను శ్రమపెట్టిరి. । మేము 16
యెహోవాకు మొర్రపెట్టగా ఆయన మా మొర్రను
విని, దూతను పంపి ఐగుప్తులోనుండి మమ్మును రప్పిం
చెను. ఇదిగో మేము నీ పొలిమేరలయందు కాదేషు
పట్టణములో ఉన్నాము. । మమ్మును నీ దేశమును దాటి 17
పోనిమ్ము; పొలములలో బడియైనను ద్రాక్షతోటలలో
బడియైనను వెళ్లము; బావుల నీళ్లు త్రాగము; రాజ
మార్గమున నడిచిపోయెదము. నీ పొలిమేరలను దాటు
వరకు కుడివైపునకైనను ఎడమవైపునకైనను తిరుగకుండ
పోయెదమని చెప్పించెను. । ఎదోమీయులు — నీవు 18
నా దేశములో బడి వెళ్లకూడదు; నేను ఖడ్గముతో
నీకు ఎదురుగా వచ్చెదను సుమీ అని అతనితో చెప్ప

[1] అనగా — వివాదము.

19 గా। ఇశ్రాయేలీయులు — మేము రాజమార్గముననే
వెళ్లెదము; నేనును నా పశువులును నీ నీళ్లు త్రాగ
నెడల వాటి విలువ నిచ్చుకొందును. మరేమి లేదు,
కాలినడకనే దాటిపోవుదును; అంతే అని అతనితో
20 చెప్పినప్పుడు అతడు—నీవు రానేకూడదనెను. । అం
తట ఎదోము బహు జనముతోను మహా బలముతోను
21 బయలుదేరి వారి కెదురుగా వచ్చెను. । ఎదోము ఇశ్రా
యేలు తన పొలిమేరలలో బడి దాటిపోవుటకు సెల
వియ్యలేదు గనుక ఇశ్రాయేలీయులు అతనియొద్దనుండి
తొలగిపోయిరి.
22 అప్పుడు ఇశ్రాయేలీయుల సర్వసమాజము కాదే
షులోనుండి సాగి హోరు కొండకు వచ్చెను. ।
23 యెహోవా ఎదోము పొలిమేరలయొద్దనున్న హోరు
కొండలో మోషే అహరోనులకు ఈలాగు సెలవిచ్చె
24 ను। — అహరోను తన పితరులతో చేర్చబడును; ఏల
యనగా మెరీబా నీళ్లయొద్ద మీరు నా మాట వినక
నామీద తిరుగబాటు చేసితిరి గనుక నేను ఇశ్రాయేలీ
యులకు ఇచ్చిన దేశమందు అతడు ప్రవేశింపడు. ।
25 నీవు అహరోనును అతని కుమారుడైన ఎలాజారును
26 తోడుకొని హోరు కొండయెక్కి, అహరోను వస్త్ర
ములు తీసి అతని కుమారుడైన ఎలాజారుకు తొడిగిం
చుము. అహరోను తన పితరులతో చేర్చబడి అక్కడ
27 చనిపోవును. । యెహోవా ఆజ్ఞాపించినట్లు మోషే
చేసెను. సర్వసమాజము చూచుచుండగా వారు హోరు
28 కొండ నెక్కిరి. । మోషే అహరోను వస్త్రములు తీసి
అతని కుమారుడైన ఎలాజారుకు తొడిగించెను. అహ
రోను కొండశిఖరమున చనిపోయెను. తరువాత మోషే
29 యు ఎలాజారును ఆ కొండదిగివచ్చిరి. । అహరోను
చనిపోయెనని సర్వసమాజము గ్రహించినప్పుడు
ఇశ్రాయేలీయుల కుటుంబికులందరును అహరోను
కొరకు ముప్పది దినములు దుఃఖము సలిపిరి.

**21** ఇశ్రాయేలీయులు అతారీయుల మార్గముగా
వచ్చుచున్నారని దక్షిణదిక్కున నివసించిన కనానీయు
డైన అరాదు రాజు విని, అతడు ఇశ్రాయేలీయులతో
2 యుద్ధముచేసి వారిలో కొందరిని చెరపట్టగా । ఇశ్రా
యేలీయులు యెహోవాకు మ్రొక్కుకొని — నీవు మా
చేతికి ఈ జనమును బొత్తిగా అప్పగించినయెడల
మేము వారి పట్టణములను నీ పేరట నిర్మూలము చేసెద
3 మనిరి. । యెహోవా ఇశ్రాయేలీయుల మాట ఆల
కించి ఆ కనానీయులను అప్పగింపగా ఇశ్రాయేలీ
యులు వారిని వారి పట్టణములను నిర్మూలముచేసిరి.
అందువలన ఆ చోటికి హోర్మా అను పేరు పెట్ట
బడెను.
4 వారు ఎదోముదేశమును చుట్టు పోవలెనని హోరు
కొండనుండి ఎర్రసముద్రమార్గముగా సాగినప్పుడు
(మార్గాయాసముచేత) జనుల ప్రాణము సొమ్మసిల్లెను. ।
కాగా ప్రజలు దేవునికిని మోషేకును విరోధ 5
ముగా మాటలాడి — ఈ అరణ్యములో చచ్చుటకు
ఐగుప్తులోనుండి మీరు మమ్ము నెందుకు రప్పించితిరి?
ఇక్కడ ఆహారము లేదు నీళ్లు లేవు చవిసారములులేని
యీ అన్నము మాకు అసహ్యమైనదనిరి. । అందుకు 6
యెహోవా ప్రజలలోకి తాపకరములైన సర్పములను
పంపెను; అవి ప్రజలను కరవగా ఇశ్రాయేలీయులలో
అనేకులు చనిపోయిరి. । కాబట్టి ప్రజలు మోషే 7
యొద్దకు వచ్చి—మేము యెహోవాకును నీకును విరో
ధముగా మాటలాడి పాపము చేసితిమి; యెహోవా
మా మధ్యనుండి ఈ సర్పములను తొలగించునట్లు ఆయ
నను వేడుకొనుమనిరి. । మోషే ప్రజలకొరకు ప్రార్థన 8
చేయగా యెహోవా—నీవు తాపకరమైన సర్పమొ
కటి చేయించి స్తంభముమీద పెట్టుము; అప్పుడు
కరవబడిన ప్రతివాడును దానివైపు చూచి బ్రదుకు
నని మోషేకు సెలవిచ్చెను. । కాబట్టి మోషే ఇత్తడి 9
సర్పమొకటి చేయించి స్తంభముమీద దానిని పెట్టెను.
అప్పుడు సర్పపుకాటు తినిన ప్రతివాడు ఆ యిత్తడి
సర్పమును నిదానించి చూచినందున బ్రదికెను. ।
తరువాత ఇశ్రాయేలీయులు సాగి ఓబోతులో దిగిరి. । 10
ఓబోతులోనుండి వారు సాగి సూర్యోదయదిక్కున, 11
అనగా మోయాబు ఎదుట అరణ్యమందలి ఈయ్యే
అబారీమునొద్ద దిగిరి. । అక్కడనుండి వారు సాగి 12
జెరెగు లోయలో దిగిరి. । అక్కడనుండి వారు సాగి 13
అమోరీయుల పొలిమేరలనుండి వచ్చి ప్రవహించి
అరణ్యమందు సంచరించు అర్నోను అద్దరిని దిగిరి.
అర్నోను మోయాబీయులకును అమోరీయులకును
మధ్యనుండు మోయాబు సరిహద్దు. । కాబట్టి— 14
యెహోవా సుడిగాలిచేతనైనట్టు వాహేబును అర్నో 15
నులో పడు ఏరులను ఆరు దేశ నివాసస్థలమునకు
తిరిగి మోయాబు ప్రాంతములకు సమీపముగా ప్రవ
హించు ఏరుల మడుగులను (పట్టుకొనెననుమాట)
యెహోవా యుద్ధముల గ్రంథములో వ్రాయబడి
యున్నది. । అక్కడనుండి వారు బెయేరుకు వెళ్లిరి. 16
యెహోవా—జనులను పోగుచేయుము, నేను వారికి
నీళ్లనిచ్చెదనని మోషేతో చెప్పిన బావి అది. ।
అప్పుడు ఇశ్రాయేలీయులు ఈ పాట పాడిరి— 17

బావీ ఉబుకుము. దాని కీర్తించుడి
బావి; యేలికలు దాని త్రవ్విరి
తమ అధికార దండములచేతను కర్రలచేతను 18
జనుల అధికారులు దాని త్రవ్విరి.

వారు అరణ్యమునుండి మత్తానుకును మత్తానునుండి 19
నహలీయేలుకును నహలీయేలునుండి బామోతుకును ।
మోయాబు దేశమందలి లోయలోనున్న బామోతు 20
నుండి యెడారికి ఎదురుగానున్న పిస్గాకొండకు వచ్చిరి.
ఇశ్రాయేలీయులు అమోరీయుల రాజైన సీహోనును 21

నొద్దకు దూతలను పంపి—మమ్మును నీ దేశములో బడి
22 వెళ్లనిమ్ము. । మేము పొలములకైనను ద్రాక్షతోటల
కైనను పోము; బావుల నీళ్లు త్రాగము; మేము నీ
పొలిమేరలను దాటువరకు రాజమార్గములోనే నడిచి
23 పోదుమని అతనితో చెప్పించిరి. । అయితే సీహోను
ఇశ్రాయేలీయులను తన పొలిమేరలను దాటనియ్య
లేదు. మరియు సీహోను తన సమస్తజనమును కూర్చు
కొని ఇశ్రాయేలీయులను ఎదుర్కొనుటకు అరణ్యము
లోకి వెళ్లి, యాహజుకు వచ్చి ఇశ్రాయేలీయులతో
24 యుద్ధముచేసెను. । ఇశ్రాయేలీయులు వానిని కత్తివాత
హతముచేసి, వాని దేశమును అర్నోను మొదలుకొని
యబ్బోకువరకు, అనగా అమ్మోనీయుల దేశమువరకు
స్వాధీనపరచుకొనిరి. అమ్మోనీయుల పొలిమేర దుర్గమ
25 మైనది గదా. । అయినను ఇశ్రాయేలీయులు ఆ పట్టణ
ములన్నిటిని పట్టుకొనిరి. ఇశ్రాయేలీయులు అమోరీ
యుల పట్టణములన్నిటిలోను హెష్బోనులోను దాని
26 పల్లెలన్నిటిలోను దిగిరి. । హెష్బోను అమోరీయుల
రాజైన సీహోను పట్టణము; అతడు అంతకు మునుపు
మోయాబురాజుతో యుద్ధముచేసి అర్నోనువరకు
27 వాని దేశమంతయు పట్టుకొనెను. । కాబట్టి సామె
తలు కల్పించు కవులు ఇట్లు చెప్పుదురు—

హెష్బోనుకు రండి
సీహోను పట్టణమును కట్టవలెను
దానిని మరమ్మతు చేయవలెను
28 హెష్బోనునుండి అగ్ని బయలువెళ్లెను
సీహోను పట్టణమునుండి జ్వాలలు బయలువెళ్లెను
అది మోయాబుకు చేరిన ఆరు దేశమును కాల్చెను
అర్నోనుయొక్క పుణ్యక్షేత్రమును కాల్చెను.
29 మోయాబూ, నీకు శ్రమ
కెమోషు జనులారా, మీరు నశించితిరి
తప్పించుకొనిన తన కుమారులను తన కుమార్తెలను
అతడు అమోరీయులరాజైన సీహోనుకు చెరగా
ఇచ్చెను.
30 వాటిమీద వేట వేసితిమి
దీబోనువరకు హెష్బోను నశించెను
నోఫహువరకు దాని పాడుచేసితిమి.
అగ్నివలన మేదెబావరకు పాడుచేసితిమి.

31 అట్లు ఇశ్రాయేలీయులు అమోరీయుల దేశములో
32 దిగిరి. । మరియు యాజెరు దేశమును సంచరించి చూ
చుటకై మోషే మనుష్యులను పంపగా వారు దాని
గ్రామములను వశముచేసికొని అక్కడనున్న అమో
33 రీయులను తోలివేసిరి. । వారు తిరిగి బాషానుమార్గ
ముగా వెళ్లినప్పుడు బాషానురాజైన ఓగును అతని
సమస్త జనమును ఎద్రెయిలో యుద్ధముచేయుటకు
34 వారిని ఎదుర్కొన బయలుదేరగా । యెహోవా
మోషేతో నిట్లనెను — అతనికి భయపడకుము; నేను
అతనిని అతని సమస్త జనమును అతని దేశమును నీ
చేతికి అప్పగించితిని; నీవు హెష్బోనులో నివసించిన
అమోరీయుల రాజైన సీహోనుకు చేసినట్లు ఇతనికిని
చేయుదువు. । కాబట్టి వారు అతనిని అతని కుమారు 35
లను అతనికి ఒక్కడైనను శేషించకుండ అతని సమస్త
జనమును హతముచేసి అతని దేశమును స్వాధీనపరచు
కొనిరి.

తరువాత ఇశ్రాయేలీయులు సాగి యెరికోకు **22**
ఎదురుగా యొర్దాను తీరముననున్న మోయాబు మైదా
నములలో దిగిరి. । సిప్పోరు కుమారుడైన బాలాకు 2
ఇశ్రాయేలీయులు అమోరీయులకు చేసినదంతయు
చూచెను. । జనము విస్తారముగా నున్నందున మోయా 3
బీయులు వారిని చూచి మిక్కిలి భయపడిరి; మోయా
బీయులు ఇశ్రాయేలీయులకు జంకిరి. । మోయాబీ 4
యులు మిద్యాను పెద్దలను చూచి—ఎద్దు బీటిపచ్చికను
నాకివేయునట్లు ఈ జనసమూహము మనచుట్టు
ఉన్నది; యావత్తును ఇప్పుడు నాకివేయుననిరి. ఆ
కాలమందు సిప్పోరు కుమారుడైన బాలాకు మోయా
బీయులకు రాజు. । కాబట్టి అతడు బెయోరు కుమారు 5
డైన బిలామును పిలుచుటకు అతని జనుల దేశమందలి
నదియొద్దనున్న పెతోరుకు దూతలచేత ఈ వర్తమానము
పంపెను—చిత్తగించుము; ఒక జనము ఐగుప్తులోనుండి
వచ్చెను; ఇదిగో వారు భూతలమును కప్పి నా
యెదుట దిగియున్నారు. । కాబట్టి నీవు దయచేసి 6
వచ్చి నా నిమిత్తము ఈ జనమును శపించుము; వారు
నాకంటె బలవంతులు; వారిని హతముచేయుటకు
నేను బలమొందుదునేమో; అప్పుడు నేను ఈ దేశ
ములోనుండి వారిని తోలివేయుదును; ఏలయనగా
నీవు దీవించువాడు దీవింపబడుననియు శపించువాడు
శపింపబడుననియు నేనెరుగుదును. । కాబట్టి మో 7
యాబు పెద్దలును మిద్యాను పెద్దలును సోదె సొమ్మును
చేత పట్టుకొని బిలామునొద్దకు వచ్చి బాలాకు మాట
లను అతనితో చెప్పగా । అతడు వారిని చూచి— 8
యీ రాత్రి ఇక్కడనే ఉండుడి; యెహోవా నాకు
సెలవిచ్చిన మాటలను నేను తిరిగి వచ్చి మీతో చెప్పె
దననెను. అప్పుడు మోయాబు అధికారులు బిలాము
నొద్ద బసచేసిరి. । దేవుడు బిలామునొద్దకు వచ్చి—నీ 9
యొద్దనున్న యీ మనుష్యులు ఎవరని అడుగగా ।
బిలాము దేవునితో ఇట్లనెను—సిప్పోరు కుమారుడైన 10
బాలాకను మోయాబు రాజు । — చిత్తగించుము; ఒక 11
జనము ఐగుప్తునుండి బయలుదేరి వచ్చెను; వారు భూత
లమును కప్పుచున్నారు; నీవు ఇప్పుడే వచ్చి నా నిమి
త్తము వారిని శపించుము; నేను వారితో యుద్ధము
చేసి వారిని తోలివేయుదునేమో అని వీరిచేత నాకు
వర్తమానము పంపెను. । అందుకు దేవుడు — నీవు 12
వారితో వెళ్లకూడదు, ఆ ప్రజలను శపింపకూడదు,

వారు ఆశీర్వదింపబడినవారు అని బిలాముతో చెప్పె
13 ను. । కాబట్టి బిలాము ఉదయమున లేచి బాలాకు
అధికారులను చూచి — మీరు మీ స్వదేశమునకు
వెళ్లుడి; మీతోకూడ వచ్చుటకు యెహోవా నాకు
14 సెలవియ్యనని చెప్పుచున్నాడనగా । మోయాబు అధి
కారులు లేచి బాలాకునొద్దకు వెళ్లి—బిలాము మాతో
15 కూడ రానొల్లడాయెననిరి. । అయినను బాలాకు
వారికంటె బహు ఘనతవహించిన మరి యెక్కువ
16 మంది అధికారులను మరల పంపెను. । వారు బిలాము
నొద్దకు వచ్చి అతని చూచి — నీవు దయచేసి నాయొ
17 ద్దకు వచ్చుటకు ఏమియు అడ్డము చెప్పకుము. । నేను
నీకు బహు ఘనత కలుగజేసెదను; నీవు నాతో ఏమి
చెప్పుదువో అది చేసెదను గనుక నీవు దయచేసి వచ్చి,
నా నిమిత్తము ఈ జనమును శపించుమని సిప్పోరు
18 కుమారుడైన బాలాకు చెప్పెననిరి. । అందుకు బిలాము
—బాలాకు తన ఇంటెడు వెండి బంగారములను నా
కిచ్చినను కొద్దిపనినైనను గొప్పపనినైనను చేయునట్లు
నేను నా దేవుడైన యెహోవా నోటిమాట మీర
19 లేను. । కాబట్టి మీరు దయచేసి యీ రాత్రి ఇక్కడ
నుండుడి; యెహోవా నాతో నికనేమి చెప్పునో నేను
తెలిసికొందునని బాలాకు సేవకులకు ఉత్తరమిచ్చెను. ।
20 ఆ రాత్రి దేవుడు బిలామునొద్దకువచ్చి — ఆ మను
ష్యులు నిన్ను పిలువవచ్చినయెడల నీవు లేచి వారితో
వెళ్లుము; అయితే నేను నీతో చెప్పిన మాటచొప్పు
21 ననే నీవు చేయవలెనని అతనికి సెలవిచ్చెను. । ఉదయ
మున బిలాము లేచి తన గాడిదెకు గంత కట్టి మో
22 యాబు అధికారులతోకూడ వెళ్లెను. । అతడు వెళ్లు
చుండగా దేవుని కోపము రగులుకొనెను; యెహోవా
దూత అతనికి విరోధియై త్రోవలో నిలిచెను.
అతడు తన గాడిదె యెక్కి పోవుచుండగా అతని
23 పనివారు ఇద్దరు అతనితోకూడ నుండిరి. । యెహోవా
దూత ఖడ్గము దూసి చేత పట్టుకొని త్రోవలో నిలిచి
యుండుట ఆ గాడిదె చూచెను గనుక అది త్రోవను
విడిచి పొలములోనికి పోయెను. బిలాము గాడిదెను
24 దారికి మలుపవలెనని దాని కొట్టగా । యెహోవా
దూత యిరుప్రక్కలను గోడలుగల ద్రాక్షతో
25 టల సందులో నిలిచెను. । గాడిదె యెహోవా
దూతను చూచి గోడమీద పడి బిలాము కాలును
గోడకు అదిమెను గనుక అతడు దాని మరల కొట్టెను. ।
26 యెహోవా దూత ముందు వెళ్లుచు కుడికైనను
ఎడమకైనను తిరుగుటకు దారిలేని యిరుకుచోటను
27 నిలువగా । గాడిదె యెహోవా దూతను చూచి
బిలాముతోకూడ క్రింద కూలబడెను గనుక బిలాము
కోపము మండి తన చేతి కర్రతో గాడిదెను కొట్టెను. ।
28 అప్పుడు యెహోవా ఆ గాడిదెకు వాక్కునిచ్చెను
గనుక అది — నీవు నన్ను ముమ్మారు కొట్టితివి; నేను
నిన్నేమి చేసితినని బిలాముతో అనగా । బిలాము— 29
నీవు నామీద తిరుగబడితివి; నాచేత ఖడ్గమున్నయెడల
నిన్ను చంపియుందునని గాడిదెతో అనెను. । అందుకు 30
గాడిదె—నేను నీదాననైనది మొదలుకొని నేటివరకు
నీవు ఎక్కుచు వచ్చిన నీ గాడిదెను కానా? నేనెప్పు
డైన నీకిట్లు చేయుట కద్దా? అని బిలాముతో అనగా
అతడు—లేదనెను. । అంతలో యెహోవా బిలాము 31
కన్నులు తెరిచెను గనుక, దూసిన ఖడ్గము చేత పట్టు
కొని త్రోవలో నిలిచియున్న యెహోవా దూతను
అతడు చూచి తల వంచి సాష్టాంగనమస్కారము
చేయగా । యెహోవా దూత — యీ ముమ్మారు నీ 32
గాడిదెను నీవేల కొట్టితివి? ఇదిగో నా యెదుట నీ
నడత విపరీతమైనది గనుక నేను నీకు విరోధినై బయలు
దేరి వచ్చితిని. । ఆ గాడిదె నన్ను చూచి యీ 33
ముమ్మారు నా యెదుటనుండి తొలిగెను; అది నా
యెదుటనుండి తొలగని పక్షమందు నిశ్చయముగా నే
నప్పుడే నిన్ను చంపి దాని ప్రాణమును రక్షించియుం
దునని అతనితో చెప్పెను. । అందుకు బిలాము—నేను 34
పాపముచేసితిని; నీవు నాకు ఎదురుగా త్రోవలో నిలు
చుట నాకు తెలిసినది కాదు. కాబట్టి యీ పని నీ
దృష్టికి చెడ్డదైతే నేను వెనుకకు వెళ్లెదనని యెహోవా
దూతతో చెప్పగా । యెహోవా దూత — నీవు 35
ఆ మనుష్యులతోకూడ వెళ్లుము. అయితే నేను నీతో
చెప్పు మాటయేకాని మరేమియు పలుకకూడదని బిలా
ముతో చెప్పెను. అప్పుడు బిలాము బాలాకు అధి
కారులతోకూడ వెళ్లెను. । బిలాము వచ్చెనని బాలాకు 36
విని, ఆ పొలిమేరల చివరనున్న అర్నోను తీరము
నందలి మోయాబు పట్టణమువరకు అతనిని ఎదుర్కొన
బయలువెళ్లగా । బాలాకు బిలామును చూచి—నిన్ను 37
పిలుచుటకు నేను నీయొద్దకు దూతలను పంపియుంటిని
గదా. నాయొద్దకు నీవేల రాకపోతివి? నిన్ను ఘన
పరచ సమర్థుడను కానా? అనెను. । అందుకు బిలాము 38
—ఇదిగో నీయొద్దకు వచ్చితిని; అయిన నేమి? ఏదైనను
చెప్పుటకు నాకు శక్తి కలదా? దేవుడు నా నోట పలి
కించు మాటయే పలికెదనని బాలాకుతో చెప్పెను. ।
అప్పుడు బిలాము బాలాకుతోకూడ వెళ్లెను. వారు 39
కిర్యత్ హుచ్చోతుకు వచ్చినప్పుడు । బాలాకు ఎడ్లను 40
గొఱ్ఱెలను బలిగా అర్పించి, (కొంతభాగము) బిలాము
కును అతని యొద్దనున్న అధికారులకును పంపెను. ।
మరునాడు బాలాకు బిలామును తోడుకొనిపోయి, 41
బయలుయొక్క ఉన్నత స్థలములమీదనుండి జనులను
చివరవరకు చూడవలెనని అతనిని అచ్చోట ఎక్కిం
చెను.

అప్పుడు బిలాము—ఇక్కడ నేను బలి అర్పించు **23**
టకు ఏడు బలిపీఠములను కట్టించి, ఇక్కడ ఏడు
కోడెలను ఏడు పొట్టేళ్లను సిద్ధపరచుమని బాలాకుతో

2 చెప్పెను. । బిలాము చెప్పినట్లు బాలాకు చేయగా,
బాలాకును బిలామును ప్రతి బలిపీఠముమీద ఒక
కోడెను ఒక పొట్టేలును దహనబలిగా అర్పించిరి. ।
3 మరియు బిలాము బాలాకును చూచి—బలిపీఠముమీది
నీ దహనబలియొద్ద నిలిచియుండుము, నేను వెళ్లెదను;
ఒకవేళ యెహోవా నన్ను ఎదుర్కొనునేమో;
ఆయన నాకు కనుపరచునది నీకు తెలియచేసెదనని
4 చెప్పి మెట్ట యెక్కెను. । దేవుడు బిలామునకు ప్రత్య
క్షముకాగా అతడు — నేను ఏడు బలిపీఠములను సిద్ధ
పరచి ప్రతిదానిమీదను ఒక కోడెను ఒక పొట్టేలును
5 అర్పించితినని ఆయనతో చెప్పగా, । యెహోవా
ఒకమాట బిలామునోట ఉంచి — నీవు బాలాకు
6 నొద్దకు తిరిగి వెళ్లి యిట్లు చెప్పుమనెను. । అతడు
బాలాకునొద్దకు తిరిగి వెళ్లినప్పుడు అతడు మోయాబు
అధికారులందరితో తన దహనబలియొద్ద నిలిచియుం
7 డెను. । అప్పుడు బిలాము ఉపమానరీతిగా ఇట్లనెను—

అరామునుండి బాలాకు
తూర్పు పర్వతములనుండి మోయాబురాజు నన్ను
రప్పించి
—రమ్ము; నా నిమిత్తము యాకోబును శపింపుము
రమ్ము; ఇశ్రాయేలును భయపెట్టవలెను

అనెను.

8 ఏమని శపింపగలను? దేవుడు శపింపలేదే
ఏమని భయపెట్టగలను? దేవుడు భయపెట్టలేదే.
9 మెట్టల శిఖరమునుండి అతని చూచుచున్నాను
కొండలనుండి అతని కనుగొనుచున్నాను
ఇదిగో ఆ జనము ఒంటిగా నివసించును
జనములలో లెక్కింపబడదు.
10 యాకోబు రేణువులను ఎవరు లెక్కింపెదరు?
ఇశ్రాయేలు నాల్గవపాలును ఎవరు లెక్కపెట్ట
గలరు?
నీతిమంతుల మరణమువంటి మరణము నాకు లభిం
చుగాక.
నా అంత్యదశ వారి అంతమువంటి దగునుగాక

అనెను.

11 అంతట బాలాకు బిలామును చూచి—నీవు నాకేమి
చేసితివి? నా శత్రువులను శపించుటకు నిన్ను రప్పిం
చితిని; అయితే నీవు వారిని పూర్తిగా దీవించితివనెను. ।
12 అందుకతడు — యెహోవా నా నోట ఉంచినదాని
నేను శ్రద్ధగా పలుకవద్దా? అని ఉత్తరమిచ్చెను. ।
13 అప్పుడు బాలాకు—దయచేసి నాతోకూడ మరియొక
చోటికి రమ్ము. అక్కడనుండి వారిని చూడవచ్చును;
వారి చివరిమాత్రమే కనబడును గాని వారందరు
నీకు కనబడరు; అక్కడనుండి నా నిమిత్తము వారిని
14 శపింపవలెనని అతనితో చెప్పి । పిస్గా కొననున్న
కావలివారి పొలమునకు అతని తోడుకొనిపోయి,
యేడు బలిపీఠములను కట్టించి, ప్రతి బలిపీఠముమీద
ఒక కోడెను ఒక పొట్టేలును అర్పించెను. । అతడు— 15
నీవు ఇక్కడ నీ దహనబలియొద్ద నిలిచియుండుము;
నేను అక్కడ యెహోవాను ఎదుర్కొందునని
బాలాకుతో చెప్పగా, । యెహోవా బిలామును 16
ఎదుర్కొని ఒక మాటను అతని నోట ఉంచి—నీవు
బాలాకునొద్దకు తిరిగి వెళ్లి యిట్లు చెప్పుమనెను. ।
అతడు బాలాకునొద్దకు వెళ్లినప్పుడు అతడు తన దహన 17
బలియొద్ద నిలిచియుండెను. మోయాబు అధికారు
లును అతనియొద్ద నుండిరి. బాలాకు—యెహోవా
యేమి చెప్పెనని అడుగగా । బిలాము ఉపమానరీతిగా 18
నిట్లనెను—

బాలాకూ, లేచి వినుము
సిప్పోరు కుమారుడా, చెవియొగ్గి నా మాట ఆల
కించుము.
దేవుడు అబద్ధమాడుటకు ఆయన మానవుడు కాడు 19
పశ్చాత్తాపపడుటకు ఆయన నరపుత్రుడు కాడు
ఆయన చెప్పి చేయకుండునా?
ఆయన మాట యిచ్చి స్థాపింపకుండునా?
ఇదిగో దీవించుమని నాకు సెలవాయెను 20
ఆయన దీవించెను; నేను దాని మార్చలేను.
ఆయన యాకోబులో ఏ దోషమును కనుగొన 21
లేదు
ఇశ్రాయేలులో ఏ వంకరతనమును చూడలేదు
అతని దేవుడైన యెహోవా అతనికి తోడైయు
న్నాడు.
రాజుయొక్క జయధ్వని వారిలోనున్నది 22
దేవుడు ఐగుప్తులోనుండి వారిని రప్పించెను
గురుపోతు వేగమువంటి వేగము వానికి కలదు.
నిజముగా యాకోబులో మంత్రము లేదు 2
ఇశ్రాయేలులో శకునము లేదు
ఆయాకాలములందు దేవుని కార్యములు
యాకోబు వంశస్థులకు ఇశ్రాయేలీయులకు తెలియ
చెప్పబడును.
ఇదిగో ఆ జనము ఆడుసింహమువలె లేచును 2
అది సింహమువలె నిక్కి నిలుచును
అది వేటను తిని చంపబడిన వాటి రక్తము త్రాగు
వరకు పండుకొనదు.

అంతట బాలాకు — నీవు ఏమాత్రమును వారిని 2
శపింపను వద్దు దీవింపను వద్దు అని బిలాముతో చెప్ప
గా । బిలాము—యెహోవా చెప్పినదంతయు నేను 2
చేయవలెనని నేను నీతో చెప్పలేదా? అని బాలాకుకు
ఉత్తరమియ్యగా । బాలాకు — నీవు దయచేసి రమ్ము; 2
నేను వేరొక చోటికి నిన్ను తోడుకొని పోయెదను;
అక్కడనుండి నా నిమిత్తము నీవు వారిని శపించుట
దేవుని దృష్టికి అనుకూలమగునేమో అని బిలాముతో

28 చెప్పెను. । బాలాకు ఎడారికి ఎదురుగానున్న
పెయోరు శిఖరమునకు బిలామును తోడుకొనిపోయిన
29 తరువాత । బిలాము—ఇక్కడ నాకు ఏడు బలిపీఠము
లను కట్టించి, యిక్కడ ఏడు కోడెలను ఏడు పొట్టే
30 ళ్లను సిద్ధపరచుమని బాలాకుతో చెప్పెను. । బిలాము
చెప్పినట్లు బాలాకు చేసి ప్రతి బలిపీఠముమీద ఒక
కోడెను ఒక పొట్టేలును అర్పించెను.

24 ఇశ్రాయేలీయులను దీవించుట యెహోవా
దృష్టికి మంచిదని బిలాము తెలిసికొనినప్పుడు అతడు
మునుపటివలె శకునములను చూచుటకు వెళ్లక అర
2 ణ్యమువైపు తన ముఖమును త్రిప్పుకొనెను. । బిలాము
కన్నులెత్తి ఇశ్రాయేలీయులు తమ తమ గోత్రముల
చొప్పున దిగియుండుట చూచినప్పుడు దేవుని ఆత్మ
3 అతనిమీదికి వచ్చెను । గనుక అతడు ఉపమానరీతిగా
ఇట్లనెను—

బెయోరు కుమారుడైన బిలామునకు వచ్చిన దేవోక్తి
కన్నులు తెరచినవానికి వచ్చిన దేవోక్తి.
4 దేవవాక్కులను వినినవాని వార్త.
అతడు పరవశుడై కన్నులు తెరచినవాడై
సర్వశక్తుని దర్శనము పొందెను.
5 యాకోబూ, నీ గుడారములు
ఇశ్రాయేలూ, నీ నివాసస్థలములు
ఎంతో రమ్యమైనవి.
6 వాగులవలె అవి వ్యాపించియున్నవి
నదీతీరమందలి తోటలవలెను యెహోవా నాటిన
అగరు చెట్లవలెను
నీళ్లయొద్దనున్న దేవదారు వృక్షములవలెను అవి
యున్నవి.
7 నీళ్లు అతని బొక్కెనలనుండి కారును
అతని సంతతి బహు జలములయొద్ద నివసించును
అతనిరాజు అగగుకంటె గొప్పవాడగును
అతని రాజ్యము అధికమైనదగును.
8 దేవుడు ఐగుప్తులోనుండి అతని రప్పించెను
గురుపోతు వేగమువంటి వేగము అతనికి కలదు
అతడు తన శత్రువులైన జనులను భక్షించును
వారి యెముకలను విరుచును
తన బాణములతో వారిని గుచ్చును.
9 సింహమువలెను ఆడు సింహమువలెను
అతడు క్రుంగి పండుకొనెను
అతని లేపువాడెవడు?
నిన్ను దీవించువాడు దీవింపబడును
నిన్ను శపించువాడు శపింపబడును.
10 అప్పుడు బాలాకు కోపము బిలాముమీద మం
డెను గనుక అతడు తన చేతులు చరుచుకొని బిలా
మును చూచి—నా శత్రువులను శపించుటకు నిన్ను
పిలిపించితిని కాని నీవు ఈ ముమ్మారు వారిని పూర్తిగా
దీవించితివి. కాబట్టి నీవు ఇప్పుడు నీ చోటికి వేగము
గా వెళ్లుము. । నేను నిన్ను మిక్కిలి ఘనపరచెదనని 11
చెప్పితినిగాని యెహోవా నీవు ఘనత పొందకుండ
ఆటంకపరచెననెను. । అందుకు బిలాము బాలాకును 12
చూచి—బాలాకు తన ఇంటెడు వెండి బంగారములను
నాకిచ్చినను నా యిష్టము చొప్పున మేలైనను కీడైనను
చేయుటకు యెహోవా సెలవిచ్చినమాటను మీర
లేను. । యెహోవా యేమి సెలవిచ్చునో అదే పలికె 13
దనని నీవు నాయొద్దకు పంపిన నీ దూతలతో నేను
చెప్పలేదా? । చిత్తగించుము; నేను నా జనులయొద్దకు 14
వెళ్లుచున్నాను. అయితే కడపటి దినములలో ఈ
జనులు నీ జనులకేమి చేయుదురో అది నీకు విశదపర
చెదను రమ్మని చెప్పి । ఉపమానరీతిగా ఇట్లనెను— 15
బెయోరు కుమారుడైన బిలామునకు వచ్చిన దేవోక్తి.
కన్నులు తెరచినవానికి వచ్చిన దేవోక్తి.
దేవవాక్కులను వినిన వాని వార్త 16
మహోన్నతుని విద్య నెరిగినవాని వార్త.
అతడు పరవశుడై కన్నులు తెరచినవాడై
సర్వశక్తుని దర్శనము పొందెను.
ఆయనను చూచుచున్నాను గాని 17
ప్రస్తుతమున నున్నట్టు కాదు
ఆయనను చూచుచున్నాను గాని
సమీపమున నున్నట్టు కాదు
నక్షత్రము యాకోబులో ఉదయించును
రాజదండము ఇశ్రాయేలులోనుండి లేచును
అది మోయాబు ప్రాంతములను కొట్టును
కలహవీరులనందరిని నాశనముచేయును.
ఎదోమును శేయీరును ఇశ్రాయేలుకు శత్రువులు 18
వారు స్వాధీనపరచబడుదురు
ఇశ్రాయేలు పరాక్రమమొందును.
యాకోబు సంతానమున ఏలిక పుట్టును 19
అతడు పట్టణములోని శేషమును నశింపజేయును.
మరియు అతడు అమాలేకీయులవైపు చూచి ఉపమాన 20
రీతిగా ఇట్లనెను—
అమాలేకు అన్యజనములకు మొదలు
నిత్యనాశనమే వానికి అంతము.
మరియు అతడు కేనీయులవైపు చూచి ఉపమానరీతిగా 21
ఇట్లనెను—
నీ నివాసస్థలము దుర్గమమైనది.
నీ గూడు కొండమీద కట్టబడియున్నది.
అష్షూరు నిన్ను చెరగా పట్టువరకు 22
కయీను నశించునా?
మరియు అతడు ఉపమానరీతిగా— 23
అయ్యో దేవుడు ఇట్లు చేయునప్పుడు ఎవడు
బ్రదుకును?
కిత్తీము ద్వీపమునుండి ఓడలు వచ్చును 24

అవి అష్షూరును ఏబెరును బాధించును.
కిత్తీయులుకూడ నిత్యనాశనము పొందుదురనెను.
25 అంతట బిలాము లేచి తన చోటికి తిరిగి వెళ్లెను; బాలా
కును తన త్రోవను వెళ్లెను.

**25** ఇశ్రాయేలీయులు షిత్తీములో దిగియుండగా
ప్రజలు మోయాబురాండ్రతో వ్యభిచారము చేయ
2 సాగిరి. ఆ స్త్రీలు తమ దేవతల బలులకు ప్రజలను
పిలువగా వీరు భోజనముచేసి వారి దేవతలకు నమస్క
3 రించిరి. అట్లు ఇశ్రాయేలీయులు బయల్పెయోరుతో
కలిసికొనినందున వారిమీద యెహోవా కోపము
4 రగులుకొనెను. అప్పుడు యెహోవా మోషేతో
ఇట్లనెను—నీవు ప్రజల అధిపతులనందరిని తోడుకొని,
యెహోవా సన్నిధిని సూర్యునికి ఎదురుగా వారిని
ఉరితీయుము. అప్పుడు యెహోవా కోపాగ్ని ఇశ్రా
యేలీయుల మీదనుండి తొలగిపోవునని చెప్పెను.
5 కాబట్టి మోషే ఇశ్రాయేలీయుల న్యాయాధిపతులను
పిలిపించి—మీలో ప్రతివాడును బయల్పెయోరుతో
కలిసికొనిన తన తన వశములోనివారిని చంపవలెనని
6 చెప్పెను. ఇదిగో మోషే కన్నులయెదుటను, ప్రత్య
క్షపు గుడారముయొక్క ద్వారమునొద్ద ఏడ్చుచుండిన
ఇశ్రాయేలీయుల సర్వసమాజముయొక్క కన్నులయెదు
టను, ఇశ్రాయేలీయులలో ఒకడు తన సహోదరుల
యొద్దకు ఒక మిద్యాను స్త్రీని తోడుకొని వచ్చెను.
7 యాజకుడైన అహరోను మనుమడును ఎలాజారు
8 కుమారుడునైన ఫీనెహాసు అది చూచి, సమాజము
నుండి లేచి, యీటెను చేత పట్టుకొని పడకచోటికి
ఆ ఇశ్రాయేలీయుని వెంబడి వెళ్లి ఆ యిద్దరిని, అనగా
ఆ ఇశ్రాయేలీయుని ఆ స్త్రీని కడుపులోగుండ దూసి
పోవునట్లు పొడిచెను; అప్పుడు ఇశ్రాయేలీయులలో
9 నుండి తెగులు నిలిచిపోయెను. ఇరువది నాలుగు
10 వేలమంది ఆ తెగులుచేత చనిపోయిరి. అప్పుడు
యెహోవా మోషేకు ఈలాగు ఆజ్ఞ ఇచ్చెను—యాజ
కుడైన అహరోను మనుమడును ఎలాజారు కుమారుడు
11 నైన ఫీనెహాసు, వారి మధ్యను నేను ఓర్వలేనిదానిని
తాను ఓర్వలేకపోవుటవలన ఇశ్రాయేలీయుల మీద
నుండి నా కోపమును మళ్లించెను గనుక నేను ఓర్వలేక
యుండియు ఇశ్రాయేలీయులను నశింపజేయలేదు.
12 కాబట్టి నీవు అతనితో ఇట్లనుము — అతనితో నేను
13 నా సమాధాన నిబంధనను చేయుచున్నాను. అది
నిత్యమైన యాజక నిబంధనగా అతనికిని అతని సం
తానమునకును కలిగియుండును; ఏలయనగా అతడు
తన దేవుని విషయమందు ఆసక్తి గలవాడై ఇశ్రాయేలీ
14 యుల నిమిత్తము ప్రాయశ్చిత్తము చేసెను. చంప
బడిన వాని పేరు జిమ్రీ, అతడు షిమ్యోనీయులలో
తన పితరుల కుటుంబమునకు ప్రధానియైన సాలూ
15 కుమారుడు. చంపబడిన స్త్రీ పేరు కొజ్బీ, ఆమె సూరు
కుమార్తె. అతడు మిద్యానీయులలో ఒక గోత్రమున
కును తన పితరుల కుటుంబమునకును ప్రధానియై
యుండెను.
మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 16
విచ్చెను—మిద్యానీయులు తమ తంత్రములవలన మీకు
బాధకులై యున్నారు; వారిని బాధపెట్టి హతము
చేయుడి; వారు తంత్రములు చేసి పెయోరు సంగతి 17
లోను, తెగులు దినమందు పెయోరు విషయములో
చంపబడిన తమ సహోదరియు మిద్యానీయుల అధి
పతి కుమార్తెయునైన కొజ్బీ సంగతిలోను, మిమ్మును
మోసపుచ్చిరి.

ఆ తెగులు పోయిన తర్వాత యెహోవా మో **26**
షేకును యాజకుడగు అహరోను కుమారుడైన ఎలా
జారుకును ఈలాగు సెలవిచ్చెను —మీరు ఇశ్రాయే 2
లీయుల సర్వసమాజములోను ఇరువది ఏండ్లు మొదలు
కొని పైప్రాయము కలిగి ఇశ్రాయేలీయులలో సేనగా
బయలువెళ్లువారందరి సంఖ్యను వారి వారి పితరుల
కుటుంబములను బట్టి వ్రాయించుడి. కాబట్టి — 3
యిరువది ఏండ్లు మొదలుకొని పైప్రాయముగలవారిని 4
(లెక్కింపుడని) యెహోవా మోషేకును ఐగుప్తుదేశ
మునుండి వచ్చిన ఇశ్రాయేలీయులకును ఆజ్ఞాపించి
నట్లు మోషేయు యాజకుడగు ఎలాజారును ఇశ్రా
యేలీయులు మోయాబు మైదానములలో యెరికో
యొద్దనున్న యొర్దాను దగ్గర నుండగా జనసంఖ్యను
చేయుడని వారితో చెప్పిరి. ఇశ్రాయేలు తొలి 5
చూలు రూబేను. రూబేను పుత్రులలో హనోకీ
యులు హనోకు వంశస్థులు; పల్లువీయులు పల్లు 6
వంశస్థులు; హెస్రోనీయులు హెస్రోను వంశస్థులు;
కర్మీయులు కర్మీ వంశస్థులు; వీరు రూబేనీయుల వంశ 7
స్థులు, వారిలో లెక్కింపబడినవారు నలుబది మూడు
వేల ఏడునూట ముప్పదిమంది. పల్లు కుమారుడు ఏలీ 8
యాబు. ఏలీయాబు కుమారులు నెమూయేలు దా
తాను అబీరాము. కోరహు తన సమూహములో 9
పేరుపడినవాడు; అతని సమాజము యెహోవాకు
విరోధముగా వాదించినప్పుడు సమాజములో మోషే
అహరోనులకు విరోధముగా వాదించిన దాతాను అబీ
రాములు వీరు. ఆ సమూహపువారు మృతిబొంది 10
నప్పుడు అగ్ని యిన్నూట ఏబదిమందిని భక్షించినందు
నను, భూమి తన నోరు తెరచి వారిని కోరహును
మ్రింగివేసినందునను, వారు దృష్టాంతములైరి. అయితే 11
కోరహు కుమారులు చావలేదు. షిమ్యోను పుత్రుల 12
వంశములలో నెమూయేలీయులు నెమూయేలు వంశ
స్థులు; యామీనీయులు యామీను వంశస్థులు; యాకీ
నీయులు యాకీను వంశస్థులు; జెరహీయులు జెరహు 13
వంశస్థులు; షావూలీయులు షావూలు వంశస్థులు. ఇవి 14
షిమ్యోనీయుల వంశములు. వారు ఇరువదిరెండువేల

15 ఇన్నూరుమంది. । గాదు పుత్రుల వంశములలో
సెఫోనీయులు సెఫోను వంశస్థులు; హగ్గీయులు హగ్గీ
16 వంశస్థులు; షూనీయులు షూనీ వంశస్థులు; । ఓజనీ
యులు ఓజని వంశస్థులు; ఏరీయులు ఏరీ వంశస్థులు; ।
17 ఆరోదీయులు ఆరోదు వంశస్థులు; అరేలీయులు
18 అరేలీ వంశస్థులు. । వీరు గాదీయుల వంశస్థులు;
వ్రాయబడినవారి సంఖ్యచొప్పున వీరు నలుబది
19 నాలుగువేల ఏనూరుమంది. । యూదా కుమారులు ఏరు
ఓనాను; ఏరును ఓనానును కనాను దేశములో మృతి
20 బొందిరి. । యూదావారి వంశములలో షేలాహీ
యులు షేలా వంశస్థులు; పెరెసీయులు పెరెసు వంశ
21 స్థులు; జెరహీయులు జెరహు వంశస్థులు; । పెరెసీయు
లలో హెస్రోనీయులు హెస్రోను వంశస్థులు;
22 హామూలీయులు హామూలు వంశస్థులు. । వీరు యూ
దాయీయుల వంశస్థులు; వ్రాయబడినవారి సంఖ్య
చొప్పున వీరు డెబ్బదియారువేల ఏనూరుమంది. ।
23 ఇశ్శాఖారు పుత్రుల వంశస్థులలో తోలాహీయులు
తోలా వంశస్థులు; పువ్వీయులు పువ్వా వంశస్థులు;
యాషూబీయులు యాషూబు వంశస్థులు; షిమ్రోనీ
యులు షిమ్రోను వంశస్థులు; వీరు ఇశ్శాఖారీయుల
24 వంశస్థులు. । వ్రాయబడినవారి సంఖ్యచొప్పున వీరు
25 అరువదినాలుగువేల ఏనూరుమంది. । జెబులూను
26 పుత్రుల వంశస్థులలో సెరెదీయులు సెరెదు వంశ
స్థులు; ఏలోనీయులు ఏలోను వంశస్థులు; యహలే
27 లీయులు యహలేలు వంశస్థులు; । వ్రాయబడినవారి
సంఖ్యచొప్పున వీరు అరువదివేల ఏనూరుమంది. ।
28 యోసేపు పుత్రుల వంశస్థులు అతని కుమారులు
29 మనష్షే ఎఫ్రాయిము. । మనష్షే కుమారులలో మాకీరీ
32 యులు మాకీరు వంశస్థులు; మాకీరు గిలాదును కనెను;
గిలాదీయులు గిలాదు వంశస్థులు; వీరు గిలాదు
పుత్రులు. ఈజెరీయులు ఈజెరు వంశస్థులు; హెల
కీయులు హెలకు వంశస్థులు; అశ్రీయేలీయులు అశ్రీ
యేలు వంశస్థులు; షెకెమీయులు షెకెము వంశ
స్థులు; షెమీదాయీయులు షెమీదా వంశస్థులు;
33 హెపెరీయులు హెపెరు వంశస్థులు. । హెపెరు
కుమారుడైన సెలోపెహాదుకు కుమార్తెలేగాని కుమా
రులు పుట్టలేదు. సెలోపెహాదు కుమార్తెల పేరులు
34 మహలా నోయా హొగ్లా మిల్కా తిర్సా. । వీరు
మనష్షీయుల వంశస్థులు; వ్రాయబడినవారి సంఖ్య
చొప్పున వీరు ఏబదిరెండువేల ఏడ్నూరుమంది. ।
35 ఎఫ్రాయిము పుత్రుల వంశములు ఇవి; షూతల
హీయులు షూతలహు వంశస్థులు; బేకరీయులు బేకరు
36 వంశస్థులు; తహనీయులు తహను వంశస్థులు. । వీరు
షూతలహు కుమారులు; ఏరానీయులు ఏరాను వంశ
37 స్థులు. । వీరు ఎఫ్రాయిమీయుల వంశస్థులు. వ్రాయ
బడినవారి సంఖ్యచొప్పున వీరు ముప్పదిరెండువేల

ఏనూరుమంది; వీరు యోసేపుపుత్రుల వంశస్థులు. ।
బెన్యామీను పుత్రుల వంశములలో బెలీయులు బెల 38
వంశస్థులు; అష్బేలీయులు అష్బేల వంశస్థులు; ।
అహీరామీయులు అహీరాము వంశస్థులు; । షూపా 39
మీయులు షూపాము వంశస్థులు; బెల కుమారులు 40
ఆర్దు నయమాను; ఆర్దీయులు ఆర్దు వంశస్థులు;
నయమానీయులు నయమాను వంశస్థులు. । వీరు 41
బెన్యామీనీయుల వంశస్థులు; వారిలో వ్రాయబడిన
లెక్కచొప్పున నలుబదియయిదువేల ఆరునూరుమంది. ।
దాను పుత్రుల వంశములలో షూహామీయులు 42
షూహాము వంశస్థులు. । వీరు తమ వంశములలో 43
దానీయుల వంశస్థులు. వ్రాయబడినవారి సంఖ్య
చొప్పున వీరు అరువదినాలుగువేల నన్నూరుమంది. ।
ఆషేరు పుత్రుల వంశములలో యిమ్నాయులు 44
యిమ్నా వంశస్థులు; ఇష్వీయులు ఇష్వీ వంశస్థులు;
బెరీయులు బెరీయా వంశస్థులు; । బెరీయానీయు 45
లలో హెబెరీయులు హెబెరు వంశస్థులు; మల్కీ
యేలీయులు మల్కీయేలు వంశస్థులు; । ఆషేరు 46
కుమార్తె పేరు శెరహు. । వ్రాయబడినవారి సంఖ్య 47
చొప్పున వీరు ఆషేరీయుల వంశస్థులు; వీరు ఏబది
మూడువేల నన్నూరుమంది. । నఫ్తాలి పుత్రుల వంశ 48
ములలో యహసయేలీయులు యహసయేలు వంశ
స్థులు; గూనీయులు గూనీ వంశస్థులు; । యేసెరీ 49
యులు యేసెరు వంశస్థులు; షిల్లేమీయులు షిల్లేము
వంశస్థులు. । వీరు నఫ్తాలీయుల వంశస్థులు; వ్రాయ 50
బడినవారి సంఖ్యచొప్పున వీరు నలుబదియయిదువేల
నన్నూరుమంది. । ఇశ్రాయేలీయులలో లెక్కింపబడిన 51
వీరు ఆరులక్షల వెయ్యిన్ని ఏడ్నూట ముప్పదిమంది.
యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చెను— 52
వీరి పేళ్ల లెక్కచొప్పున ఆ దేశమును వీరికి స్వాస్థ్య
ముగా పంచిపెట్టవలెను. । ఎక్కువమందికి ఎక్కువ 53
స్వాస్థ్యము ఇయ్యవలెను; । తక్కువమందికి తక్కువ 54
స్వాస్థ్యము ఇయ్యవలెను. దాని దాని జనసంఖ్యను
బట్టి ఆయా గోత్రములకు స్వాస్థ్యము ఇయ్యవలెను. ।
చీట్లువేసి ఆ భూమిని పంచిపెట్టవలెను. వారు తమ 55
తమ పితరుల గోత్రముల జనసంఖ్యచొప్పున స్వాస్థ్య
మును పొందవలెను. । ఎక్కువమందికేమి తక్కువ 56
మందికేమి చీట్లువేసి యెవరి స్వాస్థ్యమును వారికి
పంచిపెట్టవలెను.
వారి వారి వంశములలో లెక్కింపబడిన లేవీయులు 57
వీరు. గెర్షోనీయులు గెర్షోను వంశస్థులు; కహాతీయులు
కహాతు వంశస్థులు; మెరారీయులు మెరారి వంశస్థులు. ।
లేవీయుల వంశములు ఏవనగా, లిబ్నీయుల వంశము 58
హెబ్రోనీయుల వంశము మహలీయుల వంశము
మూషీయుల వంశము కోరహీయుల వంశము. ।
కహాతు అమ్రామును కనెను; అమ్రాము భార్యపేరు 59

యొక్కబెను. ఆమె లేవి కుమార్తె; ఐగుప్తులో ఆమె
లేవి గోత్రములో పుట్టెను. ఆమె అమ్రామువలన
అహరోనును మోషేను వీరి సహోదరియగు మిర్యా
60 మును కనెను. । అహరోనువలన నాదాబు అబీహు
61 ఎలాజారు ఈతామారు పుట్టిరి. । నాదాబు అబీహులు
యెహోవా సన్నిధికి అన్యాగ్ని తెచ్చినప్పుడు చని
62 పోయిరి. । వారిలో నెల మొదలుకొని పైప్రాయము
కలిగి లెక్కింపబడినవారందరు ఇరువది మూడువేల
మంది. వారు ఇశ్రాయేలీయులలో లెక్కింపబడిన
వారు కారు గనుక ఇశ్రాయేలీయులలో వారికి
స్వాస్థ్యమియ్యబడలేదు.
63 యెరికో ప్రాంతములయందలి యొర్దాను నొద్ద
నున్న మోయాబు మైదానములలో మోషేయు యా
జకుడగు ఎలాజారును ఇశ్రాయేలీయుల జనసంఖ్య
64 చేసినప్పుడు లెక్కింపబడినవారు వీరు. । మోషే అహ
రోనులు సీనాయి అరణ్యములో ఇశ్రాయేలీయుల
సంఖ్యను చేసినప్పుడు లెక్కింపబడినవారిలో ఒక్క
65 డైనను వీరిలో ఉండలేదు. । ఏలయనగా వారు నిశ్చ
యముగా అరణ్యములో చనిపోవుదురని యెహోవా
వారినిగూర్చి సెలవిచ్చెను. యెఫున్నె కుమారుడైన
కాలేబును నూను కుమారుడైన యెహోషువయు
తప్ప వారిలో ఒక్కడైనను మిగిలియుండలేదు.

**27** అప్పుడు యోసేపు కుమారుడైన మనష్షే వంశస్థు
లలో సెలోపెహాదు కుమార్తెలు వచ్చిరి. సెలోపె
హాదు హెపెరు కుమారుడును గిలాదు మనుమడును
మాకీరు మునిమనుమడునై యుండెను. అతని కుమార్తెల
పేళ్లు మహలా, నోయా, హొగ్లా, మిల్కా, తిర్సా
2 అనునవి. । వారు ప్రత్యక్షపు గుడారముయొక్క
ద్వారమునొద్ద మోషే యెదుటను యాజకుడైన ఎలా
జారు ఎదుటను ప్రధానుల యెదుటను సర్వసమాజము
ఎదుటను నిలిచి చెప్పినదేమనగా—మా తండ్రి అరణ్య
3 ములో మరణమాయెను. । అతడు కోరహు సమూహ
ములో, అనగా యెహోవాకు విరోధముగా కూడిన
వారి సమూహములో ఉండలేదు గాని తన పాపమును
4 బట్టి మృతిబొందెను. । అతనికి కుమారులు కలుగలేదు;
అతనికి కుమారులు లేనంతమాత్రముచేత మా తండ్రి
పేరు అతని వంశములోనుండి మాసిపోనేల? మా తండ్రి
సహోదరులతోపాటు స్వాస్థ్యము మాకు దయచేయు
5 మనిరి. । అప్పుడు మోషే వారికొరకు యెహోవా
6 సన్నిధిని మనవిచేయగా । యెహోవా మోషేకు
ఈలాగు సెలవిచ్చెను—సెలోపెహాదు కుమార్తెలు చెప్పి
7 నది యుక్తము. । నిశ్చయముగా వారి తండ్రి సహో
దరులతోపాటు భూస్వాస్థ్యమును వారి అధీనముచేసి
వారి తండ్రి స్వాస్థ్యమును వారికి చెందచేయవలెను. ।
8 మరియు నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లు చెప్పవలెను
—ఒకడు కుమారుడు లేక మృతిబొందినయెడల మీరు
వాని భూస్వాస్థ్యమును వాని కుమార్తెలకు చెందచేయ
వలెను. । వానికి కుమార్తె లేనియెడల వాని అన్నదమ్ము 9
లకు వాని స్వాస్థ్యము ఇయ్యవలెను. । వానికి అన్న 10
దమ్ములు లేనియెడల వాని భూస్వాస్థ్యమును వాని
తండ్రి అన్నదమ్ములకు ఇయ్యవలెను. । వాని తండ్రికి 11
అన్నదమ్ములు లేనియెడల వాని కుటుంబములో వానికి
సమీపమైన జ్ఞాతికి వాని స్వాస్థ్యము ఇయ్యవలెను;
వాడు దాని స్వాధీనపరచుకొనును. యెహోవా
మోషేకు ఆజ్ఞాపించినట్లు ఇది ఇశ్రాయేలీయులకు
విధింపబడిన కట్టడ.

మరియు యెహోవా మోషేతో ఇట్లనెను—నీవు 12
ఈ అబారీము కొండయెక్కి నేను ఇశ్రాయేలీయులకు
ఇచ్చిన దేశమును చూడుము. । నీవు దాని చూచిన 13
తరువాత నీ సహోదరుడైన అహరోను చేర్చబడినట్లు
నీవును నీ స్వజనులలో చేర్చబడుదువు. । ఏలయనగా 14
సీను అరణ్యములో సమాజము వాదించినప్పుడు ఆ
నీళ్లయొద్ద వారి కన్నుల యెదుట నా పరిశుద్ధతను సన్మా
నింపక నామీద తిరుగబడితిరి. ఆ నీళ్లు సీను అరణ్య
మందలి కాదేషులోనున్న మెరీబా నీళ్లే. । అప్పుడు 15
మోషే యెహోవాతో ఇట్లనెను — యెహోవా,
సమస్త మానవుల ఆత్మలకు దేవా, యెహోవా సమా
జము కాపరిలేని గొఱ్ఱెలవలె ఉండకుండునట్లు ఈ
సమాజము మీద ఒకని నియమించుము. । అతడు 16
వారితో కలిసిమెలిసియుండి । వారికి నాయకుడుగా 17
ఉండుటకు సమర్థుడై యుండవలెను. । అందుకు 18
యెహోవా మోషేతో ఇట్లనెను—నూను కుమారు
డైన యెహోషువ ఆత్మను పొందినవాడు. నీవు అతని
తీసికొని అతనిమీద నీ చెయ్యియుంచి । యాజకుడగు 19
ఎలాజారు ఎదుటను సర్వసమాజము ఎదుటను అతని
నిలువబెట్టి వారి కన్నుల యెదుట అతనికి ఆజ్ఞయిమ్ము; ।
ఇశ్రాయేలీయుల సర్వసమాజము అతని మాట విను 20
నట్లు అతనిని నీవలెనే ఘనతవహించిన వానినిగా
చేయుము. । యాజకుడైన ఎలాజారు ఎదుట అతడు 21
నిలువగా అతడు యెహోవా సన్నిధిని ఊరీము
తీర్పువలన అతనికొరకు విచారింపవలెను. అతడును
అతనితోకూడ ఇశ్రాయేలీయులందరును, అనగా సర్వ
సమాజము అతని మాటచొప్పున తమ సమస్త కార్య
ములను జరుపుచుండవలెను. । యెహోవా మోషేకు 22
ఆజ్ఞాపించినట్లు అతడు చేసెను. అతడు యెహోషు
వను తీసికొని యాజకుడైన ఎలాజారు ఎదుటను సర్వ
సమాజము ఎదుటను అతని నిలువబెట్టి । అతనిమీద 23
తన చేతులుంచి యెహోవా మోషేద్వారా ఆజ్ఞా
పించినట్లు అతనికి ఆజ్ఞయిచ్చెను.

యెహోవా మోషేకు ఈలాగు సెలవిచ్చెను । **28**
—నీవు ఇశ్రాయేలీయులకు ఈలాగు ఆజ్ఞాపించుము— 2
నాకు సువాసన కలుగుటకై మీరు అర్పణ హోమ

రూపములుగా నాకు అర్పించు ఆహారమును నియా
మకకాలమున నాయొద్దకు తెచ్చుటకు జాగ్రత్తపడ
3 వలెను. ׀ మరియు నీవు వారికీలాగు ఆజ్ఞాపించుము—
మీరు యెహోవాకు నిత్యమైన దహనబలి రూప
ముగా ప్రతిదినము నిర్దోషమైన యేడాదివగు రెండు
4 మగ గొఱ్ఱెపిల్లలను అర్పింపవలెను. ׀ వాటిలో ఒక
గొఱ్ఱెపిల్లను ఉదయమందు అర్పించి సాయంకాల
5 మందు రెండవ దానిని అర్పింపవలెను. ׀ దంచితీసిన
మూడు పళ్లలోనిది పావు నూనెతో కలపబడిన తూ
మెడు పిండిలో పదియవవంతు నైవేద్యము చేయ
6 వలెను. ׀ అది యెహోవాకు ఇంపైన సువాసనగల
హోమముగా సీనాయికొండమీద నియమింపబడిన
7 నిత్యమైన దహనబలి. ׀ ఆ మొదటి గొఱ్ఱెపిల్లతో
అర్పింపవలసిన పానార్పణము ముప్పావు; పరిశుద్ధస్థల
ములో దానిని యెహోవాకు పానార్పణముగా
8 పోయింపవలెను. ׀ ఉదయ నైవేద్యమును దాని పానా
ర్పణమును అర్పించినట్లు యెహోవాకు ఇంపైన
సువాసనగల హోమముగా ఆ రెండవ గొఱ్ఱెపిల్లను
సాయంకాలమందు అర్పింపవలెను.

9 విశ్రాంతిదినమున నిర్దోషమైన యేడాదివగు రెండు
గొఱ్ఱెపిల్లలను నైవేద్యరూపముగాను, గాని పానార్ప
ణముగాను నూనెతో కలపబడిన తూమెడు పిండిలో
10 రెండు పదియవవంతుల అర్పింపవలెను. ׀ నిత్యమైన
దహనబలియు దాని పానార్పణమును గాక యిది
ప్రతి విశ్రాంతిదినమున చేయవలసిన దహనబలి.

11 నెలనెలకు మొదటి దినమున యెహోవాకు
దహనబలి అర్పింపవలెను. రెండు కోడెదూడలను ఒక
పొట్టేలును నిర్దోషమైన యేడాదివగు ఏడు గొఱ్ఱెపిల్ల
12 లను వాటిలో ప్రతి కోడెదూడతోను, ׀ నూనెతో
కలపబడి తూమెడు పిండిలో మూడు పదియవవంతు
లను నైవేద్యముగాను ఒక్కొక్క పొట్టేలుతోను,
నూనెతో కలపబడి తూమెడు పిండిలో రెండు పది
యవవంతులను నైవేద్యముగాను, ఒక్కొక్క గొఱ్ఱె
పిల్లతో నూనెతో కలపబడి తూమెడు పిండిలో నొక
13 పదియవవంతును నైవేద్యముగాను చేయవలెను. ׀ అది
యెహోవాకు ఇంపైన సువాసనగల దహనబలి. ׀
14 వాటి పానార్పణములు ఒక్కొక్క కోడెతో పడిన్నర
ద్రాక్షారసమును పొట్టేలుతో పడియు గొఱ్ఱెపిల్లతో
ముప్పావును ఉండవలెను. ఇది సంవత్సరములో మాస
15 మాసమునకు జరగవలసిన దహనబలి. ׀ నిత్యమైన
దహనబలియు దాని పానార్పణమును గాక యొక
మేకపిల్లను పాపపరిహారార్థబలిగా యెహోవాకు
అర్పింపవలెను.

16 మొదటి నెల పదునాలుగవ దినము యెహోవాకు
17 పస్కాపండుగ. ׀ ఆ నెల పదునయిదవ దినము
పండుగ జరుగును. ఏడు దినములు పొంగని భక్ష్య
ములనే తినవలెను. ׀ మొదటి దినమున పరిశుద్ధసంఘము 18
కూడవలెను. అందులో మీరు జీవనోపాధియైన పను
లేమియు చేయకూడదు ׀ అయితే యెహోవాకు 19
దహనబలిగా మీరు రెండు కోడెదూడలను ఒక పొట్టే
లును ఏడాదివగు ఏడు మగ గొఱ్ఱెపిల్లలను అర్పింప
వలెను. అవి మీకు కలిగినవాటిలో నిర్దోషమైనవై
యుండవలెను ׀ వాటి నైవేద్యము నూనెతో కలప 20
బడిన గోధుమల పిండి. ׀ ఒక్కొక్క కోడెతో తూ 21
ములో మూడు పదియవవంతులను, పొట్టేలుతో రెండు
పదియవవంతులను, ఆ యేడు గొఱ్ఱెపిల్లలలో ఒక్కొ
క్క గొఱ్ఱెపిల్లతో ఒక్కొక్క పదియవవంతును ׀
మీకు ప్రాయశ్చిత్తము కలుగుటకై పాపపరిహారార్థ 22
బలిగా ఒక మేకను అర్పింపవలెను. ׀ ఉదయమున 23
మీరు అర్పించు నిత్యమైన దహనబలి గాక వీటిని
మీరు అర్పింపవలెను. ׀ అట్లే ఆ యేడు దినములలో 24
ప్రతిదినము యెహోవాకు ఇంపైన సువాసనగల
హోమద్రవ్యమును ఆహారముగా అర్పింపవలెను.
నిత్యమైన దహనబలియు దాని పానార్పణమును గాక
దానిని అర్పింపవలెను.׀ ఏడవ దినమున పరిశుద్ధసంఘము 25
కూడవలెను. ఆ దినమున మీరు జీవనోపాధియైన
పనులేమియు చేయకూడదు.

మరియు ప్రథమ ఫలములను అర్పించుదినమున, అన 26
గా వారముల పండుగదినమున మీరు యెహోవాకు
క్రొత్త పంటలో నైవేద్యము తెచ్చునప్పుడు మీరు
పరిశుద్ధసంఘముగా కూడవలెను. నాడు మీరు
జీవనోపాధియైన పనులేమియు చేయకూడదు. ׀
యెహోవాకు ఇంపైన సువాసనగల దహనబలిగా 27
మీరు రెండు కోడెదూడలను ఒక పొట్టేలును ఏడాది
వైన యేడు మగ గొఱ్ఱెపిల్లలను వాటికి నైవేద్యముగా
ప్రతి కోడెదూడతోను ׀ నూనె కలపబడి తూమెడు 28
పిండిలో మూడు పదియవవంతులను, ప్రతి పొట్టే
లుతో రెండు పదియవవంతులను ׀ ఆ యేడు గొఱ్ఱెపిల్ల 29
లలో ఒక్కొక్క పిల్లతో ఒక్కొక్క పదియవవంతును ׀
మీ నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయబడుటకై యొక 30
మేకపిల్లను అర్పింపవలెను. ׀ నిత్యమైన దహనబలియు 31
దాని నైవేద్యమును గాక వాటిని వాటి పానార్పణము
లను అర్పింపవలెను. అవి నిర్దోషములుగా నుండ
వలెను.

ఏడవ నెల మొదటితేదిని మీరు పరిశుద్ధసంఘ **29**
ముగా కూడవలెను. మీరు జీవనోపాధియైన పనులేమి 2
యు చేయకూడదు; అది మీకు శృంగధ్వని దినము. 6
నిర్దోషమైన ఒక కోడెదూడను ఒక పొట్టేలును
యెహోవాకు ఇంపైన సువాసనగల దహనబలిగా
అర్పింపవలెను. వాటి వాటి విధిప్రకారముగా అమావా
స్యకు అర్పించు దహనబలియు దాని నైవేద్యమును, నిత్య
మైన దహనబలియు దాని నైవేద్యమును, వాటి పానా

12 నిరి. । తరువాత వారు మోయాబు మైదానములలో
యెరికోయొద్దనున్న యొర్దాను దగ్గర దిగియున్న దం
డులో మోషేయొద్దకును యాజకుడైన ఎలాజారు
నొద్దకును ఇశ్రాయేలీయుల సమాజము నొద్దకును
చెరపట్టబడినవారిని అపహరణములను ఆ కొల్ల
13 సొమ్మును తీసికొని రాగా । మోషేయు యాజకుడైన
ఎలాజారును సమాజ ప్రధానులందరును వారిని ఎదు
ర్కొనుటకు పాళెములోనుండి వెలపలికి వెళ్లిరి. ।
14 అప్పుడు మోషే యుద్ధసేనలోనుండి వచ్చిన సహ
స్రాధిపతులును శతాధిపతులునగు సేనానాయకుల
15 మీద కోపపడెను. । మోషే వారిని చూచి—మీరు
16 ఆడువారినందరిని బ్రదుకనిచ్చితిరా? । ఇదిగో బిలాము
మాటనుబట్టి పెయోరు విషయములో ఇశ్రాయేలీయుల
చేత యెహోవామీద తిరుగబాటు చేయించినవారు
వీరు కారా? అందుచేత యెహోవా సమాజములో
17 తెగులు పుట్టియుండెను గదా. । కాబట్టి మీరు పిల్ల
లలో ప్రతి మగవానిని పురుషసంయోగము ఎరిగిన
18 ప్రతి స్త్రీని చంపుడి; । పురుషసంయోగము ఎరుగని
ప్రతి ఆడుపిల్లను మీ నిమిత్తము బ్రదుకనీయుడి. ।
19 మీరు ఏడు దినములు పాళెము వెలపట ఉండవలెను;
మీలో నరుని చంపిన ప్రతివాడును చంపబడిన నరుని
ముట్టిన ప్రతివాడును, మీరును మీరు చెరపట్టిన
వారును మూడవ దినమున ఏడవ దినమున మిమ్మును
20 మీరే పవిత్రపరచుకొనవలెను. । మీరు బట్టలన్నిటిని
చర్మవస్తువులన్నిటిని మేకవెండ్రుకల వస్తువులన్నిటిని
కొయ్యవస్తువులన్నిటిని పవిత్రపరచవలెననెను. ।
21 అప్పుడు యాజకుడగు ఎలాజారు యుద్ధమునకు పో
యిన సైనికులను చూచి — యెహోవా మోషేకు
22 ఆజ్ఞాపించిన విధి యేదనగా । మీరు బంగారును వెం
23 డిని ఇత్తడిని ఇనుమును తగరమును సీసమును । అనగా
అగ్నిచేత చెడని సమస్త వస్తువులనుమాత్రము అగ్నిలో
వేసి తీయవలెను; అప్పుడు అవి పవిత్రమగును. అయితే
పాపపరిహార జలముచేతను వాటిని పవిత్రపరచ
వలెను. అగ్నిచేత చెడునట్టి ప్రతి వస్తువును నీళ్లలో
24 వేసి తీయవలెను. । ఏడవ దినమున మీరు మీ బట్టలు
ఉదుకుకొని పవిత్రులైన తరువాత పాళెములోకి రా
వచ్చుననెను.

25 మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల
26 విచ్చెను । —నీవును యాజకుడైన ఎలాజారును సమా
జముయొక్క పితరుల కుటుంబములలో ప్రధానులును
మనుష్యులలోనేమి, పశువులలోనేమి, చెరపట్టబడిన
దోపుడుసొమ్ము మొత్తమును లెక్కించి రెండు భాగము
27 లుగా చేసి । యుద్ధమునకు పూనుకొని సేనగా బయలు
దేరినవారికి సగమును సర్వసమాజమునకు సగమును
28 పంచిపెట్టవలెను. । మరియు సేనగా బయలుదేరిన
యోధులమీద యెహోవాకు పన్ను కట్టి, ఆ మను

ష్యులలోను పశువులలోను గాడిదెలలోను గొఱ్ఱెమేక
లలోను ఏనూటికి ఒకటిచొప్పున వారి సగములో
నుండి తీసికొని । యెహోవాకు ప్రతిష్ఠార్పణముగా
యాజకుడైన ఎలాజారుకు ఇయ్యవలెను. । మనుష్యుల
లోను పశువులలోను గాడిదెలలోను గొఱ్ఱెమేకల
లోను సమస్తవిధముల జంతువులలోను ఏబదింటికి
ఒకటిచొప్పున, ఇశ్రాయేలీయులలోనుండి సగము
తీసికొని యెహోవా మందిరమును కాపాడు లేవీ
యులకు ఇయ్యవలెను. । యెహోవా మోషేకు
ఆజ్ఞాపించినట్లు మోషేయు యాజకుడైన ఎలాజా
రును చేసిరి. । ఆ దోపుడుసొమ్ము, అనగా ఆ సైనికులు
కొల్లబెట్టిన సొమ్ములో మిగిలినది । ఆరులక్షల డెబ్బది
యయిదు గొఱ్ఱెమేకలును, । డెబ్బది రెండువేల పశు
వులును, అరువది యొక వేయి గాడిదెలును, । ముప్పది
రెండువేలమంది పురుషసంయోగమెరుగని స్త్రీలును, ।
అందులో అరవంతు, అనగా సైన్యముగా పోయిన
వారివంతు, గొఱ్ఱెమేకల లెక్కయెంతనగా మూడు
లక్షల ముప్పది యేడువేల ఏనూరు. ఆ గొఱ్ఱెమేక
లలో యెహోవాకు చెల్లవలసిన పన్ను ఆరునూట
డెబ్బదియయిదు; । ఆ పశువులు ముప్పదియారు
వేలు. । వాటిలో యెహోవా పన్ను డెబ్బదిరెండు ।
ఆ గాడిదెలు ముప్పదివేల ఏనూరు; వాటిలో
యెహోవా పన్ను అరువది యొకటి. । మనుష్యులు
పదియారు వేలమంది. వారిలో యెహోవా పన్ను
ముప్పది ఇద్దరు. యెహోవా మోషేకు ఆజ్ఞాపించి
నట్లు మోషే పన్నును, అనగా యెహోవాకు చెల్ల
వలసిన ప్రతిష్ఠార్పణమును యాజకుడైన ఎలాజారుని
కిచ్చెను. సైనికులయొద్ద మోషే తీసికొని ఇశ్రాయే
లీయులకిచ్చిన సగమునుండి లేవీయులకిచ్చెను. ।
మూడులక్షల ముప్పదియేడువేల ఏనూరు గొఱ్ఱెమేక
లును । ముప్పది ఆరువేల గోవులును ముప్పదివేల
యేనూరు గాడిదెలును । పదియారువేలమంది మనుష్యు
లును సమాజమునకు కలిగిన సగమైయుండగా, మోషే ।
ఇశ్రాయేలీయులకు వచ్చిన ఆ సగమునుండి మనుష్యుల
లోను జంతువులలోను । ఏబదింటికి ఒకటిచొప్పున తీసి,
యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు యెహోవా
మందిరమును కాపాడు లేవీయులకిచ్చెను. । అప్పుడు
సేనాసహస్రముల నియామకులు, అనగా సహ
స్రాధిపతులును శతాధిపతులును మోషేయొద్దకు
వచ్చి । — నీ సేవకులమైన మేము మా చేతిక్రింద
నున్న యోధులను లెక్కించి మొత్తము చేసితిమి;
మాలో ఒక్కడైనను మొత్తమునకు తక్కువ కాలేదు. ।
కాబట్టి యెహోవా సన్నిధిని మా నిమిత్తము
ప్రాయశ్చిత్తము కలుగునట్లు మేము మాలో ప్రతి
మనుష్యునికి దొరికిన బంగారు పాత్రలను గొలుసులను
కడియములను ఉంగరములను పోగులను పతకములను

యెహోవాకు అర్పణముగా తెచ్చియున్నామని
51 చెప్పగా । మోషేయు యాజకుడైన ఎలాజారును
పాత్రలుగా చేయబడిన ఆ బంగారును వారియొద్ద
52 తీసికొనిరి. । సహస్రాధిపతులును శతాధిపతులును
ప్రతిష్ఠార్పణముగా యెహోవాకు అర్పించిన బంగా
రమంతయు పదియారువేల ఏడునూట ఏబది తులములు. ।
53 ఆ సైనికులలో ప్రతివాడును తన మట్టుకు తాను కొల్ల
54 సొమ్ము తెచ్చుకొనియుండెను. । అప్పుడు మోషేయు
యాజకుడైన ఎలాజారును సహస్రాధిపతులయొద్దనుం
డియు శతాధిపతులయొద్దనుండియు ఆ బంగారును
తీసికొని యెహోవా సన్నిధిని ఇశ్రాయేలీయులకు
జ్ఞాపకార్థముగా ప్రత్యక్షపు గుడారమున ఉంచిరి.

32 రూబేనీయులకును గాదీయులకును అతివిస్తార
మైన మందలుండెను గనుక యాజెరు ప్రదేశమును
గిలాదు ప్రదేశమును మందలకు తగిన స్థలమని తెలిసి
2 కొని । వారు వచ్చి మోషేను యాజకుడగు ఎలాజా
3 రును సమాజ ప్రధానులను చూచి । — అతారోతు
దీబోను యాజెరు నిమ్రా హెష్బోను ఏలాలే షెబాము
4 నెబో బెయోను అను స్థలములు, అనగా । ఇశ్రాయే
లీయుల సమాజము ఎదుట యెహోవా జయించిన
దేశము మందలకు తగిన ప్రదేశము. నీ సేవకులమైన
5 మాకు మందలు కలవు. । కాబట్టి మాయెడల నీకు
కటాక్షము కలిగిన పక్షమున, మమ్మును యొర్దాను అద్ద
రికి దాటింపక నీ దాసులమైన మాకు ఈ దేశమును
6 స్వాస్థ్యముగా ఇమ్మనగా । మోషే గాదీయులను
రూబేనీయులను చూచి—మీ సహోదరులు యుద్ధ
మునకు పోవుచుండగా మీరు ఇక్కడ కూర్చుండ
7 వచ్చునా? । యెహోవా ఇశ్రాయేలీయులకిచ్చిన
దేశమునకు వారు వెళ్లకయుండునట్లు మీరేల వారి
8 హృదయములను అధైర్యపరచుదురు? । ఆ దేశమును
చూచుటకు కాదేషు బర్నేయలోనుండి మీ తండ్రు
లను నేను పంపినప్పుడు వారును ఆలాగు చేసిరిగదా. ।
9 వారు ఎష్కోలు లోయలోకి వెళ్లి ఆ దేశమును చూచి
ఇశ్రాయేలీయుల హృదయమును అధైర్యపరచిరి గనుక
యెహోవా తమకిచ్చిన దేశమునకు వారు వెళ్లక
10 పోయిరి. । ఆ దినమున యెహోవా కోపము రగులు
11 కొని । — ఇరువది ఏండ్లు మొదలుకొని పైప్రాయము
కలిగి ఐగుప్తుదేశములోనుండి వచ్చిన మనుష్యులలో
పూర్ణమనస్సుతో యెహోవాను అనుసరించిన కెనె
జీయుడగు యెఫున్నె కుమారుడైన కాలేబును నూను
12 కుమారుడైన యెహోషువయు తప్ప । మరి ఎవడును
పూర్ణమనస్సుతో నన్ను అనుసరింపలేదు గనుక నేను
అబ్రాహాము ఇస్సాకు యాకోబులకు ప్రమాణపూర్వ
కముగా నిచ్చిన దేశమును వారు తప్ప మరి ఎవరును
13 చూడనే చూడరని ప్రమాణముచేసెను. । అప్పుడు
యెహోవా కోపము ఇశ్రాయేలీయులమీద రగులు
కొనగా యెహోవా దృష్టికి చెడునడత నడిచిన ఆ
తరమువారందరు నశించువరకు అరణ్యములో నలుబది
ఏండ్లు ఆయన వారిని తిరుగులాడిచేసెను. । ఇప్పుడు 14
ఇశ్రాయేలీయులయెడల యెహోవాకు కోపము
మరి ఎక్కువగా పుట్టించునట్లుగా ఆ పాపుల సంతాన
మైన మీరు మీ తండ్రులకు ప్రతిగా బయలుదేరి
యున్నారు. । మీరు ఆయనను అనుసరింపక వెనుకకు 15
మళ్లినయెడల ఆయన ఈ అరణ్యములో జనులను
ఇంక నిలువచేయును. అట్లు మీరు ఈ సర్వజన
మును నశింపచేసెదరనెను. । అందుకు వారు అతని 16
యొద్దకు వచ్చి—మేము ఇక్కడ మా మందలకొరకు
దొడ్లను మా పిల్లలకొరకు పురములను కట్టుకొందుము. ।
ఇశ్రాయేలీయులను వారి వారి స్థలములను చేర్చువరకు 17
మేము వారి ముందర యుద్ధమునకు సిద్ధపడి సాగు
దుము. అయితే మా పిల్లలు ఈ దేశనివాసుల భయము
చేత ప్రాకారముగల పురములలో నివసింపవలెను. ।
ఇశ్రాయేలీయులలో ప్రతివాడును తన తన స్వాస్థ్య 18
మును పొందువరకు మా యిండ్లకు తిరిగి రాము. ।
తూర్పుదిక్కున యొర్దాను ఇద్దరిని మాకు స్వాస్థ్యము 19
దొరికెను గనుక యొర్దాను అద్దరిని నామముగా
వారితో స్వాస్థ్యము పొందమనిరి.

అప్పుడు మోషే వారిని చూచి — మీరు మీ 20
మాట మీద నిలిచి యెహోవా సన్నిధిని యుద్ధము
నకు సిద్ధపడి యెహోవా తన యెదుటనుండి తన
శత్రువులను వెళ్లగొట్టువరకు । యెహోవా సన్నిధిని 21
మీరందరు యుద్ధసన్నద్ధులై యొర్దాను అద్దరికి వెళ్లిన
యెడల । ఆ దేశము యెహోవా సన్నిధిని జయింప 22
బడిన తరువాత మీరు తిరిగి వచ్చి యెహోవా
దృష్టికిని ఇశ్రాయేలీయుల దృష్టికిని నిర్దోషులై యుం
దురు; అప్పుడు ఈ దేశము యెహోవా సన్నిధిని
మీకు స్వాస్థ్యమగును. । మీరు అట్లు చేయని పక్ష 23
మందు యెహోవా దృష్టికి పాపము చేసినవారగు
దురు గనుక మీ పాపము[1] మిమ్మును పట్టుకొనును
అని తెలిసికొనుడి. । మీరు మీ పిల్లలకొరకు పురము 24
లను మీ మందలకొరకు దొడ్లను కట్టుకొని మీ నోట
నుండి వచ్చిన మాటచొప్పున చేయుడనెను. । అందుకు 25
గాదీయులును రూబేనీయులును మోషేను చూచి—
మా యేలినవాడు ఆజ్ఞాపించినట్లు నీ దాసులమైన
మేము చేసెదము. । మా పిల్లలు మా భార్యలు మా 26
మందలు మా సమస్త పశువులు అక్కడ గిలాదు పుర
ములలో ఉండును. । నీ దాసులమైన మేము, అనగా 27
మా సేనలో ప్రతి యోధుడును మా యేలినవాడు
చెప్పినట్లు యెహోవా సన్నిధిని యుద్ధము చేయు
టకు యొర్దాను అద్దరికి వచ్చెదమనిరి.

1 లేక, మీ పాపఫలము మీకు లభించును.

28 కాబట్టి మోషే వారినిగూర్చి యాజకుడైన ఎలా
జారుకును, నూను కుమారుడైన యెహోషువకును,
ఇశ్రాయేలీయుల గోత్రములలో పితరుల కుటుంబముల
ప్రధానులకును ఆజ్ఞాపించి వారితో ఇట్లనెను ।—
29 గాదీయులును రూబేనీయులును అందరు యెహోవా
సన్నిధిని యుద్ధమునకు సిద్ధపడి మీతోకూడ యొర్దాను
అద్దరికి వెళ్లినపక్షమందు ఆ దేశము మీచేత జయింప
బడిన తరువాత మీరు గిలాదు దేశమును వారికి
30 స్వాస్థ్యముగా ఇయ్యవలెను. । అయితే వారు మీతో
కలిసి యోధులై ఆవలికి వెళ్లని పక్షమందు వారు
కనాను దేశమందే మీ మధ్యను స్వాస్థ్యములను
31 పొందుదురనగా । గాదీయులును రూబేనీయులును—
యెహోవా నీ దాసులమైన మాతో చెప్పినట్లే చేసె
32 దము. । మేము యెహోవా సన్నిధిని యుద్ధసన్న
ద్ధులమై నది దాటి కనానుదేశములోకి వెళ్లెదము.
అప్పుడు యొర్దాను ఇద్దరిని మేము స్వాస్థ్యమును
33 పొందెదమని ఉత్తరమిచ్చిరి. । అప్పుడు మోషే వారికి,
అనగా గాదీయులకును రూబేనీయులకును యోసేపు
కుమారుడైన మనష్షే అర్ధగోత్రపు వారికిని, అమోరీ
యుల రాజైన సీహోను రాజ్యమును, బాషాను
రాజైన ఓగు రాజ్యమును, దాని ప్రాంతపురములతో
ఆ దేశమును చుట్టునుండు ఆ దేశపురములను ఇచ్చెను. ।
34 గాదీయులు దీబోను అతారోతు అరోయేరు
35 అత్రోతు షోపాను యాజెరు యొగ్బెహ బేత్నిమ్రా
36 బేత్హారాను । అను ప్రాకారములుగల పురములను
37 మందల దొడ్లను కట్టుకొనిరి. । రూబేనీయులు మారు
పేరుపొందిన హెష్బోను ఏలాలే కిర్యతాయిము నెబో
38 బయల్మెయోను । షిబ్మా అను పురములను కట్టి, తాము
39 కట్టిన ఆ పురములకు వేరు పేరులు పెట్టిరి. । మనష్షే
కుమారులైన మాకీరీయులు గిలాదుమీదికి పోయి దాని
పట్టుకొని దానిలోనున్న అమోరీయులను వెళ్లగొట్టిరి. ।
40 మోషే మనష్షే కుమారుడైన మాకీరుకు గిలాదు
41 నిచ్చెను । అతడు అక్కడ నివసించెను. మనష్షే
కుమారుడైన యాయీరు వెళ్లి వారి పల్లెలను పట్టు
కొని వాటికి యాయీరు పల్లెలను పేరు పెట్టెను. ।
42 నోబహు వెళ్లి కెనాతును దాని గ్రామములను పట్టు
కొని దానికి నోబహు అని తన పేరు పెట్టెను.

33 మోషే అహరోనులవలన తమ తమ సేనల
చొప్పున ఐగుప్తుదేశములోనుండి బయలుదేరి వచ్చిన
ఇశ్రాయేలీయులు చేసిన ప్రయాణములు ఇవి. ।
2 మోషే యెహోవా సెలవిచ్చిన ప్రకారము, వారి
ప్రయాణములనుబట్టి వారి సంచారక్రమములను వ్రా
సెను. వారి సంచారక్రమముల ప్రకారము వారి
3 ప్రయాణములు ఇవి. । మొదటి నెల పదునయిదవ దిన
మున వారు రామెసేసులోనుండి ప్రయాణమై పస్కా
పండుగకు మరునాడు వారి మధ్యను యెహోవా
హతము చేసిన తొలుచూలులనందరిని ఐగుప్తీయులు
పాతిపెట్టుచుండగా ఇశ్రాయేలీయులు ఐగుప్తీయులం
దరి కన్నులయెదుట జయోత్సాహముతో బయలు
దేరి వచ్చిరి. । అప్పుడు ఐగుప్తీయుల దేవతలకు 4
యెహోవా తీర్పుచేసెను. । ఇశ్రాయేలీయులు రామె 5
సేసులోనుండి బయలుదేరి సుక్కోతులో దిగిరి. ।
సుక్కోతులోనుండి వారు బయలుదేరి అరణ్యపు కడ 6
నున్న ఏతాములో దిగిరి. । ఏతాములోనుండి బయలు 7
దేరి బయల్సెఫోను ఎదుటనున్న పీహహీరోతుతట్టు
తిరిగి మిగ్దోలు ఎదుట దిగిరి. । పీహహీరోతులోనుండి 8
బయలుదేరి సముద్రమధ్యనుండి అరణ్యములోకి చేరి
ఏతాము అరణ్యమందు మూడుదినముల ప్రయాణము
చేసి మారాలో దిగిరి. మారాలోనుండి బయలుదేరి
ఏలీముకు వచ్చిరి. । ఏలీములో పన్నెండు నీటిబుగ్గ 9
లును డెబ్బది యీతచెట్లును ఉండెను; అక్కడ దిగిరి. ।
ఏలీములోనుండి వారు బయలుదేరి ఎఱ్ఱసముద్రము 10
నొద్ద దిగిరి. । ఎఱ్ఱసముద్రమునొద్దనుండి బయలుదేరి 11
సీను అరణ్యమందు దిగిరి. । సీను అరణ్యములోనుండి 12
బయలుదేరి దోపకాలో దిగిరి. । దోపకాలోనుండి 13
బయలుదేరి ఆలూషులో దిగిరి. । ఆలూషులోనుండి 14
బయలుదేరి రెఫీదీములో దిగిరి. అక్కడ జనులు
త్రాగుటకై నీళ్లు లేకపోయెను. । రెఫీదీములోనుండి 15
బయలుదేరి సీనాయి అరణ్యమందు దిగిరి. । సీనాయి 16
అరణ్యమునుండి బయలుదేరి కిబ్రోతుహత్తావాలో
దిగిరి. । కిబ్రోతుహత్తావాలోనుండి బయలుదేరి హజే 17
రోతులో దిగిరి. । హజేరోతులోనుండి బయలుదేరి 18
రిత్మాలో దిగిరి. । రిత్మాలోనుండి బయలుదేరి రిమ్మోను 19
పారెసులో దిగిరి. । రిమ్మోను పారెసులోనుండి బయలు 20
దేరి లిబ్నాలో దిగిరి. । లిబ్నాలోనుండి బయలుదేరి 21
రీసాలో దిగిరి. । రీసాలోనుండి బయలుదేరి కెహే 22
లాతాలో దిగిరి. । కెహేలాతాలోనుండి బయలుదేరి 23
షాపెరు కొండనొద్ద దిగిరి. । షాపెరు కొండనొద్దనుండి 24
బయలుదేరి హరాదాలో దిగిరి. । హరాదాలోనుండి 25
బయలుదేరి మకెలోతులో దిగిరి. । మకెలోతులో 26
నుండి బయలుదేరి తాహతులో దిగిరి. । తాహతులో 27
నుండి బయలుదేరి తారహులో దిగిరి. । తారహులో 28
నుండి బయలుదేరి మిత్కాలో దిగిరి. । మిత్కాలో 29
నుండి బయలుదేరి హష్మోనాలో దిగిరి. । హష్మోనాలో 30
నుండి బయలుదేరి మొసేరోతులో దిగిరి. । మొసేరో 31
తులోనుండి బయలుదేరి బెనేయాకానులో దిగిరి. ।
బెనేయాకానులోనుండి బయలుదేరి హోర్హగ్గిద్గా 32
గులో దిగిరి. । హోర్హగ్గిద్గాగులోనుండి బయలు 33
దేరి యొత్బాతాలో దిగిరి. । యొత్బాతాలోనుండి 34
బయలుదేరి ఎబ్రోనాలో దిగిరి. । ఎబ్రోనాలోనుండి 35
బయలుదేరి ఎసోన్గాబెరులో దిగిరి. । కాదేషు అన 36
బడిన ఎసోన్గాబెరులోనుండి బయలుదేరి సీను అరణ్యా

37 ములో దిగిరి. । కాదేషులోనుండి బయలుదేరి ఎదోము
దేశము కడనున్న హోరుకొండదగ్గర దిగిరి. ।
38 యెహోవా సెలవిచ్చిన ప్రకారము యాజకుడైన
అహరోను హోరు కొండనెక్కి, ఇశ్రాయేలీయులు
ఐగుప్తుదేశములోనుండి బయలుదేరి వచ్చిన నలువదియవ
సంవత్సరమున అయిదవ నెల మొదటి దినమున
39 అక్కడ మృతినొందెను. । అహరోను నూట ఇరువది
మూడేండ్ల యీడుగలవాడై హోరు కొండమీద
40 మృతినొందెను. । అప్పుడు దక్షిణదిక్కున కనానుదేశ
మందు నివసించిన అరాదురాజైన కనానీయుడు ఇశ్రా
41 యేలీయులు వచ్చిన సంగతి వినెను. । వారు హోరు
42 కొండనుండి బయలుదేరి సల్మోనాలో దిగిరి. । సల్మో
43 నాలోనుండి బయలుదేరి పూనోనులో దిగిరి. । పూ
44 నోనులోనుండి బయలుదేరి ఓబోతులో దిగిరి. । ఓ
బోతులోనుండి బయలుదేరి మోయాబు పొలిమేర
45 యొద్దనున్న ఈయ్యె అబారీములో దిగిరి. । ఈయ్యె
అబారీములోనుండి బయలుదేరి దీబోనుగాదులో
46 దిగిరి. । దీబోనుగాదులోనుండి బయలుదేరి అల్మోను
47 దిబ్లాతాయిములో దిగిరి. । అల్మోనుదిబ్లాతాయిములో
నుండి బయలుదేరి నెబోయెదుటి అబారీము కొండ
48 లలో దిగిరి. । అబారీము కొండలలోనుండి బయలు
దేరి యెరికో దగ్గర యొర్దానుకు సమీపమైన మో
49 యాబు మైదానములలో దిగిరి. । వారు మోయాబు
మైదానములలో బెత్యేషిమోతు మొదలుకొని ఆబేలు
50 షిత్తీమువరకు యొర్దానుదగ్గర దిగిరి. । యెరికోయొద్ద,
అనగా యొర్దానుకు సమీపమైన మోయాబు మైదా
నములలో యెహోవా మోషేకు ఈలాగు సెల
51 విచ్చెను । — నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము —
మీరు యొర్దానును దాటి కనానుదేశమును చేరిన తరు
52 వాత । ఆ దేశనివాసులందరిని మీ యెదుటనుండి వెళ్ల
గొట్టి, వారి సమస్త ప్రతిమలను నాశనముచేసి వారి
పోతవిగ్రహములనన్నిటిని నశింపచేసి వారి ఉన్నత
53 స్థలములనన్నిటిని పాడుచేసి । ఆ దేశమును స్వాధీన
పరచుకొని దానిలో నివసింపవలెను; ఏలయనగా దాని
స్వాధీనపరచుకొనునట్లు ఆ దేశమును మీకిచ్చితిని. ।
54 మీరు మీ వంశములచొప్పున చీట్లువేసి ఆ దేశమును
స్వాస్థ్యములగా పంచుకొనవలెను. ఎక్కువ మందికి
ఎక్కువ స్వాస్థ్యమును తక్కువ మందికి తక్కువ స్వా
స్థ్యము ఇయ్యవలెను. ఎవని చీటి యే స్థలమున పడునో
వానికి ఆ స్థలమే కలుగును. మీ తండ్రుల గోత్ర
ముల చొప్పున మీరు స్వాస్థ్యములు పొందవలెను. ।
55 అయితే మీరు మీ యెదుటనుండి ఆ దేశనివాసులను
వెళ్లగొట్టనిపక్షమందు, మీరు వారిలో ఎవరిని ఉండ
నిచ్చెదరో వారు మీ కన్నులలో ముండ్లుగాను మీ
ప్రక్కలలో శూలములుగాను ఉండి, మీరు నివసించు
56 ఆ దేశములో మిమ్మును బాధపెట్టెదరు. । మరియు
నేను వారికి చేయ తలంచినట్లు మీకు చేసెదనని
వారితో చెప్పుము.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 34
విచ్చెను — నీవు ఇశ్రాయేలీయులను చూచి । కనాను 2
దేశమున, అనగా పొలిమేరలచొప్పున మీరు చీట్లు
వేసి స్వాస్థ్యముగా పంచుకొను కనానుదేశమున ।
మీరు ప్రవేశించుచుండగా, మీ దక్షిణదిక్కు సీను 3
అరణ్యము మొదలుకొని ఎదోము సరిహద్దు, అనగా ।
మీ దక్షిణపు సరిహద్దు ఉప్పుసముద్రముయొక్క 4
తూర్పు తీరమువరకు ఉండును. మీ సరిహద్దు దక్షి
ణము మొదలుకొని అక్రబ్బీము కనమయొద్ద తిరిగి
సీనువరకు వ్యాపించును. అది దక్షిణమునుండి కాదేషు
బర్నేయవరకు వ్యాపించి, అక్కడనుండి హసరద్దారు
వరకు పోయి, అక్కడనుండి అస్మోనువరకు సాగును. ।
అస్మోనునుండి ఐగుప్తు నదివరకు సరిహద్దు తిరిగి సము 5
ద్రమువరకు వ్యాపించును. । పడమటి సరిహద్దు ఏద 6
నగా మహాసముద్రము, అదే మీకు పడమటి సరిహద్దు
గానుండును. । మీ ఉత్తరపు సరిహద్దును మహాసము 7
ద్రముయొద్దనుండి హోరు కొండవరకు ఏర్పరచు
కొనవలెను. । హోరు కొండయొద్దనుండి హమాతుకు 8
చేరువరకు ఏర్పరచుకొనవలెను. ఆ సరిహద్దు సెదాదు
వరకు వ్యాపించును. । అక్కడనుండి సరిహద్దు జిప్రోను 9
వరకు వ్యాపించును, దాని చివర హసరేనానునొద్ద
ఉండును. అది మీకు ఉత్తరపు సరిహద్దు. । తూర్పు 10
సరిహద్దు హసరేనానునుండి షెపామువరకు మీరు
ఏర్పరచుకొనవలెను. । షెపామునుండి సరిహద్దు అయీ 11
నుకు తూర్పున రిబ్లావరకు నుండును. ఆ సరిహద్దు
దిగి తూర్పున కిన్నెరెతు సముద్రమునొద్దను తగిలి
యుండును. । ఆ సరిహద్దు యొర్దానునదివరకు దిగి 12
ఉప్పుసముద్రముదనుక వ్యాపించును. ఆ దేశము
చుట్టునున్న సరిహద్దుల మధ్యనున్న దేశము మీదై
యుండునని వారికాజ్ఞాపించుము. । మోషే యిశ్రా 13
యేలీయులను చూచి—మీరు చీట్లచేత పొందబోవు
చున్న దేశము ఇది. యెహోవా తొమ్మిదిగోత్ర
ములకును అర్ధగోత్రమునకును దీని నియ్యవలెనని ఆజ్ఞా
పించెను; । ఏలయనగా తమ తమ పితరుల కుటుంబ 14
ముల ప్రకారము రూబేనీయులును గాదీయులును
తమ తమ స్వాస్థ్యముల నొందిరి. । మనష్షే అర్ధ 15
గోత్రపువారు తమ స్వాస్థ్యము నొందిరి. ఆ రెండు
గోత్రపువారును అర్ధగోత్రపువారును సూర్యోదయ
దిక్కున, అనగా తూర్పు దిక్కున యెరికోయొద్ద
యొర్దాను ఇద్దరిని తమ తమ స్వాస్థ్యములను పొందిరని
చెప్పెను.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 16
విచ్చెను । —ఆ దేశమును మీకు స్వాస్థ్యముగా పంచి 17
పెట్టవలసినవారెవరనగా, యాజకుడైన ఎలాజారును

18 నూను కుమారుడైన యెహోషువయు. । మరియు ఆ
దేశమును మీకు స్వాస్థ్యముగా పంచిపెట్టుటకు ప్రతి
గోత్రములో ఒక్కొక ప్రధానుని ఏర్పరచుకొన
19 వలెను. । వారెవరనగా, యూదా వారి గోత్రములో
20 యెఫున్నె కుమారుడైన కాలేబు. । షిమ్యోనీయుల
గోత్రములో అమీహూదు కుమారుడైన షెమూ
21 యేలు, । బెన్యామీనీయుల గోత్రములో కిస్లోను
22 కుమారుడైన ఎలీదాదు. । దానీయుల గోత్రములో
23 యొగ్లి కుమారుడైన బుక్కీ ప్రధాని,। యోసేపు పుత్రు
లలో ఏఫోదు కుమారుడైన హన్నీయేలు మనష్షీయుల
24 గోత్ర ప్రధాని, । ఎఫ్రాయిమీయుల గోత్రములో
25 షిఫ్తాను కుమారుడైన కెమూయేలు ప్రధాని, । జెబు
లూనీయుల గోత్రములో పర్నాకు కుమారుడైన ఎలీ
26 షాపాను ప్రధాని, । ఇశ్శాఖారీయుల గోత్రములో
27 అజ్జాను కుమారుడైన పల్తీయేలు ప్రధాని, । ఆషేరీ
యుల గోత్రములో షెలోమి కుమారుడైన అహీ
28 హూదు ప్రధాని, । నఫ్తాలీయుల గోత్రములో అమీ
29 హూదు కుమారుడైన పెదహేలు ప్రధాని. । కనాను
దేశములో ఇశ్రాయేలీయులకు వారి వారి స్వాస్థ్యము
లను పంచిపెట్టుటకు యెహోవా ఆజ్ఞాపించినవారు
వీరే.

**35** మరియు యెరికో యొద్ద యొర్దానుకు సమీప
మైన మోయాబు మైదానములలో యెహోవా
2 మోషేకు ఈలాగు సెలవిచ్చెను । —ఇశ్రాయేలీయులు
తాము పొందు స్వాస్థ్యములో లేవీయులు నివసించు
టకు వారికి పురములను ఇయ్యవలెనని వారికాజ్ఞా
పించుము; ఆ పురముల చుట్టునున్న భూములను
3 లేవీయులకియ్యవలెను. । వారు నివసించుటకు ఆ పుర
ములు వారివగును. వాటి పొలములు వారి పశు
వులకును వారి మందలకును వారి సమస్త జంతువుల
4 కును ఉండవలెను. । మీరు లేవీయులకిచ్చు పురముల
పొలము ప్రతి పురముయొక్క గోడ మొదలుకొని
5 చుట్టు వెయ్యి మూరలు । మరియు మీరు ఆ పుర
ముల వెలపటనుండి తూర్పు దిక్కున రెండువేల
మూరలను, దక్షిణ దిక్కున రెండువేల మూరలను,
పడమటి దిక్కున రెండువేల మూరలను, ఉత్తర
దిక్కున రెండువేల మూరలను కొలవవలెను. ఆ
నడుమ పురముండవలెను. అది వారి పురములకు
6 పొలముగా నుండును. । మరియు మీరు లేవీయుల
కిచ్చు పురములలో ఆరు ఆశ్రయపురములుండవలెను.
నరహంతకుడు వాటిలోనికి పారిపోవునట్లుగా వాటిని
నియమింపవలెను. అవియుగాక నలుబది రెండు పుర
7 ములను ఇయ్యవలెను. । వాటి వాటి పొలముతో కూడ
మీరు లేవీయులకు ఇయ్యవలసిన పురములన్నియు
8 నలువది యెనిమిది. । మీరు ఇచ్చు పురములు ఇశ్రా
యేలీయుల స్వాస్థ్యములోనుండియే ఇయ్యవలెను.
మీరు ఎక్కువైనదానిలో ఎక్కువగాను, తక్కువైన
దానిలో తక్కువగాను ఇయ్యవలెను. ప్రతి గోత్రము
తాను పొందు స్వాస్థ్యము చొప్పున, తన తన పురము
లలో కొన్నిటిని లేవీయులకు ఇయ్యవలెను.

మరియు యెహోవా మోషేకు ఈలాగు సెల 9
విచ్చెను—నీవు ఇశ్రాయేలీయులతో ఇట్లనుము ; మీరు 10
యొర్దానుదాటి కనానుదేశములోకి వెళ్లిన తరువాత ।
ఆశ్రయపురములుగా ఉండుటకు మీరు పురములను 11
ఏర్పరచుకొనవలెను. । పొరబాటున ఒకని చంపిన 12
వాడు వాటిలోనికి పారిపోవచ్చును. తీర్పు పొందు
టకై నరహంతకుడు సమాజమునెదుట నిలుచువరకు
వాడు మరణశిక్ష నొందకూడదు గనుక ప్రతిహత్య
చేయువాడు రాకుండ అవి మీకు ఆశ్రయపురము
లుగా ఉండును. । మీరు ఇయ్యవలసిన ఆ పురము 13
లలో ఆరు ఆశ్రయపురములుండవలెను. । వాటిలో 14
యొర్దాను ఇద్దరిని మూడు పురములను ఇయ్యవలెను,
కనాను దేశములో మూడు పురములను ఇయ్యవలెను.
అవి మీకు ఆశ్రయపురములుగా ఉండును. । పొర 15
బాటున ఒకని చంపిన యెవడైనను వాటిలోనికి పారి
పోవునట్లు ఆ ఆరు పురములు ఇశ్రాయేలీయులకును
పరదేశులకును మీ మధ్య నివసించువారికిని ఆశ్రయ
మైయుండును. । ఒకడు చచ్చునట్లు వానిని ఇనుప 16
ఆయుధముతో కొట్టువాడు నరహంతకుడు. ఆ నర
హంతకునికి నిశ్చయముగా మరణశిక్ష విధింపవలెను. ।
ఒకడు చచ్చునట్లు మరియొకడు రాతితో వాని కొట్ట 17
గా దెబ్బ తినినవాడు చనిపోయినయెడల కొట్టినవాడు
నరహంతకుడగును. ఆ నరహంతకుడు నిశ్చయముగా
మరణశిక్ష నొందును. । మరియు ఒకడు చచ్చునట్లు
మరియొకడు చేతికర్రతో కొట్టగా దెబ్బ తినినవాడు
చనిపోయినయెడల కొట్టినవాడు నరహంతకుడగును.
ఆ నరహంతకుడు నిశ్చయముగా మరణశిక్ష నొం
దును. । హత్య విషయములో ప్రతిహత్య చేయువాడు
తానే నరహంతకుని చంపవలెను. । వాని కనుగొని
నప్పుడు వాని చంపవలెను. ఒకడు చచ్చునట్లు వాని
పగపట్టి పొడిచినను, లేక పొంచియుండి వానిమీద
దేనినైనను వేసినను, లేక ఒకడు చచ్చునట్లు వైరము
వలన చేతితో వాని కొట్టినను, కొట్టినవాడు నరహంత
కుడు, నిశ్చయముగా వాని చంపవలెను. । నరహత్య
విషయములో ప్రతిహత్య చేయువాడు ఆ నరహంత
కుని కనుగొనినప్పుడు వాని చంపవలెను. । అయితే
పగపట్టక హఠాత్తుగా వాని పొడిచినను, పొంచియుం
డక వానిమీద ఏ ఆయుధమునైన వేసినను, వాని
చూడక ఒకడు చచ్చునట్లు వానిమీద రాయి పడ
వేసినను, దెబ్బ తినినవాడు చనిపోయినయెడల కొట్టిన
వాడు వానిమీద పగపట్టలేదు, వానికి హానిచేయ
గోరలేదు. । కాబట్టి సమాజము ఈ విధులనుబట్టి

కొట్టినవానికిని హత్యవిషయములో ప్రతిహత్య చేయు
5 వానికిని తీర్పుతీర్చవలెను. । అట్లు సమాజము నర
హత్య విషయములో ప్రతిహత్య చేయువాని చేతిలో
నుండి ఆ నరహంతకుని విడిపింపవలెను. అప్పుడు
సమాజము వాడు పారిపోయిన ఆశ్రయపురమునకు
వాని మరల పంపవలెను. వాడు పరిశుద్ధతైలముతో
అభిషేకింపబడిన ప్రధానయాజకుడు మృతినొందు
26 వరకు అక్కడనే నివసింపవలెను. । అయితే ఆ నర
హంతకుడు ఎప్పుడైనను తాను పారిపోయి చొచ్చిన
ఆశ్రయపురముయొక్క సరిహద్దును దాటి వెళ్లునప్పు
27 డు । నరహత్య విషయములో ప్రతిహత్య చేయువాడు
ఆశ్రయపురముయొక్క సరిహద్దు వెలపట వాని కను
గొనినయెడల, ఆ ప్రతిహంతకుడు ఆ నరహంతకుని
చంపినను వానిమీద ప్రాణముతీసిన దోషము ఉం
28 డదు. । ఏలయనగా ప్రధానయాజకుడు మృతినొందు
వరకు అతడు ఆశ్రయపురములోనే నివసింపవలెను.
ప్రధానయాజకుడు మృతినొందిన తరువాత ఆ నర
హంతకుడు తన స్వాస్థ్యమున్న దేశమునకు తిరిగి వెళ్ల
29 వచ్చును. । ఇవి మీ సమస్త నివాసస్థలములలో మీ
30 తరతరములకు మీకు విధింపబడిన కట్టడ. । ఎవడై
నను ఒకని చావగొట్టినయెడల సాక్షుల నోటిమాట
వలన ఆ నరహంతకునికి మరణశిక్ష విధింపవలెను. ఒక
సాక్షిమాటమీదనే యొవనికిని మరణశిక్ష విధింప
31 కూడదు. । చావతగిన నరహంతకుని ప్రాణముకొరకు
మీరు విమోచనధనమును అంగీకరింపక నిశ్చయముగా
32 వానికి మరణశిక్ష విధింపవలెను. । మరియు ఆశ్రయ
పురమునకు పారిపోయినవాడు యాజకుడు మృతినొం
దకమునుపు స్వదేశమందు నివసించునట్లు వానిచేత
33 విమోచనధనమును అంగీకరింపకూడదు. । మీరుండు
దేశమును అపవిత్రపరచకూడదు; నరహత్య దేశమును
అపవిత్రపరచును గదా. దేశములో చిందిన రక్తము
నిమిత్తము చిందించినవాని రక్తమువలననే ప్రాయశ్చి
త్తము కలుగును గాని మరి దేనివలనను కలుగదు. ।
34 మీరు నివసించు దేశమును అపవిత్రపరచకూడదు.
అందులో నేను మీ మధ్యను నివసించుచున్నాను.
నిజముగా యెహోవా అను నేను ఇశ్రాయేలీయుల
మధ్య నివసించుచున్నాను.

**36** యోసేపు పుత్రులవంశములలో మాకీరు కుమా
రుడును మనష్షే మనుమడునైన గిలాదుయొక్క పుత్రు
వంశముల పెద్దలు వచ్చి మోషేయెదుటను ఇశ్రాయేలీ
యుల పితరుల కుటుంబముల ప్రధానులయెదుటను
2 మాటలాడి యిట్లనిరి । —ఆ దేశమును వంతు చీట్ల
చొప్పున ఇశ్రాయేలీయులకు స్వాస్థ్యముగా ఇయ్య
వలెనని యెహోవా మా యేలినవానికాజ్ఞాపించెను.
మరియు మా సహోదరుడైన సెలోపెహాదు స్వాస్థ్య
మును అతని కుమార్తెలకు ఇయ్యవలెనని మా యేలిన
వాడు యెహోవాచేత ఆజ్ఞనొందెను. । అయితే వారు 3
ఇశ్రాయేలీయులలో వేరు గోత్రములవారి నెవరి
నైనను పెండ్లిచేసికొనిన పక్షమున వారి స్వాస్థ్యము
మా పితరుల స్వాస్థ్యమునుండి తీయబడి, వారు కలిసి
కొనినవారి గోత్రస్వాస్థ్యముతో కలిసి, మాకు వంతు
చీట్లచొప్పున కలిగిన స్వాస్థ్యమునుండి విడిపోవును. ।
కాబట్టి ఇశ్రాయేలీయులకు యోబేలు సంవత్సరము 4
వచ్చునప్పుడు వారి స్వాస్థ్యము వారు కలిసికొనిన
వారి గోత్రస్వాస్థ్యముతో కలుపబడును గనుక ఆ
వంతున మా పితరుల గోత్రస్వాస్థ్యము తగ్గిపోవున
గా । మోషే యెహోవా సెలవిచ్చినట్లు ఇశ్రాయేలీ 5
యులకు ఆజ్ఞాపించి యిట్లనెను—యోసేపు పుత్రుల
గోత్రికులు చెప్పినది న్యాయమే. । యెహోవా 6
సెలోపెహాదు కుమార్తెలను గూర్చి సెలవిచ్చినమాట
ఏదనగా — వారు తమకు ఇష్టులైనవారిని పెండ్లిచేసి
కొనవచ్చును గాని వారు తమ తండ్రి గోత్రవంశము
లోనే పెండ్లిచేసికొనవలెను. । ఇశ్రాయేలీయుల స్వా 7
స్థ్యము ఒక గోత్రములోనుండి వేరొక గోత్రము
లోనికి పోకూడదు. ఇశ్రాయేలీయులలో ప్రతి
వాడును తన తన పితరుల గోత్రస్వాస్థ్యమును హత్తు
కొని యుండవలెను. । మరియు ఇశ్రాయేలీయులకు 8
వారి వారి పితరుల స్వాస్థ్యము కలుగునట్లు, ఇశ్రా
యేలీయుల గోత్రములలో స్వాస్థ్యముగల ప్రతి
కుమార్తెయు తన తండ్రి గోత్రవంశములోనే పెండ్లి
చేసికొనవలెను. । స్వాస్థ్యము ఒక గోత్రములోనుండి 9
వేరొక గోత్రమునకు పోకూడదు. ఇశ్రాయేలీయుల
గోత్రములు వారి వారి స్వాస్థ్యములో నిలిచియుండ
వలెను. । యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు 10
సెలోపెహాదు కుమార్తెలు చేసిరి. । సెలోపెహాదు 11
కుమార్తెలైన మహలా, తిర్సా, హొగ్లా, మిల్కా,
నోయా తమ తండ్రి సహోదరుని కుమారులను పెండ్లి
చేసికొనిరి. । వారు యోసేపు కుమారులైన మనష్షీయు 12
లను పెండ్లిచేసికొనిరి గనుక వారి స్వాస్థ్యము వారి
తండ్రి గోత్రవంశములోనే నిలిచెను. । యెరికో 13
యొద్ద యొర్దానుకు సమీపమైన మోయాబు మైదాన
ములలో యెహోవా మోషేచేత ఇశ్రాయేలీయు
లకు ఆజ్ఞాపించిన విధులును ఆజ్ఞలును ఇవే.

# ద్వితీయోపదేశకాండము

1 యొర్దాను ఇద్దరినున్న అరణ్యములో, అనగా
పారానుకును తోపెలు, లాబాను, హజేరోతు, దీజా
హాబను స్థలములకును మధ్య ఎఱ్ఱసముద్రమునకు ఎదు
రుగానున్న మైదానములలో మోషే ఇశ్రాయేలీయు
2 లందరితో చెప్పినమాటలు ఇవే. । హోరేబునుండి
శేయీరు మన్నెపు మార్గముగా కాదేషు బర్నేయ
3 వరకు పదకొండు దినముల ప్రయాణము. । హెష్బో
నులో నివసించిన అమోరీయుల రాజైన సీహోనును
అష్తారోతులో నివసించిన బాషాను రాజైన ఓగును
4 ఎద్రెయిలో హతము చేసినతరువాత । నలుబదియవ
సంవత్సరములో పదకొండవ నెల మొదటి తేదిని మోషే
ఇశ్రాయేలీయులకు బోధించుటకై యెహోవా
తన కాజ్ఞాపించినదంతయు వారితో చెప్పెను. ।
5 యొర్దాను ఇద్దరినున్న మోయాబు దేశమున మోషే
యీ ధర్మశాస్త్రమును ప్రకటింప మొదలుపెట్టి ఇట్లనెను।
6 —మన దేవుడైన యెహోవా హోరేబులో మనకు
ఈలాగు సెలవిచ్చెను—ఈ పర్వతమునొద్ద మీరు నివ
7 సించిన కాలము చాలును; । మీరు తిరిగి ప్రయాణమై
అమోరీయుల మన్నెమునకును, అరాబాలోను, మన్నె
ములోను, లోయలోను, దక్షిణదిక్కున సముద్రతీర
ములోనున్న స్థలములన్నిటికిని, కనాను దేశమునకును,
లెబానోనుకును, మహానదియైన యూఫ్రటీసు నదివరకును వెళ్లుడి.।
8 ఇదిగో ఆ దేశమును మీకు అప్పగించితిని. మీరు
వెళ్లి యెహోవా మీ పితరులైన అబ్రాహాము
ఇస్సాకు యాకోబులకును వారి తరువాత వారి సం
తానమునకును ఇచ్చెదనని నేను ప్రమాణముచేసిన
9 దేశమును స్వాధీనపరచుకొనుడి. । అప్పుడు నేను
10 — ఒంటిగా మిమ్మును భరింపలేను. । మీ దేవుడైన
యెహోవా మిమ్ము విస్తరింపజేసెను గనుక నేడు మీరు
11 ఆకాశ నక్షత్రములవలె విస్తరించియున్నారు. । మీ
పితరుల దేవుడైన యెహోవా మీ జనసంఖ్యను
వెయ్యిరెట్లు ఎక్కువచేసి, తాను మీతో చెప్పినట్లు
12 మిమ్మును ఆశీర్వదించుగాక. । నేనొక్కడనే మీ కష్ట
మును మీ భారమును మీ వివాదమును ఎట్లు భరింప
13 గలను? । జ్ఞానవివేకములు కలిగి, మీ మీ గోత్రము
లలో ప్రసిద్ధిచెందిన మనుష్యులను ఏర్పరచుకొనుడి;
వారిని మీమీద నియమించెదనని మీతో చెప్పగా ।
14 మీరు—నీవు చెప్పిన మాటచొప్పున చేయుట మంచి
15 దని నాకు ఉత్తరమిచ్చితిరి. । కాబట్టి బుద్ధికలిగి ప్రసిద్ధు
లైన మీ మీ గోత్రములలోని ముఖ్యులను పిలిపించు
కొని, మీ గోత్రములకు న్యాయాధిపతులుగా ఉండు
టకై వెయ్యిమందికి ఒకడుగాను, నూరుమందికి ఒకడు
గాను, ఏబదిమందికి ఒకడుగాను, పదిమందికి ఒకడు
గాను వారిని మీమీద నేను నియమించితిని. । అప్పుడు 16
నేను మీ న్యాయాధిపతులను చూచి—మీ సహో
దరుల వ్యాజ్యములను తీర్చి, ప్రతి మనుష్యునికిని వాని
సహోదరునికిని వానియొద్దనున్న పరదేశికిని న్యాయ
మునుబట్టి మీరు తీర్పు తీర్చవలెను. । తీర్పు తీర్చునప్పుడు 17
అల్పుల సంగతి గాని ఘనుల సంగతి గాని పక్షపాతము
లేకుండ వినవలెను; న్యాయపుతీర్పు దేవునిదే. కాబట్టి
మీరు మనుష్యుని ముఖము చూచి భయపడవద్దు.
మీకు అసాధ్యమైన కఠినవ్యాజ్యమును నాయొద్దకు
తీసికొని రావలెను; నేను దాని విచారించెదనని వారి
కాజ్ఞాపించితిని. । మరియు మీరు చేయవలసిన సమస్త 18
కార్యములను గూర్చి అప్పుడు మీకాజ్ఞాపించితిని.
మనము హోరేబునుండి సాగి మన దేవుడైన 19
యెహోవా మనకాజ్ఞాపించినట్లు మీరు చూచిన ఆ
ఘోరమైన మహారణ్యములోనుండి వచ్చి, అమో
రీయుల మన్నెపు మార్గమున కాదేషు బర్నేయకు
చేరితిమి. । అప్పుడు నేను—మన దేవుడైన యెహోవా 20
మనకిచ్చుచున్న అమోరీయుల మన్నెమునకు వచ్చి
యున్నాము. । ఇదిగో నీ దేవుడైన యెహోవా యీ 21
దేశమును నీకు అప్పగించెను. నీ పితరుల దేవుడైన
యెహోవా నీతో సెలవిచ్చినట్లు దాని స్వాధీనపరచు
కొనుము; భయపడకుము, అధైర్యపడకుమని నీతో
చెప్పితిని. । అప్పుడు మీరందరు నాయొద్దకు వచ్చి— 22
మనకంటె ముందుగా మనుష్యులను పంపుదము; వారు
మనకొరకు ఈ దేశమును వేగుజూచి, తిరిగి వచ్చి
అందులోనికి మనము వెళ్లవలసిన త్రోవను గూర్చియు,
మనము చేరవలసిన పురములను గూర్చియు మనకు
వర్తమానము చెప్పుదురంటిరి. । ఆ మాట మంచిదను 23
కొని నేను గోత్రమొక్కంటికి ఒక మనుష్యుని చొ
ప్పున పన్నిద్దరు మనుష్యులను పిలిపించితిని. । వారు 24
తిరిగి ఆ మన్నెమునకు పోయి ఎష్కోలు లోయకు
వచ్చి దాని వేగుజూచి ఆ దేశఫలములను చేత పట్టు
కొని । మనయొద్దకు తీసికొని వచ్చి — మన దేవుడైన 25
యెహోవా మనకిచ్చుచున్న దేశము మంచిదని మనకు
తెలియజెప్పిరి. । అయితే మీరు వెళ్లనొల్లక మీ దేవు 26
డైన యెహోవా సెలవిచ్చిన మాటకు తిరుగబడి ।
మీ గుడారములలో సణుగుచు—యెహోవా మన 27

యందు పగపట్టినందున మనలను సంహరించునట్లు
అమోరీయులచేతికి మనలను అప్పగించుటకు ఐగుప్తు
28 దేశములోనుండి మనలను రప్పించియున్నాడు. । మన
మెక్కడికి వెళ్లగలము? మన సహోదరులు—అక్కడి
జనులు మనకంటె బలిష్ఠులును ఎత్తరులునై యున్నారు;
ఆ పట్టణములు గొప్పవై ఆకాశమునంటు ప్రాకార
ములతో నున్నవి; అక్కడ అనాకీయులను చూచితి
మని చెప్పి మా హృదయములను కరగజేసిరని మీరు
29 చెప్పితిరి. । అప్పుడు నేను మిమ్మును చూచి — దిగులు
30 పడకుడి, వారికి భయపడకుడి, । మీకు ముందర నడు
చుచున్న మీ దేవుడైన యెహోవా మీ కన్నుల
31 యెదుట । ఐగుప్తులోను అరణ్యములోను మీకొరకు
చేసినట్లు మీ పక్షముగా యుద్ధము చేయును, మీరు
ఈ చోటికి చేరువరకు మీరు వచ్చిన మార్గమంతటి
లోను మనుష్యుడు తన కుమారుని ఎత్తికొనునట్లు మీ
దేవుడైన యెహోవా మిమ్మును ఎత్తికొని వచ్చిన సం
32 గతి మీరెరుగుదురని మీతో చెప్పితిని. । అయితే
మీకు త్రోవ చూపించి మీ గుడారములను వేయ
33 వలసిన స్థలమును మీకు సిద్ధపరచునట్లు । రాత్రి అగ్ని
లోను పగలు మేఘములోను మీకు ముందర నడిచిన
మీ దేవుడైన యెహోవాయందు మీరు విశ్వాస
34 ముంచలేదు. । కాగా యెహోవా మీరు చెప్పిన
35 మాటలు విని । బహుగా కోపపడి—నేను మీ పిత
రులకిచ్చెదనని ప్రమాణముచేసిన యీ మంచి దేశ
36 మును ఈ చెడ్డతరమువారిలో । యెఫున్నె కుమారు
డైన కాలేబేతప్ప మరి ఎవడును చూడడు. అతడు
పూర్ణమనస్సుతో యెహోవాను అనుసరించెను గనుక
అతడు దాని చూచును. అతడు అడుగుపెట్టిన దేశ
మును నేను అతనికిని అతని సంతానమునకును ఇచ్చెద
37 నని ప్రమాణముచేసెను. । మరియు యెహోవా
మిమ్మునుబట్టి నామీద కోపపడి — నీ పరిచారకుడగు
నూను కుమారుడైన యెహోషువ దానిలో ప్రవేశిం
38 చును గాని నీవు దానిలో ప్రవేశింపవు. । అతడు
ఇశ్రాయేలీయులు దాని స్వాధీనపరచుకొనచేయును
39 గనుక అతని ధైర్యపరచుము. । ఆ దినమున మంచి
చెడ్డల నెరుగని మీ కుమారులు, అనగా—అపహరింప
బడుదురని మీరు చెప్పిన మీ పిల్లలు దానిలో ప్రవే
శింతురు; దాని వారికిచ్చెదను; వారు దాని స్వాధీన
40 పరచుకొందురు. । మీరు తిరిగి ఎఱ్ఱసముద్ర మార్గ
ముగా అరణ్యమునకు ప్రయాణము చేయుడని చెప్పె
ను. । అందుకు మీరు—మేము యెహోవాకు విరోధ
ముగా పాపము చేసితిమి; మా దేవుడైన యెహోవా
మాకాజ్ఞాపించిన మాటలన్నిటి ననుసరించి మేము
పోయి యుద్ధము చేసెదమని నాతో ఉత్తరమిచ్చి,
మీరందరు మీ ఆయుధములను కట్టుకొని, ఆలోచిం
పక ఆ మన్నెమునకు పోగా । యెహోవా నాతో
ఇట్లనెను—యుద్ధమునకు పోకుడి; నేను మీ మధ్య
నుండను గనుక వెళ్లకుడి; మీరు వెళ్లిన మీ శత్రువుల
యెదుట హతము చేయబడుదురని వారితో చెప్పుము.।
ఆ మాటలు నేను మీతో చెప్పినప్పుడు మీరు వినక 43
యెహోవా మాటకు తిరుగబడి మూర్ఖులై ఆ మన్నె
మునకు వెళ్లితిరి. । అప్పుడు ఆ మన్నెములో నివసిం 44
చిన అమోరీయులు మీకెదురుగా బయలుదేరి వచ్చి,
కందిరీగలవలె మిమ్ము తరిమి హోర్మావరకు శేయీ
రులో మిమ్ము హతముచేసిరి. । తరువాత మీరు తిరిగి 45
వచ్చి యెహోవా సన్నిధిని ఏడ్వగా యెహోవా
మీ మొఱ్ఱను లక్ష్యపెట్టలేదు, మీ మాట వినలేదు. ।
కాగా మీరు కాదేషులో బహు దినములు నివసించి 46
తిరి. మీరు నివసించిన దినములెన్నో (మీకు తెలిసి
నవి.)

మరియు యెహోవా నాతో చెప్పినట్లు మనము **2**
తిరిగి ఎఱ్ఱసముద్ర మార్గమున అరణ్యమునకు ప్రయా
ణమైపోయి బహు దినములు శేయీరు మన్నెములో
సంచరించితిమి. । అంతట యెహోవా నాకు ఈలాగు 2
సెలవిచ్చెను—మీరు ఈ మన్నెములో సంచరించిన
కాలము చాలును; । ఉత్తరదిక్కుకు తిరుగుడి. మరియు 3
నీవు ప్రజలతో ఇట్లనుము । —శేయీరులో కాపుర 4
మున్న ఏశావు సంతానమైన మీ సహోదరుల పొలి
మేరను దాటి వెళ్లబోవుచున్నారు; వారు మీకు భయ
పడుదురు; మీరు మిక్కిలి జాగ్రత్తగా ఉండుడి. ।
వారితో కలహపడవద్దు; ఏలయనగా ఏశావుకు స్వాస్థ్య 5
ముగా శేయీరు మన్నెము నేనిచ్చి యున్నాను ।
గనుక వారి భూమిలోనిది అడుగైనను మీకియ్యను. 6
మీరు రూకలిచ్చి వారియొద్ద ఆహారము కొని తిన
వచ్చును. రూకలిచ్చి వారియొద్ద నీళ్లు సంపాదించుకొని
త్రాగవచ్చును. । నీ చేతుల పనులన్నిటిలోను నీ దేవు 7
డైన యెహోవా నిన్ను ఆశీర్వదించెను. ఈ గొప్ప
అరణ్యములో నీవు ఈ నలువది సంవత్సరములు సంచ
రించిన సంగతి ఆయన యెరుగును. నీ దేవుడైన
యెహోవా నీకు తోడైయున్నాడు, నీకేమియు
తక్కువ కాదు. । అప్పుడు శేయీరులో నివసించు 8
ఏశావు సంతానపువారైన మన సహోదరుల దేశపు
మార్గమున, అనగా ఏలతు ఎసోన్గాబెరు మైదానపు
మార్గమున మనము ప్రయాణము చేయకపోతిమి.

మనము తిరిగి మోయాబు అరణ్యమార్గమున 9
ప్రయాణము చేయుచుండగా యెహోవా నాతో
ఇట్లనెను—మోయాబీయులను బాధింపవద్దు; వారితో
యుద్ధము చేయవద్దు. లోతు సంతానమునకు ఆరు
దేశమును స్వాస్థ్యముగా ఇచ్చితిని, వారి భూమిలో
ఏదియు నీకు స్వాస్థ్యముగా ఇయ్యను.

పూర్వకాలమున ఏమీయులనువారు ఆరు దేశ 10
ములో నివసించిరి. వారు అనాకీయులవలె ఉన్నత

దేహులు, బలవంతులైన బహు జనులు. వారును అనా
కీయులవలె పరాక్రమశాలులుగా ఎంచబడినవారు. ।
11 మోయాబీయులు వారికి ఏమీయులని పేరు పెట్టిరి. ।
12 పూర్వకాలమున హోరీయులు శేయీరులో నివ
సించిరి. ఇశ్రాయేలీయులు యెహోవా తమకిచ్చిన
స్వాస్థ్యమైన దేశములో చేసినట్లు ఏశావు సంతానపు
వారు హోరీయుల దేశమును స్వాధీనపరచుకొని
తమ యెదుటనుండి వారిని నశింపజేసి వారి దేశములో
13 నివసించిరి. । కాబట్టి — మీరు లేచి జెరెదు ఏరు
దాటుడి అని (యెహోవా సెలవియ్యగా) జెరెదు
14 ఏరు దాటితిమి. । మనము కాదేషు బర్నేయలోనుండి
బయలుదేరి జెరెదు ఏరు దాటువరకు, అనగా
యెహోవా వారినిగూర్చి ప్రమాణము చేసినట్లు సైని
కులైన ఆ మనుష్యుల తరమువారందరు సేనలోనుండ
కుండ నశించువరకు మనము నడిచిన కాలము ముప్పది
యెనిమిది సంవత్సరములు. అంతేకాదు, వారు నశించు
15 వరకు । సేన మధ్యనుండి వారిని సంహరించుటకు
యెహోవా బాహువు వారికి విరోధముగా నుండెను.
16 సైనికులైనవారందరు ప్రజలలోనుండి లయమై
పోయిన తరువాత యెహోవా నాకు ఈలాగు సెల
17 విచ్చెను । — నేడు నీవు మోయాబుకు సరిహద్దుగా
18 నున్న ఆరు దేశము దాటబోవుచున్నావు. । అమ్మో
19 నీయుల మార్గమున వెళ్లునప్పుడు । వారిని బాధింపవద్దు,
వారితో యుద్ధము చేయవద్దు. ఏలయనగా లోతు
సంతానమునకు దానిని స్వాస్థ్యముగా ఇచ్చినందున
అమ్మోనీయుల దేశములో నీకు స్వాస్థ్యము నియ్యను. ।
20 అదియు రెఫాయీయుల దేశమని యెంచబడుచున్నది.
పూర్వమందు రెఫాయీయులు అందులో నివసించిరి.
21 అమ్మోనీయులు వారిని జంజుమ్మీయులందురు. । వారు
అనాకీయులవలె ఉన్నతదేహులు, బలవంతులైన బహు
జనులు. అయితే యెహోవా అమ్మోనీయుల యెదుట
నుండి వారిని వెళ్లగొట్టెను గనుక అమ్మోనీయులు వారి
దేశమును స్వాధీనపరచుకొని వారిచోట నివసించిరి. ।
22 అట్లు ఆయన శేయీరులో నివసించు ఏశావు సంతా
నముకొరకు చేసెను. ఎట్లనగా ఆయన వారి యెదుట
నుండి హోరీయులను నశింపజేసెను గనుక వారు
హోరీయుల దేశమును స్వాధీనపరచుకొని నేటి
23 వరకు వారిచోట నివసించుచున్నారు. । గాజవరకు
గ్రామములలో నివసించిన ఆవీయులను కఫ్తోరు
లోనుండి బయలుదేరి వచ్చిన కఫ్తోరీయులు నశింప
24 జేసి వారిచోట నివసించిరి. । మీరు లేచి సాగి
అర్నోను ఏరు దాటుడి; ఇదిగో అమోరీయుడైన
హెష్బోను రాజగు సీహోనును అతని దేశమును
నీ చేతికి అప్పగించితిని. దాని స్వాధీనపరచుకొన
25 మొదలుపెట్టి అతనితో యుద్ధము చేయుడి. । నేడు
నేను నీవలని భయము నీవలని వెరపు ఆకాశము క్రింద
నున్న సమస్త దేశములవారికిని పుట్టింప మొదలు పెట్టు
చున్నాను. వారు నిన్నుగూర్చిన సమాచారము విని
నీయెదుట వణకి మనోవేదన నొందుదురు.
అప్పుడు నేను కెదేమోతు అరణ్యములోనుండి 26
హెష్బోను రాజైన సీహోనునొద్దకు దూతలను పంపి ।
—నన్ను నీ దేశముగుండ దాటిపోనిమ్ము, కుడియెడమలకు 27
తిరుగక త్రోవనే నడిచిపోవుదును. । నాయొద్ద రూకలు 28
తీసికొని తినుటకు భోజనపదార్థములు నాకిమ్ము; నా
యొద్ద రూకలు తీసికొని త్రాగుటకు నీళ్లిమ్ము. । శేయీ 29
రులో నివసించు ఏశావు సంతానపువారును ఆరులో
నివసించు మోయాబీయులును నాకు చేసినట్లు, మా
దేవుడైన యెహోవా మాకిచ్చుచున్న దేశములో
ప్రవేశించుటకై యొర్దాను దాటువరకు కాలినడక చేతనే
నన్ను వెళ్లనిమ్మని సమాధానపు మాటలు పలికించితిని. ।
అయితే హెష్బోను రాజైన సీహోను మనలను తన 30
దేశమార్గమున వెళ్లనిచ్చుటకు సమ్మతింపలేదు. నేడు
జరిగినట్లు నీ చేతికి అతని నప్పగించుటకు నీ దేవుడైన
యెహోవా అతని మనస్సును కఠినపరచి అతని
హృదయమునకు తెంపు కలుగజేసెను. । అప్పుడు 31
యెహోవా—చూడుము; సీహోనును అతని దేశ
మును నీకు అప్పగింప మొదలుపెట్టియున్నాను. అతని
దేశము నీదగునట్లు నీవు దాని స్వాధీనపరచుకొన
మొదలుపెట్టుమని నాతో చెప్పెను. । సీహోనును 32
అతని సమస్త జనమును యాహసులో యుద్ధము
చేయుటకై మనకు ఎదురుగా బయలుదేరి రాగా ।
మన దేవుడైన యెహోవా అతనిని మనకు అప్ప 33
గించెను గనుక మనము అతనిని అతని కుమారులను
అతని సమస్త జనమును హతముచేసి । ఆ కాలమున 34
అతని సమస్త పురములను పట్టుకొని, ప్రతి పురమును
అందలి స్త్రీ పురుషులను పిల్లలను నిశ్శేషముగా నాశము
చేసితిమి. । పశువులను మనము పట్టుకొనిన పురముల 35
సొమ్మును దోపిడిగా దోచుకొంటిమి. । అర్నోను ఏటి 36
లోయ దరినున్న అరోయేరును ఆ యేటియొద్దనున్న
పురము మొదలుకొని గిలాదువరకు మనకు అసాధ్య
మైన నగరమొకటియు లేక పోయెను. మన దేవుడైన
యెహోవా అన్నిటిని మనకు అప్పగించెను. । అయితే 37
అమ్మోనీయుల దేశమునకైనను యబ్బోకు ఏటిలో
యలోని యే ప్రాంతమునకైనను ఆ మన్నెములోని
పురములకైనను మన దేవుడైన యెహోవా పోకూడ
దని చెప్పిన మరి ఏ స్థలమునకైనను నీవు సమీపింప
లేదు.

మనము ఒక ప్రక్కను తిరిగి బాషాను మార్గ 3
ముగా వెళ్లినప్పుడు బాషాను రాజైన ఓగును అతని
ప్రజలందరును ఎద్రెయిలో మనతో యుద్ధము చేయు
టకు బయలుదేరి యెదురుగా రాగా । యెహోవా 2
నాతో ఇట్లనెను — అతనికి భయపడకుము, అతనిని

ఎక్కడికి మిమ్మును తోలివేయునో అక్కడి జనము
3 లలో మీరు కొద్దిమందే మిగిలియుందురు. ।అక్కడ
మీరు మనుష్యుల చేతిపనియైన కఱ్ఱ రాతి దేవత
లను పూజించెదరు. అవి చూడవు, వినవు, తినవు,
9 వాసనచూడవు. ।అయితే అక్కడనుండి నీ దేవుడైన
యెహోవాను మీరు వెదకినయెడల, నీ పూర్ణహృద
యముతోను నీ పూర్ణాత్మతోను వెదకునప్పుడు ఆయన
0 నీకు ప్రత్యక్షమగును. ।ఈ సంగతులన్నియు నీకు సంభ
వించిన తరువాత నీకు బాధ కలుగునప్పుడు అంత్యదినము
లలో నీవు నీ దేవుడైన యెహోవావైపు తిరిగి ఆయన
1 మాట వినినపక్షమందు ।నీ దేవుడైన యెహోవా
కనికరముగల దేవుడు గనుక నిన్ను చెయ్యి విడు
వడు; నిన్ను నాశనముచేయడు; తాను నీ పితరులతో
2 ప్రమాణముచేసిన నిబంధనను మరచిపోడు. ।దేవుడు
భూమిమీద నరుని సృజించిన దినము మొదలుకొని
నీకంటె ముందుగానుండిన మునుపటి దినములలో
ఆకాశముయొక్క యీ దిక్కునుండి ఆకాశము
యొక్క ఆ దిక్కువరకు ఇట్టి గొప్ప కార్యము జరి
గెనా? దీనివంటి వార్త వినబడెనా? అని నీవు అడు
33 గుము. ।నీవు దేవుని స్వరము అగ్ని మధ్యనుండి మాట
లాడుట వినినట్లు మరి ఏ జనమైనను విని బ్రదికెనా? ।
34 మీ దేవుడైన యెహోవా ఐగుప్తులో మీ కన్నుల
యెదుట చేసినవాటన్నిటిచొప్పున ఏ దేవుడైనను
శోధనలతోను సూచకక్రియలతోను మహత్కార్య
ములతోను యుద్ధముతోను బాహుబలముతోను చా
చిన చేతితోను మహా భయంకరకార్యములతోను
ఎప్పుడైనను వచ్చి ఒక జనములోనుండి తనకొరకు
35 ఒక జనమును తీసికొన యత్నముచేసెనా? ।అయితే
యెహోవా దేవుడనియు, ఆయన తప్ప మరియొకడు
లేడనియు నీవు తెలిసికొనునట్లు అది నీకు చూప
36 బడెను. ।నీకు బోధించుటకు ఆయన ఆకాశమునుండి
తన స్వరమును నీకు వినిపించెను; భూమిమీద తన
గొప్ప అగ్నిని నీకు చూపినప్పుడు ఆ అగ్ని మధ్య
37 నుండి ఆయన మాటలను నీవు వింటివి. ।ఆయన
నీ పితరులను ప్రేమించెను గనుక వారి తరువాత వారి
38 సంతానమును ఏర్పరచుకొనెను. ।నీకంటె బలమైన
గొప్ప జనములను నీ ముందరనుండి వెళ్లగొట్టి నిన్ను
ప్రవేశపెట్టి ఆయన నేడు చేయుచున్నట్లు వారి దేశ
మును నీకు స్వాస్థ్యముగా ఇచ్చుటకై నీకు తోడుగా
నుండి ఐగుప్తులోనుండి తన మహాబలముచేత నిన్ను
9 వెలుపలికి రప్పించెను. ।కాబట్టి పైనున్న ఆకాశమం
దును క్రిందనున్న భూమియందును యెహోవాయే
దేవుడనియు, మరియొక దేవుడు లేడనియు నేడు నీవు
) ఎరిగి జ్ఞాపకమునకు తెచ్చుకొనుము. ।మరియు నీకును
నీ తరువాత నీ సంతానపువారికిని క్షేమము కలుగు
టకై నీ దేవుడైన యెహోవా సర్వకాలము నీకిచ్చు

చున్న దేశములో నీవు దీర్ఘాయుష్మంతుడవగునట్లు
నేడు నేను నీకాజ్ఞాపించు ఆయన కట్టడలను ఆజ్ఞలను
నీవు గైకొనవలెను.

అంతకుముందొకడు పగపట్టక పరాకున తన పొ 41
రుగువాని చంపినయెడల ।చంపినవాడు పారిపోవుటకు 42
మోషే తూర్పుదిక్కున, యొర్దాను ఇద్దరిని మూడు
పురములను వేరుపరచెను. అట్టివాడెవడైనను ఆ పుర
ములలో నేనిలోకినైనను పారిపోయి బ్రదుకును. ।
అవేవనగా రూబేనీయులకు మైదానపు దేశారణ్యమం 43
దలి బేసెరును, గాదీయులకు గిలాదులోనున్న రామో
తును, మనష్షీయులకు బాషానులోనున్న గోలాను
అనునవే.

మోషే ఇశ్రాయేలీయులకిచ్చిన ధర్మశాస్త్రము ఇది. ।44
ఇశ్రాయేలీయులు ఐగుప్తులోనుండి వెలుపలికి వచ్చు 45
చుండగా ।యొర్దాను ఇద్దరిని బేత్పయోరు ఎదుటి 46
లోయలో హెష్బోనులో నివసించిన అమోరీయుల
రాజైన సీహోను దేశమందు ।మోషే ఇశ్రాయేలీ 47
యులకు నియమించిన శాసనములు కట్టడలు న్యాయ
విధులు ఇవి. ।మోషేయు ఇశ్రాయేలీయులును ఐగు 48
ప్తులోనుండి వచ్చుచు ఆ సీహోనును హతముచేసి
అతని దేశమును, యొర్దాను ఇద్దరిని ఉదయదిక్కున
నున్న బాషాను రాజైన ఓగుయొక్క దేశమును,
అర్నోను ఏటి దరినున్న అరోయేరు మొదలుకొని
హెర్మోనను సీయోను కొండవరకున్న అమోరీయుల
యిద్దరు రాజులదేశమును, ।పిస్గా చరియలకు దిగువగా 49
అరాబా సముద్రమువరకు తూర్పుదిక్కున యొర్దాను
ఇద్దరి అరాబా ప్రదేశమంతయు స్వాధీనపరచుకొనిరి.

మోషే ఇశ్రాయేలీయులనందరిని పిలిపించి యిట్లు **5**
నెను—ఇశ్రాయేలీయులారా, నేను మీ వినికిడిలో
నేడు చెప్పుచున్న కట్టడలను విధులను విని వాటిని
నేర్చుకొని వాటి ననుసరించి నడువుడి. ।మన దేవు 2
డైన యెహోవా హోరేబులో మనతో నిబంధన
చేసెను. ।యెహోవా మన పితరులతో కాదు, 3
నేడు ఇక్కడ సజీవులమైయున్న మనతోనే యీ
నిబంధన చేసెను. ।యెహోవా ఆ కొండమీద అగ్ని 4
మధ్యనుండి ముఖాముఖిగా మీతో మాటలాడగా
మీరు ఆ అగ్నికి భయపడి ఆ కొండ యెక్కలేదు ।
గనుక యెహోవామాట మీకు తెలియజేయుటకు 5
నేను యెహోవాకును మీకును మధ్యను నిలిచియుం
డగా యెహోవా ఈలాగున సెలవిచ్చెను.

—దాసుల గృహమైన ఐగుప్తుదేశములోనుండి 6
నిన్ను రప్పించిన నీ దేవుడనైన యెహోవాను నేనే.

నేను తప్ప వేరొక దేవుడు నీకుండకూడదు. 7

పైనున్న ఆకాశమందే గాని క్రిందనున్న భూమి 8
యందే గాని భూమి క్రిందనున్న నీళ్లయందే గాని
యుండు ఏ స్వరూపము గలిగిన విగ్రహమునైనను

దేహులు, బలవంతులైన బహు జనులు. వారును అనా
కీయులవలె పరాక్రమశాలులుగా ఎంచబడినవారు. ।
11 మోయాబీయులు వారికి ఏమీయులని పేరు పెట్టిరి. ।
12 పూర్వకాలమున హోరీయులు శేయీరులో నివ
సించిరి. ఇశ్రాయేలీయులు యెహోవా తమకిచ్చిన
స్వాస్థ్యమైన దేశములో చేసినట్లు ఏశావు సంతానపు
వారు హోరీయుల దేశమును స్వాధీనపరచుకొని
తమ యెదుటనుండి వారిని నశింపజేసి వారి దేశములో
13 నివసించిరి. । కాబట్టి — మీరు లేచి జెరెదు ఏరు
దాటుడి అని (యెహోవా సెలవియ్యగా) జెరెదు
14 ఏరు దాటితిమి. । మనము కాదేషు బర్నేయలోనుండి
బయలుదేరి జెరెదు ఏరు దాటువరకు, అనగా
యెహోవా వారినిగూర్చి ప్రమాణము చేసినట్లు సైని
కులైన ఆ మనుష్యుల తరమువారందరు సేనలోనుండ
కుండ నశించువరకు మనము నడిచిన కాలము ముప్పది
యెనిమిది సంవత్సరములు. అంతేకాదు, వారు నశించు
15 వరకు । సేన మధ్యనుండి వారిని సంహరించుటకు
యెహోవా బాహువు వారికి విరోధముగా నుండెను.
16 సైనికులైనవారందరు ప్రజలలోనుండి లయమై
పోయిన తరువాత యెహోవా నాకు ఈలాగు సెల
17 విచ్చెను । — నేడు నీవు మోయాబుకు సరిహద్దుగా
18 నున్న ఆరు దేశము దాటబోవుచున్నావు. । అమ్మో
19 నీయుల మార్గమున వెళ్లునప్పుడు । వారిని బాధింపవద్దు,
వారితో యుద్ధము చేయవద్దు. ఏలయనగా లోతు
సంతానమునకు దానిని స్వాస్థ్యముగా ఇచ్చినందున
అమ్మోనీయుల దేశములో నీకు స్వాస్థ్యము నియ్యను. ।
20 అదియు రెఫాయీయుల దేశమని యెంచబడుచున్నది.
పూర్వమందు రెఫాయీయులు అందులో నివసించిరి.
21 అమ్మోనీయులు వారిని జంజుమ్మీయులందురు. । వారు
అనాకీయులవలె ఉన్నతదేహులు, బలవంతులైన బహు
జనులు. అయితే యెహోవా అమ్మోనీయుల యెదుట
నుండి వారిని వెళ్లగొట్టెను గనుక అమ్మోనీయులు వారి
దేశమును స్వాధీనపరచుకొని వారిచోట నివసించిరి. ।
22 అట్లు ఆయన శేయీరులో నివసించు ఏశావు సంతా
నముకొరకు చేసెను. ఎట్లనగా ఆయన వారి యెదుట
నుండి హోరీయులను నశింపజేసెను గనుక వారు
హోరీయుల దేశమును స్వాధీనపరచుకొని నేటి
23 వరకు వారిచోట నివసించుచున్నారు. । గాజావరకు
గ్రామములలో నివసించిన ఆవీయులను కఫ్తోరు
లోనుండి బయలుదేరి వచ్చిన కఫ్తోరీయులు నశింప
24 జేసి వారిచోట నివసించిరి. । మీరు లేచి సాగి
అర్నోను ఏరు దాటుడి; ఇదిగో అమోరీయుడైన
హెష్బోను రాజగు సీహోనును అతని దేశమును
నీ చేతికి అప్పగించితిని. దాని స్వాధీనపరచుకొన
25 మొదలుపెట్టి అతనితో యుద్ధము చేయుడి. । నేడు
నేను నీవలని భయము నీవలని వెరపు ఆకాశము క్రింద
నున్న సమస్త దేశములవారికిని పుట్టింప మొదలు పెట్టు
చున్నాను. వారు నిన్నుగూర్చిన సమాచారము విని
నీయెదుట వణకి మనోవేదన నొందుదురు.
అప్పుడు నేను కెదేమోతు అరణ్యములోనుండి 26
హెష్బోను రాజైన సీహోనునొద్దకు దూతలను పంపి ।
— నన్ను నీ దేశముగుండ దాటిపోనిమ్ము, కుడియెడమలకు 27
తిరుగక త్రోవనే నడిచిపోవుదును. । నాయొద్ద రూకలు 28
తీసికొని తినుటకు భోజనపదార్థములు నాకిమ్ము; నా
యొద్ద రూకలు తీసికొని త్రాగుటకు నీళ్లిమ్ము. । శేయీ 29
రులో నివసించు ఏశావు సంతానపువారును ఆరులో
నివసించు మోయాబీయులును నాకు చేసినట్లు, మా
దేవుడైన యెహోవా మాకిచ్చుచున్న దేశములో
ప్రవేశించుటకై యొర్దాను దాటువరకు కాలినడకచేత నే
నన్ను వెళ్లనిమ్మని సమాధానపు మాటలు పలికించితిని. ।
అయితే హెష్బోను రాజైన సీహోను మనలను తన 30
దేశమార్గమున వెళ్లనిచ్చుటకు సమ్మతింపలేదు. నేడు
జరిగినట్లు నీ చేతికి అతని నప్పగించుటకు నీ దేవుడైన
యెహోవా అతని మనస్సును కఠినపరచి అతని
హృదయమునకు తెంపు కలుగజేసెను. । అప్పుడు 31
యెహోవా — చూడుము; సీహోనును అతని దేశ
మును నీకు అప్పగింప మొదలుపెట్టియున్నాను. అతని
దేశము నీదగునట్లు నీవు దాని స్వాధీనపరచుకొన
మొదలుపెట్టుమని నాతో చెప్పెను. । సీహోనును 32
అతని సమస్త జనమును యాహసులో యుద్ధము
చేయుటకై మనకు ఎదురుగా బయలుదేరి రాగా ।
మన దేవుడైన యెహోవా అతనిని మనకు అప్ప 33
గించెను గనుక మనము అతనిని అతని కుమారులను
అతని సమస్త జనమును హతముచేసి । ఆ కాలమున 34
అతని సమస్త పురములను పట్టుకొని, ప్రతి పురమును
అందలి స్త్రీ పురుషులను పిల్లలను నిశ్శేషముగా నాశము
చేసితిమి. । పశువులను మనము పట్టుకొనిన పురముల 35
సొమ్మును దోపిడిగా దోచుకొంటిమి. । అర్నోను ఏటి 36
లోయ దరినున్న అరోయేరును ఆ యేటియొద్దనున్న
పురము మొదలుకొని గిలాదువరకు మనకు అసాధ్య
మైన నగరమొకటియు లేక పోయెను. మన దేవుడైన
యెహోవా అన్నిటిని మనకు అప్పగించెను. । అయితే 37
అమ్మోనీయుల దేశమునకైనను యబ్బోకు ఏటిలో
యలోని యే ప్రాంతమునకైనను ఆ మన్నెములోని
పురములకైనను మన దేవుడైన యెహోవా పోకూడ
దని చెప్పిన మరి ఏ స్థలమునకైనను నీవు సమీపింప
లేదు.

మనము ఒక ప్రక్కను తిరిగి బాషాను మార్గ 3
ముగా వెళ్లినప్పుడు బాషాను రాజైన ఓగును అతని
ప్రజలందరును ఎద్రెయిలో మనతో యుద్ధము చేయు
టకు బయలుదేరి యెదురుగా రాగా । యెహోవా 2
నాతో ఇట్లనెను — అతనికి భయపడకుము, అతనిని

అతని సమస్త జనమును అతని దేశమును నీ చేతికి
అప్పగించియున్నాను. హెష్బోనులో నివసించిన
అమోరీయుల రాజైన సీహోనుకు చేసినట్లు ఇతని
3 కిని చేయవలెనని చెప్పెను. । అట్లు మన దేవుడైన
యెహోవా బాషాను రాజైన ఓగును అతని సమస్త జన
మును మన చేతికి అప్పగించెను; అతనికి శేషమేమియు
4 లేకుండ అతనిని హతముచేసితిమి. । ఆ కాలమున
అతని పురములన్నిటిని పట్టుకొంటిమి. వారి పురము
లలో మనము పట్టుకొనని పురమొకటియు లేదు.
బాషానులో ఓగు రాజ్యమగు అర్గోబు ప్రదేశమం
తటనున్న అరువది పురములను పట్టుకొంటిమి. ।
5 ఆ పురములన్నియు గొప్ప ప్రాకారములు గవునులు
గడియలునుగల దుర్గములు. అవియుగాక ప్రాకార
6 ములేని పురములనేకములను పట్టుకొంటిమి. । మనము
హెష్బోను రాజైన సీహోనుకు చేసినట్లు వాటిని
నిర్మూలము చేసితిమి; ప్రతి పురములోని స్త్రీ పురుషు
7 లను పిల్లలను నిర్మూలము చేసితిమి; । వారి పశువుల
నన్నిటిని ఆ పురముల సొమ్మును దోపిడిగా తీసికొం
8 టిమి. । ఆ కాలమున అర్నోను ఏరు మొదలుకొని
హెర్మోను కొండవరకు యొర్దాను ఇద్దరినున్న దేశ
మును అమోరీయుల యిద్దరు రాజులయొద్దనుండి పట్టు
9 కొంటిమి. । సీదోనీయులు హెర్మోనును షిర్యోనని
అందురు. అమోరీయులు దానిని శెనీరని అందురు. ।
0 మైదానమందలి పురములన్నిటిని బాషానునందలి ఓగు
రాజ్యపురములైన సల్కా ఎద్రెయి అనువాటివరకు
1 గిలాదంతటిని బాషానును పట్టుకొంటిమి. । రెఫాయీ
యులలో బాషాను రాజైన ఓగు మాత్రము మిగిలెను.
అతని మంచము ఇనుపమంచము. అది అమ్మోనీయుల
రబ్బాలోనున్నది గదా! దాని పొడుగు మనుష్యుని
మూరతో తొమ్మిది మూరలు దాని వెడల్పు నాలుగు
2 మూరలు. । అర్నోను లోయలోనున్న అరోయేరు
మొదలుకొని గిలాదు మన్నెములో సగమును, మనము
అప్పుడు స్వాధీనపరచుకొనిన దేశమును, దాని పుర
ములను రూబేనీయులకును గాదీయులకును ఇచ్చితిని.।
3 ఓగురాజు దేశమైన బాషాను యావత్తును గిలాదులో
మిగిలినదానిని, అనగా రెఫాయీయుల దేశమనబడిన
బాషాను అంతటిని అర్గోబు ప్రదేశమంతటిని మనష్షే
4 అర్ధగోత్రమున కిచ్చితిని. । మనష్షే కుమారుడైన యా
యీరు గెషూరీయులయొక్కయు మాయకాతీయు
యొక్కయు సరిహద్దులవరకు అర్గోబు ప్రదేశమంత
టిని పట్టుకొని, తన పేరునుబట్టి వాటికి యాయీరు
బాషాను గ్రామములని పేరు పెట్టెను. నేటివరకు ఆ
పేర్లు వాటికున్నవి. । మాకీరీయులకు గిలాదు నిచ్చి
తిని. । గిలాదుమొదలుకొని అర్నోనులోయ మధ్య
వరకును, యబ్బోకు నదివరకును అమ్మోనీయుల పడ
మటి సరిహద్దువరకును । కిన్నెరెతు మొదలుకొని
తూర్పుదిక్కున పిస్గాకొండ చరియల దిగువగా, ఉప్పు
సముద్రము అనబడిన అరాబా సముద్రమువరకును
వ్యాపించియున్న అరాబా ప్రదేశమును, యొర్దాను
లోయ మధ్యభూమిని రూబేనీయులకును గాదీయు
లకును ఇచ్చితిని.

ఆ కాలమందు నేను మిమ్మును చూచి — మీరు 18
స్వాధీనపరచుకొనునట్లు మీ దేవుడైన యెహోవా
ఈ దేశమును మీకిచ్చెను. మీలో పరాక్రమవంతు
లందరు యుద్ధసన్నద్ధులై మీ సహోదరులగు ఇశ్రా
యేలీయుల ముందర నది దాటవలెను. । అయితే 19
యెహోవా మీకు విశ్రాంతి నిచ్చినట్లు మీ సహో
దరులకును విశ్రాంతినిచ్చువరకు, । అనగా మీ దేవు 20
డైన యెహోవా యొర్దాను అద్దరిని వారికిచ్చుచున్న
దేశమును వారును స్వాధీనపరచుకొనువరకు, మీ
భార్యలును మీ పిల్లలును మీ మందలును నేను మీ
కిచ్చిన పురములలో నివసింపవలెను. తరువాత మీలో
ప్రతివాడును నేను మీకిచ్చిన తన తన స్వాస్థ్యమునకు
తిరిగి రావలెనని మీకు ఆజ్ఞాపించితిని. మీ మందలు
విస్తారములని నాకు తెలియును. । ఆ కాలమున 21
నేను యెహోషువతో ఇట్లంటిని — మీ దేవుడైన
యెహోవా ఈ యిద్దరు రాజులకు చేసినదంతయు నీవు
కన్నులార చూచితివి గదా. నీవు వెళ్లుచున్న రాజ్యముల
నన్నిటికిని యెహోవా ఆలాగుననే చేయును. । మీ 22
దేవుడైన యెహోవా మీ పక్షముగా యుద్ధముచేయు
వాడు గనుక వారికి భయపడవద్దని ఆజ్ఞాపించితిని.

మరియు ఆ కాలమున నేను — యెహోవా 23
ప్రభువా, నీ మహిమను నీ బాహుబలమును నీ దాసు
నికి కనుపరచ మొదలుపెట్టి యున్నావు. । ఆకాశ 24
మందే గాని భూమియందే గాని నీవు చేయు క్రియ
లను చేయగల దేవుడెవడు? నీవు చూపు పరాక్రమ
మును చూపగల దేవుడెవడు? । నేను అద్దరికి వెళ్లి 25
యొర్దాను అద్దరినున్న యీ మంచి దేశమును మంచి
మన్నెమును ఆ లెబానోనును చూచునట్లు దయ
చేయుమని నేను యెహోవాను బతిమాలుకొనగా ।
యెహోవా మీ మూలముగా నామీద కోపపడి 26
నా మనవి వినకపోయెను. మరియు యెహోవా
నాతో ఇట్లనెను — చాలును; ఇకను ఈ సంగతిని
గూర్చి నాతో మాటలాడవద్దు. । నీవు ఈ యొర్దా 27
నును దాటకూడదు గాని నీవు పిస్గాకొండయెక్కి
కన్నులెత్తి పడమటివైపును ఉత్తరవైపును దక్షిణవైపును
తూర్పువైపును తేరి చూడుము. । యెహోషువకు 28
ఆజ్ఞయిచ్చి అతని ధైర్యపరచి దృఢపరచుము. అతడు
ఈ ప్రజలను వెంటబెట్టుకొని నదిదాటి నీవు చూడ
బోవు దేశమును వారిని స్వాధీనపరచుకొనచేయును. ।
అప్పుడు మనము బెత్పయోరు ఎదుటనున్న లోయలో 29
దిగియుంటిమి.

4 కాబట్టి ఇశ్రాయేలీయులారా, మీరు బ్రదికి మీ
పితరుల దేవుడైన యెహోవా మీకిచ్చుచున్న దేశ
ములోకి పోయి స్వాధీనపరచుకొనునట్లు, మీరు అను
సరింపవలసిన విధులను కట్టడలను నేను మీకు బోధిం
2 చుచున్నాను వినుడి. । మీ దేవుడైన యెహోవా
ఇచ్చిన ఆజ్ఞలను మీకాజ్ఞాపించుచున్నాను. వాటిని
గైకొనుటయందు నేను మీకాజ్ఞాపించిన మాటతో
దేనిని కలుపకూడదు, దానిలోనుండి దేనిని తీసివేయ
3 కూడదు. । బయల్పెయోరు విషయములో యెహోవా
చేసినదానిని మీరు కన్నులార చూచితిరి గదా.
బయల్పెయోరు వెంట వెళ్లిన ప్రతి మనుష్యుని నీ దేవు
డైన యెహోవా నీ మధ్యను ఉండకుండ నాశనము
4 చేసెను. । మీ దేవుడైన యెహోవాను హత్తుకొనిన
5 మీరందరును నేటివరకు సజీవులై యున్నారు. । నా
దేవుడైన యెహోవా నాకాజ్ఞాపించినట్లు మీరు
స్వాధీనపరచుకొనబోవు దేశమున మీరాచరింపవల
6 సిన కట్టడలను విధులను మీకు నేర్పితిని. । ఈ కట్టడ
లన్నిటిని మీరు గైకొని అనుసరింపవలెను. వాటిని
గూర్చి విను జనముల దృష్టికి అదే మీకు జ్ఞానము,
అదే మీకు వివేకము. వారు చూచి—నిశ్చయముగా
ఈ గొప్ప జనము జ్ఞానవివేచనలుగల జనమని చెప్పు
7 కొందురు. । ఏలయనగా మనము ఆయనకు మొఱ్ఱ
పెట్టునప్పుడెల్ల మన దేవుడైన యెహోవా మనకు
సమీపముగానున్నట్టు మరి ఏ గొప్ప జనమునకు ఏ
8 దేవుడు సమీపముగా నున్నాడు? । మరియు నేడు
నేను మీకు అప్పగించుచున్న యీ ధర్మశాస్త్రమంతటి
లోనున్న కట్టడలును నీతివిధులునుగల గొప్ప జన
9 మేది? । అయితే నీవు జాగ్రత్తపడుము; నీవు కన్ను
లార చూచినవాటిని మరువకయుండునట్లును, అవి నీ
జీవితకాలమంతయు నీ హృదయములోనుండి తొలగి
పోకుండునట్లును, నీ మనస్సును బహు జాగ్రత్తగా
కాపాడుకొనుము. నీ కుమారులకును నీ కుమారుల
10 కుమారులకును వాటిని నేర్పి । నీవు హోరేబులో నీ
దేవుడైన యెహోవా సన్నిధిని నిలిచియుండగా
యెహోవా — నాయొద్దకు ప్రజలను కూర్చుము;
వారు ఆ దేశముమీద బ్రదుకు దినములన్నియు నాకు
భయపడ నేర్చుకొని, తమ పిల్లలకు నేర్పునట్లు వారికి
నా మాటలను వినిపించెదనని ఆయన నాతో చెప్పిన
11 దినమునుగూర్చి వారికి తెలుపుము. । అప్పుడు మీరు
సమీపించి ఆ కొండ దిగువను నిలిచితిరి. చీకటియు
మేఘమును గాఢాంధకారమును కమ్మి ఆ కొండ ఆకా
12 శమువరకు అగ్నితో మండుచుండగా । యెహోవా
ఆ అగ్ని మధ్యనుండి మీతో మాటలాడెను. మాటల
ధ్వని మీరు వింటిరి గాని యే స్వరూపమును మీరు
13 చూడలేదు, స్వరముమాత్రమే వింటిరి. । మరియు
మీరు చేయవలెనని ఆయన విధించిన నిబంధనను,
అనగా పది ఆజ్ఞలను మీకు తెలియజేసి రెండు రాతి
పలకలమీద వాటిని వ్రాసెను. । అప్పుడు మీరు నది 14
దాటి స్వాధీనపరచుకొనబోవు దేశములో మీరు అను
సరింపవలసిన కట్టడలను విధులను మీకు నేర్పవలెనని
యెహోవా నాకాజ్ఞాపించెను. । హోరేబులో 15
యెహోవా అగ్నిజ్వాలల మధ్యనుండి మీతో మాట
లాడిన దినమున మీరు ఏ స్వరూపమును చూడలేదు.।
కావున మీరు చెడిపోయి భూమిమీదనున్న యే 16
జంతువు ప్రతిమనైనను । ఆకాశమందు ఎగురు రెక్క 17
లుగల యే పక్షి ప్రతిమనైనను । నేలమీద ప్రాకు 18
ఏ పురుగు ప్రతిమనైనను భూమి క్రిందనున్న నీళ్ల
యందలి యే చేప ప్రతిమనైనను ఆడు ప్రతిమనుగాని
మగ ప్రతిమనుగాని, యే స్వరూపముగలిగిన విగ్రహ
మును మీకు చేసికొనకుండునట్లును, ఆకాశమువైపు
కన్నులెత్తి । సూర్య చంద్ర నక్షత్రములైన ఆకాశ 19
సైన్యమును చూచి మరలుకొల్పబడి, నీ దేవుడైన
యెహోవా సర్వాకాశము క్రిందనున్న సమస్త
ప్రజలకొరకు పంచిపెట్టినవాటికి నమస్కరించి వాటిని
పూజింపకుండునట్లును మీరు బహు జాగ్రత్తపడుడి. ।
యెహోవా మిమ్మును చేపట్టి నేడున్నట్లు మీరు 20
తనకు స్వకీయజనముగా నుండుటకై, యినుపకొలిమి
వంటి ఐగుప్తులోనుండి మిమ్మును రప్పించెను. । మరియు 21
యెహోవా మీ మాటలనుబట్టి నామీద కోపపడి
నేను ఈ యొర్దాను దాటకూడదనియు, నీ దేవుడైన
యెహోవా స్వాస్థ్యముగా నీకిచ్చుచున్న యీ
మంచి దేశములో ప్రవేశింపకూడదనియు ప్రమా
ణము చేసెను. । కావున నేను ఈ యొర్దాను దాట 22
కుండ ఈ దేశమున నే చనిపోదును; మీరు దాటి ఆ
మంచి దేశమును స్వాధీనపరచుకొనెదరు. । మీ 23
దేవుడైన యెహోవా మీకు ఏర్పరచిన నిబంధనను
మరచి, నీ దేవుడైన యెహోవా నీకాజ్ఞాపించినట్లు
ఏ స్వరూపము కలిగిన విగ్రహమునైనను చేసికొన
కుండునట్లు మీరు జాగ్రత్తపడవలెను. । ఏలయనగా 24
నీ దేవుడైన యెహోవా దహించు అగ్నియు రోష
ముగల దేవుడునై యున్నాడు.

మీరు పిల్లలను పిల్లల పిల్లలను కని ఆ దేశమందు 25
బహుకాలము నివసించిన తరువాత మిమ్మును మీరు
పాడుచేసికొని, యే స్వరూపము కలిగిన విగ్రహము
నైనను చేసి నీ దేవుడైన యెహోవాకు కోపము
పుట్టించి ఆయన కన్నులయెదుట కీడుచేసినయెడల ।
మీరు ఈ యొర్దాను దాటి స్వాధీనపరచుకొనబోవు 26
దేశములో ఉండకుండ త్వరలోనే బొత్తిగా నశించి
పోదురని భూమ్యాకాశములను మీమీద సాక్షులగా
ఉంచుచున్నాను. ఆ దేశమందు బహు దినములుండక
మీరు బొత్తిగా నశించిపోదురు. । మరియు యెహోవా 27
జనములలో మిమ్మును చెదరగొట్టును; యెహోవా

ఎక్కడికి మిమ్మును తోలివేయునో అక్కడి జనము
28 లలో మీరు కొద్దిమందే మిగిలియుందురు. । అక్కడ
మీరు మనుష్యుల చేతిపనియైన కఱ్ఱ రాతి దేవత
లను పూజించెదరు. అవి చూడవు, వినవు, తినవు,
29 వాసనచూడవు. । అయితే అక్కడనుండి నీ దేవుడైన
యెహోవాను మీరు వెదకినయెడల, నీ పూర్ణహృద
యముతోను నీ పూర్ణాత్మతోను వెదకునప్పుడు ఆయన
30 నీకు ప్రత్యక్షమగును. । ఈ సంగతులన్నియు నీకు సంభ
వించిన తరువాత నీకు బాధ కలుగునప్పుడు అంత్యదినము
లలో నీవు నీ దేవుడైన యెహోవావైపు తిరిగి ఆయన
31 మాట వినినపక్షమందు । నీ దేవుడైన యెహోవా
కనికరముగల దేవుడు గనుక నిన్ను చెయ్యి విడు
వడు; నిన్ను నాశనముచేయడు; తాను నీ పితరులతో
32 ప్రమాణముచేసిన నిబంధనను మరచిపోడు. । దేవుడు
భూమిమీద నరుని సృజించిన దినము మొదలుకొని
నీకంటె ముందుగానుండిన మునుపటి దినములలో
ఆకాశముయొక్క యీ దిక్కునుండి ఆకాశము
యొక్క ఆ దిక్కువరకు ఇట్టి గొప్ప కార్యము జరి
గెనా? దీనివంటి వార్త వినబడెనా? అని నీవు అడు
33 గుము. । నీవు దేవుని స్వరము అగ్ని మధ్యనుండి మాట
లాడుట వినినట్లు మరి ఏ జనమైనను విని బ్రదికెనా? ।
34 మీ దేవుడైన యెహోవా ఐగుప్తులో మీ కన్నుల
యెదుట చేసినవాటన్నిటిచొప్పున ఏ దేవుడైనను
శోధనలతోను సూచకక్రియలతోను మహత్కార్య
ములతోను యుద్ధముతోను బాహుబలముతోను చా
చిన చేతితోను మహా భయంకరకార్యములతోను
ఎప్పుడైనను వచ్చి ఒక జనములోనుండి తనకొరకు
35 ఒక జనమును తీసికొన యత్నముచేసెనా? । అయితే
యెహోవానే దేవుడనియు, ఆయన తప్ప మరియొకడు
లేడనియు నీవు తెలిసికొనునట్లు అది నీకు చూప
36 బడెను. । నీకు బోధించుటకు ఆయన ఆకాశమునుండి
తన స్వరమును నీకు వినిపించెను; భూమిమీద తన
గొప్ప అగ్నిని నీకు చూపినప్పుడు ఆ అగ్ని మధ్య
37 నుండి ఆయన మాటలను నీవు వింటివి. । ఆయన
నీ పితరులను ప్రేమించెను గనుక వారి తరువాత వారి
38 సంతానమును ఏర్పరచుకొనెను. । నీకంటె బలమైన
గొప్ప జనములను నీ ముందరనుండి వెళ్లగొట్టి నిన్ను
ప్రవేశపెట్టి ఆయన నేడు చేయుచున్నట్లు వారి దేశ
మును నీకు స్వాస్థ్యముగా ఇచ్చుటకై నీకు తోడుగా
నుండి ఐగుప్తులోనుండి తన మహాబలముచేత నిన్ను
39 వెలుపలికి రప్పించెను. । కాబట్టి పైనున్న ఆకాశమం
దును క్రిందనున్న భూమియందును యెహోవాయే
దేవుడనియు, మరియొక దేవుడు లేడనియు నేడు నీవు
40 ఎరిగి జ్ఞాపకమునకు తెచ్చుకొనుము. । మరియు నీకును
నీ తరువాత నీ సంతానపువారికిని క్షేమము కలుగు
టకై నీ దేవుడైన యెహోవా సర్వకాలము నీకిచ్చు
చున్న దేశములో నీవు దీర్ఘాయుష్మంతుడవగునట్లు
నేడు నేను నీకాజ్ఞాపించు ఆయన కట్టడలను ఆజ్ఞలను
నీవు గైకొనవలెను.

అంతకుముందొకడు పగపట్టక పొరబడి తన పొ 41
రుగువాని చంపినయెడల । చంపినవాడు పారిపోవుటకు 42
మోషే తూర్పుదిక్కున, యొర్దాను ఇద్దరిని మూడు
పురములను వేరుపరచెను. అట్టివాడెవడైనను ఆ పుర
ములలో నేనిలోకినైనను పారిపోయి బ్రదుకును. ।
అవేవనగా రూబేనీయులకు మైదానపు దేశారణ్యమం 43
దలి బేసెరును, గాదీయులకు గిలాదులోనున్న రామో
తును, మనష్షీయులకు బాషానులోనున్న గోలాను
అనునవే.

మోషే ఇశ్రాయేలీయులకిచ్చిన ధర్మశాస్త్రము ఇది. । 44
ఇశ్రాయేలీయులు ఐగుప్తులోనుండి వెలుపలికి వచ్చి 45
నుండగా । యొర్దాను ఇద్దరిని బేత్పయోరు ఎదుటి 46
లోయలో హెష్బోనులో నివసించిన అమోరీయుల
రాజైన సీహోనను దేశమందు । మోషే ఇశ్రాయేలీ 47
యులకు నియమించిన శాసనములు కట్టడలు న్యాయ
విధులు ఇవి. । మోషేయు ఇశ్రాయేలీయులును ఐగు 48
ప్తులోనుండి వచ్చుచు ఆ సీహోనును హతముచేసి
అతని దేశమును, యొర్దాను ఇద్దరిని ఉదయదిక్కున
నున్న బాషాను రాజైన ఓగుయొక్క దేశమును,
అర్నోను ఏటి దరినున్న అరోయేరు మొదలుకొని
హెర్మోనను సీయోను కొండవరకున్న అమోరీయుల
యిద్దరు రాజులదేశమును, । పిస్గా చరియలకు దిగువగా 49
అరాబా సముద్రమువరకు తూర్పుదిక్కున యొర్దాను
ఇద్దరి అరాబా ప్రదేశమంతయు స్వాధీనపరచుకొనిరి.

మోషే ఇశ్రాయేలీయులనందరిని పిలిపించి యిట్ల **5**
నెను—ఇశ్రాయేలీయులారా, నేను మీ వినికిడిలో
నేడు చెప్పుచున్న కట్టడలను విధులను విని వాటిని
నేర్చుకొని వాటి ననుసరించి నడువుడి. । మన దేవు 2
డైన యెహోవా హోరేబులో మనతో నిబంధన
చేసెను. । యెహోవా మన పితరులతో కాదు, 3
నేడు ఇక్కడ సజీవులమైయున్న మనతోనే యీ
నిబంధన చేసెను. । యెహోవా ఆ కొండమీద అగ్ని 4
మధ్యనుండి ముఖాముఖిగా మీతో మాటలాడగా
మీరు ఆ అగ్నికి భయపడి ఆ కొండ యెక్కలేదు ।
గనుక యెహోవామాట మీకు తెలియజేయుటకు 5
నేను యెహోవాకును మీకును మధ్యను నిలిచియుం
డగా యెహోవా ఈలాగున సెలవిచ్చెను.

—దాసుల గృహమైన ఐగుప్తుదేశములోనుండి 6
నిన్ను రప్పించిన నీ దేవుడనైన యెహోవాను నేనే.
నేను తప్ప వేరొక దేవుడు నీకుండకూడదు. 7
పైనున్న ఆకాశమందే గాని క్రిందనున్న భూమి 8
యందే గాని భూమి క్రిందనున్న నీళ్లయందే గాని
యుండు ఏ స్వరూపము గలిగిన విగ్రహమునైనను

9 చేసికొనకూడదు. । వాటికి నమస్కరింపకూడదు; వా
టిని పూజింపకూడదు. నీ దేవుడనైన యెహోవా
యగు నేను రోషముగల దేవుడను; నన్ను ద్వేషించు
వారి విషయములో మూడు నాలుగు తరముల పర్యం
తము తండ్రుల దోషమును కుమారులమీదికి రప్పిం
10 చుచు । నన్ను ప్రేమించి నా ఆజ్ఞలను గైకొనువారి
విషయములో వేయితరముల పర్యంతము దయ చూ
పుచు నుండువాడనై యున్నాను.
11 నీ దేవుడైన యెహోవా నామమును వ్యర్థముగా
ఉచ్చరింపకూడదు; యెహోవా తన నామమును
వ్యర్థముగా ఉచ్చరింపువానిని నిర్దోషిగా ఎంచడు.
12 నీ దేవుడైన యెహోవా నీకాజ్ఞాపించినట్లు
విశ్రాంతిదినమును పరిశుద్ధ దినముగా ఆచరింపుము. ।
13 ఆరుదినములు నీవు కష్టపడి నీ పని అంతయు చేయ
14 వలెను. । ఏడవ దినము నీ దేవుడైన యెహోవాకు
విశ్రాంతి దినము. అందులో నీవైనను నీ కుమారుడై
నను నీ కుమార్తెయైనను నీ దాసుడైనను నీ దాసియైనను
నీ యెద్దయినను నీ గాడిదెయైనను నీ పశువులలో
ఏదైనను నీ యిండ్లలోనున్న పరదేశియైనను ఏ పనియు
చేయకూడదు. నీవలె నీ దాసుడు నీ దాసియు విశ్ర
15 మింపవలెను. । నీవు ఐగుప్తుదేశమందు దాసుడవైయున్న
ప్పుడు నీ దేవుడైన యెహోవా బాహుబలముచేతను
చాచిన బాహువుచేతను నిన్ను అక్కడనుండి రప్పించె
నని జ్ఞాపకము చేసికొనుము. అందుచేతను విశ్రాంతి
దినము ఆచరింపవలెనని నీ దేవుడైన యెహోవా నీకు
ఆజ్ఞాపించెను.
16 నీ దేవుడైన యెహోవా నీకిచ్చుచున్న దేశములో
నీవు దీర్ఘాయుష్మంతుడవై నీకు క్షేమమగునట్లు నీ దేవు
డైన యెహోవా నీకాజ్ఞాపించినలాగున నీ తండ్రిని
నీ తల్లిని సన్మానింపుము.
17 నరహత్య చేయకూడదు.
18 వ్యభిచరింపకూడదు.
19 దొంగిలకూడదు.
20 నీ పొరుగువానిమీద అబద్ధ సాక్ష్యము పలుక
కూడదు.
21 నీ పొరుగువానిభార్యను ఆశింపకూడదు; నీ పొరుగు
వాని యింటినైనను వాని పొలమునైనను వాని దాసుని
నైనను వాని దాసినినైనను వాని యెద్దునైనను వాని
గాడిదెనైనను నీ పొరుగువానిదగు మరి దేనినైనను
ఆశింపకూడదు.
22 ఈ మాటలను యెహోవా ఆ పర్వతముమీద
అగ్ని మేఘ గాఢాంధకారముల మధ్యనుండి గొప్ప
స్వరముతో మీ సమాజమంతటితో చెప్పి, రెండు
రాతిపలకలమీద వాటిని వ్రాసి నాకిచ్చెను. ఆయన
మరేమియు చెప్పలేదు.
23 మరియు ఆ పర్వతము అగ్నివలన మండుచున్న
ప్పుడు ఆ చీకటిమధ్యనుండి ఆ స్వరమును విని మీరు,
అనగా మీ గోత్రముల ప్రధానులును మీ పెద్దలును
నాయొద్దకు వచ్చి । — మన దేవుడైన యెహోవా
తన ఘనతను మాహాత్మ్యమును మాకు చూపించెను.
అగ్ని మధ్యనుండి ఆయన స్వరమును వింటిమి. దేవుడు
నరులతో మాటలాడినను వారు బ్రదుకుదురని నేడు
తెలిసికొంటిమి. । కాబట్టి మేము చావనేల? ఈ గొప్ప 25
అగ్ని మమ్మును దహించును; మేము మన దేవుడైన
యెహోవా స్వరము ఇక వినినయెడల చనిపోదుము. ।
మావలె సమస్త శరీరులలో మరి ఎవడు సజీవుడైన 26
దేవుని స్వరము అగ్ని మధ్యనుండి పలుకుట విని బ్రది
కెను? । నీవే సమీపించి మన దేవుడైన యెహోవా 27
చెప్పునది యావత్తు వినుము. అప్పుడు మన దేవుడైన
యెహోవా నీతో చెప్పినది యావత్తు నీవే మాతో
చెప్పినయెడల మేము విని దాని గైకొందుమని చెప్పి
తిరి. । మీరు నాతో మాటలాడినప్పుడు యెహోవా 28
మీ మాటలు వినెను. అప్పుడు యెహోవా నాతో
ఈలాగు సెలవిచ్చెను—ఈ జనులు నీతో చెప్పిన మా
టలు నేను వినియున్నాను. వారు చెప్పినదంతయు
మంచిదే. । వారికిని వారి సంతానమునకును నిత్యమును 29
క్షేమము కలుగునట్లు వారు నాయందు భయభక్తులు
కలిగి నా ఆజ్ఞలన్నిటిని అనుసరించు మనస్సు వారికుం
డిన మేలు. । — మీ గుడారములలోకి తిరిగి వెళ్లుడని 30
నీవు వారితో చెప్పుము. । అయితే నీవు ఇక్కడ నా 31
యొద్ద నిలిచియుండుము. నీవు వారికి బోధింపవలసిన
ధర్మమంతటిని, అనగా కట్టడలను విధులను నేను నీతో
చెప్పెదను. । వారు స్వాధీనపరచుకొనునట్లు నేను వారి 32
కిచ్చుచున్న దేశమందు వారు ఆలాగు ప్రవర్తింపవలె
ను. । కాబట్టి మీరు కుడికే గాని యెడమకే గాని 33
తిరుగక మీ దేవుడైన యెహోవా ఆజ్ఞాపించినట్లు
చేయుటకు జాగ్రత్తపడవలెను. మీరు స్వాధీనపరచు
కొనబోవు దేశములో మీరు జీవించుచు మేలుకలిగి
దీర్ఘాయుష్మంతులగునట్లు మీ దేవుడైన యెహోవా
మీకు ఆజ్ఞాపించిన మార్గములన్నిటిలో నడుచుకొన
వలెను.

**నీ**వును నీ కుమారుడును నీ కుమారుని కుమారుడు 6
ను । నీ దేవుడైన యెహోవాకు భయపడి, నేను నీకా 2
జ్ఞాపించు ఆయన కట్టడలన్నియు ఆజ్ఞలన్నియు నీ జీవిత
దినములన్నిటను గైకొనుచు నీవు దీర్ఘాయుష్మంతుడవగు
నట్లు మీరు స్వాధీనపరచుకొనుటకు ఏరు దాటి వెళ్లు
చున్న దేశమందు మీరు జరుపుకొనుటకు మీకు
బోధింపవలెనని మీ దేవుడైన యెహోవా ఆజ్ఞాపించిన
ధర్మమంతయు, అనగా కట్టడలు విధులు ఇవే. । కాబట్టి 3
ఇశ్రాయేలూ, నీ పితరుల దేవుడైన యెహోవా
నీతో చెప్పిన ప్రకారము పాలు తేనెలు ప్రవ
హించుదేశములో మేలు కలిగి బహుగా అభివృద్ధి

నొందునట్లు నీవు వాటిని విని అనుసరించి నడుచుకొన
వలెను.
4 ఇశ్రాయేలూ వినుము. మన దేవుడైన యెహోవా
5 అద్వితీయుడగు యెహోవా. । నీ పూర్ణహృదయము
తోను నీ పూర్ణాత్మతోను నీ పూర్ణశక్తితోను నీ దేవు
6 డైన యెహోవాను ప్రేమింపవలెను. । నేడు నేను
నీకాజ్ఞాపించు ఈ మాటలు నీ హృదయములో ఉండ
7 వలెను. । నీవు నీ కుమారులకు వాటిని అభ్యసింపజేసి,
నీ యింట కూర్చుండునప్పుడును త్రోవను నడుచు
నప్పుడును పండుకొనునప్పుడును లేచునప్పుడును వా
టినిగూర్చి మాటలాడవలెను; సూచనగా వాటిని నీ
8 చేతికి కట్టుకొనవలెను. । అవి నీ కన్నుల నడుమ బాసి
9 కమువలె ఉండవలెను. । నీ యింటి ద్వారబంధముల
మీదను నీ గవునులమీదను వాటిని వ్రాయవలెను.
10 నీ దేవుడైన యెహోవా నీ పితరులైన అబ్రా
హాము ఇస్సాకు యాకోబులతో చేసిన ప్రమాణమును
బట్టి నిన్ను ఆ దేశములో ప్రవేశపెట్టి, నీవు కట్టని
11 గొప్పవగు మంచి పురములను । నీవు నింపని మంచి
ద్రవ్యములచేత నింపబడిన ఇండ్లను, నీవు త్రవ్వకపోయి
నను త్రవ్వబడిన బావులను, నీవు నాటని ద్రాక్ష
తోటలను ఒలీవల తోటలను నీకిచ్చిన తరువాత నీవు
12 తిని తృప్తిపొందినప్పుడు । దాసులగృహమైన ఐగుప్తు
దేశములోనుండి నిన్ను రప్పించిన యెహోవాను
13 మరువకుండ నీవు జాగ్రత్తపడుము. । నీ దేవుడైన
యెహోవాకు భయపడి ఆయనను సేవించి ఆయన
14 పేరట ప్రమాణము చేయవలెను. । మీరు ఇతర దేవత
లను, అనగా మీ చుట్టునున్న జనముల దేవతలను
15 సేవింపకూడదు. । నీ మధ్యను నీ దేవుడైన యెహోవా
రోషముగల దేవుడు గనుక నీ దేవుడైన యెహోవాకు
కోపాగ్ని ఒకవేళ నీమీద రగులుకొని దేశములో
నుండకుండ నిన్ను నశింపజేయును.
16 మీరు మస్సాలో మీ దేవుడైన యెహోవాను
17 శోధించినట్లు ఆయనను శోధింపకూడదు. । మీ దేవు
డైన యెహోవా ఆజ్ఞలను, అనగా ఆయన నీకు
నియమించిన శాసనములను కట్టడలను జాగ్రత్తగా
18 ఆచరింపవలెను. । నీకు మేలు కలుగునట్లును, నీ
యెదుటనుండి నీ సమస్త శత్రువులను వెళ్లగొట్టెదనని ।
19 యెహోవా చెప్పిన ప్రకారము నీ పితరులతో ప్రమా
ణముచేసిన ఆ మంచి దేశములో నీవు ప్రవేశించి దాని
స్వాధీనపరచుకొనునట్లును, నీవు యెహోవా దృష్టికి
యథార్థమైనదియు ఉత్తమమైనదియు చేయవలెను.
20 ఇకమీదట నీ కుమారుడు — మన దేవుడైన
యెహోవా మీకాజ్ఞాపించిన శాసనములు కట్టడలు
21 విధులు ఏవని నిన్ను అడుగునప్పుడు । నీవు నీ కుమా
రునితో ఇట్లనుము — మనము ఐగుప్తులో ఫరోకు
దాసులమైయుండగా యెహోవా బాహుబలముచేత

ఐగుప్తులోనుండి మనలను రప్పించెను. । మరియు 22
యెహోవా ఐగుప్తుమీదను ఫరోమీదను అతని
యింటివారందరిమీదను బాధకరములైన గొప్ప సూచక
క్రియలను అద్భుతములను మన కన్నులయెదుట కను
పరచి, । తాను మన పితరులతో ప్రమాణముచేసిన దేశ 23
మును మనకిచ్చి మనలను దానిలో ప్రవేశపెట్టుటకు
అక్కడనుండి మనలను రప్పించెను. । మనకు నిత్యము 24
మేలు కలుగుటకై యెహోవా నేటివలె మనలను
బ్రదికించునట్లు మన దేవుడైన యెహోవాకు భయ
పడి యీ కట్టడలన్నిటిని గైకొనవలెనని మనకాజ్ఞాపిం
చెను. । మన దేవుడైన యెహోవా మనకాజ్ఞాపించి 25
నట్లు ఆయన సన్నిధిని ఈ సమస్తమైన ఆజ్ఞలను అను
సరించి మనము నడుచుకొనునప్పుడు మనకు నీతి కలు
గును.

నీవు స్వాధీనపరచుకొనబోవు దేశములోకి నీ దేవు **7**
డైన యెహోవా నిన్ను చేర్చి బహు జనములను,
అనగా సంఖ్యకును బలమునకును నిన్ను మించిన హిత్తీ
యులు గిర్గాషీయులు అమోరీయులు కనానీయులు
పెరిజీయులు హివ్వీయులు యెబూసీయులను ఏడు
జనములను నీ యెదుటనుండి వెళ్లగొట్టిన తరువాత ।
నీ దేవుడైన యెహోవా వారిని నీకప్పగించునప్పుడు 2
నీవు వారిని హతముచేయవలెను, వారిని నిర్మూలము
చేయవలెను. వారితో నిబంధన చేసికొనకూడదు,
వారిని కరుణింపకూడదు, । నీవు వారితో వియ్యమంద 3
కూడదు, వాని కుమారునికి నీ కుమార్తె నియ్యకూడదు,
నీ కుమారునికి వాని కుమార్తెను పుచ్చుకొనకూడదు. ।
నన్ను అనుసరింపకుండ ఇతర దేవతలను పూజించు 4
నట్లు నీ కుమారుని వారు మళ్లించుదురు; అందును బట్టి
యెహోవా కోపాగ్ని నీమీద రగులుకొని ఆయన
నిన్ను త్వరగా నశింపజేయును. । కావున మీరు వారికి 5
చేయవలసినదేమనగా, వారి బలిపీఠములను పడద్రోసి
వారి విగ్రహములను పగలగొట్టి వారి దేవతాస్తంభము
లను నరికివేసి వారి ప్రతిమలను అగ్నితో కాల్చవలె
ను. । నీవు నీ దేవుడైన యెహోవాకు ప్రతిష్ఠిత 6
జనము, నీ దేవుడైన యెహోవా భూమిమీదనున్న
సమస్త జనములకంటె నిన్ను ఎక్కువగా ఎంచి, నిన్ను
తనకు స్వకీయజనముగా ఏర్పరచుకొనెను. । మీరు 7
సర్వజనములకంటె విస్తారజనమని యెహోవా
మిమ్మును ప్రేమించి మిమ్మును ఏర్పరచుకొనలేదు. సమస్త
జనములకంటె మీరు లెక్కకు తక్కువే గదా. ।
అయితే యెహోవా మిమ్మును ప్రేమించువాడు గను 8
కను, తాను మీ తండ్రులకు చేసిన ప్రమాణమును
నెరవేర్చువాడు గనుకను, యెహోవా బాహుబలము
చేత మిమ్మును రప్పించి దాసుల గృహములోనుండియు
ఐగుప్తురాజైన ఫరో చేతిలోనుండియు మిమ్మును విడి
పించెను. । కాబట్టి నీ దేవుడైన యెహోవా తానే 9

మీకాజ్ఞాపించిన త్రోవనుండి త్వరగా తొలగిపోయి
17 యుంటిరి. । అప్పుడు నేను ఆ రెండు పలకలను పట్టు
కొని, నా రెండు చేతులలోనుండి మీకన్నులయెదుట
18 వాటిని క్రిందపడవేసి పగలగొట్టి। మీరు యెహోవా
దృష్టికి ఆ చెడునడత నడిచి చేసిన మీ సమస్త పాప
ములవలన ఆయనకు కోపము పుట్టింపగా చూచి,
మునుపటివలె అన్నపానములు మాని నలువది పగళ్లు
నలువది రాత్రులు నేను యెహోవా సన్నిధిని సాగిల
19 పడితిని । ఏలయనగా మిమ్ము నశింపజేయవలెనని కోప
పడిన యెహోవా కోపోద్రేకమును చూచి భయ
పడితిని. ఆ కాలమందును యెహోవా నా మనవి
20 ఆలకించెను. । మరియు యెహోవా అహరోనును
నశింపజేయుటకు అతనిమీద బహుగా కోపపడగా
నేను అహరోనుకై అప్పుడే బతిమాలుకొంటిని. ।
21 అప్పుడు మీరు చేసిన పాపమును, అనగా ఆ దూడను
నేను పట్టుకొని అగ్నితో దాని కాల్చి నలుగగొట్టి
అది ధూళియగునంత మెత్తగా నూరి ఆ కొండనుండి
22 పారు ఏటిలో ఆ ధూళిని పారపోసితిని. । మరియు
మీరు తబేరాలోను మస్సాలోను కిబ్రోతు హత్తా
వాలోను యెహోవాకు కోపము పుట్టించితిరి. ।
23 యెహోవా—మీరు వెళ్లి నేను మీకిచ్చిన దేశమును
స్వాధీనపరచుకొనుడని చెప్పి కాదేషు బర్నేయలో
నుండి మిమ్ము పంపినప్పుడు మీరు మీ దేవుడైన
యెహోవాను నమ్ముకొనక ఆయన నోటిమాటకు
24 తిరుగబడితిరి, ఆయన మాటను వినలేదు. । నేను
మిమ్మును ఎరిగిన దినము మొదలుకొని మీరు
యెహోవామీద తిరుగబాటు చేయుచున్నారు. ।
25 కాగా నేను మునుపు సాగిలపడినట్లు యెహోవా
సన్నిధిని నలువది పగళ్లు నలువది రాత్రులు సాగిల
పడితిని. యెహోవా—మిమ్మును నశింపజేసెదననగా।
26 నేను యెహోవాను ప్రార్థించుచు ఈలాగు చెప్పి
తిని—ప్రభువా యెహోవా, నీవు నీ మహిమవలన
విమోచించి బాహుబలమువలన ఐగుప్తులోనుండి రప్పిం
చిన నీ స్వాస్థ్యమైన జనమును నశింపజేయకుము. ।
27 నీ సేవకులైన అబ్రాహాము ఇస్సాకు యాకోబులను
జ్ఞాపకముచేసికొనుము. ఈ ప్రజల కాఠిన్యమునైనను
వారి చెడుతనమునైనను వారి పాపమునైనను చూడ
28 కుము; । ఏలయనగా నీవు ఏ దేశములోనుండి మమ్మును
రప్పించితివో ఆ దేశస్థులు — యెహోవా తాను
వారితో చెప్పిన దేశములోకి వారిని చేర్చలేకపోవుట
వలనను, వారిని ద్వేషించుటవలనను, అరణ్యములో
వారిని చంపుటకు వారిని రప్పించెనని చెప్పుకొందు
29 రేమో. । నీవు నీ అధికబలముచేతను నీవు చాపిన నీ
బాహువుచేతను రప్పించిన నీ స్వాస్థ్యమును నీ ప్రజ
లును వీరే.

10 ఆ కాలమందు యెహోవా — మునుపటివాటి
వంటి రెండు రాతిపలకలను నీవు చెక్కుకొని కొండ
యెక్కి నా యొద్దకు రమ్ము. మరియు నీవు ఒక కర్ర
మందసమును చేసికొనవలెను. । నీవు పగలగొట్టిన 2
మొదటి పలకలమీదనున్న మాటలను నేను ఈ పల
కలమీద వ్రాసిన తరువాత నీవు ఆ మందసములో
వాటిని ఉంచవలెనని నాతో చెప్పెను. । కాబట్టి 3
నేను తుమ్మకర్రతో ఒక మందసమును చేయించి మున
పటివాటివంటి రెండు రాతిపలకలను చెక్కి ఆ రెండు
పలకలను చేత పట్టుకొని కొండ యెక్కితిని. । ఆ 4
సమాజదినమున ఆ కొండమీద అగ్ని మధ్యనుండి
తాను మీతో పలికిన పది ఆజ్ఞలను మునుపు వ్రాసినట్టు
యెహోవా ఆ పలకలమీద వ్రాసెను. యెహోవా
వాటిని నాకిచ్చిన తరువాత నేను తిరిగి కొండ దిగి
వచ్చి । నేను చేసిన మందసములో ఆ పలకలను ఉంచి 5
తిని. యెహోవా నాకాజ్ఞాపించినట్లు వాటిని
దానిలో నుంచితిని. । ఇశ్రాయేలీయులు యహకానీ 6
యులదైన బెయేరోతునుండి బయలుదేరి మోసేరుకు
వచ్చినప్పుడు అక్కడ అహరోను చనిపోయి పాతి
పెట్టబడెను. అతని కుమారుడైన ఎలాజారు అతనికి
ప్రతిగా యాజకుడాయెను. । అక్కడనుండి వారు 7
గుద్గోదకును గుద్గోదనుండి నీటివాగులుగల దేశమైన
యొత్బాతాకును ప్రయాణము చేసిరి. । నేటివరకు 8
(జరుగునట్లు) యెహోవా నిబంధన మందసమును
మోయుటకును, యెహోవా సన్నిధిని నిలుచుట
కును, ఆయనను సేవించి ఆయన నామమునుబట్టి
దీవించుటకును, లేవి గోత్రపువారిని ఆ కాలమున
యెహోవా ఏర్పరచుకొనెను. । కాబట్టి తమ 9
సహోదరులతోపాటు లేవీయులు స్వాస్థ్యమునైనను
పొందలేదు. నీ దేవుడైన యెహోవా వారితో చెప్పి
నట్లు యెహోవాయే వారికి స్వాస్థ్యము. । నేను 10
మునుపటివలె నలువది పగళ్లును నలువది రాత్రులును
కొండమీద ఉండగా యెహోవా ఆ కాలమున
నా మనవి ఆలకించి నిన్ను నశింపజేయుట మాని
వేసెను. । మరియు యెహోవా నాతో ఇట్లనెను— 11
ఈ ప్రజలు నేను వారికిచ్చెదనని వారి పితరులతో
ప్రమాణముచేసిన దేశమున ప్రవేశించి స్వాధీనపరచు
కొనునట్లు నీవు లేచి వారి ముందర సాగుమని చెప్పెను.
కాబట్టి ఇశ్రాయేలూ, నీ దేవుడైన యెహోవాకు 12
భయపడి ఆయన మార్గములన్నిటిలో నడుచుచు,
ఆయనను ప్రేమించి, నీ దేవుడైన యెహోవాను నీ
పూర్ణమనస్సుతోను నీ పూర్ణాత్మతోను సేవించి, । నీ 13
మేలుకొరకు నేడు నేను నీకాజ్ఞాపించు యెహోవా
ఆజ్ఞలను కట్టడలను అనుసరించి నడుచుకొందునను
మాట కాక నీ దేవుడైన యెహోవా నిన్ను మరి
ఏమి అడుగుచున్నాడు? । చూడుము; ఆకాశము, 1
మహాకాశము, భూమియు, అందున్నదంతయు నీ

15 దేవుడైన యెహోవావే. । అయితే యెహోవా నీ
పితరులను ప్రేమించి వారియందు ఆనందపడి సమస్త
జనములలో వారి సంతానమైన మిమ్మును నేటివలె
16 ఏర్పరచుకొనెను. । కాబట్టి మీరు లోబడనొల్లని
స్వభావము గోసివేసి యికమీదట ముష్కరులు
17 కాకుండుడి.[1] । ఏలయనగా నీ దేవుడైన యెహోవా
పరమ దేవుడును పరమ ప్రభువునై యున్నాడు.
ఆయనే మహా దేవుడు పరాక్రమవంతుడు భయంకరు
డైన దేవుడు. ఆయన నరుల ముఖమును లక్ష్యపెట్టని
18 వాడు లంచము పుచ్చుకొననివాడు. । ఆయన తలి
దండ్రులు లేనివానికిని విధవరాలికిని న్యాయము తీర్చి,
పరదేశియందు దయయుంచి అన్నవస్త్రముల ననుగ్ర
19 హించువాడు. । మీరు ఐగుప్తుదేశములో పరదేశులై
20 యుంటిరి గనుక పరదేశిని జాలి తలచుడి. । నీ దేవు
డైన యెహోవాకు భయపడి ఆయనను సేవించి
ఆయనను హత్తుకొని ఆయన నామమున ప్రమాణము
21 చేయవలెను. । ఆయనే నీకు కీర్తనీయుడు. నీవు కన్ను
లార చూచుచుండగా భీకరమైన ఆ గొప్ప కార్యము
22 లను నీ కొరకు చేసిన నీ దేవుడు ఆయనే. । నీ పితరులు
డెబ్బది మందియై ఐగుప్తుకు వెళ్లిరి. ఇప్పుడు నీ దేవు
డైన యెహోవా ఆకాశనక్షత్రములవలె నిన్ను విస్త
రింపజేసియున్నాడు.

**11** నీవు నీ దేవుడైన యెహోవాను ప్రేమించి
ఆయన విధించినవాటిని అనుసరించి ఆయన కట్టడలను
2 విధులను ఆజ్ఞలను ఎల్లప్పుడు గైకొనవలెను. । నీ దేవు
డైన యెహోవా చేసిన శిక్షను ఆయన మహిమను
ఆయన బాహుబలమును ఆయన చాపిన బాహువును।
3 ఐగుప్తులో ఐగుప్తురాజైన ఫరోకును అతని సమస్త దేశ
మునకును ఆయన చేసిన సూచకక్రియలను కార్యము
4 లను । ఆయన ఐగుప్తుదండుకును దాని గుఱ్ఱములకును
రథములకును చేసినదానిని, వారు మిమ్మును తరుము
చుండగా ఆయన ఎఱ్ఱసముద్రజలమును వారిమీద
5 ప్రవహింపజేసినదానిని । యెహోవా నేటివరకు
వారిని నశింపజేసినరీతిని, మీరు ఈ స్థలమునకు వచ్చు
6 వరకు ఎడారిలో మీకొరకు చేసినదానిని । రూబే
నీయుడైన ఏలీయాబు కుమారులైన దాతాను అబీరా
ములకు చేసిన పనిని, భూమి నోరు తెరచి వారిని
వారి ఇండ్లను గుడారములను వారియొద్దనున్న సమస్త
జీవరాసులను ఇశ్రాయేలీయులందరి మధ్యను మ్రింగి
వేసిన రీతిని, కండ్ల చూడకయు ఎరుగకయునున్న
మీ కుమారులతో నేను మాటలాడుట లేదని నేడు
7 తెలిసికొనుడి. । యెహోవా చేసిన ఆ గొప్ప కార్య
8 మంతయు మీ కన్నులే చూచినవి గదా. । మీరు
బలముగలిగి స్వాధీనపరచుకొనుటకై (నది) దాటి వెళ్లు
చున్న ఆ దేశమందు ప్రవేశించి దాని స్వాధీనపరచు
కొనునట్లును । యెహోవా వారికిని వారి సంతాన 9
మునకును దయచేసెదనని మీ పితరులతో ప్రమాణము
చేసిన దేశమున, అనగా పాలు తేనెలు ప్రవహించు
దేశమున మీరు దీర్ఘాయుష్మంతులగునట్లును నేను ఈ
దినమున మీకాజ్ఞాపించు ఆజ్ఞలనన్నిటిని మీరు గైకొన
వలెను. । మీరు స్వాధీనపరచుకొనబోవు దేశము 10
మీరు బయలుదేరి వచ్చిన ఐగుప్తుదేశమువంటిది కాదు.
అక్కడ నీవు విత్తనములు విత్తి కూరతోటకు నీరు కట్టు
టకై నీ కాళ్లతో నీ చేలకు నీరు కట్టితివి. । మీరు 11
నది దాటి స్వాధీనపరచుకొనుటకు వెళ్లుచున్న దేశము
కొండలు లోయలు గల దేశము. । అది ఆకాశవర్ష 12
జలము త్రాగును. అది నీ దేవుడైన యెహోవా
కనుపెట్టు దేశము. నీ దేవుడైన యెహోవా కన్నులు
సంవత్సరాది మొదలుకొని సంవత్సరాంతమువరకు ఎల్ల
ప్పుడు దానిమీద ఉండును.

కాబట్టి మీ పూర్ణహృదయముతోను మీ పూర్ణా 13
త్మతోను మీ దేవుడైన యెహోవాను ప్రేమించి
ఆయనను సేవింపవలెనని నేడు నేను మీకిచ్చు ఆజ్ఞ
లను మీరు జాగ్రత్తగా వినినయెడల । మీ దేశము 14
నకు వర్షము, అనగా తొలకరివానను కడవరివానను
దానిదాని కాలమున కురిపించెదను. అందువలన నీవు
నీ ధాన్యమును నీ ద్రాక్షారసమును నీ నూనెను కూర్చు
కొందువు. । మరియు నీవు తిని తృప్తిపొందునట్లు నీ 15
పశువులకొరకు నీ చేలయందు గడ్డి మొలిపించెదను. ।
మీ హృదయము మాయలలో చిక్కి త్రోవవిడిచి 16
యితర దేవతలను పూజించి వారికి నమస్కరింపకుండ
మీరు జాగ్రత్తపడుడి. । లేనియెడల యెహోవా 17
మీమీద కోపపడి ఆకాశమును మూసివేయును;
అప్పుడు వాన కురియదు, భూమి పండదు, యెహోవా
మీకిచ్చుచున్న ఆ మంచి దేశమున ఉండకుండ
మీరు శీఘ్రముగా నశించెదరు. । కాబట్టి మీరు ఈ 18
నా మాటలను మీ హృదయములోను మీ మనస్సు
లోను ఉంచుకొని వాటిని మీ చేతులమీద సూచన
లుగా కట్టుకొనవలెను. అవి మీ కన్నులనడుమ బాసి
కములుగా ఉండవలెను. । నీవు నీ యింట కూర్చుండు 19
నప్పుడు త్రోవను నడుచునప్పుడు పండుకొనునప్పుడు
లేచునప్పుడు వాటినిగూర్చి మాటలాడుచు వాటిని
మీ పిల్లలకు నేర్పి । నీ యింటి ద్వారబంధములమీదను 20
నీ గవునులమీదను వాటిని వ్రాయవలెను. । ఆలాగు 21
చేసినయెడల యెహోవా మీ పితరులకిచ్చెదనని
ప్రమాణముచేసిన దేశమున మీ దినములును మీ సం
తతివారి దినములును భూమికి పైగా ఆకాశము నిలుచు
నంతకాలము విస్తరించును. । మీరు మీ దేవుడైన 22
యెహోవాను ప్రేమించి, ఆయన మార్గములన్నిటి
లోను నడుచుచు, ఆయనను హత్తుకొని, మీ

1 మూలభాషలో—సున్నతిలేని మీ హృదయమునకు సున్నతి చేసికొని ఇకమీదట వం

వలెనని నేను మీకాజ్ఞాపించు ఈ ఆజ్ఞలన్నిటిని అనుస
23 రించి జాగ్రత్తగా నడుచుకొనవలెను. । అప్పుడు
యెహోవా మీ యెదుటనుండి ఈ సమస్త జనము
లను వెళ్లగొట్టును; మీరు మీకంటె బలిష్ఠులైన గొప్ప
24 జనముల దేశములను స్వాధీనపరచుకొందురు. । మీరు
అడుగుపెట్టు ప్రతి స్థలము మీది అగును; అరణ్యము
మొదలుకొని లెబానోనువరకును ఫరాతునది మొదలు
కొని పడమటి సముద్రమువరకును మీ సరిహద్దు
25 వ్యాపించును. । ఏ మనుష్యుడును మీ యెదుట నిలు
వడు. తాను మీతో చెప్పినట్లు మీ దేవుడైన
యెహోవా మీరు అడుగుపెట్టు దేశమంతటిమీద
26 మీ బెదురు మీ భయము పుట్టించును. । చూడుడి;
నేడు నేను మీ యెదుట దీవెనను శాపమును పెట్టు
27 చున్నాను. । నేడు నేను మీకాజ్ఞాపించు మీ దేవు
డైన యెహోవా ఆజ్ఞలను మీరు వినినయెడల దీవె
నయు, మీరు మీ దేవుడైన యెహోవా ఆజ్ఞలను
28 వినక । నేడు నేను మీకాజ్ఞాపించు మార్గమును విడిచి
మీరెరుగని యితర దేవతలను అనుసరించినయెడల
శాపమును మీకు కలుగును.

29 కాబట్టి నీవు స్వాధీనపరచుకొనబోవు దేశమున నీ
దేవుడైన యెహోవా నిన్ను చేర్చిన తరువాత గెరిజీ
మను కొండమీద ఆ దీవెన వచనమును, ఏబాలు
కొండమీద ఆ శాపవచనమును ప్రకటింపవలెను. ।
30 అవి యొర్దాను అద్దరిని సూర్యుడు అస్తమించు మార్గము
వెనుక మోరేలోని సిందూర వృక్షములకు దాపున
గిల్గాలుకు ఎదురుగానున్న మైదానములో నివసించు
31 కనానీయుల దేశమందున్నవి గదా. । మీరు చేరి మీ
దేవుడైన యెహోవా మీకిచ్చుచున్న దేశమును
స్వాధీనపరచుకొనుటకు ఈ యొర్దానును దాటబోవు
చున్నారు. మీరు దాని స్వాధీనపరచుకొని దానిలో
32 నివసించెదరు. । అప్పుడు నేడు నేను మీకు నియ
మించుచున్న కట్టడలన్నిటిని విధులన్నిటిని మీరు
అనుసరించి గైకొనవలెను.

**12** మీరు స్వాధీనపరచుకొనుటకు నీ పితరుల దేవు
డైన యెహోవా నీకిచ్చిన దేశమున మీరు భూమి
మీద బ్రదుకు దినములన్నిటను మీరు అనుసరించి
2 గైకొనవలసిన కట్టడలును విధులును ఇవి. । మీరు
స్వాధీనపరచుకొనబోవు జనములు గొప్ప పర్వతముల
మీదనేమి మెట్టలమీదనేమి పచ్చని చెట్లన్నిటిక్రింద
నేమి, యెక్కడెక్కడనైతే తమ దేవతలను పూజిం
చెనో ఆ స్థలములన్నిటిని మీరు బొత్తిగా పాడుచేయ
3 వలెను. । వారి బలిపీఠములను పడద్రోసి వారి విగ్రహ
ములను పగలగొట్టి వారి దేవతాస్తంభములను అగ్నితో
కాల్చి వారి దేవతల ప్రతిమలను కూలద్రోసి వాటి
4 పేరులు అచ్చట లేకుండ నశింపజేయవలెను. । వారు
తమ దేవతలకు సినట్లు మీరు మీ దేవుడైన
యెహోవానుగూర్చి చేయకూడదు. । మీ దేవు 5
డైన యెహోవా మీ సమస్త గోత్రములలో
తన నామమును స్థాపించుకొనుటకు నివాసస్థాన
ముగా ఏర్పరచుకొను స్థలమును వెదకి అక్కడికే
యాత్రలు చేయుచుండవలెను. । అక్కడికే మీరు 6
మీ దహనబలులను, మీ బలులను, మీ దశమభాగము
లను, ప్రతిష్ఠితములుగా మీరు చేయు నైవేద్యము
లను, మీ మ్రొక్కుబడి అర్పణములను, మీ స్వేచ్ఛా
ర్పణములను, పశువులలోను గొఱ్ఱె మేకలలోను తొలి
చూలువాటిని తీసికొని రావలెను. । మీరును మీ 7
దేవుడైన యెహోవా మిమ్మును నాశీర్వదించి మీకు
కలుగజేసిన మీ కుటుంబములును మీ దేవుడైన
యెహోవా సన్నిధిని భోజనముచేసి మీ చేతిపను
లన్నిటియందు సంతోషింపవలెను. । నేడు మనమిక్కడ 8
చేయుచున్నట్లు మీలో ప్రతి మనుష్యుడు తన కంటికి
యుక్తమైనదంతయు చేయకూడదు. । నీ దేవుడైన 9
యెహోవా నీకిచ్చుచున్న విశ్రాంతిని స్వాస్థ్యమును
మీరు ఇదివరకును పొందలేదు. । మీరు యొర్దాను 10
దాటి మీ దేవుడైన యెహోవా మీకు స్వాస్థ్య
ముగా ఇచ్చుచున్న దేశమున నివాసులైన తరువాత
ఆయన మీ చుట్టునుండు శత్రువులందరు లేకుండ
మీకు విశ్రాంతి కలుగజేసినందున మీరు నెమ్మది పొందు
నప్పుడు । నేను మీకాజ్ఞాపించు సమస్తమును, అనగా 11
మీ దహనబలులను మీ బలులను మీ దశమభాగము
లను ప్రతిష్ఠితములుగా మీరు చేయు నైవేద్యములను
మీరు యెహోవాకు మ్రొక్కుకొను మీ శ్రేష్ఠమైన
మ్రొక్కుబళ్లను మీ దేవుడైన యెహోవా తన నామ
మునకు నివాసస్థానముగా ఏర్పరచుకొను స్థలమునకే
మీరు తీసికొని రావలెను. । మీరు మీ కుమారులు 12
మీ కుమార్తెలు మీ దాసులు మీ పనికత్తెలు మీలో
పాలైనను స్వాస్థ్యమైనను పొందక మీ యిండ్లలో
ఉండు లేవీయులు మీ దేవుడైన యెహోవా సన్ని
ధిని సంతోషింపవలెను. । నీవు చూచిన ప్రతి స్థల 13
మున నీ దహనబలులను అర్పింపకూడదు. । యెహోవా 14
నీ గోత్రములలో ఒకదానియందు ఏర్పరచుకొను
స్థలముననే నీ దహనబలులను అర్పించి నేను మీ
కాజ్ఞాపించుచున్న సమస్తమును అక్కడనే జరిగింప
వలెను. । అయితే నీ దేవుడైన యెహోవా నిన్ను 15
ఆశీర్వదించినకొలది యిండ్లన్నిటిలో నీ మనస్సు కోరు
దానిని చంపి తినవచ్చును. పవిత్రులేమి అపవిత్రులేమి
యెఱ్ఱజింకను చిన్న దుప్పిని తినినట్లు తినవచ్చును. ।
మీరు రక్తము మాత్రము తినక దానిని నీళ్లవలె నేలమీద 16
పారబోయవలెను. । నీ ధాన్యములోనేమి నీ ద్రాక్షా 17
రసములోనేమి నీ నూనెలోనేమి దశమభాగమును,
నీ గోవులలోనిదేమి నీ గొఱ్ఱె మేకల మందలోనిదేమి
తొలిచూలు పిల్లలను నీవు మ్రొక్కుకొను మ్రొక్కు

బళ్లలో దేనిని నీ స్వేచ్ఛార్పణమును ప్రతిష్ఠార్పణమును
18 నీ యింట తినక । నీ దేవుడైన యెహోవా ఏర్పరచు
కొను స్థలముననే నీవు నీ కుమారుడు నీ కుమార్తె నీ
దాసుడు నీ దాసి నీ యింటనుండు లేవీయులు కలిసికొని
నీ దేవుడైన యెహోవా సన్నిధిని తిని, నీవు చేయు
ప్రయత్నములన్నిటిలో నీ దేవుడైన యెహోవా
19 సన్నిధిని సంతోషించుదువు. । నీవు నీ దేశములోనున్న
నీ దినములన్నిటను లేవీయులను విడువకూడదు.
20 నీ దేవుడైన యెహోవా తాను నీకిచ్చిన మాట
చొప్పున నీ సరిహద్దులను విశాలపరచిన తరువాత
నిశ్చయముగా మాంసము తినగోరి మాంసము తినెద
ననుకొందువు. అప్పుడు నీకిష్టమైన మాంసము తిన
21 వచ్చును. । నీ దేవుడైన యెహోవా తన నామమును
ప్రకటించుటకు ఏర్పరచుకొను స్థలము మీకు దూర
22 ముగా ఉండినయెడల । యెహోవా నీకిచ్చిన గోవుల
లోనిదేగాని మీ గొఱ్ఱె మేకలలోనిదేగాని నేను
నీకాజ్ఞాపించినట్లు చంపి నీవు ఆశించినదాని నీ యింట
తినవచ్చును. జింకను దుప్పిని తినునట్లు దాని తిన
వచ్చును. పవిత్రాపవిత్రులు భేదములేకుండ తిన
23 వచ్చును. । అయితే రక్తమును తినవే తినకూడదు
భద్రము సుమీ. ఏలయనగా రక్తము ప్రాణము;
మాంసముతో ప్రాణాధారమైనదాని తినకూడదు; ।
24 నీవు దాని తినక భూమిమీద నీళ్లవలె పారబోయ
25 వలెను. । నీవు యెహోవా దృష్టికి యుక్తమైనదానిని
చేసినందున నీకు నీ తరువాత నీ సంతతివారికి మేలు
26 కలుగునట్లు దాని తినకూడదు. । నీకు నియమింప
బడిన ప్రతిష్ఠితములను మ్రొక్కుబళ్లనుమాత్రము
యెహోవా ఏర్పరచుకొను స్థలమునకు నీవు తీసి
27 కొని పోవలెను. । నీ దహనబలులను వాటి రక్తమాం
సములను నీ దేవుడైన యెహోవా బలిపీఠముమీద
అర్పింపవలెను. నీ బలుల రక్తమును నీ దేవుడైన
యెహోవా బలిపీఠముమీద పోయవలెను; వాటి
28 మాంసము నీవు తినవలెను. । నీ దేవుడైన యెహోవా
దృష్టికి యుక్తమును యథార్థమునగుదానిని నీవు చేసి
నందున నీకును నీ తరువాత నీ సంతతివారికిని నిత్యము
మేలు కలుగునట్లు నేను నీకాజ్ఞాపించుచున్న యీ
మాటలన్నిటిని నీవు జాగ్రత్తగా వినవలెను.
29 నీవు (వారి దేశమును) స్వాధీనపరచుకొనుటకు
వెళ్లుచున్న జనములను నీ దేవుడైన యెహోవా నీ
యెదుటనుండి నాశముచేసినతరువాత, నీవు వారి
స్వాస్థ్యమును స్వాధీనపరచుకొని, వారి దేశములో
నివసించునప్పుడు, వారు నీ యెదుటనుండి నశింపజేయ
బడిన తరువాత నీవు వారి వెంట వెళ్లి చిక్కుబడి, ।
30 వారి దేవతలను ఆశ్రయింపగోరి—ఈ జనములు తమ
దేవతలను కొలిచినట్లు నేనును చేసెదనని అనుకొన
31 కుండ జాగ్రత్తగా ఉండవలెను. । తమ దేవతలకు
వారు చేసినట్లు నీవు నీ దేవుడైన యెహోవాను
గూర్చి చేయవలదు; ఏలయనగా యెహోవా
ద్వేషించు ప్రతి హేయక్రియను వారు తమ దేవతలకు
చేసిరి. వారు తమ దేవతలపేరట తమ కుమారులను
తమ కుమార్తెలను అగ్నిహోత్రములో కాల్చివేయు
దురు గదా. । నేను మీకాజ్ఞాపించుచున్న ప్రతి 32
మాటను అనుసరించి చేయవలెను. దానిలో నీవు
ఏమియు కలుపకూడదు దానిలోనుండి ఏమియు తీసి
వేయకూడదు.
ప్రవక్తయేగాని కలలు కనువాడేగాని నీ మధ్య 13
లేచి నీ యెదుట సూచకక్రియనైనను మహాత్కా
ర్యమునైనను చేసి । నీవు ఎరుగని యితర దేవతలను 2
అనుసరించి పూజింతము రమ్మని చెప్పినయెడల । అతడు 3
నీతో చెప్పిన సూచకక్రియగాని మహాత్కార్యము
గాని సంభవించినను ఆ ప్రవక్తమాటలను కలలు కను
వాని మాటలను వినకూడదు. ఏలయనగా మీరు మీ
దేవుడైన యెహోవాను మీ పూర్ణహృదయముతోను
మీ పూర్ణాత్మతోను ప్రేమించుచున్నారో లేదో తెలిసి
కొనుటకు మీ దేవుడైన యెహోవా మిమ్మును పరీక్షిం
చుచున్నాడు. । మీరు మీ దేవుడైన యెహోవాకు 4
లోబడి ఆయనకే భయపడి ఆయన ఆజ్ఞల ననుసరించి
ఆయన మాట విని ఆయనను సేవించి ఆయనను హత్తు
కొని యుండవలెను. । నీవు నడవవలెనని నీ దేవు 5
డైన యెహోవా నీకాజ్ఞాపించిన మార్గములోనుండి
నిన్ను తొలగించునట్లు ఐగుప్తుదేశములోనుండి మిమ్మును
రప్పించి దాస్యగృహములోనుండి మిమ్మును విడిపించిన
మీ దేవుడైన యెహోవామీద తిరుగబాటు చేయు
టకు మిమ్మును ప్రేరేపించెను గనుక ఆ ప్రవక్తకేమి ఆ
కలలు కనువానికేమి మరణశిక్ష విధింపవలెను. అట్లు నీ
మధ్యనుండి ఆ చెడుతనమును పరిహరింపవలెను.
నీ తల్లి కుమారుడేగాని నీ సహోదరుడేగాని నీ 6
కుమారుడేగాని నీ కుమార్తెయేగాని నీ కౌగిటి భార్యయే
గాని నీ ప్రాణస్నేహితుడేగాని । భూమియొక్క 7
యీ కొన మొదలుకొని ఆ కొనవరకు నీకు సమీప
ముగా నుండినను నీకు దూరముగానుండినను, నీ చుట్టు
నుండు జనముల దేవతలలో నీవును నీ పితరులును ఎరు
గని యితర దేవతలను పూజింతము రమ్మని రహస్య
ముగా నిన్ను ప్రేరేపించినయెడల । వారి మాటకు 8
సమ్మతింపకూడదు; వారి మాట వినకూడదు, వారిని
కటాక్షింపకూడదు; వారియందు జాలిపడకూడదు,
వారిని మాటుపరచకూడదు; అవశ్యముగా వారిని
చంపవలెను. । చంపుటకు నీ జనులందరికి ముందు 9
గాను నీ చెయ్యి మొదట వారిమీద పడవలెను. ।
రాళ్లతో వారిని చావగొట్టవలెను. ఏలయనగా ఐగుప్తు 10
దేశములోనుండియు దాస్యగృహములోనుండియు
నిన్ను రప్పించిన నీ దేవుడైన యెహోవాయొద్దనుండి

11 వారు నిన్ను తొలగింప యత్నించెదరు. । అప్పుడు
ఇశ్రాయేలీయులందరు విని భయపడుదురు గనుక నీ
మధ్య అట్టి దుష్కార్యమేమియు ఇకను చేయకుందురు.
12 నీవు నివసించుటకు నీ దేవుడైన యెహోవా
నీకిచ్చుచున్న నీ పురములలో ఏదోయొకదానియందు ।
13 పనికిమాలిన కొందరు మనుష్యులు నీ మధ్య లేచి,
మీరు ఎరుగని యితర దేవతలను పూజింతము రండని
తమ పురనివాసులను ప్రేరేపించిరని నీవు వినినయెడల,
నీవు ఆ సంగతిని శోధించి పరీక్షించి బాగుగా విచా
14 రింపవలెను. । అది నిజమైనయెడల, అనగా అట్టి
15 హేయమైనది నీ మధ్య జరిగినయెడల । ఆ పురని
వాసులను అవశ్యముగా కత్తివాత సంహరించి, దానిని
దానిలోనున్న సమస్తమును దాని పశువులను కత్తివాత
16 నిర్మూలము చేయవలెను. । దాని కొల్లసొమ్మంతటిని
విశాలవీధిలో చేర్చి, నీ దేవుడైన యెహోవా పేరట
ఆ పురమును దాని కొల్లసొమ్మంతటిని అగ్నితో
బొత్తిగా కాల్చివేయవలెను. అది తిరిగి కట్టబడక యెల్ల
17 ప్పుడును పాడుదిబ్బయై యుండును. । నేడు నేను
18 నీకాజ్ఞాపించు ఆయన ఆజ్ఞలన్నిటిని గైకొనుచు । నీ
దేవుడైన యెహోవా దృష్టికి యథార్థమైనదాని
చేయుచు, నీ దేవుడైన యెహోవా మాట విను
నప్పుడు యెహోవా తన కోపాగ్నినుండి మళ్లుకొని
నీయందు కనికరపడి నిన్ను కరుణించి నీ పితరులతో
ప్రమాణముచేసిన రీతిని నిన్ను విస్తరింపజేయునట్లు,
నిర్మూలము చేయవలసినదానిలో కొంచెమైనను నీ
యొద్ద ఉంచుకొనకూడదు.

**14** మీరు మీ దేవుడైన యెహోవాకు బిడ్డలు గనుక
చనిపోయినవాడెవనినిబట్టి మిమ్మును మీరు కోసికొన
కూడదు, మీ కనుబొమ్మల మధ్య బోడిచేసికొనకూడదు.।
2 ఏలయనగా నీ దేవుడైన యెహోవాకు నీవు ప్రతిష్ఠిత
జనము. మరియు యెహోవా భూమిమీదనున్న
సమస్త జనములలో విశేషముగా తనకు స్వకీయజన
మగునట్లు నిన్ను ఏర్పరచుకొనెను.
3 నీవు హేయమైనదేదియు తినకూడదు. మీరు తిన
4 దగిన జంతువులు ఏవేవనగా । ఎద్దు, గొఱ్ఱెపిల్ల, మేక
5 పిల్ల, దుప్పి, ఎఱ్ఱ చిన్నజింక, దుప్పి, కారుమేక,
6 కారుజింక, లేడి, కొండగొఱ్ఱె అనునవే. । జంతువు
లలో రెండు డెక్కలు గలదై నెమరువేయు జంతు
7 వును తినవచ్చును. । నెమరువేయువాటిలోనిదేకాని
రెండు డెక్కలుగలవాటిలోనిదేకాని నెమరువేసి,ఒంటి
డెక్కగల ఒంటె, కుందేలు, పొట్టికుందేలు అనువాటిని
8 తినకూడదు. అవి మీకు హేయములు. । మరియు
పంది రెండు డెక్కలుగలదైనను నెమరువేయదు గనుక
అది మీకు హేయము, వాటి మాంసము తినకూడదు,
వాటి కళేబరములను ముట్టకూడదు.

నీట నివసించువాటన్నిటిలో మీరు వేటిని తిన 9
వచ్చుననగా, రెక్కలు పొలుసులుగలవాటినన్నిటిని తిన
వచ్చును. । రెక్కలు పొలుసులు లేనిదానిని మీరు 10
తినకూడదు అది మీకు హేయము. । పవిత్రమైన 11
ప్రతి పక్షిని మీరు తినవచ్చును. మీరు తినరానివి 20
ఏవనగా—పక్షిరాజు, పెద్దబోరువ, క్రౌరమీను, పిల్లి
గద్ద, గద్ద, తెల్లగద్ద, ప్రతివిధమైన కాకి, నిప్పుకోడి,
కపిరిగాడు, కోగిలె, ప్రతివిధమైన డేగ, పైగిడికంటె,
గుడ్లగూబ, హంస, గూడబాతు, తెల్లబందు, చెరువు
కాకి, చీకుబాతు, సారసపక్షి, ప్రతివిధమైన సంకు
బుడికొంగ, కొంగ, కుకుడుగువ్వ, గబ్బిలము అనునవి.
ఎగురు ప్రతి పురుగు మీకు హేయము; వాటిని తిన
కూడదు. పవిత్రమైన ప్రతి పక్షిని తినవచ్చును.
చచ్చినదానిని మీరు తినకూడదు. నీ యింటనున్న 2
పరదేశికి దాని ఇయ్యవచ్చును వాడు దాని తినవచ్చును;
లేక అన్యునికి దాని అమ్మవచ్చును; ఏలయనగా నీ
దేవుడైన యెహోవాకు నీవు ప్రతిష్ఠితజనము. మేక
పిల్లను దాని తల్లిపాలతో వంటకూడదు.
ప్రతి సంవత్సరమున నీ విత్తనముల పంటలో దశమ 2
భాగమును అవశ్యముగా వేరుపరచవలెను. । నీ దినము 2
లన్నిటిలో నీ దేవుడైన యెహోవాకు నీవు భయపడ
నేర్చుకొనునట్లు నీ దేవుడైన యెహోవా తన నామ
మునకు నివాసస్థానముగా ఏర్పరచుకొను స్థలమున
ఆయన సన్నిధిని నీ పంటలోగాని నీ ద్రాక్షారసము
లోగాని నీ నూనెలోగాని పదియవ వంతును, నీ
పశువులలోగాని గొఱ్ఱె మేకలలోగాని తొలిచూలు
వాటిని తినవలెను. । మార్గము దీర్ఘముగానున్నందున,
అనగా యెహోవా తన నామమునకు నివాసస్థాన
ముగా ఏర్పరచుకొను స్థలము మిక్కిలి దూరముగా
నున్నందున, నీవు వాటిని మోయలేనియెడల నీ దేవు
డైన యెహోవా నిన్ను ఆశీర్వదించునప్పుడు, వాటిని
వెండికి మార్చి ఆ వెండిని చేత పట్టుకొని, । నీ దేవు
డైన యెహోవా యేర్పరచుకొను స్థలమునకు వెళ్లి
నీవు కోరు దేనికైనను । ఎద్దులకేమి గొఱ్ఱెలకేమి
ద్రాక్షారసమునకేమి మద్యమునకేమి నీవు కోరుదానికి
ఆ వెండి నిచ్చి, అక్కడ నీ దేవుడైన యెహోవా
సన్నిధిని భోజనముచేసి, నీవును నీ యింటివారును నీ
యింటనుండు లేవీయులును సంతోషింపవలెను. । లేవీ
యులను విడువకూడదు; నీ మధ్యను వారికి పాలైనను
స్వాస్థ్యమైనను లేదు.
నీ దేవుడైన యెహోవా నీవు చేయు నీ చేతి పని
అంతటిలోను నిన్ను ఆశీర్వదించునట్లు మూడేసి సం
త్సరముల కొకసారి, ఆ యేట నీకు కలిగిన పంటలో
పదియవ వంతంతయు బయటికి తెచ్చి నీ యింట
ఉంచవలెను. । అప్పుడు నీ మధ్యను పాలైనను స్వాస్థ్య
మైనను లేని లేవీయులును, నీ యింటనున్న పరదేశి

లును, తండ్రిలేనివారును, విధవరాండ్రును వచ్చి
భోజనముచేసి తృప్తిపొందుదురు.

15 ఏడవ సంవత్సరాంతమున గడువు ఇయ్యవలెను. ఆ
2 గడువురీతి యేదనగా । తన పొరుగువానికి అప్పిచ్చిన
ప్రతి అప్పులవాడు దానికి గడువు ఇయ్యవలెను. అది
యెహోవాకు గడువు అనబడును గనుక అప్పిచ్చిన
వాడు తన పొరుగువానినైనను తన సహోదరుని
3 నైనను నిర్బంధింపకూడదు. । పరదేశిని నిర్బంధింప
వచ్చును గాని నీ సహోదరుని యొద్దనున్న నీ
4 సొమ్మునకు నీవు గడువు ఇయ్యవలెను.। నీవు స్వాధీనపరచు
కొనునట్లు నీ దేవుడైన యెహోవా నీకు స్వాస్థ్య
ముగా ఇచ్చుచున్న దేశములో యెహోవా నిన్ను
5 నిశ్చయముగా ఆశీర్వదించును. । కావున నేడు నేను
నీకాజ్ఞాపించుచున్న యీ ఆజ్ఞలన్నిటిని అనుసరించి
నడుచుకొనుటకు నీ దేవుడైన యెహోవా మాటను
జాగ్రత్తగా వినినయెడల మీలో బీదలు ఉండనే
6 ఉండరు. । ఏలయనగా నీ దేవుడైన యెహోవా
నీతో చెప్పియున్నట్లు నిన్ను ఆశీర్వదించును గనుక
నీవు అనేక జనములకు అప్పిచ్చెదవుగాని అప్పుచేయవు;
అనేకజనములను ఏలుదువుగాని వారు నిన్ను ఏలరు.
7 నీ దేవుడైన యెహోవా నీకిచ్చుచున్న దేశమందు
నీ పురములలో ఎక్కడనైనను నీ సహోదరులలో
ఒక బీదవాడు ఉండినయెడల బీదవాడైన నీ సహో
దరుని కరుణింపకుండ నీ హృదయమును కఠినపరచు
8 కొనకూడదు. । నీ చెయ్యి ముడుచుకొనక వాని
కొరకు అవశ్యముగా చెయ్యి చాచి, వాని అక్కర
చొప్పున ఆ యక్కరకు చాలినంత అవశ్యముగా
9 వానికి అప్పియ్యవలెను. । విడుదల సంవత్సరమైన
యేడవసంవత్సరము సమీపమైనదని చెడ్డతలంపు నీ
మనస్సులో పుట్టక యుండునట్లు జాగ్రత్తపడుము.
బీదవాడైన నీ సహోదరునియెడల కటాక్షము
చూపక నీవు వానికేమియు ఇయ్యకపోయినపక్ష
మందు వాడొకవేళ నిన్నుగూర్చి యెహోవాకు
10 మొఱ్ఱపెట్టును; అది నీకు పాపమగును. । నీవు నిశ్చ
యముగా వాని కియ్యవలెను; వానికిచ్చినందుకు మన
స్సులో విచారపడకూడదు. ఇందువలన నీ దేవుడైన
యెహోవా నీ కార్యములన్నిటిలోను నీవు చేయు
ప్రయత్నములన్నిటిలోను నిన్ను ఆశీర్వదించును. ।
11 బీదలు దేశములో ఉండక మానరు. అందుచేత నేను
—నీ దేశములోనున్న నీ సహోదరులగు దీనులకును
బీదలకును అవశ్యముగా నీ చెయ్యి చాపవలెనని నీ
కాజ్ఞాపించుచున్నాను.
12 నీ సహోదరులలో హెబ్రీయుడే గాని హెబ్రీ
యురాలే గాని నీకు అమ్మబడి ఆరు సంవత్సరములు
నీకు దాస్యము చేసినయెడల ఏడవ సంవత్సరమున
వాని విడిపించి నీయొద్దనుండి పంపివేయవలెను. ।
అయితే వాని విడిపించి నీయొద్దనుండి పంపివేయు 13
నప్పుడు నీవు వట్టిచేతులతో వాని పంపివేయకూడదు. ।
నీవు ఐగుప్తుదేశములో దాసుడవై యున్నప్పుడు నీ 14
దేవుడైన యెహోవా నిన్ను విమోచించెనని జ్ఞాప
కముచేసికొని, నీ మందలోను నీ కళ్లములోను నీ
ద్రాక్షగానుగలోను కొంత అవశ్యముగా వానికియ్య
వలెను. నీ దేవుడైన యెహోవా నిన్ను ఆశీర్వదించి
నీకనుగ్రహించిన దానిలో కొంత వానికియ్యవలెను. ।
ఆ హేతువుచేతను నేను ఈ సంగతిని నేడు నీకాజ్ఞా 15
పించియున్నాను. । అయితే నీయొద్ద వానికి మేలు 16
కలిగినందున—నిన్నును నీ యింటివారిని ప్రేమించు
చున్నాను గనుక నేను నీయొద్దనుండి వెళ్లిపోనని
అతడు నీతో చెప్పినపక్షమున । నీవు శలాకను పట్టు 17
కొని, తలుపులోకి దిగునట్లుగా వాని చెవికి దాని
గుచ్చవలెను. ఆ తరువాత అతడు నిత్యము నీకు
దాసుడై యుండును. అలాగుననే నీవు నీ దాసికిని
చేయవలెను. । వానిని స్వతంత్రునిగా పోనిచ్చుట 18
కష్టమని నీవు అనుకొనకూడదు. ఏలయనగా వాడు ఆరు
సంవత్సరములు నీకు దాస్యము చేసినందున జీతగానికి
రావలసిన రెండు జీతముల లాభము నీకు కలిగెను.
ఆలాగైతే నీ దేవుడైన యెహోవా నీవు చేయువా
టన్నిటి విషయములో నిన్ను ఆశీర్వదించును.
నీ గోవులలోనేమి నీ గొఱ్ఱె మేకలలోనేమి తొలి 19
చూలు ప్రతి మగదానిని నీ దేవుడైన యెహోవాకు
ప్రతిష్ఠింపవలెను. నీ కోడెలలో తొలిచూలుదానితో
పనిచేయకూడదు. నీ గొఱ్ఱె మేకలలో తొలిచూలు
దాని బొచ్చు కత్తిరింపకూడదు. । యెహోవా యేర్ప 20
రచుకొను స్థలమున నీవును నీ యింటివారును నీ దేవు
డైన యెహోవా సన్నిధిని ప్రతి సంవత్సరము దాని
తినవలెను. । దానిలో లోపము, అనగా దానికి కుంటి 21
తనమైనను గుడ్డితనమైనను మరి ఏ చెడ్డ కళంకమైన
ఉండినయెడల నీ దేవుడైన యెహోవాకు దాని
అర్పింపకూడదు. । జింకను దుప్పిని తినునట్లు నీ పుర 22
ములలో పవిత్రాపవిత్రులు దాని తినవచ్చును. వాటి
రక్తమును మాత్రము నీవు తినకూడదు. నీళ్లవలె భూమి
మీద దాని పారబోయవలెను.

16 ఆబీబు నెలను ఆచరించి నీ దేవుడైన యెహోవాకు
పస్కాపండుగ జరిగింపవలెను. ఏలయనగా ఆబీబు
నెలలో రాత్రివేళ నీ దేవుడైన యెహోవా ఐగుప్తు
లోనుండి నిన్ను రప్పించెను. । యెహోవా తన 2
నామమునకు మందిరము ఏర్పరచుకొను స్థలము
లోనే నీ దేవుడైన యెహోవాకు పస్కాను ఆచ
రించి, గొఱ్ఱె మేకలలోగాని గోవులలోగాని బలి
అర్పింపవలెను. । పస్కా పండుగలో పొంగినదేని 3
నైనను తినకూడదు. నీవు త్వరపడి ఐగుప్తుదేశములో
నుండి వచ్చితివి గదా. నీవు ఐగుప్తుదేశములోనుండి

వచ్చిన దినమును నీ జీవితదినములన్నిటిలో జ్ఞాపకము
చేసికొనునట్లు, బాధను స్మరణకుతెచ్చు పొంగని ఆహార
4 మును ఏడు దినములు తినవలెను. । నీ ప్రాంతములన్ని
టిలో ఏడు దినములు పొంగినదేదైనను కనబడకూడదు.
మరియు నీవు మొదటితేది సాయంకాలమున వధించిన
దాని మాంసములో కొంచెమైనను ఉదయపర్యంతము
5 మిగిలియుండకూడదు. । నీ దేవుడైన యెహోవా
నీకిచ్చుచున్న పురములలో దేనియందైనను పస్కాపశు
6 వును వధింపకూడదు. । నీ దేవుడైన యెహోవా తన
నామమునకు నివాసస్థానముగా ఏర్పరచుకొను స్థలము
లోనే నీవు ఐగుప్తులోనుండి బయలుదేరి వచ్చిన వేళను,
అనగా సూర్యుడు అస్తమించు సాయంకాలమున
7 పస్కాపశువును వధించి । నీ దేవుడైన యెహోవా
ఏర్పరచుకొను స్థలమున దాని కాల్చి భుజించి, ఉదయ
మున తిరిగి నీ గుడారములకు వెళ్లవలెను. ఆరు దిన
8 ములు నీవు పొంగని రొట్టెలు తినవలెను. । ఏడవ
దినము నీ దేవుడైన యెహోవాకు ప్రతదినము, అం
దులో నీవు జీవనోపాధియైన యేపనియు చేయ
కూడదు.

9 ఏడు వారములను నీవు లెక్కింపవలెను. పంట
చేనిమీద కొడవలి మొదట వేసినది మొదలుకొని యేడు
10 వారములను లెక్కించి । నీ దేవుడైన యెహోవాకు
వారముల పండుగ ఆచరించుటకై నీ చేతనైనంత
స్వేచ్ఛార్పణమును సిద్ధపరచవలెను. నీ దేవుడైన
యెహోవా నిన్ను ఆశీర్వదించినకొలది దాని నియ్య
11 వలెను. । అప్పుడు నీవును నీ కుమారుడును నీ కుమార్తె
యును నీ దాసుడును నీ దాసియును నీ గ్రామముల
లోనున్న లేవీయులును నీ మధ్యనున్న పరదేశులును
తలిదండ్రులు లేనివారును విధవరాండ్రును నీ దేవు
డైన యెహోవా తన నామమునకు నివాసస్థానముగా
ఏర్పరచుకొను స్థలమున నీ దేవుడైన యెహోవా
12 సన్నిధిని సంతోషింపవలెను. । నీవు ఐగుప్తులో దాసు
డవైయుండిన సంగతిని జ్ఞాపకముచేసికొని, యీ కట్ట
డలను ఆచరించి జరుపుకొనవలెను.

13 నీ కళ్లములోనుండి ధాన్యమును నీ తొట్టిలోనుండి
రసమును సమకూర్చినప్పుడు పర్ణశాలల పండుగను
14 ఏడు దినములు ఆచరింపవలెను. । ఈ పండుగలో
నీవును నీ కుమారుడును నీ కుమార్తెయును నీ దాసు
డును నీ దాసియును నీ గ్రామములలోనున్న లేవీయు
లును పరదేశులును తలిదండ్రులు లేనివారును విధవ
15 రాండ్రును సంతోషింపవలెను. । నీ దేవుడైన
యెహోవా నీ పచ్చుబడి అంతటిలోను నీ చేతిపను
లన్నిటిలోను నిన్ను ఆశీర్వదించును గనుక యెహోవా
ఏర్పరచుకొను స్థలమున నీ దేవుడైన యెహోవాకు
ఏడుదినములు పండుగ చేయవలెను. నీవు నిశ్చయ
16 ముగా సంతోషింపవలెను. । ఏటికి మూడుమారులు,
అనగా పొంగని రొట్టెలపండుగలోను వారముల
పండుగలోను పర్ణశాలల పండుగలోను నీ దేవుడైన
యెహోవా ఏర్పరచుకొను స్థలమున నీ మగవారం
దరు ఆయన సన్నిధిని కనబడవలెను. । వారు వట్టి 17
చేతులతో యెహోవా సన్నిధిని కనబడక, నీ దేవు
డైన యెహోవా నీకనుగ్రహించిన దీవెనచొప్పున
ప్రతివాడును తన శక్తికొలది యియ్యవలెను.

నీ దేవుడైన యెహోవా నీకిచ్చుచున్న నీ గ్రామ 18
ములన్నిటను నీ గోత్రములకు న్యాయాధిపతులను
నాయకులను నీవు ఏర్పరచుకొనవలెను. వారు న్యాయ
మునుబట్టి జనులకు తీర్పుతీర్చవలెను. । నీవు న్యాయము 19
తప్పి తీర్పు తీర్చకూడదు; పక్షపాతము చేయకూడదు;
లంచము పుచ్చుకొనకూడదు. ఏలయనగా లంచము
జ్ఞానుల కన్నులకు గుడ్డితనము కలుగజేయును । నీతి 20
మంతుల మాటలకు అపార్థము పుట్టించును. నీవు
జీవించి నీ దేవుడైన యెహోవా నీకిచ్చుచున్న దేశ
మును స్వాధీనపరచుకొనునట్లు కేవలము న్యాయమునే
అనుసరించి నడుచుకొనవలెను.

నీ దేవుడైన యెహోవాకు నీవు కట్టు బలిపీఠము 21
సమీపమున ఏవిధమైన వృక్షమును నాటకూడదు,
దేవతాస్తంభమును ఏర్పరచకూడదు. । నీ దేవుడైన 22
యెహోవా విగ్రహమును ద్వేషించువాడు గనుక
నీవు ఏ విగ్రహమునైనను నిలువబెట్టకూడదు.

నీవు కళంకమైనను మరి ఏ అవలక్షణమైననుగల 17
యెద్దునేగాని గొఱ్ఱె మేకలనేగాని నీ దేవుడైన
యెహోవాకు బలిగా అర్పింపకూడదు; అది నీ దేవు
డైన యెహోవాకు హేయము.

నీ దేవుడైన యెహోవా నిబంధనను మీరి ఆయన 2
దృష్టికి చెడ్డదానిని చేయుచు, నేనిచ్చిన ఆజ్ఞకు విరోధ
ముగా అన్యదేవతలకు, అనగా సూర్యునికైనను చం
ద్రునికైనను ఆకాశ నక్షత్రములలోని దేనికైనను
నమస్కరించి మ్రొక్కు పురుషుడేగాని స్త్రీయేగాని నీ
దేవుడైన యెహోవా నీకిచ్చుచున్న నీ గ్రామము
లలో దేనియందైనను నీ మధ్య కనబడినప్పుడు । అది 3
నీకు తెలుపబడిన తరువాత నీవు విని బాగుగా విచా
రణ చేయవలెను. అది నిజమైనయెడల, అనగా అట్టి
హేయక్రియ ఇశ్రాయేలీయులలో జరిగియుండుట
వాస్తవమైనయెడల । ఆ చెడ్డకార్యము చేసిన పురు 4
షునిగాని స్త్రీనిగాని నీ గ్రామముల వెలపలికి తీసికొని
పోయి రాళ్లతో చావగొట్టవలెను. । ఇద్దరు ముగ్గురు 5
సాక్షుల మాటమీదనే చావతగినవానికి మరణశిక్ష
విధింపవలెను. । ఒక్క సాక్షి మాటమీద వానికి 6
విధింపకూడదు. । వాని చంపుటకు మొదట సాక్షు 7
లును తరువాత జనులందరును వానిమీద చేతులు
వేయవలెను. అట్లు నీ మధ్యనుండి ఆ చెడుతనమును
పరిహరింపవలెను.

8 హత్యకు హత్యకు వ్యాజ్యమునకు వ్యాజ్యమునకు
దెబ్బకు దెబ్బకు నీ గ్రామములలో వివాదములు
పుట్టగా వీటి భేదము కనుగొనుట నీకు సాధ్యముకాని
9 యెడల । నీవు లేచి నీ దేవుడైన యెహోవా ఏర్పరచు
కొను స్థలమునకు వెళ్లి యాజకులైన లేవీయులను ఆ
దినములలోనుండు న్యాయాధిపతిని విచారింపవలెను.
వారు దానికి తగిన తీర్పు నీకు తెలియజెప్పుదురు. ।
10 యెహోవా ఏర్పరచుకొను స్థలమున వారు నీకు
తెలుపు తీర్పుచొప్పున నీవు జరిగించి వారు నీకు తేట
పరచు అన్నిటిచొప్పున తీర్పుతీర్చుటకు జాగ్రత్తపడ
11 వలెను. । వారు నీకు తేటపరచు భావముచొప్పునను
వారు నీతో చెప్పు తీర్పుచొప్పునను నీవు తీర్చవలెను.
వారు నీకు తెలుపు మాటనుండి కుడికిగాని యెడమకు
12 గాని నీవు తిరుగకూడదు. । మరియు నెవడైనను
మూర్ఖించి అక్కడ నీ దేవుడైన యెహోవాకు పరి
చర్యచేయుటకు నిలుచు యాజకుని మాటనేగాని ఆ
న్యాయాధిపతి మాటనేగాని విననొల్లనియెడల వాడు
చావవలెను. అట్లు చెడుతనమును ఇశ్రాయేలీయులలో
13 నుండి పరిహరింపవలెను. । అప్పుడు జనులందరు విని
భయపడి మూర్ఖవర్తనము విడిచిపెట్టెదరు.
14 నీ దేవుడైన యెహోవా నీకిచ్చుచున్న దేశమున
నీవు ప్రవేశించి దాని స్వాధీనపరచుకొని అందులో
నివసించి — నా చుట్టునున్న సమస్త జనములవలె నా
మీద రాజును నియమించుకొందుననుకొనినయెడల,
నీ దేవుడైన యెహోవా ఏర్పరచువానిని అవశ్యముగా
15 నీమీద రాజుగా నియమించుకొనవలెను. । నీ సహో
దరులలోనే ఒకని నీమీద రాజుగా నియమించుకొన
వలెను. నీ సహోదరుడుకాని అన్యుని నీమీద నియ
16 మించుకొనకూడదు. । అతడు గుర్రములను విస్తార
ముగా సంపాదించుకొనవలదు; తాను గుర్రములను
హెచ్చుగా సంపాదించుటకుగాను జనులను ఐగుప్తుకు
తిరిగి వెళ్లనియ్యకూడదు; ఏలయనగా యెహోవా—
ఇకమీదట మీరు ఈ త్రోవను వెళ్లకూడదని మీతో
17 చెప్పెను. । తన హృదయము తొలగిపోకుండునట్లు
అతడు అనేక స్త్రీలను వివాహము చేసికొనకూడదు;
వెండి బంగారములను అతడు తనకొరకు బహుగా
18 విస్తరింపజేసికొనకూడదు. । మరియు అతడు రాజ్య
సింహాసనమందు ఆసీనుడైన తరువాత లేవీయులైన
యాజకుల స్వాధీనములోనున్న గ్రంథమును చూచి
ఆ ధర్మశాస్త్రమునకు ఒక ప్రతిని తనకొరకు వ్రాసికొన
19 వలెను; । అది అతనియొద్ద ఉండవలెను. తన రాజ్య
20 మందు తానును తన కుమారులును ఇశ్రాయేలు మధ్యను
21 దీర్ఘాయుష్మంతులగుటకై । తాను తన సహోదరుల
22 మీద గర్వించి, యీ ధర్మమును విడిచిపెట్టి కుడికిగాని
యెడమకుగాని తాను తొలగకయుండునట్లు తన దేవు
డైన యెహోవాకు భయపడి యీ ధర్మశాస్త్ర వాక్య
ములన్నిటిని యీ కట్టడలను అనుసరించి నడువ నేర్చు
కొనుటకు అతడు తాను బ్రదుకు దినములన్నిటను ఆ
గ్రంథమును చదువుచుండవలెను.

యాజకులైన లేవీయులకు, అనగా లేవిగోత్రి 18
యులకందరికి ఇశ్రాయేలీయులలో పాలైనను స్వాస్థ్య
మైనను ఉండదు, వారు యెహోవా హోమద్రవ్య
ములను తిందురు; అది వారి హక్కు. । వారి సహో 2
దరులతో వారికి స్వాస్థ్యము కలుగదు; యెహోవా
వారితో చెప్పినట్లు ఆయనే వారికి స్వాస్థ్యము.
జనులవలన, అనగా ఎద్దుగాని గొఱ్ఱెగాని మేకగాని
బలిగా అర్పించువారివలన । యాజకులు పొందవలసిన 3
దేదనగా, కుడిజబ్బను రెండు దవడలను పొట్టను యాజ
కుని కియ్యవలెను. । నీ ధాన్యములోను నీ ద్రాక్షా 4
రసములోను నీ నూనెలోను ప్రథమ ఫలములను నీ
గొఱ్ఱెల మొదటి బొచ్చును అతనికియ్యవలెను. ।
నిత్యము యెహోవా నామమున నిలిచి సేవచేయు 5
టకు నీ గోత్రములన్నిటిలోను అతనిని అతని సంతతి
వారిని నీ దేవుడైన యెహోవా ఏర్పరచుకొని
యున్నాడు.

ఒక లేవీయుడు ఇశ్రాయేలీయుల దేశమున తాను 6
విదేశిగా నివసించిన నీ గ్రామములలో ఒకదానినుండి
యెహోవా ఏర్పరచుకొను స్థలమునకు మిక్కిలి
మక్కువతో వచ్చినప్పుడు । అక్కడ యెహోవా 7
సన్నిధిని నిలుచు లేవీయులైన తన గోత్రపువారు
చేయునట్లు అతడు తన దేవుడైన యెహోవా నామ
మున సేవచేయవలెను. । అమ్మబడిన తన పిత్రార్జితము 8
వలన తనకు వచ్చినది గాక అతడు ఇతరులవలె వంతు
అనుభవింపవలెను.

నీ దేవుడైన యెహోవా నీకిచ్చుచున్న దేశమున 9
నీవు ప్రవేశించిన తరువాత ఆ జనముల హేయకృత్య
ములను నీవు చేయ నేర్చుకొనకూడదు. । తన కుమారు 10
నైనను తన కుమార్తెనైనను అగ్నిగుండ దాటించువాని
నైనను, శకునముచెప్పు సోదెగానినైనను, మేఘశకున
ములనుగాని సర్పశకునములనుగాని చెప్పువానినైనను,
చిల్లంగివానినైనను, మాంత్రికునినైనను, ఇంద్రజాలకుని
నైనను । కర్ణపిశాచి నడుగువానినైనను, దయ్యముల 11
యొద్ద విచారణచేయువానినైనను మీ మధ్య ఉండ
నియ్యకూడదు. । వీటిని చేయు ప్రతివాడును 12
యెహోవాకు హేయుడు. ఆ హేయములైనవాటిని
బట్టి నీ దేవుడైన యెహోవా నీ యెదుటనుండి ఆ
జనములను వెళ్లగొట్టుచున్నాడు. । నీవు నీ దేవుడైన 13
యెహోవాయొద్ద యథార్థపరుడవై యుండవలెను. ।
నీవు స్వాధీనపరచుకొనబోవు జనములు మేఘశకున 14
ములను చెప్పువారి మాటను సోదెగాండ్ల మాటను
విందురు. నీ దేవుడైన యెహోవా నిన్ను అలాగున
చేయనియ్యడు. । హోరేబులో ఆ సమాజదినమున 15

నీవు — నేను చావకయుండునట్లు మళ్లీ నా దేవుడైన
యెహోవా స్వరము నాకు వినబడకుండును గాక, ।
16 ఈ గొప్ప అగ్ని నాకు ఇకను కనబడకుండుగాక అని
చెప్పితివి. ఆ సమయమున నీ దేవుడైన యెహోవాను
నీవు అడిగిన వాటన్నిటిచొప్పున నీ దేవుడైన
యెహోవా నీ మధ్యను నావంటి ప్రవక్తను నీ సహో
దరులలో నీకొరకు పుట్టించును, ఆయన మాట నీవు
17 వినవలెను. । మరియు యెహోవా నాతో ఇట్లనెను
18 —వారు చెప్పిన మాట మంచిది; । వారి సహోదరు
లలోనుండి నీవంటి ప్రవక్తను వారికొరకు పుట్టించెదను;
అతని నోట నా మాటల నుంచుదును; నేను అతని
కాజ్ఞాపించునది యావత్తును అతడు వారితో చెప్పును.।
19 అతడు నా నామమున చెప్పు నా మాటలను వినని
20 వానిని దానిగూర్చి విచారణచేసెదను. । అంతేకాదు,
ఏ ప్రవక్తయు అహంకారము పూని, నేను చెప్పుమని
తన కాజ్ఞాపించనిమాటను నా నామమున చెప్పునో,
యితరదేవతల నామమున చెప్పునో ఆ ప్రవక్తయును
21 చావవలెను. । మరియు — ఏదొకమాట యెహోవా
చెప్పినదికాదని మేమెట్లు తెలిసికొనగలమని మీరను
22 కొనినయెడల, । ప్రవక్త యెహోవా నామమున
చెప్పినప్పుడు ఆ మాట జరగకపోయిన పక్షమునను
ఎన్నడును నెరవేరకపోయిన పక్షమునను అది
యెహోవా చెప్పిన మాట కాదు, ఆ ప్రవక్త అహం
కారముచేతనే దాని చెప్పెను గనుక దానికి భయ
పడవద్దు.

**19** నీ దేవుడైన యెహోవా యెవరి దేశమును నీకిచ్చు
చున్నాడో ఆ జనములను నీ దేవుడైన యెహోవా
నాశనముచేసిన తరువాత నీవు వారి దేశమును స్వాధీన
పరచుకొని, వారి పట్టణములలోను వారి యిండ్లలోను
2 నివసించునప్పుడు । నీవు స్వాధీనపరచుకొనునట్లు నీ
దేవుడైన యెహోవా నీకిచ్చుచున్న దేశములో
3 మూడు పురములను వేరుపరచవలెను. । ప్రతి నరహంత
కుడు పారిపోవునట్లుగా నీవు త్రోవను ఏర్పరచుకొని,
నీవు స్వాధీనపరచుకొనునట్లు నీ దేవుడైన యెహోవా
నీకిచ్చుచున్న దేశముయొక్క సరిహద్దులలోగా ఉన్న
4 పురములకు మూడు భాగములు చేయవలెను. । పారి
పోయి బ్రదుకగల నరహంతకునిగూర్చిన పద్ధతి యే
దనగా, ఒకడు అంతకుముందు తన పొరుగువానియందు
5 పగపట్టక । పొరబాటున వాని చంపిన పక్షమున, అన
గా ఒకడు చెట్లు నరుకుటకు తన పొరుగువానితో
కూడ అడవికిపోయి చెట్లు నరుకుటకు తన చేతితో
గొడ్డలిదెబ్బ వేసినప్పుడు, గొడ్డలి పిడి ఊడి వాని
పొరుగువానికి తగిలి వాడు చనిపోయిన పక్షమున,
వాడు అంతకుముందు తన పొరుగువానియందు పగ
6 పట్టలేదు గనుక । వానికి మరణదండన విధిలేదు.
అయితే హత్యవిషయములో ప్రతిహత్యచేయువాని
మనస్సు కోపముతో మండుచుండగా, మార్గము దూర
మైనందున వాడు నరహంతకుని తరిమి వాని కలిసికొని
వాని చావగొట్టకయుండునట్లు ఆ నరహంతకుడు పారి
పోయి ఆ పురములలో ఒకదానియందు జొచ్చి బ్రదు
కును. । అందుచేతను—మూడు పురములను నీకు ఏర్ప 7
రచుకొనవలెనని నేను నీకాజ్ఞాపించుచున్నాను. । మరి 8
యు నీ దేవుడైన యెహోవా నీ పితరులతో ప్రమా
ణముచేసినట్లు ఆయన నీ సరిహద్దులను విశాలపరచి, నీ
పితరులకు ఇచ్చెదనని చెప్పిన సమస్తదేశమును నీకిచ్చిన
యెడల నీవు నీ దేవుడైన యెహోవాను ప్రేమిం
చుచు । నిత్యమును ఆయన మార్గములలో నడుచుటకు 9
నేడు నేను నీకాజ్ఞాపించిన యీ ఆజ్ఞలన్నిటిని అనుస
రించి నడుచుచు, ఈ మూడు పురములు గాక మరి
మూడు పురములను ఏర్పరచుకొనవలెను. । ప్రాణము 10
తీసిన దోషము నీమీద మోపబడకుండునట్లు నీ దేవు
డైన యెహోవా నీకు స్వాస్థ్యముగా ఇచ్చుచున్న నీ
దేశమున నిర్దోషియొక్క ప్రాణము తీయకుండవలెను. ।
ఒకడు తన పొరుగువానియందు పగపట్టి వానికొరకు 11
పొంచియుండి వానిమీదపడి వాడు చచ్చునట్లు కొట్టి।
ఆ పురములలో ఒకదానిలోకి పారిపోయినయెడల, 12
వాని ఊరిపెద్దలు మనుష్యులను పంపి అక్కడనుండి
వాని రప్పించి వాని చంపుటకై హత్యవిషయములో
ప్రతిహత్యచేయువాని చేతికి వాని నప్పగింపవలెను. ।
వాని కటాక్షింపకూడదు; నీకు మేలుకలుగునట్లు ఇశ్రా 13
యేలీయుల మధ్యనుండి నిర్దోషి ప్రాణవిషయమైన
దోషమును పరిహరింపవలెను.

నీవు స్వాధీనపరచుకొనునట్లు నీ దేవుడైన 14
యెహోవా నీకిచ్చుచున్న దేశములో నీకు కలుగు నీ
స్వాస్థ్యములో పూర్వికులు నియమించిన నీ పొరుగు
వాని సరిహద్దురాతిని నీవు తీసివేయకూడదు.

ఒకడు చేయు సమస్త పాపములలో ఏ అపరాధ 15
మునుగూర్చియే గాని యే పాపమునుగూర్చియే గాని
ఒక సాక్షియొక్క సాక్ష్యమును అంగీకరింపకూడదు.
ఇద్దరు సాక్షులమాటమీదనైనను ముగ్గురు సాక్షుల
మాటమీదనైనను ప్రతి సంగతి స్థిరపరచబడును. ।
అన్యాయపు సాక్ష్యము ఒకనిమీద చెప్పుటకు ఒకడు 16
నిలువబడి నేరము మోపుటకై అబద్ధమాడినయెడల ।
ఆ వివాదముగల యిద్దరు మనుష్యులు యెహోవా 17
సన్నిధిని, అనగా ఆ కాలములోనున్న యాజకుల
యెదుటను న్యాయాధిపతుల యెదుటను నిలువవలె
ను. । ఆ న్యాయాధిపతులు బాగుగా విమర్శించిన తరు 18
వాత వాని సాక్ష్యము అబద్ధసాక్ష్యమై తన సహో
దరునిమీద వాడు అబద్ధసాక్ష్యము చెప్పిన సంగతి
వెల్లడియైనయెడల, వాడు తన సహోదరునికి చేయ
తలంచినట్లే వానికి చేయవలెను. । అట్లు మీ మధ్య 19
నుండి ఆ చెడుతనమును పరిహరించుదురు. । మిగిలిన 20

వారు విని భయపడి నీ దేశమున అట్టి దుష్కా-
21 ర్యము ఇకను చేయకుందురు. । నీవు ఎవనిని కటాక్షింప
కూడదు; ప్రాణమునకు ప్రాణము కంటికి కన్ను పం
టికి పల్లు చేతికి చెయ్యి కాలికి కాలు మీకు విధి.
**20** నీవు నీ శత్రువులతో యుద్ధమునకు పోయి గుఱ్ఱ
ములను రథములను మీకంటె విస్తారమైన జనమును
చూచునప్పుడు వారికి భయపడవద్దు; ఐగుప్తుదేశములో
నుండి నిన్ను రప్పించిన నీ దేవుడైన యెహోవా నీకు
2 తోడైయుండును. । అంతేకాదు, మీరు యుద్ధమునకు
సమీపించునప్పుడు యాజకుడు దగ్గరకు వచ్చి ప్రజ
3 లతో ఈలాగు చెప్పవలెను ।— ఇశ్రాయేలీయులారా
వినుడి; నేడు మీరు మీ శత్రువులతో యుద్ధము
చేయుటకు సమీపించుచున్నారు. మీ హృదయములు
4 జంకనియ్యకుడి, భయపడకుడి, । వణకకుడి, వారి
ముఖము చూచి బెదరకుడి, మీకొరకు మీ శత్రు
వులతో యుద్ధము చేసి మిమ్మును రక్షించువాడు మీ
5 దేవుడైన యెహోవాయే. । మరియు నాయకులు
జనులతో చెప్పవలసినదేమనగా, క్రొత్త యిల్లు కట్టు
కొనినవాడు గృహప్రవేశము కాకమునుపే యుద్ధ
ములో చనిపోయినయెడల వేరొకడు దానిలో ప్రవే
శించును గనుక అట్టివాడు తన యింటికి తిరిగి వెళ్ల
6 వచ్చును. । ద్రాక్షతోట వేసి యింక దాని పండ్లు తినక
ఒకడు యుద్ధములో చనిపోయినయెడల వేరొకడు
దాని పండ్లు తినును గనుక అట్టివాడును తన యింటికి
7 తిరిగి వెళ్లవచ్చును. । ఒకడు స్త్రీని ప్రధానముచేసికొని
ఆమెను ఇంక పరిగ్రహింపకమునుపే యుద్ధములో
చనిపోయినయెడల వేరొకడు ఆమెను పరిగ్రహిం
చును గనుక అట్టివాడును తన యింటికి తిరిగి వెళ్ల
8 వచ్చును. । నాయకులు జనులను చూచి — ఎవడు
భయపడి మెత్తని గుండెగలవాడగునో వాడు తాను
అధైర్యపడిన రీతిగా తన సహోదరుల గుండెలు
అధైర్యపరచకుండునట్లు తన యింటికి తిరిగి వెళ్లవచ్చు
9 నని చెప్పవలెను. । నాయకులు జనులతో మాటలా
డుట చాలించిన తరువాత జనులను నడిపించుటకు
సేనాధిపతులను నియమింపవలెను.
10 యుద్ధము చేయుటకు మీరొక పురముమీదికి
సమీపించునప్పుడు సమాధానము నిమిత్తము రాయ
భారమును పంపవలెను. సమాధానమని అది నీకు ఉత్తర
11 మిచ్చి । గుమ్మములను తెరచినయెడల దానిలోనున్న
జనులందరు నీకు పన్ను చెల్లించి నీ దాసులగుదురు. ।
12 అది మీతో సమాధానపడక యుద్ధమే మంచిదని
13 యెంచినయెడల దాని ముట్టడివేయుడి. । నీ దేవుడైన
యెహోవా దాని నీ చేతికప్పగించునప్పుడు దాని
లోని మగవారినందరిని కత్తివాత హతముచేయవలెను.।
14 అయితే స్త్రీలను చిన్నవారిని పశువులను ఆ పురములో
నున్నది యావత్తును దాని కొల్లసొమ్మంతటిని నీవు తీసి
కొనవచ్చును; నీ దేవుడైన యెహోవా నీకిచ్చిన నీ
శత్రువుల కొల్లసొమ్మును నీవు అనుభవించుదువు. । ఈ 15
జనముల పురములు గాక నీకు బహుదూరముగా ఉం 18
డిన సమస్త పురములకు మాత్రమే యీలాగున చేయ
వలెను. అయితే నీ దేవుడైన యెహోవా స్వాస్థ్య
ముగా నీకిచ్చుచున్న యీ జనముల పురములలో
ఊపిరిగల దేనిని బ్రదుకనియ్యకూడదు. వీరు, అనగా
హిత్తీయులు అమోరీయులు కనానీయులు పెరిజ్జీయులు
హివ్వీయులు యెబూసీయులనువారు తమ తమ దేవ
తల విషయమై చేసిన సమస్త హేయకృత్యములరీతిగా
మీరు చేసి, నీ దేవుడైన యెహోవాకు విరోధముగా
పాపము చేయుటకు వారు మీకు నేర్పకుండునట్లు
నీ దేవుడైన యెహోవా నీకాజ్ఞాపించిన ప్రకార
ముగా వారిని నిర్మూలము చేయవలెను.
నీవు ఒక పురమును లోపరచుకొనుటకు దానిమీద 19
యుద్ధము చేయుచు అనేక దినములు ముట్టడివేయు
నప్పుడు, దాని చెట్లు గొడ్డలిచేత పాడుచేయకూడదు;
వాటి పండ్లు తినవచ్చునుగాని వాటిని నరికివేయ
కూడదు; నీవు వాటిని ముట్టడించుటకు పొలములోని
చెట్లు నరులా? అట్టి చెట్లను నీవు కొట్టకూడదు. । ఏ 20
చెట్లు తినతగిన ఫలములనిచ్చునవి కావని నీవెరుగు
దువో వాటిని పాడుచేసి నరికి, నీతో యుద్ధముచేయు
పురము పడువరకు వాటితో దానికి ఎదురుగా ముట్టడి
దిబ్బ కట్టవచ్చును.
నీ దేవుడైన యెహోవా నీకిచ్చుచున్న దేశ **21**
ములో ఒకడు చంపబడి పొలములో పడియుండుట
కనబడునప్పుడు, వాని చంపినవాడెవడో అది తెలి
యకయుండిన పక్షమున । నీ పెద్దలును నీ న్యాయాధి 2
పతులును వచ్చి చంపబడినవాని చుట్టునున్న పురముల
దూరము కొలిపింపవలెను. । ఏ ఊరు ఆ శవమునకు 3
సమీపముగా ఉండునో ఆ ఊరి పెద్దలు ఏ పనికిని
పెట్టబడక కాడి యీడ్వని పెయ్యను తీసికొని । దున్న 4
బడకయు విత్తబడకయునున్న యేటి లోయలోనికి ఆ
పెయ్యను తోలుకొనిపోయి అక్కడ, అనగా ఆ
లోయలో ఆ పెయ్య మెడను విరుగతియ్యవలెను. ।
అప్పుడు యాజకులైన లేవీయులు దగ్గరకు రావలెను. 5
యెహోవాను సేవించి యెహోవా నామమున
దీవించుటకు ఆయన వారిని ఏర్పరచుకొనెను గనుక
వారి నోటిమాటచేత ప్రతి వివాదమును దెబ్బవిషయ
మైన ప్రతి వ్యాజ్యమును విమర్శింపబడవలెను. ।
అప్పుడు ఆ శవమునకు సమీపమందున్న ఆ ఊరి 6
పెద్దలందరు ఆ యేటిలోయలో మెడ విరుగతీయ
బడిన ఆ పెయ్యపైని తమ చేతులు కడుగుకొని ।—
మా చేతులు ఈ రక్తమును చిందింపలేదు, మా కన్నులు 7
ఇది చూడలేదు. । యెహోవా, నీవు విమోచించిన 8
నీ జనమైన ఇశ్రాయేలీయుల నిమిత్తము ప్రాయశ్చి

త్తము కలుగనిమ్ము; నీ జనమైన ఇశ్రాయేలీయులమీద
నిర్దోషియొక్క ప్రాణము తీసిన దోషమును మోప
వద్దని చెప్పవలెను. అప్పుడు ప్రాణముతీసిన దోషము
9 నకు వారినిమిత్తము ప్రాయశ్చిత్తము కలుగును. । అట్లు
నీవు యెహోవా దృష్టికి యథార్థమైనది చేయు
నప్పుడు నీ మధ్యనుండి నిర్దోషియొక్క ప్రాణము
విషయమైన దోషమును పరిహరించెదవు.

10 నీవు నీ శత్రువులతో యుద్ధముచేయ బోవునప్పుడు
నీ దేవుడైన యెహోవా నీ చేతికి వారిని అప్పగించిన
11 తరువాత । వారిని చెరపట్టి ఆ చెరపట్టబడినవారిలో
రూపవతియైనదాని చూచి ఆమెను మోహించి ఆమెను
12 పెండ్లిచేసికొన మనస్సయి । నీ యింట ఆమెను చేర్చు
కొనిన తరువాత ఆమె తలక్షౌరము చేయించుకొని ।
13 గోళ్లను తీయించుకొని తన చెరబట్టలు తీసివేసి నీ
యింట నివసించి యొక నెలదినములు తన తలిదండ్రు
లనుగూర్చి ప్రలాపనచేయుటకు నీవు ఆమెకు సెల
వియ్యవలెను. తరువాత నీవు ఆమెయొద్దకు పోయి
ఆమెను పెండ్లిచేసికొనవచ్చును; ఆమె నీకు భార్య
14 యగును. । నీవు ఆమెవలన సంతుష్టి నొందనియెడల
ఆమె మనస్సువచ్చిన చోటికి ఆమెను సాగనంపవలెనే
గాని ఆమెను ఎంతమాత్రమును వెండికి అమ్మకూడదు;
నీవు ఆమెను అవమానపరచితివి గనుక ఆమెను దాసి
వలె చూడకూడదు.

15 ప్రేమింపబడునదొకతెయు ద్వేషింపబడునదొక
తెయు ఇద్దరు భార్యలు ఒక పురుషునికి కలిగియుండి,
ప్రేమింపబడినదియు ద్వేషింపబడినదియు వానివలన
16 బిడ్డలు కని । జ్యేష్ఠకుమారుడు ద్వేషింపబడినదాని కొడు
కైనయెడల, తండ్రి తనకు కలిగినదానిని తన కుమా
రులకు స్వాస్థ్యముగా ఇచ్చునాడు ద్వేషింపబడినదాని
కుమారుడైన జ్యేష్ఠునికి మారుగా ప్రేమింపబడినదాని
17 కుమారుని జ్యేష్ఠునిగా చేయకూడదు. । ద్వేషింపబడిన
దాని కుమారునికి తండ్రి తన ఆస్తి అంతటిలో రెట్టింపు
భాగమిచ్చి వానినే జ్యేష్ఠునిగా ఎంచవలెను. వీడు వాని
బలప్రారంభము గనుక జ్యేష్ఠత్వాధికారము వీనిదే.

18 ఒకని కుమారుడు మొండివాడై తిరుగబడి తండ్రి
మాటగాని తల్లిమాటగాని వినకయుండి, వారు అతని
శిక్షించిన తరువాతయును అతడు వారికి విధేయుడు
19 కాకపోయినయెడల । అతని తలిదండ్రులు అతని
పట్టుకొని ఊరి గవినియొద్ద కూర్చుండు పెద్దలయొద్దకు
20 అతని తీసికొనివచ్చి । —మా కుమారుడైన వీడు మొండి
వాడై తిరుగబడియున్నాడు; మా మాట వినక తిండి
బోతును త్రాగుబోతును ఆయెనని ఊరి పెద్దలతో
21 చెప్పవలెను. । అప్పుడు ఊరి ప్రజలందరు రాళ్లతో
అతని చావగొట్టవలెను. అట్లు ఆ చెడుతనమును నీ
మధ్యనుండి పరిహరించుదువు. అప్పుడు ఇశ్రాయేలీ
యులందరు విని భయపడుదురు.

మరణశిక్షకు తగిన పాపము ఒకడు చేయగా అతని 2
చంపి మ్రానిమీద వ్రేలాడదీసినయెడల । అతని శవము 2
రాత్రివేళ ఆ మ్రానిమీద నిలువకూడదు. వ్రేలాడ
దీయబడినవాడు దేవునికి శాపగ్రస్తుడు గనుక నీ దేవు
డైన యెహోవా స్వాస్థ్యముగా నీకిచ్చుచున్న దేశ
మును నీవు అపవిత్రపరచకుండునట్లు అగత్యముగా
ఆ దినమున వానిని పాతిపెట్టవలెను.

నీ సహోదరుని యెద్దుగాని గొఱ్ఱగాని త్రోవ **22**
తప్పిపోవుట చూచినయెడల నీవు వాటిని చూడనట్లు
కన్నులు మూసికొనక అగత్యముగా వాటిని నీ సహో
దరునియొద్దకు మళ్లింపవలెను. । నీ సహోదరుడు నీ 2
దగ్గర లేకపోయినయెడలను, నీవు అతని నెరుగక
పోయినయెడలను దానిని నీ యింటికి తోలుకొని
పోవలెను. నీ సహోదరుడు దాని వెదకుచువచ్చు
వరకు అది నీ యొద్దనుండవలెను, అప్పుడు అతనికి
దాని మరల అప్పగింపవలెను. । అతని గాడిదెను 3
గూర్చియు వస్త్రమును గూర్చియు నీవు ఆలాగుననే
చేయవలెను. నీ సహోదరుడు పోగొట్టుకొనినది
ఏదైనను నీకు దొరికినయెడల అతడు పోగొట్టుకొనిన
దానినిగూర్చి ఆలాగుననే చేయవలెను; నీవు దాని
చూచి చూడనట్టుగా ఉండకూడదు. । నీ సహో 4
దరుని గాడిదెగాని యెద్దుగాని త్రోవలో పడియుం
డుట నీవు చూచినయెడల వాటిని చూడనట్లు కన్నులు
మూసికొనక వాటిని లేవనెత్తుటకు అగత్యముగా సహా
యము చేయవలెను.

స్త్రీ పురుషవేషము వేసికొనకూడదు; పురుషుడు 5
స్త్రీ వేషము ధరింపకూడదు; ఆలాగు చేయువారందరు
నీ దేవుడైన యెహోవాకు హేయులు.

గుడ్లయినను పిల్లలైనను గల పక్షిగూడు చెట్టుమీదనే 6
గాని నేలమీదనేగాని త్రోవలోనేగాని నీకు కనబడిన
యెడల తల్లి ఆ పిల్లలనైనను ఆ గుడ్లనైనను పొదిగి
యున్న పక్షమందు పిల్లలతోకూడ తల్లిని తీసికొనక
నీకు మేలు కలుగునట్లును । నీవు దీర్ఘాయుష్మంతుడ 7
వగునట్లును అగత్యముగా తల్లిని విడిచి పిల్లలనే తీసి
కొనవచ్చును.

క్రొత్త యిల్లు కట్టించునప్పుడు దానిమీదనుండి 8
యెవడైనను పడుటవలన నీ యింటిమీదికి హత్యా
దోషము రాకుండుటకై నీ యింటి పైకప్పుకు చుట్టు
పిట్టగోడ కట్టింపవలెను. । నీవు విత్తు విత్తనముల పైరును 9
నీ ద్రాక్షతోట వచ్చుబడియు ప్రతిష్ఠితములు కాకుం
డునట్లు నీ ద్రాక్షతోటలో వివిధమైనవాటిని విత్త
కూడదు.

ఎద్దును గాడిదెను జతచేసి భూమిని దున్నకూడదు. । 10
ఉన్నియు జనుపనారయు కలిపి నేసిన బట్టను వేసి 11
కొనకూడదు.

నీవు కప్పుకొను నీ బట్ట నాలుగు చెంగులకు అల్లి
కలను చేసికొనవలెను.

ఒకడు స్త్రీని పెండ్లిచేసికొని ఆమెను కూడిన తరు
వాత ఆమెను ఒల్లక ఆమెమీద అవమానక్రియలు
మోపి । ఆమె చెడ్డదని ప్రచురపరచి—ఈ స్త్రీని నేను
పరిగ్రహించి యీమె దగ్గరకు వచ్చినప్పుడు ఈమె
యందు కన్యాత్వము నాకు కనబడలేదని చెప్పినయెడల।
ఆ చిన్నదాని తలిదండ్రులు ద్వారమందున్న ఆ ఊరి
పెద్దలయొద్దకు ఆ చిన్నదాని కన్యాత్వలక్షణములను
తీసికొని రావలెను. । అప్పుడు ఆ చిన్నదాని తండ్రి—
నా కుమార్తెను ఈ మనుష్యునికి పెండ్లిచేయగా ।
ఇదిగో ఇతడీమెనొల్లక—నీ కుమార్తెయందు కన్యాత్వము
నాకు కనబడలేదనియు అవమానక్రియలు చేసిన
దనియు ఆమెమీద నింద మోపెను; అయితే నా
కుమార్తె కన్యాత్వమునకు గురుతులివే అని పెద్దలతో
చెప్పి పట్టణపు పెద్దలయెదుట ఆ బట్టను పరచవలెను.।
అప్పుడు ఆ ఊరి పెద్దలు ఆ మనుష్యుని పట్టుకొని
శిక్షించి నూరు వెండి రూకలు అపరాధముగా వాని
యొద్ద తీసికొని । ఆ చిన్నదాని తండ్రికియ్యవలెను.
ఏలయనగా అతడు ఇశ్రాయేలీయురాలైన కన్యకను
అవమానపరచియున్నాడు. అప్పుడామె అతనికి
భార్యయై యుండును; అతడు తాను బ్రదుకు దినము
లన్నిటను ఆమెను విడువకూడదు. । అయితే ఆ మాట
నిజమైనయెడల, అనగా ఆ చిన్నదానియందు కన్యకా
లక్షణములు కనబడనిపక్షమందు । వారు ఆమె తండ్రి
యింటియొద్దకు ఆ చిన్నదాని తీసికొని రావలెను.
అప్పుడు ఆమె ఊరివారు ఆమెను రాళ్లతో చావగొట్ట
వలెను. ఏలయనగా ఆమె తన తండ్రి యింట వ్యభి
చరించి ఇశ్రాయేలీయులలో దుష్కార్యము చేసెను.
అట్లు ఆ చెడుతనమును మీ మధ్యనుండి మీరు పరి
హరించుదురు.

ఒకడు మగనాలితో శయనించుచుండగా కనబడిన
యెడల వారిద్దరు, అనగా ఆ స్త్రీతో శయనించిన
పురుషుడును ఆ స్త్రీయును చంపబడవలెను. అట్లు ఆ
చెడుతనమును ఇశ్రాయేలులోనుండి పరిహరించుదురు.

కన్యకయైన చిన్నది ప్రధానము చేయబడిన తరు
వాత ఒకడు ఊరిలో ఆమెను కలిసికొని ఆమెతో
శయనించినయెడల । ఆ ఊరి గవినియొద్దకు వారిద్దరిని
తీసికొనివచ్చి, ఆ చిన్నది ఊరిలో కేకలు వేయక
యున్నందున ఆమెను, తన పొరుగువాని భార్యను
అవమానపరచినందున ఆ మనుష్యుని, రాళ్లతో చావ
గొట్టవలెను. అట్లు ఆ చెడుతనమును మీలోనుండి
పరిహరించుదురు.

ఒకడు ప్రధానముచేయబడిన చిన్నదానిని పొల
ములో కలిసికొనినప్పుడు ఆ మనుష్యుడు ఆమెను
బలిమిని పట్టి ఆమెతో శయనించినయెడల ఆమెతో
శయనించిన మనుష్యుడు మాత్రమే చావవలెను. ।
ఆ చిన్నదాని నేమియు చేయకూడదు, ఆ చిన్నదాని 26
యందు మరణపాత్రమైన పాపములేదు. ఒకడు తన
పొరుగువానిమీదికి లేచి ప్రాణహాని చేసినట్టే యిది
జరిగినది. । అతడు ఆమెను పొలములో కలిసికొనగా 27
ప్రధానము చేయబడిన ఆ చిన్నది కేకలువేసినను
ఆమెకు రక్షకుడు లేకపోయెను. । ఒకడు ప్రధానము 28
చేయబడని కన్యకయైన చిన్నదాని కలిసికొని ఆమెను
పట్టుకొని ఆమెతో శయనింపగా వారు కనబడిన
యెడల । ఆమెతో శయనించినవాడు ఆ చిన్నదాని 29
తండ్రికి ఏబది వెండి రూకలిచ్చి ఆమెను పెండ్లిచేసి
కొనవలెను. అతడు ఆమెను అవమానపరచెను గనుక
అతడు తాను బ్రదుకు దినములన్నిటను ఆమెను విడిచి
పెట్టకూడదు.

ఎవడును తన తండ్రిభార్యను పరిగ్రహింపకూడదు, 30
తన తండ్రి విప్పతగిన కోకను విప్పకూడదు.

గాయమునొందిన వృషణములు గలవాడేగాని 23
మర్మాంగము కోయబడినవాడేగాని యెహోవా సమా
జములో చేరకూడదు. కుండుడు యెహోవా సమా
జములో చేరకూడదు. । వానికి పదియవ తరమువాడై 2
నను యెహోవా సమాజములో చేరకూడదు.

అమ్మోనీయుడేగాని మోయాబీయుడేగాని 3
యెహోవా సమాజములో చేరకూడదు. వారిలో
పదియవ తరమువారైనను ఎన్నడును యెహోవా
సమాజములో చేరకూడదు. । ఏలయనగా మీరు ఐగు 4
ప్తులోనుండి వచ్చుచుండగా వారు అన్నపానములు
తీసికొని మిమ్మును ఎదుర్కొనరాక, నిన్ను శపించు
టకు బహుమానమునిచ్చి నహరయీములోని పెతో
రులోనుండి నీకు విరోధముగా బెయోరు కుమారు
డైన బిలామును పిలిపించిరి. । అయితే నీ దేవుడైన 5
యెహోవా బిలాము మాట విననొల్లకుండెను. నీ
దేవుడైన యెహోవా నిన్ను ప్రేమించెను గనుక నీ
దేవుడైన యెహోవా నీ నిమిత్తము ఆ శాపమును
ఆశీర్వాదముగా చేసెను. । నీ దినములన్నిట ఎన్నడును 6
వారి క్షేమమునైనను మేలునైనను విచారింపకూడదు.

ఎదోమీయులు నీ సహోదరులు గనుక వారిని 7
ద్వేషింపకూడదు. ఐగుప్తుదేశములో నీవు పరదేశివై
యుంటివి గనుక ఐగుప్తీయులను ద్వేషింపకూడదు. ।
వారికి పుట్టిన పిల్లలలో మూడవ తరమువారు 8
యెహోవా సమాజములో చేరవచ్చును.

నీ సేన శత్రువులతో యుద్ధమునకు బయలుదేరు 9
నప్పుడు ఏ దుష్కార్యమును చేయకుండ జాగ్రత్త
పడవలెను.

రాత్రి జరిగినదానివలన మైలపడినవాడు మీలో 10
ఉండినయెడల వాడు పాళెము వెలపలికి వెళ్లిపోవ
లెను. । అతడు పాళెములో చేరకూడదు; సాయం 11

కాలమున అతడు నీళ్లతో స్నానముచేసి సూర్యుడు
అస్తమించిన తరువాత పాళెములో చేరవచ్చును. ।
12 పాళెము వెలుపట నీకు ఒక చోటు ఉండవలెను, ఆ
13 బహిర్భూమికి నీవు వెళ్లవలెను. । మరియు నీ ఆయు
ధములుగాక గసిక యొకటి నీయొద్ద ఉండవలెను.
నీవు బహిర్భూమికి వెళ్లునప్పుడు దానితో త్రవ్వి వెను
14 కకు తిరిగి నీ మలమును కప్పివేయవలెను. । నీ దేవుడైన
యెహోవా నిన్ను విడిపించుటకును నీ శత్రువులను
నీకు అప్పగించుటకును నీ పాళెములో సంచరించు
చుండును గనుక ఆయన నీలో అసహ్యమైన దేని
నైనను చూచి నిన్ను విడువకుండునట్లు నీ పాళెము
పరిశుద్ధముగా ఉండవలెను.
15 తన యజమానునియొద్దనుండి తప్పించుకొని నీయొ
ద్దకు వచ్చిన దాసుని వాని యజమానునికి అప్పగింప
16 కూడదు. । అతడు తన యిష్టప్రకారము నీ గ్రామ
ములలో ఒకదానియందు తాను ఏర్పరచుకొనిన చోట
మీతో కలిసి మీ।మధ్య నివసింపవలెను; నీవు వాని
బాధింపకూడదు.
17 ఇశ్రాయేలు కుమార్తెలలో ఎవతెయు వేశ్యగా
ఉండకూడదు. ఇశ్రాయేలు కుమారులలో ఎవడును
18 పురుషగామిగా ఉండకూడదు. । పడుపుసొమ్మునేగాని
కుక్క విలువనేగాని మ్రొక్కుబడిగా నీ దేవుడైన
యెహోవా యింటికి తేకూడదు. ఏలయనగా ఆ
రెండును నీ దేవుడైన యెహోవాకు హేయములు.
19 నీవు వెండినేగాని ఆహారద్రవ్యమునేగాని వడ్డికి
వేయబడు దేనిని నీ సహోదరులకు వడ్డికియ్యకూ
20 డదు. । అన్యునికి వడ్డికి బదులు ఇయ్యవచ్చునుగాని
నీవు స్వాధీనపరచుకొనునట్లు చేరబోవుచున్న దేశ
ములో నీ దేవుడైన యెహోవా నీవు చేయు ప్రయ
త్నములన్నిటి విషయములోను నిన్ను ఆశీర్వదించు
నట్లు నీ సహోదరులకు వడ్డికి బదులు ఇయ్యకూడదు.
21 నీవు నీ దేవుడైన యెహోవాకు మ్రొక్కుకొనిన
తరువాత ఆ మ్రొక్కుబడిని చెల్లించుటకు తడవుచేయ
కూడదు. నీ దేవుడైన యెహోవా తప్పక నీవలన
22 దాని రాబట్టుకొనును, అది నీకు పాపమగును. । నీవు
మ్రొక్కుకొననియెడల నీయందు ఆ పాపముండదు. ।
23 నీ పెదవులనుండి బయలుదేరిన మాటను నెరవేర్చుకొని,
నీ దేవుడైన యెహోవాకు మ్రొక్కుకొనినప్రకారము
నీవు నీ నోట పలికినట్లు స్వేచ్ఛార్పణము నర్పింపవలెను.
24 నీవు నీ పొరుగువాని ద్రాక్షతోటకు వచ్చునప్పుడు
నీ యిష్టప్రకారము నీకు చాలినంతవరకు ద్రాక్ష
పండ్లు తినవచ్చును గాని నీ పాత్రలో వాటిని వేసి
25 కొనకూడదు. । నీ పొరుగువాని పంటచేనికి వచ్చు
నప్పుడు నీ చేతితో వెన్నులు త్రుంచుకొనవచ్చును
గాని నీ పొరుగువాని పంటచేనిమీద కొడవలి వేయ
కూడదు.

ఒకడు స్త్రీని పరిగ్రహించి ఆమెను పెండ్లిచేసి 24
కొనిన తరువాత ఆమెయందు మానభంగసూచన ఏదో
ఒకటి అతనికి కనబడినందున ఆమెమీద అతనికి
ఇష్టము తప్పినయెడల, అతడు ఆమెకు పరిత్యాగ
పత్రము వ్రాయించి ఆమెచేతికిచ్చి తన యింటనుండి
ఆమెను పంపివేయవలెను. । ఆమె అతని యింటనుండి 2
వెళ్లినతరువాత ఆమె వేరొక పురుషుని పెండ్లిచేసికొన
వచ్చును. । ఆ రెండవ పురుషుడు ఆమెను ఒల్లక 3
ఆమెకు పరిత్యాగపత్రము వ్రాయించి ఆమెచేతికిచ్చి
తన యింటనుండి ఆమెను పంపివేసినయెడల నేమి,
ఆమెను పెండ్లిచేసికొనిన పిమ్మట ఆ రెండవపురుషుడు
చనిపోయినయెడల నేమి । ఆమెను పంపివేసిన ఆమె 4
మొదటి పెనిమిటి ఆమెను పెండ్లిచేసికొనుటకై ఆమెను
మరల పరిగ్రహింపకూడదు. ఏలయనగా ఆమె
తన్ను అపవిత్రపరచుకొనెను, అది యెహోవా
సన్నిధిని హేయము గనుక నీ దేవుడైన యెహోవా
నీకు స్వాస్థ్యముగా ఇచ్చుచున్న దేశమునకు పాపము
కలుగకుండునట్లు మీరు ఆలాగు చేయకూడదు.
ఒకడు క్రొత్తగా ఒకదానిని పెండ్లిచేసికొని సేనలో 5
చేరిపోకూడదు. అతనిమీద ఏ వ్యాపారభారమును
మోపకూడదు. ఏడాదివరకు తీరికగా అతడు తన
యింట ఉండి తాను పరిగ్రహించినభార్యను సంతోష
పెట్టవలెను.
తిరగటినైనను తిరగటిమీది దిమ్మనైనను తాకట్టు 6
పట్టకూడదు. అది ఒకని జీవనాధారమును తాకట్టు
పట్టినట్లే.
ఒకడు ఇశ్రాయేలు కుమారులైన తన సహో 7
దరుల నొకని దొంగిలుట కనుగొనబడినయెడల అతడు
వానిని తన దాసునిగా చేసికొనినను అమ్మినను ఆ
దొంగ చావవలెను. ఆలాగు చేసినయెడల ఆ చెడుతన
మును మీ మధ్యనుండి పరిహరించుదురు.
కుష్ఠరోగవిషయము యాజకులైన లేవీయులు మీకు 8
బోధించు సమస్తమును చేయుటకు బహు జాగ్రత్తగా
ఉండుడి. నేను వారికాజ్ఞాపించినట్లు చేయుటకు
మీరు జాగ్రత్తగానుండుడి. । మీరు ఐగుప్తులోనుండి 9
వచ్చినప్పుడు త్రోవలో నీ దేవుడైన యెహోవా
మిర్యామునకు చేసినదానిని జ్ఞాపకముంచుకొనుడి.
నీ పొరుగువానికి ఏదైనను నీవు ఎరువిచ్చినయెడల 10
అతనియొద్ద తాకట్టు వస్తువు తీసికొనుటకు అతని
యింటికి వెళ్లకూడదు । నీవు బయట నిలువవలెను.
నీవు ఎరువిచ్చినవాడు బయటనున్న నీయొద్దకు ఆ
తాకట్టు వస్తువును తెచ్చియిచ్చును. । ఆ మనుష్యుడు
బీదవాడైనయెడల నీవు అతని తాకట్టును ఉంచుకొని
పండుకొనకూడదు. అతడు తన బట్టను వేసికొని
పండుకొని నిన్ను దీవించునట్లు సూర్యుడు అస్తమించు
నప్పుడు నిశ్చయముగా ఆ తాకట్టు వస్తువును అతనికి

3 మరల అప్పగింపవలెను. । అది నీ దేవుడైన యెహోవా
దృష్టికి నీకు నీతి యగును.

4 నీ సహోదరులలోనేమి నీ దేశమందలి నీ గ్రామ
ములలోనున్న పరదేశులలోనేమి దీనదరిద్రుడైన కూలి
వానిని బాధింపకూడదు. ఏనాటికూలి ఆనాడియ్య
5 వలెను. । సూర్యుడు అస్తమింపకమునుపు వానికియ్య
వలెను. వాడు బీదవాడు గనుక దానిమీద ఆశపెట్టు
కొనియుండును. వాడు నిన్నుబట్టి యెహోవాకు
మొఱ్ఱపెట్టునేమో అది నీకు పాపమగును.

16 కుమారుల దోషమునుబట్టి తండ్రులకు మరణశిక్ష
విధింపకూడదు, తండ్రుల దోషమునుబట్టి కుమారులకు
మరణశిక్ష విధింపకూడదు. ఎవని పాపము నిమిత్తము
వాడే మరణశిక్ష నొందును.

17 పరదేశికేగాని తండ్రిలేనివానికేగాని న్యాయము
తప్పి తీర్పుతీర్చకూడదు. విధవరాలి వస్త్రమును తాక
18 ట్టుగా తీసికొనకూడదు. । నీవు ఐగుప్తులో దాసుడవై
యుండగా నీ దేవుడైన యెహోవా నిన్ను అక్కడ
నుండి విమోచించెనని జ్ఞాపకము చేసికొనవలెను.
అందుచేత ఈ కార్యము చేయవలెనని నీకాజ్ఞాపించు
చున్నాను.

19 నీ పొలములో నీ పంట కోయుచున్నప్పుడు పొల
ములో ఒక పన మరచిపోయినయెడల అది తెచ్చు
కొనుటకు నీవు తిరిగి పోకూడదు. నీ దేవుడైన
యెహోవా నీవు చేయు పనులన్నిటిలోను నిన్ను
ఆశీర్వదించునట్లు అది పరదేశులకును తండ్రిలేనివారి
కిని విధవరాండ్రకును ఉండవలెను.

20 నీ ఒలీవపండ్లను ఏరునప్పుడు నీ వెనుకనున్న పరి
గెను ఏరుకొనకూడదు; అవి పరదేశులకును తండ్రి
21 లేనివారికిని విధవరాండ్రకును ఉండవలెను. । నీ
ద్రాక్షపండ్లను కోసికొనునప్పుడు నీ వెనుకనున్న పరి
గెను ఏరుకొనకూడదు; అది పరదేశులకును తండ్రి
22 లేనివారికిని విధవరాండ్రకును ఉండవలెను. । నీవు
ఐగుప్తుదేశమందు దాసుడవై యుంటివని జ్ఞాపకము
చేసికొనుము. అందుచేతను ఈ కార్యము చేయవలె
నని నీకాజ్ఞాపించుచున్నాను.

**25** మనుష్యులకు వివాదము కలిగి న్యాయసభకు
వచ్చునప్పుడు న్యాయాధిపతులు విమర్శించి నీతి
మంతుని నీతిమంతుడనియు దోషిని దోషియనియు
2 తీర్పు తీర్చవలెను. । ఆ దోషి శిక్షకు పాత్రుడుగా
కనబడిన పక్షమున న్యాయాధిపతి వాని పండుకొన
బెట్టి వాని నేరముకొలది దెబ్బలు లెక్కపెట్టి తన
3 యెదుట వాని కొట్టింపవలెను. । నలుబది దెబ్బలు
కొట్టింపవచ్చును అంతకు మించకూడదు. వీటికంటె
విస్తారమైన దెబ్బలు కొట్టించినయెడల నీ సహోద
రుడు నీ దృష్టికి నీచుడుగా కనబడునేమో.

ఎద్దు నూర్చునప్పుడు దాని మూతికి చిక్కము 4
వేయకూడదు.

సహోదరులు కూడి నివసించుచుండగా వారిలో 5
ఒకడు సంతానములేక చనిపోయినయెడల చనిపోయిన
వాని భార్య అన్యుని పెండ్లిచేసికొనకూడదు; ఆమె
దేవరుడు ఆమెయొద్దకు పోయి ఆమెను పెండ్లిచేసి
కొని తన సహోదరునికి మారుగా ఆమెయెడల భర్త
ధర్మము జరుపవలెను. । చనిపోయిన సహోదరుని 6
పేరు ఇశ్రాయేలీయులలోనుండి తుడిచివేయబడ
కుండునట్లు ఆమె కను జ్యేష్ఠకుమారుడు చనిపోయిన
సహోదరునికి వారసుడుగా ఉండవలెను. । అతడు 7
తన సహోదరుని భార్యను పరిగ్రహింప నొల్లని
యెడల వాని సహోదరుని భార్య పట్టణపుగవినికి,
అనగా పెద్దలయొద్దకు, పోయి — నా పెనిమిటి
సహోదరుడు ఇశ్రాయేలీయులలో తన సహో
దరునికి పేరు స్థాపింపనని చెప్పి దేవరధర్మము చేయ
నొల్లడని తెలుపుకొనవలెను. । అప్పుడు అతని యూరి 8
పెద్దలు అతని పిలిపించి అతనితో మాటలాడిన తరు
వాత అతడు నిలువబడి — ఆమెను పరిగ్రహించుటకు
నా కిష్టములేదనినయెడల అతని సహోదరుని భార్య ।
ఆ పెద్దలు చూచుచుండగా, అతని దాపుకు పోయి 9
అతని కాలినుండి చెప్పు ఊడదీసి అతని ముఖము
నెదుట ఉమ్మివేసి—తన సహోదరుని యిల్లు నిలు
పని మనుష్యునికి ఈలాగు చేయబడునని చెప్పవలెను. ।
అప్పుడు ఇశ్రాయేలీయులలో చెప్పు ఊడదీయబడిన 10
వాని యిల్లని వానికి పేరు పెట్టబడును.

మనుష్యులు ఒకనితో నొకడు పోట్లాడుచుండగా 11
వారిలో ఒకని భార్య వాని కొట్టుచున్నవాని చేతిలో
నుండి తన పెనిమిటిని విడిపించుటకు వచ్చి చెయ్యి
చాచి వాని మానము పట్టుకొనినయెడల ఆమె చేతిని
ఛేదింపవలెను. । నీ కన్ను కటాక్షింపకూడదు. 12

హెచ్చుతగ్గులుగల వేరువేరు తూనికె రాళ్లు నీ 13
సంచిలో నుంచుకొనకూడదు. । హెచ్చుతగ్గులుగల 14
వేరువేరు తూములు నీ యింట ఉంచుకొనకూడదు. ।
నీ దేవుడైన యెహోవా నీకిచ్చుచున్న దేశములో 15
నీవు దీర్ఘాయుష్మంతుడవగునట్లు తక్కువవికాని న్యాయ
మైన తూనికెరాళ్లు నీవు ఉంచుకొనవలెను. తక్కు
వదికాని న్యాయమైన తూము నీకు ఉండవలెను. ।
ఆలాగు చేయని ప్రతివాడును, అనగా అన్యాయము 16
చేయు ప్రతివాడును నీ దేవుడైన యెహోవాకు
హేయుడు.

మీరు ఐగుప్తులోనుండి వచ్చుచుండగా మార్గమున 17
అమాలేకీయులు నీకు చేసినదానిని జ్ఞాపకము చేసి
కొనుము. అతడు దేవునికి భయపడక మార్గమున నీ
కెదురుగా వచ్చి । నీవు ప్రయాసపడి అలసియున్న 18
ప్పుడు నీవారిలో నీ వెనుక[illegible]

19 హతముచేసెను. । కాబట్టి నీవు స్వాధీనపరచుకొను
నట్లు నీ దేవుడైన యెహోవా స్వాస్థ్యముగా నీకిచ్చు
చున్న దేశములో చుట్టుపట్లనున్న నీ సమస్త శత్రువు
లను లేకుండచేసి, నీ దేవుడైన యెహోవా నీకు
విశ్రాంతి దయచేసిన తరువాత ఆకాశము క్రింద
నుండి అమాలేకీయుల పేరు తుడిచివేయవలెను. ఇది
మరచిపోవద్దు.

**26** నీ దేవుడైన యెహోవా నీకు స్వాస్థ్యముగా
ఇచ్చుచున్న దేశమునకు నీవు వచ్చి దాని స్వాధీనపరచు
2 కొని దానిలో నివసించుచున్నప్పుడు । నీ దేవుడైన
యెహోవా నీకిచ్చుచున్న నీ భూమిలోనుండి నీవు
కూర్చుకొను భూఫలములన్నిటిలోను ప్రథమ ఫలము
లను తీసికొని గంపలో ఉంచి, నీ దేవుడైన యెహోవా
తన నామమునకు మందిరమును ఏర్పరచుకొను స్థలము
3 నకు వెళ్లి । ఆ దినములలోనుండు యాజకునియొద్దకు
పోయి—యెహోవా మన పితురులకిచ్చెదనని ప్రమా
ణము చేసిన దేశమునకు నేను వచ్చియున్న సంగతి
నేడు నీ దేవుడైన యెహోవా సన్నిధిని ఒప్పుకొను
4 చున్నానని అతనితో చెప్పవలెను. । యాజకుడు ఆ
గంపను నీ చేతిలోనుండి తీసికొని నీ దేవుడైన
5 యెహోవా బలిపీఠమునెదుట ఉంచగా । నీవు—
నా తండ్రి నశించుచున్న అరామీదేశస్థుడు; అతడు
ఐగుప్తుకు వెళ్లెను. కొద్దిమందితో అక్కడికి పోయి
పరవాసియై, గొప్పదియు బలమైనదియు విస్తారమై
6 నదియునగు జనమాయెను. । ఐగుప్తీయులు మనలను
హింసపెట్టి మనలను బాధపరచి మనమీద కఠిన
7 దాస్యము మోపగా । మనము మన పితరుల దేవుడైన
యెహోవాకు మొఱ్ఱపెట్టినప్పుడు యెహోవా మన
మొఱ్ఱను విని మన బాధను ప్రయాసమును మనకు
8 కలిగిన హింసను చూచెను. । అప్పుడు యెహోవా
హస్తబలమువలనను చాపిన బాహువువలనను మహా
భయమువలనను సూచకక్రియలవలనను మహత్కార్య
9 ములవలనను ఐగుప్తులోనుండి మనలను రప్పించి । యీ
స్థలమునకు మనలను చేర్చి, పాలు తేనెలు ప్రవహించు
10 దేశమైయున్న యీ దేశమును మనకిచ్చెను. । కాబట్టి
యెహోవా, నీవే నాకిచ్చిన భూమియొక్క ప్రథమ
ఫలములను నేను తెచ్చియున్నానని నీ దేవుడైన
11 యెహోవా సన్నిధిని చెప్పి । నీ దేవుడైన యెహోవా
సన్నిధిని దాని పెట్టి, నీ దేవుడైన యెహోవా సన్ని
ధిని నమస్కారముచేసి, నీకును నీ యింటివారికిని నీ
దేవుడైన యెహోవా దయచేసిన మేలంతటి విష
యము నీవును లేవీయులును నీ దేశములో ఉన్న పర
దేశులును సంతోషింపవలెను.

12 పదియవ భాగమిచ్చు సంవత్సరమున, అనగా మూ
డవ సంవత్సరమున నీ వచ్చుబడిలో పదియవ వంతును
చెల్లించి, అది లేవీయులకును పరదేశులకును తండ్రిలేని
వారికిని విధవరాండ్రకును ఇయ్యవలెను. వారు నీ
గ్రామములలో తిని తృప్తిపొందినతరువాత । నీవు నీ 13
దేవుడైన యెహోవా సన్నిధిని—నీవు నాకాజ్ఞాపిం
చిన నీ ఆజ్ఞలన్నిటిచొప్పున నా యింటనుండి ప్రతి
ష్ఠితమైనదానిని తీసివేసి, లేవీయులకును పరదేశులకును
తండ్రిలేనివారికిని విధవరాండ్రకును నేనిచ్చి యు
న్నాను. నీ ఆజ్ఞలలో దేనిని నేను మీరలేదు, దేనిని
మరచిపోలేదు. । నేను అశుచిగా నుండగా దానిలో 14
కొంచెమైనను తినలేదు, అపవిత్రుడనై యుండగా
దానిలో దేనిని తీసివేయలేదు, చనిపోయినవారి విష
యమై దానిలో ఏదియు నేనియ్యలేదు, నా దేవుడైన
యెహోవా మాట విని నీవు నాకాజ్ఞాపించినట్లు
సమస్తము జరిపియున్నాను. । నీ పరిశుద్ధాలయమగు 15
ఆకాశములోనుండి చూచి, నీ జనులైన ఇశ్రాయేలీ
యులను—పాలు తేనెలు ప్రవహించు దేశము అని నీవు
మా పితరులతో ప్రమాణముచేసినట్లు మాకిచ్చియున్న
దేశమును ఆశీర్వదింపుమని చెప్పవలెను.

ఈ కట్టడలను విధులను గైకొనుమని నీ దేవుడైన 16
యెహోవా నీకాజ్ఞాపించియున్నాడు గనుక నీవు నీ
పూర్ణహృదయముతోను నీ పూర్ణాత్మతోను వాటి నను
సరించి నడుచుకొనవలెను. । యెహోవాయే నీకు 17
దేవుడై యున్నాడనియు, నీవు ఆయన మార్గముల
యందు నడిచి, ఆయన కట్టడలను ఆయన ఆజ్ఞలను
ఆయన విధులను అనుసరించి, ఆయన మాట విందు
ననియు నేడు ఆయనతో మాట యిచ్చితివి. । మరియు 18
యెహోవా నీతో చెప్పినట్లు నీవే తనకు స్వకీయ
జనమైయుండి తన ఆజ్ఞలన్నిటిని గైకొందువనియు, ।
తాను సృజించిన సమస్త జనములకంటె నీకు కీర్తి ఘనత 19
సౌందర్యములు కలుగునట్లు నిన్ను హెచ్చించుచునని
ఆయన సెలవిచ్చినట్లు నీవు నీ దేవుడైన యెహోవాకు
ప్రతిష్ఠిత జనమై యుందువనియు యెహోవా ఈ
దినమున ప్రకటించెను.

మోషేయు ఇశ్రాయేలీయుల పెద్దలును ప్రజల **27**
తో ఇట్లనిరి— నేడు నేను మీకు విధించుచున్న ధర్మమును
మీరాచరింపవలెను. । మీ దేవుడైన యెహోవా మీ 2
కిచ్చుచున్న దేశమున ప్రవేశించుటకు మీరు యొర్దాను
దాటు దినమున మీరు పెద్దరాళ్లను నిలువబెట్టి వాటి
మీద సున్నము పూసి । నీ పితరుల దేవుడైన యెహోవా 3
నీతో చెప్పినట్లు నీవు నీ దేవుడైన యెహోవా నీ
కిచ్చుచున్న పాలు తేనెలు ప్రవహించు దేశమున
ప్రవేశించుటకు నీవు ఏరు దాటినతరువాత ఈ ధర్మ
శాస్త్రవాక్యములన్నిటిని వాటిమీద వ్రాయవలెను. ।
మీరు ఈ యొర్దాను దాటినతరువాత నేను నేడు మీ 4
కాజ్ఞాపించినట్లు ఈ రాళ్లను ఏబాలు కొండమీద
నిలువబెట్టి వాటిమీద సున్నము పూయవలెను. ।
అక్కడ నీ దేవుడైన యెహోవాకు బలిపీఠమును కట్ట 5

వలెను. ఆ బలిపీఠమును రాళ్లతో కట్టవలెను; వాటి
6 మీద ఇనుపపనిముట్టు పడకూడదు. । చెక్కని రాళ్ల
తో నీ దేవుడైన యెహోవాకు బలిపీఠమును కట్టి
దానిమీద నీ దేవుడైన యెహోవాకు దహనబలుల
7 నర్పింపవలెను. । మరియు నీవు సమాధానబలులనర్పించి
అక్కడ భోజనముచేసి నీ దేవుడైన యెహోవా సన్ని
8 ధిని సంతోషింపవలెను. । ఈ విధికి సంబంధించిన
వాక్యములన్నిటిని ఆ రాళ్లమీద బహు విశదముగా
వ్రాయవలెను.
9 మరియు మోషేయు యాజకులైన లేవీయులును
ఇశ్రాయేలీయులందరితో ఇట్లనిరి — ఇశ్రాయేలీయు
10 లారా, మీరు ఊరకొని ఆలకించుడి. । నేడు మీరు
మీ దేవుడైన యెహోవాకు స్వజనమైతిరి గనుక మీ
దేవుడైన యెహోవా మాట విని, నేడు నేను నీకు
ఆజ్ఞాపించు ఆయన కట్టడలను ఆయన ఆజ్ఞలను గైకొన
వలెను.
11 ఆ దినమందే మోషే ప్రజలకు ఆజ్ఞాపించినదేమన
గా — మీరు యొర్దాను దాటినతరువాత షిమ్యోను
12 లేవి యూదా ఇశ్శాఖారు యోసేపు । బెన్యామీను
గోత్రములవారు ప్రజలనుగూర్చి దీవెనవచనములను
పలుకుటకై గెరిజీము కొండమీద నిలువవలెను. ।
13 రూబేను గాదు ఆషేరు జెబులూను దాను నఫ్తాలి
గోత్రములవారు శాపవచనములను పలుకుటకై ఏబాలు
14 కొండమీద నిలువవలెను. । అప్పుడు లేవీయులు
15 — యెహోవాకు హేయముగా శిల్పిచేతులతో
మలిచిన విగ్రహము నేగాని పోతవిగ్రహము నేగాని
చేసి చాటున నుంచువాడు శాపగ్రస్తుడని యెలుగెత్తి
ఇశ్రాయేలీయులందరితోను చెప్పగా ప్రజలందరు—
ఆమేన్ అనవలెను.
16 — తన తండ్రినైనను తన తల్లినైనను నిర్లక్ష్యము
చేయువాడు శాపగ్రస్తుడని చెప్పగా ప్రజలందరు—
ఆమేన్ అనవలెను.
17 —తన పొరుగువాని సరిహద్దురాయిని తీసివేయు
వాడు శాపగ్రస్తుడని చెప్పగా ప్రజలందరు—ఆమేన్
అనవలెను.
18 —గ్రుడ్డివాని త్రోవను తప్పించువాడు శాపగ్రస్తు
డని చెప్పగా ప్రజలందరు—ఆమేన్ అనవలెను.
19 — పరదేశికేగాని తండ్రిలేనివానికేగాని విధవ
రాలికేగాని న్యాయము తప్పి తీర్పు తీర్చువాడు శాప
గ్రస్తుడని చెప్పగా ప్రజలందరు—ఆమేన్ అనవలెను.
20 —తన తండ్రి భార్యతో శయనించువాడు తన
తండ్రి కోకను విప్పినవాడు గనుక వాడు శాపగ్రస్తు
డని చెప్పగా ప్రజలందరు—ఆమేన్ అనవలెను.
21 —ఏ జంతువుతోనైనను శయనించువాడు శాప
గ్రస్తుడని చెప్పగా ప్రజలందరు—ఆమేన్ అనవలెను.
22 —తన సహోదరితో, అనగా తన తండ్రికుమా
ర్తెతోగాని తన తల్లికుమార్తెతోగాని శయనించువాడు
శాపగ్రస్తుడని చెప్పగా ప్రజలందరు—ఆమేన్ అన
వలెను.
—తన అత్తతో శయనించువాడు శాపగ్రస్తుడని 23
చెప్పగా ప్రజలందరు—ఆమేన్ అనవలెను.
—చాటున తన పొరుగువాని కొట్టువాడు శాప 24
గ్రస్తుడని చెప్పగా ప్రజలందరు—ఆమేన్ అనవలెను.
— నిర్దోషికి ప్రాణహాని చేయుటకు లంచము 25
పుచ్చుకొనువాడు శాపగ్రస్తుడని చెప్పగా ప్రజలం
దరు—ఆమేన్ అనవలెను.
—ఈ విధికి సంబంధించిన వాక్యములను గైకొనక 26
పోవుటవలన వాటిని స్థిరపరచనివాడు శాపగ్రస్తుడని
చెప్పగా ప్రజలందరు—ఆమేన్ అనవలెను.
నీవు నీ దేవుడైన యెహోవా మాట శ్రద్ధగా విని **28**
నేడు నేను నీకు ఆజ్ఞాపించుచున్న ఆయన ఆజ్ఞల
నన్నిటిని అనుసరించి నడుచుకొనినయెడల నీ దేవుడైన
యెహోవా భూమిమీదనున్న సమస్త జనములకంటె
నిన్ను హెచ్చించును. । నీవు నీ దేవుడైన యెహోవా 2
మాట వినినయెడల ఈ దీవెనలన్నియు నీమీదికి వచ్చి
నీకు ప్రాప్తించును. । నీవు పట్టణములో దీవింప 3
బడుదువు; పొలములో దీవింపబడుదువు; । నీ గర్భ 4
ఫలము నీ భూఫలము నీ పశువుల మందలు నీ
దుక్కిటెద్దులు నీ గొఱ్ఱె మేకల మందలును దీవింప
బడును; । నీ గంపయు పిండి పిసుకు నీ తొట్టియు 5
దీవింపబడును. । నీవు లోపలికి వచ్చునప్పుడు దీవిం 6
పబడుదువు; వెలపలికి వెళ్లునప్పుడు దీవింపబడుదు
వు. । నీమీద పడు నీ శత్రువులను యెహోవా నీ 7
యెదుట హతమగునట్లు చేయును; వారొక త్రోవను
నీమీదికి బయలుదేరివచ్చి యేడు త్రోవల నీ యెదుట
నుండి పారిపోవుదురు. । నీ కొట్లలోను నీవు చేయు 8
ప్రయత్నములన్నిటిలోను నీకు దీవెనకలుగునట్లు
యెహోవా ఆజ్ఞాపించును. నీ దేవుడైన యెహోవా
నీకిచ్చుచున్న దేశములో ఆయన నిన్ను ఆశీర్వదిం
చును. । నీవు నీ దేవుడైన యెహోవా ఆజ్ఞల ననుస 9
రించి ఆయన మార్గములలో నడుచుకొనినయెడల
యెహోవా నీకు ప్రమాణము చేసియున్నట్లు ఆయన
తనకు ప్రతిష్ఠితజనముగా నిన్ను స్థాపించును. । భూ 10
ప్రజలందరు యెహోవా నామమున నీవు పిలువబడు
చుండుట చూచి నీకు భయపడుదురు. । మరియు 11
యెహోవా నీకిచ్చెదనని నీ పితరులతో ప్రమాణము
చేసిన దేశమున యెహోవా నీ గర్భఫల విషయము
లోను నీ పశువుల విషయములోను నీ నేలపంట విష
యములోను నీకు సమృద్ధిగా మేలు కలుగజేయును. ।
యెహోవా నీ దేశముమీద వర్షము దాని కాలమందు 12
కురిపించుటకును నీవు చేయు కార్యమంతటిని ఆశీర్వ
దించుటకును, ఆకాశమను తన మంచి ధననిధిని తెర

చును. నీవు అనేకజనములకు అప్పిచ్చెదవుకాని అప్పు
13 చేయవు. । నేడు నేను మీకాజ్ఞాపించు మాటలన్ని
టిలో దేనివిషయములోను కుడికిగాని యెడమకుగాని
14 తొలగి । అన్యుల దేవతలను అనుసరింపకయు వాటిని
పూజింపకయు నున్నయెడల, నీవు అనుసరించి నడుచు
కొనవలెనని నేడు నేను నీకాజ్ఞాపించుచున్న నీ దేవు
డైన యెహోవా ఆజ్ఞలను విని వాటిని అనుసరించి
నైకొనినయెడల, యెహోవా నిన్ను తలగా నియ
మించునుగాని తోకగా నియమింపడు. నీవు పైవాడ
వుగా ఉందువుగాని క్రిందివాడవుగా ఉండవు.
15 నేను నేడు నీకాజ్ఞాపించు ఆయన సమస్తమైన
ఆజ్ఞలను కట్టడలను నీవు అనుసరించి నడుచుకొనవలెనని
నీ దేవుడైన యెహోవా సెలవిచ్చినమాట విననియెడల
16 ఈ శాపములన్నియు నీకు సంభవించును. । పట్టణ
ములో నీవు శపింపబడుదువు; పొలములో నీవు
17 శపింపబడుదువు; । నీ గంపయు పిండి పిసుకు నీ
18 తొట్టియు శపింపబడును; । నీ గర్భఫలము నీ భూమి
పంట నీ ఆవులు నీ గొఱ్ఱె మేకలమందలు శపింప
19 బడును; । నీవు లోపలికి వచ్చునప్పుడు శపింపబడు
దువు; వెలుపలికి వెళ్లునప్పుడును శపింపబడుదువు. ।
20 నీవు నన్ను విడిచి చేసిన నీ దుష్కార్యములచేత నీవు
హతము చేయబడి వేగముగా నశించువరకు, నీవు
చేయ బూనుకొను కార్యములన్నిటి విషయములోను
యెహోవా శాపమును కలవరమును గద్దింపును నీ
21 మీదికి తెప్పించును. । నీవు స్వాధీనపరచుకొన
బోవు దేశములో నుండకుండ నిన్ను క్షీణింపజేయు
వరకు యెహోవా తెగులు నిన్ను వెంటాడును. ।
22 యెహోవా క్షయరోగముచేతను జ్వరముచేతను
మంటచేతను మహాతాపముచేతను ఖడ్గముచేతను కంకి
కాటుకచేతను బూజుచేతను నిన్ను కొట్టును; నీవు
23 నశించువరకు అవి నిన్ను తరుమును. । నీ తలపైని
ఆకాశము ఇత్తడివలె ఉండును, నీ క్రిందనున్న నేల
24 యినుమువలె ఉండును. । యెహోవా నీ దేశపు
వర్షమును ధూళిగాను బుగ్గిగాను చేయును; నీవు నశిం
చువరకు అది ఆకాశమునుండి నీమీదికి వచ్చును. ।
25 యెహోవా నీ శత్రువులయెదుట నిన్ను ఓడించును.
ఒక్కమార్గమున వారి యెదుటికి బయలుదేరి యేడు
మార్గముల వారి యెదుటనుండి పారిపోయి, భూరాజ్య
26 ములన్నిటిలోకి కొనిపోబడుదువు. । నీ కళేబరము
సకలమైన ఆకాశపక్షులకును భూజంతువులకును ఆహా
రమగును; వాటిని బెదరించువాడెవడును ఉండడు. ।
27 యెహోవా ఐగుప్తు పుంటిచేతను మూలవ్యాధిచేతను
కుష్ఠుచేతను గజ్జిచేతను నిన్ను బాధించును; నీవు
28 వాటిని పోగొట్టుకొనజాలకుందువు. । వెఱ్ఱితనము
చేతను గుడ్డితనముచేతను హృదయ విస్మయముచేతను
29 యెహోవా నిన్ను బాధించును. । అప్పుడు గుడ్డి
వాడు చీకటిలో తడువులాడురీతిగా నీవు మధ్యాహ్న
మందు తడువులాడుదువు; నీ మార్గములను వర్ధిల్లచేసి
కొనలేవు; నీవు హింసింపబడి నిత్యమును దోచుకొన
బడెదవు; నిన్ను తప్పించువాడెవడును లేకపోవును. ।
స్త్రీని ప్రధానము చేసికొందువుగాని వేరొకడు ఆమెను 30
కూడును. ఇల్లు కట్టుదువుగాని దానిలో నివసింపవు.
ద్రాక్షతోట నాటుదువుగాని దాని పండ్లు తినవు. ।
నీ యెద్దు నీ కన్నులయెదుట వధింపబడునుగాని దాని 31
మాంసము నీవు తినవు. నీ గాడిదె నీ యెదుటనుండి
బలాత్కారముచేత కొనిపోబడి నీ యొద్దకు మరల
తేబడదు. నీ గొఱ్ఱె మేకలు నీ శత్రువులకు ఇయ్య
బడును, నిన్ను రక్షించువాడెవడును ఉండడు. । నీ 32
కుమారులును నీ కుమార్తెలును అన్యజనమునకు ఇయ్య
బడుదురు. వారి నిమిత్తము నీ కన్నులు దినమెల్ల చూచి
చూచి క్షీణించిపోవునుగాని నీచేత నేమియు కాక
పోవును. । నీవెరుగని జనము నీ పొలము పంటను నీ 33
కష్టార్జితమంతయు తినివేయును. నీవు హింసను బాధను
మాత్రమే నిత్యము పొందుదువు. । నీ కన్నులయెదుట 34
జరుగుదానిని చూచుటవలన నీకు వెఱ్ఱియెత్తును. ।
యెహోవా నీ అరకాలు మొదలుకొని నీ నడినెత్తి 35
వరకు మోకాళ్లమీదను తొడలమీదను కుదరని చెడు
పుండ్లు పుట్టించి నిన్ను బాధించును. । యెహోవా 36
నిన్నును నీవు నీమీద నియమించుకొను నీ రాజును,
నీవేగాని నీ పితరులేగాని యెరుగని జనమున కప్పగిం
చును. అక్కడ నీవు కొయ్యదేవతలను రాతిదేవతలను
పూజించెదవు. । యెహోవా నిన్ను చెదరగొట్టు చోటి 37
ప్రజలలో విస్మయమునకు సామెతకు నిందకు నీవు
హేతువైయుందువు. । విస్తారమైన విత్తనములు పొలము 38
లోకి తీసికొనిపోయి కొంచెమే యింటికి తెచ్చుకొం
దువు; ఏలయనగా మిడతలు దాని తినివేయును. ।
ద్రాక్షతోటలను నీవు నాటి బాగుచేయుదువుగాని ఆ 39
ద్రాక్షలరసమును త్రాగవు, ద్రాక్షపండ్లను సమ
కూర్చుకొనవు; ఏలయనగా పురుగు వాటిని తినివేయు
ను. । ఒలీవచెట్లు నీ సమస్త ప్రాంతములలో నుండును 40
గాని తైలముతో తల నంటుకొనవు; నీ ఒలీవకాయలు
రాలిపోవును. । కుమారులను కుమార్తెలను కందువుగాని 41
వారు నీయొద్ద నుండరు, వారు చెరపట్టబడుదురు. ।
మిడతల దండు నీ చెట్లన్నిటిని నీ భూమి పంటను 42
ఆక్రమించుకొనును. । నీ మధ్యనున్న పరదేశి నీకంటె 43
మిక్కిలి హెచ్చగును నీవు మిక్కిలి తగ్గిపోదువు. ।
అతడు నీకు అప్పిచ్చునుగాని నీవు అతనికి అప్పియ్య 44
లేవు. అతడు తలగానుండును నీవు తోకగానుందువు. ।
నీవు నాశనముచేయబడువరకు ఈ శాపములన్నియు 45
నీమీదికి వచ్చి నిన్ను తరిమి నిన్ను పట్టుకొనును; ఏల
యనగా నీ దేవుడైన యెహోవా నీకాజ్ఞాపించిన
ఆయన ఆజ్ఞలను ఆయన కట్టడలను అనుసరించి నడుచు

46 కొనునట్లు నీవు ఆయన మాట వినలేదు. । మరియు
అవి చిరకాలమువరకు నీమీదను నీ సంతానముమీదను
47 సూచనగాను విస్మయ కారణముగాను ఉండును. । నీకు
సర్వసమృద్ధికలిగియుండియు నీవు సంతోషముతోను
హృదయానందముతోను నీ దేవుడైన యెహోవాకు
48 నీవు దాసుడవు కాలేదు । గనుక ఆకలి దప్పులతోను
వస్త్రహీనతలోను అన్ని లోపములలోను యెహోవా
నీమీదికి రప్పించు నీ శత్రువులకు దాసుడవగుదువు.
వారు నిన్ను నశింపజేయువరకు నీ మెడమీద ఇనుప
49 కాడి యుంచుదురు. । యెహోవా దూరమైయున్న
భూదిగంతమునుండి ఒక జనమును, అనగా నీకు రాని
50 భాష కలిగిన జనమును, । క్రూరముఖము కలిగి వృద్ధు
లను యౌవనస్థులను కటాక్షింపని జనమును గద్ద యెగిరి
51 వచ్చునట్లు నీమీదికి రప్పించును. । నిన్ను నశింపజేయు
వరకు నీ పశువులను నీ పొలముల ఫలములను వారు
తినివేతురు. నిన్ను నశింపజేయువరకు ధాన్యమునేగాని
ద్రాక్షారసమునేగాని తైలమునేగాని పశువుల మందల
నేగాని గొఱ్ఱ మేకల మందలనేగాని నీకు నిలువ
52 నియ్యరు. । మరియు నీవు ఆశ్రయించిన ఉన్నత
ప్రాకారములుగల నీ కోటలు పడువరకు నీ దేశమం
తటను నీ గ్రామములన్నిటిలోను వారు నిన్ను
ముట్టడివేయుదురు. నీ దేవుడైన యెహోవా నీకిచ్చిన
నీ దేశమంతటను నీ గ్రామములన్నిటిలోను నిన్ను
53 ముట్టడివేయుదురు. । అప్పుడు ముట్టడిలోను నీ శత్రు
వులు నిన్ను పెట్టు ఇబ్బందిలోను నీ గర్భఫలమును,
అనగా నీ దేవుడైన యెహోవా నీకిచ్చిన నీ కుమా
రులయొక్కయు నీ కుమార్తెలయొక్కయు మాంసమును
54 తిందువు. । మీలో బహు మృదువైన స్వభావమును
అతి సుకుమారమునుగల మనుష్యుని కన్ను తన సహో
దరునియెడలను తన కౌగిటి భార్యయెడలను తాను
చంపక విడుచు తన కడమ పిల్లలయెడలను చెడ్డదై
55 యుండును । అతడు తాను తిను తన పిల్లల మాంసములో
కొంచెమైనను వారిలో నెవనికిని పెట్టడు; ఏలయనగా
మీ శత్రువులు మీ గ్రామములన్నిటియందు మిమ్మును
ఇరుకుపరచుటవలనను ముట్టడివేయుటవలనను వానికి
56 మిగిలినదేమియు ఉండదు. । నీ గ్రామములలో నీ
57 శత్రువులు నిన్ను ఇరుకుపరచుటవలనను ముట్టడి
వేయుటవలనను ఏమియు లేకపోవుటచేత మీలో
మృదుత్వమును అతి సుకుమారమును కలిగి మృదు
త్వముచేతను అతి సుకుమారముచేతను నేలమీద తన
అరకాలు మోప తెగింపని స్త్రీ తన కాళ్లమధ్యనుండి
పడదు మావిని తాను కనబోవు పిల్లలను తాను రహస్య
ముగా తినతలెనని తన కౌగిటి పెనిమిటియెడలనైనను
తన కుమారునియెడలనైనను తన కుమార్తెయెడలనైనను
58 కటాక్షము చూపకపోవును. । నీవు జాగ్రత్తపడి
యీ గ్రంథములో వ్రాయబడిన యీ ధర్మశాస్త్ర
వాక్యములన్నిటిని అనుసరించి గైకొనుచు, నీ దేవుడైన
యెహోవా అను ఆ మహిమగల భీకరమైన నామము
నకు భయపడని యెడల । యెహోవా నీకును నీ సంత 59
తికిని ఆశ్చర్యమైన తెగుళ్లను కలుగజేయును. అవి దీర్ఘ
కాలముండు గొప్ప తెగుళ్లును చెడ్డ రోగములునై యుం
డును. । నీవు భయపడిన ఐగుప్తు క్షయవ్యాధులన్ని 60
టిని ఆయన నీమీదికి తెప్పించును; అవి నిన్ను
వెంటాడును. । మరియు నీవు నశించువరకు ఈ ధర్మ 61
శాస్త్రగ్రంథములో వ్రాయబడని ప్రతి రోగమును
ప్రతి తెగులును ఆయన నీకు కలుగజేయును. । నీవు 62
నీ దేవుడైన యెహోవా మాట వినలేదు గనుక
ఆకాశనక్షత్రములవలె విస్తారములైన మీరు, లెక్కకు
తక్కువై కొద్దిమందే మిగిలి యుందురు. । కాబట్టి 63
మీకు మేలుచేయుచు మిమ్మును విస్తరింపజేయుటకు
మీ దేవుడైన యెహోవా మీయందు ఎట్లు సంతో
షించెనో అట్లు మిమ్ము నశింపజేయుటకును మిమ్ము సం
హరించుటకును యెహోవా సంతోషించును గనుక
నీవు స్వాధీనపరచుకొనుటకు ప్రవేశించుచున్న దేశ
ములోనుండి పెల్లగింపబడుదువు. । దేశముయొక్క 64
యీ కొనమొదలుకొని ఆ కొనవరకును సమస్తజనముల
లోనికి యెహోవా నిన్ను చెదరగొట్టును. అక్కడ
నీవైనను నీ పితరులైనను ఎరుగని కొయ్యవియు రాతి
వియునైన అన్యదేవతలను పూజింతువు. । ఆ జనము 65
లలో నీకు నెమ్మది కలుగదు; నీ అరకాలికి విశ్రాంతి
కలుగదు. అక్కడ యెహోవా హృదయకంపమును
నేత్రక్షీణతయు మనోవేదనయు నీకు కలుగజేయును. ।
నీకు ఎల్లప్పుడు ప్రాణభయము కలిగియుండును. । 66
నీవు రేయింబగళ్లు భయపడుదువు. నీ ప్రాణము నీకు 67
దక్కునను నమ్మకము నీకేమియు ఉండదు. నీ హృద
యములో పుట్టు భయముచేతను, నీ కన్ను చూచు
వాటిచేతను ఉదయమున — అయ్యో యెప్పుడు
సాయంకాలమగునా అనియు, సాయంకాలమున—
అయ్యో యెప్పుడు ఉదయమగునా అనియు అను
కొందువు. । మరియు నీవు మరి ఎప్పుడును దీని చూడ 68
కూడదని నేను నీతో చెప్పిన మార్గమున యెహోవా
ఐగుప్తుకు ఓడలమీద నిన్ను మరల రప్పించును.
అక్కడ మీరు దాసులగాను దాసీలగాను నీ శత్రువు
లకు మిమ్మును అమ్మ జూపుకొనువారందురుగాని
మిమ్మును కొనువాడొకడైన నుండడు.

**యె**హోవా హోరేబులో ఇశ్రాయేలీయు **29**
లతో చేసిన నిబంధన గాక ఆయన మోయాబుదేశ
ములో వారితో చేయుమని మోషేకు ఆజ్ఞాపించిన
నిబంధన వాక్యములు ఇవే.

మోషే ఇశ్రాయేలీయులనందరిని పిలిపించి వారితో 2
ఇట్లనెను—యెహోవా మీ కన్నులయెదుట ఐగుప్తు
దేశమున ఫరోకును అతని సేవకులందరికిని అతని

3 సమస్త జనమునకును చేసినదంతయు, అనగా । ఆ
గొప్ప శోధనలను సూచకక్రియలను మహాత్కా
4 ర్యములను మీరు కన్నులార చూచితిరి. । అయినను
గ్రహించు హృదయమును చూచు కన్నులను విను
చెవులను యెహోవా నేటివరకు మీకిచ్చియుండ
5 లేదు. । నేను మీ దేవుడనైన యెహోవానని మీరు
తెలిసికొనునట్లు నలువది సంవత్సరములు నేను మిమ్మును
అరణ్యములో నడిపించితిని. మీ బట్టలు మీ ఒంటి
మీద పాతగిలిపోలేదు; మీ చెప్పులు మీ కాళ్లను పాత
6 గిలిపోలేదు. । మీరు రొట్టె తినలేదు, ద్రాక్షారసమే
గాని మద్యమేగాని త్రాగలేదని యెహోవా సెల
7 విచ్చుచున్నాడు. । మీరు ఈ చోటికి చేరినప్పుడు
హెష్బోను రాజైన సీహోనును బాషాను రాజైన
8 ఓగును యుద్ధమునకు మనమీదికి రాగా । మనము
వారిని హతముచేసి వారి దేశమును స్వాధీనపరచుకొని
రూబేనీయులకును గాదీయులకును మనష్షే అర్ధగో
9 త్రపువారికిని దాని స్వాస్థ్యముగా ఇచ్చితిమి. । కాబట్టి
మీరు చేయునదంతయు చక్కగా జరుగునట్లు ఈ
నిబంధన వాక్యములను అనుసరించి నడుచుకొనవలెను.
10 నీ దేవుడైన యెహోవా నీతో చెప్పిన ప్రకా
13 రముగాను నీ పితరులైన అబ్రాహాము ఇస్సాకు
యాకోబులతో ప్రమాణముచేసిన ప్రకారముగాను,
నేడు నిన్ను తనకు స్వజనముగా నియమించుకొని తానే
నీకు దేవుడై యుండునట్లు నీ దేవుడైన యెహోవా
నేడు నీకు నియమించుచున్న నీ దేవుడైన యెహోవా
నిబంధనలోను ఆయన ప్రమాణము చేసినదానిలోను
నీవు పాలుపొందుటకై ఇశ్రాయేలీయులలో ప్రతి
వాడు, అనగా మీలో ముఖ్యులేమి, మీ గోత్రపు
వారేమి మీ పెద్దలేమి, మీ నాయకులేమి మీ పిల్ల
లేమి, మీ భార్యలేమి, నీ పాళెములోనున్న పరదేశు
లేమి, నీ కట్టెలను నరుకువారు మొదలుకొని నీ నీళ్లు
తోడువారివరకు మీరందరు నేడు మీ దేవుడైన
14 యెహోవా సన్నిధిని నిలిచియున్నారు. । నేను
మీతో మాత్రముకాదు, ఇక్కడ మనతోకూడను
ఉండి, నేడు మన దేవుడైన యెహోవా సన్నిధిని
15 నిలుచుచున్నవారితోను । ఇక్కడ నేడు మనతోకూడ
నుండనివారితోను ఈ నిబంధనను ప్రమాణమును
16 చేయించుచున్నాను. । మనము ఐగుప్తుదేశమందు ఎట్లు
నివసించితిమో, మీరు దాటి వచ్చిన జనముల మధ్య
నుండి మనమెట్లు దాటి వచ్చితిమో మీరెరుగుదురు. ।
17 వారి హేయక్రియలను, కఱ్ఱతోను రాతితోను వెండి
తోను బంగారముతోను చేయబడిన వారి విగ్రహము
18 లను మీరు చూచితిరి గదా. । ఆ జనముల దేవతలను
పూజించుటకు మన దేవుడైన యెహోవాయొద్దనుండి
తొలగు హృదయముగల పురుషుడేగాని స్త్రీయేగాని
కుటుంబమేగాని గోత్రమేగాని నేడు మీలో ఉండ
కుండునట్లును, మరణకరమైన దుష్కృత్యమునకు అట్టి
మూలమైనది మీలో ఉండకుండునట్లును, నేడు ఈ
నిబంధనను మీతో చేయుచున్నాను. । (అట్టి వసు 19
లనుచేయు) వాడు ఈ శాపవాక్యములను వినునప్పుడు,
మద్యముచేత దప్పి తీర్చుకొనవలెనని నేను నా హృ
దయకాఠిన్యమున నడుచుచుండినను నాకు క్షేమము
కలుగునని, నేను ఆశీర్వాదము నొందెదనని అను
కొనును. । అయితే యెహోవా వాని క్షమింప 20
నొల్లడు; అట్టివాడు మీలో నుండినయెడల నిశ్చయ
ముగా యెహోవా కోపమును ఓర్వమియు ఆ మను
ష్యునిమీద పొగరాజును; ఈ గ్రంథములో వ్రాయ
బడిన శాపములన్నియు వానికి తగులును. యెహోవా
అతని పేరు ఆకాశము క్రిందనుండకుండ తుడిచి
వేయును. । ఈ ధర్మశాస్త్రగ్రంథములో వ్రాయబడిన 21
నిబంధన శాపములన్నిటినిబట్టి వానికి కీడు కలుగజేయు
టకై యెహోవా ఇశ్రాయేలీయుల గోత్రములన్నిటి
లోనుండి వాని వేరుపరచును. । కాబట్టి మీ తరు 22
వాత పుట్టు మీ సంతతివారును దూరదేశమునుండి
వచ్చు పరదేశులును సమస్త జనములును ఆ దేశముయొక్క
తెగుళ్లను యెహోవా దానిమీదికి తెప్పించిన సంక
టములను చూచి । వారు, యెహోవా తన కోపో 23
ద్రేకముచేత నశింపజేసిన సొదొమ గొమొఱ్ఱా అద్మా
సెబోయీములవలె ఆ సమస్త దేశమును గంధకము
చేతను ఉప్పుచేతను చెడిపోయి, విత్తబడకయు దానిలో
ఏదియు పుట్టకయు దానిలో ఏ కూరయు మొలవ
కయు ఉండుట చూచి । — యెహోవా దేని బట్టి 24
యీ దేశమును ఇట్లు చేసెనో? యీ మహా కోపా
గ్నికి హేతువేమో? అని చెప్పుకొందురు. । మరియు 25
వారు—వారి పితరుల దేవుడైన యెహోవా ఐగుప్తు
దేశములోనుండి వారిని రప్పించిన తరువాత ఆయన
తమతో చేసిన నిబంధనను వారు నిరాకరించి ।
తామెరుగని అన్యదేవతలను, ఆయన వారికి నియ 26
మింపని దేవతలను, పూజించి వాటికి నమస్కరించిరి ।
గనుక యీ గ్రంథములో వ్రాయబడిన శాపము 27
లన్నిటిని యీ దేశముమీదికి తెప్పించుటకు దానిమీద
యెహోవా కోపము రవులుకొనెను. । యెహోవా 28
తన కోపోద్రేకముచేతను అత్యుగ్రతచేతను తమ దేశ
ములోనుండి వారిని పెల్లగించి, నేడున్నట్లుగా వారిని
వెళ్లగొట్టి పరదేశము పాలుచేసెను. । రహస్యములు 29
మన దేవుడైన యెహోవాకు చెందును. అయితే
మనము ఈ ధర్మశాస్త్ర వాక్యములన్నిటి ననుసరించి
నడుచుకొనునట్లు బయలుపరచబడినవి యెల్లప్పుడు
మనవియు మన సంతతివారివియు నగునని చెప్పుదురు.

నేను నీకు వినిపించిన యీ సంగతులన్నియు, **30**
అనగా దీవెనయు శాపమును నీమీదికి వచ్చిన తరు
వాత నీ దేవుడైన యెహోవా నిన్ను వెళ్లగొట్టించిన ।

2 సమస్త జనముల మధ్యను వాటిని జ్ఞాపకము చేసికొని,
నీ దేవుడైన యెహోవా వైపు తిరిగి, నేడు నేను నీ
కాజ్ఞాపించు సమస్తమునుబట్టి నీ పూర్ణహృదయము
తోను నీ పూర్ణాత్మతోను ఆయన మాట నీవును నీ సం
3 తతివారును వినినయెడల । నీ దేవుడైన యెహోవా
చెరలోనిమిమ్మును తిరిగి రప్పించును. ఆయన మిమ్మును
కరుణించి, నీ దేవుడైన యెహోవా ఏ ప్రజలలోకి
మిమ్మును చెదరగొట్టెనో వారిలోనుండి తాను మిమ్మును
4 సమకూర్చి రప్పించును. । మీలో నెవరైన ఆకాశ
దిగంతములకు వెళ్లగొట్టబడినను అక్కడనుండి నీ దేవు
డైన యెహోవా మిమ్మును సమకూర్చి అక్కడనుండి
5 రప్పించును. । నీ పితరులకు స్వాధీనపరచిన దేశమున
నీ దేవుడైన యెహోవా నిన్ను చేర్చును, నీవు దాని
స్వాధీనపరచుకొందువు; ఆయన నీకు మేలుచేసి నీ
6 పితరులకంటె నిన్ను విస్తరింపజేయును. । మరియు నీవు
బ్రదుకుటకై నీ పూర్ణహృదయముతోను నీ పూర్ణాత్మ
తోను నీ దేవుడైన యెహోవాను ప్రేమించునట్లు
నీ దేవుడైన యెహోవా తనకు లోబడుటకు నీ
హృదయమునకును నీ సంతతివారి హృదయమునకును
7 ఇష్టము పుట్టించును. । అప్పుడు నిన్ను హింసించిన నీ
శత్రువులమీదికిని నిన్ను ద్వేషించినవారిమీదికిని నీ
దేవుడైన యెహోవా ఆ సమస్త శాపములను తెప్పిం
8 చును. । నీవు తిరిగి వచ్చి యెహోవా మాట విని,
నేను నేడు నీకాజ్ఞాపించు ఆయన ఆజ్ఞలన్నిటిని గైకొను
9 చుందువు. । మరియు నీ దేవుడైన యెహోవా నీ
10 చేతిపనులన్నిటి విషయములోను, నీ గర్భఫలవిషయము
లోను, నీ పశువుల విషయములోను, నీ భూమి పంట
విషయములోను నీకు మేలగునట్లు నిన్ను వర్ధిల్లజేయును.
ఈ ధర్మశాస్త్రగ్రంథమందు వ్రాయబడిన ఆయన ఆజ్ఞ
లను కట్టడలను నీవు గైకొని, నీ దేవుడైన యెహోవా
మాట విని, నీ పూర్ణహృదయముతోను నీ పూర్ణాత్మ
తోను నీ దేవుడైన యెహోవా వైపు మళ్లునప్పుడు
యెహోవా నీ పితరులయందు ఆనందించినట్లు నీకు
మేలు చేయుటకు నీయందును ఆనందించి నీవైపు
మళ్లును.
11 నేడు నేను నీకాజ్ఞాపించు ఈ ధర్మమును గ్రహించుట
12 నీకు కఠినమైనది కాదు, దూరమైనది కాదు. । మనము
దాని విని గైకొనునట్లు, ఎవడు ఆకాశమునకు ఎక్కిపోయి
మనయొద్దకు దాని తెచ్చును అని నీవనుకొనుటకు అది
13 ఆకాశమందు ఉండునది కాదు; । మనము దాని విని
గైకొనునట్లు, ఎవడు సముద్రము దాటి మనయొద్దకు
దాని తెచ్చును అని నీవనుకొననేల? అది సముద్రపు
14 అద్దరి నుంచునదికాదు. । నీవు దాని ననుసరించుటకు
ఆ మాట నీకు బహు సమీపముగానున్నది; నీ హృద
యమున నీ నోటనున్నది.
15 చూడుము; నేడు నేను జీవమును మేలును మరణ
మును కీడును నీ యెదుట ఉంచియున్నాను. । నీవు 16
బ్రదికి విస్తరించునట్లుగా నీ దేవుడైన యెహోవాను
ప్రేమించి ఆయన మార్గములందు నడుచుకొని ఆయన
ఆజ్ఞలను కట్టడలను విధులను ఆచరించుమని నేడు నేను
నీకాజ్ఞాపించుచున్నాను. అట్లు చేసినపక్షమున నీవు
స్వాధీనపరచుకొనుటకు ప్రవేశించు దేశములో నీ
దేవుడైన యెహోవా నిన్ను ఆశీర్వదించును. । అయితే 17
నీ హృదయము తిరిగి పోయి, నీవు విననొల్లక యీడ్వ
బడినవాడవై అన్యదేవతలకు నమస్కరించి పూజించిన
యెడల । మీరు నిశ్చయముగా నశించిపోవుదురనియు, 18
స్వాధీనపరచుకొనుటకు యొర్దానును దాటబోవుచున్న
దేశములో మీరు అనేకదినములు ఉండరనియు నేడు
నేను నీకు తెలియజెప్పుచున్నాను. । నేడు జీవమును 19
మరణమును, ఆశీర్వాదమును శాపమును నేను నీ యెదు
టను ఉంచి, భూమ్యాకాశములను మీ మీద సాక్షు
లగా పిలుచుచున్నాను. । నీ పితరులైన అబ్రాహాము 20
ఇస్సాకు యాకోబులకు ఆయన ప్రమాణముచేసిన దేశ
ములో మీరు నివసించునట్లు యెహోవాయే నీ
ప్రాణమునకును నీ దీర్ఘాయుస్సుకును మూలమై యు
న్నాడు. కాబట్టి నీవును నీ సంతానమును బ్రదుకుచు,
నీ ప్రాణమునకు మూలమైన నీ దేవుడైన యెహోవాను
ప్రేమించి ఆయన వాక్యమును విని ఆయనను హత్తు
కొనునట్లును జీవమును కోరుకొనుడి.
మోషే ఇశ్రాయేలీయులందరితో ఈ మాటలు 31
చెప్పుట చాలించి వారితో మరల ఇట్లనెను—నేడు
నేను నూట ఇరువది యేండ్లవాడనై యున్నాను. ।
ఇకమీదట నేను మీ మధ్యనుండను, యెహోవా 2
ఈ యొర్దాను దాటకూడదని నాతో సెలవిచ్చెను. ।
నీ దేవుడైన యెహోవా నీకు ముందుగా దాటి 3
పోయి ఆ జనములను నీ యెదుట నుండకుండ నశింప
జేయును, నీవు వారి దేశమును స్వాధీనపరచుకొందువు.
యెహోవా సెలవిచ్చియున్నట్లు యెహోషువ నీ
ముందుగా దాటిపోవును. । యెహోవా నశింపజేసిన 4
అమోరీయుల రాజులైన సీహోనుకును ఓగుకును వారి
దేశమునకును ఏమి చేసెనో ఆ ప్రకారముగానే యీ
జనములకును చేయును. । నేను మీకాజ్ఞాపించిన దాని 5
నంతటినిబట్టి మీరు వారికి చేయునట్లు యెహోవా
నీ చేతికి వారిని అప్పగించును. నిబ్బరము గలిగి
ధైర్యముగా నుండుడి । భయపడకుడి, వారిని చూచి 6
దిగులుపడకుడి, నీతోకూడ వచ్చువాడు నీ దేవుడైన
యెహోవాయే; ఆయన నిన్ను విడువడు నిన్నెడ
బాయడు. । మరియు మోషే యెహోషువను పిలిచి 7
— నీవు నిబ్బరము గలిగి ధైర్యముగా నుండుము.
యెహోవా ఈ ప్రజల కిచ్చుటకు వారి పితరులతో
ప్రమాణముచేసిన దేశమునకు నీవు వీరితోకూడ పోయి
దానిని వారికి స్వాధీనపరచవలెను. । నీ ముందర 8

నడుచువాడు యెహోవా, ఆయన నీకు తోడైయుం
డును, ఆయన నిన్ను విడువడు నిన్ను ఎడబాయడు.
భయపడకుము విస్మయమొందకుమని ఇశ్రాయేలీయు
లందరియెదుట అతనితో చెప్పెను.
9 మోషే యీ ధర్మశాస్త్రమును వ్రాసి యెహోవా
నిబంధన మందసమును మోయు యాజకులైన లేవీ
యులకును ఇశ్రాయేలీయుల పెద్దలందరికిని దాని నప్ప
10 గించి । వారితో ఇట్లనెను—ప్రతి యేడవ సంవత్స
రాంతమున, అనగా నియమింపబడిన గడువు సంవత్స
11 రమున । నీ దేవుడైన యెహోవా ఏర్పరచుకొను
స్థలమందు ఇశ్రాయేలీయులందరు ఆయన సన్నిధిని
కనబడి పర్ణశాలల పండుగను ఆచరించునప్పుడు ఇశ్రా
యేలీయులందరి యెదుట ఈ ధర్మశాస్త్రమును ప్రకటించి
12 వారికి వినిపింపవలెను. । మీ దేవుడైన యెహోవాకు
భయపడి యీ ధర్మశాస్త్ర వాక్యములన్నిటిని అనుసరించి
నడుచుకొనునట్లు పురుషులేమి స్త్రీలేమి పిల్లలేమి నీ
పురములలోనున్న పరదేశులేమి వాటిని విని నేర్చు
13 కొనుటకై అందరిని పోగుచేయవలెను. । ఆలాగు నేర్చు
కొనిన పక్షమున దాని నెరుగని వారి సంతతివారు
దాని విని, మీరు స్వాధీనపరచుకొనుటకు యొర్దానును
దాటబోవుచున్న దేశమున మీరు బ్రదుకు దినము
లన్నియు మీ దేవుడైన యెహోవాకు భయపడుట
నేర్చుకొందురు.
14 మరియు యెహోవా—చూడుము; నీ మరణ
దినములు సమీపించెను; నీవు యెహోషువను పిలిచి
నేనతనికి ఆజ్ఞలిచ్చునట్లు ప్రత్యక్షపు గుడారములో
15 నిలువుడని మోషేతో సెలవియ్యగా, । మోషేయు
యెహోషువయు వెళ్లి ప్రత్యక్షపు గుడారములో
నిలిచిరి. అచ్చట యెహోవా మేఘస్తంభములో
ప్రత్యక్షమాయెను; ఆ మేఘస్తంభము ఆ గుడారపు
16 ద్వారముపైని నిలువగా । యెహోవా మోషేతో
ఇట్లనెను — ఇదిగో నీవు నీ పితరులతో పండుకొన
బోవుచున్నావు. ఈ జనులు లేచి, యెవరి దేశమున
తాము చేరి వారినడుమ నుందురో ఆ జనులమధ్యను
వ్యభిచారులై, ఆ అన్యుల దేవతలవెంట వెళ్లి నన్ను
విడిచి, నేను వారితో చేసిన నిబంధనను మీరుదురు. ।
17 కావున నా కోపము ఆ దినమున వారిమీద రగులు
కొనును. నేను వారిని విడిచి వారికి విరోధినగుదును,
వారు క్షీణించిపోవుదురు, విస్తారమైన కీడులు ఆప
దలు వారికి ప్రాప్తించును. ఆ దినమున వారు, మన
దేవుడు మన మధ్య నుండకపోయినందున గదా యీ
18 కీడులు మనకు ప్రాప్తించెననుకొందురు. । వారు అన్య
దేవతలతట్టు తిరిగి చేసిన కీడంతటినిబట్టి ఆ దినమున
19 నేను నిశ్చయముగా వారికి విరోధినగుదును. । కాబట్టి
మీరు ఈ కీర్తన వ్రాసి ఇశ్రాయేలీయులకు నేర్పుడి.
ఈ కీర్తన ఇశ్రాయేలీయులమీద నాకు సాక్ష్యార్థ
ముగా నుండునట్లు దానిని వారికి కంఠపాఠముగా
చేయించుము. । నేను వారి పితరులతో ప్రమాణము 20
చేసినట్లు, పాలు తేనెలు ప్రవహించు దేశమున వారిని
ప్రవేశపెట్టిన తరువాత, వారు తిని త్రాగి తృప్తిపొంది
క్రొవ్వినవారై అన్యదేవతలతట్టు తిరిగి వారిని పూజించి
నన్ను తృణీకరించి నా నిబంధనను మీరుదురు. ।
విస్తారమైన కీడులు ఆపదలు వారికి సంభవించిన తరు 21
వాత ఈ కీర్తన వారియెదుట సాక్షిగానుండి సాక్ష్యము
పలుకును. అది మరువబడక వారి సంతతి వారినోట
నుండును. నేను ప్రమాణముచేసిన దేశమున వారిని
ప్రవేశపెట్టకమునుపే, నేడే వారు చేయు ఆలోచన
నేనెరుగుదును. । కాబట్టి మోషే ఆ దినమందే యీ 22
కీర్తన వ్రాసి ఇశ్రాయేలీయులకు నేర్పెను. । మరియు 23
యెహోవా నూను కుమారుడైన యెహోషువకు
ఈలాగు సెలవిచ్చెను — నీవు నిబ్బరము గలిగి ధైర్య
ముగా నుండుము; నేను ప్రమాణపూర్వకముగా వారి
కిచ్చిన దేశమునకు ఇశ్రాయేలీయులను నీవు తోడు
కొని పోవలెను, నేను నీకు తోడైయుందును.
ఈ ధర్మశాస్త్రవాక్యములు మోషే గ్రంథమందు 24
సాంతముగా వ్రాయుట ముగించిన తరువాత । మోషే 25
యెహోవా నిబంధన మందసమును మోయు లేవీ
యులను చూచి ఆజ్ఞాపించినదేమనగా — మీరు ఈ
ధర్మశాస్త్ర గ్రంథమును తీసికొని మీ దేవుడైన
యెహోవా నిబంధన మందసపు ప్రక్కన ఉంచుడి. ।
అది అక్కడ నీమీద సాక్ష్యార్థముగా ఉండును. । 26
నీ తిరుగబాటును నీ మూర్ఖత్వమును నేనెరుగుదును. 27
నేడు నేను ఇంక సజీవుడనై మీతో ఉండగానే,
ఇదిగో మీరు యెహోవామీద తిరుగబాటుచేసితిరి. ।
నేను చనిపోయిన తరువాత మరి నిశ్చయముగా తిరుగ 28
బాటు చేయుదురుకదా. మీ గోత్రముల పెద్దలనం
దరిని మీ నాయకులను నాయొద్దకు పోగుచేయుడి.
ఆకాశమును భూమిని వారిమీద సాక్షులగా పెట్టి నేను
ఈ మాటలను వారి వినికిడిలో చెప్పెదను. । ఏలయనగా 29
నేను మరణమైన తరువాత మీరు బొత్తిగా చెడిపోయి
నేను మీకాజ్ఞాపించిన మార్గమును తప్పుదురనియు,
ఆ దినముల అంతమందు కీడు మీకు ప్రాప్తమగు
ననియు నేనెరుగుదును. మీరు చేయు క్రియలవలన
యెహోవాకు కోపము పుట్టించునట్లుగా ఆయన
దృష్టికి కీడైనదాని చేయుదురు. । అప్పుడు మోషే 30
ఇశ్రాయేలీయుల సర్వసమాజముయొక్క వినికిడిలో
ఈ కీర్తన మాటలు సాంతముగా పలికెను.

ఆకాశమండలమా, చెవినొగ్గుము; నేను మాట 32
లాడుదును
భూమండలమా, నా నోటిమాట వినుము.
నా ఉపదేశము వానవలె కురియును 2
నా వాక్యము మంచువలెను

లేతగడ్డిమీద పడు చినుకులవలెను
పచ్చికమీద కురియు వర్షమువలెను ఉండును.
3 నేను యెహోవా నామమును ప్రకటించెదను
మన దేవుని మాహాత్మ్యమును కొనియాడుడి.
4 ఆయన ఆశ్రయదుర్గముగా నున్నాడు; ఆయన
కార్యము సంపూర్ణము
ఆయన చర్యలన్నియు న్యాయములు
ఆయన నిర్దోషియై నమ్ముకొనదగిన దేవుడు
ఆయన నీతిపరుడు యథార్థవంతుడు.
5 వారు తమ్ము చెరుపుకొనిరి; ఆయన పుత్రులు
కారు; వారు కళంకులు
మూర్ఖతగల వక్రవంశము.
6 బుద్ధిలేని అవివేకజనమా,
ఇట్లు యెహోవాకు ప్రతికారము చేయుదురా?
ఆయన నిన్ను సృష్టించిన తండ్రి కాడా?
ఆయనే నిన్ను పుట్టించి స్థాపించెను.
7 పూర్వదినములను జ్ఞాపకము చేసికొనుము
తరతరముల సంవత్సరములను తలంచుకొనుము
నీ తండ్రిని అడుగుము, అతడు నీకు తెలుపును;
నీ పెద్దలను అడుగుము, వారు నీతో చెప్పుదురు.
8 మహోన్నతుడు జనములకు వారి స్వాస్థ్యములను
విభాగించినప్పుడు
నరజాతులను ప్రత్యేకించినప్పుడు
ఇశ్రాయేలీయుల లెక్కనుబట్టి ప్రజలకు సరి
హద్దులను నియమించెను.
9 యెహోవా జనమే ఆయన వంతు
యాకోబే ఆయన స్వాస్థ్యభాగము.
10 అరణ్యప్రదేశములోను
భీకరధ్వనిగల పాడైన యెడారిలోను
వాని కనుగొని ఆవరించి పరామర్శించి తన కను
పాపనువలె వాని కాపాడెను.
11 పక్షిరాజు తన గూడు రేపి తన పిల్లలపైని అల్లా
డుచు
రెక్కలు చాపుకొని వాటిని పట్టుకొని తన రెక్కల
మీద వాటిని మోయునట్లు
యెహోవా వాని నడిపించెను.
12 యెహోవా మాత్రము వాని నడిపించెను
అన్యులయొక్క దేవుళ్లలో ఏ దేవుడును ఆయనతో
కూడ ఉండలేదు.
13 భూమియొక్క ఉన్నతస్థలములమీద వాని నెక్కిం
చెను
పొలముల పంట వానికి తినిపించెను
కొండబండనుండి తేనెను
చెకుముకి రాతిబండనుండి నూనెను
అతనికి జుర్రించెను.
14 ఆవు మజ్జిగను గొఱ్ఱెమేకల పచ్చిపాలను
గొఱ్ఱెపిల్లల క్రొవ్వును బాషాను పొట్టేళ్లను మేక
లను
గోధుమల మెరికెల సారమును (నీకిచ్చెను.)
నీవు త్రాగిన మద్యము ద్రాక్షలరసము.
యెషూరూను క్రొవ్వినవాడై కాలు జాడించెను 15
నీవు క్రొవ్వి బలిసి మందుడవైతివి
వాడు తన్ను పుట్టించిన దేవుని విడిచెను
తన రక్షణ శైలమును తృణీకరించెను.
వారు అన్యుల దేవతలచేత ఆయనకు రోషము 16
పుట్టించిరి
హేయకృత్యములచేత ఆయనను కోపింపజేసిరి.
వారు దేవత్వములేని దయ్యములకు 17
తామెరుగని దేవతలకు
క్రొత్తగా పుట్టిన దేవతలకు
తమ పితరులు భయపడని దేవతలకు బలి అర్పించిరి.
నిన్ను పుట్టించిన ఆశ్రయదుర్గమును విసర్జించితివి. 18
నిన్ను కనిన దేవుని మరచితివి.
యెహోవా దాని చూచెను. 19
తన కుమారులమీదను కుమార్తెలమీదను క్రోధ
పడెను
వారిని అసహ్యించుకొనెను.
ఆయన ఇట్లనుకొనెను— 20
నేను వారికి విముఖుడనై వారి కడపటిస్థితి యే
మగునో చూచెదను
వారు మూర్ఖచిత్తముగలవారు విశ్వాసములేని పిల్లలు.
వారు దైవము కానిదానివలన నాకు రోషము 21
పుట్టించిరి
తమ వ్యర్థప్రవర్తనవలన నాకు కోపము పుట్టించిరి
కాబట్టి జనముకానివారివలన వారికి రోషము
పుట్టింతును
అవివేక జనమువలన వారికి కోపము పుట్టింతును.
నా కోపాగ్ని రగులుకొనును 22
పాతాళాగాధమువరకు అది దహించును
అది భూమిని దాని పంటను కాల్చును
పర్వతముల పునాదులను రవలబెట్టును.
వారికి ఆపదలను విస్తరింపజేసెదను 23
వారిమీద నా బాణములన్నిటిని వేసెదను.
వారు కరవుచేత క్షీణించుదురు 24
మంటచేతను క్రూరమైన హత్యచేతను హరించి
పోవుదురు
బురదలో ప్రాకు పాముల విషమును
మృగముల కోరలను వారిమీదికి రప్పించెదను.
బయట ఖడ్గమును లోపట భయమును 25
యౌవనులను కన్యకలను శిశువులను నెరిసిన తల
వెం[illegible]

26 వారిని దూరమునకు చెదరగొట్టెదను
27 వారి పేరు మనుష్యులలో లేకుండచేసెదననుకొం
దును
వారి విరోధులు నిజము గ్రహింపకుందురేమో
—ఇదంతయు యెహోవా చేసినదికాదు
మా బలముచేత వారిని గెలిచితిమి అని వారను
కొందురేమో
విరోధి గర్వమునకు భయపడి చెదరగొట్టలేదు.
28 వారు ఆలోచనలేని జనము
వారిలో వివేచనలేదు.
29 వారు జ్ఞానము తెచ్చుకొని దీని తలపోసి తమ కడ
పరిస్థితి యోచించుట మేలు.
30 తమ ఆశ్రయదుర్గము వారిని అమ్మివేయనియెడల
యెహోవా వారిని అప్పగింపనియెడల
ఒక్కడు ఎట్లు వేయిమందిని తరుమును?
ఇద్దరు ఎట్లు పదివేలమందిని పారదోలుదురు?
31 వారి ఆశ్రయదుర్గము మన ఆశ్రయదుర్గము వం
టిదికాదు
ఇందుకు మన శత్రువులే తీర్పరులు.
32 వారి ద్రాక్షావల్లి వెర్రి ద్రాక్షావల్లి
అది గొమొఱ్ఱా పొలములలో పుట్టినది.
వారి ద్రాక్షపండ్లు వెర్రి ద్రాక్షపండ్లు
వాటి గెలలు చేదైనవి.
33 వారి ద్రాక్షారసము క్రూరసర్పముల విషము
నాగుపాముల క్రూరవిషము.
34 వారి కాలు జారుకాలమున
35 —ప్రతికారమును ప్రతిఫలమిచ్చుటయు నావే;
వారి ఆపద్దినము సమీపించును
వారి గతి త్వరగా వచ్చును.
36 వారి కాధారము లేకపోవును.
37 నిర్బంధింపబడినవాడును స్వతంత్రుడును లేకపో
వును
ఇది నాయొద్ద మరుగుపడి యుండలేదా?
నా నిధులలో ముద్రింపబడి యుండలేదా?
యెహోవా చూచును
తన సేవకులనుగూర్చి సంతాపపడును.
నిజముగా తన ప్రజలకు తీర్పుచేయును.
38 ఆయన—వారి నైవేద్యముల క్రొవ్వును తిని వారి
పానీయార్పణమైన ద్రాక్షారసమును త్రాగిన
వారి దేవతలేమైరి!
వారు ఆశ్రయించిన దుర్గములే
లేచి మీకు సహాయము చేయవచ్చును
వారు మీకు శరణము కానియ్యుడి అని చెప్పును.
39 ఇదిగో నేను నేనే దేవుడను
నేను తప్ప వేరొక దేవుడు లేడు
మృతినొందించువాడను బ్రదికించువాడను నేనే
గాయపరచువాడను స్వస్థపరచువాడను నేనే
నా చేతిలోనుండి విడిపించువాడెవడును లేడు.
నేను తళతళలాడు నా ఖడ్గము నూరి 40
నా చేత న్యాయమును పట్టుకొనినయెడల 41
నా శత్రువులకు ప్రతికారము కలుగజేసెదను
నన్ను ద్వేషించువారికి ప్రతిఫలమిచ్చెదను
రక్తముచేత నా బాణములను మత్తిల్లచేసెదను.
చంపబడినవారి రక్తమును చెరపట్టబడినవారి రక్త 42
మును
శత్రువులలో వీరుల తలలను
నా ఖడ్గము భక్షించును
నేను ఆకాశముతట్టు నా హస్తమెత్తి నా శాశ్వత
జీవముతోడని ప్రమాణము చేయుచున్నాను.
జనములారా, ఆయన ప్రజలతోకూడ ఆనందిం 43
చుడి.
హతులైన తన సేవకులనుబట్టి ఆయన ప్రతిదండన
చేయును
తన విరోధులకు ప్రతికారము చేయును
తన దేశము నిమిత్తమును తన ప్రజలనిమిత్తమును
ప్రాయశ్చిత్తము చేయును.

మోషేయు నూను కుమారుడైన యెహోషువయు 44
ఈ కీర్తన మాటలన్నియు ప్రజలకు వినిపించిరి. । మరి 45
యు మోషే యీ మాటలన్నియు ఇశ్రాయేలీయు
లందరితో చెప్పి చాలించి । మరల వారితో ఇట్లనెను— 46
మీతో సాక్ష్యముగా నేడు నేను పలికిన మాటలన్ని
టిని మీ మనస్సులలో పెట్టుకొని, మీ సంతతివారు
ఈ ధర్మశాస్త్రవాక్యములన్నిటిని అనుసరించి నడుచు
కొనవలెనని వారికాజ్ఞాపింపవలెను. । ఇది మీకు నిర 47
ర్థకమైన మాటకాదు, ఇది మీకు జీవమే. మరియు
మీరు స్వాధీనపరచుకొనుటకు యొర్దానును దాట
బోవుచున్న దేశములో దీనినిబట్టి మీరు దీర్ఘాయుష్మం
తులగుదురు.

ఆ దినమున యెహోవా మోషేతో ఇట్లనెను— 48
యెరికో యెదుటనున్న మోయాబుదేశమందలి అబారీ 49
మను ఈ పర్వతము, అనగా నెబోకొండ యెక్కి
నేను ఇశ్రాయేలీయులకు స్వాస్థ్యముగా ఇచ్చుచున్న
కనానుదేశమును చూచి । నీ సహోదరుడైన అహ 50
రోను హోరు కొండమీద మృతిబొంది తన స్వజనుల
యొద్దకు చేరినట్లు నీవు ఎక్కబోవుచున్న కొండమీద
మృతిబొంది నీ స్వజనులయొద్దకు చేరుదువు. । ఏల 51
యనగా మీరు సీను అరణ్యములో కాదేషు మెరీబా
నీళ్లయొద్ద ఇశ్రాయేలీయుల మధ్యను నన్ను పరిశుద్ధ
పరచక ఇశ్రాయేలీయుల మధ్యను నామీద తిరుగ
బాటు చేసితిరి. । ఎదురుగా ఆ దేశమును చూచెదవు 52
కాని నేను ఇశ్రాయేలీయులకిచ్చుచున్న ఆ దేశమున
నీవు ప్రవేశింపవు.

33 దైవజనుడైన మోషే మృతినొందకమునుపు అతడు
ఇశ్రాయేలీయులను దీవించిన విధము ఇది; అతడిట్ల
నెను—
2 యెహోవా సీనాయినుండి వచ్చెను
శేయీరులోనుండి వారికి ఉదయించెను
ఆయన పారాను కొండనుండి ప్రకాశించెను
వేవేల పరిశుద్ధ సమూహముల మధ్యనుండి ఆయన
వచ్చెను
ఆయన కుడిపార్శ్వమున అగ్నిజ్వాలలు మెరియు
చుండెను.
3 ఆయన జనములను ప్రేమించును
ఆయన పరిశుద్ధులందరు నీ వశమున నుందురు
వారు నీ పాదములయొద్ద సాగిలపడుదురు
నీ ఉపదేశమును అంగీకరింతురు.
4 మోషే మనకు ధర్మశాస్త్రము విధించెను
అది యాకోబు సమాజ స్వాస్థ్యము.
5 జనులలో ముఖ్యులును ఇశ్రాయేలు గోత్రము
లును కూడగా
అతడు యెషురూనులో రాజు ఆయెను.
6 రూబేను బ్రదికి చావక యుండుగాక
అతనివారు లెక్కింపలేనంతమంది అగుదురు.
7 యూదానుగూర్చి అతడిట్లనెను—
యెహోవా, యూదా మనవి విని అతని ప్రజల
యొద్దకు అతని చేర్చుము.
యూదా బాహుబలము విస్తరించును
అతని శత్రువులకు విరోధముగా నీవతనికి సహా
యుడవై యుందువు.
8 లేవినిగూర్చి యిట్లనెను—
నీ తుమ్మీము నీ ఊరీము నీ భక్తునికి కలవు
మస్సాలో నీవు అతని పరిశోధించితివి
మెరీబా నీళ్లయొద్ద అతనితో వివాదపడితివి.
9 అతడు—నేను వారినెరుగనని తన తండ్రినిగూర్చి
యు తన తల్లినిగూర్చియు అనెను
తన సహోదరులను లక్ష్యపెట్టలేదు
తన కుమారులను కుమారులని యెంచలేదు
వారు నీ వాక్యమును బట్టి నీ నిబంధనను గైకొనిరి.
10 వారు యాకోబుకు నీ విధులను
ఇశ్రాయేలుకు నీ ధర్మశాస్త్రమును నేర్పుదురు
నీ సన్నిధిని ధూపమును
నీ బలిపీఠముమీద సర్వాంగబలిని అర్పించుదురు.
11 యెహోవా, అతని బలమును అంగీకరించుము
అతడు చేయు కార్యమును అంగీకరించుమీ
అతని విరోధులును అతని ద్వేషించువారును లేవ
కుండునట్లు
వారి నడుములను విరుగగొట్టుము.
12 బెన్యామీనునుగూర్చి యిట్లనెను—
బెన్యామీను యెహోవాకు ప్రియుడు
ఆయనయొద్ద అతడు సురక్షితముగా నివసించును
దినమెల్ల ఆయన అతనికి ఆశ్రయమగును
ఆయన భుజములమధ్య అతడు నివసించును.
యోసేపునుగూర్చి యిట్లనెను— 13
ఆకాశ పరమార్థములవలన మంచువలన
క్రింద క్రుంగియున్న అగాధ జలములవలన
సూర్యునివలన కలుగు ఫలములోని శ్రేష్ఠపదార్థ 14
ములవలన
చంద్రుడు పుట్టించు శ్రేష్ఠపదార్థములవలన
పురాతన పర్వతముల శ్రేష్ఠపదార్థములవలన 15
నిత్యపర్వతముల శ్రేష్ఠపదార్థములవలన
సంపూర్ణముగా ఫలించు భూమికి కలిగిన శ్రేష్ఠ 16
పదార్థములవలన
యెహోవా అతని భూమిని దీవించును
పొదలోనుండినవాని కటాక్షము యోసేపు తల
మీదికి వచ్చును
తన సహోదరులలో ప్రఖ్యాతినొందినవాని నడి
నెత్తిమీదికి అది వచ్చును
అతని వృషభమునకు మొదట పుట్టినదానికి ఘనత 17
కలదు.
అతని కొమ్ములు గురుపోతు కొమ్ములు
వాటివలన అతడు భూద్యంతములవరకు జనులను
త్రోసివేయును
ఎఫ్రాయిముయొక్క అయుతములును మనష్షే
సహస్రములును ఆలాగున నుందురు.
జెబులూనునుగూర్చి యిట్లనెను— 18
జెబులూనూ, నీవు బయలువెళ్లు స్థలమందు సంతో
షించుము
ఇశ్శాఖారూ, నీ గుడారములయందు సంతోషిం
చుము.
వారు జనములను కొండకు పిలిచిరి 19
అక్కడ నీతి బలుల నర్పింతురు
వారు సముద్రముల సమృద్ధిని
ఇసుకలో దాచబడిన రహస్యద్రవ్యములను పీల్చు
దురు.
గాదునుగూర్చి యిట్లనెను— 20
గాదును విశాలపరచువాడు స్తుతింపబడును
అతడు ఆడు సింహమువలె పొంచియుండును
బాహువును నడినెత్తిని చీల్చివేయును.
అతడు తనకొరకు మొదటిభాగము చూచుకొనెను 21
అక్కడ నాయకుని భాగము కాపాడబడెను.
అతడు జనములోని ముఖ్యులతో కూడ వచ్చెను
యెహోవా తీర్చిన న్యాయమును జరిపెన
ఇశ్రాయేలీయులరా
రించెన

22 దానునుగూర్చి యిట్లనెను—
దాను సింహపుపిల్ల
అది బాషానునుండి దుమికి దాటును.
23 నఫ్తాలినిగూర్చి యిట్లనెను—
కటాక్షముచేత తృప్తిపొందిన నఫ్తాలి,
యెహోవా దీవనచేత నింపబడిన నఫ్తాలి,
పశ్చిమ దక్షిణ దిక్కులను స్వాధీనపరచుకొనుము.
24 ఆషేరునుగూర్చి యిట్లనెను—
ఆషేరు తన సహోదరులకంటె ఎక్కువగా ఆశీర్వదింపబడును
అతడు తన సహోదరులకంటె కటాక్షము నొందును
తన పాదములను తైలములో ముంచుకొనును.
25 నీ కమ్ములు ఇనుపవియు ఇత్తడివియునై యుండును.
నీవు బ్రదుకు దినములలో నీకు విశ్రాంతి[1] కలుగును.
26 యెషురూనూ, దేవుని పోలినవాడెవడును లేడు
ఆయన నీకు సహాయము చేయుటకు ఆకాశవాహనుడై వచ్చును
మహోన్నతుడై మేఘవాహనుడగును.
27 శాశ్వతుడైన దేవుడు నీకు నివాసస్థలము
నిత్యముగనుండు బాహువులు నీ క్రిందనుండును
ఆయన నీ యెదుటనుండి శత్రువును వెళ్లగొట్టి—
నశింపజేయుమనెను.
28 ఇశ్రాయేలు నిర్భయముగా నివసించును
యాకోబు ఊట ప్రత్యేకింపబడును
అతడు ధాన్య ద్రాక్షారసములుగల దేశములోనుండును
అతనిపై ఆకాశము మంచును కురిపించును.
29 ఇశ్రాయేలూ, నీ భాగ్యమెంత గొప్పది
యెహోవా రక్షించిన నిన్ను పోలినవాడెవడు?
ఆయన నీకు సహాయకరమైన కేడెము
నీకు ఔన్నత్యమును కలిగించు ఖడ్గము
నీ శత్రువులు నీకు లోబడినట్లుగా వారు వేషము వేయుదురు
నీవు వారి ఉన్నతస్థలములను త్రొక్కుదువు.

మోషే మోయాబునుండి యెరికో యెదుటనున్న 34
పిస్గాకొండవరకు పోయి నెబో శిఖరమున కెక్కెను. ।
అప్పుడు యెహోవా దానువరకు గిలాదు దేశమం 2
తయు నఫ్తాలిదేశమంతయు ఎఫ్రాయిము మనష్షేల
దేశమును పశ్చిమసముద్రమువరకు యూదా దేశమం
తయు దక్షిణదేశమును । సోయరువరకు ఈతచెట్లుగల 3
యెరికోలోయచుట్టు మైదానమును అతనికి చూపిం
చెను. । మరియు యెహోవా అతనితో ఇట్లనెను— 4
నీ సంతానమున కిచ్చెదనని అబ్రాహాము ఇస్సాకు
యాకోబులకు నేను ప్రమాణముచేసిన దేశము ఇదే.
కన్నులార నిన్ను దాని చూడనిచ్చితిని గాని నీవు నది
దాటి అక్కడికి వెళ్లకూడదు. । యెహోవా సేవకు 5
డైన మోషే యెహోవా మాటచొప్పున మోయాబు
దేశములో మృతిబొందెను. । బెత్పయోరు యెదుట 6
మోయాబు దేశములోనున్న లోయలో అతడు పాతి
పెట్టబడెను. అతని సమాధి యెక్కడనున్నదో నేటి
వరకు ఎవరికి తెలియదు. । మోషే చనిపోయినప్పుడు 7
నూట ఇరువది సంవత్సరముల యీడుగలవాడు. అత
నికి దృష్టి మాంద్యము లేదు, అతని సత్తువు తగ్గ
లేదు. । ఇశ్రాయేలీయులు మోయాబు మైదానము 8
లలో మోషేనుబట్టి ముప్పది దినములు దుఃఖము సలు
పగా మోషేనుగూర్చిన దుఃఖము సలిపిన దినములు
సమాప్తమాయెను. । మోషే తన చేతులను నూను 9
కుమారుడైన యెహోషువమీద ఉంచియుండెను
గనుక అతడు జ్ఞానాత్మపూర్ణుడాయెను; కాబట్టి ఇశ్రా
యేలీయులు అతనిమాట విని యెహోవా మోషేకు
ఆజ్ఞాపించినట్లు చేసిరి. । ఐగుప్తుదేశములో ఫరోకును 10
అతని సేవకులకందరికిని అతనిదేశమంతటికిని యే సూ 11
చకక్రియలను మహాత్కార్యములను చేయుటకు
యెహోవా అతని పంపెనో । వాటి విషయములోను, 12
ఆ బాహుబలమంతటి విషయములోను, మోషే ఇశ్రా
యేలు జనులందరి కన్నులయెదుట కలుగజేసిన మహా
భయంకర కార్యముల విషయములోను, యెహోవాను
ముఖాముఖిగా ఎరిగిన మోషేవంటి యింకొక ప్రవక్త
ఇశ్రాయేలీయులలో ఇదివరకు పుట్టలేదు.

1 లేక, బలము.

# యెహోషువ

1 యెహోవా సేవకుడైన మోషే మృతినొందిన
తరువాత, యెహోవా నూను కుమారుడును మోషే
పరిచారకుడునైన యెహోషువకు ఈలాగు సెల
విచ్చెను — నా సేవకుడైన మోషే మృతినొందెను. ।
2 కాబట్టి నీవు లేచి, నీవును ఈ జనులందరును ఈ
యొర్దాను నది దాటి నేను ఇశ్రాయేలీయులకిచ్చుచున్న
3 దేశమునకు వెళ్లుడి. । నేను మోషేతో చెప్పినట్లు
మీరు అడుగుపెట్టు ప్రతి స్థలమును మీకిచ్చుచున్నా
4 ను. । అరణ్యమును ఈ లెబానోను మొదలుకొని
మహానదియైన యూఫ్రటీసు నదివరకును హిత్తీయుల దేశ
మంతయు పడమట మహాసముద్రమువరకును మీకు
5 సరిహద్దు. । నీవు బ్రదుకు దినములన్నిటను ఏ మను
ష్యుడును నీ యెదుట నిలువలేక యుండును; నేను
మోషేకు తోడైయుండినట్లు నీకును తోడైయుందు
6 ను. । నిన్ను విడువను నిన్ను ఎడబాయను, నిబ్బరము
గలిగి ధైర్యముగా నుండుము. వారికిచ్చెదనని నేను
వారి పితరులతో ప్రమాణముచేసిన యీ దేశమును
నిశ్చయముగా నీవు ఈ ప్రజల స్వాధీనము చేసెదవు. ।
7 అయితే నీవు నిబ్బరముగలిగి జాగ్రత్తపడి బహు ధైర్య
ముగానుండి, నా సేవకుడైన మోషే నీకు ఆజ్ఞాపించిన
ధర్మశాస్త్రమంతటి చొప్పున చేయవలెను. నీవు నడుచు
ప్రతిమార్గమున చక్కగా ప్రవర్తించునట్లు నీవు దాని
నుండి కుడికిగాని యెడమకుగాని తొలగకూడదు. ।
8 ఈ ధర్మశాస్త్రగ్రంథమును నీవు బోధింపక తప్పిపోకూ
డదు. దానిలో వ్రాయబడిన వాటన్నిటిప్రకారము
చేయుటకు నీవు జాగ్రత్తపడునట్లు దివారాత్రము
దాని ధ్యానించినయెడల నీ మార్గమును వర్ధిల్లజేసికొని
9 చక్కగా ప్రవర్తించెదవు. । నేను నీకాజ్ఞయిచ్చియు
న్నాను గదా, నిబ్బరముగలిగి ధైర్యముగానుండుము,
దిగులుపడకుము జడియకుము. నీవు నడుచు మార్గ
మంతటిలో నీ దేవుడైన యెహోవా నీకు తోడై
యుండును.

10 కాగా యెహోషువ ప్రజల నాయకులకు ఈలాగు
ఆజ్ఞాపించెను—మీరు పాళెములోకి పోయి జనులతో
11 ఈ మాట చెప్పుడి । —మీరు స్వాధీనపరచుకొనుటకు
మీ దేవుడైన యెహోవా మీకిచ్చుచున్న దేశమును
స్వాధీనపరచుకొనబోవుటకై మూడు దినములలోగా
మీరు ఈ యొర్దానును దాటవలెను గనుక ఆహార
మును సిద్ధపరచుకొనుడి.
12 మరియు రూబేనీయులకును గాదీయులకును మనష్షే
అర్ధగోత్రపువారికిని యెహోషువ యీలాగు ఆజ్ఞా
పించెను. । యెహోవా సేవకుడైన మోషే మీకాజ్ఞా 13
పించిన సంగతి జ్ఞాపకము చేసికొనుడి; ఎట్లనగా మీ
దేవుడైన యెహోవా మీకు విశ్రాంతి కలుగజేయు
చున్నాడు, ఆయన ఈ దేశమును మీకిచ్చును. । మీ 14
భార్యలును మీ పిల్లలును మీ ఆస్తియు యొర్దాను
ఇద్దరిని మోషే మీకిచ్చిన యీ దేశమున నివసింప
వలెనుగాని, పరాక్రమవంతులును శూరులునైన మీరం
దరు యుద్ధసన్నద్ధులై మీ సహోదరులకు ముం
దుగా । నది దాటి యెహోవా మీకు దయచేసినట్లు 15
మీ సహోదరులకును విశ్రాంతి దయచేయువరకు,
అనగా మీ దేవుడైన యెహోవా వారికిచ్చు దేశ
మును స్వాధీనపరచుకొనువరకు వారును సహాయము
చేయవలెను. అప్పుడు తూర్పున యొర్దాను ఇద్దరిని
యెహోవా సేవకుడైన మోషే మీకిచ్చిన మీ
స్వాస్థ్యమైన దేశమునకు మీరు తిరిగి వచ్చి దాని
స్వాధీనపరచుకొందురు. । అందుకు వారు—నీవు మా 16
కాజ్ఞాపించినదంతయు మేము చేసెదము, నీవు మమ్ము
నెక్కడికి పంపుదువో అక్కడికి పోదుము; । మోషే 17
చెప్పిన ప్రతిమాట మేము వినినట్లు నీ మాట విం
దుము; నీ దేవుడైన యెహోవా మోషేకు తోడై
యుండినట్లు నీకును తోడైయుండుగాక. । నీమీద 18
తిరుగబడి నీవు వారికి ఆజ్ఞాపించు ప్రతి విషయములో
నీ మాట విననివారందరు మరణశిక్ష నొందుదురు;
నీవు నిబ్బరముగలిగి ధైర్యము తెచ్చుకొనవలెనని
యెహోషువకు ఉత్తరమిచ్చిరి.

నూను కుమారుడైన యెహోషువ వేగులవారైన 2
యిద్దరు మనుష్యులను పిలిపించి — మీరు పోయి ఆ
దేశమును ముఖ్యముగా యెరికోను చూడుడని వారితో
చెప్పి, షిత్తీము నొద్దనుండి వారిని రహస్యముగా పం
పెను. వారు వెళ్లి రాహాబను నొక వేశ్యయింట చేరి
అక్కడ దిగగా । దేశమును వేగుచూచుటకు ఇశ్రా 2
యేలీయులయొద్దనుండి మనుష్యులు రాత్రివేళ ఇక్క
డికి వచ్చిరని యెరికో రాజుకు వర్తమానము వచ్చెను. ।
అతడు—నీయొద్దకు వచ్చి నీ యింట చేరిన ఆ మనుష్యు 3
లను వెలపలికి తీసికొనిరమ్ము; వారు ఈ దేశమంతటిని
వేగు చూచుటకై వచ్చిరని చెప్పుటకు రాహాబు నొద్దకు
మనుష్యులను పంపగా । ఆ స్త్రీ ఆ యిద్దరు మనుష్యు 4
లను తోడుకొని వారిని దాచిపెట్టి — మనుష్యులు
నాయొద్దకు వచ్చిన మాట నిజమే । వారెక్కడనుండి 5

వచ్చిరో నేనెరుగను; చీకటిపడుచుండగా గవిని వేయ
బడు వేళను ఆ మనుష్యులు వెలపలికి వెళ్లిరి, వారెచ
పోయిరో నేనెరుగను; మీరు వారిని శీఘ్రముగా
6 తరిమితిరా పట్టుకొందురు । అని చెప్పి పంపి తన
మిద్దెమీదికి ఆ యిద్దరిని ఎక్కించి దానిమీద రాశివేసి
7 యున్న జనుపకట్టెలో వారిని దాచిపెట్టెను. । ఆ
మనుష్యులు యొర్దాను దాటు రేవుల మార్గముగా
వారిని తరిమిరి; తరుమపోయిన మనుష్యులు బయలు
8 వెళ్లినతోడనే గవిని వేయబడెను. । ఆ వేగులవారు
పండుకొనకమునుపు, ఆమె వారున్న మిద్దెమీదికెక్కి
9 వారితో ఇట్లనెను । —యెహోవా ఈ దేశమును
మీకిచ్చుచున్నాడనియు, మీవలన మాకు భయము
పుట్టుననియు, మీ భయమువలన ఈ దేశనివాసులంద
10 రికి ధైర్యము చెడుననియు నేనెరుగుదును. । మీరు
ఐగుప్తు దేశములోనుండి వచ్చినప్పుడు మీ యెదుట
యెహోవా యెఱ్ఱసముద్రపు నీరును ఏలాగు ఆరిపో
చేసెనో, యొర్దాను తీరముననున్న అమోరీయుల
యిద్దరు రాజులైన సీహోనుకును ఓగుకును మీరేమి
చేసితిరో, అనగా మీరు వారిని ఏలాగు నిర్మూలము
11 చేసితిరో ఆ సంగతి మేము వింటిమి. । మేము విని
నప్పుడు మా గుండెలు కరిగిపోయెను. మీ దేవుడైన
యెహోవా పైన ఆకాశమందును క్రింద భూమి
యందును దేవుడే. మీ యెదుట ఎట్టి మనుష్యుల
12 కైనను ధైర్యమేమాత్రము ఉండదు. । నేను మీకు
ఉపకారము చేసితిని గనుక మీరును నా తండ్రియిం
టికి ఉపకారము చేసి నాకు నిజమైన ఆనవాలును
13 ఇచ్చి । నా తండ్రియు నా తల్లియు నా అన్నదమ్ము
లును నా అక్కచెల్లెండ్రును వారికి కలిగియున్న
వారందరును చావకుండ బ్రదుకనిచ్చి రక్షించునట్లుగా
దయచేసి యెహోవాతోడని ప్రమాణము చేయు
14 డనెను. । అందుకు ఆ మనుష్యులు ఆమెను చూచి—
నీవు మా సంగతి వెల్లడిచేయనిపక్షమందు మీరు చావ
కుండునట్లు మీ ప్రాణములకు బదులుగా మా ప్రాణ
మిచ్చెదము, యెహోవా ఈ దేశమును మాకిచ్చు
నప్పుడు నిజముగా మేము నీకు ఉపకారము చేసెద
15 మనిరి. । ఆమె యిల్లు పట్టణపు ప్రాకారముమీద
నుండెను; ఆమె ప్రాకారముమీద నివసించునది
గనుక త్రాడువేసి కిటికీద్వారా వారిని దింపెను. ।
16 ఆమె—మిమ్మును తరుమబోయినవారు మీకెదురుగా
వచ్చెదరేమో, మీరు కొండలకు వెళ్లి తరుమబోయిన
వారు తిరిగి వచ్చువరకు మూడుదినములు అచ్చట
దాగియుండుడి, తరువాత మీ త్రోవను వెళ్లుడని
17 వారితో అనగా । ఆ మనుష్యులు ఆమెతో ఇట్లనిరి
—యిదిగో మేము ఈ దేశమునకు వచ్చువారము
గనుక నీవు మాచేత చేయించిన యీ ప్రమాణము
18 విషయమై మేము నిర్దోషులమగునట్లు । నీవు మమ్మును
దించిన యీ కిటికీకి ఈ తొగరుదారమును కట్టి, నీ
తండ్రిని నీ తల్లిని నీ అన్నదమ్ములను నీ తండ్రి యింటి
వారినందరిని నీ యింట చేర్చుకొనుము. । నీ యింటి 19
ద్వారములలోనుండి వెలపలికి వచ్చువాడు తన ప్రాణ
మునకు తానే ఉత్తరవాది, మేము నిర్దోషులమగుదుము.
అయితే నీయొద్ద నీ యింటనున్న యెవనికేగాని యే
అపాయమైనను తగిలిన పక్షమున దానికి మేమే ఉత్తర
వాదులము. । నీవు మా సంగతి వెల్లడిచేసినపక్షమందు 20
నీవు మాచేత చేయించిన యీ ప్రమాణమువిషయ
ములో మేము దోషులము కామనిరి. । అందుకు 21
ఆమె — మీ మాటచొప్పున జరుగుగాక అని చెప్పి
వారిని వెళ్లనంపెను. వారు వెళ్లినతరువాత ఆమె ఆ
తొగరుదారమును కిటికీకి కట్టెను. । వారు వెళ్లి కొండ 22
లను చేరి, తరుమువారు తిరిగి వచ్చువరకు మూడు
దినములు అక్కడ నివసించిరి. తరుమువారు ఆ మార్గ
మందంతటను వారిని వెదకిరి గాని వారు కనబడలేదు. ।
ఆ యిద్దరు మనుష్యులు తిరిగి కొండలనుండి దిగి నది 23
దాటి నూను కుమారుడైన యెహోషువయొద్దకు వచ్చి
తమకు సంభవించినదంతయు అతనితో వివరించి
చెప్పిరి. । మరియు వారు — ఆ దేశమంతయు 24
యెహోవా మనచేతికి అప్పగించుచున్నాడు, మన
భయముచేత ఆ దేశనివాసులందరికి ధైర్యము చెడి
యున్నదని యెహోషువతో ననిరి.

యెహోషువ వేకువను లేచినప్పుడు అతడును 3
ఇశ్రాయేలీయులందరును షిత్తీమునుండి బయలుదేరి
యొర్దానుకువచ్చి దాని దాటకమునుపు అక్కడ నిలి
చిరి. । మూడు దినములైన తరువాత నాయకులు పాళె 2
ములో తిరుగుచు జనులకు ఈలాగున ఆజ్ఞాపించిరి ।
—మీరు మీ దేవుడైన యెహోవా నిబంధన మం 3
దసమును యాజకులైన లేవీయులు మోసికొనిపోవుట
చూచునప్పుడు మీరున్న స్థలములోనుండి బయలుదేరి
దాని వెంబడి వెళ్లవలెను. । మీకును దానికిని దాదాపు 4
రెండువేలకొల మూరల యెడముండవలెను. మీరు వెళ్లు
త్రోవ మీరింతకుముందుగా వెళ్లినది కాదు, మీరు
దాని గురుతుపట్టవలెను గనుక ఆ మందసమునకు
సమీపముగా మీరు నడవరాదు. । మరియు యెహో 5
షువ—రేపు యెహోవా మీ మధ్య అద్భుతకార్య
ములను చేయును గనుక మిమ్మును మీరు పరిశుద్ధపరచు
కొనుడని జనులకు ఆజ్ఞ ఇచ్చెను. । —మీరు నిబంధన 6
మందసమును ఎత్తికొని ప్రజలముందర నడువుడని
యాజకులకు అతడు సెలవియ్యగా వారు నిబంధన
మందసమును ఎత్తికొని ప్రజలముందర నడిచిరి.

అప్పుడు యెహోవా యెహోషువతో ఇట్ల 7
నెను — నేను మోషేకు తోడైయుండినట్లు నీకును
తోడైయుందునని ఇశ్రాయేలీయులందరు ఎరుగునట్లు
నేడు వారి కన్నులయెదుట నిన్ను గొప్పచేయ మొదలు

8 పెట్టెను. । మీరు యొర్దాను నీళ్లదరికి వచ్చి యొర్దా
నులో నిలువుడని నిబంధన మందసమును మోయు
9 యాజకులకు ఆజ్ఞాపించుము. । కాబట్టి యెహోషువ
—మీరు ఇక్కడికి వచ్చి మీ దేవుడైన యెహోవా
మాటలు వినుడని ఇశ్రాయేలీయులకు ఆజ్ఞాపించి ।
10 వారితో ఇట్లనెను—సర్వలోకనాథుని నిబంధన మంద
సము మీకు ముందుగా యొర్దానును దాటబోవుచున్నది
11 గనుక । జీవముగల దేవుడు మీ మధ్యనున్నాడనియు,
ఆయన నిశ్చయముగా మీ యెదుటనుండి కనానీయు
లను హిత్తీయులను హివ్వీయులను పెరిజ్జీయులను గిర్గా
షీయులను అమోరీయులను యెబూసీయులను వెళ్ల
గొట్టుననియు దీనివలన మీరు తెలిసికొందురు. ।
12 కాబట్టి ప్రతిగోత్రమునకు ఒక్కొక మనుష్యుని
ఇశ్రాయేలీయుల గోత్రములలోనుండి పన్నిద్దరు మను
13 ష్యులను ఏర్పరచుకొనుడి. । సర్వలోకనాథుడగు
యెహోవా నిబంధన మందసమును మోయు యాజ
కుల అరకాళ్లు యొర్దాను నీళ్లను ముట్టగానే యొర్దాను
నీళ్లు, అనగా ఎగువనుండి పారు నీళ్లు ఆపబడి యేక
14 రాశిగా నిలుచును. । కోత కాలమంతయు యొర్దాను
దాని గట్లన్నిటిమీద పొర్లి పారును; నిబంధన మందస
మును మోయు యాజకులు జనులకు ముందు వెళ్లగా
యొర్దానును దాటుటకై జనులు తమ గుడారములలో
15 నుండి బయలుదేరిరి. । అప్పుడు ఆ మందసమును
మోయువారు యొర్దానులో దిగినతరువాత మందస
మును మోయు యాజకుల కాళ్లు నీటి అంచున మునగ
16 గానే । పైనుండి పారు నీళ్లు నిలిచి సారెతానునొద్ద
నున్న ఆదామను పురమునకు బహుదూరమున ఏక
రాశిగా నిలిచెను. లవణసముద్రమను అరాబా సముద్ర
17 మునకు పారునవి బొత్తిగా ఆపబడెను. । జనులు
యెరికో యెదుటను దాటగా యెహోవా నిబంధన
మందసమును మోయు యాజకులు యొర్దానుమధ్య
ఆరిన నేలను స్థిరముగా నిలిచిరి. జనులందరు యొర్దా
నును దాటుట తుదముట్టువరకు ఇశ్రాయేలీయులందరు
ఆరిన నేలమీద దాటుచువచ్చిరి.

4 జనులందరు యొర్దానును దాటుట తుదముట్టిన
తరువాత యెహోవా యెహోషువతో నీలాగు
2 సెలవిచ్చెను । — ప్రతి గోత్రమునకు ఒక్కొక మను
ష్యుని చొప్పున పన్నిద్దరు మనుష్యులను ఏర్పరచి ।
3 యాజకుల కాళ్లు నిలిచిన స్థలమున యొర్దాను నడుమ
నుండి పన్నెండు రాళ్లను తీసి వాటిని ఇవతలకు తెచ్చి,
మీరు ఈ రాత్రి బసచేయుచోట వాటిని నిలువబెట్టు
4 డని వారి కాజ్ఞాపించుము । కావున యెహోషువ
ఇశ్రాయేలీయులలో సిద్ధపరచిన పన్నిద్దరు మనుష్యు
లను, అనగా ప్రతి గోత్రమునకు ఒక్కొక మనుష్యుని
5 పిలిపించి । వారితో ఇట్లనెను—యొర్దాను నడుమనున్న
మీ దేవుడైన యెహోవా మందసము నెదుట దాటి
పోయి, ఇశ్రాయేలీయుల గోత్రముల లెక్కచొప్పున
ప్రతివాడును ఒక్కొక రాతిని తన భుజముమీద
పెట్టుకొని తేవలెను. । ఇకమీదట మీ కుమారులు— 6
ఈ రాళ్లెందుకని అడుగునప్పుడు మీరు—యెహోవా
మందసమునెదుట యొర్దాను నీళ్లు ఏకరాశిగా ఆప
బడెను. । అది యొర్దానును దాటుచుండగా యొర్దాను 7
నీళ్లు ఆపబడెను గనుక యీ రాళ్లు చిరకాలము పర్యం
తము ఇశ్రాయేలీయులకు జ్ఞాపకార్థముగా నుండు
నని వారితో చెప్పవలెను. అవి మీకు ఆనవాలై
యుండును, । అందుకే దీని చేయవలెను. యెహోషువ 8
ఆజ్ఞాపించినట్లు ఇశ్రాయేలీయులు చేసిరి. యెహోవా
యెహోషువతో చెప్పినట్లు వారు ఇశ్రాయేలీయుల
గోత్రముల లెక్కచొప్పున యొర్దాను నడుమనుండి
పన్నెండు రాళ్లను తీసి తాము బసచేసినచోటికి తెచ్చి
అక్కడ నిలువబెట్టిరి. । అప్పుడు యెహోషువ నిబం 9
ధన మందసమును మోయు యాజకుల కాళ్లు యొర్దాను
నడుమ నిలిచిన చోట పన్నెండు రాళ్లను నిలువ
బెట్టించెను. నేటివరకు అవి అక్కడ నున్నవి. । ప్రజ 10
లతో చెప్పవలెనని యెహోవా యెహోషువకు
ఆజ్ఞాపించినదంతయు, అనగా మోషే యెహోషు
వకు ఆజ్ఞాపించినదంతయు, నెరవేరువరకు యాజకులు
మందసమును మోయుచు యొర్దానునడుమ నిలుచుం
డగా జనులు త్వరపడి దాటిరి.

జనులందరు దాటిన తరువాత వారు చూచు 11
చుండగా యెహోవా మందసము మోయు యాజ
కులు దాటిరి. । మరియు ఇశ్రాయేలీయులు చూచు 12
చుండగా రూబేనీయులును గాదీయులును మనష్షే
అర్ధగోత్రపువారును మోషే వారితో చెప్పినట్లు
యుద్ధసన్నద్ధులై దాటిరి. । సేనలో ఇంచుమించు నలు 13
వది వేలమంది యుద్ధసన్నద్ధులై యుద్ధము చేయుటకు
యెహోవా సన్నిధిని యెరికో మైదానములకు దాటి
వచ్చిరి. । ఆ దినమున యెహోవా ఇశ్రాయేలీయు 14
లందరి యెదుట యెహోషువను గొప్పచేసెను గనుక
వారు మోషేను గౌరవపరచినట్లు అతని బ్రదుకు
దినములన్నిటను అతని గౌరవపరచిరి.

యెహోవా—సాక్ష్యపు మందసమును మోయు 15
యాజకులకు యొర్దానులోనుండి యివతలికి రండని 16
ఆజ్ఞాపించుమని యెహోషువతో సెలవియ్యగా ।
యెహోషువ యొర్దానులోనుండి యెక్కి రండని ఆ 17
యాజకుల కాజ్ఞాపించెను. । యెహోవా నిబంధన 18
మందసమును మోయు యాజకులు యొర్దాను నడుమ
నుండి యెక్కి వచ్చినప్పుడు ఆ యాజకుల అరకాళ్లు
పొడినేలను నిలువగానే యొర్దాను నీళ్లు వాటిచోటికి
ఎప్పటివలెనే మరలి దాని గట్లన్నిటిమీద పొర్లి
పారెను. । మొదటి నెల పదియవ తేదిని జనులు 19
యొర్దానులోనుండి యెక్కి వచ్చి యెరికో తూర్పు

20 ప్రాంతమందలి గిల్గాలులో దిగగా । వారు యొర్దా
నులోనుండి తెచ్చిన పన్నెండు రాళ్లను యెహోషువ
21 గిల్గాలులో నిలువబెట్టించి । ఇశ్రాయేలీయులతో ఇట్ల
నెను — రాబోవుకాలమున మీ సంతతివారు — ఈ
రాళ్లెందుకని తమ తండ్రులను అడుగుదురుగదా; ।
22 అప్పుడు మీరు—ఇశ్రాయేలీయులు ఆరిన నేలమీద
23 ఈ యొర్దానును దాటిరి. । ఎట్లనగా యెహోవా
బాహువు బలమైనదని భూనివాసులందరు తెలిసి
24 కొనుటకును, । మీరు ఎల్లప్పుడును మీ దేవుడైన
యెహోవాయందు భయభక్తులు నిలుపుటకును,
మేము దాటువరకు మీ దేవుడైన యెహోవా తానే
మాయెదుట ఎఱ్ఱసముద్రమును ఎండచేసినట్లు మీరు
దాటువరకు మీ యెదుట యొర్దాను నీళ్లను ఎండచేసె
నని చెప్పి యీ సంగతి వారికి తెలియపరచవలెను.

5 వారు దాటుచుండగా ఇశ్రాయేలీయుల యెదుట
నుండి యెహోవా యొర్దాను నీళ్లను ఎండచేసిన
సంగతి యొర్దానుకు పడమటిదిక్కుననున్న అమో
రీయుల రాజులందరును సముద్రమునొద్దనున్న కనా
నీయుల రాజులందరును వినినప్పుడు వారి గుండెలు
చెదిరిపోయెను. ఇశ్రాయేలీయుల భయముచేత వారి
కిక ధైర్యమేమియు లేకపోయెను.
2 ఆ సమయమున యెహోవా — రాతికత్తులు
చేయించుకొని మరల ఇశ్రాయేలీయులకు సున్నతి
చేయించుమని యెహోషువకు ఆజ్ఞాపింపగా ।
3 యెహోషువ రాతికత్తులు చేయించుకొని సున్నతి
గిరి అను స్థలము దగ్గర ఇశ్రాయేలీయులకు సున్నతి
4 చేయించెను. । యెహోషువ సున్నతి చేయించుటకు
హేతువేమనగా, ఐగుప్తులోనుండి బయలుదేరినవారం
దరిలో యుద్ధసన్నద్ధులైన పురుషులందరు ఐగుప్తుమార్గ
5 మున అరణ్యములో చనిపోయిరి. । బయలుదేరిన
పురుషులందరు సున్నతి పొందినవారే కాని ఐగుప్తులో
నుండి బయలుదేరిన తరువాత అరణ్యమార్గమందు
పుట్టినవారిలో ఎవరును సున్నతి పొందియుండలేదు. ।
6 యెహోవా మనకు ఏ దేశమును ఇచ్చెదనని వారి
పితరులతో ప్రమాణముచేసెనో, పాలు తేనెలు ప్రవ
హించు ఆ దేశమును తాను వారికి చూపింపనని
యెహోవా ప్రమాణము చేసియుండెను గనుక ఐగు
ప్తులోనుండి వచ్చిన ఆ యోధులందరు యెహోవా
మాట వినకపోయినందున వారు నశించువరకు ఇశ్రా
యేలీయులు నలువది సంవత్సరములు అరణ్యములో
7 సంచరించుచు వచ్చిరి. । ఆయన వారికి ప్రతిగా పుట్టిం
చిన వారి కుమారులు సున్నతి పొందియుండలేదు
గనుక వారికి సున్నతి చేయించెను; ఏలయనగా మార్గ
8 మున వారికి సున్నతి జరుగలేదు. । కాబట్టి ఆ సమస్త
జనము సున్నతి పొందుట తీరిన తరువాత తాము
బాగుపడువరకు పాళెములోని తమ చోట్ల నిలిచిరి. ।

అప్పుడు యెహోవా—నేడు నేను ఐగుప్తు అవమా 9
నము మీ మీద నుండకుండ దొరలించివేసియున్నా
నని యెహోషువతో ననెను. అందుచేత నేటివరకు
ఆ చోటికి గిల్గాలను పేరు.
ఇశ్రాయేలీయులు గిల్గాలులో దిగి ఆ నెల పదు 10
నాలుగవ తేదిని సాయంకాలమున యెరికో మైదాన
ములో పస్కాపండుగను ఆచరించిరి. । పస్కా 11
పోయిన మరునాడు వారు ఈ దేశపు పంటను తినిరి.
ఆ దినమందే వారు పొంగకయు వేచబడియున్న
భక్ష్యములను తినిరి. । మరునాడు వారు ఈ దేశపు 12
పంటను తినుచుండగా మన్నా మానిపోయెను; అటు
తరువాత ఇశ్రాయేలీయులకు మన్నా దొరకక
పోయెను. ఆ సంవత్సరమున వారు కనానుదేశపు
పంటను తినిరి.
యెహోషువ యెరికో ప్రాంతమున నున్నప్పుడు 13
అతడు కన్నులెత్తి చూడగా, దూసిన కత్తి చేత పట్టు
కొనియున్న ఒకడు అతని యెదుట నిలిచియుండెను;
యెహోషువ అతనియొద్దకు వెళ్లి—నీవు మా పక్ష
ముగా నున్నవాడవా, మా విరోధులపక్షముగా నున్న
వాడవా? అని అడుగగా । అతడు — నేను ఎవని 14
పక్షముగా నున్నవాడనుకాను, యెహోవా సేనాధి
పతిగా నేను వచ్చియున్నాననెను. యెహోషువ
నేలమట్టుకు సాగిలపడి నమస్కారముచేసి — నా
యేలినవాడు తన దాసునికి సెలవిచ్చునదేమని అడి
గెను. । అందుకు యెహోవా సేనాధిపతి — నీవు 15
నిలిచియున్న యీ స్థలము పరిశుద్ధమైనది, నీ పాద
రక్షలను తీసివేయుమని యెహోషువతో చెప్పగా
యెహోషువ ఆలాగు చేసెను.

ఆ కాలమున ఇశ్రాయేలీయుల భయముచేత ఎవ 6
డును వెలుపలికి పోకుండను లోపలికి రాకుండను
యెరికోపట్టణద్వారము గట్టిగా మూసివేయబడెను. ।
అప్పుడు యెహోవా యెహోషువతో ఇట్లనెను— 2
చూడుము; నేను యెరికోను దాని రాజును పరాక్ర
మముగల శూరులను నీచేతికి అప్పగించుచున్నాను. ।
మీరందరు యుద్ధసన్నద్ధులై పట్టణమును ముట్టడించి 3
యొకమారు దానిచుట్టు తిరుగవలెను. । ఆలాగు ఆరు 4
దినములు చేయుచు రావలెను. ఏడుగురు యాజకులు
యోబేలు బూరలను పట్టుకొని ముందుగా నడువ
వలెను. ఏడవ దినమున మీరు ఏడు మారులు పట్ట
ణముచుట్టు తిరుగుచుండగా ఆ యాజకులు బూరల
నూదవలెను. । మానక యోబేలు కొమ్ములతో వారు 5
ధ్వనిచేయుచుండగా మీరు బూరలధ్వని వినునప్పుడు
జనులందరు ఆర్భాటముగా కేకలు వేయవలెను, అప్పుడు
ఆ పట్టణ ప్రాకారము కూలును గనుక జనులు తమ
యెదుటికి చక్కగా ఎక్కుదురు. । నూను కుమారు 6
డైన యెహోషువ యాజకులను పిలిపించి—మీరు

పెను ఎత్తికొని మోయుడి; ఏడుగురు
హోవా మందసమునకు ముందుగా
లను ఏడు పట్టుకొని నడువవలెనని
ను. । మరియు అతడు — మీరు
చుట్టుకొనుడనియు, యోధులు
ందసమునకు ముందుగా నడువవలె
చెప్పెను. । యెహోషువ ప్రజల
రువాత ఏడుగురు యాజకులు
లను ఏడు యెహోవా సన్నిధిని
ము, ఆ బూరలను ఊదుచుండగా
ంధన మందసమును వారివెంట నడి
బూరల నూదుచున్న యాజకులకు
రి, దండు వెనుకటి భాగము మంద
చ్చెను, యాజకులు వెళ్లుచు బూరలను
మరియు యెహోషువ — మీరు
నేను మీతో చెప్పు దినమువరకు
మవద్దు, మీ కంఠధ్వని వినబడనీయ
నుండి యే ధ్వనియు రావలదు, నేను
రు కేకలువేయవలెనని జనులకు ఆజ్ఞ
యెహోవా మందసము ఆ పట్టణ
యొకమారు దానిచుట్టు తిరిగిన తరు
రెములో చొచ్చి రాత్రి పాళెములో

యెహోషువ లేవగా యాజకులు
ందసమును ఎత్తికొని మోసిరి. । ఏడు
యోబేలు బూరలను ఏడు పట్టు
హోవా మందసమునకు ముందుగా
రలు ఊదుచు వచ్చిరి, యోధులు
నడిచిరి, దండు వెనుకటి భాగము
ందసము వెంబడి వచ్చెను, యాజ
బూరలు ఊదుచువచ్చిరి. । అట్లు
వారొకమారు పట్టణముచుట్టు తిరిగి
రల వచ్చిరి. ఆరుదినములు వారు
సువచ్చిరి. । ఏడవ దినమున వారు ఉద
నే లేచి యేడుమారులు ఆ ప్రకా
ణము చుట్టు తిరిగిరి; ఆ దినమున
ఏడు మారులు పట్టణముచుట్టు తిరి
రు యాజకులు బూరలు ఊదగా
జనులకు ఈలాగు ఆజ్ఞ ఇచ్చెను—
యెహోవా ఈ పట్టణమును మీకు
డు. । ఈ పట్టణమును దీనిలో
నను యెహోవావలన శపింపబడెను.
వేశ్య మనము పంపిన దూతలను దాచి
ఆమెయు ఆ యింటనున్న వారందరును
కుదురు. । శపింపబడినదానిలో
మీరు తీసికొనినయెడల మీరు శాప

గ్రస్తులై ఇశ్రాయేలీయుల పాళెమునకు శాపము
తెప్పించి దానికి బాధ కలుగజేయుదురు గనుక
శపింపబడిన దానిని మీరు ముట్టకూడదు. । వెండియు 19
బంగారును ఇత్తడిపాత్రలును ఇనుపపాత్రలును
యెహోవాకు ప్రతిష్ఠితములగును; వాటిని
యెహోవా ధనాగారములో నుంచవలెను.
యాజకులు బూరలు ఊదగా ప్రజలు కేకలు 20
వేసిరి. ఆ బూరల ధ్వని వినినప్పుడు ప్రజలు ఆర్భా
టముగా కేకలువేయగా ప్రాకారము కూలెను; ప్రజ
లందరు తమ యెదుటికి చక్కగా పట్టణప్రాకారము
ఎక్కి పట్టణమును పట్టుకొనిరి. । వారు పురుషుల 21
నేమి స్త్రీలనేమి చిన్నపెద్దలనందరిని యెద్దులను గొఱ్ఱె
లను గాడిదెలను ఆ పట్టణములోని సమస్తమును కత్తి
వాత సంహరించిరి. । అయితే యెహోషువ—ఆ వేశ్య 22
యింటికి వెళ్లి మీరు ఆమెతో ప్రమాణము చేసినట్లు
ఆమెను ఆమెకు కలిగినవారినందరిని అక్కడనుండి
తోడుకొని రండని దేశమును వేగుచూచిన యిద్దరు
మనుష్యులతో చెప్పగా । వేగులవారైన ఆ మనుష్యులు 23
పోయి రాహాబును ఆమె తండ్రిని ఆమె తల్లిని ఆమె
సహోదరులను ఆమెకు కలిగినవారినందరిని వెలుపలికి
తోడుకొని వచ్చిరి; ఆమె యింటివారినందరిని వారు
వెలుపలికి తోడుకొని ఇశ్రాయేలీయుల పాళెము వెల
పట వారిని నివసింపజేసిరి. । అప్పుడు వారు ఆ పట్టణ 24
మును దానిలోని సమస్తమును అగ్నిచేత కాల్చివేసిరి;
వెండిని బంగారును ఇత్తడి పాత్రలను ఇనుపపాత్రలను
మాత్రమే యెహోవా మందిరధనాగారములో
నుంచిరి. । రాహాబను వేశ్య యెరికోను వేగుచూచు 25
టకు యెహోషువ పంపిన దూతలను దాచిపెట్టి
యుండెను గనుక అతడు ఆమెను ఆమె తండ్రియింటి
వారిని ఆమెకు కలిగినవారినందరిని బ్రదుకనిచ్చెను.
ఆమె నేటివరకు ఇశ్రాయేలీయుల మధ్య నివసించు
చున్నది.
ఆ కాలమున యెహోషువ జనులచేత శపథము 26
చేయించి వారికీలాగు ఆజ్ఞాపించెను—ఎవడు యెరికో
పట్టణమును కట్టించవపూనుకొనునో వాడు యెహోవా
దృష్టికి శాపగ్రస్తుడగును; వాడు దాని పునాది
వేయగా వాని జ్యేష్ఠకుమారుడు చచ్చును; దాని తలుపు
లను నిలువబెట్టగా వాని కనిష్ఠకుమారుడు చచ్చును; ।
యెహోవా యెహోషువకు తోడైయుండెను గనుక 27
అతని కీర్తి దేశమందంతటను వ్యాపించెను.

**7** శపితమైన దాని విషయములో ఇశ్రాయేలీయులు
తిరుగబాటుచేసిరి. ఎట్లనగా యూదాగోత్రములో
జెరహు మునిమనుమడును జబ్ది మనుమడును కర్మీ
కుమారుడునైన ఆకాను శపితము చేయబడినదానిలో
కొంత తీసికొనెను గనుక యెహోవా ఇశ్రాయేలీ
యులమీద కోపించెను. । యెహోషువ—మీరు 2

వెళ్లి, దేశమును వేగుచూడుడని చెప్పి బేతేలు తూర్పు
దిక్కున బేతావెను దగ్గరనున్న హాయి అను పురము
నకు యెరికోనుండి వేగులవారిని పంపగా వారు వెళ్లి ।
3 హాయి పురమును వేగుచూచి యెహోషువయొద్దకు
తిరిగి వచ్చి—జనులందరిని వెళ్లనీయకుము, రెండు మూడు
వేలమంది వెళ్లి హాయిని పట్టుకొనవచ్చును, జనులందరు
ప్రయాసపడి అక్కడికి వెళ్ల నేల? హాయివారు
కొద్దిగా నున్నారు గదా అనిరి.
4 కాబట్టి జనులలో ఇంచుమించు మూడు వేలమంది
అక్కడికి వెళ్లిరిగాని వారు హాయివారి యెదుట
5 నిలువలేక పారిపోయిరి. । అప్పుడు హాయివారు
వారిలో ముప్పది ఆరుగురు మనుష్యులను హతము
చేసిరి. మరియు తమ గవినియొద్దనుండి షెబారీము
వరకు వారిని తరిమి మోరాదులో వారిని హతము
చేసిరి. కాబట్టి జనుల గుండెలు కరిగి నీరైపోయెను.
6 యెహోషువ తన బట్టలు చింపుకొని, తానును
ఇశ్రాయేలీయుల పెద్దలును సాయంకాలమువరకు
యెహోవా మందసము నెదుట నేలమీద ముఖ
ములు మోపుకొని తమ తలలమీద ధూళి పోసి
7 కొనుచు । —అయ్యో ప్రభువా యెహోవా,
మమ్మును నశింపజేయునట్లు అమోరీయులచేతికి మమ్మును
అప్పగించుటకు ఈ జనులను ఈ యొర్దాను నీవెందుకు
దాటించితివి? మేము యొర్దాను అద్దరిని నివసించుట
8 మేలు. । ప్రభువా కనికరించుము; ఇశ్రాయేలీయులు
తమ శత్రువులయెదుట నిలువలేక వెనుకకు తిరిగినం
9 దుకు నేనేమి చెప్పగలను? । కనానీయులును ఈ దేశ
నివాసులందరును విని, మమ్మును చుట్టుకొని మా పేరు
భూమిమీద ఉండకుండ తుడిచివేసినయెడల, ఘనమైన
నీ నామమునుగూర్చి నీవేమి చేయుదువని ప్రార్థిం
10 పగా । యెహోవా యెహోషువతో ఇట్లనెను—
లెమ్ము; నీవేల యిక్కడ ముఖము నేల మోపికొందువు? ।
11 ఇశ్రాయేలీయులు పాపము చేసియున్నారు. నేను
వారితో చేసిన నిబంధనను వారు మీరియున్నారు.
శపితమైన దాని కొంత తీసికొని, దొంగిలి బొంకి
తమ సామానులో దాని ఉంచుకొనియున్నారు. ।
12 కాబట్టి ఇశ్రాయేలీయులు శాపగ్రస్తులై తమ శత్రు
వులయెదుట నిలువలేక తమ శత్రువులయెదుట
వెనుకకు తిరిగిరి. శాపగ్రస్తులైనవారు మీ మధ్యనుండ
కుండ మీరు వారిని నిర్మూలము చేసితేనే తప్ప నేను
13 మీకు తోడైయుండను. । నీవు లేచి జనులను పరిశుద్ధ
పరచి వారితో ఈలాగు చెప్పుము—రేపటికి మిమ్మును
మీరు పరిశుద్ధపరచుకొనుడి; ఇశ్రాయేలీయుల దేవు
డైన యెహోవా సెలవిచ్చినదేమనగా—ఇశ్రాయేలీ
యులారా, మీ మధ్య శాపగ్రస్తులైన వారున్నారు;
మీరు శాపగ్రస్తులను మీ మధ్యనుండకుండ నిర్మూ
లము చేయువరకు మీ శత్రువుల యెదుట మీరు
నిలువలేరు. । ఉదయమున మీ గోత్రముల వరుసను 14
బట్టి మీరు రప్పింపబడుదురు; అప్పుడు యెహోవా
ఏ గోత్రమును సూచించునో అది వంశముల వరుస
ప్రకారము దగ్గరకు రావలెను; యెహోవా
సూచించు వంశము కుటుంబముల ప్రకారము దగ్గరకు
రావలెను; యెహోవా సూచించు కుటుంబము పురు
షుల వరుస ప్రకారము దగ్గరకు రావలెను. । అప్పుడు 15
శపితమైనది యెవనియొద్ద దొరుకునో వానిని వానికి
కలిగినవారినందరిని అగ్నిచేత కాల్చివేయవలెను;
ఏలయనగా వాడు యెహోవా నిబంధనను మీరి
ఇశ్రాయేలులో దుష్కార్యము చేసినవాడు. । కాబట్టి 16
యెహోషువ ఉదయమున లేచి ఇశ్రాయేలీయులను
వారి గోత్రముల వరుసనుబట్టి దగ్గరకు రప్పించి
నప్పుడు యూదాగోత్రము పట్టుబడెను. । యూదా 17
వంశమును దగ్గరకు రప్పించినప్పుడు జెరహీయుల
వంశము పట్టుబడెను. జెరహీయుల వంశమును పురు
షుల వరుసను దగ్గరకు రప్పించినప్పుడు జబ్ది పట్టుబ
డెను. । అతడును అతని యింటి పురుషుల వరుసయు 18
దగ్గరకు రప్పింపబడినప్పుడు యూదా గోత్రములోని
జెరహు మునిమనుమడును జబ్ది మనుమడును కర్మీ కుమా
రుడునైన ఆకాను పట్టుబడెను. । అప్పుడు యెహో 19
షువ ఆకానును చూచి—నా కుమారుడా, ఇశ్రాయేలు
దేవుడైన యెహోవాకు మహిమను చెల్లించి ఆయనను
స్తుతించి నీవు చేసినదానిని మరుగుచేయక నాకు
తెలుపుమని నిన్ను వేడుకొనుచున్నానని చెప్పగా ।
ఆకాను యెహోషువను చూచి—ఇశ్రాయేలీయుల 20
దేవుడైన యెహోవాకు విరోధముగా నేను పాపము
చేసినది నిజము. । దోపుడు సొమ్ములో ఒక మంచి 21
షీనారు పైవస్త్రమును ఇన్నూరు తులముల వెండిని
ఏబదితులముల యెత్తుగల ఒక బంగారు కమ్మిని నేను
చూచి వాటిని ఆశించి తీసికొంటిని; అదిగో నా డేరా
మధ్య అవి భూమిలో దాచబడియున్నవి, ఆ వెండి
దాని క్రింద ఉన్నదని ఉత్తరమిచ్చి తాను చేసినదం
తయు ఒప్పుకొనెను. । అప్పుడు యెహోషువ దూత 2
లను పంపగా వారు ఆ డేరాయొద్దకు పరుగెత్తి చూచి
నప్పుడు అది డేరాలో దాచబడియుండెను, ఆ వెండి
దాని క్రింద నుండెను. । కాబట్టి వారు డేరామధ్య 2
నుండి వాటిని తీసికొని యెహోషువయొద్దకును ఇశ్రా
యేలీయులయొద్దకును తెచ్చి యెహోవా సన్నిధిని
ఉంచిరి. । తరువాత యెహోషువయు ఇశ్రాయేలీయు 2
లందరును జెరహు కుమారుడైన ఆకానును ఆ వెండిని
ఆ పైవస్త్రమును ఆ బంగారు కమ్మిని, ఆకాను కుమారు
లను కుమార్తెలను ఎద్దులను గాడిదెలను మందను
డేరాను వానికి కలిగిన సమస్తమును పట్టుకొని ఆకోరు
లోయలోకి తీసికొని వచ్చిరి. । అప్పుడు యెహో 2
షువ — నీవేల మమ్మును బాధపరచితివి? నేడు

యెహోవా నిన్ను బాధపరచుననగా ఇశ్రాయేలీ
26 యులందరు వానిని రాళ్లతో చావకొట్టిరి; । వారిని
రాళ్లతో కొట్టినతరువాత అగ్నిచేత కాల్చి వారిమీద
రాళ్లను పెద్దకుప్పగా వేసిరి. అది నేటివరకు ఉన్నది.
అప్పుడు యెహోవా కోపోద్రేకము విడిచినవాడై
మళ్లుకొనెను. అందుచేతను నేటివరకు ఆ చోటికి
ఆకోరులోయ అని పేరు.

8 మరియు యెహోవా యెహోషువతో ఇట్లనెను
—భయపడకుము, జడియకుము, యుద్ధసన్నద్ధులైన
వారినందరిని తోడుకొని హాయిమీదికి పొమ్ము.
చూడుము; నేను హాయి రాజును అతని జనులను
అతని పట్టణమును అతని దేశమును నీ చేతికప్పగించు
2 చున్నాను. । నీవు యెరికోకును దాని రాజుకును ఏమి
చేసితివో అదే హాయికిని దాని రాజుకును చేసెదవు;
అయితే దాని సొమ్మును పశువులను మీరు కొల్లగా
దోచుకొనవచ్చును. పట్టణపు పడమటివైపున మాటు
3 గాండ్లనుంచుము. । యెహోషువయు యోధులంద
రును హాయిమీదికి పోవలెననియుండగా, యెహో
షువ పరాక్రమముగల ముప్పదివేల శూరులను ఏర్ప
4 రచి రాత్రివేళ వారిని పంపి । వారి కాజ్ఞాపించిన
దేమనగా—ఆ పట్టణమునకు పడమటివైపున మీరు
దాని పట్టుకొన చూచుచు పొంచియుండవలెను.
పట్టణమునకు బహుదూరమునకు వెళ్లక మీరందరు
5 సిద్ధపడియుండుడి. । నేనును నాతోకూడనున్న జను
లందరును పట్టణమునకు సమీపించెదము, వారు మును
పటివలె మమ్మును ఎదుర్కొనుటకు బయలుదేరగా
మేము వారియెదుట నిలువక పారిపోదుము. । —
6 మునుపటివలె వీరు మనయెదుట నిలువలేక పారి
పోదురని వారనుకొని, మేము పట్టణమునొద్దనుండి
వారిని తొలగి రాజేయువరకు వారు మా వెంబడిని
బయలుదేరి వచ్చెదరు; మేము వారియెదుట నిలువక
పారిపోయినప్పుడు మీరు పొంచియుండుట మాని ।
7 లేచి పట్టణమును పట్టుకొనుడి; మీ దేవుడైన
8 యెహోవా మీ చేతికి దాని నప్పగించును. । మీరు
ఆ పట్టణమును పట్టుకొనినప్పుడు యెహోవా మాట
9 చొప్పున జరిగించి దాని తగలబెట్టవలెను. । ఇదిగో
నేను మీ కాజ్ఞాపించియున్నానని చెప్పి యెహో
షువ వారిని పంపగా వారు పొంచియుండుటకు
పోయి హాయి పడమటి దిక్కున బేతేలుకును హాయి
కిని మధ్య నిలిచిరి. ఆ రాత్రి యెహోషువ జనుల
మధ్య బసచేసెను.
10 ఉదయమున యెహోషువ వేకువను లేచి జను
లను వ్యూహపరచి, తానును ఇశ్రాయేలీయుల పెద్ద
లును జనులకు ముందుగా హాయిమీదికి పోయిరి. ।
11 అతని యొద్దనున్న యోధులందరు పోయి సమీపించి
ఆ పట్టణము నెదుటికి వచ్చి హాయికి ఉత్తరదిక్కున
దిగిరి. । వారికిని హాయికిని మధ్యను లోయ యుండగా 12
అతడు ఇంచుమించు అయిదు వేలమంది మనుష్యులను
నియమించి పట్టణమునకు పడమటివైపున బేతేలుకును
హాయికిని మధ్యను పొంచియుండుటకు ఉంచెను. ।
వారు ఆ జనులను, అనగా పట్టణమునకు ఉత్తర 13
దిక్కుననున్న సమస్త సైన్యమును పట్టణమునకు పడ
మటి దిక్కున దాని వెనుకటిభాగమున నున్నవారిని,
ఉంచిన తరువాత యెహోషువ ఆ రాత్రి లోయ
లోకి దిగిపోయెను.
హాయి రాజు దాని చూచినప్పుడు అతడును అతని 14
జనులందరును పట్టణస్థులందరును త్వరపడి పెందలకడ
లేచి మైదానమునెదుట ఇశ్రాయేలీయులను ఎదు
ర్కొని, తాము అంతకుముందు నిర్ణయించుకొనిన స్థల
మున యుద్ధముచేయుటకు బయలుదేరిరి. తన్ను పట్టు
కొనుటకు పొంచియున్నవారు పట్టణమునకు పడమటి
వైపుననుండిన సంగతి అతడు తెలిసికొనలేదు. ।
యెహోషువయు ఇశ్రాయేలీయులందరును వారి 15
యెదుట నిలువలేక ఓడిపోయినవారైనట్టు అరణ్య
మార్గముతట్టు పారిపోయినప్పుడు । వారిని ఆతుర 16
ముగా తరుముటకై హాయిలోనున్న జనులందరు
కూడుకొని యెహోషువను తరుముచు పట్టణమునకు
దూరముగా పోయిరి. । ఇశ్రాయేలీయులను తరుము 17
టకు పోనివాడొకడును హాయిలోనేగాని బేతేలులో
నేగాని మిగిలియుండలేదు. వారు గవిని వేయక
పట్టణమును విడిచి ఇశ్రాయేలీయులను తరుమబోయి
యుండిరి. । అప్పుడు యెహోవా యెహోషువతో 18
ఇట్లనెను—నీవు చేత పట్టుకొనిన యీటెను హాయి
వైపుగా చాపుము, పట్టణమును నీ చేతి కప్పగింతును,
అంతట యెహోషువ తన చేతనున్న యీటెను ఆ
పట్టణమువైపు చాపెను. । అతడు తన చెయ్యి చాపగా 19
పొంచియున్నవారు మాటులోనుండి త్వరగా లేచి
పరుగెత్తి పట్టణములో చొచ్చి దాని పట్టుకొని
అప్పుడే తగలబెట్టిరి. । హాయివారు వెనుకవైపు తిరిగి 20
చూచినప్పుడు ఆ పట్టణముయొక్క పొగ ఆకాశమున
కెక్కుచుండెను. అప్పుడు అరణ్యమునకు పారి
పోయిన జనులు తిరిగి తమ్మును తరుముచున్నవారి
మీద పడుచుండిరి గనుక ఈ తట్టయినను ఆ తట్టయి
నను పారిపోవుటకు వారికి వీలులేకపోయెను. । పొంచి 21
యున్నవారు పట్టణమును పట్టుకొనియుండుటయు
పట్టణపు పొగ యెక్కుచుండుటయు యెహోషు
వయు ఇశ్రాయేలీయులందరును చూచినప్పుడు వారు
తిరిగి హాయివారిని హతముచేసిరి. । తక్కినవారును 22
పట్టణములోనుండి బయలుదేరి వారికి ఎదురుగా
వచ్చిరి. అట్లు ఈ తట్టు కొందరు ఆ తట్టు కొందరు
ఉండగా హాయివారు ఇశ్రాయేలీయుల నడుమ చిక్కు
బడిరి గనుక ఇశ్రాయేలీయులు వారిని హ

వారిలో ఒకడును మిగులలేదు; ఒకడును తప్పించు
23 కొనలేదు. । వారు హాయి రాజును ప్రాణముతో
పట్టుకొని యెహోషువయొద్దకు తీసికొని వచ్చిరి.
24 బీటిలోను పొలములోను హాయి నివాసులను తరి
మిన ఇశ్రాయేలీయులు వారిని చంపుట చాలింపగా,
కత్తివాత కూలక మిగిలినవాడొకడును లేకపోయి
నప్పుడు ఇశ్రాయేలీయులందరు హాయియొద్దకు తిరిగి
25 వచ్చి దాని కత్తివాతను నిర్మూలముచేసిరి. । ఆ దినమున
పడిన స్త్రీ పురుషులందరు పన్నెండు వేలమంది. ।
26 యెహోషువ హాయి నివాసులనందరిని నిర్మూలము
చేయువరకు ఈటెను పట్టుకొని చాచిన తన చేతిని
27 తిరిగి ముడుచుకొనలేదు. । యెహోవా యెహో
షువకు ఆజ్ఞాపించిన మాటచొప్పున ఇశ్రాయేలీ
యులు ఆ పట్టణములోని పశువులను సొమ్మును తమ
28 కొరకు కొల్లగా దోచుకొనిరి. । అట్లు యెహోషువ
హాయి నిత్యము పాడైపోవలెనని దాని కాల్చివేసెను;
29 నేటివరకు అది అట్లే యున్నది. । యెహోషువ
హాయి రాజును సాయంకాలమువరకు మ్రానుమీద
వ్రేలాడదీసెను. ప్రొద్దుగ్రుంకుచున్నప్పుడు సెల
వియ్యగా జనులు వాని శవమును మ్రానిమీదనుండి
దించి ఆ పురద్వారమునెదుట దాని పడవేసి దాని
మీద పెద్ద రాళ్లకుప్ప వేసిరి. అది నేటివరకు ఉన్నది.
30 మోషే ధర్మశాస్త్రగ్రంథములో వ్రాయబడిన ప్రకా
31 రము । యెహోవా సేవకుడైన మోషే ఇశ్రాయేలీ
యుల కాజ్ఞాపించినట్లు యెహోషువ ఇశ్రాయేలీ
యుల దేవుడైన యెహోవా నామమున బలిపీఠమును
ఇనుప పనిముట్లు తగిలింపని కారు రాళ్లతో ఏబాలు
కొండమీద కట్టించెను. దానిమీద వారు యెహోవాకు
దహనబలులను సమాధానబలులను అర్పించిరి. ।
32 మోషే ఇశ్రాయేలీయులకు వ్రాసియిచ్చిన ధర్మశాస్త్ర
గ్రంథమునకు ఒక ప్రతిని అతడు అక్కడ ఆ రాళ్ల
33 మీద వ్రాయించెను. । అప్పుడు ఇశ్రాయేలీయులను
దీవించుటకు యెహోవా సేవకుడైన మోషే
పూర్వము ఆజ్ఞాపించినది జరుగవలెనని, పరదేశులేమి
వారిలో పుట్టినవారేమి ఇశ్రాయేలీయులందరును వారి
పెద్దలును వారి నాయకులును వారి న్యాయాధిపతు
లును యెహోవా నిబంధన మందసమును మోయు
యాజకులైన లేవీయుల ముందర ఆ మందసమునకు
ఈ వైపున ఆ వైపున నిలిచిరి. వారిలో సగముమంది
గెరిజీము కొండయెదుటను సగముమంది ఏబాలు
34 కొండయెదుటను నిలువగా యెహోషువ । ఆ ధర్మ
శాస్త్రగ్రంథములో వ్రాయబడిన వాటన్నిటినిబట్టి ఆ
ధర్మశాస్త్ర వాక్యములన్నిటిని, అనగా దాని దీవెన
వచనమును దాని శాపవచనమును చదివి వినిపించెను.
స్త్రీలును పిల్లలును వారి మధ్యనుండు పరదేశులును
35 వినుచుండగా । యెహోషువ సర్వసమాజము నెదుట
మోషే ఆజ్ఞాపించినవాటన్నిటిలో చదువక విడిచిన
మాటయొక్కటియు లేదు.

యొర్దాను అద్దరినున్న మన్యములోను లోయ 9
లోను లెబానోను నెదుటి మహాసముద్రతీరమం
దంతటను ఉన్న హిత్తీయులు అమోరీయులు కనానీ
యులు పెరిజ్జీయులు హివ్వీయులు యెబూసీయులు
అనువారి రాజులందరు జరిగినదానిని వినినప్పుడు ।
వారు యెహోషువతోను ఇశ్రాయేలీయులతోను 2
యుద్ధముచేయుటకు కూడి వచ్చిరి. । యెహోషువ 3
యెరికోకును హాయికిని చేసినదానిని గిబియోను నివా
సులు వినినప్పుడు । వారు కపటోపాయము చేసి, 4
రాయభారులమని వేషము వేసికొని బయలుదేరి, తమ
గాడిదెలకు పాత గోనెలుకట్టి పాతగిలి చినిగి కుట్టబడి
యున్న ద్రాక్షారసపు సిద్దెలు తీసికొని । పాతగిలి 5
మాసికలు వేయబడిన చెప్పులు పాదములకు తొడుగు
కొని పాతబట్టలు కట్టుకొని వచ్చిరి. వారు ఆహార
ముగా తెచ్చుకొనిన భక్ష్యములన్నియు ఎండిన ముక్క
లుగా నుండెను. । వారు గిల్గాలునందలి పాలెములో 6
నున్న యెహోషువయొద్దకు వచ్చి — మేము దూర
దేశమునుండి వచ్చినవారము, మాతో నొక నిబం
ధనచేయుడని అతనితోను ఇశ్రాయేలీయులతోను
చెప్పగా । ఇశ్రాయేలీయులు—మీరు మా మధ్యను 7
నివసించుచున్నవారేమో, మేము మీతో ఏలాగు
నిబంధన చేయగలమని ఆ హివ్వీయులతో ననిరి. ।
వారు — మేము నీ దాసులమని యెహోషువతో 8
చెప్పినప్పుడు యెహోషువ—మీరు ఎవరు? ఎక్కడ
నుండి వచ్చితిరి? అని వారి నడుగగా । వారు—నీ 9
దేవుడైన యెహోవా నామమునుబట్టి నీ దాసులమైన
మేము బహుదూరమునుండి వచ్చితిమి; ఏలయనగా
ఆయన కీర్తిని ఆయన ఐగుప్తులో చేసిన సమస్తమును
యొర్దానుకు అద్దరినున్న । హెష్బోను రాజైన 10
సీహోను, అష్తారోతులోనున్న బాషానురాజైన ఓగు
అను అమోరీయుల యిద్దరు రాజులకు ఆయన చేసిన
దంతయు వింటిమి. । అప్పుడు మా పెద్దలును మా 11
దేశనివాసులందరును మమ్మును చూచి—మీరు ప్రయా
ణముకొరకు ఆహారము చేత పట్టుకొని వారిని ఎదు
ర్కొనబోయి వారిని చూచి—మేము మీ దాసులము
గనుక మాతో నిబంధనచేయుడి అని చెప్పుడి అనిరి. ।
మీయొద్దకు రావలెనని బయలుదేరిన దినమున మేము
సిద్ధపరచుకొని మా యిండ్లనుండి తెచ్చుకొనిన మా
వేడి భక్ష్యములు ఇవే, యిప్పటికి అవి యెండి ముక్క
లాయెను. । ఈ ద్రాక్షారసపు సిద్దెలను మేము నింపి
నప్పుడు అవి క్రొత్తవే, యిప్పటికి అవి చినిగి
పోయెను. బహుదూరమైన ప్రయాణము చేసినం
దున ఈ మా బట్టలును చెప్పులును పాతగిలి
పోయెనని అతనితో చెప్పిరి. । ఇశ్రాయేలీయులు

యెహోవాచేత సెలవుపొందకయే వారి ఆహార
15 ములో కొంత పుచ్చుకొనగా । యెహోషువ ఆ
వచ్చినవారితో సమాధానపడి వారిని బ్రదుకనిచ్చు
టకు వారితో నిబంధనచేసెను. మరియు సమాజ
16 ప్రధానులు వారితో ప్రమాణము చేసిరి. । అయితే
వారితో నిబంధనచేసి మూడు దినములైనతరువాత,
వారు తమకు పొరుగువారు, తమ నడుమను నివసించు
వారేయని తెలిసికొనిరి.
17 ఇశ్రాయేలీయులు సాగి మూడవనాడు వారి పట్ట
ణములకు వచ్చిరి; వారి పట్టణములు గిబియోను కెఫీరా
18 బెయేరోతు కిర్యత్యారీము అనునవి. । సమాజప్రధా
నులు ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాతోడని
వారితో ప్రమాణము చేసియుండిరి గనుక ఇశ్రాయేలీ
యులు వారిని హతముచేయలేదు. కాగా సమాజ
మంతయు ప్రధానులకు విరోధముగా మొఱ్ఱపెట్టిరి. ।
19 అందుకు సమాజప్రధానులందరు సర్వసమాజముతో
ఇట్లనిరి — మనము ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవాతోడని వారితో ప్రమాణము చేసితిమి
20 గనుక మనము వారికి హాని చేయకూడదు. । మనము
వారితో చేసిన ప్రమాణమువలన మనమీదికి కోపము
రాకపోవునట్లు ఆ ప్రమాణమునుబట్టి వారిని బ్రదుక
21 నియ్యవలెనని చెప్పి । వారిని బ్రదుకనియ్యుడని
సెలవిచ్చిరి గనుక ప్రధానులు తమతో చెప్పినట్లు
వారు సర్వసమాజమునకును కట్టెలు నరుకువారుగాను
22 నీళ్లు చేదువారుగాను ఏర్పడిరి. । మరియు యెహో
షువ వారిని పిలిపించి యిట్లనెను — మీరు మా
మధ్యను నివసించువారై యుండియు—మేము మీకు
బహుదూరముగా నున్నవారమని చెప్పి మమ్ము నేల
23 మోసపుచ్చితిరి? । ఆ హేతువుచేతను మీరు శాప
గ్రస్తులగుదురు, దాస్యము మీకెన్నడును మానదు,
నా దేవుని ఆలయమునకు మీరు కట్టెలు నరుకు
వారును నీళ్లు చేదువారునై యుండక మానరు ।
24 అందుకు వారు యెహోషువను చూచి — నీ దేవు
డైన యెహోవా ఈ సమస్త దేశమును మీకిచ్చి,
మీయెదుట నిలువకుండ ఈ దేశనివాసులనందరిని
నశింపజేయునట్లు తన సేవకుడైన మోషేకు ఆజ్ఞా
పించెనని నీ దాసులకు రూఢిగా తెలుపబడెను గనుక
మేము మా ప్రాణముల విషయములో నీవలన మిక్కిలి
25 భయపడి యీలాగు చేసితిమి. । కాబట్టి మేము నీ
వశమున నున్నాము; మాకేమి చేయుట నీ దృష్టికి
న్యాయమో యేది మంచిదో అదే చేయుమని
26 యెహోషువకు ఉత్తరమిచ్చిరి. । కాగా అతడు
ఆలాగు చేసి ఇశ్రాయేలీయులు గిబియోనీయులను
చంపకుండ వారి చేతులలోనుండి విడిపించెను. ।
27 అయితే సమాజముకొరకును యెహోవా ఏర్పరచు
కొను చోటుననుండు బలిపీఠముకొరకును కట్టెలు
నరుకువారుగాను నీళ్లు చేదువారుగాను యెహోషువ
ఆ దినమందే వారిని నియమించెను. నేటివరకు వారు
ఆ పని చేయువారై యున్నారు.

యెహోషువ హాయిని పట్టుకొనిన సంగతియు, 10
అతడు యెరికోను దాని రాజును నిర్మూలముచేసినట్టు
హాయిని దాని రాజును నిర్మూలముచేసిన సంగతియు,
గిబియోను నివాసులు ఇశ్రాయేలీయులతో సంధిచేసి
కొని వారితో కలిసికొనిన సంగతియు యెరూష
లేమురాజైన అదోనీసెదెకు వినినప్పుడు అతడును అతని
జనులును మిగుల భయపడిరి. । ఏలయనగా గిబియోను 2
గొప్ప పట్టణమై రాజధానులలో ఎంచబడినది; అది
హాయికంటె గొప్పది, అక్కడి జనులందరు శూరులు.
అంతట యెరూషలేమురాజైన అదోనీసెదెకు—గిబియో
నీయులు యెహోషువతోను ఇశ్రాయేలీయులతోను
సంధిచేసియున్నారు. మీరు నాయొద్దకు వచ్చి నాకు
సహాయముచేసినయెడల మనము వారి పట్టణమును
నాశనముచేయుదమని । హెబ్రోనురాజైన హోహా 3
మునొద్దకును, యర్మూతురాజైన పిరామునొద్దకును, 4
లాకీషురాజైన యాఫీయయొద్దకును ఎగ్లోనురాజైన
దెబీరునొద్దకును వర్తమానము పంపెను. । వారు రాగా 5
యెరూషలేమురాజైన అదోనీసెదెకు అమోరీయుల
అయిదుగురు రాజులను, అనగా యెరూషలేము
రాజును హెబ్రోను రాజును యర్మూతు రాజును
లాకీషు రాజును ఎగ్లోను రాజును వెంటబెట్టుకొని,
తామును తమ సేనలన్నియు బయలుదేరి గిబియోను
ముందర దిగి గిబియోనీయులతో యుద్ధముచేసిరి. ।
గిబియోనీయులు — మన్యములలో నివసించు అమో 6
రీయుల రాజులందరు కూడి మామీదికి దండెత్తి వచ్చి
యున్నారు గనుక, నీ దాసులను చెయ్యివిడువక
త్వరగా మాయొద్దకు వచ్చి మాకు సహాయము చేసి
మమ్మును రక్షించుమని గిల్గాలులో దిగియున్న పాళె
ములో యెహోషువకు వర్తమానము పంపగా ।
యెహోషువయును అతనియొద్దనున్న యోధులంద 7
రును పరాక్రమముగల శూరులందరును గిల్గాలునుండి
బయలుదేరిరి. । అప్పుడు యెహోవా—వారికి భయ 8
పడకుము, నీ చేతికి వారిని అప్పగించియున్నాను,
వారిలో ఎవడును నీ యెదుట నిలువడని యెహోషు
వతో సెలవియ్యగా । యెహోషువ గిల్గాలునుండి 9
ఆ రాత్రి అంతయు నడిచి వారిమీద హఠాత్తుగా
పడెను. । అప్పుడు యెహోవా ఇశ్రాయేలీయుల 10
యెదుట వారిని కలవరపరచగా యెహోషువ గిబి
యోను నెదుట మహా ఘోరముగా వారిని హతము
చేసెను. బేత్‌హోరోనుకు పైకి పోవుమార్గమున
అజేకావరకును మక్కేదావరకును యోధులు వారిని
తరిమి హతముచేయుచు వచ్చిరి. । మరియు వారు 11
ఇశ్రాయేలీయులయెదుటనుండి బేత్‌హోరోనుకు

వారిలో ఒకడును మిగులలేదు; ఒకడును తప్పించు
23 కొనలేదు. । వారు హాయి రాజును ప్రాణముతో
పట్టుకొని యెహోషువయొద్దకు తీసికొని వచ్చిరి.
24 బీటిలోను పొలములోను హాయి నివాసులను తరి
మిన ఇశ్రాయేలీయులు వారిని చంపుట చాలింపగా,
కత్తివాత కూలక మిగిలినవాడొకడును లేకపోయి
నప్పుడు ఇశ్రాయేలీయులందరు హాయియొద్దకు తిరిగి
25 వచ్చి దాని కత్తివాతను నిర్మూలముచేసిరి. । ఆ దినమున
పడిన స్త్రీ పురుషులందరు పన్నెండు వేలమంది. ।
26 యెహోషువ హాయి నివాసులనందరిని నిర్మూలము
చేయువరకు ఈటెను పట్టుకొని చాచిన తన చేతిని
27 తిరిగి ముడుచుకొనలేదు. । యెహోవా యెహో
షువకు ఆజ్ఞాపించిన మాటచొప్పున ఇశ్రాయేలీ
యులు ఆ పట్టణములోని పశువులను సొమ్మును తమ
28 కొరకు కొల్లగా దోచుకొనిరి. । అట్లు యెహోషువ
హాయి నిత్యము పాడైపోవలెనని దాని కాల్చివేసెను;
29 నేటివరకు అది అట్లే యున్నది. । యెహోషువ
హాయి రాజును సాయంకాలమువరకు మ్రానుమీద
వ్రేలాడదీసెను. ప్రొద్దుగ్రుంకుచున్నప్పుడు సెల
వియ్యగా జనులు వాని శవమును మ్రానిమీదనుండి
దించి ఆ పురద్వారమునెదుట దాని పడవేసి దాని
మీద పెద్ద రాళ్లకుప్ప వేసిరి. అది నేటివరకు ఉన్నది.
30 మోషే ధర్మశాస్త్రగ్రంథములో వ్రాయబడిన ప్రకా
31 రము । యెహోవా సేవకుడైన మోషే ఇశ్రాయేలీ
యుల కాజ్ఞాపించినట్లు యెహోషువ ఇశ్రాయేలీ
యుల దేవుడైన యెహోవా నామమున బలిపీఠమును
ఇనుప పనిముట్లు తగిలింపని కారు రాళ్లతో ఏబాలు
కొండమీద కట్టించెను. దానిమీద వారు యెహోవాకు
దహనబలులను సమాధానబలులను అర్పించిరి. ।
32 మోషే ఇశ్రాయేలీయులకు వ్రాసియిచ్చిన ధర్మశాస్త్ర
గ్రంథమునకు ఒక ప్రతిని అతడు అక్కడ ఆ రాళ్ల
33 మీద వ్రాయించెను. । అప్పుడు ఇశ్రాయేలీయులను
దీవించుటకు యెహోవా సేవకుడైన మోషే
పూర్వము ఆజ్ఞాపించినది జరుగవలెనని, పరదేశులేమి
వారిలో పుట్టినవారేమి ఇశ్రాయేలీయులందరును వారి
పెద్దలును వారి నాయకులును వారి న్యాయాధిపతు
లును యెహోవా నిబంధన మందసమును మోయు
యాజకులైన లేవీయుల ముందర ఆ మందసమునకు
ఈ వైపున ఆ వైపున నిలిచిరి. వారిలో సగముమంది
గెరిజీము కొండయెదుటను సగముమంది ఏబాలు
34 కొండయెదుటను నిలువగా యెహోషువ । ఆ ధర్మ
శాస్త్రగ్రంథములో వ్రాయబడిన వాటన్నిటినిబట్టి ఆ
ధర్మశాస్త్ర వాక్యములన్నిటిని, అనగా దాని దీవెన
వచనమును దాని శాపవచనమును చదివి వినిపించెను.
స్త్రీలును పిల్లలును వారి మధ్యనుండు పరదేశులును
35 వినుచుండగా । యెహోషువ సర్వసమాజమునెదుట

మోషే ఆజ్ఞాపించినవాటన్నిటిలో చదువక విడిచిన
మాటయొక్కటియు లేదు.

యొర్దాను అద్దరినున్న మన్యములోను లోయ 9
లోను లెబానోను నెదుటి మహాసముద్రతీరమం
దంతటను ఉన్న హిత్తీయులు అమోరీయులు కనానీ
యులు పెరిజ్జీయులు హివ్వీయులు యెబూసీయులు
అనువారి రాజులందరు జరిగినదానిని వినినప్పుడు ।
వారు యెహోషువతోను ఇశ్రాయేలీయులతోను 2
యుద్ధముచేయుటకు కూడి వచ్చిరి. । యెహోషువ 3
యెరికోకును హాయికిని చేసినదానిని గిబియోను నివా
సులు వినినప్పుడు । వారు కపటోపాయము చేసి, 4
రాయభారులమని వేషము వేసికొని బయలుదేరి, తమ
గాడిదెలకు పాత గోనెలుకట్టి పాతగిలి చినిగి కుట్టబడి
యున్న ద్రాక్షారసపు సిద్దెలు తీసికొని । పాతగిలి 5
మాసికలు వేయబడిన చెప్పులు పాదములకు తొడుగు
కొని పాతబట్టలు కట్టుకొని వచ్చిరి. వారు ఆహార
ముగా తెచ్చుకొనిన భక్ష్యములన్నియు ఎండిన ముక్క
లుగా నుండెను. । వారు గిల్గాలునందలి పాళెములో 6
నున్న యెహోషువయొద్దకు వచ్చి— మేము దూర
దేశమునుండి వచ్చినవారము, మాతో నొక నిబం
ధనచేయుడని అతనితోను ఇశ్రాయేలీయులతోను
చెప్పగా । ఇశ్రాయేలీయులు—మీరు మా మధ్యను 7
నివసించుచున్నవారేమో, మేము మీతో ఏలాగు
నిబంధన చేయగలమని ఆ హివ్వీయులతో ననిరి. ।
వారు — మేము నీ దాసులమని యెహోషువతో 8
చెప్పినప్పుడు యెహోషువ—మీరు ఎవరు? ఎక్కడ
నుండి వచ్చితిరి? అని వారి నడుగగా । వారు—నీ 9
దేవుడైన యెహోవా నామమునుబట్టి నీ దాసులమైన
మేము బహుదూరమునుండి వచ్చితిమి; ఏలయనగా
ఆయన కీర్తిని ఆయన ఐగుప్తులో చేసిన సమస్తమును
యొర్దానుకు అద్దరినున్న । హెష్బోను రాజైన 10
సీహోను, అష్తారోతులోనున్న బాషానురాజైన ఓగు
అను అమోరీయుల యిద్దరు రాజులకు ఆయన చేసిన
దంతయు వింటిమి. । అప్పుడు మా పెద్దలును మా 11
దేశనివాసులందరును మమ్మును చూచి—మీరు ప్రయా
ణముకొరకు ఆహారము చేత పట్టుకొని వారిని ఎదు
ర్కొనబోయి వారిని చూచి—మేము మీ దాసులము
గనుక మాతో నిబంధనచేయుడి అని చెప్పుడి అనిరి. ।
మీయొద్దకు రావలెనని బయలుదేరిన దినమున మేము 12
సిద్ధపరచుకొని మా యిండ్లనుండి తెచ్చుకొనిన మా
వేడి భక్ష్యములు ఇవే, యిప్పటికి అవి యెండి ముక్క
లాయెను. । ఈ ద్రాక్షారసపు సిద్దెలను మేము నింపి 13
నప్పుడు అవి క్రొత్తవే, యిప్పటికి అవి చినిగి
పోయెను. బహుదూరమైన ప్రయాణము చేసినం
దున ఈ మా బట్టలును చెప్పులును పాతగిలి
పోయెనని అతనితో చెప్పిరి. । ఇశ్రాయేలీయులు 14

యెహోవాచేత సెలవుపొందకయే వారి ఆహార
15 ములో కొంత పుచ్చుకొనగా । యెహోషువ ఆ
వచ్చినవారితో సమాధానపడి వారిని బ్రదుకనిచ్చు
టకు వారితో నిబంధనచేసెను. మరియు సమాజ
16 ప్రధానులు వారితో ప్రమాణము చేసిరి. । అయితే
వారితో నిబంధనచేసి మూడు దినములైనతరువాత,
వారు తమకు పొరుగువారు, తమ నడుమను నివసించు
వారేయని తెలిసికొనిరి.
17 ఇశ్రాయేలీయులు సాగి మూడవనాడు వారి పట్ట
ణములకు వచ్చిరి; వారి పట్టణములు గిబియోను కెఫీరా
18 బెయేరోతు కిర్యత్యారీము అనునవి. । సమాజప్రధా
నులు ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాతోడని
వారితో ప్రమాణము చేసియుండిరి గనుక ఇశ్రాయేలీ
యులు వారిని హతము చేయలేదు. కాగా సమాజ
మంతయు ప్రధానులకు విరోధముగా మొర్రపెట్టిరి. ।
19 అందుకు సమాజప్రధానులందరు సర్వసమాజముతో
ఇట్లనిరి — మనము ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవాతోడని వారితో ప్రమాణము చేసితిమి
20 గనుక మనము వారికి హాని చేయకూడదు. । మనము
వారితో చేసిన ప్రమాణమువలన మనమీదికి కోపము
రాకపోవునట్లు ఆ ప్రమాణమునుబట్టి వారిని బ్రదుక
21 నియ్యవలెనని చెప్పి । వారిని బ్రదుకనియ్యుడని
సెలవిచ్చిరి గనుక ప్రధానులు తమతో చెప్పినట్లు
వారు సర్వసమాజమునకును కట్టెలు నరుకువారుగాను
22 నీళ్లు చేదువారుగాను ఏర్పడిరి. । మరియు యెహో
షువ వారిని పిలిపించి యిట్లనెను — మీరు మా
మధ్యను నివసించువారై యుండియు—మేము మీకు
బహుదూరముగా నున్నవారమని చెప్పి మమ్ము నేల
23 మోసపుచ్చితిరి? । ఆ హేతువుచేతను మీరు శాప
గ్రస్తులగుదురు, దాస్యము మీకెన్నడును మానదు,
నా దేవుని ఆలయమునకు మీరు కట్టెలు నరుకు
వారును నీళ్లు చేదువారునై యుండక మానరు ।
24 అందుకు వారు యెహోషువను చూచి— నీ దేవు
డైన యెహోవా ఈ సమస్త దేశమును మీకిచ్చి,
మీయెదుట నిలువకుండ ఈ దేశనివాసులనందరిని
నశింపజేయునట్లు తన సేవకుడైన మోషేకు ఆజ్ఞా
పించెనని నీ దాసులకు రూఢిగా తెలుపబడెను గనుక
మేము మా ప్రాణముల విషయములో నీవలన మిక్కిలి
25 భయపడి యీలాగు చేసితిమి. । కాబట్టి మేము నీ
వశమున నున్నాము; మాకేమి చేయుట నీ దృష్టికి
న్యాయమో యేది మంచిదో అదే చేయుమని
26 యెహోషువకు ఉత్తరమిచ్చిరి. । కాగా అతడు
ఆలాగు చేసి ఇశ్రాయేలీయులు గిబియోనీయులను
చంపకుండ వారి చేతులలోనుండి విడిపించెను. ।
27 అయితే సమాజముకొరకును యెహోవా ఏర్పరచు
కొను చోటుననుండు బలిపీఠముకొరకును కట్టెలు
నరుకువారుగాను నీళ్లు చేదువారుగాను యెహోషువ
ఆ దినమందే వారిని నియమించెను. నేటివరకు వారు
ఆ పని చేయువారై యున్నారు.

యెహోషువ హాయిని పట్టుకొనిన సంగతియు, **10**
అతడు యెరికోను దాని రాజును నిర్మూలముచేసినట్టు
హాయిని దాని రాజును నిర్మూలముచేసిన సంగతియు,
గిబియోను నివాసులు ఇశ్రాయేలీయులతో సంధిచేసి
కొని వారితో కలిసికొనిన సంగతియు యెరూష
లేమురాజైన అదోనీసెదెకు వినినప్పుడు అతడును అతని
జనులును మిగుల భయపడిరి. । ఏలయనగా గిబియోను 2
గొప్ప పట్టణమై రాజధానులలో ఎంచబడినది; అది
హాయికంటె గొప్పది, అక్కడి జనులందరు శూరులు.
అంతట యెరూషలేమురాజైన అదోనీసెదెకు—గిబియో
నీయులు యెహోషువతోను ఇశ్రాయేలీయులతోను
సంధిచేసియున్నారు. మీరు నాయొద్దకు వచ్చి నాకు
సహాయముచేసినయెడల మనము వారి పట్టణమును
నాశనముచేయుదమని । హెబ్రోనురాజైన హోహా 3
మునొద్దకును, యర్మూతురాజైన పిరామునొద్దకును, 4
లాకీషురాజైన యాఫీయయొద్దకును ఎగ్లోనురాజైన
దెబీరునొద్దకును వర్తమానము పంపెను. । వారు రాగా 5
యెరూషలేమురాజైన అదోనీసెదెకు అమోరీయుల
అయిదుగురు రాజులను, అనగా యెరూషలేము
రాజును హెబ్రోను రాజును యర్మూతు రాజును
లాకీషు రాజును ఎగ్లోను రాజును వెంటబెట్టుకొని,
తామును తమ సేనలన్నియు బయలుదేరి గిబియోను
ముందర దిగి గిబియోనీయులతో యుద్ధముచేసిరి. ।
గిబియోనీయులు — మన్యములలో నివసించు అమో 6
రీయుల రాజులందరు కూడి మామీదికి దండెత్తి వచ్చి
యున్నారు గనుక, నీ దాసులను చెయ్యివిడువక
త్వరగా మాయొద్దకు వచ్చి మాకు సహాయము చేసి
మమ్మును రక్షించుమని గిల్గాలులో దిగియున్న పాళె
ములో యెహోషువకు వర్తమానము పంపగా ।
యెహోషువయును అతనియొద్దనున్న యోధులంద 7
రును పరాక్రమముగల శూరులందరును గిల్గాలునుండి
బయలుదేరిరి. । అప్పుడు యెహోవా—వారికి భయ 8
పడకుము, నీ చేతికి వారిని అప్పగించియున్నాను,
వారిలో ఎవడును నీ యెదుట నిలువడని యెహోషు
వతో సెలవియ్యగా । యెహోషువ గిల్గాలునుండి 9
ఆ రాత్రి అంతయు నడిచి వారిమీద హఠాత్తుగా
పడెను. । అప్పుడు యెహోవా ఇశ్రాయేలీయుల 10
యెదుట వారిని కలవరపరచగా యెహోషువ గిబి
యోను నెదుట మహా ఘోరముగా వారిని హతము
చేసెను. బేత్‌హోరోనుకు పైకి పోవుమార్గమున
అజేకావరకును మక్కేదావరకును యోధులు వారిని
తరిమి హతముచేయుచు వచ్చిరి. । మరియు వారు 11
ఇశ్రాయేలీయులయెదుటనుండి బేత్‌హోరోనుకు

పోనవు త్రోవను పారిపోవుచుండగా వారు అజేకాను
వచ్చువరకు యెహోవా ఆకాశమునుండి గొప్ప వడ
గండ్లను వారిమీద పడవేసెను గనుక వారు దానిచేత
చనిపోయిరి. ఇశ్రాయేలీయులు కత్తివాత చంపినవారి
కంటె ఆ వడగండ్లచేత చచ్చినవారు ఎక్కువమంది
యాయిరి.
12 యెహోవా ఇశ్రాయేలీయులయెదుట అమోరీ
యులను అప్పగించిన దినమున ఇశ్రాయేలీయులు విను
చుండగా యెహోషువ—సూర్యుడా, నీవు గిబియో
నులో నిలువుము, చంద్రుడా, నీవు అయ్యాలోను
లోయలో నిలువుము అని యెహోవాకు ప్రార్థన
చేసెను. జనులు తమ శత్రువులమీద పగ తీర్చుకొను
వరకు సూర్యుడు నిలిచెను చంద్రుడు ఆగెను. । —
13 సూర్యుడు ఆకాశమధ్యమున నిలిచి యించుమించు
ఒకనాడెల్ల అస్తమింప త్వరపడలేదు అను మాట
యాషారు గ్రంథములో వ్రాయబడియున్నది గదా. ।
14 యెహోవా ఒక నరుని మనవి వినిన ఆ దినమువంటి
దినము దానికి ముందేగాని దానికి తరువాతనేగాని
యుండలేదు; నాడు యెహోవా ఇశ్రాయేలీయుల
15 పక్షముగా యుద్ధముచేసెను. । అప్పుడు యెహోషు
వయు అతనితోకూడ ఇశ్రాయేలీయులందరును గిల్గా
లులోనున్న పాలెములోకి తిరిగి వచ్చిరి.
16 ఆ రాజులయిదుగురు పారిపోయి మక్కేదాయం
17 దలి గుహలో దాగియుండిరి. । మక్కేదాయందలి
గుహలో దాగియున్న ఆ రాజులయిదుగురు దొరికిరని
18 యెహోషువకు తెలుపబడినప్పుడు । యెహోషువ
—ఆ గుహ ద్వారమున కడ్డముగా గొప్ప రాళ్లను
దొర్లించి వారిని కాచుటకు మనుష్యులను ఉంచుడి. ।
19 మీ దేవుడైన యెహోవా మీ శత్రువులను మీ
చేతికి అప్పగించియున్నాడు గనుక వారిని తమ పట్టణ
ములలోకి మరల వెళ్లనీయకుండ మీరు నిలువక వారిని
20 తరిమి వారి వెనుకటివారిని కొట్టివేయుడనెను. । వారు
బొత్తిగా నశించువరకు యెహోషువయు ఇశ్రాయేలీ
యులును బహు జనసంహారముచేయుట కడతేర్చిన
తరువాత వారిలో మిగిలియున్నవారు ప్రాకారము
21 గల పట్టణములలో చొచ్చిరి. । జనులందరు మక్కేదా
యందలి పాలెములోనున్న యెహోషువయొద్దకు
సురక్షితముగా తిరిగి వచ్చిరి. ఇశ్రాయేలీయులకు
విరోధముగా ఒక మాటయైన ఆడుటకు ఎవనికిని
22 గుండె చాలకపోయెను. । యెహోషువ—ఆ గుహకు
అడ్డము తీసివేసి గుహలోనుండి ఆ అయిదుగురు రాజు
23 లను నాయొద్దకు తీసికొనిరండని చెప్పగా । వారు
ఆలాగు చేసి, యెరూషలేము రాజును హెబ్రోను
రాజును యర్మూతు రాజును లాకీషు రాజును ఎగ్లోను
రాజును ఆ రాజుల నయిదుగురిని ఆ గుహలోనుండి
24 అతనియొద్దకు తీసికొని వచ్చిరి. । వారు ఆ రాజులను
వెలపలికి రప్పించి యెహోషువయొద్దకు తీసికొని
వచ్చినప్పుడు యెహోషువ ఇశ్రాయేలీయులనందరిని
పిలిపించి, తనతో యుద్ధమునకు వెళ్లివచ్చిన యోధుల
అధిపతులను చూచి — మీరు దగ్గరకు రండి; ఈ
రాజుల మెడలమీద మీ పాదముల నుంచుడని
చెప్పగా వారు దగ్గరకు వచ్చి వారి మెడలమీద తమ
పాదములనుంచిరి. । అప్పుడు యెహోషువ వారిని
చూచి—మీరు భయపడకుడి, జడియకుడి, దృఢత్వము
వహించి ధైర్యముగా నుండుడి; మీరు ఎవరితో
యుద్ధము చేయుదురో ఆ శత్రువులకందరికి
యెహోవా వీరికి చేసినట్టు చేయుననెను. । తరువాత 26
యెహోషువ వారిని కొట్టి చంపి అయిదు చెట్లమీద
వారిని ఉరిదీసెను; వారి శవములు సాయంకాలము
వరకు ఆ చెట్లమీద వ్రేలాడుచుండెను. । ప్రొద్దు 27
గ్రుంకు సమయమున యెహోషువ సెలవియ్యగా
జనులు చెట్లమీదనుండి వారిని దించి, వారు దాగిన
గుహలోనే ఆ శవములను పడవేసి ఆ గుహద్వార
మున గొప్పరాళ్లను వేసిరి. ఆ రాళ్లు నేటివరకున్నవి.
ఆ దినమున యెహోషువ మక్కేదాను పట్టుకొని 28
దానిని దాని రాజును కత్తివాతను హతముచేసెను.
అతడు వారిని దానిలోనున్న వారినందరిని నిర్మూలము
చేసెను; యెరికో రాజుకు చేసినట్లు మక్కేదా రాజు
కును చేసెను.
యెహోషువయు అతనితోకూడ ఇశ్రాయేలీయు 29
లందరును మక్కేదానుండి లిబ్నాకు వచ్చి లిబ్నా
వారితో యుద్ధముచేసిరి. । యెహోవా దానిని దాని 30
రాజును ఇశ్రాయేలీయులకు అప్పగింపగా వారు
నిశ్శేషముగా దానిని దానిలోనున్న వారినందరిని
కత్తివాతను హతముచేసిరి. అతడు యెరికో రాజుకు
చేసినట్లు దాని రాజుకును చేసెను.
అంతట యెహోషువయు అతనితోకూడ ఇశ్రా 31
యేలీయులందరును లిబ్నానుండి లాకీషుకు వచ్చి దాని
దగ్గర దిగి లాకీషువారితో యుద్ధముచేయగా ।
యెహోవా లాకీషును ఇశ్రాయేలీయులచేతికి అప్ప 32
గించెను. వారు రెండవ దినమున దాని పట్టుకొని
తాము లిబ్నాకు చేసినట్లే దానిని దానిలోనున్న వారి
నందరిని కత్తివాత హతముచేసిరి.
లాకీషుకు సహాయము చేయుటకు గెజెరురాజైన 33
హోరాము రాగా యెహోషువ నిశ్శేషముగా
ఆతనిని అతని జనులను హతముచేసెను. । అప్పుడు 34
యెహోషువయు అతనితోకూడ ఇశ్రాయేలీయు
లందరును లాకీషునుండి ఎగ్లోనుకు వచ్చి దానియెదుట
దిగి దాని నివాసులతో యుద్ధముచేసి । ఆ దినమున 35
దాని పట్టుకొని కత్తివాతను వారిని హతముచేసిరి.
అతడు లాకీషుకు చేసినట్లే దానిలోనున్న వారినంద
రిని ఆ దినము నిర్మూలముచేసెను.

36 అప్పుడు యెహోషువయు అతనితోకూడ ఇశ్రా
యేలీయులందరును ఎగ్లోనునుండి హెబ్రోనుమీదికి
37 పోయి దాని జనులతో యుద్ధము చేసి । దాని పట్టు
కొని దానిని దాని రాజును దాని సమస్త పురములను
దానిలోనున్న వారినందరిని కత్తివాతను హతముచేసిరి.
అతడు ఎగ్లోనుకు చేసినట్లే దానిని దానిలో నున్న
వారినందరిని నిర్మూలముచేసెను.
38 అప్పుడు యెహోషువయు అతనితోకూడ ఇశ్రా
యేలీయులందరును దెబీరువైపు తిరిగి దాని జనులతో
39 యుద్ధము చేసి । దానిని దాని రాజును దాని సమస్త
పురములను పట్టుకొని కత్తివాతను హతముచేసి దానిలో
నున్న వారినందరిని నిర్మూలముచేసిరి. అతడు హెబ్రో
నుకు చేసినట్లు, లిబ్నాకును దాని రాజుకును చేసినట్లు,
అతడు దెబీరుకును దాని రాజుకును చేసెను.
40 అప్పుడు యెహోషువ మన్యప్రదేశమును దక్షిణ
ప్రదేశమును షెఫేలాప్రదేశమును చరియలప్రదేశ
మును వాటి రాజులనందరిని జయించెను. ఇశ్రాయేలీ
యుల దేవుడైన యెహోవా ఆజ్ఞాపించినట్లు అతడు
శేషమేమియు లేకుండ ఊపిరిగల సమస్తమును
41 నిర్మూలము చేసెను. । కాదేషు బర్నేయ మొదలుకొని
గాజావరకు గిబియోనువరకు గోషేను దేశమంతటిని
42 యెహోషువ జయించెను. । ఇశ్రాయేలు దేవుడైన
యెహోవా ఇశ్రాయేలీయుల పక్షముగా యుద్ధము
చేయుచుండెను గనుక ఆ సమస్త రాజులనందరిని వారి
దేశములను యెహోషువ ఒక దెబ్బతోనే పట్టు
43 కొనెను. । తరువాత యెహోషువయు అతనితో
కూడ ఇశ్రాయేలీయులందరును గిల్గాలులోని పాళెము
నకు తిరిగి వచ్చిరి.

11 హాసోరు రాజైన యాబీను జరిగినవాటినిగూర్చి
విని మాదోనురాజైన యోబాబుకును షిమ్రోను రాజు
2 కును అక్షాపు రాజుకును । ఉత్తరదిక్కుననున్న మన్య
దేశములోను కిన్నెరెతు దక్షిణదిక్కుననున్న అరాబా
లోను షెఫేలాలోను పడమటనున్న దోరు మన్యము
3 లోను ఉన్న రాజులకును । తూర్పు పడమటి దిక్కుల
యందలి కనానీయులకును అమోరీయులకును హిత్తీ
యులకును పెరిజ్జీయులకును మన్యములోనున్న యెబూ
సీయులకును మిస్పా దేశమందలి హెర్మోను దిగువ
4 నుండు హివ్వీయులకును వర్తమానము పంపగా । వారు
సముద్రతీరమందలి యిసుకరేణువులంత విస్తారముగా
నున్న తమ సైనికులనందరిని సమకూర్చుకొని, విస్తార
మైన గుర్రములతోను రథములతోను బయలు దేరిరి. ।
5 ఆ రాజులందరు కూడుకొని ఇశ్రాయేలీయులతో
యుద్ధముచేయుటకు మేరోము నదియొద్దకు వచ్చి దిగ
6 గా । యెహోవా—వారికి భయపడకుము, రేపు ఈ
వేళకు ఇశ్రాయేలీయులచేత సంహరింపబడినవారినిగా
నేను వారినందరిని అప్పగించెదను. నీవు వారి గుర్ర
ముల గుదికాలి నరమును తెగకోసి వారి రథములను
అగ్నిచేత కాల్చుదువని యెహోషువతో సెలవిచ్చె
ను. । కాబట్టి యెహోషువయు అతనితోకూడనున్న 7
యోధులందరును హఠాత్తుగా మేరోము నీళ్లయొద్దకు
వారిమీదికి వచ్చి వారిమీద పడగా । యెహోవా 8
ఇశ్రాయేలీయులచేతికి వారిని అప్పగించెను. వీరు
వారిని హతముచేసి మహాసీదోనువరకును మిశ్రేపొత్మా
యిమువరకును తూర్పువైపున మిస్పే లోయవరకును
వారిని తరిమి నిశ్శేషముగా చంపిరి. । యెహోవా 9
యెహోషువతో సెలవిచ్చినట్లు అతడు వారికి చేసెను.
అతడు వారి గుర్రముల గుదికాలి నరమును తెగకోసి
వారి రథములను అగ్నితో కాల్చివేసెను.
ఆ కాలమున యెహోషువ వెనుకకు తిరిగి హాసో 10
రును పట్టుకొని దాని రాజును కత్తివాతను హతము
చేసెను. పూర్వము హాసోరు ఆ సమస్త రాజ్యములకు
ప్రధానము. । ఇశ్రాయేలీయులు దానిలోనున్న ప్రతి 11
వానిని కత్తివాతను హతముచేసిరి. ఎవరును తప్పించు
కొనకుండ యెహోషువ వారినందరిని నిర్మూలము
చేసెను. అతడు హాసోరును అగ్నితో కాల్చివేసెను. ।
యెహోషువ ఆ రాజులనందరిని హతముచేసి వారి 12
పట్టణములను పట్టుకొని కొల్లబెట్టెను; యెహోవా
సేవకుడైన మోషే ఆజ్ఞాపించినట్లు అతడు వారిని
నిర్మూలము చేసెను. । అయితే యెహోషువ హాసో 13
రును కాల్చివేసెనుగాని మెట్టలమీద కట్టబడియున్న
పట్టణములను ఇశ్రాయేలీయులు కాల్చివేయలేదు. । ఆ 14
పట్టణముల సంబంధమైన కొల్లసొమ్మును పశువులను
ఇశ్రాయేలీయులు దోచుకొనిరి. నరులలో ఒకనిని
విడువకుండ అందరిని నశింపజేయువరకు కత్తివాతను
హతముచేయుచు వచ్చిరి. । యెహోవా తన సేవకు 15
డైన మోషేకు ఆజ్ఞాపించినట్లు మోషే యెహోషు
వకు ఆజ్ఞాపించెను, యెహోషువ ఆలాగే చేసెను.
యెహోవా మోషేకు ఆజ్ఞాపించినవాటన్నిటిలో
నొకటియు అతడు చేయక విడువలేదు.
యెహోషువ శేయీరుకు పోవు హాలాకు కొండ 16
మొదలుకొని । లెబానోను లోయలో హెర్మోను 17
కొండ దిగువనున్న బయల్గాదువరకు ఆ దేశమంతటిని,
అనగా మన్యమును దక్షిణదేశమంతటిని గోషెనుదేశ
మంతటిని షెఫేలాప్రదేశమును మైదానమును ఇశ్రా
యేలు కొండలను వాటి లోయలను వాటి రాజులనంద
రిని పట్టుకొని వారిని జయించి చంపెను. । బహుదిన 18
ములు యెహోషువ ఆ రాజులందరితో యుద్ధము
చేసెను. గిబియోను నివాసులైన హివ్వీయులుగాక ।
ఇశ్రాయేలీయులతో సంధిచేసిన పట్టణము మరి 19
ఏదియులేదు. ఆ పట్టణములన్నిటిని వారు యుద్ధ
ములో పట్టుకొనిరి. । వారిని నిర్మూలముచేయుడని 20
యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు ఇశ్రాయేలీ

యులు కనికరింపక వారిని నాశనముచేయు నిమిత్తము
వారు ఇశ్రాయేలీయులతో యుద్ధము చేయుటకు
వచ్చునట్లు యెహోవా వారి హృదయములను కఠిన
21 పరచియుండెను. । ఆ కాలమున యెహోషువ వచ్చి
మన్యదేశములోను, అనగా హెబ్రోనులోను దెబీరు
లోను అనాబులోను యూదా మన్యములన్నిటిలోను
ఇశ్రాయేలీయుల మన్యప్రదేశములన్నిటిలోను ఉన్న
అనాకీయులను నాశనము చేసెను. యెహోషువ
22 వారిని వారి పట్టణములను నిర్మూలముచేసెను. । ఇశ్రా
యేలీయుల దేశమందు అనాకీయులలో ఎవడును
మిగిలియుండలేదు; గాజాలోను గాతులోను అష్డోదు
లోను మాత్రమే కొందరు మిగిలియుండిరి.
23 యెహోవా మోషేతో చెప్పినట్లు యెహోషువ
దేశమంతటిని పట్టుకొనెను. యెహోషువ వారి
గోత్రములచొప్పున ఇశ్రాయేలీయులకు స్వాస్థ్య
ముగా దాని నప్పగించెను. అప్పుడు యుద్ధములేకుండ
దేశము సుభిక్షముగానుండెను.

12 ఇశ్రాయేలీయులు యొర్దానుకు తూర్పుగా అద్దరి
నున్న అర్నోనులోయ మొదలుకొని హెర్మోనుకొండ
వరకు తూర్పునందలి మైదానమంతటిలో హతము
చేసి వారి దేశములను స్వాధీనపరచుకొనిన రాజులు
2 ఎవరనగా । అమోరీయుల రాజైన సీహోను. అతడు
హెష్బోనులో నివసించి, అర్నోను ఏటితీరమునందలి
అరోయేరునుండి, అనగా ఆ యేటిలోయ నడుమ
నుండి గిలాదు అర్ధభాగమును అమ్మోనీయులకు సరి
హద్దుగానున్న యబ్బోకు ఏటి లోయవరకును, తూర్పు
దిక్కున కిన్నెరెతు సముద్రమువరకును, తూర్పు
దిక్కున బెత్యేషిమోతు మార్గమున ఉప్పుసముద్ర
3 ముగానున్న । అరాబా సముద్రమువరకును, దక్షిణ
దిక్కున పిస్గాకొండ చరియల దిగువనున్న మైదానము
వరకును ఏలినవాడు.
4 ఇశ్రాయేలీయులు బాషానురాజైన ఓగుదేశమును
పట్టుకొనిరి. అతడు రెఫాయీయుల శేషములో
నొకడు. అతడు అష్తారోతులోను ఎద్రెయిలోను
నివసించి గెషూరీయులయొక్కయు మాయకాతీయుల
యొక్కయు సరిహద్దువరకు బాషాను అంతటిలోను
5 సల్కాలోను । హెర్మోనులోను హెష్బోనురాజైన
సీహోను సరిహద్దువరకు గిలాదు అర్ధభాగములోను
6 రాజ్యమేలినవాడు. । యెహోవా సేవకుడైన
మోషేయు ఇశ్రాయేలీయులును వారిని హతముచేసి,
యెహోవా సేవకుడైన మోషే రూబేనీయులకును
గాదీయులకును మనష్షే అర్ధగోత్రపువారికిని స్వాస్థ్య
7 ముగా దాని నిచ్చెను. । యొర్దానుకు అద్దరిని, అనగా
పడమటిదిక్కున లెబానోను లోయలోని బయల్గాదు
మొదలుకొని శేయీరువరకునున్న హాలాకు కొండ
వరకు యెహోషువయు ఇశ్రాయేలీయులును జయిం
చిన దేశపు రాజులు వీరు. యెహోషువ దానిని
ఇశ్రాయేలీయులకు వారి గోత్రములవారీ చొప్పున
స్వాస్థ్యముగా ఇచ్చెను. । మన్యములోను లోయ 8
లోను షెఫేలాప్రదేశములోను చరియల ప్రదేశ
ములలోను అరణ్యములోను దక్షిణదేశములోను
ఉండిన హిత్తీయులు అమోరీయులు కనానీయులు
పెరిజ్జీయులు హివ్వీయులు యెబూసీయులను వారి
రాజులను ఇశ్రాయేలీయులు పట్టుకొనిరి. వారెవ
రనగా యెరికో రాజు । బేతేలుయొద్దనున్న హాయి 9
రాజు, యెరూషలేము రాజు, హెబ్రోను రాజు, 24
యర్మూతు రాజు, లాకీషు రాజు, ఎగ్లోను రాజు,
గెజెరు రాజు, దెబీరు రాజు, గెదెరు రాజు, హొర్మా
రాజు, అరాదు రాజు, లిబ్నా రాజు, అదుల్లాము
రాజు, మక్కేదా రాజు, బేతేలు రాజు, తప్పూయ
రాజు, హెపెరు రాజు, ఆఫెకు రాజు, లష్షారోను
రాజు, మాదోను రాజు, హాసోరు రాజు, షిమ్రోను మె
రోను రాజు, అక్షాపు రాజు, తానాకు రాజు, మెగిద్దో
రాజు, కెదెషు రాజు, కర్మెలులో యొక్నెయాము
రాజు, దోరుమెట్టలలో దోరు రాజు, గిల్గాలులోని
గోయీయుల రాజు, తిర్సా రాజు, ఆ రాజులందరి
సంఖ్య ముప్పది యొకటి.

13 యెహోషువ బహుదినములు గడచిన వృద్ధుడు
కాగా యెహోవా అతనికి ఈలాగు సెలవిచ్చెను--
నీవు బహుదినములు గడచిన వృద్ధుడవు. స్వాధీన
పరచుకొనుటకు అతివిస్తారమైన దేశము ఇంక మిగిలి
యున్నది. । మిగిలిన దేశము ఏదనగా, ఫిలిష్తీయుల 2
ప్రదేశములన్నియు, గెషూరీయుల దేశమంతయు,
ఐగుప్తుకు తూర్పుననున్న షీహోరు మొదలుకొని ।
కనానీయులవని యెంచబడిన ఉత్తరదిక్కున ఎక్రో 3
నీయుల సరిహద్దువరకును ఫిలిష్తీయుల అయిదుగురు
సర్దారులకు చేరిన గాజీయులయొక్కయు అష్డో
దీయులయొక్కయు అష్కెలోనీయులయొక్కయు
గాతీయులయొక్కయు ఎక్రోనీయులయొక్కయు
దేశమును । దక్షిణదిక్కున ఆవీయుల దేశమును కనా 4
నీయుల దేశమంతయు, సీదోనీయులదైన మేరా
మొదలుకొని ఆఫెకువరకున్న అమోరీయుల సరిహద్దు
వరకును । గిబ్లీయుల దేశమును, హెర్మోను కొండ 5
దిగువనున్న బయల్గాదు మొదలుకొని హమాతువరకు
లెబానోను ప్రదేశమంతయు, లెబానోను మొదలు
కొని మిశ్రేఫోత్మాయిమువరకును దేశము మిగిలి
యున్నది. । మన్యపునివాసులనందరిని సీదోనీయుల 6
నందరిని నేను ఇశ్రాయేలీయుల యెదుటనుండి వెళ్ల
గొట్టెదను. కావున నేను నీకాజ్ఞాపించినట్లు నీవు
ఇశ్రాయేలీయులకు స్వాస్థ్యముగా దాని పంచిపెట్ట
వలెను. । తొమ్మిది గోత్రములకును మనష్షే అర్ధగోత్ర 7
మునకును ఈ దేశమును స్వాస్థ్యముగా పంచిపెట్టుము.

8 యెహోవా సేవకుడైన మోషే వారికిచ్చినట్లు। రూబే
నీయులు గాదీయులు తూర్పుదిక్కున యొర్దాను అద్ద
9 రిని మోషే వారికిచ్చిన స్వాస్థ్యమును పొందిరి. । అది
ఏదనగా అర్నోను ఏటిలోయ దరినున్న అరోయేరు
మొదలుకొని ఆ లోయమధ్యనున్న పట్టణమునుండి
దీబోనువరకు మేదెబా మైదానమంతయు, అమ్మో
నీయుల సరిహద్దువరకు హెష్బోనులో ఏలికయు ।
10 అమోరీయుల రాజైన సీహోనుయొక్క సమస్త పుర
11 ములను । గిలాదును, గెషూరీయులయొక్కయు మాయ
కాతీయులయొక్కయు దేశమును, హెర్మోను మన్య
మంతయు, సల్కావరకు బాషాను దేశమంతయు ।
12 రెఫాయీయుల శేషములో అష్తారోతులోను యెద్రె
యిలోను ఏలికయైన ఓగురాజ్యమంతయు మిగిలి
యున్నది. మోషే ఆ రాజులను జయించి వారి దేశ
13 మును పట్టుకొనెను. । అయితే ఇశ్రాయేలీయులు
గెషూరీయుల దేశమునైనను మాయకాతీయుల దేశము
నైనను పట్టుకొనలేదు గనుక గెషూరీయులును మాయ
కాతీయులును నేటివరకు ఇశ్రాయేలీయుల మధ్యను
14 నివసించుచున్నారు. । లేవి గోత్రమునకే అతడు
స్వాస్థ్యము ఇయ్యలేదు. ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవా వారితో సెలవిచ్చినట్లు ఆయనకు
అర్పింపబడు హోమములే వారికి స్వాస్థ్యము.
15 వారి వంశములనుబట్టి మోషే రూబేనీయులకు
16 స్వాస్థ్యమిచ్చెను. । వారి సరిహద్దు ఏదనగా, అర్నోను
ఏటిలోయదరినున్న అరోయేరు మొదలుకొని ఆ
లోయలోనున్న పట్టణమునుండి మేదెబాయొద్దనున్న
17 మైదానమంతయు । హెష్బోనును మైదానములోని
పట్టణములన్నియు, దీబోను బామోత్బయలు బేత్బ
18 యల్మెయోను । యాహసు కెదేమోతు మేఫాతు కిర్య
21 తాయిము సిబ్మాలోయలోని కొండమీది శెరెత్షహరు
బేత్పయోరు పిస్గాకొండచరియలు బేత్యేషిమోతు (అను
పట్టణములును) మైదానములోని పట్టణములన్నియు,
హెష్బోనులో ఏలికయు, మోషే జయించినవాడు
నైన సీహోను వశముననున్న ఎవీ రేకెము సూరు
హూరు రేబ అను మిద్యానురాజుల దేశమును అమో
రీయుల రాజైన సీహోను రాజ్యమంతయు వారికి
స్వాస్థ్యముగా ఇచ్చెను.
22 ఇశ్రాయేలీయులు బెయోరు కుమారుడును సోదె
గాడునైన బిలామును తాము చంపిన తక్కినవారితో
23 పాటు ఖడ్గముతో చంపిరి. । యొర్దాను ప్రదేశమం
తయు రూబేనీయులకు సరిహద్దు; అదియు దానిలోని
పట్టణములును గ్రామములును రూబేనీయుల వంశ
ముల లెక్కచొప్పున వారికి కలిగిన స్వాస్థ్యము.
24 మోషే గాదుగోత్రమునకు, అనగా గాదీయులకు
25 వారి వంశములచొప్పున స్వాస్థ్యమిచ్చెను. । వారి సరి
హద్దు యాజెరును గిలాదు పట్టణములన్నియు, రబ్బాకు
ఎదురుగానున్న అరోయేరువరకు అమ్మోనీయుల దేశ
ములో సగమును । హెష్బోను మొదలుకొని రామ 26
త్మిజ్పె బెటోనీమువరకును మహనయీము మొదలుకొని
దెబీరు సరిహద్దువరకును । లోయలో బేతారాము 27
బేత్నిమ్రా సుక్కోతు సాఫోను, అనగా హెష్బోను
రాజైన సీహోను రాజ్య శేషమును తూర్పుదిక్కున
యొర్దాను అద్దరిని కిన్నెరెతు సముద్రతీరమువరకునున్న
యొర్దాను ప్రదేశమును. । వారి వంశములచొప్పున 28
గాదీయులకు స్వాస్థ్యమైన పట్టణములును గ్రామము
లును ఇవి.
మోషే మనష్షే అర్ధగోత్రమునకు స్వాస్థ్యమిచ్చెను. 29
అది వారి వంశములచొప్పున మనష్షీయుల అర్ధగోత్ర
మునకు స్వాస్థ్యము. । వారి సరిహద్దు మహనయీము 30
మొదలుకొని బాషాను యావత్తును, బాషాను రాజైన
ఓగు సర్వరాజ్యమును, బాషానులోని యాయీరు
పురములైన బాషానులోని అరువది పట్టణములును. ।
గిలాదులో సగమును, అష్తారోతు ఎద్రెయియును 31
బాషానులో ఓగురాజ్య పట్టణములును మనష్షే కుమా
రుడైన మాకీరు, అనగా మాకీరీయులలో సగముమం
దికి వారి వంశములచొప్పున కలిగినవి. । యెరికోయొద్ద 32
తూర్పుదిక్కున యొర్దాను అద్దరినున్న మోయాబు
మైదానములో మోషే పంచిపెట్టిన స్వాస్థ్యములు
ఇవి. । లేవి గోత్రమునకు మోషే స్వాస్థ్యము పంచి 33
పెట్టలేదు; ఏలయనగా ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవా వారితో సెలవిచ్చినట్లు ఆయనే వారికి
స్వాస్థ్యము.
ఇశ్రాయేలీయులు కనానుదేశమున పొందిన **14**
స్వాస్థ్యములు ఇవి. మోషే ద్వారా యెహోవా ఆజ్ఞా 2
పించినట్లు యాజకుడైన ఎలాజారును నూనుకుమారు
డైన యెహోషువయు ఇశ్రాయేలీయుల గోత్రముల
యొక్క పితరుల కుటుంబముల ప్రధానులును చీట్లువేసి,
తొమ్మిది గోత్రములవారికి అర్ధగోత్రపువారికిని ఆ
స్వాస్థ్యములను పంచిపెట్టిరి. । మోషే రెండు గోత్ర 3
ములకును అర్ధగోత్రమునకును యొర్దాను అద్దరిని
స్వాస్థ్యముల నిచ్చియుండెను. అతడు వారిలో లేవీ
యులకు ఏ స్వాస్థ్యము ఇయ్యలేదు. । యోసేపు వంశ 4
కులగు మనష్షే ఎఫ్రాయిములను రెండు గోత్రముల
వారు నివసించుటకు పట్టణములును వారి పశువులకును
వారి మందలకును ఆ పట్టణముల సమీపభూములను
మాత్రమేకాక లేవీయులకు ఆ దేశమున ఏ స్వాస్థ్యము
ఇయ్యలేదు. । యెహోవా మోషేకు ఆజ్ఞాపించినట్లు 5
ఇశ్రాయేలీయులు చేసి దేశమును పంచుకొనిరి.
యూదా వంశస్థులు గిల్గాలులో యెహోషువ 6
యొద్దకు రాగా కెనెజీయుడగు యెఫున్నె కుమారుడైన
కాలేబు అతనితో ఈలాగు మనవిచేసెను — కాదేషు
బర్నేయలో దైవజనుడైన మోషేతో యెహోవా

నన్నుగూర్చియు నిన్నుగూర్చియు చెప్పినమాట నీవెరు
7 గుదువు. । దేశమును వేగుచూచుటకు యెహోవా
సేవకుడైన మోషే కాదేషు బర్నేయలోనుండి నన్ను
పంపినప్పుడు నేను నలువది ఏండ్లవాడను; ఎవరికిని
భయపడక నేను చూచినది చూచినట్టె అతనికి వర్తమా
8 నము తెచ్చితిని. । నాతోకూడ బయలుదేరి వచ్చిన నా
సహోదరులు జనుల హృదయములను కరుగచేయగా
నేను నా దేవుడైన యెహోవాను నిండు మనస్సుతో
9 అనుసరించితిని. । ఆ దినమున మోషే ప్రమాణము
చేసి—నీవు నా దేవుడైన యెహోవాను నిండు మన
స్సుతో అనుసరించితివి గనుక నీవు అడుగుపెట్టిన భూమి
నిశ్చయముగా నీకును నీ సంతానమునకును ఎల్లప్పుడును
10 స్వాస్థ్యముగా ఉండుననెను. । యెహోవా చెప్పి
నట్లు యెహోవా మోషేకు ఆ మాట సెలవిచ్చి
నప్పటినుండి ఇశ్రాయేలీయులు అరణ్యములో నడిచిన
యీ నలువది ఏండ్లు ఆయన నన్ను సజీవునిగా కాపాడి
యున్నాడు; ఇదిగో నేనిప్పుడు ఎనబదియయిదేండ్ల
11 వాడను. । మోషే నన్ను పంపిననాడు నాకెంత బలమో
నేటివరకు నాకంత బలము. యుద్ధముచేయుటకు గాని
మరి ఏ పనిచేయుటకు గాని నాకెప్పటియట్లు బల
12 మున్నది. । కాబట్టి ఆ దినమున యెహోవా సెల
విచ్చిన యీ కొండప్రదేశమును నాకు దయచేయుము;
అనాకీయులును ప్రాకారములుగల గొప్ప పట్టణము
లును అక్కడ ఉన్న సంగతి ఆ దినమున నీకు విన
బడెను. యెహోవా నాకు తోడైయుండినయెడల
యెహోవా సెలవిచ్చినట్లు వారి దేశమును స్వాధీన
13 పరచుకొందును. । యెఫున్నె కుమారుడైన కాలేబు
ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాను నిండు మన
స్సుతో అనుసరించువాడు గనుక యెహోషువ అతని
దీవించి అతనికి హెబ్రోనును స్వాస్థ్యముగా ఇచ్చెను. ।
14 కాబట్టి హెబ్రోను యెఫున్నె అను కెనెజీయుని కుమా
రుడైన కాలేబుకు నేటివరకు స్వాస్థ్యముగానున్నది. ।
15 పూర్వము హెబ్రోను పేరు కిర్యతర్బా. అర్బా అనా
కీయులలో గొప్పవాడు అప్పుడు యుద్ధములేకుండ
దేశము సుభిక్షముగా ఉండెను.

15 యూదా వంశస్థుల గోత్రమునకు వారి వంశ
ములచొప్పున చీట్లవలన వచ్చిన వంతు ఎదోము సరి
హద్దువరకును, అనగా దక్షిణదిక్కున సీను అరణ్యపు
2 దక్షిణ దిగంతమువరకును ఉండెను. । దక్షిణమున వారి
సరిహద్దు ఉప్పుసముద్రతీరమున దక్షిణదిశ చూచు
3 చున్న అఖాతము మొదలుకొని వ్యాపించెను. । అది
అక్రబ్బీము నెక్కుచోటికి దక్షిణముగా బయలుదేరి
సీనువరకు పోయి కాదేషు బర్నేయకు దక్షిణముగా
ఎక్కి హెస్రోనువరకు సాగి అద్దారు ఎక్కి కర్కాయు
4 వైపు తిరిగి । అస్మోనువరకు సాగి ఐగుప్తు ఏటివరకు
వ్యాపించెను. ఆ తట్టు సరిహద్దు సముద్రమువరకు
వ్యాపించెను, అది మీకు దక్షిణపు సరిహద్దు. । దాని 5
తూర్పు సరిహద్దు యొర్దాను తుదవరకునున్న ఉప్పు
సముద్రము. ఉత్తరదిక్కు సరిహద్దు యొర్దాను తుదనున్న
సముద్రాఖాతము మొదలుకొని వ్యాపించెను । ఆ 6
సరిహద్దు బేత్హొగ్లావరకు సాగి బేతరాబా ఉత్తర
దిక్కువరకు వ్యాపించెను. అక్కడనుండి ఆ సరిహద్దు
రూబేనీయుడైన బోహను రాతివరకు వ్యాపించెను. ।
ఆ సరిహద్దు ఆకోరులోయనుండి దెబీరువరకును ఏటికి 7
దక్షిణతీరముననున్న అదుమ్మీము నెక్కుచోటికి ఎదు
రుగానున్న గిల్గాలుకు అభిముఖముగా ఉత్తరదిక్కు
వైపునకును వ్యాపించెను. ఆ సరిహద్దు ఏన్షెమెషు
నీళ్లవరకు వ్యాపించెను. దాని కొన ఏన్రోగేలునొద్ద
నుండెను. । ఆ సరిహద్దు పడమట బెన్హిన్నోము 8
లోయ మార్గముగా దక్షిణదిక్కున యెబూసీయుల
దేశమువరకు, అనగా యెరూషలేమువరకు నెక్కెను.
ఆ సరిహద్దు పడమట హిన్నోములోయకు ఎదురుగా
నున్న కొండ నడికొప్పువరకు వ్యాపించెను. అది ఉత్తర
దిక్కున రెఫాయీయుల లోయ తుదనున్నది.

ఆ సరిహద్దు ఆ కొండ నడికొప్పునుండియు 9
నెఫ్తోయ నీళ్లయూటయొద్దనుండియు ఎఫ్రోను కొండ
పురములవరకు వ్యాపించెను. ఆ సరిహద్దు కిర్యత్యారీ
మను బాలావరకు సాగెను. । ఆ సరిహద్దు పడమరగా 10
బాలానుండి శేయీరుకొండకు వంపుగా సాగి కెసా
లోనను యారీము కొండయొక్క ఉత్తరపు వైపునకు
దాటి బేత్షెమెషువరకు దిగి తిమ్నావైపుకు వ్యాపిం
చెను. । ఉత్తరదిక్కున ఆ సరిహద్దు ఎక్రోనువరకు 11
సాగి అక్కడనుండిన సరిహద్దు షిక్రోనువరకు పోయి
బాలాకొండను దాటి యబ్నెయేలువరకును ఆ సరిహద్దు
సముద్రమువరకును వ్యాపించెను. । పడమటి సరి 12
హద్దు గొప్ప సముద్రపు సరిహద్దువరకు వ్యాపించెను.
యూదా సంతతి వారివంశములచొప్పున వారి సరి
హద్దు ఇదే.

యెహోవా యెహోషువకు ఇచ్చిన ఆజ్ఞ 13
చొప్పున యూదా వంశస్థుల మధ్యను యెఫున్నె
కుమారుడైన కాలేబుకు ఒక వంతున, అనగా అనా
కీయుల వంశకర్తయైన అర్బాయొక్క పట్టణమును
ఇచ్చెను, అది హెబ్రోను. । అక్కడనుండి కాలేబు 14
అనాకుయొక్క ముగ్గురు కుమారులైన షేషయి అహీ
మాను తల్మయి అను అనాకీయుల వంశకులను వెళ్లగొట్టి
వారి దేశమును స్వాధీనపరచుకొనెను. । అక్కడనుండి 15
అతడు దెబీరు నివాసులమీదికి పోయెను. అంతకు
ముందు దెబీరుపేరు కిర్యత్సేఫెరు. । కాలేబు—కిర్యత్సే 16
ఫెరును పట్టుకొని దాని కొల్లపెట్టినవానికి నా కుమార్తె
యైన అక్సాను ఇచ్చి పెండ్లిచేసెదనని చెప్పగా ।
కాలేబు సహోదరుడును కనజు కుమారుడునైన ఒత్నీ 17
యేలు దాని పట్టుకొనెను గనుక అతడు తన కుమార్తె

18 రైన అక్సాను అతనికిచ్చి పెండ్లిచేసెను. । మరియు
ఆమె తన, పెనిమిటి యింటికి వచ్చినప్పుడు తన
తండ్రిని ఒక పొలము అడుగుమని అతని ప్రేరేపిం
చెను. ఆమె గాడిదెను త్వరగా దిగగా కాలేబు
ఆమెను చూచి—నీకేమి కావలెనని ఆమె నడిగెను. ।
19 అందుకామె—నాకు దీవెన దయచేయుము; నీవు నాకు
దక్షిణభూమి యిచ్చియున్నావు గనుక నీటి మడుగు
లను నాకు దయచేయుమనగా అతడు ఆమెకు మెరక
మడుగులను పల్లపు మడుగులను ఇచ్చెను.
20 యూదా వంశస్థుల గోత్రమునకు వారి వంశముల
32 చొప్పున కలిగిన స్వాస్థ్యమిది. దక్షిణదిక్కున ఎదోము
సరిహద్దువరకు యూదా వంశస్థుల గోత్రముయొక్క
పట్టణములు ఏవేవనగా—కబ్సెయేలు ఏదెరు యాగూరు
కీనా దిమోనా అదాదా కెదెషు హాసోరు యిత్నాను
జీఫు తెలెము బెయాలోతు క్రొత్త హాసోరు కెరీ
యోతు హెస్రోను అనబడిన హాసోరు అమాము
షేమ మోలాదా హాసర్గద్దా హెష్మోను బేత్పెలెతు
హాసర్షువలు బెయేర్షెబా బిజ్యోత్యా బాలా ఈయ్యె
ఎజెము ఎల్తోలదు కెసీలు హెర్మా సిక్లగు మద్మన్నా
సన్సన్నా లెబాయోతు షిల్హీము అయీను రిమ్మోను
అనునవి, వాటి పల్లెలు పోగా ఈ పట్టణములన్నియు
ఇరువదితొమ్మిది.
33 మైదానములో ఏవనగా ఎష్తాయోలు జొర్యా
35 అష్నా జానోహ ఏన్గన్నీము తప్పూయ ఏనాము
36 యర్మూతు అదుల్లాము శోకో అజేకా । షరాయిము
అదీతాయిము గెదేరా గెదెరోతాయిము అనునవి.
వాటి పల్లెలు పోగా పదునాలుగు పట్టణములు. ।
37 సెనాను హదాషా మిగ్దోల్గాదు దిలాను మిస్పే యొక్త
41 యేలు లాకీషు బొస్కతు ఎగ్లోను కబ్బోను లహ్మాసు
కిత్లీషు గెదెరోతు బేత్దాగోను నయమా మక్కేదా అను
నవి, వాటి పల్లెలు పోగా పదియారు పట్టణములు.
42 లిబ్నా ఎతెరు ఆషాను యిప్తా అష్నా నెసీబు
47 కెయీలా అక్జీబు మారేషా అనునవి, వాటి పల్లెలు
పోగా తొమ్మిది పట్టణములు. ఎక్రోను దాని గ్రామ
ములను పల్లెలును, ఎక్రోను మొదలుకొని సముద్రము
వరకు అష్డోదు ప్రాంతమంతయు, దాని పట్టణము
లను గ్రామములను, ఐగుప్తు ఏటివరకు పెద్ద సము
ద్రమువరకును అష్డోదును, గాజాను వాటి ప్రాంతము
48 వరకును వాటి గ్రామములను పల్లెలును, । మన్యప్రదేశ
54 మందు షామీరు యత్తీరు శోకో దన్నా కిర్యత్సన్నా
అను దెబీరు అనాబు ఎష్టెమో ఆనీము గోషెను
హోలోను గిలో అనునవి, వాటి గ్రామములు
పోగా పదకొండు పట్టణములు. ఆరాబు దూమా
ఎషాను యానీము బేత్తపూయ అఫెకా హుమ్తా కిర్య
తర్బా అను హెబ్రోనులు సీయోరు అనునవి, వాటి
పల్లెలు పోగా తొమ్మిది పట్టణములు.

మాయోను కర్మెలు జీఫు యుట్ట ఎజ్రెయేలు యొక్దె 55
యాము జానోహ కయీను గిబియా తిమ్నా అనునవి, 59
వాటి పల్లెలు పోగా పది పట్టణములు. హల్హూలు
బేత్సూరు గెదోరు మారాతు బేతనోతు ఎల్తెకోనను
నవి, వాటి పల్లెలు పోగా ఆరు పట్టణములు. । కిర్య 60
త్బాలనగా కిర్యత్యారీము రబ్బా అనునవి, వాటి
పల్లెలు పోగా రెండు పట్టణములు.
అరణ్యమున బేతరాబా మిద్దీను సెకాకా నిబ్షాను 61
యీర్మెలహు ఏన్గెదీ అనునవి, వాటి పల్లెలు పోగా 63
ఆరు పట్టణములు. యెరూషలేములో నివసించిన
యెబూసీయులను యూదా వంశస్థులు తోలివేయ
లేకపోయిరి గనుక యెబూసీయులు నేటివరకు యెరూ
షలేములో యూదా వంశస్థులయొద్ద నివసించుచు
న్నారు.
యోసేపు పుత్రులకు చీటివలన వచ్చిన వంతు **16**
యెరికో యెదుట యొర్దాను దరినుండెను, తూర్పున 2
నున్న ఆ యెరికో యేటివెంబడిగా యెరికోనుండి 3
బేతేలు మన్యదేశమువరకు అరణ్యము వ్యాపించును.
అది బేతేలునుండి లూజువరకు పోయి అతా
రోతు అర్కీయుల సరిహద్దువరకు సాగి క్రింది బేత్
హోరోనువరకును గెజెరువరకును పడమటివైపుగా
యఫ్లేటీయుల సరిహద్దువరకు వ్యాపించెను. దాని
సరిహద్దు సముద్రమువరకును సాగెను. । అక్కడ 4
యోసేపు పుత్రులైన మనష్షే ఎఫ్రాయిములు స్వాస్థ్య
మును పొందిరి.
ఎఫ్రాయిమీయుల సరిహద్దు, అనగా వారి వంశ 5
ముల చొప్పున వారికి ఏర్పడిన సరిహద్దు అతారోతు
అద్దారునుండి మీది బేత్హోరోనువరకు తూర్పుగా
వ్యాపించెను. । వారి సరిహద్దు మిక్మెతాతునొద్దనున్న 6
సముద్రమువరకు పశ్చిమోత్తరముగా వ్యాపించి ఆ సరి
హద్దు తానాత్షీలోనువరకు తూర్పువైపుగా చుట్టు తిరిగి
యానోహావరకు తూర్పున దాని దాటి । యానోహా 7
నుండి అతారోతువరకును నారాతావరకునుండి యెరి
కోకు తగిలి యొర్దానునొద్ద తుదముట్టెను. । తప్పూయ 8
మొదలుకొని ఆ సరిహద్దు కానా యేటివరకు పశ్చిమ
ముగా వ్యాపించును. అది వారి వంశములచొప్పున
ఎఫ్రాయిమీయుల గోత్రస్వాస్థ్యము. । ఎఫ్రాయి 9
మీయులకు అచ్చటచ్చట ఇయ్యబడిన పట్టణములు
పోగా ఆ పట్టణములన్నియు వాటి గ్రామములును
మనష్షీయుల స్వాస్థ్యములో నుండెను. । అయితే 10
గెజెరులో నివసించిన కనానీయుల దేశమును వారు
స్వాధీనపరచుకొనలేదు. నేటివరకు ఆ కనానీయులు
ఎఫ్రాయిమీయులమధ్య నివసించుచు పన్ను కట్టు
దాసులైయున్నారు.
మనష్షే యోసేపు పెద్దకుమారుడు గనుక అతని **17**
గోత్రమునకు, అనగా మనష్షే పెద్దకుమారుడును

గిలాదు దేశాధిపతియునైన మాకీరుకు చీట్లవలన వంతు
వచ్చెను. అతడు యుద్ధవీరుడైనందున అతనికి గిలా
2 దును బాషానును వచ్చెను. । మనష్షీయులలో మిగిలిన
వారికి, అనగా అబీయెజెరీయులకును హెలకీయుల
కును అశ్రీయేలీయులకును షెకెమీయులకును హెపె
రీయులకును షెమీదీయులకును వారి వారి వంశముల
చొప్పున వంతు వచ్చెను. వారి వంశములనుబట్టి
యోసేపు కుమారుడైన మనష్షేయొక్క మగసంతాన
మది.

3 మనష్షే మునిమనుమడును మాకీరు ఇనుమనుమడును
గిలాదు మనుమడును హెపెరు కుమారుడునైన సెలో
పెహాదుకు కుమార్తెలేగాని కుమారులు పుట్టలేదు.
అతని కుమార్తెల పేరులు మహలా నోయా హొగ్లా
4 మిల్కా తిర్సా అనునవి. । వారు యాజకుడైన ఎలా
జారు ఎదుటికిని నూను కుమారుడైన యెహోషువ
యెదుటికిని ప్రధానుల యెదుటికిని వచ్చి—మా సహో
దరులమధ్య మాకు స్వాస్థ్యమియ్యవలెనని యెహోవా
మోషేకు ఆజ్ఞాపించెనని మనవి చేయగా యెహో
షువ యెహోవా సెలవిచ్చినట్లు వారి తండ్రియొక్క
సహోదరులమధ్య వారికి స్వాస్థ్యమిచ్చెను.
5 కాబట్టి యొర్దాను అద్దరినున్న గిలాదు బాషానులు
గాక మనష్షీయులకు పదివంతులు హెచ్చుగా వచ్చెను.।
6 ఏలయనగా మనష్షీయుల స్త్రీసంతానమును వారి పురుష
సంతానమును స్వాస్థ్యములు పొందెను. గిలాదుదేశము
7 తక్కిన మనష్షీయులకు స్వాస్థ్యమాయెను. । మనష్షీ
యుల సరిహద్దు ఆషేరునుండి షెకెముకు తూర్పుగా
నున్న మిక్మెతావరకును దక్షిణమున ఏన్తప్పూయ నివా
8 సులవైపున వ్యాపించెను. । తప్పూయదేశము మనష్షీ
యులదాయెను; అయితే మనష్షీయుల సరిహద్దులోని
9 తప్పూయ ఎఫ్రాయిమీయులదాయెను. । ఆ సరిహద్దు
కానాయేటి దక్షిణదిక్కున ఆ యేటివరకు వ్యాపిం
చెను. మనష్షీయుల ఊళ్లలో ఆ ఊళ్లు ఎఫ్రాయి
మీయులకు కలిగెను; అయితే మనష్షీయుల సరిహద్దు
ఆ యేటికి ఉత్తరముగా సముద్రమువరకు వ్యాపించెను.
దక్షిణభూమి ఎఫ్రాయిమీయులకును ఉత్తరభూమి
10 మనష్షీయులకును కలిగెను. । సముద్రము వారి సరి
హద్దు; ఉత్తరదిక్కున అది ఆషేరీయుల సరిహద్దు
కును, తూర్పుదిక్కున ఇశ్శాఖారీయుల సరిహద్దుకును
నడిచెను.

11 ఇశ్శాఖారీయుల ప్రదేశములోను ఆషేరీయుల
ప్రదేశములోను బేత్షెయాను దాని పురములును ఇబ్లె
యామును దాని పురములును దోరు నివాసులును
దాని పురములును ఏన్దోరు నివాసులును దాని పుర
ములును తానాకు నివాసులును దాని పురములును
మెగిద్దో నివాసులును దాని పురములును, అనగా
మూడు కొండల ప్రదేశము మనష్షీయులకు కలిగి
యున్నది. । కనానీయులు ఆ దేశములో నివసింప 12
వలెనని గట్టిపట్టు పట్టి యుండిరి గనుక మనష్షీయులు
ఆ పురములను స్వాధీనపరచుకొనలేకపోయిరి. । ఇశ్రా 13
యేలీయులు బలవంతులైన తరువాత వారు కనానీయుల
చేత వెట్టిపనులు చేయించుకొనిరి కాని వారి దేశమును
పూర్తిగా స్వాధీనపరచుకొనలేదు. । అప్పుడు యోసేపు 14
పుత్రులు యెహోషువను చూచి—మాకేల ఒక్క
చీటితో ఒక్క వంతునే స్వాస్థ్యముగా ఇచ్చితివి?
మేము ఒక గొప్ప జనమేగదా? ఇదివరకు యెహోవా
మమ్మును దీవించెనని మనవిచేయగా । యెహోషువ 15
—మీరు గొప్ప జనము గనుక ఎఫ్రాయిమీయుల
యొక్క మన్యము మీకు ఇరుకుగా నున్నయెడల
మీరు అడవికి పోయి అక్కడ పెరిజ్జీయుల దేశము
లోను రెఫాయీయులదేశములోను మీకు మీరే
చెట్లు నరకుకొనుడని వారితో చెప్పెను. । అందుకు 16
యోసేపు పుత్రులు—ఆ మన్యము మాకు చాలదు;
అదియుగాక పల్లపుచోటున నివసించు కనానీయుల
కందరికి, అనగా బేత్షెయానులోనివారికిని దాని పుర
ములలోనివారికిని యెజ్రెయేలు లోయలోనివారికిని
ఇనుప రథములున్నవనిరి. । అప్పుడు యెహోషువ 17
యోసేపు పుత్రులైన ఎఫ్రాయిమీయులను మనష్షీ 18
యులను చూచి—మీరు ఒక విస్తారజనము, మీకు
అధికబలము గలదు, మీకు ఒక్కవంతు చీటియేకాదు,
ఆ కొండ మీదే, అది అరణ్యము గనుక మీరు దాని
నరకుడి, అప్పుడు ఆ ప్రదేశము మీదగును; కనా
నీయులకు ఇనుప రథములుండినను వారు బలవంతులై
యుండినను మీరు వారి దేశమును స్వాధీనపరచు
కొనగలరనెను.

ఇశ్రాయేలీయులు ఆ దేశమును స్వాధీనపరచు **18**
కొనినతరువాత వారందరు షిలోహుకు కూడివచ్చి
అక్కడ ప్రత్యక్షపు గుడారము వేసిరి. । ఇశ్రాయేలీ 2
యులలో స్వాస్థ్యములు ఇంక పొందని యేడు గోత్ర
ములు ఉండెను. । కావున యెహోషువ ఇశ్రా 3
యేలీయులతో ఇట్లనెను—మీ పితరుల దేవుడైన
యెహోవా మీకిచ్చిన దేశమును స్వాధీనపరచుకొన
వెళ్లకుండ మీరెన్నాళ్లు తడవుచేసెదరు? । ప్రతి 4
గోత్రమునుండి ముగ్గురేసి మనుష్యులను నాయొద్దకు
రప్పించినయెడల నేను వారిని పంపెదను; వారు లేచి
దేశసంచారముచేయుచు ఆయా స్వాస్థ్యములచొప్పున
దాని వివరమును వ్రాసి నాయొద్దకు తీసికొనివచ్చె
దరు. । వారు ఏడువంతులుగా దాని పంచుకొందురు. 5
యూదావంశస్థులు దక్షిణదిక్కున తమ సరిహద్దు
లోపల నిలిచియుండవలెను. యోసేపుపుత్రులు ఉత్తర
దిక్కున తమ సరిహద్దులోపల నిలిచియుండవలెను. ।
మీరు ఏడు వంతులుగా దేశవివరమును వ్రాసి నా 6
యొద్దకు తీసికొని రావలెను. నేను ఇక్కడ మన దేవు

డైన యెహోవా సన్నిధిని మీ నిమిత్తము వంతుచీట్లు
7 వేసెదను. । లేవీయులకు మీ మధ్య ఏ వంతును కలు
గదు, యెహోవాకు యాజక ధర్మముచేయుటే వారికి
స్వాస్థ్యము. గాదీయులును రూబేనీయులును మనష్షే
అర్ధగోత్రపువారును యొర్దానుఅద్దరిని తూర్పుదిక్కున
యెహోవా సేవకుడైన మోషే వారికిచ్చిన స్వాస్థ్య
ములను పొందియున్నారు.
8 ఆ మనుష్యులు లేచి ప్రయాణము కాగా యెహో
షువ దేశవివరమును వ్రాయుటకు వెళ్లబోవువారిని
చూచి—మీరు ఆ దేశములో బడి నడుచుచు దాని
వివరమును వ్రాసి నాయొద్దకు తిరిగి రండి; అప్పుడు
నేను షిలోహులో మీకొరకు యెహోవా సన్నిధిని
9 వంతుచీట్లు వేయించెదననగా । ఆ మనుష్యులు వెళ్లి
దేశసంచారముచేయుచు ఏడువంతులుగా, గ్రామ
ములచొప్పున, దాని వివరమును పుస్తకములో వ్రాసి
షిలోహులోని పాళెములోనున్న యెహోషువ
10 యొద్దకు వచ్చిరి. । వారికొరకు యెహోషువ షిలో
హులో యెహోవా సన్నిధిని వంతుచీట్లు వేసి వారి
వారి వంతులచొప్పున ఇశ్రాయేలీయులకు దేశమును
11 పంచిపెట్టెను. । బెన్యామీనీయుల గోత్రమునకు వారి
వంశములచొప్పున వంతుచీటివచ్చెను; వారికి చీటివలన
కలిగిన సరిహద్దు యూదావంశస్థుల సరిహద్దుకును
యోసేపు పుత్రుల సరిహద్దుకును మధ్యనుండెను.
12 ఉత్తరదిక్కున వారి సరిహద్దు యొర్దాను మొదలు
కొని యెరికోకు ఉత్తరదిక్కున పోయి పడమరగా
కొండలదేశమువరకు వ్యాపించెను, దాని సరిహద్దు
13 బేతావెను అరణ్యమువరకు సాగెను. । అక్కడనుండి
ఆ సరిహద్దు లూజువైపున, అనగా బేతేలను లూజు
దక్షిణమువరకు సాగి క్రింది బేత్‌హోరోనుకు దక్షిణ
ముననున్న కొండమీది అతారోతు అద్దారువరకు
14 వ్యాపించెను. । అక్కడనుండి దాని సరిహద్దు దక్షిణ
మున బేత్‌హోరోనుకును ఎదురుగానున్న కొండ
నుండి పడమరగా దక్షిణమునకు తిరిగి అక్కడనుండి
యూదావంశస్థుల పట్టణమైన కిర్యాత్బాలు అనగా
కిర్యత్యారీమువరకు వ్యాపించెను; అది పడమటిదిక్కు.।
15 దక్షిణదిక్కున కిర్యత్యారీముకొననుండి దాని సరిహద్దు
పడమటిదిక్కున నెఫ్తోయ నీళ్ల యూటవరకు సాగి ।
16 ఉత్తరదిక్కున రెఫాయీయుల లోయలోనున్న బెన్
హిన్నోము లోయయెదుటనున్న కొండప్రక్కననుండి
దక్షిణదిక్కున బెన్‌హిన్నోము లోయమార్గమున
యెబూసీయుల ప్రదేశమువరకు సాగి ఏన్‌రోగేలు
17 వరకు వ్యాపించెను. । అది ఉత్తరదిక్కునుండి ఏన్‌షె
మెషువరకు వ్యాపించి అదుమ్మీమునకు ఎక్కుచోటికి
ఎదురుగానున్న గెలీలోతువరకు సాగి రూబేనీయుడైన
18 బోహను (నాటిన) రాతియొద్దకు దిగెను. । అది ఉత్తర
దిక్కున మైదానమునకు ఎదురుగా వ్యాపించి అరా

బావరకు దిగి అక్కడనుండి ఆ సరిహద్దు ఉత్తరదిక్కైన
బేత్‌హొగ్లావరకు సాగెను. । అక్కడనుండి ఆ సరి 19
హద్దు యొర్దాను దక్షిణదిక్కున ఉప్పుసముద్రము
యొక్క ఉత్తరాఖాతమువరకు వ్యాపించెను. అది
దక్షిణదిక్కున దానికి సరిహద్దు. । తూర్పుదిక్కున 20
యొర్దాను దానికి సరిహద్దు. దాని చుట్టునున్న సరి
హద్దులప్రకారము బెన్యామీనీయులకు వారి వంశ
ములచొప్పున కలిగిన స్వాస్థ్యము ఇది. । బెన్యామీ 21
నీయుల గోత్రమునకు వారి వంశములచొప్పున కలిగిన
పట్టణములు ఏవేవనగా యెరికో బేత్‌హొగ్లా
యెమెక్కెసీసు । బేతరాబా సెమరాయిము బేతేలు 22
ఆవీము పారా ఒఫ్రా । కెఫరమ్మోని ఒప్ని గెబా 23
అనునవి; వాటి పల్లెలు పోగా పండ్రెండు పట్టణములు. 26
గిబియోను రామా బెయేరోతు మిస్పేకెఫీరా మోసా
రేకెము ఇర్పెయేలు తరలా । సేలా ఎలెపు యెరూష 27
లేము అనబడిన యెబూసీ గిబియా కిర్యతు అనునవి;
వాటి పల్లెలు పోగా పదునాలుగు పట్టణములు. ।
వారి వంశములచొప్పున ఇది బెన్యామీనీయులకు 28
కలిగిన స్వాస్థ్యము.

రెండవ వంతు చీటి షిమ్యోనీయులపక్షముగా, 19
అనగా వారి వంశములచొప్పున షిమ్యోనీయుల
గోత్రపక్షముగా వచ్చెను. వారి స్వాస్థ్యము యూదా
వంశస్థుల స్వాస్థ్యము మధ్యనుండెను. । వారికి కలిగిన 2
స్వాస్థ్యమేదనగా బెయేర్షెబా షెబ మోలాదా ।
హాజర్షువలు బాలా ఎజెము ఎల్తోలదు బేతూలు 3
హోర్మా । సిక్లగు బేత్మర్కాబోతు హాజర్సూసా బేత్లె 4
బాయోతు షారూహెను అనునవి, వాటి పల్లెలు 6
పోగా పదమూడు పట్టణములు. । అయీను రిమ్మోను 7
ఎతెరు ఆషానును అనునవి; వాటి పల్లెలు పోగా
నాలుగు పట్టణములు. । దక్షిణమున రామతను బాలత్బె 8
యేరువరకు ఆ పట్టణముల చుట్టునున్న పల్లెలన్నియు
ఇవి షిమ్యోనీయుల గోత్రమునకు వారి వంశముల
చొప్పున కలిగిన స్వాస్థ్యము. । షిమ్యోనీయుల 9
స్వాస్థ్యము యూదా వంశస్థుల వంతులోని భాగము;
ఏలయనగా యూదా వంశస్థుల భాగము వారికి
ఎక్కువ గనుక వారి స్వాస్థ్యము నడుమను షిమ్యో
నీయులు స్వాస్థ్యము పొందిరి.

మూడవ వంతు చీటి వారి వంశముచొప్పున జెబు 10
లూనీయుల పక్షముగా వచ్చెను. వారి స్వాస్థ్యపు సరి
హద్దు శారీదువరకు సాగెను. । వారి సరిహద్దు పడ 11
మటివైపుగా మరలావరకును దబ్బాషతువరకును సాగి
యొక్నెయాముకు ఎదురుగానున్న యేటివరకు
వ్యాపించి ; శారీదునుండి సూర్యోదయదిక్కున 12
కిస్లోత్తాబోరు సరిహద్దువరకు దాబెరతునుండి యాఫీ
యకు ఎక్కి । అక్కడనుండి తూర్పుతట్టు గిత్తహెపెరు 13
వరకును ఇత్కాచీనువరకును సాగి నేయావరకు

14 వ్యాపించు రిమ్మోనుదనుక పోయెను. । దాని సరిహద్దు
హన్నాతోనువరకు ఉత్తరదిక్కున చుట్టుకొని అక్కడ
15 నుండి యిప్తాయేలు లోయలో నిలిచెను. । కట్టాతు
నహలాలు షిమ్రోను ఇదలా బేత్లెహేము అను
16 పన్నెండు పట్టణములును వాటి పల్లెలును. । ఆ పట్టణ
ములును వాటి పల్లెలును వారి వంశములచొప్పున జెబు
లూనీయులకు కలిగిన స్వాస్థ్యము.

17 నాలుగవ వంతు చీటి వారి వంశములచొప్పున
23 ఇశ్శాఖారీయుల పక్షముగా వచ్చెను. వారి సరిహద్దు
యెజ్రెయేలు కెసుల్లోతు షూనేము హపరాయిము
షీయోను అనహరాతు రబ్బీతు కిష్యోను అబెసు
రెమెతు ఏన్గన్నీము ఏన్హద్దా బేత్పస్సెసు అను స్థల
ములవరకు సాగి తాబోరు షహచీమా బేత్షెమెషు
అను స్థలములను దాటి యొర్దానువరకు వ్యాపించెను.
వాటి పల్లెలు గాక పదమూడు పట్టణములు వారి
కాయెను. అవి వాటి పల్లెలతోకూడ వారి వంశముల
చొప్పున ఇశ్శాఖారీయుల గోత్రమునకు కలిగిన
స్వాస్థ్యము.

24 అయిదవ వంతు చీటి వారి వంశములచొప్పున
25 ఆషేరీయుల పక్షముగా వచ్చెను. । వారి సరిహద్దు
26 హెల్కతుహలి బెతెను అక్షాపు । అలమ్మెలెకు అమాదు
మిషెయలు. పడమట అది కర్మెలువరకును షీహోర్లి
27 బ్నాతువరకును సాగి । తూర్పుదిక్కున బేత్దాగోను
వరకు తిరిగి జెబులూను భాగమును యిప్తాయేలు
లోయను దాటి బేతేమెకుకును నెయీయేలుకును
28 ఉత్తరదిక్కున పోవుచు । ఎడమవైపున అది కాబూలు
వరకును హెబ్రోను రెహోబు హమ్మోను కానా
29 పెద్ద సీదోనులవరకును వ్యాపించెను. । అక్కడనుండి
ఆ సరిహద్దు రామావరకును కోటగల తూరను పట్టణము
వరకును వ్యాపించి అక్కడనుండి తిరిగి హోసావరకు
సాగి అక్కడనుండి అక్జీబు సరిహద్దునుపట్టి సముద్రము
30 వరకు సాగెను. । ఉమ్మా ఆఫెకు రెహోబు వాటి
పల్లెలతోకూడ అవి యిరువదిరెండు పట్టణములు. ।
31 వాటి పల్లెలతోకూడ ఆ పట్టణములు వారి వంశముల
చొప్పున ఆషేరీయుల గోత్రమునకు కలిగిన
స్వాస్థ్యము.

32 ఆరవ వంతు చీటి వారి వంశములచొప్పున నఫ్తా
33 లీయుల పక్షమున వచ్చెను. । వారి సరిహద్దు హెలె
పును జయనన్నీములోని సిందూరవనమును అదామి
యను కనుమను యబ్నెయేలును మొదలుకొని లక్కూ
34 మువరకు సాగి । అక్కడనుండి పడమరగా అజనోత్తా
బోరువరకు వ్యాపించి అక్కడనుండి హుక్కోకువరకు
దక్షిణదిక్కున జెబులూనును, పడమట ఆషేరును
దాటి తూర్పున యొర్దానునొద్ది యూదావరకును
35 వ్యాపించెను. । కోటగల పట్టణములేవనగా జిద్దీము
38 జేరుహమ్మతు రక్కతు కిన్నెరెతు అదామా రామా
హాసోరు కెదెషు ఎద్రెయి ఏన్హాసోరు ఇరోను
మిగ్దలేలు హొరేము బేతనాతు బేత్షెమెషు అనునవి
వాటి పల్లెలుగాక పందొమ్మిది పట్టణములు. । ఆ పట్టణ 39
ములును వాటి పల్లెలును వారి వంశములచొప్పున
నఫ్తాలీయుల గోత్రమునకు కలిగిన స్వాస్థ్యము.

ఏడవ వంతు చీటి వారి వంశములచొప్పున దానీ 40
యుల పక్షముగా వచ్చెను. వారి స్వాస్థ్యపు సరి 46
హద్దు—జొర్యా ఎష్తాయోలు ఇర్షెమెషు షెయల్బీను
అయ్యాలోను యెత్లా ఏలోను తిమ్నా ఎక్రోను
ఎత్తెకే గిబ్బెతోను బాలాతా యెహుదు బెనేబెరకు
గత్రిమ్మోను మేయర్కోను రక్కోను యాపో అను
స్థలములకు వ్యాపించెను. । దానీయుల సరిహద్దు వారి 47
యొద్దనుండి అవతలకు వ్యాపించెను. దానీయులు
బయలుదేరి లెషెముమీద యుద్ధముచేసి దాని పట్టు
కొని కొల్లపెట్టి స్వాధీనపరచుకొని దానిలో నివసించి
తమ పితరుడైన దాను పేరునుబట్టి ఆ లెషెమునకు
దానను పేరుపెట్టిరి. । వాటి పల్లెలుగాక యీ పట్టణ 48
ములు వారి వంశములచొప్పున దానీయుల గోత్రము
నకు కలిగిన స్వాస్థ్యము.

సరిహద్దులను బట్టి ఆ దేశమును స్వాస్థ్యములుగా 49
పంచిపెట్టుట ముగించిన తర్వాత ఇశ్రాయేలీయులు
నూను కుమారుడైన యెహోషువకు స్వాస్థ్యమిచ్చిరి. ।
యెహోవా సెలవిచ్చినదానినిబట్టి వారు అతడు 50
అడిగిన పట్టణమును, అనగా ఎఫ్రాయిమీయుల
మన్యప్రదేశములోనున్న తిమ్నత్సెరహును అతని
కిచ్చిరి. అతడు ఆ పట్టణమును కట్టించి దానిలో
నివసించెను. । యాజకుడైన ఎలాజారును నూను 51
కుమారుడైన యెహోషువయు ఇశ్రాయేలీయుల
గోత్రములయొక్క పితరుల కుటుంబములలోని ముఖ్యు
లును షిలోహులోనున్న ప్రత్యక్షపు గుడారమునొద్ద
యెహోవా సన్నిధిని చీట్లువలన పంపకముచేసిన
స్వాస్థ్యములు ఇవి. అప్పుడు వారు దేశమును పంచి
పెట్టుట ముగించిరి.

**మ**రియు యెహోవా యెహోషువకు సెల **20**
విచ్చినదేమనగా — నీవు ఇశ్రాయేలీయులతో ఇట్ల 2
నుము—తెలియకయే పొరబాటున ఒకని చంపిన నర 3
హంతకుడు పారిపోవుటకు నేను మోషేనోట మీతో
పలికించిన ఆశ్రయపురములను మీరు ఏర్పరచుకొన
వలెను. హత్యవిషయమై ప్రతిహత్య చేయువాడు
రాకపోవునట్లు అవి మీకు ఆశ్రయపురములగును. ।
ఒకడు ఆ పురములలో ఒకదానికి పారిపోయి ఆ పుర 4
ద్వారమునొద్ద నిలిచి, ఆ పురముయొక్క పెద్దలు
వినునట్లు తన సంగతి చెప్పిన తరువాత, వారు పురము
లోకి వాని చేర్చుకొని తమయొద్ద నివసించుటకు
వానికి స్థలమియ్యవలెను. । హత్యవిషయములో ప్రతి 5
హత్య చేయువాడు వాని తరిమినయెడల వానిచేతికి

ఆ నరహంతకుని అప్పగింపకూడదు; ఏలయనగా
అతడు పొరబాటున తన పొరుగువాని చంపెనుగాని
6 అంతకుమునుపు వానియందు పగపట్టలేదు. । అతడు
తీర్పు నొందుటకై సమాజము నెదుట నిలుచువరకును,
తరువాత ఆ దినములలోనున్న యాజకుడు మరణము
నొందువరకును ఆ పురములోనే నివసింపవలెను. తరు
వాత ఆ నరహంతకుడు ఏ పట్టణమునుండి పారిపోయెనో
ఆ పట్టణమునకును తన యింటికిని తిరిగి రావలెను. ।
7 అప్పుడు వారు నఫ్తాలీయుల మన్యములోని గలిలై
యలో కెదెషును, ఎఫ్రాయిమీయుల మన్యమందలి
షెకెమును, యూదావంశస్థుల మన్యమందలి హెబ్రో
8 నను కిర్యతర్బాను ప్రతిష్ఠపరచిరి. । తూర్పుదిక్కున
యొర్దాను అద్దరిని యెరికోనొద్ద రూబేనీయుల గోత్ర
ములోనుండి మైదానముమీదనున్న అరణ్యములోని
బేసెరును, గాదీయుల గోత్రములోనుండి గిలాదు
లోని రామోతును, మనష్షీయుల గోత్రములోనుండి
9 బాషానులోని గోలానును నియమించిరి. । పొరబా
టున ఒకని చంపినవాడు సమాజము ఎదుట నిలువక
మునుపు అక్కడికి పారిపోయి హత్యవిషయమై ప్రతి
హత్య చేయువానిచేత చంపబడకయుండునట్లు ఇశ్రా
యేలీయులకందరికిని వారి మధ్య నివసించు పరదేశుల
కును నియమింపబడిన పురములు ఇవి.

21 లేవీయుల పితరుల కుటుంబముల ప్రధానులు
కనాను దేశమందలి షిలోహులో యాజకుడైన ఎలా
జారునొద్దకును, నూను కుమారుడైన యెహోషువ
యొద్దకును, ఇశ్రాయేలీయుల గోత్రములయొక్క పిత
రుల కుటుంబముల ప్రధానులయొద్దకును వచ్చి । —
2 మేము నివసించుటకు పురములను మా పశువులకు
పొలములను ఇయ్యవలెనని యెహోవా మోషే
3 ద్వారా ఆజ్ఞాపించెననగా । ఇశ్రాయేలీయులు
యెహోవా మాటచొప్పున తమ స్వాస్థ్యములలో
ఈ పట్టణములను వాటి పొలములను లేవీయులకిచ్చిరి.
4 వంతుచీటి కహాతీయుల వంశముల పక్షముగా
వచ్చెను. లేవీయులలో యాజకుడైన అహరోను
వంశకుల పక్షముగా యూదా గోత్రికులనుండియు,
షిమ్యోను గోత్రికులనుండియు, బెన్యామీను గోత్రి
కులనుండియు చీట్లవలన వచ్చినవి పదుమూడు పట్టణ
5 ములు. । కహాతీయులలో మిగిలిన వంశకుల పక్ష
ముగా ఎఫ్రాయిము గోత్రికులనుండియు, దాను
గోత్రికులనుండియు, మనష్షే అర్ధగోత్రపువారినుం
డియు వంతు చీట్లవలన వచ్చినవి పది పట్టణములు.
6 ఇశ్శాఖారు గోత్రికులనుండియు, ఆషేరు గోత్రి
కులనుండియు, నఫ్తాలి గోత్రికులనుండియు, బాషాను
లోనున్న మనష్షే అర్ధగోత్రపువారినుండియు చీట్ల
వలన గెర్షోనీయులకు కలిగినవి పదుమూడు పట్టణ
7 ములు. । రూబేను గోత్రికులనుండియు, గాదు గోత్రి
కులనుండియు, జెబులూను గోత్రికులనుండియు వారి
వంశములచొప్పున మెరారీయులకు కలిగినవి
పన్నెండు పట్టణములు. । యెహోవా మోషేద్వారా 8
ఆజ్ఞాపించినట్లు ఇశ్రాయేలీయులు వంతుచీట్లవలన ఆ
పట్టణములను వాటి పొలములను లేవీయులకిచ్చిరి.
వారు యూదావంశస్థుల గోత్రములోను షిమ్యో 9
నీయుల గోత్రములోను చెప్పబడిన పేరులుగల యీ
పట్టణములను ఇచ్చిరి. । అవి లేవీయులైన కహాతీయుల 10
వంశములలో అహరోను వంశకులకు కలిగినవి, ఏల
యనగా మొదట చేతికివచ్చిన వంతుచీటి వారిది. ।
యూదావంశస్థుల మన్యములో వారికి కిర్యతర్బా, 11
అనగా హెబ్రోనునిచ్చిరి. ఆ అర్బా అనాకు తండ్రి.
దాని చుట్టునున్న పొలమును వారికిచ్చిరి. । అయితే 12
ఆ పట్టణముయొక్క పొలములను దాని గ్రామము
లను యెఫున్నె కుమారుడైన కాలేబుకు స్వాస్థ్యముగా
ఇచ్చిరి.
యాజకుడైన అహరోను సంతానపువారికి వారు 13
నరహంతకునికి ఆశ్రయపట్టణమైన హెబ్రోనును 16
దాని పొలమును లిబ్నాను దాని పొలమును యత్తీరును
దాని పొలమును ఎష్టెమోయను దాని పొలమును
హోలోనును దాని పొలమును దెబీరును దాని పొల
మును ఆయినిని దాని పొలమును యుట్టయును దాని
పొలమును బేత్షెమెషును దాని పొలమును, అనగా ఆ
రెండు గోత్రములవారినుండి తొమ్మిది పట్టణములను
ఇచ్చిరి. । బెన్యామీను గోత్రమునుండి నాలుగు పట్టణ 17
ములను, అనగా గిబియోనును దాని పొలమును గెబను
దాని పొలమును । అనాతోతును దాని పొలమును 18
అల్మోనును దాని పొలమును ఇచ్చిరి. । యాజకులైన 19
అహరోను వంశకుల పట్టణములన్నియు వాటి పొల
ములు పోగా పదుమూడు పట్టణములు.
కహాతీయుల వంశపువారైన లేవీయులకు, అనగా 20
కహాతు సంబంధులలో మిగిలినవారికి వంతుచీట్లవలన
కలిగిన పట్టణములు ఎఫ్రాయిము గోత్రమునుండి
వారికియ్యబడెను. । నాలుగు పట్టణములను, అనగా 21
ఎఫ్రాయిమీయుల మన్యదేశములో నరహంతకుని
కొరకు ఆశ్రయపట్టణమైన షెకెమును దాని పొల
మును గెజెరును దాని పొలమును । కిబ్సాయిమును 22
దాని పొలమును బేత్హోరోనును దాని పొలమును
వారికిచ్చిరి. । దాను గోత్రికులనుండి నాలుగు పట్టణ 23
ములను, అనగా ఎల్తెకేను దాని పొలమును గిబ్బె
తోనును దాని పొలమును । అయ్యాలోనును దాని 24
పొలమును గత్రిమ్మోనును దాని పొలమును వారి
కిచ్చిరి. । రెండు పట్టణములను, అనగా మనష్షే అర్ధ 25
గోత్రికులనుండి తానాకును దాని పొలమును గత్రి
మ్మోనును దాని పొలమును ఇచ్చిరి. । వాటి పొలములు 26

గాక కహాతుసంబంధులలో మిగిలినవారికి కలిగిన పట్ట
ణములన్నియు పది.
27 లేవీయుల వంశములలో గెర్షోనీయులకు రెండు
పట్టణములను, అనగా నరహంతకునికొరకు ఆశ్రయ
పట్టణమగుటకు బాషానులోని గోలానును దాని పొల
మును బెయెష్టెరానును దాని పొలమును ఇచ్చిరి. ।
28 ఇశ్శాఖారు గోత్రికులనుండి నాలుగు పట్టణములను,
అనగా కిష్యోనును దాని పొలమును దాబెరతును దాని
29 పొలమును యర్మూతును దాని పొలమును । ఏన్గన్నీ
30 మును దాని పొలమును ఇచ్చిరి. । ఆషేరు గోత్రికుల
నుండి నాలుగు పట్టణములను, అనగా మిషెయలు
31 దాని పొలమును అబ్దోనును దాని పొలమును । హెల్క
తును దాని పొలమును రెహోబును దాని పొల
32 మును ఇచ్చిరి. । నఫ్తాలి గోత్రికులనుండి మూడు పట్ట
ణములను, అనగా నరహంతకునికొరకు ఆశ్రయపట్టణ
మగుటకు గలిలైయలోని కెదెషును దాని పొలమును
హమ్మోత్దోరును దాని పొలమును కర్తానును దాని
33 పొలమును ఇచ్చిరి. । వారి వంశములచొప్పున గెర్షో
నీయుల పట్టణములన్నియు వాటి పొలములుగాక
పదుమూడు పట్టణములు.
34 లేవీయులలో మిగిలిన మెరారీయుల వంశములకు
జెబులూను గోత్రములనుండి నాలుగు పట్టణములను,
35 అనగా యొక్నెయామును దాని పొలమును । కర్తాను
దాని పొలమును దిమ్నాను దాని పొలమును నహ
36 లాలును దాని పొలమును ఇచ్చిరి. । రూబేను గోత్రి
కులనుండి నాలుగు పట్టణములను, అనగా బేసెరును
దాని పొలమును యాహసును దాని పొలమును ।
37 కెదేమోతును దాని పొలమును మేఫాతును దాని
38 పొలమును ఇచ్చిరి. । గాదు గోత్రికులనుండి నాలుగు
పట్టణములను, అనగా నరహంతకునికొరకు ఆశ్రయ
పట్టణమగుటకు గిలాదులోని రామోతును దాని పొల
39 మును మహనయీమును దాని పొలమును । హెష్బో
నును దాని పొలమును యాజెరును దాని పొలమును
40 ఇచ్చిరి. । వారి వారి వంశములచొప్పున, అనగా లేవీ
యుల మిగిలిన వంశములచొప్పున అవన్నియు మెరా
రీయులకు కలిగిన పట్టణములు. వంతుచీటివలన వారికి
కలిగిన పట్టణములు పన్నెండు.
41 ఇశ్రాయేలీయుల స్వాస్థ్యములో వాటి పొల
ములుగాక లేవీయుల పట్టణములన్నియు నలుపది
42 యెనిమిది. । ఆ పట్టణములన్నిటికి పొలములుండెను.
43 ఆ పట్టణములన్నియు అట్లే యుండెను. । యెహోవా
ప్రమాణముచేసి వారి పితరుల కిచ్చెదనని చెప్పిన దేశ
మంతయు ఆయన ఇశ్రాయేలీయుల కప్పగించెను.
వారు దాని స్వాధీనపరచుకొని దానిలో నివసించిరి. ।
44 యెహోవా వారి పితరులతో ప్రమాణముచేసిన
వాటన్నిటి ప్రకారము అన్నిదిక్కులయందు వారికి
విశ్రాంతి కలుగజేసెను. యెహోవా వారి శత్రువుల
నందరిని వారిచేతి కప్పగించియుండెను గనుక వారిలో
నొకడును ఇశ్రాయేలీయులయెదుట నిలువలేక
పోయెను. యెహోవా ఇశ్రాయేలీయులకు సెల
విచ్చినమాటలన్నిటిలో ఏదియు తప్పియుండలేదు,
అంతయు నెరవేరెను.

**యె**హోషువ రూబేనీయులను గాదీయులను **22**
మనష్షే అర్ధగోత్రపువారిని పిలిపించి వారితో ఇట్ల
నెను । — యెహోవా సేవకుడైన మోషే మీకాజ్ఞా 2
పించినదంతయు మీరు చేసియున్నారు. మరియు
నేను మీకాజ్ఞాపించినవాటన్నిటి విషయములో నా
మాట వినియున్నారు. । బహుదినములనుండి నేటివరకు 3
మీరు మీ సహోదరులను విడువక మీ దేవుడైన
యెహోవా ఆజ్ఞ ననుసరించి నడిచియున్నారు. ।
ఇప్పుడు మీ దేవుడైన యెహోవా మీ సహోదరు 4
లతో చెప్పినట్లు వారికి నెమ్మది కలుగజేసి యున్నాడు.
కాబట్టి మీరిప్పుడు యెహోవా సేవకుడైన మోషే
యొర్దాను అద్దరిని మీకు స్వాస్థ్యముగా ఇచ్చినదేశ
ములో మీ నివాసములకు తిరిగి వెళ్లుడి. । అయితే 5
మీ పూర్ణహృదయముతోను మీ పూర్ణాత్మతోను మీ
దేవుడైన యెహోవాను ప్రేమించుచు, ఆయన
మార్గములన్నిటిలో నడుచుకొనుచు, ఆయన ఆజ్ఞలను
గైకొనుచు, ఆయనను హత్తుకొని ఆయనను సేవించుచు,
యెహోవా సేవకుడైన మోషే మీకాజ్ఞాపించిన
ధర్మమును ధర్మశాస్త్రమును అనుసరించి నడుచుకొనుడి. ।
అతడీలాగు చెప్పిన తరువాత వారిని దీవించి వెళ్లనం 6
పగా వారు తమ నివాసములకు పోయిరి.

మోషే బాషానులో మనష్షే అర్ధగోత్రమునకును, 7
యెహోషువ పడమటిదిక్కున యొర్దాను అద్దరిని
వారి సహోదరులలో మిగిలిన అర్ధగోత్రమునకును
స్వాస్థ్యములిచ్చిరి. మరియు యెహోషువ వారి
నివాసములకు వారిని వెళ్లనంపినప్పుడు అతడు వారిని
దీవించి వారితో ఇట్లనెను । — మీరు మిక్కిలి కలిమి 8
గలవారై అతివిస్తారమైన పశువులతోను వెండితోను
బంగారుతోను ఇత్తడితోను ఇనుముతోను అతివిస్తార
మైన వస్త్రములతోను తిరిగి మీ నివాసములకు వెళ్లు
చున్నారు. మీ శత్రువుల దోపుడుసొమ్మును మీరును
మీ సహోదరులును కలిసి పంచుకొనుడి.

కాబట్టి రూబేనీయులును గాదీయులును మనష్షే 9
అర్ధగోత్రపువారును యెహోవా మోషేద్వారా సెల
విచ్చిన మాటచొప్పున తాము స్వాధీనపరచుకొనిన
స్వాస్థ్యభూమియైన గిలాదులోకి వెళ్లుటకు కనానుదేశ
మందలి షిలోహులోనున్న ఇశ్రాయేలీయులయొద్ద
నుండి బయలుదేరిరి. కనానుదేశమందున్న యొర్దాను
ప్రదేశమునకు వచ్చినప్పుడు । రూబేనీయులును గాదీ
యులును మనష్షే అర్ధగోత్రపువారును అక్కడ యొర్దాను

దగ్గర ఒక బలిపీఠమును కట్టిరి, అది చూపునకు గొప్ప
11 బలిపీఠమే. । అప్పుడు రూబేనీయులును గాదీయులును
మనష్షే అర్ధగోత్రపువారును ఇశ్రాయేలీయుల యెదుటి
వైపున యొర్దాను ప్రదేశములో కనానుదేశమునెదుట
బలిపీఠమును కట్టిరని ఇశ్రాయేలీయులకు వర్తమానము
12 వచ్చెను. । ఇశ్రాయేలీయులు ఆ మాట వినినప్పుడు
సమాజమంతయు వారితో యుద్ధముచేయుటకు షిలో
13 హులో కూడి । ఇశ్రాయేలీయులు గిలాదులోనున్న
రూబేనీయుల యొద్దకును గాదీయులయొద్దకును మనష్షే
అర్ధగోత్రపువారి యొద్దకును యాజకుడగు ఎలాజారు
14 కుమారుడైన ఫీనెహాసును పంపిరి. । ఇశ్రాయేలీయుల
గోత్రములన్నిటిలో ప్రతిదాని పితరుల కుటుంబప్ర
ధానుని, అనగా పదిమంది ప్రధానులను అతనితో
కూడ పంపిరి, వారందరు ఇశ్రాయేలీయుల సమూహ
ములలో తమ తమ పితరుల కుటుంబములకు ప్రధా
15 నులు. । వారు గిలాదుదేశములోనున్న రూబేనీయుల
యొద్దకును గాదీయుల యొద్దకును మనష్షే అర్ధగోత్రపు
వారి యొద్దకును పోయి వారితో ఇట్లనిరి । —
16 యెహోవా సర్వసమాజపువారు చెప్పుచున్నదేమన
గా— నేడు బలిపీఠమును కట్టుకొని నేడే యెహోవాను
అనుసరించుట మాని, ఇశ్రాయేలీయుల దేవునిమీద
17 మీరేల తిరుగబాటు చేయుచున్నారు? । పెయోరు
విషయములో మనము చేసిన దోషము మనకు చాలదా?
అందుచేత యెహోవా సమాజములో తెగులు పుట్టెను
గదా! నేటివరకు మనము దానినుండి పవిత్రపరచు
18 కొనక యున్నాము. । మీరు ఈ దినమున యెహోవా
వెంబడినుండి తొలగిపోవునట్లు నేడు యెహోవా
మీద తిరుగబడి ద్రోహము చేసెదరేమి! అలాగైతే
ఆయన ఇకమీదట ఇశ్రాయేలీయుల సర్వసమాజము
19 మీద కోపపడును గదా! । మీ స్వాస్థ్యమైన దేశము
అపవిత్రముగా నుండినయెడల యెహోవా మందిర
ముండు యెహోవా స్వాధీనదేశమునకు మీరు వచ్చి
మా మధ్యను స్వాస్థ్యము తీసికొనుడి, మన దేవుడైన
యెహోవా బలిపీఠము గాక వేరొక బలిపీఠమును
కట్టుకొని యెహోవామీద తిరుగబడకుడి, మా మీద
20 తిరుగబడకుడి, । జెరహు కుమారుడైన ఆకాను ప్రతి
ష్ఠితమైన దానివిషయములో తిరుగబడినప్పుడు ఇశ్రా
యేలీయుల సర్వసమాజముమీదికి కోపము రాలేదా?
తన దోషమువలన ఆ మనుష్యుడొకడే మరణమా
యెనా?

21 అందుకు రూబేనీయులును గాదీయులును మనష్షే
అర్ధగోత్రపువారును ఇశ్రాయేలీయుల ప్రధానులతో
22 ఇచ్చిన ఉత్తరమేమనగా । — దేవుళ్లలో యెహోవా
దేవుడు, దేవుళ్లలో యెహోవాయే దేవుడు; సంగతి
ఆయనకు తెలియును, ఇశ్రాయేలీయులు తెలిసికొం
దురు; ద్రోహముచేతనైనను యెహోవామీద తిరుగ
బాటుచేతనైనను మేము ఈ పనిచేసినయెడల నేడు
మమ్ము బ్రదుకనియ్యకుడి. । యెహోవాను అనుసరిం 23
పక తొలగిపోయి, దహనబలినైనను నైవేద్యమునైనను
దానిమీద అర్పించుటకే గాని సమాధానబలులను దాని
మీద అర్పించుటకే గాని మేము ఈ బలిపీఠమును
కట్టినయెడల యెహోవా తానే విమర్శచేయుగాక.
వేరొక హేతువుచేతనే ఈ బలిపీఠమును కట్టితిమి. ।
ఏమనగా రాబోవుకాలమున మీ సంతానపువారు 24
మా సంతానపువారిని చూచి— ఇశ్రాయేలీయుల దేవు
డైన యెహోవాతో మీకేమి సంబంధము? । రూబే 25
నీయులారా గాదీయులారా, మీకును మాకును మధ్య
యెహోవా యొర్దానును సరిహద్దుగా నియమించెను
గదా? యెహోవాయందు మీకు పాలేదియు లేదని
చెప్పుటవలన మీ సంతానపువారు మా సంతానపు
వారిని యెహోవా విషయములో భయభక్తులు లేని
వారగునట్లు చేయుదురేమో అని భయపడి ఆ హేతువు
చేతనే దీని చేసితిమి. । కాబట్టి మేము— మనము బలి 26
పీఠమును కట్టుటకు సిద్ధపరచుదము రండని చెప్పుకొం
టిమి; అది దహనబలుల నర్పించుటకైనను బలి నర్పిం
చుటకైనను కాదు. । మన దహనబలుల విషయము 27
లోను బలుల విషయములోను సమాధానబలుల విషయ
ములోను మనము యెహోవా సన్నిధిని ఆయన సేవ
చేయవలయుననుటకు — యెహోవాయందు మీకు
పాలు ఏదియు లేదనుమాట మీ సంతతివారు మా
సంతతివారికి చెప్పజాలకుండునట్లు అది మాకును మీ
కును మన తరువాత మన మన తరములవారికిని మధ్య
సాక్షిగానుండును. । అందుకు మేము— ఇకమీదట 28
వారు మాతోనే గాని మా తరముల వారితోనే గాని
అట్లు చెప్పినయెడల మేము— మన పితరులు చేసిన బలి
పీఠపు ఆకారమును చూడుడి; యిది దహనబలి నర్పిం
చుటకు కాదు బలి నర్పించుటకు కాదు గాని, మాకును
మీకును మధ్య సాక్షిగా నుండుటకే యని చెప్పుద
మని అనుకొంటిమి. । ఆయన మందిరము నెదుటనున్న 29
మన దేవుడైన యెహోవా బలిపీఠము తప్ప దహన
బలులకైనను నైవేద్యములకైనను బలులకైనను వేరొక
బలిపీఠమును కట్టునట్లు నేడు యెహోవాను అనుస
రింపక తొలగిపోయినయెడలనేమి యెహోవామీద
ద్రోహముచేసినయెడలనేమి మేము శాపగ్రస్తులమగు
దుము గాక.

ఫీనెహాసను యాజకుడును సమాజ ప్రధానులును, 30
అనగా అతనితో ఉండిన ఇశ్రాయేలీయుల ప్రధాను
లును రూబేనీయులును గాదీయులును మనష్షీయులును
చెప్పిన మాటలను విని సంతోషించిరి. । అప్పుడు 31
యాజకుడైన ఎలాజారు కుమారుడగు ఫీనెహాసు రూబే
నీయులతోను గాదీయులతోను మనష్షీయులతోను—
మీరు యెహోవాకు విరోధముగా ఈ ద్రోహము

చేయలేదు గనుక యెహోవా మన మధ్యనున్నాడని
నేడు ఎరుగుదుము; ఇప్పుడు మీరు యెహోవా
చేతిలోనుండి ఇశ్రాయేలీయులను విడిపించియున్నా
రని చెప్పెను.
32 యాజకుడైన ఎలాజారు కుమారుడగు ఫీనెహాసును
ప్రధానులును గిలాదులోని రూబేనీయుల యొద్దనుం
డియు, గాదీయుల యొద్దనుండియు ఇశ్రాయేలీయుల
యొద్దకు తిరిగి వచ్చి జనులకు ఆ మాట తెలియచెప్ప
33 గా । ఇశ్రాయేలీయులు విని సంతోషించిరి అప్పుడు
ఇశ్రాయేలీయులు దేవుని స్తుతించి, రూబేనీయులును
గాదీయులును నివసించు దేశమును పాడుచేయుటకు
34 వారిమీద యుద్ధముచేయుట మానిరి. । రూబేనీయు
లును గాదీయులును యెహోవాయే దేవుడనుటకు
ఇది మనమధ్యను సాక్షియగునని దానికి ఏద అను పేరు
పెట్టిరి.

23 చుట్టునున్న వారి శత్రువులలో ఎవరును వారి
మీదికి రాకుండ యెహోవా ఇశ్రాయేలీయులకు
నెమ్మది కలుగజేసినమీదట అనేక దినములైన తరు
వాత యెహోషువ బహు సంవత్సరములుగల వృద్ధు
2 డాయెను. । అప్పుడతడు ఇశ్రాయేలీయులనందరిని
వారి పెద్దలను వారి ముఖ్యులను వారి న్యాయాధి
పతులను వారి నాయకులను పిలిపించి వారితో ఇట్ల
నెను—నేను బహు సంవత్సరములు గడచిన ముసలి
3 వాడను. । మీ దేవుడైన యెహోవా మీ నిమిత్తము
సమస్త జనములకు చేసినదంతయు మీరు చూచితిరి.
మీ నిమిత్తము యుద్ధము చేసినవాడు మీ దేవుడైన
4 యెహోవాయే. । చూడుడి; యొర్దాను మొదలు
కొని తూర్పుదిక్కున మహాసముద్రమువరకు నేను
నిర్మూలముచేసిన సమస్త జనముల దేశమును, మీ
గోత్రముల స్వాస్థ్యముమధ్య మిగిలియున్న యీ జన
ముల దేశమును మీకు వంతుచీట్లువలన పంచిపెట్టితిని. ।
5 మీ దేవుడైన యెహోవాయే వారిని మీ యెదుట
నిలువకుండ వెళ్లగొట్టిన తరువాత మీ దేవుడైన
యెహోవా మీతో సెలవిచ్చినట్లు మీరు వారి దేశ
6 మును స్వాధీనపరచుకొందురు. । కాబట్టి మీరు మోషే
ధర్మశాస్త్ర గ్రంథములో వ్రాయబడినదంతటిని గైకొని
అనుసరించుటకు మనస్సు దృఢము చేసికొని, యెడ
7 మకు గాని కుడికి గాని దానినుండి తొలగిపోక । మీ
యొద్ద మిగిలియున్న యీ జనుల సహవాసము చేయక
వారి దేవతల పేళ్లను ఎత్తక వాటి తోడని ప్రమాణము
8 చేయక వారిని పూజింపక వారికి నమస్కరింపక । మీరు
నేటివరకు చేసినట్లు మీ దేవుడైన యెహోవాను
9 హత్తుకొని యుండవలెను. । యెహోవా బలముగల
గొప్ప జనములను మీ యెదుటనుండి కొట్టివేసియు
న్నాడు, మీ యెదుట నేటివరకును ఏ మనుష్యుడును
నిలిచియుండలేదు. । మీ దేవుడైన యెహోవా
మీకిచ్చిన మాటచొప్పున తానే మీకొరకు యుద్ధము
చేయువాడు గనుక మీలో ఒకడు వెయ్యిమందిని తరు
మును । కాబట్టి మీరు బహు జాగ్రత్తపడి మీ దేవు 11
డైన యెహోవాను ప్రేమింపవలెను.
అయితే మీరు వెనుకకు తొలగి మీయొద్ద మిగిలి 12
యున్న యీ జనములను హత్తుకొని వారితో వియ్య
మంది, వారితో మీరును మీతో వారును సాంగ
త్యము చేసినయెడల । మీ దేవుడైన యెహోవా 13
మీ యెదుటనుండి యీ జనములను కొట్టివేయుట
మానును. మీ దేవుడైన యెహోవా మీ కిచ్చిన
యీ మంచి దేశములో ఉండకుండ మీరు నశించు
వరకు వారు మీకు ఉరిగాను బోనుగాను మీ ప్రక్కల
మీద కొరడాలుగాను మీ కన్నులలో ముళ్లుగాను
ఉందురు. । ఇదిగో నేడు నేను సర్వలోకుల మార్గమున 14
వెళ్లుచున్నాను. మీ దేవుడైన యెహోవా మీ విష
యమై సెలవిచ్చిన మంచి మాటలన్నిటిలో ఒక్కటియై
నను తప్పియుండలేదని మీరు అనుభవపూర్వకముగా
ఎరుగుదురు; అవి అన్నియు మీకు కలిగెను, వాటిలో
ఒక్కటియైనను తప్పియుండలేదు. । అయితే మీ దేవు 15
డైన యెహోవా మీతో చెప్పిన మేలంతయును మీకు
కలిగిన ప్రకారము మీ దేవుడైన యెహోవా మీకి
చ్చిన యీ మంచి దేశములో ఉండకుండ ఆయన
మిమ్ము నశింపజేయువరకు యెహోవా మీ మీదికి
కీడంతయు రాజేయును. । మీరు మీ దేవుడైన 16
యెహోవా మీకు నియమించిన ఆయన నిబంధనను
మీరి యితర దేవతలను పూజించి వారికి నమస్క
రించినయెడల యెహోవా కోపము మీమీద మం
డును గనుక ఆయన మీకిచ్చిన యీ మంచి దేశ
ములో నుండకుండ మీరు శీఘ్రముగా నశించిపోవు
దురు.

యెహోషువ ఇశ్రాయేలీయుల గోత్రముల 24
వారినందరిని షెకెములో పోగుచేసి, వారి పెద్దలను
వారి ప్రధానులను వారి న్యాయాధిపతులను వారి
నాయకులను పిలిపింపగా వారు వచ్చి దేవుని సన్నిధిని
నిలిచిరి. । యెహోషువ జనులందరితో ఇట్లనెను— 2
ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా చెప్పునదేమ
నగా—ఆదికాలమునుండి మీ పితరులు, అనగా అబ్రా
హామునకును నాహోరుకును తండ్రియైన తెరహు
కుటుంబికులు నది అద్దరిని నివసించి యితర దేవతలను
పూజించిరి. । అయితే నేను నది అద్దరినుండి మీ 3
పితరుడైన అబ్రాహామును తోడుకొనివచ్చి కనాను
దేశమందంతట సంచరింపజేసి, అతనికి సంతానమును
విస్తరింపజేసి, అతనికి ఇస్సాకును ఇచ్చితిని. । ఇస్సా 4
కునకు నేను యాకోబు ఏశావుల నిచ్చితిని. శేయీరు
మన్యములను స్వాధీనపరచుకొనునట్లు వాటిని ఏశావు
కిచ్చితిని. యాకోబును అతని కుమారులును ఐగుప్తు

5 లోకి దిగిపోయిరి. । తరువాత నేను మోషే అహ
రోనులను పంపి, దాని మధ్యను నేను చేసిన క్రియల
వలన ఐగుప్తీయులను హతముచేసి మిమ్మును వెలుపలికి
6 రప్పించితిని. । నేను ఐగుప్తులోనుండి మీ తండ్రులను
రప్పించినప్పుడు మీరు సముద్రమునొద్దకు రాగా
ఐగుప్తీయులు రథములతోను రౌతులతోను మీ
7 తండ్రులను ఎఱ్ఱసముద్రమువరకు తరిమిరి. । వారు
యెహోవాకు మొఱ్ఱపెట్టినప్పుడు ఆయన మీకును
ఐగుప్తీయులకును మధ్య చీకటి కల్పించి సముద్రమును
వారిమీదికి రప్పించి వారిని ముంచివేసెను. ఐగుప్తు
దేశములో నేను చేసినదానిని మీరు కన్నులార చూచి
తిరి. అటుతరువాత మీరు బహు దినములు అరణ్య
8 ములో నివసించితిరి. । యొర్దాను అద్దరిని నివసించిన
అమోరీయుల దేశమునకు నేను మిమ్మును రప్పించి
నప్పుడు వారు మీతో యుద్ధముచేయగా నేను మీ
చేతికి వారిని అప్పగించితిని, మీరు వారి దేశమును
స్వాధీనపరచుకొంటిరి, వారు మీయెదుట నిలువకుండ
9 వారిని నశింపజేసితిని. । తరువాత మోయాబురాజును
సిప్పోరు కుమారుడునైన బాలాకు లేచి ఇశ్రాయేలీ
యులతో యుద్ధముచేసి మిమ్ము శపించుటకు బెయోరు
10 కుమారుడైన బిలామును పిలువనంపగా । నేను బిలాము
మనవి విననొల్లనైతిని గనుక అతడు మిమ్మును దీవించు
చునే వచ్చెను. అతని చేతినుండి నేనే మిమ్మును విడిపించి
11 తిని. । మీరు యొర్దాను దాటి యెరికో దగ్గరకు వచ్చి
నప్పుడు యెరికోకు యజమానులగు అమోరీయులు
పెరిజ్జీయులు కనానీయులు హిత్తీయులు గిర్గాషీయులు
హివ్వీయులు యెబూసీయులనువారు మీతో యుద్ధ
ముచేయగా నేను వారిని మీ చేతికప్పగించితిని. ।
12 మరియు నేను మీకు ముందుగా కందిరీగలను పంపి
తిని; నీ ఖడ్గము కాదు నీ విల్లు కాదు గాని అవే
అమోరీయుల రాజులనిద్దరిని తోలివేసెను. మీరు
13 సేద్యముచేయని దేశమును । మీరు కట్టని పట్టణము
లను మీకిచ్చియున్నాను. మీరు వాటిలో నివ
సించుచున్నారు. మీరు నాటని ద్రాక్షతోటల
పండ్లను ఒలీవతోటల పండ్లను తినుచున్నారు. ।
14 కాబట్టి మీరు యెహోవాయందు భయభక్తులుగల
వారై, ఆయనను నిష్కపటముగాను సత్యముగాను
సేవించుచు, మీ పితరులు నది అద్దరిని ఐగుప్తులో
సేవించిన దేవతలను తొలగద్రోసి యెహోవానే
15 సేవించుడి. । యెహోవాను సేవించుట మీ దృష్టికి
కీడని తోచినయెడల మీరు ఎవని సేవించెదరో, నది
అద్దరిని మీ పితరులు సేవించిన దేవతలను సేవిం
చెదరో, అమోరీయుల దేశమున మీరు నివసించు
చున్నారే వారి దేవతలను సేవించెదరో నేడు మీరు
కోరుకొనుడి; మీ రెవరిని సేవింప కోరుకొనినను నేనును
నా యింటివారును యెహోవాను సేవించెదము ।

అందుకు ప్రజలు—యెహోవాను విసర్జించి యితర 16
దేవతలను సేవించినయెడల మేము శాపగ్రస్తుల మగు
దుము గాక. । ఐగుప్తుదేశమను దాసుల గృహములో 17
నుండి మనలను మన తండ్రులను రప్పించి, మన కన్నుల
యెదుట ఆ గొప్ప సూచకక్రియలను చేసి, మనము
నడిచినమార్గములన్నిటిలోను, మనము వెళ్లిన ప్రజలం
దరి మధ్యను మనలను కాపాడిన యెహోవాయే
మన దేవుడు. । యెహోవా ఆ దేశములో నివ 18
సించిన అమోరీయులు మొదలైన ప్రజలందరు
మనయెదుట నిలువకుండ వారిని తోలివేసినవాడు;
యెహోవానే సేవించెదము; ఆయనయే మా దేవు
డని ప్రత్యుత్తరమిచ్చిరి.

అందుకు యెహోషువ—యెహోవా పరిశుద్ధ 19
దేవుడు, రోషముగల దేవుడు, ఆయన మీ అప
రాధములను మీ పాపములను పరిహరింపనివాడు,
మీరాయనను సేవింపలేరు. । మీరు యెహోవాను 20
విసర్జించి అన్యదేవతలను సేవించినయెడల ఆయన
మీకు మేలుచేయువాడైనను మనస్సు త్రిప్పుకొని
మీకు కీడుచేసి మిమ్మును క్షీణింపజేయుననగా । జనులు 21
—అట్లు కాదు, మేము యెహోవానే సేవించెదమని
యెహోషువతో చెప్పిరి. । అప్పుడు యెహోషువ 22
—మీరు యెహోవానే సేవించెదమని ఆయనను
కోరుకొన్నందుకు మిమ్మునుగూర్చి మీరే సాక్షులై
యున్నారనగా వారు—మేము సాక్షులమే అనిరి. ।
అందుకతడు — ఆలాగైతే మీ మధ్యనున్న అన్య 23
దేవతలను తొలగద్రోసి, ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవాతట్టు మీ హృదయమును త్రిప్పుకొను
డని చెప్పెను. । అందుకు జనులు—మన దేవుడైన 24
యెహోవానే సేవించెదము, ఆయన మాటయే విందు
మని యెహోషువతో చెప్పిరి.

అట్లు యెహోషువ ఆ దినమున ప్రజలతో 25
నిబంధనచేసి వారికి షెకెములో కట్టడను విధిని నియ
మించి । దేవుని ధర్మశాస్త్రగ్రంథములో ఆ వాక్యము 26
లను వ్రాయించి పెద్ద రాతిని తెప్పించి యెహోవా
పరిశుద్ధ స్థలములోనున్న సిందూర వృక్షముక్రింద
దాని నిలువబెట్టి । జనులందరితో ఇట్లనెను—ఆలో 27
చించుడి; యెహోవా మనతో చెప్పిన మాటలన్ని
యు ఈ రాతికి వినబడెను గనుక అది మనమీద
సాక్షిగా ఉండును. మీరు మీ దేవుని విసర్జించినయె
డల అది మీమీద సాక్షిగా ఉండును. । అప్పుడు 28
యెహోషువ ప్రజలను తమ స్వాస్థ్యములకు వెళ్లనం
పెను.

ఈ సంగతులు జరిగినతరువాత నూను కుమారు 29
డును యెహోవా దాసుడునైన యెహోషువ నూట
పది సంవత్సరముల వయస్సుగలవాడై మృతినొందెను. ।
అతని స్వాస్థ్యపు సరిహద్దులోగానున్న తిమ్నత్సెర 30

హులో అతడు పాతిపెట్టబడెను. అది ఎఫ్రాయి
మీయుల మన్యములోని గాయషు కొండకు ఉత్తర
దిక్కున నున్నది.
31 యెహోషువ దినములన్నిటను యెహోషువ తరు
వాత ఇంక బ్రదికి యెహోవా ఇశ్రాయేలీయుల
కొరకు చేసిన క్రియలన్నిటిని ఎరిగిన పెద్దల దినములన్ని
టను ఇశ్రాయేలీయులు యెహోవాను సేవించుచు
32 వచ్చిరి. ఇశ్రాయేలీయులు ఐగుప్తులోనుండి తెచ్చిన
యోసేపు ఎముకలను షెకెములో, అనగా యాకోబు
నూరు వరహాలకు షెకెము తండ్రియైన హమోరు
కుమారులయొద్ద కొనిన చేని భాగములో వారు పాతి
పెట్టిరి. అవి యోసేపు పుత్రులకు ఒక స్వాస్థ్యముగా
ఉండెను. మరియు అహరోను కుమారుడైన ఎలా 3
జారు మృతినొందినప్పుడు ఎఫ్రాయిమీయుల మన్య
ప్రదేశములో అతని కుమారుడైన ఫీనెహాసుకు ఇయ్య
బడిన ఫీనెహాసుగిరిలో జనులు అతని పాతిపెట్టిరి.

# న్యాయాధిపతులు

1 యెహోషువ మృతినొందిన తరువాత ఇశ్రా
యేలీయులు — కనానీయులతో యుద్ధము చేయుటకు
తమలో నెవరు ముందుగా వారి మీదికి పోవలసినది
యెహోవా తెలియజేయునట్లు ప్రార్థనచేయగా ।
2 యెహోవా—ఆ దేశమును యూదావంశస్థుల కిచ్చి
3 యున్నాను, వారు పోవలెనని సెలవిచ్చెను. । అప్పుడు
యూదావంశస్థులు తమ సహోదరులైన షిమ్యో
నీయులతో — మనము కనానీయులతో యుద్ధము
చేయుటకు — మా వంతులోకి మాతోకూడ రండి,
మేమును మీతోకూడ మీ వంతులోకి వచ్చెదమని
చెప్పగా షిమ్యోనీయులు వారితోకూడ పోయిరి. ।
4 కనానీయులమీదికి యూదావంశస్థులు పోయినప్పుడు
యెహోవా కనానీయులను పెరిజీయులను వారి కప్ప
గించెను గనుక వారు బెజెకులో పదివేలమంది మనుష్యు
5 లను హతముచేసిరి. । వారు బెజెకులో అదోనీ బెజె
కును చూచి వానితో యుద్ధముచేసి కనానీయులను
6 పెరిజీయులను హతముచేసిరి. । అదోనీ బెజెకు పారి
పోగా వారు అతని తరిమి పట్టుకొని అతని కాలు
7 చేతుల బొటనవ్రేళ్లను కోసివేసిరి. । అప్పుడు అదోనీ
బెజెకు—తమ కాళ్లచేతుల బొటనవ్రేళ్లు కోయబడిన
డెబ్బదిమంది రాజులు నా భోజనపు బల్లక్రింద
ముక్కలు ఏరుకొనుచుండిరి. నేను చేసినట్లే దేవుడు
నాకు ప్రతిఫలమిచ్చెననెను. వారు యెరూషలేము
నకు అతని తోడుకొనిరాగా అతడు అక్కడ చని
పోయెను.

8 యూదావంశస్థులు యెరూషలేముమీదికి యుద్ధ
ముచేసి దాని పట్టుకొని కొల్లబెట్టి ఆ పట్టణమును
9 కాల్చివేసిరి. । తరువాత యూదావంశస్థులు మన్య
ములయందును దక్షిణదేశమందును లోయయందును
నివసించిన కనానీయులతో యుద్ధము చేయుటకు
10 పోయిరి. । మరియు యూదావంశస్థులు హెబ్రో
నులో నివసించిన కనానీయులమీదికి పోయి షేష
11 యిని అహీమానును తల్మయిని కొల్లబెట్టిరి. । ఆ
హెబ్రోను పేరు కిర్యతర్బా. అక్కడనుండి వారు
దెబీరు నివాసులమీదికి పోయిరి. పూర్వము దెబీరు
12 పేరు కిర్యత్సేఫెరు. । కాలేబు—కిర్యత్సేఫెరును పట్టు
కొని కొల్లబెట్టువానికి నా కుమార్తెయైన అక్సాను
13 ఇచ్చి పెండ్లిచేసెదనని చెప్పగా । కాలేబు తమ్ముడైన
కనజు కుమారుడగు ఒత్నీయేలు దాని పట్టుకొనెను
గనుక కాలేబు తన కుమార్తెయైన అక్సాను అతనికిచ్చి
పెండ్లిచేసెను. । ఆమె తన పెనిమిటి యింట ప్రవేశించి 14
నప్పుడు తన తండ్రిని ఒక పొలము అడుగుటకు అతని
ప్రేరేపించెను. ఆమె గాడిదెను త్వరగా దిగగా
కాలేబు—నీకేమి కావలెనని యడిగెను । అందుకామె 15
—దీవెన దయచేయుము; నాకు దక్షిణ భూమి ఇచ్చి
యున్నావు, నీటి మడుగులను కూడ నాకు దయచేయు
మనెను. అప్పుడు కాలేబు ఆమెకు మెరక మడుగు
లను పల్లపు మడుగులను ఇచ్చెను.

మోషే మామయైన కేయిను కుమారులు యూదా 16
వంశస్థులతోకూడ ఈతచెట్ల పట్టణములోనుండి
అరాదు దక్షిణ దిక్కులోని యూదా అరణ్యమునకు
వెళ్లి అక్కడ చేరి ఆ జనముతో నివసించిరి. । యూదా 17
వంశస్థులు తమ సహోదరులైన షిమ్యోనీయులతో
కూడ పోయి జెఫతులో నివసించిన కనానీయులను
హతముచేసి పట్టణమును నిర్మూలము చేసి ఆ పట్టణ
మునకు హోర్మా అను పేరు పెట్టిరి. । యూదా 18
వంశస్థులు గాజాను దాని ప్రదేశమును అష్కెలో
నును దాని ప్రదేశమును ఎక్రోనును దాని ప్రదేశ
మును పట్టుకొనిరి. । యెహోవా యూదావంశస్థు 19
లకు తోడైయున్నందున వారు మన్యదేశమును
స్వాధీనపరచుకొనిరి. అయితే మైదానమందు నివ
సించువారికి ఇనుపరథములున్నందున వారిని వెళ్లగొట్ట
లేకపోయిరి. । మోషే చెప్పినట్లు వారు కాలేబుకు 20
హెబ్రోను నియ్యగా అతడు ముగ్గురు అనాకీయులను
అక్కడనుండి పారదోలి దాని స్వాధీనపరచుకొనెను.।
యెరూషలేములో నివసించు యెబూసీయులను బెన్యా 21
మీనీయులు వెళ్లగొట్టలేదు; యెబూసీయులు బెన్యా
మీనీయులతోకూడ నేటివరకు యెరూషలేములో
నివసించుచున్నారు.

యోసేపు ఇంటివారు బేతేలుకు వెళ్లినప్పుడు 22
యెహోవా వారికి తోడైయుండెను. । పూర్వము 23
లూజనబడిన బేతేలును వేగుచూచుటకు యోసేపు
ఇంటివారు దూతలను పంపగా । ఆ వేగులవారు ఆ 24
పట్టణమునుండి ఒకడు వచ్చుట చూచి—నీవు దయచేసి
యీ పట్టణములోకి వెళ్లు త్రోవను మాకు చూపిన
యెడల మేము మీకు ఉపకారము చేసెదమని చెప్పిరి.।
అతడు పట్టణములోకి పోవు త్రోవను వారికి చూపగా 25
వారు ఆ పట్టణమును కత్తివాత హతముచేసిరిగాని ఆ
మనుష్యుని వాని కుటుంబికులనందరిని పోనిచ్చిరి. । ఆ 26
మనుష్యుడు హిత్తీయుల దేశమునకు వెళ్లి ఒక పట్టణ

మును కట్టించి దానికి లూజు అను పేరుపెట్టెను నేటి
వరకు దానికదే పేరు.
27 మనష్షీయులు బేత్షెయానును దాని పల్లెలను, తానా
కును దాని పల్లెలను, దోరునివాసులను దోరు పల్లెలను,
ఇబ్లెయామును దాని పల్లెలను, మెగిద్దో నివాసులను,
మెగిద్దో పల్లెలను, స్వాధీనపరచుకొనలేదు; ఏలయనగా
కనానీయులు ఆ దేశములో నివసింపవలెనని గట్టిపట్టు
28 పట్టియుండిరి. । ఇశ్రాయేలీయులు బలవంతులైన తరు
వాత వారు కనానీయులచేత వెట్టిపనులు చేయించు
కొనిరి కాని వారిని బొత్తిగా వెళ్లగొట్టలేదు.
29 ఎఫ్రాయిమీయులు గెజెరులో నివసించిన కనా
నీయులను వెళ్లగొట్టలేదు, గెజెరులో కనానీయులు
30 వారిమధ్యను నివసించిరి. । జెబులూనీయులు కిత్రోను
నివాసులను నహలోలు నివాసులను వెళ్లగొట్టలేదు,
కనానీయులు వారిమధ్య నివసించి వారికి వెట్టిపనులు
31 చేయువారైరి. । ఆషేరీయులు అక్కో నివాసులను
సీదోను నివాసులను అహ్లాబు వారిని అక్జీబువారిని
32 హెల్బావారిని అఫెకువారిని రెహోబువారిని । ఆషే
రీయులు దేశనివాసులైన కనానీయులను వెళ్లగొట్టక
వారిమధ్య నివసించిరి. నఫ్తాలీయులు బేత్షెమెషువారిని
33 బేతనాతువారిని వెళ్లగొట్టలేదు గాని । బేత్షెమెషు
నివాసులచేతను బేతనాతు నివాసులచేతను వెట్టిపనులు
34 చేయించుకొనిరి. । అమోరీయులు దానీయులను పల్లపు
దేశమునకు దిగనియ్యక మన్యమునకు వారిని వెళ్ల
35 గొట్టిరి. । అమోరీయులు అయ్యాలోనునందలి హెరెసు
కొండలోను షయల్బీములోను నివసింపవలెనని గట్టి
పట్టు పట్టియుండగా యోసేపు ఇంటివారు బలవం
36 తులై వారిచేత వెట్టిపనులు చేయించుకొనిరి. । అమో
రీయుల సరిహద్దు అక్రబ్బీము మొదలుకొని హస్సెలా
వరకు వ్యాపించెను.

2 యెహోవా దూత గిల్గాలునుండి బయలుదేరి
బోకీముకువచ్చి యీలాగు సెలవిచ్చెను—నేను మిమ్మును
ఐగుప్తులోనుండి రప్పించి, మీ పితరులకు ప్రమాణము
చేసిన దేశమునకు మిమ్మును చేర్చి—నీతో చేసిన నిబం
2 ధన నేనెన్నడును మీరను. । మీరు ఈ దేశనివాసు
లతో నిబంధన చేసికొనకూడదు; వారి బలిపీఠములను
విరుగగొట్టవలెనని ఆజ్ఞ ఇచ్చితిని గాని మీరు నా
3 మాటను వినలేదు. । మీరు చేసినపని యెట్టిది? కావున
నేను—మీ యెదుటనుండి ఈ దేశనివాసులను వెళ్ల
గొట్టను, వారు మీ ప్రక్కలకు శూలములుగా నుం
దురు, వారి దేవతలు మీకు ఉరిగానుందురని చెప్పు
4 చున్నాను. । యెహోవా దూత ఇశ్రాయేలీయులంద
5 రితో ఈ మాటలు చెప్పగా । జనులు ఎలుగెత్తి
యేడ్చిరి; కాగా ఆ చోటికి బోకీమను పేరు పెట్ట
బడెను. అక్కడ వారు యెహోవాకు బలి అర్పించిరి.
6 యెహోషువ జనులను వెళ్లనంపినప్పుడు ఇశ్రా
యేలీయులు దేశమును స్వాధీనపరచుకొనుటకు తమ
స్వాస్థ్యములకు పోయిరి. । యెహోషువ దినము 7
లన్నిటను యెహోషువ తరువాత ఇంక బ్రదికినవారై
యెహోవా ఇశ్రాయేలీయులకొరకు చేసిన కార్యము
లన్నిటిని చూచిన పెద్దల దినములన్నిటను ప్రజలు
యెహోవాను సేవించుచువచ్చిరి. । నూను కుమారు 8
డును యెహోవాకు దాసుడునైన యెహోషువ
నూట పది సంవత్సరముల వయస్సుగలవాడై మృతి
నొందినప్పుడు అతని స్వాస్థ్యపు సరిహద్దులోగానున్న
తిమ్నత్సెరహులో జనులతని పాతిపెట్టిరి. । అది 9
ఎఫ్రాయిమీయుల మన్యమందలి గాయషు కొండకు
ఉత్తరదిక్కున నున్నది.
ఆ తరమువారందరు తమ స్వజనులయొద్దకు చేర్చ 10
బడిరి. వారి తరువాత యెహోవానైనను ఆయన
ఇశ్రాయేలీయులకొరకు చేసిన కార్యములనైనను ఎరు
గని తరమొకటి పుట్టగా । ఇశ్రాయేలీయులు 11
యెహోవా కన్నులయెదుట కీడుచేసి, ఐగుప్తుదేశ
ములోనుండి వారిని రప్పించిన తమ పితరుల దేవుడైన
యెహోవాను విసర్జించి బయలుదేవతలను పూజించి ।
తమ చుట్టునుండు జనుల దేవతలలో ఇతరదేవతలను 12
అనుసరించి వాటికి నమస్కరించి యెహోవాకు
కోపము పుట్టించిరి. । వారు యెహోవాను విసర్జించి 13
బయలును అష్తారోతును పూజించిరి. । కాబట్టి 14
యెహోవా కోపాగ్ని ఇశ్రాయేలీయులమీద మం
డెను; ఆయన దోచుకొనువారిచేతికి వారిని అప్పగిం
చెను. వారు ఇశ్రాయేలీయులను దోచుకొనిరి; ఆయన
వారి చుట్టునున్నవారి శత్రువులచేతికి వారిని అప్ప
గించెను గనుక వారు తమ శత్రువులయెదుట నిలువ
లేకపోయిరి. । యెహోవా వారితో చెప్పినట్లు, 15
యెహోవా వారితో ప్రమాణము చేసినట్లు, వారు
పోయిన ప్రతి స్థలమున వారికి బాధ కలుగజేయుటకు
యెహోవా వారికి శత్రువాయెను గనుక వారికి
మిక్కిలి యిబ్బంది కలిగెను.
ఆ కాలమున యెహోవా వారికొరకు న్యాయాధి 16
పతులను పుట్టించెను. వీరు దోచుకొనువారి చేతిలో
నుండి ఇశ్రాయేలీయులను రక్షించిరి. అయితే వారు
ఇంక న్యాయాధిపతుల మాట వినక । తమ పితరులు 17
యెహోవా ఆజ్ఞలను అనుసరించి నడిచిన మార్గము
నుండి త్వరగా తొలగిపోయి యితర దేవతలతో వ్యభి
చరించి వాటికి నమస్కరించిరి; తమ పితరులు ఆ
ఆజ్ఞలను అనుసరించి నడిచినట్లు వారు నడవకపోయిరి. ।
తమ శత్రువులు తమ్మును బాధింపగా వారు విడిచిన 18
నిట్టూర్పులు యెహోవా విని సంతాపించి వారి
కొరకు న్యాయాధిపతులను పుట్టించి, ఆయా న్యాయాధి
పతులకు తోడైయుండి వారి దినములన్నిటను వారి
శత్రువుల చేతులలోనుండి ఇశ్రాయేలీయులను రక్షిం

19 చెను. । ఒకొక్క న్యాయాధిపతి చనిపోగా వారు వెను
కకు తిరిగి యితర దేవతలను అనుసరించి పూజించుచు
వాటికి సాగిలపడుచు ఉండుటవలన తమ క్రియలలో
నేమి తమ మూర్ఖప్రవర్తనలోనేమి దేనిని విడువక
20 తమ పూర్వికులకంటె మరి మిగుల చెడ్డవారైరి. । కాబట్టి
యెహోవా కోపాగ్ని ఇశ్రాయేలీయులమీద మం
డగా ఆయన ఈలాగు సెలవిచ్చెను—ఈ ప్రజలు నా
మాట వినక, వీరి పితరులతో నేను చేసిన నిబంధనను
21 మీరుదురు । గనుక నేను నియమించిన విధి ననుస
రించి వారి పితరులు నడిచినట్లు వీరును యెహోవా
విధి ననుసరించి నడుచుదురో లేదో ఆ జనములవలన
22 ఇశ్రాయేలీయులను శోధించుటకై । యెహోషువ
చనిపోయిన కాలమున శేషించిన జనములలో ఏ
23 జనమును వారియెదుటనుండి నేను వెళ్లగొట్టను. । అం
దుకు యెహోవా ఆ జనములను యెహోషువ చేతి
కప్పగింపకయు శీఘ్రముగా వెళ్లగొట్టకయు మాని
వారిని ఉండనిచ్చెను.

3 ఇశ్రాయేలీయులకును కనానీయులకును జరిగిన
2 యుద్ధములన్నిటిని చూడనివారందరిని శోధించి ఇశ్రా
4 యేలీయుల తరతరములవారికి, అనగా పూర్వము ఆ
యుద్ధములను ఏమాత్రమును చూడనివారికి యుద్ధము
చేయ నేర్పునట్లు యెహోవా ఉండనిచ్చిన జన
ములు ఇవి. ఫిలిష్తీయుల అయిదుగురు సర్దారుల జను
లును, కనానీయులందరును, సీదోనీయులును, బయ
ల్హెర్మోను మొదలుకొని హమాతునకు ఒకడు వచ్చు
వరకు లెబానోను కొండలలో నివసించు హివ్వీయు
లును, యెహోవా మోషేద్వారా తమ తండ్రుల
కిచ్చిన ఆజ్ఞలను వారు అనుసరింతురో లేదో తెలిసి
కొనునట్లు ఇశ్రాయేలీయులను పరిశోధించుటకై ఆ
5 జనములను ఉండనిచ్చెను. । కాబట్టి ఇశ్రాయేలీయులు,
6 కనానీయులు హిత్తీయులు అమోరీయులు । పెరి
జ్జీయులు హివ్వీయులు యెబూసీయులను జనులమధ్య
నివసించుచు. వారి కుమార్తెలను పెండ్లిచేసికొనుచు,
వారి కుమారులకు తమ కుమార్తెలనిచ్చుచు, వారి దేవ
7 తలను పూజించుచు వచ్చిరి. । అట్లు ఇశ్రాయేలీయులు
యెహోవా సన్నిధిని దోషులై, తమ దేవుడైన
యెహోవాను మరచి బయలులను దేవతాస్తంభము
8 లను పూజించిరి. । అందునుగూర్చి యెహోవా
కోపము ఇశ్రాయేలీయులమీద మండగా ఆయన
అరామ్నహరాయిముయొక్క రాజైన కూషన్రిషాతా
యిము చేతికి (దాసులగుటకై) వారిని అమ్మివేసెను.
ఇశ్రాయేలీయులు ఎనిమిది సంవత్సరములు కూష
9 న్రిషాతాయిముకు దాసులుగా నుండిరి. । ఇశ్రాయేలీ
యులు యెహోవాకు మొఱ్ఱపెట్టగా యెహోవా
కాలేబు తమ్ముడైన కనజుయొక్క కుమారుడగు ఒత్నీ
యేలును రక్షకునిగా ఇశ్రాయేలీయులకొరకు నియ
మించి వారిని రక్షించెను. । యెహోవా ఆత్మ అతని 10
మీదికి వచ్చెను గనుక అతడు ఇశ్రాయేలీయులకు
న్యాయాధిపతియై యుద్ధమునకు బయలుదేరగా
యెహోవా అరామ్నహరాయిము రాజైన కూషన్
రిషాతాయిమును అతని చేతికప్పగించెను, అతడు
కూషన్రిషాతాయిమును జయించెను. । అప్పుడు నలు 11
వది సంవత్సరములు దేశము నెమ్మదిపొందెను. అటు
తరువాత కనజు కుమారుడైన ఒత్నీయేలు మృతి
నొందెను.

ఇశ్రాయేలీయులు మరల యెహోవా దృష్టికి 12
దోషులైరి గనుక వారు యెహోవా దృష్టికి దోషు
లైనందున యెహోవా ఇశ్రాయేలీయులతో యుద్ధ
ముచేయుటకు మోయాబు రాజైన ఎగ్లోనును బల
పరచెను. । అతడు అమ్మోనీయులను అమాలేకీయులను 13
సమకూర్చుకొని పోయి ఇశ్రాయేలీయులను ఓడ
గొట్టి యీతచెట్ల పట్టణమును స్వాధీనపరచుకొనెను. ।
ఇశ్రాయేలీయులు పదునెనిమిది సంవత్సరములు 14
మోయాబు రాజుకు దాసులైరి. । ఇశ్రాయేలీయులు 15
యెహోవాకు మొఱ్ఱపెట్టగా బెన్యామీనీయుడైన
గెరా కుమారుడగు ఏహూదను రక్షకుని వారికొరకు
యెహోవా నియమించెను, అతడు ఎడమచేతి పని
వాడు. అతనిచేతను ఇశ్రాయేలీయులు మోయాబు
రాజైన ఎగ్లోనుకు కప్పము పంపగా । ఏహూదు 16
మూరెడు పొడవుగల రెండంచుల కత్తిని చేయించు
కొని, తన వస్త్రములో తన కుడి తొడమీద । దాని 17
కట్టుకొని, ఆ కప్పము మోయాబురాజైన ఎగ్లోనుకు
తెచ్చెను. ఆ ఎగ్లోను బహు స్థూలకాయుడు ।
ఏహూదు ఆ కప్పము తెచ్చి యిచ్చిన తరువాత 18
కప్పము మోసిన జనులను వెళ్లనంపె । గిల్గాలుదగ్గర 19
నున్న పెసీలీమునొద్దనుండి తిరిగి వచ్చి—రాజా, రహ
స్యమైన మాట ఒకటి నేను నీతో చెప్పవలెననగా
అతడు—తనయొద్ద నిలిచినవారందరు వెలుపలికి పోవు
వరకు ఊరకొమ్మని చెప్పెను. । ఏహూదు అతని 20
దగ్గరకు వచ్చినప్పుడు అతడు ఒక్కడే చల్లని మేడ
గదిలో కూర్చుండి యుండెను. ఏహూదు—నీతో
నేను చెప్పవలసిన దేవునిమాట ఒకటి యున్నదని
చెప్పగా అతడు తన పీఠముమీదనుండి లేచెను ।
అప్పుడు ఏహూదు తన యెడమచేతిని చాపి తన కుడి 21
తొడమీదినుండి ఆ కత్తిని తీసి కడుపుమీద అతని పొడి
చెను । పిడియును కత్తివెంబడి దూరగా క్రొవ్వు కత్తి 22
పైని కప్పుకొనినందున అతని కడుపునుండి కత్తిని తీయ
లేకపోయెను, అది వెనుకనుండి బయటికి వచ్చియుం
డెను. । అప్పుడు ఏహూదు పంచపాళిలోకి బయలు 23
వెళ్లి తన వెనుకను ఆ మేడగది తలుపు వేసి గడియ
పెట్టెను. । అతడు బయలు వెళ్లిన తరువాత ఆ రాజు 24
దాసులు లోపలికి వచ్చి చూడగా ఆ మేడగది తలు

పులు గడియలు వేసియుండెను గనుక వారు—అతడు
చల్లని గదిలో శంకా నివర్తికి పోయి యున్నాడను
25 కొని । తాము సిగ్గువింతలు పడువరకు కనిపెట్టినను
అతడు ఆ గది తలుపులను తీయక పోగా వారు తాళపు
చెవిని తెచ్చి తలుపులుతీసి చూచినప్పుడు వారి యజ
26 మానుడు చనిపోయి నేలను పడియుండెను. । వారు
తడవు చేయుచుండగా ఏహూదు తప్పించుకొని
పెసీలీమును దాటి శెయీరాకు పారిపోయెను. ।
27 అతడు వచ్చి ఎఫ్రాయిమీయుల కొండలో బూరను
ఊదగా ఇశ్రాయేలీయులు మన్యప్రదేశమునుండి దిగి
28 అతనియొద్దకు వచ్చిరి. । అతడు వారికి ముందుగా
సాగి వారిని చూచి—నా వెంబడి త్వరగా రండి; మీ
శత్రువులైన మోయాబీయులను యెహోవా మీ
చేతి కప్పగించుచున్నాడనెను. కాబట్టి వారు అతని
వెంబడిని దిగివచ్చి మోయాబుకెదురుగా యొర్దాను రేవు
29 లను పట్టుకొని యెవనిని దాటనియ్యలేదు. । ఆ కాల
మున వారు మోయాబీయులలో బలముగల శూరు
లైన పరాక్రమశాలులను పదివేలమందిని చంపిరి; ఒక
డును తప్పించుకొనలేదు. ఆ దినమున మోయా
బీయులు ఇశ్రాయేలీయుల చేతిక్రింద అణపబడగా
దేశము ఎనుబది సంవత్సరములు నిమ్మళముగా ఉండెను.
30 అతనితరువాత అనాతు కుమారుడైన షమ్గరు
న్యాయాధిపతిగా ఉండెను. అతడు ఫిలిష్తీయులలో
ఆరునూరుమందిని ముసుకోల కర్రతో హతముచేసెను;
అతడును ఇశ్రాయేలీయులను రక్షించెను.

4 ఏహూదు మరణమైనతరువాత ఇశ్రాయేలీయులు
ఇంకను యెహోవా దృష్టికి దోషులైరి గనుక ।
2 యెహోవా హాసోరులో ఏలు కనాను రాజైన
యాబీనుచేతికి వారిని అప్పగించెను. అతని సేనాధి
పతి గోయీయుల హరోషెతులో నివసించిన సీసెరా. ।
3 అతనికి తొమ్మన్నూరు ఇనుపరథములుండెను. అతడు
ఇరువది సంవత్సరములు ఇశ్రాయేలీయులను కఠినమైన
బాధపెట్టగా ఇశ్రాయేలీయులు యెహోవాకు
మొఱ్ఱపెట్టిరి.
4 ఆ కాలమున లప్పీదోతుకు భార్యయైన దెబోరా
అను ప్రవక్త్రి ఇశ్రాయేలీయులకు న్యాయాధిపతినిగా
5 ఉండెను । ఆమె ఎఫ్రాయిమీయుల మన్యమందలి
రామాకును బేతేలుకును మధ్యనున్న దెబోరా సరళ
వృక్షముక్రింద తీర్పుచేయుటకై కూర్చుండుటకద్దు,
తీర్పునొందుటకై ఇశ్రాయేలీయులు ఆమెయొద్దకు
6 వచ్చుచుండిరి. । ఆమె నఫ్తాలి కెదెషులోనుండి అబీ
నోయము కుమారుడైన బారాకును పిలువనంపించి
అతనితో ఇట్లనెను — నీవు వెళ్లి నఫ్తాలీయులలోను
జెబులూనీయులలోను పదివేలమంది మనుష్యులను
7 తాబోరు కొండయొద్దకు రప్పించుము; । నేను నీ దగ్గ
రకు యాబీను సేనాధిపతియైన సీసెరాను అతని రథ
ములను అతని సైన్యమును కీషోను ఏటియొద్దకు కూర్చి
నీ చేతికి అతనిని అప్పగించెదనని ఇశ్రాయేలీయుల
దేవుడైన యెహోవా సెలవిచ్చియుండలేదా? అని
దెబోరా చెప్పగా । బారాకు—నీవు నాతోకూడ 8
వచ్చినయెడల నేను వెళ్లెదను గాని నీవు నాతోకూడ
రానిపక్షమందు నేను వెళ్లనని ఆమెతో చెప్పెను. ।
అప్పుడు ఆమె—నీతో నేను అగత్యముగా వచ్చెదను; 9
అయితే నీవు చేయు ప్రయాణమువలన నీకు ఘనత
కలుగదు, యెహోవా ఒక స్త్రీచేతికి సీసెరాను అప్ప
గించునని చెప్పి తాను లేచి బారాకుతోకూడ కెదె
షుకు వెళ్లెను. । బారాకు జెబులూనీయులను నఫ్తాలీ 10
యులను కెదెషుకు పిలిపించినప్పుడు పదివేలమంది
మనుష్యులు అతనివెంట వెళ్లిరి; । దెబోరాయు అత 11
నితోకూడ పోయెను. అంతకులోగా కయీనీయు
డైన హెబెరు మోషే మామయైన హోబాబు
సంతతివారైన కయీనీయులనుండి వేరుపడి కెదెషు
నొద్దనున్న జయనన్నీములోని మస్తకివృక్షమునొద్ద
తన గుడారమును వేసికొనియుండెను. । అబీనోయము 12
కుమారుడైన బారాకు తాబోరుకొండమీదికి పోయె
నని సీసెరాకు తెలుపబడినప్పుడు సీసెరా తన రథము
లన్నిటిని తన తొమ్మన్నూరు ఇనుప రథములను ।
గోయీయుల హరోషెతునుండి కీషోను నదివరకు తన 13
పక్షముగానున్న సమస్త జనమును పిలిపింపగా ।
దెబోరా—లెమ్ము, యెహోవా సీసెరాను నీ చేతికి 14
అప్పగించిన దినము ఇదే, యెహోవా నీకు ముందుగా
బయలుదేరునుగదా అని బారాకుతో చెప్పినప్పుడు,
బారాకు ఆ పదివేలమంది మనుష్యులను వెంటబెట్టు
కొని తాబోరు కొండమీదనుండి దిగి వచ్చెను. ।
బారాకు వారిని హతముచేయునట్లు యెహోవా 15
సీసెరాను అతని రథములన్నిటిని అతని సర్వసేనను
కలవరపరచగా సీసెరా తన రథము దిగి కాలినడకను
పారిపోయెను. । బారాకు ఆ రథములను సేనను 16
గోయీయుల హరోషెతువరకు తరుముగా సీసెరా
యొక్క సర్వసేనయు కత్తివాత కూలెను, ఒక్కడైనను
మిగిలియుండలేదు । హాసోరురాజైన యాబీనుకును 17
కయీనీయుడైన హెబెరు వంశస్థులకును సమాధానము
కలిగియుండెను గనుక సీసెరా కాలినడకను కయీ
నీయుడగు హెబెరు భార్యయైన యాయేలు గుడార
మునకు పారిపోయెను. । అప్పుడు యాయేలు సీసె 18
రాను ఎదుర్కొనబోయి అతని చూచి— నా యేలిన
వాడా నాతట్టు తిరుగుము, తిరుగుము భయపడకుమని
చెప్పినందున అతడు ఆమె గుడారమును జొచ్చెను. ।
ఆమె గొంగళితో అతని కప్పగా అతడు—దప్పిగొని 19
యున్నాను, దయచేసి దాహమునకు కొంచెము నీళ్లి
మ్మని ఆమెనడిగెను. ఆమె ఒక పాలబుడ్డి విప్పి అత
నికి దాహమిచ్చి అతని కప్పుచుండగా । అతడు— 20

గుడారపుద్వారమున నిలిచియుండుము; ఎవడేకాని
లోపలికివచ్చి — యిక్కడ నెవడైననున్నాడా అని
నిన్నడిగినయెడల నీవు — ఎవడును లేడని చెప్పవలె
21 ననెను. । పిమ్మట హెబెరు భార్యయైన యాయేలు
గుడారపు మేకు తీసికొని సుత్తె చేతపట్టుకొని అతని
యొద్దకు మెల్లగా వచ్చి అతనికి అలసటచేత గాఢనిద్ర
కలిగియుండగా నేలకు దిగునట్లు ఆ మేకును అతని
22 కణతలలో దిగగొట్టగా । అతడు చచ్చెను. బారాకు
సీసెరాను తరుముచుండగా యాయేలు అతనిని ఎదు
ర్కొనవచ్చి—రమ్ము, నీవు వెదకుచున్న మనుష్యుని నీకు
చూపించెదననగా అతడు (ఆ గుడారములోకి) వచ్చి
నప్పుడు సీసెరా చచ్చి పడియుండెను, ఆ మేకు అతని
కణతలలోనుండెను.
23 ఆ దినమున దేవుడు ఇశ్రాయేలీయులయెదుట
24 కనానురాజైన యాబీనును అణచెను. । తరువాత వారు
కనానురాజైన యాబీనును సంహరించువరకు ఇశ్రా
యేలీయుల చెయ్యి కనానురాజైన యాబీనుకు విరోధ
ముగా అంతకంతకు హెచ్చుచు వచ్చెను.

5 ఆ దినమున దెబోరాయు అబీనోయము కుమారు
డైన బారాకును ఈ కీర్తన పాడిరి.

2 ఇశ్రాయేలీయులలో యుద్ధశాలులు ధైర్యము కను
పరచిరి
ప్రజలు సంతోషముగా సిద్ధపడిరి. యెహోవాను
స్తుతించుడి.
3 రాజులారా వినుడి అధిపతులారా ఆలకించుడి
యెహోవాకు గానముచేసెదను.
4 ఇశ్రాయేలు దేవుడైన యెహోవాను కీర్తించెదను
యెహోవా, నీవు శేయీరునుండి బయలుదేరి
నప్పుడు
ఎదోము పొలమునుండి బయలుదేరినప్పుడు
భూమి వణకెను ఆకాశము నీళ్లను కురిపించెను
మేఘములును వర్షించెను.
5 యెహోవా సన్నిధిని కొండలలోనుండి ప్రవా
హములు వచ్చెను
ఇశ్రాయేలు దేవుడైన యెహోవా సన్నిధిని
సీనాయిలోనుండి ప్రవాహములు వచ్చెను.
6 అనాతు కుమారుడైన షమ్గరు దినములలో
యాయేలు దినములలో రాజమార్గములు ఎడారు
లాయెను
ప్రయాణస్థులు చుట్టుత్రోవలలోనే నడిచిరి.
7 ఇశ్రాయేలీయుల గ్రామములు నిర్జనములాయెను
దెబోరా అను నేను రాకమునుపు
ఇశ్రాయేలులో నేను తల్లిగా నుండకమునుపు
అవి నిర్జనములాయెను.
8 ఇశ్రాయేలీయులు క్రొత్త దేవతలను కోరుకొనగా
యుద్ధము ద్వారముల యొద్దకు వచ్చెను
ఇశ్రాయేలీయులలో నలుబదివేలమందికి
ఒక కేడెమేగాని యీటెయేగాని కనబడలేదు.
జనులలో ఇశ్రాయేలీయుల అధిపతులు సంతోష 9
ముగా సిద్ధపడిరి.
వారియందు నాకు ప్రేమ కలదు
యెహోవాను స్తుతించుడి.
తెల్ల గాడిదెల నెక్కువారలారా, 10
చాకుపుతుండుమీద కూర్చుండువారలారా,
త్రోవలో నడుచువారలారా, ఈ సంగతి ప్రక
టించుడి.
విలుకాండ్ర ధ్వనికి దూరముగా నుండువారు 11
నీళ్లు చేదుకొను స్థలములలో నుండువారు
యెహోవా నీతిక్రియలను ప్రకటించెదరు
ఇశ్రాయేలీయుల గ్రామములో ఆయన జరిగించు
నీతిక్రియలను వారు ప్రకటించెదరు
వినుటకై యెహోవా జనులు ద్వారములలో
కూడుదురు.
దెబోరా, మేలుకొనుము మేలుకొనుము 12
దెబోరా, మేలుకొనుము మేలుకొనుము
బారాకూ, కీర్తన పాడుము
అబీనోయము కుమారుడా, లెమ్ము చెరపట్టిన వారిని
చెరపట్టుము.
ప్రజలవీరులలో శేషించినవారును కూడి వచ్చిరి 13
శూరులలో యెహోవా నాకు సహాయము చేయ
వచ్చెను.
అమాలేకీయులలో కాపురమున్న ఎఫ్రాయిమీ 14
యులును
నీ తరువాత నీ జనులలో బెన్యామీనీయులును
మాకీరునుండి న్యాయాధిపతులును
జెబులూనీయులనుండి నాయకదండము వహించు
వారును వచ్చిరి.
ఇశ్శాఖారీయులైన అధిపతులు దెబోరాతో కలిసి 15
వచ్చిరి.
ఇశ్శాఖారీయులును బారాకును
అతివేగమున లోయలోనికి చొరబడిరి
రూబేనీయుల కాలువలయొద్ద
జనులకు గొప్ప హృదయాలోచనలు కలిగెను.
మందల యీలలను వినుటకు 16
నీ దొడ్లమధ్యను నీవేల నివసించితివి?
రూబేనీయుల కాలువలయొద్ద
జనులకు గొప్ప యోచనలు కలిగెను.
గిలాదు యొర్దాను అద్దరిని నిలిచెను 17
దానీయులు ఓడలదగ్గర ఏల నిలిచిరి?
ఆషేరీయులు సముద్రతీరమున తమ అఖాతముల
యొద్ద ఏల నిలిచిరి?
జెబులూనీయులు మరణభయములేక

ప్రాణము తృణీకరించుకొనిన జనము
నఫ్తాలీయులు భూమి మెట్టలమీద ప్రాణము తృణీ
కరించిరి.
19 రాజులు వచ్చి యుద్ధముచేసిరి.
మెగిద్దో కాలువలయొద్దనున్న తానాకులో
కనాను రాజులు యుద్ధముచేసిరి
వెండి లాభము వారు తీసికొనలేదు
20 నక్షత్రములు ఆకాశమునుండి యుద్ధముచేసెను
నక్షత్రములు తమ మార్గములలోనుండి సీసెరాతో
యుద్ధముచేసెను.
21 కీషోను నది వెంబడి పురాతనపు నదియైన కీషోను
వెంబడి
వారు కొట్టుకొనిపోయిరి.
నా ప్రాణమా నీవు బలముపూని సాగుము.
22 గుర్రముల డెక్కలు శూరులను త్రొక్కెను
గుర్రములు ఎగసి యెగసి శూరులను త్రొక్కెను.
23 యెహోవా దూత యిట్లనెను
—మేరోజును శపించుడి
దాని నివాసులమీద మహా శాపము నిలుపుడి
యెహోవా సహాయమునకు వారు రాలేదు
బలిష్ఠులతో కూడి యెహోవా సహాయమునకు
వారు రాలేదు.
24 కేయీనీయుడైన హెబెరు భార్య యాయేలు
స్త్రీలలో దీవెననొందును
గుడారములలోనుండు స్త్రీలలో ఆమె దీవెన నొం
దును.
25 అతడు దాహమడిగెను
ఆమె పాలు తెచ్చియిచ్చెను
సర్దారులకు తగిన పాత్రతో మీగడ దెచ్చి యిచ్చెను
ఆమె మేకును చేత పట్టుకొనెను
26 పనివాని సుత్తెను కుడిచేత పట్టుకొని
సీసెరాను కొట్టెను
వాని తలను ఆమె పగలగొట్టెను
ఆమె అతని తలను సుత్తెతో కొట్టగా అది పగిలెను.
27 అతడు ఆమె కాళ్లయొద్ద క్రుంగిపడి పరుండెను
ఆమె కాళ్లయొద్ద క్రుంగిపడెను
అతడు ఎక్కడ క్రుంగెనో అక్కడనే పడి చచ్చెను.
28 సీసెరా తల్లి కిటికీలోనుండి చూచెను
అల్లిక కిటికీలోనుండి చూచి కేకలువేసెను
రాక అతని రథము తడవుచేయనేల?
అతని రథముల చక్రములు ఆలస్యముచేయనేల?
29 ఆమెయొద్దనున్న వివేకముగల రాజకుమార్తెలు
ఈలాగుననే ఉత్తరమిచ్చిరి.
ఆమె తనకు తాను మరల ఇట్లనుకొనుచుండెను—
30 వారికి దొరికెను గదా? దోపుడుసొమ్ము పంచుకొను
చున్నారు గదా?
యోధులందరు తలాయొక స్త్రీని తీసికొందురు
ఇద్దరేసి స్త్రీలు వారికి దొరుకుదురు
సీసెరాకు రంగువేయబడిన వస్త్రమొకటి
దోపుడు సొమ్ముగా దొరుకును
రంగువేయబడిన విచిత్ర వస్త్రమొకటి దోపుడుగా
దొరుకును
రెండువైపుల రంగువేయబడిన విచిత్రమైన వస్త్రము
దోచుకొనినవారి మెడలకు తగిన వస్త్రమొకటి దొరు
కును.
యెహోవా నీ శత్రువులందరు ఆలాగుననే నశిం 31
చెదరు
ఆయనను ప్రేమించువారు బలముతో ఉదయించు
సూర్యునివలె నుందురు.
తరువాత దేశము నలువది సంవత్సరములు నిమ్మళముగా
నుండెను.

ఇశ్రాయేలీయులు యెహోవా దృష్టికి దోషులై 6
నందున యెహోవా యేడేండ్లు వారిని మిద్యానీయుల
కప్పగించెను. । మిద్యానీయుల చెయ్యి ఇశ్రాయేలీ 2
యులమీద హెచ్చాయెను గనుక వారు మిద్యానీ
యులయెదుట నిలువలేక కొండలలోనున్న వాగులను
గుహలను దుర్గములను తమకు సిద్ధపరచుకొనిరి.
ఇశ్రాయేలీయులు విత్తనములు విత్తిన తరువాత 3
మిద్యానీయులును అమాలేకీయులును తూర్పునుండు
వారును తమ పశువులను గుడారములను తీసికొని
మిడతల దండంత విస్తారముగా వారిమీదికి వచ్చి ।
వారి యెదుట దిగి, గాజాకు పోవునంతదూరము 4
భూమి పంటను పాడుచేసి, ఒక గొఱ్ఱెను గాని యెద్దును
గాని గాడిదెనుగాని జీవనసాధనమైన మరి దేనినిగాని
ఇశ్రాయేలీయులకు ఉండనియ్యలేదు. । వారును వారి 5
ఒంటెలును లెక్కలేకయుండెను. । దేశమును పాడు 6
చేయుటకు వారు దానిలోకి వచ్చిరి. ఇశ్రాయేలీ
యులు మిద్యానీయులవలన మిక్కిలి హీనదశకు వచ్చి
నప్పుడు వారు యెహోవాకు మొఱ్ఱపెట్టిరి.
మిద్యానీయులవలని బాధనుబట్టి ఇశ్రాయేలీయులు 7
యెహోవాకు మొఱ్ఱపెట్టగా । యెహోవా ఇశ్రా 8
యేలీయులయొద్దకు ప్రవక్తనొకని పంపెను. అతడు
వారితో ఈలాగు ప్రకటించెను— ఇశ్రాయేలీయుల
దేవుడైన యెహోవా సెలవిచ్చినదేమనగా— నేను
ఐగుప్తులోనుండి మిమ్మును రప్పించి, దాసుల గృహము
లోనుండి మిమ్మును తోడుకొని వచ్చితిని. । ఐగుప్తీయుల 9
చేతిలోనుండియు, మిమ్మును బాధించిన వారందరిచేతి
లోనుండియు మిమ్మును విడిపించి, మీ యెదుటనుండి
వారిని తోలివేసి వారి దేశమును మీకిచ్చితిని; మీ
దేవుడనైన యెహోవాను నేనే. । మీరు అమోరీ 10
యుల దేశమున నివసించుచున్నారు, వారి దేవతలకు

భయపడకుడి అని మీతో చెప్పితిని గాని మీరు నా
మాట వినకపోతిరి.
11 యెహోవా దూత వచ్చి అబీయెజ్రీయుడైన
యోవాషునకు కలిగిన ఒఫ్రాలోని మస్తకివృక్షము క్రింద
కూర్చుండెను. యోవాషు కుమారుడైన గిద్యోను
మిద్యానీయులకు మరుగైయుండునట్లు గానుగచాటున
12 గోధుమలను దుల్లగొట్టుచుండగా। యెహోవా దూత
అతనికి కనబడి — పరాక్రమముగల బలాఢ్యుడా,
యెహోవా నీకు తోడైయున్నాడని అతనితో అన
13 గా। గిద్యోను—చిత్తము నా యేలినవాడా, యెహోవా
మాకు తోడైయుండినయెడల ఇదంతయు మాకేల సంభ
వించెను? యెహోవా ఐగుప్తులోనుండి మమ్మును రప్పిం
చెనని చెప్పుచు, మా పితరులు మాకు వివరించిన ఆయన
అద్భుతకార్యములన్నియు ఏమాయెను? యెహోవా
మమ్మును విడిచిపెట్టి మిద్యానీయుల చేతికి మమ్మును అప్ప
14 గించెనని అతనితో చెప్పెను.। అంతట యెహోవా
అతనితట్టు తిరిగి—బలము తెచ్చుకొని మిద్యానీయుల
చేతిలోనుండి ఇశ్రాయేలీయులను రక్షింపుము, నిన్ను
15 పంపినవాడను నేనే అని చెప్పగా। అతడు—చిత్తము
నా యేలినవాడా, దేని సహాయముచేత నేను ఇశ్రా
యేలీయులను రక్షింపగలను? నా కుటుంబము మనష్షే
గోత్రములో ఎన్నికలేనిదే. నా పితరుల కుటుంబము
లో నేను కనిష్ఠుడనై యున్నానని ఆయనతో చెప్పెను.
16 అందుకు యెహోవా—అయిన నేమి?। నేను నీకు
తోడైయుందును గనుక ఒకే మనుష్యుని హతము చేసి
నట్లు మిద్యానీయులను నీవు హతముచేయుదువని సెల
17 విచ్చెను.। అందుకతడు—నాయెడల నీకు కటాక్షము
కలిగినయెడల నాతో మాటలాడుచున్నవాడవు నీవే
అని నేను తెలిసికొనునట్లు ఒక సూచన కనుపరచుము.।
18 నేను నీయొద్దకు వచ్చి నా అర్పణమును బయటికి
తెచ్చి నీ సన్నిధిని దాని పెట్టువరకు ఇక్కడనుండి
వెళ్లకుమీ అని వేడుకొనగా ఆయన—నీవు తిరిగి వచ్చు
19 వరకు నేను ఉండెదననెను.। అప్పుడు గిద్యోను లోప
లికి పోయి ఒక మేకపిల్లను తూమెడు పిండితో పొం
గని భక్ష్యములను సిద్ధపరచి ఆ మాంసమును గంపలో
ఉంచి అది వండిన నీళ్లను కుండలోపోసి ఆయనకొరకు
ఆ మస్తకివృక్షముక్రిందికి దాని తీసికొనివచ్చి దగ్గర
20 ఉంచగా। దేవుని దూత ఆ మాంసమును పొంగని
భక్ష్యములను పట్టుకొని రాతిమీద పెట్టి—నీళ్లు పోయు
21 మని అతనితో చెప్పెను.। అతడాలాగు చేయగా
యెహోవా దూత తన చేతనున్న కఱ్ఱను చాపి దాని
కొనతో ఆ మాంసమును ఆ పొంగని భక్ష్యములను
ముట్టినప్పుడు అగ్ని ఆ రాతిలోనుండి వెడలి ఆ మాంస
మును పొంగని భక్ష్యములను కాల్చివేసెను, అంతట
యెహోవా దూత అతనికి అదృశ్యమాయెను.।
22 గిద్యోను ఆయన యెహోవా దూత అని తెలిసికొని—
అహహా నా యేలినవాడా, యెహోవా, ఇందుకే
గదా నేను ముఖాముఖిగా యెహోవా దూతను
చూచితిననెను.। అప్పుడు యెహోవా—నీకు సమా 23
ధానము, భయపడకుము, నీవు చావవని అతనితో సెల
విచ్చెను.। అక్కడ గిద్యోను యెహోవా నామమున 24
బలిపీఠము కట్టి, దానికి యెహోవా సమాధానకర్త
యను పేరు పెట్టెను. నేటివరకు అది అబీయెజ్రీయుల
ఒఫ్రాలో ఉన్నది.
మరియు ఆ రాత్రియందే యెహోవా — నీ 25
తండ్రి కోడెను, అనగా ఏడేండ్ల రెండవ యెద్దును తీసి
కొనివచ్చి, నీ తండ్రికట్టిన బయలుయొక్క బలిపీఠమును
పడగొట్టి, దానికి పైగానున్న దేవతాస్తంభమును నరికి
వేసి। తగిన యేర్పాటుతో ఈ బండ కొనను నీ దేవు 26
డైన యెహోవాకు బలిపీఠము కట్టి, ఆ రెండవ కోడెను
తీసికొనివచ్చి నీవు నరికిన ప్రతిమయొక్క కఱ్ఱతో
దహనబలి నర్పించుమని అతనితో చెప్పెను.। కాబట్టి 27
గిద్యోను తన పనివారిలో పదిమందిని తీసికొనివచ్చి
యెహోవా తనతో చెప్పినట్లు చేసెను. అతడు తన
పితరుల కుటుంబమునకును ఆ ఊరివారికిని భయపడినం
దున పగలు దాని చేయలేక రాత్రివేళ చేసెను.। ఆ 28
ఊరివారు వేకువనే లేచినప్పుడు బయలుయొక్క బలి
పీఠము విరుగగొట్టబడియుండెను, దానికి పైగానున్న
దేవతాస్తంభము పడద్రోయబడి యుండెను, కట్ట
బడిన ఆ బలిపీఠముమీద ఆ రెండవ యెద్దు అర్పింప
బడియుండెను.। అప్పుడు వారు—ఈ పని యెవరు 29
చేసినదని ఒకరితోనొకరు చెప్పుకొనుచు విచారణచేసి
వెదకి, యోవాషు కుమారుడైన గిద్యోను ఆ పనిచేసి
నట్లు తెలిసికొనిరి.। కాబట్టి ఆ ఊరివారు—నీ కుమా 30
రుడు బయలుయొక్క బలిపీఠమును పడగొట్టి దానికి
పైగానున్న దేవతాస్తంభమును పడద్రోసెను గనుక
అతడు చావవలెను, వాని బయటికి తెమ్మని యోవా
షుతో చెప్పగా। యోవాషు తనకు ఎదురుగా నిలి 31
చినవారినందరిని చూచి—మీరు బయలు పక్షముగా
వాదింతురా? మీరు దాని రక్షించుదురా? దానిపక్ష
ముగా వాదించువాడు ఈ ప్రొద్దుననే చావవలెను;
ఎవడో దాని బలిపీఠమును విరుగగొట్టెను గనుక, అది
దేవత యైనందున తన పక్షమున తానే వాదించవచ్చు
ను,। ఒకడు తన బలిపీఠమును విరుగగొట్టినందున అత 32
నితో బయలు వాదించుకొననిమ్మని చెప్పి ఆ దినమున
అతనికి యెరుబ్బయలను పేరుపెట్టెను.। కాబట్టి మిద్యా 33
నీయులందరును అమాలేకీయులందరును తూర్పువారం
దరును కూడి వచ్చి (నది) దాటి యెజ్రెయేలు మైదాన
ములో దిగగా। యెహోవా ఆత్మ గిద్యోనును ఆవే 34
శించెను. అతడు బూర ఊదినప్పుడు అబీయెజెరు
(కుటుంబపువారు) అతనియొద్దకు వచ్చిరి.। ఆ
మనష్షీయులందరియొద్దకు దూతలను పంపగా

కూడుకొని అతనియొద్దకు వచ్చిరి. అతడు ఆషేరు
జెబులూను నఫ్తాలి గోత్రములవారియొద్దకు దూతలను
పంపగా వారును కూడినవారిని ఎదుర్కొనుటకు
36 వచ్చిరి. । అప్పుడు గిద్యోను—నీవు సెలవిచ్చినట్లు నా
చేత ఇశ్రాయేలీయులను రక్షింప నుద్దేశించినయెడల ।
37 నేను కళ్లమున గొఱ్ఱెబొచ్చు ఉంచినతరువాత నేల అం
తయు ఆరియుండగా ఆ గొఱ్ఱెబొచ్చుమీద మాత్రమే
మంచుపడు పక్షమున నీవు సెలవిచ్చినట్లు ఇశ్రాయేలీ
యులను నా మూలముగా రక్షించెదవని నేను నిశ్చ
38 యించుకొందునని దేవునితో అనెను. । ఆలాగున జరి
గెను; అతడు ప్రొద్దుట లేచి ఆ బొచ్చును పిడిచి
నీళ్లతో పాత్ర నిండువరకు ఆ బొచ్చునుండి మంచును
39 పిండెను. । అప్పుడు గిద్యోను—నీ కోపము నామీద
మండనియ్యకుము; ఇంకొకమారే ఆ బొచ్చుచేత
శోధింప సెలవిమ్ము. నేల అంతటిమీద మంచు పడి
యుండగా ఆ బొచ్చుమాత్రమే పొడిగా ఉండనిమ్మని
40 దేవునితో అనగా । ఆ రాత్రి దేవుడు ఆలాగున
చేసెను; నేల అంతటిమీద మంచు పడినను ఆ బొచ్చు
మాత్రమే పొడిగానుండెను.

7 అప్పుడు యెరుబ్బయలు, అనగా గిద్యోనును అత
నితోనున్న జనులందరును, వేకువను లేచి హరోదు
బావియొద్ద దిగగా లోయలోని మోరె కొండకు ఉత్తర
ముగా మిద్యానీయుల దండుపాళెము వారికి కనబడె
2 ను. । యెహోవా—నీతోనున్న జనులు ఎక్కువ
మంది, నేను వారిచేతికి మిద్యానీయులను అప్పగింప
తగదు; ఇశ్రాయేలీయులు—నా బాహుబలము నాకు
రక్షణ కలుగజేసికొనెననుకొని నామీద అతిశయించు
3 దురేమో. । కాబట్టి నీవు—ఎవడు భయపడి వణకు
చున్నాడో వాడు త్వరపడి గిలాదుకొండ విడిచి తిరిగి
వెళ్లవలెనని జనులు వినునట్లుగా ప్రకటించుమని గిద్యో
నుతో సెలవిచ్చెను. అప్పుడు జనులలోనుండి ఇరువది
రెండువేలమంది తిరిగి వెళ్లిపోయిరి.

4 పదివేలమంది నిలిచియుండగా యెహోవా—ఈ
జనులింక ఎక్కువమంది, నీళ్లయొద్దకు వారిని దిగ
జేయుము, అక్కడ నీకొరకు వారిని శోధించెదను.
ఇతడు నీతోకూడ పోవలెనని నేను ఎవనిగూర్చి చెప్పు
దునో వాడు నీతో పోవలెను; ఇతడు నీతో పోకూడ
దని యెవనిగూర్చి నీతో చెప్పుదునో వాడు పోకూడ
5 దని గిద్యోనుతో సెలవిచ్చెను. । అతడు నీళ్లయొద్దకు
ఆ జనమును దిగజేసినప్పుడు యెహోవా—కుక్క
కతుకునట్లు తన నాలుకతో నీళ్లను కతికిన ప్రతివానిని,
త్రాగుటకు మోకాళ్లూని క్రుంగిన ప్రతివానిని వేరు
6 వేరుగా ఉంచుమని గిద్యోనుతో సెలవిచ్చెను. । చేతితో
నోటికందించుకొని కతికినవారిలెక్క మున్నూరుమంది;
గిలిన జనులందరు నీళ్లు త్రాగుటకు మోకాళ్లూని
రి. । అప్పుడు యెహోవా—కతికిన మున్నూరు
గురు మనుష్యులద్వారా మిమ్మును రక్షించెదను; మిద్యా
నీయులను నీ చేతికి అప్పగించెదను; జనులందరు తమ
తమ చోట్లకు వెళ్లవచ్చునని గిద్యోనుతో సెలవిచ్చెను. ।
ప్రజలు ఆహారమును బూరలను పట్టుకొనగా అతడు 8
ప్రజలందరిని తమ గుడారములకు వెళ్లనంపెను గాని
ఆ మున్నూరుమందిని నిలుపుకొనెను. మిద్యానీయుల
దండు లోయలో అతనికి దిగువగానుండెను.

ఆ రాత్రి యెహోవా అతనితో ఇట్లనెను— 9
నీవు లేచి దండుమీదికి పొమ్ము, నీ చేతికి దాని నప్ప
గించెదను. । పోవుటకు నీకు భయమైనయెడల నీ పని 10
వాడైన పూరాతోకూడ దండుకు దిగిపొమ్ము. । వారు 11
చెప్పుకొనుచున్నదాని వినిన తరువాత నీవు ఆ దండు
లోకి దిగిపోవుటకు నీ చేతులు బలపరచబడునని చెప్ప
గా, అతడును అతని పనివాడైన పూరాయును ఆ
దండులోనున్న సన్నద్ధులయొద్దకు పోయిరి. । మిద్యా 12
నీయులును అమాలేకీయులును తూర్పువారును లెక్కకు
మిడతలవలె ఆ మైదానములో పరుండియుండిరి. వారి
ఒంటెలు సముద్రతీరమందున్న యిసుకరేణువులవలె
లెక్కలేనివై యుండెను. । గిద్యోను వచ్చినప్పుడు ఒకడు 13
తాను కనిన కలను తన చెలికానికి వివరించుచుండెను.
ఎట్లనగా—నేనొక కలగంటిని, అదేమనగా యవల
రొట్టె ఒకటి మిద్యానీయుల దండులోకి దొర్లి యొక
గుడారమునకు వచ్చి దాని పడగొట్టి తలక్రిందు చేసి
నప్పుడు ఆ గుడారము పడిపోయెనని చెప్పెను. । అం 14
దుకు వాని చెలికాడు—ఇది ఇశ్రాయేలీయుడైన
యోవాషు కుమారుడగు గిద్యోను ఖడ్గమేగాని మరేమి
కాదు; దేవుడు మిద్యానీయులను ఈ దండంతయును అతని
చేతికి అప్పగింపబోవుచున్నాడని ఉత్తరమిచ్చెను.

గిద్యోను ఆ కల వివరమును దాని తాత్పర్యమును 15
వినినప్పుడు అతడు యెహోవాకు నమస్కారము
చేసి* ఇశ్రాయేలీయుల దండులోకి తిరిగి వెళ్లి—లెండి,
యెహోవా మిద్యానీయుల దండును మీ చేతికి అప్ప
గించుచున్నాడని చెప్పి । ఆ మున్నూరుమందిని మూడు 16
గుంపులుగా చేసి బూరను వట్టికుండను ఆ కుండలలో
దివిటీలను ప్రతివానిచేతికిచ్చి వారితో ఇట్లనెను—
నన్ను చూచి నేను చేయునట్లు చేయుడి; । ఇదిగో 17
నేను వారి దండు కొట్టకొనకు పోవుచున్నాను, నేను
చేయునట్లు మీరు చేయవలెను. । నేనును నాతో 18
నున్నవారందరును బూరలను ఊదునప్పుడు మీరును
దండు పాళెమంతటిచుట్టు బూరలను ఊదుచు—
యెహోవాకును గిద్యోనుకును విజయము అని కేకలు
వేయవలెనని చెప్పెను.

అట్లు నడిజాము మొదటి కావలివారు ఉంచబడ 19
గానే గిద్యోనును అతనితోనున్న నూరుమందియు
దండుపాళెము కొట్టకొనకు పోయి బూరలను ఊది
తమ చేతులలోనున్న కుండలను పగలగొట్టిరి. । అట్లు 20

ఆ మూడు సంఘములవారు బూరలను ఊదుచు ఆ కుండ
లను పగలగొట్టి, యెడమచేతులలో దివిటీలను కుడిచేతు
లలో ఊదుటకు బూరలను పట్టుకొని—యెహోవా
పేరటను గిద్యోను పేరటను ఖడ్గము దూసియున్నామని
21 కేకలువేసిరి. । వారిలో ప్రతివాడును తన చోటున
దండుచుట్టు నిలిచియుండగా ఆ దండువారందరును
22 పరుగెత్తుచు కేకలువేయుచు పారిపోయిరి. । ఆ
మున్నూరుమంది బూరలను ఊదినప్పుడు యెహోవా
ఆ దండంతటిలోను ప్రతివాని ఖడ్గమును వాని పొరుగు
వానిమీదికి త్రిప్పెను. దండు సెరేరాతువైపున నున్న
బేత్షిత్తావరకు తబ్బాతునొద్దనున్న ఆబేల్మెహోలా తీర
23 మువరకు పారిపోగా । నఫ్తాలి గోత్రములోనుండియు,
ఆషేరు గోత్రములోనుండియు, మనష్షే గోత్రమంత
టిలోనుండియు పిలిపింపబడిన ఇశ్రాయేలీయులు కూడు
24 కొని మిద్యానీయులను తరిమిరి. । గిద్యోను ఎఫ్రాయి
మీయుల మన్యదేశమంతటికిని దూతలను పంపి—
మిద్యానీయులను ఎదుర్కొనుటకు వచ్చి, బేత్బారా
వరకు వాగులను యొర్దానును వారికంటె ముందుగా
పట్టుకొనుడని చెప్పియుండెను గనుక, ఎఫ్రాయిమీ
యులందరు కూడుకొని బేత్బారావరకు వాగులను
25 యొర్దానును పట్టుకొనిరి. । మరియు వారు మిద్యాను
రాజులైన ఓరేబు జెయేబు అను ఇద్దరిని పట్టుకొని,
ఓరేబు బండమీద ఓరేబును చంపిరి, జెయేబు ద్రాక్షల
తొట్టియొద్ద జెయేబును చంపి మిద్యానీయులను తరుము
కొనిపోయిరి. ఓరేబు జెయేబుల తలలను యొర్దాను
అద్దరికి గిద్యోనునొద్దకు తెచ్చిరి.

8 అప్పుడు ఎఫ్రాయిమీయులు గిద్యోనును చూచి—
నీవు మాయెడల చూపిన మర్యాద యెట్టిది? మిద్యానీ
యులతో యుద్ధముచేయుటకు నీవు పోయినప్పుడు
మమ్ము నేల పిలువలేదని చెప్పి అతనితో కఠినముగా
2 కలహించిరి. । అందుకతడు—మీరు చేసినదానితో నేను
చేసినదెంత? అబీయెజెరు ద్రాక్షపండ్ల కోతకంటె
ఎఫ్రాయిమీయుల పరిగె మంచిదికాదా? దేవుడు
మిద్యానీయుల అధిపతులైన ఓరేబును జెయేబును మీ
చేతికి అప్పగించెను; మీరు చేసినట్టు నేను చేయ
3 గలనా? అనెను. । అతడు ఆ మాట అన్నప్పుడు అతని
4 మీద వారి కోపము తగ్గెను. । గిద్యోనును అతనితో
నున్న మున్నూరుమందియును అలసటగానున్నను,
శత్రువులను తరుముచు యొర్దానునొద్దకు వచ్చి దాటిరి. ।
5 అతడు—నా వెంటనున్న జనులు అలసియున్నారు,
ఆహారమునకు రొట్టెలు వారికి దయచేయుడి; మేము
మిద్యానురాజులైన జెబహును సల్మున్నాను తరుము
6 చున్నామని సుక్కోతువారితో చెప్పగా । సుక్కోతు
అధిపతులు—జెబహు సల్మున్నా అను వారి చేతులు
ఇప్పుడు నీ చేతికి చిక్కినవి గనుకనా మేము నీ సేనకు
ఆహారము ఇయ్యవలెనని యడిగిరి. । అందుకు గిద్యోను— 7
ఈ హేతువుచేతను జెబహును సల్మున్నాను యెహోవా
నా చేతికప్పగించిన తరువాత నూర్చు కొయ్యలతోను
కంపలతోను మీ దేహములను నూర్చివేయుదునని
చెప్పెను. । అక్కడనుండి అతడు పెనూయేలుకు పోయి 8
ఆలాగున వారితోను చెప్పగా సుక్కోతువారు
ఉత్తరమిచ్చినట్లు పెనూయేలువారును అతని కుత్తర
మిచ్చిరి గనుక అతడు ।—నేను క్షేమముగా తిరిగి 9
వచ్చినప్పుడు ఈ గోపురమును పడగొట్టెదనని పెనూ
యేలు వారితో చెప్పెను. । అప్పుడు జెబహును సల్ము 10
న్నాయు వారితోకూడ వారి సేనలును, అనగా తూర్పు
జనుల సేనలన్నిటిలో మిగిలిన యించుమించు పది
హేనువేలమంది మనుష్యులందరును కర్కోరులో నుం
డిరి. కత్తిదూయు నూట ఇరువది వేలమంది మనుష్యులు
పడిపోయిరి. । అప్పుడు గిద్యోను నోబహుకును యొగ్బె 11
హకును తూర్పున గుడారములలో నివసించినవారి
మార్గముగా పోయి సేన నిర్భయముగా నున్నందున ఆ
సేనను హతముచేసెను. । జెబహు సల్మున్నాయు పారి 12
పోయినప్పుడు అతడు వారిని తరిమి మిద్యాను ఇద్దరు
రాజులైన జెబహును సల్మున్నాను పట్టుకొని ఆ సేన
నంతను చెదరగొట్టెను. । యుద్ధము తీరినతరువాత 13
యోవాషు కుమారుడైన గిద్యోను । హెరెసు ఎగువ 14
నుండి తిరిగి వచ్చి, సుక్కోతువారిలో ఒక యౌవ
నుని పట్టుకొని విచారింపగా అతడు సుక్కోతు అధి
పతులను పెద్దలలో డెబ్బది యేడుగురు మనుష్యులను
పేరు పేరుగా వివరించి చెప్పెను. । అప్పుడతడు 15
సుక్కోతువారి యొద్దకు వచ్చి—జెబహు సల్మున్నా
అను వారి చేతులు నీ చేతికి చిక్కినవి గనుకనా అలసి
యున్న నీ సేనకు మేము ఆహారము ఇయ్యవలెను అని
మీరు ఎవరివిషయము నన్ను దూషించితిరో ఆ జెబ
హును సల్మున్నాను చూడుడి అని చెప్పి । ఆ ఊరిపెద్ద 16
లను పట్టుకొని నూర్చుకొయ్యలను బొమ్మజెముడును
తీసికొని వాటివలన సుక్కోతువారికి బుద్ధి చెప్పెను. ।
మరియు నతడు పెనూయేలు గోపురమును పడగొట్టి 17
ఆ ఊరివారిని చంపెను. । అతడు—మీరు తాబోరులో 18
చంపిన మనుష్యులు ఎట్టివారని జెబహును సల్మున్నాను
అడుగగా వారు—నీవంటివారే, వారందరును రాజ
కుమారులను పోలియుండిరనగా । అతడు—వారు నా 19
తల్లికుమారులు నా సహోదరులు; మీరు వారిని
బ్రదుకనిచ్చినయెడల । యెహోవా జీవముతోడు, 20
మిమ్మును చంపకుందునని చెప్పి తన పెద్దకుమారుడైన
యెతెరును చూచి—నీవు లేచి వారిని చంపుమని చెప్పెను.
అతడు చిన్నవాడే గనుక భయపడి కత్తిని దూయ
లేదు. । అప్పుడు జెబహు సల్మున్నాలు—ప్రాయము 21
కొలది నరునికి శక్తియున్నది గనుక నీవు లేచి మామీద
పడుమని చెప్పగా గిద్యోను లేచి జెబహును సల్మున్నాను

చంపి వారి ఒంటెల మెడలమీదనున్న చంద్రహారము
లను తీసికొనెను.
22 అప్పుడు ఇశ్రాయేలీయులు గిద్యోనును చూచి—
నీవు మిద్యానీయుల చేతిలోనుండి మమ్మును రక్షించి
తివి గనుక నీవును నీ కుమారుడును నీ కుమారుని
23 కుమారుడును మమ్మును ఏలవలెనని చెప్పిరి. । అందుకు
గిద్యోను — నేను మిమ్మును ఏలను, నా కుమారుడును
మిమ్మును ఏలరాదు, యెహోవా మిమ్మును ఏలునని
24 చెప్పెను. । మరియు గిద్యోను — మీలో ప్రతివాడు
తన దోపుడు సొమ్ములోనున్న పోగులను నాకియ్యవలె
నని మనవిచేయుచున్నాననెను. వారు ఇష్మాయేలీ
25 యులు గనుక వారికి పోగులుండెను. । అందుకు
వారు — సంతోషముగా మేము వాటి నిచ్చెదమని
చెప్పి యొక బట్టను పరచి ప్రతివాడును తన దోపుడు
సొమ్ములోనుండిన పోగులను దానిమీద వేసెను. ।
26 మిద్యానురాజుల ఒంటెమీదనున్న చంద్రహారములు
కర్ణభూషణములు ధూమ్రవర్ణపు బట్టలు గాకను,
ఒంటెల మెడలనున్న గొలుసులు గాకను, అతడు
అడిగిన బంగారు పోగుల యెత్తు వెయ్యిన్ని ఏడ్నూరు
తులముల బంగారము. గిద్యోను దానితో ఒక ఏఫో
దును చేయించుకొని తన పట్టణమైన ఒఫ్రాలో దాని
27 ఉంచెను. । కావున ఇశ్రాయేలీయులందరు అక్కడికి
పోయి దాని ననుసరించి వ్యభిచారులైరి. అది గిద్యోను
28 కును అతని యింటివారికిని ఉరిగా నుండెను. । మిద్యా
నీయులు ఇశ్రాయేలీయులయెదుట అణపబడి అటు
తరువాత తమ తలలను ఎత్తికొనలేకపోయిరి. గిద్యోను
దినములలో దేశము నలువది సంవత్సరములు నిమ్మళ
ముగా నుండెను.
29 తరువాత యోవాషు కుమారుడైన యెరుబ్బయలు
30 తన యింట నివసించుటకు పోయెను. । గిద్యోనుకు
అనేక భార్యలున్నందున కడుపున కనిన డెబ్బదిమంది
31 కుమారులు అతనికుండిరి । షెకెములోనున్న అతని
ఉపపత్నియు అతనికొక కుమారుని కనగా గిద్యోను
32 వానికి అబీమెలెకను పేరుపెట్టెను. । యోవాషు
కుమారుడైన గిద్యోను మహా వృద్ధుడై చనిపోయి అబీ
యెజ్రీయుల ఒఫ్రాలోనున్న తన తండ్రియైన
యోవాషు సమాధిలో పాతిపెట్టబడెను.
33 గిద్యోను చనిపోయిన తరువాత ఇశ్రాయేలీయులు
మట్టునుండు తమ శత్రువులచేతిలోనుండి తమ్మును
విడిపించిన తమ దేవుడైన యెహోవాను జ్ఞాపకము
34 చేసికొనక । మరల బయలుల ననుసరించి వ్యభిచారులై
35 బయల్బెరీతును తమకు దేవతగా చేసికొనిరి. । మరియు
వారు గిద్యోనను యెరుబ్బయలు ఇశ్రాయేలీయులకు
చేసిన ఉపకారమంతయు మరచి అతని యింటివారికి
ఉపకారము చేయకపోయిరి.

9 యెరుబ్బయలు కుమారుడైన అబీమెలెకు షెకె
ములోనున్న తన తల్లి సహోదరులయొద్దకుపోయి
వారితోను తన తల్లి పితరుల కుటుంబికులందరితోను ।
—మీరు దయచేసి షెకెము యజమానులందరు విను 2
నట్లు వారితో మాటలాడి—మీకేది మంచిది? యెరుబ్బ
యలుయొక్క కుమారులైన డెబ్బదిమంది మనుష్యులం
దరు మిమ్మును ఏలుట మంచిదా! ఒక్క మనుష్యుడు
మిమ్మును ఏలుట మంచిదా? నేను మీ రక్తసంబంధినని
జ్ఞాపకముచేసికొనుడి అని పలుకుడనెను. । అతని తల్లి 3
సహోదరులు అతనిగూర్చి షెకెము యజమానులు
వినునట్లు ఆ మాటలన్నియు చెప్పగా వారు—ఇతడు
మన సహోదరుడనుకొని తమ హృదయము అబీ
మెలెకుతట్టు త్రిప్పుకొనిరి; । అప్పుడు వారు బయల్బె 4
రీతు గుడిలోనుండి డెబ్బది తులముల వెండి తెచ్చి
అతనికియ్యగా వాటితో అబీమెలెకు అల్లరిజనమును
కూలికి పెట్టుకొనెను, వారు అతని పక్షముండిరి. । తరు 5
వాత అతడు ఒఫ్రాలోనున్న తన తండ్రియింటికి
పోయి యెరుబ్బయలు కుమారులును తన సహో
దరులునైన ఆ డెబ్బదిమంది మనుష్యులను ఒక్కరాతి
మీద చంపెను. యెరుబ్బయలు చిన్న కుమారుడైన
యోతాము మాత్రమే దాగియుండి తప్పించుకొనెను. ।
తరువాత షెకెము యజమానులందరును మిల్లో ఇంటి 6
వారందరును కూడివచ్చి షెకెములోనున్న స్తంభపు
వృక్షముక్రింది దండుపాళెమునొద్ద అబీమెలెకును
రాజుగా నియమించిరి. । అది యోతాముకు తెలియ 7
బడినప్పుడు అతడు పోయి గెరిజీము కొండకొప్పున
నిలిచి యెలుగెత్తి పిలిచి వారితో ఇట్లనెను—షెకెము
యజమానులారా, మీరు నా మాట వినినయెడల
దేవుడు మీ మాట వినును. । చెట్లు తమమీద రాజును 8
ఒకని అభిషేకించుకొనవలెనను మనస్సుకలిగి బయలు
దేరి । మమ్మును ఏలుమని ఒలీవచెట్టు నడుగగా ఒలీవ 9
చెట్టు—దేవునిని మానవులను దేనివలన నరులు సన్మా
నించుదురో ఆ నా తైలము నియ్యకమాని చెట్లమీద
రాజునైయుండి యిటు అటు ఊగుటకు నేను వచ్చె
దనా? అని వాటితో అనెను. । అప్పుడు చెట్లు—నీవు 10
వచ్చి మమ్మును ఏలుమని అంజూరపు చెట్టు నడుగగా ।
అంజూరపు చెట్టు—చెట్లమీద రాజునైయుండి యిటు 11
అటు ఊగుటకు నా మాధుర్యమును నా మంచి ఫలము
లను నేనియ్యక మానుదునా? అని వాటితో అనెను. ।
అటుతరువాత చెట్లు — నీవు వచ్చి మమ్మును ఏలుమని 12
ద్రాక్షావల్లి నడుగగా ద్రాక్షావల్లి । —దేవునిని మాన 13
వులను సంతోషపెట్టు నా ద్రాక్షారసమును నేనియ్యక
మాని చెట్లమీద రాజునైయుండి యిటు అటు ఊగు
టకు నేను వచ్చెదనా? అని వాటితో అనెను. ।
అప్పుడు చెట్లన్నియు నీవు వచ్చి మమ్మును ఏలుమని 14
గోక్షురవృక్షముతో మనవిచేయగా । గోక్షురవృక్షము 15
—మీరు నిజముగా నన్ను మీమీద రాజుగా నియ

నించుకొన గోరినయెడల రండి నా నీడను ఆశ్రయిం
పుడి; లేదా అగ్ని నాలోనుండి బయలుదేరి లెబా
నోను దేవదారు చెట్లను కాల్చివేయునని చెట్లతో
చెప్పెను. । నా తండ్రి మీ నిమిత్తము తన ప్రాణ
మును నిర్లక్ష్యపెట్టి యుద్ధము చేసి మిద్యానీయుల
చేతిలోనుండి మిమ్మును విడిపించెను. । అయితే మీరు
నా తండ్రి కుటుంబముమీదికి లేచి, యొక రాతిమీద
అతని కుమారులైన డెబ్బదిమంది మనుష్యులను చంపి,
అతని పనికత్తె కుమారుడైన అబీమెలెకు మీ సహో
దరుడైనందున షెకెము వారిమీద అతని రాజుగా
నియమించి యున్నారు. యెరుబ్బయలు ఎడలను
అతని యింటివారియెడలను మీరు ఉపకారము చేయ
కయు । అతడు చేసిన క్రియలకు మీరు ప్రతిక్రియ
చేయకయు అబీమెలెకును రాజుగా నియమించుకొనిన
విషయములో మీరు న్యాయముగాను యథార్థము
గాను ప్రవర్తించిన పక్షమున । నేడు మీరు యెరుబ్బ
యలు ఎడలను అతని యింటివారియెడలను సత్యము
గాను యథార్థముగాను ప్రవర్తించిన పక్షమున, అబీ
మెలెకునందు సంతోషించుడి అతడు మీయందు
సంతోషించును గాక. । లేనియెడల అబీమెలెకునుండి
అగ్ని బయలుదేరి షెకెమువారిని మిల్లో యింటివారిని
కాల్చివేయును గాక, షెకెమువారిలోనుండియు మిల్లో
యింటినుండియు అగ్ని బయలుదేరి అబీమెలెకును
దహించును గాక అని చెప్పి । తన సహోదరుడైన అబీ
మెలెకునకు భయపడి యోతాము పారిపోయి బెయేరునకు
వెళ్లి అక్కడ నివసించెను.

అబీమెలెకు మూడు సంవత్సరములు ఇశ్రాయేలీ
యులమీద ఏలికయై యుండెను. । అప్పుడు యెరుబ్బ
యలు డెబ్బదిమంది కుమారులకు చేయబడిన ద్రోహ
ఫలము వారిని చంపిన అబీమెలెకను వారి సహోదరుని
మీదికిని, అతడు తన సహోదరులను చంపునట్లు
అతని చేతులను బలపరచిన షెకెము యజమానుల
మీదికిని వచ్చునట్లును, వారు చేసిన ప్రాణహత్య
వారిమీద వచ్చునట్లును, దేవుడు అబీమెలెకునకును
షెకెము యజమానులకును వైరము కలుగుటకై వారి
మీదికి దురాత్మను పంపెను. అప్పుడు షెకెము యజ
మానులు అబీమెలెకును వంచించిరి. । ఎట్లనగా షెకెము
యజమానులు కొండ శిఖరములమీద అతనికొరకు
మాటుగాండ్లను ఉంచి, ఆ మార్గమున తమకు సమీ
పించినవారినందరిని దోచుకొనిరి; అది అబీమెలెకునకు
తెలుపబడెను.

ఎబెదు కుమారుడైన గాలును అతని బంధువులును
వచ్చి షెకెమునకు చేరగా షెకెము యజమానులు అతని
ఆశ్రయించిరి. । వారు పొలములలోనికి పోయి వారి
ద్రాక్షపండ్లను ఏరుకొని వాటిని త్రొక్కి కృతజ్ఞ
తార్పణమును చెల్లించి తమ దేవతల మందిరములోనికి
పోయి అన్నపానములు పుచ్చుకొనుచు అబీమెలెకును
దూషింపగా । ఎబెదు కుమారుడైన గాలు ఇట్లనెను— 28
అబీమెలెకు ఏపాటివాడు? షెకెము ఏపాటివాడు?
మనము అతనికెందుకు దాసులము కావలెను? అతడు
యెరుబ్బయలు కుమారుడు కాడా? జెబులు అతని
ఉద్యోగి కాడా? షెకెము తండ్రియైన హమోరు
వారికి దాసులమగుదము గాని మనము అతనికెందుకు
దాసులము కావలెను? । ఈ జనము నా చేతిలో 29
ఉండినయెడల ఆహా నేను అబీమెలెకును తొలగింతును
గదా అనెను. తరువాత అతడు అబీమెలెకును చూచి
—నీ సేనను ఎక్కువ చేసి బయలుదేరి రమ్మనెను. । ఆ 30
పట్టణ ప్రధానియైన జెబులు ఎబెదు కుమారుడైన గాలు
మాటలు వినినప్పుడు అతని కోపాగ్ని మండెను. ।
అప్పుడతడు అబీమెలెకు నొద్దకు రహస్యముగా దూత 31
లను పంపి—ఇదిగో ఎబెదు కుమారుడైన గాలును అతని
బంధువులును షెకెమునకు వచ్చియున్నారు, వారు
నీమీదికి ఈ పట్టణమును రేపుచున్నారు. । కావున 32
రాత్రి నీవును నీతోనున్న జనులును లేచి పొలములో
మాటుగానుండుడి, । ప్రాతఃకాలమున సూర్యుడు ఉదయింప 33
గానే నీవు త్వరగా లేచి పట్టణముమీద పడవలెను.
అప్పుడు అతడును అతనితోనున్న జనులును నీయొద్దకు
బయలుదేరి వచ్చుచుండగా నీవు సమయము చూచి
వారియెడల ప్రవర్తింపవచ్చునని వర్తమానము చేసెను.
అబీమెలెకును అతనితోనున్న జనులందరును రాత్రి 34
వేళ లేచి నాలుగు మొనలై షెకెముమీద పడుటకు
పొంచియుండిరి. । ఎబెదు కుమారుడైన గాలు బయలు 35
దేరి పట్టణపు గవిని దగ్గర నిలిచినప్పుడు అబీమెలె
కును అతనితోనున్న జనులును పొంచియుండుట
చాలించి లేచిరి. । గాలు ఆ జనులను చూచి జెబు 36
లుతో—ఇదిగో జనులు కొండశిఖరముల మీదనుండి
దిగివచ్చుచున్నారనగా, జెబులు — కొండలచాయలు
మనుష్యులను పోలి నీకు కనబడుచున్నవని అతనితో
చెప్పెను. । గాలు — చూడుము, దేశపు ఎత్తయిన 37
స్థలమునుండి జనులు దిగి వచ్చుచున్నారు; ఒక దండు
శకునగాండ్ల మస్తకివృక్షపు త్రోవను వచ్చుచున్న
దనెను. । జెబులు అతని చూచి — ఆహాహా మనము 38
అతని సేవింపవలసినందుకు అబీమెలెకు ఎవడనిన నీ
మాట యేమాయెను? ఇది నీవు తృణీకరించిన జనము
కాదా! పోయి వారితో యుద్ధము చేయుమనగా ।
గాలు షెకెము యజమానుల ముందర బయలుదేరి 39
అబీమెలెకుతో యుద్ధముచేసెను. । అబీమెలెకు అతని 40
తరుమగా అతడు అతనియెదుట నిలువలేక పారి
పోయెను. అనేకులు గాయపడి పట్టణపు గవిని
ప్రవేశించుచోట పడిరి. । అప్పుడు అబీమెలెకు అరూ 41
మాలో దిగెను, గాలును అతని బంధువులును షెకె
ములో నివసింపకుండ జెబులు వారిని తోలివేసెను. ।

42 మరునాడు జనులు పొలములలోనికి బయలువెళ్లిరి. ।
43 అది అబీమెలెకుకు తెలియబడగా అతడు తన జను
లను తీసికొని మూడు తెగలుగా చేయగా వారు ఆ
పొలములో మాటుగా ఉండిరి; అప్పుడతడు చూడగా
జనులు పట్టణమునుండి బయలుదేరి వచ్చుచుండిరి గనుక
44 అతడు వారిమీద పడి వారిని హతముచేసెను. । అబీ
మెలెకును అతనితోనున్న తెగలును ఇంక సాగి పట్ట
ణపు గవిని ప్రవేశమునొద్ద నిలువగా రెండు తెగలు
పరుగెత్తి పొలములలోనున్న వారందరిమీద పడి
45 వారిని హతముచేసిరి. । ఆ దినమంతయు అబీమెలెకు
ఆ పట్టణస్థులతో యుద్ధముచేసి పట్టణమును చుట్టు
కొని అందులోనున్న జనులను చంపి పట్టణమును పడ
గొట్టి దాని స్థలమున ఉప్పు జల్లెను.
46 షెకెము గోపుర యజమానులందరు ఆ వార్త విని
బెరీతు స్వామి గుడియొక్క కోటలోనికి చొరబడిరి. ।
47 షెకెము గోపుర యజమానులందరు కూడియున్న
48 సంగతి అబీమెలెకుకు తెలుపబడినప్పుడు । అబీమెలె
కును అతనితోనున్న జనులందరును సల్మోను కొండ
నెక్కి అబీమెలెకు గొడ్డలిని చేత పట్టుకొని చెట్లనుండి
పెద్దకొమ్మను నరికి యెత్తి భుజముమీద పెట్టుకొని—
నేను దేనిచేయుట మీరు చూచితిరో మీరును నేను
చేసినట్టుగా దానిని త్వరగా చేయుడని తనతోనున్న
49 జనులతో చెప్పెను. । అప్పుడు ఆ జనులందరిలో
ప్రతివాడును ఒక్కొక కొమ్మను నరికి అబీమెలెకును
వెంబడించి ఆ కోట దగ్గర వాటిని పెట్టి వాటివలన
ఆ కోటను అగ్నిచేత కాల్చిరి. అప్పుడు షెకెము
గోపుర యజమానులు, అనగా స్త్రీ పురుషులు ఇంచు
మించు వెయ్యిమంది చచ్చిరి.
50 తరువాత అబీమెలెకు తేబేసుకు పోయి తేబేసు
51 నొద్ద దిగి దాని పట్టుకొనెను. । ఆ పట్టణమునడుమ
ఒక బలమైన గోపురముండగా స్త్రీ పురుషులును పట్ట
ణపు యజమానులును అక్కడికి పారిపోయి తలుపులు
52 వేసికొని గోపుర శిఖరము మీదికెక్కిరి. । అబీమెలెకు
ఆ గోపురమునొద్దకు వచ్చి దానిమీద పడి యుద్ధము
చేసి అగ్నిచేత దాని కాల్చుటకు గోపురద్వారము
53 నొద్దకు రాగా । ఒక స్త్రీ అబీమెలెకు తలమీద తిరు
గటి మీదిరాతిని పడవేసినందున అతని కపాలము పగి
54 లెను. । అప్పుడతడు తన ఆయుధములను మోయుబం
టును త్వరగా పిలిచి—ఒక స్త్రీ అతని చంపెనని నన్ను
గూర్చి యెవరును అనుకొనకుండునట్లు నీ కత్తిదూసి
నన్ను చంపుమని చెప్పగా ఆ బంటు అతని పొడు
55 వగా అతడు చచ్చెను. । అబీమెలెకు చనిపోయెనని
ఇశ్రాయేలీయులు తెలిసికొనినప్పుడు ఎవరిచోటికి
56 వారు పోయిరి. । అట్లు అబీమెలెకు తన డెబ్బదిమంది
సహోదరులను చంపుటవలన తన తండ్రికి చేసిన
ద్రోహమును దేవుడు మరల అతనిమీదికి రప్పించెను. ।
షెకెమువారు చేసిన ద్రోహమంతటిని దేవుడు వారి 57
తలలమీదికి మరల రాజేసెను; యెరుబ్బయలు కుమా
రుడైన యోతాము శాపము వారిమీదికి వచ్చెను.
అబీమెలెకుకు తరువాత ఇశ్శాఖారు గోత్రికుడైన 10
దోదో మనుమడును పువ్వా కుమారుడునైన తోలా
న్యాయాధిపతిగా నియమింపబడెను. అతడు ఎఫ్రాయి
మీయుల మన్యమందలి షామీరులో నివసించిన
వాడు. । అతడు ఇరువది సంవత్సరములు ఇశ్రాయేలీ 2
యులకు న్యాయాధిపతియైయుండి చనిపోయి షామీ
రులో పాతిపెట్టబడెను.
అతని తరువాత గిలాదుదేశస్థుడైన యాయీరు 3
నియమింపబడినవాడై యిరువదిరెండు సంవత్సరములు
ఇశ్రాయేలీయులకు న్యాయాధిపతిగా ఉండెను. ।
అతనికి ముప్పదిమంది కుమారులుండిరి, వారు ముప్పది 4
గాడిదెపిల్లలనెక్కి తిరుగువారు, ముప్పది ఊరులు వారి
కుండెను, నేటివరకు వాటికి యాయీరు గ్రామములని
పేరు. । అవి గిలాదు దేశములోనున్నవి. యాయీరు 5
చనిపోయి కామోనులో పాతిపెట్టబడెను.
ఇశ్రాయేలీయులు యెహోవా సన్నిధిని మరల 6
దుష్ప్రవర్తనులైరి. వారు యెహోవాను విసర్జించి
ఆయన సేవ మానివేసి, బయలులు అష్తారోతులు అను
అరాము దేవతలను సీదోనీయుల దేవతలను మోయాబీ
యుల దేవతలను అమ్మోనీయుల దేవతలను ఫిలిష్తీ
యుల దేవతలను పూజించుచువచ్చిరి. । యెహోవా 7
కోపాగ్ని ఇశ్రాయేలీయులమీద మండగా ఆయన
ఫిలిష్తీయులచేతికిని అమ్మోనీయులచేతికిని వారినప్పగిం
చెను గనుక । వారు ఆ సంవత్సరము మొదలుకొని 8
ఇశ్రాయేలీయులను, అనగా యొర్దాను అద్దరినున్న
గిలాదునందలి అమోరీయుల దేశములో కాపుర
మున్న ఇశ్రాయేలీయులను పదునెనిమిది సంవత్సర
ములు చితుకగొట్టి అణచివేసిరి. । మరియు అమ్మోనీ 9
యులు యూదాదేశస్థులతోను బెన్యామీనీయుల
తోను ఎఫ్రాయిమీయులతోను యుద్ధము చేయుటకు
యొర్దానును దాటిరి గనుక ఇశ్రాయేలీయులకు మిక్కిలి
శ్రమ కలిగెను. । అప్పుడు ఇశ్రాయేలీయులు — 10
మేము నీ సన్నిధిని పాపము చేసియున్నాము, మా
దేవుని విడిచి బయలులను పూజించియున్నామని
యెహోవాకు మొఱ్ఱపెట్టగా । యెహోవా — 11
ఐగుప్తీయుల వశములోనుండియు అమోరీయుల వశ
ములోనుండియు అమ్మోనీయుల వశములోనుండియు
ఫిలిష్తీయుల వశములోనుండియు మాత్రము గాక 12
సీదోనీయులును అమాలేకీయులును మాయోనీయు
లును మిమ్మును బాధపరచినప్పుడు వారి వశములో
నుండియు నేను మిమ్మును రక్షించితిని గదా? । అయితే 13
మీరు నన్ను విసర్జించి అన్యదేవతలను పూజించితిరి
గనుక నేను ఇకను మిమ్మును రక్షింపను. । పోయి మీరు 14

కోరుకొనిన దేవతలకు మొఱ్ఱపెట్టుకొనుడి; మీ
శ్రమకాలమున్న అవి మిమ్మును రక్షించునేమో అని
5 ఇశ్రాయేలీయులతో సెలవిచ్చెను. । అప్పుడు ఇశ్రా
యేలీయులు — మేము పాపముచేసియున్నాము, నీ
దృష్టికి ఏది అనుకూలమో దాని చొప్పున మాకు
చేయుము; దయచేసి నేడు మమ్మును రక్షింపుమని
6 చెప్పి । యెహోవాను సేవింపవలెనని తమ మధ్య
నుండి అన్యదేవతలను తొలగింపగా, ఆయన ఆత్మ
ఇశ్రాయేలీయులకు కలిగిన దురవస్థను చూచి సహింప
లేక పోయెను.
7 అప్పుడు అమ్మోనీయులు కూడుకొని గిలాదులో దిగి
యుండిరి. ఇశ్రాయేలీయులును కూడుకొని మిస్పాలో
8 దిగియుండిరి. । కాబట్టి జనులు, అనగా గిలాదు
పెద్దలు — అమ్మోనీయులతో యుద్ధముచేయ బూను
కొనువాడెవడో వాడు గిలాదు నివాసులకందరికిని
ప్రధానుడగునని యొకనితో నొకడు చెప్పుకొనిరి.
11 గిలాదువాడైన యెఫ్తా పరాక్రమముగల బలా
ఢ్యుడు. అతడు వేశ్య కుమారుడు; గిలాదు యెఫ్తాను
2 కనెను. । గిలాదు భార్య అతనికి కుమారులను కనగా
వారు పెద్దవారై యెఫ్తాను చూచి — నీవు అన్యస్త్రీకి
పుట్టినవాడవు గనుక మన తండ్రియింట నీకు స్వా
3 స్థ్యము లేదనిరి. । యెఫ్తా తన సహోదరులయొద్ద
నుండి పారిపోయి టోబుదేశమున నివసింపగా అల్లరి
జనము యెఫ్తాయొద్దకు వచ్చి అతనితోకూడ సంచరిం
చుచుండెను.
4 కొంతకాలమైన తరువాత అమ్మోనీయులు ఇశ్రా
5 యేలీయులతో యుద్ధము చేయగా । అమ్మోనీయులు
6 ఇశ్రాయేలీయులతో యుద్ధము చేసినందున । గిలాదు
పెద్దలు టోబుదేశమునుండి యెఫ్తాను రప్పించుటకు
పోయి — నీవు వచ్చి మాకు అధిపతివై యుండుము,
అప్పుడు మనము అమ్మోనీయులతో యుద్ధముచేయుద
7 మని యెఫ్తాతో చెప్పిరి. । అందుకు యెఫ్తా — మీరు
నాయందు పగపట్టి నా తండ్రి యింటనుండి నన్ను
తోలివేసితిరే. ఇప్పుడు మీకు కలిగిన శ్రమలో
మీరు నాయొద్దకు రానేల? అని గిలాదు పెద్దలతో
8 చెప్పెను. । అప్పుడు గిలాదు పెద్దలు — అందుచేతనే
మేము నీయొద్దకు మళ్లి వచ్చితిమి; నీవు మాతోకూడ
వచ్చి అమ్మోనీయులతో యుద్ధముచేసినయెడల, గిలాదు
నివాసులమైన మా అందరిమీద నీవు అధికారివవుదు
వని యెఫ్తాతో అనిరి. । అందుకు యెఫ్తా —
అమ్మోనీయులతో యుద్ధము చేయుటకు మీరు నన్ను
గిలాదుకు తిరిగి తీసికొని పోయినమీదట యెహోవా
వారిని నా చేతి కప్పగించినయెడల నేనే మీకు ప్రధా
నుడనవుదునా? అని గిలాదు పెద్దల నడుగగా । గిలాదు
పెద్దలు — నిశ్చయముగా మేము నీ మాటచొప్పున
చేయుదుము; యెహోవా మన యుభయుల మధ్యను
సాక్షిగా ఉండుగాకని యెఫ్తాతో అనిరి. । కాబట్టి 11
యెఫ్తా గిలాదు పెద్దలతోకూడ పోయినప్పుడు జనులు
తమకు ప్రధానునిగాను అధిపతినిగాను అతని నియమిం
చుకొనిరి. అప్పుడు యెఫ్తా మిస్పాలో యెహోవా
సన్నిధిని తన సంగతియంతయు వినిపించెను.
యెఫ్తా అమ్మోనీయుల రాజునొద్దకు దూతలను 12
పంపి — నాకును నీకును మధ్య ఏమి జరిగినందున నీవు
నా దేశముమీదికి యుద్ధమునకు వచ్చియున్నావని
యడుగగా । అమ్మోనీయుల రాజు — ఇశ్రాయేలీ 13
యులు ఐగుప్తులోనుండి వచ్చినప్పుడు వారు అర్నోను
మొదలుకొని యబ్బోకువరకును యొర్దానువరకును నా
దేశమును ఆక్రమించుకొనినందుననే నేను వచ్చియు
న్నాను. కాబట్టి మనము సమాధానముగా నుండు
నట్లు ఆ దేశములను మరల మాకప్పగించుమని యెఫ్తా
పంపిన దూతలతో సమాచారము చెప్పెను. । అంతట 14
యెఫ్తా మరల అమ్మోనీయుల రాజునొద్దకు దూతలను
పంపి యిట్లనెను ! — యెఫ్తా సెలవిచ్చినదేమనగా — 15
ఇశ్రాయేలీయులు మోయాబు దేశమునైనను అమ్మో
నీయుల దేశమునైనను ఆక్రమించుకొనలేదు. । ఇశ్రా 16
యేలీయులు ఐగుప్తులోనుండి వచ్చుచుండగా వారు
ఎఱ్ఱసముద్రమువరకు అరణ్యములో నడిచి కాదేషుకు
వచ్చిరి. । అప్పుడు ఇశ్రాయేలీయులు ఎదోము రాజు 17
నొద్దకు దూతలను పంపి — నీ దేశముగుండ పోవుటకు
దయచేసి నాకు సెలవిమ్మని యడుగగా, ఎదోమురాజు
ఒప్పుకొనలేదు. వారు మోయాబు రాజునొద్దకు అట్టి
వర్తమానమే పంపిరి గాని అతడును — నేను సెలవియ్య
నని చెప్పెను. అప్పుడు ఇశ్రాయేలీయులు కాదే
షులో నివసించిరి. । తరువాత వారు అరణ్యప్రయా 18
ణముచేయుచు ఎదోమీయులయొక్కయు మోయాబీ
యులయొక్కయు దేశములచుట్టు తిరిగి, మోయాబుకు
తూర్పుదిక్కున కనానుదేశమందు ప్రవేశించి అర్నోను
అద్దరిని దిగిరి. వారు మోయాబు సరిహద్దు లోప
లికి పోలేదు. అర్నోను మోయాబుకు సరిహద్దు
గదా. । మరియు ఇశ్రాయేలీయులు అమోరీయుల 19
రాజైన సీహోనను హెష్బోను రాజునొద్దకు దూత
లను పంపి — నీ దేశముగుండ మా స్థలమునకు మేము
పోవునట్లు దయచేసి సెలవిమ్మని అతనియొద్ద మనవి
చేయగా । సీహోను ఇశ్రాయేలీయులను నమ్మక, 20
తన దేశములోబడి వెళ్లనియ్యక, తన జనులనందరిని
సమకూర్చుకొని యాహసులో దిగి ఇశ్రాయేలీయు
లతో యుద్ధముచేసెను. । అప్పుడు ఇశ్రాయేలీయుల 21
దేవుడైన యెహోవా ఆ సీహోనును అతని సమస్త
జనమును ఇశ్రాయేలీయులచేతి కప్పగింపగా వారు ఆ
జనమును హతముచేసినతరువాత ఆ దేశనివాసులైన
అమోరీయుల దేశమంతయు స్వాధీనపరచుకొని ।
అర్నోను నది మొదలుకొని యబ్బోకువరకును అర 22

ణ్యము మొదలుకొని యొర్దానువరకును అమోరీయుల
23 ప్రాంతములన్నిటిని స్వాధీనపరచుకొనిరి. । కాబట్టి
ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా అమోరీయు
లను తన జనుల యెదుట నిలువకుండ తోలివేసిన
24 తరువాత నీవు దాని స్వతంత్రించుకొందువా? । స్వా
ధీనపరచుకొనుటకు కెమోషను నీ దేవత నీకిచ్చిన
దానిని నీవనుభవించుచున్నావుగదా? మా దేవుడైన
యెహోవా మా యెదుటనుండి యెవరిని తోలి
వేయునో వారి స్వాస్థ్యమును మేము స్వాధీనపరచు
25 కొందుము. । మోయాబు రాజైన సిప్పోరు కుమారు
డగు బాలాకుకంటె నీవు ఏమాత్రమును అధికుడవు
కావుగదా! అతడు ఇశ్రాయేలీయులతో ఎప్పుడై
నను కలహించెనా? ఎప్పుడైనను వారితో యుద్ధము
26 చేసెనా? । ఇశ్రాయేలీయులు హెష్బోనులోను దాని
ఊరులలోను అరోయేరులోను దాని ఊరులలోను
అర్నోను తీరముల పట్టణములన్నిటిలోను మున్నూరు
సంవత్సరములనుండి నివసించుచుండగా ఆ కాలమున
27 నీవేల వాటిని పట్టుకొనలేదు? । ఇట్లుండగా నేను నీ
యెడల తప్పు చేయలేదు గాని నీవు నా మీదికి యుద్ధ
మునకు వచ్చుటవలన నాయెడల దోషము చేయుచు
న్నావు. న్యాయాధిపతియైన యెహోవా నేడు
ఇశ్రాయేలీయులకును అమ్మోనీయులకును న్యాయము
28 తీర్చునుగాక. । అయితే అమ్మోనీయుల రాజు యెఫ్తా
తనతో చెప్పిన మాటలకు ఒప్పుకొనలేదు.
29 యెహోవా ఆత్మ యెఫ్తామీదికి రాగా అతడు
గిలాదులోను మనష్షేలోను సంచరించుచు, గిలాదు
మిస్పేలో సంచరించి గిలాదు మిస్పేనుండి అమ్మోనీయుల
30 యొద్దకు సాగెను. । అప్పుడు యెఫ్తా యెహోవాకు
మ్రొక్కుకొనెను, ఎట్లనగా — నీవు నా చేతికి అమ్మో
31 నీయులను నిశ్చయముగా అప్పగించినయెడల । నేను
అమ్మోనీయులయొద్దనుండి క్షేమముగా తిరిగివచ్చు
నప్పుడు, నన్ను ఎదుర్కొనుటకు నా యింటిద్వారము
నుండి బయలుదేరి వచ్చునదేదో అది యెహోవాకు
ప్రతిష్ఠితమగును; లేదా[1] దహనబలిగా దాని నర్పిం
32 చెదననెను. । అప్పుడు యెఫ్తా అమ్మోనీయులతో
యుద్ధము చేయుటకు వారియొద్దకు సాగిపోయినప్పుడు
యెహోవా అతనిచేతికి వారినప్పగించెను గనుక
33 అతడు వారిని । అనగా అరోయేరు మొదలుకొని
మిన్నీతుకు వచ్చువరకు ఆబేల్కెరామీమువరకును ఇరు
వది పట్టణములవారిని నిశ్శేషముగా హతముచేసెను.
అట్లు అమ్మోనీయులు ఇశ్రాయేలీయులయెదుట నిలువ
కుండ అణచివేయబడిరి.
34 యెఫ్తా మిస్పాలోనున్న తన యింటికి వచ్చినప్పుడు
అతని కుమార్తె తంబురలతోను నాట్యములతోను బయలు
దేరి అతనిని ఎదుర్కొనెను. ఆమె గాక అతనికి
మగసంతానమేగాని ఆడుసంతానమేగాని లేదు. ।
కాబట్టి అతడు ఆమెను చూచి, తన బట్టలను చింపు
కొని— అయ్యో నా కుమారీ, నీవు నన్ను బహుగా
కృంగచేసితివి, నీవు నన్ను తల్లడింపచేయువారిలో
ఒకతెవై యున్నావు; నేను యెహోవాకు మాట
యిచ్చి యున్నాను గనుక వెనుకతీయలేననగా ।
ఆమె—నా తండ్రీ, యెహోవాకు మాట యిచ్చి
యుంటివా? నీ నోటనుండి బయలుదేరిన మాట
చొప్పున నాకు చేయుము; యెహోవా నీ శత్రువు
లైన అమ్మోనీయులమీద పగతీర్చుకొని యున్నాడని
అతనితో ననెను. । మరియు ఆమె—నాకొరకు చేయ 3
వలసినదేదనగా రెండు నెలలవరకు నన్ను విడువుము,
నేనును నా చెలికత్తెలును పోయి కొండలమీద ఉండి,
నా కన్యాత్వమునుగూర్చి ప్రలాపించెదనని తండ్రితో
చెప్పగా । అతడు పొమ్మని చెప్పి రెండు నెలలవరకు 3
ఆమెను పోనిచ్చెను గనుక ఆమె తన చెలికత్తెలతో
కూడ పోయి కొండలమీద తన కన్యాత్వమునుగూర్చి
ప్రలాపించెను. । ఆ రెండు నెలల అంతమున ఆమె 3
తన తండ్రియొద్దకు తిరిగిరాగా అతడు తాను మ్రొక్కు
కొనిన మ్రొక్కుబడిచొప్పున ఆమెకు చేసెను. ।
ఆమె పురుషుని ఎరుగనేలేదు. ప్రతిసంవత్సరమున 4
ఇశ్రాయేలీయుల కుమార్తెలు నాలుగు దినములు
గిలాదుదేశస్థుడైన యెఫ్తా కుమార్తెను ప్రసిద్ధిచేయుటకు
మర్యాదకద్దు.

ఎఫ్రాయిమీయులు కూడుకొని ఉత్తరదిక్కునకు 12
పోయి — నీవు అమ్మోనీయులతో యుద్ధము చేయ
బోయినప్పుడు నీతో వచ్చుటకు మమ్ము నేల పిలువ
లేదు? నీవు కాపురమున్న నీ యింటిని అగ్నితో
కాల్చివేయుదుమని యెఫ్తాతో చెప్పగా । యెఫ్తా— 2
నాకును నా జనులకును అమ్మోనీయులతో గొప్ప కల
హము కలిగినప్పుడు నేను మిమ్మును పిలిచితినిగాని
మీరు వారి చేతులలోనుండి నన్ను రక్షింపలేదు.
మీరు నన్ను రక్షింపకపోవుట నేను చూచి । నా
ప్రాణమును అరచేతిలో ఉంచుకొని అమ్మోనీయు
లతో యుద్ధము చేయపోతిని. అప్పుడు యెహోవా
వారిని నా చేతి కప్పగించెను గనుక నాతో పోట్లాడు
టకు మీరేల నేడు వచ్చితిరనెను. । అప్పుడు యెఫ్తా
గిలాదువారి నందరిని పోగుచేసికొని ఎఫ్రాయిమీ
యులతో యుద్ధముచేయగా గిలాదువారు ఎఫ్రాయి
మీయులను జయించిరి. ఏలయనగా వారు—ఎఫ్రా
యిమీయులకును మనష్షీయులకును మధ్యను గిలాదు
వారైన మీరు ఎఫ్రాయిమీయులయెదుట నిలువక
పారిపోయినవారనిరి. । ఎఫ్రాయిమీయులతో యు
ద్ధముచేయుటకై గిలాదువారు యొర్దాను దాటు రేవు
లను పట్టుకొనగా పారిపోయిన ఎఫ్రాయిమీయు

1 పాఠాంతరము, మరియు.

లలో ఎవడో—నన్ను దాటనియ్యుడని చెప్పినప్పుడు,
గిలాదువారు — నీవు ఎఫ్రాయిమీయుడవా అని
అతని నడిగిరి. । అందుకతడు—నేను కాను అనిన
యెడల వారు అతనిచూచి — షిబ్బోలెతను శబ్దము
పలుకుమనిరి. అతడు అట్లు పలుకనేరక సిబ్బోలెతని
పలుకగా వారు అతని పట్టుకొని యొర్దానురేవుల
యొద్ద చంపిరి. ఆ కాలమున ఎఫ్రాయిమీయులలో
నలుబదిరెండువేలమంది పడిపోయిరి. । యెఫ్తా ఆరు
సంవత్సరములు ఇశ్రాయేలీయులకు న్యాయాధిపతియై
యుండెను. గిలాదువాడైన యెఫ్తా చనిపోయి గిలాదు
పట్టణములలో నొకదానియందు పాతిపెట్టబడెను.

అతని తరువాత బేత్లెహేమువాడైన ఇబ్సాను
ఇశ్రాయేలీయులకు అధిపతియాయెను. । అతనికి
ముప్పదిమంది కుమారులును ముప్పదిమంది కుమార్తె
లును ఉండిరి. అతడు ఆ కుమార్తెలను తన వంశమున
చేరనివారికిచ్చి, తన వంశమునకు చేరని ముప్పదిమంది
కన్యలను తన కుమారులకు పెండ్లిచేసెను. అతడు
ఏడేండ్లు ఇశ్రాయేలీయులకు అధిపతిగా నుండెను. ।
ఇబ్సాను చనిపోయి బేత్లెహేములో పాతిపెట్ట
బడెను.

అతని తరువాత జెబులూనీయుడైన ఏలోను
ఇశ్రాయేలీయులకు అధిపతియాయెను; అతడు పది
యేండ్లు ఇశ్రాయేలీయులకు అధిపతిగానుండెను. ।
జెబులూనీయుడైన ఏలోను చనిపోయి జెబులూను
దేశమందలి అయ్యాలోనులో పాతిపెట్టబడెను.

అతని తరువాత పిరాతోనీయుడైన హిల్లేలు కుమా
రుడగు అబ్దోను ఇశ్రాయేలీయులకు అధిపతియా
యెను. । అతనికి నలుబదిమంది కుమారులును ముప్పది
మంది మనుమలును ఉండిరి. వారు డెబ్బది గాడిదెపిల్లల
నెక్కి తిరుగువారు. అతడు ఎనిమిదేండ్లు ఇశ్రాయే
లీయులకు అధిపతిగానుండెను. । పిరాతోనీయుడైన
హిల్లేలు కుమారుడగు అబ్దోను చనిపోయి ఎఫ్రాయిము
దేశమందలి అమాలేకీయుల మన్యములోనున్న పిరా
తోనులో పాతిపెట్టబడెను.

**13** ఇశ్రాయేలీయులు మరల యెహోవా దృష్టికి
దోషులుకాగా యెహోవా నలుబది సంవత్సరములు
వారిని ఫిలిష్తీయులచేతికి అప్పగించెను.

ఆ కాలమున దానువంశస్థుడును జొర్యాపట్టణ
స్థుడునైన మానోహ అను నొకడుండెను. అతని భార్య
గొడ్రాలై కానుపులేకయుండెను. ।యెహోవా దూత
ఆ స్త్రీకి ప్రత్యక్షమై—ఇదిగో నీవు గొడ్రాలవు, నీకు
కానుపులేకపోయెను; అయితే నీవు గర్భవతివై కుమా
రుని కందువు. । కాబట్టి నీవు జాగ్రత్తగాఉండి, ద్రాక్షా
రసము నేగాని మద్యము నేగాని త్రాగకుండుము, అప
విత్రమైన దేనినైనను తినకుండుము. । నీవు గర్భవతివై
కుమారుని కందువు. అతని తలమీద మంగలకత్తి వేయ
కూడదు; ఆ బిడ్డ గర్భమున పుట్టినది మొదలుకొని
దేవునికి వ్రతము[1] చేయబడినవాడై ఫిలిష్తీయుల చేతి
లోనుండి ఇశ్రాయేలీయులను రక్షింప మొదలుపెట్టు
నని ఆమెతో అనగా । ఆ స్త్రీ తన పెనిమిటియొద్దకు 6
వచ్చి—దైవజనుడొకడు నాయొద్దకు వచ్చెను; అతని
రూపము దేవదూత రూపమును పోలినదై మిక్కిలి
భీకరముగా ఉండెను. అతడు ఎక్కడనుండి వచ్చెనో
నేనడుగలేదు, అతడు తనపేరు నాతో చెప్పలేదు ।
గాని — ఆలకించుము, నీవు గర్భవతివై కుమారుని 7
కందువు. కాబట్టి నీవు ద్రాక్షారసము నేగాని మద్య
ము నేగాని త్రాగకుండుము, అపవిత్రమైన దేనినైనను
తినకుండుము, ఆ బిడ్డ గర్భమున పుట్టినదిమొదలు
కొని చనిపోవువరకు దేవునికి వ్రతము చేయబడిన
వాడై యుండునని నాతో చెప్పెననెను. । అందుకు 8
మానోహ—నా ప్రభువా, నీవు పంపిన దైవజనుడు
మరల మాయొద్దకు వచ్చి, పుట్టబోవు ఆ బిడ్డకు మేము
ఏమేమి చేయవలెనో దాని మాకు నేర్పునట్లు దయ
చేయుమని యెహోవాను వేడుకొనగా । దేవుడు 9
మానోహ ప్రార్థన నాలకించెను గనుక, ఆ స్త్రీ పొల
ములో కూర్చుండగా దేవునిదూత ఆమెను దర్శిం
చెను. । ఆ సమయమున ఆమె పెనిమిటియైన మానోహ 10
ఆమెయొద్ద నుండలేదు గనుక ఆ స్త్రీ త్వరగా పరు
గెత్తి—ఒక దినమున నాయొద్దకు వచ్చిన మనిషి నాకు
కనబడెనని అతనితో చెప్పి దూత వచ్చిన సంగతి
తెలియజేసెను. । అప్పుడు మానోహ లేచి తన భార్య 11
వెంబడి వెళ్లి ఆ మనుష్యునియొద్దకు వచ్చి—ఈ స్త్రీతో
మాటలాడినవాడవు నీవేనా అని అతని నడుగగా
అతడు—నేనే అనెను. । అందుకు మానోహ—కావున 12
నీ మాట నెరవేరునప్పుడు ఆ బిడ్డ ఎట్టివాడగునో
అతడు చేయవలసిన కార్యమేమిటో తెలుపుమని
మనవిచేయగా । యెహోవా దూత — నేను ఆ 13
స్త్రీతో చెప్పినదంతయు ఆమె చేకొనవలెను; ఆమె
ద్రాక్షావల్లినుండి పుట్టునదేదియు తినకూడదు, ।
ఆమె ద్రాక్షారసమునైనను మద్యమునైనను త్రాగ 14
కూడదు, అపవిత్రమైన దేనినైనను తినకూడదు, నేను
ఆమె కాజ్ఞాపించినదంతయు ఆమె చేకొనవలెనని
మానోహతో చెప్పెను. । అప్పుడు మానోహ—మేము 15
ఒక మేకపిల్లను సిద్ధపరచి నీ సన్నిధిని ఉంచువరకు నీవు
ఆగుమని మనవి చేసికొనుచున్నామని యెహోవా
దూతతో చెప్పగా । యెహోవా దూత—నీవు 16
నన్ను నిలిపినను నీ భోజనము నేను తినను; నీవు
దహనబలి అర్పించ నుద్దేశించినయెడల యెహోవాకు
దాని నర్పింపవలెనని మానోహతో చెప్పెను. అతడు
యెహోవా దూత అని మానోహకు తెలియలేదు. ।

1 మూలభాషలో—నజీరు.

17 మానోహ—నీ మాటలు నెరవేరిన తరువాత మేము
నిన్ను సన్మానించునట్లు నీ పేరేమని యెహోవా
18 దూతను అడుగగా । యెహోవా దూత—నీవేల
నా పేరు అడుగుచున్నావు? అది చెప్పశక్యముకాని
19 దనెను. । అంతట మానోహ నైవేద్యముగా నొక
మేకపిల్లను తీసికొని యొక రాతిమీద యెహోవాకు
అర్పించెను. మానోహయు అతని భార్యయు చూచు
చుండగా ఆ దూత యొక ఆశ్చర్యకార్యము చేసెను. ।
20 ఎట్లనగా, జ్వాలలు బలిపీఠముమీదనుండి ఆకాశము
నకు లేచుచుండగా యెహోవాదూత బలిపీఠము
మీదనున్న ఆ జ్వాలలలో పరమునకు ఆరోహణ
మాయెను. మానోహయు అతని భార్యయు దాని
21 చూచి నేలకు సాగిలపడిరి. । ఆ తరువాత యెహోవా
దూత మరల మానోహకును అతని భార్యకును ఇక
22 ప్రత్యక్షము కాలేదు. । ఆయన యెహోవా దూత
అని మానోహ తెలిసికొని—మనము దేవుని చూచితిమి
గనుక మనము నిశ్చయముగా చనిపోదుమని తన
23 భార్యతో అనగా । అతని భార్య—యెహోవా
మనలను చంపగోరినయెడల ఆయన దహనబలిని నైవే
ద్యమును మనచేత అంగీకరింపడు, ఈ సంగతులన్ని
టిని మనకు చూపింపడు, ఈ కాలమున ఇట్టి సంగ
తులను మనకు వినిపింపడని అతనితో చెప్పెను. ।
24 తరువాత ఆ స్త్రీ కుమారుని కని అతనికి సమ్సోను
అను పేరుపెట్టెను. ఆ బాలుడు ఎదిగినప్పుడు
25 యెహోవా అతని నాశీర్వదించెను. । మరియు
యెహోవా ఆత్మ జొర్యాకును ఎష్తాయోలుకును
మధ్యనున్న మహానెదానులో అతని రేపుటకు మొదలు
పెట్టెను.

14 సమ్సోను తిమ్నాతుకు వెళ్లి తిమ్నాతులో ఫిలిష్తీ
2 యుల కుమార్తెలలో ఒకతెను చూచెను. । అతడు
తిరిగి వచ్చి—తిమ్నాతులో ఫిలిష్తీయుల కుమార్తెలలో
ఒకతెను చూచితిని, మీరు ఆమెను నాకిచ్చి పెండ్లి
3 చేయవలెనని తన తలిదండ్రులతో అనగా । వారు—
నీ స్వజనుల కుమార్తెలలోనేగాని నా జనులలోనే
గాని స్త్రీ లేదనుకొని, సున్నతిపొందని ఫిలిష్తీయులలో
నుండి కన్యను తెచ్చుకొనుటకు వెళ్లుచున్నావా? అని
అతని నడిగిరి. అందుకు సమ్సోను—ఆమె నాకిష్ట
మైనది గనుక ఆమెను నాకొరకు తెప్పించుమని తన
4 తండ్రితో చెప్పెను. । అయితే ఫిలిష్తీయులకేమైన
చేయుటకై యెహోవాచేత అతడు రేపబడెనన్న
మాట అతని తలిదండ్రులు తెలిసికొనలేదు. ఆ కాల
మున ఫిలిష్తీయులు ఇశ్రాయేలీయులను ఏలుచుండిరి.
5 అప్పుడు సమ్సోను తన తలిదండ్రులతోకూడ
తిమ్నాతుకుపోయి, తిమ్నాతు ద్రాక్షతోటలవరకు
వచ్చినప్పుడు, కొదమసింహము అతని యెదుటికి బొబ్బ
6 రించుచు వచ్చెను. । యెహోవా ఆత్మ అతని ప్రేరే
పింపగా అతనిచేతిలో ఏమియు లేకపోయినను, ఒకడు
మేకపిల్లను చీల్చునట్లు అతడు దాని చీల్చెను. అతడు
తాను చేసినది తన తండ్రితోనైనను తల్లితోనైనను
చెప్పలేదు. । అతడు అక్కడికి వెళ్లి ఆ స్త్రీతో మాట 7
లాడినప్పుడు ఆమెయందు సమ్సోనుకు ఇష్టము కలి
గెను. । కొంతకాలమైన తరువాత అతడు ఆమెను తీసి 8
కొని వచ్చుటకు తిరిగి వెళ్లుచుండగా, ఆ సింహపు కళే
బరమును చూచుటకై ఆ వైపు తిరిగినప్పుడు, సింహపు
కళేబరములో తేనెటీగల గుంపును తేనెయు కన
బడగా । అతడు ఆ తేనె చేత నుంచుకొని తినుచు 9
వెళ్లుచు తన తలిదండ్రులయొద్దకు వచ్చి వారికి కొంత
నియ్యగా వారును తినిరి. అయితే తాను సింహపు
కళేబరములోనుండి ఆ తేనెను తీసిన సంగతి వారికి
తెలియజేయలేదు. । అంతట అతని తండ్రి ఆ స్త్రీని 10
చూడబోయినప్పుడు సమ్సోను విందుచేసెను. అప్పటి
పెండ్లి కుమారులు అట్లు చేయుట మర్యాద. । వారు 11
అతని చూచినప్పుడు అతనియొద్ద నుండుటకు ముప్పది
మంది స్నేహితులను తోడుకొనివచ్చిరి. । అప్పుడు 12
సమ్సోను—మీకిష్టమైనయెడల నేను మీయెదుట ఒక
విప్పుడు కథను వేసెదను; మీరు ఈ విందు జరుగు
ఏడు దినములలోగా దాని భావమును నాకు తెలిపిన
యెడల నేను ముప్పది సన్నపు నారబట్టలను ముప్పది
దుస్తులను మీకిచ్చెదను. । మీరు దాని నాకు తెలుప 13
లేకపోయినయెడల మీరు ముప్పది సన్నపు నారబట్ట
లను ముప్పది దుస్తులను నాకియ్యవలెనని వారితో
చెప్పగా వారు—మేము ఒప్పుకొందుము, నీ విప్పుడు
కథను వేయుమని అతనితో చెప్పిరి. । కాగా అతడు— 14
బలమైనదానిలోనుండి తీపి వచ్చెను, తినుదానిలో
నుండి తిండి వచ్చెను అనెను. మూడు దినములలోగా
వారు ఆ విప్పుడు కథభావమును చెప్పలేకపోయిరి.
ఏడవ దినమున వారు సమ్సోను భార్యతో ఇట్ల 15
నిరి—నీ పెనిమిటి ఆ విప్పుడు కథభావమును మాకు
తెలుపునట్లు అతని లాలనచేయుము, లేనియెడల మేము
అగ్నివేసి నిన్ను నీ తండ్రి యింటివారిని కాల్చివేసె
దము; మా ఆస్తిని స్వాధీనపరచుకొనుటకే మమ్మును
పిలిచితిరా? అనిరి. । కాబట్టి సమ్సోను భార్య అతని 16
పాదములయొద్ద పడి యేడ్చుచు—నీవు నన్ను ద్వేషించి
తివి గాని ప్రేమింపలేదు. నీవు నా జనులకు ఒక-
విప్పుడు కథను వేసితివి, దాని నాకు తెలుపవైతివి
అనగా అతడు—నేను నా తలిదండ్రులకైనను దాని
తెలుపలేదు, నీకు తెలుపుదునా? అనినప్పుడు ఆమె
వారి విందు దినములు ఏడింటను అతనియొద్ద ఏడ్చుచు
వచ్చెను. । ఏడవదినమున ఆమె అతని తొందరపెట్టినం 17
దున అతడు ఆమెకు దాని తెలియజేయగా ఆమె తన
జనులకు ఆ విప్పుడు కథను తెలిపెను. । ఏడవదినమున 18
సూర్యుడు అస్తమింపకమునుపు ఆ ఊరివారు—తేనె

కంటె తీపియైనదేది? సింహముకంటె బలమైనదేది? అని
అతనితో అనగా అతడు — నా దూడతో దున్నక
పోయినయెడల నా విప్పుడు కథను విప్పలేక యుం
19 డురని వారితో చెప్పెను. । యెహోవా ఆత్మ అతని
మీదికి మరల రాగా అతడు అష్కెలోనుకు పోయి
వారిలో ముప్పదిమందిని చంపి వారి సొమ్మును దోచు
కొని తన విప్పుడు కథభావమును చెప్పినవారికి బట్టల
20 నిచ్చెను. । అతడు కోపించి తన తండ్రి యింటికి వెళ్లగా
అతని భార్య అతడు స్నేహితునిగా భావించుకొనిన
అతని చెలికానికియ్యబడెను.

**15** కొన్ని దినములైన తరువాత గోధుమల కోతకాల
మున సమ్సోను మేకపిల్ల ఒకటి తీసికొని తన భార్యను
చూడవచ్చి—అంతఃపురములోనున్న నా భార్యయొద్దకు
2 నేను పోదుననుకొనగా । ఆమె తండ్రి లోపలికి
అతని వెళ్లనియ్యక — నిశ్చయముగా నీవు ఆమెను
ద్వేషించితివనుకొని నీ స్నేహితునికి ఆమెను ఇచ్చి
తిని; ఆమె చెల్లెలు ఆమెకంటె చక్కనిదికాదా?
ఆమెకు ప్రతిగా ఈమె నీకుండవచ్చును చిత్తగించు
3 మనెను. । అప్పుడు సమ్సోను—నేను ఫిలిష్తీయులకు
హానిచేసినయెడల వారి విషయములో నేనిప్పుడు
4 నిరపరాధినై యుందునని వారితో చెప్పి । పోయి
మున్నూరు నక్కలను పట్టుకొని దివిటీలను తెప్పించి
తోకతట్టు తోకను త్రిప్పి రెండేసి తోకలమధ్యను
5 ఒక్కొక్క దివిటీ కట్టి । ఆ దివిటీలో అగ్ని మండ
చేసి ఫిలిష్తీయుల గోధుమ చేలలోకి వాటిని (తోలి)
పనల కుప్పలను పైరును ద్రాక్షతోటలను ఒలీవ
6 తోటలను తగలబెట్టెను. । ఫిలిష్తీయులు—ఇది ఎవడు
చేసినదని చెప్పుకొనుచు, తిమ్నాయుని అల్లుడైన
సమ్సోను భార్యను ఆమె తండ్రి తీసికొని అతని
స్నేహితునికిచ్చెను గనుక అతడే చేసియుండెనని
చెప్పిరి. కాబట్టి ఫిలిష్తీయులు ఆమెను ఆమె తండ్రిని
7 అగ్నితో కాల్చిరి. । అప్పుడు సమ్సోను—మీరు ఈ
లాగున చేసినయెడల నేను మీమీద పగతీర్చుకొనిన
8 తరువాత నే చాలించెదనని చెప్పి । తొడలతో తుంట్లను
విరుగగొట్టి వారిని బహుగా హతముచేసెను. అటు
పిమ్మట వెళ్లి ఏతాము బండసందులో నివసించెను.
9 అప్పుడు ఫిలిష్తీయులు బయలుదేరి యూదాదేశ
ములో దిగి చెదరి, లేహీలో దోపిడికొరకై దండు
10 కూర్చిరి. । యూదావారు—మీరేల మా మీదికి వచ్చితి
రని అడుగగా ఫిలిష్తీయులు—సమ్సోను మాకు చేసి
నట్లు మేము అతనికి చేయవలెనని అతని కట్టుటకే
11 వచ్చితిమనిరి. । అందుకు యూదా జనులలో మూడు
వేలమంది ఏతాములోని బండయొద్దకు పోయి సమ్సో
నును చూచి—ఫిలిష్తీయులు మనకు ఏలికలని నీకు తెలి
యదా? నీవు మాకేమి చేసితివని చెప్పగా అతడు—
వారు నాకెట్లు చేసిరో అట్లే నేను వారికి చేసితి
ననెను. । అందుకు వారు—మేము ఫిలిష్తీయులచేతికి 12
అప్పగించుటకు నిన్ను కట్టవచ్చితిమని అతనితో అనగా
సమ్సోను—మీరు నామీద పడకుందురని నాతో
ప్రమాణము చేయుడనెను. । అందుకు వారు—ఆలాగు 13
కాదు, నిశ్చయముగా మేము నిన్ను చంపముగాని
నిన్ను గట్టిగా కట్టి వారిచేతికి మేము అప్పగించెదమని
చెప్పి రెండు క్రొత్త తాళ్లచేత అతని కట్టి ఆ బండ
యొద్దనుండి అతని తీసికొనివచ్చిరి. । అతడు లేహీకి 14
వచ్చువరకు ఫిలిష్తీయులు అతనిని ఎదుర్కొని కేకలు
వేయగా, యెహోవా ఆత్మ అతనిమీదికి బలముగా
వచ్చినందున అతనిచేతులకు కట్టబడిన తాళ్లు అగ్ని
చేత కాల్చబడిన జనుపనారవలె నాయెను; కట్లును
అతని చేతులమీదనుండి విడిపోయెను. । అతడు 15
గాడిదెయొక్క పచ్చి దవడ యెముకను కనుగొని
చెయ్యి చాచి పట్టుకొని దానిచేత వెయ్యిమంది మను
ష్యులను చంపెను. । అప్పుడు సమ్సోను 16

గాడిదె దవడ యెముకతో ఒక కుప్ప
రెండు కుప్పలను నేను చంపియున్నాను
గాడిదె దవడ యెముకతో వెయ్యిమంది నరులను
చంపియున్నాను

అనెను.

అతడు చెప్పుట చాలించిన తరువాత ఆ దవడ 17
యెముకను చేతినుండి పారవేసి ఆ చోటికి రామ
త్లెహీ అను పేరు పెట్టెను. । అప్పుడతడు మిక్కిలి 18
దప్పిగొనినందున యెహోవాకు మొఱ్ఱపెట్టి—నీవు
నీ సేవకుని చేతివలన ఈ గొప్ప రక్షణను దయచేసిన
తరువాత నేనిప్పుడు దప్పిచేతను చచ్చి, సున్నతి పొం
దనివారి చేతిలోకి పడవలెనా? అని వేడుకొనగా ।
దేవుడు లేహీలోనున్న ఒక గోతిని చీల్చెను, దాని 19
నుండి నీళ్లు బయలుదేరెను. అతడు త్రాగిన తరు
వాత ప్రాణము తెప్పరిల్లి బ్రదికెను. కాబట్టి దాని
పేరు నేటివరకు ఏన్హక్కోరె అనబడెను; అది లేహీలో
నున్నది. । అతడు ఫిలిష్తీయుల దినములలో ఇరువది 20
యేండ్లు ఇశ్రాయేలీయులకు న్యాయాధిపతియై యుం
డెను.

తరువాత సమ్సోను గాజాకు వెళ్లి వేశ్య నొక **16**
తెను చూచి ఆమెయొద్ద చేరెను. । సమ్సోను అక్క 2
డికి వచ్చెనని గాజావారికి తెలిసినప్పుడు వారు మాటు
పెట్టి—రేపు తెల్లవారిన తరువాత అతని చంపుదమను
కొని పట్టణపు ద్వారమునొద్ద ఆ రాత్రి అంతయు
పొంచియుండిరి. । సమ్సోను మధ్యరాత్రివరకు పండు 3
కొని మధ్యరాత్రి లేచి పట్టణపు తలుపులను వాటి
రెండు ద్వారబంగములను పట్టుకొని వాటి అడ్డకఱ్ఱ
తోటి వాటిని ఊడబెరికి తన భుజములమీద పెట్టు
కొని హెబ్రోనుకు ఎదురుగానున్న కొండకొనకు
వాటిని తీసికొనిపోయెను.

4 పిమ్మట అతడు శోరేకు లోయలోనున్న దెలీలా
5 అను స్త్రీని మోహింపగా । ఫిలిష్తీయుల సర్దారులు
ఆమెయొద్దకువచ్చి ఆమెను చూచి—నీవు అతని లాలన
చేసి అతని గొప్పబలము దేనిలోనున్నదో, మేమే
లాగు అతని గెలువవచ్చునో తెలిసికొనుము; మేము
అతని బంధించి అతని గర్వము అణుపుగుము, అప్పుడు
మాలో ప్రతివాడును వెయ్యిన్ని నూరు వెండి నాణెము
6 లను నీకిచ్చెదమని చెప్పిరి. । కాబట్టి దెలీలా—నీ మహా
బలము దేనిలోనున్నదో నిన్ను దేనిచేత కట్టి బాధింప
వచ్చునో నాకు దయచేసి తెలుపుమని సమ్సోనుతో
7 ననగా । సమ్సోను—ఏడు నిరవంజి చువ్వలతో నన్ను
బంధించినయెడల నేను బలహీనుడనై సామాన్య మను
ష్యులలో ఒకనివలె అవుదునని ఆమెతో చెప్పెను. ।
8 ఫిలిష్తీయుల సర్దారులు ఏడు నిరవంజి చువ్వలను
ఆమెయొద్దకు తీసికొని రాగా ఆమె వాటితో
9 అతని బంధించెను. । మాటునునుండువారు ఆమెతో
అంతఃపురములో దిగియుండిరి గనుక ఆమె—సమ్సో
నూ, ఫిలిష్తీయులు నీమీద పడుచున్నారని అత
నితో అనగా, అతడు అగ్నితగిలిన నూలుకీలిగా
ఆ తడపలను తెంపెను గనుక అతని బలము తెలియ
10 బడలేదు. । అప్పుడు దెలీలా—ఇదిగో నీవు నన్ను ఎగ
తాళిచేసి నాతో అబద్ధమాడితివి, నిన్ను దేనిచేత బం
ధింపవచ్చునో దయచేసి నాకు తెలుపుమని సమ్సో
11 నుతో చెప్పగా । అతడు — పేనిన తరువాత పనికి
పెట్టని క్రొత్త తాళ్లతో నన్ను బాగుగా బంధించిన
యెడల నేను బలహీనుడనై సామాన్య మనుష్యులలో
12 ఒకనివలె అవుదునని ఆమెతో చెప్పెను । అంతట
దెలీలా పేనబడిన క్రొత్త తాళ్లను తీసికొని వాటితో
అతని బంధించి—సమ్సోనూ, ఫిలిష్తీయులు నీమీద
పడుచున్నారని అతనితో అనెను. అప్పుడు మాటున
నుండువారు అంతఃపురములో నుండిరి. అతడు తన
చేతులమీదనుండి నూలుపోగునువలె ఆ తాళ్లు తెం
13 పెను. । అప్పుడు దెలీలా—ఇదివరకు నీవు నన్ను ఎగ
తాళిచేసి నాతో అబద్ధములాడితివి, నిన్ను దేనివలన బం
ధింపవచ్చునో నాకు తెలుపుమని సమ్సోనుతో చెప్పగా
అతడు—నీవు నా తల జడలు ఏడును అల్లిక అల్లిన
14 యెడల సరి అని ఆమెతో చెప్పెను. । అంతట ఆమె
మేకుతో దాని దిగగొట్టి—సమ్సోనూ, ఫిలిష్తీయులు
నీమీద పడుచున్నారని అతనితో చెప్పినప్పుడు అతడు
నిద్రమేలుకొని మగ్గపు మేకును నేతను ఊడదీసికొని
15 పోయెను. । అప్పుడు ఆమె — నాయందు నీకిష్టము
లేనప్పుడు—నేను నిన్ను ప్రేమించుచున్నానని నీవెం
దుకు చెప్పుచున్నావు? ఇదివరకు నీవు ముమ్మారు నన్ను
ఎగతాళిచేసి నీ గొప్పబలము దేనిలోనున్నదో నాకు
16 తెలుపకపోతివని అతనితో అనెను. । ఆమె అనుదిన
మును మాటలచేత అతని బాధించి తొందరపెట్టు

చున్నందున అతడు ప్రాణము విసికి చావగోరెను. ।
అప్పుడతడు తన అభిప్రాయమంతయు ఆమెకు తెలియ 17
జేసి—నేను నా తల్లిగర్భమునుండి పుట్టినది మొదలు
కొని దేవునికి వ్రతము చేయబడినవాడనై యున్నాను,
నా తలమీదికి మంగలకత్తి రాలేదు, నాకు క్షౌరము
చేసినయెడల నా బలము నాలోనుండి తొలగిపోయి
యితర మనుష్యులవలె అవుదునని ఆమెతో అనెను. ।
అతడు తన అభిప్రాయమును తనకు తెలిపెనని దెలీలా 18
యెరిగి, ఆమె వర్తమానము పంపి ఫిలిష్తీయుల సర్దారు
లను పిలిపించి—యీసారికి రండి; ఇతడు తన అభి
ప్రాయమంతయు నాకు తెలిపెననెను. ఫిలిష్తీయుల
సర్దారులు రూపాయిలను చేత పట్టుకొని ఆమెయొద్దకు
రాగా । ఆమె తన తొడమీద అతని నిద్రబుచ్చి, 19
ఒక మనుష్యుని పిలిపించి వానిచేత అతని తలమీది
యేడు జడలను క్షౌరము చేయించి అతని బాధించు
టకు మొదలుపెట్టెను. అప్పుడు అతనిలోనుండి
బలము తొలగిపోయెను. । ఆమె—సమ్సోనూ, ఫిలిష్తీ 20
యులు నీమీద పడుచున్నారనగా అతడు నిద్రమేలు
కొని — యెప్పటియట్లు నేను బయలుదేరి విదిలించు
కొందుననుకొనెను. అయితే యెహోవా తనను ఎడ
బాసెనని అతనికి తెలియలేదు. । అప్పుడు ఫిలిష్తీయులు 21
అతని పట్టుకొని అతని కన్నులను ఊడదీసి గాజాకు
అతని తీసికొనివచ్చి యిత్తడి సంకెళ్లచేత అతని బంధిం
చిరి. । అతడు బందీగృహములో తిరుగలి విసరువా 22
డాయెను. అయితే అతడు క్షౌరము చేయబడినతరు
వాత అతని తలవెండ్రుకలు తిరిగి మొలుచుటకు
మొదలుపెట్టెను.

ఫిలిష్తీయుల సర్దారులు —మన దేవత మన శత్రు 23
వైన సమ్సోనును మన చేతికి అప్పగించియున్నదని
చెప్పుకొని, తమ దేవతయైన దాగోనుకు మహాబలి
అర్పించుటకును పండుగ ఆచరించుటకును కూడు
కొనిరి. । జనులు సమ్సోనును చూచినప్పుడు — మన 24
దేశమును పాడుచేసినవాడును మనలో అనేకులను
చంపినవాడునైన మన శత్రువుని మన దేవత మన చేతి
కప్పగించియున్నదని చెప్పుకొనుచు తమ దేవతను
స్తుతించిరి. । వారి హృదయములు సంతోషముతో 2
నిండియుండగా వారు—మనము పరిహాసము చేయు
టకు సమ్సోనును పిలిపించుదము రండని సమ్సోనును
బందీగృహమునుండి పిలువనంపిరి. వారు అతని చూచి
గుడిస్తంభముల మధ్యను అతని నిలువబెట్టి పరిహాసము
చేయగా । సమ్సోను తనచేతిని పట్టుకొనిన బంటుతో 2
ఇట్లనెను—ఈ గుడికి ఆధారముగానున్న స్తంభములను
నన్ను తడవనిచ్చి విడువుము, నేను వాటిమీద ఆను
కొందును. । ఆ గుడి స్త్రీ పురుషులతో నిండియుం 2
డెను, ఫిలిష్తీయుల సర్దారులందరు అక్కడనుండిరి,
వారు సమ్సోనును ఎగతాళిచేయగా గుడి కప్పుమీద

స్త్రీ పురుషులు దెమారము మూడు వేలమంది చూచుచుం
28 డిరి. । అప్పుడు సమ్సోను—యెహోవా ప్రభువా,
దయచేసి నన్ను జ్ఞాపకము చేసికొనుము, దేవా దయ
చేసి యీసారి మాత్రమే నన్ను బలపరచుము, నా
రెండు కన్నుల నిమిత్తము ఫిలిష్తీయులను ఒక్కమారే
దండించి పగ తీర్చుకొననిమ్మని యెహోవాకు మొఱ్ఱ
29 పెట్టి । ఆ గుడికి ఆధారముగానున్న రెండు మధ్య
స్తంభములలో ఒకదానిని కుడిచేతను ఒకదానిని ఎడమ
30 చేతను పట్టుకొని । నేనును ఫిలిష్తీయులును చనిపో
దుముగాక అని చెప్పి బలముతో వంగినప్పుడు గుడి
ఆ సర్దారులమీదను దానిలోనున్న జనులందరిమీదను
పడెను. మరణకాలమున అతడు చంపినవారి శవముల
లెక్క జీవితకాలమందు అతడు చంపినవారి లెక్క
31 కంటె ఎక్కువాయెను. । అప్పుడు అతని స్వదేశజను
లును అతని తండ్రి యింటివారందరును కూడి వాని
మోసికొని వచ్చి జొర్యాకును ఎష్తాయోలుకును మధ్య
నున్న అతని తండ్రియైన మానోహ సమాధిలో అతని
పాతిపెట్టిరి. అతడు ఇరువది సంవత్సరములు ఇశ్రా
యేలీయులకు అధిపతిగానుండెను.

17 మీకా అను నొకడు ఎఫ్రాయిమీయుల మన్య
2 దేశములో నుండెను. । అతడు తన తల్లిని చూచి—నీ
యొద్దనుండి తీసికొనిన రూకలు, అనగా నీవు ప్రమాణ
ముచేసి నా వినికిడిలో మాటలాడిన ఆ వెయ్యిన్నినూరు
వెండి రూకలు నా యొద్దనున్నవి. ఇదిగో నేను వాటిని
తీసికొంటినని ఆమెతో చెప్పగా అతని తల్లి — నా
కుమారుడు యెహోవాచేత ఆశీర్వదింపబడునుగాక
3 అనెను. । అతడు ఆ వెయ్యిన్నినూరు రూకలను తన
తల్లికి మరల నియ్యగా ఆమె—పోతవిగ్రహము చేయిం
చుటకై నా కుమారునిచేత తీసికొనిన యీ రూకలను
నేను యెహోవాకు ప్రతిష్ఠించుచున్నాను, నీకు
4 మరల అది యిచ్చెదననెను. । అతడు ఆ రూకలను తన
తల్లికియ్యగా ఆమె వాటిలో ఇన్నూరు పట్టుకొని
కంసాలికప్పగించెను. అతడు వాటితో చెక్కబడిన
ప్రతిమాస్వరూపమైన పోతవిగ్రహమును చేయగా
5 అది మీకా యింట ఉంచబడెను. । మీకా అను ఆ
మనుష్యునికి దేవమందిర మొకటి యుండెను. మరియు
అతడు ఏఫోదును గృహదేవతలను చేయించి తన కుమా
రులలో ఒకని ప్రతిష్ఠింపగా ఇతడు అతనికి యాజకు
6 డాయెను. । ఆ దినములలో ఇశ్రాయేలీయులకు రాజు
లేడు; ప్రతివాడును ఇష్టానుసారముగా ప్రవర్తించుచు
వచ్చెను.

7 యూదా బేత్లెహేములోనుండి వచ్చిన యూదా
వంశస్థుడైన ఒక యౌవనుడుండెను. అతడు లేవీ
యుడు, అతడు అక్కడ కొంతకాలము నివసించెను.।
8 ఆ మనుష్యుడు తనకు స్థలము దొరికిన చోట నివ
సింపవలెనని; యూదా బేత్లెహేమునుండి బయలుదేరి
ప్రయాణము చేయుచు ఎఫ్రాయిమీయుల మన్య
దేశముననున్న మీకా యింటికి వచ్చెను. । మీకా— 9
నీవు ఎక్కడనుండి వచ్చితివని అతని నడుగగా అతడు
—నేను యూదా బేత్లెహేమునుండి వచ్చిన లేవీయు
డను, నాకు దొరుకగల చోట నివసించుటకు పోవు
చున్నానని అతనితో అనెను. । మీకా — నాయొద్ద 10
నివసించి నాకు తండ్రివిగాను యాజకుడవుగాను ఉం
డుము; నేను సంవత్సరమునకు నీకు పది వెండి రూక
లును ఒక దుస్తు బట్టలును ఆహారమును ఇచ్చెదనని
చెప్పగా ఆ లేవీయుడు ఒప్పుకొని । ఆ మనుష్యుని 11
యొద్ద నివసించుటకు సమ్మతించెను. ఆ యౌవనుడు
అతని కుమారులలో ఒకనివలె నుండెను. । మీకా ఆ 12
లేవీయుని ప్రతిష్ఠింపగా అతడు మీకాకు యాజకుడై
అతని యింట నుండెను. । అంతట మీకా — లేవీ 13
యుడు నాకు యాజకుడైనందున యెహోవా నాకు
మేలుచేయు ననుకొనెను.

ఆ దినములలో ఇశ్రాయేలీయులకు రాజు లేడు. 18
మరియు ఇశ్రాయేలీయుల గోత్రములలో ఆ దినము
వరకు దానీయులు స్వాస్థ్యము పొంది యుండలేదు
గనుక ఆ కాలమున తాము నివసించుటకు తమకు
స్వాస్థ్యము వెదకుకొనుటకై వారు బయలుదేరియుం
డిరి. । ఆ దేశ సంచారము చేసి దాని పరిశోధించుటకై 2
దానీయులు తమ వంశస్థులందరిలోనుండి పరాక్రమ
వంతులైన అయిదుగురు మనుష్యులను జొర్యానుం
డియు ఎష్తాయోలునుండియు పంపి—మీరు వెళ్లి దేశ
మును పరిశోధించుడని వారితో చెప్పగా । వారు 3
ఎఫ్రాయిమీయుల మన్యముననున్న మీకా యింటికి
వచ్చి అక్కడ దిగిరి. వారు మీకా యింటియొద్ద
నున్నప్పుడు, లేవీయుడైన ఆ యౌవనుని స్వరమును
పోల్చి ఆ వైపుకు తిరిగి అతని చూచి—ఎవడు నిన్ను
ఇక్కడికి రప్పించెను? ఈ చోటున నీవేమి చేయుచు
న్నావు? ఇక్కడ నీకేమి కలిగియున్నదని యడుగగా।
అతడు మీకా తనకు చేసిన విధముచెప్పి — మీకా 4
నాకు జీతమిచ్చుచున్నాడు, నేను అతనికి యాజకు
డనై యున్నానని వారితో చెప్పెను. । అప్పుడు 5
వారు—మేము చేయబోవుపని శుభమగునో కాదో
మేము తెలిసికొనునట్లు దయచేసి దేవునియొద్ద విచా
రించుమని అతనితో అనగా । ఆ యాజకుడు—క్షేమ 6
ముగా వెళ్లుడి, మీరు చేయబోవుపని యెహోవా
దృష్టికి అనుకూలమని వారితో చెప్పెను.

కాబట్టి ఆ అయిదుగురు మనుష్యులు వెళ్లి లాయి 7
షుకు వచ్చి, దానిలోని జనము సీదోనీయులవలె సుఖ
ముగాను నిర్భయముగాను నివసించుటయు, అధికార
బలము పొందినవాడెవడును లేకపోవుటయు, ఏమాత్ర
మైనను అవమానపరచగలవాడెవడును ఆ దేశములో
లేకపోవుటయు, వారు సీదోనీయులకు దూరస్థులై

యే మనుష్యులతోను సాంగత్యము లేకుండుటయు
8 చూచిరి. । వారు జొర్యాలోను ఎష్తాయోలులోను
ఉండు తమ స్వజనులయొద్దకు రాగా వారు—మీ
9 తాత్పర్యమేమిటని యడిగిరి. । అందుకు వారు—లెండి,
వారిమీద పడుదము, ఆ దేశమును మేము చూచి
తిమి, అది బహు మంచిది; మీరు ఊరకయున్నారేమి?
ఆలస్యము చేయక బయలుదేరి ప్రవేశించి ఆ దేశ
10 మును స్వాధీనపరచుకొనుడి. । జనులు నిర్భయముగా
నున్నారు గనుక మీరు పోయి వారిమీద పడవచ్చును.
ఆ దేశము నలుదిక్కుల విశాలమైనది, దేవుడు మీ
చేతికి దాని నప్పగించును, భూమిలోనున్న పదార్థము
లలో ఏదియు అచ్చట కొదువలేదనిరి.
11 అప్పుడు జొర్యాలోను ఎష్తాయోలులోను ఉన్న
దానీయులైన ఆరువందలమంది యుద్ధాయుధములు
కట్టుకొని అక్కడనుండి బయలుదేరి యూదా దేశ
12 ములోని కిర్యత్యారీములో దిగిరి. । అందుచేతను నేటి
వరకు ఆ స్థలమునకు దానీయుల దండని పేరు. అది
13 కిర్యత్యారీమునకు పడమట నున్నది. । అక్కడనుండి
వారు ఎఫ్రాయిమీయుల మన్యప్రదేశమునకు పోయి
14 మీకా యింటికి వచ్చిరి. । కాబట్టి లాయిషుదేశ
మును సంచరించుటకు పోయిన ఆ అయిదుగురు మను
ష్యులు తమ సహోదరులను చూచి—ఈ యిండ్లలో
ఏఫోదును గృహదేవతలును చెక్కబడిన ప్రతిమయు
పోతవిగ్రహమును ఉన్నవని మీరెరుగుదురా? మీరేమి
15 చేయవలెనో దాని యోచన చేయుడనగా । వారు ఆ
తట్టు తిరిగి లేవీయుడైన ఆ యౌవనుడున్న మీకా
16 యింటికి వచ్చి అతని కుశలప్రశ్నలడిగిరి. । దానీయు
లైన ఆ ఆరువందలమంది తమ యుద్ధాయుధములను కట్టు
17 కొని । గవినివాకిట నిలుచుండగా, దేశమును సంచరిం
చుటకు పోయిన ఆ అయిదుగురు మనుష్యులు లోపల
చొచ్చి ఆ ప్రతిమను ఏఫోదును గృహదేవతలను పోత
విగ్రహమును పట్టుకొనిరి. అప్పుడు ఆ యాజకుడు
యుద్ధాయుధములు కట్టుకొనిన ఆ ఆరువందలమంది
మనుష్యులతోకూడ గవినియెదుట వాకిట నిలిచియుం
18 డెను. । వీరు మీకా యింటికి పోయి చెక్కబడిన
ప్రతిమను ఏఫోదును గృహదేవతలను పోతవిగ్రహ
మును పట్టుకొనినప్పుడు ఆ యాజకుడు—మీరేమి
19 చేయుచున్నారని వారి నడుగగా । వారు—నీవు ఊర
కుండుము, నీ చెయ్యి నీ నోటిమీద ఉంచుకొని
మాతోకూడ వచ్చి మాకు తండ్రివిగాను యాజకుడవు
గాను ఉండుము, ఒకని యింటివారికే యాజకుడవై
యుండుట నీకు మంచిదా, ఇశ్రాయేలీయులలో ఒక
గోత్రమునకును కుటుంబమునకును యాజకుడవై యుం
20 డుట మంచిదా? అని యడిగిరి. । అప్పుడు ఆ యాజ
కుడు హృదయమున సంతోషించి ఆ ఏఫోదును గృహ
దేవతలను చెక్కబడిన ప్రతిమను పట్టుకొని ఆ జనుల

మధ్య చేరెను. । అట్లు వారు తిరిగి చిన్నపిల్లలను పశు 21
వులను సామగ్రిని తమకు ముందుగా నడిపించుకొని
పోయిరి. । వారు మీకా యింటికి దూరమైనప్పుడు, 22
మీకా పొరుగిండ్లవారు పోగై దానీయులను వెంటాడి
కలిసికొని వారిని పిలువగా । వారు తమ ముఖములను 23
త్రిప్పుకొని—నీకేమి కావలెను? ఇట్లు గుంపుకూడ నేల?
అని మీకాను అడిగిరి. । అందుకతడు—నేను చేయించిన 24
నా దేవతలను నేను ప్రతిష్ఠించిన యాజకుని మీరు
పట్టుకొని పోవుచున్నారే; యిక నాయొద్ద ఏమి
యున్నది? నీకేమి కావలెననుచున్నారే, అదేమన్న
మాట అనగా । దానీయులు—నీ స్వరము మాలో 25
నెవనికిని వినబడనీయకుము, వారు ఆగ్రహపడి నీమీద
పడుదురేమో, అప్పుడు నీవు నీ ప్రాణమును నీ యింటి
వారి ప్రాణమును పోగొట్టుకొందువని అతనితో చెప్పి ।
తమ త్రోవను వెళ్లిరి. వారు తనకంటె బలవంతులని 26
మీకా గ్రహించినవాడై తిరిగి తన యింటికి వెళ్లిపో
యెను. । మీకా చేసికొనినదానిని, అతని యొద్దనున్న 27
యాజకునిని వారు పట్టుకొని, సుఖముగాను నిర్భయము
గాను ఉన్న లాయిషువారి మీదికి వచ్చి కత్తివాత
వారిని హతముచేసి అగ్నిచేత ఆ పట్టణమును కాల్చి
వేసిరి. । అది సీదోనుకు దూరమైయుండుటను, వారికి 28
అన్యులతో సాంగత్యమేమియు లేనందునను వారిలో
ఎవడును తప్పించుకొనలేదు. అది బేత్రెహోబుకు
సమీపమైన లోయలోనున్నది. । వారొక పట్టణ 29
మును కట్టుకొని అక్కడ నివసించిరి. ఇశ్రాయేలుకు
పుట్టిన తమ తండ్రియైన దానునుబట్టి ఆ పట్టణము
నకు దాను అను పేరు పెట్టిరి. పూర్వము ఆ పట్టణము
నకు లాయిషు అను పేరు. । దానీయులు చెక్క 30
బడిన ఆ ప్రతిమను నిలువుకొనిరి. మోషే మనుమ
డును గెర్షోము కుమారుడునైన యోనాతానను వాడును
వాని కుమారులును ఆ దేశము చెరపట్టబడువరకు దానీ
యుల గోత్రమునకు యాజకులై యుండిరి. । దేవుని 31
మందిరము షిలోహులోనున్న దినములన్నిటను వారు
మీకా చేయించిన ప్రతిమను నిలువుకొని యుండిరి.

ఇశ్రాయేలీయులకు రాజులేని దినములలో లేవీ 19
యుడైన యొకడు ఎఫ్రాయిమీయుల మన్యపు ఉత్తర
భాగమున పరదేశిగా నివసించుచుండెను. అతడు
యూదా బేత్లెహేములోనుండి ఒక స్త్రీని తనకు ఉప
పత్నిగా తెచ్చుకొనగా । అతని ఉపపత్ని అతని 2
విడిచి ఒకనితో వ్యభిచరించి యూదా బేత్లెహేము
లోని తన తండ్రి యింటికి పోయి అక్కడ నాలుగు
నెలలుండెను. । ఆమెతో ప్రియముగా మాటలాడి 3
ఆమెను తిరిగి తెచ్చుకొనుటకై ఆమె పెనిమిటి లేచి
తన దాసునిని రెండు గాడిదెలను తీసికొని ఆమె
యొద్దకు వెళ్లగా ఆమె తన తండ్రి యింట అతని
చేర్చెను. ఆ చిన్నదాని తండ్రి అతని చూచినప్పుడు

4 అతని కలిసికొని సంతోషించెను. । ఆ చిన్నదాని
తండ్రియగు అతని మామ వెళ్లనియ్యనందున అతడు
మూడు దినములు అతనియొద్ద నుండెను గనుక
వారు అన్నపానములు పుచ్చుకొనుచు అక్కడ నిలి
5 చిరి. । నాలుగవ నాడు వారు వేకువను వెళ్లుటకు
నిద్రమేలుకొనగా అతడు లేవసాగెను. అయితే ఆ
చిన్నదాని తండ్రి—నీవు కొంచెము ఆహారము పుచ్చు
కొని తెప్పరిల్లిన తరువాత నీ త్రోవను వెళ్లవచ్చునని ।
6 తన అల్లునితో అనగా, వారిద్దరు కూర్చుండి అన్న
పానములు పుచ్చుకొనిరి. తరువాత ఆ చిన్నదాని
తండ్రి —దయచేసి యీ రాత్రి అంతయు ఉండి
సంతోషపడుము, నీ హృదయమును సంతోషపరచు
7 కొనుము అని ఆ మనుష్యునితో చెప్పి । అతడు వెళ్లు
టకు లేచినప్పుడు అతని మామ బలవంతము చేయగా
8 అతడు ఆ రాత్రి అక్కడనుండెను. । అయిదవ దిన
మున అతడు వెళ్లవలెనని ఉదయమున లేచినప్పుడు
ఆ చిన్నదాని తండ్రి—నీవు నీ ప్రాణము బలపరచు
కొనుమని చెప్పినందున వారు ప్రొద్దు వాలువరకు
9 తడవుచేసి యిద్దరు కూడి భోజనముచేసిరి. । ఆ మను
ష్యుడు తానును అతని ఉపపత్నియు అతని దాసు
డును వెళ్ల లేచినప్పుడు ఆ చిన్నదాని తండ్రియగు
అతని మామ—ఇదిగో ప్రొద్దు గ్రుంకుటకు సమీప
మాయెను, నీవు దయచేసి యీ రాత్రి యిక్కడ ఉం
డుము, ఇదిగో ప్రొద్దు గ్రుంకుచున్నది, సంతో
షించి యిక్కడే రాత్రి గడుపుము, రేపు నీ గుడారము
నకు వెళ్లుటకు నీవు వేకువనే లేచి నీ త్రోవను పోవ
10 చ్చునని అతనితో చెప్పినను । అతడు అక్కడ ఆ
రాత్రి గడుపనొల్లక లేచి వెళ్లి, యెబూసను యెరూష
లేము ఎదుటికి వచ్చెను. అప్పుడు జీను కట్టబడిన
11 రెండు గాడిదెలును । అతని ఉపపత్నియు అతనితో
కూడ ఉండెను. వారు యెబూసుకు సమీపించి
నప్పుడు ప్రొద్దు చాలా వాలెను గనుక అతని
దాసుడు—మనము యెబూసీయులదైన యీ పట్టణము
ప్రవేశించి దానిలో ఈ రాత్రి బసచేయుదము రండని
12 తన యజమానునితో చెప్పగా । అతని యజమానుడు
—ఇశ్రాయేలీయులు కాని అన్యుని పట్టణము ప్రవేశిం
పము, గిబియావరకు ప్రయాణము చేయుదమనెను. ।
13 మరియు అతడు—నీవు రమ్ము, ఈ స్థలములలో ఏదో
ఒక ఊరికి సమీపించి గిబియాలోనే గాని రామా
14 లోనే గాని యీ రాత్రి బసచేసెదమనెను. । అప్పుడు
వారు సాగి వెళ్లుచుండగా బెన్యామీనీయుల గిబియా
15 దగ్గర నున్నప్పుడు ప్రొద్దు గ్రుంకెను. । కావున
వారు గిబియాలో ఆ రాత్రి గడుపుటకు అక్కడికి
చేరసాగిరి; అతడు చేరి ఆ ఊరి సంత వీధిలో నుండెను,
బసచేయుటకు ఎవడును వారిని తన యింటికి పిలువ
16 లేదు. । ఆ చోటి మనుష్యులు బెన్యామీనీయులు.

సాయంకాలమున ఒక ముసలివాడు పొలములోనుండి తన
పనినుండి వచ్చెను. అతడు ఎఫ్రాయిమీయుల మన్య
ప్రదేశమునుండి వచ్చి గిబియాలో నివసించువాడు. ।
అతడు కన్నులెత్తి ఊరి సంత వీధిలో ప్రయాణస్థుడైన 17
ఆ మనుష్యుని చూచి—నీ వెక్కడికి వెళ్లుచున్నావు?
నీ వెక్కడనుండి వచ్చితివి! అని అడిగెను. । అందు 18
కతడు—మేము యూదా బేత్లెహేమునుండి ఎఫ్రాయి
మీయుల మన్యము అవతలకు వెళ్లుచున్నాము. నేను
అక్కడివాడను; నేను యూదా బేత్లెహేమునకు
పోయియుంటిని, ఇప్పుడు యెహోవా మందిరము
నకు వెళ్లుచున్నాను, ఎవడును తన యింట నన్ను చేర్చు
కొనలేదు. । అయితే మా గాడిదెలకు గడ్డి మొదలైన 19
మేతయు నాకును నా పనికత్తెకును నీ దాసులతో
కూడనున్న నా నౌకరులకును ఆహారమును ద్రాక్షా
రసమును ఉన్నవి, ఏదియు తక్కువలేదని అతనితో
చెప్పగా । ఆ ముసలివాడు—నీకు క్షేమమగుగాక, నీకే 20
మైన తక్కువైనయెడల వాటిభారము నామీద ఉం
చుము. । మెట్టుకు వీధిలో రాత్రి గడపకూడదని 21
చెప్పి, తన యింట అతని చేర్చుకొని వారి గాడిదెల
కొరకు మేత సిద్ధపరచెను. అప్పుడు వారు కాళ్లు
కడుగుకొని అన్నపానములు పుచ్చుకొనిరి. । వారు 22
సంతోషించుచుండగా ఆ ఊరివారిలో కొందరు పోకి
రీలు ఆ యిల్లు చుట్టుకొని తలుపుకొట్టి—నీ యింటికి
వచ్చిన మనుష్యుని మేము ఎరుగునట్లు అతని బయటికి
తెమ్మని యింటి యజమానుడైన ఆ ముసలివానితో
అనగా । యింటి యజమానుడైన ఆ మనుష్యుడు వారి 23
యొద్దకు బయలువెళ్లి — నా సహోదరులారా, అడి
కూడదు, అట్టి దుష్కార్యము చేయకూడదు, ఈ మను
ష్యుడు నా యింటికి వచ్చెను గనుక మీరు ఈ వెర్రి
పని చేయకుడి. । ఇదిగో కన్యకయైన నా కుమార్తె 24
యును ఆ మనుష్యుని ఉపపత్నియు నున్నారు, నేను
వారిని బయటికి తీసికొని వచ్చెదను, మీరు వారిని నీచ
పరచి మీ యిష్టప్రకారముగా వారియెడల జరిగింప
వచ్చునుగాని యీ మనుష్యునియెడల ఈ వెర్రిపని
చేయకుడని వారితో చెప్పెనుగాని । అతని మాట విను 25
టకు వారికి మనస్సు లేకపోయెను గనుక ఆ మను
ష్యుడు బయటనున్నవారియొద్దకు తన ఉపపత్నిని తీసి
కొనిపోగా వారు ఆమెను కూడి ఉదయమువరకు ఆ
రాత్రి అంతయు ఆమెను చెరుపుచుండిరి. తెల్లవారగా
వారు ఆమెను విడిచి వెళ్లిరి. । ప్రాతఃకాలమున ఆ 26
స్త్రీ వచ్చి వెలుగువచ్చువరకు తన యజమానుడున్న ఆ
మనుష్యుని యింటిద్వారమున పడియుండెను. । ఉద 27
యమున ఆమె యజమానుడు లేచి యింటి తలుపులను
తీసి తన త్రోవను వెళ్లుటకు బయలుదేరగా అతని ఉప
పత్నియైన ఆ స్త్రీ యింటిద్వారమునొద్ద పడి చేతులు
గడపమీద చాపియుండెను. । అతడు—లెమ్ము వెళ్లుద 28

మనగా ఆమె ప్రత్యుత్తరమియ్యకుండెను గనుక అతడు
గాడిదమీద ఆమెను ఉంచి లేచి తనచోటికి ప్రయా
29 ణము చేయసాగెను. । అతడు తన యింటికి వచ్చి
నప్పుడు కత్తి పట్టుకొని తన ఉపపత్నిని తీసికొని,
ఆమెను ఆమె కీళ్లప్రకారము పన్నెండు ముక్కలుగా
కోసి, ఇశ్రాయేలీయుల దిక్కులన్నిటికి ఆ ముక్కలను
30 పంపెను. । అప్పుడు దాని చూచినవారందరు, ఇశ్రా
యేలీయులు ఐగుప్తుదేశములోనుండి వచ్చిన దినము
మొదలుకొని నేటివరకు ఈలాటిపని జరుగుటయైనను
వినబడుటయైనను లేదు; మీరు ఇది మనస్సునకు తెచ్చు
కొని దీనినిబట్టి ఆలోచనచేసి దీనినిగూర్చి మాటలాడు
డని ఒకరితో నొకరు చెప్పుకొనిరి.

**20** అంతట ఇశ్రాయేలీయులందరు బయలుదేరి దాను
మొదలుకొని బెయేర్షెబావరకును గిలాదుదేశమువర
కును వారి సమాజము ఏకమనస్సు కలిగి మిస్పాలో
2 యెహోవా సన్నిధిని కూడెను. । దేవుని జనసమా
జమునకు చేరినవారై ఇశ్రాయేలీయుల గోత్రము
లన్నిటికి పెద్దలుగా నున్నవారు కత్తిదూయు నాలుగు
3 లక్షల కాలుబలము కూడుకొనిరి. । ఇశ్రాయేలీ
యులు మిస్పాకు వచ్చియున్నారని బెన్యామీనీ
యులు వినిరి. ఇశ్రాయేలీయులు—ఈ చెడుతనము
ఎట్లు చేయబడెనో అది చెప్పుడని యడుగగా ।
4 చంపబడిన స్త్రీ పెనిమిటియైన లేవీయుడు ఉత్తరమిచ్చిన
దేమనగా—బెన్యామీనీయుల గిబియాలో రాత్రి బస
చేయుటకై నేనును నా ఉపపత్నియు వచ్చియుం
5 డగా । గిబియావారు నా మీదికి లేచి రాత్రి నేనున్న
6 యిల్లు చుట్టుకొని నన్ను చంప తలచి । నా ఉప
పత్నిని బలవంతముచేయగా ఆమె చనిపోయెను. వారు
ఇశ్రాయేలీయులలో దుష్కార్యమును వెఱ్ఱిపనిని చేసి
రని నేను తెలిసికొని, నా ఉపపత్నిని పట్టుకొని
ఆమెను ముక్కలుగా కోసి ఇశ్రాయేలీయుల స్వాస్థ్య
7 మైన దేశమంతటికి ఆ ముక్కలను పంపితిని. । ఇదిగో
ఇశ్రాయేలీయులారా, యిక్కడనే మీరందరు కూడి
యున్నారు, ఈ సంగతినిగూర్చి ఆలోచనచేసి చెప్పు
8 డనెను. । అప్పుడు జనులందరు ఏకీభవించి లేచి—
మనలో ఎవడును తన గుడారమునకు వెళ్లడు, ఎవ
9 డును ఇంటికి వెళ్లడు, । మనము గిబియాయెడల జరి
గింపవలసినదానిని నెరవేర్చుటకై చీట్లు వేసి దాని
మీదికి పోదుము. జనులు బెన్యామీనీయుల గిబి
10 యాకు వచ్చి । ఇశ్రాయేలీయులలో జరిగిన వెఱ్ఱి
తనము విషయమై పగతీర్చుకొనుటకు వెళ్లువారికొరకు
ఆహారము తెచ్చుటకై మనము ఇశ్రాయేలీయుల గోత్ర
ములన్నిటిలో నూటికి పదిమంది మనుష్యులను, వెయ్యిం
టికి నూరుమందిని, పదివేలకు వెయ్యిమందిని ఏర్ప
11 రచుకొందము రండని చెప్పుకొనిరి. । కాబట్టి ఇశ్రా
యేలీయులందరు ఒక్క మనుష్యుడైనట్టుగా ఏకీభవించి
ఆ ఊరివారితో యుద్ధముచేయుటకు కూడిరి.

ఇశ్రాయేలీయులు బెన్యామీనీయులందరియొద్దకు 12
మనుష్యులను పంపి—మీలో జరిగిన యీ చెడుతన
మేమిటి? । గిబియాలోనున్న ఆ దుష్టులను అప్పగిం 13
చుడి; వారిని చంపి ఇశ్రాయేలీయులలోనుండి దోష
మును పరిహరింపచేయుదమని పలికింపగా, బెన్యామీ
నీయులు తమ సహోదరులగు ఇశ్రాయేలీయుల మాట
విననొల్లక । యుద్ధమునకు బయలుదేరవలెనని తమ 14
పట్టణములలోనుండి వచ్చి గిబియాలో కూడుకొనిరి. ।
ఆ దినమున బెన్యామీనీయులు తమ జనసంఖ్యను 15
మొత్తముచేయగా ఏడునూర్లమందియైన గిబియానివా
సులుగాక కత్తిదూయ సమర్థులై పట్టణములనుండి
వచ్చినవారు ఇరువదియారు వేలమందియైరి. । ఆ సమస్త 16
జనములో నేర్పరచబడిన యేడునూర్లమంది యెడమ
చేతి వాటముగలవారు. వీరిలో ప్రతివాడును గురిగా
నుంచబడిన తలవెండ్రుకమీదికి వడిసెలరాయి తప్పక
విసరగలవాడు.

బెన్యామీనీయులు గాక ఇశ్రాయేలీయులలో 17
ఖడ్గముదూయు నాలుగులక్షలమంది లెక్కింపబడిరి;
వీరందరు యోధులు. । వీరు లేచి బేతేలుకు పోయి— 18
ఇశ్రాయేలీయులు బెన్యామీనీయులతో చేయవలసిన
యుద్ధమునకు మాలో ఎవరు ముందుగా వెళ్లవలెనని
దేవునియొద్ద మనవిచేసినప్పుడు యెహోవా—
యూదా వంశస్థులు ముందుగా వెళ్లవలెనని సెలవి
చ్చెను. । కాబట్టి ఇశ్రాయేలీయులు ఉదయముననే 19
లేచి గిబియాకు ఎదురుగా దిగిరి. । ఇశ్రాయేలీయులు 20
బెన్యామీనీయులతో యుద్ధముచేయ బయలుదేరి
వచ్చుడు ఇశ్రాయేలీయులు గిబియామీద పడుటకు
యుద్ధపంక్తులు తీర్చగా । బెన్యామీనీయులు గిబియా 21
లోనుండి బయటికివచ్చి ఆ దినమున ఇశ్రాయేలీయు
లలో ఇరువదిరెండు వేలమందిని నేల గూల్చిరి. ।
అయితే ఇశ్రాయేలీయులు ధైర్యము తెచ్చుకొని, తాము 22
మొదట ఎక్కడ యుద్ధపంక్తి తీర్చిరో ఆ చోటనే
మరల యుద్ధము జరుగవలెనని తిమ్మును తాము యుద్ధ
పంక్తులుగా తీర్చుకొనిరి. । మరియు ఇశ్రాయేలీయులు 23
పోయి సాయంకాలమువరకు యెహోవా ఎదుట
ఏడ్చుచు—మా సహోదరులైన బెన్యామీనీయులతో
యుద్ధముచేయుటకు తిరిగి పోదుమా? అని యెహోవా
యొద్ద విచారణచేయగా యెహోవా—వారితో
యుద్ధము చేయబోవుడని సెలవిచ్చెను.

కాబట్టి ఇశ్రాయేలీయులు రెండవ దినమున బెన్యా 24
మీనీయులతో యుద్ధము చేయ రాగా, ఆ రెండవ
దినమున బెన్యామీనీయులు వారిని ఎదుర్కొనుటకు ।
గిబియాలోనుండి బయలుదేరి వచ్చి ఇశ్రాయేలీయు 25
లలో పదునెనిమిది వేలమందిని నేలగూల్చి సంహరిం

26 చిరి. । వీరందరు కత్తిదూయువారు. అప్పుడు ఇశ్రా
యేలీయులందరును జనులందరును పోయి, బేతేలును
ప్రవేశించి యేడ్చుచు సాయంకాలమువరకు అక్కడ
యెహోవా సన్నిధిని కూర్చుండుచు ఉపవాసముండి
దహనబలులను సమాధానబలులను యెహోవా సన్ని
27 ధిని అర్పించిరి. । ఆ దినములలో యెహోవా నిబం
28 ధన మందసము అక్కడనే యుండెను. । అహరోను
మనుమడును ఎలాజారు కుమారుడునైన ఫీనెహాసు ఆ
దినములలో దానియెదుట నిలుచువాడు ఇశ్రాయేలీ
యులు మరల—మా సహోదరులైన బెన్యామీనీయు
లతో యుద్ధమునకు పోదుమా, మానుదుమా? అని
యెహోవాయొద్ద విచారణచేయగా యెహోవా—
వెళ్లుడి రేపు నీ చేతికి వారిని అప్పగించెదనని సెలవి
29 చ్చెను. । అప్పుడు ఇశ్రాయేలీయులు గిబియాచుట్టు
మాటుగాండ్లను పెట్టిరి.
30 మూడవ దినమున ఇశ్రాయేలీయులు బెన్యామీనీ
యులతో యుద్ధమునకు పోయి మునుపటివలె గిబియా
31 వారితో యుద్ధము చేయుటకు సిద్ధపడగా । బెన్యా
మీనీయులు వారిని ఎదుర్కొనుటకు బయలుదేరి పట్టణ
ములోనుండి తొలగివచ్చి మునుపటివలె ఇశ్రాయేలీయు
లలో గాయపరచబడినవారిని ఇంచుమించు ముప్పది
మంది మనుష్యులను రాజమార్గములలో చంపుచు
వచ్చిరి. ఆ మార్గములలో ఒకటి బేతేలుకును ఒకటి
32 పొలములోనున్న గిబియాకును పోవుచున్నవి. । బెన్యా
మీనీయులు—మునుపటివలె వారు మన యెదుట
నిలువలేక కొట్టబడియున్నారని అనుకొనిరిగాని ఇశ్రా
యేలీయులు—మనము పారిపోయి వారిని పట్టణము
లోనుండి రాజమార్గములలోనికి రాజేయుదము రండని
33 చెప్పుకొనియుండిరి. । ఇశ్రాయేలీయులందరు తమ
చోటునుండి లేచి బయల్తామారులో తమ్మునుతాము
యుద్ధమునకు సిద్ధపడుటలోగా ఇశ్రాయేలీయుల
మాటుగాండ్లును తమ చోటునుండి గిబియా బట్టబయటి
34 మార్గమునకు త్వరగా వచ్చిరి. । అప్పుడు ఇశ్రాయేలీ
యులందరిలోనుండి ఏర్పరచబడిన పది వేలమంది గిబి
యాకు ఎదురుగా వచ్చినందున కఠినయుద్ధము జరిగెను.
అయితే తమకు అపాయము తటస్థమైనదని బెన్యామీ
35 నీయులకు తెలియలేదు. । అప్పుడు యెహోవా ఇశ్రా
యేలీయులచేత బెన్యామీనీయులను హతముచేయిం
చెను. ఆ దినమున ఇశ్రాయేలీయులు బెన్యామీనీ
యులలో ఇరువదియయిదు వేల నూరుమంది మనుష్యు
లను చంపిరి. వీరందరు కత్తిదూయువారు.
36 బెన్యామీనీయులు జరుగుదాని చూచి తమకు అప
జయము కలిగినదని తెలిసికొనిరి. ఇశ్రాయేలీయులు
తాము గిబియామీద పెట్టిన మాటుగాండ్లను నమ్మి
37 బెన్యామీనీయులకు స్థలమిచ్చిరి. । మాటున నున్న
వారు త్వరపడి గిబియాలో చొరబడి కత్తివాతను ఆ
పట్టణములోనివారినందరిని హతముచేసిరి. । ఇశ్రా 38
యేలీయులకును మాటుగాండ్లకును నిర్ణయమైన సంకేత
మొకటి యుండెను; అదేదనగా వారు పట్టణములో
నుండి పొగ గొప్ప మేఘమువలె లేచునట్లు చేయు
టయే. । ఇశ్రాయేలీయులు యుద్ధమునుండి వెనుకతీసి 39
తిరిగినప్పుడు బెన్యామీనీయులు—వీరు మొదటి
యుద్ధములో అపజయమొందినట్లు మనచేత ఓడిపోవు
దురు గదా అనుకొని, చంపనారంభించి, ఇశ్రాయేలీ
యులలో ఇంచుమించు ముప్పదిమంది మనుష్యులను
హతము చేసిరి. । అయితే పట్టణమునుండి ఆకాశము 40
తట్టు స్తంభరూపముగా పొగ పైకిలేవ నారంభింపగా
బెన్యామీనీయులు వెనుకతట్టు తిరిగి చూచిరి. అప్పుడు
ఆ పట్టణమంతయు ధూమ మయమై ఆకాశమున
కెక్కుచుండెను. । ఇశ్రాయేలీయులు తిరిగినప్పుడు 41
బెన్యామీనీయులు తమకు అపజయము కలిగినదని
తెలిసికొని విభ్రాంతినొంది । యెడారి మార్గముతట్టు 42
వెళ్లుదమని ఇశ్రాయేలీయుల యెదుట వెనుకకు తిరిగిరి
గాని, యుద్ధమున తరుమబడగా పట్టణములలోనుండి
వచ్చినవారు మధ్య మార్గమందే వారిని చంపిరి. । ఇశ్రా 43
యేలీయులు బెన్యామీనీయులను చుట్టుకొని తరిమి
తూర్పుదిక్కున గిబియాకు ఎదురుగా వారు దిగిన
స్థలమున వారిని త్రొక్కుచుండిరి. । అప్పుడు బెన్యా 44
మీనీయులలో పదునెనిమిది వేలమంది మనుష్యులు
పడిపోయిరి. వీరందరు పరాక్రమవంతులు. । అప్పుడు 45
మిగిలినవారు తిరిగి యెడారిలోనున్న రిమ్మోనుబండకు
పారిపోగా, వారు రాజమార్గములలో చెదిరియున్న
అయిదువేలమంది మనుష్యులను చీలదీసి గిదోమువరకు
వారిని వెంటాడి తరిమి వారిలో రెండు వేలమందిని
చంపిరి. । ఆ దినమున బెన్యామీనీయులలో పడి 46
పోయినవారందరు కత్తిదూయు ఇరువదియయిదువేల
మంది, వీరందరు పరాక్రమవంతులు. । ఆరునూర్లమంది 47
తిరిగి యెడారిలోనున్న రిమ్మోను కొండకు పారిపోయి
రిమ్మోను కొండమీద నాలుగు నెలలు నివసించిరి. ।
మరియు ఇశ్రాయేలీయులు బెన్యామీనీయులమీదికి 48
తిరిగి వచ్చి పట్టణనివాసులనేమి పశువులనేమి దొరికిన
సమస్తమును కత్తివాత హతముచేసిరి. ఇదియుగాక వారు
తాము పట్టుకొనిన పట్టణములన్నిటిని అగ్ని చేత కాల్చి
వేసిరి.

**21** ఇశ్రాయేలీయులు తమలో ఎవడును తన కుమా
ర్తెను బెన్యామీనీయుని కియ్యకూడదని మిస్పాలో
ప్రమాణము చేసికొని యుండిరి. । ప్రజలు బేతే 2
లుకు వచ్చి దేవుని సన్నిధిని సాయంకాలమువరకు
కూర్చుండి । —యెహోవా ఇశ్రాయేలీయుల దేవా, 3
నేడు ఇశ్రాయేలీయులలో ఒక గోత్రము లేకపో
యెను. ఇది ఇశ్రాయేలీయులకు సంభవింపనేల అని
బహుగా ఏడ్చిరి. । మరునాడు జనులు వేకువనే లేచి 4

# రూతు



1 న్యాయాధిపతులు ఏలిన దినములయందు దేశ
ములో కరవు కలుగగా యూదా బేత్లెహేమునుండి
ఒక మనుష్యుడు తన భార్యను తన యిద్దరు కుమారు
లను వెంటబెట్టుకొని మోయాబుదేశమున కాపుర
2 ముండుటకు వెళ్లెను. । ఆ మనుష్యుని పేరు ఎలీమెలెకు,
అతని భార్య పేరు నయోమి; అతని యిద్దరు కుమారుల
పేళ్లు మహ్లోను కిల్యోను; వారు యూదా బేత్లె
హేమువారైన ఎఫ్రాతీయులు; వారు మోయాబు
3 దేశమునకు వెళ్లి అక్కడ కాపురముండిరి. । నయోమి
పెనిమిటియైన ఎలీమెలెకు చనిపోయిన తరువాత ఆమె
4 యును ఆమె యిద్దరు కుమారులును నిలిచియుండిరి. । వారు
మోయాబుస్త్రీలను పెండ్లిచేసికొనిరి. వారిలో ఒక దాని
5 పేరు ఓర్పా రెండవదాని పేరు రూతు. । వారు ఇంచు
మించు పది సంవత్సరములు అక్కడ నివసించిన తరు
వాత మహ్లోను కిల్యోనను ఇద్దరును చనిపోయిరి;
కాగా ఆ స్త్రీ తాను కనిన యిద్దరుకుమారులును తన
6 పెనిమిటియు లేనిదాయెను. । వారికి ఆహారమిచ్చు
టకు యెహోవా తన జనులను దర్శించెనని ఆమె
మోయాబుదేశములో వినెను గనుక మోయాబుదేశము
విడిచి వెళ్లుటకై ఆమెయు ఆమె కోడండ్రును
7 ప్రయాణమైరి. । అప్పుడు ఆమెయున్న స్థలమునుండి
ఆమెతోకూడ ఆమె యిద్దరు కోడండ్రును బయలు
దేరి యూదాదేశమునకు తిరిగి పోవలెనని మార్గమున
8 వెళ్లుచుండగా । నయోమి తన యిద్దరు కోడండ్రను
చూచి—మీరు మీ తల్లుల యిండ్లకు తిరిగి వెళ్లుడి;
చనిపోయినవారియెడలను నా యెడలను మీరు దయ
చూపినట్లు యెహోవా మీయెడల దయచూపు
9 గాక; । మీలో ఒక్కొక్కతె పెండ్లిచేసికొని తన
యింట నెమ్మదినొందునట్లు యెహోవా దయచేయు
గాక అని వారితో చెప్పి వారిని ముద్దుపెట్టుకొనెను. ।
10 అంతట వారు ఎలుగెత్తి యేడ్చి—నీ ప్రజలయొద్దకు
నీతోకూడ వచ్చెదమని ఆమెతో చెప్పగా । నయోమి
—నా కుమార్తెలారా, మీరు మరలుడి; నాతోకూడ
మీరు రానేల? మిమ్మును పెండ్లిచేసికొనుటకై యింక
కుమారులు నా గర్భమున నుందురా? । నా కుమార్తె
లారా, తిరిగి వెళ్లుడి; నేను పురుషునితో నుండలేని
ముసలిదానను; నాకు నమ్మిక కలదని చెప్పి ఈ రాత్రి
పురుషునితోనుండి కుమారులను కనినను । వారు పెద్ద
వారగువరకు వారికొరకు మీరు కనిపెట్టుకొందురా?
మీరు వారికొరకు కనిపెట్టుకొని పురుషులు లేక
యొంటరికత్తెలై యుందురా? నా కుమార్తెలారా, అది
కూడదు; యెహోవా నాకు విరోధియాయెను; అది
మిమ్మును నొప్పించినంతకంటె నన్ను మరి యెక్కువగా
నొప్పించినదని వారితో చెప్పెను. । వారు ఎలుగెత్తి 14
యేడ్వగా ఓర్పా తన అత్తను ముద్దుపెట్టుకొనెను,
రూతు ఆమెను హత్తుకొనెను. ఇట్లుండగా । ఆమె 15
—ఇదిగో నీ తోడికోడలు తన జనులయొద్దకును తన
దేవునియొద్దకును తిరిగి పోయినదే; నీవును నీ తోడి
కోడలివెంబడి వెళ్లుమనెను. । అందుకు రూతు—నా 16
వెంబడి రావద్దనియు నన్ను విడిచిపెట్టుమనియు నన్ను
బ్రతిమాలుకొనవద్దు. నీవు వెళ్లుచోటికే నేను వచ్చె
దను, నీవు నివసించుచోటనే నేను నివసించెదను, నీ
జనమే నా జనము నీ దేవుడే నా దేవుడు; । నీవు 17
మృతిబొందు చోటను నేను మృతిబొందెదను, అక్క
డనే పాతిపెట్టబడెదను. మరణము తప్ప మరి ఏదైనను
నిన్ను నన్ను ప్రత్యేకించినయెడల యెహోవా నాకు
ఎంత కీడైన చేయుగాక అనెను. । తనతోకూడ వచ్చు 18
టకు ఆమెకు మనస్సు కుదిరినదని నయోమి తెలిసికొని
నప్పుడు అందునుగురించి ఆమెతో మాటలాడుట
మానెను గనుక వారిద్దరు బేత్లెహేముకు వచ్చువరకు
ప్రయాణము చేసిరి. । వారు బేత్లెహేముకు వచ్చి 19
నప్పుడు ఆ ఊరివారందరు వారియొద్దకు గుంపుకూడి
వచ్చి—ఈమె నయోమి గదా అని అనుకొనుచుండగా ।
ఆమె—సర్వశక్తుడు నాకు చాలా దుఃఖము కలుగ 20
జేసెను గనుక నన్ను నయోమి అనక మారా అనుడి. ।
నేను సమృద్ధిగలదాననై వెళ్లితిని, యెహోవా నన్ను 21
రిక్తురాలినిగా తిరిగి రాజేసెను. మీరు నన్ను నయోమి
అని పిలువనేల? యెహోవా నామీద సాక్ష్యము
పలికెను, సర్వశక్తుడు నన్ను బాధపరచెను అని వారితో
చెప్పెను. । అట్లు నయోమియు ఆమెతోకూడ మోయా 22
బీయురాలైన రూతు అను ఆమె కోడలును మోయాబు
దేశమునుండి తిరిగి వచ్చిరి. వారిద్దరు యవలకోత
ఆరంభములో బేత్లెహేము చేరిరి.

నయోమి పెనిమిటికి బంధువు డొకడుండెను. 2
అతడు చాల ఆస్తిపరుడు, అతడు ఎలీమెలెకు వంశపు
వాడై యుండెను, అతని పేరు బోయజు. । మోయా 2
బీయురాలైన రూతు—నీ సెలవైనయెడల నేను పొలమునకు
లోకి పోయి, యెవని కటాక్షము పొందగలనో వా
వెనుక పరిగె నేరుకొందునని నయోమితో చెప్పగా
ఆమె—నా కుమారీ పొమ్మనెను. । కాబట్టి ఆమె వె

పొలములోకి వచ్చి చేను కోయువారి వెనుక పొల
ములో ఏరుకొనెను. ఆ పొలములో ఆమె పోయిన
భాగము ఎలీమెలెకు వంశపువాడైన బోయజుది. ।
4 బోయజు బేత్లెహేమునుండి వచ్చి — యెహోవా
మీకు తోడై యుండునుగాకని చేను కోయువారితో
చెప్పగా వారు — యెహోవా నిన్ను ఆశీర్వదించు
5 గాకనిరి. । అప్పుడు బోయజు కోయువారిమీద ఉంచ
బడిన తన పనివానిని చూచి—ఈ చిన్నది ఎవరిదని
6 అడుగగా । కోయువారిమీద నుంచబడిన ఆ పనివాడు
— ఈమె మోయాబుదేశమునుండి నయోమితోకూడ
తిరిగి వచ్చిన మోయాబీయురాలైన యౌవనురాలు. ।
7 ఆమె—నేను కోయువారి వెనుకను పనలమధ్యను ఏరు
కొని కూర్చుకొనుటకు దయచేసి నాకు సెలవిమ్మని అడి
గెను. ఆమె వచ్చి ఉదయము మొదలుకొని యిదివరకు
ఏరుకొనుచుండెను, కొంతసేపుమాత్రము ఆమె యింట
8 కూర్చుండెనని వాడు చెప్పెను. । అప్పుడు బోయజు
రూతును చూచి—నా కుమారీ, నా మాట వినుము;
వేరొక పొలములో ఏరుకొనుటకు పోవద్దు, దీని విడిచి
పోవద్దు, ఇచ్చట నా పనికత్తెలయొద్ద నిలకడగా ఉం
9 డుము. । వారు కోయు చేను కనిపెట్టి వారిని వెంబ
డించుము, నిన్ను ముట్టకూడదని యౌవనస్థులకు ఆజ్ఞా
పించి యున్నాను, నీకు దాహమగునప్పుడు కుండల
యొద్దకు పోయి పనివారు చేదు నీళ్లు త్రాగుమని
10 చెప్పెను. । అందుకు ఆమె సాగిలపడి తలవంచుకొని—
ఏమి తెలిసి పరదేశినైన నాయందు లక్ష్యముంచునట్లు
నీకు కటాక్షము కలిగెనో అని చెప్పగా బోయజు—
నీ పెనిమిటి మరణమైన తరువాత నీవు నీ అత్తకు చేసిన
11 దంతయు నాకు తెలియబడెను. । నీవు నీ తలిదండ్రు
లను నీ జన్మభూమిని విడిచి, యింతకుముందు నీవు ఎరు
12 గని జనమునొద్దకు వచ్చితివి. । యెహోవా నీవు
చేసినదానికి ప్రతిఫలమిచ్చును; ఇశ్రాయేలీయుల దేవు
డైన యెహోవా రెక్కలక్రింద సురక్షితముగా
నుండునట్లు నీవు వచ్చితివి; ఆయన నీకు సంపూర్ణమైన
13 బహుమానమిచ్చునని ఆమెకుత్తరమిచ్చెను. । అందుకు
ఆమె—నా యేలినవాడా, నేను నీ పనికత్తెలలో ఒక
దానను కాకపోయినను, నీవు నన్నాదరించి నీ దాసు
రాలగు నాయందు ప్రేమగలిగి మాటలాడితివి గనుక
నాయెడల నీకు కటాక్షము కలుగనిమ్మని చెప్పెను. ।
14 అందుకు బోయజు—భోజనకాలమున నీవిక్కడికి వచ్చి
భోజనముచేసి చిరకలో నీ ముక్క ముంచి తినుమని
ఆమెతో చెప్పగా, చేను కోయువారియొద్ద ఆమె
కూర్చుండెను. అతడు ఆమెకు పేలాలు అందియ్యగా
15 ఆమె తిని తృప్తిపొంది కొన్ని మిగిల్చెను. । ఆమె
యేరుకొనుటకు లేచినప్పుడు బోయజు — ఆమె పనల
మధ్యను ఏరుకొనవచ్చును, ఆమెను అవమానపరచ
16 కుడి. । మరియు ఆమెకొరకు పిడికెళ్లు పడవేసి ఆమె
యేరుకొనునట్లు విడిచిపెట్టుడి, ఆమెను గద్దింపవద్దని
తన దాసులకాజ్ఞాపించెను. । కాబట్టి ఆమె అస్తమయ 17
మువరకు ఆ చేనిలో ఏరుకొనుచు, తాను ఏరుకొనిన
దానిని దుల్లకొట్టగా అవి దాదాపు తూమెడు యవ
లాయెను. । ఆమె వాటిని ఎత్తికొని ఊరిలోకి వచ్చి 18
నప్పుడు ఆమె అత్త ఆమె యేరుకొనినవాటిని చూచెను.
ఆమె తిని తృప్తిపొందిన తరువాత తాను మిగిల్చినదాని
చూపించి ఆమెకిచ్చెను. । అంతట ఆమె అత్త ఆమెను 19
చూచి—నేడు నీ వెక్కడ ఏరుకొంటివి? ఎక్కడ పని
చేసితివి? నీయందు లక్ష్యముంచినవాడు దీవింపబడు
గాక అనగా, ఆమె తాను ఎవనియొద్ద పనిచేసెనో అది
తన అత్తకు తెలియచెప్పి — ఎవనియొద్ద నేడు పనిచేసి
తినో అతనిపేరు బోయజు అనెను. । నయోమి — 20
బ్రదికియున్నవారికిని చచ్చినవారికిని ఉపకారము
చేయుట మానని యితడు యెహోవాచేత ఆశీర్వదింప
బడుగాక అని తన కోడలితో అనెను. మరియు
నయోమి — ఆ మనుష్యుడు మనకు సమీపబంధువుడు,
అతడు మనలను విడిపింపగలవారిలో ఒకడని చెప్పగా ।
మోయాబీయురాలైన రూతు—అంతేకాదు, అతడు 21
నన్ను చూచి, తనకు కలిగిన పంట కోత అంతయు
ముగించువరకు తన పనివారియొద్ద నిలకడగా ఉండు
మని నాతో చెప్పెననెను. । అప్పుడు నయోమి తన 22
కోడలైన రూతును చూచి—నా కుమారీ, అతని పని
కత్తెలతోకూడనే బయలుదేరుము వేరొక చేనిలోని
వారికి నీవు కనబడకపోవుట మంచిదనెను. । కాబట్టి 23
యవలకోతయు గోధుమలకోతయు ముగియువరకు
ఆమె యేరుకొనుచు బోయజు పనికత్తెలయొద్ద నిల
కడగానుండి తన అత్త యింట నివసించెను.

**ఆ**మె అత్తయైన నయోమి — నా కుమారీ, నీకు 3
మేలుకలుగునట్లు నేను నీ కొరకు విశ్రాంతి విచారింప
వలసినదానను గదా. । ఎవని పనికత్తెలయొద్ద నీవు ఉం 2
టివో ఆ బోయజు మనకు బంధువుడు. ఇదిగో యీ
రాత్రి అతడు కళ్లమున యవలు తూర్పారబట్టింప
బోవుచున్నాడు. । నీవు స్నానముచేసి తైలము రాచు 3
కొని నీ బట్టలు కట్టుకొని ఆ కళ్లమునకు వెళ్లుము;
అతడు అన్నపానములు పుచ్చుకొనుట చాలించువరకు
నీవు అతనికి మరుగైయుండుము. । అతడు పండు 4
కొనిన తరువాత అతడు పండుకొనిన స్థలమును గుర్తె
రిగి లోపలికి పోయి అతని కాళ్లమీదనున్న బట్ట తీసి
పండుకొనవలెను; నీవు చేయవలసినదాని అతడు నీకు
తెలియజేయునని ఆమెతో అనగా । ఆమె—నీవు సెల 5
విచ్చినదంతయు చేసెదనని చెప్పి । ఆ కళ్లమునొద్దకు 6
పోయి తన అత్త ఆజ్ఞాపించినదంతయు చేసెను. । బో 7
యజు మనస్సున సంతోషించునట్లు అన్నపానములు
పుచ్చుకొని లోపలికి పోయి ధాన్యపు కుప్పయొద్ద
పండుకొనినప్పుడు ఆమె మెల్లగా పోయి అతని కాళ్ల

అక్కడ బలిపీఠమును కట్టి దహనబలులను సమాధాన
5 బలులను అర్పించిరి. । అప్పుడు ఇశ్రాయేలీయులు—
ఇశ్రాయేలీయుల గోత్రములన్నిటిలో మిస్పాలో
యెహోవా పక్షమున రాకపోయినవారెవరని విచా
రించిరి. ఏలయనగా అట్టివారికి నిశ్చయముగా మరణ
శిక్ష విధింపవలెనని ఖండితముగా ప్రమాణము చేసి
6 యుండిరి. । ఇశ్రాయేలీయులు తమ సహోదరులైన
బెన్యామీనీయులనుగూర్చి పశ్చాత్తాపపడి — నేడు
ఒక గోత్రము ఇశ్రాయేలీయులలో నుండకుండ కొట్టి
7 వేయబడియున్నది; । మిగిలియున్నవారికి భార్యలు
దొరకునట్లు మనము మన కుమార్తెలను వారికి పెండ్లి
చేయమని యెహోవాతోడని ప్రమాణము చేసితిమి
గదా; వారి విషయములో ఏమిచేయగలము? అని
8 చెప్పుకొనిరి. । మరియు వారు ఇశ్రాయేలీయుల గోత్ర
ములలో యెహోవా పక్షమున మిస్పాకు రానిది
9 ఏదని విచారింపగా । సమాజమునకు చేరిన యాబేష్గి
లాదునుండి సేనలోనికి ఎవడును రాలేదని తేలెను.
జనసంఖ్య చేసినప్పుడు యాబేష్గిలాదు నివాసులలో
10 ఒకడును అక్కడ ఉండలేదు. । కాబట్టి సమాజపు
వారు పరాక్రమవంతులైన పన్నెండు వేలమంది మను
ష్యులను పంపించి—మీరు పోయి స్త్రీలనేమి పిల్లలనేమి
యాబేష్గిలాదు నివాసులనందరిని కత్తివాతను హతము
11 చేయుడి. । మీరు చేయవలసినదేమనగా, ప్రతి పురు
షుని పురుషసంయోగము నెరిగిన ప్రతి స్త్రీని నశింప
12 జేయవలెనని చెప్పిరి. । యాబేష్గిలాదు నివాసులలో
పురుషసంయోగము నెరుగని నన్నూరుమంది కన్యలైన
స్త్రీలు దొరుకగా కనాను దేశమందలి షిలోహులో
నున్న సేనలోకి వారిని తీసికొనివచ్చిరి.

13 ఆ సర్వసమాజము రిమ్మోను కొండలోనున్న బెన్యా
మీనీయులతో మాటలాడుటకును వారిని సమాధాన
14 పరచుటకును వర్తమానము పంపగా । ఆ వేళను బెన్యా
మీనీయులు తిరిగి వచ్చిరి. అప్పుడు వారు తాము
యాబేష్గిలాదు స్త్రీలలో బ్రదుకనిచ్చినవారిని వారి
కిచ్చి పెండ్లిచేసిరి. ఆ స్త్రీలు వారికి చాలకపోగా ।
15 యెహోవా ఇశ్రాయేలీయుల గోత్రములలో
లోపము కలుగజేసియుండుట జనులు చూచి బెన్యా
మీనీయులనుగూర్చి పశ్చాత్తాపపడిరి.

సమాజప్రధానులు బెన్యామీను గోత్రములో 16
స్త్రీలు నశించియుండుట చూచి మిగిలినవారికి భార్యలు
దొరుకునట్లు మనమేమి చేయుదమని యోచించుకొని ।
ఇశ్రాయేలీయులలోనుండి ఒక గోత్రము తుడిచివేయ 17
బడకుండునట్లు బెన్యామీనీయులలో తప్పించుకొనిన
వారికి స్వాస్థ్యముండవలెననిరి. । ఇశ్రాయేలీయులలో 18
ఎవడైనను తన కుమార్తెను బెన్యామీనీయునికి ఇచ్చిన
పక్షమున వాడు నిర్మూలము చేయబడునని ప్రమాణము
చేసియున్నాము గనుక మనము మన కుమార్తెలను
వారికి పెండ్లి చేయకూడదని చెప్పుకొనుచుండిరి. ।
కాగా వారు బెన్యామీనీయులతో ఇట్లనిరి—ఇదిగో 19
బేతేలుకు ఉత్తరదిక్కున బేతేలునుండి షెకెముకు పోవు
రాజమార్గమునకు తూర్పుననున్న లెబోనాకు దక్షిణ
దిక్కున యెహోవాకు పండుగ ఏటేట షిలో
హులో జరుగునని చెప్పి బెన్యామీనీయులను చూచి ।
— మీరు వెళ్లి ద్రాక్షతోటలలో మాటుననుండి 20
షిలోహుస్త్రీలు నాట్యమాడువారితో కలిసి నాట్య
మాడుటకు బయలుదేరగా । ద్రాక్షతోటలలోనుండి 21
బయలుదేరివచ్చి పెండ్లిచేసికొనుటకు ప్రతివాడును
షిలోహు స్త్రీలలో ఒకదాని పట్టుకొని బెన్యామీనీ
యుల దేశమునకు పారిపోవుడి. । తరువాత వారి 22
తండ్రులైనను సహోదరులైనను వాదించుటకు మా
యొద్దకు వచ్చినయెడల మేము—ఆ యుద్ధమునుబట్టి
వారిలో ప్రతివానికిని పెండ్లికి స్త్రీ దొరకలేదు గనుక
ఈ స్త్రీలను దయచేసి మాకియ్యుడి, ఈ సమయమున
వారికిచ్చినయెడల మీరు అపరాధులగుదురు గనుక
మాకిచ్చినట్లుగా ఇయ్యుడని వారితో చెప్పెదమనిరి. ।
కాగా బెన్యామీనీయులు అట్లు చేసి తమ లెక్క 23
చొప్పున నాట్యమాడినవారిలోనుండి స్త్రీలను పట్టు
కొని వారిని తీసికొని పోయి తమ స్వాస్థ్యమునకు
వెళ్లి పట్టణములను కట్టి వాటిలో నివసించిరి. । అటు 24
పిమ్మట ఇశ్రాయేలీయులలో ప్రతివాడును అక్కడ
నుండి తమ గోత్రస్థానములకును కుటుంబములకును
పోయెను. అందరును అక్కడనుండి బయలుదేరి తమ
స్వాస్థ్యములకు పోయిరి. । ఆ దినములలో ఇశ్రాయేలీ 25
యులకు రాజు లేదు; ప్రతివాడు ఇష్టానుసారముగా
ప్రవర్తించుచువచ్చెను.

8 మీదనున్న బట్ట తీసి పండుకొనెను. । మధ్యరాత్రి
యందు అతడు ఉలికిపడి తిరిగి చూచినప్పుడు, ఒక
9 స్త్రీ అతని కాళ్లయొద్ద పండుకొనియుండెను. । అతడు—
నీ వెవరవని అడుగగా ఆమె — నేను రూతు అను నీ
దాసురాలిని; నీవు నాకు సన్నిహితజ్ఞాతివి గనుక నీ
10 దాసురాలిమీద నీ కొంగు కప్పుమనగా । అతడు—నా
కుమారీ, యెహోవావాచేత నీవు దీవెన నొందినదానవు;
కొద్దివారినే గాని గొప్పవారినే గాని యౌవనస్థులను
నీవు వెంబడింపక యుండుటవలన నీ మునుపటి సత్
ప్రవర్తనకంటె వెనుకటి సత్ప్రవర్తన మరి యెక్కువైనది. ।
11 కాబట్టి నా కుమారీ, భయపడకుము; నీవు చెప్పినదం
తయు నీకు చేసెదను. నీవు యోగ్యురాలవని నా జను
12 లందరు ఎరుగుదురు. । నేను నిన్ను విడిపింపగలవాడ
నను మాట వాస్తవమే; అయితే నీకు నాకంటె సమీప
13 మైన బంధువుడొకడున్నాడు. । ఈ రాత్రి యుం
డుము; ఉదయమున అతడు నీకు బంధువుని ధర్మము
జరిపినయెడల సరి, అతడు విడిపింపవచ్చును. నీకు బం
ధువుని ధర్మము జరుపుటకు అతనికి ఇష్టము లేకపోయిన
యెడల, యెహోవా జీవముతోడు నేనే నీకు బంధు
వుని ధర్మము జరిపెదను; ఉదయమువరకు పండుకొను
14 మని చెప్పెను. । కాబట్టి ఆమె ఉదయమువరకు అతని
కాళ్లయొద్ద పండుకొని, ఒకనినొకడు గుర్తించుపాటి
వెలుగు రాకముందే లేచెను. అప్పుడు అతడు — ఆ
స్త్రీ కళ్లమునకు వచ్చిన సంగతి తెలియజేయకుడని
15 చెప్పెను. । మరియు అతడు—నీవు వేసికొనిన దుప్పటి
తెచ్చి పట్టుకొనుమని చెప్పగా ఆమె దాని పట్టెను.
అతడు ఆరు కొలల యవలను కొలిచి ఆమె భుజము
16 మీద నుంచగా ఆమె పురములోకి వెళ్లెను. । ఆమె తన
అత్త యింటికి వచ్చినప్పుడు అత్త—నా కుమారీ, నీ పని
యెట్లు జరిగెనని యడుగగా, ఆమె ఆ మనుష్యుడు
17 తనకు చేసినదంతయు తెలియజేసి । — నీవు వట్టిచేతు
లతో నీ అత్త యింటికి పోవద్దని చెప్పి అతడు ఈ ఆరు
18 కొలల యవలను నాకిచ్చెననెను. । అప్పుడు ఆమె—
నా కుమారీ, యీ సంగతి నేటిదినమున నెరవేర్చితేనే
గాని ఆ మనుష్యుడు ఊరకుండడు గనుక యిది ఏలాగు
జరుగునో నీకు తెలియువరకు ఊరకుండుమనెను.

**4** బోయజు పురద్వారమునొద్దకు పోయి అక్కడ
కూర్చుండగా, బోయజు చెప్పిన బంధువుడు ఆ త్రోవను
పోవుచుండెను గనుక బోయజు — ఓయి, యీ తట్టు
తిరిగి ఇక్కడ కూర్చుండుమని అతని పిలువగా అతడు
2 వచ్చి కూర్చుండెను. । బోయజు ఆ ఊరి పెద్దలలో
పదిమందిని పిలిపించుకొని, ఇక్కడ కూర్చుండుడని
3 చెప్పగా వారును కూర్చుండిరి. । అతడు—మోయాబు
దేశమునుండి తిరిగి వచ్చిన నయోమి మన సహోదరు
డైన ఎలీమెలెకుకు కలిగిన భూభాగమును అమ్మివేయు
చున్నది గనుక నీవు చెవులార వినునట్లు నేనొకసంగతి
తెలియజేయవలెనని యున్నాను. । ఈ పుర నివాసుల 4
యెదుటను నా జనుల పెద్దలయెదుటను ఆ భూమిని
సంపాదించుకొనుము; ఏమనగా దాని విడిపించుటకు
నీవు ఒప్పుకొనిన పక్షమున విడిపించుము, దాని విడి
పింపనొల్లని పక్షమున అది స్పష్టముగా నాతో చెప్పుము.
నీవుగాక దాని విడిపింపవలసిన బంధువుడెవడును లేడు;
నీ తరువాతివాడను నేనే అని ఆ బంధువునితో
చెప్పెను. అందుకతడు — నేను విడిపించెదననెను. ।
బోయజు — నీవు నయోమి చేతినుండి ఆ పొలమును 5
సంపాదించుదినమున చనిపోయినవాని పేరట అతని
స్వాస్థ్యమును స్థిరపరచునట్లు చనిపోయినవాని భార్య
యైన రూతు అను మోయాబీయురాలియొద్దనుండియు
దాని సంపాదింపవలెనని చెప్పగా । ఆ బంధువుడు— 6
నేను దాని విడిపించుకొనలేను, నా స్వాస్థ్యమును
పోగొట్టుకొందునేమో, నేను దాని విడిపింపలేను గనుక
నీవే నాకు ప్రతిగా బంధువుని ధర్మము జరిగించుమని
చెప్పెను. । ఇశ్రాయేలీయులలో బంధుధర్మమును గూర్చి 7
గాని, క్రయవిక్రయములను గూర్చిగాని, ప్రతిసంగ
తిని స్థిరపరచుటకు పూర్వమున జరిగిన మర్యాద ఏద
నగా, ఒకడు తన చెప్పు తీసి తన పొరుగువాని కిచ్చు
టయే. ఈ పని ఇశ్రాయేలీయులలో ప్రమాణముగా
ఎంచబడెను. । ఆ బంధువుడు—నీవు దాని సంపాదించు 8
కొనుమని బోయజుతో చెప్పి తన చెప్పు తీయగా ।
బోయజు—ఎలీమెలెకుకు కలిగినది యావత్తును కిల్యోను 9
కును మహ్లోనుకును కలిగినది యావత్తును నయోమి
చేతినుండి సంపాదించితినని నేనన్నందుకు మీరు ఈ
దినమున సాక్షులైయున్నారు. । మరియు చనిపోయిన 10
వాని పేరట అతని స్వాస్థ్యమును స్థిరపరచునట్లును, చని
పోయినవాని పేరు అతని సహోదరులలోనుండియు,
అతని స్థలముయొక్క ద్వారమునుండియు కొట్టివేయ
బడక యుండునట్లును, నేను మహ్లోను భార్యయైన
రూతను మోయాబీయురాలిని సంపాదించుకొని పెండ్లి
చేసికొనుచున్నాను. దీనికి మీరు ఈ దినమున సాక్షులై
యున్నారని పెద్దలతోను ప్రజలందరితోను చెప్పెను. ।
అందుకు పురద్వారమునందున్న ప్రజలందరును పెద్ద 11
లును—మేము సాక్షులము, యెహోవా నీ యింటికి
వచ్చిన ఆ స్త్రీని ఇశ్రాయేలీయుల వంశమును వర్ధిల్లజేసిన
రాహేలును పోలినదానిగాను లేయాను పోలినదాని
గాను చేయుగాక; । ఎఫ్రాతాలో నీవు క్షేమాభివృద్ధి 12
కలిగినవాడవై బేత్లెహేములో నీవు ఖ్యాతినొందుదువు
గాక; యెహోవా యీ యౌవనురాలివలన నీకు
దయచేయు సంతానమును నీ కుటుంబమును తామారు
యూదాకు కనిన పెరెసు కుటుంబమువలె నుండుగా
అనిరి. । కాబట్టి బోయజు రూతును పెండ్లిచేసికొ
ఆమెయొద్దకు పోయినప్పుడు యెహోవా ఆమె గ
ర్భవతియగునట్లు అనుగ్రహించెను గనుక ఆమె కుమారు

14 [illegible] స్త్రీలు—ఈ దినమున నీకు బంధు
[illegible] యెహోవా స్తుతినొందుగాక;
[illegible] ప్రకటింపబడు
15 [illegible] ప్రేమించి యేడుగురు కుమారులకంటె
[illegible] ని కోడలు ఇతని కనెను; ఇతడు నీ
[illegible] ముసలితనమున నీకు పోషకుడగును
16 [illegible] చెప్పిరి. అప్పుడు నయోమి—ఆ
[illegible] దాదిగా
17 [illegible] స్త్రీలు—నయోమికొరకు
కుమారుడు పుట్టెనని చెప్పి అతనికి ఓబేదను పేరు
పెట్టిరి. అతడు దావీదుకు తండ్రియైన యెష్షయి
యొక్క తండ్రి.

పెరెసు వంశావళి యేదనగా—పెరెసు హెస్రో 18
నును కనెను, హెస్రోను రామును కనెను, రాము 19
అమ్మీనాదాబును కనెను, అమ్మీనాదాబు నయస్సోనును
కనెను, నయస్సోను శల్మానును కనెను, శల్మాను బోయ 20
జును కనెను, బోయజు ఓబేదును కనెను, ఓబేదు 21
యెష్షయిని కనెను, యెష్షయి దావీదును కనెను.

# సమూయేలు

## మొదటి గ్రంథము

1 ఎఫ్రాయిము మన్యమందు రామతయిమ్సోఫీము
పట్టణపువాడు ఒకడుండెను; అతని పేరు ఎల్కానా.
అతడు ఎఫ్రాతీయుడైన సూఫుకు పుట్టిన తోహు
కుమారుడైన ఎలీహుకు జననమైన యెరోహాము కుమా
2 రుడు, అతనికి ఇద్దరు భార్యలుండిరి. । వీరిలో ఒకదాని
పేరు హన్నా రెండవదాని పేరు పెనిన్నా. పెనిన్నాకు
పిల్లలు కలిగిరిగాని హన్నాకు పిల్లలులేకపోయిరి. ।
3 ఇతడు షిలోహునందున్న సైన్యములకధిపతియగు
యెహోవాకు మ్రొక్కుటకును బలి అర్పించుటకును
ఏటేట తన పట్టణము విడిచి అచ్చటికి పోవుచుండెను.
ఆ కాలమున ఏలీయొక్క యిద్దరు కుమారులగు హొఫ్నీ
ఫీనెహాసులు యెహోవాకు యాజకులుగా నుండిరి. ।
4 ఎల్కానా తాను బల్యర్పణ చేసిననాడు తన భార్య
యగు పెనిన్నాకును దాని కుమారులకును కుమార్తెల
5 కును పాళ్లు ఇచ్చుచు వచ్చెను గాని । హన్నా తనకు
ప్రియముగానున్నందున ఆమెకు రెండుపాళ్లు ఇచ్చుచు
వచ్చెను. యెహోవా ఆమెకు సంతులేకుండ చేసెను. ।
6 యెహోవా ఆమెకు సంతులేకుండ చేసియున్న హేతు
వునుబట్టి, ఆమె వైరియగు పెనిన్నా ఆమెను విసికించు
7 టకై ఆమెకు కోపము పుట్టించుచు వచ్చెను. । ఎల్కానా
ఆమెకు ఏటేట ఆ రీతిగా చేయుచు నుండగా హన్నా
యెహోవా మందిరమునకు పోవునప్పుడెల్ల అది
ఆమెకు కోపము పుట్టించెను గనుక ఆమె భోజనము
8 చేయక ఏడ్చుచు వచ్చెను. । ఆమె పెనిమిటియైన
ఎల్కానా—హన్నా, నీవెందుకు ఏడ్చుచున్నావు? నీవు
భోజనము మానుట ఏల? నీకు మనోవిచారమెందుకు
కలిగినది? పదిమంది కుమాళ్లకంటె నేను నీకు విశేష
మైనవాడను కానా? అని ఆమెతో చెప్పుచువచ్చెను. ।
9 వారు షిలోహులో అన్నపానములు పుచ్చుకొనిన
తరువాత హన్నా లేచి యాజకుడైన ఏలీ మందిర
స్తంభము దగ్గరనున్న ఆసనముమీద కూర్చునియుం
10 డగా । బహు దుఃఖాక్రాంతురాలై వచ్చి యెహోవా
సన్నిధిని ప్రార్థనచేయుచు బహుగా ఏడ్చుచు । —
11 సైన్యములకధిపతివగు యెహోవా, నీ సేవకురాలనైన
నాకు కలిగియున్న శ్రమను చూచి, నీ సేవకురాలనైన
నన్ను మరువక నన్ను జ్ఞాపకము చేసికొని, నీ సేవకు
రాలనైన నాకు మగపిల్లను దయచేసినయెడల, వాని
తలమీదికి క్షౌరపుకత్తి యెన్నటికి రానియ్యక, వాడు
బ్రదుకు దినములన్నిటను నేను వానిని యెహోవా
వగు నీకు అప్పగింతునని మ్రొక్కుబడి చేసికొనెను.
ఆమె యెహోవా సన్నిధిని ప్రార్థనచేయుచుండగా
ఏలీ ఆమె నోరు కనిపెట్టుచుండెను, । ఏలయనగా 12
హన్నా తన మనస్సులోనే చెప్పుకొనుచుండెను, ।
ఆమె పెదవులు మాత్రము కదలుచుండి ఆమె స్వరము 13
వినబడక యుండెను గనుక ఏలీ ఆమె మత్తురాలై
యున్నదనుకొని । — ఎంతపర్యంతము నీవు మత్తు 14
రాలవై యుందువు? ఒల్లు తెలియువరకు పండుకొని
లేచి పొమ్మని ఆమెతో అనగా । హన్నా—అది కాదు, 15
నా యేలినవాడా, నేను మనోదుఃఖముగలదాననై
యున్నాను; నేను ద్రాక్షారసమునైనను మద్యమునైనను
పానము చేయలేదు గాని నా ఆత్మను యెహోవా
సన్నిధిని కుమ్మరించుకొనుచున్నాను. । నీ సేవకురాల 16
నైన నన్ను చెడుదానిగా ఎంచవద్దు; అత్యంతమైన
కోపకారణమునుబట్టి బహుగా నిట్టూర్పులు విడుచుచు
నాలో నేను దీని చెప్పుకొనుచుంటినని నెను. । అంతట 17
ఏలీ—నీవు క్షేమముగా వెళ్లుము; ఇశ్రాయేలు దేవు
నితో నీవు చేసికొనిన మనవిని ఆయన దయచేయునని
ఆమెతో చెప్పగా । ఆమె అతనితో—నీ సేవకురాల 18
నైన నేను నీ దృష్టికి కృపనొందుదునుగాక అనెను.
తరువాత ఆ స్త్రీ తన దారిని వెళ్లిపోయి భోజనము
చేయుచు నాటనుండి దుఃఖముఖిగా నుండుట
మానెను. । తరువాత వారు ఉదయమందు వేగిరమే లేచి 19
యెహోవాకు మ్రొక్కి తిరిగి రామాలోని తమ యిం
టికి వచ్చిరి. అంతట ఎల్కానా తన భార్యయగు
హన్నాను కూడెను, యెహోవా ఆమెను జ్ఞాపకము
చేసికొనెను । గనుక హన్నా గర్భము ధరించి దినములు 20
నిండినప్పుడు ఒక కుమారుని కని—నేను యెహోవాకు
మ్రొక్కుకొని వీనిని అడిగితిననుకొని వానికి సమూయే
లను పేరు పెట్టెను. । ఎల్కానాయును అతని యింటి 21
వారందరును యెహోవాకు ఏటేట అర్పించు బలి నర్పిం
చుటకును మ్రొక్కుబడిని చెల్లించుటకును పోయిరి. ।
అయితే హన్నా—బిడ్డ పాలు విడుచు పర్యంతము 22
నేను రాను; వాడు యెహోవా సన్నిధిని అగుపడి
తిరిగి రాక అక్కడనే ఉండునట్లుగా నేను వాని తీసి
కొని వత్తునని తన పెనిమిటితో చెప్పి వెళ్లక యుం
డెను. । కాబట్టి ఆమె పెనిమిటియైన ఎల్కానా — నీ 23
దృష్టికి ఏది మంచిదో అది చేయుము; నీవు వానికి పాలు
మాన్పించుపర్యంతము నిలిచియుండుము, యెహోవా

తన వాక్యమును స్థిరపరచుగాక అని ఆమెతో అనెను.
కాగా ఆమె అక్కడనే యుండి తన కుమారునికి
24 పాలు మాన్పించువరకు అతని పెంచుచుండెను. । పాలు
మాన్పించిన తరువాత అతడు ఇంక చిన్నవాడై యుం
డగా ఆమె ఆ బాలుని నెత్తికొని మూడు కోడెలను
తూమెడు పిండిని ద్రాక్షారసపు తిత్తిని తీసికొని షిలో
25 హులోని మందిరమునకు వచ్చెను. । వారు ఒక కోడెను
వధించి, పిల్లవానిని ఏలీయొద్దకు తీసికొనివచ్చినప్పుడు
26 ఆమె అతనితో ఇట్లనెను ।— నా యేలినవాడా, నా
యేలినవాని ప్రాణముతోడు, నీయొద్ద నిలిచి బిడ్డను
దయచేయుమని యెహోవాను ప్రార్థనచేసిన స్త్రీని
27 నేనే. । యెహోవాతో నేను చేసిన మనవిని ఆయన
28 నాకను గ్రహించెను. । కాబట్టి నేను ఆ బిడ్డను
యెహోవాకు ప్రతిష్ఠించుచున్నాను; తాను బ్రదుకు
దినములన్నిటను వాడు యెహోవాకు ప్రతిష్ఠితుడని
చెప్పి యెహోవాకు అక్కడనే మ్రొక్కెను.

2 మరియు హన్నా విజ్ఞాపనచేసి యీలాగనెను—
నా హృదయము యెహోవాయందు సంతో
షించుచున్నది
యెహోవాయందు నాకు మహా బలముకలిగెను
నీవలని రక్షణనుబట్టి సంతోషించుచున్నాను
నా విరోధులమీద నేను అతిశయపడుదును.
2 యెహోవావంటి పరిశుద్ధ దేవుడు ఒకడునులేడు
నీవు తప్ప మరి ఏ దేవుడును లేడు
మన దేవునివంటి ఆశ్రయదుర్గమేదియు లేదు.
3 యెహోవా అనంతజ్ఞానియగు దేవుడు
ఆయనే క్రియలను పరీక్షించువాడు
ఇకను అంత గర్వముగా మాటలాడకుడి
గర్వపుమాటలు మీ నోట రానియ్యకుడి.
4 ప్రఖ్యాతినొందిన విలుకాండ్లు ఓడిపోవుదురు
తొట్రిల్లినవారు బలము ధరించుదురు.
5 తృప్తిగా భుజించినవారు అన్నము కావలెనని
కూలికిపోవుదురు
ఆకలి గొనినవారు ఆకలితీర తిందురు
గొడ్రాలు ఏడుగురు పిల్లలను కనును
అనేకమైన పిల్లలను కనినది కృశించి పోవును.
6 జనులను సజీవులుగాను మృతులుగాను చేయు
వాడు యెహోవాయే
పాతాళమునకు పంపుచు అందులోనుండి రప్పించు
చుండువాడు ఆయనే.
7 యెహోవా దారిద్ర్యమును ఐశ్వర్యమును కలుగ
జేయువాడు
క్రుంగజేయువాడును లేవనెత్తువాడును ఆయనే.
8 దరిద్రులను అధికారులతో కూర్చుండబెట్టుటకును
మహిమగల సింహాసనమును స్వతంత్రింపజేయుట
కును
వారిని మంటిలోనుండి యెత్తువాడు ఆయనే
లేమిగలవారిని పెంటకుప్పమీదినుండి లేవనెత్తు
వాడు ఆయనే.
భూమియొక్క స్తంభములు యెహోవా వశము,
లోకమును వాటిమీద ఆయన నిలిపియున్నాడు.
తన భక్తుల పాదములు తొట్రిల్లకుండ ఆయన 9
వారిని కాపాడును
దుర్మార్గులు అంధకారమందు మాటుమణుగుదురు
బలముచేత ఎవడును జయము నొందడు.
యెహోవాతో వాదించువారు నాశనమగుదురు 10
పరమండలములోనుండి ఆయన వారిపైన యురుము
వలె గర్జించును
లోకపు సరిహద్దులలోగా నుండువారికి ఆయన
తీర్పుచేయును
తాను నియమించిన రాజుకు ఆయన బలమిచ్చును
తాను అభిషేకించినవానికి అధిక బలము కలుగ
జేయును.

తరువాత ఎల్కానా రామాలోని తన యింటికి వెళ్లి 11
పోయెను; అయితే ఆ బాలుడు యాజకుడైన ఏలీ
యెదుట యెహోవాకు పరిచర్యచేయుచుండెను.

ఏలీ కుమారులు యెహోవాను ఎరుగనివారై 12
మిక్కిలి దుర్మార్గులైయుండిరి. । జనులవిషయమై యాజ 13
కులు చేయుచువచ్చిన పని యేమనగా, ఎవడైన బలి
పశువును వధించినమీదట మాంసము ఉడుకుచుం
డగా యాజకుని పనివారు మూడు ముండ్లుగల కొంకిని
తీసికొని వచ్చి । బొరుసులోగాని తపేలలోగాని 14
గూనలోగాని కుండలోగాని అది గుచ్చినపుడు ఆ
కొంకిచేత బయటకు వచ్చినదంతయు యాజకుడు తన
కొరకు తీసికొనును. షిలోహుకు వచ్చు ఇశ్రాయేలీ
యులందరికిని వీరు ఈలాగున చేయుచు వచ్చిరి.
ఇదియుగాక వారు క్రొవ్వును దహింపకమునుపు 15
యాజకుని పనివాడు వచ్చి బలిపశువును వధించు
వానిని చూచి—యాజకునికి వండించుటకై మాంస
మిమ్ము, ఉడకబెట్టిన మాంసము అతడు నీయొద్ద తీసి
కొనడు, పచ్చిమాంసమే కావలెను అని చెప్పుచు
వచ్చెను. ।—ఈ క్షణమందే వారు క్రొవ్వును దహిం 16
తురు, తరువాత నీ మనస్సు వచ్చినంతమట్టుకు తీసి
కొనవచ్చునని వానితో ఆ మనిషి చెప్పినయెడల
వాడు — ఆలాగువద్దు, ఇప్పుడే యియ్యవలెను, లేని
యెడల బలవంతముచేత తీసికొందుననును. । అందు 17
వలన జనులు యెహోవాకు నైవేద్యము చేయుట
మాని దానియందు అసహ్యపడుటకు ఆ యౌవనులు
కారణమైరి గనుక వారి పాపము యెహోవా సన్ని
ధిని బహు గొప్పదాయెను.

బాలుడైన సమూయేలు నారతో నేయబడిన 18
ఏఫోదు ధరించుకొని యెహోవాకు పరిచర్యచేయు

ఉండెను. వాని తల్లి వానికి చిన్న అంగీ ఒకటి కుట్టి ఏటేట బలి అర్పించుటకు తన పెనిమిటితోకూడ వచ్చినప్పుడు దాని తెచ్చి వాని కిచ్చుచువచ్చెను. యెహోవా సన్నిధిని మనవిచేసికొనగా నీకు దొరికిన యీ సంతానమునకు ప్రతిగా యెహోవా నీకు సంతానము నిచ్చుగాక అని ఏలీ ఎల్కానాను అతని భార్యను దీవించిన తరువాత వారు ఇంటికి వెళ్లిరి. యెహోవా హన్నాను దర్శింపగా ఆమె గర్భవతియై ముగ్గురు కుమాళ్లను ఇద్దరు కుమార్తెలను కనెను. అయితే బాలుడగు సమూయేలు యెహోవా సన్నిధిని ఉండి యెదుగుచుండెను.

ఏలీ బహు వృద్ధుడాయెను. ఇశ్రాయేలీయులకు తన కుమారులు చేసిన కార్యములన్నియు, వారు ప్రత్యక్షపుగుడారముయొక్క ద్వారము దగ్గరకు సేవ చేయుటకు వచ్చిన స్త్రీలతో శయనించుటయను మాట చెవిని పడగా వారిని పిలిచి యిట్లనెను — ఈ జనులముందర మీరు చేసిన చెడ్డకార్యములు నాకు వినబడినవి. ఈలాటి కార్యములు మీరెందుకు చేయుచున్నారు? నా కుమారులారా, యీలాగు చేయవద్దు, నాకు వినబడినది మంచిదికాదు, యెహోవా జనులను మీరు అతిక్రమింప చేయుచున్నారు. నరునికి నరుడు తప్పు చేసినయెడల దేవుడు విమర్శ చేయును గాని యెవరైన యెహోవా విషయములో పాపము చేసినయెడల వానికొరకు ఎవడు విజ్ఞాపనము చేయును? అయితే యెహోవా వారిని చంప దలచియుండెను గనుక వారు తమ తండ్రియొక్క మొర్రను వినకపోయిరి. బాలుడగు సమూయేలు ఇంకను ఎదుగుచు యెహోవాకును మనుష్యులకును అనుకూలుడాయెను.

అంతట దైవజనుడొకడు ఏలీయొద్దకు వచ్చి యిట్లనెను—యెహోవా నిన్నుగూర్చి సెలవిచ్చినదేమనగా, నీ పితరుని యింటివారు ఐగుప్తు దేశమందు ఫరో యింటిలో ఉండగా నేను వారికి ప్రత్యక్షమైతిని. అతడు నా ముందర ఏఫోదును ధరించి నా బలిపీఠము మీద అర్పణమును ధూపమును అర్పించుటకై నాకు యాజకుడగునట్లు ఇశ్రాయేలు గోత్రములలోనుండి నేనతని ఏర్పరచుకొంటిని. ఇశ్రాయేలీయులు అర్పించిన హోమవస్తువులన్నిటిని నీ పితరుని యింటివారికిచ్చితిని. నా నివాసస్థలమునకు నేను నిర్ణయించిన బలి నైవేద్యములను మీరేల తృణీకరించుచున్నారు? మిమ్మును క్రొవ్వబెట్టుకొనుటకై నా జనులగు ఇశ్రాయేలీయులు చేయు నైవేద్యములలో శ్రేష్ఠభాగము లను పట్టుకొనుచు, నాకంటె నీ కుమారులను నీవు గొప్పచేయుచున్నావు. నీ యింటివారును నీ పితరుని యింటివారును నా సన్నిధిని యాజకత్వము జరిగించుదురని యెహోవా ఆజ్ఞ యిచ్చియున్నను

ఇప్పుడు అది నా మనస్సుకు కేవలము ప్రతికూల
మాయెనని ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా
సెలవిచ్చుచున్నాడు. కావున యెహోవా వాక్కు
ఏదనగా—నన్ను ఘనపరచువారిని నేను ఘనపరచు
దును, నన్ను తృణీకరించువారు తృణీకారమొందు
దురు. ఆలకించుము; రాగల దినములలో నీ బల 31
మును నీ పితరుని యింటి బలమును నేను తక్కువ
చేతును. నీ యింట ముసలివాడు ఒకడును లేకపో
వును. యెహోవా ఇశ్రాయేలీయులకు చేయదల 32
చిన మేలువిషయములో నా నివాసస్థలమునకు అపా
యము కలుగగా నీవు చూతువు. ఎప్పటికిని నీ
యింట ముసలివాడు ఉండడు, నా బలిపీఠమునొద్ద 33
నెవడు ఉండకుండ నేనందరిని నశింపజేయక విడుచు
వాడను గనుక అది నీ కన్నులు క్షీణించుటకును నీవు
దుఃఖముచేత క్షయమగుటకును సాధనమగును; నీ
సంతానపువారందరు ¤యఃకాలమందు మరణమవు
దురు. నీ యిద్దరు కుమారులైన హొఫ్నీకిని ఫీనెహాసు 34
కును సంభవించునవి నేను చెప్పినదానికి నీకు సూచనగా
నుండును. ఒక్క నాటియందే వారిద్దరు మరణమవు
దురు. తరువాత నమ్మకమైన ఒక యాజకుని నేను 35
నియమింతును; అతడు నా యోచననుబట్టి నాకను
కూలముగా యాజకత్వము జరిగించును, అతనికి నేను
నమ్మకమైన సంతానము పుట్టింతును, అతడు నా అభి
షిక్తుని సన్నిధిని ఎప్పటికిని యాజకత్వము జరిగిం
చును. అయితే నీ యింటివారిలో శేషించినవారు 36
ఒక వెండిరూకకైనను రొట్టెముక్కకైనను సంపాదించు
కొనవలెనని అతనియొద్దకు వచ్చి దండముపెట్టి—నేను
రొట్టెముక్క తినునట్లుగా దయచేసి యాజకుల ఉద్యో
గములలో ఒకదానియందు నన్ను ఉంచుమని అతని
వేడుకొందురు.

బాలుడైన సమూయేలు ఏలీయెదుట యెహోవాకు 3
పరిచర్య చేయుచుండెను. ఆ దినములలో యెహోవా
వాక్కు ప్రత్యక్షమగుట అరుదు, ప్రత్యక్షము తరు
చుగా తటస్థించుటలేదు. ఆ కాలమందు ఏలీ కన్నులు 2
మందదృష్టి గలవైనందున అతడు చూడలేక తన స్థల
మందు పండుకొని యుండగాను దేవుని మందస 3
మున్న యెహోవా మందిరములో దీపము ఆరి
పోకమునుపు సమూయేలు పండుకొనియుండగాను
యెహోవా సమూయేలును పిలిచెను. అతడు—చిత్త 4
మండి నేనున్నానని చెప్పి ఏలీదగ్గరకు పోయి—నీవు 5
నన్ను పిలిచితివి గదా నేను వచ్చినాననెను. అతడు
—నేను పిలువలేదు, పోయి పండుకొమ్మని చెప్పగా
అతడు పోయి పండుకొనెను. యెహోవా మరల 6
సమూయేలును పిలువగా సమూయేలు లేచి ఏలి
యొద్దకు పోయి—చిత్తము నీవు నన్ను పిలిచితివి గనుక
వచ్చితిననెను. అయితే అతడు నా కుమారుడా, నేను

7 నిన్ను పిలువలేదు, పోయి పండుకొమ్మనెను. । సమూ
యేలు అప్పటికి యెహోవాను ఎరుగకుండెను,
యెహోవా వాక్కు అతనికి ఇంక ప్రత్యక్షము
8 కాలేదు. । యెహోవా మూడవ మారు సమూయేలును
పిలువగా అతడు లేచి ఏలీదగ్గరకు పోయి—చిత్తము
నీవు నన్ను పిలిచితివే; యిదిగో వచ్చితిననగా, ఏలీ
యెహోవా ఆ బాలుని పిలిచెనని గ్రహించి । —
9 నీవు పోయి పండుకొమ్ము, ఎవరైన నిన్ను పిలిచిన
యెడల — యెహోవా, నీ దాసుడు ఆలకించుచు
న్నాడు, ఆజ్ఞనిమ్మని చెప్పుమని సమూయేలుతో అనగా
సమూయేలు పోయి తన స్థలమందు పండుకొనెను. ।
10 తరువాత యెహోవా ప్రత్యక్షమై నిలిచి ఆ రీతిగా—
సమూయేలూ సమూయేలూ, అని పిలువగా సమూ
యేలు—నీ దాసుడు ఆలకించుచున్నాడు ఆజ్ఞ యిమ్మ
11 నెను. । అంతట యెహోవా సమూయేలుతో ఈలాగు
సెలవిచ్చెను—ఇశ్రాయేలులో నేనొక కార్యము చేయ
బోవుచున్నాను; దాని వినువారందరి చెవులు గింగురు
12 మనును. । ఆ దినమున ఏలీయొక్క యింటివారిని
గురించి నేను చెప్పినదంతయు వారిమీదికి రప్పింతును.
13 దాని చేయ మొదలుపెట్టి దాని ముగింతును. । తన
కుమారులు తమ్మును తాము శాపగ్రస్తులగా చేసికొను
చున్నారని తానెరిగియు వారిని అడ్డగించలేదు గనుక
అతని యింటికి నిత్యమైన శిక్ష విధింతునని నేను అతనికి
14 తెలియజేయుచున్నాను. । కాబట్టి ఏలీ యింటివారి
దోషమునకు బలిచేతనైనను నైవేద్యముచేతనైనను
ఎన్నటికిని ప్రాయశ్చిత్తము చేయబడదని నేను ప్రమాణ
15 పూర్వకముగా ఆజ్ఞాపించితిని. । తరువాత సమూయేలు
ఉదయమగువరకు పండుకొని, లేచి యెహోవా మంది
రపు తలుపులను తీసెనుగాని, భయపడి తనకు కలిగిన
16 దర్శన సంగతి ఏలీతో చెప్పకపోయెను. । అయితే ఏలీ
—సమూయేలూ నా కుమారుడా, అని సమూయేలును
పిలువగా అతడు—చిత్తము నేనిక్కడ ఉన్నాననెను. ।
17 ఏలీ—నీతో యెహోవా యేమి సెలవిచ్చెనో మరుగు
చేయక దయచేసి నాతో చెప్పుము. ఆయన నీతో
సెలవిచ్చిన సంగతులలో ఏదైన నీవు మరుగుచేసిన
యెడల అంతకంటె అధికమైన కీడు ఆయన నీకు
18 కలుగజేయునుగాకని చెప్పగా । సమూయేలు దేనిని
మరుగుచేయక సంగతి అంతయు అతనికి తెలియ
జెప్పెను. ఏలీ విని—సెలవిచ్చినవాడు యెహోవా;
తన దృష్టికి అనుకూలమైనదానిని ఆయన చేయును
19 గాక అనెను. । సమూయేలు పెద్దవాడు కాగా
యెహోవా అతనికి తోడైయున్నందున అతని మాట
20 లలో ఏదియు తప్పిపోలేదు. । కాబట్టి సమూయేలు
యెహోవాకు ప్రవక్తగా స్థిరపడెనని దాను మొదలు
కొని బెయేర్షెబావరకు ఇశ్రాయేలీయులందరు తెలిసి
21 కొనిరి । మరియు షిలోహులో యెహోవా మరల
దర్శనమిచ్చుచుండెను. షిలోహులో యెహోవా
తన వాక్కుచేత సమూయేలుకు ప్రత్యక్షమగుచు
వచ్చెను. సమూయేలుమాట ఇశ్రాయేలీయులందరిలో
వెల్లడియాయెను.

ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయులతో యుద్ధము చేయు 4
టకై బయలుదేరి ఎబెనెజరులో దిగగా ఫిలిష్తీయులు
ఆఫెకులో దిగిరి. । ఫిలిష్తీయులు ఇశ్రాయేలీయులమీద 2
తమ్మును యుద్ధపంక్తులుగా తీర్చుకొనగా వారు యుద్ధ
ములో కలిసినప్పుడు ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయుల
యెదుట ఓడిపోయి యుద్ధభూమిలో నేయెక్కువ తక్కువ
నాలుగు వేలమంది హతులైరి. । కాబట్టి జనులు పాళెము 3
లోకి తిరిగి రాగా ఇశ్రాయేలీయుల పెద్దలు —
యెహోవా నేడు మనలను ఫిలిష్తీయులముందర ఎం
దుకు ఓడించెను? షిలోహులోనున్న యెహోవా
నిబంధన మందసమును మనము తీసికొని మన మధ్య
నుంచుకొందము రండి; అది మన మధ్యనుండినయెడల
అది మన శత్రువుల చేతిలోనుండి మనలను రక్షించు
ననిరి. । కాబట్టి జనులు షిలోహుకు కొందరిని పంపి 4
అక్కడనుండి కెరూబులమధ్య ఆసీనుడైయుండు సైన్య
ములకధిపతియగు యెహోవా నిబంధన మందసమును
తెప్పించిరి. ఏలీయొక్క యిద్దరు కుమారులైన హొఫ్నీ
యును ఫీనెహాసును అక్కడనే దేవుని నిబంధన
మందసమునొద్ద ఉండిరి. । యెహోవా నిబంధన 5
మందసము దండులోకి రాగా ఇశ్రాయేలీయులం
దరు భూమి ప్రతిధ్వని నిచ్చునంత గొప్పకేకలు
వేసిరి. । ఫిలిష్తీయులు ఆ కేకలు విని, హెబ్రీయుల 6
దండులో ఈ గొప్ప కేకలధ్వని యేమని అడిగి,
యెహోవా నిబంధన మందసము దండులోకి వచ్చె
నని తెలిసికొని । జడిసి దేవుడు దండులోకి వచ్చెనని 7
అనుకొని — అయ్యో మనకు శ్రమ, ఇంతకుమునుపు
వారీలాగు సంభ్రమింపలేదు, । అయ్యయ్యో మహా 8
శూరుడగు ఈ దేవుని చేతిలోనుండి మనలను ఎవరు
విడిపింపగలరు? అరణ్యమందు అనేకమైన తెగుళ్లచేత
ఐగుప్తీయులను హతముచేసిన దేవుడు ఈయనే గదా. ।
ఫిలిష్తీయులారా, ధైర్యము తెచ్చుకొని వారు మీకు 9
దాసులైనట్టు మీరు హెబ్రీయులకు దాసులు కాకుండ
బలాఢ్యులై యుద్ధము చేయుడని చెప్పుకొనిరి. ।
ఫిలిష్తీయులు యుద్ధముచేయగా ఇశ్రాయేలీయులు 10
ఓడిపోయి అందరు తమ డేరాలకు పరుగెత్తివచ్చిరి.
అప్పుడు అత్యధికమైన వధ జరిగెను; ఇశ్రాయేలీయు
లలో ముప్పదివేల కాల్బలము కూలెను. । మరియు 11
దేవుని మందసము పట్టబడెను; అదికాకను హొఫ్నీ
ఫీనెహాసులను ఏలీయొక్క యిద్దరు కుమారులు హతు
లైరి. । ఆ నాడే బెన్యామీనీయుడొకడు యుద్ధభూమి 12
లోనుండి పరుగెత్తి వచ్చి, చినిగిన బట్టలతోను తలమీద
ధూళితోను షిలోహులో ప్రవేశించెను. । అతడు 13

వచ్చినప్పుడు ఏలీ మందసము విషయమై గుండె అవి
యుచు త్రోవప్రక్కను పీఠముమీద కూర్చుండి
యెదురు చూచుచుండెను. ఆ మనుష్యుడు పట్టణము
లోనికి వర్తమానము తేగా పట్టణస్థులందరు కేకలు
14 వేసిరి. । ఏలీ ఆ కేకలు విని—ఈ గల్లంతు ధ్వని యేమని
అడుగగా ఆ మనుష్యుడు త్వరగా వచ్చి ఏలీతో
15 సంగతి తెలియచెప్పెను. । ఏలీ తొంబది యెనిమి
దేండ్లవాడై యుండెను. అతనికి దృష్టి మందగిలినందున
16 అతని కండ్లు కానరాకుండెను. । ఆ మనుష్యుడు—
యుద్ధములోనుండి వచ్చినవాడను నేనే, నేడు యుద్ధ
ములోనుండి పరుగెత్తివచ్చితినని ఏలీతో అనగా అతడు
—నాయనా, అక్కడ ఏమి జరిగెనని అడిగెను. ।
17 అందుకు అతడు—ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయులముం
దర నిలువలేక పారిపోయిరి; జనులలో అనేకులు
హతులైరి; హొఫ్నీ ఫీనెహాసు అను నీ యిద్దరు కుమా
రులు మృతులైరి; మరియు దేవుని మందసము పట్ట
18 బడెను అని చెప్పెను । దేవుని మందసమను మాట
అతడు పలుకగానే ఏలీ ద్వారము దగ్గరనున్న పీఠము
మీదనుండి వెనుకకు పడి మెడవిరిగి చనిపోయెను;
ఏలయనగా అతడు వృద్ధుడై బహు స్థూలదేహియై
యుండెను. అతడు నలువది సంవత్సరములు ఇశ్రా
19 యేలీయులకు న్యాయము తీర్చెను. । ఏలీ కోడలగు
ఫీనెహాసు భార్యకు అప్పటికి గర్భముకలిగి కను
ప్రొద్దులై యుండెగా దేవునియొక్క మందసము పట్ట
బడెననియు, తన మామయు తన పెనిమిటియు చని
పోయిరనియు ఆమె విని, నొప్పులుతగిలి మోకాళ్ల
20 మీదికి క్రుంగి ప్రసవమాయెను. । ఆమె మృతినొందు
చుండెగా దగ్గర నిలిచియున్న స్త్రీలు ఆమెతో—భయ
పడవద్దు, కుమారుని కంటివనిరి గాని ఆమె ప్రత్యు
21 త్తరమియ్యకయు లక్ష్యపెట్టకయు నుండినదై । దేవుని
మందసము పట్టబడినదను సంగతిని, తన మామయు
పెనిమిటియు చనిపోయిన సంగతిని తెలిసికొని, ప్రభా
వము ఇశ్రాయేలీయులలోనుండి పోయెనని చెప్పి తన
22 బిడ్డకు ఈకాబోదు అను పేరుపెట్టెను. । దేవుని మంద
సము పట్టబడి పోయినందున ప్రభావము ఇశ్రాయేలీ
యులలోనుండి చెరపట్టబడిపోయెనని ఆమె చెప్పెను.

5 ఫిలిష్తీయులు దేవుని మందసమును పట్టుకొని
2 ఎబెనెజెరునుండి అష్డోదుకు తీసికొనివచ్చి । దాగోను
3 గుడిలో దాగోను ఎదుట దాని నుంచిరి. । అయితే
మరునాడు అష్డోదువారు ప్రాతఃకాలమందు లేవగా,
దాగోను యెహోవా మందసము ఎదుట నేలను
బోర్లబడి యుండెను గనుక వారు దాగోనును లేవ
4 నెత్తి దాని స్థానమందు మరల ఉంచిరి. । ఆ మరు
నాడు వారు ఉదయముననే లేవగా దాగోను
యెహోవా మందసము ఎదుట నేలను బోర్లబడి
యుండెను. దాగోనుయొక్క తలయు రెండు అరచేత
లును తెగవేయబడి గడపదగ్గర పడియుండెను, దాని
మొండెము మాత్రము దానికి మిగిలి యుండెను. ।
కాబట్టి దాగోను యాజకులేమి దాగోను గుడికి వచ్చు 5
వారేమి నేటివరకు ఎవరును అష్డోదులో దాగోనుయొక్క
గుడి గడపను త్రొక్కుటలేదు.

యెహోవా హస్తము అష్డోదువారిమీద భార 6
ముగా ఉండెను. అష్డోదువారిని దాని సరిహద్దులలో
నున్న వారిని ఆయన గడ్డల రోగముతో మొత్తి వారిని
హతముచేయగా । అష్డోదువారు సంభవించినదాని 7
చూచి—ఇశ్రాయేలీయుల దేవుని హస్తము మనమీదను
మన దేవతయగు దాగోనుమీదను బహు భారముగా
నున్నదే; ఆయన మందసము మన మధ్య నుండుటయే
దీనికి కారణము గదా; అది యిక మనమధ్య నుండ
కూడదని చెప్పుకొని । ఫిలిష్తీయుల సర్దారులందరిని 8
పిలువనంపించి—ఇశ్రాయేలీయుల దేవుని మందసమును
మనము ఏమి చేయుదుమని అడిగిరి. అందుకు వారు
— ఇశ్రాయేలీయుల దేవుని మందసమును ఇక్కడ
నుండి గాతు పట్టణమునకు పంపుడని చెప్పగా, జనులు
ఇశ్రాయేలీయుల దేవుని మందసమును అక్కడనుండి
గాతుకు మోసికొని పోయిరి. । అయితే వారు అష్డోదు 9
నుండి గాతుకు దాని మోసికొని పోయిన తరువాత
యెహోవా హస్తము ఆ పట్టణపు పెద్దలకును పిన్నల
కును రహస్య స్థానములలో గడ్డలు మొలిపించి వారిని
మొత్తి గొప్ప నాశనము కలుగజేసెను. । వారు దేవుని 10
మందసమును ఎక్రోనుకు పంపివేయగా దేవుని మంద
సము ఎక్రోనులోనికి వచ్చినప్పుడు ఎక్రోనీయులు
కేకలు వేసి—మనలను మన జనులను చంపివేయవలెనని
మీరు ఇశ్రాయేలీయుల దేవుని మందసమును మన
యొద్దకు తీసికొని వచ్చిరనిరి. । కాగా జనులు ఫిలిష్తీ 11
యుల సర్దారులనందరిని పిలువనంపించి — ఇశ్రాయేలీ
యుల దేవుని మందసము మనలను మన జనులను
చంపకుండునట్లు స్వస్థానమునకు దాని పంపించుడనిరి.
దేవుని హస్తము అక్కడ బహు భారముగా ఉండెను
గనుక మరణభయము ఆ పట్టణస్థులందరిని పట్టియుం
డెను. । చావక మిగిలియున్నవారు గడ్డల రోగము 12
చేత మొత్తబడిరి. ఆ పట్టణస్థుల కేకలు ఆకాశమువరకు
వినబడెను.

యెహోవా మందసము ఏడు నెలలు ఫిలిష్తీ 6
యుల దేశమందుండిన తరువాత । ఫిలిష్తీయులు 2
యాజకులను శకునము చూచువారిని పిలువనంపించి
— యెహోవా మందసమును ఏమి చేయుదుము?
ఏమి చేసి స్వస్థలమునకు దాని పంపుదుమో తెలియ
జెప్పుడనగా । వారు—ఇశ్రాయేలీయుల దేవుని మంద 3
సమును పంపివేయ నుద్దేశించినపక్షమున ఊరకయే
పంపక, యే విధముచేతనైనను ఆయనకు అపరాధార్థ
మైన అర్పణము చెల్లించి పంపవలెను. అప్పుడు మీరు

స్వస్థతనొంది ఆయన హస్తము మీ మీదనుండి యెం
దుకు తియ్యబడక యుండెనో మీరు తెలిసికొందు
4 రనిరి. । ఫిలిష్తీయులు — మనము ఆయనకు చెల్లింప
వలసిన అపరాధార్థమైన అర్పణమేదని వారినడుగగా
వారు—మీ అందరిమీదను మీ సర్దారులందరిమీదను
ఉన్న తెగులు ఒక్కటే గనుక, ఫిలిష్తీయుల సర్దారుల
లెక్కచొప్పున అయిదు బంగారపు గడ్డల రూపము
లను, అయిదు బంగారపు పందికొక్కులను చెల్లింప
5 వలెను. । కాబట్టి మీకు కలిగిన గడ్డలుగాను భూమిని
పాడుచేయు పందికొక్కులుగాను నిరూపించబడిన
గడ్డలను చుంచులను చేసి పంపించి ఇశ్రాయేలీయుల
దేవునికి మహిమను చెల్లింపవలెను. అప్పుడు మీ
మీదను మీ దేవతలమీదను మీ భూమిమీదను భార
ముగానున్న తన హస్తమును ఆయన తీసివేయును
6 కాబోలు. । ఐగుప్తీయులును ఫరోయును తమ హృద
యములను కఠినపరచుకొనినట్లు మీ హృదయములను
మీరెందుకు కఠినపరచుకొందురు? ఆయన వారిలో
అద్భుతకార్యములను చేయగా వారు ఈ జనులను
పోనిచ్చిరి; ఇశ్రాయేలీయులు వెళ్లిపోయిరి గదా. ।
7 కాబట్టి మీరు క్రొత్త బండి ఒకటి చేయించి, కాడి
మోయని పాడి ఆవులను రెంటిని తోలి తెచ్చి బండికి
కట్టి వాటి దూడలను వాటిదగ్గరనుండి యింటికి తోలి।
8 యెహోవా మందసమును ఆ బండిమీద ఎత్తి, అప
రాధార్థముగా ఆయనకు మీరు అర్పింపవలసిన బంగా
రపు వస్తువులను దాని ప్రక్కనే చిన్న పెట్టెలో
ఉంచి అది మార్గమున పోవునట్లుగా విడిచిపెట్టుడి. ।
9 అది బేత్షెమెషుకు పోవు మార్గమున బడి యీ దేశపు
సరిహద్దు దాటిన పక్షమున ఆయనే యీ గొప్పకీడు
మనకు చేసెనని తెలిసికొనవచ్చును; ఆ మార్గమున
పోనిపక్షమందు ఆయన మనలను మొత్తలేదనియు,
మన అదృష్టవశముచేతనే అది మనకు సంభవించె
10 ననియు తెలిసికొందుమనిరి. । వారు ఆలాగున రెండు
పాడి ఆవులను తోలి తెచ్చి బండికి కట్టి వాటి దూడ
11 లను ఇంటిలోపల పెట్టి । యెహోవా మందసమును
బంగారు గడ్డలను పందికొక్కు రూపములును గల ఆ
12 చిన్న పెట్టెను బండిమీద ఎత్తగా । ఆ ఆవులు రాజ
మార్గమునబడి చక్కగా పోవుచు అరచుచు, బేత్షె
మెషు మార్గమున నడిచెను. ఫిలిష్తీయుల సర్దారులు
వాటి వెంబడియే బేత్షెమెషు సరిహద్దువరకు పోయిరి. ।
13 బేత్షెమెషువారు లోయలో తమ గోధుమ చేలను
కోయుచుండిరి; వారు కన్నులెత్తి చూడగా మంద
సము వారికి కనబడెను, దాని చూచి వారు సంతో
14 షించిరి. । ఆ బండి బేత్షెమెషువాడైన యెహోషువ
యొక్క పొలములోనికి వచ్చి అక్కడనున్న ఒక పెద్ద
రాతిదగ్గర నిలువగా, వారు బండియొక్క కఱ్ఱలను
చీల్చి ఆవులను యెహోవాకు దహనబలిగా అర్పిం
చిరి. । లేవీయులు యెహోవా మందసమును బంగా 15
రపు వస్తువులుగల ఆ చిన్న పెట్టెను దింపి ఆ పెద్ద
రాతిమీద ఉంచగా, ఆ దినమున బేత్షెమెషువారు
యెహోవాకు దహనబలులను అర్పించి బలులను
వధించిరి. । ఫిలిష్తీయుల సర్దారులు అయిదుగురును అంత 16
వరకు చూచి నాడే ఎక్రోనుకు తిరిగి వెళ్లిరి.

అపరాధార్థమైన అర్పణగా ఫిలిష్తీయులు చెల్లిం 17
చిన బంగారపు గడ్డలు ఏవనగా, అష్డోదువారి నిమిత్తము
ఒకటి, గాజావారి నిమిత్తము ఒకటి, అష్కెలోను
వారి నిమిత్తము ఒకటి గాతువారి నిమిత్తము ఒకటి,
ఎక్రోనువారి నిమిత్తము ఒకటి. । ప్రాకారములుగల 18
పట్టణములవారేమి పొలములోని గ్రామములవారేమి
ఫిలిష్తీయుల అయిదుగురు సర్దారుల పట్టణములన్నిటి
లెక్కచొప్పున బంగారపు పందికొక్కులను అర్పించిరి.
వారు యెహోవా మందసమును దింపిన పెద్దరాయి
దీనికి సాక్ష్యము. నేటివరకు ఆ రాయి బేత్షెమెషు
వాడైన యెహోషువయొక్క పొలములో నున్నది. ।
బేత్షెమెషువారు యెహోవా మందసమును తెరచి 19
చూడగా దేవుడు వారిని హతముచేసి ఆ జనులలో
ఏబది వేల డెబ్బదిమందిని మొత్తెను. యెహోవా
గొప్ప దెబ్బతో అనేకులను మొత్తగా జనులు దుఃఖా
క్రాంతులైరి. । అప్పుడు బేత్షెమెషువారు — పరిశుద్ధ 20
దేవుడైన యెహోవా సన్నిధిని ఎవరు నిలుతురు?
మనయొద్దనుండి ఆయన ఎవరియొద్దకు పోవలెనని
చెప్పి । కిర్యత్యారీము కాపురస్థులకు దూతలను పంపి— 21
ఫిలిష్తీయులు యెహోవా మందసమును మరల తీసి
కొనివచ్చిరి; మీరు వచ్చి మీ దాపుకు దాని తీసికొని
పోవలెనని వర్తమానము పంపిరి.

అంతట కిర్యత్యారీమువారు వచ్చి యెహోవా **7**
మందసమును తీసికొనిపోయి గిబియాలో అబీనాదాబు
ఇంట చేర్చి దాని కాపాడుటకై అతని కుమారుడైన
ఎలాజారును ప్రతిష్ఠించిరి.

మందసము కిర్యత్యారీములోనుండిన కాలము 2
ఇరువై సంవత్సరములాయెను. ఇశ్రాయేలీయులందరు
యెహోవాను అనుసరింప దుఃఖించుచుండగా ।
సమూయేలు ఇశ్రాయేలీయులందరితో ఇట్లనెను —. 3
మీ పూర్ణహృదయముతో యెహోవాయొద్దకు మీరు
మళ్లుకొనినయెడల, అన్యదేవతలను అష్తారోతు దేవతలను
మీ మధ్యనుండి తీసివేసి, పట్టుదలగలిగి యెహోవా
తట్టు మీ హృదయములను త్రిప్పి ఆయనను సేవిం
చుడి. అప్పుడు ఆయన ఫిలిష్తీయుల చేతిలోనుండి
మిమ్మును విడిపించును. । అంతట ఇశ్రాయేలీయులు 4
బయలు దేవతలను అష్తారోతు దేవతలను తీసివేసి
యెహోవాను మాత్రమే సేవించిరి.

అంతట సమూయేలు — ఇశ్రాయేలీయులందరిని 5
మిస్పాకు పిలువనంపుడి; నేను మీ పక్షమున

6 యెహోవాను ప్రార్థనచేతునని చెప్పగా । వారు
మిస్పాలో కూడుకొని నీళ్లు చేది యెహోవా సన్ని
ధిని కుమ్మరించి ఆ దినము ఉపవాసముండి—యెహోవా
దృష్టికి మేము పాపాత్ములమని ఒప్పుకొనిరి. మిస్పాలో
సమూయేలు ఇశ్రాయేలీయులకు న్యాయము తీర్చుచు
7 వచ్చెను. । ఇశ్రాయేలీయులు మిస్పాలో కూడియున్నా
రని ఫిలిష్తీయులు వినినప్పుడు ఫిలిష్తీయుల సర్దారులు
ఇశ్రాయేలుమీదికి వచ్చిరి. ఈ సంగతి ఇశ్రాయేలీ
8 యులు విని ఫిలిష్తీయులకు భయపడి । — మన దేవుడైన
యెహోవాను ఫిలిష్తీయుల చేతిలోనుండి మనలను
రక్షించుమనట్లుగా మాకొరకు ఆయనను ప్రార్థనచేయుట
9 మానవద్దని సమూయేలునొద్ద మనవిచేసిరి । సమూయేలు
పాలు విడువని ఒక గొఱ్ఱెపిల్లను తెచ్చి యెహోవాకు
సర్వాంగ బలిగా అర్పించి, ఇశ్రాయేలీయుల పక్షమున
యెహోవాను ప్రార్థనచేయగా యెహోవా అతని
10 ప్రార్థన అంగీకరించెను. । సమూయేలు దహనబలి
అర్పించుచుండగా ఫిలిష్తీయులు యుద్ధము చేయుటకై
ఇశ్రాయేలీయులమీదికి వచ్చిరి. అయితే యెహోవా
ఆ దినమున ఫిలిష్తీయులమీద మెండుగా ఉరుములు
ఉరిమించి వారిని తారుమారు చేయగా వారు ఇశ్రా
11 యేలీయులచేత ఓడిపోయిరి. । ఇశ్రాయేలీయులు మిస్పా
లోనుండి బయలుదేరి బేత్కారు వరకు ఫిలిష్తీయులను
12 తరిమి హతముచేసిరి. । అప్పుడు సమూయేలు ఒక
రాయి తీసి మిస్పాకును షేనుకును మధ్య దాని నిలిపి—
యింతవరకు యెహోవా మనకు సహాయము చేసెనని
13 చెప్పి దానికి ఎబెనెజరు అను పేరు పెట్టెను. । ఈలా
గున ఫిలిష్తీయులు అణపబడినవారై ఇశ్రాయేలు సరి
హద్దులలోకి తిరిగి రాక ఆగిపోయిరి. సమూయేలు ఉం
డిన దినములన్నిటను యెహోవా హస్తము ఫిలిష్తీయు
14 లకు విరోధముగా ఉండెను. । మరియు ఫిలిష్తీయులు
ఇశ్రాయేలీయులయొద్దనుండి పట్టుకొనిన పట్టణములు
ఇశ్రాయేలీయులకు తిరిగి వచ్చెను. ఎక్రోనునుండి గాతు
వరకున్న గ్రామములను వాటి పొలములను ఇశ్రా
యేలీయులు ఫిలిష్తీయుల చేతిలోనుండి విడిపించిరి.
మరియు ఇశ్రాయేలీయులకును అమోరీయులకును
15 సమాధానము కలిగెను. । సమూయేలు తాను బ్రదికిన
దినములన్నియు ఇశ్రాయేలీయులకు న్యాయాధిపతిగా
16 ఉండెను. । ఏటేట అతడు బేతేలుకును గిల్గాలుకును
మిస్పాకును తిరుగుచు ఆ స్థలములయందు ఇశ్రాయేలీ
17 యులకు న్యాయము తీర్చుచు వచ్చెను. । మరియు
అతని యిల్లు రామాలోనుండినందున అచ్చటికి తిరిగి
వచ్చి అచ్చటకూడను న్యాయము తీర్చుచుండెను,
మరియు అతడు అక్కడ యెహోవాకు ఒక బలి
పీఠము కట్టెను.

**8** సమూయేలు వృద్ధుడైనప్పుడు తన కుమారులను
ఇశ్రాయేలీయులమీద న్యాయాధిపతులుగా నియమిం
చెను. । అతని జ్యేష్ఠకుమారుని పేరు యోవేలు, రెండవ 2
వాని పేరు అబీయా. । వీరు బెయేర్షెబాలో న్యాయాధి 3
పతులుగా ఉండిరి. అతని కుమారులు అతని ప్రవర్త
నను అనుసరింపక, ధనాపేక్షకులై లంచములు పుచ్చు
కొని న్యాయమును త్రిప్పివేయగా । ఇశ్రాయేలీయుల 4
పెద్దలందరు కూడి రామాలో సమూయేలునొద్దకు
వచ్చి । — చిత్తగించుము, నీవు వృద్ధుడవు, నీ కుమా 5
రులు నీ ప్రవర్తనవంటి ప్రవర్తనగలవారు కారు గనుక,
సకలజనుల మర్యాదచొప్పున మాకు ఒక రాజును
నియమింపుము, అతడు మాకు న్యాయము తీర్చునని
అతనితో అనిరి. । — మాకు న్యాయము తీర్చుటకై 6
రాజును నియమింపుమని వారు అనిన మాట సమూ
యేలుదృష్టికి ప్రతికూలముగా ఉండెను గనుక సమూ
యేలు యెహోవాను ప్రార్థనచేసెను. । అందుకు 7
యెహోవా సమూయేలుకు సెలవిచ్చినదేమనగా —
జనులు నీతో చెప్పిన మాటలన్నిటి ప్రకారము జరి
గింపుము; వారు నిన్ను విసర్జింపలేదుగాని తమ్మును ఏల
కుండ నన్నే విసర్జించి యున్నారు. । వారు నన్ను 8
విసర్జించి, యితర దేవతలను పూజించి, నేను ఐగుప్తులో
నుండి వారిని రప్పించిననాటినుండి నేటివరకు తాము
చేయుచువచ్చిన కార్యములన్నిటి ప్రకారముగా వారు
నీయెడలను జరిగించుచున్నారు; వారు చెప్పినమాట
లను అంగీకరించుము. । అయితే వారిని ఏలబోవు 9
రాజు ఎట్టివాడగునో నీవే సాక్షివై వారికి దృఢముగా
తెలియజేయుము.

సమూయేలు తనను రాజు నడిగిన జనులకు 10
యెహోవా మాటలన్ని వినిపించి । ఈలాగున చెప్పె 11
ను — మిమ్మును ఏలబోవు రాజు ఎట్టివాడగుననగా,
అతడు మీ కుమారులను పట్టుకొని, తన రథములను
తోలుటకును తన గుఱ్ఱములను కాపాడుటకును వారిని
ఉంచుకొనును, కొందరు అతని రథముల ముందర
పరుగెత్తుదురు. । మరియు అతడు వారిని తన రాణు 12
వలో సహస్రాధిపతులుగాను పంచదశాధిపతులు
గాను నియమించును; తన భూములను దున్నుటకును
వాటి పంటను కోయుటకును తన యుద్ధాయుధము
లను తన రథముల సామానులను చేయుటకును వారిని
ఏర్పరచుకొనును. । మీ కుమార్తెలను భక్ష్యకారిణులు 13
గాను బోనకత్తెలుగాను రొట్టెలు కాల్చువారినిగాను
పెట్టుకొనును. । మీ పొలములలోను మీ ద్రాక్ష 14
తోటలలోను ఒలీవతోటలలోను శ్రేష్ఠమైనవాటిని
తీసికొని తన సేవకులకిచ్చును. । మీ ధాన్యములోను 15
ద్రాక్షపండ్లలోను పదియవ భాగము తీసి తన పరివార
జనమునకును సేవకులకును ఇచ్చును. । మీ దాసులను 16
మీ పనికత్తెలను మీ పశువులలోను[1] గార్దభములలోను

[1] లేక, యౌవనులలోను.

శ్రేష్ఠమైనవాటిని పట్టుకొని తన పనికొరకు ఉంచు
17 కొనును. । మీ మందలో పదియవభాగము పట్టు
కొనును, మీ మట్టుకు మీరు అతనికి దాసులవుదురు. ।
18 ఆ దినమున మీరు కోరుకొనిన రాజునుబట్టి మీరు
మొఱ్ఱపెట్టినను యెహోవా మీ మొఱ్ఱ వినక
19 పోవును. । అయినను జనులు సమూయేలుయొక్క
20 మాట చెవిని బెట్టనొల్లక—ఆలాగున కాదు, । జన
ములు చేయురీతిని మేమును చేయునట్లు మాకు రాజు
కావలెను, మా రాజు మాకు న్యాయము తీర్చును, మా
ముందరఁబోవుచు అతడే మా యుద్ధములను జరిగించు
21 ననిరి. । సమూయేలు జనులయొక్క మాటలన్నిటిని
విని యెహోవా సన్నిధిని వాటిని వివరించెను ।
22 గనుక యెహోవా—నీవు వారి మాటలు విని వారికి
ఒక రాజును నియమించుమని సమూయేలుకు సెల
వియ్యగా సమూయేలు—మీరందరు మీ మీ గ్రామ
ములకు పొండని ఇశ్రాయేలీయులకు సెలవిచ్చెను.

9 అఫీయకు పుట్టిన బెకోరతు కుమారుడైన సెరో
రుకు జననమైన అబీయేలు కుమారుడగు కీషు అను
బెన్యామీనీయుడొకడుండెను. కీషు భాగ్యవంతుడగు
2 ఒక బెన్యామీనీయుడు. । అతనికి సౌలు అను నొక
కుమారుడుండెను. అతడు బహు సౌందర్యముగల
యౌవనుడు, ఇశ్రాయేలీయులలో అతనిపాటి సుందరు
డొకడును లేడు. అతడు భుజములు మొదలుకొని
3 పైకి ఇతరులకంటె ఎత్తుగలవాడు. । సౌలు తండ్రియైన
కీషుయొక్క గార్దభములు తప్పిపోగా కీషు తన కుమా
రుడైన సౌలును పిలిచి—మన దాసులలో ఒకని తీసి
4 కొనిపోయి గార్దభములను వెదకుమని చెప్పెను. । అతడు
పోయి ఎఫ్రాయిము మన్యము తిరిగి షాలిషాదేశమున
సంచరింపగా అవి కనబడలేదు. తరువాత వారు షయ
లీముదేశమును దాటి సంచారము చేసిరి గాని అవి కన
బడక యుండెను. బెన్యామీనీయులదేశము సంచరించి
5 చూడగా అవి దొరకలేదు. । అయితే వారు సూఫు
దేశమునకు వచ్చినప్పుడు—మనము తిరిగి వెళ్లుదము
రమ్ము, గార్దభములకొరకు చింతింపక, నా తండ్రి మన
కొరకు విచారపడునేమోయని సౌలు తనయొద్దనున్న
6 పనివానితో అనగా । వాడు—ఈ పట్టణములో దైవ
జనుడు ఒకడున్నాడు, అతడు బహు ఘనుడు, అతడు
ఏ మాట చెప్పునో ఆ మాట నెరవేరును. మనము వెళ్ల
వలసిన మార్గమును అతడు మనకు తెలియజేయునేమో
7 అతనియొద్దకు వెళ్లుదము రండని చెప్పెను. । అందుకు
సౌలు—మనము వెళ్లుపక్షమున ఆ మనిషికి ఏమి తీసి
కొని పోవుదుము' మన సామగ్రిలోనుండు భోజన
పదార్థములు సరిపోయినవి; ఆ దైవజనునికి బహుమా
నము తీసికొనిపోవుటకు మనకేమియు లేదు అని తన
పనివానితో చెప్పి—మనయొద్ద ఏమి యున్నదని అడు
8 గగా । వాడు సౌలుతో—చిత్తగించుము, నాయొద్ద
పావు తులము వెండి కలదు. మనకు మార్గము తెలియ
జెప్పినందుకై దానిని ఆ దైవజనునికిత్తుననెను. । ఇప్పుడు ।
ప్రవక్తయను పేరు నొందువాడు పూర్వము ప్రదర్శకు
డనిపించుకొనెను. పూర్వము ఇశ్రాయేలీయులలో
దేవునియొద్ద విచారణచేయుటకై ఒకడు బయలుదేరిన
యెడల—మనము ప్రదర్శకునియొద్దకు పోవుదము రం
డని జనులు చెప్పుకొనుట వాడుక. । సౌలు—నీ మాట 10
మంచిది, వెళ్లుదము రమ్మనగా । వారు దైవజనుడుండు 11
ఊరికి పోయిరి. ఊరికి ఎక్కిపోవుచుండగా నీళ్లు చేదు
కొనుటకై వచ్చిన కన్యకలు తమకు కనబడినప్పుడు—
ఇక్కడ ప్రదర్శకుడున్నాడా అని అడిగిరి. । అందుకు 12
వారు—ఇదిగో అతడు మీ యెదుటనే యున్నాడు,
త్వరగా పోయి కలిసికొనుడి, యీ దినముననే అతడు
ఈ ఊరికి వచ్చెను. నేడు ఉన్నతస్థలమందు జనులకు
బలి జరుగును గనుక । ఊరిలోకి మీరు పోయిన క్షణ 13
మందే, అతడు భోజనము చేయుటకు ఉన్నతమైన
స్థలమునకు వెళ్లకమునుపే మీరు అతని కనుగొందురు;
అతడు రాకమునుపు జనులు భోజనము చేయరు; అతడు
బలిని ఆశీర్వదించిన తరువాత పిలువబడినవారు భోజ
నముచేయుదురు, మీరు ఎక్కిపొండి, అతని చూచు
టకు ఇదే సమయమని చెప్పిరి । వారు ఊరిలోకి 14
రాగా ఉన్నతమైన స్థలమునకు పోవుచున్న సమూ
యేలు వారికి ఎదురుపడెను.

సౌలు అచ్చటికి రేపు వచ్చునని యెహోవా 15
సమూయేలుకు తెలియజేసెను. । ఎట్లనగా—నా జనుల 16
మొఱ్ఱ నాయొద్దకు వచ్చెను, నేను వారిని దృష్టించి
యున్నాను; కాగా ఫిలిష్తీయుల చేతిలోనుండి నా
జనులను విడిపించుటకై నా జనులైన ఇశ్రాయేలీయుల
మీద వానిని అధికారినిగా అభిషేకించుటకు గాను
రేపు ఈ వేళకు నేను బెన్యామీను దేశములోనుండి
ఒక మనుష్యుని నీయొద్దకు రప్పించుదును. । సౌలు 17
సమూయేలుకు కనబడగానే యెహోవా—ఇతడే
నేను నీతో చెప్పిన మనిషి; ఇతడే నా జనులను ఏలు
నని అతనితో సెలవిచ్చెను. । సౌలు గవినియందు 18
సమూయేలును కలిసికొని—ప్రదర్శకుని యిల్లు ఏది?
దయచేసి నాతో చెప్పుమని అడుగగా । సమూయేలు 19
సౌలును చూచి—నేనే ప్రదర్శకుడను, ఉన్నతమైన
స్థలమునకు వెళ్లుడి, నేడు మీరు నాతోకూడ భోజనము
చేయవలెను, రేపు నీ మనస్సులో నున్నదంతయు నీకు
తెలియజేసి నిన్ను వెళ్లనిచ్చెదను. । మూడు దినముల 20
క్రిందట తప్పిపోయిన నీ గార్దభములనుగూర్చి విచార
పడకుము, అవి దొరికినవి. ఇశ్రాయేలీయుల అభీష్టము
ఎవరియందున్నది? నీ యందును నీ తండ్రి యింటివారి
యందును గదా అనెను. । అందుకు సౌలు—నేను 21
బెన్యామీనీయుడను కానా? నా గోత్రము ఇశ్రాయేలీ
యుల గోత్రములలో స్వల్పమైనదికాదా? నా యింటి

వారు బెన్యామీను గోత్రపు ఇంటివారందరిలో
అల్పులుకారా? నాతో ఈలాగున ఎందుకు పలుకు
2 చున్నావు! అనెను. । అయితే సమూయేలు సౌలును
అతని పనివానిని భోజనపు శాలలోనికి తోడుకొని
పోయి, పిలువబడిన దాదాపు ముప్పది మందిలో
3 ప్రధానస్థలమందు వారిని కూర్చుండబెట్టి । పచనకర్తను
చూచి— నేను నీ దగ్గరనుంచుమని చెప్పి నీ చేతికి ఇచ్చిన
4 భాగమును తీసికొని రమ్మనగా । పచనకర్త జబ్బను దాని
మీద నున్నదానిని తీసికొనివచ్చి సౌలు ఎదుట ఉం
చగా సమూయేలు సౌలుతో ఇట్లనెను — చూడుము,
మనము కలిసికొను కాలమునకై దాచియుంచబడిన
దాని నీకు పెట్టియున్నాడు, జనులను పిలిచితినని నేను
పచనకర్తతో చెప్పినప్పుడు ఇది నీకొరకుంచవలసినదని
చెప్పితిని. ఆ దినమున సౌలు సమూయేలుతో కూడ
25 భోజనము చేసెను. । పట్టణస్థులు ఉన్నతమైన స్థలము
మీదనుండి దిగువనుండగా సమూయేలు సౌలుతో మిద్దె
26 మీద మాటలాడుచుండెను. । మరునాడు తెల్లవారు
నప్పుడు సమూయేలు — నేను నిన్ను సాగనంపుటకై
మిద్దెమీదికి రమ్మని సౌలును పిలువగా సౌలు లేచెను.
27 తరువాత వారిద్దరు బయలుదేరి । ఊరి చివరకు వచ్చు
చుండగా సమూయేలు సౌలును చూచి — మనకంటె
ముందుగా వెళ్లుమని యీ పనివానితో చెప్పుము;
దేవుడు సెలవిచ్చినది నేను నీకు తెలియజెప్పువరకు నీవు
ఇక్కడనే నిలిచియుండుమనగా సౌలు పనివానికి ఆలా
గుననే సెలవిచ్చెను.

**10** అప్పుడు సమూయేలు తైలపు బుడ్డి పట్టుకొని
సౌలు తలమీద తైలము పోసి అతని ముద్దుపెట్టుకొని—
యెహోవా నిన్ను అభిషేకించి తన స్వాస్థ్యముమీద
అధిపతిగా నియమించియున్నాడు అని చెప్పి యీలాగు
2 సెలవిచ్చెను । — ఈ దినమున నీవు నాయొద్దనుండి
పోయిన తరువాత బెన్యామీను సరిహద్దులో సెల్స
హులోనుండు రాహేలు సమాధిదగ్గర ఇద్దరు మను
ష్యులు నీకు కనబడుదురు. వారు—నీవు వెదకబోయిన
గార్దభములు దొరికినవి, నీ తండ్రి తన గార్దభముల
కొరకు చింతింపక నా కుమారుని కనుగొనుటకై నేనేమి
చేతునని నీకొరకు విచారపడుచున్నాడని చెప్పుదురు. ।
3 తరువాత నీవు అక్కడనుండి వెళ్లి తాబోరు మైదాన
మునకు రాగానే అక్కడ బేతేలుకు దేవునియొద్దకు
పోవు ముగ్గురు మనుష్యులు నీకు ఎదురుపడుదురు;
ఒకడు మూడు మేకపిల్లలను, ఒకడు మూడు రొట్టె
లను, ఇంకొకడు ద్రాక్షారసపు తిత్తిని మోయుచు
4 వత్తురు. । వారు నిన్ను కుశలప్రశ్నలడిగి నీకు రెండు
రొట్టెలు ఇత్తురు, అవి వారిచేత నీవు తీసికొనవలెను. ।
5 ఈలాగున పోవుచు ఫిలిష్తీయుల దండు కావువాం
డ్లుండు దేవుని కొండకు చేరుదువు, అచ్చట ఊరిదగ్గ
రకు నీవు రాగానే, స్వరమండలము తంబుర సన్నాయి
సితారా వాయించువారి వెనుక ఉన్నతమైన స్థలము
నుండి దిగి వచ్చు ప్రవక్తల సమూహము నీకు కన
బడును. వారు ప్రకటనచేయుచు వత్తురు; । యెహోవా 6
ఆత్మ నీమీదికి బలముగా దిగివచ్చును; నీవు వారితో
కలిసి ప్రకటన చేయుచుండగా నీకు క్రొత్త మనస్సు
వచ్చును. । దేవుడు నీకు తోడుగా నుండును గనుక 7
ఈ సూచనలు నీకు సంభవించిన తరువాత నీకు మంచి
దని తోచినదాని చేయుము. । నాకంటె ముందు నీవు 8
గిల్గాలునకు వెళ్లగా, దహనబలులను బలులను సమాధాన
బలులను అర్పించుటకై నేను నీయొద్దకు దిగి వత్తును;
నేను నీయొద్దకు వచ్చి నీవు చేయవలసినదాని నీకు
తెలియజేయువరకు ఏడు దినములపాటు నీవు అచ్చట
నిలువవలెను. । అతడు సమూయేలునొద్దనుండి వెళ్లి 9
పోవుటకై తిరుగగా దేవుడు అతనికి క్రొత్త మనస్సు
అనుగ్రహించెను. ఆ దినముననే ఆ సూచనలు కన
బడెను.

వారు ఆ కొండదగ్గరకు వచ్చినప్పుడు ప్రవక్తల 10
సమూహము అతనికి ఎదురుపడగా దేవుని ఆత్మ బల
ముగా అతనిమీదికి వచ్చెను. అతడు వారి మధ్యను
ఉండి ప్రకటనచేయుచుండెను. । పూర్వము అతని నెరి 11
గినవారందరు అతడు ప్రవక్తలతో కూడనుండి ప్రకటిం
చుట చూచి — కీషు కుమారునికి సంభవించినదేమిటి?
సౌలును ప్రవక్తయాయెనా? అని ఒకనితో ఒకడు
చెప్పుకొనగా । ఆ స్థలమందుండు ఒకడు—వారి తండ్రి 12
యెవడని యడిగెను. అందుకు సౌలును ప్రవక్తయా
యెనా? అను సామెత పుట్టెను. । అంతట అతడు 13
ప్రకటించుట చాలించి ఉన్నతస్థలమునకు వచ్చెను.

సౌలుయొక్క పినతండ్రి అతనిని అతని పనివానిని 14
చూచి — మీరిద్దరు ఎక్కడికి పోతిరని అడుగగా
అతడు—గార్దభములను వెదకబోతిమి; అవి కనబడక
పోగా సమూయేలునొద్దకు పోతిమని చెప్పినప్పుడు ।
సౌలు పినతండ్రి—సమూయేలు నీతో చెప్పిన సంగతి 15
నాతో చెప్పుమని అతనితో అనగా । సౌలు—గార్దభ 16
ములు దొరికినవని అతడు చెప్పెనని తన పినతండ్రితో
అనెను గాని రాజ్యమునుగూర్చి సమూయేలు చెప్పిన
మాటను తెలుపలేదు.

తరువాత సమూయేలు మిస్పాకు యెహోవా 17
యొద్దకు జనులను పిలువనంపించి ఇశ్రాయేలీయులతో
ఇట్లనెను । – ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా 18
ఈలాగున సెలవిచ్చుచున్నాడు — నేను ఇశ్రాయేలీ
యులైన మిమ్మును ఐగుప్తుదేశములోనుండి రప్పించి
ఐగుప్తీయుల వశములోనుండియు, మిమ్మును బాధ
పెట్టిన జనములన్నిటి వశములోనుండియు విడిపించి
తిని. । అయినను మీ దుర్దశలన్నిటిని ఉపద్రవము 19
లన్నిటిని పోగొట్టి మిమ్మును రక్షించిన మీ దేవుని
మీరు ఇప్పుడు విసర్జించి—మామీద ఒకని రాజుగా

నియమింపుమని ఆయనను అడిగియున్నారు. కాబట్టి
యిప్పుడు మీ గోత్రముల చొప్పునను మీ కుటుంబ
ముల చొప్పునను మీరు యెహోవా సన్నిధిని
20 హాజరు కావలెను. । ఇశ్రాయేలీయుల గోత్రము
లన్నిటిని సమూయేలు సమకూర్చగా బెన్యామీను
21 గోత్రము ఏర్పడెను. । బెన్యామీను గోత్రమును వారి
యింటికూటముల ప్రకారము అతడు సమకూర్చగా
మత్రీ యింటికూటము ఏర్పడెను. తరువాత కీషు
కుమారుడైన సౌలు ఏర్పడెను. అయితే జనులు అతని
22 వెదకినప్పుడు అతడు కనబడలేదు. । కావున వారు—
ఇక్కడికి ఇంకొక మనుష్యుడు రావలసి యున్నదా
అని యెహోవాయొద్ద విచారణచేయగా యెహోవా
—అతడు సామానులో దాగియున్నాడని సెలవిచ్చెను. ।
23 వారు పరుగెత్తిపోయి అక్కడనుండి అతని తోడు
కొనివచ్చిరి; అతడు జనసమూహములో నిలిచినప్పుడు
భుజములు మొదలుకొని పైకి ఇతరులకంటె ఎత్తుగల
24 వాడుగా కనబడెను. । అప్పుడు సమూయేలు — జను
లందరిలో యెహోవా ఏర్పరచినవానిని మీరు చూచి
తిరా? జనులందరిలో అతనివంటివాడొకడును లేడని
చెప్పగా, జనులందరు బొబ్బలుపెట్టుచు—రాజు చిరం
జీవి యగుగాక అని కేకలువేసిరి.
25 తరువాత సమూయేలు రాజ్యపాలనపద్ధతిని జను
లకు వినిపించి, ఒక గ్రంథమందు వ్రాసి యెహోవా
సన్నిధిని దాని నుంచెను. అంతట సమూయేలు జను
26 లందరిని వారి వారి ఇండ్లకు పంపివేసెను. । సౌలును
గిబియాలోని తన ఇంటికి వెళ్లిపోయెను. దేవునిచేత
హృదయ ప్రేరేపణ నొందిన శూరులు అతని వెంట
27 వెళ్లిరి. । దుర్మార్గులైన కొందరు—ఈ మనుష్యుడు మన
లను ఏలాగు రక్షింపగలడని చెప్పుకొనుచు అతని
నిర్లక్ష్యము చేసి అతనికి కానుకలు తీసికొని రాకుం
డగా అతడు చెవిటివాడైనట్టు ఊరకుండెను.

11 అమ్మోనీయుడైన నాహాషు బయలుదేరి యాబేష్గి
లాదు కెదురుగా దిగినప్పుడు యాబేషువారందరు—
మేము నీకు సేవచేయుదుము, మాతో నిబంధనచేయు
2 మని నాహాషుతో అనిరి. । — ఇశ్రాయేలీయులందరి
మీదికి నింద తెచ్చునట్లు మీరందరి కుడికన్నులను
ఊడదీయుదునని మీతో నేను నిబంధన చేసెదనని
3 అమ్మోనీయుడైన నాహాషు । యాబేషువారి పెద్దలతో
చెప్పగా వారు—మేము ఇశ్రాయేలీయుల సరిహద్దు
లన్నిటికి దూతలను పంపుటకై యేడు దినముల గడువు
మాకిమ్ము; మమ్మును రక్షించుటకు ఎవరును లేకపోయిన
యెడల మమ్మును మేము నీకప్పగించుకొనెదమనిరి. ।
4 దూతలు సౌలు గిబియాకు వచ్చి జనులకు ఆ వర్తమా
నము తెలియజెప్పగా జనులందరు బిగ్గరగా ఏడ్చిరి. ।
5 సౌలు పొలమునుండి పశువులను తోలుకొని వచ్చుచు—
జనులు ఏడ్చుటకు హేతువేమని అడుగగా వారు
యాబేషువారు తెచ్చిన వర్తమానము అతనికి తెలియ
జేసిరి. । సౌలు ఆ వర్తమానము వినగానే దేవుని ఆత్మ 6
అతనిమీదికి బలముగా వచ్చెను. అతడు అత్యాగ్ర
హుడై । ఒక కాడి ఎడ్లను తీసి తునకలుగా చేసి 7
ఇశ్రాయేలీయుల దేశములోని నలుదిక్కులకు దూతల
చేత వాటిని పంపి—సౌలుతోను సమూయేలుతోను
చేరకుండువాడెవడో వాని యెడ్లను నేను ఈ ప్రకా
రముగా చేయుదునని వర్తమానము చేసెను. అందు
వలన యెహోవా భయము జనులమీదికి వచ్చెను
గనుక యొకడైనను నిలువకుండ వారందరు వచ్చిరి. ।
అతడు బెజెకులో వారిని లెక్కపెట్టగా ఇశ్రాయేలు 8
వారు మూడు లక్షలమందియు యూదావారు ముప్పది
వేలమందియు అయిరి. । అప్పుడు—రేపు మధ్యాహ్న 9
ములోగా మీకు రక్షణ కలుగునని యాబేష్గిలాదు
వారితో చెప్పుడని వచ్చిన దూతలతో ఆజ్ఞనిచ్చి వారిని
పంపివేసెను. దూతలు పోయి యాబేషువారికి ఆ వర్త
మానము తెలుపగా వారు సంతోషపడిరి. । కాబట్టి 10
యాబేషువారు నాహాషుయొక్క దూతలతో ఇట్లనిరి—
రేపు మేము బయలుదేరి మమ్ము అప్పగించుకొందుము,
అప్పుడు మీ దృష్టికి ఏది అనుకూలమో అది మాకు
చేయవచ్చును. । మరునాడు సౌలు జనులను మూడు 11
సమూహములుగా చేసిన తరువాత వారు తెల్లవారు
సమయమున దండుమధ్యను జొచ్చి మధ్యాహ్నము
లోగా అమ్మోనీయులను హతముచేయగా వారిలో
మిగిలినవారు ఇద్దరేసి కూడి పోజాలకుండ చెదరి
పోయిరి. । జనులు—సౌలు మనలను ఏలునా అని అడి 12
గినవారేరి? మేము వారిని చంపునట్లు ఆ మనుష్యులను
తెప్పించుడని సమూయేలుతో అనగా । సౌలు—నేడు 13
యెహోవా ఇశ్రాయేలీయులకు రక్షణ కలుగజేసెను
గనుక ఈ దినమున ఏ మనుష్యునిని మీరు చంపవద్ద
నెను.

—మనము గిల్గాలునకు వెళ్లి రాజ్యపరిపాలన పద్ధ 14
తిని మరల స్థాపించుకొందము రండని చెప్పి సమూ
యేలు జనులను పిలువగా । జనులందరు గిల్గాలుకు 15
వచ్చి గిల్గాలులో యెహోవా సన్నిధిని సమాధాన
బలులను అర్పించి, యెహోవా సన్నిధిని సౌలుకు
పట్టాభిషేకము చేసిరి. సౌలును ఇశ్రాయేలీయులంద
రును అక్కడ బహుగా సంతోషించిరి.

అప్పుడు సమూయేలు ఇశ్రాయేలీయులందరితో 12
ఇట్లనెను—ఆలకించుడి; మీరు నాతో చెప్పినమాట
నంగీకరించి మీమీద ఒకని రాజుగా నియమించి
యున్నాను. । రాజు మీ కార్యములను జరిగించును. 2
నేను తల నెరిసిన ముసలివాడను, నా కుమారులు మీ
మధ్యనున్నారు; బాల్యమునాటినుండి నేటివరకు నేను
మీ కార్యములను జరిగించుచు వచ్చితిని. । ఇదిగో 3
నేనున్నాను, నేనెవని యెద్దునైన నేదైన తీసికొం

టినా? ఎవని గార్దభమునైన పట్టుకొంటినా? ఎవనికైన
అన్యాయము చేసితినా? ఎవనికైన బాధపెట్టితినా?
న్యాయము నాకు అగపడకుండ ఎవనియొద్దనైన లంచము
పుచ్చుకొంటినా? ఆలాగు చేసినయెడల యెహోవా
సన్నిధిని ఆయన అభిషేకము చేయించిన వాని యెదు
టను మీరు నా మీద సాక్ష్యము పలుకవలెను, అప్పుడు
4 నేను మీ యెదుట దాని మరల నిత్తుననెను. | —నీవు
మాకు ఏ అన్యాయమైనను ఏ బాధనైనను చేయలేదు;
ఏ మనుష్యునియొద్దగాని నీవు దేనినైనను తీసికొనలేదని
5 వారు చెప్పగా | అతడు—అట్టిది నాయొద్ద ఏదియు
మీకు దొరకదని యెహోవాయును ఆయన అభి
షేకము చేయించినవాడును ఈ దినమున మీమీద
సాక్షులై యున్నారు అని చెప్పినప్పుడు—సాక్షులే
6 అని వారు ప్రత్యుత్తరమిచ్చిరి. | మరియు సమూ
యేలు జనులతో ఇట్లనెను—మోషేను అహరోనును
నియమించి మీ పితరులను ఐగుప్తుదేశములోనుండి
7 రప్పించినవాడు యెహోవాయే గదా! | కాబట్టి
యెహోవా మీకును మీ పితరులకును చేసిన నీతి
కార్యములనుబట్టి యెహోవా సన్నిధిని నేను మీతో
వాదించునట్లు మీరు ఇక్కడ నిలిచియుండుడి. |
8 యాకోబు ఐగుప్తునకు వచ్చిన పిమ్మట మీ పితరులు
యెహోవాకు మొఱ్ఱపెట్టగా ఆయన మోషే అహ
రోనులను పంపినందున వారు మీ పితరులను ఐగుప్తు
లోనుండి తోడుకొని వచ్చి యీ స్థలమందు నివసింప
9 జేసిరి. | అయితే వారు తమ దేవుడైన యెహోవాను
మరచినప్పుడు ఆయన వారిని హాసోరుయొక్క సేనాధి
పతిగానున్న సీసెరాచేతికిని ఫిలిష్తీయులచేతికిని మోయాబు
రాజుచేతికిని అప్పగింపగా వారు ఇశ్రాయేలీయు
10 లతో యుద్ధము చేసిరి. | అంతట వారు — మేము
యెహోవాను విసర్జించి బయలు దేవతలను అష్తా
రోతు దేవతలను పూజించినందున పాపము చేసితిమి;
మా శత్రువుల చేతిలోనుండి నీవు మమ్మును విడిపించిన
యెడల మేము నిన్ను సేవించెదమని యెహోవాకు
11 మొఱ్ఱపెట్టగా | యెహోవా యెరుబ్బయలును బెదా
నును యెఫ్తాను సమూయేలును పంపి, నలుదిశల మీ
శత్రువుల చేతిలోనుండి మిమ్మును విడిపించినందున
మీరు నిర్భయముగా కాపురము చేయుచున్నారు. |
12 అయితే అమ్మోనీయుల రాజైన నాహాషు మీమీదికి
వచ్చుట మీరు చూడగానే, మీ దేవుడైన యెహోవా
మీకు రాజైయున్నను—ఆయన కాదు, ఒక రాజు
13 మమ్మును ఏలవలెనని మీరు నాతో చెప్పితిరి. | కాబట్టి
మీరు కోరి యేర్పరచుకొనిన రాజు ఇతడే. యెహోవా
ఇతనిని మీమీద రాజుగా నిర్ణయించి యున్నాడు. |
14 మీరు యెహోవాయందు భయభక్తులు కలిగి ఆయన
మాటను విని ఆయనను సేవించి ఆయన ఆజ్ఞను భంగము
చేయక మీరును మిమ్మును ఏలు రాజును మీ దేవుడైన
యెహోవాను అనుసరించినయెడల మీకు క్షేమము
కలుగును. | అయితే యెహోవా మాట వినక ఆయన 15
ఆజ్ఞను భంగము చేసినయెడల యెహోవా హస్తము
మీ పితరులకు విరోధముగా నుండినట్లు మీకును విరో
ధముగా నుండును. | మీరు నిలిచి చూచుచుండగా 16
యెహోవా జరిగించు ఈ గొప్ప కార్యమును కని
పెట్టుడి. | గోధుమ కోతకాలము ఇదే గదా? మీరు 17
రాజును నిర్ణయింపుమని అడిగినందుచేత యెహోవా
దృష్టికి మీరు చేసిన కీడు గొప్పదని మీరు గ్రహించి
తెలిసికొనుటకై యెహోవా ఉరుములను వర్షమును
పంపునట్లుగా నేను ఆయనను వేడుకొనుచున్నాను. |
సమూయేలు యెహోవాను వేడుకొనినప్పుడు 18
యెహోవా ఆ దినమున ఉరుములను వర్షమును పం
పగా జనులందరు యెహోవాకును సమూయేలుకును
బహుగా భయపడి | సమూయేలుతో ఇట్లనిరి—రాజును 19
నియమించుమని మేము అడుగుటచేత మా పాపము
లన్నిటిని మించిన కీడు మేము చేసితిమి. కాబట్టి
మేము మరణము కాకుండ నీ దాసులమైన మాకొరకు
నీ దేవుడైన యెహోవాను ప్రార్థించుము. | అంతట 20
సమూయేలు జనులతో ఇట్లనెను—భయపడకుడి, మీరు
ఈ కీడు చేసిన మాట నిజమే, అయినను యెహోవాను
విసర్జింపకుండ ఆయనను అనుసరించుచు పూర్ణహృద
యముతో ఆయనను సేవించుడి. | ఆయనను విసర్జింప 21
కుడి, ఆయనను విసర్జింపువారు ప్రయోజనముమాలి
నవై రక్షింపలేని మాయాస్వరూపములను అనుసరించు
దురు. నిజముగా అవి మాయయే. | యెహోవా 22
మిమ్మును తనకు జనముగా చేసికొనుటకు ఇష్టము గలిగి
యున్నాడు; తన ఘనమైన నామము నిమిత్తము తన
జనులను ఆయన విడనాడడు. | నామట్టుకు నేను మరి 23
యెక్కువ ఆసక్తితో మీ నిమిత్తము ప్రార్థన చేసెదను.
ఆయన శ్రేష్ఠమైన చక్కని మార్గమును మీకు బోధిం
తును, లేనియెడల నేను యెహోవా దృష్టికి పాపినవు
దును | ఆయన మీకొరకు ఎన్ని గొప్ప కార్యములను 24
చేసెనో అది మీరు తలంచుకొని, మీరు యెహోవా
యందు భయభక్తులు కలిగి, నిష్కపటులై పూర్ణహృద
యముతో ఆయనను సేవించుట ఆవశ్యకము. | మీరు 25
కీడుచేయువారైతే తప్పకుండ మీరును మీ రాజును
నాశనమగుదురు.

సౌలు (ముప్పది) ఏండ్లవాడై యేలనారంభించెను. **13**
అతడు రెండు సంవత్సరములు ఇశ్రాయేలీయులను
ఏలిన తరువాత | ఇశ్రాయేలీయులలో మూడు వేల 2
మందిని ఏర్పరచుకొనెను. వీరిలో రెండు వేలమంది
మిక్మషులోను బేతేలు కొండలోను సౌలునొద్దనుండిరి;
వెయ్యిమంది బెన్యామీనీయుల గిబియాలో యోనా
తాను నొద్ద నుండిరి; మిగిలినవారిని అతడు వారి వారి
డేరాలకు పంపివేసెను. | యోనాతాను గెబాలోనున్న 3

ఫిలిష్తీయుల దండును హతముచేయగా ఆ సంగతి ఫిలి
ష్తీయులకు వినబడెను; మరియు దేశమంతట హెబ్రీ
4 యులు వినవలెనని సౌలు బాకా ఊదించెను. । సౌలు
ఫిలిష్తీయుల దండును హతము చేసినందున ఇశ్రాయేలీ
యులు ఫిలిష్తీయులకు హేయులైరని ఇశ్రాయేలీయు
లకు వినబడగా జనులు గిల్గాలులో సౌలునొద్దకు కూడి
వచ్చిరి.
5 ఫిలిష్తీయులు ఇశ్రాయేలీయులతో యుద్ధము
చేయుటకై ముప్పదివేల రథములను ఆరువేల గుఱ్ఱపు
రౌతులను సముద్రపుదరినుండు ఇసుక రేణువులంత
విస్తారమైన జనసమూహమును సమకూర్చుకొని వచ్చిరి.
వీరు బయలుదేరి బేతావెను తూర్పుదిక్కున మిక్మషులో
6 దిగిరి. । ఇశ్రాయేలీయులు దిగులుపడుచు వచ్చి తాము
ఇరుకులోనున్నట్టు తెలిసికొని గుహలలోను పొదల
లోను మెట్టలలోను ఉన్నతస్థలములలోను కూపముల
7 లోను దాగిరి. । కొందరు హెబ్రీయులు యొర్దాను
నది దాటి గాదుదేశమునకును గిలాదుకును వెళ్లిపోయిరి
గాని సౌలు ఇంకను గిల్గాలులోనే ఉండెను; జనులం
దరు భయపడుచు అతని వెంబడించిరి.
8 సమూయేలు చెప్పినట్టు అతడు ఏడు దినములు
ఆగి, సమూయేలు గిల్గాలుకు రాకపోవుటయు, జనులు
9 తనయొద్దనుండి చెదరిపోవుటయు చూచి । — దహన
బలులను సమాధానబలులను నాయొద్దకు తీసికొని రమ్మని
10 చెప్పి దహనబలి అర్పించెను. । అతడు దహనబలి
అర్పించి చాలించిన వెంటనే సమూయేలు వచ్చెను.
సౌలు అతని కలిసికొని అతనికి వందనము చేయుటకై
11 బయలుదేరగా । సమూయేలు అతని చూచి — నీవు
చేసినపని యేమని యడిగెను. అందుకు సౌలు — జనులు
నాయొద్దనుండి చెదరిపోవుటయు, నిర్ణయకాలమున
నీవు రాకపోవుటయు, ఫిలిష్తీయులు మిక్మషులో కూడి
12 యుండుటయు నేను చూచి । — ఇంకను యెహోవాను
శాంతిపరచకమునుపే ఫిలిష్తీయులు గిల్గాలుకు వచ్చి నా
మీద పడుదురనుకొని నా అంతట నేను సాహసించి
13 దహనబలి అర్పించితిననెను. । అందుకు సమూయేలు
ఇట్లనెను — నీ దేవుడైన యెహోవా నీకిచ్చిన ఆజ్ఞను
గైకొనక నీవు అవివేకపు పని చేసితివి; నీ రాజ్యమును
ఇశ్రాయేలీయులమీద సదాకాలము స్థిరపరచుటకు
యెహోవా తలచి యుండెను; అయితే నీ రాజ్యము
14 నిలువదు. । యెహోవా తన చిత్తానుసారమైన మన
స్సుగల యొకని కనుగొనియున్నాడు. నీకు ఆజ్ఞాపిం
చినదాని నీవు గైకొనకపోతివి గనుక యెహోవా తన
జనులమీద అతనిని అధిపతినిగా నియమించును.
15 సమూయేలు లేచి గిల్గాలును విడిచి బెన్యామీనీ
యుల గిబియాకు వచ్చెను; సౌలు తనయొద్దనున్న జను
లను లెక్కపెట్టగా వారు దాదాపు ఆరు నూర్లమంది
16 యుండిరి । సౌలును అతని కుమారుడైన యోనాతానును
తమదగ్గర నున్నవారితోకూడ బెన్యామీనీయుల గిబి
యాలో ఉండిరి; ఫిలిష్తీయులు మిక్మషులో దిగియుం
డిరి. । మరియు ఫిలిష్తీయుల పాళెములోనుండి దోపుడు 17
గాండ్లు మూడుగుంపులుగా బయలుదేరి ఒక గుంపు
షూయాలు దేశమున, ఒఫ్రాకు పోవుమార్గమున సంచ
రించెను. । రెండవ గుంపు బేత్హోరోనుకు పోవు 18
మార్గమున సంచరించెను. మూడవ గుంపు అరణ్య
సమీపమందుండు జెబోయిములోయ సరిహద్దు మార్గ
మున సంచరించెను.
హెబ్రీయులు కత్తులను ఈటెలను చేయించుకొం 19
దురేమో అని ఫిలిష్తీయులు ఇశ్రాయేలీయుల దేశమం
దంతట కమ్మరవాండ్లు లేకుండ చేసియుండిరి. । కాబట్టి 20
ఇశ్రాయేలీయులందరు తమ నక్కులను పారలను
గొడ్డండ్లను పోటకత్తులను పదును చేయించుటకై ఫిలి
ష్తీయులదగ్గరకు పోవలసి వచ్చెను. । అయితే నక్కుల 21
కును పారలకును మూడు ముండ్లుగల కొంకులకును
గొడ్డండ్లకును మునుకోల కఱ్ఱలు సరిచేయుటకును ఆకు
రాళ్లుమాత్రము వారియొద్ద నుండెను. । కాబట్టి యుద్ధ 22
దినమందు సౌలునొద్దను యోనాతానునొద్దను ఉన్న
జనులలో ఒకని చేతిలోనైనను కత్తియే గాని యీటె
యే గాని లేకపోయెను, సౌలుకును అతని కుమారుడైన
యోనాతానుకును మాత్రము అవి యుండెను. । ఫిలిష్తీ 23
యుల దండు కావలివారు కొందరు మిక్మషు కనుమకు
వచ్చిరి.

ఆ దినమున సౌలు కుమారుడైన యోనాతాను 14
తన తండ్రితో ఏమియు చెప్పక తన ఆయుధములను
మోయు పడుచువాని పిలిచి — అవతలనున్న ఫిలిష్తీయుల
దండు కావలివారిని హతముచేయ పోదము రమ్మ
నెను. । సౌలు గిబియా అవతల మిగ్రోనులో దానిమ్మ 2
చెట్టు క్రింద దిగియుండెను, అతనియొద్దనున్న
జనులు దాదాపు ఆరు నూర్లమంది. । షిలోహులో 3
యెహోవాకు యాజకుడగు ఏలీయొక్క కుమారుడైన
ఫీనెహాసుకు పుట్టిన ఈకాబోదుయొక్క సహోదరు
డైన అహీటూబుకు జననమైన అహీయా ఏఫోదు
ధరించుకొని అక్కడ ఉండెను. యోనాతాను వెళ్లిన
సంగతి జనులకు తెలియక యుండెను. । యోనాతాను 4
ఫిలిష్తీయుల దండు కావలివారున్న స్థలమునకు పో
జూచిన దారియగు కనుమల నడుమ ఇవతల ఒక సూది
గట్టును అవతల ఒక సూదిగట్టును ఉండెను, వాటిలో
ఒకదాని పేరు బొస్సేసు రెండవదాని పేరు సెనే. ।
ఒకదాని కొమ్ము మిక్మషు ఎదుట ఉత్తరపువైపునను, 5
రెండవదాని కొమ్ము గిబియాయెదుట దక్షిణపువైపునను
ఉండెను. । యోనాతాను — ఈ సున్నతిలేనివారి దండు 6
కాపరులమీదికి పోదము రమ్ము, యెహోవా మన
కార్యమును సాగించునేమో, అనేకులచేతనైనను కొద్ది
మందిచేతనైనను రక్షించుటకు యెహోవాకు అడ్డమా

అని తన ఆయుధములు మోయువానితో చెప్పగా ।
7 అతడు—నీ మనస్సులో ఉన్నదంతయు చేయుము,
పోదము రమ్ము. నీ యిష్టానుసారముగా నేను నీకు
8 తోడుగా నున్నానని అతనితో చెప్పెను. । అప్పుడు
యోనాతాను—మనము వారి దగ్గరకు పోయి మన
9 లను వారికి అగుపరుచుకొందము. । వారు మనలను
చూచి — మేము మీయొద్దకు వచ్చు వరకు అక్కడ
నిలువుడని చెప్పినపక్షమున వారియొద్దకు పోక మన
10 మున్నచోట నిలుచుదము. । — మాయొద్దకు రండని
వారు చెప్పిన పక్షమందు యెహోవా వారిని మన
చేతికి అప్పగించెనని దానిచేత గుర్తించి మనము పోద
11 మని చెప్పగా । వీరిద్దరు తమ్మునుతాము ఫిలిష్తీయుల
దండుకావలివారలకు అగుపరుచుకొనిరి. అప్పుడే ఫిలిష్తీ
యులు—చూడుడి, తాము దాగియుండిన గుహలలో
నుండి హెబ్రీయులు బయలుదేరి వచ్చుచున్నారని
12 చెప్పుకొనుచు । యోనాతానును అతని ఆయుధము
లను మోయువానిని పిలిచి—మేము మీకు ఒకటి
చూపింతుము రండని చెప్పినప్పుడు యోనాతాను—
నా వెనుక రమ్ము, యెహోవా ఇశ్రాయేలీయుల
చేతికి వారినప్పగించెనని తన ఆయుధములు మోయు
13 వానితో చెప్పి । అతడును అతని వెనుక అతని ఆయుధ
ములు మోయువాడును తమ చేతులతోను కాళ్లతోను
ప్రాకి యెక్కిరి. ఫిలిష్తీయులు యోనాతాను దెబ్బకు
పడగా అతని వెనుక వచ్చు అతని ఆయుధములు
14 మోయువాడు వారిని చంపెను. । యోనాతానును
అతని ఆయుధములు మోయువాడును చేసిన ఆ
మొదటి వధయందు దాదాపుగా ఇరువదిమంది పడిరి;
ఒక దినమున ఒక కాడి యెడ్లు దున్ను అర యెకరము
15 నేల పొడుగున అది జరిగెను. । దండులోను పొలము
లోను జనులందరిలోను మహా భయకంపము కలిగెను.
దండు కావలివారును దోపుడుగాండ్లును భీతినొందిరి;
నేల యదిరెను. వారు ఈ భయము దైవికమని భావిం
16 చిరి. । బెన్యామీనీయుల గిబియాలోనున్న దండు
వారు చెదరిపోయి బొత్తిగా ఓడిపోవుట సౌలు వేగుల
17 వారికి కనబడగా । సౌలు—మీరు లెక్కపెట్టి మన
యొద్ద లేనివారెవరో చూడుడని తనయొద్దనున్న జను
లతో చెప్పెను. వారు లెక్కచూచి యోనాతానును
అతని ఆయుధములు మోయువాడును లేరని తెలిసి
కొనిరి.
18 దేవుని మందసము అప్పుడు ఇశ్రాయేలీయుల
యొద్ద ఉండగా—దేవుని మందసమును ఇక్కడికి తీసి
19 కొనిరమ్మని సౌలు అహీయాకు సెలవిచ్చెను. । సౌలు
యాజకునితో మాటలాడుచుండగా ఫిలిష్తీయుల
దండులో ధ్వని మరి యెక్కువగా వినబడెను; కాబట్టి
సౌలు యాజకుని చూచి—నీ చెయ్యి వెనుకకు తీయు
20 మని చెప్పి । తానును తనయొద్దనున్న జనులందరును

కూడుకొని యుద్ధమునకు చేరబడిరి. వారు రాగా
ఫిలిష్తీయులు కలవరపడి ఒకరినొకరు హతముచేసి
కొనుచుండిరి. । మరియు అంతకుమునుపు ఫిలిష్తీయుల 21
పక్షమునున్నవారై చుట్టునున్న ప్రాంతములలోనుండి
వారితోకూడ దండుకు వచ్చిన హెబ్రీయులు సౌలు
నొద్దను యోనాతానునొద్దను ఉన్న ఇశ్రాయేలీయు
లతో కలిసికొనవలెనని ఫిలిష్తీయులను విడిచిరి. ।
అదియుగాక ఎఫ్రాయిము మన్యములో దాగి 22
యున్న ఇశ్రాయేలీయులును ఫిలిష్తీయులు పారి
పోయిరని విని యుద్ధమందు వారిని తరుముటలో
కూడిరి. । ఆ దినమున యెహోవా ఇశ్రాయేలీ 23
యులను ఈలాగున రక్షించెను. యుద్ధము బేతా
వెను అవతలకు సాగగా ఆ దినమున ఇశ్రాయేలీ
యులు చాలా బడలికనొందిరి. । — నేను నా శత్రు 24
వులమీద పగ తీర్చుకొనకమునుపు, సాయంత్రము
కాకమునుపు భోజనము చేయువాడు శపింపబడును
అని సౌలు జనులచేత ప్రమాణము చేయించెను, అందు
వలన జనులు ఏమియు తినకుండిరి. । జనులందరు ఒక 25
అడవిలోకి రాగా అక్కడ నేలమీద తేనె కనబడెను. ।
జనులు ఆ అడవిని జొచ్చగా తేనె కాలువ కట్టి 26
యుండెను గాని జనులు తాము చేసిన ప్రమాణము
నకు భయపడి ఒకడును చెయ్యి నోట పెట్టలేదు. ।
అయితే యోనాతాను తన తండ్రి జనులచేత చేయిం 27
చిన ప్రమాణము వినలేదు గనుక తన చేతికర్రచాపి
దాని కొనను తేనెపట్టులో ముంచి తన చెయ్యి
నోటిలో పెట్టుకొనగా అతని కన్నులు ప్రకాశించెను. ।
జనులలో ఒకడు—నీ తండ్రి జనులచేత ప్రమాణము 28
చేయించి—ఈ దినమున ఆహారము పుచ్చుకొనువాడు
శపింపబడునని ఖండితముగా ఆజ్ఞాపించి యున్నాడు;
అందుచేతనే జనులు బహు బడలి యున్నారని
చెప్పెను. । అందుకు యోనాతాను అందుచేత నా 29
తండ్రి జనులను కష్టపెట్టినవాడాయెను; నేను ఈ
తేనె కొంచెము పుచ్చుకొన్నమాత్రమున నా కన్నులు
ఎంత ప్రకాశించుచున్నవో చూడుడి. ।. జనులు 30
తాము చిక్కించుకొనిన తమ శత్రువుల దోపుళ్లవలన
బాగుగా భోజనము చేసినయెడల వారు ఫిలిష్తీయు
లను మరి అధికముగా హతముచేసి యుందురనెను. ।
ఆ దినమున జనులు ఫిలిష్తీయులను మిక్మషునుండి 31
అయ్యాలోనువరకు హతముచేయగా జనులు బహు
బడలికనొందిరి. । జనులు దోపుడుమీద ఎగబడి, గొఱ్ఱె 32
లను ఎడ్లను పెయ్యలను తీసికొని నేలమీద వాటి
వధించి రక్తముతోనే భక్షించినందున । — జనులు రక్త 33
ముతోనే తిని యెహోవా దృష్టికి పా
చున్నారని కొందరు సౌలునకు తెలి
—మీరు విశ్వాసఘాతుకు
నేడు నా దగ్గరకు గొ

అక్కడక్కడికి జనుల మధ్యకు పోయి, అందరు తమ
యెద్దులను తమ గొఱ్ఱెలను నాయొద్దకు తీసికొనివచ్చి
యిక్కడ వధించి భక్షింపవలెను; రక్తముతో మాంసము
తిని యెహోవా దృష్టికి పాపము చేయకుడని
వారితో చెప్పుడని కొందరిని పంపెను. కాబట్టి జను
లందరు ఆ రాత్రి తమ తమ యెద్దులను తీసికొని వచ్చి
35 అక్కడ వధించిరి. । మరియు సౌలు యెహోవాకు
ఒక బలిపీఠమును కట్టించెను. యెహోవాకు అతడు
కట్టించిన మొదటి బలిపీఠము అదే.
36 అంతట — మనము రాత్రియందు ఫిలిష్తీయులను
తరిమి తెల్లవారువరకు వారిని కొల్లపెట్టి, శేషించువా
డొకడును లేకుండ చేతము రండి అని సౌలు ఆజ్ఞ
ఇయ్యగా జనులు—నీ దృష్టికి ఏది మంచిదో అది
చేయుమనిరి. అంతట సౌలు — యాజకుడు ఇక్క
డనే యున్నాడు, దేవునియొద్ద విచారణ చేయుదము
37 రండని చెప్పి । సౌలు — ఫిలిష్తీయులవెనుక నేను దిగి
పోయిన పక్షమున నీవు ఇశ్రాయేలీయులచేతికి వారి
నప్పగింతువా అని దేవునియొద్ద విచారణచేయగా,
ఆ దినమున ఆయన అతనికి ప్రత్యుత్తరమియ్యకయుం
38 డెను. । అందువలన సౌలు—జనులలో పెద్దలు నా
యొద్దకు వచ్చి నేడు ఎవరివలన ఈ పాపము కలిగెనో
39 అది విచారింపవలెను. । నా కుమారుడైన యోనా
తానువలన కలిగినను వాడు తప్పక మరణమవునని
ఇశ్రాయేలీయులను రక్షించు యెహోవా జీవముతో
డని నేను ప్రమాణముచేయుచున్నానని అనెను. అయితే
జనులందరిలో అతనికి ప్రత్యుత్తరమిచ్చినవాడు ఒక
40 డును లేకపోయెను. । — మీరు ఒకతట్టునను నేనును
నా కుమారుడగు యోనాతానును ఒకతట్టునను ఉండ
వలెనని అతడు జనులందరితో చెప్పగా జనులు—నీ
దృష్టికి ఏది మంచిదో అది చేయుమని సౌలుతో
41 చెప్పిరి. । అప్పుడు సౌలు—ఇశ్రాయేలీయులకు దేవుడ
వైన యెహోవా, దోషిని కనుపరచుమని ప్రార్థిం
పగా సౌలుపేరటను యోనాతాను పేరటను చీటి
42 పడెను గాని జనులు తప్పించుకొనిరి. । — నాకును
నా కుమారుడైన యోనాతానుకును చీట్లు వేయుడని
సౌలు ఆజ్ఞ ఇయ్యగా యోనాతానుపేరట చీటి
43 పడెను. । — నీవు చేసిన దేమో నాతో చెప్పుమని
యోనాతానుతో అనగా యోనాతాను — నా చేతి
కఱ్ఱ కొనతో కొంచెము తేనె పుచ్చుకొన్నమాట
వాస్తవమే; కొంచెము తేనెకై నేను మరణమొందవలసి
44 వచ్చినదని అతనితో అనెను. । అందుకు సౌలు—
యోనాతానా, నీవు అవశ్యముగా మరణమవుదువు,
నేను ఒప్పుకొనని పక్షమున దేవుడు నాకు గొప్ప
45 అపాయము కలుగజేయుగాక అనెను. । అయితే
జనులు సౌలును చూచి—ఇశ్రాయేలీయులకు ఇంత
గొప్ప రక్షణ కలుగజేసిన యోనాతాను మరణమవునా?
అదెన్నటికిని కూడదు. దేవుని సహాయముచేత ఈ
దినమున యోనాతాను మనలను జయము నొందించెను;
యెహోవా జీవముతోడు అతని తలవెండ్రుకలలో
ఒకటియు నేల రాలదని చెప్పి యోనాతాను మర
ణముకాకుండ జనులు అతని రక్షించిరి. । అప్పుడు 46
సౌలు ఫిలిష్తీయులను తరుముట మాని వెళ్లిపోగా ఫిలి
ష్తీయులు తమ స్థలమునకు వెళ్లిరి.

ఈలాగున సౌలు ఇశ్రాయేలీయులను ఏలుటకు 47
అధికారము నొందినవాడై నలుముఖాల వారి శత్రువు
లైన మోయాబీయులతోను అమ్మోనీయులతోను ఎదో
మీయులతోను సోబాదేశపు రాజులతోను ఫిలిష్తీ
యులతోను యుద్ధముచేసెను. ఎవరిమీదికి అతడు
పోయెనో వారినందరిని ఓడించెను. । మరియు అతడు 48
దండునుకూర్చి అమాలేకీయులను హతముచేసి ఇశ్రా
యేలీయులను కొల్లసొమ్ముగా పెట్టినవారి చేతిలోనుండి
వారిని విడిపించెను.

సౌలునకు పుట్టిన కుమారుల పేర్లు ఏవనగా, యోనా 49
తాను ఇష్వీ మెల్కీషూవ; అతని యిద్దరు కుమార్తెల
పేర్లు ఏవనగా పెద్దదానిపేరు మేరబు చిన్నదానిపేరు
మీకాలు. । సౌలుయొక్క భార్యకు అహీనోయమని 50
పేరు, ఈమె అహిమయస్సు కుమార్తె. అతని సైన్యాధి
పతి పేరు అబ్నేరు, ఇతడు సౌలుకు పినతండ్రియైన
నేరు కుమారుడు. । సౌలు తండ్రియగు కీషును అబ్నేరు 51
తండ్రియగు నేరును అబీయేలు కుమారులు.

సౌలు బ్రదికిన దినములన్నియు ఫిలిష్తీయులతో 52
యుద్ధము జరుగగా తాను చూచిన బలాఢ్యులనందరిని
పరాక్రమశాలులనందరిని తనయొద్దకు ఆకర్షించు
కొనెను.

ఒకానొక దినమున సమూయేలు సౌలును పిలిచి **15**
—యెహోవా ఇశ్రాయేలీయులగు తన జనులమీద
నిన్ను రాజుగా అభిషేకించుటకై నన్ను పంపెను;
యెహోవామాట వినుము. । సైన్యములకధిపతియగు 2
యెహోవా సెలవిచ్చినదేమనగా — అమాలేకీయులు
ఇశ్రాయేలీయులకు చేసినది నాకు జ్ఞాపకమే, వారు
ఐగుప్తులోనుండి రాగానే అమాలేకీయులు వారికి
విరోధులై మార్గమందు వారిమీదికి వచ్చిరి గదా. ।
కాబట్టి నీవు పోయి కనికరింపక అమాలేకీయులను 3
హతముచేయుచు, పురుషులనేమి స్త్రీలనేమి బాలుర
నేమి పసిపిల్లలనేమి యెద్దులనేమి గొఱ్ఱెలనేమి ఒంటెల
నేమి గార్దభములనేమి అన్నిటిని హతముచేసి వారికి
కలిగినదంతయు బొత్తిగా పాడుచేసి అమాలేకీయులను
నిర్మూలము చేయుమని చెప్పెను.

అంతట సౌలు జనులను పోగుచేసి తెలాయీ 4
ములో వారిని లెక్కపెట్టగా, కాలిబలము రెండు
లక్షలమందియు యూదావారు పదివేలమందియు
నుండిరి. । అప్పుడు సౌలు అమాలేకీయుల పట్టణము 5

లలో నొకదానికి వచ్చి లోయలో పొంచియుండి ।
6 —ఇశ్రాయేలీయులు ఐగుప్తులోనుండి వచ్చినప్పుడు
మీరు వారికి ఉపకారము చేసితిరి గనుక అమాలేకీ
యులతో కూడ నేను మిమ్మును నాశనము చేయకుండు
నట్లు మీరు వారిలోనుండి బయలుదేరి పోవుడని కేనీ
యులకు వర్తమానము పంపగా కేనీయులు అమాలేకీ
7 యులలోనుండి వెళ్లిపోయిరి. । తరువాత సౌలు అమా
లేకీయులను హవీలానుండి ఐగుప్తుదేశపు మార్గమున
8 నున్న షూరువరకు తరిమి హతముచేసి । అమాలేకీ
యుల రాజైన అగగును ప్రాణముతో పట్టుకొని
9 జనులనందరిని కత్తిచేత నిర్మూలముచేసెను. । సౌలును
జనులును కూడి అగగును, గొఱ్ఱెలలోను ఎడ్లలోను
క్రొవ్విన గొఱ్ఱెపిల్లలు మొదలైనవాటిలోను మంచి
వాటిని నిర్మూలము చేయక కడగానుంచి, పనికిరాని
నీచపశువులన్నిటిని నిర్మూలముచేసిరి.
10 అప్పుడు యెహోవా వాక్కు సమూయేలుకు
11 ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను ।—సౌలు నన్ను
అనుసరింపక వెనుకతీసి నా ఆజ్ఞలను గైకొనకపోయెను
గనుక అతనిని రాజుగా నిర్ణయించినందుకు నేను
పశ్చాత్తాపపడుచున్నాను. అందుకు సమూయేలు
కోపావేశుడై రాత్రి అంతే యెహోవాకు మొఱ్ఱ
12 పెట్టుచుండెను. । ఉదయమున సమూయేలు లేచి
సౌలును ఎదుర్కొనుటకు పోగా సౌలు కర్మెలుకు
వచ్చి అక్కడ జయసూచకమైన శిలను నిలిపి తిరిగి
13 గిల్గాలుకు పోయెనన్న సమాచారము వినెను. । తరువాత
అతడు సౌలునొద్దకు రాగా సౌలు —యెహోవా
వలన నీకు ఆశీర్వాదము కలుగుగాక, యెహోవా
14 ఆజ్ఞను నేను నెరవేర్చితిననగా । సమూయేలు—ఆలా
గైతే నాకు వినబడుచున్న గొఱ్ఱెల అరుపులును ఎడ్ల
15 రంకెలును ఎక్కడివి? అని అడిగెను. । అందుకు సౌలు
—అమాలేకీయులయొద్దనుండి జనులు వీటిని తీసికొని
వచ్చిరి; నీ దేవుడైన యెహోవాకు బలులనర్పించు
టకు జనులు గొఱ్ఱెలలోను ఎడ్లలోను మంచివాటిని
ఉండనిచ్చిరి, మిగిలినవాటినన్నిటిని మేము నిర్మూలము
16 చేసితిమనగా । సమూయేలు—నీవు మాటలాడ పని
లేదు. యెహోవా రాత్రి నాతో సెలవిచ్చిన మాట
నీకు తెలియజేతును వినుమని సౌలుతో అనగా, సౌలు
17 —చెప్పుమనెను. । అందుకు సమూయేలు—నీ దృష్టికి
నీవు అల్పుడవుగా ఉన్నప్పుడు ఇశ్రాయేలీయుల
గోత్రములకు శిరస్సువైతివి, యెహోవా నిన్ను
ఇశ్రాయేలీయులమీద రాజుగా అభిషేకించెను. ।
18 మరియు యెహోవా నిన్ను సాగనంపి—నీవు పోయి
పాపాత్ములైన అమాలేకీయులను నిర్మూలము చేయుము,
వారు లయమగువరకు వారితో యుద్ధము చేయుమని
19 సెలవియ్యగా । నీవు ఎందుచేత యెహోవా మాట

వినక దోపుడుమీద ఎగబడి ఆయన దృష్టికి కీడు
చేసితివనెను. । అందుకు సౌలు—ఆ మాట అనవద్దు; 20
నేను యెహోవా మాట విని యెహోవా నన్ను
పంపిన మార్గమున పోయి అమాలేకీయుల రాజైన అగ
గును తీసికొనివచ్చితిని కాని అమాలేకీయులను నిర్మూ
లము చేసితిని. । అయితే గిల్గాలులో నీ దేవుడైన 21
యెహోవాకు బలి అర్పించుటకై జనులు శపితము
లగు గొఱ్ఱెలలోను ఎడ్లలోను ముఖ్యమైనవాటిని తీసి
కొనివచ్చిరని సమూయేలుతో చెప్పెను. । అందుకు 22
సమూయేలు—తాను సెలవిచ్చిన ఆజ్ఞను ఒకడు గైకొ
నుట చూచి యెహోవా సంతోషించునట్లు, ఒకడు
దహనబలులను బలులను అర్పించుట చూచి ఆయన
సంతోషించునా? ఆలోచించుము, బలులు అర్పించుట
కంటె ఆజ్ఞను గైకొనుటయు, పొట్టేళ్లక్రొవ్వు అర్పిం
చుటకంటె మాట వినుటయు శ్రేష్ఠము. । తిరుగబాటు 23
చేయుట సోదెచెప్పుటయను పాపముతో సమానము;
మూర్ఖతను అగపరచుట మాయావిగ్రహములను గృహ
దేవతలను పూజించుటతో సమానము. యెహోవా
ఆజ్ఞను నీవు విసర్జించితివి గనుక నీవు రాజుగా ఉండ
కుండ ఆయన నిన్ను విసర్జించెననగా । సౌలు—జను 24
లకు జడిసి వారి మాట వినినందున నేను యెహోవా
ఆజ్ఞను నీ మాటలను మీరి పాపము తెచ్చుకొంటిని. ।
కాబట్టి నీవు నా పాపమును పరిహరించి నేను 25
యెహోవాకు మ్రొక్కునట్లు నాతోకూడ తిరిగి
రమ్మని సమూయేలును వేడుకొనెను. । అందుకు 26
సమూయేలు — నీతోకూడ నేను తిరిగిరాను; నీవు
యెహోవా ఆజ్ఞను విసర్జించితివి గనుక ఇశ్రాయేలీ
యులమీద రాజుగా ఉండకుండ యెహోవా నిన్ను
విసర్జించెనని చెప్పి । వెళ్లిపోవలెనని తిరుగగా, సౌలు 27
అతని దుప్పటిచెంగు పట్టుకొనినందున అది చినిగెను. ।
అప్పుడు సమూయేలు అతనితో ఇట్లనెను—నేడు 28
యెహోవా ఇశ్రాయేలీయుల రాజ్యమును నీ చేతి
లోనుండి లాగివేసి నీకంటె ఉత్తముడైన నీ పొరుగు
వానికి దానిని అప్పగించియున్నాడు. । మరియు 29
ఇశ్రాయేలీయులకు ఆధారమైనవాడు నరుడుకాడు,
ఆయన అబద్ధమాడడు, పశ్చాత్తాపపడడు. । అందుకు 30
సౌలు—నేను పాపముచేసితిని, అయినను నా జనుల
పెద్దలయెదుటను ఇశ్రాయేలీయులయెదుటను నన్ను
ఘనపరచి యెహోవాకు మ్రొక్కుటకై నేను పోగా
నాతోకూడ తిరిగి రమ్మని అతని వేడుకొనినందున ।
సమూయేలు తిరిగి సౌలువెంట వెళ్లెను. సౌలు 31
యెహోవాకు మ్రొక్కినతరువాత । సమూయేలు— 32
అమాలేకీయుల రాజైన అగగును నా దగ్గరకు తీసి
కొనిరండని చెప్పెను. అగగు సంకెళ్లతో[1] బంధింప
బడినవాడై[1] అతని దగ్గరకు వచ్చి—మరణశ్రమ నాకు

1 లేక, సంతోషముగా.

33 గడచిపోయెనే అని చెప్పగా । సమూయేలు—నీ కత్తి
స్త్రీలను సంతులేకుండ చేసినట్టు నీ తల్లికిని స్త్రీలలో సంతు
లేకపోవునని అతనితో చెప్పి గిల్గాలులో యెహోవా
సన్నిధిని అగగును తుత్తునియలుగా నరికెను.
34 అప్పుడు సమూయేలు రామాకు వెళ్లిపోయెను,
సౌలును సౌలు గిబియాలోని తన యింటికి వెళ్లెను. ।
35 సౌలు బ్రదికిన దినములన్నిటను సమూయేలు అతని
దర్శింప వెళ్లలేదు గాని సౌలునుగూర్చి దుఃఖాక్రాం
తుడాయెను. మరియు తాను సౌలును ఇశ్రాయేలీ
యులమీద రాజుగా నిర్ణయించినందుకు యెహోవా
పశ్చాత్తాపము నొందెను.

**16** అంతట యెహోవా సమూయేలుతో ఈలాగు
సెలవిచ్చెను—ఇశ్రాయేలీయులమీద రాజుగా ఉండ
కుండ నేను విసర్జించిన సౌలునుగూర్చి నీవెంతకాలము
దుఃఖింతువు? నీ కొమ్మును తైలముతో నింపుము, బేత్లె
హేమీయుడైన యెష్షయియొద్దకు నిన్ను పంపు
చున్నాను, అతని కుమారులలో ఒకని నేను రాజుగా
2 నియమించుదును. । సమూయేలు—నేనెట్లు వెళ్లుదును?
నేను వెళ్లిన సంగతి సౌలు వినినపక్షమున అతడు నన్ను
చంపుననగా యెహోవా—నీవు ఒక పెయ్యను తీసి
కొనిపోయి యెహోవాకు బలిపశువును వధించుటకై
3 వచ్చితినని చెప్పి । యెష్షయిని బల్యర్పణమునకు పిలు
వుము; అప్పుడు నీవు చేయవలసినదానిని నీకు తెలియ
జేతును; ఎవనిపేరు నేను నీకు చెప్పుదునో అతని నీవు
4 అభిషేకింపవలెనని సెలవియ్యగా । సమూయేలు
యెహోవా ఇచ్చిన సెలవుచొప్పున బేత్లెహేముకు
వెళ్లెను. ఆ ఊరి పెద్దలు అతని రాకకు భయపడి—
సమాధానముగా వచ్చుచున్నావా అని అడుగగా ।
5 అతడు—సమాధానముగానే వచ్చితిని; యెహోవాకు
బలి అర్పించుటకై వచ్చితిని; మీరు శుచిర్భూతులై
నాతోకూడ బలికి రండని చెప్పి, యెష్షయిని అతని
కుమారులను శుచిర్భూతులను జేసి బలి అర్పించెను. ।
6 వారు వచ్చినప్పుడు అతడు ఏలీయాబును చూచి—నిజ
ముగా యెహోవా అభిషేకించువాడు ఆయన
7 యెదుట నిలిచియున్నాడని అనుకొనెను. । అయితే
యెహోవా సమూయేలుతో ఈలాగు సెలవిచ్చెను—
అతని రూపమును అతని యెత్తును లక్ష్యపెట్టకుము,
మనుష్యులు లక్ష్యపెట్టువాటిని యెహోవా లక్ష్య
పెట్టడు; నేను అతని త్రోసివేసియున్నాను. మను
ష్యులు పైరూపమును లక్ష్యపెట్టుదురుగాని
8 యెహోవా హృదయమును లక్ష్యపెట్టును. । యెష్షయి
అబీనాదాబును పిలిచి సమూయేలు ఎదుటికి అతని
రప్పింపగా అతడు—యెహోవా ఇతని కోరుకొన
9 లేదనెను. । అప్పుడు యెష్షయి షమ్మాను పిలువగా
అతడు—యెహోవా ఇతనిని కోరుకొనలేదనెను. ।
10 యెష్షయి తన యేడుగురు కుమారులను సమూయేలు
ఎదుటికి పిలువగా సమూయేలు—యెహోవా వీరిని
కోరుకొనలేదని చెప్పి । నీ కుమారులందరు ఇక్కడ 11
నున్నారా అని యెష్షయిని అడుగగా అతడు—ఇంకను
కడసారివాడున్నాడు. అయితే వాడు గొఱ్ఱెలను
కాయుచున్నాడని చెప్పెను. అందుకు సమూయేలు—
నీవు వాని పిలువనంపించుము, అతడిక్కడికి వచ్చువరకు
మనము కూర్చుండమని యెష్షయితో చెప్పగా । అతడు 12
వాని పిలువనంపించి లోపలికి తోడుకొనివచ్చెను.
అతడు ఎఱ్ఱనివాడును చక్కని నేత్రములు గల
వాడును చూచుటకు సుందరమైనవాడునై యుండెను.
అతడు రాగానే — నేను కోరుకొన్నవాడు ఇతడే,
నీవు లేచి వానిని అభిషేకించుమని యెహోవా సెల
వియ్యగా । సమూయేలు తైలపు కొమ్మును తీసి వాని 13
సహోదరుల యెదుట వానికి అభిషేకముచేసెను.
నాటనుండి యెహోవా ఆత్మ దావీదుమీదికి బలముగా
వచ్చెను. తరువాత సమూయేలు లేచి రామాకు వెళ్లి
పోయెను.

యెహోవా ఆత్మ సౌలును విడిచిపోయి 14
యెహోవాయొద్దనుండి దురాత్మయొకటి వచ్చి అతని
వెరపింపగా । సౌలు సేవకులు — దేవునియొద్దనుండి 15
వచ్చిన దురాత్మయొకటి నిన్ను వెరపించియున్నది; ।
మా యేలినవాడవైన నీవు ఆజ్ఞ ఇమ్ము, నీ దాసులమైన 16
మేము సిద్ధముగానున్నాము. సితారా చమత్కార
ముగా వాయింపగల యొకని విచారించుటకై మాకు
సెలవిమ్ము. దేవునియొద్దనుండి దురాత్మ వచ్చి నిన్ను పట్టి
నప్పుడెల్ల అతడు సితారా చేతపట్టుకొని వాయించుట
చేత నీవు బాగుపడుదువని అతనితో ననిరి । సౌలు— 17
బాగుగా వాయింపగల యొకని విచారించి నాయొద్దకు
తీసికొనిరండని తన సేవకులకు సెలవియ్యగా వారిలో
ఒకడు । — చిత్తగించుము, బేత్లెహేమీయుడైన 18
యెష్షయియొక్క కుమారులలో ఒకని చూచితిని,
అతడు చమత్కారముగా వాయింపగలడు, అతడు
బహు శూరుడును యుద్ధశాలియు మాట నేర్పరియు
రూపసియునై యున్నాడు, మరియు యెహోవా
వానికి తోడుగా నున్నాడనగా । సౌలు—యెష్షయి 19
యొద్దకు దూతలను పంపి, గొఱ్ఱెలయొద్దనున్న నీ
కుమారుడైన దావీదును నాయొద్దకు పంపుమనెను. ।
అప్పుడు యెష్షయి ఒక గార్దభముమీద రొట్టెలను 20
ద్రాక్షారసపు తిత్తిని ఒక మేకపిల్లను వేయించి తన
కుమారుడైన దావీదుచేత సౌలునొద్దకు పంపెను. ।
దావీదు సౌలుదగ్గరకు వచ్చి అతనియెదుట నిలువ 21
బడగా అతనియందు సౌలుకు బహు ఇష్టము పుట్టెను,
అతడు సౌలు ఆయుధములను మోయువాడాయెను. ।
అంతట సౌలు—దావీదు నా అనుగ్రహము పొందెను 22
గనుక అతడు నా సముఖమందు సేవచేయుటకు ఒప్పు
కొనుమని యెష్షయికి వర్తమానము పంపెను. । దేవుని 23

యొద్దనుండి దురాత్మ వచ్చి సౌలును పట్టినప్పుడెల్ల
దావీదు సితారా చేతపట్టుకొని వాయింపగా దురాత్మ
అతని విడిచిపోయెను, అతడు సేదదీరి బాగాయెను.

17 ఫిలిష్తీయులు తమ సైన్యములను యుద్ధమునకు
సమకూర్చి యూదా దేశములోని శోకోలో కూడి
ఎఫెస్దమ్మీముదగ్గర శోకోకును అజేకాకును మధ్యను
2 దిగియుండగా । సౌలును ఇశ్రాయేలీయులును కూడి
వచ్చి ఏలాం లోయలో దిగి ఫిలిష్తీయుల కెదురుగ యుద్ధ
3 పంక్తులు తీర్చిరి. । ఫిలిష్తీయులు ఆతట్టు పర్వతము
మీదను ఇశ్రాయేలీయులు ఈతట్టు పర్వతముమీదను
నిలిచియుండగా ఉభయులమధ్యను ఒక లోయ యుం
4 డెను. । గాతువాడైన గొల్యాతు అను శూరుడొకడు
ఫిలిష్తీయుల దండులోనుండి బయలుదేరుచుండెను.
5 అతడు ఆరుమూళ్ల జేనెడు ఎత్తు మనిషి. । అతని తల
మీద రాగి శిరస్త్రాణముండెను, అతడు యుద్ధకవచము
ధరించియుండెను, ఆ కవచము అయిదు వేల తుల
6 ముల రాగి యెత్తుగలది. । మరియు అతని కాళ్లకు
రాగి కవచమును అతని భుజములమధ్యను రాగి బల్లె
7 మొకటి యుండెను. । అతని యీటె కర్ర నేతగాని
దోనె అంతపెద్దది; మరియు అతని యీటెకొన ఆరు
నూర్ల తులముల యినుము ఎత్తుగలది. ఒకడు బల్లెము
8 మోయుచు అతనిముందర పోవుచుండెను. । అతడు
నిలిచి ఇశ్రాయేలీయుల దండువారిని పిలిచి — యుద్ధ
పంక్తులు తీర్చుటకై మీరెందుకు బయలుదేరి వచ్చితిరి!
నేను ఫిలిష్తీయుడను కానా? మీరు సౌలు దాసులు
కారా? మీ పక్షముగా ఒకనిని ఏర్పరచుకొని అతని
9 నాయొద్దకు పంపుడి; । అతడు నాతో పోట్లాడి నన్ను
చంపగలిగినయెడల మేము మీకు దాసులమగుదుము;
నేనతని జయించి చంపినయెడల మీరు మాకు దాసులై
10 మాకు దాస్యము చేయుదురు. । ఈ దినమున నేను
ఇశ్రాయేలీయుల సైన్యములను తిరస్కరించుచున్నాను.
ఒకని నియమించిన యెడల వాడును నేనును పోట్లా
11 డుదుమని ఆ ఫిలిష్తీయుడు చెప్పుచువచ్చెను. । సౌలును
ఇశ్రాయేలీయులందరును ఆ ఫిలిష్తీయుని మాటలు విని
నప్పుడు వెరగుపడి బహు భీతులైరి.

12 దావీదు యూదా బేత్లెహేమువాడగు ఎఫ్రా
తీయుడైన యెష్షయి అనువాని కుమారుడు. యెష్షయికి
ఎనమండుగురు కుమాళ్లుండిరి. అతడు సౌలు కాల
ముందు జనులలో ముసలివాడై బలహీనుడై యుం
13 డెను. । అయితే యెష్షయియొక్క ముగ్గురు పెద్దకుమా
రులు యుద్ధమునకు సౌలువెంటను పోయియుండిరి.
యుద్ధమునకు పోయిన అతని ముగ్గురు కుమారుల
పేరులు ఏవనగా, జ్యేష్ఠుడు ఏలీయాబు, రెండవవాడు
14 అబీనాదాబు, మూడవవాడు షమ్మా, । దావీదు కని
ష్ఠుడు; పెద్దవారైన ముగ్గురు సౌలువెంటను పోయి
15 యుండిరిగాని । దావీదు బేత్లెహేములో తన తండ్రి
గొఱ్ఱెలను మేపుచు సౌలునొద్దకు తిరిగి పోవుచు
వచ్చుచునుండెను. । ఆ ఫిలిష్తీయుడు ఉదయమునను 16
సాయంత్రమునను బయలుదేరుచు నలువది దినములు
తన్నుతాను అగుపరుచుకొనుచు వచ్చెను.

యెష్షయి తన కుమారుడైన దావీదును పిలిచి—నీ 17
సహోదరులకొరకు వేయించిన యీ గోధుమలలో
ఒక తూమెడును ఈ పది రొట్టెలను తీసికొని దం
డులోనున్న నీ సహోదరులదగ్గరకు త్వరగా పొమ్ము. ।
మరియు ఈ పది జున్నుగడ్డలు తీసికొనిపోయి వారి 18
సహస్రాధిపతికిమ్ము; నీ సహోదరులు క్షేమముగా
నున్నారో లేదో సంగతి తెలిసికొని వారియొద్దనుండి
ఆనవాలొకటి తీసికొని రమ్మని చెప్పి పంపివేసెను. ।
సౌలును వారును ఇశ్రాయేలీయులందరును ఏలా 19
లోయలో ఫిలిష్తీయులతో యుద్ధము చేయుచుండగా ।
దావీదు ఉదయమున లేచి ఒక కాపరికి గొఱ్ఱెలను 20
అప్పగించి ఆ వస్తువులను తీసికొని యెష్షయి తనకిచ్చిన
ఆజ్ఞచొప్పున ప్రయాణమై పోయెను; అయితే అతడు
దండుకొత్తళమునకు వచ్చునప్పటికి వారును వీరును
పంక్తులుగా తీరి, జయము జయమని అరుచుచు యుద్ధ
మునకు సాగుచుండిరి. । సైన్యము సైన్యమునకు ఎదురై 21
ఇశ్రాయేలీయులును ఫిలిష్తీయులును యుద్ధసన్నద్ధులై
బయలుదేరుచుండిరి. । దావీదు తాను తెచ్చిన వస్తువు 22
లను సామగ్రిని కనిపెట్టువాని వశముచేసి, పరుగెత్తి
పోయి సైన్యములో చొచ్చి కుశలప్రశ్నలు తన
సహోదరులనడిగెను. । అతడు వారితో మాటలాడు 23
చుండగా గాతు ఫిలిష్తీయుడైన గొల్యాతు అను
శూరుడు ఫిలిష్తీయుల సైన్యములోనుండి వచ్చి పై
చెప్పిన మాటలచొప్పున పలుకగా దావీదు వినెను. ।
ఇశ్రాయేలీయులందరు ఆ మనుష్యుని చూచి మిక్కిలి 24
భయపడి వాని యెదుటనుండి పారిపోగా । ఇశ్రా 25
యేలీయులలో ఒకడు — వచ్చుచున్న ఆ మనిషిని
చూచితిరే; నిజముగా ఇశ్రాయేలీయులను తిరస్క
రించుటకై వాడు బయలుదేరుచున్నాడు, వాని చం
పినవానికి రాజు బహుగ ఐశ్వర్యము కలుగజేసి తన
కుమార్తెనిచ్చి పెండ్లిచేసి వాని తండ్రి ఇంటివారిని
ఇశ్రాయేలీయులలో స్వతంత్రులుగా చేయుననగా ।
దావీదు—జీవముగల దేవుని సైన్యములను తిరస్కరించు 26
టకు ఈ సున్నతిలేని ఫిలిష్తీయుడు ఎంతటివాడు?
వాని చంపి ఇశ్రాయేలీయులనుండి యీ నింద తొల
గించినవానికి బహుమతి యేమని తనయొద్ద నిలిచిన
వారి నడుగగా । జనులు—వాని చంపినవానికి ఇట్లిట్లు 27
చేయబడునని అతనికుత్తరమిచ్చిరి.

అతడు వారితో మాటలాడునది అతని పెద్దన్న 28
యగు ఏలీయాబుకు వినబడగా ఏలీయాబుకు దావీదు
మీద కోపమువచ్చి అతని చూచి—నీవిక్కడి కెందుకు
వచ్చితివి? అరణ్యములోని ఆ చిన్న గొఱ్ఱె మందను

ఎవరి వశము చేసితివి? నీ గర్వమును నీ హృదయపు
చెడుతనమును నేనెరుగుదును; యుద్ధము చూచుటకే
29 గదా నీవు వచ్చితివనెను. । అందుకు దావీదు—నేనేమి
30 చేసితిని? మాట మాత్రము పలికితినని చెప్పి । అతని
యొద్దనుండి తొలగి, తిరిగి మరియొకని ఆ ప్రకారమే
యడుగగా జనులు వానికి అదేప్రకారము ప్రత్యుత్తర
31 మిచ్చిరి. । దావీదు చెప్పిన మాటలు నలుగురికిని తెలి
యగా జనులు ఆ సంగతి సౌలుతో తెలియజెప్పిరి
32 గనుక అతడు దావీదును పిలువనంపెను. । —ఈ
ఫిలిష్తీయునిబట్టి యెవరిమనస్సును క్రుంగ నిమిత్తము
లేదు. మీ దాసుడనైన నేను వానితో పోట్లాడుదు
33 నని దావీదు సౌలుతో అనగా । సౌలు—ఈ ఫిలిష్తీ
యుని ఎదుర్కొని వానితో పోట్లాడుటకు నీకు
బలము చాలదు; నీవు బాలుడవు, వాడు బాల్యము
నుండి యుద్ధాభ్యాసము చేసినవాడని దావీదుతో
34 అనెను. । అందుకు దావీదు సౌలుతో ఇట్లనెను—మీ
దాసుడనైన నేను నా తండ్రియొక్క గొర్రెలను
కాయుచుండగా సింహమును ఎలుగుబంటియును వచ్చి
మందలోనుండి ఒక గొర్రెపిల్లను ఎత్తికొని పోయెను.।
35 నేను దాని తరిమి చంపి దాని నోటనుండి ఆ గొర్రె
పిల్లను విడిపించితిని; అది నామీదికి రాగా దాని
36 గడ్డము పట్టుకొని దాని కొట్టి చంపితిని. । మీ దాసుడ
నైన నేను ఆ సింహమును ఎలుగుబంటిని చంపితినే,
జీవముగల దేవుని సైన్యములను తిరస్కరించిన యీ
సున్నతిలేని ఫిలిష్తీయుడు వాటిలో ఒకదానివలె అగు
37 ననియు, । సింహముయొక్క బలమునుండియు, ఎలుగు
బంటియొక్క బలమునుండియు నన్ను రక్షించిన
యెహోవా ఈ ఫిలిష్తీయుని చేతిలోనుండి కూడను
నన్ను విడిపించునని చెప్పెను. అందుకు సౌలు—పొమ్ము;
యెహోవా నీకు తోడుగానుండునుగాక అని దావీ
దుతో అనెను.

38 పిమ్మట సౌలు తన యుద్ధవస్త్రములను దావీదుకు
ధరింపజేసి, రాగి శిరస్త్రాణమొకటి అతనికి కట్టి, యుద్ధ
39 కవచము తొడిగించెను. । ఈ సామగ్రి దావీదుకు
వాడుకలేదు గనుక తాను తొడిగిన వాటిపైన కత్తి
కట్టుకొని వెళ్లకలిగినది లేనిది చూచుకొనిన తరువాత
దావీదు—ఇవి నాకు వాడుకలేదు, వీటితో నేను వెళ్ల
40 లేనని సౌలుతో చెప్పి వాటిని తీసివేసి । తన కర్ర
చేత పట్టుకొని యేటి లోయలోనుండి అయిదు నున్నని
రాళ్లను ఏరుకొని తన యొద్దనున్న చిక్కములో నుంచు
కొని వడిసెల చేత పట్టుకొని ఆ ఫిలిష్తీయుని చేరువకు
41 పోయెను. । బల్లెము మోయువాడు తనకు ముందు
నడువగా ఆ ఫిలిష్తీయుడు బయలుదేరి దావీదు దగ్గ
42 రకు వచ్చి । చుట్టు పారచూచి దావీదును కనుగొని,
అతడు బాలుడై యెర్రటివాడును రూపసియునై
43 యుండుట చూచి అతని తృణీకరించెను. । ఫిలిష్తీ
యుడు—కర్ర తీసికొని నీవు నా మీదికి వచ్చు
చున్నావే, నేను కుక్కనా? అని దావీదుతో చెప్పి
తన దేవతలపేరట దావీదును శపించెను. । —నా దగ్గ 44
రకు రమ్ము, నీ మాంసమును ఆకాశపక్షులకును భూ
మృగములకును ఇచ్చివేతునని ఆ ఫిలిష్తీయుడు దావీ
దుతో అనగా । దావీదు—నీవు కత్తియు ఈటెయు 45
బల్లెమును ధరించుకొని నా మీదికి వచ్చుచున్నావు;
అయితే నీవు తిరస్కరించిన ఇశ్రాయేలీయుల సైన్య
ములకధిపతియగు యెహోవా పేరట నేను నీమీదికి
వచ్చుచున్నాను. । ఈ దినమున యెహోవా నిన్ను 46
నా చేతికి అప్పగించును; నేను నిన్ను చంపి నీ తల
తెగవేతును; ఇశ్రాయేలీయులలో దేవుడున్నాడని
లోకనివాసులందరును తెలిసికొనునట్లు నేను ఈ దిన
మున ఫిలిష్తీయులయొక్క కళేబరములను ఆకాశపక్షుల
కును భూమృగములకును ఇత్తును. । అప్పుడు 47
యెహోవా కత్తిచేతను ఈటెచేతను రక్షించువాడు
కాడని యీ దండువారందరు తెలిసికొందురు;
యుద్ధము యెహోవాదే; ఆయన మిమ్మును మా చేతికి
అప్పగించునని చెప్పెను. । ఆ ఫిలిష్తీయుడు లేచి 48
దావీదును కలియుటకై అతనికి ఎదురుపోగా దావీదు
వానిని ఎదుర్కొనుటకు సైన్యముతట్టు త్వరగా పరు
గెత్తిపోయి । తన సంచిలో చెయ్యివేసి అందులో 49
నుండి రాయి యొకటి తీసి వడిసెలతో విసరి ఆ ఫిలిష్తీ
యుని నుదుట కొట్టెను. ఆ రాయి వాని నుదురు
చొచ్చినందున వాడు నేలను బోర్లపడెను. । దావీదు 50
ఫిలిష్తీయునికంటె బలాఢ్యుడై ఖడ్గము లేకయే వడిసెల
తోను రాతితోను ఆ ఫిలిష్తీయుని కొట్టి చంపెను. ।
వాడు బోర్లపడగా దావీదు పరుగెత్తిపోయి ఫిలిష్తీయుని 51
మీద నిలుచుండి వాని కత్తి వరదూసి దానితో వాని
చంపి వాని తలను తెగవేసెను. ఫిలిష్తీయులు తమ
శూరుడు చచ్చుట చూచి పారిపోయిరి. । అప్పుడు 52
ఇశ్రాయేలువారును యూదావారును లేచి—జయము
జయమని ఆర్చుచు లోయవరకును షరాయిము ఎక్రోను
వరకును ఫిలిష్తీయులను తరుముగా ఫిలిష్తీయులు హతులై
షరాయిము ఎక్రోను మార్గమున గాతు ఎక్రోను అను
పట్టణములవరకు కూలిరి. । అప్పుడు ఇశ్రాయేలీయులు 53
ఫిలిష్తీయులను తరుముట మాని తిరిగి వచ్చి వారి డేరా
లను దోచుకొనిరి. । అయితే దావీదు ఆ ఫిలిష్తీయుని 54
ఆయుధములను తన డేరాలో ఉంచుకొని అతని
తలను తీసికొని యెరూషలేమునకు వచ్చెను.

సౌలు దావీదు ఫిలిష్తీయునికి ఎదురుగా పోవుట 55
చూచినప్పుడు తన సైన్యాధిపతియైన అబ్నేరును
పిలిచి—అబ్నేరూ, ఈ యౌవనుడు ఎవని కుమారుడని
అడుగగా అబ్నేరు—రాజా, నీ ప్రాణముతోడు
నాకు తెలియదనెను. । అందుకు రాజు—ఈ పడుచు 56
వాడు ఎవని కుమారుడో అడిగి తెలిసికొమ్మని అతనికి

57 ఆజ్ఞ ఇచ్చెను. । దావీదు ఫిలిష్తీయుని చంపి తిరిగి
వచ్చినప్పుడు అబ్నేరు అతని పిలుచుకొనిపోయి ఫిలిష్తీ
యుని తల చేతనుంచగా అతని సౌలుదగ్గరకు తోడు
58 కొనివచ్చెను. । సౌలు అతని చూచి—చిన్నవాడా,
నీవెవని కుమారుడవని అడుగగా దావీదు—నేను బేత్లె
హేమీయుడైన యెష్షయి అను నీ దాసుని కుమారుడ
నని ప్రత్యుత్తరమిచ్చెను.

18 దావీదు సౌలుతో మాటలాడుట చాలించినప్పుడు
యోనాతాను హృదయము దావీదు హృదయముతో
కలిసిపోయెను; యోనాతాను దావీదును తనకు ప్రాణ
స్నేహితునిగా భావించుకొని అతని ప్రేమించెను. ।
2 ఆ దినమున అతని తండ్రి ఇంటికి తిరిగి అతని వెళ్లని
3 య్యక సౌలు అతని చేర్చుకొనెను. । దావీదు తనకు
ప్రాణస్నేహితుడని భావించుకొని అతని ప్రేమిం
చుచు యోనాతాను అతనితో నిబంధనచేసికొనెను. ।
4 మరియు యోనాతాను తన దుప్పటిని తన కత్తిని తన
5 విల్లును నడికట్టును తీసి దావీదుకిచ్చెను. । దావీదు సౌలు
తనను పంపిన చోట్లకెల్లను పోయి, సుబుద్ధి గలిగి పని
చేసికొనివచ్చెను గనుక సౌలు యోధులమీద అతని
నియమించెను. జనులందరి దృష్టికిని సౌలు సేవకుల
దృష్టికిని దావీదు అనుకూలుడైయుండెను.
6 దావీదు ఫిలిష్తీయులను హతముచేసి తిరిగి వచ్చి
నప్పుడు, స్త్రీలు ఇశ్రాయేలీయుల ఊళ్లన్నిటిలో
నుండి తంబురలతోను సంభ్రమముతోను వాద్యముల
తోను పాడుచు నాట్యమాడుచు రాజైన సౌలును
7 ఎదుర్కొనుటకై వచ్చిరి. । ఆ స్త్రీలు గాన ప్రతిగాన
ములు చేయుచు వాయించుచు—సౌలు వేలకొలది
యును, దావీదు పదివేలకొలదియును (శత్రువులను)
8 హతముచేసిరనిరి. । ఆ మాటలు సౌలుకు ఇంపుగానుండ
నందున అతడు బహు కోపము తెచ్చుకొని—వారు
దావీదుకు పదివేలకొలది అనియు, నాకు వేలకొలది
అనియు స్తుతులు పాడిరే; రాజ్యము తప్ప మరి ఏమి
9 అతడు తీసికొనగలడు అనుకొనెను. । కాబట్టి నాట
నుండి సౌలు దావీదుమీద విషపుచూపు నిలిపెను.
10 మరునాడు దేవునియొద్దనుండి దురాత్మ సౌలుమీ
దికి బలముగా వచ్చినందున అతడు ఇంటిలో భ్రమత
గల మాటలాడుచుండగా దావీదు మునుపటిలాగున
11 వీణ చేత పట్టుకొని వాయించెను. । ఒకప్పుడు సౌలు
చేతిలో నొక యీటెయుండగా—దావీదును పొడిచి
గోడకు బిగించుదుననుకొని సౌలు ఆ యీటెను విసి
రెను. అయితే అది తగలకుండ దావీదు రెండుమా
12 రులు తప్పించుకొనెను. । యెహోవా తనను విడిచి
దావీదుకు తోడైయుండుట చూచి సౌలు దావీదుకు
13 భయపడెను. । కాబట్టి సౌలు అతని తనయొద్ద నుండ
నియ్యక సహస్రాధిపతిగా చేసెను; అతడు జను
లతో కలిసిమెలిసి యుండెను. । మరియు దావీదు 14
సమస్త విషయములలో సుబుద్ధిగలిగి ప్రవర్తింపగా
యెహోవా అతనికి తోడుగా నుండెను. । దావీదు 15
మిగుల సుబుద్ధిగలవాడై ప్రవర్తించుట సౌలు చూచి
మరి యధికముగా అతనికి భయపడెను. । ఇశ్రాయేలు 16
వారితోను యూదావారితోను దావీదు కలిసిమెలిసి
యుండుటచేత వారు అతని ప్రేమింపగా । సౌలు— 17
నా చెయ్యి వానిమీద పడకూడదు, ఫిలిష్తీయుల
చెయ్యి వానిమీద పడును గాక అనుకొని—దావీదూ,
నా పెద్ద కుమార్తెయైన మేరబును నీకిత్తును; నీవు నా
పట్ల యుద్ధశాలివై యుండి యెహోవా యుద్ధము
లను జరిగింపవలెననెను. । అందుకు దావీదు—రాజుకు 18
అల్లుడనగుటకు నేనెంతటివాడను? నా స్థితియైనను
ఇశ్రాయేలులో నా తండ్రి కుటుంబమైనను ఏపాటి
దని సౌలుతో అనెను. । అయితే సౌలు కుమార్తెయైన 19
మేరబును దావీదుకు ఇయ్యవలసియుండగా సౌలు
ఆమెను మెహోలాతీయుడైన అద్రీయేలుకిచ్చి పెండ్లి
చేసెను. । అయితే తన కుమార్తెయైన మీకాలు దావీ 20
దుమీద ప్రేమ గలిగియుండగా సౌలు విని సంతో
షించి, । ఆమె అతనికి ఉరిగానుండునట్లును ఫిలిష్తీ 21
యుల చెయ్యి అతనిమీద నుండునట్లును నేను ఆమెను
అతనికి ఇత్తుననుకొని—ఇప్పుడు నీవు మరియొకదాని
చేత నాకు అల్లుడవగుదువని దావీదుతో చెప్పి । తన 22
సేవకులను పిలిపించి—మీరు దావీదుతో రహస్యముగా
మాటలాడి—రాజు నీయందు ఇష్టము గలిగియున్నాడు,
అతని సేవకులందరును నీయెడల స్నేహముగా నున్నా
రు, కాబట్టి నీవు రాజుకు అల్లుడవు కావలెనని
చెప్పవలెనని ఆజ్ఞ ఇచ్చెను. । సౌలు సేవకులు ఆ 23
మాటలనుబట్టి దావీదుతో సంభాషింపగా దావీదు—
నేను దరిద్రుడనై యెన్నికలేనివాడనై యుండగా రా
జుకు అల్లుడనగుట స్వల్పవిషయమని మీకు తోచునా?
అని వారితో అనగా । సౌలు సేవకులు దావీదు పలికిన 24
మాటలు అతనికి తెలియజేసిరి. । అందుకు సౌలు ఫిలిష్తీ 25
యులచేత దావీదును పడగొట్టవలెనన్న తాత్పర్యము
గలవాడై—రాజు ఓలిని కోరక రాజు శత్రువులమీద
పగతీర్చుకొనవలెనని ఫిలిష్తీయుల నూరు ముందోళ్లు
కోరుచున్నాడని దావీదుతో చెప్పుడనెను. । సౌలు 26
సేవకులు ఆ మాటలు దావీదుకు తెలియజేయగా తాను
రాజుకు అల్లుడు కావలెనన్న కోరికగలవాడై । గడువు 27
దాటక మునుపే లేచి తనవారితో పోయి ఫిలిష్తీ
యులలో ఇన్నూరుమందిని హతముచేసి వారి ముం
దోళ్లు తీసికొనివచ్చి రాజుకు అల్లుడగుటకై కావల
సిన లెక్క పూర్తిచేసి అప్పగింపగా సౌలు తన కుమార్తె
యైన మీకాలును అతనికిచ్చి పెండ్లిచేసెను. ।
యెహోవా దావీదుకు తోడుగా నుండుటయు, తన 28
కుమార్తెయైన మీకాలు అతని ప్రేమించుటయు సౌలు

29 చూచి । దావీదునకు మరి యెక్కువగా భయపడి యెల్ల
ప్పుడును దావీదుమీద విరోధముగా ఉండెను.
30 ఫిలిష్తీయుల సర్దారులు యుద్ధమునకు బయలు
దేరుచు వచ్చిరి. వారు బయలుదేరినప్పుడెల్లను దావీదు
బహు వివేకము గలిగి ప్రవర్తించుచు రాగా సౌలు
సేవకులందరికంటె అతని పేరు బహు ప్రసిద్ధికెక్కెను.
19 అంతట సౌలు—మీరు దావీదును చంపవలసిన
దని తన కుమారుడైన యోనాతానుతోను తన సేవకు
2 లందరితోను చెప్పగా । సౌలు కుమారుడైన యోనా
తాను దావీదుయందు బహు ఇష్టముగలవాడై యుండి
దావీదుతో ఇట్లనెను—నా తండ్రియైన సౌలు నిన్ను
చంపవలెనన్న ప్రయత్నముమీదనున్నాడు. కాబట్టి
నీవు ఉదయమున జాగ్రత్తపడి రహస్యమైన స్థల
3 మందు దాగియుండుము. । నేను వచ్చి నీవు ఉన్న
చేనిలో నా తండ్రియొద్ద నిలిచి నిన్నుగూర్చి అత
నితో మాటలాడిన తరువాత నిన్నుగూర్చి నాకేమైన
తెలిసినయెడల దాని నీతో తెలియజెప్పుదుననెను. ।
4 యోనాతాను తన తండ్రియైన సౌలుతో దావీ
దును గూర్చి దయగా మాటలాడి—నీ సేవకుడైన
దావీదు నీ విషయములో ఏ తప్పితమును చేసినవాడు
కాక బహు మేలుచేసెను గనుక, రాజా నీవు అతని
విషయములో ఏ పాపము చేయకుందువుగాక. ।
5 అతడు ప్రాణమునకు తెగించి ఆ ఫిలిష్తీయుని చంపగా
యెహోవా ఇశ్రాయేలీయులకందరికి గొప్ప రక్షణ
కలుగజేసెను; అది నీవే చూచి సంతోషించితివి గదా;
నిష్కారణముగా దావీదును చంపి నిరపరాధియొక్క
ప్రాణము తీసి నీవెందుకు పాపము చేయుదువని
6 మనవి చేయగా । సౌలు యోనాతాను చెప్పిన మాట
అంగీకరించి—యెహోవా జీవముతోడు అతనికి మరణ
7 శిక్ష విధింపనని ప్రమాణముచేసెను. । అప్పుడు యోనా
తాను దావీదును పిలుచుకొని పోయి ఆ సంగతు
లన్నియు అతనికి తెలియజేసి దావీదును సౌలునొద్దకు
తీసికొనిరాగా దావీదు మునుపటిలాగున అతని సన్ని
8 ధిని ఉండెను. । తరువాత యుద్ధము సంభవించి
నప్పుడు దావీదు బయలుదేరి ఫిలిష్తీయులతో యుద్ధము
చేసి వారిని ఓడించి వెనుకకు పారదోలి గొప్ప వధ
9 చేయగా । యెహోవాయొద్దనుండి దురాత్మ సౌలు
మీదికి వచ్చెను. సౌలు ఈటె చేత పట్టుకొని యింట
కూర్చుండి యుండెను. దావీదు సితారా వాయించు
10 చుండగా । సౌలు ఒకే దెబ్బతో దావీదును గోడకు
పొడుచుదునన్న తాత్పర్యము గలిగి యీటె విసిరెను.
దావీదు అతని యెదుటనుండి తప్పించుకొనినందున
ఈటె గోడకు నాటగా దావీదు ఆ రాత్రియందు
11 తప్పించుకొని పారిపోయెను. । ఉదయమున అతని
చంపవలెనని పొంచియుండి దావీదును పట్టుకొనుటకై
సౌలు అతని యింటికి దూతలను పంపగా దావీదు
భార్యయైన మీకాలు—ఈ రాత్రి నీ ప్రాణమును
నీవు దక్కించుకొంటేనే గాని రేపు నీవు చంపబడుదు
వని చెప్పి । కిటికీగుండ దావీదును దింపగా అతడు 12
తప్పించుకొని పారిపోయెను. । తరువాత మీకాలు 13
ఒక గృహదేవత బొమ్మను తీసి మంచముమీద పెట్టి
మేకబొచ్చు తలవైపున ఉంచి దుప్పటితో కప్పివేసి ।
సౌలు దావీదును పట్టుకొనుటకై దూతలను పంపగా— 14
అతడు రోగియై యున్నాడని చెప్పెను. । దావీదును 15
చూచుటకు సౌలు దూతలను పంపి—నేను అతని చంపు
నట్లుగా మంచముతో అతని తీసికొనిరండని వారితో
చెప్పగా । ఆ దూతలు వచ్చి లోపల చొచ్చి చూచి 16
నప్పుడు తలతట్టున మేకబొచ్చుగల బొమ్మయొకటి మంచము
మీద కనబడెను. । అప్పుడు సౌలు—తప్పించుకొని 17
పోవునట్లుగా నీవు నా శత్రువుని పంపివేసి నన్నీలా
గున ఎందుకు మోసపుచ్చితివని మీకాలు నడుగగా మీ
కాలు—నేనెందుకు నిన్ను చంపవలెను? నన్ను పోనిమ్మని
దావీదు తనతో చెప్పినందుకని సౌలుతో అనెను.
ఆలాగున దావీదు తప్పించుకొని పారిపోయి 18
రామాలోనున్న సమూయేలునొద్దకు వచ్చి సౌలు తనకు
చేసినది అంతటిని అతనికి తెలియజేయగా అతడును
సమూయేలును బయలుదేరి నాయోతుకు వచ్చి అచ్చట
కాపురముండిరి. । దావీదు రామాదగ్గర నాయోతులో 19
ఉన్నాడని సౌలుకు వర్తమానము రాగా । దావీదును 20
పట్టుకొనుటకై సౌలు దూతలను పంపెను; వీరు వచ్చి
ప్రవక్తలు సమాజముగా కూడుకొని ప్రకటించుటయు,
సమూయేలు వారిమీద నాయకుడుగా నిలుచుటయు
చూడగా దేవుని ఆత్మ సౌలు పంపిన దూతలమీదికి
వచ్చెను గనుక వారును ప్రకటింప నారంభించిరి. ।
ఈ సంగతి సౌలునకు వినబడినప్పుడు అతడు వేరు 21
దూతలను పంపెను గాని వారును అటువలెనే ప్రక
టించుచుండిరి. సౌలు మూడవసారి దూతలను పంపె
నుగాని వారును ప్రకటించుచుండిరి. । కడవరిసారి 22
తానే రామాకు పోయి సేఖూదగ్గరనున్న గొప్ప బావి
యొద్దకు వచ్చి—సమూయేలును దావీదును ఎక్కడ
ఉన్నారని అడుగగా ఒకడు—రామాదగ్గర నాయో
తులో వారున్నారని చెప్పెను. । అతడు రామాదగ్గర 23
నున్న నాయోతుకు రాగా దేవుని ఆత్మ అతనిమీది
కిని వచ్చెను గనుక అతడు ప్రయాణము చేయుచు
రామాదగ్గరనున్న నాయోతుకు వచ్చువరకు ప్రకటిం
చుచుండెను. । మరియు అతడు తన వస్త్రములను తీసి 24
వేసి ఆ నాటి రాత్రింబగళ్లు సమూయేలు ఎదుటనే
ప్రకటించుచు, పైబట్టలేనివాడై పడియుండెను.
అందువలన సౌలును ప్రవక్తలలోనున్నాడా అను
సామ్యము పుట్టెను.
పిమ్మట దావీదు రామాలోని నాయోతునుండి 20
పారిపోయి యోనాతాను నొద్దకు వచ్చి—నేను ఏమి

చేసితిని? నేను చేసిన దోషమేమి? నా ప్రాణము
తీయ వెదకునట్లు నీ తండ్రి దృష్టికి నేను చేసిన పాప
2 మేమని యడుగగా । యోనాతాను—ఆ మాట నీ
వెన్నటికిని అనుకొనవద్దు, నీవు చావవు; నాకు తెలియ
జేయకుండ నా తండ్రి చిన్నకార్యమేగాని పెద్ద
కార్యమేగాని చేయడు, నా తండ్రి ఇదెందుకు నాకు
3 మరుగుచేయుననగా । దావీదు—నేను నీ దృష్టికి అను
కూలుడనను సంగతి నీ తండ్రి రూఢిగా తెలిసికొని,
యోనాతానుకు చింత కలుగకుండుటకై యిది అతనికి
తెలుపననుకొనుచున్నాడు; అయితే యెహోవా
జీవముతోడు నీ జీవముతోడు నిజముగా నాకును మరణ
మునకును అడుగు మాత్రమున్నదని ప్రమాణము
4 చేయగా । యోనాతాను—నీకేమి తోచునో దాని నే
5 నేను నీ పక్షమున జరుపుదుననెను. । అందుకు దావీదు
—రేపటిదినము అమావాస్య; అప్పుడు నేను తప్పక
రాజుతోకూడ కూర్చుండి భోజనము చేయవలెను;
అయితే ఎల్లుండి సాయంత్రమువరకు చేనిలో దాగు
6 టకు నాకు సెలవిమ్ము. । ఇంతలో నీ తండ్రి నేను
లేకపోవుట కనుగొనగా నీవు ఈ మాట చెప్పవలెను.
— దావీదు ఇంటివారికి ఏటేట బలి చెల్లించు మర్యాద
కద్దు. కాబట్టి అతడు బేత్లెహేమను తన పట్టణమునకు
పోవలెనని నన్ను బ్రతిమాలి నాయొద్ద సెలవుపుచ్చు
7 కొనెను. । అతడు—మంచిదని సెలవిచ్చిన పక్షమున
నీ దాసుడనైన నాకు క్షేమమే కలుగును; అతడు
బహుగా కోపించినపక్షమున అతడు నాకు కీడుచేయ
తాత్పర్యము గలవాడై యున్నాడని నీవు తెలిసికొని ।
8 నీ దాసుడనైన నాకు ఒక ఉపకారము చేయవలెను;
ఏమనగా యెహోవా పేరట నీతో నిబంధన చేయు
టకై నీవు నీ దాసుడనైన నన్ను రప్పించితివి; నా
యందు దోషమేమైన ఉండినయెడల నీ తండ్రియొద్దకు
నన్నెందుకు తోడుకొని పోదువు? నీవే నన్ను చంపు
9 మని యోనాతానునొద్ద మనవిచేయగా । యోనా
తాను—ఆ మాట ఎన్నటికిని అనరాదు; నా తండ్రి
నీకు కీడుచేయ నుద్దేశము గలిగియున్నాడని నాకు
నిశ్చయమైతే నీతో తెలియజెప్పుదును గదా అని
10 అనగా । దావీదు—నీ తండ్రి నన్నుగూర్చి నీతో కఠిన
ముగా మాటలాడినయెడల దాని నాకు తెలియజేయు
11 వారెవరని యోనాతాను నడిగెను. । అందుకు యోనా
తాను — పొలములోకి వెళ్లుదము రమ్మనగా, ఇద్దరును
పొలములోకి పోయిరి.

12 అప్పుడు యోనాతాను—ఇశ్రాయేలీయులకు దేవు
డైన యెహోవా సాక్షి; రేపైనను ఎల్లుండియైనను
ఈ వేళప్పుడు నా తండ్రిని శోధింతును; అప్పుడు
దావీదుకు క్షేమమవునని నేను తెలిసికొనినపక్షమున
13 నేను ఆ వర్తమానము నీకు పంపక పోవుదునా? । అయితే
నా తండ్రి నీకు కీడుచేయ నుద్దేశించుచున్నాడని నేను
తెలిసికొనినపక్షమున దాని నీకు తెలియజేసి నీవు
క్షేమముగా వెళ్లునట్లు నిన్ను పంపివేయనియెడల
యెహోవా నాకు గొప్ప అపాయము కలుగజేయు
గాక. యెహోవా నా తండ్రికి తోడుగా ఉండినట్లు
నీకును తోడుగా ఉండునుగాక. । అయితే నేను బ్రదికి 14
యుండిన పక్షమున నేను చావకుండ యెహోవా 15
దయచూపునట్లుగా నీవు నాకు దయచూపక పోయిన
యెడలనేమి, నేను చనిపోయినపక్షమున యెహోవా
దావీదు శత్రువులను ఒకడైన భూమిమీద నిలువకుండ
నిర్మూలము చేసిన తరువాత నీవు నా సంతతివారికి దయ
చూపకపోయినయెడలనేమి యెహోవా (నిన్ను
విసర్జించునుగాక.) । ఈలాగున యెహోవా దావీదు 16
యొక్క శత్రువులచేత దాని విచారించునట్లుగా
యోనాతాను దావీదు సంతతివారిని బట్టి నిబంధన
చేసెను. । యోనాతాను దావీదును తన ప్రాణస్నే 17
హితునిగా ప్రేమించెను గనుక ఆ ప్రేమనుబట్టి
దావీదుచేత మరల ప్రమాణము చేయించెను. । మరి 18
యు యోనాతాను దావీదుతో ఇట్లనెను—రేపటిదినము
అమావాస్య; నీ స్థలము ఖాళీగా కనబడును గదా; ।
నీవు మూడు దినములు ఆగి, యీ పని జరుగుచుండగా 19
నీవు దాగియున్న స్థలమునకు త్వరగా వెళ్లి ఏసెలు
అను బండదగ్గర నుండుము । గురి చూచి ప్రయో 20
గించినట్టు నేను మూడు బాణములను దాని ప్రక్కకు
కొట్టి । — నీవు వెళ్లి బాణములను వెదకుమని ఒక పని 21
వానితో చెప్పుదును—బాణములు నీకు ఈ తట్టున
నున్నవి, పట్టుకొని రమ్మని నేను వానితో చెప్పినపక్ష
మందు నీవు బయటికి రావచ్చును; యెహోవా
జీవముతోడు నీకు ఏ అపాయమును రాక క్షేమమే
కలుగును. । అయితే—బాణములు నీకు అవతలనున్న 22
వని నేను వానితో చెప్పినపక్షమున పారిపొమ్మని
యెహోవా సెలవిచ్చుచున్నాడని తెలిసికొని నీవు
ప్రయాణమై పోవలెను. । అయితే మనమిద్దరము 23
మాటలాడిన సంగతిని జ్ఞాపకము చేసికొనుము; నీకును
నాకును సర్వకాలము యెహోవాయే సాక్షి.

కాబట్టి దావీదు పొలములో దాగుకొనెను; అమా 24
వాస్య వచ్చినప్పుడు రాజు భోజనము చేయ కూర్చుం
డగా । మునుపటివలెనే రాజు గోడదగ్గరనున్న స్థల 25
మందు తన ఆసనముమీద కూర్చుని యుండెను.
యోనాతాను లేవగా అబ్నేరు సౌలునొద్ద కూర్చుం
డెను; అయితే దావీదు స్థలము ఖాళీగా నుండెను. ।
అయినను అతనికి ఏదో ఒకటి సంభవించినందున అతడు 26
అపవిత్రుడై యుండునేమో, అతడు అపవిత్రుడై
యుండుట యవశ్యమని సౌలు అనుకొని ఆ దినమున
ఏమియు అనలేదు. । అయితే అమావాస్య పోయిన 27
మరునాడు, అనగా రెండవ దినమున దావీదు స్థల
ములో ఎవడును లేకపోవుట చూచి సౌలు—నిన్నయు

నేడును యెష్షయి కుమారుడు భోజనమునకు రాక
28 పోవుట ఏమని యోనాతానును నడుగగా । యోనా
తాను—దావీదు బేత్లెహేముకు పోవలెనని కోరి ।
29 వినయముచేసి నన్ను పోనిమ్ము, పట్టణమందు మా యింటి
వారు బలి అర్పింపబోవుచున్నారు—నీవును రావలెనని
నా సహోదరుడు నాకు ఆజ్ఞాపించెను గనుక నీ
దృష్టికి నేను దయపొందిన వాడనైతే నేను వెళ్లి నా
సహోదరులను దర్శించునట్లుగా నాకు సెలవిమ్మని
బతిమాలుకొని నాయొద్ద సెలవు తీసికొనెను; అందు
నిమిత్తమే అతడు రాజుగారి భోజనపు బల్లయొద్దకు
30 రాలేదని సౌలుతో చెప్పగా । సౌలు యోనాతాను
మీద బహుగా కోపపడి—ఆగడగొట్టుదాని కొడుకా,
నీకును నీ తల్లి మానమునకును సిగ్గు కలుగునట్లుగా నీవు
యెష్షయి కుమారుని స్వీకరించిన సంగతి నాకు తెలిసి
31 నదికాదా? । యెష్షయి కుమారుడు భూమిమీద
బ్రదుకునంత కాలము నీకైనను నీ రాజ్యమునకైనను
స్థిరత కలుగదుగదా; కాబట్టి నీవు వర్తమానము పంపి
అతని నా దగ్గరకు రప్పించుము, నిజముగా అతడు
32 మరణమునకు కర్హుడని చెప్పెను. । అంతట యోనా
తాను—అతడెందుకు మరణశిక్ష నొందవలెను? అతడు
33 ఏమి చేసెనని సౌలు నడుగగా । సౌలు అతనిని పొడు
వవలెనని యీటె విసిరెను; అందువలన తన తండ్రి
దావీదును చంపనుద్దేశము గలిగి యున్నాడని యోనా
34 తాను తెలిసికొని । అత్యాగ్రహుడై బల్లయొద్దనుండి
లేచి, తన తండ్రి దావీదును అవమానపరచినందున
అతని నిమిత్తము దుఃఖాక్రాంతుడై అమావాస్య
పోయిన మరునాడు భోజనము చేయకుండెను.
35 ఉదయమున యోనాతాను దావీదుతో నిర్ణయము
చేసికొనిన వేళకు ఒక పనివాని పిలుచుకొని పొలము
36 లోనికి పోయెను. । —నీవు పరుగెత్తికొనిపోయి నేను
వేయు బాణములను వెదుకుమని ఆ పనివానితో
అతడు చెప్పగా వాడు పరుగెత్తుచున్నప్పుడు అతడు
37 ఒక బాణము వాని అవతలకు వేసెను. । అయితే
వాడు యోనాతాను వేసినబాణము ఉన్నచోటుకు
వచ్చినప్పుడు యోనాతాను వాని వెనుకనుండి కేకవేసి
38 —బాణము నీ అవతలనున్నదని చెప్పి । వాని వెనుక
నుండి కేక వేసి—నీవు ఆలస్యము చేయక దబ్బున రమ్మ
నెను; యోనాతాను పనివాడు బాణములను కూర్చు
కొని తన యజమానునియొద్దకు వాటిని తీసికొని
39 వచ్చెనుగాని । సంగతి ఏమియు వానికి తెలియక
యుండెను. యోనాతానుకును దావీదుకును మాత్రము
40 ఆ సంగతి తెలిసియుండెను. । యోనాతాను తన ఆయు
ధములను వాని చేతికిచ్చి—వీటిని పట్టణమునకు తీసి
41 కొని పొమ్మని చెప్పి వాని పంపివేసెను. । వాడు వెళ్లి
పోయిన వెంటనే దావీదు దక్షిణపు దిక్కునుండి బయ
టికి వచ్చి మూడుమారులు సాష్టాంగ నమస్కారము
చేసిన తరువాత వారు ఒకరినొకరు ముద్దుపెట్టుకొనుచు
ఏడ్చుచునుండిరి. ఈలాగుండగా దావీదు మరింత బిగ్గ
రగా ఏడ్చెను. । అంతట యోనాతాను—యెహోవా 42
నీకును నాకును మధ్యను నీ సంతతికిని నా సంతతికిని
మధ్యను ఎన్నటెన్నటికి సాక్షిగా నుండునుగాక. మన
మిద్దరము యెహోవా నామమునుబట్టి ప్రమాణము
చేసికొని యున్నాము గనుక మనస్సులో నెమ్మది గలిగి
పొమ్మని దావీదుతో చెప్పగా దావీదు లేచి వెళ్లి
పోయెను; యోనాతానును పట్టణమునకు తిరిగి వచ్చెను.

దావీదు నోబులో యాజకుడైన అహీమెలెకు 21
నొద్దకు వచ్చెను; అయితే అహీమెలెకు దావీదు
రాకకు భయపడి — నీవు ఒంటరిగా వచ్చితివేమని
అతని నడుగగా । దావీదు — రాజు నాకు ఒకపని 2
నిర్ణయించి—నేను నీ కాజ్ఞాపించి పంపినపని యేదో
అదెవనితోనైనను చెప్పవద్దనెను; నేను నా పనివారిని
ఒకానొక చోటికి వెళ్ల నిర్ణయించితిని; । నీయొద్ద 3
ఏమి యున్నది? అయిదు రొట్టెలుగాని మరేమియు
గాని యుండినయెడల అది నాకిమ్మని యాజకుడైన
అహీమెలెకుతో అనగా । యాజకుడు — సాధారణ 4
మైన రొట్టె నాయొద్ద లేదు; పనివారు స్త్రీలకు ఎడ
ముగా నున్నవారైతే ప్రతిష్ఠితమైన రొట్టెలు కలవని
దావీదుతో అనెను. । అందుకు దావీదు — నిజముగా 5
నేను బయలుదేరి వచ్చినప్పటినుండి ఈ మూడు దిన
ములు స్త్రీలు మాకు దూరముగానే యున్నారు; పని
వారిబట్టలు పవిత్రములే; ఒకవేళ మేము చేయు
కార్యము అపవిత్రమైనయెడల నేమి? రాజాజ్ఞను
బట్టి అది పవిత్రముగా ఎంచతగును అని యాజకు
నితో అనెను. । అంతట యెహోవా సన్నిధినుండి 6
తీసివేయబడిన సన్నిధి రొట్టెలు తప్ప అక్కడ వేరు
రొట్టెలు లేకపోగా, వెచ్చని రొట్టెలు వేయు దిన
మందు తీసివేయబడిన ప్రతిష్ఠితమైన రొట్టెలను యాజ
కుడు అతనికిచ్చెను.

ఆ దినమున సౌలుయొక్క సేవకులలో ఒకడు 7
అక్కడ యెహోవా సన్నిధి ఉండెను; అతని పేరు
దోయేగు, అతడు ఎదోమీయుడు. అతడు సౌలు
పసుల కాపరులకు పెద్ద. । — రాజు పని వేగిరముగా 8
జరుగవలెనని యెరిగి నా ఖడ్గమునైనను ఆయుధముల
నైనను నేను తేలేదు. ఇక్కడ నీయొద్ద ఖడ్గమైనను
ఈటెయైనను ఉన్నదా అని దావీదు అహీమెలెకు
నడుగగా । యాజకుడు — ఏలా లోయలో నీవు 9
చంపిన గొల్యాతు అను ఫిలిష్తీయుని ఖడ్గమున్నది,
అదిగో బట్టతో చుట్టబడి ఏఫోదు వెనుక ఉన్నది,
అది తప్ప ఇక్కడ మరి ఏ ఖడ్గమునులేదు, దాని తీసి
కొనుటకు నీకిష్టమైనయెడల తీసికొనుమనగా దావీదు
—దానికి సమమైన దొకటియు లేదు, నా కిమ్మనెను.
అంతట దావీదు సౌలుకు భయపడినందున ఆ దిన 10

మున నే లేచి పారిపోయి గాతు రాజైన ఆకీషునొద్దకు
11 వచ్చెను. । ఆకీషు సేవకులు—ఈ దావీదు ఆ దేశపు
రాజు కాడా! వారు నాట్యమాడుచు గాన ప్రతిగాన
ములు చేయుచు—సౌలు వేలకొలది హతము చేసె
ననియు, దావీదు పదివేలకొలది హతము చేసెననియు
పాడిన పాటలు ఇతనిగూర్చినవే గదా అని అతనిని
12 బట్టి రాజుతో మాటలాడగా । దావీదు ఈ మాటలు
తన మనస్సులో నుంచుకొని గాతు రాజైన ఆకీషునకు
13 బహు భయపడెను. । కాబట్టి దావీదు వారి యెదుట
తన చర్య మార్చుకొని వెర్రివానివలె నటించుచు,
ద్వారపుతలుపులమీద గీతలు గీయుచు, ఉమ్మి తన
గడ్డముమీదికి కారనిచ్చుచు నుండెను. వారతని
పట్టుకొని పోగా అతడు పిచ్చిచేష్టలు చేయుచు
14 వచ్చెను. । కావున ఆకీషు రాజు — మీరు చూచితిరి
కదా? వానికి పిచ్చిపట్టినది, నాయొద్దకు వీని నెందుకు
15 తీసికొనివచ్చితిరి? । పిచ్చిచేష్టలు చేయువారితో
నాకేమి పని? నా సన్నిధిని పిచ్చిచేష్టలు చేయుటకు
వీని తీసికొని వచ్చితిరేమి? వీడు నా నగరిలోనికి
రాతగునా? అని తన సేవకులతో అనెను.

**22** దావీదు అక్కడనుండి బయలుదేరి అదుల్లాము
గుహలోనికి తప్పించుకొనిపోగా అతని సహోదరు
లును అతని తండ్రి ఇంటివారందరును ఆ సంగతి
2 విని అతనియొద్దకు వచ్చిరి. । మరియు ఇబ్బందిగల
వారందరును, అప్పులు చేసికొనిన వారందరును, అస
మాధానముగా నుండు వారందరును, అతనియొద్ద
కూడుకొనగా అతడు వారికి అధిపతియాయెను.
అతనియొద్దకు ఎక్కువ తక్కువ నన్నూరుమంది వచ్చి
3 యుండిరి. । తరువాత దావీదు అక్కడనుండి బయలు
దేరి మోయాబులోని మిస్పేకు వచ్చి — దేవుడు నాకు
ఏమి చేయునది నేను తెలిసికొనువరకు నా తలి
దండ్రులు వచ్చి నీయొద్ద నుండనిమ్మని మోయాబు
4 రాజుతో మనవిచేసి । అతనియొద్దకు వారిని తోడు
కొని పోగా దావీదు దాగియున్న దినములు వారు
5 కొండలలో అతనియొద్ద కాపురముండిరి. । అటుతరు
వాత ప్రవక్తయగు గాదు వచ్చి—కొండలలో ఉండక
యూదాదేశమునకు పారిపొమ్మని దావీదుతో చెప్పి
నందున దావీదు పోయి హారెతు అడవిలో చొచ్చెను.
6 దావీదును అతని జనులును ఫలానిచోట ఉన్నా
రని సౌలునకు వర్తమానమాయెను. అప్పుడు సౌలు గిబి
యాదగ్గర రామాలో ఒక పిచులవృక్షముక్రింద దిగి
యీటె చేత పట్టుకొని యుండెను. అతని సేవకులు
7 అతనిచుట్టు నిలిచియుండగా । సౌలు తనచుట్టు నిలిచి
యున్న సేవకులతో ఇట్లనెను—బెన్యామీనీయులారా
ఆలకించుడి. యెష్షయి కుమారుడు మీకు పొలమును
ద్రాక్షతోటలను ఇచ్చునా? మిమ్మును సహస్రాధి
8 పతులుగాను శతాధిపతులుగాను చేయునా? । మీ
రెందుకు నామీద కుట్రచేయుచున్నారు? నా కుమా
రుడు యెష్షయి కుమారునితో నిబంధనచేసినసంగతి
మీలో ఎవడును నాకు తెలియజేయలేదే. నేడు జరు
గుచున్నట్లు నాకొరకు పొంచియుండునట్లుగా నా
కుమారుడు నా సేవకుని పురికొలిపినను నా నిమిత్తము
మీలో ఎవనికిని చింతలేదే. । అప్పుడు ఎదోమీయు 9
డగు దోయేగు సౌలు సేవకులదగ్గర నిలిచియుండి—
యెష్షయి కుమారుడు పారిపోయి నోబులోని అహీ
టూబు కుమారుడైన అహీమెలెకు దగ్గరకు రాగా
నేను చూచితిని. । అహీమెలెకు అతని పక్షముగా 10
యెహోవాయొద్ద విచారణచేసి, ఆహారమును ఫిలిష్తీ
యుడైన గొల్యాతుఖడ్గమును అతనికిచ్చెనని చెప్పగా ।
రాజు యాజకుడును అహీటూబు కుమారుడునగు 11
అహీమెలెకును నోబులోనున్న అతని తండ్రి యింటి
వారైన యాజకులనందరిని పిలువనంపించెను. వారు
రాజునొద్దకు రాగా । సౌలు—అహీటూబు కుమా 12
రుడా, ఆలకించుమనగా అతడు—చిత్తము నా యేలిన
వాడా అనెను. । సౌలు—నీవు యెష్షయి కుమారు 13
నికి ఆహారమును ఖడ్గమును ఇచ్చి అతని పక్షమున
దేవునియొద్ద విచారణచేసి, అతడు నామీదికి లేచి
నేడు జరుగుచున్నట్టు పొంచి యుండుటకై అత
డును నీవును జతకూడితిరేమని యడుగగా । అహీ 14
మెలెకు—రాజా, రాజునకు అల్లుడై నమ్మకస్థుడై రాజ
ధర్మము నొందుచు నీ నగరిలో ఘనతవహించిన
దావీదువంటివాడు నీ సేవకులందరిలో ఎవడున్నాడు? ।
ఈ సంగతినిగూర్చి కొద్ది గొప్ప యేమియు నాకు తెలిసి 15
నది కాదు. అతని పక్షముగా నేను దేవునియొద్ద
విచారణచేయుటకు నేడే ఆరంభించితినా? రాజు
ఆలాగున తలంచకుండునుగాక; రాజు తమ దాసుడనైన
నామీదను నా తండ్రి ఇంటివారందరిమీదను ఈ
నేరము మోపకుండునుగాక అని రాజుతో మనవి
చేయగా । రాజు—అహీమెలెకూ, నీకును నీ తండ్రి 16
ఇంటివారికందరికిని మరణము నిశ్చయము అని చెప్పి ।
యెహోవా యాజకులగు వీరు దావీదుతో కలిసి 17
నందునను, అతడు పారిపోయిన సంగతి తెలిసియు
నాకు తెలియజేయక పోయినందునను మీరు వారి
మీద పడి చంపుడని తనచుట్టు నిలిచియున్న కావలి
వాండ్లకు ఆజ్ఞ ఇచ్చెను. రాజు సేవకులు యెహోవా
యాజకులను హతము చేయనొల్లక యుండగా । రాజు 18
దోయేగును చూచి — నీవు ఈ యాజకులమీద పడు
మని చెప్పెను. అప్పుడు ఎదోమీయుడైన దోయేగు
యాజకులమీద పడి ఏఫోదు ధరించుకొనిన యెను
బది యయిదుగురిని ఆ దినమున హతముచేసెను. ।
మరియు అతడు యాజకుల పట్టణమైన నోబు కాపు 19
రస్థులను కత్తివాత హతముచేసెను; మగవారినేమి ఆడు
వారినేమి బాలురనేమి పసిపిల్లలనేమి యెద్దులనేమి

గార్దభములనేమి గొఱ్ఱెలనేమి అన్నిటిని కత్తివాత
20 హతముచేసెను. । అయితే అహీటూబు కుమారుడైన
అహీమెలెకు కుమారులలో అబ్యాతారు అను నొకడు
తప్పించుకొని పారిపోయి దావీదునొద్దకు వచ్చి ।
21 సౌలు యెహోవా యాజకులను చంపించిన సంగతి
22 దావీదునకు తెలియజేయగా । దావీదు—ఆ దినమున
ఎదోమీయుడైన దోయేగు అక్కడనున్నందున వాడు
సౌలునకు నిశ్చయముగా సంగతి తెలుపునని నేనను
కొంటిని; నీ తండ్రి యింటివారికందరికి మరణము
23 రప్పించుటకు నేను కారకుడనైతిని గదా. । నీవు
భయపడక నాయొద్ద ఉండుము, నాయొద్ద నీవు భద్ర
ముగా ఉందువు; నా ప్రాణము తీయజూచువాడును
నీ ప్రాణము తీయజూచువాడును ఒకడే అని అబ్యా
తారుతో చెప్పెను.

**23** తరువాత ఫిలిష్తీయులు కెయీలామీద యుద్ధము
చేసి కళ్లములమీది ధాన్యమును దోచుకొనుచున్నా
2 రని దావీదునకు వినబడెను. । అంతట దావీదు—నేను
వెళ్లి ఈ ఫిలిష్తీయులను హతము చేయుదునా అని
యెహోవాయొద్ద విచారణచేయగా యెహోవా—
నీవు వెళ్లి ఫిలిష్తీయులను హతముచేసి కెయీలాను
3 రక్షింపుమని దావీదుకు సెలవిచ్చెను. । దావీదుతో
కూడియున్న జనులు—మేము ఇచ్చట యూదా దేశ
ములో ఉండినను మాకు భయముగా నున్నది; ఫిలిష్తీ
యుల సైన్యములకెదురుగా కెయీలాకు మేము
వచ్చినయెడల మరింత భయము కలుగును గదా అని
4 దావీదుతో అనగా । దావీదు మరల యెహోవా
యొద్ద విచారణచేసెను. — నీవు లేచి కెయీలాకు
వెళ్లుము, ఫిలిష్తీయులను నీ చేతికి అప్పగించుదునని
5 యెహోవా సెలవియ్యగా । దావీదును అతని జను
లును కెయీలాకు వచ్చి ఫిలిష్తీయులతో యుద్ధము
చేసి వారిని లెస్సగా హతముచేసి వారి పశువులను
దోచుకొని వచ్చిరి. ఈలాగున దావీదు కెయీలా
కాపురస్థులను రక్షించెను.

6 దావీదు కెయీలాకు బయలుదేరగా అహీమెలెకు
కుమారుడైన అబ్యాతారు ఏఫోదు చేత పట్టుకొని
7 పారిపోయి అతనియొద్దకు వచ్చెను. । దావీదు కెయీ
లాకు వచ్చిన సంగతి సౌలు విని—దావీదు ద్వారము
లును అడ్డగడలునుగల పట్టణములో ప్రవేశించి
అందులో మూయబడి యున్నాడు, దేవుడతని నా
8 చేతికి అప్పగించెననుకొనెను. । కాబట్టి సౌలు కెయీ
లాకు పోయి దావీదును అతని జనులను ముట్టడింప
వలెనని జనులందరిని యుద్ధమునకు పిలువనంపించెను. ।
9 సౌలు తనకు కీడే యుద్దేశించుచున్నాడని దావీదు
ఎరిగి యాజకుడైన అబ్యాతారును ఏఫోదు తెమ్మ
10 నెను. । అప్పుడు దావీదు — ఇశ్రాయేలీయుల దేవా
యెహోవా, సౌలు కెయీలాకు వచ్చి నన్నుబట్టి
పట్టణమును పాడుచేయ నుద్దేశించుచున్నాడని నీ
దాసుడనైన నాకు రూఢిగా తెలియబడి యున్నది. ।
కెయీలా జనులు నన్ను అతనిచేతికి అప్పగించు 11
దురా? నీ దాసుడనైన నాకు వినబడినట్లు సౌలు దిగి
వచ్చునా? ఇశ్రాయేలీయుల దేవా యెహోవా,
దయచేసి నీ దాసుడనైన నాకు దాని తెలియజేయు
మని ప్రార్థింపగా—అతడు దిగివచ్చునని యెహోవా
సెలవిచ్చెను. । — కెయీలా జనులు నన్ను నా జను 12
లను సౌలు చేతికి అప్పగించుదురా అని దావీదు
మరల మనవి చేయగా యెహోవా — వారు నిన్ను
అప్పగించుదురని సెలవిచ్చెను. । అంతట దావీదును 13
దాదాపు ఆరునూరు మందియైన అతని జనులును లేచి
కెయీలాలో నుండి పోయి యిటు అటు తిరుగుచు
భద్రమైనస్థలములు చేరిరి. దావీదు కెయీలాలో
నుండి తప్పించుకొనిన సంగతి సౌలు విని వెళ్లక
మానెను.

అయితే దావీదు అరణ్యములోని కొండ స్థలముల 14
యందును, జీఫు అను అరణ్యమున ఒక పర్వతమం
దును నివాసము చేయుచుండెను; సౌలు అనుదినము
అతని వెదకినను దేవుడు సౌలుచేతికి అతని నప్పగింప
లేదు. । తన ప్రాణము తీయుటకై సౌలు బయలుదేర 15
నని తెలిసికొని దావీదు జీఫు అరణ్యములో ఒక వన
మున దిగెను. । అప్పుడు సౌలు కుమారుడైన యోనా 16
తాను లేచి, వనములోనున్న దావీదునొద్దకు వచ్చి—
నా తండ్రియైన సౌలు నిన్ను పట్టుకొనజాలడు, నీవు
భయపడవద్దు, । నీవు ఇశ్రాయేలీయులకు రాజవగు 17
దువు, నేను నీకు సహకారినౌదును, ఇది నా తండ్రి
యైన సౌలుకు తెలిసియున్నదని అతనితో చెప్పి దేవుని
బట్టి అతని బలపరచెను. । వీరిద్దరు యెహోవా సన్ని 18
ధిని నిబంధన చేసికొనిన తరువాత దావీదు వనములో
నిలిచెను, యోనాతాను తన యింటికి తిరిగి వెళ్లెను. ।
జీఫీయులు బయలుదేరి గిబియాలోనున్న సౌలు 19
నొద్దకు వచ్చి — యెషీమోనుకు దక్షిణమున నున్న
హకీలామన్యములోని అరణ్యమున కొండ స్థలముల
యందు మా మధ్య దావీదు దాగియున్నాడే. । రాజా, 20
నీ మనోభీష్టమంతటి చొప్పున దిగిరమ్ము; రాజవైన నీ
చేతికి అతనిని అప్పగించుట మా పని అని చెప్పగా ।
సౌలు వారితో ఇట్లనెను.—మీరు నాయందు కనికర 21
పడినందుకై మీకు యెహోవా ఆశీర్వాదము కలుగు
గాక. । మీరు పోయి అతడు ఉండు స్థలము ఏదయి 22
నది, అతని చూచినవాడు ఎవడయినది నిశ్చయముగా
తెలిసికొనుడి; అతడు బహు యుక్తిగా ప్రవర్తించు
చున్నాడని నాకు వినబడెను గనుక । మీరు బహు 23
జాగ్రత్తగానుండి, అతడుండు మరుగు తావులను కని
పెట్టియున్న సంగతి యంత నాకు తెలియజేయుటకై
మరల నాయొద్దకు తప్పక రండి, అప్పుడు నేను

మీతోకూడ వత్తును, అతడు దేశములో ఎక్కడ
నుండినను యూదావారందరిలో నేను అతని వెదకి
24 పట్టుకొందును. । అంతట వారు లేచి సౌలుకంటె
ముందు జీఫునకు తిరిగి వెళ్లిరి. దావీదును అతని జను
లును యెషీమోనుకు దక్షిణపు వైపుననున్న మైదాన
25 ములోని మాయోను అరణ్యములో ఉండగా । సౌలును
అతని జనులును తన్ను వెదుకుటకై బయలుదేరిన
మాట దావీదు విని, కొండ శిఖరము దిగి మాయోను
అరణ్యమందు నివాసముచేసెను. సౌలు అది విని
మాయోను అరణ్యములో దావీదును తరుమబోయెను.।
26 అయితే సౌలు పర్వతము ఈ తట్టునను దావీదును
అతని జనులును పర్వతము ఆ తట్టునను పోవుచుండగా
దావీదు సౌలుదగ్గరనుండి తప్పించుకొని పోవలెనని
త్వరపడుచుండెను. సౌలును అతని జనులును దావీ
దును అతని జనులను పట్టుకొనవలెనని వారిని చుట్టు
27 కొనుచుండిరి. । ఇట్లుండగా దూతయొకడు సౌలు
నొద్దకు వచ్చి — నీవు త్వరగా రమ్ము, ఫిలిష్తీయులు
దండెత్తి వచ్చి దేశములో చొరబడి యున్నారని
28 చెప్పగా । సౌలు దావీదును తరుముట మాని వెనుకకు
తిరిగి ఫిలిష్తీయులను ఎదుర్కొన బోయెను. కాబట్టి
సెలహమ్మలెకోతు[1] అని ఆ స్థలమునకు పేరు పెట్ట
29 బడెను. । తరువాత దావీదు అక్కడనుండి పోయి
ఏన్గెదీకి వచ్చి కొండ స్థలములలో నివాసము చేయు
చుండెను.

24 సౌలు ఫిలిష్తీయులను తరుముట మాని తిరిగిరాగా
దావీదు ఏన్గెదీ అరణ్యమందున్నాడని అతనికి వర్త
2 మానము వచ్చెను. । అప్పుడు సౌలు ఇశ్రాయేలీయు
లందరిలోనుండి మూడు వేలమందిని ఏర్పరచుకొని
వచ్చి, కొండమేకలకు వాసములగు శిలాపర్వతముల
మీద దావీదును అతని జనులను వెదకుటకై బయలు
3 దేరెను. । మార్గముననున్న గొఱ్ఱెదొడ్లకు అతడు రాగా
అక్కడ గుహ యొకటి కనబడెను. అందులో సౌలు
శంకానివర్తికి పోగా దావీదును అతని జనులును ఆ
4 గుహ లోపలిభాగములలో ఉండిరి గనుక । దావీదు
జనులు—అదిగో వచ్చెను—నీ దృష్టికి ఏది మంచిదో
అది నీవు అతనికి చేయునట్లు నీ శత్రువుని నీ చేతికి
అప్పగింతునని యెహోవా నీతో చెప్పిన దినము
వచ్చెనని అతనితో అనగా, దావీదు లేచి వచ్చి సౌలుకు
తెలియకుండ అతని పైవస్త్రపు చెంగును కోసెను. ।
5 సౌలు పైవస్త్రమును తాను కోసెనని దావీదు మనస్సు
6 నొచ్చి।—ఇతడు యెహోవాచేత అభిషేకము నొందిన
వాడు గనుక యెహోవాచేత అభిషిక్తుడైన నా ప్రభు
వుకు నేను ఈ కార్యము చేయను, యెహోవాను
బట్టి అతని నేను చంపను అని తన జనులతో
7 చెప్పెను. । ఈ మాటలు చెప్పి దావీదు తన జనులను
అడ్డగించి సౌలుమీదికి పోనియ్యక వారిని ఆపెను.
తరువాత సౌలు లేచి గుహలోనుండి బయలువెళ్లి
మార్గమున పోయెను. । అప్పుడు దావీదు లేచి గుహలో 8
నుండి బయలువెళ్లి—నా యేలినవాడా రాజా, అని
సౌలు వెనుకనుండి కేకవేయగా సౌలు వెనుక చూచెను.
దావీదు నేల సాష్టాంగపడి నమస్కారము చేసి ।
సౌలుతో ఇట్లనెను — దావీదు నీకు కీడుచేయ నుద్దే 9
శించుచున్నాడని జనులు చెప్పిన మాటలు నీవెందుకు
వినుచున్నావు? । ఆలోచించుము; ఈ దినమున 10
యెహోవా నిన్ను ఏలాగు గుహలో నాచేతికి అప్ప
గించెనో అది నీ కన్నులార చూచితివే; కొందరు నిన్ను
చంపుమని నాతో చెప్పినను నేను నీయందు కనికరించి
—ఇతడు యెహోవాచేత అభిషేకము నొందినవాడు
గనుక నా యేలినవాని చంపనని నేను చెప్పితిని. ।
నా తండ్రీ మాడుము, ఇదిగో చూడుము. నిన్ను 11
చంపక నీ వస్త్రపుచెంగు మాత్రమే కోసితిని గనుక
నావలన నీకు కీడు ఎంతమాత్రమును రాదనియు,
నాలో తప్పితము ఎంతమాత్రమును లేదనియు నీవు
తెలిసికొనవచ్చును. నీ విషయమై నేను ఏపాపమును
చేయనివాడనై యుండగా నీవు నా ప్రాణము తీయ
వలెనని నన్ను తరుముచున్నావు. । నీకును నాకును 12
మధ్య యెహోవా న్యాయము తీర్చును. యెహోవా
నా విషయమై పగతీర్చును గాని నేను నిన్ను చం
పను. । పూర్వికులు సామ్యము చెప్పినట్టు దుష్టుల 13
చేతనే దౌష్ట్యము పుట్టునుగాని నేను నిన్ను చంపను.।
ఇశ్రాయేలీయుల రాజు ఎవని పట్టుకొన బయలుదేరి 14
వచ్చియున్నాడు! ఏపాటివాని తరుముచున్నాడు?
చచ్చిన కుక్కను గదా? మిన్నల్లిని గదా? । యెహోవా 15
నీకును నాకును మధ్య న్యాయాధిపతియై తీర్పు తీర్చు
గాక; ఆయనే సంగతి విచారించి నా పక్షమున
వ్యాజ్యమాడి నీ వశము కాకుండ నన్ను నిర్దోషినిగా
తీర్చుగాక. । దావీదు ఈ మాటలు సౌలుతో మాట 16
లాడి చాలింపగా సౌలు — దావీదా నాయనా, ఈ
పలుకు నీదేనా అని బిగ్గరగా ఏడ్చి । దావీదుతో ఇట్ల 17
నెను—యెహోవా నన్ను నీచేతి కప్పగింపగా నన్ను 18
చంపక విడిచినందుకు ఈ దినమున నీవు నా అపకార
మునకు ఉపకారము చేసినవాడవై, నా యెడల నీకున్న
ఉపకారబుద్ధిని వెల్లడి చేసితివి గనుక నీవు నాకంటె
నీతిపరుడవు. । ఒకనికి తన శత్రువు దొరికినయెడల 19
మేలుచేసి పంపివేయునా? ఈ దినమున నీవు నాకు
చేసినదానిబట్టి యెహోవా ప్రతిగా నీకు మేలు
చేయుగాక. । నిశ్చయముగా నీవు రాజవగుదువనియు, 20
ఇశ్రాయేలీయుల రాజ్యము నీకు స్థిరపరచబడుననియు
నాకు తెలియును. । కాబట్టి నా తరువాత నా సంతతి 21
వారిని నీవు నిర్మూలము చేయకుండునట్లును, నా తండ్రి

1 అనగా, భయవిముక్తి శిల.

ఇంటివారిలోనుండి నా పేరు నీవు కొట్టివేయకుండునట్లును
యెహోవా నామమున నాకు ప్రమాణము చేయుము.
22 అంతట దావీదు సౌలుకు ప్రమాణము చేసెను। అప్పుడు
సౌలు ఇంటికి తిరిగి వచ్చెను; అయితే దావీదును
అతని జనులును తమ పర్వతివాసమునకు వెళ్లిపోయిరి.

**25** సమూయేలు మృతినొందగా ఇశ్రాయేలీయులం
దరు కూడుకొని అతడు చనిపోయెనని ప్రలాపిం
చుచు, రామాలోనున్న అతని ఇంటి నివేశనములో
అతని సమాధిచేసిన తరువాత దావీదు లేచి పారాను
అరణ్యమునకు వెళ్లెను.
2 కర్మెలులోని మాయోనునందు ఆస్తిగలవాడొకడు
కాపురముండెను. అతడు బహు భాగ్యవంతుడు, అత
నికి మూడువేల గొఱ్ఱెలును వెయ్యి మేకలును ఉం
డెను. అతడు కర్మెలులో తన గొఱ్ఱెలబొచ్చు కత్తిరించు
3 టకై పోయి యుండెను.। అతని పేరు నాబాలు,
అతని భార్యపేరు అబీగయీలు. ఈ స్త్రీ సుబుద్ధి
గలదై రూపసియై యుండెను. అయితే చర్యలనుబట్టి
చూడగా నాబాలు మోటువాడును దుర్మార్గుడునై
4 యుండెను. అతడు కాలేబు సంతతివాడు.। నాబాలు
గొఱ్ఱెలబొచ్చు కత్తెర వేయించుచున్నాడని అరణ్య
5 మందున్న దావీదు విని। తన పనివారిలో పదిమందిని
పిలిచి వారితో ఇట్లనెను—మీరు కర్మెలుకు నాబాలు
నొద్దకు పోయి, నా పేరు చెప్పి కుశలప్రశ్నలడిగి।
6 ఆ భాగ్యవంతుని చూచి — నీకును నీ యింటికిని నీకు
కలిగిన అంతటికిని క్షేమమువుగాక అని పలికి యీ
7 వర్తమానము తెలియజెప్పవలెను। —నీయొద్ద గొఱ్ఱెల
బొచ్చు కత్తిరించువారున్నారను సంగతి నాకు విన
బడెను; నీ గొఱ్ఱెకాపరులు మాదగ్గరనుండగా మేము
వారికి ఏ కీడును చేసి యుండలేదు; వారు కర్మెలులో
నున్నంతకాలము వారేదియు పోగొట్టుకొనలేదు, ।
8 నీ పని వారిని నీవు అడిగినయెడల వారాలాగు చెప్ప
దురు. కాబట్టి నా పనివారికి దయచూపుము. శుభ
దినమున మేము వచ్చితిమి గదా; నీకిష్టము వచ్చినట్టు
నీ దాసులకును నీ కుమారుడైన దావీదుకును ఇమ్ము.।
9 దావీదు పనివారు వచ్చి అతనిపేరు చెప్పి ఆ మాట
లన్నిటిని నాబాలుకు తెలియజేసి కూర్చుండగా ।
10 నాబాలు—దావీదు ఎవడు? యెష్షయి కుమారుడెవడు?
తమ యజమానులను విడిచి పారిపోయిన దాసులు
11 ఇప్పుడు అనేకులున్నారు.। నేను సంపాదించుకొనిన
అన్నపానములను, నా గొఱ్ఱెలబొచ్చు కత్తిరించువారి
కొరకు నేను వధించిన పశుమాంసమును తీసి, నేను
బొత్తిగా ఎరుగనివారికిత్తునా? అని దావీదు దాసు
12 లతో చెప్పగా। దావీదు పనివారు వెనుకకు తిరిగి
దోవపట్టుకొని పోయి అతనికి ఈ మాటలన్నియు
13 తెలియజేసిరి.। అంతట దావీదు వారితో—మీరందరు
మీ కత్తులను ధరించుకొనుడనగా వారు కత్తులు ధరించు
కొనిరి; దావీదు కూడను కత్తి ఒకటి ధరించెను. దావీదు
వెనుక దాదాపు నన్నూరుమంది బయలుదేరగా
ఇన్నూరుమంది సామానుదగ్గర నిలిచిరి.। పనివాడు 14
ఒకడు నాబాలు భార్యయైన అబీగయీలుతో ఇట్ల
నెను—అమ్మా, దావీదు అరణ్యములోనుండి, మన యజ
మానుని కుశలప్రశ్న లడుగుటకై దూతలను పంపిం
చగా అతడు వారితో కఠినముగా మాటలాడెను.।
అయితే ఆ మనుష్యులు మాకెంతో ఉపకారము చేసి 15
యున్నారు మేము పొలములో వారి సహవాసము సంచ
రించుచున్నంతసేపు అపాయము గాని నష్టము గాని
మాకు సంభవింపనేలేదు.। మేము గొఱ్ఱెలను కాయు 16
చున్నంతసేపు వారు దివారాత్రము మా చుట్టు ప్రాకా
రముగా ఉండిరి.। అయితే మా యజమానునికిని 17
అతని ఇంటివారికందరికిని హాని కీడుచేయ నిశ్చయించి
యున్నారు గనుక ఇప్పుడు నీవు చేయవలసినదానిని
బహు జాగ్రత్తగా ఆలోచించుము. మన యజమానుడు
బహు దుష్టుడు, ఎవనిని తనతో మాటలాడనియ్యడు.।
అందుకు అబీగయీలు నాబాలుతో ఏమియు చెప్పక 18
త్వరపడి యిన్నూరు రొట్టెలను, రెండు ద్రాక్షారసపు
తిత్తులను, వండిన అయిదు గొఱ్ఱెల మాంసమును,
అయిదు మానికల వేచిన ధాన్యమును, నూరు ద్రాక్ష
గెలలను, ఇన్నూరు అంజూరపు అడలను గార్దభముల
మీద వేయించి। — మీరు నాకంటె ముందుగా 19
పోవుడి, నేను మీ వెనుకనుండి వచ్చెదనని తన పని
వారికి ఆజ్ఞనిచ్చి। గార్దభముమీద ఎక్కి పర్వతపు 20
లోయలోకి వచ్చుచుండగా, దావీదును అతని జను
లును ఆమెకు ఎదురుపడిరి, ఆమె వారిని కలిసికొనెను.।
అంతకుమునుపు దావీదు — నాబాలుకు కలిగినదాని 21
అంతటిలో ఏదియు పోకుండ ఈ అరణ్యములో అతని
ఆస్తి అంతయు నేను వ్యర్థముగా కాయుచు వచ్చితిని;
ఉపకారమునకు నాకు అపకారము చేసియున్నాడే।
అని అనుకొని అతనికున్నవారిలో ఒక మగపిల్లవాని 22
నైనను తెల్లవారునప్పటికి నేనుండనియ్యను; లేదా
దేవుడు మరి గొప్ప అపాయము దావీదు శత్రువులకు
కలుగజేయుగాక అని ప్రమాణము చేసియుండెను.।
అబీగయీలు దావీదును కనుగొని, గార్దభముమీద 23
నుండి త్వరగా దిగి దావీదుకు సాష్టాంగ నమస్కారము
చేసి అతని పాదములు పట్టుకొని యిట్లనెను। —నా 24
యేలినవాడా, యీ దోషము నాదని యెంచుము; నీ
దాసురాలనైన నన్ను మాటలాడనిమ్ము, నీ దాసురాల
నైన నేను చెప్పుమాటలను ఆలకించుము;। నా యేలిన 25
వాడా, దుష్టుడైన యీ నాబాలును లక్ష్యపెట్టవద్దు,
అతనిపేరు అతని గుణములను సూచించుచున్నది,
అతనిపేరు నాబాలు మోటుతనము అతని గుణము;
నా యేలినవాడు పంపించిన పనివారు నాకు కనబడ
లేదు.। నా యేలినవాడా, యెహోవా జీవముతోడు 26

నీ జీవముతోడు ప్రాణహాని చేయకుండ యెహోవా
నిన్ను ఆపియున్నాడు. నీ చెయ్యి నిన్ను సంరక్షించె
నన్నమాట నిజమని యెహోవా జీవముతోడు నీ
జీవముతోడు అని ప్రమాణము చేయుచున్నాను. నీ
శత్రువులును నా యేలినవాడవైన నీకు కీడు చేయ
నుద్దేశించువారును నాబాలువలె ఉందురుగాక. ।
27 అయితే నేను నా యేలినవాడవగు నీయొద్దకు తెచ్చిన
యీ కానుకను నా యేలినవాడవగు నిన్ను వెంబ
28 డించు పనివారికి ఇప్పించి । నీ దాసురాలనైన నా
తప్పు క్షమించుము. నా యేలినవాడవగు నీవు
యెహోవా యుద్ధములను చేయుచున్నావు గనుక
నా యేలినవాడవగు నీకు ఆయన శాశ్వతమైన సంతతి
నిచ్చును. నీవు బ్రదుకు దినములన్నిటను నీకు అపా
29 యము కలుగకుండును. । నిన్ను హింసించుటకైనను నీ
ప్రాణము తీయుటకైనను ఎవడైన ఉద్దేశించినయెడల,
నా యేలినవాడవగు నీ ప్రాణము నీ దేవుడైన
యెహోవాయొద్దనున్న జీవపు మూటలో కట్టబడును;
ఒకడు వడిసెలతో రాయి విసరినట్టు ఆయన నీ శత్రు
30 వుల ప్రాణములను విసరివేయును. । యెహోవా నా
యేలినవాడవగు నిన్నుగూర్చి సెలవిచ్చిన మేలంతటిని
నీకు చేసి నిన్ను ఇశ్రాయేలీయులమీద అధిపతినిగా
31 నిర్ణయించిన తరువాత । నా యేలినవాడవగు నీవు
రక్తమును నిష్కారణముగా చిందించినందుకేగాని, నా
యేలినవాడవగు నీవు పగతీర్చుకొనినందుకేగాని,
మనోవిచారమైనను దుఃఖమైనను నా యేలినవాడవగు
నీకు ఎంతమాత్రమును కలుగక పోవునుగాక.
యెహోవా నా యేలినవాడవగు నీకు మేలు చేసిన తరు
వాత నీవు నీ దాసురాలనగు నన్ను జ్ఞాపకము చేసి
32 కొనుము. । అందుకు దావీదు— నాకు ఎదురుపడుటకై
నిన్ను పంపిన ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాకు
33 స్తోత్రము కలుగుగాక. । నేను పగతీర్చుకొన
కుండను ఈ దినమున ప్రాణము తీయకుండను నన్ను
ఆపినందుకై నీవు ఆశీర్వాదము నొందుదువు గాక.
నీవు చూపిన బుద్ధివిషయమై నీకు ఆశీర్వాదము కలుగు
34 గాక. । నీవు త్వరపడి నన్ను ఎదుర్కొనక పోయిన
పక్షమున, నీకు హానిచేయకుండ నన్ను ఆటంకపరచిన
ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా జీవముతోడు
తెల్లవారులోగా నాబాలుకు మగవాడొకడును విడువ
35 బడడన్నమాట నిశ్చయము అని చెప్పి । తనయొద్దకు
ఆమె తెచ్చినవాటిని ఆమెచేత తీసికొని—నీ మాటలు
నేను ఆలకించి నీ మనవి నంగీకరించితిని, సమాధాన
ముగా నీ యింటికి పొమ్మని ఆమెతో చెప్పెను. ।
36 అబీగయీలు తిరిగి నాబాలునొద్దకు రాగా, రాజులు
విందుచేసినట్లు అతడు ఇంటిలో విందుచేసి, త్రాగుచు
బహు సంతోషించుచు మత్తుగానుండెను గనుక తెల్ల
వారుపర్యంతము ఆమె అతనితో కొద్ది గొప్ప మరే
మియు చెప్పక ఊరకుండెను. । ఉదయమున నాబాలు 37
మత్తు విరిగి యున్నప్పుడు అతని భార్య అతనితో ఆ
సంగతులను తెలియజెప్పగా భయముచేత అతని గుండె
పగిలెను, అతడు రాతివలె బిగిసికొని పోయెను. । పది 38
దినములైన తరువాత యెహోవా నాబాలును
మొత్తగా అతడు చనిపోయెను । నాబాలు చనిపోయె 39
నని దావీదు విని—యెహోవా నాబాలు చేసిన కీడును
అతని తలమీదికి రప్పించెను గనుక తన దాసుడనైన
నేను కీడు చేయకుండ నన్ను కాపాడి, నాబాలువలన
నేను పొందిన అవమానమును తీర్చిన యెహోవాకు
స్తోత్రము కలుగుగాక అనెను. తరువాత దావీదు
అబీగయీలును పెండ్లి చేసికొనవలెనని ఆమెతో
మాటలాడ తగినవారిని పంపెను. । దావీదు సేవకులు 40
కర్మెలులోనున్న అబీగయీలునొద్దకు వచ్చి—దావీదు
మమ్మును పిలిచి నిన్ను పెండ్లిచేసికొనుటకై తోడుకొని
రండని పంపెననగా । ఆమె లేచి సాగిలపడి — నా 41
యేలినవాని చిత్తము; నా యేలినవాని సేవకుల కాళ్లు
కడుగుటకు నా యేలినవాని దాసురాలనగు నేను సిద్ధ
ముగా నున్నానని చెప్పి । త్వరగా లేచి గాడిదమీద 42
మీద ఎక్కి, తన వెనుక నడచుచున్న అయిదుగురు
పనికత్తెలతోకూడ దావీదు పంపిన దూతలవెంబడి
రాగా దావీదు ఆమెను పెండ్లి చేసికొనెను. । మరియు 43
దావీదు యెజ్రెయేలు స్త్రీయైన అహీనోయమును పెండ్లి
చేసికొని యుండెను; వారిద్దరు అతనికి భార్యలుగా
ఉండిరి. । సౌలు తన కుమార్తెయైన మీకాలు అను 44
దావీదు భార్యను పల్తీయేలను గల్లీమువాడైన లాయీషు
కుమారునికి ఇచ్చి యుండెను.

అంతట జీఫీయులు గిబియాలో సౌలునొద్దకు **26**
వచ్చి—దావీదు యెషీమోను ఎదుట హకీలామన్య
ములో దాగియున్నాడని తెలియజేయగా । సౌలు 2
లేచి ఇశ్రాయేలీయులలో ఏర్పరచబడిన మూడు వేల
మందిని తీసికొని జీఫు అరణ్యములో దావీదును వెద
కుటకు జీఫు అరణ్యమునకు పోయెను. । సౌలు యెషీ 3
మోను ఎదుటనున్న హకీలామన్యమందు త్రోవ
ప్రక్కను దిగగా, దావీదు అరణ్యములో నివసించు
చుండి తన్ను పట్టుకొనవలెనని సౌలు అరణ్యమునకు
వచ్చెనని విని । వేగులవారిని పంపి — నిశ్చయముగా 4
సౌలు వచ్చెనని తెలిసికొనెను. । తరువాత దావీదు 5
లేచి సౌలు దండు దిగిన స్థలము దగ్గరకు వచ్చి, సౌలును
సౌలుకు సైన్యాధిపతియగు నేరు కుమారుడైన అబ్నే
రును పరుండియుండగా వారున్నస్థలము కనుగొనెను.
సౌలు దండు క్రొత్తళములో పండుకొనగా దండు
వారు అతనిచుట్టు నుండిరి. । అప్పుడు దావీదు — 6
పాళెములోకి సౌలు దగ్గరకు నాతోకూడ ఎవరు
వత్తురని హిత్తీయుడైన అహీమెలెకును సెరూయా
కుమారుడును యోవాబుకు సహోదరుడునగు అబీ

షైని నడుగగా — నీతోకూడ నేనే వత్తునని అబీషై
7 యనెను. । దావీదును అబీషైయును రాత్రివేళ ఆ
జనులదగ్గరకు పోగా సౌలుదండు క్రొత్తళములో
పండుకొని నిద్రబోవుచుండెను, అతని యీటె అతని
తలగడదగ్గర నేలను నాటియుండెను, అబ్నేరును జను
8 లును అతని చుట్టు పండుకొనియుండిరి. । అప్పుడు
అబీషై దావీదును చూచి—దేవుడు ఈ దినమున నీ
శత్రువుని నీకప్పగించెను; కాబట్టి నీ చిత్తమైతే ఆ
యీటెతో ఒక్కపోటు పొడిచి నేనతనిని భూమికి
నాటివేతును, ఒక దెబ్బతోనే పరిష్కారము చేతు
9 ననగా । దావీదు—నీవతని చంపకూడదు, యెహోవా
చేత అభిషేకము నొందినవానిని చంపి నిర్దోషి యగుట
10 యెవనికి సాధ్యము? । యెహోవా జీవముతోడు
యెహోవాయే అతని మొత్తును, అతడు అపాయము
వలన చచ్చును, లేదా యుద్ధమునకు పోయి నశిం
11 చును; । యెహోవాచేత అభిషేకము నొందినవానిని
నేను చంపను; ఆలాగు నేను చేయకుండ యెహోవా
నన్ను ఆపునుగాక. అయితే అతని తలగడదగ్గరనున్న
యీటెను నీళ్లబుడ్డిని తీసికొని మనము వెళ్లిపోదము
12 రమ్మని అబీషైతో చెప్పి । సౌలు తలగడదగ్గరనున్న
యీటెను నీళ్లబుడ్డిని తీసికొని వారిద్దరు వెళ్లిపోయిరి.
యెహోవాచేత వారి కందరికి గాఢనిద్ర కలుగగా
వారిలో ఎవడును నిద్రమేలుకొనలేదు, ఎవడును
వచ్చినవారిని చూడలేదు, జరిగినదాని గుర్తుపట్టినవా
13 డొకడును లేడు. । తరువాత దావీదు అవతలకు పోయి
దూరముగా నున్న కొండమీద నిలిచి, ఉభయుల
14 మధ్యను చాలా యెడముండగా । జనులును నేరు
కుమారుడైన అబ్నేరును వినునట్లు—అబ్నేరూ, నీవు
మాటలాడవా? అని కేకవేయగా అబ్నేరు కేకలువేసి—
15 రాజును నిద్ర లేపు నీవెవడవని అడిగెను. । అందుకు
దావీదు—నీవు మగవాడవు కావా? ఇశ్రాయేలీయు
లలో నీ వంటివాడెవడు? నీకు యజమానుడగు రాజుకు
నీవెందుకు కాపు కాయకపోతివి! నీకు యజమానుడగు
రాజును సంహరించుటకు జనులలో ఒకడు చేరువకు
16 వచ్చెనే; । నీ ప్రవర్తన అనుకూలము కాదు, నీవు
శిక్షకు పాత్రుడవే; యెహోవాచేత అభిషేకము
నొందిన నీ యేలినవానికి నీవు రక్షకముగా నుండలేదు;
యెహోవా జీవముతోడు నీవు మరణశిక్షకు పాత్రు
డవు. రాజుయొక్క యీటె యెక్కడ నున్నదో
చూడుము, అతని తలగడయొద్దనున్న నీళ్లబుడ్డి యెక్కడ
17 నున్నదో చూడుము అని పలికెను. । సౌలు దావీదు
స్వరము ఎరిగి—దావీదా నాయనా, యిది నీ స్వరమే
గదా అని అనగా దావీదు ఇట్లనెను — నా యేలిన
18 వాడా నా రాజా, నా స్వరమే. । నా యేలినవాడు
తన దాసుని ఈలాగున ఎందుకు తరుముచున్నాడు?
నేనేమి చేసితిని? నావలన ఏ కీడు నీకు సంభవిం
చును? । రాజా నా యేలినవాడా, నీ దాసుని మాటలు 19
వినుము. నామీద పడవలెనని యెహోవా నిన్ను
ప్రేరేపించినయెడల నైవేద్యము చేసి ఆయనను శాంతి
పరపవచ్చును. అయితే నరులెవరైనను నిన్ను ప్రేరే
పించిన పక్షమున వారు యెహోవా దృష్టికి శాప
గ్రస్తులగుదురు. వారు—నీవు దేశమును విడిచి అన్య
దేవతలను పూజించుమని నాతో చెప్పి, యెహోవా
స్వాస్థ్యమునకు హత్తుకొనకుండ నన్ను వెలివేయుచు
న్నారు. । నా దేశమునకు దూరముగాను, యెహోవా 20
సన్నిధికి ఎడముగాను నేను మరణము నొందకపోవు
దునుగాక. ఒకడు పర్వతములమీద కౌజుపిట్టను తరిమి
నట్టు ఇశ్రాయేలు రాజవైన నీవు మిన్నల్లిని వెదకు
టకై బయలుదేరి వచ్చితివి. । అందుకు సౌలు—నేను 21
పాపముచేసితిని, ఈ దినమున నా ప్రాణము నీ
దృష్టికి ప్రియముగా నుండినదానిబట్టి నేను నీకిక కీడు
చేయను. దావీదా నాయనా, నాయొద్దకు తిరిగి
రమ్ము; వెర్రివాడనై నేను బహు తప్పు చేసితిననగా ।
దావీదు — రాజా, యిదిగో నీ యీటె నాయొద్ద 22
నున్నది, పనివారిలో నొకడు వచ్చి దాని తీసికొన
వచ్చును. । యెహోవా ఈ దినము నిన్ను నాకు 23
అప్పగించినను, నేను యెహోవాచేత అభిషేకము
నొందినవానిని చంపనొల్లక పోయినందున ఆయన
నా నీతిని నా విశ్వాస్యతను చూచి నాకు ప్రతి
ఫలము దయచేయును. । చిత్తగించుము, ఈ దినమున 24
నీ ప్రాణము నా దృష్టికి ఘనమైనందున యెహోవా
నా ప్రాణమును తన దృష్టికి ఘనముగా ఎంచి బాధ
లన్నిటిలోనుండి నన్ను రక్షించునుగాక అని చెప్పెను. ।
అందుకు సౌలు — దావీదా నాయనా, నీవు ఆశీర్వా 25
దము పొందుదువు గాక; నీవు ఘనకార్యములను
పూనుకొని విజయము నొందుదువుగాక అని దావీ
దుతో అనెను. అప్పుడు దావీదు తన మార్గమున వెళ్లి
పోయెను, సౌలును తన స్థలమునకు తిరిగి వచ్చెను.

తరువాత దావీదు—నేను ఇక్కడ నిలుచుట మం **27**
చిదికాదు, ఏదో ఒక దినమున నేను సౌలుచేత నాశన
మగుదును; నేను ఫిలిష్తీయుల దేశములోకి తప్పించు
కొని పోవుదును, అప్పుడు సౌలు ఇశ్రాయేలీయుల సరి
హద్దులలో నన్ను వెదకుట మానుకొనును గనుక నేను
అతని చేతిలోనుండి తప్పించుకొందునని అనుకొని ।
లేచి తనయొద్దనున్న ఆరునూరుమందితోకూడ ప్రయా 2
ణమై మాయోకు కుమారుడును గాతు రాజునైన
ఆకీషునొద్దకు వచ్చెను. । దావీదు గాతులో ఆకీషు 3
నొద్ద చేరగా అతడును అతని వారందరును తమ తమ
కుటుంబముల సమేతముగా కాపురముండిరి. యెజ్రె
యేలీయురాలగు అహీనోయము, నాబాలు భార్యయై
యుండిన కర్మెలీయురాలగు అబీగయీలు అను అతని
యిద్దరు భార్యలు దావీదుతోకూడ ఉండిరి.

4 దావీదు గాతునకు పారిపోయిన సంగతి సౌలునకు
తెలిసినమీదట అతడు దావీదును వెదకుట మానివే
5 సెను. । అంతట దావీదు—రాజపురమందు నీయొద్ద నీ
దాసుడనైన నేను కాపురము చేయనేల? నీ దృష్టికి
నేను అనుగ్రహము పొందినవాడనైతే బయటి పట్టణ
ములలో ఒకదానియందు నేను కాపురముండుటకు
6 ఒక స్థలము ఇప్పించుమని ఆకీషును అడుగగా । ఆకీషు
సిక్లగు అను గ్రామమును ఆ దినమున అతనికిచ్చెను.
కాబట్టి నేటివరకు సిక్లగు యూదారాజుల వశమున
నున్నది.

7 దావీదు ఫిలిష్తీయుల దేశములో కాపురముండిన
8 కాలమంత ఒక సంవత్సరము నాలుగు నెలలు. । అం
తలో దావీదును అతని వారును బయలుదేరి గెషూరీ
యులమీదను గెజెరీయులమీదను అమాలేకీయులమీ
దను పడిరి; ప్రయాణస్థులు పోవుమార్గమున షూరు
నుండి ఐగుప్తువరకునున్న దేశములో వారు పూర్వము
9 కాపురముండగా । దావీదు ఆ దేశస్థులను హతము
చేసి, మగవానినేమి ఆడుదానినేమి యెవరిని సజీవు
లగా విడువక గొఱ్ఱలను ఎడ్లను గార్దభములను ఒం
టెలను వస్త్రములను దోచుకొని తిరిగి ఆకీషునొద్దకు
10 వచ్చెను. । ఆకీషు — ఇప్పుడు మీరు దండెత్తి యెక
దేశములో జొరబడితిరా అని దావీదు నడుగగా
దావీదు — యూదాదేశమునకును యెరహ్మెయేలీ
యుల దేశమునకును కేనీయుల దేశమునకును దక్షి
ణముగా మేము ఒక ప్రదేశములో జొరబడితి
11 మనెను. । ఆలాగున దావీదు చేయుచు వచ్చెను. అతడు
ఫిలిష్తీయుల దేశములో నివసించినంత కాలము ఈ
ప్రకారముగా చేయునని తమ్మునుగురించి వారు చెప్పు
దురేమో అని, గాతునకు వర్తమానము తేగల మగవాని
నైనను ఆడుదానినైనను దావీదు బ్రదుకనియ్యలేదు. ।
12 — దావీదు తన జనులైన ఇశ్రాయేలీయులు తనయందు
బొత్తిగా అసహ్యపడునట్లు చేసెను గనుక అతడు
సదాకాలము నాకు దాసుడుగా ఉండునని అను
కొని ఆకీషు దావీదు మాట నమ్మెను.

**28** ఆ దినములలో ఫిలిష్తీయులు ఇశ్రాయేలీయులతో
యుద్ధముచేయవలెనని సైన్యములను సమకూర్చి యుద్ధ
మునకు సిద్ధపడగా, ఆకీషు దావీదును పిలిచి — నేను
దండెత్తగా నీవును నీ జనులును నాతోకూడ యుద్ధము
నకు బయలుదేరి రావలెనని పరిష్కారముగా తెలిసి
2 కొనుమనగా । దావీదు—నీ దాసుడనైన నేను చేయ
బోవు కార్యము ఏదో అది నీవు ఇప్పుడు తెలిసికొందు
వనెను. అందుకు ఆకీషు—ఆలాగైతే నిన్ను ఎప్పటికి
నాకు దేహసంరక్షకునిగా నిర్ణయింతుననెను.

3 సమూయేలు మృతిబొందగా ఇశ్రాయేలీయులు
అతని గురించి విలాపము చేసి రామా అను అతని
పట్టణములో అతనిని పాతిపెట్టి యుండిరి. మరియు
సౌలు కర్ణపిశాచముగలవారిని చిల్లంగివారిని దేశ
ములోనుండి వెళ్లగొట్టి యుండెను. । ఫిలిష్తీయులు దం 4
డెత్తి వచ్చి షూనేములో దిగగా, సౌలు ఇశ్రాయేలీ
యులందరిని సమకూర్చెను; వారు గిల్బోవలో దిగిరి. ।
సౌలు ఫిలిష్తీయుల దండును చూచి మనస్సునందు 5
భయకంపములనొంది । యెహోవాయొద్ద విచారణ 6
చేయగా యెహోవా స్వప్నముద్వారానైనను ఊరీము
ద్వారానైనను ప్రవక్తలద్వారానైనను ఏమియు సెల
వియ్యకుండెను. । అప్పుడు సౌలు—నాకొరకు మీరు 7
కర్ణపిశాచముగల యొక స్త్రీని కనుగొనుడి; నేను పోయి
దానిచేత విచారణ చేతునని తన సేవకులకు ఆజ్ఞ
ఇయ్యగా వారు—చిత్తము, ఏన్దోరులో కర్ణపిశాచము
గల యొకతె యున్నదని అతనితో చెప్పిరి. । కాబట్టి 8
సౌలు మారు వేషము ధరించి వేరు బట్టలు తొడుగు
కొని యిద్దరు మనుష్యులను వెంటబెట్టుకొని పోయి
రాత్రివేళ ఆ స్త్రీయొద్దకు వచ్చి—కర్ణపిశాచము ద్వారా
నాకు శకునము చెప్పి నాతో మాటలాడుటకై నేను
నీతో చెప్పువాని రప్పించుమని కోరగా । ఆ స్త్రీ— 9
చిత్తము, సౌలు చేయించినది నీకు తెలిసినది కాదా?
కర్ణపిశాచములు గలవారిని చిల్లంగివారిని అతడు దేశ
ములో ఉండకుండ నిర్మూలముచేసెను గదా. నీవు నా
ప్రాణముకొరకు ఉరియొగ్గి నాకు మరణమేల రప్పిం
తువు అని అతనితో అనెను. । అందుకు సౌలు — 10
యెహోవా జీవముతోడు దీనిని బట్టి నీకు శిక్ష యెంత
మాత్రమును రాదని యెహోవా నామమున ప్రమా
ణము చేయగా । ఆ స్త్రీ —నీతో మాటలాడుటకై నేనె 11
వని రప్పింపవలెనని యడుగగా అతడు — సమూయే
లును రప్పింపవలెననెను. । ఆ స్త్రీ। సమూయేలును 12
చూచినప్పుడు బిగ్గరగా కేకవేసి—నీవు సౌలువే; నీవు
నన్నెందుకు మోసపుచ్చితివని సౌలుతో చెప్పగా ।
రాజు—నీవు భయపడవద్దు, నీకు ఏమి కనబడినదని 13
ఆమె నడుగగా ఆమె—దేవతలలో ఒకడు భూమిలో
నుండి పైకివచ్చుట నేను చూచుచున్నాననెను. । అందు 14
కతడు — ఏ రూపముగా ఉన్నాడని దాని నడిగినం
దుకు అది — దుప్పటి కప్పుకొనిన ముసలివాడొకడు
పైకి వచ్చుచున్నాడనగా సౌలు—అతడు సమూయేలు
అని తెలిసికొని సాగిలపడి నమస్కారము చేసెను. ।
సమూయేలు—నన్ను రమ్మని నీవెందుకు తొందరపెట్టితి 15
వని సౌలు నడుగగా సౌలు— నేను బహు శ్రమలో
నున్నాను; ఫిలిష్తీయులు నా మీదికి యుద్ధమునకు
రాగా దేవుడు నన్ను ఎడబాసి ప్రవక్తలద్వారానైనను
స్వప్నములద్వారానైనను నా కేమియు సెలవియ్యక
యున్నాడు. కాబట్టి నేను చేయవలసినదానిని నాతో
తెలియజెప్పుటకై నిన్ను పిలిపించితిననెను. । అందుకు 16
సమూయేలు—యెహోవా నిన్ను ఎడబాసి నీకు పగ
వాడు కాగా నన్ను అడుగుటవలన ప్రయోజన

17 వైరి! । యెహోవా తన మాట తన పక్షముగానే
నెరవేర్చుచున్నాడు. నా ద్వారా ఆయన సెలవిచ్చి
యున్నట్టు నీ చేతినుండి రాజ్యమును తీసివేసి నీ
పొరుగువాడైన దావీదుకు దాని నిచ్చియున్నాడు. ।
18 యెహోవా ఆజ్ఞకు నీవు లోబడక, అమాలేకీయుల
విషయములో ఆయన తీక్ష్ణమైన కోపము నెరవేర్చక
పోయినదానినిబట్టి యెహోవా నీకు ఈవేళ ఈ
19 ప్రకారముగా చేయుచున్నాడు. । యెహోవా
నిన్నును ఇశ్రాయేలీయులను ఫిలిష్తీయుల చేతికి అప్ప
గించును; యెహోవా ఇశ్రాయేలీయుల దండును
ఫిలిష్తీయుల చేతికి అప్పగించును; రేపు నీవును నీ
కుమారులును నాతోకూడ ఉందురు అని సౌలుతో
20 చెప్పగా । సమూయేలు మాటలకు సౌలు బహు భయ
మొంది వెంటనే నేలను సాష్టాంగపడి దివారాత్రము
భోజనమేమియు చేయక యుండినందున బలహీను
21 డాయెను. । అప్పుడు ఆ స్త్రీ సౌలు దగ్గరకు వచ్చి,
అతడు బహుగా కలవరపడుట చూచి — నా యేలిన
వాడా, నీ దాసినైన నేను నీ ఆజ్ఞకు లోబడి నా
ప్రాణము నా చేతిలో పెట్టుకొని నీవు నాతో సెల
22 విచ్చిన మాటలను విని అట్లు చేసితిని. । ఇప్పుడు నీ
దాసినైన నేను చెప్పు మాటలను ఆలకించుము, నేను
నీకు ఇంత ఆహారము వడ్డించుదును, నీవు భోజనము
చేసి ప్రయాణమై పోవుటకు బలము తెచ్చుకొనుమని
23 అతనితో చెప్పగా । అతడు ఒప్పక భోజనము చేయ
ననెను; అయితే అతని సేవకులు ఆ స్త్రీతో ఏకమై
యతని బలవంతము చేయగా అతడు వారు చెప్పిన
మాట ఆలకించి నేలనుండి లేచి మంచముమీద కూర్చుం
24 డెను. । తన యింటిలో క్రొవ్విన పెయ్య ఒకటి
యుండగా ఆ స్త్రీ దాని తీసికొని త్వరగా వధించి
25 పిండి తెచ్చి పిసికి పులుసులేని రొట్టెలు కాల్చి । తీసి
కొనివచ్చి సౌలుకును అతని సేవకులకును వడ్డించగా
వారు భోజనముచేసి లేచి ఆ రాత్రి వెళ్లిపోయిరి.

**29** అంతలో ఫిలిష్తీయులు దండెత్తి పోయి ఆఫెకులో
దిగియుండిరి; ఇశ్రాయేలీయులు యెజ్రెయేలులోని
2 జెలదగ్గర దిగియుండిరి. । ఫిలిష్తీయుల సర్దారులు తమ
సైన్యమును నూరేసిమందిగాను వెయ్యేసిమందిగాను
వ్యూహపరచి వచ్చుచుండగా దావీదును అతని జను
లును ఆకీషుతో కలిసి దండు వెనుకతట్టున వచ్చు
3 చుండిరి. । ఫిలిష్తీయుల సర్దారులు — ఈ హెబ్రీ
యులు ఏల రావలెను అని ఆకీషును అడుగగా అతడు
— ఇన్ని దినములు ఇన్ని సంవత్సరములు నాయొద్ద
నుండిన ఇశ్రాయేలీయుల రాజైన సౌలుకు సేవకుడగు
దావీదు ఇతడే కాడా? ఇతడు నాయొద్ద చేరిననాటి
నుండి నేటివరకు ఇతనియందు తప్పేమియు నాకు
కనబడలేదని ఫిలిష్తీయుల సర్దారులతో అనెను. ।
4 అందుకు ఫిలిష్తీయుల సర్దారులు అతనిమీద కోప

పడి—ఈ మనుష్యుని నీవు నిర్ణయించిన స్థలము తిరిగి పోనిమ్ము, అతడు మనతో కలిసి యుద్ధము రాకూడదు, యుద్ధమందు అతడు మనకు విరోధియగు నేమో, దేనిచేత అతడు తన యజమానునితో స ధానపడును? మనవారి తలలను ఛేదించి తీసి పోవుటచేతనే గదా తన యజమానునితో సమా పడును. । —సౌలు వేలకొలదిగాను దావీదు పదివే లదిగాను హతముచేసిరని వారు నాట్యమాడుచు ప్రతిగానము చేయుచు పాడిన దావీదు ఇతడే గ అని అతనితో చెప్పిరి. । కాబట్టి ఆకీషు దావీ పిలిచి—యెహోవా జీవముతోడు నిజముగా నీ యథార్థపరుడవై యున్నావు; దండులో నీవు నా కూడ సంచరించుట నా దృష్టికి అనుకూలమే; నాయొద్దకు వచ్చిన దినమునుండి నేటివరకు నీయం ఏ దోషమును నాకు కనబడలేదు గాని సర్దారు నీయందు ఇష్టములేక యున్నారు. । ఫిలిష్తీయుల స యుల దృష్టికి నీవు ప్రతికూలముగా ఏమియు చేయకుండు నట్లు నీవు తిరిగి నీ స్థలమునకు సమాధానముగా వెళ్లు చెప్పగా । దావీదు—నేనేమి చేసితిని? నా యేలిన వా గు రాజా, నీ శత్రువులతో యుద్ధముచేయుట నేను రాకుండునట్లు నీయొద్దకు వచ్చిన దినమును నేటివరకు నీ దాసుడనైన నాయందు తప్పేమి బడెనని ఆకీషు నడిగెను. । అందుకు ఆకీషు — మాతవలె నీవు నా దృష్టికి కనబడుచున్నావని నే గుదును గాని ఫిలిష్తీయుల సర్దారులు—ఇతడు తోకూడ యుద్ధమునకు రాకూడదని చెప్పుచున్నా కాబట్టి ఉదయమున నీవును నీతోకూడ వచ్చిన యజమానుని సేవకులును త్వరగా లేచి ఉద మున లేచి తెల్లవారగానే బయలుదేరి పోవల దావీదుకు ఆజ్ఞ ఇచ్చెను. । కావున దావీదును అ జనులును ఉదయమున త్వరగా లేచి ఫిలిష్తీయుల మునకు పోవలెనని ప్రయాణమైరి; ఫిలిష్తీయు దండెత్తి యెజ్రెయేలునకు పోయిరి.

దావీదును అతని జనులును మూడవ దినమున సిక్లగుకు వచ్చిరి; అంతలో అమాలేకీయులు దం దక్షిణదేశముమీదను సిక్లగుమీదను పడి దోచుకొ సిక్లగువారిని హతముచేసి దాని తగలబెట్టి । ఘ నేమి అల్పులనేమి అందులోనున్న ఆడువారంద చెరపట్టుకొని చంపక వారిని తీసికొని వెళ్లిపో యుండిరి. । దావీదును అతని జనులును పట్టణము వచ్చి అది కాల్చబడి యుండుటయు, తమ భా లును కుమారులును కుమార్తెలును చెరలోనికి కొని బడి యుండుటయు చూచి । ఇక ఏడ్చుటకు శక్తి పోవునంత బిగ్గరగా ఏడ్చిరి. । యెజ్రెయేలీయురా అహీనోయము, కర్మెలీయుడైన నాబాలు భా యయిన అబీగయీలు అను దావీదు ఇద్దరు భా

6 లును చెరలోనికి కొనిపోబడగా చూచి । దావీదు
మిక్కిలి దుఃఖపడెను. మరియు తమ తమ కుమారు
లను బట్టియు కుమార్తెలను బట్టియు జనులకందరికి
ప్రాణము విసికినందున రాళ్లు రువ్వి దావీదును చంపు
దము రండని వారు చెప్పుకొనగా దావీదు తన దేవు
డైన యెహోవానుబట్టి ధైర్యము తెచ్చుకొనెను. ।
7 పిమ్మట దావీదు—ఏఫోదు తెమ్మని యాజకుడగు అహీ
మెలెకు కుమారుడైన అబ్యాతారుతో చెప్పగా అబ్యా
తారు ఏఫోదును దావీదునొద్దకు తీసికొని వచ్చెను. ।
8 —నేను ఈ దండును తరిమినయెడల దాని కలిసి
కొందునా అని యెహోవాయొద్ద దావీదు విచారణ
చేయగా యెహోవా—తరుము, నిశ్చయముగా నీవు
వారిని కలిసికొని తప్పక నీవారినందరిని దక్కించు
9 కొందువని సెలవిచ్చెను. । కాబట్టి దావీదును అతని
యొద్దనున్న ఆరునూరుమందియును బయలుదేరి బెసోరు
వాగుగట్టునకు రాగా వారిలో ఇన్నూరుమంది వెనుక
10 దిగవిడువబడిరి. । దావీదును నన్నూరుమందియును
ఇంక తరుముచు పోయిరి గాని ఆ ఇన్నూరుమంది
అలసటపడి బెసోరువాగు దాటలేక ఆగిరి. ఆ నన్నూ
11 రుమంది పోవుచుండగా । పొలములో ఒక ఐగుప్తీ
యుడు కనబడెను. వారు దావీదునొద్దకు వాని తోడు
కొనివచ్చి, వాడు మూడు దివారాత్రములు అన్నపా
నము లేమియు పుచ్చుకొనలేదని తెలిసికొని, వానికి
భోజనముపెట్టి దాహమిచ్చి అంజూరపు అడలోని
ముక్కను రెండు ద్రాక్షగెలలను వానికిచ్చిరి. ।
12 వాడు భోజనము చేసిన తరువాత వాని ప్రాణము
13 తెప్పరిల్లగా । దావీదు—నీవు ఏ దేశపువాడవు? ఎక్క
డనుండి వచ్చితివని వాని నడిగెను. అందుకు వాడు
—నేను ఐగుప్తీయుడనై పుట్టి అమాలేకీయుడైన యొక
నికి దాసుడనైతిని, మూడు దినముల క్రిందట నేను
కాయిలా పడగా నా యజమానుడు నన్ను విడిచి
14 పెట్టి పోయెను. । మేము దండెత్తి కెరేతీయుల దక్షిణ
దేశమునకును యూదా దేశమునకును కాలేబు దక్షిణ
దేశమునకును వచ్చి వాటిని దోచుకొని సిక్లగును
15 కాల్చివేసితిమని చెప్పెను. ।—ఆ దండును కలిసికొను
టకై నీవు నాకు దోవచూపుదువా అని దావీదు వాని
నడుగగా వాడు—నేను నిన్ను చంపననియు నీ యజ
మానుని వశము చేయననియు దేవునిబట్టి నీవు నాకు
ప్రమాణము చేసినయెడల ఆ దండును కలిసికొనుటకు
16 నీకు దోవచూపుదుననెను. । తరువాత వాడు వారి
దగ్గరకు దావీదును నడిపింపగా, ఫిలిష్తీయుల దేశము
లోనుండియు యూదా దేశములోనుండియు తాము
దోచి తెచ్చుకొనిన సొమ్ముతో తులదూగుచు, వారు
ఆ ప్రదేశమంతట చెదరి అన్నపానములు పుచ్చు
17 కొనుచు ఆటపాటలు సలుపుచుండిరి. । దావీదు సంగ
తిని గ్రహించి సంధ్యవేళ మొదలుకొని మరునాటి
సాయంత్రమువరకు వారిని హతము చేయుచుండగా,
ఒంటెలమీద ఎక్కి పారిపోయిన నన్నూరుమంది
యౌవనులు తప్ప తప్పించుకొనినవాడు ఒకడును
లేకపోయెను. । ఈలాగున దావీదు అమాలేకీయులు 18
దోచుకొనిపోయిన దానంతటిని తిరిగి తెచ్చుకొనెను.
మరియు అతడు తన యిద్దరు భార్యలను రక్షించెను. ।
కుమారులేమి కుమార్తెలేమి దోపుడు సొమ్మేమి వారు 19
ఎత్తికొనిపోయిన దానంతటిలో కొద్దిదేమి గొప్పదేమి
యేదియు తక్కువకాకుండ దావీదు సమస్తమును రక్షిం
చెను. । మరియు దావీదు అమాలేకీయుల గొఱ్ఱెలన్ని 20
టిని గొడ్లన్నిటిని పట్టుకొనెను. ఇవి దావీదుకు దోపుడు
సొమ్మని జనులు మిగిలిన తమ స్వంత పశువులకు
ముందుగా వీటిని తోలిరి. । అలసటచేత దావీదును 21
వెంబడించలేక బెసోరు వాగుదగ్గర నిలిచిన ఆ
యిన్నూరుమందియొద్దకు దావీదు పోగా వారు దావీ
దును అతనియొద్దనున్న జనులను ఎదుర్కొనుటకై
బయలుదేరి వచ్చిరి. దావీదు ఈ జనులయొద్దకు వచ్చి
వారి యోగక్షేమమడుగగా । దావీదుతోకూడ వెళ్లిన 22
వారిలో దుర్మార్గులైన చెడు మనుష్యులు కొందరు —
వీరు మనతోకూడ రాక నిలిచిరి గనుక తమ భార్య
లను పిల్లలను తప్ప మనకు మరల వచ్చిన దోపుడు
సొమ్ములో మనమేమియు వీరికియ్యము; తమ భార్య
పిల్లలను వారు తీసికొని పోవచ్చుననిరి. । అందుకు 23
దావీదు వారితో ఇట్లనెను—నా సహోదరులారా,
యెహోవా మనలను కాపాడి మనమీదికి వచ్చిన
యీ దండును మనకప్పగించి మనకు దయచేసిన దాని
విషయములో మీరు ఈలాగున చేయకూడదు. ।
మీరు చెప్పినది యెవరు ఒప్పుకొందురు? యుద్ధము 24
నకు పోయినవాని భాగమెంతో సామానునొద్ద నిలి
చినవాని భాగము అంతే అని వాడుకమాట; అందరు
సమముగానే పాలు పంచుకొందురు గదా? । కావున 25
నాటనుండి నేటివరకు దావీదు ఇశ్రాయేలీయులలో
అట్టి పంపకము కట్టడగాను న్యాయవిధిగాను ఏర్ప
రచి నియమించెను.

దావీదు సిక్లగునకు వచ్చినప్పుడు దోపుడుసొమ్ములో 26
కొంత తన స్నేహితులైన యూదా పెద్దలకు ఏర్పరచి
—యెహోవా శత్రువులయొద్ద నేను దోచుకొనిన
సొమ్ములో కొంత ఆశీర్వాదసూచనగా మీకు ఇచ్చు
చున్నానని చెప్పి వారికి పంపించెను. । బేతేలులోను 27
దక్షిణ రామోతులోను యత్తీరులోను । అరోయేరు 28
లోను షిఫ్మోతులోను ఎష్టెమోలోను । రాకాలులోను 29
యెరహ్మయేలీయుల గ్రామములలోను కేనీయుల
గ్రామములలోను । హోర్మాలోను కోరాషానులోను 30
అతాకులోను । హెబ్రోనులోను దావీదును అతని 31
జనులును సంచరించిన స్థలములన్నిటిలోను ఉన్న పెద్ద
లకు దావీదు పంపించెను.

31 అంతలో ఫిలిష్తీయులు ఇశ్రాయేలీయులతో
యుద్ధము చేయగా ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయుల
యెదుటనుండి పారిపోయిరి. గిల్బోవ పర్వతమువరకు
2 ఫిలిష్తీయులు వారిని హతము చేయుచు సౌలును
అతని కుమారులను తరుముచు, యోనాతాను, అబీనా
దాబు, మెల్కీషూవ అను సౌలుయొక్క ముగ్గురు
3 కుమారులను హతము చేసిరి. యుద్ధములో సౌలు
ఓడిపోవుచుండగా విలుకాండ్లు గురిపెట్టి అతని కొట్టి
4 నందున అతడు బహుగా భయపడి — సున్నతి లేని
వీరు వచ్చి నన్ను పొడిచి అపహాస్యము చేయకుండు
నట్లు నీ కత్తి దూసి దానిచేత నన్ను పొడువుమని తన
ఆయుధములను మోయువానితో చెప్పగా అతడు
భయముచేత ఆలాగుచేయ నొల్లకుండెను గనుక సౌలు
5 తన కత్తి పట్టుకొని దానిమీద పడెను. సౌలు
మరణమాయెనని అతని ఆయుధములను మోయువాడు
తానును తన కత్తిమీద పడి అతనితోకూడ మరణ
6 మాయెను. ఈలాగున సౌలును అతని ముగ్గురు కుమా
రులును అతని ఆయుధములను మోయువాడును అతని
7 వారందరును ఒక దినముననే మరణమైరి. లోయ
అవతలనున్న ఇశ్రాయేలీయులును, యొర్దాను అవతల
నున్నవారును, ఇశ్రాయేలీయులు పారిపోవుటయు,
సౌలును అతని కుమారులును చచ్చియుండుటయు
చూచి తమ నివాసగ్రామములు విడిచిపెట్టి పారి
పోయిరి. ఫిలిష్తీయులు వచ్చి వాటిలో కాపురముండిరి.
మరునాడు ఫిలిష్తీయులు హతమైనవారిని దోచు
కొనవచ్చి గిల్బోవ పర్వతముమీద పడిపోయిన సౌలును
అతని ముగ్గురు కుమారులను కనుగొని అతని తలను
ఛేదించి అతని ఆయుధములను తీసి తమ బొమ్మల గుళ్ల
లోను జనులలోను జయవర్తమానము తెలియజేయుటకై
ఫిలిష్తీయుల దేశములో నలుదిశలు వాటిని పంపిరి.
మరియు వారు అతని ఆయుధములను అష్తారోతు
దేవిగుడిలో ఉంచి అతని మొండెమును బేత్షాను పట్ట
ణపు గోడకు తగిలించిరి. అయితే ఫిలిష్తీయులు సౌలుకు
చేసినదానిగురించిన వార్త యాబేష్గిలాదువారు విని
బలశాలులందరు లేచి రాత్రియంతయు నడిచి సౌలు
మొండెమును అతని కుమారుల కళేబరములను బేత్షాను
పట్టణపు గోడమీదనుండి దించి యాబేషునకు తిరిగి
వచ్చి వాటిని దహనముచేసి, వారి శల్యములను తీసి
యాబేషులోని పిచులవృక్షముక్రింద పాతిపెట్టి యేడు
దినములు ఉపవాసముండిరి.

# స మూ యే లు

## రెండవ గ్రంథము



1 దావీదు అమాలేకీయులను హతముచేసి తిరిగి
వచ్చెను. సౌలు మృతినొందిన తరువాత అతడు సిక్ల
2 గులో రెండు దినములుండెను. | మూడవ దినమున
బట్టలు చింపుకొని తలమీద బుగ్గిపోసికొనిన యొకడు
3 సౌలునొద్దనున్న దండువారిలోనుండి వచ్చెను. | అతడు
దావీదును దర్శించి నేలను సాగిలపడి నమస్కారము
చేయగా దావీదు—నీవెక్కడనుండి వచ్చితివని యడి
గెను. అందుకు వాడు—ఇశ్రాయేలీయుల సైన్యము
లోనుండి నేను తప్పించుకొని వచ్చితిననెను. | — జరి
గిన సంగతులేవో నాతో చెప్పుమని దావీదు సెల
వియ్యగా వాడు—జనులు యుద్ధమందు నిలువలేక పారి
పోయిరి. అనేకులు పడి చచ్చిరి, సౌలును అతని
కుమారుడైన యోనాతానును మరణమైరి అనెను. |—
సౌలును అతని కుమారుడైన యోనాతానును మరణ
మైరని నీకేలాగు తెలిసినదో నాకు వివరముగా తెలియ
జేయుమని దావీదు వాని నడుగగా వాడిట్లనెను | —
గిల్బోవ పర్వతమునకు నేను అకస్మాత్తుగా వచ్చినప్పుడు
సౌలు తన యీటెమీద ఆనుకొని యుండెను. అతడు
రథములును రౌతులును తనను వెనువెంట తగులుచుం
డుట చూచి వెనుక తిరిగి నన్ను కనుగొని పిలిచెను.
అందుకు—చిత్తము నా యేలినవాడా అని నేనంటిని. |
—నీవెవడవని అతడు నన్నడుగగా—నేను అమాలేకీ
యుడనని చెప్పితిని. అతడు—నా ప్రాణము ఇంక
నాలో ఉన్నదిగాని తల త్రిప్పుచేత నేను బహు
బాధపడుచున్నాను; నీవు నా దగ్గర నిలువబడి నన్ను
చంపుమని సెలవియ్యగా, ఈలాగు పడినతరువాత
అతడు బ్రదుకడని నేను నిశ్చయించుకొని అతనిదగ్గర
నిలిచి అతని చంపితిని; తరువాత అతని తలమీదనున్న
కిరీటమును హస్తకంకణములను తీసికొని నా యేలిన
వాడవైన నీయొద్దకు వాటిని తెచ్చియున్నాను అనెను. |
దావీదు ఆ వార్త విని తన వస్త్రములు చింపుకొనెను.
అతనియొద్దనున్న వారందరును ఆలాగున చేసి |
సౌలును యోనాతానును యెహోవా జనులును ఇశ్రా
యేలు ఇంటివారును యుద్ధములో కూలిరని వారిని
గూర్చి దుఃఖపడుచు ఏడ్చుచు సాయంత్రమువరకు
ఉపవాసముండిరి. | తరువాత దావీదు — నీవెక్కడ
నుండి వచ్చితివని ఆ వార్త తెచ్చినవాని నడుగగా
వాడు—నేను ఇశ్రాయేలు దేశమున నివసించు అమా
లేకీయుడగు ఒకని కుమారుడననెను. | అందుకు దావీదు 14
—భయపడక యెహోవా అభిషేకించినవానిని చంపు 16
టకు నీవేల అతనిమీద చెయ్యి ఎత్తితివి? యెహోవా
అభిషేకించినవానిని నేను చంపితినని నీవు చెప్పితివే;
నీ నోటి మాటయే నీమీద సాక్ష్యము గనుక నీ
ప్రాణమునకు నీవే ఉత్తరవాదివని వానితో చెప్పి తన
వారిలో ఒకని పిలిచి—నీవు పోయి వాని చంపుమనగా
అతడు వాని కొట్టి చంపెను.
యూదావారికి అభ్యాసము చేయవలెనని దావీదు 17
సౌలునుగూర్చియు అతని కుమారుడైన యోనాతానును 18
గూర్చియు ధనుర్గీతమొకటి చేసి దానిబట్టి విలాపము
సలిపెను. అది యాషాను గ్రంథమందు లిఖింపబడి
యున్నది. ఎట్లనగా—

ఇశ్రాయేలూ, నీకు భూషణమగువారు 19
నీ ఉన్నత స్థలములమీద హతులైరి
అహహా బలాఢ్యులు పడిపోయిరి.
ఫిలిష్తీయుల కుమార్తెలు సంతోషింపకుండునట్లు 20
సున్నతిలేనివారి కుమార్తెలు జయమని చెప్పకుండు
నట్లు
ఈ సమాచారము గాతులో తెలియజేయకుడి
అష్కెలోను వీధులలో ప్రకటన చేయకుడి.
గిల్బోవ పర్వతములారా 21
నిష్ప్రయోజనములని బలాఢ్యులు మీమీద అవ
మానమొందిరి
వారు బల్లెములను పారవేసిరి.
తైలముచేత అభిషేకింపబడని వానిదైనట్టు
సౌలు బల్లెమును పారవేయబడెను.
మీమీద మంచైనను వర్షమైనను
ప్రథమ ఫలార్పణకు తగిన పైరుగల చేలైనను
లేకపోవును గాక.
హతుల రక్తము ఒలికింపకుండ 22
బలాఢ్యుల క్రొవ్వును పట్టకుండ
యోనాతాను విల్లు వెనుకతియ్యలేదు
ఎవరిని హతముచేయకుండ సౌలు కత్తి వెనుక తీసి
నదికాదు.
సౌలును యోనాతానును తమ బ్రదుకునందు సర 23
సులుగాను సెనరుగల వారుగాను ఉండిరి
తమ మరణమందైనను వారు ఒకరినొకరు ఎడ
బాసినవారు కారు

వారు పక్షి రాజులకంటె వడిగలవారు
సింహములకంటె బలముగలవారు.
24 ఇశ్రాయేలీయుల కుమార్తెలారా, సౌలునుగూర్చి
యేడ్వుడి
అతడు మీకు ఇంపైన రక్తవర్ణపు వస్త్రములు ధరింప
జేసినవాడు
బంగారు నగలు మీకు పెట్టినవాడు.
25 యుద్ధరంగమునందు బలాఢ్యులు పడియున్నారు
నీ ఉన్నతస్థలములలో యోనాతాను హత
మాయెను.
26 నా సహోదరుడా యోనాతానా
నీవు నాకు అతిమనోహరుడవై యుంటివి
నీ నిమిత్తము నేను బహు శోకము నొందుచు
న్నాను
నాయందు నీకున్న ప్రేమ బహు వింతైనది
స్త్రీలు చూపు ప్రేమకంటెను అది అధికమైనది.
27 అయ్యయ్యో బలాఢ్యులు పడిపోయిరి
యుద్ధసన్నద్ధులు నశించిపోయిరి.

2 ఇది జరిగిన తరువాత—యూదా పట్టణములలోకి
నేను పోవుదునా అని దావీదు యెహోవాయొద్ద
విచారణచేయగా—పోవచ్చునని యెహోవా అతనికి
సెలవిచ్చెను. — నేను పోవలసిన స్థలమేదని దావీదు
మనవి చేయగా— హెబ్రోనునకు పొమ్మని ఆయన సెల
2 విచ్చెను. । కాబట్టి యెజ్రెయేలీయురాలగు అహీనో
యము, కర్మెలీయుడగు నాబాలుకు భార్యయైన అబీగ
యీలు అను తన యిద్దరు భార్యలను వెంటబెట్టుకొని
3 దావీదు అక్కడికి పోయెను. । మరియు దావీదు తన
యొద్దనున్న వారినందరిని వారి వారి యింటివారిని
తోడుకొని వచ్చెను; వీరు హెబ్రోను గ్రామములలో
4 కాపురముండిరి. । అంతట యూదావారు అక్కడికి
వచ్చి యూదావారిమీద రాజునిగా దావీదుకు పట్టాభి
షేకము చేసిరి.
5 సౌలును పాతిపెట్టినవారు యాబేష్గిలాదువారని
దావీదు తెలిసికొని యాబేష్గిలాదువారియొద్దకు దూత
లను పంపి — మీరు ఉపకారము చూపి మీ యేలిన
వాడైన సౌలును పాతిపెట్టితిరి గనుక యెహోవా
చేత మీరు ఆశీర్వచనము నొందుదురు గాక. ।
6 యెహోవా మీకు కృపను సత్యస్వభావమును అగ
పరచును, నేనును మీరు చేసిన యీ క్రియనుబట్టి
7 మీకు ప్రత్యుపకారము చేసెదను. । మీ యజమాను
డగు సౌలు మృతినొందెను గాని యూదావారు నాకు
తమమీద రాజుగా పట్టాభిషేకము చేసియున్నారు
* మీరు ధైర్యము తెచ్చుకొని బలాఢ్యులై యుం
డుడని చెప్పెను.
కుమారుడగు అబ్నేరు అను సౌలుయొక్క
సౌలు కుమారుడగు ఇష్బోషెతును మహ

నయీమునకు తోడుకొని పోయి, గిలాదువారిమీదను
ఆషేరీయులమీదను యెజ్రెయేలుమీదను ఎఫ్రాయి
మీయులమీదను బెన్యామీనీయులమీదను ఇశ్రా
యేలువారిమీదను రాజుగా అతనికి పట్టాభిషేకము
చేసెను. సౌలు కుమారుడగు ఇష్బోషెతు నలుబదేండ్ల
వాడై యేలనారంభించి రెండు సంవత్సరములు పరిపా
లించెను; అయితే యూదావారు దావీదు పక్షమున
నుండిరి. । దావీదు హెబ్రోనులో యూదావారిమీద 11
ఏలినకాలమంతయు ఏడు సంవత్సరములు ఆరు మాస
ములు.

అంతలో నేరు కుమారుడగు అబ్నేరును సౌలు 12
కుమారుడగు ఇష్బోషెతు సేవకులును మహనయీము
లోనుండి బయలుదేరి గిబియోనునకు రాగా । సెరూయా 13
కుమారుడగు యోవాబును దావీదు సేవకులును బయలు
దేరి వారిని కలిసికొనుటకై గిబియోను కొలనునకు వచ్చిరి.
వీరు కొలనుకు ఈ తట్టునను వారు కొలనునకు ఆ తట్టు
నను దిగియుండగా । అబ్నేరు లేచి — మన యెదుట 14
యౌవనస్థులు మల్లచేష్టలు చేయుదురు" అని యోవా
బుతో అనగా యోవాబు—వారు చేయవచ్చునని సెలవిచ్చెను. ।
లెక్కకు సరిగా సౌలు కుమారుడగు ఇష్బోషెతు సంబం 15
ధులైన పన్నిద్దరుమంది బెన్యామీనీయులును దావీదు
సేవకులలో పన్నిద్దరుమందియును లేచి ముందర నిలి
చిరి. । ఒక్కొక్కడు తనయెదుటనున్నవాని తల పట్టు 16
కొని వాని ప్రక్కను కత్తి పొడవగా అందరు కూటా
లున పడిరి. అందువలన హెల్కత్‌హస్సూరీమని ఆ స్థల
మునకు పేరు పెట్టబడెను. అది గిబియోనునకు సమీ
పము. । తరువాత ఆ దినమున ఘోరయుద్ధము జరు 17
గగా అబ్నేరును ఇశ్రాయేలువారును దావీదు సేవకుల
యెదుట నిలువలేక పారిపోయిరి. । సెరూయా ముగ్గురు 18
కుమారులగు యోవాబును అబీషైయును అశాహే
లును అచ్చట నుండిరి. అశాహేలు అడవిలేడియంత
తేలికగా పరుగెత్తగలవాడు గనుక । అతడు కుడితట్టై 19
యినను ఎడమతట్టయినను తిరుగక అబ్నేరును తరుము
చుండగా । అబ్నేరు వెనుకకు తిరిగి — నీవు అశా 20
హేలువా అని అతని నడుగగా అతడు నేను అశా
హేలునే యనెను. । — నీవు కుడికైనను ఎడమకైనను 21
తిరిగి యౌవనస్థులలో ఒకని కలిసికొని వాని ఆయుధ
ములను పట్టుకొమ్ము అని అబ్నేరు అతనితో చెప్పినను,
అశాహేలు ఈ తట్టయినను ఆ తట్టయినను తిరుగక
అతని తరుమగా । అబ్నేరు—నన్ను తరుముట మాని 22
తొలగిపొమ్ము, నేను నిన్ను నేలకు కొట్టి చంపినయెడల
నీ సహోదరుడగు యోవాబును ఎట్లు సంతోష
ముగా కలిసికొందునననెను. । అతడు — నేను తొలుగ 23
ననగా, అబ్నేరు ఈటె మడమతో అతని కడుపులో
పొడిచినందున యీటె అతని వెనుకకు వచ్చెను గనుక
అతడు అచ్చటనే పడి చచ్చెను. అశాహేలు పడి

వచ్చిన స్థలమునకు వచ్చినవారందరు నిలువబడిరి గాని।
24 యోవాబును అబీషైయును అబ్నేరును తరుముచు
గిబియోనను అరణ్యమార్గములోని గీహయెదుటి అమ్మా
యను కొండకు వచ్చిరి; అంతలో సూర్యుడు అస్తమిం
25 చెను. । అబ్నేరు మీదికి ఎవరును రాకుండ బెన్యా
మీనీయులు గుంపుగా కూడుకొని ఒక కొండమీద
26 నిలువగా । అబ్నేరు కేకవేసి—కత్తి చిరకాలము భక్షిం
చునా? అది తుదకు ద్వేషమునకే హేతువగునని నీ
వెరుగుదువు గదా; తమ సహోదరులను తరుమవద్దని
నీ వెంటనున్న జనులకు ఆజ్ఞ ఇయ్యక యుందువని
27 యోవాబుతో అనెను. । అందుకు యోవాబు —
దేవుని జీవముతోడు జగడమునకు నీవు వారిని పిలువక
యుండినయెడల జనులందరు తమ సహోదరులను
తరుముక ఉదయముననే తిరిగి పోయియుందురని
28 చెప్పి । బూర ఊదగా జనులందరు నిలిచి, ఇశ్రా
యేలువారిని తరుముటయు వారితో యుద్ధము చేయు
29 టయు మానిరి. । అబ్నేరును అతనివారును ఆ రాత్రి
అంతయు మైదానముగుండ ప్రయాణము చేసి యొర్దాను
నది దాటి బిత్రోను మార్గమున మహనయీమునకు
30 వచ్చిరి. । యోవాబు అబ్నేరును తరుముట మాని తిరిగి
వచ్చి జనులను సమకూర్చి లెక్కచూడగా దావీదు
సేవకులలో అశాహేలు గాక పందొమ్మండుగురు లేక
31 పోయిరి. । అయితే దావీదు సేవకులు బెన్యామీనీ
యులలోను అబ్నేరు జనులలోను మున్నూరుమందిని
32 హతముచేసిరి. । జనులు అశాహేలును ఎత్తికొనిపోయి
బేత్లెహేములోనున్న అతని తండ్రి సమాధియందు
పాతిపెట్టిరి. తరువాత యోవాబును అతనివారును
రాత్రి అంతయు నడిచి తెల్లవారు సమయమున
హెబ్రోనునకు వచ్చిరి.

3 సౌలు కుటుంబికులకును దావీదు కుటుంబికులకును
బహుకాలము యుద్ధము జరుగగా దావీదు అంతకం
తకు ప్రబలెను; సౌలు కుటుంబము అంతకంతకు నీరస
ిల్లెను.

హెబ్రోనులో దావీదుకు పుట్టిన కుమారులెవ
రనగా, అమ్నోను అను అతని జ్యేష్ఠపుత్రుడు యెజ్రె
యేలీయురాలగు అహీనోయమువలన పుట్టెను. ।
3 కిల్యాబు అను రెండవవాడు కర్మెలీయుడగు నాబాలు
భార్యయైన అబీగయీలువలన పుట్టెను. మూడవ
వాడైన అబ్షాలోము గెషూరురాజగు తల్మయి కుమార్తె
4 యగు మయకావలన పుట్టెను. । నాలుగవవాడగు
అదోనీయా హగ్గీతువలన పుట్టెను. అయిదవవాడగు
5 షెఫట్య అబీటలువలన పుట్టెను. । ఆరవవాడగు ఇత్రె
యాము దావీదుకు భార్యయగు ఎగ్లావలన పుట్టెను.
వీరు హెబ్రోనులో దావీదుకు పుట్టిన కుమారులు.

6 సౌలు కుటుంబికులకును దావీదు కుటుంబికులకును
యుద్ధము జరుగుచుండగా అబ్నేరు సౌలు కుటుంబికు
లకు బహు సహాయముచేసెను. । అయ్యా కుమార్తె 7
యైన రిస్పాయను ఒక ఉపపత్ని సౌలునకుండెను—నా
తండ్రికి ఉపపత్నియగు దానిని నీవెందుకు కూడితి
వని ఇష్బోషెతు అబ్నేరును అడుగగా । అబ్నేరు 8
ఇష్బోషెతు అడిగిన మాటకు బహుగా కోపగించు
కొని—నిన్ను దావీదు చేతికప్పగింపక నీ తండ్రియైన
సౌలు ఇంటివారికిని అతని సహోదరులకును అతని
స్నేహితులకును ఈవేళ ఉపకారము చేసిన నన్ను
యూదావారికి చేరిన కుక్కతో సమానునిగా చేసి
యీ దినమున ఒక స్త్రీనిబట్టి నామీద నేరము మోపు
దువా? । యెహోవా దావీదుకు ప్రమాణము చేసిన 9
దానిని అతనిపక్షమున నేను నెరవేర్చనియెడల ।
దేవుడు నాకు గొప్ప అపాయము కలుగజేయుగాక; 10
సౌలు ఇంటివారి వశము కాకుండ రాజ్యమును తప్పించి
దాను మొదలుకొని బెయేర్షెబావరకు దావీదు సింహా
సనమును ఇశ్రాయేలువారిమీదను యూదావారిమీ
దను నేను స్థిరపరచెదననెను. । కావున ఇష్బోషెతు 11
అబ్నేరుకు భయపడి యిక ఏ మాటయు పలుకలేక
పోయెను.

అబ్నేరు తన తరపున దావీదునొద్దకు దూతలను 12
పంపి—ఈ దేశము ఎవరిది? నీవు నాతో నిబంధన
చేసినయెడల నేను నీకు సహాయము చేసి, ఇశ్రాయేలు
వారినందరిని నీతట్టు త్రిప్పెదనని వర్తమానము పంపగా
దావీదు—మంచిది; నేను నీతో నిబంధన చేసెదను. ।
అయితే నీవు ఒకపని చేయవలెను; నా దర్శనమునకు 13
వచ్చునప్పుడు సౌలు కుమార్తెయగు మీకాలును నా
యొద్దకు తోడుకొని రావలెను; లేదా నీకు దర్శనము
దొరకదనెను. । మరియు దావీదు సౌలు కుమారుడగు 14
ఇష్బోషెతునొద్దకు దూతలను పంపి—ఫిలిష్తీయులలో
నూరుమంది ముందోళ్లను తెచ్చి నేను పెండ్లిచేసికొనిన
మీకాలును నాకప్పగింపుమని చెప్పుడనగా । ఇష్బో 15
షెతు దూతను పంపి, లాయీషు కుమారుడగు పల్తీ
యేలు అను దాని పెనిమిటియొద్దనుండి మీకాలును
పిలువనంపెను. । దాని పెనిమిటి బహూరీమువరకు 16
దాని వెనుక ఏడ్చుచు రాగా అబ్నేరు — నీవు తిరిగి
పొమ్మనెను గనుక అతడు వెళ్లిపోయెను.

అంతలో అబ్నేరు ఇశ్రాయేలు వారి పెద్దలను 17
పిలిపించి—దావీదు మిమ్మును ఏలవలెనని మీరు ఇంతకు
మునుపు కోరితిరి గదా! । — నా సేవకుడైన దావీదు 18
చేత నా జనులగు ఇశ్రాయేలీయులను ఫిలిష్తీయుల
చేతిలోనుండియు, వారి శత్రువులందరి చేతిలోనుం
డియు విమోచించెదనని యెహోవా దావీదునుగూర్చి
సెలవిచ్చియున్నాడు గనుక మీ కోరిక నెరవేర్చుకొను
డని వారితో చెప్పెను. । మరియు అబ్నేరు బెన్యా 19
మీనీయులతో ఆలాగున మాటలాడిన తరువాత
హెబ్రోనునకు వచ్చి ఇశ్రాయేలువారి దృష్టికిని బెన్యా

బెన్యామీనీయులందరి దృష్టికిని ప్రయోజనమైనదానిని దావీ
20 దునకు పూర్తిగా తెలియజేసెను. అందునిమిత్తమై అబ్నేరు
ఇరువదిమందిని వెంటబెట్టుకొని హెబ్రోనులోనున్న
దావీదునొద్దకు రాగా దావీదు అబ్నేరునకును అతని
21 వారికిని విందు చేయించెను. అంతట అబ్నేరు—
నేను పోయి ఇశ్రాయేలువారినందరిని నా యేలినవాడ
వగు నీ పక్షమున సమకూర్చి, వారు నీతో నిబంధన
చేయునట్లును, నీ చిత్తానుసారముగా నీవు రాజరికము
వహించి కోరినదాని అంతటిమీద ఏలునట్లును చేయు
దునని దావీదుతో చెప్పి దావీదునొద్ద సెలవుపుచ్చు
22 కొని సమాధానముగా వెళ్లిపోయెను. పిమ్మట దావీదు
సేవకులును యోవాబును బందిపోటునుండి బహు
విస్తారమైన దోపుడుసొమ్ము తీసికొనిరాగా అబ్నేరు
హెబ్రోనులో దావీదునొద్ద లేకపోయెను, దావీదు
అతనికి సెలవిచ్చియున్నందున అతడు సమాధానముగా
23 వెళ్లిపోయి యుండెను. అయితే యోవాబును అతని
యొద్దనున్న సైన్యమును వచ్చినప్పుడు నేరు కుమారు
డగు అబ్నేరు రాజునొద్దకు వచ్చెననియు, రాజు అతనికి
సెలవిచ్చి పంపెననియు, అతడు సమాధానముగా వెళ్లి
24 పోయెననియు తెలిసికొని యోవాబు రాజునొద్దకు
వచ్చి—చిత్తగించుము, నీవు ఏమిచేసితివి? అబ్నేరు నీ
యొద్దకు వచ్చినప్పుడు నీవెందుకు అతనికి సెలవిచ్చి
25 పంపివేసితివి? నేరు కుమారుడగు అబ్నేరును నీ వెరు
గవా? నిన్ను మోసపుచ్చి నీ రాకపోకలన్నిటిని నీవు
చేయు సమస్తమును తెలిసికొనుటకై అతడు వచ్చెనని
26 చెప్పి దావీదునొద్దనుండి బయలు వెడలి అబ్నేరును
పిలువనంపుటకై దూతలను పంపెను. వారు పోయి సిరా
యను బావిదగ్గరనుండి అతని తోడుకొని వచ్చిరి;
అతడు వచ్చిన సంగతి దావీదునకు తెలియక యుం
27 డెను. అబ్నేరు తిరిగి హెబ్రోనునకు వచ్చినప్పుడు—
సంగతి యొకరికిని వినబడకుండ గుమ్మము నడుమ ఏకాం
తముగా అతనితో మాటలాడవలెనని యోవాబు అతని
పిలిచి, తన సహోదరుడగు అశాహేలు ప్రాణము
తీసినందుకై అతనిని కడుపులో పొడువగా అతడు
28 చచ్చెను. ఆ తరువాత ఈ సమాచారము దావీదునకు
వినబడినప్పుడు అతడు అనుకొనిన దేమనగా—నేనును
నా రాజ్యమును నేరు కుమారుడగు అబ్నేరు ప్రాణము
తీయుట విషయములో యెహోవా సన్నిధిని ఎప్పటి
29 కిని నిరపరాధులమే. ఈ దోషము యోవాబుమీ
దను అతని తండ్రికి పుట్టిన వారందరిమీదను మోప
బడునుగాక. యోవాబు ఇంటివారిలో స్రావముగల
వాడైనను కుష్ఠరోగియైనను కర్రపట్టుకొని నడుచు
వాడైనను ఖడ్గముచేత కూలువాడైనను ఆహారము లేని
30 వాడైనను ఉండకపోడుగాక అనెను. ఆలాగున
యోవాబును అతని సహోదరుడైన అబీషైయును,
అబ్నేరు గిబియోను యుద్ధమందు తమ సహోదరు
డైన అశాహేలును చంపిన దానినిబట్టి అతని చంపిరి.
దావీదు—మీ బట్టలు చింపుకొని గోనెపట్ట కట్టు 31
కొని అబ్నేరు శవమునకు ముందు నడుచుచు ప్రలా
పము చేయుడని యోవాబునకును అతనితో నున్నవారి
కందరికిని ఆజ్ఞ ఇచ్చెను. రాజును స్వయముగా పాడె 32
వెంట నడిచెను. వారు అబ్నేరును హెబ్రోనులో
పాతిపెట్టగా రాజు అబ్నేరు సమాధిదగ్గర ఎలుగెత్తి
యేడ్చెను, జనులందరును ఏడ్చిరి. మరియు రాజు 33
అబ్నేరునుగూర్చి శోకకీర్తన యొకటి కట్టెను. ఎట్ల
నగా

అబ్నేరూ 34
నీచుడొకడు చచ్చునట్లుగా నీవు చచ్చితివే
నీ చేతులకు కట్లు లేకపోయెను
నీ కాళ్లకు సంకెళ్లు వేయబడకపోయెను
దోషకారి యెదుట ఒకడు పడునట్లు నీవు పడితివే

రాజు ఈలాగున కీర్తన యెత్తి పాడగా జనులందరును తిరిగి
మరి యెక్కువగా ఏడ్చిరి. ఇంక వెలుగుండగా దావీదు 35
జనులు దావీదునొద్దకు వచ్చి భోజనము చేయుమని
అతని బతిమాలగా దావీదు ప్రమాణము చేసి—
సూర్యుడు అస్తమించకమునుపు ఆహారమేమైనను నేను
రుచిచూచినయెడల దేవుడు నాకు గొప్ప అపా
యము కలుగజేయునుగాక అనెను. జనులందరును ఆ సంగతి 36
గ్రహించినప్పుడు సంతోషించిరి; రాజు చేసినది యంత
తయు జనులందరి దృష్టికి అనుకూలమైనట్లు అదియును
వారి దృష్టికి అనుకూలమాయెను. నేరు కుమారుడైన 37
అబ్నేరును చంపుట రాజు ప్రేరేపణవలన కాలేదని
ఆ దినమున ఇశ్రాయేలువారికందరికి తెలియబడెను.
పిమ్మట రాజు తన సేవకులను పిలిచి వారితో ఈలాగు 38
సెలవిచ్చెను—నేటిదినమున పడిపోయినవాడు ఇశ్రా
యేలువారిలో ప్రధానుడనియు పెద్దలలో ఒకడనియు
మీకు తెలిసేయున్నది. పట్టాభిషేకము నొందినవాడ 39
నైనను నేడు నేను బలహీనుడనైతిని. సెరూయా
కుమారులైన యీ మనుష్యులు నాకంటె బలముగల
వారు; అతడు జరిగించిన దుష్క్రియనుబట్టి యెహోవా
కీడుచేసినవానికి ప్రతికీడు చేయునుగాక.

హెబ్రోనులో అబ్నేరు చనిపోయెనను సంగతి 4
సౌలు కుమారుడు విని అధైర్యపడెను, ఇశ్రాయేలు
వారికందరికి ఏమియు తోచకయుండెను. అయితే 2
సౌలు కుమారునికి సైన్యాధిపతులుండిరి; వారిలో ఒకని
పేరు బయనా, రెండవవాని పేరు రేకాబు; వీరు బెన్యా
మీనీయులకు చేరిన బెయేరోతీయుడగు రిమ్మోను
కుమారులు. బెయేరోతు కూడను బెన్యామీనీయుల
దేశములో చేరినదని యెంచబడెను. అయితే బెయే 3
రోతీయులు గిత్తయీముకు పారిపోయి నేటివరకు
అక్కడి కాపురస్థులై యున్నారు.

4 సౌలు కుమారుడగు యోనాతానునకు కుంటివాడగు
కుమారుడు ఒకడుండెను. యెజ్రెయేలునుండి సౌలును
గురించియు యోనాతానును గురించియు వర్తమానము
వచ్చినప్పుడు వాడు అయిదేండ్లవాడు; వాని దాది
వానిని ఎత్తికొని పరుగు పరుగున పారిపోగా వాడు
పడి కుంటివాడాయెను. వాని పేరు మెఫీబోషెతు.
5 రిమ్మోను కుమారులగు రేకాబును బయనాయును
మంచి యెండవేళ బయలుదేరి మధ్యాహ్నకాలమున
ఇష్బోషెతు మంచముమీద పండుకొనియుండగా అతని
6-8 యింటికి వచ్చిరి. । — గోధుమలు తెచ్చెదమని వేషము
వేసికొని వారు ఇంటిలో చొచ్చి, ఇష్బోషెతు పడక
టింట మంచముమీద పరుండియుండగా అతనిని కడు
పులో పొడిచి తప్పించుకొని పోయిరి. వారతని
పొడిచి చంపి అతని తలను ఛేదించి దాని తీసికొని
రాత్రి అంతయు మైదానములో బడి ప్రయాణమై
పోయి హెబ్రోనులోనున్న దావీదునొద్దకు ఇష్బో
షెతు తలను తీసికొనివచ్చి — చిత్తగించుము; నీ ప్రాణము
తీయచూచిన సౌలుకుమారుడైన ఇష్బోషెతు తలను
మేము తెచ్చియున్నాము; ఈ దినమున యెహోవా
మా యేలినవాడవును రాజవునగు నీ పక్షమున సౌలు
కును అతని సంతతికిని ప్రతికారము చేసియున్నాడని
9 చెప్పగా । దావీదు బెయేరోతీయుడగు రిమ్మోను కుమా
రులైన రేకాబుతోను బయనాతోను ఇట్లనెను । —
10 మంచి వర్తమానము తెచ్చితినని తలంచి యొకడు వచ్చి
11 సౌలు చచ్చెనని నాకు తెలియజెప్పగా । వాడు తెచ్చిన
వర్తమానమునకు బహుమానముగా సిక్లగులో నేను
వాని పట్టుకొని చంపించితిని. కావున దుర్మార్గులైన
మీరు ఇష్బోషెతు ఇంటిలో చొరబడి, అతని మం
చముమీదనే నిర్దోషియగువానిని చంపినప్పుడు మీచేత
అతని ప్రాణదోషము విచారింపకపోవుదునా? లోక
ములో ఉండకుండ నేను మిమ్మును తీసివేయక మాను
12 దునా? । సకలమైన ఉపద్రవములలోనుండి నన్ను
రక్షించిన యెహోవా జీవముతోడు మాననని చెప్పి,
దావీదు తన వారికి ఆజ్ఞ ఇయ్యగా వారు ఆ మనుష్యు
లను చంపి వారి చేతులను కాళ్లను నరికి వారి శవము
లను హెబ్రోను కొలనుదగ్గర వ్రేలాడగట్టిరి. తరువాత
వారు ఇష్బోషెతు తలను తీసికొని పోయి హెబ్రో
నులో అబ్నేరు సమాధిలో పాతిపెట్టిరి.

5 ఇశ్రాయేలువారి సకలగోత్రములవారు హెబ్రో
నులో దావీదునొద్దకు వచ్చి — చిత్తగించుము; మేము
2 నీ రక్తసంబంధులము; । పూర్వకాలమున సౌలు మా
మీద రాజై యుండగా నీవు విచారణకర్తగా ఉంటివి.
అయితే ఇప్పుడు — నీవు ఇశ్రాయేలీయులనునట్టి నా
జనులను పాలించి వారిమీద అధిపతివై యుందువని
యెహోవా నిన్నుగురించి సెలవిచ్చియున్నాడని
3 చెప్పిరి. । మరియు ఇశ్రాయేలువారి పెద్దలందరు
హెబ్రోనులో రాజునొద్దకు రాగా రాజైన దావీదు
హెబ్రోనులో యెహోవా సన్నిధిని వారితో నిబం
ధన చేసెను గనుక ఇశ్రాయేలువారిమీద రాజగుటకై
వారు దావీదునకు పట్టాభిషేకము చేసిరి.

దావీదు ముప్పది యేండ్లవాడై యేల నారంభించి 4
నలువది సంవత్సరములు పరిపాలనచేసెను. । హెబ్రో 5
నులో అతడు యూదావారందరిమీద ఏడు సంవ
త్సరములు ఆరు మాసములు, యెరూషలేములో
ఇశ్రాయేలు యూదాలవారందరిమీద ముప్పది
మూడు సంవత్సరములు పరిపాలన చేసెను. । యెబూ 6-7
సీయులు దేశములో నివాసులై యుండగా రాజును
అతని పక్షమువారును యెరూషలేమునకు వచ్చిరి.
యెబూసీయులు దావీదు లోపలికి రాలేడని తలంచి
— నీవు వచ్చినయెడల ఇచ్చటి గుడ్డివారును కుంటివారును
నిన్ను తోలివేతురని దావీదునకు వర్తమానము పంపియుం
డిరి గనుక దావీదుపురమనబడిన సీయోను కోటను దా
వీదు స్వాధీనపరచుకొనిన దినమున అతడు । — గుడ్డివారు 8
గాను కుంటివారుగాను ఉన్న యెబూసీయులు దావీ
దునకు హేయులు; యెబూసీయులను హతముచేయు
వారందరును అట్టివారిని నీటికాలువపైనుండి పడవేయ
వలెనని సెలవిచ్చెను. అందునుబట్టి గుడ్డివారును కుంటి
వారును ఉన్నారు; అతడు ఇంటిలోనికి రాలేడను
సామెత పుట్టెను. । దావీదు ఆ కోటలో కాపుర 9
ముండి దానికి దావీదుపురమను పేరు పెట్టెను.
మరియు మిల్లోనుండి దిగువకు దావీదు ఒక ప్రాకార
మును కట్టించెను. । దావీదు అంతకంతకు వర్ధిల్లెను. 10
సైన్యములకధిపతియగు యెహోవా అతనికి తోడుగా
ఉండెను.

తూరురాజగు హీరాము, దూతలను దేవదారు 11
మ్రానులను వడ్రంగులను కాసెపనివారిని పంపగా
వారు దావీదునకు ఒక నగరిని కట్టిరి. । ఇశ్రాయే 12
లీయులమీద యెహోవా తన్ను రాజుగా స్థిరపరచె
ననియు, ఇశ్రాయేలీయులనునట్టి ఆయన జనుల నిమి
త్తము రాజ్యము ప్రబలము చేయుననియు దావీదు
గ్రహించెను.

దావీదు హెబ్రోనునుండి వచ్చిన తరువాత 13
యెరూషలేములోనుండి యింక అనేకమైన ఉప
పత్నులను భార్యలను చేసికొనగా దావీదునకు ఇంకను
పెక్కుమంది కుమారులును కుమార్తెలును పుట్టిరి ।
యెరూషలేములో అతనికి పుట్టినవారెవరనగా షమ్మూ 14-16
యషోబాబు నాతాను సొలొమోను ఇభారు ఏలీషూవ
నెపెగు యాఫీయ ఎలీషామా ఎల్యాదా ఎలీపేలెటు
అనువారు.

జనులు ఇశ్రాయేలీయులమీద రాజుగా దావీదునకు 17
పట్టాభిషేకము చేసిరని ఫిలిష్తీయులకు వినబడినప్పుడు
దావీదును పట్టుకొనుటకై ఫిలిష్తీయులందరు వచ్చిరి.

దావీదు ఆ వార్త విని ప్రాకారస్థలమునకు వెళ్లి
18 పోయెను. । ఫిలిష్తీయులు వచ్చి రెఫాయీము
19 లోయలో వ్యాపించగా । దావీదు—నేను ఫిలిష్తీయుల
మీదికి పోగా నీవు వారిని నాచేతికప్పగిం
తువా అని యెహోవాయొద్ద విచారించినప్పుడు
—పొమ్ము, నిస్సందేహముగా వారిని నీ చేతికప్పగిం
20 తునని యెహోవా సెలవిచ్చెను. । కాబట్టి దావీదు
బయల్పెరాజీమునకు వచ్చి—అక్కడ వారిని హతముచేసి,
నీళ్లు కొట్టుకొనిపోవునట్లు యెహోవా
నా శత్రువులను నా యెదుట నిలువకుండ నాశము
చేసెనని చెప్పి ఆ స్థలమునకు బయల్పెరాజీమను పేరు
21 పెట్టెను. । ఫిలిష్తీయులు తమ బొమ్మలను అచ్చట
విడిచిపెట్టి పారిపోగా దావీదును అతని వారును
వాటిని పట్టుకొనిరి.

22 ఫిలిష్తీయులు మరల వచ్చి రెఫాయీము లోయలో
23 వ్యాపించగా । దావీదు యెహోవాయొద్ద విచారణ
24 చేసెను. అందుకు యెహోవా—నీవు కంబళి చెట్ల
ప్రక్కనుండి వారి వెనుకగా వెళ్లక చుట్టు తిరిగి
పోయి వారిమీద పడవలెను. కంబళిచెట్ల కొనలను
చప్పుడు వినగానే ఫిలిష్తీయులను హతముచేయుటకై
యెహోవా బయలుదేరుచున్నాడు గనుక అప్పుడే
నీవు త్వరగా బయలుదేరవలెనని సెలవిచ్చెను. ।
25 దావీదు యెహోవా తనకాజ్ఞాపించిన ప్రకారము
చేసి, గెబనుండి గెజెరువరకు ఫిలిష్తీయులను తరుముచు
హతముచేసెను.

6 తరువాత దావీదు ఇశ్రాయేలీయులలో ముప్పది
2 వేలమంది శూరులను సమకూర్చుకొని బయలుదేరి,
కెరూబుల మధ్య నివసించు సైన్యములకధిపతియగు
యెహోవా అను తన నామమును బయలుపరచు
దేవుని మందసమును అక్కడనుండి తీసికొని వచ్చు
టకై తనయొద్దనున్న వారందరితోకూడ బాలా
3 యెహూదాలోనుండి ప్రయాణమాయెను. । వారు
దేవుని మందసమును క్రొత్త బండిమీద ఎక్కించి
గిబియాలోనున్న అబీనాదాబుయొక్క యింటిలో
నుండి తీసికొని రాగా అబీనాదాబు కుమారులగు ఉజ్జా
యును అహ్యోయును ఆ క్రొత్త బండిని తోలిరి. ।
4 దేవుని మందసముగల ఆ బండిని గిబియాలోని అబీ
నాదాబు ఇంటనుండి తీసికొనిరాగా అహ్యో దాని
5 ముందర నడచెను. । దావీదును ఇశ్రాయేలీయులంద
రును సరళవృక్షపు కఱ్ఱతో చేయబడిన నానావిధ
ములైన వీణాదులను స్వరమండలములను తంబురలను
మృదంగములను పెద్ద తాళములను వాయించుచు
6 యెహోవా సన్నిధిని నాట్యమాడుచుండిరి. । వారు
నాకోను కళ్లము దగ్గరకు వచ్చినప్పుడు ఎడ్లకు కాలు
జారినందున ఉజ్జా చేయి చాపి దేవుని మందసమును
7 పట్టుకొనగా । యెహోవా కోపము ఉజ్జామీద
రగులుకొనెను. అతడు చేసిన తప్పునుబట్టి దేవుడు ఆ
క్షణమందే అతని మొత్తగా అతడు అక్కడనే దేవుని
మందసమునొద్ద పడి చనిపోయెను. । యెహోవా 8
ఉజ్జాను ప్రాణోపద్రవము కలుగజేయగా దావీదు
చూచి ఆ స్థలమునకు పెరెజ్ ఉజ్జా అను పేరు
పెట్టెను. । నేటికిని దానికి అదేపేరు. ఆ దినమున— 9
యెహోవా మందసము నాయొద్దకు ఏలాగునందునను
కొని, దావీదు యెహోవాకు భయపడి । యెహోవా 10
మందసమును దావీదు పురములోనికి తనయొద్దకు
తెప్పింపనొల్లక గిత్తీయుడగు ఓబేదెదోము ఇంటివారికి
తీసికొని అచ్చట ఉంచెను. । యెహోవా మంద 11
సము మూడు నెలలు గిత్తీయుడగు ఓబేదెదోము
ఇంటిలో ఉండగా యెహోవా ఓబేదెదోమును అతని
ఇంటివారినందరిని ఆశీర్వదించెను. । దేవుని మందసము 12
ఉండుటవలన యెహోవా ఓబేదెదోము ఇంటివారిని
అతనికి కలిగినదాని నంతటిని ఆశీర్వదించుచున్నాడను
సంగతి దావీదునకు వినబడగా, దావీదు పోయి దేవుని
మందసమును ఓబేదెదోము ఇంటిలోనుండి దావీదు
పురమునకు ఉత్సవముతో తీసికొని వచ్చెను. । ఎట్లు 13
నగా యెహోవా మందసమును మోయువారు 14
ఆరేసి యడుగులు సాగగా ఎద్దు ఒకటియు క్రొవ్విన
దూడ ఒకటియు వధింపబడెను, దావీదు నారతో
చేయబడిన ఏఫోదును ధరించినవాడై బహు సంతోష
ముగా యెహోవా సన్నిధిని నాట్యమాడుచుండెను. ।
ఈలాగున దావీదును ఇశ్రాయేలీయులందరును ఆర్భా 15
టముతోను బాకానాదములతోను యెహోవా
మందసమును తీసికొని వచ్చిరి. । యెహోవా మంద 16
సము దావీదుపురమునకు రాగా, సౌలు కుమార్తెయగు
మీకాలు కిటికీలోనుండి చూచి, యెహోవా సన్ని
ధిని గంతులు వేయుచు నాట్యమాడుచు నున్న దావీ
దును కనుగొని, తన మనస్సులో అతని హీనపరచెను. ।
వారు యెహోవా మందసమును తీసికొని వచ్చి 17
గుడారము మధ్యను దావీదు దానికొరకు ఏర్పరచిన
స్థలమునందుంచగా, దావీదు దహనబలులను సమాధాన
బలులను యెహోవా సన్నిధిని అర్పించెను. । దహన 18
బలులను సమాధానబలులను అర్పించుట చాలించిన 19
తరువాత సైన్యములకధిపతియగు యెహోవా నామ
మున దావీదు జనులను ఆశీర్వదించి, సమూహముగా
కూడిన ఇశ్రాయేలీయులగు స్త్రీపురుషులకందరికి
ఒక్కొక రొట్టెయు ఒక్కొక భక్ష్యమును ఒక్కొక
ద్రాక్షపండ్ల అడయు పంచిపెట్టిన తరువాత జను
లందరును తమ తమ యిండ్లకు వెళ్లిపోయిరి.

తన యింటివారిని దీవించుటకు దావీదు తిరిగి 20
రాగా సౌలు కుమార్తెయగు మీకాలు దావీదును
ఎదుర్కొన బయలుదేరి వచ్చి — హీనస్థితి గల పని
కత్తెలు చూచుచుండగా వ్యర్థుడొకడు తన బట్టలను

విప్పివేసినట్టుగా ఇశ్రాయేలీయులకు రాజైన నీవు
నేడు బట్టలను తీసివేసి యెంత ఘనముగా కనబడితి
21 వని అపహాస్యము చేసినందున దావీదు — నీ తండ్రిని
అతని సంతతిని విసర్జించి ఇశ్రాయేలీయులను తన
జనులమీద నన్ను అధిపతిగా నిర్ణయించుటకై నన్ను
ఏర్పరచుకొనిన యెహోవా సన్నిధిని నేనాలాగు
చేసితిని, యెహోవా సన్నిధిని నేను ఆట ఆడితిని.
22 ఇంతకంటె మరి యెక్కువగా నేను తృణీకరింపబడి
నా దృష్టికి నేను అల్పుడనై నీవు చెప్పిన పనికత్తెల
దృష్టికి ఘనుడనగుదునని మీకాలుతో అనెను.
23 అయితే మరణపర్యంతము సౌలు కుమార్తెయగు
మీకాలు పిల్లలను కనకయుండెను.

7 యెహోవా నలుదిక్కుల అతని శత్రువుల
మీద అతనికి విజయమిచ్చి అతనికి నెమ్మది కలుగ
జేసిన తరువాత రాజు తన నగరియందు కాపురముండి
2 నాతానను ప్రవక్తను పిలువనంపి — నేను దేవదారు
మ్రానుతో కట్టబడిన నగరియందు వాసము చేయు
చుండగా దేవుని మందసము డేరాలో నిలిచియున్న
3 దనగా నాతాను — యెహోవా నీకు తోడుగా
నున్నాడు, నీకు తోచినదంతయు నెరవేర్చుమనెను.
4 అయితే ఆ రాత్రి యెహోవా వాక్కు నాతానుకు
5 ప్రత్యక్షమై సెలవిచ్చినదేమనగా — నీవు పోయి
నా సేవకుడగు దావీదుతో ఇట్లనుము — యెహోవా
నీకాజ్ఞ ఇచ్చునదేమనగా — నాకు నివాసముగా ఒక
6 మందిరమును కట్టించుటకు నీవు తగినవాడవా? ఐగు
ప్తులోనుండి నేను ఇశ్రాయేలీయులను రప్పించిన
నాటనుండి నేటివరకు మందిరములో నివసింపక డేరా
లోను గుడారములోను నివసించుచు సంచరించితిని.
7 ఇశ్రాయేలీయులతోకూడ నేను సంచరించిన కాల
మంతయు నా జనులను పోషించుడని నేను ఆజ్ఞాపిం
చిన ఇశ్రాయేలీయుల గోత్రములలో ఎవరితోనైనను
దేవదారుమయమైన మందిరమొకటి మీరు నాకు
కట్టింపకపోతిరే అని నేనెన్నడైనను అనియుంటినా?
8 కాబట్టి నీవు నా సేవకుడగు దావీదుతో ఈలాగు
చెప్పుము—సైన్యములకధిపతియగు యెహోవా నీకు
సెలవిచ్చునదేమనగా—గొఱ్ఱెల కాపులోనున్న నిన్ను
గొఱ్ఱెల దొడ్డిలోనుండి తీసి ఇశ్రాయేలీయులను నా
9 జనులమీద అధిపతిగా నియమించితిని. నీవు పోవు
చోట్లనెల్లను నీకు తోడుగానుండి నీ శత్రువులనంద
రిని నీ యెదుట నిలువకుండ నిర్మూలముచేసి, లోకము
లోని ఘనులైనవారికి కలుగు కీర్తి నీకు కలుగజేసి
10 యున్నాను. మరియు ఇశ్రాయేలీయులను నా
జనులు ఇకను కదిలింపబడకుండ తమ స్వస్థలమందు
నివసించునట్లు దానియందు వారిని నాటి, పూర్వము
ఇశ్రాయేలీయులను నా జనులమీద నేను న్యాయాధి
పతులను నియమించిన తరువాత జరుగుచువచ్చినట్లు
దుర్బుద్ధిగల జనులు ఇకను వారిని కష్టపెట్టక యుండు
నట్లుగా చేసి నీ శత్రువులమీద నీకు జయమిచ్చి 11
నీకు నెమ్మది కలుగజేసి యున్నాను. మరియు
యెహోవానగు నేను నీకు తెలియజేయునదేమ
నగా — నేను నీకు సంతానము కలుగజేయుదును.
నీ దినములు సంపూర్ణములగునప్పుడు నీవు నీ పితరు 12
లతోకూడ నిద్రించిన తరువాత నీ గర్భములోనుండి
వచ్చిన నీ సంతతిని హెచ్చించి, రాజ్యమును అతనికి
స్థిరపరచెదను. అతడు నా నామఘనతకొరకు ఒక 13
మందిరమును కట్టించును; అతని రాజ్యసింహాసనమును
నేను నిత్యముగా స్థిరపరచెదను; నేనతనికి తండ్రినై 14
యుందును. అతడు నాకు కుమారుడై యుండును;
అతడు పాపముచేసినయెడల నరుల దండముతోను
మనుష్యులకు తగులు దెబ్బలతోను అతని శిక్షింతును
గాని నిన్ను స్థాపించుటకై నేను కొట్టివేసిన సౌలునకు 15
నా కృప దూరమైనట్లు అతనికి నా కృప దూరము
చేయను. నీమట్టుకు నీ సంతానమును నీ రాజ్యమును 16
నిత్యము స్థిరమగును, నీ సింహాసనము నిత్యము స్థిర
పరచబడును. తనకు కలిగిన దర్శనమంతటినిబట్టి 17
యీ మాటలన్నిటిచొప్పున నాతాను దావీదుకు వర్త
మానము తెలియజెప్పెను.
దావీదు రాజు లోపల ప్రవేశించి యెహోవా 18
సన్నిధిని కూర్చుండి ఈలాగున మనవి చేసెను — నా
ప్రభువా యెహోవా, ఇంతగా నీవు నన్ను హెచ్చిం
చుటకు నేనెంతటివాడను? నా కుటుంబము ఏపాటిది?
ఇంత హెచ్చుగా చేసినదంతయు నీ దృష్టికి కొంచెమై, 19
మానవుల పద్ధతినిబట్టి, బహుకాలము జరిగిన తరువాత
నీ దాసుడనైన నా సంతానమునకు కలుగబోవుదానిని
గూర్చి నీవు సెలవిచ్చి యున్నావు. యెహోవా
నా ప్రభువా, దావీదు అను నేను ఇక నీతో ఏమి
చెప్పుకొందును? యెహోవా నా ప్రభువా, నీ 20
దాసుడనైన నన్ను నీవు ఎరిగియున్నావు. నీ వాక్కును 21
బట్టి నీ యిష్టానుసారముగా ఈ ఘనకార్యములను జరి
గించి నీ దాసుడనగు నాకు దీని తెలియజేసితివి.
కాబట్టి దేవా యెహోవా, నీవు అత్యంతమైన ఘనత 22
గలవాడవు, నీవంటి దేవుడొకడును లేడు; మేము
వినినదానినంతటిని బట్టి చూడగా నీవు తప్ప దేవు
డెవడును లేడు. నీకు జనులగుటకై వారిని నీవు 23
విమోచించునట్లును, నీకు ఖ్యాతి కలుగునట్లును, నీ
జనులను బట్టి నీ దేశమునకు భీకరమైన మహాకార్య
ములను చేయునట్లును దేవుడవైన నీవు ఐగుప్తుదేశ
ములోనుండియు, ఆ జనుల వశములోనుండియు,
వారి దేవతల వశములోనుండియు నీవు విమోచించిన
ఇశ్రాయేలీయులనునట్టి నీ జనులవంటి జనము లోకము
నందు మరి ఎక్కడ నున్నది? మరియు యెహోవా 24
వైన నీవు వారికి దేవుడవై యుండి, వారు నిత్యము

నీకు ఇశ్రాయేలీయులను పేరుగల జనులై యుండు
25 నట్లుగా వారిని నిర్ధారణ చేసితివి. । దేవా యెహోవా,
నీ దాసుడనగు నన్నుగూర్చియు నా కుటుంబమును
గూర్చియు నీవు సెలవిచ్చినమాట యెన్నటికి నిలుచు
26 నట్లు దృఢపరచి । సైన్యములకధిపతియగు యెహోవా
ఇశ్రాయేలీయులకు దేవుడై యున్నాడను మాటచేత
నీ నామమునకు శాశ్వతమహిమ కలుగునట్లును, నీ
దాసుడనైన నా కుటుంబము నీ సన్నిధిని స్థిరపరచ
బడునట్లును నీవు సెలవిచ్చినమాట నెరవేర్చుము. ।
27 ఇశ్రాయేలీయుల దేవా సైన్యములకధిపతియగు
యెహోవా—నీకు సంతానము కలుగజేయుదునని
నీవు నీ దాసుడనైన నాకు తెలియపరచితివి గనుక
ఈలాగున నీతో మనవిచేయుటకై నీ దాసుడ
28 నైన నాకు ధైర్యము కలిగెను. । యెహోవా నా
ప్రభువా, మేలు దయచేయుదునని నీవు నీ దాసుడ
నైన నాకు సెలవిచ్చుచున్నావే, నీవు దేవుడవు గనుక
29 నీ మాటలు సత్యము. । దయచేసి నీ దాసుడనైన నా
కుటుంబము నిత్యము నీ సన్నిధిని ఉండునట్లుగా
దానిని ఆశీర్వదించుము; యెహోవా నా ప్రభువా,
నీవు సెలవిచ్చి యున్నావు; నీ ఆశీర్వాదము నొంది
నా కుటుంబము నిత్యము ఆశీర్వదింపబడును గాక.

8 దావీదు ఫిలిష్తీయులను ఓడించి లోపరచుకొని
వారి వశములోనుండి మెతెగమ్మాను పట్టుకొనెను. ।
2 మరియు అతడు మోయాబీయులను ఓడించి, పట్ట
బడినవారిని నేలపొడుగున పండజేసి, తాడుతో
కొలిచి రెండు తాడుల పొడుగుననున్నవారు చావ
వలెననియు, ఒక తాడు పొడుగుననున్నవారు బ్రదుక
వచ్చుననియు నిర్ణయించెను. అంతట మోయాబీయులు
దావీదుకు దాసులై కప్పము చెల్లించుచుండిరి. ।
3 సోబారాజును రెహోబు కుమారుడునగు హదదెజెరు
ఫరాతు నదివరకు తన రాజ్యమును వ్యాపింపజేయవలె
4 నని బయలుదేరగా దావీదు అతని నోడించి । అతని
యొద్దనుండి వెయ్యిన్నియేడు నూర్లమంది గుర్రపు
రౌతులను ఇరువది వేల కాల్బలమును పట్టుకొని, వారి
గుర్రములలో నూటిని ఉంచుకొని, మిగిలినవాటికి
5 చీలమండ నరములను తెగవేయించెను. । మరియు
దమస్కులోనున్న అరామీయులు సోబారాజగు
హదదెజెరుకు సహాయము చేయరాగా దావీదు అరా
మీయులలో ఇరువదిరెండు వేలమందిని ఓడించి ।
6 దమస్కువశముననున్న అరాము దేశమందు దండును
ఉంచగా, అరామీయులు దావీదుకు దాసులై కప్పము
చెల్లించుచుండిరి. దావీదు ఎక్కడికి పోయినను
7 యెహోవా అతని కాపాడుచుండెను. । హదదెజెరు
సేవకులకున్న బంగారు బల్లెములను దావీదు పట్టుకొని
8 యెరూషలేమునకు తీసికొనివచ్చెను. । మరియు బెతహు
బేరోతై అను హదదెజెరు పట్టణములలో దావీదు
రాజు విస్తారమైన యిత్తడిని పట్టుకొనెను.
దావీదు హదదెజెరు దండు అంతయు ఓడించిన 9
సమాచారము హమాతు రాజైన తోయికి వినబడెను. ।
హదదెజెరుకును తోయికిని యుద్ధములు జరుగు 10
చుండెను గనుక దావీదు హదదెజెరుతో యుద్ధముచేసి
అతని ఓడించి యుండుట తోయి విని, తన కుమారు
డగు యోరాముచేతికి వెండి బంగారు ఇత్తడి వస్తువు
లను కానుకలుగా అప్పగించి కుశలప్రశ్నలడిగి దావీ
దుతోకూడ సంతోషించుటకై అతని దావీదునొద్దకు
పంపెను. । రాజైన దావీదు తాను జయించిన జనముల 11
యొద్ద పట్టుకొనిన వెండి బంగారములతో వీటిని
చేర్చి యెహోవాకు ప్రతిష్ఠించెను. । వాటిని అతడు 12
అరామీయులయొద్దనుండియు మోయాబీయులయొద్ద
నుండియు అమ్మోనీయులయొద్దనుండియు ఫిలిష్తీయుల
యొద్దనుండియు అమాలేకీయుల యొద్దనుండియు
రెహోబు కుమారుడగు హదదెజెరు అను సోబా
రాజునొద్దనుండియు పట్టుకొని యుండెను. । దావీదు 13
ఉప్పులోయలో అరామీయులగు పదునెనిమిది వేల
మందిని హతముచేసి తిరిగి రాగా అతని పేరు ప్రసిద్ధ
మాయెను. । మరియు ఎదోము దేశమందు అతడు 14
దండు నుంచెను. ఎదోమీయులు దావీదుకు దాసులు
కాగా ఎదోము దేశమంతట అతడు కావలిదండుం
చెను; దావీదు ఎక్కడికి పోయినను యెహోవా
అతని కాపాడుచుండెను.
దావీదు ఇశ్రాయేలీయులందరిమీద రాజై తన 15
జనులనందరిని నీతిన్యాయములనుబట్టి యేలుచుండెను.।
సెరూయా కుమారుడగు యోవాబు సైన్యమునకు 16
అధిపతియై యుండెను. అహీలూదు కుమారుడగు
యెహోషాపాతు రాజ్యపు సస్తావేజుల మీద
నుండెను. । అహీటూబు కుమారుడగు సాదోకును 17
అబ్యాతారు కుమారుడగు అహీమెలెకును యాజకులు;
శెరాయా ప్రధానమంత్రి; । యెహోయాదా 18
కుమారుడగు బెనాయా కెరేతీయులకును పెలేతీయు
లకును అధిపతి; దావీదు కుమారులు సభాముఖ్యులు.
—యోనాతానునుబట్టి నేను ఉపకారము చూపు 9
టకు సౌలు కుటుంబములో ఎవడైన కలడాయని
దావీదు అడిగెను. । సౌలు కుటుంబమునకు సేవకుడగు 2
సీబాయను ఒకడుండగా వారు అతని దావీదునొద్దకు
పిలువనంపిరి. రాజు—సీబావు నీవేగదా అని అడుగగా
అతడు—నీ దాసుడనైన నేనే సీబాను అనెను. । రాజు 3
— యెహోవా నాకు దయచూపినట్లుగా నేను ఉప
కారము చేయుటకు సౌలు కుటుంబములో ఎవడైన
నొకడు శేషించి యున్నాడా యని అతని నడుగగా
సీబా— యోనాతానుకు కుంటికాళ్లుగల కుమారుడొక
డున్నాడని రాజుతో మనవి చేసెను. । —అతడెక్కడ 4

ఉన్నాడని రాజు అడుగగా సీబా — చిత్తగించుము,
అతడు లోదెబారులో అమ్మీయేలు కుమారుడగు
5 మాకీరు ఇంట నున్నాడని రాజుతో అనెను. । అప్పుడు
రాజైన దావీదు మనుష్యులను పంపి లోదెబారులో
నున్న అమ్మీయేలు కుమారుడగు మాకీరు ఇంటనుండి
6 అతని రప్పించెను. । సౌలు కుమారుడైన యోనా
తానుకు పుట్టిన మెఫీబోషెతు దావీదునొద్దకు వచ్చి
సాగిలపడి నమస్కారము చేయగా దావీదు — మెఫీ
బోషెతూ అని అతని పిలిచినప్పుడు అతడు—చిత్తము,
7 నీ దాసుడనైన నేనున్నాననెను । అందుకు దావీదు—
నీవు భయపడవద్దు, నీ తండ్రియైన యోనాతాను
నిమిత్తము నిజముగా నేను నీకు ఉపకారము చూపి,
నీ పితరుడైన సౌలు భూమి అంతయు నీకు మరల
ఇప్పించెదను; మరియు నీవు సదాకాలము నా బల్ల
యొద్దనే భోజనము చేయుదువని సెలవియ్యగా ।
8 అతడు నమస్కరించి — చచ్చిన కుక్కవంటివాడనైన
నాయెడల నీవు దయచూపుటకు నీ దాసుడనగు నేను
9 ఎంతటివాడను? అనెను. । అప్పుడు రాజు సౌలు సేవకు
డైన సీబాను పిలువనంపి—సౌలునకును అతని కుటుంబ
మునకును కలిగిన సొత్తంతటిని నీ యజమానుని కుమారు
10 నికి నేనిప్పించి యున్నాను; । కాబట్టి నీవును నీ కుమా
రులును నీ దాసులును అతనికొరకు ఆ భూమిని సాగు
బడిచేసి, నీ యజమానుని కుమారునికి భోజనమునకై
ఆహారము కలుగునట్లు నీవు దాని పంట తేవలెను; నీ
యజమానుని కుమారుడైన మెఫీబోషెతు ఎల్లప్పుడును
నా బల్లయొద్దనే భోజనము చేయునని సెలవిచ్చెను.
ఈ సీబాకు పదిహేనుమంది కుమారులును ఇరువది
11 మంది దాసులును ఉండిరి. । — నా యేలినవాడవగు
రాజు తన దాసునికిచ్చిన యాజ్ఞ అంతటి చొప్పున
నీ దాసుడనైన నేను చేసెదనని సీబా రాజుతో
చెప్పెను. కాగా మెఫీబోషెతు రాజకుమారులలో
ఒకడైనట్టుగా రాజు బల్లయొద్దనే భోజనము చేయు
12 చుండెను. । మెఫీబోషెతుకు ఒక చిన్న కుమారు
డుండెను, వాని పేరు మీకా. మరియు సీబాయిం
టిలో కాపురమున్న వారందరు మెఫీబోషెతుకు దాసు
13 లుగా ఉండిరి. । మెఫీబోషెతు యెరూషలేములో
కాపురముండి సదాకాలము రాజు బల్లయొద్ద భోజ
నము చేయుచుండెను. అతని కాళ్లు రెండును కుంటివి.

**10** పిమ్మట అమ్మోనురాజు మృతి నొందగా అతని
కుమారుడగు హానూను అతని రాజ్యము నేలుచుండెను.।
2 దావీదు—హానూను తండ్రియైన నాహాషు నాకు చేసిన
ఉపకారమునకు నేను హానూనుకు ప్రత్యుపకారము
చేతునని అనుకొని, అతని తండ్రి మృతి నొందినందుకు
అతని నోదార్చుటకై తన సేవకులచేత సమాచారము
పంపించెను. దావీదు సేవకులు అమ్మోనీయుల దేశము
3 లోనికి రాగా । అమ్మోనీయుల ఘనులు తమ రాజగు
హానూనుతో ఈలాగు మనవిచేసిరి—నీ తండ్రిని సన్మా
నించుటకే దావీదు నీయొద్దకు ఓదార్చువారిని పంపె
నని నీవనుకొనుచున్నావా? ఈ పట్టణమును నాశము
చేయవలెనని దాని శోధించుటకై వారిని అతడు వేగు
నిమిత్తమే పంపించి యున్నాడని నీకు తోచలేదా! ।
అంతట హానూను దావీదు పంపించిన సేవకులను పట్టు 4
కొని, సగము గడ్డము గొరిగించి, వారు తొడుగు
కొనిన బట్టలను నడిమికి పిర్రలమట్టుకు కత్తిరించి
వారిని వెళ్లగొట్టెను. । ఈ సంగతి దావీదునకు వినబడి 5
నప్పుడు, ఆ మనుష్యులు బహు సిగ్గునొందిరని వారిని
ఎదుర్కొనుటకై మనుష్యులను పంపించి — మీ గడ్డ
ములు పెరుగువరకు యెరికోపట్టణమందు ఆగి ఆటు
తరువాత రండని వారితో చెప్పుడనెను. । —దావీదు 6
దృష్టికి మనలను మనము హేయపరచుకొంటిమని
అమ్మోనీయులు గ్రహించి దూతలను పంపి, బేత్రె
హోబులోను అరాము సోబాలోను చేరిన అరా
మీయులలోనుండి యిరువదివేలమంది కాల్బలమును,
మయకా రాజునొద్దనుండి వెయ్యిమంది బంటులను,
టోబులోనుండి పన్నెండు వేలమంది బంటులను జీత
మునకు పిలిపించుకొనిరి. । దావీదు ఈ సంగతి విని, 7
యోవాబును శూరుల దండంతటిని పంపెను. । అమ్మో 8
నీయులు బయలుదేరి గుమ్మమునకెదురుగా యుద్ధపం
క్తులు తీర్చిరి. సోబా అరామీయులును రెహోబు
అరామీయులును మయకావారును టోబువారును
విడిగా పొలములో నిలిచిరి. । యోవాబు తనకు 9
వెనుకను ముందును వారు యుద్ధపంక్తులు తీర్చియుం
డుట చూచి, ఇశ్రాయేలీయులలో బలాఢ్యులను ఏర్ప
రచి పంక్తులు తీర్చి అరామీయులను ఎదుర్కొన
బోయెను. । అమ్మోనీయులను ఎదుర్కొనుటకై మిగి 10
లినవారిని తన సహోదరుడగు । అబీషైకి అప్ప 11
గించి—అరామీయుల బలము నాకు మించినయెడల
నీవు నన్ను ఆదుకొనవలెను, అమ్మోనీయుల బలము
నీకు మించినయెడల నేను వచ్చి నిన్ను ఆదుకొందునని
చెప్పి అమ్మోనీయులను ఎదుర్కొనుటకై తనవారిని
వ్యూహపరచెను. । అప్పుడు—ధైర్యము తెచ్చుకొమ్ము, 12
మన జనులను మన దేవుని పట్టణమును తలంచుకొని
ధైర్యము తెచ్చుకొందము, తన దృష్టికి ఏది యను
కూలమో యెహోవా దానిని చేయుగాక అని అబీ
షైతో చెప్పి । యోవాబును అతనితోకూడ నున్న 13
వారును అరామీయులతో యుద్ధముచేయ బయలు
దేరగానే వారు అతని యెదుట నిలువజాలక పారి
పోయిరి. । అరామీయులు పారిపోవుట అమ్మో 14
నీయులు చూచి వారును అబీషై యెదుట నిలువలేక
పారిపోయి పట్టణములో చొరబడగా, యోవాబు
అమ్మోనీయులను విడిచి యెరూషలేమునకు వచ్చెను. ।
అయితే అరామీయులు తాము ఇశ్రాయేలీయుల 15

చేతిలో ఓడిపోతిమని తెలిసికొని గుంపుకూడిరి. ।
16 హదరెజెరు నది యవతలనున్న అరామీయులను పిలువ
17 నంపగా వారు హేలామునకు వచ్చిరి. । హదరెజెరు
సైన్యాధిపతియగు షోబకు వారికి అధిపతిగా ఉండెను
దావీదునకు ఈ వార్త వినబడినప్పుడు అతడు ఇశ్రా
యేలీయులనందరిని సమకూర్చి యొర్దాను నది దాటి
18 హేలామునకు వచ్చెను. । అరామీయులు సన్నద్ధులై
దావీదును ఎదుర్కొన వచ్చి అతనితో యుద్ధము
చేసిరి. ఇశ్రాయేలీయులయెదుట నిలువజాలక పారి
పోగా, దావీదు అరామీయులలో ఏడు నూర్లమంది
రథికులను నలుబది వేలమంది గుర్రపు రౌతులను
హతముచేసెను. మరియు వారి సైన్యాధిపతియగు
షోబకు దావీదు చేతిలో ఓడిపోయి అచ్చటనే చచ్చెను.।
19 హదరెజెరునకు సేవకులగు రాజులందరును తాము ఇశ్రా
యేలీయుల యెదుట నిలువలేకుండ కొట్టబడియుం
డుట చూచి భయాక్రాంతులై అమ్మోనీయులకు ఇక
సహాయము చేయుట మాని ఇశ్రాయేలీయులతో
సమాధానపడి వారికి లోబడిరి.

11 వసంతకాలమున రాజులు యుద్ధమునకు బయలు
దేరు సమయమున దావీదు యోవాబును అతనివారిని
ఇశ్రాయేలీయులనందరిని పంపగా వారు అమ్మోనీయు
లను సంహరించి రబ్బా పట్టణమును ముట్టడివేసిరి;
అయితే దావీదు యెరూషలేమునందు నిలిచెను.
2 ఒకానొక దినమున ప్రొద్దు గ్రుంకువేళ దావీదు
పడకమీదనుండి లేచి రాజనగరి మిద్దెమీద నడుచుచు
నుండి చూచుచుండగా స్నానముచేయు ఒక స్త్రీ
3 కనబడెను. । ఆమె బహు సౌందర్యవతియై యుండుట
చూచి దావీదు దాని సమాచారము తెలిసికొనుటకై
యొక దూతను పంపెను. అతడు వచ్చి — ఆమె ఏలీ
యాము కుమార్తెయు హిత్తీయుడగు ఊరియాకు భార్య
4 యునైన బత్షెబ అని తెలియజేయగా । దావీదు దూతల
చేత ఆమెను పిలువనంపెను. ఆమె అతనియొద్దకు
రాగా అతడు ఆమెతో శయనించెను; కలిగిన అప
విత్రత పోగొట్టుకొని ఆమె తన యింటికి మరల
5 వచ్చెను. । ఆ స్త్రీ గర్భవతియై—నేను గర్భవతినైతినని
6 దావీదునకు వర్తమానము పంపగా । దావీదు—హిత్తీయు
డగు ఊరియాను నాయొద్దకు పంపుమని దూతద్వారా
7 యోవాబునకు ఆజ్ఞ ఇచ్చెను. । ఊరియా దావీదునొద్దకు
రాగా దావీదు యోవాబు యోగక్షేమమును జనుల
యోగక్షేమమును యుద్ధసమాచారమును అడిగెను. ।
8 తరువాత దావీదు—ఇంటికి పోయి శ్రమ తీర్చుకొను
మని ఊరియాకు సెలవియ్యగా, ఊరియా రాజనగ
9 రిలోనుండి బయలువెళ్లెను. । అతని వెనుక రాజు
ఫలాహారము అతనియొద్దకు పంపించెను గాని ఊరియా
తన యింటికి వెళ్లక తన యేలినవాని సేవకులతో కూడ
10 రాజనగరిద్వారమున పండుకొనెను. । ఊరియా తన
యింటికి పోలేదను మాట దావీదునకు వినబడినప్పుడు
దావీదు ఊరియాను పిలిపించి — నీవు ప్రయాణము
చేసి వచ్చితివి గదా; యింటికి వెళ్లకపోతివేమని యడు
గగా । ఊరియా—మందసమును ఇశ్రాయేలువారును 11
యూదావారును గుడారములలో నివసించుచుండగను,
నా యధిపతియగు యోవాబును నా యేలినవాడగు
నీ సేవకులును బయట దండులో నుండగను, భోజన
పానములు చేయుటకును నా భార్యయొద్ద శయనించుట
కును నేను ఇంటికి పోదునా! నీతోడు నీ ప్రాణము
తోడు నేనాలాగు చేయువాడను కానని దావీదుతో
అనెను. । దావీదు—నేడును నీవిక్కడనుండుము, రేపు 12
నీకు సెలవిత్తునని ఊరియాతో అనగా ఊరియా
నాడును మరునాడును యెరూషలేములో నిలిచెను. ।
అంతలో దావీదు అతనిని భోజనమునకు పిలిపించెను; 13
అతడు బాగుగా తిని త్రాగిన తరువాత దావీదు
అతని మత్తునిగా చేసెను గనుక సాయంత్రమున
అతడు బయలువెళ్లి తన యింటికి పోక తన యేలిన
వాని సేవకుల మధ్య పడకమీద పండుకొనెను. ।
ఉదయమున దావీదు — యుద్ధము ఘోరముగా జరుగు 14
చున్నచోట ఊరియాను ముందుపెట్టి అతడు కొట్ట
బడి హతమగునట్లు నీవు అతని యొద్దనుండి వెళ్లి
పొమ్మని । యోవాబుకు ఉత్తరము వ్రాయించి ఊరియా 15
చేత పంపించెను. । యోవాబు పట్టణమును ముట్టడి 16
వేయుచుండగా, ధైర్యవంతులుండు స్థలమును గుర్తించి
ఆ స్థలమునకు ఊరియాను పంపెను. । ఆ పట్టణపు 17
వారు బయలుదేరి యోవాబుతో యుద్ధమునకు రాగా
దావీదు సేవకులలో కొందరు కూలిరి, హిత్తీయుడగు
ఊరియాయును హతమాయెను. । కాబట్టి యోవాబు 18
యుద్ధసమాచారమంతయు దావీదునొద్దకు పంపి
దూతతో ఇట్లనెను । — యుద్ధసమాచారము నీవు 19
రాజుతో చెప్పి చాలించిన తరువాత రాజు కోపము
తెచ్చుకొని — యుద్ధము చేయునప్పుడు మీరెందుకు
పట్టణముదగ్గరకు పోతిరి! । గోడమీదనుండి వారు 20
అంబులు వేయుదురని మీకు తెలియక పోయెనా! ।
ఎరుబ్బెషెతు కుమారుడైన అబీమెలెకు ఏలాగు హత 21
మాయెను! ఒక స్త్రీ తిరగటిరాతి తునక ఎత్తి గోడ
మీదనుండి అతనిమీద వేసినందున అతడు తేబేసు
దగ్గర హతమాయెను గదా! ప్రాకారముదగ్గరకు
మీరెందుకు పోతిరని నిన్నడిగినయెడల నీవు—తమరి
సేవకుడగు ఊరియాయు హతమాయెనని చెప్పుమని
బోధించి దూతను పంపెను. । దూత పోయి యోవాబు 22
పంపిన వర్తమానమంతయు దావీదుకు తెలియజేసెను. ।
ఎట్లనగా—ఆ మనుష్యులు మమ్మును ఓడించుచు పొలము 23
లోనికి మాకెదురు రాగా మేము వారిని గుమ్మమువరకు
వెంటాడి గెలిచితిమి. । అప్పుడు ప్రాకారముమీద 24
నుండి విలుకాండ్రు తమరి సేవకులమీద అంబులు

వేయగా రాజు సేవకులలో కొందరు హతమైరి, తమరి
సేవకుడైన హిత్తీయుడగు ఊరియాకూడ హతమాయెను. ।
25 అందుకు దావీదు — నీవు యోవాబుతో ఈ మాట
చెప్పుము — ఆ సంగతినిబట్టి నీవు చింతపడకుము;
ఖడ్గము ఒకప్పుడు ఒకనిమీదను ఒకప్పుడు మరియొకని
మీదను పడుటకద్దు; పట్టణముమీద యుద్ధము మరి
బలముగా జరపి దాని పడగొట్టుమని చెప్పి, నీవు
యోవాబును ధైర్యపరచి చెప్పుమని ఆ దూతకు ఆజ్ఞ
26 ఇచ్చి పంపెను. । ఊరియా భార్య తన భర్తయగు
ఊరియా హతమైన సంగతి విని తన భర్తకొరకు అంగ
27 లార్చెను । అంగలార్పు కాలము తీరిన తరువాత దావీదు
దూతలను పంపి ఆమెను తన నగరికి తెప్పించుకొనగా
ఆమె అతనికి భార్యయయి అతనికొక కుమారుని
కనెను. అయితే దావీదు చేసినది యెహోవా దృష్టికి
దుష్కార్యముగా ఉండెను.

12 కావున యెహోవా నాతానును దావీదునొద్దకు
పంపెను; అతడు వచ్చి దావీదుతో ఇట్లనెను—ఒకా
నొక పట్టణమందు ఇద్దరు మనుష్యులు ఉండిరి. ।
2 ఒకడు ఐశ్వర్యవంతుడు ఒకడు దరిద్రుడు. ఐశ్వర్య
వంతునికి విస్తారమైన గొఱ్ఱెలును గొడ్లును కలిగియుం
3 డెను. । అయితే ఆ దరిద్రునికి తాను కొనుక్కొనిన
యొక చిన్న ఆడు గొఱ్ఱెపిల్ల తప్ప ఏమియు లేక
పోయెను. వాడు దాని పెంచుకొనుచుండగా అది
వానియొద్దను వాని బిడ్డలయొద్దను ఉండి పెరిగి వాని
చేతి ముద్దలు తినుచు వాని గిన్నెలోనిది త్రాగుచు
వాని కౌగిట పండుకొనుచు వానికి కుమార్తెవలె ఉం
4 డెను. । అట్లుండగా మార్గస్థుడొకడు ఐశ్వర్యవంతుని
యొద్దకు వచ్చెను. అతడు తనయొద్దకు వచ్చిన మార్గ
స్థునికి ఆయత్తము చేయుటకు తన గొఱ్ఱెలలోగాని
గొడ్లలోగాని దేనిని ముట్టనొల్లక, ఆ దరిద్రుని గొఱ్ఱె
పిల్లను పట్టుకొని, తనయొద్దకు వచ్చినవానికి ఆయత్తము
5 చేసెను. । దావీదు ఈ మాట విని ఆ మనుష్యుని
మీద బహుగా కోపించుకొని—యెహోవా జీవము
తోడు నిశ్చయముగా ఈ కార్యము చేసినవాడు
6 మరణపాత్రుడు. । వాడు కనికరము లేక యీ
కార్యము చేసెను గనుక ఆ గొఱ్ఱెపిల్లకు ప్రతిగా
నాలుగు గొఱ్ఱెపిల్లల నియ్యవలెనని నాతానుతో
అనెను.
7 నాతాను దావీదును చూచి—నీవే ఆ మనుష్యు
డవు. ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా సెల
విచ్చునదేమనగా—ఇశ్రాయేలీయులమీద నేను నిన్ను
రాజుగా పట్టాభిషేకముచేసి సౌలుచేతిలోనుండి నిన్ను
8 విడిపించి నీ యజమానుని నగరిని నీకనుగ్రహించి । నీ
యజమానుని స్త్రీలను నీ కౌగిట చేర్చి ఇశ్రాయేలువారిని
యూదావారిని నీకప్పగించితిని. ఇది చాలదని నీవను
కొనినపక్షమున నేను మరి ఎక్కువగా నీకిచ్చియుం
డును. । నీవు యెహోవా మాటను తృణీకరించి 9
ఆయన దృష్టికి చెడుతనము చేసితివేమి? హిత్తీయుడగు
ఊరియాను కత్తిచేత చంపించి అతని భార్యను నీకు
భార్యయగునట్లుగా నీవు పట్టుకొని యున్నావు;
అమ్మోనీయులచేత నీవతని చంపించితివి గదా! । నీవు 10
నన్ను లక్ష్యము చేయక హిత్తీయుడగు ఊరియా
భార్యను నీకు భార్యయగునట్లు తీసికొనినందున నీ
యింటివారికి సదాకాలము యుద్ధము కలుగును. । నా 11
మాట ఆలకింపుము; యెహోవానగు నేను సెల
విచ్చునదేమనగా—నీ యింటివారి మూలముననే నేను
నీకు అపాయము పుట్టింతును; నీవు చూచుచుండగా
నేను నీ భార్యలను తీసి నీ చేరువ వానికప్పగించెదను. ।
పగటియందు వాడు వారితో శయనించును. నీవు ఈ 12
కార్యము రహస్యముగా చేసితివిగాని ఇశ్రాయేలీ
యులందరు చూచుచుండగా పగటియందే నేను చెప్పిన
దాని చేయింతును. ।—నేను పాపముచేసితినని దావీదు 13
నాతానుతో అనగా నాతాను—నీవు చావకుండునట్లు
యెహోవా నీ పాపమును బట్టి నిన్ను శిక్షింపక
పోవును. । అయితే ఈ కార్యమువలన యెహోవాను 14
దూషించుటకు ఆయన శత్రువులకు నీవు గొప్ప 15
హేతువు కలుగజేసితివి గనుక నీకు పుట్టిన బిడ్డ నిశ్చయ
ముగా చచ్చునని దావీదుతో చెప్పి తన యింటికి
వెళ్లెను.
యెహోవా ఊరియా భార్య దావీదునకు కనిన 16
బిడ్డను మొత్తినందున అది బహు జబ్బుపడెను. । దావీదు 17
ఉపవాసముండి లోపలికి పోయి రాత్రి అంతయు
నేలపడియుండి బిడ్డకొరకు దేవుని బతిమాలగా, ఇం
టిలో ఎన్నికగలవారు లేచి అతని నేలనుండి లేవ
నెత్తుటకు వచ్చిరి గాని అతడు సమ్మతింపక వారితో
కూడ భోజనము చేయక యుండెను. । ఏడవ దినమున 18
బిడ్డ చావగా—బిడ్డ ప్రాణముతో ఉండగా మేము అత
నితో మాటలాడినప్పుడు అతడు మా మాటలు వినక
యుండెను. । ఇప్పుడు బిడ్డ చనిపోయెనని మనము అత 19
నితో చెప్పినయెడల తనకు తాను హాని చేసికొను
నేమో యనుకొని, దావీదు సేవకులు బిడ్డ చనిపోయెనను
సంగతి అతనితో చెప్ప వెరచిరి. అయితే దావీదు తన
సేవకులు గుసగుసలాడుట చూచి బిడ్డ చనిపోయెనను
సంగతి గ్రహించి—బిడ్డ చనిపోయెనా అని తన సేవకుల
నడుగగా వారు—చనిపోయెననిరి. । అప్పుడు దావీదు 20
నేలనుండి లేచి స్నానముచేసి తైలము పూసికొని వేరు
వస్త్రములు ధరించి యెహోవా మందిరములో ప్రవే
శించి మ్రొక్కి తన యింటికి తిరిగి వచ్చి భోజనము
తెమ్మనగా వారు వడ్డించిరి; అప్పుడు అతడు భోజ
నము చేసెను. । అతని సేవకులు — బిడ్డ జీవముతో 21
ఉండగా ఉపవాసముండి దానికొరకు ఏడ్చుచుంటివి
గాని అది మరణమైనప్పుడు లేచి భోజనము చేసితివి.

22 నీవీలాగున చేయుట ఏమని దావీదునడుగగా । అతడు
—బిడ్డ ప్రాణముతో ఉన్నప్పుడు దేవుడు నాయందు
కనికరించి వాని బ్రదికించునేమో యనుకొని నేను
23 ఉపవాసముండి యేడ్చుచుంటిని. । ఇప్పుడు చని
పోయెను గనుక నేనెందుకు ఉపవాసముండవలెను?
వాని తిరిగి రప్పించగలనా? నేను వానియొద్దకు పోవు
దును గాని వాడు నాయొద్దకు మరల రాడని వారితో
24 చెప్పెను. । తరువాత దావీదు తన భార్యయైన బత్షె
బను ఓదార్చి ఆమెయొద్దకు పోయి ఆమెను కూడగా
ఆమె యొక కుమారుని కనెను. దావీదు అతనికి
25 సొలొమోను అని పేరు పెట్టెను. । యెహోవా
అతని ప్రేమించి నాతాను అను ప్రవక్తను పంపగా
అతడు యెహోవా ఆజ్ఞనుబట్టి యదీద్యా అని అత
నికి పేరుపెట్టెను.
26 యోవాబు రబ్బా అను అమ్మోనీయుల పట్టణము
మీద యుద్ధము చేసి రాజనగరిని పట్టుకొనెను. ।
27 దావీదునొద్దకు అతడు దూతలను పంపి—నేను రబ్బా
మీద యుద్ధము చేసి జలములమీది పట్టణమును పట్టు
28 కొంటిని; । నేను పట్టణమును పట్టుకొని నా పేరు
దానికి పెట్టకుండునట్లు (యెరూషలేమునొద్ద) మిగిలిన
దండువారిని సమకూర్చి నీవు పట్టణమును పట్టుకొన
29 వలెనని వర్తమానముచేయగా । దావీదు యోధులను
సమకూర్చి రబ్బాకు వచ్చి దానిమీద యుద్ధముచేసి
దాని పట్టుకొని, వారి రాజు కిరీటమును అతని తల
మీదనుండి తీయించగా అది దావీదు తలమీద పెట్ట
బడెను. అది విలువగల రత్నములు చెక్కినదై రెండు
30 బంగారు మణుగులంతంత యెత్తుండెను. । మరియు
అతడు పట్టణములోనుండి బహు విస్తారమైన దోపు
31 సొమ్ము పట్టుకొని పోయెను. । పట్టణములో ఉన్న
వారిని బయటికి తెప్పించి రంపములచేతను పదునుగల
యినుప పనిముట్లచేతను ఇనుప గొడ్డండ్లచేతను వారిని
తుత్తునియలుగా చేయించి వారిని ఇటుక అవములలో
వేసెను. అమ్మోనీయుల పట్టణములన్నిటికి అతడు
ఈలాగు చేసెను. ఆ తరువాత దావీదును జనులంద
రును తిరిగి యెరూషలేమునకు వచ్చిరి.

13 తరువాత దావీదు కుమారుడగు అబ్షాలోముకు
తామారను నొక సుందరవతియగు సహోదరి యుం
డగా దావీదు కుమారుడగు అమ్నోను ఆమెను
2 మోహించెను. । తామారు కన్యయైనందున ఆమెకు
ఏమి చేయవలెనన్నను దుర్లభమని అమ్నోను గ్రహించి
చింతాక్రాంతుడై తన సోదరియైన తామారునుబట్టి
3 చిక్కిపోయెను. । అమ్నోనుకు మిత్రుడొకడుండెను.
అతడు దావీదు సహోదరుడైన షిమ్యా కుమారుడు,
అతని పేరు యెహోనాదాబు. ఈ యెహోనా
4 దాబు బహు కపటముగలవాడు. అతడు । —రాజ
కుమారుడవైన నీవు నానాటికి చిక్కిపోవుటకు హేతు
వేమి? సంగతి నాకు తెలియజెప్పవా అని అమ్నో
నుతో అనగా అమ్నోను—నా సహోదరుడగు అబ్షా
లోము సహోదరియైన తామారును నేను మోహించి
యున్నానని అతనితో అనెను. । యెహోనాదాబు 5
—నీవు రోగివైనట్టు వేషము వేసికొని నీ మంచముమీద
పండుకొని యుండుము. నీ తండ్రి నిన్ను చూచుటకు
వచ్చినప్పుడు నీవు — నా సోదరియైన తామారుచేత
సిద్ధపరచబడిన భోజనము నేను భుజించునట్లు ఆమె
వచ్చి నేను చూచుచుండగా దాని సిద్ధముచేసి నాకు
పెట్టునట్లు సెలవిమ్మని అడుగుమని అతనికి బోధించగా
అమ్నోను పడకమీద పండుకొనెను. । అమ్నోను 6
కాయిలాపడెనని రాజు అతని చూచుటకు వచ్చినప్పుడు
అమ్నోను—నా సహోదరియగు తామారుచేత నింట
కము నేను భుజించునట్లు ఆమె వచ్చి నేను చూచు
చుండగా నాకొరకు రెండు అప్పములు చేయుటకు
సెలవిమ్మని రాజుతో మనవి చేయగా । దావీదు—నీ 7
సహోదరుడగు అమ్నోను ఇంటికి పోయి అతని
కొరకు భోజనము సిద్ధము చేయుమని తామారు ఇంటికి
వర్తమానము పంపెను. । కాబట్టి తామారు తన సహో 8
దరుడైన అమ్నోను ఇంటికి పోయెను. । అతడు పండుకు 9
కొని యుండగా ఆమె పిండి తీసికొని కలిపి అతని
యెదుట అప్పములు చేసి వాటిని కాల్చి బొరుసు
పట్టుకొని అతనికి వడ్డింపగా అతడు—నాకు వద్దని
చెప్పి — ఉన్నవారందరు నాయొద్దనుండి అవతలకు
పొండనెను. । వారందరు బయటికి పోయిన తరువాత 10
అమ్నోను — నీచేతి వంటకము నేను భుజించునట్లు
దానిని గదిలోనికి తెమ్మనగా, తామారు తాను చేసిన
అప్పములను తీసికొని గదిలోపలనున్న తన సహో
దరుడగు అమ్నోనునొద్దకు వచ్చెను. । అయితే అతడు 11
భుజింపవలెనని ఆమె వాటిని తీసికొని వచ్చినప్పుడు
అతడు ఆమెను పట్టుకొని—నా సహోదరీ రమ్ము,
నాతో శయనించుము అని చెప్పగా । ఆమె—నా 12
అన్నా, నన్ను అవమానపరచకుము; ఈలాగు చేయుట
ఇశ్రాయేలీయులకు తగదు, ఇట్టి జారకార్యము నీవు
చేయవద్దు, నా యవమానము నేనెక్కడ దాచుకొం
గును? । నీవును ఇశ్రాయేలీయులలో దుర్మార్గుడవగు 13
దువు; అయితే ఇందునుగూర్చి రాజుతో మాటలా
డుము; । అతడు నన్ను నీకియ్యక పోడు అని చెప్పి 14
నను అతడు ఆమె మాట వినక ఆమెను బలవంతము చేసి
అవమానపరచి ఆమెతో శయనించెను. । అమ్నోను 15
ఈలాగు చేసిన తరువాత ఆమెయెడల అత్యధికమైన
ద్వేషము పుట్టి అదివరకు ఆమెను ప్రేమించినంతకంటె
అతడు మరి యెక్కువగా ఆమెను ద్వేషించి లేచి
పొమ్మని ఆమెతో చెప్పగా । ఆమె—నన్ను బయటకు 16
త్రోసివేయుటవలన నాకు నీవిప్పుడు చేసిన కీడుకంటె
మరి యెక్కువ కీడు చేయకుమని చెప్పినను । అతడు 17

ఆమె మాట వినక తన పనివారిలో ఒకని పిలిచి—
దీనిని నాయొద్దనుండి వెళ్లగొట్టి తలుపు గడియ వేయు
18 మని చెప్పెను. । కన్యకలైన రాజకుమార్తెలు వివిధ
వర్ణములుగల చీరలు ధరించువారు. ఆమె యట్టి చీర
యొకటి ధరించి యుండినను పనివాడు ఆమెను బయ
టికి వెళ్లగొట్టి మరల రాకుండునట్లు తలుపు గడియ
19 వేసెను. । అప్పుడు తామారు నెత్తిమీద బుగ్గిపోసి
కొని తాను కట్టుకొనిన వివిధవర్ణములుగల చీరను చింపి
20 నెత్తిమీద చెయ్యిపెట్టుకొని యేడ్చుచు పోగా । ఆమె
సహోదరుడగు అబ్షాలోము ఆమెను చూచి — నీ
సహోదరుడగు అమ్నోను నిన్ను కూడినాడు గదా?
నా సహోదరీ నీవు ఊరకుండుము; అతడు నీ
సహోదరుడే గదా, యిందునుగూర్చి చింతపడవద్ద
నెను. కాపున తామారు చెరుపబడినదై తన సహో
21 దరుడగు అబ్షాలోము ఇంట నుండెను. । ఈ సంగతి
రాజగు దావీదుకు వినబడినప్పుడు అతడు బహు
22 రౌద్రము తెచ్చుకొనెను. । అబ్షాలోము తన సహో
దరుడగు అమ్నోనుతో మంచి చెడ్డ లేమియు మాట
లాడక ఊరకుండెను గాని, తన సహోదరియగు
తామారును బలవంతము చేసినందుకై అతనిమీద పగ
యుంచెను.

23 రెండు సంవత్సరములైన తరువాత ఎఫ్రాయిముకు
సమీపమందుండు బయల్హాసోరులో (అబ్షాలోము)
గొఱ్ఱెలబొచ్చు కత్తిరించు కాలము రాగా అబ్షాలోము
24 రాజకుమారుల నందరిని విందుకు పిలిచెను. । అబ్షా
లోము రాజునొద్దకు వచ్చి—చిత్తగించుము, నీ దాసుడ
నైన నాకు గొఱ్ఱె బొచ్చు కత్తిరించు కాలము వచ్చెను;
రాజవైన నీవును నీ సేవకులును విందుకు రావలెనని నీ
దాసుడనైన నేను కోరుచున్నానని మనవి చేయగా ।
25 రాజు—నా కుమారుడా, మమ్మును పిలువవద్దు; మేము
నీకు అధిక భారముగా ఉందుము; మేమందరము
రాతగదని చెప్పినను అబ్షాలోము రాజును బలవంతము
26 చేసెను. । అయితే దావీదు వెళ్లనొల్లక అబ్షాలోమును
దీవించి పంపగా అబ్షాలోము — నీవు రాకపోయిన
యెడల నా సహోదరుడగు అమ్నోను మాతో కూడ
వచ్చునట్లు సెలవిమ్మని రాజుతో మనవి చేసెను.—
అతడు నీయొద్దకు ఎందుకు రావలెనని రాజు అడు
27 గగా । అబ్షాలోము అతని బతిమాలినందున రాజు
అమ్నోనును తన కుమారులందరును అతనియొద్దకు
28 పోవచ్చునని సెలవిచ్చెను. । అంతలో అబ్షాలోము
తన పనివారిని పిలిచి, అమ్నోను ద్రాక్షారసమువలన
సంతోషియై యుండుట మీరు కనిపెట్టియుండి
అమ్నోనును హతము చేయుడని నేను మీతో చెప్పు
నప్పుడు భయపడక అతని చంపుడి, నేను గదా మీకు
ఆజ్ఞ ఇచ్చి యున్నాను, ధైర్యము తెచ్చుకొని పౌరు
షము చూపుడి అని గట్టిగా ఆజ్ఞ ఇచ్చెను. । అబ్షా 29
లోము ఇచ్చిన ఆజ్ఞచొప్పున వారు చేయగా రాజ
కుమారులందరును లేచి తమ కంచరగాడిదల నెక్కి
పారిపోయిరి. । వారు మార్గములో ఉండగానే యొక 30
డును లేకుండ రాజకుమారులను అందరిని అబ్షాలోము
హతముచేసెనని దావీదుకు వార్త రాగా । అతడు లేచి 31
వస్త్రములు చింపుకొని నేల పడియుండెను; మరియు
అతని సేవకులందరు వస్త్రములు చింపుకొని దగ్గర నిలువ
బడియుండిరి. । దావీదు సహోదరుడైన షిమ్యాకు 32
పుట్టిన యెహోనాదాబు దీని చూచి—రాజకుమారు
లైన యౌవనులనందరిని వారు చంపిరని నా యేలిన
వాడవగు నీవు తలంచవద్దు; అమ్నోను మాత్రమే
మరణమాయెను; ఏలయనగా అతడు అబ్షాలోము
సహోదరియైన తామారును బలవంతము చేసిన నాట
నుండి అబ్షాలోము అతని చంపవలెనను తాత్పర్య
ముతో ఉండెనని అతని నోటి మాటనుబట్టి నిశ్చ
యించుకొనవచ్చును. । కాబట్టి నా యేలినవాడవగు 33
నీవు రాజకుమారులందరును మరణమైరని దలచి విచార
పడవద్దు; అమ్నోను మాత్రమే మరణమాయెననెను. ।
అబ్షాలోము ఇంతకుముందు పారిపోయి యుండెను. 34
కావలియున్న పనివాడు ఎదురుచూచుచున్నప్పుడు
తన వెనుక కొండప్రక్కనున్న మార్గమున వచ్చుచున్న
అనేకజనులు కనబడిరి. । యెహోనాదాబు—అదిగో 35
రాజకుమారులు వచ్చియున్నారు; నీ దాసుడనైన నేను
చెప్పిన ప్రకారముగానే ఆయెనని రాజుతో చెప్పెను. ।
అతడు ఆ మాటలాడ చాలింపగానే రాజకుమారులు 36
వచ్చి బిగ్గరగా ఏడ్వసాగిరి, రాజును అతని సేవకులంద
రును దీని చూచి బహుగా ఏడ్చిరి. । అయితే అబ్షా 37
లోము పారిపోయి అమీహూదు కుమారుడైన తల్మయి
అను గెషూరు రాజునొద్ద చేరెను. దావీదు అనుదిన
మును తన కుమారునికొరకు అంగలార్చుచుండెను.

అబ్షాలోము పారిపోయి గెషూరుకు వచ్చి అక్కడ 38
మూడు సంవత్సరములున్న తరువాత । రాజైన దావీదు 39
అమ్నోను మరణమాయెననుకొని అతనిగూర్చి యోదా
ర్పునొందినవాడై అబ్షాలోమును పట్టుకొనవలెనన్న
ఆలోచన మానెను.[1]

రాజుయొక్క మనస్సు అబ్షాలోముకు విరోధ 14
మని[2] సెరూయా కుమారుడైన యోవాబు గ్రహించి ।
తెకోవనుండి యుక్తిగల యొక స్త్రీని పిలువనంపించి— 2
ఏడ్చుచున్న దానవైనట్టు నటించి దుఃఖవస్త్రములు ధరిం
చుకొని తైలము పూసికొనక బహు కాలము దుఃఖ
పడిన దానివలెనుండి । నీవు రాజునొద్దకు వచ్చి యీ 3
ప్రకారము మనవి చేయవలెనని దానికి బోధించెను. ।
కాగా తెకోవ ఊరి స్త్రీ రాజునొద్దకువచ్చి సాగిలపడి 4
నమస్కారము చేసి—రాజా రక్షించుమనగా । రాజు 5

1 లేక, అబ్షాలోముమీద ప్రాణము పెట్టుకొనెను. 2 లేక, రాజు అబ్షాలోముమీద ప్రాణము పెట్టుకొనియున్నాడని.

—నీకేమి కష్టము వచ్చెనని అడిగెను. అందుకు ఆమె
—నేను నిజముగా విధవరాలను, నా పెనిమిటి చని
6 పోయెను; । నీ దాసినైన నాకు ఇద్దరు కుమారులు
ఉండిరి, వారు పొలములో పెనుగులాడుచుండగా
ఎడిపించు వాడెవడును లేకపోయినందున వారిలో
7 నొకడు రెండవవాని కొట్టి చంపెను. । కాబట్టి నా
యింటివారందరును నీ దాసినైన నామీదికి లేచి—తన
సహోదరుని చంపినవాని అప్పగించుము; తన
సహోదరుని ప్రాణము తీసినందుకై మేము వాని
చంపి హక్కుదారుని నాశనము చేతుమనుచున్నారు.
ఈలాగున వారు నా పెనిమిటికి భూమిమీద పేరైనను
శేషమైనను లేకుండ మిగిలిన నిప్పురవను ఆర్పివేయ
8 బోవుచున్నారని రాజుతో చెప్పగా । రాజు — నీవు
నీ యింటికి పొమ్ము, నిన్నుగురించి ఆజ్ఞ ఇత్తునని
9 ఆమెతో చెప్పెను. । అందుకు తెకోవ ఊరి స్త్రీ—నా
యేలినవాడా రాజా, దోషము నామీదను నా తండ్రి
ఇంటివారి మీదను నిలుచునుగాక, రాజుకును రాజు
సింహాసనమునకును దోషము తగులకుండునుగాక అని
10 రాజుతో అనగా । రాజు — ఎవడైనను దీనిగూర్చి
నిన్నేమైన అనినయెడల వాని నాయొద్దకు తోడు
కొని రమ్ము; వాడికను నిన్ను ముట్టక యుండునని
11 ఆమెతో చెప్పెను. । అప్పుడు ఆమె—రాజవైన నీవు
నీ దేవుడైన యెహోవాను స్మరించి హత్యకు ప్రతి
హత్య చేయువారు నా కుమారుని నశింపజేయకుండ
ఇకను నాశనము చేయుట మాన్పించుమని మనవి
చేయగా రాజు—యెహోవా జీవముతోడు నీ కుమా
రుని తలవెంట్రుకలలో ఒకటైనను నేల రాలకుండు
12 ననెను. । అప్పుడు ఆ స్త్రీ—నా యేలినవాడవగు నీతో
ఇంకొక మాట చెప్పుకొనుటకు నీ దాసినగు నాకు
దయచేసి సెలవిమ్మని మనవి చేయగా రాజు—చెప్పు
13 మనెను. । అందుకు ఆ స్త్రీ—దేవుని జనులైనవారికి
విరోధముగా నీవెందుకు దీని తలపెట్టియున్నావు?
రాజు ఆ మాట సెలవిచ్చుటచేత తాను వెళ్లగొట్టిన
తనవాని రానియ్యక తానే దోషియగుచున్నాడు. ।
14 మనమందరమును చనిపోదుము గదా, నేలను ఒలికిన
మీదట మరల ఎత్తలేని నీటివలె ఉన్నాము; దేవుడు
ప్రాణముతీయక తోలివేయబడినవాడు తనకు దూర
స్థుడుకాకయుండుటకు సాధనములు కల్పించుచున్నా
15 డు. । జనులు నన్ను భయపెట్టిరి గనుక నేను దీని
గూర్చి నా యేలినవాడవగు నీతో మాటలాడ వచ్చి
తిని. కాబట్టి నీ దాసురాలనగు నేను — రాజు తన
16 దాసినగు నా మనవిచొప్పున చేయునేమో । రాజు
నా మనవి అంగీకరించి దేవుని స్వాస్థ్యము అనుభవింప
కుండ నన్నును నా కుమారునిని నాశనము చేయదల
చినవాని చేతిలోనుండి తన దాసినగు నన్ను విడిపించు
17 నేమో అనుకొంటిని. । మరియు నీ దేవుడైన
యెహోవా నీకు తోడై యుండునుగాక గనుక నా
యేలినవాడవును రాజవునగు నీవు దేవుని దూతవంటి
వాడవై మంచి చెడ్డలన్నియు విచారింప చాలియు
న్నావు; కాబట్టి నీ దాసినగు నేను నా యేలినవాడగు
రాజు సెలవిచ్చిన మాట సమాధానకరమగునని అను
కొంటిననెను. । రాజు—నేను నిన్ను అడుగు సంగతి నీ 18
వెంతమాత్రమును మరుగుచేయవద్దని ఆ స్త్రీతో అనగా
ఆమె—నా యేలినవాడవగు నీవు సెలవిమ్మనెను. । అం 19
తట రాజు—యోవాబు నీకు బోధించెనా అని ఆమె
నడిగినందుకు ఆమె యిట్లనెను—నా యేలినవాడవైన
రాజా, నీ ప్రాణము తోడు, చెప్పినదానిని తప్పక
గ్రహించుటకు నా యేలినవాడవును రాజవునగు
నీవంటివాడొకడును లేడు; నీ సేవకుడగు యోవాబు
నాకు బోధించి యీ మాటలన్నిటిని నీ దాసినగు
నాకు నేర్పెను । సంగతిని రాజుతో మరుగు మాట 20
లతో మనవి చేయుటకు నీ సేవకుడగు యోవాబు
ఏర్పాటు చేసెను. ఈ లోకమందు సమస్తమును ఎరు
గుటయందు నా యేలినవాడవగు నీవు దేవదూతల
జ్ఞానమువంటి జ్ఞానము గలవాడవు. । అప్పుడు రాజు 21
యోవాబుతో ఈలాగున సెలవిచ్చెను. ఆలకించుము,
నీవు మనవి చేసినదానిని నేను ఒప్పుకొనుచున్నాను. ।
తరువాత—యౌవనుడగు అబ్షాలోమును రప్పింపుమని 22
అతడు సెలవియ్యగా యోవాబు సాష్టాంగనమస్కా
రము చేసి రాజును స్తుతించి—రాజవగు నీవు నీ దాసుడ
నైన నా మనవి అంగీకరించినందున నా యేలినవాడ
వగు నీవలన నేను అనుగ్రహము నొందితినని నాకు
తెలిసెనని చెప్పి లేచి గెషూరుకు పోయి । అబ్షాలో 23
మును యెరూషలేముకు తోడుకొని వచ్చెను. । అయితే 24
రాజు — అతడు నా దర్శనము చేయక తన ఇంటికి
పోవలెనని ఉత్తరువు చేయగా అబ్షాలోము రాజదర్శ
నము చేయక తన ఇంటికి పోయెను.

ఇశ్రాయేలీయులందరిలో అబ్షాలోమంత సౌంద 25
ర్యము గలవాడు ఒకడును లేడు; అరికాలు మొదలు
కొని తలవరకు ఏ లోపమును అతనియందు లేక
పోయెను. । తన తలవెంట్రుకలు భారముగా నున్నం 26
దున ఏటేట అతడు వాటిని కత్తిరించుచు వచ్చెను;
కత్తిరించునప్పుడెల్ల వాటి యెత్తు రాజు తూనికనుబట్టి
యిన్నూరు తులములాయెను. । అబ్షాలోముకు ముగ్గురు 27
కుమారులును తామారు అను నొక కుమార్తెయు పుట్టిరి;
ఆమె బహు సౌందర్యవతి.

అబ్షాలోము రెండు నిండు సంవత్సరములు 28
యెరూషలేములోనుండియు రాజదర్శనము చేయక
యుండగా । యోవాబును రాజునొద్దకు పంపించుటకై 29
అబ్షాలోము అతని పిలువనంపినప్పుడు యోవాబు
రానొల్లక యుండెను. రెండవమారు అతని పిలువనంపి
నప్పుడు అతడు రానొల్లకపోగా । అబ్షాలోము తన 30

పనివారిని పిలిచి—యోవాబు పొలము నా పొలము
దగ్గర నున్నది గదా, దానిలో యవలచేలు ఉన్నవి;
మీరు పోయి వాటిని తగలబెట్టుడని వారితో చెప్పెను.
అబ్షాలోము పనివారు ఆ చేలు తగలబెట్టగా ।
యోవాబు చూచి లేచి అబ్షాలోము ఇంటికి వచ్చి—
నీ పనివారు నా చేలు తగలబెట్టిరేమని అడుగగా ।
అబ్షాలోము యోవాబుతో ఇట్లనెను—గెషూరునుండి
నేను వచ్చిన ఫలమేమి? నేనచ్చటనే యుండుట
మేలని నీ ద్వారా రాజుతో చెప్పుకొనుటకై రాజు
నొద్దకు నిన్ను పంపవలెనని నేను నిన్ను పిలిచితిని;
రాజదర్శనము నేను చేయవలెను; నాయందు దోషము
కనబడినయెడల రాజు నాకు మరణశిక్ష విధింప
వచ్చును. । అంతట యోవాబు రాజునొద్దకు వచ్చి ఆ
సమాచారము తెలుపగా, రాజు అబ్షాలోమును పిలువ
నంపించెను. అతడు రాజునొద్దకు వచ్చి రాజ సన్నిధిని
సాష్టాంగ నమస్కారము చేయగా రాజు అబ్షాలో
మును ముద్దుపెట్టుకొనెను.

5 ఇది యైన తరువాత అబ్షాలోము ఒక రథమును
గుఱ్ఱములను సిద్ధపరచి, తనయెదుట పరుగెత్తుటకై
యేబదిమంది బంటులను ఏర్పరచుకొనెను. । ఉదయ
మున నే లేచి బయలుదేరి పట్టణముయొక్క గుమ్మపు
మార్గమందు ఒకతట్టున నిలిచి, రాజుచేత తీర్పునొందు
టకై వ్యాజ్యమాడువారెవరైనను వచ్చియుండగా కని
పెట్టి వారిని పిలిచి — నీవు ఏ ఊరివాడవని యడుగు
చుండెను — నీ దాసుడనైన నేను ఇశ్రాయేలీయుల
గోత్రములలో ఫలానిదానికి చేరినవాడనని వాడు
చెప్పగా । అబ్షాలోము — నీ వ్యాజ్యము సరిగాను
న్యాయముగాను ఉన్నదిగాని దాని విచారించుటకై
నియమింపబడినవాడు రాజునొద్ద ఒకడును లేడని
చెప్పి । నేను ఈ దేశమునకు న్యాయాధిపతినై
యుండుట యెంత మేలు; అప్పుడు వ్యాజ్యమాడువారు
నాయొద్దకు వత్తురు, నేను వారికి న్యాయము తీర్చుదు
నని చెప్పుచు వచ్చెను. । మరియు తనకు నమస్కారము
చేయుటకై యెవడైనను తన దాపునకు వచ్చినప్పుడు
అతడు తన చేయి చాపి అతని పట్టుకొని ముద్దుపెట్టు
కొనుచు వచ్చెను. । తీర్పునొందుటకై రాజునొద్దకు
వచ్చిన ఇశ్రాయేలీయులకందరికి అబ్షాలోము ఈ
ప్రకారము చేసి ఇశ్రాయేలీయులనందరిని తనతట్టు
త్రిప్పుకొనెను.

నాలుగు[1] సంవత్సరములు జరిగినమీదట అబ్షా
లోము రాజునొద్దకు వచ్చి — నీ దాసుడనైన నేను
అరాము దేశమునందలి గెషూరునందుండగా —
యెహోవా నన్ను యెరూషలేమునకు తిరిగి రప్పించిన
యెడల నేను ఆయనను సేవించెదనని మ్రొక్కు
కొంటిని గనుక, నేను హెబ్రోనునకు పోయి
యెహోవాకు నేను మ్రొక్కుకొనిన మ్రొక్కుబడి
తీర్చుకొనుటకు నాకు సెలవిమ్మని మనవిచేయగా ।
రాజు—సుఖముగా పొమ్మని సెలవిచ్చెను గనుక అతడు 9
లేచి హెబ్రోనునకు పోయెను. । అబ్షాలోము—మీరు 10
బాకానాదము వినునప్పుడు అబ్షాలోము హెబ్రో
నులో ఏలుచున్నాడని కేకలు వేయుడని చెప్పుటకై
ఇశ్రాయేలీయుల గోత్రములన్నిటియొద్దకు వేగులవా
రిని పంపెను. । విందుకు పిలువబడియుండి యున్నూరు 11
మంది యెరూషలేములోనుండి అబ్షాలోముతోకూడ
బయలుదేరి యుండిరి; వీరు ఏమియు తెలియక యథా
ర్థమైన మనస్సుతో వెళ్లియుండిరి. । మరియు బలి 12
అర్పింపవలెనని యుండి అబ్షాలోము గిలోనీయుడైన
అహీతోపెలు అను దావీదుయొక్క మంత్రిని గిలో
అను అతని ఊరినుండి పిలిపించి యుండెను. అబ్షా
లోము దగ్గరకు వచ్చిన జనము మరి మరి యెక్కు
వగుటచేత కుట్ర బహు బలమాయెను.

ఇశ్రాయేలీయులు అబ్షాలోముపక్షము వహించి 13
రని దావీదునకు వర్తమానము రాగా । దావీదు యెరూష 14
లేమునందున్న తన సేవకులకందరికి ఈలాగు ఆజ్ఞ
ఇచ్చెను—అబ్షాలోము చేతిలోనుండి మనము తప్పించు
కొని రక్షణ నొందలేము; మనము పారిపోదము రండి,
అతడు హఠాత్తుగా వచ్చి మనలను పట్టుకొనకను,
మనకు కీడుచేయకను, పట్టణమును కత్తివాత హతము
చేయకను ఉండునట్లు మనము త్వరగా వెళ్లి పోదము
రండి. । అందుకు రాజు సేవకులు ఈలాగు మనవి 15
చేసిరి — చిత్తగించుము; నీ దాసులమైన మేము మా
యేలినవాడవును రాజవునగు నీవు సెలవిచ్చినట్లు చేయు
టకు సిద్ధముగా నున్నాము. । అప్పుడు రాజు నగరిని 16
కనిపెట్టుటకై ఉపపత్నులగు పదిమందిని ఉంచిన
మీదట తన యింటివారినందరిని వెంటబెట్టుకొని కాలి
నడకను బయలుదేరెను. । రాజును అతని యింటి 17
వారును బయలుదేరి బెత్మెర్హాకుకు వచ్చి బసచేసిరి. ।
అతని సేవకులందరును అతని యిరుపార్శ్వముల నడి 18
చిరి, కెరేతీయులందరును పెలేతీయులందరును గాతు
నుండి వచ్చిన ఆరు నూర్లమంది గిత్తీయులును రాజుకు
ముందుగా నడచుచుండిరి. । రాజు గిత్తీయుడగు ఇత్తై 19
యిని కనుగొని—నీవు నివాసస్థలము కోరు పరదేశివై
యున్నావు; నీవెందుకు మాతోకూడ వచ్చుచున్నావు?
నీవు తిరిగి పోయి రాజున్న స్థలమున ఉండుము. ।
నిన్ననే వచ్చిన నీకు, ఎక్కడికి పోవుదుమో తెలి 20
యకయున్న మాతోకూడ ఈ తిరుగులాట యెందుకు?
నీవు తిరిగి నీ సహోదరులను తోడుకొని పొమ్ము;
కృపాసత్యములు నీకు తోడుగా ఉండును గాక యని
చెప్పగా । ఇత్తయి — నేను చచ్చినను బ్రదికినను, 21
యెహోవా జీవముతోడు నా యేలినవాడవును

1 పాఠాంతరము, నలుబది.

రాజవగు నీ జీవముతోడు, ఏ స్థలమందు నా యేలిన
వాడవును రాజవునగు నీవుందువో ఆ స్థలమందే నీ
దాసుడనైన నేనుందునని రాజుతో మనవి చేసెను. ।
22 అందుకు దావీదు—అట్లయితే నీవు రావచ్చునని ఇత్త
యితో సెలవియ్యగా గిత్తీయుడగు ఇత్తయియును
అతని వారందరును అతని కుటుంబికులందరును సాగి
23 పోయిరి. వారు సాగిపోవుచుండగా జనులందరు
బహుగా ఏడ్చుచుండిరి, ఈ ప్రకారము వారందరు
రాజుతోకూడ కిద్రోనువాగు దాటి అరణ్యమార్గమున
24 ప్రయాణమై పోయిరి. । సాదోకును లేవీయులంద
రును దేవుని నిబంధన మందసమును మోయుచు అతని
యొద్ద ఉండిరి. వారు దేవుని మందసమును దింపగా
అబ్యాతారు వచ్చి పట్టణములోనుండి జనులందరును
25 దాటిపోవు పర్యంతము నిలిచెను. । అప్పుడు రాజు
సాదోకును పిలిచి—దేవుని మందసమును పట్టణము
లోనికి తిరిగి తీసికొనిపొమ్ము; యెహోవా దృష్టికి
నేను అనుగ్రహము పొందినపక్షమున ఆయన నన్ను
26 తిరిగి రప్పించి ! దానిని తన నివాసస్థానమును నాకు
చూపించును; నీయందు నాకిష్టము లేదని ఆయన సెల
విచ్చినయెడల ఆయన చిత్తము,— నీ దృష్టికి అనుకూల
మైనట్టు నాయెడల జరిగించుమని నేను చెప్పుదునని
27 పలికి ! యాజకుడైన సాదోకుతో ఇట్లనెను—ప్రదర్శ
కుడవగు సాదోకూ, శుభమొంది నీవును నీ కుమారు
డగు అహీమయస్సు అబ్యాతారుకు పుట్టిన యోనా
తాను అను నీ యిద్దరు కుమారులును పట్టణమునకు
28 పోవలెను. । ఆలకించుము; నీయొద్దనుండి నాకు రూఢి
యైన వర్తమానము వచ్చు పర్యంతము నేను అరణ్య
29 మందలి రేవులదగ్గర నిలిచి యుందును. । కాబట్టి
సాదోకును అబ్యాతారును దేవుని మందసమును
యెరూషలేమునకు తిరిగి తీసికొనిపోయి అక్కడ నిలిచిరి.
30 అయితే దావీదు ఒలీవచెట్ల కొండ యెక్కుచు
ఏడ్చుచు, తల కప్పుకొని పాదరక్షలులేకుండ కాలి
నడకను వెళ్లెను; అతనియొద్దనున్న జనులందరును తలలు
31 కప్పుకొని యేడ్చుచు కొండ యెక్కిరి. । అంతలో
ఒకడు వచ్చి, అబ్షాలోము చేసిన కుట్రలో అహీతోపెలు
చేరియున్నాడని దావీదుకు తెలియజేయగా
దావీదు—యెహోవా అహీతోపెలుయొక్క ఆలో
32 చనను చెడగొట్టుమని ప్రార్థనచేసెను. । దేవుని ఆరా
ధించు స్థలమొకటి ఆ కొండమీద ఉండెను. వారు
అచ్చటికి రాగా అర్కీయుడైన హూషై పై వస్త్ర
ములు చింపుకొని తలమీద ధూళి పోసికొని వచ్చి
33 రాజును దర్శనము చేసెను. । రాజు — నీవు నాతో
కూడ వచ్చినయెడల నాకు భారముగా ఉందువు; ।
34 నీవు పట్టణమునకు తిరిగి పోయి—రాజా, యింతవరకు
నీ తండ్రికి నేను సేవచేసినట్లు ఇకను నీకు సేవచేసెదనని
అబ్షాలోముతో చెప్పినయెడల నీవు నా పక్షపువాడవై
యుండి అహీతోపెలుయొక్క ఆలోచనను చెడగొట్ట
గలవు. । అక్కడ యాజకులైన సాదోకును అబ్యాతా 35
రును నీకు సహాయకులుగా నుందురు; కాబట్టి రాజనగరి
యందు ఏదైనను జరుగుట నీకు వినబడినయెడల యాజ
కులైన సాదోకుతోను అబ్యాతారుతోను దాని చెప్ప
వలెను. । అహీమయస్సు అబ్యాతారు కుమారుడైన 36
యోనాతాను అను సాదోకు ఇద్దరు కుమారులు అక్కడ
నున్నారు. నీకు వినబడినదంతయు వారిచేత నా
యొద్దకు వర్తమానము చేయుమని చెప్పి అతని పంపి
వేసెను. । దావీదు స్నేహితుడైన హూషై పట్టణము 37
నకు వచ్చుచుండగా అబ్షాలోమును యెరూషలేము
చేరెను.

దావీదు కొండ శిఖరము అవతలి కొంచెము 16
దూరము వెళ్లిన తరువాత మెఫీబోషెతు సేవకుడైన
సీబా గంతలు కట్టిన రెండు గాడిదలను తీసికొని
వచ్చెను, ఇన్నూరు రొట్టెలును నూరు ద్రాక్షగెల
లును నూరు అంజూరపు అడలును ద్రాక్షారసపుతిత్తి
ఒకటియు వాటిమీద వేసి యుండెను. । రాజు—వీటి 2
నెందుకు తెచ్చితివని సీబాను అడుగగా సీబా—గాడి
దెలు రాజు ఇంటివారు ఎక్కుటకును, రొట్టెలును
అంజూరపు అడలును పనివారు తినుటకును, ద్రాక్షా
రసము అరణ్యమందు అలసటనొందినవారు త్రాగు
టకును తెచ్చితిననగా । రాజు — నీ యజమానుని 3
కుమారుడు ఎక్కడ నున్నాడని అడిగెను. అందుకు
సీబా — చిత్తగించుము, ఈవేళ ఇశ్రాయేలీయులు —
తన తండ్రి రాజ్యమును తనకు మరల యిప్పించెదరను
కొని అతడు యెరూషలేములో నిలిచి యున్నాడ
నెను. । అందుకు రాజు మెఫీబోషెతునకు కలిగినదంతయు 4
నీదేయని సీబాతో చెప్పగా సీబా—నా యేలినవాడా
రాజా, నీ దృష్టియందు నేను అనుగ్రహము పొందు
దును గాక, నేను నీకు నమస్కారము చేయుచున్నా
ననెను.

రాజైన దావీదు బహూరీము దాపునకు వచ్చినప్పుడు 5
సౌలు కుటుంబికుడగు గెరా కుమారుడైన షిమీ అను
నొకడు అచ్చటనుండి బయలుదేరి వచ్చెను; అతడు
వెంటవెంట నడుచుచు దావీదును శపించుచు । జను 6
లందరును బలాఢ్యులందరును దావీదు ఇరుప్రక్క
ల నుండగా రాజైన దావీదుమీదను అతని సేవకు
లందరిమీదను రాళ్లు రువ్వుచు వచ్చెను. । ఈ షిమీ—. 7
నరహంతకుడా దుర్మార్గుడా । ఛీపో, ఛీపో, — నీవేల 8
వలెనని నీవు వెళ్లగొట్టిన సౌలు ఇంటివారి హత్యను
యెహోవా నీ మీదికి రప్పించి, యెహోవా నీ
కుమారుడైన అబ్షాలోము చేతికి రాజ్యమును అప్ప
గించి యున్నాడు; నీవు నరహంతకుడవు గనుక నే
నీ మోసములో నీవు చిక్కుబడి యున్నావని చెప్పి
రాజును శపింపగా । సెరూయా కుమారుడైన అబీషై 9

—ఈ చచ్చిన కుక్క నా యేలినవాడవును రాజవు
నగు నిన్ను శపింపనేల? నీ చిత్తమైతే నేను వాని చేర
10 బోయి వాని తల ఛేదించి వచ్చెదననెను. । అందుకు
రాజు—సెరూయా కుమారులారా, మీకును నాకును
ఏమి పొందు? వాని శపింపనియ్యుడి, దావీదును
శపింపుమని యెహోవా వానికి సెలవియ్యగా—నీవు
ఈలాగున నెందుకు చేయుచున్నావని ఆక్షేపణ చేయ
11 గలవాడెవడని చెప్పి । అబీషైతోను తన సేవకులందరి
తోను పలికినదేమనగా—నా కడుపునబుట్టిన నా
కుమారుడే నా ప్రాణము తీయ చూచుచుండగా ఈ
బెన్యామీయుడు ఈ ప్రకారము చేయుట ఏమి
ఆశ్చర్యము? వానిజోలి మానుడి, యెహోవా వానికి
సెలవిచ్చి యున్నాడు గనుక వాని శపింపనియ్యుడి. ।
12 యెహోవా నా శ్రమను లక్ష్యపెట్టునేమో, వాడు
పలికిన శాపమునకు బదులుగా యెహోవా నాకు
13 మేలు చేయునేమో. । అంతట దావీదును అతని
వారును మార్గమున వెళ్లిపోయిరి. వారు వెళ్లిపోవు
చుండగా షిమీ అతనికెదురుగా కొండప్రక్కను
పోవుచు అతనిమీదికి రాళ్లు విసురుచు ధూళి యెగర
14 గొట్టుచునుండెను. । రాజును అతనితోకూడనున్న
జనులందరును బడలినవారై యొకానొక చోటికి వచ్చి
అలసట తీర్చుకొనిరి.
15 అబ్షాలోమును ఇశ్రాయేలువారందరును అహీతో
16 పెలును యెరూషలేమునకు వచ్చి యుండిరి. । దావీ
దుతో స్నేహముగానున్న అర్కీయుడైన హూషై
యనునతడు అబ్షాలోమునొద్దకు వచ్చి అతని దర్శించి
—రాజు చిరంజీవియగు గాక రాజు చిరంజీవియగు
17 గాక అని పలుకగా । అబ్షాలోము—నీ స్నేహితునికి
నీవు చేయు ఉపకారమింతేనా? నీ స్నేహితునితో
కూడ నీవు వెళ్లకపోతివేమని అతని నడుగగా ।
18 హూషై—యెహోవాయును ఈ జనులును ఇశ్రా
యేలీయులందరును ఎవని కోరుకొందురో నేను అతని
19 వాడనగుదును, అతనియొద్దనే యుందును. । మరియు
నేనెవనికి సేవచేయవలెను? అతని కుమారుని సన్నిధిని
నేను సేవచేయవలెను గదా? నీ తండ్రి సన్నిధిని నేను
సేవచేసినట్లు నీ సన్నిధిని నేను సేవచేయుదునని అబ్షా
20 లోమునొద్ద మనవి చేసెను. । అబ్షాలోము అహీతో
పెలును పిలువనంపి—మనము చేయవలసిన పని ఏదో
తెలిసికొనుటకై ఆలోచన చేతము రమ్ము అనగా ।
21 అహీతోపెలు—నీ తండ్రిచేత ఇంటికి కావలి యుంచ
బడిన ఉపపత్నులయొద్దకు నీవు పోయినయెడల నీవు
నీ తండ్రికి అసహ్యుడవైతివని ఇశ్రాయేలీయులందరు
తెలిసికొందురు, అప్పుడు నీ పక్షమున నున్నవారం
22 దరు ధైర్యము తెచ్చుకొందురని చెప్పెను. । కాబట్టి
మేడమీద వారు అబ్షాలోమునకు గుడారము వేయగా
ఇశ్రాయేలీయులకందరికి తెలియునట్లుగా అతడు తన
తండ్రి ఉపపత్నులను కూడెను. । ఆ దినములలో 23
అహీతోపెలు చెప్పిన యే యాలోచనయైనను ఒకడు
దేవునియొద్ద విచారణచేసి పొందిన ఆలోచనయైన
ట్టుగా ఉండెను; దావీదును అబ్షాలోమును దానిని
అట్లే యెంచుచుండిరి.

దావీదు అలసట నొంది బలహీనముగా నున్నాడు 17
గనుక—నేను అతనిమీద పడి అతని బెదరించినయెడల 2
అతనియొద్దనున్న జనులందరు పారిపోదురు; రాజును 3
మాత్రము హతముచేసి జనులనందరిని నీతట్టు త్రిప్పె
దను; నీవు వెదకు మనిషిని నేను పట్టుకొనగా జను
లందరు వచ్చి నీతో సమాధానపడుదురు గనుక నీ
చిత్తమైతే నేను పన్నెండు వేలమందిని ఏర్పరచుకొని
పోయి యీ రాత్రి దావీదును తరిమి పట్టుకొందునని
అహీతోపెలు అబ్షాలోముతో చెప్పగా । ఈ బోధ 4
అబ్షాలోమునకును ఇశ్రాయేలువారి పెద్దలకందరికిని
యుక్తముగా కనబడెను.

అంతట—అర్కీయుడైన హూషై యేమి చెప్పునో 5
మనము వినునట్లు అతని పిలువనంపుడని అబ్షాలోము
ఆజ్ఞ ఇయ్యగా, హూషై అబ్షాలోమునొద్దకు వచ్చె
ను. । అబ్షాలోము అహీతోపెలు చెప్పిన ఆలోచన 6
అతనికి తెలియజేసి—అతని మాటచొప్పున మనము
చేయుదమా చేయకుందుమా? నీ యాలోచన యేమైనది
చెప్పుమని అతని నడుగగా । హూషై అబ్షాలో 7
ముతో ఇట్లనెను. ఈసారి అహీతోపెలు చెప్పిన ఆలో
చన మంచిది కాదు. । నీ తండ్రియు అతని పక్షమున 8
నున్నవారును మహా బలాఢ్యులనియు, అడవిలో పిల్ల
లను పోగొట్టుకొనిన యెలుగుబంట్లవంటివారై రేగిన
మనస్సుతో ఉన్నారనియు నీకు తెలియును. మరియు
నీ తండ్రి యుద్ధమునందు ప్రవీణుడు, అతడు జను
లతో కూడ బసచేయడు. । అతడేదో యొక గుహ 9
యందో మరి ఏ స్థలమందో దాగి యుండును. కాబట్టి
నీవారిలో కొందరు యుద్ధారంభమందు కూలగా చూచి
జనులు వెంటనే ఆ సంగతినిబట్టి అబ్షాలోము పక్ష
మున నున్నవారు ఓడిపోయిరని చెప్పుకొందురు. । నీ 10
తండ్రి మహా బలాఢ్యుడనియు, అతని పక్షపువారు
శౌర్యవంతులనియు ఇశ్రాయేలీయులందరును ఎరుగు
దురు గనుక సింహపుగుండెవంటి గుండెగలవారు సహి
తము దిగులొందుదురు. । కాబట్టి నా ఆలోచన యే 11
మనగా, దానునుండి బెయేర్షెబావరకు లెక్కకు సము
ద్రపు ఇసుకరేణువులంత విస్తారముగా ఇశ్రాయేలీ
యులనందరిని నలుదిశలనుండి నీయొద్దకు సమకూర్చి
నీవు స్వయముగా యుద్ధమునకు పోవలెను. । అప్పుడు 12
మనము అతడు కనబడిన స్థలములలో ఏదోయొక
దానియందు అతనిమీద పడుదుము; నేలమీద మంచు
పడురీతిగా మనము అతనిమీదికి [illegible] అతని
పక్షపువారిలో ఒకడును

13 అతడు ఒక పట్టణములో చొచ్చినపక్షమున ఇశ్రా
యేలీయులందరును ఆ పట్టణమునకు త్రాళ్లు తీసికొని
వచ్చి యొక చిన్నరాయి అచ్చట కనబడకుండ దానిని
14 నదిలోనికి లాగుదుము. । అబ్షాలోమును ఇశ్రాయేలు
వారందరును ఈ మాట విని అర్కీయుడగు హూషై
చెప్పిన ఆలోచన అహీతోపెలు చెప్పినదానికంటె
యుక్తమని యొప్పుకొనిరి; ఏలయనగా యెహోవా
అబ్షాలోముమీదికి ఉపద్రవమును రప్పింప గలందు
లకై అహీతోపెలు చెప్పిన యుక్తిగల ఆలోచనను
వ్యర్థముచేయ నిశ్చయించి యుండెను.
15 కాబట్టి హూషై అబ్షాలోమునకును ఇశ్రాయేలు
వారి పెద్దలకందరికిని అహీతోపెలు చెప్పిన ఆలోచ
నను తాను చెప్పిన ఆలోచనను యాజకులగు సాదోకు
16 తోను అబ్యాతారుతోను తెలియజెప్పి ।—మీరు
త్వరపడి ఈ రాత్రి అరణ్యమందు ఏరు దాటు స్థల
ములలో ఉండవద్దనియు, రాజును అతని సమక్షమం
దున్న జనులందరును నశింపకుండునట్లు శీఘ్రముగా
వెళ్లిపోవలెననియు దావీదుకు వర్తమానము పంపుడని
17 చెప్పెను. । తాము పట్టణముతట్టు వచ్చిన సంగతి
తెలియబడకుండునట్లు యోనాతానును అహిమ
యస్సును ఏన్రోగేలు దగ్గర నిలిచియుండగా పని
కత్తె యొకతె వచ్చి, హూషై చెప్పిన సంగతిని వారికి
తెలియజేయగా వారు వచ్చి రాజైన దావీదుతో దాని
18 తెలియజెప్పిరి. । తాము వారిని కనుగొనిన సంగతి పని
వాడు ఒకడు అబ్షాలోముకు తెలిపెను గాని వారిద్దరు
వేగిరముగా పోయి బహూరీములో ఒకని యిల్లు
చేరి అతని యింటి ముంగిట ఒక బావి యుండగా
19 దానిలో దిగి దాగి యుండిరి. । ఆ యింటి యిల్లాలు
ముతకగుడ్డ యొకటి తీసికొనివచ్చి బావిమీద పరిచి
దానిపైన గోధుమపిండి ఆరబోసెను గనుక వారు
20 దాగిన సంగతి యెవరికిని తెలియకపోయెను. । అబ్షా
లోము సేవకులు ఆ యింటి ఆమెయొద్దకు వచ్చి అహిమ
యస్సును యోనాతానును ఎక్కడ ఉన్నారని అడు
గగా ఆమె—వారు ఏరుదాటి పోయిరని వారితో
చెప్పెను గనుక వారు పోయి వెదకి వారిని కానక
21 యెరూషలేమునకు తిరిగి వచ్చిరి. । వారు వెళ్లిన తరువాత
యోనాతానును అహిమయస్సును బావిలోనుండి బయ
టికి వచ్చి దావీదు నొద్దకు పోయి అహీతోపెలు అతని
మీద చేసిన ఆలోచన తెలియజేసి—నీవు లేచి త్వరగా
22 నది దాటవలసినదని అతనితో చెప్పగా । దావీదును
అతనియొద్దనున్న జనులందరును లేచి యొర్దానునది
దాటిరి, తెల్లవారునప్పటికి నది దాటక యుండినవాడు
23 ఒకడును లేకపోయెను. । అహీతోపెలు తాను చెప్పిన
ఆలోచన జరుగకపోవుట చూచి, గాడిదెను గంతకట్టి
యెక్కి తన ఊరనున్న తన యింటికి పోయి తన
యిల్లు చక్కబెట్టుకొని ఉరి పోసికొని చనిపో
యెను; జనులు అతని తండ్రి సమాధియందు అతని
పాతిపెట్టిరి.

దావీదు మహనయీమునకు రాగా అబ్షాలోమును 24
ఇశ్రాయేలీయులందరును యొర్దాను నది దాటి వచ్చిరి. ।
అబ్షాలోము యోవాబుకు మారుగా అమాశాను సైన్యా 25
ధిపతిగా నియమించెను. ఈ అమాశా ఇత్రా అను
ఇశ్రాయేలీయుడు యోవాబు తల్లియగు సెరూయాకు
సహోదరియగు నాహాషు కుమార్తెయగు అబీగయీలు
నొద్దకు పోయినందున పుట్టినవాడు. । అబ్షాలోమును 26
ఇశ్రాయేలీయులును గిలాదుదేశములో దిగియుండిరి.

దావీదు మహనయీమునకు వచ్చినప్పుడు అమ్మోనీ 27
యుల రబ్బా పట్టణపువాడైన నాహాషు కుమారుడగు
షోబీయును, లోదెబారు ఊరివాడగు అమ్మీయేలు
కుమారుడైన మాకీరును, రోగెలీము ఊరివాడును గిలా
దీయుడునైన బర్జిల్లయియు । అరణ్యమందు జనులు 28
అలసినవారై ఆకలిగొని దప్పిగొనియుందురని తలంచి,
పరుపులు పాత్రలు కుంచెలు గోధుమలు యవలు
పిండి వేచిన గోధుమలు కాయధాన్యములు చిక్కుడు
కాయలు పేలాలు । తేనె వెన్న గొఱ్ఱెలు జున్ను 29
ముద్దలు దావీదును అతనియొద్దనున్న జనులును భోజ
నము చేయుటకై తీసికొనివచ్చిరి.

దావీదు తనయొద్దనున్న జనులను లెక్కించి వారి 18
మీద సహస్రాధిపతులను శతాధిపతులను నిర్ణయించి ।
జనులను మూడు భాగములుగా చేసి యోవాబు చేతి 2
క్రింద ఒక భాగమును, సెరూయా కుమారుడును అబీషై
అను యోవాబు సహోదరుని చేతిక్రింద ఒక భాగ
మును, గిత్తీయుడైన ఇత్తయి చేతిక్రింద ఒక భాగ
మును ఉంచెను. దావీదు—నేను మీతోకూడ బయలు
దేరుదునని జనులతో చెప్పగా । జనులు — నీవు 3
రాకూడదు, మేము పారిపోయినను జనులు దాని లక్ష్య
పెట్టరు, మాలో సగము మంది చనిపోయినను జనులు
దాని లక్ష్యపెట్టరు, మావంటి పది వేలమందితో నీవు
సాటి; కాబట్టి నీవు పట్టణమందు నిలిచి మాకు సహా
యము చేయవలెనని అతనితో చెప్పిరి. । అందుకు 4
రాజు—మీ దృష్టికేది మంచిదో దాని చేసెదనని చెప్పి
గుమ్మపు ప్రక్కను నిలిచియుండగా జనులందరును
గుంపులై నూరుల కొలదిగాను వేల కొలదిగాను బయలు
దేరిరి. । అప్పుడు రాజు యోవాబును అబీషైని ఇత్త 5
యిని పిలిచి—నా నిమిత్తమై యౌవనుడైన అబ్షాలో
ముకు దయచూపుడని ఆజ్ఞాపించెను. జనులందరు విను
చుండగా రాజు అబ్షాలోమునుగూర్చి అధిపతుల
కందరికి ఆజ్ఞ ఇచ్చెను. । జనులు ఇశ్రాయేలువారిని 6
ఎదిరించుటకై పొలములోనికి బయలుదేరిన మీదట
యుద్ధము ఎఫ్రాయిము వనములో జరుగగా । ఇశ్రా 7
యేలువారు దావీదు సేవకులయెదుట నిలువలేక ఓడి
పోయిరి; ఆ దినమున ఇరువది వేలమంది అక్కడ హతమ

త లైరి. । యుద్ధము ఆ ప్రదేశమంతటను వ్యాపించెను;
మరియు నాటిదినమున కత్తిచేత కూలినవారికంటె
9 ఎక్కువమంది అడవిలో చిక్కుబడి నాశనమైరి. । అబ్షా
లోము కంచరగాడిదెమీద ఎక్కిపోవుచు దావీదు
సేవకులకు ఎదురాయెను; ఆ కంచరగాడిదె యొక
గొప్ప మస్తకివృక్షముయొక్క చిక్కుకొమ్మల క్రిందికి
పోయినప్పుడు అతని తల చెట్టుకు తగులుకొనినందున
అతడు ఎత్తబడి ఆకాశమునకును భూమికిని మధ్యను
వ్రేలాడుచుండగా అతని క్రిందనున్న కంచరగాడిదె
10 సాగిపోయెను. । ఒకడు దాని చూచి వచ్చి—అబ్షా
లోము మస్తకివృక్షమున వ్రేలాడుచుండుట నేను
11 చూచితినని యోవాబుతో చెప్పినప్పుడు । యోవాబు
— నీవు చూచియుంటివే, నేల కూలునట్లు నీవతని
కొట్టకపోతివేమి? నీవతని చంపినయెడల పది తులముల
వెండియు ఒక నడికట్టును నీకిచ్చియుందునని తనకు
12 సమాచారము చెప్పినవానితో అనెను. । అందుకు
వాడు—యౌవనుడైన అబ్షాలోమును ఎవడును ముట్ట
కుండ జాగ్రత్తపడుడని రాజు నీకును అబీషైకిని ఇత్తై
యికిని ఆజ్ఞనిచ్చుచుండగా నేను వింటిని; వెయ్యి తుల
ముల వెండి నా చేతిలో పెట్టినను రాజు కుమారుని
13 నేను చంపను. । మోసము చేసి నేను అతని ప్రాణము
నకు ముప్పు తెచ్చినయెడల అది రాజుకు తెలియక
పోదు, రాజు సన్నిధిని నీవే నాకు విరోధివగుదువు
14 గదా అని యోవాబుతో అనగా । యోవాబు—నీవు
చేయుదనుక నేను కాచుకొని యుందునా! అని చెప్పి
మూడు బాణములు చేత పట్టుకొని పోయి మస్తకివృక్ష
మున వ్రేలాడుచు ఇంకను ప్రాణముతోనున్న అబ్షా
15 లోముయొక్క గుండెకు గురిపెట్టి । తన ఆయుధము
లను మోయువారు పదిమంది చుట్టు చుట్టుకొని యుం
16 డగా అబ్షాలోమును కొట్టి చంపెను. । అప్పుడు జను
లను ఇక హతము చేయక విడువవలసినదని యోవాబు
బాకా ఊదింపగా ఇశ్రాయేలీయులను తరుముకొని
17 పోయిన జనులు తిరిగి వచ్చిరి. । జనులు అబ్షాలోము
యొక్క కళేబరమును ఎత్తి అడవిలో ఉన్న పెద్ద
గోతిలో పడవేసి పెద్ద రాళ్లకుప్ప దానిమీద పేర్చిన
తరువాత ఇశ్రాయేలీయులందరును తమ తమ యిండ్లకు
18 పోయిరి. । తన పేరు నిలుపుటకు తనకు కుమారులు
లేరనుకొని, అబ్షాలోము తాను బ్రదికియుండగా
ఒక స్తంభము తెచ్చి దానిని రాజు లోయలో తన
పేరట నిలువబెట్టి, అతడు ఆ స్తంభమునకు తన పేరు
పెట్టి యుండెను. నేటివరకు అబ్షాలోము స్తంభమని
దానికి పేరు.

19 సాదోకు కుమారుడైన అహిమయస్సు—నేను పరు
గెత్తికొని పోయి యెహోవా తన శత్రువులను
ఓడించి తనకు న్యాయము తీర్చిన వర్తమానము
20 రాజుతో చెప్పెదననగా । యోవాబు—ఈ దినమున
ఈ వర్తమానము చెప్ప తగదు, మరియొక దినమున
చెప్పవచ్చును; రాజు కుమారుడు మరణమాయెను
గనుక ఈ దినమున వర్తమానము తీసికొని పోత
గదని అతనితో చెప్పెను. । తరువాత కూషీని పిలిచి 21
— నీవు పోయి నీవు చూచినదానిని రాజుకు తెలియ
జేయుమనగా కూషీ యోవాబుకు నమస్కారము చేసి
పరుగెత్తికొని పోయెను. । అయితే సాదోకు కుమారు 22
డైన అహిమయస్సు—కూషీతో కూడ నేనును పరు
గెత్తికొని పోవుటకు సెలవిమ్మని యోవాబుతో మనవి
చేయగా యోవాబు—నాయనా నీవెందుకు పోవలెను?
చెప్పుటకు నీకు బహుమానము తెచ్చు విశేషమైన
సమాచారమేదియు లేదుగదా అని అతనితో అనగా ।
అతడు—ఏమైనను సరే నేను పరుగెత్తికొని పోవుదు 23
ననెను. అందుకు యోవాబు—పొమ్మని సెలవియ్యగా
అహిమయస్సు మైదానపు మార్గమున పరుగెత్తికొని
కూషీకంటె ముందుగా చేరెను.

దావీదు రెండు గుమ్మముల మధ్యను నడవలో 24
కూర్చుని యుండెను; కావలికాడు గుమ్మముపైనున్న
గోడమీదికి ఎక్కి పారచూడగా ఒంటరిగా పరుగెత్తి
కొని వచ్చుచున్న యొకడు కనబడెను. వాడు అరచి
రాజుకు ఈ సంగతి తెలియజేయగా । రాజు—వాడు 25
ఒంటరిగా ఉండినయెడల ఏదో వర్తమానము తెచ్చు
చున్నాడనెను. అంతలో వాడు పరుగుమీద వచ్చు
చుండగా । కావలికాడు పరుగెత్తికొని వచ్చు మరి 26
యొకని కనుగొని—అదిగో మరియొకడు ఒంటరిగానే
పరుగెత్తికొని వచ్చుచున్నాడని ద్వారపుతట్టు తిరిగి
చెప్పగా రాజు—వాడును వర్తమానము తెచ్చుచున్నా
డనెను. । కావలికాడు మొదటివాడు పరుగెత్తుట 27
చూడగా — వాడు సాదోకు కుమారుడైన అహి
మయస్సు అని నాకు తోచుచున్నది అనినప్పుడు
రాజు — వాడు మంచివాడు, శుభవర్తమానము తెచ్చు
చున్నాడని చెప్పెను. అంతలో । అహిమయస్సు 28
జయమని బిగ్గరగా రాజుతో చెప్పి రాజుముందర
సాష్టాంగ నమస్కారము చేసి—నా యేలినవాడవును
రాజవునగు నిన్ను చంప చూచినవారిని అప్పగించిన
నీ దేవుడైన యెహోవాకు స్తోత్రము అని చెప్పె
ను. । రాజు—బాలుడగు అబ్షాలోము క్షేమముగా 29
ఉన్నాడా? అని యడుగగా అహిమయస్సు—యో
వాబు రాజసేవకుడనైన నీ దాసుడనగు నన్ను పంపి
నప్పుడు గొప్ప అల్లరి జరుగుట నేను చూచితిని గాని
అది ఏమైనది నాకు తెలిసినదికాదని చెప్పెను. ।
అప్పుడు రాజు—నీవు ప్రక్కకు తొలగి నిలిచియుండు 30
మని వానికాజ్ఞనియ్యగా వాడు తొలగి నిలిచెను. ।
అంతలో కూషీ వచ్చి — నా యేలినవాడా రాజా, 31
నేను నీకు శుభసమాచారము తెచ్చితిని; యీ దినమున
యెహోవా నీ మీదికి వచ్చినవారినందరిని ఓడించి

32 నీకు న్యాయము తీర్చెనని చెప్పినప్పుడు । రాజు—
బాలుడైన అబ్షాలోము క్షేమముగా ఉన్నాడా? అని
యడిగెను. అందుకు కూషీ చెప్పినదేమనగా — నా
యేలినవాడవగు రాజవగు నీ శత్రువులును నీకు
హాని చేయతలచిన నీ మీదికి వచ్చినవారందరును ఆ
33 బాలునివలెనే యుందురు గాక. । అప్పుడు
రాజు బహు కలతపడి గుమ్మమునకు పైగానున్న గదికి
ఎక్కి యేడ్చుచు, సంచరించుచు—నా కుమా
రుడా అబ్షాలోమా, నా కుమారుడా అబ్షాలోమా,
అని కేకలువేయుచు, అయ్యో నా కుమారుడా, నీకు
బదులుగా నేను చనిపోయినయెడల ఎంత బాగుండును;
నా కుమారుడా అబ్షాలోమా నా కుమారుడా, అని
యేడ్చుచు పలికెను.

19 రాజు తన కుమారునిగూర్చి దుఃఖించుచు
2–5 ఏడ్చుచున్నాడను సంగతి ఆ దినమున జనులందరు విని,
యుద్ధమందు సిగ్గుతో పారిపోయిన జనులవలె వారు
నాడు దొంగతనపుకలతో వచ్చి పట్టణములో ప్రవే
శించిరి; నాటి విజయము జనులకందరికి దుఃఖమునకు
కారణమాయెను. రాజు ముఖము కప్పుకొని—అబ్షా
లోమా నా కుమారుడా అబ్షాలోమా నా కుమారుడా
నా కుమారుడా, అని కేకలువేయుచు ఏడ్చుచుండగా,
రాజు అబ్షాలోమునుగూర్చి దుఃఖించుచు ఏడ్చుచు
న్నాడను సంగతి యోవాబు విని నగరియందున్న
రాజునొద్దకు వచ్చి — నీ ప్రాణమును నీ కుమారుల
ప్రాణములను నీ కుమార్తెల ప్రాణములను నీ భార్యల
ప్రాణములను నీ ఉపపత్నుల ప్రాణములను ఈ దిన
మున రక్షించిన నీ సేవకులనందరిని నేడు సిగ్గుపరచి ।
6 నీ స్నేహితులయెడల ప్రేమ చూపక నీ శత్రువుల
యెడల ప్రేమ చూపుచు, ఈ దినమున అధిపతులును
సేవకులును నీకు ఇష్టజనులు కారని నీవు కనుపరచితివి.
మేమందరము చనిపోయి అబ్షాలోము బ్రదికియుండిన
యెడల అది నీకు ఇష్టముగనున్న మాట యీ దినమున
నేను తెలిసికొనుచున్నాను. ఇప్పుడు లేచి బయటికి వచ్చి
7 నీ సేవకులను ధైర్యపరచుము. । నీవు బయటికి రాక
యుండిన పక్షమున ఈ రాత్రి యొకడును నీయొద్ద
నిలువడని యెహోవా నామమునుబట్టి ప్రమాణము
చేసి చెప్పుచున్నాను; నీ బాల్యమునుండి నేటివరకు
నీకు ప్రాప్తించిన అపాయము లన్నిటికంటె అది నీకు
కష్టతరముగా ఉండునని రాజుతో మనవి చేయగా
రాజు లేచి వచ్చి గుమ్మములో కూర్చుండెను.
8 రాజు గుమ్మములో కూర్చున్నాడను మాట జను
లందరు విని రాజును దర్శింప వచ్చిరిగాని ఇశ్రాయేలు
9 వారు తమ తమ యిండ్లకు పారిపోయిరి. । అంతట
ఇశ్రాయేలువారి గోత్రములకు చేరికైన జనులందరు
ఇట్లనుకొనిరి — మన శత్రువుల చేతిలోనుండియు,
ఫిలిష్తీయుల చేతిలోనుండియు మనలను విడిపించిన
రాజు అబ్షాలోమునకు భయపడి దేశములోనుండి పారి
పోయెను. । మనమీద మనము రాజుగా పట్టాభి 10
షేకము చేసిన అబ్షాలోము యుద్ధమందు మరణ
మాయెను. కాబట్టి మనము రాజును మరల తోడు
కొని రాకుండుటకు హేతువేమి?

రాజైన దావీదు ఇది విని యాజకులగు సాదో 11
కుకును అబ్యాతారుకును వర్తమానము పంపి—ఇశ్రా
యేలువారందరు మాటలాడుకొను సంగతి నగరిలో
నున్న రాజుకు వినబడెను గనుక రాజును నగరికి మరల
తోడుకొని రాకుండ మీరెందుకు ఆలస్యము చేయు
చున్నారు? । మీరు నాకు ఎముక నంటినట్టియు మాం 12
సము నంటినట్టియు సహోదరులైయుండగా రాజును
తోడుకొని రాకుండ మీరెందుకు ఆలస్యము చేయు
చున్నారని యూదావారి పెద్దలతో చెప్పుమని ఆజ్ఞ
ఇచ్చెను. । మరియు అమాశాయొద్దకు మనుష్యులను పంపి 13
—నీవు నాకు ఎముక నంటిన బంధువుడవును మాంసము
నంటిన బంధువుడవు కావా? యోవాబునకు బదులు
నిన్ను సైన్యాధిపతిగా నేను ఖాయపరచనియెడల
దేవుడు గొప్ప అపాయము నాకు కలుగజేయును గాక ని
చెప్పుడనెను. । అతడు పోయి యెవరును తప్పింపక 14
యూదావారినందరిని రాజుకు ఇష్టపూర్వకముగా
లోబడునట్లు చేయగా—నీవును నీ సేవకులందరును
మరల రావలెనన్న వర్తమానము వారు రాజునొద్దకు
పంపిరి. రాజు తిరిగి యొర్దాను నదియొద్దకు రాగా ।
యూదావారు రాజును ఎదుర్కొనుటకును రాజును 15
నది యివతలకు తోడుకొని వచ్చుటకును గిల్గాలునకు
వచ్చిరి.

అంతలో బహూరీమునందున్న బెన్యామీనీయు 16
డగు గెరా కుమారుడైన షిమీ త్వరపడి రాజైన దావీ
దును ఎదుర్కొనుటకై యూదావారితో కూడ వచ్చెను. ।
అతనియొద్ద వెయ్యిమంది బెన్యామీనీయులు ఉండిరి. 17
మరియు సౌలు కుటుంబమునకు సేవకుడైన సీబా
యును అతని పదునయిదుగురు కుమారులును అతని
యిరువదిమంది దాసులును వచ్చి । రాజు ఎదుట నది 18
దాటిరి; రాజు ఇంటివారిని అవతలకు దాటించుటకును
రాజు దృష్టికి అనుకూలమైనదానిని చేయుటకును రేవు
పడవను ఇవతలకు తెచ్చియుండిరి. అంతట గెరా కుమా
రుడగు షిమీ వచ్చి రాజు యొర్దానునది దాటిపోగానే
అతనికి సాష్టాంగపడి ।—నా యేలినవాడా, నేను చేసిన 19
ద్రోహము నామీద మోపకుము; నా యేలినవాడ
వును రాజవునగు నీవు యెరూషలేమును విడిచిన వేళ
నీ దాసుడనగు నేను మూర్ఖించి చేసిన దోషమును
జ్ఞాపకమందుంచకుము, మనస్సునందుంచుకొనకుము. ।
నేను పాపము చేసితినని నాకు తెలిసినది గనుక యోసే 20
పు వారందరితోకూడ నా యేలినవాడవును రాజవు
నగు నిన్ను ఎదుర్కొనుటకై నేను ముందుగా వచ్చి

21 యనుచున్నాననెను. అంతట సెరూయా కుమారుడగు
అబీషై—యెహోవా అభిషేకించినవానిని శపించిన
యీ షిమీ మరణమునకు పాత్రుడు కాడా అని
22 యనగా । దావీదు — సెరూయా కుమారులారా
మీకును నాకును ఏమి పొందు? ఇట్టి సమయమున
మీరు నాకు విరోధులగుదురా? ఇశ్రాయేలువారిలో
ఎవనికైనను ఈ దినమున మరణశిక్ష నొందుదురా?
యిప్పుడు నేను ఇశ్రాయేలువారిమీద రాజనైతినను
సంగతి నాకు తెలిసేయున్నదని చెప్పి ప్రమాణము
23 చేసి । — నీకు మరణశిక్ష విధింపనని షిమీతో సెల
విచ్చెను.
24 మరియు సౌలు కుమారుడగు మెఫీబోషెతు రాజును
ఎదుర్కొనుటకు వచ్చెను. రాజు పారిపోయిన దినము
మొదలుకొని అతడు సుఖముగా తిరిగి వచ్చిన నాటి
వరకు అతడు కాళ్లు కడుగుకొనకయు, గడ్డము కత్తి
రించుకొనకయు బట్టలు ఉదుకుకొనకయు నుండెను. ।
25 రాజును ఎదుర్కొనుటకై అతడు యెరూషలేమునకు
రాగా రాజు — మెఫీబోషెతూ, నీవు నాతోకూడ
26 రాకపోతివేమని అతని నడిగెను. । అందుకతడు—నా
యేలినవాడా రాజా, నీ దాసుడనైన నేను కుంటి
వాడను గనుక గాడిదమీద గంత కట్టించి యెక్కి
రాజుతోకూడ వెళ్లిపోదునని నేననుకొనగా నా పని
27 వాడు నన్ను మోసము చేసెను. । సీబా నీ దాసుడ
నైన నన్నుగూర్చి నా యేలినవాడవును రాజవునగు
నీతో అబద్ధమాడెను. అయితే నా యేలినవాడవును
రాజవునగు నీవు దేవదూత వంటివాడవు, నీ దృష్టికి
28 ఏది యనుకూలమో దాని చేయుము. । నా తండ్రి
యింటివారందరు నా యేలినవాడవును రాజవునగు నీ
దృష్టికి మృతుల వంటివారై యుండగా, నీవు నీ బల్ల
యొద్ద భోజనము చేయువారిలో నీ దాసుడనైన నన్ను
చేర్చితివి. కాబట్టి ఇకను రాజవైన నీకు మొఱ్ఱపెట్టు
29 టకు నాకేమి న్యాయమని అనగా । రాజు—నీ సంగ
తులను నీవిక ఎందుకు ఎత్తెదవు? నీవును సీబాయును
భూమిని పంచుకొనుడని నేనాజ్ఞ ఇచ్చితిని గదా
30 అనెను. । అందుకు మెఫీబోషెతు—నా యేలినవాడ
వగు నీవు నీ నగరికి తిరిగి క్షేమముగా వచ్చియున్నావు
గనుక అతడు అంతయు తీసికొన వచ్చుననెను.
31 మరియు గిలాదీయుడగు బర్జిల్లయి రోగెలీమునుండి
యొర్దాను అద్దరికి వచ్చి రాజుతోకూడ నది దాటెను. ।
32 బర్జిల్లయి యెనుబది సంవత్సరముల వయస్సుకలిగి బహు
ముసలివాడై యుండెను. అతడు అధిక ఐశ్వర్యవం
తుడు గనుక రాజు మహనయీములో నుండగా అత
నికి భోజనపదార్థములను పంపించుచు వచ్చెను. ।
33 యెరూషలేములో నాయొద్ద నిన్ను నిలిపి పోషించె
దను, నీవు నాతోకూడ నది దాటవలెనని రాజు బర్జిల్ల
34 యితో సెలవియ్యగా । బర్జిల్లయి—రాజవగు నీతో
కూడ యెరూషలేమునకు వచ్చుటకు ఇక నేనెన్ని దిన
ములు బ్రదుకబోవుదును? । నేటికి నాకు ఎనుబది 35
యేండ్లాయెను. సుఖదుఃఖములకున్న భేదమును నేను
గుర్తింపగలనా? అన్నపానముల రుచి నీ దాసుడనైన
నేను తెలిసికొనగలనా? గాయకులయొక్కయు గాయకు
రాండ్రయొక్కయు స్వరము నాకు వినబడునా? కావున
నీ దాసుడనగు నేను నా యేలినవాడవును రాజవునగు
నీకు ఎందుకు భారముగా నుండవలెను? । నీ దాసుడ 36
నైన నేను నీతోకూడ నది దాటి అవతలకు కొంచెము
దూరము వచ్చెదను గాని రాజవగు నీవు నాకంత
ప్రత్యుపకారము చేయనేల? । నేను నా ఊరియం 37
దుండి మరణమై నా తలిదండ్రుల సమాధియందు
పాతిపెట్టబడుటకై అచ్చటికి తిరిగి పోవునట్లు నీ
దాసుడనైన నాకు సెలవిమ్ము, చిత్తగించుము, నీ దాసుడగు
కింహాము నా యేలినవాడవును రాజవునగు నీతోకూడ
వచ్చుటకు సెలవిమ్ము; నీ దృష్టికి ఏది యనుకూలమో
దానిని అతనికి చేయుమని మనవిచేయగా । రాజు— 38
కింహాము నాతోకూడ రావచ్చును, నీ దృష్టికి అను
కూలమైనదానిని నేను అతనికి చేసెదను, మరియు
నావలన నీవు కోరునదంతయు నేను చేసెదనని సెల
విచ్చెను. । జనులందరును రాజును నది యవతలకు 39
రాగా రాజు బర్జిల్లయిని ముద్దుపెట్టుకొని దీవించెను;
తరువాత బర్జిల్లయి తన స్థలమునకు వెళ్లిపోయెను.
యూదావారందరును ఇశ్రాయేలువారిలో సగము 40
మందియు రాజును తోడుకొని రాగా రాజు కింహా
మును వెంటబెట్టుకొని గిల్గాలుకు వచ్చెను. । ఇట్లుం 41
డగా ఇశ్రాయేలువారందరును రాజునొద్దకు వచ్చి —
మా సహోదరులగు యూదావారు ఎందుకు నిన్ను
దొంగిలించుకొని, నీ యింటివారిని నీవారిని యొర్దాను
ఇవతలకు తోడుకొని వచ్చిరని యడుగగా । యూదా 42
వారందరు — రాజు మాకు సమీపబంధువుడై యు
న్నాడు గదా, మీకు కోపమెందుకు? ఆలాగుండినను
మాలో ఎవరమైనను లాభము పొందితిమా? మాకొరకు
మేమేదైన నపహరించితిమా? అని ఇశ్రాయేలువారితో
అనిరి. । అందుకు ఇశ్రాయేలువారు—రాజులో మాకు 43
పది భాగములున్నవి; మీకంటె మేము దావీదునందు
అధిక స్వాతంత్ర్యముగలవారము; రాజును తోడుకొని
వచ్చుటనుగురించి మీతో ముందుగా మాటలాడిన
వారము మేమే గదా? మీరు మమ్మును నిర్లక్ష్యము
చేసితిరేమి? అని యూదావారితో పలికిరి. యూదా
వారి మాటలు ఇశ్రాయేలువారి మాటలకంటె కఠిన
ముగా ఉండెను.

బెన్యామీనీయుడగు బిక్రి కుమారుడైన షెబ **20**
యను దుర్మార్గుడొకడు అచ్చటనుండెను. వాడు—
దావీదునందు మనకు భాగము లేదు, యెష్షయి కుమా
రునియందు మనకు స్వాస్థ్యము ఎంతమాత్రమును

లేదు; ఇశ్రాయేలువారలారా, మీరందరు మీ మీ
కాపురస్థలములకు పొండని బాకా ఊది ప్రకటన
2 చేయగా । ఇశ్రాయేలువారందరు దావీదును విడిచి
బిక్రి కుమారుడైన షెబను వెంబడించిరి. అయితే
యొర్దాను నదినుండి యెరూషలేమువరకు యూదా
3 వారు రాజును హత్తుకొనిరి. । దావీదు యెరూషలేము
లోని తన నగరికి వచ్చి, తన యింటికి తాను కాపుగా
నుంచిన తన ఉపపత్నులైన పదిమంది స్త్రీలను తీసి
[illegible] వారిని కావలిలో ఉంచి వారిని పోషించుచుం
డెను గాని వారియొద్దకు పోకుండెను; వారు కావలి
యందుంచబడినవారై బ్రదికినంతకాలము విధవరాండ్ర
వలె ఉండిరి.
4 తరువాత రాజు అమాశాను పిలువనంపి—మూడు
దినములలోగా నీవు నా దగ్గరకు యూదావారినంద
రిని సమకూర్చి యిక్కడ హాజరుకమ్మని ఆజ్ఞాపింపగా ।
5 అమాశా యూదావారిని సమకూర్చుటకై వెళ్లి
పోయెను. అతడు ఆలస్యము చేసినందున అతనికి
6 నిర్ణయించిన కాలము మీరిపోయినప్పుడు । దావీదు
అబీషైని పిలువనంపి—బిక్రి కుమారుడైన షెబ అబ్షా
లోముకంటె మనకు ఎక్కువ కీడు చేయును; వాడు
ప్రాకారములుగల పట్టణములలో చొచ్చి మనకు
దొరకక పోవునేమో గనుక నీవు నీ యేలినవాని
సేవకులను వెంటపెట్టుకొని పోయి వాని తరిమి
7 పట్టుకొనుమని ఆజ్ఞాపించెను. । కాబట్టి యోవాబు
వారును కెరేతీయులును పెలేతీయులును బలాఢ్యు
లందరును అతనితోకూడ యెరూషలేములోనుండి
బయలుదేరి బిక్రి కుమారుడగు షెబను తరుమబోయిరి. ।
8 వారు గిబియోనులో ఉన్న పెద్ద బండదగ్గరకు రాగా
అమాశా వారిని కలియవచ్చెను; యోవాబు తాను
తొడుగుకొనిన చొక్కాయకు పైన బిగించియున్న
నడికట్టుకు వరగల కత్తి కట్టుకొనియుండగా ఆ వర
9 వదులై కత్తి నేలపడెను. । అప్పుడు యోవాబు అమా
శాను చూచి—నా సహోదరా, నీవు క్షేమముగా
ఉన్నావా అనుచు, అమాశాను ముద్దుపెట్టుకొను
10 నట్లుగా కుడిచేత అతని గడ్డము పట్టుకొని । అమాశా
యోవాబు చేతిలోనున్న కత్తిని చూడకను తన్ను
కాపాడుకొనకను ఉండగా యోవాబు అతని కడు
పులో దాని గుచ్చెను; గుచ్చిన తోడనే అతని పేగులు
నేలకు జారి ఆ దెబ్బతోనే అతడు చనిపోయెను.
యోవాబును అతని సహోదరుడగు అబీషైయును
బిక్రి కుమారుడగు షెబను తరుముటకు సాగిపోగా ।
11 యోవాబు బంటులలో ఒకడు అతనిదగ్గర నిలిచి —
యోవాబుకు ఇష్టులై దావీదు పక్షముననున్నవారం
దరు యోవాబును వెంబడించుడని ప్రకటనచేసెను. ।
12 అమాశా రక్తములో పొర్లుచు మార్గమున పడియుం
డగా అచ్చోటికి వచ్చిన జనులందరు నిలిచియుండుట
ఆ మనుష్యుడు చూచి—అమాశాను మార్గమునుండి
చేనిలోనికి లాగి, మార్గస్థులందరు నిలిచి తేరిచూడ
కుండ శవముమీద బట్ట కప్పెను. । శవము మార్గము 13
నుండి తీయబడిన తరువాత జనులందరు బిక్రి కుమారు
డగు షెబను తరుముటకై యోవాబు వెంబడి వెళ్లిరి. ।
అతడు ఇశ్రాయేలు గోత్రపువారందరియొద్దకును 14
ఆబేలువారియొద్దకును బేత్మయకావారియొద్దకును బెరీ
యులందరియొద్దకును రాగా వారు కూడుకొని అతని
వెంబడించిరి । ఈ ప్రకారము వారు వచ్చి ఆబేలు 15
బేత్మయకాయందు బిక్రిని ముట్టడివేసి పట్టణపు ప్రాకా
రము ఎదుట బురుజు కట్టగా యోవాబువారందరు
ప్రాకారమును పడగొట్టి పాడు చేసిరి. । అప్పుడు 16
యుక్తిగల యొక స్త్రీ ప్రాకారము ఎక్కి—ఓహో
ఆలకించుడి, ఆలకించుడి, నేను అతనితో మాటలాడు
నట్లు యోవాబును ఇక్కడికి రమ్మని చెప్పుడని కేక
వేయగా యోవాబు ఆమెదగ్గరకు వచ్చెను. । అంతట 17
ఆమె—యోవాబువు నీవేనా అని అతని నడుగగా
అతడు—నేనే అనెను. అందుకామె—నీ దాసురాల
నగు నేను నీతో మాటలాడుదునా అని అడుగగా
అతడు—మాటలాడు అనెను. । అంతట ఆమె— 18
పూర్వకాలమున జనులు—ఆబేలునందు సంగతి విచా
రింపవలెనని చెప్పుట కద్దు; ఆలాగున చేసి కార్యములు
ముగించుచు వచ్చిరి. । నేను ఇశ్రాయేలునందు నిమ్మళ 19
స్థులలోను యథార్థవంతులలోను చేరికైనదానను;
ఇశ్రాయేలీయుల పట్టణములలో ప్రధానమగు ఒక
పట్టణమును లయము చేయవలెనని నీవు ఉద్దేశించు
చున్నావు; యెహోవా స్వాస్థ్యమును నీ వెందుకు నిర్మూ
లము చేయుదువని చెప్పగా । యోవాబు—నిర్మూలము 20
చేయను, లయపరచను, ఆలాగున చేయనే చేయను, సం
గతి అది కానేకాదు. । బిక్రి కుమారుడగు షెబ అను 21
ఎఫ్రాయిము మన్యపువాడు ఒకడు రాజైన దావీదు
మీద ద్రోహము చేసియున్నాడు; మీరు వానిని
మాత్రము అప్పగించుడి; తోడనే నేను ఈ పట్టణము
విడిచిపోవుదునని చెప్పగా ఆమె యోవాబుతో —
చిత్తము, వాని తల ప్రాకారము పైనుండి పడవేయ
బడునని చెప్పి పోయి । తాను యోవాబుతో పలికిన 22
యుక్తిగల మాటలను జనులకందరికి తెలియజేయగా,
వారు బిక్రి కుమారుడగు షెబయొక్క తలను ఛేదించి
యోవాబు దగ్గర దాని పడవేసిరి. కాగా అతడు
బాకా ఊదించిన తరువాత జనులందరును ఆ పట్టణ
మును విడిచి యెవరి కాపురస్థలమునకు వారు పోయిరి;
యోవాబు యెరూషలేమునకు రాజునొద్దకు తిరిగి
వచ్చెను.

యోవాబు ఇశ్రాయేలు దండువారికందరికి అధి 23
పతియై యుండెను. అయితే కెరేతీయులకును పెలె
తీయులకును యెహోయాదా కుమారుడగు బెనాయా

24 అధిపతియై యుండెను. । అదోరాము పన్ను వసూలు
చేయుటయందు పనిచేయువారిమీద అధికారియై
యుండెను; అహీలూదు కుమారుడగు యెహోషా
పాతు రాజ్యపు దస్తావేజులమీద ఉండెను; షెవా
ప్రధానమంత్రి; సాదోకును అబ్యాతారును యాజ
కులు; యాయీరీయుడగు ఈరా దావీదుకు సభా
ముఖ్యుడు.

21 దావీదు కాలమున మూడు సంవత్సరములు విడువ
కుండ కరవు కలుగగా దావీదు యెహోవాతో మనవి
చేసెను. అందుకు యెహోవా ఈలాగున సెలవిచ్చెను
—సౌలు గిబియోనీయులను హతముచేసెను గనుక అతనిని
బట్టియు, నరహంతకులగు అతని యింటివారినిబట్టియు
2 శిక్షగా ఈ కరవు కలిగెను. । గిబియోనీయులు ఇశ్రా
యేలీయుల సంబంధికులు కారు, వారు అమోరీయులలో
శేషించినవారు. ఇశ్రాయేలీయులు మిమ్మును చంపమని
ప్రమాణపూర్వకముగా వారితో చెప్పియుండిరి గాని
సౌలు ఇశ్రాయేలు యూదాలవారియందు ఆసక్తిగల
3 వాడై వారిని హతము చేయ చూచుచుండెను. । రాజగు
దావీదు గిబియోనీయులను పిలువనంపి—నేను మీకేమి
చేయగోరుదురు! యెహోవా స్వాస్థ్యమును మీరు
దీవించునట్లు దోషనివృత్తికై దేనిచేత నేను ప్రాయశ్చి
4 త్తము చేయుదునని వారిని అడుగగా । గిబియోనీ
యులు — సౌలును అతని యింటివారును చేసినదాని
నిమిత్తము ప్రాయశ్చిత్తము కలుగుటకై వెండి బంగా
రులే గాని ఇశ్రాయేలీయులలో ఎవరినైనను చంపుట
యే గాని మేము కోరుటలేదనిరి. అంతట దావీదు—
మీరేమి కోరుదురో దానిని నేను మీకు చేయుదు
5 ననగా । వారు—మాకు శత్రువులై మమ్మును నాశనము
చేయుచు ఇశ్రాయేలీయుల సరిహద్దులలో ఉండకుండ
మేము లయమగునట్లు మాకు హానిచేయ నుద్దేశించిన
వాని కుమారులలో ఏడుగురిని మాకప్పగించుము ।
6 యెహోవా ఏర్పరచుకొనిన సౌలు గిబియా పట్టణ
ములో యెహోవా సన్నిధిని మేము వారిని ఉరి
తీసెదమని రాజుతో మనవిచేయగా రాజు — నేను
7 వారిని అప్పగించెదననెను. । తాను సౌలు కుమారు
డగు యోనాతానును యెహోవా నామమునుబట్టి
ప్రమాణము చేసియున్న హేతువుచేత రాజు సౌలు
కుమారుడగు యోనాతానుకు పుట్టిన మెఫీబోషెతును
8 అప్పగింపక । అయ్యా కుమార్తెయగు రిస్పా సౌలుకు కనిన
యిద్దరు కుమారులగు అర్మోనిని మెఫీబోషెతును, సౌలు
కుమార్తెయగు మెరాబు మెహోలతీయుడగు బర్జిల్లయి
కుమారుడైన అద్రీయేలుకు కనిన అయిదుగురు కుమారు
9 లను పట్టుకొని గిబియోనీయుల కప్పగించెను. । వారు ఈ
యేడుగురిని తీసికొనిపోయి కొండమీద యెహోవా
సన్నిధిని ఉరితీసిరి. ఆ యేడుగురు ఏకరీతినే చంప
బడిరి; కోతకాలమున యవలకోత యారంభమందు
వారు మరణమైరి. । అయ్యా కుమార్తెయగు రిస్పా 10
గోనెపట్ట తీసికొని కొండపైన పరచుకొని కోత కాలా
రంభము మొదలుకొని ఆకాశమునుండి వర్షము ఆ
కళేబరములమీద కురియు పర్యంతము అచ్చటనే
యుండి, పగలు ఆకాశపక్షులు వాటిమీద వాల
కుండను రాత్రి అడవిమృగములు దగ్గరకు రాకుండను
వాటిని కాచుచుండగా । అయ్యా కుమార్తెయగు రిస్పా 11
అను సౌలు ఉపపత్ని చేసినది దావీదుకు వినబడెను.।
కాబట్టి దావీదు పోయి సౌలు ఎముకలను అతని 12
కుమారుడైన యోనాతాను ఎముకలను యాబేష్గిలాదు
వారియొద్దనుండి తెప్పించెను. ఫిలిష్తీయులు గిల్బో
వలో సౌలును హతముచేసినప్పుడు వారు సౌలును
యోనాతానును బేత్షాను పట్టణపు వీధిలో వ్రేలాడ
కట్టగా యాబేష్గిలాదువారు వారి యెముకలను అచ్చట
నుండి దొంగిలి తెచ్చియుండిరి. । కావున దావీదు 13
వారియొద్దనుండి సౌలు ఎముకలను అతని కుమారు
డైన యోనాతాను ఎముకలను తెప్పించెను, రాజాజ్ఞను
బట్టి ఉరితీయబడినవారి యెముకలను జనులు సమ
కూర్చిరి. । సౌలు ఎముకలను అతని కుమారుడైన 14
యోనాతాను ఎముకలను బెన్యామీనీయుల దేశము
నకు చేరిన సేలాలోనున్న సౌలు తండ్రియగు కీషు
సమాధియందు పాతిపెట్టిరి. రాజు ఈలాగు చేసినతరు
వాత దేశముకొరకు చేయబడిన విజ్ఞాపనమును దేవు
డంగీకరించెను.

తరువాత ఫిలిష్తీయులకును ఇశ్రాయేలీయులకును 15
యుద్ధములు జరుగగా దావీదు తన సేవకులతోకూడ
దిగిపోయి ఫిలిష్తీయులతో యుద్ధము చేయునప్పుడు
అతడు సొమ్మసిల్లెను. । అప్పుడు రెఫాయీయుల సంతతి 16
వాడగు ఇష్బిబెనోబ అను ఒకడు ఉండెను. అతడు
ధరించియున్న ఖడ్గము కొత్తది, వాని యీటె మున్నూరు
తులముల యెత్తు యిత్తడిగలది—నేను దావీదును చంపెద
నని అతడు చెప్పియుండెను. । సెరూయా కుమారు 17
డైన అబీషై రాజును ఆదుకొని ఆ ఫిలిష్తీయుని కొట్టి
చంపెను. దావీదు జనులు దీని చూచి, ఇశ్రాయేలీ
యులకు దీపమగు నీవు ఆరిపోకుండునట్లు నీవు ఇక
మీదట మాతోకూడ యుద్ధమునకు రావద్దని అతని
చేత ప్రమాణము చేయించిరి.

అటుతరువాత ఫిలిష్తీయులతో గోబుదగ్గర మరల 18
యుద్ధము జరుగగా హుషాతీయుడైన సిబ్బెకై రెఫా
యీయుల సంతతివాడగు సఫును చంపెను. । తరువాత 19
గోబుదగ్గర ఫిలిష్తీయులతో ఇంకొకసారి యుద్ధము
జరుగగా అక్కడ బేత్లెహేమీయుడైన యహరేయో
రెగీము కుమారుడగు ఎల్హానాను గిత్తీయుడైన గొల్యాతు
సహోదరుని చంపెను; వాని యీటెకర్ర నేత
గాని దోనె అంత గొప్పది । ఇంకొక యుద్ధము 20
గాతుదగ్గర జరిగెను. అక్కడ మంచి యెత్తరి యొక

ఉండెను, ఒక్కొక చేతికి ఆరేసి వ్రేళ్లును, ఒక్కొక
కాలికి ఆరేసి వ్రేళ్లును, ఇరువది నాలుగు వ్రేళ్లు అతని
కుండెను. అతడును రెఫాయీయుల సంతతివాడు.
21 అతడు ఇశ్రాయేలీయులను తిరస్కరించుచుండగా
దావీదు సహోదరుడైన షిమ్యాకు పుట్టిన యోనా
22 తాను వాని చంపెను. ఈ నలుగురును గాతులో
నున్న రెఫాయీయుల సంతతివారై దావీదువలనను
అతని సేవకులవలనను హతులైరి.

**22** యెహోవా తన్ను సౌలుచేతిలోనుండియు, తన
శత్రువులందరి చేతిలోనుండియు తప్పించిన
దినమున దావీదు ఈ గీత వాక్యములను చెప్పి
యెహోవాను స్తోత్రించెను.
అతడిట్లనెను.
2 యెహోవా నా శైలము నా కోట నా రక్షకుడు.
3 నా దుర్గము నేను ఆయనను ఆశ్రయించుదును.
నా కేడెము నా రక్షణశృంగము
నా ఉన్నతదుర్గము నా ఆశ్రయస్థానము.
ఆయనే నాకు రక్షకుడు
బలాత్కారులనుండి నన్ను రక్షించువాడవు నీవే.
4 కీర్తనీయుడైన యెహోవాకు నేను మొఱ్ఱపెట్టితిని
నా శత్రువుల చేతిలోనుండి ఆయన నన్ను రక్షించెను.
5 మృత్యువుయొక్క అలలు నన్ను చుట్టుకొనగను
వరద పొర్లువలె భక్తిహీనులు నామీదికి వచ్చి నన్ను బెదరించగను
6 పాతాళపాశములు నన్ను అరికట్టగను
మరణపు ఉరులు నన్ను ఆవరించగను
7 నా శ్రమలో నేను యెహోవాకు మొఱ్ఱ పెట్టితిని
నా దేవునికి ప్రార్థన చేసితిని
ఆయన తన ఆలయములో ఆలకించి నా ప్రార్థన అంగీకరించెను
నా మొఱ్ఱ ఆయన చెవులలో చొచ్చెను.
8 అప్పుడు భూమి కంపించి అదిరెను
పరమండలపు పునాదులు వణకెను
ఆయన కోపింపగా అవి కంపించెను.
9 ఆయన నాసికారంధ్రములలోనుండి పొగ పుట్టెను
ఆయన నోటనుండి అగ్ని వచ్చి దహించెను
నిప్పు కణములను రాజబెట్టెను.
10 మేఘములను వంచి ఆయన వచ్చెను
ఆయన పాదముల క్రింద గాఢాంధకారము కమ్మియుండెను.
11 కెరూబుమీద ఎక్కి ఆయన యెగిరి వచ్చెను.
గాలి రెక్కలమీద ప్రత్యక్షమాయెను.
12 గుడారమువలె అంధకారము తనచుట్టు వ్యాపింపజేసెను.
నీటిమబ్బుల సముదాయములను ఆకాశపు దట్టపు
మేఘములను వ్యాపింపజేసెను.
ఆయన సన్నిధికాంతిలోనుండి నిప్పుకణములు పుట్టెను.
యెహోవా ఆకాశమందు గర్జించెను 14
సర్వోన్నతుడు ఉరుముధ్వని పుట్టించెను.
తన బాణములను ప్రయోగించి శత్రువులను చెదర గొట్టెను 15
మెరుపులను ప్రయోగించి వారిని తరుమువేసెను
యెహోవా గద్దింపునకు
తన నాసికారంధ్రముల శ్వాసము వడిగా
విడువగా ఆయన గద్దింపునకు
మహాసముద్రపు అడుగుభాగములు కనబడెను
భూమి పునాదులు బయలుపడెను. 16
ఉన్నతస్థలమునుండి చెయ్యి చాపి ఆయన నన్ను పట్టుకొనెను 17
నన్ను పట్టుకొని మహా జలరాసులలోనుండి తీసెను.
బలవంతులగు పగవారును, నన్ను ద్వేషించువారును, 18
నాకంటె బలిష్ఠులై యుండగా
వారి వశమునుండి ఆయన నన్ను రక్షించెను.
ఆపత్కాలమందు వారు నామీదికి రాగా 19
యెహోవా నన్ను ఆదుకొనెను.
విశాలమైన స్థలమునకు నన్ను తోడుకొని వచ్చెను.
నేను ఆయనకు ఇష్టుడను గనుక ఆయన నన్ను తప్పించెను. 20
నా నీతినిబట్టి ఆయన నాకు ప్రతిఫలమిచ్చెను 21
నా నిర్దోషత్వమునుబట్టియే నాకు ప్రతిఫలమిచ్చెను.
యెహోవా మార్గములను నేను అనుసరించుచున్నాను. 22
భక్తిహీనుడనై నా దేవుని విడిచినవాడను కాను.
ఆయన న్యాయవిధులనన్నిటిని నేను లక్ష్యపెట్టుచున్నాను 23
ఆయన కట్టడలను త్రోసివేసిన వాడనుకాను.
దోషక్రియలు నేను చేయనొల్లకుంటిని గనుక 24
ఆయన దృష్టికి యథార్థుడనైతిని.
కావున నేను నిర్దోషినై యుండుట యెహోవా చూచెను 25
తన దృష్టికి కనబడిన నా నిర్దోషత్వమునుబట్టి నాకు ప్రతిఫలమిచ్చెను.
దయగలవారియెడల నీవు దయ చూపించుదువు 26
యథార్థవంతులయెడల నీవు యథార్థవంతుడవుగా నుందువు.
సద్భావము గలవారియెడల నీవు సద్భావము చూపుదువు 27
మూర్ఖులయెడల నీవు వికటముగా నుందువు.

28 శ్రమనొందువారిని నీవు రక్షించెదవు
గర్విష్ఠులకు విరోధివై వారిని అణచివేసెదవు.
29 యెహోవా, నీవు నాకు దీపమై యున్నావు
యెహోవా చీకటిని నాకు వెలుగుగా చేయును.
30 నీ సహాయముచేత నేను సైన్యములను జయింతును
నా దేవుని సహాయమువలన నేను ప్రాకారములను
దాటుదును.
31 దేవుడు యథార్థవంతుడు
యెహోవా వాక్కు నిర్మలము
ఆయనను ఆశ్రయించువారికందరికి ఆయన కేడెము.
32 యెహోవా తప్ప దేవుడేడి?
మన దేవుడు తప్ప ఆశ్రయదుర్గమేది?
33 దేవుడు నాకు బలమైన కోటగా ఉన్నాడు
ఆయన తన మార్గమునందు యథార్థవంతులను
నడిపించును.
34 ఆయన నా కాళ్లు జింక కాళ్లవలె చేయును
ఎత్తయిన స్థలములమీద నన్ను నిలుపును.
35 నా చేతులకు యుద్ధముచేయ నేర్పువాడు ఆయనే
నా బాహువులు ఇత్తడి విల్లును ఎక్కుపెట్టును.
36 నీవు నీ రక్షణ కేడెమును నాకు అందించుదువు
నీవు నా మనవి ఆలకించి నన్ను గొప్పచేయుదువు
37 నా పాదములకు చోటు విశాలపరచుదువు
నా చీలమండలు బెణకవు.
38 నా శత్రువులను తరిమి నాశనము చేయుదును
వారిని నశింపజేయు పర్యంతము నేను తిరుగను.
39 నేను వారిని మ్రింగివేయుదును
వారిని తుత్తునియలుగా కొట్టుదును
వారు నా పాదములక్రింద పడి లేవలేక యుం
దురు.
40 యుద్ధమునకు బలము నీవు నన్ను ధరింపజేయుదువు
నామీదికి లేచినవారిని నీవు అణచివేయుదువు.
41 నా శత్రువులను వెనుకకు మళ్లచేయుదువు
నన్ను ద్వేషించువారిని నేను నిర్మూలము చేయు
దును.
42 వారు ఎదురు చూతురు గాని రక్షించువాడు
ఒకడును లేకపోవును
వారు యెహోవాకొరకు కనిపెట్టుకొనినను
ఆయన వారికి ప్రత్యుత్తరమియ్యకుండును.
43 నేల ధూళివలె వారిని నలుగగొట్టెదను పొడిగా
వారిని కొట్టెదను
వీధిలోని పెంటవలె నేను వారిని పారబోసి అణగ
ద్రొక్కెదను.
44 నా ప్రజల కలహములలో పడకుండ నీవు నన్ను
విడిపించుదువు
జనులకు అధికారిగా నన్ను నిలుపుదువు
నేను ఎరుగని జనులు నన్ను సేవించెదరు.

అన్యులు నాకు లోబడినట్లు వేషము వేయుదురు 45
వారు నన్నుగూర్చి వినిన మాత్రముచేత నాకు
విధేయులగుదురు
అన్యులు దుర్బలులై వణకుచు తమ దుర్గములను 46
విడిచి వచ్చెదరు.
యెహోవా జీవముగలవాడు 47
నా ఆశ్రయదుర్గమైనవాడు స్తోత్రార్హుడు
నాకు రక్షణాశ్రయదుర్గమైన దేవుడు మహో
న్నతుడగు గాక
ఆయన నా నిమిత్తము ప్రతిదండన చేయు దేవుడు 48
ఆయన నా నిమిత్తము పగ తీర్చు దేవుడు
జనములను నాకు లోపరచువాడు ఆయనే.
ఆయనే నా శత్రువుల చేతిలోనుండి నన్ను విడి 49
పించును
నామీదికి లేచినవారికంటె ఎత్తుగా నీవు నన్ను
హెచ్చించుదువు
బలాత్కారము చేయువారి చేతిలోనుండి నీవు
నన్ను విడిపించుదువు.
నీవు నియమించిన రాజుకు గొప్ప రక్షణ కలుగ 50
జేయువాడవనియు
అభిషేకించిన దావీదునకును అతని సంతానమునకును 51
నిత్యము కనికరము చూపువాడవనియు ప్రక
టించి
యెహోవా, అన్యజనులలో నేను నిన్ను ఘన
పరచెదను
నీ నామకీర్తన గానముచేసెదను.

దావీదు రచించిన చివరి మాటలు ఇవే; యెష్షయి **23**
కుమారుడగు దావీదు పలికిన దేవోక్తి యిదే;
యాకోబు దేవునిచేత అభిషిక్తుడై మహాధి
పత్యము నొందినవాడును ఇశ్రాయేలీయుల
స్తోత్రగీతములను మధురగానము చేసిన గాయ
కుడునగు దావీదు పలికిన దేవోక్తి యిదే.
యెహోవా ఆత్మ నా ద్వారా పలుకుచున్నాడు 2
ఆయన వాక్కు నా నోట ఉన్నది.
ఇశ్రాయేలీయుల దేవుడు సెలవిచ్చుచున్నాడు 3
ఇశ్రాయేలీయులకు ఆశ్రయదుర్గమగువాడు
నాద్వారా మాటలాడుచున్నాడు
—మనుష్యులను ఏలు నొకడు పుట్టును
అతడు నీతిమంతుడై దేవునియందు భయభక్తులు
కలిగి యేలును.
ఉదయకాలపు సూర్యోదయ కాంతివలెను 4
మబ్బులేకుండ ఉదయించిన సూర్యునివలెను
వర్షము కురిసినపిమ్మట నిర్మలమైన కాంతిచేత
భూమిలోనుండి పుట్టిన లేత గడ్డివలెను
అతడు ఉండును.
నా సంతతివారు దేవుని దృష్టికి అనుకూలులే గదా 5

ఆయన నాతో నిత్యనిబంధన చేసియున్నాడు
ఆయన నిబంధన సర్వసంపూర్ణమైన నిబంధనే
అది స్థిరమాయెను, దేవునికి పూర్ణానుకూలము
అది నాకు గ్రహింపబడిన రక్షణార్థమైనది
నిశ్చయముగా ఆయన దాని నెరవేర్చును.
6 ఒకడు ముండ్లను చేత పట్టుకొనుటకు భయపడి
నట్లు
దుర్మార్గులు విసర్జింపబడుదురు.
7 ముండ్లను పట్టుకొనువాడు ఇనుప పనిముట్టునైనను
బల్లెపు కోలనైనను వినియోగించును గదా.
మనుష్యులు వాటిలో దేనిని విడువక
అంతయు ఉన్నచోటనే కాల్చివేయుదురు.
8 దావీదు అనుచరులలో బలాఢ్యులెవరనగా యోషే
బెష్షెబెతను ముఖ్యుడగు తక్మోనీయుడు; అతడు ఒక
యుద్ధములో ఎనమన్నూరు మందిని హతముచేసెను. ।
9 ఇతని తరువాతివాడు అహోహీయుడైన దోదో
కుమారుడైన ఎలియాజరు; ఇతడు దావీదు ముగ్గురు
బలాఢ్యులలో ఒకడు. యుద్ధమునకు కూడివచ్చిన
ఫిలిష్తీయులు ఇశ్రాయేలీయులను తిరస్కరించి డీకొని
వచ్చినప్పుడు ఇశ్రాయేలీయులు వెళ్లిపోగా ఇతడు
10 లేచి । చేయి తిమ్మిరిగొని కత్తి దానికి అంటుకొని
పోవువరకు ఫిలిష్తీయులను హతము చేయుచు వచ్చెను.
ఆ దినమున యెహోవా ఇశ్రాయేలీయులకు గొప్ప
రక్షణ కలుగజేసెను. దోపుడుసొమ్ము పట్టుకొనుటకు
11 మాత్రము జనులు అతనివెనుక వచ్చిరి. । ఇతని తరు
వాతి వాడెవరనగా హరారీయుడగు ఆగేకుమారుడైన
షమ్మా; ఫిలిష్తీయులు అలచందల చేనిలో గుంపు
కూడగా జనులు ఫిలిష్తీయులయెదుట నిలువలేక పారి
12 పోయిరి. । అప్పుడితడు ఆ చేని మధ్యను నిలిచి ఫిలిష్తీ
యులు దానిమీదికి రాకుండ వారిని వెళ్లగొట్టి వారిని
హతము చేయుటవలన యెహోవా ఇశ్రాయేలీయు
13 లకు గొప్పరక్షణ కలుగజేసెను. । మరియు ముప్పది
మంది అధిపతులలో శ్రేష్ఠులైన ముగ్గురు కోతకాల
మున అదుల్లాము గుహలోనున్న దావీదునొద్దకు
వచ్చినప్పుడు ఫిలిష్తీయులు రెఫాయీము లోయలో
14 దండు దిగియుండిరి, । దావీదు దుర్గములో నుండెను,
ఫిలిష్తీయుల దండు కావలివారు బేత్లెహేములో ఉం
15 డిరి. । దావీదు — బేత్లెహేము గుమ్మము దగ్గరనున్న
బావి నీళ్లు ఎవడైనను నాకు తెచ్చి యిచ్చినయెడల
ఎంతో సంతోషించెదనని అధికాశతో పలుకగా ।
16 ఆ ముగ్గురు బలాఢ్యులు ఫిలిష్తీయుల దండు కావలి
వారిని ఓడించి, దారి చేసికొని పోయి బేత్లెహేము
గుమ్మము దగ్గరనున్న బావి నీళ్లు చేది దావీదునొద్దకు
తీసికొని వచ్చిరి; అయితే అతడు ఆ నీళ్లు త్రాగ
నొల్లక యెహోవా సన్నిధిని పోసివేసి—యెహోవా,
17 నేను ఇవి త్రాగను; । ప్రాణమునకు తెగించిపోయి
తెచ్చినవారిచేతి నీళ్లు త్రాగుదునా? అని చెప్పి త్రాగ
నొల్లకుండెను. ఆ ముగ్గురు బలాఢ్యులు ఈ కార్య
ములు చేసిరి. । సెరూయా కుమారుడును యోవాబు 18
సహోదరుడునైన అబీషై తన అనుచరులలో
ముఖ్యుడు. ఇతడొక యుద్ధములో మున్నూరుమందిని
హతముచేసి వారిమీద తన యీటెను ఆడించెను.
ఇతడు ఆ ముగ్గురిలోను పేరు పొందినవాడు. । ఇతడు 19
ఆ ముప్పదిమందిలో ఘనుడై వారికి అధిపతి యాయెను
గాని మొదటి ముగ్గురితో సమానుడు కాకపోయెను. ।
మరియు కబ్సెయేలు ఊరివాడై క్రియలచేత ఘనత 20
నొందిన యొక పరాక్రమశాలికి పుట్టిన యెహోయా
యాదా కుమారుడైన బెనాయా అను నొకడు ఉం
డెను. ఇతడు మోయాబీయుల సంబంధులగు ఆ
యిద్దరు శూరులను హతముచేసెను; మరియు మంచు
కాలమున బయలువెడలి బావిలో దాగియున్న యొక
సింహమును చంపివేసెను. । ఇంకను అతడు సౌందర్య 21
వంతుడైన యొక ఐగుప్తీయుని చంపెను. ఈ ఐగుప్తీ
యుని చేతిలో ఈటె యుండగా బెనాయా దుడ్డు
కర్ర తీసికొని వానిమీదికి పోయి వానిచేతిలోని
యీటె ఊడలాగి దానితోనే వాని చంపెను. । ఈ 22
కార్యములు యెహోయాదా కుమారుడైన బెనాయా
చేసినందున ఆ ముగ్గురు బలాఢ్యులలోను అతడు
పేరు పొంది । ఆ ముప్పదిమందిలో ఘనుడాయెను. 23
అయినను మొదటి ముగ్గురితో సమానుడు కాక
పోయెను. దావీదు ఇతనిని తన సభికులలో ఒకనిగా
నియమించెను.

ఆ ముప్పదిమంది యెవరనగా, యోవాబు సహో 24
దరుడైన అశాహేలు, బేత్లెహేమీయుడగు దోదోకు
కుమారుడగు ఎల్హానాను, । హరోదీయుడైన షమ్మా, 25
హరోదీయుడైన ఎలీకా, । పత్తీయుడైన హేలెస్సు, 26
తెకోవీయుడగు ఇక్కేషు కుమారుడైన ఈరా, । అనా 27
తోతీయుడైన అబీయెజెరు, హుషాతీయుడైన మెబు
న్నయి, । అహోహీయుడైన సల్మోను, నెటోపా 28
తీయుడైన మహరై । నెటోపాతీయుడైన బయనాకు 29
పుట్టిన హేలెబు, బెన్యామీనీయుల గిబియాలో
పుట్టిన రీబై కుమారుడైన ఇత్తయి, । పిరాతోనీయుడైన 30
బెనాయా, గాయషు ఏళ్లనడుమ నివసించు హిద్దయి, ।
అర్బాతీయుడైన అబీయల్బోను, బర్హుమీయుడైన అజ్మా 31
వెతు, । షయల్బోనీయుడైన ఎల్యహ్బా, యాషేను 32
యొక్క కుమారులలో యోనాతాను, । హరారీయు 33
డైన షమ్మా, హరారీయుడైన షారారుకు పుట్టిన అహీ
యాము, । మాయకాతీయునికి పుట్టిన అహస్బయి 34
కుమారుడైన ఎలీపేలెటు, గిలోనీయుడైన అహీతో
పెలు కుమారుడగు ఏలీయాము, । కర్మెతీయుడైన 35
హెస్రై, అర్బీయుడైన పయరై, । సోబావాడగు నాతాను 36
యొక్క కుమారుడైన ఇగాలు, గాదీయుడైన బానీ, ।

37 అమ్మోనీయుడైన శెలెకు, బెయేరోతీయుడైన నహరై,
యితడు సెరూయా కుమారుడగు యోవాబుయొక్క
38 ఆయుధములను మోయువాడై యుండెను. । ఇత్రీయు
39 డైన ఈరా, ఇత్రీయుడైన గారేబు, । హిత్తీయుడైన
ఊరియా. ఈ కోటిలో చేరినవారందరు ముప్పది
యేడుగురు.

24 ఇంకొకమారు యెహోవా కోపము ఇశ్రాయేలీ
యులమీద రగులుకొనగా ఆయన దావీదును వారి
మీదికి ప్రేరేపణచేసి—నీవు పోయి ఇశ్రాయేలువారిని
యూదావారిని లెక్కించుమని అతనికి ఆజ్ఞ ఇచ్చెను. ।
2 అందుకు రాజు తన యొద్దనున్న సైన్యాధిపతియైన
యోవాబును పిలిచి — జనసంఖ్య యెంతైనది నాకు
తెలియగలందులకై దాను మొదలుకొని బెయేర్షెబావరకు
ఇశ్రాయేలు గోత్రములలో నీవు సంచారముచేసి
3 వారిని లెక్కించుమని ఆజ్ఞ ఇయ్యగా । యోవాబు
—జనుల సంఖ్య యెంత యున్నను నా యేలినవాడ
వును రాజవునగు నీవు బ్రదికియుండగానే దేవుడైన
యెహోవా దానిని నూరంతలు ఎక్కువ చేయునుగాక;
నా యేలినవాడవును రాజవునగు నీకు ఈ కోరిక
4 ఏల పుట్టెననెను. । అయినను రాజు యోవాబుకును
సైన్యాధిపతులకును గట్టి ఆజ్ఞ ఇచ్చియుండుటచేత
యోవాబును సైన్యాధిపతులును ఇశ్రాయేలీయుల
సంఖ్య చూచుటకై రాజుసముఖమునుండి బయలు వెళ్లి।
5 యొర్దాను నది దాటి యాజేరుతట్టున గాదునది లోయ
మధ్యనుండు పట్టణపు కుడిపార్శ్వముననున్న అరో
6 యేరులో దిగి । అక్కడనుండి గిలాదుకును తహ్తీం
హొద్షీ దేశమునకును వచ్చిరి; తరువాత దానా
7 యానుకును పోయి తిరిగి సీదోనుకు వచ్చిరి. । అక్కడ
నుండి బురుజులుగల తూరు పట్టణమునకును హివ్వీ
యులయొక్కయు కనానీయులయొక్కయు పట్టణము
లన్నిటికిని వచ్చి యూదాదేశపు దక్షిణదిక్కుననున్న
8 బెయేర్షెబావరకు సంచరించిరి । ఈ ప్రకారము వారు
దేశమంతయు సంచరించి తొమ్మిదినెలలు ఇరువది దిన
9 ములకు తిరిగి యెరూషలేమునకు వచ్చిరి. । అప్పుడు
యోవాబు జనసంఖ్య వెరసి రాజునకు అప్పగించెను;
ఇశ్రాయేలువారిలో కత్తి దూయగల యెనిమిది లక్షల
మంది యోధులుండిరి; యూదావారిలో అయిదు
లక్షలమంది యుండిరి.

0 . జనసంఖ్య చూచినందుకై దావీదు మనస్సు కొట్టు
కొనగా అతడు—నేను చేసిన పనివలన గొప్ప పాపము
కట్టుకొంటిని, నేను ఎంతో అవివేకినై దాని చేసితిని;
యెహోవా, కరుణ యుంచి నీ దాసుడనైన నా
దోషమును పరిహరింపుమని యెహోవాతో మనవి
1 చేయగా । ఉదయమున దావీదు లేచినప్పుడు దావీ
దుకు దర్శకుడును ప్రవక్తయునగు గాదుకు యెహోవా
వాక్కు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను । —
నీవు పోయి దావీదుతో ఇట్లనుము — యెహోవా 12
సెలవిచ్చునదేమనగా — మూడు విషయములను నీ
యెదుట పెట్టుచున్నాను; వాటిలో ఒకదానిని నీవు
కోరుకొనినయెడల నేనది నీమీదికి రప్పించెదను. ।
కావున గాదు దావీదునొద్దకు వచ్చి యిట్లని సంగతి 13
తెలియజెప్పెను — నీవు నీ దేశమందు ఏడు సంవత్స
రములు క్షామము కలుగుటకు ఒప్పుకొందువా?
నిన్ను తరుముచున్న నీ శత్రువులయెదుట నిలువ
లేక నీవు మూడునెలలు పారిపోవుటకు ఒప్పు
కొందువా? నీ దేశమందు మూడుదినములు తెగులు
రేగుటకు ఒప్పుకొందువా? యోచనచేసి నన్ను పంపిన
వానికి నేనియ్యవలసిన యుత్తరము నిశ్చయించి తెలియ
జెప్పుమనెను. । అందుకు దావీదు — నా కేమియు 14
తోచకయున్నది, గొప్ప చిక్కులో ఉన్నాను,
యెహోవా బహు వాత్సల్యతగలవాడు గనుక మను
ష్యుని చేతిలో పడకుండ యెహోవా చేతిలోనే
పడుదుము గాక అని గాదుతో అనెను. । అందుకు 15
యెహోవా ఇశ్రాయేలీయులమీదికి తెగులు రప్పిం
చగా ఆ దినము ఉదయము మొదలుకొని సమాజ
కూటపు వేళవరకు అది జరుగుచుండెను; అందుచేత
దానునుండి బెయేర్షెబావరకు డెబ్బదివేలమంది మృతి
నొందిరి. । అయితే దూత యెరూషలేముపైని హస్తము 16
చాపి నాశనము చేయబోయినప్పుడు, యెహోవా
ఆ కీడునుగూర్చి సంతాపమొంది—అంతే చాలును, నీ
చెయ్యి తీయుమని జనులను నాశనముచేయు దూతకు
ఆజ్ఞ ఇచ్చెను. యెహోవా దూత యెబూసీయుడైన
అరౌనాయొక్క కళ్లము దగ్గర ఉండగా । దావీదు జను 17
లను నాశనము చేసిన దూతను కనుగొని యెహోవాను
ఈలాగు ప్రార్థించెను—చిత్తగించుము; పాపము చేసిన
వాడను నేనే; దుర్మార్గముగా ప్రవర్తించినవాడను
నేనే; గొఱ్ఱెలవంటి వీరేమి చేసిరి? నన్నును నా తండ్రి
యింటివారిని శిక్షించుము.

ఆ దినమున గాదు దావీదునొద్దకు వచ్చి—నీవు 18
పోయి యెబూసీయుడైన అరౌనాయొక్క కళ్లములో
యెహోవా నామమున ఒక బలిపీఠము కట్టించుమని
అతనితో చెప్పగా । దావీదు గాదుచేత యెహోవా 19
యిచ్చిన ఆజ్ఞచొప్పున పోయెను. । అరౌనా రాజును 20
అతని సేవకులును తన దాపుకువచ్చుట చూచి బయలు
దేరి రాజునకు సాష్టాంగ నమస్కారముచేసి — నా
యేలినవాడవును రాజవునగు నీవు నీ దాసుడనైన నా
యొద్దకు వచ్చిన నిమిత్తమేమని అడుగగా । దావీదు 21
—ఈ తెగులు మనుష్యులకు తగలకుండ నిలిచి పోవు
నట్లు యెహోవా నామమున ఒక బలిపీఠము కట్టించు
టకై నీయొద్ద ఈ కళ్లమును కొనవలెనని వచ్చితిననెను,।
అందుకు అరౌనా—నా [illegible] 22
యేది నీకు అనుకూలమో

నవు; చిత్తగించుము, దహనబలికి ఎద్లున్నవి, నూర్చు
మ్రానులు సామానులు కట్టెలుగా అక్కరకు వచ్చును. ।
23 రాజా, యివన్నియు అరౌనా అను నేను రాజుకు
ఇచ్చుచున్నానని చెప్పి—నీ దేవుడైన యెహోవా
నిన్ను అంగీకరించును గాక అని రాజుతో అనగా ।
24 రాజు—నేను ఆలాగు తీసికొనను, వెల యిచ్చి నీయొద్ద
కొందును, వెల యియ్యక నేను తీసికొనిన దానిని నా
దేవుడైన యెహోవాకు దహనబలిగా అర్పించనని
అరౌనాతో చెప్పి ఆ కళ్లమును ఎద్లను ఏబది తులముల
వెండికి కొనెను. । అక్కడ దావీదు యెహోవా 25
నామమున ఒక బలిపీఠము కట్టించి దహనబలులను
సమాధానబలులను అర్పించెను; యెహోవా దేశము
కొరకు చేయబడిన విజ్ఞాపనలను అంగీకరింపగా ఆ తెగులు
ఆగి ఇశ్రాయేలీయులను విడిచిపోయెను.

# రాజులు

## మొదటి గ్రంథము



1 రాజైన దావీదు బహు వృద్ధుడు కాగా సేవకులు
అతనికి ఎన్ని బట్టలు కప్పినను అతనికి వెట్ట కలుగక
2 యుండెను. । కాబట్టి వారు — షూ యేలినవాడవును
రాజవునగు నీకొరకు తగిన చిన్నదాని వెదకుట మం
చిది, ఆమె రాజైన నీ సముఖమందుండి నిన్ను ఆద
రించి వెట్ట కలుగుటకు నీ కౌగిటిలో పండుకొనునని
3 చెప్పి । ఇశ్రాయేలీయుల దేశపు దిక్కులన్నిటిలో
తిరిగి ఒక చక్కని చిన్నదాని వెదకి, అబీషగు అను
షూనేమీయురాలిని చూచి రాజునొద్దకు తీసికొని
4 వచ్చిరి. । ఈ చిన్నది బహు చక్కనిదై యుండి
రాజును ఆదరించి ఉపచారము చేయుచుండెను గాని
5 రాజు దానిని కూడలేదు. । హగ్గీతు కుమారుడైన అదో
నీయా గర్వించినవాడై — నేనే రాజునగుదునని అను
కొని, రథములను గుఱ్ఱపురౌతులను తనకు ముందుగా
పరుగెత్తుటకు ఏబదిమంది మనుష్యులను ఏర్పరచు
6 కొనెను. । అతని తండ్రి—నీవు ఈలాగున ఏల చేయు
చున్నావని అతనిచేత ఎప్పుడును విచారించి అతనికి
నొప్పి కలుగజేయలేదు. చూచుటకు అతడు బహు
సౌందర్యము గలవాడు, అబ్షాలోము తరువాత పుట్టిన
7 వాడు. । అతడు సెరూయా కుమారుడైన యోవాబు
తోను యాజకుడైన అబ్యాతారుతోను ఆలోచన
చేయగా వారు అదోనీయా పక్షము వహించి అతనికి
8 సహాయము చేసిరి గాని । యాజకుడైన సాదోకును
యెహోయాదా కుమారుడైన బెనాయయును ప్రవక్త
యైన నాతానును షిమీయును రేయీయును దావీదు
యొక్క శూరులును అదోనీయాతో కలిసికొనక
9 యుండిరి. । అదోనీయా ఏన్రోగేలు సమీపమం
దుండు జోహెలేతు అను బండదగ్గర గొఱ్ఱెలను
ఎడ్లను క్రొవ్విన దూడలను బలిగా అర్పించి, రాజ
కుమారులగు తన సహోదరులనందరిని యూదావా
రగు రాజుయొక్క సేవకులనందరిని పిలిపించెను గాని ।
10 ప్రవక్తయగు నాతానును బెనాయనును దావీదు శూరు
లను తనకు సహోదరుడైన సొలొమోనును పిలువ
11 లేదు. । అప్పుడు నాతాను సొలొమోను తల్లియైన
బత్షెబతో చెప్పినదేమనగా—హగ్గీతు కుమారుడైన అదో
నీయా యేలుచున్న సంగతి నీకు వినబడలేదా? అయితే
ఈ సంగతి మన యేలినవాడైన దావీదుకు తెలియకయే
12 యున్నది. । కాబట్టి నీ ప్రాణమును నీ కుమారుడైన
సొలొమోను ప్రాణమును రక్షించుకొనుటకై నేను
నీకొక ఆలోచన చెప్పెదను వినుము. । నీవు రాజైన 13
దావీదునొద్దకు పోయి — నా యేలినవాడా, రాజా,
అవశ్యముగా నీ కుమారుడైన సొలొమోను నా వెనుక
ఏలువాడై నా సింహాసనముమీద ఆసీనుడగునని నీ
సేవకురాలనైన నాకు నీవు ప్రమాణపూర్వకముగా సెల
విచ్చితివే; అదోనీయా యేలుచుండుట యేమని అడుగ
వలెను. । రాజుతో నీవు మాటలాడుచుండగా నేను 14
నీ వెనుక లోపలికి వచ్చి నీవు విన్నవించిన మాటలను
రూఢిపరచుదునని చెప్పెను. । కాబట్టి బత్షెబ గదిలో 15
నున్న రాజునొద్దకు వచ్చెను. రాజు బహు వృద్ధుయి
నందున షూనేమీయురాలైన అబీషగు రాజును కని
పెట్టుచుండెను. । బత్షెబ వచ్చి రాజు ఎదుట సాగిల 16
పడి నమస్కారము చేయగా రాజు—నీ కోరికె ఏమని
అడిగినందుకు ఆమె యీలాగు మనవి చేసెను । — నా 17
యేలినవాడా, నీవు నీ దేవుడైన యెహోవాతోడని
నీ సేవకురాలనైన నాకు ప్రమాణము చేసి అవశ్య
ముగా నీ కుమారుడైన సొలొమోను నా వెనుక ఏలు
వాడై నా సింహాసనముమీద ఆసీనుడగునని సెలవిచ్చి
తివే, । ఇప్పుడైతే అదోనీయా యేలుచున్నాడు. ఈ 18
సంగతి నా యేలినవాడవును రాజవునగు నీకు తెలియ
కయే యున్నది. । అతడు ఎడ్లను క్రొవ్విన దూడలను 19
గొఱ్ఱెలను బలిగా అర్పించి రాజకుమారులనందరిని
యాజకుడైన అబ్యాతారును సైన్యాధిపతియైన యోవా
బును పిలిపించెను గాని నీ సేవకుడైన సొలొమోనును
పిలువలేదు । నా యేలినవాడవైన రాజా, నా యేలిన 20
వాడవైన రాజవగు నీ తరువాత సింహాసనముమీద
ఎవడు ఆసీనుడగునో అందునుగూర్చి ఇశ్రాయేలీయు
లందరును కనిపెట్టియున్నారు. । ఇదిగాక నా యేలిన 21
వాడవైన రాజవగు నీవు నీ పితరులతోకూడ నిద్రపొం
దిన తరువాత నేనును నా కుమారుడైన సొలొమోనును
అపరాధులముగా ఎంచబడుదుము. । ఆమె రాజుతో 22
మాటలాడుచున్నప్పుడు ప్రవక్తయగు నాతానును లోప
లికి రాగా—ప్రవక్తయగు నాతాను వచ్చి యున్నాడని
సేవకులు రాజుకు తెలియజేసిరి. । అతడు రాజు సన్ని 23
ధికి వచ్చి నమస్కారము చేసి సాష్టాంగపడి । — నా 24
యేలినవాడవైన రాజా, అదోనీయా నీ తరువాత ఏలు
వాడై నీ సింహాసనముమీద కూర్చుండునని నీవు సెల

25 సెలవిచ్చితివా? । ఏలయనగా ఈ దినమున అతడు పోయి
విస్తారమైన యెద్దులను క్రొవ్విన దూడలను గొఱ్ఱెలను
బలిగా అర్పించి రాజకుమారులనందరిని సైన్యాధిపతు
లను యాజకుడైన అబ్యాతారును పిలిపింపగా వారు
వాని సముఖములో అన్నపానములు పుచ్చుకొనుచు—
రాజైన అదోనీయా చిరంజీవి యగుగాక అని పలుకు
26 చున్నారు. । అయితే నీ సేవకుడనైన నన్ను యాజకు
డైన సాదోకును యెహోయాదా కుమారుడైన బెనా
యాను నీ సేవకుడైన సొలొమోనును అతడు పిలిచిన
27 వాడు కాడు. । నా యేలినవాడవును రాజవునగు నీ
తరువాత నీ సింహాసనముమీద ఎవడు ఆసీనుడై యుం
డునో అది నీ సేవకుడనైన నాతో చెప్పక యుం
డినా? ఈ కార్యము నా యేలినవాడవును రాజవు
నగు నీ సెలవుచొప్పున జరుగుచున్నదా? అని యడి
28 గెను. । దావీదు—బత్షెబను పిలువుమని సెలవియ్యగా
ఆమె రాజు సన్నిధికి వచ్చి రాజు ఎదుట నిలువబడెను. ।
29 అప్పుడు రాజు ప్రమాణపూర్వకముగా చెప్పినదేమన
గా—నాకు కలిగిన శ్రమములలోనుండి నన్ను విడి
30 పించిన యెహోవా జీవముతోడు । అవశ్యముగా నీ
కుమారుడైన సొలొమోను నా తరువాత ఏలువాడై
నాకు ప్రతిగా నా సింహాసనముమీద ఆసీనుడగునని
ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా నామము
తోడని నేను నీకు ప్రమాణము చేసినదానిని ఈ దిన
31 మున నే నెరవేర్చుదునని చెప్పగా । బత్షెబ సాగిలపడి
రాజునకు నమస్కారము చేసి—నా యేలినవాడైన
రాజగు దావీదు సదాకాలము బ్రదుకును గాక అనెను. ।
32 అప్పుడు రాజైన దావీదు—యాజకుడైన సాదోకును
ప్రవక్తయైన నాతానును యెహోయాదా కుమారుడైన
బెనాయాను నాయొద్దకు పిలువుమని సెలవియ్యగా
33 వారు రాజు సన్నిధికి వచ్చిరి. । అంతట రాజు—మీరు
మీ యేలినవాడనైన నా సేవకులను పిలుచుకొని పోయి
నా కుమారుడైన సొలొమోనును నా కంచరగాడిదె
34 మీద ఎక్కించి గిహోనుకు తీసికొని పోయి । యాజ
కుడైన సాదోకును ప్రవక్తయైన నాతానును అక్కడ
ఇశ్రాయేలీయులమీద రాజుగా అతనికి పట్టాభి
షేకము చేసిన తరువాత మీరు బాకానాదము చేసి—
రాజైన సొలొమోను చిరంజీవి యగుగాక అని ప్రక
35 టన చేయవలెను. । ఇశ్రాయేలువారిమీదను యూదా
వారిమీదను నేనతనిని అధికారిగా నియమించి
యున్నాను గనుక పిమ్మట మీరు యెరూషలేముకు
అతని వెంటరాగా అతడు నా సింహాసనముమీద ఆసీ
36 నుడై నాకు ప్రతిగా రాజగును అని సెలవిచ్చెను. । అం
దుకు యెహోయాదా కుమారుడైన బెనాయా
రాజుకు ప్రత్యుత్తరముగా ఇట్లనెను—ఆలాగు జరు
గును గాక, నా యేలినవాడవును రాజవునగు నీ దేవు
డైన యెహోవా ఆ మాటను స్థిరపరచును గాక. ।
యెహోవా నా యేలినవాడవును రాజవునగు నీకు
తోడుగా నుండినట్లు ఆయన సొలొమోనుకు తోడుగా
నుండి, నా యేలినవాడైన రాజగు దావీదుయొక్క
రాజ్యముకంటె అతని రాజ్యము ఘనముగా చేయును
గాక అనెను; । కాబట్టి యాజకుడైన సాదోకును
ప్రవక్తయైన నాతానును యెహోయాదా కుమారు
డైన బెనాయాయును కెరేతీయులును పెలేతీయులును
రాజైన దావీదు కంచరగాడిదెమీద సొలొమోనును
ఎక్కించి గిహోనుకు తీసికొని రాగా । యాజకుడైన
సాదోకు గుడారములోనుండి తైలపు కొమ్మును తెచ్చి
సొలొమోనుకు పట్టాభిషేకము చేసెను. అప్పుడు
వారు బాకా ఊదగా కూడిన జనులందరును—రాజైన
సొలొమోను చిరంజీవి యగుగాక అని కేకలువేసిరి ।
మరియు ఆ జనులందరును అతని వెంబడి వచ్చి పిల్లన
గ్రోవులను ఊదుచు, వాటి నాదముచేత నేల బద్ద
లగునట్లు అత్యధికముగా సంతోషించిరి. । అదోనీయా
యును అతడు పిలిచినవారందరును విందులో ఉండగా
విందు ముగియబోవు సమయమున ఆ చప్పుడు వారికి
వినబడెను. యోవాబు బాకానాదము విని—పట్టణము
ఎందు ఈ గల్లంతుధ్వని యేమని యడుగగా । యాజ 4
కుడైన అబ్యాతారు కుమారుడైన యోనాతాను వచ్చెను.
అదోనీయా—లోపలికి రమ్ము, నీవు ధైర్యవంతుడవు,
నీవు శుభసమాచారములతో వచ్చుచున్నావనగా ।
యోనాతాను అదోనీయాతో ఇట్లనెను — నిజముగా 4
మన యేలినవాడును రాజునగు దావీదు సొలొమోనును
రాజుగా నియమించి యున్నాడు. । రాజు యాజకుడైన 4
సాదోకును ప్రవక్తయైన నాతానును యెహోయాదా
కుమారుడైన బెనాయాను కెరేతీయులను పెలేతీయు
లను అతనితోకూడ పంపగా వారు రాజు కంచర
గాడిదెమీద అతని నూరేగించిరి; । యాజకుడైన సాదో 4
కును ప్రవక్తయైన నాతానును గిహోను దగ్గర అతనికి
పట్టాభిషేకము చేసిరి; అక్కడనుండి వారు సంతోష
ముగా వచ్చియున్నారు; అందువలన పట్టణము గల్లంతు
ఆయెను; మీకు వినబడిన ధ్వని యిదే. । మరియు సొలొ 4
మోను రాజ్యాసనముమీద ఆసీనుడై యున్నాడు; ।
అందుకై రాజు సేవకులు మన యేలినవాడును రాజ 4
నగు దావీదుకు కృతజ్ఞతలు చెల్లింపవచ్చి, నీకు కలిగిన
ఖ్యాతికంటె సొలొమోనుకు ఎక్కువైన ఖ్యాతి కలుగు
నట్లును, నీ రాజ్యముకంటె అతని రాజ్యము ఘనముగా
ఉండునట్లును దేవుడు దయచేయును గాక అని చెప్పగా
రాజు మంచముమీద సాగిలపడి నమస్కారము చేసి
యిట్లనెను । —నేను సజీవినై యుండగా ఈ దినమున 4
జరిగినట్లు నా సింహాసనముమీద ఆసీనుడగుటకు ఇశ్రా
యేలీయుల దేవుడైన యెహోవా ఒకని నాకు దయ
చేసినందుకు ఆయనకు స్తోత్రము కలుగు గాక. । అం 4
దుకు అదోనీయా పిలిచినవారు భయపడి లేచి తమ తమ

50 యింండ్లకు వెళ్లిపోయిరి. । అదోనీయా సొలొమోనునకు
భయపడి లేచి బయలుదేరి బలిపీఠపు కొమ్ములను పట్టు
51 కొనెను. । అదోనీయా రాజైన సొలొమోనునకు భయ
పడి బలిపీఠపు కొమ్ములను పట్టుకొని—రాజైన సొలొ
మోను తన సేవకుడనైన నన్ను కత్తిచేత చంపకుండ ఈ
దినమున నాకు ప్రమాణము చేయవలెనని మనవి చేయు
52 చున్నట్లు సొలొమోనునకు సమాచారము రాగా । సొలొ
మోను ఈలాగు సెలవిచ్చెను—అతడు తన్ను యోగ్యు
నిగా అగుపరచుకొనిన పక్షమున అతని తలవెండ్రుక
లలో ఒకటైనను క్రిందపడదు గాని అతనియందు
దోషము కనబడిన పక్షమున అతనికి మరణశిక్ష వచ్చు
53 నని సెలవిచ్చి । బలిపీఠమునొద్దనుండి అతని పిలువనం
పించెను; అతడు వచ్చి రాజైన సొలొమోను ఎదుట
సాష్టాంగపడగా సొలొమోను అతని చూచి—నీ యిం
టికి పొమ్మని సెలవిచ్చెను.

2 దావీదునకు మరణకాలము సమీపింపగా అతడు
తన కుమారుడైన సొలొమోనునకు ఈలాగు ఆజ్ఞ
2 ఇచ్చెను । — లోకులందరు పోవలసిన మార్గమున నేను
పోవుచున్నాను; కాబట్టి నీవు ధైర్యము తెచ్చుకొని
3 నిబ్బరము గలిగి । నీ దేవుడైన యెహోవా అప్పగిం
చినదాని కాపాడి, ఆయన మార్గముల ననుసరించిన
యెడల నీవు ఏ పని పూనుకొనినను ఎక్కడ తిరిగినను
అన్నిటిలో వివేకముగా నడుచుకొందువు. మోషే
ధర్మశాస్త్రములో వ్రాయబడియున్న దేవుని కట్టడలను
ఆయన నియమించిన ధర్మమంతటిని ఆయన న్యాయ
4 విధులను శాసనములను గైకొనుము; । అప్పుడు — నీ
పిల్లలు తమ ప్రవర్తన విషయములో జాగ్రత్తగానుండి
నాయెదుట తమ పూర్ణహృదయముతోను పూర్ణమనస్సు
తోను సత్యము ననుసరించి నడుచుకొనినయెడల ఇశ్రా
యేలీయుల రాజ్యసింహాసనముమీద ఆసీనుడగు ఒకడు
నీకు ఉండక మానడని యెహోవా నన్నుగూర్చి
5 ప్రమాణము చేసిన మాటను స్థిరపరచును. । అయితే
సెరూయా కుమారుడైన యోవాబు నాకు చేసినదానిని,
ఇశ్రాయేలు సేనాధిపతులగు నేరు కుమారుడైన అబ్నేరు
యెతెరు కుమారుడైన అమాశాయను వారిద్దరికి అతడు
చేసినదానిని నీ వెరుగుదువు; అతడు వారిని చంపి యుద్ధ
సమయమందైనట్లుగా సమాధానకాలమందు రక్తము
చిందించి దానిని తన నడికట్టుమీదను తన *పాదరక్షల
6 మీదను పడజేసెను. । నీకు తోచినట్టు అతనికి చేయ
వచ్చును గాని అతని నెరసిన తలవెండ్రుకలను సమా
7 ధికి నెమ్మదిగా దిగనియ్యవద్దు. । నేను నీ సహోదరు
డైన అబ్షాలోము ముందరనుండి పారిపోగా, గిలా
దీయుడైన బర్జిల్లయి కుమారులు నా సహాయమునకు
వచ్చిరి; నీవు వారిమీద దయయుంచి నీ బల్లయొద్ద
8 భోజనము చేయువారిలో వారిని చేర్చుము. । మరియు
బెన్యామీనీయుడైన గెరా కుమారుడగు బహూరీము
ఊరి షిమీ నీయొద్దనున్నాడు; నేను మహనయీముకు
వెళ్లుచుండగా అతడు నన్ను శపించెను. నన్ను ఎదు
ర్కొనుటకై అతడు యొర్దాను నదియొద్దకు దిగి రాగా—
యెహోవాతోడు కత్తిచేత నేను నిన్ను చంపనని
ప్రమాణము చేసితిని. । వానిని నిర్దోషిగా ఎంచవద్దు; 9
నీవు సుబుద్ధిగలవాడవు గనుక వాని నేమి చేయవలెనో
అది నీకు తెలియును; వాని నెరసిన తలవెండ్రుకలు
రక్తముతో సమాధికి దిగజేయుము. । తరువాత దావీదు 10
తన పితరులతో కూడ నిద్రపొంది, దావీదు పట్టణ
మందు సమాధిలో పెట్టబడెను. । దావీదు ఇశ్రాయేలీ 11
యులను ఏలిన కాలము నలుబది సంవత్సరములు,
హెబ్రోనులో అతడు ఏడు సంవత్సరములును యెరూ
షలేములో ముప్పది మూడు సంవత్సరములును ఏలెను.
అప్పుడు సొలొమోను తన తండ్రియైన దావీదు 12
సింహాసనముమీద ఆసీనుడాయెను. అతని రాజ్యము
నిలుకడగా స్థిరపరచబడెను. । అంతలో హగ్గీతు కుమా 13
రుడైన అదోనీయా సొలొమోను తల్లియగు బత్షెబ
యొద్దకు రాగా ఆమె — సమాధానముగా వచ్చుచు
న్నావా అని అతనినడిగెను. అతడు—సమాధానముగానే
వచ్చుచున్నానని చెప్పి । — నీతో చెప్పవలసిన మాట 14
యొకటి యున్నదనెను. ఆమె అది చెప్పుమనగా । అతడు 15
—రాజ్యము నాదై యుండెననియు, నేను ఏలవలెనని
ఇశ్రాయేలీయులందరు తమ దృష్టి నా మీద ఉంచి
రనియు నీవు ఎరుగుదువు; అయితే రాజ్యము నాది
కాక నా సహోదరునిదాయెను; అది యెహోవా
వలన అతనికి ప్రాప్తమాయెను. । ఇప్పుడు నేను నీతో 16
ఒక మనవి చేసికొనుచున్నాను, కాదనకుము. । ఆమె— 17
చెప్పుమనగా అతడు—రాజగు సొలొమోను షూనే
మీయురాలైన అబీషగును నాకు పెండ్లికిచ్చునట్లు దయ
చేసి అతనితో నీవు చెప్పవలెను, అతడు నీతో కాదని
చెప్పడనెను. । బత్షెబ—మంచిది, నిన్నుగూర్చి రాజుతో 18
చెప్పెదననెను. । బత్షెబ రాజైన సొలొమోనునొద్దకు 19
అదోనీయా పక్షమున చెప్పుటకు వచ్చినప్పుడు, రాజు
లేచి ఆమెకు ఎదురుగా వచ్చి ఆమెకు నమస్కారము
చేసి సింహాసనముమీద ఆసీనుడై తన తల్లికొరకు
ఆసనము ఒకటి వేయింపగా, ఆమె అతని కుడిపార్శ్వ
మున కూర్చుండెను. । — ఒక చిన్న మనవి చేయ గోరు 20
చున్నాను; నా మాట త్రోసివేయకుమని ఆమె చెప్పగా
రాజు — నా తల్లీ చెప్పుము, నీ మాట త్రోసివేయ
ననగా । ఆమె — షూనేమీయురాలైన అబీషగును నీ 21
సహోదరుడైన అదోనీయాకు పెండ్లికిప్పింపవలె
ననెను. । అందుకు రాజైన సొలొమోను—షూనేమీ 22
యురాలైన అబీషగును మాత్రమే అదోనీయాకొరకు
అడుగుట యేల? అతడు నా అన్న కాబట్టి అతనికొర
కును, యాజకుడైన అబ్యాతారుకొరకును, సెరూయా
కుమారుడైన యోవాబుకొరకును రాజ్యమును అడుగ

23 నని తన తల్లితో చెప్పెను. । మరియు రాజైన సొలొ
మోను — యెహోవా తోడు అదోనీయా పలికిన
యీ మాటవలన అతని ప్రాణమునకు నష్టము రాక
పోయినయెడల దేవుడు నాకు గొప్ప అపాయము కలుగ
24 జేయును గాక. । నన్ను స్థిరపరచి, నా తండ్రి సింహాసన
ముమీద నన్ను ఆసీనునిగా చేసి, తన వాగ్దానము ప్రకా
రము నాకు కుటుంబము కలుగజేసిన యెహోవా
జీవముతోడు, అదోనీయా యీ దినమున మరణమవు
25 నని చెప్పి । యెహోయాదా కుమారుడైన బెనాయాను
పంపగా అతడు అదోనీయామీద పడినందున అతడు
26 చనిపోయెను. । తరువాత రాజు యాజకుడైన అబ్యా
తారును పిలిపించి యేమనగా అనాతోతులో నీకు కలి
గిన భూములకు వెళ్లుము; నీవు మరణమునకు పాత్రుడ
వైతివి గాని నీవు నా తండ్రియైన దావీదు ముందర
ప్రభువైన యెహోవా మందసమును మోసి, నా తం
డ్రికి ప్రాప్తించిన శ్రమలన్నిటిలో శ్రమ పొందితివి
27 గనుక ఈ దినమున మరణశిక్ష నీకు విధింపను. । తరువాత
సొలొమోను అబ్యాతారును యెహోవాకు యాజకు
డుగా ఉండకుండ తీసివేసెను అందువలన యెహోవా
ఏలీ కుటుంబికులను గూర్చి షిలోహులో ప్రమాణము
28 చేసిన మాట నెరవేరెను. । యోవాబు అబ్షాలోము
పక్షము అవలంబింపక పోయినను అదోనీయా పక్షము
అవలంబించి యుండెను గనుక ఈ వర్తమానములు అత
నికి రాగా అతడు పారిపోయి యెహోవా గుడార
మునకు వచ్చి బలిపీఠపు కొమ్ములను పట్టుకొనెను. ।
29 యోవాబు పారిపోయి యెహోవా గుడారమునకు
వచ్చి బలిపీఠమునొద్ద నున్నాడను సంగతి రాజగు సొలొ
మోనుకు వినబడగా సొలొమోను యెహోయాదా
కుమారుడైన బెనాయాను పిలిపించి—నీవు వెళ్లి వానిమీద
30 పడుమని ఆజ్ఞ ఇచ్చినందున । బెనాయా యెహోవా
గుడారమునకు వచ్చి — రాజు నిన్ను బయటికి రమ్మని
సెలవిచ్చెనని యోవాబుతో చెప్పెను. అతడు — అది
కాదు, నేనిక్కడనే చచ్చెదననగా, బెనాయా తిరిగి
రాజునొద్దకు వచ్చి యోవాబు తనతో చెప్పిన మాట
31 రాజునకు తెలియజేసెను. । అందుకు రాజు ఇట్లనెను—
అతడు నీతో చెప్పినట్లుగా చేయుము; అతడు ధార
పోసిన నిరపరాధుల రక్తమును నామట్టుకును నా తండ్రి
కుటుంబికుల మట్టుకును కనబడకుండ చేయుటకై అతని
32 చంపి పాతిపెట్టుము. । నేరు కుమారుడును ఇశ్రాయేలు
వారి సమూహాధిపతియునైన అబ్నేరును, యెతెరు
కుమారుడును యూదావారి సేనాధిపతియునైన అమా
శాయును అను తనకంటె నీతిపరులును యోగ్యులు
నగు ఈ యిద్దరు మనుష్యులమీద పడి యోవాబు నా
తండ్రియైన దావీదు ఎరుగకుండ కత్తిచేత వారిని చంపి
వేసెను గనుక అతడు ధారపోసిన రక్తము యెహోవా
33 అతని తలమీదికే రప్పించును. । మరియు వీరి ప్రాణ
దోషమునకు యోవాబును అతని సంతతివారును సదా
కాలము ఉత్తరవాదులు గాని, దావీదునకును అతని
సంతతికిని అతని కుటుంబికులకును అతని సింహాసన
మునకును సమాధానము యెహోవావలన ఎన్నటెన్న
టికిని కలిగి యుండును. । కాబట్టి యెహోయాదా
కుమారుడైన బెనాయా వచ్చి అతనిమీద పడి అతని
చంపగా అతడు అరణ్యమందుండు తన యింటిలో పాతి
పెట్టబడెను. । రాజు అతనికి బదులుగా యెహోయాదా
కుమారుడైన బెనాయాను సేనాధిపతిగా నియమించెను.
మరియు రాజు అబ్యాతారుకు బదులుగా యాజకుడైన
సాదోకును నియమించెను. । తరువాత రాజు షిమీని
పిలువనంపించి అతనికి ఈ మాట సెలవిచ్చెను — నీవు
యెరూషలేములో ఇల్లు కట్టించుకొని బయట ఎక్కడి
కైనను వెళ్లక అందులో కాపురముండుము. । నీవు ఏ
దినమున బయలుదేరి కిద్రోను ఏరు దాటుదువో ఆ
దినమున నీవు చచ్చుట నిశ్చయమని యేర్పాటుగా తెలిసి
కొనుము, నీ ప్రాణమునకు నీవే ఉత్తరవాదివగుదువు. ।
షిమీ—తమరు సెలవిచ్చినది మంచిదేను, నా యేలిన
వారైన రాజగు తమరు చెప్పినప్రకారము నీను సేవ
కుడనైన నేను చేసెదనని రాజుతో చెప్పెను. షిమీ
యెరూషలేములో అనేక దినములు నివాసము చేయు
చుండెను. । అయితే మూడు సంవత్సరములైన తరువాత
షిమీయొక్క పనివారిలో ఇద్దరు పారిపోయి మయకా
కుమారుడైన ఆకీషు అను గాతు రాజునొద్దకు చేరిరి.
అంతట—నీవారు గాతులో ఉన్నారని షిమీకి వర్త
మానము కాగా । షిమీ లేచి గాడిదకు గంత కట్టి
తన పనివారిని వెదకుటకై గాతులోని ఆకీషునొద్దకు
పోయెను. ఈలాగున షిమీ పోయి గాతులోనుండి తన
పనివారిని తీసికొని వచ్చెను. । షిమీ యెరూషలేములో 4
నుండి గాతుకు పోయి వచ్చెనని సొలొమోనుకు వర్త
మానము కాగా । రాజు షిమీని పిలువనంపించి అత
నితో ఇట్లనెను — నీవు ఏ దినమందు బయలుదేరి ఏ
స్థలమునకైనను వెళ్లుదువో ఆ దినమున నీవు మరణమగు
దువని నిశ్చయముగా తెలిసికొనవలెనని యెహోవా
తోడని నేను నీకు ఖండితముగా ఆజ్ఞ ఇచ్చి నీ చేత
ప్రమాణము చేయించితిని గదా? మరియు — తమరు
సెలవిచ్చినదే మంచిదని నీవు ఒప్పుకొంటివి; । కాబట్టి 4
యెహోవాతోడని నీవు చేసిన ప్రమాణమును మేము
నీకు ఆజ్ఞాపించిన ఆజ్ఞను నీవు గైకొనక పోతివేమి అని
అడిగి । — నీవు మా తండ్రియైన దావీదునకు చేసినట్లు 4
నీ హృదయములో మెదులుచున్న కీడంతయు నీకు
తెలియును. నీవు చేసిన కీడు యెహోవా నీ తలమీదికే
రప్పించును. । అయితే రాజైన సొలొమోను ఆశీర్వా 4
దము పొందును, దావీదు సింహాసనము యెహోవా
సముఖమందు సదాకాలము స్థిరపరచబడునని షిమీతో
చెప్పి । రాజు యెహోయాదా కుమారుడైన బెనా 4

యోవాను సెలవియ్యగా అతడు బయలుదేరి వానిమీద
పడి వాని చంపెను. ఈ ప్రకారము రాజ్యము సొలొ
మోను వశమైన స్థిరపరచబడెను.
3 తరువాత సొలొమోను ఐగుప్తురాజైన ఫరో కుమా
ర్తెను పెండ్లిచేసికొని అతనికి అల్లుడాయెను. తన నగ
రును యెహోవా మందిరమును యెరూషలేము చుట్టు
ప్రాకారమును కట్టించుట ముగించిన తరువాత ఫరో
2 కుమార్తెను దావీదు పట్టణమునకు రప్పించెను. | ఆ దిన
ముల పర్యంతము యెహోవా నామమున కట్టింప
బడిన మందిరము లేకపోగా జనులు ఉన్నత స్థలముల
3 యందు మాత్రము బలులను అర్పించుచు వచ్చిరి. | తన
తండ్రియైన దావీదు నియమించిన కట్టడలను అనుసరిం
చుచు సొలొమోను యెహోవాయందు ప్రేమయుం
చెను గాని యున్నతస్థలములయందు అతడు బలులను
మాత్రము అర్పించుచు ధూపము వేయుచు నుండెను.
4 గిబియోను ముఖ్యమైన ఉన్నతస్థలమై యుండెను
గనుక బలుల నర్పించుటకై రాజు అక్కడికి పోయి
ఆ బలిపీఠముమీద వెయ్యి దహనబలులను అర్పించెను. |
5 గిబియోనులో యెహోవా రాత్రివేళ స్వప్నమందు
సొలొమోనునకు ప్రత్యక్షమై—నేను నీకు ఏమి నియ్యవల
యునో దాని నడుగుమని దేవుడు అతనితో సెల
6 వియ్యగా | సొలొమోను ఈలాగు మనవి చేసెను—నీ
దాసుడును నా తండ్రియునైన దావీదు నీ దృష్టికి అను
కూలముగా సత్యమును నీతిని అనుసరించి యథార్థమైన
మనస్సు గలవాడై ప్రవర్తించెను గనుక నీవు అతనియెడల
గొప్ప కటాక్షము చూపించి, యీ దినమున నున్న
ట్లుగా అతని సింహాసనముమీద అతని కుమారుని
కూర్చుండబెట్టి అతనియందు మహా కృపను చూపి
7 యున్నావు. | నా దేవా యెహోవా, నీవు నా తం
డ్రియైన దావీదునకు బదులుగా నీ దాసుడనైన నన్ను
రాజుగా నియమించి యున్నావు; అయితే నేను బాలు
డను, కార్యములు జరుపుటకు నాకు బుద్ధి చాలదు; |
8 నీ దాసుడనైన నేను నీవు కోరుకొనిన జనులమధ్య
ఉన్నాను; వారు విస్తరించియున్నందున వారిని లెక్క
పెట్టుటయు వారి విశాలదేశమును తనకీ చేయుటయు
9 అసాధ్యము. | ఇంత గొప్పదైన నీ జనమునకు న్యాయము
తీర్చగలవాడు ఎవ్వడు? కాబట్టి నేను మంచి చెడ్డలు
వివేచించి నీ జనులకు న్యాయము తీర్చునట్లు నీ దాసుడ
నైన నాకు వివేకముగల హృదయము దయచేయుము. |
0 సొలొమోను చేసిన యీ మనవి ప్రభువునకు అను
1 కూలమాయెను గనుక | దేవుడు అతనికి ఈలాగు సెల
విచ్చెను — దీర్ఘాయువునైనను ఐశ్వర్యమునైనను నీ
శత్రువుల ప్రాణమునైనను అడుగక, న్యాయములను
గ్రహించుటకు వివేకము అనుగ్రహించుమని నీవు
2 అడిగితివి. | నీవు ఈలాగున అడిగినందున నీ మనవి
ఆలకించుచున్నాను; బుద్ధి వివేకములుగల హృదయము

నీకిచ్చుచున్నాను; పూర్వికులలో నీవంటివాడు ఒక
డును లేడు, ఇకమీదటను నీవంటివాడొకడును ఉం
డడు. | మరియు నీవు ఐశ్వర్యమును ఘనతను ఇమ్మని 13
అడుగక పోయినను నేను వాటినికూడ నీకిచ్చుచు
న్నాను; అందువలన నీ దినములన్నిటను రాజులలో
నీవంటివాడొకడైన నుండడు. | మరియు నీ తండ్రియైన 14
దావీదు నా మార్గములలో నడచి నా కట్టడలను నేను
నియమించిన ధర్మమంతటిని గైకొనినట్లు నీవు నడచి
వాటిని గైకొనినపక్షమున నిన్ను దీర్ఘాయుష్మంతునిగా
చేసెదను. | అంతలో సొలొమోను మేలుకొని అది 15
స్వప్నమని తెలిసికొనెను. పిమ్మట అతడు యెరూష
లేముకు వచ్చి యెహోవా నిబంధనగల మందసము
ఎదుట నిలువబడి దహనబలులను సమాధానబలులను
అర్పించి తన సేవకులకందరికిని విందు చేయించెను.
తరువాత వేశ్యలైన యిద్దరు స్త్రీలు రాజునొద్దకు 16
వచ్చి అతని ముందర నిలిచిరి. | వారిలో ఒకతె యిట్లు 17
మనవిచేసెను — నా యేలినవాడా చిత్తగించుము,—
నేనును ఈ స్త్రీయును ఒక యింటిలో నివసించు
చున్నాము; దానితోకూడ ఇంటిలో ఉండి నేనొక
పిల్లను కంటిని. | నేను కనిన మూడవ దినమున ఇదియు 18
పిల్లను కనెను; మేమిద్దరమును కూడనున్నాము, మేమిద్ద
రము తప్ప ఇంటిలో మరియెవరును లేరు. | అయితే 19
రాత్రియందు ఇది పడకలో తన పిల్లమీద పడగా
అది చచ్చెను. | కాబట్టి మధ్యరాత్రి యిది లేచి నీ 20
దాసినైన నేను నిద్రించుచుండగా వచ్చి, నా ప్రక్కలో
నుండి నా బిడ్డను తీసికొని తన కౌగిటిలో పెట్టుకొని,
చచ్చిన తన పిల్లను నా కౌగిటిలో ఉంచెను. | ఉదయ 21
మున నేను లేచి నా పిల్లకు పాలియ్య చూడగా అది
చచ్చినదాయెను; తరువాత ఉదయమున నేను పిల్లను
నిదానించి చూచినప్పుడు వాడు నా కడుపున పుట్టిన
వాడు కాడని నేను తెలిసికొంటిని. | అంతలో రెం 22
డవ స్త్రీ—అది కాదు; బ్రదికియున్నది నా బిడ్డ చచ్చి
నది దాని బిడ్డ అని చెప్పగా ఆమె — కాదు, చచ్చి
నదే నీ బిడ్డ బ్రదికియున్నది నా బిడ్డ అనెను. ఈ
ప్రకారముగా వారు రాజుసముఖమున మనవి చేయగా |
రాజు—బ్రదికియున్నది నా బిడ్డ చచ్చినది నీ బిడ్డ 23
అని యొకతెయు, రెండవది—ఆలాగు కాదు చచ్చినది
నీ బిడ్డ బ్రదికియున్నది నా బిడ్డ అని చెప్పుచున్నది;
గనుక | కత్తి తెమ్మని ఆజ్ఞ ఇచ్చెను. వారు ఒక కత్తి 24
రాజుసన్నిధికి తేగా | రాజు రెండు భాగములుగా 25
బ్రదికియుండు బిడ్డనుచేసి సగము దీనికిని సగము
దానికిని చెరిసగము ఇయ్యవలసినదని ఆజ్ఞ ఇచ్చెను. |
అంతట బ్రదికియున్న బిడ్డయొక్క తల్లి తన బిడ్డ విష 26
యమై పేగులు తరుగుకొని పోయినదై, రాజునొద్ద—
నా యేలినవాడా, బిడ్డను ఎంతమాత్రము చంపక
దానికే యిప్పించుమని మనవిచేయగా, ఆ రెండవ

స్త్రీ—అది నాదైనను నీదైనను కాకుండ చెరిసగము
27 చేయుమనెను. । అందుకు రాజు—బ్రదికియున్న
బిడ్డను ఎంతమాత్రము చంపక మొదటిదాని కియ్యుడి,
28 దాని తల్లి అదే అని తీర్పుతీర్చెను. । అంతట ఇశ్రా
యేలీయులందరును రాజు తీర్చిన తీర్పునుగూర్చి విని
న్యాయము విచారించుటయందు రాజు దైవజ్ఞానము
నొందినవాడని గ్రహించి అతనికి భయపడిరి.

4 రాజైన సొలొమోను ఇశ్రాయేలీయులందరిమీద
2 రాజాయెను. । అతనియొద్దనున్న అధిపతులు ఎవరన
గా సాదోకు కుమారుడైన అజర్యా యాజకుడు; ।
3 షీషా కుమారులైన ఎలీహోరెపును అహీయాయును
ప్రధానమంత్రులు; అహీలూదు కుమారుడైన యెహో
4 షాపాతు లేఖకుడై యుండెను; । యెహోయాదా
కుమారుడైన బెనాయా సైన్యాధిపతి; సాదోకును
5 అబ్యాతారును యాజకులు. । నాతాను కుమారుడైన
అజర్యా అధికారులమీద నుండెను; నాతాను కుమారు
6 డైన జాబూదు రాజుసముఖములోని మంత్రి; । అహీ
షారు గృహనిర్వాహకుడు; అబ్దా కుమారుడైన అదో
7 నీరాము వెట్టి పని విషయములో అధికారి. । ఇశ్రా
యేలీయులందరిమీద సొలొమోను పన్నిద్దరు అధి
కారులను నియమించెను. వీరు రాజునకును అతని ఇంటి
వారికిని ఆహారమును సంగ్రహము చేయువారు. సం
వత్సరమందు ఒక్కొక్క నెలకు వారిలో ఒక్కొక్కడు
8 ఆహారమును సంగ్రహము చేయుచుండెను. । వారి పేళ్లు
ఏవనగా, ఎఫ్రాయిము మన్యమందు హూరు కుమారుడు; ।
9 మాకస్సులోను షయల్బీములోను బేత్షెమెషులోను
10 ఏలోన్బేత్హానానులోను దెకెరు కుమారుడు; । అరుబ్బో
తులో హెసెదు కుమారుడు; వీనికి శోకోదేశమును
11 హెపెరు దేశమంతయు నియమింపబడెను. । మరియు
అబీనాదాబు కుమారునికి దోరు మన్యప్రదేశమంతయు
నియమింపబడెను; సొలొమోను కుమార్తెయైన టాపతు
12 ఇతని భార్య. । మరియు అహీలూదు కుమారుడైన
బయనాకు తానాకును మెగిద్దోయును బేత్షెయాను
ప్రదేశమంతయును నియమింపబడెను. ఇది యెజ్రె
యేలు దగ్గరనున్న సారెతానునుండి బేత్షెయాను
మొదలుకొని ఆబేల్మెహోలావరకును యొక్నెయాము
13 అవతలి స్థలమువరకును వ్యాపించుచున్నది. । గెబెరు
కుమారుడు రామోత్గిలాదునందు కాపురముండెను;
వీనికి గిలాదులోనుండిన మనస్సేకు కుమారుడైన యా
యీరు గ్రామములును బాషానులోనున్న అర్గోబు
దేశమును నియమింపబడెను; అది ప్రాకారములును
ఇత్తడి అడ్డగడలునుగల అరువది గొప్ప పట్టణములు
14 గల ప్రదేశము. । ఇద్దో కుమారుడైన అహీనాదాబు
15 మహనయీములో నుండెను. । నఫ్తాలీము దేశమందు
అహిమయస్సు ఉండెను; వీడు సొలొమోను కుమార్తె
16 యైన బాశెమతును వివాహము చేసికొనెను. । ఆషేరు
లోను ఆలోతులోను హూషై కుమారుడైన బయనా
యుండెను. । ఇశ్శాఖారు దేశమందు పరూయహు 17
కుమారుడైన యెహోషాపాతు ఉండెను. । బెన్యా 18
మీను దేశమందు ఏలా కుమారుడైన షిమీ యుం
డెను. । గిలాదు దేశమందును అమోరీయులకు రాజైన 19
సీహోను దేశమందును బాషాను రాజైన ఓగు దేశ
మందును ఊరి కుమారుడైన గెబెరు ఉండెను; అతడు
ఒక్కడే ఆ దేశమందు అధికారి. । అయితే యూదా 20
వారును ఇశ్రాయేలువారును సముద్రపు దరినున్న
యిసుక రేణువులంత విస్తార సమూహమై తినుచు
త్రాగుచు సంభ్రమపడుచు నుండిరి.

నది మొదలుకొని ఐగుప్తు సరిహద్దువరకును ఈ మధ్య 21
నున్న రాజ్యములన్నిటిమీదను ఫిలిష్తీయుల దేశమం
తటిమీదను సొలొమోను ప్రభుత్వము చేసెను. ఆ
జనులు పన్ను చెల్లించుచు సొలొమోను బ్రతికిన
దినములన్నియు అతనికి సేవచేయుచు వచ్చిరి. ।
ఒక్కొక్క దినమునకు సొలొమోను భోజనపు 22
సామగ్రి యెంతయనగా, ఆరునూర్ల తూముల సన్నపు
గోధుమపిండియు, వేయినిన్నూరు తూముల ముతక
పిండియు, । క్రొవ్విన యెద్దులు పదియు, పచ్చికయెద్దులు 23
ఇరువదియు, నూరు గొర్రెలును; ఇవియుగాక ఎఱ్ఱ
దుప్పులు దుప్పులు జింకలు క్రొవ్విన బాతులును
తేబడెను. । నది యివతల తిప్సహు మొదలుకొని 24
గాజావరకును నది యివతలనున్న రాజులందరిమీదను
అతనికి అధికారముండెను. అతని కాలమున నలు
దిక్కుల నెమ్మది కలిగియుండెను. । సొలొమోను 25
దినములన్నిటను ఇశ్రాయేలువారేమి యూదావారేమి
దాను మొదలుకొని బెయేర్షెబావరకును తమ తమ
ద్రాక్షచెట్ల క్రిందను అంజూరపుచెట్ల క్రిందను
నిర్భయముగా నివసించుచుండిరి. । సొలొమోను రథ 26
ములకు నలువదివేల గుర్రపు సాలలును రౌతులకు
పండ్రెండువేల గుర్రములును ఉండెను. । మరియు 27
రాజైన సొలొమోనుకును రాజైన సొలొమోను భోజ
నపు బల్లయొద్దకు వచ్చిన వారికందరికిని ఏమియు
తక్కువకాకుండ అధికారులలో ఒకడు తాను నియ
మింపబడిన మాసమునుబట్టి ఆహారము సంగ్రహము
చేయుచు వచ్చెను. । మరియు గుర్రములును పాటు 28
పశువులును ఉన్న ఆయాస్థలములకు ప్రతివాడును
తనకు చేయబడిన నిర్ణయము చొప్పున యవలును గడ్డిని
తెప్పించుచుండెను.

దేవుడు జ్ఞానమును బుద్ధిని వర్ణింప శక్యము కాని 29
వివేచనగల మనస్సును సొలొమోనుకు దయచేసెను ।
గనుక సొలొమోనుకు కలిగిన జ్ఞానము తూర్పుదేశ 30
స్థుల జ్ఞానముకంటెను ఐగుప్తీయుల జ్ఞానమంతటికం
టెను అధికమై యుండెను. । అతడు సమస్తమైన 31
వారికంటెను, ఎజ్రాహీయుడైన ఏతానుకంటెను

మాహోలు కుమారులైన హేమాను కల్కోలు దర్ద
అను వారికంటెను జ్ఞానవంతుడై యుండెను గనుక
అతని కీర్తి చుట్టునున్న జనములన్నిటిలో వ్యాపిత
32 మాయెను. । అతడు మూడువేల సామెతలు చెప్పెను,
33 వెయ్యిన్ని యయిదు కీర్తనలు రచించెను. । మరియు
లెబానోనులో ఉండు దేవదారు వృక్షమునే గాని
గోడలోనుండి మొలుచు హిస్సోపు మొక్కనే గాని
చెట్లన్నిటినిగూర్చి అతడు వ్రాసెను; మరియు మృగ
ములు పక్షులు ప్రాకు జంతువులు జలచరములు అను
34 వాటినన్నిటిని గూర్చియు అతడు వ్రాసెను. । అతని
జ్ఞానపుమాటలు తెలిసికొనుటకై అతని జ్ఞానమును
గూర్చి వినిన భూపతులందరిలోనుండియు, జనులం
దరిలోనుండియు మనుష్యులు సొలొమోను నొద్దకు
వచ్చిరి.

5 తరువాత తూరునకు రాజైన హీరాము తన తం
డ్రికి బదులుగా సొలొమోను పట్టాభిషేకము నొందె
నని విని తన సేవకులను సొలొమోనునొద్దకు పంపెను;
ఏలయనగా హీరాము ఎప్పటికి దావీదుతో స్నేహ
2 ముగా నుండెను. । హీరామునొద్దకు సొలొమోను ఈ
3 వర్తమానము పంపెను. । —యెహోవా నా తండ్రి
యైన దావీదు శత్రువులను అతని పాదములక్రింద
అణచు పర్యంతము అన్నివైపులను యుద్ధములు అత
4 నికి కలిగి యుండెను. । తన దేవుడైన యెహోవా
నామఘనతకు అతడు మందిరమును కట్టింప వీలు లేక
పోయెనన్న సంగతి నీవెరుగుదువు. ఇప్పుడు శత్రువు
ఒకడును లేకుండను అపాయమేమియు కలుగకుండను
నా దేవుడైన యెహోవా నలుదిశలను నాకు నెమ్మది
5 దయచేసియున్నాడు. । కాబట్టి—నీ సింహాసనముమీద
నేను నీకు బదులుగా కూర్చుండబెట్టు నీ కుమారుడు
నా నామఘనతకు ఒక మందిరమును కట్టించునని
యెహోవా నా తండ్రియైన దావీదుకు సెలవిచ్చి
నట్లు నా దేవుడైన యెహోవా నామఘనతకు మంది
రమును కట్టించుటకు నేను ఉద్దేశము గలవాడనై
6 యున్నాను. । లెబానోనులో దేవదారు మ్రానులను
నరికించుటకై నాకు సెలవిమ్ము; నా సేవకులును నీ
సేవకులును కలిసి పని చేయుదురు; మ్రానులను నరు
కుటయందు సీదోనీయులకు సాటియైనవారు మాలో
7 ఎవరును లేరని నీకు తెలియును గనుక । నీ యేర్పాటు
చొప్పున నేను నీ సేవకుల జీతము నీకిచ్చెదను. హీరాము
సొలొమోను చెప్పిన మాటలు విని బహుగా సంతోష
పడి — ఈ గొప్ప జనమును ఏలుటకు జ్ఞానముగల
కుమారుని దావీదుకు దయచేసిన యెహోవాకు ఈ
8 దినమున స్తోత్రము కలుగును గాక అని చెప్పి । సొలొ
మోనుకు ఈ వర్తమానము పంపెను—నీవు నాయొద్దకు
పంపిన వర్తమానమును నేను అంగీకరించితిని; దేవదారు
మ్రానులనుగూర్చియు సరళపు మ్రానులనుగూర్చియు
నీ కోరికె యంతటిప్రకారము నేను చేయించెదను. ।
నా సేవకులు వాటిని లెబానోనునుండి సముద్రము 9
నొద్దకు తెచ్చెదరు; అప్పుడు వాటిని తెప్పలుగా
కట్టించి నీవు నాకు నిర్ణయించు స్థలమునకు సముద్రము
మీద చేరునట్లు చేసి, అక్కడ వాటిని నీకు అప్పగింప
బడు బందోబస్తు నేను చేయుదును, నీవు వాటిని తీసి
కొందువు. ఇందునుగూర్చి నీవు నాకోరికెచొప్పున
జరిగించి నా యింటివారి సంరక్షణకొరకు ఆహారము
ఇచ్చెదవు. । హీరాము సొలొమోనుకు ఇష్టమైనంత 10
మట్టుకు దేవదారు మ్రానులను సరళపు మ్రానులను
పంపించగా । సొలొమోను హీరామునకును అతని 11
యింటివారి సంరక్షణకును ఆహారముగా రెండులక్షల
తూముల గోధుమలను మూడు వేల ఎనమన్నూరు
పళ్లు స్వచ్ఛమైన నూనెను పంపించెను. ఈ ప్రకారము
సొలొమోను ప్రతి సంవత్సరము హీరామునకు ఇచ్చుచు
వచ్చెను. । యెహోవా సొలొమోనుకు చేసిన వాగ్దా 12
నము చొప్పున అతనికి జ్ఞానము దయచేసెను; మరియు
హీరామును సొలొమోనును సంధిచేయగా వారిద్దరికి
సమాధానము కలిగియుండెను.

రాజైన సొలొమోను ఇశ్రాయేలీయులందరిచేతను 13
వెట్టిపని చేయించెను; వారిలో ముప్పదివేలమంది వెట్టి
పని చేయువారైరి, । వీరిని అతడు వంతులచొప్పున 14
నెలకు పది వేలమందిని లెబానోనుకు పంపించెను;
ఒక నెల లెబానోనులోను రెండు నెలలు ఇంటియొద్దను
వారు ఉండిరి; ఆ వెట్టివారిమీద అదోనీరాము అధి
కారియై యుండెను. । మరియు సొలొమోనుకు బరు 15
వులు మోయువారు డెబ్బది వేలమందియు పర్వతము
లందు మ్రానులు నరుకువారు ఎనుబది వేలమందియు
నుండిరి. । వీరు కాక పనిమీదనున్న సొలొమోను 16
శిల్పకారులకు అధికారులు మూడువేల మున్నూరు
మంది; వీరు పనివారిమీద అధికారులై యుండిరి. ।
రాజు సెలవియ్యగా వారు మందిరముయొక్క పునా 17
దిని చెక్కిన రాళ్లతో వేయుటకు గొప్ప రాళ్లను
మిక్కిలి వెలగల రాళ్లను తెప్పించిరి. । ఈలాగున 18
సొలొమోను పంపిన గిబ్లీయులును హీరాము శిల్ప
కారులును మ్రానులను నరికి రాళ్లను మలిచి మందిరము
కట్టుటకు మ్రానులను రాళ్లను సిద్ధపరచిరి.

అయితే ఇశ్రాయేలీయులు ఐగుప్తుదేశములోనుండి 6
బయలుదేరి వచ్చిన నన్నూట ఎనుబదియవ సంవత్సర
మందు, అనగా సొలొమోను ఇశ్రాయేలును ఏలిన
నాలుగవ సంవత్సరమందు జీప్ అను రెండవ మాసమున
అతడు యెహోవా మందిరమును కట్టింప నారంభిం
చెను. । రాజైన సొలొమోను యెహోవాకు కట్టిం 2
చిన మందిరము అరువది మూరల పొడుగును ఇరువది
మూరల వెడల్పును ముప్పది మూరల ఎత్తును గలదై
యుండెను. । పరిశుద్ధస్థలము ఎదుటనున్న ముఖమంట 8

34 గవ వంతు వెడల్పుగా నుండెను. । రెండు తలుపులు
దేవదారుకర్రతో చేయబడి యుండెను; ఒక్కొక్క
35 తలుపుకు రెండేసి మడత రెక్కలు ఉండెను. । వాటి
మీద అతడు కెరూబులను తమాల వృక్షములను విక
సించిన పుష్పములను చెక్కించి ఆ చెక్కిన వాటిమీద
36 బంగారు రేకును పొదిగించెను. । మరియు లోపల
నున్న శాలను మూడు వరుసలను చెక్కిన రాళ్లతోను
ఒక వరుసను దేవదారు దూలములతోను కట్టిం
37 చెను. । నాలుగవ సంవత్సరము జీప్ అను మాసమున
38 యెహోవా మందిరపు పునాది వేయబడెను; । పదు
నొకండవ సంవత్సరము బూలు అను ఎనిమిదవ మాస
మున దాని యేర్పాటుచొప్పున దాని ఉపభాగము
లన్నిటితోను మందిరము సమాప్తమాయెను. ఏడు
సంవత్సరములు సొలొమోను దాని కట్టించుచుండెను.

**7** సొలొమోను పదుమూడు సంవత్సరములు తన
నగరును కట్టించుచుండి దానినంతటిని ముగించెను. ।
2 మరియు లెబానోను అరణ్యమందు అతడొక నగరును
కట్టించెను; దీని పొడుగు నూరు మూరలు, వెడల్పు
ఏబది మూరలు, ఎత్తు ముప్పది మూరలు; నాలుగు
వరుసల దేవదారు స్తంభములమీద దేవదారు దూల
3 ములు వేయబడెను. । మరియు నలుబదియైదు స్తంభ
ములమీద ప్రక్కగదులపైన దేవదారు కర్రలతో
అది కప్పబడెను; ఆ స్తంభములు వరుస వరుసకుపైగా
పదిహేనేసి చొప్పున మూడు వరుసలు ఉండెను. ।
4 మూడు వరుసల కిటికీలు ఉండెను; మూడు వరుస
లలో కిటికీలు ఒక దానికొకటి యెదురుగా ఉండెను. ।
5 తలుపులయొక్కయు కిటికీలయొక్కయు స్తంభములు
నచ్చౌకముగా ఉండెను; మూడు వరుసలలోను కిటి
6 కీలు ఒకదానికొకటి యెదురుగా ఉండెను. । మరియు
అతడు స్తంభములుగల యొక మంటపమును కట్టిం
చెను; దాని పొడుగు ఏబది మూరలు, వెడల్పు ముప్పది
మూరలు; ఒక మంటపము వాటి యెదుట ఉండెను;
స్తంభములును లావుగల దూలములును వాటి యెదుట
7 నుండెను. । తరువాత తాను తీర్పుచేయ కూర్చుండు
టకై యొక అధికారమంటపమును కట్టించెను; దాని
నట్టిల్లు కొనమొదలు దేవదారు కర్రతో కప్ప
8 బడెను. । లోపలి ఆవరణములో తన నివాసపు
ఇంటిని ఆ విధముగానే కట్టించెను. మరియు సొలొ
మోను తాను వివాహమైన ఫరో కుమార్తెకు ఈ మంట
9 పమువంటి యొక నగరును కట్టించెను. । ఈ కట్టడము
లన్నియు పునాది మొదలుకొని గోడ చూరువరకు
లోపటను వెలపటను వాటి పరిమాణప్రకారముగా
తొలవబడినట్టివియు, రంపములచేత కోయబడినట్టి
వియు, మిక్కిలి వెలగల రాళ్లతో కట్టబడెను; ఈ
ప్రకారమే గొప్ప ఆవరణపు వైపుననున్న వెలపలి
10 భాగమును ఉండెను. । దాని పునాది పదేసి యెనిమి
దేసి మూరలుగల మిక్కిలి వెలగల పెద్ద రాళ్లతో కట్ట
బడెను. । పైతట్టున పరిమాణప్రకారముగా చెక్క 11
బడిన మిక్కిలి వెలగల రాళ్లును దేవదారు కర్రలును
కలవు. । గొప్ప ఆవరణమునకు చుట్టును మూడు వరు 12
సల చెక్కిన రాళ్లును, ఒక వరుస దేవదారు దూల
ములును కలవు; యెహోవా మందిరములోని ఆవర
ణము కట్టబడిన రీతినే ఆ మందిరపు మంటపమును
కట్టబడెను.

రాజైన సొలొమోను తూరు పట్టణములోనుండి 13
హీరామును పిలువనంపించెను. । ఇతడు ఒక విధవ 14
రాలి కుమారుడును నఫ్తాలి గోత్రపువాడునై యుం
డెను; ఇతని తండ్రి తూరుపట్టణపువాడగు ఇత్తడి పని
వాడు. ఈ హీరాము పూర్ణప్రజ్ఞగల బుద్ధిమంతుడును
ఇత్తడితో చేయు సమస్తమైన పనులలోను బహు చమ
త్కారపు పనివాడునై యుండెను; అతడు సొలొ
మోనునొద్దకు వచ్చి అతని పని అంతయు చేసెను. ।
ఏమనగా అతడు రెండు ఇత్తడి స్తంభములు పోత 15
పోసెను; ఒక్కొక్క స్తంభము పదునెనిమిది మూరల
నిడివిగలది, ఒక్కొక్కటి పన్నెండు మూరల కైవా
రము గలది. । మరియు స్తంభములమీద ఉంచుటకై 16
యిత్తడితో రెండు పీటలు పోతపోసెను; ఒక పీట
యొక్క యెత్తు అయిదు మూరలు, రెండవ పీట
యొక్క యెత్తు అయిదు మూరలు. । మరియు స్తంభ 17
ములమీదనున్న పీటలకు అల్లికపనివంటి పనియు,
గొలుసు పని దండలును చేయబడెను; అవి పీటకు
ఏడేసి కలిగి యుండెను. । ఈలాగున అతడు స్తంభ 18
ములను చేసి మీది పీటలను కప్పుటకు చుట్టును అల్లిక
పని రెండు వరుసలు దానిమ్మపండ్లతో చేసెను; ఈ
ప్రకారముగా అతడు రెండవ పీటను చేసెను. ।
మరియు స్తంభములమీది పీటలు నాలుగు మూరల 19
వట్టుకు తామర పుష్పమువంటి పనిగలవై యుండెను. ।
మరియు రెండు స్తంభముల మీదనున్న పీటలమీది 20
అల్లిక పనిదగ్గరనున్న ఉబ్బెత్తుకు పైగా దానిమ్మ
పండ్లుండెను; ఇన్నూరు దానిమ్మ పండ్లు ఆ పీటమీద
వరుస వరుసలుగా చుట్టునుండెను. । ఈ స్తంభములను 21
అతడు పరిశుద్ధస్థలపు మంటపములో ఎత్తించెను; కుడి
పార్శ్వపు స్తంభమును ఎత్తి దానికి యాకీను అను
పేరుపెట్టెను, ఎడమపార్శ్వపు స్తంభమును ఎత్తి దానికి
బోయజు అను పేరుపెట్టెను. । ఈ స్తంభములమీద 22
తామర పుష్పములవంటి పని యుండెను; ఈలాగున
స్తంభములయొక్క పని సమాప్తమాయెను. । మరియు 23
అతడు పోతపనితో ఒక సముద్రమును చేసెను; అది
ఈ తట్టు పై అంచు మొదలుకొని ఆ తట్టు పై అంచు
వరకు పది మూరలు; అది అయిదు మూరల యెత్తు
గలదై గుండ్రముగా ఉండెను; దాని కైవారము
ముప్పది మూరలు. । దాని పై అంచుకు క్రింద 24

చుట్టును గుబ్బలుండెను; మూరకు పది గుబ్బలచొప్పున
ఆ గుబ్బలు సముద్రముచుట్టును ఆవరించియుండెను;
అవి పోత పోయబడినప్పుడు ఆ గుబ్బలు రెండు వరుస
25 లుగా పోత పోయబడెను. । అది పన్నెండు ఎద్దులమీద
నిలువబడి యుండెను; వీటిలో మూడు ఉత్తరదిక్కును
మూడు పడమరదిక్కును మూడు దక్షిణదిక్కును
మూడు తూర్పుదిక్కును చూచుచుండెను. వీటిమీద
ఆ సముద్రము ఎత్తబడి యుండెను. వాటి వెనుకటి
భాగములన్నియు లోపలితట్టు త్రిప్పబడి యుండెను.।
26 అది బెత్తెడు దళసరిగలదై యుండెను; దాని పై
అంచుపాత్రకు పై అంచువలె తామర పుష్పముల
వంటి పని కలిగి యుండెను; అది తొమ్మిది గరిసెలు
27 పట్టును. । మరియు అతడు పది యిత్తడి స్తంభములు
చేసెను; ఒక్కొక్క స్తంభము నాలుగు మూరల
పొడుగు, నాలుగు మూరల వెడల్పు, మూడు మూరల
28 యెత్తు కలిగి యుండెను. । ఈ స్తంభములపని రీతి
యేదనగా, వాటికి ప్రక్కపలకలు కలవు, ఆ ప్రక్క
29 పలకలు జవలమధ్య ఉండెను. । జవలమధ్యనున్న
ప్రక్కపలకలమీద సింహములును ఎద్దులును కెరూబు
లును ఉండెను; మరియు జవలమీద ఆలాగుండెను;
సింహములక్రిందను ఎద్దలక్రిందను వ్రేలాడు దండల
30 వంటి పని కలిగి యుండెను. । మరియు ప్రతి స్తంభ
మునకు నాలుగేసి యిత్తడి చక్రములును ఇత్తడి యిరు
సులును కలిగి యుండెను; దాని నాలుగు మూలలను
దిమ్మలు కలవు; ఈ దిమ్మలు తొట్టిక్రింద అతికిన
31 ప్రతి స్థలము దగ్గర పోత పోయబడెను. । మరియు
దాని మూతి పైపీటయందును మీదను మూరెడు
నిడివి; అయితే మూతి క్రింది స్తంభము పనిచొప్పున
గుండ్రముగా ఉండి మూరన్నర నిడివి. మరియు
ఆ మూతిమీద ప్రక్కపలకలుగల చెక్కిన పనులు
గలవు; ఇవి గుండ్రనివిగాక చచ్చౌకముగా ఉండెను.।
32 మరియు ప్రక్కపలకల క్రింద నాలుగు చక్రములు
కలవు; చక్రముల యిరుసులు స్తంభములతో అతక
బడి యుండెను; ఒక్కొక్క చక్రము మూరెడునర
33 నిడివి గలదై యుండెను. । ఈ చక్రముల పని రథ
చక్రముల పనివలె ఉండెను, వాటి యిరుసులును
అడ్డలును పూటీలును ఆకులును పోతపనివై యుం
34 డెను. । ఒక్కొక్క స్తంభపు నాలుగు మూలలను
నాలుగు దిమ్మలు కలవు; ఈ దిమ్మలును స్తంభమును
35 ఏకాండముగా ఉండెను. । మరియు స్తంభమును పైని
చుట్టును జేనెడు ఎత్తుగల గుండ్రని బొద్దు కలిగి
యుండెను; మరియు స్తంభమును పైనున్న జవలును
ప్రక్క పలకలును దానితో ఏకాండముగా ఉండెను.।
36 దాని జవల పలకలమీదను, దాని ప్రక్క పలకలమీ
దను, అతడు కెరూబులను సింహములను తమాల
వృక్షములను ఒక్కొక్కదాని చోటునుబట్టి చుట్టును
దండలతో వాటిని చెక్కెను. । ఈ ప్రకారము
అతడు పది స్తంభములను చేసెను; అన్నిటి పోత
యును పరిమాణమును రూపమును ఏకరీతిగా ఉం
డెను. । తరువాత అతడు పది యిత్తడి తొట్లను
చేసెను; ప్రతి తొట్టి యేడునూర్ల ఇరువది తూములు
పట్టునది; ఒక్కొక్క తొట్టి నాలుగు మూరలు;
ఒక్కొక్క స్తంభముమీద ఒక్కొక్క తొట్టి పెట్ట
బడెను. । మందిరపు కుడిపార్శ్వమున అయిదు స్తంభ
ములను మందిరముయొక్క యెడమపార్శ్వమున
అయిదు మట్లను అతడు ఉంచెను; సముద్రమును
దక్షిణమునకు ఎదురుగా తూర్పుతట్టున మందిరము
యొక్క కుడిపార్శ్వమున ఉంచెను. । మరియు
హీరాము తొట్లను చేటలను గిన్నెలను చేసెను. ఈ
ప్రకారము హీరాము రాజైన సొలొమోను ఆజ్ఞనుబట్టి
యెహోవా మందిరపు పనియంతయు ముగించెను. ।
రెండు స్తంభములను, ఆ రెండు స్తంభములమీదనున్న 4
పైపీటల పళ్లెములను, ఆ స్తంభములమీది పైపీటల పళ్లె
ములను కప్పిన రెండు అల్లికలను, । ఆ స్తంభముల 4
మీదనున్న పైపీటల రెండు పళ్లెములను కప్పిన అల్లిక
యొక్కటింటికి రెండు వరుసలచొప్పున రెండు అల్లి
కలకును నన్నూరు దానిమ్మపండ్లను, । పది స్తంభములను, 4
స్తంభములమీద పది తొట్లను, । ఒక సముద్రమును, 4
సముద్రముక్రింద పండ్రెండు ఎద్దులను, । బిందెలను, 4
చేటలను, గిన్నెలను, వీటినన్నిటిని రాజైన సొలొమోను
ఆజ్ఞనుబట్టి హీరాము యెహోవా మందిరమునకు
చేసెను. ఈ వస్తువులన్నియు మెరుగుపెట్టిన యిత్త
డివై యుండెను. । యొర్దాను మైదానమందు సుక్కోతు 4
కును సారెతానుకును మధ్య బంకమట్టిభూమియందు రాజు
వాటిని పోత పోయించెను. । అయితే ఈ ఉపకరణములు 4
అతివిస్తారములైనందున సొలొమోను ఎత్తు చూచుట
మానివేసెను; ఇత్తడియొక్క యెత్తు ఎంతైనది తెలియ
బడక పోయెను. । మరియు సొలొమోను యెహోవా 4
మందిర సంబంధమైన తక్కిన ఉపకరణములన్నిటిని
చేయించెను, అనగా బంగారపు బలిపీఠమును, సము
ఖపు రొట్టెలనుంచు బంగారపు బల్లలను, । గర్భాల 4
యముముందర కుడిపార్శ్వమున అయిదును, ఎడమ
పార్శ్వమున అయిదును, పది బంగారపు దీపస్తంభ
ములను, బంగారపు పుష్పములను, ప్రమిదెలను, కారు
లను, । మేలిమి బంగారపు పాత్రలను, కత్తెరలను, 5
గిన్నెలను, ధూపకలశములను, అంతర్మందిరమను అతి
పరిశుద్ధమైన స్థలముయొక్క తలుపులకును మందిర
మను ఆలయపు తలుపులకును కలిగిన బంగారపు
బందులను, వీటినన్నిటిని చేయించెను. । ఈ ప్రకా 5
రము రాజైన సొలొమోను యెహోవా మందిరము
నకు చేసిన పని అంతయు సమాప్తమాయెను. మరియు
సొలొమోను తన తండ్రియైన దావీదు ప్రతిష్ఠించిన

వెండిని బంగారమును ఉపకరణములను తెప్పించి
యెహోవా మందిరపు ఖజానాలో ఉంచెను.

8 అప్పుడు సీయోను అను దావీదు పురములో
నుండి యెహోవా నిబంధన మందసమును తీసికొని
వచ్చుటకు యెరూషలేములోనుండు రాజైన సొలొ
మోను ఇశ్రాయేలీయుల పెద్దలను గోత్ర ప్రధాను
లను, అనగా ఇశ్రాయేలీయుల పితరుల కుటుంబముల
2 పెద్దలను, తనయొద్దకు సమకూర్చెను. । కాబట్టి ఇశ్రా
యేలీయులందరును ఏతనీము అను ఏడవ మాసమందు
పండుగ కాలమున రాజైన సొలొమోనునొద్దకు
3 కూడుకొనిరి. । ఇశ్రాయేలీయుల పెద్దలందరును రాగా
4 యాజకులు యెహోవా మందసమును ఎత్తి । దాని
తీసికొనివచ్చిరి. ప్రత్యక్షపు గుడారమును గుడార
ములోనున్న పరిశుద్ధ ఉపకరణములను యాజకులును
5 లేవీయులును తీసికొనిరాగా । రాజైన సొలొమోనును
అతనియొద్దకు కూడి వచ్చిన ఇశ్రాయేలీయులగు సమా
జకులందరును మందసము ముందర నిలువబడి, లెక్కింప
శక్యముగాని గొఱ్ఱెలను ఎడ్లను బలిగా అర్పించిరి. ।
6 మరియు యాజకులు యెహోవా నిబంధన మందస
మును తీసికొని దాని స్థలములో, అనగా మందిరపు
గర్భాలయమగు అతిపరిశుద్ధస్థలములో, కెరూబుల
7 రెక్కలక్రింద దాని ఉంచిరి. । కెరూబుల రెక్కలు
మందసస్థానము మీదికి చాపబడెను, ఆ కెరూబులు
మందసమును దాని దండెలను పైతట్టున కమ్మెను. ।
8 వాటి కొనలు గర్భాలయము ఎదుట పరిశుద్ధ స్థలము
లోకి కనబడునంత పొడవుగా ఆ దండెలుంచబడెను
గాని యివి బయటికి కనబడలేదు. అవి నేటివరకు
9 అక్కడనే యున్నవి. । మందసములో ఆ రెండు
రాతిపలకలు తప్ప మరి ఏమియు లేకపోయెను. ఇశ్రా
యేలీయులు ఐగుప్తు దేశములోనుండి వచ్చినప్పుడు
యెహోవా వారితో నిబంధనచేయగా మోషే తాను
హోరేబునందు ఆ పలకలను అందులో ఉంచె
10 ను. । యాజకులు పరిశుద్ధస్థలములోనుండి బయటికి
వచ్చినప్పుడు మేఘము యెహోవా మందిరమును
11 నింపెను. । కాబట్టి యెహోవా తేజోమహిమ
యెహోవా మందిరములో నిండుకొనగా ఆ మేఘ
మున్న హేతువుచేత యాజకులు సేవచేయుటకు
నిలువలేక పోయిరి.

12 సొలొమోను దాని చూచి—గాఢాంధకారమందు
నివాసము చేయుదునని యెహోవా సెలవిచ్చి యు
13 న్నాడు. । నీవు నివాసము చేయుటకు నేను మంది
రము కట్టించియున్నాను; సదాకాలము అందులో
నీవు నివసించుటకై నేనొకస్థలము ఏర్పరచియున్నాను
14 అని చెప్పి । తన ముఖమును ప్రజలతట్టు త్రిప్పు
కొని, ఇశ్రాయేలీయుల సమాజమంతయు నిలిచియుం
డగా ఇశ్రాయేలీయుల సమాజకులందరిని ఈలాగు
దీవించెను. ।—నా తండ్రియైన దావీదుకు మాట 15
యిచ్చి దాని నెరవేర్చిన ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవాకు స్తోత్రము కలిగియుండును గాక. ।—
నేను ఇశ్రాయేలీయులగు నా జనులను ఐగుప్తుదేశము 16
లోనుండి రప్పించిన నాటనుండి నా నామము దాని
యందుండునట్లుగా ఇశ్రాయేలీయుల గోత్రస్థానము
లలో ఏ పట్టణములోనైనను మందిరమును కట్టించు
టకు నేను కోరలేదు గాని ఇశ్రాయేలీయులగు నా
జనులమీద దావీదును ఉంచుటకు నేను కోరియు
న్నాను అని ఆయన సెలవిచ్చెను. । ఇశ్రాయే 17
లీయుల దేవుడైన యెహోవా నామఘనతకు ఒక
మందిరమును కట్టింపవలెనని నా తండ్రియైన దావీ
దుకు మనస్సు పుట్టగా । యెహోవా నా తండ్రి 18
యైన దావీదుతో సెలవిచ్చినదేమనగా—నా నామ
ఘనతకు ఒక మందిరమును కట్టించుటకు నీవు తాత్ప
ర్యము కలిగి యున్నావు, ఆ తాత్పర్యము మంచిదే; ।
అయినను నీవు మందిరమును కట్టించకూడదు; . నీ 19
నడుములోనుండి పుట్టబోవు నీ కుమారుడు నా నామ
ఘనతకు ఒక మందిరమును కట్టించును. । ప్రమాణము 20
చేసి తాను సెలవిచ్చిన మాటను యెహోవా నెర
వేర్చియున్నాడు. నేను నా తండ్రియైన దావీదుకు
ప్రతిగా నియమింపబడి, యెహోవా సెలవుచొప్పున
ఇశ్రాయేలీయులమీద సింహాసనాసీనుడనై యుండి,
ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా నామఘన
తకు మందిరమును కట్టించియున్నాను. । అందులో 21
యెహోవా నిబంధన మందసమునకు స్థలము ఏర్ప
రచితిని, ఐగుప్తుదేశములోనుండి ఆయన మన పితరు
లను రప్పించినప్పుడు ఆయన చేసిన నిబంధన అందు
లోనే యున్నది.

ఇశ్రాయేలీయుల సమాజకులందరు చూచుచుం 22
డగా సొలొమోను యెహోవా బలిపీఠము ఎదుట
నిలువబడి ఆకాశముతట్టు చేతులెత్తి యిట్లనెను ।-
యెహోవా ఇశ్రాయేలీయుల దేవా, పైనున్న ఆకాశ 23
మందైనను క్రిందనున్న భూమియందైనను నీవంటి
దేవుడొకడును లేడు; పూర్ణమనస్సుతో నీ దృష్టికి అను
కూలముగా నడుచు నీ దాసుల విషయమై నీవు నిబంధ
నను నెరవేర్చుచు కనికరము చూపుచు ఉండువాడవై
యున్నావు; । నీ దాసుడైన నా తండ్రియగు దావీ 24
దుకు నీవు చేసిన వాగ్దానమును స్థిరపరచి, నీవిచ్చిన
మాటను నేడు నెరవేర్చియున్నావు. । యెహోవా 25
ఇశ్రాయేలీయుల దేవా—నీ కుమారులు సత్ప్రవర్తన
గలవారై, నీవు నా యెదుట నడిచినట్లు నా యెదుట
నడిచినయెడల, నా దృష్టికి అనుకూలుడై ఇశ్రాయేలీ
యులమీద సింహాసనాసీనుడగువాడు నీకుండక మాన
డని సెలవిచ్చితివి. నీవు నీ దాసుడును నా తండ్రి
యునగు దావీదుకు ఇచ్చిన వాగ్దానమును స్థిరపర

26 చుము. ఇశ్రాయేలీయుల దేవా, దయచేసి నీ దాసు
డును నా తండ్రియునైన దావీదుతో నీవు సెలవిచ్చిన
27 మాటను నిశ్చయపరచుము. నిశ్చయముగా దేవుడు
ఈ లోకమందు నివాసము చేయునా; ఆకాశ మహా
కాశములు సహితము నిన్ను పట్టజాలవు; నేను కట్టిం
28 చిన యీ మందిరము ఏలాగు పట్టును? అయినను
యెహోవా నా దేవా, నీ దాసుడనైన నా ప్రార్థ
నను విన్నపమును అంగీకరించి, యీ దినమున నీ
దాసుడనైన నేను చేయు ప్రార్థనను పెట్టు మొరను
29 ఆలకించుము. ఈ స్థలమును స్మరించి, నీ దాసుడ
నైన నేను చేయు ప్రార్థనను దయతో అంగీకరించు
నట్లు — నా నామము అక్కడ ఉండునని యే స్థల
మునుగూర్చి నీవు సెలవిచ్చితివో ఆ స్థలమైన యీ
మందిరముతట్టు నీ నేత్రములు రేయింబగలు తెరవబడి
30 యుండునుగాక. మరియు నీ దాసుడనైన నేనును
నీ జనులైన ఇశ్రాయేలీయులును ఈ స్థలమును స్మరించి
ప్రార్థన చేయునప్పుడెల్ల, నీ నివాసస్థానమైన ఆకాశ
మందు విని మా విన్నపము అంగీకరించుము; విను
31 నప్పుడెల్ల మమ్మును క్షమించుము. ఎవడైనను తన
పొరుగువానికి అన్యాయము చేయగా అతనిచేత
ప్రమాణము చేయించుటకు అతనిమీద ఒట్టు పెట్ట
బడినయెడల, అతడు ఈ మందిరమందున్న నీ బలిపీఠము
32 ఎదుట ఆ ఒట్టు పెట్టునప్పుడు నీవు ఆకాశమందు
విని, నీ దాసులకు న్యాయము తీర్చి, హాని చేసినవాని
తలమీదికి శిక్ష రప్పించి నీతిపరుని నీతిచొప్పున వానికి
33 ఇచ్చి వాని నీతిని నిర్ధారణచేయుము. మరియు
ఇశ్రాయేలీయులగు నీ జనులు నీకు విరోధముగా
పాపముచేయుటచేత తమ శత్రువులయెదుట మొత్త
బడినప్పుడు, వారు నీతట్టు తిరిగి నీ నామమును ఒప్పు
కొని యీ మందిరమందు నిన్నుగూర్చి ప్రార్థన విన్న
34 పములు చేయునప్పుడెల్ల నీవు ఆకాశమందు విని,
ఇశ్రాయేలీయులగు నీ జనులు చేసిన పాపమును
క్షమించి, వారి పితరులకు నీవిచ్చిన దేశములోనికి వారిని
35 తిరిగి రప్పించుము. మరియు వారు నీకు విరోధ
ముగా పాపము చేసినందున ఆకాశము మూయబడి
వర్షము లేక పోగా, నీవు వారిని ఈలాగున శ్రమ
పెట్టుటవలన వారు నీ నామమును ఒప్పుకొని తమ
పాపములను విడిచి యీ స్థలమును స్మరించి ప్రార్థన
36 చేసిన పక్షమున నీవు ఆకాశమందు విని, నీ దాసు
లైన ఇశ్రాయేలీయులగు నీ జనులు చేసిన పాపమును
క్షమించి, వారు నడువవలసిన సన్మార్గమును వారికి
చూపించి, నీ జనులకు నీవు స్వాస్థ్యముగా ఇచ్చిన
37 భూమిమీద వర్షము కురిపించుము. దేశమందు
క్షామము గాని తెగులు గాని గాడ్పు దెబ్బ గాని చిత్త
పట్టుట గాని మిడతలు గాని చీడపురుగు గాని కలిగి
నను, వారి శత్రువు వారి దేశపు పట్టణములలో వారిని
ముట్టడివేసినను, ఏ తెగులు గాని వ్యాధి గాని కలిగి
నను, ఇశ్రాయేలీయులగు నీ జనులలో ప్రతి మనిషి
తన తన మనోవ్యాధిని తెలిసికొనును గనుక ఒక్కడై
నను జనులందరైనను ఈ మందిరము తట్టు తమ చేతులు
చాపి ప్రార్థన విన్నపములు చేసిన పక్షమున ప్రతి
మనిషియొక్క హృదయము నీ వెరుగుదువు గనుక
నీవు ఆకాశమను నీ నివాసస్థలమందు విని, క్షమించి
దయచేసి యెవరి ప్రవర్తననుబట్టి వారికి ప్రతిఫలమిచ్చి
మా పితరులకు నీవు దయచేసిన దేశమందు జనులు
బ్రదుకు దినములన్నిటను వారు నీయందు భయభక్తులు
కలిగియుండునట్లు చేయుము; నరపుత్రులందరి హృద
యములను నీవు మాత్రమే తెలిసికొనియున్నావు.
మరియు ఇశ్రాయేలీయులగు నీ జనుల సంబంధులు
కాని పరదేశులు నీ నామమునుబట్టి దూరదేశమునుండి
వచ్చి నీ ఘనమైన నామమునుగూర్చియు, నీ బాహు
బలమునుగూర్చియు, నీవు చాపిన బాహువు ప్రసిద్ధిని
గూర్చియు విందురు. వారు వచ్చి యీ మందిరము
తట్టు ప్రార్థన చేసినపక్షమున ఆకాశమను నీ నివాస
స్థలమందు నీవు విని, పరదేశులు నిన్ను వేడుకొనుదాని
ప్రకారము సమస్తము ననుగ్రహించుము, అప్పుడు
లోకములోని జనులందరును నీ నామమును ఎరిగి,
ఇశ్రాయేలీయులగు నీ జనులవలెనే నీయందు భయ
భక్తులు కలిగి, నేను కట్టించిన యీ మందిరమునకు నీ
పేరు పెట్టబడినదని తెలిసికొందురు. మరియు నీ
జనులు తమ శత్రువులతో యుద్ధము చేయుటకై నీవు
వారిని పంపించు ఏ స్థలమునకైనను బయలుదేరునప్పుడు,
నీవు కోరుకొనిన పట్టణముతట్టును నీ నామఘనతకు
నేను కట్టించిన మందిరముతట్టును యెహోవా నామమునుబట్టి
నీకు వారు ప్రార్థన చేసిన పక్షమున ఆకాశమందు 4
నీవు వారి ప్రార్థన విన్నపములను విని, వారి కార్య
మును నిర్వహించుము. పాపము చేయనివాడు ఒక
డును లేడు; వారు నీకు విరోధముగా పాపము చేసిన
యెడలనేమి, నీవు వారిమీద కోపపడి వారిని
శత్రువులచేతికి అప్పగించినయెడలనేమి, వారు వీరిని
దూరమైనట్టి గాని సమీపమైనట్టి గాని ఆ శత్రువుల
దేశములోనికి చెరగా కొనిపోయినప్పుడు వారు
చెరగా కొనిపోబడిన దేశమందు తాముచేసిన దానిని
మనస్సుకు తెచ్చుకొని—మేము దుర్మార్గులమై ప్రవర్తించి
పాపము చేసితిమని చెప్పి, తమ్మును చెరగా కొనిపోయిన
వారిదేశమందు చింతించి పశ్చాత్తాపపడి నీకు విన్న
పము చేసిన పక్షమున తమ్మును చెరగా కొనిపోయిన
వారియొక్క దేశమందు పూర్ణహృదయముతోను
పూర్ణాత్మతోను వారు నీ తట్టు తిరిగి, నీవు వారి పిత
రులకు దయచేసిన దేశముతట్టును నీవు కోరుకొనిన
పట్టణముతట్టును నీ నామఘనతకు నేను కట్టించిన
మందిరముతట్టును నిన్నుగూర్చి ప్రార్థనచేసిన పక్ష

49 [illegible] నీవు వారి
[illegible] విన్న
50 [illegible] చేసిన నీ జనులు
[illegible] ఆ యప్పు
[illegible] కొనిపోయిన
[illegible] కనికరము
51 [illegible] కొలిమి
[illegible] నీ స్వాస్థ్య
52 [illegible] నేను
[illegible] నీ
[illegible] కూడి,
[illegible] చేయునప్పుడు
[illegible] కాలకుం
53 [illegible] నేను నా పితరులను
[illegible] నీ
[illegible] నీ స్వాస్థ్యముగా
[illegible] వారిని
[illegible]
54 [illegible] విన్న
[illegible] చేసి
[illegible]
55 [illegible] మహా
[illegible] కేకం
56 [illegible] మాటలన్నిటినిబట్టి
[illegible] నెరవేర్చిన
[illegible] గాక. తన
[illegible] చేసిన శుభవాగ్దాన
57 [illegible] గాక
[illegible] మనలను విడువ
[illegible] మానకను
58 [illegible] అనుసరించి
[illegible] మన పితరులకిచ్చిన
[illegible] మన
[illegible] గాక.
59 [illegible] ఇశ్రాయేలీ
[illegible] అవసరముకొలది,
[illegible] యెహోవా
[illegible] ఈ మాటలు రేయింబగలు
[illegible] సన్నిధిని ఉండును గాక.
60 [illegible] జనులందరును యెహోవాయే
దేవుడనియు, ఆయన తప్ప మరి ఏ దేవుడును లేడనియు
61 తెలిసికొందురు. కాబట్టి ఆయన నియమించిన కట్టడ
లను అనుసరించి నడుచుకొనుటకును, ఈ దినమం
దున్నట్లు ఆయన చేసిన నిర్ణయములను చేకొనుటకును,
మీ హృదయము మీ దేవుడైన యెహోవా విషయమై
62 సర్వసిద్ధముగా నుండును గాక. అంతట రాజును,
అతనితోకూడ ఇశ్రాయేలీయులందరును యెహోవా
సముఖమందు బలులు అర్పించుచుండగా ఇరువది 63
రెండు వేల యెడ్లను, లక్ష యిరువది వేల గొఱ్ఱెలను
సొలొమోను సమాధానబలులగా యెహోవాకు
అర్పించెను. ఈ ప్రకారము రాజును ఇశ్రాయేలీయు
లందరును యెహోవా మందిరమును ప్రతిష్ఠచేసిరి.
ఆ దినమున యెహోవా సముఖమందున్న యిత్తడి 64
బలిపీఠము ఆ దహనబలులను నైవేద్యములను సమా
ధానబలి పశువుల క్రొవ్వును అర్పించుటకు బహు
చిన్నదై చాలకపోయెను గనుక రాజు యెహోవా
మందిరము ముందరనున్న ఆవరణము మధ్యనుండు
స్థలమును ప్రతిష్ఠించి అచ్చట దహనబలులను నైవేద్య
ములను సమాధానబలిపశువుల క్రొవ్వును అర్పించెను.
మరియు ఆ సమయమున సొలొమోనును అతనితో 65
కూడ ఇశ్రాయేలీయులందరును హమాతులో ప్రవే
శించు స్థలము మొదలుకొని ఐగుప్తునది పర్యంతమున
నున్న సకల ప్రాంతములనుండి వచ్చిన ఆ మహా
సమూహమును రెండు వారములు, అనగా పదు
నాలుగు దినములు యెహోవా సముఖమందు ఉత్స
వము చేసిరి. ఎనిమిదవ దినమున అతడు జనులకు 66
సెలవియ్యగా, వారు రాజును పొగడి యెహోవా
తన దాసుడైన దావీదునకును ఇశ్రాయేలీయులగు తన
జనులకును చేసిన మేలంతటినిబట్టి సంతోషించుచు
ఆనందహృదయులై తమ తమ స్థానములకు వెళ్లి
పోయిరి.

సొలొమోను యెహోవా మందిరమును రాజ 9
నగరును కట్టుటయు, తాను చేయకోరినదంతటిని
చేయుటయు ముగించిన తరువాత గిబియోనులో 2
ప్రత్యక్షమైనట్లు రెండవమారు యెహోవా సొలొ
మోనునకు ప్రత్యక్షమై అతనితో ఈలాగు సెల 3
విచ్చెను — నా సముఖమందు నీవు చేసిన ప్రార్థన
విన్నపములను నేను అంగీకరించితిని, నా నామమును
అక్కడ సదాకాలము ఉంచుటకు నీవు కట్టించిన యీ
మందిరమును పరిశుద్ధపరచియున్నాను; నా దృష్టియు
నా మనస్సును ఎల్లప్పుడు అక్కడ ఉండును. నీ 4
తండ్రియైన దావీదు నడిచినట్లు నీవును యథార్థహృద
యుడవై నీతిని బట్టి నడుచుకొని, నేను నీకు సెల
విచ్చినదంతటి ప్రకారము చేసి నా కట్టడలను విధు
లను అనుసరించినయెడల నీ సంతతిలో ఒకడు 5
ఇశ్రాయేలీయులమీద సింహాసనాసీనుడై యుండక
మానడని నీ తండ్రియైన దావీదునకు నేను సెలవిచ్చి
యున్నట్లు ఇశ్రాయేలీయులమీద నీ సింహాసనమును
చిరకాలపర్యంతము స్థిరపరచుదును. అయితే మీరే 6
గాని మీ కుమారులే గాని యేమాత్రమైనను నన్ను
వెంబడించుట మాని, నేనిచ్చిన
అనుసరింపక యితరమైన దేవతల

7 యెడల । నేను ఇశ్రాయేలీయులకిచ్చిన యీ దేశ
ములో వారిని ఉండనియ్యక వారిని నిర్మూలము చేసి,
నా నామమునకు నేను పరిశుద్ధపరచిన యీ మందిర
మును నా సముఖములోనుండి కొట్టివేసెదను; ఇశ్రా
యేలీయులు సర్వజనములలో చెదరిపోయి సామెతె
8 గాను హేళనగాను చేయబడుదురు. । ఈ మందిర
మార్గమున వచ్చువారందరును దానిమూచి ఆశ్చర్యపడి
తిరస్కారముచేసి — యెహోవా ఈ దేశమునకును
ఈ మందిరమునకును ఈలాగున ఎందుకు చేసెనని
9 యడుగగా । జనులిట్లందురు—ఐగుప్తుదేశములోనుండి
తమ పితరులను రప్పించిన తమ దేవుడైన యెహోవాను
వారు విడిచి యితర దేవతలను ఆధారము చేసికొని
కొలిచి పూజించుచు వచ్చిరి గనుక యెహోవా ఈ
కీడంతయు వారిమీదికి రప్పించియున్నాడు.
10 సొలొమోను యెహోవా మందిరమును రాజ
నగరును ఈ రెండింటిని యిరువది సంవత్సరములలోగా
కట్టించెను. అతడు పని ముగించినతరువాత తూరు
రాజైన హీరాము సొలొమోను కోరినంతమట్టుకు
దేవదారు మ్రానులను సరళవృక్షపు మ్రానులను బం
11 గారమును అతనికిచ్చియున్నందున । సొలొమోను
గలిలైయ దేశమందున్న యిరువది పట్టణములను
12 హీరాము కప్పగించెను. । హీరాము సొలొమోను
తనకిచ్చిన పట్టణములను చూచుటకు తూరునుండి
రాగా అవి అతని దృష్టికి అనుకూలమైనవిగా కనబడ
13 లేదు గనుక । —నా సహోదరుడా, నీవు నాకిచ్చిన
యీ పట్టణములు ఏపాటివనెను. నేటివరకు వాటికి
14 నిష్ప్రయోజకదేశమని పేరు. । హీరాము ఇన్నూట
నలువది మణుగుల బంగారమును రాజుకు పంపించెను.
15 యెహోవా మందిరమును మిల్లోనును యెరూష
లేముయొక్క ప్రాకారమును హాషోరు మెగిద్దో గెజెరు
అను పట్టణములను కట్టించుటకు సొలొమోను వెట్టి
16 వారిని పెట్టెను. । ఐగుప్తురాజైన ఫరో గెజెరుమీదికి
వచ్చి దాని పట్టుకొని అగ్నిచేత కాల్చి ఆ పట్టణ
మందున్న కనానీయులను హతముచేసి దానిని తన
కుమార్తెయైన సొలొమోను భార్యకు కట్నముగా
17 ఇచ్చెను. । సొలొమోను గెజెరును కట్టించెను, మరియు
18 దిగువను బేత్హోరోనును, । బాలాతును దేశమం
19 దున్న అరణ్యములో తద్మోరునును, । సొలొమోను
భోజనపదార్థములకు ఏర్పాటైన పట్టణములను, రథ
ములకు ఏర్పాటైన పట్టణములను, రౌతులకు ఏర్పా
టైన పట్టణములను, సొలొమోను యెరూషలేమునం
దును లెబానోనునందును తాను ఏలిన దేశమంతటి
యందును ఏదేది కట్టుటకు కోరెనో అదియును కట్టిం
20 చెను. । అయితే ఇశ్రాయేలీయులుకాని అమోరీయులు
హిత్తీయులు పెరిజ్జీయులు హివ్వీయులు యెబూ
21 సీయులు అనువారిలో శేషించిన వారుండిరి. । ఇశ్రా
యేలీయులు వారిని నిర్మూలము చేయలేక పోగా వారి
దేశమందు శేషించియున్న వారి పిల్లలను సొలొమోను
దాసత్వముచేయ నియమింపగా నేటివరకు ఆలాగు
జరుగుచున్నది. । అయితే ఇశ్రాయేలీయులలో ఎవని 22
నైనను సొలొమోను దాసునిగా చేయలేదు; వారు
రాణువవారుగాను తనకు సేవకులుగాను అధిపతులు
గాను సైన్యాధిపతులుగాను అతని రథాధిపతులుగాను
రౌతులుగాను ఉండిరి. । సొలొమోనుయొక్క పని 23
మీదనున్న ప్రధానులు ఏనూట ఏబదిమంది; వీరు
పనివాండ్లమీద అధికారులుగా ఉండిరి. । ఫరో 24
కుమార్తె దావీదు పురమునుండి సొలొమోను తనకు
కట్టించిన నగరునకు రాగా అతడు మిల్లోను కట్టిం
చెను. । మరియు సొలొమోను కట్టించిన బలిపీఠము 25
మీద ఏడాదిలో మూడు మారులు దహనబలులను
సమాధానబలులను యెహోవాకు అర్పించుచు,
యెహోవా సముఖమందున్న పీఠముమీద ధూప
ద్రవ్యము వేయుచుండెను; పిమ్మట అతడు మందిర
మును సమాప్తము చేసెను.
మరియు రాజైన సొలొమోను ఎదోముదేశపు 26
ఎఱ్ఱసముద్రతీరమందున్న ఏలతునొద్దను ఎసోన్గాబెరు
నందు ఓడలను కట్టించెను. । సొలొమోను సేవకులతో 27
కూడ హీరాము సముద్రప్రయాణము చేయనెరిగిన
ఓడవారైన తన దాసులను ఓడలమీద పంపెను. ।
వారు ఓఫీరను స్థలమునకు పోయి అక్కడనుండి యెని 28
మిది నూరుల నలువది మణుగుల బంగారమును రాజైన
సొలొమోనునొద్దకు తీసికొని వచ్చిరి.
షేబదేశపురాణి యెహోవా నామమును **10**
గూర్చియు, సొలొమోనునకు కలిగిన కీర్తినిగూర్చియు
విని, గూఢార్థముగల మాటలచేత అతని శోధించుటకై
వచ్చెను. । ఆమె గొప్ప పరివారముతో, గంధవర్గమును 2
విస్తారమైన బంగారమును రత్నములను ఒంటెలమీద
ఎక్కించుకొని యెరూషలేమునకు వచ్చెను. సొలొ
మోను దర్శనముచేసి తనకు తోచినదానినంతటినిబట్టి
అతనితో మాటలాడగా । ఆమె వేసిన ప్రశ్నలన్ని 3
టికి సొలొమోను ప్రత్యుత్తరము చెప్పెను; రాజుకు
మరుగైనదేదియు లేనందున ఆమె ప్రశ్నవేసిన
వాటన్నిటి భావము చెప్పెను. । షేబరాణి సొలొ 4
మోనుయొక్క జ్ఞానమును అతడు కట్టించిన మందిర
మును, । అతని బల్లమీదనున్న భోజనద్రవ్యములను, 5
అతని సేవకులు కూర్చుండు పీఠములను, అతని ఉప
చారులు కనిపెట్టుటను, వారి వస్త్రములను, అతనికి
గిన్నె నందించువారిని, యెహోవా మందిరమందు
అతడు అర్పించు దహనబలులను చూచి విస్మయమొం
దినదై । రాజుతో ఇట్లనెను — నీ కార్యములను 6
గూర్చియు జ్ఞానమునుగూర్చియు నా దేశమందు నేను
వినిన మాట నిజమే; । అయినను నేను వచ్చి కన్ను 7

లార చూడకమునుపు ఆ మాటలను నమ్మకయుంటిని;
ఉన్న దానిలో సగమైనను నాతో చెప్పబడలేదని
యిప్పుడు నేను తెలిసికొనుచున్నాను. నీ జ్ఞానమును
నీ భాగ్యమును నేను వినినదానిని బహుగా మించి
8 యున్నవి; । నీ జనులు భాగ్యవంతులు, నీ యెదుర
ఎల్లప్పుడును నిలిచి నీ జ్ఞానవచనములను వినుచుండు
9 నీ సేవకులును భాగ్యవంతులు. । నీయందు ఆనందించి
నిన్ను ఇశ్రాయేలీయులమీద రాజుగా నియమించిన
నీ దేవుడైన యెహోవాకు స్తోత్రము కలుగునుగాక.
యెహోవా ఇశ్రాయేలీయులయందు శాశ్వత ప్రేమ
యుంచెను గనుక నీతిన్యాయములను అనుసరించి రాజ్య
కార్యములను జరిగించుటకు ఆయన నిన్ను నియమిం
10 చెను. । మరియు ఆమె రాజునకు ఇన్నూట నలువది
మణుగుల బంగారమును, బహు విస్తారమైన గంధ
వర్గమును, రత్నములను ఇచ్చెను. షేబదేశపు రాణి
రాజైన సొలొమోనునకు ఇచ్చిన గంధవర్గములంత విస్తా
11 రము మరి ఎన్నడైనను రాలేదు. । మరియు ఓఫీరు
దేశమునుండి బంగారము తెచ్చిన హీరాము ఓడలు
ఓఫీరునుండి చందనపు మ్రానులను రత్నములను బహు
12 విస్తారముగా తెచ్చెను. । ఈ చందనపు మ్రానులచేత
రాజు యెహోవా మందిరమునకును రాజనగరున
కును స్తంభములను, గాయకులకు సితారాలను స్వర
మండలములను చేయించెను. ఇప్పుడు అటువంటి చంద
నపు మ్రానులు దొరకవు, ఎక్కడను కనబడవు. ।
13 సొలొమోను తన ప్రభావమునకు తగినట్లు షేబదేశపు
రాణికిచ్చినదిగాక ఆమె కోరినప్రకారము ఆమె
యిచ్ఛాపూర్తిగా ఆమెకిచ్చెను; అప్పుడు ఆమెయు
ఆమె సేవకులును తమ దేశమునకు తిరిగి వెళ్లిరి.
14 ఏటేట సొలొమోనునకు వచ్చు బంగారము వెయ్యిని
15 ఆరునూట ముప్పది రెండు మణుగుల యెత్తు. । ఇదియు
గాక గంధవర్గములు మొదలైనవి వర్తకులయొద్దనుం
డియు, అరబి రాజులయొద్దనుండియు దేశాధికారుల
యొద్దనుండియు అతనికి చాలా వచ్చుచుండెను. ।
16 రాజైన సొలొమోను సుత్తెతో కొట్టిన బంగారముతో
అలుగులుగల యిన్నూరు డాళ్లను చేయించెను; డాలు
ఒకటింటికి ఆరు నూర్ల తులముల యెత్తు బంగారముం
17 డెను. । మరియు సుత్తెతో కొట్టిన బంగారముతో
అతడు మున్నూరు కేడెములను చేయించెను; కేడెము
ఒకటింటికి మున్నూరు బంగారపు తులముల యెత్తు
బంగారముండెను; వీటిని రాజు లెబానోను అరణ్యపు
18 మందిరమందుంచెను. । మరియు రాజు దంతముచేత
పెద్ద సింహాసనము చేయించి సువర్ణములో దాని పొది
19 గించెను. । ఈ సింహాసనమునకు ఆరుమెట్లుండెను;
సింహాసనము మీదిభాగపు వెనుకతట్టు గుండ్రముగా
ఉండెను; ఆసనమునకు ఇరుపార్శ్వములయందు ఊత
లుండెను; ఊతలదగ్గర రెండు సింహములు నిలిచి
యుండెను. । ఇరుప్రక్కల ఆరు మెట్లమీద పం 20
డ్రెండు సింహములు నిలిచియుండెను; అటువంటిది
ఏ రాజ్యమందైనను చేయబడలేదు. । మరియు రాజైన 21
సొలొమోను పానపాత్రలు బంగారువై యుండెను;
లెబానోను అరణ్యమందిరపు పాత్రలును బంగారపువే,
వెండిది యొకటియు లేదు; సొలొమోను దినములలో
వెండి యెన్నికకు రాలేదు. । సముద్రమందు హీరాము 22
ఓడలతోకూడ తర్షీషు ఓడలును రాజునకు కలిగి యుం
డెను; ఈ తర్షీషు ఓడలు మూడు సంవత్సరములకు
ఒకమారు బంగారమును వెండిని దంతమును కోతులను
నెమలి పిట్టలను తీసికొని వచ్చుచుండెను. । ఈ ప్రకా 23
రము రాజైన సొలొమోను ధనముచేతను జ్ఞానము
చేతను భూపతులందరిలో అధికుడై యుండెను. ।
అతని హృదయమందు దేవుడు ఉంచిన జ్ఞానవాక్యము 24
లను వినుటకై లోకులందరును అతని చూడగోరిరి. ।
ఏర్పాటైన ప్రతిమనిషి వెండి వస్తువులు గాని, బంగా 25
రపు వస్తువులు గాని, వస్త్రములు గాని, యుద్ధాయుధ
ములు గాని, గంధవర్గములు గాని, గుర్రములు గాని,
కంచరగాడిదలు గాని, తన తన వంతుచొప్పున కట్న
ములను ఏటేట తీసికొని వచ్చుచుండెను. । మరియు 26
సొలొమోను రథములను రౌతులను సమకూర్చెను;
అతడు వెయ్యిన్ని నన్నూరు రథములును పండ్రెండు
వేల రౌతులును గలవాడై యుండెను; వీటిని అతడు
రథములకై యేర్పడిన పురములలోను యెరూషలేము
నందు రాజునొద్దను ఉంచ నిర్ణయించెను. । రాజు 27
యెరూషలేములో వెండిని రాళ్లంత విస్తారముగా
వాడుక చేసెను; దేవదారు మ్రానులను షెఫేలా
ప్రదేశముననున్న మేడిచెట్లవలె విస్తరింపజేసెను. ।
సొలొమోనునకుండు గుర్రములు ఐగుప్తులోనుండియు 28
కోవేలోనుండియు తేబడెను; రాజు వర్తకులు నియా
మకమైన ధరనిచ్చి కోవేనుండి కొని తెప్పించిరి. ।
వారు ఐగుప్తులోనుండి కొనితెచ్చిన రథమొకటింటికి 29
ఆరునూర్ల తులముల వెండియు, గుర్రమొకటింటికి
నూట ఏబది తులముల వెండియు ఇచ్చిరి. హిత్తీయుల
రాజులందరికొరకును అరాము రాజులకొరకును వారు
ఆ ధరకే వాటిని తీసికొనిరి.

మోయాబీయులు ఎదోమీయులు అమ్మోనీ **11**
యులు సీదోనీయులు హిత్తీయులు అను జనులు మీ
హృదయములను తమ దేవతలతట్టు త్రిప్పుదురు గనుక
వారితో సహవాసము చేయకూడదనియు, వారిని
మీతో సహవాసము చేయనియ్యకూడదనియు
యెహోవా ఇశ్రాయేలీయులకు సెలవిచ్చి యు
న్నాడు. అయితే రాజైన సొలొమోను ఫరో కుమా
ర్తెనుగాక ఆ జనులలో ఇంక అనేకమంది పరస్త్రీలను
మోహించి । కామాతురత గలవాడై వారిని ఉంచు 2
కొనుచు వచ్చెను. । అతనికి [illegible]

కుమార్తెలైన భార్యలును మున్నూరుమంది ఉపపత్ను
లును కలిగియుండిరి; అతని భార్యలు అతని హృదయ
4 మును త్రిప్పివేసిరి. । సొలొమోను వృద్ధుడైనప్పుడు
అతని భార్యలు అతని హృదయమును ఇతర దేవతల
తట్టు త్రిప్పగా అతని తండ్రియైన దావీదు హృద
యమువలె అతని హృదయము దేవుడైన యెహోవా
5 యెడల యథార్థము కాకపోయెను. । సొలొమోను
అష్తారోతు అను సీదోనీయుల దేవతను మిల్కోము
అను అమ్మోనీయుల హేయమైన దేవతను అనుసరించి
6 నడిచెను. । ఈ ప్రకారము సొలొమోను యెహోవా
దృష్టికి చెడు నడత నడచి తన తండ్రియైన
దావీదు అనుసరించినట్లు యథార్థహృదయముతో
7 యెహోవాను అనుసరింపలేదు. । సొలొమోను
కెమోషు అను మోయాబీయుల హేయమైన దేవత
కును మొలెకు అను అమ్మోనీయుల హేయమైన దేవత
కును యెరూషలేము ఎదుటనున్న కొండమీద బలిపీఠ
8 ములను కట్టించెను. । తమ దేవతలకు ధూపము
వేయుచు బలుల నర్పించుచుండిన పరస్త్రీలైన తన
భార్యల నిమిత్తము అతడు ఈలాగు చేసెను.
9 ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా అతనికి
10 రెండు మారులు ప్రత్యక్షమై । —నీవు ఇతర దేవతలను
వెంబడింపవలదని అతనికి ఆజ్ఞాపించినను సొలొమోను
హృదయము ఆయన యొద్దనుండి తొలగిపోయెను
యెహోవా తనకిచ్చిన ఆజ్ఞను అతడు గైకొనకపోగా
11 యెహోవా అతనిమీద కోపగించి । సెలవిచ్చిన
దేమనగా—నేను నీతో చేసిన నా నిబంధనను కట్టడ
లను నీవు ఆచరింపక పోవుట నేను కనుగొనుచున్నాను
గనుక యీ రాజ్యము నీకుండకుండ నిశ్చయముగా
12 తీసివేసి నీ దాసునికిచ్చెదను. । అయినను నీ తండ్రి
యైన దావీదు నిమిత్తము నీ దినములయందు నేను
ఆలాగున చేయక నీ కుమారుని చేతిలోనుండి దాని
13 తీసివేసెదను. । రాజ్యమంతయు తీసివేయను; నా
దాసుడైన దావీదు నిమిత్తమును నేను కోరుకొనిన
యెరూషలేము నిమిత్తమును ఒక గోత్రము నీ కుమా
రునికిచ్చెదను.
14 యెహోవా ఎదోమీయుడైన హదదు అను
ఒకని సొలొమోనుకు విరోధిగా లేపెను; అతడు
15 ఎదోముదేశపు రాజవంశస్థుడు. । దావీదు ఎదోము
దేశముమీద యుద్ధము చేయుచుండగా, సైన్యాధిపతి
యైన యోవాబు చంపబడినవారిని పాతిపెట్టుటకు
వెళ్లియున్నప్పుడు ఎదోము దేశమందున్న మగవారి
16 నందరిని హతము చేసెను. । ఎదోములోనున్న మగ
వారినందరిని హతము చేయువరకు ఇశ్రాయేలీయు
లందరితోకూడ యోవాబు ఆరు నెలలు అచ్చట నిలి
17 చెను. । అంతట హదదును అతనితోకూడ అతని
తండ్రి సేవకులలో కొందరు ఎదోమీయులును ఐగుప్తు
దేశములోకి పారిపోయిరి; హదదు అప్పుడు చిన్న
వాడై యుండెను. । వారు మిద్యాను [illegible]లోనుండి 18
బయలుదేరి పారాను దేశమునకు వచ్చి । పారాను
దేశములోనుండి కొందరిని తోడుకొని ఐగుప్తులోనికి
ఐగుప్తురాజగు ఫరోనొద్దకు రాగా, ఈ రాజు అతనికి
ఇల్లును భూమియు ఇచ్చి ఆహారము నిర్ణయించెను. ।
హదదు ఫరో దృష్టికి బహు దయపొందగా తాను 19
పెండ్లిచేసికొనిన రాణియైన తహ్పెనేసు సహో
దరిని అతనికి ఇచ్చి పెండ్లిచేసెను. । ఈ తహ్పెనేసు 20
యొక్క సహోదరి అతనికి గెనుబతు అను కుమారుని
కనెను; ఫరోయింట తహ్పెనేసు వీనికి పాలు విడి
పించెను గనుక గెనుబతు ఫరోకుటుంబికులలో నివ
సించి ఫరో కుమారులలో ఒకడుగా ఎంచబడెను. ।
అంతట దావీదు తన పితరులతోకూడ నిద్రపొందిన 21
సంగతిని, సైన్యాధిపతియైన యోవాబు మరణమైన
సంగతిని ఐగుప్తుదేశమందు హదదు విని — నేను నా
స్వదేశమునకు వెళ్లుటకు సెలవిమ్మని ఫరోతో మనవి
చేయగా । ఫరో—నీవు నీ స్వదేశమునకు వెళ్ల కోరు 22
టకు నాయొద్ద నీకేమి తక్కువైనది అని యడిగెను.
అందుకు హదదు—తక్కువైన దేదియు లేదు గాని
యేలాగుననైనను నన్ను వెళ్లనిమ్మనెను.
మరియు దేవుడు అతనిమీదికి ఎల్యాదా కుమారు 23
డైన రెజోను అను ఇంకొక విరోధిని లేపెను. వీడు
సోబారాజైన హదదెజెరు అను తన యజమానుని
యొద్దనుండి పారిపోయినవాడు. । దావీదు సోబావా 24
రిని హతము చేసినప్పుడు ఇతడు కొందరిని సమ
కూర్చి, కూడిన యొక సైన్యమునకు అధిపతియై దమ
స్కుకు వచ్చి అచ్చట నివాసము చేసి దమస్కులో
రాజాయెను. । హదదు చేసిన యీ కీడుగాక సొలొ 25
మోను బ్రదికిన దినములన్నియు ఇతడు అరాము
దేశమందు ఏలినవాడై ఇశ్రాయేలీయులకు విరోధియై
యుండి ఇశ్రాయేలీయులయందు అసహ్యతగలవాడై
యుండెను.
మరియు సొలొమోను సేవకుడైన యరొబాము 26
సహా రాజుమీదికి యుద్ధమునకు లేచెను. ఇతడు
జెరేదా సంబంధమైన ఎఫ్రాతీయుడైన నెబాతు
కుమారుడు, ఇతని తల్లిపేరు జెరూహా, ఆమె విధవ
రాలు. । ఇతడు రాజుమీదికి లేచుటకు హేతువేమ 27
నగా, సొలొమోను మిల్లో కట్టించి తన తండ్రియైన
దావీదు పురమునకు కలిగిన బీటలు బాగుచేయుచుం
డెను. । అయితే యరొబాము అను ఇతడు మహా 28
బలాఢ్యుడై యుండగా యౌవనుడగు ఇతడు పని
యందు శ్రద్ధగలవాడని సొలొమోను తెలిసికొని,
యోసేపు సంతతివారు చేయవలసిన భారమైన పని
మీద అతనిని అధికారిగా నిర్ణయించెను. । అంతట 29
యరొబాము యెరూషలేములోనుండి బయలువెడలి

పోగా షిలోనీయుడును ప్రవక్తయునగు అహీయా
అతనిని మార్గమందు కనుగొనెను; అహీయా క్రొత్త
వస్త్రము ధరించుకొని యుండెను, వారిద్దరు తప్ప
30 పొలములో మరియెవడును లేకపోయెను. । అంతట
అహీయా తాను ధరించుకొని యున్న క్రొత్త వస్త్ర
మును పట్టుకొని పన్నెండు తునకలుగా చింపి
యరొబాముతో ఇట్లనెను—ఈ పది తునకలను నీవు తీసి
31 కొనుము; । ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా
33 సెలవిచ్చునదేమనగా—జనులు నన్ను విడిచిపెట్టి అష్టా
రోతు అను సీదోనీయుల దేవతకును కెమోషు అను
మోయాబీయుల దేవతకును మిల్కోము అను అమ్మో
నీయుల దేవతకును మ్రొక్కి, సొలొమోను తండ్రి
యైన దావీదు చేసినట్లు నా దృష్టికి యోగ్యమైనదాని
చేయకయు, నా కట్టడలను నా విధులను అనుసరింప
కయు, నేను ఏర్పరచిన మార్గములలో నడవకయు
నున్నారు గనుక సొలొమోను చేతిలోనుండి రాజ్య
మును కొట్టివేసి పది గోత్రములను నీకిచ్చెదను.
అయితే నా సేవకుడైన దావీదు నిమిత్తమును, నేను
యెరూషలేము పట్టణమును కోరుకొనినందునను ఇశ్రా
యేలీయుల గోత్రములలోనుండి వానికి ఒక గోత్రము
34 ఉండనిత్తును. । రాజ్యము వాని చేతిలోనుండి బొత్తిగా
తీసివేయక నేను కోరుకొనిన నా సేవకుడైన దావీదు
నా ఆజ్ఞలను అనుసరించి నా కట్టడలను ఆచరించెను
గనుక దావీదును జ్ఞాపకము చేసికొని అతని దినము
35 లన్నియు అతనిని అధికారిగా ఉండనిత్తును. । అయితే
అతని కుమారుని చేతిలోనుండి రాజ్యమును తీసివేసి
36 అందులో నీకు పది గోత్రముల నిచ్చెదను; । నా
నామమును అక్కడ ఉంచుటకు నేను కోరుకొనిన
పట్టణమైన యెరూషలేములో నా యెదుట ఒక
దీపము నా సేవకుడైన దావీదుకు ఎల్లప్పుడు నుండు
నట్లు అతని కుమారునికి ఒక గోత్రము ఇచ్చెదను. ।
37 నేను నిన్ను అంగీకరించినందున నీ కోరిక యంతటి
చొప్పున నీవు ఏలుబడి చేయుచు ఇశ్రాయేలువారి
38 మీద రాజవై యుందువు. । నేను నీకు ఆజ్ఞాపించిన
దంతయు నీవు విని, నా మార్గముల ననుసరించి నడ
చుచు, నా దృష్టికి అనుకూలమైనదానిని జరిగిం
చుచు, నా సేవకుడైన దావీదు చేసినట్లు నా కట్టడ
లను నా ఆజ్ఞలను గైకొనినయెడల, నేను నీకు తోడుగా
ఉండి దావీదు కుటుంబమును శాశ్వతముగా నేను
స్థిరపరచినట్లు నిన్నును స్థిరపరచి ఇశ్రాయేలువారిని
39 నీకు అప్పగించెదను. । వారు చేసిన క్రియలనుబట్టి
నేను దావీదు సంతతివారిని బాధపరుచుదును గాని
40 నిత్యము బాధింపను. । జరిగినదానిని విని సొలొమోను
యరొబామును చంప చూడగా యరొబాము లేచి
ఐగుప్తుదేశమునకు పారిపోయి ఐగుప్తు రాజైన షీషకు
నొద్ద చేరి సొలొమోను మరణమగు పర్యంతము ఐగు
ప్తులోనే యుండెను.

సొలొమోను చేసిన యితర కార్యములనుగూర్చి 41
యు, అతడు చేసినదంతటిని గూర్చియు, అతని జ్ఞాన
మును గూర్చియు, సొలొమోను కార్యములను
గూర్చిన గ్రంథమందు వ్రాయబడి యున్నది. ।
సొలొమోను యెరూషలేమునందు ఇశ్రాయేలనందరిని 42
ఏలిన కాలము నలుబది సంవత్సరములు. । అంతట 43
సొలొమోను తన పితరులతోకూడ నిద్రించి, తన
తండ్రియైన దావీదు పురమందు సమాధిచేయబడెను;
తరువాత అతని కుమారుడైన రెహబాము అతనికి
మారుగా రాజాయెను.

రెహబాముకు పట్టాభిషేకము చేయుటకు ఇశ్రా 12
యేలీయులందరును షెకెముకు రాగా రెహబాము
షెకెముకు పోయెను. । నెబాతు కుమారుడైన యరొ 2
బాము రాజైన సొలొమోను నొద్దనుండి పారిపోయి
ఐగుప్తులో నివాసము చేయుచుండెను; యరొబాము
ఇంక ఐగుప్తులోనే యుండి ఆ సమాచారము వినెను. ।
జనులు అతని పిలువనంపగా యరొబామును ఇశ్రా 3
యేలీయుల సమాజమంతయును వచ్చి రెహబాముతో
నీలాగు మనవి చేసిరి । — నీ తండ్రి బరువైన కాడిని 4
మామీద ఉంచెను; నీ తండ్రి నియమించిన కఠినమైన
దాస్యమును మామీద అతడు ఉంచిన బరువైన కాడిని
నీవు చులకన చేసినయెడల మేము నీకు సేవచేయు
దుము. । అందుకు రాజు—మీరు వెళ్లి మూడు దినము 5
లైన తరువాత నాయొద్దకు తిరిగి రండని సెలవియ్యగా
జనులు వెళ్లిపోయిరి. । అప్పుడు రాజైన రెహబాము 6
తన తండ్రియైన సొలొమోను బ్రదికియున్నప్పుడు
అతని సముఖమందు సేవచేసిన పెద్దలతో ఆలోచన
చేసి—ఈ జనులకు ఏమి ప్రత్యుత్తరమిచ్చెదనని వారి
నడుగగా । వారు—ఈ దినముననే నీవు ఈ జనులకు 7
దాసుడవై వారికి సేవచేసి మృదువైన మాటలతో వారికి
ప్రత్యుత్తరమిచ్చినయెడల వారు సదాకాలము నీకు
దాసులగుదురనిరి. । అయితే అతడు పెద్దలు తనతో 8
చెప్పిన ఆలోచనను నిర్లక్ష్యపెట్టి, తనతోకూడ పెరిగిన
యౌవనస్థులను పిలిచి ఆలోచన నడిగి, వారికీలాగు
ప్రశ్నవేసెను । — మామీద నీ తండ్రి యుంచిన 9
కాడిని చులకన చేయుమని నాతో చెప్పుకొనిన యీ
జనులకు ప్రత్యుత్తరమిచ్చుటకు ఏ ఆలోచన మీరు
చెప్పుదురు? । అప్పుడు అతనితోకూడ ఎదిగిన ఆ 10
యౌవనస్థులు ఈ యాలోచన చెప్పిరి—నీ తండ్రి
మా కాడిని బరువైనదిగా చేసెను గాని నీవు దానిని
చులకనగా చేయవలెనని నీతో చెప్పుకొనిన యీ
జనులకు ఈలాగు ఆజ్ఞ ఇమ్ము— నా తండ్రి నడుము
కంటె నా చిటికెన వ్రేలు పెద్దదిగా ఉండును. ।
నా తండ్రి మీమీద బరువైన కాడిని పెట్టెను సరే, 11

నేను ఆ కాడిని ఇంక బరువుగా చేయుదును; నా
తండ్రి చబుకులతో మిమ్మును శిక్షించెను సరే, నేను
12 కొరడాలతో మిమ్మును శిక్షించుదును. । — మూడవ
దినమందు నాయొద్దకు రండని రాజు నిర్ణయము చేసి
యున్నట్లు యరొబామును జనులందరును మూడవ
13 దినమున రెహబామునొద్దకు వచ్చిరి. । అప్పుడు రాజు
పెద్దలు చెప్పిన ఆలోచనను నిర్లక్ష్యపెట్టి యౌవన
ులు చెప్పిన ఆలోచనచొప్పున వారికి కఠినముగా
14 ప్రత్యుత్తరమిచ్చి యిట్లు ఆజ్ఞాపించెను । —నా తండ్రి
మీ కాడిని బరువుగా చేసెను గాని నేను మీ కాడిని
మరి బరువుగా చేయుదును, నా తండ్రి చబుకులతో
మిమ్మును శిక్షించెను గాని నేను కొరడాలతో మిమ్మును
15 శిక్షించుదును. । జనులు చేసిన మనవిని రాజు ఈ
ప్రకారము అంగీకరింపక పోయెను. షిలోనీయు
డైన అహీయాద్వారా నెబాతు కుమారుడైన యరొ
బాముతో తాను పలికించిన మాట నెరవేర్చవలెనని
16 యెహోవా ఈలాగున జరిగించెను. । కాబట్టి ఇశ్రా
యేలువారందరును రాజు తమ విన్నపమును వినలేదని
తెలిసికొని రాజు కీలాగు ప్రత్యుత్తరమిచ్చిరి—దావీదు
సంతతితో మాకు నిమిత్తములేదు; యెష్షయి కుమారుని
యందు మాకు స్వాస్థ్యములేదు; ఇశ్రాయేలువారి
లారా, మీ మీ గుడారములకు పోవుడి; దావీదు
సంతతివారలారా, మీవారిని మీరే చూచుకొనుడి
అని చెప్పి ఇశ్రాయేలువారు తమ గుడారములకు
17 వెళ్లిపోయిరి. । అయితే యూదా పట్టణములలోనున్న
18 ఇశ్రాయేలువారిని రెహబాము ఏలెను. । తరువాత
రాజైన రెహబాము వెట్టిపనిమీద అధికారియైన అదో
రామును పంపగా ఇశ్రాయేలువారందరును రాళ్లతో
అతని కొట్టినందున అతడు మరణమాయెను. కాబట్టి
రాజైన రెహబాము యెరూషలేముకు పారిపోవలెనని
19 తన రథముమీద త్వరగా ఎక్కెను. । ఈ ప్రకారము
ఇశ్రాయేలువారు నేటివరకు జరుగుచున్నట్లు దావీదు
20 సంతతివారిమీద తిరుగబాటు చేసిరి. । మరియు
యరొబాము తిరిగి వచ్చెనని ఇశ్రాయేలువారందరు
విని, సమాజముగా కూడి, అతని పిలువనంపించి ఇశ్రా
యేలువారందరిమీద రాజుగా అతనికి పట్టాభిషేకము
చేసిరి; యూదాగోత్రీయులు తప్ప దావీదు సంతతి
వారిని వెంబడించినవారెవరును లేకపోయిరి.
21 రెహబాము యెరూషలేమునకు వచ్చిన తరువాత
ఇశ్రాయేలువారితో యుద్ధము చేసి, రాజ్యము సొలొ
మోను కుమారుడైన రెహబాము అను తనకు మరల
వచ్చునట్లు చేయుటకై యూదావారందరిలోనుం
డియు బెన్యామీను గోత్రీయులలోనుండియు యుద్ధ
ప్రవీణులైన లక్ష యెనుబది వేలమందిని పోగుచేసెను. ।
22 అంతట దేవుని వాక్కు దైవజనుడగు షెమయాకు
23 ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను । — నీవు సొలొ
మోను కుమారుడును యూదా రాజునైన రెహబాము
తోను యూదావారందరితోను బెన్యామీనీయులం
దరితోను శేషించినవారందరితోను ప్రకటింపుము ! —
యెహోవా సెలవిచ్చునదేమనగా—జరిగినది నావల 24
ననే జరిగెను; మీరు ఇశ్రాయేలువారగు మీ సహో
దరులతో యుద్ధము చేయుటకు వెళ్లక, అందరును
మీ మీ యిండ్లకు తిరిగి పోవుడి. కాబట్టి వారు
యెహోవా మాటకు లోబడి దానినిబట్టి యుద్ధము
నకు పోక నిలిచిరి.
తరువాత యరొబాము ఎఫ్రాయిము మన్యమందు 25
షెకెమను పట్టణము కట్టించి అచ్చట కాపురముండి
అచ్చటనుండి బయలుదేరి పెనూయేలును కట్టించెను. । —
ఈ జనులు యెరూషలేమునందున్న యెహోవా మం 26
దిరమందు బలులు అర్పించుటకు పోవుచుండినయెడల
ఈ జనుల హృదయము యూదారాజైన రెహబాము
అను తమ యజమానునితట్టు తిరుగును; అప్పుడు వారు
నన్ను చంపి యూదారాజైన రెహబామునొద్ద మరల
చేరుదురు; రాజ్యము మరల దావీదు సంతతివారి
దగును అని । యరొబాము తన హృదయమందు 27
తలంచి । ఆలోచనచేసి రెండు బంగారపు దూడలు 28
చేయించి, జనులను పిలిచి—యెరూషలేముకు పోవుట
మీకు బహు కష్టము; । ఇశ్రాయేలువారలారా, ఐగుప్తు 29
దేశములోనుండి మిమ్మును రప్పించిన మీ దేవుడు ఇవే
అని చెప్పి, ఒకటి బేతేలునందును, ఒకటి దానునందును
ఉంచెను. । దానువరకు ఈ రెంటిలో ఒకదానిని జనులు 30
పూజించుటవలన రాజు చేసిన కార్యము పాపమునకు
కారణమాయెను. । మరియు అతడు ఉన్నత స్థలము 31
లను కట్టించి మందిరముగా ఏర్పరచి, లేవీయులు కాని
సాధారణమైనవారిలో కొందరిని యాజకులుగా నియ
మించెను. । మరియు యరొబాము యూదాదేశమందు 32
జరుగు ఉత్సవమువంటి ఉత్సవమును ఎనిమిదవ మాసము
పదునైదవ దినమందు జరుప నిర్ణయించి, బలిపీఠము
మీద బలులు అర్పించుచు వచ్చెను. ఈ ప్రకారము
బేతేలునందును తాను చేయించిన దూడలకు బలులు
అర్పించుచుండెను. మరియు తాను చేయించిన యున్న
తమైన స్థలమునకు యాజకులను బేతేలునందుంచెను. ।
ఈ ప్రకారము అతడు యోచించినదానిని బట్టి యెని 33
మిదవ మాసము పదునైదవ దినమందు బేతేలులో
తాను చేయించిన బలిపీఠముమీద బలులు అర్పించుచు
వచ్చెను; మరియు ఇశ్రాయేలువారికి ఒక ఉత్సవమును
నిర్ణయించి ధూపము వేయుటకై తానే బలిపీఠము
ఎక్కెను.

అంతట దైవజనుడైన యొకడు యెహోవాచేత 13
సెలవునొంది యూదాదేశమునుండి బేతేలునకు వచ్చెను.
ధూపము వేయుటకై యరొబాము ఆ బలిపీఠమునొద్ద
నిలిచి యుండగా । ఆ దైవజనుడు యెహోవా ఆజ్ఞ 2

చేత బలిపీఠమునకు ఈ మాట ప్రకటనచేసెను — బలి
2 పీఠమా బలిపీఠమా, యెహోవా సెలవిచ్చునదేమనగా
—దావీదు సంతతిలో యోషీయా అను నొక శిశువు
పుట్టును; నీమీద ధూపము వేసిన ఉన్నత స్థలము
యొక్క యాజకులను అతడు నీమీద అర్పించును;
అతడు మనుష్య శల్యములను నీమీద దహనము
3 చేయును. ఈ బలిపీఠము బద్దలైపోయి దానిమీద
నున్న బుగ్గి ఒలికి పోవుటయే యెహోవా ఇచ్చు
సూచన అని చెప్పి ఆ దినమున ఆ ప్రవక్త సూచన
4 యొకటి యిచ్చెను. బేతేలునందున్న బలిపీఠమును
గూర్చి ఆ దైవజనుడు ప్రకటించిన మాట రాజైన
యరొబాము విని, బలిపీఠముమీదనుండి తన చెయ్యి
చాపి, వాని పట్టుకొనుమని చెప్పగా అతడు చాపిన
చెయ్యి యెండిపోయెను; దానిని వెనుకకు తీసికొను
5 టకు అతనికి శక్తిలేకపోయెను. మరియు యెహోవా
సెలవు ప్రకారము దైవజనుడిచ్చిన సూచనచొప్పున
బలిపీఠము బద్దలుకాగా బుగ్గి దానిమీదనుండి ఒలికి
6 పోయెను. అప్పుడు రాజు—నా చెయ్యి మునుపటి
వలె బాగగునట్లు నీ దేవుడైన యెహోవా సముఖ
మందు నాకొరకు వేడుకొనుమని ఆ దైవజనుని బతి
మాలుకొనగా, దైవజనుడు యెహోవాను బతిమాలు
కొనెను గనుక రాజు చెయ్యి మరల బాగై మునుపటి
7 వలె ఆయెను. అప్పుడు రాజు — నీవు నా యింటికి
వచ్చి అలసట తీర్చుకొనుము, నీకు బహుమతి ఇచ్చెద
8 నని ఆ దైవజనునితో చెప్పగా దైవజనుడు రాజుతో
ఇట్లనెను — నీ యింటిలో సగము నీవు నాకిచ్చినను
నీతోకూడ నేను లోపలికి రాను; ఈ స్థలమందు నేను
9 అన్నపానములు పుచ్చుకొనను; — అన్నపానములు
పుచ్చుకొనవద్దనియు, నీవు వచ్చిన మార్గమున తిరిగి
పోవద్దనియు యెహోవా వాక్కుచేత నాకు సెలవా
10 యెనని రాజుతో అనెను. అంతట అతడు తాను
బేతేలుకు వచ్చిన మార్గమున వెళ్లక మరియొక మార్గ
మున తిరిగిపోయెను.

11 బేతేలులో ప్రవక్తయగు ఒక ముసలివాడు కాపుర
ముండెను. ఇతని కుమారులలో ఒకడు వచ్చి బేతే
లులో దైవజనుడు ఆ దినమున చేసిన క్రియలన్నిటిని,
అతడు రాజుతో పలికిన మాటలన్నిటిని తమ తండ్రితో
12 తెలియజెప్పగా వారి తండ్రి—అతడు ఏ మార్గమున
వెళ్లిపోయెనని వారినడిగెను; అంతట అతని కుమారులు
యూదాదేశములోనుండి వచ్చిన దైవజనుడు ఏ మార్గ
13 మున వెళ్లిపోయినది తెలిపిరి. పిమ్మట అతడు తన
కుమారులను పిలిచి—నాకొరకు గాడిదెకు గంత కట్టు
డని చెప్పగా వారు అతనికొరకు గాడిదెకు గంత
కట్టిరి. అతడు దానిమీద ఎక్కి దైవజనుని కనుగొన
14 వలెనని పోయి మస్తకివృక్షము క్రింద అతడు కూర్చుం
డగా చూచి—యూదాదేశములోనుండి వచ్చిన దైవ
జనుడవు నీవేనా? అని అడుగగా అతడు — నేనే
అనెను. అప్పుడు అతడు—నా యింటికి వచ్చి భోజ 15
నము చేయుమనగా అతడు—నేను నీతోకూడ మరలి 16
రాజాలను, నీ యింట ప్రవేశింపను, మరియు నీతో
కలిసి ఈ స్థలమందు అన్నపానములు పుచ్చుకొనను.
— నీవు అచ్చట అన్నపానములు పుచ్చుకొనవద్దనియు, 17
నీవు వచ్చినమార్గమున పోవుటకు తిరుగవద్దనియు
యెహోవా వాక్కుచేత నాకు సెలవాయెనని చెప్పె
ను. అందుకతడు—నేనును నీవంటి ప్రవక్తనే; మరియు 18
దేవదూత యొకడు — యెహోవాచేత సెలవుపొంది
అన్నపానములు పుచ్చుకొనుటకై అతని నీ యింటికి
తోడుకొని రమ్మని నాతో చెప్పెనని అతనితో అబద్ధ
మాడగా అతడు తిరిగి అతనితోకూడ మరలి పోయి 19
అతని యింట అన్నపానములు పుచ్చుకొనెను. వారు 20
భోజనము చేయుచుండగా అతని వెనుకకు తోడుకొని
వచ్చిన ఆ ప్రవక్తకు యెహోవా వాక్కు ప్రత్యక్ష
మాయెను. అంతట అతడు యూదాదేశములోనుండి 21
వచ్చిన దైవజనుని పిలిచి—యెహోవా ఈలాగున
ఆజ్ఞ ఇచ్చుచున్నాడు—నీ దేవుడైన యెహోవా నీకు
ఆజ్ఞాపించినదానిని గైకొనక ఆయన సెలవిచ్చిన నోటి 22
మాటమీద తిరుగబడి నీవు వెనుకకు వచ్చి, నీవు అచ్చట
అన్నపానములు పుచ్చుకొనవలదని ఆయన సెలవిచ్చిన
స్థలమున భోజనము చేసియున్నావు గనుక, నీ కళే
బరము నీ పితరుల సమాధిలోకి రాకపోవునని యెలు
గెత్తి చెప్పెను. అంతట వారు అన్నపానములు పుచ్చు 23
కొనిన తరువాత అచ్చటి ప్రవక్త తాను వెనుకకు
తోడుకొని వచ్చిన ఆ ప్రవక్తకు గాడిదెమీద గంత
కట్టించెను. అతడు బయలుదేరి మార్గమున పోవుచుం 24
డగా ఒక సింహము అతనికి ఎదురుపడి అతని చంపెను.
అతని కళేబరము మార్గమందు పడియుండగా గాడిదె
దాని దగ్గర నిలిచి యుండెను, సింహమును శవము
దగ్గర నిలిచియుండెను. కొందరు మనుష్యులు ఆ 25
చోటికి వచ్చి శవము మార్గమందు పడి యుండుటయు,
సింహము శవముదగ్గర నిలిచి యుండుటయు చూచి,
ఆ ముసలిప్రవక్త కాపురమున్న పట్టణమునకు వచ్చి ఆ
వర్తమానము తెలియజేసిరి. మార్గములోనుండి అతని 26
తోడుకొని వచ్చిన ఆ ప్రవక్త ఆ వర్తమానము విని
నప్పుడు — యెహోవా మాటను ఆలకింపక తిరుగ
బడిన దైవజనుడు ఇతడే; యెహోవా సింహమునకు
అతని అప్పగించి యున్నాడు; యెహోవా సెల
విచ్చిన ప్రకారము అది అతని చీల్చి చంపెను అని
పలికి తన కుమారులను పిలిచి—గాడిదెకు నాకొరకు 27
గంత కట్టుడని చెప్పెను. వారు అతనికొరకు గంత
కట్టినప్పుడు అతడు పోయి అతని శవము మార్గమందు 28
పడి యుండుటయు, గాడిదెయు సింహమును శవము
దగ్గర నిలిచి యుండుటయు, సింహము గాడిదెను

చీల్చివేయక శవమును తినక యుండుటయు చూచి ।
29 దైవజనుని శవము ఎత్తి గాడిదెమీద వేసికొని తిరిగి
వచ్చెను. ఈ ప్రకారము ఆ ముసలి ప్రవక్త అంగ
లార్చుటకును సమాధిలో శవమును పెట్టుటకును పట్టణ
30 మునకు వచ్చెను. । అతడు తన సమాధిలో ఆ శవమును
పెట్టగా జనులు—కటకటా నా సహోదరుడా అని
31 యేడ్చిరి. । మరియు ఇతడు సమాధిలో శవమును పెట్టి—
నేను మరణమైనప్పుడు దైవజనుడైన యితడు పెట్ట
బడిన సమాధిలో నన్ను పాతిపెట్టుడి, నా శల్యము
32 లను అతని శల్యములదగ్గర ఉంచుడి, । యెహోవా
మాటనుబట్టి బేతేలులోనున్న బలిపీఠమునకు విరోధము
గాను, షోమ్రోను పట్టణములోనున్న ఉన్నత స్థలముల
లోని మందిరములన్నిటికి విరోధముగాను, అతడు
ప్రకటించినది అవశ్యముగా సంభవించునని తన కుమా
రులతో చెప్పెను.
33 ఈ సంగతియైన తరువాత యరొబాము తన
దుర్మార్గమును విడిచిపెట్టక, సామాన్యజనులలో కొంద
రిని ఉన్నతస్థలములకు యాజకులుగా నియమించెను.
తనకిష్టులైనవారిని యాజకులుగా ప్రతిష్ఠించి వారిని
ఉన్నత స్థలములకు యాజకులుగా నియమించెను. ।
34 యరొబాము సంతతివారిని నిర్మూలము చేసి భూమి
మీద ఉండకుండ నశింపజేయునట్లుగా ఇది వారికి
పాపకారణమాయెను.

14 ఆ కాలమున యరొబాము కుమారుడైన అబీయా
2 కాయిలాపడెగా । యరొబాము తన భార్యతో ఇట్ల
నెను—నీవు లేచి యరొబాము భార్యవని తెలియబడ
కుండ మారువేషము వేసికొని షిలోహుకు పొమ్ము;
ఈ జనులమీద నేను రాజునగుదునని నాకు సమా
చారము తెలియజెప్పిన ప్రవక్తయగు అహీయా
3 అక్కడ ఉన్నాడు. । కాబట్టి నీవు పది రొట్టెలును
అప్పములును ఒక బుడ్డి తేనెయు చేత పట్టుకొని
అతని దర్శించుము. బిడ్డ యేమగునో అతడు నీకు
4 తెలియజేయునని చెప్పగా । యరొబాము భార్య ఆ
ప్రకారము లేచి షిలోహుకు పోయి అహీయా
యింటికి వచ్చెను. అహీయా వృద్ధాప్యముచేత కండ్లు
5 కానరాని వాడై యుండెను. । అంతట యెహోవా
అహీయాతో సెలవిచ్చినదేమనగా — యరొబాము
కుమారుడు కాయిలాగా ఉన్నాడు గనుక అతని
గూర్చి నీచేత విచారించుటకై యరొబాము భార్య
వచ్చుచున్నది. ఆమె మారు వేషము వేసికొని మరి
యొకతె యైనట్టుగా వచ్చుచున్నది గనుక నేను నీకు
6 సెలవిచ్చునట్టు నీవు ఆమెతో చెప్పవలెను. । అంతలో
అహీయా ద్వారము లోపలికి వచ్చు నామె కాలి
చప్పుడు విని ఆమెతో ఇట్లనెను — యరొబాము
భార్యా, లోపలికి రమ్ము; నీవు వేషము వేసికొని
వచ్చుట యేల? కఠినమైన మాటలు నీకు చెప్పవలెనని
నాకు ఆజ్ఞ యాయెను. । నీవు వెళ్లి యరొబాముతో 7
చెప్పవలసినదేమనగా — ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవా ఈ ప్రకారము సెలవిచ్చుచున్నాడు—
నేను నిన్ను జనులలోనుండి తీసి హెచ్చింపజేసి,
ఇశ్రాయేలువారను నా జనులమీద నిన్ను అధి
కారిగా నియమించి । దావీదు సంతతి వారియొద్ద 8
నుండి రాజ్యమును తీసి నీకిచ్చి యుండినను, నా ఆజ్ఞ
లను గైకొని మనఃపూర్తిగా నన్ను అనుసరించి నా
దృష్టికి ఏది అనుకూలమో దాని మాత్రమే చేసిన
నా సేవకుడైన దావీదు చేసినట్లు నీవు చేయక ।
నీకంటె ముందుగా ఉండిన వారందరికంటెను అధిక 9
ముగా కీడుచేసి యున్నావు; నన్ను బొత్తిగా విస
ర్జించి యితర దేవతలను పోత విగ్రహములను పెట్టు
కొని నాకు కోపము పుట్టించి యున్నావు. । కాబట్టి 10
యరొబాము సంతతివారిమీదికి నేను కీడు రప్పిం
చుచు, ఇశ్రాయేలువారిలో అల్పులు గాని ఘనులు
గాని లేకుండ మగవారినందరిని యరొబాము వంశము
నుండి నిర్మూలముచేసి, పెంట అంతయు పోవునట్లుగా
ఒకడు అవతలకు దాని ఊడ్చివేసినట్లు యరొబాము
సంతతిలో శేషించినవారిని నేను ఊడ్చివేయుదును. ।
పట్టణమందు యరొబాము సంబంధులలో మరణమగు 11
వారిని కుక్కలు తినును; బయట భూమిలో మరణ
మగువారిని ఆకాశపక్షులు తినును; యెహోవా
మాటయిచ్చి యున్నాడు. । కాబట్టి నీవు లేచి 12
నీ యింటికి పొమ్ము, నీ పాదములు పట్టణములో
ప్రవేశించునప్పుడే నీ బిడ్డ చనిపోవును; । వాని నిమి 13
త్తము ఇశ్రాయేలువారందరు అంగలార్చుచు, సమా
ధిలో వాని పెట్టుదురు; ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవా యరొబాము సంబంధులలో ఇతని
యందు మాత్రమే అనుకూలమైన దాని కనుగొనెను
గనుక యరొబాము సంతతివారిలో ఇతడు మాత్రమే
సమాధికి వచ్చును. । ఇదియుగాక యెహోవా తన 14
నిమిత్తము ఒకని ఇశ్రాయేలువారిమీద రాజుగా నియ
మింప బోవుచున్నాడు; ఆ దినముననే అతడు యరొ
బాము సంతతివారిని నిర్మూలముచేయును; కొద్దికాల
ములోనే ఆయన అతని నియమింపబోవును. । ఇశ్రా 15
యేలువారు దేవతాస్తంభములను నిలిపి యెహోవాకు
కోపము పుట్టించి యున్నారు గనుక నీటియందు
రెల్లు అల్లల్లాడునట్లు యెహోవా ఇశ్రాయేలువారిని
మొత్తి, ఒకడు వేరును పెల్లగించినట్లు వారి పితరులకు
తాను ఇచ్చిన యీ మంచి దేశములోనుండి వారిని
పెల్లగించి వారిని అవతలకు చెదరగొట్టును. । మరియు 16
తానే పాపముచేసి ఇశ్రాయేలువారు పాపము చేయు
టకై కారకుడైన యరొబాము పాపములనుబట్టి
ఆయన ఇశ్రాయేలువారిని అప్పగింప బోవుచు
న్నాడు. । అప్పుడు యరొబాము భార్య లేచి వెళ్లి 1

పోయి తిర్సా పట్టణమునకు వచ్చెను; ఆమె లోగిటి
ద్వారపు గడపయొద్దకు రాగానే ఆ చిన్నవాడు
18 చనిపోయెను. । జనులు అతనిని సమాధిలో పెట్టి,
యెహోవా తన సేవకుడైన ప్రవక్తయగు అహీయా
ద్వారా సెలవిచ్చిన ప్రకారముగా ఇశ్రాయేలువారం
19 దరును వానికొరకు అంగలార్చిరి. । యరొబాము
చేసిన యితర కార్యములనుగూర్చియు, అతడు జరి
గించిన యుద్ధములనుగూర్చియు, ప్రభుత్వమును
గూర్చియు ఇశ్రాయేలువారి రాజుల వృత్తాంతముల
20 గ్రంథమందు వ్రాయబడి యున్నది. । యరొబాము
ఏలిన దినములు ఇరువది రెండు సంవత్సరములు;
అతడు తన పితరులతోకూడ నిద్రించగా అతనికి
మారుగా అతని కుమారుడైన నాదాబు రాజాయెను.
21 యూదాదేశమందు సొలొమోను కుమారుడైన
రెహబాము ఏలుచుండెను. రెహబాము నలుబది
యొక సంవత్సరములవాడైనప్పుడు ఏలనారంభించెను.
తన నామము నుంచుటకై ఇశ్రాయేలీయుల గోత్రము
లన్నిటిలోనుండి యెహోవా కోరుకొనిన యెరూ
షలేమను పట్టణమందు అతడు పదునేడు సంవత్సర
ములు ఏలెను; అతని తల్లి అమ్మోనీయురాలు, ఆమె
22 పేరు నయమా. । యూదావారు యెహోవా దృష్టికి
కీడుచేసి తమ పితరులు చేసినదానంతటిని మించు
నట్లుగా పాపము చేయుచు ఆయనకు రోషము పుట్టిం
23 చిరి. । ఎట్లనగా వారును ఎత్తయిన ప్రతి పర్వతము
మీదను పచ్చని ప్రతి వృక్షముక్రిందను బలిపీఠము
లను కట్టి, విగ్రహములను నిలిపి, దేవతాస్తంభములను
24 ఉంచిరి. । మరియు పురుషగాములు సహా దేశమం
దుండిరి. ఇశ్రాయేలీయులయెదుట నిలువకుండ
యెహోవా వెళ్లగొట్టిన జనులు చేయు హేయ
క్రియల ప్రకారముగా యూదావారును చేయుచు
25 వచ్చిరి. । రాజైన రెహబాముయొక్క అయిదవ సంవ
త్సరమందు ఐగుప్తురాజైన షీషకు యెరూషలేము
26 మీదికి వచ్చి । యెహోవా మందిరపు ఖజానా
లోని పదార్థములను, రాజనగరుయొక్క ఖజానా
లోని పదార్థములను, ఎత్తికొని పోయెను, అతడు
సమస్తమును ఎత్తికొని పోయెను; సొలొమోను చేయిం
చిన బంగారపు డాళ్లను అతడు ఎత్తికొని పోయెను. ।
27 రాజైన రెహబాము వీటికి మారుగా ఇత్తడి డాళ్లను
చేయించి, రాజనగరు ద్వారపాలకులైన తన దేహసంర
28 క్షకుల అధిపతుల వశము చేసెను. । రాజు యెహోవా
మందిరమునకు వెళ్లునప్పుడెల్ల రాజదేహసంరక్షకులు
వాటిని మోసికొనిపోయి అతడు తిరిగి రాగా వాటిని
29 తమ గదిలో ఉంచిరి. । రెహబాము చేసిన యితర
కార్యములనుగూర్చియు, అతడు చేసినవాటన్నిటిని
గూర్చియు యూదారాజులయొక్క వృత్తాంతముల
గ్రంథమందు వ్రాయబడి యున్నది. । వారు బ్రదికి 30
నంత కాలము రెహబామునకును యరొబామునకును
యుద్ధము జరుగుచుండెను. । రెహబాము తన పితరు 31
లతోకూడ నిద్రించి దావీదు పురమందున్న తన
పితరుల సమాధిలో పాతిపెట్టబడెను; అతని తల్లి
నయమాయను ఒక అమ్మోనీయురాలు; అతని కుమారు
డైన అబీయాము అతనికి మారుగా రాజాయెను.

నెబాతు కుమారుడును రాజునైన యరొబాము **15**
ఏలుబడిలో పదునెనిమిదవ సంవత్సరమున అబీయాము
యూదావారిని ఏలనారంభించెను. । అతడు మూడు 2
సంవత్సరములు యెరూషలేమునందు రాజుగా ఉం
డెను; అతని తల్లిపేరు మయకా; ఆమె అబీషాలోము
కుమార్తె. । అతడు పూర్వము తన తండ్రి అనుసరిం 3
చిన పాపమార్గములన్నిటిలో నడిచెను; తన పితరు
డైన దావీదు హృదయము తన దేవుడైన యెహోవా
యెడల యథార్థముగా ఉన్నట్లు అతని హృదయము
యథార్థముగా ఉండలేదు. । దావీదు హిత్తీయుడైన 4
ఊరియా సంగతియందు తప్ప తన జీవితదినము
లన్నియు యెహోవా దృష్టికి యథార్థముగా నడు
చుకొనుచు, యెహోవా అతనికిచ్చిన ఆజ్ఞలలో దేని
విషయమందును తప్పిపోకుండెను గనుక । దావీదు 5
నిమిత్తము అతని తరువాత అతని కుమారుని నిలుపుట
కును, యెరూషలేమును స్థిరపరచుటకును, అతని దేవు
డైన యెహోవా యెరూషలేమునందు దావీదుకు
దీపముగా అతని ఉండనిచ్చెను. । రెహబాము[1] బ్రది 6
కిన దినములన్నియు అతనికిని యరొబామునకును
యుద్ధము జరుగుచుండెను. । అబీయాము చేసిన 7
యితర కార్యములనుగూర్చియు, అతడు చేసిన వాట
న్నిటినిగూర్చియు యూదారాజుల వృత్తాంతముల
గ్రంథమందు వ్రాయబడి యున్నది. అబీయామునకును
యరొబామునకును యుద్ధము కలిగి యుండెను. ।
అబీయాము తన పితరులతోకూడ నిద్రించగా 8
వారు దావీదు పురమందు అతనిని సమాధిచేసిరి;
అతని కుమారుడైన ఆసా అతనికి మారుగా రాజా
యెను.

ఇశ్రాయేలువారికి రాజైన యరొబాము ఏలుబడి 9
యందు ఇరువదియవ సంవత్సరమున ఆసా యూదా
వారిని ఏలనారంభించెను. । అతడు నలుబదియొక 10
సంవత్సరములు యెరూషలేమునందు ఏలుచుండెను.
అతని అవ్వపేరు మయకా; యీమె అబీషాలోము
కుమార్తె. । ఆసా తన పితరుడైన దావీదువలె 11
యెహోవా దృష్టికి యథార్థముగా నడుచుకొని ।
పురుషగాములను దేశములోనుండి వెళ్లగొట్టి తన పిత 12
రులు చేయించిన విగ్రహములన్నిటిని పడగొట్టెను. ।
మరియు తన అవ్వయైన మయకా అసహ్యమైన 13

1 కొన్ని ప్రాచీనప్రతులలో—అబీయాము అని పాఠాంతరము.

యొకదాని చేయించి, దేవతాస్తంభము ఒకటి నిలు
పగా ఆసా ఆ విగ్రహమును ఛిన్నాభిన్నములుగా
కొట్టించి, కిద్రోను ఓడయొద్ద దాని కాల్చివేసి ఆమె
14 ప్రధానురాలై యుండకుండ ఆమెను తొలగించెను. । ఆసా
తన దినములన్నియు హృదయపూర్వకముగా
యెహోవాను అనుసరించెను గాని ఉన్నత స్థలము
15 లను తీసివేయక పోయెను. । మరియు అతడు తన
తండ్రి ప్రతిష్ఠించిన వస్తువులను తాను ప్రతిష్ఠించిన
వస్తువులను, వెండియు బంగారమును ఉపకరణములను
16 యెహోవా మందిరములోనికి తెప్పించెను. । వారు
బ్రదికిన దినములన్నిటను ఆసాకును ఇశ్రాయేలు
రాజైన బయెషాకును యుద్ధము జరుగుచుండెను. ।
17 ఇశ్రాయేలు రాజైన బయెషా యూదావారికి విరో
ధియై యుండి, యూదారాజైన ఆసాయొద్దనుండి
యెవరును రాకుండను అతనియొద్దకు ఎవరును పోకుం
18 డను, రామాపట్టణమును కట్టించెను. । కాబట్టి ఆసా
యెహోవా మందిరపు ఖజానాలోను రాజనగరు
యొక్క ఖజానాలోను శేషించిన వెండి అంతయు
బంగారమంతయు తీసి తన సేవకులచేతి కప్పగించి,
హెజ్యోనుకు పుట్టిన టబ్రిమ్మోను కుమారుడును
దమస్కులో నివాసము చేయుచు అరాముకు రాజునై
యున్న బెన్హదదుకు పంపి మనవి చేసినదేమనగా । —
19 నీ తండ్రికిని నా తండ్రికిని సంధి కలిగి యున్నట్లు
నీకును నాకును సంధి కలిగి యుండవలెను గనుక
వెండి బంగారములను నీకు కానుకగా పంపించు
చున్నాను; నీవు వచ్చి ఇశ్రాయేలు రాజైన బయెషా
నాయొద్దనుండి తిరిగిపోవునట్లు నీకును అతనికిని కలి
20 గిన నిబంధనను తప్పింపవలెను. । కాబట్టి బెన్హదదు
రాజైన ఆసా చెప్పిన మాటకు సమ్మతించి తన సైన్య
ముల అధిపతులను ఇశ్రాయేలు పట్టణములమీదికి
పంపి ఈయోనును దానును ఆబేల్బేత్మయకాను కిన్నె
రెతును నఫ్తాలీదేశమును పట్టుకొని కొల్లపెట్టెను. ।
21 అది బయెషాకు వర్తమానము కాగా రామాపట్టణము
కట్టుట మాని తిర్సాకు పోయి నివాసము చేసెను. ।
22 అప్పుడు రాజైన ఆసా యెవరును నిలిచిపోకుండ
యూదాదేశపువారందరు రావలెనని ప్రకటన
చేయగా జనులు సమకూడి బయెషా కట్టించుచుండిన
రామాపట్టణపు రాళ్లను కఱ్ఱలను ఎత్తికొని వచ్చిరి.
రాజైన ఆసా వాటిచేత బెన్యామీను సంబంధమైన
23 గెబను మిస్పాను కట్టించెను. । ఆసా చేసిన యితర
కార్యములనుగూర్చియు, అతని బలమంతటినిగూర్చి
యు, అతడు చేసిన సమస్తమునుగూర్చియు, అతడు
కట్టించిన పట్టణములనుగూర్చియు యూదారాజుల
వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి యున్నది.
వృద్ధుడైన తరువాత అతని పాదములయందు
పుట్టెను. । అంతట ఆసా తన పితరులతో
కూడ నిద్రించి, తన పితరుడైన దావీదు పురమందు
తన పితరుల సమాధిలో పాతిపెట్టబడెను; అతనికి
మారుగా యెహోషాపాతు అను అతని కుమారుడు
రాజాయెను.
యరొబాము కుమారుడైన నాదాబు యూదా 25
రాజైన ఆసా యేలుబడిలో రెండవ సంవత్సరమందు
ఇశ్రాయేలువారిని ఏలనారంభించి ఇశ్రాయేలువారిని
రెండు సంవత్సరములు ఏలెను. । అతడు యెహోవా 26
దృష్టికి కీడుచేసి తన తండ్రి నడిచిన మార్గమందు
నడిచి, అతడు దేనిచేత ఇశ్రాయేలువారు పాపము
చేయుటకై కారకుడాయెనో ఆ పాపమును అనుస
రించి ప్రవర్తించెను. । ఇశ్శాఖారు ఇంటి సంబంధుడును 27
అహీయా కుమారుడునైన బయెషా అతనిమీద కుట్ర
చేసెను. నాదాబును ఇశ్రాయేలువారందరును ఫిలిష్తీ
యుల సంబంధమైన గిబ్బెతోనుకు ముట్టడి వేయు
చుండగా గిబ్బెతోనులో బయెషా అతని చంపెను. ।
రాజైన ఆసా యేలుబడిలో మూడవ సంవత్సరమందు 28
బయెషా అతని చంపి అతనికి మారుగా రాజాయెను. ।
తాను రాజు కాగానే అతడు యరొబాము సంతతి 29
వారినందరిని హతముచేసెను; ఎవనినైన యరొబా
మునకు సజీవునిగా ఉండనియ్యక అందరిని నశింప
జేసెను. తన సేవకుడైన షీలోనీయుడైన అహీయా
ద్వారా యెహోవా సెలవిచ్చిన ప్రకారముగా ఇది
జరిగెను. । తాను చేసిన పాపములచేత ఇశ్రాయేలు 30
వారు పాపముచేయుటకు కారకుడై యరొబాము
ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాకు కోపము
పుట్టింపగా ఈలాగున జరిగెను. । నాదాబు చేసిన 31
ఇతర కార్యములనుగూర్చియు, అతడు చేసినదాని
నంతటినిగూర్చియు ఇశ్రాయేలు రాజుల వృత్తాంత
ముల గ్రంథమందు వ్రాయబడి యున్నది. । వారి 32
దినములన్నిటను ఆసాకును ఇశ్రాయేలు రాజైన
బయెషాకును యుద్ధము జరుగుచుండెను.
యూదారాజైన ఆసా యేలుబడిలో మూడవ 33
సంవత్సరమందు అహీయా కుమారుడైన బయెషా
తిర్సాయందు ఇశ్రాయేలువారినందరిని ఏలనారంభించి
యిరువది నాలుగు సంవత్సరములు ఏలెను. । ఇతడు 34
యెహోవా దృష్టికి కీడుచేసి యరొబాము దేనిచేత
ఇశ్రాయేలువారు పాపము చేయుటకు కారకుడా
యెనో దానినంతటిని అనుసరించి ప్రవర్తించెను.

**యెహోవా** వాక్కు హనానీ కుమారుడైన **16**
యెహూకు ప్రత్యక్షమై బయెషానుగూర్చి యీలాగు
సెలవిచ్చెను । — నేను నిన్ను మంటిలోనుండి తీసి 2
హెచ్చింపజేసి ఇశ్రాయేలువారను నా జనులమీద
నిన్ను అధికారిగా చేసితిని; అయినను యరొబాము
ప్రవర్తించిన ప్రకారముగా నీవు ప్రవర్తించుచు, ఇశ్రా
యేలువారగు నా జనులు పాపము చేయుటకు కారక

కుడవై, వారి పాపములచేత నాకు కోపము పుట్టించి
3 యున్నావు. । కాబట్టి బయెషా సంతతివారిని అతని
కుటుంబికులను నేను సమూలధ్వంసము చేసి, నెబాతు
కుమారుడైన యరొబాము సంతతివారికి నేను చేసి
4 నట్లు నీ సంతతివారికిని చేయబోవుచున్నాను. । పట్టణ
మందు చనిపోవు బయెషా సంబంధికులను కుక్కలు
తినును; బయటి బీడు భూములలో చనిపోవువాని
5 సంబంధికులను ఆకాశపక్షులు తినును. । బయెషా
చేసిన యితర కార్యములను గూర్చియు, అతడు
చేసిన వాటన్నిటిని గూర్చియు, అతని బలమును
గూర్చియు ఇశ్రాయేలురాజుల వృత్తాంతముల గ్రంథ
6 మందు వ్రాయబడి యున్నది. । బయెషా తన పిత
రులతోకూడ నిద్రించి తిర్సాలో సమాధిచేయ
బడెను; అతనికి మారుగా అతని కుమారుడైన ఏలా
7 రాజాయెను. । మరియు బయెషా యరొబాము సంతతి
వారివలెనే యుండి తన కార్యములచేత యెహోవా
దృష్టికి కీడుచేసి ఆయనకు కోపము పుట్టించిన దాని
నంతటిని బట్టియు, అతడు తన రాజును చంపుటను
బట్టియు, అతని గూర్చియు, అతని సంతతివారిని
గూర్చియు యెహోవా వాక్కు హనానీ కుమారు
డును ప్రవక్తయునగు యెహూకు ప్రత్యక్షమాయెను.
8 యూదారాజైన ఆసా యేలుబడిలో ఇరువది
యారవ సంవత్సరమున బయెషా కుమారుడైన ఏలా
తిర్సాయందు ఇశ్రాయేలువారినందరిని ఏలనారం
9 భించి రెండు సంవత్సరములు ఏలెను. । తిర్సాలో
తనకు గృహనిర్వాహకుడగు అర్సాయింట అతడు
త్రాగి మత్తుడై యుండగా, యుద్ధరథముల అర్ధ
భాగముమీద అధికారియైన జిమ్రీ అతనిమీద
10 కుట్రచేసి లోపలికి చొచ్చి । అతని కొట్టి చంపి
అతనికి మారుగా రాజాయెను. ఇది యూదారాజైన
ఆసా యేలుబడిలో ఇరువది యేడవ సంవత్సరమున
11 సంభవించెను. । అతడు సింహాసనాసీనుడై యేలుబడి
చేయుచు, బయెషా సంతతివారందరిలో ఏ పురు
షునే గాని అతని బంధువులలోను మిత్రులలోను
ఎవరినే గాని మిగులనియ్యక అందరిని హతము
12 చేసెను. । బయెషాయును అతని కుమారుడగు ఏలా
యును తామే పాపముచేసి, ఇశ్రాయేలువారు
పాపము చేయుటకు కారకులై, తాము పెట్టుకొనిన
దేవతలచేత ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాకు
13 కోపము పుట్టించిరి గనుక । వారు చేసిన పాపములను
బట్టి ప్రవక్తయైన యెహూద్వారా బయెషానుగూర్చి
యెహోవా సెలవిచ్చిన మాట నెరవేరుటకై జిమ్రీ
14 బయెషా సంతతివారినందరిని నాశనముచేసెను. । ఏలా
చేసిన యితర కార్యములను గూర్చియు, అతడు చేసిన
క్రియలన్నిటిని గూర్చియు ఇశ్రాయేలు రాజుల
వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి యున్నది.
యూదారాజైన ఆసా యేలుబడిలో ఇరువది 15
యేడవ సంవత్సరమున జిమ్రీ తిర్సాలో ఏడు దిన
ములు ఏలెను. జనులు ఫిలిష్తీయుల సంబంధమైన
గిబ్బెతోను మీదికి వచ్చి అక్కడ దిగియుండగా ।
జిమ్రీ కుట్రచేసి రాజును చంపించెనను వార్త అక్కడ 16
దిగియున్న జనులకు వినబడెను గనుక ఇశ్రాయేలు
వారందరును ఆ దినమున సైన్యాధిపతియైన ఒమ్రీని
దండుపేటలో ఇశ్రాయేలు వారిమీద రాజుగా
పట్టాభిషేకము చేసిరి. । వెంటనే ఒమ్రీ గిబ్బెతో 17
నును విడిచి అతడును ఇశ్రాయేలు వారందరును
తిర్సాకు వచ్చి దాని ముట్టడి వేసిరి. । పట్టణము పట్ట 18
బడెనని జిమ్రీ తెలిసికొని, తాను రాజనగరునందు
జొచ్చి తనతోకూడ రాజనగరును తగలబెట్టుకొని
చనిపోయెను. । యరొబాము చేసినట్లు ఇతడును 19
యెహోవా దృష్టికి చెడుతనము చేయువాడై యుండి
తానే పాపము చేయుచు, ఇశ్రాయేలువారు పాపము
చేయుటకు కారకుడైనందున ఈలాగున జరిగెను. ।
జిమ్రీ చేసిన యితర కార్యములను గూర్చియు, అతడు 20
చేసిన రాజద్రోహమును గూర్చియు ఇశ్రాయేలు
రాజుల వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి
యున్నది.
అప్పుడు ఇశ్రాయేలువారు రెండు జట్లుగా విడి 21
పోయి, జనులలో సగముమంది గీనతు కుమారుడైన
తిబ్నీని రాజుగా చేయవలెనని అతని పక్షమునను,
సగముమంది ఒమ్రీ పక్షమునను చేరిరి. । ఒమ్రీ 22
పక్షపువారు గీనతు కుమారుడైన తిబ్నీ పక్షపువారిని
జయింపగా తిబ్నీ చంపబడెను; ఒమ్రీ రాజాయెను. ।
యూదారాజైన ఆసా యేలుబడిలో ముప్పది యొక 23
టవ సంవత్సరమున ఒమ్రీ ఇశ్రాయేలువారికి రాజై
పన్నెండు సంవత్సరములు ఏలెను. ఆ పన్నెండిం
టిలో ఆరు సంవత్సరములు అతడు తిర్సాలో ఏలెను. ।
అతడు షెమెరునొద్ద షోమ్రోను కొండను నాలుగు 24
మణుగుల వెండికి కొనుక్కొని ఆ కొండమీద పట్టణ
మొకటి కట్టించి, ఆ కొండ యజమానుడైన షెమెరు
అనునతని పేరునుబట్టి తాను కట్టించిన పట్టణమునకు
షోమ్రోను అను పేరు పెట్టెను. । ఒమ్రీ యెహోవా 25
దృష్టికి చెడుతనము జరిగించి, తన పూర్వికులందరి
కంటె మరి దుర్మార్గముగా ప్రవర్తించెను. । అతడు 26
నెబాతు కుమారుడైన యరొబాము దేనిచేత ఇశ్రా
యేలువారు పాపము చేయుటకు కారకుడై దేవతలను
పెట్టుకొని, ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాకు
కోపము పుట్టించెనో, దానిని అనుసరించి ప్రవర్తిం
చెను. । ఒమ్రీ చేసిన యితర కార్యములను గూర్చియు 27
అతడు అగుపరచిన బలమునుగూర్చియు ఇశ్రాయేలు
రాజుల వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి
యున్నది. । ఒమ్రీ తన పితరులతోకూడ నిద్రించి 28

షోమ్రోనులో సమాధియందు పాతిపెట్టబడెను,
అతని కుమారుడైన అహాబు అతనికి మారుగా రాజా
యెను.
29 యూదారాజైన ఆసా యేలుబడిలో ముప్పది
యెనిమిదవ సంవత్సరమున ఒమ్రీ కుమారుడైన అహాబు
ఇశ్రాయేలువారికి రాజై షోమ్రోనులో ఇశ్రాయేలు
వారిని ఇరువది రెండు సంవత్సరములు ఏలెను. ।
30 ఒమ్రీ కుమారుడైన అహాబు తన పూర్వికులందరిని
మించునంతగా యెహోవా దృష్టికి చెడుతనము
31 చేసెను. । నెబాతు కుమారుడైన యరొబాము జరిగిం
చిన పాపక్రియలను అనుసరించి నడుచుకొనుట స్వల్ప
సంగతి యనుకొని, అతడు సీదోనీయులకు రాజైన
ఎత్బయలు కుమార్తెయైన యెజెబెలును వివాహము
చేసికొని బయలుదేవతను పూజించుచు దానికి మ్రొక్కు
32 చునుండెను. । షోమ్రోనులో తాను బయలుకు కట్టిం
చిన మందిరమందు బయలుకు ఒక బలిపీఠమును కట్టిం
33 చెను. । మరియు అహాబు దేవతాస్తంభమొకటి నిలి
పెను. ఈ ప్రకారము అహాబు తన పూర్వికులైన
ఇశ్రాయేలు రాజులందరికంటె ఎక్కువగా పాపము
చేసి ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాకు
34 కోపము పుట్టించెను. । అతని దినములలో బేతేలీయు
డైన హీయేలు యెరికో పట్టణమును కట్టించెను.
అతడు దాని పునాదివేయగా అబీరాము అను అతని
జ్యేష్ఠపుత్రుడు చనిపోయెను; దాని గవునులనెత్తగా
సెగూబు అను అతని కనిష్ఠపుత్రుడు చనిపోయెను.
ఇది నూను కుమారుడైన యెహోషువద్వారా
యెహోవా సెలవిచ్చిన మాటచొప్పున సంభవించెను.
**17** అంతట గిలాదు కాపురస్థుల సంబంధియును
తిష్బీయుడునైన ఏలీయా అహాబునొద్దకు వచ్చి —
ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా సన్నిధిని
నేను నిలువబడి యున్నాను; ఆయన జీవముతోడు
నా మాటప్రకారముగాక, యీ సంవత్సరములలో
2 మంచైనను వర్షమైనను పడదని ప్రకటించెను. । పిమ్మట
3 యెహోవా వాక్కు అతనికి ప్రత్యక్షమై । —నీవు
ఇచ్చటనుండి తూర్పువైపుకు పోయి యొర్దానుకు ఎదు
4 రుగానున్న కెరీతు ఏటిదగ్గర దాగియుండుము; । ఆ
యేటి నీరు నీవు త్రాగుదువు, అచ్చటికి నీకు ఆహా
రము తెచ్చునట్లు నేను కాకోలములకు ఆజ్ఞాపించితి
5 నని అతనికి తెలియజేయగా । అతడు పోయి
యెహోవా సెలవుచొప్పున యొర్దానుకు ఎదురుగా
6 నున్న కెరీతు ఏటిదగ్గర నివాసము చేసెను. । అక్కడ
కాకోలములు ఉదయమందు రొట్టెను మాంసమును
అస్తమయమందు రొట్టెను మాంసమును అతనియొద్దకు
తీసికొని వచ్చుచుండెను; అతడు ఏటినీరు త్రాగుచు
7 వచ్చెను. । కొంతకాలమైన తరువాత దేశములో
వర్షములేక ఆ నీరు ఎండిపోయెను.

అంతట యెహోవా వాక్కు అతనికి ప్రత్య
క్షమై యీలాగు సెలవిచ్చెను—నీవు సీదోను పట్టణ
సంబంధమైన సారెపతు అను ఊరికి పోయి అచ్చట
ఉండుము; । నిన్ను పోషించుటకు అచ్చటనున్న
యొక విధవరాలికి నేను సెలవిచ్చితిని. । అందుకతడు
లేచి సారెపతుకు పోయి పట్టణపు గవినియొద్దకు
రాగా, ఒక విధవరాలు అచ్చట కట్టెలు ఏరుచుండుట
చూచి ఆమెను పిలిచి — త్రాగుటకై పాత్రతో
కొంచెము నీళ్లు నాకు తీసికొనిరమ్మని వేడుకొనెను.
ఆమె నీళ్లు తేబోవుచుండగా అతడామెను మరల
పిలిచి—నాకొక రొట్టెముక్కను నీ చేతిలో తీసికొని
రమ్మని చెప్పెను. । అందుకామె — నీ దేవుడైన
యెహోవా జీవముతోడు తొట్టిలో పట్టెడు
పిండియు బుడ్డిలో కొంచెము నూనెయు నా
యొద్దనున్నవే గాని అప్పమొకటైన లేదు, మేము
చావకముందు నేను ఇంటికి పోయి నాకును
నా బిడ్డకును సిద్ధము చేసికొనవలెనని కొన్ని పుల్లలు
ఏరుటకై వచ్చితిననెను. । అప్పుడు ఏలీయా ఆమెతో
ఇట్లనెను — భయపడవద్దు, పోయి నీవు చెప్పినట్లు
చేయుము; అయితే అందులో నాకొక చిన్న అప్పము
మొదట చేసి నాయొద్దకు తీసికొని రమ్ము, తరువాత
నీకును నీ బిడ్డకును అప్పములు చేసికొనుము. । భూమి
మీద యెహోవా వర్షము కురిపించు పర్యంతము ఆ
తొట్టిలో ఉన్న పిండి తక్కువకాదు, బుడ్డిలో నూనె
అయిపోదని ! ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా
సెలవిచ్చియున్నాడు. అంతట ఆమె వెళ్లి ఏలీయా
చెప్పిన మాటచొప్పున చేయగా అతడును ఆమెయును
ఆమె యింటివారును అనేక దినములు భోజనము చే
యుచు వచ్చిరి. । యెహోవా ఏలీయాద్వారా సెలవి
చ్చిన ప్రకారము తొట్టిలో ఉన్న పిండి తక్కువకాలేదు,
బుడ్డిలో ఉన్న నూనె అయిపోలేదు. । అటుతరువాత
ఆ యింటి యజమానురాలైన ఆమె కుమారుడు రోగియై
ప్రాణము నిలువజాలనంత వ్యాధిగలవాడాయెను. ।
ఆమె ఏలీయాను చూచి — దైవజనుడా, నాయొద్దకు
నీవు రానిమిత్తమేమి! నా పాపమును జ్ఞాపకము
చేసి నా కుమారుని చంపుటకై నాయొద్దకు వచ్చితివా
అని మనవి చేయగా । అతడు—నీ బిడ్డను నా చేతికిమ్మని
చెప్పి, ఆమె కౌగిటిలోనుండి వాని తీసికొని తానున్న
పై అంతస్తు గదిలోకి పోయి తన మంచముమీద
వాని పరుండబెట్టి । —యెహోవా నా దేవా, నన్ను 2
చేర్చుకొనిన యీ విధవరాలి కుమారుని చంపునంతగా
ఆమెమీదికి కీడు రాజేసితివా అని యెహోవాకు
మొఱ్ఱపెట్టి । ఆ చిన్నవానిమీద ముమ్మారు తాను పార 2
చాచుకొని—యెహోవా నా దేవా, నా మొఱ్ఱ
ఆలకించి యీ చిన్నవానికి ప్రాణము మరల రాని
మ్మని యెహోవాకు ప్రార్థింపగా । యెహోవా 2

యా చేసిన ప్రార్థన ఆలకించి ఆ చిన్నవానికి
ప్రాణము మరల రానిచ్చినప్పుడు వాడు బ్రదికెను. ।
యా ఆ చిన్నవాని తీసికొని గదిలోనుండి దిగి
ంట ప్రవేశించి వాని తల్లికి అప్పగించి—ఇదిగో నీ
మారుడు; వాడు బ్రదుకుచున్నాడని చెప్పగా ।
స్త్రీ ఏలీయాను చూచి—నీవు దైవజనుడవై యున్నా
వును నీవు పలుకుచున్న యెహోవామాట నిజ
యు ఇందుచేత నేనెరుగుదుననెను.
అనేకదినములైన తరువాత మూడవ సంవత్సర
ము యెహోవా వాక్కు ఏలీయాకు ప్రత్యక్షమై
నేను భూమిమీద వర్షము కురిపింప బోవుచు
ను; నీవు వెళ్లి అహాబును దర్శించుమని సెల
య్యగా, । అహాబును దర్శించుటకై ఏలీయా వెళ్లి
యెను. షోమ్రోనులో ఘోరమైన క్షామము
యుండగా । అహాబు తన గృహనిర్వాహకుడగు
ద్యాను పిలిపించెను. ఈ ఓబద్యా యెహోవా
దు బహు భయభక్తులుగలవాడై । యెజెబెలు
హోవా ప్రవక్తలను నిర్మూలము చేయుచుండగా
ని గుహలో ఏబదేసిమందిగా నూరుగురిని దాచి
పానములిచ్చి వారిని పోషించెను. । అహాబు —
ములోని ఊటక ధారలన్నిటిని నదులన్నిటిని చూడు
ము, పశువులన్నిటిని పోగొట్టుకొనకుండ గుఱ్ఱము
కంచరగాడిదెలను ప్రాణములతో కాపాడుటకై
కు గడ్డి దొరుకునేమో తెలిసికొనుమని ఓబద్యాకు
ఇచ్చెను. । కాబట్టి వారు దేశమంతట సంచరింప
ని చెరియొక పాలు తీసికొని, అహాబు ఒంటరిగా
వైపుకును ఓబద్యా ఒంటరిగా నింకొక వైపు
వెళ్లిరి. । ఓబద్యా మార్గమున పోవుచుండగా ఏలీ
అతనిని ఎదుర్కొనెను. ఓబద్యా యితని
నమస్కారము చేసి—నా యేలినవాడవైన ఏలీ
వు నీవే గదా యని అడుగగా । అతడు — నేనే
చెప్పి—నీవు నీ యేలినవాని దగ్గరకు పోయి,
యా యిచ్చట ఉన్నాడని తెలియజేయుమనెను. ।
కు ఓబద్యా—నేను చావవలెనని నీ దాసుడనైన
అహాబుచేతికి నీవు అప్పగింపనేల? నేను చేసిన
మేమి? । నీ దేవుడైన యెహోవా జీవముతోడు
చిక్కించుకొనవలెనని నా యేలినవాడు దూత
పంపించని జనమొకటైనను లేదు, రాజ్యమొక
ను లేదు; అతడు ఇక్కడ లేడనియు, అతని
వలేదనియు, వారు ఆయా జనముల చేతను రాజ్యా
చేతను ప్రమాణము చేయించుచు వచ్చిరి. । నీవు
యేలినవానిచెంతకు పోయి, ఏలీయా యిచ్చట
న్నాడని చెప్పుమని నాకు ఆజ్ఞ ఇచ్చుచున్నావే; ।
తే నేను నీ యొద్దనుండి పోవు క్షణమందే
హోవా ఆత్మ నాకు తెలియని స్థలమునకు నిన్ను
మపోవును; అప్పుడు నేను పోయి అహాబుకు

వర్తమానము తెలియజెప్పిన తరువాత నీవు అతనికి కన
బడని పక్షమందు అతడు నన్ను చంపివేయును;
ఆలాగున ఆజ్ఞ ఇయ్యవద్దు; నీ దాసుడనైన నేను
బాల్యమునుండి యెహోవాయందు భయభక్తులు నిలి
పినవాడను. । యెజెబెలు యెహోవా ప్రవక్తలను 13
హతము చేయుచుండగా నేను చేసినది నా యేలిన
వాడవైన నీకు వినబడినది కాదా? నేను యెహోవా
ప్రవక్తలలో నూరు మందిని గుహకు ఏబదేసి మంది
చొప్పున దాచి, అన్నపానములిచ్చి వారిని పోషించి
తిని. । ఇప్పుడు అహాబు నన్ను చంపునట్లుగా—నీ 14
యేలినవాని దగ్గరకు పోయి, ఏలీయా యిచ్చట
ఉన్నాడని చెప్పుమని నీవు నాకు ఆజ్ఞ ఇచ్చుచు
న్నావే అని మనవి చేయగా । ఏలీయా—ఇశ్రాయేలీ 15
యుల దేవుడైన యెహోవా సన్నిధిని నేను నిలువ
బడుచున్నాను; నిజముగా ఈ దినమున నేను అహా
బును దర్శించుదునని యెహోవా జీవముతోడు
చెప్పుచున్నాననెను. । అంతట ఓబద్యా అహాబును ఎదు 16
ర్కొనబోయి ఆ వర్తమానమును తెలియజేయగా ఏలీ
యాను కలిసికొనుటకై అహాబు బయలుదేరెను. ।
అహాబు ఏలీయాను చూచి—ఇశ్రాయేలువారిని శ్రమ 17
పెట్టువాడవు నీవే కావా యని అతనితో అనగా ।
అతడు—నేను కాను, యెహోవా ఆజ్ఞలను మైకొనక 18
బయలుదేవత ననుసరించు నీవును, నీ తండ్రియింటివా
రును ఇశ్రాయేలువారిని శ్రమపెట్టువారై యున్నారు. ।
అయితే ఇప్పుడు నీవు ఇశ్రాయేలువారినందరిని, యెజె 19
బెలు పోషించుచున్న బయలుదేవత ప్రవక్తలు నన్నూట
ఏబదిమందిని, అష్తారోతుదేవి ప్రవక్తలైన నన్నూరుమందిని
నాయొద్దకు కర్మెలు పర్వతమునకు పిలువనంపుమని
చెప్పెను. । అహాబు ఇశ్రాయేలువారందరియొద్దకు 20
దూతలను పంపి, ప్రవక్తలను కర్మెలు పర్వతమునకు
సమకూర్చెను. । ఏలీయా జనులందరి దగ్గరకు వచ్చి— 21
యెన్నాళ్లమట్టుకు మీరు రెండు అభిప్రాయములు
పెట్టుకొని యుందురు? యెహోవా దేవుడైతే ఆయ
నను అనుసరించుడి, బయలు దేవుడైతే వాని ననుస
రించుడని ప్రకటన చేయగా, జనులు అతనికి ప్రత్యు
త్తరముగా ఒక మాటైనను పలుకక పోయిరి. ।
అప్పుడు ఏలీయా—యెహోవాకు ప్రవక్తలైనవారిలో 22
నేను ఒకడనే శేషించి యున్నాను; అయితే బయ
లుకు ప్రవక్తలు నన్నూట ఏబదిమంది యున్నారు. ।
మాకు రెండు ఎడ్లను ఇయ్యుడి. వారు వాటిలో 23
ఒకదాని కోరుకొని దాని తునకలుగా చేసి, క్రింద
అగ్ని యేమియు వేయకుండనే దానిని కట్టెలమీద
ఉంచవలెను, రెండవ యెద్దును నేను సిద్ధము చేసి,
క్రింద అగ్ని యేమియు వేయకుండనే దానిని కట్టెల
మీద ఉంచుదును. । తరువాత మీరు మీ దేవత 24
పేరునుబట్టి ప్రార్థన చేయుడి; నేనైతే యెహోవా

రెంటివలె వారియెదుట దిగియుండిరి గాని దేశము
28 అరామీయులచేత కప్పబడి యుండెను. । అప్పుడు
దైవజనుడైన యొకడు వచ్చి ఇశ్రాయేలు రాజుతో
ఇట్లనెను—యెహోవా సెలవిచ్చునదేమనగా—అరా
మీయులు — యెహోవా కొండలకు దేవుడేగాని
లోయలకు దేవుడు కాడని అనుకొందురు; అయితే
నేను యెహోవానై యున్నానని మీరు తెలిసికొను
నట్లు ఈ గొప్ప సమూహమంతయు నీ చేతికి అప్ప
29 గించెదను. । వారు ఎదురుముఖములుగా ఏడుదినములు
గుడారములు వేసికొని యుండిన తరువాత ఏడవ దిన
మందు యుద్ధమునకు కలిసికొనగా ఇశ్రాయేలువారు
ఒక దినమందే అరామీయుల కాల్బలము లక్షమందిని
30 హతముచేసిరి. । తక్కినవారు ఆఫెకు పట్టణములోకి
పారిపోగా అచ్చటనున్న యొక ప్రాకారము శేషిం
చినవారిలో ఇరువది యేడు వేలమందిమీద పడెను.
బెన్హదదు పారిపోయి ఆ పట్టణమందు ప్రవేశించి ఆ
31 యా గదులలో చొచ్చగా । అతని సేవకులు—ఇశ్రా
యేలువారి రాజులు దయాపరులని మేము వింటిమి
గనుక నీకు అనుకూలమైనయెడల మేము నడుముకు
గోనెలు కట్టుకొని తలమీద త్రాళ్లు వేసికొని ఇశ్రా
యేలు రాజునొద్దకు పోవుదుము; అతడు నీ ప్రాణ
మును రక్షించునేమో అని రాజుతో అనగా రాజు
32 అందుకు సమ్మతించెను. । కావున వారు తమ నడుము
లకు గోనెలు కట్టుకొని తలమీద త్రాళ్లు వేసికొని
ఇశ్రాయేలు రాజునొద్దకు వచ్చి—నీ దాసుడైన బెన్హదదు
—దయచేసి నన్ను బ్రదుకనిమ్మని మనవి చేయుటకై
మమ్మును పంపెనని చెప్పగా అతడు — బెన్హదదు నా
సహోదరుడు, అతడు ఇంకను సజీవుడై యున్నాడా
33 అని యడిగెను. । అప్పుడు ఆ మనుష్యులు సంగతి
గ్రహించి అతని మనస్సు ఏలాగుననున్నదో అది
నిశ్చయముగా గుర్తెరిగి ఆ మాటనుబట్టి—బెన్హదదు నీకు
సహోదరుడే అని చెప్పగా అతడు — మీరు వెళ్లి
అతని తోడుకొని రండనెను. బెన్హదదు తనయొద్దకు
రాగా అతడు తన రథముమీద అతని ఎక్కించు
34 కొనెను. । అంతట బెన్హదదు — తమ తండ్రి చేతిలో
నుండి నా తండ్రి తీసికొనిన పట్టణములను నేను మరల
అప్పగించెదను; మరియు నా తండ్రి షోమ్రోనులో
వీధులను కట్టించుకొనినట్లు దమస్కులో తమకొరకు
తమరు వీధులను కట్టించుకొనవచ్చును అని అతనితో
చెప్పగా అహాబు — ఈ ప్రకారముగా నీతో సంధి
చేసి నిన్ను పంపివేయుదునని చెప్పి అతనితో సంధి
చేసి అతని పోనిచ్చెను.
35 అంతట ప్రవక్తల శిష్యులలో ఒకడు యెహోవా
ఆజ్ఞచేత తన చెలికానితో — నన్ను కొట్టుమనగా
36 అతడు అతని కొట్టుటకు ఒప్పకపోయినప్పుడు । అత
డు—నీవు యెహోవా ఆజ్ఞకు లోబడకపోతివి గనుక
నీవు నన్ను విడిచిపోగానే సింహము నిన్ను చంపునని
అతనితో చెప్పెను. అతడు వెళ్లిపోగానే సింహమొకటి
అతనికి ఎదురై అతని చంపెను. । తరువాత మరియొ 37
కడు అతనికి కనబడినప్పుడు అతడు — నన్ను కొట్టు
మనగా అతడు అతని కొట్టి గాయపరచెను. । అప్పుడు 38
ఆ ప్రవక్త పోయి, కండ్లమీద పాగా కట్టుకొని మారు
వేషము వేసికొని, మార్గమందు రాజుయొక్క రాకకై
కనిపెట్టుకొని యుండి । రాజు వచ్చుట చూచి బిగ్గ 39
రగా రాజుతో ఈలాగు మనవి చేసికొనెను — నీ
దాసుడనైన నేను యుద్ధములోకి పోయి యుండగా
ఒకడు ఇటు తిరిగి—ఒక మనుష్యుని నాయొద్దకు తోడు
కొని వచ్చి యీ మనుష్యుని కనిపెట్టుము; ఏ విధము
గానైనను వాడు తప్పించుకొని పోయినయెడల వాని
ప్రాణమునకు మారుగా నీ ప్రాణము పోవును; లేదా
నీవు రెండు మణుగుల వెండిని ఇయ్యవలెననెను. ।
అయితే నీ దాసుడనైన నేను పనిమీద అక్కడక్కడ 40
తిరుగుచుండగా వాడు కనబడక పోయెను. అప్పుడు
ఇశ్రాయేలురాజు — నీకు నీవే తీర్పు తీర్చుకొంటివి
గనుక నీవు చెప్పినట్టుగానే నీకు జరుగును అని అతనికి
సెలవియ్యగా । అతడు త్వరపడి తన కండ్లమీది పాగా 41
తీసివేయగా చూచి అతడు ప్రవక్తలలో ఒకడని రాజు
పోల్చెను. । అప్పుడు అతడు—యెహోవా సెలవిచ్చు 42
నదేమనగా—నేను శపించిన మనుష్యుని నీవు నీ చేతి
లోనుండి తప్పించుకొని పోనిచ్చితివి గనుక వాని
ప్రాణమునకు మారుగా నీ ప్రాణమును, వాని జను
లకు మారుగా నీ జనులను అప్పగింపబడుదురని రాజు
తో అనగా । ఇశ్రాయేలురాజు మూతి ముడుచు 43
కొనినవాడై కోపముతో షోమ్రోనులోని తన నగరుకు
వచ్చెను.

ఈ సంగతులైన తరువాత యెజ్రెయేలులో 21
షోమ్రోనురాజైన అహాబు నగరును ఆనుకొని యెజ్రె
యేలువాడైన నాబోతుకు ఒక ద్రాక్షతోట కలిగి
యుండగా । అహాబు నాబోతును పిలిపించి — నీ 2
ద్రాక్షతోట నా నగరును ఆనుకొని యున్నది గనుక
అది నాకు కూరతోటకిమ్ము దానికి ప్రతిగా దానికంటె
మంచి ద్రాక్షతోట నీకిచ్చెదను, లేదా నీకు అనుకూల
మైనయెడల దానిని క్రయమునకిమ్మని అడిగెను. । అం 3
దుకు నాబోతు—నా పితరుల స్వాస్థ్యమును నీకిచ్చు
టకు నాకు ఎంతమాత్రమును వల్లపడదని చెప్పగా । —
నా పితరుల స్వాస్థ్యమును నీ కియ్యనని యెజ్రెయేలీయు 4
డైన నాబోతు తనతో చెప్పినదానినిబట్టి అహాబు
మూతి ముడుచుకొనినవాడై కోపముతో తన నగరుకు
పోయి మంచముమీద పరుండి యెవరితోను మాట
లాడకయు భోజనము చేయకయు ఉండెను. । అంతట 5
అతని భార్యయైన యెజెబె
ముడుచుకొనినవాడవై ?

6 మని అతని నడుగగా । అతడు ఆమెతో ఇట్లనెను—
నీ ద్రాక్షతోటను క్రయమునకు నాకిమ్ము, లేక నీకు
అనుకూలమైనయెడల దానికి మారుగా మరియొక
ద్రాక్షతోట నీకిచ్చెదనని, యెజ్రెయేలీయుడైన నాబో
తుతో నేను చెప్పగా అతడు—నా ద్రాక్షతోట
7 నీకియ్యనని చెప్పెను. అందుకు అతని భార్యయైన యెజెబెలు—
ఇశ్రాయేలులో నీవిప్పుడు రాజ్యపరిపాలనము చేయుట
లేదా? లేచి భోజనము చేసి మనస్సులో సంతోష
ముగా ఉండుము; నేనే యెజ్రెయేలీయుడైన నాబోతు
8 ద్రాక్షతోట నీకిప్పించెదనని అతనితో చెప్పి । అహాబు
పేరట తాకీదు వ్రాయించి అతని ముద్రతో ముద్రించి,
ఆ తాకీదును నాబోతు నివాసము చేయుచున్న పట్ట
9 ణపు పెద్దలకును సామంతులకును పంపెను. । ఆ తాకీ
దులో వ్రాయించినదేమనగా—ఉపవాసదినము జరుగ
వలెనని మీరు చాటించి నాబోతును జనులయెదుట
10 నిలువబెట్టి ।—నీవు దేవుని రాజును దూషించితివని
అతనిమీద సాక్ష్యము పలుకుటకు దుర్మార్గులైన యిద్దరు
మనుష్యులను సిద్ధపరచుడి; తీర్పు అయినమీదట అతని
11 బయటికి తీసికొనిపోయి రాళ్లతో చావగొట్టుడి. । అతని
పట్టణపు పెద్దలును పట్టణమందు నివసించు సామంతు
లును యెజెబెలు తమకు పంపిన తాకీదు ప్రకారముగా
12 జరిగించిరి. । ఎట్లనగా వారు ఉపవాసదినము చాటించి
13 నాబోతును జనులయెదుట నిలువబెట్టిరి. । అప్పుడు
దుర్మార్గులైన యిద్దరు మనుష్యులు సమాజములో ప్రవే
శించి అతని యెదుట కూర్చుండి—నాబోతు దేవునిని
రాజును దూషించెనని జనుల సమక్షమున నాబోతు
మీద సాక్ష్యము పలుకగా వారు పట్టణము బయటికి
14 అతని తీసికొని పోయి రాళ్లతో చావగొట్టిరి. । నా
బోతు రాతిదెబ్బలచేత మరణమాయెనని వారు యెజె
15 బెలుకు వర్తమానము పంపగా । నాబోతు రాతిదెబ్బల
చేత మరణమాయెనని యెజెబెలు విని—నాబోతు
సజీవుడు కాడు, అతడు చనిపోయెను గనుక నీవు
లేచి యెజ్రెయేలీయుడైన నాబోతు క్రయమునకు
నీకియ్యనొల్లకపోయిన అతని ద్రాక్షతోటను స్వాధీన
16 పరచుకొనుమని అహాబుతో చెప్పెను. । నాబోతు
చనిపోయెనని అహాబు విని లేచి యెజ్రెయేలీయు
డైన నాబోతు ద్రాక్షతోటను స్వాధీనపరచుకొన
బోయెను.

17 అప్పుడు యెహోవా వాక్కు తిష్బీయుడైన
ఏలీయాకు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను ।—
18 నీవు లేచి షోమ్రోనులోనున్న ఇశ్రాయేలురాజైన
అహాబును ఎదుర్కొనుటకు బయలుదేరుము, అతడు
నాబోతుయొక్క ద్రాక్షతోటలో ఉన్నాడు; అతడు
19 దాని స్వాధీనపరచుకొనబోయెను. । నీవు అతని
చూచి యీలాగు ప్రకటించుము—యెహోవా సెల
విచ్చునదేమనగా—దీని స్వాధీనపరచుకొనవలెనని నీవు
నాబోతును చంపితివిగదా. యెహోవా సెలవిచ్చున
దేమనగా—ఏ స్థలమందు కుక్కలు నాబోతు రక్తమును
నాకెనో ఆ స్థలమందే కుక్కలు నీ రక్తమును నిజముగా
నాకునని అతనితో చెప్పెను. । అంతట అహాబు ఏలీ 20
యాను చూచి—నా పగవాడా, నీ చేతిలో నేను
చిక్కుబడితినా? అని పలుకగా ఏలీయా ఇట్లనెను—
యెహోవా దృష్టికి కీడు చేయుటకు నిన్ను నీవే
అమ్ముకొని యున్నావు గనుక నా చేతిలో నీవు చిక్కి
తివి. । అందుకు యెహోవా ఈలాగు సెలవిచ్చెను— 21
నేను నీమీదికి అపాయము రప్పించెదను; నీ సంతతి
వారిని నాశముచేతును; అల్పులేమి ఘనులేమి ఇశ్రా
యేలువారిలో అహాబు పక్షమున ఎవరును లేకుండ
పురుషులనందరిని నిర్మూలముచేతును. । ఇశ్రాయేలు 22
వారు పాపముచేయుటకు నీవు కారకుడవై నాకు
కోపము పుట్టించితివి గనుక నెబాతు కుమారుడైన
యరొబాము కుటుంబమునకును అహీయా కుమారు
డైన బయెషా కుటుంబమునకును నేను చేసినట్లు నీ
కుటుంబమునకు చేయుదునని యెహోవా సెలవిచ్చు
చున్నాడు. । మరియు యెజెబెలునుగూర్చి యెహోవా 23
సెలవిచ్చినదేమనగా—యెజ్రెయేలు ప్రాకారముయొద్ద
కుక్కలు యెజెబెలును తినివేయును. । పట్టణమందు 24
చచ్చు అహాబు సంబంధికులను కుక్కలు తినివేయును;
బయటిభూములలో చచ్చువారిని ఆకాశపక్షులు తిని
వేయును. । తన భార్యయైన యెజెబెలు ప్రేరేపణ 25
చేత యెహోవా దృష్టికి కీడుచేయ తన్ను తాను అమ్ము
కొనిన అహాబువంటివాడు ఎవ్వడును లేడు. । ఇశ్రా 26
యేలీయుల యెదుట నిలువకుండ యెహోవా వెళ్ల
గొట్టిన అమోరీయుల ఆచారరీతిగా విగ్రహములను
పెట్టుకొని అతడు బహు హేయముగా ప్రవర్తించెను. ।
అహాబు ఆ మాటలు విని తన వస్త్రములను చింపుకొని 27
గోనెపట్ట కట్టుకొని ఉపవాసముండి, గోనెపట్టమీద
పరుండి వ్యాకులపడుచుండగా । యెహోవావాక్కు 28
తిష్బీయుడైన ఏలీయాకు ప్రత్యక్షమై యీలాగు సెల
విచ్చెను ।—అహాబు నాకు భయపడి వినయముగా 29
ప్రవర్తించుట చూచితివా? నాకు భయపడి అతడు
వినయముగా ప్రవర్తించుటచేత ఆ అపాయము అతని
కాలమునందు సంభవింపకుండ ఆపి, అతని కుమారుని
కాలమునందు అతని కుటుంబికులమీదికి నేను దాని
రప్పించెదను.

అరామీయులును ఇశ్రాయేలువారును మూడు **22**
సంవత్సరములు ఒకరితో ఒకరు యుద్ధము జరిగింపక
మానిరి. । మూడవ సంవత్సరమందు యూదారాజైన 2
యెహోషాపాతు బయలుదేరి ఇశ్రాయేలురాజు
నొద్దకు రాగా । ఇశ్రాయేలురాజు తన సేవకులను పిలి 3
పించి—రామోత్గిలాదు మనదని మీరెరుగుదురు; అయితే
మనము అరాము రాజుచేతిలోనుండి దాని తీసికొనక

4 ఊరకున్నామని చెప్పి । – యుద్ధముచేయుటకు నాతో
కూడ నీవు రామోత్గిలాదుకు వచ్చెదవా అని యెహో
షాపాతును అడిగెను. అందుకు యెహోషాపాతు—
నేను నీవాడనే; నా గుఱ్ఱములును నీ గుఱ్ఱములే అని
5 ఇశ్రాయేలు రాజుతో చెప్పెను. । పిమ్మట యెహోషా
పాతు– నేడు యెహోవాయొద్ద విచారణచేయుదము
6 రండని ఇశ్రాయేలురాజుతో అనగా । ఇశ్రాయేలురాజు
దాదాపు నన్నూరుమంది ప్రవక్తలను పిలిపించి—యుద్ధ
ముచేయుటకు రామోత్గిలాదుమీదికి పోదునా పోకుం
దునా అని వారినడిగెను. అందుకు— యెహోవా
7 దానిని రాజైన నీ చేతికి అప్పగించును గనుక । పొం
డని వారు చెప్పిరి గాని యెహోషాపాతు—విచారణ
చేయుటకై వీరు తప్ప యెహోవా ప్రవక్తలలో ఒక
8 డైనను ఇక్కడ లేడా అని అడిగెను. । అందుకు ఇశ్రా
యేలురాజు — ఇమ్లా కుమారుడైన మీకాయా అను
ఒకడున్నాడు; అతనిద్వారా మనము యెహోవా
యొద్ద విచారణచేయవచ్చును గాని, అతడు నన్ను
గూర్చి మేలు ప్రకటింపక కీడే ప్రకటించును గనుక
అతనియందు నాకిష్టములేదని యెహోషాపాతుతో
అనగా యెహోషాపాతు—రాజైన మీరు ఆలాగన
9 వద్దనెను. । అప్పుడు ఇశ్రాయేలురాజు తన గృహనిర్వా
హకులలో ఒకని పిలిచి—ఇమ్లా కుమారుడైన మీకా
యాను శీఘ్రముగా ఇక్కడికి రప్పించుమని సెల
10 విచ్చెను. । ఇశ్రాయేలురాజును యూదారాజగు
యెహోషాపాతును రాజవస్త్రములు ధరించుకొని,
షోమ్రోను గవిని దగ్గరనున్న విశాలస్థలమందు గద్దెల
మీద ఆసీనులై యుండి, ప్రవక్తలందరును వారి సమక్ష
11 మందు ప్రకటన చేయుచుండగా । కెనయనా కుమారు
డైన సిద్కియా యినుపకొమ్ములు చేయించుకొని వచ్చి
—వీటిచేత నీవు అరామీయులను పొడిచి నాశనము
చేతువని యెహోవా సెలవిచ్చుచున్నాడని చెప్పెను. ।
12 ప్రవక్తలందరును ఆ చొప్పుననే ప్రకటన చేయుచు—
యెహోవా రామోత్గిలాదును రాజైన నీ చేతికి అప్ప
గించును గనుక నీవు దానిమీదికి పోయి జయమొందు
13 దువు అని చెప్పిరి. । మీకాయాను పిలువబోయిన
గృహనిర్వాహకుడు—ప్రవక్తలు ఏకముగా రాజుతో
మంచి మాటలు పలుకుచున్నారు గనుక నీ మాట వారి
మాటకు అనుకూలపరచుమని అతనితో అనగా ।
14 మీకాయా — యెహోవా నాకు సెలవిచ్చునదేదో
ఆయన జీవముతోడు నేను దానినే పలుకుదుననెను. ।
15 అతడు రాజునొద్దకు వచ్చినప్పుడు రాజు–మీకాయా,
నీవేమందువు? యుద్ధము చేయుటకు మేము రామోత్గి
లాదుమీదికి పోగుమా పోకుందుమా అని యడుగగా
అతడు— యెహోవా రాజవైన నీ చేతికి దాని నప్ప
గించును గనుక రాజు పోయినయెడల జయమొందుదు
16 వని రాజుతో అనెను. । అందుకు రాజు–నీచేత ప్రమా
ణము చేయించి యెహోవా నామమునుబట్టి నిజమైన
మాటలే నీవు నాతో పలుకవలసినదని నేనెన్నిమారులు
నీతో చెప్పితిని అని రాజు సెలవియ్యగా । అతడు— 17
ఇశ్రాయేలీయులందరును కాపరిలేని గొఱ్ఱెలవలెనే
కొండలమీద చెదరి యుండుట నేను చూచుచు
న్నాను. వారికి యజమానుడు లేడు; యుద్ధము చేయ
బూనక యెవరి యింటికి వారు సుఖముగా వెళ్లవలసిన
దని యెహోవా సెలవిచ్చుచున్నాడు అని చెప్పెను. ।
అప్పుడు ఇశ్రాయేలురాజు యెహోషాపాతును 18
చూచి—ఇతడు నన్నుగూర్చి మేలు పలుకక కీడే ప్రవ
చించునని నేను నీతో చెప్పలేదా అనగా । మీకాయా 19
యిట్లనెను — యెహోవా సెలవిచ్చినమాట ఆలకిం
చుము; యెహోవా సింహాసనాసీనుడై యుండగా
పరలోకసైన్యమంతయు ఆయన కుడిపార్శ్వమునను
ఎడమపార్శ్వమునను నిలిచి యుండుట నేను చూచి
తిని ।– అహాబు రామోత్గిలాదుమీదికిపోయి అక్కడ 20
ఓడిపోవునట్లుగా ఎవడు అతని ప్రేరేపించునని
యెహోవా సెలవియ్యగా, ఒకడు ఈ విధముగాను
మరియొకడు ఆ విధముగాను యోచన చెప్పుచుండిరి. ।
అంతలో ఒక ఆత్మ యెదుటికి వచ్చి యెహోవా 21
సన్నిధిని నిలువబడి — నేను అతనిని ప్రేరేపించెద
ననగా యెహోవా — ఏ ప్రకారము నీవతని ప్రేరే
పించుదువని అతని నడిగెను. । అందుకతడు — నేను 22
బయలుదేరి అతని ప్రవక్తల నోట అబద్ధమాడు ఆత్మను
ఉంచుదునని చెప్పగా ఆయన—నీవు అతని ప్రేరే
పించి జయము నొందుదువు; పోయి ఆ ప్రకారము
చేయుమని అతనికి సెలవిచ్చెను. । యెహోవా నిన్ను 23
గూర్చి కీడు యోచించి నీ ప్రవక్తల నోట అబద్ధమాడు
ఆత్మను ఉంచి యున్నాడు. । మీకాయా యిట్లనగా, 24
కెనయనా కుమారుడైన సిద్కియా అతని దగ్గరకు
వచ్చి—నీతో మాటలాడుటకు యెహోవా ఆత్మ నా
యొద్దనుండి ఏవైపుగా పోయెనని చెప్పి మీకాయాను
చెంపమీద కొట్టెను. । అందుకు మీకాయా—దాగు 25
కొనుటకై నీవు ఆ యా గదులలోకి చొరబడు నాడు
అది నీకు తెలియవచ్చునని అతనితో చెప్పెను. ।
అప్పుడు ఇశ్రాయేలురాజు—మీకాయాను పట్టుకొని 26
తీసికొని పోయి పట్టణపు అధికారియైన ఆమోనుకును
రాజకుమారుడైన యోవాషుకును అప్పగించి । — బందీ 27
గృహములో ఉంచి, మేము క్షేమముగా తిరిగి వచ్చు
పర్యంతము అతనిని కఠినముగా చూచి అన్నపానము
లీయుడని ఆజ్ఞ ఇచ్చెను. । అప్పుడు మీకాయా — 28
సకల జనులారా, నా మాట ఆలకించుడని చెప్పి —
రాజవైన నీవు ఏమాత్రమైనను క్షేమముగా తిరిగివచ్చిన
పక్షమందు యెహోవా నాచేత పలుకలేదనెను.

ఇశ్రాయేలు రాజును యూదారాజగు యెహో 29
షాపాతును రామోత్గిలాదు మీదికి పోవుచుండగా ।

30 ఇశ్రాయేలురాజు—నేను మారువేషము వేసికొని యుద్ధ
ములో ప్రవేశించెదను, నీవైతే నీ వస్త్రములు ధరించు
కొని ప్రవేశించుమని యెహోషాపాతుతో చెప్పి
మారువేషము వేసికొని యుద్ధమందు ప్రవేశించెను. ।
31 అయితే అరాము రాజు తన రథములమీద అధికారు
లైన ముప్పది యిద్దరు అధిపతులను పిలిపించి—అల్పుల
తోనైనను ఘనులతోనైనను మీరు పోట్లాడవద్దు;
ఇశ్రాయేలు రాజుతో మాత్రమే పోట్లాడుడని ఆజ్ఞ
32 ఇచ్చియుండెగా । రథాధిపతులు యెహోషాపాతును
చూచి—యితడే ఇశ్రాయేలు రాజనుకొని అతనితో
పోట్లాడుటకు అతని మీదికి వచ్చిరి. యెహోషా
33 పాతు కేకలు వేయగా । రథాధిపతులు అతడు ఇశ్రా
యేలురాజు కానట్టు గురుతుపట్టి అతని తరుముట
34 మానివేసిరి. । పిమ్మట ఒకడు తన విల్లు తీసి గురి చూడ
కయే విడువగా అది ఇశ్రాయేలు రాజుకు కవచపు
కీలు మధ్యను తగిలెను గనుక అతడు—నాకు గాయమై
నది, రథము త్రిప్పి సైన్యములోనుండి నన్ను అవతలకు
35 తీసికొని పొమ్మని తన సారథితో చెప్పెను. । నాడు
యుద్ధము బలముగా జరుగుచున్నప్పుడు రాజును అరా
మీయుల యెదుట అతని రథముమీద నిలువబెట్టిరి;
అస్తమయమందు అతడు మరణమాయెను; తగిలిన గాయ
ములోనుండి అతని రక్తము కారి రథములో మడుగు
36 గట్టెను. । సూర్యాస్తమయ సమయమందు దండువా
రందరు తమ తమ పట్టణములకును దేశములకును వెళ్లి
37 పోవచ్చునని ప్రచురమాయెను. । ఈ ప్రకారము
రాజు మరణమై షోమ్రోనుకు కొంచుపోబడి షోమ్రో
38 నులో పాతిపెట్టబడెను. । వేశ్యలు స్నానము చేయు
చుండగా ఒకడు ఆ రథమును షోమ్రోను కొలనులో
కడిగినప్పుడు యెహోవా సెలవిచ్చిన మాటచొప్పున
39 కుక్కలు వచ్చి అతని రక్తమును నాకెను. । అహాబు
చేసిన యితర కార్యములనుగూర్చియు, అతడు చేసిన
దానంతటినిగూర్చియు, అతడు కట్టించిన దంతపు ఇం
టినిగూర్చియు, అతడు కట్టించిన పట్టణములనుగూర్చి
యు ఇశ్రాయేలు రాజుల వృత్తాంతముల గ్రంథమందు
40 వ్రాయబడి యున్నది. । అహాబు తన పితరులతోకూడ
నిద్రించగా అతని కుమారుడైన అహజ్యా అతనికి
మారుగా రాజాయెను.

41 ఆసా కుమారుడైన యెహోషాపాతు ఇశ్రాయేలు
రాజైన అహాబు ఏలుబడిలో నాలుగవ సంవత్సరమందు
42 యూదాను ఏల నారంభించెను. । యెహోషాపాతు
ఏల నారంభించినప్పుడు అతడు ముప్పది యయిదేండ్ల
వాడై యెరూషలేములో ఇరువది యయిదేండ్లు ఏలెను;
అతని తల్లి పేరు అజూబా, ఆమె షిల్హీకుమార్తెయై
యుండెను. । అతడు తన తండ్రియైన ఆసాయొక్క 43
మార్గములన్నిటి ననుసరించి, యెహోవా దృష్టికి అను
కూలముగా ప్రవర్తించుచు వచ్చెను. అయితే ఉన్నత
స్థలములను తీసివేయలేదు; ఉన్నత స్థలములలో జనులు
ఇంకను బలులు అర్పించుచు ధూపము వేయుచు నుం
డిరి. । యెహోషాపాతు ఇశ్రాయేలురాజుతో సంధి 44
చేసెను. । యెహోషాపాతు చేసిన యితర కార్య 45
ములనుగూర్చియు, అతడు కనుపరచిన బలమునుగూర్చి
యు, అతడు యుద్ధముచేసిన విధమునుగూర్చియు
యూదారాజుల వృత్తాంతముల గ్రంథమందు వ్రాయ
బడి యున్నది. । తన తండ్రియైన ఆసా దినములలో 46
శేషించియుండిన పురుషగాములను అతడు దేశములో
నుండి వెళ్లగొట్టెను. । ఆ కాలమందు ఎదోము దేశము 47
నకు రాజు లేకపోయెను; ప్రధానియైన యొకడు
రాజ్యపాలనము చేయుచుండెను. । యెహోషాపాతు 48
బంగారము తెచ్చుటకై ఓఫీరుదేశమునకు పోవుటకు
తర్షీషు ఓడలను కట్టింపగా ఆ ఓడలు బయలుదేరక
ఎసోన్గాబెరునొద్ద బద్దలై పోయెను. । అహాబు కుమారు 49
డైన అహజ్యా—నా సేవకులను నీ సేవకులతోకూడ
ఓడలమీద పోనిమ్మని యెహోషాపాతు నడుగగా
యెహోషాపాతు దానికి ఒప్పలేదు. । పిమ్మట 50
యెహోషాపాతు తన పితరులతో కూడ నిద్రించి,
తన పితరుడైన దావీదు పురమందు తన పితరులతో
కూడ పాతిపెట్టబడెను; అతని కుమారుడైన యెహో
రాము అతనికి మారుగా రాజాయెను.

అహాబు కుమారుడైన అహజ్యా యూదారాజైన 51
యెహోషాపాతు ఏలుబడిలో పదునేడవ సంవత్సర
మందు షోమ్రోనులో ఇశ్రాయేలును ఏలనారంభించి
రెండు సంవత్సరములు ఇశ్రాయేలును ఏలెను. । అతడు 52
యెహోవా దృష్టికి చెడుతనము జరిగించి, తన తలి
దండ్రు లిద్దరి ప్రవర్తనను, ఇశ్రాయేలువారు పాపము
చేయుటకు కారకుడైన నెబాతు కుమారుడగు యరో
బాము ప్రవర్తనను అనుసరించి ప్రవర్తించుచు వచ్చెను. ।
అతడు బయలు దేవతను పూజించుచు, దానికి నమ 53
స్కారము చేయుచు, తన తండ్రి చేసిన క్రియలన్నిటి
చొప్పున జరిగించుచు, ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవాకు కోపము పుట్టించెను.

# రా జు లు

## రెండవ గ్రంథము



అహాబు మరణమైన తరువాత మోయాబీయులు
ుయేలువారిమీద తిరుగబడిరి. । అహజ్యా
ప్రానులోనున్న తన మేడగది కిటికీలోనుండి
పడి రోగియై — మీరు ఎక్రోను దేవతయగు
జ్జెబూబునొద్దకు పోయి — ఈ వ్యాధి పోగొట్టు
నేను స్వస్థపడుదునో లేదో విచారించుడని
తలను పంపగా । యెహోవా దూత తిష్బీయు
ఏలీయాతో ఈలాగు సెలవిచ్చెను — నీవు లేచి
ప్రాను రాజు పంపిన దూతలను ఎదుర్కొన
ు యిట్లనుము—ఇశ్రాయేలువారిలో దేవుడన్న
ు లేడనుకొని ఎక్రోను దేవతయైన బయల్జె
బునొద్ద మీరు విచారించబోవుచున్నారా? ।
ా యెహోవా సెలవిచ్చునదేమనగా — నీవె
మంచముమీదనుండి దిగి రాకుండ నీవు నిశ్చ
ుగా మరణమవుదువు అని ఏలీయా వారితో
వెళ్లిపోయెను. । తరువాత ఆ దూతలు రాజు
ప వచ్చిరి.—మీరెందుకు తిరిగి వచ్చితిరని అతడు
నడుగగా । వారు—ఒక మనుష్యుడు మాకు
పడి—మిమ్మును పంపిన రాజునొద్దకు తిరిగిపోయి
కి ఈ సంగతి తెలియజేయుడి — యెహోవా
చ్చునదేమనగా — ఇశ్రాయేలులో దేవుడన్న
ు లేడనుకొని ఎక్రోను దేవతయగు బయల్జెబూబు
విచారణచేయుటకు నీవు దూతలను పంపు
ివే; నీవెక్కిన మంచముమీదనుండి దిగి
ండ నిశ్చయముగా నీవు మరణమవుదువు అని
ు పలికెనని వారు చెప్పగా । — మిమ్మును ఎదు
నవచ్చి యీ మాట చెప్పినవాడు ఏలాటివాడని
అడిగెను. । అందుకు వారు—అతడు కంబళి
ుకొని నడుముకు తోలుదట్టి కట్టుకొనినవాడని
్త్తరమియ్యగా—ఆ మనుష్యుడు తిష్బీయుడైన
ా అని అతడు చెప్పెను. । వెంటనే రాజు
మందికి అధిపతియైన యొకనిని వాని యేబది
తోకూడ ఏలీయా యొద్దకు పంపెను. అతడు
మీద కూర్చుని యుండగా అధిపతి యెక్కి
సమీపమునకు పోయి—దైవజనుడా, నీవు దిగి
ెనని రాజు ఆజ్ఞాపించుచున్నాడనెను. । అందుకు
ా—నేను దైవజనుడనైతే అగ్ని ఆకాశమునుండి
్చి నిన్ను నీ యేబదిమందిని దహించుగాక అని
యేబదిమందికి అధిపతియైన వానితో చెప్పగా, అగ్ని
ఆకాశమునుండి దిగి వానిని వాని యేబదిమందిని
దహించెను. । మరల అతడు ఏబదిమందిమీద అధిపతి 11
యైన మరియొకని వాని యేబదిమందితోకూడ పంపగా
వీడు వచ్చి — దైవజనుడా, త్వరగా దిగి రమ్మని రాజు
ఆజ్ఞాపించుచున్నాడనెను. । అందుకు ఏలీయా—నేను 12
దైవజనుడనైతే అగ్ని ఆకాశమునుండి దిగివచ్చి నిన్ను
నీ యేబదిమందిని దహించుగాక అని చెప్పగా, ఆకా
శమునుండి దేవుని అగ్ని దిగి వానిని వాని యేబది
మందిని దహించెను. । ఇంకను రాజు ఏబదిమందికి అధి 13
పతియైన యొకని వాని యేబదిమందితోకూడ పంపగా
ఏబదిమందిమీద అధిపతియైన ఆ మూడవవాడు వచ్చి
ఏలీయా యెదుట మోకాళ్లూని— దైవజనుడా, దయ
చేసి నా ప్రాణమును నీ దాసులైన యీ యేబదిమంది
ప్రాణములను నీ దృష్టికి ప్రియమైనవిగా ఉండనిమ్ము. ।
చిత్తగించుము; ఆకాశమునుండి అగ్ని దిగి వెనుకటి 14
పంచదశాధిపతులను ఇద్దరిని వానివాని యేబదిమంది
తోకూడ దహించెను; అయితే నా ప్రాణము నీ
దృష్టికి ప్రియమైనదిగా ఉండనిమ్మని మనవి చేయగా ।
యెహోవా దూత — వానికి భయపడక వానితో 15
కూడ దిగిపొమ్మని ఏలీయాకు సెలవిచ్చెను గనుక
అతడు లేచి వానితోకూడ రాజునొద్దకు వచ్చెను. ।
అతడు వచ్చి రాజును చూచి—విచారణచేయుటకు 16
ఇశ్రాయేలువారిమధ్య దేవుడున్నవాడు లేడనుకొని
నీవు ఎక్రోను దేవతయగు బయల్జెబూబునొద్ద విచా
రణచేయుటకై దూతలను పంపితివే; నీవెక్కిన మంచ
ముమీదనుండి దిగి రాకుండ నిశ్చయముగా నీవు
మరణమవుదువు అని చెప్పెను. । ఏలీయాద్వారా 17
యెహోవా సెలవిచ్చిన మాటప్రకారము అతడు
చనిపోయెను. అతనికి కుమారుడు లేనందున
యూదారాజైన యెహోషాపాతు కుమారుడైన
యెహోరాము ఏలుబడిలో రెండవ సంవత్సరమందు
యెహోరాము అతనికి మారుగా రాజాయెను. ।
అహజ్యా చేసిన యితర కార్యములనుగూర్చి ఇశ్రా 18
యేలు రాజుల వృత్తాంతముల గ్రంథమందు వ్రాయ
బడియున్నది.

**యెహోవా సుడిగాలిచేత ఏలీయాను ఆకాశ** **2**
మునకు ఆరోహణము చేయింపబోవు కాలమున ఏలీ

యాయు ఎలీషాయు కూడి గిల్గాలునుండి వెళ్లు
2 చుండగా ; ఏలీయా—యెహోవా నన్ను బేతేలునకు
పొమ్మని సెలవిచ్చియున్నాడు గనుక నీవు దయచేసి
యిక్కడ నుండుమని ఎలీషాతో అనెను. ఎలీషా—
యెహోవా జీవముతోడు నీ జీవముతోడు, నేను
నిన్ను విడువనని చెప్పగా వారిద్దరును బేతేలునకు
3 ప్రయాణముచేసిరి. । బేతేలులో ఉన్న ప్రవక్తల
శిష్యులు ఎలీషాయొద్దకు వచ్చి—నేడు యెహోవా
నీయొద్దనుండి నీ గురువును పరమునకు తీసికొని పోవు
నని నీకెరుకయేనా అని ఎలీషాను అడుగగా అతడు—
4 నేనెరుగుదును, మీరు ఊరకుండుడనెను. । పిమ్మట
ఏలీయా—ఎలీషా,యెహోవానన్ను యెరికోకుపొమ్మని
సెలవిచ్చియున్నాడు గనుక నీవు దయచేసి యిక్కడ
నుండుమని ఎలీషాతో అనగా అతడు యెహోవా
జీవముతోడు నీ జీవముతోడు, నేను నిన్ను విడువ
ననెను గనుక వారిద్దరు యెరికోకు ప్రయాణము
5 చేసిరి. । యెరికోలో ఉన్న ప్రవక్తల శిష్యులు ఎలీషా
యొద్దకు వచ్చి—నేడు యెహోవా నీయొద్దనుండి
నీ గురువును పరమునకు తీసికొని పోవునని నీ వెరుగు
దువా అని ఎలీషాను అడుగగా అతడు—నేనెరుగు
6 దును మీరు ఊరకుండుడనెను. । అంతట ఏలీయా—
యెహోవా నన్ను యొర్దానుకు పొమ్మని సెలవిచ్చి
యున్నాడు గనుక నీవు దయచేసి యిక్కడ ఉండుమని
ఎలీషాతో అనగా అతడు—యెహోవా జీవము
తోడు నీ జీవముతోడు, నేను నిన్ను విడువనని
చెప్పెను గనుక వారిద్దరును ప్రయాణమై సాగి వెళ్లిరి.।
7 ప్రవక్తల శిష్యులలో ఏబదిమంది దూరమున నిలిచి
చూచుచుండగా వారిద్దరు యొర్దాను నదివద్దగర నిలి
8 చిరి. । అంతట ఏలీయా తన దుప్పటి తీసికొని మడత
పెట్టి నీటిమీద కొట్టగా అది ఇవతలకును అవతలకును
విడిపోయెను గనుక వారిద్దరు పొడినేలమీద దాటి
9 పోయిరి. । వారు దాటిపోయిన తరువాత ఏలీయా
ఎలీషాను చూచి—నేను నీయొద్దనుండి తీయబడక
మునుపు నీకొరకు నేనేమి చేయకోరుదువో దాని
నడుగుమని చెప్పగా ఎలీషా—నీకు కలిగిన ఆత్మ రెండం
తలుగా నామీదికి వచ్చునట్లు దయచేయుమనెను. ।
10 అందుకతడు—నీవు అడిగినది కష్టతరముగా నున్నది;
అయితే నీయొద్దనుండి తీయబడినప్పుడు నేను నీకు
కనబడినయెడల ఆ ప్రకారము నీకు లభించును, కన
11 బడనియెడల అది కాకపోవునని చెప్పెను. । వారు
ఇంక వెళ్లుచు మాటలాడుచుండగా అగ్ని రథమును
అగ్ని గుర్రములును కనబడి వీరిద్దరిని వేరుచేసెను;
అప్పుడు ఏలీయా సుడిగాలిచేత ఆకాశమునకు ఆరో
12 హణమాయెను । ఎలీషా అది చూచి—నా తండ్రీ
—నా తండ్రీ, ఇశ్రాయేలువారికి రథమును రౌతులును
నీకేలువేసెను; అంతలో ఏలీయా అతనికి
మరల కనబడకపోయెను. అప్పుడు ఎలీషా తన వస్త్ర
మును పట్టుకొని రెండు తునకలుగా చేసెను. । మరియు 13
ఏలీయా దుప్పటి క్రింద పడగా అతడు దాని తీసి
కొని యొర్దాను ఒడ్డుకు వచ్చి నిలిచి । ఒంటిమీది 14
నుండి క్రిందపడిన ఆ దుప్పటిని పట్టుకొని నీటిమీద
కొట్టి—యెహోవా, ఏలీయాయొక్క దేవా, నీవె
క్కడ ఉన్నావనెను. అతడు ఆ దుప్పటితో నీటిని
కొట్టగా అది ఇటు అటు విడిపోయినందున ఎలీషా
అవతలి యొడ్డుకు నడిచిపోయెను. । యెరికో దగ్గర 15
నుండి కనిపెట్టుచుండిన ప్రవక్తల శిష్యులు అతని
చూచి—ఏలీయామీద నున్న ఆత్మ ఎలీషామీదికి వచ్చి
యున్నదని చెప్పుకొని, అతనిని ఎదుర్కొనబోయి
అతనికి సాష్టాంగ నమస్కారము చేసి । అతనితో 16
ఇట్లనిరి—నీ దాసులమైన మా యొద్ద ఏబదిమంది బల
ముగలవారున్నారు; మా మీద దయయుంచి నీ
గురువును వెదకుటకు వారిని పోనిమ్ము; యెహోవా
ఆత్మ అతనిని ఎత్తి యొక పర్వతముమీదనైనను లోయ
యందైనను వేసి యుండునేమో అని మనవి చేయగా
అతడు—ఎవరిని పంపవద్దనెను. । అతడు ఒప్పవలసి 17
నంత బలవంతము చేసి వారతని బతిమాలగా అతడు
పంపుడని సెలవిచ్చెను గనుక వారు ఏబదిమందిని
పంపిరి. వీరు వెళ్లి మూడు దినములు అతని వెదకి
నను అతడు వారికి కనబడకపోయెను. । వారు 18
యెరికో పట్టణమందు ఆగియున్న ఎలీషాయొద్దకు
తిరిగి రాగా అతడు—వెళ్లవద్దని నేను మీతో చెప్ప
లేదా అని వారితో అనెను.

అంతట ఆ పట్టణపువారు — ఈ పట్టణమున్న 19
చోటు రమ్యమైనదని మా యేలినవాడవైన నీకు కన
బడుచున్నది గాని నీళ్లు మంచివి కావు. అందుచేత
భూమియు నిస్సారమై యున్నదని ఎలీషాతో అనగా।
అతడు—క్రొత్త పాత్రలో ఉప్పువేసి నాయొద్దకు 20
తీసికొని రండని వారితో చెప్పెను. వారు దాని
తీసికొని రాగా । అతడు ఆ నీటి ఊటయొద్దకు 21
పోయి అందులో ఉప్పువేసి,—యెహోవా సెల
విచ్చునదేమనగా — ఈ నీటిని నేను బాగు చేసి
యున్నాను గనుక ఇక దీనివలన మరణము కలుగక
పోవును. భూమియు నిస్సారముగా ఉండదు అనెను.।
కాబట్టి నేటివరకు ఎలీషా చెప్పిన మాటచొప్పున 22
ఆ నీరు మంచిదై యున్నది.

అక్కడనుండి అతడు బేతేలుకు ప్రయాణమై 23
త్రోవను పోవుచుండగా బాలురు పట్టణములోనుండి
వచ్చి—బోడివాడా వెళ్లిపొమ్ము, బోడివాడా వెళ్లి
పొమ్మని అతని అపహాస్యము చేయగా । అతడు 24
వెనుకకు తిరిగి వారిని చూచి యెహోవా నామ
మునుబట్టి వారిని శపించెను. అప్పుడు రెండు ఆడు
ఎలుగుబంట్లు అడవిలోనుండి వచ్చి వారిలో నలువది

25 యిద్దరు బాలురను చీల్చివేసెను. । అతడు అచ్చట
నుండి పోయి కర్మెలు పర్వతమునకు వచ్చి అచ్చట
నుండి షోమ్రోనుకు తిరిగి వచ్చెను.

3 అహాబు కుమారుడైన యెహోరాము యూదా
రాజైన యెహోషాపాతు ఏలుబడిలో పదునెనిమి
దవ సంవత్సరమందు షోమ్రోనులో ఇశ్రాయేలు
వారికి రాజై పండ్రెండు సంవత్సరములు ఏలెను. ।
2 ఇతడు తన తలిదండ్రులు చేసిన ప్రకారము చేయక,
తన తండ్రి నిలిపిన బయలుదేవతా స్తంభమును తీసి
వేసెను గాని యెహోవా దృష్టికి చెడుతనము
3 చేయుట మానకుండెను । ఇశ్రాయేలువారు పాపము
చేయుటకు కారకుడగు నెబాతు కుమారుడైన యరొ
బాము చేసిన పాపములను విడువక చేయుచునే
వచ్చెను.

4 మోయాబు రాజైన మేషా అనేకమైన మందలు
గలవాడై లక్ష గొఱ్ఱెపిల్లలను బొచ్చుగల లక్ష గొఱ్ఱె
పొట్టేళ్లను ఇశ్రాయేలురాజునకు పన్నుగా ఇచ్చు
5 చుండువాడు. । అయితే అహాబు మరణమైన తరు
వాత మోయాబురాజు ఇశ్రాయేలు రాజుమీద
6 తిరుగబాటు చేయగా । యెహోరాము షోమ్రో
నులోనుండి బయలుదేరి ఇశ్రాయేలువారినందరిని సమ
7 కూర్చెను. । యూదారాజైన యెహోషాపాతునకు
వర్తమానము పంపి—మోయాబురాజు నామీద తిరుగ
బాటు చేసియున్నాడు; నీవు వచ్చి నాతోకూడ
మోయాబీయులతో యుద్ధము చేసెదవా అని యడు
గగా అతడు—నేను నీవాడనైయున్నాను, నా జనులు
నీ జనులే, నా గుఱ్ఱములు నీ గుఱ్ఱములే; నేను బయలు
8 దేరి వచ్చెదనని ప్రత్యుత్తరమిచ్చెను. ।— మనము ఏ
మార్గమున పోవుదమని యెహోషాపాతు అడుగగా
అతడు — ఎదోము అరణ్యమార్గమున పోవుదుమని
9 చెప్పెను. । ఇశ్రాయేలురాజును యూదారాజును
ఎదోమురాజును బయలుదేరి యేడు దినములు చుట్టు
తిరిగిన తరువాత, వారితోకూడనున్న దండువారికిని
10 పశువులకును నీళ్లు లేకపోయెను. । ఇశ్రాయేలురాజు
—కటకటా ముగ్గురు రాజులమైన మనలను మోయా
బీయులచేతికి అప్పగింపవలెనని యెహోవా మన
11 లను పిలిచెననగా । యెహోషాపాతు—అతని ద్వారా
మనము యెహోవాయొద్ద విచారణచేయుటకు
యెహోవా ప్రవక్తలలో ఒకడైనను ఇచ్చట లేడా
అని యడిగెను. అంతట ఇశ్రాయేలురాజు సేవకు
లలో ఒకడు — ఏలీయాకు ఉపచారము చేయుచు
వచ్చిన షాపాతు కుమారుడైన ఎలీషా యొకడే
12 ఇక్కడ ఉన్నాడని చెప్పగా । యెహోషాపాతు—
యెహోవా ఆజ్ఞ యితని ద్వారా మనకు దొరుకు
ననెను. ఇశ్రాయేలురాజును యెహోషాపాతును
13 ఎదోమురాజును అతనియొద్దకుపోగా । ఎలీషా ఇశ్రా
యేలురాజును చూచి — నాతో నీకు నిమిత్తమేమి?
నీ తలిదండ్రులుంచుకొనిన ప్రవక్తలయొద్దకు పొమ్మని
చెప్పెను.—ఆలాగనవద్దు, మోయాబీయులచేతికి అప్ప
గింపవలెనని యెహోవా, రాజులమైన మా ముగ్గురిని
పిలిచెనని ఇశ్రాయేలురాజు అతనితో అనినప్పుడు ।
ఎలీషా ఇట్లనెను—సైన్యములకధిపతియగు యెహోవా 14
సన్నిధిని నేను నిలుచుచున్నాను; ఆయన జీవము
తోడు యూదారాజైన యెహోషాపాతును నేను
గౌరవము చేయనియెడల నిన్ను చూచుటకైనను లక్ష్య
పెట్టుటకైనను ఒప్పకపోదును. । నాయొద్దకు వీణ 15
వాయించగల యొకని తీసికొనిరమ్ము. వాద్యకు
డొకడు వచ్చి వాయించుచుండగా యెహోవా
బలము అతనిమీదికి వచ్చెను గనుక అతడు ఈ మాట
ప్రకటనచేసెను. । — యెహోవా సెలవిచ్చునదేమ 16
నగా — ఈ లోయలో చాలా గోతులను త్రవ్విం
చుడి; । యెహోవా సెలవిచ్చునదేమనగా—గాలియే 17
గాని వర్షమే గాని రాకపోయినను, మీరును మీ
మందలును మీ పశువులును త్రాగుటకు ఈ లోయ
నీళ్లతో నిండును. । ఇది యెహోవా దృష్టికి 18
అల్పమే, ఆయన మోయాబీయులను మీచేతికి అప్ప
గించును. । మీరు ప్రాకారములుగల ప్రతి పట్టణ 19
మును రమ్యమైన ప్రతి పట్టణమును కొల్లబెట్టి, మంచి
చెట్లనెల్ల నరికి, నీళ్ల బావులన్నిటిని పూడ్చి, సమస్త
మైన మంచి భూములను రాళ్లతో నెరిపివేయుదురు.।
ఉదయ నైవేద్యము అర్పించు సమయమందు నీళ్లు 20
ఎదోము మార్గమున రాగా దేశము నీళ్లతో నిండెను. ।
తమతో యుద్ధము చేయుటకు రాజులు వచ్చి యు 21
న్నారని మోయాబీయులు విని, అల్పులేమి ఘనుల
నేమి ఆయుధములు ధరించుకొనగల వారినందరిని
సమకూర్చుకొని దేశపు సరిహద్దునందు నిలిచిరి. ।
ఉదయమందు వీరు లేచినప్పుడు సూర్యుడు నీళ్లమీద 22
ప్రకాశింపగా, అవతలి నీళ్లు మోయాబీయులకు రక్తము
వలె కనబడెను । గనుక వారు—అది రక్తము సుమా; 23
రాజులు ఒకరినొకరు హతముచేసికొని నిజముగా
హతులైరి; మోయాబీయులారా, దోపుడుసొమ్ము పట్టు
కొందము రండని చెప్పుకొనిరి. । వారు ఇశ్రాయేలు 24
వారి దండుదగ్గరకు రాగా ఇశ్రాయేలీయులు లేచి
వారిని హతము చేయుచుండిరి గనుక మోయాబీయులు
వారియెదుట నిలువలేక పారిపోయిరి; ఇశ్రాయేలీ
యులు వారి దేశములో చొరబడి మోయాబీయు
లను హతముచేసిరి. । మరియు వారు పట్టణములను 25
పడగొట్టి, సమస్తమైన మంచి భూభాగములమీదను
తలయొక రాయి వేసి నింపి, నీళ్లబావులన్నిటిని పూడ్చి,
మంచి చెట్లన్నిటిని నరికివేసిరి. కీర్హరెశెతు పట్టణమును
మాత్రము వారు విడిచిపెట్టిరి గనుక దాని ప్రాకా
రము నిలిచి యుండెను గాని వడిసెలలు విసరువారు

26 దాని చుట్టుకొని రాళ్లు విసరుచు వచ్చిరి. । మోయాబు
రాజు యుద్ధము బహు కఠినముగా జరుగుట చూచి,
కత్తిదూయు ఏడునూర్లమందిని ఏర్పరచుకొని, ఎదో
మురాజునొద్దకు తోసికొని పోవుటకు యత్నించెను
27 గాని అది వారివలన కాకపోయెను. । అప్పుడతడు
తనకు మారుగా ఏలవలసిన తన జ్యేష్ఠకుమారుని తీసి
కొని, పట్టణపు ప్రాకారముమీద దహనబలిగా
అర్పింపగా ఇశ్రాయేలువారిమీదికి కోపము బహుగా
వచ్చెను గనుక వారు అతని విడిచి తమ దేశమునకు
మరలిపోయిరి.

4 అంతట ప్రవక్తల శిష్యులలో ఒకని భార్య—
నీ దాసుడైన నా పెనిమిటి చనిపోయెను; అతడు
యెహోవాయందు భక్తిగలవాడై యుండెనని నీకు
తెలిసేయున్నది; ఇప్పుడు అప్పులవాడు నా యిద్దరు
కుమారులు తనకు దాసులుగా ఉండుటకై వారిని
పట్టుకొని పోవుటకు వచ్చియున్నాడని ఎలీషాకు
2 మొఱ్ఱపెట్టగా । ఎలీషా—నావలన నీకేమి కావలెను?
నీ యింటిలో ఏమి యున్నదో అది నాకు తెలియ
జెప్పుమనెను. అందుకామె — నీ దాసురాలనైన నా
యింటిలో నూనెకుండ యొకటి యున్నది; అది తప్ప
3 మరేమియు లేదనెను. । అతడు — నీవు బయటికి
పోయి, నీ యిరుగు పొరుగు వారందరియొద్ద దొరుక
గలిగిన వట్టి పాత్రలన్నిటిని ఎరవు పుచ్చుకొనుము; ।
4 అప్పుడు నీవు నీ యింటిలోకి వచ్చి నీవును నీ కుమారు
లును లోపలనుండి తలుపుమూసి, ఆ పాత్రలన్ని
టిలో (నూనె) పోసి, నిండినవి యొకతట్టున ఉంచు
5 మని ఆమెతో సెలవియ్యగా । ఆమె అతని యొద్ద
నుండి పోయి, తానును కుమారులును లోపలనుండి
తలుపు మూసి, కుమారులు తెచ్చిన పాత్రలలో (నూనె)
6 పోసెను. । పాత్రలన్నియు నిండిన తరువాత ఇంక
పాత్రలు తెమ్మని ఆమె తన కుమారునితో చెప్పగా
వాడు—మరేమియు లేవని చెప్పెను. అంతలో నూనె
7 నిలిచిపోయెను. । ఆమె దైవజనుడైన అతనియొద్దకు
వచ్చి సంగతి తెలియజెప్పగా అతడు—నీవు పోయి
ఆ నూనెను అమ్మి నీ అప్పు తీర్చి మిగిలినదానితో
నీవును నీ పిల్లలును బ్రదుకుడని ఆమెతో చెప్పెను.
8 తరువాత ఒక దినమందు ఎలీషా షూనేము పట్ట
ణమునకు పోగా అచ్చట ఘనురాలైన యొక స్త్రీ—
భోజనమునకు రమ్మని అతని బలవంతముచేసెను గనుక
అతడు ఆ మార్గమున వచ్చినప్పుడెల్ల ఆమె యింట
9 భోజనము చేయుచు వచ్చెను. । కాగా ఆమె తన
పెనిమిటిని చూచి—మనయొద్దకు వచ్చుచు పోవుచు
నున్నవాడు భక్తిగల దైవజనుడని నేనెరుగుదును. ।
10 కావున మనము అతనికి గోడమీద ఒక చిన్నగది
కట్టించి, అందులో అతనికొరకు మంచము బల్ల పీట
దీపస్తంభము నుంచుదము; అతడు మనయొద్దకు వచ్చు
నప్పుడెల్ల అందులో బసచేయవచ్చునని చెప్పెను. ।
ఆ తరువాత అతడు అక్కడికి ఒకానొక దినమున 11
వచ్చి ఆ గదిలో చొచ్చి అక్కడ పరుండెను. ।
పిమ్మట అతడు తన దాసుడైన గేహజీని పిలిచి—ఈ 12
షూనేమీయురాలిని పిలువుమనగా వాడు ఆమెను
పిలిచెను. ఆమె వచ్చి అతనిముందర నిలువబడినప్పుడు ।
అతడు—నీవు ఇంత శ్రద్ధాభక్తులు మాయందు కనుపరచి 13
తివే; నీకు నేనేమి చేయవలెను? రాజుతోనైనను
సైన్యాధిపతితోనైనను నిన్నుగూర్చి నేను మాటలాడ
వలెనని కోరుచున్నావా అని అడుగుమని గేహజీకి
ఆజ్ఞ ఇయ్యగా వాడు ఆ ప్రకారము ఆమెతో
అనెను. అందుకామె — నేను నా స్వజనులలో
కాపురమున్నాననెను. । ఎలీషా—ఆమె నేనేమి చేయ 14
కోరుచున్నదని వాని నడుగగా గేహజీ — ఆమెకు
కుమారుడు లేడు; మరియు ఆమె పెనిమిటి ముసలి
వాడని అతనితో చెప్పెను. । అందుకతడు—ఆమెను 15
పిలువుమనగా వాడు ఆమెను పిలిచెను. ఆమె వచ్చి
ద్వారమందు నిలువగా । ఎలీషా—మరుసటి యేట ఈ 16
రుతువున నీ కౌగిట కుమారుడుండునని ఆమెతో
అనెను. ఆమె ఆ మాట విని—దైవజనుడవైన నా
యేలినవాడా, ఆలాగు పలుకవద్దు; నీ దాసురాలనైన
నాతో అబద్ధమాడవద్దనెను. । పిమ్మట ఆ స్త్రీ గర్భ 17
వతియై మరుసటి యేట ఎలీషా తనతో చెప్పిన కాల
మున కుమారుని కనెను. । ఆ బిడ్డ యెదిగిన తరువాత 18
ఒకనాడు కోత కోయువారియొద్దనున్న తన తండ్రి
దగ్గరకు పోయి అక్కడ ఉండగా వాడు—నా తల
పోయెనే నా తలపోయెనే, అని తన తండ్రితో
చెప్పెను. । అతడు వానిని ఎత్తికొని తల్లియొద్దకు తీసి 19
కొని పొమ్మని పనివారిలో ఒకనికి చెప్పగా । వాడు 20
ఆ బాలుని ఎత్తికొని వాని తల్లియొద్దకు తీసికొని
పోయెను. పిల్లవాడు మధ్యాహ్న పర్యంతము తల్లి
తొడమీద పండుకొని యుండి చనిపోయెను. ।
అప్పుడు ఆమె పిల్లవానిని దైవజనుని మంచముమీద 21
పెట్టి తలుపువేసి బయటికి వచ్చి । — ఒక పనివానిని 22
ఒక గాడిదెను నాయొద్దకు పంపుము; నేను దైవజనుని
యొద్దకు పోయి వచ్చెదనని తన పెనిమిటితో ఆమె
యనగా । అతడు—నేడు అమావాస్య కాదే; విశ్రాంతి 23
దినము కాదే; అతనియొద్దకు ఎందుకు పోవుదువని
యడుగగా ఆమె—నేను పోవుట మంచిదని చెప్పి ।
గాడిదెకు గంత కట్టించి తాను ఎక్కి తన పనివా 24
నితో—శీఘ్రముగా తోలుము, నేను నీకు సెలవిచ్చి
తేనే గాని నిమ్మళముగా తోలవద్దనెను. । ఈ ప్రకా 25
రము ఆమె పోయి కర్మెలు పర్వతమందున్న ఆ దైవ
జనునియొద్దకు వచ్చెను. దైవజనుడు దూరమునుండి
ఆమెను చూచి—అదిగో ఆ షూనేమీయురాలు; ।
నీవు ఆమెను ఎదుర్కొనుటకై పరుగున పోయి—నీవును 26

నీ పెనిమిటియు నీ బిడ్డయు సుఖముగా ఉన్నారా
అని అడుగుమని తన పనివాడైన గేహజీతో చెప్పి
పంపెను. అందుకామె — సుఖముగా ఉన్నామని
27 చెప్పెను. । పిమ్మట ఆమె కొండమీదనున్న దైవజనుని
యొద్దకు వచ్చి అతని కాళ్లు పట్టుకొనెను. గేహజీ
ఆమెను తోలివేయుటకు దగ్గరకు రాగా దైవజనుడు
—ఆమె బహు వ్యాకులముగా ఉన్నది, యెహోవా
ఆ సంగతి నాకు తెలియజేయక మరుగుచేసెను; ఆమె
28 జోలికి పోవద్దని వానికి ఆజ్ఞ ఇచ్చెను. । అప్పుడు
ఆమె—కుమారుడు కావలెనని నేను నా యేలినవాడ
వైన నిన్ను అడిగితినా? నన్ను భ్రమపెట్టవద్దని నేను
29 చెప్పలేదా? అని అతనితో మనవి చేయగా । అతడు
—నీ నడుము బిగించుకొని నా దండమును చేత పట్టు
కొని పొమ్ము; ఎవరైనను నీకు ఎదురుపడినయెడల వారికి
నమస్కరింపవద్దు; ఎవరైనను నీకు నమస్కరించినయెడల
వారికి ప్రతి మర్యాదచేయవద్దు; అక్కడికి పోయి
నా దండమును ఆ బాలుని ముఖముమీద పెట్టుమని
30 గేహజీకి ఆజ్ఞ ఇచ్చి పంపెను. । తల్లి ఆ మాట విని—
యెహోవా జీవముతోడు నీ జీవముతోడు, నేను
నిన్ను విడువనని చెప్పగా అతడు లేచి ఆమెతోకూడ
31 పోయెను. । గేహజీ వారికంటె ముందుగా పోయి ఆ
దండమును బాలుని ముఖముమీద పెట్టెను గాని యే
శబ్దమును రాకపోయెను, ఏమియు వినవచ్చినట్టు కన
బడలేదు గనుక వాడు ఎలీషాను ఎదుర్కొనవచ్చి —
32 బాలుడు మేలుకొనలేదని చెప్పెను. । ఎలీషా ఆ
యింటి లోనికి వచ్చి, బాలుడు మరణమై యుండి తన
33 మంచముమీద పెట్టబడి యుండుట చూచి । తానే
లోపలికిపోయి తామిద్దరే లోపలనుండగా తలుపువేసి
34 యెహోవాకు ప్రార్థనచేసి । మంచముమీద ఎక్కి
బిడ్డమీద తన్ను చాచుకొని తన నోరు వాని నోటి
మీదను తన కండ్లు వాని కండ్లమీదను తన చేతులు
వాని చేతులమీదను ఉంచి, బిడ్డమీద పొడుగుగా
35 పండుకొనగా ఆ బిడ్డ ఒంటికి వెట్ట పుట్టెను. । తాను
దిగి యింటిలో ఇవతలనుండి యవతలకు ఒకసారి తిరిగి
నడచి, మరల మంచముమీద ఎక్కి వానిమీద పొడు
గుగా పండుకొనగా బిడ్డ యేడు మారులు తుమ్మి కండ్లు
36 తెరచెను. । అప్పుడతడు గేహజీని పిలిచి—ఆ షూనేమీ
యురాలిని పిలుచుకొని రమ్మనగా వాడు ఆమెను పిలి
చెను. ఆమె అతనియొద్దకు రాగా అతడు—నీ కుమా
37 రుని ఎత్తికొనుమని ఆమెతో చెప్పెను. । అంతట ఆమె
లోపలికి వచ్చి అతని కాళ్లమీద సాష్టాంగపడి లేచి
తన కుమారుని ఎత్తికొనిపోయెను.

38 ఇదియైన తరువాత ఎలీషా గిల్గాలుకు తిరిగి రాగా
ఆ దేశమందు క్షామము కలిగి యుండెను. ప్రవక్తల
శిష్యులు అతని సమక్షమునందు కూర్చుండి యుండగా
అతడు తన పనివాని పిలిచి—పెద్దకుండ పొయిమీద
పెట్టి ప్రవక్తల శిష్యులకు కూరవంట చేయుమని సెల
విచ్చెను. । అయితే ఒకడు కూరాకులు ఏరుటకు పొల 39
ములోకి పోయి వెర్రి ద్రాక్షచెట్టును చూచి, దాని
గుణమెరుగక దాని తీగెలు తెంపి ఒడినిండ కోసికొని
వచ్చి, వాటిని తరిగి కూరకుండలో వేసెను. । తినుటకు 40
వారు వడ్డింపగా ప్రవక్తల శిష్యులు రుచి చూచి—
దైవజనుడా, కుండలో విషమున్నదని కేకలువేసి దాని
తినక మానిరి. । అతడు — పిండి కొంత తెమ్మనెను. 41
వారు తేగా—కుండలో దాని వేసి, జనులు భోజనము
చేయుటకు వడ్డించుడని చెప్పెను. వడ్డింపగా కుండలో
మరి ఏ జబ్బు కనిపింపకపోయెను.

మరియు ఒకడు బయల్షాలిషానుండి మొదటి పంట 42
బాపతు యవల పిండితో చేయబడిన యిరువది రొట్టె
లను కొన్ని పండ్లను తీసికొని వచ్చి దైవజనుడైన అతనికి
కానుకగా ఇయ్యగా అతడు జనులు భోజనము చేయు
టకు దాని వడ్డించుమనెను. । అయితే అతని పనివాడు 43
—నూరుమందికి వడ్డించుటకు ఇవి యెంతవని చెప్పగా
అతడు—వారు తినగా మిగులునని యెహోవా సెల
విచ్చి యున్నాడు గనుక జనులు భోజనము చేయు
నట్లు వడ్డించుమని మరల ఆజ్ఞ ఇచ్చెను. । పనివాడు 44
వారికి వడ్డింపగా యెహోవా సెలవిచ్చినట్లు అది
వారు తినిన తరువాత మిగిలిపోయెను.

అరాము రాజు సైన్యాధిపతియైన నయమాను అను 5
నొకడుండెను. అతనిచేత యెహోవా అరాముదేశ
మునకు జయము కలుగజేసి యుండెను గనుక అతడు
తన యజమానుని దృష్టికి ఘనుడై దయ పొందిన
వాడాయెను. అతడు మహా పరాక్రమశాలియై యుం
డెను గాని అతడు కుష్ఠరోగి. । అరామీయులు గుంపు 2
గుంపులుగా బయలుదేరి ఇశ్రాయేలు దేశముమీదికి
పోయియుండిరి. వారచ్చటనుండి యొక చిన్నదాని
చెరగొని తేగా, అది నయమాను భార్యకు పరిచారము
చేయుచుండెను. । అది—షోమ్రోనులోనున్న ప్రవక్త 3
దగ్గర నా యేలినవాడుండవలెనని నేనెంతో కోరు
చున్నాను; అతడు నా యేలినవానికి కలిగిన కుష్ఠరోగ
మును బాగుచేయునని తన యజమానురాలితో అనెను. ।
నయమాను రాజునొద్దకు పోయి ఇశ్రాయేలు దేశపు 4
చిన్నది చెప్పిన మాటలను అతనికి తెలియజేయగా ।
అరామురాజు — నేను ఇశ్రాయేలురాజుకు దూత 5
చేత పత్రిక పంపించెదనని ఆజ్ఞ ఇచ్చెను గనుక అతడు
ఇరువది మణుగుల వెండియు లక్ష యిరువది వేల
రూపాయిల బంగారును పది దుస్తుల బట్టలను తీసికొని
పోయి ఇశ్రాయేలురాజుకు పత్రికను అప్పగించెను. ।
ఆ పత్రికలో ఉన్న సంగతి యేదనగా—నా సేవకు 6
డైన నయమానుకు కలిగిన కుష్ఠరోగమును నీవు బాగు
చేయవలెనని యీ పత్రికను అతనిచేత నీకు పంపించి
యున్నాను. । ఇశ్రాయేలురాజు ఈ పత్రికను చదివి 7

వస్త్రములు చింపుకొని—చంపుటకును బ్రదికించుటకును
నేను దేవుడనా? ఒకనికి కలిగిన కుష్ఠరోగమును మాన్పు
మని నాయొద్దకు ఇతడు పంపుటయేమి? నాతో కలహ
మునకు కారణము అతడు ఎట్లు వెదకుచున్నాడో
8 మీరు ఆలోచించుడనెను. । ఇశ్రాయేలురాజు తన
వస్త్రములు చింపుకొనిన సంగతి దైవజనుడైన ఎలీషాకు
వినబడినప్పుడు అతడు—నీ వస్త్రములు నీ వెందుకు చింపు
కొంటివి? ఇశ్రాయేలులో ప్రవక్తయొకడున్నాడని అత
నికి తెలియబడునట్లు అతని నాయొద్దకు రానిమ్ము అని
9 రాజుకు వర్తమానము చేసెను. । నయమాను గుఱ్ఱముల
తోను రథముతోను వచ్చి ఎలీషా యింటి ద్వారము
10 ముందర నిలిచియుండగా । ఎలీషా — నీవు యొర్దాను
నదికి పోయి యేడు మారులు స్నానము చేయుము,
నీ ఒళ్లు మరల బాగై నీవు శుద్ధుడవగుదువని అతనితో
11 చెప్పుటకు ఒక దూతను పంపెను. । అందుకు నయ
మాను కోపము తెచ్చుకొని తిరిగి పోయి యిట్లనెను—
అతడు నాయొద్దకు వచ్చి నిలిచి, తన దేవుడైన
యెహోవా నామమునుబట్టి తన చెయ్యి రోగముగా
ఉన్న స్థలముమీద ఆడించి కుష్ఠరోగమును మాన్పునని
12 నేననుకొంటిని. । దమస్కునదులైన అబానాయును
ఫర్పరును ఇశ్రాయేలు దేశములోని నదులన్నిటికంటె
శ్రేష్ఠమైనవి కావా? వాటిలో స్నానము చేసి శుద్ధి
నొందలేనా అని అనుకొని రౌద్రుడై తిరిగి వెళ్లి
13 పోయెను. । అయితే అతని దాసులలో ఒకడు వచ్చి
—నాయనా, ఆ ప్రవక్త యేదైన నొక గొప్పకార్యము
చేయుమని నియమించినయెడల నీవు చేయకుందువా?
అయితే స్నానము చేసి శుద్ధుడవు కమ్మను మాట దాని
14 కంటె మేలుకాదా అని చెప్పినప్పుడు । అతడు పోయి
దైవజనుడు చెప్పినట్లు యొర్దాను నదిలో ఏడు మారులు
మునుగగా అతని దేహము పసిపిల్ల దేహమువలెనై
15 అతడు శుద్ధుడాయెను. । అప్పుడతడు తన పరివార
ముతోకూడ దైవజనునిదగ్గరకు తిరిగివచ్చి అతని ముం
దర నిలిచి — చిత్తగించుము; ఇశ్రాయేలులో నున్న
దేవుడు తప్ప లోకమంతటియందును మరియొక దేవుడు
లేడని నేను ఎరుగుదును; ఇప్పుడు నీవు నీ దాసుడనైన
నాయొద్ద బహుమానము తీసికొనవలసినదని అతనితో
16 చెప్పగా । ఎలీషా — యెహోవా సన్నిధిని నేను
నిలుచుచున్నాను, ఆయన జీవముతోడు నేనేమియు
తీసికొనను అని చెప్పెను. నయమాను అతని ఎంతో
17 బతిమాలినను అతడు ఒప్పక పోయెను. । అప్పుడు—
యెహోవాకు తప్ప దహనబలినైనను మరి యే బలి
నైనను ఇతరమైన దేవతలకు నేనికను అర్పింపను; రెండు
కంచరగాడిదెలు మోయుపాటి మన్ను నీ దాసుడనైన
18 నాకు ఇప్పించకూడదా? । నా యజమానుడు మ్రొక్కు
టకు రిమ్మోను గుడిలో చొచ్చి నా చేతిమీద ఆను
కొనునప్పుడు, నేను రిమ్మోను గుడిలో నమస్కారము
చేసిన పక్షమున, రిమ్మోను గుడిలో నేను నమస్కారము
చేసిన సంగతినిగూర్చి యెహోవా నీ దాసుడనైన
నన్ను క్షమించుగాకని నయమాను చెప్పగా । ఎలీషా 19
—నెమ్మదిగలిగి పొమ్మని అతనికి సెలవిచ్చెను. అతడు
ఎలీషాయొద్దనుండి వెళ్లి కొంత దూరము సాగిపోయెను.
అంతట దైవజనుడైన ఎలీషాకు సేవకుడగు గేహజీ— 20
అరామీయుడైన యీ నయమాను తీసికొని వచ్చిన
వాటిని అంగీకరించుటకు నా యజమానునికి మనస్సు
లేకపోయెను గాని, యెహోవా జీవముతోడు నేను
పరుగెత్తికొని పోయి అతని కలిసికొని అతనియొద్ద
ఏదైనను తీసికొందుననుకొని । నయమానును కలిసి 21
కొనుటకై పోవుచుండగా, నయమాను తన వెనుకనుండి
పరుగున వచ్చుచున్నవాని చూచి తన రథముమీద
నుండి దిగి వానిని ఎదుర్కొని—క్షేమమా అని అడి
గెను. అతడు — క్షేమమే అని చెప్పి । —నా యజ 22
మానుడు నాచేత వర్తమానము పంపి—ప్రవక్తల శిష్యు
లలో ఇద్దరు యౌవనులు ఎఫ్రాయిము మన్యమునుండి
నాయొద్దకు ఇప్పుడే వచ్చిరి గనుక నీవు వారికొరకు
రెండు మణుగుల వెండియు రెండు దుస్తుల బట్టలును
దయచేయుమని సెలవిచ్చుచున్నాడనెను. । అందుకు 23
నయమాను—నీకు అనుకూలమైతే రెట్టింపు వెండి తీసి
కొనుమని బతిమాలి, రెండు సంచులలో నాలుగు
మణుగుల వెండి కట్టి రెండు దుస్తుల బట్టలనిచ్చి, తన
పనివారిలో ఇద్దరిమీద వాటిని వేయగా వారు గేహజీ
ముందర వాటిని మోసికొని పోయిరి. । మెట్టుదగ్గరకు 24
వారు రాగానే వారియొద్దనుండి గేహజీ వాటిని తీసి
కొని యింటిలో దాచి వారికి సెలవియ్యగా వారు
వెళ్లిపోయిరి. । అతడు లోపలికి పోయి తన యజ 25
మానుని ముందర నిలువగా ఎలీషా వాని చూచి—
గేహజీ, నీవెచ్చటనుండి వచ్చితివని అడిగినందుకు వాడు
—నీ దాసుడనైన నేను ఎచ్చటికిని పోలేదనెను. । అం 26
తట ఎలీషా వాని చూచి—ఆ మనుష్యుడు తన రథము
దిగి నిన్ను ఎదుర్కొనుటకు తిరిగి వచ్చినప్పుడు నా
మనసు నీతోకూడ రాలేదా? ద్రవ్యమును వస్త్రములను
ఒలీవచెట్ల తోటలను ద్రాక్షతోటలను గొఱ్ఱెలను
ఎడ్లను దాసదాసీలను సంపాదించుకొనుటకు ఇది సమ
యమా? । కాబట్టి నయమానుకు కలిగిన కుష్ఠు నీకును 27
నీ సంతతికిని సర్వకాలము అంటియుండును అని
చెప్పగా వాడు మంచువలె తెల్లనైన కుష్ఠము గలిగి
ఎలీషా ఎదుట నుండి బయటికి వెళ్లెను.
అంతట ప్రవక్తల శిష్యులు ఎలీషాయొద్దకు వచ్చి— 6
నీయొద్ద మాకున్న స్థలము ఇరుకుగా నున్నది; । నీ 2
సెలవైతే మేము యొర్దాను నదికి పోయి తలయొక
ద్రాను అచ్చటనుండి తెచ్చుకొని మరియొకచోట
నివాసము కట్టుకొందుమని మనవి చేయగా అతడు—
వెళ్లుడని ప్రత్యుత్తరమిచ్చెను. । ఒకడు—దయచేసి నీ 3

సైన మాతోకూడ నీవు రావలెనని కోరగా
నేను వచ్చెదనని చెప్పి । వారితోకూడ
; వారు యొర్దానుకు వచ్చి మ్రానులు నరుకు
। ఒకడు దూలము నరుకుచున్నప్పుడు గొడ్డలి
లో పడిపోగా వాడు—అయ్యో నా యేలిన
అది యెరవు తెచ్చినదని మొఱ్ఱపెట్టెను
ఆ దైవజనుడు—అదెక్కడ పడెనని అడిగెను;
తనికి ఆ స్థలమును చూపింపగా అతడు కొమ్మ
నరికి నీళ్లలో వేయగా గొడ్డలి తేలెను. ।
దాని పట్టుకొనుమని వానితో చెప్పగా వాడు
య్య చాపి దాని పట్టుకొనెను.
మురాజు ఇశ్రాయేలుతో యుద్ధముచేయవలె
తన సేవకులతో ఆలోచనచేసి—ఫలానిస్థల
మన దండు పేట ఉంచుదమని చెప్పెను. ।
ఆ దైవజనుడు ఇశ్రాయేలురాజుకు వర్తమానము
ఫలాని స్థలమునకు నీవు పోవద్దు, అచ్చటికి
యులు వచ్చి దిగియున్నారని తెలియజేసెను
ఇశ్రాయేలురాజు దైవజనుడు తనకు తెలిపి
కచేసిన స్థలమునకు పంపి సంగతి తెలిసికొని
రక్షించుకొనెను. ఈలాగు మాటి మాటికి
వచ్చినందున । అరాము రాజు కల్లోలపడి తన
పిలిచి—మనలో ఇశ్రాయేలు రాజు పక్షము
వారెవరైనది మాకు తెలియజెప్పరాదా అని
గగా । అతని సేవకులలో ఒకడు—రాజవైన
లినవాడా, ఇశ్రాయేలురాజు పక్షమున ఎవ
రుగాని ఇశ్రాయేలులోనున్న ప్రవక్తయగు
మీ అంతఃపురమందు మీరు అనుకొనిన
ఇశ్రాయేలురాజుకు తెలియజేయుననెను. ।
రాజు — మేము మనుష్యులను పంపి అతని
నట్లు నీవు వెళ్లి అతడుండు చోటు చూచి
సెలవియ్యగా అతడు దోతానులో ఉన్నా
మానము వచ్చెను. । కాబట్టి రాజు అచ్చటికి
లను రథములను గొప్ప సైన్యమును పంపెను.
త్రివేళ వచ్చి నలుదిశలను పట్టణమును చుట్టు
। దైవజనుడైన అతని పనివాడు పెందలకడ
టికి వచ్చినప్పుడు గుఱ్ఱములును రథములును
్యము పట్టణమును చుట్టుకొని యుండుట కన
అంతట అతని పనివాడు — అయ్యో నా
డా, మనము ఏమిచేయుదమని ఆ దైవజను
నగా । అతడు — భయపడవద్దు, మన పక్ష
న్నవారు వారికంటె అధికులై యున్నారని
—యెహోవా, వీడు చూచునట్లు దయచేసి
డ్లను తెరువుమని ఎలీషా ప్రార్థనచేయగా
వా ఆ పనివాని కండ్లను తెరవచేసెను గనుక
ఎలీషాచుట్టును పర్వతము అగ్ని గుఱ్ఱముల
థములచేతను నిండియుండుట చూచెను. । ఆ

దండువారు అతని సమీపించినప్పుడు ఎలీషా — ఈ
జనులను అంధత్వముతో మొత్తుమని యెహోవాను
వేడుకొనగా ఆయన ఎలీషాచేసిన ప్రార్థనచొప్పున
వారిని అంధత్వముతో మొత్తెను. । అప్పుడు ఎలీషా— 19
ఇది మార్గము కాదు, ఇది పట్టణము కాదు, మీరు
నా వెంట వచ్చినయెడల మీరు వెదకువానియొ
ద్దకు మిమ్మును తీసికొని పోదునని వారితో చెప్పి
షోమ్రోను పట్టణమునకు వారిని నడిపించెను. । వారు 20
షోమ్రోనులోకి వచ్చినప్పుడు అతడు—యెహోవా,
వీరు చూచునట్లు వీరి కండ్లను తెరువుమని ప్రార్థన
చేయగా యెహోవా వారి కండ్లను తెరవచేసెను
గనుక వారు తాము షోమ్రోను మధ్య ఉన్నామని
తెలిసికొనిరి. । అంతట ఇశ్రాయేలురాజు వారిని పార 21
జూచి — నాయనా వీరిని కొట్టుదునా, కొట్టుదునా?
అని ఎలీషాను అడుగగా । అతడు—నీవు వీరిని కొట్ట 22
వద్దు; నీ కత్తిచేతను నీ వింటిచేతను నీవు చెరపట్టిన వారి
నైనను కొట్టుదువా? వారికి భోజనము పెట్టించి వారు
తిని త్రాగిన తరువాత వారు తమ యజమానుని
యొద్దకు వెళ్లుదురని చెప్పెను. । అతడు వారికొరకు 23
విస్తారమైన భోజన పదార్థములను సిద్ధపరచగా వారు
అన్నపానములు పుచ్చుకొని రాజు సెలవుపొంది తమ
యజమానుని యొద్దకు పోయిరి. అప్పటినుండి అరా
మీయుల దండువారు ఇశ్రాయేలు దేశములోకి
వచ్చుట మానిపోయెను.

అటుతరువాత అరామురాజైన బెన్హదదు తన సైన్య 24
మంతటిని సమకూర్చుకొని వచ్చి షోమ్రోనుకు ముట్టడి
వేసెను. । అప్పుడు షోమ్రోనులో గొప్ప క్షామము 25
కలిగి యుండగా గాడిదెయొక్క తల రెండు రూపా
యలకును, అరపావు పావురపు రెట్ట అయిదు రూపా
యలకును అమ్మబడెను; వారు అంత కఠినముగా ముట్టడి
వేసియుండిరి. । అంతట ఇశ్రాయేలురాజు పట్టణపు 26
ప్రాకారముమీద సంచారముచేయగా ఒక స్త్రీ రాజును
చూచి—రాజవైన నా యేలినవాడా, సహాయము చేయు
మని కేకలు వేయుట విని । — యెహోవా నీకు సహా 27
యము చేయనిది నేనెక్కడనుండి నీకు సహాయముచేయు
దును? కళ్లములోనుండిగాయైనను ద్రాక్షగానుగలో
నుండిగాయైనను దేనినైనను ఇచ్చి సహాయము చేయ వల్ల
పడదని చెప్పి । నీ విచారమునకు కారణమేమని యడు 28
గగా అది—ఈ స్త్రీ నన్ను చూచి—రేపు మనము నా
బిడ్డను భక్షించుదము, నేటి ఆహారమునకు నీ బిడ్డను
ఇమ్మని చెప్పినప్పుడు । మేము నా బిడ్డను వంటచేసి 29
కొని తింటిమి. అయితే మరునాటియందు నేను దాని
చూచి—నేటి ఆహారమునకు నీ బిడ్డను ఇమ్మని అడిగితిని
గాని అది తన బిడ్డను దాచిపెట్టెనని చెప్పెను. । రాజు 30
ఆ స్త్రీ మాటలు విని తన వస్త్రములను చింపుకొని యింక
ప్రాకారముమీద నడిచిపోవుచుండగా జనులు అతని

తేరి చూచినప్పుడు లోపల అతని ఒంటిమీద గోనె
31 పట్ట కనబడెను. । తరువాత రాజు—షాపాతు కుమారు
డైన ఎలీషాయొక్క తల యీ దినమున అతనిపైన
నిలిచియున్నయెడల దేవుడు నాకు గొప్ప అపాయము
32 కలుగజేయును గాక అనెను.। అయితే ఎలీషా తన యింట
కూర్చునియుండగా పెద్దలును అతనితోకూడ కూర్చుం
డియున్నప్పుడు రాజు ఒక మనిషిని పంపెను. ఆ
పంపబడినవాడు ఎలీషాదగ్గరకు రాకమునుపే అతడు
ఆ పెద్దలను చూచి —ఈ నరహంతకుని కుమారుడు
నా తలను కొట్టివేయుటకు ఒకని పంపియున్నాడని
మీకు తెలిసినదా! మీరు కనిపెట్టియుండి, ఆ దూత
రాగా వాడు లోపలికి రాకుండ తలుపుతో వానిని
వెలుపలికి త్రోసి తలుపు మూసివేయుడి; వాని యజ
మానుని కాళ్లచప్పుడు వాని వెనుక వినబడును గదా
33 అని వారితో చెప్పుచుండగా । ఆ దూత అతనియొద్దకు
వచ్చెను. అంతట రాజు వెంటనే వచ్చి —ఈ కీడు
యెహోవాచేత కలుగుచున్నది, నేను ఇక ఎందుకు
యెహోవాకొరకు కనిపెట్టి యుండవలెననెను.
7 అప్పుడు ఎలీషా రాజుతో ఇట్లనెను—యెహోవా
మాట ఆలకించుము; యెహోవా సెలవిచ్చునదేమనగా
—రేపు ఈ వేళకు షోమ్రోను ద్వారమందు రూపాయి
ఒకటింటికి ఒక మానిక సన్నని పిండియు, రూపాయి
ఒకటింటికి రెండు మానికల యవలును అమ్మబడును. ।
2 అందుకు ఎవరిచేతిమీద రాజు ఆనుకొని యుండెనో
ఆ యధిపతి—యెహోవా ఆకాశమందు కిటికీలు
తెరచినను ఆలాగు జరుగునా అని దైవజనునికి ప్రత్యు
త్తరమియ్యగా అతడు—నీవు కన్నులార దాని చూచె
దవు గాని దాని తినకుందువని అతనితో చెప్పెను.
3 అప్పుడు పట్టణపు గుమ్మమునొద్ద నలుగురు కుష్ఠ
రోగులుండగా వారు ఒకరినొకరు చూచి — మనము
చచ్చిపోవువరకు ఇచ్చట ఎందుకు కూర్చుండవలెను? ।
4 పట్టణములోకి పోవుదమనుకొంటిమా పట్టణమందు
క్షామమున్నందున అచ్చట చచ్చిపోదుము; ఇచ్చట
ఊరక కూర్చున్నను ఇచ్చటను చచ్చిపోదుము; పదండి,
అరామీయుల దండు పేటలోకి పోవుదము రండి,
వారు మనలను బ్రదుకనిచ్చిన బ్రదుకుదుము, మన
5 లను చంపిన చత్తుము అని చెప్పుకొని । సందెచీకటి
యందు అరామీయుల దండు పేటలోకి పోవలె
నని లేచి, అరామీయుల దండు వెలుపలి భాగము
నొద్దకు రాగా అచ్చట ఎవరును కనబడక పోయిరి. ।
6 యెహోవా రథముల ధ్వనియు గుఱ్ఱముల ధ్వనియు
గొప్ప సమూహపు ధ్వనియు అరామీయుల దండుకు
వినబడునట్లు చేయగా వారు—మనమీదికి వచ్చుటకై
ఇశ్రాయేలురాజు హిత్తీయుల రాజులకును ఐగుప్తీయుల
రాజులకును బత్తెమిచ్చి యున్నాడని అరామీయులు
7 ఒకరితోనొకరు చెప్పుకొని । లేచి తమ గుడారములలో
నైనను గుఱ్ఱములలోనైనను గాడిదెలలోనైనను దండు
పేటలో నున్నవాటిలోనైనను ఏమియు తీసికొనకయే
తమ ప్రాణములు రక్షించుకొనుటకే చాలుననుకొని,
సందెచీకటిని ఉన్నది ఉన్నట్లుగా పేట విడిచి పారి
పోయి యుండిరి. । కాబట్టి ఆ కుష్ఠరోగులు దండు 8
పేట వెలపటి భాగము నొద్దకు వచ్చి యొక గుడా
రము జొచ్చి భోజనపానములు చేసి, అచ్చటనుండి
వెండి బంగారములను బట్టలను ఎత్తికొని పోయి దాచి
పెట్టి, తిరిగి వచ్చి మరియొక గుడారము జొచ్చి అచ్చట
నుండి సొమ్ము ఎత్తికొని పోయి దాచిపెట్టిరి. । వారు 9
—మనము చేయునది మంచి పని కాదు, నేటిదినము
శుభవర్తమానముగల దినము, మనము ఊరకొననేల?
తెల్లవారు పర్యంతము మనము ఇచ్చట నుండిన పక్ష
మున ఏదైన నొక అపాయము మనకు సంభవించును
గనుక మనము వెళ్లి రాజు ఇంటివారితో సంగతి
తెలియజెప్పుదము రండని ఒకరితోనొకరు చెప్పుకొని ।
వచ్చి పట్టణపు ద్వారపాలకుని పిలిచి—మేము అరా 10
మీయుల దండుపేటకు పోతిమి. అచ్చట ఏ మని
షియు కనబడలేదు, మనిషి చప్పుడైనను లేదు. కట్ట
బడిన గుఱ్ఱములును కట్టబడిన గాడిదెలును ఉన్నవి
గాని గుడారములదగ్గర ఎవరును లేరని వానితో
అనగా । వాడు ద్వారపాలకులను పిలిచెను. వారు 11
లోపలనున్న రాజు ఇంటివారితో ఆ సమాచారము
తెలియజెప్పగా । రాజు రాత్రియందు లేచి తన సేవ 12
కులను పిలిచి—అరామీయులు మనకు చేసినదానిని
నేను మీకు చూపింతును; మనము ఆకలితోనున్న
సంగతి వారికి తెలిసియున్నది గనుక—వారు పట్టణ
ములోనుండి బయటకు వచ్చినయెడల మనము వారిని
సజీవులనుగా పట్టుకొని పట్టణమందు ప్రవేశింపగల
మని యోచనచేసి, పేట విడిచి పొలములోకి పోయి
పొంచియున్నారని వారితో అనెను. । అప్పుడు అతని 13
సేవకులలో ఒకడు ఈలాగు మనవిచేసెను — ఇంతకు
ముందు ఇశ్రాయేలువారలలో బహుమంది మను
ష్యులు లయమై పోయిరి గదా! ఇక అయిదుగురు
లయమై పోవుట అబ్బురమా? నీకు అనుకూలమైన
యెడల పట్టణమందు మిగిలియున్న గుఱ్ఱములలో
అయిదుగురిని తీసికొని పోనిమ్ము; మనము వారిని
పంపి చూచెదమని చెప్పెను. । వారు జోడు రథము 14
లను వాటి గుఱ్ఱములను తీసికొనగా—అరామీయుల
సైన్యము వెనుక పోయి చూచిరండని రాజు వారికి
సెలవిచ్చి పంపెను. । కాబట్టి వారు వారివెనుక 15
యొర్దాను నదివరకు పోయి, అరామీయులు తొందర
రగా పోవుచు, పోయినంత లెక్క పారవేసిన వస్త్రము
లను సామానులను చూచి, ఆ దూతలు తిరిగివచ్చి
రాజుతో సంగతి తెలియజెప్పగా । జనులు బయలు 16
దేరి అరామీయుల దండుపేటను దోచుకొనిరి.

కాబట్టి యెహోవా మాటచొప్పున రూపాయి ఒక
టంకెకు ఒక మానిక సన్నని పిండియు రెండు మాని
17 కల యవలును అమ్మబడెను. । ఎవని చేతిమీద రాజు
ఆనుకొని యుండెనో ఆ యధిపతి ఆ ద్వారమున
నిలువబడుటకు నిర్ణయింపబడగా, రాజు దైవజనుని
యొద్దకు వచ్చినప్పుడు ఆ దైవజనుడు అతనితో చెప్పిన
ప్రకారము ద్వారమందు జనుల త్రొక్కిడిచేత
18 అతడు మరణమాయెను. । మరియు—రూపాయి ఒక
టంకెకు రెండు మానికల యవలును, రూపాయి ఒక
టంకెకు ఒక మానిక సన్ననిపిండియు, రేపు ఈ వేళ
ప్పుడు షోమ్రోనులో అమ్మబడునని దైవజనుడు
19 రాజుతో చెప్పిన మాట నెరవేరెను. । ఆ యధిపతి—
యెహోవా ఆకాశమందు కిటికీలు తెరచినను అది
జరుగునా అని ఆ దైవజనునితో చెప్పగా అతడు —
నీవు కన్నులార చూచెదవు గాని దాని తినకపోదువని
20 ఆ యధిపతితో చెప్పెను. । జనులు ద్వారమందు అతని
త్రొక్కగా అతడు మరణమాయెను గనుక ఆ మాట
ప్రకారము అతనికి సంభవించెను.

**8** ఒకానొక దినము ఎలీషా తాను బ్రదికించిన బిడ్డకు తల్లి
యైన ఆమెను పిలిచి — యెహోవా క్షామకాలము
రప్పింప బోవుచున్నాడు; ఏడు సంవత్సరములు దేశ
ములో క్షామము కలుగునని చెప్పి—నీవు లేచి, నీవును
నీ యింటివారును ఎచ్చటనుండుట అనుకూలమో
2 అచ్చటికి పోవుడనగా । ఆ స్త్రీ లేచి దైవజనుని
మాటచొప్పున చేసి, తన యింటివారిని తోడుకొని
ఫిలిష్తీయుల దేశమునకు పోయి యేడు సంవత్సరములు
3 అక్కడ వాసముచేసెను. । అయితే ఆ యేడు సంవ
త్సరములు గతించిన తరువాత ఆ స్త్రీ ఫిలిష్తీయుల దేశ
ములోనుండి వచ్చి తన యింటిని గూర్చియు భూమిని
గూర్చియు మనవి చేయుటకై రాజునొద్దకు పోయెను.।
4 రాజు దైవజనుని పనివాడగు గేహజీతో మాటలాడి—
ఎలీషా చేసిన గొప్ప కార్యములన్నిటిని నాకు తెలియ
5 జెప్పుమని ఆజ్ఞనిచ్చి యుండెను. । అతడు ఒక మృతు
నికి ప్రాణము తిరిగి రప్పించిన సంగతి వాడు రాజుకు
తెలియజెప్పుచుండగా, ఎలీషా బ్రదికించిన బిడ్డ తల్లి
తన యింటిని గూర్చియు భూమిని గూర్చియు
రాజుతో మనవి చేయ వచ్చెను. అంతట గేహజీ—
నా యేలినవాడవైన రాజా ఆ స్త్రీ యిదే; మరియు
ఎలీషా తిరిగి బ్రదికించిన దీనిబిడ్డ వీడే అని చెప్పగా।
6 రాజు ఆ స్త్రీని అడిగినప్పుడు ఆమె అతనితో సంగతి
తెలియజెప్పెను. కాబట్టి రాజు ఆమెపక్షముగా ఒక
అధిపతిని నియమించి, ఆమె సొత్తు యావత్తును ఆమె
దేశము విడిచినప్పటినుండి నేటివరకు భూమి ఫలించిన
పంట యావత్తును ఆమెకు మరల ఇమ్మని సెలవిచ్చెను.
7 పిమ్మట ఎలీషా దమస్కునకు వచ్చెను. ఆ కాల
మున అరామురాజైన బెన్హదదు రోగియై యుండి,
దైవజనుడైన అతడు ఇక్కడికి వచ్చియున్నాడని తెలిసి
కొని । హజాయేలును పిలిచి—నీవు ఒక కానుకను చేత 8
పట్టుకొని దైవజనుడైన అతనిని ఎదుర్కొనబోయి
—ఈ రోగము పోయి నేను బాగుపడుదునా లేదా
అని అతనిద్వారా యెహోవాయొద్ద విచారణ
చేయుమని ఆజ్ఞ ఇచ్చి పంపెను. । కాబట్టి హజా 9
యేలు దమస్కులోనున్న మంచి వస్తువులన్నిటిలో
నలువది ఒంటెల మోతంత కానుకగా తీసికొని అతనిని
ఎదుర్కొనబోయి అతని ముందర నిలిచి—నీ కుమా
రుడును అరామురాజైన బెన్హదదు—నాకు కలిగిన
రోగము పోయి నేను బాగుపడుదునా లేదా అని
నిన్నడుగుటకు నన్ను పంపెనని చెప్పెను. । అప్పుడు 10
ఎలీషా—నీవు అతని యొద్దకు పోయి—నిశ్చయముగా
నీవు మరణమగుదువని యెహోవా నాకు తెలిపి
యున్నాడు గనుక నీవు బ్రదుకజాలవని నేను చెప్పి
నట్లు అతనితో చెప్పుమని చెప్పి । హజాయేలు ముఖము 11
చిన్నబోవునంతవరకు ఆ దైవజనుడు అతని తేరి
చూచుచు కన్నీళ్లు రాల్చెను. । హజాయేలు — నా 12
యేలినవాడవైన నీవు కన్నీళ్లు రాల్చెదవేమని అతని
నడుగగా ఎలీషా యీలాగు ప్రత్యుత్తరమిచ్చెను—
ఇశ్రాయేలువారి గట్టి స్థలములను నీవు కాల్చివేయు
దువు; వారి యౌవనస్థులను కత్తిచేత హతముచేయు
దువు; వారి పిల్లలను నేలకు వేసి కొట్టి చంపుదువు;
వారి గర్భిణుల కడుపులను చింపివేయుదువు గనుక
నీవు వారికి చేయబోవు కీడును నేనెరిగియుండుటచేత
కన్నీళ్లు రాల్చుచున్నాను. । అందుకు హజాయేలు 13
—కుక్కవంటివాడనగు నీ దాసుడనైన నేను ఇంత
కార్యము చేయుటకు ఎంతటివాడను అని అతనితో
అనగా, ఎలీషా—నీవు అరాముమీద రాజవగుదువని
యెహోవా నాకు బయలుపరచి యున్నాడనెను. ।
అతడు ఎలీషాను విడిచి వెళ్లి తన యజమానుని యొద్దకు 14
రాగా అతడు—ఎలీషా నీతో చెప్పినదేమని అడుగగా
అతడు — నిజముగా నీవు బాగుపడుదువని అతడు
చెప్పెననెను. । అయితే మరునాడు హజాయేలు 15
ముదుగు బట్ట తీసికొని నీటిలో ముంచి రాజు ముఖము
మీద పరపగా అతడు చచ్చెను; అప్పుడు హజాయేలు
అతనికి మారుగా రాజాయెను.

అహాబు కుమారుడును ఇశ్రాయేలువారికి రాజు 16
నైన యెహోరాము ఏలుబడిలో అయిదవ సంవత్సర
మందు యెహోషాపాతు యూదారాజై యుండగా
యూదారాజైన యెహోషాపాతు కుమారుడైన
యెహోరాము ఏలనారంభించెను. । అతడు ఏల 17
నారంభించినప్పుడు ముప్పది రెండేండ్లవాడై యుండి
యెరూషలేమందు ఎనిమిది సంవత్సరములు ఏలెను. ।
ఇతడు అహాబు కుమార్తెను పెండ్లి చేసికొని యుండెను 18
గనుక అహాబు కుటుంబికులవలెనే ఇతడును ఇశ్రా

యేలురాజులు ప్రవర్తించినట్లు ప్రవర్తించుచు
19 యెహోవా దృష్టికి చెడుతనము జరిగించెను. । అయి
నను యెహోవా సదాకాలము తన సేవకుడగు దావీ
దుకును అతని కుమారులకును దీపము నిలిపెదనని
మాట యిచ్చి యుండెను గనుక అతని జ్ఞాపకముచేత
యూదాను నశింపజేయుటకు ఆయనకు మనస్సు
20 లేకపోయెను. । ఇతని దినములలో ఎదోమీయులు
యూదారాజుకు ఇక లోబడుట మాని అతనిమీద
తిరుగబాటు చేసి, తమమీద నొకని రాజుగా నియ
21 మించుకొనినందున । యెహోరాము తన రథము
లన్నిటిని తీసికొని పోయి జాయీరు అను స్థలమునకు
వచ్చి రాత్రివేళ లేచి తన చుట్టునున్న ఎదోమీయు
లను రథములమీది అధిపతులను హతము చేయగా
జనులు తమ తమ గుడారములకు పారిపోయిరి. ।
22 అయితే నేటివరకును ఎదోమీయులు తిరుగబాటు
చేసి యూదావారికి లోబడకయే యున్నారు.
మరియు ఆ సమయమందు లిబ్నా పట్టణమును తిరుగ
23 బడెను. । యెహోరాము చేసిన యితర కార్యము
లనుగూర్చియు, అతడు చేసినదాని నంతటినిగూర్చియు
యూదారాజుల వృత్తాంతముల గ్రంథమందు వ్రాయ
24 బడి యున్నది. । యెహోరాము తన పితరులతో
కూడ నిద్రించి తన పితరుల సమాధిలో దావీదు
పురమునందు పాతిపెట్టబడెను. అతని కుమారుడైన
25 అహజ్యా అతనికి మారుగా రాజాయెను. । అహాబు
కుమారుడును ఇశ్రాయేలు రాజునైన యెహోరాము
ఏలుబడిలో పన్నెండవ సంవత్సరమందు యూదా
రాజైన యెహోరాము కుమారుడైన అహజ్యా యేల
26 నారంభించెను. । అహజ్యా యేలనారంభించినప్పుడు
ఇరువది రెండేండ్లవాడై యుండి యెరూషలేములో ఒక
సంవత్సరము ఏలెను. అతని తల్లిపేరు అతల్యా; ఈమె
27 ఇశ్రాయేలు రాజైన ఓమ్రీ కుమార్తె. । అతడు
అహాబు కుటుంబికుల ప్రవర్తనను అనుసరించుచు, వారి
వలెనే యెహోవా దృష్టికి చెడుతనము జరిగించెను;
28 అతడు అహాబు ఇంటివారికి అల్లుడు. । అతడు
అహాబు కుమారుడైన యెహోరాముతోకూడ రామో
త్గిలాదునందు అరామురాజైన హజాయేలుతో
యుద్ధము చేయ బయలుదేరగా అరామీయులు
29 యెహోరామును గాయపరచిరి. । రాజైన
యెహోరాము అరామురాజైన హజాయేలుతో
రామాలో యుద్ధము చేసినప్పుడు అరామీయులవలన
తాను పొందిన గాయములను బాగుచేసికొనుటకై
యెజ్రెయేలు ఊరికి తిరిగి రాగా యూదారాజైన
యెహోరాము కుమారుడైన అహజ్యా అహాబు
కుమారుడైన యెహోరాము రోగి యాయెనని తెలిసి
కొని అతని దర్శించుటకై యెజ్రెయేలు ఊరికి
వచ్చెను.

అంతట ప్రవక్తయగు ఎలీషా ప్రవక్తల శిష్యులలో 9
ఒకని పిలువనంపించి అతనితో ఇట్లనెను — నీవు
నడుము బిగించుకొని యీ తైలపుగిన్నె చేత పట్టు
కొని రామోత్గిలాదుకు పోయి । అచ్చట ప్రవేశించి 2
నప్పుడు నింషీకి పుట్టిన యెహోషాపాతు కుమారు
డైన యెహూ యెక్కడనున్నాడని తెలిసికొని అతని
దర్శించి, అతని సహోదరుల మధ్యనుండి అతనిని
చాటుగా రప్పించి, లోపలి గదిలోకి అతని పిలుచు
కొని పోయి । తైలపుగిన్నె తీసికొని అతని తలమీద 3
తైలము పోసి—నేను నిన్ను ఇశ్రాయేలుమీద పట్టాభి
షిక్తునిగా చేసితినని యెహోవా సెలవిచ్చుచున్నా
డని అతనితో చెప్పి, ఆలస్యము చేయక తలుపు తీసి
పారిపొమ్ము. । యౌవనుడైన ఆ ప్రవక్త పోవలెనని 4
బయలుదేరి రామోత్గిలాదుకు వచ్చునప్పటికి సైన్యాధి
పతులు కూర్చుని యుండిరి. । అప్పుడతడు—అధిపతీ, 5
నీకొక సమాచారము తెచ్చితినని చెప్పగా యెహూ—
యిందరిలో అది ఎవరినిగూర్చినదని అడుగగా అతడు—
అధిపతీ నిన్నుగూర్చినదే యనెను; అందుకు యెహూ
లేచి యింటిలో ప్రవేశించెను. । అప్పుడు ఆ యౌవ 6
నుడు అతని తలమీద తైలము పోసి అతనితో ఇట్లనెను
—యెహోవా సెలవిచ్చునదేమనగా—యెహోవా
జనులైన ఇశ్రాయేలువారిమీద నేను నిన్ను పట్టాభి
షిక్తునిగా చేయుచున్నాను. । కాబట్టి నా సేవకు 7
లైన ప్రవక్తలను హతము చేసిన దానినిబట్టియు,
యెహోవా సేవకులందరిని హతము చేసిన దానిని
బట్టియు, యెజెబెలుకు ప్రతికారము చేయునట్లు
నీవు నీ యజమానుడైన అహాబు సంతతివారిని
హతముచేయుము. । అహాబు సంతతివారందరును 8
నశింతురు; అల్పులలోనేమి ఘనులలోనేమి అహాబు
సంతతిలో ఏ పురుషుడును ఉండకుండ అందరిని
నిర్మూలము చేయుము. । నెబాతు కుమారుడైన యరో 9
బాము కుటుంబికులను అహీయా కుమారుడైన బయెషా
కుటుంబికులను నేను అప్పగించినట్లు అహాబు కుటుం
బికులను నేను అప్పగించుదును. । యెజెబెలు పాతి 10
పెట్టబడక యెజ్రెయేలు భూభాగమందు కుక్కలచేత
తినివేయబడును. ఆ యౌవనుడు ఈ మాటలు చెప్పి
తలుపుతీసి పారిపోయెను. । యెహూ బయలుదేరి 11
తన యజమానుని సేవకులయొద్దకు రాగా ఒకడు—
ఏమి సంభవించినది? ఆ వెర్రివాడు నీయొద్దకు వచ్చిన
హేతువేమని అతని నడుగగా అతడు— వాడు పిచ్చి
మాటలు పలుకువాడని మీరెరిగేయున్నారనెను. ।
కాబట్టి వారు — అదంతయు వట్టిది; జరిగినదానిని 12
మాకు తెలియజెప్పుమనగా అతడిట్లనెను— నేను నిన్ను
ఇశ్రాయేలుమీద పట్టాభిషిక్తునిగా చేయుచున్నానని
యెహోవా సెలవిచ్చుచున్నాడని అతడు నాతో
చెప్పెను. । అంతట వారు అతివేగిరముగా తమ తమ 13

వస్త్రములను పట్టుకొని మెట్లమీద అతని క్రింద పరచి
బాకా ఊదించి—యెహూ రాజై యున్నాడని
చాటించిరి. । ఈ ప్రకారము నింషీకి పుట్టిన
యెహోషాపాతు కుమారుడైన యెహూ యెహో
రాముమీద కుట్రచేసెను. అప్పుడు యెహోరా
మును ఇశ్రాయేలువారందరును అరామురాజైన హజా
యేలును ఎదిరించుటకై రామోత్గిలాదు దగ్గర కావలి
యుండిరి. । అయితే యెహోరాము అరామురాజైన
హజాయేలుతో యుద్ధము చేయుచుండగా అరామీ
యులవలన తాను పొందిన గాయములను బాగుచేసి
కొనుటకై యెజ్రెయేలు ఊరికి తిరిగివచ్చి యుండెను.
అంతట యెహూ—నీకనుకూలమైతే ఈ సంగతి తెలి
యబడకుండునట్లు ఈ పట్టణములోనుండి యెవని
నైనను యెజ్రెయేలు ఊరికి తప్పించుకొని పోనియ్యకు
మని ఆజ్ఞ ఇచ్చి । రథముయెక్కి, యెజ్రెయేలు
ఊరిలో యెహోరాము మంచము పట్టియుండగా
అచ్చటికి పోయెను. మరియు యూదారాజైన
అహజ్యా యెహోరామును దర్శించుటకై అచ్చటికి
వచ్చి యుండెను. । యెజ్రెయేలు గోపురముమీద
కావలికాడు నిలిచి యుండి యెహూతో కలిసి
వచ్చుచున్న సైన్యమును చూచి—సైన్యమొకటి నాకు
కనబడుచున్నదని తెలియజెప్పగా యెహోరాము
ఒక రౌతును పిలిచి—వారిని ఎదుర్కొనబోయి—
అంతయు క్షేమమా అని అడుగుమని చెప్పి పంపు
మని వానితో సెలవిచ్చెను. । కాబట్టి యొకడు గుర్ర
మెక్కిపోయి అతనిని ఎదుర్కొని—క్షేమమా అని
అడుగుమని రాజు నన్ను పంపెననగా యెహూ—
క్షేమముతో నీకేమి పని? నీవు నా వెనుకకు తిరిగిరమ్మని
వానితో చెప్పగా ఆ కావలికాడు—పంపబడినవాడు
వారిని కలిసికొనెను గాని తిరిగి రాక నిలిచెనని సమా
చారము తెలిపెను. । రాజు రెండవ రౌతును పంపగా
వాడు వారియొద్దకు వచ్చి—క్షేమమా అని అడుగు
మని రాజు నన్ను పంపెననగా యెహూ—క్షేమ
ముతో నీకేమిపని? నా వెనుకకు తిరిగి రమ్మని వానితో
చెప్పెను. । అప్పుడు కావలికాడు—వీడును వారిని
కలిసికొని తిరిగి రాక నిలిచెను మరియు అతడు
వెర్రితోలడము తోలుచున్నాడు గనుక తోలడము
చూడగా నింషీకుమారుడైన యెహూ తోలడము
వలెనే యున్నదనెను. । —రథము సిద్ధముచేయుమని
యెహోరాము సెలవియ్యగా వారు అతని రథము
సిద్ధముచేసిరి. అప్పుడు ఇశ్రాయేలురాజైన యెహో
రామును యూదారాజైన అహజ్యాయును తమ తమ
రథములనెక్కి యెహూను కలియబోయి యెజ్రెయే
లీయుడైన నాబోతు భూభాగమందు అతనిని ఎదు
ర్కొనిరి. । అంతట యెహోరాము యెహూను
చూచి—యెహూ క్షేమమా అని అడుగగా యెహూ
—నీ తల్లియైన యెజెబెలు జారత్వములును చిల్లంగి
తనములును ఇంత యపరిమితమై యుండగా క్షేమ
మెక్కడనుండి వచ్చుననెను. । యెహోరాము 23
రథము త్రిప్పి—అహజ్యా, ద్రోహము జరుగుచున్న
దని అహజ్యాతో చెప్పి పారిపోయెను. । అప్పుడు 24
యెహూ తన బలముకొలది విల్లు ఎక్కుపెట్టి
యెహోరామును భుజములమధ్య కొట్టగా బాణము
అతని గుండెగుండ దూసిపోయెను గనుక అతడు తన
రథమునందే యొరిగెను. । కాగా యెహూ తన అధి 25
పతియైన బిద్కరును పిలిచి యిట్లనెను—అతని ఎత్తి
యెజ్రెయేలీయుడైన నాబోతు భూభాగమందు పడ
వేయుము; మనమిద్దరమును అతని తండ్రియైన అహా
బును విడిచి గుర్రములెక్కి వచ్చినప్పుడు యెహోవా
అతనిమీద ఈ శిక్షమోపిన సంగతి జ్ఞాపకము చేసి
కొనుము. । అప్పుడు యెహోవా సెలవిచ్చినదేమ 26
నగా—నిశ్చయముగా నాబోతు రక్తమును వాని కుమా
రుల రక్తమును నిన్నటి దినమున నేను చూచితిని
గనుక ఈ భూభాగమందు నేను దానికి ప్రతికారము
చేయుదును; ఇదే యెహోవా వాక్కు. కాబట్టి
నీవు యెహోవా మాట చొప్పున అతని ఎత్తి యీ
భూభాగమందు పడవేయుము. । యూదారాజైన 27
అహజ్యా జరిగిన దాని చూచి వనములోని నగరి
మార్గముగా పారిపోయెను; అయినను యెహూ
అతని తరిమి, రథమునందు అతని హతముచేయుడని
ఆజ్ఞ ఇచ్చెను గనుక వారు ఇబ్లెయాము దగ్గరనున్న
గూరుకు పోవు మార్గమందు అతని కొట్టగా అతడు
మెగిద్దోకు పారిపోయి అచ్చట మరణమాయెను. ।
అప్పుడు అతని సేవకులు అతనిని రథముమీద వేసి 28
యెరూషలేముకు తీసికొని పోయి దావీదు పురమందు
అతని పితరుల సమాధిలో అతని పాతిపెట్టిరి.

అహజ్యా అహాబు కుమారుడైన యెహోరాము 29
ఏలుబడిలో పదకొండవ సంవత్సరమందు యూదాను
ఏల నారంభించెను.

యెహూ యెజ్రెయేలు ఊరికి వచ్చిన సంగతి 30
యెజెబెలుకు వినబడెను గనుక ఆమె తన ముఖమునకు
రంగు పూసికొని శిరోభూషణములు ధరించుకొని
కిటికీలోనుండి కనిపెట్టి చూచుచుండగా । యెహూ 31
గుమ్మముద్వారా ప్రవేశించెను. ఆమె అతని చూచి—
నీ యజమానుని చంపినవాడా, జిమ్రీ వంటివాడా,
నీవు సమాధానముగా వచ్చుచున్నావా అని అడు
గగా । అతడు తలయెత్తి కిటికీతట్టు చూచి—నా పక్ష 32
మందున్న వారెవరని అడుగగా ఇద్దరు ముగ్గురు పరి
చారకులు పైనుండి తొంగిచూచిరి. । —ఈమెను 33
క్రింద పడద్రోయుడని అతడు చెప్పగా వారు
దానిని క్రిందికి పడద్రోసినందున దాని రక్తములో
కొంత గోడమీదను గుర్రములమీదను చిందెను.

మరియు గుఱ్ఱములచేత అతడు దాని త్రొక్కించెను.।
34 అతడు లోపల ప్రవేశించి భోజనముచేసిన తరువాత
—ఆ శాపగ్రస్తురాలు రాజకుమార్తె గనుక మీరు
వెళ్లి దాని కనుగొని పాతిపెట్టుడని ఆజ్ఞ ఇయ్యగా ।
35 వారు దాని పాతిపెట్టబోయిరి; అయితే దాని కపాల
మును పాదములును అరచేతులును తప్ప మరి ఏమియు
36 కనబడలేదు. । వారు తిరిగి వచ్చి అతనితో ఆ సంగతి
తెలియజెప్పగా అతడిట్లనెను—ఇది యెజెబెలని యెవ
రును గుర్తుపట్టలేకుండ యెజ్రెయేలు భూభాగమందు
37 కుక్కలు యెజెబెలు మాంసమును తినును. । యెజె
బెలుయొక్క కళేబరము యెజ్రెయేలు భూభాగమం
దున్న పెంటవలె నుండును అని తన సేవకుడును తిష్బీ
యుడునగు ఏలీయాద్వారా యెహోవా సెలవిచ్చిన
మాటచొప్పున యిది జరిగెను.

10 షోమ్రోనులో అహాబుకు డెబ్బదిమంది కుమారు
లుండిరి. యెహూ వెంటనే తాకీదులు వ్రాయించి
షోమ్రోనులోనుండు యెజ్రెయేలు అధిపతులకును
పెద్దలకును అహాబు పిల్లలను పెంచినవారికిని పంపి
ఆజ్ఞ ఇచ్చినదేమనగా—మీ యజమానుని కుమారులు
2 మీయొద్దనున్నారు; । మరియు మీకు రథములును
గుఱ్ఱములును ప్రాకారముగల పట్టణమును ఆయుధ
3 సామగ్రియును కలవు గదా? । కాబట్టి యీ తాకీదు
మీకు ముట్టినవెంటనే మీ యజమానుని కుమారు
లలో ఉత్తముడును తగినవాడునైన యొకని కోరు
కొని, తన తండ్రి సింహాసనముమీద అతనిని ఆసీను
నిగా చేసి, మీ యజమానుని కుటుంబికుల పక్షమున
4 యుద్ధమాడుడి. । వారు ఇది విని బహు భయపడి—
ఇద్దరు రాజులు అతనిముందర నిలువజాలక పోయిరే,
5 మనమెట్లు నిలువగలమని అనుకొని । కుటుంబపు
అధికారియు పట్టణపు అధికారియు పెద్దలును పిల్ల
లను పెంచినవారును కూడి యెహూకు వర్తమానము
పంపి—మేము నీ దాసులము; నీ సెలవు ప్రకారము
సమస్తము జరిగించెదము; మేము ఎవనిని రాజుగా
చేసికొనము; నీ దృష్టికి ఏది అనుకూలమో దాని
6 చేయుమని తెలియజేసిరి. । అప్పుడతడు రెండవ తాకీదు
వ్రాయించి—మీరు నా పక్షముననుండి నా మాట
వినుటకు ఒప్పుకొనినయెడల మీ యజమానుని కుమా
రుల తలలను తీసికొని, రేపు ఈ వేళకు యెజ్రెయే
లుకు నాయొద్దకు రండని ఆజ్ఞ ఇచ్చెను. డెబ్బదిమంది
రాజకుమారులును వారిని పెంచిన పట్టణపు పెద్దల
7 యొద్ద ఉండిరి. । కావున ఆ తాకీదు తమకు ముట్టి
నప్పుడు వారు డెబ్బదిమంది రాజకుమారులను పట్టు
కొని చంపి, వారి తలలను గంపలలో పెట్టి, యెజ్రె
8 యేలులోనున్న అతనియొద్దకు పంపిరి. । దూత అతని
యొద్దకు వచ్చి—రాజకుమారుల తలలు వచ్చినవని
చెప్పగా అతడు—ఉదయము పర్యంతము ద్వారము
బయటి స్థలమందు వాటిని రెండు కుప్పలుగా
వేయించుడనెను. । ఉదయమైనప్పుడు అతడు బయ 9
టికి వచ్చి నిలిచి, జనులనందరిని చూచి—మీరు నిర్దో
షులు, నేను నా యజమానునిమీద కుట్రచేసి అతని
చంపితిని; అయితే వీరందరిని ఎవరు చంపిరి? । అహాబు 10
కుటుంబికులనుగూర్చి యెహోవా సెలవిచ్చిన మాట
లలో ఒకటియు నెరవేరక పోదు; తన సేవకుడైన
ఏలీయాద్వారా తాను సెలవిచ్చిన మాట యెహోవా
నెరవేర్చెనని చెప్పెను. । ఈ ప్రకారము యెహూ 11
యెజ్రెయేలులో అహాబు కుటుంబికులనందరిని, అతని
సంబంధులగు గొప్పవారినందరిని, అతని బంధువుల
నందరిని, అతడు నియమించిన యాజకులను హతము
చేసెను; అతనికి ఒకనినైనను ఉండనియ్యలేదు. । అప్పు 12
డతడు లేచి ప్రయాణమై షోమ్రోను పట్టణమునకు
పోయెను. మార్గమందు అతడు గొఱ్ఱెవెండ్రుకలు
కత్తిరించు ఇంటికి వచ్చి । యూదారాజైన అహజ్యా 13
సహోదరులను ఎదుర్కొని—మీరు ఎవరని వారి
నడుగగా వారు—మేము అహజ్యా సహోదరు
లము; రాజకుమారులను రాణికుమారులను దర్శించుటకు
వెళ్లుచున్నామని చెప్పిరి. । వారిని సజీవులుగా పట్టు 14
కొనుడని అతడు చెప్పగా వారు వారిని సజీవులుగా
పట్టుకొని యొకనినైన విడువక గొఱ్ఱె వెండ్రుకలు
కత్తిరించు ఇంటి గోతిదగ్గర నలుబది ఇద్దరిని చంపిరి.
అచ్చటనుండి అతడు పోయిన తరువాత తనను 15
ఎదుర్కొన వచ్చిన రేకాబు కుమారుడైన యెహోనా
దాబును కనుగొని అతనిని కుశలప్రశ్నలడిగి—నీ
యెడల నాకున్నట్టుగా నాయెడల నీకున్నదా అని
అతని నడుగగా యెహోనాదాబు—ఉన్నదనెను.—
ఆలాగైతే నా చేతిలో చెయ్యివేయుమని చెప్పగా
అతడు ఇతని చేతిలో చెయ్యివేసెను గనుక యెహూ
తన రథముమీద అతనిని ఎక్కించుకొని । —
యెహోవానుగూర్చి నాకు కలిగిన ఆసక్తిని చూచు 16
టకై నాతోకూడ రమ్మనగా యెహూ రథముమీద
వారతని కూర్చుండబెట్టిరి. । అతడు షోమ్రోనుకు వచ్చి 17
షోమ్రోనులో అహాబుకు శేషించియున్న వారినందరిని
చంపి, ఏలీయాకు యెహోవా సెలవిచ్చిన మాట నెర
వేర్చి, అహాబును నిర్మూలము చేయు పర్యంతము హత
ముచేయుట మానకుండెను. । తరువాత యెహూ జను 18
లందరిని సమకూర్చి వారికీలాగు ఆజ్ఞ ఇచ్చెను—అహాబు
బయలుదేవతకు కొద్దిగానే పూజచేసెను, యెహూ
అను నేను అధికముగా పూజచేయబోవుచున్నాను. ।
కావున ఒకడైనను తప్పకుండ బయలు ప్రవక్తలనంద 19
రిని వాని భక్తులనందరిని వాని యాజకులనందరిని నా
యొద్దకు పిలువనంపించుడి; నేను బయలుకు గొప్ప బలి
అర్పింప బోవుచున్నాను గనుక రానివాడెవడో వాని
బ్రదుకనియ్యనని చెప్పెను. అయితే బయలుకు మ్రొక్కు

వారిని నాశనము చేయుటకై అతడు ఈ ప్రకారము
20 కపటోపాయము చేసెను. । మరియు యెహూ—
బయలుకు పండుగ నియమింపబడినదని చాటించుడని
21 ఆజ్ఞ ఇయ్యగా వారాలాగు చాటించిరి. । యెహూ
ఇశ్రాయేలు దేశమంతటిలోకి వర్తమానము పంపించగా
బయలుకు మ్రొక్కువారందరును వచ్చిరి, రానివాడు
ఒకడును లేడు; వారు వచ్చి బయలు గుడిలో ప్రవే
శింపగా ఎచ్చటను చోటులేకుండ బయలు గుడి ఈ
22 తట్టునుండి ఆ తట్టువరకు నిండిపోయెను. । అప్పుడతడు
వస్త్రశాలమీద ఉన్న అధికారిని పిలిచి — బయలుకు
మ్రొక్కువారికందరికి వస్త్రములు బయటికి తెప్పించు
23 మని చెప్పగా వాడు తెప్పించెను. । యెహూయును
రేకాబు కుమారుడైన యెహోనాదాబును బయలు
గుడిలో ప్రవేశింపగా యెహూ—యెహోవా భక్తు
లలో ఒకనినైనను ఇచ్చట మీయొద్ద నుండనియ్యక
బయలుకు మ్రొక్కువారు మాత్రమే యుండునట్లు
జాగ్రత్తచేయుడని బయలుకు మ్రొక్కువారితో ఆజ్ఞ
24 ఇచ్చెను. । బలులను దహనబలులను అర్పించుటకై వారు
లోపల ప్రవేశింపగా యెహూ యెనుబదిమందిని
బయట కావలి యుంచి — నేను మీ వశము చేసిన
వారిలో ఒకడైన తప్పించుకొని పోయినయెడల వాని
ప్రాణమునకు బదులుగా వాని పోనిచ్చిన వాని
25 ప్రాణము తీతునని వారితో చెప్పియుండెను. । దహన
బలుల నర్పించుట సమాప్తికాగా యెహూ — మీరు
లోపల చొచ్చి యొకడైనను బయటికి రాకుండ వారిని
చంపుడని తన కావలివారితోను అధిపతులతోను
చెప్పగా వారు అందరిని హతము చేసిరి. పిమ్మట కావలి
వారును అధిపతులును వారిని బయటవేసి, బయలు
26 గుడియున్న పట్టణమునకు పోయి । బయలు గుడిలోని
నిలువు విగ్రహములను బయటికి తీసికొని వచ్చి వాటిని
27 కాల్చివేసిరి. । మరియు బయలు ప్రతిమను గుడిని
క్రింద పడగొట్టి దానిని పెంట యిల్లుగా చేసిరి. నేటి
28 వరకు అది ఆలాగే యున్నది। ఈ ప్రకారము యెహూ
బయలు దేవతను ఇశ్రాయేలువారి మధ్య నుండకుండ
29 నాశనము చేసెను. । అయితే ఇశ్రాయేలువారు
పాపము చేయుటకు నెబాతు కుమారుడైన యరొ
బాము కారకుడైనట్లు యెహూకూడ అందుకు కార
కుడై, బేతేలు దాను అను స్థలములందున్న బంగారు
30 దూడలను అనుసరించుట మానలేదు. । కావున
యెహోవా యెహూతో నీలాగు సెలవిచ్చెను—నీవు
నా హృదయాలోచన యంతటిచొప్పున అహాబు
కుటుంబికులకు చేసి నా దృష్టికి న్యాయమైనదాని జరి
గించి బాగుగా నెరవేర్చితివి గనుక నీ కుమారులు
నాల్గవ తరమువరకు ఇశ్రాయేలురాజ్య సింహాసనము
31 మీద ఆసీనులగుదురు. । అయితే ఇశ్రాయేలువారు
పాపము చేయుటకు కారకుడైన యరొబాము చేసిన
పాపములను యెహూ యేమాత్రమును విసర్జించని
వాడై ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా నియ
మించిన ధర్మశాస్త్రమును పూర్ణహృదయముతో అనుసరిం
చుటకు శ్రద్ధాభక్తులు లేనివాడాయెను.

ఆ దినములలో యెహోవా ఇశ్రాయేలువారిని 32
తగ్గింప నారంభించెను. । హజాయేలు ఇశ్రాయేలు సరి 33
హద్దులలోనున్న యొర్దాను తూర్పుదిక్కున గాదీయుల
కును రూబేనీయులకును చేరికైన గిలాదు దేశమంతటి
లోను, అర్నోనునది దగ్గరనున్న అరోయేరు మొదలు
కొని మనష్షీయుల దేశములోను, అనగా గిలాదులోను
బాషానులోను వారిని ఓడించెను. । యెహూ చేసిన 34
యితర కార్యములనుగూర్చియు, అతడు చేసిన దాని
నంతటినిగూర్చియు, అతని పరాక్రమమునుగూర్చియు
ఇశ్రాయేలు రాజుల వృత్తాంతముల గ్రంథమందు
వ్రాయబడి యున్నది. । అంతట యెహూ తన పిత 35
రులతోకూడ నిద్రించి షోమ్రోనులో సమాధిచేయ
బడెను; అతని కుమారుడైన యెహోయాహాజు అత
నికి మారుగా రాజాయెను. । షోమ్రోనులో యెహూ 36
ఇశ్రాయేలును ఏలిన కాలము ఇరువది యెనిమిది
యేండ్లు.

అహజ్యా తల్లియైన అతల్యా తన కుమారుడు 11
మృతిబొందెనని తెలిసికొని లేచి రాజకుమారులనంద
రిని నాశనముచేసెను. । రాజైన యెహోరాము 2
కుమార్తెయును అహజ్యాకు సహోదరియునైన
యెహోషెబ అహజ్యా కుమారుడైన యోవాషును,
హతమైన రాజకుమారులతోకూడ చంపబడకుండ అతని
రహస్యముగా తప్పించెను గనుక వారు అతనిని అతని
దాదిని పడకగదిలో అతల్యాకు మరుగుగా ఉంచి
యుండుటచేత అతడు చంపబడకుండెను. । అతల్యా 3
దేశమును ఏలుచుండగా ఇతడు ఆరు సంవత్సరములు
యెహోవా మందిరమందు దాదితోకూడ దాచబడి
యుండెను.

ఏడవ సంవత్సరమందు యెహోయాదా కావలి 4
కాయువారిమీదను రాజదేహసంరక్షకులమీదను ఏర్ప
డియున్న శతాధిపతులను పిలువనంపించి, యెహోవా
మందిరములోకి వారిని తీసికొని పోయి, యెహోవా
మందిరమందు వారిచేత ప్రమాణము చేయించి వారితో
నిబంధనచేసి, వారికి ఆ రాజుకుమారుని కనుపరచి
యీలాగు ఆజ్ఞాపించెను । — మీరు చేయవలసినదే 5
మనగా, విశ్రాంతి దినమున లోపల ప్రవేశించు మీరు
మూడు భాగములై యొకభాగము రాజమందిరమునకు
కావలికాయువారై యుండవలెను; । ఒక భాగము 6
సూరు గుమ్మముదగ్గర కాపు చేయవలెను, ఒక భాగము
కాపు కాయువారి వెనుకటి గుమ్మమునొద్ద ఉండవలెను,
ఈ ప్రకారము మందిరమును భద్రపరచుటకై మీరు
దాని కాచుకొని యుండవలెను. । మరియు విశ్రాంతి 7

దినమున బయలుదేరు మీయందరిలో రెండు భాగ
ములు రాజు దగ్గర యెహోవా మందిరమునకు
8 కాపు కాయువారై యుండవలెను. । మీలో ప్రతి
మనిషి తన తన ఆయుధములను చేత పట్టుకొని రాజు
చుట్టు కాచుకొని యుండవలెను, ఎవడైనను పంక్తులలో
ప్రవేశించిన యెడల వాని చంపవలెను, రాజు బయలు
దేరి సంచరించునప్పుడెల్ల మీరు అతనియొద్ద ఉండ
9 వలెను. । శతాధిపతులు యాజకుడైన యెహోయాదా
తమకిచ్చిన ఆజ్ఞలన్నిటిప్రకారము చేసిరి. ప్రతిమనిషి
తన తన మనుష్యులను తీసికొని విశ్రాంతిదినమున
లోపల ప్రవేశింపవలసిన వారితోను, విశ్రాంతిదిన
మున బయలుదేరవలసిన వారితోను కలిసి యాజకుడైన
10 యెహోయాదా యొద్దకు వచ్చెను. । యాజకుడు
మందిరములో ఉన్న దావీదు ఈటెలను డాళ్లను శతాధి
11 పతులకు అప్పగింపగా । కాపు కాయువారిలో ప్రతి
మనిషి తన తన ఆయుధములను చేత పట్టుకొని బలి
పీఠముచెంతను మందిరముచెంతను మందిరము కుడికొన
మొదలుకొని యెడమకొన వరకు రాజుచుట్టు నిలి
12 చిరి. । అప్పుడు యాజకుడు రాజకుమారుని బయటకు
తోడుకొని పోయి అతని తలమీద కిరీటము పెట్టి,
ధర్మశాస్త్రగ్రంథమును అతని చేతికిచ్చిన తరువాత వారు
అతని పట్టాభిషిక్తునిగా చేసి చప్పట్లుకొట్టి — రాజు
13 చిరంజీవియగు గాకని చాటించిరి. । అతల్యా, కాయు
వారును జనులును కేకలువేయగా విని, యెహోవా
14 మందిరమందున్న జనులదగ్గరకు వచ్చి । రాజు ఎప్పటి
మర్యాదచొప్పున ఒక స్తంభముదగ్గర నిలుచుటయు,
అధిపతులును బాకా ఊదువారును రాజునొద్ద నిలువ
బడుటయు, దేశపువారందరును సంతోషించుచు
శృంగధ్వనిచేయుటయు చూచి తన వస్త్రములను చింపు
కొని — ద్రోహము ద్రోహము అని కేకవేయగా ।
15 యాజకుడైన యెహోయాదా సైన్యములోని శతాధి
పతులకు—యెహోవా మందిరమందు ఆమెను చంప
కూడదు, పంక్తుల బయటికి ఆమెను వెళ్లగొట్టుడి; ఆమె
పక్షపువారిని ఖడ్గముచేత చంపుడని ఆజ్ఞ ఇచ్చెను
16 గనుక । రాజమందిరములోకి గుర్రములు వచ్చు మార్గ
మున ఆమెకు దారి ఇచ్చిరి. ఆమె వెళ్లిపోగా వారు
ఆమెను అక్కడ పట్టుకొని చంపిరి.
17 అప్పుడు యెహోయాదా—జనులు యెహోవా
వారని ఆయనపేరట రాజుతోను జనులతోను నిబంధన
చేయించెను, మరియు అతడు రాజుపేరట జనులతో
18 నిబంధన చేయించెను. । అప్పుడు దేశపు జనులందరును
బయలు గుడికి పోయి దాని పడగొట్టి దాని బలిపీఠము
లను ప్రతిమలను ఛిన్నాభిన్నములు చేసి, బయలుకు
యాజకుడైన మత్తానును బలిపీఠములముందర చంపి
వేసిరి. మరియు యాజకుడైన యెహోయాదా
యెహోవా మందిరమును కాచుకొనుటకు మనుష్యు
లను నియమించెను. । అతడు శతాధిపతులను అధికారు 19
లను కాపుకాయువారిని దేశపు జనులందరిని పిలిపిం
పగా వారు యెహోవా మందిరములోనున్న రాజును
తీసికొని, కాపుకాయువారి గుమ్మపు మార్గమున రాజ
నగరుకు రాగా రాజు సింహాసనముమీద ఆసీనుడా
యెను. । మరియు వారు రాజునగరు దగ్గర అతల్యాను 20
ఖడ్గముచేత చంపిన తరువాత దేశపు జనులందరును
సంతోషించిరి, పట్టణమును నిమ్మళముగా ఉండెను.
యోవాషు ఏలనారంభించినప్పుడు అతడు **12**
ఏడేండ్లవాడు. యెహూ యేలుబడిలో ఏడవ సంవత్సర
మందు యోవాషు ఏలనారంభించి యెరూషలేములో
నలువది సంవత్సరములు ఏలెను. అతని తల్లి బెయేర్షెబా
సంబంధురాలైన జిబ్యా. । యాజకుడైన యెహో 2
యాదా తనకు బుద్ధినేర్పువాడై యుండు దినములన్ని
టిలో యోవాషు యెహోవా దృష్టికి అనుకూలము
గానే ప్రవర్తించెను. । అయితే ఉన్నత స్థలములు కొట్టి 3
వేయబడక నిలిచెను; జనులు ఇంకను ఉన్నత స్థలము
లందు బలులు అర్పించుచు ధూపము వేయుచు నుండిరి.
పిమ్మట యోవాషు యాజకులను పిలిపించి — 4
యెహోవా మందిరములోకి తేబడు ప్రతిష్ఠిత వస్తు
వుల విలువను అనగా జనసంఖ్య దాఖలాచేయబడిన
జనులు తెచ్చిన ద్రవ్యమును, వంతుచొప్పున ప్రతి
మనిషికి నిర్ణయమైన ద్రవ్యమును, స్వేచ్ఛచేత నెవరై
నను యెహోవా మందిరములోనికి తెచ్చిన ద్రవ్య
మును, । యాజకులలో ఒక్కొక్కడు తనకు నెలవైన 5
వారియొద్ద తీసికొని, మందిరము ఎచ్చటెచ్చట శిథిలమై
యున్నదో అచ్చటనెల్ల దాని బాగుచేయింపవలెనని
ఆజ్ఞ ఇచ్చెను. । అయితే యోవాషు ఏలుబడిలో ఇరు 6
వది మూడవ సంవత్సరమువరకును యాజకులు మంది
రముయొక్క శిథిలమైన స్థలములను బాగుచేయకయే
యుండిరి గనుక । యోవాషు యాజకుడైన యెహో 7
యాదాను మిగిలిన యాజకులను పిలిపించి — మందిర
ములో శిథిలమైన స్థలములను మీరెందుకు బాగు
చేయక పోతిరి? ఇకను మీ మీ నెలవైన వారియొద్ద
ద్రవ్యము తీసికొనక, మందిరములో శిథిలమైన స్థల
ములను బాగుచేయుటకై మీరు అంతకుముందు తీసి
కొనినదాని నప్పగించుడని ఆజ్ఞ ఇచ్చి యుండెను. ।
కాబట్టి యాజకులు — మందిరములో శిథిలమైన స్థల 8
ములను బాగుచేయుట మా వశము లేదు గనుక
జనులయొద్ద ద్రవ్యము ఇక తీసికొనమని చెప్పిరి. ।
అంతట యాజకుడైన యెహోయాదా ఒక పెట్టెను 9
తెచ్చి దాని మూతకు బెజ్జముచేసి, బలిపీఠము దగ్గరగా
యెహోవా మందిరములో ప్రవేశించువారి కుడి
పార్శ్వమందు దాని నుంచగా ద్వారముకాయు యాజ
కులు యెహోవా మందిరములోకి వచ్చిన ద్రవ్యమం
తయు అందులో వేసిరి. । పెట్టెలో ద్రవ్యము విస్తార 10

ముగా ఉన్నదని వారు తెలియజేయగా రాజుయొక్క
ప్రధానమంత్రియును ప్రధానయాజకుడును వచ్చి,
యెహోవా మందిరమందు దొరికిన ద్రవ్యము లెక్క
1 చూచి సంచులలో ఉంచిరి. । తరువాత వారు ఆ
ద్రవ్యమును తూచి యెహోవా మందిరపు కాపరు
లకు, అనగా పనిచేయించువారికప్పగించిరి; వీరు
యెహోవా మందిరమందు పనిచేసిన కంసాలులకును
శిల్పకారులకును కాసెపనివారికిని రాతిపనివారికిని ।
2 యెహోవా మందిరమందు శిథిలమైన స్థలములను
బాగుచేయుటకు మ్రానులనేమి చెక్కబడిన రాళ్లనేమి
కొనుటకును, మందిరము బాగుచేయుటలో అయిన
ఖర్చు అంతటికిని, ఆ ద్రవ్యము ఇచ్చుచు వచ్చిరి. ।
13 యెహోవా మందిరమునకు వెండి పాత్రలైనను,
కత్తెరలైనను, గిన్నెలైనను, బాకాలైనను, బంగారు
పాత్రలైనను, వెండిపాత్రలైనను చేయబడలేదు గాని ।
14 మరమ్మతు పనిచేయువారికి మాత్రము ఆ ద్రవ్యము
ఇచ్చి యెహోవా మందిరమును మరల బాగుచేయిం
15 చిరి. । మరియు పనివారికిచ్చుటకై ఆ ద్రవ్యము అప్ప
గింత పెట్టుకొనినవారు నమ్మకస్థులని వారిచేత లెక్క
16 అడుగలేదు. । అపరాధపరిహారార్థ బలులవలనను పాప
పరిహారార్థ బలులవలనను దొరికిన సొమ్ము యెహోవా
మందిరములోనికి తేబడలేదు, అది యాజకులదాయెను.
17 అంతట అరామురాజైన హజాయేలు గాతు పట్ట
ణము మీదికి పోయి యుద్ధముచేసి దాని పట్టుకొనిన
తరువాత అతడు యెరూషలేముమీదికి రాదలచియుం
18 డగా । యూదారాజైన యోవాషు తన పితరులైన
యెహోషాపాతు యెహోరాము అహజ్యా అను
యూదారాజులు ప్రతిష్ఠించిన వస్తువులన్నిటిని, తాను
ప్రతిష్ఠించిన వస్తువులను, యెహోవా మందిరము
లోను రాజనగరులోనున్న పదార్థములలోను కనబడిన
బంగారమంతయు తీసికొని అరామురాజైన హజాయే
లుకు పంపగా అతడు యెరూషలేమునొద్దనుండి తిరిగి
9 పోయెను. । యోవాషు చేసిన యితరకార్యములను
గూర్చియు అతడు చేసిన దాని నంతటినిగూర్చియు
యూదారాజుల వృత్తాంతముల గ్రంథమందు వ్రాయ
0 బడి యున్నది. । అతని సేవకులు లేచి కుట్రచేసి సిల్లా
అను చోటికి పోవుమార్గమందున్న మిల్లో అను నగరు
1 నందు యోవాషును చంపిరి. । ఎట్లనగా షిమాతు కుమా
రుడైన యోజాకారు షోమేరు కుమారుడైన యెహో
జాబాదు అను అతని సేవకులును అతనిమీద పడగా
అతడు మరణమాయెను. జనులు దావీదు పురమందు
అతని పితరుల సమాధిలో అతని పాతిపెట్టిరి; అతని
కుమారుడైన అమజ్యా అతనికి మారుగా రాజాయెను.
3 యూదారాజైన అహజ్యా కుమారుడైన యోవాషు
ఏలుబడిలో ఇరువది మూడవ సంవత్సరమందు యెహూ
కుమారుడైన యెహోయాహాజు షోమ్రోనులో
ఇశ్రాయేలును ఏలనారంభించి పదిహేను సంవత్సర
ములు ఏలెను. । ఇతడు ఇశ్రాయేలువారు పాపము 2
చేయుటకు కారకుడగు నెబాతు కుమారుడైన
యరొబాము పాపములను విడువక అనుసరించుచు
యెహోవా దృష్టికి చెడుతనము జరిగించెను. । కాబటి 3
యెహోవా కోపము ఇశ్రాయేలువారిమీద రగులు
కొనగా ఆయన అరామురాజైన హజాయేలు దినము
లన్నిటను హజాయేలు కుమారుడైన బెన్హదదు దినము
లన్నిటను ఇశ్రాయేలువారిని వారికప్పగించెను. ।
అయితే యెహోయాహాజు యెహోవాను వేడు 4
కొనగా యెహోవా అరాము రాజుచేత బాధనొం
దిన ఇశ్రాయేలువారిని కనికరించి అతని మనవి నంగీ
కరించెను. । కావున యెహోవా ఇశ్రాయేలువారికి 5
ఒక రక్షకుని అనుగ్రహింపగా అతనిచేత ఇశ్రాయేలు
వారు అరామీయుల వశములోనుండి తప్పించుకొని
మునుపటివలె స్వస్థానములలో కాపురముండిరి. । అయి 6
నను ఇశ్రాయేలువారు పాపము చేయుటకు కారకు
డగు యరొబాము కుటుంబికులు చేసిన పాపములను
వారు విడువక వాటిననుసరించుచు వచ్చిరి. మరియు
ఆ దేవతాస్తంభమును షోమ్రోనులో నిలిచియుండెను. ।
రౌతులలో ఏబదిమందియు రథములలో పదియు 7
కాల్బలములో పదివేలమందియు మాత్రమే యెహో
యాహాజు దగ్గర ఉండిరి; మిగిలినవారిని అరామురాజు
దుళ్లకొట్టిన ధూళివలె నాశనముచేసి యుండెను. ।
యెహోయాహాజు చేసిన యితర కార్యములను 8
గూర్చియు, అతడు చేసినదాని నంతటిని గూర్చియు,
అతని పరాక్రమమును గూర్చియు ఇశ్రాయేలురాజుల
వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి యున్నది. ।
యెహోయాహాజు తన పితరులతోకూడ నిద్రించి 9
షోమ్రోనులో పాతిపెట్టబడెను; అతని కుమారుడైన
యెహోయాషు అతనికి మారుగా రాజాయెను.
యూదారాజైన యోవాషు ఏలుబడిలో ముప్పది 10
యేడవ సంవత్సరమందు యెహోయాహాజు కుమారు
డైన యెహోయాషు షోమ్రోనులో ఇశ్రాయేలును
ఏలనారంభించి పదునారు సంవత్సరములు ఏలెను. ।
ఇతడును ఇశ్రాయేలువారు పాపము చేయుటకు కార 11
కుడగు నెబాతు కుమారుడైన యరొబాము చేసిన పాప
ములను విడువక వాటి ననుసరించుచు యెహోవా
దృష్టికి చెడుతనము జరిగించెను. । యెహోయాషు 12
చేసిన యితర కార్యములనుగూర్చియు, అతడు చేసిన
దాని అంతటినిగూర్చియు, యూదారాజైన అమ
జ్యాతో యుద్ధము చేయునప్పుడు అతడు కనుపర
చిన పరాక్రమమునుగూర్చియు ఇశ్రాయేలురాజుల
వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి యున్నది. ।
యెహోయాషు తన పితరులతోకూడ నిద్రించిన 13
తరువాత యరొబాము అతని సింహాసనముమీద ఆసీను

డాయెను; యెహోయాషు షోమ్రోనులో ఇశ్రా
యేలురాజుల సమాధియందు పాతిపెట్టబడెను.
14 అంతట ఎలీషా మరణకరమైన రోగముచేత పీడి
తుడై యుండగా ఇశ్రాయేలురాజైన యెహోయాషు
అతనియొద్దకు వచ్చి అతని చూచి కన్నీరు విడుచుచు
—నా తండ్రీ నా తండ్రీ, ఇశ్రాయేలువారికి రథమును
15 రౌతులును నీవే అని యేడ్చెను. । అందుకు ఎలీషా—
నీవు వింటిని బాణములను తీసికొమ్మని అతనితో చెప్పగా
16 అతడు వింటిని బాణములను తీసికొనెను. । —నీ
చెయ్యి వింటిమీద ఉంచుమని అతడు ఇశ్రాయేలు
రాజుతో చెప్పగా అతడు తన చెయ్యి వింటిమీద
ఉంచినప్పుడు ఎలీషా తన చేతులను రాజు చేతుల
17 మీద వేసి । —తూర్పువైపున నున్న కిటికీని విప్పుమని
చెప్పగా అతడు విప్పెను. అప్పుడు ఎలీషా—బాణము
వేయుమని చెప్పి అతడు బాణము వేయుట చూచి
ఇట్లనెను—ఇది యెహోవా రక్షణ బాణము, అరా
మీయుల చేతిలోనుండి మిమ్మును రక్షించు బాణము;
అరామీయులు నాశనమగునట్లు నీవు ఆఫెకులో
18 వారిని హతముచేయుదువని చెప్పి । బాణములను
పట్టుకొమ్మనగా అతడు పట్టుకొనెను. అంతట అతడు
ఇశ్రాయేలురాజును చూచి — నేలను కొట్టుమని
19 నప్పుడు అతడు ముమ్మారు కొట్టి మానెను. । అయితే
అందు నిమిత్తము దైవజనుడు అతనిమీద కోపగించి—
నీవు అయిదు మారులైన ఆరుమారులైన కొట్టిన పక్ష
మందు అరామీయులు నాశనమగువరకు నీవు వారిని
హతము చేసియుందువు; అయితే ఇప్పుడు ముమ్మారు
మాత్రమే అరామీయులను ఓడించెదవని చెప్పెను.
20 తరువాత ఎలీషా మృతిపొందగా వారు అతనిని
సమాధిలో ఉంచిరి. ఒక సంవత్సరము గడచిన తరు
వాత మోయాబీయుల సైన్యము దేశముమీదికి వచ్చి
21 నప్పుడు । కొందరు ఒక శవమును పాతిపెట్టుచు
సైన్యమునకు భయపడి ఆ శవమును ఎలీషాయొక్క
సమాధిలో ఉంచగా దింపిన ఆ శవము ఎలీషా శల్య
ములకు తగిలినప్పుడు అది తిరిగి బ్రదికి కాళ్లుమోపి
నిలిచెను.
22 యెహోయాహాజు దినములన్నియు అరాము
రాజైన హజాయేలు ఇశ్రాయేలువారిని బాధపెట్టెను.।
23 కాబట్టి యెహోవా వారిని జాలి దలచి వారియందు
దయయుంచి, అబ్రాహాము ఇస్సాకు యాకోబులతో
తాను చేసియున్న నిబంధననుబట్టి వారియందు లక్ష్యము
నిలిపి, వారిని నాశము చేయనొల్లక యిప్పటికిని తన
సముఖములోనుండి వారిని వెళ్లగొట్టక యుండెను. ।
24 అరామురాజైన హజాయేలు మరణము కాగా అతని
కుమారుడైన బెన్హదదు అతనికి మారుగా రాజాయెను.।
25 అంతట యెహోయాహాజు కుమారుడైన యెహో
యాషు హజాయేలు కుమారుడైన బెన్హదదు తన తండ్రి
యైన యెహోయాహాజు చేతిలోనుండి యుద్ధమం
పట్టుకొనిన పట్టణములను మరల తీసికొనెను. యెహో
యాషు అతని ముమ్మారు జయించి ఇశ్రాయేలు పట్ట
ములను మరల వశపరచుకొనెను.

ఇశ్రాయేలురాజును యెహోయాహాజు కుమా
రుడునైన యెహోయాషు ఏలుబడిలో రెండవ సం
వత్సరమందు యూదారాజును యోవాషు కుమారుడు
నైన అమజ్యా రాజాయెను. । అతడు ఏలనారంభించి
నప్పుడు ఇరువది యయిదేండ్లవాడై యెరూషలేము
నందు ఇరువది తొమ్మిది సంవత్సరములు ఏలెను; అతని
తల్లి యెరూషలేము కాపురస్థురాలైన యెహో
యద్దాను. । ఇతడు తన పితరుడైన దావీదు చేసినట్లు
చేయక పోయినను, యెహోవా దృష్టికి నీతిగలవాడై
తన తండ్రియైన యోవాషు చేసిన ప్రకారము చేసెను.
అయితే అతడు ఉన్నత స్థలములను కొట్టివేయలేదు;
జనులు ఇంకను ఉన్నత స్థలములలో బలులనర్పించుచు
ధూపము వేయుచునుండిరి. । రాజ్యమందు తాను
స్థాపింపబడిన తరువాత రాజగు తన తండ్రిని చంపిన
తన సేవకులను అతడు హతము చేయించెను. । అయితే
—పిల్లలకు మారుగా తండ్రులను తండ్రులకు మారుగా
పిల్లలను మరణశిక్షకు లోపరచక, ప్రతి మనిషికి తాను
చేసిన పాపమునుబట్టి శిక్ష విధింపవలెనని మోషే
వ్రాసియిచ్చిన ధర్మశాస్త్రమందు యెహోవా యిచ్చిన
ఆజ్ఞనుబట్టి ఆ నరహంతకుల పిల్లలను అతడు హతము
చేయలేదు. । మరియు ఉప్పులోయలో అతడు
యుద్ధము చేసి ఎదోమీయులలో పదివేలమందిని
హతముచేసి, సెల అను పట్టణమును పట్టుకొని దానికి
యొక్తయేలని పేరు పెట్టెను; నేటివరకు దానికి అదే
పేరు.

అంతట అమజ్యా ఇశ్రాయేలురాజైన యెహూకు
పుట్టిన యెహోయాహాజు కుమారుడైన యెహో
యాషు నొద్దకు దూతలను పంపి—మనము ఒకరినొక
రము దర్శించునట్లు నన్ను కలియ రమ్మని వర్తమానము
చేయగా । ఇశ్రాయేలురాజైన యెహోయాషు
యూదారాజైన అమజ్యాకు ఈలాగు వర్తమానము
పంపెను—లెబానోనులోనున్న ముండ్ల చెట్టొకటి—నీ
కుమార్తెను నా కుమారునికిమ్మని లెబానోనులోనున్న
దేవదారు వృక్షమునకు వర్తమానము పంపగా, లెబా
నోనులోనున్న దుష్టమృగము వచ్చి ఆ ముండ్లచెట్టును
త్రొక్కివేసెను. । నీవు ఎదోమీయులను హతము చేసి
నందున నీ హృదయమందు నీవు అతిశయపడు
చున్నావు సరే; యిప్పుడు నీ నగరునందు నీవుండి
నీకున్న ఘనతనుబట్టి నీవు అతిశయపడుము. నీవు
మాత్రము గాక నీతోకూడ యూదావారును కూలు
నట్లుగా నీవెందుకు అపాయములో దిగుదువని చెప్పి
నను । అమజ్యా విననొల్లనందున ఇశ్రాయేలురాజైన

యెహోయాషు బయలుదేరి, యూదా సంబంధమైన
బేత్షెమెషు పట్టణముదగ్గర తానును యూదారాజైన
12 అమజ్యాయు కలిసికొనగా । యూదావారు ఇశ్రా
యేలువారి యెదుట నిలువలేక అపజయమొంది అంద
13 రును తమ తమ స్థలములకు పారిపోయిరి. । మరియు
ఇశ్రాయేలురాజైన యెహోయాషు అహజ్యాకు
పుట్టిన యోవాషు కుమారుడైన అమజ్యా అను
యూదారాజును బేత్షెమెషుదగ్గర పట్టుకొని యెరూష
లేముకు వచ్చి, ఎఫ్రాయిము గుమ్మము మొదలుకొని
మూల గుమ్మము వరకు యెరూషలేము ప్రాకారమును
14 నన్నూరు మూరల పొడుగున పడగొట్టెను. । మరియు
యెహోవా మందిరమునందును రాజనగరునందును
కనబడిన బంగారము వెండి మొదలైన సమస్త వస్తువులను
(పట్టణస్థులలో) కుదవపెట్టబడినవారిని తీసికొని
15 షోమ్రోనుకు వచ్చెను. । యెహోయాషు చేసిన
యితర కార్యములను గూర్చియు, అతని పరాక్రమ
మును గూర్చియు, యూదారాజైన అమజ్యాతో
అతడు చేసిన యుద్ధమును గూర్చియు ఇశ్రాయేలు
రాజుల వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి
16 యున్నది. । అంతట యెహోయాషు తన పితరు
లతోకూడ నిద్రించి షోమ్రోనులో ఇశ్రాయేలు
రాజుల సమాధియందు పాతిపెట్టబడెను; అతని కుమా
రుడైన యరొబాము అతనికి మారుగా రాజాయెను.
17 యూదారాజైన యోవాషు కుమారుడైన అమజ్యా
ఇశ్రాయేలురాజైన యెహోయాహాజు కుమారుడైన
యెహోయాషు మరణమైన తరువాత పదునయిదు
18 సంవత్సరములు బ్రదికెను. । అమజ్యా చేసిన యితర
కార్యములనుగూర్చి యూదా రాజుల వృత్తాంతముల
19 గ్రంథమందు వ్రాయబడి యున్నది. । అతనిమీద
యెరూషలేములో జనులు కుట్రచేయగా అతడు
లాకీషుపట్టణమునకు పారిపోయెను గాని వారు లాకీ
20 షుకు అతనివెంట కొందరిని పంపిరి. । వారు అక్కడ
అతని చంపి గుఱ్ఱములమీద అతని శవమును యెరూ
షలేముకు తెప్పించి దావీదు పురమందు అతని పితరుల
21 సమాధిలో పాతిపెట్టిరి. । అప్పుడు యూదా జనులం
దరును పదునారు సంవత్సరములవాడైన అజర్యాను
తీసికొని అతని తండ్రియైన అమజ్యాకు బదులుగా
22 పట్టాభిషేకము చేసిరి. । ఇతడు రాజైన తన తండ్రి
తన పితరులతో నిద్రించిన తరువాత ఏలతు అను
పట్టణమును బాగుగా కట్టించి యూదావారికి దానిని
మరల అప్పగించెను.

23 యూదారాజును యోవాషు కుమారుడునైన
అమజ్యా యేలుబడిలో పదునయిదవ సంవత్సరమందు
ఇశ్రాయేలురాజైన యెహోయాషు కుమారుడగు
యరొబాము షోమ్రోనులో ఏలనారంభించి నలువది
యొక సంవత్సరములు ఏలెను. । ఇతడును ఇశ్రాయేలు 24
వారు పాపము చేయుటకు కారకుడగు నెబాతు కుమా
రుడైన యరొబాము చేసిన పాపములను విడువక అనుస
రించి యెహోవా దృష్టికి చెడుతనము జరిగించెను. ।
గత్హేపెరు ఊరివాడైన అమిత్తయికి పుట్టిన తన సేవకుడైన 25
యోనా అను ప్రవక్తద్వారా ఇశ్రాయేలీయుల దేవు
డగు యెహోవా సెలవిచ్చిన మాటచొప్పున ఇతడు
హమాతు దిక్కు మొదలుకొని మైదానపు సముద్రము
వరకు ఇశ్రాయేలువారి సరిహద్దును మరల స్వాధీనము
చేసికొనెను. । ఏలయనగా అల్పులేమి ఘనులేమి 26
ఇశ్రాయేలువారికి సహాయులెవరును లేకపోయిరి.
యెహోవా ఇశ్రాయేలువారు పొందిన బాధ ఘోర
మైనదనుకొనెను. । ఇశ్రాయేలను పేరు ఆకాశము 27
క్రిందనుండి తుడిచివేయనని యెహోవా సెలవిచ్చి
యుండెను గనుక యెహోయాషు కుమారుడైన
యరొబాము ద్వారా వారిని రక్షించెను. । యరొ 28
బాము చేసిన యితర కార్యములనుగూర్చియు, అతడు
చేసిన దాని నంతటినిగూర్చియు, అతని పరాక్రమ
మునుగూర్చియు, అతడు చేసిన యుద్ధమునుగూర్చియు,
యూదావారికి కలిగియున్న దమస్కు పట్టణమును
హమాతు పట్టణమును ఇశ్రాయేలువారికొరకై అతడు
మరల పట్టుకొనిన సంగతినిగూర్చియు ఇశ్రాయేలు
రాజుల వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి
యున్నది. । యరొబాము తన పితరులైన ఇశ్రాయేలు 29
రాజులతోకూడ నిద్రించిన తరువాత అతని కుమారు
డైన జెకర్యా అతనికి మారుగా రాజాయెను.

**15** ఇశ్రాయేలురాజైన యరొబాము ఏలుబడిలో
ఇరువది యేడవ సంవత్సరమందు యూదారాజైన
అమజ్యా కుమారుడైన అజర్యా యేలనారంభించెను. ।
అతడు పదునారేండ్లవాడై యేలనారంభించి యెరూష 2
లేమునందు ఏబది రెండు సంవత్సరములు రాజుగా
ఉండెను; అతని తల్లి యెరూషలేము కాపురస్థురాలైన
యెకొల్యా. । ఇతడు తన తండ్రియైన అమజ్యా 3
చర్య యంతటిప్రకారము యెహోవా దృష్టికి నీతి
గలవాడై ప్రవర్తించెను. । ఉన్నత స్థలములను మాత్రము 4
కొట్టివేయలేదు; ఉన్నత స్థలములయందు జనులు
ఇంకను బలులు అర్పించుచు ధూపము వేయుచు
ఉండిరి. । యెహోవా ఈ రాజును మొత్తినందున 5
అతడు మరణమగువరకు కుష్ఠరోగియై ప్రత్యేకముగా
ఒక నగరులో నివసించెను గనుక రాజకుమారుడైన
యోతాము నగరుమీద అధికారియై దేశపు జనులకు
న్యాయము తీర్చువాడుగా ఉండెను. । అజర్యా చేసిన 6
యితర కార్యములనుగూర్చియు, అతడు చేసినదాని
నంతటినిగూర్చియు యూదారాజుల వృత్తాంతముల
గ్రంథమందు వ్రాయబడి యున్నది. । అజర్యా తన 7
పితరులతోకూడ నిద్రించి దావీదుపురములో తన

పితరుల సమాధియందు పాతిపెట్టబడగా అతని కుమారు
డైన యోతాము అతనికి మారుగా రాజాయెను.
8 యూదారాజైన అజర్యా యేలుబడిలో ముప్పది
యెనిమిదవ సంవత్సరమందు యరొబాము కుమారు
డైన జెకర్యా షోమ్రోనులో ఇశ్రాయేలువారిని ఆరు
9 నెలలు ఏలెను. ఇతడు ఇశ్రాయేలువారు పాపము
చేయుటకు కారకుడగు నెబాతు కుమారుడైన యరొ
బాము చేసిన పాపములను విడువక అనుసరించుచు,
తన పితరులు చేసినట్లుగా తానును యెహోవా
10 దృష్టికి చెడుతనము జరిగించెను. యాబేషు కుమారు
డైన షల్లూము అతనిమీద కుట్రచేసి, జనులు చూచు
చుండగా అతనిమీద పడి అతని చంపి అతనికి
11 మారుగా రాజాయెను. జెకర్యా చేసిన కార్యములను
గూర్చి ఇశ్రాయేలురాజుల వృత్తాంతముల గ్రంథ
12 మందు వ్రాయబడి యున్నది. —నీ కుమారులు
నాలుగవ తరమువరకు ఇశ్రాయేలు సింహాసనముమీద
ఆసీనులై యుందురని యెహోవా యెహూతో సెల
విచ్చిన మాటచొప్పున ఇది జరిగెను.
13 యూదారాజైన ఉజ్జియా యేలుబడిలో ముప్పది
తొమ్మిదవ సంవత్సరమందు యాబేషు కుమారుడైన
షల్లూము ఏలనారంభించి షోమ్రోనులో నెల దిన
14 ములు ఏలెను. గాదీ కుమారుడైన మెనహేము
తిర్సాలోనుండి బయలుదేరి షోమ్రోనుకు వచ్చి
షోమ్రోనులోనుండు యాబేషు కుమారుడైన షల్లూము
మీద పడి అతని చంపి అతనికి మారుగా రాజా
15 యెను. షల్లూము చేసిన యితర కార్యములనుగూ
ర్చియు, అతడు చేసిన కుట్రనుగూర్చియు ఇశ్రా
యేలురాజుల వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడి
16 యున్నది. మెనహేము రాగా తిప్సహు పట్టణపు
వారు తమ గుమ్మములు తీయలేదు గనుక అతడు వారి
నందరిని హతము చేసి, తిర్సాను దాని చేరువ గ్రామ
ములనన్నిటిని కొల్లపెట్టి అచ్చటి గర్భిణులందరి గర్భ
ములను చించెను.
17 యూదారాజైన అజర్యా యేలుబడిలో ముప్పది
తొమ్మిదవ సంవత్సరమందు గాదీ కుమారుడైన మెన
హేము ఇశ్రాయేలువారిని ఏలనారంభించి షోమ్రో
18 నులో పది సంవత్సరములు ఏలెను. ఇతడును తన
దినములన్నియు ఇశ్రాయేలువారు పాపము చేయు
టకు కారకుడగు నెబాతు కుమారుడైన యరొబాము
చేసిన పాపములను విడువక యనుసరించుచు
యెహోవా దృష్టికి చెడుతనము జరిగించెను.
19 అష్షూరురాజైన పూలు దేశముమీదికి రాగా, మెన
హేము తనకు రాజ్యము స్థిరపరచునట్లుగా పూలుచేత
సంధి చేయించుకొనవలెనని రెండు వేల మణుగుల
20 వెండి పూలుకు ఇచ్చెను. మెనహేము ఇశ్రాయే
లులో భాగ్యవంతులైన గొప్పవారిలో ప్రతి మనిషి
యొద్దను ఏబదేసి తులముల వెండి వసూలుచేసి యీ
ద్రవ్యమును అష్షూరురాజుకిచ్చెను గనుక అష్షూరు
రాజు దేశమును విడిచి వెళ్లిపోయెను. మెనహేము 21
చేసిన యితర కార్యములనుగూర్చియు, అతడు చేసిన
దానినంతటినిగూర్చియు ఇశ్రాయేలురాజుల వృత్తాం
తముల గ్రంథమందు వ్రాయబడి యున్నది. మెన 22
హేము తన పితరులతోకూడ నిద్రించిన తరువాత
అతని కుమారుడైన పెకహ్యా అతనికి మారుగా రాజా
యెను.
యూదారాజైన అజర్యా యేలుబడిలో ఏబదియవ 23
సంవత్సరమందు మెనహేము కుమారుడైన పెకహ్యా
షోమ్రోనులో ఇశ్రాయేలువారిని ఏలనారంభించి
రెండు సంవత్సరములు ఏలెను. ఇతడును ఇశ్రాయే 24
లువారు పాపము చేయుటకు కారకుడగు నెబాతు
కుమారుడైన యరొబాము చేసిన పాపములను విడువక
అనుసరించుచు యెహోవా దృష్టికి చెడుతనము జరి
గించెను. ఇతని క్రింద అధిపతియైన రెమల్యా 25
కుమారుడైన పెకహు కుట్రచేసి, తన యొద్దనున్న
గిలాదీయులైన యేబదిమందితోను కలిసికొని షోమ్రో
నులోనున్న రాజనగరులోని అంతఃపురమందు అర్గో
బును అరీహేను చంపి పెకహ్యాకు మారుగా రాజా
యెను. పెకహ్యా చేసిన యితర కార్యములనుగూ 26
ర్చియు, అతడు చేసినదానినంతటినిగూర్చియు ఇశ్రా
యేలురాజుల వృత్తాంతముల గ్రంథమందు వ్రాయ
బడి యున్నది.
యూదారాజైన అజర్యా యేలుబడిలో ఏబది 27
రెండవ సంవత్సరమందు రెమల్యా కుమారుడైన
పెకహు షోమ్రోనులో ఇశ్రాయేలును ఏలనారంభించి
యిరువది సంవత్సరములు ఏలెను. ఇతడును ఇశ్రా 28
యేలువారు పాపము చేయుటకు కారకుడగు నెబాతు
కుమారుడైన యరొబాము చేసిన పాపములను విడు
వక అనుసరించుచు యెహోవా దృష్టికి చెడుతనము
జరిగించెను. ఇశ్రాయేలురాజైన పెకహు దినము 29
లలో అష్షూరురాజైన తిగ్లత్పిలేసెరు వచ్చి ఈయోను
పట్టణమును, ఆబేల్బేత్మయకా పట్టణమును, యానో
యహు పట్టణమును, కెదెషు పట్టణమును, హాసోరు
పట్టణమును, గిలాదు దేశమును, గలిలైయ దేశమును,
నఫ్తాలీ దేశమంతయును పట్టుకొని అచ్చట నున్న
వారిని అష్షూరు దేశమునకు చెరగా తీసికొని పోయె
ను. అప్పుడు ఏలా కుమారుడైన హోషేయ 30
ఇశ్రాయేలురాజైన రెమల్యా కుమారుడైన పెకహు
మీద కుట్రచేసి, అతనిమీద పడి అతని చంపి,
యూదారాజైన ఉజ్జియా కుమారుడైన యోతాము
ఏలుబడిలో ఇరువదియవ సంవత్సరమున అతనికి
మారుగా రాజాయెను. పెకహు చేసిన యితర కార్య 31
ములనుగూర్చియు, అతడు చేసినదానినంతటినిగూ

్రయేలురాజుల వృత్తాంతముల గ్రంథ
మబడి యున్నది.
ుర్రాజైన రెమల్యా కుమారుడగు పెకహు
రెండవ సంవత్సరమున యూదారాజైన
ారుడగు యోతాము ఏలనారంభించెను. ।
 యయిదేండ్లవాడై యెరూషలేమునందు
ారు సంవత్సరములు ఏలెను. అతని
ు కుమార్తెయైన యెరూషా. । ఇతడు
 దృష్టికి నీతిగా ప్రవర్తించి తన తండ్రి
ా చర్యను పూర్తిగా అనుసరించెను. ।
న్నత స్థలములను కొట్టివేయకుండెను;
త స్థలములందు ఇంకను బలుల నర్పిం
ు వేయుచునుండిరి. ఇతడు యెహోవా
న్న యెత్తయిన ద్వారమును కట్టించెను. ।
చేసిన యితర కార్యములనుగూర్చియు,
నదాని నంతటినిగూర్చియు యూదా
త్తాంతముల గ్రంథమందు వ్రాయబడి
ఆ దినములలో యెహోవా అరాము
ను రెమల్యా కుమారుడైన పెకహును
ముమీదికి పంప నారంభించెను. ।
తన పితరులతోకూడ నిద్రించి తన
ావీదు పురమందు తన పితరుల సమా
పెట్టబడెను; అతని కుమారుడైన ఆహాజు
ుగా రాజాయెను.
్య కుమారుడైన పెకహు ఏలుబడిలో పదు
త్సరమందు యూదారాజైన యోతాము
ఆహాజు ఏలనారంభించెను. । ఆహాజు ఏల
ప్పుడు ఇరువది యేండ్లవాడై యెరూష
పదునారు సంవత్సరములు ఏలెను. తన
ావీదు తన దేవుడైన యెహోవా దృష్టికి
ర్తించినట్లు అతడు ప్రవర్తింపక ఇశ్రా
ు ప్రవర్తించినట్లు ప్రవర్తించెను. । అతడు
ుల ముందర నిలువకుండ యెహోవా
జనులు చేసిన హేయమైన క్రియలు
న కుమారుని అగ్నిహోత్రములో నడి
మరియు అతడు ఉన్నత స్థలములలోను
ుదను సమస్తమైన పచ్చని వృక్షముల
లులు అర్పించుచు ధూపము వేయుచు
రాముమరాజైన రెజీనును ఇశ్రాయేలురాజైన
ుమారుడగు పెకహును యెరూషలేము
ద్ధమునకువచ్చి ఆహాజున్న పట్టణము
 గాని దాని పట్టుకొనలేక పోయిరి. ।
డు అరాముమరాజైన రెజీను ఏలతు పట్టణ
 పట్టుకొని అరామీయుల వశము చేసి,
ండి యూదావారిని వెళ్లగొట్టగా అరా
ఏలతు పట్టణమునకు వచ్చి కాపురముండిరి.
నేటివరకును వారచ్చటనే యున్నారు. । ఇట్లుండగా 7
ఆహాజు యెహోవామందిర సంబంధమైనట్టియు
రాజనగరు సంబంధమైనట్టియు సామగ్రులలో కన
బడిన వెండి బంగారములను తీసికొని అష్షూరురాజుకు
కానుకగా పంపి । — నేను నీ దాసుడను నీ కుమారు 8
డనై యున్నాను గనుక నీవు వచ్చి, నామీదికి లేచిన
అరాముమరాజు చేతిలోనుండియు ఇశ్రాయేలురాజు
చేతిలోనుండియు నన్ను రక్షింపవలెనని అష్షూరు
రాజైన తిగ్లత్పిలేసెరునొద్దకు దూతలనంపగా । అష్షూరు 9
రాజు అతనిమాట అంగీకరించి, దమస్కు పట్టణను
మీదికి వచ్చి దాని పట్టుకొని, రెజీనును హతముచేసి
ఆ జనులను కీరుపట్టణమునకు చెరదీసికొని పోయెను. ।
రాజైన ఆహాజు అష్షూరురాజైన తిగ్లత్పిలేసెరును కలిసి 10
కొనుటకై దమస్కు పట్టణమునకు వచ్చి, దమస్కు
పట్టణమందు ఒక బలిపీఠమును చూచి, దాని పోలికెను,
మచ్చును, దాని పని విధమంతయును యాజకుడైన
ఊరియాకు పంపెను. । కాబట్టి యాజకుడైన ఊరియా 11
రాజైన ఆహాజు దమస్కుపట్టణమునుండి పంపిన
మచ్చుకు సమమైన యొక బలిపీఠమును కట్టించి, రాజైన
ఆహాజు దమస్కునుండి తిరిగి రాకమునుపే సిద్ధపర
చెను. । అంతట రాజు దమస్కునుండి వచ్చి బలిపీఠ 12
మును చూచి ఆ బలిపీఠమునొద్దకు వచ్చి దాని ఎక్కి ।
దహనబలిని నైవేద్యమును అర్పించి పానార్పణము 13
చేసి, తాను అర్పించిన సమాధానబలిపశువుల రక్తమును
దానిమీద ప్రోక్షించెను. । మరియు యెహోవా 14
సన్నిధినున్న యిత్తడి బలిపీఠమును మందిరము ముంగిటి
స్థలమునుండి, అనగా తాను కట్టించిన బలిపీఠమునకును
యెహోవా మందిరమునకును మధ్యనుండి తీయించి,
తాను కట్టించినదాని ఉత్తర పార్శ్వమందు దానిని
ఉంచెను. । అప్పుడు రాజైన ఆహాజు యాజకుడైన 15
ఊరియాకు ఆజ్ఞాపించినదేమనగా—ఈ పెద్ద బలిపీఠము
మీద ఉదయమున అర్పించు దహనబలులను, సాయం
త్రమున అర్పించు నైవేద్యములను, రాజు చేయు
దహనబలి నైవేద్యములను దేశపు జనులందరు అర్పించు
దహనబలి నైవేద్యములను, పానార్పణలను దహించి,
యే దహనబలి జరిగినను, ఏ బలి జరిగినను వాటి పశు
వుల రక్తమును దానిమీదనే ప్రోక్షింపవలెను. అయితే
ఈ యిత్తడి బలిపీఠమునకు నేనేమి చేయవలెనో ఆలో
చనచేసి చెప్పెదను. । కాగా యాజకుడైన ఊరియా 16
రాజైన ఆహాజు ఆజ్ఞచొప్పున అంతయు చేసెను. ।
మరియు రాజైన ఆహాజు స్తంభముల అంచులను తీసి 17
వేసి వాటిమీదనున్న తొట్టిని తొలగించెను, ఇత్తడి
యెద్దులమీదనున్న సముద్రమును దింపి రాతి కట్టుమీద
దానిని ఉంచెను. । మరియు అతడు అష్షూరు రాజుకు 18
భయపడి విశ్రాంతిదినపు ఆచరణకొరకై మందిర
ములో కట్టబడిన మంటపమును, రాజు ఆవరణము

నుండి బయటి ద్వారమును యెహోవా మందిరము
19 నుండి తీసివేసెను. । ఆహాజు చేసిన యితర కార్యము
లనుగూర్చి యూదారాజుల వృత్తాంతముల గ్రంథ
20 మందు వ్రాయబడి యున్నది. । ఆహాజు తన పిత
రులతోకూడ నిద్రించి దావీదు పురమందు తన
పితరుల సమాధిలో పాతిపెట్టబడెను; అతని కుమారు
డైన హిజ్కియా అతనికి మారుగా రాజాయెను.

**17** యూదారాజైన ఆహాజు ఏలుబడిలో పన్నెం
డవ సంవత్సరమందు ఏలా కుమారుడైన హోషేయ
షోమ్రోనులో ఇశ్రాయేలును ఏలనారంభించి తొమ్మిది
2 సంవత్సరములు ఏలెను. । అతడు తన పూర్వికులైన
ఇశ్రాయేలురాజులు చెడుతనము చేసినంతమట్టుకు
చేయకపోయినను, యెహోవా దృష్టికి చెడుతనమే
3 జరిగించెను. । అతనిమీదికి అష్షూరురాజైన షల్మనేసెరు
యుద్ధమునకు రాగా హోషేయ అతనికి దాసుడై
4 పన్ను ఇచ్చువాడాయెను. । అతడు ఐగుప్తురాజైన
సోనొద్దకు దూతలను పంపి, పూర్వము తాను ఏటేట
ఇచ్చుచు వచ్చినట్లు అష్షూరురాజుకు పన్ను ఇయ్యక
పోగా, హోషేయ చేసిన కుట్ర అష్షూరురాజు
తెలిసికొని అతనికి సంకెళ్లు వేయించి బందీగృహములో
5 ఉంచెను. । అష్షూరురాజు దేశమంతటిమీదికిని
షోమ్రోనుమీదికిని వచ్చి మూడు సంవత్సరములు
6 షోమ్రోనును ముట్టడించెను. । హోషేయ యేలు
బడిలో తొమ్మిదవ సంవత్సరమందు అతడు షోమ్రోను
పట్టణమును పట్టుకొని ఇశ్రాయేలువారిని అష్షూరు
దేశములోకి చెరగొని పోయి, గోజానునది దగ్గర
నున్న హాలహు హాబోరు అను స్థలములందును మాదీ
7 యుల పట్టణములలోను వారిని ఉంచెను. । ఇశ్రా
యేలీయులు ఐగుప్తుదేశములో నుండియు, ఐగుప్తు
రాజైన ఫరోయొక్క బలము క్రిందనుండియు, తమ్మును
విడిపించిన తమ దేవుడైన యెహోవా దృష్టికి పాప
ముచేసి యితర దేవతలయందు భయభక్తులు నిలిపి ।
8 తమయెదుట నిలువకుండ యెహోవా వెళ్లగొట్టిన
జనముల కట్టడలను, ఇశ్రాయేలురాజులు నిర్ణయించిన
9 కట్టడలను అనుసరించుచు ఉండిరి. । మరియు ఇశ్రా
యేలువారు తమ దేవుడైన యెహోవా విషయములో
కపటము గలిగి దుర్బోధలు బోధించుచు, అడవి గుడి
సెల నివాసులును ప్రాకారములుగల పట్టణనివాసు
లును తమ స్థలములన్నిటిలో బలిపీఠములను కట్టుకొని ।
10 యెత్తయిన కొండలన్నిటిమీదనేమి, సకలమైన పచ్చని
వృక్షముల క్రిందనేమి, అంతటను విగ్రహములను
11 నిలువబెట్టి దేవతాస్తంభములను నిలిపి । తమయెదుట
నిలువకుండ యెహోవా వెళ్లగొట్టిన జనులవాడుక
చొప్పున ఉన్నతస్థలములలో ధూపము వేయుచు,
చెడుతనము జరిగించుచు, యెహోవాకు కోపము
పుట్టించి । —చేయకూడదని వేటినిగూర్చి యెహోవా 12
తమ కాజ్ఞాపించెనో వాటిని చేసి పూజించుచుండిరి. ।
అయినను—మీ దుర్మార్గములను విడిచిపెట్టి, నేను మీ 13
పితరులకు ఆజ్ఞాపించినట్టియు, నా సేవకులగు ప్రవక్తల
ద్వారా మీకప్పగించినట్టియు ధర్మశాస్త్రమునుబట్టి నా
ఆజ్ఞలను కట్టడలను ఆచరించుడని సెలవిచ్చి, ప్రవక్తలం
దరిద్వారాను ప్రదర్శకులద్వారాను యెహోవా
ఇశ్రాయేలువారికిని యూదావారికిని సాక్ష్యము పలి
కించినను, । వారు విననివారై తమ దేవుడైన 14
యెహోవా దృష్టికి విశ్వాసఘాతుకులైన తమ పిత
రులు ముష్కరులైనట్లు తాము ముష్కరులైరి. ।
వారు ఆయన కట్టడలను, తమ పితరులతో ఆయన 15
చేసిన నిబంధనను, ఆయన తమకు నిర్ణయించిన ధర్మ
శాస్త్రమును విసర్జించి వ్యర్థమైనదాని అనుసరించుచు,
వ్యర్థులై—వారి వాడుకలచొప్పున మీరు చేయకూడ
దని యెహోవా తమకు సెలవిచ్చిన తమ చుట్టునున్న
ఆ జనుల మర్యాదల ననుసరించి వారినంటివారైరి. ।
వారు తమ దేవుడైన యెహోవా ఆజ్ఞలన్నిటిని 16
యనుసరింపక పోత విగ్రహములైన రెండు దూడలను
చేసి దేవతాస్తంభములను నిలిపి, ఆకాశసమూహము
నకు నమస్కరించి బయలుదేవతను పూజించిరి. ।
మరియు తమ కుమారులను కుమార్తెలను అగ్నిహోత్ర 17
ములో నడిపించి, శకునమును చిల్లంగితనమును వాడుక
చేసికొని యెహోవా దృష్టికి చెడుతనము చేయు
టకై తమ్మును తాము అమ్ముకొని, ఆయనకు కోపము
పుట్టించిరి. । కాబట్టి యెహోవా ఇశ్రాయేలువారి 18
యందు బహుగా కోపగించి, తన సముఖములోనుండి
వారిని వెళ్లగొట్టెను గనుక యూదాగోత్రము గాక
మరి యేగోత్రమును శేషించి యుండలేదు. । అయితే 19
యూదావారును తమ దేవుడైన యెహోవా ఆజ్ఞలను
విడిచిపెట్టినవారై ఇశ్రాయేలువారు చేసికొనిన కట్టడ
లను అనుసరించిరి. । అంతట యెహోవా ఇశ్రా 20
యేలువారి సంతతివారినందరిని విసర్జించి, వారిని
శ్రమపెట్టి దోపుడుగాండ్ల చేతికప్పగించి, వారిని తన
సముఖమునుండి వెళ్లగొట్టెను. । ఆయన ఇశ్రాయేలు 21
గోత్రములను దావీదు ఇంటివారిలోనుండి విడగొట్టి
వేయగా వారు నెబాతు కుమారుడైన యరొబామును
రాజుగా చేసికొనిరి. ఈ యరొబాము ఇశ్రాయేలు
వారు యెహోవాను అనుసరింపకుండ ఆయనమీద
వారిని తిరుగబడచేసి, వారు ఘోరపాపము చేయు
టకు కారకుడాయెను. । ఇశ్రాయేలువారు యరొ 22
బాము చేసిన పాపములలో దేనిని విడువక వాటి
ననుసరించుచు వచ్చిరి గనుక । తన సేవకులైన ప్రవక్తల 23
ద్వారా యెహోవా సెలవిచ్చిన మాటచొప్పున,
ఆయన ఇశ్రాయేలువారిని తన సముఖములోనుండి
వెళ్లగొట్టెను. ఆ హేతువుచేత వారు తమ స్వదేశ

ములోనుండి అష్షూరు దేశములోనికి చెరగొని పోబడిరి;
నేటివరకు వారచ్చట ఉన్నారు.
24 అష్షూరురాజు బాబెలు, కూతా, అవ్వా, హమాతు,
సెపర్వయీము అను దేశములలోనుండి జనులను
రప్పించి, ఇశ్రాయేలువారికి మారుగా షోమ్రోను పట్టణ
ములలో ఉంచెను గనుక వారు షోమ్రోను దేశమును
స్వతంత్రించుకొని దాని పట్టణములలో కాపురము
25 చేసిరి. । అయితే వారు కాపురముండ నారంభించి
నప్పుడు యెహోవాయందు భయభక్తులు లేనివారు
గనుక యెహోవా వారి మధ్యకు సింహములను పం
26 పెను, అవి వారిలో కొందరిని చంపెను. । —తమరు
పట్టుకొనిన షోమ్రోను పట్టణములలో తాముంచిన
జనులకు ఆ దేశపు దేవుని మర్యాద తెలియకున్నది
గనుక ఆయన సింహములను పంపించెను. ఇశ్రాయేలు
దేవుని మర్యాద వారికి తెలియనందున సింహములు
వారిని చంపుచున్నవని వారు అష్షూరురాజుతో మనవి
27 చేయగా । అష్షూరురాజు — అచ్చటనుండి తేబడిన
యాజకులలో ఒకనిని అచ్చటికి మీరు తోడుకొని
పోవుడి; అతడు అచ్చటికి పోయి కాపురముండి ఆ
దేశపు దేవుని మర్యాదను వారికి నేర్పవలెనని ఆజ్ఞా
28 పించెను. । కాగా షోమ్రోనులోనుండి వారు పట్టు
కొని వచ్చిన యాజకులలో ఒకడు వచ్చి బేతేలు
ఊరిలో కాపురముండి, యెహోవాయందు భయ
భక్తులుగా ఉండతగిన మర్యాదను వారికి బోధించెను
29 గాని । కొందరు జనులు తమ స్వంత దేవతలను పెట్టు
కొని షోమ్రోనీయులు కట్టుకొనిన ఉన్నతస్థలముల
మందిరములలో వాటిని ఉంచుచువచ్చిరి; మరియు
కొందరు తమ తమ పురములలో తమకు దేవతలను
30 కలుగజేసికొనిరి. । బాబెలువారు సుక్కోతు బెనోతు
దేవతను, కూతావారు నెర్గలు దేవతను, హమాతువారు
31 అషీమా దేవతను, । ఆవీయులు నిబ్హజు దేవతను తర్తాకు
దేవతను, ఎవరు వారి దేవతను పెట్టుకొనుచుండిరి.
సెపర్వీయులు తమ పిల్లలను అద్రమ్మెలెకు అనెమ్మెలెకు
అను సెపర్వయీముయొక్క దేవతలకు అగ్నిహోత్ర
32 మందు దహించుచుండిరి. । మరియు జనులు
యెహోవాకు భయపడి, ఉన్నత స్థలములనిమిత్తము
సామాన్యులలో కొందరిని యాజకులను చేసికొనగా
వారు జనులపక్షమున ఉన్నత స్థలములలో కట్టబడిన
33 మందిరములయందు బలులు అర్పించుచుండిరి. । ఈ
ప్రకారముగా వారు యెహోవాయందు భయభక్తులు
గలవారై యుండి, తాము ఏ జనులలోనుండి పట్ట
బడిరో ఆ యా జనుల మర్యాదచొప్పున తమ దేవ
34 తలను పూజించుచుండిరి. । నేటివరకు తమ పూర్వ
మర్యాదల ప్రకారము వారు చేయుచున్నారు;
యెహోవాయందు భయభక్తులు పూనక — వారితో
నిబంధనచేసి మీరు ఇతర దేవతలకు భయపడకయు,
వాటికి నమస్కరింపకయు, పూజచేయకయు, బలులు
అర్పింపకయు, । మహాద్భుతకార్యము చూపి బాహుబలము 35
చేత ఐగుప్తు దేశములోనుండి మిమ్మును రప్పించిన
యెహోవాయందు భయభక్తులు కలిగి ఆయనకు
మాత్రమే నమస్కారముచేసి బలులు అర్పింపవలెనని
ఇశ్రాయేలని పేరుపెట్టబడిన యాకోబు సంతతివారికి
సెలవిచ్చిన దేవుని సేవింపకయు । ఆయన ఆజ్ఞాపించిన 36
కట్టడలను గాని విధులను గాని ధర్మశాస్త్రమును గాని
ధర్మమందు దేనిని గాని అనుసరింపకయు ఉన్నారు. ।
మరియు—ఇతర దేవతలను పూజింపక మీరు బ్రదుకు 37
దినములన్నియు మోషే మీకు వ్రాసియిచ్చిన కట్టడ
లను విధులను, అనగా ధర్మశాస్త్రమును ధర్మమంతటిని
గైకొనవలెను. । నేను మీతో చేసిన నిబంధనను మరు 38
వకయు ఇతర దేవతలను పూజింపకయు ఉండవలెను. ।
మీ దేవుడైన యెహోవాయందు భయభక్తులుగల 39
వారై యుండిన యెడల ఆయన మీ శత్రువుల
చేతిలోనుండి మిమ్మును విడిపించునని ఆయన సెల
విచ్చినను । వారు ఆయన మాట వినక తమ పూర్వపు 40
మర్యాదచొప్పుననే జరిగించుచు వచ్చిరి. । ఆ ప్రజలు 41
ఆలాగున యెహోవాయందు భయభక్తులు గలవారై
నను తాము పెట్టుకొనిన విగ్రహములను పూజించుచు
వచ్చిరి. మరియు తమ పితరులు చేసినట్లు వారి యింటి
వారును వారి సంతతివారును నేటివరకు చేయు
చున్నారు.

ఇశ్రాయేలురాజును ఏలా కుమారుడునైన 18
హోషేయ యేలుబడిలో మూడవ సంవత్సరమందు
యూదారాజును ఆహాజు కుమారుడునైన హిజ్కియా
యేలనారంభించెను. । అతడు ఏలనారంభించినప్పుడు 2
ఇరువది యయిదేండ్లవాడై యెరూషలేమునందు ఇరు
వది తొమ్మిది సంవత్సరములు ఏలెను. అతని తల్లి జెకర్యా
కుమార్తె; ఆమెకు అబీ అని పేరు. । తన పితరుడైన 3
దావీదు చేసినట్లు అతడు యెహోవా దృష్టికి పూర్ణ
ముగా నీతిననుసరించెను. । ఉన్నత స్థలములను కొట్టి 4
వేసి విగ్రహములను పగలగొట్టి దేవతాస్తంభములను
పడగొట్టి మోషేచేసిన యిత్తడి సర్పమును ఛిన్నాభిన్న
ములుగా చేసెను. దానికి ఇశ్రాయేలీయులు నెహూ
ష్టానను పేరుపెట్టి దానికి ధూపము వేయుచు వచ్చి
యుండిరి. । అతడు ఇశ్రాయేలీయుల దేవుడైన 5
యెహోవాయందు విశ్వాసముంచినవాడు; అతని
తరువాత వచ్చిన యూదా రాజులలోను అతని
పూర్వికులైన రాజులలోను అతనితో సమమైనవాడు
ఒకడునులేడు. । అతడు యెహోవాతో హత్తుకొని, 6
ఆయనను వెంబడించకుండ వెనుక తీయక ఆయన
మోషేకు ఆజ్ఞాపించిన ఆజ్ఞలన్నిటిని గైకొనుచుండెను. ।
కావున యెహోవా అతనికి తోడుగా ఉండెను; 7
తాను వెళ్లిన చోటనెల్ల అతడు జయము పొందెను.

అతడు అష్షూరు రాజుకు సేవచేయకుండ అతనిమీద
8 తిరుగబడెను. । మరియు గాజా పట్టణము పర్యంత
మును దాని సరిహద్దుల పర్యంతమును, కాపరుల గుడి
సెలయందేమి, ప్రాకారములుగల పట్టణములయందేమి,
అంతటను అతడు ఫిలిష్తీయులను ఓడించెను.
9 రాజైన హిజ్కియా యేలుబడిలో నాలుగవ సం
వత్సరమందు, ఇశ్రాయేలురాజైన ఏలా కుమారుడగు
హోషేయ యేలుబడిలో ఏడవ సంవత్సరమందు,
అష్షూరురాజైన షల్మనేసెరు షోమ్రోను పట్టణముమీదికి
10 వచ్చి ముట్టడివేసెను. । మూడు సంవత్సరములు పూర్తి
యైన తరువాత అష్షూరీయులు దాని పట్టుకొనిరి.
హిజ్కియా యేలుబడిలో ఆరవ సంవత్సరమందు,
ఇశ్రాయేలురాజైన హోషేయ యేలుబడిలో తొమ్మి
దవ సంవత్సరమందు షోమ్రోను పట్టణము పట్టబడెను.।
11 తమ దేవుడైన యెహోవా సెలవిచ్చిన మాట వినని
వారై ఆయన నిబంధనకును ఆయన సేవకుడైన మోషే
ఆజ్ఞాపించిన దానంతటికిని లోబడక అతిక్రమించి
12 యుండిరి. । అష్షూరు రాజు ఇశ్రాయేలు వారిని
అష్షూరు దేశములోకి తీసికొని పోయి గోజాను నది
దగ్గరనున్న హాలహు హాబోరు అను పట్టణములలోను
మాదీయుల పట్టణములలోను వారిని ఉంచెను.
13 రాజైన హిజ్కియా యేలుబడిలో పదునాలుగవ
సంవత్సరమందు అష్షూరురాజైన సన్హైరీబు యూదా
దేశమందున్న ప్రాకారములుగల పట్టణములన్నిటి
14 మీదికి వచ్చి వాటిని పట్టుకొనగా । యూదారాజైన
హిజ్కియా లాకీషు పట్టణమందున్న అష్షూరు రాజు
నొద్దకు దూతలను పంపి—నావలన తప్పు వచ్చినది;
నాయొద్దనుండి తిరిగి నీవు వెళ్లిపోయినయెడల నామీద
నీవు మోపినదానిని నేను భరించుదునని వర్తమానము
చేయగా, అష్షూరురాజు యూదారాజైన హిజ్కి
యాకు ఆరు నూరుల మణుగుల వెండియు అరువది
మణుగుల బంగారమును జుల్మానాగా నియమించెను. ।
15 కావున హిజ్కియా యెహోవా మందిరమందును
రాజనగరునందునున్న పదార్థములలో కనబడిన
16 వెండియంతయు అతనికిచ్చెను. । మరియు ఆ కాల
మందు హిజ్కియా దేవాలయపు తలుపులకున్న బం
గారమును తాను కట్టించిన స్తంభములకున్న బంగార
17 మును తీయించి అష్షూరురాజుకిచ్చెను. । అంతట
అష్షూరురాజు తర్తానును రబ్సారీసును రబ్షాకేనును
లాకీషు పట్టణమునుండి యెరూషలేమునందున్న రాజైన
హిజ్కియామీదికి బహు గొప్ప సమూహముతో పం
పెను. వారు యెరూషలేముమీదికి వచ్చి చాకిరేవు
మార్గమందున్న మెరకకొలను కాలువయొద్ద ప్రవేశించి
18 నిలిచి రాజును పిలువనంపగా । గృహనిర్వాహకుడగు
హిల్కీయా కుమారుడైన ఎల్యాకీమును, ప్రధానమంత్రి
యగు షెబ్నాయును, లేఖికుడగు ఆసాపు కుమారు
డైన యోవాహును వారియొద్దకు పోయిరి. । అప్పుడు 19
రబ్షాకే వారితో ఇట్లనెను—ఈ మాట హిజ్కియాతో
తెలియజెప్పుడు — మహారాజైన అష్షూరురాజు సెల
విచ్చినదేమనగా — నీవు ఈలాగు చెప్పవలెను. నీవు
నమ్ముకొను ఈ ఆశ్రయాస్పదము ఏపాటి ప్రయోజన
కారి? । యుద్ధవిషయములో నీ యోచనయు నీ బల 20
మును వట్టి మాటలే. ఎవని నమ్ముకొని నామీద తిరుగ
బాటు చేయుచున్నావు? । నలిగిన రెల్లువంటి యీ 21
ఐగుప్తును నీవు నమ్ముకొనుచున్నావు గదా? ఒకడు
దానిమీద ఆనుకొన్నయెడల అది వానిచేతికి గుచ్చు
కొని దూసిపోవును. ఐగుప్తురాజైన ఫరో అతని నమ్ము
కొను వారికందరికిని అట్టివాడే. । — మా దేవుడైన 22
యెహోవాను మేము నమ్ముకొనుచున్నామని మీరు
నాతో చెప్పెదరేమో సరే. — యెరూషలేమందున్న
యీ బలిపీఠమునొద్ద మాత్రమే మీరు నమస్కారము
చేయవలెనని యూదావారికిని యెరూషలేమువారికిని
ఆజ్ఞ ఇచ్చి హిజ్కియా యెవని ఉన్నతస్థలములను
బలిపీఠములను పడగొట్టెనో ఆయన నేగదా యెహోవా?।
కావున చిత్తగించి అష్షూరురాజైన నా యేలినవానితో 23
పందెము వేయుము; రెండువేల గుర్రములమీద రౌతు
లను ఎక్కించుటకు నీకు శక్తి యున్నయెడల నేను
వాటిని నీకిచ్చెదను. । అట్లయితే నా యజమానుని 24
సేవకులలో అత్యల్పుడైన అధిపతియగు ఒకని నీవే
లాగు ఎదిరింతువు? రథములను రౌతులను పంపునని
ఐగుప్తురాజును నీవు ఆశ్రయించుకొంటివే. ।
యెహోవా సెలవునొందకయే ఈ దేశమును పాడు 25
చేయుటకు నేను వచ్చితినా? లేదు;—ఆ దేశముమీదికి
పోయి దాని పాడుచేయుమని యెహోవా నాకు
ఆజ్ఞ ఇచ్చెను. । హిల్కీయా కుమారుడైన ఎల్యాకీము 26
షెబ్నాయు యోవాహు అనువారు—చిత్తగించుము,
నీ దాసులమైన మాకు అరాము భాష తెలియును
గనుక దానితో మాటలాడుము; ప్రాకారముమీద
నున్న ప్రజల వినికిడిలో యూదుల భాషతో మాట
లాడకుమని రబ్షాకేతో అనగా । రబ్షాకే—ఈ మాటలు 27
చెప్పుటకై నా యజమానుడు నీ యజమానునియొద్ద
కును నీయొద్దకును నన్ను పంపెనా? తమ మలమును
తినుచు తమ మూత్రమును త్రాగుచు మీతోకూడ
ప్రాకారముమీద కూర్చున్నవారియొద్దకును నన్ను
పంపెనుగదా అని చెప్పి । గొప్పశబ్దముతో యూదా 28
భాషతో ఇట్లనెను—మహారాజైన అష్షూరురాజు సెల
విచ్చిన మాటలు వినుడి. రాజు సెలవిచ్చునదేమనగా ।
—హిజ్కియాచేత మోసపోకుడి; నా చేతిలోనుండి 29
మిమ్మును విడిపింప శక్తి వానికి చాలదు. । యెహోవాను 30
బట్టి మిమ్మును నమ్మించి — యెహోవా మనలను విడి
పించును, ఈ పట్టణము అష్షూరురాజు చేతిలో
చిక్కకపోవునని హిజ్కియా చెప్పుచున్నాడే. ।

31 హిజ్కియా చెప్పిన మాట మీరంగీకరింపవద్దు; అష్షూరు
రాజు సెలవిచ్చునదేమనగా — నాతో సంధిచేసి నా
యొద్దకు మీరు బయటికి వచ్చినయెడల మీలో ప్రతి
మనిషి తన ద్రాక్షచెట్టు ఫలమును తన అంజూరపు
చెట్టు ఫలమును తినుచు తన బావి నీళ్లు పానము
32 చేయుచు ఉందును. । అటుపిమ్మట మీరు చావక
బ్రదుకునట్లుగా మేము వచ్చి మీ దేశమువంటి దేశ
మునకు, అనగా గోధుమలును ద్రాక్షారసమునుగల
దేశమునకును, ఆహారమును ద్రాక్షచెట్లునుగల దేశ
మునకును, ఒలీవతైలమును తేనెయునుగల దేశమున
కును మిమ్మును తీసికొని పోవుదును; అచ్చట మీరు
సుఖముగా నుందురు. కావున—యెహోవా మిమ్మును
విడిపించునని చెప్పి హిజ్కియా మీకు బోధించు
33 మాటలను వినవద్దు. । ఆ యా జనముల దేవతలలో
ఏదైనను తన దేశమును అష్షూరురాజు చేతిలోనుండి
34 విడిపించెనా? । హమాతు దేవతలు ఏమాయెను?
అర్పాదు దేవతలు ఏమాయెను? సెపర్వయీము దేవతలు
ఏమాయెను? హేన ఇవ్వా అనువారి దేవతలు ఏమా
యెను? షోమ్రోను దేశపు దేవత మా చేతిలోనుండి
35 ఆ పట్టణమును విడిపించలేదు గదా? । యెహోవా
మా చేతిలోనుండి యెరూషలేమును విడిపించుననుటకు
ఆ యా దేశముల దేవతలలో ఏదైనను తన దేశమును
36 మా చేతిలోనుండి విడిపించినది కలదా? । అయితే—
అతనికి ప్రత్యుత్తరమియ్యవద్దని రాజు సెలవిచ్చి యుం
డుటచేత జనులు ఎంతమాత్రమును ప్రత్యుత్తరమియ్యక
37 ఊరకుండిరి. । గృహనిర్వాహకుడును హిల్కీయా
కుమారుడునైన ఎల్యాకీమును, ప్రధానమంత్రియగు
షెబ్నాయును, లేఖకుడగు ఆసాపు కుమారుడైన
యోవాహును, బట్టలు చింపుకొని హిజ్కియాయొద్దకు
వచ్చి రబ్షాకే పలికిన మాటలన్నియు తెలియజెప్పిరి.

19 హిజ్కియా విని తన బట్టలు చింపుకొని గోనె
పట్ట కట్టుకొని యెహోవా మందిరమునకు పోయి ।
2 గృహనిర్వాహకుడగు ఎల్యాకీమును, ప్రధానమంత్రి
యగు షెబ్నాను, యాజకులలో పెద్దలను, ఆమోజు
కుమారుడును ప్రవక్తయునైన యెషయాయొద్దకు పం
3 పెను. । వీరు గోనెపట్ట కట్టుకొని అతనియొద్దకు వచ్చి
అతనితో ఇట్లనిరి—హిజ్కియా సెలవిచ్చునదేమనగా
— ఈ దినము శ్రమయు శిక్షయు దూషణయు గల
దినము; పిల్లలు పుట్టవచ్చిరి గాని కనుటకు శక్తి చాలదు.।
4 జీవముగల దేవుని దూషించుటకై అష్షూరురాజైన తన
యజమానునిచేత పంపబడిన రబ్షాకే పలికిన మాటల
న్నియు నీ దేవుడైన యెహోవా ఒకవేళ ఆలకించి,
నీ దేవుడైన యెహోవాకు వినబడియున్న ఆ మాట
లనుబట్టి ఆయన అష్షూరురాజును గద్దించునేమో. కాబట్టి
నిలిచిన శేషముకొరకు నీవు హెచ్చుగా ప్రార్థన
5 చేయుము. । రాజైన హిజ్కియా సేవకులు యెషయా
యొద్దకు రాగా । యెషయా వారితో ఇట్లనెను—మీ 6
యజమానునికి ఈ మాట తెలియజేయుడి - యెహోవా
సెలవిచ్చునదేమనగా—అష్షూరురాజు పనివారు నన్ను
దూషింపగా నీవు వినిన మాటలకు భయపడవద్దు. ।
అతనిలో ఒక యాత్మను నేను పుట్టింతును; అతడు 7
వదంతి విని తన దేశమునకు వెళ్లిపోవును; తన దేశ
మందు కత్తిచేత అతని కూలచేయుదును.

అష్షూరురాజు లాకీషు పట్టణమును విడిచి వెళ్లి 8
లిబ్నామీద యుద్ధము చేయుచుండగా రబ్షాకే పోయి
అతని కలిసికొనెను. । అంతట కూషురాజైన తిర్హాకా 9
తనమీద యుద్ధము చేయుటకువచ్చెనని అష్షూరురాజుకు
వినబడినప్పుడు, అతడు ఇంకొకసారి హిజ్కియా
యొద్దకు దూతలను పంపి యీలాగు ఆజ్ఞ ఇచ్చెను ।—
యూదారాజగు హిజ్కియాతో ఈలాగు చెప్పుడి— 10
యెరూషలేము అష్షూరురాజుచేతికి అప్పగింపబడదని
చెప్పి నీవు నమ్ముకొనియున్న నీ దేవునిచేత మోసపో
కుము. । అష్షూరురాజులు సకల దేశములను బొత్తిగా 11
నశింపజేసిన సంగతి నీకు వినబడినది గదా? నీవు
మాత్రము తప్పించుకొందువా? । నా పితరులు నిర్మూ 12
లముచేసిన గోజానువారు గాని, హారానువారు గాని,
రెజెపులు గాని, తెలశ్శారులోనుండిన ఏదెనీయులు
గాని తమ దేవతల సహాయమువలన తప్పించుకొనిరా? ।
హమాతు రాజు ఏమాయెను? అర్పాదురాజును సెపర్వ 13
యీము హేన ఇవ్వా అను పట్టణముల రాజులును
ఏమైరి? । హిజ్కియా దూతలచేతిలోనుండి ఆ ఉత్త 14
రము తీసికొని చదివి, యెహోవా మందిరములోకి
పోయి యెహోవా సన్నిధిని దాని విప్పి పరచి ।
యెహోవా సన్నిధిని ఇట్లని ప్రార్థనచేసెను — 15
యెహోవా, కెరూబుల మధ్యను నివసించుచున్న
ఇశ్రాయేలీయుల దేవా, భూమ్యాకాశములను కలుగ
జేసిన అద్వితీయ దేవా, నీవు లోకమందున్న సకల
రాజ్యములకు దేవుడవై యున్నావు. । యెహోవా, 16
చెవియొగ్గి ఆలకింపుము; యెహోవా, కన్నులు తెరచి
దృష్టించుము; జీవముగల దేవుడవైన నిన్ను దూషించు
టకై సన్హెరీబు పంపినవాని మాటలను చెవినిబెట్టుము. ।
యెహోవా, అష్షూరురాజులు ఆ జనములను వారి 17
దేశములను పాడుచేసి । వారి దేవతలను అగ్నిలో వేసి 18
నది నిజమే. ఆ రాజ్యముల దేవతలు నిజమైన దేవుండ్లు
కాక మనుష్యులచేత చేయబడిన కఱ్ఱలు రాళ్లే గనుక
వారు వారిని నిర్మూలముచేసిరి. । యెహోవా మా 19
దేవా, లోకమందున్న సమస్త జనులు నీవే నిజముగా
అద్వితీయ దేవుడవైన యెహోవావని తెలిసికొను
నట్లుగా అతనిచేతిలోనుండి మమ్మును రక్షించుము.

అంతట ఆమోజు కుమారుడైన యెషయా హిజ్కి 20
యాయొద్దకు ఈ వర్తమానము పంపెను — ఇశ్రాయేలీ
యుల దేవుడగు యెహోవా సెలవిచ్చునదేమనగా—

అష్షూరురాజైన సన్హెరీబు విషయమందు నీవు నా
యెదుట చేసిన ప్రార్థన నేను అంగీకరించియు
21 న్నాను. | అతనిగూర్చి యెహోవా సెలవిచ్చుమాట
యేదనగా — సీయోను కుమారియైన కన్యక నిన్ను
హీనముచేయుచున్నది; నిన్ను అపహాస్యము చేయు
చున్నది; యెరూషలేము కుమారి నిన్ను చూచి తల
22 ఊచుచున్నది. | నీవు ఎవని తిరస్కరించితివి? ఎవని
దూషించితివి? నీవు గర్వించి యెవని భయపెట్టితివి?
23 ఇశ్రాయేలీయుల పరిశుద్ధ దేవుని నేగదా? | నీ దూతల
చేత యెహోవాను తిరస్కరించి పలికించినమాటలు
ఏవేగదా

— నా రథముల సముదాయముతో నేను పర్వత
శిఖరములకును
లెబానోను పార్శ్వములకును ఎక్కియున్నాను
ఎత్తుగల దాని దేవదారు వృక్షములను
శ్రేష్ఠమైన సరళవృక్షములను నరికివేసి యున్నాను
వాని మారుపు సరిహద్దులలోనున్న సత్రముల
లోనికిని
కర్మెలు అను వాని ఫలవంతములగు క్షేత్రమైన
అడవిలోనికిని
ప్రవేశించి యున్నాను.
24 నేను త్రవ్వి పరుల నీళ్లు పానము చేసియున్నాను
నా అరికాలిచేత నేను దిట్టమైన స్థలముల నదుల
నన్నిటిని ఎండిపో జేసియున్నాను.
25 నేనే పూర్వమందే దీని కలుగజేసితిననియు
పురాతనకాలమందే దీని నిర్ణయించితిననియు
నీకు వినబడలేదా?
ప్రాకారములుగల పట్టణములను నీవు పాడు దిబ్బ
లుగా చేయుట నావలననే సంభవించినది.
26 కాబట్టి వాటి కాపురస్థులు బలహీనులై జడిసిరి
విభ్రాంతినొంది పొలములోని గడ్డివలెను
కాడవేయని చేలవలెను అయిరి.
27 నీవు కూర్చుండుటయు బయలువెళ్లుటయు
లోపలికి వచ్చుటయు నామీదవేయు రంకెలును
నాకు తెలిసేయున్నవి.
28 నామీద నీవు వేయు రంకెలును
నీవు చేసిన కలహమును నా చెవులలో జొచ్చెను
గనుక నా గాలమును నీ ముక్కుకు తగిలించెదను.
నా కళ్లెము నీ నోటిలో పెట్టి నిన్ను మళ్లించెదను
నీవు వచ్చిన మార్గముననే నిన్ను మళ్లించెదను.
29 మరియు యెషయా చెప్పినదేమనగా—హిజ్కియా,
నీకిదే సూచనయగును. ఈ సంవత్సరమందు దానంతట
అదే పండు ధాన్యమును, రెండవ సంవత్సరమందు ఆ
రీతినే పండు ధాన్యమును మీరు భుజింతురు, మూడవ
సంవత్సరమున మీరు విత్తనము విత్తి చేలు కోయుదురు;
ద్రాక్షతోటలు వాటి వాటి ఫలము అనుభవించు
దురు. | యూదావంశములో తప్పించుకొనిన శేషము 30
ఇంకను క్రిందికి వేరు తన్ని మీదికి ఎదిగి ఫలించును. |
శేషించువారు యెరూషలేములోనుండి బయలుదేరు 31
దురు; తప్పించుకొనినవారు సీయోను కొండలో
నుండి బయలుదేరుదురు; సైన్యముల కధిపతియగు
యెహోవా ఆసక్తి దీని నెరవేర్చును. | కాబట్టి అష్షూరు 32
రాజునుగూర్చి యెహోవా సెలవిచ్చునదేమనగా —
అతడు ఈ పట్టణములోనికి రాడు; దానిమీద ఒక
బాణమైన ప్రయోగింపడు; ఒక కేడెమైనను దానికి
కనుపరచడు; దాని యెదుట ముట్టడిదిబ్బ కట్టడు. |
ఈ పట్టణము లోపలికి రాక తాను వచ్చిన మార్గము 33
ననే అతడు తిరిగి పోవును; ఇదే యెహోవా
వాక్కు. | నా నిమిత్తమును నా సేవకుడైన దావీదు 34
నిమిత్తమును నేను ఈ పట్టణమును కాపాడి రక్షించు
దును.

ఆ రాత్రియే యెహోవా దూత బయలుదేరి 35
అష్షూరువారి దండు పేటలో జొచ్చి లక్ష యెనుబది
యయిదు వేలమందిని హతముచేసెను. ఉదయమున
జనులు లేచి చూడగా వారందరును మృతకళేబరములై
యుండిరి. | అష్షూరురాజైన సన్హెరీబు తిరిగి పోయి 36
నీనెవె పట్టణమునకు వచ్చి నివసించిన తరువాత | అతడు 37
నిస్రోకు అను తన దేవత మందిరమందు మ్రొక్కు
చుండగా అతని కుమారులైన అద్రమ్మెలెకును షరెజె
రును ఖడ్గముతో అతని చంపి అరారాతు దేశములోనికి
తప్పించుకొని పోయిరి; అప్పుడు అతని కుమారుడైన
ఏసర్హద్దోను అతనికి మారుగా రాజాయెను.

ఆ దినములలో హిజ్కియాకు మరణకరమైన 20
రోగము కలుగగా ఆమోజు కుమారుడును ప్రవక్త
యునైన యెషయా అతనియొద్దకు వచ్చి—నీవు మరణ
మవుచున్నావు, బ్రదుకవు గనుక నీవు నీ కుటుంబికులకు
మరణశాసనము తెలియజేయుమని యెహోవా సెల
విచ్చుచున్నాడని చెప్పగా | అతడు తన ముఖము గోడ 2
తట్టు త్రిప్పుకొని | — యెహోవా, యథార్థహృద 3
యుడనై, సత్యముతో నీ సన్నిధిని నేనెట్లు నడుచు
కొంటినో, నీ దృష్టికి అనుకూలముగా సమస్తమును
నేనెట్లు జరిగించితినో కృపతో జ్ఞాపకము చేసికొను
మని హిజ్కియా కన్నీళ్లు విడుచుచు యెహోవాను
ప్రార్థించెను. | యెషయా నడిమిశాలలోనుండి అవత 4
లకు వెళ్లకమునుపే యెహోవా వాక్కు అతనికి
ప్రత్యక్షమై ఈలాగు సెలవిచ్చెను. | —నీవు తిరిగి నా 5
ప్రజలకు అధిపతియైన హిజ్కియాయొద్దకు పోయి
అతనితో ఇట్లనుము—నీ పితరుడైన దావీదుకు దేవు
డగు యెహోవా నీకు సెలవిచ్చునదేమనగా — నీవు
కన్నీళ్లు విడుచుట చూచితిని; నీ ప్రార్థన నేనంగీక
రించి యున్నాను; నేను నిన్ను బాగుచేసెదను; మూ
డవ దినమున నీవు యెహోవా మందిరమునకు పోవు

6 దువు; । ఇంక పదునయిదు సంవత్సరముల ఆయు
ష్యము నీకిచ్చెదను; మరియు నా నిమిత్తమును నా
సేవకుడైన దావీదు నిమిత్తమును ఈ పట్టణమును నేను
కాపాడుచు, నిన్నును ఈ పట్టణమును అష్షూరురాజు
7 చేతిలో పడకుండ నేను విడిపించెదను. । పిమ్మట
యెషయా — అంజూరపుపండ్ల ముద్ద తెప్పించుడని
చెప్పగా వారు దాని తెచ్చి కురుపుమీద వేసినతరు
8 వాత అతడు బాగుపడెను. । — యెహోవా నన్ను
స్వస్థపరచుననుటకును, నేను మూడవ దినమున ఆయన
మందిరమునకు పోవుదుననుటకును సూచన ఏదని
హిజ్కియా యెషయాను అడుగగా యెషయా యిట్ల
9 నెను । — తాను సెలవిచ్చిన మాట యెహోవా నెర
వేర్చుననుటకు ఆయన దయచేసిన సూచన ఏదనగా,
నీడ పదిమెట్లు ముందుకు నడిచెనుగదా? అది పది
10 మెట్లు వెనుకకు నడిచినయెడల అవునా? । అందుకు
హిజ్కియా యిట్లనెను — నీడ పదిమెట్లు ముందరికి
నడుచుట అల్పము గాని నీడ పది గడులు వెనుకకు
11 నడుచుట (చాలును.) । ప్రవక్తయగు యెషయా
యెహోవాను ప్రార్థింపగా ఆయన ఆహాజు గడి
యారపు పలకమీద పదిమెట్లు ముందరికి నడిచిన నీడ
పదిమెట్లు వెనుకకు తిరిగిపోవునట్లు చేసెను.

12 ఆ కాలమందు బాబెలురాజును బలదాను కుమా
రుడునైన బెరోదక్బలదాను హిజ్కియా రోగియై
యుండిన సంగతి విని, పత్రికలను కానుకను అతని
13 యొద్దకు పంపగా । హిజ్కియా, దూతలు వచ్చిన
మాట విని వారిని లోపలికి రప్పించి, తన నగరునం
దేమి రాజ్యమందేమి కలిగిన సమస్త వస్తువులలో
దేనిని మరుగుచేయక తన పదార్థములుగల కొట్టును,
వెండి బంగారములను, గంధవర్గములను పరిమళ తైల
మును, ఆయుధశాలలను, తన పదార్థములలోనున్న
14 సమస్తమును వారికి చూపించెను. । పిమ్మట ప్రవక్తయైన
యెషయా రాజైన హిజ్కియాయొద్దకు వచ్చి — ఆ
మనుష్యులు ఏమనిరి? నీయొద్దకు ఎక్కడినుండి వచ్చిరి?
అని అడుగగా హిజ్కియా—బాబెలను దూరదేశము
15 నుండి వారు వచ్చి యున్నారని చెప్పెను. । — నీ
యింటిలో వారు ఏమేమి చూచిరని అతడడుగగా
హిజ్కియా — నా పదార్థములలో దేనిని మరుగు
చేయక నా యింటిలోనున్న సమస్తమును నేను వారికి
16 చూపించి యున్నాననెను. । అంతట యెషయా
హిజ్కియాతో ఇట్లనెను—యెహోవా సెలవిచ్చు
17 మాట వినుము । — వచ్చు దినములలో ఏమియు మిగుల
కుండ నీ నగరునందున్న సమస్తమును, నేటివరకు నీ పిత
రులు సమకూర్చి దాచిపెట్టిన దంతయును బాబెలు
పట్టణమునకు ఎత్తికొని పోబడునని యెహోవా
18 సెలవిచ్చుచున్నాడు. । మరియు నీ గర్భమందు పుట్టిన
నీ పుత్రసంతును బాబెలురాజు నగరునందు నపుంస
కులగా చేయుటకై వారు తీసికొనిపోవుదురు. ।
అందుకు హిజ్కియా—నీవు తెలియజేసిన యెహోవా 19
ఆజ్ఞచొప్పున జరుగుట మేలే; నా దినములలో సమా
ధానము సత్యము కలిగినయెడల మేలేగదా అని యెష
యాతో అనెను. । హిజ్కియా చేసిన యితర కార్య 20
ములను గూర్చియు, అతని పరాక్రమమంతటిని గూ
ర్చియు, అతడు కొలను త్రవ్వించి కాలువ వేయించి
పట్టణములోకి నీళ్లు రప్పించినదానిని గూర్చియు,
యూదారాజుల వృత్తాంతముల గ్రంథమందు వ్రాయ
బడి యున్నది. । హిజ్కియా తన పితరులతో కూడ 21
నిద్రించగా అతని కుమారుడైన మనష్షే అతనికి
మారుగా రాజాయెను.

మనష్షే యేలనారంభించినప్పుడు పన్నెండేండ్ల **21**
వాడై యెరూషలేములో ఏబదియయిదు సంవత్సర
ములు ఏలెను; అతని తల్లిపేరు హెఫ్సిబా. । అతడు 2
యెహోవా దృష్టికి చెడుతనము జరిగించుచు, ఇశ్రా
యేలీయులయెదుట నిలువకుండ యెహోవా వెళ్ల
గొట్టిన జనములు చేసినట్లు హేయక్రియలు చేయుచు
వచ్చెను. । తన తండ్రియైన హిజ్కియా పడగొట్టిన 3
ఉన్నత స్థలములను అతడు తిరిగి కట్టించి, బయలు
దేవతకు బలిపీఠములను కట్టించి, ఇశ్రాయేలురాజైన
అహాబు చేసినట్లు దేవతాస్తంభములను చేయించి, నక్ష
త్రములకు మ్రొక్కి వాటిని పూజించుచుండెను. ।
మరియు—నా నామము ఉంచుదునని యెహోవా 4
సెలవిచ్చిన యెరూషలేములో అతడు యెహోవా
మందిరమందు బలిపీఠములను కట్టించెను. । మరియు 5
యెహోవా మందిరమునకున్న రెండు సాలలలో
నక్షత్రములకు అతడు బలిపీఠములను కట్టించెను. ।
అతడు తన కుమారుని అగ్నిహోత్రములో నడి 6
పించి, జ్యోతిషమును శకునములను వాడుకచేసి,
యక్షిణిగాండ్లతోను సోదెగాండ్లతోను సాంగత్యము
చేసెను. ఈ ప్రకారము అతడు యెహోవా దృష్టికి
బహుగా చెడుతనము జరిగించుచు ఆయనకు కోపము
పుట్టించెను. । యెహోవా దావీదుకును అతని కుమా 7
రుడైన సొలొమోనుకును ఆజ్ఞ ఇచ్చి — ఈ మందిర
మున ఇశ్రాయేలు గోత్రస్థానములలోనుండి నేను
కోరుకొనిన యెరూషలేమునందు నా నామమును
సదాకాలము ఉంచుదునని సెలవిచ్చిన యెహోవా
మందిరమందు తాను చేయించిన అషేరా ప్రతిమను
ఉంచెను. । మరియు — ఇశ్రాయేలీయులకు నేను 8
ఆజ్ఞాపించినదంతటిని, నా సేవకుడగు మోషే వారికి
వ్రాసియిచ్చిన ధర్మశాస్త్రమును వారు గైకొనినయెడల
వారి పితరులకు నేనిచ్చిన దేశములోనుండి వారి
పాదములను ఇక తొలగి పోనియ్యనని యెహోవా
సెలవిచ్చిన మాట వారు వినక । ఇశ్రాయేలీయుల 9
యెదుట నిలువకుండ యెహోవా లయముచేసిన

జనములు జరిగించిన చెడుతనమును మించిన చెడు
10 తనము చేయునట్లు మనష్షే వారిని రేపెను. । కాగా
యెహోవా తన సేవకులైన ప్రవక్తలద్వారా ఈలాగు
11 సెలవిచ్చెను. । — యూదారాజైన మనష్షే యీ
హేయమైన కార్యములను చేసి, తనకు ముందున్న
అమోరీయులను మించిన చెడునడత కనుపరచి, తాను
పెట్టుకొనిన విగ్రహములవలన యూదావారు
12 పాపము చేయుటకు కారకుడాయెను. । కావున ఇశ్రా
యేలీయుల దేవుడైన యెహోవా సెలవిచ్చునదే
మనగా—వినువారి రెండు చెవులు గింగురుమనునంత
కీడు యెరూషలేము మీదికిని యూదావారి మీదికిని
13 రప్పించుచు । నేను షోమ్రోనును కొలిచిన నూలును,
అహాబు కుటుంబికులను సరిచూచిన మట్టపు గుండును
యెరూషలేముమీద సాగలాగుదును; ఒకడు పళ్లెమును
తుడుచునప్పుడు దాని బోర్లించి తుడుచునట్లు నేను
14 యెరూషలేమును తుడిచివేసెదను. । మరియు నా స్వా
స్థ్యములో శేషించినవారిని నేను త్రోసివేసి వారి శత్రు
15 వుల చేతికి వారిని అప్పగించెదను. । వారు తమ పితరులు
ఐగుప్తుదేశములోనుండి వచ్చిన నాటనుండి నేటివరకు
నా దృష్టికి కీడుచేసి నాకు కోపము పుట్టించుచున్నారు
గనుక వారు తమ శత్రువులందరిచేత దోచబడి నష్టము
16 నొందుదురు. । మరియు మనష్షే యెహోవా దృష్టికి
చెడునడత నడిచి, యూదావారిని పాపములో
ముంచిన యెరూషలేము ఈ కొననుండి ఆ కొనవరకు
రక్తముతో నిండునట్లు నిరపరాధుల రక్తమును బహుగా
17 ఒలికించెను. । మనష్షే చేసిన యితర కార్యములను
గూర్చియు, అతడు చేసినదానినంతటిని గూర్చియు,
అతడు చేసిన దోషమునుగూర్చియు, యూదారాజుల
వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడియున్నది. ।
18 మనష్షే తన పితరులతోకూడ నిద్రించి ఉజ్జా అను
తన నగరుతోటలో సమాధిచేయబడెను; అతని కుమారు
డైన ఆమోను అతనికి మారుగా రాజాయెను.
19 ఆమోను ఏలనారంభించినప్పుడు ఇరువది రెండేండ్ల
వాడై యెరూషలేమునందు రెండు సంవత్సరములు
ఏలెను; అతని తల్లి యొట్బదేశస్థుడగు హారూసు కుమా
20 ర్తెయైన మెషుల్లెమెతు. । అతడు తన తండ్రియైన
మనష్షే నడిచినట్లు యెహోవా దృష్టికి చెడునడత
21 నడిచెను. । తన పితరుల దేవుడైన యెహోవాను
22 విసర్జించి యెహోవా మార్గమందు నడువక తన
తండ్రి ప్రవర్తించినట్లు తానును ప్రవర్తించుచు, తన
తండ్రి పూజించిన విగ్రహములను తానును పూజిం
23 చెను. । ఆమోను సేవకులు అతనిమీద కుట్రచేసి
24 అతని నగరునందు అతని చంపగా । దేశపు జనులు
రాజైన ఆమోనుమీద కుట్రచేసిన వారినందరిని చంపి
అతని కుమారుడైన యోషీయాను అతనికి మారుగా
25 పట్టాభిషేకము చేసిరి. । ఆమోను చేసిన యితర కార్య
ములనుగూర్చి యూదారాజుల వృత్తాంతముల గ్రంథ
మందు వ్రాయబడియున్నది. । ఉజ్జాయొక్క 26
తోటలో అతనికి కలిగిన సమాధియందు అతడు పాతి
పెట్టబడెను; అతని కుమారుడైన యోషీయా అతనికి
మారుగా రాజాయెను.

యోషీయా యేలనారంభించినప్పుడు ఎనిమి 22
దేండ్లవాడై యెరూషలేమునందు ముప్పదియొక సంవ
త్సరములు ఏలెను; అతని తల్లి బొస్కతు ఊరివాడగు
అదాయాకు కుమార్తెయైన యెదీదా. । అతడు 2
యెహోవా దృష్టికి యథార్థముగా నడుచుచు, కుడి
యెడమలకు తిరుగక తన పితరుడగు దావీదు చూపిన
ప్రవర్తనకు సరిగా ప్రవర్తించెను.
రాజైన యోషీయా యేలుబడిలో పదునెనిమిదవ 3
సంవత్సరమందు, మెషుల్లాముకు పుట్టిన అజల్యా
కుమారుడును ప్రధానమంత్రియునైన షాఫానును
యెహోవా మందిరమునకు పొమ్మని చెప్పి రాజు
అతనితో ఈలాగు సెలవిచ్చెను । — నీవు ప్రధాన 4
యాజకుడైన హిల్కీయా యొద్దకు పోయి, ద్వారపాల
కులు జనులయొద్ద వసూలుచేసి యెహోవా మందిర
ములో ఉంచిన రొక్కపు మొత్తము చూడుమని అత
నితో చెప్పుము. । యెహోవా మందిరపు పనికి అధి 5
కారులై పని జరిగించువారిచేతికి ఆ ద్రవ్యమును
అప్పగించిన తరువాత—యెహోవా మందిరమందలి
శిథిలమైన స్థలములను బాగుచేయుటకై యెహోవా
మందిరపు పనిచేయు కూలివారికి వారు దాని నియ్య
వలెననియు । వడ్లవాండ్లకును శిల్పకారులకును కాసె 6
పనివారికిని మందిరమును బాగుచేయుటకై మ్రానుల
నేమి చెక్కిన రాళ్లనేమి కొనుటకును ఇయ్యవలె
ననియు తెలియజెప్పుము. । ఆ అధికారులు నమ్మకస్థు 7
లని వారి చేతికి అప్పగించిన ద్రవ్యమునుగూర్చి వారి
యొద్ద లెక్క పుచ్చుకొనకుండిరి. । అంతట ప్రధాన 8
యాజకుడైన హిల్కీయా — యెహోవా మందిర
మందు ధర్మశాస్త్రగ్రంథమొకటి నాకు దొరికెనని
షాఫాను అను ప్రధానమంత్రితో చెప్పి ఆ గ్రంథ
మును షాఫానుకు అప్పగించెను. అతడు దాని చదివి ।
రాజునొద్దకు తిరిగి వచ్చి—మీ సేవకులు మందిరమందు 9
దొరికిన ద్రవ్యమును సమకూర్చి యెహోవా మంది
రపు పని విషయములో అధికారులై పని జరిగించు
వారిచేతికి అప్పగించిరని వర్తమానము తెలిపి । యాజకు 10
డైన హిల్కీయా నాకు ఒక గ్రంథము అప్పగించెనని
రాజుతో చెప్పి ఆ గ్రంథమును రాజు సముఖమందు
చదివెను. । రాజు ధర్మశాస్త్రముగల ఆ గ్రంథపు మాటలు 11
వినినప్పుడు తన బట్టలు చింపుకొనెను. । తరువాత 12
రాజు యాజకుడైన హిల్కీయాను, షాఫాను కుమారు
డైన అహీకామును, మీకాయా కుమారుడైన అక్బో
రును, షాఫాను అను ప్రధానమంత్రిని, అశాయా

అను రాజసేవకులలో ఒకనిని పిలిచి ఆజ్ఞాపించినదే
13 మనగా। —మీరు పోయి దొరికిన యీ గ్రంథపు
మాటలనుగూర్చి నా విషయములోను జనుల విషయ
ములోను యూదావారందరి విషయములోను
యెహోవాయొద్ద విచారణచేయుడి; మన పితరులు
తమ విషయములో వ్రాయబడియున్నదానంతటి
ప్రకారము చేయక యీ గ్రంథపు మాటలను వినని
వారైరి గనుక యెహోవా కోపాగ్ని మనమీద
14 ఇంత అధికముగా మండుచున్నది. । కాబట్టి యాజకు
డైన హిల్కీయాయును, అహీకామును, అక్బోరును,
షాఫానును, అశాయాయును ప్రవక్త్రియగు హుల్దా
యొద్దకు వచ్చిరి. ఈమె వస్త్రశాలకు అధికారియగు
హర్హషునకు పుట్టిన తిక్వాకు కుమారుడైన షల్లూమునకు
భార్యయై యెరూషలేములో రెండవ భాగమందు
కాపురస్థురాలై యుండెను. ఈమెయొద్దకు వారు
15 వచ్చి మాటలాడగా। ఈమె వారితో ఇట్లనెను —
మిమ్మును నాయొద్దకు పంపినవానితో ఈ మాట తెలియ
16 జెప్పుడి। — యెహోవా సెలవిచ్చునదేమనగా —
యూదారాజు చదివించిన గ్రంథములో వ్రాయబడి
యున్న కీడంతటిని ఏదియు విడిచిపెట్టకుండ నేను ఈ
స్థలముమీదికిని దాని కాపురస్థులమీదికిని రప్పింతు
17 ను. । ఈ జనులు నన్ను విడిచి యితరదేవతలకు
ధూపమువేయుచు, తమ సకల కార్యములచేత నాకు
కోపము పుట్టించి యున్నారు గనుక నా కోపము
ఆరిపోకుండ ఈ స్థలముమీద రగులుకొనుచున్నది. ।
18 యెహోవాయొద్ద విచారణచేయుటకై మిమ్మును
పంపిన యూదారాజుకు ఈ మాట తెలియపరచుడి।
19 — ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా సెల
విచ్చునదేమనగా—ఈ స్థలము పాడగుననియు, దాని
కాపురస్థులు దూషణాస్పదులగుదురనియు, నేను
చెప్పిన మాటలను నీవు ఆలకించి, మెత్తని మనస్సుకలిగి
యెహోవా సన్నిధిని దీనత్వము ధరించి, నీ బట్టలు
చింపుకొని నా సన్నిధిని కన్నీళ్లు రాల్చితివి గనుక
నీవు చేయు మనవిని నేను అంగీకరించియున్నాను. ।
20 నేను నిన్ను నీ పితరులయొద్ద చేర్చుదును; నీవు నెమ్మది
నొందినవాడవై సమాధికి చేర్చబడుదువు. నేను ఈ
స్థలముమీదికి రప్పింపబోవు కీడును నీవు నీ కన్ను
లతో చూడనే చూడవు; ఇదే యెహోవా వాక్కు.
అంతట వారు ఈ వర్తమానమును రాజునొద్దకు
తెచ్చిరి.

23 అప్పుడు రాజు యూదా పెద్దలనందరిని యెరూ
షలేము పెద్దలనందరిని తనయొద్దకు పిలువనంపించి ।
2 యూదావారినందరిని యెరూషలేము కాపురస్థులనంద
రిని, యాజకులను ప్రవక్తలను అల్పులనేమి ఘనులనేమి
జనులనందరిని పిలుచుకొని, యెహోవా మందిరము
నకు వచ్చి వారు వినుచుండగా, యెహోవా మందిర
మందు దొరికిన నిబంధన గ్రంథములోని మాటలన్ని
టిని చదివించెను. । రాజు ఒక స్తంభముదగ్గర నిలిచి 3
—యెహోవా మార్గములయందు నడచి, ఆయన ఆజ్ఞ
లను కట్టడలను శాసనములను పూర్ణహృదయముతోను
పూర్ణాత్మతోను గైకొని, యీ గ్రంథమందు వ్రాయ
బడియున్న నిబంధన సంబంధమైన మాటలన్నిటిని
స్థిరపరచుదుమని యెహోవా సన్నిధిని నిబంధన
చేయగా జనులందరు ఆ నిబంధనకు సమ్మతించిరి. ।
రాజు—బయలు దేవతకును అషేరా దేవికిని నక్షత్రము 4
లకును చేయబడిన ఉపకరణములన్నిటిని యెహోవా
ఆలయములోనుండి ఇవతలకు తీసికొని రావలెనని
ప్రధానయాజకుడైన హిల్కీయాకును రెండవవరుస
యాజకులకును ద్వారపాలకులకును ఆజ్ఞ ఇయ్యగా
హిల్కీయా వాటిని యెరూషలేము వెలుపల కిద్రోను
పొలములో కాల్చివేసి పడిన బూడిదెను బేతేలు ఊరికి
పంపివేసెను. । మరియు యూదా పట్టణములయం 5
దున్న ఉన్నతస్థలములలోను యెరూషలేము చుట్టు
నున్న చోట్లలోను ధూపము వేయుటకై యూదా
రాజులు నియమించిన బొమ్మల పూజారులనేమి,
బయలుకును సూర్యచంద్రులకును గ్రహములకును
నక్షత్రములకును ధూపము వేయువారినేమి, అతడు
అందరిని నిలిపివేసెను. । యెహోవా మందిరము 6
దున్న అషేరాదేవి ప్రతిమను యెరూషలేము వెలుపల
నున్న కిద్రోను వాగుదగ్గరకు తెప్పించి, కిద్రోను
వాగు ఒడ్డున దాని కాల్చి త్రొక్కి పొడుముచేసి ఆ
పొడుమును సామాన్యజనుల సమాధులమీద చల్లెను. ।
మరియు యెహోవా మందిరమందున్న పురుష 7
గాముల యిండ్లను పడగొట్టించెను. అచ్చట అషేరా
దేవికి గుళ్లను అల్లు స్త్రీలు వాసము చేయుచుండిరి. ।
యూదా పట్టణములలోనున్న యాజకులనందరిని 8
అతడు అవతలికి వెళ్లగొట్టెను; గెబా మొదలుకొని
బెయేర్షెబావరకును యాజకులు ధూపము వేసిన ఉన్నత
స్థలములను అతడు అపవిత్రపరచి, పట్టణములో ప్రవే
శించువాని యెడమపార్శ్వమున పట్టణపు అధికారి
యైన యెహోషువ గుమ్మముదగ్గిరనుండు ఉన్నతస్థల
ములను పడగొట్టించెను.. । ఆ ఉన్నతస్థలములమీద 9
నియమింపబడిన యాజకులు యెరూషలేమునందున్న
యెహోవా బలిపీఠమునొద్దకు వచ్చుట మానివేసి,
తమ సహోదరులయొద్ద పులుసులేని ఆహారము
భక్షించువారు. । మరియు ఎవడైనను తన కుమారునే 10
గాని కుమార్తెనేగాని మొలెకుకు అగ్నిలో నడిపించ
కుండునట్లు బెన్హిన్నోము అను లోయలోనున్న
తోఫెతు అను ప్రదేశమును అతడు అపవిత్రము
చేసెను. । ఇదియుగాక అతడు యూదారాజులు 11
సూర్యునికి ప్రతిష్ఠించిన గుర్రములను మంటపములో,
నివసించు పరిచారకుడైన నెతన్మెలకుయొక్క గదిదగ్గర

యెహోవా మందిరపు ద్వారమునొద్దనుండి తీసివేసి
సూర్యునికి ప్రతిష్ఠింపబడిన రథములను అగ్నితో
12 కాల్చివేసెను. । మరియు యూదారాజులు చేయిం
చిన ఆహాజు మేడమీదనున్న బలిపీఠములను,
యెహోవా మందిరపు రెండు సాలలలో మనష్షే
చేయించిన బలిపీఠములను రాజు పడగొట్టించి ఛిన్నా
భిన్నములుగా చేయించి ఆ ధూళిని కిద్రోను వాగులో
13 పారబోయించెను. । యెరూషలేము ఎదుటనున్న హేయ
మను కొండకు కుడిపార్శ్వమందు అష్తారోతు అను
సీదోనీయుల విగ్రహమునకును, కెమోషు అను
మోయాబీయుల విగ్రహమునకును, మిల్కోము అను
అమ్మోనీయుల విగ్రహమునకును ఇశ్రాయేలురాజైన
సొలొమోను కట్టించిన ఉన్నతస్థలములను రాజు అప
14 విత్రపరచి । ఆ ప్రతిమలను తునకలుగా కొట్టించి,
అషేరాదేవి ప్రతిమను పడగొట్టించి వాటి స్థానములను
15 నరశల్యములతో నింపెను. । బేతేలులోనున్న బలిపీఠ
మును ఉన్నతస్థలమును, అనగా ఇశ్రాయేలువారు
పాపము చేయుటకు కారకుడైన నెబాతు కుమారుడగు
యరొబాము కట్టించిన ఆ ఉన్నతస్థలమును బలిపీఠ
మును అతడు పడగొట్టించి, ఆ ఉన్నతస్థలమును కాల్చి
పొడుము అగునట్లుగా త్రొక్కించి అషేరాదేవి
16 ప్రతిమను కాల్చివేసెను. । యోషీయా అటు తిరిగి
అచ్చట పర్వతమందున్న సమాధులను చూచి కొందరిని
పంపి సమాధులలోనున్న శల్యములను తెప్పించి, దైవ
జనుడు యెహోవా మాట చాటించి చెప్పిన ప్రకా
రము వాటిని బలిపీఠముమీద కాల్చి దాని అపవిత్ర
17 పరచెను. । అంతట అతడు—నాకు కనబడుచున్న ఆ
సమాధి యెవరిదని అడిగినప్పుడు పట్టణపువారు —
అది యూదాదేశమునుండి వచ్చి, నీవు బేతేలులోని
బలిపీఠమునకు చేసిన క్రియలను ముందుగా తెలిపిన
18 దైవజనుని సమాధియని చెప్పిరి. । అందుకతడు —
దానిని తప్పించుడి; యెవడును అతని శల్యములను
తీయకూడదని చెప్పగా వారు అతని శల్యములను
షోమ్రోను పట్టణమునుండి వచ్చిన ప్రవక్త శల్యములను
19 తప్పించిరి. । మరియు ఇశ్రాయేలు రాజులు షోమ్రోను
పట్టణములో ఏ ఉన్నతస్థలములలో మందిరములను
కట్టించి యెహోవాకు కోపము పుట్టించిరో ఆ మంది
రములన్నిటిని యోషీయా తీసివేసి, తాను బేతేలులో
చేసిన క్రియలన్నిటి ప్రకారము వాటికి చేసెను. ।
20 అచ్చట అతడు ఉన్నతస్థలములకు నియమింపబడిన
యాజకులనందరిని బలిపీఠములమీద చంపించి వాటి
మీద నరశల్యములను కాల్పించి యెరూషలేమునకు
తిరిగి వచ్చెను.

అంతట రాజు—నిబంధన గ్రంథమునందు వ్రాసి
యున్న ప్రకారముగా మీ దేవుడైన యెహోవాకు
పస్కాపండుగను ఆచరించుడని జనులకందరికి ఆజ్ఞా
పింపగా । ఇశ్రాయేలీయులకు న్యాయము నడిపించిన 22
న్యాయాధిపతులున్న దినములనుండి ఇశ్రాయేలు
రాజులయొక్కయు యూదారాజులయొక్కయు దిన
ములన్నిటి పర్యంతము ఎన్నడును జరుగనంత గొప్పగా
ఆ సమయమందు పస్కాపండుగ ఆచరింపబడెను. ।
ఈ పండుగ రాజైన యోషీయా యేలుబడిలో పదు 23
నెనిమిదవ సంవత్సరమందు యెరూషలేములో
యెహోవాకు ఆచరింపబడెను. । మరియు కర్ణపిశాచి 24
గలవారిని సోదెచెప్పువారిని గృహదేవతలను విగ్రహ
ములను, యూదాదేశమందును యెరూషలేమునం
దును కనబడిన విగ్రహములన్నిటిని యోషీయా తీసి
వేసి, యెహోవా మందిరమందు యాజకుడైన హిల్కీ
యాకు దొరికిన గ్రంథమందు వ్రాసియున్న ధర్మశాస్త్ర
విధులను స్థిరపరచుటకై ప్రయత్నముచేసెను. । అతనికి 25
పూర్వమున్న రాజులలో అతనివలె పూర్ణహృదయము
తోను పూర్ణాత్మతోను పూర్ణబలముతోను యెహోవా
వైపు తిరిగి మోషే నియమించిన ధర్మశాస్త్రముచొప్పున
చేసినవాడు ఒకడును లేడు; అతని తరువాతనైనను
అతనివంటివాడు ఒకడును లేడు. । అయినను మనష్షే 26
యెహోవాకు పుట్టించిన కోపమునుబట్టి ఆయన
కోపాగ్ని యింకను చల్లారకుండ యూదామీద మండు
చునే యుండెను. । కాబట్టి యెహోవా — నేను 27
ఇశ్రాయేలువారిని వెళ్లగొట్టినట్లు యూదావారిని నా
సముఖమునకు దూరముగా చేసి, నేను కోరుకొనిన
యెరూషలేము పట్టణమును, నా నామమును అచ్చట
ఉంచుదునని నేను చెప్పియున్న మందిరమును నేను
విసర్జించెదనని అనుకొనియుండెను. । యోషీయా 28
చేసిన యితర కార్యములనుగూర్చియు, అతడు చేసిన
దానినంతటినిగూర్చియు యూదారాజుల వృత్తాంత
ముల గ్రంథమందు వ్రాయబడియున్నది. । అతని 29
దినములయందు ఐగుప్తురాజైన ఫరోనెకో అష్షూరు
రాజుతో యుద్ధముచేయుటకై ఫరాతునది దగ్గరకు
వచ్చి తన్ను ఎదుర్కొనవచ్చిన రాజైన యోషీయాను
మెగిద్దోదగ్గర కనుగొనగా అతని చంపెను. । అతని 30
సేవకులు అతని శవమును రథముమీద ఉంచి, మెగిద్దో
నుండి యెరూషలేమునకు తీసికొనివచ్చి అతని సమాధి
యందు పాతిపెట్టిరి. అప్పుడు దేశపుజనులు
యోషీయా కుమారుడైన యెహోయాహాజును తీసి
కొని అతనికి పట్టాభిషేకముచేసి అతని తండ్రికి
మారుగా అతని రాజుగానుంచిరి.

యెహోయాహాజు ఏలనారంభించినప్పుడు ఇరు 31
ఐది మూడేండ్లవాడై యెరూషలేములో మూడు మాస
ములు ఏలెను. అతని తల్లి లిబ్నా ఊరివాడైన
యిర్మీయా కుమార్తెయగు హమూటలు. । ఇతడు తన 32
పితరులు చేసినదంతటి ప్రకారముగా యెహోవా
దృష్టికి చెడునడత నడిచెను. । ఇతడు యెరూషలే 33

ములో ఏలుబడి చేయకుండ ఫరోనెకో హమాతు
దేశమందున్న రిబ్లా పట్టణమందు అతనిని బంధకము
లలో ఉంచి, దేశముమీద ఏబది మణుగుల వెండిని,
రెండు మణుగుల బంగారును పన్నుగా నిర్ణయించి।
34 యోషీయా కుమారుడైన ఎల్యాకీమును అతని తండ్రి
యైన యోషీయాకు మారుగా రాజుగా నియమించి,
అతనికి యెహోయాకీము అను మారుపేరు పెట్టి
యెహోయాహాజును ఐగుప్తుదేశమునకు కొనిపోగా
35 అతడచ్చట మృతిబొందెను. । యెహోయాకీము
ఫరోయిచ్చిన ఆజ్ఞచొప్పున దేశముమీద పన్ను నిర్ణ
యించి ఆ వెండి బంగారములను ఫరోకు చెల్లించుచు
వచ్చెను. దేశపు జనులయొద్దనుండి వారివారికి నిర్ణయ
మైన చొప్పున వసూలుచేసి అతడు ఫరోనెకోకు చెల్లిం
చెను.

36 యెహోయాకీము ఏలనారంభించినప్పుడు ఇరువది
యయిదేండ్లవాడై యెరూషలేమున పదకొండు సంవ
త్సరములు ఏలెను. అతని తల్లి రూమా ఊరివాడైన
37 పెదాయా కుమార్తెయగు జెబూదా. । ఇతడును తన
పితరుల చర్యలన్నిటి ప్రకారముగా యెహోవా
దృష్టికి చెడునడత నడిచెను.

**24** యెహోయాకీము దినములలో బాబెలురాజైన
నెబుకద్నెజరు యెరూషలేముమీదికి వచ్చెను.
యెహోయాకీము అతనికి దాసుడై మూడేండ్లు సేవ
చేసిన తరువాత అతనిమీద తిరుగబాటుచేయగా।
2 యెహోవా అతనిమీదికిని, తన సేవకులైన ప్రవక్తల
ద్వారా తాను సెలవిచ్చిన మాటచొప్పున యూదా
దేశమును నాశనముచేయుటకై దానిమీదికిని, కల్దీ
యుల సైన్యములను అరామీయుల సైన్యములను
మోయాబీయుల సైన్యములను అమ్మోనీయుల సైన్యము
3 లను రప్పించెను. । మనష్షే చేసిన క్రియలన్నిటిని
బట్టియు, అతడు నిరపరాధులను హతముచేయుటను
బట్టియు, యూదావారు యెహోవా సముఖము
నుండి పారదోలబడునట్లుగా ఆయన ఆజ్ఞవలన ఇది
4 వారిమీదికి వచ్చెను. । అతడు నిరపరాధుల రక్తముతో
యెరూషలేమును నింపనందున అది క్షమించుటకు
5 యెహోవాకు మనస్సులేకపోయెను. । యెహోయా
కీము చేసిన యితర కార్యములనుగూర్చియు, అతడు
జరిగించినదానినంతటినిగూర్చియు యూదారాజుల
వృత్తాంతముల గ్రంథమందు వ్రాయబడియున్నది. ।
6 యెహోయాకీము తన పితరులతోకూడ నిద్రించగా
అతని కుమారుడైన యెహోయాకీను అతనికి
7 మారుగా రాజాయెను. । బాబెలురాజు ఐగుప్తు నదికిని
ఫరాతు నదికిని మధ్య ఐగుప్తురాజు వశమునన్న
భూమియంతటిని పట్టుకొనగా ఐగుప్తురాజు ఇక నెన్న
టికిని తన దేశము విడిచి బయలుదేరుట మానెను.

యెహోయాకీను ఏలనారంభించినప్పుడు పదు 8
నెనిమిదేండ్లవాడై యెరూషలేమునందు మూడు మాస
ములు ఏలెను. యెరూషలేమువాడైన ఎల్నాతాను
కుమార్తెయగు నెహుష్తా అతని తల్లి. । అతడు తన 9
తండ్రిచేసినదానంతటి ప్రకారముగా యెహోవా
దృష్టికి చెడునడత నడిచెను. । ఆ కాలమందు బాబెలు 10
రాజైన నెబుకద్నెజరుయొక్క సేవకులు యెరూష
లేముమీదికి వచ్చి పట్టణమునకు ముట్టడివేసిరి. । వారు 11
పట్టణమునకు ముట్టడి వేయుచుండగా బాబెలురాజు
తానే దానిమీదికి వచ్చెను. । అప్పుడు యూదా 12
రాజైన యెహోయాకీనును, అతని తల్లియును అతని
సేవకులును అతని క్రింది అధిపతులును అతని పరివా
రమును బయలువెళ్లి బాబెలురాజు నొద్దకు రాగా
బాబెలురాజు అతని యేలుబడిలో ఎనిమిదవ సంవత్స
రమున అతని పట్టుకొనెను. । మరియు అతడు 13
యెహోవా మందిరపు ధననిధిలోనున్న పదార్థము
లను, రాజు ఖజానాలోనున్న సొమ్మును, పట్టుకొని
ఇశ్రాయేలురాజైన సొలొమోను యెహోవా ఆలయ
మునకు చేయించిన బంగారపు ఉపకరణములన్నిటిని
యెహోవా సెలవిచ్చిన మాటచొప్పున తునకలుగా
చేయించి యెత్తికొనిపోయెను. । అదియుగాక అతడు 14
దేశపు జనులలో అతి బీదలైనవారు తప్ప మరి ఎవ
రును లేకుండ యెరూషలేము పట్టణమంతటిలోనున్న
అధిపతులను పరాక్రమశాలులను పదివేలమందిని, వీరు
గాక కంసాలివారిని కమ్మరివారిని చెరతీసికొని
పోయెను. । అతడు యెహోయాకీనును రాజు తల్లిని 15
రాజు భార్యలను అతని పరివారమును దేశములోని
గొప్పవారిని చెరపట్టి యెరూషలేమునుండి బాబెలు
పురమునకు తీసికొనిపోయెను. । ఏడు వేలమంది పరా 16
క్రమశాలులను వెయ్యిమంది కంసాలివారిని కమ్మరి
వారిని యుద్ధమందు తేరిన శక్తిమంతులనందరిని బాబెలు
రాజు చెరపట్టి బాబెలుపురమునకు తీసికొని వచ్చెను. ।
మరియు బాబెలురాజు అతని పినతండ్రియైన మత్త 17
న్యాకు సిద్కియా అను మారుపేరుపెట్టి అతని స్థాన
మందు రాజుగా నియమించెను.

సిద్కియా యేలనారంభించినప్పుడు ఇరువదియొక 18
సంవత్సరములవాడు; అతడు యెరూషలేమునందు
పదకొండు సంవత్సరములు ఏలెను. । లిబ్నా ఊరివా 19
డైన యిర్మీయాయొక్క కుమార్తెయగు హమూటలు
అతని తల్లి. యెహోయాకీముయొక్క చర్య అంతటి
చొప్పున సిద్కియా యెహోవా దృష్టికి చెడునడత
నడిచెను. । యూదావారిమీదను యెరూషలేమువారి 20
మీదను తాను తెచ్చుకొనిన కోపమునుబట్టి తన సము
ఖములోనుండి వారిని తోలివేయుటకై యెహోవా
బాబెలు రాజుమీద సిద్కియా తిరుగబడునట్లు
చేసెను.

**25** అతని యేలుబడిలో తొమ్మిదవ సంవత్సరమందు
పదియవ మాసము పదియవ దినమందు బాబెలురాజైన
నెబుకద్నెజరును అతని సైన్యమంతయును యెరూష
లేముమీదికి వచ్చి దానికెదురుగా దిగి దానిచుట్టును
2 ముట్టడిదిబ్బలు కట్టిరి. । ఈ ప్రకారము రాజైన
సిద్కియా యేలుబడియందు పదకొండవ సంవత్సరము
3 వరకు పట్టణము ముట్టడి వేయబడియుండగా । నాలవ
నెల తొమ్మిదవ దినమందు పట్టణములో క్షామము
అఘోరమాయెను, దేశపు జనులకు ఆహారము లేక
4 పోయెను. । కల్దీయులు పట్టణప్రాకారమును పడ
గొట్టగా రాణువవారు రాత్రియందు రాజు తోట
దగ్గర రెండు గోడల మధ్యనున్న ద్వారపు మార్గమున
5 పారిపోయిరి. । అయితే కల్దీయులు పట్టణముచుట్టు
ఉండగా రాజు మైదానమునకు పోవుమార్గమున వెళ్లి
పోయెను; కల్దీయుల సైన్యము రాజును తరిమి, అతని
సైన్యము అతనికి దూరముగా చెదరిపోయినందున
6 యెరికో మైదానమందు అతని పట్టుకొనిరి । వారు
రాజును పట్టుకొని రిబ్లా పట్టణమందున్న బాబెలు
రాజునొద్దకు తీసికొని పోయినప్పుడు రాజు అతనికి
7 శిక్ష విధించెను. । సిద్కియా చూచుచుండగా వారు
అతని కుమారులను చంపించి సిద్కియా కన్నులు
ఊడదీయించి యిత్తడి సంకెళ్లతో అతని బంధించి
బాబెలు పట్టణమునకు తీసికొనిపోయిరి.

8 మరియు బాబెలురాజైన నెబుకద్నెజరు ఏలు
బడిలో పందొమ్మిదవ సంవత్సరమందు అయిదవ నెల
యేడవ దినమున రాజదేహసంరక్షకులకు అధిపతియు
బాబెలురాజు సేవకుడునగు నెబూజరదాను యెరూష
9 లేమునకు వచ్చి । యెహోవా మందిరమును రాజనగ
రును యెరూషలేమునందున్న యిండ్లన్నిటిని గొప్ప
10 వారి యిండ్లన్నిటిని అగ్నిచేత కాల్పించెను. । మరియు
రాజదేహసంరక్షకుల అధిపతియొద్దనున్న కల్దీయుల
సైనికులందరును యెరూషలేము చుట్టునున్న ప్రాకా
11 రములను పడగొట్టిరి. । పట్టణమందు మిగిలి యుండిన
వారిని, బాబెలురాజు పక్షము చేరినవారిని, సామాన్య
జనులలో శేషించినవారిని రాజదేహసంరక్షకుల అధి
పతియైన నెబూజరదాను చెరగొని పోయెను గాని ।
12 వ్యవసాయదారులును ద్రాక్షతోటవారును ఉండవలె
నని దేశపు బీదజనములో కొందరిని ఉండనిచ్చెను. ।
13 మరియు యెహోవా మందిరమందున్న యిత్తడి
స్తంభములను మట్లను యెహోవా మందిరమందున్న
యిత్తడి సముద్రమును కల్దీయులు తునకలుగా కొట్టి,
ఆ యిత్తడిని బాబెలు పట్టణమునకు ఎత్తికొనిపోయిరి. ।
14 సేవకొరకై యుంచబడిన పాత్రలను చేటలను ముండ్లను
ధూపార్తులను ఇత్తడి ఉపకరణములన్నిటిని వారు తీసి
15 కొనిపోయిరి. । అగ్నిపాత్రలు గిన్నెలు మొదలైన
వెండి వస్తువులను బంగారు వస్తువులను రాజదేహ
సంరక్షకుల అధిపతి తీసికొనిపోయెను. । మరియు 16
అతడు యెహోవా మందిరమునకు సొలొమోను
చేయించిన రెండు స్తంభములను సముద్రమును మట్లను
తీసికొని పోయెను. ఈ యిత్తడి వస్తువుల యెత్తు
లెక్కకు మించియుండెను. । ఒక్కొక స్తంభపు నిడివి 17
పదునెనిమిది మూరలు. దాని పైపీట యిత్తడిది, పైపీట
నిడివి మూడు మూరలు. మరియు ఆ పైపీటచుట్టు
ఉన్న అల్లికలును దానిమ్మపండ్లును ఇత్తడివి; రెండవ
స్తంభమును వీటివలె అల్లికపని కలిగియుండెను. ।
రాజదేహసంరక్షకుల అధిపతి ప్రధానయాజకుడైన 18
శెరాయాను రెండవ యాజకుడైన జెఫన్యాను ముగ్గురు
ద్వారపాలకులను పట్టుకొనెను. । మరియు యుద్ధ 19
స్థులమీద నియమింపబడియున్న అధిపతిని, పట్టణ
ములోనుండి తీసికొని, రాజుసముఖమును కనిపెట్టు
కొని యుండువారిలో పట్టణమందు దొరికిన అయిదు
గురిని, దేశపుజనులను సంఖ్యచేయువారికి అధిపతి
యొక్క లేఖకుని, సామాన్యజనులలో పట్టణమందు
దొరికిన అరువదిమందిని పట్టుకొనెను. । రాజదేహ 20
సంరక్షకుల అధిపతియగు నెబూజరదాను వీరిని తీసి
కొని రిబ్లా పట్టణమందున్న బాబెలురాజునొద్దకు
రాగా । బాబెలురాజు హమాతు దేశమందున్న రిబ్లా 21
పట్టణమందు వారిని చంపించెను. ఈ రీతిగా యూదా
వారు తమ దేశములోనుండి ఎత్తికొని పోబడిరి. ।
బాబెలురాజైన నెబుకద్నెజరు యూదాదేశమందు 22
ఉండనిచ్చినవారిమీద అతడు షాఫానుకు పుట్టిన
అహీకాము కుమారుడైన గెదల్యాను అధిపతిగా నిర్ణ
యించెను.

యూదావారి సైన్యాధిపతులందరును వారి జను 23
లందరును బాబెలురాజు గెదల్యాను అధిపతిగా నియ
మించిన సంగతి విని, మిస్పాపట్టణమందున్న గెద
ల్యాయొద్దకు నెతన్యా కుమారుడైన ఇష్మాయేలును,
కారేహ కుమారుడైన యోహానానును, నెటోపా
తీయుడైన తన్హుమెతు కుమారుడగు శెరాయాయును,
మాయకాతీయుడైన యొకనికి పుట్టిన యజన్యాను
కూడిరాగా । గెదల్యావారితోను వారి జనులతోను 24
ప్రమాణముచేసి—కల్దీయులకు మనము దాసులమైతి
మని జడియవద్దు; దేశమందు కాపురముండి బాబెలు
రాజుకు మీరు సేవచేసినయెడల మీకు మేలు కలుగు
నని చెప్పెను. । అయితే ఏడవ మాసమందు రాజవం 25
శజుడగు ఎలీషామాకు పుట్టిన నెతన్యా కుమారుడైన
ఇష్మాయేలు పదిమంది మనుష్యులను పిలుచుకొని వచ్చి
గెదల్యామీద పడగా అతడు మరణమాయెను.
మరియు మిస్పాలో అతనియొద్దనున్న యూదులను
కల్దీయులను అతడు హతముచేసెను. । అప్పుడు కొద్ది 26
వారేమి గొప్పవారేమి జనులందరును, సైన్యాధిపతు

లును, లేచి కల్దీయుల భయముచేత ఐగుప్తుదేశమునకు
పారిపోయిరి.
27 యూదారాజైన యెహోయాకీను చెరలో ఉంచ
బడిన ముప్పదియేడవ సంవత్సరమున పన్నెండవ నెల
యిరువది యేడవ దినమున బాబెలురాజైన ఎవీల్మెరో
దకు తాను ఏలనారంభించిన సంవత్సరమందు బందీ
గృహములోనుండి యూదారాజైన యెహోయా
28 కీనును తెప్పించి । అతనితో దయగా మాటలాడి,
అతని పీఠమును బాబెలులో తనయొద్దనున్న రాజుల
పీఠములకంటె ఎత్తుచేసెను. । కాగా అతడు తన బందీ 29
గృహ వస్త్రములను తీసివేసి వేరు వస్త్రములను ధరించు
కొని తాను బ్రదికిన దినములన్నియు రాజుసన్నిధిని
భోజనముచేయుచు వచ్చెను. । మరియు అతని 30
బత్తెము ఏనాటికి ఆనాడు రాజుచేత నిర్ణయింపబడినదై
అతడు బ్రదికినన్నాళ్లు ఆ చొప్పున అతని కియ్యబడు
చుండెను.

# దినవృత్తాంతములు

## మొదటి గ్రంథము



1 ఆదాము షేతు ఎనోషు । కేయినాను మహలలేలు
2 యెరెదు । హనోకు మెతూషెల లెమెకు । నోవహు
4 షేము హాము యాపెతు.
5 యాపెతు కుమారులు గోమెరు మాగోగు మాదయి
6 యావాను తుబాలు మెషెకు తీరసు అనువారు. । గో
మెరు కుమారులు అష్కనజు రీఫతు తోగర్మా. ।
7 యావాను కుమారులు ఎలీషా తర్షీషు కిత్తీము దోదా
నీము.
8 హాము కుమారులు కూషు మిస్రాయిము పూతు
9 కనాను. । కూషు కుమారులు సెబా హవీలా సబ్తా
రాయమా సబ్తకా. రాయమా కుమారులు షెబ దదాను.।
10 కూషు నిమ్రోదును కనెను, ఇతడు భూమిమీద పరా
11 క్రమశాలులలో మొదటివాడు. । లూదీయులు అనా
12 మీయులు లెహాబీయులు నప్తుహీయులు । పత్రుసీ
యులు ఫిలిష్తీయుల వంశకర్తలైన కస్లూహీయులు
13 కఫ్తోరీయులు మిస్రాయిము సంతతివారు. । కనాను
తన జ్యేష్ఠకుమారుడైన సీదోనును హేతును కనెను. ।
14 యెబూసీయులు అమోరీయులు గిర్గాషీయులు । హివ్వీ
16 యులు అర్కీయులు సీనీయులు । అర్వాదీయులు
సెమారీయులు హమాతీయులు అతని సంతతివారు.
17 షేము కుమారులు ఏలాము అష్షూరు అర్పక్షదు
లూదు అరాము ఊజు హూలు గెతెరు మెషెకు. ।
18 అర్పక్షదు షేలహును కనెను. షేలహు ఏబెరును
19 కనెను. । ఏబెరుకు ఇద్దరు కుమారులు పుట్టిరి, ఒకని
దినములలో భూమి వేర విడిచెను గనుక అతనికి
పెలెగు అని పేరు పెట్టబడెను, అతని సహోదరుని
20 పేరు యొక్తాను. । యొక్తాను అల్మోదాదును షెలపును
21 హసర్మావెతును యెరహును । హదోరమును ఊజాలును
22 దిక్లానును : ఏబాలును అబీమాయేలును షేబను ।
23 ఓఫీరును హవీలాను యోబాబును కనెను, వీరందరును
యొక్తాను కుమారులు.
24 షేము అర్పక్షదు షేలహు । ఏబెరు పెలెగు
27 రయూ ; సెరూగు నాహోరు తెరహు । అబ్రాహా
28 మను పేరు పెట్టబడిన అబ్రాము. । అబ్రాహాము
29 కుమారులు ఇస్సాకు ఇష్మాయేలు. । వీరి తరములు ఏవ
ఇష్మాయేలుకు జ్యేష్ఠకుమారుడు నెబాయోతు
కేదారు అద్బయేలు మిబ్శాము । మిష్మా
హదదు తేమా । యెతూరు నాపీషు
ాయేలు కుమారులు.

అబ్రాహాముయొక్క ఉపపత్నియైన కెతూరా 32
కనిన కుమారులు ఎవరనగా జిమ్రాను యొక్షాను
మెదాను మిద్యాను ఇష్బాకు షూవహు. యొక్షాను
కుమారులు షేబ దదాను. । మిద్యాను కుమారులు 33
ఏయిఫా ఏఫెరు హనోకు అబీదా ఎల్దాయా; వీరంద
రును కెతూరాకు పుట్టిన కుమారులు.
అబ్రాహాము ఇస్సాకును కనెను, ఇస్సాకు కుమా 34
రులు ఏశావు ఇశ్రాయేలు. । ఏశావు కుమారులు ఎలీ 35
ఫజు రెయూవేలు యెయూషు యాలాము కోరహు. ।
ఎలీఫజు కుమారులు తేమాను ఓమారు సెపో గాతాము 36
కనజు తిమ్నా అమాలేకు. । రెయూవేలు కుమారులు 37
నహతు జెరహు షమ్మా మిజ్జ. । శేయీరు కుమారులు 38
లోతాను శోబాలు సిబ్యోను అనా దిషోను ఏసెరు
దిషాను. । లోతాను కుమారులు హోరీ హోమాము; 39
తిమ్నా లోతానుకు సహోదరి. ; శోబాలు కుమా 40
రులు అల్వాను మనహతు ఏబాలు షెపో ఓనాము.
సిబ్యోను కుమారులు అయ్యా అనా. । అనా కుమా 41
రులలో ఒకనికి దిషోను అని పేరు. దిషోను కుమా
రులు హమ్రాము ఎష్బాను ఇత్రాను కెరాను. । ఏసెరు 42
కుమారులు బిల్హాను జవాను యహకాను. దిషాను
కుమారులు ఊజు అరాను. । ఏ రాజును ఇశ్రాయేలీ 43
యులను ఏలకమునుపు ఎదోము దేశమందు ఏలిన
రాజులు వీరు; బెయోరు కుమారుడైన బెల అతని
పట్టణము పేరు దిన్హాబా. । బెల చనిపోయిన తరు 44
వాత బొస్రా ఊరివాడైన జెరహు కుమారుడైన
యోబాబు అతనికి బదులుగా రాజాయెను. ।
యోబాబు చనిపోయిన తరువాత తేమానీయుల దేశపు 45
వాడైన హుషాము అతనికి బదులుగా రాజాయెను. ।
హుషాము చనిపోయిన తరువాత మోయాబు దేశమున 46
మిద్యానీయులను హతముచేసిన బెదదు కుమారుడైన
హదదు అతనికి బదులుగా రాజాయెను; ఇతని పట్ట
ణము పేరు అవీతు. । హదదు చనిపోయిన తరువాత 47
మశ్రేకా ఊరివాడైన శమ్లా అతనికి బదులుగా రాజా
యెను. । శమ్లా చనిపోయిన తరువాత నది దగ్గరనున్న 48
రెహోబోతువాడైన షావూలు అతనికి బదులుగా రాజా
యెను. । షావూలు చనిపోయిన తరువాత అక్బోరు 49
కుమారుడైన బయల్ హానాను అతనికి బదులుగా రాజా
యెను. । బయల్ హానాను చనిపోయిన తరువాత హదదు 50
అతనికి బదులుగా రాజాయెను; ఇతని పట్టణము పేరు

పోయెను. ఇతని భార్యపేరు మెహేతబేలు; ఈమె
మేజాహాబు కుమార్తెయైన మత్రేదుకు పుట్టినది. ।
51 హదదు చనిపోయిన తరువాత ఎదోమునందు ఉండిన
నాయకులెవరనగా తిమ్నా నాయకుడు, అల్వా నాయ
52 కుడు, యతేతు నాయకుడు, । అహలీబామా నాయకుడు,
53 ఏలా నాయకుడు, పీనోను నాయకుడు, । కనజు నాయ
కుడు, తేమాను నాయకుడు, మిబ్సారు నాయకుడు, ।
54 మగ్దీయేలు నాయకుడు, ఈరాము నాయకుడు; వీరు
ఎదోముదేశమునకు నాయకులు.

**2** ఇశ్రాయేలు కుమారులు రూబేను షిమ్యోను లేవి
2 యూదా ఇశ్శాఖారు జెబులూను । దాను యోసేపు
బెన్యామీను నఫ్తాలి గాదు ఆషేరు.
3 యూదా కుమారులు ఏరు ఓనాను షేలా. ఈ
ముగ్గురు కనానీయురాలైన షూయ కుమార్తెయందు
అతనికి పుట్టిరి. యూదాకు జ్యేష్ఠకుమారుడైన ఏరు
యెహోవా దృష్టికి చెడ్డవాడైనందున ఆయన వాని
4 చంపెను. । మరియు అతని కోడలైన తామారు
అతనికి పెరెసును జెరహును కనెను. యూదా
5 కుమారులందరును అయిదుగురు. । పెరెసు కుమా
6 రులు హెస్రోను హామూలు. । జెరహు కుమారులు
అయిదుగురు జిమ్రీ ఏతాను హేమాను కల్కోలు
7 దార. । కర్మీ కుమారులలో ఒకనికి ఆకాను అని పేరు;
ఇతడు శాపగ్రస్తమైన దానిలో కొంత అపహరించి
8 ఇశ్రాయేలీయులను శ్రమపెట్టెను. । ఏతాను కుమా
9 రులలో అజర్యా అను ఒకడుండెను. । హెస్రోనుకు
పుట్టిన కుమారులు యెరహ్మెయేలు రాము కెలూబై. ।
10 రాము అమ్మీనాదాబును కనెను, అమ్మీనాదాబు
యూదావారికి పెద్దయైన నయస్సోనును కనెను, ।
11 నయస్సోను శల్మాను కనెను, శల్మా బోయజును
12 కనెను, । బోయజు ఓబేదును కనెను, ఓబేదు యెష్షయిని
13 కనెను, । యెష్షయి తన జ్యేష్ఠకుమారుడైన ఏలీయాబును
రెండవవాడైన అబీనాదాబును మూడవవాడైన షిమ్మాను!
14 నాలుగవవాడైన నెతనేలును అయిదవవాడైన రద్దయిని
15 । ఆరవవాడైన ఓజెమును ఏడవవాడైన దావీదును
16 కనెను. । సెరూయా అబీగయీలు వీరి అక్కచెల్లెండ్రు.
సెరూయా కుమారులు ముగ్గురు అబీషై యోవాబు
17 అశాహేలు. । అబీగయీలు అమాశాను కనెను;
ఇష్మాయేలీయుడైన యెతెరు అమాశాకు తండ్రి.
18 హెస్రోను కుమారుడైన కాలేబు అజూబా అను
తన భార్యయందును యెరీయోతునందును పిల్లలను
కనెను. అజూబా కుమారులు ఎవరనగా యేషెరు
19 షోబాబు అర్దోను. । అజూబా చనిపోయిన తరువాత
కాలేబు ఎఫ్రాతాను వివాహముచేసికొనగా అది
20 అతనికి హూరును కనెను. । హూరు ఊరిని కనెను,
21 ఊరి బెసలేలును కనెను. । తరువాత హెస్రోను
గిలాదు తండ్రియైన మాకీరు కుమార్తెను కూడెను;
తాను అరువది సంవత్సరముల యెయస్సుగలవాడైనప్పుడు
దానిని వివాహముచేసికొనగా అది అతనికి సెగూబును
కనెను. । సెగూబు యాయీరును కనెను, ఇతనికి 22
గిలాదు దేశమందు ఇరువది మూడు పట్టణములుం
డెను. । మరియు గెషూరువారును అరామీయులును 23
యాయీరు పట్టణములను కెనాతును దాని ఉపపట్ట
ణములను అరువది పట్టణములను వారియొద్దనుండి తీసి
కొనిరి. వీరందరును గిలాదు తండ్రియైన మాకీరుకు
కుమాళ్లు. । కాలేబుదైన ఎఫ్రాతాలో హెస్రోను 24
చనిపోయిన తరువాత హెస్రోను భార్యయైన అబీయా
అతనికి తెకోవకు తండ్రియైన అష్షూరును కనెను. ।
హెస్రోను జ్యేష్ఠకుమారుడైన యెరహ్మెయేలు కుమా 25
రులు ఎవరనగా జ్యేష్ఠుడగు రాము బూనా ఓరెను
ఓజెము అహీయా. । అటారా అను ఇంకొక భార్య 26
యెరహ్మెయేలుకు ఉండెను, ఇది ఓనాముకు తల్లి. ।
యెరహ్మెయేలుకు జ్యేష్ఠకుమారుడగు రాము కుమారులు 27
మయజు యామీను ఏకెరు. । ఓనాము కుమారులు 28
షమ్మయి యాదా, షమ్మయి కుమారులు నాదాబు అబీ
షూరు. । అబీషూరు భార్యపేరు అబీహాయిలు, అది 29
అతనికి అహ్బానును, మొలీదును కనెను. । నాదాబు 30
కుమారులు సెలెదు అప్పయీము. సెలెదు సంతానము
లేకుండ చనిపోయెను. । అప్పయీము కుమారులలో 31
ఇషీ అను ఒకడుండెను, ఇషీ కుమారులలో షేషాను
అను ఒకడుండెను, షేషాను కుమారులలో అహ్లాయి
అను ఒకడుండెను, । షమ్మయి సహోదరుడైన యాదా 32
కుమారులు యెతెరు యోనాతాను; యెతెరు సంతా
నములేకుండ చనిపోయెను. । యోనాతాను కుమారులు 33
పేలెతు జాజా; వీరు యెరహ్మెయేలుకు పుట్టినవారు. ।
షేషానుకు కుమార్తెలేగాని కుమారులు లేకపోయిరి; 34
ఈ షేషానుకు యర్హా అను ఒక దాసుడుండెను,
వాడు ఐగుప్తీయుడు । షేషాను తన కుమార్తెను తన 35
దాసుడైన యర్హాకు ఇయ్యగా అది అతనికి అత్తయిని
కనెను. । అత్తయి నాతానును కనెను, నాతాను జాబా 36
దును కనెను, । జాబాదు ఎప్లాలును కనెను, ఎప్లాలు 37
ఓబేదును కనెను, । ఓబేదు యెహూను కనెను, 38
యెహూ అజర్యాను కనెను, । అజర్యా హేలెస్సును 39
కనెను, హేలెస్సు ఎలాశాను కనెను, । ఎలాశా 40
సిస్మాయీని కనెను, సిస్మాయీ షల్లూమును కనెను, ।
షల్లూము యెకమ్యాను కనెను, యెకమ్యా ఎలీషామాను 41
కనెను. । యెరహ్మెయేలు సహోదరుడైన కాలేబు 42
కుమారులెవరనగా జీఫు తండ్రియైన మేషా, యితడు అత
నికి జ్యేష్ఠుడు. అబీ హెబ్రోను మేషాకు కుమారుడు. ।
హెబ్రోను కుమారులు కోరహు తప్పూయ రేకెము 43
షెమ. । షెమ యొర్కెయాము తండ్రియైన రహ 44
మును కనెను, రేకెము షమ్మయిని కనెను. । షమ్మయి 45
కుమారుడు మాయోను, ఈ మాయోను బేత్సూరుకు

46 తండ్రి. । కాలేబు ఉపపత్నియైన ఏయిఫా హారా
నును మోజాను గాజేజును కనెను, హారాను గాజేజును
47 కనెను. । యెహ్దాయి కుమారులు రెగెము యోతాము
48 గేషాను పెలెటు ఏయిఫా షయపు. । కాలేబు ఉప
పత్నియైన మయకా షెబెరును తిర్హానాను కనెను. ।
49 మరియు అది మద్మన్నాకు తండ్రియైన షయపును
మక్బేనాకును గిబ్యాకు తండ్రియైన షెవానును కనెను.
50 కాలేబు కుమార్తెకు అక్సా అని పేరు. । ఎఫ్రాతాకు
జ్యేష్ఠుడుగా పుట్టిన హూరు కుమారుడైన కాలేబు
కుమారులు ఎవరనగా కిర్యత్యారీము తండ్రియైన
51 శోబాలును, । బేత్లెహేము తండ్రియైన శల్మాయును,
52 బేత్గాదేరు తండ్రియైన హారేపును. । కిర్యత్యారీము
తండ్రియైన శోబాలు కుమారులెవరనగా హారోయే
53 హజీహమ్మెనుహోతు. । కిర్యత్యారీము కుమారు
లెవరనగా ఇత్రీయులును పూతీయులును షుమ్మాతీయు
లును మిష్రాయీయులును; వీరివలన సొరాతీయులును
54 ఎష్తాయులీయులును కలిగిరి. । శల్మా కుమారులెవరనగా
బేత్లెహేమును నెటోపాతీయులును యోవాబు ఇంటి
సంబంధమైన అతారోతీయులును మానహతీయులలో
55 ఒక భాగముగానున్న జారీయులును. । యబ్బేజులో
కాపురమున్న లేఖికుల వంశములైన తిరాతీయులును
షిమ్యాతీయులును శూకాతీయులును; వీరు రేకాబు
ఇంటివారికి తండ్రియైన హమాతువలన పుట్టిన కేనీ
యుల సంబంధులు.

3 దావీదుకు హెబ్రోనులో పుట్టిన కుమారులెవర
నగా యెజ్రెయేలీయురాలైన అహీనోయముకు పుట్టిన
అమ్నోను జ్యేష్ఠుడు; కర్మెలీయురాలైన అబీగయీలుకు
2 పుట్టిన దానియేలు రెండవవాడు, । గెషూరు రాజైన
తల్మయి కుమార్తెయైన మయకాకు పుట్టిన అబ్షాలోము
మూడవవాడు, హగ్గీతు కుమారుడైన అదోనీయా నాల్గవ
3 వాడు, । అబీటలు కనిన షెఫట్య అయిదవవాడు,
అతని భార్యయైన ఎగ్లా కనిన ఇత్రెయాము ఆరవ
4 వాడు, । ఈ ఆరుగురు హెబ్రోనులో అతనికి పుట్టిరి,
అచ్చట అతడు ఏడు సంవత్సరముల ఆరు నెలలు
5 ఏలెను, । యెరూషలేములో ముప్పది మూడు సంవ
త్సరములు ఏలెను. యెరూషలేములో అతనికి పుట్టిన
వారెవరనగా అమ్మియేలు కుమార్తెయైన బత్షెబవలన
కలిగిన షిమ్యా షోబాబు నాతాను సొలొమోను అను
6 నలుగురు । ఇభారు ఎలీషామా ఎలీపేలెటు । నోగహు
-8 నెపెగు యాఫీయ । ఎలీషామా ఎల్యాదా ఎలీపేలెటు
9 అను తొమ్మండ్రు కుమారులు. । ఉపపత్నులవలన కలి
గినవారుగాక వీరందరు దావీదుకు జననమైరి; తామారు
10 వీరికి సహోదరి. । సొలొమోనుకు రెహబాము కుమా
రుడు, అతని కుమారుడు అబీయా. అబీయాకు ఆసా
కుమారుడు ఆసాకు యెహోషాపాతు కుమారుడు ।
11 యెహోషాపాతుకు యెహోరాము కుమారుడు,
యెహోరాముకు అహజ్యా కుమారుడు, అహజ్యాకు
యోవాషు కుమారుడు, । యోవాషుకు అమజ్యా కుమా 12
రుడు, అమజ్యాకు అజర్యా కుమారుడు, అజర్యాకు
యోతాము కుమారుడు । యోతాముకు ఆహాజు 13
కుమారుడు, ఆహాజుకు హిజ్కియా కుమారుడు, హిజ్కి
యాకు మనష్షే కుమారుడు, । మనష్షేకు ఆమోను కుమా 14
రుడు, ఆమోనుకు యోషీయా కుమారుడు. । యో 15
షీయా కుమారులెవరనగా జ్యేష్ఠుడు యోహానాను, రెం
డవవాడు యెహోయాకీము, మూడవవాడు సిద్కియా,
నాల్గవవాడు షల్లూము. । యెహోయాకీము కుమారు 16
లలో యెకొన్యా అను ఒకడుండెను, అతని కుమా
రుడు సిద్కియా. । యెకొన్యా కుమారులు అసీరు 17
షయల్తీయేలు । మల్కీరాము పెదాయా షెనజ్జరు 18
యెకమ్యా హోషామా నెదబ్యా. । పెదాయా కుమా 19
రులు జెరుబ్బాబెలు షిమీ; జెరుబ్బాబెలు కుమా
రులు మెషుల్లాము హనన్యా; షెలోమీతు వారికి
సహోదరి. । హషుబా ఓహెలు బెరెక్యా హసద్యా 20
యూషబెస్హెదు అను మరి యయిదుగురుండిరి. ।
హనన్యా కుమారులు పెలట్యా యెషయా, రెఫాయా 21
కుమారులును అర్నాను కుమారులును ఓబద్యా కుమారు
లును షెకన్యా కుమారులును. । షెకన్యా కుమారులలో 22
షెమయా అను ఒకడుండెను; షెమయా కుమారులు
ఆరుగురు. హట్టూషు ఇగాలు బారియహు నెయర్యా
షాపాతు. । నెయర్యా కుమారులు ముగ్గురు. ఎల్యో 23
యేనై హిజ్కియా అజ్రీకాము; । ఎల్యోయేనై కుమా 24
రులు ఏడుగురు; హోదవ్యా ఎల్యాషీబు పెలాయా
అక్కూబు యోహానాను దెలాయ్యా అనాని.

యూదా కుమారులెవరనగా పెరెసు హెస్రోను 4
కర్మీ హూరు శోబాలు. । శోబాలు కుమారుడైన రెవాయా 2
యహతును కనెను, యహతు అహూమైని లహదును
కనెను, ఇవి సొరాతీయుల వంశములు. । అబీయేతాము 3
సంతతివారెవరనగా యెజ్రెయేలు ఇష్మా ఇద్బాషు వీరి
సహోదరిపేరు హజ్జెలెల్పోని. । మరియు గెదోరీ 4
యులకు పితరుడగు పెనూయేలును హూషాయీయు
లకు పితరుడగు ఏజెరును, వీరు బేత్లెహేముకు తండ్రి
యైన ఎఫ్రాతాకు జ్యేష్ఠుడగు హూరుకు కుమారులు. ।
తెకోవ తండ్రియైన అష్హూరుకు హెలా నయరా అను 5
ఇద్దరు భార్యలుండిరి. । నయరా అతనికి అహుజామును 6
హెపెరును తేమనీని హాయహష్తారీని కనెను. వీరు
నయరాకు పుట్టిన కుమారులు. । హెలా కుమారు 7
లెవరనగా జెరెతు సోహరు ఎత్నాను. । కోజు ఆనూ 8
బును జోబేబాను హారుము కుమారుడైన అహర్హేలు
యొక్క వంశములను కనెను. । యబ్బేజు తన సహో 9
దరులకంటె ఘనము పొందినవాడై యుండెను—వేదన
పడి యితని కంటినని అతని తల్లి అతనికి యబ్బేజు అని
పేరుపెట్టెను. । యబ్బేజు ఇశ్రాయేలీయుల దేవుని 10

గూర్చి మొఱ్ఱపెట్టి — నీవు నన్ను నిశ్చయముగా
ఆశీర్వదించి నా సరిహద్దును విశాలపరచి నీ చెయ్యి
నాకు తోడుగా ఉండ దయచేసి నాకు కీడు రాకుండ
దానిలోనుండి నన్ను తప్పించుము అని ప్రార్థింపగా
దేవుడు అతడు మనవిచేసినదానిని అతనికి దయ
1 చేసెను. । షూవహు సహోదరుడైన కెలూబు ఎష్తో
2 నుకు తండ్రియైన మెహీరును కనెను. । ఎష్తోను బేత్రా
ఫాను పాసెయను ఈర్నాహాషుకు తండ్రియైన తెహి
3 న్నాను కనెను, వీరు రేకావారు. । కనజు కుమారులు
ఒత్నీయేలు శెరాయా; ఒత్నీయేలు కుమారులలో
14 హతతు అను ఒకడుండెను. । మెయోనొతై ఒఫ్రాను
కనెను, శెరాయా పనివారిలోయలో నివసించువారికి
తండ్రియైన యోవాబును కనెను, ఆ లోయలోని
15 వారు పనివారై యుండిరి. । యెఫున్నె కుమారుడైన
కాలేబు కుమారులు ఈరూ ఏలా నయము; ఏలా కుమా
16 రులలో కనజు అను ఒకడుండెను. । యెహల్లెలేలు
17 కుమారులు జీఫు జీఫా తీర్యా అశర్యేలు. । ఎజ్రా
కుమారులు యెతెరు మెరెదు ఏఫెరు యాలోను;
మెరెదు భార్య మిర్యామును షమ్మయిని ఎష్టెమోను
18 వారికి పెద్దయయిన ఇష్బాహును కనెను. । అతని భార్య
యైన యెహూదీయా గెదోరుకు ప్రధానియైన యెరె
దును శోకోకు ప్రధానియైన హెబెరును జానోహకు
ప్రధానియైన యెకూతీయేలును కనెను. మెరెదు వివా
హము చేసికొనిన ఫరో కుమార్తెయైన బిత్యాకు పుట్టిన
19 కుమారులు వీరే. । మరియు నహము సహోదరియైన
హూదీయా భార్యయొక్క కుమారులెవరనగా గర్మీ
యుడైన కెయీలా మాయకాతీయుడైన ఎష్టెమో. ।
20 షీమోను కుమారులు అమ్నోను రిన్నా బెన్హానాను
తీలోను. ఇషీ కుమారులు జోహేతు బెన్జోహేతు. ।
21 యూదా కుమారుడైన షేలహు కుమారులెవరనగా
లేకాకు ప్రధానియైన ఏరు మారేషాకు ప్రధానియైన
లద్దాయు; సన్నపు వస్త్రములు నేయు అషేయ యింటి
22 వంశకులకును । యోకీమీయులకును కోజేబాయీ
యులకును యోవాషువారికిని మోయాబులో ప్రభు
త్వము నొందిన శారాపీయులకును యాషూబిలెహెము
వారికిని అతడు పితరుడు; ఇవి పూర్వకాలపు సంగ
23 తులే. । వారు కుమ్మరివాండ్లయి నెతాయీమునందును
గెదేరనందును కాపురముండిరి; రాజు నియమముచేత
అతని పని విచారించుటకై అచ్చట కాపురముండిరి.
24 షిమ్యోను కుమారులు నెమూయేలు యామీను
25 యారీబు జెరహు షావూలు. । షావూలుకు షల్లూము
కుమారుడు, షల్లూముకు మిబ్శాము కుమారుడు, మిబ్శా
26 ముకు మిష్మా కుమారుడు. । మిష్మా కుమారులలో ఒకడు
హమ్మూయేలు; హమ్మూయేలుకు జక్కూరు కుమారుడు,
27 జక్కూరుకు షిమీ కుమారుడు. । షిమీకి పదియారుగురు
కుమారులును ఆరుగురు కుమార్తెలును కలిగిరి; అయితే
అతని సహోదరులకు ఎంతోమంది కుమారులు కలుగ
లేదు; యూదావారు వృద్ధియైనట్లు వారి వంశము
లన్నియు వృద్ధికాలేదు. । వారు బెయేర్షెబాలోను 28
మోలాదాలోను హజర్షువలులోను । బిల్హాలోను ఎజెము 29
లోను తోలాదులోను । బెతూయేలులోను హోర్మా 30
లోను సిక్లగులోను । బేత్మర్కాబోతులోను హజరూసూసా 31
లోను బేత్బిరీలోను షరాయిములోను కాపురముండిరి.
దావీదు ఏలుబడి పర్యంతము వారు ఆ పట్టణములలో
కాపురముండిరి. । ఏతాము అయీను రిమ్మోను తోకెను 32
ఆషాను అనువారి ఊళ్లు అయిదు. । బయలువరకు ఆ 33
పట్టణముల పొలములు వారి వశమున ఉండెను; ఇవి
వారి నివాసస్థలములు, వంశావళి పట్టీలు వారికుండెను. ।
వారు మెషోబాబు యమ్లేకు అమజ్యా కుమారుడైన 34
యోషా, । యోవేలు అశీయేలు కుమారుడైన శెరా 35
యాకు పుట్టిన యోషిబ్యా కుమారుడైన యెహూ. ।
ఎల్యోయేనై యహకోబా యెషోహాయా అశాయా 36
అదీయేలు యెశీమీయేలు బెనాయా; । షెమయాకు 37
పుట్టిన షిమ్రీ కుమారుడైన యెదాయాకు పుట్టిన
అల్లోను కుమారుడైన షిపి కుమారుడైన జీజా అను
వారు. । పేళ్లవరుసను వ్రాయబడిన వీరు తమ తమ 38
వంశములలో పెద్దలైయుండిరి; వీరి పితరుల యిండ్లు
బహుగా వర్ధిల్లెను. । వీరు తమ మందలకొరకు మేత 39
వెదకుటకై గెదోరుకు పడమరగానున్న పల్లపుస్థలము
యొక్క తూర్పువైపుకు పోయి । మంచి బలకరమైన 40
మేతయు నెమ్మదియు సుఖమునుగల విశాల దేశమును
కనుగొనిరి; పూర్వమందు హాముయొక్క వంశపువారు
అక్కడ కాపురముండిరి. । పేళ్లవరుసను వ్రాయబడి 41
యుండు వీరు యూదా రాజైన హిజ్కియా దినము
లలో అచ్చటికి వచ్చి అచ్చట కనబడినవారి గుడార
ములను నివాసస్థలములను పడగొట్టి వారిని హతము
చేసి, అచ్చట తమ గొఱ్ఱెలకు తగిన మేత కలిగి
యుండుటచేత నేటిపర్యంతము వారి స్థానములను
ఆక్రమించుకొని యున్నారు. । షిమ్యోను కుమారు 42
లైన వీరిలో ఏనూరుమంది తమపైని ఇషీ కుమారు
లైన పెలట్యాను నెయర్యాను రెఫాయాను ఉజ్జీ
యేలును అధిపతులగా నిర్ణయించుకొని శేయీరు
మన్నెమునకు పోయి । అమాలేకీయులలో తప్పించు 43
కొనిన శేషమును హతముచేసి నేటిపర్యంతము అచ్చట
కాపురమున్నారు.

ఇశ్రాయేలుకు తొలిచూలి కుమారుడైన రూబేను 5
కుమారుల వివరము. ఇతడు జ్యేష్ఠుడై యుండెను
గాని తన తండ్రి పరుపును తాను అంటుపరచినందున
అతని జన్మస్వాతంత్ర్యము ఇశ్రాయేలు కుమారుడైన
యోసేపు కుమారులకియ్యబడెను; అయితే వంశా
వళిలో యోసేపు జ్యేష్ఠుడుగా దాఖలుచేయబడలేదు. ।
యూదా తన సహోదరులకంటె హెచ్చినవాడా 2

నామమునుబట్టి ప్రార్థన చేయుదును. ఏ దేవుడు
కట్టెలను తగలబెట్టుటచేత ప్రత్యుత్తరమిచ్చునో
ఆయనే దేవుడని నిశ్చయించుదము రండని ఏలీయా
మరల జనులతో చెప్పగా జనులందరును—ఆ మాట
25 మంచిదని ప్రత్యుత్తరమిచ్చిరి. । అప్పుడు ఏలీయా—
బయలు ప్రవక్తలను పిలిచి — మీరు అనేకులై
యున్నారు గనుక మీరే మొదట ఒక యెద్దును
కోసికొని సిద్ధముచేసి మీ దేవత పేరునుబట్టి ప్రార్థన
చేయుడి, అయితే మీరు అగ్నియేమియు క్రింద
26 వేయవద్దని చెప్పగా । వారు తమకు ఇయ్యబడిన
యెద్దును తీసికొని సిద్ధముచేసి, ఉదయము మొదలు
కొని మధ్యాహ్నమువరకు — బయలా, మా ప్రార్థన
వినుమని బయలు పేరునుబట్టి ప్రార్థనచేసిరి గాని
యొక మాటయైనను ప్రత్యుత్తరమిచ్చువాడెవడును
లేకపోగా, వారు తాము చేసిన బలిపీఠమునొద్ద
27 గంతులు వేయ మొదలుపెట్టిరి. । మధ్యాహ్నము కాగా
ఏలీయా — వాడు దేవుడై యున్నాడు, పెద్దకేకలు
వేయుడి; వాడు ఒకవేళ ధ్యానము చేయుచున్నా
డేమో, దూరముననున్నాడేమో, ప్రయాణము చేయు
చున్నాడేమో, వాడు నిద్రపోవుచున్నాడేమో, మీరు
ఒకవేళ లేపవలసి యున్నదేమో అని అపహాస్యము
28 చేయగా । వారు మరి గట్టిగా కేకలు వేయుచు, రక్తము
కారుమట్టుకు తమ మర్యాదచొప్పున కత్తులతోను
బాణములతోను తమ దేహములను కోసికొనుచుండిరి. ।
29 ఈ ప్రకారము మధ్యాహ్నమైన తరువాత అస్తమయ
నైవేద్యము అర్పించు సమయమువరకు వారు ప్రక
టనము చేయుచు వచ్చిరి గాని, మాటయైనను ప్రత్యు
త్తరమిచ్చువాడైనను లక్ష్యముచేసినవాడైనను లేక
30 పోయెను. । అప్పుడు ఏలీయా—నా దగ్గరకు రండని
జనులందరితో చెప్పగా జనులందరును అతని దగ్గరకు
వచ్చిరి. అతడు క్రింద పడద్రోయబడియున్న
31 యెహోవా బలిపీఠమును బాగుచేసి, । యెహోవా
వాక్కు ప్రత్యక్షమై—నీ నామము ఇశ్రాయేలగునని
వాగ్దానము నొందిన యాకోబు సంతతి గోత్రముల
32 లెక్కచొప్పున పన్నెండు రాళ్లను తీసికొని । ఆ
రాళ్లచేత యెహోవా నామమున ఒక బలిపీఠము
కట్టించి, దానిచుట్టు రెండు మానికల గింజలు పట్టు
33 నంత లోతుగా కందకమొకటి త్రవ్వించి । కట్టెలను
క్రమముగా పేర్చి యెద్దును తునకలుగా కోసి
ఆ కట్టెలమీద ఉంచి, జనులు చూచుచుండగా —
మీరు నాలుగు తొట్లనిండ నీళ్లు నింపి దహనబలి పశు
మాంసముమీదను కట్టెలమీదను పోయుడని చెప్పెను ।
34 అదియైన తరువాత—రెండవ మారు ఆ ప్రకారమే
చేయుడని అతడు చెప్పగా వారు రెండవ మారును
ఆలాగు చేసిరి; — మూడవ మారును చేయుడనగా
35 వారు మూడవ మారును చేసిరి; అప్పుడు । ఆ నీళ్లు
బలిపీఠముచుట్టును పొర్లి పారెను; మరియు అతడు
కందకమును నీళ్లతో నింపెను. । అస్తమయ నైవేద్యము 36
అర్పించు సమయమున ప్రవక్తయగు ఏలీయా దగ్గరకు
వచ్చి యీలాగు ప్రార్థనచేసెను — యెహోవా,
అబ్రాహాము ఇస్సాకు ఇశ్రాయేలుల దేవా, ఇశ్రా
యేలీయుల మధ్య నీవు దేవుడవై యున్నావనియు,
నేను నీ సేవకుడనై యున్నాననియు, ఈ కార్యము
లన్నియు నీ సెలవుచేత చేసితిననియు ఈ దినమున
కనుపరచుము. । యెహోవా, నా ప్రార్థన ఆలకిం 37
చుము; యెహోవావైన నీవే దేవుడవై యున్నా
వనియు, నీవు వారి హృదయములను నీ తట్టునకు తిరుగ
చేయుదువనియు ఈ జనులకు తెలియునట్లుగా నా
ప్రార్థన అంగీకరించుము. । అతడు ఈలాగున ప్రార్థన 38
చేయుచుండగా యెహోవా అగ్ని దిగి, దహనబలి
పశువును కట్టెలను రాళ్లను బుగ్గిని దహించి కందక
మందున్న నీళ్లను ఆరిపోచేసెను. । అంతట జనులంద 39
రును దాని చూచి సాగిలపడి — యెహోవాయే
దేవుడు, యెహోవాయే దేవుడు అని కేకలువేసిరి. ।
అప్పుడు ఏలీయా — ఒకనినైన తప్పించుకొని పోని 40
య్యక బయలు ప్రవక్తలను పట్టుకొనుడని వారికి సెల
వియ్యగా జనులు వారిని పట్టుకొనిరి. ఏలీయా
కీషోను ఏటిదగ్గరకు వారిని కొనిపోయి అక్కడ
వారిని వధించెను. । పిమ్మట ఏలీయా — విస్తారమైన 41
వర్షము వచ్చునట్లుగా ధ్వని పుట్టుచున్నది, నీవు పోయి
భోజనము చేయుమని అహాబుతో చెప్పగా । అహాబు 42
భోజనము చేయబోయెను గాని, ఏలీయా కర్మెలు
పర్వతముమీదికి పోయి నేలమీద పడి ముఖము
మోకాళ్లమధ్య ఉంచుకొనెను. । తరువాత అతడు 43
తన దాసుని పిలిచి—నీవు పైకి పోయి సముద్రము
వైపు చూడుమనగా వాడు మెరక ఎక్కి పారజూచి
ఏమియు కనబడలేదనగా అతడు—ఇంక ఏడు మారులు
పోయి చూడుమని చెప్పెను. । ఏడవ మారు అతడు 44
చూచి—మనిషి చెయ్యి యంత చిన్న మేఘము సము
ద్రమునుండి పైకి ఎక్కుచున్నదనెను. అప్పుడు
ఏలీయా—నీవు అహాబు దగ్గరకు పోయి — నీవు వెళ్ల
కుండ వర్షము నిన్ను ఆపకుండునట్లు నీ రథమును సిద్ధ
పరచుకొని పొమ్మని చెప్పుమని వాని పంపెను. ।
అంతలో ఆకాశము మేఘములతోను గాలివాన 45
తోను కారుకమ్మెను; మోపైన వాన కురిసెను గనుక
అహాబు రథమెక్కి యెజ్రెయేలునకు వెళ్లిపోయెను. ।
యెహోవా హస్తము ఏలీయాను బలపరచగా అతడు 46
నడుము బిగించుకొని పరుగెత్తికొనిపోయి అహాబు
కంటె ముందుగా యెజ్రెయేలు గుమ్మమునొద్దకు
వచ్చెను.

ఏలీయా చేసినదంతయును అతడు ఖడ్గముచేత **19**
ప్రవక్తలనందరిని చంపించిన సంగతియును అహాబు

యెను, అతనినుండి ప్రముఖుడు బయలువెడలెను,
అయినను జన్మస్వాతంత్ర్యము యోసేపుదాయెను. ।
3 ఇశ్రాయేలుకు జ్యేష్ఠుడుగా పుట్టిన రూబేను కుమారు
4 లెవరనగా హనోకు పల్లు హెస్రోను కర్మీ. । యోవేలు
కుమారులలో ఒకడు షెమయా, షెమయాకు గోగు
5 కుమారుడు, గోగుకు షిమీ కుమారుడు, । షిమీకి
మీకా కుమారుడు, మీకాకు రెవాయా కుమారుడు,
6 రెవాయాకు బయలు కుమారుడు, । బయలుకు బెయేర
కుమారుడు, ఇతడు రూబేనీయులకు పెద్ద. అష్షూరు
రాజైన తిగ్లత్పిలేసెరు అతని చెరతీసికొని పోయెను. ।
7 వారి తరముల వంశావళి సరిచూడబడినప్పుడు వారి
కుటుంబములచొప్పున అతని సహోదరులలో
ముఖ్యులుగా తేలినవారు యెహీయేలును, జెకర్యా
8 యును, । యోవేలు కుమారుడైన షెమకు పుట్టిన
ఆజాజు కుమారుడైన బెలయును. బెలవంశపువారు
అరోయేరునందును నెబోవరకును బయల్మెయోనువర
9 కును కాపురముండిరి. । వారి పశువులు గిలాదు దేశ
మందు అతివిస్తారము కాగా తూర్పున ఫరాతునది
మొదలుకొని అరణ్యపు సరిహద్దువరకును వారు కాపుర
10 ముండిరి. । సౌలు దినములలో వారు హగ్రీయీలతో
యుద్ధము జరిగించి వారిని హతముచేసి గిలాదు తూర్పు
వైపువరకు వారి గుడారములలో కాపురముండిరి.
11 గాదు వంశస్థులు వారికెదురుగా బాషాను దేశ
12 మందు సల్కా పర్యంతము కాపురముండిరి. । వారిలో
యోవేలు తెగవారు ముఖ్యులు, రెండవ తెగవారు
షాపామువారు. షాపామువారును యహనైవారును
13 షాపాతువారును బాషానులో ఉండిరి. । వారి పితరుల
యింటివారైన వారి సహోదరులు ఏడుగురు, మిఖా
యేలు మెషుల్లాము షెబయోరై యకాను జీయ
14 ఏబెరు. । వీరు హూరీ అనువానికి పుట్టిన అబీహా
యిలు కుమారులు. ఈ హూరీ యారోయకు
యారోయ గిలాదుకు గిలాదు మిఖాయేలుకు మిఖా
యేలు యెషీషైకి యెషీషై యహదోకు యహదో
15 బూజుకు పుట్టిరి. । గూనీ కుమారుడైన అబ్దీయేలుకు
పుట్టిన అహీ వారి పితరుల యింట్లవారికి పెద్ద. ।
16 వారు బాషానులోనున్న గిలాదునందును దాని గ్రామ
ములయందును షారోనుకు చేరికైన ఉపగ్రామముల
యందును దాని ప్రాంతములవరకు కాపురముండిరి. ।
17 వీరందరును యూదా రాజైన యోతాము దినముల
లోను ఇశ్రాయేలు రాజైన యరొబాము దినముల
లోను తమ వంశావళుల వరుసను లెక్కలో చేర్చబడిరి.
18 రూబేనీయులలోను గాదీయులలోను మనష్షే అర్ధ
గోత్రమువారిలోను బల్లెమును ఖడ్గమును ధరించుట
కును అంబువేయుటకును నేర్చినవారు, యుద్ధమందు
నేర్పరులై దండుకు పోతగినవారు నలుబది నాలుగు
19 వేల ఏడువందల అరువదిమంది యుండిరి. । వీరు హగ్రీ
యీలతోను యెతూరువారితోను నాపీషువారితోను
నోదాబువారితోను యుద్ధముచేసిరి. । యుద్ధమందు 20
వారు దేవునికి మొఱ్ఱపెట్టగా, ఆయనమీద వారు
నమ్మికయుంచినందున ఆయన వారి మొఱ్ఱ ఆలకిం
చెను । గనుక వారిని జయించుటకు వారికి సహాయము 21
కలిగెను. హగ్రీయీలును వారితో ఉన్నవారందరును
వారిచేతికి అప్పగింపబడిరి; వారు ఏబదివేల ఒంటెలను
పశువులను రెండులక్షల ఏబదివేల గొఱ్ఱెలను రెండువేల
గాడిదెలను లక్ష జనమును పట్టుకొనిరి. । యుద్ధమందు 22
దేవుని సహాయము వారికి కలుగుటచేత శత్రువులు
అనేకులు పడిపోయిరి; తాము చెరతీసికొని పోబడు
పర్యంతము రూబేనీయులును గాదీయులును మనష్షే
అర్ధగోత్రమువారును వీరి స్థానములయందు కాపుర
ముండిరి.

మనష్షే అర్ధగోత్రమువారును ఆ దేశమందు కాపుర 23
ముండి వర్ధిల్లుచు, బాషాను మొదలుకొని బయల్హెర్మోను
వరకును శెనీరువరకును హెర్మోను పర్వతము వ్యాపిం
చిరి. । వారి పితరుల యింట్లకు పెద్దలైనవారెవరనగా 24
ఏఫెరు ఇషీ ఎలీయేలు అజ్రీయేలు యిర్మీయా హోదవ్యా
దవ్యా యహదీయేలు; వీరు కీర్తిపొందిన పరాక్రమ
శాలులై తమ పితరుల యింట్లకు పెద్దలైరి. । అయితే 25
వారు తమ పితరుల దేవునిమీద తిరుగబాటుచేసి,
దేవుడు తమ ముందర నాశనము చేసిన జనసమూహ
ముల దేవతలతో వ్యభిచరించిరి. । కాబట్టి ఇశ్రాయేలీ 26
యుల దేవుడు అష్షూరు రాజైన పూలు మనస్సును
అష్షూరు రాజైన తిగ్లత్పిలేసెరు మనస్సును రేపగా
అతడు రూబేనీయులను గాదీయులను మనష్షే అర్ధ
గోత్రమువారిని చెరపట్టి నేటికిని కనబడుచున్నట్లుగా
హాలహుకును హాబోరుకును హారాకును గోజాను నదీ
ప్రాంతములకును వారిని కొంచుబోయెను.

లేవి కుమారులు గెర్షోను కహాతు మెరారి. । కహాతు 6
కుమారులు అమ్రాము ఇస్హారు హెబ్రోను ఉజ్జీయేలు. । 2
అమ్రాము కుమారులు అహరోను మోషే, కుమార్తె 3
మిర్యాము. అహరోను కుమారులు నాదాబు అబీహు
ఎలాజారు ఈతామారు. । ఎలాజారు ఫీనెహాసును 4
కనెను, ఫీనెహాసు అబీషూవను కనెను, । అబీషూవ 5
బుక్కీని కనెను, బుక్కీ ఉజ్జీని కనెను, । ఉజ్జీ జెర 6
హ్యాను కనెను, జెరహ్యా మెరాయోతును కనెను, ।
మెరాయోతు అమర్యాను కనెను, అమర్యా అహీ 7
టూబును కనెను, । అహీటూబు సాదోకును కనెను, 8
సాదోకు అహిమయస్సును కనెను, । అహిమయస్సు 9
అజర్యాను కనెను, అజర్యా యోహానానును కనెను, ।
యోహానాను అజర్యాను కనెను, ఇతడు సొలొమోను 10
యెరూషలేములో కట్టించిన మందిరమందు యాజ
కత్వము జరిగించినవాడు. । అజర్యా అమర్యాను 11
కనెను, అమర్యా అహీటూబును కనెను, । అహీ 12

టూబు సాదోకును కనెను, సాదోకు షల్లూమును
13 కనెను, । షల్లూము హిల్కీయాను కనెను, హిల్కీయా
14 అజర్యాను కనెను, । అజర్యా శెరాయాను కనెను,
15 శెరాయా యెహోజాదాకును కనెను. । యెహోవా
నెబుకద్నెజరు ద్వారా యూదావారిని యెరూష
లేమువారిని చెరతీసికొని పోయినప్పుడు ఈ యెహో
16 జాదాకు చెరలోకి పోయెను. । లేవి కుమారులు గెర్షోను
17 కహాతు మెరారి. । గెర్షోను కుమారుల పేళ్లు లిబ్నీ
18 షిమీ. । కహాతు కుమారులు అమ్రాము ఇస్హారు
19 హెబ్రోను ఉజ్జీయేలు. । మెరారి కుమారులు మహలి
మూషి; వారి పితరుల వరుసలనుబట్టి లేవీయుల కుటుంబ
20 ములు ఏవనగా । గెర్షోను కుమారుడు లిబ్నీ, లిబ్నీ
కుమారుడు యహతు, యహతు కుమారుడు జిమ్మా, ।
21 జిమ్మా కుమారుడు యోవాహు, యోవాహు కుమారుడు
ఇద్దో, ఇద్దో కుమారుడు జెరహు, జెరహు కుమారుడు
22 యెయతిరయి. । కహాతు కుమారులలో ఒకడు అమ్మీ
నాదాబు, వీని కుమారుడు కోరహు, కోరహు కుమా
23 రుడు అస్సీరు, । అస్సీరు కుమారుడు ఎల్కానా,
ఎల్కానా కుమారుడు ఎబ్యాసాపు, ఎబ్యాసాపు
24 కుమారుడు అస్సీరు, । అస్సీరు కుమారుడు తహతు,
తహతు కుమారుడు ఊరియేలు, ఊరియేలు కుమారుడు
25 ఉజ్జీయా, ఉజ్జీయా కుమారుడు షావూలు. । ఎల్కానా
26 కుమారులు అమాశై అహీమోతు. । ఎల్కానా కుమా
రులలో ఒకడు జోపై. జోపై కుమారుడు నహతు, ।
27 నహతు కుమారుడు ఏలీయాబు, ఏలీయాబు కుమారుడు
యెరోహాము, యెరోహాము కుమారుడు ఎల్కానా. ।
28 సమూయేలు కుమారులు జ్యేష్ఠుడగు వష్నియు అబీ
29 యాయు. । మెరారి కుమారులలో ఒకడు మహలి,
మహలి కుమారుడు లిబ్నీ, లిబ్నీ కుమారుడు షిమీ,
30 షిమీ కుమారుడు ఉజ్జా, । ఉజ్జా కుమారుడు షిమ్యా,
షిమ్యా కుమారుడు హగ్గీయా, హగ్గీయా కుమారుడు
అశాయా.

31 నిబంధన మందసమునకు స్థలము ఏర్పాటైన తరు
వాత యెహోవా మందిరమందు సంగీత సేవకొరకు
32 దావీదు నియమించినవారు వీరే. । సొలొమోను
యెరూషలేములో యెహోవా మందిరమును కట్టించు
పర్యంతము వీరు సమాజపు గుడారముయొక్క ముంగిట
సంగీతసేవను ఆచరించుచుండిరి; వారు వంతులచొప్పున
33 తమ పని చూచుకొనుచుండిరి. । ఈ ప్రకారము తమ
కుమారులతో కలిసి కనిపెట్టుచున్నవారెవరనగా
కహాతీయుల కుమారులలో గాయకుడగు హేమాను;
ఇతడు సమూయేలు కుమారుడగు యోవేలుకు పుట్టిన
34 వాడు. । సమూయేలు ఎల్కానాకు పుట్టెను,
ఎల్కానా యెరోహాముకు పుట్టెను, యెరోహాము
ఎలీయేలుకు పుట్టెను, ఎలీయేలు తోయహుకు పుట్టెను, ।
35 తోయహు సూపుకు పుట్టెను, సూపు ఎల్కానాకు
పుట్టెను, ఎల్కానా మహతుకు పుట్టెను, మహతు
అమాశైకి పుట్టెను, । అమాశై ఎల్కానాకు పుట్టెను, 36
ఎల్కానా యోవేలుకు పుట్టెను, యోవేలు అజర్యాకు
పుట్టెను, అజర్యా జెఫన్యాకు పుట్టెను, । జెఫన్యా 37
తాహతుకు పుట్టెను, తాహతు అస్సీరుకు పుట్టెను,
అస్సీరు ఎబ్యాసాపుకు పుట్టెను, ఎబ్యాసాపు కోర
హుకు పుట్టెను, । కోరహు ఇస్హారుకు పుట్టెను, 38
ఇస్హారు కహాతుకు పుట్టెను, కహాతు లేవికి పుట్టెను,
లేవి ఇశ్రాయేలుకు పుట్టెను. । హేమాను సహోదరు 39
డైన ఆసాపు ఇతని కుడిప్రక్కను నిలుచువాడు. ఈ
ఆసాపు బెరక్యా కుమారుడు, బెరక్యా షిమ్యా కుమా
రుడు, । షిమ్యా మిఖాయేలు కుమారుడు, మిఖాయేలు 40
బయశేయా కుమారుడు, బయశేయా మల్కీయా
కుమారుడు, । మల్కీయా యెత్నీ కుమారుడు, యెత్నీ 41
జెరహు కుమారుడు, జెరహు అదాయా కుమారుడు, ।
అదాయా ఏతాను కుమారుడు, ఏతాను జిమ్మా కుమా 42
రుడు, జిమ్మా షిమీ కుమారుడు, । షిమీ యహతు 43
కుమారుడు, యహతు గెర్షోను కుమారుడు, గెర్షోను
లేవి కుమారుడు.

మెరారీయులు ఎడమప్రక్కను నిలుచువారు; 44
వారిలో ఏతాను కీషీ కుమారుడు, కీషీ అబ్దీ కుమారుడు,
అబ్దీ మల్లూకు కుమారుడు, మల్లూకు హషబ్యా కుమా
రుడు, । హషబ్యా అమజ్యా కుమారుడు, అమజ్యా 45
హిల్కీయా కుమారుడు, । హిల్కీయా అమ్జీ కుమా 46
రుడు, అమ్జీ బానీ కుమారుడు, బానీ షమెరు కుమా
రుడు, । షమెరు మహలి కుమారుడు, మహలి మూషి 47
కుమారుడు, మూషి మెరారి కుమారుడు, మెరారి లేవి
కుమారుడు. । వీరి సహోదరులైన లేవీయులు దేవుని 48
మందిరస్థలముతో సంబంధించిన సకలమైన పనులకు
నిర్ణయింపబడిరి.

అయితే అహరోనును అతని సంతతివారును 49
దహన బలిపీఠముమీదను ధూపపీఠముమీదను ధూపము
వేయుచు, అతిపరిశుద్ధస్థలపు పనియంతటిని జరుపు
చుండవలెననియు, దేవుని సేవకుడైన మోషే ఆజ్ఞా
పించిన అంతటిచొప్పున ఇశ్రాయేలీయుల నిమిత్తము
ప్రాయశ్చిత్తము చేయుచుండవలెననియు వారికి నిర్ణయ
మాయెను. । అహరోను కుమారులలో ఎలాజారు అను 50
ఒకడుండెను; వీని కుమారుడు ఫీనెహాసు, ఫీనెహాసు
కుమారుడు అబీషూవ, । అబీషూవ కుమారుడు బుక్కీ, 51
బుక్కీ కుమారుడు ఉజ్జీ, ఉజ్జీ కుమారుడు జెరహ్యా, ।
జెరహ్యా కుమారుడు మెరాయోతు, మెరాయోతు 52
కుమారుడు అమర్యా, అమర్యా కుమారుడు అహీ
టూబు, । అహీటూబు కుమారుడు సాదోకు, సాదోకు
కుమారుడు అహిమయస్సు.

అహరోను సంతతివారగు కహాతీయులు వంతు 54
వారు; వారి కుటుంబముల పొలిమేరలలో వారు

వెడిసిన తావులనుబట్టి వారికి ఏర్పడిన నివాసస్థలములు
55 ఇవి. । యూదాదేశములోని హెబ్రోనును దాని
చుట్టునున్న యుపగ్రామములును వారికప్పగింపబడె
56 ను. । అయితే ఆ పట్టణపు పొలములును దాని గ్రామ
ములును యెఫున్నె కుమారుడైన కాలేబుకు ఇయ్య
57 బడెను. । అహరోను సంతతివారికి వచ్చిన పట్టణము
లేవనగా ఆశ్రయ పట్టణమైన హెబ్రోను లిబ్నా
దాని గ్రామములు, యత్తీరు ఎష్టెమో దాని గ్రామ
58 ములు, । హీలేను దాని గ్రామములు, దెబీరు దాని
59 గ్రామములు, । ఆషాను దాని గ్రామములు, బేత్షెమెషు
60 దాని గ్రామములు. । మరియు బెన్యామీను గోత్ర
స్థానములోని గెబ దాని గ్రామములు, అల్లెమెతు
దాని గ్రామములు, అనాతోతు దాని గ్రామములు,
వీరి వంశములకు కలిగిన పట్టణములన్నియు పదుమూడు.
61 కహాతు గోత్రీయులలో శేషించినవారికి ఎఫ్రా
యిము గోత్రస్థానములోనుండియు, దాను అర్ధగోత్ర
స్థానములోనుండియు, మనష్షే అర్ధగోత్రస్థానములో
నుండియు చీటిచేత పది పట్టణములు ఇయ్యబడెను.
62 గెర్షోను సంతతివారికి వారి వంశములచొప్పున
ఇశ్శాఖారు గోత్రస్థానములోనుండియు, ఆషేరు
గోత్రస్థానములోనుండియు, నఫ్తాలి గోత్రస్థానములో
నుండియు బాషానునందుండు మనష్షే గోత్రస్థాన
ములోనుండియు పదుమూడు పట్టణములు ఇయ్య
63 బడెను. । మెరారీయులకు వారి వంశములచొప్పున
రూబేను గోత్రస్థానములోనుండియు, గాదు గోత్ర
స్థానములోనుండియు, జెబులూను గోత్రస్థానములో
నుండియు చీటిచేత పన్నెండు పట్టణములు ఇయ్య
64 బడెను. । ఈ ప్రకారముగా ఇశ్రాయేలీయులు లేవీ
యులకు ఈ పట్టణములను వాటి గ్రామములను
65 ఇచ్చిరి. । వారు చీటివేసి యూదావారి గోత్రస్థాన
ములోనుండియు, షిమ్యోనీయుల గోత్రస్థానములో
నుండియు, బెన్యామీనీయుల గోత్రస్థానములోనుం
డియు పేరు పేరుగా చెప్పబడిన ఆ పట్టణములను
66 ఇచ్చిరి. । కహాతీయులలో కొందరికి ఎఫ్రాయిము
గోత్రములో పొలిమేర పట్టణములు కలిగియుండెను.।
67 ఆశ్రయ పట్టణములును ఎఫ్రాయిము పర్వతములోని
షెకెమును దాని గ్రామములును, గెజెరును దాని గ్రామ
68 ములును, । యొక్మెయామును దాని గ్రామములును
69 బేత్‌హోరోనును దాని గ్రామములును, । అయ్యా
లోనును దాని గ్రామములును గత్రిమ్మోనును దాని
70 గ్రామములును వారికియ్యబడెను. । మరియు మనష్షే
అర్ధగోత్రస్థానములోనుండి ఆనేరును దాని గ్రామ
ములను, బిలియామును దాని గ్రామములను కహాతీయు
71 లకు ఇచ్చిరి. । మరియు గెర్షోనీయులకు మనష్షే
అర్ధగోత్రవంశస్థానములోనుండి బాషానునందలి
గోలాను దాని గ్రామములు, అష్తారోతు దాని గ్రామ
ములు, । ఇశ్శాఖారు గోత్రస్థానములోనుండి కెదెషు 72
దాని గ్రామములు, దాబెరతు దాని గ్రామములు, ।
రామోతు దాని గ్రామములు, ఆనేము దాని గ్రామ 73
ములు, । ఆషేరు గోత్రస్థానములోనుండి మాషాలు 74
దాని గ్రామములు, అబ్దోను దాని గ్రామములు, ।
హుక్కోకు దాని గ్రామములు రెహోబు దాని 75
గ్రామములు; । నఫ్తాలి గోత్రస్థానములోనుండి గలి 76
లైయలోనున్న కెదెషు దాని గ్రామములు, హమ్మోను
దాని గ్రామములు, కిర్యతాయిము దాని గ్రామములు
ఇయ్యబడెను. । మరియు మెరారీయులలో శేషించిన 77
వారికి జెబులూను గోత్రస్థానములోనుండి రిమ్మోను
దాని గ్రామములు, తాబోరు దాని గ్రామములు, ।
యెరికోకు ఆవల యొర్దానుకు తూర్పుగా ఉండు 78
రూబేను గోత్రస్థానములోనుండి అరణ్యములోని
బేసెరు దాని గ్రామములు, యహజాయు దాని
గ్రామములు, । కెదేమోతు దాని గ్రామములు, 79
మేఫాతు దాని గ్రామములు, । గాదు గోత్రస్థాన 80
ములోనుండి గిలాదుయందలి రామోతు దాని గ్రామ
ములు, మహనయీము దాని గ్రామములు, ।
హెష్బోను దాని గ్రామములు, యాజెరు దాని 81
గ్రామములు ఇయ్యబడెను.

ఇశ్శాఖారు కుమారులు నలుగురు. వారు తోలా 7
పువ్వా యాషూబు షిమ్రోను అనువారు. । తోలా 2
కుమారులు ఉజ్జీ రెఫాయా యెరీయేలు యహ్మయి
యిబ్శాము షెమూయేలు; తోలాకు పుట్టిన వీరు తమ
పితరుల యిండ్లకు పెద్దలు; వీరు తమ తరములలో
పరాక్రమశాలులై యుండిరి; దావీదు దినములలో వీరి
సంఖ్య యిరువది రెండువేల ఆరునూరు. । ఉజ్జీ కుమా 3
రులలో ఒకడు ఇజ్రహయా. ఇజ్రహయా కుమా
రులు మిఖాయేలు ఓబద్యా యోవేలు ఇష్షీయా; వీరు
అయిదుగురు పెద్దలై యుండిరి. । వారికి బహుమంది 4
భార్యలును పిల్లలును కలిగియుండుటచేత వారి పితరుల
యిండ్ల లెక్కను వారి వంశములలో సేనకు చేరినవారు
ముప్పది ఆరువేలమంది యుండిరి. । మరియు ఇశ్శా 5
ఖారు వంశములన్నిటిలో వారి సహోదరులైన పరా
క్రమశాలులందరు తమ వంశావళులచొప్పున ఎనుబది
యేడువేలమంది యుండిరి.

బెన్యామీను కుమారులు ముగ్గురు; బెల బేకరు 6
యెదీయయేలు. । బెల కుమారులు అయిదుగురు; ఎస్బోను 7
ఉజ్జీ ఉజ్జీయేలు యెరీమోతు ఈరీ. వీరు తమ పితరుల
యిండ్లకు పెద్దలు, పరాక్రమశాలులు; వీరి వంశములో
చేరినవారు ఇరువది రెండువేల ముప్పది నలుగురు. ।
బేకరు కుమారులు జెమీరా యోవాషు ఎలీయెజెరు 8
ఎల్యోయేనై ఒమ్రీ యెరీమోతు అబీయా అనాతోతు
ఆలెమెతు; వీరందరును బేకరు కుమారులు. । వీరు తమ 9
పితరుల యిండ్లకు పెద్దలు, పరాక్రమశాలులు; వీరంద.

10 రును ఇరువదివేల ఇన్నూరుగురు. । యెదీయవేలు కుమా
రులలో ఒకడు బిల్హాను. బిల్హాను కుమారులు యూషు
బెన్యామీను ఏహూదు కెనయనా జేతాను తర్షీషు
11 అహీషహరు. । యెదీయవేలు కుమారులైన వీరందరును
తమ పితరుల యిండ్లకు పెద్దలు; వీరిలో యుద్ధమునకు
పోతగిన పరాక్రమశాలులు పదిహేనువేల ఇన్నూరు
12 మంది యుండిరి. । షుప్పీము హుప్పీము ఈరు కుమా
రులు; అహేరు కుమారులలో హుషీము అను ఒక
13 డుండెను. । నఫ్తాలీయులు బిల్హాకు పుట్టిన యహస
యేలు గూనీ యేసెరు షిల్లేము.

14 మనష్షే కుమారులలో అశ్రీయేలను ఒకడుండెను.
అరామీయురాలైన ఉపపత్ని అతని కనెను, అది
15 గిలాదుకు పెద్దయైన మాకీరునుకూడ కనెను. । మాకీరు
హుప్పీముకును షుప్పీముకును పెండ్లిచేసెను. దాని
సహోదరి పేరు మయకా, రెండవదానికి సెలోపెహా
దని పేరు, ఈ సెలోపెహాదుకు కుమార్తెలు మాత్రము
16 పుట్టిరి. । మాకీరు భార్యయైన మయకా ఒక కుమారుని
కని అతనికి పెరెషు అను పేరుపెట్టెను, ఇతని సహో
దరుని పేరు షెరెషు, అతని కుమారులు ఊలాము
17 రాకెము. । ఊలాము కుమారులలో బెదాను అను ఒక
డుండెను; వీరు మనష్షే కుమారుడైన మాకీరుకు పుట్టిన
18 గిలాదు కుమారులు. । మాకీరుకు సహోదరియైన
హమ్మోలెకెతు ఇషోదును అబీయెజెరును మహలాను
19 కనెను. । షెమీదా కుమారులు అహెయాను షెకెము
లికీ అనీయాము.

20 ఎఫ్రాయిము కుమారులలో షూతలహు అను ఒక
డుండెను; అతనికి బెరెదు కుమారుడు, బెరెదుకు
తాహతు కుమారుడు, తాహతుకు ఎలాదా కుమారుడు,
21 ఎలాదాకు తాహతు కుమారుడు, । తాహతుకు జాబాదు
కుమారుడు. వీనికి షూతలహు ఏజెరు ఎల్యాదు అను
వారు పుట్టిరి; వారు తమ దేశములో పుట్టిన గాతీయుల
పశువులను పట్టుకొనిపోవుటకు దిగి రాగా ఆ గాతీ
22 యులు వారిని చంపిరి. । వారి తండ్రియైన ఎఫ్రాయిము
అనేకదినములు దుఃఖించుచుండగా అతని సహోదరు
23 రులు వచ్చి అతని పరామర్శించిరి. । తరువాత అతడు
తన భార్యను కూడగా అది గర్భము ధరించి యొక కుమా
రుని కనెను; తన యింటికి కీడు కలిగినందున ఎఫ్రా
24 యిము అతనికి బెరీయా అను పేరు పెట్టెను. । అతని
కుమార్తెయైన షెయెరా ఉత్తరపు బేత్‌హోరోనును
దక్షిణపు బేత్‌హోరోనును ఉజ్జెన్‌షెయెరాను కట్టిం
25 చెను. । వాని కుమారులు రెఫహు రెషెపు; రెషెపు
కుమారుడు తెలహు, తెలహు కుమారుడు తహను, ।
26 తహను కుమారుడు లద్దాను, లద్దాను కుమారుడు అమీ
హూదు, అమీహూదు కుమారుడు ఎలీషామా, ।
27 ఎలీషామా కుమారుడు నూను, నూను కుమారుడు
28 యెహోషువ. । వారికి స్వాస్థ్యములైన నివాసస్థల
ములు బేతేలు దాని గ్రామములు తూర్పుననున్న
నహరాను పడమటనున్న గెజెరు దాని గ్రామములు,
షెకెము దాని గ్రామములు, గాజా దాని గ్రామము
లును ఉన్నంతవరకు వ్యాపించెను. । మరియు మనష్షీ 29
యుల ప్రక్కనున్న బేత్షెయాను దాని గ్రామములు,
తానాకు దాని గ్రామములు, మెగిద్దో దాని గ్రామ
ములు, దోరు దాని గ్రామములు వారికుండెను, ఈ
స్థలములలో ఇశ్రాయేలు కుమారుడైన యోసేపు సం
తతివారు కాపురముండిరి.

ఆషేరీయులు ఇమ్నా ఇష్వా ఇష్వీ బెరీయా. 30
శెరహు వీరికి సహోదరి. । బెరీయా కుమారులు 31
హెబెరు మల్కీయేలు, మల్కీయేలు బిర్జాయీతుకు
తండ్రి. । హెబెరు యప్లేటును షోమేరును హోతా 32
మును వీరి సహోదరియైన షూయాను కనెను. ।
యప్లేటు కుమారులెవరనగా పాసకు బింహాలు అష్వాతు 33
వీరు యప్లేటుకు కుమారులు. । షోమేరు కుమారులు 34
అహీ రోగా యెహుబ్బా అరాము. । వాని సహో 35
దరుడైన హేలెము కుమారులు జోపహు ఇమ్నా
షెలెషు ఆమాలు. । జోపహు కుమారులు సూయ 36
హర్నెపెరు షూయాలు బేరీ ఇమ్రా. । బేసెరు హోదు 37
షమ్మా షిల్షా ఇత్రాను బెయేర. । యెతెరు కుమారులు 38
యెఫున్నె పిస్పా అరా. । ఉల్లా కుమారులు ఆరహు 39
హన్నీయేలు రిజెయా. । ఆషేరు సంతతివారైన వీరంద 40
రును తమ పితరుల యిండ్లకు పెద్దలును ప్రఖ్యాతినొం
దిన పరాక్రమశాలులును అధిపతులలో ముఖ్యులునై
యుండిరి. ఆ వంశపువారిలో యుద్ధమునకు పోతగిన
వారి లెక్క యిరువది యారువేలు.

బెన్యామీను కనిన కుమారులలో బెల అనువాడు 8
జ్యేష్ఠుడు, రెండవవాడు అష్బేలు, మూడవవాడు అహ
రహు, । నాల్గవవాడు నోహా, అయిదవవాడు రాపా. । 2
బెలకు పుట్టిన కుమారులు అద్దారు గెరా అబీహూదు । 3
అబీషూవ నయమాను అహోయహు । గెరా 4
షెపూపాను హూరాము. । ఏహూదు కనిన కుమా 6
రులు ఉజ్జా అహీహూదు; వారు గెబ కాపురస్థులకు
ఇంటి పెద్దలుగా నుండిరి; । నయమాను అహీయా గెరా 7
అనువారు వారిని మనహతుకు చెరతీసికొని పోయిరి,
గెరా వారిని అచ్చటికి చెరతీసికొని పోయెను. । వారిని 8
పంపివేసిన తరువాత షహరయీము మోయాబు దేశ
మందు హుషీము బయరా అను తన భార్యలయందు
కనిన పిల్లలు గాక । తన భార్యయైన హోదెషునందు 9
యోబాబును జిబ్యాను మేషాను మల్కామును । యెవూ 10
జును షాక్యాను మిర్మాను కనెను, వీరు అతని కుమా
రులు; వారు తమ పితరుల యిండ్లకు పెద్దలుగా ఉం
డిరి. । హుషీము అను దానియందు అతడు అహీటూ 11
బును ఎల్పయలును కనెను. । ఎల్పయలు కుమారులు 12
ఏబెరు మిషాము షెమెదు; షెమెదు ఓనోను లోదును

18 దాని గ్రామములను కట్టించెను. । బెరీయాయును షెమ
యును అయ్యాలోను కాపురస్థులయొక్క పితరులలో
14 పెద్దలు; వీరు గాతీయులను పారదోలిరి. । అహ్యో
15 షాషకు యెరేమోతు । జెబద్యా అరాదు ఎదెరు ।
16 మిఖాయేలు ఇష్పా యోహా అనువారు బెరీయా కుమా
17 రులు. । జెబద్యా మెషుల్లాము హిజికి హెబెరు ।
18 ఇష్మెరై ఇజ్లీయా యోబాబు అనువారు ఎల్పయలునకు
19 కుమారులు । యాకీము జిఖ్రీ జబ్ది । ఎలీయేనై జిల్లెతై
21 ఎలీయేలు । అదాయా బెరాయా షిమ్రాతు అనువారు
22 షిమీకి కుమారులు. । ఇష్పాను ఏబెరు ఎలీయేలు । అబ్దోను
24 జిఖ్రీ హానాను । హనన్యా ఏలాము అంతోతీయా ।
25 ఇపెదెయా పెనూయేలు అనువారు షాషకు కుమా
26 రులు. । షిమ్షెరై షెహర్యా అతల్యా యహరెష్యా
27 ఏలీయ్యా । జిఖ్రీ అనువారు యెరోహాము కుమా
28 రులు. । వీరు తమ తమ తరములన్నిటిలో పితరుల
యిండ్లకు పెద్దలును ప్రముఖులునై యుండి యెరూష
లేమునందు కాపురముండిరి.

29 గిబియోనుకు తండ్రియైనవాడు గిబియోనులో
30 కాపురముండెను. ఇతని భార్య పేరు మయకా; । ఇతని
పెద్దకుమారుడు అబ్దోను, మిగిలినవారు సూరు కీషు
31 బయలు నాదాబు । గెదోరు అహ్యో, జెకెరు అను
32 వారు. । మిక్లోతు షిమ్యాను కనెను. వీరును తమ
సహోదరులతోకూడ వారికి ఎదురుగానున్న యిండ్ల
33 లోనే యెరూషలేమునందు కాపురముండిరి. । నేరు
కీషును కనెను, కీషు సౌలును కనెను, సౌలు యోనా
తానును మల్కీషూవను అబీనాదాబును ఎష్బయలును
34 కనెను. । యోనాతాను కుమారుడు మెరీబ్బయలు, మెరీ
35 బ్బయలు మీకాను కనెను । మీకా కుమారులు పీతోను
36 మెలెకు తరేయ ఆహాజు. । ఆహాజు యెహోయాదాను
కనెను, యెహోయాదా ఆలెమెతును అజ్మావెతును
37 జిమ్రీని కనెను, జిమ్రీ మోజాను కనెను. । మోజా
బిన్యాను కనెను, బిన్యాకు రాపా కుమారుడు, రాపాకు
ఎలాశా కుమారుడు, ఎలాశాకు ఆజేలు కుమారుడు. ।
38 ఆజేలు కుమారులు ఆరుగురు; వారి పేళ్లు అజ్రీకాము
బోకెరు ఇష్మాయేలు షెయర్యా ఓబద్యా హానాను;
39 వీరందరును ఆజేలు కుమారులు. । అతని సహోదరు
డైన ఏషెకు కుమారులు ముగ్గురు; ఊలాము అను
జ్యేష్ఠుడు, యెహూషు అను రెండవవాడు, ఎలీపే
40 లెటు అను మూడవవాడు. । ఊలాము కుమారులు విలు
విద్యయందు ప్రవీణులైన పరాక్రమశాలులు; వీరికి
నూట యేబదిమంది కుమారులును కుమారుల కుమారు
లును కలిగిరి; వీరందరును బెన్యామీనీయులు.

9 ఈ ప్రకారము ఇశ్రాయేలీయులందరును తమ
వంశములచొప్పున సరిచూడబడినమీదట వారిపేళ్లు
ఇశ్రాయేలు రాజుల గ్రంథమందు వ్రాయబడెను.
యూదావారు చేసిన ద్రోహమునకై వారు బాబె
లునకు చెరగొనిపోబడిరి. । తమ స్వాస్థ్యములైన పట్టణ 2
ములలో మునుపు కాపురమున్న వారెవరనగా ఇశ్రా
యేలీయులును యాజకులును లేవీయులును నెతీనీయు
లును. । యూదావారిలోను బెన్యామీనీయులలోను 3
ఎఫ్రాయిము మనష్షే సంబంధులలోను యెరూష
లేమునందు కాపురమున్న వారెవరనగా । యూదా 4
కుమారుడైన పెరెసు సంతతివాడగు బానీ కుమారుడైన
ఇమ్రీకి పుట్టిన ఒమ్రీ కుమారుడగు అమీహూదుకు
జననమైన ఊతైయు. । షిలోనీయుల పెద్దవాడైన 5
అశాయాయు వాని పిల్లలును. । జెరహు సంతతివారిలో 6
యెయూయేలు వాని సహోదరులైన ఆరువందల తొం
బదిమంది, । బెన్యామీనీయులలో సెనూయాకు కుమారు 7
డైన హోదవ్యాకు పుట్టిన మెషుల్లాము కుమారుడగు
సల్లు, । యెరోహాము కుమారుడైన ఇబ్నెయా, మిక్రికి 8
పుట్టిన ఉజ్జీ కుమారుడైన ఏలా, ఇబ్నీయా కుమారు
డైన రగూయేలుకు పుట్టిన షెఫట్యా కుమారుడగు మెషు
ల్లాము. । వీరును వీరి సహోదరులును తమ తమ వంశ 9
ముల పట్టీలచొప్పున తొమ్మన్నూట ఏబది ఆరుగురు;
ఈ మనుష్యులందరును తమ పితరుల వంశములనుబట్టి
తమ పితరుల యిండ్లకు పెద్దలు.

యాజకులలో యెదాయా యెహోయారీబు యా 10
కీను, । దేవుని మందిరములో అధిపతియైన అహీ 11
టూబు కుమారుడైన మెరాయోతుకు పుట్టిన సాదోకు
కుమారుడగు మెషుల్లామునకు కలిగిన హిల్కీయా కుమా
రుడైన అజర్యా; । మల్కీయా కుమారుడగు పషూరునకు 12
పుట్టిన యెరోహాము కుమారుడైన అదాయా ఇమ్మెరు
కుమారుడైన మెషిల్లేమీతునకు పుట్టిన మెషుల్లామునకు
కుమారుడైన యహజేరాకు జననమైన అదీయేలు కుమా
రుడగు మశై. । మరియు తమ పితరుల యిండ్లకు పెద్ద 13
లైన వెయ్యిన్ని యేడువందల అరువదిమంది కుటుంబి
కులు. వీరు దేవుని మందిరసేవాసంబంధమైన కార్య
ములయందు మంచి గట్టివారు. । మరియు లేవీయు 14
లలో మెరారి సంతతివాడైన హషబ్యా కుమారుడగు
అజ్రీకాముకు పుట్టిన హష్షూబు కుమారుడైన షెమ
యా, । బక్బక్కరు, హెరెషు, గాలాలు, ఆసాపు 15
కుమారుడగు జిఖ్రీకి పుట్టిన మీకా కుమారుడైన
మత్తన్యా, । యెదూతూను కుమారుడైన గాలాలునకు 16
పుట్టిన షెమయా కుమారుడైన ఓబద్యా, నెటోపాతీ
యుల గ్రామములలో కాపురమున్న ఎల్కానా
కుమారుడైన ఆసాకు పుట్టిన బెరెక్యా. । ద్వారపాల 17
కులు ఎవరనగా షల్లూము అక్కూబు టల్మోను అహీ
మాను అనువారును వారి సహోదరులును. వీరిలో
షల్లూము పెద్ద. । లేవీయుల సమూహములలో వీరు 18
తూర్పుననుండు రాజు గుమ్మమునొద్ద ఇంత పర్యంతము
కాపురము చేయుచున్నారు. । మరియు కోరహు 19
కుమారుడగు ఎబ్యాసాపునకు పుట్టిన కోరే కుమారుడైన

షల్లూమును వాని పితరుని యింటివారును వాని
సహోదరులగు కోరహీయులును సేవాసంబంధమైన
పనిమీదనుండి గుడారమునకు ద్వారపాలకులై యుం
డిరి; వారి పితరులు యెహోవా పాళెమునకు కావలి
వారై యుండి ప్రవేశస్థలమును కాయుచుండిరి. ।
20 ఎలాజారు కుమారుడైన ఫీనెహాసు మునుపు వారిమీద
అధికారియై యుండెను, యెహోవా అతనితో
21 కూడ నుండెను. । మరియు మెషెలెమ్యా కుమారుడైన
జెకర్యా సమాజపు గుడారముయొక్క ద్వారమునకు
22 కావలి. । గుమ్మములయొద్ద ద్వారపాలకులుగా ఏర్పడిన
వీరందరు ఇన్నూటపన్నిద్దరు; వీరు తమ గ్రామముల
వరుసను తమ వంశావళిచొప్పున సరిచూడబడిరి; వీరు
నమ్మదగినవారని దావీదును దర్శకుడగు సమూయేలును
23 వీరిని నియమించిరి. । వారికిని వారి కుమారులకును
యెహోవా మందిరపు గుమ్మములకు, అనగా గుడా
రపు మందిరముయొక్క గుమ్మములకు వంతులచొప్పున
24 కావలికాచుట పని కలిగియుండెను. । గుమ్మముల కావలి
వారు నాలుగు దిశలను, అనగా తూర్పునను పడమరను
25 ఉత్తరమునను దక్షిణమునను ఉండిరి. । వారి సహో
దరులు తమ గ్రామములలోనుండి యేడేసి దినముల
26 కొకసారి వారియొద్దకు వచ్చుటకద్దు. । లేవీయులైన
నలుగురు ప్రధాన ద్వారపాలకులు ఉత్తరవాదులై
యుండిరి; దేవుని మందిరపు గదులమీదను బొక్కస
ములమీదను ఆ లేవీయులు ఉంచబడియుండిరి. ।
27 వారు దేవుని మందిరమునకు కావలివారు గనుక వారి
కాపురములు దానిచుట్టు ఉండెను. ప్రతి ఉదయ
మున మందిరపు వాకిండ్లను తెరచుపని వారిదే. ।
28 వారిలో కొందరు సేవోపకరణములను కనిపెట్టువారు,
వారు లెక్కచొప్పున వాటిని లోపలికి కొంచుపో
వలెను, లెక్కచొప్పున వెలుపలికి తీసికొని రావలెను. ।
29 మరియు వారిలో కొందరు మిగిలిన సామగ్రిమీదను
పరిశుద్ధమైన పాత్రలన్నిటిమీదను ఉంచబడియుండిరి;
సన్నపు పిండియు ద్రాక్షారసమును నూనెయు ధూప
30 వర్గమును వారి అధీనము చేయబడెను. । యాజకుల
కుమారులలో కొందరు సుగంధవర్గములను పరిమళ
31 తైలమును చేయుదురు. । లేవీయులలో కోరహు
సంతతివాడైన షల్లూముకు పెద్ద కుమారుడైన మత్తిత్యా
32 పిండివంటలమీద నుంచబడెను. । వారి సహోదరు
లగు కహాతీయులలో కొందరికి విశ్రాంతి దినమున
సముఖపు రొట్టెలు సిద్ధముచేయు పని కలిగియుం
33 డెను. । లేవీయుల పితరులలో పెద్దలైన గాయకులు
రాత్రింబగళ్లు పని విచారణ కలిగియున్న హేతువు
చేత వారు కడమ పనుల విచారణలేకుండ తమ గదుల
34 లోనుండిరి. । వీరు తమ వంశపట్టీలచొప్పున లేవీ
యుల పితరులలో పెద్దలైనవారు. వీరు యెరూష
35 లేమునందు కాపురముండిరి. । గిబియోను తండ్రియైన
యెహీయేలు గిబియోనులో కాపురముండెను, అతని
భార్యపేరు మయకా. । ఇతని పెద్దకుమారుడు అబ్దోను; 36
సూరు కీషు బయలు నేరు నాదాబు । గెదోరు 37
అహ్యో జెకర్యా మిక్లోతు తరువాత పుట్టినవారు. ।
మిక్లోతు షిమ్యామును కనెను. వీరు యెరూషలేము 38
వాసులగు తమ సహోదరులతో కూడ తమ సహో
దరులకు ఎదురుగానున్న యిండ్లలోనే కాపురముం
డిరి. । నేరు కీషును కనెను, కీషు సౌలును కనెను, 39
సౌలు యోనాతానును మల్కీషూవను అబీనాదాబును
ఎష్బయలును కనెను. । యోనాతాను కుమారుడు మెరీ 40
బ్బయలు, మెరీబ్బయలు మీకాను కనెను. । మీకా 41
కుమారులు పీతోను మెలెకు తరేయ (ఆహాజు.) ।
ఆహాజు యరాను కనెను; యరా ఆలెమెతును అజ్మా 42
వెతును జిమ్రీని కనెను, జిమ్రీ మోజాను కనెను. ।
మోజా బిన్యాను కనెను, రెఫాయా బిన్యానుకు కుమా 43
రుడు, ఎలాశా రెఫాయాకు కుమారుడు, ఆజేలు ఎలా
శాకు కుమారుడు. । ఆజేలుకు ఆరుగురు కుమారులుం 44
డిరి; వారు అజ్రీకాము బోకెరు ఇష్మాయేలు షెయర్యా
ఓబద్యా హానాను అను పేళ్లుగలవారు; వీరు ఆజేలు
కుమారులు.

ఫిలిష్తీయులు ఇశ్రాయేలీయులతో యుద్ధము **10**
చేయగా ఇశ్రాయేలీయులు ఫిలిష్తీయులయెదుట
నిలువలేక పారిపోయి హతులై గిల్బోవ పర్వతమందు
పడిరి. । ఫిలిష్తీయులు సౌలును అతని కుమారులను 2
తరిమి సౌలు కుమారులైన యోనాతానును అబీనా
దాబును మల్కీషూవను హతముచేసిరి. । యుద్ధము 3
సౌలుమీద ప్రబలముకాగా అతడు అంబులు వేయు
వారి కంటబడి వారిచేత బహు గాయములనొందెను. ।
అప్పుడు సౌలు—ఈ సున్నతిలేని జనులు వచ్చి నాకు 4
మానభంగము చేయకుండ నీవు నీ కత్తి దూసి నన్ను
పొడిచివేయుమని తన ఆయుధములను మోయు
వానితో ననగా, వాడు బహుగా భయపడి అలాగు
చేయుటకు ఒప్పలేదు గనుక సౌలు తన కత్తిని నేలను
నాటి దానిమీద పడెను. । సౌలు చనిపోయెనని 5
ఆయుధములను మోయువాడు తెలిసికొని తానును
కత్తిని నేలను నాటి దానిమీద పడి చచ్చెను. । ఆ 6
ప్రకారమే సౌలును అతని ముగ్గురు కుమారులును
చచ్చిరి. మరియు అతని యింటివారందరును చచ్చిరి. ।
జనులు పారిపోయిరనియు, సౌలును అతని కుమారు 7
లును చనిపోయిరనియు, లోయలోని ఇశ్రాయేలీయు
లందరు తెలిసికొని తమ పట్టణములు విడిచి పారి
పోగా ఫిలిష్తీయులు వచ్చి వాటిలో కాపురముండిరి.
హతులైనవారి వస్త్రాదులను దోచుకొనుటకై ఫిలిష్తీ 8
యులు మరునాడు వచ్చినప్పుడు వారు సౌలును
అతని కుమారులును గిల్బోవ పర్వతమందు చచ్చి పడి
యుండుట చూచి । అతని కవచమును దోచుకొని, 9

అతని తలను అతని ఆయుధములను తీసికొని పోయి
ఫిలిష్తీయుల దేశమందంతట వాటిని త్రిప్పి, జరిగినదానిని
10 విగ్రహములకును జనులకును చాటించిరి. । వారు
అతని ఆయుధములను తమ దేవుని గుడిలో పెట్టి
11 అతని తలను దాగోను గుడిలో తగిలించిరి. । ఫిలిష్తీ
12 యులు సౌలునకు చేసినదంతయు యాబేష్గిలాదువారు
వినినప్పుడు పరాక్రమశాలులైనవారందరును లేచి
పోయి, సౌలు శవమును అతని కుమారుల శవములను
ఎత్తికొని యాబేషునకు వచ్చి వారి యెముకలను యాబే
షునందలి సింధూరవృక్షముక్రింద పాతిపెట్టి యేడు
13 దినములు ఉపవాసముండిరి. । ఈ ప్రకారము
యెహోవా ఆజ్ఞ గైకొనక ఆయన దృష్టియెదుట
ద్రోహము చేసినందుకును, యెహోవాయొద్ద విచా
రణచేయక కర్ణపిశాచములయొద్ద విచారణచేయువారిని
14 వెదకినందుకును సౌలు హతమాయెను. । అందునిమి
త్తము యెహోవా అతనికి మరణశిక్ష విధించి రాజ్య
మును యెష్షయి కుమారుడైన దావీదు వశము చేసెను.
11 అప్పుడు ఇశ్రాయేలీయులందరును హెబ్రోనులో
నుండు దావీదునొద్దకు కూడి వచ్చి—చూడుము, మేము
2 నీకు ఎముకనంటినవారము రక్తసంబంధులము. । ఇంతకు
ముందు సౌలు రాజైయున్నప్పుడు నీవు ఇశ్రాయేలీ
యులను నడిపించువాడవై యుంటివి—నా జనులగు
ఇశ్రాయేలీయులను నీవు ఏలి వారిమీద అధిపతిగా
ఉందువని నీ దేవుడైన యెహోవా నీకు సెలవిచ్చెను
3 అని మనవి చేసిరి. । ఇశ్రాయేలీయుల పెద్దలందరును
హెబ్రోనులోనున్న రాజునొద్దకు రాగా దావీదు
హెబ్రోనులో యెహోవా సన్నిధిని వారితో
నిబంధనచేసెను; అప్పుడు వారు సమూయేలుద్వారా
యెహోవా సెలవిచ్చిన ప్రకారము దావీదును
ఇశ్రాయేలీయులమీద రాజుగా అభిషేకము చేసిరి. ।
4 తరువాత దావీదును ఇశ్రాయేలీయులందరును
యెరూషలేమనబడిన యెబూసుకు పోయిరి; ఆ దేశ
5 వాసులైన యెబూసీయులు అచ్చట ఉండిరి. । అప్పుడు
—నీవు దీనియందు ప్రవేశింపకూడదని యెబూసు
కాపురస్థులు దావీదుతో అనగా దావీదు దావీదు
పట్టణమనబడిన సీయోనుకోటను పట్టుకొనెను. ।
6 ఎవడు మొదట యెబూసీయులను హతముచేయునో
వాడు ముఖ్యుడును సైన్యాధిపతియునగునని దావీదు
సెలవియ్యగా సెరూయా కుమారుడైన యోవాబు
అందరికంటె ముందుగా ప్రాకారమెక్కి ఆ యాధి
7 పత్యమును పొందెను. । తరువాత దావీదు ఆ కోట
యందు నివాసము చేసినందున దానికి దావీదు పట్టణ
8 మను పేరు కలిగెను. । దావీదు మిల్లో మొదలుకొని
చుట్టును పట్టణమును కట్టించెను; యోవాబు పట్టణ
9 ములో మిగిలిన భాగములను బాగుచేసెను. । సైన్య
ముల కధిపతియగు యెహోవా అతనికి తోడై యుం
డగా దావీదు ఈ ప్రకారము అంతకంతకు అధికు
డగుచుండెను.
ఇశ్రాయేలీయులకు యెహోవా సెలవిచ్చిన 10
ప్రకారము దావీదును పట్టాభిషేకము చేయుటకై
అతని రాజ్యమునందు అతనితోను ఇశ్రాయేలీయు
లందరితోను కూడి సహాయముచేసిన దావీదునొద్ద
నున్న పరాక్రమశాలులైన వారిలో ప్రధానులు వీరు. ।
దావీదు నొద్దనుండిన ఆ పరాక్రమశాలుల పట్టీలోని 11
వారు ముప్పదిమంది; వారిలో హక్మోనీ కుమారుడైన
యాషాబాము ముఖ్యుడు; ఇతడు ఒక యుద్ధమందు
మున్నూరుమందిని చంపి వారిమీద ఈటె ఆడించిన
వాడు. । ఇతని తరువాతివాడు అహోహీయుడగు 12
దోదో కుమారుడైన ఎలాజారు; ఇతడు పరాక్రమ
శాలులని పేరుపడిన ముగ్గురిలో ఒకడు. । ఫిలిష్తీయులు 13
దానినిండ యవలుగల చేను ఉన్న పస్దమ్మీములో
యుద్ధముచేయుటకై కూడిరాగా జనులు ఫిలిష్తీయు
లను చూచి పారిపోయినప్పుడు ఇతడు దావీదుతో
కూడ అచ్చట ఉండెను. । వీరు ఆ చేనిలో నిలిచి 14
దాని కాపాడి ఫిలిష్తీయులను హతముచేయగా
యెహోవా జనులకు గొప్ప రక్షణ కలుగజేసెను. ।
ముప్పదిమంది పరాక్రమశాలులలో ముఖ్యులగు ఈ 15
ముగ్గురు అదుల్లాము అను చట్టు రాతికొండ గుహలో
నుండు దావీదునొద్దకు వచ్చిరి, ఫిలిష్తీయుల సమూ
హము రెఫాయీయుల లోయలో దిగియుండెను. ।
దావీదు మరుగు స్థలమందుండగా ఫిలిష్తీయుల దండు 16
బేత్లెహేమునందుండెను. । దావీదు ఆశపడి—బేత్లె 17
హేమునందలి ఊరి గవినియొద్ది బావినీళ్లు కొంచెము
నాకు దాహమునకు ఎవడు తెచ్చి యిచ్చునని అనగా ।
ఆ ముగ్గురును ఫిలిష్తీయుల దండులోకి చొరబడి పోయి 18
బేత్లెహేము ఊరి గవినియొద్ది బావినీళ్లు చేదుకొని
దావీదునొద్దకు తీసికొని వచ్చిరి. అయితే దావీదు
ఆ నీళ్లు త్రాగుటకు మనస్సులేక యెహోవాకు
అర్పితముగా వాటిని పారబోసి । — నేను ఈలాగు 19
చేయకుండ నా దేవుడు నన్ను కాచును గాక;
ప్రాణమునకు తెగించి యీ నీళ్లు తెచ్చిన యీ మను
ష్యుల రక్తమును నేను త్రాగుదునా అని చెప్పి త్రాగక
పోయెను; ఈ ముగ్గురు పరాక్రమశాలులు ఇట్టి
పనులు చేసిరి. । యోవాబు సహోదరుడైన అబీషై 20
ముగ్గురిలో ప్రధానుడు; ఇతడు ఒక యుద్ధమందు
మున్నూరుమందిని హతముచేసి తన యీటె వారిమీద
ఆడించినవాడై యీ ముగ్గురిలోను పేరుపొందిన
వాడాయెను. । ఈ ముగ్గురిలోను కడమ యిద్దరికంటె 21
అతడు ఘనతనొందినవాడై వారికి అధిపతియాయెను
గాని ఆ మొదటి ముగ్గురిలో ఎవరికిని అతడు సాటి
వాడు కాలేదు. । మరియు కబ్సెయేలు సంబంధుడును 22
పరాక్రమవంతుడునైన యొకనికి పుట్టిన యెహో

యాదా కుమారుడైన బెనాయాయును విక్రమ
క్రియలవలన గొప్పవాడాయెను. ఇతడు మోయా
బీయుడగు అరీయేలు కుమారుల నిద్దరిని చంపెను;
మరియు ఇతడు బయలుదేరి హిమముపడిన కాలమున
ఒక సింహమును ఒక గుహయందు చంపివేసెను. ।
23 అయిదు మూరల పొడవుగల మంచి యెత్తరియైన
ఐగుప్తీయుని ఒకని అతడు చావగొట్టెను; ఆ ఐగుప్తీ
యుని చేతిలో నేతగాని దోనెవంటి యీటె యొకటి
యుండగా ఇతడు ఒక దుడ్డుకర్ర చేత పట్టుకొని
వానిమీదికి పోయి ఆ యీటెను ఐగుప్తీయుని చేతిలో
24 నుండి ఊడ లాగి దానితో వాని చంపెను । యెహో
యాదా కుమారుడైన బెనాయా యిట్టి పనులు చేసి
నందున ఆ ముగ్గురు పరాక్రమశాలులలో ఘనత
25 నొందిన వాడాయెను. । ముప్పదిమందిలోను ఇతడు
వాసికెక్కెను గాని ఆ ముగ్గురిలో ఎవరికిని సాటి
వాడు కాలేదు; దావీదు ఇతనిని తన దేహసంరక్షకుల
కధిపతిగా ఉంచెను.
26 మరియు సైన్యములకు చేరిన వేరు పరాక్రమ
శాలులెవరనగా యోవాబు తమ్ముడైన అశాహేలు,
బేత్లెహేము ఊరివాడైన దోదో కుమారుడగు ఎల్హా
27 నాను, । హరోరీయుడైన షమ్మోతు, పెలోనీయుడైన
28 హేలెస్సు, । తెకోవీయుడైన ఇక్కేషు కుమారుడగు
29 ఈరా, అన్నెతోతీయుడైన అబీయెజెరు, । హుషా
30 తీయుడైన సిబ్బెకై, అహోహీయుడైన ఈలై, । నెటో
పాతీయుడైన మహరై, నెటోపాతీయుడైన బయనా
31 కుమారుడగు హేలెదు, । బెన్యామీనీయుల స్థానము
లోని గిబియా ఊరివాడును రీబైకి కుమారుడునగు
32 ఈతయి, పిరాతోనీయుడైన బెనాయా, । గాయషు
లోయవాడైన హూరై, అర్బాతీయుడైన అబీయేలు, ।
33 బహరూమీయుడైన అజ్మావెతు, షయల్బోనీయుడైన
34 ఎల్యాహ్బా, । గిజోనీయుడైన హాషేము కుమారులు,
హరారీయుడైన షాగే కుమారుడగు యోనాతాను, ।
35 హరారీయుడైన శాకారు కుమారుడగు అహీయాము,
36 ఊరు కుమారుడైన ఎలీఫాలు, । మెకేరాతీయుడైన
37 హెపెరు, పెలోనీయుడైన అహీయా, । కర్మెలీయు
38 డైన హెజ్రో, ఎజ్బయి కుమారుడైన నయరై, । నా
తాను సహోదరుడైన యోవేలు, హగ్రీయుడైన
39 మిబ్హారు, । అమ్మోనీయుడైన జెలెకు, సెరూయా కుమా
రుడై యోవాబుయొక్క ఆయుధములు మోయువా
40 డును బెరోతీయుడునగు నహరై, । ఇత్రీయుడైన
41 ఈరా, ఇత్రీయుడైన గారేబు, । హిత్తీయుడైన ఊరి
42 యా, అహ్లయి కుమారుడైన జాబాదు, । రూబేనీయు
డైన షీజా కుమారుడును రూబేనీయులకు పెద్దయునైన
43 అదీనా, అతనితోటివారగు ముప్పదిమంది, । మయకా
కుమారుడైన హానాను, మిత్నీయుడైన యెహోషా
44 పాతు, । ఆష్తెరాతీయుడైన ఉజ్జీయా, అరోయేరీయు
డైన హోతాను కుమారులగు షామా యెహీయేలు, ।
షిమ్రీ కుమారుడైన యెదీయవేలు, తిజీయుడైన వాని 45
సహోదరుడగు యోహా, । మహవీయుడైన ఎలీ 46
యేలు, ఎల్నయము కుమారులైన యెరీబై యోషవ్యా,
మోయాబీయుడైన ఇత్మా, । ఎలీయేలు ఓబేదు, మెజో 47
బాయా ఊరివాడైన యహశీయేలు.

దావీదు కీషు కుమారుడైన సౌలుకు భయపడి 12
యింకను దాగియుండగా సౌలు బంధువులగు బెన్యా
మీనీయులలో పరాక్రమశాలులు కొందరు దావీదుకు
యుద్ధసహాయముచేయుటకై అతనియొద్దకు సిక్లగుకు
వచ్చిరి. । వీరు విలుకాండ్రయి కుడి యెడమ చేతులతో 2
వడిసెలచేత రాళ్లు రువ్వుటకును వింటిచేత అంబులు
విడుచుటకును సమర్థులైనవారు. । వారెవరనగా గిబి 3
యావాడైన షెమాయా కుమారులైన అహీయెజెరు,
ఇతడు అధిపతి; ఇతని తరువాతివాడగు యోవాషు,
అజ్మావెతు కుమారులైన యెజీయేలు, పెలెటు, బెరాకా,
అనెతోతీయుడైన యెహూ, । ముప్పదిమందిలో 4
పరాక్రమశాలియు ముప్పదిమందికి పెద్దయునైన ఇష్మ
యా అను గిబియోనీయుడు, యిర్మీయా, యహజీయేలు,
యోహానాను, గదేరాతీయుడైన యోజాబాదు, ।
ఎలూజై, యెరీమోతు, బెయల్యా, షెమర్యా, హారీపీ 5
యుడైన షెఫట్యా, । కోరహీయులగు ఎల్కానా, 6
యెష్షీయా, అజరేలు, యోహెజెరు, యాషాబాము, ।
గెదోరు ఊరివాడైన యెరోహాము కుమారులగు యో 7
హేలా, జెబద్యా అనువారును. । మరియు గాదీయు 8
లలో పరాక్రమశాలులు కొందరు అరణ్యమందు దాగి
యున్న దావీదునొద్ద చేరిరి; వీరు బల్లెమును ఈటెను
వాడుకచేయగల యుద్ధప్రవీణులు, సింహముఖము
వంటి ముఖములుగలవారు, కొండలలోనుండు జింక
లంత పాదవేగము గలవారు. । వారెవరనగా మొదటి 9
వాడు ఏజెరు, రెండవవాడు ఓబద్యా, మూడవవాడు
ఏలీయాబు, । నాల్గవవాడు మిష్మన్నా, అయిదవవాడు 10
యిర్మీయా, । ఆరవవాడు అత్తయి, యేడవవాడు ఎలీ 11
యేలు, । ఎనిమిదవవాడు యోహానాను, తొమ్మిదవ 12
వాడు ఎల్జాబాదు, । పదియవవాడు యిర్మీయా, పద 13
కొండవవాడు మక్బన్నయి. । గాదీయులగు వీరు సైన్య 14
మునకు అధిపతులై యుండిరి; వారిలో అత్యల్పుడైన
వాడు నూరుమందికి అధిపతి, అత్యధికుడైనవాడు
వెయ్యిమందికి అధిపతి. । యొర్దాను దరులమీదుగా 15
పొర్లి పారుచుండు మొదటి నెలయందు దానిని దాటి
పోయి తూర్పులోయలలోను పడమటిలోయలలోను
ఉన్నవారినందరిని తరిమివేసినవారు వీరే. । మరియు 16
బెన్యామీనీయులలో కొందరును యూదావారిలో
కొందరును దావీదు దాగియున్న స్థలమునకు వచ్చిరి. ।
దావీదు బయలుదేరి వారికి ఎదురుగా పోయి వారితో 17
ఇట్లనెను—మీరు సమాధానము కలిగి నాకు సహాయము

చేయుటకై నాయొద్దకు వచ్చియున్నయెడల నా హృద
యము మీతో అతికియుండును; అట్లుగాక నావలన
మీకు అపకారమేదియు కలుగలేదని యెరిగియుండి
యు, నన్ను నా శత్రువులచేతికి అప్పగింపవలెనని
మీరు వచ్చియున్నయెడల మన పితరులయొక్క దేవుడు
18 దీని చూచి మిమ్మును గద్దించును గాక. । అప్పుడు ముప్పది
మందికి అధిపతియైన అమాశై ఆత్మవశుడై—దావీదూ,
మేము నీవారము; యెష్షయి కుమారుడా, మేము నీపక్ష
మున ఉన్నాము; నీకు సమాధానము కలుగునుగాక,
సమాధానము కలుగునుగాక, నీ సహకారులకును సమా
ధానము కలుగునుగాక, నీ దేవుడే నీకు సహాయము చేయు
వని పలుకగా దావీదు వారిని చేర్చుకొని వారిని తన
19 దండుకు అధిపతులుగా చేసెను. । సౌలుమీద యుద్ధము
చేయబోయిన ఫిలిష్తీయులతోకూడ దావీదు వచ్చిన
ప్పుడు మనష్షే సంబంధులలో కొందరును అతని
పక్షము చేరిరి; దావీదు ఫిలిష్తీయులకు సహాయము
చేయకపోయెను, ఏలయనగా అతడు తన యజమాను
డైన సౌలు పక్షమునకు మరలి తమకు ప్రాణహాని
చేయునని యెంచి ఫిలిష్తీయుల అధికారులు అతని
20 పంపివేసిరి. । అంతట అతడు సిక్లగుకు తిరిగి పోవుచుం
డగా మనష్షే సంబంధులైన అద్నా యోజాబాదు,
యెదీయయేలు, మిఖాయేలు, యోజాబాదు, ఎలీహు,
జిల్లెతై అను మనష్షే గోత్రపువారికి అధిపతులు అతని
21 పక్షము చేరిరి. । వారందరును పరాక్రమశాలులును
సైన్యాధిపతులునై యుండిరి; ఆ దండును హతము
చేయుటకు వారు దావీదునకు సహాయముచేసిరి. ।
22 దావీదు దండు దేవుని సైన్యమువలె మహాసైన్యమగు
నట్లు ప్రతిదినమున అతనికి సహాయము చేయువారు
అతనియొద్దకు వచ్చుచుండిరి.
23 యెహోవా నోటిమాట ప్రకారము సౌలుయొక్క
రాజ్యమును దావీదునకు త్రిప్పవలెనన్న ప్రయత్న
ముతో యుద్ధమునకై ఆయుధములను ధరించి అతని
యొద్దకు హెబ్రోనుకు వచ్చిన అధిపతుల లెక్క
24 యెంతయనగా । యూదావారిలో బల్లెమును ఈటెను
పట్టుకొని యుద్ధసన్నద్ధులై యున్నవారు ఆరువేల
25 ఎనమన్నూరుమంది. । షిమ్యోనీయులలో యుద్ధము
26 నకు తగినశూరులు ఏడువేల నూరుమంది. । లేవీయు
27 లలో అట్టివారు నాలుగువేల ఆరునూరుమంది. । అహ
రోను సంతతివారికి యెహోయాదా అధిపతి, అతని
తోకూడ ఉన్నవారు మూడువేల ఏడు నూరుమంది. ।
28 పరాక్రమశాలియైన సాదోకు అను యౌవనునితో
కూడ అతని తండ్రి యింటివారైన అధిపతులు ఇరువది
29 యిద్దరు. । సౌలు సంబంధులగు బెన్యామీనీయులు
మూడు వేలమంది; అప్పటివరకు వారిలో బహుమంది
30 సౌలు ఇల్లు గాపాడుచుండిరి. । తమ పితరుల యింటి
వారిలో పేరుపొందిన పరాక్రమశాలులు ఎఫ్రాయి
మీయులలో ఇరువదివేల ఎనమన్నూరుమంది. । మన 31
ష్షేయొక్క అర్ధగోత్రపువారిలో దావీదును రాజుగా
చేయుటకై రావలెనని పేరుపేరుగా నియమింపబడిన
వారు పదునెనిమిది వేలమంది. । ఇశ్శాఖారీయులలో 32
సమయోచితజ్ఞానము కలిగి ఇశ్రాయేలీయులు చేయ
తగినదేదో దాని నెరిగియున్న అధిపతులు ఇన్నూరు
గురు; వీరి గోత్రపువారందరును వీరి యాజ్ఞకు బద్ధులై
యుండిరి. । జెబులూనీయులలో సకలవిధమైన యుద్ధా 33
యుధములను ధరించి యుద్ధమునకు పోదగినవారును
యుద్ధపు నేర్పుగలవారును మనస్సునందు పొరపు
లేకుండ యుద్ధము చేయగలవారును ఏబదివేలమంది. ।
నఫ్తాలీయులలో వెయ్యిమంది అధిపతులు, వారితో 34
కూడ బల్లెమును ఈటెను పట్టుకొనినవారు ముప్పది
యేడువేలమంది. । దానీయులలో యుద్ధసన్నద్ధులైన 35
వారు ఇరువది యెనిమిది వేల ఆరు నూరుమంది. । ఆషే 36
రీయులలో యుద్ధపు నేర్పుగల యుద్ధసన్నద్ధులు నలు
బది వేలమంది. । మరియు యొర్దాను నది అవతలనుండు 37
రూబేనీయులలోను గాదీయులలోను మనష్షే అర్ధ
గోత్రపు వారిలోను సకలవిధమైన యుద్ధాయుధము
లను ధరించు యుద్ధశూరులైన యీ యోధులందరు
దావీదును ఇశ్రాయేలుమీద రాజుగా నియమింపవలె
నన్న కోరిక హృదయమందు కలిగినవారై ఆయుధము
లను ధరించి హెబ్రోనుకు వచ్చిరి. । ఇశ్రాయేలులో 38
కడమవారందరును ఏకమనస్కులై దావీదును రాజుగా
నియమింపవలెనని కోరియుండిరి. । వారి సహోద 39
రులు వారికొరకు భోజనపదార్థములను సిద్ధము చేసి
యుండగా వారు దావీదుతోకూడ అచ్చట మూడు
దినములుండి అన్నపానములు పుచ్చుకొనిరి. । ఇశ్రా 40
యేలీయులకు సంతోషము కలిగియుండెను గనుక ఇశ్శా
ఖారు జెబులూను నఫ్తాలి అనువారి పొలిమేరలవరకు
వారికి సమీపమైనవారు గాడిదెలమీదను ఒంటెల
మీదను కంచరగాడిదెలమీదను ఎద్దులమీదను ఆహార
వస్తువులైన పిండివంటకములను అంజూరపు అడలను
ఎండిన ద్రాక్షపండ్ల గెలలను ద్రాక్షారసమును
నూనెను గొర్రెలను పశువులను విస్తారముగా తీసికొని
వచ్చిరి.

దావీదు సహస్రాధిపతులతోను శతాధిపతుల **13**
తోను అధిపతులందరితోను ఆలోచనచేసి, సమాజ
ముగా కూడిన ఇశ్రాయేలీయులందరితో ఈలాగు
సెలవిచ్చెను। — ఈ యోచన మీదృష్టికి అనుకూలమై 2
మన దేవుడైన యెహోవావలన కలిగిన యెడల ఇశ్రా
యేలీయుల నివాసప్రదేశముల యందంతట శేషించి
యున్న మన సహోదరులును తమ పట్టణములలోను
పల్లెలలోను కాపురమున్న యాజకులును లేవీయులును
మనతో కూడుకొనునట్లు వారియొద్దకు పంపి । మన 3
దేవుని మందసమును మరల మనయొద్దకు కొంచువత్తము

రండి; సౌలు దినములలో దానియొద్ద మనము విచారణ
4 చేయకయే యుంటిమి. । ఈ కార్యము సమాజకు
లందరి దృష్టికి అనుకూలమాయెను గనుక జనులందరును
5 ఆ ప్రకారము చేయుదుమనిరి. । కాగా దేవుని మంద
సమును కిర్యత్యారీమునుండి తీసికొని వచ్చుటకు దావీదు
ఐగుప్తుయొక్క షీహోరునది మొదలుకొని హమాతు
పొలిమేరవరకునుండు ఇశ్రాయేలీయులనందరిని సమ
6 కూర్చెను. । కెరూబుల మధ్య నివాసముచేయు దేవు
డైన యెహోవా నామము పెట్టబడిన ఆయన మందస
మును యూదాలోనుండు కిర్యత్యారీము అనబడిన
బాలానుండి తీసికొనివచ్చుటకై అతడును ఇశ్రాయేలీ
7 యులందరును అచ్చటికి పోయిరి. । వారు దేవుని
మందసమును ఒక క్రొత్త బండిమీద ఎక్కించి, అబీ
నాదాబు ఇంటనుండి తీసికొనివచ్చిరి; ఉజ్జాయును
8 అహ్యోయును బండిని తోలిరి. । దావీదును ఇశ్రా
యేలీయులందరును తమ పూర్ణశక్తితో దేవుని సన్నిధిని
పాటలు పాడుచు, సితారాలను స్వరమండలములను
తంబురలను తాళములను వాయించుచు బూరలు ఊదు
9 చుండిరి. । వారు కీదోను కళ్లమునొద్దకు వచ్చినప్పుడు
పశువులకు కాలుజారినందున మందసమును పట్టుకొన
10 వలెనని ఉజ్జా చేయి చాపగా । యెహోవా కోపము
అతనిమీద మండెను, అతడు తన చేయి మందసము
నొద్దకు చాపగా ఆయన అతని మొత్తెను గనుక
అతడు అక్కడనే దేవుని సన్నిధిని చనిపోయెను. ।
11 యెహోవా ఉజ్జాను వినాశము చేయుట చూచి
దావీదు వ్యాకులపడెను; అందుచేత ఆ స్థలమునకు
12 నేటివరకు పెరెజ్ ఉజ్జా అని పేరు. । ఆ దినమున
దావీదు దేవుని విషయమై భయమొంది—దేవుని మంద
సమును నాయొద్దకు నేను ఏలాగు తీసికొని పోవుదు
13 ననుకొని, మందసమును । తనయొద్దకు దావీదు పట్టణ
మునకు తీసికొనిపోక, దానిని గిత్తీయుడైన ఓబేదె
14 దోము ఇంటిలోనికి కొంచుపోయెను. । దేవుని మంద
సము ఓబేదెదోము ఇంటిలో అతని కుటుంబమునొద్ద
మూడు నెలలుండగా యెహోవా ఓబేదెదోము
ఇంటివారిని అతని పాత్తంతటిని ఆశీర్వదించెను.

**14** తూరు రాజైన హీరాము దావీదునొద్దకు దూత
లను, అతనికి ఒక యిల్లు కట్టుటకై దేవదారు మ్రాను
2 లను, కాసెపనివాండ్లను వడ్లవాండ్లను పంపెను. । తన
జనులగు ఇశ్రాయేలీయుల నిమిత్తము యెహోవా
అతని రాజ్యమును ఉన్నత స్థితిలోకి తెచ్చినందున
ఆయన తన్ను ఇశ్రాయేలీయులమీద రాజుగా స్థిరపర
చెనని దావీదు గ్రహించెను.
3 పిమ్మట యెరూషలేమునందు దావీదు ఇంక కొందరు
స్త్రీలను వివాహము చేసికొని యింక కుమారులను కుమా
4 ర్తెలను కనెను. । యెరూషలేమునందు అతనికి పుట్టిన
కుమారుల పేరు లేవనగా షమ్మూయ షోబాబు నాతాను
సొలొమోను । ఇభారు ఏలీషూవ ఎల్పాలెటు । 5
నోగహు నెపెగు యాఫీయ । ఎలీషామా బెయెల్యాదా 6
ఎలీపేలెటు. 7
దావీదు ఇశ్రాయేలీయులందరిమీద రాజుగా అభి 8
షేకము చేయబడెనని విని, ఫిలిష్తీయులందరు దావీదును
వెదకి పట్టుకొనుటకై బయలుదేరగా దావీదు ఆ సంగతి
విని వారిని ఎదుర్కొనబోయెను. । ఫిలిష్తీయులు వచ్చి 9
రెఫాయీముల లోయలో దిగిరి. । ఫిలిష్తీయులమీదికి 10
నేను పోయినయెడల నీవు వారిని నా చేతికి అప్పగిం
చుదువా? అని దావీదు దేవునియొద్ద విచారణచేయగా
యెహోవా—పొమ్ము, నేను వారిని నీ చేతికి అప్పగిం
చెదనని సెలవిచ్చెను. । వారు బయల్పెరాజీముకు వచ్చి 11
నప్పుడు దావీదు అచ్చట వారిని హతముచేసి—వరద
పొర్లు పారగొట్టివేయునట్లు దేవుడు నాచేత నా శత్రు
వులను మెండుగా నాశము చేయించెననెను; దానిని
బట్టి ఆ స్థలమునకు బయల్పెరాజీము అను పేరు కలి
గెను. । వారు అచ్చట తమ దేవతలను విడిచిపెట్టి 12
పోగా వాటిని అగ్నిచేత కాల్చివేయవలెనని దావీదు
సెలవిచ్చెను. । ఫిలిష్తీయులు మరల ఆ లోయలోకి 13
దిగి రాగా । దావీదు తిరిగి దేవునియొద్ద మనవిచేసెను. 14
అందుకు దేవుడు—నీవు వారిని తరుముకొనిపోక వారిని
తప్పించుకొని చుట్టు తిరిగి, కంబళిచెట్లకు ఎదురుగా
నిలిచి । కంబళిచెట్ల కొనలయందు వారి కాళ్లచప్పుడు 15
నీకు వినబడునప్పుడు వారితో యుద్ధము కలుపుటకై
బయలుదేరి వారిమీద పడుము; ఆ చప్పుడు వినబడు
నప్పుడు ఫిలిష్తీయుల దండును హతముచేయుటకై
దేవుడు నీకు ముందుగా బయలువెళ్లి యున్నాడని
తెలిసికొనుమని సెలవిచ్చెను. । దేవుడు తనకు సెలవి 16
చ్చిన ప్రకారము దావీదు చేయగా ఇశ్రాయేలీయులు
ఫిలిష్తీయుల సైన్యమును గిబియోను మొదలుకొని
గాజెరువరకు తరిమి హతముచేసిరి. । కాబట్టి దావీదు 17
కీర్తి ఇశ్రాయేలీయుల ప్రదేశములందంతట ప్రసిద్ధియా
యెను; యెహోవా అతని భయము అన్యజనులకం
దరికి కలుగజేసెను.

దావీదు తనకొరకు దావీదు పట్టణమందు ఇండ్లు **15**
కట్టించెను; దేవుని మందసమునకు ఒక స్థలమును సిద్ధ
పరచి, దానిమీద గుడారమొకటి వేయించెను. । —
మందసమును ఎత్తుటకును నిత్యము తనకు సేవచేయుట 2
కును యెహోవా లేవీయులను ఏర్పరచుకొనెనని
చెప్పి—వారు తప్ప మరి ఎవరును దేవుని మందసమును
ఎత్తకూడదని దావీదు ఆజ్ఞ ఇచ్చెను. । అంతట దావీదు 3
తాను యెహోవా మందసమునకు సిద్ధపరచిన స్థలము
నకు దాని తీసికొనివచ్చుటకై ఇశ్రాయేలీయులనందరిని
యెరూషలేముకు సమాజముగా కూర్చెను. । అహ 4
రోను సంతతివారిని । లేవీయులైన కహాతు సంతతివారి 5
అధిపతియగు ఊరీయేలును వాని బంధువులలో నూట

6 నూట ఇరువదిమందిని, । మెరారీయులలో అధిపతియైన
అశాయాను వాని బంధువులలో రెన్నూట ఇరువది
7 మందిని, । గెర్షోను సంతతివారికధిపతియగు యోవే
లును వాని బంధువులలో నూట ముప్పదిమందిని, ।
8 ఎలీషాపాను సంతతివారికధిపతియగు షెమయాను
9 వాని బంధువులలో రెన్నూరుమందిని, । హెబ్రోను
సంతతివారికధిపతియగు ఎలీయేలును వాని బంధు
10 వులలో ఎనుబదిమందిని । ఉజ్జీయేలు సంతతివారి
కధిపతియగు అమ్మీనాదాబును వాని బంధువులలో
నూట పన్నెండుగురిని దావీదు సమకూర్చెను. ।
11 అంతట దావీదు యాజకులైన సాదోకును అబ్యా
తారును లేవీయులైన ఊరియేలు అశాయా యోవేలు
షెమయా ఎలీయేలు అమ్మీనాదాబు అనువారిని పిలి
12 పించి వారితో ఇట్లనెను । — లేవీయుల పితరుల
13 సంతతులకు మీరు పెద్దలై యున్నారు. । ఇంతకు
ముందు మీరు ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా
మందసమును మోయకయుండుటచేతను, మనము మన
దేవుడైన యెహోవాయొద్ద విధినిబట్టి విచారణచేయ
కుండుటచేతను, ఆయన మనలో నాశనము కలుగ
జేసెను; కావున ఇప్పుడు మీరును మీవారును మిమ్మును
మీరు ప్రతిష్ఠించుకొని, నేను ఆ మందసమునకు సిద్ధ
14 పరచిన స్థలమునకు దాని తేవలెను. । అప్పుడు యాజ
కులును లేవీయులును ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవా మందసమును తెచ్చుటకై తమ్మునుతాము
15 ప్రతిష్ఠించుకొనిరి. । తరువాత లేవీయులు యెహోవా
సెలవిచ్చిన మాటనుబట్టి మోషే ఆజ్ఞాపించినట్లు దేవుని
మందసమును దాని దండెలతో తమ భుజములమీదికి
16 ఎత్తికొనిరి. । అంతట దావీదు—మీరు మీ బంధువు
లగు పాటకులను పిలిచి, స్వరమండలములు సితారాలు
తాళములులోనగు వాద్యవిశేషములతో గంభీరధ్వని
చేయుచు, సంతోషముతో స్వరములెత్తి పాడునట్లు
ఏర్పాటుచేయుడని లేవీయుల అధిపతులకు ఆజ్ఞ ఇచ్చె
17 ను. । కావున లేవీయులు యోవేలు కుమారుడైన హే
మానును, వాని బంధువులలో బెరెక్యా కుమారుడైన
ఆసాపును, తమ బంధువులగు మెరారీయులలో కూషా
18 యాహు కుమారుడైన ఏతానును, । వీరితోకూడ
రెండవ వరుసగానున్న తమ బంధువులైన జెకర్యా బేను
యహజీయేలు షెమీరామోతు యెహీయేలు ఉన్నీ
ఎలీయాబు బెనాయా మయశేయా మత్తిత్యా ఎలీ
ప్లేహు మిక్నేయాహులనువారిని ద్వారపాలకులగు
ఓబేదెదోమును యెహీయేలును (పాటకులనుగా)
19 నియమించిరి. । పాటకులైన హేమానును ఆసాపును
ఏతానును పంచలోహముల తాళములు వాయించుటకు
20 నిర్ణయింపబడిరి. । జెకర్యా అజీయేలు షెమీరామోతు
యెహీయేలు ఉన్నీ ఎలీయాబు మయశేయా బెనాయా
అనువారు హెచ్చు స్వరముగల స్వరమండలములను
వాయించుటకు నిర్ణయింపబడిరి. । మరియు మత్తిత్యా 21
ఎలీప్లేహు మిక్నేయాహు ఓబేదెదోము యెహీయేలు
అజజ్యాహు అనువారు రాగమెత్తుటకును సితారాలు
వాయించుటకును నిర్ణయింపబడిరి. । లేవీయుల కధి 22
పతియైన కెనన్యా మందసమును మోయుటయందు
గట్టివాడైనందున అతడు మోతక్రమము నేర్పుటకై
నియమింపబడెను. । బెరెక్యాయును ఎల్కానాయును 23
మందసమునకు ముందునడుచు కావలివారుగాను ।
షెబన్యా యెహోషాపాతు నెతనేలు అమాశై జెక 24
ర్యా బెనాయా ఎలీయెజెరు అను యాజకులు దేవుని
మందసమునకు ముందు బూరలు ఊదువారుగాను,
ఓబేదెదోమును యెహీయాయును వెనుకతట్టు కని
పెట్టువారుగాను నియమింపబడిరి. । దావీదును 25
ఇశ్రాయేలీయుల పెద్దలును సహస్రాధిపతులును
యెహోవా నిబంధన మందసమును ఓబేదెదోము
ఇంటిలోనుండి తెచ్చుటకై ఉత్సాహముతో పోయిరి. ।
యెహోవా నిబంధన మందసమును మోయు లేవీయు 26
లకు దేవుడు సహాయముచేయగా వారు ఏడు కోడెలను
ఏడు గొఱ్ఱపొట్టేళ్లను బలులుగా అర్పించిరి. । దావీ 27
దును మందసమును మోయు లేవీయులందరును పాట
కులును పాటకుల పనికి విచారణకర్తయగు కెనన్యా
యును సన్నపునారతో నేయబడిన వస్త్రములు ధరించు
కొనియుండిరి, దావీదును సన్నపునారతో నేయబడిన
ఏఫోదును ధరించియుండెను. । ఇశ్రాయేలీయులంద 28
రును ఆర్భాటము చేయుచు, కొమ్ములు బూరలు ఊదు
చు, తాళములు కొట్టుచు, స్వరమండలములు సితా
రాలు వాయించుచు యెహోవా నిబంధన మందస
మును తీసికొనివచ్చిరి. । యెహోవా నిబంధన మంద 29
సము దావీదు పట్టణములోకి రాగా సౌలు కుమార్తె
యైన మీకాలు కిటికీలోనుండి చూచి రాజైన దావీదు
నాట్యమాడుటయు వాయించుటయు కనుగొని తన
మనస్సులో అతని హీనపరచెను.

ఈ ప్రకారము వారు దేవుని మందసమును తీసి 16
కొని వచ్చి, దావీదు దానికొరకు వేయించియున్న
గుడారము నడుమను దాని ఉంచి, దేవుని సన్నిధిని
దహనబలులను సమాధానబలులను అర్పించిరి. । దహన 2
బలులను సమాధానబలులను దావీదు అర్పించి చాలిం
చిన తరువాత అతడు యెహోవా నామమున జను
లను దీవించి । పురుషులకేమి స్త్రీలకేమి ఇశ్రాయేలీయు 3
లందరిలో ఒక్కొకరికి ఒక రొట్టెను ఒక భక్ష్యమును
ఒక ద్రాక్షపండ్ల అడను పంచిపెట్టెను.

మరియు అతడు యెహోవా మందసము 4
ఎదుట సేవచేయుచు, ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవాను ప్రసిద్ధిచేయుటకును, వందించుటకును
ఆయనకు స్తోత్రములు చెల్లించుటకును లేవీయులలో
కొందరిని నియమించెను. । వారిలో ఆసాపు అధిపతి, 5

జెకర్యా అతని తరువాతివాడు, యెహీయేలు
షెమీరామోతు యెహీయేలు మత్తిత్యా ఏలీయాబు
బెనాయా ఓబేదెదోము యెహీయేలు అనువారు స్వర
మండలములను సితారాలను వాయించుటకై నియమింప
బడిరి, ఆసాపు తాళములను వాయించువాడు.
6 బెనాయా యహజీయేలు అను యాజకులు ఎప్పుడును
దేవుని నిబంధన మందసము ఎదుట బూరలు ఊదువారు.
7 ఆ దినమందు యెహోవాను స్తుతిచేయు విచా
రణను ఏర్పరచి, దావీదు ఆసాపుచేతికిని వాని బంధు
వులచేతికిని గానిని అప్పగించెను. (ఆ స్తుతి విధమే
మనగా)

8 యెహోవాకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి
ఆయన నామమును ప్రకటనచేయుడి
ఆయన కార్యములను జనములలో తెలియజేయుడి.
9 ఆయననుగూర్చి పాడుడి
ఆయనను కీర్తించుడి
ఆయన అద్భుతక్రియలన్నిటినిగూర్చి సంభాషణ
చేయుడి.
10 ఆయన పరిశుద్ధ నామమునుబట్టి అతిశయించుడి
యెహోవాను వెదకువారు హృదయమునందు
సంతోషించుదురు గాక.
11 యెహోవాను ఆశ్రయించుడి ఆయన బలము
నాశ్రయించుడి
ఆయన సన్నిధి నిత్యము వెదకుడి.
12 ఆయన దాసులగు ఇశ్రాయేలు వంశస్థులారా
ఆయన ఏర్పరచుకొనిన యాకోబు సంతతి వార
లారా
13 ఆయన చేసిన ఆశ్చర్యకార్యములను జ్ఞాపకముచేసి
కొనుడి
ఆయన సూచక క్రియలను ఆయన నోటి తీర్పులను
జ్ఞాపకముచేసికొనుడి.
14 ఆయన మన దేవుడైన యెహోవా
ఆయన తీర్పులు భూమియందంతట జరుగుచున్నవి.
15 మీ సంఖ్య కొద్దిగాను మీరు స్వల్పసంఖ్యగల
జనులుగాను
కనాను దేశములో అన్యులుగాను ఉండగా
కొలవబడిన స్వాస్థ్యముగా దాని నీకిచ్చెదనని
16 ఆయన అబ్రాహాముతో చేసిన నిబంధనను
17 ఇస్సాకుతో చేసిన ప్రమాణమును ఏర్పాటును
నిత్యము జ్ఞాపకముంచుకొనుడి.
18 వేయితరములవరకు ఆ మాట నిలుచునని ఆయన
సెలవిచ్చెను.
19 యాకోబుకు కట్టడగాను
ఇశ్రాయేలుకు నిత్యనిబంధనగాను
ఆయన ఆ మాటను స్థిరపరచియున్నాడు.
వారు జనమునుండి జనమునకును రాజ్యమునుండి 20
రాజ్యమునకును తిరుగులాడుచుండగా
నేను అభిషేకించినవారిని ముట్టవలదనియు 21
నా ప్రవక్తలకు కీడుచేయవద్దనియు సెలవిచ్చి
ఆయన ఎవరినైనను వారికి హింసచేయనియ్యలేదు 22
వారి నిమిత్తము రాజులను గద్దించెను.
సర్వభూజనులారా, యెహోవాను సన్నుతిం 23
చుడి
అనుదినము ఆయన రక్షణను ప్రకటించుడి.
అన్యజనులలో ఆయన మహిమను ప్రచురించుడి 24
సమస్త జనములలో ఆయన ఆశ్చర్యకార్యములను
ప్రచురించుడి.
యెహోవా మహా ఘనత వహించినవాడు 25
ఆయన బహుగా స్తుతినొంద తగినవాడు
సమస్త దేవతలకంటె ఆయన పూజ్యుడు.
జనముల దేవతలన్నియు వట్టి విగ్రహములే 26
యెహోవా ఆకాశవైశాల్యమును సృజించిన
వాడు.
ఘనతాప్రభావములు ఆయన సన్నిధిని ఉన్నవి 27
బలమును సంతోషమును ఆయనయొద్ద ఉన్నవి.
జనముల కుటుంబములారా, యెహోవాకు చెల్లిం 28
చుడి
మహిమాబలములను యెహోవాకు చెల్లించుడి.
యెహోవా నామమునకు తగిన మహిమను ఆయ 29
నకు చెల్లించుడి
నైవేద్యములు చేత పుచ్చుకొని ఆయన సన్నిధిని
చేరుడి
ప్రతిష్ఠితములగు ఆభరణములను ధరించుకొని
ఆయనయెదుట సాగిలపడుడి.
భూజనులారా, ఆయన సన్నిధిని వణకుడి 30
అప్పుడు భూలోకము కదలకుండును
అప్పుడది స్థిరపరచబడును.
యెహోవా ఏలుచున్నాడని జనములలో చాటిం 31
చుడి.
ఆకాశములు ఆనందించుగాక
భూమి సంతోషించుగాక
సముద్రమును దాని సంపూర్ణతయు ఘోషించు 32
గాక
పొలములును వాటియందుండు సర్వమును సంతో
షించుగాక.
యెహోవా వేంచేయుచున్నాడు.
భూజనులకు తీర్పుచేయుటకై యెహోవా 33
వేంచేయుచున్నాడు
వనవృక్షములు ఆయన సన్నిధిని ఉత్సహించును.
యెహోవా దయాళుడు, ఆయన కృప నిరంతర 34
ముండును

ఆయనను స్తుతించుడి.
35 దేవా మా రక్షకా, మమ్మును రక్షించుము
మమ్మును చేర్చుకొనుము.
36 మేము నీ పరిశుద్ధనామమునకు కృతజ్ఞతాస్తుతులు
చెల్లించునట్లు
నిన్ను స్తుతించుచు అతిశయించునట్లు
అన్యజనుల వశములోనుండి మమ్మును విడిపింపుము.
అని ఆయనను బతిమాలుకొనుడి.
ఇశ్రాయేలీయులకు దేవుడైన యెహోవా యుగ
ములన్నిటను స్తోత్రము నొందుగాక.
ఈలాగున వారు పాడగా జనులందరు ఆమేన్
37 అని చెప్పి యెహోవాను స్తుతించిరి. । అప్పుడు
మందసము ముందర నిత్యమును కావలసిన అనుదిన
సేవ జరుపుటకై దావీదు అచ్చట యెహోవా నిబం
ధన మందసముమీద ఆసాపును అతని సహోదరు
లను నియమించెను. ఓబేదెదోమును వారి సహో
38 దరులైన అరువది ఎనిమిదిమందిని । యెదూతూను
కుమారుడైన ఓబేదెదోమును హోసాను ద్వారపాల
39 కులుగా నియమించెను. । గిబియోనులోని ఉన్నతస్థల
మునందున్న యెహోవా గుడారముమీదను అచ్చటి
బలిపీఠముమీదను యెహోవా ఇశ్రాయేలీయులకు
ఆజ్ఞాపించిన ధర్మశాస్త్రమందు వ్రాయబడియున్న
40 ప్రకారము । ఉదయాస్తమయములయందు అనుదిన
మున నిత్యమైన దహనబలిని ఆయనకు అర్పించుటకై
అచ్చట అతడు యాజకుడైన సాదోకును అతని
సహోదరులైన యాజకులను నియమించెను. ।
41 యెహోవా కృప నిత్యముండునని ఆయనను స్తుతి
చేయుటకై వీరితోకూడ హేమానును యెదూతూ
నును పేర్లవరుసను ఉదహరింపబడిన మరి కొందరిని
42 నియమించెను. । బూరలు ఊదుటకును తాళములను
వాయించుటకును దేవునిగూర్చి పాడతగిన గీతములను
వాద్యములతో వినిపించుటకును వీరిలోనుండు హేమా
నును యెదూతూనును అతడు నియమించెను. మరియు
యెదూతూను కుమారులను అతడు ద్వారపాలకులుగా
43 నియమించెను. । తరువాత జనులందరును తమతమ
యిండ్లకు వెళ్లిపోయిరి; దావీదును తన యింటివారిని
దీవించుటకై వారియొద్దకు పోయెను.

17 దావీదు తన యింట కూర్చునియుండి ప్రవక్త
యైన నాతానును పిలిపించి—నేను దేవదారు మ్రాను
లతో కట్టబడిన నగరులో నివాసము చేయుచున్నాను;
యెహోవా నిబంధన మందసము తెరలచాటున నున్న
2 దని చెప్పగా । నాతాను — దేవుడు నీకు తోడై
యున్నాడు, నీ హృదయమందున్న దంతయు చేయు
3 మని దావీదుతో అనెను. । ఆ రాత్రియందు దేవుని
వాక్కు నాతానుకు ప్రత్యక్షమై యీలాగు సెల
4 విచ్చెను. । —నీవు పోయి నా సేవకుడైన దావీదుతో
ఇట్లనుము—యెహోవా సెలవిచ్చునదేమనగా, నా
నివాసమునకై యొక ఆలయము కట్టించుట నీచేత
కాదు. । ఇశ్రాయేలీయులను రప్పించిన నాటనుండి 5
నేటివరకు నేను ఒక యింటిలో నివాసము చేయక,
ఒకానొక గుడారములోను ఒకానొక డేరాలోను
నివాసము చేసితిని. । నేను ఇశ్రాయేలీయులందరి 6
మధ్యను సంచరించిన కాలమంతయు—మీరు నా
కొరకు దేవదారుమ్రానులతో ఆలయము కట్టకుంటి
రేమియని, నా జనమును మేపవలసినదని నేను ఆజ్ఞా
పించిన ఇశ్రాయేలీయుల న్యాయాధిపతులలో ఎవ
రితోనైనను నేనొక మాటయైన పలికియుంటినా? ।
కావున నీవు నా సేవకుడైన దావీదుతో చెప్పవలసిన 7
దేమనగా—సైన్యములకు అధిపతియగు యెహోవా
ఈ ప్రకారము సెలవిచ్చుచున్నాడు—నీవు నా జను
లైన ఇశ్రాయేలీయులమీద అధిపతివై యుండునట్లు,
గొఱ్ఱెలవెంబడి తిరుగుచున్న నిన్ను గొఱ్ఱెలమంద
నుండి తీసికొని । నీవు వెళ్లిన చోట్లనెల్ల నీకు తోడుగా 8
ఉండి, నిన్ను ద్వేషించినవారిని నీ ముందర నిలువ
నియ్యక నిర్మూలము చేసితిని; లోకములోని ఘనులకు
కలిగియున్న పేరువంటి పేరు నీకు కలుగజేయుదును ।
మరియు నేను నా జనులైన ఇశ్రాయేలీయులకొరకు 9
ఒక స్థలము ఏర్పరచి వారిని నాటుదును, వారు మరి
తిరుగులాడక తమ స్థానమందు కాపురముందురు,
పూర్వమందు జరిగినట్లును, నా జనులైన ఇశ్రాయేలీ
యులమీద నేను న్యాయాధిపతులను నిర్ణయించిన
కాలము మొదలుకొని జరుగుచు వచ్చినట్లును, దుష్టులు
వారిని ఇక శ్రమ పెట్టకుందురు; । నీ పగవారినంద 10
రిని నేను అణచివేసెదను. అదియుగాక—యెహోవా
నీకు సంతతి కలుగజేయునని నేను నీకు తెలియజేసితిని. ।
నీ జీవితదినములు తీరి నీ పితరులయొద్దకు నీవు చేరు 11
నప్పుడు నీ కుమారులవలన కలుగు నీ సంతతిని నేను
స్థాపనచేసి అతని రాజ్యమును స్థిరపరచెదను. । అతడు 12
నాకు ఒక మందిరమును కట్టించును, అతని సింహాసన
మును నేను నిత్యస్థాపనచేసెదను. । నేను అతనికి 13
తండ్రినై యుందును, అతడు నాకు కుమారుడై యుం
డును; నీకంటె ముందుగా ఉన్నవానికి నా కృపను
నేను చూపక మానినట్లు అతనికి నేను నా కృపను
చూపక మానను. । నా మందిరమందును నా రాజ్య 14
మందును నేను నిత్యము అతని స్థిరపరచెదను, అతని
సింహాసనము ఎన్నటికిని స్థిరముగా నుండునని అతనికి
తెలియజేయుము.

నాతాను తనకు ప్రత్యక్షమైనదానిబట్టి యీ మాట 15
లన్నిటిని దావీదుకు తెలియజేయగా । రాజైన దావీదు 16
వచ్చి యెహోవా సన్నిధిని కూర్చుండి ఈలాగు
మనవిచేసెను—దేవా యెహోవా, నీవు నన్ను ఇంత
హెచ్చులోకి తెచ్చుటకు నేను ఎంతటివాడను? నా

17 యిల్లు ఏమాత్రపుది? । దేవా, యిది నీ దృష్టికి స్వల్ప
విషయమే; దేవా యెహోవా, నీవు రాబోవు బహు
కాలమువరకు నీ సేవకుని సంతతినిగూర్చి సెలవిచ్చి,
మనుష్యునితో మనుష్యుడు మాటలాడునట్లు దయ
పాలించి నాతో మాటలాడి, నా సంతతి ఘనతజెందు
18 నని మాట యిచ్చియున్నావు. । నీ దాసుడనగు నాకు
కలుగబోవు ఘనతనుగూర్చి దావీదను నీ దాసుడనైన
నేను నీతో మరి ఏమని మనవిచేసెదను? నీవు నీ దాసుని
19 ఎరుగుదువు. । యెహోవా నీ దాసుని నిమిత్తమే నీ
చిత్తప్రకారము ఈ మహా ఘనత కలుగునని నీవు
తెలియజేసియున్నావు, అతని నిమిత్తమే నీవు ఈ గొప్ప
20 కార్యమును చేసియున్నావు. । యెహోవా, మేము
మా చెవులతో వినినదంతయు నిజము, నీవంటి వాడెవ
డును లేడు, నీవు తప్ప మరి ఏ దేవుడును లేడు. ।
21 నీ జనులైన ఇశ్రాయేలీయులవంటి జనము భూలోక
మందు ఏది? ఐగుప్తులోనుండి నీవు విమోచించిన నీ
జనులయెదుట నిలువనీయక నీవు అనేక జనములను
తోలివేసినందువలన నీవు మహా భయంకరమైన పేరు
తెచ్చుకొంటివి. వారు నీ స్వంత జనులగునట్లు వారిని
22 విమోచించుటకై దేవుడవైన నీవు బయలుదేరితివి. । నీ
జనులైన ఇశ్రాయేలీయులు నిత్యము నీకు జనులగునట్లు
నీ వాలాగున చేసితివి; యెహోవావైన నీవు వారికి
23 దేవుడవై యున్నావు । యెహోవా, ఇప్పుడు నీ
దాసునిగూర్చియు అతని సంతతినిగూర్చియు నీవు సెల
24 విచ్చిన మాట నిత్యము స్థిరమగుగాక. । ఇశ్రా
యేలీయుల దేవుడైన సైన్యములకు అధిపతియగు
యెహోవా ఇశ్రాయేలీయులకు దేవుడై యున్నా
డని నీ పేరు ఎన్నటికిని ఘనపరచబడునట్లు నీవు సెల
విచ్చిన మాట నిశ్చయముగా స్థిరపరచబడు గాక;
మరియు నీ దాసుడైన దావీదు సంతతి నీ యెదుట
25 స్థిరపరచబడు గాక. । దేవా — నీకు సంతతి కలుగ
జేసెదనని నీ దాసునికి నీవు తెలియజేసియున్నావు
గనుక నీ సన్నిధిని విన్నపము చేయుటకు నీ దాసునికి
26 మనోధైర్యము కలిగెను. । యెహోవా, నీవు దేవు
డవై యుండి నీ దాసునికి ఈ మేలు దయచేసెదనని
27 సెలవిచ్చియున్నావు. । ఇప్పుడు నీ దాసుని సంతతి
నిత్యము నీ సన్నిధిని ఉండునట్లుగా దానిని ఆశీర్వ
దింప ననుగ్రహించియున్నావు. యెహోవా, నీవు
ఆశీర్వదించిన పక్షమున అది ఎన్నటికిని ఆశీర్వదింపబడి
యుండును.

18 ఇదియైన తరువాత దావీదు ఫిలిష్తీయులను
జయించి, తిరుగబాటు చేయచాలకుండ వారిని లో
పరచి, గాతు పట్టణమును దాని గ్రామములను ఫిలి
ష్తీయుల వశమున నుండకుండ వాటిని పట్టుకొనెను. ।
2 అతడు మోయాబీయులను జయించగా వారు దావీ
3 దుకు కప్పముకట్టు దాసులైరి. । సోబా రాజైన హద
రెజెరు ఫరాతునదివరకు తన అధికారమును స్థాపించు
టకై బయలుదేరగా హమాతునొద్ద దావీదు అతనిని
ఓడించి । అతని యొద్దనుండి వెయ్యి రథములను ఏడు 4
వేల గుర్రపు రౌతులను ఇరువదివేల కాల్బలమును
పట్టుకొనెను. దావీదు ఆ రథములలో నూరింటికి
కావలసిన గుర్రములను ఉంచుకొని కడమవాటికన్ని
టికి చీలమండ నరములు తెగవేయించెను. । సోబా 5
రాజైన హదరెజెరుకు సహాయము చేయవలెనని దమస్కు
లోని అరామీయులు రాగా దావీదు ఆ అరామీ
యులలో ఇరువది రెండు వేలమందిని హతముచేసెను. ।
తరువాత దావీదు అరాము సంబంధమైన దమస్కులో 6
కావలి సైన్యమును ఉంచెను; అరామీయులు దావీ
దుకు కప్పముకట్టు సేవకులైరి. ఈ ప్రకారము
దావీదు పోయిన చోట్లనెల్ల యెహోవా అతనికి
సహాయముచేయుచు వచ్చెను. । మరియు హదరెజెరు 7
సేవకులు పట్టుకొనియున్న బంగారు బల్లెములను
దావీదు తీసికొని యెరూషలేమునకు చేర్చెను. । హద 8
రెజెరుయొక్క పట్టణములైన టిబ్హతులోనుండియు,
కూనులోనుండియు దావీదు బహు విస్తారమైన యిత్త
డిని తీసికొని వచ్చెను. దానితో సొలొమోను ఇత్తడి
సముద్రమును స్తంభములను ఇత్తడి వస్తువులను చేయిం
చెను. । దావీదు సోబారాజైన హదరెజెరుయొక్క 9
సైన్యమంతటిని ఓడించిన వర్తమానము హమాతురాజైన
తోహూకు వినబడెను. । హదరెజెరుకును తోహూ 10
కును విరోధము కలిగియుండెను గనుక రాజైన దావీదు
హదరెజెరుతో యుద్ధముచేసి అతని నోడించినందుకై
దావీదుయొక్క క్షేమము తెలిసికొనుటకును, అత
నితో శుభవచనములు పలుకుటకును, బంగారముతోను
వెండితోను ఇత్తడితోను చేయబడిన సకల విధములైన
పాత్రలనిచ్చి, తోహూ తన కుమారుడైన హదోర
మును అతనియొద్దకు పంపెను. । ఈ వస్తువులనుకూడ 11
రాజైన దావీదు తాను ఎదోమీయులయొద్ద నుండియు,
మోయాబీయులయొద్ద నుండియు, అమ్మోనీయులయొద్ద
నుండియు, ఫిలిష్తీయులయొద్ద నుండియు, అమాలేకీ
యులయొద్ద నుండియు తీసికొనిన వెండి బంగారము
లతో పాటుగా యెహోవాకు ప్రతిష్ఠించెను. ।
మరియు సెరూయా కుమారుడైన అబీషై ఉప్పు 12
లోయలో ఎదోమీయులలో పదునెనిమిది వేలమం
దిని హతముచేసెను. । దావీదు ఎదోములో కావలి 13
సైన్యమును ఉంచెను, ఎదోమీయులందరును అతనికి
సేవకులైరి, దావీదు పోయిన చోట్లనెల్ల యెహోవా
అతని రక్షించెను.

ఈ ప్రకారము దావీదు ఇశ్రాయేలీయులందరి 14
మీదను రాజైయుండి తన జనులందరికిని నీతిన్యాయ
ములను జరిగించెను. । సెరూయా కుమారుడైన 15
యోవాబు సైన్యాధిపతియై యుండెను; అహీలూదు

కుమారుడైన యెహోషాపాతు రాజ్యపుదస్తావేజుల
16 మీద నుండెను; । అహీటూబు కుమారుడైన సాదో
కును అబ్యాతారు కుమారుడైన అబీమెలెకును సభా
17 ముఖ్యులు; షవ్షా ప్రధానమంత్రి; । యెహో
యాదా కుమారుడైన బెనాయా కెరేతీయులకును
పెలేతీయులకును అధిపతియై యుండెను; మరియు
దావీదుయొక్క కుమారులు రాజుకు సహాయులై
యుండిరి.

**19** ఇదియైన తరువాత అమ్మోనీయుల రాజైన నాహాషు
చనిపోగా అతని కుమారుడు అతనికి మారుగా రాజా
2 యెను. । అప్పుడు దావీదు—హానూను తండ్రియైన
నాహాషు నాయెడల దయ చూపించెను గనుక నేను
అతని కుమారునియెడల దయ చూపెదనని యనుకొని,
అతని తండ్రి నిమిత్తము అతని పరామర్శించుటకు
దూతలను పంపెను. దావీదు సేవకులు హానూనును
పరామర్శించుటకై అమ్మోనీయుల దేశమునకు వచ్చి
3 నప్పుడు । అమ్మోనీయుల యధిపతులు హానూనుతో
—నిన్ను పరామర్శించుటకై నీయొద్దకు దావీదు దూత
లను పంపుట నీ తండ్రిని ఘనపరచుటకే అని నీవను
కొనుచున్నావా? దేశమును తరిచి చూచి దాని
నాశనము చేయుటకేగదా అతని సేవకులు నీయొ
ద్దకు వచ్చియున్నారు అని మనవి చేయగా ।
4 హానూను దావీదు సేవకులను పట్టుకొని, వారిని గొరి
గించి, వారి వస్త్రములు పిరుగులు దిగకుండునట్లు నడి
5 మికి కత్తిరించి వారిని పంపివేసెను. । ఆ మనుష్యులు
ఇంటికి వచ్చుచుండగా కొందరు వచ్చి వారిని గూర్చిన
వార్త దావీదుకు తెలియజేసిరి; వారు బహు లజ్జా
క్రాంతులై యుండిరి గనుక వారికి ఎదురుగా మను
ష్యులను పంపి — మీ గడ్డములు పెరుగుదనుక మీరు
యెరికోలో ఉండి తరువాత రండని రాజు వారికి
6 వర్తమానమంపెను. । అమ్మోనీయులు దావీదుకు తమ
యందు అసహ్యము పుట్టించితిమని తెలిసికొనినప్పుడు
హానూనును అమ్మోనీయులును అరామ్నహరయీము
నుండియు, అరాము మయకానుండియు, సోబా
నుండియు రథములను గుర్రపు రౌతులను రెండువేల
మణుగుల వెండి ఇచ్చి బాడిగెకు కుదుర్చుకొనిరి. ।
7 ముప్పది రెండువేల రథములతో వచ్చునట్లు జీతమిచ్చి
మయకారాజును అతని జనులను కుదుర్చుకొనిరి; వీరు
వచ్చి మేదెబా ముందరితట్టున దిగిరి, అమ్మోనీయులు
తమతమ పట్టణములలోనుండి కూడుకొని యుద్ధము
8 చేయుటకు వచ్చిరి. । దావీదు ఈ సంగతి విని
యోవాబును సైన్యములోని పరాక్రమశాలుల నంద
9 రిని పంపెను. । అమ్మోనీయులు బయలుదేరి పట్టణపు
గవినియొద్ద యుద్ధపంక్తులు తీర్చిరి, వచ్చిన రాజులు
ప్రత్యేకముగా బయట భూమిలో యుద్ధమునకు సిద్ధ
10 ముగా నిలిచిరి. । తాను రెండు సైన్యముల మధ్యను
చిక్కుబడియుండుట చూచి, యోవాబు ఇశ్రాయేలీ
యులలోని శ్రేష్ఠులలో పరాక్రమశాలులను ఏర్ప
రచుకొని, అరామీయులకు ఎదురుగా వారిని పంక్తులు
తీర్చి, । కడమ జనులను అమ్మోనీయులకు ఎదురుగా
వ్యూహపరచి, తన సహోదరుడైన అబీషైకి అప్ప
గించి యిట్లనెను । —అరామీయుల బలమునకు నేను
నిలువలేకపోయినయెడల నీవు నాకు సహాయము చేయ
వలెను, అమ్మోనీయుల బలమునకు నీవు నిలువలేక
పోయినయెడల నేను నీకు సహాయము చేయుదును. ।
ధైర్యము కలిగి యుండుము, మనము మన జనుల నిమిత్త
మును మన దేవుని పట్టణముల నిమిత్తమును ధీరత్వము
చూపుదము; యెహోవా తన దృష్టికి ఏది మంచిదో
దాని చేయునుగాక. । ఆ ప్రకారము యోవాబును
అతనితో కూడనున్న జనమును అరామీయులతో
యుద్ధము కలుపుటకై చేరపోగా వారు నిలువలేక
అతని యెదుటనుండి తిరిగి పారిపోయిరి. । అరామీ
యులు తిరిగి పారిపోవుట అమ్మోనీయులు చూచి
నప్పుడు వారును అతని సహోదరుడైన అబీషైయెదు
డర నిలువలేక తిరిగి పారిపోయి పట్టణములో
చొచ్చిరి, యోవాబు మరలి యెరూషలేమునకు వచ్చెను. ।
తాము ఇశ్రాయేలీయుల చేతిలో ఓడిపోతిమని అరా
మీయులు తెలిసికొనినప్పుడు వారు దూతలను పంపి,
యేటి ఆవలి అరామీయులను పిలిపించుకొనిరి, హదరె
జెరుయొక్క సైన్యాధిపతియైన షోపకు వారికి నాయకు
డాయెను. । దావీదు ఆ సంగతి తెలిసికొని ఇశ్రాయే 1
లీయులనందరిని సమకూర్చి యొర్దాను దాటి వారికి
ఎదురుపడి వారి యెదుట సైన్యములను వ్యూహపర
చెను; దావీదు అరామీయులకు ఎదురుగా సైన్యము
లను పంక్తులు తీర్చినప్పుడు వారు అతనితో యుద్ధము
చేసిరి. । అయితే అరామీయులు ఇశ్రాయేలీయుల 1
యెదుట నిలువక తిరిగి పారిపోయిరి; దావీదు అరా
మీయులలో ఏడువేల రథికులను నలుబదివేల కాల్బల
మును హతముచేసి సైన్యాధిపతియైన షోపకును చంపి
వేసెను. । తాము ఇశ్రాయేలీయులచేతిలో ఓడిపోతి 19
మని హదరెజెరుయొక్క సేవకులు తెలిసికొనినప్పుడు
వారు దావీదుతో సమాధానపడి అతనికి సేవకులైరి.
అంతటినుండి అరామీయులు అమ్మోనీయులకు సహా
యము చేయుటకు మనస్సులేక యుండిరి.

మరుసటి యేట రాజులు యుద్ధమునకు బయలు **20**
దేరుకాలమున యోవాబు సైన్యములో శూరులైన
వారిని సమకూర్చి, అమ్మోనీయుల దేశమును పాడు
చేసి వచ్చి రబ్బాకు ముట్టడివేసెను; దావీదు యెరూష
లేములోనే యుండగా యోవాబు రబ్బాను ఓడించి
జనులను హతముచేసెను. । దావీదు వచ్చి వారి రాజు 2
తలమీదనున్న కిరీటమును తీసికొనెను; దాని యెత్తు
రెండు మణుగుల బంగారము, అందులో రత్నములు

చిక్కియుండెను, దానిని దావీదు ధరించెను. మరియు
అతడు బహు విస్తారమైన కొల్లసొమ్ము ఆ పట్టణములో
3 నుండి తీసికొనిపోయెను. । దానియందున్న జనులను
అతడు వెలపలికి కొంచుపోయి, వారిలో కొందరిని
రంపములతో కోయించెను, కొందరిని ఇనుపదంతెలతో
చీరించెను; కొందరిని గొడ్డళ్లతో నరికించెను. ఈ
ప్రకారము అతడు అమ్మోనీయుల పట్టణములన్నిటికిని
చేసెను, అంతట దావీదును జనులందరును యెరూష
లేమునకు తిరిగి వచ్చిరి.
4 అటుతరువాత గెజెరులోనున్న ఫిలిష్తీయులతో
యుద్ధము కలుగగా హుషాతీయుడైన సిబ్బెకై రెఫా
యీయుల సంతతివాడగు సిప్పయి అను నొకని
హతముచేసెను, అందువలన ఫిలిష్తీయులు లొంగు
5 బాటుకు తేబడిరి. । మరల ఫిలిష్తీయులతో యుద్ధము
జరుగగా యాయీరు కుమారుడైన ఎల్హానాను గిత్తీయు
డైన గొల్యాతు సహోదరుడగు లహ్మీని చంపెను.
6 వాని యీటె నేతగాని దోనెయంత పెద్దది. । మరల
గాతులో యుద్ధము జరిగెను; మంచి యెత్తరియగు
ఒకడు అచ్చట ఉండెను, వానికి చేతిచేతికి కాలి
కాలికి ఆరేసి చొప్పున ఇరువది నాలుగు వ్రేళ్లుండెను,
7 వాడు రెఫాయీయుల సంతతివాడు. । వాడు ఇశ్రా
యేలీయులను దూషింపగా దావీదు సహోదరుడైన
షిమ్యాకు పుట్టిన యోనాతాను వాని చంపెను. ।
8 గాతులోనున్న రెఫాయీయుల సంతతివారగు వీరు
దావీదుచేతను అతని సేవకులచేతను హతులైరి.

**21** తరువాత సాతాను ఇశ్రాయేలునకు విరోధముగా
లేచి, ఇశ్రాయేలీయులను లెక్కించుటకు దావీదును
2 ప్రేరేపింపగా । దావీదు యోవాబునకును జనులయొక్క
అధిపతులకును — మీరు వెళ్లి బెయేర్షెబా మొదలు
కొని దానువరకు ఉండు ఇశ్రాయేలీయులను ఎంచి,
వారి సంఖ్య నాకు తెలియుటకై నాయొద్దకు దాని
3 తీసికొని రండని ఆజ్ఞ ఇచ్చెను. । అందుకు యోవాబు
—రాజా నా యేలినవాడా, యెహోవా తన జనులను
ఇప్పుడున్న వారికంటె నూరంతలు ఎక్కువమంది చేయు
గాక; వారందరు నా యేలినవాని దాసులు కారా?
నా యేలినవానికి ఈ విచారణ యేల? ఇది జరుగవలసిన
హేతువేమి? జరిగినయెడల ఇశ్రాయేలీయులకు శిక్ష
4 కలుగును అని మనవిచేసెను. । అయినను యోవాబు
మాట చెల్లక రాజు మాటయే చెల్లెను గనుక యోవాబు
ఇశ్రాయేలు దేశమందంతట సంచరించి తిరిగి యెరూష
లేమునకు వచ్చి జనుల సంఖ్య వెరసి దావీదునకు అప్ప
5 గించెను. । ఇశ్రాయేలీయులందరిలో కత్తి దూయు
వారు పదకొండు లక్షలమందియు యూదావారిలో
కత్తి దూయువారు నాలుగు లక్షల డెబ్బది వేలమంది
6 యు సంఖ్యకు వచ్చిరి. । రాజు మాట యోవాబునకు
అసహ్యముగా ఉండెను గనుక అతడు లేవి బెన్యా
మీను గోత్రసంబంధులను ఆ సంఖ్యలో చేర్చలేదు. ।
ఈ కార్యము దేవుని దృష్టికి ప్రతికూలమగుటచేత 7
ఆయన ఇశ్రాయేలీయులను బాధపెట్టెను. । దావీదు 8
—నేను ఈ కార్యము చేసి అధిక పాపము తెచ్చు
కొంటిని, నేను మిక్కిలి అవివేకముగా ప్రవర్తించితిని,
ఇప్పుడు నీ దాసుని దోషము పరిహరించుమని దేవుని
తో మొఱ్ఱపెట్టగా । యెహోవా దావీదునకు దీర్ఘ 9
దర్శి యగు గాదుతో ఈలాగు సెలవిచ్చెను—నీవు వెళ్లి
దావీదుతో ఇట్లనుము. । — యెహోవా సెలవిచ్చున 10
దేమనగా—మూడు విషయములు నేను నీయెదుట
నుంచుచున్నాను, వాటిలో ఒకదానిని నీవు కోరు
కొనినయెడల దాని నీకు చేయుదును. । కావున గాదు 11
దావీదునొద్దకు వచ్చి యిట్లనెను । — మూడేండ్లపాటు 12
కరవు కలుగుట, మూడు నెలలపాటు నీ శత్రువులు
కత్తిదూసి నిన్ను తరుముగా నీవు వారియెదుట నిలువ
లేక నశించిపోవుట, మూడు దినములపాటు దేశమందు
యెహోవా కత్తి, అనగా తెగులు నిలుచుటచేత
యెహోవా దూత ఇశ్రాయేలీయుల దేశమందంతట
నాశనము కలుగజేయుట, అను వీటిలో ఒకదానిని
నీవు కోరుకొనుమని యెహోవా సెలవిచ్చుచు
న్నాడు; కావున నన్ను పంపినవానికి నేను ఏమి
ప్రత్యుత్తరమియ్యవలెనో దాని యోచించుము. । అం 13
దుకు దావీదు—నేను మిక్కిలి యిరుకులో చిక్కియు
న్నాను; యెహోవా మహా కృపగలవాడు, నేను
మనుష్యులచేతిలో పడక ఆయన చేతిలోనే పడుదును
గాక అని గాదుతో అనెను. । కావున యెహోవా 14
ఇశ్రాయేలీయులమీదికి తెగులు పంపగా ఇశ్రాయేలీ
యులలో డెబ్బదివేలమంది చచ్చిరి. । యెరూషలేమును 15
నాశనముచేయుటకై దేవుడు ఒక దూతను పంపెను;
అతడు నాశనము చేయబోవుచుండగా యెహోవా
చూచి ఆ చేటు విషయమై సంతాపమొంది నాశనము
చేయు దూతతో—చాలును, ఇప్పుడు నీ చెయ్యి
ఆపుమని సెలవియ్యగా ఆ దూత యెబూసీయుడైన
ఒర్నాను కళ్లమునొద్ద నిలిచెను. । దావీదు కన్నులెత్తి 16
చూడగా, భూమ్యాకాశముల మధ్యను నిలుచుచు,
వరదీసిన కత్తి చేత పట్టుకొని దానిని యెరూషలేము
మీద చాపిన యెహోవాదూత కనబడెను. అప్పుడు
దావీదును పెద్దలును గోనెపట్టలు కప్పుకొనినవారై
సాష్టాంగపడగా । దావీదు—జనులను ఎంచుమని ఆజ్ఞ 17
ఇచ్చినవాడను నేనేగదా? పాపముచేసి చెడుతనము
జరిగించినవాడను నేనేగదా? గొఱ్ఱెలవంటివారగు
వీరేమిచేసిరి? నా దేవుడవైన యెహోవా, బాధపెట్టు
నీ చెయ్యి నీ జనులమీద నుండకుండ నామీదను నా
తండ్రి యింటివారిమీదను ఉండనిమ్మని దేవునితో
మనవిచేసెను. । యెబూసీయుడైన ఒర్నాను కళ్లము 18
నందు యెహోవాకు ఒక బలిపీఠమును కట్టించుటకై

దావీదు అక్కడికి వెళ్లవలెనని దావీదుకు ఆజ్ఞనిమ్మని
యెహోవా దూత గాదుకు సెలవియ్యగా ।
19 యెహోవా నామమున గాదు పలికిన మాటప్రకా
20 రము దావీదు వెళ్లెను. । ఒర్నాను అప్పుడు గోధుమ
లు దుళ్లగొట్టుచుండెను; అతడు వెనుకకు తిరిగి దూతను
చూచినప్పుడు, అతడును అతనితో కూడనున్న అతని
21 నలుగురు కుమారులును దాగుకొనిరి. । దావీదు ఒర్నాను
నొద్దకు వచ్చినప్పుడు ఒర్నాను దావీదును చూచి,
కళ్లములోనుండి వెలుపలికి వచ్చి, తల నేలమట్టుకు
22 వంచి దావీదునకు నమస్కారము చేసెను. । —ఈ
తెగులు జనులను విడిచిపోవునట్లుగా ఈ కళ్లపు ప్రదేశ
మును నేను యెహోవాకు ఒక బలిపీఠమును కట్టిం
చుటకై దాని నాకు తగిన క్రయమునకిమ్మని దావీదు
23 ఒర్నానుతో అనగా । ఒర్నాను—రాజైన నా యేలిన
వాడు దాని తీసికొని తన దృష్టికి అనుకూలమైనట్టు
చేయునుగాక, ఇదిగో దహనబలులకు ఎద్దులు కట్టెలకై
నురుగుడు మ్రాను నైవేద్యమునకు గోధుమపిండి; ఇది
24 అంతయును నేనిచ్చుచున్నానని దావీదుతో అనెను. । రాజైన
దావీదు — అట్లు కాదు, నేను నీ సొత్తును ఊరక
తీసికొని యెహోవాకు దహనబలులను అర్పించను,
న్యాయమైన క్రయధనమిచ్చి దాని తీసికొందునని
25 ఒర్నానుతో చెప్పి । ఆ భూమికి ఆరునూరు తుల
26 ముల బంగారమును అతనికిచ్చెను. । పిమ్మట దావీదు
యెహోవాకు అచ్చట ఒక బలిపీఠమును కట్టించి, దహన
బలులను సమాధానబలులను అర్పించి యెహోవాకు
మొఱ్ఱపెట్టగా ఆయన ఆకాశములోనుండి దహనబలి
పీఠముమీదికి అగ్నివలన అతనికి ప్రత్యుత్తరమిచ్చెను. ।
27 యెహోవా దూతకు ఆజ్ఞాపింపగా అతడు తన కత్తిని
మరల వరలో వేసెను.

28 యెబూసీయుడైన ఒర్నాను కళ్లమందు
యెహోవా తనకు ప్రత్యుత్తరమిచ్చెనని దావీదు
29 తెలిసికొని అచ్చటనే బలి అర్పించెను । మోషే అరణ్య
మందు చేయించిన యెహోవా నివాసపు గుడార
మును దహనబలిపీఠమును ఆ కాలమందు గిబియోను
30 లోని ఉన్నతస్థలమందుండెను. । దావీదు యెహోవా
దూత పట్టుకొనిన కత్తికి భయపడినవాడై దేవునియొద్ద
విచారించుటకు ఆ స్థలమునకు వెళ్లలేకుండెను. మరియు
— దేవుడైన యెహోవా నివాసస్థలము ఇదేయని
ఇశ్రాయేలీయులర్పించు దహనబలులకు పీఠము ఇదే
యని దావీదు సెలవిచ్చెను.

22 తరువాత దావీదు ఇశ్రాయేలీయుల దేశమం
దుండు అన్యజాతివారిని సమకూర్చుడని ఆజ్ఞ ఇచ్చి,
దేవుని మందిరమును కట్టించుటకై రాళ్లు చెక్కువారిని
2 నియమించెను. । వాకిళ్ల తలుపులకు కావలసిన మేకుల
కేమి చీలలకేమి విస్తారమైన యినుమును తూచ శక్యము
3 కానంత విస్తారమైన యిత్తడిని । ఎంచనలవికానన్ని
దేవదారు మ్రానులను దావీదు సంపాదించెను; సీదో
నీయులును తూరీయులును దావీదునకు విస్తారమైన
దేవదారు మ్రానులను తీసికొని వచ్చుచుండిరి. । —నా 4
కుమారుడైన సొలొమోను పిన్నవయస్సుగల లేతవాడు;
యెహోవాకు కట్టబోవు మందిరము దాని కీర్తినిబట్టి
యు అందమునుబట్టియు సకల దేశములలో ప్రసిద్ధి
చెందునట్లుగా అది చాలా ఘనమైనదై యుండవలెను;
కాగా దానికి కావలసిన సాధనరాశిని సిద్ధపరచెదనని
చెప్పి, దావీదు తన మరణమునకుముందు విస్తారముగా
వస్తువులను సమకూర్చి యుంచెను.

తరువాత అతడు తన కుమారుడైన సొలొమోనును 5
పిలిపించి—ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాకు 6
ఒక మందిరమును కట్టవలసినదని అతనికి ఆజ్ఞ ఇచ్చెను. ।
మరియు దావీదు సొలొమోనుతో ఇట్లనెను — నా 7
కుమారుడా, నేను నా దేవుడైన యెహోవా నామ
ఘనతకొరకు ఒక మందిరమును కట్టింపవలెనని నా
హృదయమందు నిశ్చయము చేసికొనియుండగా ।
యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై యీలాగు 8
సెలవిచ్చెను — నీవు విస్తారముగా రక్తము ఒలికించి
గొప్ప యుద్ధములు జరిగించినవాడవు, నీవు నా నామ
మునకు మందిరమును కట్టింపకూడదు, నా సన్నిధిని
నీవు విస్తారముగా రక్తము నేలమీద ఒలికించితివి. । నీకు 9
పుట్టబోవు ఒక కుమారుడు సమాధానకర్తగా నుండును;
చుట్టు ఉండు అతని శత్రువులనందరిని నేను తోలి
వేసి అతనికి సమాధానము కలుగజేతును; అందువలన
అతనికి సొలొమోను అను పేరు పెట్టబడును; అతని
దినములలో ఇశ్రాయేలీయులకు సమాధానమును
విశ్రాంతియు దయచేయుదును. । అతడు నా నామ 10
మునకు ఒక మందిరమును కట్టించును; అతడు నాకు
కుమారుడైయుండును, నేనతనికి తండ్రినైయుందును,
ఇశ్రాయేలీయులమీద అతని రాజ్యసింహాసనమును
నిత్యము స్థిరపరచుదును. । నా కుమారుడా, 11
యెహోవా నీకు తోడుగా ఉండును గాక; నీవు వర్ధిల్లి
నీ దేవుడైన యెహోవా నిన్నుగూర్చి సెలవిచ్చిన
ప్రకారముగా ఆయనకు మందిరమును కట్టించుదువు
గాక. । నీ దేవుడైన యెహోవా ధర్మశాస్త్రమును నీవు 12
అనుసరించునట్లుగా యెహోవా నీకు వివేకమును
తెలివిని అనుగ్రహించి ఇశ్రాయేలీయులమీద నీకు
అధికారము దయచేయును గాక. । యెహోవా ఇశ్రా 13
యేలీయులనుగూర్చి మోషేకు ఇచ్చిన కట్టడల ప్రకా
రముగాను ఆయన తీర్చిన తీర్పుల ప్రకారముగాను
జరుపుకొనుటకు నీవు జాగ్రత్తపడినయెడల నీవు వృద్ధి
పొందుదువు; ధైర్యము తెచ్చుకొని బలముగా ఉం
డుము; భయపడకుము దిగులుపడకుము. । ఇదిగో నేను 14
నా కష్టస్థితిలోనే ప్రయాసపడి యెహోవా మంది
రముకొరకు రెండులక్షల మణుగుల బంగారమును పది

తూనిక్కు మించినంత వెండిని తూచ శక్యముకానంత విస్తార
మైన యిత్తడిని యినుమును సమకూర్చియున్నాను;
మ్రానులను రాళ్లను కూర్చియుంచితిని; నీవు ఇంకను
సంపాదించుదువు గాక. । మరియు పనిచేయతగిన
విస్తారమైన శిల్పకారులును కాసె పనివారును వడ్ర
వారును ఏవిధమైన పనినైనను నెరవేర్చగల మంచి
పనివారును నీయొద్ద ఉన్నారు. । లెక్కింపలేనంత
బంగారమును వెండియు ఇత్తడియు ఇనుమును నీకు
ఉన్నవి; కాబట్టి నీవు పని పూనుకొనుము, యెహోవా
నీకు తోడుగా ఉండుగాక.

మరియు తన కుమారుడైన సొలొమోనుకు సహా
యము చేయవలెనని దావీదు ఇశ్రాయేలీయుల యధి
పతులకందరికిని ఆజ్ఞాపించెను. । ఎట్లనగా—మీ దేవు
డైన యెహోవా మీతోకూడ ఉన్నాడు గదా?
చుట్టునున్నవారివలన తొందరలేకుండ ఆయన మీకు
నెమ్మది యిచ్చియున్నాడు గదా? దేశనివాసులను
ఆయన నాకు వశపరచియున్నాడు, యెహోవా
భయమువలనను ఆయన జనుల భయమువలనను దేశము
లోపరచబడియున్నది. । కావున హృదయపూర్వక
ముగా మీ దేవుడైన యెహోవాను వెదకుటకు మీ
మనస్సులు దృఢపరచుకొని, ఆయన నిబంధన మందస
మును దేవునికి ప్రతిష్ఠితమైన ఉపకరణములను ఆయన
నామముకొరకు కట్టబడు ఆ మందిరములోనికి చేర్చు
టకై మీరు పూనుకొని దేవుడైన యెహోవా పరి
శుద్ధస్థలమును కట్టుడి.

3 దావీదు ఏండ్లు నిండిన వృద్ధుడాయెను గనుక
అతడు తన కుమారుడైన సొలొమోనును ఇశ్రాయేలీ
యులమీద రాజుగా నియమించెను. । మరియు అతడు
ఇశ్రాయేలీయుల యధిపతులందరిని యాజకులను లేవీ
యులను సమకూర్చెను. । అప్పుడు లేవీయులు ముప్పది
సంవత్సరములు మొదలుకొని అంతకు పైవయస్సుగల
వారు కవిలెలో చేర్చబడిరి; వారి సంఖ్య ముప్పది
యెనిమిది వేల పురుషులు. । వీరిలో ఇరువది నాలుగు
వేలమంది యెహోవా మందిరపు పని విచారించు
వారుగాను, ఆరు వేలమంది అధిపతులుగాను, న్యా
యాధిపతులుగాను ఉండిరి. । నాలుగు వేలమంది ద్వార
పాలకులుగా నియమింపబడిరి. మరి నాలుగు వేల
మంది స్తుతిచేయు నిమిత్తమై దావీదు చేయించిన వాద్య
విశేషములతో యెహోవాను స్తుతించువారుగా
నియమింపబడిరి । గెర్షోను కహాతు మెరారీయులు అను
లేవీయులలో దావీదు వారిని వరుసలుగా విభాగిం
చెను. । గెర్షోనీయులలో లద్దాను షిమీ అనువారుండిరి. ।
లద్దాను కుమారులు ముగ్గురు; పెద్దవాడగు యెహీ
యేలు, జేతాము యోవేలు. । షిమీ కుమారులు ముగ్గురు
షెలోమీతు హజీయేలు హారాను, వీరు లద్దాను వంశ
ముయొక్క పితరుల పెద్దలు. । యహతు జీనా యూషు

బెరీయా అను నలుగురును షిమీ కుమారులు. ।
యహతు పెద్దవాడు జీనా రెండవవాడు. యూషు 11
కును బెరీయాకును కుమారులు అనేకులు లేకపోయిరి
గనుక తమ పితరుల యింటివారిలో వారు ఒక్కవంశ
ముగా ఎంచబడిరి. । కహాతు కుమారులు నలుగురు 12
అమ్రాము ఇస్హారు హెబ్రోను ఉజ్జీయేలు. । అమ్రాము 13
కుమారులు అహరోను మోషే; అహరోనును అతని
కుమారులును నిత్యము అతిపరిశుద్ధమైన వస్తువులను
ప్రతిష్ఠించుటకును, యెహోవా సన్నిధిని ధూపము
వేయుటకును, ఆయన సేవ జరిగించుటకును, ఆయన
నామమునుబట్టి జనులను దీవించుటకును ప్రత్యేకింప
బడిరి. । దైవజనుడగు మోషే సంతతివారు లేవి గోత్ర 14
పువారిలో ఎంచబడిరి. । మోషే కుమారులు గెర్షోము 15
ఎలీయెజెరు. । గెర్షోము కుమారులలో షెబూయేలు 16
పెద్దవాడు. । ఎలీయెజెరు కుమారులలో రెహబ్యా 17
అను పెద్దవాడు తప్ప ఇక కుమారులు అతనికి లేక
పోయిరి, అయితే రెహబ్యాకు అనేకమంది కుమారు
లుండిరి. । ఇస్హారు కుమారులలో షెలోమీతు పెద్ద 18
వాడు. । హెబ్రోను కుమారులలో యెరీయా పెద్ద 19
వాడు, అమర్యా రెండవవాడు, యహజీయేలు మూడవ
వాడు, యెక్మెయాము నాలుగవవాడు. । ఉజ్జీయేలు 20
కుమారులలో మీకా పెద్దవాడు యెష్షీయా రెండవ
వాడు. । మెరారి కుమారులు మహలి మూషి; 21
మహలి కుమారులు ఎలాజారు కీషు. । ఎలాజారు 22
చనిపోయినప్పుడు వానికి కుమార్తెలుండిరి కాని
కుమారులు లేకపోయిరి. కీషు కుమారులైన వారి
సహోదరులు వారిని వివాహము చేసికొనిరి. । మూషి 23
కుమారులు ముగ్గురు మహలి ఏదెరు యెరీమోతు. ।
వీరు తమ పితరుల యింటివారినిబట్టి లేవీయులుగా 24
ఎంచబడిరి; పితరుల యిండ్లకు పెద్దలైన వీరు ఇరువది
సంవత్సరములు మొదలుకొని అంతకు పైవయస్సుగల
వారై తమ తమ పేరుల లెక్కప్రకారము ఒక్కొక
రుగా నెంచబడి యెహోవా మందిరపు సేవపని
చేయువారై యుండిరి. । —ఇశ్రాయేలీయుల దేవుడైన 25
యెహోవా తన జనులకు నెమ్మది దయచేసియున్నా
డు గనుక వారు నిత్యము యెరూషలేములో నివా
సము చేయుదురనియు । లేవీయులుకూడ ఇక మీదట 26
గుడారమునైనను దాని సేవకొరకైన ఉపకరణముల
నైనను మోయ పనిలేదనియు దావీదు సెలవిచ్చెను. ।
దావీదు ఇచ్చిన కడవరి యాజ్ఞనుబట్టి లేవీయులలో 27
ఇరువది సంవత్సరములు మొదలుకొని అంతకు పైవయ
స్సుగలవారు ఎంచబడిరి. । వీరు అహరోను సంతతి 28
వారి చేతిక్రింద పని చూచుటకును, వారి వశమున
నున్న యెహోవా మందిర సేవకొరకై శాలలలోను
గదులలోను ఉంచబడిన సకలమైన ప్రతిష్ఠితవస్తువు
లను శుద్ధిచేయుటకును, దేవుని మందిర సేవకొరకైన

29 పనిని విచారించుటకును, । సన్నిధి రొట్టెను నైవేద్య
మునకు తగిన సన్నపు పిండిని పులుసులేని భోజ్యము
లను పెనములో కాల్చుదానిని వేల్చుదానిని నానా
విధమైన పరిమాణములు గలవాటిని కొలతగలవాటిని
30 విచారించుటకును, । అనుదినము ఉదయ సాయం
కాలములయందు యెహోవానుగూర్చిన స్తుతిపాటలు
పాడుటకును, విశ్రాంతిదినములలోను, అమావాస్యల
లోను పండుగలలోను యెహోవాకు దహనబలు
లను అర్పింపవలసిన సమయములన్నిటిలోను, లెక్కకు
సరియైనవారు వంతు ప్రకారము నిత్యము యెహోవా
సన్నిధిని సేవ జరిగించుటకును నియమింపబడిరి. ।
31 సమాజపు గుడారమును కాపాడుటయు, పరిశుద్ధస్థల
మును కాపాడుటయు, యెహోవా మందిరపు
సేవలో సంబంధించిన పనులలో వారి సహోదరు
లగు అహరోను సంతతివారికి సహాయము చేయుటయు
వారికి నియమింపబడిన పనియైయుండెను.

**24** అహరోను సంతతివారికి కలిగిన వంతులేవనగా,
అహరోను కుమారులు నాదాబు అబీహు ఎలాజారు
2 ఈతామారు. । నాదాబును అబీహుయును సంతతి
లేకుండ తమ తండ్రికంటె ముందుగా చనిపోయిరి
గనుక ఎలాజారును ఈతామారును యాజకత్వము
3 జరుపుచు వచ్చిరి. । దావీదు ఎలాజారు సంతతివారిలో
సాదోకును ఈతామారు సంతతివారిలో అహీమెలె
కును ఏర్పరచి, వారి వారి జనముయొక్క లెక్కను
4 బట్టి పని నియమించెను. । వారిని ఏర్పరచుటలో
ఈతామారు సంతతివారిలోని పెద్దలకంటె ఎలాజారు
సంతతివారిలోని పెద్దలు అధికులుగా కనబడిరి గనుక
ఎలాజారు సంతతివారిలో పదహారుగురు తమ పిత
రుల యింటివారికి పెద్దలుగాను, ఈతామారు సంతతి
వారిలో ఎనిమిదిమంది తమ తమ పితరుల యింటి
5 వారికి పెద్దలుగాను నియమింపబడిరి. । ఎలాజారు
సంతతిలోనివారును, ఈతామారు సంతతివారిలో
కొందరును దేవునికి ప్రతిష్ఠితులగు అధికారులై యుం
డిరి గనుక తాము పరిశుద్ధస్థలమునకు అధికారులుగా
6 ఉండుటకై చీట్లువేసి వంతులు పంచుకొనిరి. । లేవీ
యులలో ప్రధానమంత్రిగానున్న నెతనేలు కుమారు
డగు షెమయా రాజు ఎదుటను, అధిపతుల యెదు
టను, యాజకుడైన సాదోకు ఎదుటను, అబ్యాతారు
కుమారుడైన అహీమెలెకు ఎదుటను, యాజకుల యెదు
టను, లేవీయుల యెదుటను, పితరుల యిండ్ల పెద్దలైన
వారి యెదుటను వారి పేళ్లు దాఖలు చేసెను; ఒక్కొక
పాత్రలోనుండి యొక పితరుని యింటి చీటి ఎలా
జారు పేరటను ఇంకొకటి ఈతామారు పేరటను
తీయబడెను.
7 మొదటి చీటి యెహోయారీబుకు, రెండవది
8 యెదాయాకు, । మూడవది హారిముకు, నాలుగవది
శెయొరీముకు, । అయిదవది మల్కీయాకు, ఆరవది 9
మీయామినుకు, । ఏడవది హక్కోజుకు, ఎనిమిదవది 10
అబీయాకు, । తొమ్మిదవది యేషూవకు పదియవది షెక 11
న్యాకు । పదకొండవది ఎల్యాషీబుకు, పన్నెండవది 12
యాకీముకు, । పదుమూడవది హుప్పాకు, పదునాలుగ 13
వది యెషెబాబుకు, । పదునయిదవది బిల్గాకు, పదు 14
నారవది ఇమ్మేరుకు, । పదునేడవది హెజీరుకు, పదు 15
నెనిమిదవది హప్పిస్సేసుకు, । పందొమ్మిదవది పెతహ 16
యాకు ఇరువదియవది యెహెజ్కేలుకు, । ఇరువది 17
యొకటవది యాకీనుకు, ఇరువది రెండవది గామూలుకు,।
ఇరువది మూడవది దెలాయ్యాకు, ఇరువది నాలుగవది 18
మయజ్యాకు పడెను. । ఇశ్రాయేలీయుల దేవుడైన 19
యెహోవా వారి పితరుడగు అహరోనుకు ఆజ్ఞాపిం
చిన కట్టడ ప్రకారముగా వారు తమ పద్ధతిచొప్పున
యెహోవా మందిరములో ప్రవేశించి చేయవలసిన
సేవాధర్మము ఈలాగున ఏర్పాటు ఆయెను.
శేషించిన లేవీ సంతతివారెవరనగా — అమ్రాము 20
సంతతిలో షూబాయేలును, షూబాయేలు సంతతిలో
యెహెద్యాహును, । రెహబ్యా యింటిలో అనగా 21
రెహబ్యా సంతతిలో పెద్దవాడైన ఇష్షీయాయును, ।
ఇస్హారీయులలో షెలోమోతును, షెలోమోతు సంత 22
తిలో యహతును, । హెబ్రోను సంతతిలో పెద్ద 23
వాడైన యెరీయా, రెండవవాడైన అమర్యా, మూడవ
వాడైన యహజీయేలు, నాలుగవవాడైన యెక్మెయాము
లును, । ఉజ్జీయేలు సంతతిలో మీకాయును మీకా 24
సంతతిలో షామీరును, । ఇష్షీయా సంతతిలో జెక 25
ర్యాయును, । మెరారి సంతతిలో మహలి, మూషి 26
అనువారును యహజీయాహు సంతతిలో బెనోయును.।
యహజీయాహువలన మెరారికి కలిగిన కుమారులెవ 27
రనగా బెనో షోహము జక్కూరు ఇబ్రీ, । మహలికి 28
ఎలాజారు కలిగెను, వీనికి కుమారులు లేకపోయిరి. ।
కీషు ఇంటివాడు అనగా కీషు కుమారుడు యెరహ్మె 29
యేలు. । మూషి కుమారులు మహలి ఏదెరు యెరీ 30
మోతు, వీరు తమ పితరుల యిండ్లనుబట్టి లేవీయులు. ।
వీరును తమ సహోదరులైన అహరోను సంతతివారు 31
చేసినట్లు రాజైన దావీదు ఎదుటను సాదోకు అహీ
మెలెకు అను యాజకులలోను లేవీయులలోను పిత
రుల యిండ్ల పెద్దలయెదుట తమలోనుండు పితరుల
యింటి పెద్దలకును తమ చిన్న సహోదరులకును
చీట్లు వేసికొనిరి.

మరియు దావీదును సైన్యాధిపతులును ఆసాపు **25**
హేమాను యెదూతూను అనువారి కుమారులలో
కొందరిని సేవనిమిత్తమై ప్రత్యేకపరిచి, సితారాలను
స్వరమండలములను తాళములను వాయించుచు ప్రక
టించునట్లుగా నియమించిరి. ఈ సేవావృత్తినిబట్టి
యేర్పాటైన వారిసంఖ్య యెంతయనగా । ఆసాపు 2

కుమారులలో రాజాజ్ఞప్రకారముగా ప్రకటించుచు,
ఆసాపు చేతిక్రిందనుండు ఆసాపు కుమారులైన
జక్కూరు యోసేపు నెతన్యా అషర్యేలా అనువారు.।
3 యెదూతూను సంబంధులలో స్తుతిపాటలు పాడుచు
యెహోవాను స్తుతించుటకై సితారాను వాయిం
చుచు ప్రకటించు తమ తండ్రియైన యెదూతూను
చేతిక్రిందనుండు యెదూతూను కుమారులైన గెదల్యా
జెరీ యెషయా హషబ్యా మత్తిత్యా అను ఆరుగురు.।
4 హేమాను సంబంధులలో హేమాను కుమారులైన
బుక్కీయాహు మత్తన్యా ఉజ్జీయేలు షెబూయేలు
యెరీమోతు హనన్యా హనానీ ఎలీయ్యాతా గిద్దల్తీ
రోమమ్తీయెజెరు యొష్బెకాషా మల్లోతి హోతీరు
5 మహజీయోతు అనువారు.। వీరందరును దేవుని వాక్య
విషయములో రాజునకు దర్శకుడగు హేమానుయొక్క
కుమారులు. హేమాను సంతతిని గొప్పచేయుటకై
దేవుడు హేమానునకు పదునలుగురు కుమారులను
ముగ్గురు కుమార్తెలను అనుగ్రహించి యుండెను.।
6 వీరందరు ఆసాపునకును యెదూతూనునకును హేమాను
కును రాజు చేసియున్న కట్టడప్రకారము యెహోవా
యింటిలో తాళములు స్వరమండలములు సితారాలు
వాయించుచు గానము చేయుచు, తమ తండ్రి చేతి
క్రింద దేవుని మందిరపు సేవ జరిగించుచుండిరి.।
7 యెహోవాకు గానము చేయుటలో నేర్పుపొందిన
తమ సహోదరులతో కూడనున్న ప్రవీణులైన పాట
8 కుల లెక్క యిన్నూట ఎనుబది యెనిమిది.। తాము
చేయు సేవ విషయములో పిన్నయని పెద్దయని గురు
వని శిష్యుడని భేదములేకుండ వంతులకొరకై చీట్లు
9 వేసిరి.। మొదటి చీటి ఆసాపు వంశమందున్న
యోసేపు పేరట పడెను, రెండవది గెదల్యా పేరట
పడెను, వీడును వీని సహోదరులును కుమారులును
10 పండ్రెండుగురు.। మూడవది జక్కూరు పేరట పడెను,
వీడును వీని కుమారులును సహోదరులును పండ్రెం
11 డుగురు.। నాలుగవది యిజ్రీ పేరట పడెను, వీడును
వీని కుమారులును సహోదరులును పండ్రెండుగురు.।
12 అయిదవది నెతన్యా పేరట పడెను, వీని కుమారు
13 లును సహోదరులును పండ్రెండుగురు.। ఆరవది
బుక్కీయాహు పేరట పడెను, వీని కుమారులును
14 సహోదరులును పండ్రెండుగురు.। ఏడవది యెష
ర్యేలా పేరట పడెను, వీని కుమారులును సహోదరు
15 లును పండ్రెండుగురు.। ఎనిమిదవది యెషయా
పేరట పడెను, వీని కుమారులును సహోదరులును
16 పండ్రెండుగురు.। తొమ్మిదవది మత్తన్యా పేరట
పడెను, వీని కుమారులును సహోదరులును పండ్రెం
17 డుగురు.। పదియవది షిమీ పేరట పడెను, వీని
కుమారులును సహోదరులును పండ్రెండుగురు.।
18 పదకొండవది అజరేలు పేరట పడెను, వీని కుమారు
లును సహోదరులును పండ్రెండుగురు.। పండ్రెండ 19
వది హషబ్యా పేరట పడెను, వీని కుమారులును
సహోదరులును పండ్రెండుగురు.। పదుమూడవది 20
షూబాయేలు పేరట పడెను, వీని కుమారులును
సహోదరులును పండ్రెండుగురు.। పదునాలుగవది 21
మత్తిత్యా పేరట పడెను, వీని కుమారులును సహో
దరులును పండ్రెండుగురు.। పదునయిదవది యెరే 22
మోతు పేరట పడెను, వీని కుమారులును సహోదరు
లును పండ్రెండుగురు.। పదునారవది హనన్యా పేరట 23
పడెను, వీని కుమారులును సహోదరులును పండ్రెం
డుగురు.। పదునేడవది యొష్బెకాషా పేరట పడెను, 24
వీని కుమారులును సహోదరులును పండ్రెండుగురు.।
పదునెనిమిదవది హనానీ పేరట పడెను, వీని కుమారు 25
లును సహోదరులును పండ్రెండుగురు.। పందొమ్మి 26
దవది మల్లోతి పేరట పడెను, వీని కుమారులును
సహోదరులును పండ్రెండుగురు.। ఇరువదియవది 27
ఎలీయ్యాతా పేరట పడెను, వీని కుమారులును
సహోదరులును పండ్రెండుగురు.। ఇరువది యొకట 28
వది హోతీరు పేరట పడెను, వీని కుమారులును
సహోదరులును పండ్రెండుగురు.। ఇరువది రెండ 29
వది గిద్దల్తీ పేరట పడెను, వీని కుమారులును సహో
దరులును పండ్రెండుగురు.। ఇరువది మూడవది 30
మహజీయోతు పేరట పడెను, వీని కుమారులును
సహోదరులును పండ్రెండుగురు.। ఇరువది నాలుగ 31
వది రోమమ్తీయెజెరు పేరట పడెను, వీని కుమారు
లును సహోదరులును పండ్రెండుగురు.

ద్వారపాలకుల విభాగమును గూర్చినది. ఆసాపు **26**
కుమారులలో కోరే కుమారుడైన మెషెలెమ్యా
కోరహు సంతతివాడు.। మెషెలెమ్యా కుమారులు 2
ఎవరనగా జెకర్యా జ్యేష్ఠుడు, యెదీయవేలు రెండవ
వాడు, జెబద్యా మూడవవాడు, యత్నీయేలు నాల్గవ
వాడు,। ఏలాము అయిదవవాడు, యెహోహానాను 3
ఆరవవాడు, ఎల్యోయేనై యేడవవాడు.। దేవుడు 4
ఓబేదెదోమును ఆశీర్వదించి అతనికి కుమారులను
దయచేసెను; వారెవరనగా షెమయా జ్యేష్ఠుడు,
యెహోజాబాదు రెండవవాడు, యోవాహు మూడవ
వాడు, శాకారు నాల్గవవాడు, నెతనేలు అయిదవ
వాడు,। అమ్మీయేలు ఆరవవాడు, ఇశ్శాఖారు ఏడవ 5
వాడు, పెయుల్లెతై యెనిమిదవవాడు.। వాని కుమారు 6
డైన షెమయాకు కుమారులు పుట్టిరి; వారు పరా
క్రమశాలులై యుండి తమ తండ్రి యింటివారికి పెద్ద
లైరి.। షెమయా కుమారులు ఒత్ని రెఫాయేలు ఓబేదు 7
యెల్జాబాదు బలాఢ్యులైన అతని సహోదరులు
ఎలీహు సెమక్యా.। ఓబేదెదోము కుమారులైన వీరును 8
వీరి కుమారులును వీరి సహోదరులును అరువది
యిద్దరు, వారు తమ పనిచేయుటలో మంచి గట్టి

9 వారు. । మెషెలెమ్యాకు కలిగిన కుమారులును సహో
దరులును పరాక్రమశాలులు, వీరు పదునెనిమిది
10 మంది. । మెరారీయులలో హోసా అనువానికి కలి
గిన కుమారులు ఎవరనగా జ్యేష్ఠుడగు షిమ్రీ; వీడు
జ్యేష్ఠుడు కాకపోయినను వాని తండ్రి వాని జ్యేష్ఠ
11 కుమారునిగా చేసెను, । రెండవవాడగు హిల్కీయా,
మూడవవాడగు టెబల్యాహు, నాల్గవవాడగు జెకర్యా,
హోసాకు కుమారులును సహోదరులును అందరు
12 పదముగ్గురు. । ఈలాగున ఏర్పాటైన తరగతు
లనుబట్టి యెహోవా మందిరములో వంతుల ప్రకా
రముగా తమ సహోదరులు చేయునట్లు సేవచేయు
టకు ఈ ద్వారపాలకులు, అనగా వారిలోని పెద్దలు
13 అధికారులుగా నియమింపబడిరి. । చిన్నలకేమి
పెద్దలకేమి పితరుల యింటి వరుసనుబట్టి యొక్కొక్క
ద్వారమునొద్ద కావలి యుండుటకై వారు చీట్లు
14 వేసిరి. । తూర్పుతట్టు కావలి షెలెమ్యాకు పడెను,
వివేకముగల ఆలోచన కర్తయైన అతని కుమారుడగు
జెకర్యాకు చీటివేయగా, ఉత్తరపుతట్టు కావలి వానికి
15 పడెను. । ఓబేదెదోముకు దక్షిణపువైపు కావలియు
అతని కుమారులకు అసుప్పీమను ఇంటికావలియు
16 పడెను. । షుప్పీముకును హోసాకును పడమట తట్టున
నున్న షల్లెకెతు గుమ్మమునకు ఎక్కు రాజమార్గమును
17 కాచుటకు చీటి పడెను. । తూర్పున లేవీయులైన
ఆరుగురును, ఉత్తరమున దినమునకు నలుగురును, దక్షిణ
మున దినమునకు నలుగురును, అసుప్పీమునొద్ద ఇద్దరిద్ద
18 రును, । బయట ద్వారమునొద్దను పడమరగా ఎక్కి
పోవు రాజమార్గమునొద్ద నలుగురును, వెలపటి త్రోవ
19 యందు ఇద్దరును ఏర్పాటైరి. । కోరే సంతతివారి
లోను మెరారీయులలోను ద్వారము కనిపెట్టువారికి
ఈలాగున వంతులాయెను.

20 కడకు లేవీయులలో అహీయా అనువాడు దేవుని
మందిరపు బొక్కసమును ప్రతిష్ఠితములగు వస్తువుల
బొక్కసములను కాచువాడుగా నియమింపబడెను. ।
21 లద్దాను కుమారులను గూర్చినది, గెర్షోనీయుడైన
లద్దాను కుమారులు, అనగా గెర్షోనీయులై తమ పిత
రుల యిండ్లకు పెద్దలైయున్నవారిని గూర్చినది. ।
22 యెహీయేలీ కుమారులైన జేతామును వాని సహో
దరుడైన యోవేలును యెహోవా మందిరపు బొక్క
23 సములకు కావలికాయువారు. । అమ్రామీయులు
ఇస్హారీయులు హెబ్రోనీయులు ఉజ్జీయేలీయులు
24 అనువారిని గూర్చినది. । మోషే కుమారుడైన గెర్షో
మునకు పుట్టిన షెబూయేలు బొక్కసముమీద ప్రధా
25 నిగా నియమింపబడెను. । ఎలీయెజెరు సంతతివారగు
షెబూయేలు సహోదరులు ఎవరనగా వాని కుమా
రుడైన రెహబ్యా, రెహబ్యా కుమారుడైన యెషయా,
యెషయా కుమారుడైన యెహోరాము, యెహో
రాము కుమారుడైన జిఖ్రీ, జిఖ్రీ కుమారుడైన షెలో
మీతు. । యెహోవా మందిరము ఘనముగా కట్టిం 2
చుటకై రాజైన దావీదును పితరుల యింటి పెద్దలును 2
సహస్రాధిపతులును శతాధిపతులును సైన్యాధిపతు
లును యుద్ధములలో పట్టుకొని ప్రతిష్ఠించిన కొల్ల
సొమ్ము ఉన్న బొక్కసములకు షెలోమీతును వాని
సహోదరులును కావలి కాయువారైరి. । దర్శకు 2
డగు సమూయేలును కీషు కుమారుడైన సౌలును నేరు
కుమారుడైన అబ్నేరును సెరూయా కుమారుడైన
యోవాబును ప్రతిష్ఠించిన సొమ్మంతయు షెలోమీతు
చేతిక్రిందను వాని సహోదరులచేతిక్రిందను ఉంచ
బడెను. । ఇస్హారీయులనుగూర్చినది—వారిలో కెనన్యా 2
యును వాని కుమారులును బయటిపని జరిగించుటకై
ఇశ్రాయేలీయులకు లేఖికులుగాను న్యాయాధిపతులు
గాను నియమింపబడిరి. । హెబ్రోనీయులను గూర్చి 30
నది. హషబ్యాయును వాని సహోదరులును పరా
క్రమశాలులు వెయ్యిన్ని యేడు నూరుల సంఖ్యగల
వారు; వీరు యొర్దాను ఈవల పడమటి వైపుననుండు
ఇశ్రాయేలీయులమీద యెహోవా సేవనుగూర్చిన
వాటన్నిటి విషయములోను రాజు నియమించిన పని
విషయములోను పైవిచారణకర్తలుగా నియమింపబ
డిరి. । హెబ్రోనీయులను గూర్చినది. హెబ్రోనీయుల 31
పితరుల యింటి పెద్దలందరికి యెరీయా పెద్దయాయెను.
దావీదు ఏలుబడిలో నలువదియవ సంవత్సరమున వారి
సంగతి విచారింపగా వారిలో గిలాదు దేశములోని
యాజేరునందున్నవారు పరాక్రమశాలులుగా కన
బడిరి. । పరాక్రమశాలులగు వాని సహోదరులు 32
రెండువేల ఏడునూరులమంది యింటి పెద్దలుగా కన
బడిరి; దావీదు రాజు దేవుని సంబంధమైన కార్య
ముల విషయములోను రాజకార్యముల విషయము
లోను రూబేనీయులమీదను గాదీయులమీదను మనష్షే
అర్ధగోత్రపువారిమీదను వారిని నియమించెను.

జనసంఖ్యనుబట్టి ఇశ్రాయేలీయుల పితరుల **27**
యింటిపెద్దలు సహస్రాధిపతులు శతాధిపతులును
వారి లెక్కను గూర్చినది, అనగా ఏర్పాటైన వంతుల
విషయములో ఏటేట నెలవంతున రాజునకు సేవచేసిన
వారిని గూర్చినది. వీరి సంఖ్య యిరువది నాలుగు
వేలు. । మొదటి నెలను మొదటి భాగముమీద 2
జబ్దీయేలు కుమారుడైన యాషాబాము అధిపతిగా
ఉండెను; వాని భాగములో ఇరువది నాలుగు వేల
మంది యుండిరి. । పెరెజు సంతతివారిలో ఒకడు 3
మొదటి నెల సైన్యాధిపతులకందరికి అధిపతిగా
ఉండెను. । రెండవ నెల వంతు అహోహీయుడైన 4
దోదైదియు అతని భాగపువారిదియు ఆయెను; అతని
భాగమందు మిక్లోతు అధిపతిగా ఉండెను; అతని
భాగములో చేరినవారు ఇరువది నాలుగు వేలమంది. ।

5 మూడవ నెలను యెహోయాదా కుమారుడును సభా
ముఖ్యుడునగు బెనాయా అధిపతిగా ఉండెను; అతని
భాగములో చేరినవారు ఇరువది నాలుగు వేలమంది. ।
6 ఈ బెనాయా ఆ ముప్పదిమంది పరాక్రమశాలులలో
ఒకడై ఆ ముప్పదిమందికి అధిపతియై యుండెను;
అతని భాగమందు అతని కుమారుడైన అమ్మీజాబాదు
7 ఉండెను. । నాలుగవ నెలను యోవాబు సహోదరు
డైన అశాహేలు నాలుగవ అధిపతిగా ఉండెను;
అతని కుమారుడైన జెబద్యా అతని తరువాత అధిపతి
యాయెను, అతని భాగములో చేరినవారు ఇరువది
8 నాలుగు వేలమంది. । అయిదవ నెలను ఇశ్రాహేతీ
యుడైన షమ్హూతు అధిపతిగా ఉండెను; అతని భాగ
ములో చేరినవారు ఇరువది నాలుగు వేలమంది. ।
9 ఆరవ నెలను తెకోవీయుడైన ఇక్కేషుకు పుట్టిన
ఈరా అధిపతిగా ఉండెను; అతని భాగములో చేరిన
10 వారు ఇరువది నాలుగు వేలమంది. । ఏడవ నెలను
ఎఫ్రాయిము సంతతివాడును పెలోనీయుడునైన
హేలెస్సు అధిపతిగా ఉండెను; అతని భాగములో
11 చేరినవారు ఇరువది నాలుగు వేలమంది. । ఎనిమిదవ
నెలను జెరహీయుల సంబంధుడును హూషాతీయుడు
నైన సిబ్బెకై అధిపతిగా ఉండెను; అతని భాగములో
12 చేరినవారు ఇరువది నాలుగు వేలమంది. । తొమ్మిదవ
నెలను బెన్యామీనీయుల సంబంధుడును అనాతోతీ
యుడునైన అబీయెజెరు అధిపతిగా ఉండెను; అతని
భాగములో చేరినవారు ఇరువది నాలుగు వేలమంది. ।
13 పదియవ నెలను జెరహీయుల సంబంధుడును నెటోపా
తీయుడునైన మహరై అధిపతిగా ఉండెను; అతని
భాగములో చేరినవారు ఇరువది నాలుగు వేలమంది. ।
14 పదకొండవ నెలను ఎఫ్రాయిము సంతతివాడును
పిరాతోనీయుడునైన బెనాయా అధిపతిగా ఉండెను;
అతని భాగములో చేరినవారు ఇరువది నాలుగు వేల
15 మంది. । పన్నెండవ నెలను ఒత్నీయేలు సంబంధు
డును నెటోపాతీయుడునైన హెల్దయి అధిపతిగా
ఉండెను; అతని భాగములో చేరినవారు ఇరువది
నాలుగు వేలమంది.

16 మరియు ఇశ్రాయేలీయుల గోత్రములమీదనున్న
వారి వివరమేదనగా, జిఖ్రీ కుమారుడైన ఎలీయెజెరు
రూబేనీయులకు అధిపతిగా ఉండెను, మయకా కుమా
రుడైన షెపట్య షిమ్యోనీయులకు అధిపతిగా ఉండె
17 ను, । కెమూయేలు కుమారుడైన హషబ్యా లేవీయు
లకు అధిపతిగా ఉండెను, సాదోకు అహరోనీయు
18 లకు అధిపతిగా ఉండెను. । దావీదు సహోదరు
లలో ఎలీహు అను ఒకడు యూదావారికి అధిపతిగా
ఉండెను, మిఖాయేలు కుమారుడైన ఒమ్రీ ఇశ్శా
19 ఖారీయులకు అధిపతిగా ఉండెను, । ఓబద్యా కుమారు
డైన ఇష్మయా జెబులూనీయులకు అధిపతిగా ఉండెను,
అజ్రీయేలు కుమారుడైన యెరీమోతు నఫ్తాలీయులకు
అధిపతిగా ఉండెను, । అజజ్యాహు కుమారుడైన 20
హోషేయ ఎఫ్రాయిమీయులకు అధిపతిగా
ఉండెను, మనష్షే అర్ధగోత్రపువారికి పెదాయా
కుమారుడైన యోవేలు అధిపతిగా ఉండెను, । గిలా 21
దులోనున్న మనష్షే అర్ధగోత్రపువారికి జెకర్యా కుమా
రుడైన ఇద్దో అధిపతిగా ఉండెను, బెన్యామీనీయు
లకు అబ్నేరు కుమారుడైన యహశీయేలు అధిపతిగా
ఉండెను, । దానీయులకు యెరోహాము కుమారుడైన 22
అజరేలు అధిపతిగా ఉండెను. వీరు ఇశ్రాయేలు
గోత్రములకు అధిపతులు. । ఇశ్రాయేలీయులను 23
ఆకాశ నక్షత్రములంతమందిగా చేయుదునని
యెహోవా సెలవిచ్చియుండెను గనుక ఇరువది
యేండ్లు మొదలుకొని అంతకు తక్కువ వయస్సుగల
వారిని దావీదు జనసంఖ్యయందు చేర్చలేదు. । జన 24
సంఖ్యచేయు విషయమున ఇశ్రాయేలీయులమీదికి
కోపము వచ్చినందున సెరూయా కుమారుడైన
యోవాబు దాని చేయనారంభించెనే గాని దాని
ముగింపకపోయెను; కాబట్టి జనసంఖ్య మొత్తము
దావీదు రాజు వృత్తాంతగ్రంథములలో చేర్చబడలేదు.

రాజు బొక్కసములమీద అదీయేలు కుమారుడైన 25
అజ్మావెతు నియమింపబడెను; అయితే పొలములలోను
పట్టణములలోను గ్రామములలోను దుర్గములలోను
ఉండు ఆస్తిమీద ఉజ్జీయా కుమారుడైన యెహోనా
తాను నియమింపబడెను. । పొలములో పనిచేయువారి 26
మీదను, భూమి దున్నువారిమీదను కెలూబు కుమారు
డైన ఎజ్రీ నియమింపబడెను. । ద్రాక్షతోటలమీద 27
రామాతీయుడైన షిమీయు, ద్రాక్షతోటల ఆదాయ
మైన ద్రాక్షారసము నిలువచేయు కొట్లమీద షిప్మీయు
డైన జబ్దియు నియమింపబడిరి. । షెఫేలా ప్రదేశ 28
ముననుండు ఒలీవ చెట్లమీదను బోడ్డచెట్లమీదను గెదే
రీయుడైన బయల్‌హనాను నియమింపబడెను; నూనె
కొట్లమీద యోవాషు నియమింపబడెను. । షారో 29
నులో మేయు పశువులమీద షారోనీయుడైన షిట్రి
యియు, లోయలలోని పశువులమీద అద్లయి కుమారు
డైన షాపాతును నియమింపబడిరి. । ఒంటెలమీద 30
ఇష్మాయేలీయుడైన ఓబీలును, గాడిదెలమీద మేరోనో
తీయుడైన యెహెద్యాహును నియమింపబడిరి. ।
గొఱ్ఱెలమీద హగ్రీయుడైన యాజీజు నియమింప 31
బడెను. వీరందరు దావీదు రాజునకున్న ఆస్తిమీద నియ
మింపబడిన యధిపతులు.

దావీదు పినతండ్రియైన యోనాతాను వివేకము 32
గల ఆలోచనకర్తయై యుండెను గనుక అతడు
ప్రధానమంత్రిగా నియమింపబడెను; హక్మోనీ కుమారు
డైన యెహీయేలు రాజు కు[illegible]
నియమింపబడెను. । అహీ

34 అర్కీయుడైన హూషై రాజునకు తోడు. । అహీతో
పెలు చనిపోయినమీదట బెనాయా కుమారుడైన
యెహోయాదాయును అబ్యాతారును మంత్రులైరి;
యోవాబు రాజుయొక్క సేనకు అధిపతిగా నియ
మింపబడెను.

28 గోత్రముల పెద్దలను, వంతులచొప్పున రాజును
సేవచేయు అధిపతులను సహస్రాధిపతులను, శతాధి
పతులను, రాజునకును రాజుకుమారులకును కలిగియున్న
యావత్తు చరాస్తిమీదను స్థిరాస్తిమీదను ఉన్న అధి
పతులను, అనగా ఇశ్రాయేలీయుల పెద్దలనందరిని
రాజునొద్దనున్న పరివారమును పరాక్రమశాలులను
సేనాసంబంధులైన పరాక్రమశాలులనందరిని రాజగు
2 దావీదు యెరూషలేమునందు సమకూర్చెను. । అప్పుడు
రాజైన దావీదు లేచి నిలువబడి ఈలాగు సెలవిచ్చెను
—నా సహోదరులారా నా జనులారా నా మాట
ఆలకించుడి; యెహోవా నిబంధన మందసమునకును
మన దేవుని పాదపీఠమునకును విశ్రమస్థానముగా
ఉండుటకు ఒక మందిరము కట్టించవలెనని నేను నా
హృదయమందు నిశ్చయముచేసికొని సమస్తము సిద్ధ
3 పరచితిని. । అయితే—నీవు యుద్ధములు జరిగించి
రక్తము ఒలికించినవాడవు గనుక నీవు నా నామమునకు
మందిరమును కట్టించకూడదని దేవుడు నాకు ఆజ్ఞ
4 ఇచ్చెను. । ఇశ్రాయేలీయులమీద నిత్యము రాజునై
యుండుటకు ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా
నా తండ్రి యింటివారందరిలోను నన్ను కోరుకొ
నెను; ఆయన యూదాగోత్రమును, యూదాగో
త్రపువారిలో ప్రధానమైనదిగా నా తండ్రి యింటిని
నా తండ్రి యింటిలో నన్నును ఏర్పరచుకొని నా
యందు ఆయన దయచూపి ఇశ్రాయేలీయులమీద
5 రాజుగా నియమించియున్నాడు. । యెహోవా
నాకు అనేకమంది కుమారులను దయచేసియున్నాడు,
అయితే ఇశ్రాయేలీయులపైని యెహోవా రాజ్య
సింహాసనముమీద కూర్చుండుటకు ఆయన నా కుమా
రులందరిలో సొలొమోనును కోరుకొని ఆయన నాతో
6 ఈలాగు సెలవిచ్చెను ।—నేను నీ కుమారుడైన సొలొ
మోనును నాకు కుమారునిగా ఏర్పరచుకొని యు
న్నాను, నేను అతనికి తండ్రినైయుందును అతడు నా
7 మందిరమును నా ఆవరణములను కట్టించును. । మరియు
నేటిదినమున చేయుచున్నట్లు అతడు ధైర్యము వహించి
నా ఆజ్ఞలను నా న్యాయవిధులను అనుసరించినయెడల,
8 నేనతని రాజ్యమును నిత్యము స్థిరపరచుదును. । కా
బట్టి మీరు ఈ మంచిదేశమును స్వాస్థ్యముగా అను
భవించి, మీ తరువాత మీ సంతతివారికి శాశ్వత
స్వాస్థ్యముగా దానిని అప్పగించునట్లు మీ దేవుడైన
యెహోవా మీకిచ్చిన యాజ్ఞలన్నియు ఎట్టివో
తెలిసికొని వాటిని గైకొనుడి అని యెహోవా సమాజ
మునకు చేరిన ఇశ్రాయేలీయులందరు చూచుచుండ
గను మన దేవుడు ఆలకించుచుండగను (నేను మిమ్మును
హెచ్చరిక చేయుచున్నాను.) । సొలొమోనా, నా 9
కుమారుడా, నీ తండ్రియొక్క దేవుడైన యెహోవా
అందరి హృదయములను పరిశోధించువాడును, ఆలో
చనలన్నిటిని సంకల్పములన్నిటిని ఎరిగినవాడునై యు
న్నాడు. నీవు ఆయనను తెలిసికొని హృదయపూర్వ
కముగాను మనఃపూర్వకముగాను ఆయనను సేవిం
చుము, ఆయనను వెదకినయెడల ఆయన నీకు ప్రత్యక్ష
మగును; నీవు ఆయనను విసర్జించినయెడల ఆయన
నిన్ను నిత్యముగా త్రోసివేయును. । పరిశుద్ధ స్థల 10
ముగా ఉండుటకు ఒక మందిరమును కట్టించుటకై
యెహోవా నిన్ను కోరుకొనిన సంగతి మనస్సునకు
తెచ్చుకొని ధైర్యము వహించి పని జరిగింపుము.
అప్పుడు దావీదు మంటపమునకును మందిరపు 11
కట్టడమునకును బొక్కసపు శాలలకును మేడ గదుల
కును లోపలి గదులకును ప్రాయశ్చిత్తార్థపీఠపు గదికిని
యెహోవా మందిరపు ఆవరణములకును । వాటి 12
చుట్టునున్న గదులకును దేవుని మందిరపు బొక్కస
ములకును ప్రతిష్ఠితవస్తువుల బొక్కసములకును తాను
ఏర్పాటుచేసి సిద్ధపరచిన మచ్చులను తన కుమారుడైన
సొలొమోనుకు అప్పగించెను. । మరియు యాజకు 13
లును లేవీయులును సేవచేయవలసిన వంతుల పట్టీ
యును, యెహోవా మందిరపు సేవనుగూర్చిన పట్టీ
యును, యెహోవా మందిరపు సేవోపకరణముల
పట్టీయును దావీదు అతనికప్పగించెను. । మరియు 14
ఆ యా సేవాక్రమములకు కావలసిన బంగారు ఉప
కరణములన్నిటిని చేయుటకై యెత్తు ప్రకారము బంగా
రమును, ఆ యా సేవాక్రమములకు కావలసిన వెండి
ఉపకరణములన్నిటిని చేయుటకై యెత్తు ప్రకారము
వెండిని దావీదు అతనికప్పగించెను. । బంగారు దీప 15
స్తంభములకును వాటి బంగారు ప్రమిదెలకును ఒక్కొక
దీపస్తంభమునకును దాని ప్రమిదెలకును కావలసినంత
బంగారమును ఎత్తు ప్రకారముగాను, వెండి దీపస్తంభ
ములలో ఒక్కొక దీపస్తంభమునకును, దాని దాని
ప్రమిదెలకును కావలసినంత వెండిని యెత్తు ప్రకారము
గాను, । సన్నిధిరొట్టెలు ఉంచు ఒక్కొక బల్లకు 16
కావలసినంత బంగారమును ఎత్తు ప్రకారముగాను,
వెండిబల్లలకు కావలసినంత వెండిని, । ముండ్ల కొంకుల 17
కును గిన్నెలకును పాత్రలకును కావలసినంత అచ్చ
బంగారమును, బంగారు గిన్నెలలో ఒక్కొక గిన్నెకు
కావలసినంత బంగారమును ఎత్తు ప్రకారముగాను
వెండిగిన్నెలలో ఒక్కొకగిన్నెకు కావలసినంత వెండిని
యెత్తు ప్రకారముగాను, । ధూపపీఠమునకు కావలసి 18
నంత పుటము వేయబడిన బంగారమును ఎత్తు ప్రకార
ముగాను, రెక్కలు విప్పుకొని యెహోవా నిబంధన

మందసమును కప్పు కెరూబుల వాహనముయొక్క
మచ్చులకు కావలసినంత బంగారమును అతనికప్పగిం
19 చెను. । ఇవియన్నియు అప్పగించి — యెహోవా
బలము నామీదికి వచ్చి యీ మచ్చుల పనియంతయు
వ్రాతమూలముగా నాకు నేర్పెను అని సొలొమోను
20 తో చెప్పెను. । మరియు దావీదు తన కుమారుడైన
సొలొమోనుతో చెప్పినదేమనగా—నీవు బలముపొంది
ధైర్యము తెచ్చుకొని యీ పని పూనుకొనుము, భయ
పడకుండుము, వెరవకుండుము, నా దేవుడైన
యెహోవా నీతోకూడ నుండును; యెహోవా
మందిరపు సేవనుగూర్చిన పనియంతయు నీవు ముగించు
వరకు ఆయన నిన్ను ఎంతమాత్రమును విడువక యుం
21 డును. । దేవుని మందిరసేవయంతటికిని యాజకులును
లేవీయులును వంతులప్రకారము ఏర్పాటైరి; నీ యా
జ్ఞకు బద్ధులైయుండి యీ పనియంతటిని నెరవేర్చుటకై
ఆ యా పనులయందు ప్రవీణులైనవారును మనఃపూర్వ
కముగా పనిచేయువారును అధిపతులును జనులంద
రును నీకు సహాయులగుదురు.

**29** తరువాత రాజైన దావీదు సర్వసమాజముతో
ఈలాగు సెలవిచ్చెను — దేవుడు కోరుకొనిన నా
కుమారుడైన సొలొమోను ఇంకను లేతప్రాయముగల
బాలుడై యున్నాడు, కట్టబోవు ఆలయము మనుష్యు
నికి కాదు దేవుడైన యెహోవాకే గనుక ఈ పని
2 బహు గొప్పది. । నేను బహుగా ప్రయాసపడి నా
దేవుని మందిరమునకు కావలసిన బంగారపు పనికి
బంగారమును, వెండిపనికి వెండిని, యిత్తడిపనికి ఇత్త
డిని, యినుపపనికి ఇనుమును, కఱ్ఱపనికి కఱ్ఱలను,
గోమేధికపురాళ్లను, చెక్కుడురాళ్లను, వింతైన వర్ణ
ములుగల పలువిధములరాళ్లను, మిక్కిలి వెలగల నానా
విధ రత్నములను, తెల్లచలువరాయి విశేషముగా సంపా
3 దించితిని. । మరియు నా దేవుని మందిరముమీద
నాకు కలిగియున్న మక్కువచేత నేను ఆ ప్రతిష్ఠిత
మైన మందిరము నిమిత్తము సంపాదించియుంచిన వస్తు
వులు గాక, నా స్వంతమైన బంగారమును వెండిని
4 నా దేవుని మందిరము నిమిత్తము నేనిచ్చెదను. । గదుల
గోడల రేకుమూతకును బంగారపు పనికిని బంగార
మును, వెండిపనికి వెండిని పనివారు చేయు ప్రతివిధ
మైన పనికి ఆరువేల మణుగుల ఓఫీరు బంగారమును
పదునాలుగువేల మణుగుల పుటమువేయబడిన వెండిని
5 ఇచ్చుచున్నాను । ఈ దినమున యెహోవాకు ప్రతి
ష్ఠితముగా మనఃపూర్వకముగా ఇచ్చువారెవరైన మీలో
6 ఉన్నారా? । అప్పుడు పితరుల యిండ్లకు అధిపతు
లును ఇశ్రాయేలీయుల గోత్రపు అధిపతులును సహ
స్రాధిపతులును శతాధిపతులును రాజు పనిమీద
7 నియమింపబడిన అధిపతులును కలిసి । మనఃపూర్వక
ముగా దేవుని మందిరపు పనికి పదివేల మణుగుల
బంగారమును ఇరువదివేల మణుగుల బంగారపు
ద్రాములను ఇరువదివేల మణుగుల వెండిని ముప్పది
యారువేల మణుగుల యిత్తడిని రెండులక్షల మణు
గుల యినుమును ఇచ్చిరి. । తమయొద్ద రత్నములున్న 8
వారు వాటిని తెచ్చి యెహోవా మందిరపు బొక్క
సముమీదనున్న గెర్షోనీయుడైన యెహీయేలునకు
ఇచ్చిరి. । వారు పూర్ణమనస్సుతో యెహోవాకు 9
ఇచ్చియుండిరి గనుక వారు ఆలాగు మనఃపూర్వక
ముగా ఇచ్చినందుకు జనులు సంతోషపడిరి.
రాజైన దావీదుకూడను బహుగా సంతోషపడి, 10
సమాజము పూర్ణముగా ఉండగా యెహోవాకు
ఇట్లు స్తోత్రములు చెల్లించెను—మాకు తండ్రిగానున్న
ఇశ్రాయేలీయుల దేవా యెహోవా, నిరంతరము
నీవు స్తోత్రార్హుడవు. । యెహోవా, భూమ్యాకాశ 11
ములయందుండు సమస్తమును నీ వశము; మాహాత్మ్య
మును పరాక్రమమును ప్రభావమును తేజస్సును ఘన
తయు నీకే చెందుచున్నవి; యెహోవా, రాజ్యము
నీది, నీవు అందరిమీదను నిన్ను అధిపతిగా హెచ్చిం
చుకొని యున్నావు. । ఐశ్వర్యమును గొప్పతనమును 12
నీవలన కలుగును, నీవు సమస్తమును ఏలువాడవు, బల
మును పరాక్రమమును నీ దానములు, హెచ్చించు
వాడవును అందరికి బలము ఇచ్చువాడవును నీవే. । మా 13
దేవా, మేము నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నా
ము, ప్రభావముగల నీ నామమును కొనియాడు
చున్నాము. । ఈ ప్రకారము మనఃపూర్వకముగా 14
ఇచ్చు సామర్థ్యము మాకుండుటకు నేనెంతమాత్రపు
వాడను? నా జనులెంతమాత్రపువారు? సమస్తమును
నీవలననే కలిగెను గదా? నీ స్వసంపాద్యములో కొంత
మేము నీకిచ్చియున్నాము. । మా పితరులందరివలెనే 15
మేమును నీ సన్నిధిని అతిథులమును పరదేశులమునై
యున్నాము, మా భూనివాసకాలము నీడయంత అస్థి
రము, స్థిరముగా ఉన్నవాడొకడును లేడు । మా 16
దేవా యెహోవా, నీ పరిశుద్ధ నామముయొక్క
ఘనతకొరకు మందిరమును కట్టించుటకై మేము సమ
కూర్చిన యీ వస్తుసముదాయమును నీవలన కలిగినదే,
అంతయు నీదియై యున్నది. । నా దేవా, నీవు 17
హృదయపరిశోధనచేయుచు యథార్థవంతులయందు
ఇష్టపడుచున్నావని నేనెరుగుదును; నేనైతే యథార్థ
హృదయముగలవాడనై యివి యన్నియు మనఃపూర్వ
కముగా ఇచ్చియున్నాను; ఇప్పుడు ఇక్కడనుండు
నీ జనులును నీకు మనఃపూర్వకముగా ఇచ్చుట చూచి
సంతోషించుచున్నాను. । అబ్రాహాము ఇస్సాకు 18
ఇశ్రాయేలు అను మా పితరుల దేవా యెహోవా,
నీ జనులు హృదయపూర్వకముగా సంకల్పించిన యీ
ఉద్దేశమును నిత్యము కాపాడుము; వారి హృదయ
మును నీకు అనుకూలపరచుము. । నా కుమారుడైన 19

సొలొమోను నీ యాజ్ఞలను నీ శాసనములను నీ కట్టడ
లను గైకొనుచు వాటన్నిటిని అనుసరించునట్లును,
నేను కట్టుటకై సిద్ధపరచిన యీ ఆలయమును కట్టించునట్లును
అతనికి నిర్దోషమైన హృదయము దయచేయుము. ।
20 ఈలాగు పలికిన తరువాత దావీదు — ఇప్పుడు మీ
దేవుడైన యెహోవాను స్తుతించుడని సమాజకులంద
రితో చెప్పగా, వారందరును తమ పితరుల దేవుడైన
యెహోవాను స్తుతించి యెహోవా సన్నిధిని రాజు
21 ముందరను తలవంచి నమస్కారముచేసిరి. । తరువాత
వారు యెహోవాకు బలులు అర్పించిరి. మరునాడు
దహనబలిగా వెయ్యి యెద్దులను వెయ్యి గొఱ్ఱెపొట్టే
ళ్లను వెయ్యి గొఱ్ఱెపిల్లలను వాటి పానార్పణలతో
కూడ ఇశ్రాయేలీయులందరి సంఖ్యకు తగునట్టుగా
22 అర్పించిరి. । ఆ దినమున వారు యెహోవా సన్ని
ధిని బహు సంతోషముతో అన్నపానములు పుచ్చు
కొనిరి. దావీదు కుమారుడైన సొలొమోనుకు రెండవ
మారు పట్టాభిషేకముచేసి, యెహోవా సన్నిధిని
అతని అధిపతిగాను సాదోకును యాజకునిగాను అభి
23 షేకించిరి । అప్పుడు సొలొమోను తన తండ్రియైన
దావీదునకు మారుగా యెహోవా సింహాసనమందు
రాజుగా కూర్చుండి వర్ధిల్లుచుండెను. ఇశ్రాయేలీయు
24 లందరును అతని యాజ్ఞకు బద్ధులై యుండిరి. । అధి
పతులందరును యోధులందరును రాజైన దావీదు
కుమారులందరును రాజైన సొలొమోనునకు లోబడిరి. ।
యెహోవా సొలొమోనును ఇశ్రాయేలీయులందరి 25
యెదుటను బహుగా ఘనపరచి, అతనికి ముందుగా
ఇశ్రాయేలీయులను ఏలిన యే రాజునకైనను కలుగని
రాజ్యప్రభావమును అతని కనుగ్రహించెను.

యెష్షయి కుమారుడైన దావీదు ఇశ్రాయేలీయు 26
లందరిమీద రాజైయుండెను. । అతడు ఇశ్రాయేలీ 27
యులను ఏలినకాలము నలువది సంవత్సరములు;
హెబ్రోనులో ఏడు సంవత్సరములును, యెరూష
లేములో ముప్పది మూడు సంవత్సరములును అతడు
ఏలెను. । అతడు వృద్ధాప్యము వచ్చినవాడై ఐశ్వర్య 28
ప్రభావములు కలిగి, మంచి ముదిమిలో మరణమొం
దెను. అతని తరువాత అతని కుమారుడైన సొలొ
మోను అతనికి మారుగా రాజాయెను. । రాజైన దావీ 29
దుకు జరిగినవాటన్నిటినిగూర్చియు, అతని రాజరిక
మంతటినిగూర్చియు, పరాక్రమమునుగూర్చియు,
అతనికిని ఇశ్రాయేలీయులకును దేశముల రాజ్యము
లన్నిటికిని వచ్చిన కాలములనుగూర్చియు, । దర్శకు 30
డగు సమూయేలు మాటలనుబట్టియు, ప్రవక్తయగు
నాతాను మాటలనుబట్టియు, దర్శకుడగు గాదు మాట
లనుబట్టియు వ్రాయబడియున్నది.

# దినవృత్తాంతములు

## రెండవ గ్రంథము



**1** దావీదు కుమారుడైన సొలొమోను తన రాజ్య
మందు స్థిరపరచబడగా అతని దేవుడైన యెహోవా
అతనితోకూడ ఉండి అతనిని బహు ఘనుడైన
2 రాజుగా చేసెను. । యెహోవా సేవకుడైన మోషే
అరణ్యమందు చేయించిన దేవుని సమాజపు గుడారము
3 గిబియోనునందుండెను గనుక । సొలొమోను సహ
స్రాధిపతులకును శతాధిపతులకును న్యాయాధిపతుల
కును ఇశ్రాయేలీయుల పితరుల యిండ్లకు పెద్దలైనవారి
కందరికిని, అనగా ఇశ్రాయేలీయులకందరికిని ఆజ్ఞ
4 ఇయ్యగా సమాజకులందరును । సొలొమోనుతోకూడ
కలిసి గిబియోనునందుండు బలిపీఠము నొద్దకు పోయిరి;
దావీదు దేవుని మందసమును కిర్యత్యారీమునుండి
తెప్పించి యెరూషలేమునందు దానికొరకు గుడారము
5 వేసి తాను సిద్ధపరచిన స్థలమున నుంచెను. । హూరు
కుమారుడైన ఊరికి పుట్టిన బెసలేలు చేసిన యిత్తడి
బలిపీఠము అక్కడ యెహోవా నివాసస్థలము ఎదుట
ఉండగా సొలొమోనును సమాజపువారును దాని
6 యొద్ద విచారణచేసిరి. । సమాజపు గుడారము ముం
దర యెహోవా సన్నిధినుండు ఇత్తడి బలిపీఠము
నొద్దకు సొలొమోను పోయి దానిమీద వెయ్యి
దహనబలులను అర్పించెను.
7 ఆ రాత్రియందు దేవుడు సొలొమోనుకు ప్రత్య
క్షమై — నేను నీకు ఏమి ఇయ్యగోరుదువో దాని
8 అడుగుమని సెలవియ్యగా । సొలొమోను దేవునితో
ఈలాగు మనవిచేసెను—నీవు నా తండ్రియైన దావీదు
ఎడల బహుగా కృప చూపి అతని స్థానమందు నన్ను
9 రాజుగా నియమించియున్నావు గనుక । దేవా
యెహోవా, నీవు నా తండ్రియైన దావీదుకు చేసిన
వాగ్దానమును స్థిరపరచుము, నేల ధూళియంత విస్తార
మైన జనులమీద నీవు నన్ను రాజుగా నియమించి
10 యున్నావు. । ఈ నీ గొప్ప జనమునకు న్యాయము
తీర్చ శక్తిగలవాడెవడు? నేను ఈ జనులమధ్యను ఉండి
కార్యములను చక్కపెట్టునట్లు తగిన జ్ఞానమును తెలి
11 విని నాకు దయచేయుము. । అందుకు దేవుడు సొలొ
మోనుతో ఈలాగు సెలవిచ్చెను–నీవు ఈ ప్రకారము
యోచించుకొని, ఐశ్వర్యమునైనను సొమ్మునైనను ఘన
తనైనను నీ శత్రువుల ప్రాణమునైనను దీర్ఘాయువు
నైనను అడుగక, నేను నిన్ను వారిమీద రాజుగా
నియమించిన నా జనులకు న్యాయము తీర్చుటకు
తగిన జ్ఞానమును తెలివిని అడిగియున్నావు. । కాబట్టి 12
జ్ఞానమును తెలివియు నీ కియ్యబడును, నీకన్న ముం
దుగానున్న రాజులకైనను నీ తరువాత వచ్చు రాజుల
కైనను కలుగని ఐశ్వర్యమును సొమ్మును ఘనతను
నీకిచ్చెదను. । పిమ్మట సొలొమోను గిబియోనులో 13
నుండు సమాజపు గుడారము ఎదుటనున్న బలిపీఠ
మును విడిచి యెరూషలేమునకు వచ్చి ఇశ్రాయేలీయు
లను ఏలుచుండెను.
సొలొమోను రథములను గుఱ్ఱపు రౌతులను సమ 14
కూర్చెను; వెయ్యిన్ని నన్నూరు రథములును పన్నెం
డు వేల గుఱ్ఱపు రౌతులును అతనికి ఉండెను; వీరిలో
కొందరిని అతడు రథములుండు పట్టణములలో ఉం
చెను, కొందరిని తన రాజసన్నిధిని ఉండుటకు యె
రూషలేములో ఉంచెను. । రాజు యెరూషలేము 15
నందు వెండి బంగారములను రాళ్లంత విస్తారముగాను,
సరళ మ్రానులను షెఫేల ప్రదేశమునందున్న మేడి
చెట్లంత విస్తారముగాను సమకూర్చెను. । సొలొమోను 16
కుండు గుఱ్ఱములు ఐగుప్తులోనుండియు కోవేలో
నుండియు తేబడెను, రాజు వర్తకులు నియామకమైన
వెల ఇచ్చి కోవేలోనుండియు కొని తెప్పించిరి. । వారు 17
ఐగుప్తునుండి కొని తెచ్చిన రథమొకటింటికి ఆరునూరు
తులముల వెండియు గుఱ్ఱమొకటింటికి నూట ఏబది
తులముల వెండియు నిచ్చిరి; హిత్తీయుల రాజులందరి
కొరకును అరాము రాజులకొరకును వారు ఆ ధరకే
వాటిని తీసికొనిరి.
సొలొమోను యెహోవా నామఘనతకొరకు **2**
ఒక మందిరమును తన రాజ్యఘనతకొరకు ఒక నగ
రును కట్టవలెనని తీర్మానము చేసికొని । బరువులు 2
మోయుటకు డెబ్బది వేలమందిని, కొండలమీద
మ్రానులు కొట్టుటకు ఎనుబది వేలమందిని ఏర్పరచు
కొని, వీరిమీద మూడు వేల ఆరు నూరుమందిని అధి
పతులుగా ఉంచెను. । సొలొమోను తూరు రాజైన 3
హీరాము నొద్దకు దూతలచేత ఈ వర్తమానము పం
పెను—నా తండ్రియైన దావీదు నివాసమునకై యొక
నగరును కట్టతలచియుండగా నీవు అతనికి సరళ
మ్రానులను సిద్ధముచేసి పంపించినట్లు నాకును దయ
చేసి పంపించుము. । నా దేవుడైన యెహోవా సన్ని 4
ధిని సుగంధవర్గములను ధూపము వేయుటకును సన్నిధి
రొట్టెలను నిత్యము ఉంచుటకును, ఉదయ సాయం

కాలములయందును, విశ్రాంతి దినములయందును,
అమావాస్యలయందును, మా దేవుడైన యెహోవాకు
ఏర్పాటైన ఉత్సవములయందును, ఇశ్రాయేలీయులు
నిత్యమును అర్పింపవలసిన దహనబలులను అర్పించుట
కును, ఆయన నామఘనతకొరకు మందిరమొకటి ఆయ
నకు ప్రతిష్ఠితము చేయబడునట్లుగా నేను కట్టించ
5 బోవుచున్నాను. । నేను కట్టించు మందిరము గొప్ప
దిగానుండును; మా దేవుడు సకలమైన దేవతలకంటె
6 మహనీయుడు గనుక । ఆకాశములును మహాకాశము
లును ఆయనను పట్టజాలవు, ఆయనకు మందిరమును
కట్టించుటకు చాలినవాడెవడు? ఆయన సన్నిధిని ఆయ
నకు మందిరమును కట్టించుటకైనను నేనేమాత్రపు
వాడను? ధూపము వేయుటకే నేను ఆయనకు మందిర
7 మును కట్ట దలచియున్నాను. । నా తండ్రియైన
దావీదు నియమించి యూదాదేశములోను యెరూష
లేములోను నాయొద్ద ఉంచిన ప్రజ్ఞగలవారికి సహాయ
కుడై యుండి, బంగారముతోను వెండితోను ఇత్తడి
తోను ఇనుముతోను ఊదా నూలుతోను ఎఱ్ఱ నూలు
తోను నీలి నూలుతోను చేయు పనియును అన్ని
విధముల చెక్కడపుపనియును నేర్చిన ప్రజ్ఞగల మను
8 ష్యునొకని నాయొద్దకు పంపుము. । మరియు లెబా
నోనునందు మ్రానులు కొట్టుటకు మీ పనివారు నేర్పు
9 గలవారని నాకు తెలిసేయున్నది. । కాగా లెబానోను
నుండి సరళమ్రానులను దేవదారుమ్రానులను చందనపు
మ్రానులను నాకు పంపుము; నేను కట్టించబోవు మంది
రము గొప్పదిగాను ఆశ్చర్యకరమైనదిగాను ఉండును
గనుక నాకు మ్రానులు విస్తారముగా సిద్ధపరచుటకై
నా పనివారు మీ పనివారితోకూడ పోవుదురు. ।
10 మ్రానులుకొట్టు మీ పనివారికి నన్నూరు గరిసెల
దంచిన గోధుమలను ఎనుబదినాలుగు పుట్లు యవలను
నూట నలువదిపుట్లు ద్రాక్షారసమును నూట నలువది
పుట్లు నూనెను ఇచ్చెదను.
11 అప్పుడు తూరు రాజైన హీరాము సొలొమో
నుకు వ్రాసిపంపిన ఉత్తరమేమనగా—యెహోవా
తన జనమును స్నేహించి నిన్ను వారిమీద రాజుగా
12 నియమించి యున్నాడు. । యెహోవా ఘనతకొరకు
ఒక మందిరమును నీ రాజ్యఘనతకొరకు ఒక నగరును
కట్టించుటకు తగిన జ్ఞానమును తెలివియుగల బుద్ధిమం
తుడైన కుమారుని రాజైన దావీదుకు దయచేసిన,
భూమ్యాకాశములకు సృష్టికర్తయగు ఇశ్రాయేలీయుల
13 దేవుడైన యెహోవా స్తుతినొందుగాక. । తెలివియు
వివేచనయుగల హూరాము అనునొక చురుకైన పని
14 వానిని నేను నీయొద్దకు పంపుచున్నాను. । అతడు
దాను వంశపురాలగు ఒక స్త్రీకి పుట్టినవాడు, వాని
తండ్రి తూరు సంబంధమైనవాడు, అతడు బంగారము
తోను వెండితోను ఇత్తడితోను ఇనుముతోను రాళ్ల
తోను మ్రానులతోను ఊదా నూలుతోను నీలి నూలు
తోను సన్నపు నూలుతోను ఎఱ్ఱ నూలుతోను పని
చేయగల నేర్పరియైనవాడు. సకలవిధముల చెక్క
డపు పనియందును మచ్చులు కల్పించుటయందును
యుక్తికలిగి, నీ పనివారికిని నీ తండ్రియైన దావీదు అను
నా యేలినవాడు నియమించిన ఉపాయశాలులకును
సహకారియై వాటన్నిటిని నిరూపించుటకు తగిన సామ
ర్థ్యము గలవాడు. । ఇప్పుడు నా యేలినవాడు చెప్పి 15
యున్న గోధుమలను యవలను నూనెను ద్రాక్షారస
మును నీ సేవకుల చేతికిచ్చి వారిని సాగనంపినయెడల ।
మేము నీకు కావలసిన మ్రానులన్నియు లెబానోను 16
నందు కొట్టించి వాటిని నీకొరకు సముద్రముమీద
తెప్పలుగా యొప్పేకు కొనివచ్చెదము, తరువాత
నీవు వాటిని యెరూషలేముకు తెప్పించుకొనవచ్చును
అని వ్రాసెను.
సొలొమోను తన తండ్రియైన దావీదు ఇశ్రా 17
యేలు దేశమందుండిన అన్యజాతివారినందరిని, ఎన్నిక
వేయించిన యెన్నిక ప్రకారము వారిని లెక్కింపగా
వారు లక్ష యెనుబది మూడు వేల ఆరునూరుమంది
యైరి. । వీరిలో బరువులు మోయుటకు డెబ్బది వేల 18
మందిని, పర్వతములందు మ్రానులు కొట్టుటకు ఎను
బది వేలమందిని, జనులమీద అధిపతులుగానుండి పని
చేయించుటకు మూడు వేల ఆరునూరుమందిని అతడు
ఏర్పరచెను.

తరువాత సొలొమోను యెరూషలేములో తన 3
తండ్రియైన దావీదుకు యెహోవా ప్రత్యక్షమై
నప్పుడు, మోరీయా పర్వతమందు దావీదు సిద్ధపరచిన
స్థలమున యెబూసీయుడైన ఒర్నాను కళ్లమందు
దావీదు ఏర్పరచిన స్థలమున యెహోవాకు ఒక
మందిరమును కట్టనారంభించెను । తన యేలుబడిలో 2
నాలుగవ సంవత్సరము రెండవ నెల రెండవ దినమందు
దాని కట్టనారంభించెను. । దేవుని మందిరమునకు 3
సొలొమోను పూర్వపు కొలలప్రకారము పునాదులు
ఏర్పరచెను; పొడవు అరువది మూరలు, వెడల్పు ఇరు
వది మూరలు. । మందిరపు ముఖమంటపము మందిరపు 4
పొడుగునుబట్టి యిరువది మూరలు వెడల్పు, నూట
ఇరువది మూరలు ఎత్తు; దాని లోపలిభాగమును
ప్రశస్తమైన బంగారముతో అతడు పొదిగించెను. ।
మందిరపు పెద్ద గదిని దేవదారుపలకలతో కప్పి వాటి 5
పైన మేలిమి బంగారును పొదిగించి పైభాగమున ఖర్జూ
రపు చెట్లవంటి పనియు గొలుసులవంటి పనియు
చెక్కించి । ప్రశస్తమైన రత్నములతో దానిని అలంక 6
రించెను. ఆ బంగారము పర్వాయిమునుండి వచ్చి
నది. । మందిరపు దూలములను స్తంభములను దాని 7
గోడలను దాని తలుపులను బంగారముతో పొదిగించి
గోడలమీద కెరూబులను చెక్కించెను. । మరియు అ 8

**అతడు** అతిపరిశుద్ధ స్థలమొకటి కట్టించెను; దాని
పొడవు మందిరపు వెడల్పును బట్టి యిరువది మూరలు,
దాని వెడల్పు ఇరువది మూరలు, రెండు లక్షల
వెయ్యిన్ని రెండు నూరుల మణుగుల మేలిమి బంగా
9 రుతో అతడు దాని పొదిగించెను. । మేకుల యెత్తు
ఏబది తులముల బంగారు; మీదిగదులను బంగారముతో
0 పొదిగించెను. । అతిపరిశుద్ధ స్థలమునందు చెక్కడపు
పనిగల రెండు కెరూబులను చేయించి వాటిని బంగా
1 రుతో పొదిగించెను. । ఆ కెరూబుల రెక్కల పొడవు
2 ఇరువది మూరలు, ఒక్కొక రెక్క అయిదు మూరల
పొడుగు, అది మందిరపు గోడకు తగులుచుండెను,
రెండవది జతగానున్న కెరూబు రెక్కకు తగులుచుం
3 డెను. । ఈ ప్రకారము చాచుకొనిన ఈ కెరూబుల
రెక్కలు ఇరువది మూరలు వ్యాపించెను, కెరూబులు
పాదములమీద నిలువబడెను, వాటి ముఖములు మంది
4 రపు లోతట్టు తిరిగియుండెను. । అతడు నీలి నూలు
తోను ఊదా నూలుతోను ఎర్ర నూలుతోను సన్నపు
నారనూలుతోను ఒక తెరను చేయించి దానిమీద
5 కెరూబులను కుట్టించెను. । ఇదియుగాక మందిరము
ముందర ఉండుటకై ముప్పదియయిదు మూరల యెత్తు
గల రెండు స్తంభములను వాటిమీదికి అయిదుమూరల
6 యెత్తుగల పీటలను చేయించెను. । గర్భాలయమునందు
చేసినట్టు గొలుసుపని చేయించి, స్తంభముల పైభాగ
మున దాని ఉంచి, నూరు దానిమ్మపండ్లను చేయించి
7 ఆ గొలుసు పనిమీద తగిలించెను. । ఆ రెండు స్తంభ
ములను దేవాలయము ఎదుట కుడితట్టున ఒకటియు
ఎడమతట్టున ఒకటియు నిలువబెట్టించి, కుడితట్టు
దానికి యాకీను అనియు, ఎడమతట్టుదానికి బోయజు
అనియు పేళ్లు పెట్టెను.

**4** **అతడు** ఇరువది మూరలు పొడవును ఇరువది
మూరలు వెడల్పును పది మూరలు ఎత్తునుగల యొక
2 యిత్తడి బలిపీఠమును చేయించెను. । పోతపోసిన సము
ద్రపు తొట్టియొకటి చేయించెను, అది యీ యంచుకు
ఆ యంచుకు పది మూరల యెడము గలది; దాని
యెత్తు అయిదు మూరలు, దాని కైవారము ముప్పది
3 మూరలు. । దాని క్రిందితట్టున ఎద్దులు రూపింపబడి
యుండెను, అవి ఒక్కొక మూరకు పదేసియుండెను,
అవి ఆ సముద్రపు తొట్టిని ఆవరించెను; ఎద్దులు
రెండు వరుసలు తీరి యుండెను, అవి తొట్టితోకూడ నే
4 పోతపోయబడెను. । అది పన్నెండు ఎద్దులమీద
నిలువబడెను; మూడు ఎద్దులు ఉత్తరపుతట్టు మూడు
పడమటితట్టు మూడు దక్షిణపుతట్టు మూడు తూర్పు
తట్టు చూచుచుండెను. సముద్రపుతొట్టి వాటిపై
నుంచబడెను, వాటి వెనుకటి పార్శ్వములన్నియు
5 లోపలికి తిరిగియుండెను. । అది బెత్తెడు దళము
గలది, దాని అంచు గిన్నెయంచువంటిదై తామరపుష్ప
ములు తేల్చబడియుండెను; అది ముప్పది పుట్ల నీళ్లు
పట్టును.

మరియు దహనబలులుగా అర్పించువాటిని కడుగు 6
టకై కుడి తట్టుకు అయిదును ఎడమ తట్టుకు అయి
దును పది స్నానపు గంగాళములను చేయించెను;
సముద్రమువంటి తొట్టియందు యాజకులు మాత్రము
స్నానము చేయుదురు. । మరియు వాటినిగూర్చిన 7
విధి ననుసరించి పది బంగారపు దీపస్తంభములను
చేయించి, దేవాలయమందు కుడి తట్టున అయిదును
ఎడమ తట్టున అయిదును ఉంచెను. । పది బల్లలను 8
చేయించి దేవాలయమందు కుడి తట్టున అయిదును
ఎడమ తట్టున అయిదును ఉంచెను; నూరు బంగారపు
తొట్లను చేయించెను. । అతడు యాజకుల ఆవరణ 9
మును గొప్ప ముంగిటి బయలును దీనికి వాకిండ్లను
చేయించి దీని తలుపులను ఇత్తడితో పొదిగించెను. ।
సముద్రపుతొట్టిని తూర్పుతట్టున కుడిపార్శ్వమందు 10
దక్షిణముఖముగా ఉంచెను. । హూరాము పాత్ర 11
లను బూడిదెనెత్తు చిప్పకోలలను తొట్లను చేసెను;
రాజైన సొలొమోను ఆజ్ఞప్రకారము దేవుని మంది
రమునకు చేయవలసిన పనియంతయు హూరాము
సమాప్తిచేసెను. । దాని వివరమేమనగా, రెండు స్తంభ 12
ములు, వాటి పళ్లెములు, వాటి పైభాగమునకు చేసిన
పీటలు, వీటి పళ్లెములు, ఆ స్తంభముల శీర్షముల రెండు
పళ్లెములను కప్పుటకైన రెండు అల్లికలు, । ఆ స్తంభ 13
ముల శీర్షముల రెండు పళ్లెములను కప్పునట్టి అల్లిక,
అల్లికకు రెండేసి వరుసలుగా చేయబడిన నన్నూరు
దానిమ్మపండ్లు. । మట్లు, మట్లమీదనుండు తొట్లు, । 14
సముద్రపుతొట్టి దాని క్రిందనుండు పన్నెండు 15
ఎద్దులు, । పాత్రలు, బూడిదె నెత్తు చిప్పకోలలు, 16
ముండ్లకొంకులు మొదలైన ఉపకరణములు. వీటిని
హూరాము, రాజైన సొలొమోను ఆజ్ఞప్రకారము
యెహోవా మందిరముకొరకు మంచి పన్నెగల
యిత్తడితో చేసెను. । యొర్దాను మైదానమందు 17
సుక్కోతుకును జెరేదాతాకును మధ్యను జిగటమంటి
భూమియందు రాజు వాటిని పోత పోయించెను. ।
ఎత్తు చూచలేనంత యిత్తడి తన యొద్ద యుండగా సొలొ 18
మోను ఈ ఉపకరణములన్నిటిని బహు విస్తారముగా
చేయించెను. । దేవుని మందిరమునకు కావలసిన ఉప 19
కరణములన్నిటిని బంగారపు పీఠమును సన్నిధి రొట్టెలు
ఉంచు బల్లలను, । వాటినిగూర్చిన విధిప్రకారము 20
గర్భాలయము ఎదుట వెలుగుచుండుటకై ప్రశస్తమైన
బంగారపు దీపస్తంభములను, । పుష్పములను ప్రమిదె 21
లను కత్తెరలను కారులను తొట్లను గిన్నెలను ధూప
కలశములను సొలొమోను మేలిమి బంగారముతో
చేయించెను. । మరియు మందిరద్వారము లోపలి 22
తలుపులను అతి పరిశుద్ధ స్థలముయొక్క లోపలి తలు

పులును దేవాలయపు తలుపులును అన్నియు బంగార
ముతో చేయబడెను.

**5** సొలొమోను యెహోవా మందిరమునకు తాను
చేసిన పని యంతయు సమాప్తముచేసి, తన తండ్రి
యైన దావీదు ప్రతిష్ఠించిన వెండిని బంగారమును
ఉపకరణములన్నిటిని దేవుని మందిరపు బొక్కసము
2 లలో చేర్చెను. । తరువాత యెహోవా నిబంధన
మందసమును సీయోను అను దావీదు పట్టణమునుండి
తీసికొని వచ్చుటకై సొలొమోను ఇశ్రాయేలీయుల
పెద్దలను ఇశ్రాయేలీయుల వంశములకు అధికారులగు
గోత్రముల పెద్దలనందరిని యెరూషలేమునందు సమ
3 కూర్చెను. । ఏడవ నెలను పండుగ జరుగుకాలమున
ఇశ్రాయేలీయులందరును రాజు నొద్దకు వచ్చిరి. ।
4 ఇశ్రాయేలీయుల పెద్దలందరును వచ్చిన తరువాత ।
5 రాజైన సొలొమోనును ఇశ్రాయేలీయుల సమాజకు
లందరును సమకూడి, లెక్కింప శక్యముకాని గొఱ్ఱె
6 లను పశువులను బలిగా అర్పించిరి. । లేవీయులును
యాజకులును కలిసి, మందసమును సమాజపు గుడార
మును గుడారమందుండు ప్రతిష్ఠితములగు ఉపకరణ
7 ములన్నిటిని తీసికొని వచ్చిరి. । మరియు యాజకులు
యెహోవా నిబంధన మందసమును తీసికొని గర్భా
లయమగు అతిపరిశుద్ధస్థలమందు కెరూబుల రెక్కల
8 క్రింద దానిని ఉంచిరి. । మందసముండు స్థలమునకు
మీదుగా కెరూబులు తమ రెండు రెక్కలను చాచు
9 కొని మందసమును దాని దండెలను కమ్మెను. । వాటి
కొనలు గర్భాలయము ఎదుట కనబడునంత పొడ
వుగా ఆ దండెలుంచబడెనుగాని అవి బయటికి కనబడ
10 లేదు. నేటివరకు అవి అచ్చటనే యున్నవి. । ఇశ్రా
యేలీయులు ఐగుప్తులోనుండి బయలువెళ్లిన తరువాత
యెహోవా హోరేబునందు వారితో నిబంధన
చేసినప్పుడు మోషే ఆ మందసమునందు ఉంచిన
రెండు రాతిపలకలు తప్ప దానియందు మరేమియు
11 లేదు. । యాజకులు పరిశుద్ధస్థలమునుండి బయలుదేరి
వచ్చినప్పుడు అచ్చట కూడియున్న యాజకులందరును
తమ వంతులు చూడకుండ తమ్మునుతాము ప్రతిష్ఠించు
12 కొనిరి. । ఆసాపు హేమాను యెదూతూనుల సంబంధ
మైనవారును, వారి కుమారులకును సహోదరుల
కును సంబంధికులగు పాటకులైన లేవీయులందరును,
సన్నపు నారవస్త్రములను ధరించుకొని తాళములను
తంబురలను సితారాలను చేత పట్టుకొని బలిపీఠమునకు
13 తూర్పుతట్టున నిలిచిరి; । వారితోకూడ బూరలు
ఊదు యాజకులు నూట ఇరువదిమంది నిలిచిరి;
బూరలు ఊదువారును పాటకులును ఏకస్వరముతో
వాకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచు గానము
యాజకులు పరిశుద్ధస్థలములోనుండి బయలు
తోను తాళములతోను వాద్యముల
తోను కలిసి స్వరమెత్తి—యెహోవా దయాళుడు,
ఆయన కృప నిరంతరముండునని స్తోత్రముచేసిరి. ।
అప్పుడొక మేఘము యెహోవా మందిరమునిండ 14
నిండెను; యెహోవా తేజస్సుతో దేవుని మందిరము
నిండుకొనగా సేవచేయుటకు యాజకులు ఆ మేఘ
మున్నచోట నిలువలేకపోయిరి.

అప్పుడు సొలొమోను ఈలాగు ప్రకటన చేసెను **6**
—గాఢాంధకారమందు నేను నివాసము చేయుదునని
యెహోవా సెలవిచ్చియున్నాడు. । నీవు నిత్యము 2
కాపురముండుటకై నిత్యనివాసస్థలముగా నేనొక ఘన
మైన మందిరమును నీకు కట్టించి యున్నాను అని
చెప్పి । రాజు తన ముఖము ప్రజలతట్టు త్రిప్పుకొని 3
ఇశ్రాయేలీయుల సమాజకులందరును నిలుచుచుండగా
వారిని దీవించెను. । మరియు రాజు ఇట్లు ప్రకటన 4
చేసెను—నా తండ్రియైన దావీదుకు మాట యిచ్చి,
తానే స్వయముగా నెరవేర్చిన ఇశ్రాయేలీయుల దేవు
డైన యెహోవాకు స్తోత్రము కలుగునుగాక. । ఆయన 5
సెలవిచ్చినదేమనగా — నేను నా జనులను ఐగుప్తుదేశ
ములోనుండి రప్పించిన దినము మొదలుకొని నా
నామముండుటకై యొక మందిరమును కట్టింపవలెనని
నేను ఇశ్రాయేలీయుల గోత్రస్థానములలో ఏ పట్ట
ణమునైనను కోరుకొనలేదు, నా జనులైన ఇశ్రాయేలీ
యులమీద అధిపతిగానుండుటకై యే మనుష్యునినైన
నను నేను నియమింపలేదు. । ఇప్పుడు నా నామముం 6
డుటకై యెరూషలేమును కోరుకొంటిని, నా జనులైన
ఇశ్రాయేలీయులమీద అధిపతిగానుండుటకై దావీ
దును కోరుకొంటిని. । ఇశ్రాయేలీయుల దేవుడైన 7
యెహోవా నామఘనతకొరకు ఒక మందిరమును
కట్టింపవలెనని నా తండ్రియైన దావీదు మనోభిలాష
గలవాడాయెను. । అయితే యెహోవా నా తండ్రి 8
యైన దావీదుతో సెలవిచ్చినదేమనగా — నా నామ
ఘనతకొరకు మందిరమును కట్టింపవలెనని నీవు ఉద్దే
శించిన యుద్దేశము మంచిదేగాని । నీవు ఆ మందిర 9
మును కట్టతగదు; నీకు పుట్టబోవు నీ కుమారుడే నా
నామమునకు ఆ మందిరమును కట్టును. । అప్పుడు 10
తాను అట్లు చెప్పియున్న మాటను యెహోవా
ఇప్పుడు నెరవేర్చియున్నాడు. యెహోవా సెలవు
ప్రకారము నేను నా తండ్రియైన దావీదుకు ప్రతిగా
రాజునై ఇశ్రాయేలీయుల రాజాసనమందు కూర్చుండి
ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాకు మందిర
మును కట్టించి । యెహోవా ఇశ్రాయేలీయులతో 11
చేసిన నిబంధనకు గురుతైన మందసమును దానియందు
ఉంచితినని చెప్పి । ఇశ్రాయేలీయులందరు సమాజ 12
ముగా కూడి చూచుచుండగా యెహోవా బలి
పీఠము ఎదుట నిలిచి తన చేతులు చాపి ప్రార్థన
చేసెను.

13 అనగా తాను చేయించిన అయిదు మూరల పొడ
వును అయిదు మూరల వెడల్పును మూడు మూరల
యెత్తునుగల యిత్తడి చప్పరమును ముంగిటి బయలు
నందుంచి, దానిమీద నిలిచియుండి, సమాజముగా
కూడియున్న ఇశ్రాయేలీయులందరి యెదుటను మో
కాళ్లూని, చేతులు ఆకాశమువైపు చాపి సొలొమోను
14 ఇట్లని ప్రార్థనచేసెను. । —యెహోవా ఇశ్రాయేలీ
యుల దేవా, హృదయపూర్వకముగా నిన్ను అనుస
రించు నీ భక్తులకు నిబంధనను నెరవేర్చుచు కృపను
చూపుచునుండు నీవంటి దేవుడు పరమండలమందైనను
15 భూమియందైనను లేడు. । నీ సేవకుడైన దావీదు అను
నా తండ్రితో నీవు సెలవిచ్చినమాట నెరవేర్చియు
న్నావు; నీవు ప్రమాణముచేసి యీ దినమున కన
బడుచున్నట్టుగా దాని నెరవేర్చియున్నావు. । —
16 నీవు నాముందర నడిచినట్లుగా నీ కుమారులును తమ
ప్రవర్తన కాపాడుకొని, నా ధర్మశాస్త్రముచొప్పున
నడిచినయెడల ఇశ్రాయేలీయుల సింహాసనముమీద
కూర్చుండువాడు నా యెదుట నీకుండకపోడని నీవు
నీ సేవకుడైన దావీదు అను నా తండ్రితో సెలవిచ్చిన
మాట, ఇశ్రాయేలీయుల దేవా యెహోవా, దయ
17 చేసి నెరవేర్చుము. । ఇశ్రాయేలీయుల దేవా
యెహోవా, నీవు నీ సేవకుడైన దావీదుతో సెల
18 విచ్చిన మాట ఇప్పుడు స్థిరమవునుగాక. । మనుష్యు
లతో కలిసి దేవుడు భూమియందు నివాసము
చేయునా? ఆకాశమును మహాకాశమును నిన్ను పట్ట
చాలవే; నేను కట్టిన యీ మందిరము నిన్ను పట్టునా? ।
19 దేవా యెహోవా, నీ సేవకుడు నీ సన్నిధిని చేయు
ప్రార్థనయందును విన్నపమునందును లక్ష్యముంచి,
నీ సేవకుడనైన నేను చేయు ప్రార్థనను పెట్టు మొఱ్ఱను
20 ఆలకించుము. । నీ సేవకులు ఈ స్థలమందు చేయు
విన్నపములను వినుటకై — నా నామమును అచ్చట
ఉంచెదనని నీవు సెలవిచ్చిన స్థలముననున్న యీ
మందిరముమీద నీ కనుదృష్టి రాత్రింబగళ్లు నిలుచును
21 గాక. । నీ సేవకుడును నీ జనులైన ఇశ్రాయేలీయు
లును ఈ స్థలమందు చేయబోవు ప్రార్థనలను నీవు
ఆలకించుము పరమండలముననున్న నీ నివాసస్థల
మందు ఆలకించుము, ఆలకించునప్పుడు (వారి పాప
22 ములను) క్షమించుము. । ఎవడైనను తన పొరుగువాని
యెడల తప్పుచేసినప్పుడు అతనిచేత ప్రమాణము
చేయించుటకై అతనిమీద ఒట్టుపెట్టబడి ఆ ఒట్టు ఈ
మందిరమందుండు నీ బలిపీఠము ఎదుటికి వచ్చినప్పుడు ।
23 నీవు ఆకాశమందు విని, నీ దాసులకు న్యాయముతీర్చి,
హాని చేసినవాని తలమీదికి శిక్ష రప్పించి, నీతిపరుని
నీతిచొప్పున వానికిచ్చి వాని నీతిని నిర్ధారణచేయుము.।
24 నీ జనులైన ఇశ్రాయేలీయులు నీ దృష్టియెదుట
పాపము చేసినవారై తమ శత్రువుల బలమునకు నిలువ
లేక పడిపోయినప్పుడు, వారు నీయొద్దకు తిరిగి వచ్చి
నీ నామమును స్తోత్రించి, యీ మందిరమునందు నీ
సన్నిధిని ప్రార్థించి విన్నపము చేసినయెడల । పర 25
మండలమందు నీవు విని, నీ జనులైన ఇశ్రాయేలీయులు
చేసిన పాపమును క్షమించి, వారికిని వారి పితరుల
కును నీవిచ్చిన దేశమునకు వారిని మరల రప్పించుదువు
గాక. । వారు నీ దృష్టియెదుట పాపముచేసినందున 26
ఆకాశము మూయబడి వాన కురియకున్నప్పుడు,
వారు ఈ స్థలమున ప్రార్థనచేసి నీ నామమును
స్తోత్రించి, నీవు వారిని శ్రమపెట్టినప్పుడు వారు
తమ పాపములను విడిచిపెట్టి తిరిగినయెడల । పరమం 27
డలమందున్న నీవు ఆలకించి, నీ సేవకులును నీ జనులు
నగు ఇశ్రాయేలీయులు చేసిన పాపమును క్షమించి,
వారు నడువవలసిన మంచి మార్గము వారికి బోధించి,
నీవు నీ జనులకు స్వాస్థ్యముగా ఇచ్చిన నీ దేశమునకు
వాన దయచేయుదువుగాక. । దేశమునందు కరవు 28
గాని తెగులుగాని కనబడినప్పుడైనను, గాడ్పు దెబ్బ
గాని చిత్తపట్టుటగాని తగిలినప్పుడైనను, మిడతలుగాని
చీడపురుగులుగాని దండు దిగినప్పుడైనను, వారి
శత్రువులు వారి దేశపు పట్టణములలో వారిని ముట్టడి
వేసినప్పుడైనను, ఏ బాధగాని యే రోగముగాని
వచ్చినప్పుడైనను । ఏ దేశపువాడైనను ఇశ్రాయేలీయు 29
లగు నీ జనులందరు కలిసియైనను, నొప్పిగాని కష్టము
గాని అనుభవించుచు, ఈ మందిరముతట్టు చేతులు
చాపి చేయు విన్నపములన్నియు ప్రార్థనలన్నియు
నీ నివాసస్థలమైన పరమండలమునుండి నీవు ఆలకించి
క్షమించి । నీవు మా పితరులకిచ్చిన దేశమందు వారు 30
తమ జీవితకాలమంతయు నీయందు భయభక్తులు కలిగి ।
నీ మార్గములలో నడుచునట్లుగా వారి వారి హృదయ 31
ములను ఎరిగియున్న నీవు వారి సకల ప్రవర్తనకు తగి
నట్లు ప్రతిఫలమును దయచేయుదువు గాక. నీవు
ఒక్కడవే మానవుల హృదయము నెరిగినవాడవు గదా.
మరియు నీ జనులైన ఇశ్రాయేలీయుల సంబంధులు 32
కాని అన్యులు నీ ఘనమైన నామమునుగూర్చియు,
నీ బాహుబలమునుగూర్చియు, చాచిన బాహుబల
మునుగూర్చియు వినినవారై, దూరదేశమునుండి ఈ
మందిరమునకు వచ్చి విన్నపముచేసినయెడల । నీ 33
నివాసస్థలమగు పరమండలమునుండి నీవు వారి ప్రార్థన
నంగీకరించి, నీ జనులగు ఇశ్రాయేలీయులు తెలిసి
కొనినట్లు భూజనులందరును నీ నామమును తెలిసి
కొని, నీయందు భయభక్తులు కలిగి నేను కట్టిన యీ
మందిరమునకు నీ నామము పెట్టబడెనని గ్రహించు
నట్లుగా ఆ యన్యులు నీకు మొఱ్ఱపెట్టినదానిని నీవు
దయచేయుదువు గాక. । నీ జనులు నీవు పంపిన 34
మార్గమందు తమ శత్రువులతో యుద్ధముచేయుటకై
బయలుదేర నుద్దేశించి, నీవు కోరుకొనిన యీ పట్ట

ణముతట్టును నీ నామమునకు నేను కట్టించిన యీ
మందిరముతట్టును చూచి విన్నపముచేసినయెడల ।
35 పరమండలమునుండి నీవు వారి విన్నపమును ప్రార్థ
నను ఆలకించి వారి కార్యమును నిర్వహించుదువు
36 గాక. । పాపము చేయనివాడెవడును లేడు గనుక
వారు నీ దృష్టియెదుట పాపము చేసినప్పుడు నీవు
వారిమీద ఆగ్రహించి, శత్రువులచేతికి వారిని అప్ప
గింపగా, చెరపట్టువారు వారిని దూరమైనట్టి గాని
సమీపమైనట్టి గాని తమ దేశములకు పట్టుకొనిపోగా।
37 వారు చెరకుపోయిన దేశమందు బుద్ధి తెచ్చుకొని
మనస్సు తిప్పుకొని—మేము పాపముచేసితిమి, దోషుల
మైతిమి, భక్తిహీనముగా నడిచితిమి అని ఒప్పుకొని ।
38 తాము చెరలోనున్న దేశమందు పూర్ణహృదయము
తోను పూర్ణాత్మతోను నీయొద్దకు మళ్లుకొని, తమ
పితరులకు నీవిచ్చిన తమ దేశముమీదికిని, నీవు కోర
కొనిన యీ పట్టణముమీదికిని, నీ నామఘనతకొరకు
నేను కట్టించిన యీ మందిరముమీదికిని మనస్సు తిప్పి
39 విన్నపము చేసినయెడల । నీ నివాసస్థలమైన పరమం
డలమునుండి నీవు వారి విన్నపమును ప్రార్థనను ఆల
కించి వారి కార్యమును నిర్వహించి, నీ దృష్టియెదుట
40 పాపముచేసిన నీ జనులను క్షమించుదువుగాక. । నా
దేవా, యీ స్థలమందు చేయబడు విన్నపముమీద
నీ కనుదృష్టి యుంచుదువుగాక, నీ చెవులు దానిని
41 ఆలకించునుగాక. । నా దేవా, యెహోవా, బలమున
కాధారమగు నీ మందసమును దృష్టించి లెమ్ము; నీ
విశ్రాంతి స్థలమందు ప్రవేశించుము; దేవా
యెహోవా, నీ యాజకులు రక్షణ ధరించుకొందురు
గాక, నీ భక్తులు నీ మేలునుబట్టి సంతోషింతురుగాక.।
42 దేవా యెహోవా, నీవు నీచేత అభిషేకమునొందిన
వానికి పరాఙ్ముఖుడవై యుండకుము, నీవు నీ భక్తుడైన
దావీదుకు వాగ్దానముచేసిన కృపలను జ్ఞాపకము చేసి
కొనుము.

7 సొలొమోను తాను చేయు ప్రార్థనను ముగించి
నప్పుడు అగ్ని ఆకాశమునుండి దిగి దహనబలులను
ఇతరమైన బలులను దహించెను; యెహోవా తేజస్సు
2 మందిరమునిండ నిండెను. । యెహోవా తేజస్సుతో
మందిరము నిండినందున యాజకులు అందులో ప్రవే
3 శింపలేకయుండిరి. । అగ్నియు యెహోవా తేజ
స్సును మందిరముమీదికి దిగగా చూచి ఇశ్రాయేలీ
యులందరును సాష్టాంగనమస్కారముచేసి —
యెహోవా దయాళుడు, ఆయన కృప నిరంతర
ముండునని చెప్పి ఆయనను ఆరాధించి స్తుతించిరి. ।
4 రాజును జనులందరును యెహోవా ఎదుట బలులు
5 అర్పించిరి. । రాజైన సొలొమోను ఇరువది రెండు
వేల పశువులను లక్ష యిరువది వేల గొఱ్ఱెలను బలు
లుగా అర్పించెను; యాజకులు తమ తమ సేవాధర్మ
ములలో నిలుచుచుండగను, లేవీయులు యెహోవా
కృప నిరంతరము నిలుచుచున్నదని వారిచేత ఆయనను
స్తుతించుటకై రాజైన దావీదు కల్పించిన యెహోవా
గీతములను పాడుచు వాద్యములను వాయించుచు
నిలుచుచుండగను, యాజకులు వారికి ఎదురుగా నిలిచి
బూరలు ఊదుచుండగను, ఇశ్రాయేలీయులందరును
నిలిచియుండగను । రాజును జనులందరును కూడి 6
దేవుని మందిరమును ప్రతిష్ఠచేసిరి.

మరియు తాను చేయించిన యిత్తడి బలిపీఠము 7
దహనబలులకును నైవేద్యములకును క్రొవ్వుకును చాల
నందున యెహోవా మందిరము ముంగిటనున్న నడిమి
ఆవరణమును సొలొమోను ప్రతిష్ఠించి, అక్కడ
దహనబలులను సమాధాన బలిపశువుల క్రొవ్వును
అర్పించెను. । ఆ సమయమందు సొలొమోనును, 8
అతనితోకూడ హమాతు సరిహద్దు మొదలుకొని
ఐగుప్తు నదివరకున్న దేశములోనుండి బహు గొప్ప
సమూహముగా కూడివచ్చిన ఇశ్రాయేలీయులందరును
ఏడు దినములు పండుగ ఆచరించి । యెనిమిదవనాడు 9
పండుగ ముగించిరి; ఏడు దినములు బలిపీఠమును
ప్రతిష్ఠచేయుచు ఏడు దినములు పండుగ ఆచరించిరి.

ఏడవ నెల యిరువది మూడవ దినమందు దావీదు 10
కును సొలొమోనుకును తన జనులైన ఇశ్రాయేలీయు
లకును యెహోవా చేసిన మేలుల విషయమై సంతో
షించుచును మనోత్సాహము నొందుచును, ఎవరి గుడా
రములకు వారు వెళ్లునట్లు అతడు జనులకు సెలవిచ్చి
వారిని పంపివేసెను. । ఆ ప్రకారము సొలొమోను 11
యెహోవా మందిరమును రాజనగరును కట్టించి,
యెహోవా మందిరమందును తన నగరునందును
చేయుటకు తాను ఆలోచించినదంతయు ఏ లోపము
లేకుండ నెరవేర్చి, పని ముగించెను.

అప్పుడు యెహోవా రాత్రియందు సొలొమో 12
నుకు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను—నేను నీ
విన్నపము నంగీకరించి యీ స్థలమును నాకు బలులు
అర్పించు మందిరముగా కోరుకొంటిని. । వాన కురియ 13
కుండ నేను ఆకాశమును మూసివేసినప్పుడే గాని, దేశ
మును నాశనముచేయుటకు మిడతలకు సెలవిచ్చినప్పుడే
గాని, నా జనులమీదికి తెగులు రప్పించినప్పుడే గాని,।
నా నామము పెట్టబడిన నా జనులు తమ్మును తాము 14
తగ్గించుకొని ప్రార్థనచేసి నన్ను వెదకి తమ చెడుమార్గ
ములను విడిచినయెడల, పరమండలమునుండి నేను
వారి ప్రార్థనను విని వారి పాపమును క్షమించి వారి
దేశమును స్వస్థపరచుదును. । ఈ స్థలమందు చేయబడు 15
ప్రార్థనమీద నా కనుదృష్టి నిలుచును, నా చెవులు
దానిని ఆలకించును, । నా నామము ఈ మందిరము 16
నకు నిత్యము ఉండునట్లుగా నేను దాని కోరుకొని
పరిశుద్ధపరచితిని, నా దృష్టియు నా మనస్సును

17 నిత్యము దానిమీద నుండును. । నీ తండ్రియైన
దావీదు నడిచినట్లుగా నీవును నాకనుకూలవర్తనుడవై
నడిచి, నేను నీకాజ్ఞాపించిన దానియంతటి ప్రకారము
చేసి, నా కట్టడలను నా న్యాయవిధులను అనుసరించిన
18 యెడల । ఇశ్రాయేలీయులను ఏలుటకు స్వసంతతి
వాడు ఒకడు నీకుండకపోడని నేను నీ తండ్రియైన
దావీదుతో చేసియున్న నిబంధననుబట్టి నేను నీ రాజ్య
19 సింహాసనమును స్థిరపరచుదును. । అయితే మీరు
త్రోవ తప్పి, నేను మీకు నియమించిన కట్టడలను
ఆజ్ఞలను విడిచి, యితర దేవతలను అనుసరించి వాటికి
20 పూజానమస్కారములు చేసినయెడల। నేను మీకిచ్చిన
నా దేశములోనుండి మిమ్మును పెల్లగించి, నా నామ
మునకు నేను పరిశుద్ధపరచిన యీ మందిరమును నా
సన్నిధినుండి తీసివేసి, సమస్త జనములలో దానిని
సామెతకాస్పదముగాను నిందకాస్పదముగాను చేయు
21 దును. । అప్పుడు ప్రఖ్యాతినొందిన యీ మందిర
మార్గమున పోవు ప్రయాణస్థులందరును విస్మయమొంది
—యెహోవా ఈ దేశమునకును ఈ మందిరమున
కును ఎందుకు ఈ ప్రకారముగా చేసెనని యడుగగా।
22 జనులు—ఈ దేశస్థులు తమ పితరులను ఐగుప్తుదేశము
నుండి రప్పించిన తమ దేవుడైన యెహోవాను విస
ర్జించి యితర దేవతలను అనుసరించి వాటికి పూజా
నమస్కారములు చేసినందున యెహోవా ఈ కీడం
తయు వారిమీదికి రప్పించెనని ప్రత్యుత్తరమిచ్చెదరు.

**8** సొలొమోను యెహోవా మందిరమును తన
నగరును కట్టించిన యిరువది సంవత్సరముల కాలము
2 తీరిన తరువాత । హీరాము తనకిచ్చిన పట్టణములను
సొలొమోను కట్టించి వాటిలో ఇశ్రాయేలీయులను
కాపురముంచెను.

3 తరువాత సొలొమోను హమాతుసోబా అను స్థల
4 మునకు పోయి దాని పట్టుకొనెను. । మరియు అరణ్య
మందుండు తద్మోరుకును హమాతు దేశమందు ఖజానా
ఉంచు పట్టణములన్నిటికిని ప్రాకారములను కట్టిం
5 చెను. । ఇదియు గాక అతడు ఎగువ బేత్హోరోను
దిగువ బేత్హోరోను గవునులు అడ్డ గడలుగల
6 ప్రాకారపట్టణములుగా కట్టించెను. । బాలాతాను
తాను ఖజానా ఉంచు పట్టణములన్నిటిని రథములుంచు
పట్టణములన్నిటిని గుర్రపు రౌతులుండు పట్టణము
లన్నిటిని కట్టించెను. మరియు యెరూషలేమునందును
లెబానోనునందును తాను ఏలు దేశములన్నిటియందును
ప్రాకారపురములుగా కట్టించవలెనని తానుద్దేశించిన
7 పట్టణములన్నిటిని సొలొమోను కట్టించెను. । ఇశ్రా
యేలీయుల సంబంధులు కాని హిత్తీయులలోనుండి
యు, అమోరీయులలోనుండియు, పెరిజ్జీయులలో
నుండియు, హివ్వీయులలోనుండియు, యెబూసీయు
లలోనుండియు, శేషించియున్న సకల జనులను ।
ఇశ్రాయేలీయులు నాశనముచేయక వదలివేసిన ఆ యా 8
జనుల సంతతివారిని సొలొమోను నేటివరకును తనకు
పన్ను ఇచ్చువారినిగా చేసికొని యుండెను. । అయితే 9
ఇశ్రాయేలీయులలో ఒకనినైనను సొలొమోను తన
పనిచేయుటకు దాసునిగా నియమింపలేదు; వారిని
యోధులుగాను తన అధిపతులలో ప్రధానులుగాను
రథములకును గుర్రపు రౌతులకును అధిపతులుగాను
నియమించెను. । వీరిలో శ్రేష్ఠులైన యిన్నూట ఏబది 10
మంది రాజైన సొలొమోనుక్రింద అధిపతులై ప్రజల
మీద అధికారులై యుండిరి. । — ఇశ్రాయేలీయుల 11
రాజైన దావీదు నగరునందు నా భార్య నివాసము
చేయవలదు, యెహోవా మందసమున్న స్థలములు
ప్రతిష్ఠితములు అని చెప్పి, సొలొమోను ఫరో కుమా
ర్తెను దావీదు పట్టణమునుండి తాను ఆమెకొరకు
కట్టించిన నగరుకు రప్పించెను.

అది మొదలుకొని సొలొమోను తాను మంటపము 12
ఎదుట కట్టించిన యెహోవా బలిపీఠముమీద దహన
బలులు అర్పించుచు వచ్చెను. అతడు అనుదిన నిర్ణయ
ముచొప్పున । మోషే యిచ్చిన ఆజ్ఞనుబట్టి విశ్రాంతి 13
దినములయందును, అమావాస్యలయందును, నియామక
కాలములయందును, సంవత్సరమునకు ముమ్మారు జరుగు
పండుగలయందును, అనగా పులియని రొట్టెల పండుగ
యందును వారముల పండుగయందును పర్ణశాలల
పండుగయందును యెహోవాకు దహనబలులు
అర్పించుచు వచ్చెను. । అతడు తన తండ్రియైన 14
దావీదు చేసిన నిర్ణయమునుబట్టి వారి వారి సేవాధర్మ
ములను జరుపుకొనుటకై వారి వారి వంతులచొప్పున
యాజకులను వారి సేవకును, కట్టడనుబట్టి అనుదినమున
యాజకుల సముఖమున స్తుతిచేయుటకును, ఉపచార
కులుగా ఉండుటకును, వంతులచొప్పున లేవీయులను,
ద్వారములన్నిటి దగ్గర కావలియుండుటకై వారి వారి
వంతులచొప్పున ద్వారపాలకులను నియమించెను; దైవ
జనుడైన దావీదు ఆలాగుననే యాజ్ఞ ఇచ్చియుండెను.।
ఏ విషయమును గూర్చియేగాని బొక్కసములను గూర్చి 15
యేగాని రాజు యాజకులకును లేవీయులకును చేసి
యున్న నిర్ణయమునుబట్టి వారు సమస్తమును జరుపుచు
వచ్చిరి. । యెహోవా మందిరమునకు పునాదివేసిన 16
దినము మొదలుకొని అది సంపూర్ణమగువరకు సొలొ
మోను పని యంతయు చేయించెను; అప్పుడు
యెహోవా మందిరము సమాప్తమాయెను.

సొలొమోను ఎదోము దేశముయొక్క సముద్రపు 17
దరినున్న ఎసోన్గాబెరుకును ఏలతుకును పోగా ।
హీరాము తన పనివారిద్వారా ఓడలను ఓడ నడుపుట 18
యందు యుక్తిగల పనివారిని పంపెను. వీరు సొలొ
మోను పనివారితోకూడ ఓ

నుండి తొమ్మిదినూరు మణుగుల బంగారమును ఎక్కిం
చుకొని రాజైన సొలొమోనునొద్దకు తీసికొని వచ్చిరి.
**9** షేబదేశపు రాణి సొలొమోనునుగూర్చిన ప్రసి
1 ద్ధి వినినప్పుడు గూఢమైన ప్రశ్నలచేత సొలొమో
నును శోధింపవలెనని కోరి, మిక్కిలి గొప్ప పరివార
మును వెంటబెట్టుకొని, గంధవర్గములను విస్తారము
బంగారమును ప్రశస్తమైన రత్నములను ఒంటెలమీద
ఎక్కించుకొని యెరూషలేముకు వచ్చెను. ఆమె
సొలొమోను నొద్దకు వచ్చి తన మనస్సులోని విషయ
2 ములన్నిటినిగూర్చి అతనితో మాటలాడెను. । సొలొ
మోను ఆమె ప్రశ్నలన్నియు ఆమెకు విడదీసి చెప్పెను;
సొలొమోను ఆమెకు ప్రత్యుత్తరము చెప్పలేని మరు
3 గైన మాట యేదియు లేకపోయెను. । షేబదేశపు
రాణి సొలొమోనుకు కలిగిన జ్ఞానమును, అతడు
4 కట్టించిన నగరును, । అతని బల్లమీది భోజనపదార్థ
ములను, అతని సేవకులు కూర్చుండుటను, అతని
యుపచారులు కనిపెట్టుటను వారి వస్త్రములను, అతనికి
గిన్నెలనందించువారిని వారి వస్త్రములను, యెహోవా
మందిరమునకు అతడు కట్టించిన మేడగదులను చూచి
నప్పుడు, ఆమె విస్మయమొంది రాజుతో ఇట్లనెను ।
5 — నీ కార్యములనుగూర్చియు జ్ఞానమునుగూర్చియు
నేను నా దేశమందు వినిన వర్తమానము నిజవర్తమానమే
గాని, నేను వచ్చి దాని కన్నులార చూచు పర్యంతము
6 వారి మాటలను నమ్మకయుంటిని. । నీ యధిక జ్ఞాన
మునుగూర్చి సగమైనను వారు నాకు తెలుపలేదు;
నిన్నుగూర్చి నేను వినినదానికంటె నీ కీర్తి యెంతో
7 హెచ్చుగానున్నది. । నీ సేవకుల భాగ్యము మంచిది,
ఎల్లప్పుడును నీ సముఖమున నిలిచి నీ జ్ఞానసంభాషణ
వినుచుండు నీ సేవకులైన వీరి భాగ్యము మంచిది. ।
8 నీ దేవుడైన యెహోవా సన్నిధిని నీవు రాజువై
ఆయన సింహాసనముమీద ఆసీనుడవై యుండునట్లు
నీయందు అనుగ్రహము చూపినందుకు నీ దేవుడైన
యెహోవాకు స్తోత్రములు కలుగునుగాక. ఇశ్రాయేలీ
యులను నిత్యము స్థిరపరచవలెనన్న దయాలోచన నీ
దేవునికి కలిగియున్నందున నీతిన్యాయములను జరిగిం
చుటకై ఆయన నిన్ను వారిమీద రాజుగా నియమిం
9 చెను. । ఆమె రాజుకు రెండునూరుల నలుబది మణు
గుల బంగారమును విస్తారమైన గంధవర్గములను రత్న
ములను ఇచ్చెను; షేబదేశపు రాణి రాజైన సొలొ
మోనుకిచ్చిన గంధవర్గములతో సాటియైన దేదియు
10 లేదు. । ఇదియుగాక ఓఫీరునుండి బంగారము తెచ్చిన
హీరాము పనివారును సొలొమోను పనివారును చంద
నపు మ్రానులను ప్రశస్తమైన రత్నములనుకూడ
... ఆ చందనపు మ్రానులచేత రాజు
... మందిరమునకును రాజనగరునకును
... గాయకులకు తంబురలను సితారాలను

చేయించెను; అటువంటి పని అంతకుముందు యూదా
దేశమందు ఎవ్వరును చూచియుండలేదు । షేబదేశపు 12
రాణి రాజునకు తీసికొనివచ్చిన వాటికి అతడిచ్చిన
ప్రతి బహుమానములుగాక ఆమె మక్కువపడి అడిగిన
దంతయు రాజైన సొలొమోను ఆమెకిచ్చెను; తరు
వాత ఆమె తన సేవకులను వెంటబెట్టుకొని మరలి తన
దేశమునకు వెళ్లిపోయెను.
గంధవర్గములు అమ్ము వర్తకులును ఇతర వర్తకులును 13
కొనివచ్చు బంగారముగాక సొలొమోనునకు ఏటేట
వచ్చు బంగారము వెయ్యిన్ని మూడునూరుల ముప్పది
రెండు మణుగుల యెత్తు. । అరబిదేశపు రాజులంద 14
రును దేశాధిపతులును సొలొమోను నొద్దకు బంగార
మును వెండియు తీసికొని వచ్చిరి. । రాజైన సొలొ 15
మోను సాగగొట్టిన బంగారముతో అలుగులుగల
యిన్నూరు డాళ్లను చేయించెను; ఒక్కొక డాలుకు
ఆరునూరు తులముల బంగారము పట్టెను. । మరియు 16
సాగగొట్టిన బంగారముతో మున్నూరు కేడెములను
చేయించెను; ఒక్కొక కేడెమునకు మున్నూరు తుల
ముల బంగారము పట్టెను; వాటిని రాజు లెబానోను
అరణ్యమునందున్న తన నగరునందుంచెను. । మరియు 17
రాజు దంతముతో ఒక గొప్ప సింహాసనము చేయించి
ప్రశస్తమైన బంగారముతో దాని పొదిగించెను. । ఆ 18
సింహాసనమునకు దానితో కలిసియున్న ఆరు బంగా
రపు సోపానములును సింహాసనమునకు కట్టియున్న
బంగారపు పాదపీఠమును ఉండెను, కూర్చుండుచోటికి
ఇరుప్రక్కల ఊతలుండెను, ఊతలదగ్గర రెండు సింహ
ములుండెను; । ఆ యారు సోపానములమీద ఇరు 19
ప్రక్కల పన్నెండు సింహములు నిలిచియుండెను,
ఏరాజ్యమందైనను అటువంటి పని చేయబడలేదు. ।
మరియు రాజైన సొలొమోనుకున్న పానపాత్రలన్ని 20
యును బంగారపువై యుండెను; లెబానోను అరణ్య
మందలి నగరునందున్న ఉపకరణములన్నియు బంగా
రముతో చేసినవి; హీరాముయొక్క పనివారితోకూడ
రాజు ఓడలు తర్షీషుకు పోయి మూడు సంవత్సరము
లకు ఒకమారు బంగారము, వెండి, యేనుగుదంతము,
కోతులు, నెమళ్లు అను సరకులతో వచ్చుచుండెను
గనుక । సొలొమోను దినములలో వెండి యెన్నికకు 21
రానిదాయెను. । రాజైన సొలొమోను భూరాజులం 22
దరికంటెను ఐశ్వర్యమందును జ్ఞానమందును అధికు
డాయెను. । దేవుడు సొలొమోనుయొక్క హృదయ 23
మందుంచిన జ్ఞానోక్తులను వినుటకై భూరాజులందరును
అతని ముఖదర్శనము చేయగోరిరి. । మరియు ప్రతి 24
వాడును ఏటేట వెండి వస్తువులను బంగారు వస్తువు
లను వస్త్రములను ఆయుధములను గంధవర్గములను
గుర్రములను కంచరగాడిదెలను కానుకలుగా తీసికొని
వచ్చెను.

5 రథములు నిలువయుంచు పట్టణములలోను రాజు
నొద్ద యెరూషలేములోను సొలొమోనునకు నాలుగు
వేల గుఱ్ఱపు సాలలును రథములును పన్నెండు వేల
6 గుఱ్ఱపు రౌతులును కలిగి యుండెను. । ఫరాతునది
మొదలుకొని ఫిలిష్తీయుల దేశమువరకును ఐగుప్తు సరి
హద్దువరకును ఉండు రాజులందరిపైని అతడు ఏలు
7 బడి చేసెను. । రాజు యెరూషలేమునందు వెండి
రాళ్లంత విస్తారముగా నుండునట్లును, దేవదారు మ్రా
నులు షెఫేలా ప్రదేశమున నున్న మేడివృక్షములంత
8 విస్తారముగా నుండునట్లును చేసెను. । ఐగుప్తునుండియు
సకల దేశములనుండియు సొలొమోనునకు గుఱ్ఱములు
9 తేబడెను. । సొలొమోను చేసిన కార్యములన్నిటిని
గూర్చి ప్రవక్తయైన నాతాను రచించిన గ్రంథమం
దును, నెబాతు కుమారుడైన యరొబామునుగూర్చి
షిలోనీయుడైన అహీయా రచించిన ప్రవచన గ్రంథ
మందును, జ్ఞానదృష్టిగల ఇద్దోకు కలిగిన దర్శనముల
0 గ్రంథమందును వ్రాయబడి యున్నది. । సొలొ
మోను యెరూషలేమునందు ఇశ్రాయేలీయులందరి
1 మీద నలుబది సంవత్సరములు ఏలుబడిచేసెను. । తరు
వాత సొలొమోను తన పితరులతోకూడ నిద్రించి
తన తండ్రియైన దావీదు పట్టణమందు పాతిపెట్ట
బడెను; అతనికి బదులుగా అతని కుమారుడైన రెహ
బాము రాజాయెను.

10 రెహబాముకు పట్టాభిషేకము చేయుటకై
ఇశ్రాయేలీయులందరును షెకెముకు వెళ్లగా రెహ
2 బాము షెకెముకు పోయెను. । రాజైన సొలొమోను
సమక్షమునుండి పారిపోయి ఐగుప్తులో వాసము
చేయుచున్న నెబాతు కుమారుడైన యరొబాము అది
3 విని ఐగుప్తునుండి తిరిగి రాగా । జనులు అతని పిలిపిం
చిరి. యరొబామును ఇశ్రాయేలువారందరును కూడి
4 వచ్చి—నీ తండ్రి మా కాడిని బరువుచేసెను; । నీ
తండ్రి నియమించిన కఠిన దాస్యమును ఆయన మా
మీద ఉంచిన బరువైన కాడిని నీవు ఇప్పుడు చులుకన
చేసినయెడల మేము నిన్ను సేవింతుమని రెహబాము
5 తో మనవిచేయగా । అతడు—మీరు మూడు దిన
ములు తాళి మరల నాయొద్దకు రండని చెప్పెను గనుక
6 జనులు వెళ్లిపోయిరి. । అప్పుడు రాజైన రెహబాము
తన తండ్రియైన సొలొమోను సజీవియై యుండగా
అతని సమక్షమున నిలిచిన పెద్దలను పిలిపించి—యీ
జనులకు నేనేమి ప్రత్యుత్తరమియ్యవలెను, మీరు
7 చెప్పు ఆలోచన ఏది అని అడుగగా । వారు—నీవు
ఈ జనులయెడల దయాదాక్షిణ్యములు చూపి వారి
తో మంచి మాటలాడినయెడల వారు ఎప్పటికిని నీకు
8 దాసులగుదురని అతనితో చెప్పిరి. । అయితే అతడు
పెద్దలు తనకు చెప్పిన ఆలోచన త్రోసివేసి, తనతో
కూడ పెరిగి తన యెదుటనున్న యౌవనస్థులతో ఆలో
చనచేసి । —నీ తండ్రి మామీద ఉంచిన కాడిని 9
చులుకన చేయుమని నన్నడిగిన యీ జనులకు ప్రత్యు
త్తరమేమి ఇయ్యవలెనని మీరు యోచింతురో
చెప్పుడని వారినడుగగా । అతనితోకూడ పెరిగిన యీ 10
యౌవనస్థులు అతనితో ఇట్లనిరి—నీ తండ్రి మా కాడిని
బరువుచేసెను, నీవు దానిని చులుకన చేయుమని నీతో
పలికిన యీ జనులతో నీవు చెప్పవలసినదేమనగా—
నా చిటికెనవ్రేలు నా తండ్రియొక్క నడుముకంటె
బరువుగా ఉండును; । నా తండ్రి బరువైన కాడి మీ 11
మీద మోపెను గాని నేను మీ కాడిని మరింత బరువు
చేయుదును; నా తండ్రి మిమ్మును చబుకులతో దండిం
చెను గాని నేను కొరడాలతో మిమ్మును దండించెదనని
చెప్పుము. । —మూడవ దినమందు నాయొద్దకు తిరిగి 12
రండని రాజు చెప్పిన ప్రకారము యరొబామును
జనులందరును మూడవ దినమందు రెహబాము నొద్దకు
రాగా । రాజైన రెహబాము పెద్దల ఆలోచనను త్రోసి 13
వేసి, యౌవనస్థులు చెప్పిన ప్రకారము వారితో
మాటలాడి । వారికి కఠినమైన ప్రత్యుత్తరమిచ్చెను; 14
ఎట్లనగా—నా తండ్రి మీ కాడిని బరువుచేసెను,
నేను దానిని మరింత బరువు చేయుదును; నా తండ్రి
మిమ్మును చబుకులతో దండించెను, నేను మిమ్మును
కొరడాలతో దండించెదనని చెప్పెను. । యెహోవా 15
షిలోనీయుడైన అహీయాద్వారా నెబాతు కుమారు
డైన యరొబాముతో సెలవిచ్చిన తన మాటను స్థిరపర
చునట్లు దేవుని నిర్ణయ ప్రకారము జనులు చేసిన
మనవి రాజు అంగీకరించకపోయెను. । రాజు తాము 16
చేసిన మనవి అంగీకరింపకపోవుట చూచి జనులు—
దావీదులో మాకు భాగము ఏది? యెష్షయి కుమారుని
యందు మాకు స్వాస్థ్యము లేదు; ఇశ్రాయేలువార
లారా, మీ గుడారములకు పోవుడి; దావీదూ, నీ
సంతతివారిని నీవే చూచుకొనుమని రాజుకు ప్రత్యు
త్తరమిచ్చి ఇశ్రాయేలువారందరును ఎవరి గుడార
మునకు వారు వెళ్లిపోయిరి. । అయితే యూదాపట్టణ 17
ములలో కాపురముండు ఇశ్రాయేలువారిమీద రెహ
బాము ఏలుబడిచేసెను. । రాజైన రెహబాము పన్ను 18
విచారణకర్తయగు హదోరమును పంపగా ఇశ్రాయేలు
వారు రాళ్లతో అతని చావగొట్టిరి గనుక రాజైన
రెహబాము యెరూషలేమునకు పారిపోవలెనని త్వరపడి
తన రథము ఎక్కెను. । ఇశ్రాయేలువారు ఇప్పటికిని 19
దావీదు సంతతివారిమీద తిరుగబాటు చేసి నేటివర
కును వారికి లోబడకయున్నారు.

రెహబాము యెరూషలేమునకు వచ్చినప్పుడు 11
ఇశ్రాయేలువారితో యుద్ధముచేయుటకును, రాజ్య
మును తనకు మరల రప్పించుకొనుటకును అతడు
యూదావారిలోనుండియు బెన్యామీనీయులలోనుం
డియు ఏర్పరచబడిన యుద్ధశాలులను లక్ష యెనుబది

2 వేలమందిని సమకూర్చగా । దైవజనుడైన షెమయాకు
యెహోవా వాక్కు ప్రత్యక్షమై యీలాగు సెల
3 విచ్చెను । — నీవు యూదారాజును సొలొమోను
కుమారుడునగు రెహబాముతోను, యూదాయందును
బెన్యామీనీయుల ప్రదేశమందును ఉండు ఇశ్రా
యేలు వారందరితోను ఈ మాట ప్రకటించుము । —
4 ఈ కార్యము నావలన జరుగుచున్నదని యెహోవా
సెలవిచ్చుచున్నాడు గనుక, బయలుదేరకుండను మీ
సహోదరులతో యుద్ధముచేయకుండను మీరంద
రును మీ మీ యిండ్లకు తిరిగి పోవుడి. కావున వారు
యెహోవా మాటలు విని యరొబాముతో యుద్ధము
చేయుట మాని వెళ్లిపోయిరి.
5 రెహబాము యెరూషలేమునందు కాపురముండి
యూదా ప్రదేశమందు ప్రాకారపురములను కట్టిం
6 చెను. । అతడు బేత్లెహేము, ఏతాము, తెకోవ, ।
7 బేత్సూరు, శోకో, అదుల్లాము, । గాతు, మారేషా,
10 జీఫు, । అదోరయీము, లాకీషు, అజేకా, । జొర్యా;
అయ్యాలోను, హెబ్రోను అను యూదా బెన్యా
మీను ప్రదేశములందుండు ప్రాకారపురములను
11 కట్టించి । దుర్గములను బలపరచి, వాటిలో అధిపతు
లను ఉంచి, ఆహారమును నూనెను ద్రాక్షారసమును
12 సమకూర్చెను. । మరియు వాటిలో డాళ్లను బల్లెము
లను ఉంచి ఆ పట్టణములను బహు బలవంతమైన
వాటినిగా చేసెను. యూదావారును బెన్యామీనీ
యులును అతని పక్షమున నుండిరి.
13 ఇశ్రాయేలువారి మధ్యనుండు యాజకులును లేవీ
యులును తామున్న ప్రదేశముల సరిహద్దులను దాటి
14 అతనియొద్దకు వచ్చి చేరిరి. । యరొబామును అతని
కుమారులును యెహోవాకు యాజకసేవ జరుగకుండ
లేవీయులను త్రోసివేయగా, వారు తమ గ్రామము
లను స్వాస్థ్యములను విడిచి, యూదా దేశమునకును
15 యెరూషలేమునకును వచ్చిరి. । యరొబాము బలిపీఠముల
కును దయ్యములకును తాను చేయించిన దూడలకును
16 యాజకులను ఏర్పరచుకొనెను. । వారి చర్యలట్లుండగా
ఇశ్రాయేలీయుల గోత్రములయందంతటను ఇశ్రా
యేలీయుల దేవుడైన యెహోవాను వెదకుటకు
మనస్సు నిలుపుకొనినవారు తమ పితరుల దేవుడైన
యెహోవాకు బలుల నర్పించుటకై యెరూషలేమునకు
17 వచ్చిరి. । దావీదును సొలొమోనును నడిచిన మార్గ
మందు మూడు సంవత్సరములు వారు నడిచి, యూదా
రాజ్యమును బలపరచి మూడు సంవత్సరములు సొలొ
మోను కుమారుడైన రెహబామునకు సహాయకులైరి.
18 రెహబాము దావీదు కుమారుడైన యెరీమోతు
కుమార్తెయగు మహలతును యెష్షయి కుమారుడైన
ఏలీయాబు కుమార్తెయగు అబీహాయిలును వివాహము
19 చేసికొనెను. । అతనికి యూషు షెమర్యా జహము
అను కుమారులు కలిగిరి. । పిమ్మట అతడు అబ్షాలోము 20
కుమార్తెయైన మయకాను వివాహము చేసికొనగా
ఆమె అతనికి అబీయాను అత్తయిని జీజాను షెలో
మీతును కనెను. । రెహబాము పదునెనిమిదిమంది 21
భార్యలను పెండ్లిచేసికొని అరువదిమంది ఉపపత్నులను
తెచ్చుకొని యిరువది యెనిమిదిమంది కుమారులను
అరువదిమంది కుమార్తెలను కనెను; అయితే తన భార్య
లందరికంటెను ఉపపత్నులందరికంటెను అబ్షాలోము
కుమార్తెయైన మయకాను అతడు ఎక్కువగా ప్రేమిం
చెను. । రెహబాము మయకాకు పుట్టిన కుమారుడైన 22
అబీయాను రాజును చేయతలచి, అతని సహోదరుల
మీద ప్రధానునిగాను అధిపతినిగాను అతని నియమిం
చెను. । అతడు మంచి మెలకువగలవాడై తన కుమా 23
రులలో శేషించినవారిని యూదా బెన్యామీను
సంబంధములైన ఆ యా ప్రదేశములలోని ఆ యా
ప్రాకారపురములయందు అధిపతులుగా నియమించి
వారికి విస్తారమైన సొత్తు ఇచ్చి వారికి పెండ్లిండ్లు
చేసెను.

రెహబాము రాజ్యము స్థిరపడి తాను బలపరచ **12**
బడిన తరువాత అతడును ఇశ్రాయేలీయులందరును
యెహోవా ధర్మశాస్త్రమును విసర్జించిరి. । వారు 2
యెహోవా యెడల ద్రోహము చేసినందున రాజైన
రెహబాముయొక్క అయిదవ సంవత్సరమందు ఐగుప్తు
రాజైన షీషకు వెయ్యిన్ని ఇన్నూరు రథములతోను
అరువది వేల గుర్రపు రౌతులతోను యెరూషలేము
మీదికి వచ్చెను. । అతనితోకూడ ఐగుప్తునుండి వచ్చిన 3
లూబీయులు సుక్కీయులు కూషీయులు అనువారు
లెక్కకు మించియుండిరి. । అతడు యూదాకు సమీ 4
పమైన ప్రాకారపురములను పట్టుకొని యెరూష
లేమువరకు రాగా । ప్రవక్తయైన షెమయా రెహ 5
బామునొద్దకును, షీషకుకు భయపడి యెరూషలేమునకు
వచ్చి కూడియున్న యూదావారి అధిపతులయొద్ద
కును వచ్చి—మీరు నన్ను విసర్జించితిరి గనుక నేను
మిమ్మును షీషకు చేతిలో పడనిచ్చియున్నానని
యెహోవా సెలవిచ్చుచున్నాడని చెప్పెను. । అప్పుడు 6
ఇశ్రాయేలీయుల అధిపతులును రాజును తమ్మును తాము
తగ్గించుకొని యెహోవా న్యాయస్థుడని ఒప్పుకొనిరి. ।
వారు తమ్మును తాము తగ్గించుకొనుట యెహోవా 7
చూచెను గనుక యెహోవా వాక్కు షెమయాకు
ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను—వారు తమ్మును
తాము తగ్గించుకొనిరి గనుక నేను వారిని నాశనము
చేయక, షీషకు ద్వారా నా ఉగ్రతను యెరూషలేము
మీద కుమ్మరింపక త్వరలోనే వారికి రక్షణ దయచేసె
దను. । అయితే నన్ను సేవించుటకును, భూరాజులకు 8
దాసులై యుండుటకును ఎంత భేదమున్నదో వారు
తెలిసికొనునట్లు వారు అతనికి దాసులగుదురు.

9 ఐగుప్తురాజైన షీషకు యెరూషలేముమీదికి వచ్చి
యెహోవా మందిరపు బొక్కసములన్నిటిని రాజ
నగరులోని బొక్కసములన్నిటిని దోచుకొని, సొలో
మోను చేయించిన బంగారపు డాళ్లను తీసికొని
10 పోయెను. । వాటికి బదులుగా రాజైన రెహబాము
ఇత్తడి డాళ్లను చేయించి వాటిని రాజనగరుయొక్క
ద్వారమును కాయు సేవకులయొక్క అధిపతులకు
1 అప్పగించెను. । రాజు యెహోవా మందిరములోకి
ప్రవేశించినప్పుడెల్ల నగరు సేవకులు వచ్చి వాటిని ఎత్తి
తరువాత వాటిని మరల గదిలో ఉంచుచు వచ్చిరి. ।
12 అతడు తన్నుతాను తగ్గించుకొనినందున యెహోవా
అతని బొత్తిగా నిర్మూలముచేయక, యూదావారు
కొంతమట్టుకు మంచితనము ననుసరించుట చూచి,
తన కోపము అతనిమీదనుండి త్రిప్పుకొనెను.
13 రాజైన రెహబాము యెరూషలేమునందు స్థిరపడి
యేలుబడి చేసెను; రెహబాము ఏలనారంభించినప్పుడు
నలుబదియొక సంవత్సరముల యీడుగలవాడై యుం
డెను; తన నామమును అచ్చట ఉంచుటకై ఇశ్రాయేలీ
యుల గోత్రములన్నిటిలోనుండి యెహోవా కోరు
కొనిన పట్టణమగు యెరూషలేమునందు అతడు పదు
నేడు సంవత్సరములు ఏలెను. అతని తల్లిపేరు నయమా,
4 ఆమె అమ్మోనీయురాలు. । అతడు తన మనస్సు
యెహోవాను వెదకుటయందు నిలుపుకొనక చెడు
క్రియలు చేసెను.
5 రెహబాము చేసిన కార్యములన్నిటిని గూర్చియు
షెమయా రచించిన గ్రంథమందును జ్ఞానదృష్టిగల
ఇద్దో రచించిన వంశావళియందును వ్రాయబడియు
6 న్నది. । రెహబామునకును యరొబామునకును యుద్ధము
యెడతెగక జరిగెను. రెహబాము తన పితరులతోకూడ
నిద్రించి దావీదు పట్టణమందు పాతిపెట్టబడెను, అతని
కుమారుడైన అబీయా అతనికి బదులుగా రాజాయెను.

13 రాజైన యరొబాము ఏలుబడిలో పదునెనిమి
దవ సంవత్సరమందు అబీయా యూదావారిమీద
2 ఏలనారంభించెను. । అతడు మూడు సంవత్సరములు
యెరూషలేమునందు ఏలెను; అతని తల్లిపేరు మీకా
యా, ఆమె గిబియా ఊరివాడైన ఊరీయేలు కుమార్తె.
8 అబీయాకును యరొబామునకును యుద్ధము కలు
గగా అబీయా నాలుగు లక్షలమంది పరాక్రమశాలుల
సైన్యము ఏర్పరచుకొని యుద్ధమునకు సిద్ధముచేసెను;
యరొబామును ఎనిమిది లక్షలమంది పరాక్రమశాలు
లను ఏర్పరచుకొని అతనికి ఎదురుగా వారిని యుద్ధ
4 మునకు వ్యూహపరచెను. । అప్పుడు అబీయా ఎఫ్రా
యిము మన్యమందుండు సెమరాయిము కొండమీద
నిలిచి ప్రకటించినదేమనగా—యరొబామూ, ఇశ్రా
యేలువారలారా, మీరందరును నాకు చెవియొగ్గుడి. ।
5 ఇశ్రాయేలు రాజ్యమును ఎల్లప్పుడును ఏలునట్లుగా
ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా దావీదు
తోను అతని సంతతివారితోను భంగము కాజాలని
నిబంధన చేసి దానిని వారికిచ్చెనని మీరు తెలిసికొనం
దురుగదా. । అయినను దావీదు కుమారుడైన సొలొ 6
మోనుకు దాసుడును నెబాతు కుమారుడునగు యరొ
బాము పనికిమాలిన దుష్టులతో కలిసి లేచి తన యజ
మానునిమీద తిరుగబాటు చేసెను. । సొలొమోను 7
కుమారుడైన రెహబాము ఇంకను బాల్యదశలోనుండి
ధైర్యము లేనివాడై వారిని ఎదిరించుటకు తగిన శక్తి
లేకున్నప్పుడు వారు అతనితో యుద్ధము చేయుటకు
సిద్ధమైరి. । ఇప్పుడు దావీదు సంతతివారి వశమున 8
నున్న యెహోవా రాజ్యముతో మీరు యుద్ధము
చేయ తెగించెదమని తలంచుచున్నారు. మీరు గొప్ప
సైన్యముగా ఉన్నారు; యరొబాము మీకు దేవతలుగా
చేయించిన బంగారు దూడలును మీయొద్ద ఉన్నవి. ।
మీరు అహరోను సంతతివారైన యెహోవా యాజ 9
కులను లేవీయులను త్రోసివేసి, అన్యదేశముల జనులు
చేయునట్లు మీకొరకు యాజకులను నియమించుకొనం
టిరిగదా? ఒక కోడెను ఏడు గొఱ్ఱెపొట్టేళ్లను ప్రతి
ష్ఠించుటకై వచ్చు ప్రతివాడు దైవములు కానివాటికి
యాజకుడగుచున్నాడు. । అయితే యెహోవా 10
మాకు దేవుడై యున్నాడు; మేము ఆయనను విస
ర్జించినవారము కాము; అహరోను సంతతివారు
యెహోవాకు సేవచేయు యాజకులై యున్నారు;
లేవీయులు చేయవలసిన పనులను లేవీయులే చేయు
చున్నారు. । వారు ఉదయాస్తమయములయందు 11
యెహోవాకు దహనబలులు అర్పించుచు, సుగంధ
ద్రవ్యములతో ధూపము వేయుచు, పవిత్రమైన బల్ల
మీద సన్నిధిరొట్టెలు ఉంచుచు, బంగారు దీపస్తంభ
మును ప్రమిదెలను ప్రతి సాయంత్రము ముట్టించుచు
వచ్చుచున్నారు; మేము మా దేవుడైన యెహోవా
యేర్పరచిన విధినిబట్టి సమస్తము జరిగించుచున్నాము
గాని మీరు ఆయనను విసర్జించినవారైతిరి. । ఆలో 12
చించుడి, దేవుడే మాకు తోడై మాకు అధిపతిగా
నున్నాడు; మీ మీద ఆర్భాటము చేయుటకై బూరలు
పట్టుకొని ఊదునట్టి ఆయన యాజకులు మా పక్ష
మున ఉన్నారు; ఇశ్రాయేలువారలారా, మీ పిత
రుల దేవుడైన యెహోవాతో యుద్ధముచేయకుడి,
చేసినను మీరు జయమొందరు.
యరొబాము వారి వెనుకటి భాగమందు మాటు 13
గాండ్లను కొందరిని ఉంచి, సైన్యము యూదావారికి
ముందును మాటుగాండ్లు వారికి వెనుకను ఉండునట్లు
చేసెను. । యూదావారు తిరిగి చూచి యోధులు 14
తమకు ముందును వెనుకను ఉన్నట్టు తెలిసికొని
యెహోవాకు ప్రార్థనచేసిరి, యాజకులును బూరలు
ఊదిరి. । అప్పుడు యూదావారు ఆర్భటించిరి; 15

యూదావారు ఆర్భటించినప్పుడు యరొబామును
ఇశ్రాయేలువారందరును అబీయా యెదుటను
యూదావారి యెదుటను నిలువలేకుండునట్లు దేవుడు
16 వారిని మొత్తెను గనుక । ఇశ్రాయేలువారు యూదా
వారి యెదుటనుండి పారిపోయిరి. దేవుడు వారిని
17 యూదావారిచేతికి అప్పగించినందున । అబీయా
యును అతని జనులును వారిని ఘోరముగా సంహ
రించిరి. ఇశ్రాయేలువారిలో అయిదు లక్షలమంది
18 పరాక్రమశాలులు హతులైరి. । ఈ ప్రకారము
ఇశ్రాయేలువారు ఆ కాలమందు తగ్గింపబడిరి గాని
యూదావారు తమ పితరుల దేవుడైన యెహోవాను
19 ఆశ్రయించిన హేతువుచేత జయమొందిరి. । అబీయా
యరొబామును తరిమి, బేతేలును దాని గ్రామములను
యెషానాను దాని గ్రామములను ఎఫ్రోనును దాని
గ్రామములను పట్టుకొనెను.
20 అబీయా బ్రదికిన కాలమున యరొబాము మరల
బలము పొందలేదు, యెహోవా అతని మొత్తినందు
21 చేత అతడు మరణమొందెను. । అబీయా వృద్ధినొం
దెను, అతడు పదునాలుగుమంది భార్యలను వివా
హము చేసికొని యిరువది యిద్దరు కుమారులను పదు
22 నారుగురు కుమార్తెలను కనెను. । అబీయా చేసిన
యితర కార్యములను గూర్చియు, అతని చర్యను
గూర్చియు, అతని కాలమున జరిగిన సంగతులను
గూర్చియు ప్రవక్తయైన ఇద్దో రచించిన సటీక గ్రంథ
మునందు వ్రాయబడియున్నది.

**14** అబీయా తన పితరులతోకూడ నిద్రింపగా జనులు
అతనిని దావీదు పట్టణమందు పాతిపెట్టిరి; అతనికి
బదులుగా అతని కుమారుడైన ఆసా రాజాయెను.
ఇతని దినములలో దేశము పది సంవత్సరములు నెమ్మది
2 పొందెను. । ఆసా తన దేవుడైన యెహోవా దృష్టికి
అనుకూలముగాను యథార్థముగాను నడిచినవాడై ।
3 అన్యదేవతల బలిపీఠములను పడగొట్టి ఉన్నతస్థలము
లను పాడుచేసి ప్రతిమలను పగలగొట్టి దేవతాస్తంభ
4 ములను కొట్టివేయించి । వారి పితరుల దేవుడైన
యెహోవాను ఆశ్రయించుటకును, ధర్మశాస్త్రమును
బట్టియు విధినిబట్టియు క్రియలు జరిగించుటకును,
5 యూదావారికి ఆజ్ఞాపించి । ఉన్నతస్థలములను సూర్య
దేవతాస్తంభములను యూదావారి పట్టణములన్నిటిలో
నుండి తీసివేసెను. అతని యేలుబడియందు రాజ్యము
6 నెమ్మదిగా ఉండెను. । ఆ సంవత్సరములలో అతనికి
యుద్ధములు లేకపోవుటచేత దేశములో నెమ్మదికలిగి
యుండెను; యెహోవా అతనికి విశ్రాంతి దయచేసి
యుండెగా అతడు యూదాదేశమున ప్రాకారములు
గల పట్టణములను కట్టించెను.
7 అతడు యూదావారికి ఈలాగు ప్రకటనచేసెను
—మన దేవుడైన యెహోవాను మనము ఆశ్రయించి
తిమి, ఆశ్రయించినందున ఆయన మన చుట్టును
నెమ్మది కలుగజేసియున్నాడు; దేశమింకను మనము నిర
భ్యంతరముగా తిరుగవచ్చును, మనము ఈ పట్టణము
లను కట్టించి, వాటికి ప్రాకారములను గోపురములను
గుమ్మములను ద్వారబంధములను అమర్చుదము. కాగా
వారు పట్టణములను కట్టి వృద్ధినొందిరి. । ఆ కాలమున 8
డాళ్లను ఈటెలను పట్టుకొను మూడు లక్షలమంది
యూదావారును, కేడెములు ధరించి విల్లువేయు
రెండు లక్షల ఎనుబది వేలమంది బెన్యామీనీయు
లును కూడిన సైన్యము ఆసాకు ఉండెను; వీరందరును
పరాక్రమశాలులై యుండిరి. । కూషీయుడైన జెరహు 9
వారిమీద దండెత్తి వేయివేల సైన్యమును మున్నూరు
రథములను కూర్చుకొని బయలుదేరి మారేషావరకు
రాగా । ఆసా అతనికి ఎదురుబోయెను. వారు 10
మారేషానొద్ద జెపాతా అను పల్లపుస్థలమందు పంక్తులు
తీర్చి యుద్ధము కలుపగా । ఆసా తన దేవుడైన 11
యెహోవాకు మొఱ్ఱపెట్టి—యెహోవా, విస్తార
మైన సైన్యముచేతిలో ఓడిపోకుండ బలములేనివారికి
సహాయము చేయుటకు నీకన్న ఎవరును లేరు; మా
దేవా యెహోవా, మాకు సహాయముచేయుము,
నిన్నే నమ్ముకొని యున్నాము, నీ నామమునుబట్టియే
యీ సైన్యమును ఎదిరించుటకు బయలుదేరియున్నాము.
యెహోవా నీవే మా దేవుడవు, నరమాత్రులను నీ
మైని జయమొందనియ్యకుము అని ప్రార్థింపగా ।
యెహోవా ఆ కూషీయులను ఆసాయెదుటను
యూదావారి యెదుటను నిలువనియ్యక వారిని మొత్తి
నందున వారు పారిపోయిరి. । ఆసాయును అతనితో
కూడనున్న వారును గెరారువరకు వారిని తరు
మగా కూషీయులు మరల పంక్తులు తీర్చలేక
యెహోవా భయముచేతను ఆయన సైన్యపు భయము
చేతను పారిపోయిరి. యూదావారు విశేషమైన
కొల్లసొమ్ము పట్టుకొనిరి. । గెరారు చుట్టునున్న పట్టణ
ములలోని వారందరిమీదికి యెహోవా భయము
వచ్చెను గనుక ఆ పట్టణములన్నిటిని కొల్లపెట్టి, వాటి
లోనున్న మిక్కుటమైన కొల్లసొమ్మంతయు దోచు
కొనిరి. । మరియు వారు పసులసాలలను పడగొట్టి
విస్తారమైన గొఱ్ఱెలను ఒంటెలను సమకూర్చుకొని
యెరూషలేమునకు తిరిగి వచ్చిరి.

ఆ కాలమున దేవుని ఆత్మ ఓదేదు కుమారుడైన **15**
అజర్యామీదికి రాగా అతడు ఆసాను ఎదుర్కొన
బోయి యీలాగు ప్రకటించెను ।—ఆసా, యూదా 2
వారలారా, బెన్యామీనీయులారా, మీరందరు నా
మాట వినుడి. మీరు యెహోవా పక్షపువారైన
యెడల ఆయన మీ పక్షమున నుండును; మీరు
ఆయనయొద్ద విచారణచేసినయెడల ఆయన మీకు
ప్రత్యక్షమగును; మీరు ఆయనను విసర్జించినయెడల

3 ఆయన మిమ్మును విసర్జించును, । నిజమైన దేవుడై
నను, ఉపదేశముచేయు యాజకులైనను, ధర్మశాస్త్ర
మైనను చాలా దినములు ఇశ్రాయేలీయులకు
4 లేకుండపోవును. । తమ శ్రమయందు వారు ఇశ్రా
యేలీయుల దేవుడైన యెహోవాయొద్దకు మళ్లుకొని
ఆయనను వెదకినయెడల ఆయన వారికి ప్రత్యక్షమ
5 గును. । ఆ కాలములలో దేశముల కాపురస్థులందరి
లోను గొప్ప కల్లోలములు కలిగియుండును గనుక
తమ పనిపాటలను చక్కపెట్టుకొనుటకై తిరుగువారికి
6 సమాధానము లేకుండును. । దేవుడు జనములను సకల
విధములైన బాధలతో శ్రమపరచును గనుక జనము
జనమును పట్టణము పట్టణమును పాడుచేయును. ।
7 కాగా మీరు బలహీనులు కాక ధైర్యము వహించుడి,
మీ కార్యము సఫలమగును.
8 ప్రవక్తయైన ఓదేదు ప్రవచించిన యీ మాటలు
ఆసా వినినప్పుడు అతడు ధైర్యము తెచ్చుకొని
యూదా బెన్యామీనీయుల దేశమంతటినుండియు,
ఎఫ్రాయిము మన్యములో తాను పట్టుకొనిన పట్టణ
ములలోనుండియు హేయములైన విగ్రహములన్ని
టిని తీసివేసి, యెహోవా మంటపము ఎదుటనుండు
9 యెహోవా బలిపీఠమును మరల కట్టించి । యూదా
వారినందరిని బెన్యామీనీయులనందరిని, ఎఫ్రాయిము
మనష్షే షిమ్యోను గోత్రస్థానములలోనుండి వచ్చి
వారి మధ్య నివసించు పరదేశులను సమకూర్చెను.
అతని దేవుడైన యెహోవా అతనికి సహాయుడై
యుండుట చూచి ఇశ్రాయేలువారిలోనుండి విస్తార
10 మైన జనులు అతని పక్షము చేరిరి. । ఆసా యేలు
బడియందు పదునైదవ సంవత్సరమున మూడవ నెలను
11 వారు యెరూషలేములో కూడి । తాము తీసికొని
వచ్చిన కొల్లసొమ్ములోనుండి ఆ దినమున ఏడునూరుల
యెద్దులను ఏడు వేల గొఱ్ఱెలను యెహోవాకు బలు
12 లుగా అర్పించి । పూర్ణహృదయముతోను పూర్ణాత్మ
తోను తమ పితరుల దేవుడైన యెహోవాయొద్ద
13 తాము విచారణచేయుదుమనియు । పిన్నలేగాని పెద్దలే
గాని పురుషులేగాని స్త్రీలేగాని ఇశ్రాయేలీయుల
దేవుడైన యెహోవాయొద్ద విచారణ చేయనివారి
కందరికిని మరణము విధించుదుమనియు నిష్కర్షచేసి
14 కొనిరి. । వారు ఎలుగెత్తి బొబ్బలిడుచు, మేళముల
తోను బూరల నాదములతోను భేరీధ్వనులతోను
15 యెహోవా సన్నిధిని ప్రమాణముచేసిరి. । ఈలాగు
ప్రమాణము చేయబడగా యూదావారందరును
సంతోషించిరి; వారు పూర్ణహృదయముతో ప్రమా
ణముచేసి పూర్ణమనస్సుతో ఆయనను వెదకియుండిరి
గనుక యెహోవా వారికి ప్రత్యక్షమై చుట్టునున్న
దేశస్థులతో యుద్ధములు లేకుండ వారికి నెమ్మది
16 కలుగజేసెను. । మరియు తన తల్లియైన మయకా
అసహ్యమైన యొక దేవతాస్తంభమును నిలిపినందున
ఆమె యిక పట్టపుదేవిగా యుండకుండ రాజైన ఆసా
ఆమెను త్రోసివేసి, ఆమె నిలిపిన విగ్రహమును పడ
గొట్టి చిన్నాభిన్నము చేసి కిద్రోను వాగుదగ్గర దాని
కాల్చివేసెను. । ఆసా ఉన్నతస్థలములను ఇశ్రాయేలీ 17
యులలోనుండి తీసివేయలేదుగాని యితడు బ్రదికిన
కాలమంతయు ఇతని హృదయము యథార్థముగా
ఉండెను. । తన తండ్రి ప్రతిష్ఠించినట్టియు, తాను 18
ప్రతిష్ఠించినట్టియు వెండిని బంగారమును ఉపకరణ
ములను అతడు తీసికొని దేవుని మందిరమునందుం
చెను. । ఆసా యేలుబడియందు ముప్పది యయిదవ 19
సంవత్సరమువరకు యుద్ధములు జరుగలేదు.

ఆసా యేలుబడియందు ముప్పది ఆరవ సంవత్సర **16**
మున ఇశ్రాయేలు రాజైన బయెషా యూదావారిమీద
దండెత్తి బయలుదేరి యూదా రాజైన ఆసాయొద్దకు
రాకపోకలు జరుగకుండునట్లు రామాను కట్టింపగా ।
ఆసా యెహోవా మందిరమందును రాజనగరునం 2
దును ఉన్న బొక్కసములలోని వెండి బంగారములను
తీసి, దమస్కులో నివాసముచేయు అరాము రాజగు
బెన్హదదునొద్దకు దూతలచేత పంపించి । —నా తండ్రి 3
కిని నీ తండ్రికిని కలిగియున్నట్లు నాకును నీకును
సంధి కలిగియున్నది; వెండిని బంగారమును నీకు పంపి
యున్నాను; ఇశ్రాయేలు రాజైన బయెషా నన్ను
విడిచి ఆవలికి పోవునట్లుగా నీవు అతనితో చేసియున్న
సంధిని భంగము చేయుమని వర్తమానము చేసెను. ।
బెన్హదదు రాజైన ఆసా మాట అంగీకరించి, తన సైన్య 4
ముల అధిపతులను ఇశ్రాయేలువారి పట్టణముల
మీదికి పంపగా వీరు ఈయోనును దానును ఆబేల్మా
యీమును నఫ్తాలి ప్రదేశమునకు చేరిన పట్టణముల
లోని కొట్లను కొల్లపెట్టిరి. । బయెషా అది విని 5
రామాను ప్రాకారములతో కట్టించుట మానివేసి
తాను చేయుచున్న పని చాలించెను. । అప్పుడు 6
రాజైన ఆసా యూదా వారినందరిని సమకూర్చెను;
వీరు పోయి బయెషా కట్టించుచుండిన రామాపట్టణపు
రాళ్లను దూలములను తీసికొని వచ్చిరి; వాటితో ఆసా
గెబను మిస్పాను ప్రాకారపురములుగా కట్టించెను.

ఆ కాలమందు దర్శకుడైన హనానీ యూదా 7
రాజైన ఆసాయొద్దకు వచ్చి అతనితో ఈలాగు ప్రక
టించెను — నీవు నీ దేవుడైన యెహోవాను నమ్ము
కొనక అరాము రాజును నమ్ముకొంటివే; అరాము
రాజుయొక్క సైన్యము నీ వశమునుండి తప్పించుకొని
పోయెను. । బహు విస్తారమైన రథములును గుఱ్ఱపు 8
రౌతులునుగల కూషీయులును లూబీయులును గొప్ప
దండై వచ్చిరిగదా? అయినను నీవు యెహోవాను
నమ్ముకొనినందున ఆయన వారిని నీచేతి కప్పగించెను. ।
తనయెడల యథార్థహృదయముగలవారిని బలపరుచు 9

లకై యెహోవా కనుదృష్టి లోకమందంతట సంచా
రము చేయుచున్నది; యీ విషయమందు నీవు మతి
తప్పి ప్రవర్తించితివి గనుక ఇది మొదలుకొని నీకు
10 యుద్ధములే కలుగును. । ఆ దర్శకుడు అట్లు ప్రకటించి
నందుకు ఆసా అతనిమీద కోపగించి రౌద్రము చూపి
అతనిని బందీగృహములో వేసెను; ఇదియుగాక ఆ
సమయమందే ఆసా జనులలో కొందరిని బాధపర
11 చెను. । ఆసా చేసిన కార్యములన్నిటినిగూర్చి యూదా
ఇశ్రాయేలు రాజుల గ్రంథమందు వ్రాయబడి
12 యున్నది. । ఆసా తన యేలుబడియందు ముప్పది
తొమ్మిదవ సంవత్సరమున పాదములలో జబ్బుపుట్టి
తాను బహు బాధపడినను దానివిషయములో అతడు
యెహోవాయొద్ద విచారణచేయక వైద్యులను పట్టు
13 కొనెను. । ఆసా తన పితరులతోకూడ నిద్రించి తన
యేలుబడియందు నలువది యొకటవ సంవత్సరమున
14 మృతినొందగా । అత్తరు పనివారిచేత సిద్ధముచేయ
బడిన సుగంధవర్గములతోను పరిమళద్రవ్యములతోను
నిండిన పడకమీద జనులు అతని ఉంచి, అతని
నిమిత్తము బహు విస్తారమైన గంధవర్గములను దహించి,
దావీదు పట్టణమందు అతడు తనకొరకై తొలిపించు
కొనిన సమాధియందు అతని పాతిపెట్టిరి.

**17** తరువాత అతనికి బదులుగా అతని కుమారుడైన
యెహోషాపాతు రాజై ఇశ్రాయేలు తన మీదికి
2 రాకుండ తన రాజ్యమును బలపరచుకొనెను. । అతడు
యూదా దేశములోని ప్రాకార పురములన్నిటియం
దును సైన్యములను ఉంచి, యూదా దేశమందును
తన తండ్రియైన ఆసా పట్టుకొనిన ఎఫ్రాయిము
పట్టణములయందును కావలి బలములను ఉంచెను. ।
3 యెహోవా అతనికి సహాయుడై యుండగా
యెహోషాపాతు తన తండ్రియైన దావీదు ప్రారంభ
4 దినములలో నడిచిన మార్గమందు నడుచుచు । బయలు
దేవతను ఆశ్రయింపక తన తండ్రి దేవుని ఆశ్రయిం
చుచు, ఇశ్రాయేలువారి చర్యలను వెంబడింపక ఆయన
5 ఆజ్ఞల ననుసరించి నడిచెను. । కాబట్టి యెహోవా
అతనిచేత రాజ్యమును స్థిరపరచెను, యూదావారంద
రును యెహోషాపాతునకు పన్ను ఇచ్చుచుండిరి,
అతనికి ఐశ్వర్యమును ఘనతయు మెండుగా కలిగెను. ।
6 యెహోవా మార్గములయందు నడుచుకొనుటకు
అతడు తన మనస్సును దృఢపరచుకొనినవాడై ఉన్నత
స్థలములను దేవతాస్తంభములను యూదాలోనుండి
తీసివేసెను.

7 తన యేలుబడియందు మూడవ సంవత్సరమున
యూదా పట్టణములలో జనులకు ధర్మశాస్త్రమును
[illegible] అతడు పెద్దలైన బెన్హయీలును ఓబ
[illegible] నెతనేలును మీకాయాను । షెమ
[illegible] అశాహేలు షెమీరామోతు

యెహోనాతాను అదోనీయా టోబీయా టోబ
దోనీయా అను లేవీయులను, యాజకులైన ఎలీషా
మాను యెహోరామును పంపెను. । వారు 9
యెహోవా ధర్మశాస్త్రగ్రంథమును చేత పుచ్చుకొని
యూదావారిమధ్య ప్రకటనచేయుచు, యూదా
పట్టణములన్నిటను సంచరించుచు జనులకు బోధిం
చిరి. । యూదాదేశము చుట్టు ఉండు దేశముల 10
రాజ్యములన్నిటిమీదికి యెహోవా భయము వచ్చి
నందున వారు యెహోషాపాతుతో యుద్ధము చేయ
కుండిరి. । ఫిలిష్తీయులలో కొందరు యెహోషా 11
పాతునకు పన్నును కానుకలను ఇచ్చుచు వచ్చిరి; అరబీ
యులును అతనికి ఏడు వేల ఏడు నూరుల గొఱ్ఱె
పొట్టేళ్లను ఏడు వేల ఏడు నూరుల మేకపోతులను
తెచ్చుచు వచ్చిరి.

యెహోషాపాతు అంతకంతకు గొప్పవాడై 12
యూదా దేశమునందు కోటలను సామగ్రిని నిలువ
చేయు పట్టణములను కట్టించెను. । యూదాదేశపు 13
పట్టణములలో అతనికి బహు ధనము సమకూర్చ
బడెను. అతని క్రింది పరాక్రమశాలులు యెరూష
లేములో కూడియుండిరి. । వీరి పితరుల వంశముల 14
చొప్పున వీరి సంఖ్య యెంతనగా, యూదాలో సహ
స్రాధిపతులైనవారికి ప్రధానుడగు అద్నాయొద్ద
మూడు లక్షలమంది పరాక్రమశాలులుండిరి. । రెండవ 15
వాడగు యెహోహానాను అను అధిపతియొద్ద రెండు
లక్షల ఎనుబదివేలమంది యుండిరి. । మూడవవాడు 16
జిఖ్రీ కుమారుడై యెహోవాకు తన్నుతాను మనః
పూర్వకముగా సమర్పించుకొనిన అమస్యా; అతని
యొద్ద రెండు లక్షలమంది పరాక్రమశాలులుండిరి. ।
బెన్యామీనీయులలో ఎల్యాదా అను పరాక్రమశాలి 17
యొకడుండెను; వీనియొద్ద వింటిని కేడెమును పట్టు
కొనువారు రెండు లక్షలమంది యుండిరి. । రెండవ 18
వాడు యెహోజాబాదు; వీనియొద్ద లక్ష యెనుబది
వేలమంది యుద్ధసన్నద్ధులుండిరి. । రాజు యూదా 19
యందంతటనుండు ప్రాకారపురములలో ఉంచిన
వారు గాక వీరు రాజుయొక్క పరివారములో చేరిన
వారై యుండిరి.

తనకు ఐశ్వర్యమును ఘనతయు అధికముగా కలి **18**
గిన తరువాత యెహోషాపాతు అహాబుతో వియ్య
మంది । కొన్ని సంవత్సరములు గతించినమీదట 2
షోమ్రోనులోనుండు అహాబునొద్దకు పోయెను;
అహాబు అతని కొరకును అతని వెంటవచ్చిన జనుల
కొరకును అనేకమైన గొఱ్ఱెలను పశువులను కోయించి,
తనతోకూడ రామోత్గిలాదు మీదికి పోవుటకు అతని
ప్రేరేపించెను. । ఇశ్రాయేలు రాజైన అహాబు 3
యూదారాజైన యెహోషాపాతును చూచి—నీవు
నాతోకూడ రామోత్గిలాదుకు వచ్చెదవా అని అడు

గగా యెహోషాపాతు — నేను నీవాడను, నా
జనులు నీ జనులు, మేము నీతోకూడ యుద్ధమునకు
4 వచ్చెదమని చెప్పెను. । మరియు యెహోషాపాతు
ఇశ్రాయేలు రాజుతో — నేడు యెహోవాయొద్ద
5 సంగతి విచారణ చేయుదము రండనగా । ఇశ్రాయేలు
రాజు నన్నూరుమంది ప్రవక్తలను సమకూర్చి — నేను
రామోత్గిలాదుమీదికి యుద్ధమునకు పోవుదునా
మానుదునా అని వారి నడిగెను. అందుకు వారు—
పొమ్ము, దేవుడు రాజు చేతికి దాని నప్పగించునని
6 చెప్పిరి. । అయితే యెహోషాపాతు—మనము అడిగి
విచారణచేయుటకు యెహోవా ప్రవక్తలలో ఒక
7 డైనను ఇచ్చట లేడా అని యడుగగా । ఇశ్రాయేలు
రాజు — యెహోవాయొద్ద విచారణచేయుటకు
ఇమ్లా కుమారుడైన మీకాయా అను ఒకడు ఇచ్చట
ఉన్నాడు; అయితే అతడు నన్నుగూర్చి మేలు ప్రవచిం
పక నిత్యము కీడునే ప్రవచించుచున్నాడు గనుక నేను
వానియందు పగ కలిగియున్నాననగా యెహోషా
8 పాతు — రాజు అలాగనవద్దనెను. । అప్పుడు ఇశ్రా
యేలు రాజు తన పరివారములోనున్న యొకని పిలి
పించి—ఇమ్లా కుమారుడైన మీకాయాను శీఘ్రముగా
9 రప్పించుమని ఆజ్ఞ ఇచ్చెను. । ఇశ్రాయేలు రాజును
యూదారాజగు యెహోషాపాతును షోమ్రోను
ఊరు గవిని ముందరి బయలునందు తమ తమ వస్త్రము
లను ధరించుకొని తమ తమ సింహాసనములమీద
కూర్చునియుండగా ప్రవక్తలందరును వారిముందర
0 ప్రవచించుచుండిరి. । అప్పుడు కెనయనా కుమారు
డైన సిద్కియా యినుపకొమ్ములు చేయించుకొని వచ్చి
—అరామీయులు నిర్మూలమగు పర్యంతము వీటితో
వారిని నీవు పొడిచెదవని యెహోవా సెలవిచ్చు
1 చున్నాడని ప్రకటించెను. । ప్రవక్తలందరును ఆ
ప్రకారముగానే ప్రవచించుచు — యెహోవా
రామోత్గిలాదును రాజు చేతికి అప్పగించును, దాని
2 మీదికి పోయి జయమొందుము అనిరి. । మీకాయాను
పిలుచుటకు పోయిన దూత అతని కనుగొని—ప్రవక్తలు
రాజు విషయమై యేకముఖముగా మేలునే పలుకు
చున్నారు; దయచేసి నీ మాటను వారి మాటలకు అను
3 కూలపరచి మేలునే ప్రవచింపుమనగా । మీకాయా
—యెహోవా జీవముతోడు నా దేవుడు సెలవిచ్చున
4 దేదో దానినే ప్రవచింతునని చెప్పెను. । అతడు
రాజునొద్దకు రాగా రాజు అతని చూచి—మీకాయా,
యుద్ధమునకు రామోత్గిలాదుకు మేము పోవుదుమా
మానుదుమా అని యడుగగా అతడు—పోయి జయిం
చుడి, వారు మీ చేతికి అప్పగింపబడుదురనెను. ।
5 అప్పుడు రాజు — యెహోవా నామమునుబట్టి అబ
ద్ధము కాక సత్యమే పలుకుమని నేను ఎన్నిమారులు
నీచేత ఒట్టు పెట్టించుకొందునని అతనితో అనగా :
అతడు — కాపరిలేని గొఱ్ఱెలవలెనే ఇశ్రాయేలు 16
వారందరును పర్వతములమీద చెదరిపోవుట చూచి
తిని;—వీరికి యజమానుడు లేడనియు, వీరిలో ప్రతి
వాడు తన తన యింటికి సమాధానముగా పోవలెనని
యు యెహోవా సెలవిచ్చుచున్నాడనెను. । ఇశ్రా 17
యేలురాజు ఇది విని యెహోషాపాతుతో ఇట్లనెను—
ఇతడు కీడునేగాని నా విషయమై మేలును ప్రవచింప
డని నేను నీతో చెప్పలేదా అని యనగా । మీకాయా 18
—యెహోవా మాట వినుడి; యెహోవా తన సింహా
సనముమీద ఆసీనుడై యుండుటయు, పరమండల
సైన్యమంతయు ఆయన కుడిప్రక్కను ఎడమప్రక్కను
నిలువబడుటయు నేను చూచితిని. । —ఇశ్రాయేలు 19
రాజైన అహాబు రామోత్గిలాదుమీదికి పోయి పడి
పోవునట్లు ఎవడు అతని ప్రేరేపించునని యెహోవా
అడుగగా, ఒకడు ఈ విధముగాను ఇంకొకడు ఆ
విధముగాను ప్రత్యుత్తరమిచ్చిరి. । అప్పుడు ఒక ఆత్మ 20
వచ్చి యెహోవాయెదుట నిలువబడి—నేను అతని
ప్రేరేపించెదనని చెప్పగా యెహోవా — దేనిచేత
నని అతని నడిగెను. । అందుకు ఆ యాత్మ — నేను 21
బయలుదేరి వాని ప్రవక్తలందరినోటను అబద్ధములాడు
ఆత్మగా ఉందునని చెప్పగా యెహోవా—నీవు వాని
ప్రేరేపించి జయింతువు, పోయి ఆ ప్రకారముగా
చేయుమని సెలవిచ్చెను. । యెహోవా నీ ప్రవక్తలగు 22
వీరినోట అబద్ధములాడు ఆత్మను ఉంచియున్నాడు,
యెహోవా నీమీద కీడు పలికించి యున్నాడని
చెప్పెను.

అప్పుడు కెనయనా కుమారుడైన సిద్కియా దగ్గ 23
రకువచ్చి మీకాయాను చెంపమీద కొట్టి — నీతో
మాటలాడుటకు యెహోవా ఆత్మ నాయొద్దనుండి ఏ
మార్గమున పోయెననెను. । అందుకు మీకాయా — 24
దాగుటకై నీవు లోపలిగదిలోకి వెళ్లు దినమున దాని
తెలిసికొందువని చెప్పెను. । అప్పుడు ఇశ్రాయేలు 25
రాజు — పట్టణపు అధిపతియైన ఆమోనునొద్దకును
రాజు కుమారుడైన యోవాషునొద్దకును — మీరు
మీకాయాను తీసికొని పోయి వారితో రాజు మీ
కిచ్చిన సెలవు ఇదియే యనుడి; । —నేను సురక్షిత 26
ముగా తిరిగి వచ్చు పర్యంతము వీనిని చెరలోపెట్టి
కఠినముగా చూచి అన్నపానములియ్యుడి. । అప్పుడు 27
మీకాయా యిట్లనెను — నీవు సురక్షితముగా తిరిగి
వచ్చిన పక్షమందు యెహోవా నా ద్వారా పలుకనే
లేదని చెప్పి, సమస్త జనులారా ఆలకించుడనెను. । అంతట 28
ఇశ్రాయేలురాజును యూదా రాజైన యెహోషా
పాతును రామోత్గిలాదుమీదికి పోయిరి. । ఇశ్రా 29
యేలురాజు — నేను మారువేషము వేసికొని యుద్ధము
నకు పోవుదును, నీవు నీ వస్త్రములనే ధరించుకొనుమని
యెహోషాపాతుతో చెప్పి తాను మారువేషము వేసి

కొనెను, తరువాత వారు యుద్ధమునకు పోయిరి. ।
30 అరాము రాజు — మీరు ఇశ్రాయేలురాజుతోనే
యుద్ధము చేయుడి, అధములతోనైనను అధికులతో
నైనను చేయవద్దని తనతోకూడనున్న తన రథాధి
31 పతులకు ఆజ్ఞ ఇచ్చియుండెను. । కాగా యెహోషా
పాతు కనబడుటతోనే రథాధిపతులు అతడు ఇశ్రా
యేలురాజనుకొని యుద్ధముచేయుటకు అతని చుట్టు
కొనిరి గాని యెహోషాపాతు మొఱ్ఱపెట్టినందున
యెహోవా అతనికి సహాయము చేసెను, దేవుడు
అతని యొద్దనుండి వారు తొలగిపోవునట్లు చేసెను. ।
32 ఎట్లనగా రథాధిపతులు అతడు ఇశ్రాయేలు రాజు
కాడని తెలిసికొని అతని తరుముట మాని తిరిగి
33 పోయిరి. । అప్పుడు ఒకడు గురిచూడకయే తన విం
టిని ఎక్కుపెట్టి, ఇశ్రాయేలు రాజును అతని కవచపు
బందులసందున కొట్టగా అతడు — నాకు గాయము
తగిలినది, నీ చెయ్యి త్రిప్పి దండులోనుండి నన్ను
34 కొంపొమ్మని తన సారథితో అనెను. । ఆ దినమున
యుద్ధము ప్రబలమాయెను; అయినను ఇశ్రాయేలు
రాజు అస్తమయపర్యంతము అరామీయులకెదురుగా
తన రథమునందు నిలిచెను; ప్రొద్దుగ్రుంకువేళ అతడు
చనిపోయెను.

19 యూదారాజైన యెహోషాపాతు ఏ యపా
యమును చెందకుండ యెరూషలేమందుండు తన నగ
2 రుకు తిరిగి రాగా । దర్శకుడును హనానీ కుమారుడు
నగు యెహూ అతనిని ఎదుర్కొనపోయి, రాజైన
యెహోషాపాతునకు ఈలాగు ప్రకటనచేసెను—నీవు
భక్తిహీనులకు సహాయము చేసి యెహోవా శత్రువు
లకు స్నేహితుడవైతివి గదా? అందువలన యెహోవా
3 సన్నిధినుండి కోపము నీమీదికి వచ్చును. । అయితే
దేశములోనుండి నీవు దేవతాస్తంభములను తీసివేసి
దేవునియొద్ద విచారణ చేయుటకు నీవు మనస్సు నిలుపు
కొని యున్నావు, నీయందు మంచి క్రియలు కనబడు
చున్నవి.

4 యెహోషాపాతు యెరూషలేములో నివాసము
చేయుచు బెయేర్షెబానుండి ఎఫ్రాయిము మన్యము
వరకు జనులమధ్యను సంచరించుచు, వారి పితరుల దేవు
డైన యెహోవా వైపుకు వారిని మళ్లించెను. ।
5 మరియు అతడు ఆ యా పట్టణములలో, అనగా
దేశమందు యూదావారున్న బురుజులుగల పట్టణము
లన్నిటిలో న్యాయాధిపతులను నిర్ణయించి వారి కీలా
6 గున ఆజ్ఞాపించెను । — మీరు యెహోవా నియమ
మునుబట్టియే గాని మనుష్యుల నియమమునుబట్టి తీర్పు
తీర్చవలసినవారు కారు; ఆయన మీతోకూడ నుండును
గనుక మీరు తీర్చు తీర్పు బహు జాగ్రత్తగా
7 చేయుడి. । యెహోవా భయము మీమీద ఉండు
గాక; హెచ్చరికగానుండి తీర్పు తీర్చుడి; మన దేవు
డైన యెహోవాయందు దౌష్ట్యము లేదు, ఆయన
పక్షపాతికాడు, లంచము పుచ్చుకొనువాడు కాడు. ।
మరియు తాను యెరూషలేమునకు వచ్చినప్పుడు 8
యెహోవా నిర్ణయించిన న్యాయమును జరిగించుట
కును, సందేహాంశములను పరిష్కరించుటకును,
యెహోషాపాతు లేవీయులలోను యాజకులలోను
ఇశ్రాయేలీయుల పితరుల యిండ్ల పెద్దలలోను కొంద
రిని నియమించి । వారికీలాగున ఆజ్ఞాపించెను — 9
యెహోవాయందు భయభక్తులు కలిగినవారై, నమ్మక
ముతోను యథార్థమనస్సుతోను మీరు ప్రవర్తింప
వలెను. । నరహత్యను గూర్చియు, ధర్మశాస్త్రమును 10
గూర్చియు, ధర్మమును గూర్చియు, కట్టడలను గూర్చి
యు, న్యాయవిధులను గూర్చియు, ఆ యా పట్టణ
ములలో నివసించు మీ సహోదరులు తెచ్చు ఏ
సంగతినే గాని మీరు విమర్శించునప్పుడు, మీమీది
కిని మీ సహోదరులమీదికిని కోపము రాకుండు
నట్లు వారు యెహోవాదృష్టికి ఏ అపరాధమును
చేయకుండ వారిని హెచ్చరిక చేయవలెను; మీరాలాగు
చేసినయెడల అపరాధులు కాకయుందురు. । మరియు 11
ప్రధానయాజకుడైన అమర్యా యెహోవాకు చెందు
సకల విషయములను కనిపెట్టుటకు మీమీద ఉన్నాడు,
యూదా సంతతివారికి అధిపతియు ఇష్మాయేలు
కుమారుడునగు జెబద్యా రాజు సంగతుల విషయములో
పైవాడుగా ఉన్నాడు, లేవీయులు మీకు పరిచారకు
లుగా ఉన్నారు, ధైర్యము వహించుడి, మేలుచేయు
టకై యెహోవా మీతోకూడ ఉండును.

ఇది యయిన తరువాత మోయాబీయులును 20
అమ్మోనీయులును మెయోనీయులలో కొందరును
దండెత్తి యెహోషాపాతుమీదికి వచ్చిరి. । అంతలో 2
కొందరు వచ్చి—సముద్రము ఆవలనుండు అరామీ
యుల తట్టునుండి గొప్ప సైన్యమొకటి నీమీదికి వచ్చు
చున్నది; చిత్తగించుము, వారు హససోన్తామారు
అను ఏన్గెదీలో ఉన్నారని యెహోషాపాతునకు తెలి
యజేసిరి. । అందుకు యెహోషాపాతు భయపడి 3
యెహోవాయొద్ద విచారించుటకు మనస్సు నిలుపు
కొని, యూదాయందంతట ఉపవాసదినము ఆచరింప
వలెనని చాటింపగా । యూదావారు యెహోవా 4
వలని సహాయమును వేడుకొనుటకై కూడుకొనిరి,
యెహోవాయొద్ద విచారించుటకు యూదా పట్టణ
ములన్నిటిలోనుండి జనులు వచ్చిరి. । యెహోషా 5
పాతు యెహోవా మందిరములో క్రొత్త శాల
యెదుట సమాజముగా కూడిన యూదా యెరూష
లేముల జనులమధ్యను నిలువబడి । — మా పితరుల 6
దేవా యెహోవా, నీవు పరమండలమందు దేవుడవై
యున్నావు, అన్యజనుల రాజ్యములను ఏలువాడవు
నీవే; నీవు బాహుబలము గలవాడవు, పరాక్రమము

గలవాడవు, నిన్నెదిరించుట కెవరికిని బలము చాలదు. ।
7 నీ జనులైన ఇశ్రాయేలీయుల యెదుటనుండి ఈ దేశపు
కాపురస్థులను తోలివేసి, నీ స్నేహితుడైన అబ్రా
హాముయొక్క సంతతికి దీనిని శాశ్వతముగా నిచ్చిన
8 మా దేవుడవు నీవే. । వారు అందులో నివాసముచేసి
కీడైనను యుద్ధమైనను తీర్పైనను తెగులైనను కరవైనను
మామీదికి వచ్చినప్పుడు మేము ఈ మందిరము ఎదుట
నిలువబడి మా శ్రమలో నీకు మొఱ్ఱపెట్టినయెడల ।
9 నీవు ఆలకించి మమ్మును రక్షించుదువని అనుకొని,
యిచ్చట నీ నామఘనతకొరకు ఈ పరిశుద్ధస్థలమును
కట్టించిరి. నీ నామము ఈ మందిరమునకు పెట్ట
10 బడెను గదా. । ఇశ్రాయేలీయులు ఐగుప్తులోనుండి
వచ్చినప్పుడు నీవు వారిని అమ్మోనీయులతోను మోయా
బీయులతోను శేయీరు మన్యవాసులతోను యుద్ధము
చేయనియ్యలేదు గనుక ఇశ్రాయేలీయులు వారిని
నిర్మూలము చేయక వారియొద్దనుండి తొలగిపోయిరి. ।
11 మేము స్వతంత్రించుకొనవలెనని నీవు మాకిచ్చిన నీ
స్వాస్థ్యములోనుండి మమ్మును తోలివేయుటకై వారు
బయలుదేరి వచ్చి మాకెట్టి ప్రత్యుపకారము చేయు
12 చున్నారో దృష్టించుము. । మా దేవా, నీవు వారికి
తీర్పుతీర్చవా? మామీదికి వచ్చు ఈ గొప్ప సైన్య
ముతో యుద్ధము చేయుటకు మాకు శక్తి చాలదు;
ఏమి చేయుటకును మాకు తోచదు; నీవే మాకు దిక్కు
13 అని ప్రార్థనచేసెను. । యూదావారందరును తమ శిశు
వులతోను భార్యలతోను పిల్లలతోను యెహోవా
14 సన్నిధిని నిలువబడిరి. । అప్పుడు మత్తన్యాకు పుట్టిన
యెహీయేలు కుమారుడైన బెనాయాకు జననమైన
జెకర్యా కుమారుడును ఆసాపు సంతతివాడును లేవీ
యుడునగు యహజీయేలు సమాజములో ఉండెను.
యెహోవా ఆత్మ అతనిమీదికి రాగా అతడీలాగు
15 ప్రకటించెను । —యూదావారలారా, యెరూష
లేము కాపురస్థులారా, యెహోషాపాతు రాజా,
మీరందరును ఆలకించుడి; యెహోవా సెలవిచ్చున
దేమనగా—ఈ గొప్ప సైన్యమునకు మీరు భయపడ
కుడి, జడియకుడి, యీ యుద్ధము మీరు కాదు
16 దేవుడే జరిగించును. । రేపు వారిమీదికి పోవుడి;
వారు జీజు అను ఎక్కుడు మార్గమున వచ్చెదరు, మీరు
యెరూవేలు అరణ్యము ముందరనున్న వాగు కొనదగ్గర
17 వారిని కనుగొందురు. । ఈ యుద్ధములో మీరు
పోట్లాడవలసిన నిమిత్తము లేదు; యూదావారలారా,
యెరూషలేమువారలారా, మీరు యుద్ధపంక్తులు
తీర్చి నిలువబడుడి; మీతోకూడనున్న యెహోవా
చేయుచేయు రక్షణను మీరు చూచెదరు; భయపడకుడి
జడియకుడి, రేపు వారిమీదికి పోవుడి, యెహోవా
18 మీతోకూడ ఉండును. । అప్పుడు యెహోషాపాతు
సాష్టాంగ నమస్కారముచేసెను; యూదావారును

యెరూషలేము కాపురస్థులును యెహోవా సన్ని
ధిని సాగిలపడి నమస్కరించిరి. । కహాతీయుల సంతతి 19
వారును కోరహీయుల సంతతివారునగు లేవీయులు
నిలువబడి గొప్ప శబ్దముతో ఇశ్రాయేలీయుల దేవు
డైన యెహోవాను స్తుతించిరి. । అంతట వారు 20
ఉదయముననే లేచి తెకోవ అరణ్యమునకు పోయిరి;
వారు పోవుచుండగా యెహోషాపాతు నిలువబడి
—యూదావారలారా, యెరూషలేము కాపురస్థు
లారా, నా మాట వినుడి; మీ దేవుడైన యెహోవాను
నమ్ముకొనుడి, అప్పుడు మీరు స్థిరపరచబడుదురు;
ఆయన ప్రవక్తలను నమ్ముకొనుడి, అప్పుడు మీరు
కృతార్థులగుదురని చెప్పెను. । మరియు అతడు జను 21
లను హెచ్చరిక చేసిన తరువాత యెహోవాను
స్తుతించుటకు గాయకులను ఏర్పరచి, వారు పరిశుద్ధా
లంకారములు ధరించి సైన్యము ముందర నడచుచు—
యెహోవా కృప నిరంతరముండును, ఆయనను
స్తుతించుడి అని స్తోత్రము చేయుటకు వారిని నియ
మించెను. । వారు పాడుటకును స్తుతించుటకును 22
మొదలుపెట్టగా యెహోవా యూదావారిమీదికి
వచ్చిన అమ్మోనీయులమీదను మోయాబీయులమీదను
శేయీరు మన్యవాసులమీదను మాటుగాండ్లను
పెట్టెను గనుక వారు హతులైరి. । అమ్మోనీయులును 23
మోయాబీయులును శేయీరు మన్యనివాసులను
బొత్తిగా చంపి నిర్మూలము చేయవలెనని పొంచియుండి
వారిమీద పడిరి; వారు శేయీరు కాపురస్థులను కడ
ముట్టించిన తరువాత తమలో ఒకరినొకరు చంపుకొను
టకు మొదలుపెట్టిరి. । యూదావారు అరణ్యమం 24
దున్న కాపరుల దుర్గము దగ్గరకు వచ్చి సైన్యముతట్టు
చూడగా వారు శవములై నేలపడియుండిరి, ఒకడును
తప్పించుకొనలేదు. । యెహోషాపాతును అతని జను 25
లును వారి వస్తువులను దోచుకొనుటకు దగ్గరకు రాగా
ఆ శవములయొద్ద విస్తారమైన ధనమును ప్రశస్తమైన
నగలును కనబడెను; వారు తమకిష్టమైనంతమట్టుకు
తీసికొని తాము కొంచుపో గలిగినంతకంటె ఎక్కు
వగా ఒలుచుకొనిరి; కొల్లసొమ్ము అతి విస్తారమైనం
దున దానిని కూర్చుటకు మూడు దినములు పట్టెను. ।
నాల్గవ దినమున వారు బెరాకాలోయలో కూడిరి; 26
అక్కడ వారు యెహోవాకు కృతజ్ఞతాస్తుతులు
చెల్లించినందున నేటివరకును ఆ చోటికి బెరాకా
లోయ యని పేరు. । ఈలాగున యెహోవా వారి 27
శత్రువులమీద వారికి జయము అనుగ్రహించి వారిని
సంతోషపరచెను గనుక యెరూషలేమునకు ఉత్సవ
ముతో మరలవలెనని యూదావారును యెరూషలేము
వారును వారందరికి ముందు యెహోషాపాతును
సాగి వెళ్లిరి; । వారు యెరూషలేములోనున్న 28
యెహోవా మందిరమునకు స్వరమండలములను సితా

రాలను వాయించుచు బూరలు ఊదుచువచ్చిరి. |
29 ఇశ్రాయేలీయుల శత్రువులతో యెహోవా
యుద్ధము చేసెనని దేశముల రాజ్యములవారందరు
వినగా దేవుని భయము వారందరిమీదికి వచ్చెను. |
30 ఈ ప్రకారము అతని దేవుడు చుట్టునున్నవారిని
జయించి అతనికి నెమ్మది ననుగ్రహింపగా యెహోషా
పాతు రాజ్యము నిమ్మళముగా నుండెను.
31 యెహోషాపాతు యూదారాజ్యమును ఏలెను.
అతడు ఏలనారంభించినప్పుడు ముప్పదియయిదు
సంవత్సరములవాడై యెరూషలేములో ఇరువది
యయిదు సంవత్సరములు ఏలెను; అతని తల్లి షిల్హీ
32 కుమార్తె, ఆమె పేరు అజూబా. | అతడు యెహోవా
దృష్టికి యథార్థముగా ప్రవర్తించి తన తండ్రి
యైన ఆసా మార్గమందు నడుచుచు దానిలోనుండి
33 తొలగిపోకుండెను. | అయితే అప్పటికింకను జనులు
తమ పితరుల దేవుని వెదకుటకు తమ హృదయము
లను స్థిరపరచుకొనలేదు, అతడు ఉన్నతస్థలములను
34 తీసివేయలేదు. | యెహోషాపాతు చేసిన కార్య
ములన్నిటినిగూర్చి హనానీ కుమారుడైన యెహూ
రచించిన గ్రంథమందు వ్రాయబడియున్నవి. ఈ
యెహూపేరు ఇశ్రాయేలు రాజుల గ్రంథమందు
35 కనబడుచున్నది. | ఇది యయిన తరువాత యూదా
రాజైన యెహోషాపాతు మిక్కిలి దుర్మార్గముగా
ప్రవర్తించిన ఇశ్రాయేలు రాజైన అహజ్యాతో
36 స్నేహము చేసెను. | తర్షీషుకు పోదగిన ఓడలను
చేయింపవలెనని యెహోషాపాతు అతనితో స్నే
హము చేయగా వారు ఎసోన్గెబెరులో ఆ ఓడలను
37 చేయించిరి. | అప్పుడు మారేషావాడును దోదావాహు
కుమారుడునగు ఎలీయెజెరు—నీవు అహజ్యాతో స్నే
హము చేసికొంటివి గనుక యెహోవా నీ పనులను
భంగముచేయుననని యెహోషాపాతుమీద ప్రవచన
మొకటి చెప్పెను. ఆ ఓడలు తర్షీషుకు వెళ్లజాల
కుండ బద్దలైపోయెను.

21 యెహోషాపాతు తన పితరులతోకూడ నిద్రించి
తన పితరులచెంతను దావీదు పట్టణమందు పాతి
పెట్టబడెను; అతని కుమారుడైన యెహోరాము
2 అతనికి బదులుగా రాజాయెను. | యెహోషాపాతు
కుమారులైన అజర్యా యెహీయేలు జెకర్యా అజర్యా
మిఖాయేలు షెఫట్య అనువారు ఇతనికి సహోద
రులు; వీరందరును ఇశ్రాయేలు రాజైన యెహోషా
3 పాతు కుమారులు. | వారి తండ్రి వెండి బంగార
ములను బహుమానములుగా ప్రశస్తవస్తువు లనేకము
లను యూదాదేశములో ప్రాకారముగల పట్టణము
లను వారికిచ్చెను; అయితే యెహోరాము జ్యేష్ఠుడు
4 గనుక అతనికి రాజ్యమును ఇచ్చెను. | యెహోరాము
తన తండ్రి రాజ్యమును ఏలనారంభించినప్పుడు
తన్ను స్థిరపరచుకొని, తన సహోదరులనందరిని
ఇశ్రాయేలీయుల అధిపతులలో కొందరిని హతము
చేసెను. | యెహోరాము ఏలనారంభించినప్పుడు 5
ముప్పది రెండేండ్లవాడు. అతడు యెరూషలేములో
ఎనిమిది సంవత్సరములు ఏలెను. | అతడు అహాబు కుమా 6
ర్తెను పెండ్లిచేసికొని అహాబు సంతతివారు నడిచిన
ప్రకారముగా ఇశ్రాయేలు రాజుల మార్గమందు నడి
చెను; అతడు యెహోవా దృష్టికి ప్రతికూలముగా
ప్రవర్తించెను. | అయినను యెహోవా తాను దావీ 7
దుతో చేసిన నిబంధన నిమిత్తమును, అతనికిని అతని
కుమారులకును నిత్యము దీపమిచ్చెదనని చేసిన వాగ్దా
నము నిమిత్తమును దావీదు సంతతిని నశింపజేయుటకు
మనస్సు లేక యుండెను. | అతని దినములలో ఎదోమీ 8
యులు తిరుగబడి యూదావారి అధికారమును త్రోసి
వేసి తమకు ఒక రాజును చేసికొనగా | యెహోరాము 9
తన చేతిక్రిందనున్న అధికారులను వెంటబెట్టుకొని,
తన రథములన్నిటితో బయలుదేరి రాత్రివేళ లేచి
తన్ను చుట్టుకొనిన ఎదోమీయులను రథాధిపతులను
హతముచేసెను. | కాగా నేటివరకును జరుగుచున్నట్టు 10
ఎదోమీయులు యూదావారి చేతిక్రింద నుండక
తిరుగబడిరి. యెహోరాము తన పితరుల దేవుడైన
యెహోవాను విసర్జించినందున ఆ కాలమందు లిబ్నా
యును అతని చేతిక్రిందనుండి తిరుగబడెను. | మరియు 11
అతడు యూదా పర్వతములయందు బలిపీఠములను
కట్టించి యెరూషలేము కాపురస్థులు దేవుని విసర్జించు
నట్లు చేసెను, యూదావారిని విగ్రహపూజకు లోపర
చెను.[1]

అంతట ప్రవక్తయైన ఏలీయా యిట్లని యొక పత్రిక 12
వ్రాసి అతనియొద్దకు పంపెను —నీ పితరుడగు దావీ
దుకు దేవుడైన యెహోవా సెలవిచ్చునదేమనగా—
నీవు నీ తండ్రియైన యెహోషాపాతు మార్గములం
దైనను యూదారాజైన ఆసా మార్గములందైనను నడు
వక | ఇశ్రాయేలు రాజుల మార్గమందు నడిచి అహాబు 13
సంతతివారు చేసిన వ్యభిచారములచొప్పున యూ
దాను యెరూషలేము కాపురస్థులను వ్యభిచరింపజేసి,
నీకంటె యోగ్యులైన నీ తండ్రి సంతతివారగు నీ
సహోదరులను నీవు చంపియున్నావు. | కాబట్టి 14
గొప్ప తెగులుచేత యెహోవా నీ జనులను నీ పిల్ల
లను నీ భార్యలను నీ వస్తువాహనములన్నిటిని
మొత్తును. | నీవు ఉదరమున వ్యాధి కలిగి మిక్కిలి 15
రోగివై యుందువు; దినక్రమేణ ఆ వ్యాధిచేత నీ
పేగులు పడిపోవును. | మరియు యెహోవా 16
యెహోరాముమీదికి ఫిలిష్తీయులను కూషీయుల
చేరువనున్న అరబీయులను రేపగా | వారు యూదా 17

1 మూలభాషలో, వ్యభిచరింపజేసెను.

దేశముమీదికి వచ్చి దానిలో చొరబడి రాజనగరు
నందు దొరికిన సమస్త పదార్థములను అతని కుమారు
లను భార్యలను పట్టుకొనిపోయిరి; అతని కుమారులలో
కనిష్ఠుడైన యెహోయాహాజు తప్ప అతనికి ఒక్క
8 కుమారుడైనను విడువబడలేదు. । ఇదియంతయు అయిన
తరువాత యెహోవా కుదురచాలని వ్యాధిచేత అత
9 నిని ఉదరమున మొత్తినందున । రెండు సంవత్సరములు
వ్యాధి బలమగుచు వచ్చి ఆ వ్యాధిచేత అతని పేగులు
పడిపోయి బహు వేదననొందుచు అతడు మరణ
మాయెను. అతని జనులు అతని పితరులకు చేసిన
10 ఉత్తర క్రియలు అతనికి చేయలేదు. । అతడు ఏల
నారంభించినప్పుడు ముప్పది రెండేండ్లవాడు; యెరూ
షలేములో ఎనిమిది సంవత్సరములు ఏలి యెవరికిని
ఇష్టములేనివాడై అతడు చనిపోయెను; రాజుల సమా
ధులలో గాక దావీదు పట్టణమందు వేరుచోట జనులు
అతని పాతిపెట్టిరి.

**22** అరబీయులతో కూడ దండు విడియుచోటికి
వచ్చినవారు పెద్దవారినందరిని చంపిరి గనుక యెరూ
షలేము కాపురస్థులు అతని కడగొట్టు కుమారుడైన
అహజ్యాను అతనికి బదులుగా రాజునుచేసిరి. ఈ
ప్రకారము యూదారాజగు యెహోరాము కుమా
2 రుడైన అహజ్యా రాజ్యము నొందెను. । అహజ్యా
యేలనారంభించినప్పుడు నలువది రెండేండ్లవాడై
యెరూషలేములో ఒక సంవత్సరము ఏలెను; అతని
3 తల్లి ఒమ్రీ కుమార్తె, ఆమె పేరు అతల్యా. । దుర్మా
ర్గముగా ప్రవర్తించుటకు అతని తల్లి అతనికి నేర్పుచు
వచ్చెను గనుక అతడును అహాబు సంతతివారి మార్గము
4 లందు నడిచెను. । అహాబు సంతతివారివలెనే అతడు
యెహోవా దృష్టికి చెడునడత నడిచెను; అతని
తండ్రి మరణమైన తరువాత వారు అతనికి ఆలోచన
5 కర్తలై అతని నాశమునకు కారకులైరి. । వారి ఆలో
చనచొప్పున అతడు ప్రవర్తించి, రామోత్గిలాదులో
అరాము రాజైన హజాయేలుతో యుద్ధము చేయు
టకై అహాబు కుమారుడైన ఇశ్రాయేలురాజగు
యెహోరాముతోకూడ పోయెను; అరామీయుల
6 చేత యెహోరామునకు గాయములుతగిలెను. । అరాము
రాజైన హజాయేలుతో తాను రామాలో చేసిన
యుద్ధమునందు తనకు తగిలిన గాయములను బాగుచేసి
కొనుటకై అతడు యెజ్రెయేలునకు మరల వచ్చెను.
అహాబు కుమారుడైన యెహోరాము రోగియై
యున్నాడని విని యూదారాజైన యెహోరాము
కుమారుడగు అహజ్యా అతని దర్శించుటకై యెజ్రె
7 యేలునకు పోయెను. । యెహోరాము నొద్దకు అతడు
వచ్చుటచేత దేవునివలన అతనికి నాశము కలిగెను; ఎట్లు
నగా అతడు వచ్చినప్పుడు అహాబు సంతతివారిని నిర్మూ
లముచేయుటకై యెహోవా అభిషేకించిన నింషీ
కుమారుడైన యెహూమీదికి అతడు యెహోరాము
తోకూడ పోగా । యెహూ అహాబు సంతతివారి 8
మీద తీర్పుచేయుటకై వచ్చినప్పుడు అతడు యూదా
వారి అధిపతులను, అహజ్యాకు పరిచారకులుగానున్న
అహజ్యా సహోదరుల కుమారులను చూచి వారిని
హతముచేసెను. । తరువాత అతడు అహజ్యాను వెద 9
కెను. అతడు షోమ్రోనులో దాగియుండగా వారు
అతని పట్టుకొని యెహూనొద్దకు తీసికొనివచ్చిరి;
వారు అతని చంపిన తరువాత—ఇతడు యెహోవాను
హృదయపూర్వకముగా వెదకిన యెహోషాపాతు
కుమారుడుగదా అనుకొని అతని పాతిపెట్టిరి; కాగా
రాజ్యమేలుటకు అహజ్యా యింటివారు ఇక నెవరును
లేకపోయిరి.

అహజ్యా తల్లియైన అతల్యా తన కుమారుడు 10
చనిపోయెనని వినినప్పుడు ఆమె లేచి యూదావారి
సంబంధులగు రాజవంశజులనందరిని హతముచేసెను. ।
అయితే రాజు కుమార్తెయైన యెహోషబతు అహజ్యా 11
కుమారుడైన యోవాషును హతులైన రాజకుమారు
లలోనుండి దొంగిలించి, అతనిని అతని దాదిని ఒక
పడకటింటిలో ఉంచెను. యెహోరాము రాజు
కుమార్తెయును యెహోయాదా అను యాజకుని
భార్యయునైన యెహోషబతు అతల్యాకు కనబడ
కుండ అతని దాచిపెట్టెను గనుక ఆమె అతని చంప
లేకపోయెను; ఈ యెహోషబతు అహజ్యాకు
సహోదరి. । ఆరు సంవత్సరములు అతడు వారితో 12
కూడ దేవుని మందిరములో దాచబడియుండెను; ఆ
కాలమున అతల్యా దేశమును పాలించెను.

అంతట ఏడవ సంవత్సరమందు యెహోయాదా **23**
ధైర్యము తెచ్చుకొని, శతాధిపతులతోను యెరోహాము
కుమారుడైన అజర్యాతోను యెహోహానాను కుమా
రుడైన ఇష్మాయేలుతోను ఓబేదు కుమారుడైన అజర్యా
తోను అదాయాకుమారుడైన మయశేయాతోను జిఖ్రీ
కుమారుడైన ఎలీషాపాతుతోను నిబంధన చేయగా ।
వారు యూదా దేశమందంతటను సంచరించి, యూదా 2
వారి పట్టణములన్నిటిలోనుండి లేవీయులను ఇశ్రా
యేలీయుల పితరుల యిండ్ల పెద్దలను సమకూర్చి
యెరూషలేమునకు తోడుకొని వచ్చిరి. । జనులందరు 3
సమాజముగా కూడి దేవుని మందిరములో రాజుతో
నిబంధన చేసికొనినప్పుడు అతడు వారితో ఇట్లనెను
—యెహోవా దావీదు కుమారులనుగూర్చి యిచ్చిన
సెలవుచొప్పున రాజుకుమారుడు రాజ్యమేలవలెను. ।
కాబట్టి మీరు చేయవలసినదేమనగా, మీలో 4
యాజకులైనవారేమి లేవీయులైనవారేమి విశ్రాంతి
దినమున లోపల ప్రవేశించువారు మూడు భాగ
ములై, యొక భాగము ద్వారపాలకులుగా ఉండ
వలెను, । ఒక భాగము రాజనగరునొద్ద ఉండవలెను, 5

ఒక భాగము పునాది గుమ్మమునొద్ద ఉండవలెను,
జనులందరు యెహోవా మందిరపు ఆవరణములలో
6 ఉండవలెను. । యాజకులును లేవీయులలో పరిచారము
చేయువారును తప్ప యెహోవా మందిరము లోప
లికి మరి ఎవరును రాకూడదు, వారు ప్రతిష్ఠింపబడిన
వారు గనుక వారు లోపలికి రావచ్చునుగాని జను
లందరు యెహోవా ఇచ్చిన ఆజ్ఞచొప్పున బయట
7 ఉండవలెను. । లేవీయులందరు తమ తమ ఆయుధము
లను చేత పట్టుకొని రాజుచుట్టును ఉండవలెను,
మందిరము లోపలికి మరి ఎవరైనను వచ్చినయెడల ఆ
వచ్చినవారికి మరణశిక్ష విధించుడి; రాజు లోపలికి
వచ్చునప్పుడేమి బయటికి వెళ్లునప్పుడేమి మీరు అతనితో
8 కూడ ఉండవలెను. । కాబట్టి లేవీయులును యూదా
వారందరును యాజకుడైన యెహోయాదా ఆజ్ఞ
యంతటి ప్రకారము చేసిరి; యాజకుడైన యెహో
యాదా వంతులవారికి సెలవియ్యలేదు గనుక ప్రతి
వాడు విశ్రాంతిదినమున బయటికి వెళ్లవలసిన తన
వారిని ఆ దినమున లోపలికి రావలసిన తనవారిని
తీసికొని వచ్చెను.
9 మరియు యాజకుడైన యెహోయాదా దేవుని
మందిరమందు రాజైన దావీదు ఉంచిన బల్లెములను
కేడెములను డాళ్లను శతాధిపతులకు అప్పగించెను. ।
10 అతడు ఆయుధము చేత పట్టుకొనిన జనులందరిని మంది
రపు కుడివైపునుండి యెడమవైపువరకు బలిపీఠము
ప్రక్కను మందిరముప్రక్కను రాజుచుట్టును ఉం
11 చెను. । అప్పుడు వారు రాజకుమారుని బయటికి
తోడుకొని వచ్చి, అతనిమీద కిరీటముంచి, ధర్మశాస్త్ర
మును అతని చేతికిచ్చి అతనికి పట్టాభిషేకము చేసిరి;
యెహోయాదాయును అతని కుమారులును అతనిని
అభిషేకించి—రాజు చిరంజీవియగుగాక యనిరి.
12 పరుగులెత్తుచు రాజును కొనియాడుచు ఉన్న
జనులు చేయు ధ్వని అతల్యా విని యెహోవా
13 మందిరమందున్న జనులయొద్దకు వచ్చి । ప్రవేశస్థలము
దగ్గరనున్న అతనికి ఏర్పాటైన స్తంభమునొద్ద రాజు
నిలువబడియుండుటయు, అధిపతులును బూరలు
ఊదువారును రాజునొద్దనుండుటయు, దేశపు జను
లందరును సంతోషించుచు బూరలతో నాదములు
చేయుచుండుటయు, గాయకులును వాద్యములతో
స్తుతిపాటలు పాడుచుండుటయు చూచి వస్త్రములు
14 చింపుకొని—ద్రోహము ద్రోహమని అరచెను. । అప్పుడు
యాజకుడైన యెహోయాదా—యెహోవా మంది
రములో ఆమెను చంపవలదు, ఆమెను పంక్తుల అవత
లకు వెళ్లవేసి ఆమె పక్షము పూనువారిని కత్తిచేత చంపు
డని సైన్యముమీదనున్న శతాధిపతులకు ఆజ్ఞ ఇచ్చెను. ।
15 కాబట్టి వారు ఆమెకు దారియిచ్చి, రాజ నగరునొద్ద
నున్న గుర్రపు గుమ్మముయొక్క ప్రవేశస్థలమునకు
ఆమె వచ్చినప్పుడు వారు ఆమెను అక్కడ చంపి
వేసిరి. । అప్పుడు యెహోయాదా జనులందరు 16
యెహోవావారై యుండవలెనని జనులందరితోను
రాజుతోను నిబంధనచేసెను. । అంతట జనులందరును 17
బయలు దేవతయొక్క గుడికి పోయి దాని పడగొట్టి,
బలిపీఠములను విగ్రహములను తుత్తునియలుగా విరుగ
గొట్టి, బయలు యాజకుడైన మత్తానును బలిపీఠముల
ముందర చంపిరి. । మరియు మోషే యిచ్చిన ధర్మశాస్త్ర 18
మందు వ్రాయబడినదానినిబట్టి ఉత్సాహముతోను
గానముతోను యెహోవాకు అర్పింపవలసిన దహన
బలులను దావీదు నియమించిన ప్రకారముగా అర్పించు
నట్లును, లేవీయులైన యాజకుల చేతిక్రింద నుండునట్టి
యు, యెహోవా మందిరమందు దావీదు పనులు
పంచివేసినట్టియునైన యెహోవా మందిరపు కావలి
వారికి యెహోయాదా నిర్ణయించెను. । యెహోవా 19
మందిరములోకి దేనిచేతనైనను అంటుతగిలినవారు ప్రవే
శింపకుండునట్లు అతడు ద్వారములయొద్ద ద్వారపాల
కులను ఉంచెను. । మరియు అతడు శతాధిపతులను 20
ప్రధానులను జనుల అధికారులను దేశపు జనులనంద
రిని వెంటబెట్టుకొని యెహోవా మందిరములో
నుండి రాజును తోడుకొని వచ్చెను; వారు ఎత్తయిన
ద్వారముగుండ రాజనగరుచొచ్చి రాజ్యసింహాసనము
మీద రాజును ఆసీనుని చేయగా । దేశ జనులందరు 21
సంతోషించిరి. వారు అతల్యాను చంపిన తరువాత
పట్టణము నెమ్మదిగా ఉండెను.
యోవాషు ఏలనారంభించినప్పుడు ఏడు సంవ **24**
త్సరముల యీడుగలవాడై యెరూషలేములో నలుబది
ఏండ్లు ఏలెను; అతని తల్లి బెయేర్షెబా సంబంధు
రాలైన జిబ్యా. । యాజకుడైన యెహోయాదా 2
బ్రదికిన దినములన్నియు యోవాషు యెహోవా
దృష్టికి యథార్థముగా ప్రవర్తించెను.
యెహోయాదా యిద్దరు భార్యలను పెండ్లిచేసి 3
కొనెను; అతడు కుమారులను కుమార్తెలను కనెను. ।
యెహోవా మందిరమును బాగుచేయవలెనని యోవా 4
షుకు తాత్పర్యము పుట్టెను గనుక । అతడు యాజ 5
కులను లేవీయులను సమకూర్చి—మీరు యూదా
పట్టణములకు పోయి మీ దేవుని మందిరము బాగు
చేయుటకై ఇశ్రాయేలీయులందరియొద్దనుండి ధనమును
ఏటేట సమకూర్చుచు, ఈ కార్యమును మీరు త్వర
పెట్టవలెనని వారికాజ్ఞ ఇచ్చెను. వారు దానిని త్వరగా
చేయకపోయినందున । రాజు ప్రధానయాజకుడగు 6
యెహోయాదాను పిలిచి—ఆ దుర్మార్గురాలైన
అతల్యా కుమారులు దేవుని మందిరమును పాడుచేసి,
యెహోవా మందిర సంబంధమైన ప్రతిష్ఠోపకరణ
ములన్నిటిని బయలుదేవతపూజకు ఉపయోగించిరి. ।
సాక్ష్యపు గుడారమును బాగుచేయుటకై యూదా 7

లోనుండియు యెరూషలేములోనుండియు ఇశ్రాయేలీ
యుల సమాజకులచేత యెహోవా సేవకుడైన మోషే
నిర్ణయించిన కానుకను లేవీయులతో నీవెందుకు చెప్పి
8 తెప్పించలేదని యడిగెను. । కాబట్టి రాజు ఆజ్ఞచొ
ప్పున వారు ఒక పెట్టెను చేయించి యెహోవా
9 మందిరద్వారము బయట ఉంచిరి. । మరియు దేవుని
సేవకుడైన మోషే అరణ్యమందు ఇశ్రాయేలీయులకు
నిర్ణయించిన కానుకను యెహోవాయొద్దకు జనులు
తేవలెనని యూదాలోను యెరూషలేములోను వారు
10 చాటించిరి. । కాగా అధిపతులందరును జనులందరును
సంతోషముగా కానుకలను తీసికొని వచ్చి చాలినంత
11 మట్టుకు పెట్టెలో వేసిరి. । లేవీయులు ఆ పెట్టెను
రాజు విమర్శించు స్థలమునకు తెచ్చుచు వచ్చిరి; అందు
లో ద్రవ్యము విస్తారముగా నున్నట్టు కనబడినప్పుడెల్ల,
రాజుయొక్క ప్రధానమంత్రియు ప్రధానయాజకుడు
నియమించిన పైవిచారణకర్తయు వచ్చి, పెట్టెలోనున్న
ద్రవ్యమును తీసి యథాస్థానమందు దానిని ఉంచుచు
వచ్చిరి; వారీచొప్పున పలుమారు చేయుటచేత విస్తార
12 మైన ద్రవ్యము సమకూర్చబడెను. । అప్పుడు రాజును
యెహోయాదాయును యెహోవా మందిరపు పని
చేయువారికి దానినిచ్చి, యెహోవా మందిరమును
బాగుచేయుటకై కాసెవారిని వడ్లవారిని, యెహోవా
మందిరమును బలపరచుటకు ఇనుపపని యిత్తడిపని
13 చేయువారిని కూలికి కుదిర్చిరి. । ఈలాగున పనివారు
పని జరిగించి సంపూర్తిచేసిరి; వారు దేవుని మందిర
మును దాని యథాస్థితికి తెచ్చి దాని బలపరచిరి. ।
14 అది సిద్ధమైన తరువాత మిగిలిన ద్రవ్యమును రాజు
నొద్దకును యెహోయాదా యొద్దకును తీసికొని
రాగా వారు దానిచేత యెహోవా మందిరపు సేవ
యందు ఉపయోగపడునట్లును, దహనబలుల నర్పిం
చుటయందు ఉపయోగపడునట్లును, ఉపకరణములను
గరిటెలను వెండి బంగారముల ఉపకరణములను చేయిం
చిరి. యెహోయాదాయున్న యన్నిదినములు
యెహోవా మందిరములో దహనబలులు నిత్యమును
అర్పింపబడెను.
15 యెహోయాదా దినములు గడచిన వృద్ధుడై చని
పోయెను; అతడు చనిపోయినప్పుడు నూట ముప్పది
16 ఏండ్లవాడు. । అతడు ఇశ్రాయేలీయులలో దేవుని
దృష్టికిని తన యింటివారి దృష్టికిని మంచివాడై ప్రవర్తిం
చెను గనుక జనులు దావీదు పట్టణమందు రాజుల
17 దగ్గర అతని పాతిపెట్టిరి. । యెహోయాదా చని
పోయిన తరువాత యూదా అధిపతులు వచ్చి రాజుకు
నమస్కరింపగా రాజు వారి మాటకు సమ్మతించెను. ।
18 జనులు తమ పితరుల దేవుడైన యెహోవా మందిర
మును విడిచి, దేవతాస్తంభములకును విగ్రహములకును
పూజచేసిరి; వారు చేసిన యీ యపరాధము నిమిత్తము
యూదావారిమీదికిని యెరూషలేము కాపురస్థుల
మీదికిని కోపము వచ్చెను. । తన వైపునకు వారిని మళ్లిం 19
చుటకై యెహోవా వారియొద్దకు ప్రవక్తలను పంప
గా ఆ ప్రవక్తలు వారిమీద సాక్ష్యము పలికిరి గాని
వారు చెవియొగ్గక యుండిరి. । అప్పుడు దేవుని ఆత్మ 20
యాజకుడగు యెహోయాదా కుమారుడైన జెకర్యా
మీదికి రాగా అతడు జనులయెదుట నిలువబడి—
మీరెందుకు యెహోవా ఆజ్ఞలను మీరుచున్నారు?
మీరు వర్ధిల్లరు; మీరు యెహోవాను విసర్జించితిరి
గనుక ఆయన మిమ్మును విసర్జించి యున్నాడని దేవుడు
సెలవిచ్చుచున్నాడు అనెను. । అందుకు వారతని 21
మీద కుట్రచేసి, రాజు మాటనుబట్టి యెహోవా
మందిరపు ఆవరణములోపల రాతివేతలచేత అతని
చావగొట్టిరి. । ఈ ప్రకారము రాజైన యోవాషు 22
జెకర్యా తండ్రియైన యెహోయాదా తనకు చేసిన
ఉపకారమును మరచినవాడై అతని కుమారుని చంపిం
చెను; అతడు చనిపోవునప్పుడు—యెహోవా దీని
దృష్టించి దీనిని విచారణలోకి తెచ్చునుగాక యనెను.
ఆ సంవత్సరాంతమందు అరాము సైన్యము యో 23
వాషుమీదికి వచ్చెను; వారు యూదాదేశముమీదికిని
యెరూషలేముమీదికిని వచ్చి, శేషములేకుండ జనుల
అధిపతులనందరిని హతముచేసి, తాము పట్టుకొనిన
కొల్లసొమ్మంతయు దమస్కు రాజునొద్దకు పంపిరి. ।
అరామీయులు చిన్న దండుతో వచ్చినను యూదా 24
వారు తమ పితరుల దేవుడైన యెహోవాను విసర్జించి
నందుకై యెహోవా వారిచేతికి అతివిస్తారమైన ఆ
సైన్యమును అప్పగింపగా యోవాషుకు శిక్ష కలిగెను. ।
వారు యోవాషును విడిచిపోయినప్పుడు అతడు 25
మిక్కిలి రోగియై యుండెను. అప్పుడు యాజకుడైన
యెహోయాదా కుమారుల ప్రాణహత్యదోషము
నిమిత్తము అతని సేవకులు అతనిమీద కుట్రచేసి,
అతడు పడకమీద ఉండగా అతని చంపిరి. అతడు
చనిపోయినతరువాత జనులు దావీదు పట్టణమందు
అతని పాతిపెట్టిరి గాని రాజుల సమాధులలో అతని
పాతిపెట్టలేదు. । అతనిమీద కుట్రచేసినవారు అమ్మో 26
నీయురాలైన షిమాతు కుమారుడగు జాబాదు, మో
యాబురాలైన షిమ్రీతు కుమారుడగు యెహోజా
బాదు అనువారు. । అతని కుమారులను గూర్చియు, 27
అతనిమీద చెప్పబడిన అనేకమైన దేవోక్తులను గూర్చి
యు, అతడు దేవుని మందిరమును బాగుచేయుటను
గూర్చియు రాజుల సటీక గ్రంథములో వ్రాయబడి
యున్నది. అతనికి బదులుగా అతని కుమారుడైన
అమజ్యా రాజాయెను.

**25** అమజ్యా యేలనారంభించినప్పుడు ఇరువది
యయిదేండ్లవాడై యిరువది తొ
యెరూషలేములో ఏలెను

సంబంధురాలు, ఆమె పేరు యెహోయద్దాను. ।
2 అతడు యెహోవా దృష్టికి యథార్థముగా ప్రవర్తిం
చెనుగాని పూర్ణహృదయముతో ఆయనను అనుసరింప
3 లేదు. । రాజ్యము తనకు స్థిరమైనప్పుడు అతడు
రాజైన తన తండ్రిని చంపిన రాజసేవకులను చంపిం
4 చెను. । అయితే—తండ్రులు పిల్లలకొరకును పిల్లలు
తండ్రులకొరకును చావకూడదు, ప్రతి మనిషి తన
పాపముకొరకు తానే చావవలెనని మోషే గ్రంథ
మందలి ధర్మశాస్త్రమునందు వ్రాయబడియున్న
యెహోవా ఆజ్ఞనుబట్టి అతడు వారి పిల్లలను చంపక
మానెను.
5 అమజ్యా యూదావారినందరిని సమకూర్చి యూ
దాదేశమంతటను బెన్యామీనీయుల దేశమంతటను
వారి వారి పితరుల యిండ్లనుబట్టి సహస్రాధిపతులను
శతాధిపతులను నియమించెను. అతడు ఇరువది సంవ
త్సరములు మొదలుకొని అంతకు పైప్రాయముగల
వారిని లెక్కింపగా, ఈటెను డాళ్లను పట్టుకొని
యుద్ధమునకు పోదగినట్టి యోధులు మూడు లక్షల
6 మంది కనబడిరి. । మరియు అతడు ఇశ్రాయేలు
వారిలోనుండి లక్షమంది పరాక్రమశాలులను
7 రెండు నూరుల మణుగుల వెండికి కుదిర్చెను. । దైవజను
డైన యొకడు అతనియొద్దకు వచ్చి—రాజా, ఇశ్రా
యేలువారి సైన్యమును నీతోకూడ తీసికొనిపోవద్దు,
యెహోవా ఇశ్రాయేలువారికి ఎఫ్రాయిమీయు
8 లలో ఎవరికిని తోడుగా ఉండడు. । ఆలాగు పోవలె
నని నీకున్న పక్షమున పొమ్ము, యుద్ధము బలముగా
చేసినను దేవుడు నీ శత్రువు ఎదుట నిన్ను కూల్చును;
నిలువబెట్టుటయు పడవేయుటయు దేవుని వశమేగదా
9 అని ప్రకటింపగా । అమజ్యా దైవజనుని చూచి—
ఇశ్రాయేలువారి సైన్యమునకు నేనిచ్చిన రెండు నూరుల
మణుగుల వెండికి ఏమి చేసెదమని అడిగినందుకు—
దీనికంటె మరి యధికముగా యెహోవా నీకు ఇయ్య
10 గలడని ఆ దైవజనుడు ప్రత్యుత్తరమిచ్చెను. । అప్పుడు
అమజ్యా ఎఫ్రాయిములోనుండి తనయొద్దకు వచ్చిన
సైన్యమును వేరుపరచి—మీ యిండ్లకు తిరిగి వెళ్లుడని
వారికి సెలవిచ్చెను; అందుకు వారి కోపము యూదా
వారిమీద బహుగా రగులుకొనెను, వారు ఉగ్రులై
11 తమ యిండ్లకు తిరిగిపోయిరి. । అంతట అమజ్యా
ధైర్యము తెచ్చుకొని తన జనులతోకూడ బయలుదేరి
ఉప్పుపల్లపు స్థలమునకు పోయి శేయీరువారిలో పది
12 వేలమందిని హతముచేసెను. । ప్రాణముతోనున్న మరి
పదివేలమందిని యూదావారు చెరపట్టుకొని, వారిని
ఒక పేటుమీదికి తీసికొనిపోయి ఆ పేటుమీదనుండి
వారిని పడవేయగా వారు తుత్తునియలైపోయిరి. ।
...కూడ యుద్ధమునకు రావద్దని అమజ్యా
...సిన సైనికులు షోమ్రోను మొదలుకొని
బేత్‌హోరోనువరకు ఉన్న యూదాపట్టణముల
మీద పడి వారిలో మూడు వేలమందిని హతముచేసి
విస్తారమైన కొల్లసొమ్ము పట్టుకొనిపోయిరి.
అమజ్యా ఎదోమీయులను ఓడించి తిరిగి వచ్చిన 14
తరువాత అతడు శేయీరువారి దేవతలను తీసికొని
వచ్చి తనకు దేవతలుగా నిలిపి వాటికి నమస్కరించి
ధూపము వేసెను. । అందుకొరకు యెహోవా కోపము 15
అమజ్యామీద రగులుకొనెను. ఆయన అతనియొద్దకు
ప్రవక్తను ఒకని పంపగా అతడు—నీ చేతిలోనుండి
తమ జనులను విడిపింప శక్తిలేని దేవతలయొద్ద నీవెందుకు
విచారణ చేయుదువని అమజ్యాతో ననెను. । అతడు 16
అమజ్యాతో మాటలాడుచుండగా రాజు అతని చూచి
—నీవు రాజుయొక్క ఆలోచనకర్తలలో ఒకడవైతివా?
ఊరకొనుము; నేను నిన్ను చంపనేల అని చెప్పగా
ఆ ప్రవక్త—నీవు ఈలాగున చేసి నా ఆలోచనను
అంగీకరింపకపోవుట చూచి దేవుడు నిన్ను నశింపజేయ
నుద్దేశించి యున్నాడని నాకు తెలియునని చెప్పి
యూరకొనెను.
అప్పుడు యూదారాజైన అమజ్యా ఆలోచన 17
చేసికొని—రమ్ము మనము ఒకరి ముఖమును ఒకరము
చూచుకొనుదమని యెహూకు పుట్టిన యెహోయా
హాజు కుమారుడును ఇశ్రాయేలు రాజునైన యెహో
యాషునొద్దకు వర్తమానము పంపెను. । కాగా ఇశ్రా 18
యేలురాజైన యెహోయాషు యూదారాజైన అమ
జ్యాకు ఈలాగు తిరుగు వర్తమానము పంపెను—నీ
కుమార్తెను నా కుమారునికిమ్మని లెబానోనులోనున్న
ముండ్లచెట్టు లెబానోనులోనున్న దేవదారువృక్షము
నకు వర్తమానము పంపగా లెబానోనులో సంచరించు
ఒక దుష్టమృగము ఆ ముండ్లచెట్టును త్రొక్కివేసెను. ।
—నేను ఎదోమీయులను ఓడించితినిగదా యని నీవను 19
కొనుచున్నావు; నీ హృదయము నీవు గర్వించి ప్రగ
ల్భము లాడునట్లు చేయుచున్నది; యింటియొద్ద నిలిచి
యుండుము; నీవు నా జోలికి వచ్చి కీడు తెచ్చు
కొనుట యెందుకు? నీవును నీతోకూడ యూదావా
రును అపజయమొందుట యెందుకు? । జనులు ఎదో 20
మీయుల దేవతలయొద్ద విచారణచేయుచు వచ్చిరి
గనుక వారి శత్రువులచేతికి వారు అప్పగింపబడునట్లు
దేవుని ప్రేరణవలన అమజ్యా ఆ వర్తమానమును అంగీ
కరింపక పోయెను. । ఇశ్రాయేలురాజైన యెహో 21
యాషు బయలుదేరగా యూదాదేశమునకు చేరిన బేత్షె
మెషులో అతడును యూదారాజైన అమజ్యాయును
ఒకరి ముఖము ఒకరు చూచుకొనిరి. । యూదావారు 22
ఇశ్రాయేలువారియెదుట నిలువలేక ఓడిపోగా ప్రతి
వాడును తన తన గుడారమునకు పారిపోయెను. ।
అప్పుడు ఇశ్రాయేలురాజైన యెహోయాషు 23
యెహోయాహాజుకు పుట్టిన యోవాషు కుమారు

డును యూదారాజునైన అమజ్యాను బేత్షెమెషులో
పట్టుకొని యెరూషలేమునకు తీసికొని వచ్చి, యెరూష
లేము ప్రాకారమును ఎఫ్రాయిము గుమ్మము మొదలు
కొని మూలగుమ్మమువరకు నన్నూరుమూరల పొడుగున
24 పడగొట్టెను. । అతడు దేవుని మందిరములో ఓబేదె
దోము నొద్దనున్న వెండియంతయు బంగారమంతయు
ఉపకరణములంతయు రాజు నగరునందున్న సొమ్మును
కుదువపెట్టబడినవారిని తీసికొని షోమ్రోనుకు తిరిగి
వెళ్లెను.
25 ఇశ్రాయేలు రాజును యెహోయాహాజు కుమా
రుడునైన యెహోయాషు మరణమైన తరువాత
యూదారాజును యోవాషు కుమారుడునైన అమజ్యా
26 పదునయిదు సంవత్సరములు బ్రదికెను. । అమజ్యా
చేసిన యితర కార్యములు యూదా ఇశ్రాయేలు
27 రాజుల గ్రంథమందు వ్రాయబడియున్నవి. । అమజ్యా
యెహోవాను అనుసరించుట మానివేసిన తరువాత
జనులు యెరూషలేములో అతనిమీద కుట్రచేయగా
28 అతడు లాకీషుకు పారిపోయెను. । అయితే వారు
అతనివెనుక లాకీషుకు మనుష్యులను పంపి అతని
అక్కడ చంపి, గుఱ్ఱములమీద అతని శవము ఎక్కించి
తీసికొనివచ్చి యూదాపట్టణమందు అతని తండ్రుల
యొద్ద అతని పాతిపెట్టిరి.

**26** అంతట యూదా జనులందరును పదునారేండ్ల
వాడైన ఉజ్జియాను తీసికొని అతని తండ్రియైన అమ
2 జ్యాకు బదులుగా రాజుగా నియమించిరి. । అతడు
ఏలతును కట్టించి, రాజగు తన తండ్రి అతని పితరుల
తోకూడ నిద్రించిన తరువాత అది యూదావారికి
తిరిగి వచ్చునట్లు చేసెను.
3 ఉజ్జియా యేలనారంభించినప్పుడు పదునారేండ్ల
వాడై యెరూషలేములో ఏబది రెండు సంవత్సర
ములు ఏలెను; అతని తల్లి యెరూషలేము సంబంధు
4 రాలు, ఆమెపేరు యెకొల్యా. । అతడు తన తండ్రి
యైన అమజ్యా చర్యయంతటి ప్రకారము యెహోవా
5 దృష్టికి యథార్థముగా ప్రవర్తించెను. । దేవుని ప్రత్య
క్షత విషయమందు తెలివి కలిగిన జెకర్యా దినము
లలో అతడు దేవుని ఆశ్రయించెను, అతడు
యెహోవాను ఆశ్రయించినంతకాలము దేవుడు
6 అతని వర్ధిల్లజేసెను. । అతడు బయలుదేరి ఫిలిష్తీయు
లతో యుద్ధముచేసి గాతు ప్రాకారమును యబ్నె
ప్రాకారమును అష్డోదు ప్రాకారమును పడగొట్టి,
అష్డోదు దేశములోను ఫిలిష్తీయుల ప్రదేశములలోను
7 ప్రాకారపురములను కట్టించెను. । ఫిలిష్తీయులతోను
గూర్బయలులో నివసించిన అరబీయులతోను మెహూ
నీయులతోను అతడు యుద్ధముచేయగా దేవుడు అత
8 నికి సహాయము చేసెను. । అమ్మోనీయులు ఉజ్జియాకు
పన్నిచ్చువారైరి; అతడు అధికముగా బలాభివృద్ధి
నొందెను గనుక అతని కీర్తి ఐగుప్తు మార్గ ప్రదేశము
లన్నిటను వ్యాపించెను. । మరియు ఉజ్జియా యెరూష 9
లేములో మూలగుమ్మము దగ్గరను, పల్లపుస్థలముల
గుమ్మము దగ్గరను, ప్రాకారపు మూల దగ్గరను, దుర్గ
ములను కట్టించి గుమ్మములు దిట్టపరచెను. । అదియు 10
గాక షెఫేలా ప్రదేశములోను మైదానప్రదేశము
లోను అతనికి విస్తారమైన పశువులుండగా అతడు
అరణ్యములో దుర్గములు కట్టించి అనేకమైన బావులు
త్రవ్వించెను. వ్యవసాయమందు అతడు అపేక్షగల
వాడు గనుక పర్వతములలోను కర్మెలులోను అతనికి
వ్యవసాయకులును ద్రాక్షతోట పనివారును కలిగి
యుండిరి.
యుద్ధమునకు ఉజ్జియాకు సైన్యము కలిగియుం 11
డెను; అందులోని యోధులు రాజు అధిపతులలో
హనన్యా అనువాని చేతిక్రిందనుండిరి. ఖజానాదారు
డగు మయశేయాయు ప్రధానమంత్రియగు యెహీ
యేలును వారిలెక్క ఎంతైనది చూచి వారిని పటాల
ముగా ఏర్పరచువారై యుండిరి. । వారి పితరుల 12
యిండ్ల పెద్దల సంఖ్యనుబట్టి పరాక్రమశాలులు రెండు
వేల ఆరు నూరు మందియైరి. । రాజుకు సహాయము 13
చేయుటకై శత్రువులతో యుద్ధము చేయుటయందు
పేరుపొందిన పరాక్రమశాలులైన మూడు లక్షల
ఏడు వేల ఏనూరుమందిగల సైన్యము వారి చేతిక్రింద
ఉండెను. । ఉజ్జియా యీ సైన్యమంతటికి డాళ్లను 14
ఈటెలను శిరస్త్రాణములను కవచములను విల్లులను వడి
సెలలను చేయించెను. । మరియు అతడు అంబులనేమి 15
పెద్దరాళ్లనేమి ప్రయోగించుటకై ఉపాయశాలులు
కల్పించిన యంత్రములను యెరూషలేములో చేయించి
దుర్గములలోను బురుజులలోను ఉంచెను. అతడు
స్థిరపడువరకు అతనికి ఆశ్చర్యకరమైన సహాయము
కలిగెను గనుక అతని కీర్తి దూరముగా వ్యాపించెను.
అయితే అతడు స్థిరపడిన తరువాత అతడు మన 16
స్సున గర్వించి చెడిపోయెను. అతడు ధూపపీఠము
మీద ధూపము వేయుటకై యెహోవా మందిర
ములో ప్రవేశించి తన దేవుడైన యెహోవామీద
ద్రోహము చేయగా । యాజకుడైన అజర్యాయు 17
అతనితోకూడ ధైర్యవంతులైన యెహోవా యాజ
కులు ఎనుబదిమందియు అతని వెంబడి లోపలికి
పోయిరి. । వారు రాజైన ఉజ్జియాను ఎదిరించి— 18
ఉజ్జియా, యెహోవాకు ధూపము వేయుట ధూపము
వేయుటకై ప్రతిష్ఠింపబడిన అహరోను సంతతివారైన
యాజకుల పనియేగాని నీ పని కాదు; పరిశుద్ధస్థలము
లోనుండి బయటికి పొమ్ము, నీవు ద్రోహము చేసి
యున్నావు, దేవుడైన యెహోవా సన్నిధిని ఇది
నీకు ఘనత కలుగజేయదని చెప్పగా । ఉజ్జియా 19
ధూపము వేయుటకు ధూపకలశమును చేత పట్టుకొని

రౌద్రుడై, యాజకులమీద కోపము చూపెను.
యెహోవా మందిరములో ధూపపీఠము ప్రక్క
నతడు ఉండగా యాజకులు చూచుచునే యున్న
ప్పుడు అతని నొసట కుష్ఠరోగము పుట్టెను. ।
20 ప్రధానయాజకుడైన అజర్యాయును యాజకులంద
రును అతనివైపు చూడగా అతడు నొసట కుష్ఠముగల
వాడై యుండెను గనుక తడవుచేయక అతడు అక్కడ
నుండి బయటికి వెళ్లవలెనని వారు చెప్పిరి; యెహోవా
తన్ను మొత్తెనని యెరిగి బయటికి వెళ్లుటకు తానును
21 త్వరపడెను. । రాజైన ఉజ్జియా తన మరణదినము
పర్యంతము కుష్ఠరోగియై యుండెను; కుష్ఠరోగియై
యెహోవా మందిరములోకి పోకుండ ప్రత్యేకింప
బడెను గనుక అతడు ప్రత్యేకముగా ఒక యింటిలో
నివసించుచుండెను; అతని కుమారుడైన యోతాము
రాజు ఇంటివారికి అధిపతియై దేశపు జనులకు
22 న్యాయము తీర్చుచుండెను. । ఉజ్జియా చేసిన యితర
కార్యములనుగూర్చి ఆమోసు కుమారుడును ప్రవక్త
23 యునైన యెషయా వ్రాసెను. । ఉజ్జియా తన పితరు
లతోకూడ నిద్రించెను. అతడు కుష్ఠరోగియని రాజుల
సంబంధమైన శ్మశానభూమిలో అతని పితరులవద్దర
అతని పాతిపెట్టిరి. అతని కుమారుడైన యోతాము
అతనికి బదులుగా రాజాయెను.

**27** యోతాము ఏలనారంభించినప్పుడు ఇరువది
యయిదేండ్లవాడై యెరూషలేములో పదునారు సంవ
త్సరములు ఏలెను; అతని తల్లి సాదోకు కుమార్తె;
2 ఆమె పేరు యెరూషా. । యెహోవా మందిరములో
ప్రవేశించుట తప్ప అతడు తన తండ్రియైన ఉజ్జియా
యొక్క చర్యయంతటి ప్రకారము చేయుచు
యెహోవా దృష్టికి యథార్థముగానే ప్రవర్తించెను;
అతని కాలములో జనులు మరింత దుర్మార్గముగా
3 ప్రవర్తించుచుండిరి. । అతడు యెహోవా మందిరపు
ఎత్తు ద్వారమును కట్టించి ఓపెలు దగ్గరనున్న గోడ
4 చాలమట్టుకు కట్టించెను. । మరియు అతడు యూదా
పర్వతములలో ప్రాకారపురములను కట్టించి అరణ్య
5 ములలో కోటలను దుర్గములను కట్టించెను. । అతడు
అమ్మోనీయులరాజుతో యుద్ధము చేసి జయించెను
గనుక అమ్మోనీయులు ఆ సంవత్సరము అతనికి
ఇన్నూరు మణుగుల వెండిని పది వేల కొలల గోధుమ
ములను పది వేల కొలల యవలను ఇచ్చిరి; ఈ ప్రకా
రముగా అమ్మోనీయులు మరు సంవత్సరమును మూడవ
6 సంవత్సరమును అతనికి చెల్లించిరి. । ఈలాగున
యోతాము తన దేవుడైన యెహోవా దృష్టికి యథా
7 ర్థముగా ప్రవర్తించి బలపరచబడెను. । యోతాము
చేసిన యితర కార్యములనుగూర్చియు, అతడు చేసిన
యుద్ధములన్నిటిని గూర్చియు, అతని చర్యను గూర్చ
యూ ఇశ్రాయేలు యూదారాజుల గ్రంథమందు
వ్రాయబడియున్నది. । అతడు ఏలనారంభించినప్పుడు 8
ఇరువది యయిదేండ్లవాడై యెరూషలేములో పదు
నారు సంవత్సరములు ఏలెను. । యోతాము తన పిత 9
రులతోకూడ నిద్రించెను; అతడు దావీదు పట్టణ
మందు పాతిపెట్టబడెను; అతని కుమారుడైన ఆహాజు
అతనికి బదులుగా రాజాయెను.

ఆహాజు ఏలనారంభించినప్పుడు ఇరువది సంవత్స **28**
రములవాడై యెరూషలేములో పదునారు సంవత్సర
ములు ఏలెను. అతడు తన పితరుడైన దావీదువలె
యెహోవా దృష్టికి యథార్థముగా ప్రవర్తింపలేదు. ।
అతడు ఇశ్రాయేలు రాజుల మార్గములందు నడిచి, 2
బయలు దేవతారూపములుగా పోతవిగ్రహములను
చేయించెను. । మరియు అతడు బెన్హిన్నోము 3
లోయయందు ధూపము వేసి ఇశ్రాయేలీయుల యెదు
టనుండి యెహోవా తోలివేసిన జనముల హేయ
క్రియలచొప్పున తన కుమారులను అగ్నిహోత్ర
ములో నడిపించెను. । అతడు ఉన్నతస్థలములలోను 4
కొండలమీదను ప్రతి పచ్చనిచెట్టుక్రిందను బలులు
అర్పించుచు ధూపము వేయుచు వచ్చెను. । అందు 5
చేత అతని దేవుడైన యెహోవా అతనిని అరాము
రాజుచేతికప్పగించెను. అరామీయులు అతని ఓడించి
అతని జనులలో చాలమందిని చెరపట్టుకొని దమ
స్కుకు తీసికొని పోయిరి. అతడును ఇశ్రాయేలు
రాజుచేతికి అప్పగింపబడెను; ఆ రాజు అతని
లెస్సగా ఓడించెను.

రెమల్యా కుమారుడైన పెకహు యూదావారిలో 6
పరాక్రమశాలులైన లక్ష ఇరువది వేలమందిని ఒక్క
నాడు హతముచేసెను. వారు తమ పితరుల దేవు
డైన యెహోవాను విసర్జించినందున వారికిట్టిగతి
పట్టెను. । పరాక్రమశాలియైన ఎఫ్రాయిమీయుడగు 7
జిఖ్రీ రాజసంతతివాడైన మయశేయాను సభాముఖ్యు
డైన అజ్రీకామును ప్రధానమంత్రియైన ఎల్కా
నానును హతము చేసెను. । ఇదియుగాక ఇశ్రా 8
యేలువారు తమ సహోదరులైన వీరిలోనుండి స్త్రీ
నేమి కుమారులనేమి కుమార్తెలనేమి రెండు లక్షల
మందిని చెరతీసికొని పోయిరి. మరియు వారియొద్ద
నుండి విస్తారమైన కొల్లసొమ్ము తీసికొని దానిని షోమ్రో
నుకు తెచ్చిరి. । యెహోవా ప్రవక్తయగు ఓదేదు 9
అను ఒకడు అచ్చట ఉండెను. అతడు షోమ్రోనుకు
వచ్చిన సమూహము ఎదుటికి పోయి వారితో ఈలాగు
చెప్పెను — ఆలకించుడి, మీ పితరుల దేవుడైన
యెహోవా యూదావారిమీద కోపించినందుచేత
ఆయన వారిని మీ చేతికి అప్పగించెను; మీరు ఆకా
శము నంటునంత రౌద్రముతో వారిని సంహరించి
తిరి. । ఇప్పుడు మీరు యూదావారిని యెరూషలేము 10
కాపురస్థులను మీకొరకు దాసులుగాను దాసురాం

ద్రుగాను లోపరచుకొన దలచియున్నారు. మీ
దేవుడైన యెహోవా దృష్టికి మీరు మాత్రము అప
11 రాధులు కాకయున్నారా? । యెహోవా మహో
గ్రత మీమీద రేగియున్నది గనుక నా మాట ఆల
కించి మీ సహోదరులలోనుండి మీరు చెరపట్టిన
వీరిని విడిచిపెట్టుడి.
12 అప్పుడు ఎఫ్రాయిమీయుల పెద్దలలో యోహా
నాను కుమారుడైన అజర్యా మెషిల్లేమోతు కుమారు
డైన బెరెక్యా షల్లూము కుమారుడైన యెహిజ్కియా
హద్లాయి కుమారుడైన అమాశా అనువారు యుద్ధము
నుండి వచ్చినవారికి ఎదురుగా నిలువబడి వారితో
13 ఇట్లనిరి । — యెహోవా మనమీదికి అపరాధశిక్ష
రప్పించునట్లు మీరు చేసియున్నారు. చెరపట్టిన
వీరిని మీరు ఇక్కడికి రప్పింపకూడదు. మన పాప
ములను అపరాధములను పెంపుజేయుటకు మీరు
పూనుకొని యున్నారు; మన అపరాధము అధి
కమైయున్నది. ఇశ్రాయేలువారమైన మనమీద
14 మహోగ్రత రేగియున్నది. । కాగా అధిపతులును
సమాజముగా కూడినవారును కన్నులార చూచుచుం
డగా ఆయుధస్థులు చెరపట్టినవారిని కొల్లసొమ్మును
15 విడిచిపెట్టిరి. । పేర్లు ఉదాహరింపబడినవారు అప్పుడు
లేచి చెరపట్టబడినవారిని చేపట్టి దోపుసొమ్ముచేత
వారిలో వస్త్రహీనులైనవారికి బట్టలు కట్టించి వారికి
వస్త్రములను పాదరక్షలను ధరింపజేసి అన్నపానములిచ్చి
తలలకు నూనె బెట్టించి వారిలో బలహీనులైనవారిని
గాడిదెలమీద ఎక్కించి సరళవృక్షములుగల పట్టణ
మగు యెరికోకు వారి సహోదరులయొద్దకు వారిని
తోడుకొనివచ్చిరి; తరువాత వారు షోమ్రోనుకు
మరల వెళ్లిరి.
16 ఆ కాలమందు ఎదోమీయులు మరల వచ్చి
యూదాదేశమును పాడుచేసి కొందరిని చెరపట్టు
17 కొని పోగా । రాజైన ఆహాజు తనకు సహాయము
చేయుడని అష్షూరు రాజులయొద్దకు వర్తమానము పం
18 పెను. । ఫిలిష్తీయులు షెఫేలా ప్రదేశములోని పట్టణ
ములమీదను యూదాదేశమునకు దక్షిణపుదిక్కున
నున్న పట్టణములమీదను పడి బేత్షెమెషును అయ్యా
లోనును గెదెరోతును శోకోను దాని గ్రామములను,
తిమ్నాను దాని గ్రామములను, గిమ్జోనును దాని
గ్రామములను ఆక్రమించుకొని అక్కడ కాపురముం
19 డిరి. । ఆహాజు యూదాదేశములో విగ్రహములను
పూజించి యెహోవామీద ద్రోహము చేసి యుం
డెను గనుక యెహోవా ఇశ్రాయేలు రాజైన ఆహాజు
చేసిన దానినిబట్టి యూదావారిని హీనపరచెను. ।
20 అష్షూరురాజైన తిగ్లత్పిలేసెరు అతనియొద్దకు వచ్చి అతని
21 బాధపరచెనేగాని అతని బలపరచలేదు. । ఆహాజు
భాగము లేర్పరచి, యెహోవా మందిరములోనుండి
యొక భాగమును, రాజనగరులోనుండి యొక భాగ
మును, అధిపతులయొద్దనుండి యొక భాగమును తీసి
అష్షూరు రాజుకిచ్చెనుగాని అతడు అతనికి సహాయము
చేయలేదు. । ఆపత్కాలమందు అతడు యెహోవా 22
దృష్టికి మరి యధికముగా అతిక్రమములు జరిగించెను;
అట్లు చేసినవాడు ఈ ఆహాజు రాజే. । ఎట్లనగా— 23
అరాము రాజుల దేవతలు వారికి సహాయము చేయు
చున్నవి గనుక వాటి సహాయము నాకును కలుగునట్లు
నేను వాటికి బలులు అర్పించెదననుకొని, తన్ను ఓడిం
చిన దమస్కువారి దేవతలకు బలులు అర్పించెను;
అయితే అవి అతనికిని ఇశ్రాయేలువారికిని నష్టమునకే
హేతువులాయెను. । ఆహాజు దేవుని మందిరపు ఉప 24
కరణములను సమకూర్చి వాటిని తెగగొట్టించి
యెహోవా మందిరపు తలుపులను మూసివేయించి
యెరూషలేమునందంతట బలిపీఠములను కట్టించెను. ।
యూదాదేశములోని పట్టణములన్నిటిలోను అతడు 25
అన్యుల దేవతలకు ధూపమువేయుటకై బలిపీఠములను
కట్టించి, తన పితరుల దేవుడైన యెహోవాకు కోపము
పుట్టించెను. । అతడు చేసిన యితర కార్యములను 26
గూర్చియు, అతని చర్యయంతటిని గూర్చియు
యూదా ఇశ్రాయేలు రాజుల గ్రంథమందు వ్రాయ
బడియున్నది. । ఆహాజు తన పితరులతో కూడ 27
నిద్రించి యెరూషలేము పట్టణమునందు పాతిపెట్ట
బడెనుగాని ఇశ్రాయేలీయుల రాజుల సమాధులకు
అతడు తేబడలేదు. అతని కుమారుడైన హిజ్కియా
అతనికి బదులుగా రాజాయెను.

హిజ్కియా యేలనారంభించినప్పుడు ఇరువది **29**
యయిదేండ్లవాడై యిరువదితొమ్మిది సంవత్సరములు
యెరూషలేములో ఏలెను. అతని తల్లి జెకర్యా కుమార్తె,
ఆమె పేరు అబీయా. । అతడు తన పితరుడగు దావీదు 2
చర్యయంతటిప్రకారము యెహోవా దృష్టికి యథార్థ
ముగా ప్రవర్తించెను. । అతడు తన యేలుబడియందు 3
మొదటి సంవత్సరము మొదటి నెలను యెహోవా
మందిరపు తలుపులను తెరచి వాటిని బాగుచేసి, ।
యాజకులను లేవీయులను పిలువనంపి, తూర్పుగానున్న 4
రాజవీధిలో వారిని సమకూర్చి । వారికీలాగు ఆజ్ఞ 5
ఇచ్చెను — లేవీయులారా, నా మాట ఆలకించుడి;
ఇప్పుడు మిమ్మును మీరు ప్రతిష్ఠించుకొని, మీ పిత
రుల దేవుడైన యెహోవా మందిరమును ప్రతిష్ఠించి
పరిశుద్ధస్థలములోనుండి నిషిద్ధవస్తువులనన్నిటిని బయ
టికి కొనిపోవుడి. । మన పితరులు ద్రోహులై మన 6
దేవుడైన యెహోవా దృష్టికి చెడునడతలు నడచి
ఆయనను విసర్జించి, ఆయన నివాసమునకు పెడ
ముఖము పెట్టుకొని దానిని అలక్ష్యముచేసిరి. । మరియు 7
వారు మంటపముయొక్క ద్వారములను మూసివేసి
దీపములను ఆర్పివేసె, పరిశుద్ధ స్థలమందు ఇశ్రాయేలీ

యుల దేవునికి ధూపము వేయకయు దహనబలులను
8 అర్పింపకయు ఉండిరి. । అందుచేత యెహోవా
యూదావారిమీదను యెరూషలేము కాపురస్థుల
మీదను కోపించి, మీరు కన్నులార చూచుచున్న
ట్లుగా వారిని ఆయన భీతికిని విస్మయమునకును నింద
9 కును ఆస్పదముగా చేసెను. । కాబట్టి మన తండ్రులు
కత్తిచేత పడిరి; మన కుమారులును కుమార్తెలును భార్య
10 లును చెరలోనికి కొనిపోబడిరి. । ఇప్పుడు మనమీద
నున్న ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా
మహోగ్రత చల్లారునట్లు ఆయనతో మనము నిబం
ధన చేయవలెనని నా మనస్సులో అభిలాష పుట్టెను. ।
11 నా కుమారులారా, తనకు పరిచారకులైయుండి ధూ
పము వేయుచుండుటకును, తన సన్నిధిని నిలుచుటకును,
తనకు పరిచర్యచేయుటకును యెహోవా మిమ్మును
ఏర్పరచుకొనెను గనుక మీరు అశ్రద్ధచేయకుడి.
12 అప్పుడు కహాతీయులలో అమాశై కుమారుడైన
మహతు అజర్యా కుమారుడైన యోవేలు మెరారీయు
లలో అబ్దీ కుమారుడైన కీషు యెహల్లెలేలు కుమారు
డైన అజర్యా గెర్షోనీయులలో జిమ్మా కుమారుడైన
13 యోవాహు యోవాహు కుమారుడైన ఏదెను । ఎలీషా
పాను సంతతివారిలో షిమ్రీ యెహీయేలు ఆసాపు
14 కుమారులలో జెకర్యా మత్తన్యా । హేమాను సంతతి
వారిలో యెహీయేలు షిమీ యెదూతూను సంతతి
వారిలో షెమయా ఉజ్జీయేలు అను లేవీయులు నియ
15 మింపబడిరి. । వీరు తమ సహోదరులను సమకూర్చి
తమ్మును ప్రతిష్ఠించుకొని యెహోవా మాటలనుబట్టి
రాజు ఇచ్చిన ఆజ్ఞచొప్పున యెహోవా మందిర
16 మును పవిత్రపరచుటకు వచ్చిరి. । పవిత్రపరచుటకై
యాజకులు యెహోవా మందిరపు లోపలి భాగము
నకు పోయి యెహోవా మందిరములో తమకు కన
బడిన నిషిద్ధవస్తువులనన్నిటిని యెహోవా మందిరపు
ఆవరణములోనికి తీసికొనిరాగా లేవీయులు వాటిని
17 ఎత్తి కిద్రోను వాగులో పారవేసిరి. । మొదటి నెల
మొదటి దినమున వారు ప్రతిష్ఠచేయ నారంభించి,
ఆ నెల యెనిమిదవ దినమున యెహోవా మంటప
మునకు వచ్చిరి. ఈ ప్రకారము వారు ఎనిమిది దిన
ములు యెహోవా మందిరమును ప్రతిష్ఠించుచు
మొదటి నెల పదునారవ దినమున సమాప్తిచేసిరి.
18 అప్పుడు వారు రాజైన హిజ్కియాయొద్దకు పోయి
—మేము యెహోవా మందిరమంతటిని దహనబలి
పీఠమును ఉపకరణములన్నిటిని సన్నిధి రొట్టెలుంచు
19 బల్లను పవిత్రపరచి యున్నాము. । మరియు రాజైన
ఆహాజు ఏలిన కాలమున అతడు ద్రోహముచేసి పార
వేసిన ఉపకరణములన్నిటిని మేము సిద్ధపరచి ప్రతి
...ము, అవి యెహోవా బలిపీఠము
...చెప్పిరి.

అప్పుడు రాజైన హిజ్కియా పెందలకడ లేచి, 20
పట్టణపు అధికారులను సమకూర్చుకొని యెహోవా
మందిరమునకు పోయెను. । రాజ్యముకొరకును పరి 21
శుద్ధస్థలముకొరకును యూదావారికొరకును పాపపరి
హారార్థబలి చేయుటకై యేడు కోడెలను ఏడు పొట్టే
ళ్లను ఏడు గొఱ్ఱెపిల్లలను ఏడు మేకపోతులను వారు
తెచ్చియుంచిరి గనుక అతడు—యెహోవా బలిపీఠ
ముమీద వాటిని అర్పించుడని అహరోను సంతతి
వారగు యాజకులకు ఆజ్ఞాపించెను. । పరిచారకులు 22
ఆ కోడెలను వధించినప్పుడు యాజకులు వాటి రక్త
మును తీసికొని బలిపీఠముమీద ప్రోక్షించిరి. ఆ ప్రకా
రము వారు పొట్టేళ్లను వధించినప్పుడు యాజకులు ఆ
రక్తమును బలిపీఠముమీద ప్రోక్షించిరి. వారు గొఱ్ఱె
పిల్లలను వధించినప్పుడు ఆ రక్తమును బలిపీఠముమీద
ప్రోక్షించిరి. । పాపపరిహారార్థబలికై రాజు ఎదుటి 23
కిని సమాజము ఎదుటికిని మేకపోతులను తీసికొని
రాగా, వారు తమ చేతులను వాటిమీద ఉంచిన
తరువాత యాజకులు వాటిని వధించి । ఇశ్రాయేలీ 24
యులందరికొరకు దహనబలియు పాపపరిహారార్థ
బలియు అర్పింపవలెనని రాజు ఆజ్ఞాపించి యుండెను
గనుక, ఇశ్రాయేలీయులందరి నిమిత్తము ప్రాయశ్చి
త్తము చేయుటకై బలిపీఠముమీద వాటి రక్తమును
పోసి, పాపపరిహారార్థబలి అర్పించిరి. । మరియు దావీ 25
దును దావీదు రాజునకు దర్శకుడగు గాదును ప్రవక్తయైన
నాతానును చేసిన నిర్ణయముచొప్పున యెహోవా
మందిరములో తాళములను స్వరమండలములను సితా
రాలను వాయించుటకై అతడు లేవీయులను ఏర్పాటు
చేసెను. ఆలాగు జరుగవలెనని యెహోవా తన
ప్రవక్తలద్వారా ఆజ్ఞాపించి యుండెను. । దావీదు 26
చేయించిన వాద్యములను వాయించుటకు లేవీయు
లును బూరలు ఊదుటకు యాజకులును నియమింప
బడిరి. । బలిపీఠముమీద దహనబలులను అర్పించుడని 27
హిజ్కియా ఆజ్ఞాపించెను. దహనబలి యర్పణ ఆరంభ
మగుటతోనే బూరలు ఊదుటతోను ఇశ్రాయేలు
రాజైన దావీదు చేయించిన వాద్యములను వాయిం
చుటతోను యెహోవాకు స్తుతిగానము నారంభ
మాయెను. । అంతసేపును సర్వసమాజము ఆరాధించు 28
చుండెను. గాయకులు పాడుచుండిరి, బూరలు ఊదు
వారు నాదము చేయుచుండిరి, దహనబలియర్పణ
సమాప్తమగువరకు ఇదియంతయు జరుగుచుండెను. ।
వారు అర్పించుట ముగించిన తరువాత రాజును అత 29
నితోకూడనున్న వారందరును తల వంచి ఆరాధిం
చిరి. । —దావీదును దర్శకుడగు ఆసాపును రచించిన 30
శ్లోకములను ఎత్తి యెహోవాను స్తుతించుడని రాజైన
హిజ్కియాయును అధిపతులును లేవీయులకు ఆజ్ఞా

పింపగా వారు సంతోషముతో స్తోత్రములు పాడి
తల వంచి ఆరాధించిరి.
31 అంతట హిజ్కియా—మీరిప్పుడు యెహోవాకు
మిమ్మును ప్రతిష్ఠించుకొంటిరి; దగ్గరకు వచ్చి
యెహోవా మందిరములోనికి బలిద్రవ్యములను కృత
జ్ఞతార్పణలను తీసికొనిరండని ఆజ్ఞ ఇయ్యగా సమా
జపువారు బలిద్రవ్యములను కృతజ్ఞతార్పణలను తీసి
కొని వచ్చిరి. దహనబలులనర్పించుటకు ఎవరికి ఇష్టము
పుట్టెనో వారు దహనబలిద్రవ్యములను తీసికొని
32 వచ్చిరి. । సమాజపువారు తీసికొని వచ్చిన దహనబలి
పశువులెన్నియనగా, డెబ్బది కోడెలును నూరు పొట్టే
ళ్లును ఇన్నూరు గొఱ్ఱెపిల్లలును; ఇవియన్నియు
33 యెహోవాకు దహనబలులుగా తేబడెను. । ప్రతి
ష్ఠింపబడినవి ఆరునూరు ఎద్దులును మూడువేల గొఱ్ఱె
34 లును. । యాజకులు కొద్దిగా ఉన్నందున వారు ఆ
దహనబలి పశువులన్నిటిని ఒలువలేకపోగా, పని సం
పూర్ణమగువరకు కడమ యాజకులు తమ్మును ప్రతిష్ఠిం
చుకొనుపర్యంతము వారి సహోదరులగు లేవీయులు
వారికి సహాయముచేసిరి; తమ్మును ప్రతిష్ఠించుకొనుట
యందు యాజకులకంటె లేవీయులు యథార్థహృద
35 యులై యుండిరి. । సమాధాన బలిపశువుల క్రొవ్వును
దహనబలి పశువులును దహనబలులకు ఏర్పడిన పానా
ర్పణలును సమృద్ధిగా ఉండెను. ఈలాగున యెహోవా
36 మందిరసేవ క్రమముగా జరిగెను. । ఈ కార్యము
అప్పటికప్పుడే జరిగినందున దేవుడు జనులకు సిద్ధపర
చినదాని చూచి హిజ్కియాయును జనులందరును
సంతోషించిరి.

**30** మరియు హిజ్కియా ఇశ్రాయేలీయుల దేవు
డైన యెహోవాకు పస్కాపండుగ ఆచరించుటకై
యెరూషలేములోనున్న యెహోవా మందిరమునకు
రావలసినదని ఇశ్రాయేలువారికందరికిని యూదావారి
కందరికిని వర్తమానములను, ఎఫ్రాయిమీయులకును
2 మనష్షేవారికిని పత్రికలను పంపెను. । సేవకు చాలి
నంతమంది యాజకులు తమ్మునుతాము ప్రతిష్ఠించుకొన
కుండుటచేతను, జనులు యెరూషలేములో కూడు
కొనకుండుటచేతను, మొదటి నెలయందు పస్కాపం
3 డుగ జరుగకపోగా । రాజును అతని అధిపతులును
యెరూషలేములోనున్న సమాజపువారందరును దానిని
4 రెండవ నెలలో ఆచరింపవలెనని యోచనచేసిరి. । ఈ
సంగతి రాజుకును సమాజపువారికందరికిని అనుకూల
5 మాయెను. । కావున బహుకాలమునుండి వారు
వ్రాయబడిన ప్రకారము ఇంత ఘనముగా దాని
నాచరింపకుండుట చూచి, ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవాకు యెరూషలేములో పస్కాపండుగ
ఆచరించుటకై రావలసినదని బెయేర్షెబా మొదలుకొని
దాను పర్యంతము ఇశ్రాయేలీయులందు దేశమంత
టను చాటింపవలెనని వారు నిర్ణయముచేసిరి. । కావున 6
అంచెవాండ్రు రాజునొద్దను అతని అధిపతులయొద్దను
తాకీదులు తీసికొని, యూదా ఇశ్రాయేలు దేశము
లందంతట సంచరించి రాజాజ్ఞను ఈలాగు ప్రచురము
చేసిరి—ఇశ్రాయేలువారలారా, అబ్రాహాము ఇస్సాకు
ఇశ్రాయేలుల దేవుడైన యెహోవావైపు తిరుగుడి;
మీరు తిరిగినయెడల మీలో అష్షూరురాజుల చేతిలో
నుండి తప్పించుకొని శేషించినవారివైపు ఆయన తిరు
గును. । తమ పితరుల దేవుడైన యెహోవాయెడల 7
ద్రోహముగా ప్రవర్తించిన మీ పితరులవలెను మీ
సహోదరులవలెను మీరు ప్రవర్తింపకుడి. వారి
ప్రవర్తన ఎట్టిదో మీకు అగపరచవలెనని ఆయన
వారిని వినాశమునకు అప్పగించెను. । మీ పితరులవలె 8
మీరు అవిధేయులు గాక యెహోవాకు లోబడి,
ఆయన శాశ్వతముగా పరిశుద్ధపరచిన ఆయన పరిశుద్ధ
మందిరములో ప్రవేశించి, మీ దేవుడైన యెహోవా
మహోగ్రత మీ మీదినుండి తొలగిపోవునట్లు ఆయ
నను సేవించుడి. । మీరు యెహోవావైపు తిరిగిన 9
పక్షమున మీ సహోదరులయెడలను మీ పిల్లలయెడ
లను చెరతీసికొని పోయినవారికి కనికరము పుట్టును,
వారు ఈ దేశమునకు తిరిగి వచ్చెదరు. మీ దేవుడైన
యెహోవా కరుణాకటాక్షములు గలవాడు గనుక
మీరు ఆయనవైపు తిరిగినయెడల ఆయన మీయందు
ప్రసన్నుడగును.
అంచెవాండ్రు జెబులూను దేశమువరకును, 10
ఎఫ్రాయిము మనష్షేల దేశములలోనున్న ప్రతి పట్ట
ణమునకును పోయిరి గాని అచ్చటివారు ఎగతాళిచేసి
వారిని అపహసించిరి. । అయినను ఆషేరు మనష్షే 11
జెబులూను దేశముల వారిలోనుండి కొందరు కృంగిన
మనస్సుతో యెరూషలేమునకు వచ్చిరి. । యెహోవా 12
ఆజ్ఞనుబట్టి రాజును అధిపతులును చేసిన నిర్ణయమును
వారు నెరవేర్చునట్లు యూదాలోనివారికి మనస్సు
ఏకముచేయుటకై దేవుని హస్తము వారికి తోడ్పడెను. ।
కావున రెండవ నెలయందు పులియని రొట్టెల 13
పండుగ ఆచరించుటకై అతివిస్తారమైన సమాజముగా
బహు జనులు యెరూషలేములో కూడిరి. । వారు 14
దాని చేపట్టి యెరూషలేములోనున్న బలిపీఠములను
ధూపపీఠములను తీసివేసి, కిద్రోను వాగులో వాటిని
పారవేసిరి. । రెండవ నెల పదునాలవ దినమున వారు 15
పస్కాపశువును వధించిరి; యాజకులును లేవీయులును
సిగ్గునొంది, తమ్మును ప్రతిష్ఠించుకొని దహనబలిపశువు
లను యెహోవా మందిరములోనికి తీసికొని వచ్చిరి. ।
దైవజనుడైన మోషే నియమించిన ధర్మశాస్త్రములోని 16
విధినిబట్టి వారు తమ స్థలమందు నిలువబడగా, యాజ
కులు లేవీయుల చేతిలోనుండి రక్తమును తీసికొని
దానిని ప్రోక్షించిరి. । సమాజములో తమ్మును ప్రతి 17

ష్ఠించుకొనని వారనేకులుండుటచేత యెహోవాకు
వాటిని ప్రతిష్ఠించుటకై ప్రతిష్ఠించుకొనని ప్రతివాని
నిమిత్తము పస్కాపశువులను వధించుపని లేవీయుల కప్ప
18 గింపబడెను. । ఎఫ్రాయిము మనష్షే ఇశ్శాఖారు జెబు
లూను దేశములనుండి వచ్చిన జనులలో చాలామంది
తమ్మును తాము ప్రతిష్ఠించుకొనకయే విధివిరుద్ధముగా
19 పస్కాను భుజింపగా హిజ్కియా । — పరిశుద్ధస్థల
ముయొక్క శుద్ధీకరణము చొప్పున తన్ను పవిత్రపరచు
కొనకయే తన పితరుల దేవుడైన యెహోవాను
ఆశ్రయింప మనస్సు నిలుపుకొనిన ప్రతివాని నిమి
త్తము దయగల యెహోవా ప్రాయశ్చిత్తము చేయు
20 నుగాక అని ప్రార్థింపగా । యెహోవా హిజ్కియా
చేసిన ప్రార్థన అంగీకరించి జనులను స్వస్థపరచెను. ।
21 యెరూషలేములోనున్న ఇశ్రాయేలువారు బహు
సంతోషభరితులై పులియని రొట్టెల పండుగను ఏడు
దినములు ఆచరించిరి. లేవీయులును యాజకులును
యెహోవాను ఘనపరచుచు గొప్ప నాదముగల
వాద్యములతో ప్రతిదినము ఆయనను స్తుతించుచు
22 ఉండిరి. । యెహోవా సేవయందు మంచి నేర్పరులైన
లేవీయులందరితో హిజ్కియా ప్రీతిగా మాటలా
డెను; వారు సమాధానబలులు అర్పించుచు, తమ
పితరుల దేవుడైన యెహోవా దేవుని యొప్పుకొ
23 నుచు ఏడు దినములు పండుగ ఆచరించిరి. । యూదా
రాజైన హిజ్కియా సమాజపువారికి బలియర్పణల నిమి
త్తము వెయ్యి కోడెలను ఏడు వేల గొఱ్ఱెల నిచ్చు
టయు, అధిపతులు వెయ్యి కోడెలను పది వేల గొఱ్ఱెల
నిచ్చుటయు, బహుమంది యాజకులు తమ్మును తాము
24 ప్రతిష్ఠించుకొనుటయు । సమాజపువారందరు చూచి
నిశ్చయించి, మరి ఏడు దినములు పండుగ ఆచరింపవలెనని
యోచనచేసికొని మరి ఏడు దినములు సంతోషముగా
25 దాని ఆచరించిరి. । అప్పుడు యాజకులును లేవీయు
లును యూదావారిలో నుండియు ఇశ్రాయేలువారి
లోనుండియు వచ్చిన సమాజపువారందరును, ఇశ్రా
యేలు దేశములోనుండి వచ్చి యూదాలో కాపుర
26 మున్న అన్యులును సంతోషించిరి. । యెరూషలేము
కాపురస్థులకు మిక్కిలి ఆనందము కలిగెను. ఇశ్రా
యేలు రాజును దావీదు కుమారుడునైన సొలొమోను
కాలమునకు తరువాత ఈలాగున జరిగియుండలేదు. ।
27 అప్పుడు లేవీయులైన యాజకులు లేచి జనులను దీవిం
పగా వారి మాటలు వినబడెను; వారి ప్రార్థన పర
మండలమునవున్న పరిశుద్ధ నివాసమునకు చేరెను.

**31** ఇదంతయు సమాప్తమైన తరువాత అక్కడనున్న
ఇశ్రాయేలువారందరును యూదా పట్టణములకు
పోయి, యూదాదేశమందంతటను, బెన్యామీను
ఎఫ్రాయిము మనష్షే దేశముల యందంతటను ఉన్న
విగ్రహములను నిర్మూలముచేసి, దేవతాస్తంభములను
ముక్కలుగా నరికి, ఉన్నతస్థలములను బలిపీఠములను
పడగొట్టిరి; తరువాత ఇశ్రాయేలువారందరును తమ
తమ పట్టణములలోనున్న తమ తమ స్వాస్థ్యములకు
తిరిగి వెళ్లిరి । అంతట హిజ్కియా యెవరి సేవాధర్మము 2
వారు జరుపుకొనునట్లుగా యాజకులను వరుసల ప్రకా
రముగాను, లేవీయులను వారి వారి వరుసల ప్రకా
రముగాను నియమించెను; దహనబలులను సమాధాన
బలులను అర్పించుటకును, సేవను జరిగించుటకును కృత
జ్ఞతాస్తుతులు చెల్లించుటకును, యెహోవా పాలెపు
ద్వారములయొద్ద స్తుతులు చేయుటకును యాజకులను
లేవీయులను నియమించెను. । మరియు యెహోవా 3
ధర్మశాస్త్రమునందు వ్రాయబడియున్న విధినిబట్టి జరుగు
ఉదయాస్తమయముల దహనబలులకును విశ్రాంతిదినముల
కును అమావాస్యలకును నియామక కాలములకును ఏర్పడి
యున్న దహనబలులను అర్పించుటకై తనకు కలిగిన
ఆస్తిలోనుండి రాజు ఒక భాగమును ఏర్పాటుచేసెను. ।
మరియు యెహోవా ధర్మశాస్త్రమునుబట్టి యాజకులును 4
లేవీయులును ధైర్యము వహించి తమ పని జరుపుకొను
నట్లు వారి భాగములను వారికి ఇయ్యవలెనని
యెరూషలేములో కాపురమున్న జనులకు అతడు ఆజ్ఞా
పించెను. । ఆ యాజ్ఞ వెల్లడియగుటతోడనే ఇశ్రాయేలీ 5
యులు ప్రథమఫలములైన ధాన్య ద్రాక్షారసములను
నూనెను తేనెను సస్యఫలములను విస్తారముగా తీసి
కొని వచ్చిరి. సమస్తమైన వాటిలోనుండియు పదియవ
వంతులను విస్తారముగా తీసికొని వచ్చిరి. । యూదా 6
పట్టణములలో కాపురమున్న ఇశ్రాయేలువారును
యూదావారును ఎద్దులలోను గొఱ్ఱెలలోను పదియవ
వంతును, తమ దేవుడైన యెహోవాకు ప్రతిష్ఠితము
లైన వస్తువులలో పదియవ వంతును తీసికొని వచ్చి
కుప్పలుగా కూర్చిరి. । వారు మూడవ మాసమందు 7
కుప్పలు వేయ నారంభించి ఏడవ మాసమందు ముగిం
చిరి. । హిజ్కియాయును అధిపతులును వచ్చి ఆ కుప్ప 8
లను చూచి యెహోవాను స్తుతించి ఆయన జను
లైన ఇశ్రాయేలీయులను దీవించిరి. । హిజ్కియా ఆ 9
కుప్పలనుగూర్చి యాజకులను లేవీయులను ఆలోచన
యడిగినందుకు సాదోకు సంతతివాడును ప్రధాన
యాజకుడునగు అజర్యా । — యెహోవా మందిర 10
ములోనికి జనులు కానుకలను తెచ్చుట మొదలుపెట్టి
నప్పటినుండి మేము సమృద్ధిగా భోజనము చేసినను
చాలా మిగులుచున్నది; యెహోవా తన జనులను
ఆశీర్వదించినందున ఇంత గొప్పరాశి మిగిలినదని రాజు
తోననగా । హిజ్కియా యెహోవా మందిరములో 11
కొట్లను సిద్ధపరచవలసినదని ఆజ్ఞ ఇచ్చెను. వారు వాటిని
సిద్ధపరచి । ఏమియు అపహరింపకుండ కానుకలను 12
పదియవ భాగములను ప్రతిష్ఠితములుగా తేబడిన వస్తు
వులను లోపల చేర్చిరి; లేవీయుడైన కొననాయా వాటి

మీద విచారణకర్తగా నియమింపబడెను; అతని సహోదరుడైన షిమీ అతనికి సహకారిగా ఉండెను. ।
13 మరియు యెహీయేలు అజజ్యాహు నహతు అశాహేలు యెరీమోతు యోజాబాదు ఎలీయేలు ఇస్మక్యాహు మహతు బెనాయాలనువారు రాజైన హిజ్కియావలనను, దేవుని మందిరమునకు అధిపతియైన అజర్యావలనను, తాము పొందిన ఆజ్ఞచొప్పున కొనన్యా చేతిక్రిందను, అతని సహోదరుడగు షిమీ చేతిక్రిం
14 దను కనిపెట్టువారై యుండిరి. । తూర్పుతట్టు ద్వారము నొద్ద పాలకుడును ఇమ్నా కుమారుడునగు లేవీయుడైన కోరే యెహోవా కానుకలను అతిపరిశుద్ధమైన వాటిని పంచిపెట్టుటకు దేవునికి అర్పింపబడిన స్వేచ్ఛా
15 ర్పణలమీద నియమింపబడెను. । అతని చేతిక్రింద ఏదెను మిన్యామీను యేషూవ షెమయా అమర్యా షెకన్యా అనువారు నమ్మకమైనవారు గనుక యాజకుల పట్టణములందు పిన్న పెద్దలైన తమ సహోదరులకు వంతులచొప్పున భాగములిచ్చుటకు నియమింప
16 బడిరి. । ఇదియుగాక గోత్రములలో మూడు సంవత్సరములు మొదలుకొని అంతకు పైవయస్సు గలవారై జనసంఖ్య సరిచూడబడిన మగవారికందరికిని, వంతుల చొప్పున సేవచేయుటకై ప్రతిదినము యెహోవా
17 మందిరములోకి వచ్చువారందరికిని, । ఇరువది సంవత్సరములు మొదలుకొని అంతకు పైవయస్సు గలవారై వంతులచొప్పున సేవచేయుటకు తమ తమ పితరుల వంశములచొప్పున యాజకులలో సరిచూడబడిన లేవీ
18 యులకు, । అనగా నమ్మకమైనవారై తమ్మును ప్రతిష్ఠించుకొనిన లేవీయులకును, తమ పిల్లలతోను భార్యల
19 తోను కుమారులతోను కుమార్తెలతోను । సమాజమంతటను సరిచూడబడినవారికిని, ఆ యా పట్టణములకు చేరిన గ్రామములలోనున్న అహరోను వంశస్థులైన యాజకులకును, వంతులు ఏర్పరచుటకు వారు నియమింపబడి యుండిరి. పేళ్లచేత చెప్పబడిన ఆ జనులు యాజకులలో పురుషులకందరికిని, లేవీయులలో వంశములచొప్పున సరిచూడబడిన వారికందరికిని వంతులు
20 ఏర్పరచుటకు నియమింపబడిరి. । హిజ్కియా యూదాదేశమందంతటను ఈలాగున జరిగించి, తన దేవుడైన యెహోవా దృష్టికి అనుకూలముగాను యథార్థము
21 గాను నమ్మకముగాను పనిచేయుచు వచ్చెను. । తన దేవుని ఆశ్రయించుటకై దేవుని మందిర సేవవిషయమందేమి ధర్మశాస్త్రవిషయమందేమి ధర్మమంతటివిషయమందేమి తాను ఆరంభించిన ప్రతి పని అతడు హృదయపూర్వకముగా జరిగించి వర్ధిల్లెను.

32 రాజు ఇట్టి నమ్మకమైన చర్య చూపిన తరువాత అష్షూరురాజైన సన్హెరీబు వచ్చి, యూదాదేశములో చొరబడి ప్రాకారపురములయెదుట దిగి వాటిని లో
2 పరచుకొన జూచెను. । సన్హెరీబు దండెత్తి వచ్చి యెరూషలేముమీద యుద్ధముచేయ నుద్దేశించి యున్నాడని
హిజ్కియా చూచి । పట్టణముబయటనున్న ఊటల 3
నీళ్లను అడ్డవలెనని తలచి, తన యధిపతులతోను పరాక్రమశాలులతోను యోచనచేయగా వారతనికి సహా
యము చేసిరి. । — బహు జనులు పోగై అష్షూరు 4
రాజులు రానేల? విస్తారమైన జలము వారికి దొరుక నేల? అనుకొని ఊటలన్నిటిని దేశమధ్యముగుండ పారు
చున్న కాలువను అడ్డిరి. । మరియు రాజు ధైర్యము 5
తెచ్చుకొని, పాడైన గోడ యావత్తు కట్టించి, గోపురములవరకు దానిని ఎత్తు చేయించి, బయట మరియొక గోడను కట్టించి, దావీదు పట్టణములో మిల్లో దుర్గమును బాగుచేయించెను. మరియు ఈటెలను డాళ్లను
విస్తారముగా చేయించెను. । జనులమీద సైన్యాధిపతు 6
లను నియమించి పట్టణపు గుమ్మములకు పోవు రాజవీధిలోకి వారిని తనయొద్దకు రప్పించి వారిని ఈలాగు
హెచ్చరికచేసెను । — మీరు దిగులుపడకుడి, ధైర్యము 7
విడువకుడి; అష్షూరురాజుకైనను అతనితోకూడనున్న సైన్యమంతటికైనను మీరు భయపడవద్దు, విస్మయమొందవద్దు, అతనికి కలిగియున్న సహాయముకంటె ఎక్కువ
సహాయము మనకు కలదు. । మాంససంబంధమైన 8
బాహువే అతనికి అండ, మనకు సహాయము చేయుటకును మన యుద్ధములను జరిగించుటకును మన దేవుడైన యెహోవా మనకు తోడుగా ఉన్నాడని చెప్పగా జనులు యూదారాజైన హిజ్కియా చెప్పిన మాటలయందు నమ్మికయుంచిరి.

ఇదియైన తరువాత అష్షూరురాజైన సన్హెరీబు 9
తన బలగమంతటితో లాకీషుకు ముట్టడివేయుచుండి, యెరూషలేముకు యూదారాజైన హిజ్కియాయొద్దకును, యెరూషలేమునందున్న యూదావారందరియొద్దకును తన సేవకులను పంపి ఈలాగు ప్రకటన
చేయించెను । — అష్షూరురాజైన సన్హెరీబు సెలవిచ్చు 10
నదేమనగా—దేని నమ్మి మీరు ముట్టడివేయబడియున్న
యెరూషలేములో నిలుచుచున్నారు? । కరవుచేతను 11
దాహముచేతను మిమ్మును చంపుటకై — మన దేవుడైన యెహోవా అష్షూరురాజు చేతిలోనుండి మనలను విడిపించునని చెప్పి హిజ్కియా మిమ్మును ప్రేరేపించుచు
న్నాడు గదా? । ఆ హిజ్కియా, మీరు ఒక్క బలిపీఠము 12
ఎదుట నమస్కరించి దానిమీద ధూపము వేయవలెనని యూదావారికిని యెరూషలేమువారికిని ఆజ్ఞ ఇచ్చి, యెహోవా ఉన్నతస్థలములను బలిపీఠములను తీసి
వేసినవాడు కాడా? । నేనును నా పితరులును ఇతర 13
దేశముల జనులకందరికిని ఏమేమి చేసితిమో మీరెరుగరా? ఆ దేశజనుల దేవతలు వారి దేశములను నా చేతిలోనుండి యేమాత్రమైనను రక్షింప చాలియుం
డెనా? । మీ దేవుడు మిమ్మును నా చేతిలోనుండి విడి 14
పింపగల డనుకొనుటకు, నా పితరులు బొత్తిగా నిర్మూ

లము చేసిన ఆ యా దేశస్థుల సకల దేవతలలోను తన
జనులను నా చేతిలోనుండి విడిపింపగలిగిన దేవుడొక
15 డైన యుండెనా? । కాబట్టి యిప్పుడు హిజ్కియాచేత
మీరు మోసపోకుడి, మీరు ఇట్టి ప్రేరేపణకు లోబడి
కుడి, అతని నమ్ముకొనకుడి, యే జనుల దేవుడైనను ఏ
రాజ్యపు దేవుడైనను తన జనులను నా చేతిలోనుండి
గాని నా పితరులచేతిలోనుండి గాని విడిపింపలేక
పోగా, మీ దేవుడు నా చేతిలోనుండి మిమ్మును మొదలే
16 విడిపింపలేక పోవునుగదా? । అతని సేవకులు దేవుడైన
యెహోవామీదను ఆయన సేవకుడైన హిజ్కియా
17 మీదను ఇంకను పేలాపనలు పేలిరి. । అదియుగాక
ఇతరదేశముల జనుల దేవతలు తమ జనులను నా చేతి
లోనుండి యేలాగున విడిపింపలేకపోయిరో ఆలాగున
హిజ్కియా సేవించు దేవుడును తన జనులను నా చేతి
లోనుండి విడిపింపలేకపోవునని ఇశ్రాయేలు దేవుడైన
యెహోవాను నిందించుటకును, ఆయనమీద అప
వాదములు పలుకుటకును అతడు పత్రికలు వ్రాసి
18 పంపెను. । అప్పుడు వారు పట్టణమును పట్టుకొనవలె
నన్న యోచనతో, ప్రాకారముమీదనున్న యెరూష
లేము కాపురస్థులను బెదరించుటకును నొప్పించుట
కును, యూదభాషలో బిగ్గరగా వారితో ఆ మాటలు
19 పలికిరి. । మరియు వారు మనుష్యుల చేతిపనియైన
భూజనుల దేవతలమీద తాము పలికిన దూషణలను
యెరూషలేముయొక్క దేవునిమీద కూడను పలికిరి.
20 రాజైన హిజ్కియాయును ఆమోసు కుమారుడైన
యెషయా అను ప్రవక్తయును ఇందును గురించి
ప్రార్థించి ఆకాశముతట్టు చూచి మొఱ్ఱపెట్టగా ।
21 యెహోవా ఒక దూతను పంపెను. అతడు అష్షూరు
రాజు దండులోని పరాక్రమశాలులనందరిని సేనా
నాయకులను అధికారులను నాశముచేయగా అష్షూరు
రాజు సిగ్గునొందినవాడై తన దేశమునకు తిరిగిపోయెను.
అంతట అతడు తన దేవుని గుడిలో చొచ్చినప్పుడు
అతని కడుపున పుట్టినవారే అతని అక్కడ కత్తిచేత
22 చంపిరి. । ఈ ప్రకారము యెహోవా హిజ్కియాను
యెరూషలేము కాపురస్థులను అష్షూరురాజైన సన్హెరీబు
చేతిలోనుండియు అందరిచేతిలోనుండియు రక్షించి,
23 అన్నివైపులను వారిని కాపాడినందున । అనేకులు
యెరూషలేములో యెహోవాకు అర్పణలను
యూదారాజైన హిజ్కియాకు కానుకలను తెచ్చి
యిచ్చిరి. అందువలన అతడు అప్పటినుండి సకల జన
ముల దృష్టికి ఘనతనొందినవాడాయెను.
24 ఆ దినములలో హిజ్కియా రోగియై మరణదశ
లోనుండెను. అతడు యెహోవాకు మొఱ్ఱపెట్టగా
ఆయన అతనికి తన చిత్తమును తెలియపరచి అతనికి
25 సూచన యొకటి దయచేసెను. । అయితే హిజ్కియా
మనస్సున గర్వించి తనకు చేయబడిన మేలుకు తగినట్లు
ప్రవర్తింపనందున అతనిమీదికిని యూదా యెరూష
లేముల వారిమీదికిని కోపము రాగా । హిజ్కియా 26
హృదయగర్వము విడిచి, తానును యెరూషలేము కాపు
రస్థులును తమ్మును తాము తగ్గించుకొనిరి గనుక హిజ్కి
యా దినములలో యెహోవా కోపము జనులమీదికి
రాలేదు. । హిజ్కియాకు అతివిస్తారమైన ఐశ్వర్య 27
మును ఘనతయు కలిగెను. అతడు వెండిబంగారము
లను రత్నములను సుగంధద్రవ్యములను డాళ్లను నానా
విధములగు శ్రేష్ఠమైన ఉపకరణములను సంపాదించి
వాటికి బొక్కసములను కట్టించెను. । ధాన్యమును 28
ద్రాక్షారసమును తైలమును ఉంచుటకు కొట్లను, పలు
విధముల పశువులకు శాలలను మందలకు దొడ్లను కట్టిం
చెను. । మరియు దేవుడు అతనికి అతివిస్తారమైన కలిమి 29
దయచేసినందున పట్టణములను విస్తారమైన గొఱ్ఱెల
మందలను పసులమందలను అతడు సంపాదించెను. ।
ఈ హిజ్కియా గిహోను కాలువకు ఎగువను కట్టి 30
వేయించి దావీదుపట్టణపు పడమటివైపుకు దాని తెప్పిం
చెను; హిజ్కియా తాను పూనుకొనిన సర్వప్రయత్న
ములయందును వృద్ధిపొందెను. । అతని దేశము ఆశ్చర్య 31
ముగా వృద్ధినొందుటను గూర్చి విచారించి తెలిసికొను
టకై బాబెలు అధిపతులు అతనియొద్దకు పంపిన రాయ
భారుల విషయములో అతని శోధించి, అతని హృద
యములోని ఉద్దేశమంతయు తెలిసికొనవలెనని దేవు
డతని విడిచిపెట్టెను.
హిజ్కియా చేసిన యితర కార్యములనుగూర్చియు, 32
అతడు చూపిన భక్తినిగూర్చియు, ప్రవక్తయును
ఆమోసు కుమారుడునగు యెషయాకు కలిగిన దర్శన
ముల గ్రంథమునందును యూదా ఇశ్రాయేలుల
రాజుల గ్రంథమునందును వ్రాయబడియున్నది. ।
హిజ్కియా తన పితరులతోకూడ నిద్రింపగా జనులు 33
దావీదు సంతతివారి శ్మశానభూమియందు కట్ట
బడిన పైస్థానమునందు అతని పాతిపెట్టిరి. అతడు
మరణమొందినప్పుడు యూదావారందరును యెరూష
లేము కాపురస్థులందరును అతనికి ఉత్తరక్రియలను
ఘనముగా జరిగించిరి. అతని కుమారుడైన మనష్షే అత
నికి మారుగా రాజాయెను.

**మ**నష్షే యేలనారంభించినప్పుడు పన్నెండేండ్లవాడై **33**
యెరూషలేములో ఏబది యయిదు సంవత్సర
ములు ఏలెను. । ఇతడు ఇశ్రాయేలీయుల యెదుట 2
నుండి యెహోవా వెళ్లగొట్టిన అన్యజనులు చేసిన
హేయక్రియలను అనుసరించి, యెహోవా దృష్టికి
చెడునడత నడిచెను. । ఇతడు తన తండ్రియైన 3
హిజ్కియా పడగొట్టిన ఉన్నతస్థలములను తిరిగి కట్టించి,
బయలు దేవతకు బలిపీఠములను నిలిపి, దేవతాస్తంభము
లను చేయించి, ఆకాశనక్షత్రములన్నిటిని పూజించి
కొలిచెను. । మరియు—నా నామము ఎన్నెన్నటికి 4

ఉండునని యెరూషలేమునందు ఏ స్థలమునుగూర్చి
యెహోవా సెలవిచ్చెనో అక్కడనున్న యెహోవా
మందిరమందు అతడు బలిపీఠములను కట్టించెను. ।
5 మరియు యెహోవా మందిరపు రెండు ఆవరణము
లలో అతడు ఆకాశనక్షత్ర సమూహమునకు బలి
6 పీఠములను కట్టించెను. । బెన్‌హిన్నోము లోయ
యందు అతడు తన కుమారులను అగ్నిలోగుండ నడి
పించి, ముహూర్తములను విచారించుచు, మంత్రము
లను చిల్లంగితనమును వాడుకచేయు కర్ణపిశాచముల
తోను సోదెగాండ్లతోను సాంగత్యము చేయుచు,
యెహోవా దృష్టికి బహుగా చెడునడత నడుచుచు
ఆయనకు కోపము పుట్టించెను. । — ఇశ్రాయేలీయుల
7 గోత్రస్థానములన్నిటిలో నేను కోరుకొనిన యెరూష
లేమునందు నా నామము నిత్యము ఉంచెదను; నేను
మోషేద్వారా నియమించిన కట్టడలను విధులను ధర్మ
శాస్త్రమంతటిని అనుసరించి నడుచుకొనుటకై వారు
జాగ్రత్తపడినయెడల, మీ పితరులకు నేను ఖాయ
పరచిన దేశమునుండి ఇశ్రాయేలీయులను నేను ఇక
తొలగింపనని దావీదుతోను అతని కుమారుడైన సొలో
మోనుతోను దేవుడు సెలవిచ్చిన మాటను లక్ష్య
పెట్టక, ఆ మందిరమునందు మనష్షే తాను చేయించిన
9 చెక్కుడు విగ్రహమును నిలిపెను. । ఈ ప్రకారము
మనష్షే యూదావారిని యెరూషలేము కాపురస్థు
లను మోసపుచ్చినవాడై, ఇశ్రాయేలీయులయెదుట
ఉండకుండ యెహోవా నశింపజేసిన అన్యజనుల
కంటెను వారు మరింత అక్రమముగా ప్రవర్తించు
నట్లు చేయుటకు కారకుడాయెను.
10 యెహోవా మనష్షేకును అతని జనులకును వర్త
మానములు పంపినను వారు చెవియొగ్గకపోయిరి. ।
కాబట్టి యెహోవా అష్షూరురాజుయొక్క సైన్యాధి
పతులను వారిమీదికి రప్పించెను. మనష్షే తప్పించు
కొని పోకుండ వారు అతని పట్టుకొని, గొలు
సులతో బంధించి అతనిని బాబెలునకు తీసికొని
12 పోయిరి. । అతడు శ్రమలో ఉన్నప్పుడు తన దేవు
డైన యెహోవాను బ్రతిమాలుకొని, తన పితరుల
దేవుని సన్నిధిని తన్నుతాను బహుగా తగ్గించుకొని ।
13 ఆయనకు మొరలిడగా, ఆయన అతని విన్నపములను
ఆలకించి యెరూషలేమునకు అతని రాజ్యములోనికి అతని
తిరిగి తీసికొని వచ్చినప్పుడు యెహోవా దేవుడై
యున్నాడని మనష్షే తెలిసికొనెను.
14 ఇదిగాక తరువాత అతడు దావీదుపట్టణము బయట
గిహోనునకు పడమరగా లోయయందు మత్స్యపు
గుమ్మమువరకు ఓపెలు చుట్టును బహు ఎత్తుగల గోడను
కట్టించెను. మరియు యూదా దేశములోని బలమైన
పట్టణములన్నిటిలోను సేనాధిపతులను ఉంచెను. ।
15 మరియు యెహోవా మందిరమునుండి అన్యుల దేవ
తలను విగ్రహమును తీసివేసి, యెరూషలేమునందును
యెహోవా మందిర పర్వతమునందును తాను కట్టిం
చిన బలిపీఠములన్నిటిని తీసి పట్టణము బయటికి వాటిని
లాగివేయించెను. । ఇదియుగాక అతడు యెహోవా 16
బలిపీఠమును బాగుచేసి, దానిమీద సమాధానబలు
లను కృతజ్ఞతార్పణలను అర్పించుచు — ఇశ్రాయేలీ
యుల దేవుడైన యెహోవాను సేవించుడని యూదా
వారికి ఆజ్ఞ ఇచ్చెను. । అయినను జనులు ఉన్నత 17
స్థలములయందు ఇంతకు బలులు అర్పించుచు వచ్చిరి
గాని ఆ యర్పణలను తమ దేవుడైన యెహోవా
నామమునకే చేసిరి. । మనష్షే చేసిన యితర కార్య 18
ములను గూర్చియు, అతడు దేవునికి పెట్టిన
మొరలను గూర్చియు, ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవా పేరట అతనితో పలికిన దర్శకులు
చెప్పిన మాటలను గూర్చియు, ఇశ్రాయేలు రాజుల
గ్రంథమందు వ్రాయబడియున్నది. । అతడు చేసిన 19
ప్రార్థనను గూర్చియు, అతని మనవి వినబడుటను
గూర్చియు, అతడు చేసిన పాపద్రోహములన్నిటిని
గూర్చియు, తాను గుణపడకమందు ఉన్నత స్థలము
లను కట్టించి దేవతాస్తంభములను చెక్కిన విగ్రహము
లను అచ్చట నిలుపుటను గూర్చియు, దర్శకులు రచిం
చిన గ్రంథములలో వ్రాయబడియున్నది. । మనష్షే 20
తన పితరులతోకూడ నిద్రించి తన నగరునందు
పాతిపెట్టబడెను; అతని కుమారుడైన ఆమోను అతనికి
మారుగా రాజాయెను.
ఆమోను ఏలనారంభించినప్పుడు ఇరువది రెండేండ్ల 21
వాడై యెరూషలేములో రెండు సంవత్సరములు
ఏలెను. । అతడు తన తండ్రియైన మనష్షే నడిచినట్లు 22
యెహోవా దృష్టికి చెడునడత నడిచెను; తన తండ్రి
యైన మనష్షే చేయించిన చెక్కుడు విగ్రహములన్ని
టికి బలులు అర్పించుచు పూజించుచు । తన తండ్రి 23
యైన మనష్షే గుణపడినట్లు యెహోవా సన్నిధిని
పశ్చాత్తప్తుడు కాకను గుణపడకను, ఈ ఆమోను
అంతకంతకు ఎక్కువ ద్రోహకార్యములను చేయుచు
వచ్చెను. । అతని సేవకులు అతనిమీద కుట్రచేసి అతని 24
నగరునందే అతని చంపగా । దేశజనులు ఆమోను 25
రాజుమీద కుట్రచేసినవారినందరిని హతముచేసి అతని
కుమారుడైన యోషీయాను అతని స్థానమందు రాజుగా
నియమించిరి.

యోషీయా యేలనారంభించినప్పుడు ఎనిమి **34**
దేండ్లవాడై యెరూషలేములో ముప్పది యొక సంవ
త్సరము ఏలెను. । అతడు యెహోవా దృష్టికి నీతి 2
ననుసరించుచు, కుడికైనను ఎడమకైనను తొలగకుండ,
తన పితరుడైన దావీదు చూపిన ప్రవర్తనకు సరిగా ప్రవ
ర్తించెను. । తన యేలుబడియందు ఎనిమిదవ సంవత్సర 3
మున తానింకను బాలుడై యుండగానే అతడు తన

పితరుడైన దావీదుయొక్క దేవునియొద్ద విచారించు
టకు పూనుకొనినవాడై, పన్నెండవ యేట ఉన్నతస్థల
ములను దేవతాస్తంభములను పడగొట్టి, చెక్కిన విగ్ర
హములను పోత విగ్రహములను తీసివేసి, యూదా
దేశమును యెరూషలేమును పవిత్రముచేయ నారం
4 భించెను. । అతడు చూచుచుండగా జనులు బయలు
దేవతల బలిపీఠములను పడగొట్టి, వాటిపైన ఉన్న
సూర్యదేవతా విగ్రహములను అతని ఆజ్ఞచొప్పున
నరికివేసి, దేవతాస్తంభములను చెక్కిన విగ్రహములను
పోతవిగ్రహములను తుత్తునియలుగా కొట్టి చూర్ణము
చేసి, వాటికి బలులు అర్పించినవారి సమాధులమీద
5 చల్లివేసిరి. । బయలుదేవత యాజకుల శల్యములను
బలిపీఠములమీద అతడు కాల్పించి, యూదాదేశ
6 మును యెరూషలేమును పవిత్రపరచెను. । ఆ ప్రకా
రము అతడు మనష్షే ఎఫ్రాయిము షిమ్యోను దేశ
ములవారి పట్టణములలోను, నఫ్తాలి మన్యమునందును,
చుట్టుపట్లనున్న పాడుస్థలములన్నిటను బలిపీఠములను
7 పడగొట్టెను. । బలిపీఠములను దేవతాస్తంభములను పడ
గొట్టి చెక్కిన విగ్రహములను చూర్ణముచేసి, ఇశ్రా
యేలీయుల దేశమంతటనున్న సూర్యదేవతా విగ్ర
హములన్నిటిని నరికివేసి అతడు యెరూషలేముకు
తిరిగి వచ్చెను.

8 అతని యేలుబడియందు పదునెనిమిదవ సంవత్సర
మున, దేశమును మందిరమును పవిత్రపరచుటయైన
తరువాత, అతడు అజల్యా కుమారుడైన షాఫానును,
పట్టణాధిపతియైన మయశేయాను, రాజ్యపు దస్తా
వేజులమీదనున్న యోవాహాజు కుమారుడగు యోవా
హాజును, తన దేవుడైన యెహోవా మందిరమును
9 బాగుచేయుటకై పంపెను. । వారు ప్రధానయాజకు
డైన హిల్కీయాయొద్దకు వచ్చి, ద్వారపాలకులైన లేవీ
యులు మనష్షే ఎఫ్రాయిమీయుల దేశములయందు
ఇశ్రాయేలువారిలో శేషించియున్నవారందరియొద్ద
నుండియు, యూదా బెన్యామీనీయులందరియొద్ద
నుండియు కూర్చి, దేవుని మందిరములోనికి తీసికొని
10 వచ్చిన ద్రవ్యమును అతనికి అప్పగించిరి. । వారు
దానిని యెహోవా మందిరపు పనిమీదనున్న పై
విచారణకర్తలకియ్యగా, దాని బాగుచేయుటకును,
యూదా రాజులు పాడుచేసిన యిండ్లకు దూలము
11 లను అమర్చుటకును । చెక్కిన రాళ్లను జోడింపుపనికి
మ్రానులను కొనుటకై యెహోవా మందిరమునందు
పనిచేయువారికిని శిల్పకారులకును దాని నిచ్చిరి. ।
12 ఆ మనుష్యులు ఆ పనిని నమ్మకముగా చేసిరి. వారి
మీది పైవిచారణకర్తలు ఎవరనగా, మెరారీయులైన
లేవీయులగు యహతు ఓబద్యా అనువారును, పని
నడిపించుటకు ఏర్పడిన కహాతీయులగు జెకర్యా మెషు
ల్లాము అనువారును. లేవీయులలో వాద్యప్రవీణు
లైనవారు వారితోకూడ ఉండిరి. । మరియు బరు 13
వులు మోయువారిమీదను, ప్రతివిధమైన పని జరి
గించువారిమీదను ఆ లేవీయులు పైవిచారణకర్తలుగా
నియమింపబడిరి. మరియు లేవీయులలో లేఖికులును
పరిచారకులును ద్వారపాలకులునైనవారు ఆ యా
పనులమీద నియమింపబడిరి. । యెహోవా మందిర 14
ములోకి తేబడిన ద్రవ్యమును బయటికి తీసికొని వచ్చి
నప్పుడు, మోషేద్వారా యెహోవా దయచేసిన ధర్మ
శాస్త్రముగల గ్రంథమొకటి యాజకుడైన హిల్కీయాకు
కనబడెను. । అప్పుడు హిల్కీయా—యెహోవా మందిర 15
మందు ధర్మశాస్త్రముగల గ్రంథమొకటి నాకు దొరికెనని
ప్రధానమంత్రియగు షాఫానుతో చెప్పి ఆ గ్రంథమును
షాఫానుకు అప్పగించెను. । షాఫాను ఆ గ్రంథమును 16
రాజునొద్దకు తీసికొనిపోయి రాజుతో ఇట్లనెను—నీ
సేవకులకు నీవు ఆజ్ఞాపించినదంతయు వారు చేయుచు
న్నారు. । యెహోవా మందిరమునందు దొరికిన 17
ద్రవ్యమును వారు పోగుచేసి పైవిచారణకర్తల చేతికిని
పనివారి చేతికిని దాని అప్పగించియున్నారు. । మరియు 18
యాజకుడైన హిల్కీయా నాకు ఒక గ్రంథము ఇచ్చెనని
రాజు ఎదుట మనవిచేసికొని, ప్రధానమంత్రియగు
షాఫాను రాజు సముఖమున దాని చదివి వినిపించెను. ।
అతడు ధర్మశాస్త్రపు మాటలు చదివి వినిపింపగా రాజు 19
విని తన వస్త్రములను చింపుకొని ; హిల్కీయాకును, 20
షాఫాను కుమారుడైన అహీకాముకును, మీకా
కుమారుడైన అబ్దోనుకును, ప్రధానమంత్రియగు షాఫా
నుకును, రాజు సేవకుడైన అశాయాకును ఈలాగున
ఆజ్ఞ ఇచ్చెను । — మీరు వెళ్లి దొరికిన యీ గ్రంథ 21
ములోని మాటల విషయమై నాకొరకును, ఇశ్రాయేలు
యూదాలవారిలో శేషించియున్నవారికొరకును
యెహోవాయొద్ద విచారించుడి. మన పితరులు
ఈ గ్రంథమునందు వ్రాయబడియున్న సమస్తమును
అనుసరింపకయు, యెహోవా ఆజ్ఞలను గైకొనకయు
నుండిరి గనుక యెహోవా కోపము మనమీదికి
అత్యధికముగా వచ్చియున్నది.

అప్పుడు హిల్కీయాయును రాజు నియమించిన 22
వారును సంగతినిగూర్చి విచారణచేయుటకై హస్రాకు
పుట్టిన తిక్వా కుమారుడును వస్త్రశాలకు పైవిచారణ
కర్తయునగు షల్లూముయొక్క భార్యయైన హుల్దా
అను ప్రవక్త్రియొద్దకు పోయిరి. ఆమె అప్పుడు యెరూ
షలేముకు చేరిన యుపభాగములో కాపురముండెను.
వారు ఆమెతో సంగతి చెప్పగా । ఆమె వారితో 23
ఇట్లనెను—ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా
సెలవిచ్చునదేమనగా ।—ఆలకించుడి, నేను ఈ స్థలము 24
మీదికిని దాని కాపురస్థులమీదికిని యూదారాజు
సముఖమున చదివి వినిపింపబడిన గ్రంథమునందు
వ్రాయబడియున్న శాపములన్నిటిని రప్పించెదను. ।

వారు నన్ను విసర్జించి యితర దేవతలకు ధూపము
వేసి, తమ చేతిపనులవలన నాకు కోపము పుట్టించి
యున్నారు గనుక నా కోపము ఈ స్థలముమీద మితి
లేకుండ కుమ్మరింపబడును. నాయొద్దకు మిమ్మును పంపిన
వానికి ఈ వార్త తెలుపుడి. । మరియు యెహోవా
యొద్ద విచారించుడని మిమ్మును పంపిన యూదా
రాజుకు మీరు ఈ మాట తెలియజెప్పుడి—నీవు ఎవని
మాటలు వినియున్నావో ఇశ్రాయేలీయుల దేవుడైన
ఆ యెహోవా సెలవిచ్చునదేమనగా ।—నీ మనస్సు
మెత్తనిదై యీ స్థలముమీదను దాని కాపురస్థుల
మీదను దేవుడు పలికిన మాటలను నీవు వినినప్పుడు నా
సన్నిధిని నిన్ను నీవు తగ్గించుకొని నీ వస్త్రములు చింపు
కొని నా సన్నిధిని కన్నీరు విడిచితివి గనుక నీ మన
వి నేను ఆలకించితిని. । నేను నీ పితరులయొద్ద నిన్ను
చేర్చుదును; నెమ్మదిగలవాడవై నీవు నీ సమాధిలోకి
చేర్చబడుదువు; ఈ స్థలముమీదికిని దాని కాపు
రస్థులమీదికిని నేను రప్పించు అపాయమును నీవు
కన్నులార చూడవు.

వారు రాజునొద్దకు ఈ వర్తమానము తీసికొని రాగా
రాజు యూదా యెరూషలేములలోని పెద్దలనందరిని
పిలువనంపించి । వారిని సమకూర్చెను. రాజును,
యూదావారందరును, యెరూషలేము కాపురస్థు
లును, యాజకులును, లేవీయులును, జనులలో పిన్న
పెద్దలందరును యెహోవా మందిరమునకు రాగా
యెహోవా మందిరమందు దొరికిన నిబంధన గ్రం
థపు మాటలన్నియు వారికి వినిపింపబడెను. । పిమ్మట
రాజు తన స్థలమందు నిలువబడి—నేను యెహోవాను
అనుసరించుచు, ఆయన ఇచ్చిన ఆజ్ఞలను శాసనములను
కట్టడలను పూర్ణమనస్సుతోను పూర్ణహృదయముతోను
గైకొనుచు, ఈ గ్రంథమందు వ్రాయబడిన నిబంధన
మాటల ప్రకారముగా ప్రవర్తించుదునని యెహోవా
సన్నిధిని నిబంధన చేసికొనెను. । మరియు అతడు
యెరూషలేమునందున్న వారినందరిని బెన్యామీనీ
యులనందరిని అట్టి నిబంధనకు ఒప్పుకొనజేసెను
గనుక యెరూషలేము కాపురస్థులు తమ పితరుల
దేవుడైన దేవుని నిబంధన ప్రకారము ప్రవర్తించిరి. ।
మరియు యోషీయా ఇశ్రాయేలీయులకు చేరిన దేశము
లన్నిటిలోనుండి హేయమైన విగ్రహములన్నిటిని
తీసివేసి, ఇశ్రాయేలీయులందరును తమ దేవుడైన
యెహోవాను సేవించునట్లు చేసెను. అతని దినము
లన్నియు వారు తమ పితరుల దేవుడైన యెహోవాను
అనుసరించుట మానలేదు.

**5** మరియు యోషీయా యెరూషలేమునందు
యెహోవాకు పస్కాపండుగ ఆచరించెను. మొదటి నెల
పదునాల్గవ దినమున జనులు పస్కాపశువును వధించిరి. ।
అతడు యాజకులను వారి వారి పనులకు నిర్ణయించి,
యెహోవా మందిరసేవను జరిగించుటకై వారిని
ధైర్యపరచి । ఇశ్రాయేలీయులకందరికి బోధచేయు 3
వారును యెహోవాకు ప్రతిష్ఠితులునైన లేవీయులకు
ఈలాగు ఆజ్ఞ ఇచ్చెను—పరిశుద్ధమైన మందసమును
మీరిక మీ భుజములమీద మోయక, ఇశ్రాయేలీ
యుల రాజైన దావీదు కుమారుడగు సొలొమోను
కట్టించిన మందిరములో దాని నుంచుడి. మీ దేవుడైన
యెహోవాను ఆయన జనులైన ఇశ్రాయేలీయుల
కును సేవ జరిగించుడి. । ఇశ్రాయేలీయుల రాజైన దావీదు 4
వ్రాసి యిచ్చిన క్రమముచొప్పునను అతని కుమారు
డైన సొలొమోను వ్రాసి ఇచ్చిన క్రమముచొప్పు
నను మీ మీ పితరుల యిండ్లకు ఏర్పాటైన వరుసలను
బట్టి మిమ్మును సిద్ధపరచుకొనుడి. । జనుల ఆ యా 5
భాగములకు లేవీయుల కుటుంబములలో ఆ యా
భాగములు ఏర్పాటగునట్లుగా మీరు పరిశుద్ధ స్థల
మందు నిలిచి, వారి వారి పితరుల కుటుంబముల
వరుసలనుబట్టి జనులైన మీ సహోదరులకొరకు
సేవచేయుడి. । ఆ ప్రకారము పస్కాపశువును 6
వధించి మిమ్మును ప్రతిష్ఠించుకొని, మోషేద్వారా
యెహోవా యిచ్చిన ఆజ్ఞలను అనుసరించి, దాని
మీ సహోదరులకొరకు సిద్ధపరచుడి. । మరియు 7
యోషీయా తన స్వంత మందలో ముప్పది వేల
గొఱ్ఱెపిల్లలను మేకపిల్లలను మూడువేల కోడెలను
అక్కడనున్న జనులకందరికి పస్కాపశువులుగా ఇచ్చెను. ।
అతని అధిపతులును జనులకును యాజకులకును లేవీ 8
యులకును మనఃపూర్వకముగా పశువులు ఇచ్చిరి.
యెహోవా మందిరపు అధికారులైన హిల్కీయాయు,
జెకర్యాయు, యెహీయేలును పస్కాపశువులుగా
యాజకులకు రెండువేల ఆరునూరు గొఱ్ఱెలను
మున్నూరు కోడెలను ఇచ్చిరి. । కొనన్యాయు, అతని 9
సహోదరులైన షెమయాయు, నెతనేలును, లేవీ
యులలో నధిపతులగు హషబ్యాయు, యెహీ
యేలును, యోజాబాదును పస్కాపశువులుగా
లేవీయులకు అయిదు వేల గొఱ్ఱెలను ఏనూరు కోడె
లను ఇచ్చిరి. । ఈ ప్రకారము సేవ జరుగుచుండగా 10
రాజాజ్ఞనుబట్టి యాజకులు తమ స్థలములోను లేవీ
యులు తమ వరుసలలోను నిలువబడిరి. । లేవీయులు 11
పస్కాపశువులను వధించి రక్తమును యాజకులకియ్యగా
వారు దాని ప్రోక్షించిరి. లేవీయులు పశువులను
ఒలువగా । మోషే గ్రంథములో వ్రాయబడిన 12
ప్రకారము జనుల కుటుంబముల విభాగము చొప్పున
యెహోవాకు అర్పణగా ఇచ్చుటకు దహనబలిపశు
మాంసమును యాజకులు తీసికొనిరి. వారు ఎడ్లను
కూడ ఆ ప్రకారముగానే చేసిరి. । వారు విధిప్రకా 13
రము పస్కాపశుమాంసమును నిప్పుమీద కాల్చిరి
గాని యితరమైన ప్రతిష్ఠార్పణలను కుండలలోను

బొరుసులలోను పెనములలోను ఉడికించి జనులకంద
14 రికి త్వరగా వడ్డించిరి. । తరువాత లేవీయులు తమ
కొరకును యాజకులకొరకును సిద్ధముచేసిరి. అహరోను
సంతతివారగు యాజకులు దహనబలిపశుమాంసమును
క్రొవ్వును రాత్రివరకు అర్పింపవలసివచ్చెను గనుక
లేవీయులు తమకొరకును అహరోను సంతతివారగు
15 యాజకులకొరకును సిద్ధపరచిరి. । మరియు ఆసాపు
సంతతివారగు గాయకులును, ఆసాపు హేమానులును,
రాజుకు దర్శకుడగు యెదూతూనును దావీదు నియ
మించిన ప్రకారముగా తమ స్థలమందుండిరి; ద్వార
ములన్నిటియొద్దను ద్వారపాలకులు కనిపెట్టుచుండిరి.
వారు తమ చేతిలో పని విడిచి అవతలికి వెళ్లిపోకుండు
నట్లు వారి సహోదరులగు లేవీయులు వారికొరకు
16 సిద్ధపరచిరి. । ఈ ప్రకారము రాజైన యోషీయా
యిచ్చిన ఆజ్ఞనుబట్టి వారు పస్కాపండుగ ఆచరించి,
యెహోవా బలిపీఠముమీద దహనబలులను అర్పిం
చుటచేత ఆ దినమున ఏమియు లోపములేకుండ
17 యెహోవా సేవ జరిగెను. । అక్కడనున్న ఇశ్రా
యేలీయులు ఆ కాలమందు పస్కా అను పులియని
రొట్టెల పండుగను ఏడు దినములు ఆచరించిరి. ।
18 ప్రవక్తయగు సమూయేలు దినములు మొదలుకొని
ఇశ్రాయేలీయులలో పస్కాపండుగ అంత ఘనముగా
ఆచరింపబడి యుండలేదు. యోషీయాయు, యాజ
కులును, లేవీయులును, అక్కడనున్న యూదా ఇశ్రా
యేలువారందరును, యెరూషలేము కాపురస్థులును
ఆచరించిన ప్రకారము ఇశ్రాయేలు రాజులందరిలో
ఒక్కడైనను పస్కాపండుగను ఆచరించి యుండ
19 లేదు. । యోషీయా యేలుబడియందు పదునెనిమిదవ
సంవత్సరమున ఈ పస్కాపండుగ జరిగెను.
20 ఇదంతయు అయిన తరువాత యోషీయా మంది
రమును సిద్ధపరచినప్పుడు ఐగుప్తురాజైన నెకో ఫరాతు
నదియొద్దనున్న కర్కెమీషుమీదికి దండెత్తి రాగా యో
21 షీయా అతనిమీదికి బయలుదేరెను. । అయితే రాజైన
నెకో అతనియొద్దకు రాయబారులను పంపి—యూదా
రాజా నీతో నాకేమి? పూర్వమునుండి నాకు శత్రువు
లగువారిమీదికేగాని నేడు నీమీదికి నేను రాలేదు.
దేవుడు త్వరచేయుమని నాకు ఆజ్ఞాపించెను గనుక
దేవుడు నాతోకూడ ఉండి నిన్ను నశింపజేయకుండు
నట్లు ఆయన జోలికి నీవు రావద్దని చెప్ప నాజ్ఞాపిం
22 చెను. । అయినను యోషీయా అతనితో యుద్ధము
చేయగోరి, అతనియొద్దనుండి తిరిగిపోక మారువేషము
ధరించుకొని, యెహోవా నోటి మాటలుగా పలుక
బడిన నెకో మాటలను వినక మెగిద్దో లోయయందు
యుద్ధముచేయ వచ్చెను. । విలుకాండ్రు రాజైన యో
షీయామీద బాణములు వేయగా రాజు తన సేవకు
లను చూచి—నాకు గొప్పగాయము తగిలెను, ఇక్కడ
నుండి నన్ను కొంచుపోవుడని చెప్పెను. । కావున 24
అతని సేవకులు రథముమీదనుండి అతని దింపి, అతని
కున్న వేరు రథముమీద అతని ఉంచి యెరూషలే
ముకు అతని తీసికొని వచ్చిరి. అతడు మృతిబొంది
తన పితరుల సమాధులలో ఒకదానియందు పాతి
పెట్టబడెను. యూదా యెరూషలేమువారందరును
యోషీయా చనిపోయెనని ప్రలాపము చేసిరి. । యిర్మీ 25
యాయు యోషీయానుగూర్చి ప్రలాపవాక్యము
చేసెను, గాయకులందరును గాయకురాండ్రందరును
తమ ప్రలాపవాక్యములలో అతనిగూర్చి పలికిరి;
నేటివరకు యోషీయానుగూర్చి ఇశ్రాయేలీయులలో
ఆలాగు చేయుట వాడుక ఆయెను. ప్రలాపవాక్య
ములలో అట్టివి వ్రాయబడియున్నవి. । యో 26
షీయా చేసిన యితర కార్యములన్నిటిని గూర్చియు,
యెహోవా ధర్మశాస్త్రవిధులననుసరించి అతడు చూపిన
భయభక్తులను గూర్చియు, । అతడు చేసిన సమస్త 27
క్రియలను గూర్చియు ఇశ్రాయేలు యూదాల
రాజుల గ్రంథమందు వ్రాయబడియున్నది.

అప్పుడు దేశపు జనులు యోషీయా కుమారుడైన 36
యెహోయాహాజును స్వీకరించి యెరూషలేములో
అతని తండ్రి స్థానమున అతనిని రాజుగా నియమిం
చిరి. । యెహోయాహాజు ఏలనారంభించినప్పుడు 2
ఇరువది మూడేండ్లవాడై యెరూషలేములో మూడు
నెలలు ఏలెను. । ఐగుప్తురాజు యెరూషలేమునకు వచ్చి 3
అతని తొలగించి, ఆ దేశమునకు ఇన్నూరు మణుగుల
వెండిని రెండు మణుగుల బంగారమును జుల్మానాగా
నిర్ణయించి । అతని సహోదరుడైన ఎల్యాకీమును 4
యూదామీదను యెరూషలేముమీదను రాజుగా
నియమించి, అతనికి యెహోయాకీము అను మారు
పేరు పెట్టెను. నెకో అతని సహోదరుడైన యెహో
యాహాజును పట్టుకొని ఐగుప్తునకు తీసికొనిపోయెను.

యెహోయాకీము ఏలనారంభించినప్పుడు ఇరువది 5
యయిదేండ్లవాడై యెరూషలేములో పదకొండు సం
వత్సరములు ఏలెను. అతడు తన దేవుడైన యెహోవా
దృష్టికి చెడునడత నడుచుటచేత । అతనిమీదికి బాబెలు 6
రాజైన నెబుకద్నెజరు వచ్చి అతని బాబెలుకు తీసికొని
పోవుటకై గొలుసులతో బంధించెను. । మరియు నెబు 7
కద్నెజరు యెహోవా మందిరపు ఉపకరణములలో
కొన్నిటిని బాబెలుకు తీసికొనిపోయి బాబెలులో
నున్న తన గుడిలో ఉంచెను. । యెహోయాకీము 8
చేసిన యితర కార్యములను గూర్చియు, అతడు హేయ
దేవతలను పెట్టుకొనుటను గూర్చియు, అతని సకల
ప్రవర్తనను గూర్చియు ఇశ్రాయేలు యూదారాజుల
గ్రంథమందు వ్రాయబడియున్నది. అతని కుమారుడైన
యెహోయాకీను అతనికి బదులుగా రాజాయెను.

9 యెహోయాకీను ఏలనారంభించినప్పుడు ఎనిమి
దేండ్లవాడై యెరూషలేములో మూడు నెలల పది దిన
ములు ఏలెను. అతడు యెహోవా దృష్టికి చెడు
10 నడత నడిచెను. । ఏడాదినాటికి, రాజైన నెబుకద్నెజరు
దూతలను పంపి యెహోయాకీనును బాబెలుకు
రప్పించి, అతని సహోదరుడైన సిద్కియాను యూదా
మీదను యెరూషలేముమీదను రాజుగా నియమిం
చెను. మరియు అతడు రాజువెంట యెహోవా మంది
రములోని ప్రశస్తమైన ఉపకరణములను తెప్పించెను.
11 సిద్కియా యేలనారంభించినప్పుడు ఇరువది యొక
టేండ్లవాడై యెరూషలేములో పదకొండు సంవత్సర
12 ములు ఏలెను. । అతడు తన దేవుడైన యెహోవా
దృష్టికి చెడునడత నడుచుచు, ఆయన నియమించిన
ప్రవక్తయైన యిర్మీయా మాట వినకయు, తన్నుతాను
13 తగ్గించుకొనకయు ఉండెను. । మరియు దేవుని నామ
మునుబట్టి తనచేత ప్రమాణముచేయించిన నెబుకద్నె
జరు రాజుమీద అతడు తిరుగబాటుచేసెను. అతడు
మొండితనము వహించి ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవా వైపు తిరుగక తన మనస్సును కఠినపరచు
14 కొనెను. । అదియుగాక యాజకులలోను జనులలోను
అధిపతులగువారు, అన్యజనులు పూజించు హేయ
మైన విగ్రహములను పెట్టుకొని బహుగా ద్రోహులై,
యెహోవా యెరూషలేములో పరిశుద్ధపరచిన మంది
15 రమును అపవిత్రపరచిరి. । వారి పితరుల దేవుడైన
యెహోవా తన జనులయందును తన నివాసస్థలమం
దును కటాక్షముగలవాడై వారియొద్దకు తన దూతల
ద్వారా వర్తమానము పంపుచు వచ్చెను. ఆయన పెందల
16 కడ లేచి పంపుచు వచ్చినను । వారు దేవుని దూతలను
ఎగతాళిచేయుచు, ఆయన వాక్యములను తృణీకరిం
చుచు, ఆయన ప్రవక్తలను హింసించుచు రాగా, నివా
రింప శక్యముకాకుండ యెహోవా కోపము ఆయన
17 జనులమీదికి **వచ్చెను.** । ఆయన వారిమీదికి కల్దీయుల
రాజును రప్పింపగా అతడు వారికి పరిశుద్ధస్థలముగా
నున్న మందిరములోనే వారి యౌవనులను ఖడ్గముచేత
సంహరించెను. అతడు యౌవనులయందైనను, యువ
తులయందైనను, ముసలివారియందైనను, నెరసిన వెం
డ్రుకలుగల వారియందైనను కనికరింపలేదు. దేవుడు
వారినందరిని అతనిచేతి కప్పగించెను. । మరియు బాబెలు 18
రాజు పెద్దవేమి చిన్నవేమి దేవుని మందిరపు ఉపకర
ణములన్నిటిని, యెహోవా మందిరపు నిధులలోని
దేమి రాజు నిధులలోనిదేమి అధిపతుల నిధులలోని
దేమి, దొరికిన ద్రవ్యమంతయు బాబెలుకు తీసికొని
పోయెను. । అదియుగాక కల్దీయులు దేవుని మందిర 19
మును తగలబెట్టి, యెరూషలేము ప్రాకారమును పడ
గొట్టి, దానియొక్క నగరులన్నిటిని కాల్చివేసిరి. దాని
లోని ప్రశస్తమైన వస్తువులన్నిటిని బొత్తిగా పాడు
చేసిరి. । ఖడ్గముచేత హతులు కాకుండ తప్పించుకొనిన 20
వారిని అతడు బాబెలుకు తీసికొని పోయెను. రాజ్యము
పారసీకులదగువరకు వారు అక్కడనే యుండి అతని
కిని అతని కుమారులకును దాసులైరి. । యిర్మీయాద్వారా 21
పలుకబడిన యెహోవా మాట నెరవేరుటకై దేశ
ములో జనులు ఆచరించని విశ్రాంతిదినములను దేశము
అనుభవించువరకు ఇది సంభవించెను. దేశము పాడుగా
నున్న డెబ్బది సంవత్సరములకాలము అది విశ్రాంతి
దినముల ననుభవించెను.

పారసీకదేశపు రాజైన కోరెషు ఏలుబడియందు 22
మొదటి సంవత్సరమున యిర్మీయా ద్వారా పలుకబడిన
తన వాక్యమును నెరవేర్చుటకై యెహోవా పారసీక
దేశపు రాజైన కోరెషు మనస్సును ప్రేరేపింపగా
అతడు తన రాజ్యమందంతటను చాటించి వ్రాతమూల
ముగా ఇట్లు ప్రకటనచేయించెను :—పారసీకదేశపు 23
రాజైన కోరెషు ఆజ్ఞాపించునదేమనగా—పరమండలి
దేవుడైన యెహోవా సకల జనములను నా వశము
చేసి, యూదాదేశమందున్న యెరూషలేములో తనకు
మందిరమును కట్టించుమని నాకు ఆజ్ఞ ఇచ్చియున్నాడు;
ఆయన జనులగు మీయందరిలో బయలుదేరవలెనన్న
యిచ్ఛగలవారెవరో వారు బయలుదేరవచ్చును; వారి
దేవుడైన యెహోవా వారికి తోడుగా నుండునుగాక.

# ఎజ్రా

1 పారసీకదేశపు రాజైన కోరెషు ఏలుబడిలో
మొదటి సంవత్సరమందు యిర్మీయాద్వారా పలుకబడిన
తన వాక్యమును నెరవేర్చుటకై యెహోవా పారసీక
దేశపు రాజైన కోరెషు మనస్సును ప్రేరేపింపగా
అతడు తన రాజ్యమందంతట చాటింపుచేయించి
వ్రాతమూలముగా ఇట్లు ప్రకటన చేయించెను। —
2 పారసీకదేశపు రాజైన కోరెషు ఆజ్ఞాపించునదేమన
గా — పరమండలి దేవుడైన యెహోవా లోకమం
దున్న సకల జనములను నా వశముచేసి, యూదా
దేశమందున్న యెరూషలేములో తనకు మందిరమును
3 కట్టించుమని నాకు ఆజ్ఞ ఇచ్చియున్నాడు. । కావున
ఆయన జనులలో చేరికైనవారై మీ మధ్య నివసించు
వారెవరో వారు యూదాదేశమందున్న యెరూష
లేమునకు పోయి, యెరూషలేములోని దేవుని మందిర
మును, అనగా ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా
మందిరమును కట్టవలెను; వారి దేవుడు వారికి తోడై
4 యుండును గాక. । మరియు యెరూషలేములోనుండు
దేవుని మందిరమును కట్టించుటకై స్వేచ్ఛార్పణను గాక
ఆ యా స్థలములలోనివారు తమయొద్ద నివసించువారికి
వెండి బంగారములను వస్తువులను పశువులను ఇచ్చి
5 సహాయము చేయవలెను. । అప్పుడు యూదా పెద్ద
లును, బెన్యామీనీయుల పెద్దలును, యాజకులును
లేవీయులును, ఎవరెవరి మనస్సును దేవుడు ప్రేరేపిం
చెనో వారందరు వారితో కూడుకొని వచ్చి, యెరూష
లేములో ఉండు యెహోవా మందిరమును కట్టుటకు
6 ప్రయాణమైరి. । మరియు వారి చుట్టునున్నవారంద
రును స్వేచ్ఛగా అర్పించినవి గాక, వెండి ఉపకరణ
ములను బంగారును పశువులను ప్రశస్తమైన వస్తువులను
7 ఇచ్చి వారికి సహాయము చేసిరి. । మరియు నెబుకద్నె
జరు యెరూషలేములోనుండి తీసికొని వచ్చి తన దేవ
తలయొక్క గుడియందుంచిన యెహోవా మందిరపు
ఉపకరణములను రాజైన కోరెషు బయటికి తెప్పిం
8 చెను. । పారసీకదేశపు రాజైన కోరెషు తన ఖజానా
దారుడైన మిత్రిదాతు ద్వారా వాటిని బయటికి
తెప్పించి లెక్కచేయించి, యూదులకు అధిపతియగు
9 షేష్బజ్జరుచేతికి అప్పగించెను. । వాటియొక్క లెక్క
ముప్పది బంగారపు పళ్లెములును వెయ్యి వెండి పళ్లెము
10 లును ఇరువది తొమ్మిది కత్తులును । ముప్పది బంగారు
గిన్నెలును నన్నూట పది వెండితో చేయబడిన రెండవ
రకమైన గిన్నెలును, మరి యితరమైన ఉపకరణము
లును వెయ్యియై యుండెను. । బంగారు వస్తువు 11
లును వెండి వస్తువులును అన్నియు అయిదువేల
నన్నూరు. షేష్బజ్జరు బాబెలు చెరలోనుండి విడిపింప
బడినవారితో కూడ కలిసి వీటన్నిటిని యెరూషలేముకు
తీసికొని వచ్చెను.

బాబెలురాజైన నెబుకద్నెజరుచేత బాబెలు దేశ 2
మునకు చెరగా తీసికొని పోబడినవారికి ఆ దేశమందు
పుట్టి చెరలోనుండి విడిపింపబడి । యెరూషలేముకును 2
యూదాదేశమునకును తమ తమ పట్టణములకు పోవు
నట్లుగా సెలవుపొంది, జెరుబ్బాబెలు యేషూవ నెహె
మ్యా శెరాయా రెయేలాయా మొర్దెకై బిల్షాను మిస్పె
రెతు బిగ్వయి రెహూము బయనా అనువారితో కూడ
వచ్చిన ఇశ్రాయేలీయులయొక్క లెక్క యిది. ।
పరోషు వంశస్థులు రెండు వేల నూట డెబ్బది యిద్దరు,। 3
షెఫట్య వంశస్థులు మున్నూట డెబ్బది యిద్దరు, । 4
ఆరహు వంశస్థులు ఏడునూట డెబ్బది యయిదుగురు, । 5
పహత్మోయాబు వంశస్థులు యేషూవ యోవాబు వంశ 6
స్థులతో కూడ రెండు వేల ఎనమన్నూట పన్నెండు
గురు, । ఏలాము వంశస్థులు వెయ్యిన్ని ఇన్నూట ఏబది 7
నలుగురు, । జత్తూ వంశస్థులు తొమ్మన్నూట నలువది 8
యయిదుగురు, । జక్కయి వంశస్థులు ఏడునూట అరు 9
వది మంది, । బానీ వంశస్థులు ఆరున్నూట నలువది 10
యిద్దరు, । బేబై వంశస్థులు ఆరున్నూట ఇరువది ముగ్గురు, । 11
అజ్గాదు వంశస్థులు వెయ్యిన్ని ఇన్నూట ఇరువది 12
యిద్దరు, । అదోనీకాము వంశస్థులు ఆరున్నూట అరు 13
వది ఆరుగురు, । బిగ్వయి వంశస్థులు రెండు వేల ఏబది 14
ఆరుగురు, । ఆదీను వంశస్థులు నన్నూట ఏబది నలు 15
గురు, । అటేరు వంశస్థులు హిజ్కియాతో కూడ తొం 16
బది ఎనమండుగురు, । బెజయి వంశస్థులు మున్నూట 17
ఇరువది ముగ్గురు, । యోరా వంశస్థులు నూటపన్నెండు 18
గురు, । హాషుము వంశస్థులు ఇన్నూట ఇరువది 19
ముగ్గురు, । గిబ్బారు వంశస్థులు తొంబది యయిదు 20
గురు, । బేత్లెహేము వంశస్థులు నూట ఇరువది ముగ్గు 21
రు, । నెటోపా వంశస్థులు ఏబది ఆరుగురు, । అనా 22
తోతు వంశస్థులు నూట ఇరువది యెనమండుగురు, । 23
అజ్మావెతు వంశస్థులు నలువది యిద్దరు, । కిర్యాతారీము 24
కెఫీరా బెయేరోతు అనువారి వంశస్థులు ఏడునూట 25
నలుబది ముగ్గురు, । రామా గెబ అనువారి వంశస్థులు 26
ఆరున్నూట ఇరువది యొక్కరు, । మిక్మషు వంశస్థులు 27
నూట ఇరువది ముగ్గురు, । బేతేలు హాయి మనుష్యులు 28

ఇన్నూట ఇరువది యిద్దరు, । నెబో వంశస్థులు ఏబది
ఇద్దరు, । మగ్బీషు వంశస్థులు నూట ఏబది ఆరుగురు, ।
ఇంకొక ఏలాము వంశస్థులు వెయ్యిన్ని యిన్నూట
ఏబది నలుగురు, । హారిము వంశస్థులు మున్నూట ఇరు
వదిమంది, । లోదు హాదీదు ఓనో అనువారి వంశస్థులు
ఏడునూట ఇరువది యయిదుగురు, । యెరికో వంశ
స్థులు మున్నూట నలువది యయిదుగురు, । సెనాయా
వంశస్థులు మూడు వేల ఆర్నూట ముప్పదిమంది, ।
యాజకులలో యేషూవ యింటివారైన యెదాయా
వంశస్థులు తొమ్మన్నూట ఏబది ముగ్గురు, । ఇమ్మేరు వంశ
స్థులు వెయ్యిన్ని ఏబది ఇద్దరు, । పషూరు వంశస్థులు
వెయ్యిన్ని ఇన్నూట నలుబది యేడుగురు, । హారిము
వంశస్థులు వెయ్యిన్ని పదునేడుగురు, । లేవీయులలో
యేషూవ కద్మీయేలు హొదవ్యా అనువారి వంశస్థులు
కలిసి డెబ్బది నలుగురు, । గాయకులలో ఆసాపు వంశ
స్థులు నూట ఇరువది యెనమండుగురు, । ద్వారపాల
కులలో షల్లూము అటేరు టల్మోను అక్కూబు హటీటా
షోబయి అనువారందరి వంశస్థులు నూట ముప్పది
తొమ్మండుగురు, । నెతీనీయులలో జీహా వంశస్థులు
హశూపా వంశస్థులు టబ్బాయోతు వంశస్థులు, ।
కేరోసు వంశస్థులు, సీయహా వంశస్థులు, పాదోను వంశ
స్థులు, । లెబానా వంశస్థులు, హగాబా వంశస్థులు,
అక్కూబు వంశస్థులు, । హాగాబు వంశస్థులు, షల్మయి
వంశస్థులు, హానాను వంశస్థులు, । గిద్దేలు వంశస్థులు,
గహరు వంశస్థులు, రెవాయా వంశస్థులు, । రెజీను
వంశస్థులు, నెకోదా వంశస్థులు, గజ్జాము వంశస్థులు, ।
ఉజ్జా వంశస్థులు, పాసెయ వంశస్థులు, బేసాయి వంశ
స్థులు, । అస్నా వంశస్థులు, మెహూనీము వంశస్థులు,
నెపూసీము వంశస్థులు, । బక్బూకు వంశస్థులు, హకూపా
వంశస్థులు, హర్హూరు వంశస్థులు, । బజ్లీతు వంశస్థులు,
మెహీదా వంశస్థులు, హర్షా వంశస్థులు, । బర్కోసు
వంశస్థులు, సీసెరా వంశస్థులు, తెమహు వంశస్థులు, ।
నెజీయహు వంశస్థులు, హటీపా వంశస్థులు, । సొలొ
మోను సేవకుల వంశస్థులు, సొటయి వంశస్థులు, సోపె
రెతు వంశస్థులు, పెరూదా వంశస్థులు, । యహలా
వంశస్థులు, దర్కోను వంశస్థులు, గిద్దేలు వంశస్థులు, ।
షెఫట్య వంశస్థులు, హట్టీలు వంశస్థులు, జెబాయీము
సంబంధమైన పొకెరెతు వంశస్థులు, ఆమీ వంశస్థులు, ।
నెతీనీయులును సొలొమోను సేవకుల వంశస్థులును
అందరును కలిసి మున్నూట తొంబది యిద్దరు. ।
మరియు తేల్మెలహు తేల్హర్షా కెరూబు అద్దాను ఇమ్మేరు
అను స్థలములలోనుండి కొందరు వచ్చిరి. అయితే వీరు
తమ పితరులయొక్క యింటినైనను వంశావళినైనను
చూపింపలేకపోయినందున వారు ఇశ్రాయేలీయులో
కారో తెలియకపోయెను. । వారు ఎవరనగా దెలాయ్యా
వంశస్థులు, టోబీయా వంశస్థులు, నెకోదా వంశస్థులు,

వీరు ఆరునూట ఏబది యిద్దరు. । మరియు యాజకు 61
లలో హబాయ్యా వంశస్థులు, హక్కోజు వంశస్థులు,
గిలాదీయుడైన బర్జిల్లయియొక్క కుమార్తెలలో ఒకతెను
పెండ్లిచేసికొని వారి పేళ్లను పట్టి బర్జిల్లయి అని పిలువ
బడినవాని వంశస్థులు. । వీరు వంశావళి లెక్కలో తమ 62
తమ పేరులను వెదకినప్పుడు అవి కనబడకపోయినం
దున యాజక ధర్మములోనుండి ప్రత్యేకింపబడి అప
విత్రులుగా ఎంచబడిరి. । మరియు పారసీకుల అధి 63
కారి—ఊరీమును తుమ్మీమును ధరించుకొనగల యొక
యాజకుడు ఏర్పడు పర్యంతము మీరు ప్రతిష్ఠితమైన
వస్తువులను భుజింపకూడదని వారి కాజ్ఞాపించెను. ।
సమాజముయొక్క లెక్క మొత్తము నలువది రెండు వేల 64
మున్నూట అరువదిమంది యాయెను. । వీరుగాక వీరి 65
దాసులును దాసురాండ్రును ఏడు వేల మున్నూట
ముప్పది యేడుగురు. మరియు వారిలో గాయకులును
గాయకురాండ్రును ఇన్నూరుమంది యుండిరి. । వారి 66
గుఱ్ఱములు ఏడు నూట ముప్పది యారు, వారి కంచర
గాడిదెలు ఇన్నూట నలువది యయిదు, । వారి ఒం 67
టెలు నన్నూట ముప్పది యయిదు, గాడిదెలు ఆరువేల
ఏడు నూట ఇరువదియు ఉండెను. । కుటుంబ ప్రధా 68
నులు కొందరు యెరూషలేములో నుండు యెహోవా
మందిరమునకు వచ్చి, దేవుని మందిరమును దాని స్థల
ములో నిలుపుటకు కానుకలను స్వేచ్ఛార్పణములుగా
అర్పించిరి. । పని నెరవేర్చుటకు తమ శక్తికొలది ఖజా 69
నాకు పదునారు వేల మున్నూరు తులముల బంగార
మును రెండు లక్షల యేబది వేల తులముల వెండిని
యాజకులకొరకు నూరు వస్త్రములను ఇచ్చిరి. । యాజకు 70
లును లేవీయులును జనులలో కొందరును గాయకులును
ద్వారపాలకులును నెతీనీయులును తమ పట్టణములకు
వచ్చి కాపురము చేసిరి. మరియు ఇశ్రాయేలీయు
లందరును తమ తమ పట్టణములందు కాపురము చేసిరి.

ఇశ్రాయేలీయులు తమ తమ పట్టణములకు వచ్చిన 3
తరువాత ఏడవ నెలలో జనులు ఏకమనస్సు కలిగిన
వారై యెరూషలేములో కూడి, । యోజాదాకు కుమా 2
రుడైన యేషూవయును యాజకులైన అతని సంబంధు
లును షయల్తీయేలు కుమారుడైన జెరుబ్బాబెలును అతని
సంబంధులును లేచి, దైవజనుడైన మోషే నియమించిన
ధర్మశాస్త్రమునందు వ్రాయబడిన ప్రకారముగా దహన
బలులు అర్పించుటకై ఇశ్రాయేలీయుల దేవుని బలిపీఠ
మును కట్టిరి. । వారు దేశమందు కాపురస్థులైనవారికి 3
భయపడుచు, ఆ బలిపీఠమును దాని పురాతన స్థలమున
నిలిపి, దానిమీద ఉదయమునను అస్తమయమునను
యెహోవాకు దహనబలులు అర్పించుచు వచ్చిరి ।
మరియు గ్రంథమునుబట్టి వారు పర్ణశాలల పండుగను 4
నడిపించి, ఏ దినమునకు నియమింపబడిన లెక్కచొప్పున
ఆ దినపు దహనబలిని విధిచొప్పున అర్పింపసాగిరి. ।

5 తరువాత నిత్యమైన దహనబలిని, అమావాస్యలకును
యెహోవాయొక్క నియామకమైన పండుగలకును
ప్రతిష్ఠితమైన దహనబలులను, ఒక్కొకడు తెచ్చిన
6 స్వేచ్ఛార్పణలను అర్పించుచు వచ్చిరి. । ఏడవ నెల
మొదటి దినమునుండి యెహోవాకు దహనబలులు
అర్పింప మొదలుపెట్టిరి. అయితే యెహోవా మంది
రముయొక్క పునాది అప్పటికి ఇంకను వేయబడలేదు. ।
7 మరియు వారు కాసెవారికిని వడ్రవారికిని ద్రవ్యము
నిచ్చిరి. అదియుగాక పారసీకదేశపు రాజైన కోరెషు
తమకు సెలవిచ్చినట్లు దేవదారు మ్రానులను లెబానోను
నుండి సముద్రముమీద యొప్పేపట్టణమునకు తెప్పించు
టకు సీదోనీయులకును తూరువారికిని భోజనపదార్థము
లను పానమును నూనెను ఇచ్చిరి.
8 యెరూషలేములోనుండి దేవునియొక్క మందిర
మునకు కట్టుటకై వారు వచ్చిన రెండవ సంవత్సరము
రెండవ నెలలో షయల్తీయేలు కుమారుడైన జెరుబ్బాబె
లును, యోజాదాకు కుమారుడైన యేషూవయును, వీరి
బంధువులైన తక్కిన యాజకులును లేవీయులును, చెర
లోనుండి విడిపింపబడి యెరూషలేమునకు వచ్చినవారంద
రును పని ఆరంభించి, యిరువది సంవత్సరములు మొదలు
కొని పై యీడుగల లేవీయులను యెహోవా మంది
9 రముయొక్క పనికి నిర్ణయించిరి. । యేషూవయు అతని
కుమారులును అతని సహోదరులును, కద్మీయేలును
అతని కుమారులును, హోదవ్యా కుమారులును, హేనా
దాదు కుమారులును వారి కుమారులును, లేవీయులైన
వారి బంధువులును, దేవుని మందిరములో పనివారిచేత
10 పని చేయించుటకు నియమింపబడిరి. । శిల్పకారులు
యెహోవా మందిరముయొక్క పునాదిని వేయుచుం
డగా ఇశ్రాయేలు రాజైన దావీదు నిర్ణయించిన విధి
చొప్పున తమ వస్త్రములు ధరించుకొనినవారై యాజకులు
బాకాలతోను, ఆసాపు వంశస్థులగు లేవీయులు చేయి
తాళములతోను నిలువబడి యెహోవాను స్తోత్రము
11 చేసిరి. । వీరు వంతుచొప్పున కూడి — యెహోవా
దయాళుడు, ఇశ్రాయేలీయుల విషయమై ఆయనకు
కృప నిరంతరము నిలుచునని పాడుచు యెహోవాను
స్తుతించిరి. మరియు యెహోవా మందిరముయొక్క
పునాది వేయబడుట చూచి, జనులందరును గొప్ప శబ్ద
12 ముతో యెహోవాను స్తోత్రము చేసిరి. । మునుపటి
మందిరమును చూచిన యాజకులలోను లేవీయులలోను
కుటుంబ ప్రధానులలోను వృద్ధులైన అనేకులు, ఇప్పుడు
వేయబడిన యీ మందిరముయొక్క పునాదిని చూచి
గొప్ప శబ్దముతో ఏడ్చిరి. అయితే మరి అనేకులు సం
13 తోషముచేత బహుగా అరచిరి. । ఏది సంతోషపుశబ్దమో
ఏడ్పుశబ్దమో జనులు తెలిసికొనలేక పోయిరి.
ధ్వని చేసినందున ఆ శబ్దము బహు
దూ...

అంతట యూదావంశస్థులకును బెన్యామీనీయుల 4
కును విరోధులైనవారు, చెరనివారణ యయినవారు
ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవాకు ఆలయ
మును కట్టుచున్న సంగతి విని । జెరుబ్బాబెలు నొద్ద 2
కును పెద్దలలో ప్రధానులయొద్దకును వచ్చి—మీరు
ఆశ్రయించునట్లు మేమును మీ దేవుని ఆశ్రయించు
వారము. ఇచ్చటికి మమ్మును రప్పించిన అష్షూరురాజైన
ఏసర్హద్దోనుయొక్క కాలము మొదలుకొని మేము
యెహోవాకు బలులు అర్పించువారము, మేమును
మీతో కలిసి కట్టెదమని చెప్పిరి. । అందుకు జెరు 3
బ్బాబెలును యేషూవయు ఇశ్రాయేలీయుల పెద్దలలో
తక్కిన ప్రధానులును—మీరు మాతో కలిసి మా దేవు
నికి మందిరమును కట్టుటకు నిమిత్తము లేదు; మేమే
కూడుకొని పారసీకదేశపు రాజైన కోరెషు మా
కిచ్చిన ఆజ్ఞప్రకారము ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవాకు మందిరమును కట్టుదుమని వారితో
చెప్పగా । దేశపుజనులు యూదావంశస్థులకు ఇబ్బంది 4
కలుగజేసి కట్టుచున్నవారిని భాధపరచిరి. । మరియు 5
పారసీకదేశపు రాజైన కోరెషుయొక్క దినములన్నిటి
లోను పారసీకదేశపు రాజైన దర్యావేషుయొక్క పరి
పాలన కాలపర్యంతము వారి ఉద్దేశమును భంగపరచు
టకై వారు మంత్రులకు లంచమిచ్చిరి. । మరియు 6
అహష్వేరోషు ఏలనారంభించినప్పుడు వారు యూదా
దేశస్థులను గూర్చియు యెరూషలేము పట్టణపువారిని
గూర్చియు ఉత్తరము వ్రాసి వారిమీద తప్పుమోపిరి.
అర్తహషస్తయొక్క దినములలో బిష్లామును మిత్రి 7
దాతును టాబెయేలును వారి పక్షముగానున్న తక్కిన
వారును పారసీకదేశపు రాజైన అర్తహషస్తకు ఉత్తరము
వ్రాసి పంపిరి. ఆ యుత్తరము అరాముభాషలో
వ్రాయబడి అరాముభాషలోనే తాత్పర్యము చేయ
బడినది. । మరియు మంత్రియగు రెహూమును లేఖ 8
కుడగు షిమ్షయియు ఈ ప్రకారముగా యెరూష
లేము సంగతినిగూర్చి ఉత్తరము వ్రాసి రాజైన అర్త
హషస్తయొద్దకు పంపిరి. । అంతట మంత్రియగు రెహూ 9
మును లేఖకుడగు షిమ్షయియు వారి పక్షముగానున్న
తక్కినవారైన దీనాయీయులును అపర్సత్కాయ్యీ
లును టర్పెలాయేలును అపార్సీయులును అర్కెవా
యులును బాబెలువారును షూషన్కాయులును దెహా
వేయులును ఏలామీయులును । ఘనుడును, శ్రేష్ఠుడు
నైన ఆస్నప్పరు నది యివతలకు రప్పించి షోమ్రోను
పట్టణములందును నది యవతలనున్న ప్రదేశమందును
ఉంచిన తక్కిన జనములును, నది యివతలనున్న తక్కిన
వారును ఉత్తరము ఒకటి వ్రాసిరి. । వీరు రాజైన అర్త
హషస్తకు వ్రాసి పంపించిన ఉత్తరము నకలు. నది యివ
తలనున్న తమ దాసులమైన మేము రాజైన తమకు
తెలియజేయునదేమనగా । తమ సన్నిధినుండి మా

యొద్దకు వచ్చిన యూదులు యెరూషలేమునకు వచ్చి,
తిరుగబాటుచేసిన ఆ చెడుపట్టణమును కట్టుచున్నారు.
వారు దాని ప్రాకారములను నిలిపి దాని పునాదు
లను మరమ్మతు చేయుచున్నారు. । కావున రాజవైన
తమకు తెలియవలసిన దేమనగా, ఈ పట్టణమును కట్టి
దాని ప్రాకారములను నిలువబెట్టినయెడల వారు శిస్తు
గాని సుంకముగాని పన్నుగాని యియ్యకయుందురు,
అప్పుడు రాజుకు రావలసిన హైకము నష్టమగును. ।
మేము రాజుచేత జీవనోపాధి పొందువారము గనుక
రాజునకు నష్టమురాకుండ మేము చూడవలెనని ఈ
యుత్తరమును పంపి రాజవైన తమకు ఈ సంగతి తెలియ
జేసితిమి. । మరియు తమ పూర్వికులు వ్రాయించిన
రాజ్యపు దస్తావేజులను చూచినయెడల, ఈ పట్టణపు
వారు తిరుగబాటు చేయువారుగాను, రాజులకును
దేశములకును హానిచేయువారుగాను, కలహకారులు
గాను కనబడుదురనియు, అందువలననే యీ పట్ట
ణము నాశనముపొందెననియు రాజ్యపు దస్తావేజుల
వలననే తమకు తెలియవచ్చును. । కావున రాజవైన
తమకు మేము రూఢిపరుచున దేమనగా, ఈ పట్టణము
కట్టబడి దాని ప్రాకారములు నిలువబెట్టబడినయెడల
నది యివతల తమకు హక్కు ఎంతమాత్రము ఉండదు ।
అప్పుడు రాజు—మంత్రియగు రెహూముకును లేఖకు
డగు షిమ్షయికిని షోమ్రోనులో నివసించువారి పక్ష
ముగానున్న మిగిలిన వారికిని నది యవతలనుండు తక్కిన
వారికిని—మీకు క్షేమసంప్రాప్తియగుగాక అని యీ
మొదలగు మాటలు వ్రాయించి సెలవిచ్చిన దేమనగా ।
—మీరు మాకు పంపిన ఉత్తరమును శాంతముగా చది
వించుకొన్నాము. । అందువిషయమై మా యాజ్ఞనుబట్టి
వెదకగా, ఆదినుండి ఆ పట్టణపువారు రాజులమీద
కలహమును తిరుగబాటును చేయువారని మాకు అగు
పడినది. । మరియు యెరూషలేముపట్టణమందు బల
మైనరాజులు ప్రభుత్వము చేసిరి. వారు నది యవతలి
దేశములన్నిటిని ఏలినందున వారికి శిస్తును సుంకమును
పన్నును చెల్లుచుండెను. । కాబట్టి యిప్పుడు ఆ మను
ష్యులు ఆ పని చాలించి, మేము సెలవిచ్చు పర్యంతము
ఆ పట్టణమును కట్టక మానవలెనని ఆజ్ఞాపించుడి. । ఇది
తప్పకుండ చేయుటకు మీరు జాగ్రత్తపడుడి. రాజు
లకు నష్టము కలుగునట్లు ద్రోహము పెరుగకుండ
చూడుడి. । రాజైన అర్తహషస్త పంపించిన యుత్తరము
యొక్క ప్రతి రెహూముకును షిమ్షయికిని వీరి పక్ష
ముగా నున్న వారికిని వినిపింపబడినప్పుడు వారు త్వరగా
యెరూషలేములోనున్న యూదులయొద్దకు వచ్చి, బల
ంతముచేతను అధికారముచేతను వారు పని ఆపునట్లు
చేయగా । యెరూషలేములో నుండు దేవుని మందిరపు
పని నిలిచిపోయెను. ఈలాగున పారసీకదేశపు రాజైన

దర్యావేషు ఏలుబడియందు రెండవ సంవత్సరమువరకు
ఆ పని నిలిచిపోయెను.

ప్రవక్తలైన హగ్గయియు ఇద్దో కుమారుడైన జెక **5**
ర్యాయు యూదాదేశమందును యెరూషలేమందును
ఉన్న యూదులకు ఇశ్రాయేలీయుల దేవుడైన
యెహోవా నామమున ప్రకటింపగా । షయల్తీయేలు **2**
కుమారుడైన జెరుబ్బాబెలును యోజాదాకు కుమారుడైన
యేషూవయును లేచి యెరూషలేములోనుండు దేవుని
మందిరమును కట్టనారంభించిరి. మరియు దేవునియొక్క
ప్రవక్తలు వారితోకూడనుండి సహాయము చేయుచు
వచ్చిరి. । అంతట నది యివతల అధికారియైన తత్తెనై **3**
యును షెతర్బోజ్నయియును వారి పక్షముననున్న
వారును యూదులయొద్దకు వచ్చి—ఈ మందిరమును
కట్టుటకును ఈ ప్రాకారమును నిలుపుటకును ఎవరు
మీకు సెలవిచ్చిరని అడుగగా । ఈ కట్టడమును **4**
చేయించినవారి పేరులు మొదలైన సంగతులను మేము
వారితో చెప్పితిమి. । యూదుల దేవుడు వారి పెద్దల **5**
మీద తన దృష్టియుంచినందున ఆ సంగతినిగూర్చి
దర్యావేషు ఎదుటికి వచ్చువారు ఆజ్ఞనొందు పర్యం
తము అధికారులు వారిని పని మాన్పింపలేకపోయిరి.

నది యివతల అధికారియైన తత్తెనైయును షెత **6**
ర్బోజ్నయియును, నది యివతల నుండువారి పక్షము
గానున్న అపర్సెకాయులును, రాజైన దర్యావేషుకు
పంపిన ఉత్తరము నకలు. । —రాజైన దర్యావేషుకు **7**
సకల క్షేమప్రాప్తియగుగాక. । రాజవైన తమకు తెలియ **8**
వలసిన దేమనగా, మేము యూదా ప్రదేశములోకి
వెళ్లితిమి, అక్కడ మహా దేవునియొక్క మందిరము
ఉన్నది; అది గొప్ప రాళ్లచేత కట్టబడినది, గోడలలో
దూలములు వేయబడినవి. మరియు ఈ పని త్వరగా
జరుగుచు వారిచేతిలో వృద్ధియగుచున్నది. । ఈ మం **9**
దిరమును కట్టుటకును ఈ ప్రాకారములను నిలుపుట
కును ఎవరు మీకు సెలవిచ్చిరని మేము అక్కడనున్న
పెద్దలను అడిగితిమి. । వారిలో అధికారులైనవారి **10**
పేళ్లు వ్రాసి తమకు తెలియజేయుటకై వారి పేళ్లను
అడుగగా । వారు ఈలాగున ప్రత్యుత్తరమిచ్చిరి— **11**
మేము భూమ్యాకాశముల దేవునియొక్క సేవకులమై
అనేక సంవత్సరముల క్రిందట ఇశ్రాయేలీయులలో
నొక గొప్పరాజు కట్టించి నిలిపిన మందిరమును (మరల)
కట్టుచున్నాము. । మా పితరులు ఆకాశమందలి దేవు **12**
నికి కోపము పుట్టించినందున ఆయన వారిని కల్దీయు
డైన నెబుకద్నెజరను బాబెలు రాజుచేతికి అప్పగిం
చెను. అతడు ఈ మందిరమును నాశనముచేసి జనులను
బాబెలు దేశములోకి చెరపట్టుకొని పోయెను. ।
అయితే బాబెలు రాజైన కోరెషు ఏలుబడిలో మొదటి **13**
సంవత్సరమందు రాజైన కోరెషు దేవుని మందిరమును
తిరిగి కట్టుటకు ఆజ్ఞ ఇచ్చెను. । మరియు నెబుకద్నె **14**

జరు యెరూషలేమందున్న దేవాలయములోనుండి తీసి
బాబెలు పట్టణమందున్న గుడిలోకి కొనిపోయిన
దేవుని మందిరపు వెండి బంగారు ఉపకరణములను
రాజైన కోరెషు బాబెలు పట్టణపు మందిరములోనుండి
15 తెప్పించి । తాను అధికారిగా చేసిన షేష్బజ్జరు అను
నతనికి అప్పగించి—నీవు ఈ ఉపకరణములను తీసికొని
యెరూషలేము పట్టణమందుండు దేవాలయమునకు
పోయి దేవుని మందిరమును దాని స్థలమందు కట్టించు
16 మని అతనికి ఆజ్ఞ ఇచ్చెను. । కాబట్టి ఆ షేష్బజ్జరు
వచ్చి యెరూషలేములోనుండు దేవుని మందిరపు పునా
దిని వేయించెను. అప్పటినుండి నేటివరకు అది కట్టబడు
17 చున్నను ఇంకను సమాప్తికాకుండ ఉన్నది. । కాబట్టి
రాజవైన తమకు అనుకూలమైతే బాబెలు పట్టణమం
దున్న రాజుయొక్క ఖజానాలో వెదకించి, యెరూష
లేములోనుండు దేవుని మందిరమును కట్టుటకు రాజైన
కోరెషు నిర్ణయముచేసెనో లేదో అది తెలిసికొని,
రాజవైన తమరు ఆజ్ఞ ఇచ్చి యీ సంగతినిగూర్చి తమ
చిత్తము తెలియజేయ గోరుచున్నాము.

**6** అప్పుడు రాజైన దర్యావేషు ఆజ్ఞ ఇచ్చినందున
బాబెలులో ఖజానాలోని దస్తావేజుకొట్టులో వెద
2 కగా । మాదీయుల ప్రదేశమందు ఎగ్బతానా యను
పురములో ఒక గ్రంథము దొరికెను. దానిలో వ్రాయ
బడియున్న యీ సంగతి కనబడెను.

3 —రాజైన కోరెషు ఏలుబడిలో మొదటి సంవత్సర
మందు అతడు యెరూషలేములో ఉండు దేవుని మం
దిరమునుగూర్చి నిర్ణయించినది—బలులు అర్పింపతగిన
స్థలముగా మందిరము కట్టింపబడవలెను; దాని పునా
దులు గట్టిగా వేయబడవలెను; దాని నిడివి అరువది
మూరలును దాని వెడల్పు అరువది మూరలును ఉండ
4 వలెను; । మూడు వరుసలు గొప్ప రాళ్లచేతను ఒక
వరుస క్రొత్త మ్రానులచేతను కట్టింపబడవలెను; దాని
వ్రయమును రాజుయొక్క ఖజానాలోనుండి యియ్య
5 వలెను. । మరియు యెరూషలేములోనున్న ఆలయము
లోనుండి నెబుకద్నెజరు బాబెలుకు తీసికొని వచ్చిన
దేవుని మందిర సంబంధమైన వెండి బంగారు ఉపకరణ
ములు తిరిగి అప్పగింపబడి, యెరూషలేములోనున్న
మందిరమునకు తేబడి, దేవుని మందిరములో వాటి
స్థలమందు పెట్టబడవలెను.

6 కావున రాజైన దర్యావేషు ఈలాగు సెలవిచ్చెను—
నది యవతల అధికారియైన తత్తెనై అను నీవును, షెత
ర్బోజ్నయి అను నీవును నది యవతల మీతోకూడ
నున్న అపర్సెకాయులును యూదులజోలికి పోక ।
7 దేవుని మందిరపు పని జరుగనిచ్చి, వారి అధికారిని
పెద్దలను దేవుని మందిరమును దాని స్థలమందు కట్టింప
8 నియ్యుడి. । మరియు దేవుని మందిరమును కట్టించు

నట్లుగా యూదులయొక్క పెద్దలకు మీరు చేయవల
సిన సహాయమునుగూర్చి మేము నిర్ణయించినదేమనగా—
రాజుయొక్క సొమ్ములోనుండి, అనగా నది యవతల
నుండి వచ్చిన పన్నులోనుండి వారు చేయు పనినిమి
త్తము తడవు ఏమాత్రమును చేయక వారి [illegible] యము
నకు కావలసినదాని ఇయ్యవలెను. । మరియు ఆకాశ 9
మందలి దేవునికి దహనబలులు అర్పించుటకై కోడెలే
గాని గొర్రెపొట్టేళ్లే గాని గొర్రెపిల్లలే గాని గోధు
మలే గాని ఉప్పే గాని ద్రాక్షారసమే గాని నూనెయే
గాని, యెరూషలేములోనున్న యాజకులు ఆకాశ
మందలి దేవునికి సువాసనయైన అర్పణలను అర్పించి,
రాజును అతని కుమారులును జీవించునట్లు ప్రార్థన
చేయు నిమిత్తమై వారు చెప్పినదానినిబట్టి ప్రతిదిన
మును తప్పకుండ । వారికి కావలసినదంతయు ఇయ్య 10
వలెను. । ఇంకను మేము నిర్ణయించినదేమనగా, ఎవడై 11
నను ఈ ఆజ్ఞను భంగపరచినయెడల వాని యింటి
వెన్నుగాడి ఊడదీయబడి నిలువనెత్తబడి దానిమీద
వాడు ఉరితీయింపబడును, ఆ తప్పునుబట్టి వాని యిల్లు
పెంటరాశి చేయబడును. । ఏ రాజులే గాని యే జనులే 12
గాని యీ ఆజ్ఞను భంగపరచి యెరూషలేములోనున్న
దేవుని మందిరమును నశింపజేయుటకై చెయ్యి చాపిన
యెడల, తన నామమును అక్కడ ఉంచిన దేవుడు
వారిని నశింపజేయును. దర్యావేషు అను నేనే యీ
ఆజ్ఞ ఇచ్చితిని. మరియు అది అతివేగముగా జరుగ
వలెనని వ్రాయించి అతడు తాకీదుగా పంపించెను.

అప్పుడు నది యివతల అధికారియైన తత్తెనైయును 13
షెతర్బోజ్నయియును వారి పక్షమున నున్నవారును
రాజైన దర్యావేషు ఇచ్చిన ఆజ్ఞచొప్పున వేగముగా
పని జరిపించిరి. । యూదుల పెద్దలు కట్టించుచు, ప్రవక్త 14
యైన హగ్గయియు ఇద్దో కుమారుడైన జెకర్యాయు
హెచ్చరించుచున్నందున పని బాగుగా జరిపిరి. ఈ
ప్రకారము ఇశ్రాయేలీయుల దేవుని ఆజ్ఞ ననుసరించి
వారు కట్టించుచు, కోరెషు దర్యావేషు అర్తహషస్త
అను పారసీకదేశపు రాజుల ఆజ్ఞచొప్పున ఆ పని
సమాప్తిచేసిరి. । రాజైన దర్యావేషు ఏలుబడియందు 15
ఆరవ సంవత్సరము అదారు నెల మూడవనాటికి మంది
రము సమాప్తి చేయబడెను. । అప్పుడు ఇశ్రాయేలీయు 16
లును యాజకులును లేవీయులును చెరలోనుండి విడు
దలనొందిన తక్కినవారును దేవుని మందిరమును ఆనంద
ముతో ప్రతిష్ఠించిరి. । దేవుని మందిరమును ప్రతిష్ఠించి 17
నప్పుడు నూరు ఎడ్లను ఇన్నూరు పొట్టేళ్లను నన్నూరు
గొర్రెపిల్లలను ఇశ్రాయేలీయులకందరికిని పాపపరిహా
రార్థ బలిగా ఇశ్రాయేలీయుల గోత్రముల లెక్క
చొప్పున పన్నెండు మేకపోతులను అర్పించిరి. ।
మరియు వారు యెరూషలేములోనున్న దేవుని సేవ 18
జరిపించుటకై మోషేయొక్క గ్రంథమందు వ్రాసిన

తరగతులచొప్పున యాజకులను వరుసల
యులను నిర్ణయించిరి.
ండి విడుదలనొందినవారు మొదటి నెల
దినమున పస్కాపండుగ ఆచరించిరి. ।
లేవీయులును తమ్మునుతాము పవిత్రపర
త్రులైన తరువాత చెరలోనుండి విడుదల
రందరికొరకును తమ బంధువులైన యాజ
తమకొరకును పస్కాపశువును వధిం
న చెరలోనుండి విడుదలనొంది తిరిగి
యేలీయులును, ఇశ్రాయేలీయుల దేవుడైన
ను ఆశ్రయించుటకై దేశమందుండు అన్య
పవిత్రతనుండి తమ్మునుతాము ప్రత్యేకించు
ందరును వచ్చి, తిని పులియని రొట్టెల
డు దినములు ఆనందముతో ఆచరించిరి. ।
ఇశ్రాయేలీయుల దేవుని మందిరపు పని
రి చేతులను బలపరచుటకు యెహోవా
హృదయమును వారివైపు త్రిప్పి వారిని
జేసెను.
తులు జరిగినపిమ్మట పారసీకదేశపు
హస్తయొక్క యేలుబడిలో ఎజ్రా బాబెలు
(యెరూషలేముపట్టణమునకు) వచ్చెను.
యా కుమారుడైయుండెను, శెరాయా
రుడు అజర్యా హిల్కీయా కుమారుడు।
షల్లూము కుమారుడు షల్లూము సాదోకు
దోకు అహీటూబు కుమారుడు । అహీ
ర్యా కుమారుడు అమర్యా అజర్యా
అజర్యా మెరాయోతు కుమారుడు ।
జెరహ్యా కుమారుడు జెరహ్యా ఉజ్జీ కుమా
బుక్కీ కుమారుడు । బుక్కీ అబీషూవ
బీషూవ ఫీనెహాసు కుమారుడు ఫీనెహాసు
కుమారుడు ఎలాజారు ప్రధానయాజకు
ను కుమారుడు. । ఈ ఎజ్రా ఇశ్రా
దేవుడైన యెహోవా అనుగ్రహించిన
ధర్మశాస్త్రమందు ప్రవీణతగల శాస్త్రి.
ని దేవుడైన యెహోవా హస్తము అత
ఉన్నందున అతడు ఏ మనవి చేసినను
గ్రహించును. । మరియు రాజైన అర్తహ
మందు ఏడవ సంవత్సరమున ఇశ్రాయేలీ
దరును యాజకులు కొందరును లేవీయు
లును ద్వారపాలకులును నెతీనీయులును
రూషలేము పట్టణమునకు వచ్చిరి.। రాజు
ము ఏడవ సంవత్సరము అయిదవ మాస
యెరూషలేమునకు వచ్చెను. । మొదటి నెల
మందు అతడు బాబెలు దేశమునుండి
తన దేవుని బలము తనకు తోడుగా
యిదవ నెల మొదటి దినమున యెరూష

లేముకు చేరెను. । ఎజ్రా యెహోవా ధర్మశాస్త్రమును 10
పరిశోధించి దానిచొప్పున నడుచుకొనుటకును,
ఇశ్రాయేలీయులకు దాని కట్టడలను విధులను నేర్పు
టకును దృఢనిశ్చయము చేసికొనెను.
యెహోవా ఆజ్ఞల వాక్యములయందును, ఆయన 11
ఇశ్రాయేలీయులకు విధించిన కట్టడలయందును శాస్త్రి
యు యాజకుడునైన ఎజ్రాకు రాజైన అర్తహషస్త
యిచ్చిన తాకీదు నకలు ।—రాజైన అర్తహషస్త, ఆకాశ 12
మండలి దేవుని ధర్మశాస్త్రమందు శాస్త్రియు యాజకుడు
నైన ఎజ్రాకు క్షేమము, మొదలగు మాటలు వ్రాసి
యీలాగు సెలవిచ్చెను ।—నీకు తెలిసియున్న నీ దేవుని 13
ధర్మశాస్త్రమునుబట్టి యూదానుగూర్చియు యెరూష
లేమునుగూర్చియు విమర్శచేయుటకు నీవు రాజుచేతను
అతని యేడుగురు మంత్రులచేతను పంపబడితివి గనుక
మేము చేసిన నిర్ణయమేమనగా, । మా రాజ్యమందుండు 14
ఇశ్రాయేలీయులలోను వారి యాజకులలోను లేవీ
యులలోను యెరూషలేము పట్టణమునకు వెళ్లుటకు
మనఃపూర్వకముగా ఇష్టపడువారెవరో వారందరు
నీతోకూడ వెళ్లవచ్చును. । మరియు యెరూషలేములో 15
నివాసముగల ఇశ్రాయేలీయుల దేవునికి రాజును అతని
యొక్క మంత్రులును స్వేచ్ఛగా అర్పించిన వెండి
బంగారములను నీవు తీసికొని పోవలెను. । మరియు 16
బాబెలు ప్రదేశమందంతట నీకు దొరకు వెండి బంగా
రములంతయును, జనులును యాజకులును యెరూష
లేములోనున్న తమ దేవుని మందిరమునకు స్వేచ్ఛగా
అర్పించు వస్తువులను నీవు తీసికొని పోవలెను. । తడవు 17
చేయక నీవు ఆ ద్రవ్యముచేత ఎడ్లను పొట్టేళ్లను గొఱ్ఱె
పిల్లలను, వాటితోకూడ ఉండవలసిన భోజనార్పణలను
పానార్పణలను కొని, యెరూషలేమందుండు మీ దేవుని
మందిరపు బలిపీఠముమీద వాటిని అర్పించుము. । మిగి 18
లిన వెండి బంగారములతో మీ దేవుని చిత్తానుసార
ముగా నీకును నీ వారికిని యుక్తమని తోచినదానిని
చేయవచ్చును. । మరియు నీ దేవుని మందిరపు సేవ 19
కొరకు నీకియ్యబడిన ఉపకరణములను నీవు యెరూష
లేములోని దేవునియెదుట అప్పగింపవలెను. । నీ 20
దేవుని మందిరవిషయములో దానమిచ్చుటకై మరి
ఏదైనను నీకు కావలసినయెడల అది రాజుయొక్క
ఖజానాలోనుండి నీకియ్యబడును. । మరియు—రాజు 21
నైన అర్తహషస్త అను నేనే నది యవతలనున్న ఖజా
నాదారులైన మీకు ఇచ్చు ఆజ్ఞ యేమనగా, ఆకాశ
మండలి దేవుని ధర్మశాస్త్రములో శాస్త్రియు యాజకుడు
నైన ఎజ్రా మిమ్మును ఏదైన అడిగినయెడల ఆలస్యము
కాకుండ మీరు దాని చేయవలెను. । వెయ్యి తూముల 22
గోధుమలు ఇన్నూరు మణుగుల వెండి మున్నూరు
తూముల ద్రాక్షారసము మున్నూరు తూముల నూనె
లెక్కలేకుండ ఉప్పును ఇయ్యవలెను. । ఆకాశమండలి 23

దేవునిచేత ఏది నిర్ణయమాయెనో దాని ఆకాశమందలి
దేవుని మందిరమునకు జాగ్రత్తగా చేయింపవలసినది.
రాజుయొక్క రాజ్యముమీదికిని అతని కుమారుల
24 మీదికిని కోపమెందుకు రావలెను? । మరియు యాజ
కులును లేవీయులును గాయకులును ద్వారపాలకులును
నెతీనీయులును, దేవుని మందిరపు సేవకులునైన వారం
దరినిగూర్చి మేము మీకు నిర్ణయించినదేమనగా,
వారికి శిస్తు గాని సుంకము గాని పన్ను గాని వేయుట
25 కట్టడప్రకారము న్యాయము కాదని తెలిసికొనుడి. । మరియు
ఎజ్రా, నది యవతలనున్న జనులకు తీర్పుచేయుటకై
నీ దేవుడు నీకు దయచేసిన జ్ఞానము చొప్పున నీవు నీ
దేవునియొక్క ధర్మశాస్త్రవిధులను తెలిసికొనినవారిలో
కొందరిని అధికారులగాను న్యాయాధిపతులగాను
ఉంచవలెను, ఆ ధర్మశాస్త్ర విషయములో తెలియని
26 వారెవరో వారికి నేర్పవలెను. । నీ దేవుని ధర్మశాస్త్రము
గాని, రాజుయొక్క చట్టముగాని, గైకొననివాడెవడో
త్వరగా విచారణచేసి, మరణ శిక్షయైనను స్వదేశ
త్యాగమైనను ఆస్తి జప్తియైనను ఖైదునైనను వానికి
విధింపవలెను.
27 యెరూషలేములోనుండు యెహోవా మందిర
మును అలంకరించుటకు రాజునకు బుద్ధి పుట్టించినందు
నను, రాజును అతని మంత్రులును రాజుయొక్క మహాధి
పతులును నాకు దయ అనుగ్రహింపజేసినందునను,
మన పితరుల దేవుడైన యెహోవాకు స్తోత్రము
28 కలుగునుగాక. । నా దేవుడైన యెహోవా బాహు
బలము నాకు తోడుగా ఉన్నందున నేను బలపరచ
బడి, నాతోకూడ వచ్చుటకు ఇశ్రాయేలీయుల ప్రధా
నులను సమకూర్చితిని.
8 రాజైన అర్తహషస్త ఏలుబడి కాలమందు బాబెలు
దేశమునుండి నాతోకూడ వచ్చిన యింటి పెద్దల వంశా
2 వళి. । —ఫీనెహాసు వంశములో గెర్షోమును, ఈతా
మారు వంశములో దానియేలును, దావీదు వంశములో
3 హట్టూషును, । షెకన్యా పరోషుల వంశములలో
జెకర్యాయు వంశావళికి నూట ఏబదిమంది పురుష
4 లును లెక్కింపబడిరి. । పహత్మోయాబు వంశములో
జెరహ్యా కుమారుడైన ఎల్యోయేనైయు ఇన్నూరుమంది
5 పురుషులును । షెకన్యా వంశములో యహజీయేలు
6 కుమారుడును మున్నూరుమంది పురుషులును । ఆదీను
వంశములో యోనాతాను కుమారుడైన ఎబెదును
7 ఏబదిమంది పురుషులును । ఏలాము వంశములో
అతల్యా కుమారుడైన యెషయాయు డెబ్బదిమంది
8 పురుషులును । షెఫట్యా వంశములో మిఖాయేలు
కుమారుడైన జెబద్యాయు ఎనుబదిమంది పురుషులును ।
9 యోవాబు వంశములో యెహీయేలు కుమారుడైన
[illegible]యాయు ఇన్నూట పదునెనిమిదిమంది పురుషు
[illegible] । షెలోమీతు వంశములో యోసిప్యా కుమా
రుడును నూట అరువదిమంది పురుషులును । బేబై
వంశములో బేబై కుమారుడైన జెకర్యాయు ఇరువది
ఎనిమిదిమంది పురుషులును । అజ్గాదు వంశములో
హక్కాటాను కుమారుడైన యోహానానును నూట
పదిమంది పురుషులును । అదోనీకాముయొక్క
చిన్న కుమారులలో ఎలీపేలెటును యెహీయేలును
షెమయాయు అరువదిమంది పురుషులును । బిగ్వయి
వంశములో ఊతైయును జబ్బూదును డెబ్బదిమంది
పురుషులును.
వీరిని నేను అహవా వైపుకు పారు నదియొద్దకు
సమకూర్చితిని. అచ్చట మేము మూడు దినములు
గుడారములలో ఉంటిమి. అంతలో నేను జనులను
యాజకులను తనిఖీ చూడగా లేవీయుడొకడును నాకు
కనబడలేదు. । అప్పుడు నేను పెద్దలైన ఎలీయెజెరు
అరీయేలు షెమయా ఎల్నాతాను యారీబు ఎల్నాతాను
నాతాను జెకర్యా మెషుల్లాము అను వారిని, ఉపదేశకు
లగు యోయారీబు ఎల్నాతానులను పిలువనంపించి ।
—కాసిప్యా అను స్థలమందుండు అధికారియైన ఇద్దో
యొద్దకు వారిని పంపి, మా దేవుని మందిరమునకు
పరిచారకులను మాయొద్దకు తీసికొని వచ్చునట్లుగా
కాసిప్యా అను స్థలమందుండు ఇద్దోతోను అతని
బంధువులైన నెతీనీయులతోను చెప్పవలసిన మాటలను
వారికి తెలియజెప్పితిని. । మా దేవుని కరుణా హస్తము
మాకు తోడుగా ఉన్నందున వారు ప్రజ్ఞావంతుడైన
షేరేబ్యా అను ఒకనిని, అతని కుమారులను సహో
దరులను, పదునెనిమిదిమందిని తోడుకొని వచ్చిరి. ఆ
ప్రజ్ఞావంతుడు మహలి కుమారులలో ఒకడు; ఈ
మహలి ఇశ్రాయేలుకు పుట్టిన లేవి వంశస్థుడు. । హష
బ్యాను అతనితోకూడ మెరారీయుడగు యెషయాను
అతని బంధువులును వారి కుమారులునైన యిరువది
మందిని వారు తోడుకొని వచ్చిరి. । మరియు లేవీ
యులు చేయవలసిన సేవలో తోడ్పడుటకై దావీదును
అధిపతులును నిర్ణయించిన నెతీనీయులలో ఇన్నూట
ఇరువదిమంది వచ్చిరి. వీరందరును పేర్లు ఉదహరింపబడి
నియమింపబడినవారు. । అప్పుడు దేవుని సన్నిధిని
మమ్మును మేము దుఃఖపరచుకొని, మాకును మా చిన్న
వారికిని మా ఆస్తికిని శుభప్రయాణము కలుగునట్లుగా
ఆయనను వేడుకొనుటకు అహవా నదిదగ్గర ఉపవాస
ముండుడని ప్రకటించితిని. । —మేలు కలుగజేయుటకై
ఆయనను ఆశ్రయించువారికందరికి మా దేవుని హస్తము
తోడుగా ఉండునుగాని, ఆయన హస్తమును ఆయన
ఉగ్రతయు ఆయనను విసర్జించువారందరిమీదికి వచ్చు
నని మేము రాజుతో చెప్పియుంటిమి గనుక మార్గ
మందున్న శత్రువుల విషయమై మాకు సహాయము
చేయునట్లు కాల్బలమును రౌతులును రాజునొద్ద
కావలెనని మనవి చేయుటకు సిగ్గు నాకు తోచెను. ।

23 మేము ఉపవాసముండి ఆ సంగతినిబట్టి మా దేవుని
వేడుకొనగా ఆయన మా మనవిని అంగీకరించెను ।
24 గనుక నేను యాజకులలోనుండి ప్రధానులైన
పన్నెండు మందిని, అనగా షేరేబ్యాను హషబ్యాను
25 వీరి బంధువులలో పదిమందిని ఏర్పరచి । మా దేవుని
మందిరమును ప్రతిష్ఠించుట విషయములో రాజును
అతని మంత్రులును అధిపతులును అక్కడనున్న
ఇశ్రాయేలీయులందరును ప్రతిష్ఠించిన వెండి బంగా
రములను ఉపకరణములను తూచి వారికి అప్పగించి
26 తిని. । వెయ్యిన్ని మున్నూరు మణుగుల వెండిని
యిన్నూరు మణుగుల వెండి ఉపకరణములను,
27 ఇన్నూరు మణుగుల బంగారమును, । ఏడు వేల తుల
ములుగల యిరువది బంగారపు గిన్నెలను, బంగార
మంత వెలగల పరిశుద్ధమైన రెండు రాగి పాత్రలను
28 తూచి । వారిచేతికి అప్పగించి—మీరు యెహోవాకు
ప్రతిష్ఠింపబడినవారు, పాత్రలును ప్రతిష్ఠితములైన
యీ వెండి బంగారములును మీ పితరుల దేవుడైన
29 యెహోవాకు స్వేచ్ఛార్పణలై యున్నవి. । కాబట్టి
మీరు యెరూషలేములో యెహోవా మందిరపు
ఖజానాగదులలో, యాజకులయొక్కయు లేవీయుల
యొక్కయు ఇశ్రాయేలు పెద్దలయొక్కయు ప్రధాను
లైనవారియెదుట, వాటిని తూచి అప్పగించు పర్యం
తము వాటిని భద్రముగా ఉంచుడని వారితో చెప్పి
30 తిని. । కాబట్టి యాజకులును లేవీయులును వాటి
యెత్తు ఎంతో తెలిసికొని, యెరూషలేములోనున్న
మన దేవుని మందిరమునకు కొనిపోవుటకై ఆ వెండి
బంగారములను పాత్రలను తీసికొనిరి.
31 మేము మొదటి నెల పన్నెండవ దినమందు
యెరూషలేమునకు వచ్చుటకై అహావా నదినుండి
బయలుదేరగా, మా దేవుని బాహుబలము మాకు
తోడుగానుండి, శత్రువుల చేతిలోనుండియు మార్గ
మందు పొంచియున్నవారిచేతిలోనుండియు మమ్మును
తప్పించినందున । మేము యెరూషలేమునకు వచ్చి మూడు
దినములు అక్కడ బసచేసితిమి. । నాలుగవ దినమున
వెండి బంగారములును పాత్రలును మా దేవుని మంది
రమందు యాజకుడైన ఊరియా కుమారుడైన మెరే
మోతుచేత తూనిక వేయబడెను. అతనితోకూడ ఫీనె
హాసు కుమారుడైన ఎలాజారు ఉండెను; వీరితో లేవీయు
లైన యేషూవ కుమారుడైన యోజాబాదును బిన్నూయి
కుమారుడైన నోవద్యాయును కూడనుండిరి. । సంఖ్య
చొప్పునను ఎత్తుచొప్పునను అన్నిటిని సరిచూచిన
తరువాత వాటి యెత్తు ఎంతైనది లెక్కలలో వ్రాసిరి. ।
మరియు చెరలోనికి కొనిపోబడినవారికి పుట్టి చెరనుండి
విడుదలనొంది తిరిగి వచ్చినవారు ఇశ్రాయేలీయుల
దేవునికి దహన బలులు అర్పించిరి. ఇశ్రాయేలీయులం
దరికొరకు పన్నెండు ఎడ్లను తొంబది యారు పొట్టే
ళ్లను డెబ్బది యేడు గొఱ్ఱెపిల్లలను, పాపపరిహారార్థ
బలిగా పన్నెండు మేకపోతులను తెచ్చి అన్నిటిని
దహనబలిగా యెహోవాకు అర్పించిరి. । వారు 36
రాజుయొక్క నిర్ణయములను రాజుయొక్క సేనాధి
పతులకును నది యివతలనున్న అధికారులకును అప్పగిం
చిన తరువాత వీరు జనులకును దేవుని మందిరపు పనికిని
సహాయముచేసిరి.

ఈ సంగతులు సమాప్తమైన తరువాత పెద్దలు 9
నాయొద్దకు వచ్చి—ఇశ్రాయేలీయులును యాజకు
లును లేవీయులును, కనానీయులు హిత్తీయులు పెరి
జీయులు యెబూసీయులు అమ్మోనీయులు మో
యాబీయులు ఐగుప్తీయులు అమోరీయులు అను
దేశపు జనములలోనుండి తమ్మును తాము వేరు పరు
చుకొనక, వారు చేయు అసహ్యమైన కార్యము
లను తామే చేయుచు, । వారి కుమార్తెలను పెండ్లి 2
చేసికొనుచు తమ కుమారులకును తీసికొనుచు, పరి
శుద్ధసంతతిగా ఉండవలసిన తాము ఆ దేశపు జనులతో
కలిసికొనినవారైరి. ఈ అపరాధము చేసినవారిలో
పెద్దలును అధికారులును నిజముగా ముఖ్యులై యుండి
రని చెప్పిరి. । నేను ఈ సంగతి విని నా వస్త్రమును 3
పై దుప్పటిని చింపుకొని, నా తలవెండ్రుకలను నా
గడ్డపు వెండ్రుకలను పెరికి వేసికొని విభ్రాంతిపడి
కూర్చుంటిని. । చెరపట్టబడినవారి అపరాధమును 4
చూచి, ఇశ్రాయేలీయుల దేవుని మాటకు భయపడిన
వారందరును నాయొద్దకు కూడి వచ్చిరి. నేను విభ్రాంతి
పడి సాయంత్రపు అర్పణ వేళవరకు కూర్చుంటిని. ।
సాయంత్రపు అర్పణ వేళను శ్రమ తీరగా నేను లేచి, 5
నా వస్త్రమును పై దుప్పటిని చింపుకొని మోకాళ్లమీద
పడి, నా దేవుడైన యెహోవాతట్టు చేతులెత్తి ।—
నా దేవా నా దేవా, నా ముఖము నీ వైపు ఎత్తికొను 6
టకు సిగ్గుపడి ఖిన్నుడనై యున్నాను. మా దోష
ములు మా తలలకు పైగా హెచ్చియున్నవి, మా అప
రాధము ఆకాశమంత యెత్తుగా పెరిగియున్నది. ।
మా పితరుల దినములు మొదలుకొని నేటివరకు మేము 7
మిక్కిలి అపరాధులము; మా దోషములనుబట్టి మేమును
మా రాజులును మా యాజకులును అన్యదేశముల
రాజుల వశమునకును ఖడ్గమునకును చెరకును దోపుకును
నేటిదినముననున్నట్లు అప్పగింపబడుటచేత మిగుల
సిగ్గునొందినవారమైతిమి. । అయితే ఇప్పుడు మా 8
దేవుడు మా నేత్రములకు వెలుగిచ్చి, మా దాస్యములో
మమ్మును కొంచెము తెప్పిరిల్ల జేయునట్లుగాను, మాలో
ఒక శేషము ఉండ నిచ్చినట్లుగాను, తన పరిశుద్ధస్థల
మందు మమ్మును స్థిరపచునట్లుగాను, మా దేవుడైన
యెహోవా కొంతమట్టుకు మాయెడల దయ చూపి
యున్నాడు. । నిజముగా మేము దాసులమైతిమి; 9
అయితే మా దేవుడవైన నీవు మా దాస్యములో మమ్మును

విడువక, పారసీకదేశపు రాజులయెదుట మాకు దయ
కనుపరచి, మేము తెప్పరిల్లునట్లుగా మా దేవుని మందిర
మును నిలిపి, దాని పాడైన స్థలములను తిరిగి బాగు
చేయుటకును, యూదాదేశమందును యెరూషలేము
పట్టణమందును మాకు ఒక ఆశ్రయస్థలము నిచ్చుటకును
10 కృప చూపించితివి. । మా దేవా, యింత కృపనొందిన
తరువాత మేమేమి చెప్పగలము? నిజముగా ప్రవక్తలైన
నీ దాసులద్వారా నీవిచ్చిన ఆజ్ఞలను మేము అనుసరిం
11 పక పోతిమి గదా. । వారు—మీరు స్వతంత్రించు
కొనబోవు దేశము దాని నివాసుల అపవిత్రతచేతను
వారు చేయు అసహ్యమైన వాటిచేతను అపవిత్ర
మాయెను, వారు జరిగించిన అసహ్యమైన వాటిచేత
12 ఆ దేశము నలుదిక్కుల నిండినదాయెను. । కాబట్టి
మీరు మీ కుమార్తెలను వారి కుమారుల కియ్యకుడి.
వారి కుమార్తెలను మీ కుమారులకొరకు పుచ్చుకొన
కుడి. మరియు వారికి క్షేమభాగ్యములు కలుగవలె
నని మీరు ఎన్నటికిని కోరకుండినయెడల, మీరు
బలముగానుండి, ఆ దేశముయొక్క సుఖమును అను
భవించి, మీ పిల్లలకు నిత్యస్వాస్థ్యముగా దాని నప్ప
13 గించెదరని చెప్పిరి. । అయితే మా దుష్క్రియలను బట్టియు
మా గొప్ప అపరాధములను బట్టియు ఈ శ్రమలన్ని
యు మామీదికి వచ్చిన తరువాత, మా దేవుడవైన నీవు
మా దోషములకు రావలసిన శిక్షలో కొంచెమే మా
మీద ఉంచి, మాకు ఈ విధముగా విడుదల కలుగ
14 జేయగా మేము నీ ఆజ్ఞలను మీరి । ఈ అసహ్య
కార్యములను జరిగించిన జనులతో సంబంధములు చేసి
కొనిన పక్షమున, మేము నాశనమగువరకు శేషమై
నను లేకుండునట్లును, తప్పించుకొనుటకు సాధనమై
నను లేకుండునట్లును, నీవు కోపపడుదువు గదా. ।
15 యెహోవా ఇశ్రాయేలీయుల దేవా, నీవు నీతిమంతు
డవై యున్నావు, అందువలననే నేటి దినమున ఉన్న
ట్లుగా మేము శేషించి నిలుచుచున్నాము. చిత్తగిం
చుము; మేము నీ సన్నిధిని అపరాధులము గనుక నీ
సన్నిధిని నిలుచుటకు అర్హులముకామని ప్రార్థన
చేసితిని.

**10** ఎజ్రా యేడ్చుచు దేవుని మందిరము ఎదుట
సాష్టాంగపడుచు, పాపమును ఒప్పుకొని ప్రార్థన
చేసెను. ఇశ్రాయేలీయులలో పురుషులు స్త్రీలు చిన్న
వారు మిక్కిలి గొప్ప సమూహముగా అతనియొద్దకు
2 కూడివచ్చి బహుగా ఏడ్వగా । ఏలామీయుడగు
యెహీయేలు కుమారుడైన షెకన్యా ఎజ్రాతో ఇట్ల
నెను — మేము దేశమందుండు అన్యజనములలోని
స్త్రీలను పెండ్లిచేసికొని మా దేవుని దృష్టికి పాపము
చేసితిమి; అయితే ఈ విషయములో ఇశ్రాయేలీ
[illegible] (శేమ నడవడి దిద్దుకొందురను) నిరీక్షణ కద్దు. ।
[illegible] పని ధర్మశాస్త్రానుసారముగా జరుగునట్లు
ఏలినవాడవైన నీ యోచననుబట్టియు, దైవాజ్ఞకు భయ
పడువారి యోచననుబట్టియు, ఈ భార్యలను వారికి
పుట్టినవారిని వెలివేయించెదమని మన దేవునితో నిబం
ధన చేసికొనెదము. । లెమ్ము ఈ పని నీ యధీనములో 4
నున్నది, మేమును నీతోకూడ నుందుము, నీవు ధైర్యము
తెచ్చుకొని దీని జరిగించుమనగా । ఎజ్రా లేచి, ప్రధాన 5
యాజకులును లేవీయులును ఇశ్రాయేలీయులందరును
ఆ మాటప్రకారము చేయునట్లుగా వారిచేత ప్రమా
ణము చేయించెను. వారు ప్రమాణము చేసికొనగా ।
ఎజ్రా దేవుని మందిరము ఎదుటనుండి లేచి, ఎల్యా 6
షీబు కుమారుడైన యోహానానుయొక్క గదిలో ప్రవే
శించెను. అతడు అచ్చటికి వచ్చి, చెరపట్టబడినవారి
అపరాధమునుబట్టి దుఃఖించుచు, భోజనమైనను పాన
మైనను చేయకుండెను. । చెరనుండి విడుదల నొందిన 7
వారందరు యెరూషలేముకు కూడి రావలెనని యూదా
దేశమంతటియందును యెరూషలేము పట్టణమందును
ప్రకటనచేయబడెను. । మరియు మూడు దినముల 8
లోగా ప్రధానులును పెద్దలును చేసిన యోచనచొ
ప్పున ఎవడైనను రాకపోయినయెడల వాని ఆస్తి దేవునికి
ప్రతిష్ఠితమగుననియు, వాడు విడుదలనొందినవారి
సమాజములోనుండి వెలివేయబడుననియు నిర్ణయిం
చిరి. । యూదా వంశస్థులందరును బెన్యామీనీయులం 9
దరును ఆ మూడు దినములలోగా యెరూషలేముకు
కూడి వచ్చిరి. అది తొమ్మిదవ నెల; ఆ నెల యిరువది
యవ దినమున జనులందరును దేవుని మందిరపు వీధిలో
కూర్చుని గొప్ప వర్షాలచేత తడియుచు, ఆ సంగతిని
తలంచుటవలన వణకుచుండిరి.

అప్పుడు యాజకుడైన ఎజ్రా లేచి వారితో ఇట్ల 10
నెను—మీరు ఆజ్ఞను మీరి అన్యస్త్రీలను పెండ్లిచేసికొని,
ఇశ్రాయేలీయుల అపరాధమును ఎక్కువ చేసితిరి. ।
కాబట్టి యిప్పుడు మీ పితరులయొక్క దేవుడైన 11
యెహోవాయెదుట మీ పాపమును ఒప్పుకొని,
ఆయన చిత్తానుసారముగా నడుచుకొనుటకు సిద్ధపడి,
దేశపు జనులను అన్యస్త్రీలను విసర్జించి మిమ్మును మీరు
ప్రత్యేకపరుచుకొని యుండుడి. । అందుకు సమాజకు 12
లందరు ఎలుగెత్తి అతనితో ఇట్లనిరి—నీవు చెప్పినట్లు
గానే మేము చేయవలసియున్నది. । అయితే జనులు 13
అనేకులై యున్నారు, మరియు ఇప్పుడు వర్షము బల
ముగా వచ్చుచున్నందున మేము బయట నిలువలేము,
ఈ పని యొకటి రెండు దినములలో జరుగునది కాదు;
ఈ విషయములో అనేకులము అపరాధులము; కాబట్టి
సమాజపు పెద్దలనందరిని యీ పనిమీద ఉంచవలెను, ।
మన పట్టణములయందు ఎవరెవరు అన్యస్త్రీలను పెండ్లి 14
చేసికొనిరో వారందరును నిర్ణయకాలమందు రావ
లెను; మరియు ప్రతి పట్టణముయొక్క పెద్దలును
న్యాయాధిపతులును ఈ సంగతినిబట్టి మామీదికి

చ్చిన దేవుని కఠినమైన కోపము మామీదికి రాకుండ
లగిపోవునట్లుగా వారితోకూడ రావలెను. ।
ప్పుడు అశాహేలు కుమారుడైన యోనాతానును
క్వా కుమారుడైన యహజ్యాయును మాత్రమే ఆ
నికి నిర్ణయింపబడిరి. మెషుల్లామును లేవీయుడైన
బ్బెతైయును వారికి సహాయులై యుండిరి. । చెర
ండి విడుదలనొందినవారు అట్లు చేయగా యాజకు
న ఎజ్రాయును పెద్దలలో కొందరు ప్రధానులును
రి పితరుల యింటిపేరులనుబట్టి తమ తమ పేరుల
ప్రకారము అందరిని వేరుగా ఉంచి పదియవ నెల
మొదటి దినమున ఈ సంగతిని విమర్శించుటకు కూర్చుం
రి. । మొదటి నెల మొదటి దినమున అన్యస్త్రీలను పెండ్లి
సికొనిన వారందరి సంగతి వారు సమాప్తము చేసిరి.
యాజకుల వంశములో అన్యస్త్రీలను పెండ్లిచేసికొని
యున్నట్లు కనబడినవారు ఎవరనగా—యేషూవ వంశ
ములో యోజాదాకు కుమారుడైన మయశేయాయును
గాని సహోదరులైన ఎలీయెజెరును యారీబును గెద
ల్యాయును. । వీరు తమ భార్యలను పరిత్యజించెదమని
మాట యిచ్చిరి. మరియు వారు అపరాధులై యున్నం
దున అపరాధ విషయములో మందలో ఒక పొట్టే
లును చెల్లించిరి. । ఇమ్మేరు వంశములో హనానీ జెబద్యా ।
హారిము వంశములో మయశేయా ఏలీయా షెమయా
యెహీయేలు ఉజ్జీయా, । పషూరు వంశములో ఎల్యో
యేనై మయశేయా ఇష్మాయేలు నెతనేలు యోజాబాదు
ఎల్యాశా. । లేవీయులలో యోజాబాదు షిమీ కెలిథా
ను కెలీటా పెతహయా యూదా ఎలీయెజెరు, ।
గాయకులలో ఎల్యాషీబు, ద్వారపాలకులలో షల్లూము 24
తెలెము ఊరి అనువారు. । ఇశ్రాయేలీయులలో ఎవ 25
రెవరనగా పరోషు వంశములో రమ్యా యిజ్జీయా
మల్కీయా మీయామిను ఎలాజారు మల్కీయా బెనా
యా, । ఏలాము వంశములో మత్తన్యా జెకర్యా యెహీ 26
యేలు అబ్దీ యెరేమోతు ఏలీయ్యా, । జత్తూ వంశ 27
ములో ఎల్యోయేనై ఎల్యాషీబు మత్తన్యా యెరేమోతు
జాబాదు అజీజా, । బేబై వంశములో యెహోహా 28
నాను హనన్యా జబ్బయి అత్లాయి, । బానీ వంశములో 29
మెషుల్లాము మల్లూకు అదాయా యాషూబు షెయాలు
రామోతు, । పహత్మోయాబు వంశములో అద్నా 30
కెలాలు బెనాయా మయశేయా మత్తన్యా బెసలేలు
బిన్నూయి మనష్షే, । హారిము వంశములో ఎలీయెజెరు 31
ఇష్షీయా మల్కీయా షెమయా । షిమ్యోను బెన్యామీను 32
మల్లూకు షెమర్యా, । హాషుము వంశములో మత్తెనై 33
మత్తత్తా జాబాదు ఎలీపేలెటు యెరేమై మనష్షే షిమీ, ।
బానీ వంశములో మయదై అమ్రాము ఊయేలు । 34
బెనాయా బేద్యా కెలూహు । వన్యా మెరేమోతు 35
ఎల్యాషీబు । మత్తన్యా మత్తెనై యహశావు బానీ 37
బిన్నూయి షిమీ । షెలెమ్యా నాతాను అదాయా 38
మక్నద్బయి షాషై షారాయి అజరేలు షెలెమ్యా 41
షెమర్యా । షల్లూము అమర్యా యోసేపు । నెబో 42
వంశములో యెహీయేలు మత్తిత్యా జాబాదు జెబీనా 43
యద్దయి యోవేలు బెనాయా అనువారు. । వీరం 44
దరును అన్యస్త్రీలను పెండ్లిచేసికొని యుండిరి; ఈ
స్త్రీలలో కొందరు పిల్లలుగలవారు.

# నె హె మ్యా

1 హకల్యా కుమారుడైన నెహెమ్యాయొక్క
చర్యలు. ఇరువదియవ సంవత్సరములో కిస్లేవు మాసమున
2 నేను షూషను కోటలో ఉండగా । నా సహోదరు
లలో హనానీయను ఒకడును యూదులలో కొంద
రును వచ్చిరి. చెరపట్టబడిన శేషములో విడుదలనొందిన
యూదులనుగూర్చియు, యెరూషలేమునుగూర్చియు
3 నేను వారి నడుగగా । వారు — చెరపట్టబడినవారిలో
శేషించినవారు ఆ దేశములో బహుగా శ్రమను నిం
దను పొందుచున్నారు; మరియు యెరూషలేము
యొక్క ప్రాకారము పడిపోయినది; దాని గుమ్మము
4 లును అగ్నిచేత కాల్చబడినవని నాతో చెప్పిరి. । ఈ
మాటలు వినినప్పుడు నేను కూర్చుండి యేడ్చి, కొన్ని
దినములు దుఃఖముతో ఉపవాసముండి, ఆకాశమందలి
5 దేవుని యెదుట విజ్ఞాపనచేసితిని. । ఎట్లనగా—ఆకాశ
మందున్న దేవా యెహోవా, భయంకరుడవైన గొప్ప
దేవా, నిన్ను ప్రేమించి నీ ఆజ్ఞలను అనుసరించి నడుచు
వారిని కటాక్షించి వారితో నిబంధనను స్థిరపరుచు
6 వాడా, । నీ చెవియొగ్గి నీ నేత్రములు తెరచి నీ సన్ని
ధిని దివారాత్రము నీ దాసులైన ఇశ్రాయేలీయుల
పక్షముగా నేను చేయు ప్రార్థన అంగీకరించుము.
నేనును నా తండ్రి యింటివారును నీకు విరోధముగా
7 చేసిన పాపములను ఒప్పుకొనుచున్నాను. । నీ యెదుట
బహు అసహ్యముగా ప్రవర్తించితిమి, నీ సేవకుడైన
మోషేచేత నీవు నిర్ణయించిన ఆజ్ఞలనైనను కట్టడలనైనను
8 విధులనైనను మేము గైకొనకపోతిమి. । నీ సేవకుడైన
మోషేతో నీవు సెలవిచ్చినమాటను జ్ఞాపకము తెచ్చు
కొనుము; అదేదనగా — మీరు అపరాధము చేసిన
యెడల జనులలోకి మిమ్మును చెదర గొట్టుదును. ।
9 అయితే మీరు నావైపు తిరిగి నా ఆజ్ఞలను అనుసరించి
నడిచినయెడల, భూదిగంతములవరకు మీరు తోలివేయ
బడినను అక్కడనుండి సహా మిమ్మును కూర్చి, నా
నామము ఉంచుటకు నేను ఏర్పరచుకొనిన స్థలమునకు
10 మిమ్మును రప్పించెదనని నీవు సెలవిచ్చితివి గదా. । చిత్త
గించుము, నీవు నీ మహా ప్రభావమును చూపి, నీ
బాహుబలముచేత విడిపించిన నీ దాసులగు నీ జనులు
11 వీరే. । యెహోవా చెవియొగ్గి నీ దాసుడనైన నా
మొర్రను, నీ నామమును భయభక్తులతో ఘనపరచుట
యందు ఆనందించు నీ దాసుల మొర్రను ఆలకించి,
ఈ దినమందు నీ దాసుని ఆలోచన సఫలపరచి, ఈ
మనుష్యుడు నాయందు దయచూపునట్లు అనుగ్రహిం
చుమని నిన్ను బతిమాలుకొనుచున్నాను. నేను రాజుకు
గిన్నె అందించువాడనై యుంటిని.

అటుతరువాత అర్తహషస్త రాజు ఏలుబడికాలమున 2
ఇరువదియవ సంవత్సరములో నీసాను మాసమందు
రాజు ద్రాక్షారసము త్రాగవలెనని చూచుచుండగా
నేను ద్రాక్షారసము తీసికొని రాజునకు అందించితిని.
అంతకు పూర్వము నేనెన్నడును అతనియెదుట విచా
రముగా ఉండలేదు. । కాగా రాజు—నీకు వ్యాధి 2
లేదు గదా, నీ ముఖము విచారముగా ఉన్నదేమి? నీ
హృదయదుఃఖముచేతనే అది కలిగినదని నాతో అన
గా । నేను మిగుల భయపడి — రాజు చిరంజీవియగు 3
గాక, నా పితరుల సమాధులుండు పట్టణము పాడై
పోయి, దాని గుమ్మములును అగ్నిచేత కాల్చబడి యుం
డగా నాకు దుఃఖముఖము లేకపోవునా అని రాజుతో
అంటిని. । అప్పుడు రాజు—ఏమి కావలెనని నీవు మనవి 4
చేయుచున్నావని నన్నడుగగా, నేను ఆకాశమందలి
దేవునికి ప్రార్థన చేసి । రాజుతో—నీ సముఖమందు 5
నేను దయపొందిన యెడల, నా పితరుల సమాధులుండు
పట్టణమును తిరిగి కట్టునట్లుగా నన్ను యూదాదేశ
మునకు పంపుడని వేడుకొనుచున్నానని నేను మనవి
చేసితిని. । అందుకు రాజు రాణి తనయొద్ద కూర్చుని 6
యుండగా—నీ ప్రయాణము ఎన్నిదినములు పట్టును?
నీవు ఎప్పుడు తిరిగి వచ్చెదవని అడిగెను. నేను ఇంత
కాలమని చెప్పినప్పుడు రాజు నన్ను పంపుటకు చిత్తము
గలవాడాయెను. । ఇదియుగాక రాజుతో నేనిట్లంటిని 7
—రాజు కనుకూలమైతే యూదాదేశమున నేను చేరు
పర్యంతము నన్ను దాటించునట్లుగా నది యవతలనున్న
అధికారులకు తాకీదులను, । పట్టణప్రాకారమునకును, 8
మందిరముతో సంబంధించిన కోటగుమ్మములకును,
నేను ప్రవేశింపబోవు ఇంటికిని, దూలములు మ్రానులు
ఇచ్చునట్లుగా రాజుగారి అడవులను కాయు ఆసాపుకు
ఒక తాకీదును ఇయ్యుడని అడిగితిని; ఆలాగు నాకు
తోడుగా ఉండి నాకు కృప చూపుచున్న నా దేవుని
బలముకొలది రాజు నా మనవి ఆలకించెను. । తరువాత 9
నేను నది యవతలనున్న అధికారులయొద్దకు వచ్చి
వారికి రాజుయొక్క తాకీదులను అప్పగించితిని. రాజు
నాతోకూడ సేనాధిపతులను గుర్రపురౌతులను పం
పించెను.

హోరోనీయుడైన సన్బల్లటును, అమ్మోనీయుడైన 10
టోబీయా అను దాసుడును ఇశ్రాయేలీయులకు

క్షేమము కలుగజేయు ఒకడు వచ్చెనని విని బహుగా
11 దుఃఖపడిరి. । అంతట నేను యెరూషలేమునకు వచ్చి
12 మూడు దినములు అక్కడనే యుండి । రాత్రియందు
నేనును నాతోకూడనున్న కొందరును లేచితిమి.
యెరూషలేమునుగూర్చి దేవుడు నా హృదయమందు
పుట్టించిన ఆలోచనను నేనెవరితోనైనను చెప్పలేదు.
మరియు నేను ఎక్కియున్న పశువు తప్ప మరి యే
13 పశువును నాయొద్ద ఉంపలేదు. । నేను రాత్రికాల
మందు లోయద్వారముగుండ భుజంగపు బావి యెదుటి
కిని పెంట ద్వారము దగ్గరకును పోయి, పడిపోయిన
యెరూషలేముయొక్క ప్రాకారములను చూడగా
దాని గుమ్మములు అగ్నిచేత కాల్చబడి యుండెను. ।
14 తరువాత నేను బుగ్గగుమ్మమునకు వచ్చి రాజు కోనేటి
కిని వెళ్లితిని గాని, నేను ఎక్కియున్న పశువు పోవు
15 టకు ఎడము లేకపోయెను. । మరియొకసారి నేను
రాత్రియందు మడుగు దగ్గరనుండి పోయి ప్రాకార
మును చూచినమీదట వెనుకకు మరలి లోయ గుమ్మ
16 ములో బడి తిరిగి వచ్చితిని. । అయితే నేను ఎచ్చటికి
వెళ్లినది యేమి చేసినది అధికారులకు తెలియలేదు.
యూదులకే గాని యాజకులకే గాని యజమానులకే
గాని అధికారులకే గాని పనిచేయు ఇతరమైనవారికే
17 గాని నేను ఆ సంగతి చెప్పియుండలేదు. । అయితే
వారితో నేనిట్లంటిని—మనకు కలిగిన శ్రమ మీకు
తెలిసియున్నది, యెరూషలేము ఎట్లు పాడైపోయెనో
దాని గుమ్మములు అగ్నిచేత ఎట్లు కాల్చబడెనో మీరు
చూచియున్నారు, మనకు ఇకమీదట నింద రాకుండ
యెరూషలేముయొక్క ప్రాకారమును మరల కట్టు
18 దము రండి. । ఇదియుగాక నాకు సహాయము చేయు
దేవుని బలమునుగూర్చియు, రాజు నాకు సెలవిచ్చిన
మాటలన్నియు నేను వారతో చెప్పితిని. అందుకు
వారు—మనము కట్టుటకు పూనుకొందము రండని చెప్పి
యీ మంచికార్యము చేయుటకై బలము తెచ్చుకొనిరి. ।
19 అయితే హోరోనీయుడైన సన్బల్లటును, అమ్మోనీయు
డైన దాసుడగు టోబీయా అనువాడును, అరబీయు
డైన గెషెమును ఆ మాట వినినప్పుడు మమ్మును హేళన
చేసి మా పని తృణీకరించి—మీరు చేయు పనియేమిటి?
రాజుమీద తిరుగబాటు చేయుదురా అని చెప్పిరి. ।
20 అందుకు నేను — ఆకాశమందు నివాసియైన దేవుడు
తానే మా యత్నమును సఫలముచేయును గనుక ఆయన
దాసులమైన మేము కట్టుటకు పూనుకొనుచున్నాము,
యెరూషలేమునందు మీకు భాగమైనను స్వతం
త్రమైనను జ్ఞాపకసూచనయైనను లేదని ప్రత్యుత్తర
మిచ్చితిని.

3 ప్రధానయాజకుడైన ఎల్యాషీబును అతని సహో
దరులైన యాజకులును లేచి గొఱ్ఱెల గుమ్మమును కట్టి
ప్రతిష్ఠించి తలుపులు నిలిపిరి. హమ్మేయా గోపురము
వరకును హననేలు గోపురమువరకును ప్రాకారమును
కట్టి ప్రతిష్ఠించిరి. । అతని ఆనుకొని యెరికో పట్టణపు 2
వారు కట్టిరి; వారిని ఆనుకొని ఇమ్రీ కుమారుడైన
జక్కూరు కట్టెను; । మత్స్యపు గుమ్మమును హస్సె 3
నాయా వంశస్థులు కట్టిరి; మరియు వారు దానికి దూల
ములను ఎత్తి తలుపులు నిలిపి తాళములను గడియలను
అమర్చిరి. । వారిని ఆనుకొని హక్కోజుకు పుట్టిన 4
ఊరియా కుమారుడైన మెరేమోతును, వారిని ఆనుకొని
మెషేజబెయేలుకు పుట్టిన బెరెక్యా కుమారుడైన మెషు
ల్లామును, వారిని ఆనుకొని బయనా కుమారుడైన సాదో
కును, । వారిని ఆనుకొని తెకోవీయులును బాగుచేసిరి. 5
అయితే జనుల అధికారులు తమ ప్రభువు పనిచేయ
నొప్పుకొనక పోయిరి. । పాత గుమ్మమును బాగుచేయు 6
వారు ఎవరనగా పాసెయ కుమారుడైన యెహోయా
దాయును బెసోద్యా కుమారుడైన మెషుల్లామును దానికి
దూలములను ఎత్తి తలుపులు నిలిపి తాళములను గడియ
లను అమర్చిరి. । వారిని ఆనుకొని గిబియోనీయులును 7
మిస్పావారును గిబియోనీయుడైన మెలట్యాయును
మేరోనోతీయుడైన యాదోనును ఏటి యివతలనున్న
అధికారి న్యాయపీఠముంచబడు స్థలమువరకు బాగు
చేసిరి. । వారిని ఆనుకొని బంగారపు పనివారి సంబంధి 8
యైన హర్హయా కుమారుడైన ఉజ్జీయేలు బాగుచేయు
వాడై యుండెను. అతని ఆనుకొని ఔషధజ్ఞానియగు
హనన్యా పని జరుపుచుండెను. కల్దీయులు యెరూష
లేముయొక్క వెడల్పుగోడ నంతయు కొట్టక దాని
నుండనిచ్చి యుండిరి. । వారిని ఆనుకొని యెరూష 9
లేములో సగము భాగమునకు అధిపతియైన హూరు
కుమారుడైన రెఫాయా బాగుచేసెను. । వారిని ఆనుకొని 10
తన యింటికి ఎదురుగా హరూమపు కుమారుడైన
యెదాయా బాగుచేసెను, అతని ఆనుకొని హషబ్నెయా
కుమారుడైన హట్టూషు పని జరుపువాడై యుండెను ।
రెండవ భాగమును అగ్నిగుండముల గోపురమును హారిము 11
కుమారుడైన మల్కీయాయును పహత్మోయాబు కుమా
రుడైన హష్షూబును బాగుచేసిరి. । వారిని ఆనుకొని 12
యెరూషలేములో సగమునకు అధిపతియైన హల్లో
హేషు కుమారుడైన షల్లూమును అతని కుమార్తెలును
బాగుచేసిరి. । లోయద్వారమును హానూనును జానోహ 13
కాపురస్థులును బాగుచేసి కట్టినతరువాత దానికి తలు
పులను తాళములను గడియలను అమర్చిరి. ఇదియుగాక
పెంట ద్వారమువరకుండు గోడ వెయ్యి మూరలదనుక
వారు కట్టిరి. । బేత్హక్కెరెము ప్రదేశమునకు అధిపతి 14
యైన రేకాబు కుమారుడైన మల్కీయా పెంటగుమ్మమును
బాగుచేసెను, అతడు దాని కట్టిన తరువాత దానికి తలు
పులు నిలిపి తాళములను గడియలను అమర్చెను. । అటు 15
వెనుక మిస్పా ప్రదేశమునకు అధిపతియైన కొల్హోజె
కుమారుడైన షల్లూను ధారయొక్క గుమ్మమును బాగు

చేసి కట్టినతరువాత దానికి తలుపులు నిలిపి తాళ్ళములను
గడియలను అమర్చెను. ఇదియుగాక దావీదుపట్టణము
నుండి క్రిందకుపోవు మెట్లవరకు రాజు తోటయొద్ద
నున్న సిలోయము మడుగుయొక్క గోడను అతడు
16 కట్టెను. । అతని ఆనుకొని బేత్సూరులో సగము భాగ
మునకు అధిపతియు అజ్బూకు కుమారుడునైన నెహె
మ్యా బాగుచేసెను. అతడు దావీదు సమాధులకు ఎదు
రుగానున్న స్థలములవరకును కట్టబడిన కోనేటివరకును
పరాక్రమశాలుల యిండ్ల స్థలమువరకును కట్టెను. ।
17 అతని ఆనుకొని లేవీయులలో బానీ కుమారుడైన
రెహూము బాగుచేసెను; అతని ఆనుకొని తన భాగ
ములో కెయీలాయొక్క సగము భాగమునకు అధిపతి
18 యైన హషబ్యా బాగుచేయువాడాయెను. । అతని ఆను
కొని వారి సహోదరులైన హేనాదాదు కుమారుడైన
బవ్వై బాగుచేసెను. అతడు కెయీలాలో సగము
19 భాగమునకు అధిపతిగా ఉండెను. । అతని ఆనుకొని
మిస్పాకు అధిపతియు యేషూవకు కుమారుడునైన
ఏజెరు ఆయుధముల కొట్టు మార్గమునకు ఎదురుగా
నున్న గోడ మలుపు ప్రక్కను మరియొక భాగమును
20 బాగుచేసెను. । అతని ఆనుకొని ఆ గోడ మలుపునుండి
ప్రధానయాజకుడైన ఎల్యాషీబు ఇంటి ద్వారమువరకు
ఉన్న మరియొక భాగమును జబ్బయి కుమారుడైన
21 బారూకు ఆసక్తితో బాగుచేసెను. । అతని ఆనుకొని
ఎల్యాషీబు ఇంటి ద్వారమునుండి ఆ యింటి కొన
వరకు హక్కోజుకు పుట్టిన ఊరియా కుమారుడైన
22 మెరేమోతు బాగుచేసెను. । అతనిని ఆనుకొని
యొర్దాను మైదానములో నివాసులైన యాజకులు
23 బాగుచేయువారైరి. । వారిని ఆనుకొని తమ యింటి
కెదురుగా బెన్యామీను హష్షూబు అనువారు బాగు
చేసిరి; వారిని ఆనుకొని తన యింటియొద్ద అనన్యాకు
పుట్టిన మయశేయా కుమారుడైన అజర్యా బాగు
24 చేసెను. । అతని ఆనుకొని అజర్యా యిల్లు మొదలు
కొని గోడ మలుపు మూలవరకును హేనాదాదు
కుమారుడైన బిన్నూయి మరియొక భాగమును బాగు
25 చేసెను. । అతని ఆనుకొని గోడ మళ్లిన దిక్కున చెర
సాలదగ్గర రాజు నగరులో నిలుచు మహా గోపురము
వరకు ఊజై కుమారుడైన పాలాలు బాగుచేయు
వాడాయెను; అతని ఆనుకొని పరోషు కుమారుడైన
26 పెదాయా బాగుచేసెను. । ఓపెలులోనున్న నెతీనీ
యులు తూర్పువైపు నీటిగుమ్మము ప్రక్కను దానికి
27 సంబంధించిన గోపురముదగ్గరను బాగుచేసిరి. । అతని
ఆనుకొని ఓపెలు గోడవరకు గొప్ప గోపురమునకు
ఎదురుగానున్న మరియొక భాగమును తెకోవీయులు
28 బాగుచేసిరి. । గుఱ్ఱపు గుమ్మమునకు పైగా యాజకు
29 లందరు తమ యిండ్లకెదురుగా బాగుచేసిరి. । వారిని
ఆనుకొని తన యింటికి ఎదురుగా ఇమ్మేరు కుమారు
డైన సాదోకు బాగుచేసెను; అతని ఆనుకొని తూర్పు
ద్వారమును కాయు షెకన్యా కుమారుడైన షెమయా
బాగుచేసెను. । అతని ఆనుకొని షెలెమ్యా కుమారు 30
డైన హనన్యాయును జాలాపు ఆరవ కుమారుడైన
హానూనును మరియొక భాగమును బాగుచేయువారైరి;
వారిని ఆనుకొని తన గదికి ఎదురుగా బెరెక్యా
కుమారుడైన మెషుల్లాము బాగుచేసెను. । అతని 31
ఆనుకొని నెతీనీయుల స్థలమునకును మిఫ్కాదు ద్వార
మునకు ఎదురుగానున్న వర్తకుల స్థలముయొక్క
మూలవరకును బంగారపు పనివాని కుమారుడైన
మల్కీయా బాగుచేసెను. । మరియు మూలకును 32
గొఱ్ఱెల గుమ్మమునకును మధ్యను బంగారపు పని
వారును వర్తకులును బాగుచేసిరి.

మేము గోడ కట్టుచున్న సమాచారము విని సన్బ 4
ల్లటు మిగుల కోపగించి రౌద్రుడై యూదులను ఎగ
తాళిచేసి । షోమ్రోను దండువారి యెదుటను తన 2
స్నేహితుల యెదుటను ఇట్లనెను—దుర్బలులైన యీ
యూదులు ఏమి చేయుదురు? తమంతట తామే
యీ పని ముగింతురా? బలులు అర్పించి (బలపరచు
కొందురా?) ఒక దినమందే ముగింతురా? కాల్చబడిన
చెత్తను కుప్పలుగాపడిన రాళ్లను మరల బలమైనవిగా
చేయుదురా? । మరియు అమ్మోనీయుడైన టోబీయా 3
అతనియొద్దను ఉండి—వారు కట్టినదానిపైకి ఒక నక్క
యెగిరినట్టయిన వారి రాతిగోడ పడిపోవుననెను. ।—
మా దేవా ఆలకించుము, మేము తిరస్కారము నొందిన 4
వారము; వారి నింద వారి తలలమీదికి వచ్చునట్లు
చేసి, వారు చెరపట్టబడినవారై వారు నివసించు దేశ
ములోనే వారిని దోపుడు అప్పగించుము. । వారు 5
కట్టువారిని బట్టి నీకు కోపము పుట్టించి యుండిరి
గనుక వారి దోషమును పరిహరింపకుము, నీయెదుట
వారి పాపమును తుడిచివేయకుము. । అయినను పని 6
చేయుటకు జనులకు మనస్సు కలిగియుండెను గనుక
మేము గోడను కట్టుచుంటిమి, అది సగము ఎత్తు కట్ట
బడి యుండెను.

సన్బల్లటును టోబీయాయును అరబీయులును 7
అమ్మోనీయులును అష్డోదీయులును, యెరూషలేము
యొక్క గోడలు కట్టబడెననియు, బీటలన్నియు
కప్పబడెననియు వినినప్పుడు । మిగుల కోపపడి 8
యెరూషలేముమీదికి యుద్ధమునకు వచ్చి, పని ఆటం
కపరచవలెనని వారందరు కట్టుకట్టి మమ్మును కలత
పరచగా, । మేము మా దేవునికి ప్రార్థనచేసి, వారి 9
భయముచేత దివారాత్రము కావలి యుంచితిమి. ।
అప్పుడు యూదావారు — బరువులు మోయువారి 10
బలము తగ్గిపోయెను, ఉన్న చెత్త విస్తారము, గోడ
కట్టలేమని చెప్పగా, । మా విరోధులును — వారు 11
తెలిసికొనకుండను చూడకుండను మనము వారి

సధ్యకు చొరబడి వారిని చంపి పని ఆటంకపరచుదు
మనిరి. । మా శత్రువులయొద్ద నివాసులైయున్న
యూదులు వచ్చి — నలుదిక్కులనుండి మీరు మా
సహాయమునకు రావలెనని మాటి మాటికి మాతో
చెప్పగా । అందునిమిత్తము గోడవెనుకనున్న దిగువ
లములలోను పైనున్న స్థలములలోను జనులను వారి
ారి కుటుంబముల ప్రకారముగా వారి కత్తులతోను
ారి యీటెలతోను వారి విండ్లతోను నిలిపితిని. ।
ంతట నేను లేచి చూచి ప్రధానులతోను అధికా
లతోను జనులలోను—వారికి మీరు భయపడకుడి,
హా ఘనుడును భయంకరుడునగు యెహోవాను
ాపకము చేసికొని, మీ సహోదరుల పక్షముగాను
ా కుమారుల పక్షముగాను మీ కుమార్తెల పక్షము
ాను మీ భార్యల పక్షముగాను మీ నివాసము
ాకుండునట్లు యుద్ధముచేయుడి అంటిని.

వారి యోచన మాకు తెలియబడెననియు, దేవుడు
ానిని వ్యర్థము చేసెననియు మా శత్రువులు సమా
ారము వినగా, మాలో ప్రతివాడును తన పనికి
ోడదగ్గరకు వచ్చెను. । అయితే అప్పటినుండి నా
నివారిలో సగముమంది పనిచేయుచు వచ్చిరి, సగ
ుమంది యీటెలును బల్లెములును విండ్లును కవచ
ులును ధరించినవారై వచ్చిరి; అధికారులు యూదు
లో ఆ యా యింటివారి వెనుక నిలిచిరి. । గోడ
ట్టువారును బరువులు మోయువారును బరువులు
త్తువారును, ఒక్కొక్కరు ఒక చేతితో పనిచేసి
క చేతితో ఆయుధము పట్టుకొని యుండిరి. ।
రియు కట్టువారిలో ఒక్కొకడు తన కత్తిని నడు
ుకు బిగించుకొని గోడ కట్టుచువచ్చెను, బాకా
ుదువాడు నాయొద్ద నిలిచెను. । అప్పుడు నేను
్రధానులతోను అధికారులతోను మిగిలినవారితోను
ల్లంటిని—పని మిక్కిలి గొప్పది, మనము గోడమీద
కరొకరికి చాల యెడముగా ఉన్నాము । గనుక
స్థలములో మీకు బాకానాదము వినబడునో
క్కడికి మా దగ్గరకు రండి, మన దేవుడు మన పక్ష
ుగా యుద్ధముచేయును. । ఆ ప్రకారము మేము
నియందు ప్రయాసపడితిమి; సగముమంది ఉద
ము మొదలుకొని నక్షత్రములు అగుపడువరకు
టెలు పట్టుకొనిరి. । మరియు ఆ కాలమందు నేను
ులతో—ప్రతివాడు తన పనివానితోకూడ యెరూ
లేములో బసచేయవలెను, అప్పుడు వారు రాత్రి
ుకు కాపుగా నుందురు, పగలు పనిచేయుదురని
ప్పితిని. । ఈలాగున నేను గాని నా బంధువులు
ని నా పనివారు గాని వా వెంబడియున్న కావలి
ారు గాని ఉదుకుకొనుటకు తప్ప మరి దేనికిని మా
స్త్రములను తీసివేయలేదు.

తమ సహోదరులైన యూదుల పెద్దలమీద
జనులును వారి భార్యలును కఠినమైన ఫిర్యాదు
చేసిరి. । ఏదనగా కొందరు—మేమును మా కుమారు 2
లును మా కుమార్తెలును అనేకులము. అందుచేత
మేము తిని బ్రదుకుటకు ధాన్యము మీయొద్ద తీసి
కొందుమనిరి. । మరికొందరు — క్షామమున్నందున 3
మా భూములను ద్రాక్షతోటలను మా యిండ్లను
కుదువపెట్టితిమి గనుక మీయొద్ద ధాన్యము తీసికొందు
మనిరి. । మరికొందరు—రాజుగారికి పన్ను చెల్లించుటకై 4
మా భూములమీదను మా ద్రాక్షతోటలమీదను మేము
అప్పుచేసితిమి. । మా ప్రాణము మా సహోదరుల 5
ప్రాణమువంటిది కాదా? మా పిల్లలు వారి పిల్లలను
పోలినవారు కారా? మా కుమారులను మా కుమార్తె
లను దాసులగుటకై అప్పగింపవలసి వచ్చెను; ఇప్పటి
కిని మా కుమార్తెలలో కొందరు దాసత్వములో
నున్నారు, మా భూములును మా ద్రాక్షతోటలును
అన్యులవశమున నుండగా వారిని విడిపించుటకు
మాకు శక్తి చాలకున్నదని చెప్పగా । వారి ఫిర్యాదును 6
ఈ మాటలను నేను వినినప్పుడు మిగుల కోపపడి
తిని. । అంతట నాలో నేనే యోచనచేసి ప్రధాను 7
లను అధికారులను గద్దించి — మీరు మీ సహోదు
రులయొద్ద వడ్డి పుచ్చుకొనుచున్నారని చెప్పి వారిని
ఆటంకపరచుటకై మహా సమాజమును సమకూర్చి ।
—అన్యులకు అమ్మబడిన మా సహోదరులైన యూదు 8
లను మా శక్తికొలది మేము విడిపించితిమి, మీరు మీ
సహోదరులను అమ్ముదురా? వారు మనకు అమ్మబడ
వచ్చునా? అని వారితో చెప్పగా, వారు ఏమియు
చెప్పలేక ఊరకుండిరి. । మరియు నేను — మీరు 9
చేయునది మంచిది కాదు, మన శత్రువులైన అన్యుల
నిందనుబట్టి మన దేవునికి భయపడి మీరు ప్రవర్తింప
కూడదా? । నేనును నా బంధువులును నా దాసులును 10
కూడ ఆలాగుననే వారికి సొమ్మును ధాన్యమును అప్పు
గా ఇచ్చితిమి; ఆ అప్పు పుచ్చుకొనకుందము. । ఈ 11
దినములోనే వారియొద్ద మీరు అపహరించిన భూము
లను ద్రాక్షతోటలను ఒలీవతోటలను వారి యిండ్లను
వారికి అప్పుగా ఇచ్చిన సొమ్ములోను ధాన్యములోను
ద్రాక్షారసములోను నూనెలోను నూరవ భాగమును
వారికి మరల అప్పగించుడని నేను మిమ్మును బతిమాలు
చున్నాను అంటిని. । అందుకు వారు—నీవు చెప్పిన 12
ప్రకారమే యివన్నియు ఇచ్చివేసి వారియొద్ద ఏమియు
కోరమనిరి. అంతట నేను యాజకులను పిలిచి ఈ
వాగ్దానప్రకారము జరిగించుటకు వారిచేత ప్రమా
ణము చేయించితిని. । మరియు నేను నా ఒడిని దులిపి 13
—ఈ ప్రకారమే దేవుడు ఈ వాగ్దానము నెరవేర్చని
ప్రతివానిని తన యింటిలో ఉండకయు తన పని
ముగింపకయు నుండునట్లు దులిపివేయును; ఇటువలె
వాడు దులిపివేయబడి యేమియు లేనివాడుగా చేయ

జరుగునుగాకని చెప్పగా, సమాజకులందరు ఆలాగు కలుగు
గాక అని చెప్పి యెహోవాను స్తుతించిరి. జనులంద
14 రును ఈ మాటచొప్పుననే జరిగించిరి. ၊ మరియు
నేను యూదాదేశములో వారికి అధికారిగా నిర్ణ
యింపబడిన కాలము మొదలుకొని, అనగా అర్తహ
షస్త రాజు ఏలుబడియందు ఇరువదియవ సంవత్సరము
మొదలుకొని ముప్పది రెండవ సంవత్సరమువరకు
పండ్రెండు సంవత్సరములు అధికారికి రావలసిన
సొమ్మును నేను గాని నా బంధువులు గాని తీసికొనలే
15 దు. ၊ అయితే నాకు ముందుగానుండు అధికారులు
జనులయొద్దనుండి ఆహారమును ద్రాక్షారసమును నలు
వది తులముల వెండిని తీసికొనుచు వచ్చిరి; వారి పని
వారు సహా జనులమీద జులుము చేయుచు వచ్చిరి,
అయితే దేవుని భయముచేత నేనాలాగున చేయలేదు. ၊
16 ఇదియుగాక నేను గోడపని చేయగా నా పనివా
17 రును ఆ పని చేయుచు వచ్చిరి. ၊ భూమి సంపాదించు
కొనిన వారము కాము; నా భోజనపు బల్లయొద్ద మా
చుట్టునున్న అన్యజనులలోనుండి వచ్చినవారు గాక
యూదులును అధికారులును నూట ఏబదిమంది
18 కూర్చునియుండిరి. ၊ నా నిమిత్తము ప్రతి దినము ఒక
యెద్దును శ్రేష్ఠమైన ఆరు గొఱ్ఱెలును సిద్ధము చేయ
బడెను. ఇవియుగాక కోళ్లను, పదిరోజులకు ఒకమారు
నానావిధమైన ద్రాక్షారసములను సిద్ధము చేసితిని.
ఈ ప్రకారముగా చేసినను ఈ జనుల దాసత్వము
బహు కఠినముగా ఉండినందున అధికారికి రావలసిన
19 సొమ్మును నేను అపేక్షింపలేదు. ၊ నా దేవా, ఈ జను
లకు నేను చేసిన సకలమైన ఉపకారములనుబట్టి నాకు
మేలు కలుగునట్లుగా నన్ను దృష్టించుము.

6 నేను ఇంకను గుమ్మములకు తలుపులు నిలుపక
ముందుగా దానిలో బీటలులేకుండ సంపూర్ణముగా
గోడను కట్టియుండగా, సన్బల్లటును టోబీయాయును
అరబీయుడైన గెషెమును మా శత్రువులలో మిగిలిన
2 వారును విని ၊ సన్బల్లటును గెషెమును నాకు ఏదో
హాని చేయుటకు ఆలోచించి—ఓనో మైదానమం
దున్న గ్రామములలో ఒక దాని దగ్గర మనము కలిసి
కొందము రండని నాయొద్దకు వర్తమానము పంపిరి. ၊
3 అందుకు నేను—నేను చేయుపని గొప్పది, దాని విడిచి
మీయొద్దకు వచ్చుటకై నేను దాని నెందుకు ఆప
వలెను? నేను రాలేనని చెప్పుటకు దూతలను పంపితిని.၊
4 వారు ఆలాగున నాలుగు మారులు నాయొద్దకు వర్త
మానము పంపగా ఆ ప్రకారమే నేను మరల ప్రత్యు
5 త్తరమిచ్చితిని. ၊ అంతట అయిదవమారు సన్బల్లటు తన
పనివాని ద్వారా విప్పియున్న యొక పత్రికను నా
6 యొద్దకు పంపెను. ၊ అందులో — వారిపైన రాజుగా
ఉండవలెనని నీవు ప్రాకారమును కట్టుచున్నావనియు,
ఈ హేతువుచేతనే నీవును యూదులును రాజుమీద
తిరుగబాటు చేయునట్లుగా నీవు ఆలోచించుచున్నా
వనియు, ၊ యూదులకు రాజుగా ఉన్నాడని నిన్ను 7
గూర్చి ప్రకటనచేయుటకు యెరూషలేములో ప్రవక్త
లను నీవు నియమించితివనియు మొదలగు మాటలును
—రాజుకు ఈ సంగతులు తెలియనగుననియు మొద
లగు మాటలును,—అందునిమిత్తము ఇప్పుడు మనము
యోచన చేసెదము రండనియు, ఈ సంగతి అన్య
జనుల వదంతియనియు, దానిని గెషెము చెప్పుచున్నా
డనియు వ్రాయబడెను. ၊ ఈ పని చేయలేకుండ 8
మేమశక్తులమగుదు మనుకొని వారందరు మమ్మును బెద
రింప జూచిరిగాని ၊ నేను — ఇటువంటి కార్యములను 9
మేమెంతమాత్రమును చేయువారముకాము, వీటిని నీ
మనస్సులోనుండి నీవు కల్పించుకొంటివని అతనియొద్దకు
నేను వర్తమానము పంపితిని. దేవా, ఇప్పుడు నన్ను
బలపరచుము.

అటుతరువాత మెహేతబేలుకు పుట్టిన దెలాయ్యా 10
కుమారుడైన షెమయాయొక్క యింటికి వచ్చితిని.
అతడు వాకిలి మూసివేసి తన యింట నుండెను. అతడు
—రాత్రికాలమందు నిన్ను చంపుటకు వారు వచ్చెదరు
గనుక, దేవుని మందిర గర్భాలయములోపలికి మనము
పోయి తలుపులు వేసికొనెదము రండని చెప్పగా ၊
నేను—నావంటివాడు పారిపోవచ్చునా? ఇంతవాడనైన 11
నేను నా ప్రాణమును రక్షించుకొనుటకైనను గర్భా
లయమున ప్రవేశింపవచ్చునా? నేను అందులో ప్రవే
శింపనంటిని. ၊ అప్పుడు దేవుడు అతని పంపలేదనియు, 12
టోబీయాయును సన్బల్లటును అతనికి లంచమిచ్చినం
దున నా విషయమై యీ ప్రకటన చేసెననియు నాకు
తెలియబడినది. ၊ ఇందువలన నాకు భయము పుట్టగా, 13
నేను అతడు చెప్పినట్లుచేసి పాపములో పడుదునని
అనుకొని, నామీద నింద మోపునట్లుగా నన్నుగూర్చి
చెడువార్త పుట్టించుటకు వారతనికి లంచమిచ్చియుం
డిరి. ၊ నా దేవా, వారి క్రియలనుబట్టి టోబీయాను 14
సన్బల్లటును, నన్ను భయపెట్టవలెనని కనిపెట్టియున్న
ప్రవక్తలను, నోవద్యా అను ప్రవక్త్రిని జ్ఞాపకము చేసి
కొనుము.

ఈ ప్రకారముగా ఏలూలు మాసము ఇరువది 15
యయిదవ దినమందు, అనగా ఏబదిరెండు దినములకు
ప్రాకారమును కట్టుట సమాప్తమాయెను. ၊ అయితే 16
మా శత్రువులు ఈ సంగతి వినినప్పుడును, మా చుట్టు
నుండు అన్యజనులందరు జరిగినపని చూచినప్పుడును,
వారు బహుగా అధైర్యపడిరి; ఏలయనగా ఈ పని
మా దేవునివలన జరిగినదని వారు తెలిసికొనిరి. ၊ ఆ 17
దినములలో యూదుల ప్రధానులు టోబీయాయొద్దకు
మాటి మాటికి పత్రికలు పంపుచు వచ్చిరి; అతడును
వారికి పత్రికలు పంపుచుండెను. ၊ అతడు ఆరహు 18
కుమారుడైన షెకన్యాకు అల్లుడు. ఇదియుగాక

రోహానాను అను తన కుమారుడు బెరెక్యా కుమారు
డైన మెషుల్లాము కుమార్తెను వివాహము చేసికొని
యుండెను గనుక యూదులలో అనేకులు అతని పక్ష
9 మున నుండెదమని ప్రమాణముచేసిరి. । వారు నా
యెదుట అతని గుణాతిశయములనుగూర్చి మాటలా
డుచువచ్చిరి, నేను చెప్పిన మాటలు అతనికి తెలియ
జేసిరి. నన్ను భయపెట్టుటకే టోబీయా పత్రికలు
పంపెను.

7 నేను ప్రాకారమును కట్టి తలుపులు నిలిపి,
ద్వారపాలకులను గాయకులను లేవీయులను నియమిం
2 చిన పిమ్మట । నా సహోదరుడైన హనానీకిని,
కోటకు అధిపతియైన హనన్యాకును యెరూషలేము
పైన అధికారము ఇచ్చితిని. హనన్యా నమ్మకమైన
మనుష్యుడు, అందరికంటె ఎక్కువగా దేవునియెదుట
3 భయభక్తులుగలవాడు. । అప్పుడు నేను — బాగుగా
ప్రొద్దెక్కు పర్యంతము యెరూషలేముయొక్క గుమ్మ
ముల తలుపులు తియ్యకూడదు; మరియు జనులు
దగ్గర నిలువబడియుండగా తలుపులు వేసి అడ్డగడి
యలు వాటికి వేయవలెననియు, ఇదియుగాక యెరూష
లేము కాపురస్థులందరు తమ తమ కావలి వంతులను
బట్టి తమ యిండ్లకు ఎదురుగా కాచుకొనుటకు కావలి
4 నియమింపవలెననియు చెప్పితిని. । అప్పటిలో ఆ
పట్టణము మిగుల విశాలముగాను పెద్దదిగాను ఉండెను
గాని దానిలో జనులు కొద్దిగా ఉండిరి, యిండ్లు
5 ఇంక కట్టబడలేదు. । జనసంఖ్య చేయునట్లు నా
దేవుడు నా హృదయములో తలంపు పుట్టింపగా,
ప్రధానులను అధికారులను జనులను నేను సమకూర్చి
తిని. అంతలో ముందు వచ్చినవారినిగూర్చిన వంశా
వళి గ్రంథము నాకు కనబడెను, అందులో వ్రాయ
6 బడిన వంశావళులు ఇవి. । జెరుబ్బాబెలు యేషూవ
నెహెమ్యా అజర్యా రయమ్యా నహమానీ మొర్దకై
బిల్షాను మిస్పెరెతు బిగ్వయి నెహూము బయనా
అనువారితోకూడ బాబెలురాజైన నెబూకద్నెజరు
7 చేత చెరలోనికి కొంచుపోబడి । తిరిగి యెరూషలేమున
కును యూదాదేశమునకును తమ తమ పట్టణములకు
వచ్చినవారు వీరే. ఇశ్రాయేలీయులయొక్క జనసంఖ్య
8 యిదే అది ఏలాగనగా పరోషు వంశస్థులు రెండు
9 వేల నూట డెబ్బది యిద్దరును । షెఫట్యా వంశస్థులు
0 మున్నూట డెబ్బది యిద్దరును । ఆరహు వంశస్థులు
1 ఆరునూట ఏబది యిద్దరును । యేషూవ యోవాబు
సంబంధులైన పహత్మోయాబు వంశస్థులు రెండువేల
2 ఎనమన్నూట పదునెనిమిదిమందియు । ఏలాము వంశ
3 స్థులు వెయ్యిన్ని ఇన్నూట ఏబది నలుగురును. । జత్తూ
వంశస్థులు ఎనమన్నూట నలుబది యయిదుగురును ।
4 జక్కయి వంశస్థులు ఏడు నూట అరువది మందియు ।
5 బిన్నూయి వంశస్థులు ఆరు నూట నలుబది యెనమండు

గురును । బేబై వంశస్థులు ఆరు నూట ఇరువది యెన 16
మండుగురును । అజ్గాదు వంశస్థులు రెండువేల 17
మున్నూట ఇరువది యిద్దరును । అదోనీకాము వంశ 18
స్థులు ఆరు నూట అరువది యేడుగురును । బిగ్వయి 19
వంశస్థులు రెండు వేల అరువది యేడుగురును । ఆదీను 20
వంశస్థులు ఆరు నూట ఏబది యయిదుగురును । హిజ్కి 21
యా బంధువుడైన ఆటేరు వంశస్థులు తొంబది యెన
మండుగురును । హాషుము వంశస్థులు మున్నూట ఇరు 22
వది యెనమండుగురును । బేజయి వంశస్థులు మున్నూట 23
ఇరువది నలుగురును । హారీపు వంశస్థులు నూట 24
పన్నెండుగురును । గిబియోను వంశస్థులు తొంబది 25
యయిదుగురును । బేత్లెహేము నెటోపావారు నూట 26
ఎనుబది యెనమండుగురును । అనాతోతువారు నూట 27
ఇరువది యెనమండుగురును । బేతజ్మావెతువారు నలు 28
బది యిద్దరును । కిర్యత్యారీము కెఫీరా బెయేరోతుల 29
వారు ఏడునూట నలువది ముగ్గురును । రామా గెబల 30
వారు ఆరు నూట ఇరువది యొకరును । మిక్మషువారు 31
నూట ఇరువది యిద్దరును । బేతేలు హాయిలవారు 32
నూట ఇరువది ముగ్గురును । రెండవ నెబోవారు ఏబది 33
యిద్దరును । రెండవ ఏలామువారు వెయ్యిన్ని ఇన్నూట 34
ఏబది నలుగురును । హారిము వంశస్థులు మున్నూట 35
ఇరువది మందియు । యెరికో వంశస్థులు మున్నూట 36
నలువది యయిదుగురును । లోదు హాదీదు ఓనో 37
అనువారి వంశస్థులు ఏడునూట ఇరువది యొకరును ।
సెనాయా వంశస్థులు మూడు వేల తొమ్మన్నూట 38
ముప్పదిమందియు । యాజకులైయుండి యేషూవ 39
యింటివారైన యెదాయా వంశస్థులు తొమ్మన్నూట
డెబ్బది ముగ్గురును । ఇమ్మేరు వంశస్థులు వెయ్యిన్ని 40
ఏబది యిద్దరును । పషూరు వంశస్థులు వెయ్యిన్ని 41
ఇన్నూట నలువది యేడుగురును । హారిము వంశస్థులు 42
వెయ్యిన్ని పదునేడుగురును । లేవీయులైన యేషూవ 43
హోదవ్యా కద్మీయేలు అనువారి వంశస్థులు డెబ్బది
నలుగురును । గాయకులైన ఆసాపు వంశస్థులు నూట 44
నలువది యెనమండుగురును । ద్వారపాలకులైన 45
షల్లూము వంశస్థులు ఆటేరు వంశస్థులు టల్మోను
వంశస్థులు అక్కూబు వంశస్థులు హటీటా వంశస్థులు
షోబయి వంశస్థులు నూట ముప్పది యెనమండు
గురును । నెతీనీయులైన జీహా వంశస్థులు హశూపా 46
వంశస్థులు టబ్బాయోతు వంశస్థులు । కేరోసు 47
వంశస్థులు సీయహా వంశస్థులు పాదోను వంశస్థులు ।
లెబానా వంశస్థులు హగాబా వంశస్థులు షల్మయి వంశ 48
స్థులు । హానాను వంశస్థులు గిద్దేలు వంశస్థులు గహారు 49
వంశస్థులు । రెవాయ వంశస్థులు రెజీను వంశస్థులు 50
నెకోదా వంశస్థులు । గజ్జాము వంశస్థులు ఉజ్జా 51
వంశస్థులు పాసెయ వంశస్థులు । బేసాయి వంశస్థులు 52
మెహూనీము వంశస్థులు నెపూషేసీము వంశస్థులు ।

53 బక్బూకు వంశస్థులు హకూపా వంశస్థులు హర్హూరు
54 వంశస్థులు । బజ్లీతు వంశస్థులు మెహీదా వంశస్థులు
55 హర్షా వంశస్థులు । బర్కోసు వంశస్థులు సీసెరా వం
56 శస్థులు తెమహు వంశస్థులు । నెజీయహు వంశస్థులు
57 హటీపా వంశస్థులు । సొలొమోను దాసుల వంశస్థులు
సొటయి వంశస్థులు సోపెరెతు వంశస్థులు పెరూదా
58 వంశస్థులు । యహలా వంశస్థులు దర్కోను వంశస్థులు
59 గిద్దేలు వంశస్థులు । షెఫట్యా వంశస్థులు హట్టీలు వం
శస్థులు జెబాయీయుల సంబంధమైన పొకెరెతు వం
60 శస్థులు ఆమోను వంశస్థులు. । ఈ నెతీనీయులంద
రును సొలొమోను దాసుల వంశస్థులును మున్నూట
తొంబది యిద్దరు.

61 తేల్మెలహు తేల్హర్షా కెరూబు అదోను ఇమ్మేరు
మొదలైన స్థలములనుండి వచ్చినవారు తాము ఇశ్రా
యేలీయుల సంబంధులో కారో తెలుపుటకు తమ
యింటి పేరులైనను తమ వంశావళి పత్రికయైనను
62 కనుపరచలేకపోయిరి. । వారెవరనగా దెలాయ్యా
వంశస్థులు టోబీయా వంశస్థులు నెకోదా వంశస్థులు
63 వీరు ఆరు నూట నలువది యిద్దరు । హబాయ్యా
వంశస్థులు హక్కోజు వంశస్థులు బర్జిల్లయి వంశస్థులు,
అనగా గిలాదీయుడైన బర్జిల్లయి కుమార్తెలలో ఒక
తెను పెండ్లిచేసికొని వారి పేరుచేత పిలువబడిన బర్జి
64 ల్లయి వంశస్థులును యాజక సంతానులు. । వీరి వంశా
వళులను బట్టి యెంచబడినవారిలో వారి పద్దు పుస్తక
మును వెదకగా అది కనబడకపోయెను; కాగా వారు
అపవిత్రులుగా ఎంచబడి యాజకులలో ఉండకుండ
65 వేరుపరచబడిరి. । కాగా అధికారి–ఊరీము తుమ్మీము
అనువాటిని ధరించుకొని ఒక యాజకుడు ఏర్పడు
వరకు అతిపరిశుద్ధవస్తువులను మీరు తినకూడదని
66 వారితో చెప్పెను. । సమాజకులందరును నలువది
67 రెండువేల మున్నూట అరువదిమంది. । వీరు గాక
వీరి పనివారును పనికత్తెలును ఏడు వేల మున్నూట
ముప్పది యేడుగురును, గాయకులలో స్త్రీ పురుషులు
68 ఇన్నూట నలువది యయిదుగురునై ఉండిరి. । వారి
గుఱ్ఱములు ఏడు నూట ముప్పది ఆరును, వారి కంచర
69 గాడిదెలు ఇన్నూట నలువది యయిదును । వారి
ఒంటెలు నన్నూట ముప్పది యయిదును వారి గాడి
దెలు ఆరు వేల ఏడు నూట ఇరువదియునై యుండెను.

70 పెద్దలలో ప్రధానులైన కొందరు పనికి కొంత
సహాయము చేసిరి. అధికారి ఖజానాలో నూట ఇరు
వది తులముల బంగారమును ఏబది పళ్లెములను ఏడు
నూట ముప్పది యాజక వస్త్రములను వేసి యిచ్చెను. ।
71 మరియు పెద్దలలో ప్రధానులైనవారు కొందరు ఖజా
నాలో నూట నలువది తులముల బంగారమును పదు
72 నాలుగు లక్షల తులముల వెండిని వేసిరి. । మిగిలిన
వారును ఇన్నూట నలువది తులముల బంగారమును
ఇన్నూట నలువది లక్షల తులముల వెండిని అరువది
యేడు యాజక వస్త్రములను ఇచ్చిరి. । అప్పుడు యాజ 7
కులు లేవీయులు ద్వారపాలకులు గాయకులు జను
లలో కొందరును, నెతీనీయులు ఇశ్రాయేలీయులంద
రును, తమ పట్టణములయందు నివాసము చేసిరి.

ఏడవ నెల రాగా ఇశ్రాయేలీయులు తమ పట్ట 8
ణములలో నివాసులై యుండిరి. అప్పుడు జనులంద
రును ఏకమనస్కులై, నీటి గుమ్మము ఎదుటనున్న
మైదానమునకు వచ్చి—యెహోవా ఇశ్రాయేలీయు
లకు ఆజ్ఞాపించిన మోషే ధర్మశాస్త్రగ్రంథమును తెమ్మని
ఎజ్రా అను శాస్త్రితో చెప్పగా । యాజకుడైన ఎజ్రా 2
యేడవ మాసము మొదటి దినమున చదువబడుదాని
గ్రహింప శక్తిగల స్త్రీ పురుషులు కలిసిన సమాజమం
తటి యెదుటను ఆ ధర్మశాస్త్రగ్రంథము తీసికొనివచ్చి ।
నీటి గుమ్మము ఎదుటనున్న మైదానములో ఉదయము 3
మొదలుకొని మధ్యాహ్నమువరకు నిలుచున్న ఆ స్త్రీ
పురుషులకును, తెలివితో వినగలవారికందరికిని చదివి
వినిపించుచు వచ్చెను, ఆ జనులందరును ధర్మశాస్త్రగ్రంథ
మును శ్రద్ధతో వినిరి. । అంతట శాస్త్రియగు ఎజ్రా 4
ఆ పనికొరకు కఱ్ఱతో చేయబడిన యొక పీఠము
మీద నిలువబడెను; మరియు అతని దగ్గర కుడిపార్శ్వ
మందు మత్తిత్యా షెమ అనాయా ఊరియా హిల్కీ
యా మయశేయా అనువారును, అతని యెడమపార్శ్వ
మందు పెదాయా మిషాయేలు మల్కీయా హాషుము
హష్బద్దానా జెకర్యా మెషుల్లాము అనువారును నిలిచి
యుండిరి. । అప్పుడు ఎజ్రా అందరికంటె ఎత్తుగా 5
నిలువబడి జనులందరును చూచుచుండగా గ్రంథమును
విప్పెను, విప్పగానే జనులందరు నిలువబడిరి. । ఎజ్రా 6
మహా దేవుడైన యెహోవాను స్తుతింపగా జనులం
దరు తమ చేతులెత్తి—ఆమేన్ ఆమేన్ అని పలుకుచు,
నేలకు ముఖములు వంచుకొని యెహోవాకు నమ
స్కరించిరి. । జనులు ఈలాగు నిలువబడుచుండగా 7
యేషూవ బానీ షేరేబ్యా యామీను అక్కూబు
షబ్బెతై హోదీయా మయశేయా కెలీటా అజర్యా
యోజాబాదు హానాను పెలాయాలును లేవీయులును
ధర్మశాస్త్రముయొక్క తాత్పర్యమును తెలియజెప్పిరి. ।
ఇటువలెనే వారు దేవుని గ్రంథమును స్పష్టముగా 8
చదివి వినిపించి జనులు బాగుగా గ్రహించునట్లు
దానికి అర్థము చెప్పిరి. । జనులందరు ధర్మశాస్త్రగ్రంథపు 9
మాటలు విని యేడ్వ మొదలుపెట్టగా, అధికారియైన
నెహెమ్యాయు యాజకుడును శాస్త్రియునగు ఎజ్రా
యును జనులకు బోధించు లేవీయులును — మీరు
దుఃఖపడవద్దు, ఏడ్వవద్దు, ఈ దినము మీ దేవుడైన
యెహోవాకు ప్రతిష్ఠిత దినమని జనులతో చెప్పిరి. ।
మరియు నెహెమ్యా వారితో నిట్లనెను — పదండి, 10
క్రొవ్విన మాంసము భక్షించుడి, మధురమైనదాని

పానముచేయుడి, ఇదివరకు తమకొరకు ఏమియు
సిద్ధము చేసికొననివారికి వంతులు పంపించుడి. ఏల
యనగా ఈ దినము మన ప్రభువుకు ప్రతిష్ఠితమా
యెను, మీరు దుఃఖపడకుడి, యెహోవాయందు
1 ఆనందించుటవలన మీరు బలమొందుదురు. । అలా
గున లేవీయులు జనులందరిని ఓదార్చి — మీరు దుః
ఖము మానుడి, ఇది పరిశుద్ధదినము, మీరు దుఃఖపడ
3 కూడదని వారితో అనిరి. । ఆ తరువాత జనులు
తమకు తెలియజేయబడిన మాటలన్నిటిని గ్రహించి,
తినుటకును త్రాగుటకును లేనివారికి ఫలాహారములు
పంపించుటకును సంభ్రమముగా ఉండుటకును ఎవరి
యింట్లకు వారు వెళ్లిరి.
3 రెండవ దినమందు జనులందరి పెద్దలలో ప్రధాను
లైనవారును యాజకులును లేవీయులును ధర్మశాస్త్ర
గ్రంథపు మాటలు వినవలెనని శాస్త్రియైన ఎజ్రా
4 యొద్దకు కూడి వచ్చిరి. । యెహోవా మోషేకు
దయచేసిన గ్రంథములో చూడగా, ఏడవ మాసపు
ఉత్సవకాలమందు ఇశ్రాయేలీయులు పర్ణశాలలలో
నివాసము చేయవలెనని వ్రాయబడి యుండెను. ।
5 మరియు వారు తమ పట్టణములన్నిటిలోను యెరూష
లేములోను ప్రకటనచేసి తెలియజేయవలసిన దేమనగా
—మీరు పర్వతమునకు పోయి ఒలీవచెట్ల కొమ్మలను
అడవి ఒలీవచెట్ల కొమ్మలను గొంజిచెట్ల కొమ్మలను
ఈతచెట్ల కొమ్మలను గుబురుగల వేరు వేరు చెట్లకొమ్మ
లను తెచ్చి, వ్రాయబడినట్లుగా పర్ణశాలలు కట్టవ
లెను. । ఆ ప్రకారమే జనులు పోయి కొమ్మలను తెచ్చి
జనులందరు తమ తమ యింట్లమీదను తమ లోగిళ్ల
లోను దేవమందిరపు ఆవరణములోను నీటి గుమ్మపు
వీధిలోను ఎఫ్రాయిమీయుల గుమ్మపు వీధిలోను
పర్ణశాలలు కట్టుకొనిరి. । మరియు చెరలోనుండి
తిరిగి వచ్చినవారి సమూహమును పర్ణశాలలు కట్టు
కొని వాటిలో కూర్చుండిరి. నూను కుమారుడైన
యెహోషువ దినములు మొదలుకొని అదివరకు
ఇశ్రాయేలీయులు ఆలాగున చేసియుండలేదు; అప్పుడు
వారికి బహు సంతోషము పుట్టెను. । ఇదియుగాక
మొదటి దినము మొదలుకొని కడదినమువరకు అను
దినము ఎజ్రా దేవుని ధర్మశాస్త్రగ్రంథమును చదివి
వినిపించుచు వచ్చెను. వారు ఈ ఉత్సవమును ఏడు
దినములవరకు ఆచరించిన తరువాత విధిచొప్పున ఎనిమి
దవ దినమును వ్రతదినముగా ఆచరించిరి.

ఈ నెల యిరువది నాలుగవ దినమందు ఇశ్రా
యేలీయులు ఉపవాసముండి గోనెపట్టలు కట్టుకొని
తలమీద ధూళి పోసికొని కూడి వచ్చిరి. । ఇశ్రాయే
లీయులు అన్యజనులందరిలోనుండి ప్రత్యేకింపబడిన
వారై నిలువబడి, తమ పాపములను తమ పితరుల పాప
ములను ఒప్పుకొనిరి. । మరియు వారు ఒక జాము
సేపు తామున్నచోటనే నిలువబడి, తమ దేవుడైన
యెహోవా ధర్మశాస్త్రగ్రంథమును చదువుచు వచ్చిరి,
ఒక జాముసేపు తమ పాపములను ఒప్పుకొనుచు
దేవుడైన యెహోవాకు నమస్కారము చేయుచు
వచ్చిరి. । లేవీయులలో యేషూవ బానీ కద్మీయేలు 4
షెబన్యా బున్నీ షేరేబ్యా బానీ కెనానీ అనువారు
మెట్లమీద నిలువబడి, యెలుగెత్తి తమ దేవుడైన
యెహోవాకు మొఱ్ఱపెట్టిరి. । అప్పుడు లేవీయులైన 5
యేషూవ కద్మీయేలు బానీ హషబ్నెయా షేరేబ్యా
హోదీయా షెబన్యా పెతహయా అనువారు—నిలువ
బడి, నిరంతరము మీకు దేవుడైయున్న యెహోవాను
స్తుతించుడని చెప్పి ఈలాగు స్తోత్రముచేసిరి—సకలా
శీర్వచన స్తోత్రములకు మించిన నీ ఘనమైన నామము
స్తుతింపబడు గాక. । నీవే అద్వితీయుడవైన 6
యెహోవా, నీవే ఆకాశమును మహాకాశములను
వాటి సైన్యమును, భూమిని దానిలో ఉండునది అంత
టిని, సముద్రములను వాటిలో ఉండునది అంతటిని
సృజించి వాటినన్నిటిని కాపాడువాడవు. ఆకాశ
సైన్యమంతయు నీకే నమస్కారము చేయుచున్నది. ।
దేవా యెహోవా, అబ్రామును ఏర్పరచుకొని, కల్దీ 7
యుల ఊరు అను స్థలమునుండి ఇవతలకు అతని రప్పించి
అతనికి అబ్రాహామను పేరుపెట్టినవాడవు నీవే. ।
అతడు నమ్మకమైన మనస్సుగలవాడని యెరిగి, కనా 8
నీయులు హిత్తీయులు అమోరీయులు పెరిజ్జీయులు
యెబూసీయులు గిర్గాషీయులు అనువారి దేశమును
అతని సంతతివారికిచ్చునట్లు అతనితో నిబంధన చేసిన
వాడవు నీవే. । నీవు నీతిమంతుడవై యుండి నీ మాట 9
చొప్పున జరిగించితివి. ఐగుప్తులో మా పితరులు
పొందిన శ్రమను నీవు చూచితివి, ఎఱ్ఱసముద్రము
నొద్ద వారి మొఱ్ఱను నీవు వింటివి. । ఫరోయు అతని 10
దాసులందరును అతని దేశపు జనులందరును వారి
యెడల బహు గర్వముగా ప్రవర్తించిరని నీకు తెలియు
గా నీవు వారియెదుట సూచకక్రియలను మహాత్కా
ర్యములను చూపించితివి. ఆలాగున చేయుటవలన
నీవు ఈ దినమందున్నట్టుగా ప్రసిద్ధినొందితివి. ।
మరియు నీ జనులయెదుట నీవు సముద్రమును విభా 11
గించినందున వారు సముద్రముమధ్య పొడినేలను
నడిచిరి, ఒకడు లోతునీట రాయి వేసినట్లు వారిని
తరిమినవారిని అగాధజలములలో నీవు పడవేసితివి. ।
ఇదియుగాక పగటికాలమందు మేఘస్తంభములో 12
ఉండినవాడవును రాత్రికాలమందు వారు వెళ్లవలసిన
మార్గమున వెలుగిచ్చుటకై అగ్నిస్తంభములో ఉండిన
వాడవును అయియుండి వారిని తోడుకొనిపోతివి. ।
సీనాయిపర్వతముమీదికి దిగి వచ్చి ఆకాశమునుండి 13
వారితో మాటలాడి, వారికి నీతియుక్తమైన విధులను
సత్యమైన ఆజ్ఞలను మేలుకరములైన కట్టడలను ధర్మ

14 ములను నీవు దయచేసితివి. । వారికి నీ పరిశుద్ధమైన
విశ్రాంతి దినమును ఆచరింప నాజ్ఞ ఇచ్చి, నీ దాసు
డైన మోషేద్వారా ఆజ్ఞలను కట్టడలను ధర్మశాస్త్రమును
15 వారికి నియమించితివి. । వారి ఆకలి తీర్చుటకు ఆకాశ
మునుండి ఆహారమును, వారి దాహము తీర్చుటకు
బండలోనుండి ఉదకమును తెప్పించితివి. వారికి
ప్రమాణముచేసిన దేశమును స్వాధీనపరచుకొనవలెనని
16 వారి కాజ్ఞాపించితివి. । అయితే వారును మా పితరు
లును గర్వించి, లోబడనొల్లక నీ ఆజ్ఞలకు చెవియొగ్గక
17 పోయిరి. । వారు విధేయులగుటకు మనస్సులేనివారై
తమ మధ్య నీవు చేసిన అద్భుతములను జ్ఞాపకము చేసి
కొనక తమ మనస్సును కఠినపరచుకొని, తాముండి
వచ్చిన దాస్యపుదేశమునకు తిరిగి వెళ్లుటకు ఒక అధి
కారిని నియమించుకొని నీ మీద తిరుగబాటు చేసిరి.
అయితే నీవు క్షమించుటకు సిద్ధమైన దేవుడవును,
దయాదాక్షిణ్యతలు గలవాడవును, దీర్ఘశాంతమును
బహు కృపయు గలవాడవునై యుండి వారిని విసర్జింప
18 లేదు. । వారు ఒక పోతదూడను చేసికొని—ఐగుప్తు
లోనుండి మమ్మును రప్పించిన దేవుడు ఇదే అని చెప్పి,
19 నీకు బహు విసుకు పుట్టించినను । వారు ఎడారిలో
ఉండగా నీవు బహు విస్తారమైన కృప కలిగినవాడవై
వారిని విసర్జింపలేదు; మార్గముగుండ వారిని తోడుకొని
పోవుటకు పగలు మేఘస్తంభమును, దారిలో వారికి
వెలుగిచ్చుటకు రాత్రి అగ్నిస్తంభమును వారిపైనుండి
20 వెళ్లిపోక నిలిచెను. । వారికి బోధించుటకు నీ యుప
కారాత్మను దయచేసితివి, నీవిచ్చిన మన్నాను ఇయ్యక
మానలేదు; వారి దాహమునకు ఉదకమిచ్చితివి. ।
21 నిజముగా అరణ్యములో ఏమియు తక్కువ కాకుండ
నలువది సంవత్సరములు వారిని పోషించితివి, వారి
వస్త్రములు పాతగిలి పోలేదు, వారి కాళ్లకు వాపు
22 రాలేదు. । ఇదియుగాక రాజ్యములను జనములను
వారికప్పగించి, వారికి సరిహద్దులు ఏర్పరచితివి గనుక,
వారు సీహోను అను హెష్బోను రాజుయొక్క దేశ
మును బాషానుకు రాజైన ఓగుయొక్క దేశమును
23 స్వతంత్రించుకొనిరి. । వారి సంతతిని ఆకాశపు నక్ష
త్రములంత విస్తారముగా చేసి, ప్రవేశించి స్వతంత్రిం
చుకొనునట్లు వారి పితరులకు నీవు వాగ్దానముచేసిన
24 దేశములోకి వారిని రప్పింపగా । ఆ సంతతివారు
ప్రవేశించి ఆ దేశమును స్వతంత్రించుకొనిరి. నీవు
కనానీయులను ఆ దేశవాసులను జయించి, తమకు
మనస్సువచ్చినట్లు చేయుటకు వారి రాజులను ఆ దేశ
25 జనులను వారిచేతికి అప్పగించితివి. । అప్పుడు వారు
ప్రాకారములుగల పట్టణములను ఫలవంతమైన
భూమిని స్వాధీనపరచుకొని, సకలమైన పదార్థముల
తో నిండియున్న యిండ్లను త్రవ్విన బావులను ద్రాక్ష
తోటలను ఒలీవతోటలను బహు విస్తారముగా ఫలించు

చెట్లను వశపరచుకొనిరి. ఆలాగున వారు తిని తృప్తి
పొంది మదించి నీ మహోపకారమునుబట్టి బహుగా
సంతోషించిరి. । అయినను వారు అవిధేయులై నీ 26
మీద తిరుగబాటు చేసి, నీ ధర్మశాస్త్రమును లక్ష్యపెట్టక
త్రోసివేసి, నీతట్టు తిరుగవలెనని తమకు ప్రకటనచేసిన
నీ ప్రవక్తలను చంపి నీకు బహుగా విసుకు పుట్టించిరి. ।
అందుచేత నీవు వారిని వారి శత్రువులచేతికి అప్పగిం 27
చితివి. ఆ శత్రువులు వారిని బాధింపగా శ్రమకాల
మందు వారు నీకు మొఱ్ఱపెట్టినప్పుడు ఆకాశమం
దుండు నీవు ఆలకించి, వారి శత్రువుల చేతిలోనుండి
వారిని తప్పించుటకై నీ కృపాసంపత్తినిబట్టి వారికి
రక్షకులను దయచేసితివి. । వారు నెమ్మదిపొందిన 28
తరువాత నీ యెదుట మరల ద్రోహులు కాగా నీవు
వారిని వారి శత్రువులచేతికి అప్పగించితివి; వీరు వారి
మీద అధికారము చేసిరి. వారు తిరిగి వచ్చి నీకు
మొఱ్ఱపెట్టినప్పుడు ఆకాశమందుండు నీవు ఆలకించి
నీ కృపచొప్పున అనేకమారులు వారిని విడిపించితివి. ।
నీ ఆజ్ఞలను విధులను ఒకడు ఆచరించినయెడల వాటి 29
వలన వాడు బ్రదుకును గదా. వారు మరల నీ ధర్మ
శాస్త్రము ననుసరించి నడుచునట్లు నీవు వారిమీద
సాక్ష్యము పలికినను, వారు గర్వించి నీ ఆజ్ఞలకు
లోబడక నీ విధులవిషయములో పాపులై నిన్ను తిర
స్కరించి తమ మనస్సును కఠినపరచుకొని నీ మాట
వినకపోయిరి. । నీవు అనేక సంవత్సరములు వారిని 30
ఓర్చి, నీ ప్రవక్తలద్వారా నీ ఆత్మచేత వారిమీద సాక్ష్య
ము పలికితివి గాని వారు వినకపోయిరి; కాగా నీవు ఆ
యా దేశములలోనున్న జనులచేతికి వారిని అప్పగించి
తివి. । అయితే నీవు మహోపకారివై యుండి, వారిని 31
బొత్తిగా నాశనముచేయకయు విడిచిపెట్టకయు ఉం
టివి. నిజముగా నీవు కృపాకనికరములుగల దేవుడవై
యున్నావు. । చేసిన నిబంధనను నిలుపుచు కృప 32
చూపునట్టి మహా పరాక్రమశాలివైన భయంకరుడవు
నగు మా దేవా, అష్షూరు రాజుల దినములు మొదలు
కొని యీ దినములవరకు మా మీదికిని మా రాజుల
మీదికిని ప్రధానులమీదికిని మా పితరులమీదికిని నీ
జనులందరిమీదికిని వచ్చిన శ్రమయంతయు నీ దృష్టికి
అల్పముగా ఉండకుండు గాక. । మా మీదికి వచ్చిన 33
శ్రమలన్నిటిని చూడగా నీవు న్యాయస్థుడవే; నీవు
సత్యముగానే ప్రవర్తించితివి కాని మేము దుర్మార్గుల
మైతిమి. । మా రాజులు గాని మా ప్రధానులు గాని 34
మా యాజకులు గాని మా పితరులు గాని నీ ధర్మ
శాస్త్రము ననుసరించి నడువలేదు, నీవు వారిమీద పలి
కిన సాక్ష్యములనైనను నీ ఆజ్ఞలనైనను వారు వినక
పోయిరి. । వారు తమ రాజ్యపరిపాలనకాలమందు 35
నీవు తమ యెడల చూపించిన గొప్ప ఉపకారములను
తలంచక, నీవు వారికిచ్చిన విస్తారముగు ఫలవంతమైన

మిని అనుభవించి యుండియు నిన్ను సేవింపక
యుర్రి, తమ చెడునడతలు విడిచి మారుమనస్సు
పడరైరి. । చిత్తగించుము, నేడు మేము దాస్యము
ఉన్నాము, దాని ఫలమును దాని సమృద్ధిని అను
చునట్లు నీవు మా పితరులకు దయచేసిన భూమి
ను మేము దాసులమై యున్నాము. । మా పాప
నుబట్టి నీవు మామీద నియమించిన రాజులకు అది
విస్తారముగా ఫలమిచ్చుచున్నది. వారు తమ
ు వచ్చినట్లు మా శరీరములమీదను మా పశువుల
పను అధికారము చూపుచున్నారు గనుక మాకు
శ్రమలు కలుగుచున్నవి.
మేము ఒప్పుకొని చెప్పినదానినిబట్టి ఒక స్థిర
నిబంధన చేసికొని వ్రాయించుకొనగా, మా
ానులును లేవీయులును యాజకులును దానికి
ద్రలు వేసిరి. దానికి ముద్రలు వేసినవారెవరనగా,
కారియగు హకల్యా కుమారుడైన నెహెమ్యా
యా । శెరాయా అజర్యా యిర్మీయా । పషూరు
ర్యా మల్కీయా । హట్టూషు షెబన్యా మల్లూ
। హారిము మెరేమోతు ఓబద్యా । దానియేలు
తోను బారూకు । మెషుల్లాము అబీయా మీయా
। మయజ్యా బిల్గయి షెమయా. వీరందరును
జకులుగా ఉండువారు. । లేవీయులు ఎవరనగా,
న్యా కుమారుడైన యేషూవ హేనాదాదు కుమారు
బిన్నూయి కద్మీయేలు । వారి సహోదరులైన
న్యా హోదీయా కెలీటా పెలాయా హానాను ।
రెహోబు హషబ్యా । జక్కూరు షేరేబ్యా
న్యా । హోదీయా బానీ బెనీను అనువారు. ।
లలో ప్రధానులెవరనగా పరోషు పహత్మోయాబు
ము జత్తూ బానీ । బున్నీ అజ్గాదు బేబై । అదో
బిగ్వయి ఆదీను । ఆటేరు హిజ్కియా అజ్జూరు ।
దీయా హాషుము బేజయి । హారీపు అనాతోతు
। మగ్పీయాషు మెషుల్లాము హెజీరు । మెషేజ
లు సాదోకు యద్దూవ । పెలట్యా హానాను
యా । హోషేయ హనన్యా హష్షూబు ।
హోషు పిల్హా షోబేకు । రెహూము హషబ్నా
శేయా । అహీయా హానాను ఆనాను । మల్లూకు
ము బయనా అనువారు. । అయితే జనులలో
నవారు, అనగా దేవుని ధర్మశాస్త్రమునకు విధేయు
ట్లు దేశపుజనులలో ఉండకుండ తమ్మును తాము
పరచుకొనిన యాజకులు లేవీయులు ద్వారపాల
గాయకులు నెతీనీయులు అందరును, దేవుని
డైన మోషేద్వారా నియమించబడిన దేవుని
స్త్రము ననుసరించి నడుచుకొనుచు, మన ప్రభు
యెహోవా నిబంధనలను కట్టడలను ఆచరిం
మని శపథము పూని ప్రమాణము చేయుటకు
రి. । వారి భార్యలు వారి కుమారులు వారి కుమా

ర్తెలు తెలివియు బుద్ధియుగలవారెవరో వారును ఈ
విషయములో ప్రధానులైన తమ బంధువులతో కలి
సిరి. । మరియు—మేము దేశపు జనులకు మా కుమార్తె 30
లను ఇయ్యకయు వారి కుమార్తెలను మా కుమారులకు
పుచ్చుకొనకయు నుందుమనియు, । దేశపు జనులు 31
విశ్రాంతిదినమందు అమ్మకపు వస్తువులనే గాని భోజన
పదార్థములనే గాని అమ్ముటకు తెచ్చినయెడల విశ్రాంతి
దినమునగాని పరిశుద్ధ దినములలోగాని వాటిని కొన
కుందుమనియు, ఏడవ సంవత్సరమును విడిచిపెట్టి ఆ
సంవత్సరములో బాకీదారుల బాకీలు వదలివేయుదు
మనియు నిర్ణయించుకొంటిమి. । మరియు మన దేవుని 32
మందిరపు సేవనిమిత్తము ప్రతి సంవత్సరము తులము
వెండిలో మూడవవంతు ఇచ్చెదమని నిబంధన చేసి
కొంటిమి. । సవరింపబడిన రొట్టెవిషయములోను, 33
నిత్య నైవేద్యము విషయములోను, నిత్యము అర్పించు
దహనబలి విషయములోను, విశ్రాంతిదినముల విష
యములోను, అమావాస్యల విషయములోను, నిర్ణ
యింపబడిన పండుగల విషయములోను, ప్రతిష్ఠితము
లైన వస్తువుల విషయములోను, ఇశ్రాయేలీయులకు
ప్రాయశ్చిత్తము కలుగుటకైన పాపపరిహారార్థ బలుల
విషయములోను, మన దేవుని మందిరపు పనియంతటి
విషయములోను, ఆలాగుననే నిర్ణయించుకొంటిమి. ।
మరియు మా పితరుల యింటి మర్యాదప్రకారము 34
ప్రతి సంవత్సరమును నిర్ణయించుకొనిన కాలములలో
ధర్మశాస్త్రగ్రంథమందు వ్రాసియున్నట్టు మా దేవుడైన
యెహోవా బలిపీఠముమీద దహింపజేయుటకు
యాజకులలోను లేవీయులలోను జనులలోను కట్టెల
అర్పణమును మా దేవుని మందిరములోకి ఎవరు తేవ
లెనో వారును చీట్లువేసికొని నిర్ణయించుకొంటిమి. ।
మరియు మా భూమియొక్క ప్రథమ ఫలములను, 35
సకల వృక్షముల ప్రథమ ఫలములను, ప్రతి సంవత్స
రము ప్రభువు మందిరమునకు మేము తీసికొని వచ్చు
నట్లుగా నిర్ణయించుకొంటిమి. । మా కుమారులలో 36
జ్యేష్ఠపుత్రులను, మా పశువులలో తొలిచూలులను,
ధర్మశాస్త్రగ్రంథమందు వ్రాయబడినట్టు మా మంద
లలో తొలిచూలులను, మన దేవుని మందిరములో
సేవచేయు యాజకులయొద్దకు మేము తీసికొని వచ్చు
నట్లుగా నిర్ణయించుకొంటిమి. । ఇదియుగాక మా 37
పిండిలో ప్రథమ ఫలము ప్రతిష్ఠార్పణలు సకలవిధ
మైన వృక్షముల ఫలములు ద్రాక్షారసము నూనె
మొదలైనవాటిని మా దేవుని మందిరపు గదులలోకి
యాజకులయొద్దకు తెచ్చునట్లుగాను, మా భూమి పం
టలో పదియవవంతును లేవీయులయొద్దకు తీసికొని
వచ్చునట్లుగా ప్రతి పట్టణములోనున్న మా పంటలో
పదియవ వంతును ఆ లేవీయులకిచ్చునట్లుగాను నిర్ణ
యించుకొంటిమి. । లేవీయులు ఆ పదియవ వంతును 38

తీసికొని రాగా అహరోను సంతతివాడైన యాజకుడు
ఒకడును వారితోకూడ ఉండవలెననియు, పదియవ
వంతులలో ఒకవంతు లేవీయులు మా దేవుని మందిర
ములో ఉన్న ఖజానా గదులలోకి తీసికొని రావలె
39 ననియు నిర్ణయించుకొంటిమి, । ఇశ్రాయేలీయులును
లేవీయులును ధాన్యమును క్రొత్త ద్రాక్షారసమును
నూనెను తేగా, సేవచేయు యాజకులును ద్వారపాల
కులును గాయకులును వాటిని తీసికొని ప్రతిష్ఠితము
లగు ఉపకరణములుండు మందిరపు గదులలో ఉంచ
వలెను. మా దేవుని మందిరమును మేము చూడకుండ
మానము.

11 జనుల అధికారులు యెరూషలేములో నివాసము
చేసిరి. మిగిలిన జనులు పరిశుద్ధపట్టణమగు యెరూష
లేమునందు పదిమందిలో ఒకడు నివసించునట్లును,
మిగిలిన తొమ్మండ్రుగురు వేరు పట్టణములలో నివ
2 సించునట్లును చీట్లు వేసిరి. । యెరూషలేములో నివ
సించుటకు సంతోషముగా ఒప్పుకొనినవారిని జనులు
3 దీవించిరి. । యెరూషలేములో నివాసము చేసిన
రాజ్యపు ప్రధానులు వీరే. యూదాపట్టణములలో
ఎవరి స్వాస్థ్యములో వారు నివసించుచుండిరి. వారెవ
రనగా ఇశ్రాయేలీయులును యాజకులును లేవీయు
లును నెతీనీయులును సొలొమోనుయొక్క దాసుల
4 వంశస్థులును నివాసము చేసిరి. । మరియు యెరూష
లేములో యూదులలో కొందరును బెన్యామీనీయు
లలో కొందరును నివసించిరి. యూదులలో ఎవ
రనగా, జెకర్యాకు పుట్టిన ఉజ్జీయా కుమారుడైన
అతాయా, యితడు షెఫట్యకు పుట్టిన అమర్యా
కుమారుడు, వీడు షెఫట్యకు పుట్టిన పెరెసు వంశస్థు
5 డగు మహలలేలు కుమారుడు. । మరియు షిలోనికి
పుట్టిన జెకర్యా కుమారునికి పుత్రుడైన యోయారీబు
కనిన అదాయా కుమారుడైన హజాయాకు కలిగిన
కొల్హోజెకు పుట్టిన బారూకు కుమారుడైన మయశేయా
6 నివసించెను. । యెరూషలేములో నివాసము చేసిన
పెరెసు వంశస్థులందరును బలవంతులైన నన్నూట
అరువది ఎనమండుగురు.

7 బెన్యామీనీయులలో ఎవరనగా యోవేదు
పెదాయా కోలాయా మయశేయా ఈతీయేలు
యెషయా అను పితరుల వరుసలో మెషుల్లాము కుమారు
8 డైన సల్లు. । అతని తరువాత గబ్బయి సల్లయి; వీరంద
9 రును తొమ్మన్నూట ఇరువది యెనమండుగురు; । జిఖ్రీ
కుమారుడైన యోవేలు వారికి పెద్దగా ఉండెను.
సెనూయా కుమారుడైన యూదా పట్టణముమీద రెం
10 డవ అధికారియై యుండెను. । యాజకులలో ఎవ
రనగా, యోయారీబు కుమారుడైన యెదాయాయు
11 యాకీనును, । శెరాయా దేవుని మందిరమునకు అధి
పతియై యుండెను. ఇతడు మెషుల్లాము సాదోకు
మెరాయోతు అహీటూబులను పితరుల వరుసలో
హిల్కీయాకు పుట్టెను. । ఇంటిపని చేసినవారి సహో
దరులు ఎనమన్నూట ఇరువది యిద్దరు. మరియు పిత
రులైన మల్కీయా పషూరు జెకర్యా అమ్జీ పెలల్యాల
వరుసలో యెరోహాముకు పుట్టిన అదాయా. । పెద్ద
లలో ప్రధానులైన ఆ అదాయా బంధువులు ఇన్నూట
నలువది యిద్దరు. మరియు ఇమ్మేరు మెషిల్లేమోతు
అహజైయను పితరుల వరుసలో అజరేలుకు పుట్టిన
అమష్షయి. । బలవంతులైనవారి బంధువులు నూట
ఇరువది యెనమండుగురు. వారికి జబ్దీయేలు పెద్దగా
ఉండెను; ఇతడు ఘనులైనవారిలో ఒకని కుమారుడు. ।
లేవీయులలో ఎవరనగా, షెమయా. ఇతడు బున్నీకి
పుట్టిన హషబ్యా కనిన అజ్రీకాము కుమారుడైన
హష్షూబుకు పుట్టినవాడు. । లేవీయులలో ప్రధాను
లైనవారిలో షబ్బెతైయును యోజాబాదును దేవుని
మందిరమును బాగుజేయు విషయములో అధికారము
పొందిరి. । ఆసాపు కుమారుడైన జబ్దికి పుట్టిన మీకా
కుమారుడైన మత్తన్యా ప్రార్థన స్తోత్రముల విషయ
ములో ప్రధానుడు; తన సహోదరులలో బక్బు
క్యాయును యెదూతూను కుమారుడైన గాలాలుకు
పుట్టిన షమ్మూయ కుమారుడైన అబ్దాయును ఈ విష
యములో అతని చేతిక్రిందివారు. । పరిశుద్ధపట్టణ
ములో ఉన్న లేవీయులందరు ఇన్నూట ఎనుబది
నలుగురు. । ద్వారపాలకులైన అక్కూబు టల్మోను
గుమ్మములు కాయువారును నూట డెబ్బది యిద్దరు. ।
ఇశ్రాయేలీయులలో శేషించిన యాజకులు లేవీయులు
మొదలైనవారు యూదాపట్టణములన్నిటిలో ఎవరి
స్వాస్థ్యములో వారు ఉండిరి. । నెతీనీయులు ఓఫె
లులో నివసించిరి. జీహాయు గిష్పాయును నెతీనీయు
లకు ప్రధానులు. । యెరూషలేములో ఉన్న లేవీయు
లకు మీకాకు పుట్టిన మత్తన్యా కుమారుడైన హషబ్యా
కనిన బానీ కుమారుడైన ఉజ్జీ ప్రధానుడు; ఆసాపు
కుమారులలో గాయకులు దేవుని మందిరముయొక్క
పనిమీద అధికారులు. । వారినిగూర్చిన విధి యేద
నగా, గాయకులు వంతుల ప్రకారము ఒప్పందముమీద
తమ పనిచేయవలెను, లేవీయులు రాజుయొక్క ఆజ్ఞను
బట్టి దినక్రమేణ జరుగుపనులు చూడవలెను. । మరియు
యూదాదేశస్థుడగు జెరహు వంశస్థుడైన మెషేజ
బెయేలు కుమారుడగు పెతహయా జనులనుగూర్చిన
సంగతులను విచారించుటకు రాజునొద్ద ఉండెను. ।
వాటి పొలములలోనున్న పల్లెలు చూడగా యూదా
వంశస్థులలో కొందరు కిర్యతర్బాలోను దానికి సం
బంధించిన పల్లెలలోను దీబోనులోను దానికి సంబం
ధించిన పల్లెలలోను యెకబ్సెయేలులోను దానికి సం
బంధించిన పల్లెలలోను । యేషూవలోను మోలాదా
లోను బేత్పెలెతులోను । హాజర్షువలులోను బెయేర్షె

ోను దానికి సంబంధించిన పల్లెలలోను । సిక్లగు
ం మెకోనాలోను దానికి సంబంధించిన పల్లెల
ం । ఏన్రిమ్మోనులోను జోర్యాలోను యర్మూతు
ం । జానోహలోను అదుల్లాములోను వాటికి సం
ంచిన పల్లెలలోను లాకీషులోను దానికి సంబం
న పొలములలోను అజేకాలోను దానికి సంబం
న పల్లెలలోను నివసించినవారు. మరియు బెయే
మొదలుకొని హిన్నోము లోయవరకు వారు
ంచిరి. । గెబ నివాసులగు బెన్యామీనీయులు మిక్మ
ోను హాయిలోను బేతేలులోను వాటికి సంబం
న పల్లెలలోను । అనాతోతులోను నోబులోను
న్యాలోను । హాసోరులోను రామాలోను గిత్తయీ
ోను । హాదీదులోను జెబోయిములోను నెబ
ంలోను । లోదులోను పనివారి లోయ అను
లోను నివసించిరి । మరియు లేవీయుల సంబంధ
వారిలో యూదా వంశస్థులలోనివారు బెన్యా
యులమధ్య భాగములు పొందిరి.
షయల్తీయేలు కుమారుడైన జెరుబ్బాబెలుతో
వచ్చిన యాజకులును లేవీయులును వీరే.
ూవ శెరాయా యిర్మీయా ఎజ్రా । అమర్యా
ూకు హట్టూషు । షెకన్యా రెహూము మెరే
ు । ఇద్దో గిన్నెతోను అబీయా । మీయామిను
ద్యా బిల్గా । షెమయా యోయారీబు యెదా
। సల్లూ ఆమోకు హిల్కీయా యెదాయా అను
వారందరును యేషూవ దినములలో యాజ
ోను వారి బంధువులలోను ప్రధానులుగా ఉం
। మరియు లేవీయులలో యేషూవ బిన్నూయి
మీయేలు షేరేబ్యా యూదా స్తోత్రాది సేవవిషయ
ప్రధానియైన మత్తన్యాయు అతని బంధువు
. । మరియు బక్బుక్యాయు ఉన్నీయును వారి
వులును వారికి ఎదురు వరుసలోనుండి పాడు
. । యేషూవ యోయాకీమును కనెను యోయా
ఎల్యాషీబును కనెను ఎల్యాషీబు యోయాదాను
. । యోయాదా యోనాతానును కనెను. యోనా
యద్దూవను కనెను. । యోయాకీము దినములలో
లలో ప్రధానులైనవారు యాజకులై యుండిరి.
వరనగా, శెరాయా యింటివారికి మెరాయా,
యా యింటివారికి హనన్యా । ఎజ్రా యింటి
కి మెషుల్లాము, అమర్యా యింటివారికి
హోహానాను । మెలీకూ యింటివారికి యోనా
, షెబన్యా యింటివారికి యోసేపు । హారిము
వారికి అద్నా, మెరాయోతు ఇంటివారికి
ల్కయి । ఇద్దో యింటివారికి జెకర్యా, గిన్నెతోను
వారికి మెషుల్లాము । అబీయా యింటివారికి
, మీయామిను ఇంటివారికి మోవద్యా యింటి
కి పిల్టయి । బిల్గా యింటివారికి షమ్మూయ, షెమ
యా యింటివారికి యెహోనాతాను । యోయారీబు 19
ఇంటివారికి మత్తెనై యెదాయా యింటివారికి ఉజ్జీ ।
సల్లయి యింటివారికి కల్లయి ఆమోకు ఇంటివారికి 20
ఏబెరు । హిల్కీయా యింటివారికి హషబ్యా, 21
యెదాయా యింటివారికి నెతనేలు. । ఎల్యాషీబు 22
దినములలో లేవీయుల విషయములో యోయాదా
యోహానాను యద్దూవ కుటుంబ ప్రధానులుగా దాఖ
లైరి. మరియు పారసీకుడగు దర్యావేషు ఏలుబడి
కాలములో వారే యాజకకుటుంబ ప్రధానులుగా
దాఖలైరి. । ఎల్యాషీబు కుమారుడైన యోహానాను 23
దినములపర్యంతము అనుదినము జరుగు విషయముల
గ్రంథమందు వారు లేవీయుల కుటుంబ ప్రధాను
లుగా దాఖలైరి. । లేవీయుల కుటుంబ ప్రధానులైన 24
హషబ్యాయు షేరేబ్యాయును కద్మీయేలు కుమారు
డైన యేషూవయును వారికి ఎదురు వరుసలో పాడు
తమ బంధువులతోకూడ దైవజనుడైన దావీదుయొక్క
ఆజ్ఞనుబట్టి స్తుతిపాటలు పాడుటకు వంతుల చొప్పున
నిర్ణయింపబడిరి. । మత్తన్యా బక్బుక్యా ఓబద్యా మెషు 25
ల్లాము టల్మోను అక్కూబు అనువారు గుమ్మముల
దగ్గరనున్న పదార్థపు కొట్లులయొద్ద కాపుకాచు
ద్వారపాలకులుగా ఉండిరి. । వీరు యోజాదాకుకు 26
పుట్టిన యేషూవ కుమారుడైన యోయాకీము దినముల
లోను అధికారియైన నెహెమ్యా దినములలోను
యాజకుడును శాస్త్రియునగు ఎజ్రా దినములలోను
(ఆ పని జరుపుచు వచ్చిరి.)
యెరూషలేము ప్రాకారమును ప్రతిష్ఠించు కాల 27
ములో వారు ఆ ప్రతిష్ఠాచారమును స్తోత్రగీతముల
తోను పాటలతోను స్వరమండల సితారా చేయి
తాళములతోను సంతోషముగా జరిగించునట్లు లేవీ
యులను తమ సకల స్థలములలోనుండి యెరూష
లేముకు రప్పించుటకు పూనుకొనిరి । అప్పుడు గాయ 28
కుల వంశస్థులు యెరూషలేము చుట్టునున్న మైదాన
భూమిలోనుండియు, నెటోపాతియొక్క గ్రామము
లలోనుండియు కూడుకొని వచ్చిరి. । మరియు గిల్గాలు 29
యొక్క యింటిలోనుండియు, గెబయొక్కయు అజ్మా
వెతుయొక్కయు పొలములలోనుండియు జనులు
వచ్చిరి. వీలయనగా యెరూషలేము చుట్టును గాయ
కులు తమకు ఊళ్లను కట్టుకొని యుండిరి. । యాజకు 30
లును లేవీయులును తమ్మును తాము పవిత్రపరచుకొనిన
తరువాత జనులను గుమ్మములను ప్రాకారమును పవిత్ర
పరచిరి. । అటుతరువాత నేను యూదుల ప్రధాను 31
లను ప్రాకారముమీదికి తోడుకొని వచ్చి స్తోత్రగీత
ములు పాడువారిని రెండు గొప్ప సమూహములుగా
ఏర్పరచితిని. అందులో ఒక సమూహము కుడిప్రక్కను
వెంట గుమ్మముపైపున ప్రాకారముమీదను నడచెను. ।
వారి వెంబడి హోషయాయును యూదుల ప్రధా 32

33 సులలో సగముమందియును వెళ్లిరి. । మరియు అజ
34 ర్యాయు ఎజ్రాయు మెషుల్లామును । యూదాయు
బెన్యామీనును షెమయాయును యిర్మీయాయు అను
35 వారు పోయిరి. । యాజకుల కుమారులలో కొందరు
బాకాలు ఊదుచు పోయిరి; వారెవరనగా, ఆసాపు
కుమారుడైన జక్కూరుకు పుట్టిన మీకాయా కనిన
మత్తన్యాకు పుట్టిన షెమయా కుమారుడైన యోనా
36 తానుకు పుట్టిన జెకర్యాయు । అతని బంధువులగు
షెమయా అజరేలు మిలలై గిలలై మాయి నెతనేలు
యూదా హనానీ అనువారును. వీరు దైవజనుడగు
దావీదుయొక్క వాద్యములను వాయించుచు పోయిరి;
37 వారిముందర శాస్త్రియగు ఎజ్రాయును నడిచెను. । వారికి
ఎదురుగా ఉన్న ఊట గుమ్మముదగ్గర దావీదుపురము
యొక్క మెట్లమీద దావీదు నగరును దాటి ప్రాకా
రము వెంబడి తూర్పువైపు నీటి గుమ్మమువరకు పోయిరి. ।
38 స్తోత్రగీతములు పాడువారి రెండవ సమూహము వారికి
ఎదురుగా నడిచెను, వారివెంబడి నేనును వెళ్లితిని.
ప్రాకారముమీదనున్న సగముమంది కొలిముల గోపు
రము అవతలనుండి వెడల్పు ప్రాకారమువరకు వెళ్లిరి. ।
39 మరియు వారు ఎఫ్రాయిమీయుల గుమ్మము అవతల
నుండియు, పాత గుమ్మము అవతలనుండియు, మత్స్యపు
గుమ్మము అవతలనుండియు, హనన్యేలు గోపురమునుం
డియు, మేయా గోపురమునుండియు, గొర్రెల గుమ్మము
40 వరకు వెళ్లి బందీగృహపు గుమ్మములో నిలిచిరి. । ఆ
ప్రకారమే దేవుని మందిరములో స్తోత్రగీతములు పాడు
వారి రెండు సమూహములును నేనును, నాతోకూడ
ఉన్న అధికారులలో సగముమందియు నిలిచియుం
41 టిమి. । యాజకులగు ఎల్యాకీము మయశేయా మిన్యా
మీను మీకాయా ఎల్యోయేనై జెకర్యా హనన్యా బా
42 కాలు పట్టుకొనిరి. । ఇజ్రహయా అనువాడు నడిపిం
పగా మయశేయా షెమయా ఎలాజారు ఉజ్జీ యెహో
హానాను మల్కీయా ఏలాము ఏజెరులను గాయకులు
43 బిగ్గరగా పాడిరి. । మరియు దేవుడు తమకు మహానం
దము కలుగజేసెనని ఆ దినములో వారు గొప్ప బలు
లను అర్పించి సంతోషించిరి. వారి భార్యలు పిల్లలు
కూడ సంతోషించిరి. అందువలన యెరూషలేములో
పుట్టిన ఆనందధ్వని బహు దూరమునకు వినబడెను. ।
44 ఆ కాలమందు పదార్థములకును ప్రతిష్ఠార్పణలకును
ప్రథమఫలములకును పదియవవంతుల సంబంధమైన
వాటికిని ఏర్పడిన గదులమీద కొందరిని నియమించి,
వారు యాజకులకొరకును లేవీయులకొరకును ధర్మ
శాస్త్రానుసారముగా నిర్ణయింపబడిన భాగములను పట్టణ
ముల పొలములనుండి సమకూర్చ నాజ్ఞాపించితిని; సేవ
చేయుటకు నియమింపబడిన యాజకులనుబట్టియు,
లేవీయులనుబట్టియు యూదులు సంతోషించిరి. ।
మరియు గాయకులును ద్వారపాలకులును దావీదును 4
అతని కుమారుడైన సొలొమోనును ఆజ్ఞాపించినట్లు
దేవునిగూర్చిన పనులను తమ శుద్ధినిగూర్చిన పనులను
నెరవేర్చుచు వచ్చిరి. । పూర్వమందు దావీదు దినము 4
లలో గాయకుల విషయములోను స్తోత్రగీతముల
విషయములోను పాటల విషయములోను [1]ఆసాపు
ప్రధానుడు. । జెరుబ్బాబెలు దినములలో నేమి 4
నెహెమ్యా దినములలో నేమి ఇశ్రాయేలీయులంద
రును వారి వంతులచొప్పున గాయకులకును ద్వార
పాలకులకును భోజనపదార్థములను అనుదినము
ఇచ్చుచు వచ్చిరి. మరియు వారు లేవీయుల నిమిత్తము
అర్పణలను ప్రతిష్ఠించుచు వచ్చిరి. లేవీయులు అహ
రోను వంశస్థులకు వాటిని ప్రతిష్ఠించిరి.

ఆ దినమందు వారు మోషే గ్రంథము జనులకు 13
చదివి వినిపించగా అందులో—అమ్మోనీయులు గాని
మోయాబీయులు గాని దేవునియొక్క సమాజమును
ఎన్నటికి చేరకూడదు. । వారు అన్నపానములు తీసి 2
కొని ఇశ్రాయేలీయులకు ఎదురుపడక వారిని శపించు
మని బిలామును ప్రోత్సాహపరచిరి. అయినను మన
దేవుడు ఆ శాపమును ఆశీర్వాదముగా మార్చెనని
వ్రాయబడినట్టు కనబడెను. । కాగా జనులు ధర్మ 3
శాస్త్రమును వినినప్పుడు మిశ్రజనసమూహమును ఇశ్రా
యేలీయులలోనుండి వెలివేసిరి. । ఇంతకుముందు మన 4
దేవుని మందిరపు గదిమీద నిర్ణయింపబడిన యాజకు
డగు ఎల్యాషీబు టోబీయాతో బంధుత్వము కలుగ
జేసికొని । నైవేద్యమును సాంబ్రాణిని పాత్రలను 5
గింజలలో పదియవ భాగమును క్రొత్త ద్రాక్షారస
మును లేవీయులకును గాయకులకును ద్వారపాలకుల
కును ఏర్పడిన నూనెను యాజకులకు తేవలసిన ప్రతి
ష్ఠిత వస్తువులను ఉంచు స్థలమునొద్ద అతనికి ఒక గొప్ప
గదిని సిద్ధము చేసియుండెను. । ఆ సమయములో 6
నేను యెరూషలేములో ఉండలేదు. పిమ్మట బాబెలు
దేశపు రాజైన అర్తహషస్త యేలుబడియందు ముప్పది
రెండవ సంవత్సరమున నేను రాజును దర్శించి కొన్ని
దినములైన తరువాత రాజునొద్ద సెలవు పుచ్చుకొని ।
యెరూషలేముకు వచ్చి ఎల్యాషీబు దేవుని మంది 7
రములో టోబీయాకు ఒక గది యేర్పరచి చేసిన
కీడంతయు తెలిసికొని । బహుగా దుఃఖపడి ఆ గదిలో 8
నుండి టోబీయాయొక్క సామగ్రియంతయు అవతల
పారవేసి, గదులన్నియు శుభ్రముచేయుడని ఆజ్ఞా
పింపగా వారాలాగు చేసిరి. । పిమ్మట మందిరపు 9
పాత్రలను నైవేద్య పదార్థములను సాంబ్రాణిని
నేనక్కడికి మరల తెప్పించితిని. । మరియు లేవీయు 10
లకు రావలసిన పాళ్లు వారికి అందకపోవుటచేత సేవ
చేయు లేవీయులును గాయకులును తమ పొలములకు

[1] పాఠాంతరము—దావీదు ఆసాపుల దినములలో ప్రధానుడొకడుండెను.

పారిపోయిరని తెలిసికొని । నేను అధిపతులతో
పోరాడి — దేవునిమందిరమును ఎందుకు లక్ష్యపెట్ట
లేదని అడిగి, వారిని సమకూర్చి తమ స్థలములలో
2 ఉంచితిని. । అటు తరువాత యూదులందరును
ధాన్య ద్రాక్షారసతైలములలో పదియవ భాగమును
3 ఖజానాలోకి తెచ్చిరి. । నమ్మకముగల మనుష్యులని
పేరు పొందిన షెలెమ్యా అను యాజకుని సాదోకు
అను శాస్త్రిని లేవీయులలో పెదాయాను ఖజానామీద
నేను కాపరులగా నియమించితిని; వారి చేతిక్రింద
మత్తన్యా కుమారుడైన జక్కూరుకు పుట్టిన హానాను
నియమింపబడెను; మరియు తమ సహోదరులకు
ఆహారము పంచిపెట్టుపని వారికి నియమింపబడెను. ।
4 నా దేవా, ఈ విషయములో నన్ను జ్ఞాపకముంచు
కొని, నా దేవుని మందిరమునకును దాని ఆచారముల
జరుగుబాటునకును నేను చేసిన ఉపకారములను మరువ
కుండుము.

5 ఆ దినములలో యూదులలో కొందరు విశ్రాంతి
దినమున ద్రాక్షతొట్లను త్రొక్కుటయు, గింజలు
తొట్లలో పోయుటయు, గాడిదెలమీద బరువులు
మోపుటయు, ద్రాక్షారసమును ద్రాక్షపండ్లను అం
జూరపు పండ్లను నానావిధములైన బరువులను విశ్రాం
తిదినమున యెరూషలేములోకి తీసికొని వచ్చుటయు
చూచి, యీ ఆహారవస్తువులను ఆ దినమున అమ్మిన
6 వారిని గద్దించితిని. । తూరు దేశస్థులును కాపురముండి,
యెరూషలేములోను విశ్రాంతిదినములో యూదుల
కును చేపలు మొదలైన నానావిధ వస్తువులను తెచ్చి
7 అమ్ముచుండిరి. । అంతట యూదుల ప్రధానులను
నేనెదురాడి—విశ్రాంతి దినమును నిర్లక్ష్యపెట్టి మీ
8 రెందుకు ఈ దుష్కార్యమును చేయుదురు! । మీ
పితరులును ఇట్లు చెసి దేవునియొద్దనుండి మనమీదికిని
యీ పట్టణస్థులమీదికిని కీడు రప్పింపలేదా? అయితే
మీరు విశ్రాంతి దినమును నిర్లక్ష్యపెట్టి ఇశ్రాయేలీ
యులమీదికి కోపము మరి అధికముగా రప్పించు
చున్నారని చెప్పితిని. । మరియు విశ్రాంతిదినమునకు
ముందు చీకటి పడినప్పుడు యెరూషలేము గుమ్మము
లను మూసివేయవలెననియు, విశ్రాంతిదినము గడచు
వరకు వాటిని తియ్యకూడదనియు నేనాజ్ఞాపించితిని.
మరియు విశ్రాంతిదినమున ఏ బరువైనను లోపలికి
రాకుండ గుమ్మములయొద్ద నా పనివారిలో కొందరిని
కావలి యుంచితిని. । వర్తకులును నానావిధములైన
వస్తువులను అమ్మువారును ఒకటి రెండు మారులు
యెరూషలేము అవతల బసచేసికొనగా । నేను వారిని
గద్దించి వారితో ఇట్లంటిని — మీరు గోడచాటున
ఎందుకు బసచేసికొంటిరి; మీరు ఇంకొకసారి ఈలాగు
చేసినయెడల మిమ్మును పట్టుకొందునని చెప్పితిని;
అప్పటినుండి విశ్రాంతిదినమున వారు మరి రాలేదు. ।
అప్పుడు తమ్మును తాము పవిత్రపరచుకొనవలెననియు, 22
విశ్రాంతిదినమును ఆచరించుటకు వచ్చి గుమ్మములను
కాచుకొనవలెననియు లేవీయులకు నేను ఆజ్ఞాపించి
తిని. నా దేవా, యిందునుగూర్చియు నన్ను జ్ఞాపక
ముంచుకొని నీ కృపాతిశయముచొప్పున నన్ను రక్షిం
చుము.

ఆ దినములలో అష్డోదు అమ్మోను మోయాబు 23
సంబంధులైన స్త్రీలను వివాహము చేసికొనిన కొందరు
యూదులు నాకు కనబడిరి. ; వారి కుమారులలో 24
సగముమంది అష్డోదుభాష మాటలాడువారు. వారు
ఆ యా భాషలు మాటలాడువారు గాని యూదుల
భాష వారిలో ఎవరికిని రాదు. । అంతట నేను 25
వారితో వాదించి వారిని శపించి కొందరిని కొట్టి
వారి తలవెండ్రుకలను పెరికివేసి—మీరు వారి కుమా
రులకు మీ కుమార్తెలను ఇయ్యకయు, మీ కుమారుల
కైనను మీకైనను వారి కుమార్తెలను పుచ్చుకొనకయు
ఉండవలెనని వారిచేత దేవుని పేరట ప్రమాణము
చేయించి । —ఇట్టి కార్యములు జరిగించి ఇశ్రాయేలీ 26
యుల రాజైన సొలొమోను పాపము చేయలేదా?
అనేక జనములలో అతనివంటి రాజు లేకపోయినను,
అతడు తన దేవునిచేత ప్రేమింపబడినవాడై ఇశ్రా
యేలీయులందరిమీద రాజుగా నియమింపబడినను,
అన్యస్త్రీలు అతనిచేత సహా పాపము చేయించిరేదా? ।
కాగా ఇంత గొప్పకీడు చేయునట్లును, మన దేవునికి 27
విరోధముగా పాపము చేయునట్లును అన్యస్త్రీలను
వివాహము చేసికొనిన మీవంటివారి మాటలను మేము
ఆలకింపవచ్చునా! అని అడిగితిని. । ప్రధాన యాజ 28
కుడును ఎల్యాషీబు కుమారుడునైన యోయాదా
కుమారులలో ఒకడు హోరోనీయుడైన సన్బల్ల
టుకు అల్లుడాయెను. దానినిబట్టి నేను అతని నాయొద్ద
నుండి తరిమితిని. । నా దేవా వారు యాజకధర్మమును, 29
యాజకధర్మపు నిబంధనను, లేవీయుల నిబంధనను
అపవిత్రపరచిరి గనుక వారిని జ్ఞాపకముంచుకొనుము. ।
ఈలాగున వారు ఏ పరదేశులలోను కలియకుండ 30
వారిని పవిత్రపరచి, ప్రతి యాజకుడును ప్రతి లేవీ
యుడును విధిప్రకారముగా సేవచేయునట్లు నియ
మించితిని. । మరియు కావలసి వచ్చినప్పుడెల్ల కట్టెల 31
అర్పణను ప్రథమ ఫలములను తీసికొని వచ్చునట్లుగా
నేను నియమించితిని. నా దేవా, మేలుకై నన్ను
జ్ఞాపకముంచుకొనుము.

# ఎస్తేరు



1 అహష్వేరోషు దినములలో జరిగిన చర్య వివ
రము. హిందూదేశము మొదలుకొని కూషుదేశము
వరకు నూట ఇరువది యేడు సంస్థానములను అహష్వే
2 రోషు ఏలెను. । ఆ కాలమందు రాజైన అహష్వే
రోషు షూషను కోటలోనుండి రాజ్యపరిపాలన
3 చేయుచుండగా । తన యేలుబడియందు మూడవ
సంవత్సరమున తన అధిపతులకందరికిని సేవకులకును
విందు చేయించెను. పారసీకదేశముయొక్కయు మాద్య
దేశముయొక్కయు పరాక్రమశాలులును ఘనులును
4 సంస్థానాధిపతులును అతని సన్నిధి నుండగా । అతడు
తన మహిమగల రాజ్యముయొక్క ఐశ్వర్యప్రభావ
ములను, తన మహాత్మ్యాతిశయ ఘనతలను అనేక దిన
ములు, అనగా నూట ఎనుబది దినములు కనుపర
5 చెను. । ఆ దినములు గడచిన తరువాత రాజు షూషను
కోటలోనున్న అల్పులకేమి ఘనులకేమి జనులకందరి
కిని రాజు కోటలోని తోట ఆవరణములో ఏడు దిన
6 ములు విందు చేయించెను. । అక్కడ ధవళధూమ్ర
వర్ణములుగల అవిసెనారితో చేయబడిన త్రాళ్లతో
చలువరాతి స్తంభములమీద ఉంచబడిన వెండి కమ్ము
లకు తగిలించిన తెలుపును ఊదారంగును కలిసిన తెరలు
వ్రేలాడుచుండెను. మరియు ఎరుపు తెలుపు పసుపు
నలుపు అయిన చలువరాళ్లు పరచిన నేలమీద వెండి
బంగారుమయమైన జలతారుగల పరుపులుండెను. ।
7 అచ్చట కూడినవారికి వివిధమైన బంగారు పాత్రలతో
పానమిచ్చుచు, రాజు స్థితికి తగినట్లుగా రాజు ద్రాక్షా
8 రసమును దాసులు అధికముగా పోసిరి. । ఆ విందు
పానము ఆజ్ఞానుసారముగా జరుగుటనుబట్టి యెవరును
బలవంతము చేయలేదు. ఎవడు కోరినట్టుగా వానికి
పెట్టవలెనని తన కొలువువారికి రాజు ఆజ్ఞ నిచ్చి
9 యుండెను. । రాణియైన వష్తి కూడ రాజైన అహష్వే
రోషు కోటలో స్త్రీలకు ఒక విందు చేయించెను.
10 ఏడవ దినమందు రాజు ద్రాక్షారసము త్రాగి
సంతోషముగా నున్నప్పుడు, కూడివచ్చిన జనమున
కును, అధిపతులకును రాణియైన వష్తియొక్క సౌందర్య
మును కనుపరచవలెనని రాజకిరీటము ధరించుకొనిన
11 ఆమెను తన సన్నిధికి పిలుచుకొనివచ్చునట్లు । రాజైన
అహష్వేరోషు ఎదుట ఉపచారముచేయు మెహూ
మాను బిజ్తా హర్బోనా బిగ్తా అబగ్తా జేతరు కర్కసు
అను ఏడుగురు నపుంసకులకు ఆజ్ఞాపించెను. ఆమె
12 సౌందర్యవతి. । రాణియైన వష్తి నపుంసకులచేత
ఇయ్యబడిన రాజాజ్ఞప్రకారము వచ్చుటకు ఒప్పక
పోగా రాజు మిగుల కోపగించెను, అతని కోపము
రగులుకొనెను. । విధిని రాజ్యధర్మమును ఎరిగినవారం 13
దరిచేత రాజు ప్రతి సంగతి పరిష్కరించుకొనువాడు
గనుక । అతడు కాలజ్ఞానులను చూచి—రాణియైన 15
వష్తి రాజైన అహష్వేరోషు అను నేను నపుంసకుల
చేత ఇచ్చిన ఆజ్ఞాప్రకారము చేయక పోయినందున
ఆమెకు విధినిబట్టి చేయవలసినదేమని వారి నడిగెను. ।
అతని సన్నిధిని ఉండి రాజు ముఖమును చూచుచు, 14
రాజ్యమందు ప్రథమపీఠములమీద కూర్చుండు పార
సీకులయొక్కయు మాదీయులయొక్కయు ఏడుగురు
ప్రధానులు ఎవరనగా—కర్షెనా షేతారు అద్మాతా
తర్షీషు మెరెసు మర్సెనా మెమూకాను అనువారు. ।
మెమూకాను రాజు ఎదుటను ప్రధానుల యెదుటను 16
ఈలాగు ప్రత్యుత్తరమిచ్చెను—రాణియైన వష్తి రాజు
ఎడల మాత్రము కాదు, రాజైన అహష్వేరోషు
యొక్క సకల సంస్థానములలోనుండు అధిపతులందరి
యెడలను జనులందరియెడలను నేరస్థురాలాయెను. ।
ఏలయనగా రాజైన అహష్వేరోషు తన రాణియైన 17
వష్తిని తన సన్నిధికి పిలుచుకొని రావలెనని ఆజ్ఞాపిం
పగా ఆమె రాలేదను సంగతి బయలుపడగానే స్త్రీలం
దరు దాని విని, ముఖము ఎదుటనే తమ పురుషులను
తిరస్కారము చేయుదురు. । మరియు పారసీకుల 18
యొక్కయు మాదీయులయొక్కయు నాయకపత్నులం
రాణి చేసినదాని సమాచారము విని, రాణి పలికినట్లు
ఈ దినమందు రాజుయొక్క అధిపతులందరితో పలు
కుదురు. దీనివలన బహు తిరస్కారమును కోపమును
పుట్టును. । రాజుకు సమ్మతి ఆయెనా వష్తి రాజైన 19
అహష్వేరోషు సన్నిధికి ఇకను రాకూడదని తమ
యొద్దనుండి యొక రాజాజ్ఞ పుట్టవలెను. అది తప్ప
కుండునట్లు పారసీకులయొక్కయు మాదీయులయొక్క
యు న్యాయముచొప్పున నియమింపవలెను. మరియు
వష్తికంటె యోగ్యురాలిని రాణినిగా తాము చేయ
వలెను. । మరియు రాజు చేయు నిర్ణయము విస్తార 20
మైన తమ రాజ్యమందంతట ప్రకటించినయెడల, ఘను
రాలు గాని అల్పురాలు గాని స్త్రీలందరు తమ పురుషు
లను సన్మానించుదురని చెప్పెను. । ఈ సంగతి రాజు 21
కును అధిపతులకును అనుకూలముగా నుండెను గనుక
అతడు మెమూకాను మాట ప్రకారము చేసెను. ।
ప్రతి పురుషుడు తన యింటిలో అధికారిగా నుండ 22

ేసనియు, ప్రతి పురుషుడు తన పుట్టుభాషను తన
ంటివారితో మాటలాడవలెననియు ఆజ్ఞ ఇచ్చి,
తి సంస్థానమునకు దాని వ్రాత ప్రకారముగాను,
తి జనమునకు దాని భాష ప్రకారముగాను రాజు
సకలమైన సంస్థానములకు (దానిగూర్చిన) తాకీ
లు పంపించెను.

ఈ సంగతులైన తరువాత రాజైన అహష్వేరోషు
ొక్క ఆగ్రహము చల్లారినప్పుడు అతడు వష్తిని
ను చేసినదానిని ఆమెకు నిర్ణయింపబడినదానిని
ంచగా । యౌవనస్థులగు రాజు పరిచారకులు ఇట్లనిరి
అందమైన కన్యకలను రాజుకొరకు వెదుకనగును, ।
ందునిమిత్తము సౌందర్యవతులైన కన్యకలందరిని సమ
ర్చి షూషను కోట అంతఃపురమునకు చేర్చి స్త్రీలకు
పరియగు రాజుయొక్క నపుంసకుడగు హేగే వశ
నకు అప్పగించునట్లు రాజు తన రాజ్యముయొక్క
స్థానములన్నిటిలో పరిచారకులను నియమించును
క. శుద్ధికొరకు సుగంధద్రవ్యములను వారికిచ్చిన
రవాత । రాజు ఆ కన్యకలలో దేనియందు ఇష్ట
డునో ఆమె వష్తికి బదులుగా రాణి యగును. ఈ
ట రాజుకు అనుకూలమాయెను గనుక అతడు
ాగు జరిగించెను.

షూషను కోటలో బెన్యామీనీయుడగు కీషుకు
ట్టిన షిమీ కుమారుడగు యాయీరు వంశస్థుడైన
ొర్దెకై అను ఒక యూదుడుండెను. । బాబెలు
జైన నెబుకద్నెజరు యూదా రాజైన యెకో
్యను పట్టుకొని పోయినప్పుడు ఇతడు యెకోన్యా
కూడ యెరూషలేమునుండి చెరపట్టబడినవారిలో
డు. । తన పినతండ్రి కుమార్తెయైన హదస్సా అను
్తేరు తలితండ్రులు లేనిదైయుండగా అతడామెను
ుకొనెను. ఆమె అందమైన రూపమును సుందర
ఖమునుగలదై యుండెను. ఆమె తలిదండ్రులు
ణము పొందిన తరువాత మొర్దెకై ఆమెను తన
ుమార్తెగా స్వీకరించెను. । రాజాజ్ఞయు అతని నిర్ణయ
ను ప్రచురముచేయబడి కన్యకలు అనేకులు షూషను
టకు పోగుచేయబడి హేగే వశమునకు అప్పగింప
గా, ఎస్తేరును రాజుయొక్క నగరుకు తేబడి,
ను కాయు హేగే వశమునకు అప్పగింపబడెను. ।
చిన్నది అతని దృష్టికి ఇంపైనది గనుక ఆమె అతని
న దయపొందెను; కాబట్టి ఆమె పరిమళ క్రియల
రకైన వస్తువులను ఆమెకు కావలసిన భోజనపదార్థ
లను, రాజు ఇంటిలోనుండి ఆమెకు ఇయ్యదగిన
డుగురు ఆడుపిల్లలను అతడు ఆమెకు త్వరగా ఏర్ప
ి ఆమెను ఆమె చెలికత్తెలను అంతఃపురములో
శ్రేష్ఠమైన స్థలమందుంచెను. । మొర్దెకై—నీ జాతిని
వంశమును కనుపరచకూడదని ఎస్తేరుకు ఆజ్ఞాపించి
ుండెను గనుక ఆమె తెలుపలేదు. । ఎస్తేరు ఏలాగుం
డెనో అదియు, ఆమెకేమి సంభవించునో అదియు
తెలిసికొనుటకై అంతఃపురముయొక్క ఆవరణము
ఎదుట ప్రతిదినము మొర్దెకై తిరుగులాడుచుండెను. ।
ఆరుమాసములు గోపరస తైలముతోను, ఆరు మాస 12
ములు సుగంధవర్గములతోను, స్త్రీల పరిమళ క్రియల
కొరకైన మరి వేరు పదార్థములతోను స్త్రీలు పరిమళ
క్రియలు ముగించి రాజునొద్దకు పోవువారు పన్నెండు
మాసములైన తరువాత రాజైన అహష్వేరోషునొద్దకు
వెళ్లుటకు ఒక్కొక చిన్నదానికి వంతు వచ్చినప్పుడు
ఒక్కొక చిన్నది రాజునొద్దకు ఆ విధముగా పోవు
చుండెను, ఏమనగా ఆ తీరున వారు పరిమళ క్రియలు
చేయుకాలము సంపూర్ణమగుచుండెను. । మరియు 13
అంతఃపురములోనుండి రాజు ఇంటిలోకి వెళ్లవలసిన
సమయమందు ఆమె యేమేమి కోరునో అది అట్టి
స్త్రీకి ఇయ్యబడుటకద్దు. । సాయంత్రమందు ఆమె 14
లోపలికి వెళ్లి మరుదినము ఉపపత్నులను కాయు
రాజుయొక్క షండుడైన షయష్గజు అను అతని వశ
ములోనున్న రెండవ అంతఃపురమునకు తిరిగి వచ్చును.
ఆమెయందు రాజు సంతోషించి ఆమెను పేరుపెట్టి
పిలిచితేనే గాని ఆమె రాజునొద్దకు మరల వెళ్లకుం
డెను. । మొర్దెకై తన కుమార్తెగా స్వీకరించుకొనిన 15
తన పినతండ్రియైన అబీహాయిలు కుమార్తెయగు ఎస్తేరు
రాజునొద్దకు వెళ్లుటకు వంతు వచ్చినప్పుడు స్త్రీలను
కాయు రాజుయొక్క షండుడైన హేగే నిర్ణయించిన
(అలంకారము) గాక ఆమె మరి ఏమియు కోరలేదు.
ఎస్తేరును చూచినవారందరికి ఆమెయందు దయపుట్టె
ను. । ఈ ప్రకారము ఎస్తేరు రాజైన అహష్వేరోషు 16
ఏలుబడియందు ఏడవ సంవత్సరమున టెబేతు అను
పదియవ నెలలో రాజనగరులోకి అతనియొద్దకు
పోగా । స్త్రీలందరికంటె రాజు ఎస్తేరును ప్రేమించెను, 17
కన్యలందరికంటె ఆమె అతనివలన దయాదాక్షిణ్య
ములు పొందెను. అతడు రాజ్యకిరీటమును ఆమె తల
మీద ఉంచి ఆమెను వష్తికి బదులుగా రాణిగా నియ
మించెను. । అప్పుడు రాజు తన అధిపతులకందరికిని 18
సేవకులకందరికిని ఎస్తేరు విషయమై యొక గొప్పవిందు
చేయించి, సంస్థానములలో సెలవు దినము ప్రకటించి
రాజు స్థితికి తగినట్టుగా బహుమతులు ఇప్పించెను. ।
రెండవ మారు కన్యకలు కూర్చబడినప్పుడు మొర్దెకై 19
రాజు గుమ్మములో కూర్చునియుండెను. । ఎస్తేరు 20
మొర్దెకైయొక్క పోషణమందున్న కాలమున చేసినట్టు
గానే ఇప్పుడును అతని మాటకు ఆమె లోబడుచుం
డెను గనుక మొర్దెకై తనకు ఆజ్ఞాపించిన ప్రకారము
ఎస్తేరు తన జాతినైనను తన వంశమునైనను తెలియ
జేయక యుండెను. । ఆ దినములలో మొర్దెకై రాజు 21
గుమ్మములో కూర్చునియుండగా రాజుయొక యిద్దరు
షండులైన బిగ్తాను తెరెషు అన

గ్రస్తులై రాజైన అహష్వేరోషును చంపుటకు ఆలో
22 చించుకొని యుండిరి. । ఈ సంగతి మొర్దెకైకి తెలియ
బడెను గనుక అతడు దానిని రాణియైన ఎస్తేరుతో
చెప్పెను. ఎస్తేరు మొర్దెకైయొక్క పేరట రాజునకు
23 దాని తెలియజేసెను. । ఈ సంగతినిగూర్చి విచారణ
కాగా అది నిజమాయెను. అందుచేత వారిద్దరును ఒక
చెట్టునకు ఉరితీయింపబడిరి. ఇది రాజు ఎదుటనే
రాజ్యసమాచార గ్రంథమందు వ్రాయబడెను.

3 ఈ సంగతులైన తరువాత రాజైన అహష్వేరోషు
హమ్మెదాతా కుమారుడును అగాగీయుడునగు హామా
నును ఘనపరచి వాని హెచ్చించి, వాని పీఠమును
తన దగ్గరనున్న అధిపతులందరికంటె ఎత్తుగా నుంచెను.।
2 కాబట్టి రాజు గుమ్మముననున్న రాజసేవకులందరును
రాజాజ్ఞానుసారముగా మోకాళ్లూని హామానుకు నమ
స్కరించిరి. మొర్దెకై వంగకయు నమస్కారము చేయ
3 కయు నుండగా । రాజు గుమ్మముననున్న రాజసేవ
కులు—నీవు రాజాజ్ఞను ఎందుకు మీరుచున్నావని
4 మొర్దెకైని అడిగిరి. । ఈ ప్రకారము వారు ప్రతి
దినము అతనితో చెప్పుచు వచ్చినను అతడు వారి
మాట చెవిని బెట్టకపోయెను గనుక వారు — మొర్దెకై
యొక్క మాటలు స్థిరపడునో లేదో చూతమని దాని
హామానుకు తెలిపిరి. ఏలయనగా అతడు — నేను
యూదుడను గనుక (ఆ పని చేయజాలనని) వారితో
5 చెప్పియుండెను. । మొర్దెకై వంగకయు నమస్కరింప
కయు నుండుట హామాను చూచినప్పుడు బహుగా
6 కోపగించి । మొర్దెకై ప్రాణము మాత్రము తీయుట
స్వల్పకార్యమని యెంచి, మొర్దెకైయొక్క జనులు
ఎవరైనది తెలిసికొని, అహష్వేరోషుయొక్క రాజ్య
మందంతటనుండు మొర్దెకై స్వజనులగు యూదుల
7 నందరిని సంహరించుటకు ఆలోచించెను. । రాజైన
అహష్వేరోషుయొక్క యేలుబడియందు పన్నెండవ
సంవత్సరమున నీసాను మాసమున, అనగా ప్రథమ
మాసమున వారు హామాను ఎదుట పూరు, అనగా
చీటిని దినదినమునకును నెలనెలకును అదారు అను
8 పన్నెండవ నెలవరకు వేయుచు వచ్చిరి. । అంతట
హామాను అహష్వేరోషుతో చెప్పినదేమనగా — మీ
రాజ్య సంస్థానములన్నిటియందుండు జనులలో ఒక
జాతివారు చెదరియున్నారు; వారి విధులు సకలజనుల
విధులకు వేరుగా ఉన్నవి; వారు రాజుయొక్క ఆజ్ఞ
లను గైకొనువారు కారు; కాబట్టి వారిని ఉండ
9 నిచ్చుట రాజునకు ప్రయోజనకరము కాదు. । రాజునకు
సమ్మతియైతే వారు హతముచేయబడునట్లును, నేను
ఆ పని చేయువారికి ఇరువది వేల మణుగుల వెండిని
రాజుయొక్క ఖజానాలో ఉంచుటకు తూచి అప్ప
10 గించునట్లును, వ్రాతము పుట్టించుమనగా । రాజు తన
చేతి ఉంగరము తీసి దానిని హమ్మెదాతా కుమారు
డైన అగాగీయుడగు హామాను కిచ్చి । — ఆ వెండి 11
నీకియ్యబడియున్నది, నీ దృష్టికి ఏది అనుకూలమో
అది ఆ జనులకు చేయునట్లుగా వారును నీకు అప్ప
గింపబడి యున్నారని రాజు సెలవిచ్చెను. ఈ
హామాను యూదులకు శత్రువు. । మొదటి నెల పద 12
మూడవ దినమందు రాజుయొక్క వ్రాతగాండ్లు పిలువ
బడిరి; హామాను ఆజ్ఞాపించిన ప్రకారము అంతయు
ఆ యా సంస్థానములమీద నుంచబడిన రాజుయొక్క
అధిపతులకును అధికారులకును, ఆ యా సంస్థానముల
లోని జనములమీద నుంచబడిన అధిపతులకును అధి
కారులకును, వారి వారి లిపినిబట్టియు, ఆ యా జన
ముల భాషనుబట్టియు, రాజైన అహష్వేరోషు పేరట
ఆ వ్రాతగాండ్లచేత తాకీదులు వ్రాయింపబడి రాజు
ఉంగరముచేత ముద్రింపబడెను. । అదారు అను 13
పన్నెండవ నెల పదమూడవ దినమందు యౌవనుల
నేమి వృద్ధులనేమి శిశువులనేమి స్త్రీలనేమి యూదుల
నందరిని ఒక్కదినమందే బొత్తిగా నిర్మూలము చేసి
వారి సొమ్ము కొల్లపుచ్చుకొమ్మని తాకీదులు అంచెవారి
చేత రాజ్యసంస్థానములన్నిటికిని పంపబడెను. । మరి 14
యు ఒకానొక దినమునకు వారు సిద్ధపడవలెనను ఆ
ఆజ్ఞను ఒక ప్రతి ప్రబలింపబడినదై ప్రతి సంస్థాన
ములోనున్న సమస్త జనులకు ఇయ్యబడుటకు పంప
బడెను. । అంచెవారు రాజాజ్ఞచేత త్వరపెట్టబడి బయ 15
లువెళ్లిరి. ఆ యాజ్ఞ షూషను కోటలో ఇయ్య
బడెను, దాని విని షూషను పట్టణము కలతపడెను.
అంతట రాజును హామానును విందుకు కూర్చుండిరి.

జరిగినదంతయు తెలియగానే మొర్దెకై తన బట్టలు 4
చింపుకొని గోనెపట్టలు వేసికొని బూడిదె పోసికొని
పట్టణము మధ్యకు బయలువెళ్లి మహా శోకముతో
రోదనముచేసి । రాజు గుమ్మము ఎదుటికి వచ్చెను; గోనె 2
కట్టుకొనినవాడు రాజు గుమ్మమున ప్రవేశింపకూడ
దన్న ఆజ్ఞ కలదు. । రాజుయొక్క ఆజ్ఞయు శాసన 3
మును ఏ సంస్థానమునకు వచ్చెనో అక్కడనున్న
యూదులు ఉపవాసముండి మహాదుఃఖములోను
ఏడ్పులోను రోదనములోను మునిగినవారైరి, అనే
కులు గోనెను బూడిదెను వేసికొని పడియుండిరి. ।
ఎస్తేరుయొక్క పనికత్తెలును ఆమెదగ్గరనున్న షండు 4
లును వచ్చి జరిగినదాని ఆమెకు తెలియజేయగా రాణి
గొప్ప మనోవిచారము కలదై— మొర్దెకై కట్టుకొని
యున్న గోనెపట్టను తీసివేయుమని ఆజ్ఞ ఇచ్చి,
కట్టించుకొనుటకై అతనియొద్దకు వస్త్రములు పంపెను
గాని అతడు వాటిని తీసికొనలేదు. । అప్పుడు ఎస్తేరు 5
తన్ను కనిపెట్టియుండుటకు రాజు నియమించిన షండు
లలో హతాకు అను ఒకని పిలిచి—అదియేమియైనది,
ఎందుకైనది తెలిసికొనుటకు మొర్దెకైయొద్దకు వెళ్లుమని
ఆజ్ఞనిచ్చెను. । హతాకు రాజు గుమ్మము ఎదుటనున్న 6

ఎపు వీధిలోనుండు మొర్దకైయొద్దకు పోగా ।
ర్దకై, తనకు సంభవించినదంతయు, యూదులను
నము చేయుటకుగాను హామాను వారినిబట్టి రాజు
నాకు తూచి యిచ్చెదనని చెప్పిన సొమ్ము మొత్తము
మునియును అతనికి తెలిపి । — వారిని సంహ
టుకై షూషనులో ఇయ్యబడిన ఆజ్ఞ ప్రతిని
రకు చూపి తెలుపుమనియు, ఆమె తన జనులవిష
ి రాజును వేడుకొని అతని సముఖమందు విన్న
చేయుటకై అతనియొద్దకు పోవలెనని చెప్పు
ము దాని నతనికిచ్చెను. హతాకు వచ్చి మొర్దకై
క మాటలను ఎస్తేరుతో చెప్పెను. । అంతట
ి మొర్దకైతో చెప్పుమని హతాకునకు సెలవిచ్చిన
ిగా । — పిలువబడక పురుషుడే గాని స్త్రీయే
రాజుయొక్క అంతర్గృహమున ప్రవేశించిన
ల బ్రదుకునట్లుగా రాజు తన బంగారపుదండ
ఎవరితట్టు చాపునో వారు తప్ప ప్రతివాడు
ిరింపబడునన్న కఠినమైన ఆజ్ఞ కలదని రాజసేవ
ంసరికిని అతని సంస్థానములలోనున్న జనుల
కిని తెలిసేయున్నది. నేటికి ముప్పది దినముల
రాజునొద్దకు ప్రవేశించుటకు నేను పిలువబడ
చెప్పుమనెను. । వారు ఎస్తేరుయొక్క మాటలు
కైకి తెలుపగా । మొర్దకై ఎస్తేరుతో ఇట్లు
త్తరమిచ్చె — రాజనగరులో ఉన్నంత మాత్ర
ి యూదులందరికంటె నీవు తప్పించుకొందు
ి మనస్సులో తలంచుకొనవద్దు; । నీవు ఈ సమ
ందు ఏమియు మాటలాడక మౌనముగా నున్న
మున, యూదులకు సహాయమును విడుదలయు
ుక దిక్కునుండి వచ్చును గాని, నీవును నీ తండ్రి
ివారును నశించుదురు. నీవు ఈ సమయమును
ి రాజ్యమునకు వచ్చితివేమో ఆలోచించుకొనుు
చెప్పుమనెను. । అప్పుడు ఎస్తేరు మొర్దకైతో
ఇట్లనుమనెను : — నీవు పోయి షూషనునందు
ిన యూదులనందరిని సమాజమందిరమునకు
కూర్చి, నా నిమిత్తము ఉపవాసముండి మూడు
లు అన్నపానములు చేయకుండుడి; నేనును
నికత్తెలును కూడ ఉపవాసముందుము; ప్రవే
ట న్యాయవ్యతిరిక్తముగా నున్నను నేను రాజు
స ప్రవేశించుదును; నేను నశించిన నశించెదను. ।
లెనే మొర్దకై బయలుదేరి ఎస్తేరు తనకు ఆజ్ఞా
న యంతటి ప్రకారముగా జరిగించెను.
మూడవ దినమందు ఎస్తేరు రాజభూషణములు
ుకొని, రాజునగరుయొక్క ఆవరణములో రాజు
ికి వెళ్లి నిలిచెను. రాజనగరు ద్వారమునకు
ుగానున్న రాజావరణములో తన రాజాసనము
రాజు కూర్చుని యుండెను. । రాణియైన ఎస్తేరు
ణములో నిలుచుని యుండుట రాజు చూడగా
ఆమెయందు అతనికి దయపుట్టెను. రాజు తన చేతిలో
నుండు బంగారపు దండమును ఎస్తేరుతట్టు చాపగా
ఎస్తేరు దగ్గరకు వచ్చి దండముయొక్క కొన ముట్టెను. ।
రాజు — రాణియైన ఎస్తేరూ, నీకేమి కావలెను? నీ 3
మనవి యేమిటి? రాజ్యములో సగముమట్టుకు నీకను
గ్రహించెదనని ఆమెతో చెప్పగా । ఎస్తేరు — రాజుకు 4
యుక్తముగా తోచినయెడల నేను రాజుకొరకు సిద్ధము
చేయించిన విందుకు రాజవైన తామును హామానును
నేడు రావలెనని కోరుచున్నానని ప్రత్యుత్తరమి
చ్చెను. । ఎస్తేరు మాటప్రకారముగా జరుగునట్లు 5
హామాను చేయవలయునని త్వరపెట్టుమని రాజు సెల
వియ్యగా రాజును హామానును ఎస్తేరు చేయించిన
విందుకు వచ్చిరి. । రాజు ద్రాక్షారసపు విందుకు 6
కూర్చుండి ఎస్తేరును చూచి నీ కోరిక యేమిటి? అది
నీకను గ్రహింపబడును, నీ మనవి యేమిటి? అది
రాజ్యములో సగముమట్టుకైనను చేయబడునని చెప్ప
గా । ఎస్తేరు ఈలాగు ప్రత్యుత్తరమిచ్చెను — రాజవైన 7
తమ దృష్టికి నాయెడల దయకలిగి నా మనవిచొప్పు
నను నా కోరికచొప్పునను జరిగించుట రాజవైన తమకు
అనుకూలమైతే । రాజవైన తామును హామానును మీ 8
నిమిత్తము నేను చేయింపబోవు విందుకు రావలెను.
రాజవైన తాము చెప్పినట్లు రేపటి దినమున నేను చేయు
దును; ఇదే నా మనవియు నా కోరికయు ననెను. ।
ఆ దినమందు హామాను సంతోషించి మనోల్లాసము 9
గలవాడై బయలు వెళ్లి, రాజుగుమ్మమునందు మొర్దకై
తన్ను చూచియు అతడు లేచి నిలువకయు కదలకయు
ఉన్నందున మొర్దకైమీద బహుగా కోపగించెను. ।
అయితే హామాను కోపము అణచుకొని తన యింటికి 10
పోయి తన స్నేహితులను తన భార్యయైన జెరెషును
పిలిపించి । తనకు కలిగిన గొప్ప ఐశ్వర్యమును గూర్చి 11
యు, చాలామంది పిల్లలు తనకుండుటను గూర్చియు,
రాజు తన్ను ఘనపరచి రాజు క్రిందనుండు అధిపతుల
మీదను సేవకులమీదను తన్ను ఏలాగున పెద్దగా
చేసెనో దానినిగూర్చియు వారితో మాటలాడెను. ।
మరియు అతడు — రాణియైన ఎస్తేరు తాను చేయించిన 12
విందుకు రాజును నన్ను తప్ప మరి యెవనిని పిలిపించ
లేదు, రేపటి దినమున కూడ రాజుతో కలిసి విందుకు
రమ్మని నాకు సెలవైనదని తెలియజేసెను. । అయితే 13
యూదుడైన మొర్దకై రాజుగుమ్మమున కూర్చునియుం
డుట నేను చూచునంత కాలము ఆ పదవి యంతటి
వలన నాకు ప్రయోజనమేమియు లేదని అతడు చెప్ప
గా । అతని భార్యయైన జెరెషును అతని స్నేహితు 14
లందరును — ఏబది మూరల ఎత్తుగల యొక ఉరికొయ్య
చేయించుము; దానిమీద మొర్దకై ఉరితీయింపబడు
నట్లు రేపు నీవు రాజుతో మనవి చేయుము; తరువాత
నీవు సంతోషముగా రాజుతో కూడ విందుకు పోమువు

అని అతనితో చెప్పిరి. ఈ సంగతి హామానుకు యుక్త
ముగా కనబడినందున అతడు ఉరికొయ్య యొకటి
సిద్ధము చేయించెను.

6 ఆ రాత్రి నిద్రపట్టక పోయినందున రాజ్యపు
సమాచార గ్రంథము తెమ్మని రాజు ఆజ్ఞ ఇయ్యగా
2 అది రాజు ఎదుట చదివి వినిపింపబడెను. । ద్వార
పాలకులైన బిగ్తాను తెరెషు అను రాజుయొక్క యిద్దరు
నపుంసకులు రాజైన అహష్వేరోషును చంప యత్నిం
చిన సంగతి మొర్దెకై తెలిపినట్టు అందులో వ్రాయ
3 బడి యుండెను. । రాజు ఆ సంగతి విని—ఇందునిమి
త్తము మొర్దెకైకి బహుమతి యేదైనను ఘనత యేదై
నను చేయబడెనా అని యడుగగా రాజు సేవకులు—
అతనికేమియు చేయబడలేదని ప్రత్యుత్తరమిచ్చిరి. ।
4 అప్పుడు—ఆవరణములో ఎవరో యున్నారని రాజు
చెప్పెను అప్పటికి హామాను తాను చేయించిన ఉరి
కొయ్యమీద మొర్దెకైని ఉరితీయింప సెలవిమ్మని రాజు
తో మనవిచేయుటకై రాజనగరుయొక్క ఆవరణము
5 లోకి వచ్చియుండెను. । రాజసేవకులు—ఏలినవాడా
చిత్తగించుము, హామాను ఆవరణములో నిలువబడియు
న్నాడని రాజుతో చెప్పగా రాజు—అతని రానియ్యు
డని సెలవిచ్చినందున హామాను లోపలికి వచ్చెను. ।
6 —రాజు ఘనపరచ నపేక్షించువానికి ఏమిచేయవలెనని
రాజు అతని నడుగగా హామాను—నన్నుగాక మరి
ఎవరిని రాజు ఘనపరచ నపేక్షించునని తనలోతాననుకొని
7 కొని రాజుతో ఇట్లనెను । — రాజు ఘనపరచ నపే
8 క్షించువానికి చేయతగినదేమనగా । రాజు ధరించు
కొను రాజవస్త్రములను రాజు ఎక్కు గుఱ్ఱమును రాజు
తన తలమీద ఉంచుకొను రాజకిరీటమును ఒకడు తీసి
9 కొని రాగా । ఘనులైన రాజుయొక్క అధిపతులలో
ఒకడు ఆ వస్త్రములను ఆ గుఱ్ఱమును పట్టుకొని, రాజు
ఘనపరచ నపేక్షించువానికి ఆ వస్త్రములను ధరింపజేసి
ఆ గుఱ్ఱముమీద అతనిని ఎక్కించి రాజవీధిలో
అతని నడిపించుచు — రాజు ఘనపరచ నపేక్షించు
వానికి ఈ ప్రకారముగా చేయతగునని అతనిముందర
10 చాటింపవలెను. । అందుకు రాజు — నీవు చెప్పిన
ప్రకారమే శీఘ్రముగా ఆ వస్త్రములను ఆ గుఱ్ఱమును
తీసికొని, రాజు గుమ్మమునొద్ద కూర్చునియున్న యూ
దుడైన మొర్దెకైకి ఆలాగుననే చేయుము; నీవు చెప్పిన
దానిలో ఒకటియు విడువక అంతయు చేయుమని
11 హామానుకు ఆజ్ఞ ఇచ్చెను. । ఆ ప్రకారమే హామాను
ఆ వస్త్రములను ఆ గుఱ్ఱమును తీసికొని, మొర్దెకైకి ఆ
వస్త్రములను ధరింపజేసి ఆ గుఱ్ఱముమీద అతనిని ఎక్కించి
రాజవీధిలో అతని నడిపించుచు,—రాజు ఘనపరచ
నపేక్షించువానికి ఈ ప్రకారము చేయతగునని అతని
చాటించెను. । తరువాత మొర్దెకై రాజు
కు వచ్చెను; అయితే హామాను తల కప్పు
కొని దుఃఖించుచు తన యింటికి త్వరగా వెళ్లిపోయెను. ।
హామాను తనకు సంభవించినదంతయు తన భార్యయైన 13
జెరెషుకును తన స్నేహితులకందరికిని తెలుపగా, అతని
యొద్దనున్న జ్ఞానులును అతని భార్యయైన జెరెషును—
ఎవనిచేత నీకు అధికారనష్టము కలుగుచున్నదో ఆ
మొర్దెకై యూదుల వంశపువాడైనయెడల అతనిమీద
నీకు జయము కలుగదు, అతనిచేత అవశ్యముగా చెడి
పోదువని అతనితో అనిరి. । వారు ఇంక మాటలాడు 14
చుండగా రాజుయొక్క నపుంసకులు వచ్చి ఎస్తేరు
చేయించిన విందుకు రమ్మని హామానును త్వరపెట్టిరి.

రాజును హామానును రాణియైన ఎస్తేరునొద్దకు 7
విందుకు రాగా । రాజు—ఎస్తేరు రాణీ, నీ విజ్ఞాపన 2
మేమిటి? అది నీకనుగ్రహింపబడును, నీ మనవి
యేమిటి? రాజ్యములో సగముమట్టుకైనను నీకనుగ్ర
హించెదనని రెండవ నాడు ద్రాక్షారసపు విందులో
ఎస్తేరుతో అనెను. । అప్పుడు రాణియైన ఎస్తేరు 3
ఈలాగు ప్రత్యుత్తరమిచ్చెను — రాజా, నీ దృష్టికి
నేను దయపొందినదాననైన పక్షమున రాజవైన తమకు
సమ్మతియైతే, నా విజ్ఞాపననుబట్టి నా ప్రాణమును,
నా మనవినిబట్టి నా జనులును, నా కనుగ్రహింపబడు
దురు గాక. । సంహరింపబడుటకును, హతముచేయ 4
బడి నశించుటకును, నేనును నా జనులును కూడ అమ్మ
బడినవారము. మేము దాసులముగాను దాసురాండ్ర
ముగాను అమ్మబడిన పక్షమున నేను మౌనముగా
నుందును; ఏలయనగా మా విరోధిని తప్పించుకొను
టకై మేము రాజవగు తమరిని శ్రమపరచుట యుక్తము
కాదు. । అందుకు రాజైన అహష్వేరోషు — ఈ 5
కార్యముచేయుటకు తన మనస్సు దృఢపరచుకొన్న
వాడెవడు? వాడేడి! అని రాణియగు ఎస్తేరు నడు
గగా । ఎస్తేరు—మా విరోధియగు ఆ పగవాడు దుష్టు 6
డైన యీ హామానే అనెను. అంతట హామాను రాజు
ఎదుటను రాణి యెదుటను భయాక్రాంతుడాయెను. ।
రాజు ఆగ్రహమొంది ద్రాక్షారసపు విందును విడిచి 7
నగరు వనమునకు పోయెను. అయితే రాజు తనకు
ఏదో హానిచేయ నుద్దేశించెనని హామాను తెలిసికొని,
రాణియైన ఎస్తేరు ఎదుట తన ప్రాణముకొరకు విన్న
పముచేయుటకై నిలిచెను. । నగరు వనములోనుండి 8
ద్రాక్షారసపు విందుస్థలమునకు రాజు తిరిగి రాగా
ఎస్తేరు కూర్చుండియున్న శయ్యమీద హామాను పడి
యుండుట చూచి — వీడు ఇంటిలో నా సముఖము
ఎదుటనే రాణిని బలవంతము చేయునా? అని
చెప్పెను; ఆ మాట రాజు నోట రాగానే బంటులు
హామాను ముఖమునకు ముసుకు వేసిరి. । రాజు ముం 9
దరనుండు షండులలో హర్బోనా అను నొకడు—
ఏలినవాడా చిత్తగించుము, రాజు మేలుకొరకు మాట
లాడిన మొర్దెకైని ఉరితీయుటకు హామాను చేయించిన

బది మూరల యెత్తుగల ఉరికొయ్య హామాను ఇంటి
ద్ద, నాటబడి యున్నదనగా రాజు—దానిమీద
ని ఉరితీయుడని ఆజ్ఞ ఇచ్చెను. । కాగా హామాను
ర్దెకైకి సిద్ధముచేసిన ఉరికొయ్యమీద వారు అతనినే
తీసిరి. అప్పుడు రాజుయొక్క ఆగ్రహము చల్లారెను.
ఆ దినమున రాజైన అహష్వేరోషు యూదులకు
త్రువైన హామాను ఇంటిని రాణియైన ఎస్తేరు
ముచేసెను. ఎస్తేరు మొర్దెకై తనకు ఏమి కావలెనో
జుకు తెలియజేసినమీదట అతడు రాజు సన్నిధికి
గా । రాజు హామాను చేతిలోనుండి తీసికొనిన
ఉంగరమును మొర్దెకైకి ఇచ్చెను. ఎస్తేరు మొర్దె
హామాను ఇంటిమీద అధికారిగా ఉంచెను. ।
రియు ఎస్తేరు రాజు ఎదుట మనవిచేసికొని, అతని
దములమీద పడి, అగాగీయుడైన హామాను చేసిన
గు అతడు యూదులకు విరోధముగా తలంచిన
చనను వ్యర్థపరచుమని కన్నీళ్లతో అతని వేడుకొ
గా । రాజు బంగారు దండమును ఎస్తేరుతట్టు
పెను. ఎస్తేరు లేచి రాజు ఎదుట నిలిచి । —రాజవైన
కు సమ్మతిగానైనయెడలను, తమ దృష్టికి నేను దయ
ందినదాననైన రాజవైన తమ యెదుట ఈ సంగతి
క్తముగా తోచినయెడలను, తమ దృష్టికి నేను
నైనదాననైనయెడలను, రాజవైన తమ సకలసంస్థాన
లలోనుండు యూదులను నాశనముచేయవలెనని
మ్మెదాతా కుమారుడైన అగాగీయుడగు హామాను
్రాయించిన తాకీదులచొప్పున జరుగకుండునట్లు
టిని రద్దుచేయుటకు ఆజ్ఞ ఇయ్యుడి. । నా జనుల
దికి రాబోవు కీడును, నా వంశముయొక్క నాశన
ను చూచి నేను ఏలాగు సహింపగలనని మనవి
యగా । రాజైన అహష్వేరోషు రాణియైన ఎస్తేరు
ను యూదుడైన మొర్దెకైకిని ఈలాగు సెలవిచ్చెను
హామాను ఇంటిని ఎస్తేరు వశము చేసియున్నాను;
తడు యూదులను హతముచేయుటకు ప్రయత్నించి
దున అతడు ఉరికొయ్యమీద ఉరితీయబడెను. ।
యితే రాజుపేరట వ్రాయబడి రాజు ఉంగరముతో
ద్రింపబడిన తాకీదును ఏ మానవుడును మార్చ
లడు; కాగా మీకిష్టమైనట్లు మీరు రాజునైన నా
రట యూదుల పక్షమున తాకీదు వ్రాయించి రాజు
ంగరముతో దాని ముద్రించుడి.
సీవాను అను మూడవ నెలలో ఇరువది మూడవ
నమందు రాజుయొక్క వ్రాతగాండ్రు పిలువబడిరి;
ర్దెకై ఆజ్ఞాపించిన ప్రకారమంతయు యూదుల
ను, హిందూదేశము మొదలుకొని కూషుదేశము
రకు వ్యాపించియున్న నూట ఇరువది యేడు సంస్థా
ములలోనున్న అధిపతులకును అధికారులకును, ఆ
యా సంస్థానములకును దాని దాని వ్రాతనుబట్టియు
ని దాని భాషనుబట్టియు తాకీదులు వ్రాయబడెను. ।
రాజైన అహష్వేరోషు పేరట తాకీదులు మొర్దెకై 10
వ్రాయించి రాజు ఉంగరముతో ముద్రించి గుఱ్ఱ
ములమీద, అనగా రాజనగరుపనికి పెంచబడిన బీజా
శ్వములమీద అంచెగాండ్ల నెక్కించి ఆ తాకీదులను
వారిచేత పంపెను. । రాజైన అహష్వేరోషుయొక్క 11
సంస్థానములన్నిటిలో ఒక్క దినమందే, అనగా
అదారు అను పన్నెండవ నెల పదమూడవ దినమందే
ప్రతి పట్టణమునందుండు యూదులు కూడుకొని,
తమ ప్రాణములు కాపాడుకొనుటకు ఆ యా ప్రదేశ
ములలోనుండి తమకు విరోధులగు జనుల సైనికులనం
దరిని, శిశువులను స్త్రీలనుకూడ, సంహరించి హతముచేసి
నిర్మూలపరచి । వారి వస్తువులను కొల్లపెట్టుటకు రాజు 12
యూదులకు సెలవిచ్చెనని దానియందు వ్రాయబ
డెను. । మరియు ఈ తాకీదుకు ప్రతులు వ్రాయించి 13
ఆ యా సంస్థానములలోని జనులకందరికి పంపించవలె
ననియు, యూదులు తమ శత్రువులమీద పగతీర్చు
కొనుటకు ఒకానొక దినమందు సిద్ధముగా ఉండవలె
ననియు ఆజ్ఞ ఇయ్యబడెను. । రాజనగరు పనికి పెంచ 14
బడిన బీజాశ్వములమీద నెక్కిన అంచెగాండ్లు రాజు
మాటవలన ప్రేరేపింపబడి అతివేగముగా బయలు
దేరిరి. ఆ తాకీదు షూషను కోటలో ఇయ్యబడెను. ।
అప్పుడు మొర్దెకై ఊదావర్ణమును తెలుపువర్ణమును 15
గల రాజవస్త్రమును బంగారపు పెద్దకిరీటమును అవిసె
నారతో చేయబడిన ధూమ్రవర్ణముగల వస్త్రములను
ధరించుకొనినవాడై రాజుసముఖమునుండి బయలు
దేరెను; అందునిమిత్తము షూషనుపట్టణము ఆనందించి
సంతోషమొందెను. । మరియు యూదులకు క్షేమ 16
మును ఆనందమును సంతుష్టియు ఘనతయు కలిగెను. ।
రాజుచేసిన తీర్మానమును అతని చట్టమును వచ్చిన 17
ప్రతి సంస్థానమందును ప్రతి పట్టణమందును యూదు
లకు ఆనందమును సంతోషమును కలిగెను, అది శుభ
దినమని విందుచేసికొనిరి. మరియు దేశజనులలో
యూదులయెడల భయముకలిగెను గనుక అనేకులు
యూదుల మతము అవలంబించిరి.

రాజు చేసిన తీర్మానమును చట్టమును నెరవేరు 9
కాలమువచ్చినప్పుడు అదారు అను పన్నెండవ నెల
పదమూడవ దినమున యూదులను జయింపగలుగుదు
మని వారి పగవారు నిశ్చయించుకొనిన దినముననే
యూదులు తమ పగవారిమీద అధికారము నొంది
నట్లు అగుపడెను. । యూదులు రాజైన అహష్వే 2
రోషుయొక్క సంస్థానములన్నిటిలోనుండు పట్టణ
ములయందు తమకు కీడు చేయవలెనని చూచినవారిని
హతముచేయుటకు కూడుకొనిరి. వారినిగూర్చి సకల
జనులకు భయము కలిగినందున ఎవరును వారి యెదుట
నిలువలేకపోయిరి. । మొర్దెకైని గూర్చిన భయము 3
తమకు కలిగినందున సంస్థానములయొక్క అధిపతు

లును అధికారులును ప్రభువులును రాజు పని నడిపిం
4 చువారును యూదులకు సహాయముచేసిరి. । మొర్దెకై
రాజుయొక్క నగరులో గొప్పవాడాయెను. ఈ
మొర్దెకై అనువాడు అంతకంతకు గొప్పవాడగుటచేత
అతని కీర్తి సంస్థానములన్నిటియందు వ్యాపించెను. ।
5 యూదులు తమ శత్రువులనందరిని కత్తివాత హతము
చేసి వారిని నాశనము చేసి మనస్సు తీర తమ విరో
6 ధులకు చేసిరి. । షూషను కోటయందు యూదులు
7 ఏనూరుమందిని చంపి నాశముచేసిరి. । హమ్మెదాతా
కుమారుడై యూదులకు శత్రువగు హామానుయొక్క
8 పదిమంది కుమారులైన పర్షందాతా । దల్ఫోను అస్పా
9 తా పోరాతా । అదల్యా అరీదాతా పర్మష్తా ।
10 అరీసై అరీదై వైజాతా అనువారిని చంపిరి; అయితే
11 కొల్లసొమ్ము వారు పట్టుకొనలేదు. । ఆ దినమున
షూషను కోటయందు చంపబడినవారి లెక్క రాజుకు
12 తెలియజెప్పగా । రాజు రాణియైన ఎస్తేరుతో—యూ
దులు షూషను కోటయందు ఏనూరుమందిని హామాను
యొక్క పదిమంది కుమారులను బొత్తిగా నాశనము
చేసియున్నారు; రాజుయొక్క కొదువ సంస్థానము
లలో వారు ఏమిచేసియుందురో; ఇప్పుడు నీ మనవి
ఏమిటి? అది నీకనుగ్రహింపబడును, నీవు ఇంకను
అడుగునదేమి? అది దయచేయబడునని సెలవియ్యగా ।
13 ఎస్తేరు—రాజవైన తమకు సమ్మతమైనయెడల ఈ దినము
జరిగిన చొప్పున షూషనుసందున్న యూదులు రేపును
చేయునట్లుగాను, హామానుయొక్క పదిమంది కుమా
రులు ఉరికొయ్యమీద ఉరి తీయింపబడునట్లుగాను
14 సెలవియ్యుడనెను. । ఆలాగు చేయవచ్చునని రాజు
సెలవిచ్చెను; షూషనులో ఆజ్ఞ ప్రకటింపబడెను;
హామానుయొక్క పదిమంది కుమారులు ఉరి తీయింప
15 బడిరి. । షూషనునందున్న యూదులు అదారు మాస
మున పదునాలుగవ దినమందు కూడుకొని షూషను
నందు మున్నూరుమందిని చంపివేసిరి, అయితే వారు
16 కొల్లసొమ్ము పట్టుకొనలేదు. । రాజు సంస్థానముల
యందుండు తక్కిన యూదులు కూడుకొని, తమ
ప్రాణములను రక్షించుకొనుటకై పూనుకొని, తమ
విరోధులలో డెబ్బది యయిదు వేలమందిని చంపివేసి,
తమ పగవారివలన బాధలేకుండ నెమ్మదిపొందిరి;
17 అయితే వారును కొల్లపట్టుకొనలేదు. । అదారు
మాసము పదమూడవ దినమందును పదునాలుగవ
దినమందును వారు నెమ్మదిపొంది విందుచేసికొనుచు
18 సంతోషముగా నుండిరి. । షూషనునందున్న యూ
దులు ఆ మాసమందు పదమూడవ దినమందును పదు
నాలుగవ దినమందును కూడుకొని పదునైదవ దిన
మందు నెమ్మదిపొంది విందుచేసికొనుచు సంతోష
19 ముగా నుండిరి. । కాబట్టి ప్రాకారములులేని ఊళ్లలో
కాపురమున్న గ్రామవాసులైన యూదులు అదారు
మాసము పదునాలుగవ దినమందు సంతోషముగా
నుండి—అది విందుచేయదగిన శుభదినమనుకొని ఒకరి
కొకరు బహుమానములను పంపించుకొనుచు వచ్చిరి.
మొర్దెకై యీ సంగతులను గూర్చి రాజైన అహ 20
ష్వేరోషుయొక్క సంస్థానములన్నిటికి సమీపమున
నేమి దూరమున నేమి నివసించియున్న యూదులకం
దరికి పత్రికలను పంపి । —యూదులు తమ పగ 21
వారిచేత బాధపడక నెమ్మదిపొందిన దినములనియు,
వారి దుఃఖము పోయి సంతోషము వచ్చిన నెల
అనియు, వారు మూల్గుట మానిన శుభదినమనియు,
ప్రతి సంవత్సరము అదారు నెలయొక్క పదునాలు
గవ దినమును పదునైదవ దినమును వారు ఆచరించు
కొనుచు । విందుచేసికొనుచు సంతోషముగానుండి 22
ఒకరికొకరు బహుమానములను, దరిద్రులకు కాను
కలను, పంపతగిన దినములనియు వారికి స్థిరపరచెను. ।
అప్పుడు యూదులు తాము ఆరంభించినదానిని మొ 23
ర్దెకై తమకు వ్రాసిన ప్రకారముగా నెరవేర్చుదుమని
యొప్పుకొనిరి. । యూదులకు శత్రువగు హమ్మెదాతా 24
కుమారుడైన అగాగీయుడగు హామాను యూదులను
సంహరింప దలచి వారిని నాశనపరచి నిర్మూలము
చేయవలెనని, పూరు, అనగా చీటి, వేయించియుం
డగా । ఎస్తేరు రాజు ఎదుటికి వచ్చిన తరువాత రాజు 25
అతడు యూదులకు విరోధముగా తలపెట్టిన చెడు
యోచన తన తలమీదికే వచ్చునట్లుగా చేసి, వాడును
వాని కుమారులును ఉరికొయ్యమీద ఉరితీయబడు
నట్లుగా ఆజ్ఞ వ్రాయించి ఇచ్చెను. । కావున ఆ దిన 26
ములు పూరు అను పేరును బట్టి పూరీము అనబడెను.
ఈ ఆజ్ఞలో వ్రాయబడిన మాటలన్నిటినిబట్టియు,
ఈ సంగతినిబట్టియు, తాము చూచినదానినంతటిని
బట్టియు, తమమీదికి వచ్చినదానినిబట్టియు । యూ 27
దులు ఈ రెండు దినములనుగూర్చి వ్రాయబడిన
ప్రకారముగా ప్రతి సంవత్సరము వాటి నియామక
కాలమునుబట్టి వాటిని ఆచరించెదమనియు, ఈ దిన
ములు తరతరముగా ప్రతి కుటుంబములోను ప్రతి
సంస్థానములోను ప్రతి పట్టణములోను జ్ఞాపకము
చేయబడునట్లుగా ఆచరించెదమనియు, । పూరీము 28
అను ఈ దినములను యూదులు ఆచరింపకయు,
తమ సంతతివారు వాటిని జ్ఞాపకముంచుకొనకయు
మానకుండునట్లు నిర్ణయించుకొని, ఆ సంగతిని మరచి
పోకుండునట్లు, తమమీదను తమ సంతతివారిమీదను,
తమతో కలిసికొనినవారిమీదను ఇది యొక బాధ్య
తగా ఉండునని ఒప్పుకొనిరి. । అప్పుడు పూరీమును 29
గూర్చి వ్రాయబడిన యీ రెండవ ఆజ్ఞను దృఢపరచు
టకు అబీహాయిలు కుమార్తెయును రాణియునైన ఎస్తే
రును యూదుడైన మొర్దెకైయును ఖండితముగా
వ్రాయించిరి. । మరియు యూదుడైన మొర్దెకైయును 30

రాణియైన ఎస్తేరును యూదులకు నిర్ణయించినదానిని
బట్టి వారు ఉపవాస విజ్ఞాపన కాలములు ఏర్పరచు
కొని, అది తమమీదను తమ వంశపువారిమీదను
ఒక బాధ్యతయని యెంచుకొని వాటిని జరిగించెదమని
31 యొప్పుకొనిన ప్రకారముగా । ఈ పూరీము అను
పండుగదినములను స్థిరపరచుటకు అతడు అహష్వే
రోషుయొక్క రాజ్యమందుండు నూట ఇరువదియేడు
సంస్థానములలోనున్న యూదులకందరికి వారి
క్షేమము కోరునట్టియు, విశ్వాసార్థ్వములగునట్టియు
32 మాటలుగల పత్రికలు పంపెను. । ఈలాగున ఎస్తేరు
యొక్క ఆజ్ఞచేత ఈ పూరీముయొక్క సంగతులు
స్థిరమై గ్రంథములో వ్రాయబడెను.

10 రాజైన అహష్వేరోషు రాజ్యమును సముద్ర
ద్వీపములును పన్ను చెల్లింప నిర్ణయించెను. । మొర్దెకై 2
యొక్క బలమును గూర్చియు, అతడు సామర్థ్యము
చేత చేసిన కార్యములన్నిటిని గూర్చియు, రాజు
అతనిని ఘనపరచిన సంగతిని గూర్చియు మాదీయుల
యొక్కయు పారసీకులయొక్కయు రాజ్యసమాచార
గ్రంథమందు వ్రాయబడి యున్నది. । యూదుడైన 3
మొర్దెకై రాజైన అహష్వేరోషుకు ప్రధానమంత్రిగా
నుండి, తనవారందరితో సమాధానముగా మాట
లాడుచు, తన జనులయొక్క క్షేమమును విచారించు
వాడును యూదులలో గొప్పవాడునై తన దేశస్థు
లలో చాలామందికి ఇష్టుడుగా ఉండెను.

# యోబు గ్రంథము

1 ఊజు దేశమునందు యోబు అను ఒక మనుష్యు
డుండెను. అతడు యథార్థవర్తనుడును, న్యాయవంతు
డునై దేవునియందు భయభక్తులు కలిగి చెడుతనము
2 విసర్జించినవాడు. । అతనికి ఏడుగురు కుమారులును
3 ముగ్గురు కుమార్తెలును కలిగిరి. । అతనికి ఏడు వేల
గొఱ్ఱెలును మూడు వేల ఒంటెలును ఐదువందల జతల
యెడ్లును ఐదువందల ఆడు గాడిదెలును కలిగి, బహు
మంది పనివారును అతనికి ఆస్తిగానుండెను గనుక
తూర్పు దిక్కు జనులందరిలో అతడే గొప్పవాడుగా
4 నుండెను. । అతని కుమారులందరు వంతులవొప్పున
అనుదినము ఒకరికొకరు తమ తమ యిండ్లలో విందు
చేయుటకై కూడుచున్నప్పుడు తమ ముగ్గురు అక్క చెల్లెండ్ర
బుట్టువులను తమతో కలిసి అన్నపానములు పుచ్చు
5 కొనవలెనని వారిని పిలిపించుచు వచ్చిరి. । వారి వారి
విందుదినములు పూర్తికాగా యోబు, తన కుమారులు
పాపముచేసి తమ హృదయములలో దేవుని దూషించి
రేమో అని వారిని పిలువనంపించి వారిని పవిత్రపరచి,
అరుణోదయమున లేచి వారిలో ఒక్కొకని నిమిత్తమై
దహనబలి నర్పించుచు వచ్చెను. యోబు నిత్యము
ఆలాగున చేయుచుండెను.

6 [1]దేవదూతలు యెహోవా సన్నిధిని నిలుచుటకై
వచ్చిన దినమొకటి తటస్థించెను. ఆ దినమున అప
7 వాదియగువాడు వారితో కలిసి వచ్చెను. । యెహోవా
—నీవు ఎక్కడనుండి వచ్చితివని వాని నడుగగా అప
వాది — భూమిమీద ఇటు అటు తిరుగులాడుచు
అందులో సంచరించుచు వచ్చితినని యెహోవాకు
8 ప్రత్యుత్తరమిచ్చెను. । అందుకు యెహోవా — నా
సేవకుడైన యోబు యథార్థవర్తనుడును న్యాయవంతు
డునై దేవునియందు భయభక్తులు కలిగి చెడుతనము
విసర్జించినవాడు, ఆ మనుష్యునివంటివాడు ఎవడును
9 లేడు. । అతని సంగతి నీవెప్పుడైన ఆలోచించితివా
అని అడుగగా అపవాది — యోబు ఊరకయే దేవుని
10 యందు భయభక్తులు కలవాడాయెనా? । నీవు అతని
కిని అతని యింటివారికిని అతనికి కలిగిన సమస్తమున
కును చుట్టు కంచె వేసితివి గదా? నీవు అతని చేతిపనిని
దీవించుచుండుటచేత అతని ఆస్తి దేశములో బహుగా
11 విస్తరించియున్నది. । అయినను నీవు ఇప్పుడు నీ చేయి
చాపి అతనికి కలిగిన సమస్తమును మొత్తినయెడల
అతడు నీ ముఖము ఎదుటనే దూషించి నిన్ను విడిచి
12 పోవును అని యెహోవాతో అనగా । యెహోవా
— ఇదిగో అతనికి కలిగిన సమస్తమును నీ వశమున
ఉన్నది; అతనికిమాత్రము ఏ హానియు చేయకూడ
దని అపవాదికి సెలవియ్యగా వాడు యెహోవా
సన్నిధినుండి బయలు వెళ్లెను.

ఒకదినమున యోబు కుమారులును కుమార్తెలును 13
తమ అన్నగారి యింట భోజనముచేయుచు ద్రాక్షా
రసము పానము చేయుచునుండగా ఒక దూత అతని
యొద్దకు వచ్చి । — ఎద్దులు నాగలి దున్నుచు గాడి 14
దెలు వాటి సమీపమున మేయుచునుండగా షెబా
యీయులు వాటిమీద పడి వాటిని పట్టుకొని పోయి ।
ఖడ్గముతో పనివారిని హతముచేసిరి. జరిగినది నీకు 15
తెలియజేయుటకు నేనొక్కడనే తప్పించుకొని వచ్చి
యున్నాననెను. । అతడు ఇంక మాటలాడుచుండగా 16
మరియొకడు వచ్చి—దేవుని అగ్ని ఆకాశమునుండి పడి
గొఱ్ఱెలను పనివారిని రగులబెట్టి కాల్చివేసెను; దాని
నీకు తెలియజేయుటకు నేనొక్కడనే తప్పించుకొని
వచ్చియున్నాననెను. । అతడు ఇంక మాటలాడు 17
చుండగా మరియొకడు వచ్చి — కల్దీయులు మూడు
సమూహములుగా వచ్చి ఒంటెలమీద పడి వాటిని
కొనిపోయి ఖడ్గముచేత పనివారిని చంపిరి; నీకు దాని
తెలియజేయుటకు నేనొక్కడనే తప్పించుకొని వచ్చి
యున్నాననెను. । అతడు మాటలాడుచుండగా వేరొ 18
కడు వచ్చి — నీ కుమారులును నీ కుమార్తెలును తమ
అన్నగారి యింట భోజనముచేయుచు ద్రాక్షారసము
పానము చేయుచునుండగా । గొప్ప సుడిగాలి అరణ్య 19
మార్గముగా వచ్చి ఆ యింటి నాలుగు మూలలను
కొట్టగా అది యౌవనస్థులమీద పడినందున వారు
చనిపోయిరి; దాని నీకు తెలియజేయుటకు నేనొక్క
డనే తప్పించుకొని వచ్చియున్నాననెను. । అప్పుడు 20
యోబు లేచి తన పై వస్త్రమును చింపుకొని తలవెండ్రు
కలు గొరిగించుకొని నేలమీద సాష్టాంగపడి నమ
స్కారముచేసి ఇట్లనెను । —నేను నా తల్లిగర్భములో 21
నుండి దిగంబరినై వచ్చితిని, దిగంబరినై అక్కడికి
తిరిగి వెళ్లెదను; యెహోవా ఇచ్చెను యెహోవా
తీసికొనిపోయెను, యెహోవా నామమునకు స్తుతి
కలుగు గాక. । ఈ సంగతులలో ఏ విషయమందును 22
యోబు ఏ పాపమును చేయలేదు, దేవుడు అన్యా
యము చేసెనని చెప్పలేదు.

దేవదూతలు యెహోవా సన్నిధిని నిలుచుటకై 2
వచ్చిన మరియొక దినము తటస్థింపగా, వారితోకూడ

[1] మూలభాషలో—దైవకుమారులు.

ౘవాది యెహోవా సన్నిధిని నిలుచుటకై వచ్చెను.।
హోవా — నీవు ఎక్కడనుండి వచ్చితివని వాని
ిగగా అపవాది — భూమిలో ఇటు అటు తిరుగు
ుచు అందులో సంచరించుచు వచ్చితినని
హోవాకు ప్రత్యుత్తరమిచ్చెను. । అందుకు
హోవా—నీవు నా సేవకుడైన యోబు సంగతి
ోచించితివా? అతడు యథార్థవర్తనుడును న్యాయ
ుడునై దేవునియందు భయభక్తులు కలిగి చెడు
ు విసర్జించినవాడు, భూమిమీద అతనివంటి
వాడును లేడు. నిష్కారణముగా అతనిని పాడు
ుటకు నీవు నన్ను ప్రేరేపించినను అతడు ఇంకను
యథార్థతను విడలక నిలకడగా నున్నాడనగా ।
వాది—చర్మము కాపాడుకొనుటకై చర్మమును, తన
ణమును కాపాడుకొనుటకై తనకు కలిగినది యా
ు నరుడిచ్చును గదా. । ఇంకొకసారి నీవు చేయి
అతని యెముకను అతని దేహమును మొత్తినయె
అతడు నీ ముఖము ఎదుటనే దూషించి నిన్ను
ిపోవును అనెను.
ందుకు యెహోవా — అతడు నీ వశమునను
ు; అతని ప్రాణము మాత్రము నీవు ముట్టవద్దని
ిచ్చెను. । కాబట్టి అపవాది యెహోవా సన్నిధి
బయలువెళ్లి, అరికాలు మొదలుకొని నడినెత్తి
బాధగల కురుపులతో యోబును మొత్తెను. ।
ు ఒళ్లు గోకుకొనుటకై చిల్ల పెంకు తీసికొని
ిడెలో కూర్చుండగా । అతని భార్య వచ్చి —
ఇంకను యథార్థతను విడలకయుందువా? దేవుని
ంచి మరణము కమ్మనెను. । అందుకతడు—మూర్ఖు
మాటలాడునట్లు నీవు మాటలాడుచున్నావు;
ు దేవునివలన మేలు అనుభవించుదుమా, కీడును
ు అనుభవింపతగదా అనెను. ఈ సంగతులలో
విషయమందును యోబు నోటిమాటతోనైనను
ము చేయలేదు.
ేమానీయుడైన ఎలీఫజు, షూహీయుడైన బిల్దదు
నామాతీయుడైన జోఫరు అను యోబు ముగ్గురు
ితులు అతనికి సంభవించిన ఆపదలన్నిటిని గూర్చి
న్నారై, అతనితో కలిసి దుఃఖించుటకును అతనిని
ుచ్చుటకును పోవలెనని ఆలోచించుకొని తమ తమ
ులను విడిచి వచ్చిరి. । వారు వచ్చి దూరముగా
బడి కన్నులెత్తి చూచినప్పుడు, అతని పోల్చలేక
వస్త్రములను చింపుకొని ఆకాశముతట్టు తలలమీద
చల్లుకొని యెలుగెత్తి యేడ్చిరి. । అతని బాధ
ధికముగా నుండెనని గ్రహించి యెవరును అత
ఒక్క మాటయైనను పలుకక రేయింబగలు
దినములు అతనితోకూడ నేలను కూర్చుండిరి.
3 తరువాత యోబు మాటలాడ మొదలుపెట్టి
పుట్టిన దినమును శపించెను.



యోబు ఈలాగు అనెను— 2
నా తల్లి గర్భద్వారములను అది మూయనందుకును 3
నా నేత్రములకు అది బాధను మరుగుచేయనందు
కును
నేను పుట్టిన దినము లేకపోవును గాక
మగపిల్ల పుట్టెనని ఒకడు చెప్పిన రాత్రి లేకపో
వును గాక.
ఆ దినము అంధకారమగును గాక 4
పైనుండి దేవుడు దాని నెంచకుండును గాక
వెలుగు దానిమీద ప్రకాశింపకుండును గాక
చీకటియు గాఢాంధకారమును మరల దానిని 5
తమ యొద్దకు తీసికొనును గాక.
మేఘము దాని కమ్మును గాక
పగలును కమ్మునట్టి అంధకారము దాని బెదరిం
చును గాక
అంధకారము ఆ రాత్రిని పట్టుకొనును గాక 6
సంవత్సరపు దినములలో నేనొకదాననని అది
హర్షింపకుండును గాక
మాసముల సంఖ్యలో అది చేరకుండును గాక.
ఆ రాత్రి యెవడును జననము కాకపోవును గాక 7
దానిలో ఏ ఉత్సాహధ్వని పుట్టకుండును గాక
దినములు అశుభదినములని చెప్పువారు దాని శపిం 8
చుదురు గాక
భుజంగమును రేపుటకు నేర్పుగలవారు దాని శపిం
చుదురు గాక.
అందులో సంధ్యవేళను ప్రకాశించు నక్షత్రము 9
లకు అంధకారము కమ్మును గాక
వెలుగుకొరకు అది యెదురుచూడగా వెలుగు లేక
పోవును గాక
అది వేకువ కనురెప్పలను చూడకుండును గాక 10
పుట్టుకలోనే నేనేల చావకపోతిని? 11
గర్భమునుండి బయలుదేరగానే నేనేల ప్రాణము
విడువకపోతిని?
మోకాళ్లమీద నన్నేల ఉంచుకొనిరి? 12
నేనేల స్తనములను కుడిచితిని?
లేనియెడల నేనిప్పుడు పండుకొని నిమ్మళించి 13
యుందును
నేను నిద్రించియుందును నాకు విశ్రాంతి కలిగి
యుందును
తమకొరకు బీడుభూములయందు భవనములు కట్టిం 14
చుకొనిన భూరాజులతోను మంత్రులతోను
నేను నిద్రించి నిమ్మళించియుందును.
బంగారము సంపాదించి తమ యిండ్లను వెండితో 15
నింపుకొనిన అధిపతులతో నిద్రించి విశ్ర
మించి యుందును.

2 దౌర్భాగ్యమునుగూర్చి యేడ్చుటవలన మూఢులు
నశించెదరు
బుద్ధిలేనివారు అసూయవలన చచ్చెదరు.
3 మూఢుడు వేరు తన్నుట నేను చూచియున్నాను
అయినను తోడనే అతని నివాసస్థలము శాపగ్రస్త
మని కనుగొంటిని.
4 అతని పిల్లలు సంరక్షణ దొరకక యుందురు
గుమ్మములో నలిగిపోవుదురు
వారిని విడిపించువాడెవడును లేడు.
5 ఆకలిగొనినవారు అతని పంటను తినివేయుదురు
ముండ్ల చెట్లలోనుండియు వారు దాని తీసికొం
దురు
బోనులు వారి ఆస్తికొరకు కాచుకొనుచున్నవి
6 శ్రమ ధూళిలోనుండి పుట్టదు
బాధ భూమిలోనుండి మొలవదు.
7 నిప్పు రవ్వలు పైకి ఎగురునట్లు నరులు శ్రమాను
భవమునకే పుట్టుచున్నారు.
8 అయితే నేను దేవుని నాశ్రయించుదును.
దేవునికే నా వ్యాజ్యమును అప్పగించుదును.
9 ఆయన పరిశోధింపజాలని మహాకార్యములను
లెక్కలేనన్ని అద్భుతక్రియలను చేయువాడు.
10 ఆయన భూమిమీద వర్షము కురిపించువాడు
పొలములమీద నీళ్లు ప్రవహింపజేయువాడు.
1 అట్లు ఆయన దీనులను ఉన్నతస్థలములలో నుం
చును
దుఃఖపడువారిని క్షేమమునకు లేవనెత్తును.
2 వంచకులు తమ పన్నాగములను నెరవేర్చ నేరకుండ
ఆయన వారి ఉపాయములను భంగపరచును
3 జ్ఞానులను వారి కృత్రిమములలోనే ఆయన పట్టు
కొనును
కపటుల ఆలోచనను తలక్రిందుచేయును
4 పగటివేళ వారికి అంధకారము తారసిల్లును
రాత్రి ఒకడు తడువులాడునట్లు మధ్యాహ్నకాల
మున వారు తడువులాడుదురు
5 బలాఢ్యుల నోటి ఖడ్గమునుండి, వారి చేతిలో
నుండి ఆయన దరిద్రులను రక్షించును.
5 కావున బీదలకు నిరీక్షణ కలుగును
మూఢత్వము నోరు మూసికొనును.
దేవుడు గద్దించు మనుష్యుడు ధన్యుడు
కాబట్టి సర్వశక్తుడగు దేవుని శిక్షను తృణీకరింప
కుము.
ఆయన గాయపరచి గాయమును కట్టును
ఆయన గాయముచేయును, ఆయన చేతులే స్వస్థ
పరచును.
ఆరు బాధలలోనుండి ఆయన నిన్ను విడిపించును
ఏడు బాధలు కలిగినను నీకు ఏ కీడును తగలదు.
క్షామకాలమున మరణమునుండియు యుద్ధమున 20
ఖడ్గబలమునుండియు ఆయన నిన్ను తప్పిం
చును.
నోటిమాటలచేత కలుగు నొప్పి నీకు తగలకుండ 21
ఆయన నిన్ను చాటుచేయును
ప్రళయము వచ్చినను నీవు దానికి భయపడవు.
పొలములోని రాళ్లతో నీవు నిబంధన చేసికొని 22
యుందువు
అడవిమృగములు నీతో సమ్మతిగా నుండును.
ప్రళయమును క్షామమును వచ్చునప్పుడు నివు 23
వాటిని నిర్లక్ష్యము చేయుదువు
అడవిమృగములకు నీవు ఏమాత్రమును భయపడవు
నీ డేరా క్షేమనివాసమని నీకు తెలిసియుండును 24
నీ యింటి వస్తువులను నీవు లెక్క చూడగా
ఏదియు పోయి యుండదు.
మరియు నీ సంతానము విస్తారమగుననియు 25
నీ కుటుంబికులు భూమిమీది పచ్చికవలె విస్తరిం
చుదురనియు నీకు తెలియును.
వాటి కాలమున ధాన్యపుపనలు ఇల్లు చేరునట్లు 26
పూర్ణవయస్సుగలవాడవై నీవు సమాధికి చేరెదవు.
మేము ఈ సంగతి పరిశోధించి చూచితిమి అది 27
ఆలాగే యున్నది.
ఈ మాట ఆలకించి నీకు నీవే తెలిసికొనుము.
దానికి యోబు ఇట్లని ప్రత్యుత్తరమిచ్చెను— 6
నా దుఃఖము చక్కగా తూచబడును గాక 2
దాని సరిచూచుటకై నాకు వచ్చిన ఆపద త్రాసులో
పెట్టబడును గాక.
ఆలాగున చేసినయెడల నా విపత్తు సముద్రముల 3
ఇసుకకన్న బరువుగా కనబడును.
అందువలన నేను నిరర్థకమైన మాటలు పలికితిని.
సర్వశక్తుడగు దేవుని అంబులు నాలో చొచ్చెను 4
వాటి విషమును నా ఆత్మ పానముచేయుచున్నది
దేవుని భీకరకార్యములు నాతో యుద్ధము చేయు
టకై పంక్తులు తీరుచున్నవి.
అడవిగాడిదె గడ్డి చూచి ఓండ్ర పెట్టునా? 5
ఎద్దు మేత చూచి రంకెవేయునా?
ఉప్పులేక యెవరైన రుచిలేనిదాని తిందురా? 6
గ్రుడ్డులోని తెలుపులో రుచికలదా?
నేను ముట్టనొల్లని వస్తువులు నాకు హేయము 7
లైనను
అవియే నాకు భోజనపదార్థములాయెను.
ఆహా నా విన్నపము నాకు నెరవేర్చబడును గాక 8
నేను కోరుదానిని దేవుడు నెరవేర్చును గాక
దేవుడు యిష్టానుసారముగా నన్ను నలుపును గాక 9
తన చేయి జాడించి ఆయన నన్ను నిర్మూలము
చేయును గాక.

16 అకాలసంభవమై కంటబడకయున్న పిండమువంటి
వాడనై లేకపోయి యుందును.
వెలుగు చూడని బిడ్డలవలె లేకపోయి యుందును.
17 అక్కడ దుర్మార్గులు ఇక శ్రమపరచరు
బలహీనులై అలసినవారు విశ్రాంతి నొందుదురు
18 బంధింపబడినవారు కార్యనియామకుల శబ్దము
వినక యేకముగా కూడి విశ్రమించుదురు
19 అల్పులేమి ఘనులేమి అందరు నచ్చటనున్నారు
దాసులు తమ యజమానుల వశమునుండి తప్పించు
కొని స్వతంత్రులై యున్నారు.
20 దుర్దశలోనున్నవారికి వెలుగియ్యబడుట ఏల?
దుఃఖాక్రాంతులైనవారికి జీవమియ్యబడుట ఏల?
21 వారు మరణము నపేక్షింతురు
దాచబడిన ధనముకొరకైనట్టు దానిని కనుగొనుటకై
వారు లోతుగా త్రవ్వుచున్నారు గాని అది
వారికి దొరకక యున్నది.
22 సమాధికి చేరినప్పుడు వారు హర్షించి బహుగా
సంతోషించెదరు.
23 మరుగుపడిన మార్గముగలవానికిని, దేవుడు చుట్టు
కంచెవేసినవానికిని వెలుగు ఇయ్యబడనేల?
24 భోజనమునకు మారుగా నాకు నిట్టూర్పు కలుగు
చున్నది
నా మొఱ్ఱలు నీళ్లవలె ప్రవహించుచున్నవి.
25 ఏది వచ్చునని నేను బహుగా భయపడితినో
అదియే నాకు సంభవించుచున్నది
నాకు భీతి పుట్టించినదే నామీదికి వచ్చుచున్నది.
26 నాకు నెమ్మది లేదు సుఖము లేదు విశ్రాంతి లేదు
శ్రమయే సంభవించుచున్నది.

4 దానికి తేమానీయుడైన ఎలీఫజు ఈలాగు ప్రత్యు
త్తరమిచ్చెను—
2 ఎవడైన ఈ సంగతి యెత్తి నీతో మాటలాడిన
యెడల నీకు వ్యసనము కలుగునా?
అయితే వాదింపక ఎవడు ఊరకొనగలడు?
3 అనేకులకు నీవు బుద్ధి నేర్పినవాడవు
బలహీనములైన చేతులను బలపరచినవాడవు.
4 నీ మాటలు తొట్రిల్లువానిని ఆదుకొని యుండెను.
క్రుంగిపోయిన మోకాళ్లుగలవానిని నీవు బలపర
చితివి.
5 అయితే ఇప్పుడు శ్రమ నీకు కలుగగా నీవు
దుఃఖాక్రాంతుడవైతివి
అది నీకు తగలగా నీవు కలవరపడుచున్నావు.
6 నీ భక్తి నీకు ధైర్యము పుట్టింపదా?
నీ యథార్థప్రవర్తన నీ నిరీక్షణకు ఆధారము కాదా?
7 జ్ఞాపకము చేసికొనుము, నిరపరాధియైన యొకడు
ఎప్పుడైన నశించెనా?
యథార్థవర్తనులు ఎక్కడనైన నిర్మూలమైరా?

నేను చూచినంతవరకు అక్రమమును దున్ని
కీడును విత్తువారు దానినే కోయుదురు.
దేవుడు ఊదగా వారు నశించుదురు
ఆయన కోపాగ్ని శ్వాసమువలన వారు లేక పోవు
దురు.
సింహగర్జనయు క్రూరసింహపు శబ్దమును నిలిచి
పోవును.
కొదమ సింహముల కోరలును విరిగిపోవును.
ఎర లేనందున ఆడుసింహము నశించును
సింహిపిల్లలు చెల్లా చెదరగొట్టబడును.
నా కొకమాట రహస్యముగా తెలుపబడెను
నా చెవిలో ఒకడు గుసగుసలాడినట్టుగా అది
నాకు వినబడెను.
గాఢనిద్ర మనుష్యులకు వచ్చు సమయమున
రాత్రి కలలవలన పుట్టు తలంపులలో అది కలిగెను.
భయమును వణకును నాకు కలిగెను
అందువలన నా యెముకలన్నియు కదిలెను.
(ఒకని) శ్వాసము నా ముఖమును కొట్టగా
నా శరీర రోమములు పులకించెను.
అది నిలువబడగా దాని రూపమును నేను గురుతు
పట్టలేక యుంటిని
ఒక రూపము నా కన్నులయెదుట నుండెను
మెల్లనైన యొక కంఠస్వరమును నేను వింటిని
ఏమనగా—దేవుని సన్నిధిని మర్త్యులు నీతిమంతు
లగుదురా?
తమ్ము సృజించినవాని సన్నిధిని నరులు పవిత్రులగు
దురా?
ఆయన తన సేవకులను నమ్ముటలేదు
తన దూతలయందు లోపములు కనుగొనుచ
న్నాడు.
జిగటమంటి యిండ్లలో నివసించువారియందు
మంటిలో పుట్టినవారియందు
చిమ్మట చితికిపోవునట్లు చితికిపోవువారియందు
మరి ఎన్నో కనుగొనును?
ఉదయము మొదలుకొని సాయంత్రమువరకు
ఉండి
వారు బద్దలైపోవుదురు
ఎన్నికలేనివారై సదాకాలము నాశనమై యుం
దురు.
వారి డేరాత్రాడు తెగవేయబడును
వారు బుద్ధికలుగకయే మృతినొందుదురు.
ఆలాగుననే జరుగుచున్నది గదా.
నీవు మొరలిడినయెడల నీకు ఉత్తరమియ్యగలవా
డెవడైన నుండునా?
పరిశుద్ధదూతలలో ఎవనితట్టు తిరుగుదువు?

10 అప్పుడు నేను పరిశుద్ధ దేవుని మాటలను ఒప్పు
కొనకుండ లేదని నేను ఆదరణ పొందుదును
మరియు నేనెంత వేదనపడుచుండినను దానిబట్టి
హర్షించుదును
11 నా బలము ఏపాటిది? నేను కనిపెట్టుకొనుట యేల?
నా అంతము ఏపాటిది? నేను తాళుకొనుట యేల?
12 నా బలము రాళ్ల బలమువంటిదా?
నా శరీరము ఇత్తడిదా?
13 నాలో త్రాణ యేమియు లేదు గదా.
శక్తి నన్ను బొత్తిగా విడిచిపోయెను గదా.
14 క్రుంగిపోయినవాడు
సర్వశక్తుడగు దేవునియందు భయభక్తులు మాను
కొనినను
స్నేహితుడు వానికి దయచూపతగును.
15 నా స్నేహితులు ఎండిన వాగువలెను
మాయమై పోవు జలప్రవాహములవలెను నమ్మ
కూడనివారైరి.
16 మంచుగడ్డలుండుటవలనను
హిమము వాటిలో పడుటవలనను
అవి మురికిగా కనబడును
17 వేసవి రాగానే అవి మాయమై పోవును
వెట్ట కలుగగానే అవి తమ స్థలమును విడిచి ఆరి
పోవును.
18 వాటి నీళ్లు ప్రవహించుదారి త్రిప్పబడును, ఏమి
యు లేకుండ అవి యినికిపోవును.
19 సమూహముగా ప్రయాణముచేయు తేమా వర్త
కులు వాటిని వెదకుదురు
షేబ వర్తకులు వాటికొరకు కనిపెట్టుదురు.
20 వారు వాటిని నమ్మినందుకు అవమానమొందుదురు
వాటి చేరువకు వచ్చి కలవరపడుదురు.
21 అటువలె మీరు లేనట్టుగానే యున్నారు
మీరు ఆపదను చూచి భయపడుచున్నారు.
22 —ఏమైన దయచేయుడని నేను మిమ్ము నడిగితినా?
మీ ఆస్తిలోనుండి నాకొరకు బహుమానమేమైన
తెమ్మని యడిగితినా?
23 పగవానిచేతిలోనుండి నన్ను విడిపింపుడని యడిగి
తినా?
బాధించువారి చేతిలోనుండి నన్ను విమోచింపు
డని యడిగితినా?
24 నాకుపదేశము చేయుడి, నేను మౌనినై యుండె
దను
ఏ విషయమందు నేను తప్పిపోతినో అది నాకు
తెలియజేయుడి.
25 యథార్థమైన మాటలు ఎంతో బలమైనవి
అయినను మీ గద్దింపు దేనికి ప్రయోజనము?
26 మాటలను గద్దించుదమని మీరనుకొందురా?

నిరాశగలవాని మాటలు గాలివంటివే గదా.
మీరు తండ్రిలేనివారిని కొనుటకై చీట్లువేయు
దురు, మీ స్నేహితులమీద బేరము సాగిం
తురు.
దయచేసి నావైపు చూడుడి, మీ ముఖము ఎదుట
నేను అబద్ధమాడుదునా?
అన్యాయము లేకుండ నా సంగతి మరల విచా
రించుడి
మరల విచారించుడి, నేను నిర్దోషినిగా కనబడు
దును.
నా నోట అన్యాయముండునా?
దుర్మార్గత రుచి నా నోరు తెలిసికొనజాలదా?
భూమిమీద నరుల కాలము యుద్ధకాలము కాదా?
వారి దినములు కూలివాని దినములవంటివి కావా?
నీడను మిగుల నపేక్షించు దాసునివలెను
కూలినిమిత్తము కనిపెట్టుకొను కూలివానివలెను
ఆశ లేకయే జరుగు నెలలను నేను చూడవలసి
వచ్చెను.
ఆయాసముతో కూడిన రాత్రులు నాకు నియమిం
పబడి యున్నవి.
నేను పండుకొనునప్పుడెల్ల
—ఎప్పుడు లేచెదనా? రాత్రి యెప్పుడు గతించు
నా? అని యనుకొందును.
తెల్లవారువరకు ఇటు అటు పొరలుచు ఆయాస
పడుదును.
నా దేహము పురుగులతోను మంటి పెల్లలతోను
కప్పబడియున్నది.
నా చర్మము మాని మరల పగులుచున్నది.
నా దినములు నేతగాని నాడెకంటెను వడిగా
గతించుచున్నవి
నిరీక్షణ లేక అవి క్షయమై పోవుచున్నవి.
నా జీవము వట్టి ఊపిరియే అని జ్ఞాపకము చేసి
కొనుడి
నా కన్ను ఇకను మేలు చూడదు.
నన్ను చూచువారి కన్ను ఇకమీదట నన్ను చూ
డదు.
నీ కన్నులు నా తట్టు చూచును గాని నేనుండక
పోదును.
మేఘము విడిపోయి అదృశ్యమగునట్లు
పాతాళమునకు దిగిపోయినవాడు మరి ఎప్పుడును
రాడు
అతడు ఇక ఎన్నడును తన యింటికి రాడు
అతని స్థలము అతని మరల నెరుగదు.
కావున నేను నా నోరు మూసికొనను
నా ఆత్మ వేదనకొలది నేను మాటలాడెదను
నా మనోవేదననుబట్టి మూల్గుచుండెదను.

నేనొక సముద్రమునా? సముద్రములోని భుజంగ
మునా?
నీవెందుకు నామీద కావలి యుంచెదవు?
—నా మంచము నాకు ఆదరణ ఇచ్చును.
నా పరుపు నా బాధకు ఉపశాంతి ఇచ్చును అని
నేననుకొనగా
నీవు స్వప్నములవలన నన్ను బెదరించెదవు
దర్శనములవలన నన్ను భయపెట్టెదవు.
కావున నేను ఉరితీయబడవలెనని కోరుచున్నాను
ఈ నా యెముకలను చూచుటకన్న మరణమొం
దుట నాకిష్టము.
అవి నాకు అసహ్యములు, నిత్యము బ్రదుకుటకు
నాకిష్టము లేదు
నా దినములు ఊపిరివలె నున్నవి నా జోలికి
రావద్దు.
మనుష్యుడు ఏపాటివాడు? అతని ఘనపరచనేల?
అతనిమీద నీవు మనస్సు నిలుపనేల?
ప్రతి పగలు నీవతని దర్శింపనేల?
ప్రతి క్షణమున నీవతని శోధింపనేల?
ఎంత కాలము నీవు నన్ను చూచుట మానకుందువు?
నేను గుటక వేయువరకు నన్ను విడిచిపెట్టవా?
నేను పాపముచేసితినా? నరులను కనిపెట్టువాడా,
నేను నీ యెడల ఏమి చేయగలను?
నాకు నేనే భారముగా నున్నాను, నీవేల గురిపెట్టి
తివి!
నీవేల నా అతిక్రమమును పరిహరింపవు? నా
దోషము నేల క్షమింపవు?
నేనిప్పుడు మంటిలో పండుకొనెదను
నీవు నన్ను జాగ్రత్తగా వెదకెదవు గాని నేను లేక
పోయెదను.
అప్పుడు షూహీయుడగు బిల్దదు ఇట్లనెను
—ఎంత కాలము నీవిట్టి మాటలాడెదవు?
నీ నోటి మాటలు సుడిగాలి వంటివాయెను.
దేవుడు న్యాయవిధిని రద్దుపరచునా?
సర్వశక్తుడగు దేవుడు న్యాయమును రద్దుపరచునా?
నీ కుమారులు ఆయన దృష్టియెదుట పాపముచేసి
రేమో
కావుననే వారు చేసిన తిరుగబాటునుబట్టి ఆయన
వారిని అప్పగించెనేమో.
నీవు జాగ్రత్తగా దేవుని వెదకినయెడల
సర్వశక్తుడగు దేవుని బతిమాలుకొనినయెడల
నీవు పవిత్రుడవై యథార్థవంతుడవైనయెడల
నిశ్చయముగా ఆయన నీయందు శ్రద్ధ నిలిపి
నీ నీతికి తగినట్టుగా నీ నివాసస్థలమును వర్ధిల్లజే
యును.
అప్పుడు నీ స్థితి మొదట కొద్దిగా నుండినను
తుదను నీవు మహాభివృద్ధి పొందుదువు.
మనము నిన్నటివారమే, మనకు ఏమియు తెలి 8
యదు
భూమిమీద మన దినములు నీడవలె నున్నవి.
మునుపటి తరమువారి సంగతులు విచారించుము 9
వారి పితరులు పరీక్షించినదానిని బాగుగా తెలిసి
కొనుము.
వారు నీకు బోధించుదురు గదా వారు నీకు తెలు 10
పుదురు గదా
వారు తమ అనుభవమునుబట్టి మాటలాడుదురు
గదా.
బురద లేకుండ జమ్ము పెరుగునా? 11
నీళ్లు లేకుండ రెల్లు మొలుచునా?
అది కోయబడకముందు బహు పచ్చగానున్నది 12
కాని యితర మొక్కలన్నిటికంటె త్వరగా
వాడిపోవును.
దేవుని మరచువారందరి గతి అట్లే ఉండును 13
భక్తిహీనుని ఆశ నిరర్థకమగును
అతని ఆశ భంగమగును. 14
అతడు ఆశ్రయించునది సాలెపురుగు పట్టే.
అతడు తన యింటిమీద ఆనుకొనగా అది నిలు 15
వదు.
అతడు గట్టిగా దాని పట్టుకొనగా అది విడిపో
వును.
ఎండకు అతడు పచ్చిపట్టి బలియును? 16
అతని తీగెలు అతని తోటమీద అల్లుకొనును.
అతని వేళ్లు గట్టుమీద చుట్టుకొనును 17
రాళ్లుగల తన నివాసమును అతడు తేరిచూచును.
దేవుడు అతని స్థలములోనుండి అతని వెళ్లవేసిన 18
యెడల
అది—నేను నిన్నెరుగను ఎప్పుడును నిన్ను చూడ
లేదనును.
ఇదే అతని సంతోషకరమైన గతికి అంతము 19
అతడున్న ధూళినుండి ఇతరులు పుట్టెదరు.
ఆలోచించుము దేవుడు యథార్థవంతుని త్రోసి 20
వేయడు.
ఆయన దుష్కార్యములు చేయువారిని నిలువ
బెట్టడు.
నిన్ను పగపట్టువారు అవమానభరితులగుదురు 21
దుష్టుల గుడారము ఇక నిలువకపోవును.
అయితే ఇంకను ఆయన నీకు నోటినిండ నవ్వు 22
కలుగజేయును.
ప్రహర్షముతో నీ పెదవులను నింపును.
అప్పుడు యోబు ఈలాగున ప్రత్యుత్తరమిచ్చెను 9
—వాస్తవమే, ఆ సంగతి అంతేయని నేనెరుగుదును. 2
నరుడు దేవుని దృష్టికి

3 వాడు ఆయనతో వ్యాజ్యమాడ గోరినయెడల
వేయి ప్రశ్నలలో ఒక్కదానికైనను వాడు ఆయ
నకు ఉత్తరమియ్యలేడు.
4 ఆయన మహా వివేకి, అధిక బలసంపన్నుడు
ఆయనతో పోరాడి తెగించి హాని నొందనివాడె
వడు?
5 వాటికి తెలియకుండ పర్వతములను తీసివేయు
వాడు ఆయనే
ఉగ్రతకలిగి వాటిని బోర్లదోయువాడు ఆయనే
6 భూమిని దాని స్థలములోనుండి కదలించువాడు
ఆయనే
దాని స్తంభములు అదరచేయువాడు ఆయనే
7 ఉదయింపవద్దని ఆయన సూర్యునికి ఆజ్ఞాపింపగా
అతడు ఉదయింపడు
ఆయన నక్షత్రములను మరుగుపరచును.
8 ఆయన ఒక్కడే ఆకాశమండలమును విశాలపరచు
వాడు
సముద్రతరంగములమీద ఆయన నడుచుచు
న్నాడు.
9 ఆయన స్వాతి మృగశీర్షము కృత్తిక అనువాటిని
దక్షిణ నక్షత్రరాసులను చేసినవాడు.
10 ఎవడును తెలిసికొనలేని మహత్తయినకార్యములను
లెక్కలేనన్ని అద్భుతక్రియలను ఆయన చేయు
చున్నాడు.
11 ఇదిగో ఆయన నా సమీపమున గడచిపోవు
చున్నాడు గాని నేనాయనను కనుగొనలేను
నా చేరువను పోవుచున్నాడు గాని ఆయన నాకు
కనబడడు.
12 ఆయన పట్టుకొనిపోగా ఆయనను అడ్డగింపగల
వాడెవడు?
— నీవేమి చేయుచున్నావని ఆయనను అడుగతగిన
వాడెవడు?
13 దేవుని కోపము చల్లారదు
రాహాబు సహాయులు ఆయనకు లోబడుదురు.
14 కావున ఆయనకు ప్రత్యుత్తరమిచ్చుటకు నేనెంతటి
వాడను?
ఆయనతో వాదించుచు సరియైన మాటలు పలుకు
టకు నేనేపాటివాడను?
15 నేను నిర్దోషినై యుండినను ఆయనకు ప్రత్యుత్త
రము చెప్పజాలను
న్యాయకర్తయని నేనాయనను బతిమాలుకొన
దగును.
16 నేను మొఱ్ఱపెట్టినప్పుడు ఆయన నాకుత్తరమిచ్చి
నను
ఆయన నా మాట ఆలకించెనని నేను నమ్మజాలను.

ఆయన (ఆలకింపక) పెనుగాలిచేత నన్ను నలుగ 17
గొట్టును
నిర్నిమిత్తముగా నా గాయములను విస్తరింపజేయును.
ఆయన నన్ను ఊపిరి తీయనియ్యడు 18
చేదైనవాటిని నాకు తినిపించును.
బలవంతుల శక్తినిగూర్చి వాదము కలుగగా—నేనే 19
యున్నానని ఆయన యనును
న్యాయవిధినిగూర్చి వాదము కలుగగా — ప్రతి
వాదిగా నుండ తెగించువాడెవడని ఆయన
యనును?
నా వ్యాజ్యము న్యాయమైనను నా మాటలు నా 20
మీద నేరము మోపును
నేను యథార్థవంతుడనైనను దోషియని ఆయన
నన్ను నిరూపించును.
నేను యథార్థవంతుడనైనను నాయందు నాకిష్టము 21
లేదు
నేను నా ప్రాణము తృణీకరించుచున్నాను.
ఏమి చేసినను ఒక్కటే. 22
కావున—యథార్థవంతుల నేమి దుష్టుల నేమి భేదము
లేకుండ ఆయన అందరిని నశింపజేయుచున్నా
డని నేను వాదించుచున్నాను.
సమూలధ్వంసము ఆకస్మికముగా కలిగి నాశనము 23
చేయగా
నిర్దోషుల ఆపదను చూచి ఆయన హాస్యము
చేయును.
రాజ్యములు దుష్టులచేతికి అప్పగింపబడియున్నవి 24
వారి న్యాయాధిపతులు మంచి చెడ్డలు గుర్తింప
లేకుండ ఆయన చేయును.
ఆయన గాక ఇవి అన్నియు జరిగించువాడు మరి
ఎవడు?
పరుగుమీద పోవువానికంటె నా దినములు త్వరగా 25
గతించుచున్నవి
క్షేమము లేకయే అవి గతించిపోవుచున్నవి.
రెల్లుపడవలు దాటిపోవునట్లు అవి జరిగిపోవును 26
ఎరమీదికి విసురున దిగు పక్షిరాజువలె అవి త్వర
పడిపోవును.
—నా శ్రమను మరిచిపోయెదననియు 27
దుఃఖముఖుడనై యుండుట మాని సంతోషముగా
నుండెదననియు నేను అనుకొంటినా?
నా సమస్త బాధలకు భయపడి వణకుచున్నాను 28
నీవు నన్ను నిర్దోషినిగా ఎంచవను సంగతి నేను
నిశ్చయముగా ఎరిగియున్నాను
నన్ను దోషినిగా ఎంచవలసి వచ్చెను గదా 29
కాబట్టి నాకు ఈ వ్యర్థప్రయాసమేల?
నేను హిమముతో నన్ను కడుగుకొనినను 30
సబ్బుతో నా చేతులు కడుగుకొనినను

నీవు నన్ను గోతిలో ముంచెదవు
అప్పుడు నేను నా స్వంతవస్త్రములకే అసహ్యుడ
నగుదును.
ఆయన నావలె నరుడు కాడు
నేను ఆయనతో వ్యాజ్యమాడజాలను
మేము కలిసి న్యాయవిమర్శకు పోలేము.
మా యిద్దరిమీద చెయ్యి ఉంచదగిన మధ్యవర్తి
మాకు లేడు.
ఆయన తన దండమును నామీదనుండి తీసివేయ
వలెను
నేను భ్రమసిపోకుండ ఆయన తన భయంకర
మాహాత్మ్యమును నాకు కనుపరచకుండవలెను.
అప్పుడు ఆయనకు భయపడక నేను మాటలాడె
దను, ఏలయనగా నేను అట్టివాడను కానను
కొనుచున్నాను.

నా బ్రదుకునందు నాకు విసుకు పుట్టినది
నేను అడ్డులేకుండ అంగలార్చెదను
నా మనోవ్యాకులము కొలది నేను పలికెదను
నా మీద నేరము మోపకుండుము
నీవేల నాతో వ్యాజ్యమాడుచున్నావో నాకు
తెలియజేయుమని నేను దేవునితో చెప్పెదను.
దౌర్జన్యము చేయుట నీకు సంతోషమా?
దుష్టుల ఆలోచనమీద దయా దృష్టియుంచుట
సంతోషమా?
నీ హస్తకృత్యములను తృణీకరించుట నీకు సంతో
షమా?
నీ నేత్రములు నరుల నేత్రములవంటివా?
నరులు ఆలోచించునట్లు నీవు ఆలోచించువాడవా?
నీ జీవితకాలము నరుల జీవిత కాలమువంటిదా?
నీ ఆయుష్కాల సంవత్సరములు నరుల దినముల
వంటివా?
నేను దోషిని కాననియు
నీ చేతిలోనుండి విడిపింపగలవాడెవడును లేడనియు
నీవు ఎరిగియుండియు
నీవేల నా దోషమునుగూర్చి విచారణ చేయు
చున్నావు?
నా పాపమును ఏల వెదకుచున్నావు?
నీ హస్తములు నాకు అవయవ నిర్మాణముచేసి నన్ను
రూపించి యున్నను
నీవు నన్ను మ్రింగివేయుచున్నావు.
జిగటమన్నుగానున్న నన్ను నీవు నిర్మించితివి, ఆ
సంగతి జ్ఞాపకము చేసికొనుము
నీవు నన్ను మరల మన్నుగా చేయుదువా?
ఒకడు పాలు పోసినట్లు నీవు నన్ను పోసితివి గదా
జున్నుగడ్డ ఒకడు పేరబెట్టునట్లు నీవు నన్ను పేర
బెట్టితివి గదా.
చర్మముతోను మాంసముతోను నీవు నన్ను కప్పితివి 11
ఎముకలతోను నరములతోను నన్ను సంధించితివి.
జీవము ననుగ్రహించి నాయెడల కృప చూపితివి 12
నీ సంరక్షణచేత నా ఆత్మను కాపాడితివి.
అయినను నా దోషములనుగూర్చి నీవు నీ హృద 13
యములో ఆలోచించితివి
ఈ అభిప్రాయము నీకుండెనని నేనెరుగుదును.
నేను పాపము చేసినయెడల నీవు దాని కనిపెట్టు 14
దువు
నా దోషమునకు పరిహారము చేయకుందువు.
నేను దోషకృత్యములు చేసినయెడల నాకు బాధ 15
కలుగును
నేను నిర్దోషినైయుండినను అతిశయపడను
అవమానముతో నిండుకొని
నాకు కలిగిన బాధను తలంచుకొనుచుండెదను.
నేను సంతోషించినయెడల 16
ఎడతెగక నీ ఆశ్చర్యమైన బలమును నీవు నామీద
చూపుదువు.
సింహము వేటాడునట్లు నీవు నన్ను వేటాడుచుం
దువు
ఎడతెగక నామీదికి క్రొత్త సాక్షులను పిలిచెదవు 17
ఎడతెగక నామీద నీ ఉగ్రతను పెంచెదవు
ఎడతెగక సమూహము వెనుక సమూహమును నా
మీదికి రాజేసెదవు.
గర్భములోనుండి నీవు నన్నేల వెలికి రప్పించితివి? 18
అప్పుడే యెవరును నన్ను చూడకుండ నేను
ప్రాణము విడిచి యుండినయెడల మేలు;
అప్పుడు నేను లేనట్లే యుండియుందును 19
గర్భములోనుండి సమాధికి కొంచుపోబడి యుం
దును.
నా దినములు కొంచెమే గదా 20
తిరిగి వెలుపలికి రాజాలని దేశమునకు
అంధకారము మరణాంధకారముగల దేశమునకు 21
కటికచీకటియై గాఢాంధకారమయమైన దేశము 22
నకు
భ్రమ పుట్టించు మరణాంధకార దేశమునకు
వెలుగే చీకటిగాగల దేశమునకు నేను వెళ్లకముందు
కొంతసేపు నేను తెప్పరిల్లునట్లు
నన్ను విడిచి నా జోలికి రాకుండుము.

**అ**ప్పుడు నయమాతీయుడైన జోఫరు ఈలాగున **11**
ప్రత్యుత్తరమిచ్చెను—
ప్రవాహముగా బయలువెళ్లు మాటలకు ప్రత్యుత్త 2
రము చెప్పవలెను గదా.
వదరుబోతు వ్యాజ్యము న్యాయమని యెంచబడునా?
నీ ప్రగల్భములను విని మనుష్యులు మౌనముగా 3
నుండవలెనా?

ఎవడును నిన్ను అపహసింపకుండనే నీవు హాస్యము
చేయుదువా?
4 —నా ఉపదేశము నిర్దోషమనియు
దేవా, నీ దృష్టికి నేను పవిత్రుడననియు నీ వను
చున్నావే.
5 దేవుడు నీతో మాటలాడిన మేలు
ఆయనే నీతో వాదించిన మేలు
6 ఆయనే జ్ఞానరహస్యములు నీకు తెలియజేసిన మేలు.
అప్పుడు జ్ఞానము (నీ యోచనకు) మించినదని నీవు
తెలిసికొందువు
నీ దోషములో అధిక భాగము దేవుడు మరచి
పోయి యున్నాడని తెలిసికొనుము.
7 దేవుని గూఢాంశములను నీవు తెలిసికొనగలవా?
సర్వశక్తుడగు దేవునిగూర్చి నీకు పరిపూర్ణజ్ఞానము
కలుగునా?
8 అది ఆకాశ వీధి అంత ఉన్నతమైనది, నీవేమి
చేయుదువు?
పాతాళముకంటె లోతుగానున్నది, నీవేమి యెరుగు
దువు?
9 దాని పరిమాణము భూమికంటె అధికమైనది
దాని వెడల్పు సముద్రముకంటె అధికమైనది
10 ఆయన సంచారముచేయుచు ఒకని చెరలో వేసి
వ్యాజ్యమాడ పిలిచినప్పుడు
ఆయననడ్డగింప గలవాడెవడు?
11 పనికిమాలినవారెవరో ఆయనే యెరుగును గదా
పరిశీలనచేయకయే పాపము ఎక్కడ జరుగు
చున్నదో ఆయనే తెలిసికొనును గదా.
12 అయితే అడవిగాడిదె పిల్ల నరుడై పుట్టిననాటికి
గాని బుద్ధిహీనుడు వివేకికాడు.
13 నీవు నీ మనస్సును తిన్నగా నిలిపినయెడల
నీ చేతులు ఆయనవైపు చాపినయెడల
14 పాపము నీ చేతిలోనుండుట చూచి నీవు దాని
విడిచినయెడల
నీ గుడారములలోనుండి దుర్మార్గతను నీవు కొట్టి
వేసినయెడల
15 నిశ్చయముగా నిర్దోషివై నీవు సంతోషించెదవు
నిర్భయుడవై నీవు స్థిరపడి యుందువు.
16 నిశ్చయముగా నీ దుర్దశను నీవు మరచెదవు
దాటిపోయిన పారు నీటిని జ్ఞాపకము చేసికొను
నట్లు నీవు దానిని జ్ఞాపకము చేసికొనెదవు.
17 అప్పుడు నీ బ్రదుకు మధ్యాహ్నకాల తేజస్సు
కంటె అధికముగా ప్రకాశించును
చీకటి కమ్మినను అది అరుణోదయమువలె కాంతిగా
నుండును.
...ను ఆస్పదము కలుగును గనుక నీవు
...గా ఉందువు.
నీ యింటిని నీవు పరిశోధించి సురక్షితముగా పండు
కొందువు.
ఎవరి భయములేకుండ నీవు పండుకొందువు 19
అనేకులు నీతో విన్నపములు చేసెదరు.
దుష్టుల కనుచూపు క్షీణించిపోవును 20
వారికి ఆశ్రయమేమియు ఉండదు
ప్రాణము ఎప్పుడు విడిచెదమా అని వారు ఎదురు
చూచుచుందురు.
అప్పుడు యోబు ఈలాగు ప్రత్యుత్తరమిచ్చెను— 12
నిజముగా లోకములో మీరే జనులు 2
మీతోనే జ్ఞానము గతించి పోవును.
అయినను మీకున్నట్టు నాకును వివేచనాశక్తి కలిగి 3
యున్నది
నేను మీకంటె తక్కువజ్ఞానము కలవాడను కాను
మీరు చెప్పినవాటిని ఎరుగనివాడెవడు?
దేవునికి మొఱ్ఱపెట్టి ప్రత్యుత్తరములు పొందిన
వాడనైన నేను
నా స్నేహితునికి అపహాస్యాస్పదముగా నుండ 4
వలసి వచ్చెను.
నీతియు యథార్థతయు గలవాడు అపహాస్యాస్పద
ముగా నుండవలసి వచ్చెను.
దుర్దశ నొందినవానిని తిరస్కరించుట క్షేమము 5
గలవారు యుక్తమనుకొందురు.
కాలుజారువారికొరకు తిరస్కారము కనిపెట్టు
చున్నది.
దోపిడిగాండ్ల కాపురములు వర్ధిల్లును 6
దేవునికి కోపము పుట్టించువారు నిర్భయముగా
నుందురు
వారు తమ బాహుబలమే తమకు దేవుడనుకొం
దురు.
అయినను మృగములను విచారించుము అవి నీకు 7
బోధించును
ఆకాశపక్షులను విచారించుము అవి నీకు తెలియ
జేయును.
భూమినిగూర్చి ధ్యానించినయెడల అది నీకు బోధిం 8
చును
సముద్రములోని చేపలును నీకు దాని వివరించును.
వీటి అన్నిటినిబట్టి యోచించుకొనినయెడల 9
యెహోవా హస్తము వీటిని కలుగజేసెనని తెలిసి
కొనలేనివాడెవడు?
జీవరాసుల ప్రాణమును మనుష్యులందరి ఆత్మలును 1
ఆయన వశమున నున్నవి గదా.
అంగిలి ఆహారమును రుచి చూచునట్లు 1
చెవి మాటలను పరీక్షింపదా?
వృద్ధులయొద్ద జ్ఞానమున్నది, దీర్ఘాయువువలన వివే 1
గన కలుగుచున్నది.

జ్ఞానశౌర్యములు ఆయనయొద్ద ఉన్నవి
ఆలోచనయు వివేచనయు ఆయనకు కలవు.
ఆలోచించుము ఆయన పడగొట్టగా ఎవరును మరల
    కట్టజాలరు
ఆయన మనుష్యుని చెరలో తూసివేయగా తెరచుట ఎవరికిని సాధ్యము కాదు.
ఆలోచించుము ఆయన జలములను బిగబట్టగా అవి
    ఆరిపోవును
వాటిని ప్రవహింపనియ్యగా అవి భూమిని ముంచి
    వేయును.
బలమును జ్ఞానమును ఆయనకు స్వభావలక్షణములు
మోసపడువారును మోసపుచ్చువారును ఆయన
    వశమున నున్నారు.
ఆలోచనకర్తలను వస్త్రహీనులనుగా చేసి ఆయన
    వారిని తోడుకొని పోవును
న్యాయాధిపతులను అవివేకులనుగా కనుపరచును.
రాజుల అధికారమును ఆయన కొట్టివేయును
వారి నడుములకు గొలుసులు కట్టును.
యాజకులను వస్త్రహీనులనుగా చేసి వారిని తోడు
    కొని పోవును
స్థిరముగా నాటుకొనినవారిని ఆయన పడగొట్టును.
వాక్చాతుర్యము గలవారి పలుకును ఆయన నిరర్థ
    కము చేయును
పెద్దలను బుద్ధిలేనివారినిగా చేయును.
అధిపతులను ఆయన తిరస్కారము చేయును
బలాఢ్యుల నడికట్లను విప్పును.
చీకటిలోని రహస్యములను ఆయన బయలుపర
    చును
మరణాంధకారమును వెలుగులోకి రప్పించును
జనములను విస్తరింపజేయును నిర్మూలముజేయును
సరిహద్దులను విశాలపరచును జనములను కొని
    పోవును.
భూజనుల అధిపతుల వివేచనను ఆయన నిరర్థక
    పరచును
త్రోవలేని మహారణ్యములో వారిని తిరుగులాడ
    చేయును.
వారు వెలుగులేక చీకటిలో తడబడుచుందురు
మత్తుగొనినవాడు తూలునట్లు ఆయన వారిని
    తూలచేయును.
ఇదిగో నా కన్ను ఇదంతయు చూచెను
నా చెవి దాని విని గ్రహించియున్నది
మీకు తెలిసినది నాకును తెలిసేయున్నది
నేను మీకంటె తక్కువ జ్ఞానముగలవాడను కాను.
నేను సర్వశక్తుడగు దేవునితో మాటలాడ గోరు
    చున్నాను
దేవునితోనే వాదింప గోరుచున్నాను

మీరైతే అబద్ధములు కల్పించువారు. 4
మీరందరు పనికిమాలిన వైద్యులు.
మీరు కేవలము మౌనముగా నుండుట మేలు 5
అది మీకు జ్ఞానమని యెంచబడును.
దయచేసి నా వాదము వినుడి, నేను ఆడు వ్యా 6
    జ్యము నాలకించుడి.
దేవుని పక్షముగా మీరు అన్యాయ వాదన 7
    చేయుదురా?
ఆయనపక్షముగా మీరు మోసములు పలుకు
    దురా?
ఆయనయెడల మీరు పక్షపాతము చూపుదురా? 8
దేవుని పక్షమున మీరు వాదింతురా?
ఆయన మిమ్మును పరిశోధించుట మీకు క్షేమమా? 9
లేక ఒకడు నరులను మోసముచేయునట్లు మీరు
    ఆయనను మోసముచేయుదురా?
మీరు రహస్యముగా పక్షపాతము చూపినయెడల 10
నిశ్చయముగా ఆయన మిమ్మును గద్దించును.
ఆయన ప్రభావము మిమ్మును భయపెట్టదా? 11
ఆయన భయము మీ మీదికి రాదా?
మీ హెచ్చరిక మాటలు బూడిదె సామెతలు. 12
మీ వాదములు మంటివాదములు
నేను మాటలాడెదను నా జోలికి రాక మౌనులై 13
    యుండుడి
నామీదికి వచ్చునది ఏదో అది వచ్చుగాక.
నేనెందుకు నా ప్రాణమును ఎరగా చేసికొన 14
    వలెను?
చేసికొననుగాని ప్రాణమునకు తెగించి మాట
    లాడెదను
ఇదిగో ఆయన నన్ను చంపబోవుచున్నాడు, 15
    నేను ఆయనకొరకు కనిపెట్టుచున్నాను.
ఆయన సన్నిధిని నా ప్రవర్తన న్యాయమని రుజువు
    పరతును.
ఇదియు నాకు రక్షణార్థమైనదగును 16
భక్తిహీనుడు ఆయన సన్నిధికి రా తెగింపడు.
నా వాక్యాలమును శ్రద్ధగా ఆలకించుడి 17
నా ప్రమాణవాక్యములు మీ చెవులలో చొర
    నీయుడి.
ఆలోచించుడి నేను (నా) వ్యాజ్యమును సరిచేసి 18
    కొనియున్నాను
నేను నిర్దోషిగా కనబడుదునని నాకు తెలియును.
నాతో వ్యాజ్యమాడ చూచువాడెవడు? 19
ఎవడైన నుండినయెడల నేను నోరుమూసికొని
    ప్రాణము విడిచెదను.
ఈ రెండు పనులు మాత్రము నాకు చేయకుము 20
అప్పుడు నేను నీకు విముఖు
నీ చెయ్యి నామీద

నీ భయము నన్ను బెదరింపనీయకుము
22 అప్పుడు నీవు పిలిచిన పక్షమున నేను నీ కుత్తర
మిచ్చెదను
నేను పలికెదను నీవు నా కుత్తరమిమ్ము
23 నా దోషములెన్ని? నా పాపములెన్ని?
నా అతిక్రమమును నా పాపమును నాకు తెలియ
జేయుము.
24 నీవేల నీ ముఖమును మరుగుచేసికొంటివి?
నన్నేల నీకు పగవానిగా ఎంచుచున్నావు?
25 ఇటు అటు కొట్టుకొని పోవుచున్న ఆకును నీవు
వేధించెదవా?
ఎండిపోయిన చెత్తను తరుముదువా?
26 నీవు నాకు కఠినమైన శిక్ష విధించి యున్నావు
నా బాల్యకాలపు పాపములను నాకు స్వాస్థ్య
ముగా నీవు విధించి యున్నావు
27 బొండలలో నా కాళ్లు బిగించి యున్నావు
నా ప్రవర్తన అంతయు నీవు కనిపెట్టుచున్నావు
నా అరికాళ్లచుట్టు గిరి గీసియున్నావు
28 మురిగి క్షీణించుచున్నవానిచుట్టు
చిమ్మటకొట్టిన వస్త్రమువంటివానిచుట్టు
గిరి గీసి వానిని కనిపెట్టుచున్నావు.

14 స్త్రీ కనిన నరుడు కించిదాయుస్సుగలవాడై మిక్కిలి
బాధనొందును.
2 పువ్వు వికసించినట్లు వాడు పెరిగి కోయబడును
నీడ కనబడకపోవునట్లు వాడు నిలువక పారి
పోవును.
3 అట్టివానిమీద నీవు కనుదృష్టి యుంచియున్నావు
తీర్పు నొందుటకై నన్ను నీ యెదుటికి రప్పించి
యున్నావు.
4 పాపసహితునిలోనుండి పాపరహితుడు పుట్టగలి
గిన ఎంత మేలు?
ఆలాగున ఎవడును పుట్టనేరడు.
5 నరుల ఆయుష్కాలము పరిమితి కలది, వారి నెలల
సంఖ్య నీకు తెలిసేయున్నది.
మించజాలని వయఃపరిమాణము నీవు వారికి నియ
మించియున్నావు
6 కూలివారివలె తమకు నియమింపబడిన పనిని వారు
ముగించువరకు
వారు విశ్రమము నొందునట్లు వారివైపు చూడక
యుండుము.
7 వృక్షము నరకబడినయెడల అది తిరిగి చిగుర్చు
ననియు
దానికి లేతకొమ్మలు వేయుననియు నమ్మకము
కలదు.
8 దాని వేరు భూమిలో పాతదై పోయినను
దాని అడుగుమొద్దు మంటిలో చీకిపోయినను
నీటి వాసనమాత్రముచేత అది చిగుర్చును 9
లేత మొక్కవలె అది కొమ్మలు వేయును.
అయితే నరులు మరణమై కదలలేక పడియుందురు. 10
నరులు ప్రాణము విడిచినతరువాత వారేమై
పోవుదురు?
తటాక జలములు ఎట్లు ఇంకిపోవునో 11
నది నీరు ఎట్లు ఎండి హరించిపోవునో
ఆలాగుననే నరులు పండుకొని తిరిగి లేవరు. 12
ఆకాశము గతించిపోవువరకు వారు మేలుకొనరు.
ఎవరును వారిని నిద్ర లేపజాలరు.
నీవు పాతాళములో నన్ను దాచినయెడల ఎంతో 13
మేలు
నీ కోపము చల్లారువరకు నన్ను చాటున నుంచిన
యెడల ఎంతో మేలు
నాకు ఇంతకాలమని నీవు నియమించి తరువాత
నన్ను జ్ఞాపకము చేసికొనవలెనని నేనెంతో
కోరుచున్నాను.
మరణమైన తరువాత నరులు బ్రదుకుదురా? 14
ఆలాగుండినయెడల నాకు విడుదల కలుగువరకు
నా యుద్ధదినములన్నియు నేను కనిపెట్టియుం
దును.
ఆలాగుండినయెడల నీవు పిలిచెదవు నేను నీకు 15
ప్రత్యుత్తరమిచ్చెదను
నీ హస్తకృత్యము ఎడల నీకు ఇష్టము కలుగును.
అయితే ఇప్పుడు నీవు నా అడుగుజాడలను లెక్క 16
పెట్టుచున్నావు
నా పాపమును సహింపలేకయున్నావు
నా అతిక్రమము సంచిలో ముద్రింపబడియున్నది 17
నేను చేసిన దోషమును భద్రముగా ఉంచియు
న్నావు.
పర్వతమైనను పడిపోయి నాశనమగును 18
కొండయైనను దాని స్థానము తప్పును.
జలము రాళ్లను అరుగదీయును 19
దాని ప్రవాహములు భూమియొక్క ధూళిని
కొట్టుకొనిపోవును
నీవైతే నరుల ఆశను భంగపరచుచున్నావు.
నీవు వారిని ఎల్లప్పుడు గెలుచుచున్నావు గనుక 20
వారు గతించిపోవుదురు
నీవు వారికి ముఖవికారము కలుగజేసి వారిని వెళ్ల
గొట్టుచున్నావు.
వారి కుమారులు ఒకవేళ ఘనత వహించినను అది 21
వారికి తెలియకపోవును.
వారు ఒకవేళ అణిగిపోయినను అట్టి గతి వారికి
పట్టెనని వారు గ్రహింపకయుందురు.
తమమట్టుకు తామే శరీరమునందు నొప్పి నొందు 22
దురు

తన మట్టుకు తామే ప్రాణమునందు దుఃఖపడు
దురు.

అప్పుడు తేమానీయుడైన ఎలీఫజు ఈలాగున
ప్రత్యుత్తరమిచ్చెను—

జ్ఞానముగలవాడు నిరర్థకమైన తెలివితో ప్రత్యు
త్తరమియ్య దగునా?
తూర్పుగాలితో తన కడుపు నింపుకొన దగునా?
వ్యర్థసంభాషణలచేత వ్యాజ్యమాడ దగునా?
నిష్ప్రయోజనమైన మాటలచేత వాదింప తగునా?
నీవు భయభక్తులను వ్యర్థముచేయుచున్నావు.
దేవునిగూర్చిన ధ్యానమును హీనపరచుచున్నావు.
నీ మాటలవలన నీ పాపము తెలియబడుచున్నది.
వంచకుల పలుకులు నీవు పలుకుచున్నావు.
నేను కాదు నీ మాటలే నీ దోషమును స్థాపించు
చున్నవి
నీ పెదవులే నీ మీద సాక్ష్యము పలుకుచున్నవి.
మొదట పుట్టిన పురుషుడవు నీవేనా?
నీవు పర్వతములకు ముందుగా పుట్టినవాడవా?
నీవు దేవుని ఆలోచనసభలో చేరియున్నవాడవా?
నీవు మాత్రమే జ్ఞానవంతుడవా?
మేము ఎరుగనిది నీవేమి యెరుగుదువు?
మేము గ్రహింపనిది నీవేమి గ్రహింతువు?
నెరసిన వెండ్రుకలు గలవారును చాలా వయస్సు
మీరిన పురుషులును మాలో నున్నారు
నీ తండ్రికంటెను వారు చాల పెద్దవారు.
దేవుడు సెలవిచ్చిన ఆదరణ నీకు తేలికగా నున్నదా?
ఇట్లు నీతో మృదువుగా పలుకబడిన వాక్యము
తేలికగా నున్నదా?
నీ హృదయము ఏల క్రుంగిపోయెను?
నీ కన్నులు ఏల ఎర్రబారుచున్నవి?
దేవునిమీద నీవేల ఆగ్రహపడుచున్నావు?
నీ నోటనుండి అట్టి మాటలేల రానిచ్చుచున్నావు?
శుద్ధుడగుటకు నరుడు ఏపాటివాడు?
నిర్దోషుడగుటకు స్త్రీకి పుట్టినవాడు ఏపాటివాడు?
ఆలోచించుము ఆయన తన దూతలయందు నమ్మిక
యుంచడు.
ఆకాశ వైశాల్యము ఆయన దృష్టికి పవిత్రము
కాదు.
అట్లుండగా హేయుడును చెడినవాడును నీళ్లు
త్రాగునట్లు దుష్క్రియలు చేయువాడును మరి
అపవిత్రుడు గదా.
నా మాట ఆలకింపుము నీకు తెలియజేతును
నేను చూచినదానిని నీకు వివరించెదను.
జ్ఞానులు తమ పితరులయొద్ద నేర్చుకొని మరుగు
చేయక చెప్పిన బోధను నీకు తెలిపెదను.
అన్యులతో సహవాసము చేయక
తాము స్వాస్థ్యముగా పొందిన దేశములో నివ
సించిన జ్ఞానులు చెప్పిన బోధను నీకు తెలి
పెదను.
తన జీవితకాలమంతయు దుష్టుడు బాధనొందును 20
హింసకునికి ఏర్పడిన సంవత్సరములన్నియు వాడు
బాధనొందును.
భీకరమైన ధ్వనులు వాని చెవులలో బడును, 21
క్షేమకాలమున పాడుచేయువారు వాని
మీదికి వచ్చుదురు.
తాను చీకటిలోనుండి తిరిగి వచ్చెదనని వాడు 22
నమ్మడు
వాడు ఖడ్గమునకు ఏర్పరచబడినవాడు.
అబ్బా ఆహారమెక్కడ దొరుకునని దానికొరకు 23
తిరుగులాడును.
అంధకారదినము సమీపించుచున్నదని వానికి
తెలియును.
శ్రమయు వేదనయు వాని బెదరించును. 24
యుద్ధముచేయుటకు సిద్ధపడిన రాజు శత్రువుని
పట్టుకొనునట్లు అవి వాని పట్టుకొనును.
వాడు దేవునిమీదికి చేయి చాపును 25
సర్వశక్తుడగువానిని ధిక్కరించి మాటలాడును.
మూర్ఖుడై ఆయనను మార్కొనును 26
తన కేడెముల గుబకలతో ఆయనమీదికి పరు
గెత్తును.
వాని ముఖము క్రొవ్వు పట్టియున్నది 27
వాని చిరుప్రక్కలపైని క్రొవ్వుకండలు పెరిగి
యున్నవి.
అట్టివారు పాడైన పట్టణములలో నివసించుదురు 28
ఎవరును నివసింపకూడని యిండ్లలో
దిబ్బలు కావలసియున్న యిండ్లలో నివసించెదరు
కావున వారు భాగ్యవంతులు కాకపోదురు వారి 29
ఆస్తి నిలువదు.
వారి సస్యసంపద (పంటబరువై) నేలకు వంగదు
వారు చీకటిని తప్పించుకొనరు 30
అగ్నిజ్వాల వారి లేతకొమ్మలను దహించును
దేవుని నోటి ఊపిరిచేత వారు నాశనమగుదురు.
వారు మాయను నమ్ముకొనకుందురు గాక; వారు 31
మోసపోయినవారు
మాయయే వారికి ఫలమగును.
వారి కాలము రాకముందే అది జరుగును 32
అప్పుడే వారి కొమ్మ వాడిపోవును.
ద్రాక్షచెట్టు పిందెలు రాల్చునట్లు ఆయన వారిని 33
రాల్చును
ఒలీవచెట్టు పువ్వులు రాల్చునట్లు ఆయన వారిని
రాల్చును.
భక్తిహీనుల కుటుంబము నిస్సంతువగును. 34

లంచగొండుల గుడారములను అగ్ని కాల్చివేయును
35 వారు దుష్కార్యమును గర్భమున ధరించి పాపము
కందురు
వారి కడుపున కపటము పుట్టును.

16 అందుకు యోబు ఈలాగున ప్రత్యుత్తర
మిచ్చెను—
2 ఇట్టి మాటలు అనేకములు నేను వినియున్నాను
మీరందరు బాధకే కర్తలు గాని ఆదరణకు కర్తలు
కారు.
3 ఈ గాలిమాటలు ముగిసిపోయెనా?
నీకేమి బాధ కలుగుటచేత నాకుత్తరమిచ్చుచు
న్నావు?
4 నా స్థితిలో మీరుండినయెడల నేనును మీవలె
మాటలాడవచ్చును.
నేనును మీమీద మాటలు కల్పింపవచ్చును
మీ వైపు చూచి నా తల ఆడింపవచ్చును.
5 అయినను నేను నా నోటి మాటలతో మిమ్మును
బలపరచుదును
నా పెదవుల మాటలు మిమ్మును ఓదార్చి ఆదరిం
చును
6 నేను మాటలాడినను నా దుఃఖము చల్లారదు
నేను ఊరకుండినను నాకేమి ఉపశమనము కలు
గును?
7 ఇప్పుడు ఆయన నాకు ఆయాసము కలుగజేసి
యున్నాడు
నా బంధువర్గమంతయు నీవు పాడుచేసియు
న్నావు
8 నా దేహమంతయు నీవు పట్టుకొనియున్నావు.
ఇదికూడ నామీద సాక్ష్యముగా నున్నది
నా క్షీణత ముఖాముఖిగా సాక్ష్యమిచ్చుచున్నది.
9 ఆయన తన కోపముచేత నామీద పడి నన్ను
చీల్చెను.
ఆయన నామీద పండ్లు కొరుకుచుండెను
నాకు శత్రువై నామీద తన కన్నులు ఎఱ్ఱచేసెను.
0 జనులు నామీద తమ నోరు తెరతురు
నన్ను తిట్టి చెంపమీద కొట్టుదురు.
వారు ఏకీభవించి నామీద గుంపు కూడుదురు
1 దేవుడు నన్ను దుర్మార్గులకు అప్పగించియున్నాడు
భక్తిహీనుల వశమున నన్ను ఉంచియున్నాడు.
2 నేను నెమ్మదిగానుంటిని అయితే ఆయన నన్ను
ముక్కలు చెక్కలు చేసియున్నాడు
మెడ పట్టుకొని విదలించి నన్ను తుత్తునియలుగా
చేసియున్నాడు.
తనకు నన్ను గురిదిబ్బగా నిలిపియున్నాడు
3 ఆయన బాణములు నన్ను చుట్టుకొనుచున్నవి
కనికరములేక నా తుంట్లను పొడిచెను
నా పైత్యరసమును నేలను పారబోసెను.
కన్నముమీద కన్నము వేసి ఆయన నన్ను విరుగ 14
గొట్టెను
పరుగులెత్తి శూరునివలె నామీద పడెను.
నా చర్మముమీద నేను గోనెపట్ట కుర్చుకొంటిని 15
నా కొమ్మును ధూళితో మురికిచేసితిని.
నాచేత బలాత్కారము జరుగకపోయినను 16
నా ప్రార్థన యథార్థముగా నుండినను
ఏడ్పుచేత నా ముఖము ఎఱ్ఱబడియున్నది 17
నా కనురెప్పలమీద మరణాంధకారము నిలుచు
చున్నది.
భూమీ, నా రక్తమును కప్పివేయకుము 18
నా మొఱ్ఱకు విరామము కలుగకుండునుగాక.
ఇప్పుడు నాకు సాక్షియైనవాడు పరలోకములో 19
నున్నాడు
నా పక్షముగా సాక్ష్యము పలుకువాడు పరముందు
న్నాడు.
నా స్నేహితులు నన్ను ఎగతాళిచేయుచున్నారు. 20
నరునివిషయమై యొకడు దేవునితో వ్యాజ్య
మాడవలెననియు
నా పుత్రునివిషయమై వాని స్నేహితునితో 21
వ్యాజ్యమాడవలెననియు కోరి
నేను దేవునితట్టు దృష్టియుంచి కన్నీళ్లు ప్రవాహ
ముగా విడుచుచున్నాను.
కొద్ది సంవత్సరములు గతించిన తరువాత తిరిగి 22
రాని మార్గమున నేను వెళ్లుదును.

నా ప్రాణము సమసిపోయెను నా దినములు 17
తీరెను.
సమాధి నా నిమిత్తము సిద్ధమైయున్నది.
ఎగతాళి చేయువారు నాయొద్ద చేరియున్నారు 2
వారు పుట్టించు వివాదములు నా కన్నులకెదు
రుగా నున్నవి.
ఏర్పాటు చేయుము దయచేసి నా నిమిత్తము నీ 3
అంతట నీవే పూటపడుము
మరి యెవడు నా నిమిత్తము పూటపడును?
నీవు వారి హృదయమునకు జ్ఞానము మరుగుచేసితివి 4
కావున నీవు వారిని హెచ్చింపవు.
ఎవడు తన స్నేహితులను దోపుసొమ్ముగా ఇచ్చునో 5
వాని పిల్లల కన్నులు క్షీణించును.
ఆయన నన్ను జనులలో సామెతకాస్పదముగా 6
చేసియున్నాడు
నలుగురు నా ముఖముమీద ఉమ్మివేయుదురు.
నా కనుదృష్టి దుఃఖముచేత మందమాయెను 7
నా అవయవములన్నియు నీడవలె ఆయెను
యథార్థవంతులు దీని చూచి ఆశ్చర్యపడుదురు 8
నిర్దోషులు భక్తిహీనుల స్థితి చూచి కలవరపడుదురు.

9 అయితే నీతిమంతులు తమ మార్గమును విడువక
ప్రవర్తించెదరు
నిరపరాధులు అంతకంతకు బలము నొందుదురు.
10 మీరందరు నాయొద్దకు రండి మరల దయచేయుడి
వచ్చినగాని మీలో జ్ఞానవంతు డొక్కడైనను
నాకు కనబడడు.
11 నా దినములు గతించెను
నా యోచన నిరర్థకమాయెను
నా హృదయ వాంఛ భంగమాయెను.
12 రాత్రి పగలనియు
చీకటి కమ్ముటయే వెలుగనియు వారు వాదించు
చున్నారు.
13 ఆశ యేదైన నాకుండిన యెడల పాతాళము
నాకు ఇల్లు అని ఆశయే.
చీకటిలో నా పక్క పరచుకొనుచున్నాను
14 —నీవు నాకు తండ్రివని గోతితోను
నీవు నాకు తల్లివని చెల్లెలవని పురుగుతోను నేను
మనవి చేయుచున్నాను.
15 నాకు నిరీక్షణాధారమేది?
నా నిరీక్షణ యెవనికి కనబడును?
16 ధూళిలో విశ్రాంతి దొరకగా
అది పాతాళపు అడ్డకమ్ములయొద్దకు దిగుచున్నది.

18 అప్పుడు షూహీయుడైన బిల్దదు ఈలాగు ప్రత్యు
త్తరమిచ్చెను—
2 మాటలలో చిక్కుపరచుటకై మీ రెంతసేపు
వెదకుదురు?
మీరు ఆలోచన చేసి ముగించినయెడల మేము
మాటలాడెదము.
3 మీ దృష్టికి మృగములుగాను
మూఢులుగాను మేమెంచబడుట ఏల?
4 కోపముచేత నిన్ను నీవు చీల్చుకొనువాడా,
నీ నిమిత్తము భూమి పాడుగా చేయబడునా?
నీ నిమిత్తము కొండ దాని స్థానము తప్పునా?
5 భక్తిహీనుల దీపము ఆర్పివేయబడును
వారి అగ్నిజ్వాలలు ప్రకాశింపకపోవును.
6 వారి గుడారములో వెలుగు అంధకారమగును
వారియొద్దనున్న దీపము ఆరిపోవును
7 వారి పటుత్వముగల నడకలు అడ్డగింపబడును
వారి స్వకీయాలోచన వారిని కూల్చును.
8 వారు వాగురలమీద నడచువారు
తమ కాళ్లే వారిని వలలోనికి నడిపించును.
9 బోను వారి మడిమెను పట్టుకొనును
వల వారిని చిక్కించుకొనును.
10 వారిని చిక్కించుకొనుటకై ఉరి నేలను ఉంచబడును
వారిని పట్టుకొనుటకై త్రోవలో ఉచ్చు పెట్ట
బడును.
నలుదిక్కుల భీకరమైనవి వారికి భయము కలుగ 11
జేయును
భయములు వారిని వెంటాడి తరుమును.
వారి బలము క్షీణించిపోవును 12
వారిని కూల్చుటకు ఆపద కాచియుండును.
అది వారి దేహ అవయవములను భక్షించును 13
మరణజ్యేష్ఠుడు వారి అవయవములను భక్షించును.
వారి ఆశ్రయమైన వారి గుడారములోనుండి 14
పెరికివేయబడుదురు
మరణజ్యేష్ఠుడు వారిని భీతుల రాజునొద్దకు కొని
పోవును.
వారికి అన్యులైనవారు వారి గుడారములో నివా 15
సము చేయుదురు
వారి నివాసస్థలముమీద గంధకము చల్లబడును.
క్రింద వారి వేళ్లు ఎండిపోవును 16
పైన వారి కొమ్మలు నరకబడును.
భూమిమీద ఎవరును వారిని జ్ఞాపకము చేసికొనరు 17
మైదానమునందు ఎక్కడను వారిని ఎరిగినవారు
ఉండరు.
జనులు వారిని వెలుగులోనుండి చీకటిలోకి తోలు 18
దురు
భూలోకములోనుండి వారిని తరుముదురు.
వారి ప్రజలలో వారికి పుత్రులైనను పౌత్రులైనను 19
ఉండరు
వారు నివసించిన స్థలములో తప్పించుకొనినవాడు
ఒకడైనను ఉండడు.
పశ్చిమదిశను నివసించువారు వారిమీద పడిన 20
శిక్షను చూచి విస్మయమొందుదురు
తూర్పుదిక్కున నివసించువారు దాని చూచి దిగులు
పడుదురు.
నిశ్చయముగా భక్తిహీనుల నివాసములకు ఇట్టి గతి 21
పట్టును
దేవుని ఎరుగనివారి స్థలము ఇట్టిది.

అంతట యోబు ఈలాగున ప్రత్యుత్తరమిచ్చెను— 19
ఎన్నాళ్లు మీరు నన్ను బాధింతురు? 2
ఎన్నాళ్లు మాటలచేత నన్ను నలుగగొట్టుదురు?
పదిమారులు మీరు నన్ను నిందించితిరి 3
సిగ్గులేక మీరు నన్ను బాధించెదరు.
నేను తప్పుచేసినయెడల 4
నా తప్పు నా మీదికే వచ్చును గదా.
మిమ్మును మీరు నామీద హెచ్చించుకొందురా? 5
నా నేరము నామీద మీరు మోపుదురా?
ఆలాగైతే దేవుడు నాకు అన్యాయము చేసెననియు 6
తన వలలో నన్ను చిక్కించుకొనెననియు మీరు
తెలిసికొనుడి.

7 నామీద బలాత్కారము జరుగుచున్నదని నేను
మొఱ్ఱపెట్టుచున్నాను గాని నా మొఱ్ఱ అంగీ
కరింపబడదు
సహాయము నిమిత్తము నేను మొరలిడుచున్నాను
గాని న్యాయము దొరకదు.
8 నేను దాటలేకుండ ఆయన నా మార్గమునకు కంచె
వేసి యున్నాడు
నా త్రోవలను చీకటి చేసియున్నాడు
9 ఆయన నా ఘనతను కొట్టివేసియున్నాడు
తలమీదనుండి నా కిరీటమును తీసివేసియున్నాడు.
10 నలుదిశల ఆయన నన్ను విరుగగొట్టగా నేను
నాశనమైపోతిని
ఒకడు చెట్టును పెల్లగించినట్లు ఆయన నా నిరీ
క్షణాధారమును పెల్లగించెను.
11 ఆయన నామీద తన కోపమును రగులబెట్టెను
నన్ను తన శత్రువులలో ఒకనిగా ఎంచెను.
12 ఆయన సైనికులు ఏకముగా కూడి వచ్చిరి
వారు నామీద ముట్టడిదిబ్బలు వేసిరి
నా గుడారముచుట్టు దిగిరి.
13 ఆయన నా సోదరజనమును నాకు దూరముచేసి
యున్నాడు
నా నెళవరులు నాకు కేవలము అన్యులైరి.
14 నా బంధువులు నాయొద్దకు రాకయున్నారు
నా ప్రాణస్నేహితులు నన్ను మరచిపోయి యు
న్నారు.
15 నా యింటి దాస దాసీ జనులు నన్ను అన్యునిగా
ఎంచెదరు
నేను వారి దృష్టికి పరదేశినై యున్నాను.
16 నేను నా పనివాని పిలువగా వాడేమి పలుకకుండ
నున్నాడు
నేను వాని బతిమాలవలసి వచ్చెను.
17 నా ఊపిరి నా భార్యకు అసహ్యము
నేను కనిన కుమారులకు నా వాసన అసహ్యము.
18 చిన్నపిల్లలు సహా నన్ను తృణీకరించెదరు
నేను లేచుట చూచినయెడల బాలురు నామీద
దూషణలు పలికెదరు.
19 నా ప్రాణస్నేహితులకందరికి నేనసహ్యుడనైతిని
నేను ప్రేమించినవారు నామీద తిరుగబడియు
న్నారు.
20 నా యెముకలు నా చర్మముతోను నా మాంసము
తోను అంటుకొని యున్నవి
దంతముల అస్థిచర్మము మాత్రము నాకు మిగిలింప
బడి యున్నది.
హస్తము నన్ను మొత్తియున్నది
నామీద జాలిపడుడి నా స్నేహితులారా నామీద
జాలిపడుడి.
నా శరీరమాంసము పోవుట చాలుననుకొనక
దేవుడు నన్ను తరుమునట్లుగా మీరేల నన్ను తరు
ముదురు?
నా మాటలు వ్రాయబడవలెనని నేనెంతో కోరు 23
చున్నాను.
అవి గ్రంథములో వ్రాయబడవలెనని నేనెంతో
కోరుచున్నాను.
అవి యినుపపోగరతో బండమీద చెక్కబడి సీస 24
ముతో నింపబడి నిత్యము నిలువవలెనని
నేనెంతో కోరుచున్నాను.
నా విమోచకుడు సజీవుడనియు, తరువాత ఆయన 25
భూమిమీద నిలుచుననియు నేనెరుగుదును.
ఈలాగు నా చర్మము చీకిపోయిన తరువాత[1] శరీర 26
ముతో నేను దేవుని చూచెదను.
నామట్టుకు నేనే చూచెదను 27
మరి ఎవరును కాదు నేనే కన్నులార ఆయనను
చూచెదను
నాలో నా అంతరింద్రియములు కృశించి యున్నవి.
జరిగినదాని కారణము నాలోనే ఉన్నదనుకొని 28
మీరు—మేము వానిని ఎట్లు తరిమెదమా అని తలం
చినయెడల
మీరు ఖడ్గమునకు భయపడుడి 29
తీర్పు కలుగునని మీరు తెలిసికొనునట్లు ఉగ్రతకు
తగిన దోషములకు శిక్ష నియమింపబడును.

అప్పుడు నయమాతీయుడైన జోఫరు ఈలాగున **20**
ప్రత్యుత్తరమిచ్చెను—
ఆలాగున నీవు చెప్పినందుకు నాయందలి ఆతురత 2
తగిన ప్రత్యుత్తరము సిద్ధపరచియున్నది.
నాకు అవమానము కలుగజేయు నిందను నేను 3
విన్నందుకు
నా మనోవివేకము తగిన ప్రత్యుత్తరము సిద్ధపరచి
యున్నది.
దుష్టులకు విజయము కొద్దికాలముండును 4
భక్తిహీనులకు సంతోషము ఒక నిమిషమాత్రముం
డును.
ఆదినుండి నరులు భూమిమీద నుంచబడిన కాలము 5
మొదలుకొని
ఈలాగు జరుగుచున్నదని నీకు తెలియదా?
వారి ఘనత ఆకాశమంత యెత్తుగా పెరిగినను 6
మేఘములంత యెత్తుగా వారు తలయెత్తినను
తమ మలము నశించురీతిగా వారెన్నటికిని నుండ 7
కుండ నశించుదురు.
వారిని చూచినవారు—వారేమైరని యడుగుదురు.

1 లేక—శరీరములేనివాడనై.

8 కల యెగసిపోవునట్లు వారు గతించి కనబడక
పోవుదురు
రాత్రి స్వప్నము దాటిపోవునట్లు వారు తరిమి
వేయబడుదురు.
9 వారిని చూచిన కన్ను ఇకను వారిని చూడదు
వారి స్థలమున వారు మరి ఎప్పుడును కనబడరు.
10 వారి సంతతివారు దరిద్రుల దయను వెదకెదరు
వారి చేతులు వారి ఆస్తిని తిరిగి అప్పగించును.
11 వారి యెముకలలో యౌవనబలము నిండియుం
డును గాని
అదియు వారితోకూడ మంటిలో పండుకొనును.
12 చెడుతనము వారి నోటికి తియ్యగా నుండెను
వారు నాలుకక్రింద దాని దాచిపెట్టిరి.
13 దాని పోనియ్యక భద్రముచేసికొనిరి, నోట దాని
నుంచుకొనిరి.
14 అయినను వారి కడుపులో వారి ఆహారము పులిసి
పోవును
అది వారిలోపట నాగుపాముల విషమగును.
15 వారు ధనమును మ్రింగివేసిరి గాని యిప్పుడు
దానిని మరల కక్కివేయుదురు
వారి కడుపులోనుండి దేవుడు దాని కక్కించును.
16 వారు కట్లపాముల విషమును పీల్చుదురు
నాగుపాము నాలుక వారిని చంపును.
17 ఏరులై పారుచున్న తేనెను వెన్నపూసను చూచి
వారు సంతోషింపరు.
18 దేనికొరకు వారు ప్రయాసపడి సంపాదించిరియుం
డిరో
దానిని వారు అనుభవింపక మరల అప్పగించెదరు
వారు సంపాదించిన ఆస్తికొలది వారికి సంతోష
ముండదు.
19 వారు బీదలను ముంచి విడిచిపెట్టినవారు
వారు బలాత్కారముచేత ఒక యింటిని ఆక్ర
మించుకొనినను దానిని కట్టి పూర్తిచేయరు.
20 వారు ఎడతెగక ఆశించినవారు
తమ యిష్టవస్తువులలో ఒకదానిచేతనైనను తమ్మును
తాము రక్షించుకొనజాలరు.
21 వారిని మ్రింగివేయనిది ఒకటియు లేదు గనుక వారి
క్షేమస్థితి నిలువదు.
22 వారికి సంపాద్యము పూర్ణముగా కలిగిన సమయ
మున వారు ఇబ్బందిపడుదురు
దురవస్థలోనుండు వారందరి చెయ్యి వారిమీదికి
వచ్చును.
23 వారి కడుపు నింపుటకై
దేవుడు వారిమీద తన కోపాగ్ని కురిపించును
వారి పేగులలోనే దాని కురిపించును.
ఇనుప ఆయుధము తప్పించుకొనుటకై వారు పారి 24
పోగా
ఇత్తడివిల్లు వారి దేహములగుండ బాణములను
పోవిడుచును.
అది దేహమును చీల్చి వారి శరీరములోనుండి 25
వచ్చును
అది బయట తీయగా వారి శరీరములోనుండి
పైత్యపు తిత్తి వచ్చును, మరణభయము వారి
మీదికి వచ్చును.
వారి ధననిధులు అంధకారపూర్ణములగును 26
ఊదనక్కరలేని అగ్ని వారిని మ్రింగివేయును
వారి గుడారములో మిగిలినదానిని అది కాల్చి
వేయును.
ఆకాశము వారి దోషమును బయలుపరచును 27
భూమి వారిమీదికి లేచును.
వారి యింటికివచ్చిన ఆర్జన కనబడకపోవును 28
దేవుని కోపదినమున వారి ఆస్తి నాశనమగును.
ఇది దేవునివలన దుష్టులైన నరులకు ప్రాప్తించు 29
భాగము
దేవునివలన వారికి నియమింపబడిన స్వాస్థ్యము
ఇదే.

అప్పుడు యోబు ఈలాగున ప్రత్యుత్తరమిచ్చెను— **21**
నా మాట మీరు జాగ్రత్తగా వినుడి 2
నా మాట మీ ఆదరణ మాటకు ప్రతిగా నుండు
గాక.
నాకు సెలవిచ్చినయెడల నేను మాటలాడెదను 3
నేను మాటలాడిన తరువాత మీరు అపహాస్యము
చేయవచ్చును.
నేను మనుష్యులతో మొఱ్ఱపెట్టుకొన్నానా? లేదు 4
గనుక నేను ఏల ఆతురపడకూడదు?
నన్ను తేరిచూచి ఆశ్చర్యపడుడి 5
నోటిమీద చేయి వేసికొనుడి.
నేను దాని మనస్సునకు తెచ్చుకొనినయెడల నాకే 6
మియు తోచకున్నది
నా శరీరమునకు వణకు పుట్టుచున్నది.
భక్తిహీనులు ఏల బ్రదుకుదురు? 7
వారు వృద్ధులై బలాభివృద్ధి ఏల నొందుదురు?
వారుండగానే వారితోకూడ వారి సంతానము 8
వారు చూచుచుండగా వారి కుటుంబము స్థిరపరచ
బడుచున్నది.
వారి కుటుంబములు భయమేమియు లేక క్షేమ 9
ముగా నున్నవి
దేవుని దండము వారిమీద పడుట లేదు.
వారి గొడ్లు దాటగా తప్పక చూలు కలుగును 10
వారి ఆవులు ఈచుకపోక ఈనును.

11 వారు తమ పిల్లలను మందలు మందలుగా బయటికి పంపుదురు
వారి పిల్లలు నటనము చేయుదురు.
12 తంబుర స్వరమండలములను పట్టుకొని వాయించుదురు
సానికనాదము విని సంతోషించుదురు.
13 వారు శ్రేయస్సుకలిగి తమ దినములు గడుపుదురు
అయినను ఒక్క క్షణములోనే పాతాళమునకు దిగుదురు.
14 వారు—నీ మార్గములనుగూర్చిన జ్ఞానము మాకక్కర లేదు
నీవు మమ్మును విడిచిపొమ్మని దేవునితో చెప్పుదురు.
15 మేము ఆయనను సేవించుటకు సర్వశక్తుడగువాడెవడు?
మేము ఆయననుగూర్చి ప్రార్థనచేయుటచేత మాకేమి లాభము కలుగును?
16 వారి క్షేమము వారి చేతిలో లేదు
భక్తిహీనుల యోచన నాకు దూరముగా నుండును గాక.
17 భక్తిహీనుల దీపము ఆర్పివేయబడుట అరుదు గదా.
వారిమీదికి ఆపద వచ్చుట బహు అరుదు గదా.
18 వారు తుఫాను ఎదుట కొట్టుకొనిపోవు చెత్తవలెను
గాలి యెగరగొట్టు పొట్టువలెను ఉండునట్లు
ఆయన కోపపడి వారికి వేదనలు నియమించుట అరుదు గదా.
19 వారి పిల్లలమీద మోపుటకై దేవుడు వారి పాపమును దాచిపెట్టునేమో?
చేసినవారు దానిని అనుభవించునట్లు ఆయన వారికే ప్రతిఫలమిచ్చును గాక
20 వారు కన్నులార తమ నాశనమును చూతురు గాక
సర్వశక్తుడగు దేవుని కోపాగ్నిని వారు త్రాగుదురు గాక.
21 తమ జీవితకాలము సమాప్తమైన తరువాత
తాము పోయిన తరువాత తమ ఇంటిమీద వారికి చింత ఏమి?
22 ఎవడైనను దేవునికి జ్ఞానము నేర్పునా?
పరలోకవాసులకు ఆయన తీర్పు చేయును గదా.
23 ఒకడు తన కడవలలో పాలు నిండియుండగను
తన యెముకలలో మూలుగ బలిసియుండగను
24 సంపూర్ణ సౌఖ్యమును నెమ్మదియును కలిగి నిండు ఆయుష్యముతో మృతినొందును
25 వేరొకడు ఎన్నడును క్షేమమనుదాని నెరుగక మనోదుఃఖముగలవాడై మృతినొందును.
26 వారు ఒకనియొద్ద నొకడు మంటిలో పండుకొందురు
పురుగులు వారిద్దరిని కప్పును.
27 మీ తలంపులు నేనెరుగుదును
మీరు నామీద అన్యాయముగా పన్నుచున్న పన్నాగములు నాకు తెలిసినవి.
28 —అధిపతుల మందిరము ఎక్కడనున్నది?
భక్తిహీనులు నివసించిన గుడారము ఎక్కడ ఉన్నది అని మీరడుగుచున్నారే.
29 దేశమున సంచరించువారిని మీరడుగలేదా?
వారు తెలియజేసిన సంగతులు మీరు గురుతుపట్టలేదా?
30 అవి ఏవనగా దుర్జనులు ఆపత్కాలమందు కాపాడబడుదురు
ఉగ్రతదినమందు వారు తోడుకొనిపోబడుదురు.
31 వారి ప్రవర్తననుబట్టి వారితో ముఖాముఖిగా మాటలనగలవాడెవడు?
వారు చేసిన దానినిబట్టి వారికి ప్రతికారము చేయువాడెవడు?
32 వారు సమాధికి తేబడుదురు
సమాధి శ్రద్ధగా కావలికాయబడును
33 పల్లములోని మంటి పెల్లలు వారికి ఇంపుగానున్నవి
మనుష్యులందరు వారి వెంబడి పోవుదురు
ఆలాగుననే లెక్కలేనంతమంది వారికి ముందుగా పోయిరి.
34 మీరు చెప్పు ప్రత్యుత్తరములు నమ్మదగినవి కావు
ఇట్టి నిరర్థకమైన మాటలతో మీరేలాగు నన్ను ఓదార్చ జూచెదరు?

22 అప్పుడు తేమానీయుడైన ఎలీఫజు ఈలాగున ప్రత్యుత్తరమిచ్చెను—
2 నరులు దేవునికి ప్రయోజనకారులగుదురా? కారు;
బుద్ధిమంతులు తమమట్టుకు తామే ప్రయోజనకారులై యున్నారు.
3 నీవు నీతిమంతుడవై యుండుట సర్వశక్తుడగు దేవునికి సంతోషమా?
నీవు యథార్థవంతుడవై ప్రవర్తించుట ఆయనకు లాభకరమా?
4 ఆయనయందు భయభక్తులు కలిగియున్నందున ఆయన నిన్ను గద్దించునా?
నీ భయభక్తులనుబట్టి ఆయన నీతో వ్యాజ్యమాడునా?
5 నీ చెడుతనము గొప్పది కాదా?
నీ దోషములు మితిలేనివి కావా?
6 ఏమియు ఇయ్యకయే నీ సోదరులయొద్ద నీవు తాకట్టు పుచ్చుకొంటివి
వస్త్రహీనుల బట్టలను తీసికొంటివి
7 దప్పిచేత ఆయాసపడినవారికి నీళ్లియ్యవైతివి
ఆకలిగొనినవానికి అన్నము పెట్టకపోతివి.

8 బాహుబలముగల మనుష్యునికే భూమి ప్రాప్తించును
ఘనుడని యెంచబడినవాడు దానిలో నివసించును.
9 విధవరాండ్రను వట్టిచేతులతో పంపివేసితివి
తండ్రిలేనివారి చేతులు విరుగగొట్టితివి.
10 కావుననే బోనులు నిన్ను చుట్టుకొనుచున్నవి
ఆకస్మిక భయము నిన్ను బెదరించుచున్నది.
11 నిన్ను చిక్కించుకొన్న అంధకారమును నీవు చూచుట లేదా?
నిన్ను ముంచబోవు ప్రళయజలములను నీవు చూచుట లేదా?
12 దేవుడు ఆకాశమంత మహోన్నతుడు కాడా?
నక్షత్రముల ఔన్నత్యమును చూడుము అవి ఎంత పైగా నున్నవి?
13 —దేవునికి ఏమి తెలియును?
గాఢాంధకారములోనుండి ఆయన న్యాయము కనుగొనునా?
14 గాఢమైన మేఘములు ఆయనకు చాటుగానున్నవి, ఆయన చూడలేడు
ఆకాశములో ఆయన తిరుగుచున్నాడు అని నీవను కొనుచున్నావు.
15 పూర్వమునుండి దుష్టులు అనుసరించిన మార్గమును నీవు అనుసరించెదవా?
16 వారు అకాలముగా ఒక నిమిషములో నిర్మూలమైరి
వారి పునాదులు జలప్రవాహమువలె కొట్టుకొని పోయెను.
7 ఆయన మంచి పదార్థములతో వారి యిండ్లను నింపినను
8 —మాయొద్దనుండి తొలగిపొమ్మనియు
సర్వశక్తుడగు దేవుడు మాకు ఏమిచేయుననియు వారు దేవునితో అందురు.
భక్తిహీనుల ఆలోచన నాకు దూరమై యుండును గాక.
9 —మన విరోధులు నిశ్చయముగా నిర్మూలమైరనియు
వారి సంపదను అగ్ని కాల్చివేసెననియు పలుకుచు
0 నీతిమంతులు దాని చూచి సంతోషించుదురు
నిర్దోషులు వారిని హేళనచేయుదురు.
1 ఆయనతో సహవాసముచేసినయెడల నీకు సమాధానము కలుగును
ఆలాగున నీకు మేలు కలుగును.
2 ఆయన నోటి ఉపదేశమును అవలంబించుము
ఆయన మాటలను నీ హృదయములో ఉంచుకొనుము.
3 సర్వశక్తునియొద్దకు నీవు తిరిగినయెడల
నీ గుడారములలోనుండి దుర్మార్గమును దూరముగా తొలగించినయెడల నీవు అభివృద్ధి పొందెదవు.

మంటిలో నీ బంగారమును ఏటిరాళ్లలో ఓఫీరు 24
సువర్ణమును పారవేయుము
అప్పుడు సర్వశక్తుడు నీకు అపరంజిగాను ప్రశస్త 25
మైన వెండిగాను ఉండును.
అప్పుడు సర్వశక్తునియందు నీవు ఆనందించెదవు 26
దేవునితట్టు నీ ముఖము ఎత్తెదవు.
నీవు ఆయనకు ప్రార్థనచేయగా 27
ఆయన నీ మనవి నాలకించును
నీ మ్రొక్కుబళ్లు నీవు చెల్లించెదవు.
మరియు నీవు దేనినైన యోచనచేయగా అది నీకు 28
స్థిరపరచబడును
నీ మార్గములమీద వెలుగు ప్రకాశించును.
నీవు పడద్రోయబడినప్పుడు—మీదు చూచెదనం 29
దువు
వినయముగలవానిని ఆయన రక్షించును.
నిర్దోషికానివానినైనను ఆయన విడిపించును 30
అతడు నీ చేతుల శుద్ధివలన విడిపింపబడును.

అప్పుడు యోబు ఈలాగున ప్రత్యుత్తరమిచ్చెను— **23**
నేటివరకు నేను మొరలిడుచు తిరుగబాటు చేయు 2
చున్నాను
నేటితో చాలించుకొనలేక నేనింక మూలుగు
చున్నాను.
ఆయన నివాసస్థానమునొద్ద నేను చేరునట్లుగా 3
ఆయనను ఎక్కడ కనుగొందునో అది నాకు తెలియ
బడును గాక.
ఆయన సన్నిధిని నేను నా వ్యాజ్యమును విశద 4
పరచెదను
వాదములతో నా నోరు నింపుకొనెదను.
ఆయన నాకు ప్రత్యుత్తరముగా ఏమి పలుకునో 5
అది నేను తెలిసికొందును
ఆయన నాతో పలుకు మాటలను గ్రహించుకొం
దును.
ఆయన తన అధికబలముచేత నాతో వ్యాజ్యమా 6
డునా?
ఆయన ఆలాగు చేయక నా మనవి ఆలకించును
అప్పుడు యథార్థవంతుడు ఆయనతో వాజ్యమాడ 7
వచ్చును.
కావున నేను ఎన్నటికిని నా న్యాయాధిపతివలన
శిక్ష నొందకపోవుదును.
నేను తూర్పుదిశకు వెళ్లినను ఆయన అచ్చట లేడు 8
పడమటిదిశకు వెళ్లినను ఆయన కనబడుట లేదు
ఆయన పనులు జరిగించు ఉత్తరదిశకు పో 9
ఆయన నాకు కానవచ్చుట లేదు
దక్షిణదిశకు ఆయన తిరుగుచున
కనుగొనలేను.
నేను నడుచుమార్గము ఆయనకు

ఆయన నన్ను శోధించిన తరువాత నేను సువర్ణమువలె కనబడుదును.
11 నా పాదములు ఆయన అడుగుజాడలు విడువక నడిచినవి
నేను ఇటు అటు తొలగక ఆయన మార్గము ననుసరించితిని.
12 ఆయన పెదవుల ఆజ్ఞను నేను విడిచి తిరుగలేదు
ఆయన నోటిమాటలను నా స్వాభిప్రాయముకంటె ఎక్కువగా ఎంచితిని.
13 అయితే ఆయన ఏకమనస్సుగలవాడు ఆయనను మార్చగలవాడెవడు?
ఆయన తనకిష్టమైనది ఏదో అదే చేయును.
14 నాకు విధింపబడినదానిని ఆయన నెరవేర్చును
అట్టి పనులను ఆయన అనేకముగా జరిగించువాడై యున్నాడు.
15 కావున ఆయన సన్నిధిని నేను కలవరపడుచున్నాను
నేను ఆలోచించునప్పుడెల్ల ఆయనకు భయపడుచున్నాను.
16 దేవుడు నా హృదయమును క్రుంగజేసెను, సర్వశక్తుడే నన్ను కలవరపరచెను.
17 అంధకారము కమ్మియుండినను గాఢాంధకారము నన్ను కమ్మియుండినను
నేను నాశనముచేయబడి యుండలేదు.

24 సర్వశక్తుడగువాడు నియామక కాలములను ఎందుకు ఏర్పాటుచేయడు?
ఆయన నెరిగియున్నవారు ఆయన దినములను ఎందుచేత చూడకున్నారు!
2 సరిహద్దు రాళ్లను తీసివేయువారు కలరు
వారు అక్రమముచేసి మందలను ఆక్రమించుకొని వాటిని మేపుదురు.
3 తండ్రిలేనివారి గాడిదెను తోలివేయుదురు
విధవరాలి యెద్దును తాకట్టుగా తీసికొందురు
4 వారు మార్గములోనుండి దరిద్రులను తొలగించి వేయుదురు
దేశములోని బీదలు ఎవరికిని తెలియకుండ దాగవలసివచ్చెను.
5 అరణ్యములోని అడవిగాడిదెలు తిరుగునట్లు
వారు తమ పనిమీద బయలుదేరి వేటను వెదకుదురు
ఎడారిలో వారి పిల్లలకు ఆహారము దొరుకును
6 పొలములో వారు పశువులకు గడ్డి కోయుదురు
దుష్టుల ద్రాక్షతోటలలో పరిగ ఏరుదురు.
7 బట్టలులేక రాత్రి అంతయు పండుకొనియుందురు
చలిలో వస్త్రహీనులై పడియుందురు.
8 పర్వతములమీది జల్లులకు తడిసియుందురు
చాటులేనందున బండను కౌగలించుకొందురు.
తండ్రిలేని పిల్లను రొమ్మునుండి లాగువారు కలరు 9
వారు దరిద్రులయొద్ద తాకట్టు పుచ్చుకొందురు
దరిద్రులు వస్త్రహీనులై బట్టలులేక తిరుగులాడుదురు 10
ఆకలిగొని పనలను మోయుదురు.
వారు తమ యజమానుల గోడలలోపల నూనె గానుగలను ఆడుదురు 11
ద్రాక్ష గానుగలను త్రొక్కుచు దప్పిగలవారై యుందురు.
జనముగల పట్టణములో మూలుగుదురు 12
గాయపరచబడినవారు మొఱ్ఱపెట్టుదురు
అయినను జరుగునది అక్రమమని దేవుడు ఎంచడు.
వెలుగుమీద తిరుగబడువారు కలరు 13
వీరు దాని మార్గములను గురుతుపట్టరు
దాని త్రోవలలో నిలువరు.
తెల్లవారునప్పుడు నరహంతకుడు లేచును 14
వాడు దరిద్రులను లేమిగలవారిని చంపును
రాత్రియందు వాడు దొంగతనము చేయును.
వ్యభిచారి — ఏ కన్నైనను నన్ను చూడదనుకొని 15
తన ముఖమునకు ముసుకు వేసికొని సంజచీకటి కొరకు కనిపెట్టును.
చీకటిలో వారు కన్నము వేయుదురు 16
పగలు దాగుకొందురు
వారు వెలుగు చూడనొల్లరు
వారందరు ఉదయమును మరణాంధకారముగా 17
ఎంచుదురు.
గాఢాంధకార భయము ఎట్టిదైనది వారికి తెలిసియున్నది.
జలములమీద వారు తేలికగా కొట్టుకొని పోవు 18
దురు
వారి స్వాస్థ్యము భూమిమీద శాపగ్రస్తము
ద్రాక్షతోటల మార్గమున వారు ఇకను నడువరు.
అనావృష్టిచేతను ఉష్ణముచేతను మంచు నీళ్లు ఎగసి 19
పోవునట్లు
పాతాళము పాపముచేసినవారిని పట్టుకొనును.
కన్న గర్భము వారిని మరచును, పురుగు వారిని 20
కమ్మగా తినివేయును
వారు మరి ఎప్పుడును జ్ఞాపకములోకి రారు
వృక్షము విరిగి పడిపోవునట్లు దుర్మార్గులు పడిపోవుదురు
వారు పిల్లలు కనని గొడ్రాళ్లను బాధపెట్టుదురు 21
విధవరాండ్రకు మేలుచేయరు.
ఆయన తన బలముచేతను బలవంతులను కాపాడు 22
చున్నాడు

కొందరు ప్రాణమునుగూర్చి ఆశ విడిచినను వారు
మరల బాగుపడుదురు.
ఆయన వారికి అభయమును దయచేయును గనుక
వారు ఆధారము నొందుదురు
ఆయన వారి మార్గములమీద తన దృష్టి నుంచును
వారు హెచ్చింపబడినను
కొంతసేపటికి లేకపోవుదురు
వారు హీనస్థితిలో చొచ్చి ఇతరులందరివలె త్రోయబడుదురు, పండిన వెన్నులవలె కోయబడుదురు.
ఇప్పుడు ఈలాగు జరుగని పక్షమున నేను అబద్ధికుడనని రుజువుపరచువాడెవడు?
నా మాటలు వట్టివని దృష్టాంతపరచువాడెవడు?

5 అప్పుడు షూహీయుడైన బిల్దదు ఈలాగున ప్రత్యుత్తరమిచ్చెను—
అధికారమును భీకరత్వమును ఆయనకు తోడైయున్నవి
ఆయన తన ఉన్నతస్థలములలో సమాధానము కలుగజేయును.
ఆయన సేనలను లెక్కింప శక్యమా?
ఆయన వెలుగు ఎవరిమీదనైనను ఉదయింపకుండునా?
నరుడు దేవుని దృష్టికి నీతిమంతుడు ఎట్లు కాగలడు?
స్త్రీకి పుట్టినవాడు ఆయన దృష్టికి ఎట్లు శుద్ధుడు కాగలడు!
ఆయన దృష్టికి చంద్రుడు కాంతిగలవాడు కాడు
నక్షత్రములు పవిత్రమైనవి కావు.
మరి నిశ్చయముగా పురుగువంటి మనుష్యుడు
పురుగువంటి నరుడు ఆయన దృష్టికి పవిత్రుడు కానేరడు గదా.

6 అప్పుడు యోబు ఈలాగున ప్రత్యుత్తరమిచ్చెను—
శక్తిలేనివానికి నీవు ఎంత సహాయము చేసితివి?
బలములేని బాహువును ఎంత బాగుగా రక్షించితివి?
జ్ఞానము లేనివానికి నీవెంత చక్కగా ఆలోచన చెప్పితివి?
సంగతిని ఎంత చక్కగా వివరించితివి?
నీవు ఎవనియెదుట మాటలను ఉచ్చరించితివి?
ఎవని ఊపిరి నీలోనుండి బయలుదేరినది?
జలములక్రిందను వాటి నివాసులక్రిందను ఉండు
ప్రేతలు విలవిలలాడుదురు.
ఆయన దృష్టికి పాతాళము తెరువబడియున్నది
నాశనకూపము బట్టబయలుగా నున్నది.
శూన్యమండలముపైని ఉత్తరదిక్కుననున్న ఆకాశవిశాలమును ఆయన పరిచెను
శూన్యముపైని భూమిని వ్రేలాడచేసెను.
వాటిక్రింద మేఘములు చినిగిపోకుండ
ఆయన తన మేఘములలో నీళ్లను బంధించెను.
దానిమీద మేఘమును వ్యాపింపజేసి 9
ఆయన తన సింహాసనపు కాంతిని మరుగుపరచెను.
వెలుగు చీకటుల సరిహద్దులవరకు 10
ఆయన జలములకు హద్దు నియమించెను.
ఆయన గద్దింపగా ఆకాశవిశాల స్తంభములు విస్మయమొంది అదరును 11
తన బలమువలన ఆయన సముద్రమును రేపును 12
తన వివేకమువలన రాహాబును పగులగొట్టును.
ఆయన ఊపిరి విడువగా ఆకాశవిశాలములకు 13
అందము వచ్చును.
ఆయన హస్తము పారిపోవు మహా సర్పమును పొడిచెను.
ఇవి ఆయన కార్యములలో స్వల్పములు. 14
ఆయననుగూర్చి మనకు వినబడుచున్నది మిక్కిలి మెల్లనైన గుసగుస శబ్దముపాటిదే గదా.
గర్జనలుచేయు ఆయన మహాబలము ఎంతైనది గ్రహింపగలవాడెవడు?

యోబు ఇంకను ఉపమానరీతిగా ఇట్లనెను— 27
నా ఊపిరి యింకను నాలో పూర్ణముగా ఉండుటను బట్టియు 2
దేవుని ఆత్మ నా నాసికారంధ్రములలో ఉండుటను బట్టియు
నా న్యాయమును పోగొట్టిన దేవుని జీవముతోడు 3
నా ప్రాణమును వ్యాకులపరచిన సర్వశక్తునితోడు
నిశ్చయముగా నా పెదవులు అబద్ధము పలుకుట లేదు 4
నా నాలుక మోసము నుచ్చరించుటలేదు.
మీరు చెప్పినది న్యాయమని నేనేమాత్రమును ఒప్పుకొనను 5
మరణమగువరకు నేనెంతమాత్రమును యథార్థతను విడువను.
నా నీతిని విడువక గట్టిగా పట్టుకొందును 6
నా ప్రవర్తన అంతటి విషయములో నా హృదయము నన్ను నిందింపదు.
నాకు శత్రువులైనవారు దుష్టులుగా కనబడుదురు గాక 7
నన్నెదిరించువారు నీతిలేనివారుగా కనబడుదురు గాక.
దేవుడు వాని కొట్టివేయునప్పుడు వాని ప్రాణము తీసివేయునప్పుడు 8
భక్తిహీనునికి ఆధారమేది?
వానికి బాధ కలుగునప్పుడు 9
దేవుడు వాని మొఱ్ఱ వినునా?
వాడు సర్వశక్తునియందు ఆనందించునా? 10

వాడు అన్ని సమయములలో దేవునికి ప్రార్థన
చేయునా?
11 దేవుని హస్తమును గూర్చి నేను మీకు ఉపదేశించెదను
సర్వశక్తుడు చేయు క్రియలను నేను దాచిపెట్టను.
12 మీలో ప్రతివాడు దాని చూచియున్నాడు
మీరెందుకు కేవలము వ్యర్థమైనవాటిని భావించుచుందురు?
13 దేవునివలన భక్తిహీనులకు నియమింపబడిన భాగము ఇది.
ఇది బాధించువారు సర్వశక్తునివలన పొందు స్వాస్థ్యము
14 వారి పిల్లలు విస్తరించినయెడల అది ఖడ్గముచేత పడుటకే గదా
వారి సంతానమునకు చాలినంత ఆహారము దొరకదు.
15 వారికి మిగిలినవారు తెగులువలన చచ్చి పాతిపెట్టబడెదరు
వారి విధవరాండ్లు రోదనము చేయకుండిరి.
16 ధూళి అంత విస్తారముగా వారు వెండిని పోగుచేసినను జిగటమన్నంత విస్తారముగా వస్త్రములను సిద్ధపరచుకొనినను
17 వారు దాని సిద్ధపరచుకొనుటయే గాని నీతిమంతులు దాని కట్టుకొనెదరు
నిరపరాధులు ఆ వెండిని పంచుకొనెదరు.
18 పురుగుల గూళ్లవంటి యిండ్లు వారు కట్టుకొందురు
కావలివాడు కట్టుకొను గుడిసెవంటి యిండ్లు వారు కట్టుకొందురు.
19 వారు ధనముగలవారై పండుకొందురు గాని మరల లేవరు
కన్నులు తెరవగానే లేకపోవుదురు.
20 భయములు జలప్రవాహములవలె వారిని తరిమి పట్టుకొనును
రాత్రివేళ తుఫాను వారిని ఎత్తికొనిపోవును.
21 తూర్పుగాలి వారిని కొనిపోగా వారు సమసిపోవుదురు
అది వారి స్థలములోనుండి వారిని ఊడ్చివేయును.
22 ఏమియు కరుణ చూపకుండ
దేవుడు వారిమీద (బాణములు) వేయును
వారు ఆయన చేతిలోనుండి తప్పించుకొనగోరి ఇటు అటు పారిపోవుదురు.
23 మనుష్యులు వారిని చూచి చప్పట్లు కొట్టుదురు
వారి స్థలములోనుండి వారిని చీకొట్టి తోలివేయుదురు.

28 వెండికి గని గలదు
పుటమువేయు సువర్ణమునకు స్థలము గలదు.
ఇనుమును మంటిలోనుండి తీయుదురు
రాళ్లు కరిగించి రాగి తీయుదురు.
మనుష్యులు చీకటికి అంతము కలుగజేయుదురు
గాఢాంధకారములోను మరణాంధకారములోను ఉండు రత్నములను వెదకుచు
వారు భూమ్యంతముల పర్యంతము సంచరింతురు.
జనులు తిరుగు స్థలములకు చాల దిగువగా మనుష్యులు సొరంగము త్రవ్వుదురు
వారు పైసంచరించువారిచేత మరువబడుదురు
అచ్చట వారు మానవులకు దూరముగానుండి ఇటు అటు అల్లాడుచుందురు.
భూమిలోనుండి ఆహారము పుట్టును
దాని లోపలిభాగము అగ్నిమయమైనట్లుండును.
దాని రాళ్లు నీలరత్నములకు స్థానము
దానిలో సువర్ణమయమైన రాళ్లున్నవి.
ఆ త్రోవ యే క్రూరపక్షికైనను తెలియదు
డేగ కన్నులు దాని చూడలేదు.
గర్వముగల క్రూర జంతువులు దాని త్రొక్కలేదు.
సింహము ఆ మార్గమున నడవలేదు.
మనుష్యులు స్ఫటికమువంటి బండను పట్టుకొందురు
పర్వతములను వాటి కుదుళ్ల సహితముగా బోర్లద్రోయుదురు.
బండలలో వారు బాటలు కొట్టుదురు
వారి కన్ను అమూల్యమైన ప్రతి వస్తువును చూచును.
నీళ్లు ఓడిగిలిపోకుండ వారు నదులకు గట్లు కట్టుదురు
మరుగైయున్న వస్తువును వారు వెలుగులోకి తెప్పించుదురు.
అయితే జ్ఞానము ఎక్కడ దొరుకును?
వివేచన దొరుకు స్థలము ఎక్కడ నున్నది?
నరులు దాని విలువను ఎరుగరు
ప్రాణులున్న దేశములో అది దొరుకదు.
అగాధము—అది నాలో లేదనును
సముద్రము—నాయొద్ద లేదనును.
సువర్ణము దానికి సాటియైనది కాదు
దాని విలువకొరకై వెండి తూచరాదు.
అది ఓఫీరు బంగారమునకైనను
విలువగల గోమేధికమునకైనను
నీలమునకైనను కొనబడునది కాదు.
సువర్ణమైనను స్ఫటికమైనను దానితో సాటికావు
ప్రశస్తమైన బంగారు నగలకు ప్రతిగా అది ఇయ్యబడదు.
పగడముల పేరు స్ఫటికముల పేరు దానియెదుట ఎత్తనేకూడదు.
జ్ఞానసంపాద్యము కెంపులకన్న కోరదగినది.

కూషుదేశపు గోమేధికము దానితో సాటికాదు.
శుద్ధసువర్ణమునకు కొనబడినది కాదు.
అట్లైన జ్ఞానము ఎక్కడనుండి వచ్చును?
వివేచన దొరకు స్థలమెక్కడ నున్నది?
అది సజీవులందరి కన్నులకు మరుగై యున్నది
ఆకాశపక్షులకు మరుగుచేయబడి యున్నది.
మేము చెవులార దానిగూర్చిన వార్త వింటిమని
నాశనమును మరణమును అనును.
దేవుడు దాని మార్గమును గ్రహించును
దాని స్థలము ఆయనకే తెలియును.
ఆయన భూమ్యంతములవరకు చూచుచున్నాడు
ఆకాశము క్రింది దానినంతటిని తెలిసికొనుచు
న్నాడు.
గాలికి ఇంత బరువు ఉండవలెనని ఆయన నియ
మించినప్పుడు
ప్రమాణమునుబట్టి జలములకు ఇంత కొలతయని
ఆయన వాటిని కొలిచి చూచినప్పుడు
వర్షమునకు కట్టడ నియమించినప్పుడు
ఉరుములతో కూడిన మెరుపుకు మార్గము ఏర్పరచి
నప్పుడు
ఆయన దాని చూచి బయలుపరచెను
దానిని స్థాపనచేసి దాని పరిశోధించెను.
మరియు—యెహోవాయందలి భయభక్తులే జ్ఞాన
మనియు
దుష్టత్వము విడుచుటయే వివేకమనియు ఆయన
నరులకు సెలవిచ్చెను.

9 యోబు ఇంకొకసారి ఉపమానము ఎత్తి ఇట్ల
నెను—
పూర్వకాలమున నున్నట్లు నేనున్నయెడల ఎంతో
మేలు
దేవుడు నన్ను కాపాడుచుండిన దినములలో
ఉన్నట్లు నేనున్నయెడల ఎంతో మేలు
అప్పుడు ఆయన దీపము నా తలపైగా ప్రకా
శించెను
ఆయన తేజమువలన నేను చీకటిలో తిరుగులాడు
చుంటిని.
నా పరిపక్వదినములలో ఉండినట్లు నేనుండిన
యెడల ఎంతో మేలు
అప్పుడు దేవుని రహస్యము నా గుడారమునకు
పైగా నుండెను.
సర్వశక్తుడు ఇంకను నాకు తోడైయుండెను
నా పిల్లలు నా చుట్టునుండిరి
నేను పెట్టిన అడుగెల్ల పాలలో పడెను
బండనుండి నా నిమిత్తము నూనె ప్రవాహముగా
పారెను.
పట్టణపు గుమ్మమునకు నేను వెళ్లినప్పుడు
రాజవీధిలో నా పీఠము సిద్ధపరచుకొనినప్పుడు
యౌవనులు నన్ను చూచి దాగుకొనిరి 8
ముసలివారు లేచి నిలువబడిరి.
అధికారులు మాటలాడుట మాని నోటిమీద 9
చెయ్యి వేసికొనిరి.
ప్రధానులు మాటలాడక ఊరకొనిరి 10
వారి నాలుక వారి అంగిలికి అంటుకొనెను.
నా సంగతి చెవినిబడిన ప్రతివాడు నన్ను అదృష్ట 11
వంతునిగా ఎంచెను.
నేను కంటబడిన ప్రతివాడు నన్నుగూర్చి సాక్ష్య
మిచ్చెను.
ఏలయనగా మొఱ్ఱపెట్టిన దీనులను 12
తండ్రిలేనివారిని సహాయములేనివారిని నేను విడి
పించితిని.
నశించుటకు సిద్ధమైయున్నవారి దీవెన నామీదికి 13
వచ్చెను
విధవరాండ్ర హృదయమును సంతోషపెట్టితిని
నేను నీతిని వస్త్రముగా ధరించుకొని యుంటిని 14
గనుక అది నన్ను ధరించెను
నా న్యాయప్రవర్తన నాకు వస్త్రమును పాగాయు
ఆయెను.
గుడ్డివారికి నేను కన్నులైతిని కుంటివారికి పాదము 15
లైతిని.
దరిద్రులకు తండ్రిగా ఉంటిని 16
ఎరుగనివారి వ్యాజ్యమును నేను శ్రద్ధగా విచా
రించితిని.
దుర్మార్గుల దవడపళ్లను ఊడగొట్టితిని. 17
వారి పళ్లలోనుండి దోపుడుసొమ్మును లాగివేసితిని.
అప్పుడు నేనిట్లనుకొంటిని — నా గూటియొద్దనే 18
నేను చచ్చెదను
హంసవలె నేను దీర్ఘాయువు గలవాడనవుదును.
నా వేళ్లచుట్టు నీళ్లు వ్యాపించును 19
మంచు నా కొమ్మలమీద నిలుచును.
నాకు ఎడతెగని ఘనత కలుగును 20
నా చేతిలో నా విల్లు ఎప్పటికిని బలముగా నుం
డును.
మనుష్యులు నాకు చెవియొగ్గి నాకొరకు కాచు 21
కొనిరి
నా ఆలోచన వినవలెనని మౌనముగా ఉండిరి.
నేను మాటలాడిన తరువాత వారు మారు మాట 22
పలుకకుండిరి
గుత్తులు గుత్తులుగా నా మాటలు వారిమీద పడెను.
వర్షముకొరకు కనిపెట్టునట్లు వారు నాకొరకు కని 23
పెట్టుకొనిరి
కడవరి వానకొరకైనట్లు వారు వెడల్పుగా నోరు
తెరచుకొనిరి.

24 వారు ఆశారహితులై యుండగా వారిని దయగా
చూచి చిరునవ్వు నవ్వితిని
నా ముఖప్రకాశము లేకుండ వారేమియు చేయ
రైరి.
25 నేను వారికి పెద్దనై కూర్చుండి వారికి మార్గములను
ఏర్పరచితిని
సేనలో రాజువలెను
దుఃఖించువారిని ఓదార్చువానివలెను నేనుంటిని.

30 ఇప్పుడు నాకన్న తక్కువ వయస్సుగలవారు
నన్ను ఎగతాళి చేయుదురు
వీరి తండ్రులు నా మందలు కాయు కుక్కలతో
నుండుటకు తగనివారని నేను తలంచియుంటిని.
2 వారి చేతుల బలము నాకేమి ప్రయోజనమగును?
వారి పౌరుషము పోయినది.
3 వారు దారిద్ర్యముచేతను క్షామముచేతను శుష్కించిన
వారై
ఎడారిలో చాల దినములనుండి పాడై నిర్మానుష్య
ముగానున్న యెడారిలో ఆహారముకొరకు
వారు తిరుగులాడుదురు
4 వారు తుప్పలలోని తుత్తిచెట్లను పెరుకుదురు
తంగేడువేళ్లు వారికి ఆహారమైయున్నవి.
5 వారు నరుల మధ్యనుండి తరిమివేయబడిన వారు
దొంగను తరుముచు కేకలు వేయునట్లు మనుష్యులు
వారిని తరుముచు కేకలు వేయుదురు.
6 భయంకరమైన లోయలలోను
నేల సందులలోను బండల సందులలోను వారు
కాపురముండవలసి వచ్చెను.
7 తుప్పలలో వారు ఓండ్ర పెట్టుదురు
ముళ్లచెట్లక్రింద వారు కూడియుందురు.
8 వారు మోటువారికిని నామ ప్రతిష్ఠ లేనివారికిని
పుట్టినవారు
వారు దేశములోనుండి తరుమబడినవారు.
9 అట్టివారు ఇప్పుడు నన్నుగూర్చి పదములు పాడు
దురు
నేను వారికి సామెతకు ఆస్పదముగా నున్నాను.
10 వారు నన్ను అసహ్యించుకొందురు నా యొద్ద
నుండి దూరముగా పోవుదురు
నన్ను చూచినప్పుడు ఉమ్మివేయక మానరు
11 ఆయన నా త్రాడు విప్పి నన్ను బాధించెను
కావున వారు నాకు లోబడక కళ్లెము వదలించు
కొందురు.
12 నా కుడిప్రక్కను అల్లరిమూక లేచును
వారు నా కాళ్లను తొట్రిల్లచేయుదురు
పట్టణమునకు ముట్టడిదిబ్బ వేసినట్లు తమ నాశన
ప్రయత్నములను నామీద సాగింతురు.
13 వారు నిరాధారులైనను
నా మార్గమును పాడుచేయుదురు
నామీదికి వచ్చిన ఆపదను మరి యధికము కలుగ
జేయుదురు
గొప్ప గండిగుండ జలప్రవాహము వచ్చునట్లు 14
వారు వచ్చెదరు
ఆ వినాశములో వారు పొర్లిగింతలు పెట్టుదురు.
భీకరమైనవి నామీద పడెను 15
గాలి కొట్టివేయునట్లు వారు నా ప్రభావమును
కొట్టివేయుదురు
మేఘమువలె నా క్షేమము గతించిపోయెను.
నా ఆత్మ నాలో కరిగిపోయి యున్నది 16
ఆపద్దినములు నన్ను పట్టుకొనియున్నవి
రాత్రివేళను నా యెముకలు నాలో విరుగగొట్ట 17
బడునట్లున్నవి
నన్ను బాధించు నొప్పులు నిద్రపోవు.
మహా రోగబలముచేత నా వస్త్రము వికారమగును 18
మెడ చుట్టునుండు నా చొక్కాయివలె అది
నన్ను ఇరికించుచున్నది.
ఆయన నన్ను బురదలోకి త్రోసెను 19
నేను ధూళియు బూడిదెయునైనట్లున్నాను.
నీకు మొఱ్ఱపెట్టుచున్నాను అయితే నీవు ప్రత్యు 20
త్తరమేమియు నియ్యకున్నావు
నేను నిలుచుండగా నీవు నన్ను తేరి చూచుచు
న్నావు.
నీవు మారిపోయి నాయెడల కఠినుడవైతివి 21
నీ బాహుబలముచేత నన్ను హింసించుచున్నావు
గాలిచేత నన్ను లేవనెత్తి దానిమీద నన్ను కొట్టు 22
కొని పోజేయుచున్నావు
తుఫానుచేత నన్ను హరించివేయుచున్నావు
మరణమునకు సర్వజీవులకు నియమింపబడిన సంకేత 23
సమాజమందిరమునకు నీవు నన్ను రప్పించెదవని
నాకు తెలియును.
ఒకడు పడిపోవునెడల వాడు చెయ్యిచాపడా? 24
ఆపదలో నున్నవాడు తప్పింపవలెనని మొఱ్ఱ
పెట్టడా?
బాధలోనున్నవారి నిమిత్తము నేను ఏడవలేదా? 25
దరిద్రుల నిమిత్తము నేను దుఃఖింపలేదా?
నాకు మేలు కలుగునని నేను ఆశించుకొనగా 26
నాకు కీడు సంభవించెను
వెలుగు నిమిత్తము నేను కనిపెట్టగా చీకటి కలిగెను.
నా పేగులు మానక మండుచున్నవి 27
అపాయదినములు నన్నెదుర్కొనెను.
సూర్యుని ప్రకాశములేక వ్యాకులపడుచు నేను 28
సంచరించుచున్నాను
సమాజములో నిలువబడి మొఱ్ఱపెట్టుచున్నాను.
నేను నక్కలకు చెలికాడనైతిని 29

నిప్పుకోడికి జతకాడనైతిని.
30 నా చర్మము నల్లబడి నామీదనుండి ఊడిపోవు
చున్నది
కాకవలన నా యెముకలు కాగిపోయెను.
31 నా స్వరమండలము దుఃఖ స్వరము నిచ్చుచున్నది
నా పిల్లనగ్రోవి రోదనశబ్దము ఎత్తుచున్నది.
31 నేను నా కన్నులతో నిబంధన చేసికొంటిని
కన్యకను నేనేలాగు చూచుదును?
2 ఆలాగు చేసినయెడల పరముననున్న దేవుని ఆజ్ఞ
యేమగును?
ఉన్నతస్థలముననున్న సర్వశక్తుని స్వాస్థ్యమేమగును?
3 దుర్మార్గులకు విపత్తు సంభవించుటే గదా
పాపముచేయువారికి దురవస్థ ప్రాప్తించుటయే
గదా.
4 ఆయన నా ప్రవర్తన నెరుగును గదా
నా అడుగుజాడలనన్నిటిని లెక్కించును గదా.
5 అబద్ధికుడనై నేను తిరుగులాడినయెడల
మోసముచేయుటకై నా కాలు త్వరపడినయెడల
6 నేను యథార్థుడనై యున్నానని దేవుడు తెలిసి
కొనునట్లు
7 న్యాయమైన త్రాసులో ఆయన నన్ను తూచును
గాక.
నేను త్రోవవిడిచి నడిచినయెడల
నా మనస్సు నా కన్నులను అనుసరించి సంచరిం
చినయెడల
మాలిన్యమేమైనను నా చేతులకు తగిలినయెడల
8 నేను విత్తినదానిని వేరొకడు భుజించును గాక
నేను నాటినది పెరికివేయబడును గాక.
9 నేను హృదయమున పరస్త్రీని మోహించినయెడల
నా పొరుగువాని ద్వారమున నేను పొంచియున్న
యెడల
10 నా భార్య వేరొకని తిరుగలి విసురును గాక
ఇతరులు ఆమెను కూడుదురు గాక.
11 అది దుష్కామకార్యము
అది న్యాయాధిపతులచేత శిక్ష నొందతగిన నేరము
12 అది నాశనకూపమువరకు దహించు అగ్నిహో
త్రము
అది నా ఆదాయమంతయు నిర్మూలము చేయును.
13 నా పనివాడైనను పనికత్తెయైనను నాతో వ్యాజ్య
మాడగా
నేను వారి వ్యాజ్యమును నిర్లక్ష్యము చేసినయెడల
14 దేవుడు లేచునప్పుడు నేనేమి చేయుదును?
ఆయన విచారణచేయునప్పుడు నేను ఆయనతో
ఏమి ప్రత్యుత్తరమిత్తును?
15 గర్భమున నన్ను పుట్టించినవాడు వారినికూడ
పుట్టింపలేదా?
గర్భములో మమ్ము రూపించినవాడు ఒక్కడే
గదా.
బీదలు ఇచ్ఛయించినదానిని నేను బిగబట్టినయెడ 16
లను
విధవరాండ్లకన్నులు క్షీణింపజేసినయెడలను
తలిదండ్రులు లేనివారిని నా అన్నములో కొంచె 17
మైనను తిననియ్యక
నేను ఒంటరిగా భోజనముచేసినయెడలను
ఎవడైనను వస్త్రహీనుడై చచ్చుట నేను చూడగను 18
బీదలకు వస్త్రము లేకపోవుట నేను చూడగను
వారి దేహములు నన్ను దీవింపకపోయినయెడలను 19
వారు నా గొఱ్ఱెలబొచ్చుచేత వేడిమి పొందక
పోయినయెడలను
గుమ్మములో నాకు సహాయము దొరకునని 20
తండ్రిలేనివారిని నేను అన్యాయముచేసినయెడలను
నా భుజశల్యము దాని గూటినుండి పడును గాక 21
నా బాహువు ఎముకలోకి విరుగును గాక.
నేనాలాగు చేయలేదు, నా బాల్యము మొదలు 22
కొని దిక్కులేనివాడు తండ్రిభావముతో
నన్ను భావించి నాయొద్ద పెరిగెను.
నా తల్లి గర్భమందు పుట్టిననాటనుండి దిక్కులేని
వానికి నేను మార్గదర్శినైతిని.
దేవుని మాహాత్మ్యము ఎదుట నేను నిలువజాల 23
ననియు.
ఆయన నన్ను నిర్మూలము చేయుననియు భీతి
పుట్టెను.
సువర్ణము నాకు ఆధారమనుకొనినయెడలను 24
—నా ఆశ్రయము నీవేయని మేలిమి బంగార
ముతో నేను చెప్పినయెడలను
నా ఆస్తి గొప్పదని గాని 25
నా చేతికి విస్తారము సొత్తు దొరికెనని గాని నేను
సంతోషించినయెడలను
సూర్యుడు ప్రకాశించినప్పుడు నేను అతని నేగాని 26
చంద్రుడు మిక్కిలి కాంతికలిగి నడుచుచుండగా
అతని నేగాని చూచి
నా హృదయము రహస్యముగా ప్రేరేపింపబడి 27
(వారితట్టు చూచి) నా నోరు ముద్దుపెట్టినయెడ
లను
పరముననున్న దేవుని దృష్టికి నేను వేషధారి నవు 28
దును.
అదియు న్యాయాధిపతులచేత శిక్ష నొందతగిన
నేరమగును.
నన్ను ద్వేషించినవానికి కలిగిన నాశనమునుబట్టి 29
నేను సంతోషించినయెడలను
అతనికి కీడు కలుగుట చూచి నేను ఉల్లసించిన
యెడలను

30 నేనాలాగు చేయలేదు, అతని ప్రాణమును నేను శపించలేదు
పాపముచేయుటకు నా నోటికి నేను చోటియ్యవే లేదు.
31 — అతడు పెట్టిన భోజనము తిననివానిని, తిని తృప్తిపొందనివానిని చూపింపగలవారెవరని
నా గుడారమందు నివసించువారు పలుకనియెడలను
32 పరదేశిని వీధిలో ఉండనియ్యక
నా యింటి వీధితలుపులు తెరిచితిని గదా.
33 ఆదాము చేసినట్లు నా దోషములను దాచిపెట్టుకొని
34 మహా సమూహమునకు భయపడియు
కుటుంబముల తిరస్కారమునకు జడిసియు
నేను మౌనముగానుండి ద్వారము దాటి బయలు వెళ్లక
రొమ్ములో నా పాపమును కప్పుకొనినయెడల
(పరముననున్న దేవుని దృష్టికి నేను వేషధారి నవుదును)
35 నా మనవి వినుటకై నాకొకడు ఉండవలెనని నేనెంతో కోరుచున్నాను;
ఇదిగో నా చేవ్రాలు గురుతు.
ఇదిగో నా ప్రతివాది వ్రాసిన ఫిర్యాదు, సర్వశక్తుడు నాకుత్తరమిచ్చును గాక.
36 నిశ్చయముగా నేను నా భుజముమీద దానిని వేసికొందును
నాకు కిరీటముగా దానిని ధరించుకొందును.
37 నా అడుగుల లెక్క ఆయనకు తెలియజేసెదను, రాజువలె నేనాయనయొద్దకు వెళ్లెదను.
38 నా భూమి నామీద మొర్రపెట్టినయెడలను
దాని చాళ్లు ఏకమై యేడ్చినయెడలను
39 క్రయధనము ఇయ్యక దాని ననుభవించినయెడలను
దాని యజమానులకు ప్రాణహాని కలుగజేసినయెడలను
40 గోధుమలకు ప్రతిగా ముళ్లును
యవలకు ప్రతిగా కలుపును మొలుచును గాక.
యోబు వాక్యములు ఇంతటితో సమాప్తములాయెను.

32 యోబు తన దృష్టియందు తాను నీతిమంతుడై
యున్నాడని ఆ ముగ్గురు మనుష్యులు తెలిసికొని అత
2 నికి ప్రత్యుత్తరము చెప్పుట చాలించిరి. । అప్పుడు
రాము వంశస్థుడును బూజీయుడును బరకెయేలు
కుమారుడునగు ఎలీహు, యోబు దేవునికంటె తానే
నీతిమంతుడైనట్లు చెప్పుకొనుట చూచి అతనిమీద
3 బహుగా కోపగించెను. । మరియు యోబుయొక్క
ముగ్గురు స్నేహితులు ప్రత్యుత్తరమేమియు చెప్పకయే
యోబుమీద దోషము మోపినందుకు వారిమీద
కూడ అతడు బహుగా కోపగించెను.
వారు ఎలీహుకన్న ఎక్కువ వయస్సుగలవారు 4
గనుక అతడు యోబుతో మాటలాడవలెనని కనిపెట్టి
యుండెను. । అయితే ఎలీహు ఆ ముగ్గురు మనుష్యులు 5
ప్రత్యుత్తరమేమియు ఇయ్యకపోవుట చూచినప్పుడు
అతని కోపము రేగెను. । కావున బూజీయుడైన బరకె 6
యేలు కుమారుడగు ఎలీహు ఈలాగు మాటలాడ
సాగెను—
నేను పిన్నవయస్సుగలవాడను మీరు బహు వృద్ధులు
ఆ హేతువుచేతను నేను భయపడి నా తాత్పర్యము మీకు తెలుపుటకు తెగింపలేదు.
వృద్ధాప్యము మాటలాడదగును 7
అధిక సంఖ్యగల యేండ్లు జ్ఞానము బోధింపతగునని నేననుకొంటిని;
అయినను నరులలో ఆత్మ ఒకటి యున్నది 8
సర్వశక్తుడగు దేవుని ఊపిరి వారికి వివేచన కలుగజేయును.
వృద్ధులు మాత్రమే జ్ఞానవంతులు కారు 9
బహు వయస్సుగలవారు ఒకప్పుడు న్యాయము తెలిసినవారుకారు.
కావున నేను—నా మాట నంగీకరింపుడని మనవి చేసికొనుచున్నాను 10
నేను సహితము నా తాత్పర్యము తెలుపుదును.
ఏమి పలుకుదుమా అని మీరు యోచనచేయుచుండగా 11
నేను మీ మాటలకొరకు కనిపెట్టుకొంటిని
మీ అభిప్రాయములు చెవిని వేసికొనుటకై
మీరు చెప్పినవాటికి బహు జాగ్రత్తగా చెవి ఇచ్చితిని 12
అయితే మీలో ఎవరును యోబును ఖండింపలేదు
ఎవరును అతని మాటలకు ప్రత్యుత్తరమియ్యలేదు.
కావున—మాకు జ్ఞానము లభించినదనియు 13
దేవుడే గాని నరులు అతని జయింపనేరరనియు మీరు పలుకకూడదు.
అతడు నాతో వాదమాడలేదు 14
మీరు చెప్పిన మాటలనుబట్టి నేనతనికి ప్రత్యుత్తరమియ్యను.
వారు ఆశ్చర్యపడి ఇకను ఉత్తరమియ్యకయున్నారు 15
పలుకుటకు వారికి మాటయొకటియు లేదు.
కాగా వారికనేమియు ప్రత్యుత్తరము చెప్పక 16
యున్నారు

వారు మాటలాడక పోవుట చూచి నేను ఊర
  కుందునా?
నేను ఇయ్యవలసిన ప్రత్యుత్తరము నేనిచ్చెదను
నేనును నా తాత్పర్యము తెలిపెదను.
నా మనస్సునిండ మాటలున్నవి
నా అంతరంగమునను్న ఆత్మ నన్ను బలవంతము
  చేయుచున్నది.
నా మనస్సు తెరువబడని ద్రాక్షారసపు తిత్తివలె
  నున్నది
క్రొత్త తిత్తులవలె అది పగిలిపోవుటకు సిద్ధముగా
  నున్నది.
నేను మాటలాడి ఆయాసము తీర్చుకొనెదను
నా పెదవులు తెరచి నేను ప్రత్యుత్తరమిచ్చెదను.
మీరు దయచేసి వినుడి నేను ఎవరియెడలను పక్ష
  పాతినై యుండను.
నేను ఎవరికిని ముఖస్తుతికై బిరుదులు పెట్టను
ముఖస్తుతి చేయుట నా చేత కాదు
అట్లు చేసినయెడల నన్ను సృజించినవాడు నన్ను
  శీఘ్రముగా నిర్మూలము చేయును.
3 యోబూ, దయచేసి నా వాదము నాలకించుము
నా మాటలన్నియు చెవిని బెట్టుము.
ఇదిగో నేను మాటలాడ నారంభించితిని
నా నోట నా నాలుక ఆడుచున్నది.
నా మాటలు నా హృదయ యథార్థతను తెలుపు
  చున్నవి
నా పెదవులు జ్ఞానమును యథార్థముగా పలుకును.
దేవుని ఆత్మ నన్ను సృజించెను
సర్వశక్తునియొక్క శ్వాసము నాకు జీవమిచ్చెను.
నీ చేతనైనయెడల నాకుత్తరమిమ్ము
నా యెదుట నీ వాదము సిద్ధపరచుకొనుము వ్యాజ్య
  మాడుము.
దేవునియెడల నేనును నీవంటివాడను
నేనును జిగటమంటితో చేయబడినవాడనే
నావలని భయము నిన్ను బెదరించదు
నా చెయ్యి నీమీద బరువుగా నుండదు.
నిశ్చయముగా నీ పలుకులు నా చెవినిబడెను
నీ మాటల ధ్వని నాకు వినబడెను.
ఏమనగా—నేను దోషములేని పవిత్రుడను
మాలిన్యములేని పాపరహితుడను.
ఆయన నామీద తప్పులు పట్టించుటకు సమయము
  వెదకుచున్నాడు
నన్ను తనకు పగవానిగా భావించుచున్నాడు.
ఆయన నా కాళ్లను బొండలో బిగించుచున్నాడు
నా త్రోవలన్నిటిని కనిపెట్టుచున్నాడని (నీ వను
  చున్నావు.)
ఈ విషయములో నీవు న్యాయము కనిపెట్టలేదు
నేను నీకు ప్రత్యుత్తరము చెప్పెదను.
తన క్రియలలో దేనిగూర్చియు ఆయన ప్రత్యు 13
  త్తరమియ్యడు
దేవుడు నరులశక్తికి మించినవాడు, నీవేల ఆయ
  నతో పోరాడుదువు?
దేవుడు ఒక్కమారే పలుకును 14
రెండు మారులు పలుకును
అయితే మనుష్యులు అది కనిపెట్టరు
మంచముమీద కునుకు సమయమున గాఢనిద్ర 15
  పట్టినప్పుడు
కలలో రాత్రి కలుగు స్వప్నములలో
—నరులు గర్విష్ఠులు కాకుండచేయునట్లు 16
తాము తలచిన కార్యము వారు మానుకొనచేయు 18
  నట్లు
గోతికి పోకుండ వారిని కాపాడునట్లు
కత్తివలన నశింపకుండ వారి ప్రాణమును తప్పించు
  నట్లు
ఆయన వారి చెవులను తెరువచేయును
వారికొరకు ఉపదేశము సిద్ధపరచును.
వ్యాధిచేత మంచమెక్కుటవలనను 19
ఒకని యెముకలలో ఎడతెగని నొప్పులు కలుగుట
  వలనను వాడు శిక్షింపబడును.
రొట్టెయు రుచిగల ఆహారమును వానికసహ్య 20
  మగును
వాని శరీరమాంసము క్షీణించిపోయి వికారమగును 21
బయటికి కనబడకుండిన యెముకలు పైకి పొడుచు
  కొని వచ్చును.
వాడు సమాధికి సమీపించును 22
వాని ప్రాణము సంహారకులయొద్దకు సమీపిం
  చును.
నరులకు యుక్తమైనది ఏదో దానిని వానికి తెలియ 23
  జేయుటకు
వేలాది దూతలలో ఘనుడగు ఒకడు వానికి మధ్య
  వర్తియై యుండినయెడల
దేవుడు వానియందు కరుణ జూపి— 24
పాతాళములోకి దిగి వెళ్లకుండ వానిని విడిపింపుము
ప్రాయశ్చిత్తము నాకు దొరికెనని సెలవిచ్చును.
అప్పుడు వాని మాంసము బాలురమాంసముకన్న 25
  ఆరోగ్యముగా నుండును.
వానికి తన చిన్ననాటిస్థితి తిరిగి కలుగును.
వాడు దేవుని బతిమాలుకొనినయెడల
ఆయన వాని కటాక్షించును
కావున వాడు ఆయన ముఖము చూచి [illegible]
  చును.
ఈలాగున నిర్దోషత్వము ఆ[illegible]
  చేయును.

27 అప్పుడు వాడు మనుష్యులయెదుట సంతోషించుచు ఇట్లని పలుకును—
యథార్థమైనదానిని వ్యత్యాసపరచి నేను పాపము చేసితిని
అయినను దానికి తగిన ప్రతికారము నాకు చేయబడలేదు
28 కూపములోనికి దిగిపోకుండ నా ప్రాణమును ఆయన విమోచించియున్నాడు
నా జీవము వెలుగును చూచుచున్నది.
29 ఆలోచించుము, నరులు సజీవులకుండు వెలుగుచేత
30 వెలిగింపబడునట్లు
కూపములోనుండి వారిని మరల రప్పింపవలెనని
మానవులకొరకు రెండు సారులు మూడు సారులు
ఈ క్రియలన్నిటిని దేవుడు చేయువాడై యున్నాడు.
31 యోబూ, చెవిని బెట్టుము నా మాట ఆలకింపుము
మౌనముగా నుండుము నేను మాటలాడెదను.
32 చెప్పవలసిన మాట యేదైన నీకు కలిగినయెడల నాతో ప్రత్యుత్తరము చెప్పుము
మాటలాడుము, నీవు నీతిమంతుడవని స్థాపింప గోరుచున్నాను.
33 మాట యేమియు లేనియెడల నీవు నా మాట ఆలకింపుము
మౌనముగా నుండుము, నేను నీకు జ్ఞానము బోధించెదను.

34 అప్పుడు ఎలీహు మరల ఈలాగు చెప్పసాగెను
2 —జ్ఞానులారా, నా మాటలు వినుడి
అనుభవశాలులారా, నాకు చెవియొగ్గుడి
3 అంగిలి ఆహారమును రుచి చూచునట్లు
చెవి మాటలను పరీక్షించును.
4 న్యాయమైనదానిని విచారించి చూతము రండి
మేలైనదేదో మనంతట మనము విచారించి తెలిసికొందము రండి.
5 —నేను నీతిమంతుడను
దేవుడు నా పక్షన్యాయము తప్పెను
6 న్యాయవంతుడనై యుండియు నేను అబద్ధికునిగా ఎంచబడుచున్నాను
నేను తిరుగబాటు చేయకపోయినను నాకు మానజాలని గాయము కలిగెనని యోబు అనుచున్నాడు.
7 యోబువంటి మానవుడెవడు?
అతడు మంచి నీళ్లవలె తిరస్కారమును పానము చేయుచున్నాడు.
8 అతడు చెడుతనము చేయువారికి చెలికాడాయెను
భక్తిహీనులకు సహవాసి ఆయెను.
9 —నరులు దేవునితో సహవాసము చేయుట
వారి కేమాత్రమును ప్రయోజనకరము కాదని అతడు చెప్పుకొనుచున్నాడు.
విజ్ఞానముగల మనుష్యులారా, నా మాట ఆలకించుడి 10
దేవుడు అన్యాయము చేయుట అసంభవము
సర్వశక్తుడు దుష్కార్యము చేయుట అసంభవము.
నరుల క్రియలకు తగినట్టుగా ఫలము ఆయన వారి కిచ్చును 11
అందరికి వారి వారి మార్గములనుబట్టి వారికి ఫలమిచ్చును.
దేవుడు ఏమాత్రమును దుష్కార్యము చేయడు 12
సర్వశక్తుడు న్యాయము తప్పడు.
ఎవడైన భూమిని ఆయనకు అప్పగించిపెట్టెనా? 13
ఎవడైన సర్వప్రపంచ భారమును ఆయనకప్పగించెనా?
ఆయన తన మనస్సు తనమీదనే ఉంచుకొనినయెడల 14
తన శ్వాసనిశ్వాసములను తనయొద్దకు తిరిగి తీసికొనినయెడల
శరీరులందరు ఏకముగా నశించెదరు 15
నరులు మరల ధూళియై పోవుదురు.
కావున దీని విని వివేచింపుము 16
నా మాటల నాలకింపుము.
న్యాయమును ద్వేషించువాడు లోకము నేలునా? 17
న్యాయసంపన్నుడైనవానిమీద నేరము మోపుదువా?
నీవు పనికిమాలినవాడవని రాజుతోనైనను 18
మీరు దుష్టులని ప్రధానులతోనైనను అనవచ్చునా?
రాజులయెడల పక్షపాతము చూపనివానితోను 19
బీదలకన్న ధనముగలవారిని ఎక్కువగా చూడనివానితోను ఆలాగు పలుకుట తగునా?
వారందరు ఆయన నిర్మించినవారు కారా?
వారు నిమిషములో చనిపోవుదురు 20
మధ్యరాత్రి ప్రజలు కల్లోలమునొంది నాశనమగుదురు
బలవంతులు దైవికముగా కొంచుపోబడెదరు.
ఆయన దృష్టి నరుల మార్గములమీద నుంచబడియున్నది 21
ఆయన వారి నడకలన్నియు కనిపెట్టి చూచుచున్నాడు.
దుష్క్రియలు చేయువారు దాగుకొనుటకు 22
చీకటియైనను మరణాంధకారమైనను లేదు.
ఒకడు న్యాయవిమర్శలోనికి రాకముందు 23
బహుకాలము అతనిని విచారణచేయుట దేవునికి అగత్యము లేదు.

విచారణ లేకుండనే బలవంతులను ఆయన నిర్మూ
లము చేయుచున్నాడు
వారి స్థానమున ఇతరులను నియమించుచున్నాడు.
వారి క్రియలను ఆయన తెలిసికొనుచున్నాడు
రాత్రియందు ఆయన నాశనము కలుగజేయగా
వారు నలుగగొట్టబడుదురు.
దుష్టులని బహిరంగముగానే ఆయన వారిని శిక్షిం
చును.
ఏలయనగా వారు ఆయనను అనుసరించుట మానిరి
ఆయన ఆజ్ఞలలో దేనినైనను లక్ష్యపెట్టకపోయిరి.
బీదల మొఱ్ఱను ఆయనయొద్దకు వచ్చునట్లు చేసిరి
దీనుల మొఱ్ఱను ఆయనకు వినబడునట్లు చేసిరి.
ఆయన సమాధానము కలుగజేసినయెడల శిక్ష
విధింపగలవాడెవడు?
ఆయన తన ముఖమును దాచుకొనినయెడల
ఆయనను చూడగలవాడెవడు?
అది అనేకులను గూర్చినదైనను ఒకటే ఒకని
గూర్చినదైనను ఒకటే
భక్తిహీనులు రాజ్యపరిపాలన చేయకుండునట్లు
వారు ప్రజలను చిక్కులపరచకుండునట్లు (బలవం
తులను ఆయన నిర్మూలము చేయుచున్నాడు)
ఒకడు—నేను శిక్షనొందితిని
నేను ఇకను పాపము చేయను
నాకు తెలియనిదానిని నాకు నేర్పుము
నేను దుష్కార్యము చేసియున్నయెడల ఇకను
చేయనని దేవునితో చెప్పునా?
నీకిష్టము వచ్చినట్లు ఆయన ప్రతికారము చేయు
నా? లేనియెడల నీవుందువా?
నేను కాను నీవే నిశ్చయింపవలెను గనుక నీవు
ఎరిగినదానిని పలుకుము.
వివేచనగలవారు జ్ఞానముగలిగి నా మాట విను
వారు నాతో నీలాగు పలుకుదురు—
యోబు తెలివిమాలిన మాటలాడుచున్నాడు.
అతని మాటలు బుద్ధిహీనమైనవి
దుష్టులవలె యోబు ప్రత్యుత్తరమిచ్చినందున
అతడు తుదముట్ట శోధింపబడవలెనని నేనెంతో
కోరుచున్నాను
అతడు తన పాపమునకు తోడుగా ద్రోహము
కూర్చుకొనుచున్నాడు
మనయెదుట చప్పట్లుకొట్టి దేవునిమీద కానిమా
టలు పెంచుచున్నాడు.
మరియు ఎలీహు ఈలాగు ప్రత్యుత్తరమిచ్చెను
—నేను పాపము చేసినయెడల నాకు కలిగిన
లాభముకన్న (నా నీతివలన) నాకు కలిగిన
లాభమేమి అది నీకు ప్రయోజనమేమి? అని
నీవు చెప్పుచున్నావే!

ఇదే న్యాయమని నీకు తోచినదా?— 3
దేవుని నీతికన్న నా నీతి యెక్కువని నీవనుకొను
చున్నావా?
నీతోను నీతోకూడనున్న నీ సహవాసులతోను 4
నేను వాదమాడెదను.
ఆకాశమువైపు నిదానించి చూడుము 5
నీకన్న ఉన్నతమైన ఆకాశ విశాలములవైపు
చూడుము.
నీవు పాపము చేసినను ఆయనకు నీవేమైన చేసి 6
తివా?
నీ అతిక్రమములు విస్తరించినను ఆయనకు నీవేమైన
చేసితివా?
నీవు నీతిమంతుడవైనను ఆయనకు నీవేమైన ఇచ్చు 7
చున్నావా?
ఆయన నీచేత ఏమైనను తీసికొనునా?
నీవంటి మనుష్యునికే నీ చెడుతనపు (ఫలము) 8
చెందును
నరులకే నీ నీతి (ఫలము) చెందును.
అనేకులు బలాత్కారము చేయుటవలన జనులు 9
కేకలు వేయుదురు
బలవంతుల భుజబలమునకు భయపడి సహాయము
కొరకై కేకలు వేయుదురు.
అయితే—రాత్రియందు కీర్తనలు పాడుటకు ప్రేరే 10
పించుచు
భూజంతువులకంటె మనకు ఎక్కువ బుద్ధినేర్పుచు 11
ఆకాశపక్షులకంటె మనకు ఎక్కువ జ్ఞానము
కలుగజేయుచు
నన్ను సృజించిన దేవుడు ఎక్కడ నున్నాడని అను
కొనువారెవరును లేరు.
కాగా వారు దుష్టులైన మనుష్యుల గర్వమునుబట్టి 12
మొఱ్ఱపెట్టుదురు గాని
ఆయన ప్రత్యుత్తర మిచ్చుటలేదు.
నిశ్చయముగా దేవుడు నిరర్థకమైన మాటలు చెవిని 13
బెట్టడు
సర్వశక్తుడు వాటిని లక్ష్యపెట్టడు.
—ఆయనను చూడలేనని నీవు చెప్పినను వ్యాజ్యము 14
ఆయనయెదుటనే యున్నది; ఆయన నిమిత్తము
నీవు కనిపెట్టవలెను.
ఆయన కోపముతో దండింపక పోయినందునను 15
నిశ్చయముగా దురహంకారమును ఆయన గుర్తింపక
పోయినందునను
నిర్హేతుకముగా యోబు మాటలాడి యున్నాడు 16
తెలివిలేకయే మాటలను విస్తరింపజేసియున్నాడు.

మరియు ఎలీహు ఇంక ఇట్లనెను 36
—కొంతసేపు నన్ను ఓర్చుకొనుము ఈ సంగతి 2
నీకు తెలియజేసెదను.

ఏలయనగా దేవునిపక్షముగా నేనింకను మాటలాడ
వలసి యున్నది.
3 దూరమునుండి నేను జ్ఞానము తెచ్చుకొందును
నన్ను సృజించినవానికి నీతిని ఆరోపించెదను.
4 నా మాటలు ఏమాత్రమును అబద్ధములు కావు
పూర్ణజ్ఞాని యొకడు నీ యెదుట నున్నాడు.
5 ఆలోచించుము దేవుడు బలవంతుడు గాని ఆయన
ఎవనిని తిరస్కారము చేయడు
ఆయన వివేచనాశక్తి బహు బలమైనది.
6 భక్తిహీనుల ప్రాణమును ఆయన కాపాడడు
ఆయన దీనులకు న్యాయము జరిగించును.
7 నీతిమంతులను ఆయన చూడక పోడు
సింహాసనముమీద కూర్చుండు రాజులతో
ఆయన వారిని నిత్యమును కూర్చుండబెట్టును
వారు ఘనపరచబడుదురు.
8 వారు సంకెళ్లతో కట్టబడినయెడలను
బాధాపాశములచేత పట్టబడినయెడలను
9 అప్పుడు వారు గర్వముగా ప్రవర్తించిరని
ఆయన వారి వారి కార్యములను వారి వారి దోష
ములను వారికి తెలియజేయును.
10 ఉపదేశము వినుటకై వారి చెవిని తెరువజేయును.
పాపము విడిచి రండని ఆజ్ఞ ఇచ్చును.
11 వారు ఆలకించి ఆయనను సేవించినయెడల
తమ దినములను క్షేమముగాను
తమ సంవత్సరములను సుఖముగాను వెళ్లబుచ్చెదరు.
12 వారు ఆలకింపనియెడల వారు బాణములచేత కూలి
నశించెదరు
జ్ఞానములేక చనిపోయెదరు.
13 అయినను లోలోపల హృదయపూర్వకమైన భక్తి
లేనివారు క్రోధము నుంచుకొందురు.
ఆయన వారిని బంధించునప్పుడు వారు మొఱ్ఱ
పెట్టరు.
14 కావున వారు యౌవనమందే మృతినొందుదురు
వారి బ్రదుకు పురుషగాముల బ్రదుకువంటిదగును.
15 శ్రమపడువారిని వారికి కలిగిన శ్రమనుండి ఆయన
విడిపించును
బాధవలన వారిని విధేయులగా చేయును.
16 అంతయేకాక బాధలోనుండి ఆయన నిన్ను తప్పిం
చును.
ఇరుకులేని విశాలస్థలమునకు నిన్ను తోడుకొని
పోవును
నీ ఆహారమును క్రొవ్వుతో నింపును.
17 దుష్టుల తీర్పు నీలో పూర్తిగా కనబడుచున్నది
న్యాయవిమర్శయు తీర్పును కూడుకొనియున్నవి.
18 నీకు క్రోధము పుట్టుచున్నది గనుక నీవు ఒక వేళ
తిరస్కారము చేయుదువేమో జాగ్రత్తపడుము

నీవు చేయవలసిన ప్రాయశ్చిత్తము గొప్పదని నీవు
మోసపోయెదవేమో జాగ్రత్తపడుము.
నీవు మొఱ్ఱపెట్టుటయు
బలవత్ ప్రయత్నములు చేయుటయు
బాధనొందకుండ నిన్ను తప్పించునా?
జనులను తమ స్థలములలోనుండి కొట్టివేయు రాత్రి 20
రావలెనని కోరుకొనకుము.
జాగ్రత్తపడుము చెడుతనము చేయకుండుము. 21
దుఃఖానుభవముకన్న అది మంచిదని నీవు దాని
కోరుకొనియున్నావు.
ఆలోచించుము, దేవుడు శక్తిమంతుడై ఘనతవహిం 22
చినవాడు
ఆయనను పోలిన బోధకుడెవడు?
ఆయనకు మార్గము నియమించినవాడెవడు? 23
—నీవు దుర్మార్గపు పనులు చేయుచున్నావని ఆయ
నతో ఎవడు పలుక తెగించును?
మనుష్యులు కీర్తించిన ఆయన కార్యమును 24
మహిమపరచుటకై నీవు జాగ్రత్తపడుము.
మనుష్యులందరు దాని చూచెదరు 25
నరులు దూరమున నిలిచి దాని చూచెదరు.
ఆలోచించుము, దేవుడు మహోన్నతుడు మనము 26
ఆయనను ఎరుగము
ఆయన సంవత్సరముల సంఖ్య మితిలేనిది.
ఆయన ఉదకబిందువులను పైనుండి కురిపించును 27
మంచుతో కూడిన వర్షమువలె అవి పడును
మేఘములు వాటిని కుమ్మరించును 28
మనుష్యులమీదికి అవి సమృద్ధిగా దిగును.
మేఘములు వ్యాపించు విధమును 29
ఆయన మందిరములోనుండి ఉరుములు వచ్చు విధ
మును ఎవడైనను గ్రహింపజాలునా?
ఆయన తనచుట్టు తన మెరుపును వ్యాపింపజే 30
యును
సముద్రపు అడుగుభాగమును ఆయన కప్పును.
వీటివలన ఆయన ఆ యా ప్రజలకు తీర్పుచేయును 31
ఆయన ఆహారమును సమృద్ధిగా ఇచ్చువాడు.
ఇరుప్రక్కలను ఆయన మెరుపులు మెరిపించును 32
గురికి తగలవలెనని ఆయన దానికి ఆజ్ఞాపించును.
ఆయన గర్జనము ఆయనను ప్రసిద్ధిచేయును 33
తాను వచ్చుచున్నాడని ఆయన పశువులకును తెలు
పును.

దీనినిబట్టి నా హృదయము వణకుచున్నది 37
దాని స్థలములోనుండి అది కదిలింపబడుచున్నది.
ఆయన స్వరగర్జనమును వినుడి 2
ఆయన నోటనుండి బయలువెళ్లు ధ్వని నాలకించుడి.
ఆకాశవైశాల్యమంతటి క్రింద ఆయన దాని 3
వినిపించును

భూమ్యంతములవరకు తన మెరుపును కనబడజే
యును.
4 దాని తరువాత ఉరుముధ్వని గర్జించును
ఆయన తన గంభీరమైన స్వరముతో గర్జించును
ఆయన ధ్వని వినబడునప్పుడు ఆయన మెరుపును
నిలిపివేయడు
5 దేవుడు ఆశ్చర్యముగా ఉరుముధ్వని చేయును
మనము గ్రహింపలేని గొప్పకార్యములను ఆయన
చేయును.
6 —నీవు భూమిమీద పడుమని హిమముతోను
వర్షములతోను మహా వర్షముతోను ఆయన ఆజ్ఞ
ఇచ్చుచున్నాడు.
7 మనుష్యులందరు ఆయన సృష్టికార్యమును తెలిసి
కొనునట్లు
ప్రతి మనుష్యుని చేతిమీదను ఆయన ముద్రవేసి
యున్నాడు.
8 జంతువులు వాటి వాటి గుహలలో చొచ్చి వాటి
వాటి బిలములలో వసించును.
9 మరుగుస్థానములోనుండి తుపాను వచ్చును
ఉత్తరదిక్కునుండి చలి వచ్చును
10 దేవుని ఊపిరివలన మంచు పుట్టును
జలముల పైభాగమంతయు గట్టిపడును.
11 మరియు ఆయన దట్టమైన మేఘమును జలముతో
నింపును
తన మెరుపుగల మేఘమును వ్యాపింపజేయును.
12 ఆయనవలన నడిపింపబడినవై నరులకు నివాస
13 యోగ్యమైన భూగోళముమీద
మెరుపును మేఘములును సంచారము చేయును
ఆయన వాటికి ఆజ్ఞాపించునది యావత్తును అవి
నెరవేర్చును
శిక్షకొరకే గాని తన భూలోకముకొరకే గాని కృప
చేయుటకే గాని ఆయన ఆజ్ఞాపించినదానిని
అవి నెరవేర్చును.
14 యోబూ, ఈ మాట ఆలకింపుము
ఊరకుండి దేవుని అద్భుతక్రియలను ఆలోచిం
పుము.
15 దేవుడు తన మేఘపు మెరుపు ప్రకాశింపవలెనని
యెట్లు తీర్మానముచేయునో నీకు తెలియునా?
16 మేఘములను తేలచేయుటయు
పరిపూర్ణజ్ఞానము గలవాని మహా కార్యములును
నీకు తెలియునా?
17 దక్షిణపుగాలి వీచుటచేత ఉబ్బవేయునప్పుడు
నీ వస్త్రములెట్లు వెచ్చబడినది నీకు తెలియునా?
18 పోతపోసిన అద్దమంత దట్టమైనదగు ఆకాశమును
ఆయన వ్యాపింపజేసినట్లు నీవు వ్యాపింపజేయ
గలవా?

మేము ఆయనతో ఏమి పలుకవలెనో అది మాకు 19
తెలుపుము
చీకటి కలిగినందున మాకేమియు తోచక యున్నది.
నేను పలుకుదునని యెవడైన ఆయనతో చెప్ప 20
దగునా?
ఒకడు తాను నిర్మూలము కావలెనని కోరునా?
ఉన్నతమైన మేఘములలో ప్రకాశించు ఎండ 21
యిప్పుడు కనబడకయున్నను
గాలి మేఘములను పోగొట్టి దాని తేటగా కను
పరచును.
ఉత్తరదిక్కున సువర్ణప్రకాశము పుట్టును 22
దేవుడు భీకరమైన మహిమను ధరించుకొనియు
న్నాడు.
సర్వశక్తుడగు దేవుడు 23
మాహాత్మ్యముగలవాడు.
ఆయన మనకు అగోచరుడు.
న్యాయమును నీతిని ఆయన ఏమాత్రమును చెరు
పడు.
అందువలన నరులు ఆయనయందు భయభక్తులు 24
కలిగియుందురు
తాము జ్ఞానులమనుకొనువారిని ఆయన ఏమాత్ర
మును లక్ష్యపెట్టడు.

అప్పుడు యెహోవా సుడిగాలిలోనుండి ఈలా **38**
గున యోబుకు ప్రత్యుత్తరమిచ్చెను—
జ్ఞానములేని మాటలు చెప్పి ఆలోచనను చెరుపు 2
చున్న వీడెవడు?
పౌరుషము తెచ్చుకొని నీ నడుము బిగించు 3
కొనుము
నేను నిన్ను ప్రశ్నవేయుదును నీవు దానిని నాకు
తెలియజెప్పుము.
నేను భూమికి పునాదులు వేసినప్పుడు నీవెక్కడ 4
నుంటివి?
నీకు వివేకము కలిగియున్నయెడల చెప్పుము.
నీకు తెలిసినయెడల దానికి పరిమాణమును నియ 5
మించినవాడెవడో చెప్పుము.
దానిమీద పరిమాణపు కొల వేసినవాడెవడో 6
చెప్పుము.
దాని స్తంభముల పాదులు దేనితో కట్టబడినవో
చెప్పుము.
ఉదయనక్షత్రములు ఏకముగా కూడి పాడి 7
నప్పుడు
దేవదూతలందరును దేవుని కుమారులందరును ఆనం
దించి జయధ్వనులు చేసినప్పుడు
దాని మూలరాతిని వేసినవాడెవడు?
సముద్రము దాని గర్భమునుండి పొర్లి రాగా 8
తలుపులచేత దానిని మూసివేసినవాడెవడు?

9 నేను మేఘమును దానికి వస్త్రముగాను
గాఢాంధకారమును దానికి పొత్తిగుడ్డగాను వేసినప్పుడు నీవుంటివా?
10 దానికి సరిహద్దు నియమించి దానికి అడ్డగడియలను తలుపులను పెట్టించినప్పుడు
11 —నీవు ఇంతవరకే గాని మరి దగ్గరకు రాకూడదనియు
ఇక్కడనే నీ తరంగముల పొంగు అణపబడుననియు నేను చెప్పినప్పుడు నీవుంటివా?
12 అరుణోదయము భూమి దిగంతములవరకు వ్యా
13 పించునట్లును
అది దుష్టులను తనలోనుండకుండ దులిపివేయునట్లును
నీవెప్పుడైన ఉదయమును కలుగజేసితివా?
అరుణోదయమునకు దాని స్థలమును తెలిపితివా?
14 ముద్రవలన మంటికి రూపము కలుగునట్లు అది పుట్టగా భూముఖము మార్పునొందును
విచిత్రమైన పనిగల వస్త్రమువలె సమస్తమును కనబడును.
15 దుష్టుల వెలుగు వారియొద్దనుండి తీసివేయబడును
వారెత్తిన బాహువు విరుగగొట్టబడును.
16 సముద్రపు ఊటలలోనికి నీవు చొచ్చితివా?
మహాసముద్రము అడుగున నీవు సంచరించితివా?
17 మరణద్వారములు నీకు తెరవబడెనా?
మరణాంధకార ద్వారములను నీవు చూచితివా?
18 భూమి వైశాల్యత ఎంతో నీవు గ్రహించితివా?
నీకేమైన తెలిసినయెడల చెప్పుము.
19 వెలుగు నివసించు చోటునకు పోవు మార్గమేది?
20 చీకటి అనుదాని ఉనికిపట్టు ఏది?
దాని సరిహద్దునకు నీవు వెలుగును కొనిపోవుదువా?
దాని గృహమునకు పోవు త్రోవలను నీవెరుగుదువా?
1 ఇదంతయు నీకు తెలిసేయున్నది గదా. నీవు బహు వృద్ధుడవు నీవు అప్పటికి పుట్టియుంటివి.
22 నీవు హిమముయొక్క నిధులలోనికి చొచ్చితివా?
23 ఆపత్కాలముకొరకును యుద్ధముకొరకును యుద్ధదినముకొరకును నేను దాచియుంచిన
వడగండ్ల నిధులను నీవు చూచితివా?
24 వెలుగు విభాగింపబడు చోటికి మార్గమేది?
తూర్పు గాలి యెక్కడనుండి వచ్చి భూమిమీద నలుముఖములను వ్యాపించును?
25 నిర్మానుష్య ప్రదేశముమీదను
26 జనులులేని యెడారిలోను వర్షము కురిపించుటకును
—పాడైన యెడారిని తృప్తిపరచుటకును
లేతగడ్డి మొలిపించుటకును వరద నీటికి కాలువలను
ఉరుములోని మెరుపుకు మార్గమును నిర్ణయించువాడెవడు?
వర్షమునకు తండ్రి యున్నాడా? 28
మంచు బిందువులను పుట్టించువాడెవడు?
మంచుగడ్డ యెవని గర్భములోనుండి వచ్చును? 29
ఆకాశమునుండి దిగు మంచును ఎవడు పుట్టించును?
జలములు రాతివలె గడ్డకట్టును 30
అగాధజలముల ముఖము గట్టిపరచబడును.
కృత్తిక నక్షత్రములను నీవు బంధింపగలవా? 31
మృగశీర్షపు కట్లను విప్పగలవా?
వాటి వాటి కాలములలో నక్షత్రరాసులను 32
వచ్చునట్లు చేయగలవా?
సప్తర్షి నక్షత్రములను వాటి ఉపనక్షత్రములను నీవు నడిపింపగలవా?
ఆకాశమండలపు కట్టడలను నీవెరుగుదువా? 33
దానికి భూమిమీదగల ప్రభుత్వమును నీవు స్థాపింపగలవా?
జలరాసులు నిన్ను కప్పునట్లు 34
మేఘములకు నీవు ఆజ్ఞ ఇయ్యగలవా?
మెరుపులు బయలువెళ్లి 35
—చిత్తము ఉన్నామని నీతో చెప్పునట్లు
నీవు వాటిని బయటికి రప్పింపగలవా?
అంతరింద్రియములలో జ్ఞానముంచినవాడెవడు? 36
హృదయమునకు తెలివి నిచ్చినవాడెవడు?
జ్ఞానముచేత మేఘములను వివరింపగలవాడెవడు? 37
ధూళి బురదగామారునట్లును 38
మంటిపెడ్డలు ఒకదానికొకటి అంటుకొనునట్లును
ఆకాశపు కలశములలోని వర్షమును కుమ్మరించువాడెవడు?
ఆడుసింహము నిమిత్తము నీవు ఎరను వేటాడెదవా? 39
సింహపుపిల్లలు తమ తమ గుహలలో పండుకొనునప్పుడు 40
తమ గుహలలో పొంచి యుండునప్పుడు నీవు వాటి ఆకలి తీర్చెదవా?
తిండిలేక తిరుగులాడుచు 41
కాకి పిల్లలు దేవునికి మొఱ్ఱపెట్టునప్పుడు
కాకికి ఆహారము సిద్ధపరచువాడెవడు?
అడవిలోని కొండమేకలు ఈనుకాలము నీకు తెలియునా? **39**
లేళ్లు పిల్లలు వేయు కాలమును గ్రహింపగలవా?
అవి మోయు మాసములను నీవు లెక్కపెట్టగలవా?
అవి యీనుకాలము ఎరుగుదువా?
అవి వంగి తమ పిల్లలను కనును
తమ పిల్లలను వేయును.

వాటి పిల్లలు పుష్టికలిగి యెడారిలో పెరుగును
అవి తల్లులను విడిచిపోయి వాటియొద్దకు తిరిగి
రావు.
అడవిగాడిదెను స్వేచ్ఛగా పోనిచ్చినవాడెవడు?
అడవిగాడిదె కట్లను విప్పినవాడెవడు?
నేను అరణ్యమును దానికి ఇల్లుగాను
ఉప్పుపఱ్ఱను దానికి నివాసస్థలముగాను నియ
మించితిని.
పట్టణపు కోలాహలమును అది తిరస్కరించును
తోలువాని కేకలను అది వినదు.
పర్వతముల పంక్తియే దానికి మేతభూమి
ప్రతివిధమైన పచ్చని మొలకను అది వెదకికొనును.
గురుపోతు నీకు లోబడుటకు సమ్మతించునా?
అది నీ శాలలో నిలుచునా?
పగ్గము వేసి గురుపోతును నాగటిచాలులో కట్ట
గలవా?
అది నీచేత తోలబడి లోయలను చదరము
చేయునా?
దాని బలము గొప్పదని దాని నమ్ముదువా?
దానికి నీ పని అప్పగించెదవా?
అది నీ ధాన్యమును ఇంటికి తెచ్చి నీ కళ్లమందున్న
ధాన్యమును కూర్చునని దాని నమ్ముదువా?
నిప్పుకోడి సంతోషముచేత రెక్కల నాడించును.
రెక్కలును వెండ్రుకలును దాని కున్నందున అది
వాత్సల్యము కలదిగా నున్నదా?
లేదుసుమీ, అది నేలను దాని గుడ్లను పెట్టును
ధూళిలో వాటిని కాచును.
కాలిపాదమైన వాటిని త్రొక్కవచ్చుననిగాని
అడవిజంతువు వాటిని చితక త్రొక్కవచ్చునని
గాని అనుకొనకయే యున్నది.
తన పిల్లలు తనవి కానట్టు వాటియెడల అది కాఠి
న్యము చూపును
దాని కష్టము వ్యర్థమైనను దానికి చింతలేదు
దేవుడు దానిని తెలివిలేనిదిగా జేసెను
ఆయన దానికి వివేచనాశక్తి ననుగ్రహించి యుండ
లేదు.
అది లేచునప్పుడు గుర్రమును దాని రౌతును
తిరస్కరించును.
గుర్రమునకు నీవు బలమునిచ్చితివా?
జూలు వెండ్రుకలతో దాని మెడను కప్పితివా?
మిడుతవలె అది గంతులు వేయునట్లు చేయు
దువా?
దాని నాసికారంధ్ర ధ్వని భీకరము.
మైదానములో అది కాలు దువ్వి తన బలమును
బట్టి సంతోషించును
అది ఆయుధధారులను ఎదుర్కొనబోవును.

అది భయము పుట్టించుదానిని వెక్కిరించి భీతి 22
నొందకుండును
ఖడ్గమును చూచి వెనుకకు తిరుగదు.
అంబుల పొదియు తళతళలాడు ఈటెలును బల్లె 23
మును దానిమీద గలగలలాడించబడునప్పుడు
ఉద్దండకోపములో అది బహుగా పరుగులెత్తును 24
అది బాకానాదము విని ఊరకుండదు.
బాకానాదము వినబడినప్పుడెల్ల అది అహా అహా 25
అనుకొని దూరమునుండి యుద్ధవాసన తెలిసి
కొనును
సేనాధిపతుల ఆర్భాటమును యుద్ధఘోషను
వినును.
డేగ నీ జ్ఞానముచేతనే ఎగురునా? 26
అది నీ ఆజ్ఞవలననే తన రెక్కలు దక్షిణదిక్కునకు
చాచునా?
పక్షిరాజు నీ ఆజ్ఞకు లోబడి ఆకాశవీధి కెక్కునా? 27
తన గూడు ఎత్తయినచోటను కట్టుకొనునా?
అది రాతికొండమీద నివసించును 28
కొండపేటుమీదను ఎవరును ఎక్కజాలని యెత్తు
చోటను గూడు కట్టుకొనును.
అక్కడనుండియే తన యెరను వెదకును. 29
దాని కన్నులు దానిని దూరమునుండి కనిపెట్టును
దాని పిల్లలు రక్తము పీల్చును. 30
హతులైనవారు ఎక్కడనుందురో అక్కడనే అది
యుండును.

మరియు యెహోవా యోబుకు ఈలాగు 40
ప్రత్యుత్తరమిచ్చెను—
ఆక్షేపణలు చేయజూచువాడు సర్వశక్తుడగు దేవు 2
నితో వాదింపవచ్చునా?
దేవునితో వాదించువాడు ఇప్పుడు ప్రత్యుత్తర
మియ్యవలెను.
అప్పుడు యోబు యెహోవాకు ఈలాగున 3
ప్రత్యుత్తరమిచ్చెను—
చిత్తగించుము, నేను నీచుడను, నేను నీకు ఏమని 4
ప్రత్యుత్తరమిచ్చెదను?
నా నోటిమీద నా చేతిని ఉంచుకొందును.
ఒక మారు మాటలాడితిని నేను మరల నోరెత్తను. 5
రెండు సారులు మాటలాడితిని ఇకను పలుకను.
అప్పుడు యెహోవా సుడిగాలిలోనుండి ఈలాగు 6
యోబుతో ప్రత్యుత్తరమిచ్చెను—
పౌరుషము తెచ్చుకొని నీ నడుము కట్టుకొనుము 7
నేను నీకు ప్రశ్న వేసెదను నీవు ప్రత్యుత్తరమిమ్ము.
నీవు నా న్యాయమును బొత్తిగా కొట్టివేసెదవా? 8
నిర్దోషినని నీవు తీర్పు పొందుటకై నామీద అప
రాధము మోపుదువా?
దేవునికి కలిగియున్న బాహుబలము నీకు కలదా? 9

ఆయన ఉరుము స్వరమువంటి స్వరముతో నీవు
గర్జింపగలవా?
10 ఆడంబర మాహాత్మ్యములతో నిన్ను నీవు అలంక
రించుకొనుము
గౌరవప్రభావములను ధరించుకొనుము.
11 నీ ఆగ్రహమును ప్రవాహములుగా కుమ్మరించుము
గర్విష్ఠులైనవారినందరిని చూచి వారిని క్రుంగ
జేయుము.
12 గర్విష్ఠులైనవారిని చూచి వారిని అణగగొట్టుము
దుష్టులు ఎక్కడనున్నను వారిని అక్కడనే అణగ
ద్రొక్కుము.
13 కనబడకుండ వారినందరిని బూడిదెలో పాతి
పెట్టుము
సమాధిలో వారిని బంధింపుము.
14 అప్పుడు నీ దక్షిణహస్తమే నిన్ను రక్షింపగలదని
నేను నిన్నుగూర్చి ఒప్పుకొనెదను.
15 నేను చేసిన నీటిగుఱ్ఱమును నీవు చూచియు
న్నావు గదా
ఎద్దువలె అది గడ్డి మేయును.
16 దాని శక్తి దాని నడుములో ఉన్నది
దాని బలము దాని కడుపు నరములలో ఉన్నది.
17 దేవదారుచెట్టు కొమ్మ వంగునట్లు అది తన తోకను
వంచును
దాని తొడల నరములు దిట్టముగా సంధింపబడి
యున్నవి.
18 దాని యెముకలు ఇత్తడి గొట్టములవలె ఉన్నవి
దాని ప్రక్కటెముకలు ఇనుపకమ్ములవలె ఉన్నవి
19 అది దేవుడు సృష్టించినవాటిలో గొప్పది
దాని సృజించినవాడే దాని ఖడ్గమును దానికిచ్చెను.
20 పర్వతములలో దానికి మేత మొలుచును
అరణ్యజంతువులన్నియు అచ్చట ఆడుకొనును.
21 తామర చెట్లక్రిందను
జమ్ముగడ్డి మరుగునను పఱ్ఱలోను అది పండు
కొనును
22 తామరచెట్ల నీడను అది ఆశ్రయించును
నదిలోని నిరవంజిచెట్లు దాని చుట్టుకొనియుం
డును.
23 నదీప్రవాహము పొంగి పొర్లినను అది భయపడదు
యొర్దానువంటి ప్రవాహము పొంగి దాని నోటి
యొద్దకు వచ్చినను అది ధైర్యము విడువదు.
24 అది చూచుచుండగా ఎవరైన దానిని పట్టుకొన
గలరా?
ఉరియొగ్గి దాని ముక్కుకు సూత్రము వేయ
గలరా?

41 నీవు మకరమును గాలముతో బయటికి లాగ
గలవా?
అది యెరను లాగునట్లు చేయగలవా?
నీవు దాని ముక్కుగుండ సూత్రము వేయగలవా? 2
దాని దవడకు గాలము ఎక్కింపగలవా?
అది నీతో విన్నపములు చేయునా? 3
మృదువైన మాటలు నీతో పలుకునా?
నీవు శాశ్వతముగా దానిని దాసునిగా చేసికొను 4
నట్లు అది నీతో నిబంధనచేయునా?
నీవు ఒక పిట్టతో ఆటలాడునట్లు దానితో ఆట 5
లాడెదవా?
నీ కన్యకలు ఆడుకొనుటకై దాని కట్టివేసెదవా?
బెస్తవాండ్లు దానితో వ్యాపారము చేయుదురా? 6
వారు దానిని తునకలు చేసి వర్తకులతో వ్యాపా
రము చేయుదురా?
దాని ఒంటినిండ ఇనుప శూలములు గుచ్చగలవా? 7
దాని తలనిండ చేప అలుగులు గుచ్చగలవా?
దానిమీద నీ చెయ్యి వేసి చూడుము 8
దానితో కలుగు పోరు నీవు జ్ఞాపకము చేసికొనిన
యెడల
నీవు మరల ఆలాగున చేయకుందువు.
దాని చూచినప్పుడు మనుష్యులు దానిని వశ 9
పరచుకొందుమన్న ఆశ విడిచెదరు
దాని పొడ చూచిన మాత్రముచేతనే యెవరికైనను
గుండెలు అవిసిపోవును గదా.
దాని రేపుటకైనను తెగింపగల శూరుడు లేడు. 10
అట్లుండగా నా యెదుట నిలువగలవాడెవడు?
నేను తిరిగి ఇయ్యవలసి యుండునట్లు నాకెవడై 11
నను ఏమైనను ఇచ్చెనా?
ఆకాశవైశాల్యమంతటి క్రింద నున్నదంతయు
నాదేగదా
దాని అవయవములను గూర్చిగాని దాని మహా 12
బలమునుగూర్చిగాని దాని చక్కని తీరును
గూర్చిగాని పలుకక మౌనముగా నుండను.
ఎవడైన దాని పై కవచమును లాగివేయగలడా? 13
దాని రెండు దవడల నడిమికి ఎవడైన రాగలడా?
దాని ముఖద్వారములను తెరవగలవాడెవడు? 14
దాని పళ్లచుట్టు భయకంపములు కలవు.
దాని గట్టిపొలుసులు దానికి అతిశయాస్పదము 15
ఎవరును తీయలేని ముద్రచేత అవి సంతతనచేయబడి
యున్నవి.
అవి ఒకదానితో ఒకటి హత్తుకొని యున్నవి. 16
వాటిమధ్యకు గాలి యేమాత్రమును జొరనేరదు.
ఒకదానితో ఒకటి అతకబడి యున్నవి 17
ఛేదింప శక్యము కాకుండ అవి యొకదానితో
నొకటి కలిసికొని యున్నవి.
అది తుమ్మగా వెలుగు ప్రకాశించును 18

దాని కన్నులు ఉదయకాలపు కనురెప్పలవలె
నున్నవి.
దాని నోటనుండి జ్వాలలు బయలుదేరును
అగ్నికణములు దానినుండి లేచును.
ఉడుకుచున్న కాగులోనుండి, జమ్ముమంటమీద
కాగుచున్న బానలోనుండి పొగ లేచునట్లు
దాని నాసికారంధ్రములలోనుండి లేచును.
దాని ఊపిరి నిప్పులను రాజబెట్టును
దాని నోటనుండి జ్వాలలు బయలుదేరును.
దాని మెడ బలమునకు స్థానము
భయము దానియెదుట తాండవమాడుచుండును
దాని ప్రక్కలమీద మాంసము దళముగా ఉన్నది
అది దాని ఒంటిని గట్టిగా అంటియున్నది అది
ఊడిరాదు.
దాని గుండె రాతివలె గట్టిగా నున్నది
అది తిరుగటి క్రింది దిమ్మంత కఠినము.
అది లేచునప్పుడు బలిష్ఠులు భయపడుదురు
అధిక భయముచేత వారు మైమరతురు.
దాని చంపుటకై ఒకడు ఖడ్గము దూయుట
వ్యర్థమే
ఈటెలైనను బాణములైనను పంట్రకోలలైనను
అక్కరకు రావు.
అది ఇనుమును గడ్డిపోచగాను
ఇత్తడిని పుచ్చిపోయిన కఱ్ఱగాను ఎంచును.
బాణము దానిని పారదోలజాలదు
వడిసెల రాళ్లు దాని దృష్టికి చెత్తవలె ఉన్నవి.
దుడ్డుకఱ్ఱలు గడ్డిపరకలుగా ఎంచబడును
అది ఆడిగా పోవు మెండు ఈటెను చూచి నవ్వును.
దాని క్రింది భాగములు కరుకైన చిల్లపెంకులవలె
ఉన్నవి.
అది బురదమీద సూరిపిడికొయ్యవంటి (తన దేహ
మును) పరచుకొనును.
కాగు మసలునట్లు మహాసముద్రమును అది పొంగ
జేయును
సముద్రమును తైలమువలె చేయును.
అది తాను నడచిన త్రోవను తన వెనుక ప్రకా
శింపజేయును
చూచినవారికి సముద్రము నెరిసిన వెండ్రుకలుగా
తోచును.
అది భయములేనిదిగా సృజింపబడినది
భూమిమీద దానివంటిదేదియు లేదు.
అది గొప్పవాటినన్నిటిని తిరస్కరించును
గర్వించిన జంతువులన్నిటికి అది రాజు.
అప్పుడు యోబు యెహోవాతో ఈలాగు
ప్రత్యుత్తరమిచ్చెను—
నీవు సమస్తక్రియలను చేయగలవనియు



నీవు ఉద్దేశించినది ఏదియు నిష్ఫలము కానేర
దనియు నేనిప్పుడు తెలిసికొంటిని.
జ్ఞానములేని మాటలచేత ఆలోచనను నిరర్థకము 3
చేయు వీడెవడు?
ఆలాగున వివేచనలేనివాడనైన నేను
ఏమియు నెరుగక నా బుద్ధికి మించిన సంగతులను
గూర్చి మాటలాడితిని.
నేను మాటలాడ గోరుచున్నాను దయచేసి నా 4
మాట ఆలకింపుము
ఒక సంగతి నిన్ను అడిగెదను దానిని నాకు తెలియ
జెప్పుము.
వినికిడిచేత నిన్నుగూర్చిన వార్త నేను వింటిని 5
అయితే ఇప్పుడు నేను కన్నులార నిన్ను చూచు
చున్నాను.
కావున నన్ను నేను అసహ్యించుకొని, ధూళిలోను 6
బూడిదెలోను పడి పశ్చాత్తాపపడుచున్నాను.
యెహోవా యోబుతో ఆ మాటలు పలికిన తరు 7
వాత ఆయన తేమానీయుడైన ఎలీఫజుతో ఈలాగు
సెలవిచ్చెను—
నా సేవకుడైన యోబు పలికినట్లు మీరు నన్ను
గూర్చి యుక్తమైనది పలుకలేదు గనుక
నా కోపము నీమీదను నీ ఇద్దరు స్నేహితుల
మీదను మండుచున్నది.
కాబట్టి యేడు ఎడ్లను ఏడు పొట్టేళ్లను మీరు తీసి 8
కొని, నా సేవకుడైన యోబునొద్దకు పోయి మీ నిమి
త్తము దహనబలి అర్పింపవలెను. అప్పుడు నా సేవకు
డైన యోబు మీ నిమిత్తము ప్రార్థనచేయును. మీ
అవివేకమునుబట్టి మిమ్మును శిక్షింపక యుండునట్లు
నేను అతనిని మాత్రము అంగీకరించెదను; ఏలయనగా
నా సేవకుడైన యోబు పలికినట్లు మీరు నన్నుగూర్చి
యుక్తమైనది పలుకలేదు.
తేమానీయుడైన ఎలీఫజును, షూహీయుడైన బిల్ద 9
దును, నయమాతీయుడైన జోఫరును పోయి,
యెహోవా తమకు ఆజ్ఞాపించినట్లు చేయగా
యెహోవా వారిపక్షమున యోబును అంగీకరించెను.
మరియు యోబు తన స్నేహితుల నిమిత్తము 10
ప్రార్థనచేసినప్పుడు యెహోవా అతని క్షేమస్థితిని
మరల అతనికి దయచేసెను. మరియు యోబుకు
పూర్వము కలిగినదానికంటె రెండంతలు అధికముగా
యెహోవా అతనికి దయచేసెను.
అప్పుడు అతని సహోదరులందరును అతని అక్క 11
చెల్లెండ్రందరును అంతకుముందు అతనికి పరిచయులైన
వారును వచ్చి, అతనితోకూడ అతని యింట అన్న
పానములు పుచ్చుకొని, యెహోవా అతనిమీదికి
రప్పించిన సమస్తబాధనుగూర్చి యెంతలేసి దుఃఖములు
పొందితివని అతనికొరకు దుఃఖించుచు అతని నోద

ర్పిరి. ఇదియుగాక ఒక్కొక్కడు కొంత సొమ్మును
ఒక్కొక్కడు బంగారు ఉంగరమును అతనికి తెచ్చి
ఇచ్చెను.
12 యెహోవా యోబును మొదట ఆశీర్వదించి
నంతకంటె మరి అధికముగా ఆశీర్వదించెను. అతనికి
పదునాలుగు వేల గొఱ్ఱెలును ఆరు వేల ఒంటెలును
వెయ్యి జతల యెడ్లును వెయ్యి ఆడుగాడిదెలును
కలిగెను.
13 మరియు అతనికి ఏడుగురు కుమారులును ముగ్గురు
కుమార్తెలును కలిగిరి.

అతడు పెద్దదానికి యెమీమా అనియు రెండవ
దానికి కెజీయా అనియు మూడవదానికి కెరెంహప్పుకు
అనియు పేళ్లు పెట్టెను.
ఆ దేశమందంతటను యోబు కుమార్తెలంత సౌం
దర్యవతులు కనబడలేదు. వారి తండ్రి వారి సహో
దరులతో పాటు వారికి స్వాస్థ్యములనిచ్చెను.
అటుతరువాత యోబు నూట నలువది సంవత్సర
ములు బ్రదికి, తన కుమారులను కుమారుల కుమారు
లను నాలుగు తరములవరకు చూచెను. పిమ్మట యోబు
కాలము నిండిన వృద్ధుడై మృతినొందెను.

---

# కీర్తనల గ్రంథము

## ప్రథమ స్కంధము

**దు**ష్టుల ఆలోచనచొప్పున నడువక
పాపుల మార్గమున నిలువక
అపహాసకులు కూర్చుండు చోటను కూర్చుండక
యెహోవా ధర్మశాస్త్రమునందు ఆనందించుచు
దివారాత్రము దానిని ధ్యానించువాడు ధన్యుడు.
అతడు నీటికాలువల యోరను నాటబడినదై
ఆకు వాడక తన కాలమందు ఫలమిచ్చు చెట్టువలె నుండును
అతడు చేయునదంతయు సఫలమగును.
దుష్టులు ఆలాగున నుండక
గాలి చెదరగొట్టు పొట్టువలె నుందురు.
కాబట్టి న్యాయవిమర్శలో దుష్టులును
నీతిమంతుల సభలో పాపులును నిలువరు.
నీతిమంతుల మార్గము యెహోవాకు తెలియును
దుష్టుల మార్గము నాశనమునకు నడుపును.

**అ**న్యజనులు ఏల గల్లత్తు చేయుచున్నారు?
జనములు ఏల వ్యర్థమైనదాని తలంచుచున్నవి?
—మనము వారి కట్లు తెంపుదము రండి
వారి పాశములను మనయొద్దనుండి పారవేయుదము రండి అని చెప్పుకొనుచు
భూరాజులు యెహోవాకును ఆయన అభిషిక్తునికిని విరోధముగా నిలువబడుచున్నారు
ఏలికలు ఏకీభవించి ఆలోచన చేయుచున్నారు.
ఆకాశమందు ఆసీనుడగువాడు నవ్వుచున్నాడు
ప్రభువు వారిని చూచి అపహసించుచున్నాడు.
—నేను నా పరిశుద్ధ పర్వతమైన సీయోనుమీద
నా రాజును ఆసీనునిగా చేసియున్నాను (అని సెలవిచ్చి)
ఆయన ఉగ్రుడై వారితో పలుకును
ప్రచండకోపముచేత వారిని తల్లడింపజేయును
కట్టడను నేను వివరించెదను
యెహోవా నాకీలాగు సెలవిచ్చెను
—నీవు నా కుమారుడవు
నేడు నిన్ను కనియున్నాను.
నన్ను అడుగుము, జనములను నీకు స్వాస్థ్యముగాను
భూమిని దిగంతములవరకు సొత్తుగాను ఇచ్చెదను.
ఇనుపదండముతో నీవు వారిని నలుగగొట్టెదవు
కుండను పగులగొట్టినట్టు వారిని ముక్కచెక్కలుగా పగులగొట్టెదవు.
కాబట్టి రాజులారా, వివేకులై యుండుడి 10
భూపతులారా, బోధనొందుడి.
భయభక్తులు కలిగి యెహోవాను సేవించుడి 11
గడగడ వణకుచు సంతోషించుడి.
ఆయన కోపము త్వరగా రగులుకొనును 12
కుమారుని ముద్దుపెట్టుకొనుడి; లేనియెడల ఆయన కోపించును
అప్పుడు మీరు త్రోవ తప్పి నశించెదరు.
ఆయనను ఆశ్రయించువారందరు ధన్యులు.

అబ్షాలోమను తన కుమారుని యెదుటనుండి పారిపోయినప్పుడు దావీదు రచించిన కీర్తన. 3

**యె**హోవా, నన్ను బాధించువారు ఎంతో విస్తరించియున్నారు
నామీదికి లేచువారు అనేకులు.
—దేవునివలన అతనికి రక్షణ యేమియు దొరకదని 2
నన్నుగూర్చి చెప్పువారు అనేకులు. (సెలా.)
యెహోవా, నీవే నాకు కేడెముగాను 3
నీవే నాకు అతిశయాస్పదముగాను నా తల ఎత్తువాడవుగాను ఉన్నావు.
ఎలుగెత్తి నేను యెహోవాకు మొఱ్ఱపెట్టునప్పుడు 4
ఆయన తన పరిశుద్ధ పర్వతమునుండి నాకుత్తరమిచ్చును.
యెహోవా నాకు ఆధారము 5
నేను పండుకొని నిద్రపోయి మేలుకొందును.
పదివేలమంది దండెత్తి నామీదికి వచ్చి మోహరించినను 6
నేను భయపడను.
యెహోవా, లెమ్ము నా దేవా నన్ను రక్షింపుము 7
నా శత్రువులనందరిని దవడ యెముకమీద కొట్టువాడవు నీవే, దుష్టుల పళ్లు విరుగగొట్టువాడవు నీవే.
రక్షణ నిచ్చుట యెహోవాది 8
నీ ప్రజలమీదికి నీ ఆశీర్వాదము వచ్చునుగాక. (సెలా.)

ప్రధానగాయకునికి. 4
తంతివాద్యములతో పాడదగినది
దావీదు కీర్తన.

**నా** నీతికి ఆధారమగు దేవా, నేను మొఱ్ఱపెట్టునప్పుడు నాకుత్తరమిమ్ము
ఇరుకులో నాకు విశాలత కలుగజేసినవాడవు నీవే

నన్ను కరుణించి నా ప్రార్థన నంగీకరించుము.
2 నరులారా, ఎంతకాలము నా గౌరవమును అవమానముగా మార్చెదరు?
ఎంతకాలము వ్యర్థమైనదాని ప్రేమించెదరు? ఎంతకాలము అబద్ధమైనవాటిని వెదకెదరు
3 యెహోవా తన భక్తులను తనకు ఏర్పరచుకొనుచున్నాడని తెలిసికొనుడి.
నేను యెహోవాకు మొఱ్ఱపెట్టగా ఆయన ఆలకించును.
4 భయమునొంది పాపము చేయకుడి
మీరు పడకలమీద నుండగా మీ హృదయములలో ధ్యానముచేసికొని ఊరకుండుడి. (సెలా.)
5 నీతియుక్తమైన బలులు అర్పించుచు యెహోవాను నమ్ముకొనుడి
6 —మాకు మేలు చూపువాడెవడని పలుకువారనేకులు.
యెహోవా, నీ సన్నిధికాంతి మామీద ప్రకాశింపజేయుము.
7 వారి ధాన్య ద్రాక్షారసములు విస్తరించిననాటి సంతోషముకంటె
అధికమైన సంతోషము నీవు నా హృదయములో పుట్టించితివి.
8 యెహోవా, నెమ్మదితో పండుకొని వెంటనే నిద్రపోవుదును
నేను ఒంటరిగా నుండినను నీవే నన్ను సురక్షితముగా నివసింపజేయుదువు.

## 5

ప్రధానగాయకునికి.
పిల్లనగ్రోవితో పాడదగినది.
దావీదు కీర్తన.

యెహోవా, నా మాటలు చెవినిబెట్టుము
నా ధ్యానముమీద లక్ష్యముంచుము.
2 నా రాజా నా దేవా, నా ఆర్తధ్వని ఆలకించుము
నిన్నే ప్రార్థించుచున్నాను.
3 యెహోవా, ఉదయమున నా కంఠస్వరము నీకు వినబడును
ఉదయమున నా ప్రార్థన నీ సన్నిధిని సిద్ధముచేసి కాచియుందును.
4 నీవు దుష్టత్వమును చూచి ఆనందించు దేవుడవు కావు
చెడుతనమునకు నీయొద్ద చోటులేదు
5 డాంబికులు నీ సన్నిధిని నిలువలేరు
పాపము చేయువారందరు నీకసహ్యులు
6 అబద్ధమాడువారిని నీవు నశింపజేయుదువు
కపటము చూపి నరహత్య జరిగించువారు యెహోవాకు అసహ్యులు.

నేనైతే నీ కృపాతిశయమునుబట్టి నీ మందిరములో ప్రవేశించుచున్నాను
నీయెడల భయభక్తులు కలిగి నీ పరిశుద్ధాలయము దిక్కు చూచి నమస్కరించుచున్నాను
యెహోవా, నన్ను పొంచియున్నవారినిబట్టి
నీ నీత్యానుసారముగా నన్ను నడిపింపుము
నీ మార్గమును నాకు స్పష్టముగా కనుపరచుము.
వారి నోట యథార్థత లేదు
వారి అంతరంగము నాశనకరమైన గుంట
వారి కంఠము తెరచిన సమాధి
వారు నాలుకతో ఇచ్చకములాడుదురు.
దేవా, వారు నీమీద తిరుగబడి యున్నారు
వారిని అపరాధులుగా తీర్చుము.
వారు తమ ఆలోచనలలో చిక్కుబడి కూలుదురు గాక
వారు చేసిన అనేక దోషములనుబట్టి వారిని వెలివేయుము.
నిన్ను ఆశ్రయించువారందరు సంతోషించుదురు
నీవే వారిని కాపాడుదువు గనుక వారు నిత్యము ఆనందధ్వని చేయుదురు.
యెహోవా, నీతిమంతులను ఆశీర్వదించువాడవు నీవే
కేడెముతో కప్పినట్లు నీవు వారిని దయతో కప్పెదవు
కావున నీ నామమును ప్రేమించువారు నిన్నుగూర్చి ఉల్లసింతురు.

ప్రధానగాయకునికి.
అష్టమశ్రుతిమీద తంతివాద్యములతో పాడదగినది.
దావీదు కీర్తన.

యెహోవా, నీ కోపముచేత నన్ను గద్దింపకుము
నీ ఉగ్రతతో నన్ను శిక్షింపకుము.
యెహోవా, నేను కృశించి యున్నాను నన్ను కరుణించుము.
యెహోవా, నా యెముకలు అదరుచున్నవి నన్ను బాగుచేయుము
నా ప్రాణము బహుగా అదరుచున్నది.
యెహోవా, నీవు ఎంతవరకు (కరుణింపక యుందువు.)
యెహోవా, తిరిగి రమ్ము నన్ను విడిపింపుము
నీ కృపనుబట్టి నన్ను రక్షింపుము.
మరణమైనవారికి నిన్నుగూర్చిన జ్ఞాపకము లేదు
పాతాళములో ఎవరు నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుదురు?
నేను మూలుగుచు అలసియున్నాను
ప్రతి రాత్రియు కన్నీరు విడుచుచు నా పరుపు తేలజేయుచున్నాను.

నా కన్నీళ్లచేత నా పడక కొట్టుకొనిపోవుచున్నది.
విచారముచేత నా కన్నులు గుంటలు పడుచున్నవి
నాకు బాధ కలిగించువారిచేత అవి చివికియున్నవి.
యెహోవా నా రోదన ధ్వని వినియున్నాడు
పాపముచేయు వారలారా, మీరందరు నాయొద్దనుండి తొలగిపోవుడి.
యెహోవా నా విన్నపము ఆలకించి యున్నాడు
యెహోవా నా ప్రార్థన నంగీకరించును.
నా శత్రువులందరు సిగ్గుపడి బహుగా అదరుచున్నారు
వారు ఆకస్మికముగా సిగ్గుపడి వెనుకకు మళ్లుదురు.

బెన్యామీను వంశస్థుడైన కూషు చెప్పిన మాటల విషయమై దావీదు యెహోవానుగూర్చి పాడినది.

వీణానాదసహిత గీతము.

యెహోవా నా దేవా, నేను నీ శరణుజొచ్చి యున్నాను
నన్ను తరుమువారిచేతిలోనుండి నన్ను తప్పించుము.
నన్ను తప్పించువాడెవడును లేకపోగా
వారు సింహమువలె ముక్కలుగా చీల్చివేయకుండ నన్ను తప్పించుము.
యెహోవా నా దేవా, నేను ఈ కార్యము చేసిన యెడల
నాచేత పాపము జరిగినయెడల
నాతో సమాధానముగా నుండినవానికి నేను కీడు చేసినయెడల
శత్రువు నన్ను తరిమి పట్టుకొననిమ్ము
నా ప్రాణమును నేలకు అణగద్రొక్కనిమ్ము
నా అతిశయాస్పదమును మంటిపాలు చేయనిమ్ము.
నిర్నిమిత్తముగా నన్ను బాధించినవారిని నేను సంరక్షించితిని గదా. (సెలా.)
యెహోవా, కోపము తెచ్చుకొని లెమ్ము
నా విరోధుల ఆగ్రహము నణచుటకై లెమ్ము
నన్ను ఆదుకొనుటకై మేల్కొనుము
న్యాయవిధిని నీవు నియమించియున్నావు గదా.
జనములు సమాజముగా కూడి నిన్ను చుట్టుకొనునప్పుడు
వారికి పైగా పరమందు ఆసీనుడవు కమ్ము.
యెహోవా జనములకు తీర్పు తీర్చువాడు
యెహోవా, నా నీతినిబట్టియు నా యథార్థతను బట్టియు నా విషయములో
నాకు న్యాయము తీర్చుము.
హృదయములను అంతరింద్రియములను
పరిశీలించు నీతిగల దేవా,
దుష్టుల చెడుతనము మాన్పుము
నీతిగలవారిని స్థిరపరచుము.
యథార్థ హృదయులను రక్షించు దేవుడే
నా కేడెమును మోయువాడై యున్నాడు.
న్యాయమునుబట్టి ఆయన తీర్పు తీర్చును 11
ఆయన ప్రతిదినము కోపపడు దేవుడు.
ఒకడును మళ్లనియెడల ఆయన తన ఖడ్గమును పదునుపెట్టును 12
తన విల్లు ఎక్కుపెట్టి దాని సిద్ధపరచి యున్నాడు
వానికొరకు మరణసాధనములను సిద్ధపరచి యున్నాడు 13
తన అంబులను అగ్నిబాణములుగా చేసియున్నాడు
పాపమును కనుటకు వాడు ప్రసవవేదనపడుచున్నాడు 14
చేటును గర్భమున ధరించినవాడై అబద్ధము కని యున్నాడు.
వాడు గుంట త్రవ్వి అది లోతుచేసి యున్నాడు 15
తాను త్రవ్విన గుంటలో తానే పడిపోయెను.
వాడు తలంచిన చేటు వాని నెత్తిమీదికే వచ్చును 16
వాడు యోచించిన బలాత్కారము వాని నడినెత్తి మీదనే పడును.
యెహోవా న్యాయము విధించువాడని నేను 17
ఆయనకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించెదను
సర్వోన్నతుడైన యెహోవా నామమును కీర్తించెదను.

8

ప్రధానగాయకునికి.

గిత్తీత్ రాగమునుబట్టి పాడదగినది.

దావీదు కీర్తన.

యెహోవా మా ప్రభువా, ఆకాశములలో నీ మహిమను కనుపరచువాడా
భూమియందంతట నీ నామము ఎంతో ప్రభావము గలది.
శత్రువులను పగతీర్చుకొనువారిని మాన్పివేయుటకై నీ విరోధులనుబట్టి బాలురయొక్కయు 2
చంటిపిల్లలయొక్కయు స్తుతుల మూలమున
నీవు ఒక దుర్గమును స్థాపించి యున్నావు.
నీ చేతిపనియైన నీ ఆకాశములను 3
నీవు కలుగజేసిన చంద్రనక్షత్రములను నేను చూడగా
నీవు వాని జ్ఞాపకము చేసికొనుటకు మనుష్యుడు ఏపాటివాడు? 4
నీవు దర్శనమిచ్చుటకు నరుడు ఏపాటివాడు?
దేవునికంటె వానిని కొంచెము తక్కువవానిగా చేసి యున్నావు 5
మహిమా ప్రభావములతో వానిని కిరీటము ధరింపజేసియున్నావు.

6 నీ చేతిపనులమీద వానికి అధికారమిచ్చియున్నావు.
7 గొఱ్ఱెలన్నిటిని ఎడ్లన్నిటిని
అడవి మృగములను ఆకాశపక్షులను సముద్రమత్స్యములను
సముద్రమార్గములలో సంచరించువాటినన్నిటిని
వాని పాదములక్రింద నీవు ఉంచియున్నావు.
యెహోవా మా ప్రభువా
భూమియందంతట నీ నామము ఎంత ప్రభావముగలది.

9

ప్రధానగాయకునికి.
ముత్లబ్బేను అను రాగముమీద పాడదగినది
దావీదు కీర్తన.

నా పూర్ణ హృదయముతో నేను యెహోవాను స్తుతించెదను
యెహోవా, నీ ఆశ్చర్యకార్యములన్నిటిని నేను వివరించెదను.
2 మహోన్నతుడా, నేను నిన్నుగూర్చి సంతోషించి హర్షించుచున్నాను
నీ నామమును కీర్తించెదను.
3 నీవు నా పక్షమున వ్యాజ్యమాడి నాకు న్యాయము తీర్చుచున్నావు
నీవు సింహాసనాసీనుడవై న్యాయమునుబట్టి తీర్పు తీర్చుచున్నావు
4 కాబట్టి నా శత్రువులు వెనుకకు మళ్లుదురు
నీ సన్నిధిని వారు జోగిపడి నశింతురు.
5 నీవు అన్యజనులను గద్దించియున్నావు దుష్టులను నశింపజేసియున్నావు
వారి పేరు ఎన్నటికి నుండకుండ తుడుపుపెట్టియున్నావు.
6 శత్రువులు నశించిరి వారు ఎన్నడు నుండకుండ నిర్మూలమైరి
నీవు పెల్లగించిన పట్టణములు స్మరణకు రాకుండ బొత్తిగా నశించెను.
7 యెహోవా శాశ్వతముగా సింహాసనాసీనుడై యున్నాడు
న్యాయము తీర్చుటకు ఆయన తన సింహాసనమును స్థాపించియున్నాడు
8 యెహోవా నీతినిబట్టి లోకమునకు తీర్పు తీర్చును
యథార్థతనుబట్టి ప్రజలకు న్యాయము తీర్చును.
9 నలిగినవారికి తాను మహా దుర్గమగును
ఆపత్కాలములలో వారికి మహా దుర్గమగును.
10 యెహోవా, నిన్ను ఆశ్రయించువారిని నీవు విడిచిపెట్టువాడవు కావు
కావున నీ నామమెరిగినవారు నిన్ను నమ్ముకొందురు

సీయోను వాసియైన యెహోవాను కీర్తించుడి
ఆయన క్రియలను ప్రజలలో ప్రచురముచేయుడి.
ఆయన రక్తాపరాధమునుగూర్చి విచారణచేయునప్పుడు బాధపరచబడువారిని జ్ఞాపకము చేసికొనును 12
వారి మొఱ్ఱను ఆయన మరువడు.
నేను నీ కీర్తి అంతటిని ప్రసిద్ధిచేయుచు 13
సీయోను కుమార్తె గుమ్మములలో
నీ రక్షణనుబట్టి హర్షించునట్లు
యెహోవా, నన్ను కరుణించుము.
మరణద్వారమున ప్రవేశించకుండ నన్ను ఉద్ధరించువాడా 14
నన్ను ద్వేషించువారు నాకు కలుగజేయు బాధను చూడుము.
తాము త్రవ్విన గుంటలో జనములు మునిగిపోయిరి 15
తాము ఒడ్డిన వలలో వారి కాలు చిక్కుబడియున్నది
యెహోవా ప్రత్యక్షమాయెను, ఆయన తీర్పు తీర్చియున్నాడు. 16
దుష్టులు తాము చేసికొనినదానిలో చిక్కియున్నారు. (హిగ్గాయోన్ సెలా.)
దుష్టులును దేవుని మరచు జనులందరును 17
పాతాళమునకు దిగిపోవుదురు.
దరిద్రులు నిత్యము మరువబడరు 18
బాధపరచబడువారి నిరీక్షణాస్పదము ఎన్నటికిని నశించదు.
యెహోవా లెమ్ము, నరులు ప్రబలక పోవుదురు గాక 19
నీ సన్నిధిని జనములు తీర్పు పొందుదురు గాక.
యెహోవా, వారిని భయపెట్టుము 20
తాము నరమాత్రులని జనులు తెలిసికొందురు గాక. (సెలా.)

యెహోవా, నీవెందుకు దూరముగా నిలుచుచున్నావు? 10
ఆపత్కాలములలో నీవెందుకు దాగియున్నావు?
దుష్టుడు గర్వించి దీనుని వడిగా తరుముచున్నాడు 2
వారు యోచించిన మోసక్రియలలో తామే చిక్కుబడుదురు గాక
దుష్టులు తమ మనోభిలాషనుబట్టి అతిశయపడుదురు 3
వారు యెహోవాను తృణీకరించి దోచుకొనువారిని దీవింతురు
దుష్టులు పొగరెక్కి యెహోవా విచారణ చేయడనుకొందురు 4

దేవుడు లేడని వారెల్లప్పుడు యోచించుదురు.
వారెల్లప్పుడు భయము మానుకొని ప్రవర్తింతురు
నీ న్యాయవిధులు ఉన్నతమైనవై వారి దృష్టికి అందకుండును.
వారు తమ శత్రువులనందరిని చూచి తిరస్కరింతురు.
— మేము కదల్చబడము, తరతరములవరకు ఆపద చూడము
అని వారు తమ హృదయములలో అనుకొందురు
వారి నోరు శాపముతోను కపటముతోను వంచనతోను నిండియున్నది
వారి నాలుకక్రింద చేటును పాపమును ఉన్నవి.
తామున్న పల్లెలయందలి మాటుచోటులలో పొంచి యుందురు
చాటైన స్థలములలో నిరపరాధులను చంపుదురు
వారి కన్నులు నిరాధారులను పట్టుకొనవలెనని పొంచి చూచును.
గుహలోని సింహమువలె వారు చాటైన స్థలములలో పొంచి యుందురు
బాధపడువారిని పట్టుకొన పొంచి యుందురు
బాధపడువారిని తమ వలలోకి లాగి పట్టుకొందురు.
కాగా నిరాధారులు నలిగి వంగుదురు
వారి బలాత్కారమువలన నిరాధారులు కూలుదురు.
—దేవుడు మరచిపోయెను
ఆయన విముఖుడై యెప్పుడును చూడకుండును అని వారు తమ హృదయములలో అనుకొందురు.
యెహోవా లెమ్ము, దేవా బాధపడువారిని మరువక నీ చెయ్యి యెత్తుము.
దుష్టులు దేవుని తృణీకరించుట యేల? నీవు విచారణచేయవని వారు తమ హృదయములలో అనుకొనుట యేల?
నీవు దీని చూచి యున్నావు గదా, వారికి ప్రతికారము చేయుటకై
నీవు చేటును పగను కనిపెట్టి చూచుచున్నావు.
నిరాధారులు తమ్మును నీకు అప్పగించుకొందురు
తండ్రిలేనివారికి నీవే సహాయుడవై యున్నావు.
దుష్టుల భుజమును విరుగగొట్టుము
చెడ్డవారి దుష్టత్వము కనబడకపోవునట్లు దానిగూర్చి విచారణ చేయుము.
యెహోవా నిరంతరము రాజై యున్నాడు
ఆయన దేశములోనుండి అన్యజనులు నశించిపోయిరి.
యెహోవా లోకులు ఇకను భయకారణులు కాకుండునట్లు
బాధపడువారి కోరికను నీవు విని యున్నావు
తండ్రిలేనివారికిని నలిగినవారికిని న్యాయము తీర్చుటకై 18
నీవు వారి హృదయమును స్థిరపరచితివి చెవియొగ్గి ఆలకించితివి.

## 11

ప్రధానగాయకునికి.
దావీదు కీర్తన.

యెహోవా శరణుజొచ్చియున్నాను
—పక్షీ, నీ కొండకు ఎగురపొమ్ము
అని మీరు నాతో చెప్పుట యేల?
దుష్టులు విల్లెక్కుపెట్టియున్నారు 2
చీకటిలో యథార్థహృదయులమీద వేయుటకై
తమ బాణములు నారియందు సంధించి యున్నారు
పునాదులు పాడైపోగా 3
నీతిమంతులేమి చేయగలరు?
యెహోవా తన పరిశుద్ధాలయములో ఉన్నాడు 4
యెహోవా సింహాసనము ఆకాశమందున్నది
ఆయన నరులను కన్నులార చూచుచున్నాడు
తన కనుదృష్టిచేత ఆయన వారిని పరిశీలించుచున్నాడు.
యెహోవా నీతిమంతులను పరిశీలించును 5
దుష్టులును బలాత్కారాసక్తులును ఆయనకు అసహ్యులు.
దుష్టులమీద ఆయన ఉరులు కురిపించును 6
అగ్నిగంధకములును వడగాలియు
వారికి పానీయభాగమగును.
యెహోవా నీతిమంతుడు, ఆయన నీతిని ప్రేమించువాడు 7
యథార్థవంతులు ఆయన ముఖదర్శనము చేసెదరు.

## 12

ప్రధానగాయకునికి.
అష్టమశ్రుతిమీద పాడదగినది.
దావీదు కీర్తన

యెహోవా నన్ను రక్షింపుము, భక్తిగలవారు లేకపోయిరి
విశ్వాసులు నరులలో నుండకుండ గతించిపోయిరి.
అందరు ఒకరితో నొకరు అబద్ధములాడుదురు 2
మోసకరమైన మనస్సుగలవారై ఇచ్చకములాడు పెదవులతో పలుకుదురు.
యెహోవా ఇచ్చకములాడు పెదవులన్నిటిని 3
బింకములాడు నాలుకలన్నిటిని కోసివేయును.
—మా నాలుకలచేత మేము సాధించెదము 4
మా పెదవులే మాకు సహకారులు, మాకు ప్రభువు ఎవడని వారనుకొందురు.
—బాధపడువారికి చేయబడిన బలాత్కారమును బట్టియు 5

దరిద్రుల నిట్టూర్పులనుబట్టియు నేనిప్పుడే లేచె
దను
రక్షణను కోరుకొనువారికి నేను రక్షణ కలుగ
జేసెదను అని
యెహోవా సెలవిచ్చుచున్నాడు.
6 యెహోవా మాటలు పవిత్రమైనవి
అవి మట్టిమూసలో ఏడు మారులు కరిగి ఊదిన
వెండి అంత పవిత్రములు.
7 యెహోవా, నీవు దరిద్రులను కాపాడెదవు
ఈ తరమువారి చేతిలోనుండి వారిని నిత్యము
రక్షించెదవు.
8 నరులలో నీచవర్తన ప్రబలమైనప్పుడు
దుష్టులు గర్విష్ఠులై నలుదిక్కుల తిరుగులాడుదురు.

## 13

ప్రధానగాయకునికి.
దావీదు కీర్తన.

యెహోవా, ఎన్నాళ్లవరకు నన్ను మరచి
పోదువు? నిత్యము మరచెదవా?
నాకెంతకాలము విముఖుడవై యుందువు?
2 ఎంతవరకు నా మనస్సులో నేను చింతపడుదును?
ఎంతవరకు నా హృదయములో పగలంతయు
దుఃఖాక్రాంతుడనై యుందును?
ఎంతవరకు నా శత్రువు నామీద తన్ను హెచ్చించు
కొనును?
3 యెహోవా నా దేవా, నామీద దృష్టి యుంచి
నా కుత్తరమిమ్ము
4 నేను మరణనిద్ర నొందకుండను — వాని గెలిచితి
నని నా శత్రువు చెప్పుకొనకుండను
నేను తూలిపోయి యుండగా నా విరోధులు
హర్షింపకుండను
నా కన్నులకు వెలుగిమ్ము.
5 నేనైతే నీ కృపయందు నమ్మిక యుంచి యున్నాను
నీ రక్షణవిషయమై నా హృదయము హర్షించు
చున్నది
యెహోవా నాకు మహోపకారములు చేసి
యున్నాడు
నేను ఆయనను కీర్తించెదను.

## 14

ప్రధానగాయకునికి.
దావీదు కీర్తన.

— దేవుడు లేడని బుద్ధిహీనులు తమ హృదయ
ములో అనుకొందురు.
వారు దుష్టవర్తనులై అసహ్యకార్యములు చేయు
దురు
మేలుచేయు వాడొకడును లేడు.
2 వివేకియై దేవుని వెదకువాడు కలడేమో అని
యెహోవా ఆకాశమునుండి చూచి నరులను
పరిశీలించెను
వారందరు దారి తొలగి బొత్తిగా చెడియున్నారు 3
మేలుచేయువారెవరును లేరు ఒక్కడైనను లేడు.
యెహోవాకు ప్రార్థన చేయక ఆహారము మ్రింగు 4
నట్లు నా ప్రజలను మ్రింగుచు
పాపము చేయువారికందరికిని తెలివి లేదా?
దేవుడు నీతిమంతుల సంతానము పక్షమున 5
నున్నాడు
గనుక పాపము చేయువారు బహుగా భయపడు
దురు.
బాధపడువారి ఆలోచనను మీరు తృణీకరించు 6
దురు
అయినను యెహోవా వారికి ఆశ్రయమై యు
న్నాడు.
సీయోనులోనుండి ఇశ్రాయేలుకు రక్షణ కలుగును 7
గాక
యెహోవా చెరలోని తన ప్రజలను రప్పించు
నప్పుడు యాకోబు హర్షించును ఇశ్రాయేలు
సంతోషించును.

## 15

దావీదు కీర్తన.

యెహోవా, నీ గుడారములో అతిథిగా ఉండ
దగినవాడెవడు?
నీ పరిశుద్ధ పర్వతముమీద నివసింపదగినవాడెవడు?
యథార్థమైన ప్రవర్తన గలిగి నీతి ననుసరించుచు 2
హృదయపూర్వకముగా నిజము పలుకువాడే.
అట్టివాడు నాలుకతో కొండెములాడడు, తన 3
చెలికానికి కీడు చేయడు
తన పొరుగువానిమీద నింద మోపడు
వాని దృష్టికి నీచుడు అసహ్యుడు 4
అతడు యెహోవాయందు భయభక్తులు గల
వారిని సన్మానించును
అతడు ప్రమాణముచేయగా నష్టము కలిగినను
మాట తప్పడు.
తన ద్రవ్యము వడ్డికియ్యడు 5
నిరపరాధిని చెరుపుటకై లంచము పుచ్చుకొనడు
ఈ ప్రకారము చేయువాడు ఎన్నడును కదల్చ
బడడు.

## 16

దావీదు రసికకావ్యము.

దేవా, నీ శరణుజొచ్చియున్నాను నన్ను కాపా
డుము.
— నీవే ప్రభుడవు నీకంటె నాకు క్షేమాధారమేది 2
యు లేదని యెహోవాతో నేను మనవి
చేయుదును
నేనిలాగందును — భూమిమీదనున్న భక్తులే 3
శ్రేష్ఠులు; వారు నాకు కేవలము ఇష్టులు.
యెహోవాను విడిచి వేరొకని అనుసరించువారికి 4
శ్రమలు విస్తరించును.

వారర్పించు రక్త పానీయార్పణములు నేనర్పింపను
వారి పేళ్లు నా పెదవుల నెత్తను.
యెహోవా నా స్వాస్థ్యభాగము నా పానీయ
భాగము
నీవే నా భాగమును కాపాడుచున్నావు.
మనోహర స్థలములలో నాకు పాలు ప్రాప్తించెను
శ్రేష్ఠమైన స్వాస్థ్యము నాకు కలిగెను.
నాకు ఆలోచనకర్తయైన యెహోవాను స్తుతిం
చెదను
రాత్రిగడియలలో నా అంతరింద్రియము నాకు
బోధించుచున్నది.
సదాకాలము యెహోవాయందు నా గురి నిలుపు
చున్నాను.
ఆయన నా కుడి పార్శ్వమందు ఉన్నాడు గనుక
నేను కదల్చబడను.
పాతాళమునకు నీవు నన్ను అప్పగింపవు
నీవు నీ భక్తుని గోతిని[1] చూడనీయవు
అందువలన నా హృదయము సంతోషించుచున్నది
నా ఆత్మ[2] హర్షించుచున్నది
నా శరీరముకూడ సురక్షితముగా నివసించుచున్నది
జీవమార్గమును నీవు నాకు తెలియజేసెదవు
నీ సన్నిధిని సంపూర్ణసంతోషము కలదు
నీ కుడిచేతిలో నిత్యము సుఖములు కలవు.

7 దావీదు ప్రార్థన.

యెహోవా, న్యాయపక్షమును ఆలకించుము
నా మొఱ్ఱ నంగీకరించుము
నా ప్రార్థనకు చెవియొగ్గుము, అది కపటమైన
పెదవులనుండి వచ్చునది కాదు.
2 నీ సన్నిధినుండి నాకు తీర్పు వచ్చును గాక
నీ కనుదృష్టి న్యాయముగా చూచును.
3 రాత్రివేళ నీవు నన్ను దర్శించి నా హృదయమును
పరిశీలించితివి
నన్ను పరిశోధించితివి, నీకు ఏ దురాలోచనయు
కానరాలేదు
నోటిమాటచేత నేను అతిక్రమింపను
4 మనుష్యుల కార్యముల విషయమైతే
బలాత్కారుల మార్గములు తప్పించుకొనుటకై
నీ నోటిమాటనుబట్టి నన్ను నేను కాపాడుకొని
యున్నాను.
5 నీ మార్గములయందు నా నడకలను స్థిరపరచుకొని
యున్నాను
నాకు కాలు జారలేదు.
6 నేను నీకు మొఱ్ఱపెట్టుకొనియున్నాను
దేవా నీవు నాకుత్తరమిచ్చెదవు
నాకు చెవియొగ్గి నా మాట ఆలకించుము.

నీ శరణుజొచ్చినవారిని వారిమీదికి లేచువారి 7
చేతిలోనుండి నీ కుడిచేత రక్షించువాడా,
నీ కృపాతిశయములను చూపుము.
ఒకడు తన కనుపాపను కాపాడుకొనునట్లు నన్ను 8
కాపాడుము 9
నన్ను లయపరచగోరు దుష్టులను పోగొట్టి కాపా
డుము
నన్ను చుట్టుకొను నా ప్రాణశత్రువులచేత చిక్క
కుండను
నీ రెక్కల నీడక్రింద నన్ను దాచుము.
వారు తమ హృదయమును కఠినపరచుకొని యు 10
న్నారు
వారి నోరు గర్వముగా మాటలాడును.
మా అడుగుజాడలను గురుతుపట్టి వారిప్పుడు మమ్ము 11
చుట్టుకొని యున్నారు
మమ్మును నేలను కూల్చుటకు గురిచూచుచున్నారు.
వారు చీల్చుటకు ఆతురపడు సింహమువలెను 12
చాటైన స్థలములలో పొంచు కొదమసింహము
వలెను ఉన్నారు.
యెహోవా లెమ్ము, వాని నెదుర్కొని వాని పడ 13
గొట్టుము
దుష్టునిచేతిలోనుండి నీ ఖడ్గముచేత నన్ను రక్షిం
పుము
లోకులచేతిలోనుండి 14
ఈ జీవితకాలములోనే తమ పాలు పొందిన యీ
లోకుల చేతిలోనుండి
నీ హస్తబలముచేత నన్ను రక్షింపుము.
నీవు నీ దానములతో వారి కడుపు నింపుచున్నావు
వారు కుమారులు కలిగి తృప్తినొందుదురు
తమ ఆస్తిని తమ పిల్లలకు విడిచిపెట్టుదురు.
నేనైతే నీతిగలవాడనై నీ ముఖదర్శనముచేసెదను 15
నేను మేల్కొనునప్పుడు నీ స్వరూపదర్శనముతో
నా ఆశను తీర్చుకొందును.

18 ప్రధానగాయకునికి.

యెహోవా దాసుడైన దావీదు కీర్తన.
అతని శత్రువులందరి చేతిలోనుండియు సౌలు చేతిలోనుండియు
యెహోవా అతని తప్పించిన దినమున దావీదు
ఈ గీతవాక్యములను చెప్పి యెహోవాను
స్తోత్రించి అతడు ఇట్లనెను.

యెహోవా నా బలమా, నేను నిన్ను ఎంతో
ప్రేమించుచున్నాను.
యెహోవా నా శైలము నా కోట నన్ను 2
రక్షించువాడు
నా కేడెము నా రక్షణ శృంగము నా ఉన్నత
దుర్గము నా దేవుడు

1 లేక, కుళ్లును. 2 మూలభాషలో: మహిమ.

నేను ఆశ్రయించియున్న నా దుర్గము.
3 కీర్తనీయుడైన యెహోవాకు నేను మొఱ్ఱపెట్టగా
ఆయన నా శత్రువులచేతిలోనుండి నన్ను రక్షించును.
4 మరణ పాశములు నన్ను చుట్టుకొనగను
భక్తిహీనులు వరదపొర్లువలె నామీద పడి బెదరింపగను
5 పాతాళపు పాశములు నన్ను అరికట్టగను
మరణపు ఉరులు నన్ను ఆవరింపగను
6 నా శ్రమలో నేను యెహోవాకు మొఱ్ఱపెట్టితిని
నా దేవునికి ప్రార్థన చేసితిని
ఆయన తన ఆలయములో ఆలకించి నా ప్రార్థన నంగీకరించెను
నా మొఱ్ఱ ఆయన సన్నిధిని చేరి ఆయన చెవుల జొచ్చెను.
7 అప్పుడు భూమి కంపించి అదిరెను
పర్వతముల పునాదులు వణకెను
ఆయన కోపింపగా అవి కంపించెను.
8 ఆయన నాసికారంధ్రములనుండి పొగ పుట్టెను
ఆయన నోటనుండి అగ్ని వచ్చి దహించెను
నిప్పుకణములు రాజబెట్టెను.
9 మేఘములను వంచి ఆయన వచ్చెను
ఆయన పాదములక్రింద గాఢాంధకారము కమ్మియుండెను.
10 కెరూబుమీద ఎక్కి ఆయన యెగిరి వచ్చెను
గాలి రెక్కలమీద ప్రత్యక్షమాయెను.
11 గుడారమువలె అంధకారము తనచుట్టు వ్యాపింపజేసెను
జలాంధకారమును ఆకాశమేఘములను తనకు మాటుగా చేసికొనెను.
12 ఆయన సన్నిధి కాంతిలోనుండి మేఘములగుండ వడగండ్లును మండుచున్న నిప్పులును దాటిపోయెను.
13 యెహోవా ఆకాశమందు గర్జనచేసెను
సర్వోన్నతుడు తన ఉరుముధ్వని పుట్టించెను
వడగండ్లును మండుచున్న నిప్పులును రాలెను.
14 ఆయన తన బాణములు ప్రయోగించి శత్రువులను చెదరగొట్టెను
మెరుపులు మెండుగా మెరిపించి వారిని ఓడగొట్టెను.
15 యెహోవా, నీ నాసికారంధ్రముల ఊపిరిని నీవు విడిగా విడువగా
నీ గద్దింపుకు మహాసముద్రపు అడుగుభాగములు కనబడెను
పునాదులు బయలుపడెను.

ఉన్నతస్థలమునుండి చెయ్యి చాపి ఆయన నన్ను పట్టుకొనెను 16
నన్ను పట్టుకొని మహా జలరాసులలోనుండి తీసెను.
బలవంతులగు పగవారు నన్ను ద్వేషించువారు 17
నాకంటె బలిష్ఠులై యుండగా
వారి వశమునుండి ఆయన నన్ను రక్షించెను.
ఆపత్కాలమందు వారు నామీదికి రాగా 18
యెహోవా నన్ను ఆదుకొనెను.
విశాలమైన స్థలమునకు ఆయన నన్ను తోడుకొని వచ్చెను 19
నేను ఆయనకు ఇష్టుడను గనుక ఆయన నన్ను తప్పించెను.
నా నీతినిబట్టి యెహోవా నాకు ప్రతిఫలమిచ్చెను 20
నా నిర్దోషత్వమునుబట్టి నాకు ప్రతిఫలమిచ్చెను.
యెహోవా మార్గములను అనుసరించుచున్నాను
భక్తిహీనుడనై నేను నా దేవుని విడిచినవాడను కాను 21
ఆయన న్యాయవిధులన్నిటిని నేను లక్ష్యపెట్టుచున్నాను 22
ఆయన కట్టడలను త్రోసివేసినవాడను కాను.
దోషక్రియలు నేను చేయనొల్లకుంటిని గనుక 23
ఆయన దృష్టికి నేను యథార్థుడనైతిని.
కావున యెహోవా నేను నిర్దోషిగానుండుట చూచి 24
తన దృష్టికి కనబడిన నా నిర్దోషత్వమునుబట్టి నాకు ప్రతిఫలమిచ్చెను.
దయగలవారియెడల నీవు దయచూపించుదువు 25
యథార్థవంతులయెడల యథార్థవంతుడవుగా నుందువు.
సద్భావముగలవారియెడల నీవు సద్భావము చూపుదువు. 26
మూర్ఖులయెడల నీవు కపటముగా నుందువు
శ్రమపడువారిని నీవు రక్షించెదవు 27
గర్విష్ఠులకు విరోధివై వారిని అణచివేసెదవు.
నా దీపము వెలిగించువాడవు నీవే 28
నా దేవుడైన యెహోవా చీకటిని నాకు వెలుగుగా చేయును
నీ సహాయమువలన నేను సైన్యములను జయింతును 29
నా దేవుని సహాయమువలన ప్రాకారమును దాటుదును.
దేవుడు యథార్థవంతుడు 30
యెహోవా వాక్కు నిర్మలము
తన శరణుజొచ్చు వారికందరికి ఆయన కేడెము.
యెహోవా తప్ప దేవుడేడి? 31
మన దేవుడు తప్ప ఆశ్రయదుర్గమేది?

32 నాకు బలము ధరింపజేయువాడు ఆయనే
నన్ను యథార్థమార్గమున నడిపించువాడు ఆయనే.
33 ఆయన నా కాళ్లు జింకల కాళ్లవలె చేయు
చున్నాడు
ఎత్తయిన స్థలములమీద నన్ను నిలుపుచున్నాడు.
34 నా చేతులకు యుద్ధముచేయ నేర్పువాడు ఆయనే
నా బాహువులు ఇత్తడి విల్లును ఎక్కుపెట్టును.
35 నీ రక్షణ కేడెమును నీవు నాకందించుచున్నావు
నీ కుడిచెయ్యి నన్ను ఆదుకొనెను.
నీవు నా మనవి నాలకించి నన్ను గొప్పచేయుదువు.
36 నా పాదములకు చోటు విశాలపరచుదువు
నా చీలమండలు బెణకవు.
37 నా శత్రువులను తరిమి పట్టుకొందును
వారిని నశింపజేయువరకు నేను తిరుగను.
38 వారు నా పాదములక్రింద పడుదురు
వారు లేవలేకపోవునట్లు నేను వారిని అణగ
ద్రొక్కుదును
39 యుద్ధమునకు నీవు నన్ను బలము ధరింపజేసితివి
నా మీదికి లేచినవారిని నా క్రింద అణచివేసితివి
40 నా శత్రువులను వెనుకకు నీవు మళ్లచేసితివి
నన్ను ద్వేషించువారిని నేను నిర్మూలము చేసితిని
41 వారు మొఱ్ఱపెట్టుదురు గాని రక్షించువాడు
లేకపోయెను
యెహోవాకు వారు మొఱ్ఱపెట్టుదురు గాని
ఆయన వారి కుత్తరమియ్యకుండును.
42 అప్పుడు గాలికి ఎగురు ధూళివలె నేను వారిని
పొడిగా కొట్టితిని
వీధుల పెంటను ఒకడు పారబోయునట్లు నేను
వారిని పారబోసితిని.
43 ప్రజలు చేయు కలహములలో పడకుండ నీవు
నన్ను విడిపించుదువు
నన్ను అన్యజనులకు అధికారిగా చేయుదువు
నేను ఎరుగని ప్రజలు నన్ను సేవించెదరు
44 నా మాట చెవినిపడగానే వారు నాకు విధేయు
లగుదురు
అన్యులు నాకు లోబడినట్లు నటించుదురు
45 అన్యులు నిస్త్రాణగలవారై వణకుచు
తమ దుర్గములను విడిచి వచ్చెదరు.
46 యెహోవా జీవముగలవాడు
నా ఆశ్రయదుర్గమైనవాడు స్తోత్రార్హుడు
నా రక్షణకర్తయయిన దేవుడు బహుగా స్తుతి
నొందును గాక.
47 ఆయన నా నిమిత్తము ప్రతిదండన చేయు దేవుడు
జనములను నాకు లోపరచువాడు ఆయనే.
48 ఆయన నా శత్రువులచేతిలోనుండి నన్ను విడి
పించును.
నామీదికి లేచువారికంటె ఎత్తుగా నీవు నన్ను
హెచ్చించుదువు
బలాత్కారముచేయు మనుష్యుల చేతిలోనుండి
నీవు నన్ను విడిపించుదువు
నీవు నియమించిన రాజుకు గొప్ప రక్షణ కలుగ 49
జేయువాడవనియు
అభిషేకించిన దావీదుకును అతని సంతానము
నకును నిత్యము కనికరము చూపువాడవనియు
యెహోవా అన్యజనులలో నేను నిన్ను ఘన 50
పరచెదను
నీ నామకీర్తన గానము చేసెదను.

## 19

ప్రధానగాయకునికి.
దావీదు కీర్తన.

ఆకాశములు దేవుని మహిమను వివరించుచున్నవి
అంతరిక్షము ఆయన చేతిపనిని ప్రచురపరచు
చున్నది.
పగటికి పగలు బోధచేయుచున్నది 2
రాత్రికి రాత్రి జ్ఞానము తెలుపుచున్నది.
వాటికి భాషలేదు మాటలులేవు వాటి స్వరము 3
వినబడదు.
వాటి కొలనూలు భూమియందంతట వ్యాపించి 4
యున్నది
లోకదిగంతములవరకు వాటి ప్రకటనలు బయలు
వెళ్లుచున్నవి.
వాటిలో ఆయన సూర్యునికి గుడారము వేసెను.
అతడు తన అంతఃపురములోనుండి బయలుదేరు 5
పెండ్లి కుమారునివలె ఉన్నాడు
శూరుడు పరుగెత్త నుల్లసించునట్లు తన పథము
నందు పరుగెత్త నుల్లసించుచున్నాడు.
అతడు ఆకాశమున ఈ దిక్కునుండి బయలుదేరి 6
ఆ దిక్కువరకు దాని చుట్టు తిరిగి వచ్చు
చున్నాడు
అతని వేడిమికి మరుగైనది ఏదియు లేదు.
యెహోవా నియమించిన ధర్మశాస్త్రము యథార్థ 7
మైనది
అది ప్రాణమును తెప్పరిల్లజేయును
యెహోవా శాసనము నమ్మదగినది
అది బుద్ధిహీనులకు జ్ఞానము పుట్టించును.
యెహోవా ఉపదేశములు నిర్దోషమైనవి అవి 8
హృదయమును సంతోషపరచును
యెహోవా ఏర్పరచిన ధర్మము నిర్మలమైనది అది
కన్నులకు వెలుగిచ్చును.
యెహోవాయందైన భయము పవిత్రమైనది అది 9
నిత్యము నిలుచును
యెహోవా న్యాయవిధులు సత్యమైనవి అవి
కేవలము న్యాయమైనవి.

10 అవి బంగారుకంటెను విస్తారమైన మేలిమి బం
గారుకంటెను కోరదగినవి
తేనెకంటెను జుంటితేనెధారలకంటెను మధుర
మైనవి.
11 వాటివలన నీ సేవకుడు హెచ్చరిక నొందును
వాటిని గైకొనుటవలన గొప్ప లాభము కలుగును.
12 తన పొరపాటులు కనుగొనగలవాడెవడు?
నేను రహస్యముగా చేసిన తప్పులు క్షమించి
నన్ను నిర్దోషినిగా తీర్చుము.
13 దురభిమానపాపములలో పడకుండ నీ సేవకుని
ఆపుము వాటిని నన్ను ఏలనియ్యకుము
అప్పుడు నేను యథార్థవంతుడనై అధిక ద్రోహము
చేయకుండ నిందారహితుడనగుదును.
14 యెహోవా, నా ఆశ్రయదుర్గమా, నా విమో
చకుడా,
నా నోటి మాటలును నా హృదయ ధ్యానమును
నీ దృష్టికి అంగీకారములగును గాక.

20

ప్రధానగాయకునికి.

దావీదు కీర్తన.

ఆపత్కాలమందు యెహోవా నీకుత్తరమిచ్చు
గాక
యాకోబు దేవుని నామము నిన్ను ఉద్ధరించును
గాక.
2 పరిశుద్ధస్థలములోనుండి ఆయన నీకు సహాయము
చేయును గాక
సీయోనులోనుండి నిన్ను ఆదుకొనును గాక.
3 ఆయన నీ నైవేద్యములన్నిటిని జ్ఞాపకము చేసి
కొనును గాక
నీ దహనబలులను అంగీకరించును గాక.
4 నీ కోరికను సిద్ధింపజేసి
నీ ఆలోచన యావత్తును సఫలపరచును గాక.
5 (యెహోవా) నీ రక్షణనుబట్టి మేము జయోత్సా
హము చేయుచున్నాము
మా దేవుని నామమునుబట్టి మా ధ్వజము ఎత్తు
చున్నాము
నీ ప్రార్థనలన్నియు యెహోవా సఫలపరచును
గాక.
6 యెహోవా తన అభిషిక్తుని రక్షించునని నా
కిప్పుడు తెలియును
రక్షణార్థమైన తన దక్షిణహస్తబలము చూపును
తన పరిశుద్ధాకాశములోనుండి అతని కుత్తర
మిచ్చును.
7 కొందరు రథములనుబట్టియు కొందరు గుఱ్ఱము
లనుబట్టియు అతిశయపడుదురు
మనమైతే మన దేవుడైన యెహోవా నామ
మునుబట్టి అతిశయపడుదము.

వారు క్రుంగి నేలమీద పడియున్నారు, మనము 8
లేచి చక్కగా నిలుచుచున్నాము.
యెహోవా, రక్షింపుము 9
మేము మొఱ్ఱపెట్టునపుడు రాజు మాకుత్తర
మిచ్చును గాక.

21

ప్రధానగాయకునికి.

దావీదు కీర్తన.

యెహోవా, రాజు నీ బలమునుబట్టి సంతోషిం
చుచున్నాడు
నీ రక్షణనుబట్టి అతడు ఎంతో హర్షించుచున్నాడు.
అతని మనోభీష్టము నీవు సఫలము చేయు 2
చున్నావు
అతని పెదవులలోనుండి వచ్చిన ప్రార్థన నీవు
మానక అంగీకరించుచున్నావు. (సెలా.)
శ్రేయస్కరమైన ఆశీర్వాదములతో నీవు అతనిని 3
ఎదుర్కొనుచున్నావు
అతని తలమీద అపరంజి కిరీటము నీవు ఉంచి
యున్నావు.
ఆయుస్సు నిమ్మని అతడు నిన్ను వరమడుగగా 4
నీవు దానిని అతనికనుగ్రహించి యున్నావు
సదాకాలము నిలుచు దీర్ఘాయువు నీవు దయచేసి
యున్నావు.
నీ రక్షణవలన అతనికి గొప్ప మహిమ కలిగెను 5
గౌరవ ప్రభావములను నీవు అతనికి ధరింపజేసి
యున్నావు.
నిత్యము ఆశీర్వాదకారకుడుగా నుండునట్లు 6
నీవతని నియమించి యున్నావు
నీ సన్నిధిని సంతోషముతో అతని నుల్లసింపజేసి
యున్నావు.
ఏలయనగా రాజు యెహోవాయందు నమ్మిక 7
యుంచుచున్నాడు
సర్వోన్నతుని కృపచేత అతడు కదలకుండ
నిలుచును.
నీ హస్తము నీ శత్రువులందరిని చిక్కించుకొనును 8
నీ దక్షిణహస్తము నిన్ను ద్వేషించువారిని చిక్కించు
కొనును.
నీవు ప్రత్యక్షమైనప్పుడు వారు అగ్నిగుండము 9
వలె అగుదురు
తన కోపమువలన యెహోవా వారిని నిర్మూ
లము చేయును
అగ్ని వారిని దహించును.
భూమిమీద నుండకుండ వారి గర్భఫలమును నీవు 10
నాశనము చేసెదవు
నరులలో నుండకుండ వారి సంతానమును నశింప
జేసెదవు.

11 వారు నీకు కీడు చేయవలెనని ఉద్దేశించిరి దురు
. పాయము పన్నిరి
కాని దానిని కొనసాగింప లేకపోయిరి.
12 నీవు వారిని వెనుకకు త్రిప్పివేసెదవు
నీ వింటి నారులను బిగించి వారిని ముఖముమీద
కొట్టుదువు.
13 యెహోవా, నీ బలమునుబట్టి నిన్ను హెచ్చించు
కొనుము
మేము గానముచేయుచు నీ పరాక్రమమును
కీర్తించెదము.

## 22

ప్రధానగాయకునికి.
అయ్యెలెత్ షహరు అను రాగముమీద పాడదగినది.
దావీదు కీర్తన.

నా దేవా నా దేవా, నీవు నన్నేల విడనాడితివి?
నన్ను రక్షింపక నా ఆర్తధ్వని వినక నీవేల దూర
ముగా నున్నావు?
2 నా దేవా, పగలు నేను మొఱ్ఱపెట్టుచున్నాను
రాత్రివేళను నేను మౌనముగా నుండుట లేదు
అయినను నీవు నా కుత్తరమియ్యకున్నావు.
3 నీవు ఇశ్రాయేలు చేయు స్తోత్రములమీద ఆసీను
డవై పరిశుద్ధ దేవుడవై యున్నావు.
4 మా పితరులు నీయందు నమ్మిక యుంచిరి
వారు నీయందు నమ్మిక యుంచగా నీవు వారిని
రక్షించితివి.
5 వారు నీకు మొఱ్ఱపెట్టి విడుదల నొందిరి
నీయందు నమ్మిక యుంచి సిగ్గు పడకపోయిరి.
6 నేను నరుడను కాను నేను పురుగును
నరులచేత నిందింపబడినవాడను ప్రజలచేత తృణీక
రింపబడినవాడను.
7 నన్ను చూచువారందరు పెదవులు విరిచి తల
ఆడించుచు నన్ను అపహసించుచున్నారు.
8 —యెహోవామీద నీ భారము మోపుము
ఆయన వాని విడిపించునేమో
వాడు ఆయనకు ఇష్టుడు గదా ఆయన వాని
తప్పించునేమో అందురు.
9 గర్భమునుండి నన్ను తీసినవాడవు నీవే గదా
నేను నా తల్లియొద్ద స్తన్యపానము చేయుచుండగా
నీవే గదా నాకు నమ్మిక పుట్టించితివి.
10 గర్భవాసినైనది మొదలుకొని నాకు ఆధారము నీవే
నా తల్లి నన్ను కన్నది మొదలుకొని నా దేవుడవు
నీవే.
11 శ్రమ వచ్చియున్నది సహాయము చేయువాడెవ
డును లేడు
నాకు దూరముగా నుండకుము.
12 వృషభములు అనేకములు నన్ను చుట్టుకొని
యున్నవి
బాషానుదేశపు బలమైన వృషభములు నన్ను ఆవ
రించి యున్నవి.
చీల్చుచును గర్జించుచునుండు సింహమువలె వారు 13
నోళ్లు తెరచుచున్నారు
నేను నీళ్లవలె పారబోయబడి యున్నాను 14
నా యెముకలన్నియు స్థానము తప్పియున్నవి
నా హృదయము నా అంతరంగమందు మైనము
వలె కరిగియున్నది.
నా బలము ఎండిపోయి చిల్లపెంకువలె ఆయెను 15
నా నాలుక నా దౌడను అంటుకొని యున్నది
నీవు నన్ను ప్రేతల భూమిలో పడవేసి యు
న్నావు.
కుక్కలు నన్ను చుట్టుకొని యున్నవి
దుర్మార్గులు గుంపుకూడి నన్ను ఆవరించి యున్నారు 16
వారు నా చేతులను నా పాదములను పొడిచి
యున్నారు.
నా యెముకలన్నియు నేను లెక్కింపగలను 17
వారు నిదానించుచు నన్ను తేరి చూచుచున్నారు
నా వస్త్రములు వారు పంచుకొనుచున్నారు 18
నా అంగీకొరకు చీట్లు వేయుచున్నారు.
యెహోవా, దూరముగా నుండకుము 19
నా బలమా, త్వరపడి నాకు సహాయము
చేయుము.
ఖడ్గమునుండి నా ప్రాణమును 20
కుక్కల బలమునుండి నా ప్రాణమును తప్పింపుము.
సింహపు నోటనుండి నన్ను రక్షింపుము 21
గురుపోతుల కొమ్ములలో పడకుండ నన్ను రక్షిం
పుము.
నీవు నాకుత్తరమిచ్చి యున్నావు 22
నీ నామమును నా సహోదరులకు ప్రచురపర
చెదను
సమాజమధ్యమున నిన్ను స్తుతించెదను.
యెహోవాయందు భయభక్తులు గలవారలారా, 23
ఆయనను స్తుతించుడి
యాకోబు వంశస్థులారా, మీరందరు ఆయనను
ఘనపరచుడి
ఇశ్రాయేలు వంశస్థులారా, మీరందరు ఆయనకు
భయపడుడి
ఆయన బాధపడువాని బాధను తృణీకరింపలేదు, 24
దాని చూచి ఆయన అసహ్యపడలేదు, అతనికి
తన ముఖమును దాచలేదు.
వాడాయనకు మొఱ్ఱపెట్టగా ఆయన ఆలకించెను.
మహా సమాజములో నిన్నుగూర్చి నేను కీర్తన 25
పాడెదను
ఆయనయందు భయ
మ్రొక్కు

26 దీనులు భోజనముచేసి తృప్తిపొందెదరు
యెహోవాను వెదకువారు ఆయనను స్తుతిం
చెదరు.
మీ హృదయములు తెప్పరిల్లి నిత్యము బ్రదుకును.
27 భూదిగంతముల నివాసులందరు జ్ఞాపకము చేసి
కొని యెహోవాతట్టు తిరిగెదరు
అన్యజనుల వంశస్థులందరు నీ సన్నిధిని నమస్కా
రము చేసెదరు.
28 రాజ్యము యెహోవాదే
అన్యజనులలో ఏలువాడు ఆయనే.
29 భూమిమీద వర్థిల్లుచున్నవారందరు అన్నపాన
ములు పుచ్చుకొనుచు నమస్కారము చేసెదరు.
తమ ప్రాణము కాపాడుకొనలేక మంటిపాలగు
వారందరు ఆయన సన్నిధిని మోకరించెదరు.
30 ఒక సంతతివారు ఆయనను సేవించెదరు
రాబోవుతరమునకు ప్రభువునుగూర్చి వివరింతురు.
31 వారు వచ్చి—ఆయన దీని చేసెనని పుట్టబోవు
ప్రజలకు తెలియజేతురు
ఆయన నీతిని వారికి ప్రచురపరతురు.

## 23

దావీదు కీర్తన.

**యె**హోవా నా కాపరి నాకు లేమి కలుగదు.
2 పచ్చికగల చోట్లను ఆయన నన్ను పరుండజేయు
చున్నాడు
శాంతికరమైన జలములయొద్ద నన్ను నడిపించు
చున్నాడు.
3 నా ప్రాణమునకు ఆయన సేదదీర్చుచున్నాడు
తన నామమునుబట్టి నీతిమార్గములలో నన్ను నడి
పించుచున్నాడు.
4 గాఢాంధకారపు లోయలో నేను సంచరించినను
ఏ అపాయమునకు భయపడను
నీవు నాకు తోడైయుందువు నీ దుడ్డుకఱ్ఱయు
నీ దండమును నన్ను ఆదరించును.
5 నా శత్రువులయెదుట నీవు నాకు భోజనము సిద్ధ
పరచుదువు
నూనెతో నా తల అంటియున్నావు
నా గిన్నె నిండి పొర్లుచున్నది.
6 నేను బ్రదుకు దినములన్నియు కృపాక్షేమములే
నావెంట వచ్చును
చిరకాలము యెహోవా మందిరములో నేను
నివాసము చేసెదను.

దావీదు కీర్తన.

**భూ**మియు దాని సంపూర్ణతయు
లోకమును దాని నివాసులును యెహోవావే.
2 ఆయన సముద్రములమీద దానికి పునాది వేసెను
ప్రవాహజలములమీద దాని స్థిరపరచెను.
యెహోవా పర్వతమునకు ఎక్కదగినవాడెవడు? 3
ఆయన పరిశుద్ధ స్థలములో నిలువదగినవాడెవడు?
వ్యర్థమైనదానియందు మనస్సు పెట్టకయు 4
కపటముగా ప్రమాణము చేయకయు
నిర్దోషమైన చేతులును శుద్ధమైన హృదయమును
కలిగియుండువాడే.
వాడు యెహోవావలన ఆశీర్వాదము నొందును 5
తన రక్షకుడైన దేవునివలన నీతిమత్త్వము నొందును.
ఆయన నాశ్రయించువారు 6
యాకోబు దేవా, నీ సన్నిధిని వెదకువారు అట్టి
వారే. (సెలా.)
గుమ్మములారా, మీ తలలు పైకెత్తికొనుడి 7
మహిమగల రాజు ప్రవేశించునట్లు పురాతనమైన
తలుపులారా, మిమ్మును లేవనెత్తికొనుడి.
మహిమగల యీ రాజు ఎవడు? 8
బలశౌర్యములుగల యెహోవా
యుద్ధశూరుడైన యెహోవా.
గుమ్మములారా, మీ తలలు పైకెత్తికొనుడి. 9
పురాతనమైన తలుపులారా,
మహిమగల రాజు ప్రవేశించునట్లు
మిమ్మును లేవనెత్తికొనుడి.
మహిమగల యీ రాజు ఎవడు? 10
సైన్యములకధిపతియగు యెహోవాయే.
ఆయనే యీ మహిమగల రాజు.

## 25

దావీదు కీర్తన.

**యె**హోవా, నా ఆత్మను నీ దిక్కుకు చూచి
యెత్తికొనుచున్నాను.
నా దేవా, నీయందు నమ్మిక యుంచి యున్నాను 2
నన్ను సిగ్గుపడనియ్యకుము
నా శత్రువులను నన్నుగూర్చి ఉత్సహింపనియ్య
కుము.
నీకొరకు కనిపెట్టువారిలో ఎవడును సిగ్గునొందడు. 3
హేతువులేకుండనే ద్రోహము చేయువారు సిగ్గు
నొందుదురు.
యెహోవా, నీ మార్గములను నాకు తెలియ 4
జేయుము
నీ త్రోవలను నాకు తేటపరచుము.
నన్ను నీ సత్యము ననుసరింపజేసి నాకు ఉపదేశము 5
చేయుము.
నీవే నా రక్షణకర్తవైన దేవుడవు
దినమెల్ల నీకొరకు కనిపెట్టుచున్నాను.
యెహోవా, నీ కరుణాతిశయములను జ్ఞాపకము 6
చేసికొనుము
నీ కృపాతిశయములను జ్ఞాపకము చేసికొనుము
అవి పూర్వమునుండి యున్నవే గదా.
నా బాల్యపాపములను నా అతిక్రమములను 7

జ్ఞాపకము చేసికొనకుము.
యెహోవా, నీ కృపనుబట్టి
నీ దయచొప్పున నన్ను జ్ఞాపకములో ఉంచు
కొనుము.
యెహోవా ఉత్తముడును యథార్థవంతుడునై
యున్నాడు
కావున తన మార్గమునుగూర్చి ఆయన పాపులకు
ఉపదేశించును.
న్యాయవిధులనుబట్టి ఆయన దీనులను నడిపించును
తన మార్గమును దీనులకు నేర్పును.
ఆయన చేసిన నిబంధనను ఆయన నియమించిన
శాసనములను గైకొనువారి విషయములో
యెహోవా త్రోవలన్నియు కృపాసత్యమయ
ములై యున్నవి
యెహోవా, నా పాపము బహు ఘోరమైనది
నీ నామమునుబట్టి దాని క్షమింపుము.
యెహోవాయందు భయభక్తులుగలవాడెవడో
వాడు కోరుకొనవలసిన మార్గమును ఆయన వానికి
బోధించును.
అతని ప్రాణము నెమ్మదిగా ఉండును
అతని సంతానము భూమిని స్వతంత్రించుకొనును.
యెహోవా మర్మము ఆయనయందు భయభక్తులు
గలవారికి తెలిసియున్నది
ఆయన తన నిబంధనను వారికి తెలియజేయును.
నా కనుదృష్టి యెల్లప్పుడు యెహోవావైపుకే
తిరిగియున్నది
ఆయన నా పాదములను వలలోనుండి విడిపిం
చును.
నేను ఏకాకిని బాధపడువాడను
నా వైపు తిరిగి నన్ను కరుణింపుము.
నా హృదయవేదనలు అతివిస్తారములు
ఇక్కట్టులలోనుండి నన్ను విడిపింపుము.
నా బాధను నా వేదనను కనుగొనుము
నా పాపములన్నిటిని క్షమింపుము.
నా శత్రువులను చూడుము, వారు అనేకులు
క్రూరద్వేషముతో వారు నన్ను ద్వేషించుచు
న్నారు.
నేను నీ శరణుజొచ్చి యున్నాను నన్ను సిగ్గుపడ
నియ్యకుము
నా ప్రాణమును కాపాడుము నన్ను రక్షింపుము.
నీకొరకు నేను కనిపెట్టుచున్నాను
యథార్థతయు నిర్దోషత్వమును నన్ను సంరక్షిం
చును గాక.
దేవా, వారి బాధలన్నిటిలోనుండి
ఇశ్రాయేలీయులను విమోచింపుము.

## 26

దావీదు కీర్తన.

యెహోవా, నేను యథార్థవంతుడనై ప్రవర్తించు
చున్నాను
నా పక్షముగా తీర్పు తీర్చుము
ఏమియు సందేహపడకుండ యెహోవాయందు
నేను నమ్మిక యుంచి యున్నాను.
యెహోవా, నన్ను పరిశీలించుము నన్ను పరీ 2
క్షించుము
నా అంతరింద్రియములను నా హృదయమును పరి
శోధించుము.
నీ కృప నా కన్నులయెదుట నుంచుకొని యు 3
న్నాను
నీ సత్యము ననుసరించి నడుచుకొనుచున్నాను
పనికిమాలినవారితో నేను సాంగత్యముచేయను 4
వేషధారులతో పొందుచేయను.
దుష్టుల సంఘము నాకు అసహ్యము 5
భక్తిహీనులతో సాంగత్యముచేయను.
నిర్దోషినని నా చేతులు కడుగుకొందును 6
యెహోవా, నీ బలిపీఠముచుట్టు ప్రదక్షిణము
చేయుదును.
అచ్చట కృతజ్ఞతాస్తుతులు చెల్లింతును. 7
నీ ఆశ్చర్యకార్యములను వివరింతును.
యెహోవా, నీ నివాసమందిరమును 8
నీ తేజోమహిమ నిలుచు స్థలమును నేను ప్రేమిం
చుచున్నాను.
పాపులతో నా ప్రాణమును చేర్చకుము 9
నరహంతకులతో నా జీవమును చేర్చకుము.
వారి చేతిలో దుష్కార్యములు కలవు 10
వారి కుడిచెయ్యి లంచములతో నిండియున్నది.
నేను యథార్థవంతుడనై నడుచుకొనుచున్నాను 11
నన్ను విమోచింపుము నన్ను కరుణింపుము.
సమభూమిలో నా పాదము నిలిపియున్నాను 12
సమాజములలో యెహోవాను స్తుతించెదను.

## 27

దావీదు కీర్తన.

యెహోవా నాకు వెలుగును రక్షణయునై
యున్నాడు నేను ఎవరికి భయపడుదును?
యెహోవా నా ప్రాణదుర్గము ఎవరికి వెరతును?
నా శరీరమాంసము తినుటకై దుష్టులు నామీదికి 2
వచ్చినప్పుడు
నన్ను బాధించు శత్రువులు నామీదికి వచ్చి
నప్పుడు వారు తొట్రిల్లి కూలిరి
నాతో యుద్ధము చేయుటకు దండు దిగినను 3
నా హృదయము భయపడదు
నామీదికి యుద్ధము రేగినను
దీనిలో నేను ధైర్యము విడువకుందును.
యెహోవాయొద్ద ఒక్క వరము అడిగితిని

దానిని నేను వెదకుచున్నాను.
యెహోవా ప్రసన్నతను చూచుటకును ఆయన ఆలయములో ధ్యానించుటకును
నా జీవితకాలమంతయు నేను యెహోవా మందిరములో నివసింప గోరుచున్నాను.
5 ఆపత్కాలమున ఆయన తన పర్ణశాలలో నన్ను దాచును
తన గుడారపు మాటున నన్ను దాచును
ఆశ్రయదుర్గముమీద ఆయన నన్ను ఎక్కించును.
6 ఇప్పుడు నన్ను చుట్టుకొనియున్న నా శత్రువుల కంటె ఎత్తుగా నా తల యెత్తబడును.
ఆయన గుడారములో నేను ఉత్సాహధ్వని చేయుచు బలులు అర్పించెదను
నేను పాడెదను యెహోవానుగూర్చి స్తుతిగానము చేసెదను.
7 యెహోవా, నేను కంఠధ్వని యెత్తి నిన్ను ప్రార్థించునప్పుడు నా మనవి ఆలకింపుము
కరుణజేసి నాకుత్తరమిమ్ము.
8 నా సన్నిధి వెదకుడని (నీవు సెలవియ్యగా)
—యెహోవా నీ సన్నిధి నేను వెదకెదనని
నా హృదయము నీతో అనెను.
9 నీ ముఖమును నాకు దాచకుము
కోపముచేత నీ సేవకుని తోలివేయకుము.
నా సహాయుడవు నీవే
రక్షణకర్తవగు నా దేవా, నన్ను దిగనాడకుము నన్ను విడువకుము.
10 నా తలిదండ్రులు నన్ను విడిచినను
యెహోవా నన్ను చేరదీయును.
11 యెహోవా, నీ మార్గమును నాకు బోధింపుము.
నాకొరకు పొంచియున్నవారిని చూచి
సరాళమైన మార్గమున నన్ను నడిపింపుము.
12 అబద్ధసాక్షులును క్రూరత్వము వెళ్లగ్రక్కువారును
నామీదికి లేచి యున్నారు.
నా విరోధుల యిచ్ఛకు నన్ను అప్పగింపకుము
13 సజీవుల దేశమున నేను యెహోవా దయను పొందుదునన్న నమ్మకము నాకు లేనియెడల నేనేమవుదును?
14 యెహోవాకొరకు కనిపెట్టుకొని యుండుము
ధైర్యము తెచ్చుకొని నీ హృదయమును నిబ్బరముగా నుంచుకొనుము
యెహోవాకొరకు కనిపెట్టుకొని యుండుము.

28

దావీదు కీర్తన.

యెహోవా, నేను నీకు మొఱ్ఱపెట్టుచున్నాను
నా ఆశ్రయదుర్గమా, మౌనముగా ఉండక నా మొఱ్ఱ ఆలకింపుము
నీవు మౌనముగా ఉండినయెడల
నేను సమాధిలోకి దిగువారివలె అగుదును.
నేను నీకు మొఱ్ఱపెట్టునప్పుడు
నీ పరిశుద్ధాలయము వైపుకు నా చేతుల నెత్తునప్పుడు
నా విజ్ఞాపన ధ్వని ఆలకింపుము.
భక్తిహీనులను పాపము చేయువారిని నీవు లాగివేయునట్లు నన్ను లాగివేయకుము.
వారు దుష్టాలోచన హృదయములో నుంచుకొని
తమ పొరుగువారితో సమాధానముగా మాటలాడుదురు
వారి క్రియలనుబట్టి వారి దుష్టక్రియలనుబట్టి వారికి ప్రతికారము చేయుము.
వారు చేసిన పనినిబట్టి వారికి ప్రతికారము చేయుము
వారికి తగిన ప్రతిఫలమిమ్ము.
యెహోవా కార్యములను వారు లక్ష్యపెట్టరు
ఆయన హస్తకృత్యములను వారు లక్ష్యపెట్టరు
కావున ఆయన వారిని వృద్ధిపరచక నిర్మూలము చేయును.
యెహోవా నా విజ్ఞాపనధ్వని ఆలకించి యున్నాడు
ఆయనకు స్తోత్రము కలుగు గాక.
యెహోవా నా ఆశ్రయము నా కేడెము 7
నా హృదయము ఆయనయందు నమ్మికయుంచెను గనుక
నాకు సహాయము కలిగెను.
కావున నా హృదయము ప్రహర్షించుచున్నది
కీర్తనలతో నేను ఆయనను స్తుతించుచున్నాను.
యెహోవా తన జనులకు ఆశ్రయము 8
ఆయన తన అభిషిక్తునికి రక్షణదుర్గము.
నీ జనులను రక్షింపుము నీ స్వాస్థ్యమును ఆశీర్వదింపుము 9
వారికి కాపరివై నిత్యము వారిని ఉద్ధరింపుము.

29

దావీదు కీర్తన

దైవపుత్రులారా, యెహోవాకు ఆరోపించుడి
ప్రభావ మాహాత్మ్యములను యెహోవాకు ఆరోపించుడి
యెహోవా నామమునకు చెందవలసిన ప్రభావమును ఆయనకు ఆరోపించుడి 2
ప్రతిష్ఠితములగు ఆభరణములను ధరించుకొని ఆయనయెదుట సాగిలపడుడి.
యెహోవా స్వరము జలములమీద వినబడుచున్నది 3
మహిమగల దేవుడు ఉరుమువలె గర్జించుచున్నాడు.

మహాజలములమీద యెహోవా సంచరించు
చున్నాడు.
4 యెహోవా స్వరము బలమైనది
యెహోవా స్వరము ప్రభావము గలది.
5 యెహోవా స్వరము దేవదారు వృక్షములను
విరచును
యెహోవా లెబానోను దేవదారు వృక్షములను
ముక్కలుగా విరచును.
6 దూడవలె అవి గంతులు వేయునట్లు ఆయన
చేయును
లెబానోనును షిర్యోనును గురుపోతు పిల్లవలె
గంతులువేయునట్లు ఆయన చేయును.
7 యెహోవా స్వరము అగ్నిజ్వాలలను ప్రజ్వలింప
జేయుచున్నది.
8 యెహోవా స్వరము అరణ్యమును కదిలించును
యెహోవా కాదేషు అరణ్యమును కదిలించును.
9 యెహోవా స్వరము లేళ్లను ఈనజేయును
అది అడవుల ఆకులు రాల్చును.
ఆయన ఆలయములో నున్నవన్నియు ఆయనకే
ప్రభావము అనుచున్నవి.
10 యెహోవా ప్రళయజలములమీద ఆసీను
డాయెను
యెహోవా నిత్యము రాజుగా ఆసీనుడై
యున్నాడు.
11 యెహోవా తన ప్రజలకు బలము ననుగ్ర
హించును
యెహోవా తన ప్రజలకు సమాధానము కలుగ
జేసి వారి నాశీర్వదించును.

30

గృహప్రతిష్ఠాపనగానము.
దావీదు కీర్తన.

యెహోవా, నా శత్రువులను నా విషయమై
సంతోషింపనియ్యక నీవు నన్నుద్ధరించి
యున్నావు
అందుకై నేను నిన్ను కొనియాడుచున్నాను.
2 యెహోవా నా దేవా,
నేను నీకు మొఱ్ఱపెట్టగా నీవు నన్ను స్వస్థపర
చితివి.
3 యెహోవా, పాతాళములోనుండి నా ప్రాణ
మును లేవదీసితివి
నేను సమాధిలోనికి దిగకుండ నీవు నన్ను బ్రదికిం
చితివి.
4 యెహోవా భక్తులారా, ఆయనను కీర్తించుడి
ఆయన పరిశుద్ధమైన జ్ఞాపకార్థ నామమునుబట్టి
ఆయనను స్తుతించుడి.
5 ఆయన కోపము నిమిషమాత్రముండును
ఆయన దయ ఆయుష్కాలమంతయు నిలుచును.

సాయంకాలమున ఏడ్పు వచ్చి రాత్రి వెళ్లబుచ్చును
ఉదయమున సంతోషము కలుగును.
—నేనెన్నడు కదలనని నా క్షేమకాలమున అను 6
కొంటిని.
యెహోవా, దయకలిగి నీవే నా పర్వతమును స్థిర 7
పరచితివి
నీ ముఖమును నీవు దాచుకొనినప్పుడు నేను క్షోభి
ల్లితిని.
యెహోవా, నీకే మొఱ్ఱపెట్టితిని 8
నా ప్రభువును బతిమాలుకొంటిని.
—నేను సమాధిలోనికి దిగినయెడల నా ప్రాణము 9
వలన ఏమి లాభము?
మన్ను నిన్ను స్తుతించునా? నీ సత్యమునుగూర్చి
అది వివరించునా?
యెహోవా, ఆలకింపుము నన్ను కరుణింపుము 10
యెహోవా, నాకు సహాయుడవై యుండుము.
నా ప్రాణము మౌనముగా నుండక నిన్ను కీర్తిం 11
చునట్లు
నా అంగలార్పును నీవు నాట్యముగా మార్చి
యున్నావు.
నీవు నా గోనెపట్ట విడిపించి సంతోషవస్త్రము నన్ను 12
ధరింపజేసియున్నావు
యెహోవా నా దేవా, నిత్యము నేను నిన్ను
స్తుతించెదను.

31

ప్రధానగాయకునికి.
దావీదు కీర్తన.

యెహోవా, నీ శరణుజొచ్చి యున్నాను
నన్నెన్నడును సిగ్గుపడనియ్యకుము
నీ నీతినిబట్టి నన్ను రక్షింపుము.
నాకు నీ చెవియొగ్గి నన్ను త్వరగా విడిపించుము 2
నన్ను రక్షించుటకు నాకు ఆశ్రయశైలముగాను
ప్రాకారముగల యిల్లుగాను ఉండుము.
నా కొండ నా కోట నీవే 3
నీ నామమునుబట్టి త్రోవ చూపి నన్ను నడి
పించుము
నా ఆశ్రయదుర్గము నీవే. 4
నన్ను చిక్కించుకొనుటకై శత్రువులు రహస్య
ముగా ఒడ్డిన వలలోనుండి నన్ను తప్పించుము.
నా ఆత్మను నీ చేతికప్పగించుచున్నాను 5
యెహోవా సత్యదేవా, నన్ను విమోచించు
వాడవు నీవే.
నేను యెహోవాను నమ్ముకొని యున్నాను 6
వ్యర్థమైన దేవతలను అనుసరించువారు నాకు అస
హ్యులు.
నీవు నా బాధను దృష్టించి యున్నావు 7
నా ప్రాణబాధలను నీవు కనిపెట్టి యున్నావు

కావున నీ కృపనుబట్టి నేను ఆనందభరితుడనై
సంతోషించెదను.
8 నీవు శత్రువులచేత నన్ను చెరపెట్టలేదు
విశాలస్థలమున నా పాదములు నిలువబెట్టితివి.
9 యెహోవా, నేను ఇరుకున పడియున్నాను నన్ను
కరుణింపుము
విచారమువలన నా కన్ను క్షీణించుచున్నది
నా ప్రాణము నా దేహము క్షీణించుచున్నవి
10 నా బ్రదుకు దుఃఖముతో వెళ్లబుచ్చుచున్నాను
నిట్టూర్పులు విడుచుటతో నా యేండ్లు గతించు
చున్నవి
నా దోషమునుబట్టి నా బలము తగ్గిపోవుచున్నది
నా యెముకలు క్షీణించుచున్నవి.
11 నా శత్రువులకందరికి నేను నిందాస్పదుడనై
యున్నాను
నా పొరుగువారికి విచారకారణముగా ఉన్నాను
నా నెళవరులకు భీకరుడనై యున్నాను
వీధిలో నన్ను చూచువారు నా యెదుటనుండి
పారిపోవుదురు.
12 మరణమై స్మరణకు రాకున్నవానివలె మరువబడితిని
ఓటికుండవంటివాడనైతిని.
13 అనేకులు నామీద దురాలోచనలు చేయు
చున్నారు
నాకు ప్రాణహాని చేయుటకు యోచించు
చున్నారు
వారు గుసగుసలాడుట నాకు వినబడుచున్నది.
నలుదిశలను నాకు భీతి కలుగుచున్నది.
14 యెహోవా, నీయందు నమ్మిక యుంచియున్నాను
—నీవే నా దేవుడవని నేను అనుకొనుచున్నాను.
15 నా కాలగతులు నీ వశములో నున్నవి.
నా శత్రువుల చేతిలోనుండి నన్ను రక్షింపుము
నన్ను తరుమువారినుండి నన్ను రక్షింపుము.
16 నీ సేవకునిమీద నీముఖకాంతి ప్రకాశింపజేయుము
నీ కృపచేత నన్ను రక్షింపుము.
17 యెహోవా, నీకు మొఱ్ఱపెట్టియున్నాను నన్ను
సిగ్గునొందనియ్యకుము
భక్తిహీనులు సిగ్గుపడుదురు గాక పాతాళమునందు
వారు మౌనులై యుందురు గాక
18 అబద్ధికుల పెదవులు మూయబడును గాక.
వారు గర్వమును అసహ్యమును అగపరచుచు నీతి
మంతులమీద కఠోరమైన మాటలు పలు
కుదురు.
19 నీయందు భయభక్తులుగలవారి నిమిత్తము నీవు దాచి
యుంచిన మేలు ఎంతో గొప్పది
నరులయెదుట నిన్ను ఆశ్రయించువారి నిమిత్తము
నీవు సిద్ధపరచిన మేలు ఎంతో గొప్పది.

మనుష్యుల కపటోపాయములు వారి నంటకుండ 20
నీ సన్నిధి చాటున వారిని దాచుచున్నావు
వాక్కలహము మాన్పి వారిని గుడారములో
దాచుచున్నావు
ప్రాకారముగల పట్టణములో యెహోవా తన 21
కృపను ఆశ్చర్యకరముగా నాకు చూపియు
న్నాడు
ఆయన స్తుతినొందును గాక.
భీతిచెందినవాడనై—నీకు కనబడకుండ నేను నాశన 22
మైతిననుకొంటిని
అయినను నీకు నేను మొఱ్ఱపెట్టగా
నీవు నా విజ్ఞాపనల ధ్వని నాలకించితివి.
యెహోవా భక్తులారా, మీరందరు ఆయనను 23
ప్రేమించుడి
యెహోవా విశ్వాసులను కాపాడును
గర్వముగా ప్రవర్తించువారికి ఆయన గొప్ప ప్రతి
కారము చేయును.
యెహోవాకొరకు కనిపెట్టువారలారా, 24
మీరందరు మనస్సున ధైర్యము వహించి నిబ్బర
ముగా నుండుడి.

## 32

దావీదు కీర్తన.

దైవధ్యానము.

తన అతిక్రమములకు పరిహారమునొందినవాడు
తన పాపమునకు ప్రాయశ్చిత్తము నొందినవాడు
ధన్యుడు.
యెహోవాచేత నిర్దోషి అని యెంచబడినవాడు 2
ఆత్మలో కపటములేనివాడు ధన్యుడు.
నేను మౌనినై యుండగా దినమంతయు నేను చేసిన 3
నా ఆర్తధ్వనివలన
నా యెముకలు క్షీణించినవి.
దివారాత్రులు నీ చెయ్యి నామీద బరువుగా 4
నుండెను
నా సారము వేసవికాలమున ఎండినట్టాయెను.
(సెలా.)
నా దోషమును కప్పుకొనక 5
నీ యెదుట నా పాపము ఒప్పుకొంటిని
—యెహోవా సన్నిధిని నా అతిక్రమములు
ఒప్పుకొందు ననుకొంటిని.
నీవు నా పాపదోషమును పరిహరించి యున్నావు.
(సెలా.)
కావున నీ దర్శనకాలమందు భక్తిగలవారందరు 6
నిన్ను ప్రార్థనచేయుదురు
విస్తార జలప్రవాహములు పొరలివచ్చినను
నిశ్చయముగా అవి వారిమీదికి రావు.
నాకు దాగు చోటు నీవే, శ్రమలోనుండి నీవు 7
నన్ను రక్షించెదవు

విమోచన గానములతో నీవు నన్ను ఆవరించెదవు.
8 నీకు ఉపదేశము చేసెదను నీవు నడవవలసిన మార్గమును నీకు బోధించెదను
నీమీద దృష్టియుంచి నీకు ఆలోచన చెప్పెదను.
9 బుద్ధి జ్ఞానములులేని గుఱ్ఱమువలెనైనను కంచరగాడిదవలెనైనను మీరు ఉండకుడి
అవి నీ దగ్గరకు తేబడునట్లు వాటి నోరు వారుతోను కళ్లెముతోను బిగింపవలెను.
10 భక్తిహీనులకు అనేక వేదనలు కలుగుచున్నవి
కృప యెహోవాయందు నమ్మికయుంచువానిని ఆవరించుచున్నది.
11 నీతిమంతులారా, యెహోవానుబట్టి సంతోషించుడి ఉల్లసించుడి
యథార్థహృదయులారా, మీరందరు ఆనందగానము చేయుడి.

**33** నీతిమంతులారా, యెహోవానుబట్టి ఆనందగానము చేయుడి.
స్తుతిచేయుట యథార్థవంతులకు శోభస్కరము.
2 సితారాతో యెహోవాను స్తుతించుడి
పది తంతుల స్వరమండలముతో ఆయనను కీర్తించుడి
3 ఆయననుగూర్చి నూతనకీర్తన పాడుడి
ఉత్సాహధ్వనితో ఇంపుగా వాయించుడి.
4 యెహోవా వాక్యము యథార్థమైనది
ఆయన చేయునదంతయు నమ్మకమైనది.
5 ఆయన నీతిని న్యాయమును ప్రేమించుచున్నాడు
లోకము యెహోవా కృపతో నిండియున్నది.
6 యెహోవా వాక్కుచేత ఆకాశములు కలిగెను
ఆయన నోటి ఊపిరిచేత వాటి సర్వసమూహము సృష్టింపబడెను.
7 సముద్రజలములను రాశిగా కూర్చువాడు ఆయనే.
అగాధ జలములను కొట్లలో కూర్చువాడు ఆయనే.
8 లోకులందరు యెహోవాయందు భయభక్తులు నిలుపవలెను
భూలోక నివాసులందరు ఆయనకు వెరవవలెను.
ఆయన మాట సెలవియ్యగా దాని ప్రకారమాయెను
ఆయన ఆజ్ఞాపింపగానే కార్యము స్థిరపరచబడెను.
అన్యజనముల ఆలోచనలను యెహోవా వ్యర్థపరచును
జనముల యోచనలను ఆయన నిష్ఫలములుగా జేయును.
యెహోవా ఆలోచన సదాకాలము నిలుచును
ఆయన సంకల్పములు తరతరములకు ఉండును.
యెహోవా తమకు దేవుడుగాగల జనులు ధన్యులు.
ఆయన తనకు స్వాస్థ్యముగా ఏర్పరచుకొను జనులు ధన్యులు.
యెహోవా ఆకాశములోనుండి కనిపెట్టుచున్నాడు 13
ఆయన నరులనందరిని దృష్టించుచున్నాడు.
తానున్న నివాసస్థలములోనుండి 14
భూలోక నివాసులందరివైపు ఆయన చూచుచున్నాడు.
ఆయన వారందరి హృదయములను ఏకరీతిగా నిర్మించినవాడు 15
వారి క్రియలన్నియు విచారించువాడు వారిని రక్షించువాడు.
ఏ రాజును సేనాబలముచేత రక్షింపబడడు 16
ఏ వీరుడును అధికబలముచేత తప్పించుకొనడు.
రక్షించుటకు గుఱ్ఱము అక్కరకు రాదు 17
అది దాని విశేషబలముచేత మనుష్యులను తప్పింపజాలదు.
వారి ప్రాణమును మరణమునుండి తప్పించుటకును 18
కరవులో వారిని సజీవులుగా కాపాడుటకును 19
యెహోవా దృష్టి ఆయనయందు భయభక్తులుగలవారిమీదను
ఆయన కృపకొరకు కనిపెట్టువారిమీదను నిలుచుచున్నది.
మనము యెహోవా పరిశుద్ధనామమందు నమ్మికయుంచి యున్నాము. 20
ఆయననుబట్టి మన హృదయము సంతోషించుచున్నది
మన ప్రాణము యెహోవాకొరకు కనిపెట్టుకొనుచున్నది 21
ఆయనే మనకు సహాయమును మనకు కేడెమునై యున్నాడు.
యెహోవా, మేము నీకొరకు కనిపెట్టుచున్నాము 22
నీ కృప మామీద నుండును గాక.

దావీదు అబీమెలెకు ఎదుట వెఱ్ఱివానివలె ప్రవర్తించి అతనిచేత తోలివేయబడిన తరువాత రచించిన కీర్తన. **34**

నేనెల్లప్పుడు యెహోవాను సన్నుతించెదను.
నిత్యము ఆయన కీర్తి నా నోట నుండును.
యెహోవానుబట్టి నేను అతిశయించుచున్నాను 2
దీనులు దాని విని సంతోషించెదరు.
నాతో కూడి యెహోవాను ఘనపరచుడి 3
మనము ఏకముగా కూడి ఆయన నామమును గొప్ప చేయుదము.
నేను యెహోవాయొద్ద విచారణచేయగా ఆయన నాకుత్తరమిచ్చెను 4

నాకు కలిగిన భయములన్నిటిలోనుండి ఆయన
నన్ను తప్పించెను.
5 వారు ఆయనతట్టు చూడగా వారికి వెలుగు కలిగెను
వారి ముఖము లెన్నటికిని లజ్జింపకపోవును.
6 ఈ దీనుడు మొఱ్ఱపెట్టగా యెహోవా ఆలకించెను
అతని శ్రమలన్నిటిలోనుండి అతని రక్షించెను.
7 యెహోవాయందు భయభక్తులుగలవారి చుట్టు
ఆయన దూత కావలియుండి వారిని రక్షించును.
8 యెహోవా ఉత్తముడని రుచి చూచి తెలిసి
కొనుడి
ఆయనను ఆశ్రయించు నరుడు ధన్యుడు.
9 యెహోవా భక్తులారా, ఆయనయందు భయ
భక్తులు ఉంచుడి
ఆయనయందు భయభక్తులు ఉంచువానికి ఏమియు
కొదువలేదు.
10 సింహపు పిల్లలు లేమిగలవై ఆకలిగొనును
యెహోవాను ఆశ్రయించువారికి ఏ మేలు
కొదువయై యుండదు.
11 పిల్లలారా, మీరు వచ్చి నా మాట వినుడి.
యెహోవాయందలి భయభక్తులు మీకు నేర్పె
దను.
12 బ్రతుక గోరువాడెవడైన నున్నాడా?
మేలు నొందుచు అనేక దినములు బ్రతుక గోరు
వాడెవడైన నున్నాడా?
13 చెడ్డ మాటలు పలుకకుండ నీ నాలుకను
కపటమైన మాటలు పలుకకుండ నీ పెదవులను
కాచుకొనుము.
14 కీడు చేయుట మాని మేలు చేయుము
సమాధానము వెదకి దాని వెంటాడుము.
15 యెహోవా దృష్టి నీతిమంతులమీద నున్నది.
ఆయన చెవులు వారి మొరలకు ఒగ్గియున్నవి.
16 దుష్క్రియలు చేయువారి జ్ఞాపకమును భూమి
మీదనుండి కొట్టివేయుటకై
యెహోవా సన్నిధి వారికి విరోధముగా నున్నది.
17 నీతిమంతులు మొఱ్ఱపెట్టగా యెహోవా ఆల
కించును
వారి శ్రమలన్నిటిలోనుండి వారిని విడిపించును.
18 విరిగిన హృదయముగలవారికి యెహోవా ఆస
న్నుడు.
నలిగిన మనస్సుగలవారిని ఆయన రక్షించును.
19 నీతిమంతునికి కలుగు ఆపదలు అనేకములు
వాటి అన్నిటిలోనుండి యెహోవా వాని విడి
పించును.
20 ఆయన వాని యెముకలన్నిటిని కాపాడును
వాటిలో ఒక్కటియైనను విరిగిపోదు.
21 చెడుతనము భక్తిహీనులను సంహరించును
నీతిమంతుని ద్వేషించువారు అపరాధులుగా ఎంచ
బడుదురు.
యెహోవా తన సేవకుల ప్రాణమును విమో 22
చించును
ఆయన శరణుజొచ్చినవారిలో ఎవరును అపరాధు
లుగా ఎంచబడరు.

దావీదు కీర్తన.

## 35

యెహోవా, నాతో వ్యాజ్యమాడువారితో
వ్యాజ్యమాడుము
నాతో పోరాడువారితో పోరాడుము.
కేడెమును డాలును పట్టుకొని 2
నా సహాయమునకై లేచి నిలువుము.
ఈటె దూసి నన్ను తరుమువారిని అడ్డగింపుము 3
—నేనే నీ రక్షణ అని నాతో సెలవిమ్ము.
నా ప్రాణము తీయగోరువారికి సిగ్గును అవమాన 4
మును కలుగును గాక
నాకు కీడుచేయ నాలోచించువారు వెనుకకు
మళ్లింపబడి లజ్జపడుదురు గాక.
యెహోవా దూత వారిని పారదోలును గాక 5
వారు గాలికి కొట్టుకొనిపోవు పొట్టువలె నుందురు
గాక.
యెహోవా దూత వారిని తరుమును గాక 6
వారి త్రోవ చీకటియై జారుడుగా నుండును గాక.
నన్ను పట్టుకొనవలెనని వారు నిర్నిమిత్తముగా గుం 7
టలో తమ వల నొడ్డిరి
నా ప్రాణము తీయవలెనని నిర్నిమిత్తముగా గుంట
త్రవ్విరి.
వానికి తెలియకుండ చేటు వానిమీదికి వచ్చును 8
గాక
తాను ఒడ్డిన వలలో తానే చిక్కుబడును గాక
వాడు ఆ చేటులోనే పడును గాక.
అప్పుడు యెహోవాయందు నేను హర్షించుదును 9
ఆయన రక్షణనుబట్టి నేను సంతోషించుదును.
అప్పుడు—యెహోవా నీవంటివాడెవడు? 10
మించిన బలముగలవారి చేతినుండి దీనులను
దోచుకొనువారి చేతినుండి దీనులను దరిద్రులను
విడిపించువాడవు నీవే అని నా యెముకలన్నియు
చెప్పుకొనును.
కూటసాక్షులు లేచుచున్నారు. 11
నేనెరుగని సంగతులనుగూర్చి నన్ను అడుగు
చున్నారు.
మేలుకు ప్రతిగా నాకు కీడు చేయుచున్నారు 12
నేను దిక్కులేనివాడనైతిని.
వారు వ్యాధితో నున్నప్పుడు గోనెపట్ట కట్టు 13
కొంటిని

ఉపవాసముచేత నా ప్రాణమును ఆయాసపరచు
కొంటిని
అయినను నా ప్రార్థన నా యెదలోనికే తిరిగి
వచ్చియున్నది.
14 అతడు నాకు చెలికాడైనట్టును సహోదరుడై
నట్టును నేను నడుచుకొంటిని
తన తల్లి మృతినొందినందున దుఃఖవస్త్రములు
ధరించువానివలె క్రుంగుచుంటిని.
15 నేను కూలియుండుట చూచి వారు సంతోషించి
గుంపుకూడిరి
నీచులును నేనెరుగనివారును నామీదికి కూడివచ్చి
మానక నన్ను నిందించిరి.
16 విందుకాలమునందు దూషణలాడు వదరుబో
తులవలె
వారు నామీద పండ్లు కొరికిరి.
17 ప్రభువా, నీవెన్నాళ్లు చూచుచు ఊరకుందువు?
వారు నాశనము చేయకుండ నా ప్రాణమును
రక్షింపుము
నా ప్రాణమును సింహముల నోటనుండి విడి
పింపుము
18 అప్పుడు మహాసమాజములో నేను నిన్ను స్తుతిం
చెదను
బహు జనులలో నిన్ను నుతించెదను.
19 నిర్హేతుకముగా నాకు శత్రువులైనవారిని
నన్నుగూర్చి సంతోషింపనియ్యకుము
నిర్నిమిత్తముగా నన్ను ద్వేషించువారిని కన్ను గీట
నియ్యకుము.
20 వారు సమాధానపు మాటలు ఆడరు
దేశమందు నెమ్మదిగా నున్నవారికి విరోధముగా
వారు కపటయోచనలు చేయుదురు.
21 నన్ను దూషించుటకై వారు నోరు పెద్దదిగా
తెరచుకొనుచున్నారు
—ఆహా ఆహా యిప్పుడు వాని సంగతి మాకు కన
బడినదే అనుచున్నారు.
22 యెహోవా, అది నీకే కనబడుచున్నది గదా
మౌనముగా నుండకుము
నా ప్రభువా, నాకు దూరముగా నుండకుము.
23 నాకు న్యాయము తీర్చుటకు మేలుకొనుము
నా దేవా నా ప్రభువా, నా పక్షమున వ్యాజ్య
మాడుటకు లెమ్ము.
24 యెహోవా నా దేవా, నీ నీతినిబట్టి నాకు
న్యాయము తీర్చుము
నన్నుబట్టి వారు సంతోషింపకుందురు గాక.
25 —ఆహా మా ఆశ తీరెను అని మనస్సులో వారు
అనుకొనకపోదురు గాక
—వాని మ్రింగివేసితిమని వారు చెప్పుకొనక
యుందురు గాక.
నా అపాయమును చూచి సంతోషించువారందరు 26
అవమానము నొందుదురు గాక లజ్జపడుదురు
గాక
నామీద అతిశయపడువారు
సిగ్గుపడి అపకీర్తిపాలగుదురు గాక
నా నిర్దోషత్వమునుబట్టి ఆనందించువారు 27
ఉత్సాహధ్వనిచేసి సంతోషించుదురు గాక
—తన సేవకుని క్షేమమును చూచి ఆనందించు
యెహోవా ఘనపరచబడును గాక అని వారు
నిత్యము పలుకుదురు.
నా నాలుక నీ నీతిని గూర్చియు నీ కీర్తిని గూర్చియు 28
దినమెల్ల సల్లాపములు చేయును.

## 36

ప్రధానగాయకునికి.
యెహోవా సేవకుడైన దావీదు కీర్తన

భక్తిహీనుల హృదయములో అతిక్రమము దేవోక్తి
వలె పలుకుచున్నది
వాని దృష్టియెదుట దేవుని భయము బొత్తిగాలేదు.
వాని దోషము బయలుపడి అసహ్యముగా కనబడు 2
వరకు
అది వాని దృష్టియెదుట వాని ముఖస్తుతి చేయు
చున్నది.
వాని నోటి మాటలు పాపమునకును కపటమునకును 3
ఆస్పదములు
బుద్ధిగలిగి ప్రవర్తింపను మేలుచేయను వాడు మాని
వేసియున్నాడు.
వాడు మంచముమీదనే పాపయోచనలు యో 4
చించును
వాడు కాని నడతలు నడచువాడు
చెడుతనము వానికి అసహ్యము కాదు.
యెహోవా, నీ కృప ఆకాశము నంటుచున్నది 5
నీ సత్యసంధత్వము అంతరిక్షము నంటుచున్నది.
నీ నీతి దేవుని పర్వతములతో సమానము 6
నీ న్యాయవిధులు మహాగాధములు.
యెహోవా, నరులను జంతువులను రక్షించు
వాడవు నీవే.
దేవా, నీ కృప యెంతో అమూల్యమైనది 7
నరులు నీ రెక్కల నీడను ఆశ్రయించుచున్నారు.
నీ మందిరముయొక్క సమృద్ధివలన వారు సంతృప్తి 8
నొందుచున్నారు.
నీ ఆనందప్రవాహములోనిది నీవు వారికి త్రాగిం
చుచున్నావు.
నీయొద్ద జీవపు ఊట కలదు 9
నీ వెలుగును పొందియే మేము వెలుగు చూచు
చున్నాము.

10 నిన్ను ఎరిగినవారియెడల నీ కృపను
యథార్థహృదయులయెడల నీ నీతిని ఎడతెగక నిలుపుము.
11 గర్విష్ఠుల పాదమును నామీదికి రానియ్యకుము
భక్తిహీనుల చేతిని నన్ను పారదోలనియ్యకుము.
12 అదిగో పాపముచేయువారు అక్కడ పడియున్నారు
లేవలేకుండ వారు పడద్రోయబడి యున్నారు.

37 దావీదు కీర్తన.

చెడ్డవారిని చూచి నీవు వ్యసనపడకుము
దుష్కార్యములు చేయువారిని చూచి మత్సరపడకుము.
2 వారు గడ్డివలెనే త్వరగా ఎండిపోవుదురు
పచ్చని కూరవలెనే వాడిపోవుదురు.
3 యెహోవాయందు నమ్మికయుంచి మేలుచేయుము
దేశమందు నివసించి సత్యము ననుసరించుము
4 యెహోవానుబట్టి సంతోషించుము
ఆయన నీ హృదయవాంఛలను తీర్చును.
5 నీ మార్గమును యెహోవాకు అప్పగింపుము
నీవు ఆయనను నమ్ముకొనుము ఆయన నీ కార్యము నెరవేర్చును.
6 ఆయన వెలుగునువలె నీ నీతిని
మధ్యాహ్నమునువలె నీ నిర్దోషత్వమును వెల్లడిపరచును.
7 యెహోవా యెదుట మౌనముగానుండి ఆయనకొరకు కనిపెట్టుకొనుము.
తన మార్గమున వర్ధిల్లువాని చూచి వ్యసనపడకుము
దురాలోచనలు నెరవేర్చుకొనువాని చూచి వ్యసనపడకుము.
8 కోపము మానుము ఆగ్రహము విడిచిపెట్టుము
వ్యసనపడకుము అది కీడుకే కారణము.
9 కీడు చేయువారు నిర్మూలమగుదురు
యెహోవాకొరకు కనిపెట్టుకొనువారు దేశమును స్వతంత్రించుకొందురు.
10 ఇక కొంతకాలమునకు భక్తిహీనులు లేకపోవుదురు
వారి స్థలమును జాగ్రత్తగా పరిశీలించినను వారు కనబడకపోవుదురు.
11 దీనులు భూమిని స్వతంత్రించుకొందురు
బహు క్షేమము కలిగి సుఖించెదరు
12 భక్తిహీనులు నీతిమంతులమీద దురాలోచన చేయుదురు
వారిని చూచి పండ్లు కొరుకుదురు.
13 వారి కాలము వచ్చుచుండుట ప్రభువు చూచుచున్నాడు
వారిని చూచి ఆయన నవ్వుచున్నాడు.
దీనులను దరిద్రులను పడద్రోయుటకై
యథార్థముగా ప్రవర్తించువారిని చంపుటకై
భక్తిహీనులు కత్తి దూసియున్నారు విల్లెక్కుపెట్టియున్నారు
వారి కత్తి వారి హృదయములోనే దూరును 15
వారి విండ్లు విరువబడును.
నీతిమంతునికి కలిగినది కొంచెమైనను 16
బహుమంది భక్తిహీనులకున్న ధనసమృద్ధికంటె శ్రేష్ఠము.
భక్తిహీనుల బాహువులు విరువబడును 17
నీతిమంతులకు యెహోవాయే సంరక్షకుడు
నిర్దోషుల చర్యలను యెహోవా గుర్తించుచున్నాడు 18
వారి స్వాస్థ్యము సదాకాలము నిలుచును.
ఆపత్కాలమందు వారు సిగ్గునొందరు 19
కరవు దినములలో వారు తృప్తిపొందుదురు.
భక్తిహీనులు నశించిపోవుదురు 20
యెహోవా విరోధులు మేతభూముల సొగసును పోలియుందురు
అది కనబడకపోవునట్లు వారు పొగవలె కనబడకపోవుదురు.
భక్తిహీనులు అప్పుచేసి తీర్చకయుందురు 21
నీతిమంతులు దాక్షిణ్యము కలిగి ధర్మమిత్తురు.
యెహోవా ఆశీర్వాదము నొందినవారు భూమిని స్వతంత్రించుకొందురు 22
ఆయన శపించినవారు నిర్మూలమగుదురు.
ఒకని నడత యెహోవాచేతనే స్థిరపరచబడును 23
వాని ప్రవర్తన చూచి ఆయన ఆనందించును.
యెహోవా అతని చెయ్యి పట్టుకొని యున్నాడు గనుక 24
అతడు నేలను పడినను లేవలేక యుండడు.
నేను చిన్నవాడనై యుంటిని ఇప్పుడు ముసలివాడనై యున్నాను 25
అయినను నీతిమంతులు విడువబడుట గాని
వారి సంతానము భిక్షమెత్తుట గాని నేను చూచియుండలేదు.
దినమెల్ల వారు దయాళురై అప్పు ఇచ్చుచుందురు 26
వారి సంతానపువారు ఆశీర్వదింపబడుదురు
కీడు చేయుట మాని మేలు చేయుము అప్పుడు నీవు నిత్యము నిలుచుదువు 27
ఏలయనగా యెహోవా న్యాయమును ప్రేమించువాడు 28
ఆయన తన భక్తులను విడువడు
వారెన్నటెన్నటికి కాపాడబడుదురు గాని
భక్తిహీనుల సంతానము నిర్మూలమగును.
నీతిమంతులు భూమిని స్వతంత్రించుకొందురు 29
వారు దానిలో నిత్యము నివసించెదరు.

నీతిమంతుల నోరు జ్ఞానమునుగూర్చి వచించును
వారి నాలుక న్యాయమును ప్రకటించును.
వారి దేవుని ధర్మశాస్త్రము వారి హృదయములో నున్నది వారి అడుగులు జారవు.
భక్తిహీనులు నీతిమంతులకొరకు పొంచియుండి వారిని చంపజూతురు.
వారిచేతికి యెహోవా నీతిమంతులను అప్పగింపడు
వారు విమర్శకు వచ్చినప్పుడు ఆయన వారిని దోషులుగా ఎంచడు.
యెహోవాకొరకు కనిపెట్టుకొని యుండుము
ఆయన మార్గము ననుసరించుము
భూమిని స్వతంత్రించుకొనునట్లు ఆయన నిన్ను హెచ్చించును
భక్తిహీనులు నిర్మూలము కాగా నీవు చూచెదవు.
భక్తిహీనుడు ఎంతో ప్రబలియుండుట నేను చూచియుంటిని
అది మొలచిన చోటనే విస్తరించిన చెట్టువలె వాడు వర్ధిల్లి యుండెను.
అయినను ఒకడు ఆ దారిని పోయి చూడగా వాడు లేకపోయెను
నేను వెదకితిని గాని వాడు కనబడకపోయెను.
నిర్దోషులను కనిపెట్టుము యథార్థవంతులను చూడుము
సమాధానపరుచువారి సంతతి నిలుచును గాని
ఒకడైన నిలువకుండ అపరాధులు నశించుదురు
భక్తిహీనుల సంతతి నిర్మూలమగును.
యెహోవాయే నీతిమంతులకు రక్షణాధారము
బాధ కలుగునప్పుడు ఆయనే వారికి ఆశ్రయదుర్గము.
యెహోవా వారికి సహాయుడై వారిని రక్షించును
వారు యెహోవా శరణుజొచ్చి యున్నారు గనుక
ఆయన భక్తిహీనుల చేతిలోనుండి వారిని విడిపించి రక్షించును.

జ్ఞాపకార్థమైనది.
దావీదు కీర్తన.

యెహోవా, కోపోద్రేకముచేత నన్ను గద్దింపకుము.
నీ ఉగ్రతచేత నన్ను శిక్షింపకుము.
నీ బాణములు నాలో గట్టిగా నాటియున్నవి
నీ చెయ్యి నామీద భారముగా నున్నది.
నీ కోపాగ్నివలన ఆరోగ్యము నా శరీరమును విడిచిపోయెను
నా పాపమునుబట్టి నా యెముకలలో స్వస్థతలేదు.
నా దోషములు నా తలమీదుగా పొర్లిపోయినవి 4
నేను మోయలేని బరువువలె అవి నామీద మోపబడియున్నవి.
నా మూర్ఖతవలన గలిగిన నా గాయములు దుర్వాసనగలవై స్రవించుచున్నవి. 5
నేను శ్రమచేత మిక్కిలి క్రుంగియున్నాను 6
దినమెల్ల దుఃఖాక్రాంతుడనై సంచరించుచున్నాను.
నా నడుము తాపముతో నిండియున్నది 7
నా శరీరములో ఆరోగ్యము లేదు.
నేను సొమ్మసిల్లి బహుగా నలిగియున్నాను 8
నా మనోవేదననుబట్టి కేకలు వేయుచున్నాను
ప్రభువా, నా అభిలాష అంతయు నీకే కనబడుచున్నది 9
నా నిట్టూర్పులు నీకు దాచబడి యుండలేదు.
నా గుండె కొట్టుకొనుచున్నది నా బలము నన్ను విడిచిపోయెను 10
నా కనుదృష్టియు తప్పిపోయెను.
నా స్నేహితులును నా చెలికాండ్రును నా తెగులు చూచి యెడముగా నిలుచుచున్నారు 11
నా బంధువులు దూరముగా నిలుచుచున్నారు.
నా ప్రాణము తీయజూచువారు ఉరులు ఒడ్డుచున్నారు 12
నాకు కీడుచేయ జూచువారు హానికరమైన మాటలు పలుకుచు దినమెల్ల కపటోపాయములు పన్నుచున్నారు.
చెవిటివాడనైనట్టు నేను వినకయున్నాను 13
మూగవాడనైనట్టు నోరు తెరచుట మానితిని.
నేను వినలేనివాడనైతిని 14
ఎదురుమాట పలుకలేనివాడనైతిని.
యెహోవా, నీ కొరకే నేను కనిపెట్టుకొని యున్నాను 15
—నా కాలు జారినయెడల వారు నామీద అతిశయపడుదురని, నేననుకొనుచున్నాను.
ప్రభువా నా దేవా, నీవే ఉత్తరమిచ్చెదవు.
నన్నుబట్టి వారు సంతోషించక పోదురుగాక. 16
నేను పడబోవునట్లున్నాను 17
నా మనోదుఃఖము నన్నెన్నడును విడువదు.
నా దోషమును నేను ఒప్పుకొనుచున్నాను 18
నా పాపమునుగూర్చి విచారపడుచున్నాను.
నా శత్రువులు చురుకైనవారును బలవంతులునై యున్నారు 19
నిర్హేతుకముగా నన్ను ద్వేషించువారు అనేకులు.
మేలుకు ప్రతిగా వారు కీడు చేయుచున్నారు. 20
నేను ఉత్తమమైనదాని ననుసరించుచున్నందుకు వారు నాకు శత్రువులైరి
యెహోవా, నన్ను విడువకుము 21

నా దేవా, నాకు దూరముగా నుండకుము.
22 రక్షణకర్తవైన నా ప్రభువా, నా సహాయమునకు త్వరగా రమ్ము.

## 39

ప్రధానగాయకుడైన యెదూతూనునకు.
దావీదు కీర్తన.

—నా నాలుకతో పాపముచేయకుండునట్లు
నా మార్గములను జాగ్రత్తగా చూచుకొందును
భక్తిహీనులు నా యెదుట నున్నప్పుడు
నా నోటికి చిక్కము ఉంచుకొందు ననుకొంటిని.
2 నేను ఏమియు మాటలాడక మౌనినైతిని
క్షేమమును గూర్చియైనను పలుకక నేను మౌనముగా నుంటిని
అయినను నా విచారము అధికమాయెను.
3 నా గుండె నాలో మండుచుండెను
నేను ధ్యానించుచుండగా మంట పుట్టెను
అప్పుడు నేను ఈ మాట నోరార పలికితిని
4 —యెహోవా, నా అంతము ఎట్లుండునది
నా దినముల ప్రమాణము ఎంతైనది నాకు తెలుపుము.
నా ఆయువు ఎంత అల్పమైనదో నేను తెలిసికొన గోరుచున్నాను.
5 నా దినముల పరిమాణము నీవు బెత్తెడంతగా చేసియున్నావు
నీ సన్నిధిని నా ఆయుష్కాలము లేనట్టే యున్నది.
ఎంత స్థిరుడైనను ప్రతివాడును కేవలము వట్టి ఊపిరివలె ఉన్నాడు. (సెలా.)
6 మనుష్యులు వట్టి నీడవంటివారై తిరుగులాడుదురు.
వారు తొందరపడుట గాలికే గదా
వారు ధనము కూర్చుకొందురు గాని
అది ఎవనికి చేజిక్కునో వారికి తెలియదు.
7 ప్రభువా, నేను దేనికొరకు కనిపెట్టుకొందును?
నిన్నే నేను నమ్ముకొనియున్నాను.
8 నా అతిక్రమములన్నిటినుండి నన్ను విడిపింపుము
నీచులకు నన్ను నింద్యాస్పదముగా చేయకుము.
9 దాని చేసినది నీవే గనుక నోరు తెరవక నేను మౌనినైతిని.
10 నీవు పంపిన తెగులు నామీదనుండి తొలగింపుము
నీ చేతి దెబ్బవలన నేను క్షీణించుచున్నాను.
1 దోషములనుబట్టి నీవు మనుష్యులను గద్దింపులతో శిక్షించునప్పుడు
చిమ్మట కొట్టిన వస్త్రమువలె నీవు వారి అందము చెడగొట్టెదవు
నరులందరు వట్టి ఊపిరివంటివారు. (సెలా.)
12 యెహోవా, నా ప్రార్థన ఆలకింపుము నా మొఱ్ఱకు చెవియొగ్గుము
నా కన్నీళ్లు చూచి మౌనముగా నుండకుము
నీ దృష్టికి నేను అతిథివంటివాడను
నా పితరులందరివలె నేను పరవాసినైయున్నాను
నేను వెళ్లిపోయి లేకపోకమునుపు 1
నేను తెప్పరిల్లునట్లు నన్ను కోపముతో చూడకుము.

## 40

ప్రధానగాయకునికి.
దావీదు కీర్తన.

యెహోవాకొరకు నేను సహనముతో కనిపెట్టుకొంటిని
ఆయన నాకు చెవియొగ్గి నా మొఱ్ఱ ఆలకించెను.
నాశనకరమైన గుంటలోనుండియు 2
జిగటగల దొంగ ఊబిలోనుండియు
ఆయన నన్ను పైకెత్తెను
నా పాదములు బండమీద నిలిపి నా అడుగులు స్థిరపరచెను.
తనకు స్తోత్రరూపమగు క్రొత్తగీతమును మన దేవుడు నా నోట నుంచెను. 3
అనేకులు దాని చూచి భయభక్తులుగలిగి యెహోవాయందు నమ్మిక యుంచెదరు.
గర్విష్ఠులనైనను త్రోవ విడిచి అబద్ధములతట్టు తిరుగువారినైనను లక్ష్యపెట్టక 4
యెహోవాను నమ్ముకొనువాడు ధన్యుడు.
యెహోవా నా దేవా, నీవు మాయెడల జరిగించిన ఆశ్చర్యక్రియలును 5
మాయెడల నీకున్న తలంపులును బహు విస్తారములు.
వాటిని వివరించి చెప్పెదననుకొంటినా అవి లెక్కకు మించియున్నవి
నీకు సాటియైనవాడొకడును లేడు.
బలులనైనను నైవేద్యములనైనను నీవు కోరుటలేదు. 6
నీవు నాకు చెవులు నిర్మించియున్నావు.
దహన బలులనైనను పాపపరిహారార్థ బలులనైనను నీవు తెమ్మనలేదు.
అప్పుడు—పుస్తకపుచుట్టలో నన్నుగూర్చి వ్రాయబడిన ప్రకారము నేను వచ్చియున్నాను. 7
నా దేవా, నీ చిత్తము నెరవేర్చుట నాకు సంతోషము 8
నీ ధర్మశాస్త్రము నా అంతర్యములోనున్నది.
నా పెదవులు మూసికొనక మహాసమాజములో నీతిసువార్తను నేను ప్రకటించియున్నానని నేనంటిని 9
యెహోవా, అది నీకు తెలిసేయున్నది.
నీ నీతిని నా హృదయములో నుంచుకొని నేను ఊరకుండలేదు. 10
నీ సత్యమును నీ రక్షణను నేను వెల్లడిచేసియున్నాను

నీ కృపను నీ సత్యమును మహాసమాజమునకు
తెలుపక నేను వాటిని మరుగుచేయలేదు.
1 యెహోవా, నీవు నీ వాత్సల్యాతిశయము నాకు
దూరము చేయవు
నీ కృపాసత్యములు ఎప్పుడును నన్ను కాపాడును
గాక.
2 లెక్కలేని అపాయములు నన్ను చుట్టుకొని
యున్నవి
నా దోషములు నన్ను తరిమి పట్టుకొనగా నేను
తలయెత్తి చూడలేకపోతిని
లెక్కకు అవి నా తలవెండ్రుకలను మించియున్నవి
నా హృదయము అధైర్యపడి యున్నది.
3 యెహోవా, దయచేసి నన్ను రక్షింపుము
యెహోవా, నా సహాయమునకు త్వరగా రమ్ము.
4 నా ప్రాణము తీయుటకై యత్నించువారు
సిగ్గుపడి బొత్తిగా భ్రమసియుందురు గాక
నాకు కీడు చేయ గోరువారు వెనుకకు మళ్లింపబడి
అవమానము నొందుదురు గాక.
5 నన్ను చూచి—ఆహా ఆహా అని పలుకువారు
తమకు కలుగు అవమానమును చూచి విస్మయమొందుదురు గాక.
6 నిన్ను వెదకువారందరు సంతోషించి నిన్నుబట్టి
ఉల్లసించుదురు గాక
నీ రక్షణను ప్రేమించువారు — యెహోవా
మహిమపరచబడును గాక అని నిత్యము చెప్పుకొందురు గాక.
7 నేను బాధనొందు దరిద్రుడనైనను
ప్రభువు నన్ను తలంచుకొనుచున్నాడు.
నాకు సహాయము నీవే నా రక్షణకర్తవు నీవే.
నా దేవా, ఆలస్యము చేయకుము.

41

ప్రధానగాయకునికి.

దావీదు కీర్తన.

బీదలను కటాక్షించువాడు ధన్యుడు
ఆపత్కాలమందు యెహోవా వాని తప్పించును.
2 యెహోవా వాని కాపాడి బ్రదికించును
భూమిమీద వాడు ధన్యుడగును
వాని శత్రువుల యిచ్ఛకు నీవు వాని అప్పగింపవు.
3 రోగశయ్యమీద యెహోవా వాని ఆదరించును
రోగము కలుగగా నీవే వాని స్వస్థపరచుదువు.
4 —యెహోవా నీ దృష్టియెదుట నేను పాపము
చేసియున్నాను
నన్ను కరుణింపుము నా ప్రాణమును స్వస్థపరచుము అని మనవి చేయుచున్నాను.
5 అయితే నా శత్రువులు నా విషయమై చెడ్డ
మాటలాడుచున్నారు



—వాడు ఎప్పుడు చచ్చును? వాని పేరు ఎప్పుడు
మాసిపోవును? అని చెప్పుకొనుచున్నారు.
ఒకడు నన్ను చూడవచ్చినయెడల వాడు అబద్ధమాడును 6
వాని హృదయము పాపమును పోగుచేసికొనుచున్నది
వాడు బయలువెళ్లి వీధిలో దాని పలుకుచున్నాడు.
నన్ను ద్వేషించువారందరు కూడి నామీద గుసగుసలాడుచున్నారు 7
నశింపజేయవలెనని వారు నాకు కీడుచేయ నాలోచించుచున్నారు.
—కుదురని రోగము వానికి సంభవించియున్నది 8
వాడు ఈ పడక విడిచి తిరిగి లేవడని చెప్పుకొనుచున్నారు.
నేను నమ్ముకొనిన నా విహితుడు నా యింట భోజనము చేసినవాడు 9
నన్ను తన్నుటకై తన మడిమె నెత్తినవాడాయెను
యెహోవా, నన్ను కరుణించి లేవనెత్తుము 10
అప్పుడు నేను వారికి ప్రతీకారము చేసెదను.
నా శత్రువు నామీద ఉల్లసింపక యుండుట 11
చూడగా
నేను నీకు ఇష్టుడనని తెలియనాయెను.
నా యథార్థతనుబట్టి నీవు నన్ను ఉద్ధరించు 12
చున్నావు
నీ సన్నిధిని నిత్యము నన్ను నిలువబెట్టుదువు.
ఇశ్రాయేలు దేవుడైన యెహోవా 13
శాశ్వతకాలమునుండి శాశ్వతకాలపర్యంతము
స్తుతింపబడును గాక. ఆమేన్. ఆమేన్.

## ద్వితీయ స్కంధము.

42

ప్రధానగాయకునికి.

కోరహు కుమారులు రచించినది

దైవధ్యానము.

దుప్పి నీటివాగులకొరకు ఆశపడునట్లు
దేవా, నీకొరకు నా ప్రాణము ఆశపడుచున్నది.
నా ప్రాణము దేవునికొరకు తృష్ణగొనుచున్నది 2
జీవముగల దేవునికొరకు తృష్ణగొనుచున్నది
దేవుని సన్నిధికి నేనెప్పుడు వచ్చెదను? ఆయన
సన్నిధిని నేనెప్పుడు కనబడెదను?
—నీ దేవుడు ఏమాయెనని వారు నిత్యము నాతో 3
అనుచుండగా
దివారాత్రులు నా కన్నీళ్లు నాకు అన్నపానములాయెను.
జనసమూహముతో పండుగచేయుచున్న సమూ 4
హముతో నేను వెళ్లిన సంగతిని,

సంతోషముకలిగి స్తోత్రములు చెల్లించుచు
నేను దేవుని మందిరమునకు వారిని నడిపించిన
సంగతిని జ్ఞాపకము చేసికొనగా
నా ప్రాణము నాలో కరిగిపోవుచున్నది.
5 నా ప్రాణమా, నీవు ఏల క్రుంగియున్నావు?
నాలో నీవేల తొందరపడుచున్నావు?
దేవునియందు నిరీక్షణ యుంచుము.
ఆయనే నాకు రక్షణకర్త అనియు నా దేవుడనియు- చెప్పుకొనుచు నేనింకను ఆయనను స్తుతించెదను.
6 నా దేవా, నా ప్రాణము నాలో క్రుంగియున్నది
కావున యొర్దాను అద్దరి దేశమునుండియు
హెర్మోను పర్వతమునుండియు మిసారు కొండనుండియు
నేను నిన్ను జ్ఞాపకము చేసికొనుచున్నాను.
7 నీ జలప్రవాహధారల ధ్వని విని కరడు కరడును పిలుచుచున్నది
నీ అలలన్నియు నీ తరంగములన్నియు నా మీదుగా పొర్లి పారియున్నవి.
8 అయినను పగటివేళ యెహోవా తన కృప కలుగ నాజ్ఞాపించును
రాత్రివేళ ఆయననుగూర్చిన కీర్తనయు
నా జీవదాతయైన దేవునిగూర్చిన ప్రార్థనయు నాకు తోడుగా ఉండును.
9 కావున—నీవేల నన్ను మరచి యున్నావు!
శత్రుబాధచేత నేను దుఃఖాక్రాంతుడనై సంచరించవలసి వచ్చెనేమి అని
నా ఆశ్రయదుర్గమైన నా దేవునితో నేను మనవి చేయుచున్నాను.
10 —నీ దేవుడు ఏమాయెనని నా శత్రువులు దినమెల్ల అడుగుచున్నారు.
వారు తమ దూషణలచేత నా యెముకలు విరుచుచున్నారు.
11 నా ప్రాణమా, నీవేల క్రుంగియున్నావు!
నాలో నీవేల తొందరపడుచున్నావు?
దేవునియందు నిరీక్షణ యుంచుము;
ఆయనే నా రక్షణకర్త నా దేవుడు
ఇంకను నేనాయనను స్తుతించెదను.

43 దేవా, నాకు న్యాయము తీర్చుము
భక్తిలేని జనముతో నా పక్షమున వ్యాజ్యమాడుము
కపటము కలిగి దౌర్జన్యము చేయువారి చేతిలోనుండి నీవు నన్ను విడిపించుదువు.
నాకు దుర్గమైన దేవుడవు నన్ను త్రోసివేసితివేల?
నేను శత్రుబాధచేత దుఃఖాక్రాంతుడనై సంచరింపనేల?
నీ వెలుగును నీ సత్యమును బయలుదేరజేయుము 3
అవి నాకు త్రోవ చూపును
అవి నీ పరిశుద్ధ పర్వతమునకును నీ నివాసస్థలములకును నన్ను తోడుకొని వచ్చును.
అప్పుడు నేను దేవుని బలిపీఠమునొద్దకు 4
నాకు ఆనందసంతోషములు కలుగజేయు దేవుని యొద్దకు చేరుదును
దేవా నా దేవా, సితారా వాయించుచు నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించెదను.
నా ప్రాణమా, నీవేల క్రుంగియున్నావు? 5
నాలో నీవేల తొందరపడుచున్నావు?
దేవునియందు నిరీక్షణ యుంచుము
ఆయన నా రక్షణకర్త నా దేవుడు
ఇంకను నేనాయనను స్తుతించెదను.

44

ప్రధానగాయకునికి.

కోరహు కుమారులు చేసినది.

దైవధ్యానము.

దేవా, పూర్వకాలమున మా పితరుల దినములలో
నీవు చేసినపనినిగూర్చి మేము చెవులార వినియున్నాము
మా పితరులు వాటిని మాకు వివరించిరి.
నీవు నీ భుజబలముచేత అన్యజనులను వెళ్లగొట్టి 2
మా పితరులను నాటితివి
జనములను నిర్మూలము చేసి వారిని వ్యాపింపజేసితివి.
వారు తమ ఖడ్గముచేత దేశమును స్వాధీనపరచుకొనలేదు 3
వారి బాహువు వారికి జయమియ్యలేదు
నీవు వారిని కటాక్షించితివి గనుక
నీ దక్షిణహస్తమే నీ బాహువే నీ ముఖకాంతియే వారికి విజయము కలుగజేసెను.
దేవా, నీవే నా రాజవు 4
యాకోబునకు పూర్ణరక్షణ కలుగ నాజ్ఞాపించుము.
నీవలన మా విరోధులను అణచివేయుదుము 5
నీ నామమువలననే మామీదికి లేచువారిని మేము త్రొక్కివేయుదుము.
నేను నా వింటిని నమ్ముకొనను 6
నా కత్తియు నన్ను రక్షింపజాలదు
మా శత్రువుల చేతిలోనుండి మమ్మును రక్షించువాడవు నీవే 7
మమ్మును ద్వేషించువారిని సిగ్గుపరచువాడవు నీవే.
దినమెల్ల మేము దేవునియందు అతిశయపడుచున్నాము 8

నీ నామమునుబట్టి మేము నిత్యము కృతజ్ఞతా
స్తుతులు చెల్లించుచున్నాము. (సెలా.)
అయితే ఇప్పుడు నీవు మమ్మును విడనాడి అవమాన
పరచియున్నావు
మా సేనలతోకూడ నీవు బయలు దేరక యున్నావు.
శత్రువులయెదుట నిలువకుండ మమ్మును వెనుకకు
పారిపోజేయుచున్నావు
మమ్మును ద్వేషించువారు ఇష్టము వచ్చినట్లు మమ్మును
దోచుకొనుచున్నారు.
భోజనపదార్థముగా ఒకడు గొఱ్ఱెలను అప్పగించు
నట్లు నీవు మమ్మును అప్పగించి యున్నావు
అన్యజనులలోకి మమ్మును చెదరగొట్టి యున్నావు.
అధికమైన వెల చెప్పక ధనప్రాప్తిలేకయే
నీవు నీ ప్రజలను అమ్మి యున్నావు
మా పొరుగువారి దృష్టికి నీవు మమ్మును నిందాస్పదముగా చేసియున్నావు
మా చుట్టునున్నవారి దృష్టికి అపహాస్యాస్పదముగాను ఎగతాళికి కారణముగాను
మమ్మును ఉంచి యున్నావు.
అన్యజనులలో మమ్మును సామెతకు హేతువుగాను
ప్రజలు తల ఆడించుటకు కారణముగాను
మమ్మును ఉంచి యున్నావు.
నన్ను నిందించి దూషించువారి మాటలు వినగా
శత్రువులనుబట్టియు పగతీర్చుకొనువారినిబట్టియు
నేను దినమెల్ల నా అవమానమును తలపోయుచున్నాను
సిగ్గు నా ముఖమును కమ్మియున్నది.
ఇదంతయు మా మీదికి వచ్చినను మేము నిన్ను మరువలేదు
నీ నిబంధన మీరి ద్రోహులము కాలేదు.
మా హృదయము వెనుకకు మరలిపోలేదు
మా అడుగులు నీ మార్గమును విడిచి తొలగిపోలేదు.
అయితే నక్కలున్నచోట నీవు మమ్మును బహుగా నలిపియున్నావు
గాఢాంధకారముచేత మమ్మును కప్పియున్నావు
మా దేవుని నామమును మేము మరచియున్నయెడల
అన్యదేవతలతట్టు మా చేతులు చాపియున్నయెడల
హృదయ రహస్యములు ఎరిగిన దేవుడు
ఆ సంగతిని పరిశోధింపక మానునా?
నిన్నుబట్టి దినమెల్ల మేము వధింపబడువారము
వధకు సిద్ధమైన గొఱ్ఱెలమని మేము ఎంచబడినవారము.
ప్రభువా, మేల్కొనుము నీవేల నిద్రించుచున్నావు?
లెమ్ము నిత్యము మమ్మును విడనాడకుము.
నీ ముఖమును నీవేల మరుగుపరచి యున్నావు? 24
మా బాధను మాకు కలుగు హింసను నీవేల మరచి 25
యున్నావు?
మా ప్రాణము నేలకు క్రుంగియున్నది
మా శరీరము నేలను పట్టియున్నది.
మా సహాయమునకు లెమ్ము 26
నీ కృపనుబట్టి మమ్మును విమోచింపుము.

## 45

ప్రధానగాయకునికి.
షోషన్నీయులను రాగముమీద పాడదగినది.
కోరహు కుమారులు రచించిన దైవధ్యానము.
ప్రేమనుగూర్చిన గీతము.

ఒక దివ్యమైన సంగతితో నా హృదయము బహుగా ఉప్పొంగుచున్నది
నేను రాజునుగూర్చి రచించినదానిని పలికెదను
నా నాలుక త్వరగా వ్రాయువాని కలమువలెనున్నది.
నరులకంటె నీవు అతిసుందరుడవై యున్నావు 2
నీ పెదవులమీద దయారసము పోయబడియున్నది
కావున దేవుడు నిత్యము నిన్ను ఆశీర్వదించును.
శూరుడా, నీ కత్తి మొలను కట్టుకొనుము 3
నీ తేజస్సును నీ ప్రభావమును ధరించుకొనుము.
సత్యమును వినయముతోకూడిన నీతిని స్థాపించుటకు 4
నీ ప్రభావము ధరించుకొని వాహనమెక్కి బయలు దేరుము
నీ దక్షిణహస్తము భీకరమైనవాటిని జరిగించుటకు నీకు నేర్పును.
నీ బాణములు వాడిగలవి 5
ప్రజలు నీచేత కూలుదురు.
నీ బాణములు రాజు శత్రువుల గుండెలో చొచ్చును.
దేవా, నీ సింహాసనము నిరంతరము నిలుచును 6
నీ రాజదండము న్యాయార్థమైన దండము.
నీవు నీతిని ప్రేమించి భక్తిహీనతను ద్వేషించు 7
చున్నావు
కావున దేవుడు నీ దేవుడే నీ చెలికాండ్లకంటె హెచ్చుగునట్లుగా
నిన్ను ఆనందతైలముతో అభిషేకించి యున్నాడు.
నీ వస్త్రములెల్ల గోపరస వాసనే అగురు వాసనే 8
లవంగిపట్ట వాసనే
దంతముతో కట్టిన నగరులలో తంతివాద్యములు నిన్ను సంతోషపెట్టుచున్నవి.
నీ దయనొందిన స్త్రీలలో రాజుల కుమార్తెలున్నారు. 9
రాణి ఓఫీరు అపరంజితో అలంకరించుకొని
నీ కుడిపార్శ్వమున నిలుచుచున్నది.

10 కుమారీ, ఆలకించుము ఆలోచించి చెవియొగ్గుము
నీ స్వజనమును నీ తండ్రి యింటిని మరువుము
11 ఈ రాజు నీ ప్రభువు అతడు నీ సౌందర్యమును
కోరినవాడు
అతనికి నమస్కరించుము.
12 తూరు కుమార్తె నైవేద్యము తీసికొనివచ్చును జను
లలో ఐశ్వర్యవంతులు నీ దయను వెదకుదురు.
13 అంతఃపురములోనుండు రాజుకుమార్తె కేవలము
మహిమగలది
ఆమె వస్త్రము బంగారు బుట్టాపని చేసినది.
14 విచిత్రమైన పనిగల వస్త్రములను ధరించుకొని రాజు
నొద్దకు ఆమె తీసికొని రాబడుచున్నది
ఆమెను వెంబడించు ఆమె చెలికత్తెలైన కన్యకలు
నీయొద్దకు తీసికొని రాబడుచున్నారు.
15 ఉత్సాహ సంతోషములతో వారు వచ్చుచున్నారు
రాజనగరులో ప్రవేశించుచున్నారు.
16 నీ పితరులకు ప్రతిగా నీకు కుమారులుందురు
భూమియందంతట నీవు వారిని అధికారులనుగా
నియమించెదవు.
17 తరములన్నిటను నీ నామము జ్ఞాపకముండునట్లు
నేను చేయుదును
కావున జనములు సార్వకాలము నీకు కృతజ్ఞతా
స్తుతులు చెల్లించుదురు.

## 46

ప్రధానగాయకునికి.
కోరహు కుమారులది.
అలామోతు అను రాగముమీద పాడదగినది.
గీతము.

దేవుడు మనకు ఆశ్రయమును దుర్గమునై
యున్నాడు
ఆపత్కాలములో ఆయన నమ్ముకొనదగిన సహా
యకుడు.
2 కావున భూమి మార్పునొందినను నడిసముద్రము
లలో పర్వతములు మునిగినను
3 వాటి జలములు ఘోషించుచు నురుగు కట్టినను
ఆ పొంగునకు పర్వతములు కదిలినను
మనము భయపడము. (సెలా.)
4 ఒక నది కలదు, దాని కాలువలు దేవుని పట్టణ
మును
సర్వోన్నతుని మందిరపు పరిశుద్ధ స్థలమును సం
తోషపరచుచున్నవి.
5 దేవుడు ఆ పట్టణములో నున్నాడు దానికి చల
నము లేదు
అరుణోదయమున దేవుడు దానికి సహాయము
చేయుచున్నాడు.
6 జనములు ఘోషించుచున్నవి రాజ్యములు కదలు
చున్నవి
ఆయన తన కంఠధ్వని వినిపింపగా భూమి కరిగి
పోవుచున్నది.
సైన్యములకధిపతియగు యెహోవా మనకు 7
తోడైయున్నాడు
యాకోబుయొక్క దేవుడు మనకు ఆశ్రయమై
యున్నాడు.
యెహోవా చేసిన కార్యములు వచ్చి చూడుడి. 8
ఆయనే భూమిమీద నాశనములు కలుగజేయు
వాడు.
ఆయనే భూదిగంతములవరకు యుద్ధములు మాన్పు 9
వాడు
విల్లు విరుచువాడును బల్లెమును తెగనరుకువాడును
ఆయనే
యుద్ధ రథములను అగ్నిలో కాల్చివేయువాడు
ఆయనే.
—ఊరకుండుడి నేనే దేవుడనని తెలిసికొనుడి 1
అన్యజనులలో నేను మహోన్నతుడ నగుదును
భూమిమీద నేను మహోన్నతుడ నగుదును.
సైన్యములకధిపతియగు యెహోవా మనకు 1
తోడైయున్నాడు
యాకోబుయొక్క దేవుడు మనకు ఆశ్రయమై
యున్నాడు.

## 47

ప్రధానగాయకునికి.
కోరహు కుమారులు చేసినది.
గీతము.

సర్వజనులారా, చప్పట్లు కొట్టుడి
జయధ్వనులతో దేవునిగూర్చి ఆర్భాటము
చేయుడి.
యెహోవా మహోన్నతుడు భయంకరుడు 2
ఆయన సర్వభూమికి మహారాజై యున్నాడు.
ఆయన జనములను మనకు లోపరచును 3
మన పాదముల క్రింద ప్రజలను అణగద్రొక్కును.
తాను ప్రేమించిన యాకోబుకు మహాతిశయా 4
స్పదముగా మన స్వాస్థ్యమును
ఆయన మనకొరకు ఏర్పాటు చేసియున్నాడు.
దేవుడు ఆర్భాటముతో ఆరోహణమాయెను 5
బూరధ్వనితో యెహోవా ఆరోహణమాయెను.
దేవుని కీర్తించుడి కీర్తించుడి 6
మన రాజును కీర్తించుడి కీర్తించుడి.
దేవుడు సర్వభూమికి రాజై యున్నాడు 7
రమ్యముగా కీర్తనలు పాడుడి.
దేవుడు అన్యజనులకు రాజై యున్నాడు 8
దేవుడు తన పరిశుద్ధసింహాసనముమీద ఆసీనుడై
యున్నాడు.
జనముల ప్రధానులు అబ్రాహాముయొక్క దేవు 9
కి జనులై కూడుకొనియున్నారు,

నా అతిక్రమములు నాకు తెలిసేయున్నవి
నా పాపమెల్లప్పుడు నాయెదుట నున్నది.
నీకు కేవలము నీకే విరోధముగా నేను పాపము
చేసియున్నాను
నీ దృష్టియెదుట నేను చెడుతనము చేసియున్నాను.
కావున ఆజ్ఞ ఇచ్చునప్పుడు నీవు నీతిమంతుడవుగా
అగపడుదువు
తీర్పు తీర్చునప్పుడు నిర్మలుడవుగా అగపడుదువు.
నేను పాపములో పుట్టినవాడను
పాపములోనే నా తల్లి నన్ను గర్భమున ధరించెను.
నీవు అంతరంగమున సత్యము కోరుచున్నావు
ఆంతర్యములో నాకు జ్ఞానము తెలియజేయుదువు.
నేను పవిత్రుడనగునట్లు
హిస్సోపుతో నా పాపము పరిహరింపుము.
హిమముకంటెను నేను తెల్లగా నుండునట్లు
నీవు నన్ను కడుగుము.
ఉత్సాహ సంతోషములు నాకు వినిపింపుము
అప్పుడు నీవు విరిచిన యెముకలు హర్షించును.
నా పాపములకు విముఖుడవు కమ్ము
నా దోషములన్నిటిని తుడిచివేయుము.
దేవా, నాయందు శుద్ధహృదయము కలుగజేయుము
నా అంతరంగములో స్థిరమైన మనస్సును నూతన
ముగా పుట్టించుము.
నీ సన్నిధిలోనుండి నన్ను త్రోసివేయకుము
నీ పరిశుద్ధాత్మను నాయొద్దనుండి తీసివేయకుము.
నీ రక్షణానందము నాకు మరల పుట్టించుము
సమ్మతిగల మనస్సు కలుగజేసి నన్ను దృఢపర
చుము.
అప్పుడు అతిక్రమము చేయువారికి నీ త్రోవలను
బోధించెదను
పాపులును నీ తట్టు తిరుగుదురు.
దేవా, నా రక్షణకర్తయగు దేవా
రక్తాపరాధమునుండి నన్ను విడిపింపుము
అప్పుడు నా నాలుక నీ నీతినిగూర్చి ఉత్సాహ
గానము చేయును.
ప్రభువా, నా నోరు నీ స్తుతిని ప్రచురపరచునట్లు
నా పెదవులను తెరువుము.
నీవు బలిని కోరువాడవు కావు (కోరినయెడల) నేను
అర్పించుదును
దహనబలి నీకిష్టమైనది కాదు.
విరిగిన మనస్సే దేవునికిష్టమైన బలులు
దేవా, విరిగి నలిగిన హృదయమును నీవు అలక్ష్యము
చేయవు.
నీ కటాక్షముచొప్పున సీయోనుకు మేలుచేయుము
యెరూషలేముయొక్క గోడలను కట్టించుము.

అప్పుడు నీతియుక్తములైన బలులును దహనబలు 19
లును
సర్వాంగహోమములును నీకు అంగీకృతములగును
అప్పుడు జనులు నీ బలిపీఠముమీద కోడెల నర్పిం
చెదరు.

## 52

ప్రధానగాయకునికి.

ఎదోమీయుడైన దోయేగు సౌలునొద్దకు వచ్చి—దావీదు అహీమెలెకు
ఇంటికి వచ్చియున్నాడని అతనితో చెప్పినప్పుడు దావీదు రచిం
చిన దైవధ్యానము.

శూరుడా, చేసిన కీడునుబట్టి నీవెందుకు అతిశయ
పడుచున్నావు?
దేవుని కృప నిత్యముండును.
మోసము చేయువాడా, 2
వాడిగల మంగల కత్తివలె నీ నాలుక నాశనము
చేయ నుద్దేశించుచున్నది
మేలుకంటె కీడు చేయుటయు నీతి పలుకుటకంటె 3
అబద్ధము చెప్పుటయు నీకిష్టము. (సెలా.)
కపటమైన నాలుక గలవాడా, 4
అధిక నాశకరములైన మాటలే నీకిష్టము.
కావున దేవుడు సదాకాలము నిన్ను అణగ 5
గొట్టును
నిన్ను పట్టుకొని ఆయన నీ గుడారములోనుండి
నిన్ను పెల్లగించును
సజీవుల దేశములోనుండి నిన్ను నిర్మూలము
చేయును. (సెలా.)
నీతిమంతులు చూచి భయభక్తులు కలిగి 6
—ఇదిగో దేవుని తనకు దుర్గముగా నుంచుకొనక 7
తన ధనసమృద్ధియందు నమ్మిక యుంచి
తన చేటును బలపరచుకొనినవాడు వీడేయని చెప్పు
కొనుచు వాని చూచి నవ్వుదురు.
నేనైతే దేవుని మందిరములో పచ్చని ఒలీవ చెట్టు 8
వలె నున్నాను
నిత్యము దేవుని కృపయందు నమ్మిక యుంచు
చున్నాను.
నీవు దాని నెరవేర్చితివి గనుక నేను నిత్యము నిన్ను 9
స్తుతించెదను.
నీ నామము నీ భక్తుల దృష్టికి ఉత్తమమైనది
నేను దాని స్మరించి కనిపెట్టుచున్నాను.

## 53

ప్రధానగాయకునికి.

మహలతు అను రాగముమీద పాడదగినది.

దావీదు రచించినది. దైవధ్యానము.

—దేవుడు లేడని బుద్ధిహీనులు హృదయములో
అనుకొందురు.
వారు చెడిపోయినవారు, అసహ్య
చేయుదురు
మేలు చేయువాడొకడును

15 దేవుడు నన్ను చేర్చుకొనును
పాతాళ బలములోనుండి ఆయన నా ప్రాణమును
విమోచించును. (సెలా.)
16 ఒకడు ధనసంపన్నుడైనప్పుడు
వాని యింటి ఘనత విస్తరించినప్పుడు భయ
పడకుము.
17 వాడు చనిపోవునప్పుడు ఏమియు కొంచుపోడు
వాని ఘనత వానివెంట దిగదు.
18 —నీకు నీవే మేలు చేసికొంటివని మనుష్యులు
నిన్ను స్తుతించినను
తన జీవితకాలమున నొకడు తన్ను పొగడు
కొనినను
19 అతడు తన పితరుల తరమునకు చేరవలెను
వారు మరి ఎన్నడును వెలుగు చూడరు.
20 ఘనత నొంది యుండియు బుద్ధిహీనులైనవారు
నశించు జంతువులను పోలియున్నారు.

50

ఆసాపు కీర్తన.

దేవాది దేవుడైన యెహోవా ఆజ్ఞ ఇచ్చు
చున్నాడు
తూర్పుదిక్కు మొదలుకొని పడమటి దిక్కువరకు
భూనివాసులను రమ్మని ఆయన పిలుచుచున్నాడు.
2 పరిపూర్ణ సౌందర్యముగల సీయోనులోనుండి
దేవుడు ప్రకాశించుచున్నాడు
3 మన దేవుడు వేంచేయుచున్నాడు
ఆయన మౌనముగా నుండడు.
ఆయన ముందర అగ్ని మండుచున్నది
ఆయనచుట్టు ప్రచండవాయువు విసరుచున్నది.
4 ఆయన తన ప్రజలకు న్యాయము తీర్చుటకై
5 —బల్యర్పణచేత నాతో నిబంధన చేసికొనిన
నా భక్తులను నాయొద్దకు సమకూర్చుడని
మీది ఆకాశమును భూమిని పిలుచుచున్నాడు.
6 దేవుడు తానే న్యాయకర్తయై యున్నాడు.
ఆకాశము ఆయన నీతిని తెలియజేయుచున్నది.
(సెలా.)
7 నా జనులారా, నేను మాటలాడబోవుచున్నాను
ఆలకించుడి
ఇశ్రాయేలూ, ఆలకింపుము నేను దేవుడను నీ
దేవుడను నేను నీ మీద సాక్ష్యము పలికెదను
8 నీ బలుల విషయమై నేను నిన్ను గద్దించుట లేదు
నీ దహనబలులు నిత్యము నాయెదుట కనబడు
చున్నవి.
9 నీ యింటనుండి కోడెనైనను
నీ మందలోనుండి పొట్టేళ్లనైనను నేను తీసికొనను.
10 అడవిమృగములన్నియు
వేయికొండలమీది పశువులన్నియు నావేగదా
11 కొండలలోని పక్షులన్నిటిని నేనెరుగుదును
పొలములలోని పశ్వాదులు నా వశమై యున్నవి.
లోకమును దాని పరిపూర్ణతయు నావే. 12
నేను ఆకలిగొనినను నీతో చెప్పను.
వృషభముల మాంసము నేను తిందునా? 13
పొట్టేళ్ల రక్తము త్రాగుదునా?
దేవునికి స్తుతి యాగము చేయుము 14
మహోన్నతునికి నీ మ్రొక్కుబడులు చెల్లిం
చుము.
ఆపత్కాలమున నీవు నన్నుగూర్చి మొర్రపెట్టుము 15
నేను నిన్ను విడిపించెదను నీవు నన్ను మహిమ
పరచెదవు.
భక్తిహీనులతో దేవుడు ఇట్లు సెలవిచ్చుచున్నాడు 16
—నా కట్టడలు వివరించుటకు నీకేమి పని?
నా నిబంధన నీ నోట వచించెదవేమి?
దిద్దుబాటు నీకు అసహ్యము గదా 17
నీవు నా మాటలను నీ వెనుకకు త్రోసివేసెదవు.
నీవు దొంగను చూచినప్పుడు వానితో ఏకీభవిం 18
చెదవు
వ్యభిచారులతో నీవు సాంగత్యము చేసెదవు.
కీడుచేయవలెనని నీవు నోరు తెరచుచున్నావు 19
నీ నాలుక కపటము కల్పించుచున్నది.
నీవు కూర్చుండి నీ సహోదరునిమీద కొండె 20
ములు చెప్పుచున్నావు
నీ తల్లి కుమారునిమీద అపనిందలు మోపు
చున్నావు.
ఇట్టి పనులు నీవు చేసినను నేను మౌనినై యుంటిని 21
అందుకు నేను కేవలము నీవంటివాడనని నీవను
కొంటివి
అయితే నీ కన్నులయెదుట ఈ సంగతులను నేను
వరుసగా ఉంచి నిన్ను గద్దించెదను
దేవుని మరచువారలారా, దీని యోచించుకొనుడి 22
లేనియెడల నేను మిమ్మును చీల్చివేయుదును
తప్పించువాడెవడును లేకపోవును
స్తుతియాగము అర్పించువాడు నన్ను మహిమపర 23
చుచున్నాడు
నేను వానికి దేవుని రక్షణ కనుపరచునట్లు వాడు
మార్గము సిద్ధపరచుకొనును.

51

ప్రధానగాయకునికి.
దావీదు బత్షెబయొద్దకు వెళ్లిన తరువాత నాతానను ప్రవక్త అతని
యొద్దకు వచ్చినప్పుడు అతడు రచించిన కీర్తన.

దేవా, నీ కృపచొప్పున నన్ను కరుణింపుము
నీ వాత్సల్య బాహుళ్యముచొప్పున
నా అతిక్రమములను తుడిచివేయుము
నా దోషము పోవునట్లు నన్ను బాగుగా కడు 2
గుము
నా పాపము పోవునట్లు నన్ను పవిత్రపరచుము.

2 వివేకము కలిగి దేవుని వెదకువారు ఉందురో లేరో కనుగొనుటకై
యెహోవా ఆకాశమునుండి నరులను నిదానించి చూచుచున్నాడు.
వారందరును తొలగిపోయి యున్నారు
3 ఒకడును తప్పకుండ అందరును చెడియున్నారు
మేలు చేయువాడు లేడు ఒక్కడైనను లేడు.
4 దేవునికి ప్రార్థనచేయక ఆహారము తినునట్లుగా
నా ప్రజలను తిను పాపాత్ములకు తెలివిలేదా?
5 భయకారణము లేనిచోట వారు భయాక్రాంతులైరి.
నిన్ను ముట్టడివేయువారి యెముకలను దేవుడు చెదరగొట్టియున్నాడు
దేవుడు వారిని ఉపేక్షించెను గనుక నీవు వారిని సిగ్గుపరచితివి.
6 సీయోనునుండి ఇశ్రాయేలుకు పూర్ణరక్షణ కలుగును గాక.
దేవుడు చెరలోనున్న తన ప్రజలను రప్పించునప్పుడు
యాకోబు హర్షించును ఇశ్రాయేలు సంతోషించును.

## 54

ప్రధానగాయకునికి.

తంతివాద్యములతో పాడదగినది. జీఫీయులు వచ్చి—దావీదు మాలో దాగియున్నాడు కాదా అని సౌలుతో చెప్పినప్పుడు దావీదు రచించిన దైవధ్యానము.

దేవా, నీ నామమునుబట్టి నన్ను రక్షింపుము
నీ పరాక్రమమునుబట్టి నాకు న్యాయము తీర్చుము.
2 దేవా, నా ప్రార్థన ఆలకింపుము
నా నోటి మాటలు చెవినిబెట్టుము.
3 అన్యులు నా మీదికి లేచియున్నారు
బలాఢ్యులు నా ప్రాణము తీయజూచుచున్నారు
వారు తమయెదుట దేవుని ఉంచుకొన్నవారు కారు. (సెలా.)
4 ఇదిగో దేవుడే నాకు సహాయకుడు
ప్రభువే నా ప్రాణమును ఆదరించువాడు.
5 నా శత్రువులు చేయు కీడు ఆయన వారిమీదికి రప్పించును
నీ సత్యమునుబట్టి వారిని నశింపజేయుము
6 స్వేచ్ఛార్పణలైన బలులను నేను నీకర్పించెదను.
యెహోవా, నీ నామము ఉత్తమము
7 నేను దానికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాను.
ఆపదలన్నిటిలోనుండి ఆయన నన్ను విడిపించియున్నాడు
నా శత్రువుల గతిని చూచి నా కన్ను సంతోషించుచున్నది.

## 55

ప్రధానగాయకునికి.

తంతివాద్యములమీద పాడదగినది

దావీదు రచించినది.

దైవధ్యానము.

దేవా, చెవియొగ్గి నా ప్రార్థన ఆలకింపుము
నా విన్నపమునకు విముఖుడవై యుండకుము.
నా మనవి ఆలకించి నాకుత్తరమిమ్ము. 2
శత్రువుల శబ్దమునుబట్టియు 3
దుష్టుల బలాత్కారమునుబట్టియు
నేను చింతాక్రాంతుడనై విశ్రాంతి లేక మూలుగుచున్నాను.
వారు నామీద దోషము మోపుచున్నారు
ఆగ్రహముగలవారై నన్ను హింసించుచున్నారు.
నా గుండె నాలో వేదనపడుచున్నది 4
మరణభయము నాలో పుట్టుచున్నది
దిగులును వణకును నాకు కలుగుచున్నవి 5
మహా భయము నన్ను ముంచివేసెను.
ఆహా గువ్వవలె నాకు రెక్కలున్నయెడల 6
నేను ఎగిరిపోయి నెమ్మదిగా నుందునే
త్వరపడి దూరముగా పారిపోయి 7
పెనుగాలిని సుడిగాలిని తప్పించుకొని
అరణ్యములో నివసించియుందునే అనుకొంటిని. 8
పట్టణములో బలాత్కార కలహములు జరుగుట నేను చూచుచున్నాను. 9
ప్రభువా, అట్టిపనులు చేయువారిని నిర్మూలము చేయుము వారి నాలుకలు ఛేదించుము.
దివారాత్రులు వారు పట్టణపు ప్రాకారములమీద తిరుగుచున్నారు 10
పాపమును చెడుతనమును దానిలో జరుగుచున్నవి.
దాని మధ్యను నాశనక్రియలు జరుగుచున్నవి 11
వంచనయు కపటమును దాని అంగడి వీధులలో మానక జరుగుచున్నవి.
నన్ను దూషించువాడు శత్రువు కాడు 12
శత్రువైనయెడల నేను దాని సహింపవచ్చును
నామీద మిట్టిపడువాడు నాయందు పగపట్టినవాడు కాడు
అట్టివాడైతే నేను దాగియుండవచ్చును.
ఈ పనిచేసిన నీవు నా సహకారివి 13
నా చెలికాడవు నా పరిచయుడవు.
మనము కూడి మధురమైన గోష్ఠిచేసి యున్నవారము 14
ఉత్సవమునకు వెళ్లు సమూహముతో దేవుని మందిరమునకు పోయి యున్నవారము.
వారికి మరణము అకస్మాత్తుగా వచ్చును గాక 15
సజీవులుగానే వారు పాతాళమునకు దిగిపోవుదురు గాక

చెడుతనము వారి నివాసములలోను వారి అంత
రంగమునందును ఉన్నది
16 అయితే నేను దేవునికి మొఱ్ఱపెట్టుకొందును
యెహోవా నన్ను రక్షించును.
17 సాయంకాలమున ఉదయమున మధ్యాహ్నమున
నేను ధ్యానించుచు మొఱ్ఱపెట్టుచున్నాను
ఆయన నా ప్రార్థన ఆలకించియున్నాడు.
18 నా శత్రువులు అనేకులై యున్నారు
అయినను వారు నామీదికి రాకుండునట్లు
సమాధానము కలుగజేసి ఆయన నా ప్రాణమును
విమోచించి యున్నాడు.
19 పురాతనకాలము మొదలుకొని ఆసీనుడగు దేవుడు,
మారుమనస్సు లేనివారై తనకు భయపడనివారికి
ఉత్తరమిచ్చును.
20 తమతో సమాధానముగా నున్నవారికి వారు బలా
త్కారము చేయుదురు
తాము చేసిన నిబంధన నతిక్రమింతురు.
21 వారి నోటి మాటలు వెన్నవలె మృదువుగా
నున్నవి
అయితే వారి హృదయములో కలహమున్నది.
వారి మాటలు చమురుకంటె నునుపైనవి
అయితే అవి వరదీసిన కత్తులే.
22 నీ భారము యెహోవామీద మోపుము
ఆయనే నిన్ను ఆదుకొనును
నీతిమంతులను ఆయన ఎన్నడును కదలనీయడు,
23 దేవా, నాశనకూపములో నీవు వారిని పడవే
యుదువు
రక్తాపరాధులును వంచకులును
సగముకాలమైన బ్రదుకరు.
నేనైతే నీయందు నమ్మికయుంచి యున్నాను.

## 56

ప్రధానగాయకునికి.

యోనతేలెమ్ రెహోకీమ్ అను రాగముమీద పాడదగినది. ఫిలిష్తీ
యులు దావీదును గాతులో పట్టుకొనినప్పుడు అతడు రచించి
నది. అనుపదగీతము.

దేవా, నన్ను కరుణింపుము మనుష్యులు నన్ను
మ్రింగవలెనని యున్నారు
దినమెల్ల వారు పోరాడుచు నన్ను బాధించు
చున్నారు.
2 అనేకులు గర్వించి నాతో పోరాడుచున్నారు
దినమెల్ల నాకొరకు పొంచియున్నవారు నన్ను
మ్రింగవలెనని యున్నారు
3 నాకు భయము సంభవించు దినమున నిన్ను ఆశ్ర
యించుచున్నాను.
4 దేవునిబట్టి నేను ఆయన వాక్యమును కీర్తించెదను
దేవునియందు నమ్మికయుంచి యున్నాను నేను
భయపడను
శరీరధారులు నన్నేమి చేయగలరు?
దినమెల్ల వారు నా మాటలు అపార్థము చేయు 5
దురు
నాకు హాని చేయవలెనన్న తలంపులే వారికి నిత్యము
పుట్టుచున్నవి.
వారు గుంపుకూడి పొంచియుందురు 6
నా ప్రాణము తీయగోరుచు వారు నా అడుగు
జాడలు కనిపెట్టుదురు.
తాము చేయు దోషక్రియలచేత వారు తప్పించు 7
కొందురా?
దేవా, కోపముచేత జనములను అణగగొట్టుము.
నా సంచారములను నీవు లెక్కించి యున్నావు 8
నా కన్నీళ్లు నీ బుడ్డిలో నుంచబడి యున్నవి
అవి నీ కవిలెలో కనబడును గదా.
నేను మొఱ్ఱపెట్టు దినమున నా శత్రువులు వెను 9
కకు తిరుగుదురు.
దేవుడు నా పక్షమున నున్నాడని నాకు తెలి
యును.
దేవునిబట్టి నేను ఆయన వాక్యమును కీర్తించెదను 10
యెహోవానుబట్టి ఆయన వాక్యమును కీరిం
చెదను
నేను దేవునియందు నమ్మికయుంచి యున్నాను 11
నేను భయపడను
నరులు నన్నేమి చేయగలరు?
దేవా, నీవు మరణములోనుండి నా ప్రాణమును 12
తప్పించియున్నావు
నేను జీవపు వెలుగులో దేవుని సన్నిధిని సంచ
రించునట్లు జారిపడకుండ నీవు నా పాదము
లను తప్పించియున్నావు.
నేను నీకు మ్రొక్కుకొని యున్నాను 13
నేను నీకు స్తుతియాగముల నర్పించెదను.

## 57

ప్రధానగాయకునికి.

అల్‌తష్హేతు అను రాగముమీద పాడదగినది. గుహలో దావీదు
సౌలునొద్దనుండి పారిపోయినప్పుడు అతడు రచించినది.
అనుపదగీతము.

నన్ను కరుణింపుము దేవా నన్ను కరుణింపుము
నేను నీ శరణుజొచ్చి యున్నాను
ఈ ఆపదలు తొలగిపోవువరకు నీ రెక్కల నీడను
శరణుజొచ్చి యున్నాను.
మహోన్నతుడైన దేవునికి 2
నా కార్యము సఫలముచేయు దేవునికి నేను
మొఱ్ఱపెట్టుచున్నాను.
ఆయన ఆకాశమునుండి ఆజ్ఞ ఇచ్చి నన్ను రక్షిం 3
చును
నన్ను మ్రింగగోరువారు దూషణలు పలుకు
నప్పుడు

దేవుడు తన కృపాసత్యములను పంపును. (సెలా.)
4 నా ప్రాణము సింహములమధ్య నున్నది
కోపోద్రేకుల మధ్యను నేను పండుకొనుచున్నాను
వారి దంతములు శూలములు అవి అంబులు
వారి నాలుక వాడిగల కత్తి.
5 దేవా, ఆకాశముకంటె అత్యున్నతుడవుగా నిన్ను
కనుపరచుకొనుము
నీ ప్రభావము సర్వభూమిమీద కనబడనిమ్ము.
6 నా అడుగులను చిక్కించుకొనుటకై వారు వల
యొడ్డిరి
నా ప్రాణము క్రుంగియున్నది.
నాయెదుట గుంట త్రవ్వి దానిలో తామే పడిరి.
(సెలా.)
7 నా హృదయము నిబ్బరముగా నున్నది
దేవా, నా హృదయము నిబ్బరముగా నున్నది
నేను పాడుచు కీర్తించెదను.
8 నా ప్రాణమా, మేలుకొనుము స్వరమండలమా
సితారా, మేలుకొనుడి
నేను వేకువను ముందుగా లేచెదను.
9 నీ కృప ఆకాశ విశాలమువరకు
నీ సత్యము మేఘమండలమువరకు వ్యాపించి
యున్నది.
10 ప్రభువా, జనములలో నీకు కృతజ్ఞతాస్తుతులు
నేను చెల్లించెదను
ప్రజలలో నిన్ను కీర్తించెదను.
11 దేవా, ఆకాశముకంటె అత్యున్నతుడవుగా నిన్ను
కనుపరచుకొనుము.
నీ ప్రభావము సర్వభూమిమీద కనబడనిమ్ము.

## 58

ప్రధానగాయకునికి.
అల్తష్హేతు అను రాగముమీద పాడదగినది.
దావీదు రచించిన కీర్తన.
అనుపదగీతము.

**అ**ధిపతులారా, మీరు నీతి ననుసరించి మాటలా
డుదురన్నది నిజమా?
నరులారా, మీరు న్యాయమునుబట్టి తీర్పు తీర్చు
దురా?
2 లేదే, మీరు హృదయపూర్వకముగా చెడుతనము
జరిగించుచున్నారు
దేశమందు మీ చేతి బలాత్కారము తూచి చెల్లించు
చున్నారు.
3 తల్లికడుపున పుట్టినది మొదలుకొని భక్తిహీనులు
విపరీతబుద్ధులై కలిగియుందురు
పుట్టినతోడనే అబద్ధములాడుచు తప్పిపోవుదురు.
4 వారి విషము నాగుపాము విషమువంటిది
5 మాంత్రికులు ఎంత నేర్పుగా మంత్రించినను
వారి స్వరము తనకు వినబడకుండునట్లు
చెవి మూసికొనునట్టి చెవిటిపామువలె వారు
న్నారు.
దేవా, వారి నోట వారి పండ్లను విరుగగొట్టుము 6
యెహోవా, కొదమ సింహముల కోరలను ఊడ
గొట్టుము.
పారు నీళ్లవలె వారు గతించిపోవుదురు 7
అతడు తన బాణములను సంధింపగా
అవి తునాతునకలై పోవును.
వారు కరిగిపోయి నత్తవలె నుందురు 8
సూర్యుని చూడని గర్భస్రావమువలె నుందురు.
మీ కుండలకు ముళ్లకంపల సెగ తగలకమునుపే 9
అది పచ్చిదైనను ఉడికినదైనను ఆయన దాని
నెగరగొట్టుచున్నాడు.
ప్రతిదండన కలుగగా నీతిమంతులు చూచి సంతో 10
షించుదురు
భక్తిహీనుల రక్తములో వారు తమ పాదములు
కడుగుకొందురు.
కావున — నిశ్చయముగా నీతిమంతులకు ఫలము 11
కలుగుననియు
నిశ్చయముగా న్యాయము తీర్చు దేవుడు లోక
ములో నున్నాడనియు
మనుష్యులు ఒప్పుకొందురు.

## 59

ప్రధానగాయకునికి.
అల్తష్హేతు అను రాగముమీద పాడదగినది. దావీదును చంపుటకు
సౌలు పంపినవారు ఇంటియొద్ద పొంచియున్నప్పుడు అతడు
రచించినది. అనుపదగీతము.

**నా** దేవా, నా శత్రువులచేతిలోనుండి నన్ను
తప్పింపుము.
నామీద పడువారికి చిక్కకుండ నన్ను ఉద్ధరించుము.
పాపము చేయువారి చేతిలోనుండి నన్ను తప్పిం 2
పుము.
రక్తాపరాధుల చేతిలోనుండి నన్ను రక్షింపుము.
నా ప్రాణము తీయవలెనని వారు పొంచి 3
యున్నారు
యెహోవా, నా దోషమునుబట్టి కాదు నా
పాపమునుబట్టి కాదు
ఊరకయే బలవంతులు నాపైని పోగుబడి
యున్నారు.
నాయందు ఏ అక్రమమును లేకున్నను వారు 4
పరుగులెత్తి సిద్ధపడుచున్నారు
నన్ను కలిసికొనుటకై మేల్కొనుము.
సైన్యములకధిపతియగు యెహోవావైన దేవా, 5
ఇశ్రాయేలు దేవా,

అన్యజనులనందరిని శిక్షించుటకై మేల్కొనుము
అధికద్రోహులలో ఎవరిని కనికరింపకుము. (సెలా.)
6 సాయంకాలమున వారు మరల వచ్చెదరు
కుక్కవలె మొరుగుచు పట్టణముచుట్టు తిరుగుదురు.
7 వినువారెవరును లేరనుకొని వారు తమ నోటనుండి మాటలు వెళ్లగ్రక్కుదురు.
వారి పెదవులలో కత్తులున్నవి.
8 యెహోవా, నీవు వారిని చూచి నవ్వుదువు
అన్యజనులనందరిని నీవు అపహసించుదువు.
9 నా బలమా, నీకొరకు నేను కనిపెట్టుకొనుచున్నాను
నా ఉన్నతమైన దుర్గము దేవుడే.
10 నా దేవుడు తన కృపతో నన్ను కలిసికొనును
నాకొరకు పొంచియున్నవారికి సంభవించినదానిని దేవుడు నాకు చూపించును.
11 వారిని చంపకుము ఏలయనగా నా ప్రజలు దాని మరచిపోదురేమో.
మా కేడెమైన ప్రభువా, నీ బలముచేత వారిని చెల్లాచెదరు చేసి అణగగొట్టుము.
12 వారి పెదవుల మాటవలన వారి నోటికి పాపము కలుగును
వారు పలుకు శాపములనుబట్టియు అబద్ధములనుబట్టియు
వారు తమ గర్వములో చిక్కుబడుదురు గాక.
13 కోపముచేత వారిని నిర్మూలము చేయుము
వారు లేకపోవునట్లు వారిని నిర్మూలము చేయుము
దేవుడు యాకోబు (వంశమును) ఏలుచున్నాడని భూదిగంతములవరకు మనుష్యులు ఎరుగునట్లు చేయుము. (సెలా.)
14 సాయంకాలమున వారు మరల వచ్చెదరు
కుక్కవలె మొరుగుచు పట్టణముచుట్టు తిరుగుదురు
15 తిండికొరకు వారు ఇటు అటు తిరుగులాడెదరు
తృప్తి కలుగని పక్షమున రాత్రి అంతయు ఆగుదురు.
16 నీవు నాకు ఎత్తయిన కోటగా ఉన్నావు
ఆపద్దినమున నాకు ఆశ్రయముగా ఉన్నావు.
నీ బలమునుగూర్చి నేను కీర్తించెదను
ఉదయమున నీ కృపనుగూర్చి ఉత్సాహగానము చేసెదను
17 దేవుడు నాకు ఎత్తయిన కోటగాను
కృపగల దేవుడుగాను ఉన్నాడు
నా బలమా, నిన్నే కీర్తించెదను

# 60

ప్రధానగాయకునికి.
షూషనేదూతుమీద పాడదగినది.
దావీదు అరమ్నహరాయీమీయులతోను అరమోజబాయీయులతోను యుద్ధముచేయగా యోవాబు ఉప్పుపల్లములో పన్నెండువేలమంది ఎదోమీయులను చంపి తిరిగి వచ్చినప్పుడు అతడు ఉపదేశమునకు రచించినది. అనుపదగీతము.

దేవా, మమ్ము విడనాడియున్నావు మమ్ము చెదరగొట్టియున్నావు
నీవు కోపపడితివి మమ్ము మరల బాగుచేయుము.
నీవు దేశమును కంపింపజేసియున్నావు దాని బద్దలుచేసియున్నావు 2
అది వణకుచున్నది అది పడిపోయిన చోటులు బాగుచేయుము.
నీ ప్రజలకు నీవు కఠినకార్యములు చేసితివి 3
తూలునట్లు చేయు మద్యమును మాకు త్రాగించితివి
సత్యము నిమిత్తము ఎత్తి పట్టుటకై 4
నీయందు భయభక్తులుగలవారికి నీవొక ధ్వజము నిచ్చియున్నావు. (సెలా.)
నీ ప్రియులు విమోచింపబడునట్లు 5
నీ కుడిచేత నన్ను రక్షించి నాకుత్తరమిమ్ము.
దేవుడు తన పరిశుద్ధతతోడని మాట యిచ్చియున్నాడు 6
నేను ప్రహర్షించెదను షెకెమును పంచిపెట్టెదను
సుక్కోతు లోయను కొలిపించెదను.
గిలాదు నాది మనష్షే నాది ఎఫ్రాయిము నాకు శిరస్త్రాణము 7
యూదా నా రాజదండము.
మోయాబు నేను కాళ్లు కడుగుకొను పళ్లెము 8
ఎదోముమీద నా చెప్పు విసిరివేయుచున్నాను
ఫిలిష్తియా, నన్నుగూర్చి ఉత్సాహధ్వని చేయుము.
కోటగల పట్టణములోనికి నన్నెవడు తోడుకొని పోవును? 9
ఎదోములోనికి నన్నెవడు నడిపించును?
దేవా, నీవు మమ్ము విడనాడియున్నావు 10
దేవా, మా సేనలతోకూడ నీవు బయలుదేరుట మానియున్నావు.
మనుష్యుల సహాయము వ్యర్థము 11
మేము శత్రువులచేత ఓడిపోకుండ నీవే మాకు సహాయము అనుగ్రహింపుము.
దేవునివలన నే జయము నొందుదుము 12
మా శత్రువులను అణగద్రొక్కువాడు ఆయనే.

# 61

ప్రధానగాయకునికి.
తివాద్యములతో పాడదగినది.
దావీదు కీర్తన.

దేవా, నా మొఱ్ఱ ఆలకింపుము
నా ప్రార్థనకు చెవియొగ్గుము

2 నా ప్రాణము తల్లడిల్లగా భూదిగంతములనుండి
నీకు మొఱ్ఱపెట్టుచున్నాను
నేను ఎక్కలేనంత యెత్తయిన కొండపైకి నన్ను
ఎక్కించుము.
3 నీవు నాకు ఆశ్రయముగా నుంటివి
శత్రువులయెదుట బలమైన కోటగా నుంటివి.
4 యుగయుగములు నేను నీ గుడారములో నివసించెదను
నీ రెక్కల చాటున దాగుకొందును. (సెలా.)
5 దేవా, నీవు నా మ్రొక్కుబడుల నంగీకరించి
యున్నావు
నీ నామమునందు భయభక్తులుగలవారి స్వాస్థ్యము
నీవు నాకనుగ్రహించి యున్నావు.
6 రాజుకు దీర్ఘాయువు కలుగజేయుదువు గాక
అతని సంవత్సరములు తరతరములు గడచును గాక.
7 దేవుని సన్నిధిని అతడు నిరంతరము నివసించును
గాక
అతని కాపాడుటకై కృపాసత్యములను నియమించుము.
8 దినదినము నా మ్రొక్కుబడులను నేను చెల్లించు
నట్లు
నీ నామమును నిత్యము కీర్తించెదను.

## 62

ప్రధానగాయకునికి.
యెదూతూను అను రాగముమీద పాడదగినది.
దావీదు కీర్తన.

నా ప్రాణము దేవుని నమ్ముకొని మౌనముగా
ఉన్నది
ఆయనవలన నాకు రక్షణ కలుగును.
2 ఆయనే నా ఆశ్రయదుర్గము ఆయనే నా రక్షణ
కర్త
ఎత్తయిన నా కోట ఆయనే, నేను అంతగా కదిలింపబడను.
3 ఎన్నాళ్లు మీరు ఒకనిమీద పైబడుదురు?
ఒరుగుచున్న గోడను పడబోవు కంచెను ఒకడు
పడద్రోయునట్లు మీరందరు ఎన్నాళ్లు ఒకని
పడద్రోయ చూచుదురు?
4 అతని ఔన్నత్యమునుండి అతని పడద్రోయుటకే
వారు ఆలోచించుదురు
అబద్ధమాడుట వారికి సంతోషము
వారు తమ నోటితో శుభవచనములు పలుకుచు
అంతరంగములో దూషించుదురు. (సెలా.)
5 నా ప్రాణమా, దేవుని నమ్ముకొని మౌనముగా
నుండుము
ఆయనవలననే నాకు నిరీక్షణ కలుగుచున్నది.
6 ఆయనే నా ఆశ్రయదుర్గము నా రక్షణాధారము
నా ఎత్తయిన కోట ఆయనే, నేను కదిలింపబడను.
నా రక్షణకు నా మహిమకు దేవుడే ఆధారము. 7
నా బలమైన ఆశ్రయదుర్గము
నా ఆశ్రయము దేవునియందే యున్నది.
జనులారా, యెల్లప్పుడు ఆయనయందు నమ్మిక 8
యుంచుడి
ఆయన సన్నిధిని మీ హృదయములు కుమ్మరించుడి
దేవుడు మనకు ఆశ్రయము. (సెలా.)
అల్పులైనవారు వట్టి ఊపిరిగా యున్నారు 9
ఘనులైనవారు మాయాస్వరూపులు
త్రాసులో వారందరు తేలిపోవుదురు
వట్టి ఊపిరికన్న అలకనగా ఉన్నారు
బలాత్కారమందు నమ్మికయుంచకుడి 10
దోచుకొనుటచేత గర్వపడకుడి
ధనము హెచ్చినను దాని లక్ష్యపెట్టకుడి.
—బలము తనదని ఒక మారు దేవుడు సెలవిచ్చెను 11
రెండు మారులు ఆ మాట నాకు వినబడెను.
ప్రభువా, మనుష్యులకందరికి వారి వారి క్రియల 12
చొప్పున నీవే ప్రతిఫలమిచ్చుచున్నావు.
కాగా కృప చూపుటయు నీది.

## 63

దావీదు యూదా అరణ్యములోనుండగా
రచించిన కీర్తన.

దేవా, నా దేవుడవు నీవే వేకువనే నిన్ను వెదకు 2
దును
నీ బలమును నీ ప్రభావమును చూడవలెనని
పరిశుద్ధాలయమందు నేనెంతో ఆశతో నీతట్టు
కనిపెట్టియున్నాను.
నీళ్లులేక యెండియున్న దేశమందు
నా ప్రాణము నీకొరకు తృష్ణగొనియున్నది
నీమీది ఆశచేత నిన్ను చూడవలెనని నా శరీరము
కృశించుచున్నది.
నీ కృప జీవముకంటె ఉత్తమము 3
నా పెదవులు నిన్ను స్తుతించును.
నా మంచముమీద నిన్ను జ్ఞాపకము చేసికొని 4
రాత్రిజాములయందు నిన్ను ధ్యానించునప్పుడు 6
క్రొవ్వు మెదడు నాకు దొరికినట్లుగా నా
ప్రాణము తృప్తిపొందుచున్నది
ఉత్సహించు పెదవులతో నా నోరు నిన్నుగూర్చి
గానము చేయుచున్నది
కాగా నా జీవితకాలమంతయు నేనీలాగున నిన్ను
స్తుతించెదను
నీ నామమునుబట్టి నా చేతులెత్తెదను.
నీవు నాకు సహాయకుడవై యుంటివి 7
నీ రెక్కల చాటున శరణుజొచ్చి ఉత్సాహ
ధ్వని చేసెదను.

13 పచ్చికపట్లు మందలను వస్త్రమువలె ధరించియున్నవి.
లోయలు సస్యములతో కప్పబడియున్నవి
అన్నియు సంతోషధ్వని చేయుచున్నవి అన్నియు
గానము చేయుచున్నవి.

## 66

ప్రధానగాయకునికి.

కీర్తన. గీతము.

సర్వలోకనివాసులారా, దేవునిగూర్చి సంతోష
గీతము పాడుడి
ఆయన నామప్రభావము కీర్తించుడి
2 ఆయనకు ప్రభావము ఆరోపించి ఆయనను
స్తోత్రించుడి
ఈలాగు దేవునికి స్తోత్రము చెల్లించుడి.
3 —నీ కార్యములు ఎంతో భీకరమైనవి
నీ బలాతిశయమునుబట్టి నీ శత్రువులు లొంగి
నీయొద్దకు వచ్చెదరు
4 సర్వలోకము నీకు నమస్కరించి నిన్ను కీర్తించును
నీ నామమునుబట్టి నిన్ను కీర్తించును. (సెలా.)
5 దేవుని ఆశ్చర్యకార్యములను చూడ రండి
నరులయెడల ఆయన జరిగించు కార్యములను
చూడగా ఆయన భీకరుడై యున్నాడు.
6 ఆయన సముద్రమును ఎండిన భూమిగా జేసెను
జనులు కాలినడకచే దాటిరి.
అక్కడ ఆయనయందు మేము సంతోషించితిమి.
7 ఆయన తన పరాక్రమమువలన నిత్యము ఏలు
చున్నాడు
అన్యజనులమీద ఆయన తన దృష్టియుంచి
యున్నాడు
ద్రోహులు తమ్ము తాము హెచ్చించుకొన తగదు.
సెలా.)
8 జనములారా, మా దేవుని సన్నుతించుడి
గొప్ప స్వరముతో ఆయన కీర్తి వినుపించుడి.
9 జీవప్రాప్తులగా మమ్మును కలుగజేయువాడు
ఆయనే
ఆయన మా పాదములు కదలనియ్యడు.
10 దేవా, నీవు మమ్మును పరిశీలించియున్నావు.
వెండిని నిర్మలము చేయురీతిగా మమ్ము నిర్మలులను
చేసియున్నావు.
11 నీవు బందీగృహములో మమ్ము ఉంచితివి
మా నడుములమీద గొప్ప భారము పెట్టితివి.
12 నరులు మా నెత్తిమీద ఎక్కునట్లు చేసితివి
మేము నిప్పులలోను నీళ్లలోను పడితిమి
అయినను నీవు సమృద్ధిగలచోటికి మమ్ము రప్పించి
యున్నావు.
13 దహనబలులను తీసికొని నేను నీ మందిరములోనికి
వచ్చెదను.
నాకు శ్రమ కలిగినప్పుడు 14
నా పెదవులు పలికిన మ్రొక్కుబడులను
నా నోరు వచించిన మ్రొక్కుబడులను నేను నీకు
చెల్లించెదను
పొట్టేళ్లను ధూపమును క్రొవ్విన గొఱ్ఱెలను తీసి 15
కొని
నీకు దహనబలులు అర్పించెదను.
ఎద్దులను పోతుమేకలను అర్పించెదను. (సెలా.)
దేవునియందు భయభక్తులుగలవారలారా, మీరం 16
దరు వచ్చి ఆలకించుడి
ఆయన నాకొరకు చేసిన కార్యములను నేను
వినిపించెదను.
ఆయనకు నేను మొఱ్ఱపెట్టితిని 17
అప్పుడే నా నోట శ్రేష్ఠమైన కీర్తన యుండెను.
నా హృదయములో నేను పాపమును లక్ష్యము 18
చేసినయెడల
ప్రభువు నా మనవి వినకపోవును.
నిశ్చయముగా దేవుడు నా మనవి అంగీకరించి 19
యున్నాడు
ఆయన నా విజ్ఞాపన ఆలకించియున్నాడు.
దేవుడు నా ప్రార్థనను త్రోసివేయలేదు 20
నాయొద్దనుండి తన కృపను తొలగింపలేదు.
ఆయన సన్నుతింపబడును గాక.

## 67

ప్రధానగాయకునికి.

తంతివాద్యములతో పాడదగినది.

గీతము.

భూమిమీద నీ మార్గము తెలియబడునట్లును
అన్యజనులందరిలో నీ రక్షణ తెలియబడునట్లును
దేవుడు మమ్మును కరుణించి మమ్మును ఆశీర్వదిం 2
చును గాక
ఆయన తన ముఖకాంతి మామీద ప్రకాశింప
జేయును గాక. (సెలా.)
దేవా, ప్రజలు నిన్ను స్తుతించుదురు గాక. 3
ప్రజలందరు నిన్ను స్తుతించుదురు గాక.
న్యాయమునుబట్టి నీవు జనములకు తీర్పు తీర్చుదువు
భూమిమీదనున్న జనములను ఏలెదవు. (సెలా.)
జనములు సంతోషించుచు ఉత్సాహధ్వని చేయును 4
గాక
దేవా, ప్రజలు నిన్ను స్తుతించుదురు గాక 5
ప్రజలందరు నిన్ను స్తుతించుదురు గాక.
అప్పుడు భూమి దాని ఫలమిచ్చును 6
దేవుడు మా దేవుడు మమ్మును ఆశీర్వదించును.
దేవుడు మమ్మును దీవించును 7
భూదిగంత నివాసులందరును ఆయనయందు భయ
భక్తులు నిలుపుదురు.

68 ప్రధానగాయకునికి.
దావీదు రచించినది. గీతము.

దేవుడు లేచును గాక
ఆయన శత్రువులు చెదరిపోవుదురు గాక
ఆయనను ద్వేషించువారు ఆయన సన్నిధినుండి పారిపోవుదురు గాక.
2 పొగ చెదరగొట్టబడునట్లు నీవు వారిని చెదరగొట్టుము
అగ్నికి మైనము కరుగునట్లు
భక్తిహీనులు దేవుని సన్నిధికి కరిగి నశించుదురు గాక.
3 నీతిమంతులు సంతోషించుదురు గాక
వారు దేవుని సన్నిధిని ఉల్లసించుదురు గాక
వారు మహానందము పొందుదురు గాక.
4 దేవునిగూర్చి పాడుడి ఆయన నామమునుబట్టి స్తోత్రగానము చేయుడి
వాహనమెక్కి అరణ్యములలో ప్రయాణముచేయు దేవునికొరకు ఒక రాజమార్గము చేయుడి
యెహోవా అను ఆయన నామమునుబట్టి ఆయన సన్నిధిని ప్రహర్షించుడి.
5 తన పరిశుద్ధాలయమందుండు దేవుడు తండ్రి లేని వారికి తండ్రియు
విధవరాండ్రకు న్యాయకర్తయునై యున్నాడు
6 దేవుడు ఏకాంగులను సంసారులుగా చేయువాడు.
ఆయన బంధింపబడినవారిని విడిపించి వారిని వర్ధిల్ల జేయువాడు
విశ్వాసఘాతుకులు నిర్జలదేశమందు నివసించుదురు.
7 దేవా, నీవు నీ ప్రజలముందర బయలుదేరినప్పుడు
అరణ్యములో నీవు ప్రయాణము చేసినప్పుడు (సెలా.)
8 భూమి వణకెను దేవుని సన్నిధిని అంతరిక్షము దిగజారెను
ఇశ్రాయేలు దేవుడగు దేవుని సన్నిధిని ఆవలి సీనాయి కంపించెను.
9 దేవా, నీ స్వాస్థ్యముమీద నీవు వర్షము సమృద్ధిగా కురిపించితివి
అది డస్సియుండగా నీవు దాని బలపరచితివి.
10 నీ సమూహము దానిలో నివసించును
దేవా, నీ అనుగ్రహముచేత దీనులకు సదుపాయము కలుగజేసితివి.
11 ప్రభువు మాట సెలవిచ్చుచున్నాడు
దాని ప్రకటించు స్త్రీలు గొప్ప సైన్యముగా ఉన్నారు.
12 సేనల రాజులు పారిపోయెదరు పారిపోయెదరు
ఇంట నిలిచినది దోపుడుసొమ్ము పంచుకొనును.
గొఱ్ఱెల దొడ్లమధ్యను మీరు పండుకొనగా 13
గువ్వల రెక్కలు వెండితో కప్పబడినట్టున్నది
వాటి యీకెల రెక్కలు పచ్చని బంగారుతో కప్పబడినట్టున్నది.
సర్వశక్తుడు అక్కడ రాజులను చెదరగొట్టినప్పుడు 14
సల్మోనుమీద హిమము కురిసినట్లాయెను.
బాషాను పర్వతము దేవపర్వతము 15
బాషాను పర్వతము శిఖరములుగల పర్వతము.
శిఖరములుగల పర్వతములారా, 16
దేవుడు నివాసముగా కోరుకొన్న కొండను మీరేల ఓరచూపులు చూచుచున్నారు?
యెహోవా నిత్యము అందులోనే నివసించును.
దేవుని రథములు సహస్రములు సహస్రసహస్రములు 17
ప్రభువు వాటిలో నున్నాడు
సీనాయి పరిశుద్ధమైనట్టు ఆ కొండ పరిశుద్ధమాయెను.
నీవు ఆరోహణమైతివి పట్టబడినవారిని చెరపట్టుకొని పోతివి 18
మనుష్యులచేత నీవు కానుకలు తీసికొని యున్నావు.
యెహోవా అను దేవుడు అక్కడ నివసించునట్లు
విశ్వాసఘాతుకులచేత సహితము నీవు కానుకలు తీసికొని యున్నావు.
ప్రభువు స్తుతినొందును గాక. 19
అనుదినము ఆయన మా భారము భరించుచున్నాడు
దేవుడే మాకు రక్షణకర్తయై యున్నాడు.
దేవుడు మా పక్షమున పూర్ణరక్షణ కలుగజేయు దేవుడై యున్నాడు 20
మరణము తప్పించుట ప్రభువైన యెహోవా వశము.
దేవుడు నిశ్చయముగా తన శత్రువుల తలలు పగులగొట్టును. 21
మానక దోషములు చేయువారి వెండ్రుకలుగల నడినెత్తిని ఆయన పగులగొట్టును.
ప్రభువు సెలవిచ్చినదేమనగా— నేను బాషానులోనుండి వారిని రప్పించెదను 22
అగాధ సముద్రములలోనుండి వారిని రప్పించెదను.
వారి రక్తములో నీవు నీ పాదము ముంచుదువు 23
నీ శత్రువులు నీ కుక్కల నాలుకలకు భాగమగుదురు.
దేవా, నీ గమనమును పరిశుద్ధ స్థలమునకు పోవు 24
నా రాజగు దేవుని గమనమును వారు చూచి యున్నారు.

చుట్టును కన్యకలు తంబురలు వాయించుచుండగా
25 కీర్తనలు పాడువారు ముందర నడిచిరి
తంతివాద్యములు వాయించువారు వెనుక వచ్చె
దరు.
26 సమాజములలో దేవుని స్తుతించుడి
ఇశ్రాయేలులోనుండి ఉద్భవించినవారలారా,
ప్రభువును స్తుతించుడి.
27 కనిష్ఠుడగు బెన్యామీను అను వారి యేలిక అచ్చట
నున్నాడు
యూదా అధిపతుల పరివారమచ్చట నున్నది
జెబులూను అధిపతులును నఫ్తాలి అధిపతులును
ఉన్నారు.
28 నీ దేవుడు నీకు బలము కలుగ నియమించి
యున్నాడు.
దేవా, నీవు మాకొరకు చేసినదానిని బలపరచుము
29 యెరూషలేములోని నీ ఆలయమునుబట్టి
రాజులు నీయొద్దకు కానుకలు తెచ్చెదరు.
30 రెల్లులోని మృగమును
ఆబోతుల గుంపును దూడలవంటి జనములను
లొంగి వెండి కడ్డీలను తెచ్చునట్లుగా వాటిని
గద్దింపుము
కలహప్రియులను ఆయన చెదరగొట్టియున్నాడు.
31 ఐగుప్తులోనుండి ప్రధానులు వచ్చెదరు
కూషీయులు దేవునితట్టు తమ చేతులు చాచుకొని
పరుగెత్తి వచ్చెదరు.
32 భూరాజ్యములారా, దేవునిగూర్చి పాడుడి
ప్రభువును కీర్తించుడి. (సెలా.)
33 అనాదిగానున్న ఆకాశాకాశవాహన మెక్కువా
నిని కీర్తించుడి
ఆయన తన స్వరము వినబడజేయును అది బల
మైన స్వరము.
34 దేవునికి బలాతిశయము నారోపించుడి
మహిమోన్నతుడై ఆయన ఇశ్రాయేలుమీద ఏలు
చున్నాడు
అంతరిక్షమున ఆయన బలాతిశయమున్నది.
35 తన పరిశుద్ధ స్థలములలో దేవుడు భీకరుడు
ఇశ్రాయేలు దేవుడే తన ప్రజలకు బలపరాక్రమ
ముల ననుగ్రహించుచున్నాడు.
దేవుడు స్తుతినొందును గాక.

## 69

ప్రధానగాయకునికి.
షోషన్నీయులను రాగముమీద పాడదగినది.
దావీదు కీర్తన.

దేవా, జలములు నా ప్రాణముమీద పొర్లుచు
న్నవి నన్ను రక్షింపుము.
నిలుకయియ్యని అగాధమైన దొంగ ఊబిలో 2
నేను దిగిపోవుచున్నాను
అగాధ జలములలో నేను దిగబడియున్నాను
వరదలు నన్ను ముంచివేయుచున్నవి.
నేను మొఱ్ఱపెట్టుటచేత అలసియున్నాను నా 3
గొంతుక యెండిపోయెను
నా దేవునికొరకు కనిపెట్టుటచేత నా కన్నులు
క్షీణించిపోయెను.
నిర్నిమిత్తముగా నామీద పగపట్టువారు 4
నా తలవెంట్రుకలకంటె విస్తారముగా ఉన్నారు
అబద్ధమునుబట్టి నాకు శత్రువులై నన్ను సంహా
రింప గోరువారు అనేకులు
నేను దోచుకొననిదానిని నేను ఇచ్చుకొనవలసి
వచ్చెను.
దేవా, నా బుద్ధిహీనత నీకు తెలిసేయున్నది 5
నా అపరాధములు నీకు మరుగైనవి కావు.
ప్రభువా, సైన్యములకధిపతివగు యెహోవా, 6
నీకొరకు కనిపెట్టుకొనువారికి నావలన సిగ్గు కలుగ
నియ్యకుము
ఇశ్రాయేలు దేవా, నిన్ను వెదకువారిని నావలన
అవమానము నొందనియ్యకుము.
నీ నిమిత్తము నేను నిందనొందినవాడనైతిని 7
నీ నిమిత్తము సిగ్గు నా ముఖమును కప్పెను.
నా సహోదరులకు నేను అన్యుడనైతిని 8
నా తల్లి కుమారులకు పరుడనైతిని.
నీ యింటినిగూర్చిన ఆసక్తి నన్ను భక్షించి 9
యున్నది
నిన్ను నిందించినవారి నిందలు నామీద పడి
యున్నవి.
ఉపవాసముండి నేను కన్నీరు విడువగా 10
అది నాకు నిందాస్పదమాయెను.
నేను గోనెపట్ట వస్త్రముగా కట్టుకొనినప్పుడు 11
వారికి హాస్యాస్పదుడనైతిని.
గుమ్మములలో కూర్చుండువారు నన్నుగూర్చి మాట 12
లాడుకొందురు
త్రాగుబోతులు నన్నుగూర్చి పాటలు పాడుదురు.
యెహోవా, అనుకూల సమయమున నేను నిన్ను 13
ప్రార్థించుచున్నాను.
దేవా, నీ కృపాబాహుళ్యమునుబట్టి
నీ రక్షణ సత్యమునుబట్టి నాకుత్తరమిమ్ము.
నేను దిగిపోకుండ ఊబిలోనుండి నన్ను తప్పిం 14
చుము
నా పగవారిచేతిలోనుండి అగాధజలములలోనుండి
నన్ను తప్పించుము.
నీటివరదలు నన్ను ముంచనియ్యకుము 15
అగాధసముద్రము నన్ను మ్రింగనియ్యకుము

గుంట నన్ను మ్రింగనియ్యకుము.
16 యెహోవా, నీ కృప ఉత్తమత్వమునుబట్టి నాకు ఉత్తరమిమ్ము
నీ వాత్సల్యబాహుళ్యతనుబట్టి నాతట్టు తిరుగుము.
17 నీ సేవకునికి విముఖుడవై యుండకుము
నేను ఇబ్బందిలోనున్నాను త్వరగా నాకు ఉత్తరమిమ్ము.
18 నాయొద్దకు సమీపించి నన్ను విమోచింపుము
నా శత్రువులను చూచి నన్ను విడిపింపుము.
19 నిందయు సిగ్గును అవమానమును నాకు కలిగెనని నీకు తెలిసియున్నది
నా విరోధులందరు నీకు కనబడుచున్నారు.
20 నిందకు నా హృదయము బద్దలాయెను నేను బహుగా కృశించియున్నాను
కనికరించువారికొరకు కనిపెట్టుకొంటిని గాని యెవరును లేకపోయిరి
ఓదార్చువారికొరకు కనిపెట్టుకొంటిని గాని యెవరును కానరారైరి.
21 వారు చేదును నాకు ఆహారముగా పెట్టిరి
నాకు దప్పియైనప్పుడు చిరకను త్రాగనిచ్చిరి.
22 వారి భోజనము వారియెదుట వలగా నుండును గాక
వారు నిర్భయులై యున్నప్పుడు అది వారికి ఉరిగా నుండును గాక.
23 వారు చూడకపోవునట్లు వారి కన్నులు చీకటి కమ్మును గాక
వారి నడుములకు ఎడతెగని వణకు పుట్టించుము.
24 వారిమీద నీ ఉగ్రతను కుమ్మరించుము
నీ కోపాగ్ని వారిని పట్టుకొనును గాక
25 వారి పాలెము పాడవును గాక
వారి గుడారములలో ఎవడును ఉండకపోవును గాక
26 నీవు మొత్తినవానిని వారు తరుముచున్నారు
నీవు గాయపరచినవారి వేదనను వారు వివరించుచున్నారు.
27 దోషముమీద దోషము వారికి తగలనిమ్ము
నీ నీతి వారికి అందనీయకుము.
28 జీవగ్రంథములోనుండి వారి పేరులు తుడుపుపెట్టుము
నీతిమంతుల పట్టీలో వారి పేరులు వ్రాయకుము.
29 నేను బాధపడినవాడనై వ్యాకులపడుచున్నాను
దేవా, నీ రక్షణ నన్ను ఉద్ధరించును గాక.
30 కీర్తనలతో నేను దేవుని నామమును స్తుతించెదను
కృతజ్ఞతాస్తుతులతో నేనాయనను ఘనపరచెదను
31 ఎద్దుకంటెను కొమ్ములును డెక్కలునుగల కోడెకంటెను అది యెహోవాకు ప్రీతికరము



బాధపడువారు దాని చూచి సంతోషించుదురు 32
దేవుని వెదకువారలారా, మీ ప్రాణము తెప్పరిల్లును గాక.
యెహోవా దరిద్రుల మొర్ర ఆలకించువాడు 33
ఖైదులో నుంచబడిన తన వారిని ఆయన తృణీకరించువాడు కాడు.
భూమ్యాకాశములు ఆయనను స్తుతించును గాక 34
సముద్రములును వాటియందు సంచరించు సమస్తమును ఆయనను స్తుతించును గాక.
దేవుడు సీయోనును రక్షించును ఆయన యూదా 35
పట్టణములను కట్టించును
జనులు అక్కడ నివసించెదరు అది వారివశమగును.
ఆయన సేవకుల సంతానము దానిని స్వతంత్రించు 36
కొనును
ఆయన నామమును ప్రేమించువారు అందులో నివసించెదరు.

## 70

ప్రధానగాయకునికి దావీదు రచించినది.
జ్ఞాపకార్థమైన కీర్తన.

దేవా, నన్ను విడిపించుటకు త్వరగా రమ్ము
యెహోవా, నా సహాయమునకు త్వరగా రమ్ము.
నా ప్రాణము తీయగోరువారు 2
సిగ్గుపడి అవమానమొందుదురు గాక.
నాకు అపాయము కలుగగా చూచి సంతోషించువారు
వెనుకకు త్రిప్పబడి సిగ్గునొందుదురు గాక.
—ఆహా ఆహా అని పలుకువారు 3
తాము చేసిన నిందనుబట్టి వెనుకకు త్రిప్పబడుదురు గాక.
నిన్ను వెదకువారందరు 4
నిన్నుగూర్చి ఉత్సహించి సంతోషించుదురు గాక.
నీ రక్షణను ప్రేమించువారందరు
—దేవుడు మహిమపరచబడునుగాక అని యెల్లప్పుడు పలుకుచుందురు గాక.
నేను శ్రమల పాలై దీనుడనైతిని 5
దేవా, నన్ను రక్షించుటకు త్వరపడి రమ్ము
నా సహాయుడవు నన్ను తప్పించువాడవు నీవే
యెహోవా, ఆలస్యము చేయకుమీ.

## 71

యెహోవా, నేను నీ శరణుజొచ్చియున్నాను
నన్నెన్నడును సిగ్గుపడనియ్యకుము.
నీ నీతినిబట్టి నన్ను తప్పింపుము నన్ను విడిపింపుము 2
నీ చెవి యొగ్గి నన్ను రక్షింపుము.
నేను నిత్యము చొచ్చునట్లు నాకు ఆశ్రయదుర్గముగా ఉండుము 3
నా శైలము నా దుర్గము నీవే

నీవు నన్ను రక్షింప నిశ్చయించి యున్నావు.
4 నా దేవా, భక్తిహీనుల చేతిలోనుండి నన్ను రక్షింపుము
కీడు చేయువారి పట్టులోనుండి బలాత్కారుని పట్టులోనుండి నన్ను విడిపింపుము.
5 నా ప్రభువా యెహోవా, నా నిరీక్షణాస్పదము నీవే
బాల్యమునుండి నా ఆశ్రయము నీవే.
6 గర్భవాసినైనది మొదలుకొని నీవే నాకు ప్రాపకుడవై యుంటివి
తల్లిగర్భమునుండి నన్ను ఉద్భవింపజేసినవాడవు నీవే
నిన్నుగూర్చి నేను నిత్యము స్తుతిగానము చేయుదును.
7 నేను అనేకులకు ఒక వింతగా ఉన్నాను
అయినను నాకు బలమైన ఆశ్రయము నీవే.
8 నీ కీర్తితోను నీ ప్రభావవర్ణనతోను దినమంతయు నా నోరు నిండియున్నది.
9 వృద్ధాప్యమందు నన్ను విడనాడకుము
నా బలము క్షీణించినప్పుడు నన్ను విడువకుము.
10 నా శత్రువులు నన్నుగూర్చి మాటలాడుకొనుచున్నారు
11 నా ప్రాణముకొరకు పొంచియున్నవారు కూడి ఆలోచన చేయుచున్నారు.
—దేవుడు వాని విడిచెను తప్పించువారెవరునులేరు
వాని తరిమి పట్టుకొనుడి అని వారనుకొనుచున్నారు.
12 దేవా, నాకు దూరముగా ఉండకుము.
నా దేవా, నా సహాయమునకు త్వరపడి రమ్ము
13 నా ప్రాణవిరోధులు సిగ్గుపడి నశించుదురు గాక.
నాకు కీడుచేయ జూచువారు నిందపాలై మానభంగము నొందుదురు గాక.
14 నేను ఎల్లప్పుడు నిరీక్షింతును
నేను మరి యెక్కువగా నిన్ను కీర్తింతును
15 నీ నీతిని నీ రక్షణను నా నోరు దినమెల్ల వివరించును
అవి నాకు ఎన్నశక్యము కావు.
16 ప్రభువైన యెహోవాయొక్క బలవత్కార్యములనుబట్టి నేను మొదలుపెట్టెదను
నీ నీతిని మాత్రమే నేను వర్ణించెదను.
17 దేవా, బాల్యమునుండి నీవు నాకు బోధించుచు వచ్చితివి
ఇంతవరకు నీ ఆశ్చర్యకార్యములు నేను తెలుపుచునే వచ్చితిని.
18 దేవా, వచ్చుతరమునకు నీ బాహుబలమును గూర్చియు
పుట్టబోవువారికందరికి నీ శౌర్యమును గూర్చియు
నేను తెలియజెప్పునట్లు తల నెరసి వృద్ధునై యుండువరకు నన్ను విడువకుము.
దేవా, నీ నీతి మహాకాశమంత ఉన్నతమైనది 19
గొప్ప కార్యములు చేసిన దేవా, నీతో సాటియైన వాడెవడు?
అనేకమైన కఠినబాధలను మాకు కలుగజేసిన 20
వాడా,
నీవు మరల మమ్ము బ్రదికించెదవు
భూమియొక్క అగాధ స్థలములలోనుండి
నీవు మరల మమ్ము లేవనెత్తెదవు.
నా గొప్పతనమును వృద్ధిచేయుము 21
నాతట్టు మరలి నాకు నెమ్మది కలుగజేయుము
నా దేవా, నేనుకూడ నీ సత్యమునుబట్టి 22
స్వరమండల వాద్యముతో నిన్ను స్తుతించెదను
ఇశ్రాయేలు పరిశుద్ధ దేవా, సితారాతో నిన్ను కీర్తించెదను.
నేను నిన్ను కీర్తించునప్పుడు 23
నా పెదవులును నీవు విమోచించిన నా ప్రాణమును
నిన్నుగూర్చి ఉత్సాహధ్వని చేయును.
నాకు కీడు చేయ జూచువారు సిగ్గుపడియున్నారు 24
వారు అవమానము పొందియున్నారు
కాగా నా నాలుక దినమెల్ల నీ నీతిని వర్ణించును.

## 72

సొలొమోను కీర్తన.

దేవా, రాజునకు నీ న్యాయవిధులను
రాజకుమారునికి నీ నీతిని తెలియజేయుము.
నీతినిబట్టి నీ ప్రజలకును 2
న్యాయవిధులనుబట్టి శ్రమ నొందిన నీవారికిని అతడు న్యాయము తీర్చును.
నీతినిబట్టి పర్వతములును చిన్నకొండలును 3
ప్రజలకు నెమ్మది పుట్టించును.
ప్రజలలో శ్రమ నొందువారికి అతడు న్యాయము 4
తీర్చును
బీదల పిల్లలను రక్షించి బాధపెట్టువారిని నలగగొట్టును.
సూర్యుడు నిలుచునంత కాలము 5
చంద్రుడు నిలుచునంత కాలము తరములన్నిటను
జనులు నీయందు భయభక్తులు కలిగియుందురు.
గడ్డి కోసిన బీటిమీద కురియు వానవలెను 6
భూమిని తడుపు మంచి వర్షమువలెను అతడు విజయముచేయును.
అతని దినములలో నీతిమంతులు వర్ధిల్లుదురు 7
చంద్రుడు లేకపోవువరకు క్షేమాభివృద్ధి కలుగును.
సముద్రమునుండి సముద్రమువరకు 8

నది మొదలుకొని భూదిగంతములవరకు
అతడు రాజ్యము చేయును.
అరణ్యవాసులు అతనికి లోబడుదురు
అతని శత్రువులు మన్ను నాకెదరు.
తర్షీషు రాజులు ద్వీపముల రాజులు కప్పము
చెల్లించెదరు
షేబరాజులును సెబారాజులును కానుకలు తీసి
కొని వచ్చెదరు.
రాజులందరు అతనికి నమస్కారము చేసెదరు.
అన్యజనులందరు అతని సేవించెదరు.
దరిద్రులు మొఱ్ఱపెట్టగా అతడు వారిని విడి
పించును.
దీనులను నిరాధారులను అతడు విడిపించును.
నిరుపేదలయందును బీదలయందును అతడు కనిక
రించును
బీదల ప్రాణములను అతడు రక్షించును.
కపట బలాత్కారములనుండి అతడు వారి ప్రాణ
మును విమోచించును.
వారి ప్రాణము[1] అతని దృష్టికి ప్రియముగా
నుండును.
అతడు చిరంజీవియగును, షేబ బంగారము అతనికి
ఇయ్యబడును.
అతని క్షేమమునకై జనులు నిత్యము ప్రార్థన
చేయుదురు
దినమంతయు అతని పొగడుదురు.
దేశములోను పర్వత శిఖరములమీదను సస్య
సమృద్ధి కలుగును
దాని పంట లెబానోను వృక్షములవలె తాండవ
మాడుచుండును
నేలమీది పచ్చికవలె పట్టణస్థులు తేజరిల్లుదురు.
అతని పేరు నిత్యము నిలుచును
అతని నామము సూర్యుడున్నంత కాలము చిగుర్చు
చుండును
అతనినిబట్టి మనుష్యులు తమ్మును తాము దీవించు
కొందురు
అన్యజనులందరును అతడు ధన్యుడని చెప్పు
కొందురు.
దేవుడైన యెహోవా ఇశ్రాయేలుయొక్క
దేవుడు స్తుతింపబడును గాక
ఆయన మాత్రమే ఆశ్చర్యకార్యములు చేయు
వాడు.
ఆయన మహిమగల నామము నిత్యము స్తుతింప
బడును గాక.
సర్వభూమియు ఆయన మహిమతో నిండియుం
డును గాక. ఆమేన్. ఆమేన్.

యెష్షయి కుమారుడగు దావీదు ప్రార్థనలు ముగి
సెను.

## తృతీయ స్కంధము.

ఆసాపు కీర్తన. 73

ఇశ్రాయేలుయెడల శుద్ధహృదయులయెడల
నిశ్చయముగా దేవుడు దయాళుడై యున్నాడు.
నా పాదములు జారుటకు కొంచెమే తప్పెను 2
నా అడుగులు జార సిద్ధమాయెను.
భక్తిహీనుల క్షేమము నా కంటబడినప్పుడు 3
గర్వించువారినిబట్టి నేను మత్సరపడితిని.
మరణమందు వారికి యాతనలు లేవు 4
వారు పుష్టిగా నున్నారు.
ఇతరులకు కలుగు ఇబ్బందులు వారికి కలుగవు 5
ఇతరులకు పుట్టునట్లు వారికి తెగులు పుట్టదు.
కావున గర్వము కంఠహారమువలె వారిని చుట్టు 6
కొనుచున్నది
వస్త్రమువలె వారు బలాత్కారము ధరించుకొందురు.
క్రొవ్వుచేత వారి కన్నులు మెరకలై యున్నవి 7
వారి హృదయాలోచనలు బయటికి కానవచ్చు
చున్నవి.
ఎగతాళి చేయుచు బలాత్కారముచేత జరుగు 8
కీడునుగూర్చి వారు మాటలాడుదురు
గర్వముగా మాటలాడుదురు.
ఆకాశముతట్టు వారు ముఖము ఎత్తుదురు 9
వారి నాలుక భూసంచారము చేయును.
వారి జనము వారిపక్షము చేరును 10
వారు జలపానము సమృద్ధిగా చేయుదురు.
—దేవుడు ఎట్లు తెలిసికొనును 11
మహోన్నతునికి తెలివియున్నదా? అని వారను
కొందురు, ఇట్టివారు భక్తిహీనులు.
వీరు ఎల్లప్పుడు నిశ్చింతగలవారై ధనవృద్ధి చేసి 12
కొందురు.
నా హృదయమును నేను శుద్ధిచేసికొని యుండుట 13
వ్యర్థమే
నా చేతులు కడుగుకొని నిర్మలుడనై యుండుట
వ్యర్థమే
దినమంతయు నాకు బాధ కలుగుచున్నది 14
ప్రతి ఉదయమున నాకు శిక్ష వచ్చుచున్నది.
—ఈలాగు ముచ్చటింతునని నేననుకొనినయెడల 15
నేను నీ కుమారుల వంశమును మోసపుచ్చినవాడ
నగుదును.
అయినను దీని తెలిసికొనవలెనని ఆలోచించి 16
నప్పుడు 17

1 లేక—వారి రక్తము.

నేను దేవుని పరిశుద్ధ స్థలములోకి పోయి
వారి అంతమునుగూర్చి ధ్యానించువరకు
ఆ సంగతి నాకు ఆయాసకరముగా ఉండెను.
18 నిశ్చయముగా నీవు వారిని కాలుజారు చోటనే ఉంచియున్నావు
వారు నశించునట్లు వారిని పడవేయుచున్నావు
19 క్షణమాత్రములోనే వారు పాడైపోవుదురు
మహాభయముచేత వారు కడముట్ట నశించుదురు.
20 మేలుకొనినవాడు తాను కన్న కల మరచిపోవునట్లు
ప్రభువా, నీవు మేలుకొని వారి బ్రదుకును తృణీకరింతువు.
21 నా హృదయము మత్సరపడెను
నా అంతరింద్రియములలో నేను వ్యాకులపడితిని.
22 నేను తెలివిలేని పశుప్రాయుడనైతిని
నీ సన్నిధిని మృగమువంటి వాడనైతిని.
23 అయినను నేను ఎల్లప్పుడు నీయొద్దనున్నాను
నా కుడిచెయ్యి నీవు పట్టుకొని యున్నావు.
24 నీ ఆలోచనచేత నన్ను నడిపించెదవు.
తరువాత ఘనతతో నీవు నన్ను చేర్చుకొందువు
25 ఆకాశమందు (నీవు తప్ప) నాకెవరున్నారు?
నీవు నాకుండగా లోకములోనిది ఏదియు నాకక్కరలేదు.
26 నా శరీరము నా హృదయము క్షీణించిపోయినను
దేవుడు నిత్యము నా హృదయమునకు ఆశ్రయ దుర్గమును స్వాస్థ్యమునై యున్నాడు.
27 నిన్ను విసర్జించువారు నశించెదరు
నిన్ను విడిచి వ్యభిచరించువారినందరిని నీవు సంహరించెదవు.
28 నాకైతే దేవుని పొందు ధన్యకరము
నీ సర్వకార్యములను నేను తెలియజేయునట్లు
నేను ప్రభువైన యెహోవా శరణుజొచ్చి యున్నాను.

## 74

ఆసాపు కీర్తన. దైవధ్యానము.

దేవా, నీవు నిత్యము మమ్మును విడనాడితివేమి?
నీవు మేపు గొఱ్ఱెలమీద నీ కోపము పొగరాజుచున్నదేమి?
2 నీ స్వాస్థ్య గోత్రమును నీవు పూర్వము సంపాదించుకొని విమోచించిన నీ సమాజమును జ్ఞాపకమునకు తెచ్చుకొనుము
నీవు నివసించు ఈ సీయోను పర్వతమును జ్ఞాపకమునకు తెచ్చుకొనుము.
3 శత్రువులు పరిశుద్ధ స్థలములోనున్న సమస్తమును పాడుచేసియున్నారు
నిత్యము పాడైయుండు చోట్లకు విజయము చేయుము.
4 నీ ప్రత్యక్షపు గుడారములో నీ విరోధులు ఆర్భటించుచున్నారు
విజయధ్వజములని తమ ధ్వజములను వారెత్తియున్నారు.
5 దట్టమైన చెట్ల గుబురుమీద జనులు గొడ్డండ్లనెత్తినట్లుగా వారు కనబడుదురు
6 ఇప్పుడే వారు గొడ్డళ్లను సమ్మెటలను చేతపట్టుకొని దాని విచిత్రమైన పనిని బొత్తిగా విరుగగొట్టుదురు.
7 నీ పరిశుద్ధ స్థలమునకు అగ్ని ముట్టించుదురు
నీ నామమందిరమును నేల పడగొట్టి అపవిత్రపరచుదురు.
8 —దేవుని మందిరములను బొత్తిగా అణగద్రొక్కుదమనుకొని
దేశములోని వాటినన్నిటిని వారు కాల్చియున్నారు.
9 సూచకక్రియలు మాకు కనబడుటలేదు, ఇకను ప్రవక్తయు లేకపోయెను.
ఇది ఎంతకాలము జరుగునో దాని నెరిగినవాడు మాలో ఎవడును లేడు.
10 దేవా, విరోధులు ఎందాక నిందింతురు?
శత్రువులు నీ నామమును నిత్యము దూషింతురా?
11 నీ హస్తమును నీ దక్షిణహస్తమును నీవెందుకు ముడుచుకొని యున్నావు?
నీ రొమ్ములోనుండి దాని తీసి వారిని నిర్మూలము చేయుము.
12 పురాతనకాలము మొదలుకొని దేవుడు నా రాజైయున్నాడు
దేశములో మహారక్షణ కలుగజేయువాడు ఆయనే.
13 నీ బలముచేత సముద్రమును పాయలుగా చేసితివి
జనములలో భుజంగముల శిరస్సులను నీవు పగులగొట్టితివి.
14 మకరముయొక్క శిరస్సును నీవు ముక్కలుగా గొట్టితివి
అరణ్యవాసము చేయు జంతువులకు దానిని ఆహారముగా ఇచ్చితివి.
15 బుగ్గలను నదులను పుట్టించితివి
నిత్యము ప్రవహించు నదులను నీవు ఇనుకజేసితివి
16 పగలు నీదే రాత్రి నీదే
సూర్యచంద్రులను నీవే నిర్మించితివి.
17 భూమికి సరిహద్దులను నియమించినవాడవు నీవే
వేసవికాలము చలికాలము నీవే కలుగజేసితివి.
18 యెహోవా, శత్రువులు నిన్ను దూషణ చేయుటను
అవివేకప్రజలు నీ నామమును దూషించుటను

మనస్సుకు తెచ్చుకొనుము.
దుష్టమృగమునకు నీ గువ్వయొక్క ప్రాణము
అప్పగింపకుము
శ్రమనొందు నీవారిని నిత్యము మరువకుము.
లోకములోనున్న చీకటిగల చోటులు బలాత్కా
రుల నివాసములతో నిండియున్నవి
కాగా నిబంధనను జ్ఞాపకము చేసికొనుము
నలిగినవానిని అవమానముతో వెనుకకు మరల
నియ్యకుము.
శ్రమ నొందువారును దరిద్రులును నీ నామము
సన్నుతించుదురు గాక.
దేవా, లెమ్ము నీ వ్యాజ్యము నడుపుము
అవివేకులు దినమెల్ల నిన్ను నిందించు సంగతి జ్ఞాప
కము చేసికొనుము.
నీమీదికి లేచువారి అల్లరి నిత్యము బయలుదేరు
చున్నది.
నీ విరోధులు చేయు గల్లత్తును మరువకుము.

ప్రధానగాయకునికి.
అల్తష్హేతు అను రాగముమీద పాడదగినది.
ఆసాపు కీర్తన. గీతము.

దేవా, మేము నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించు
చున్నాము
నీవు[1] సమీపముగా నున్నావని
కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాము
నరులు నీ ఆశ్చర్యకార్యములను వివరించుదురు.
నేను యుక్తకాలమును కనిపెట్టుచున్నాను
నేనే న్యాయమునుబట్టి తీర్పు తీర్చుచున్నాను.
భూమియు దాని నివాసులందరును లయమగు
నప్పుడు
నేనే దాని స్తంభములను నిలుపుదును. (సెలా.)
—అహంకారులై యుండకుడని అహంకారులకు
నేను ఆజ్ఞ ఇచ్చుచున్నాను.
—కొమ్ము ఎత్తకుడి ఎత్తుగా కొమ్ము ఎత్తకుడి
పొగరుపట్టిన మాటలాడకుడి అని భక్తిహీనులకు
నేను ఆజ్ఞ ఇచ్చుచున్నాను.
తూర్పునుండియైనను పడమటనుండియైనను
అరణ్యమునుండియైనను హెచ్చుకలుగదు.
దేవుడే తీర్పు తీర్చువాడు
ఆయన ఒకని తగ్గించును ఒకని హెచ్చించును.
యెహోవా చేతిలో ఒక పాత్ర యున్నది
అందులోని ద్రాక్షారసము పొంగుచున్నది, అది
సంబారముతో నిండియున్నది
ఆయన దానిలోనిది పోయుచున్నాడు
భూమిమీదనున్న భక్తిహీనులందరు మడ్డితోకూడ
దానిని పీల్చి మ్రింగివేయవలెను.

నేనైతే నిత్యము (ఆయన స్తుతిని) ప్రచురము 9
చేయుదును
యాకోబు దేవుని నేను నిత్యము కీర్తించెదను.
భక్తిహీనుల కొమ్ములనన్నిటిని నేను విరుగగొట్టెదను 10
నీతిమంతుల కొమ్ములు హెచ్చింపబడును.

## 76

ప్రధానగాయకునికి.
తంతివాద్యములతో పాడదగినది.
ఆసాపు కీర్తన. గీతము.

యూదాలో దేవుడు ప్రసిద్ధుడు
ఇశ్రాయేలులో ఆయన నామము గొప్పది.
షాలేములో ఆయన గుడారమున్నది 2
సీయోనులో ఆయన ఆలయమున్నది.
అక్కడ వింటి అగ్నిబాణములను 3
కేడెములను కత్తులను యుద్ధాయుధములను ఆయన
విరుగగొట్టెను. (సెలా.)
దుష్టమృగములుండు పర్వతముల సౌందర్యము 4
కంటె నీవు అధిక తేజస్సుగలవాడవు.
కఠినహృదయులు[2] దోచుకొనబడి యున్నారు 5
వారు నిద్రనొంది యున్నారు
పరాక్రమశాలులందరి బాహుబలము హరించెను.
యాకోబు దేవా, నీ గద్దింపుకు 6
రథసారథులకును గుర్రములకును గాఢనిద్ర
కలిగెను.
నీవు నీవే భయంకరుడవు 7
నీవు కోపపడు వేళ నీ సన్నిధిని నిలువగలవా
డెవడు?
నీవు తీర్చిన తీర్పు ఆకాశములోనుండి వినబడ 8
జేసితివి 9
దేశములో శ్రమనొందిన వారినందరిని రక్షించు
టకై న్యాయపుతీర్పుకు దేవుడు లేచినప్పుడు
భూమి భయపడి ఊరకుండెను. (సెలా.)
నరుల ఆగ్రహము నిన్ను స్తుతించును 10
ఆగ్రహశేషమును నీవు ధరించుకొందువు.
మీ దేవుడైన యెహోవాకు మ్రొక్కుకొని మీ 11
మ్రొక్కుబడులను చెల్లించుడి
ఆయన చుట్టునున్నవారందరు భయంకరుడగు
ఆయనకు కానుకలు తెచ్చి అర్పింపవలెను.
అధికారుల పొగరును ఆయన అణచివేయువాడు 12
భూరాజులకు ఆయన భీకరుడు.

## 77

ప్రధానగాయకునికి.
యెదూతూను అను రాగముమీద పాడదగినది.
ఆసాపు కీర్తన.

నేను ఎలుగెత్తి దేవునికి మొఱ్ఱపెట్టుదును ఆయ
నకు మనవి చేయుదును

1 మూలభాషలో—నామము.

2 లేక—గుండె దిట్టరులు.

దేవుడు నాకు చెవియొగ్గువరకు నేను ఎలుగెత్తి ఆయనను మనవి చేయుదును.
2 నా ఆపత్కాలమందు నేను ప్రభువును వెదకువాడను.
రాత్రివేళ నా చెయ్యి వెనుకకు తీయకుండ చాపబడియున్నది
నా ప్రాణము ఓదార్పు పొందనొల్లక యున్నది.
3 దేవుని జ్ఞాపకము చేసికొనునప్పుడు నేను నిట్టూర్పు విడుచుచున్నాను
నేను ధ్యానించునప్పుడు నా ఆత్మ క్రుంగిపోవుచున్నది. (సెలా.)
4 నీవు నా కన్నులు మూతపడనీయవు.
నేను కలవరపడుచు మాటలాడలేక యున్నాను.
5 తొల్లిటి దినములను పూర్వకాల సంవత్సరములను నేను మనస్సునకు తెచ్చుకొందును.
6 నేను పాడిన పాట రాత్రియందు జ్ఞాపకము చేసికొందును
హృదయమున ధ్యానించుకొందును.
(దేవా) నా ఆత్మ నీ (తీర్పుమార్గము) శ్రద్ధగా వెదకుచున్నది.
7 ప్రభువు నిత్యము విడనాడునా?
ఆయన ఇకెన్నడును కటాక్షింపడా?
8 ఆయన కృప యెన్నటికిలేకుండ మానిపోయెనా?
ఆయన సెలవిచ్చిన మాట తరతరములకు తప్పిపోయెనా?
9 దేవుడు కటాక్షింప మానెనా?
ఆయన కోపించి వాత్సల్యత చూపకుండునా? (సెలా.)
10 అందుకు—నేనీలాగు అనుకొనుచున్నాను
మహోన్నతుని దక్షిణహస్తము మార్పునొందెనను కొనుటకు నాకు కలిగిన శ్రమయే కారణము.
11 యెహోవా చేసిన కార్యములను పూర్వము జరిగిన నీ ఆశ్చర్యకార్యములను
నేను మనస్సునకు తెచ్చుకొందును
12 నీ కార్యమంతయు నేను ధ్యానించుకొందును
నీ క్రియలను నేను ధ్యానించుకొందును.
13 దేవా, నీ మార్గము పరిశుద్ధమైనది.
దేవునివంటి మహా దేవుడు ఎక్కడనున్నాడు?
14 ఆశ్చర్యక్రియలు జరిగించు దేవుడవు నీవే
జనములలో నీ ప్రభావమును నీవు ప్రత్యక్షపరచుకొనియున్నావు.
15 నీ బాహుబలమువలన యాకోబు యోసేపుల సంతతివారగు నీ ప్రజలను నీవు విమోచించియున్నావు.
16 దేవా, జలములు నిన్ను చూచెను
జలములు నిన్ను చూచి దిగులుపడెను
అగాధజలములు గజగజలాడెను.
మేఘరాసులు నీళ్లు దిమ్మరించెను అంతరిక్షము 17
ఘోషించెను.
నీ బాణములు నలుదిక్కుల పారెను.
నీ ఉరుముల ధ్వని సుడిగాలిలో మ్రోగెను 18
మెరుపులు లోకమును ప్రకాశింపజేసెను
భూమి వణకి కంపించెను.
నీ మార్గము సముద్రములో ఉండెను. 19
నీ త్రోవలు మహా జలములలో ఉండెను
నీ యడుగుజాడలు గుర్తింపబడక యుండెను.
మోషే అహరోనులచేత నీ ప్రజలను మందవలె 20
నడిపించితివి.

## 78

ఆసాపు కీర్తన. దైవధ్యానము.

నా జనులారా, నా బోధకు చెవియొగ్గుడి
నా నోటి మాటలకు చెవియొగ్గుడి.
నేను నోరు తెరచి ఉపమానము చెప్పెదను 2
పూర్వకాలపు గూఢవాక్యములను నేను తెలియజెప్పెదను.
మాకు తెలిసిన సంగతులను 3
మా పితరులు మాకు వివరించిన సంగతులను చెప్పెదను.
యెహోవా స్తోత్రార్హక్రియలను 4
ఆయన బలమును ఆయన చేసిన ఆశ్చర్యకార్యములను దాచకుండ
వాటిని వారి పిల్లలకు మేము చెప్పెదము.
రాగల తరములలో పుట్టబోవు పిల్లలు దాని నెరు 5
గునట్లును
వారు లేచి తమ పిల్లలకు దానిని వివరించునట్లును
వీరును దేవునియందు నిరీక్షణగలవారై దేవుని క్రియలను మరువకయుండి
యథార్థహృదయులు కాక దేవుని విషయమై 6
స్థిరమనస్సులేనివారై తమ పితరులవలె తిరుగబడకయు
మూర్ఖతయు తిరుగబాటునుగల ఆ తరమును పోలి 7
యుండకయు
వారు ఆయన ఆజ్ఞలను గైకొనునట్లును
ఆయన యాకోబు సంతతికి శాసనములను నియ 8
మించెను
ఇశ్రాయేలు సంతతికి ధర్మశాస్త్రము ననుగ్రహించెను
మన పితరులు తమ పుత్రులకు దాని తెలుపవలెనని వారికాజ్ఞాపించెను
విండ్లను పట్టుకొని యుద్ధసన్నద్ధులైన ఎఫ్రా 9
యిము సంతతివారు యుద్ధకాలమున వెనుకకు తిరిగిరి.
వారు దేవుని నిబంధనను గైకొనకపోయిరి 10
ఆయన ధర్మశాస్త్రము ననుసరింపనొల్లకపోయిరి

11 ఆయన క్రియలను ఆయన వారికి చూపిన తన
ఆశ్చర్యక్రియలను వారు మరచిపోయిరి.
12 ఐగుప్తుదేశములోని సోయను క్షేత్రమందు వారి
పితరులు చూచుచుండగా
ఆయన ఆశ్చర్యకార్యములను చేసెను.
13 ఆయన సముద్రమును పాయలుగా చేసి వారిని
అద్దరికి నడిపించెను
ఆయన నీటిని రాశిగా నిలిపెను.
14 పగటివేళ మేఘములోనుండియు
రాత్రి అంతయు అగ్నిప్రకాశములోనుండియు
ఆయన వారికి త్రోవ చూపెను
15 అరణ్యములో ఆయన బండలు చీల్చి
సముద్రమంత సమృద్ధిగా వారికి నీరు త్రాగ
నిచ్చెను.
16 బండలోనుండి ఆయన నీటికాలువలు రప్పించెను
నదులవలె నీళ్లు ప్రవహింపజేసెను.
17 అయినను వారు ఆయనకు విరోధముగా ఇంకను
పాపముచేయుచునే వచ్చిరి
అడవిలో మహోన్నతునిమీద తిరుగబడిరి.
18 వారు తమ ఆశకొలది ఆహారము నడుగుచు
తమ హృదయములలో దేవుని శోధించిరి.
19 —ఈ అరణ్యములో దేవుడు భోజనము సిద్ధపరచ
గలడా యనుచు
వారు దేవునికి విరోధముగా మాటలాడిరి.
20 ఆయన బండను కొట్టగా నీరు ఉబికెను
నీళ్లు కాలువలై పారెను.
—ఆయన ఆహారము ఇయ్యగలడా
ఆయన తన ప్రజలకు మాంసము సిద్ధపరచగలడా?
అని వారు చెప్పుకొనిరి.
21 యెహోవా ఈ మాట విని కోపగించెను
యాకోబు సంతతిని దహించివేయుటకు అగ్ని
రాజెను
ఇశ్రాయేలు సంతతిని హరించివేయుటకు కోపము
పుట్టెను.
22 వారు దేవునియందు విశ్వాసముంచకపోయిరి
ఆయన దయచేసిన రక్షణయందు నమ్మిక యుంచ
లేదు.
23 అయినను ఆయన పైనున్న ఆకాశములకు ఆజ్ఞా
పించెను
అంతరిక్షద్వారములను తెరచెను
24 ఆహారమునకై ఆయన వారిమీద మన్నాను కురి
పించెను
ఆకాశధాన్యము వారి కనుగ్రహించెను.
25 దేవదూతల ఆహారము నరులు భుజించిరి
భోజనపదార్థములను ఆయన వారికి సమృద్ధిగా
పంపెను.
ఆకాశమందు తూర్పు గాలి ఆయన విసరజేసెను 26
తన బలముచేత దక్షిణపు గాలి రప్పించెను.
ధూళి అంత విస్తారముగా మాంసమును 27
సముద్రపు ఇసుకరేణువులంత విస్తారముగా రెక్కలు
గల పిట్టలను ఆయన వారిమీద కురిపించెను.
వారి దండు మధ్యను వారి నివాసస్థలములచుట్టును 28
ఆయన వాటిని వ్రాలజేసెను.
వారు కడుపార తిని తనిసిరి 29
ఆయన వారు ఆశించిన దాని ననుగ్రహించెను.
వారి ఆశ తీరకమునుపే 30
ఆహారము ఇంక వారి నోళ్లలో నుండగానే
దేవుని కోపము వారిమీదికి దిగెను 31
వారిలో బలిసినవారిని ఆయన సంహరించెను
ఇశ్రాయేలులో యౌవనస్థులను కూల్చెను.
ఇంత జరిగినను వారు ఇంకను పాపముచేయుచు 32
ఆయన ఆశ్చర్యకార్యములనుబట్టి ఆయనను
నమ్ముకొనకపోయిరి.
కాబట్టి ఆయన వారి దినములు ఊపిరివలె గడచి 33
పోజేసెను
వారి సంవత్సరములు అకస్మాత్తుగా గడచిపో
జేసెను.
ఆయన వారిని సంహరించినప్పుడు వారు ఆయనను 34
వెదకిరి
వారు తిరిగి హృదయపూర్వకముగా దేవుని బతి
మాలుకొనిరి.
దేవుడు తమకు ఆశ్రయదుర్గమనియు 35
మహోన్నతుడైన దేవుడు తమకు విమోచకుడ
నియు వారు జ్ఞాపకము చేసికొనిరి.
అయినను వారి హృదయము ఆయనయెడల స్థిర 36
ముగా నుండలేదు
ఆయన నిబంధనను వారు నమ్మకముగా గైకొన
లేదు.
నోటి మాటతో వారు ఆయనను ముఖస్తుతిచేసిరి 37
తమ నాలుకలతో ఆయనయొద్ద బొంకిరి.
అయితే ఆయన వాత్సల్యసంపూర్ణుడై 38
వారిని నశింపజేయక వారి దోషము పరిహరించు
వాడు.[1]
తన ఉగ్రతను ఏమాత్రమును రేపుకొనక
పలుమారు కోపము అణచుకొనువాడు.
కాగా — వారు కేవలము శరీరులై [illegible]
నియు
విసరి వెళ్లి [illegible]
ఆయన

1 మూలభాషలో—దోషమునకు ప్రాయశ్చిత్తవ

40 అరణ్యమున వారు ఆయనమీద ఎన్నిమారులో తిరుగబడిరి
ఎడారియందు ఆయనను ఎన్నిమారులో దుఃఖ పెట్టిరి.
41 మాటిమాటికి వారు దేవుని శోధించిరి
మాటిమాటికి ఇశ్రాయేలు పరిశుద్ధదేవునికి సంతాపము కలిగించిరి.
42 ఆయన బాహుబలమునైనను
విరోధులచేతిలోనుండి ఆయన తమ్మును విమోచించిన దినమునైనను
వారు స్మరణకు తెచ్చుకొనలేదు.
43 ఐగుప్తులో తన సూచకక్రియలను
సోయను క్షేత్రమందు తన అద్భుతములను ఆయన చూపిన దినమును
వారు జ్ఞప్తికి తెచ్చుకొనలేదు.
44 (ఐగుప్తీయులు) త్రాగలేకుండ
నైలునది కాలువలను వారి ప్రవాహజలములను ఆయన రక్తముగా మార్చెను
45 ఆయన వారిమీదికి జోరీగలను గుంపుగా విడిచెను అవి వారిని తినివేసెను
కప్పలను విడిచెను అవి వారిని నాశనము చేసెను.
46 ఆయన వారి పంటను చీడపురుగులకిచ్చెను
వారి కష్టఫలమును మిడతలకప్పగించెను.
47 వడగండ్లచేత వారి ద్రాక్షతీగెలను
హిమముచేత వారి మేడిచెట్లను ఆయన పాడుచేసెను.
48 వారి పశువులను వడగండ్ల పాలుచేసెను.
వారి మందలను పిడుగుల పాలుచేసెను.
49 ఆయన ఉపద్రవము కలుగజేయు దూతల సేనగా తన కోపాగ్నిని ఉగ్రతను
మహోగ్రతను శ్రమను వారిమీద విడిచెను.
50 తన కోపమునకు ఆయన త్రోవ చదునుచేసెను
మరణమునుండి వారి ప్రాణమును తప్పింపక
వారి జీవమును తెగులుకు అప్పగించెను.
51 ఐగుప్తులోని జ్యేష్ఠులనందరిని
హాము గుడారములలోనున్న బలప్రారంభమైన (ప్రథమసంతానమును) ఆయన సంహరించెను.
52 అయితే గొఱ్ఱెలవలె ఆయన తన ప్రజలను తోడుకొనిపోయెను
ఒకడు మందను నడిపించునట్లు అరణ్యములో ఆయన వారిని నడిపించెను
53 వారు భయపడకుండ ఆయన వారిని సురక్షితముగా నడిపించెను.
శత్రువులను సముద్రములో ముంచివేసెను.
తిష్ఠించిన సరిహద్దునొద్దకు
తన దక్షిణహస్తము సంపాదించిన యీ పర్వతమునొద్దకు ఆయన వారిని రప్పించెను.
వారియెదుటనుండి అన్యజనులను వెళ్లగొట్టెను. 55
కొలనూలుచేత వారి స్వాస్థ్యమును వారికి పంచి యిచ్చెను.
ఇశ్రాయేలు గోత్రములను వారి గుడారములలో నివసింపజేసెను.
అయినను వారు మహోన్నతుడైన దేవుని 56
శోధించి తిరుగబాటు చేసిరి
ఆయన శాసనముల ననుసరింపకపోయిరి.
తమ పితరులవలె వారు వెనుకకు తిరిగి ద్రోహులైరి 57
జౌకిచ్చు విల్లు పనికిరాకపోయినట్లు వారు తొలగిపోయిరి.
వారు ఉన్నతస్థలములను కట్టి ఆయనకు కోపము 58
పుట్టించిరి
విగ్రహములను పెట్టుకొని ఆయనకు రోషము కలుగజేసిరి.
దేవుడు దీని చూచి ఆగ్రహించి ఇశ్రాయేలునందు 59
బహుగా అసహ్యించుకొనెను.
షిలోహుమందిరమును తాను మనుష్యులలో సం 60
స్థాపన చేసిన గుడారమును ఆయన విడిచిపెట్టెను.
ఆయన తన బలాతిశయాస్పదమును చెరకును 61
తన భూషణమైనదానిని విరోధులచేతికిని అప్పగించెను.
తన ప్రజలను ఖడ్గమునకు అప్పగించెను 62
ఆయన తన స్వాస్థ్యముమీద ఆగ్రహించెను
అగ్ని వారి యౌవనస్థులను భక్షించెను 63
వారి కన్యకలకు పెండ్లిపాటలు లేకపోయెను.
వారి యాజకులు కత్తిపాలుకాగా 64
వారి విధవరాండ్రు రోదనము చేయకుండిరి.
అప్పుడు నిద్రనుండి మేల్కొను ఒకనివలెను 65
మద్యవశుడై ఆర్భటించు పరాక్రమశాలివలెను ప్రభువు మేల్కొనెను.
ఆయన తన విరోధులను వెనుకకు తరిమికొట్టెను 66
నిత్యమైన నింద వారికి కలుగజేసెను.
పిమ్మట ఆయన యోసేపు గుడారమును అసహ్యిం 67
చుకొనెను
ఎఫ్రాయిము గోత్రమును కోరుకొనలేదు.
యూదా గోత్రమును తాను ప్రేమించిన సీయోను 68
పర్వతమును
ఆయన కోరుకొనెను.
తాను అంతరిక్షమును కట్టినట్లు 69
తాను భూమిని నిత్యముగా స్థాపించినట్లు
ఆయన తన పరిశుద్ధమందిరమును కట్టించెను
తన దాసుడైన దావీదును కోరుకొని
70

గొఱ్ఱెల దొడ్లలోనుండి అతని పిలిపించెను.
అతడు పాడి గొఱ్ఱెలను వెంబడించుట మాన్పివేసి
తన ప్రజలైన యాకోబును తన స్వాస్థ్యమైన
ఇశ్రాయేలును మేపుటకై ఆయన అతని రప్పించెను.
అతడు యథార్థహృదయుడై వారిని పాలించెను
కార్యములయందు నేర్పరియై వారిని నడిపించెను.

79 ఆసాపు కీర్తన.

దేవా, అన్యజనులు నీ స్వాస్థ్యములోకి చొరబడియున్నారు
వారు నీ పరిశుద్ధాలయమును అపవిత్రపరచియున్నారు
యెరూషలేమును పాడుదిబ్బలుగా చేసియున్నారు.
2 వారు నీ సేవకుల కళేబరములను ఆకాశపక్షులకు ఎరగాను
నీ భక్తుల శవములను భూజంతువులకు ఆహారముగాను పారవేసి యున్నారు.
3 ఒకడు నీళ్లుపోసినట్లు యెరూషలేముచుట్టు వారి రక్తము పారబోసి యున్నారు
వారిని పాతిపెట్టువారెవరును లేరు.
4 మా పొరుగువారికి మేము అసహ్యులమైతిమి
మా చుట్టునున్నవారు మమ్ము నపహసించి యెగతాళి చేసెదరు.
5 యెహోవా, ఎంతవరకు కోపపడుదువు? ఎల్లప్పుడును కోపపడుదువా?
నీ రోషము అగ్నివలె ఎల్లప్పుడును మండునా?
6 నిన్నెరుగని అన్యజనులమీదను
నీ నామమునుబట్టి ప్రార్థనచేయని రాజ్యములమీదను నీ ఉగ్రతను కుమ్మరించుము.
7 వారు యాకోబు సంతతిని మ్రింగివేసియున్నారు
వారి నివాసమును పాడుచేసియున్నారు
8 మేము బహుగా క్రుంగియున్నాము.
మా పూర్వుల దోషములు జ్ఞాపకము చేసికొని నీవు మామీద కోపముగా నుండకుము
నీ వాత్సల్యము త్వరగా మమ్ము నెదుర్కొననిమ్ము.
9 మా రక్షణకర్తవగు దేవా, నీ నామప్రభావమును బట్టి మాకు సహాయముచేయుము
నీ నామమునుబట్టి మా పాపములను పరిహరించి మమ్మును రక్షించుము.
10 —వారి దేవుడెక్కడ నున్నాడని అన్యజనులు పలుకనేల?
మేము చూచుచుండగా ఒలుకబడిన నీ సేవకుల రక్తమునుగూర్చిన ప్రతిదండన జరిగినట్లు
అన్యజనులకు తెలియబడనిమ్ము.
11 చెరలోనున్నవాని నిట్టూర్పు నీ సన్నిధికి రానిమ్ము
నీ బాహు బలాతిశయమును చూపుము
చావుకు విధింపబడినవారిని కాపాడుము.
ప్రభువా, మా పొరుగువారు నిన్ను నిందించిన 12
నిందకు ప్రతిగా
వారి యెదలోకి ఏడంతలు నిందను కలుగజేయుము.
అప్పుడు నీ ప్రజలమును నీ మంద గొఱ్ఱెలమునైన 13
మేము
సదాకాలము నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించెదము
తరతరముల పర్యంతము నీ కీర్తిని ప్రచురపరచెదము.

80

ప్రధానగాయకునికి.
షోషన్నీమ్ ఏదూత్ అను రాగముమీద పాడదగినది.
ఆసాపు కీర్తన.

ఇశ్రాయేలుకు కాపరీ, చెవియొగ్గుము.
మందవలె యోసేపును నడిపించువాడా,
కెరూబులమీద ఆసీనుడవైనవాడా, ప్రకాశింపుము.
ఎఫ్రాయిము బెన్యామీను మనష్షే అను వారి 2
యెదుట
నీ పరాక్రమమును మేల్కొలిపి మమ్మును రక్షింపరమ్ము.
దేవా, చెరలోనుండి మమ్మును రప్పించుము 3
మేము రక్షణ నొందునట్లు నీ ముఖకాంతి ప్రకాశింపజేయుము.
యెహోవా, సైన్యములకధిపతివగు దేవా, 4
నీ ప్రజల మనవి నాలకింపక నీవెన్నాళ్లు నీ కోపము పొగరాజనిచ్చెదవు?
కన్నీళ్లు వారికి ఆహారముగా ఇచ్చుచున్నావు. 5
విస్తారమైన కన్నీళ్లు నీవు వారికి పానముగా ఇచ్చుచున్నావు.
మా పొరుగువారికి మమ్ము కలహకారణముగా 6
జేయుచున్నావు.
ఇష్టము వచ్చినట్లు మా శత్రువులు మమ్మును అపహాస్యము చేయుచున్నారు.
సైన్యములకధిపతివగు దేవా, చెరలోనుండి మమ్ము 7
రప్పించుము
మేము రక్షణనొందునట్లు నీ ముఖకాంతి ప్రకాశింపజేయుము.
నీవు ఐగుప్తులోనుండి యొక ద్రాక్షావల్లిని తెచ్చి 8
తివి
అన్యజనులను వెళ్లగొట్టి దాని నాటితివి
దానికి తగిన స్థలము సిద్ధపరచితివి 9
దాని వేరు లోతుగా పారి అది దేశమంతట వ్యాపించెను.
దాని నీడ కొండలను కప్పెను 10

40 అరణ్యమున వారు ఆయనమీద ఎన్నిమారులో
తిరుగబడిరి
ఎడారియందు ఆయనను ఎన్నిమారులో దుఃఖ
పెట్టిరి.
41 మాటిమాటికి వారు దేవుని శోధించిరి
మాటిమాటికి ఇశ్రాయేలు పరిశుద్ధదేవునికి సంతా
పము కలిగించిరి.
42 ఆయన బాహుబలమునైనను
విరోధులచేతిలోనుండి ఆయన తమ్మును విమోచిం
చిన దినమునైనను
వారు స్మరణకు తెచ్చుకొనలేదు.
43 ఐగుప్తులో తన సూచకక్రియలను
సోయను క్షేత్రమందు తన అద్భుతములను ఆయన
చూపిన దినమును
వారు జ్ఞప్తికి తెచ్చుకొనలేదు.
44 (ఐగుప్తీయులు) త్రాగలేకుండ
నైలునది కాలువలను వారి ప్రవాహజలములను
ఆయన రక్తముగా మార్చెను
45 ఆయన వారిమీదికి జోరీగలను గుంపుగా విడిచెను
అవి వారిని తినివేసెను
కప్పలను విడిచెను అవి వారిని నాశనము చేసెను.
46 ఆయన వారి పంటను చీడపురుగులకిచ్చెను
వారి కష్టఫలమును మిడతలకప్పగించెను.
47 వడగండ్లచేత వారి ద్రాక్షతీగెలను
హిమముచేత వారి మేడిచెట్లను ఆయన పాడు
చేసెను.
48 వారి పశువులను వడగండ్ల పాలుచేసెను.
వారి మందలను పిడుగుల పాలుచేసెను.
49 ఆయన ఉపద్రవము కలుగజేయు దూతల సేనగా
తన కోపాగ్నిని ఉగ్రతను
మహోగ్రతను శ్రమను వారిమీద విడిచెను.
50 తన కోపమునకు ఆయన త్రోవ చదునుచేసెను
మరణమునుండి వారి ప్రాణమును తప్పింపక
వారి జీవమును తెగులుకు అప్పగించెను.
51 ఐగుప్తులోని జ్యేష్ఠులనందరిని
హాము గుడారములలోనున్న బలప్రారంభమైన
(ప్రథమసంతానమును) ఆయన సంహరించెను.
52 అయితే గొఱ్ఱెలవలె ఆయన తన ప్రజలను తోడు
కొనిపోయెను
ఒకడు మందను నడిపించునట్లు అరణ్యములో
ఆయన వారిని నడిపించెను
53 వారు భయపడకుండ ఆయన వారిని సురక్షిత
ముగా నడిపించెను.
శత్రువులను సముద్రములో ముంచివేసెను.
తిష్ఠించిన సరిహద్దునొద్దకు
తన దక్షిణహస్తము సంపాదించిన యీ పర్వతము
నొద్దకు ఆయన వారిని రప్పించెను.
వారియెదుటనుండి అన్యజనులను వెళ్లగొట్టెను. 55
కొలనూలుచేత వారి స్వాస్థ్యమును వారికి పంచి
యిచ్చెను.
ఇశ్రాయేలు గోత్రములను వారి గుడారములలో
నివసింపజేసెను.
అయినను వారు మహోన్నతుడైన దేవుని 56
శోధించి తిరుగబాటు చేసిరి
ఆయన శాసనముల ననుసరింపకపోయిరి.
తమ పితరులవలె వారు వెనుకకు తిరిగి ద్రోహులైరి 57
జౌకిచ్చు విల్లు పనికిరాకపోయినట్లు వారు తొలగి
పోయిరి.
వారు ఉన్నతస్థలములను కట్టి ఆయనకు కోపము 58
పుట్టించిరి
విగ్రహములను పెట్టుకొని ఆయనకు రోషము
కలుగజేసిరి.
దేవుడు దీని చూచి ఆగ్రహించి ఇశ్రాయేలునందు 59
బహుగా అసహ్యించుకొనెను.
షిలోహుమందిరమును తాను మనుష్యులలో సం 60
స్థాపన చేసిన గుడారమును ఆయన విడిచి
పెట్టెను.
ఆయన తన బలాతిశయాస్పదమును చెరకును 61
తన భూషణమైనదానిని విరోధులచేతికిని అప్ప
గించెను.
తన ప్రజలను ఖడ్గమునకు అప్పగించెను 62
ఆయన తన స్వాస్థ్యముమీద ఆగ్రహించెను
అగ్ని వారి యౌవనస్థులను భక్షించెను 63
వారి కన్యకలకు పెండ్లిపాటలు లేకపోయెను.
వారి యాజకులు కత్తిపాలుకాగా 64
వారి విధవరాండ్రు రోదనము చేయకుండిరి.
అప్పుడు నిద్రనుండి మేల్కొనను ఒకనివలెను 65
మద్యవశుడై ఆర్భటించు పరాక్రమశాలివలెను
ప్రభువు మేల్కొనెను.
ఆయన తన విరోధులను వెనుకకు తరిమికొట్టెను 66
నిత్యమైన నింద వారికి కలుగజేసెను.
పిమ్మట ఆయన యోసేపు గుడారమును అసహ్యిం 67
చుకొనెను
ఎఫ్రాయిము గోత్రమును కోరుకొనలేదు.
యూదా గోత్రమును తాను ప్రేమించిన సీయోను 68
పర్వతమును
ఆయన కోరుకొనెను.
తాను అంతరిక్షమును కట్టినట్లు 69
తాను భూమిని నిత్యముగా స్థాపించినట్లు
ఆయన తన పరిశుద్ధమందిరమును కట్టించెను
తన దాసుడైన దావీదును కోరుకొని 70

దాని తీగెలు దేవుని దేవదారు వృక్షములను ఆవరించెను.
11 దాని తీగెలు సముద్రమువరకు వ్యాపించెను
గొప్ప నదివరకు దాని రెమ్మలు వ్యాపించెను.
12 త్రోవను నడుచువారందరు దాని త్రెంచివేయునట్లు
దానిచుట్టునున్న కంచెలను నీవేల పాడుచేసితివి?
13 అడవిపంది దాని పెకలించుచున్నది
పొలములోని పశువులు దాని తినివేయుచున్నవి.
14 సైన్యములకధిపతివగు దేవా, ఆకాశములోనుండి మరల చూడుము
ఈ ద్రాక్షావల్లిని దృష్టించుము.
15 నీ కుడిచేయి నాటిన మొక్కను కాయుము
నీకొరకు నీవు ఏర్పరచుకొనిన కొమ్మను[1] కాయుము.
16 అది అగ్నిచేత కాల్చబడియున్నది నరకబడియున్నది
నీ కోపదృష్టివలన జనులు నశించుచున్నారు.
17 నీ కుడిచేతి మనుష్యునికి తోడుగాను
నీకొరకై నీవు ఏర్పరచుకొనిన నరునికి తోడుగాను
నీ బాహుబలముండును గాక.
18 అప్పుడు మేము నీ యొద్దనుండి తొలగిపోము
నీవు మమ్ము బ్రదికింపుము అప్పుడు నీ నామమునుబట్టియే మేము మొఱ్ఱపెట్టెదము
19 యెహోవా, సైన్యములకధిపతివగు దేవా, చెరలోనుండి మమ్ము రప్పించుము
మేము రక్షణ నొందునట్లు నీ ముఖకాంతి ప్రకాశింపజేయుము.

81

ప్రధానగాయకునికి.
గిత్తీత్ అను రాగముమీద పాడదగినది.
ఆసాపు కీర్తన.

మనకు బలమైయున్న దేవునికి ఆనందగానము చేయుడి
యాకోబు దేవునిబట్టి ఉత్సాహధ్వని చేయుడి.
2 కీర్తన యెత్తుడి గిలకతప్పెట పట్టుకొనుడి
స్వరమండలమును మనోహరమైన సితారాను వాయించుడి.
3 అమావాస్యనాడు కొమ్ము ఊదుడి
మనము పండుగ ఆచరించు దినమగు పున్నమనాడు కొమ్ము ఊదుడి.
4 అది ఇశ్రాయేలీయులకు కట్టడ
యాకోబు దేవుడు నిర్ణయించిన చట్టము.
5 ఆయన ఐగుప్తు దేశసంచారము చేసినప్పుడు
యోసేపు సంతతికి సాక్ష్యముగా దాని నియమించెను.
అక్కడ నేనెరుగని భాష వింటిని.
వారి భుజమునుండి నేను బరువును దింపగా 6
వారి చేతులు మోతగంపల నెత్తకుండ విడుదల పొందెను.
ఆపత్కాలమునందు నీవు మొఱ్ఱపెట్టగా నేను 7
నిన్ను విడిపించితిని
ఉరుము దాగు చోటులోనుండి నీకు ఉత్తరమిచ్చితిని
మెరీబా జలములయొద్ద నిన్ను శోధించితిని.
(సెలా.)
నా ప్రజలారా, ఆలకింపుడి నేను మీకు సంగతి 8
తెలియజేతును
అయ్యో ఇశ్రాయేలూ, నీవు నా మాట వినినయెడల ఎంత మేలు.
అన్యుల దేవతలలో ఒకటియును నీలో ఉండ 9
కూడదు
అన్యుల దేవతలలో ఒకదానికిని నీవు పూజచేయకూడదు.
ఐగుప్తీయుల దేశములోనుండి నిన్ను రప్పించిన 10
నీ దేవుడనగు యెహోవాను నేనే
నీ నోరు బాగుగా తెరువుము నేను దాని నింపెదను.
అయినను నా ప్రజలు నా మాట ఆలకింపక 11
పోయిరి
ఇశ్రాయేలీయులు నా మాట వినకపోయిరి.
కాబట్టి వారు తమ స్వకీయాలోచనలనుబట్టి 12
నడుచుకొనునట్లు
వారి హృదయకాఠిన్యమునకు నేను వారినప్పగించితిని.
అయ్యో నా ప్రజలు నా మాట వినినయెడల 13
ఇశ్రాయేలు నా మార్గముల ననుసరించినయెడల ఎంత మేలు.
అప్పుడు నేను వేగిరమే వారి శత్రువులను అణగ 14
ద్రొక్కుదును
వారి విరోధులను కొట్టుదును.
యెహోవాను ద్వేషించువారు వారికి లొంగు 15
దురు
వారి కాలము శాశ్వతముగా నుండును.
అతిశ్రేష్ఠమైన గోధుమల ననుగ్రహించి నేను 16
వారిని పోషించుదును
కొండ తేనెతో నిన్ను తృప్తిపరచుదును.

82

ఆసాపు కీర్తన.

దేవుని సమాజములో దేవుడు నిలిచియున్నాడు
దైవముల మధ్యను ఆయన తీర్పు తీర్చుచున్నాడు.

1 మూలభాషలో—కుమారుని.

ఎంత కాలము మీరు అన్యాయముగా తీర్పు
తీర్చుదురు?
ఎంత కాలము భక్తిహీనులయెడల పక్షపాతము
చూపుదురు? (సెలా.)
పేదలకును తలిదండ్రులులేనివారికిని న్యాయము
తీర్చుడి
శ్రమగలవారికిని దీనులకును న్యాయము తీర్చుడి.
దరిద్రులను నిరుపేదలను విడిపించుడి
భక్తిహీనుల చేతిలోనుండి వారిని తప్పించుడి.
జనులకు తెలివి లేదు వారు గ్రహింపరు
వారు అంధకారములో ఇటు అటు తిరుగులా
డుదురు
భూమికున్న ఆధారములన్నియు కదలుచున్నవి.
—మీరు దైవములనియు
మీరందరు యెహోవా కుమారులనియు నేనే
సెలవిచ్చియున్నాను.
అయినను ఇతర మనుష్యులు చనిపోవునట్లు
మీరును చనిపోవుదురు
అధికారులలో ఒకడు కూలునట్లు మీరును కూలు
దురు.
దేవా, లెమ్ము భూమికి తీర్పు తీర్చుము
అన్యజనులందరు నీకే స్వాస్థ్యముగా ఉందురు.

ఆసాపు కీర్తన. గీతము.

దేవా, ఊరకుండకుము
దేవా, మౌనముగా ఉండకుము ఊరకుండకుము.
నీ శత్రువులు అల్లరి చేయుచున్నారు
నిన్ను ద్వేషించువారు తల యెత్తి యున్నారు.
నీ ప్రజలమీద వారు కపటోపాయములు పన్ను
చున్నారు
నీ మరుగుజొచ్చినవారిమీద ఆలోచన చేయు
చున్నారు.
వారు—ఇశ్రాయేలను పేరు ఇకను జ్ఞాపకము
రాకపోవునట్లు
జనముగా నుండకుండ వారిని సంహరించుదము
రండని చెప్పుకొనుచున్నారు.
ఏకమనస్సుతో వారు ఆలోచన చేసికొని
యున్నారు
నీకు విరోధముగా నిబంధన చేయుచున్నారు.
గుడారపువాసులైన ఎదోమీయులును ఇష్మాయేలీ
యులును
మోయాబీయులును హగ్రీయీలును
గెబలువారును అమ్మోనీయులును అమాలేకీ
యులును
ఫిలిష్తీయులును తూరు నివాసులును
నీకు విరోధముగా నిబంధన చేసికొనియున్నారు.
అష్షూరు దేశస్థులు వారితో కలిసియున్నారు
లోతు వంశస్థులకు వారు సహాయము చేయు
చున్నారు. (సెలా.)
మిద్యానుకు నీవు చేసినట్లు 9
కీషోను ఏటియొద్దను నీవు సీసెరాకును యాబీను
కును చేసినట్లు నీవు వారికిని చేయుము.
వారు ఎన్దోరులో నశించిరి 10
భూమికి పెంట అయిరి.
ఓరేబు జెయేబు అనువారికి నీవు చేసినట్లు వారి 11
ప్రధానులకును చేయుము
జెబహు సల్మున్నా అనువారికి చేసినట్లు
వారి సకల రాజులకును చేయుము.
—దేవుని నివాసస్థలములను మనము ఆక్రమించు 12
కొందమని వారు చెప్పుకొనుచున్నారు.
నా దేవా, సుడి తిరుగు ధూళివలెను 13
గాలి యెదుటి పొట్టువలెను వారిని చేయుము
అగ్ని అడవిని కాల్చునట్లు 14
కారుచిచ్చు కొండలను తగలపెట్టునట్లు
నీ తుపానుచేత వారిని తరుముము 15
నీ సుడిగాలిచేత వారికి భీతి పుట్టించుము.
యెహోవా, వారు నీ నామమును వెదకునట్లు 16
వారికి పూర్ణావమానము కలుగజేయుము.
వారు నిత్యము సిగ్గుపడి భీతి నొందుదురు గాక 17
వారు భ్రమసి నశించుదురు గాక.
యెహోవా అను నామము ధరించిన నీవు 18
మాత్రమే
సర్వలోకములో మహోన్నతుడవని వారెరుగు
దురు గాక.

## 84

ప్రధానగాయకునికి.
గిత్తీత్ అను రాగముమీద పాడదగినది
కోరహు కుమారుల కీర్తన.

సైన్యములకధిపతివగు యెహోవా, నీ నివాస
ములు ఎంత రమ్యములు.
యెహోవా మందిరావరణములను చూడవలెనని 2
నా ప్రాణము ఎంతో ఆశపడుచున్నది అది సొమ్మ
సిల్లుచున్నది
జీవముగల దేవుని దర్శించుటకు నా హృదయమును
నా శరీరమును ఆనందముతో కేకలు వేయు
చున్నవి.
సైన్యములకధిపతివగు యెహోవా, నా రాజా, 3
నా దేవా,
నీ బలిపీఠమునొద్దనే పిచ్చుకలకు నివాస
దొరికెను
పిల్లలు పెట్టుటకు వానకోవెలకు గూ
దొరికెను.
నీ మందిరమునందు నివసించువారు ధన్యులు 4
వారు నిత్యము నిన్ను స్తుతించుదురు. (సెలా.)

5 నీవలన బలము నొందు మనుష్యులు ధన్యులు
యాత్రచేయు మార్గములు వారికి అతిప్రియములు.
6 వారు బాకా లోయలోబడి వెళ్లుచు
దానిని జలమయముగా చేయుదురు
తొలకరి వాన దానిని దీవెనలతో కప్పును.
7 వారు నానాటికి బలాభివృద్ధి నొందుచు ప్రయాణము చేయుదురు
వారిలో ప్రతివాడు సీయోనులో దేవుని సన్నిధిని కనబడును.
8 యెహోవా, సైన్యములకధిపతివగు దేవా, నా ప్రార్థన ఆలకింపుము
యాకోబు దేవా, చెవి యొగ్గుము. (సెలా.)
9 దేవా, మా కేడెమా, దృష్టించుము
నీవు అభిషేకించినవాని ముఖమును లక్షింపుము.
10 నీ ఆవరణములలో ఒక దినము గడుపుట వెయ్యిదినములకంటె శ్రేష్ఠము.
భక్తిహీనుల గుడారములలో నివసించుటకంటె
నా దేవుని మందిర ద్వారమునొద్ద నుండుట నాకిష్టము.
11 దేవుడైన యెహోవా సూర్యుడును కేడెమునై యున్నాడు
యెహోవా కృపయు ఘనతయు అనుగ్రహించును
యథార్థముగా ప్రవర్తించువారికి ఆయన యే మేలును చేయక మానడు.
12 సైన్యములకధిపతివగు యెహోవా,
నీయందు నమ్మికయుంచువారు ధన్యులు

## 85

ప్రధానగాయకునికి.
కోరహు కుమారుల కీర్తన.

**యె**హోవా, నీవు నీ దేశము ఎడల కటాక్షము చూపియున్నావు
చెరకుపోయిన యాకోబు సంతతిని నీవు వెనుకకు రప్పించియున్నావు.
2 నీ ప్రజల దోషమును పరిహరించియున్నావు
వారి పాపమంతయు కప్పివేసియున్నావు. (సెలా.)
3 నీ ఉగ్రత అంతయు మానివేసియున్నావు
నీ కోపాగ్నిని చల్లార్చుకొని యున్నావు.
4 మా రక్షణకర్తవగు దేవా, మాకు క్షేమము కలుగజేయుము
మా మీదనున్న నీ కోపము చాలించుము.
5 ఎల్లకాలము మామీద కోపగించెదవా?
తరతరములు నీ కోపము సాగించెదవా?
6 నీ ప్రజలు నీయందు సంతోషించునట్లు
మరల మమ్మును బ్రదికింపవా?
యెహోవా, నీ కృప మాకు కనుపరచుము 7
నీ రక్షణ మాకు దయచేయుము.
దేవుడైన యెహోవా సెలవిచ్చుమాటను నేను చెవినిబెట్టెదను 8
ఆయన తన ప్రజలతోను తన భక్తులతోను శుభవచనము సెలవిచ్చును
వారు మరల బుద్ధిహీనులు కాకుందురు గాక.
మన దేశములో మహిమ నివసించునట్లు 9
ఆయన రక్షణ ఆయనకు భయపడువారికి సమీపముగా నున్నది.
కృపాసత్యములు కలిసికొనినవి 10
నీతి సమాధానములు ఒకదానినొకటి ముద్దుపెట్టుకొనినవి.
భూమిలోనుండి సత్యము మొలుచును 11
ఆకాశములోనుండి నీతి పారజూచును.
యెహోవా ఉత్తమమైనదాని ననుగ్రహించును 12
మన భూమి దాని ఫలమునిచ్చును.
నీతి ఆయనకు ముందు నడుచును 13
ఆయన అడుగుజాడలలో అది నడుచును.

## 86

దావీదు ప్రార్థన.

**యె**హోవా, నేను దీనుడను దరిద్రుడను
చెవియొగ్గి నాకుత్తరమిమ్ము
నేను నీ భక్తుడను నా ప్రాణము కాపాడుము. 2
నా దేవా, నిన్ను నమ్ముకొనియున్న నీ సేవకుని రక్షింపుము.
ప్రభువా, దినమెల్ల నీకు మొఱ్ఱపెట్టుచున్నాను 3
నన్ను కరుణింపుము
ప్రభువా, నా ప్రాణము నీ వైపుకు ఎత్తుచున్నాను 4
నీ సేవకుని ప్రాణము సంతోషింపజేయుము.
ప్రభువా, నీవు దయాళుడవు క్షమించుటకు సిద్ధమైన మనస్సుగలవాడవు 5
నీకు మొఱ్ఱపెట్టువారందరియెడల కృపాతిశయము గలవాడవు.
యెహోవా, నా ప్రార్థనకు చెవి యొగ్గుము 6
నా మనవుల ధ్వని ఆలకింపుము.
నీవు నాకు ఉత్తరమిచ్చువాడవు 7
గనుక నా ఆపత్కాలమందు నేను నీకు మొఱ్ఱపెట్టెదను.
ప్రభువా, దేవతలలో నీవంటివాడు లేడు 8
నీ కార్యములకు సాటియైన కార్యములును లేవు.
ప్రభువా, నీవు మాహాత్మ్యముగలవాడవు ఆశ్చర్యకార్యములు చేయువాడవు 9
నీవే అద్వితీయ దేవుడవు.
నీవు సృజించిన అన్యజనములందరును వచ్చి నీ సన్నిధిని నమస్కారము చేయుదురు 10

నీ నామమును ఘనపరచుదురు.
యెహోవా, నేను నీ సత్యము ననుసరించి నడుచుకొనునట్లు నీ మార్గమును నాకు బోధింపుము.
నీ నామమునకు భయపడునట్లు నా హృదయమునకు ఏకదృష్టి కలుగజేయుము.
ప్రభువా, నా దేవా, నాయెడల నీవు చూపిన కృప అధికమైనది
పాతాళపు అగాధమునుండి నా ప్రాణమును తప్పించియున్నావు.
నా పూర్ణహృదయముతో నేను నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించెదను
నీ నామమును నిత్యము మహిమపరచెదను.
దేవా, గర్విష్ఠులు నామీదికి లేచియున్నారు
బలాత్కారులు గుంపుకూడి నా ప్రాణము తీయ జూచుచున్నారు
వారు నిన్ను లక్ష్యపెట్టనివారై యున్నారు.
ప్రభువా, నీవు దయాదాక్షిణ్యములుగల దేవుడవు
దీర్ఘశాంతుడవు కృపాసత్యములతో నిండినవాడవు
నాతట్టు తిరిగి నన్ను కనికరింపుము
నీ సేవకునికి నీ బలము అనుగ్రహింపుము
నీ సేవకురాలి కుమారుని రక్షింపుము.
యెహోవా, నీవు నాకు సహాయుడవై నన్నాదరించుచున్నావు
నా పగవారు చూచి సిగ్గుపడునట్లు
శుభకరమైన ఆనవాలు నాకు కనుపరచుము

కోరహు కుమారుల కీర్తన. గీతము.

ఆయన (పట్టణపు) పునాది పరిశుద్ధ పర్వతముల మీద వేయబడియున్నది
యాకోబు నివాసములన్నిటికంటె సీయోను గుమ్మములు యెహోవాకు ప్రియములై యున్నవి.
దేవుని పట్టణమా,
మనుష్యులు నిన్నుగూర్చి మిక్కిలి గొప్ప సంగతులు చెప్పుకొందురు. (సెలా.)
రహబును బాబెలును నాకు పరిచయులని నేను తెలియజెప్పుచున్నాను
ఫిలిష్తీయ తూరు కూషులను చూడుము
వీరు అచ్చట జన్మించిరని (యందురు.)
ప్రతి జనము దానిలోనే జన్మించెననియు
సర్వోన్నతుడు తానే దాని స్థిరపరచెననియు
సీయోనునుగూర్చి చెప్పుకొందురు.
యెహోవా జనముల సంఖ్య వ్రాయించునప్పుడు
—ఈ జనము అక్కడ జన్మించెనని సెలవిచ్చును. (సెలా.)
పాటలు పాడుచు వాద్యములు వాయించుచు
— మా ఊటలన్నియు నీయందే యున్నవని వారందురు.

ప్రధానగాయకునికి. **88**

మహలతు లయన్నోత్ అను రాగముమీద పాడదగినది. ఎజ్రాహీయుడైన హేమాను రచించిన దైవధ్యానము. కోరహు కుమారుల కీర్తన. గీతము.

యెహోవా, నాకు రక్షణకర్తవగు దేవా,
రాత్రివేళ నేను నీ సన్నిధిని మొఱ్ఱపెట్టునాడు
నా ప్రార్థన నీ సన్నిధిని చేరును గాక 2
నా మొఱ్ఱకు చెవి యొగ్గుము
నేను ఆపదలతో నిండియున్నాను 3
నా ప్రాణము పాతాళమునకు సమీపించియున్నది.
సమాధిలోకి దిగువారిలో నేనొకనిగా ఎంచబడితిని. 4
నేను త్రాణలేనివానివలె అయితిని.
చచ్చినవారిలో విడువబడినవాడనైతిని 5
నేను సమాధిలో పడియున్న హతులలో ఒకనివలె అయితిని
నీవిక స్మరింపనివారివలె అయితిని
వారు నీ చేతిలోనుండి తొలగిపోయి యున్నారు గదా.
అగాధమైన గుంటలోను చీకటిగల చోట్లలోను 6
అగాధ జలములలోను నీవు నన్ను పరుండబెట్టియున్నావు.
నీ ఉగ్రత నామీద బరువుగా నున్నది 7
నీ తరంగములన్నియు నన్ను ముంచుచున్నవి. (సెలా.)
నా నెళవరులను నాకు దూరముగా నీవు ఉంచియున్నావు 8
నీవు వారి దృష్టికి నన్ను హేయునిగా చేసియున్నావు
వెలుపలికి రావల్ల గాకుండ నేను బంధింపబడియున్నాను
బాధచేత నా కన్ను క్షీణించుచున్నది 9
యెహోవా, ప్రతిదినము నేను నీకు మొఱ్ఱపెట్టుచున్నాను
నీవైపు నా చేతులు చాపుచున్నాను.
మృతులకు నీవు అద్భుతములు చూపెదవా? 10
ప్రేతలు లేచి నిన్ను స్తుతించెదరా? (సెలా.)
సమాధిలో నీ కృపను ఎవరైన వివరింతురా? 11
నాశనకూపములో నీ విశ్వాస్యతను ఎవరైన చెప్పుకొందురా?
అంధకారములో నీ అద్భుతములు తెలియనగునా? 12
పాతాళములో నీ నీతి తెలియనగునా?

13 యెహోవా, నేను నీతోనే మనవి చేయు
చున్నాను
ఉదయమున నా ప్రార్థన నిన్ను ఎదుర్కొనును.
14 యెహోవా, నీవు నన్ను విడుచుట యేల?
నీ ముఖము నాకు చాటు చేయుట యేల?
15 బాల్యమునుండి నేను బాధపడి చావుకు సిద్ధ
మైతిని
నీవు పెట్టు భయముచేత నేను కలవరపడు
చున్నాను.
16 నీ కోపాగ్ని నా మీదికి పొర్లియున్నది
నీ మహా భయములు నన్ను సంహరించి యున్నవి.
17 నీళ్లు ఆవరించునట్లు అవి దినమంత నన్ను ఆవరించు
చున్నవి
అవి నన్ను చుట్టూర చుట్టుకొని యున్నవి.
18 నా ప్రియులను స్నేహితులను నీవు నాకు దూర
ముగా ఉంచియున్నావు
చీకటియే నాకు బంధువర్గమాయెను.

# 89

ఎజ్రాహీయుడైన ఏతాను రచించినది
దైవధ్యానము.

యెహోవాయొక్క కృపాతిశయమును నిత్యము
నేను కీర్తించెదను
తరతరములకు నీ విశ్వాస్యతను నా నోటితో
తెలియజేసెదను.
2 —కృప నిత్యము స్థాపింపబడుననియు
ఆకాశమందే నీ విశ్వాస్యతను స్థిరపరచుకొందు
వనియు నేననుకొనుచున్నాను.
3-4 —నేను ఏర్పరచుకొనినవానితో నిబంధన చేసి
యున్నాను
నిత్యము నీ సంతానమును స్థిరపరచెదను
తరతరములకు నీ సింహాసనమును స్థాపించెదనని
చెప్పి
నా సేవకుడైన దావీదుతో ప్రమాణముచేసి
యున్నాను. (సెలా.)
5 యెహోవా, ఆకాశవైశాల్యము నీ ఆశ్చర్య
కార్యములను స్తుతించుచున్నది
పరిశుద్ధదూతల సమాజములో నీ విశ్వాస్యతను
బట్టి నీకు స్తుతులు కలుగుచున్నవి.
6 మింటను యెహోవాకు సాటియైనవాడెవడు?
దైవపుత్రులలో యెహోవావంటివాడెవడు?
7 పరిశుద్ధదూతల సభలో ఆయన మిక్కిలి భీకరుడు
తన చుట్టునున్న వారందరికంటె భయంకరుడు.
8 యెహోవా, సైన్యములకధిపతివగు దేవా,
యెహోవా, నీవంటి బలాఢ్యుడెవడు?
నీ విశ్వాస్యతచేత నీవు ఆవరింపబడియున్నావు.
9 సముద్రపు పొంగు నణచువాడవు నీవే
దాని తరంగములు లేచునప్పుడు నీవు వాటిని
అణచివేయుచున్నావు.
చంపబడినదానితో సమానముగా నీవు రహబును 10
నలిపివేసితివి
నీ బాహుబలముచేత నీ శత్రువులను చెదరగొట్టి
తివి.
ఆకాశము నీదే భూమి నీదే 11
లోకమును దాని పరిపూర్ణతను నీవే స్థాపించితివి.
ఉత్తర దక్షిణములను నీవే నిర్మించితివి. 12
తాబోరు హెర్మోనులు నీ నామమునుబట్టి ఉత్సా
హధ్వని చేయుచున్నవి.
పరాక్రమముగల బాహువు నీకు కలదు 13
నీ హస్తము బలమైనది నీ దక్షిణహస్తము ఉన్నత
మైనది.
నీతిన్యాయములు నీ సింహాసనమునకు ఆధార 14
ములు
కృపాసత్యములు నీ సన్నిధానవర్తులు.
శృంగధ్వనుల నెరుగు ప్రజలు ధన్యులు 15
యెహోవా, నీ ముఖకాంతిని చూచి వారు
నడుచుకొనుచున్నారు.
నీ నామమునుబట్టి వారు దినమెల్ల హర్షించు 16
చున్నారు
నీ నీతిచేత హెచ్చింపబడుచున్నారు.
వారి బలమునకు అతిశయాస్పదము నీవే 17
నీ దయచేతనే మా కొమ్ము హెచ్చింపబడుచున్నది.
మా కేడెము యెహోవావశము 18
మా రాజు ఇశ్రాయేలు పరిశుద్ధ దేవునివాడు.
అప్పుడు నీవు దర్శనమున నీ భక్తులతో ఇట్లు 19
సెలవిచ్చియుంటివి
—నేను ఒక శూరునికి సహాయము చేసియున్నాను
ప్రజలలోనుండి యేర్పరచబడిన యొకని నేను
హెచ్చించియున్నాను.
నా సేవకుడైన దావీదును నేను కనుగొని 20
యున్నాను
నా పరిశుద్ధ తైలముతో అతని నభిషేకించి
యున్నాను.
నా చెయ్యి యెడతెగక అతనికి తోడైయుండును 21
నా బాహుబలము అతని బలపరచును.
ఏ శత్రువును అతనిమీద జయము నొందదు 22
దోషకారులు అతని బాధపరచరు.
అతనియెదుట నిలువకుండ అతని విరోధులను 23
నేను పడగొట్టెదను.
అతనిమీద పగపట్టువారిని మొత్తెదను.
నా విశ్వాస్యతయు నా కృపయు అతనికి తోడై 24
యుండును.

నా నామమునుబట్టి అతని కొమ్ము హెచ్చింపబడును.
నేను సముద్రముమీద అతని చేతిని
నదులమీద అతని కుడిచేతిని ఉంచెదను.
—నీవు నా తండ్రివి నా దేవుడవు
నా రక్షణ దుర్గము అని అతడు నాకు మొఱ్ఱపెట్టును.
కావున నేను అతని నా జ్యేష్ఠకుమారునిగా చేయుదును
భూరాజులలో అత్యున్నతునిగా నుంచెదను.
నా కృప నిత్యము అతనికి తోడుగా నుండజేసెదను
నా నిబంధన అతనితో స్థిరముగా నుండును.
శాశ్వతకాల పర్యంతము అతని సంతానమును
ఆకాశమున్నంతవరకు అతని సింహాసనమును నేను నిలిపెదను.
అతని కుమారులు నా ధర్మశాస్త్రము విడిచి
నా న్యాయవిధుల ననుసరింపనియెడల
వారు నా కట్టడలను అపవిత్రపరచి
నా ఆజ్ఞలను గైకొననియెడల
నేను వారి తిరుగబాటుకు దండముతోను
వారి దోషమునకు దెబ్బలతోను వారిని శిక్షించెదను.
కాని నా కృపను అతనికి బొత్తిగా ఎడముచేయను
అబద్ధికుడనై నా విశ్వాస్యతను విడువను.
నా నిబంధనను నేను రద్దుపరచను
నా పెదవులగుండ బయలువెళ్లిన మాటను మార్చను.
అతని సంతానము శాశ్వతముగా ఉండుననియు
అతని సింహాసనము సూర్యుడున్నంతకాలము నా సన్నిధిని ఉండుననియు
చంద్రుడున్నంతకాలము అది నిలుచుననియు
మింటనుండు సాక్షి నమ్మకముగా ఉన్నట్లు అది స్థిరపరచబడుననియు
నా పరిశుద్ధతతోడని నేను ప్రమాణము చేసితిని
దావీదుతో నేను అబద్ధమాడను.
ఇట్లు సెలవిచ్చి యుండియు నీవు మమ్ము విడనాడి విసర్జించియున్నావు
నీ అభిషిక్తునిమీద నీవు అధికకోపము చూపియున్నావు.
నీ సేవకుని నిబంధన నీకసహ్యమాయెను
అతని కిరీటమును నేల పడద్రోసి అపవిత్రపరచియున్నావు.
అతని కంచెలన్నియు నీవు తెగగొట్టియున్నావు
అతని కోటలు పాడుచేసియున్నావు
త్రోవను పోవువారందరు అతని దోచుకొనుచున్నారు
అతడు తన పొరుగువారికి నిందాస్పదుడాయెను.
అతని విరోధుల కుడిచేతిని నీవు హెచ్చించియున్నావు 42
అతని శత్రువులనందరిని నీవు సంతోషపరచియున్నావు
అతని ఖడ్గము ఏమియు సాధింపకుండ చేసియున్నావు 43
యుద్ధమందు అతని నిలువబెట్టకున్నావు
అతని వైభవమును మాన్పియున్నావు 44
అతని సింహాసనమును నేల పడగొట్టియున్నావు
అతని యౌవనదినములను తగ్గించియున్నావు 45
సిగ్గుతో అతని కప్పియున్నావు (సెలా.)
యెహోవా, ఎంతవరకు నీవు దాగియుందువు? 46
నిత్యము దాగియుందువా?
ఎంతవరకు నీ ఉగ్రత అగ్నివలె మండును?
నా ఆయుష్కాలము ఎంత కొద్దిదో జ్ఞాపకము చేసికొనుము 47
ఎంత వ్యర్థముగా నీవు నరులనందరిని సృజించియున్నావు?
మరణమును చూడక బ్రదుకు నరుడెవడు? 48
పాతాళముయొక్క వశము కాకుండ తన్ను తాను తప్పించుకొనగలవాడెవడు?
ప్రభువా, నీ విశ్వాస్యతతోడని నీవు దావీదుతో 49
ప్రమాణము చేసిన తొల్లిటి నీ కృపాతిశయము లెక్కడ?
ప్రభువా, నీ సేవకులకు వచ్చిన నిందను జ్ఞాపకము 50
చేసికొనుము
బలవంతులైన జనులందరిచేతను నా యెదలో నేను భరించుచున్న నిందను జ్ఞాపకము చేసికొనుము.
యెహోవా, అవి నీ శత్రువులు చేసిన నిందలు 51
నీ అభిషిక్తుని నడతలమీద వారు మోపుచున్న నిందలు.
యెహోవా నిత్యము స్తుతినొందును గాక 52
ఆమేన్ ఆమేన్.

## చతుర్థ స్కంధము.

## 90

దైవజనుడైన మోషే చేసిన ప్రార్థన.

ప్రభువా, తరతరములనుండి
మాకు నివాసస్థలము నీవే.
పర్వతములు పుట్టకమునుపు 2
భూమిని లోకమును నీవు పుట్టింపకమునుపు
యుగయుగములు నీవే దేవుడవు.
నీవు మనుష్యులను మంటికి మార్చుచున్నావు 3
—నరులారా, తిరిగి రండని నీవు సెలవిచ్చుచున్నావు.

4 నీ దృష్టికి వేయి సంవత్సరములు గతించిన నిన్నటి
వలె నున్నవి
రాత్రియందలి యొక జామువలె నున్నవి.
5 వరదచేతనైనట్టు నీవు వారిని పారగొట్టివేయగా
వారు నిద్రింతురు.
ప్రొద్దుట వారు పచ్చ గడ్డివలె చిగిరింతురు
6 ప్రొద్దుట అది మొలిచి చిగిరించును
సాయంకాలమున అది కోయబడి వాడబారును.
7 నీ కోపమువలన మేము క్షీణించుచున్నాము
నీ ఉగ్రతనుబట్టి దిగులుపడుచున్నాము.
8 మా దోషములను నీవు నీ యెదుట నుంచుకొని
యున్నావు
నీ ముఖకాంతిలో మా రహస్యపాపములు కన
బడుచున్నవి.
9 నీ ఉగ్రతను భరించుచునే మా దినములన్నియు
గడిపితిమి.
నిట్టూర్పులు విడిచినట్టు మా జీవితకాలము జరు
పుకొందుము.
10 మా ఆయుష్కాలము డెబ్బది సంవత్సరములు
అధిక బలమున్న యెడల ఎనుబది సంవత్సరములగును
అయినను వాటి వైభవము ఆయాసమే దుఃఖమే
అది త్వరగా గతించును మేము ఎగిరిపోవుదుము.
11 నీ ఆగ్రహబలము ఎంతో ఎవరికి తెలియును?
నీకు చెందవలసిన భయముకొలది పుట్టు నీ
క్రోధము ఎంతో ఎవరికి తెలియును?
12 మాకు జ్ఞానహృదయము కలుగునట్లుగా చేయుము
మా దినములు లెక్కించుటకు మాకు నేర్పుము.
13 యెహోవా, తిరుగుము ఎంతవరకు (తిరుగక
యుందువు?)
నీ సేవకులను చూచి సంతాపపడుము.
14 ఉదయమున నీ కృపతో మమ్మును తృప్తిపరచుము
అప్పుడు మేము మా దినములన్నియు ఉత్సహించి
సంతోషించెదము.
15 నీవు మమ్మును శ్రమపరచిన దినముల కొలది
మేము కీడనుభవించిన యేండ్ల కొలది మమ్మును
సంతోషపరచుము.
16 నీ సేవకులకు నీ కార్యము కనుపరచుము
వారి కుమారులకు నీ ప్రభావము చూపింపుము.
17 మా దేవుడైన యెహోవా ప్రసన్నత మామీద
నుండును గాక
మా చేతిపనిని మాకు స్థిరపరచుము
మా చేతిపనిని స్థిరపరచుము.

**మ**హోన్నతుని చాటున నివసించువాడే సర్వ
శక్తుని నీడను విశ్రమించువాడు.
నే నాకు ఆశ్రయము నా కోట నేను
ను నా దేవుడని
నేను యెహోవాతో మనవి చేయుచున్నాను.
వేటకాని ఉరిలోనుండి ఆయన నిన్ను విడిపించును 3
నాశనకరమైన తెగులు రాకుండ నిన్ను రక్షించును.
ఆయన తన రెక్కలతో నిన్ను కప్పును 4
ఆయన రెక్కల క్రింద నీకు ఆశ్రయము కలుగును
ఆయన సత్యము కేడెమును డాలునై యున్నది.
రాత్రివేళ కలుగు భయమునకైనను 5
పగటివేళ ఎగురు బాణమునకైనను
చీకటిలో సంచరించు తెగులునకైనను 6
మధ్యాహ్నమందు పాడుచేయు రోగమునకైనను
నీవు భయపడకుందువు.
నీ ప్రక్కను వేయి మంది పడినను 7
నీ కుడిప్రక్కను పది వేలమంది కూలినను
అపాయము నీయొద్దకు రాదు.
నీవు కన్నులార చూచుచుండగా 8
భక్తిహీనులకు ప్రతిఫలము కలుగును
—యెహోవా, నీవే నా ఆశ్రయము 9
(అని) నీవు మహోన్నతుడైన దేవుని నీకు
నివాసస్థలముగా చేసికొనియున్నావు
నీకు అపాయమేమియు రాదు 10
ఏ తెగులును నీ గుడారమును సమీపించదు
నీ మార్గములన్నిటిలో నిన్ను కాపాడుటకు 11
ఆయన నిన్నుగూర్చి తన దూతలకు ఆజ్ఞాపించును
నీ పాదమునకు రాయి తగలకుండ 12
వారు నిన్ను తమ చేతులమీద ఎత్తి పట్టుకొందురు.
నీవు సింహములను నాగుపాములను త్రొక్కెదవు 13
కొదమ సింహములను భుజంగములను అణగ
ద్రొక్కెదవు.
అతడు నన్ను ప్రేమించుచున్నాడు గనుక నేనతని 14
తప్పించెదను
అతడు నా నామము నెరిగినవాడు గనుక నేనతని
ఘనపరచెదను
అతడు నాకు మొఱ్ఱపెట్టగా నేనతనికి ఉత్తర 15
మిచ్చెదను
శ్రమలో నేనతనికి తోడై యుండెదను
అతని విడిపించి అతని గొప్ప చేసెదను
దీర్ఘాయువుచేత అతనిని తృప్తిపరచెదను 16
నా రక్షణ అతనికి చూపించెదను.

## 92

విశ్రాంతిదినమునకు తగిన కీర్తన. గీతము.

**యె**హోవాను స్తుతించుట మంచిది 2
మహోన్నతుడా, నీ నామమును కీర్తించుట 3
మంచిది.
ఉదయమున నీ కృపను ప్రతిరాత్రి నీ విశ్వా
స్యతను

4 పది తంతుల స్వరమండలముతోను గంభీర ధ్వని
గల సితారాతోను ప్రచురించుట మంచిది.
ఎందుకనగా యెహోవా, నీ కార్యముచేత నీవు
నన్ను సంతోషపరచుచున్నావు
5 నీ చేతిపనులనుబట్టి నేను ఉత్సహించుచున్నాను.
యెహోవా, నీ కార్యములు ఎంత దొడ్డవి
నీ ఆలోచనలు అతిగంభీరములు.
6 పశుప్రాయులు వాటిని గ్రహింపరు
7 అవివేకులు వివేచింపరు.
నిత్యనాశనము నొందుటకే గదా
భక్తిహీనులు గడ్డివలె చిగుర్చుదురు.
చెడుపనులు చేయువారందరు పుష్పించుదురు.
8 యెహోవా, నీవే నిత్యము మహోన్నతుడవుగా
నుందువు.
9 నీ శత్రువులు యెహోవా, నీ శత్రువులు నశిం
చెదరు
చెడు పనులు చేయువారందరు చెదరిపోవుదురు.
10 గురుపోతు కొమ్మువలె నీవు నా కొమ్ము పైకెత్తితివి
క్రొత్త తైలముతో నేను అంటబడితిని.
11 నాకొరకు పొంచినవారి గతి నా కన్నులు ఆశ
తీర చూచెను
నాకు విరోధముగా లేచిన దుష్టులకు సంభవించి
నది నా చెవులకు వినబడెను.
12 నీతిమంతులు తమాల వృక్షమువలె మొవ్వువేయు
దురు
లెబానోనుమీది దేవదారు వృక్షమువలె వారు
ఎదుగుదురు.
13 యెహోవా మందిరములో నాటబడినవారై
వారు మన దేవుని ఆవరణములలో వర్ధిల్లుదురు.
14 నాకు ఆశ్రయదుర్గమైన యెహోవా యథార్థ
వంతుడనియు
ఆయనయందు ఏ చెడుతనమును లేదనియు ప్రసిద్ధి
చేయుటకై
15 వారు ముసలితనమందు ఇంక చిగురుపెట్టుచుం
దురు
సారము కలిగి పచ్చగా నుందురు.

**93** యెహోవా రాజ్యము చేయుచున్నాడు
ప్రభావమును ఆయన వస్త్రముగా ధరించి
యున్నాడు
యెహోవా బలము ధరించి బలముతో నడుము
కట్టుకొని యున్నాడు
కదలకుండునట్లు భూలోకము స్థిరపరచబడి
యున్నది.
2 పురాతనకాలమునుండి నీ సింహాసనము స్థిరమా
యెను
సదాకాలము ఉన్నవాడవు నీవే
వరదలు ఎలుగెత్తెను యెహోవా, వరదలు ఎలు 3
గెత్తెను
వరదలు తమ అలలను హోరెత్తునట్లు చేయు
చున్నవి.
విస్తారజలముల ఘోషలకంటెను బలమైన సముద్ర 4
తరంగముల ఘోషలకంటెను
ఆకాశమునందు యెహోవా బలిష్ఠుడు.
నీ శాసనములు ఎన్నడును తప్పిపోవు 5
యెహోవా, ఎన్నటెన్నటికి పరిశుద్ధతయే నీ
మందిరమునకు అనుకూలము.

**94** యెహోవా, ప్రతికారముచేయు దేవా,
ప్రతికారముచేయు దేవా, ప్రకాశింపుము.
భూలోక న్యాయాధిపతీ, లెమ్ము 2
గర్విష్ఠులకు ప్రతిఫలమిమ్ము.
యెహోవా, భక్తిహీనులు ఎంతవరకు ఉత్సహిం 3
చుదురు?
భక్తిహీనులు ఎంతవరకు ఉత్సహించుదురు?
వారు వదరుచు కఠోరమైన మాటలు పలుకు 4
చున్నారు
దోషము చేయువారందరు బింకములాడుచు
న్నారు.
—యెహోవా చూచుటలేదు 5
యాకోబు దేవుడు విచారించుటలేదు అనుకొని
యెహోవా, వారు నీ ప్రజలను నలుగగొట్టు 6
చున్నారు
నీ స్వాస్థ్యమును బాధించుచున్నారు
విధవరాండ్లను పరదేశులను చంపుచున్నారు 7
తండ్రిలేనివారిని హతముచేయుచున్నారు.
జనులలో పశుప్రాయులారా, దీనిని ఆలో 8
చించుడి
బుద్ధిహీనులారా, మీరెప్పుడు బుద్ధిమంతులవు
దురు?
చెవులను కలుగజేసినవాడు వినకుండునా? 9
కంటిని నిర్మించినవాడు కానకుండునా?
అన్యజనులను శిక్షించువాడు 10
మనుష్యులకు తెలివినేర్పువాడు దండింపక
మానునా?
నరుల ఆలోచనలు వ్యర్థములని యెహోవాకు 11
తెలిసియున్నది.
యెహోవా, నీవు శిక్షించువాడు నీ ధర్మశాస్త్రము 12
నుబట్టి నీవు బోధించువాడు ధన్యుడు.
భక్తిహీనులకు గుంట త్రవ్వబడువరకు 13
నీతిమంతుల కష్టదినములను పోగొట్టి వారికి నెమ్మది
కలుగజేయుదువు.
యెహోవా తన ప్రజలను ఎడబాయువాడు 14
కాడు

తన స్వాస్థ్యమును విడనాడువాడు కాడు.
15 నీతిని స్థాపించుటకై న్యాయపుతీర్పు జరుగును
యథార్థహృదయులందరు దాని ననుసరించెదరు.
16 దుష్టులమీదికి నా పక్షమున ఎవడు లేచును?
దోషము చేయువారికి విరోధముగా నా పక్షమున
ఎవడు నిలుచును?
17 యెహోవా నాకు సహాయము చేసియుండని
యెడల
నా ప్రాణము శీఘ్రముగా మౌనమందు నివసించి
యుండును.
18 —నా కాలు జారెనని నేననుకొనగా
యెహోవా, నీ కృప నన్ను బలపరచుచున్నది.
19 నా అంతరంగమందు విచారములు హెచ్చగా
నీ గొప్ప ఆదరణ నా ప్రాణమునకు నెమ్మది
కలుగజేయుచున్నది.
20 కట్టడవలన కీడు కల్పించు దుష్టుల పరిపాలనతో
నీకు పొందు కలుగునా?
21 దుష్టులు నీతిమంతుల ప్రాణము తీయుటకై వారి
మీద పడుదురు
దోషులని నిర్దోషులకు మరణము విధించుదురు.
22 యెహోవా నాకు ఎత్తయిన కోట
నా దేవుడు నాకు ఆశ్రయదుర్గము.
23 ఆయన వారి దోషము వారిమీదికి రప్పించును
వారి చెడుతనమునుబట్టి వారిని సంహరించును
మన దేవుడైన యెహోవా వారిని సంహరించును.

95 రండి యెహోవానుగూర్చి ఉత్సాహధ్వని
చేయుదము
మన రక్షణ దుర్గమునుబట్టి సంతోషగానము
చేయుదము.
2 కృతజ్ఞతాస్తుతులతో ఆయన సన్నిధికి వచ్చెదము
కీర్తనలు పాడుచు ఆయన పేరట సంతోష
గానము చేయుదము.
3 యెహోవా మహా దేవుడు
దేవతలందరికి పైన మహాత్మ్యముగల మహారాజు
4 భూమ్యాగాధస్థలములు ఆయన చేతిలోనున్నవి
పర్వతశిఖరములు ఆయనవే.
5 సముద్రము ఆయనది ఆయన దాని కలుగజేసెను
ఆయన హస్తములు భూమిని నిర్మించెను.
6 ఆయన మన దేవుడు
మనము ఆయన పాలించు ప్రజలము ఆయన
మేపు గొఱ్ఱెలము.
7 రండి నమస్కారము చేసి సాగిలపడుదము
మనలను సృజించిన యెహోవా సన్నిధిని మోక
రించుదము
నేడు మీరు ఆయన మాట నంగీకరించినయెడల
ఎంత మేలు.
అరణ్యమందు మెరీబాయొద్ద మీరు కఠినపరచు 8
కొనినట్లు
మస్సాదినమందు మీరు కఠినపరచుకొనినట్లు
మీ హృదయములను కఠినపరచుకొనకుడి.
అచ్చట మీ పితరులు నన్ను పరీక్షించి శోధించి 9
నా కార్యములు చూచిరి
నలువది ఏండ్లకాలము ఆ తరమువారివలన నేను 10
విసికి
—వారు హృదయమున తప్పిపోవు ప్రజలు
వారు నా మార్గములు తెలిసికొనలేదని అను
కొంటిని.
కావున నేను కోపించి—వీరెన్నడును నా విశ్రాం 11
తిలో ప్రవేశింపకూడదని ప్రమాణముచేసితిని.

యెహోవామీద క్రొత్త కీర్తన పాడుడి 96
సర్వభూజనులారా, యెహోవామీద పాడుడి
యెహోవామీద పాడుడి ఆయన నామమును 2
స్తుతించుడి
అనుదినము ఆయన రక్షణసువార్తను ప్రకటించుడి.
యెహోవా మహాత్మ్యముగలవాడు 3
ఆయన అధికస్తోత్రము పొందతగినవాడు
సమస్త దేవతలకంటెను ఆయన పూజనీయుడు.
అన్యజనులలో ఆయన మహిమను ప్రచురించుడి 4
సమస్త జనములలో ఆయన ఆశ్చర్యకార్యములను
ప్రచురించుడి.
జనముల దేవతలందరు వట్టి విగ్రహములే 5
యెహోవా ఆకాశవిశాలమును సృజించినవాడు.
ఘనతాప్రభావములు ఆయన సన్నిధిని ఉన్నవి 6
బలసౌందర్యములు ఆయన పరిశుద్ధస్థలములో
ఉన్నవి.
జనముల కుటుంబములారా, యెహోవాకు చెల్లిం 7
చుడి
మహిమాబలములు యెహోవాకు చెల్లించుడి.
యెహోవా నామమునకు తగిన మహిమ ఆయ 8
నకు చెల్లించుడి
నైవేద్యము తీసికొని ఆయన ఆవరణములలోనికి
రండి.
పరిశుద్ధాలంకారములు ధరించుకొని యెహోవా 9
వాకు నమస్కారము చేయుడి
సర్వభూజనులారా, ఆయన సన్నిధిని వణకుడి.
యెహోవా రాజ్యము చేయుచున్నాడు 10
లోకము కదలకుండ స్థిరపరచబడియున్నది
న్యాయమునుబట్టి ఆయన జనములను పరిపాలన
చేయును.
ఈ వార్తను అన్యజనులలో ప్రకటించుడి
యెహోవా వేంచేయుచున్నాడు 11

ఆకాశము సంతోషించు గాక భూమి ఆనందించు
గాక
సముద్రమును దాని సంపూర్ణతయు ఘోషించు
గాక.
భూజనులకు తీర్పు తీర్చుటకై యెహోవా
వేంచేయుచున్నాడు
న్యాయమునుబట్టి లోకమునకు తన విశ్వాస్యతను
బట్టి జనములకు ఆయన తీర్పు తీర్చును.
కాగా పొలమును దానియందుగల సర్వమును
యెహోవా సన్నిధిని ప్రహర్షించును
వనవృక్షములన్నియు ఉత్సాహధ్వని చేయును.
యెహోవా రాజ్యము చేయుచున్నాడు,
భూలోకము ఆనందించు గాక
ద్వీపములన్నియు సంతోషించు గాక.
మేఘాంధకారములు ఆయనచుట్టు నుండును
నీతి న్యాయములు ఆయన సింహాసనమునకు ఆధా
రము.
అగ్ని ఆయనకు ముందు నడుచుచున్నది
అది చుట్టునున్న ఆయన శత్రువులను కాల్చి
వేయుచున్నది
ఆయన మెరుపులు లోకమును ప్రకాశింపజేయు
చున్నవి
భూమి దాని చూచి కంపించుచున్నది.
యెహోవా సన్నిధిని సర్వలోకనాథుని సన్నిధిని
పర్వతములు మైనమువలె కరుగుచున్నవి.
ఆకాశము ఆయన నీతిని తెలియజేయుచున్నది
సమస్త జనములకు ఆయన మహిమ కనబడు
చున్నది.
వ్యర్థ విగ్రహములనుబట్టి అతిశయపడుచు
చెక్కిన ప్రతిమలను పూజించువారందరు సిగ్గు
పడుదురు
సకలదేవతలు ఆయనకు నమస్కారము చేయును.
యెహోవా, సీయోను నివాసులు ఆ సంగతి విని
నీ న్యాయవిధులనుబట్టి సంతోషించుచు
న్నారు
యూదా కుమార్తెలు ఆనందించుచున్నారు.
ఏలయనగా యెహోవా, భూలోకమంతటికి
పైగా నీవు మహోన్నతుడవై యున్నావు
సమస్త దేవతలకు పైగా నీవు అత్యధికమైన ఔన్న
త్యము పొందియున్నావు.
యెహోవాను ప్రేమించువారలారా, చెడుతన
మును అసహ్యించుకొనుడి
తన భక్తుల ప్రాణములను ఆయన కాపాడు
చున్నాడు
భక్తిహీనులచేతిలోనుండి ఆయన వారిని విడిపిం
చును.

నీతిమంతులకొరకు వెలుగును 11
యథార్థహృదయులకొరకు ఆనందమును విత్తబడి
యున్నవి.
నీతిమంతులారా, యెహోవాయందు సంతో 12
షించుడి
ఆయన పరిశుద్ధనామమునుబట్టి ఆయనకు కృతజ్ఞతా
స్తుతులు చెల్లించుడి.

గీతము. **98**

యెహోవా ఆశ్చర్యకార్యములు చేసి
యున్నాడు
ఆయననుగూర్చి క్రొత్త కీర్తన పాడుడి
ఆయన దక్షిణహస్తము ఆయన పరిశుద్ధ బాహువు
ఆయనకు విజయము కలుగజేసియున్నది.
యెహోవా తన రక్షణను వెల్లడిచేసి యున్నాడు 2
అన్యజనుల యెదుట తన నీతిని బయలుపరచి
యున్నాడు.
ఇశ్రాయేలు సంతతికి తాను చూపిన కృపావిశ్వా 3
స్యతలను ఆయన జ్ఞాపకము చేసికొని
యున్నాడు
భూదిగంత నివాసులందరు మన దేవుడు కలు
జేసిన రక్షణను చూచిరి.
సర్వభూజనులారా, యెహోవానుబట్టి ఉత్స 4
హించుడి
ఆర్భాటముతో సంతోషగానము చేయుడి కీర్త
నలు పాడుడి.
సితారాస్వరముతో యెహోవాను స్తోత్రగీత 5
ములు పాడుడి
సితారా తీసికొని సంగీత స్వరముతో గానము
చేయుడి.
బూరలతోను కొమ్ముల నాదముతోను 6
రాజైన యెహోవా సన్నిధిని సంతోషధ్వని
చేయుడి.
సముద్రమును దాని సంపూర్ణతయు ఘోషించు 7
గాక
లోకమును దాని నివాసులును కేకలువేయుదురు
గాక.
ఆయన సన్నిధిని నదులు చప్పట్లు కొట్టును గాక 8
కొండలు కూడి ఉత్సాహధ్వని చేయు గాక.
భూమికి తీర్పు తీర్చుటకై నీతినిబట్టి లోకమునకు 9
తీర్పు తీర్చుటకై
న్యాయమునుబట్టి జనములకు తీర్పు తీర్చుటకై
యెహోవా వేంచేసియున్నాడు.

**99**

యెహోవా రాజ్యము చేయుచున్నాడు జన
ములు వణకును
ఆయన కెరూబులమీద ఆసీనుడై యున్నాడు
భూమి కదులును.

2 సీయోనులో యెహోవా మహోన్నతుడు
జనములన్నిటిపైన ఆయన హెచ్చియున్నాడు.
3 భయంకరమైన నీ గొప్ప నామమును వారు స్తుతించెదరు.
యెహోవా పరిశుద్ధుడు.
4 యథార్థతనుబట్టి నీవు న్యాయమును ప్రేమించు రాజును స్థిరపరచియున్నావు
యాకోబు సంతతిమధ్య నీవు నీతి న్యాయములను జరిగించియున్నావు.
5 మన దేవుడైన యెహోవాను ఘనపరచుడి
ఆయన పాదపీఠము ఎదుట సాగిలపడుడి
ఆయన పరిశుద్ధుడు.
6 ఆయన యాజకులలో మోషే అహరోనులుండిరి
ఆయన నామమునుబట్టి ప్రార్థన చేయువారిలో సమూయేలు ఉండెను.
వారు యెహోవాకు మొఱ్ఱపెట్టగా
ఆయన వారికుత్తరమిచ్చెను.
7 మేఘస్తంభములోనుండి ఆయన వారితో మాటలాడెను
వారు ఆయన శాసనముల ననుసరించిరి
ఆయన తమకిచ్చిన కట్టడను వారనుసరించిరి.
8 యెహోవా మా దేవా, నీవు వారికుత్తరమిచ్చితివి
వారి క్రియలనుబట్టి ప్రతికారము చేయుచునే
వారి విషయములో నీవు (పాపము) పరిహరించు దేవుడవైతివి.
9 మన దేవుడైన యెహోవా పరిశుద్ధుడు
మన దేవుడైన యెహోవాను ఘనపరచుడి.
ఆయన పరిశుద్ధ పర్వతము ఎదుట సాగిలపడుడి.

## 100

స్తుత్యర్పణ కీర్తన.

సమస్త దేశములారా, యెహోవాకు ఉత్సాహధ్వని చేయుడి.
2 సంతోషముతో యెహోవాను సేవించుడి
ఉత్సాహగానము చేయుచు ఆయన సన్నిధికి రండి.
3 యెహోవాయే దేవుడని తెలిసికొనుడి
ఆయనే మనలను పుట్టించెను మనము ఆయనవారము
మనము ఆయన ప్రజలము ఆయన మేపు గొఱ్ఱెలము.
4 కృతజ్ఞతార్పణలు చెల్లించుచు ఆయన గుమ్మములలో ప్రవేశించుడి
కీర్తనలు పాడుచు ఆయన ఆవరణములలో ప్రవేశించుడి
ఆయనను స్తుతించుడి ఆయన నామమును ఘనపరచుడి.
యెహోవా దయాళుడు ఆయన కృప నిత్యముండును 5
ఆయన సత్యము తరతరములుండును

## 101

దావీదు కీర్తన.

నేను కృపనుగూర్చియు న్యాయమునుగూర్చియు పాడెదను
యెహోవా, నిన్ను కీర్తించెదను.
నిర్దోష మార్గమున వివేకముతో ప్రవర్తించెదను 2
నీవు ఎప్పుడు నాయొద్దకు వచ్చెదవు?
నా యింట యథార్థహృదయముతో నడుచుకొందును
నా కన్నులయెదుట నేను ఏ దుష్కార్యమును 3 ఉంచుకొనను
భక్తిమార్గము తొలగినవారి క్రియలు నాకు అసహ్యములు అవి నాకు అంటనియ్యను.
మూర్ఖచిత్తుడు నాయొద్దనుండి తొలగిపోవలెను 4
దౌష్ట్యమును నేననుసరింపను.
తమ పొరుగువారిని చాటున దూషించువారిని 5 నేను సంహరించెదను
అహంకార దృష్టిగలవారిని గర్వించిన హృదయముగలవారిని నేను సహింపను.
నాయొద్ద నివసించునట్లు దేశములో నమ్మకస్థులైన 6 వారిని నేను కనిపెట్టుచున్నాను
నిర్దోషమార్గమందు నడుచువారు నాకు పరిచారకులగుదురు.
మోసము చేయువాడు నా యింట నివసింపరాదు 7
అబద్ధములాడువాడు నా కన్నులయెదుట నిలువడు.
యెహోవా పట్టణములోనుండి 8
పాపము చేయువారినందరిని నిర్మూలము చేయుటకై
దేశమందలి భక్తిహీనులనందరిని ప్రతి ఉదయమున నేను సంహరించెదను.

## 102

దుఃఖముచేత ప్రాణము సొక్కినవాడు యెహోవా సన్నిధిని పెట్టిన మొఱ్ఱ.

యెహోవా, నా ప్రార్థన ఆలకింపుము
నా మొఱ్ఱ నీయొద్దకు చేరనిమ్ము.
నా కష్టదినమున నాకు విముఖుడవై యుండకుము 2
నాకు చెవియొగ్గుము నేను మొరలిడునాడు త్వరపడి నాకుత్తర మిమ్ము.
పొగ యెగిరిపోవునట్లుగా నా దినములు తరిగి 3 పోవుచున్నవి
పొయిలోనిది కాలిపోయినట్లు నా యెముకలు కాలిపోయి యున్నవి.
ఎండదెబ్బకు వాడిన గడ్డివలె నా హృదయము 4 వాడిపోయి యున్నది

భోజనము చేయుటకే నేను మరచిపోవుచున్నాను.
నా మూల్గుల శబ్దమువలన నా యెముకలు నా
దేహమునకు అంటుకొని పోయినవి.
నేను అడవిలోని గూడబాతును పోలియున్నాను
పాడైన స్థలములలోని పగిడికంటెవలె నున్నాను.
రాత్రి మెలకువగా నుండి యింటిమీద ఒంటిగా
నున్న పిచ్చుకవలె నున్నాను
దినమెల్ల నా శత్రువులు నన్ను నిందించుచున్నారు
నామీద వెర్రికోపముగలవారు నా పేరు చెప్పి
శపింతురు.
నీ కోపాగ్నినిబట్టియు నీ ఆగ్రహమునుబట్టియు
బూడిదెను ఆహారముగా భుజించుచున్నాను.
నా పానీయములో కన్నీళ్లు కలుపుకొను
చున్నాను.
నీవు నన్ను పైకెత్తి పారవేసియున్నావు.
నా దినములు సాగిపోయిన నీడను పోలియున్నవి
గడ్డివలె నేను వాడియున్నాను.
యెహోవా, నీవు నిత్యము సింహాసనాసీనుడవు
నీ నామస్మరణ తరతరములుండును.
నీవు లేచి సీయోనును కరుణించెదవు.
దానిమీద దయచూపుటకు కాలము వచ్చెను
నిర్ణయకాలమే వచ్చెను.
దాని రాళ్లు నీ సేవకులకు ప్రియములు
వారు దాని మంటిని కనికరించుదురు
అప్పుడు అన్యజనులు యెహోవా నామమున
కును
భూరాజులందరు నీ మహిమకును భయపడెదరు
ఏలయనగా యెహోవా సీయోనును కట్టి
యున్నాడు
ఆయన తన మహిమతో ప్రత్యక్షమాయెను
ఆయన దిక్కులేని దరిద్రుల ప్రార్థన నిరాక
రింపక
వారి ప్రార్థనవైపు తిరిగియున్నాడు.
యెహోవాను సేవించుటకై జనములును రాజ్య
ములును కూర్చబడునప్పుడు
మనుష్యులు సీయోనులో యెహోవా నామ
ఘనతను
యెరూషలేములో ఆయన స్తోత్రమును ప్రకటిం
చునట్లు
చెరసాలలో ఉన్నవారి మూల్గులను వినుటకును
చావుకు విధింపబడినవారిని విడిపించుటకును
ఆయన తన ఉన్నతమైన పరిశుద్ధాలయమునుండి
వంగిచూచెననియు
ఆకాశమునుండి భూమిని దృష్టించెననియు
వచ్చుతరము తెలిసికొనునట్లుగా ఇది వ్రాయబడ
వలెను
సృజింపబడబోవు జనము యెహోవాను స్తుతిం
చును.
నేను ప్రయాణము చేయుచుండగా ఆయన నా 23
బలము క్రుంగజేసెను
నా దినములు కొద్దిపరచెను.
నేనీలాగు మనవిచేసితిని—నా దేవా, నా దినముల 24
మధ్యను నన్ను కొంచుపోకుము
నీ సంవత్సరములు తరతరములుండును.
పూర్వమే నీవు భూమికి పునాది వేసితివి 25
ఆకాశములు కూడ నీ చేతిపనులే.
అవి నశించును గాని నీవు నిలిచియుందువు 26
అవియన్నియు వస్త్రమువలె పాతగిలును
ఒకడు అంగవస్త్రమును తీసివేసినట్లు నీవు వాటిని
తీసివేయుదువు అవి మార్చబడును.
నీవు ఏకరీతిగా నుండువాడవు 27
నీ సంవత్సరములకు అంతము లేదు.
నీ సేవకుల కుమారులు నిలిచియుందురు 28
వారి సంతానము నీ సన్నిధిని స్థిరపరచబడును.

## 103

దావీదు కీర్తన.

నా ప్రాణమా, యెహోవాను సన్నుతించుము
నా అంతరంగముననున్న సమస్తమా,
ఆయన పరిశుద్ధ నామమును సన్నుతించుము.
2 నా ప్రాణమా, యెహోవాను సన్నుతించుము
ఆయన చేసిన ఉపకారములలో దేనిని మరువ
కుము.
3 ఆయన నీ దోషములన్నిటిని క్షమించువాడు
నీ సంకటములన్నిటిని కుదుర్చువాడు.
4 సమాధిలోనుండి నీ ప్రాణమును విమోచించు
చున్నాడు
కరుణాకటాక్షములను నీకు కిరీటముగా ఉంచు
చున్నాడు.
5 పక్షిరాజు యౌవనమువలె నీ యౌవనము క్రొత్త
దగుచుండునట్లు
మేలుతో నీ హృదయమును తృప్తిపరచుచున్నాడు
6 యెహోవా నీతిక్రియలను జరిగించుచు బాధింప
బడువారికందరికి న్యాయము తీర్చును
7 ఆయన మోషేకు తన మార్గములను తెలియజేసెను
ఇశ్రాయేలు వంశస్థులకు తన క్రియలను కనుపర
చెను
8 యెహోవా దయాదాక్షిణ్యపూర్ణుడు
దీర్ఘశాంతుడు కృపాసముద్రుడు.
9 ఆయన ఎల్లప్పుడు వ్యాజ్యమాడువాడు కాడు
ఆయన నిత్యము కోపించువాడు కాడు.
10 మన పాపములనుబట్టి మనకు ప్రతికారము చేయ
లేదు

మన దోషములనుబట్టి మనకు ప్రతిఫలమియ్యలేదు.
11 భూమికంటె ఆకాశము ఎంత ఉన్నతముగా ఉన్నదో
ఆయనయందు భయభక్తులు గలవారియెడల ఆయన కృప అంత అధికముగా ఉన్నది.
12 పడమటికి తూర్పు ఎంత దూరమో
ఆయన మన అతిక్రమములను మనకు అంత దూరపరచి యున్నాడు.
13 తండ్రి తన కుమారులయెడల జాలిపడునట్లు
యెహోవా తనయందు భయభక్తులు గలవారి యెడల జాలిపడును.
14 మనము నిర్మింపబడిన రీతి ఆయనకు తెలిసేయున్నది
మనము మంటివారమని ఆయన జ్ఞాపకముచేసి కొనుచున్నాడు.
15 నరుని ఆయువు గడ్డివలె నున్నది
అడవి పువ్వు పూయునట్లు వాడు పూయును.
16 దానిమీద గాలి వీచగా అది లేకపోవును
ఆ మీదట దాని చోటు దాని నెరుగదు.
17 ఆయన నిబంధనను గైకొనుచు ఆయన కట్టడల
18 ననుసరించి నడుచుకొనువారికి
యెహోవాయందు భయభక్తులుగలవారికి
ఆయన కృప యుగయుగములు నిలుచును
ఆయన నీతి వారికి పిల్లపిల్ల తరమున నిలుచును.
19 యెహోవా ఆకాశమందు తన సింహాసనమును స్థిరపరచి యున్నాడు
ఆయన అన్నిటిమీద రాజ్యపరిపాలన చేయుచున్నాడు.
20 యెహోవా దూతలారా,
ఆయన ఆజ్ఞకు లోబడి ఆయన వాక్యము నెరవేర్చు బలశూరులారా,
ఆయనను సన్నుతించుడి.
21 యెహోవా సైన్యములారా,
ఆయన చిత్తము నెరవేర్చు ఆయన పరిచారకులారా,
మీరందరు ఆయనను సన్నుతించుడి.
22 యెహోవా ఏలుచుండు స్థలములన్నిటిలో నున్న ఆయన సర్వకార్యములారా, ఆయనను స్తుతించుడి.
నా ప్రాణమా, యెహోవాను సన్నుతించుము.

**104** నా ప్రాణమా, యెహోవాను సన్నుతించుము
యెహోవా నా దేవా, నీవు అధిక ఘనతవహించినవాడవు
నీవు మాహాత్మ్యప్రభావములు ధరించియున్నావు.
వస్త్రమువలె వెలుగును నీవు కప్పుకొనియున్నావు.
తెరను పరచినట్లు ఆకాశవిశాలమును నీవు పరచియున్నావు.
జలములలో ఆయన తన గదుల దూలములను 3
వేసియున్నాడు
మేఘములను తనకు వాహనముగా చేసికొని
గాలి రెక్కలమీద గమనము చేయుచున్నాడు.
వాయువులను తనకు దూతలుగాను 4
అగ్నిజ్వాలలను తనకు పరిచారకులుగాను ఆయన చేసికొని యున్నాడు.
భూమి యెన్నటికిని కదలకుండునట్లు 5
ఆయన దానిని పునాదులమీద స్థిరపరచెను.
దానిమీద అగాధజలములను నీవు వస్త్రమువలె 6
కప్పితివి
కొండలకుపైగా నీళ్లు నిలిచెను.
నీవు గద్దింపగానే అవి పారిపోయెను 7
నీ ఉరుము శబ్దము విని అవి త్వరగా పారిపోయెను.
నీవు వాటికి నియమించిన చోటికి పోవుటకై 8
అవి పర్వతములెక్కెను పల్లములకు దిగెను.
అవి మరలి వచ్చి భూమిని కప్పక యుండునట్లు 9
అవి దాటలేని సరిహద్దులు నీవు వాటికి నియమించితివి.
ఆయన కొండలోయలలో నీటిబుగ్గలను పుట్టించును 10
అవి మన్యములలో పారును.
అవి అడవిజంతువులన్నిటికి దాహమిచ్చును 11
వాటివలన అడవి గాడిదెలు దప్పితీర్చుకొనును.
వాటి ఒడ్డున ఆకాశపక్షులు వాసము చేయును 12
కొమ్మల నడుమ అవి సునాదము చేయును.
తన గదులలోనుండి ఆయన కొండలకు జలధారల 13
నిచ్చును
నీ క్రియల ఫలముచేత భూమి తృప్తిపొందుచున్నది.
పశువులకు గడ్డిని నరుల ఉపయోగమునకు కూర 14
చెట్లను
ఆయన మొలిపించుచున్నాడు
అందుమూలమున భూమిలోనుండి ఆహారమును
నరుల హృదయమును సంతోషపెట్టు ద్రాక్షారస 15
మును
వారి ముగములకు మెరుగు నిచ్చు తైలమును
నరుల హృదయమును బలపరచు ఆహారమును ఆయన పుట్టించుచున్నాడు.
యెహోవా వృక్షములు తృప్తిపొందుచున్నవి. 16
ఆయన నాటిన లెబానోను దేవదారు వృక్షములు తృప్తిపొందుచున్నవి.
అచ్చట పక్షులు తమ గూళ్లు కట్టుకొనును 17
అచ్చట సరళవృక్షములపైన కొంగలు నివాసము చేయుచున్నవి.

18 గొప్ప కొండలు కొండమేకలకు ఉనికిపట్లు
కుందేళ్లకు బండలు ఆశ్రయస్థానములు
19 ఋతువులను తెలుపుటకై ఆయన చంద్రుని నియ
మించెను
సూర్యునికి తన అస్తమయకాలము తెలియును
20 నీవు చీకటి కలుగజేయగా రాత్రియగుచున్నది
అప్పుడు అడవిజంతువులన్నియు తిరుగులాడు
చున్నవి.
21 సింహపు పిల్లలు వేటకొరకు గర్జించుచున్నవి
తమ ఆహారమును దేవుని చేతిలోనుండి తీసికొన
జూచుచున్నవి.
22 సూర్యుడు ఉదయింపగానే అవి మరలిపోయి
తమ గుహలలో పండుకొనును.
23 సాయంకాలమువరకు పాటుపడి తమ పనులను
జరుపుకొనుటకై మనుష్యులు బయలువెళ్లు
దురు.
24 యెహోవా, నీ కార్యములు ఎన్నెన్ని విధము
లుగా నున్నవి
జ్ఞానముచేత నీవు వాటన్నిటిని నిర్మించితివి
నీవు కలుగజేసినవాటితో భూమి నిండియున్నది.
25 అదిగో విశాలమైన మహాసముద్రము
అందులో లెక్కలేని జలచరములు
దానిలో చిన్నవి పెద్దవి జీవరాసులున్నవి.
26 అందులో ఓడలు నడుచుచున్నవి
దానిలో ఆటలాడుటకు నీవు నిర్మించిన మకరము
లున్నవి.
27 తగిన కాలమున నీవు వాటికి ఆహారమిచ్చెదవని
ఇవన్నియు నీ దయకొరకు కనిపెట్టుచున్నవి
28 నీవు వాటికి పెట్టునది అవి కూర్చుకొనును
నీవు గుప్పిలి విప్పగా అవి మంచివాటిని తిని
తృప్తిపరచబడును.
29 నీవు ముఖము మరుగుచేసికొనగా అవి కలతపడును
నీవు వాటి ఊపిరి తీసివేయునప్పుడు అవి ప్రాణ
ములు విడిచి మంటిపాలగును.
30 నీవు నీ ఊపిరి విడువగా అవి సృజింపబడును
అట్లు నీవు భూతలమును నూతనపరచుచున్నావు.
31 యెహోవా మహిమ నిత్యముండుగాక.
యెహోవా తన క్రియలను చూచి ఆనందించు
గాక.
32 ఆయన భూమిని చూడగా అది వణకును
ఆయన పర్వతములను ముట్టగా అవి పొగరాజును.
33 నా జీవితకాలమంతయు నేను యెహోవాకు
కీర్తనలు పాడెదను
నేనున్నంత కాలము నా దేవుని కీర్తించెదను.
34 ఆయననుగూర్చిన నా ధ్యానము ఆయనకు ఇంపుగా
నుండు గాక
నేను యెహోవాయందు సంతోషించెదను.
పాపులు భూమిమీదనుండి లయమగుదురు గాక 35
భక్తిహీనులు ఇక నుండకపోదురు గాక
నా ప్రాణమా, యెహోవాను సన్నుతించుము
యెహోవాను స్తుతించుడి.

**105**

యెహోవాకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి
ఆయన నామమును ప్రకటన చేయుడి
జనములలో ఆయన కార్యములను తెలియజేయుడి.
ఆయననుగూర్చి పాడుడి ఆయనను కీర్తించుడి 2
ఆయన ఆశ్చర్యకార్యములన్నిటినిగూర్చి సంభా
షణ చేయుడి
ఆయన పరిశుద్ధ నామమునుబట్టి అతిశయించుడి. 3
యెహోవాను వెదకువారు హృదయమందు
సంతోషించుదురు గాక.
యెహోవాను వెదకుడి ఆయన బలమును వెదకుడి 4
ఆయన సన్నిధిని నిత్యము వెదకుడి.
ఆయన దాసుడైన అబ్రాహాము వంశస్థులారా, 5
ఆయన ఏర్పరచుకొనిన యాకోబు సంతతివార 6
లారా,
ఆయన చేసిన ఆశ్చర్యకార్యములను జ్ఞాపకము
చేసికొనుడి
ఆయన చేసిన సూచకక్రియలను ఆయన నోటి
తీర్పులను జ్ఞాపకము చేసికొనుడి.
ఆయన మన దేవుడైన యెహోవా 7
ఆయన తీర్పులు భూమియందంతట జరుగుచున్నవి.
తాను సెలవిచ్చిన మాటను వెయ్యి తరములవరకు 8
అబ్రాహాముతో తాను చేసిన నిబంధనను 9
ఇస్సాకుతో తాను చేసిన ప్రమాణమును
నిత్యము ఆయన జ్ఞాపకము చేసికొనును.
వారి సంఖ్య కొద్దిగా నుండగను 10
ఆ కొద్దిమంది ఆ దేశమందు పరదేశులై యుండ 12
గను
—కొలవబడిన స్వాస్థ్యముగా
కనాను దేశమును మీకిచ్చెదనని ఆయన సెల
విచ్చెను
ఆ మాట యాకోబుకు కట్టడగాను
ఇశ్రాయేలుకు నిత్యనిబంధనగాను స్థిరపరచి
యున్నాడు.
వారు జనమునుండి జనమునకును 13
ఒక రాజ్యమునుండి మరియొక రాజ్యమునకును
తిరుగులాడుచుండగా
—నేనభిషేకించినవారిని ముట్టకూడదనియు 14
నా ప్రవక్తలకు కీడు చేయకూడదనియు ఆయన
ఆజ్ఞ ఇచ్చి
ఆయన ఎవరినైనను వారికి హింసచేయనియ్యలేదు 15
ఆయన వారికొరకు రాజులను గద్దించెను.

16 దేశముమీదికి ఆయన కరవు రప్పించెను
జీవనాధారమైన ధాన్యమంతయు కొట్టివేసెను.
17 వారికంటె ముందుగా ఆయన యొకని పంపెను.
యోసేపు దాసుడుగా అమ్మబడెను.
18 వారు సంకెళ్లచేత అతని కాళ్లు నొప్పించిరి
ఇనుము అతని ప్రాణమును బాధించెను.
19 అతడు చెప్పిన సంగతి నెరవేరు పర్యంతము
యెహోవా వాక్కు అతని పరిశోధించుచుండెను.
20 రాజు వర్తమానము పంపి అతని విడిపించెను
ప్రజల నేలినవాడు అతని విడుదలచేసెను.
21 ఇష్టప్రకారము అతడు తన అధిపతుల నేలుటకును
22 తన పెద్దలకు బుద్ధి చెప్పుటకును
తన యింటికి యజమానునిగాను
తన యావదాస్తిమీద అధికారిగాను అతని నియమించెను.
23 ఇశ్రాయేలు ఐగుప్తులోకి వచ్చెను
యాకోబు హాముదేశమందు పరదేశిగా నుండెను
24 ఆయన తన ప్రజలకు బహు సంతానవృద్ధి కలుగజేసెను
వారి విరోధులకంటె వారికి అధికబలము దయచేసెను.
25 తన ప్రజలను పగచేయునట్లును
తన సేవకులయెడల కుయుక్తిగా నడచునట్లును
ఆయన వారి హృదయములను త్రిప్పెను.
26 ఆయన తన సేవకుడైన మోషేను
తాను ఏర్పరచుకొనిన అహరోనును పంపెను.
27 వారు ఐగుప్తీయుల మధ్యను ఆయన సూచకక్రియలను
హాముదేశములో మహత్కార్యములను జరిగించిరి.
28 ఆయన అంధకారము పంపి చీకటి కమ్మజేసెను
వారు ఆయన మాటను ఎదిరింపలేదు.
29 ఆయన వారి జలములను రక్తముగా మార్చెను వారి చేపలను చంపెను.
30 వారి దేశములో కప్పలు నిండెను
అవి వారి రాజుల గదులలోనికి వచ్చెను.
31 ఆయన ఆజ్ఞ ఇయ్యగా జోరీగలు పుట్టెను
వారి ప్రాంతములన్నిటిలోనికి దోమలు వచ్చెను.
32 ఆయన వారిమీద వడగండ్ల వాన కురిపించెను
వారి దేశములో అగ్నిజ్వాలలు పుట్టించెను.
33 వారి ద్రాక్షతీగెలను వారి అంజూరపుచెట్లను పడగొట్టెను
వారి ప్రాంతములయందలి వృక్షములను విరుగగొట్టెను.
ఆయన ఆజ్ఞ ఇయ్యగా పెద్ద మిడతలును
లెక్కలేని చీడపురుగులును వచ్చెను.
అవి వారిదేశపు కూరచెట్లన్నిటిని
వారి భూమి పంటలను తినివేసెను.
వారి దేశమందలి సమస్త జ్యేష్ఠులను 36
వారి బలప్రారంభమైన (ప్రథమసంతానమును)
ఆయన హతముచేసెను.
అక్కడనుండి తన జనులను వెండి బంగారములతో 37
ఆయన రప్పించెను
వారి గోత్రములలో నిస్సత్తువచేత తొట్రిల్లు
వాడొక్కడైనను లేకపోయెను.
వారివలన ఐగుప్తీయులకు భయము పుట్టెను 38
వారు బయలువెళ్లినప్పుడు ఐగుప్తీయులు సంతోషించిరి.
వారికి చాటుగా నుండుటకై ఆయన మేఘమును 39
కల్పించెను
రాత్రి వెలుగిచ్చుటకై అగ్నిని కలుగజేసెను.
వారు మనవి చేయగా ఆయన పూరేళ్లను రప్పించెను. 40
ఆకాశములోనుండి ఆహారమునిచ్చి వారిని తృప్తిపరచెను.
బండను చీల్చగా నీళ్లు ఉబికి వచ్చెను 41
ఎడారులలో అవి యేరులై పారెను.
ఏలయనగా ఆయన తన పరిశుద్ధ వాగ్దానమును 42
తన సేవకుడైన అబ్రాహామును జ్ఞాపకము చేసికొని
ఆయన తన ప్రజలను సంతోషముతోను 43
తాను ఏర్పరచుకొనినవారిని ఉత్సాహధ్వనితోను
వెలుపలికి రప్పించెను.
వారు తన కట్టడలను గైకొనునట్లును 44
తన ధర్మశాస్త్రవిధులను ఆచరించునట్లును 45
అన్యజనుల భూములను ఆయన వారికప్పగించెను
జనముల కష్టార్జితమును వారు స్వాధీనపరచుకొనిరి.
యెహోవాను స్తుతించుడి.

# 106

యెహోవాను స్తుతించుడి
యెహోవా దయాళుడు ఆయనకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి
ఆయన కృప నిత్యముండును.
యెహోవా పరాక్రమకార్యములను ఎవడు 2
వర్ణింపగలడు?
ఆయన కీర్తి యంతటిని ఎవడు ప్రకటింపగలడు?
న్యాయము ననుసరించువారు 3
ఎల్లవేళల నీతి ననుసరించి నడుచుకొనువారు ధన్యులు.
యెహోవా, నీవు ఏర్పరచుకొనినవారి క్షేమము 4
నేను చూచుచు
నీ జనులకు కలుగు సంతోషమునుబట్టి నేను సంతోషించుచు
నీ స్వాస్థ్యమైనవారితో కూడి కొనియాడునట్లు 5

నీ ప్రజలయందు నీకున్న దయచొప్పున నన్ను
జ్ఞాపకమునకు తెచ్చుకొనుము
నాకు దర్శనమిచ్చి నన్ను రక్షింపుము
మా పితరులవలెనే మేము పాపము చేసితిమి
దోషములు కట్టుకొని భక్తిహీనులమైతిమి.
ఐగుప్తులో మా పితరులు నీ అద్భుతములను గ్రహింపక యుండిరి
నీ కృపాబాహుళ్యమును జ్ఞాపకమునకు తెచ్చుకొనక యుండిరి
సముద్రమునొద్ద ఎఱ్ఱసముద్రమునొద్ద వారు తిరుగబాటు చేసిరి.
అయినను తన మహా పరాక్రమమును ప్రసిద్ధి చేయుటకై
ఆయన తన నామమునుబట్టి వారిని రక్షించెను.
ఆయన ఎఱ్ఱసముద్రమును గద్దింపగా అది ఆరి పోయెను
మైదానముమీద నడుచునట్లు వారిని అగాధజలములలో నడిపించెను.
వారి పగవారి చేతిలోనుండి వారిని రక్షించెను
శత్రువుల చేతిలోనుండి వారిని విమోచించెను.
నీళ్లు వారి శత్రువులను ముంచివేసెను
వారిలో ఒక్కడైనను మిగిలియుండలేదు.
అప్పుడు వారు ఆయన మాటలు నమ్మిరి
ఆయన కీర్తి గానము చేసిరి.
అయినను వారు ఆయన కార్యములను వెంటనే మరచిపోయిరి
ఆయన ఆలోచనకొరకు కనిపెట్టుకొనకపోయిరి.
అరణ్యములో వారు బహుగా ఆశించిరి
ఎడారిలో దేవుని శోధించిరి.
వారు కోరినది ఆయన వారికిచ్చెను
అయినను వారి ప్రాణములకు ఆయన క్షీణత కలుగజేసెను.
వారు తమ దండు పాళెములో మోషేయందును
యెహోవాకు ప్రతిష్ఠితుడైన అహరోనునందును అసూయపడిరి.
భూమి నెరవిడిచి దాతానును మ్రింగెను
అది అబీరాము గుంపును కప్పివేసెను.
వారి సంఘములో అగ్ని రగిలెను
దాని మంట భక్తిహీనులను కాల్చివేసెను.
హోరేబులో వారు దూడను చేయించుకొనిరి.
పోతపోసిన విగ్రహమునకు నమస్కారము చేసిరి
తమ మహిమాస్పదమును గడ్డిమేయు ఎద్దు రూపమునకు మార్చిరి.
ఐగుప్తులో గొప్ప కార్యములను
హాము దేశములో ఆశ్చర్యకార్యములను
ఎఱ్ఱసముద్రమునొద్ద భయము పుట్టించు క్రియలను చేసిన తమ రక్షకుడైన దేవుని మరచి పోయిరి.
అప్పుడు ఆయన—నేను వారిని నశింపజేసెదననెను. 23
అయితే ఆయన వారిని నశింపజేయకుండునట్లు
ఆయన కోపము చల్లార్చుటకై
ఆయన ఏర్పరచుకొనిన మోషే
ఆయన సన్నిధిని నిలిచి అడ్డపడెను.
వారు రమ్యమైన దేశమును నిరాకరించిరి 24
ఆయన మాట నమ్మకపోయిరి
యెహోవా మాట ఆలకింపక 25
వారు తమ గుడారములలో సణుగుకొనిరి.
అప్పుడు అరణ్యములో వారిని కూలజేయుటకును 26
అన్యజనులలో వారి సంతానమును కూల్చుటకును 27
దేశములలో వారిని చెదరగొట్టుటకును
ఆయన వారిమీద చెయ్యి యెత్తెను.
మరియు వారు బయల్పెయోరును హత్తుకొని, 28
చచ్చినవారికి అర్పించిన బలిమాంసమును భుజించిరి.
వారు తమ క్రియలచేత ఆయనకు కోపము పుట్టింపగా 29
వారిలో తెగులు రేగెను.
ఫీనెహాసు లేచి శిక్ష జరిగింపగా 30
ఆ తెగులు ఆగిపోయెను.
నిత్యము తరములన్నిటను అతనికి ఆ పని నీతిగా 31
ఎంచబడెను.
మెరీబా జలములయొద్ద వారు ఆయనకు కోపము 32
పుట్టించిరి
కావున వారి మూలముగా మోషేకు బాధకలిగెను.
ఎట్లనగా వారు యెహోవా ఆత్మమీద తిరుగ 33
బాటుచేయగా
అతడు తన పెదవులతో కాని మాట పలికెను.
యెహోవా వారికి ఆజ్ఞాపించినట్లు 34
వారు అన్యజనులను నాశనముచేయకపోయిరి.
అన్యజనులతో సహవాసము చేసి వారి క్రియలు 35
నేర్చుకొనిరి.
వారి విగ్రహములకు పూజచేసిరి 36
అవి వారికి ఉరి ఆయెను.
మరియు వారు తమ కుమారులను తమ కుమార్తెలను 37
దయ్యములకు బలిగా అర్పించిరి.
నిరపరాధ రక్తము, అనగా తమ కుమారుల రక్తము 38
తమ కుమార్తెల రక్తము ఒలికించిరి.
కనాను దేశపువారి బొమ్మలకు వారిని బలిగా
అర్పించిరి
ఆ రక్తమువలన దేశము అపవిత్రమాయెను.
తమ క్రియలవలన వారు అపవిత్రులైరి 39
తమ నడవడిలో వ్యభిచరించినవారైరి.

40 కావున యెహోవా కోపము ఆయన ప్రజల
మీద రవులుకొనెను
ఆయన తన స్వాస్థ్యమందు అసహ్యపడెను.
41 ఆయన వారిని అన్యజనులచేతికి అప్పగించెను
వారి పగవారు వారిని ఏలుచుండిరి.
42 వారి శత్రువులు వారిని బాధపెట్టిరి
వారు శత్రువుల చేతిక్రింద అణపబడిరి.
43 అనేక పర్యాయములు ఆయన వారిని విడిపించెను
అయినను వారు తమ ఆలోచనను అనుసరించి
తిరుగబాటు చేయుచు వచ్చిరి.
తమ దోషముచేత హీనదశ నొందిరి.
44 అయినను వారి రోదనము తనకు వినబడగా
వారికి కలిగిన శ్రమను ఆయన చూచెను.
45 వారిని తలంచుకొని ఆయన తన నిబంధనను జ్ఞాప
కము చేసికొనెను
తన కృపాబాహుళ్యమును బట్టి వారిని కరు
ణించెను.
46 వారిని చెరగొనిపోయిన వారికందరికి
వారియెడల కనికరము పుట్టించెను.
47 యెహోవా మా దేవా, మమ్మును రక్షింపుము
మేము నీ పరిశుద్ధ నామమునకు కృతజ్ఞతాస్తుతులు
చెల్లించునట్లును
నిన్ను స్తుతించుచు మేమతిశయించునట్లును
అన్యజనులలోనుండి మమ్మును పోగుచేయుము.
48 ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవా
యుగములన్నిటను స్తుతినొందు గాక
ప్రజలందరు—ఆమేన్ అందురు గాక.
యెహోవాను స్తుతించుడి.

## పంచమ స్కంధము.

---

**107** యెహోవా దయాళుడు ఆయనకు కృతజ్ఞతా
స్తుతులు చెల్లించుడి
ఆయన కృప నిత్యముండును.
2 యెహోవా విమోచించినవారు ఆ మాట పలు
కుదురు గాక
విరోధుల చేతిలోనుండి ఆయన విమోచించిన
వారును
3 తూర్పునుండి పడమటినుండి ఉత్తరమునుండి దక్షి
ణమునుండియు
నానాదేశములనుండియు ఆయన పోగుచేసిన
వారును
ఆ మాట పలుకుదురు గాక.
4 వారు అరణ్యమందలి యెడారిత్రోవను తిరుగు
లాడుచుండిరి
నివాసపురమేదియు వారికి దొరుకకపోయెను.
ఆకలి దప్పులచేత వారి ప్రాణము వారిలో సొమ్మ 5
సిల్లెను.
వారు కష్టకాలమందు యెహోవాకు మొఱ్ఱ 6
పెట్టిరి
ఆయన వారి ఆపదలలోనుండి వారిని విడిపించెను.
వారొక నివాసపురము చేరునట్లు 7
చక్కని త్రోవను ఆయన వారిని నడిపించెను.
ఆయన కృపనుబట్టియు నరులకు ఆయన చేయు 8
ఆశ్చర్యకార్యములనుబట్టియు
వారు యెహోవాకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించు
దురు గాక
ఏలయనగా ఆశగల ప్రాణమును ఆయన తృప్తి 9
పరచి యున్నాడు
ఆకలిగొనినవారి ప్రాణమును మేలుతో నింపి
యున్నాడు.
దేవుని ఆజ్ఞలకు లోబడక మహోన్నతుని తీర్మాన 10
మును తృణీకరించినందున 11
బాధచేతను ఇనుప కట్లచేతను బంధింపబడినవారై
చీకటిలోను మరణాంధకారములోను
నివాసము చేయువారి హృదయమును
ఆయన ఆయాసముచేత క్రుంగజేసెను. 12
వారు కూలియుండగా సహాయుడు లేకపోయెను.
కష్టకాలమందు వారు యెహోవాకు మొఱ్ఱ 13
పెట్టిరి
ఆయన వారి ఆపదలలోనుండి వారిని విడిపించెను.
వారి కట్లను తెంపివేసి 14
చీకటిలోనుండియు మరణాంధకారములోనుం
డియు వారిని రప్పించెను.
ఆయన కృపనుబట్టియు 15
నరులకు ఆయన చేయు ఆశ్చర్యకార్యములను
బట్టియు
వారు యెహోవాకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించు
దురు గాక.
ఆయన యిత్తడి తలుపులను పగులగొట్టియున్నాడు 16
ఇనుపగడియలను విరుగగొట్టియున్నాడు.
బుద్ధిహీనులు తమ దుష్ప్రవర్తనచేతను తమ 17
దోషముచేతను బాధ తెచ్చుకొందురు.
భోజనపదార్థములన్నియు వారి ప్రాణమునకు 18
అసహ్యమగును
వారు మరణద్వారములను సమీపించుదురు.
కష్టకాలమందు వారు యెహోవాకు మొఱ్ఱ 19
పెట్టిరి
ఆయన వారి ఆపదలలోనుండి వారిని విడిపించెను.
ఆయన తన వాక్కును పంపి వారిని బాగుచేసెను 20
ఆయన వారు పడిన గుంటలలోనుండి వారిని విడి
పించెను.

21 ఆయన కృపనుబట్టియు నరులకు ఆయన చేయు
ఆశ్చర్యకార్యములనుబట్టియు
వారు యెహోవాకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించు
దురు గాక.
22 వారు కృతజ్ఞతార్పణలు చెల్లించుదురు గాక
ఉత్సాహధ్వనితో ఆయన కార్యములను ప్రక
టించుదురు గాక.
23 ఓడలెక్కి సముద్రప్రయాణము చేయువారు
మహాజలములమీద సంచరించుచు వ్యాపారము
చేయువారు
24 యెహోవా కార్యములను
సముద్రములో ఆయన చేయు అద్భుతములను
చూచిరి.
25 ఆయన సెలవియ్యగా తుఫాను పుట్టెను
అది దాని తరంగములు పైకెత్తెను
26 వారు ఆకాశముపరకు ఎక్కుచు అగాధమునకు
దిగుచునుండిరి
శ్రమచేత వారి ప్రాణము కరిగిపోయెను.
27 మత్తులైనవారివలె వారు ముందుకు వెనుకకు దొర్లుచు
ఇటు అటు తూలుచుండిరి
వారు ఎటుతోచక యుండిరి.
28 శ్రమకు తాళలేక వారు యెహోవాకు మొఱ్ఱ
పెట్టిరి
ఆయన వారి ఆపదలలోనుండి వారిని విడిపించెను.
29 ఆయన తుఫానును ఆపివేయగా
దాని తరంగములు అణిగిపోయెను.
30 అవి నిమ్మళమైనవని వారు సంతోషించిరి
వారు కోరిన రేవుకు ఆయన వారిని నడిపించెను.
31 ఆయన కృపనుబట్టియు నరులకు ఆయన చేయు
ఆశ్చర్యకార్యములనుబట్టియు
వారు యెహోవాకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించు
దురు గాక.
32 జనసమాజములో వారాయనను ఘనపరచుదురు
గాక
పెద్దల సభలో ఆయనను కీర్తించుదురు గాక
33 దేశనివాసుల చెడుతనమునుబట్టి
34 ఆయన నదులను అడవిగాను నీటిబుగ్గలను ఎండిన
నేలగాను
సత్తువగల భూమిని చవిటిపఱ్ఱగాను మార్చెను.
35 అరణ్యమును నీటిమడుగుగాను
ఎండిన నేలను నీటి ఊటల చోటుగాను ఆయన
మార్చి
36 వారు అచ్చట నివాసపురము ఏర్పరచుకొను
37 నట్లును
పొలములలో విత్తనములు చల్లి ద్రాక్షతోటలు
నాటి
వాటివలన సస్యఫలసమృద్ధి పొందునట్లును
ఆయన ఆకలిగొనినవారిని అచ్చట కాపుర
ముంచెను.
మరియు ఆయన వారిని ఆశీర్వదింపగా వారు అధి 38
కముగా సంతానాభివృద్ధి నొందిరి
ఆయన వారి పశువులను తగ్గిపోనియ్యలేదు.
వారు బాధవలనను ఇబ్బందివలనను దుఃఖమువల 39
నను తగ్గిపోయినప్పుడు
రాజులను తృణీకరించుచు 40
త్రోవలేని యెడారిలో వారిని తిరుగులాడజేయు
వాడు.
అట్టి దరిద్రుల బాధను పోగొట్టి వారిని లేవనెత్తెను 41
వారి వంశమును మందవలె వృద్ధిచేసెను.
యథార్థవంతులు దాని చూచి సంతోషించుదురు 42
మోసగాండ్లందరును మౌనముగా నుందురు.
బుద్ధిమంతుడైనవాడు ఈ విషయములను ఆలో 43
చించును
యెహోవా కృపాతిశయములను జనులు తెల
పోయుదురు గాక.

# 108

గీతము. దావీదు కీర్తన.

1 దేవా, నా హృదయము స్థిరమాయెను
నేను పాడుచు స్తుతిగానము చేసెదను
నా ఆత్మ పాడుచు గానము చేయును.
స్వరమండలమా సితారా, మేలుకొనుడి 2
నేను వేకువనే లేచెదను
జనులమధ్య నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించెదను 3
ప్రజలలో నిన్నుగూర్చి స్తుతిగానము చేసెదను.
యెహోవా, నీ కృప ఆకాశముకంటె ఎత్తయినది 4
నీ సత్యము మేఘములంత ఎత్తుగా ఉన్నది.
దేవా, ఆకాశముకంటె ఎత్తుగానున్న మహోన్న 5
తునిగా నిన్ను కనుపరచుకొనుము. 6
నీ మహిమ సర్వభూమిమీద వ్యాపింపజేసికొనుము
నీ ప్రియులు రక్షణనొందునట్లు
నీ కుడిచేతితో నన్ను రక్షించి నాకు ఉత్తరమిమ్ము.
తన పరిశుద్ధత తోడని దేవుడు మాట యిచ్చి 7
యున్నాడు
నేను ప్రహర్షించెదను షెకెమును పంచిపెట్టెదను
సుక్కోతు లోయను కొలిపించెదను.
గిలాదును మనష్షేయును నావి 8
ఎఫ్రాయిము నాకు శిరస్త్రాణము యూదా నా
రాజదండము.
మోయాబు నేను కడుగుకొను పళ్లెము 9
ఎదోముమీదికి నా చెప్పు విసిరివేసి యున్నాను
ఫిలిష్తీయనుబట్టి జయోత్సవము చేసియున్నాను.
కోటగల పట్టణములోనికి నన్ను ఎవడు తోడుకొని 10
పోవును!

ఎదోములోనికి ఎవడు నాకు త్రోవచూపును?
11 దేవా, నీవు మమ్మును విడనాడి యున్నావు
దేవా, మా సేనలతోకూడ నీవు బయలుదేరుట
మానియున్నావు
12 మనుష్యుల సహాయము వ్యర్థము.
శత్రువులను జయించుటకు నీవు మాకు సహాయము
దయచేయుము
13 దేవునివలన మేము శూరకార్యములు జరిగించెదము
మమ్ము బాధించువారిని అణగద్రొక్కువాడు
ఆయనే.

## 109

ప్రధానగాయకునికి. దావీదు కీర్తన.

నా స్తుతికి కారణభూతుడవగు దేవా, మౌనముగా
ఉండకుము
2 నన్ను చెరుపవలెనని భక్తిహీనులు తమ నోరు
కపటముగల తమ నోరు తెరచియున్నారు
వారు నామీద అబద్ధములు చెప్పుకొనుచున్నారు.
3 నన్ను చుట్టుకొని నామీద ద్వేషపు మాటలాడు
చున్నారు
నిర్నిమిత్తముగా నాతో పోరాడుచున్నారు.
4 నేను చూపిన ప్రేమకు ప్రతిగా వారు నామీద
పగపట్టియున్నారు
అయితే నేను మానక ప్రార్థనచేయుచున్నాను.
5 నేను చేసిన మేలుకు ప్రతిగా కీడు చేయు
చున్నారు.
నేను చూపిన ప్రేమకు ప్రతిగా నామీద ద్వేష
ముంచుచున్నారు.
6 వానిమీద భక్తిహీనుని అధికారిగా నుంచుము
అపవాది వాని కుడిప్రక్కను నిలుచును గాక.
7 వాడు విమర్శలోనికి తేబడునప్పుడు దోషియని
తీర్పునొందును గాక
వాని ప్రార్థన పాపమగును గాక
8 వాని జీవితదినములు కొద్దివగును గాక
వాని ఉద్యోగమును వేరొకడు తీసికొనును గాక.
9 వాని బిడ్డలు తండ్రిలేనివారవుదురు గాక
వాని భార్య విధవరాలగును గాక
10 వాని బిడ్డలు దేశద్రిమ్మరులై భిక్షమెత్తుదురు గాక
పాడుపడిన తమ యిండ్లకు దూరముగా జీవనము
వెదకుదురు గాక
11 వాని ఆస్తి అంతయు అప్పులవారు ఆక్రమించు
కొందురు గాక
వాని కష్టార్జితమును పరులు దోచుకొందురు గాక
12 వానికి కృప చూపువారు లేకపోదురు గాక
తండ్రిలేని వాని బిడ్డలకు దయచూపువారు ఉండక
పోదురు గాక
వంశము నిర్మూలము చేయబడును గాక
మునందు వారి పేరు మాసిపోవును గాక

వాని పితరులదోషము యెహోవా జ్ఞాపకములో 14
నుంచుకొనును గాక
వాని తల్లి పాపము తుడుపుపెట్టబడక యుండును
గాక
ఆయన వారి జ్ఞాపకమును భూమిమీదనుండి కొట్టి 15
వేయునట్లు
ఆ పాపములు నిత్యము యెహోవా సన్నిధిని
కనబడుచుండును గాక.
ఏలయనగా కృప చూపవలెనన్నమాట మరచి 16
శ్రమనొందినవానిని దరిద్రుని నలిగిన హృదయము
గలవానిని
చంపవలెనని వాడు అతని తరిమెను.
శపించుట వానికి ప్రీతి గనుక అది వానిమీదికి 17
వచ్చియున్నది.
దీవెనయందు వానికిష్టము లేదు గనుక అది వానికి
దూరమాయెను.
తాను పైబట్ట వేసికొనునట్లు వాడు శాపము 18
ధరించెను
అది నీళ్లవలె వాని కడుపులో చొచ్చియున్నది
తైలమువలె వాని యెముకలలో చేరియున్నది.
తాను కప్పుకొను వస్త్రమువలెను 19
తాను నిత్యము కట్టుకొను నడికట్టువలెను అది
వానిని వదలకుండును గాక.
నా విరోధులకు నా ప్రాణమునకు విరోధముగా 20
మాటలాడువారికి
ఇదే యెహోవావలన కలుగు ప్రతికారము.
యెహోవా ప్రభువా, 21
నీ నామమునుబట్టి నాకు సహాయము చేయుము
నీ కృప ఉత్తమమైనది గనుక నన్ను విడిపింపుము.
నేను దీనదరిద్రుడను నా హృదయము నాలో 22
గుచ్చబడియున్నది.
సాగిపోయిన నీడవలె నేను క్షీణించియున్నాను. 23
మిడతలను పారదోలునట్లు నన్ను పారదోలుదురు.
ఉపవాసముచేత నా మోకాళ్లు బలహీనమాయెను 24
నా శరీరము పుష్టి తగ్గి చిక్కిపోయెను.
వారి నిందలకు నేను ఆస్పదుడనైతిని 25
వారు నన్ను చూచి తమ తలలు ఊచెదరు.
యెహోవా నా దేవా, యిది నీచేత జరిగినదనియు 26
యెహోవావైన నీవే దీని చేసితివనియు వారికి 27
తెలియునట్లు
నాకు సహాయము చేయుము నీ కృపనుబట్టి నన్ను
రక్షింపుము.
వారు శపించుచున్నారు గాని నీవు దీవించుదువు 28
వారు లేచి అవమానము పొందెదరు గాని నీ సేవ
కుడు సంతోషించును.
నా విరోధులు అవమానము ధరించుకొందురు గాక 29

తమ సిగ్గునే నిలువుటంగీవలె కప్పుకొందురు గాక.
30 నా నోటితో నేను యెహోవాకు కృతజ్ఞతాస్తు
తులు మెండుగా చెల్లించెదను
అనేకుల మధ్యను నేనాయనను స్తుతించెదను.
31 దరిద్రుని ప్రాణమును విమర్శకు లోపరచువారి
చేతిలోనుండి అతని రక్షించుటకై
యెహోవా అతని కుడిప్రక్కను నిలుచు
చున్నాడు.

## 110

దావీదు కీర్తన.

నా ప్రభువునుగూర్చి యెహోవా సెలవిచ్చిన
వాక్కు
—నేను నీ శత్రువులను నీ పాదములకు పీఠముగా
చేయువరకు నా కుడిపార్శ్వమున కూర్చుం
డుము.
2 యెహోవా నీ పరిపాలనదండమును సీయో
నులోనుండి సాగజేయుచున్నాడు
నీ శత్రువులమధ్యను నీవు పరిపాలన చేయుము.
3 యుద్ధసన్నాహదినమున నీ ప్రజలు ఇష్టపూర్వక
ముగా వచ్చెదరు.
నీ యౌవనస్థులలో శ్రేష్ఠులు పరిశుద్ధాలంకృతులై
మంచువలె అరుణోదయగర్భములోనుండి నీ
యొద్దకు వచ్చెదరు.
4 —మెల్కీసెదెకు క్రమముచొప్పున నీవు నిరం
తరము యాజకుడవై యుందువని
యెహోవా ప్రమాణము చేసియున్నాడు,
ఆయన మాట తప్పనివాడు.
5 ప్రభువు నీ కుడిపార్శ్వమందుండి
తన కోపదినమున రాజులను నలుగగొట్టును.
6 అన్యజనులకు ఆయన తీర్పు తీర్చును
దేశము శవములతో నిండియుండును
విశాలదేశముమీది ప్రధానుని ఆయన నలుగ
గొట్టును.
7 మార్గమున ఏటి నీళ్లు పానముచేసి ఆయన తల
యెత్తును.

## 111

యెహోవాను స్తుతించుడి.
యథార్థవంతుల సభలోను సమాజములోను పూర్ణ
హృదయముతో నేను యెహోవాకు కృత
జ్ఞతాస్తుతులు చెల్లించెదను.
2 యెహోవా క్రియలు గొప్పవి
వాటియందు ఇష్టముగలవారందరు వాటిని విచా
రించుదురు.
3 ఆయన కార్యము మహిమాప్రభావములుగలది
ఆయన నీతి నిత్యము నిలకడగా నుండును.
4 ఆయన తన ఆశ్చర్యకార్యములకు జ్ఞాపకార్థసూచ
నను నియమించి యున్నాడు.
యెహోవా దయాదాక్షిణ్యపూర్ణుడు
తనయందు భయభక్తులుగలవారికి ఆయన ఆహార 5
మిచ్చియున్నాడు
ఆయన నిత్యము తన నిబంధన జ్ఞాపకము చేసి
కొనును.
ఆయన తన ప్రజలకు అన్యజనుల స్వాస్థ్యము అప్ప 6
గించియున్నాడు
తన క్రియల మాహాత్మ్యమును వారికి వెల్లడిచేసి
యున్నాడు.
ఆయన చేతికార్యములు సత్యమైనవి న్యాయ 7
మైనవి
ఆయన శాసనములన్నియు నమ్మకమైనవి.
అవి శాశ్వతముగా స్థాపింపబడియున్నవి 8
సత్యముతోను యథార్థతతోను అవి చేయబడి
యున్నవి.
ఆయన తన ప్రజలకు విమోచనము కలుగజేయు 9
వాడు
తన నిబంధన ఆయన నిత్యముగా ఉండ నిర్ణయించు
వాడు.
ఆయన నామము పరిశుద్ధమైనది పూజింపదగినది.
యెహోవాయందలి భయము జ్ఞానమునకు 10
మూలము
ఆయన శాసనముల ననుసరించువారందరు మంచి
వివేకముగలవారు.
ఆయనకు నిత్యము స్తోత్రము కలుగుచున్నది.

## 112

యెహోవాను స్తుతించుడి
యెహోవాయందు భయభక్తులుగలవాడు
ఆయన ఆజ్ఞలనుబట్టి అధికముగా ఆనందించువాడు
ధన్యుడు.
వాని సంతతివారు భూమిమీద బలవంతులగుదురు 2
యథార్థవంతుల వంశపువారు దీవింపబడుదురు
కలిమియు సంపదయు వాని యింట నుండును 3
వాని నీతి నిత్యము నిలుచును.
యథార్థవంతులకు చీకటిలో వెలుగు పుట్టును 4
వారు కటాక్షమును వాత్సల్యతయు నీతియు
గలవారు.
దయాళులును అప్పిచ్చువారును భాగ్యవంతులు 5
న్యాయవిమర్శలో వారి వ్యాజ్యము గెలుచును
అట్టివారు ఎప్పుడును కదిలింపబడరు 6
నీతిమంతులు నిత్యము జ్ఞాపకములో నుందురు.
వాని హృదయము యెహోవాను ఆశ్రయించి 7
స్థిరముగా నుండును
వాడు దుర్వార్తకు జడియడు.
వాని మనస్సు స్థిరముగా నుండును 8
తన శత్రువుల విషయమైన తన కోరిక నెరవేరు
వరకు వాడు భయపడడు.
వాడు దాతృత్వము కలిగి బీదలకిచ్చును

వాని నీతి నిత్యము నిలుచును
వాని కొమ్ము ఘనతనొంది హెచ్చింపబడును.
10 భక్తిహీనులు దాని చూచి చింతపడుదురు
వారు పండ్లుకొరుకుచు క్షీణించిపోవుదురు
భక్తిహీనుల ఆశ భంగమైపోవును.

113 యెహోవాను స్తుతించుడి
యెహోవా సేవకులారా, ఆయనను స్తుతించుడి
యెహోవా నామమును స్తుతించుడి.
2 ఇది మొదలుకొని యెల్లకాలము
యెహోవా నామము సన్నుతింపబడు గాక.
3 సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయ
ము వరకు
యెహోవా నామము స్తుతి నొందదగినది.
4 యెహోవా అన్యజనులందరియెగుట మహో
న్నతుడు
ఆయన మహిమ ఆకాశ విశాలమున వ్యాపించి
యున్నది.
5 ఉన్నతమందు ఆసీనుడైయున్న మన దేవుడైన
యెహోవాను పోలియున్నవాడెవడు?
6 ఆయన భూమ్యాకాశములను వంగిచూడననుగ్ర
హించుచున్నాడు.
7 ప్రధానులతో తన ప్రజల ప్రధానులతో వారిని
కూర్చుండబెట్టుటకై
8 ఆయన నేలనుండి దరిద్రులను లేవనెత్తువాడు
పెంట కుప్పమీదనుండి బీదలను పైకెత్తువాడు
9 ఆయన సంతులేనిదానిని ఇల్లాలుగాను
కుమాళ్ల సంతోషముగల తల్లిగాను చేయును.
యెహోవాను స్తుతించుడి.

114 ఐగుప్తులోనుండి ఇశ్రాయేలు
అన్యభాషగల జనులలోనుండి యాకోబు బయలు
వెళ్లినప్పుడు
2 యూదా ఆయనకు పరిశుద్ధస్థలమాయెను
ఇశ్రాయేలు ఆయనకు రాజ్యమాయెను.
3 సముద్రము దాని చూచి పారిపోయెను
యొర్దాను నది వెనుకకు మళ్లెను.
4 కొండలు పొట్టేళ్లవలెను గుట్టలు గొఱ్ఱెపిల్లలవలెను
గంతులు వేసెను.
5 సముద్రమా, నీవు పారిపోవుటకు నీకేమి తటస్థిం
చినది?
యొర్దానూ, నీవు వెనుకకు మళ్లుటకు నీకేమి తట
స్థించినది?
6 కొండలారా, మీరు పొట్టేళ్లవలెను
గుట్టలారా, మీరు గొఱ్ఱెపిల్లలవలెను గంతులు
వేయుటకు మీకేమి సంభవించినది?
7 భూమీ, ప్రభువు సన్నిధిని యాకోబు దేవుని
8 సన్నిధిని వణకుము
ఆయన బండను నీటిమడుగుగాను
చెకుముకి రాతిబండను నీటి ఊటలుగాను చేయు
వాడు.

మాకు కాదు యెహోవా మాకు కాదు 115
నీ కృపాసత్యములనుబట్టి నీ నామమునకే మహిమ
కలుగు గాక
—వారి దేవుడేడి అని 2
అన్యజనులెందుకు చెప్పుకొందురు?
మా దేవుడు ఆకాశమందున్నాడు 3
తనకిచ్ఛవచ్చినట్టుగా సమస్తమును ఆయన చేయు
చున్నాడు.
వారి విగ్రహములు వెండి బంగారువి 4
అవి మనుష్యుల చేతిపనులు.
వాటికి నోరుండియు పలుకవు 5
కన్నులుండియు చూడవు
చెవులుండియు వినవు 6
ముక్కులుండియు వాసనచూడవు
చేతులుండియు ముట్టుకొనవు 7
పాదములుండియు నడువవు
గొంతుకతో మాటలాడవు.
వాటిని చేయువారును వాటియందు నమ్మికయుంచు 8
వారందరును వాటివంటివారైయున్నారు.
ఇశ్రాయేలీయులారా, యెహోవాను నమ్ము 9
కొనుడి.
ఆయన వారికి సహాయము వారికి కేడెము.
అహరోను వంశస్థులారా, యెహోవాను నమ్ము 10
కొనుడి.
ఆయన వారికి సహాయము వారికి కేడెము.
యెహోవాయందు భయభక్తులుగలవారలారా, 11
యెహోవాయందు నమ్మిక యుంచుడి.
ఆయన వారికి సహాయము వారికి కేడెము.
యెహోవా మమ్మును మరచిపోలేదు ఆయన మమ్ము 12
నాశీర్వదించును
ఆయన ఇశ్రాయేలీయుల నాశీర్వదించును
అహరోను వంశస్థుల నాశీర్వదించును.
పిన్నలనేమి పెద్దలనేమి తనయందు భయభక్తులు 13
గలవారిని యెహోవా ఆశీర్వదించును.
యెహోవా మిమ్మును మీ పిల్లలను వృద్ధిపొం 14
దించును.
భూమ్యాకాశములను సృజించిన యెహోవాచేత 15
మీరు ఆశీర్వదింపబడినవారు.
ఆకాశములు యెహోవావశము 16
భూమిని ఆయన నరుల కిచ్చియున్నాడు.
మృతులును మౌనస్థితిలోనికి దిగిపోవువారును 17
యెహోవాను స్తుతింపరు

18 మేమైతే ఇది మొదలుకొని నిత్యము యెహో
వాను స్తుతించెదము
యెహోవాను స్తుతించుడి.

116 యెహోవా నా మొరవిని నా విన్నపములను ఆల
కించియున్నాడు.
కాగా నేనాయనను ప్రేమించుచున్నాను.
2 ఆయన నాకు చెవి యొగ్గెను
కావున నా జీవితకాలమంతయు నేనాయనకు
మొఱ్ఱపెట్టుదును
3 మరణబంధములు నన్ను చుట్టుకొని యుండెను
పాతాళపు వేదనలు నన్ను పట్టుకొని యుండెను
శ్రమయు దుఃఖమును నాకు కలిగెను.
4 అప్పుడు—యెహోవా, దయచేసి నా ప్రాణ
మును విడిపింపుమని
యెహోవా నామమునుబట్టి నేను మొఱ్ఱ
పెట్టితిని.
5 యెహోవా దయాళుడు నీతిమంతుడు
మన దేవుడు వాత్సల్యతగలవాడు.
6 యెహోవా సాధువులను కాపాడువాడు
నేను క్రుంగియుండగా ఆయన నన్ను రక్షించెను.
7 నా ప్రాణమా, యెహోవా నీకు క్షేమము
విస్తరింపజేసియున్నాడు.
తిరిగి నీ విశ్రాంతిలో ప్రవేశింపుము.
8 మరణమునుండి నా ప్రాణమును కన్నీళ్లు విడువ
కుండ నా కన్నులను
జారిపడకుండ నా పాదములను నీవు తప్పించి
యున్నావు.
9 సజీవులున్న దేశములలో
యెహోవా సన్నిధిని నేను కాలము గడుపుదును.
10 నేను ఆలాగు మాటలాడి నమ్మిక యుంచితిని.
నేను మిగుల బాధపడినవాడను.
11 నేను తొందరపడినవాడనై
— ఏ మనుష్యుడును నమ్మదగినవాడు కాడను
కొంటిని.
12 యెహోవా నాకు చేసిన ఉపకారములన్నిటికి
నేనాయనకేమి చెల్లించుదును?
13 రక్షణపాత్రను చేత పుచ్చుకొని
యెహోవా నామమున ప్రార్థన చేసెదను.
14 యెహోవాకు నా మ్రొక్కుబళ్లు చెల్లించెదను
ఆయన ప్రజలందరి యెదుటనే చెల్లించెదను.
15 యెహోవా భక్తుల మరణము ఆయన దృష్టికి
విలువగలది.
16 యెహోవా, నేను నిజముగా నీ సేవకుడను
నీ సేవకుడను నీ సేవకురాలి కుమారుడనై యున్నాను
నీవు నా కట్లు విప్పియున్నావు.
17 నేను నీకు కృతజ్ఞతార్పణ నర్పించెదను,
యెహోవా నామమున ప్రార్థనచేసెదను.
ఆయన ప్రజలందరియెదుటను 18
యెహోవా మందిరపు ఆవరణములలోను 19
యెరూషలేమా, నీ మధ్యను
నేను యెహోవాకు నా మ్రొక్కుబళ్లు చెల్లించెదను.
యెహోవాను స్తుతించుడి.

యెహోవా కృప మనయెడల హెచ్చుగా 117
నున్నది
ఆయన విశ్వాస్యత నిరంతరము నిలుచును.
కాబట్టి సమస్త అన్యజనులారా, యెహోవాను 2
స్తుతించుడి
సర్వజనములారా, ఆయనను కొనియాడుడి
యెహోవాను స్తుతించుడి.

యెహోవా దయాళుడు ఆయన కృప నిరం 118
తరము నిలుచుచున్నది
ఆయనకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి
ఆయన కృప నిరంతరము నిలుచునని ఇశ్రాయేలీ 2
యులు అందురు గాక.
ఆయన కృప నిరంతరము నిలుచునని అహరోను 3
వంశస్థులు అందురు గాక.
ఆయన కృప నిరంతరము నిలుచునని యెహోవా 4
యందు భయభక్తులుగలవారు అందురు గాక.
ఇరుకునందుండి నేను యెహోవాకు మొఱ్ఱ 5
పెట్టితిని
విశాలస్థలమందు యెహోవా నాకు ఉత్తరమిచ్చెను
యెహోవా నా పక్షమున నున్నాడు నేను 6
భయపడను
నరులు నాకేమి చేయగలరు?
యెహోవా నా పక్షము వహించి నాకు సహా 7
కారుడై యున్నాడు
నా శత్రువుల విషయమైన నా కోరిక నెరవేరుట
చూచెదను.
మనుష్యులను నమ్ముకొనుటకంటె 8
యెహోవాను ఆశ్రయించుట మేలు.
రాజులను నమ్ముకొనుటకంటె 9
యెహోవాను ఆశ్రయించుట మేలు.
అన్యజనులందరు నన్ను చుట్టుకొనియున్నారు 10
యెహోవా నామమునుబట్టి నేను వారిని నిర్మూ
లము చేసెదను.
నలుదిశలను వారు నన్ను చుట్టుకొనియున్నారు 11
యెహోవా నామమునుబట్టి నేను వారిని నిర్మూ
లము చేసెదను.
కందిరీగలవలె నామీద ముసిరి యున్నారు 12
ముండ్లు కాల్చిన మంట ఆరిపోవునట్లు వా
నశించిపోయిరి

యెహోవా నామమునుబట్టి నేను వారిని నిర్మూ
లము చేసెదను
13 నేను పడునట్లు నీవు నన్ను గట్టిగా తోసితివి
యెహోవా నాకు సహాయము చేసెను.
14 యెహోవా నా దుర్గము నా గానము
ఆయన నాకు రక్షణాధారమాయెను.
15 నీతిమంతుల గుడారములలో రక్షణనుగూర్చిన
ఉత్సాహ సునాదము వినబడును
యెహోవా దక్షిణహస్తము సాహసకార్యములను
చేయును.
16 యెహోవా దక్షిణహస్తము మహోన్నత
మాయెను
యెహోవా దక్షిణహస్తము సాహసకార్యములను
చేయును.
17 నేను చావను సజీవుడనై యెహోవా క్రియలు
వివరించెదను.
18 యెహోవా నన్ను కఠినముగా శిక్షించెను గాని
ఆయన నన్ను మరణమునకు అప్పగింపలేదు.
19 నేను వచ్చునట్లు నీతి గుమ్మములు తీయుడి
నేను వాటిలో ప్రవేశించి యెహోవాకు కృత
జ్ఞతాస్తుతులు చెల్లించెదను.
20 ఇది యెహోవా గుమ్మము
నీతిమంతులు దీనిలో ప్రవేశించెదరు.
21 నీవు నాకు రక్షణాధారుడవై నాకు ఉత్తరమిచ్చి
యున్నావు
నేను నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించెదను.
22 ఇల్లు కట్టువారు నిషేధించిన రాయి
మూలకు తలరాయి ఆయెను.
23 అది యెహోవావలన కలిగినది
అది మనకు ఆశ్చర్యముగా కనబడుచున్నది.
24 ఇది యెహోవా ఏర్పాటు చేసిన దినము
దీనియందు మనము ఉత్సహించి సంతోషిం
చెదము.
25 యెహోవా, దయచేసి నన్ను రక్షించుము
యెహోవా, దయచేసి అభివృద్ధి కలిగించుము.
26 యెహోవా పేరట వచ్చువాడు ఆశీర్వాద
మొందు గాక
యెహోవా మందిరములోనుండి మిమ్మును దీవించు
చున్నాము.
27 యెహోవాయే దేవుడు ఆయన మనకు వెలుగు
ననుగ్రహించియున్నాడు
ఉత్సవ బలిపశువును త్రాళ్లతో బలిపీఠపు కొమ్ము
లకు కట్టుడి.
నీవు నా దేవుడవు నేను నీకు కృతజ్ఞతాస్తుతులు
—ించెదను
దేవుడవు నిన్ను ఘనపరచెదను.

యెహోవా దయాళుడు ఆయన కృప నిరం 29
తరము నిలుచుచున్నది
ఆయనకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి.

ఆలెఫ్. 119

యెహోవా ధర్మశాస్త్రము ననుసరించి
నిర్దోషముగా నడుచుకొనువారు ధన్యులు
ఆయన శాసనములను గైకొనుచు 2
పూర్ణహృదయముతో ఆయనను వెదకువారు
ధన్యులు.
వారు ఆయన మార్గములలో నడుచుకొనుచు ఏ 3
పాపమును చేయరు
నీ ఆజ్ఞలను జాగ్రత్తగా గైకొనవలెనని 4
నీవు మాకు ఆజ్ఞాపించియున్నావు.
ఆహా నీ కట్టడలను గైకొనునట్లు 5
నా ప్రవర్తన స్థిరపడి యుండిన నెంత మేలు.
నీ ఆజ్ఞలన్నిటిని నేను లక్ష్యము చేయునప్పుడు 6
నాకు అవమానము కలుగనేరదు.
నీతిగల నీ న్యాయవిధులను నేను నేర్చుకొను 7
నప్పుడు
యథార్థహృదయముతో నీకు కృతజ్ఞతాస్తుతులు
చెల్లించెదను.
నీ కట్టడలను నేను గైకొందును 8
నన్ను బొత్తిగా విడనాడకుము.

బేత్.

యౌవనస్థులు దేనిచేత తమ నడత శుద్ధిపరచు 9
కొందురు!
నీ వాక్యమునుబట్టి దానిని జాగ్రత్తగా చూచు
కొనుటచేతనే గదా?
నా పూర్ణహృదయముతో నిన్ను వెదకియున్నాను 10
నన్ను నీ ఆజ్ఞలను విడిచి తిరుగనియ్యకుము.
నీ యెదుట నేను పాపము చేయకుండునట్లు 11
నా హృదయములో నీ వాక్యము ఉంచుకొని
యున్నాను.
యెహోవా, నీవే స్తోత్రము నొందదగినవాడవు 12
నీ కట్టడలను నాకు బోధించుము.
నీ నోట నీవు సెలవిచ్చిన న్యాయవిధులన్నిటిని 13
నా పెదవులతో వివరించుదును.
సర్వసంపదలు దొరికినట్లు 14
నీ శాసనముల మార్గమునుబట్టి నేను సంతోషించు
చున్నాను.
నీ ఆజ్ఞలను నేను ధ్యానించెదను 15
నీ త్రోవలను మన్నించెదను.
నీ కట్టడలనుబట్టి నేను హర్షించెదను 16
నీ వాక్యమును నేను మరువకయుందును.

### గీమెల్.

17 నీ సేవకుడనైన నేను బ్రదుకునట్లు నాయెడల నీ
దయారసము చూపుము
నీ వాక్యమునుబట్టి నేను నడుచుకొనుచుందును.
18 నేను నీ ధర్మశాస్త్రమునందు ఆశ్చర్యమైన సంగ
తులను చూచునట్లు నా కన్నులు తెరువుము.
19 నేను భూమిమీద పరదేశినై యున్నాను
నీ ఆజ్ఞలను నాకు మరుగుచేయకుము.
20 నీ న్యాయవిధులమీద నాకు ఎడతెగని ఆశకలిగి
యున్నది
దానిచేత నా ప్రాణము క్షీణించుచున్నది.
21 గర్విష్ఠులను నీవు గద్దించుచున్నావు.
నీ ఆజ్ఞలను విడిచి తిరుగువారు శాపగ్రస్తులు.
22 నేను నీ శాసనముల ననుసరించుచున్నాను.
నామీదికి రాకుండ నిందను తిరస్కారమును తొల
గింపుము.
23 అధికారులు నాకు విరోధముగా సభతీర్చి మాట
లాడుకొందురు
నీ సేవకుడు నీ కట్టడలను ధ్యానించుచుండును.
24 నీ శాసనములు నాకు సంతోషకరములు
అవి నాకు ఆలోచనకర్తలైయున్నవి.

### దాలెత్.

25 నా ప్రాణము మంటిని హత్తుకొనుచున్నది
నీ వాక్యముచేత నన్ను బ్రదికింపుము.
26 నా చర్య అంతయు నేను చెప్పుకొనగా నీవు
నాకు ఉత్తరమిచ్చితివి
నీ కట్టడలను నాకు బోధింపుము
27 నీ ఉపదేశమార్గమును నాకు బోధపరచుము.
నీ ఆశ్చర్యకార్యములను నేను ధ్యానించెదను.
28 వ్యసనమువలన నా ప్రాణము నీరై పోయెను
నీ వాక్యముచేత నన్ను స్థిరపరచుము.
29 కపటపు నడత నాకు దూరము చేయుము
నీ ఉపదేశమును నాకు దయచేయుము.
30 సత్యమార్గమును నేను కోరుకొనియున్నాను
నీ న్యాయవిధులను నేను నాయెదుట పెట్టుకొని
యున్నాను
31 యెహోవా, నేను నీ శాసనములను హత్తుకొని
యున్నాను
నన్ను సిగ్గుపడనియ్యకుము.
32 నా హృదయమును నీవు విశాలపరచునప్పుడు
నేను నీ ఆజ్ఞలమార్గమున పరుగెత్తెదను.

### హే.

33 యెహోవా, నీ కట్టడలను అనుసరించుటకు నాకు
నేర్పుము.
అప్పుడు నేను కడమట్టుకు వాటిని గైకొందును.
నీ ధర్మశాస్త్రము ననుసరించుటకు నాకు బుద్ధి దయ 34
చేయుము
అప్పుడు నా పూర్ణహృదయముతో నేను దాని
ప్రకారము నడుచుకొందును.
నీ ఆజ్ఞల జాడను చూచి నేను ఆనందించుచున్నాను 35
దానియందు నన్ను నడువజేయుము.
లోభముతట్టు కాక నీ శాసనములతట్టు నా హృద 36
యము త్రిప్పుము.
వ్యర్థమైనవాటిని చూడకుండ నా కన్నులు త్రిప్పి 37
వేయుము
నీ మార్గములలో నడుచుకొనుటకు నన్ను బ్రది
కింపుము.
నీవిచ్చిన వాక్యము మనుష్యులలో నీ భయము 38
పుట్టించుచున్నది
నీ సేవకునికి దాని స్థిరపరచుము.
నీ న్యాయవిధులు ఉత్తమములు 39
నాకు భయము పుట్టించుచున్న నా అవమానమును
కొట్టివేయుము.
నీ ఉపదేశములు నాకు అధిక ప్రియములు 40
నీ నీతినిబట్టి నన్ను బ్రదికింపుము.

### వావ్.

యెహోవా, నీ కనికరములు నాయొద్దకు రానిమ్ము 41
నీ మాటచొప్పున నీ రక్షణ రానిమ్ము.
అప్పుడు నన్ను నిందించువానికి నేను ఉత్తరమీయ 42
గలను
ఏలయనగా నీ మాట నమ్ముకొనియున్నాను.
నా నోటనుండి సత్యవాక్యమును ఏమాత్రమును 43
తీసివేయకుము
నీ న్యాయవిధులమీద నా ఆశ నిలిపియున్నాను.
నిరంతరము నీ ధర్మశాస్త్రము ననుసరించుదును 44
నేను నిత్యము దాని ననుసరించుదును
నేను నీ ఉపదేశములను వెదకువాడను 45
నిర్భంధములేక నడుచుకొందును
సిగ్గుపడక రాజులయెదుట 46
నీ శాసనములనుగూర్చి నేను మాటలాడెదను.
నీ ఆజ్ఞలనుబట్టి నేను హర్షించెదను 47
అవి నాకు ప్రియములు.
నాకు ప్రియముగానున్న నీ ఆజ్ఞలతట్టు నా చేతు 48
లెత్తెదను
నీ కట్టడలను నేను ధ్యానించుదును.

### జాయిన్.

నీ సేవకునికి దయచేయబడిన మాట జ్ఞాపకము 49
చేసికొనుము
దానివలన నీవు నాకు నమ్మకము పుట్టించియున్నావు.
నీ వాక్యము నన్ను బ్రదికించి యున్నది 50

నా బాధలో ఇదే నాకు నెమ్మది కలిగించుచున్నది.
51 గర్విష్ఠులు నన్ను మిగుల అపహసించిరి
అయినను నీ ధర్మశాస్త్రమునుండి నేను తొలగక యున్నాను.
52 యెహోవా, పూర్వకాలమునుండి యుండిన నీ న్యాయవిధులను జ్ఞాపకము చేసికొని
నేను ఓదార్పు నొందితిని.
53 నీ ధర్మశాస్త్రమును విడిచి నడుచుచున్న భక్తిహీనులను చూడగా
నాకు అధిక రోషము పుట్టుచున్నది
54 యాత్రికుడనైన నేను నా బసలో పాటలు పాడుటకు
నీ కట్టడలు హేతువులాయెను.
55 యెహోవా, రాత్రివేళ నీ నామమును స్మరణ చేయుచున్నాను
నీ ధర్మశాస్త్రము ననుసరించి నడుచుకొనుచున్నాను.
56 నీ ఉపదేశము ననుసరించి నడుచుకొనుచున్నాను
ఇదే నాకు వరముగా దయచేయబడియున్నది.

హేత్.

57 యెహోవా, నీవే నా భాగము
నీ వాక్యముల ననుసరించి నడుచుకొందునని నేను నిశ్చయించుకొనియున్నాను.
58 కటాక్షముంచుమని నా పూర్ణహృదయముతో నిన్ను బతిమాలుకొనుచున్నాను
నీవిచ్చిన మాటచొప్పున నన్ను కరుణింపుము.
59 నా మార్గములు నేను పరిశీలన చేసికొంటిని
నీ శాసనములతట్టు మరలుకొంటిని.
60 నీ ఆజ్ఞలను అనుసరించుటకు
నేను జాగుచేయక త్వరపడితిని.
61 భక్తిహీనులపాశములు నన్ను చుట్టుకొని యున్నను
నీ ధర్మశాస్త్రమును నేను మరువలేదు
62 న్యాయమైన నీ విధులనుబట్టి నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుటకు
అర్ధరాత్రివేళ నేను మేల్కొనువాడను.
63 నీయందు భయభక్తులుగలవారికందరికిని
నీ ఉపదేశములను అనుసరించువారికిని నేను చెలికాడను.
64 యెహోవా, భూమి నీ కృపతో నిండియున్నది
నీ కట్టడలను నాకు బోధింపుము.

తేత్.

65 యెహోవా, నీ మాటచొప్పున
నీ సేవకునికి నీవు మేలు చేసియున్నావు.
66 నేను నీ ఆజ్ఞలయందు నమ్మిక యుంచియున్నాను
మంచి వివేచన మంచి జ్ఞానము నాకు నేర్పుము.
67 శ్రమ కలుగకమునుపు నేను త్రోవ విడిచితిని
ఇప్పుడు నీ వాక్యము ననుసరించి నడుచుకొను చున్నాను.
నీవు దయాళుడవై మేలు చేయుచున్నావు 68
నీ కట్టడలను నాకు బోధింపుము.
గర్విష్ఠులు నామీద అబద్ధము కల్పించుదురు 69
అయితే పూర్ణహృదయముతో నేను నీ ఉపదేశములను అనుసరింతును.
వారి హృదయము క్రొవ్వువలె మందముగా 70
ఉన్నది
నేను నీ ధర్మశాస్త్రమునుబట్టి ఆనందించుచున్నాను.
నేను నీ కట్టడలను నేర్చుకొనునట్లు 71
శ్రమనొంది యుండుట నాకు మేలాయెను.
వేలకొలది వెండి బంగారు నాణ్యములకంటె 72
నీవిచ్చిన ధర్మశాస్త్రము నాకు మేలు.

యోద్.

నీ చేతులు నన్ను నిర్మించి నాకు రూపు ఏర్పరచెను 73
నేను నీ ఆజ్ఞలను నేర్చుకొనునట్లు నాకు బుద్ధి దయచేయుము.
నీ వాక్యముమీద నేను ఆశపెట్టుకొని యున్నాను 74
నీయందు భయభక్తులుగలవారు నన్ను చూచి సంతోషింతురు
యెహోవా, నీ తీర్పులు న్యాయమైనవనియు 75
విశ్వాస్యతగలవాడవై నీవు నన్ను శ్రమపరచితివనియు నేనెరుగుదును.
నీ సేవకునికి నీవిచ్చిన మాటచొప్పున 76
నీ కృప నన్ను ఆదరించును గాక.
నీ ధర్మశాస్త్రము నాకు సంతోషకరము. 77
నేను బ్రదుకునట్లు నీ కరుణాకటాక్షములు నాకు కలుగును గాక.
నేను నీ ఉపదేశములను ధ్యానించుచున్నాను. 78
గర్విష్ఠులు నామీద అబద్ధములాడినందుకు
వారు సిగ్గుపడుదురు గాక.
నీయందు భయభక్తులుగలవారును 79
నీ శాసనములను తెలిసికొనువారును నా పక్షమున నుందురు గాక.
నేను సిగ్గుపడకుండునట్లు 80
నా హృదయము నీ కట్టడలవిషయమై నిర్దోషమగును గాక.

కఫ్.

నీ రక్షణకొరకు నా ప్రాణము సొమ్మసిల్లుచున్నది 81
నేను నీ వాక్యముమీద ఆశపెట్టుకొని యున్నాను.
—నన్ను ఎప్పుడు ఆదరించెదవో అని 82
నా కన్నులు నీవిచ్చిన మాటకొరకు కనిపెట్టి క్షీణించుచున్నవి
నేను పొగ తగులుచున్న సిద్దెవలెనైతిని 83

అయినను నీ కట్టడలను నేను మరచుట లేదు.
నీ సేవకుని దినములు ఎంత కొద్దివాయెను
నన్ను తరుమువారికి నీవు తీర్పు తీర్చుట యెప్పుడు?
నీ ధర్మశాస్త్రము ననుసరింపని గర్విష్ఠులు
నన్ను చిక్కించుకొనుటకై గుంటలు త్రవ్విరి.
నీ ఆజ్ఞలన్నియు నమ్మదగినవి
పగవారు నిర్నిమిత్తముగా నన్ను తరుముచున్నారు
నాకు సహాయము చేయుము.
భూమిమీద నుండకుండ వారు నన్ను నాశనము చేయుటకు కొంచెమే తప్పెను
అయితే నీ ఉపదేశములను నేను విడువక యున్నాను.
3 నీవు నియమించిన శాసనమును నేను అనుసరించుచున్నట్లు
నీ కృపచేత నన్ను బ్రదికింపుము.

లామెద్.

9 యెహోవా, నీ వాక్యము ఆకాశమందు నిత్యము నిలకడగా నున్నది.
0 నీ విశ్వాస్యత తరతరములుండును.
నీవు భూమిని స్థాపించితివి అది స్థిరముగా నున్నది.
11 సమస్తము నీకు సేవచేయుచున్నవి
కావున నీ నిర్ణయముచొప్పున అవి నేటికిని స్థిరపడియున్నవి
92 నీ ధర్మశాస్త్రము నాకు సంతోషమియ్యనియెడల
నా శ్రమయందు నేను నశించియుందును.
93 నీ ఉపదేశములవలన నీవు నన్ను బ్రదికించితివి
నేనెన్నడును వాటిని మరువను.
94 నీ ఉపదేశములను నేను వెదకుచున్నాను
నేను నీవాడనే నన్ను రక్షించుము.
95 నన్ను సంహరింపవలెనని భక్తిహీనులు నాకొరకు పొంచియున్నారు
అయితే నేను నీ శాసనములను తలపోయుచున్నాను.
96 సకల సంపూర్ణతకు పరిమితి కలదని నేను గ్రహించియున్నాను
నీ ధర్మోపదేశము అపరిమితమైనది.

మేమ్.

97 నీ ధర్మశాస్త్రము నాకెంతో ప్రియముగా నున్నది
దినమెల్ల నేను దాని ధ్యానించుచున్నాను.
98 నీ ఆజ్ఞలు నిత్యము నాకు తోడుగా నున్నవి
నా శత్రువులను మించిన జ్ఞానము అవి నాకు కలుగజేయుచున్నవి.
99 నీ శాసనములను నేను ధ్యానించుచున్నాను
కావున నా బోధకులందరికంటె నాకు విశేష జ్ఞానము కలదు.
నీ ఉపదేశములను నేను లక్ష్యముచేయుచున్నాను 100
కావున వృద్ధులకంటె నాకు విశేషజ్ఞానము కలదు.
నేను నీ వాక్యము ననుసరించునట్లు 101
దుష్టమార్గములన్నిటిలోనుండి నా పాదములు తొలగించుకొనుచున్నాను
నీవు నాకు బోధించితివి గనుక 102
నీ న్యాయవిధులనుండి నేను తొలగకయున్నాను.
నీ వాక్యములు నా జిహ్వకు ఎంతో మధురములు 103
అవి నా నోటికి తేనెకంటె తీపిగా నున్నవి.
నీ ఉపదేశములవలన నాకు వివేకము కలిగెను 104
తప్పుమార్గములన్నియు నా కసహ్యములాయెను.

నూన్.

నీ వాక్యము నా పాదములకు దీపమును 105
నా త్రోవకు వెలుగునై యున్నది.
నీ న్యాయవిధులను నేననుసరించెదనని 106
నేను ప్రమాణము చేసియున్నాను నా మాట నెరవేర్చుదును.
యెహోవా, నేను మిక్కిలి శ్రమపడుచున్నాను 107
నీ మాటచొప్పున నన్ను బ్రదికింపుము.
యెహోవా, నా నోటి స్వేచ్ఛార్పణలను అంగీకరించుము. 108
నీ న్యాయవిధులను నాకు బోధింపుము
నా ప్రాణము ఎల్లప్పుడు నా అరచేతిలో ఉన్నది. 109
అయినను నీ ధర్మశాస్త్రమును నేను మరువను.
నన్ను పట్టుకొనుటకై భక్తిహీనులు ఉరియొడ్డిరి 110
అయినను నీ ఉపదేశములనుండి నేను తొలగి తిరుగుట లేదు.
నీ శాసనములు నాకు హృదయానందకరములు 111
అవి నాకు నిత్యస్వాస్థ్యమని భావించుచున్నాను.
నీ కట్టడలను గైకొనుటకు నా హృదయమును 112
నేను లోపరచుకొని యున్నాను
ఇది తుదవరకు నిలుచు నిత్యనిర్ణయము.

సామెహ్.

ద్విమనస్కులను నేను ద్వేషించుచున్నాను 113
నీ ధర్మశాస్త్రము నాకు ప్రీతికరము.
నాకు మరుగుచోటు నా కేడెము నీవే 114
నేను నీ వాక్యముమీద ఆశపెట్టుకొనియున్నాను.
నేను నా దేవుని ఆజ్ఞలను అనుసరించెదను 115
దుష్క్రియలు చేయువారలారా, నాయొద్దనుండి తొలగుడి
నేను బ్రదుకునట్లు నీ మాటచొప్పున నన్ను ఆదుకొనుము 116
నా ఆశ భంగమై నేను సిగ్గునొందక యుందును గాక.
నాకు రక్షణ కలుగునట్లు నీవు నన్ను ఉద్ధరింపుము 117

అప్పుడు నీ కట్టడలను నిత్యము లక్ష్యముచేసెదను.
118 నీ కట్టడలను మీరిన వారినందరిని నీవు నిరాక
రించుదువు
వారి కపటాలోచన మోసమే.
119 భూమిమీదనున్న భక్తిహీనులనందరిని నీవు మష్టు
వలె లయపరచుదువు
కావున నీ శాసనములు నాకు ఇష్టమైయున్నవి.
120 నీ భయమువలన నా శరీరము వణకుచున్నది
నీ న్యాయవిధులకు నేను భయపడుచున్నాను.

అయిన్.

121 నేను నీతిన్యాయముల ననుసరించుచున్నాను
నన్ను బాధించువారివశమున నన్ను విడిచిపెట్ట
కుము.
122 మేలుకొరకు నీ సేవకునికి పూటపడుము
గర్విష్ఠులు నన్ను బాధింపకయుందురు గాక.
123 నీ రక్షణకొరకు నీతిగల నీ మాటకొరకు కని
పెట్టుచు
నా కన్నులు క్షీణించుచున్నవి.
124 నీ కృపచొప్పున నీ సేవకునికి మేలుచేయుము
నీ కట్టడలను నాకు బోధింపుము.
125 నేను నీ సేవకుడను
నీ శాసనములను గ్రహించునట్లు నాకు జ్ఞానము
కలుగజేయుము.
126 జనులు నీ ధర్మశాస్త్రమును నిరర్థకము చేసియున్నారు.
యెహోవా పక్షమున క్రియ జరిగించుటకు ఇదే
సమయము.
127 బంగారుకంటెను అపరంజికంటెను నీ ఆజ్ఞలు నాకు
ప్రియముగానున్నవి.
128 నీ ఉపదేశములన్నియు యథార్థములని నేను
వాటిని మన్నించుచున్నాను
అబద్ధమార్గములన్నియు నా కసహ్యములు.

పే.

129 నీ శాసనములు ఆశ్చర్యములు
కావుననే నేను వాటిని గైకొనుచున్నాను.
130 నీ వాక్యములు వెల్లడి అగుటతోడనే వెలుగు
కలుగును
అవి తెలివిలేనివారికి తెలివి కలిగించును
131 నీ ఆజ్ఞలయందైన యధిక వాంఛచేత
నేను నోరు తెరచి ఒగర్చుచున్నాను.
నీ నామమును ప్రేమించువారికి నీవు చేయదగినట్లు
ణింపుము.
సడుగులు స్థిరపరచుము
య్యకుము.
నుసరించునట్లు

మనుష్యుల బలాత్కారమునుండి నన్ను విమో
చింపుము.
నీ సేవకునిమీద నీ ముఖకాంతి ప్రకాశింప 135
జేయుము
నీ కట్టడలను నాకు బోధింపుము.
జనులు నీ ధర్మశాస్త్రము ననుసరింపకపోయినందుకు 136
నా కన్నీరు ఏరులై పారుచున్నది.

సాదె.

యెహోవా, నీవు నీతిమంతుడవు 137
నీ న్యాయవిధులు యథార్థములు.
నీతినిబట్టియు పూర్ణ విశ్వాస్యతనుబట్టియు 138
నీ శాసనములను నీవు నియమించితివి.
నా విరోధులు నీ వాక్యములు మరచిపోవుదురు 139
కావున నా ఆసక్తి నన్ను భక్షించుచున్నది.
నీ మాట మిక్కిలి స్వచ్ఛమైనది 140
అది నీ సేవకునికి ప్రియమైనది.
నేను అల్పుడను నిరాకరింపబడినవాడను 141
అయినను నీ ఉపదేశములను నేను మరువను.
నీ నీతి శాశ్వతమైనది 142
నీ ధర్మశాస్త్రము కేవలము సత్యము.
శ్రమయు వేదనయు నన్ను పట్టియున్నవి 143
అయినను నీ ఆజ్ఞలు నాకు సంతోషము కలుగజేయు
చున్నవి
నీ శాసనములు శాశ్వతమైన నీతిగలవి 144
నేను బ్రదుకునట్లు నాకు తెలివి దయచేయుము.

ఖొఫ్.

యెహోవా, హృదయపూర్వకముగా నేను 145
మొఱ్ఱపెట్టుచున్నాను
నీ కట్టడలను నేను గైకొనునట్లు నాకు ఉత్తరమిమ్ము.
నేను నీకు మొఱ్ఱపెట్టుచున్నాను 146
నీ శాసనములచొప్పున నేను నడుచుకొనునట్లు
నన్ను రక్షింపుము.
తెల్లవారకమునుపే మొఱ్ఱపెట్టితిని 147
నీ మాటలమీద నేను ఆశపెట్టుకొని యున్నాను
నీవిచ్చిన వాక్యమును నేను ధ్యానించుటకై 148
నా కన్నులు రాత్రిజాములు కాకమునుపే తెరచు
కొందును.
నీ కృపనుబట్టి నా మొఱ్ఱ ఆలకింపుము 149
యెహోవా, నీ న్యాయవిధులనుబట్టి నన్ను బ్రది
కింపుము.
దుష్కార్యములు చేయువారును 150
నీ ధర్మశాస్త్రమును త్రోసివేయువారును నాయొద్దకు
సమీపించుచున్నారు
యెహోవా, నీవు సమీపముగా ఉన్నావు. 151
నీ ఆజ్ఞలన్నియు సత్యమైనవి.

152 నీ శాసనములను నీవు నిత్యములుగా స్థిరపరచితివని
నేను పూర్వమునుండి వాటివలననే తెలిసికొని
యున్నాను.

రేష్.

153 నేను నీ ధర్మశాస్త్రమును మరచువాడను కాను
నా శ్రమను విచారించి నన్ను విడిపింపుము
154 నా పక్షమున వ్యాజ్యమాడి నన్ను విమోచింపుము
నీవిచ్చిన మాటచొప్పున నన్ను బ్రదికింపుము.
155 భక్తిహీనులు నీ కట్టడలను వెదకుట లేదు
గనుక రక్షణ వారికి దూరముగా నున్నది.
156 యెహోవా, నీ కనికరములు మితిలేనివి
నీ న్యాయవిధులనుబట్టి నన్ను బ్రదికింపుము.
157 నన్ను తరుమువారును నా విరోధులును అనేకులు
అయినను నీ న్యాయశాసనములనుండి నేను తొలగకయున్నాను.
158 ద్రోహులను చూచి నేను అసహ్యించుకొంటిని
నీవిచ్చిన మాటను వారు లక్ష్యపెట్టరు.
159 యెహోవా, చిత్తగించుము నీ ఉపదేశములు నాకెంతో ప్రీతికరములు
నీ కృపచొప్పున నన్ను బ్రదికింపుము
160 నీ వాక్య సారాంశము సత్యము
నీవు నియమించిన న్యాయవిధులన్నియు నిత్యము
నిలుచును.

షీన్.

161 అధికారులు నిర్నిమిత్తముగా నన్ను తరుముదురు
అయినను నీ వాక్యభయము నా హృదయమందు
నిలుచుచున్నది.
162 విస్తారమైన దోపుసొమ్ము సంపాదించినవానివలె
నీవిచ్చిన మాటనుబట్టి నేను సంతోషించుచున్నాను.
163 అబద్ధము నాకసహ్యము అది నాకు హేయము
నీ ధర్మశాస్త్రము నాకు ప్రీతికరము.
164 నీ న్యాయవిధులనుబట్టి
దినమునకు ఏడు మారులు నేను నిన్ను స్తుతించుచున్నాను.
165 నీ ధర్మశాస్త్రమును ప్రేమించువారికి ఎంతో నెమ్మది
కలదు
వారు తూలి తొట్రిల్లుటకు కారణమేమియులేదు.
166 యెహోవా, నీ రక్షణకొరకు నేను కనిపెట్టుచున్నాను
నీ ఆజ్ఞలను అనుసరించి నడుచుకొనుచున్నాను.
167 నేను నీ శాసనములనుబట్టి ప్రవర్తించుచున్నాను
అవి నాకు అతి ప్రియములు.
168 నా మార్గములన్నియు నీ యెదుట నున్నవి
నీ ఉపదేశములను నీ శాసనములను నేను అనుసరించుచున్నాను.

తౌ.

యెహోవా, నా మొర్ర నీ సన్నిధికి వచ్చును 169
గాక
నీ మాటచొప్పున నాకు వివేకము నిమ్ము
నా విన్నపము నీ సన్నిధిని చేరనిమ్ము 170
నీవిచ్చిన మాటచొప్పున నన్ను విడిపింపుము.
నీవు నీ కట్టడలను నాకు బోధించుచున్నావు 171
నా పెదవులు నీ స్తోత్రము నుచ్చరించును
నీ ఆజ్ఞలన్నియు న్యాయములు 172
నీ వాక్యమునుగూర్చి నా నాలుక పాడును.
నేను నీ ఉపదేశములను కోరుకొనియున్నాను 173
నీ చెయ్యి నాకు సహాయమగును గాక.
యెహోవా, నీ రక్షణకొరకు నేను మిగుల ఆశ 174
పడుచున్నాను
నీ ధర్మశాస్త్రము నాకు సంతోషకరము.
నీవు నన్ను బ్రదికింపుము నేను నిన్ను స్తుతించెదను 175
నీ న్యాయవిధులు నాకు సహాయములగును గాక.
నేను నీ ఆజ్ఞలను మరచువాడను కాను 176
తప్పిపోయిన గొఱ్ఱెవలె నేను త్రోవవిడిచి తిరిగిన
యెడల నీ సేవకుని వెదకి పట్టుకొనుము.

## 120

యాత్రకీర్తన.

నా శ్రమలో నేను యెహోవాకు మొఱ్ఱ
పెట్టితిని
ఆయన నాకు ఉత్తరమిచ్చెను.
యెహోవా, అబద్ధమాడు పెదవులనుండియు 2
మోసకరమైన నాలుకనుండియు నా ప్రాణమును
విడిపింపుము.
మోసకరమైన నాలుకా, ఆయన నీకేమి చేయును? 3
ఇంతకంటె అధికముగా నీకేమి చేయును?
తంగేడునిప్పులతో కూడిన బాణములను 4
బలాఢ్యుని వాడిగల బాణములను (నీమీద
వేయును.)
అయ్యో నేను మెషెకులో పరదేశినై యున్నాను. 5
కేదారు గుడారములయొద్ద కాపురమున్నాను.
కలహప్రియునియొద్ద 6
నేను చిరకాలము నివసించినవాడను.
నేను కోరునది సమాధానమే 7
అయినను మాట నా నోట వచ్చినతోడనే వారు
యుద్ధమునకు సిద్ధమగుదురు.

## 121

యాత్రకీర్తన.

కొండలతట్టు నా కన్ను లెత్తుచున్నాను
నాకు సహాయము ఎక్కడనుండి వచ్చును?
యెహోవావలననే నాకు సహాయము కలుగును 2
ఆయన భూమ్యాకాశములను సృజించినవాడు.
ఆయన నీ పాదము తొట్రిల్లనియ్యడు 3

నిన్ను కాపాడువాడు కునుకడు.
4 ఇశ్రాయేలును కాపాడువాడు కునుకడు నిద్రపోడు
5 యెహోవాయే నిన్ను కాపాడువాడు
నీ కుడిప్రక్కను యెహోవా నీకు నీడగా ఉండును.
6 పగలు ఎండ దెబ్బయైనను
రాత్రి వెన్నెల దెబ్బయైనను నీకు తగలదు.
7 ఏ అపాయమును రాకుండ యెహోవా నిన్ను కాపాడును
ఆయన నీ ప్రాణమును కాపాడును.
8 ఇది మొదలుకొని నిరంతరము
నీ రాకపోకలయందు యెహోవా నిన్ను కాపాడును.

## 122

యాత్రకీర్తన. దావీదుది.

—యెహోవా మందిరమునకు వెళ్లుదమని
జనులు నాతో అనినప్పుడు నేను సంతోషించితిని.
2-4 యెరూషలేమా, మా పాదములు నీ గుమ్మములలో నిలుచుచున్నవి
యెరూషలేమా, బాగుగా కట్టబడిన పట్టణమువలె నీవు కట్టబడియున్నావు
ఇశ్రాయేలీయులకు నియమింపబడిన శాసనమును బట్టి యెహోవా నామమునకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుటకై
వారి గోత్రములు యెహోవా గోత్రములు అక్కడికి ఎక్కి వెళ్లును.
5 అచ్చట న్యాయము తీర్చుటకై సింహాసనములు
దావీదు వంశీయుల సింహాసనములు స్థాపింపబడియున్నవి.
6 యెరూషలేముయొక్క క్షేమముకొరకు ప్రార్థన చేయుడి
(యెరూషలేమా) నిన్ను ప్రేమించువారు వర్ధిల్లుదురు.
7 నీ ప్రాకారములలో నెమ్మది కలుగును గాక.
నీ నగరులలో క్షేమముండును గాక.
8 నా సహోదరుల నిమిత్తమును నా సహవాసుల నిమిత్తమును
నీకు క్షేమము కలుగును గాక అని నేనందును.
9 మన దేవుడైన యెహోవా మందిరము నిమిత్తము
నీకు మేలుచేయ ప్రయత్నించెదను.

## 123

యాత్రకీర్తన.

ఆకాశమందు ఆసీనుడవైనవాడా,
నీ తట్టు నా కన్నులెత్తుచున్నాను.
2 దాసుల కన్నులు తమ యజమానుని చేతితట్టును
దాసి కన్నులు తన యజమానురాలి చేతితట్టును చూచునట్లు
మన దేవుడైన యెహోవా మనలను కరుణించువరకు
మన కన్నులు ఆయనతట్టు చూచుచున్నవి.
యెహోవా, మేము అధిక తిరస్కారము పొందితిమి 3
అహంకారుల నిందయు గర్విష్ఠుల తిరస్కారమును
మామీదికి అధికముగా వచ్చియున్నవి.
మమ్మును కరుణింపుము మమ్మును కరుణింపుము. 4

## 124

యాత్రకీర్తన. దావీదుది.

మనుష్యులు మనమీదికి లేచినప్పుడు
యెహోవా మనకు తోడైయుండనియెడల
వారి ఆగ్రహము మనపైని రవులుకొనినప్పుడు 2
యెహోవా మనకు తోడైయుండనియెడల 3
వారు మనలను ప్రాణముతోనే మ్రింగివేసియుందురు
జలములు మనలను ముంచివేసి యుండును 4
ప్రవాహము మన ప్రాణములమీదుగా పొర్లి పారియుండును
ప్రవాహములై ఘోషించు జలములు 5
మన ప్రాణములమీదుగా పొర్లి పారియుండును
అని ఇశ్రాయేలీయులు అందురు గాక.
వారి పండ్లకు మనలను వేటగా అప్పగింపని 6
యెహోవా స్తుతినొందును గాక.
పక్షి తప్పించుకొనినట్లు మన ప్రాణము వేటకాండ్ల 7
ఉరినుండి తప్పించుకొనియున్నది
ఉరి తెంపబడెను మనము తప్పించుకొనియున్నాము.
భూమ్యాకాశములను సృజించిన యెహోవా 8
నామమువలననే
మనకు సహాయము కలుగుచున్నది.

## 125

యాత్రకీర్తన.

యెహోవాయందు నమ్మికయుంచువారు
కదలక నిత్యము నిలుచు సీయోను కొండవలె నుందురు.
యెరూషలేముచుట్టు పర్వతములున్నట్లు 2
యెహోవా ఇది మొదలుకొని నిత్యము తన ప్రజలచుట్టు ఉండును.
నీతిమంతులు పాపము చేయుటకు తమ చేతులు 3
చాపకుండునట్లు
భక్తిహీనుల రాజదండము నీతిమంతుల స్వాస్థ్యముమీద నుండదు.
యెహోవా, మంచివారికి మేలు చేయుము 4
యథార్థహృదయులకు మేలు చేయుము.

5 తమ వంకరత్రోవలకు తొలగిపోవువారిని
పాపము చేయువారితో కూడ యెహోవా కొని
పోవును
ఇశ్రాయేలుమీద సమాధానముండును గాక.

## 126

యాత్రకీర్తన.

సీయోనుకు తిరిగి వచ్చినవారిని యెహోవా చెర
లోనుండి రప్పించినప్పుడు
మనము కల కనినవారివలె నుంటిమి
2 మన నోట నిండ నవ్వుండెను
మన నాలుక ఆనందగానముతో నిండియుండెను.
అప్పుడు—యెహోవా వీరికొరకు గొప్పకార్య
ములు చేసెనని అన్యజనులు చెప్పుకొనిరి.
3 యెహోవా మనకొరకు గొప్పకార్యములు చేసి
యున్నాడు
మనము సంతోషభరితులమైతిమి.
4 దక్షిణదేశములో ప్రవాహములు పారునట్లుగా
యెహోవా, చెరపట్టబడిన మా వారిని రప్పిం
చుము.
5 కన్నీళ్లు విడుచుచు విత్తువారు
సంతోషగానముతో పంట కోసెదరు.
6 విత్తువాడు పిడికెడు విత్తనములు చేత పట్టుకొని
యేడ్చుచు పోవును
7 అయితే అతడు సంతోషగానము చేయుచు పనలు
మోసికొని వచ్చును.

## 127

యాత్రకీర్తన. సొలొమోనుది.

యెహోవా ఇల్లు కట్టించనియెడల
దాని కట్టువారి ప్రయాసము వ్యర్థమే.
యెహోవా పట్టణమును కాపాడనియెడల
దాని కావలికాయువారు మేలుకొని యుండుట
వ్యర్థమే.
2 మీరు వేకువనే లేచి చాలారాత్రియైన తరువాత
పండుకొనుచు కష్టార్జితమైన ఆహారము తినుచు
నుండుట వ్యర్థమే.
తన ప్రియులు నిద్రించుచుండగా ఆయన వారి
కిచ్చుచున్నాడు.
3 కుమారులు యెహోవా అనుగ్రహించు స్వాస్థ్యము
గర్భఫలము (ఆయన యిచ్చు) బహుమానమే
4 యౌవనకాలమందు పుట్టిన కుమారులు
బలవంతునిచేతిలోని బాణములవంటివారు.
5 వారితో తన అంబులపొది నింపుకొనినవాడు
ధన్యుడు
అట్టివారు సిగ్గుపడక గుమ్మములో తమ విరోధు
లతో వాదించుదురు.

## 128

యాత్రకీర్తన.

యెహోవాయందు భయభక్తులు కలిగి
ఆయన త్రోవలయందు నడుచువారందరు ధన్యులు.
2 నిశ్చయముగా నీవు నీ చేతుల కష్టార్జితము ననుభ
వించెదవు
నీవు ధన్యుడవు నీకు మేలు కలుగును.
3 నీ లోగిట నీ భార్య ఫలించు ద్రాక్షావల్లివలె
నుండును
నీ భోజనపు బల్లచుట్టు నీ పిల్లలు
ఒలీవ మొక్కలవలె నుందురు.
4 యెహోవాయందు భయభక్తులుగలవాడు
ఈలాగు ఆశీర్వదింపబడును.
5 సీయోనులోనుండి యెహోవా నిన్ను ఆశీర్వ
దించును
నీ జీవితకాలమంతయు యెరూషలేముకు క్షేమము
కలుగుట చూచెదవు
6 నీ పిల్లల పిల్లలను నీవు చూచెదవు.
ఇశ్రాయేలుమీద సమాధానముండును గాక.

## 129

యాత్రకీర్తన.

ఇశ్రాయేలు ఇట్లనును
—నా యౌవనకాలము మొదలుకొని పగవారు
నాకు అధిక బాధలు కలుగజేయుచు వచ్చిరి
2 నా యౌవనకాలము మొదలుకొని నాకు అధిక
బాధలు కలుగజేయుచు వచ్చిరి
అయినను వారు నన్ను జయింపలేకపోయిరి.
3 దున్నువారు నా వీపుమీద దున్నిరి
వారు చాళ్లను పొడుగుగా చేసిరి.
4 యెహోవా న్యాయవంతుడు
భక్తిహీనులు కట్టిన త్రాళ్లను ఆయన తెంపి
యున్నాడు.
5 సీయోను పగవారందరు
సిగ్గుపడి వెనుకకు త్రిప్పబడుదురు గాక.
6 వారు ఇంటిమీద పెరుగు గడ్డివలె నుందురు గాక
ఎదగక మునుపే అది వాడిపోవును
7 కోయువాడు తన గుప్పిలినైనను
పనలు కట్టువాడు తన ఒడినైనను దానితో నింపు
కొనడు.
8 దారిని పోవువారు—యెహోవా ఆశీర్వాదము
నీమీద నుండునుగాక
—యెహోవా నామమున మేము మిమ్ము దీవించు
చున్నాము అని అనకయుందురు.

## 130

యాత్రకీర్తన.

యెహోవా, అగాధస్థలములలోనుండి నేను నీకు
మొఱ్ఱపెట్టుచున్నాను.
2 ప్రభువా, నా ప్రార్థన ఆలకింపుము
నీ చెవి యొగ్గి నా ఆర్తధ్వని వినుము.

3 యెహోవా, నీవు దోషములను కనిపెట్టి చూచిన యెడల
ప్రభువా, ఎవడు నిలువగలడు?
4 అయినను జనులు నీయందు భయభక్తులు నిలుపునట్లు నీయొద్ద క్షమాపణ దొరుకును.
5 యెహోవాకొరకు నేను కనిపెట్టుకొనుచున్నాను
నా ప్రాణము ఆయనకొరకు కనిపెట్టుకొనుచున్నది.
ఆయన మాటమీద నేను ఆశపెట్టుకొనియున్నాను.
6 కావలివారు ఉదయముకొరకు కనిపెట్టుటకంటె ఎక్కువగా
నా ప్రాణము ప్రభువుకొరకు కనిపెట్టుచున్నది
కావలివారు ఉదయముకొరకు కనిపెట్టుటకంటె ఎక్కువగా
నా ప్రాణము కనిపెట్టుచున్నది.
7 ఇశ్రాయేలూ, యెహోవామీద ఆశపెట్టుకొనుము
యెహోవాయొద్ద కృప దొరుకును
ఆయనయొద్ద సంపూర్ణ విమోచన దొరుకును.
8 ఇశ్రాయేలీయుల దోషములన్నిటినుండి ఆయన వారిని విమోచించును.

## 131

యాత్రకీర్తన. దావీదుది.

యెహోవా, నా హృదయము అహంకారముగలది కాదు
నా కన్నులు మీదు చూచునవి కావు
నాకు అందనివాటియందైనను గొప్పవాటియందైనను నేను అభ్యాసము చేసికొనుట లేదు.
2 నేను నా ప్రాణమును నిమ్మళపరచుకొనియున్నాను
సముదాయించుకొని యున్నాను
చనుపాలు విడిచిన పిల్ల తన తల్లియొద్దనున్నట్లు
చనుపాలు విడిచిన పిల్లయున్నట్లు నా ప్రాణము నాయొద్ద నున్నది.
3 ఇశ్రాయేలూ, ఇది మొదలుకొని నిత్యము యెహోవామీదనే ఆశపెట్టుకొనుము.

## 132

యాత్రకీర్తన.

యెహోవా, దావీదుకు కలిగిన బాధలన్నిటిని అతని పక్షమున జ్ఞాపకము చేసికొనుము.
2 అతడు యెహోవాతో ప్రమాణపూర్వకముగా మాటయిచ్చి
3-5 యాకోబుయొక్క బలిష్ఠునికి మ్రొక్కుబడి చేసెను.
ఎట్లనగా యెహోవాకు నేనొక స్థలము చూచువరకు
యాకోబుయొక్క బలిష్ఠునికి ఒక నివాసస్థలము నేను చూచువరకు
నివాసస్థానమైన గుడారములో నేను ప్రవేశింపను
నేను పరుండు మంచముమీది కెక్కను
నా కన్నులకు నిద్ర రానియ్యను
నా కనురెప్పలకు కునికిపాటు రానియ్యననెను.
అది ఎఫ్రాతాలోనున్నదని మేము వింటిమి 6
యాయరు పొలములలో అది దొరికెను.
ఆయన నివాసస్థలములకు పోదము రండి 7
ఆయన పాదపీఠము ఎదుట సాగిలపడుదము రండి.
యెహోవా, లెమ్ము నీ బలసూచకమైన మందసముతోకూడ రమ్ము 8
నీ విశ్రాంతి స్థలములో ప్రవేశింపుము.
నీ యాజకులు నీతిని వస్త్రమువలె ధరించుకొందురు గాక 9
నీ భక్తులు ఉత్సాహగానము చేయుదురు గాక.
నీ సేవకుడైన దావీదు నిమిత్తము 10
నీ అభిషిక్తునికి విముఖుడవై యుండకుము.
—నీ గర్భఫలమును నీ రాజ్యముమీద నేను నియమింతును.
నీ కుమారులు నా నిబంధనను గైకొనినయెడల 11
నేను వారికి బోధించు నా శాసనమును వారు అనుసరించినయెడల
వారి కుమారులుకూడ నీ సింహాసనముమీద నిత్యము కూర్చుందురని
యెహోవా సత్యప్రమాణము దావీదుతో చేసెను 12
ఆయన మాట తప్పనివాడు.
యెహోవా సీయోనును ఏర్పరచుకొని యున్నాడు 13
తనకు నివాసస్థలముగా దాని కోరుకొని యున్నాడు.
ఇది నేను కోరినస్థానము ఇది నిత్యము నాకు విశ్రమస్థానముగా నుండును 14
ఇక్కడనే నేను నివసించెదను
దాని ఆహారమును నేను నిండారులుగా దీవించెదను 15
దానిలోని బీదలను ఆహారముతో తృప్తిపరచెదను
దాని యాజకులకు రక్షణను వస్త్రముగా ధరింపజేసెదను 16
దానిలోని భక్తులు బిగ్గరగా ఆనందగానము చేసెదరు.
అక్కడ దావీదుకు కొమ్ము మొలవజేసెదను 17
నా అభిషిక్తునికొరకు నేనచ్చట ఒక దీపము సిద్ధపరచి యున్నాను.
అతని శత్రువులకు అవమానమును వస్త్రముగా ధరింపజేసెదను 18
అతని కిరీటము అతనిమీదనే యుండి తేజరిల్లును
(అనెను)

133 యాత్రకీర్తన. దావీదుది.
సహోదరులు ఐక్యత కలిగి నివసించుట
ఎంత మేలు ఎంత మనోహరము.
2 అది తలమీద పోయబడి అహరోను గడ్డము
మీదుగా కారి అతని అంగీల అంచువరకు దిగ
జారిన పరిమళతైలమువలె నుండును
3 సీయోను కొండలమీదికి దిగి వచ్చు హెర్మోను
మంచువలె నుండును.
ఆశీర్వాదమును శాశ్వత జీవమును
అచ్చట నుండవలెనని యెహోవా సెలవిచ్చి
యున్నాడు.

134 యాత్రకీర్తన.
యెహోవా సేవకులారా,
యెహోవా మందిరములో రాత్రి నిలుచుండు
వారలారా,
మీరందరు యెహోవాను సన్నుతించుడి.
2 పరిశుద్ధస్థలమువైపు మీ చేతులెత్తి యెహోవాను
సన్నుతించుడి.
3 భూమ్యాకాశములను సృజించిన యెహోవా
సీయోనులోనుండి నిన్ను ఆశీర్వదించును గాక.

135 యెహోవాను స్తుతించుడి
యెహోవా నామమును స్తుతించుడి
యెహోవా సేవకులారా,
2 యెహోవా మందిరములో
మన దేవుని మందిరపు ఆవరణములలో నిలుచుండు
వారలారా,
యెహోవాను స్తుతించుడి.
3 యెహోవా దయాళుడు యెహోవాను స్తుతిం
చుడి
ఆయన నామమును కీర్తించుడి అది మనోహరము.
4 యెహోవా తనకొరకు యాకోబును ఏర్పరచు
కొనెను
తనకు స్వకీయధనముగా ఇశ్రాయేలును ఏర్పరచు
కొనెను.
5 యెహోవా గొప్పవాడనియు
మన ప్రభువు సమస్త దేవతలకంటె గొప్పవాడనియు
నేనెరుగుదును.
6 ఆకాశమందును భూమియందును
సముద్రములయందును మహాసముద్రములన్నిటి
యందును
ఆయన తనకిష్టమైనదంతయు జరిగించువాడు.
7 భూదిగంతములనుండి ఆవిరి లేవజేయువాడు
ఆయనే
వాన కురియునట్లు మెరుపు పుట్టించువాడు ఆయనే
తన నిధులలోనుండి గాలిని ఆయన బయలువెళ్ల
జేయును.

ఐగుప్తులో మనుష్యుల తొలిచూలులను పశువుల 8
తొలిచూలులను ఆయన హతముచేసెను.
ఐగుప్తూ, నీ మధ్యను ఫరోయెదుటను అతని 9
ఉద్యోగస్థుల యెదుటను
ఆయనే సూచకక్రియలను మహత్కార్యములను
జరిగించెను.
అనేకులైన అన్యజనులను బలిష్ఠులైన రాజులను 10
ఆయన హతముచేసినవాడు.
అమోరీయుల రాజైన సీహోనును 11
బాషానురాజైన ఓగును హతముచేసెను
కనాను రాజ్యములన్నిటిని పాడుచేసెను.
ఆయన వారి దేశమును స్వాస్థ్యముగాను 12
ఇశ్రాయేలీయులైన తన ప్రజలకు స్వాస్థ్యముగాను
అప్పగించెను.
యెహోవా, నీ నామము నిత్యము నిలుచును 13
యెహోవా, నీ జ్ఞాపకార్థమైన నామము తర
తరములుండును.
యెహోవా తన ప్రజలకు న్యాయము తీర్చును 14
తన సేవకులనుబట్టి ఆయన సంతాపము నొందును.
అన్యజనుల విగ్రహములు వెండి బంగారువి 15
అవి మనుష్యుల చేతిపనులు.
వాటికి నోరుండియు పలుకవు 16
కన్నులుండియు చూడవు
చెవులుండియు వినవు 17
వాటి నోళ్లలో ఊపిరి లేశమైన లేదు.
వాటిని చేయువారును వాటియందు నమ్మికయుంచు 18
వారందరును వాటితో సమానులగుదురు.
ఇశ్రాయేలు వంశీయులారా, యెహోవాను 19
సన్నుతించుడి
అహరోను వంశీయులారా, యెహోవాను సన్ను
తించుడి
లేవి వంశీయులారా, యెహోవాను సన్నుతించుడి 20
యెహోవాయందు భయభక్తులుగలవారలారా,
యెహోవాను సన్నుతించుడి.
యెరూషలేములో నివసించు యెహోవా 21
సీయోనులోనుండి సన్నుతింపబడును గాక
యెహోవాను స్తుతించుడి.

136 యెహోవా దయాళుడు ఆయనకు కృతజ్ఞతా
స్తుతులు చెల్లించుడి
ఆయన కృప నిరంతరముండును.
దేవదేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి 2
ఆయన కృప నిరంతరముండును.
ప్రభువుల ప్రభువునకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి 3
ఆయన కృప నిరంతరముండును.
ఆయన ఒక్కడే మహాశ్చర్యకార్యములు చేయు 4
వాడు

ఆయన కృప నిరంతరముండును.
5 తన జ్ఞానముచేత ఆయన ఆకాశమును కలుగజేసెను
ఆయన కృప నిరంతరముండును.
6 ఆయన భూమిని నీళ్లమీద పరచినవాడు
ఆయన కృప నిరంతరముండును.
7 ఆయన గొప్ప జ్యోతులను నిర్మించినవాడు
ఆయన కృప నిరంతరముండును.
8 పగటి నేలుటకు ఆయన సూర్యుని చేసెను
ఆయన కృప నిరంతరముండును.
9 రాత్రి నేలుటకు ఆయన చంద్రుని నక్షత్రములను చేసెను
ఆయన కృప నిరంతరముండును.
10 ఐగుప్తుదేశపు తొలిచూలులను ఆయన హతము చేసెను
ఆయన కృప నిరంతరముండును.
11 వారి మధ్యనుండి ఇశ్రాయేలీయులను ఆయన రప్పించెను
ఆయన కృప నిరంతరముండును.
12 చేయి చాచి తన బాహుబలముచేత వారిని రప్పించెను
ఆయన కృప నిరంతరముండును.
13 ఎఱ్ఱసముద్రమును ఆయన పాయలుగా చీల్చెను.
ఆయన కృప నిరంతరముండును.
14 ఆయన ఇశ్రాయేలీయులను దాని నడుమ దాటిపో జేసెను
ఆయన కృప నిరంతరముండును.
15 ఫరోను అతని సైన్యమును ఎఱ్ఱసముద్రములో ఆయన ముంచివేసెను
ఆయన కృప నిరంతరముండును.
16 అరణ్యమార్గమున ఆయన తన ప్రజలను తోడు కొని వచ్చెను
ఆయన కృప నిరంతరముండును.
17 గొప్ప రాజులను ఆయన హతముచేసెను
ఆయన కృప నిరంతరముండును.
18 ప్రసిద్ధినొందిన రాజులను ఆయన హతముచేసెను
ఆయన కృప నిరంతరముండును.
19 అమోరీయుల రాజైన సీహోనును ఆయన హతము చేసెను
ఆయన కృప నిరంతరముండును.
20 బాషాను రాజైన ఓగును ఆయన హతముచేసెను
ఆయన కృప నిరంతరముండును.
21 ఆయన వారి దేశమును (మనకు) స్వాస్థ్యముగా అప్పగించెను
ఆయన కృప నిరంతరముండును.
22 తన సేవకుడైన ఇశ్రాయేలుకు దానిని స్వాస్థ్య ముగా అప్పగించెను
ఆయన కృప నిరంతరముండును.
మనము దీనదశలోనున్నప్పుడు ఆయన మనలను జ్ఞాపకము చేసికొనెను 23
ఆయన కృప నిరంతరముండును.
మనలను బాధించినవారి చేతిలోనుండి మనలను విడిపించెను 24
ఆయన కృప నిరంతరముండును.
సమస్త జీవులకును ఆయన ఆహారమిచ్చుచున్నాడు 25
ఆయన కృప నిరంతరముండును.
ఆకాశమందుండు దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి 26
ఆయన కృప నిరంతరముండును.

## 137

బాబెలు నదులయొద్ద కాపురమున్నప్పుడు
మనము సీయోనును జ్ఞాపకము చేసికొని యేడ్చు చుంటిమి.
వాటిమధ్యనున్న నిరవంజిచెట్లకు మన సితారాలు తగిలించితిమి. 2
అచ్చట మనలను చెరగొన్నవారు—ఒక కీర్తన పాడుడి అనిరి 3
మనలను బాధించినవారు
—సీయోను కీర్తనలలో ఒకదానిని మాకు వినిపించుడి అని మనవలన ఉల్లాసము గోరిరి.
అన్యుల దేశములో యెహోవా కీర్తనలు మన మెట్లు పాడుదుము? 4
యెరూషలేమా, నేను నిన్ను మరచినయెడల 5
నా కుడిచేయి తన నేర్పు మరచును గాక.
నేను నిన్ను జ్ఞాపకము చేసికొననియెడల 6
నా ముఖ్య సంతోషముకంటె
నేను యెరూషలేమును హెచ్చుగా ఎంచనియెడల
నా నాలుక నా అంగిటికి అంటుకొనును గాక.
యెహోవా, ఎదోము జనులు చేసినది జ్ఞాపకము చేసికొనుము 7
యెరూషలేము పాడైన దినమును జ్ఞాపకమునకు తెచ్చుకొనుము.
—దానిని నాశనముచేయుడి
సమూలధ్వంసము చేయుడి అని వారు చాటిరి గదా.
పాడుచేయబడబోవు బాబెలు కుమారీ, 8
నీవు మాకు చేసిన క్రియలనుబట్టి నీకు ప్రతికారము చేయువాడు ధన్యుడు
నీ పసిపిల్లలను పట్టుకొని వారిని బండకు వేసి కొట్టువాడు ధన్యుడు. 9

## 138

దావీదు కీర్తన.

నేను నా పూర్ణహృదయముతో నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాను
దేవతల యెదుట నిన్ను కీర్తించెదను.

2 నీ పరిశుద్ధాలయముతట్టు నేను నమస్కారము
చేయుచున్నాను
నీ నామమంతటికంటె నీవిచ్చిన వాక్యమును నీవు
గొప్పచేసియున్నావు.
నీ కృపాసత్యములనుబట్టి నీ నామమునకు కృత
జ్ఞతాస్తుతులు నేను చెల్లించెదను.
3 నేను మొఱ్ఱపెట్టిన దినమున నీవు నాకు ఉత్తర
మిచ్చితివి
నా ప్రాణములో త్రాణ పుట్టించి నన్ను ధైర్య
పరచితివి.
4 యెహోవా, భూరాజులందరు నీవు సెలవిచ్చిన
మాటలు విని
నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించెదరు.
5 —యెహోవా మహా ప్రభావముగలవాడని
వారు యెహోవా మార్గములనుగూర్చి గానము
చేసెదరు.
6 యెహోవా మహోన్నతుడైనను ఆయన దీను
లను లక్ష్యపెట్టును
ఆయన దూరమునుండి గర్విష్ఠులను బాగుగా
ఎరుగును.
7 నేను ఆపదలలో చిక్కుబడి యున్నను నీవు నన్ను
బ్రదికించెదవు
నా శత్రువుల కోపమునుండి నన్ను రక్షించుటకై
నీవు నీ చేయి చాపెదవు
నీ కుడిచేయి నన్ను రక్షించును.
8 యెహోవా నా పక్షమున కార్యము సఫలము
చేయును.
యెహోవా, నీ కృప నిరంతరముండును
నీ చేతికార్యములను విడిచిపెట్టకుము.

## 139

ప్రధానగాయకునికి.
దావీదు కీర్తన.

యెహోవా, నీవు నన్ను పరిశోధించి తెలిసికొని
యున్నావు
2 నేను కూర్చుండుట నేను లేచుట నీకు తెలియును
నాకు తలంపు పుట్టకమునుపే నీవు నా మనస్సు
గ్రహించుచున్నావు.
3 నా నడకను నా పడకను నీవు పరిశీలనచేసి
యున్నావు.
నా చర్యలన్నిటిని నీవు బాగుగా తెలిసికొని
యున్నావు.
4 యెహోవా, మాట నా నాలుకకు రాకమునుపే
అది నీకు పూర్తిగా తెలిసియున్నది.
5 వెనుకను ముందును నీవు నన్ను ఆవరించియున్నావు
నీ చేయి నామీద ఉంచియున్నావు.
6 ఇట్టి తెలివి నాకు మించినది
అది అగోచరము అది నాకందదు.
నీ ఆత్మయొద్దనుండి నేనెక్కడికి పోవుదును? 7
నీ సన్నిధినుండి నేనెక్కడికి పారిపోవుదును?
నేను ఆకాశమున కెక్కినను నీవు అక్కడను ఉన్నావు 8
నేను పాతాళమందు పండుకొనినను నీవు అక్క
డను ఉన్నావు.
నేను వేకువ రెక్కలు కట్టుకొని 9
సముద్ర దిగంతములలో నివసించినను
అక్కడను నీ చేయి నన్ను నడిపించును 10
నీ కుడిచేయి నన్ను పట్టుకొనును.
—అంధకారము నన్ను మరుగుచేయును 11
నాకు కలుగు వెలుగు రాత్రివలె ఉండును అని
నేననుకొనిన పక్షమున
చీకటియైనను నీకు చీకటి కాకపోవును 12
రాత్రి పగటివలె నీకు వెలుగుగా ఉండును
చీకటియు వెలుగును నీకు ఏకరీతిగా ఉన్నవి.
నా అంతరింద్రియములను నీవే కలుగజేసితివి 13
నా తల్లి గర్భమందు నన్ను నిర్మించినవాడవు నీవే.
నీవు నన్ను కలుగజేసిన విధము చూడగా భయ 14
మును ఆశ్చర్యమును నాకు పుట్టుచున్నవి
అందునుబట్టి నేను నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించు
చున్నాను
నీ కార్యములు ఆశ్చర్యకరములు
ఆ సంగతి నాకు బాగుగా తెలిసియున్నది.
నేను రహస్యమందు పుట్టిననాడు 15
భూమియొక్క అగాధస్థలములలో విచిత్రముగా
నిర్మింపబడిననాడు
నాకు కలిగిన యెముకలును నీకు మరుగైయుండలేదు.
నేను పిండమునై యుండగా నీ కన్నులు నన్ను 16
చూచెను
నియమింపబడిన దినములో ఒకటైన కాకమునుపే
నా దినములన్నియు నీ గ్రంథములో లిఖితము
లాయెను.[1]
దేవా, నీ తలంపులు నా కెంత ప్రియమైనవి 17
వాటి మొత్తమెంత గొప్పది.
వాటిని లెక్కించెద ననుకొంటినా అవి యిసుక 18
కంటెను లెక్కకు ఎక్కువై యున్నవి
నేను మేల్కొంటినా యింకను నీయొద్దనే యుందును.
దేవా, నీవు భక్తిహీనులను సంహరించుట మేలు. 19
నరహంతకులారా, నాయొద్దనుండి తొలగిపోవుడి.
వారు దురాలోచనతో నిన్నుగూర్చి పలుకుదురు 20
మోసపుచ్చుటకై నీ నామమునుబట్టి ప్రమాణము
చేయుదురు.
యెహోవా, నిన్ను ద్వేషించువారిని నేనును 21
ద్వేషించుచున్నాను గదా.

1 లేక, ఒకటైనను కాకమునుపే నా అవయవములన్నియు దినదినము నిరూపింపబడుచుండగా అవన్నియు నీ గ్రంథములో లిఖితములాయెను.

నీ మీద లేచువారిని నేను అసహ్యించుకొను
చున్నాను గదా
22 వారియందు నాకు పూర్ణద్వేషము కలిగియున్నది
వారిని నాకు శత్రువులగా భావించుకొను
చున్నాను.
23 దేవా, నన్ను పరిశోధించి నా హృదయమును
తెలిసికొనుము
నన్ను పరీక్షించి నా ఆలోచనలను తెలిసికొనుము
24 ఆయాసకరమైన మార్గము నాయందున్నదేమో
చూడుము
నిత్యమార్గమున నన్ను నడిపింపుము.

## 140

ప్రధానగాయకునికి.
దావీదు కీర్తన.

యెహోవా, దుష్టుల చేతిలోనుండి నన్ను విడి
పింపుము
బలాత్కారము చేయువారి చేతిలో పడకుండ
నన్ను కాపాడుము.
2 వారు తమ హృదయములలో అపాయకరమైన
యోచనలు చేయుదురు
వారు నిత్యము యుద్ధము రేప జూచుచుందురు.
3 పాము నాలుకవలె వారు తమ నాలుకలు వాడి
చేయుదురు
వారి పెదవుల క్రింద సర్పవిషమున్నది. (సెలా.)
4 యెహోవా, భక్తిహీనుల చేతిలోపడకుండ నన్ను
కాపాడుము
బలాత్కారము చేయువారి చేతిలోనుండి నన్ను
రక్షింపుము.
నేను అడుగు జారిపడునట్లు చేయుటకు వారు
ఉద్దేశించుచున్నారు.
5 గర్విష్ఠులు నాకొరకు ఉరిని త్రాళ్లను చాటుగా
ఒడ్డియున్నారు
వారు త్రోవప్రక్కను వల పరచియున్నారు
నన్ను పట్టుకొనుటకై ఉచ్చుల నొగ్గియున్నారు.
(సెలా.)
6 అయినను నేను యెహోవాతో ఈలాగు మనవి
చేయుచున్నాను
—యెహోవా, నీవే నా దేవుడవు నా విజ్ఞాపన
లకు చెవి యొగ్గుము.
7 ప్రభువైన యెహోవా నా రక్షణదుర్గము
యుద్ధదినమున నీవు నా తలను కాయుదువు.
8 యెహోవా, భక్తిహీనుల కోరికలను తీర్చకుము
వారు అతిశయించకుండునట్లు వారి ఆలోచనను
కొనసాగింపకుము. (సెలా.)
9 నన్ను చుట్టుకొనువారు తలయెత్తినయెడల
వారి పెదవుల చేటు వారిని ముంచును గాక
10 కణకణలాడు నిప్పులు వారిమీద వేయబడును గాక
వారు తిరిగి లేవకుండునట్లు అగ్నిహోత్రములో
వారు కూల్చబడుదురు గాక
అగాధ జలములలోకి త్రోయబడుదురు గాక
కొండెములాడువారు భూమిమీద స్థిరపడకుందురు 11
గాక
ఆపత్తు బలాత్కారులను తరిమి వారిని పడద్రో
యును గాక.
బాధింపబడువారి పక్షమున యెహోవా వ్యాజ్యె 12
మాడుననియు
దరిద్రులకు ఆయన న్యాయము తీర్చుననియు
నేనెరుగుదును.
నిశ్చయముగా నీతిమంతులు నీ నామమునకు 13
కృతజ్ఞతాస్తుతులు చెల్లించెదరు
యథార్థవంతులు నీ సన్నిధిని నివసించెదరు.

## 141

దావీదు కీర్తన.

యెహోవా, నేను నీకు మొఱ్ఱపెట్టుచున్నాను
నాయొద్దకు త్వరపడి రమ్ము
నేను మొఱ్ఱపెట్టగా నా మాటకు చెవి యొగ్గుము.
నా ప్రార్థన ధూపమువలెను 2
నేను చేతులెత్తుట సాయంకాల నైవేద్యమువలెను
నీ దృష్టికి అంగీకారములగును గాక.
యెహోవా, నా నోటికి కావలి యుంచుము 3
నా పెదవుల ద్వారమునకు కాపు పెట్టుము.
పాపము చేయువారితో కూడ 4
నేను దుర్ణీతికార్యములలో చొరబడకుండునట్లు
నా మనస్సు దుష్కార్యమునకు తిరుగనియ్యకుము
వారి రుచిగల పదార్థములు నేను తినకయుందును
గాక.
నీతిమంతులు నన్ను కొట్టుట నాకు ఉపకారము 5
వారు నన్ను గద్దించుట నాకు తైలాభిషేకము
నేను అట్టి అభిషేకమును త్రోసివేయకుందును గాక.
వారి దుష్క్రియలను చూచియు నేను తప్పక
ప్రార్థనచేయుచున్నాను.
వారి న్యాయాధిపతులు కొండ పేటుమీదనుండి 6
పడద్రోయబడుదురు
కావున జనులు నా మాటలు మధురమైనవని వాటిని
అంగీకరించుచున్నారు.
ఒకడు భూమిని దున్నుచు దాని పగులగొట్టునట్లు 7
మా యెముకలు పాతాళద్వారమున చెదిరియున్నవి.
యెహోవా, నా ప్రభువా, నా కన్నులు నీతట్టు 8
చూచుచున్నవి
నీ శరణుజొచ్చియున్నాను నా ప్రాణము ధార
పోయకుము.
నా నిమిత్తము వారు ఒడ్డిన వలనుండి 9
పాపము చేయువారి ఉచ్చులనుండి నన్ను తప్పించి
కాపాడుము.

నేను తప్పించుకొని పోవుచుండగా
భక్తిహీనులు తమ వలలలో చిక్కుకొందురు గాక.

## 142 గుహలో నున్నప్పుడు దావీదుచేసిన ప్రార్థన. దైవధ్యానము.

నేను ఎలుగెత్తి యెహోవాకు మొఱ్ఱలిడుచున్నాను
ఎలుగెత్తి యెహోవాను బతిమాలుకొనుచున్నాను.
బహు వినయముగా ఆయన సన్నిధిని నేను మొఱ్ఱపెట్టుచున్నాను.
నాకు కలిగిన బాధ ఆయన సన్నిధిని తెలియజెప్పుకొనుచున్నాను.
నాలో నా ప్రాణము క్రుంగియున్నప్పుడు నా మార్గము నీవు తెలియుదువు
నన్ను పట్టుకొనుటకై నేను నడువవలసిన త్రోవలో చాటుగా పగవారు ఉరినొడ్డుచున్నారు.
నా కుడిప్రక్కను నిదానించి చూడుము
నన్నెరిగినవాడు ఒకడును నాకు లేకపోయెను
ఆశ్రయమేదియు నాకు దొరకలేదు
నాయెడల జాలిపడువాడు ఒకడును లేడు.
యెహోవా, నీకే నేను మొఱ్ఱపెట్టుచున్నాను
నా ఆశ్రయదుర్గము నీవే
సజీవులున్న భూమిమీద నా స్వాస్థ్యము నీవే అని నేననుకొంటిని.
నేను చాలా క్రుంగియున్నాను నా మొఱ్ఱకు చెవి యొగ్గుము
నన్ను తరుమువారు నాకంటె బలిష్ఠులు వారి చేతిలోనుండి నన్ను విడిపింపుము.
నేను నీ నామమునకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించునట్లు
చెరసాలలోనుండి నా ప్రాణమును తప్పింపుము
అప్పుడు నీవు నాకు మహోపకారము చేసియుండుట చూచి
నీతిమంతులు నన్ను బట్టి అతిశయపడుదురు.

## 143 దావీదు కీర్తన.

యెహోవా, నా ప్రార్థన ఆలకింపుము
నా విన్నపములకు చెవి యొగ్గుము
నీ విశ్వాస్యతనుబట్టియు నీ నీతినిబట్టియు నాకు ఉత్తరమిమ్ము.
2 నీ సేవకునితో వ్యాజ్యమాడకుము
సజీవులలో ఒకడును నీ సన్నిధిని నీతిమంతుడుగా ఎంచబడడు.
3 శత్రువులు నన్ను తరుముచున్నారు
వారు నా ప్రాణమును నేల పడగొట్టుచున్నారు
చిరకాలముక్రిందట చనిపోయినవారితోపాటు
గాఢాంధకారములో నన్ను నివసింపజేయుచున్నారు.
కావున నా ఆత్మ నాలో క్రుంగియున్నది 4
నాలో నా హృదయము విస్మయమొందెను.
పూర్వదినములు జ్ఞాపకము చేసికొనుచున్నాను 5
నీ క్రియలన్నియు ధ్యానించుచున్నాను.
నేను నీ చేతుల పని యోచించుచున్నాను
నీతట్టు నా చేతులు చాపుచున్నాను 6
ఎండిపోయిన భూమివలె నా ప్రాణము నీకొరకు ఆశపడుచున్నది.
యెహోవా, నా ఆత్మ క్షీణించుచున్నది 7
త్వరగా నాకు ఉత్తరమిమ్ము
నేను సమాధిలోనికి దిగువారివలె కాకుండునట్లు
నీ ముఖమును నాకు మరుగుచేయకుము.
నీయందు నేను నమ్మిక యుంచియున్నాను 8
ఉదయమున నీ కృపావార్తను నాకు వినిపింపుము
నీ వైపు నా మనస్సు నేనెత్తికొనుచున్నాను.
నేను నడవవలసిన మార్గము నాకు తెలియజేయుము.
యెహోవా, నేను నీ మరుగు జొచ్చియున్నాను 9
నా శత్రువుల చేతిలోనుండి నన్ను విడిపింపుము
నీవే నా దేవుడవు నీ చిత్తానుసారముగా ప్రవర్తించుటకు నాకు నేర్పుము 10
దయగల నీ ఆత్మ సమభూమిగల ప్రదేశమందు నన్ను నడిపించును గాక.
యెహోవా, నీ నామమునుబట్టి నన్ను బ్రదికింపుము 11
నీ నీతినిబట్టి నా ప్రాణమును శ్రమలోనుండి తప్పింపుము.
నేను నీ సేవకుడను నీ కృపనుబట్టి నా శత్రువులను సంహరింపుము 12
నా ప్రాణమును బాధపరచువారినందరిని నశింపజేయుము.

## 144 దావీదు కీర్తన.

నాకు ఆశ్రయదుర్గమగు యెహోవా సన్నుతింపబడును గాక
ఆయన నా చేతులకు యుద్ధమును
నా వ్రేళ్లకు పోరాటమును నేర్పువాడైయున్నాడు.
ఆయన నాకు కృపానిధి నా కోట 2
నా దుర్గము నన్ను తప్పించువాడు
నా కేడెము నేనాశ్రయించువాడు.
ఆయన నా జనులను నాకు లోపరచువాడైయున్నాడు.
యెహోవా, నీవు నరులను లక్ష్యపెట్టుటకు వారు ఏపాటివారు? 3
నీవు వారిని ఎన్నికచేయుటకు మనుష్యులు ఏపాటివారు?
నరులు వట్టి ఊపిరిని పోలియున్నారు 4
వారి దినములు దాటిపో

5 యెహోవా, నీ ఆకాశమును వంచి దిగి రమ్ము
నీవు పర్వతములను ముట్టగా అవి పొగ రాజునట్లు వాటిని ముట్టుము
6 మెరుపులు మెరిపించి వారిని చెదరగొట్టుము
నీ బాణములు వేసి వారిని ఓడగొట్టుము.
7 పైనుండి నీ చెయ్యి చాచి నన్ను తప్పింపుము
మహా జలములలోనుండి
అన్యులచేతిలోనుండి నన్ను విడిపింపుము.
8 వారి నోరు వట్టి మాటలాడుచున్నది
వారి కుడిచేయి అబద్ధముతో కూడియున్నది.
9 దేవా, నిన్నుగూర్చి నేనొక క్రొత్త కీర్తన పాడెదను
పదితంతుల సితారాతో నిన్ను కీర్తించెదను.
10 నీవే రాజులకు విజయము దయచేయువాడవు
దుష్టుల ఖడ్గమునుండి నీవు నీ సేవకుడైన దావీదును తప్పించువాడవు
11 నన్ను తప్పింపుము అన్యుల చేతిలోనుండి నన్ను విడిపింపుము
వారి నోరు వట్టి మాటలాడుచున్నది
వారి కుడిచేయి అబద్ధముతో కూడియున్నది.
12 మా కుమారులు తమ యౌవన కాలమందు
ఎదిగిన మొక్కలవలె ఉన్నారు
మా కుమార్తెలు నగరునకై చెక్కిన మూలకంబముల వలె ఉన్నారు.
13 మా కొట్లు నింపబడి పలువిధములైన ద్రవ్యములకు నిధులుగా ఉన్నవి
మా గొఱ్ఱెలు వేలకొలదిగాను పదివేలకొలదిగాను
మా గడ్డి బీళ్లలో పిల్లలు వేయుచున్నవి.
14 మా యెద్దులు గొప్ప బరువులు మోయగలవి
మా వీధులలో చొరబడుటయైనను ఉరుకులెత్తుట యైనను లేదు
వాటిలో శ్రమగలవారి మొఱ్ఱ వినబడుటయైనను లేదు
ఇట్టి స్థితిగలవారు ధన్యులు.
15 యెహోవా తమకు దేవుడుగాగల జనులు ధన్యులు.

## 145

స్తుతి కీర్తన.
దావీదుది.

రాజవైన నా దేవా, నిన్ను ఘనపరచెదను.
నీ నామమును నిత్యము సన్నుతించెదను
2 అనుదినము నేను నిన్ను స్తుతించెదను
నిత్యము నీ నామమును స్తుతించెదను.
3 యెహోవా మహాత్మ్యముగలవాడు
ఆయన అధికస్తోత్రము నొందదగినవాడు
ఆయన మహాత్మ్యము గ్రహింప శక్యము కానిది.
4 ఒక తరమువారు మరియొక తరమువారియెదుట
నీ క్రియలను కొనియాడుదురు
నీ పరాక్రమక్రియలను తెలియజేయుదురు.
మహోన్నతమైన నీ ప్రభావమహిమను 5
నీ ఆశ్చర్యకార్యములను నేను ధ్యానించెదను
నీ భీకరకార్యముల విక్రమమును మనుష్యులు వివరించెదరు 6
నేను నీ మహాత్మ్యమును వర్ణించెదను.
నీ మహా దయాళుత్వమును గూర్చిన కీర్తిని వారు ప్రకటించెదరు 7
నీ నీతినిగూర్చి వారు గానము చేసెదరు.
యెహోవా దయాదాక్షిణ్యములు గలవాడు 8
ఆయన దీర్ఘశాంతుడు కృపాతిశయముగలవాడు.
యెహోవా అందరికిని ఉపకారి 9
ఆయన కనికరములు ఆయన సమస్తకార్యముల మీద నున్నవి.
యెహోవా, నీ క్రియలన్నియు నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నవి 10
నీ భక్తులు నిన్ను సన్నుతించుదురు
ఆయన రాజ్య మహోన్నత ప్రభావమును ఆయన బలమును 11
నరులకు తెలియజేయుటకై
నీ భక్తులు నీ రాజ్యప్రభావమునుగూర్చి చెప్పుకొందురు 12
నీ శౌర్యమునుగూర్చి పలుకుదురు.
నీ రాజ్యము శాశ్వతరాజ్యము 13
నీ రాజ్యపరిపాలన తరతరములు నిలుచును.
యెహోవా పడిపోవువారినందరిని ఉద్ధరించువాడు 14
క్రుంగిపోయిన వారినందరిని లేవనెత్తువాడు.
సర్వజీవుల కన్నులు నీవైపు చూచుచున్నవి 15
తగిన కాలమందు నీవు వారికి ఆహారమిచ్చుచున్నావు.
నీవు నీ గుప్పిలిని విప్పి ప్రతి జీవి కోరికను తృప్తి పరచుచున్నావు. 16
యెహోవా తన మార్గములన్నిటిలో నీతిగలవాడు 17
తన క్రియలన్నిటిలో కృప చూపువాడు.
తనకు మొఱ్ఱపెట్టువారికందరికి 18
తనకు నిజముగా మొఱ్ఱపెట్టువారికందరికి
యెహోవా సమీపముగా ఉన్నాడు.
తనయందు భయభక్తులుగలవారి కోరిక ఆయన నెరవేర్చును 19
వారి మొఱ్ఱ ఆలకించి వారిని రక్షించును.
యెహోవా తన్ను ప్రేమించువారినందరిని కాపాడును 20
అయితే భక్తిహీనులనందరిని ఆయన నాశనము చేయును.
నా నోరు యెహోవాను స్తోత్రము చేయును 21
శరీరులందరు ఆయన పరిశుద్ధ నామమును నిత్యము సన్నుతించుదురు గాక.

**146** యెహోవాను స్తుతించుడి.
నా ప్రాణమా, యెహోవాను స్తుతింపుము
2 నా జీవితకాలమంతయు నేను యెహోవాను స్తుతించెదను
నేను బ్రదుకుకాలమంతయు నా దేవుని కీర్తించెదను
3 రాజులచేతనైనను నరులచేతనైనను రక్షణ కలుగదు వారిని నమ్ముకొనకుడి
4 వారి ప్రాణము వెడలిపోవును వారు మంటిపాలగుదురు
వారి సంకల్పములు నాడే నశించును.
5 ఎవనికి యాకోబు దేవుడు సహాయుడగునో
ఎవడు తన దేవుడైన యెహోవామీద ఆశపెట్టుకొనునో వాడు ధన్యుడు.
6 ఆయన ఆకాశమును భూమిని సముద్రమును దాని లోనిది సర్వము సృజించినవాడు
ఆయన ఎన్నడును మాట తప్పనివాడు.
7 బాధపరచబడువారికి ఆయన న్యాయము తీర్చును
ఆకలిగొనినవారికి ఆహారము దయచేయును
యెహోవా బంధింపబడినవారిని విడుదల చేయును.
8 యెహోవా గుడ్డివారి కన్నులు తెరవజేయువాడు
యెహోవా క్రుంగినవారిని లేవనెత్తువాడు
యెహోవా నీతిమంతులను ప్రేమించువాడు
9 యెహోవా పరదేశులను కాపాడువాడు
ఆయన తండ్రిలేనివారిని విధవరాండ్లను ఆదరించువాడు
భక్తిహీనుల మార్గమును ఆయన వంకరమార్గముగా చేయును.
10 యెహోవా నిరంతరము ఏలును
సీయోనూ, నీ దేవుడు తరములన్నిటను రాజ్యము చేయును
యెహోవాను స్తుతించుడి.

**147** యెహోవాను స్తుతించుడి
మన దేవునికి స్తోత్రగానము చేయుట మంచిది
అది మనోహరము స్తోత్రముచేయుట ఒప్పిదము.
2 యెహోవాయే యెరూషలేమును కట్టువాడు
చెదరిన ఇశ్రాయేలీయులను పోగుచేయువాడు
3 గుండె చెదిరినవారిని ఆయన బాగుచేయువాడు
వారి గాయములు కట్టువాడు.
4 నక్షత్రముల సంఖ్యను ఆయన నియమించి యున్నాడు
వాటికన్నిటికి పేరులు పెట్టుచున్నాడు.
5 మన ప్రభువు గొప్పవాడు ఆయన అధిక శక్తిగలవాడు
ఆయన జ్ఞానమునకు మితిలేదు.
యెహోవా దీనులకు అండయైనవాడు 6
భక్తిహీనులను ఆయన నేలను కూల్చును.
కృతజ్ఞతాస్తుతులతో యెహోవాను కీర్తించుడి 7
సితారాతో మన దేవుని కీర్తించుడి.
ఆయన ఆకాశమును మేఘములతో కప్పువాడు 8
భూమికొరకు వర్షము సిద్ధపరచువాడు
పర్వతములమీద గడ్డి మొలిపించువాడు
పశువులకును అరుచుచుండు పిల్ల కాకులకును 9
ఆయన ఆహారమిచ్చువాడు.
గుఱ్ఱముల బలమునందు ఆయన సంతోషించడు 10
నరుల కాలిసత్తువయందు ఆయన ఆనందించడు.
తనయందు భయభక్తులుగలవారియందు 11
తన కృపకొరకు కనిపెట్టువారియందు
యెహోవా ఆనందించువాడై యున్నాడు.
యెరూషలేమా, యెహోవాను కొనియాడుము 12
సీయోనూ, నీ దేవుని కొనియాడుము.
ఆయన నీ గుమ్మముల గడియలు బలపరచియున్నాడు 13
నీ మధ్యను నీ పిల్లలను ఆశీర్వదించి యున్నాడు.
నీ సరిహద్దులలో సమాధానము కలుగజేయువాడు ఆయనే 14
మంచిగోధుమలతో నిన్ను తృప్తిపరచువాడు ఆయనే
భూమికి ఆజ్ఞనిచ్చువాడు ఆయనే 15
ఆయన వాక్యము బహు వేగముగా పరుగెత్తును.
గొఱ్ఱెబొచ్చువంటి హిమము కురిపించువాడు ఆయనే 16
బూడిదెవంటి మంచు కణములు చల్లువాడు ఆయనే
ముక్కముక్కలుగా వడగండ్లు విసరువాడు ఆయనే. 17
ఆయన పుట్టించు చలికి ఎవరు నిలువగలరు?
ఆయన ఆజ్ఞ ఇయ్యగా అవన్నియు కరిగిపోవును 18
ఆయన తనగాలి విసరజేయగా నీళ్లు ప్రవహించును.
ఆయన తన వాక్యము యాకోబుకు తెలియజేసెను 19
తన కట్టడలను తన న్యాయవిధులను ఇశ్రాయేలుకు తెలియజేసెను.
ఏ జనమునకును ఆయన ఈలాగు చేసియుండలేదు 20
ఆయన న్యాయవిధులు వారికి తెలియకయేయున్నవి.
యెహోవాను స్తుతించుడి.

**148** యెహోవాను స్తుతించుడి.
ఆకాశవాసులారా, యెహోవాను స్తుతించుడి
ఉన్నతస్థలముల నివాసులారా, ఆయనను స్తుతించుడి
ఆయన దూతలారా, మీరందరు ఆయనను స్తుతించుడి 2
ఆయన సైన్యములారా, మీరందరు ఆయనను స్తుతించుడి.

3 సూర్యచంద్రులారా, ఆయనను స్తుతించుడి
కాంతిగల నక్షత్రములారా, మీరందరు ఆయనను
స్తుతించుడి.
4 పరమాకాశములారా, ఆకాశముపైనున్న జలము
లారా,
ఆయనను స్తుతించుడి.
5 యెహోవా ఆజ్ఞ ఇయ్యగా అవి పుట్టెను
అవి యెహోవా నామమును స్తుతించును గాక.
6 ఆయన వాటిని నిత్యస్థాయువులుగా స్థిరపరచి
యున్నాడు
ఆయన వాటికి కట్టడ నియమించెను
ఏదియు దాని నతిక్రమింపదు.
7 భూమిమీదనున్న మకరములారా, అగాధజలము
లారా,
యెహోవాను స్తుతించుడి
8 అగ్ని వడగండ్లారా, హిమమా, ఆవిరీ,
ఆయన ఆజ్ఞను నెరవేర్చు తుఫానూ,
9 పర్వతములారా, సమస్తమైన గుట్టలారా,
ఫలవృక్షములారా, సమస్తమైన దేవదారు వృక్షము
లారా,
10 మృగములారా, పశువులారా,
నేలను ప్రాకు జీవులారా, రెక్కలతో ఎగురు
పక్షులారా,
11 భూరాజులారా, సమస్త ప్రజలారా,
భూమిమీదనున్న అధిపతులారా, సమస్త న్యా
యాధిపతులారా,
యెహోవాను స్తుతించుడి.
12 యౌవనులు కన్యలు వృద్ధులు బాలురు
13 అందరును యెహోవా నామమును స్తుతించు
దురు గాక
ఆయన నామము మహోన్నతమైన నామము
ఆయన ప్రభావము భూమ్యాకాశములకు పైగా
నున్నది.
14 ఆయన తన ప్రజలకు ఒక శృంగమును హెచ్చించి
యున్నాడు
అది ఆయన భక్తులకందరికిని
ఆయన చెంతజేరిన జనులగు ఇశ్రాయేలీయులకును
ప్రఖ్యాతికరముగా నున్నది.
యెహోవాను స్తుతించుడి.

**149** యెహోవాను స్తుతించుడి
యెహోవాను క్రొత్త కీర్తన పాడుడి
భక్తులు కూడుకొను సమాజములో ఆయనను
స్తోత్రగీతము పాడుడి.
2 ఇశ్రాయేలీయులు తమ్మును పుట్టించినవానినిబట్టి
సంతోషించుదురు గాక
సీయోను జనులు తమ రాజునుబట్టి ఆనందించు
దురు గాక.
నాట్యముతో వారు ఆయన నామమును స్తుతించు 3
దురు గాక
తంబురతోను సితారాతోను ఆయననుగూర్చి
గానము చేయుదురు గాక.
యెహోవా తన ప్రజలయందు ప్రీతిగలవాడు. 4
ఆయన దీనులను రక్షణతో అలంకరించును.
భక్తులు ఘనతనొంది ప్రహర్షించుదురు గాక 5
వారు సంతోషభరితులై తమ పడకలమీద
ఉత్సాహగానము చేయుదురు గాక.
వారి నోట దేవునికి చేయబడు ఉత్సాహ స్తోత్రము 6
లున్నవి.
అన్యజనులకు ప్రతిదండన చేయుటకును ప్రజలను 7
శిక్షించుటకును
గొలుసులతో వారి రాజులను 8
ఇనుప సంకెళ్లతో వారి ఘనులను బంధించుటకును
విధింపబడిన తీర్పు వారిమీద నడుపుటకును 9
వారి చేతిలో రెండంచులుగల ఖడ్గమున్నది.
ఆయన భక్తులకందరికి ఘనత యిదే
యెహోవాను స్తుతించుడి.

**150** యెహోవాను స్తుతించుడి
ఆయన పరిశుద్ధాలయమునందు
దేవుని స్తుతించుడి.
ఆయన బలమును ప్రసిద్ధిచేయు ఆకాశవిశాలమందు
ఆయనను స్తుతించుడి.
ఆయన పరాక్రమ కార్యములనుబట్టి 2
ఆయనను స్తుతించుడి.
ఆయన మహా ప్రభావమునుబట్టి
ఆయనను స్తుతించుడి.
బూరధ్వనితో 3
ఆయనను స్తుతించుడి.
స్వరమండలముతోను సితారాతోను
ఆయనను స్తుతించుడి.
తంబురతోను నాట్యముతోను 4
ఆయనను స్తుతించుడి.
తంతివాద్యములతోను పిల్లనగ్రోవితోను
ఆయనను స్తుతించుడి.
మ్రోగు తాళములతో 5
ఆయనను స్తుతించుడి.
గంభీరధ్వనిగల తాళములతో
ఆయనను స్తుతించుడి.
సకలప్రాణులు యెహోవాను స్తుతించుదురు 6
గాక.
యెహోవాను స్తుతించుడి.

# సామెతలు

...దు కుమారుడును ఇశ్రాయేలు రాజునైన
...లొమోను సామెతలు.
...మును ఉపదేశమును అభ్యసించుటకును
... సల్లాపములను గ్రహించుటకును
...్యాయ యథార్థతల ననుసరించుటయందు బుద్ధి
...శలత ఇచ్చు ఉపదేశము నొందుటకును
...ములేనివారికి బుద్ధి కలిగించుటకును
...వనులకు తెలివియు వివేచనయు పుట్టించుట
...ను తగిన సామెతలు.
...ముగలవాడు విని పాండిత్యము వృద్ధిచేసి
...నును
...కముగలవాడు ఆలకించి నీతి సూత్రములను
సంపాదించుకొనును.
...చేత సామెతలను భావసూచక విషయములను
...ల మాటలను వారు చెప్పిన గూఢవాక్యము
లను జనులు గ్రహించుదురు.
...హోవాయందు భయభక్తులు కలిగియుండుట
తెలివికి మూలము
...ర్ఖులు జ్ఞానమును ఉపదేశమును తిరస్కరిం
చుదురు.
... కుమారుడా, నీ తండ్రి ఉపదేశము ఆలకింపుము
తల్లి చెప్పు బోధను త్రోసివేయకుము.
...వి నీ తలకు సొగసైన మాలికయు
కంఠమునకు హారములునై యుండును
... కుమారుడా, పాపులు నిన్ను ప్రేరేపింపగా
ఒప్పకుము.
... మాతోకూడ రమ్ము మనము ప్రాణముతీయు
టకై పొంచియుందము
...ద్రోషిదైన యొకని పట్టుకొనుటకు దాగియుం
దము
...తాళము మనుష్యులను మ్రింగివేయునట్లు వారిని
...జీవముతోనే మ్రింగివేయుదము
...మాధిలోకి దిగువారు మ్రింగబడునట్లు వారు
పూర్ణబలముతోనుండగా మనము వారిని మ్రింగి
వేయుదము రమ్ము అని వారు చెప్పునప్పుడు
ఒప్పకుము.
...పలువిధములైన మంచి సొత్తులు మనకు దొరుకును
మన యిండ్లను దోపుడుసొమ్ముతో నింపుకొందము
నీవు మాతో పాలివాడవై యుండుము
మనకందరికిని సంచి ఒక్కటే యుండును అని
వారు నీతో చెప్పుదురు.

నా కుమారుడా, నీవు వారి మార్గమున పోకుము 15
వారి త్రోవలయందు నడువకుండ నీ పాదము
వెనుకకు తీసికొనుము.
కీడు చేయుటకై వారి పాదములు పరుగులెత్తును 16
నరహత్య చేయుటకై వారు త్వరపడుచుందురు.
పక్షి చూచుచుండగా వల వేయుట వ్యర్థమేగదా. 17
వారు స్వనాశనమునకే పొంచియుందురు 18
తమ్మును తామే పట్టుకొనుటకై దాగియుందురు.
ఆశాపాతకులందరి గతి అట్టిదే 19
దానిని స్వీకరించువారి ప్రాణము అది తీయును.
జ్ఞానము వీధులలో కేకలు వేయుచున్నది 20
సంతవీధులలో బిగ్గరగా పలుకుచున్నది
గొప్ప సందడిగల స్థలములలో ప్రకటన చేయు 21
చున్నది
పురద్వారములలోను పట్టణములోను
జ్ఞానము ప్రచురించుచు తెలియజేయుచున్నది
—ఎట్లనగా, జ్ఞానములేనివారలారా, 22
మీరెన్నాళ్లు జ్ఞానములేనివారుగా ఉండగోరు
దురు?
అపహాసకులారా, మీరెన్నాళ్లు అపహాస్యము
చేయుచు ఆనందింతురు?
బుద్ధిహీనులారా, మీరెన్నాళ్లు జ్ఞానమును అస
హ్యించుకొందురు?
నా గద్దింపు విని తిరుగుడి 23
ఆలకించుడి నా ఆత్మను మీమీద కుమ్మరించుదును
నా ఉపదేశమును మీకు తెలిపెదను.
నేను పిలువగా మీరు వినకపోతిరి 24
నా చేయి చాపగా ఎవరును లక్ష్యపెట్టకపోయిరి
నేను చెప్పిన బోధ యేమియు మీరు వినక 25
త్రోసివేసితిరి
నేను గద్దింపగా లోబడకపోతిరి.
కాబట్టి మీకు అపాయము కలుగునప్పుడు నేను 26
నవ్వెదను
మీకు భయము వచ్చునప్పుడు నేను అపహాస్యము
చేసెదను
భయము మీమీదికి తుఫానువలె వచ్చునప్పుడు 27
సుడిగాలి వచ్చునట్లు మీకు అపాయము కలుగు
నప్పుడు
మీకు కష్టమును దుఃఖమును ప్రాప్తించునప్పుడు
నేను అపహాస్యము చేసెదను.

28 అప్పుడు వారు నన్నుగూర్చి మొఱ్ఱపెట్టెదరు గాని నేను ప్రత్యుత్తరమియ్యకుందును
నన్ను శ్రద్ధగా వెదకెదరు గాని వారికి నేను కనబడకుందును.
29 జ్ఞానము వారికి అసహ్యమాయెను
యెహోవాయందు భయభక్తులు కలిగియుండుట వారికిష్టము లేకపోయెను.
30 నా ఆలోచన విననొల్లకపోయిరి
నా గద్దింపును వారు కేవలము తృణీకరించిరి.
31 కాబట్టి వారు తమ ప్రవర్తనకు తగిన ఫలము ననుభవించెదరు
తమకు వెక్కసమగువరకు తమ ఆలోచనలను అనుసరించెదరు.
32 జ్ఞానము లేనివారు దేవుని విసర్జించి నాశనమగుదురు.
బుద్ధిహీనులు క్షేమము కలిగినదని మైమరచి నిర్మూలమగుదురు.
33 నా ఉపదేశము నంగీకరించువాడు సురక్షితముగా నివసించును
వాడు కీడు వచ్చునన్న భయము లేక నెమ్మదిగా నుండును.

**2** **నా** కుమారుడా, నీవు నా మాటల నంగీకరించి నా ఆజ్ఞలను నీయొద్ద దాచుకొనినయెడల
2 జ్ఞానమునకు నీ చెవి యొగ్గి హృదయపూర్వకముగా వివేచన నభ్యసించినయెడల
3 తెలివికై మొఱ్ఱపెట్టినయెడల
వివేచనకై మనవి చేసినయెడల
4 వెండిని వెదకినట్లు దాని వెదకినయెడల
దాచబడిన ధనమును వెదకినట్లు దాని వెదకినయెడల
5 యెహోవాయందు భయభక్తులు కలిగియుండుట యెట్టిదో నీవు గ్రహించెదవు
దేవునిగూర్చిన విజ్ఞానము నీకు లభించును.
6 యెహోవాయే జ్ఞానమిచ్చువాడు
తెలివియు వివేచనయు ఆయన నోటనుండి వచ్చును.
7 ఆయన యథార్థవంతులను వర్ధిల్లజేయును
యుక్తమార్గము తప్పక నడుచుకొనువారికి ఆయన కేడెముగా నున్నాడు.
8 న్యాయము తప్పిపోకుండ ఆయన కనిపెట్టును
తన భక్తుల ప్రవర్తనను ఆయన కాచును.
9 అప్పుడు నీతి న్యాయములను
యథార్థతను ప్రతి సన్మార్గమును నీవు తెలిసికొందువు.
10 జ్ఞానము నీ హృదయమున జొచ్చును
కు మనోహరముగా నుండును
బుద్ధి నిన్ను కాపాడును వివేచన నీకు కావలి కాయును. 11
అది దుష్టుల మార్గమునుండియు 12
మూర్ఖముగా మాటలాడువారి చేతిలోనుండియు నిన్ను రక్షించును.
అట్టివారు చీకటి త్రోవలలో నడువవలెనని 13 యథార్థమార్గములను విడిచిపెట్టెదరు
కీడుచేయ సంతోషించుదురు 14
అతిమూర్ఖుల ప్రవర్తనయందు ఉల్లసించుదురు.
వారు నడుచుకొను త్రోవలు వంకరవి 15
వారు కుటిలవర్తనులు.
మరియు అది జారస్త్రీనుండి 16
మృదువుగా మాటలాడు పరస్త్రీనుండి నిన్ను రక్షించును.
అట్టి స్త్రీ తన యౌవనకాలపు ప్రియుని విడుచునది 17
తన దేవుని నిబంధనను మరచునది.
దాని యిల్లు మృత్యువునొద్దకు దారితీయును 18
అది నడచు త్రోవలు ప్రేతలయొద్దకు చేరును
దానియొద్దకు పోవువారిలో ఎవరును తిరిగి రారు 19
జీవమార్గములు వారికి దక్కవు.
(నా మాటలు వినినయెడల)
నీవు సజ్జనుల మార్గమందు నడుచుకొందువు 20
నీతిమంతుల ప్రవర్తనల ననుసరించుదువు.
యథార్థవంతులు దేశమందు నివసించుదురు 21
లోపములేనివారు దానిలో నిలిచియుందురు.
భక్తిహీనులు దేశములో నుండకుండ నిర్మూలమగుదురు. 22
విశ్వాసఘాతకులు దానిలోనుండి పెరికివేయబడుదురు.

**నా** కుమారుడా, నా ఉపదేశమును మరువకుము **3**
నా ఆజ్ఞలను హృదయపూర్వకముగా గైకొనుము.
అవి దీర్ఘాయువును సుఖజీవముతో గడచు సంవ 2 త్సరములను
శాంతిని నీకు కలుగజేయును.
దయను సత్యమును ఎన్నడును నిన్ను విడిచి 3 పోనియ్యకుము
వాటిని కంఠభూషణముగా ధరించుకొనుము.
నీ హృదయమను పలకమీద వాటిని వ్రాసికొనుము.
అప్పుడు దేవుని దృష్టియందును మానవుల దృష్టి 4 యందును
నీవు దయనొంది మంచివాడవని అనిపించుకొందువు.
నీ స్వబుద్ధిని ఆధారము చేసికొనక 5
నీ పూర్ణహృదయముతో యెహోవాయందు నమ్మకముంచుము

నీ ప్రవర్తన అంతటియందు ఆయన అధికారము
నకు ఒప్పుకొనుము
అప్పుడు ఆయన నీ త్రోవలను సరాళము చేయును.
నేను జ్ఞానిని గదా అని నీవనుకొనవద్దు
యెహోవాయందు భయభక్తులుగలిగి చెడుతనము
విడిచిపెట్టుము
అప్పుడు నీ దేహమునకు ఆరోగ్యమును
నీ యెముకలకు సత్తువయు కలుగును.
నీ రాబడి అంతటిలో ప్రథమఫలమును
నీ ఆస్తిలో భాగమును ఇచ్చి యెహోవాను
ఘనపరచుము.
అప్పుడు నీ కొట్లలో ధాన్యము సమృద్ధిగా
నుండును
నీ గానుగులలోనుండి క్రొత్త ద్రాక్షారసము పైకి
పొర్లి పారును.
నా కుమారుడా, యెహోవా శిక్షను తృణీక
రింపవద్దు
ఆయన గద్దింపునకు విసుకవద్దు.
తండ్రి తనకు ఇష్టుడైన కుమారుని గద్దించురీతిగా
యెహోవా తాను ప్రేమించువారిని గద్దించును.
జ్ఞానము సంపాదించినవాడు ధన్యుడు
వివేచన కలిగిన నరుడు ధన్యుడు.
వెండి సంపాదించుటకంటె జ్ఞానము సంపాదిం
చుట మేలు
అపరంజి సంపాదించుటకంటె జ్ఞానలాభము
నొందుట మేలు.
పగడములకంటె అది ప్రియమైనది
నీ యిష్టవస్తువులన్నియు దానితో సమానములు
కావు.
దాని కుడిచేతిలో దీర్ఘాయువును
దాని యెడమచేతిలో ధనఘనతలును ఉన్నవి.
దాని మార్గములు రమ్యమార్గములు
దాని త్రోవలన్నియు క్షేమకరములు.
దాని నవలంబించువారికి అది జీవవృక్షము
దాని పట్టుకొనువారందరు ధన్యులు.
జ్ఞానమువలన యెహోవా భూమిని స్థాపించెను
వివేచనవలన ఆయన ఆకాశవిశాలమును స్థిర
పరచెను.
ఆయన తెలివివలన అగాధజలములు ప్రవహించు
చున్నవి
మేఘములనుండి మంచుబిందువులు కురియు
చున్నవి.
నా కుమారుడా, లెస్సయైన జ్ఞానమును వివేచనను
భద్రముచేసికొనుము
వాటిని నీకన్నుల ఎదుటనుండి తొలగిపోనియ్యకుము

అవి నీకు జీవముగాను 22
నీ మెడకు అలంకారముగాను ఉండును.
అప్పుడు నీ మార్గమున నీవు సురక్షితముగా నడి 23
చెదవు
నీ పాదము ఎప్పుడును తొట్రిల్లదు.
పండుకొనునప్పుడు నీవు భయపడవు 24
నీవు పరుండి సుఖముగా నిద్రించెదవు.
ఆకస్మికముగా భయము కలుగునప్పుడు 25
దుర్మార్గులకు నాశనము వచ్చునప్పుడు నీవు భయ
పడవద్దు
యెహోవా నీకు ఆధారమగును 26
నీ కాలు చిక్కుబడకుండునట్లు ఆయన నిన్ను
కాపాడును.
మేలుచేయుట నీ చేతనైనప్పుడు 27
దాని పొందదగినవారికి చేయకుండ వెనుకతియ్య
కుము.
ద్రవ్యము నీయొద్ద నుండగా 28
— రేపు ఇచ్చెదను పోయి రమ్మని నీ పొరుగు
వానితో అనవద్దు.
నీ పొరుగువాడు నీయొద్ద నిర్భయముగా నివసించు 29
నపుడు
వానికి అపకారము కల్పింపవద్దు.
నీకు హాని చేయనివానితో నిర్నిమిత్తముగా జగడ 30
మాడవద్దు.
బలాత్కారము చేయువాని చూచి మత్సరపడకుము 31
వాడు చేయు క్రియలను ఏమాత్రమును చేయ
గోరవద్దు.
కుటిలవర్తనుడు యెహోవాకు అసహ్యుడు 32
యథార్థవంతులకు ఆయన తోడుగా నుండును.
భక్తిహీనుల యింటిమీదికి యెహోవా శాపము 33
వచ్చును
నీతిమంతుల నివాసస్థలమును ఆయన ఆశీర్వ
దించును.
అపహాసకులను ఆయన అపహసించును 34
దీనులయెడల ఆయన దయ చూపును.
జ్ఞానులు ఘనతను స్వతంత్రించుకొందురు 35
బుద్ధిహీనులు అవమానభరితులగుదురు.

**4**

కుమారులారా, తండ్రి యుపదేశము వినుడి
మీరు వివేకమునొందునట్లు ఆలకించుడి.
నేను మీకు సదుపదేశము చేసెదను 2
నా బోధను త్రోసివేయకుడి.
నా తండ్రికి నేను కుమారుడనుగా నుంటిని 3
నా తల్లి దృష్టికి నేను సుకుమారుడనైన [1]యేక
కుమారుడనైయుంటిని.
ఆయన నాకు బోధించుచు నాతో ఇట్లనెను 4

1 లేక, ముద్దుబిడ్డ.

—నీ హృదయము పట్టుదలతో నా మాటలను పట్టుకొననిమ్ము
నా ఆజ్ఞలను గైకొనినయెడల నీవు బ్రదుకుదువు.
5 జ్ఞానము సంపాదించుకొనుము బుద్ధి సంపాదించుకొనుము,
నా నోటిమాటలను మరువకుము.
వాటినుండి తొలగిపోకుము.
6 జ్ఞానమును విడువక యుండినయెడల అది నిన్ను కాపాడును
దాని ప్రేమించినయెడల అది నిన్ను రక్షించును.
7 జ్ఞానము సంపాదించుకొనుటయే జ్ఞానమునకు ముఖ్యాంశము.
నీ సంపాదన అంతయు ఇచ్చి బుద్ధి సంపాదించుకొనుము.
8 దాని గొప్పచేసినయెడల అది నిన్ను హెచ్చించును
దాని కౌగలించినయెడల అది నీకు ఘనతను తెచ్చును.
9 అది నీ తలకు అందమైన మాలిక కట్టును
ప్రకాశమానమైన కిరీటమును నీకు దయచేయును.
10 నా కుమారుడా, నీవు ఆలకించి నా మాటల నంగీకరించినయెడల
నీవు దీర్ఘాయుష్మంతుడవగుదువు.
11 జ్ఞానమార్గమును నేను నీకు బోధించియున్నాను
యథార్థమార్గములో నిన్ను నడిపించియున్నాను.
12 నీవు నడుచునప్పుడు నీ అడుగు ఇరుకున పడదు
నీవు పరుగెత్తునప్పుడు నీ పాదము తొట్రిల్లదు.
13 ఉపదేశమును విడిచిపెట్టక దాని గట్టిగా పట్టుకొనుము
అది నీకు జీవము గనుక దాని పొందియుండుము.
14 భక్తిహీనుల త్రోవను చేరకుము
దుష్టుల మార్గమున నడువకుము.
15 దానియందు ప్రవేశింపక తప్పించుకొని తిరుగుము
దానినుండి తొలగి సాగిపొమ్ము.
16 అట్టివారు కీడుచేయనిది నిద్రింపరు
ఎదుటివారిని పడద్రోయనిది వారికి నిద్రరాదు.
17 కీడుచేత దొరికినదానిని వారు భుజింతురు
బలాత్కారముచేత దొరికిన ద్రాక్షారసమును త్రాగుదురు.
18 పట్టపగలగువరకు వేకువ వెలుగు తేజరిల్లునట్లు
నీతిమంతుల మార్గము అంతకంతకు తేజరిల్లును.
19 భక్తిహీనుల మార్గము గాఢాంధకారమయము
తాము దేనిమీద పడుదురో వారికి తెలియదు.
20 నా కుమారుడా, నా మాటలను ఆలకింపుము
నా వాక్యములకు నీ చెవి యొగ్గుము.
కన్నుల ఎదుటనుండి వాటిని తొలగిపోనియ్యకుము
నీ హృదయమందు వాటిని భద్రముచేసికొనుము.
దొరికినవారికి అవి జీవమును
వారి సర్వశరీరమునకు ఆరోగ్యమును ఇచ్చును.
నీ హృదయములోనుండి జీవధారలు బయలుదేరును 23
కాబట్టి అన్నిటికంటె ముఖ్యముగా నీ హృదయమును భద్రముగా కాపాడుకొనుము
మూర్ఖపు మాటలు నోటికి రానియ్యకుము 24
పెదవులనుండి కుటిలమైన మాటలు రానియ్యకుము.
నీ కన్నులు ఇటు అటు చూడక సరిగాను 25
నీ కనురెప్పలు నీ ముందర సూటిగాను చూడవలెను.
నీవు నడుచు మార్గమును సరాళము చేయుము 26
అప్పుడు నీ మార్గములన్నియు స్థిరములగును.
నీవు కుడితట్టుకైనను ఎడమతట్టుకైనను తిరుగకుము 27
నీ పాదమును కీడునకు దూరముగా తొలగించుకొనుము.

నా కుమారుడా, నా జ్ఞానోపదేశము ఆలకింపుము 5
వివేకముగల నా బోధకు చెవి యొగ్గుము
అప్పుడు నీవు బుద్ధికలిగి నడుచుకొందువు 2
తెలివినిబట్టి నీ పెదవులు మాటలాడును.
జారస్త్రీ పెదవులనుండి తేనె కారును 3
దాని నోటి మాటలు నూనెకంటెను నునుపైనవి
దానివలన కలుగు ఫలము ముసిణిపండంత చేదు 4
అది రెండంచులుగల కత్తియంత పదునుగలది.
దాని నడతలు మరణమునకు దిగుటకు దారితీయును 5
దాని అడుగులు పాతాళమునకు చక్కగా చేరును
అది జీవమార్గమును ఏమాత్రమును విచారింపదు 6
దానికి తెలియకుండనే దాని పాదములు ఇటు అటు తిరుగును.
కుమారులారా, నా మాట ఆలకింపుడి 7
నేను చెప్పు ఉపదేశమునుండి తొలగకుడి.
జారస్త్రీయుండు ఛాయకు పోక నీ మార్గము దానికి దూరముగా చేసికొనుము 8
దాని యింటివాకిటి దగ్గరకు వెళ్లకుము.
వెళ్లినయెడల పరులకు నీ యౌవనబలమును 9
క్రూరులకు నీ జీవితకాలమును ఇచ్చివేతువు.
నీ ఆస్తివలన పరులు తృప్తిపొందుదురు 10
నీ కష్టార్జితము అన్యుల యిల్లు చేరును.
తుదకు నీ మాంసమును నీ శరీరమును క్షీణించినప్పుడు 11
—అయ్యో, ఉపదేశము నేనెట్లు త్రోసివేసితిని! 12
నా హృదయము గద్దింపు నెట్లు తృణీకరించెను?
నా బోధకుల మాట నేను వినకపోతిని 13
నా ఉపదేశకులకు నేను చెవి యొగ్గలేదు
నేను సమాజ సంఘముల మధ్యనుండినను 14

ప్రతివిధమైన దౌష్ట్యమునకు లోబడుటకు కొంచెమే యెడమాయెను అని నీవు చెప్పుకొనుచు మూలుగుచు నుందువు.
15 నీ కుండలోని నీళ్లు పానము చేయుము
నీ బావిలో ఊబుకు జలము త్రాగుము.
16 నీ ఊటలు బయటికి చెదరిపోదగునా?
అవి నీకే యుండవలెను గదా.
17 వీధులలో అవి నీటి కాలువలుగా పారదగునా?
అన్యులు నీతోకూడ వాటి ననుభవింపకుండ
18 నీ ఊట దీవెన నొందును.
నీ యౌవనకాలపు భార్యయందు సంతోషింపుము.
19 ఆమె అతిప్రియమైన లేడి, అందమైన దుప్పి
ఆమె రొమ్ములవలన నీవు ఎల్లప్పుడు తృప్తినొందు చుండుము.
ఆమె ప్రేమచేత నిత్యము బద్ధుడవై యుండుము.
20 నా కుమారుడా, జారస్త్రీయందు నీవేల బద్ధుడవై యుందువు?
పరస్త్రీ రొమ్ము నీవేల కౌగలించుకొందువు?
21 నరుని మార్గములను యెహోవా యెరుగును
వాని నడతలన్నిటిని ఆయన గుర్తించును.
22 దుష్టుని దోషములు వాని చిక్కులబెట్టును
వాడు తన పాపపాశములవలన బంధింపబడును.
23 శిక్షలేకయే అట్టివాడు నాశనమగును
అతిమూర్ఖుడై వాడు త్రోవతప్పి పోవును.

6 నా కుమారుడా, నీ చెలికానికొరకు పూటపడిన యెడల
పరునిచేతిలో నీవు నీ చేయి వేసినయెడల
2 నీ నోటి మాటలవలన నీవు చిక్కుబడియున్నావు
నీ నోటి మాటలవలన పట్టబడియున్నావు
3 నా కుమారుడా, నీ చెలికానిచేత చిక్కుబడితివి.
నీవు త్వరపడి వెళ్లి విడిచిపెట్టుమని నీ చెలికానిని బలవంతము చేయుము.
ఈలాగు చేసి తప్పించుకొనుము
4 నీ కన్నులకు నిద్రయైనను
నీ కనురెప్పలకు కునుకుపాటైనను రానియ్యకుము.
5 వేటకాని చేతినుండి లేడి తప్పించుకొనునట్లును
ఎరుకువాని చేతినుండి పక్షి తప్పించుకొనునట్లును తప్పించుకొనుము.
6 సోమరీ, చీమలయొద్దకు వెళ్లుము
వాటి నడతలు కనిపెట్టి జ్ఞానము తెచ్చుకొనుము.
7 వాటికి న్యాయాధిపతి లేకున్నను
పై విచారణకర్త లేకున్నను అధిపతి లేకున్నను
8 అవి వేసవికాలమందు ఆహారము సిద్ధపరచుకొనును
కోతకాలమందు ధాన్యము కూర్చుకొనును.
9 సోమరీ, ఎందాక నీవు పండుకొనియుందువు?
ఎప్పుడు నిద్రలేచెదవు?
ఇంక కొంచెము నిద్రించెదనని కొంచెము కునికెదనని 10
కొంచెముసేపు చేతులు ముడుచుకొని పరుండెదనని (నీవనుచుందువు.)
అందుచేత దోపిడిగాడు వచ్చునట్లు దారిద్ర్యము నీయొద్దకు వచ్చును. 11
ఆయుధధారుడు వచ్చునట్లు లేమి నీయొద్దకు వచ్చును.
కుటిలమైన మాటలు పలుకువాడు 12
పనికిమాలినవాడును దుష్టుడునై యున్నాడు
వాడు కన్ను గీటుచు కాళ్లతో సైగచేయుచు 13
వ్రేళ్లతో గురుతులు చూపును.
వాని హృదయము అతిమూర్ఖ స్వభావముగలది 14
వాడెల్లప్పుడు కీడు కల్పించుచు జగడములు పుట్టించును.
కాబట్టి ఆపద వానిమీదికి హఠాత్తుగా వచ్చును 15
వాడు తిరుగలేకుండ ఆ క్షణమందే నలుగగొట్టబడును.
యెహోవాకు అసహ్యములైనవి ఆరు సంగతు లున్నవి 16
ఏడును ఆయనకు హేయములు.
అవేవనగా, అహంకారదృష్టియు కల్లలాడు నాలుకయు 17
నిరపరాధులను చంపు చేతులును
దుర్యోచనలు యోచించు హృదయమును 18
కీడుచేయుటకు త్వరపడి పరుగులెత్తు పాదములును
లేనివాటిని పలుకు అబద్ధసాక్షియు 19
అన్నదమ్ములలో జగడములు పుట్టించువాడును.
నా కుమారుడా, నీ తండ్రి ఆజ్ఞను గైకొనుము 20
నీ తల్లి ఉపదేశమును త్రోసివేయకుము.
వాటిని ఎల్లప్పుడు నీ హృదయమునందు ధరించుకొనుము 21
నీ మెడచుట్టు వాటిని కట్టుకొనుము.
నీవు త్రోవను వెళ్లునప్పుడు అది నిన్ను నడిపించును 22
నీవు పండుకొనునప్పుడు అది నిన్ను కాపాడును
నీవు మేలుకొనునప్పుడు అది నీతో ముచ్చటించును.
ఆజ్ఞ దీపముగాను ఉపదేశము వెలుగుగాను ఉండును. 23
శిక్షార్థమైన గద్దింపులు జీవమార్గములు.
24
చెడుస్త్రీయొద్దకు పోకుండను
పరస్త్రీ పలుకు ఇచ్చకపు మాటలకు లోబడకుండను అవి నిన్ను కాపాడును.
దాని చక్కదనమునందు నీ హృదయములో ఆశపడకుము 25

అది తన కనురెప్పలను చికిలించి నిన్ను లోపరచుకొననియ్యకుము.
26 వేశ్యాసాంగత్యము చేయువానికి రొట్టెతునక మాత్రము మిగిలియుండును.
మగనాలు మిక్కిలి విలువగల ప్రాణమును వేటాడును.
27 ఒకడు తన ఒడిలో అగ్ని నుంచుకొనినయెడల
వాని వస్త్రములు కాలకుండునా?
28 ఒకడు నిప్పులమీద నడిచినయెడల
వాని పాదములు కమలకుండునా?
29 తన పొరుగువాని భార్యను కూడువాడు ఆ ప్రకారమే నాశనమగును
ఆమెను ముట్టువాడు శిక్ష తప్పించుకొనడు.
30 దొంగ ఆకలిగొని ప్రాణరక్షణకొరకు దొంగిలిన యెడల
ఎవరును వాని తిరస్కరింపరు గదా.
31 వాడు దొరికినయెడల ఏడంతలు చెల్లింపవలెను
తన యింటి ఆస్తి అంతయు అప్పగింపవలెను.
32 జారత్వము జరిగించువాడు కేవలము బుద్ధిశూన్యుడు
ఆ కార్యము చేయువాడు స్వనాశనమును కోరువాడే.
33 వాడు దెబ్బలకును అవమానమునకును పాత్రుడగును
వానికి కలుగు అపకీర్తి యెన్నటికిని తొలగిపోదు.
34 భర్తకు పుట్టు రోషము మహా రౌద్రముగలది
ప్రతికారము చేయు కాలమందు అట్టివాడు కనికరపడడు.
35 ప్రాయశ్చిత్తమేమైన నీవు చేసినను వాడు లక్ష్యపెట్టడు
ఎంత గొప్ప బహుమానములు నీవిచ్చినను వాడు ఒప్పుకొనడు.

7 **నా** కుమారుడా, నా మాటలను మనస్సున నుంచుకొనుము
నా ఆజ్ఞలను నీ యొద్ద దాచిపెట్టుకొనుము.
2 నా ఆజ్ఞలను నీవు మనస్సున నుంచుకొనినయెడల
నీ కనుపాపవలె నా ఉపదేశమును కాపాడినయెడల నీవు బ్రదుకుదువు.
3 నీ వ్రేళ్లకు వాటిని కట్టుకొనుము
నీ హృదయమను పలకమీద వాటిని వ్రాసికొనుము.
4 జ్ఞానముతో—నీవు నాకు అక్కవనియు
తెలివితో—నీవు నాకు చెలికత్తెవనియు చెప్పుము.
5 అవి నీవు జారస్త్రీయొద్దకు పోకుండను
ఇచ్చకములాడు పరస్త్రీకి లోబడకుండను నిన్ను కాపాడును.

నా యింటి కిటికీలోనుండి
నా అల్లిక కిటికీలోనుండి నేను పారజూడగా
జ్ఞానములేనివారి మధ్యను
యౌవనస్థుల మధ్యను బుద్ధిలేని పడుచువాడొకడు నాకు కనబడెను.
సందెవేళ ప్రొద్దు గ్రుంకినతరువాత చిమ్మ చీకటిగల రాత్రివేళ
వాడు జారస్త్రీ సందుదగ్గరనున్న వీధిలో తిరుగుచుండెను
దాని యింటిమార్గమున నడుచుచుండెను.
అంతట వేశ్యావేషము వేసికొనిన కపటముగల స్త్రీ ఒకతె వానిని ఎదుర్కొన వచ్చెను.
అది బొబ్బలు పెట్టునది, స్వేచ్ఛగా తిరుగునది, దాని పాదములు దాని యింట నిలువవు.
ఒకప్పుడు ఇంటియెదుటను ఒకప్పుడు సంతవీధులలోను అది యుండును.
ప్రతి సందుదగ్గరను అది పొంచియుండును.
అది వానిని పట్టుకొని ముద్దుపెట్టుకొనెను
సిగ్గుమాలిన ముఖము పెట్టుకొని యిట్లనెను
—సమాధానబలులను నేను అర్పింపవలసియుంటిని
నేడు నా మ్రొక్కుబళ్లు చెల్లించియున్నాను
కాబట్టి నేను నిన్ను కలిసికొనవలెనని రాగా
నిన్ను ఎదుర్కొనవలెనని బయలుదేరగా నీవే కనబడితివి
నా మంచముమీద రత్నకంబళ్లను
ఐగుప్తునుండి వచ్చు విచిత్రపుపనిగల నారదుప్పట్లను నేను పరచియున్నాను.
నా పరుపుమీద బోళము అగరు కారపుచెక్క చల్లియున్నాను.
ఉదయము పర్యంతము వలపుదీర తృప్తిపొందుదము రమ్ము
పరస్పరమోహముచేత చాలా సంతుష్టి నొందుదము రమ్ము.
పురుషుడు ఇంట లేడు
దూరప్రయాణము వెళ్లియున్నాడు
అతడు సొమ్ముసంచి చేత పట్టుకొని పోయెను
పున్నమనాటివరకు ఇంటికి తిరిగి రాడు.
అది తన అధికమైన లాలనమాటలచేత వాని లోపరచుకొనెను
తాను పలికిన యిచ్చకపుమాటలచేత వాని నీడ్చుకొని పోయెను.
వెంటనే పశువు వధకు పోవునట్లును
పరులచే చిక్కినవాడు సంకెళ్లలోనికి పోవునట్లును
తనకు ప్రాణహానికరమైనదని యెరుగక
ఉరియొద్దకు పక్షి త్వరపడునట్లును
వాని గుండెను అంబు చీల్చువరకు

వాడు దాని వెంట పోయెను.
24 నా కుమారులారా, చెవియొగ్గుడి
నా నోటి మాటల నాలకింపుడి
25 జారస్త్రీ మార్గములతట్టు నీ మనస్సు తొలగనియ్యకుము
దారి తప్పి అది నడుచు త్రోవలలోకి పోకుము.
26 అది గాయపరచి పడద్రోసినవారు అనేకులు
అది చంపినవారు లెక్కలేనంతమంది
27 దాని యిల్లు పాతాళమునకుపోవు మార్గము
ఆ మార్గము మరణశాలలకు దిగిపోవును.
8 జ్ఞానము ఘోషించుచున్నది
వివేచన తన స్వరమును వినిపించుచున్నది
2 త్రోవప్రక్కను రాజవీధుల మొగలలోను
నడిమార్గములలోను అది నిలుచుచున్నది.
3 గుమ్మములయొద్దను పురద్వారమునొద్దను
పట్టణపు గవునులయొద్దను నిలువబడి అది ఈలాగు గట్టిగా ప్రకటన చేయుచున్నది
4 — మానవులారా, మీకే నేను ప్రకటించుచున్నాను
నరులగు మీకే నా కంఠస్వరము వినిపించుచున్నాను.
5 జ్ఞానములేనివారలారా, జ్ఞానము ఎట్టిదైనది తెలిసికొనుడి.
బుద్ధిహీనులారా, బుద్ధి యెట్టిదైనది యోచించి చూడుడి.
6 నేను శ్రేష్ఠమైన సంగతులను చెప్పెదను వినుడి
నా పెదవులు యథార్థమైన మాటలు పలుకును
7 నా నోరు సత్యమైన మాటలు పలుకును
దుష్టత్వము నా పెదవులకు అసహ్యము
8 నా నోటి మాటలన్నియు నీతిగలవి
వాటిలో మూర్ఖతయైనను కుటిలతయైనను లేదు.
9 అవియన్నియు వివేకికి తేటగాను
తెలివినొందినవారికి యథార్థముగాను ఉన్నవి.
10 వెండికి ఆశపడక నా ఉపదేశము అంగీకరించుడి
మేలిమి బంగారు నాశింపక తెలివినొందుడి.
11 జ్ఞానము ముత్యములకన్న శ్రేష్ఠమైనది
విలువగల సొత్తులేవియు దానితో సాటి కావు.
12 జ్ఞానమను నేను చాతుర్యమును నాకు నివాసముగా చేసికొనియున్నాను
సదుపాయములు తెలిసికొనుట నాచేతనగును.
13 యెహోవాయందు భయభక్తులు గలిగియుండుట చెడుతనము నసహ్యించుకొనుటయే.
గర్వము అహంకారము దుర్మార్గత
కుటిలమైన మాటలు నాకు అసహ్యములు.
14 ఆలోచన చెప్పుటయు లెస్సైన జ్ఞానమునిచ్చుటయు నా వశము
జ్ఞానాధారము నేనే, పరాక్రమము నాదే.
నావలన రాజులు ఏలుదురు 15
అధికారులు న్యాయమునుబట్టి పాలనచేయుదురు.
నావలన అధిపతులును లోకములోని ఘనులైన న్యాయాధిపతులందరును ప్రభుత్వము చేయుదురు. 16
నన్ను ప్రేమించువారిని నేను ప్రేమించుచున్నాను 17
నన్ను జాగ్రత్తగా వెదకువారు నన్ను కనుగొందురు
ఐశ్వర్య ఘనతలును స్థిరమైన కలిమియు నీతియు నాయొద్ద నున్నవి. 18
మేలిమి బంగారముకంటెను అపరంజికంటెను నా వలన కలుగు ఫలము మంచిది 19
ప్రశస్తమైన వెండికంటె నావలన కలుగు వచ్చుబడి దొడ్డది.
నీతిమార్గమునందును న్యాయమార్గములయందును నేను నడుచుచున్నాను. 20
నన్ను ప్రేమించువారిని ఆస్తికర్తలుగా చేయుదును 21
వారి నిధులను నింపుదును.
పూర్వకాలమందు తన సృష్ట్యారంభమున తన కార్యములలో ప్రథమమైనదానిగా యెహోవా నన్ను కలుగజేసెను. 22
అనాదికాలము మొదలుకొని మొదటినుండి 23
భూమి ఉత్పత్తియైన కాలము మొదలుకొని నేను నియమింపబడితిని.
ప్రవాహజలములు లేనప్పుడు 24
నీళ్లతో నిండిన ఊటలు లేనప్పుడు నేను పుట్టితిని.
పర్వతములు స్థాపింపబడకమునుపు 25
కొండలు పుట్టకమునుపు
భూమిని దాని మైదానములను ఆయన నిర్మింపకమునుపు 26
నేల మట్టిని రవంతయు సృష్టింపకమునుపు నేను పుట్టితిని.
ఆయన ఆకాశవిశాలమును స్థిరపరచినప్పుడు 27
మహాజలములమీద మండలమును నిర్ణయించినప్పుడు నేనక్కడ నుంటిని.
ఆయన పైన ఆకాశమును స్థిరపరచినప్పుడు 28
జలధారలను ఆయన బిగించినప్పుడు
జలములు తమ సరిహద్దులు మీరకుండునట్లు 29
ఆయన సముద్రమునకు పొలిమేరను ఏర్పరచినప్పుడు
భూమియొక్క పునాదులను నిర్ణయించినప్పుడు
నేను ఆయనయొద్ద ప్రధాన శిల్పినై అనుదినము సంతోషించుచు 30
నిత్యము ఆయన సన్నిధిని ఆనందించుచునుంటిని.
ఆయన కలుగజేసిన పరలోకమునుబట్టి సంతోషించుచు 31

నరులను చూచి ఆనందించుచునుంటిని.
32 కావున పిల్లలారా, నా మాట ఆలకించుడి
నా మార్గముల ననుసరించువారు ధన్యులు
33 ఉపదేశమును నిరాకరింపక దాని నవలంబించి
జ్ఞానులై యుండుడి.
34 అనుదినము నా గడపయొద్ద కనిపెట్టుకొని
నా ద్వారబంధములయొద్ద కాచుకొని
నా ఉపదేశము వినువారు ధన్యులు.
35 నన్ను కనుగొనువాడు జీవమును కనుగొనును
యెహోవా కటాక్షము వానికి కలుగును.
36 నన్ను కనుగొననివాడు తనకే హాని చేసికొనును
నాయందు అసహ్యపడువారందరు మరణమును
స్నేహించుదురు.

9 జ్ఞానము నివాసమును కట్టుకొని
దానికి ఏడు స్తంభములు చెక్కుకొనినది
2 పశువులను వధించి ద్రాక్షారసమును కలిపియున్నది
భోజనపదార్థములను సిద్ధపరచియున్నది
3 తన పనికత్తెలచేత జనులను పిలువనంపినది
పట్టణమందలి మెట్టలమీద అది నిలిచి
4 —జ్ఞానము లేనివాడా, ఇక్కడికి రమ్మని ప్రక
టించుచున్నది.
తెలివిలేనివారితో అది ఇట్లనుచున్నది
5 —వచ్చి సిద్ధపరచిన ఆహారమును భుజించుడి
నేను కలిపిన ద్రాక్షారసమును పానముచేయుడి
6 ఇక జ్ఞానము లేనివారై యుండక బ్రదుకుడి
తెలివి కలుగజేయు మార్గములో చక్కగా నడు
వుడి.
7 అపహాసకులకు బుద్ధిచెప్పువాడు తనకే నింద
తెచ్చుకొనును.
భక్తిహీనులను గద్దించువానికి అవమానమే కలుగును.
8 అపహాసకుని గద్దింపకుము గద్దించినయెడల వాడు
నిన్ను ద్వేషించును.
జ్ఞానముగలవాని గద్దింపగా వాడు నిన్ను ప్రేమిం
చును.
9 జ్ఞానముగలవానికి ఉపదేశము చేయగా వాడు
మరింత జ్ఞానము నొందును
నీతిగలవానికి బోధచేయగా వాడు జ్ఞానాభివృద్ధి
నొందును.
10 యెహోవాయందు భయభక్తులు గలిగియుండు
టయే జ్ఞానమునకు మూలము
పరిశుద్ధ దేవునిగూర్చిన తెలివియే వివేచనకు ఆధా
రము.
11 నావలన నీకు దీర్ఘాయువు కలుగును
నీవు జీవించు సంవత్సరములు అధికములగును.
12 నీవు జ్ఞానివైనయెడల నీ జ్ఞానము నీకే లాభకర
మగును
నీవు అపహసించినయెడల దానిని నీవే భరింప
వలెను.
బుద్ధిహీనత అనునది బొబ్బలు పెట్టునది 13
అది కాముకురాలు దానికేమియు తెలివిలేదు.
అది తన ఇంటివాకిట కూర్చుండును 14
ఊరి రాజవీధులలో పీఠముమీద కూర్చుండును.
ఆ దారిని పోవువారిని చూచి 15
తమ త్రోవను చక్కగా వెళ్లువారిని చూచి
—జ్ఞానములేనివాడా, ఇక్కడికి రమ్మని వారిని 16
పిలుచును.
అది తెలివిలేనివాడొకడు వచ్చుట చూచి—దొంగి 17
లించిన నీళ్లు తీపి
చాటున తినిన భోజనము రుచి అని చెప్పును.
అయితే అచ్చట ప్రేతలున్నారనియు 18
దాని ఇంటికి వెళ్లువారు పాతాళకూపములో
ఉన్నారనియు
వానికి ఎంతమాత్రమును తెలియదు.

సొలొమోను చెప్పిన సామెతలు. 10

జ్ఞానముగల కుమారుడు తండ్రిని సంతోషపర
చును
బుద్ధిలేని కుమారుడు తన తల్లికి దుఃఖము పుట్టిం
చును.
భక్తిహీనుల ధనము వారికి లాభకరము కాదు 2
నీతి మరణమునుండి రక్షించును.
యెహోవా నీతిమంతుని ఆకలిగొననియ్యడు 3
భక్తిహీనుని ఆశను భంగముచేయును.
బద్ధకముగా పనిచేయువాడు దరిద్రుడగును 4
శ్రద్ధగలవాడు ఐశ్వర్యవంతుడగును.
వేసవికాలమున కూర్చువాడు బుద్ధిగల కుమారుడు 5
కోతకాలమందు సుఖముగా నిద్రించువాడు సిగ్గు
పరచు కుమారుడు.
నీతిమంతుని తలమీదికి ఆశీర్వాదములు వచ్చును 6
బలాత్కారము భక్తిహీనుని నోరు మూసివేయును.
నీతిమంతుని జ్ఞాపకముచేసికొనుట ఆశీర్వాదకర 7
మగును
భక్తిహీనుల పేరు అసహ్యత పుట్టించును
జ్ఞానచిత్తుడు ఉపదేశము నంగీకరించును 8
పనికిమాలిన వదురుబోతు నశించును.
యథార్థముగా ప్రవర్తించువాడు నిర్భయముగా 9
ప్రవర్తించును.
కుటిలవర్తనుడు బయలుపడును.
కనుసైగ చేయువాడు వ్యథ పుట్టించును 10
పనికిమాలిన వదురుబోతు నశించును.
నీతిమంతుని నోరు జీవపు ఊట 11
భక్తిహీనుల నోరు బలాత్కారము మరుగుపరచును.
పగ కలహమును రేపును 12

ప్రేమ దోషములన్నిటిని కప్పును.
వివేకుని పెదవులయందు జ్ఞానము కనబడును
బుద్ధిహీనుని వీపునకు బెత్తమే తగును.
జ్ఞానులు జ్ఞానము సమకూర్చుకొందురు
మూఢుల నోరు అప్పుడే నాశనము చేయును.
ధనవంతుని ఆస్తి వానికి ఆశ్రయపట్టణము
దరిద్రుని పేదరికము వానికి నాశనకరము.
నీతిమంతుని కష్టార్జితము జీవదాయకము
భక్తిహీనునికి కలుగు వచ్చుబడి పాపము పుట్టించును.
ఉపదేశము నంగీకరించువాడు జీవమార్గములో ఉన్నాడు
గద్దింపునకు లోబడనివాడు త్రోవ తప్పును.
అంతరంగమున పగ ఉంచుకొనువాడు అబద్ధికుడు
కొండెములు ప్రచురము చేయువాడు బుద్ధిహీనుడు.
విస్తారమైన మాటలలో దోషముండక మానదు
తన పెదవులను మూసికొనువాడు బుద్ధిమంతుడు.
నీతిమంతుని నాలుక ప్రశస్తమైన వెండివంటిది
భక్తిహీనుల ఆలోచన పనికిమాలినది.
నీతిమంతుని పెదవులు అనేకులకు ఉపదేశించును
బుద్ధి లేకపోవుటచేత మూఢులు చనిపోవుదురు.
యెహోవా ఆశీర్వాదము ఐశ్వర్యమిచ్చును
నరుల కష్టముచేత ఆ యాశీర్వాదము ఎక్కువ కాదు.
చెడుపనులు చేయుట బుద్ధిహీనునికి ఆటగా నున్నది
వివేకికి జ్ఞానపరిశ్రమ చేయుట అట్టిదే.
భక్తిహీనుడు దేనికి భయపడునో అదే వానిమీదికి వచ్చును
నీతిమంతులు ఆశించునది వారికి దొరకును.
సుడిగాలి వీచగా భక్తిహీనుడు లేకపోవును.
నీతిమంతుడు నిత్యము నిలుచు కట్టడమువలె ఉన్నాడు.
సోమరి తనకు పని పెట్టువారికి
పండ్లకు పులుసువంటివాడు కండ్లకు పొగవంటి వాడు.
యెహోవాయందు భయభక్తులు కలిగియుండుట దీర్ఘాయువుకు కారణము
భక్తిహీనుల ఆయుస్సు తక్కువై పోవును.
నీతిమంతుల ఆశ సంతోషము పుట్టించును
భక్తిహీనుల ఆశ భంగమై పోవును.
యథార్థవంతునికి యెహోవా యేర్పాటు ఆశ్రయదుర్గము
పాపముచేయువారికి అది నాశనకరము.
నీతిమంతుడు ఎన్నడును కదలింపబడడు
భక్తిహీనులు దేశములో నివసింపరు.

నీతిమంతుని నోరు జ్ఞానోపదేశమును పలుకును 31
మూర్ఖపు మాటలు పలుకు నాలుక పెరికివేయ బడును.
నీతిమంతుని పెదవులు ఉపయుక్తములైన సంగతులు 32
పలుకును
భక్తిహీనుల నోట మూర్ఖపు మాటలు వచ్చును.
దొంగత్రాసు యెహోవాకు హేయము 11
సరియైన గుండు ఆయనకిష్టము.
అహంకారము వెంబడి అవమానము వచ్చును 2
వినయముగలవారియొద్ద జ్ఞానమున్నది.
యథార్థవంతుల యథార్థత వారికి త్రోవ చూపించును 3
ద్రోహుల మూర్ఖస్వభావము వారిని పాడు చేయును.
ఉగ్రతదినమందు ఆస్తి అక్కరకు రాదు 4
నీతి మరణమునుండి రక్షించును.
యథార్థవంతుల నీతి వారి మార్గమును సరాళము 5
చేయును
భక్తిహీనుడు తన భక్తిహీనతచేతనే పడిపోవును.
యథార్థవంతుల నీతి వారిని విమోచించును 6
విశ్వాసఘాతకులు తమ దురాశవలననే పట్ట బడుదురు.
భక్తిహీనుడు చనిపోగా వాని ఆశ నిర్మూలమగును 7
బలాఢ్యులైనవారి ఆశ భంగమైపోవును.
నీతిమంతుడు బాధనుండి తప్పింపబడును 8
వానికి మారుగా భక్తిహీనుడు బాధనొందును.
భక్తిహీనుడు తన నోటి మాటచేత తన పొరుగు 9
వారికి నాశనము తెప్పించును
తెలివిచేత నీతిమంతులు తప్పించుకొందురు.
నీతిమంతులు వర్ధిల్లుట పట్టణమునకు సంతోషకరము 10
భక్తిహీనులు నశించునప్పుడు ఉత్సాహధ్వని పుట్టును.
యథార్థవంతుల దీవెనవలన పట్టణమునకు కీర్తి 11
కలుగును
భక్తిహీనుల మాటలు దానిని బోర్లద్రోయును.
తన పొరుగువానిని తృణీకరించువాడు బుద్ధిలేని 12
వాడు
వివేకియైనవాడు మౌనముగా నుండును.
కొండెగాడై తిరుగులాడువాడు పరుల గుట్టు 13
బయటపెట్టును
నమ్మకమైన స్వభావముగలవాడు సంగతి దాచును.
నాయకులు లేని జనులు చెడిపోవుదురు 14
ఆలోచనకర్తలు అనేకులుండుట రక్షణకరము.
ఎదుటివానికొరకు పూటబడినవాడు చెడిపోవును. 15
పూటబడ నొప్పనివాడు నిర్భయముగా నుండును.
కనికరముగల స్త్రీ ఘనతనొందును 16

బలిష్ఠులు ఐశ్వర్యము చేపట్టుదురు.
17 దయగలవాడు తనకే మేలు చేసికొనును
క్రూరుడు తన శరీరమునకు బాధ తెచ్చుకొనును
18 భక్తిహీనుని సంపాదన వానిని మోసము చేయును
నీతిని విత్తువాడు శాశ్వతమైన బహుమానము నొందును.
19 యథార్థమైన నీతి జీవదాయకము
దుష్క్రియలు విడువక చేయువాడు తన మరణమునకే చేయును
20 మూర్ఖచిత్తులు యెహోవాకు హేయులు
యథార్థముగా ప్రవర్తించువారు ఆయనకిష్టులు.
21 నిశ్చయముగా భక్తిహీనునికి శిక్ష తప్పదు.
నీతిమంతుల సంతానము విడిపింపబడును.
22 వివేకములేని సుందరస్త్రీ
పంది ముక్కుననున్న బంగారు కమ్మివంటిది.
23 నీతిమంతుల కోరిక ఉత్తమమైనది
భక్తిహీనుల ఆశ అహంకారయుక్తమైనది.
24 వెదజల్లి అభివృద్ధిపొందువారు కలరు
తగినదానికన్న తక్కువ ఇచ్చి లేమికి వచ్చువారు కలరు.
25 ఔదార్యముగలవారు పుష్టినొందుదురు.
నీళ్లు పోయువారికి నీళ్లు పోయబడును
26 ధాన్యము బిగబట్టువానిని జనులు శపించెదరు
దానిని అమ్మువాని తలమీదికి దీవెన వచ్చును.
27 మేలు చేయగోరువాడు ఉపయుక్తమైన క్రియ చేయును
కీడుచేయ గోరువానికి కీడే మూడును.
28 ధనమును నమ్ముకొనువాడు పాడైపోవును
నీతిమంతులు చిగురాకువలె వృద్ధినొందుదురు.
29 తన ఇంటివారిని బాధపెట్టువాడు గాలిని స్వతంత్రించుకొనును
మూఢుడు జ్ఞానహృదయులకు దాసుడగును.
30 నీతిమంతులు ఇచ్చు ఫలము జీవవృక్షము
జ్ఞానముగలవారు ఇతరులను రక్షించుదురు
నీతిమంతులు భూమిమీద ప్రతిఫలము పొందుదురు
భక్తిహీనులును పాపులును మరి నిశ్చయముగా ప్రతిఫలము పొందుదురు గదా.

12 శిక్షను ప్రేమించువాడు జ్ఞానమును ప్రేమించువాడు
గద్దింపును అసహ్యించుకొనువాడు పశుప్రాయుడు.
2 సత్పురుషునికి యెహోవా కటాక్షము చూపును
దురాలోచనలుగలవాడు నేరస్థుడని ఆయన తీర్పు తీర్చును.
3 భక్తిహీనతవలన ఎవరును స్థిరపరచబడరు
నీతిమంతుల వేరు కదలదు
యోగ్యురాలు తన పెనిమిటికి కిరీటము 4
సిగ్గు తెచ్చునది వాని యెముకలకు కుళ్లు.
నీతిమంతుల తలంపులు న్యాయయుక్తములు 5
భక్తిహీనులు చెప్పు ఆలోచనలు మోసకరములు.
భక్తిహీనుల మాటలు నరహత్య చేయ పొంచువారి 6
వంటివి
యథార్థవంతుల నోరు వారిని విడిపించును.
భక్తిహీనులు పాడై లేకపోవుదురు 7
నీతిమంతుల యిల్లు నిలుచును.
ఒక్కొక్క మనుష్యుడు తన వివేకముకొలది పొగడ 8
బడును
కుటిలచిత్తుడు తృణీకరింపబడును.
ఆహారము లేకయుండియు తనను తాను పొగడు 9
కొనువానికంటె
దాసుడుగల అల్పుడు గొప్పవాడు.
నీతిమంతుడు తన పశువుల ప్రాణమును దయతో 10
చూచును
భక్తిహీనుల వాత్సల్యము క్రూరత్వమే.
తన భూమిని సేద్యపరచుకొనువానికి ఆహారము 11
సమృద్ధిగా కలుగును
వ్యర్థమైనవాటిని అనుసరించువాడు బుద్ధిలేనివాడు.
భక్తిహీనులు చెడ్డవారికి దొరుకు దోపుసొమ్మును 12
అపేక్షించుదురు
నీతిమంతుల వేరు చిగుర్చును.
పెదవులవలని దోషము అపాయకరమైన ఉరి 13
నీతిమంతుడు ఆపదను తప్పించుకొనును.
ఒకడు తన నోటి ఫలముచేత తృప్తిగా మేలు 14
పొందును
ఎవని క్రియల ఫలము వానికి వచ్చును.
మూఢుని మార్గము వాని దృష్టికి సరియైనది 15
జ్ఞానముగలవాడు ఆలోచన నంగీకరించును.
మూఢుడు కోపపడునది నిమిషములోనే బయలు 16
పడును
వివేకి నిందను వెల్లడిపరచక యూరకుండును.
సత్యవాద ప్రియుడు నీతిగల మాటలు పలుకును 17
కూటసాక్షి మోసపు మాటలు చెప్పును.
కత్తిపోటువంటి మాటలు పలుకువారు కలరు 18
జ్ఞానుల నాలుక ఆరోగ్యదాయకము.
నిజమాడు పెదవులు నిత్యము స్థిరమై యుండును 19
అబద్ధమాడు నాలుక క్షణమాత్రమే యుండును.
కీడు కల్పించువారి హృదయములో మోసము 20
కలదు
సమాధానపరచుటకై ఆలోచన చెప్పువారు సంతోషభరితులగుదురు.
నీతిమంతునికి ఏ ఆపదయు సంభవింపదు. 21

భక్తిహీనులు కీడుతో నిండియుందురు.
అబద్ధమాడు పెదవులు యెహోవాకు హేయములు
సత్యవర్తనులు ఆయనకిష్టులు.
వివేకియైనవాడు తన విద్యను దాచిపెట్టును
అవివేక హృదయములు తమ మూఢత్వము వెల్లడి చేయును.
శ్రద్ధగా పని చేయువారు ఏలుబడి చేయుదురు
సోమరులు వెట్టి పనులు చేయవలసి వచ్చును.
ఒకని హృదయములోని విచారము దాని క్రుంగ జేయును
దయగల మాట దాని సంతోషపెట్టును.
నీతిమంతుడు తన పొరుగువానికి దారి చూపును
భక్తిహీనుల ప్రవర్తన వారిని దారి తప్పించును.
సోమరి వేటాడినను పట్టుకొనడు
చురుకుగా నుండుట గొప్ప భాగ్యము.
నీతిమార్గమునందు జీవము కలదు
దాని త్రోవలో మరణమే లేదు.
తండ్రి శిక్షించిన కుమారుడు జ్ఞానముగలవాడగును.
అపహాసకుడు గద్దింపునకు లోబడడు.
నోటి ఫలముచేత మనుష్యుడు మేలు ననుభవించును
విశ్వాసఘాతకులు బలాత్కారముచేత నశించుదురు.
తన నోరు కాచుకొనువాడు తన్ను కాపాడుకొనును
ఊరకొనక మాటలాడువాడు తనకు నాశనము తెచ్చుకొనును.
సోమరి ఆశపడును గాని వాని ప్రాణమునకేమియు దొరకదు
శ్రద్ధగలవారి ప్రాణము పుష్టిగా నుండును.
నీతిమంతునికి కల్ల మాట అసహ్యము
భక్తిహీనుడు నిందించుచు అవమానపరచును.
యథార్థవర్తనునికి నీతియే రక్షకము
భక్తిహీనత పాపులను చెరిపివేయును.
ధనవంతులమని చెప్పుకొనుచు లేమిడి గలవారు కలరు
దరిద్రులమని చెప్పుకొనుచు బహు ధనము గలవారు కలరు.
ఒకని ప్రాణమునకు వాని ఐశ్వర్యము ప్రాయశ్చిత్తము చేయును
దరిద్రుడు బెదరింపు మాటలు వినడు.
నీతిమంతుల వెలుగు తేజరిల్లును
భక్తిహీనుల దీపము ఆరిపోవును.
గర్వమువలన జగడమే పుట్టును
ఆలోచన వినువారికి జ్ఞానము కలుగును.

మోసముచేత సంపాదించిన ధనము క్షీణించి పోవును 11
కష్టము చేసి కూర్చుకొనువాడు తన ఆస్తిని వృద్ధి చేసికొనును.
కోరిక సఫలము కాకుండుటచేత హృదయము నొచ్చును 12
సిద్ధించిన మనోవాంఛ జీవవృక్షము.
ఆజ్ఞను తిరస్కరించువాడు అందువలన శిక్ష నొందును 13
ఆజ్ఞవిషయమై భయభక్తులుగలవాడు లాభము పొందును.
జ్ఞానుల ఉపదేశము జీవపు ఊట 14
అది మరణపాశములలోనుండి విడిపించును.
సుబుద్ధి దయను సంపాదించును 15
విశ్వాసఘాతుకుల మార్గము కష్టము.
వివేకులందరు తెలివి గలిగి పని జరుపుకొందురు 16
బుద్ధిహీనుడు మూర్ఖతను వెల్లడిపరచును.
దుష్టుడైన దూత కీడునకు లోబడును 17
నమ్మకమైన రాయబారి ఔషధమువంటివాడు.
శిక్షను ఉపేక్షించువానికి అవమాన దారిద్ర్యతలు 18 ప్రాప్తించును
గద్దింపును లక్ష్యపెట్టువాడు ఘనతనొందును.
ఆశ తీరుట ప్రాణమునకు తీపి 19
చెడుతనమును విడుచుట మూర్ఖులకు అసహ్యము.
జ్ఞానుల సహవాసము చేయువాడు జ్ఞానముగలవాడగును 20
మూర్ఖుల సహవాసము చేయువాడు చెడిపోవును.
కీడు పాపులను తరుమును 21
నీతిమంతులకు మేలు ప్రతిఫలముగా వచ్చును.
మంచివాడు తన పిల్లల పిల్లలను ఆస్తికర్తలనుగా 22 చేయును
పాపాత్ముల ఆస్తి నీతిమంతులకు ఉంచబడును.
బీదలు సేద్యపరచు క్రొత్త భూమి విస్తారముగా 23 పండును
అన్యాయమువలన నశించువారు కలరు.
బెత్తము వాడనివాడు తన కుమారునికి విరోధి 24
కుమారుని ప్రేమించువాడు బాల్యమందే వాని శిక్షించును.
నీతిమంతుడు ఆకలితీర భోజనముచేయును
భక్తిహీనుల కడుపుకు లేమి కలుగును.
జ్ఞానవంతురాలు తన యిల్లు కట్టును
మూఢురాలు తన చేతులతో తన ...
పెరుకును.
యథార్థముగా ప్రవర్తించువాడు ...
యందు భయభక్తులుగలవా...
కుటిలచిత్తుడు ఆయనను తి...

3 మూఢుల నోట బెత్తమువంటి గర్వమున్నది.
జ్ఞానుల పెదవులు వారిని కాపాడును.
4 ఎద్దులు లేని చోట గాదెయందు ధాన్యముండదు
ఎద్దుల బలముచేత విస్తారము వచ్చుబడి కలుగును.
5 నమ్మకమైన సాక్షి అబద్ధమాడడు
కూటసాక్షికి అబద్ధములు ప్రియములు.
6 అపహాసకుడు జ్ఞానము వెదకుట వ్యర్థము
తెలివిగలవానికి జ్ఞానము సులభము.
7 బుద్ధిహీనుని యెదుటనుండి వెళ్లిపొమ్ము
జ్ఞానవచనములు వానియందు కనబడవు గదా.
8 తమ ప్రవర్తనను కనిపెట్టి యుండుట వివేకుల జ్ఞానమునకు లక్షణము
మోసకృత్యములే బుద్ధిహీనులు కనుపరచు మూఢత.
9 మూఢులు చేయు అపరాధపరిహారార్థబలి వారిని అపహాస్యము చేయును
యథార్థవంతులు ఒకరియందు ఒకరు దయ చూపుదురు.
10 ఎవని దుఃఖము వాని హృదయమునకే తెలియును
ఒకని సంతోషములో అన్యుడు పాలివాడు కానేరడు.
11 భక్తిహీనుల యిల్లు నిర్మూలమగును
యథార్థవంతుల గుడారము వర్ధిల్లును.
12 ఒకని యెదుట సరియైనదిగా కనబడుమార్గము కలదు
అయితే తుదకు అది మరణమునకు త్రోవ తీయును.
13 ఒకడు నవ్వుచుండినను హృదయమున దుఃఖముండవచ్చును.
సంతోషము తుదకు వ్యసనమగును.
14 భక్తి విడిచినవాని మార్గములు వానికే వెక్కసమగును
మంచివాని స్వభావము వానికే సంతోషమిచ్చును.
15 జ్ఞానము లేనివాడు ప్రతి మాట నమ్మును
వివేకియైనవాడు తన నడతలను బాగుగా కనిపెట్టును.
16 జ్ఞానముగలవాడు భయపడి కీడునుండి తొలగును
బుద్ధిహీనుడు విఱ్ఱవీగి నిర్భయముగా తిరుగును.
17 త్వరగా కోపపడువాడు మూఢత్వము చూపును
దుర్యోచనలుగలవాడు ద్వేషింపబడును.
18 జ్ఞానము లేనివారికి మూఢత్వమే స్వాస్థ్యము
వివేకులు జ్ఞానమును కిరీటముగా ధరించుకొందురు.
19 చెడ్డవారు మంచివారి యెదుటను
భక్తిహీనులు నీతిమంతుల తలుపునొద్దను వంగుదురు.
20 దరిద్రుడు తన పొరుగువారికి అసహ్యుడు
ఐశ్వర్యవంతుని ప్రేమించువారు అనేకులు.

తన పొరుగువాని తిరస్కరించువాడు పాపము చేయువాడు 21
బీదలను కటాక్షించువాడు ధన్యుడు.
కీడు కల్పించువారు తప్పిపోవుదురు 22
మేలు కల్పించువారు కృపాసత్యముల నొందుదురు.
ఏ కష్టము చేసినను లాభమే కలుగును 23
వట్టి మాటలు లేమిడికి కారణములు.
జ్ఞానుల ఐశ్వర్యము వారికి భూషణము 24
బుద్ధిహీనుల మూఢత్వము మూఢత్వమే.
నిజము పలుకు సాక్షి మనుష్యులను రక్షించును 25
అబద్ధములు ప్రేలుచువాడు వట్టి మోసగాడు.
యెహోవాయందు భయభక్తులు కలిగియుండుట 26
బహు ధైర్యము పుట్టించును
అట్టివారి పిల్లలకు ఆశ్రయస్థానము కలదు.
యెహోవాయందు భయభక్తులు కలిగియుండుట 27
జీవపు ఊట
అది మరణపాశములలోనుండి విడిపించును.
జనసమృద్ధి కలుగుటచేత రాజులకు ఘనత వచ్చును 28
జనక్షయము రాజులకు వినాశకరము.
దీర్ఘశాంతముగలవాడు మహా వివేకి 29
ముంగోపి మూఢత్వమును బహుమానముగా పొందును.
సాత్వికమైన మనస్సు శరీరమునకు జీవము 30
మత్సరము ఎముకలకు కుళ్లు
దరిద్రుని బాధించువాడు వాని సృష్టికర్తను నిందించువాడు 31
బీదను కనికరించువాడు ఆయనను ఘనపరచువాడు.
అపాయము రాగా భక్తిహీనుడు నశించును 32
మరణకాలమందు నీతిమంతునికి ఆశ్రయము కలదు.
తెలివిగలవాని హృదయమందు జ్ఞానము సుఖనివాసము చేయును 33
బుద్ధిహీనుల అంతరంగములోనున్నది బయలుపడును
నీతి జనములకు ఘనతకెక్కుటకు కారణము 34
పాపము ప్రజలకు అవమానము తెచ్చును.
బుద్ధిగల సేవకుడు రాజుల కిష్టుడు 35
అవమానకరముగా నడచువానిమీద రాజు కోపించును.

15
మృదువైన మాట క్రోధమును చల్లార్చును.
నొప్పించు మాట కోపమును రేపును.
జ్ఞానుల నాలుక మనోహరమైన జ్ఞానాంశములు పలుకును 2
బుద్ధిహీనుల నోరు మూఢవాక్యములు కుమ్మరించును.
యెహోవా దృష్టి ప్రతి స్థలముమీద నుండును 3

చెడ్డవారిని మంచివారిని ఆయన చూచుచుండును.
సాత్వికమైన నాలుక జీవవృక్షము
దానిలో కుటిలత యుండినయెడల ఆత్మకు భంగము
కలుగును.
మూఢుడు తన తండ్రిచేయు శిక్షను తిరస్కరించును
గద్దింపుకు లోబడువాడు బుద్ధిమంతుడగును.
6 నీతిమంతుని యిల్లు గొప్ప ధననిధి
భక్తిహీనునికి కలుగు వచ్చుబడి శ్రమకు కారణము.
7 జ్ఞానుల పెదవులు తెలివిని వెదజల్లును
బుద్ధిహీనుల మనస్సు స్థిరమైనది కాదు
8 భక్తిహీనులు చేయు బలులు యెహోవాకు
హేయములు
యథార్థవంతుల ప్రార్థన ఆయనకు ఆనందకరము.
9 భక్తిహీనుల మార్గము యెహోవాకు హేయము
నీతి ననుసరించువానిని ఆయన ప్రేమించును.
10 మార్గము విడిచినవానికి కఠినశిక్ష కలుగును
గద్దింపును ద్వేషించువారు మరణము నొందుదురు.
11 పాతాళమును అగాధకూపమును యెహోవాకు
కనబడుచున్నవి
నరుల హృదయములు మరి తేటగా ఆయనకు కన
బడును గదా.
12 అపహాసకుడు తన్ను గద్దించువారిని ప్రేమించడు
వాడు జ్ఞానులయొద్దకు వెళ్లడు.
13 సంతోషహృదయము ముఖమునకు తేటనిచ్చును
మనోదుఃఖమువలన ఆత్మ నలిగిపోవును.
14 బుద్ధిమంతుని మనస్సు జ్ఞానము వెదకును
బుద్ధిహీనులు మూఢత్వము భుజించెదరు.
15 బాధపడువాని దినములన్నియు శ్రమకరములు
సంతోషహృదయునికి నిత్యము విందు కలుగును.
16 నెమ్మదిలేకుండ విస్తారమైన ధనముండుటకంటె
యెహోవాయందలి భయభక్తులతో కూడ కొం
చెము కలిగియుండుట మేలు.
17 పగవాని యింట క్రొవ్వినయెద్దు మాంసము తినుట
కంటె
ప్రేమగలచోట ఆకుకూరల భోజనము తినుట
మేలు.
18 కోపోద్రేకియగువాడు కలహము రేపును
దీర్ఘశాంతుడు వివాదము నణచివేయును.
19 సోమరి మార్గమున ముళ్లకంచె
యథార్థవంతుల త్రోవ రాజమార్గము.
20 జ్ఞానముగల కుమారుడు తండ్రిని సంతోషపెట్టును
బుద్ధిహీనుడు తన తల్లిని తిరస్కరించును.
21 బుద్ధిలేనివానికి మూఢత సంతోషకరము
వివేకముగలవాడు చక్కగా ప్రవర్తించును.
22 ఆలోచన చెప్పువారు లేని చోట ఉద్దేశములు
వ్యర్థమగును
ఆలోచన చెప్పువారు బహుమంది యున్నయెడల
ఉద్దేశములు దృఢపడును.
(సరిగా) ప్రత్యుత్తరమిచ్చినవానికి దానివలన సం 23
తోషము పుట్టును
సమయోచితమైన మాట యెంత మనోహరము.
క్రిందనున్న పాతాళమును తప్పించుకొనవలెనని 24
బుద్ధిమంతుడు పరమునకు పోవు జీవమార్గమున
నడుచుకొనును
గర్విష్ఠుల యిల్లు యెహోవా పెరికివేయును 25
విధవరాలి పొలిమేరను ఆయన స్థాపించును.
దురాలోచనలు యెహోవాకు హేయములు 26
దయగల మాటలు (ఆయన దృష్టికి) పవిత్రములు.
లోభి తన యింటివారిని బాధపెట్టును 27
లంచము నసహ్యించుకొనువాడు బ్రదుకును.
నీతిమంతుని మనస్సు యుక్తమైన ప్రత్యుత్తరమిచ్చు 28
టకు ప్రయత్నించును
భక్తిహీనుల నోరు చెడ్డమాటలు కుమ్మరించును
భక్తిహీనులకు యెహోవా దూరస్థుడు 29
నీతిమంతుల ప్రార్థన ఆయన అంగీకరించును.
కన్నుల ప్రకాశము చూచుట హృదయమునకు 30
సంతోషకరము
మంచి సమాచారము ఎముకలకు పుష్టి ఇచ్చును.
జీవార్థమైన ఉపదేశమును అంగీకరించువానికి 31
జ్ఞానుల సహవాసము లభించును.
శిక్షనొంద నొల్లనివాడు తన ప్రాణమును తృణీక 32
రించును
గద్దింపును వినువాడు వివేకియగును.
యెహోవాయందు భయభక్తులు కలిగియుండుట 33
జ్ఞానాభ్యాసమునకు కారణము
ఘనతకు ముందు వినయముండును.

16

హృదయాలోచనలు మనుష్యుని వశము,
(చక్కని) ప్రత్యుత్తరమిచ్చుట యెహోవావలన
కలుగును.
ఒకని నడతలన్నియు వాని దృష్టికి నిర్దోషములుగా 2
కనబడును
యెహోవా ఆత్మలను పరిశోధించును.
నీ పనుల భారము యెహోవామీద నుంచుము 3
అప్పుడు నీ ఉద్దేశములు సఫలములగును.
యెహోవా ప్రతి వస్తువును దాని దాని పని 4
నిమిత్తము కలుగజేసెను
కీడు ననుభవించుటకై ఆయన భక్తిహీనులను కలుగ
జేసెను.
గర్వహృదయులందరు యెహోవాకు హేయులు 5
నిశ్చయముగా వారు శిక్ష నొందుదురు.
కృపాసత్యములవలన దోషమునకు ప్రాయశ్చిత్తము 6
కలుగును

యెహోవాయందు భయభక్తులు కలిగియుండుట
వలన మనుష్యులు చెడుతనమునుండి తొలగి
పోవుదురు.
7 ఒకని ప్రవర్తన యెహోవాకు ప్రీతికరమగు
నప్పుడు
ఆయన వాని శత్రువులను సహా వానికి మిత్రు
లుగా చేయును.
8 అన్యాయముచేత కలిగిన గొప్ప వచ్చుబడికంటె
నీతితోకూడిన కొంచెమే శ్రేష్ఠము.
9 ఒకడు తాను చేయబోవునది హృదయములో
యోచించుకొనును
యెహోవా వాని నడతను స్థిరపరచును
10 దేవోక్తి పలుకుట రాజువశము
న్యాయము విధించుటయందు అతని మాట న్యా
యము తప్పదు.
11 న్యాయమైన త్రాసును తూనికరాళ్లును
యెహోవాయొక్క యేర్పాటులు
సంచిలోని గుండ్లన్నియు ఆయన నియమించెను.
12 రాజులు దుష్టక్రియలు చేయుట హేయమైనది
నీతివలన సింహాసనము స్థిరపరచబడును.
13 నీతిగల పెదవులు రాజులకు సంతోషకరములు
యథార్థవాదులు వారికి ప్రియులు.
14 రాజుని క్రోధము మరణదూత
జ్ఞానిగలవాడు ఆ క్రోధమును శాంతిపరచును.
15 రాజుల ముఖప్రకాశమువలన జీవము కలుగును
వారి కటాక్షము కడవరి వానమబ్బు.
16 అపరంజిని సంపాదించుటకంటె జ్ఞానమును సంపా
దించుట ఎంతో శ్రేష్ఠము
వెండిని సంపాంచుటకంటె తెలివిని సంపాదించుట
ఎంతో మేలు.
17 చెడుతనము విడిచి నడచుటయే యథార్థవంతులకు
రాజమార్గము
తన ప్రవర్తన కనిపెట్టువాడు తన ప్రాణమును
కాపాడుకొనును.
18 నాశనమునకు ముందు గర్వము నడుచును
పడిపోవుటకు ముందు అహంకారమైన మనస్సు
నడుచును.
19 గర్విష్ఠులతో దోపుసొమ్ము పంచుకొనుటకంటె
దీనమనస్సు కలిగి దీనులతో పొత్తుచేయుట మేలు.
20 ఉపదేశమునకు చెవి యొగ్గువాడు మేలునొందును
యెహోవాను ఆశ్రయించువాడు ధన్యుడు.
21 జ్ఞానహృదయుడు వివేకి యనబడును
రుచిగల మాటలు పలుకుటవలన విద్య యెక్కు
వగును.
తెలివిగలవానికి వాని తెలివి జీవపు ఊట
మూఢులకు వారి మూఢత్వమే శిక్ష.
జ్ఞానుని హృదయము వానినోటికి తెలివి కలిగించును 23
వాని పెదవులకు విద్య విస్తరింపజేయును.
ఇంపైన మాటలు తేనెపట్టువంటివి 24
అవి ప్రాణమునకు మధురమైనవి యెముకలకు
ఆరోగ్యకరమైనవి.
ఒకని మార్గము వాని దృష్టికి యథార్థముగా కన 25
బడును
అయినను తుదకు అది మరణమునకు చేరును.
కష్టము చేయువాని ఆకలి వానికొరకు వాని 26
చేత కష్టము చేయించును
వాని కడుపు వానిని తొందరపెట్టును.
పనికిమాలినవాడు కీడును త్రవ్వి పైకెత్తును 27
వాని పెదవులమీద అగ్ని మండుచున్నట్టున్నది.
మూర్ఖుడు కలహము పుట్టించును 28
కొండెగాడు మిత్రభేదము చేయును.
బలాత్కారి తన పొరుగువానిని లాలనచేయును 29
కానిమార్గములో వాని నడిపించును.
కృత్రిమములు కల్పింపవలెనని కన్నులు మూసి 30
కొని
తన పెదవులు బిగబట్టువాడే కీడు పుట్టించువాడు.
నెరసిన వెండ్రుకలు సొగసైన కిరీటము 31
అవి నీతిప్రవర్తన గలవానికి కలిగి యుండును.
పరాక్రమశాలికంటె దీర్ఘశాంతముగలవాడు 32
శ్రేష్ఠుడు
పట్టణము పట్టుకొనువానికంటె తన మనస్సును
స్వాధీనపరచుకొనువాడు శ్రేష్ఠుడు
చీట్లు ఒడిలో వేయబడును 33
వాటివలని తీర్పు యెహోవా వశము.
**వ**ధింపబడిన పశుమాంసము కావలసినంత కలిగి **17**
యుండియు కలహముతో కూడియుండు
ఇంట నుండుటకంటె
నెమ్మది కలిగియుండి పట్టి రొట్టెముక్క తినుట
మేలు.
బుద్ధిగల దాసుడు సిగ్గుతెచ్చు కుమారునిమీద 2
ఏలుబడి చేయును
అన్నదమ్ములతోపాటు వాడు పిత్రార్జితము పంచు
కొనును.
వెండికి మూస తగినది, బంగారుకు కొలిమి తగినది 3
హృదయ పరిశోధకుడు యెహోవాయే.
చెడునడవడి గలవాడు దోషపు మాటలు వినును 4
నాలుక హానికరమైన మాటలు పలుకుచుండగా
అబద్ధికుడు చెవియొగ్గును.
బీదలను వెక్కిరించువాడు వారి సృష్టికర్తను నిందిం 5
చువాడు.
ఆపదను చూచి సంతోషించువాడు నిర్దోషిగా
ఎంచబడడు.

6 కుమారుల కుమారులు వృద్ధులకు కిరీటము
తండ్రులే కుమారులకు అలంకారము.
7 అహంకారముగా మాటలాడుట బుద్ధిలేనివానికి
తగదు
అబద్ధమాడుట అధిపతికి బొత్తిగా తగదు.
8 లంచము పుచ్చుకొనువాని దృష్టికి లంచము మాణి
క్యమువలె నుండును
అట్టివాడు ఏమి చేసినను దానిలో యుక్తిగా ప్రవ
ర్తించును.
9 ప్రేమను వృద్ధిచేయగోరువాడు తప్పితములు దాచి
పెట్టును.
జరిగిన సంగతి మాటిమాటికి ఎత్తువాడు మిత్ర
భేదము చేయును.
10 బుద్ధిహీనునికి నూరుదెబ్బలు నాటునంతకంటె
బుద్ధిమంతునికి ఒక గద్దింపుమాట లోతుగా
నాటును.
11 తిరుగబాటు చేయువాడు కీడుచేయుటకే కోరును
అట్టివానివెంట క్రూరదూత పంపబడును.
12 పిల్లలను పోగొట్టుకొనిన యెలుగుబంటిని ఎదుర్కొన
వచ్చును గాని
మూర్ఖపుపనులు చేయుచున్న మూర్ఖుని ఎదుర్కొన
రాదు.
13 మేలుకు ప్రతిగా కీడుచేయువాని యింటనుండి
కీడు తొలగిపోదు.
14 కలహారంభము నీటిగట్టున పుట్టు ఊట
వివాదము అధికము కాకమునుపే దాని విడిచి
పెట్టుము.
15 దుష్టులు నిర్దోషులని తీర్పు తీర్చువాడు
నీతిమంతులు దోషులని తీర్పు తీర్చువాడు
వీరిద్దరును యెహోవాకు హేయులు.
16 బుద్ధిహీనుని చేతిలో సొమ్ముండనేల?
జ్ఞానము సంపాదించుటకు వానికిష్టము లేదు గదా.
17 నిజమైన స్నేహితుడు విడువక ప్రేమించును
దుర్దశలో అట్టివాడు సహోదరుడుగా నుండును.
18 తన పొరుగువానికి జామీను ఉండి పూటపడు
వాడు తెలివిమాలినవాడు.
19 కలహప్రియుడు దుర్మార్గప్రియుడు
తన వాకిండ్లు ఎత్తుచేయువాడు నాశనము వెదకు
వాడు.
20 కుటిలవర్తనుడు మేలుపొందడు
మూర్ఖముగా మాటలాడువాడు కీడులో పడును.
21 బుద్ధిహీనుని కనినవానికి వ్యసనము కలుగును
తెలివిలేనివాని తండ్రికి సంతోషము లేదు.
22 సంతోషముగల మనస్సు ఆరోగ్యకారణము.
నలిగిన మనస్సు ఎముకలను ఎండ కలుగజేయును.
23 న్యాయవిధులను చెరుపుటకై
దుష్టుడు ఒడిలోనుండి లంచము పుచ్చుకొనును.
జ్ఞానము వివేకముగలవాని యెదుటనే యున్నది 24
బుద్ధిహీనుని కన్నులు భూదిగంతములలో నుం
డును.
బుద్ధిహీనుడగు కుమారుడు తన తండ్రికి దుఃఖము 25
తెచ్చును
తన్ను కనినదానికి అట్టివాడు బాధ కలుగజేయును.
నీతిమంతులను దండించుట న్యాయము కాదు 26
అది వారి యథార్థతనుబట్టి మంచివారిని హతము
చేయుటే.
మితముగా మాటలాడువాడు తెలివిగలవాడు 27
శాంతగుణముగలవాడు వివేకముగలవాడు.
ఒకడు మూఢుడైనను మౌనముగానుండినయెడల 28
జ్ఞాని అని యెంచబడును
అట్టివాడు పెదవులు మూసికొనగా వాడు వివేకి
అని యెంచబడును.

వేరుండగోరువాడు స్వేచ్ఛానుసారముగా నడుచు **18**
వాడు
అట్టివాడు లెస్సైన జ్ఞానమునకు విరోధి.
బుద్ధిహీనుడు వివేచనయందు సంతోషింపక 2
తన అభిప్రాయములను బయలుపరచుటయందు
సంతోషించును.
భక్తిహీనుడు రాగానే తిరస్కారము వచ్చును 3
అవమానము రాగానే నింద వచ్చును.
మనుష్యుని నోటి మాటలు లోతు నీటివంటివి 4
అవి నదీప్రవాహమువంటివి జ్ఞానపు ఊటవంటివి.
తీర్పు తీర్చుటలో భక్తిహీనులయెడల పక్షపాతము 5
చూపుటయు
నీతిమంతులకు న్యాయము తప్పించుటయు క్రమము
కాదు.
బుద్ధిహీనుని పెదవులు కలహమునకు సిద్ధముగా 6
నున్నవి.
దెబ్బలు కావలెనని వాడు కేకలువేయును.
బుద్ధిహీనుని నోరు వానికి నాశనము తెచ్చును 7
వాని పెదవులు వాని ప్రాణమునకు ఉరి తెచ్చును.
కొండెగాని మాటలు రుచిగల భోజ్యములు 8
అవి లోకడుపులోకి దిగిపోవును.
పనిలో జాగుచేయువాడు 9
నష్టము చేయువానికి సోదరుడు.
యెహోవా నామము బలమైన దుర్గము
నీతిమంతుడు అందులోకి పరుగెత్తి సురక్షితముగా
నుండును.
ధనవంతునికి వాని

ఘనతకు ముందు వినయముండును.
13 సంగతి వినకముందు ప్రత్యుత్తరమిచ్చువాడు
తన మూఢతను బయలుపరచి సిగ్గునొందును.
14 నరుని ఆత్మ వాని వ్యాధి నోర్చును
నలిగిన హృదయమును ఎవడు సహింపగలడు?
15 జ్ఞానుల చెవి తెలివిని వెదకును
వివేకముగల మనస్సు తెలివిని సంపాదించును.
16 ఒకడు ఇచ్చు కానుక వానికి వీలు కలుగజేయును
అది గొప్పవారియెదుటికి వాని రప్పించును.
17 వ్యాజ్యమందు వాది పక్షము న్యాయముగా కన
బడును
అయితే ఎదుటివాడు వచ్చినమీదట వాని సంగతి
తేటపడును.
18 చీట్లు వేయుటచేత వివాదములు మానును
అది పరాక్రమశాలులను సమాధానపరచును.
19 బలమైన పట్టణమును వశపరచుకొనుటకంటె
ఒకనిచేత అన్యాయమునొందిన సహోదరుని వశ
పరచుకొనుట కష్టతరము.
వివాదములు నగరు తలుపుల అడ్డగడియలంత స్థిర
ములు.
20 ఒకని నోటి ఫలముచేత వాని కడుపు నిండును
తన పెదవుల ఆదాయముచేత వాడు తృప్తిపొం
దును.
21 జీవమరణములు నాలుక వశము
దానియందు ప్రీతిపడువారు దాని ఫలము తిందురు
22 భార్య దొరికినవానికి మేలు దొరికెను
అట్టివాడు యెహోవావలన అనుగ్రహము పొం
దినవాడు.
23 దరిద్రుడు బతిమాలి మనవి చేసికొనును
ధనవంతుడు దురుసుగా ప్రత్యుత్తరమిచ్చును.
24 బహుమంది చెలికాండ్లు గలవాడు నష్టపడును
సహోదరునికంటెను ఎక్కువగా హత్తియుండు
స్నేహితుడు కలడు.

**19** బుద్ధిహీనుడై తన పెదవులతో మూర్ఖముగా మాట
లాడువానికంటె
యథార్థముగా ప్రవర్తించు దరిద్రుడే శ్రేష్ఠుడు.
2 ఒకడు తెలివి లేకుండుట మంచిది కాదు
తొందరపడి నడుచువాడు దారి తప్పిపోవును.
ఒకని మూర్ఖత వాని ప్రవర్తనను తారుమారు
చేయును
3 అట్టివాడు హృదయమున యెహోవామీద
కోపించును.
4 ధనముగలవానికి స్నేహితులు అధికముగా
నుందురు,
దరిద్రుడు తన స్నేహితులను పోగొట్టుకొనును.
5 కూటసాక్షి శిక్ష నొందకపోడు
అబద్ధములాడువాడు తప్పించుకొనడు.
అనేకులు గొప్పవారి కటాక్షము వెదకుదురు 6
దాతకు అందరు స్నేహితులే.
బీదవాడు తన చుట్టములందరికి అసహ్యుడు 7
అట్టివానికి స్నేహితులు మరి దూరస్థులగుదురు
వాడు నిరర్థకమైన మాటలు వెంటాడువాడు.
బుద్ధి సంపాదించుకొనువాడు తన ప్రాణమునకు 8
ఉపకారి
వివేచనను లక్ష్యము చేయువాడు మేలు పొం
దును.
కూటసాక్షి శిక్షనొందకపోడు 9
అబద్ధములాడువాడు నశించును.
భోగముల ననుభవించుట బుద్ధిహీనునికి తగదు 10
రాజులనేలుట దాసునికి బొత్తిగా తగదు.
ఒకని సుబుద్ధి వానికి దీర్ఘశాంతము నిచ్చును 11
తప్పులు క్షమించుట అట్టివానికి ఘనతనిచ్చును.
రాజు కోపము సింహగర్జనవంటిది 12
వాని కటాక్షము గడ్డిమీద కురియు మంచువంటిది.
బుద్ధిహీనుడగు కుమారుడు తన తండ్రికి చేటు 13
తెచ్చును
భార్యచేతి పోరు ఎడతెగక పడుచుండు బిందువు
లతో సమానము.
గృహమును విత్తమును పితరులిచ్చిన స్వాస్థ్యము 14
సుబుద్ధిగల భార్య యెహోవాయొక్క దానము.
సోమరితనము గాఢనిద్రలో పడవేయును 15
సోమరివాడు పస్తు పడియుండును.
ఆజ్ఞను గైకొనువాడు తన్ను కాపాడుకొనువాడు 16
తన ప్రవర్తన విషయమై అజాగ్రత్తగా నుండు
వాడు చచ్చును.
బీదలను కనికరించువాడు యెహోవాకు అప్పి 17
చ్చువాడు
వాని ఉపకారమునకు ఆయన ప్రత్యుపకారము
చేయును.
బుద్ధి వచ్చునని నీ కుమారుని శిక్షింపుము 18
అయితే వాడు చావవలెనని కోరవద్దు.
మహా కోపియగువాడు దండన తప్పించుకొనడు 19
వాని తప్పించినను వాడు మరల కోపించుచునే
యుండును.
నీవు ముందుకు జ్ఞానివగుటకై 20
ఆలోచన విని ఉపదేశము అంగీకరించుము.
నరుని హృదయములో ఆలోచనలు అనేకము 21
లుగా పుట్టును
యెహోవాయొక్క తీర్మానమే స్థిరము.
కృప చూపుట నరుని పరులకు ప్రియునిగా 22
చేయును
అబద్ధికునికంటె దరిద్రుడే మేలు.

3 యెహోవాయందు భయభక్తులు కలిగియుండుట జీవసాధనము
అది కలిగినవాడు తృప్తుడై అపాయము లేకుండ బ్రదుకును.
4 సోమరి పాత్రలో చెయ్యి ముంచునే గాని
తన నోటికి దాని తిరిగి ఎత్తనైన ఎత్తడు.
5 అపహాసకులు దండింపబడగా చూచి జ్ఞానము లేనివారు జ్ఞానము నొందుదురు
వివేకులను గద్దించినయెడల వారు జ్ఞానవృద్ధి నొందుదురు.
6 తండ్రికి కీడుచేసి తల్లిని తరిమివేయువాడు
అవమానమును అపకీర్తిని కలుగజేయువాడు.
7 నా కుమారుడా, తెలివి పుట్టించు మాటలను నీవు మీరిగోరితివా?
ఉపదేశము వినుట ఇక మానుకొనుము.
8 వ్యర్థుడైన సాక్షి న్యాయము నపహసించును
భక్తిహీనుల నోరు దోషమును జుర్రుకొనును.
9 అపహాసకులకు తీర్పులును
బుద్ధిహీనుల వీపులకు దెబ్బలును నియమింపబడినవి.

20 ద్రాక్షారసము వెక్కిరింతల పాలు చేయును
మద్యము అల్లరి పుట్టించును
దాని వశమైనవారందరు జ్ఞానములేనివారు.
2 రాజువలని భయము సింహగర్జనవంటిది
రాజునకు క్రోధము పుట్టించువారు తమకు ప్రాణమోసము తెచ్చుకొందురు.
3 కలహమునకు దూరముగా నుండుట నరులకు ఘనత
మూర్ఖుడైన ప్రతివాడును పోరునే కోరును.
4 విత్తులు వేయు కాలమున సోమరి దున్నడు
కోతకాలమున పంటనుగూర్చి వాడు విచారించునప్పుడు వానికేమియు లేకపోవును.
5 నరుని హృదయములోని ఆలోచన లోతు నీళ్లవంటిది
వివేకముగలవాడు దానిని పైకి చేదుకొనును.
6 దయ చూపువానిని కలిసికొనుట అనేకులకు తటస్థించును
నమ్మకొనదగినవాడు ఎవరికి కనబడును?
7 యథార్థవర్తనుడగు నీతిమంతుని పిల్లలు
వాని తదనంతరము ధన్యులగుదురు.
8 న్యాయసింహాసనాసీనుడైన రాజు
తన కన్నులతో చెడుతనమంతయు చెదరగొట్టును.
9 —నా హృదయమును శుద్ధపరచుకొని యున్నాను
పాపము పోగొట్టుకొని పవిత్రుడనైతిననుకొనదగినవాడెవడు?
10 వేరువేరు తూనికె రాళ్లు వేరువేరు కుంచములు
ఈ రెండును యెహోవాకు హేయములు.

బాలుడు సహితము తన నడవడి శుద్ధమైనదో 11
కాదో యథార్థమైనదో కాదో
తన చేష్టలవలన తెలియజేయును.
వినగల చెవి చూడగల కన్ను 12
ఈ రెండును యెహోవా కలుగజేసినవే.
లేమికి భయపడి నిద్రయందు ఆసక్తి విడువుము 13
నీవు మేల్కొని యుండినయెడల ఆహారము తిని తృప్తిపొందుదువు.
కొనువాడు—జబ్బుది జబ్బుది అనును 14
అవతలికి వెళ్లి దాని మెచ్చుకొనును.
బంగారును విస్తారమైన ముత్యములును కలవు 15
తెలివి నుచ్చరించు పెదవులు అమూల్యమైన సొత్తు.
అన్యునికొరకు పూటబడినవాని వస్త్రమును పుచ్చుకొనుము 16
పరులకొరకు వానినే కుదువపెట్టించుము.
మోసము చేసి తెచ్చుకొన్న ఆహారము మనుష్యులకు బహు ఇంపుగా నుండును 17
పిమ్మట వాని నోరు మంటితో నింపబడును.
ఉద్దేశములు ఆలోచనచేత స్థిరపరచబడును 18
వివేకముగల నాయకుడవై యుద్ధము చేయుము.
కొండెగాడై తిరుగులాడువాడు పరుల గుట్టు బయటపెట్టును 19
కావున వదరుబోతుల జోలికి పోకుము.
తన తండ్రినైనను తల్లినైనను దూషించువాని దీపము 20
కారుచీకటిలో ఆరిపోవును.
మొదట బహు త్వరితముగా దొరికిన స్వాస్థ్యము 21
తుదకు దీవెన నొందకపోవును.
—కీడుకు ప్రతికీడు చేసెదననుకొనవద్దు 22
యెహోవాకొరకు కనిపెట్టుకొనుము ఆయన నిన్ను రక్షించును.
వేరువేరు తూనికె రాళ్లు యెహోవాకు హేయములు 23
దొంగత్రాసు అనుకూలము కాదు.
ఒకని నడతలు యెహోవా వశము
తనకు సంభవింపబోవునది యొకడెట్లు తెలిసికొనగలడు? 24
వివేచింపక ప్రతిష్ఠితమని చెప్పుటయు 25
మ్రొక్కుకొనిన తరువాత దానిగూర్చి విచారించుటయు ఒకనికి ఉరియగును.
జ్ఞానముగల రాజు భక్తిహీనులను చెదరగొట్టును 26
వారిమీద చక్రము దొర్లించును.
నరుని ఆత్మ యెహోవా పెట్టిన దీపము 27
అది అంతరంగములన్నియు శోధించును.
కృపాసత్యములు రాజును కాపాడును 28
కృపవలన అతడు తన సింహాసనమును స్థిరపరచుకొనును.

29 యౌవనస్థుల బలము వారికి అలంకారము
తల నెరపు వృద్ధులకు సౌందర్యము.
30 గాయములు చేయు దెబ్బలు
అంతరింగములలో చొచ్చి చెడుతనమును తొలగించును.

**21** యెహోవా చేతిలో రాజు హృదయము నీటికాలువలవలెనున్నది.
ఆయన తన చిత్తవృత్తిచొప్పున దాని త్రిప్పును.
2 ఒకడు తనకేర్పరచుకొనిన మార్గము ఎట్టిదైనను
తన దృష్టికది న్యాయముగానే అగపడును
యెహోవాయే హృదయములను పరిశీలన చేయువాడు.
3 నీతిన్యాయముల ననుసరించి నడుచుకొనుట
బలుల నర్పించుటకంటె యెహోవాకు ఇష్టము.
4 అహంకార దృష్టియు గర్వ హృదయమును
భక్తిహీనుల క్షేమమును పాపయుక్తములు.
5 శ్రద్ధగలవారి యోచనలు లాభకరములు
తాలిమి లేక పనిచేయువానికి నష్టమే ప్రాప్తించును
6 అబద్ధములాడి ధనము సంపాదించుకొనుట
మరణము కోరువారి కొన ఊపిరితో సాటి.
7 భక్తిహీనులు న్యాయము చేయనొల్లరు
వారు చేయు బలాత్కారము వారిని కొట్టుకొనిపోవును.
8 దోషభరితుని మార్గము మిక్కిలి వంకరమార్గము
పవిత్రుల కార్యము యథార్థము.
9 గయ్యాళితో పెద్దయింట నుండుటకంటె
మిద్దెమీద నొక మూలను నివసించుట మేలు.
10 భక్తిహీనుని మనస్సు కీడుచేయ గోరును
వాడు తన పొరుగువానికైనను దయ తలచడు.
11 అపహాసకుడు దండింపబడుట చూచి జ్ఞానములేనివాడు జ్ఞానము పొందును
జ్ఞానముగలవాడు ఉపదేశమువలన తెలివినొందును.
12 నీతిమంతుడైన యొకడు భక్తిహీనుని యిల్లు ఏమైనది కనిపెట్టును
భక్తిహీనులను ఆయన నాశనములో కూల్చును.
13 దరిద్రుల మొఱ్ఱ వినక చెవి మూసికొనువాడు
తాను మొఱ్ఱపెట్టునప్పుడు అంగీకరింపబడడు.
14 చాటున ఇచ్చిన బహుమానము కోపమును చల్లార్చును
ఒడిలోనుంచబడిన కానుక మహా క్రోధమును శాంతిపరచును.
15 న్యాయమైన క్రియలు చేయుట నీతిమంతునికి సంతోషకరము
పాపము చేయువారికి అది భయంకరము.

వివేకమార్గము విడిచి తిరుగువాడు 16
ప్రేతల గుంపులో కాపురముండును.
సుఖభోగములయందు వాంఛగలవానికి లేమి కలుగును 17
ద్రాక్షారసమును నూనెయు వాంఛించువానికి
ఐశ్వర్యము కలుగదు.
నీతిమంతునికొరకు భక్తిహీనులు ప్రాయశ్చిత్తమగుదురు 18
యథార్థవంతులకు ప్రతిగా విశ్వాసఘాతకులు (కూలుదురు.)
ప్రాణము విసికించు జగడగొండిదానితో కాపురము చేయుటకంటె 19
అరణ్యభూమిలో నివసించుట మేలు.
విలువగల ధనమును నూనెయు జ్ఞానుల యింట నుండును 20
బుద్ధిహీనుడు దాని వ్యయపరచును.
నీతిని కృపను అనుసరించువాడు 21
జీవమును నీతిని ఘనతను పొందును.
జ్ఞానియైన యొకడు పరాక్రమశాలుల పట్టణప్రాకారమెక్కును 22
అట్టివాడు దానికి ఆశ్రయమైన కోటను పడగొట్టును.
నోటిని నాలుకను భద్రముచేసికొనువాడు 23
శ్రమలనుండి తన ప్రాణమును కాపాడుకొనును.
అహంకారియైన గర్విష్ఠునికి అపహాసకుడని పేరు 24
అట్టివాడు అమితగర్వముతో ప్రవర్తించును.
సోమరివాని చేతులు పనిచేయనొల్లవు 25
వాని యిచ్ఛ వాని చంపును.
దినమెల్ల ఆశలు పుట్టుచుండును 26
నీతిమంతుడు వెనుకతీయక ఇచ్చుచుండును.
భక్తిహీనులు చేయు బలులు హేయములు 27
దురాలోచనతో అర్పించినయెడల అవి మరి హేయములు.
కూటసాక్షి నశించును 28
విని మాటలాడువాడు సత్యము పలుకును.
భక్తిహీనుడు బెదురులేకుండ ఎదురుగావచ్చును 29
యథార్థవంతుడు తన ప్రవర్తనను చక్కపరచుకొనును.
యెహోవాకు విరోధమైన జ్ఞానమైనను వివేచనయైనను ఆలోచనయైనను నిలువదు. 30
యుద్ధదినమునకు గుఱ్ఱములను ఆయత్తపరచుటకద్దు 31
గాని రక్షణ యెహోవా అధీనము.

గొప్ప ఐశ్వర్యముకంటె మంచి పేరును **22**
వెండి బంగారములకంటె దయయు కోరదగినవి.
ఐశ్వర్యవంతులును దరిద్రులును కలిసియుందురు 2
వారందరిని కలుగజేసినవాడు యెహోవాయే.

బుద్ధిమంతుడు అపాయము వచ్చుట చూచి దాగును
జ్ఞానములేనివారు యోచింపక ఆపదలో పడుదురు.
యెహోవాయందు భయభక్తులు కలిగియుండుటకును
వినయమునకును ప్రతిఫలము
ఐశ్వర్యమును ఘనతయు జీవమును దానివలన కలుగును.
ముండ్లును ఉరులును మూర్ఖుల మార్గములో ఉన్నవి
తన్ను కాపాడుకొనువాడు వాటికి దూరముగా ఉండును.
బాలుడు నడువవలసిన త్రోవను వానికి నేర్పుము
వాడు వృద్ధుడైనప్పుడును దానినుండి తొలగిపోడు.
ఐశ్వర్యవంతుడు బీదలమీద ప్రభుత్వము చేయును
అప్పుచేయువాడు అప్పిచ్చినవానికి దాసుడు.
దౌష్ట్యమును విత్తువాడు కీడును కోయును
వాని క్రోధమను దండము కాలిపోవును.
దయాదృష్టిగలవాడు తన ఆహారములో కొంత దరిద్రునికిచ్చును
అట్టివాడు దీవెననొందును.
తిరస్కారులను తోలివేసినయెడల కలహములు మానును
పోరు తీరి అవమానము మానిపోవును.
హృదయశుద్ధిని ప్రేమించుచు దయగల మాటలు పలుకువానికి రాజు స్నేహితుడగును.
యెహోవా చూపులు జ్ఞానముగలవానిని కాపాడును
విశ్వాసఘాతకుల మాటలు ఆయన వ్యర్థము చేయును.
సోమరి—బయట సింహమున్నది
వీధులలో నేను చంపబడుదుననును.
వేశ్య నోరు లోతైన గొయ్యి
యెహోవా శాపము నొందినవాడు దానిలో పడును.
బాలుని హృదయములో మూఢత్వము స్వాభావికముగా పుట్టును
శిక్షాదండము దానిని వానిలోనుండి తోలివేయును.
6 లాభము నొందవలెనని దరిద్రులకు అన్యాయము చేయువానికిని ధనవంతుల కిచ్చువానికిని నష్టమే కలుగును.
7 చెవి యొగ్గి జ్ఞానుల ఉపదేశము ఆలకింపుము
నేను కలుగజేయు తెలివిని పొందుటకు మనస్సు నిమ్ము.
8 నీ అంతరంగమందు వాటిని నిలుపుకొనుట ఎంతో మంచిది
పోకుండ అవి నీ పెదవులమీద ఉండనిమ్ము.
నీవు యెహోవాను ఆశ్రయించునట్లు 19
నీకు నీకే గదా నేను ఈ దినమున వీటిని ఉపదేశించి యున్నాను.
నిన్ను పంపువారికి నీవు సత్యవాక్యములతో 20
ప్రత్యుత్తరమిచ్చునట్లు
సత్యప్రమాణము నీకు తెలియజేయుటకై
ఆలోచనయు తెలివియుగల శ్రేష్ఠమైన సామి 21
తెలు నేను నీకొరకు రచించితిని.
దరిద్రుడని దరిద్రుని దోచుకొనవద్దు 22
గుమ్మమునొద్ద దీనులను బాధపరచవద్దు.
యెహోవా వారి పక్షమున వ్యాజ్యమాడును 23
ఆయన వారిని దోచుకొనువారి ప్రాణమును దోచుకొనును.
కోపచిత్తునితో సహవాసము చేయకుము 24
క్రోధముగలవానితో పరిచయము కలిగి యుండకుము.
నీవు వాని మార్గములను అనుసరించి 2
నీ ప్రాణమునకు ఉరి తెచ్చుకొందువేమో.
చేతిలో చెయ్యి వేయువారితోను 26
అప్పులకు పూటబడువారితోను చేరకుము.
చెల్లించుటకు నీయొద్ద ఏమియు లేకపోగా 27
వాడు నీ క్రిందనుండి నీ పరుపు తీసికొనిపోనేల?
నీ పితరులు వేసిన పురాతనమైన పొలిమేర రాతిని 28
నీవు తీసివేయకూడదు.
తన పనిలో నిపుణతగలవానిని చూచితివా? 29
అల్పులైనవారి యెదుట కాదు వాడు రాజుల యెదుటనే నిలుచును.

**23** నీవు ఏలికతో భోజనము చేయ కూర్చుండినయెడల
నీవెవరి సమక్షమున నున్నావో బాగుగా యోచించుము.
నీవు తిండిపోతువైనయెడల
నీ గొంతుకకు కత్తి పెట్టుకొనుము. 2
అతని రుచిగల పదార్థములను ఆశింపకుము 3
అవి మోసపుచ్చు ఆహారములు.
ఐశ్వర్యము పొంద ప్రయాసపడకుము 4
నీకు అట్టి అభిప్రాయము కలిగినను దాని విడిచి పెట్టుము.
నీవు దానిమీద దృష్టి నిలిపినతోడనే అది లేకపోవును 5
నిశ్చయముగా అది రెక్కలు ధరించి యెగిరిపోవును
పక్షిరాజు ఆకాశమునకు ఎగిరి పోవునట్లు అది ఎగిరిపోవును.
ఎదుటివాని మేలు ఓర్వలేనివానితో కలిసి భోజనము చేయకుము 6
వాని రుచిగల పదార్థముల నాశింపకుము.

7 అట్టివాడు తన అంతర్యములో లెక్కలు చూచు
కొనువాడు
తినుము త్రాగుము అని అతడు నీతో చెప్పునే
గాని
అది హృదయములోనుండి వచ్చు మాట కాదు.
8 నీవు తినినను తినినదానిని కక్కివేయుదువు
నీవు పలికిన యింపైన మాటలు వ్యర్థములగును.
9 బుద్ధిహీనుడు వినగా మాటలాడకుము
అట్టివాడు నీ మాటలలోని జ్ఞానమును తృణీక
రించును.
10 పురాతనమైన పొలిమేర రాతిని తీసివేయకుము
తలిదండ్రులు లేనివారి పొలములోనికి నీవు చొర
బడకూడదు
11 వారి విమోచకుడు బలవంతుడు
ఆయన వారిపక్షమున నీతో వ్యాజ్యెమాడును.
12 ఉపదేశముమీద మనస్సు నుంచుము
తెలివిగల మాటలకు చెవి యొగ్గుము.
13 నీ బాలురను శిక్షించుట మానుకొనకుము
బెత్తముతో వాని కొట్టినయెడల వాడు చావకుం
డును
14 బెత్తముతో వాని కొట్టినయెడల
పాతాళమునకు పోకుండ వాని ఆత్మను నీవు తప్పిం
చెదవు.
15 నా కుమారుడా, నీ హృదయమునకు జ్ఞానము
లభించినయెడల
నా హృదయముకూడ సంతోషించును.
16 నీ పెదవులు యథార్థమైన మాటలు పలుకుట విని
నా అంతరింద్రియములు ఆనందించును.
17 పాపులను చూచి నీ హృదయమునందు మత్సర
పడకుము
నిత్యము యెహోవాయందు భయభక్తులు కలిగి
యుండుము.
18 నిశ్చయముగా ముందు గతి రానే వచ్చును
నీ ఆశ భంగము కానేరదు.
19 నా కుమారుడా, నీవు విని జ్ఞానము తెచ్చుకొనుము
నీ హృదయమును యథార్థమైన త్రోవలయందు
చక్కగా నడిపించుకొనుము.
20 ద్రాక్షారసము త్రాగువారితోనైనను
మాంసము హెచ్చుగా తినువారితోనైనను సహ
వాసము చేయకుము.
21 త్రాగుబోతులును తిండిపోతులును దరిద్రులగు
దురు.
నిద్రమత్తు చింపిగుడ్డలు ధరించుటకు కారణమగును.
నిన నీ తండ్రి ఉపదేశము అంగీకరించుము.
ముదిమియందు ఆమెను నిర్లక్ష్యము చేయ

సత్యమును అమ్మివేయక దాని కొని యుంచు 23
కొనుము
జ్ఞానమును ఉపదేశమును వివేకమును కొని
యుంచుకొనుము.
నీతిమంతుని తండ్రికి అధిక సంతోషము కలుగును 24
జ్ఞానముగలవానిని కనినవాడు వానివలన ఆనందము
నొందును.
నీ తలిదండ్రులను నీవు సంతోషపెట్టవలెను 25
నిన్ను కనిన తల్లిని ఆనందపరచవలెను.
నా కుమారుడా, నీ హృదయమును నాకిమ్ము 26
నా మార్గములు నీ కన్నులకు ఇంపుగా నుండనిమ్ము.
వేశ్య లోతైన గొయ్యి పరస్త్రీ యిరుకైన గుంట. 27
దోచుకొనువాడు పొంచియుండునట్లు అది పొంచి 28
యుండును
అది బహుమందిని విశ్వాసఘాతకులనుగా
చేయును.
ఎవరికి శ్రమ? ఎవరికి దుఃఖము? 29
ఎవరికి జగడములు? ఎవరికి చింత?
ఎవరికి హేతువులేని గాయములు? ఎవరికి మంద
దృష్టి?
ద్రాక్షారసముతో ప్రొద్దుపుచ్చువారికే గదా 30
కలిపిన ద్రాక్షారసము రుచిచూడ చేరువారికేగదా.
ద్రాక్షారసము మిక్కిలి ఎఱ్ఱబడగను 31
గిన్నెలో తళతళలాడుచుండగను
త్రాగుటకు రుచిగా నుండగను దానివైపు చూడ
కుము.
పిమ్మట అది సర్పమువలె కరచును 32
కట్లపాామువలె కాటువేయును.
విపరీతమైనవి నీ కన్నులకు కనబడును 33
నీవు వెఱ్ఱిమాటలు పలుకుదువు
నీవు నడిసముద్రమున పండుకొనువానివలె 34
నుందువు
ఓడకొయ్య చివరను పండుకొనువానివలె నుందువు.
—నన్ను కొట్టినను నాకు నొప్పి కలుగలేదు 35
నామీద దెబ్బలు పడినను నాకు తెలియలేదు
నేనెప్పుడు నిద్రమేల్కొందును?
మరల దాని వెదకుదును అని నీవనుకొందువు.

## 24

దుర్జనులను చూచి మత్సరపడకుము
వారి సహవాసము కోరకుము
వారి హృదయము బలాత్కారము చేయ యోచిం 2
చును
వారి పెదవులు కీడునుగూర్చి మాటలాడును.
జ్ఞానమువలన ఇల్లు కట్టబడును 3
వివేచనవలన అది స్థిరపరచబడును.
తెలివిచేత దాని గదులు విలువగల రమ్యమైన 4
సర్వసంపదలతో నింపబడును.

5 జ్ఞానముగలవాడు బలవంతుడుగా నుండును
తెలివిగలవాడు శక్తిమంతుడుగా నుండును.
6 వివేకముగల నాయకుడవై యుద్ధముచేయుము.
ఆలోచన చెప్పువారు అనేకులుండుట రక్షణకరము.
7 మూర్ఖునికి జ్ఞానము అందదు
గుమ్మమునొద్ద అట్టివారు మౌనులై యుందురు.
8 కీడుచేయ బన్నాగములు పన్నువానికి
తంటాలమారి అని పేరు పెట్టబడును.
9 మూర్ఖుని యోచన పాపము
అపహాసకులు నరులకు హేయులు.
10 శ్రమదినమున నీవు క్రుంగినయెడల
నీవు చేతకానివాడవగుదువు.
11 చావునకై పట్టబడినవారిని నీవు తప్పించుము
నాశమునందు పడుటకు జోగుచున్నవారిని నీవు రక్షింపవా?
12 ఈ సంగతి మాకు తెలియదని నీవనుకొనినయెడల
హృదయములను శోధించువాడు నీ మాటను గ్రహించును గదా
నిన్ను కనిపెట్టువాడు దాని నెరుగును గదా
నరులకు వారి వారి పనులనుబట్టి ఆయన ప్రతికారము చేయును గదా.
13 నా కుమారుడా, తేనె త్రాగుము అది రుచిగలది గదా
తేనెపట్టు తినుము అది నీ నాలుకకు తీపియే గదా.
14 నీ ఆత్మకు జ్ఞానము అట్టిదని తెలిసికొనుము
అది నీకు దొరికినయెడల ముందుకు నీకు మంచిగతి కలుగును
నీ ఆశ భంగము కానేరదు.
15 భక్తిహీనుడా, నీతిమంతుని నివాసమునొద్ద పొంచి యుండకుము
వాని విశ్రమస్థలమును పాడుచేయకుము.
16 నీతిమంతుడు ఏడు మారులు పడినను తిరిగి లేచును
ఆపత్కాలమునందు భక్తిహీనులు కూలుదురు.
17 నీ శత్రువు పడినప్పుడు సంతోషింపకుము
వాడు తొట్రిల్లినప్పుడు నీవు మనస్సున నుల్లసింపకుము.
18 యెహోవా అది చూచి అసహ్యించుకొని
వానిమీదనుండి తన కోపము త్రిప్పుకొనునేమో.
19 దుర్మార్గులను చూచి నీవు వ్యసనపడకుము
భక్తిహీనులయెడల మత్సరపడకుము.
20 దుర్జనునికి ముందు గతి లేదు భక్తిహీనుల దీపము ఆరిపోవును.
21 నా కుమారుడా, యెహోవాను ఘనపరచుము రాజును ఘనపరచుము
ఆలాగు చేయనివారి జోలికి పోకుము.

అట్టివారికి ఆపద హఠాత్తుగా తటస్థించును 22
వారి కాలము ఎప్పుడు ముగియునో యెవరికి తెలియును?
ఇవియు జ్ఞానులు చెప్పిన సామెతలే 23
—న్యాయము తీర్చుటలో పక్షపాతము చూపుట ధర్మము కాదు.
—నీయందు దోషములేదని దుష్టునితో చెప్పువానిని 24
ప్రజలు శపించుదురు
జనులు అట్టివానియందు అసహ్యపడుదురు.
న్యాయముగా తీర్పు తీర్చువారికి మేలు కలుగును 25
క్షేమకరమైన దీవెన అట్టివారిమీదికి వచ్చును.
సరియైన మాటలతో ప్రత్యుత్తరమిచ్చుట 26
పెదవులతో ముద్దుపెట్టుకొనినట్లుండును.
బయట నీ పని చక్కపెట్టుకొనుము ముందుగా 27
పొలములో దాని సిద్ధపరచుము
తరువాత ఇల్లు కట్టుకొనవచ్చును.
నిర్నిమిత్తముగా నీ పొరుగువానిమీద సాక్ష్యము 28
పలుకకుము
నీ పెదవులతో మోసపు మాటలు చెప్పవచ్చునా?
—వాడు నాకు చేసినట్లు వానికి చేసెదను 29
వాని క్రియచొప్పున వానికి ప్రతిఫలమిచ్చెదననుకొనకుము.
సోమరివాని చేను నేను దాటి రాగా 30
తెలివిలేనివాని ద్రాక్షతోట నేను దాటి రాగా
ఇదిగో దానియందంతట ముండ్లతుప్పలు బలిసి యుండెను. 31
దూలగొండ్లు దాని కప్పియుండెను
దాని రాతిగోడ పడియుండెను.
నేను దాని చూచి యోచన చేసికొంటిని 32
దాని కనిపెట్టి బుద్ధి తెచ్చుకొంటిని.
ఇంక కొంచెము నిద్ర యింక కొంచెము కునుకుపాటు 33
పరుండుటకై యింక కొంచెము చేతులు ముడుచుకొనుట
వీటివలన నీకు దరిద్రత పరుగెత్తి వచ్చును 34
ఆయుధస్థుడు వచ్చినట్లు లేమి నీమీదికి వచ్చును.

25

ఇవియును సొలొమోను సామెతలే
యూదారాజైన హిజ్కియా సేవకులు వీటిని ఎత్తి వ్రాసిరి.
—సంగతి మరుగుచేయుట దేవునికి ఘనత 2
సంగతి శోధించుట రాజులకు ఘనత.
ఆకాశముల యెత్తును భూమి లోతును 3
రాజుల అభిప్రాయమును అగోచరములు.
వెండిలోని మష్టు తీసివేసినయెడల 4
పుటము వేయువాడు పాత్రయొకటి సిద్ధపరచును.
రాజు ఎదుటనుండి దుష్టులను తొలగించినయెడల 5

అతని సింహాసనము నీతివలన స్థిరపరచబడును.
6 రాజు ఎదుట డంబము చూపకుము
గొప్పవారున్న చోట నిలువకుము.
7 నీ కన్నులు చూచిన ప్రధానియెదుట
ఒకడు నిన్ను తగ్గించుటకంటె
—ఇక్కడికి ఎక్కి రమ్మని అతడు నీతో చెప్పుట
నీకు మేలు గదా.
8 ఆలోచన లేక వ్యాజ్యమాడుటకు పోకుము
నీ పొరుగువాడు నిన్ను అవమానపరచి — దాని
అంతమున ఇక నీవేమి చేయుదువని నీతో
అనునేమో.
9 నీ పొరుగువానితో నీవు వ్యాజ్యమాడవచ్చును
గాని పరునిగుట్టు బయటపెట్టకుము.
10 బయటపెట్టినయెడల వినువాడు నిన్ను అవమాన
పరచునేమో
అందువలన నీకు కలిగిన అపకీర్తి యెన్నటికిని
పోకుండును.
11 సమయోచితముగా పలుకబడిన మాట
చిత్రమైన వెండి పళ్లెములలో నుంచబడిన బంగారు
పండ్లవంటిది.
12 బంగారు కర్ణభూషణ మెట్టిదో అపరంజి ఆభరణ
మెట్టిదో
వినువాని చెవికి జ్ఞానముగల ఉపదేశకుడు అట్టి
వాడు.
13 నమ్మకమైన దూత తనను పంపువారికి
కోతకాలమందు మంచుచేత పుట్టు చల్లదనమువంటి
వాడు
వాడు తన యజమానుల హృదయమును తెప్పరిల్ల
జేయును.
14 కపటమనస్సుతో దానమిచ్చి డంబము చేయువాడు
వర్షములేని మబ్బును గాలిని పోలియున్నాడు.
15 దీర్ఘశాంతముచేత న్యాయాధిపతిని ఒప్పించవచ్చును
సాత్వికమైన నాలుక యెముకలను నలుగగొట్టును.
16 తేనె కనుగొంటివా? తగినంతమట్టుకే త్రాగుము
అధికముగా త్రాగినయెడల కక్కి వేయుదువేమో.
17 మాటిమాటికి నీ పొరుగువాని యింటికి వెళ్లకుము
అతడు నీవలన విసికి నిన్ను ద్వేషించునేమో.
18 తన పొరుగువానిమీద కూటసాక్ష్యము పలుకు
వాడు
సమ్మెటను ఖడ్గమును వాడిగల అంబును పోలిన
వాడు.
19 శ్రమకాలములో విశ్వాసఘాతకుని ఆశ్ర
యించుట
విరిగిన పల్లుతోను కీలు వసిలిన కాలుతోను సమా
నము.
20 దుఃఖచిత్తునికి పాటలు వినుపించువాడు
చలిదినమున పైబట్ట తీసివేయువానితోను
సురేకారముమీద చిరకపోయు వానితోను సమా
నుడు.
నీ పగవాడు ఆకలిగొనినయెడల వానికి భోజ 21
నము పెట్టుము
దప్పిగొనినయెడల వానికి దాహమిమ్ము
అట్లు చేయుటచేత వాని తలమీద నిప్పులు కుప్ప 22
వేసెదవు
యెహోవా అందుకు నీకు ప్రతిఫలమిచ్చును.
ఉత్తరపు గాలి వాన పుట్టించును 23
కొండెగాని నాలుక కోపదృష్టి కలిగించును.
గయ్యాళితో పెద్ద యింట నుండుటకంటె 24
మిద్దెమీద నొక మూలను నివసించుట మేలు
దప్పిగొనినవానికి చల్లని నీరు ఎట్లుండునో 25
దూరదేశమునుండి వచ్చిన శుభసమాచారము
అట్లుండును.
కలకలు చేయబడిన ఊటయు చెడిపోయిన 26
బుగ్గయు
నీతిమంతుడు దుష్టునికి లోబడుటయు సమాన
ములు.
తేనె నధికముగా త్రాగుట మంచిది కాదు. 27
దుర్లభమైన సంగతి పరిశీలనచేయుట ఘనతకు
కారణము.
ప్రాకారము లేక పాడైన పురము ఎంతో 28
తన మనస్సును అణచుకొనలేనివాడును అంతే.
ఎండకాలమునకు మంచు గిట్టదు కోతకాలమునకు **26**
వర్షము గిట్టదు
అటువలె బుద్ధిహీనునికి ఘనత గిట్టదు.
రెక్కలు కొట్టుకొనుచు తారాడుచున్న పిచ్చు 2
కయు దాటుచుండు వానకోవెలయు దిగ
కుండునట్లు
హేతువులేని శాపము తగులకపోవును.
గుఱ్ఱమునకు చబుకు గాడిదెకు కళ్లెము 3
మూర్ఖుల వీపునకు బెత్తము.
వాని మూఢతచొప్పున మూర్ఖునికి ప్రత్యుత్తర 4
మియ్యకుము
ఇచ్చినయెడల నీవును వాని పోలియుందువు.
వాని మూఢతచొప్పున మూర్ఖునికి ప్రత్యుత్తర 5
మిమ్ము
ఆలాగు చేయనియెడల వాడు తన దృష్టికి తాను
జ్ఞానిననుకొనును.
మూర్ఖునిచేత వర్తమానము పంపువాడు 6
కాళ్లు తెగగొట్టుకొని విషము త్రాగినవానితో
సమానుడు.
కుంటివాని కాళ్లు పట్టులేక యున్నట్లు 7
మూర్ఖుల నోట సామెత పాటి లేకుండును

బుద్ధిహీనుని ఘనపరచువాడు
వడిసెలలోని రాయి కదలకుండ కట్టువానితో
సమానుడు.
మూర్ఖుల నోట సామెతె
మత్తుగొనువాని చేతిలో ముల్లు గుచ్చుకొన్న
ట్లుండును.
అధికముగా నొందినవాడు సమస్తము చేయవచ్చును
మూర్ఖునివలన కలుగు లాభము నిలువదు కూలికి
వాని పిలిచినవాడును చెడిపోవును.
తన మూఢతను మరల కనుపరచు మూర్ఖుడు
కక్కినదానికి తిరుగు కుక్కతో సమానుడు.
తన దృష్టికి జ్ఞానిననుకొనువానిని చూచితివా?
వానిని గుణపరచుటకంటె మూర్ఖుని గుణపరచుట
సుళువు.
సోమరి దారిలో సింహమున్నదనును వీధిలో
సింహమున్నదనును.
ఉతికమీద తలుపు తిరుగును
తన పడకమీద సోమరి తిరుగును.
సోమరి పాత్రలో తన చెయ్యి ముంచును
నోటియొద్దకు దాని తిరిగి యెత్తుట కష్టమనుకొనును.
హేతువులు చూపగల యేడుగురికంటె
సోమరి తన దృష్టికి తానే జ్ఞానిననుకొనును.
తనకు పట్టని జగడమునుబట్టి రేగువాడు
దాటిపోవుచున్న కుక్క చెవులు పట్టుకొనువానితో
సమానుడు.
తెగులు అమ్ములు కొరవులు విసరు వెఱ్ఱివాడు
తన పొరుగువాని మోసపుచ్చి నేను నవ్వులాటకు
చేసితినని పలుకువానితో సమానుడు.
20 కట్టెలు లేనియెడల అగ్ని ఆరిపోవును
కొండెగాడు లేనియెడల జగడము చల్లారును.
21 వేడిబూడిదెకు బొగ్గులు అగ్నికి కట్టెలు
కలహములు పుట్టించుటకు కలహప్రియుడు.
22 కొండెగాని మాటలు రుచిగల పదార్థములవంటివి
అవి లోకడుపులోకి దిగిపోవును.
23 చెడు హృదయమును ప్రేమగల మాటలాడు పెద
వులును కలిగియుండుట మంటి పెంకుమీది
వెండిపూతతో సమానము.
24 పగవాడు పెదవులతో మాయలు చేసి
అంతరంగములో కపటము దాచుకొనును.
25 వాడు దయగా మాటలాడినప్పుడు వాని మాట
నమ్మకుము
వాని హృదయములో ఏడు హేయవిషయములు
కలవు.
26 వాడు తన ద్వేషమును కపటవేషముచేత దాచు
కొనును
సమాజములో వాని చెడుతనము బయలుపరచ
బడును.
గుంటను త్రవ్వువాడే దానిలో పడును 27
రాతిని పొర్లించువానిమీదికి అది తిరిగి వచ్చును.
అబద్ధములాడువాడు తాను నలుగగొట్టినవారిని 28
ద్వేషించును
ఇచ్చకపు మాటలాడు నోరు నష్టము కలుగజేయును.

## 27

రేపటి దినమునుగూర్చి అతిశయపడకుము
ఏ దినమున ఏది సంభవించునో అది నీకు తెలి
యదు.
నీ నోరు కాదు అన్యుడే, నీ పెదవులు కాదు 2
పరులే నిన్ను పొగడదగును.
రాయి బరువు ఇసుక భారము 3
మూఢుని కోపము ఆ రెంటికంటె బరువు.
క్రోధము క్రూరమైనది అగ్రహము వరదవలె 4
పొర్లునది.
రోషము ఎదుట ఎవడు నిలువగలడు?
లోలోపల ప్రేమించుటకంటె 5
బహిరంగముగా గద్దించుట మేలు.
మేలును కోరి స్నేహితుడు గాయములు చేయును 6
పగవాడు లెక్కలేని ముద్దులు పెట్టును.
కడుపు నిండినవాడు తేనెపట్టునైనను త్రొక్కి 7
వేయును
ఆకలిగొనినవానికి చేదువస్తువైనను తియ్యగా
నుండును
తన యిల్లు విడిచి తిరుగువాడు 8
గూడు విడిచి తిరుగు పక్షితో సమానుడు.
తైలమును అత్తరును హృదయమును సంతోషపర 9
చునట్లు
చెలికాని హృదయములోనుండి వచ్చు మధురమైన
మాటలు హృదయమును సంతోషపరచును.
నీ స్నేహితునినైనను నీ తండ్రి స్నేహితునినైనను 10
విడిచిపెట్టకుము
నీకు ఆపద కలిగిన దినమందు నీ సహోదరుని
యింటికి వెళ్లకుము
దూరములోనున్న సహోదరునికంటె
దగ్గరనున్న పొరుగువాడు వాసి
నా కుమారుడా, జ్ఞానమును సంపాదించి నా 11
హృదయమును సంతోషపరచుము
అప్పుడు నన్ను నిందించువారితో నేను ధైర్య
ముగా మాటలాడుదును.
బుద్ధిమంతుడు అపాయము వచ్చుట చూచి 12
దాగును
జ్ఞానములేనివారు యోచింపక ఆపదలో పడుదురు.
ఎదుటివానికొరకు పూటబడినవాని వస్త్రము పుచ్చు 13
కొనుము.

పతులకొరకు పూటబడినవానివలన కుదువపెట్టిం
చుము.
14 వేకువనే లేచి గొప్ప శబ్దముతో తన స్నేహితుని
దీవించువాని దీవెన వానికి శాపముగా ఎంచ
బడును.
15 ముసురు దినమున ఎడతెగక కారు నీళ్లును
గయ్యాళియైన భార్యయు సమానము
16 దానిని ఆపజూచువాడు గాలిని ఆపజూచు
వానితోను
తన కుడిచేత నూనె పట్టుకొనువానితోను సమా
నుడు.
17 ఇనుముచేత ఇనుము పదునగును
అట్లు ఒకడు తన చెలికానికి వివేకము పుట్టించును.
18 అంజూరపు చెట్టును పెంచువాడు దాని ఫలము
తినును
తన యజమానుని మన్నించువాడు ఘనతనొందును.
19 నీటిలో ముఖమునకు ముఖము కనబడునట్లు
ఒకని మనస్సునకు మరియొకని మనస్సు కనబడును.
20 పాతాళమునకును అగాధ కూపమునకును తృప్తి
లేదు
ఆలాగున నరుల దృష్టి తృప్తికానేరదు.
21 మూసచేత వెండిని కొలిమిచేత బంగారును
తాను పొందిన కీర్తిచేత నరుని పరిశోధింపవచ్చును.
22 మూఢుని రోటిలోని గోధుమలలో వేసి రోకట
దంచినను
వాని మూఢత వాని విడిచిపోదు.
23 నీ పశువుల స్థితి జాగ్రత్తగా తెలిసికొనుము
నీ మందలయందు మనస్సు ఉంచుము.
24 ధనము శాశ్వతము కాదు
కిరీటము తరతరములు (ఒక కుటుంబమునకు)
ఉండునా?
25 ఎండిన గడ్డి వామివేయబడెను పచ్చిక కనబడు
చున్నది
కొండగడ్డి యేరబడియున్నది
26 నీ వస్త్రములకొరకు గొఱ్ఱెపిల్లలున్నవి
ఒక చేని క్రయధనమునకు పొట్టేళ్లు సరిపోవును
27 నీ ఆహారమునకు నీ యింటివారి ఆహారమునకు
నీ పనికత్తెల జీవనమునకు మేకపాలు సమృద్ధి
యగును.

**28** ఎవడును తరుమకుండనే దుష్టుడు పారిపోవును
నీతిమంతులు సింహమువలె ధైర్యముగా నుందురు.
2 దేశస్థుల దోషమువలన దాని అధికారులు అనేకు
లగుదురు
బుద్ధిజ్ఞానములు గలవారిచేత దాని అధికారము
స్థిరపరచబడును.
బీదలను బాధించు దరిద్రుడు 3
ఆహారవస్తువులను ఉండనియ్యక కొట్టుకొనిపోవు
వానతో సమానుడు.
ధర్మశాస్త్రమును త్రోసివేయువారు దుష్టులను పొగడు 4
చుందురు
ధర్మశాస్త్రము ననుసరించువారు వారితో పోరాడు
దురు.
దుష్టులు న్యాయమెట్టిదైనది గ్రహింపరు 5
యెహోవాను ఆశ్రయించువారు సమస్తమును
గ్రహించుదురు
వంచకుడై ధనము సంపాదించినవానికంటె 6
యథార్థముగా ప్రవర్తించు దరిద్రుడు వాసి.
ఉపదేశము నంగీకరించు కుమారుడు బుద్ధిగలవాడు 7
తుంటరుల సహవాసము చేయువాడు తన తండ్రికి
అపకీర్తి తెచ్చును.
వడ్డిచేతను దుర్లాభముచేతను ఆస్తి పెంచుకొను 8
వాడు
దరిద్రులను కరుణించువానికొరకు దాని కూడ
బెట్టును.
ధర్మశాస్త్రము వినబడకుండ చెవిని తొలగించుకొను 9
వాని ప్రార్థన హేయము.
యథార్థవంతులను దుర్మార్గమందు చొప్పించువాడు 10
తాను త్రవ్విన గోతిలో తానే పడును
యథార్థవంతులు మేలైనదానిని స్వతంత్రించు
కొందురు.
ఐశ్వర్యవంతుడు తన దృష్టికి తానే జ్ఞాని 11
వివేకముగల దరిద్రుడు వాని పరిశోధించును.
నీతిమంతులకు జయము కలుగుట మహాఘనతకు 12
కారణము.
దుష్టులు గొప్పవారగునప్పుడు జనులు దాగియుం
దురు.
అతిక్రమములను దాచిపెట్టువాడు వర్ధిల్లడు 13
వాటిని ఒప్పుకొని విడిచిపెట్టువాడు కనికరము
పొందును.
నిత్యము భయముగలిగి ప్రవర్తించువాడు ధన్యుడు 14
హృదయమును కఠినపరచుకొనువాడు కీడులో
పడును.
బొబ్బరించు సింహమును తిరుగులాడు ఎలుగు 15
బంటియు
దరిద్రులైన జనుల నేలు దుష్టుడును సమానములు.
వివేకములేనివాడవై జనులను అధికముగా బాధ 16
పెట్టు అధికారీ,[1]
దుర్లాభమును ద్వేషించువాడు దీర్ఘాయుష్మంతు
డగును.

[1] లేక, వివేకములేని అధికారి జనులను అధికముగా బాధపెట్టును.

ప్రాణము తీసిన దోషము కట్టుకొనినవాడు గోతికి
పరుగెత్తుచున్నాడు
ఎవరును అట్టివానిని ఆపకూడదు.
యథార్థముగా ప్రవర్తించువాడు రక్షింపబడును
మూర్ఖప్రవర్తనగలవాడు హఠాత్తుగా పడిపోవును.
తన పొలము సేద్యము చేసికొనువానికి కడుపు
నిండ అన్నము కలుగును
వ్యర్థమైనవాటిని అనుసరించువానికి కలుగు పేద
రికము ఇంతంత కాదు.
నమ్మకమైనవానికి దీవెనలు మెండుగా కలుగును
ధనవంతుడగుటకు ఆతురపడువాడు శిక్షనొందక
పోడు.
పక్షపాతము చూపుట మంచిది కాదు
రొట్టెముక్కకొరకు ఒకడు దోషముచేయును.
చెడు దృష్టిగలవాడు ఆస్తి సంపాదింప ఆతుర
పడును
తనకు దరిద్రత వచ్చునని వానికి తెలియదు.
నాలుకతో ఇచ్చకములాడు వానికంటె
నరులను గద్దించువాడు తుదకు ఎక్కువ దయ
పొందును.
తన తలిదండ్రుల సొమ్ము దోచుకొని — అది
ద్రోహము కాదనుకొనువాడు
నశింపజేయువానికి జతగాడు.
పేరాసగలవాడు కలహమును రేపును
యెహోవాయందు నమ్మకముంచువాడు వర్ధిల్లును.
తన మనస్సును నమ్ముకొనువాడు బుద్ధిహీనుడు
జ్ఞానముగా ప్రవర్తించువాడు తప్పించుకొనును.
బీదలకిచ్చువానికి లేమి కలుగదు
కన్నులు మూసికొనువానికి బహు శాపములు
కలుగును.
దుష్టులు గొప్పవారగునప్పుడు జనులు దాగు
కొందురు
వారు నశించునప్పుడు నీతిమంతులు ఎక్కువగుదురు.

29 ఎన్నిసారులు గద్దించినను లోబడనివాడు
మరి తిరుగులేకుండ హఠాత్తుగా నాశనమగును.
2 నీతిమంతులు ప్రబలినప్పుడు ప్రజలు సంతో
షింతురు
దుష్టుడు ఏలునప్పుడు ప్రజలు నిట్టూర్పులు
విడుతురు.
3 జ్ఞానమును ప్రేమించువాడు తన తండ్రిని సం
తోషపరచును
వేశ్యలతో సాంగత్యము చేయువాడు అతని ఆస్తిని
పాడుచేయును.
4 న్యాయము జరిగించుటవలన రాజు దేశమునకు
క్షేమము కలుగజేయును
లంచములు పుచ్చుకొనువాడు దేశమును పాడు
చేయును.
తన పొరుగువానితో ఇచ్చకములాడువాడు 5
వాని పట్టుకొనుటకు వలవేయువాడు.
దుష్టుని మార్గమున బోనులు ఉంచబడును 6
నీతిమంతుడు సంతోషగానములు చేయును.
నీతిమంతుడు బీదలకొరకు న్యాయము విచా 7
రించును
దుష్టుడు జ్ఞానము వివేచింపడు.
అపహాసకులు పట్టణము తల్లడిల్లజేయుదురు 8
జ్ఞానులు కోపము చల్లార్చెదరు.
జ్ఞాని మూఢునితో వాదించునప్పుడు 9
వాడు ఊరకుండక రేగుచుండును.
నరహంతకులు నిర్దోషులను ద్వేషించుదురు 10
అట్టివారు యథార్థవంతుల ప్రాణము తీయజూ
తురు.
బుద్ధిహీనుడు తన కోపమంత కనుపరచును 11
జ్ఞానముగలవాడు కోపము అణచుకొని దానిని
చూపకుండును.
అబద్ధముల నాలకించు రాజుకు 12
ఉద్యోగస్థులందరు దుష్టులుగా నుందురు.
బీదలును వడ్డికిచ్చువారును కలిసికొందురు 13
ఉభయులకు వెలుగునిచ్చువాడు యెహోవాయే.
ఏ రాజు దరిద్రులకు సత్యముగా న్యాయము 14
తీర్చునో
ఆ రాజు సింహాసనము నిత్యముగా స్థిరపరచబడును.
బెత్తమును గద్దింపును జ్ఞానము కలుగజేయును 15
అదుపులేని బాలుడు తన తల్లికి అవమానము
తెచ్చును.
దుష్టులు ప్రబలినప్పుడు చెడుతనము ప్రబలును 16
వారు పడిపోవుటను నీతిమంతులు కన్నులార
చూచెదరు.
నీ కుమారుని శిక్షించినయెడల అతడు నిన్ను సం 17
తోషపరచును
నీ మనస్సుకు ఆనందము కలుగజేయును
దేవోక్తి లేనియెడల జనులు కట్టులేక తిరుగుదురు 18
ధర్మశాస్త్రము ననుసరించువాడు ధన్యుడు.
దాసుడు వాగ్దండనచేత గుణపడడు 19
తాత్పర్యము తెలిసికొన్నను వాడు లోబడడు
ఆతురపడి మాటలాడువాని చూచితివా? 20
వానికంటె మూర్ఖుడు సులువుగా గుణపడును.
ఒకడు తన దాసుని చిన్నప్పటినుండి 21
గారాబముగా పెంచినయెడల తుదిని వాడు
కుమారుడుగా ఎంచబడును.
కోపిష్ఠుడు కలహము రేపును 22
ముంగోపి అధికమైన దుష్క్రియలు చేయును.

# ప్ర స ం గి

1 దావీదు కుమారుడును యెరూషలేములో రాజునై
యుండిన ప్రసంగి పలికిన మాటలు.
2 —వ్యర్థము వ్యర్థమని ప్రసంగి చెప్పుచున్నాడు,
3 వ్యర్థము వ్యర్థము సమస్తము వ్యర్థమే.। సూర్యుని క్రింద
నరులు పడుచుండు పాటు అంతటివలన వారికి కలుగు
4 చున్న లాభమేమి? । తరము వెంబడి తరము గతించి
పోవుచున్నది; భూమియొకటే యెల్లప్పుడును నిలుచు
5 నది. । సూర్యుడుదయించును, సూర్యుడు అస్తమిం
చును, తాను ఉదయించు స్థలము మరల చేరుటకు త్వర
6 పడును. । గాలి దక్షిణమునకు పోయి ఉత్తరమునకు
తిరుగును; ఇట్లు మరల మరల తిరుగుచు తన సంచార
7 మార్గమున తిరిగి వచ్చును. । నదులన్నియు సముద్ర
ములో పడును, అయితే సముద్రము నిండుట లేదు;
నదులు ఎక్కడనుండి పారి వచ్చునో అక్కడికే అవి
8 ఎప్పుడును మరలిపోవును । ఎడతెరిపిలేకుండ సమ
స్తము జరుగుచున్నది; మనుష్యులు దాని వివరింప
జాలరు; చూచుటచేత కన్ను తృప్తిపొందకున్నది,
9 వినుటచేత చెవికి తృప్తికలుగుట లేదు. । మునుపు
ఉండినదే ఇక ఉండబోవునది; మునుపు జరిగినదే ఇక
జరుగబోవునది; సూర్యుని క్రింద నూతనమైన దేదియు
10 లేదు. ' —ఇది నూతనమైనదని యొకదానిగూర్చి
యొకడు చెప్పును; అదియును మనకు ముందుండిన
11 తరములలో ఉండినదే. । పూర్వులు జ్ఞాపకమునకు
రారు; పుట్టబోవువారి జ్ఞాపకము ఆ తరువాత నుండ
బోవువారికి కలుగదు.
12 ప్రసంగినైన నేను యెరూషలేమునందు ఇశ్రాయే
13 లీయులమీద రాజునై యుంటిని. । ఆకాశము క్రింద
జరుగునది అంతటిని జ్ఞానముచేత విచారించి గ్రహిం
చుటకై నా మనస్సు నిలిపితిని; వారు దీనిచేత శిక్ష
నొందవలెనని దేవుడు మానవులకు ఏర్పాటుచేసిన
14 ప్రయాసము బహు కఠినమైనది. । సూర్యుని క్రింద
జరుగుచున్న క్రియలనన్నిటిని నేను చూచితిని; అవి
అన్నియు వ్యర్థములే, అవి యొకడు గాలికై ప్రయాస
15 పడినట్లున్నవి. । వంకరగానున్నదానిని చక్కపరచ
శక్యముకాదు, లోపముగలది లెక్కకు రాదు. ।
16 యెరూషలేమునందు నాకు ముందున్న వారందరి
కంటెను నేను చాల ఎక్కువగా జ్ఞానము సంపాదిం
చితినని, జ్ఞానమును విద్యను నేను పూర్ణముగా
—చితినని నా మనస్సులో నేననుకొంటిని.।
నిలిపి, జ్ఞానాభ్యాసమును వెఱ్ఱితనమును
తెలిసికొనుటకు ప్రయత్నించితిని;
అయితే ఇదియు గాలికై ప్రయాసపడుటయే అని
తెలిసికొంటిని. । విస్తారమైన జ్ఞానాభ్యాసముచేత 18
విస్తారమైన దుఃఖము కలుగును; అధిక విద్య సంపా
దించినవానికి అధిక శోకము కలుగును.

కానీ నిన్ను సంతోషముచేత శోధించి చూతును; 2
—నీవు మేలు ననుభవించి చూడుమని నేను నా
హృదయముతో చెప్పుకొంటిని; అయితే అదియు
వ్యర్థప్రయత్నమాయెను. । నవ్వుతో—నీవు వెఱ్ఱిదాన 2
వనియు, సంతోషముతో — నీచేత కలుగునదేమి
యనియు నేనంటిని. । నా మనస్సు ఇంకను జ్ఞానము 3
అనుసరించుచుండగా ఆకాశము క్రింద తాము
బ్రదుకుకాలమంతయు మనుష్యులు ఏమిచేసి మేలు
అనుభవింతురో చూడవలెనని తలచి, నా దేహమును
ద్రాక్షారసముచేత సంతోషపరచుకొందుననియు,
మతిహీనతయొక్క సంగతి అంతయు గ్రహింతు
ననియు నా మనస్సులో నేను యోచన చేసికొంటిని.।
నేను గొప్ప పనులు చేయబూనుకొంటిని, నాకొరకు 4
ఇండ్లు కట్టించుకొంటిని, ద్రాక్షతోటలు నాటించు
కొంటిని. । నాకొరకు తోటలను శృంగారవనములను 5
వేయించుకొని వాటిలో సకలవిధములైన ఫలవృక్షము
లను నాటించితిని. । వృక్షముల నారుమళ్లకు నీరు 6
పారుటకై నేను చెరువులు త్రవ్వించుకొంటిని. ।
పనివాండ్లను పనికత్తెలను సంపాదించుకొంటిని; నా 7
యింట పుట్టిన దాసులు నాకుండిరి; యెరూషలేము
నందు నాకు ముందుండినవారందరికంటె ఎక్కువగా
పసుల మందలును గొఱ్ఱె మేకలమందలును బహు విస్తా
రముగా సంపాదించుకొంటిని. । నాకొరకు నేను 8
వెండి బంగారములను, రాజులు సంపాదించు సంప
దను, ఆ యా దేశములలో దొరుకు సంపత్తును
కూర్చుకొంటిని; నేను గాయకులను గాయకురాండ్రను
మనుష్యులిచ్ఛయించు సంపదలను సంపాదించుకొని
బహుమంది ఉపపత్నులను ఉంచుకొంటిని. । నాకు 9
ముందు యెరూషలేమునందున్న వారందరికంటెను
నేను ఘనుడనై అభివృద్ధినొందితిని; నా జ్ఞానము
నన్ను విడిచిపోలేదు. । నా కన్నులు ఆశించినవాటిలో 10
దేనిని అవి చూడకుండ నేను అభ్యంతరము చేయ
లేదు; మరియు నా హృదయము నా పనులన్నిటిని
బట్టి సంతోషింపగా సంతోషకరమైన దేదియు
అనుభవించకుండ నేను నా హృదయమును నిర్బం
ధింపలేదు. ఇదే నా పనులన్నిటివలన నాకు దొరి
కిన భాగ్యము. । అప్పుడు నేను చేసిన పనులన్నియు, 11

కొరకై నేను పడిన ప్రయాసమంతయు నేను
నించి వివేచింపగా అవన్నియు వ్యర్థమైనవిగాను
డు గాలికి ప్రయాసపడినట్టుగాను అగుపడెను;
ర్యునిక్రింద లాభకరమైనదేదియు లేనట్టు నాకు
బడెను.

మునుపు నియమింపబడిన రాజు తరువాత రాబోవు
డు ఏమి (చేయునో) అనుకొని నేను జ్ఞానమును
త్తతనమును మతిహీనతను పరిశీలించుటకై పూను
ంటిని. । అంతట చీకటికంటె వెలుగు ఎంత
ప్రయోజనకరమో బుద్ధిహీనతకంటె జ్ఞానము అంత
ప్రయోజనకరమని నేను తెలిసికొంటిని. । జ్ఞానికి
న్నులు తలలో నున్నవి, బుద్ధిహీనుడు చీకటియందు
డుచుచున్నాడు; అయినను అందరికిని ఒక్కటే గతి
ంభవించునని నేను గ్రహించితిని. । కావున—బుద్ధి
నునికి సంభవించునట్లే నాకును సంభవించును
నుక నేను అధిక జ్ఞానము ఏల సంపాదించితినని
ా హృదయమందనుకొంటిని. ఇదియు వ్యర్థమే. ।
బుద్ధిహీనులనుగూర్చినట్లుగానే జ్ఞానులనుగూర్చియు
జ్ఞాపకము ఎన్నటికిని యుంచబడదు; రాబోవు దినము
లలో వారందరును మరువబడినవారై యుందురు;
జ్ఞానులు మృతినొందు విధమెట్టిదో బుద్ధిహీనులు
మృతినొందు విధమట్టిదే. । ఇది చూడగా సూర్యుని
క్రింద జరుగునది నాకు వ్యసనము పుట్టించెను—
అంతయు వ్యర్థముగాను ఒకడు గాలికై ప్రయాసపడి
నట్టుగాను కనబడెను గనుక బ్రదుకుట నాకసహ్య
మాయెను.

సూర్యునిక్రింద నేను ప్రయాసపడి చేసిన పను
లన్నిటిని నా తరువాత వచ్చువానికి నేను విడిచిపెట్ట
వలెనని తెలిసికొని నేను వాటియందు అసహ్యపడి
తిని. । వాడు జ్ఞానముగలవాడై యుండునో బుద్ధి
హీనుడై యుండునో అది ఎవనికి తెలియును! అయితే
సూర్యునిక్రింద నేను ప్రయాసపడి జ్ఞానముచేత
సంపాదించుకొన్న నా కష్టఫలమంతటిమీదను వాడు
అధికారియై యుండును; ఇదియును వ్యర్థమే. ।
కావున సూర్యునిక్రింద నేను పడిన ప్రయాస
మంతటి విషయమై నేను ఆశ విడిచినవాడనైతిని. ।
ఒకడు జ్ఞానముతోను తెలివితోను యుక్తితోను
ప్రయాసపడి ఏదో ఒక పని చేయును; అయితే
దానికొరకు ప్రయాసపడనివానికి అతడు దానిని
స్వాస్థ్యముగా ఇచ్చివేయవలసివచ్చును; ఇదియు
వ్యర్థమును గొప్ప చెడుగునై యున్నది. । సూర్యుని
క్రింద నరునికి తటస్థించు ప్రయాసమంతటిచేతను,
వాడు తలపెట్టు కార్యములన్నిటిచేతను, వానికేమి
3 దొరుకుచున్నది? । వాని దినములన్నియు శ్రమకర
ములు, వాని పాట్లు వ్యసనకరములు, రాత్రియందైనను
వాని మనస్సునకు నెమ్మది దొరుకదు; ఇదియు వ్యర్థమే.

అన్నపానములు పుచ్చుకొనుటకంటెను, తన కష్టా 24
ర్జితముచేత సుఖపడుటకంటెను నరునికి మేలుకరమైన
దేదియు లేదు. ఇదియును దేవునివలన కలుగునని
నేను తెలిసికొంటిని. । ఆయన సెలవులేక భోజనము 25
చేసి సంతోషించుట ఎవరికి సాధ్యము? । ఏలయనగా 26
దైవదృష్టికి మంచివాడుగా నుండువానికి దేవుడు
జ్ఞానమును తెలివిని ఆనందమును అనుగ్రహించును;
అయితే దైవదృష్టికి ఇష్టుడగువాని కిచ్చుటకై ప్రయాస
పడి పోగుచేయు పనిని ఆయన పాపాత్మునికి నిర్ణ
యించును. ఇదియు వ్యర్థముగాను ఒకడు గాలికై
ప్రయాసపడినట్టుగాను ఉన్నది.

ప్రతిదానికి సమయము కలదు. ఆకాశముక్రింద 3
ప్రతి ప్రయత్నమునకు సమయము కలదు. । పుట్టు 2
టకు సమయము కలదు, చచ్చుటకు సమయము కలదు,
నాటుటకు సమయము కలదు నాటబడినదాని పెరికి
వేయుటకు సమయము కలదు; । చంపుటకు సమ 3
యము కలదు బాగుచేయుటకు సమయము కలదు,
పడగొట్టుటకు సమయము కలదు కట్టుటకు సమయము
కలదు, । ఏడ్చుటకు సమయము కలదు నవ్వుటకు 4
సమయము కలదు, దుఃఖించుటకు సమయము కలదు
నాట్యమాడుటకు సమయము కలదు, । రాళ్లను పార 5
వేయుటకు సమయము కలదు రాళ్లను కుప్పవేయు
టకు సమయము కలదు, కౌగలించుటకు సమయము
కలదు కౌగలించుట మానుటకు సమయము కలదు, ।
వెదకుటకు సమయము కలదు పోగొట్టుకొనుటకు సమ 6
యము కలదు, దాచుకొనుటకు సమయము కలదు
పారవేయుటకు సమయము కలదు, । చింపుటకు సమ 7
యము కలదు కుట్టుటకు సమయము కలదు, మౌన
ముగా నుండుటకు సమయము కలదు మాటలాడుటకు
సమయము కలదు, । ప్రేమించుటకు సమయము కలదు 8
ద్వేషించుటకు సమయము కలదు, యుద్ధము చేయు
టకు సమయము కలదు సమాధానపడుటకు సమయము
కలదు. । కష్టపడినవారికి తమ కష్టమువలన వచ్చిన 9
లాభమేమి? । నరులు శిక్ష నొందవలెనని దేవుడు వారికి 10
పెట్టియున్న కష్టానుభవమును నేను చూచితిని. । దేని 1
కాలమునందు అది చక్కగా నుండునట్లు సమస్తమును
ఆయన నియమించి యున్నాడు; ఆయన శాశ్వతకాల
జ్ఞానమును నరుల హృదయమందుంచియున్నాడు
గాని దేవుడు చేయు క్రియలను పరిశీలనగా తెలిసి
కొనుటకు అది చాలదు. । కావున సంతోషముగా
నుండుటకంటెను, తమ బ్రదుకును సుఖముగా వెళ్లి
బుచ్చుటకంటెను, శ్రేష్ఠమైనదేదియు నరులకు లేదని
నేను తెలిసికొంటిని. । మరియు ప్రతివాడు అన్న
పానములు పుచ్చుకొనుచు తన కష్టార్జితమువలన సుఖ
మనుభవించుట దేవుడిచ్చు బహుమానమే (అని తెలిసి
కొంటిని.) । దేవుడు చేయు పనులన్నియు శాశ్వతము

23 ఎవని గర్వము వానిని తగ్గించును
వినయమనస్కుడు ఘనతనొందును.
24 దొంగతో పాలుకూడువాడు తనకుతానే పగవాడు
అట్టివాడు ఒట్టుపెట్టినను సంగతి చెప్పడు.
25 భయపడుటవలన మనుష్యులకు ఉరి వచ్చును
యెహోవాయందు నమ్మిక యుంచువాడు సుర
క్షితముగా నుండును.
26 అనేకులు ఏలువాని దయ కోరుచుందురు
మనుష్యులను తీర్పు తీర్చుట యెహోవా వశము.
27 దుర్మార్గుడు నీతిమంతులకు హేయుడు
యథార్థవర్తనుడు భక్తిహీనునికి హేయుడు.

30 దేవోక్తి, అనగా యాకె కుమారుడైన ఆగూరు
పలికిన మాటలు. ఆ మనుష్యుడు ఈతీయేలు
కును, ఈతీయేలుకును ఉక్కాలుకును చెప్పిన
మాట.
2 నిశ్చయముగా మనుష్యులలో నావంటి పశుప్రా
యుడు లేడు
నరులకున్న వివేచన నాకు లేదు.
3 నేను జ్ఞానాభ్యాసము చేసికొన్నవాడనుకాను
పరిశుద్ధ దేవునిగూర్చిన జ్ఞానము పొందలేదు.
4 ఆకాశమునకెక్కి మరల దిగినవాడెవడు?
తన పిడికిళ్లలో గాలిని పట్టుకొన్నవాడెవడు?
బట్టలో నీళ్లు మూటకట్టినవాడెవడు?
భూమియొక్క దిక్కులన్నిటిని స్థాపించినవాడెవడు?
ఆయన పేరేమో ఆయన కుమారుని పేరేమో నీకు
తెలిసియున్నదా?
5 దేవుని మాటలన్నియు పుటము పెట్టబడినవే
ఆయనను ఆశ్రయించువారికి ఆయన కేడెము.
6 ఆయన మాటలతో ఏమియు చేర్చకుము
ఆయన నిన్ను గద్దించునేమో
అప్పుడు నీవు అబద్ధికుడవగుదువు.
7 దేవా, నేను నీతో రెండు మనవులు చేసికొను
చున్నాను
నేను చనిపోకముందు వాటిని నాకనుగ్రహింపుము.
8 వ్యర్థమైనవాటిని అబద్ధములను నాకు దూరముగా
నుంచుము
పేదరికమునైనను ఐశ్వర్యమునైనను నాకు దయ
చేయకుము
తగినంత ఆహారము నాకు అనుగ్రహింపుము
9 ఎక్కువైనయెడల నేను కడుపు నిండినవాడనై
నిన్ను విసర్జించి
—యెహోవా యెవడని అందునేమో
లేక బీదనై దొంగిలి నా దేవుని నామమును
దూషింతునేమో.
10 దాసునిగూర్చి వాని యజమానునితో కొండెములు
చెప్పకుము
వాడు నిన్ను శపించును ఒకవేళ నీవు శిక్షార్హుడ
వగుదువు.
తమ తండ్రిని శపించుచు తల్లిని దీవించని తరము 11
(కలదు.)
తమ దృష్టికి తాము శుద్ధులై 12
తమ మాలిన్యమునుండి కడుగబడని వారి తరము
(కలదు.)
కన్నులు నెత్తికి వచ్చినవారి తరము (కలదు.) 13
వారి కనురెప్పలు ఎంత పైకెత్తబడియున్నవి.
దేశములో ఉండకుండ వారు దరిద్రులను మ్రింగు
నట్లును
మనుష్యులలో ఉండకుండ బీదలను నశింపజేయు
నట్లును
ఖడ్గమువంటి పళ్లును కత్తులవంటి దవడపళ్లును 14
గలవారి తరము (కలదు.)
జలగకమునకు ఇమ్ము ఇమ్ము అను కూతురులిద్దరు కలరు 15
తృప్తిపడనివి మూడు కలవు—చాలును అని పలుక
నివి నాలుగు కలవు.
అవేవనగా పాతాళము, కనని గర్భము, నీరు 16
చాలును అనని భూమి, చాలును అనని అగ్ని.
తండ్రిని అపహసించి తల్లి మాట విననొల్లని వాని 17
కన్ను
లోయ కాకులు పీకును పక్షిరాజు పిల్లలు దాని
తినును.
నా బుద్ధికి మించినవి మూడు కలవు 18
నేను గ్రహింపలేనివి నాలుగు కలవు.
అవేవనగా, అంతరిక్షమున పక్షిరాజు జాడ
బండమీద సర్పము జాడ నడిసముద్రమున ఓడ 19
నడచు జాడ
కన్యకతో పురుషుని జాడ
జారిణియొక్క చర్యయును అట్టిదే; అది తిని నోరు 20
తుడుచుకొని
—నేను ఏ దోషము ఎరుగననును.
భూమిని వణకించునవి మూడు కలవు, అది మోయ 21
లేనివి నాలుగు కలవు.
వేవనగా, రాజరికమునకు వచ్చిన దాసుడు, 22
కడుపునిండ అన్నము కలిగిన మూర్ఖుడు,
ంటకురాలై యుండి పెండ్లియైన స్త్రీ, యజమాను 23
రాలికి హక్కుదారురాలైన దాసి.
భూమిమీద చిన్నవి నాలుగు కలవు అయినను అవి 24
మిక్కిలి జ్ఞానముగలవి.
చీమలు బలములేని జీవులు అయినను అవి వేసవిలో 25
తమ ఆహారమును సిద్ధపరచుకొనును.
చిన్న కుందేళ్లు బలములేని జీవులు అయినను అవి 26
పేటు సందులలో నివాసములు కల్పించు
కొనును.

27 మిడుతలకు రాజు లేడు అయినను అవన్నియు
పంక్తులు తీరి సాగిపోవును.
28 బల్లిని చేతితో నీవు పట్టుకొనగలవు అయినను
రాజుల గృహములలో అది యుండును.
29 డంబముగా నడుచునవి మూడు కలవు
30 ఠీవితో నడుచునవి నాలుగు కలవు — అవేవనగా
ఎల్లమృగములలో పరాక్రమముగలదై
ఎవనికైన భయపడి వెనుకకు తిరుగని సింహము.
31 శోణంగి కుక్క, మేకపోతు,
తన సైన్యమునకు ముందు నడుచుచున్న రాజు.
32 నీవు బుద్ధిహీనుడవై అతిశయపడి యుండినయెడల
కీడు యోచించి యుండినయెడల
నీ చేతితో నోరు మూసికొనుము.
33 పాలు తరచగా వెన్న పుట్టును, ముక్కు పిండగా
రక్తమువచ్చును, కోపము రేపగా కలహము
పుట్టును

**31** రాజైన లెమూయేలు మాటలు, అతని తల్లి అతని
కుపదేశించిన దేవోక్తి.
2 నా కుమారుడా, నేనేమందును? నేను కన్న
కుమారుడా, నేనేమందును?
నా మ్రొక్కులు మ్రొక్కి కనిన కుమారుడా,
నేనేమందును?
3 నీ బలమును స్త్రీలకియ్యకుము.
రాజులను నశింపజేయు స్త్రీలతో సహవాసము
చేయకుము.
4 ద్రాక్షారసము త్రాగుట రాజులకు తగదు
లెమూయేలూ, అది రాజులకు తగదు
మద్యపానాసక్తి అధికారులకు తగదు.
5 త్రాగినయెడల వారు కట్టడలను మరతురు
దీనులకందరికి అన్యాయము చేయుదురు.
6 ప్రాణము పోవుచున్నవానికి మద్యము నియ్యుడి
మనోవ్యాకులము గలవారికి ద్రాక్షారసము
నియ్యుడి.
7 వారు త్రాగి తమ పేదరికము మరతురు
తమ శ్రమను ఇక తలంచకుందురు.
8 మూగవారికిని దిక్కులేనివారికందరికిని న్యాయము
జరుగునట్లు నీ నోరు తెరువుము.
9 నీ నోరు తెరచి న్యాయముగా తీర్పు తీర్చుము
దీనులకును శ్రమపడువారికిని దరిద్రులకును
న్యాయము జరిగింపుము.
10 గుణవతియైన భార్య దొరుకుట అరుదు
అట్టిది ముత్యముకంటె అమూల్యమైనది.
11 ఆమె పెనిమిటి ఆమెయందు నమ్మికయుంచును
అతని లాభప్రాప్తికి వెలితి కలుగదు.
12 ఆమె తాను బ్రదుకు దినములన్నియు
అతనికి మేలు చేయును గాని కీడేమియు చేయదు.

ఆమె గొఱ్ఱెబొచ్చును అవిసెనారను వెదకును 13
తన చేతులార వాటితో పనిచేయును.
వర్తకపు ఓడలు దూరమునుండి ఆహారము తెచ్చునట్లు 14
ఆమె దూరమునుండి ఆహారము తెచ్చుకొనును.
ఆమె చీకటితోనే లేచి తన యింటివారికి భోజ 15
నము సిద్ధపరచును
తన పనికత్తెలకు బత్తెము ఏర్పరచును.
ఆమె పొలమును చూచి దానిని తీసికొనును 16
తాము కూడబెట్టిన ద్రవ్యము పెట్టి ద్రాక్షతోట
యొకటి నాటించును.
ఆమె నడికట్టుచేత నడుము బలపరచుకొని 17
చేతులతో బలముగా పనిచేయును
తన వ్యాపారలాభము అనుభవముచే తెలిసికొనును 18
రాత్రివేళ ఆమె దీపము ఆరిపోదు.
ఆమె పంటెను చేత పట్టుకొనును 19
తన వ్రేళ్లతో కదురు పట్టుకొని వడుకును.
దీనులకు తన చెయ్యి చాపును 20
దరిద్రులకు తన చేతులు చాపును
తన యింటివారికి చలి తగులునని భయపడదు 21
ఆమె యింటివారందరు రక్తవర్ణ వస్త్రములు ధరించిన
వారు.
ఆమె పరుపులను సిద్ధపరచుకొనును 22
ఆమె బట్టలు సన్నని నారబట్టలు రక్తవర్ణపు
వస్త్రములు.
ఆమె పెనిమిటి దేశపు పెద్దలతో కూడ కూర్చుండును 23
గవినియొద్ద పేరుగొనినవాడై యుండును.
ఆమె నారబట్టలు నేయించి అమ్మును 24
నడికట్లను వర్తకులకు అమ్మును.
బలమును ఘనతయు ఆమెకు వస్త్రములు 25
ఆమె రాబోవు కాలము విషయమై నిర్భయముగా
ఉండును.
జ్ఞానము కలిగి తన నోరు తెరచును 26
కృపగల ఉపదేశము ఆమె బోధించును.
ఆమె తన యింటివారి నడతలను బాగుగా కని 27
పెట్టును
పనిచేయకుండ ఆమె భోజనము చేయదు.
ఆమె కుమారులు లేచి ఆమెను ధన్యురాలందురు 28
—చాలామంది కుమార్తెలు పతివ్రతాధర్మము ననుస 29
రించి యున్నారు గాని
వారందరిని నీవు మించినదానవు అని
ఆమె పెనిమిటి ఆమెను పొగడును.
అందము మోసకరము, సౌందర్యము వ్యర్థము
యెహోవాయందు భయభక్తులు కలిగిన
కొనియాడబడును
చేసిన పనినిబట్టి అట్టిదానికి ప్రతిఫలమియ్యుడి
గవునులయొద్ద ఆమె పనులు ఆమెను కొనియాడును

లని నేను తెలిసికొంటిని; దానికేదియు చేర్చబడదు
దానినుండి ఏదియు తీయబడదు; మనుష్యులు తన
యందు భయభక్తులు కలిగియుండునట్లు దేవుడిట్టి నియ
15 మము చేసియున్నాడు. । ముందు జరిగినదే ఇప్పుడును
జరుగును; జరుగబోవునది పూర్వమందు జరిగినదే;
జరిగిపోయినదానిని దేవుడు మరల రప్పించును.

16 మరియు లోకమునందు విమర్శస్థానమున దుర్మా
ర్గత జరుగుటయు, న్యాయముండవలసిన స్థానమున
17 దుర్మార్గత జరుగుటయు నాకు కనబడెను. । ప్రతి
ప్రయత్నమునకును ప్రతి క్రియకును తగిన సమయ
మున్నదనియు, నీతిమంతులకును దుర్మార్గులకును దేవుడే
తీర్పు తీర్చుననియు నా హృదయములో నేననుకొం
18 టిని. । కాగా తాము మృగములవంటివారని నరులు
తెలిసికొనునట్లును, దేవుడు వారిని విమర్శించునట్లును
19 ఈలాగు జరుగుచున్నదని అనుకొంటిని. । నరులు
అయత్నసంభవులు, మృగములు అయత్నసంభవములు;
వారికిని వాటికిని కలుగు గతి ఒక్కటే; నరులు చచ్చు
నట్లు మృగములును చచ్చును; సకల జీవులకు ఒక్కటే
ప్రాణము; మృగములకంటె నరులకేమియు ఎక్కువ
20 లేదు; సమస్తమును వ్యర్థము. । సమస్తము ఒక్కస్థల
మునకే పోవును; సమస్తము మంటిలోనుండి పుట్టెను,
21 సమస్తము మంటికే తిరిగిపోవును. । నరుల ఆత్మ పరమున
కెక్కిపోవునో లేదో, మృగముల ప్రాణము భూమికి
22 దిగిపోవునో లేదో యెవరికి తెలియును? । కాగా తమకు
తరువాత జరుగుదానిని చూచుటకై నరుని తిరిగి లేపి
కొని పోవువాడెవడును లేకపోవుట నేను చూడగా
వారు తమ క్రియలయందు సంతోషించుటకంటె
వారికి మరి ఏ మేలును లేదను సంగతి నేను తెలిసి
కొంటిని; ఇదే వారి భాగము.

4 పిమ్మట సూర్యునిక్రింద జరుగు వివిధమైన
అన్యాయక్రియలను గురించి నేను యోచించితిని.
బాధింపబడువారు ఆదరించు దిక్కులేక కన్నీళ్లు విడు
చుదురు; వారిని బాధపెట్టువారు బలవంతులు గనుక
2 ఆదరించువాడెవడును లేకపోయెను. । కాబట్టి యిం
కను బ్రదుకుచున్నవారికంటె ఇంతకుముందు కాలము
3 చేసినవారే ధన్యులనుకొంటిని. । ఇంకను పుట్టనివారు
సూర్యునిక్రింద జరుగు అన్యాయపు పనులు చూచి
యుండని హేతువుచేత ఈ ఉభయులకంటెను వారే
మరి ధన్యులనుకొంటిని.

4 మరియు కష్టమంతయు నేర్పుతో కూడిన పను
లన్నియు నరులకు రోషకారణములని నాకు కన
బడెను; ఇదియు వ్యర్థముగా నొకడు గాలిని పట్టు
5 కొనుటకై చేయు ప్రయత్నమువలెనున్నది. । బుద్ధి
హీనుడు చేతులు ముడుచుకొని తన మాంసము భక్షిం
6 చును. । శ్రమయును గాలికైన యత్నములును రెండు
చేతులనిండ నుండుటకంటె ఒక చేతినిండ నెమ్మది
కలిగి యుండుట మేలు.

నేనాలోచింపగా వ్యర్థమైనది మరియొకటి సూ 7
ర్యునిక్రింద నాకు కనబడెను. । ఒంటరిగా నున్న 8
ఒకడు కలడు, అతనికి జతగాడు లేడు కుమారుడు
లేడు సహోదరుడు లేడు; అయినను అతడు ఎడ
తెగక కష్టపడును, అతని కన్ను ఐశ్వర్యముచేత తృప్తి
పొందదు, అతడు — సుఖమనునది నేనెరుగక ఎవరి
నిమిత్తము కష్టపడుచున్నానని అనుకొనడు; ఇదియు
వ్యర్థమైనదై బహు చింత కలిగించును. । ఇద్దరి కష్టము 9
చేత ఉభయులకు మంచిఫలము కలుగును గనుక ఒంటి
గాడై యుండుటకంటె ఇద్దరు కూడియుండుట మేలు.।
వారు పడిపోయినను ఒకడు తనతోటివానిని లేవ 10
నెత్తును; అయితే ఒంటరిగాడు పడిపోయినయెడల
వానికి శ్రమయే కలుగును, వాని లేవనెత్తువాడు లేక
పోవును. । ఇద్దరు కలిసి పండుకొనినయెడల వారికి 11
వెట్ట కలుగును; ఒంటరిగానికి వెట్ట ఏలాగు పుట్టును? ।
ఒంటరియగు నొకనిమీద మరియొకడు పడినయెడల 12
ఇద్దరు కూడి వాని నెదిరింపగలరు, మూడు పేటల
త్రాడు త్వరగా తెగిపోదుగదా.

మూఢత్వముచేత బుద్ధి మాటలకిక చెవియొగ్గలేని 13
ముసలి రాజుకంటె బీదవాడైన జ్ఞానవంతుడగు చిన్న
వాడే శ్రేష్ఠుడు. । అట్టివాడు తన దేశమందు బీద 14
వాడుగా పుట్టినను పట్టాభిషేకము నొందుటకు చెర
సాలలోనుండి బయలువెళ్లును. । సూర్యునిక్రింద 15
సంచరించు సజీవులందరు గతించిన రాజుకు బదులుగా
రాజైన ఆ చిన్నవాని పక్షమున నుందురని నేను తెలిసి
కొంటిని. । అతని ఆధిపత్యముక్రింది జనులకు లెక్కయే 16
లేదు, అయినను తరువాత రాబోవువారు వీనియందు
ఇష్టపడరు. నిజముగా ఇదియు వ్యర్థమే, ఒకడు
గాలికై ప్రయాసపడినట్టే.

నీవు దేవుని మందిరమునకు పోవునప్పుడు నీ ప్రవ 5
ర్తన జాగ్రత్తగా చూచుకొనుము; బుద్ధిహీనులు
అర్పించునట్లుగా బలి అర్పించుటకంటె సమీపించి
ఆలకించుట శ్రేష్ఠము; వారు తెలియకయే దుర్మార్గపు
పనులు చేయుదురు. । నీవు దేవుని సన్నిధిని అనా 2
లోచనగా పలుకుటకు నీ హృదయమును త్వరపడ
నియ్యక నీ నోటిని కాచుకొమ్ము; దేవుడు ఆకాశ
మందున్నాడు నీవు భూమిమీద ఉన్నావు, కావున
నీ మాటలు కొద్దిగా ఉండవలెను. । విస్తారమైన పని 3
పాటులవలన స్వప్నము పుట్టును; మెండుమాటలు
పలుకువాడు బుద్ధిహీనుడగును. । నీవు దేవునికి మ్రొక్కు 4
బడి చేసికొనినయెడల దాని చెల్లించుటకు ఆలస్యము
చేయకుము; బుద్ధిహీనులయందు ఆయన కిష్టము లేదు. ।
నీవు మ్రొక్కుకొనినదాని చెల్లించుము, నీవు మ్రొక్కు 5
కొని చెల్లింపకుండుటకంటె మ్రొక్కుకొనకుండుటయే

మేలు. । నీ దేహమును శిక్షకు లోపరచునంత పని నీ
నోటివలన జరుగనియ్యకుము; అది పొరపాటుచేత
జరిగెనని దూతయెదుట చెప్పకుము; నీ మాటలవలన
దేవునికి కోపము పుట్టించి నీవేల నీ కష్టమును వ్యర్థ
పరచుకొనెదవు? । అధికమైన స్వప్నములును మాట
లును నిష్ప్రయోజనములు; నీమట్టుకు నీవు దేవుని
యందు భయభక్తులు కలిగియుండుము.
ఒక రాజ్యమందు బీదలను బాధించుటయు, ధర్మ
మును న్యాయమును బలాత్కారముచేత మీరుటయు
నీకు కనబడినయెడల దానికి ఆశ్చర్యపడకుము; అధి
కారము నొందినవారిమీద మరి ఎక్కువ అధికారము
నొందినవారున్నారు; మరియు మరి ఎక్కువైన అధి
కారము నొందినవాడు వారికి పైగా నున్నాడు. । ఏ
దేశములో రాజు భూమివిషయమై శ్రద్ధ పుచ్చు
కొనునో ఆ దేశమునకు సర్వవిషయములయందు మేలు
కలుగును.
ద్రవ్యము నపేక్షించువాడు ద్రవ్యముచేత తృప్తి
నొందడు, ధనసమృద్ధి నపేక్షించువాడు దానిచేత
తృప్తినొందడు; ఇదియు వ్యర్థమే. । ఆస్తి యెక్కువైన
యెడల దాని భక్షించువారును ఎక్కువ అగుదురు;
కన్నులార చూచుటయేగాక ఆస్తిపరునికి తన ఆస్తివలని
2 ప్రయోజనమేమి? । కష్టజీవులు కొద్దిగా తినినను
ఎక్కువగా తినినను సుఖనిద్ర నొందుదురు; అయితే
ఐశ్వర్యవంతులకు తమ ధనసమృద్ధిచేత నిద్రపట్టదు.
3 సూర్యునిక్రింద మనస్సుకు ఆయాసకరమైనదొకటి
జరుగుట నేను చూచితిని, అదేదనగా ఆస్తిగలవాడు
తన ఆస్తిని దాచిపెట్టుకొని తనకు నాశనము తెప్పించు
4 కొనును. । అయితే ఆ ఆస్తి దురదృష్టమువలన నశించి
పోవును; అతడు పుత్రులుగలవాడైనను అతనిచేతిలో
5 ఏమియు లేకపోవును. । వాడు ఏ ప్రకారముగా
తల్లిగర్భమునుండి వచ్చెనో ఆ ప్రకారముగానే తాను
వచ్చినట్లే దిగంబరిగానే మరల పోవును, తాను ప్రయా
సపడి చేసికొనినదానిలో ఏదైనను చేతపట్టుకొని
6 పోడు; । అతడు వచ్చిన ప్రకారముగానే మరల
పోవును; గాలికి ప్రయాసపడి సంపాదించినదానివలన
17 వానికి లాభమేమి? । ఇదియు మనస్సుకు ఆయాసకర
మైనదే, తన దినములన్నియు అతడు చీకటిలో భోజ
నము చేయును, అతనికి కలుగు వ్యాకులమును రోగ
మును అసహ్యమును ఇంతంతయని చెప్ప నలవికాదు.
18 మరియు కోరదగినదిగాను చూడ ముచ్చటయైనది
గాను నాకు కనబడినది ఏదనగా, దేవుడు తనకు నియ
మించిన ఆయుష్కాల దినములన్నియు ఒకడు అన్న
పానములు పుచ్చుకొనుచు తన కష్టార్జితమంతటివలన
క్షేమముగా బ్రదుకుచుండుటయే, యిదియే వానికి
19 భాగ్యము. । మరియు దేవుడు ఒకనికి ధనధాన్య
సమృద్ధి ఇచ్చి దానియందు తన భాగము అనుభవిం
చుటకును, అన్నపానములు పుచ్చుకొనుటకును, తన
కష్టార్జితమందు సంతోషించుటకును వీలు కలుగజేసిన
యెడల అతనికి ఆ స్థితి దేవుని ఆశీర్వాదమువలన కలి
గినదనుకొనవలెను. । అట్టివానికి దేవుడు హృదయా 20
నందము దయచేసియున్నాడు గనుక అతడు తన
ఆయుష్కాల దినములను జ్ఞాపకము చేసికొనడు.

సూర్యునిక్రింద దురవస్థ యొకటి నాకు కన 6
బడెను, అది మనుష్యులకు బహు విశేషముగా కలుగు
చున్నది । ఏమనగా దేవుడు ఒకనికి ధనధాన్యసమృ 2
ద్ధిని ఘనతను అనుగ్రహించును. అతడేమేమి కోరినను
అది అతనికి తక్కువ కాకుండును; అయినను దాని
ననుభవించుటకు దేవుడు వానికి శక్తి ననుగ్రహింపడు,
అన్యుడు దాని ననుభవించును; ఇది వ్యర్థముగాను
గొప్ప దురవస్థగాను కనబడుచున్నది. । ఒకడు నూర్గు 3
మంది పిల్లలను కని దీర్ఘాయుష్మంతుడై చిరకాలము
జీవించినను, అతడు సుఖానుభవము నెరుగకయు తగిన
రీతిని సమాధి చేయబడకయు నుండినయెడల వాని
గతికంటె పడిపోయిన పిండముయొక్క గతి మేలని
నేననుకొనుచున్నాను. । అది లేమిడితో వచ్చి చీకటి 4
లోకి పోవును, దాని పేరు చీకటిచేత కప్పబడెను. ।
అది సూర్యుని చూచినది కాదు, ఏ సంగతియు దానికి 5
తెలియదు, అతని గతికంటె దాని గతి నెమ్మదిగలది. ।
అట్టివాడు రెండువేల సంవత్సరములు బ్రదికియు మేలు 6
కానకయున్నయెడల (వానిగతి అంతే అనవలెను.)
అందరును ఒక స్థలమునకే వెళ్లుదురు గదా. । మను 7
ష్యుల ప్రయాసమంతయు వారి నోటికేగదా; అయి
నను వారి మనస్సు సంతుష్టినొందదు. । బుద్ధిహీనుల 8
కంటె జ్ఞానుల విశేషమేమి? సజీవుల యెదుట బ్రదుక
నేర్చిన బీదవారికి కలిగిన విశేషమేమి? । మనస్సు అడి 9
యాశలు కలిగి తిరుగులాడుటకన్న ఎదుట నున్న
దానిని అనుభవించుట మేలు; ఇదియు వ్యర్థమే,
గాలికై ప్రయాసపడినట్టే.
ముందుండినది బహుకాలముక్రిందనే తెలియ 10
బడెను; ఆ యా మనుష్యులు ఎట్టివారగుదురో అది
నిర్ణయమాయెను; తమకంటె బలవంతుడైనవానితో
వారు వ్యాజ్యమాడజాలరు. । పలుకబడిన మాటలలో 11
నిరర్థకమైన మాటలు చాల ఉండును; వాటివలన
నరులకేమి లాభము? । నీడవలె తమ దినములన్నియు 12
వ్యర్థముగా గడుపుకొను మనుష్యుల బ్రదుకునందు
ఏది వారికి క్షేమకరమైనదో యెవరికి తెలియును?
వారు పోయిన తరువాత ఏమి సంభవించునో వారితో
ఎవరు చెప్పగలరు?

సుగంధతైలముకంటె మంచి పేరు మేలు; ఒకని 7
జన్మదినముకంటె మరణదినమే మేలు. । విందు జరుగు 2
చున్న యింటికి పోవుటకంటె ప్రలాపించుచున్నవారి
యింటికి పోవుట మేలు; ఏలయనగా మరణము అందరి

కీని వచ్చును గనుక బ్రదుకువారు దానిని మనస్సున
3 పెట్టుదురు. । నవ్వుటకంటె దుఃఖపడుట మేలు; ఏల
యనగా ఖిన్నమైన ముఖము హృదయమును గుణ
4 పరచును. । జ్ఞానుల మనస్సు ప్రలాపించువారి యింటి
మీదనుండును; అయితే బుద్ధిహీనుల తలంపు సంతో
5 షించువారి మధ్యనుండును. । బుద్ధిహీనుల పాటలు
6 వినుటకంటె జ్ఞానుల గద్దింపు వినుట మేలు. । ఏల
యనగా బాన క్రింద చిటపటయను చితుకులమంట
ఎట్టిదో బుద్ధిహీనుల నవ్వు అట్టిదే; ఇదియు వ్యర్థము. ।
7 అన్యాయము చేయుటవలన జ్ఞానులు తమ బుద్ధిని
కోలుపోవుదురు; లంచము పుచ్చుకొనుటచేత మనస్సు
8 చెడును. । కార్యారంభముకంటె కార్యాంతము మేలు;
అహంకారము గలవానికంటె శాంతముగలవాడు
9 శ్రేష్ఠుడు. । ఆత్రపడి కోపపడవద్దు; బుద్ధిహీనుల
అంతరింద్రియములందు కోపము సుఖనివాసము చేయు
10 ను. । ఈ దినములకంటె మునుపటి దినములు ఏల
క్షేమకరములు అని యడుగవద్దు; ఈ ప్రశ్న వేయుట
11 జ్ఞానయుక్తము కాదు । జ్ఞానము స్వాస్థ్యమంత యుప
యోగము; సూర్యుని క్రింద బ్రదుకువారికి అది లాభ
12 కరము. । జ్ఞానము ఆశ్రయాస్పదము, ద్రవ్యము
ఆశ్రయాస్పదము; అయితే జ్ఞానము దాని పొందిన
వారి ప్రాణమును రక్షించును; ఇదే జ్ఞానమువలన
13 కలుగు లాభము. । దేవుని క్రియలను ధ్యానించుము;
ఆయన వంకరగా చేసినదానిని ఎవడు చక్కపరచును? ।
14 సుఖదినమునందు సుఖముగా ఉండుము, ఆపద్దినము
నందు యోచించుము; తాము చనిపోయిన తరువాత
జరుగుదానిని నరులు తెలిసికొనకుండునట్లు దేవుడు
సుఖదుఃఖములను జతపరచియున్నాడు.
15 నా వ్యర్థసంచారముల కాలములో నేను వీటినన్ని
టిని చూచితిని; నీతి ననుసరించి నశించిన నీతిమంతులు
కలరు, దుర్మార్గులైయుండియు చిరాయువులైన దుష్టు
16 లును కలరు. । అధికముగా నీతిమంతుడవై యుండ
కుము; అధికముగా జ్ఞానివికాకుము; నిన్ను నీవేల
17 నాశనము చేసికొందువు? । అధికముగా దుర్మార్గపు
పనులు చేయకుము, బుద్ధిహీనముగా తిరుగవద్దు; నీ
18 కాలమునకు ముందుగా నీవేల చనిపోదువు? । నీవు
దీని పట్టుకొని యుండుటయు దానిని చేయి విడువ
కుండుటయు మేలు; దేవునియందు భయభక్తులు గల
వాడు వాటినన్నిటిని కొనసాగించును.
19 పట్టణమందుండు పదిమంది అధికారులకంటె జ్ఞాన
20 ముగలవానికి జ్ఞానమే యెక్కువైన ఆధారము. । పా
పము చేయక మేలు చేయుచుండు నీతిమంతుడు
21 భూమిమీద ఒకడైనను లేడు. । నీ పనివాడు శపిం
చుట నీకు వినబడకుండునట్లు చెప్పెడు మాటలు
22 లక్ష్యపెట్టకుము. । నీవును అనేకమారులు ఇతరులను
శపించితివని నీకే తెలిసియున్నది గదా.

ఇది అంతయు జ్ఞానముచేత నేను శోధించి చూచి 23
తిని, జ్ఞానాభ్యాసము చేసికొందునని నేననుకొంటిని
గాని అది నాకు దూరమాయెను. । సత్యమైనది 24
దూరముగాను బహు లోతుగాను ఉన్నది, దాని పరి
శీలన చేయగలవాడెవడు? । వివేచించుటకును పరిశో 25
ధించుటకును, జ్ఞానాభ్యాసము చేయుటకై సంగతుల
యొక్క హేతువులను తెలిసికొనుటకును, భక్తిహీనత
బుద్ధిహీనత అనియు బుద్ధిహీనత వెఱ్ఱితనమనియు
గ్రహించుటకును, రూఢి చేసికొని నా మనస్సు నిలిపి
తిని. । మరణముకంటె ఎక్కువ దుఃఖము కలిగించు 26
నది ఒకటి నాకు కనబడెను; అది వలలవంటిదై, ఉరుల
వంటి మనస్సును బంధకములవంటి చేతులును కలిగిన
స్త్రీ; దేవుని దృష్టికి మంచివారైనవారు దానిని తప్పించు
కొందురు గాని పాపాత్ములు దానివలన పట్టబడు
దురు. । సంగతుల హేతువు ఏమైనది కనుగొనుటకై 27
నేను ఆ యా కార్యములను తరచి చూడగా ఇది నాకు
కనబడెనని ప్రసంగినైన నేను చెప్పుచున్నాను; అయితే
నేను తరచి చూచినను నాకు కనబడనిది ఒకటి
యున్నది, । అదేదనగా వెయ్యిమంది పురుషులలో 28
నేనొకని చూచితిని గాని అంతమంది స్త్రీలలో ఒక
తెను చూడలేదు. । ఇది యొకటి మాత్రము నేను 29
కనుగొంటిని, ఏమనగా దేవుడు నరులను యథార్థవం
తులనుగా పుట్టించెను గాని వారు వివిధమైన తంత్ర
ములు కల్పించుకొని యున్నారు.

జ్ఞానులతో సములైనవారెవరు? జరుగువాటి భావ 8
మును ఎరిగినవారెవరు? మనుష్యుల జ్ఞానము వారి ముఖ
మునకు తేజస్సు నిచ్చును, దానివలన వారి మోటు
తనము మార్చబడును. । నీవు దేవునికి ఒట్టుపెట్టుకొంటి 2
వని జ్ఞాపకముచేసికొని రాజుల కట్టడకు లోబడుమని
నేను చెప్పుచున్నాను. । రాజుల సముఖమునుండి 3
అనాలోచనగా వెళ్లకుము; వారు తాము కోరినదెల్ల
నెరవేర్చుదురు గనుక దుష్కార్యములో పాలుపుచ్చు
కొనకుము. । రాజుల ఆజ్ఞ అధికారము గలది, నీవు 4
చేయు పని ఏమని రాజుతో చెప్పగలవాడెవడు? ।
ధర్మము నాచరించువారికి కీడేమియు సంభవింపదు; 5
సమయము వచ్చుననియు న్యాయము జరుగుననియు
జ్ఞానులు మనస్సున తెలిసికొందురు. । ప్రతి సంగతిని 6
విమర్శించు సమయమును ఏర్పడియున్నది; లేనియెడల
మనుష్యులుచేయు కీడు బహు భారమగును. । సంభ 7
వింపబోవునది నరులకు తెలియదు, అది ఏలాగు సంభ
వించునో వారికి తెలియజేయువారెవరు? । గాలి విసర 8
కుండ చేయుటకు గాలిమీద ఎవరికిని అధికారము
లేదు; మరణదినము ఎవరికిని వశముకాదు. ఈ యుద్ధ
మందు విడుదల దొరుకదు; దౌష్ట్యము దాని ననుస
రించువారిని తప్పింపదు. । సూర్యుని క్రింద జరుగు 9
ప్రతి పనినిగూర్చి నేను మనస్సిచ్చి యోచన చేయు

చుండగా ఇదంతయు నాకు తెలిసెను. మరియు ఒకడు
మరియొకనిపైన అధికారియై తనకు హాని తెచ్చుకొనుట
కలదు.
10 మరియు దుష్టులు క్రమముగా పాతిపెట్టబడి
విశ్రాంతినొందుటయు, న్యాయముగా నడుచుకొన్న
వారు పరిశుద్ధస్థలమునకు దూరముగా కొనిపోబడి పట్ట
ణస్థులవలన మరువబడియుండుటయు నేను చూచితిని;
11 ఇదియు వ్యర్థమే. । దుష్క్రియకు తగిన శిక్ష శీఘ్ర
ముగా కలుగకపోవుట చూచి మనుష్యులు భయము
విడిచి హృదయపూర్వకముగా దుష్క్రియలు చేయు
12 దురు. । పాపాత్ములు నూరు మారులు దుష్కార్యము
చేసి దీర్ఘాయుష్మంతులైనను దేవునియందు భయభక్తులు
కలిగి ఆయన సన్నిధికి భయపడువారు క్షేమముగా
13 నుందురనియు, । భక్తిహీనులు దేవుని సన్నిధిని భయ
పడరు గనుక వారికి క్షేమము కలుగదనియు, వారు
నీడవంటి దీర్ఘాయువును పొందకపోవుదురనియు నేనెరు
14 గుదును. । వ్యర్థమైనది మరియొకటి సూర్యునిక్రింద
జరుగుచున్నది, అదేమనగా భక్తిహీనులకు జరిగినట్లుగా
నీతిమంతులలో కొందరికి జరుగుచున్నది; నీతిమంతు
లకు జరిగినట్లుగా భక్తిహీనులలో కొందరికి జరుగు
చున్నది; ఇదియును వ్యర్థమే అని నేననుకొంటిని. ।
15 అన్నపానములు పుచ్చుకొని సంతోషించుటకంటె
మనుష్యులకు లాభకరమైనదొకటియు లేదు గనుక
నేను సంతోషమును పొగడితిని; బ్రదికి కష్టపడవలె
నని దేవుడు వారికి నియమించిన కాలమంతయు ఇదియే
16 వారికి తోడుగా నున్నది. । జ్ఞానాభ్యాసము చేయుట
కును దివారాత్రులు కన్నులు నిద్రకానకుండ మను
ష్యులు జరిగించు వ్యాపారములను చూచుటకును నా
17 మనస్సు నేను నిలుపగా । దేవుడు జరిగించునదంతయు
నేను కనుగొంటిని; మరియు సూర్యునిక్రింద జరుగు
క్రియలు మనుష్యులు కనుగొనలేరనియు, కనుగొనవలె
నని మనుష్యులు ఎంత ప్రయత్నించినను వారు కను
గొనుటలేదనియు, దాని తెలిసికొనవలెనని జ్ఞానులు
పూనుకొనినను వారైన కనుగొనజాలరనియు నేను
తెలిసికొంటిని.

9 నీతిమంతులును జ్ఞానులును వారి క్రియలును దేవుని
వశమను సంగతిని, స్నేహము చేయుటయైనను ద్వేషిం
చుటయైనను మనుష్యుల వశమున లేదను సంగతిని,
అదియంతయు వారివలన కాదను సంగతిని పూర్తిగా
పరిశీలనచేయుటకై నా మనస్సు నిలిపి నిదానింప
2 బూనుకొంటిని. । సంభవించునవి అన్నియు అందరికిని
ఏకరీతిగానే సంభవించును; నీతిమంతులకును దుష్టుల
కును, మంచివారికిని పవిత్రులకును అపవిత్రులకును,
బలులనర్పించువారికిని బలులనర్పింపనివారికిని గతి
యొక్కటే; మంచివారికేలాగుననో పాపాత్ములకును
ఆలాగుననే తటస్థించును; ఒట్టుపెట్టుకొనువారికేలాగు
ననో ఒట్టుకు భయపడువారికిని ఆలాగుననే జరుగును. ।
అందరికిని ఒక్కటే గతి సంభవించును, లోకమందు 3
జరుగువాటన్నిటిలో ఇది బహు దుఃఖకరము. మరియు
నరుల హృదయము చెడుతనముతో నిండియున్నది,
వారు బ్రదుకుకాలమంతయు వారి హృదయమందు
వెర్రితనముండును, తరువాత వారు మృతులయొద్దకు
పోవుదురు (ఇదియును దుఃఖకరము.) । బ్రదికియుండు 4
వారితో కలిసిమెలిసియున్నవారికి ఆశ కలదు; చచ్చిన
సింహముకంటె బ్రదికియున్న కుక్క మేలు గదా. ।
బ్రదికియుండువారు తాము చత్తురని ఎరుగుదురు 5
అయితే చచ్చినవారు ఏమియు ఎరుగరు; వారిపేరు
మరువబడియున్నది, వారికిక ఏ లాభమును కలుగదు. ।
వారిక ప్రేమింపరు, పగచేయరు, అసూయపడరు; 6
జరుగువాటిలో దేనియందును వారికిక నెప్పటికిని
వంతు లేదు.
నీవు పోయి సంతోషముగా నీ అన్నము తినుము, 7
ఉల్లాసపు మనస్సుతో నీ ద్రాక్షారసము త్రాగుము;
ఇదివరకే దేవుడు నీ క్రియలను అంగీకరించెను. । ఎల్ల 8
ప్పుడు తెల్లనివస్త్రములు ధరించుకొనుము, నీ తలకు నూనె
తక్కువచేయకుము. । దేవుడు నీకు దయచేసిన వ్యర్థ 9
మైన నీ ఆయుష్కాలమంతయు నీవు ప్రేమించు నీ
భార్యతోకూడి సుఖించుము, నీ వ్యర్థమైన ఆయు
ష్కాలమంతయు సుఖించుము, ఈ బ్రదుకునందు నీవు
కష్టపడి చేసికొనిన దానియంతటికి అదే నీకు కలుగు
భాగము. । చేయుటకు నీ చేతికి వచ్చిన యే పనినై 10
నను నీ శక్తిలోపము లేకుండ చేయుము; నీవు పోవు
పాతాళమునందు పనియైనను ఉపాయమైనను తెలివి
యైనను జ్ఞానమైనను లేదు.
మరియు నేను ఆలోచింపగా సూర్యునిక్రింద 11
జరుగుచున్నది నాకు తెలియబడెను. వడిగలవారు
పరుగులో గెలువరు; బలముగలవారు యుద్ధమునందు
విజయమొందరు; జ్ఞానముగలవారికి అన్నము దొర
కదు; బుద్ధిమంతులగుటవలన ఐశ్వర్యము కలుగదు;
తెలివిగలవారికి అనుగ్రహము దొరకదు; ఇవియన్నియు
అదృష్టవశముచేతనే కాలవశముచేతనే అందరికి కలుగు
చున్నవి । తమ కాలము ఎప్పుడు వచ్చునో నరులెరు 12
గరు; చేపలు బాధకరమైన వలయందు చిక్కుబడు
నట్లు, పిట్టలు వలలో పట్టుబడునట్లు, అశుభకాలమున
హఠాత్తుగా తమకు చేటు కలుగునప్పుడు వారును
చిక్కుపడుదురు.
మరియు నేను జరుగు దీనిని చూచి యిది జ్ఞాన 13
మని తలంచితిని, యిది నా దృష్టికి గొప్పదిగా కన
బడెను. । ఏమనగా ఒక చిన్న పట్టణముండెను, దాని 14
యందు కొద్దిమంది కాపురముండిరి; దానిమీదికి గొప్ప
రాజు వచ్చి దాని ముట్టడివేసి దానియెదుట గొప్ప
బురుజులు కట్టించెను; । అయితే అందులో జ్ఞా

గల యొక బీదవాడుండి తన జ్ఞానముచేత ఆ పట్టణ
మును రక్షించెను, అయినను ఎవరును ఆ బీదవానిని
16 జ్ఞాపకముంచుకొనలేదు. । కాగా నేనిట్లనుకొంటిని—
బలముకంటె జ్ఞానము శ్రేష్ఠమేగాని బీదవారి జ్ఞానము
తృణీకరింపబడును, వారి మాటలు ఎవరును లక్ష్యము
17 చేయరు. । బుద్ధిహీనులలో ఏలువాని కేకలకంటె
మెల్లగా వినబడిన జ్ఞానుల మాటలు శ్రేష్ఠములు. ।
18 యుద్ధాయుధములకంటె జ్ఞానము శ్రేష్ఠము; ఒక పాపా
త్ముడు అనేకమైన మంచి పనులను చెరుపును.

**10** అత్తరు వాని తైలములో చచ్చిన యీగలు పడుట
చేత అది చెడువాసన కొట్టును; కొంచెము బుద్ధి
హీనత త్రాసులో ఉంచినయెడల జ్ఞానమును ఘనతను
2 తేలగొట్టును. । జ్ఞానియొక్క హృదయము అతని కుడి
చేతిని ఆడించును, బుద్ధిహీనుని హృదయము అతని
3 ఎడమ చేతిని ఆడించును. । బుద్ధిహీనుడు తన ప్రవర్తనను
గూర్చి అధైర్యపడి—తాను బుద్ధిహీనుడని అందరికి
4 తెలియజేయును. । ఏలువాడు నీమీద కోపపడిన
యెడల నీ ఉద్యోగమునుండి నీవు తొలగిపోకుము;
ఓర్పు గొప్ప ద్రోహకార్యములు జరుగకుండ చేయు
5 ను. । పొరపాటున అధిపతిచేత జరుగు దుష్కార్య
6 మొకటి నేను చూచితిని । ఏమనగా బుద్ధిహీనులు
గొప్ప ఉద్యోగములలో ఉంచబడుటయు ఘనులు
7 క్రింద కూర్చుండుటయు । పనివారు గుఱ్ఱముల
మీద కూర్చుండుటయు అధిపతులు సేవకులవలె నేలను
8 నడుచుటయు నాకగపడెను. । గొయ్యి త్రవ్వువాడు
దానిలో పడును; కంచె కొట్టువానిని పాము కరు
9 చును. । రాళ్లు దొర్లించువాడు వాటిచేత గాయము
నొందును; చెట్లు నరుకువాడు దానివలన అపాయము
10 తెచ్చుకొనును. । ఇనుప ఆయుధము మొద్దుగా
ఉన్నప్పుడు దానిని పదునుచేయనియెడల పనిలో
ఎక్కువ బలము వినియోగింపవలెను; అయితే కార్య
11 సిద్ధికి జ్ఞానమే ప్రధానము. । మంత్రపు కట్టులేక
పాము కరచినయెడల మంత్రగానిచేత ఏమియు
12 కాదు. । జ్ఞానుని నోటిమాటలు ఇంపుగా ఉన్నవి,
అయితే బుద్ధిహీనుని నోరు వానినే మ్రింగివేయు
13 ను. । వాని నోటిమాటల ప్రారంభము బుద్ధిహీనత,
14 వాని పలుకుల ముగింపు వెఱ్ఱితనము. । కలుగ
బోవునది ఏదో మనుష్యులు ఎరుగక యుండినను బుద్ధి
హీనులు విస్తారముగా మాటలాడుదురు; నరుడు చని
పోయిన తరువాత ఏమి జరుగునో యెవరు తెలియ
15 జేతురు? । ఊరికి పోవు త్రోవ యెరుగనివారై బుద్ధి
హీనులు తమ ప్రయాసచేత ఆయాసపడుదురు. ।
దేశమా, దాసుడు నీకు రాజై యుండుటయు, ఉదయ
నే భోజనమునకు కూర్చుండువారు నీకు అధి
యుండుటయు నీకు అశుభము. । దేశమా,
ొప్ప యింటివాడై యుండుటయు నీ అధి
పతులు మత్తులగుటకుకాక బలము నొందుటకై అను
కూల సమయమున భోజనమునకు కూర్చుండువారై
యుండుటయు నీకు శుభము. । సోమరితనముచేత ఇంటి 18
కప్పు దిగబడిపోవును, చేతుల బద్ధకముచేత ఇల్లు కురి
యును. । నవ్వులాటలు పుట్టించుటకై వారు విందు 19
చేయుదురు, ద్రాక్షారసపానము వారి ప్రాణమునకు
సంతోషకరము; ద్రవ్యము అన్నిటికి అక్కరకు వచ్చు
ను. । నీ మనస్సునందైనను రాజును శపింపవద్దు, నీ 20
పడక గదిలోనైనను ఐశ్వర్యవంతులను శపింపవద్దు;
ఏలయనగా ఆకాశపక్షులు సమాచారము కొంచు
బోవును, రెక్కలుగలది సంగతి తెలుపును.

నీ ఆహారమును నీళ్లమీద వేయుము, చాలా దినము **11**
లైన తరువాత అది నీకు కనబడును. । ఏడుగురికిని 2
ఎనమండుగురికిని భాగము పంచిపెట్టుము, భూమి
మీద ఏమి కీడు జరుగునో నీవెరుగవు. । మేఘములు 3
వర్షముతో నిండియుండగా అవి భూమిమీద దాని
పోయును; మ్రాను దక్షిణముగా పడినను ఉత్తరముగా
పడినను అది పడినచోటనే యుండును. । గాలిని 4
గురుతుపట్టువాడు విత్తడు, మేఘములను కనిపెట్టు
వాడు కోయడు. । చూలాలి గర్భమందు ఎముకలు 5
ఏరీతిగా ఎదుగునది నీకు తెలియదు, గాలి యే త్రోవను
వచ్చునో నీవెరుగవు, ఆలాగునే సమస్తమును జరిగించు
దేవుని క్రియలను నీవెరుగవు. । ఉదయమందు విత్తన 6
మును విత్తుము, అస్తమయమందును నీ చేయి వెనుక
తియ్యక విత్తుము, అది ఫలించునో యిది ఫలించునో
లేక రెండును సరిసమానముగా ఎదుగునో నీవెరుగవు. ।
వెలుగు మనోహరమైనది, సూర్యుని చూచుట కన్నుల 7
కింపుగా నున్నది. । ఒకడు చాలా సంవత్సరములు 8
బ్రదికినయెడల చీకటిగల దినములు అనేకములు వచ్చు
నని యెరిగియుండి తాను బ్రదుకుదినములన్నియు
సంతోషముగా ఉండవలెను, రాబోవునదంతయు
వ్యర్థము.

యౌవనుడా, నీ యౌవనమందు సంతోషపడుము, 9
నీ యౌవనకాలమందు నీ హృదయము సంతుష్టిగా
ఉండనిమ్ము, నీ కోరికచొప్పునను నీ దృష్టియొక్క
యిష్టముచొప్పునను ప్రవర్తింపుము; అయితే వీటన్ని
టినిబట్టి దేవుడు నిన్ను తీర్పులోకి తెచ్చునని జ్ఞాపక
ముంచుకొనుము; । లేతవయస్సును నడిప్రాయమును 10
గతించిపోవునవి గనుక నీ హృదయములోనుండి
వ్యాకులమును తొలగించుకొనుము, నీ దేహమును
చెరుపుదాని తొలిగించుకొనుము.

దుర్దినములు రాకముందే—ఇప్పుడు వీటియందు **12**
నాకు సంతోషము లేదని నీవు చెప్పు సంవత్సరములు
రాకముందే, । తేజస్సునకును సూర్య చంద్ర నక్షత్ర 2
ములకును చీకటి కమ్మకముందే, వాన వెలిసినతరువాత
మేఘములు మరల రాకముందే, నీ బాల్యదినములందే

3 నీ సృష్టికర్తను జ్ఞాపకమునకు తెచ్చుకొనుము. । ఆ దినమున
ఇంటి కావలివారు వణకుదురు బలిష్ఠులు వంగుదురు,
విసరువారు కొద్దిమంది యగుటచేత పని చాలించు
కొందురు, కిటికీలలోగుండ చూచువారు కానలేక
4 యుందురు. । తిరుగటిరాళ్ల ధ్వని తగ్గిపోవును వీధి
తలుపులు మూయబడును, పిట్టయొక్క కూతకు ఒకడు
లేచును, సంగీత నాదము చేయువారందరును నిశ్శబ్ద
5 ముగా ఉంచబడుదురు. । ఎత్తుచోటుల కెక్కుటకు
భయపడుదురు. మార్గములయందు భయంకరమైనవి
కనబడును, బాదము వృక్షము పువ్వులు పూయును
మిడుత బరువుగా ఉండును బుడ్డబుడుసరకాయ పగు
లును, ఏలయనగా ఒకడు తన నిత్యమైన ఉనికిపట్టుకు
పోవుచున్నాడు. వాని నిమిత్తము ప్రలాపించువారు
6 వీధులలో తిరుగుదురు. । వెండిత్రాడు విడిపోవును,
బంగారు గిన్నె పగిలిపోవును, ధారయొద్ద కుండ పగిలి
7 పోవును, బావియొద్ద చక్రము పడిపోవును. । మన్ను
యినది వెనుకటివలెనే మరల భూమికి చేరును, ఆత్మ
దాని దయచేసిన దేవునియొద్దకు మరల పోవును.
8 సమస్తము వ్యర్థమని ప్రసంగి చెప్పుచున్నాడు
సమస్తము వ్యర్థము. । ప్రసంగి జ్ఞానియై యుండెను 9
అతడు జనులకు జ్ఞానము బోధించెను; అతడు ఆలో
చించి సంగతులు పరిశీలించి అనేక సామితెలను అను
క్రమపరచెను. । ప్రసంగి యింపైన మాటలు చెప్పు 10
టకు పూనుకొనెను, సత్యమునుగూర్చిన మాటలు
యథార్థభావముతో వ్రాయుటకు పూనుకొనెను. ।
జ్ఞానులు చెప్పు మాటలు మునుకోలలవలెను చక్కగా 11
కూర్చబడి బిగగొట్టబడిన మేకులవలెను ఉన్నవి; అవి
ఒక్క కాపరివలన అంగీకరింపబడినట్టున్నవి. । ఇదియు 12
గాక నా కుమారుడా, హితోపదేశములు వినుము;
పుస్తకములు అధికముగా రచింపబడును, దానికి అం
తము లేదు; విస్తారముగా విద్యాభ్యాసము చేయుట
దేహమునకు ఆయాసకరము.

ఇదంతయు వినిన తరువాత తేలిన ఫలితార్థమిదే; 13
దేవునియందు భయభక్తులు కలిగియుండి ఆయన కట్ట
డల ననుసరించి నడుచుచుండవలెను, మానవకోటికి
ఇదియే విధి. । గూఢమైన ప్రతి యంశమునుగూర్చి 14
దేవుడు విమర్శచేయునప్పుడు ఆయన ప్రతిక్రియను,
అది మంచిదే గాని చెడ్డదే గాని, తీర్పులోనికి తెచ్చును.

# పరమగీతము

1 సొలొమోను రచించిన పరమగీతము.
2 నోటిముద్దులతో అతడు నన్ను ముద్దుపెట్టుకొనును గాక
నీ ప్రేమ ద్రాక్షారసముకన్న మధురము.
3 నీవు పూసికొను పరిమళతైలము సువాసనగలది
నీ పేరు పోయబడిన పరిమళతైలముతో సమానము
కన్యకలు నిన్ను ప్రేమించుదురు.
4 నన్ను ఆకర్షించుము
మేము నీయొద్దకు పరుగెత్తి వచ్చెదము
రాజు తన అంతఃపురములోనికి నన్ను చేర్చుకొనెను
నిన్నుబట్టి మేము సంతోషించి ఉత్సహించెదము
ద్రాక్షారసముకన్న నీ ప్రేమను ఎక్కువగా స్మరించెదము
యథార్థమైన మనస్సుతో వారు నిన్ను ప్రేమించుచున్నారు.
5 యెరూషలేము కుమార్తెలారా,
నేను నల్లనిదాననైనను సౌందర్యవంతురాలను
కేదారువారి గుడారములవలెను
సొలొమోను నగరు తెరలవలెను
నేను సౌందర్యవంతురాలను.
6 నల్లనిదానని నన్ను (చిన్న) చూపులు చూడకుడి
నేను ఎండ తగిలినదానను
నా సహోదరులు నామీద కోపించి
నన్ను ద్రాక్షతోటకు కావలికత్తెగా నుంచిరి
నా స్వంత తోటను నేను కాయకపోతిని.
7 నా ప్రాణ ప్రియుడా,
నీ మందను నీవెచ్చట మేపుదువో
మధ్యాహ్నమున నెచ్చట నీడకు వాటిని తోలుదువో నాతో చెప్పుము
ముసుకువేసికొనినదాననై
నీ జతకాండ్ల మందలయొద్ద నేనెందుకుండవలెను?
8 నారీమణీ, సుందరీ, అది నీకు తెలియకపోయెనా?
మందల యడుగుజాడలనుబట్టి నీవు పొమ్ము
మందకాపరుల గుడారములయొద్ద నీ మేకపిల్లలను మేపుము.
9 నా ప్రియురాలా,
ఫరోయొక్క రథాశ్వములతో నిన్ను పోల్చెదను.
10 ఆభరణములచేత నీ చెక్కిళ్లును
హారములచేత నీ కంఠమును శోభిల్లుచున్నవి.
11 వెండి పువ్వులుగల బంగారు సరములు
మేము నీకు చేయింతుము

రాజు విందుకు కూర్చుండియుండగా 12
నా పరిమళతైలపు సువాసన వ్యాపించెను.
నా ప్రియుడు నా రొమ్ముననుండు గోపరసమంత సువాసనగలవాడు 13
నాకు నా ప్రియుడు ఏన్గెదీ ద్రాక్షావనములోని కర్పూరపు పూగుత్తులతో సమానుడు. 14
నా ప్రియురాలా, నీవు సుందరివి నీవు సుందరివి 15
నీ నేత్రములు గువ్వనేత్రములు.
నా ప్రియుడా, నీవు సుందరుడవు అతిమనోహరుడవు 16
మన శయనస్థానము పచ్చనిచోటు
మన మందిరముల దూలములు దేవదారు మ్రానులు
మన వాసములు సరళపు మ్రానులు.
నేను షారోను పొలములో పూయు పుష్పము వంటిదానను 2
లోయలలో పుట్టు పద్మమువంటిదానను.
బలురక్కసి చెట్లలో వల్లిపద్మము కనబడునట్లు 2
స్త్రీలలో నా ప్రియురాలు కనబడుచున్నది.
అడవి వృక్షములలో జల్దరు వృక్షమెట్లున్నదో 3
పురుషులలో నా ప్రియుడు అట్లున్నాడు
ఆనందభరితనై నేనతని నీడను కూర్చుంటిని
అతని ఫలము నా జిహ్వకు మధురము.
అతడు నన్ను విందుశాలకు తోడుకొనిపోయెను 4
నామీద ప్రేమను ధ్వజముగా ఎత్తెను.
ప్రేమాతిశయముచేత నేను మూర్ఛిల్లుచున్నాను 5
ద్రాక్షపండ్ల యడలు పెట్టి నన్ను బలపరచుడి
జల్దరు పండ్లు పెట్టి నన్నాదరించుడి
అతని యెడమచెయ్యి నా తలక్రిందనున్నది 6
కుడిచేత అతడు నన్ను కౌగలించుచున్నాడు.
యెరూషలేము కుమార్తెలారా, 7
పొలములోని యిఱ్ఱులనుబట్టియు లేళ్లనుబట్టియు
మీచేత ప్రమాణము చేయించుకొని
ప్రేమకు ఇష్టమగువరకు
మీరు లేపకయు కలతపరచకయు
నుండుడని మిమ్మును బతిమాలుకొనుచున్నాను.
ఆలకించుడి; నా ప్రియుని స్వరము వినబడుచున్నది 8
ఇదిగో అతడు వచ్చుచున్నాడు
గంతులువేయుచు కొండలమీదను ఎగసిదాటుచు మెట్టలమీదను అతడు వచ్చుచున్నాడు.
నా ప్రియుడు ఇఱ్ఱివలె నున్నాడు 9

లేడిపిల్లవలె నున్నాడు
అదిగో మన గోడకు వెలిగా నతడు నిలుచు
చున్నాడు
కిటికీగుండ చూచుచున్నాడు
కిటికీకంతగుండ తొంగి చూచుచున్నాడు.
10 ఇప్పుడు నా ప్రియుడు నాతో మాటలాడు
చున్నాడు
11 నా ప్రియురాలా, సుందరవతీ లెమ్ము రమ్ము
చలికాలము గడచిపోయెను
వర్షకాలము తీరిపోయెను వర్షమిక రాదు.
12 దేశమంతట పువ్వులు పూసియున్నవి
పిట్టలు కోలాహలము చేయు కాలము వచ్చెను
పావుర స్వరము మన దేశములో వినబడుచున్నది.
13 అంజూరపుకాయలు పక్వమగుచున్నవి
ద్రాక్షచెట్లు పూతపట్టి సువాసన నిచ్చుచున్నవి
నా ప్రియురాలా, సుందరవతీ లెమ్ము రమ్ము.
14 బండసందులలో ఎగురు నా పావురమా,
పేటుబీటల నాశ్రయించు నా పావురమా,
నీ స్వరము మధురము నీ ముఖము మనోహరము
నీ ముఖము నాకు కనబడనిమ్ము
నీ స్వరము నాకు వినబడనిమ్ము.
15 మన ద్రాక్షతోటలు పూతపట్టియున్నవి
ద్రాక్షతోటలను చెరుపు నక్కలను పట్టుకొనుడి
సహాయము చేసి గుంటనక్కలను పట్టుకొనుడి.
16 నా ప్రియుడు నా వాడు నేను అతనిదానను
పద్మములున్నచోట అతడు మందను మేపు
చున్నాడు.
17 చల్లనిగాలి వీచువరకు నీడలు లేకపోవువరకు
ఇఱ్ఱివలెను లేడిపిల్లవలెను కొండబాటలమీద త్వర
పడి రమ్ము.

3 రాత్రివేళ పరుండియుండి
నేను నా ప్రాణప్రియుని వెదకితిని
వెదకినను అతడు కనబడక యుండెను.
నేనిప్పుడే లేచెదను
2 పట్టణము వెంబడిపోయి వెదకుదును
సంతవీధులలోను రాజవీధులలోను తిరు[illegible]
నా ప్రాణప్రియుని వెదకుదును అని
నేననుకొంటిని.
నేను వెదకినను అతడు కనబడలేదు.
3 పట్టణమునందు సంచరించు కావలివారు నాకెదురు
పడగా
మీరు నా ప్రాణప్రియుని చూచితిరా? (అని
నేనడిగితిని)
4 నేను వారిని విడిచి కొంచెము దూరము పోగా
నా ప్రాణప్రియుడు నాకెదురుపడెను
వదలిపెట్టక నేనతని పట్టుకొంటిని
నా తల్లి యింటికతని తోడుకొని వచ్చితిని
నన్ను కనినదాని యరలోకి తోడుకొని వచ్చితిని.
యెరూషలేము కుమార్తెలారా, 5
పొలములోని యిఱ్ఱులనుబట్టియు లేళ్లనుబట్టియు
మీచేత ప్రమాణము చేయించుకొని
లేచుటకు ప్రేమకు ఇష్టమగువరకు
మీరు లేపకయు కలతపరచకయు
నుండుడని నేను మిమ్మును బతిమాలుకొనుచున్నాను.
ధూమ స్తంభములవలె అరణ్యమార్గముగా వచ్చు 6
ఇది ఏమి?
గోపరసముతోను సాంబ్రాణితోను వర్తకులమ్ము
వివిధమైన సుగంధ చూర్ణములతోను
పరిమళించుచు వచ్చు ఇది ఏమి?
ఇదిగో సొలొమోను పల్లకి వచ్చుచున్నది 7
అరువదిమంది శూరులు దానికి పరివారము
వారు ఇశ్రాయేలీయులలో పరాక్రమశాలులు
వారందరును ఖడ్గధారులు యుద్ధవీరులు
రాత్రి భయముచేత వారు ఖడ్గము ధరించి వచ్చు 8
చున్నారు.
లెబానోను మ్రానుతో మంచమొకటి 9
సొలొమోనురాజు తనకు చేయించుకొనియు
న్నాడు.
దాని స్తంభములు వెండిమయములు 10
దాని పాదములు స్వర్ణమయములు
దాని మెత్తలు ధూమ్రవర్ణవస్త్రముతో చేయబడెను
ప్రేమను సూచించు విచిత్రమైన కుట్టుపనితో
యెరూషలేము కుమార్తెలు దాని లోపలిభాగము
నలంకరించిరి.
సీయోను కుమార్తెలారా, వేంచేయుడి 11
కిరీటము ధరించిన సొలొమోనురాజును చూడుడి
వివాహదినమున అతని తల్లి
అతనికి పెట్టిన కిరీటము చూడుడి
ఆ దినము అతనికి బహు సంతోషకరము.

నా ప్రియురాలా, నీవు సుందరివి నీవు సుందరివి 4
నీ ముసుకుగుండ నీ నేత్రములు గువ్వ నేత్రములవలె
కనబడుచున్నవి
నీ తలవెండ్రుకలు
గిలాదు పర్వతముమీది మేకల మందను పోలి
యున్నవి.
నీ పలువరుస కత్తెరవేయబడినవియు
కడుగబడి అప్పుడే పైకి వచ్చినవియునై 2
జోడుజోడు పిల్లలు కలిగి ఒకదానినైన పోగొట్టు
కొనక
సుఖముగానున్న గొఱ్ఱెల కదుపులను పోలి
యున్నది.
నీ పెదవులు ఎఱ్ఱని తొగరును పోలియున్నవి. 3

నీ నోరు సుందరము
నీ ముసుకుగుండ నీ కణతలు విచ్చిన దాడిమ ఫలము వలె నగపడుచున్నవి.
4 జయసూచకముల నుంచుటకై
దావీదు కట్టించిన గోపురముతోను
వేయి డాలులును శూరుల కవచములన్నియును
వ్రేలాడు ఆ గోపురముతోను నీ కంధరము సమానము.
5 నీ యిరు కుచములు ఒక జింకపిల్లలయి తామరలో మేయు కవలను పోలియున్నవి.
6 ఎండ చల్లారి నీడలు జరిగిపోవువరకు
గోపరస పర్వతములకు
సాంబ్రాణి పర్వతములకు నేను వెళ్లుదును.
7 నా ప్రియురాలా, నీవు అధికసుందరివి
నీయందు కళంకమేమియు లేదు.
8 ప్రాణేశ్వరీ, లెబానోను విడిచి నాతోకూడ రమ్ము
లెబానోను విడిచి నాతోకూడ రమ్ము
అమానపర్వతపు శిఖరమునుండి
శెనీరు హెర్మోనుల శిఖరమునుండి
సింహ వ్యాఘ్రములుండు గుహలుగల కొండల పైనుండి
నీవు క్రిందికి చూచెదవు.
9 నా సహోదరీ, ప్రాణేశ్వరీ,
నీవు నా హృదయమును వశపరచుకొంటివి
ఒక చూపుతో నా హృదయమును వశపరచు కొంటివి
నీ హారములలో ఒకదానిచేత నన్ను వశపరచు కొంటివి.
10 సహోదరీ, ప్రాణేశ్వరీ,
నీ ప్రేమ ఎంత మధురము
ద్రాక్షారసముకన్న నీ ప్రేమ ఎంత సంతోష కరము
నీవు పూసికొను పరిమళతైలముల వాసన
సకల గంధవర్గములకన్న సంతోషకరము.
11 ప్రాణేశ్వరీ, నీ పెదవులు తేనియలొలుకుచున్నట్లున్నవి
నీ జిహ్వక్రింద మధుక్షీరములు కలవు
నీ వస్త్రముల సువాసన లెబానోను సువాసనవలె నున్నది.
12 నా సహోదరి నా ప్రాణేశ్వరి
మూయబడిన ఉద్యానము
మూతవేయబడిన జలకూపము.
13 నీ చిగురులు దాడిమ వనము
వింతైన శ్రేష్ఠ ఫలవృక్షములు కర్పూర వృక్షములు
జటామాంసి వృక్షములు
14 జటామాంసియు కుంకుమయు నిమ్మగడ్డియు
లవంగపట్టయు వివిధమైన పరిమళతైల వృక్షములు
గోపరసమును అగరు వృక్షములు
నానావిధ శ్రేష్ఠ పరిమళద్రవ్యములు.
నా సహోదరీ, నా ప్రాణేశ్వరీ,
నీవు ఉద్యానజలాశయము
ప్రవాహజలకూపము
లెబానోను పర్వతప్రవాహము.
ఉత్తరవాయువూ, ఏతెంచుము
దక్షిణవాయువూ, వేంచేయుము
నా ఉద్యానవనముమీద విసరుడి
దాని పరిమళములు వ్యాపింపజేయుడి
నా ప్రియుడు తన ఉద్యానవనమునకు వేంచేయును గాక
తనకిష్టమైన ఫలముల నతడు భుజించు గాక.
నా సహోదరీ, ప్రాణేశ్వరీ,
నా ఉద్యానవనమునకు నేను ఏతెంచితిని
నా జటామాంసిని నా గంధవర్గములను కూర్చుకొనుచున్నాను
తేనెయు తేనెపట్టును భుజించుచున్నాను
క్షీరసహితద్రాక్షారసము పానము చేయుచున్నాను.
నా సఖులారా, భుజించుడి లెస్సగా పానము చేయుడి
స్నేహితులారా, పానము చేయుడి.
నేను నిద్రించితినే గాని నా మనస్సు మేలుకొనియున్నది
నా సహోదరీ, నా ప్రియురాలా,
నా పావురమా, నిష్కళంకురాలా, ఆలకింపుము
నా తల మంచుకు తడిసినది
నా వెండ్రుకలు రాత్రి కురియు చినుకులకు తడిసినవి.
నాకు తలుపుతీయుమనుచు నా ప్రియుడు వాకిలి తట్టుచున్నాడు.
నేను వస్త్రము తీసివేసితిని 3
నేను మరల దాని ధరింపనేల?
పాదములు కడుగుకొంటిని
నేను మరల వాటిని మురికిచేయనేల?
తలుపుసందులో నా ప్రియుడు చెయ్యియుంచగా 4
నా అంతరంగము అతనియెడల జాలిగొనెను.
నా ప్రియునికి తలుపు తీయ లేచితిని 5
నా చేతులనుండియు నా వ్రేళ్లనుండియు జటామాంసి గడియలమీద ప్రవహించెను
నా ప్రియునికి నేను తలుపు తీయునంతలో 6
అతడు వెళ్లిపోయెను
అతనిమాట వినుటతోనే నా ప్రాణము సొమ్మసిల్లెను

నేనతని వెదకినను అతడు కనబడకపోయెను
నేను పిలిచినను అతడు పలుకలేదు.
పట్టణములో తిరుగు కావలివారు
నా కెదురుపడి నన్ను కొట్టి గాయపరచిరి
ప్రాకారముమీది కావలివారు
నా పైవస్త్రమును దొంగిలించిరి.
యెరూషలేము కుమార్తెలారా,
నా ప్రియుడు మీకు కనబడినయెడల
ప్రేమాతిశయముచేత నీ ప్రియురాలు మూర్ఛిల్లెనని
మీరతనికి తెలియజేయునట్లు
నేను మీచేత ప్రమాణము చేయించుకొందును.
స్త్రీలలో అతి సుందరిగలదానా,
ఇతర ప్రియునికన్న నీ ప్రియుని విశేషమేమి?
నీవు మాచేత ప్రమాణము చేయించుకొనుటకు
ఇతర ప్రియునికన్న నీ ప్రియుని విశేషమేమి?
10 నా ప్రియుడు ధవళవర్ణుడు రత్నవర్ణుడు
పదివేలమంది పురుషులలో అతని గుర్తింపవచ్చును
11 అతని శిరఃకేశములు అపరంజివంటివి
అతని తలవెండ్రుకలు కాకపక్షములవలె కృష్ణవర్ణ
ములు
అవి నొక్కులు నొక్కులుగా కనబడుచున్నవి.
12 అతని నేత్రములు నదీతీరములందుండు
గువ్వలవలె కనుపడుచున్నవి
అవి పాలతో కడుగబడినట్లున్నవి
అవి చక్కగా పొదిగిన రత్నములవలె ఉన్నవి.
13 అతని చెక్కిళ్లు పరిమళ పుష్పస్థానములు
సుగంధవృక్షములచేత శోభిల్లు ఉన్నత భూభాగ
ములు
అతని పెదవులు పద్మములవంటివి
ప్రవహించు జటామాంసివలె అవి పరిమళించును.
14 అతని కరములు తార్షీషు రత్నభూషితమైన
స్వర్ణగోళమువలె ఉన్నవి
అతని కాయము నీలరత్నఖచితమైన
విచిత్రమగు దంతపుపనిగా కనబడుచున్నది.
15 అతని కాళ్లు మేలిమిబంగారు మట్లయందు
నిలిపిన చలువరాతి స్తంభములవలె ఉన్నవి.
అతని వైఖరి లెబానోను పర్వతతుల్యము
అది దేవదారు వృక్షములంత ప్రసిద్ధము
16 అతని నోరు అతిమధురము.
అతడు అతికాంక్షణీయుడు
యెరూషలేము కుమార్తెలారా,
ఇతడే నా ప్రియుడు ఇతడే నా స్నేహితుడు.

# 6

స్త్రీలలో అధిక సుందరివగుదానా,
నీ ప్రియుడు ఎక్కడికి పోయెను?
అతడేదిక్కుకు తిరిగెను?
మనము పోయి యతని వెదకుదము రమ్ము.
ఉద్యానవనమునందు మేపుటకును 2
పద్మములను ఏరుకొనుటకును
నా ప్రియుడు తన ఉద్యానమునకు పోయెను
పరిమళ పుష్పస్థానమునకు పోయెను.
నేను పద్మములలో మేపుచున్న నా ప్రియునిదానను 3
అతడును నావాడు.
నా సఖీ, నీవు తిర్సాపట్టణమువలె సుందరమైన 4
దానవు
యెరూషలేమంత సౌందర్యవంతురాలవు
టెక్కెములనెత్తిన సైన్యమువలె భయము పుట్టించు
దానవు.
నీ కనుదృష్టి నామీద ఉంచకుము 5
అది నన్ను వశపరచుకొనును
నీ తలవెండ్రుకలు
గిలాదు పర్వతముమీది మేకలమందను పోలి
యున్నవి.
నీ పలువరుస కత్తెర వేయబడినవియై 6
కడుగబడి యప్పుడే పైకి వచ్చినవియునై
జోడుజోడు పిల్లలు కలిగి ఒకదానినైన పోగొట్టు
కొనక
సుఖముగానున్న గొఱ్ఱెల కదుపులను పోలి
యున్నవి.
నీ ముసుకుగుండ నీ కణతలు 7
విచ్చిన దాడిమ ఫలమువలె అగపడుచున్నవి.
అరువదిమంది రాణులును ఎనుబదిమంది ఉప 8
పత్నులును
లెక్కకు మించిన కన్యకలును కలరు
నా పావురము నా నిష్కళంకురాలు ఒకతే 9
ఆమె తన తల్లికి ఒకతే కుమార్తె
కన్నతల్లికి ముద్దు బిడ్డ
స్త్రీలు దాని చూచి ధన్యురాలందురు
రాణులును ఉపపత్నులును దాని పొగడుదురు.
సంధ్యారాగము చూపట్టుచు 10
చంద్రబింబమంత అందముగలదై
సూర్యుని అంత స్వచ్ఛము కళలుగలదై
వ్యూహితసైన్య సమభీకర రూపిణియునగు
ఈమె ఎవరు?
లోయలోని చెట్లు ఎట్లున్నవో చూచుటకు 11
ద్రాక్షావల్లులు చిగిర్చెనో లేదో
దాడిమవృక్షములు పూతపట్టెనో లేదో చూచుటకు
నేను అక్షోట వృక్షోద్యానమునకు వెళ్లితిని.
తెలియకయే నా జనులలో ఘనులగువారి రథ
లను నేను కలిసికొంటిని.
షూలమ్మీతీ, రమ్ము రమ్ము
మేము నిన్ను ఆశతీర చూ
రమ్ము.

షూలమ్మీతీయందు మీకు ముచ్చట పుట్టించునదేది?
ఆమె మహనయీము నాటకమంత వింతయైనదా?
7 రాజకుమార పుత్రికా,
నీ పాదరక్షలతో నీవెంత అందముగా నడుచుచున్నావు?
నీ ఊరువులు శిల్పకారి చేసిన ఆభరణ సూత్రములవలె ఆడుచున్నవి.
2 నీ నాభీదేశము మండలాకార కలశము
సమ్మిళిత ద్రాక్షారసము దానియందు వెలితిపడకుండు గాక
నీ గాత్రము పద్మాలంకృత గోధుమరాశి
3 నీ యిరు కుచములు
ఒక జింకపిల్లలయి తామరలలో మేయు కవలను పోలియున్నవి.
4 నీ కంఠరము దంతగోపుర రూపము
నీ నేత్రములు జనపూర్ణమైన హెష్బోను పట్టణమునన్న
రెండు తటాకములతో సమానములు
నీ నాసిక దమస్కు దిక్కునకు చూచు లెబానోను శిఖరముతో సమానము.
5 నీ శిరస్సు కర్మెలు పర్వతరూపము
నీ తలవెండ్రుకలు ధూమ్రవర్ణముగలవి.
రాజు వాటి యుంగరములచేత బద్ధుడగుచున్నాడు.
6 నా ప్రియురాలా, ఆనందకరమైనవాటిలో
నీవు అతిసుందరమైనదానవు
అతి మనోహరమైనదానవు.
7 నీవు తాళవృక్షమంత తిన్ననిదానవు
నీ కుచములు గెలలవలె నున్నవి.
8 తాళవృక్షము నెక్కుదుననుకొంటిని
దాని శాఖలను పట్టుకొందుననుకొంటిని
నీ కుచములు ద్రాక్షగెలలవలె నున్నవి
నీ శ్వాసవాసన జల్దరుఫల సువాసనవలె నున్నది.
9 నీ నోరు శ్రేష్ఠద్రాక్షారసమువలె నున్నది
ఆ శ్రేష్ఠద్రాక్షారసము నా ప్రియునికి మధుర పానీయము
అది నిద్రితుల యధరములు ఆడజేయును.
10 నేను నా ప్రియునిదానను
అతడు నాయందు ఆశాబద్ధుడు.
11 నా ప్రియుడా, లెమ్ము రమ్ము
మనము పల్లెలకు పోదము
గ్రామసీమలలో నివసింతము.
12 పెందలకడ లేచి ద్రాక్షవనములకు పోదము
ద్రాక్షావల్లులు చిగిరించెనో లేదో
వాటి పువ్వులు వికసించెనో లేదో
దాడిమచెట్లు పూతపట్టెనో లేదో
[illegible]ము రమ్ము
అచ్చటనే నా ప్రేమాసూచనలు నీకు చూపెదను.
పుత్రదాత వృక్షము సువాసన నిచ్చుచున్నది 13
నా ప్రియుడా, నేను నీకొరకు దాచియుంచిన
నానావిధ శ్రేష్ఠఫలములు పచ్చివియు పండువియు
మా ద్వారబంధములమీద వ్రేలాడుచున్నవి.
నా తల్లియొద్ద స్తన్యపానము చేసిన యొక సహోదరునివలె 8
నీవు నాయెడలనుండిన నెంత మేలు
అప్పుడు నేను బయట నీకు ఎదురై
ముద్దులిడుదును
ఎవరును నన్ను నిందింపరు.
నేను నీకు మార్గదర్శినైదును 2
నా తల్లియింట చేర్చుదును
నీవు నాకు ఉపదేశము చెప్పుదువు
సంభార సమ్మిళిత ద్రాక్షారసమును
నా దాడిమఫలరసమును నేను నీకిత్తును.
అతని యెడమచెయ్యి నా తలక్రింద నున్నది 3
అతని కుడిచెయ్యి నన్ను కౌగలించుచున్నది
యెరూషలేము కుమార్తెలారా, 4
లేచుటకు ప్రేమకు ఇచ్ఛపుట్టువరకు
లేపకయు కలతపరచకయు నుండుమని
నేను మీచేత ప్రమాణము చేయించుకొందును.
తన ప్రియునిమీద ఆనుకొని 5
అరణ్యమార్గమున వచ్చునది ఎవతె?
జల్దరువృక్షముక్రింద నేను నిన్ను లేపితిని
అచ్చట నీ తల్లికి నీవలన ప్రసవవేదన కలిగెను
నిన్ను కనిన తల్లి యచ్చటనే ప్రసవవేదన పడెను.
ప్రేమ మరణమంత బలవంతమైనది 6
రోషము పాతాళమంత కఠోరమైనది
దాని జ్వాలలు అగ్నిజ్వాలా సమములు
అది యెహోవా పుట్టించు జ్వాల
నీ హృదయముమీద నన్ను నాముద్రగా ఉంచుము
నీ భుజమునకు నాముద్రగా నన్నుంచుము.
అగాధసముద్రజలము ప్రేమను ఆర్పజాలదు 7
నదీప్రవాహములు దాని ముంచివేయజాలవు
ప్రేమకై యొకడు తన స్వాస్థ్యమంత ఇచ్చినను
తిరస్కారముతో అతడు త్రోసివేయబడును.
మాకొక చిన్న చెల్లెలు కలదు 8
దానికి ఇంకను వయస్సు రాలేదు
వివాహకాలము వచ్చినప్పుడు
మేము దానివిషయమై యేమిచేయుదుము?
అది ప్రాకారమువంటిదాయెనా 9
మేము దానిపైన వెండి గోపురమొకటి కట్టుదుము.

అది కవాటమునంటిదాయెనా!
దేవదారు మ్రానుతో దానికి అడ్డులను కట్టుదుము
10 నేను ప్రాకారమునంటిదాననైతిని
నా కుచములు దుర్గములాయెను
అందువలన అతనిదృష్టికి
నేను క్షేమము నొందదగినదాననైతిని.
11 బయలు హామోనునందు
సొలొమోనునకు ఒక ద్రాక్షావనము కలదు
అతడు దానిని కాపులకిచ్చెను
దాని ఫలములకు వచ్చుబడిగా
ఒక్కొకడు వేయి రూపాయిలు తేవలెను.

నా ద్రాక్షావనము నా వశమున ఉన్నది 12
సొలొమోనా, ఆ వేయి రూపాయిలు నీకే
చెల్లును.
దానిని కాపుచేయువారికి ఇన్నూరు వచ్చును.
ఉద్యానములలో పెంచబడినదానా, 13
నీ చెలికత్తెలు నీ స్వరము వినగోరుదురు
నన్నును దాని విననిమ్ము.
నా ప్రియుడా, త్వరపడుము 14
లఘువైన యిఱ్ఱివలె ఉండుము
గంధవర్గవృక్ష పర్వతములమీద
గంతులువేయు లేడిపిల్లవలె ఉండుము

# యెషయా గ్రంథము

1 ఉజ్జియా యోతాము ఆహాజు హిజ్కియాయను
యూదారాజుల దినములలో యూదాను గూర్చియు
యెరూషలేమును గూర్చియు ఆమోజు కుమారుడగు
యెషయాకు కలిగిన దర్శనములు.
2 యెహోవా మాటలాడుచున్నాడు
ఆకాశమా, ఆలకించుము; భూమీ, చెవి యొగ్గుము.
—నేను పిల్లలను పెంచి గొప్పవారినిగా చేసితిని
వారు నామీద తిరుగబడియున్నారు.
3 ఎద్దు తన కామందును నెరుగును గాడిద సొంతవాని
దొడ్డి తెలిసికొనును
ఇశ్రాయేలుకు తెలివిలేదు నా జనులు యోచింపరు
4 పాపిష్ఠ జనమా, దోషభరితమైన ప్రజలారా,
దుష్టసంతానమా, చెరుపుచేయు పిల్లలారా, మీకు
శ్రమ.
వారు యెహోవాను విసర్జించి యున్నారు
ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధదేవుని దూషించుదురు
ఆయనను విడిచి తొలగిపోయి యున్నారు.
5 నిత్యము తిరుగబాటు చేయుచు
మీరేల ఇంకను కొట్టబడుదురు?
ప్రతివాడు నడినెత్తిని వ్యాధి గలిగి యున్నాడు
ప్రతివాని గుండె బలహీనమయ్యెను.
6 అరకాలు మొదలుకొని తలవరకు
స్వస్థత కొంచెమైనను లేదు
ఎక్కడ చూచినను గాయములు దెబ్బలు పచ్చి
పుండ్లు
అవి పిండబడలేదు కట్టబడలేదు తైలముతో మెత్తన
చేయబడలేదు.
7 మీ దేశము పాడై పోయెను
మీ పట్టణములు అగ్ని చేత కాలిపోయెను
మీ యెదుటనే అన్యులు మీ భూమిని తినివేయు
చున్నారు
అన్యులకు తటస్థించు నాశనమువలె అది పాడై
పోయెను.
8 ద్రాక్షతోటలోని గుడిసెవలెను దోసపాదుల
లోని పాకవలెను ముట్టడి వేయబడిన పట్టణము
వలెను
సీయోను కుమార్తె విడువబడియున్నది.
9 సైన్యములకధిపతియగు యెహోవా బహు కొద్ది
పాటి శేషము మనకు నిలుపని పక్షమున
మనము సొదొమవలె నుందుము గొమొఱ్ఱాతో
సమానముగా ఉందుము.

సొదొమ న్యాయాధిపతులారా, యెహోవా 10
మాట ఆలకించుడి.
గొమొఱ్ఱా జనులారా, మన దేవుని ఉపదేశ
మునకు చెవి యొగ్గుడి.
యెహోవా సెలవిచ్చిన మాట ఇదే 11
—విస్తారమైన మీ బలులు నాకేల?
దహనబలులగు పొట్టేళ్లును
బాగుగా మేపిన దూడల క్రొవ్వును నాకు వెక్కస
మాయెను
కోడెల రక్తమందైనను గొఱ్ఱెపిల్లల రక్తమందైనను
మేకపోతుల రక్తమందైనను నాకిష్టములేదు.
నా సన్నిధిని కనబడవలెనని మీరు వచ్చుచున్నారే 12
మా ఆవరణములను త్రొక్కుటకు మిమ్మును
రమ్మన్నవాడెవడు?
మీ నైవేద్యము వ్యర్థము 13
అది నాకు అసహ్యము పుట్టించు ధూపార్పణము
దాని నికను తేకుడి.
అమావాస్యయు విశ్రాంతిదినమును సమాజకూట
ప్రకటనమును జరుగుచున్నవి
పాపులగుంపుకూడిన ఉత్సవసమాజమును నే
నోర్చజాలను.
మీ అమావాస్యోత్సవములును నియామకకాల 14
ములును నాకు హేయములు
అవి నాకు బాధకరములు
వాటిని సహింపలేక విసికియున్నాను.
మీరు మీ చేతులు చాపుచున్నప్పుడు మిమ్మును 15
చూడక నా కన్నులు కప్పుకొందును
మీరు బహుగా ప్రార్థనచేసినను నేను వినను
మీ చేతులు రక్తముతో నిండియున్నవి.
మిమ్మును కడుగుకొనుడి శుద్ధి చేసికొనుడి. 16
మీ దుష్క్రియలు నాకు కనబడకుండ వాటిని తొల
గింపుడి.
కీడుచేయుట మానుడి మేలుచేయ నేర్చుకొనుడి 17
న్యాయము జాగ్రత్తగా విచారించుడి హింసించు
వానిని న్యాయము చేయ నేర్పుడి.
తండ్రిలేనివానికి న్యాయము తీర్చుడి విధవరాలి
పక్షముగా వాదించుడి.
యెహోవా ఈ మాట సెలవిచ్చుచున్నాడు 18
—రండి మన వివాదము తీర్చుకొందము
మీ పాపములు రక్తమువలె ఎఱ్ఱనివైనను అవి
హిమమువలె తెల్లబడును

కెంపువలె ఎఱ్ఱనివైనను అవి గొఱ్ఱెబొచ్చువలె
తెల్లనివగును.
మీరు సమ్మతించి నా మాట వినినయెడల మీరు
భూమియొక్క మంచిపదార్థములను అనుభవిం
తురు.
సమ్మతింపక తిరుగబడినయెడల నిశ్చయముగా
మీరు ఖడ్గము పాలగుదురు
యెహోవా నా యీలాగున నే సెలవిచ్చి
యున్నాను.
అయ్యో, నమ్మకమైన నగరము వేశ్య ఆయెనే
అది న్యాయముతో నిండియుండెను నీతి దానిలో
నివసించెను
ఇప్పుడైతే నరహంతకులు దానిలో కాపురము
న్నారు.
నీ వెండి మష్టాయెను, నీ ద్రాక్షారసము నీళ్లతో
కలిసి చెడిపోయెను.
నీ అధికారులు ద్రోహులు దొంగల సహవాసులు
వారందరును లంచము కోరుదురు బహుమానముల
కొరకు కనిపెట్టుదురు
తండ్రిలేనివారిపక్షమున న్యాయము తీర్చరు,
విధవరాండ్ర వ్యాజ్యము విచారించరు.
కాబట్టి ప్రభువును ఇశ్రాయేలుయొక్క బలిష్ఠు
డును సైన్యములకధిపతియునగు యెహోవా
ఈలాగున అనుకొనుచున్నాడు—
ఆహా నా శత్రువులనుగూర్చి నేనికను ఆయాస
పడను
నా విరోధులమీద నేను పగ తీర్చుకొందును.
నా హస్తము నీమీద పెట్టి క్షారము వేసి నీ మష్టును
నిర్మలము చేసి నీలో కలిసిన తగరమంతయు
తీసివేసెదను.
మొదటనుండినట్లు నీకు న్యాయాధిపతులను మరల
ఇచ్చెదను
ఆదిలోనుండినట్లు నీకు ఆలోచనకర్తలను మరల
నియమించెదను
అప్పుడు నీతిగల పట్టణమనియు నమ్మకమైన నగర
మనియు నీకు పేరు పెట్టబడును.
సీయోనుకు న్యాయముచేతను
తిరిగి వచ్చిన దాని నివాసులకు నీతిచేతను విమో
చనము కలుగును.
అతిక్రమము చేయువారును పాపులును నిశ్శేష
ముగా నాశమగుదురు
యెహోవాను విసర్జించువారు లయమగుదురు.
మీరు ఇచ్ఛయించిన మస్తకివృక్షములనుగూర్చి వారు
సిగ్గుపడుదురు
మీరు సంతోషకరములైన తోటలనుగూర్చి మీ
ముఖములు ఎఱ్ఱబారును

మీరు ఆకులు వాడు మస్తకివృక్షమువలెను 30
నీరులేని తోటవలెను అగుదురు.
బలవంతులు నారపీచువలె నుందురు, వారి పని 31
అగ్నికణమువలె నుండును
ఆర్పువాడెవడును లేక వారును వారి పనియు
బొత్తిగా కాలిపోవును.

యూదానుగూర్చియు యెరూషలేమునుగూర్చి 2
యు ఆమోజు కుమారుడైన యెషయాకు దర్శనము
వలన కలిగిన దేవోక్తి—
అంత్యదినములలో పర్వతములపైన యెహోవా 2
మందిరపర్వతము పర్వత శిఖరమున స్థిరపరచ
బడి కొండల కంటె ఎత్తుగా ఎత్తబడును
ప్రవాహము వచ్చినట్లు సమస్త అన్యజనులు దాని
లోనికి వచ్చెదరు.
ఆ కాలమున సీయోనులోనుండి ఉపదేశము 3
యెరూషలేములోనుండి యెహోవా వాక్కు
బయలు వెళ్లును.
జనములు గుంపులు గుంపులుగా వచ్చి
—యాకోబు దేవుని మందిరమునకు యెహోవా
పర్వతమునకు మనము వెళ్లుదము రండి
ఆయన తన మార్గముల విషయమై మనకు బోధిం
చును
మనము ఆయన త్రోవలలో నడుతము
అని చెప్పుకొందురు.
ఆయన మధ్యవర్తియై అన్యజనులకు న్యాయము 4
తీర్చును
అనేక జనములకు తీర్పుతీర్చును.
వారు తమ ఖడ్గములను నాగటి నక్కులుగాను
తమ యీటెలను మచ్చుకత్తులుగాను సాగగొట్టు
దురు
జనముమీదికి జనము ఖడ్గమెత్తక యుండును
యుద్ధముచేయ నేర్చుకొనుట ఇక మానిపోవును.
యాకోబు వంశస్థులారా, రండి 5
మనము యెహోవా వెలుగులో నడుచుకొం
దము.
యాకోబు వంశమగు ఈ జనము తూర్పున నుం 6
డిన జనుల సంప్రదాయములతో నిండుకొని
యున్నారు
వారు ఫిలిష్తీయులవలె మంత్రప్రయోగము చేయు
దురు
అన్యులతో సహవాసము చేయుదురు గనుక నీవు
వారిని విసర్జించి యున్నావు.
వారి దేశము వెండి బంగారములతో నిండియున్నది 7
వారి ఆస్తి సంపాద్యమునకు మితిలేదు
వారి దేశము గుర్రములతో నిండియున్నది వారి
రథములకు మితిలేదు.

8 వారి దేశము విగ్రహములతో నిండియున్నది
వారు తమ చేతిపనికి తాము వ్రేళ్లతో చేసిన
దానికి నమస్కారము చేయుదురు
9 అల్పులు అణగద్రొక్కబడుదురు ఘనులు తగ్గింప
బడుదురు
కాబట్టి వారిని క్షమింపకుము.
10 యెహోవా భీకరసన్నిధినుండియు ఆయన
ప్రభావ మాహాత్మ్యమునుండియు బండ బీట
లోకి దూరుము
మంటిలో దాగి యుండుము.
11 నరుల అహంకారదృష్టి తగ్గింపబడును
మనుష్యుల గర్వము అణగద్రొక్కబడును
ఆ దినమున యెహోవా మాత్రమే ఘనత వహిం
చును.
12 అహంకారాతిశయముగల ప్రతిదానికిని ఔన్న
త్యముగల ప్రతిదానికిని
విమర్శించు దినమొకటి సైన్యములకధిపతియగు
యెహోవా నియమించియున్నాడు
అవి అణగద్రొక్కబడును.
13 ఔన్నత్యముకలిగి అతిశయించు లెబానోను దేవ
దారు వృక్షములకన్నిటికిని
బాషాను సిందూర వృక్షములకన్నిటికిని
14 ఉన్నతపర్వతములకన్నిటికిని ఎత్తయిన మెట్లకన్ని
టికిని
15 ఉన్నతమైన ప్రతిగోపురమునకును బురుజులుగల
ప్రాకారమునకును
16 తర్షీషు ఓడలకన్నిటికిని రమ్యమైన విచిత్ర వస్తు
వులకన్నిటికిని
ఆ దినము నియమింపబడియున్నది.
17 అప్పుడు నరుల అహంకారము అణగద్రొక్కబడును
మనుష్యుల గర్వము తగ్గింపబడును
ఆ దినమున యెహోవా మాత్రమే ఘనత వహిం
చును.
18 విగ్రహములు బొత్తిగా నశించిపోవును.
19 యెహోవా భూమిని గజగజ వణకింప లేచు
నప్పుడు ఆయన భీకర సన్నిధినుండియు
ఆయన ప్రభావ మాహాత్మ్యమునుండియు
మనుష్యులు కొండల గుహలలో దూరుదురు
నేల బొరియలలో దూరుదురు.
20 ఆ దినమున యెహోవా భూమిని గజగజ వణ
21 కింప లేచునప్పుడు
ఆయన భీకర సన్నిధినుండియు ఆయన ప్రభావ
మాహాత్మ్యమునుండియు
కొండల గుహలలోను బండబీటలలోను
దూరవలెనన్న ఆశతో నరులు తాము పూజిం
చుటకై
చేయించుకొనిన వెండి విగ్రహములను సువర్ణ
విగ్రహములను
ఎలుకలకును గబ్బిలములకును పారవేయుదురు.
తన నాసికారంధ్రములలో ప్రాణముకలిగిన నరుని
లక్ష్యపెట్టకుము;
వానిని ఏవిషయములో ఎన్నిక చేయవచ్చును?
ఆలకించుడి
ప్రభువును సైన్యములకధిపతియునగు యెహోవా
పోషణమును పోషణాధారమును
అన్నోదకముల ఆధారమంతయు పోషణమంతయు
శూరులను యోధులను న్యాయాధిపతులను ప్రవక్త
లను
సోదెకాండ్లను పెద్దలను పంచాయదధిపతులను
ఘనత వహించినవారిని మంత్రులను శిల్పశాస్త్రము
లను ఎరిగినవారిని మాంత్రికులను
యెరూషలేములోనుండియు యూదాదేశములో
నుండియు తీసివేయును.
బాలకులను వారికి అధిపతులనుగా నియమించెదను
వారు బాలచేష్టలుచేసి జనులను ఏలెదరు.
ప్రజలలో ఒకడిట్లును మరియొకడట్లును ప్రతి
వాడు తన పొరుగువానిని ఒత్తుడు చేయును.
పెద్దవానిపైని బాలుడును ఘనునిపైని నీచుడును
గర్వించి తిరస్కారముగా నడుచును.
ఒకడు తన తండ్రియింట తన సహోదరుని పట్టు 6
కొని—నీకు వస్త్రము కలదు నీవు మామీద అధి
పతివై యుందువు
ఈ పాడుస్థలము నీ వశముండనిమ్మనును.
అతడు ఆ దినమున కేకవేసి—నేను సంరక్షణ 7
కర్తనుగా ఉండనొల్లను
నా యింట ఆహారమేమియు లేదు వస్త్రమేమియు
లేదు
నన్ను జనాధిపతినిగా నియమింపరాదనును.
యెరూషలేము పాడైపోయెను యూదా నాశన 8
మాయెను
యెహోవా మహిమగల దృష్టికి తిరుగబాటు
చేయునంతగా
వారి మాటలును క్రియలును ఆయనకు ప్రతికూల
ముగా ఉన్నవి.
వారి ముఖలక్షణమే వారిమీద సాక్ష్యమిచ్చును. 9
తమ పాపమును మరుగుచేయక సొదొమవారివలె
దాని బయలుపరచుదురు.
తమకు తామే వారు కీడుచేసికొని యున్నారు
వారికి శ్రమ
— మీకు మేలు కలుగునని నీతిమంతులతో 10
చెప్పుము
వారు తమ క్రియల ఫలము అనుభవింతురు.

దుష్టులకు శ్రమ, వారి క్రియల ఫలము వారికి
కలుగును.
నా ప్రజలవిషయమై నేనేమందును?
బాలురు వారిని బాధపెట్టుచున్నారు స్త్రీలు వారిని
ఏలుచున్నారు.
నా ప్రజలారా, మీ నాయకులు త్రోవను తప్పిం
చువారు
వారు నీ త్రోవల జాడను చెరిపివేయుదురు.
యెహోవా వాదించుటకు నిలువబడియున్నాడు
జనములను విమర్శించుటకు లేచియున్నాడు
యెహోవా తన జనుల పెద్దలను వారి యధిపతు
లను విమర్శింప వచ్చుచున్నాడు.
మీరే ద్రాక్షలతోటను తినివేసితిరి
మీరు దోచుకొనిన దరిద్రుల సొమ్ము మీ యిండ్ల
లోనే యున్నది
నా ప్రజలను నలుగగొట్టి మీరేమి చేయుదురు?
శ్రమపడువారి ముఖములను నూరి మీరేమి చేయు
దురు?
అని ప్రభువును సైన్యములకధిపతియునగు
యెహోవా సెలవిచ్చుచున్నాడు.
మరియు యెహోవా సెలవిచ్చినదేదనగా—
సీయోను కుమార్తెలు గర్విష్ఠురాండ్రై
మెడచాచి నడుచుచు ఓర చూపులు చూచుచు
కులుకుతో నడచుచు, తమ కాళ్లగజ్జెలను మ్రోగిం
చుచున్నారు;
కాబట్టి ప్రభువు సీయోను కుమార్తెల నడినెత్తి
బోడి చేయును
యెహోవా వారి మానమును బయలుపరచును.
ఆ దినమున యెహోవా గల్లుగల్లుమను వారి
పాదభూషణములను
సూర్యబింబ భూషణములను
చంద్రవంకలను భూషణములను
కర్ణభూషణములను కడియములను నాణెమైన
ముసుకులను
కుళ్లాయీలను కాళ్ల గొలుసులను
ఒడ్డాణములను పరిమళ ద్రవ్యపు బరిణెలను
రక్షరేకులను ఉంగరములను ముక్కు కమ్ములను
ఉత్సవ వస్త్రములను ఉత్తరీయములను పైటలను
సంచులను
చేతి అద్దములను సన్నపునారతో చేసిన ముసుకు
లను పాగాలను శాలువులను తీసివేయును.
అప్పుడు పరిమళద్రవ్యమునకు ప్రతిగా మురుగు
డును
నడికట్టుకు ప్రతిగా త్రాడును
అల్లిన జడకు ప్రతిగా బోడితలయు
ప్రశస్తమైన పైవస్త్రమునకు ప్రతిగా గోనెపట్టయు
అందమునకు ప్రతిగా వాతయును ఉండును.
ఖడ్గముచేత మనుష్యులు కూలుదురు 25
యుద్ధమున నీ బలాఢ్యులు పడుదురు
పట్టణపు గుమ్మములు బాధపడి దుఃఖించును 26
ఆమె ఏమియు లేనిదై నేల కూర్చుండును.

4 ఆ దినమున ఏడుగురు స్త్రీలు ఒక్క పురుషుని
పట్టుకొని
—మేము మా అన్నమే తిందుము మా వస్త్రములే
కట్టుకొందుము,
నీ పేరుమాత్రము మాకు పెట్టి మా నింద తీసి
వేయుమని చెప్పుదురు.
ఆ దినమున యెహోవా చిగురు మహిమయు 2
భూషణమునగును.
ఇశ్రాయేలులో తప్పించుకొనినవారికి
భూమిపంట అతిశయాస్పదముగాను శుభలక్షణము
గాను ఉండును.
సీయోనులో శేషించినవానికి యెరూషలేములో 3
నిలువబడినవానికి
అనగా జీవముపొందుటకై యెరూషలేములో
దాఖలైన ప్రతివానికి పరిశుద్ధుడని పేరు
పెట్టుదురు.
తీర్పుతీర్చు ఆత్మవలనను పరీక్షించు ఆత్మవలనను 4
ప్రభువు సీయోను కుమార్తెలకున్న కల్మషమును
కడిగివేయునప్పుడు
యెరూషలేమునకు తగిలిన రక్తమును దాని మధ్య
నుండి తీసివేసి దాని శుద్ధిచేయునప్పుడు
సీయోనుకొండలోని ప్రతి నివాసస్థలముమీదను 5
దాని ఉత్సవ సంఘములమీదను
పగలు మేఘధూమములను రాత్రి అగ్నిజ్వాలా
ప్రకాశమును యెహోవా కలుగజేయును.
మహిమ అంతటిమీద వితానముగా నుండును.
పగలు ఎండకు నీడగాను గాలివానకు ఆశ్రయము 6
గాను చాటుగాను పర్ణశాల యొకటి యుండును.

5 నా ప్రియునిగూర్చి పాడెదను వినుడి
అతని ద్రాక్షతోటనుబట్టి నాకిష్టుడైనవానిగూర్చి
పాడెదను వినుడి.
సత్తువ భూమిగల కొండమీద నా ప్రియుని కొక
ద్రాక్షతోట యుండెను
ఆయన దానిని బాగుగా త్రవ్వి రాళ్లను ఏరి అం 2
దులో శ్రేష్ఠమైన ద్రాక్షతీగెలను నాటించెను
దాని మధ్యను బురుజు ఒకటి వేయించి ద్రాక్ష
తొట్టిని తొలిపించెను.
ద్రాక్షపండ్లు ఫలింపవలెనని యెదురుచూ
చుండెను గాని అది కారుద్రాక్షలు కాచ
కావున యెరూషలేము నివాసులారా, యూ
వారలారా,

నా ద్రాక్షతోట విషయము నాకు న్యాయము
తీర్చవలెనని మిమ్ము వేడుకొనుచున్నాను.
4 నేను నా ద్రాక్షతోటకు చేసినదానికంటె మరేమి
దానికి చేయగలను?
అది ద్రాక్షపండ్లు కాయునని నేను కనిపెట్టు
కొంటిని
అది కారు ద్రాక్షలు కాయుటకు కారణమేమి?
5 ఆలోచించుడి, నేను నా ద్రాక్షతోటకు చేయ
బోవు కార్యమును మీకు తెలియజెప్పెదను
నేను అది మేసివేయబడునట్లు దాని కంచెను
కొట్టివేసెదను
అది త్రొక్కబడునట్లు దాని గోడను పడగొట్టి
దాని పాడుచేసెదను
6 అది శుద్ధిచేయబడదు పారతో త్రవ్వబడదు
దానిలో గచ్చపొదలును బలురక్కసి చెట్లును
బలిసియుండును
దానిమీద వర్షింపవలదని మేఘములకు ఆజ్ఞనిచ్చె
దను.
7 ఇశ్రాయేలు వంశము సైన్యములకధిపతియగు
యెహోవా ద్రాక్షతోట
యూదా మనుష్యులు ఆయన కిష్టమైన వనము.
ఆయన న్యాయము కావలెనని చూడగా బలా
త్కారము కనబడెను
నీతి కావలెనని చూడగా రోదనము వినబడెను.
8 స్థలము మిగులకుండ మీరు మాత్రమే దేశములో
నివసించునట్లు
ఇంటికి ఇల్లు కలుపుకొని పొలమునకు పొలము
చేర్చుకొను మీకు శ్రమ.
9 నేను చెవులార వినునట్లు సైన్యములకధిపతియగు
యెహోవా స్పష్టముగా ఈ మాట నాతో
సెలవిచ్చెను
—నిజముగా గొప్పవియు దివ్యమైనవియునైన
యిండ్లు అనేకములు నివాసులులేక పాడై
పోవును.
10 పది కాండ్ల ద్రాక్షతోట ఒక బదురస మిచ్చును
తూమెడుగింజల పంట ఒక పడి యగును.
11 మద్యము త్రాగుదమని వేకువనే లేచి ద్రాక్షా
రసము తమకు మంట పుట్టించు పర్యంతము
చాల రాత్రివరకు పానముచేయువారికి శ్రమ.
12 వారు సితారా స్వరమండల తంబుర సన్నాయిలను
వాయించుచు ద్రాక్షారసము త్రాగుచు విందు
చేయుదురుగాని యెహోవా పని యోచిం
పరు
ఆయన హస్తకృత్యములను లక్ష్యపెట్టరు.
13 కావున నా ప్రజలు జ్ఞానము లేకయే చెరపట్టబడి
పోవుచున్నారు

వారిలో ఘనులైనవారు నిరాహారులుగా నున్నారు
సామాన్యులు దప్పిచేత జ్వరపీడితులగుదురు.
అందుచేతనే పాతాళము గొప్ప ఆశ పెట్టుకొని 14
అపరిమితముగా తన నోరు తెరచుచున్నది
వారిలో ఘనులును సామాన్యులును
ఘోషచేయువారును హర్షించువారును పడిపోవు
దురు.
అల్పులు అణగి త్రొక్కబడుదురు 15
ఘనులు తగ్గింపబడుదురు గర్విష్ఠుల చూపు తగ్గును
సైన్యములకధిపతియగు యెహోవాయే తీర్పు 16
తీర్చి మహిమపరచబడును
పరిశుద్ధుడైన దేవుడు నీతినిబట్టి తన్ను పరిశుద్ధపరచు
కొనును.
అది మేతబీడుగా నుండును గొఱ్ఱెపిల్లలు అచ్చట 17
మేయును
గర్వించినవారి బీడు భూమిని విదేశీయులైన కాప
రులు అనుభవింతురు.
భక్తిహీనతయను త్రాళ్లతో దోషమును లాగుకొను 18
వారికి శ్రమ.
బండిమోకులచేత పాపమును లాగుకొనువారికి
శ్రమ
వారు ఇట్లనుకొనుచున్నారు
—ఆయనను త్వరపడనిమ్ము 19
మేము ఆయన కార్యమును చూచునట్లు ఆయనను
దానిని వెంటనే చేయనిమ్ము
ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధదేవుని ఆలోచన మాకు
తెలియబడునట్లు
అది మా యెదుట కనబడనిమ్ము
కీడు మేలనియు మేలు కీడనియు చెప్పుకొని 20
చీకటి వెలుగనియు వెలుగు చీకటనియు ఎంచు
కొనువారికి శ్రమ.
చేదు తీపి అనియు తీపి చేదనియు ఎంచుకొను
వారికి శ్రమ.
తమ దృష్టికి తాము జ్ఞానులనియు 21
తమ యెన్నికలో తాము బుద్ధిమంతులనియు
తలంచుకొనువారికి శ్రమ.
ద్రాక్షారసము త్రాగుటలో ప్రఖ్యాతినొందిన 22
వారికిని
మద్యము కలుపుటలో తెగువగలవారికిని శ్రమ.
వారు లంచము పుచ్చుకొని దుష్టుడు నీతిమంతు 23
డని తీర్పు తీర్చుదురు
నీతిమంతుల నీతిని దుర్నీతిగా కనబడచేయుదురు.
సైన్యములకధిపతియగు యెహోవాయొక్క ధర్మ 24
శాస్త్రమును నిర్లక్ష్యపెట్టుదురు
ఇశ్రాయేలుయొక్క పరిశుద్ధదేవుని వాక్కును
తృణీకరించుదురు.

కాబట్టి అగ్నిజ్వాల కొయ్యకాలును కాల్చివేయునట్లును
ఎండిన గడ్డి మంటలో భస్మమగునట్లును వారి వేరు కుళ్లిపోవును
వారి పువ్వు ధూళివలె పైకి ఎగిరిపోవును.
దానినిబట్టి యెహోవా కోపము ఆయన ప్రజల మీద మండుచున్నది.
ఆయన వారిమీదికి తన బాహువు చాచి వారిని కొట్టగా పర్వతములు వణకుచున్నవి.
వీధులమధ్యను వారి కళేబరములు పెంటవలె పడియున్నవి.
ఇంతగా జరిగినను ఆయన కోపము చల్లారలేదు
ఆయన బాహువు ఇంకను చాపబడియున్నది.
దూరముగానున్న ఆయన జనములను పిలుచుటకు ధ్వజము నెత్తును
భూమ్యంతమునుండి వారిని రప్పించుటకు ఈల గొట్టును
అదిగో వారు త్వరపడి వేగముగా వచ్చుచున్నారు.
వారిలో అలసినవాడైనను తొట్రిల్లువాడైనను లేడు.
వారిలో ఎవడును నిద్రపోడు కునుకడు
వారి నడికట్టు విడిపోదు వారి పాదరక్షల వారు తెగిపోదు.
వారి బాణములు వాడిగలవి
వారి విండ్లన్నియు ఎక్కుపెట్టబడియున్నవి
వారి గుఱ్ఱముల డెక్కలు చెకుముకిరాళ్లతో సమానములు
వారి రథచక్రములు సుడిగాలి తిరిగినట్టు తిరుగును
ఆడుసింహము గర్జించినట్లు వారు గర్జించుదురు
కొదమసింహము గర్జించినట్లు గర్జనచేయుచు
వేటను పట్టుకొని అడ్డమేమియు లేకుండ దానిని ఎత్తికొని పోవుదురు
విడిపింపగలవాడెవడును ఉండడు.
వారు ఆ దినమున సముద్ర ఘోషవలె జనము మీద గర్జనచేయుదురు
ఒకడు భూమివైపు చూడగా అంధకారమును బాధయు కనబడును
అంతట ఆ దేశముమీది వెలుగు మేఘములచేత చీకటియగును.

5 రాజైన ఉజ్జియా మృతినొందిన సంవత్సరమున
అత్యున్నతమైన సింహాసనమందు ప్రభువు ఆసీనుడై
యుండగా నేను చూచితిని; ఆయన చొక్కాయి అం
2 చులు దేవాలయమును నిండుకొనెను. । ఆయనకు పైగా
దేవుని మహాదూతలు నిలిచియుండిరి; ఒక్కొక్కరికి
ఆరేసి రెక్కలుండెను. ప్రతివాడు రెండు రెక్కలతో
తన ముఖమును రెంటితో తన కాళ్లను కప్పుకొనుచు
రెంటితో ఎగురుచునుండెను. । వారు — సైన్యముల 3
కధిపతియగు యెహోవా, పరిశుద్ధుడు పరిశుద్ధుడు
పరిశుద్ధుడు; సర్వలోకము ఆయన మహిమతో నిండి
యున్నది అని గొప్ప స్వరముతో గాన ప్రతిగాన
ములు చేయుచుండిరి. । వారి కంఠస్వరమువలన గడప 4
కమ్ముల పునాదులు కదలుచు మందిరము ధూమముచేత
నిండగా । నేను—అయ్యో నేను అపవిత్రమైన పెద 5
వులు గలవాడను; అపవిత్రమైన పెదవులుగల జనుల
మధ్యను నివసించువాడను; నేను నశించితిని; రాజును
సైన్యములకధిపతియునగు యెహోవాను నేను కన్ను
లార చూచితిననుకొంటిని. । అప్పుడు ఆ దేవదూత 6
లలో నొకడు తాను బలిపీఠముమీదనుండి కారుతో
తీసిన నిప్పును చేత పట్టుకొని నాయొద్దకు ఎగిరి వచ్చి
నా నోటికి దాని తగిలించి । — ఇది నీ పెదవులకు 7
తగిలెను గనుక నీ పాపమునకు ప్రాయశ్చిత్తమాయెను,
నీ దోషము తొలగిపోయెను అనెను. । అప్పుడు — 8
నేను ఎవని పంపెదను? మా నిమిత్తము ఎవడు పోవునని
ప్రభువు సెలవియ్యగా వింటిని. అంతట నేను—చిత్త
గించుము నేనున్నాను నన్ను పంపుమనగా । ఆయన 9
— నీవు పోయి యీ జనులతో ఇట్లనుము — మీరు
నిత్యము వినుచుందురు గాని గ్రహింపకుందురు,
నిత్యము చూచుచుందురు గాని తెలిసికొనకుందురు. ।
వారు కన్నులతో చూచి చెవులతో విని హృదయ 10
ముతో గ్రహించి మనస్సు మార్చుకొని స్వస్థత
పొందక పోవునట్లు ఈ జనుల హృదయము క్రొవ్వ
చేసి వారి చెవులు మందపరచి వారి కన్నులు మూయిం
చుమని చెప్పెను. । — ప్రభువా, ఎన్నాళ్లవరకని 11
నేనడుగగా ఆయన—నివాసులు లేక పట్టణములును,
మనుష్యులు లేక యిండ్లును పాడగువరకును దేశము
బొత్తిగా బీడగువరకును । యెహోవా మనుష్యులను 12
దూరముగా తీసికొని పోయినందున దేశములో నిర్జన
మైన స్థలములు విస్తారమగువరకును ఆలాగున జరు
గును. । దానిలో దశమభాగముమాత్రము విడువబడి 13
నను అదియును నాశనమగును. సిందూర మస్తకి వృక్ష
ములు నరకబడిన తరువాత అది మిగిలియుండు మొద్దు
వలె నుండును; అట్టి మొద్దునుండి పరిశుద్ధమైన చిగురు
పుట్టును.

యూదారాజైన ఉజ్జియా మనుమడును యో 7
తాము కుమారుడునైన ఆహాజు దినములలో అరాము
రాజైన రెజీనును ఇశ్రాయేలు రాజైన రెమల్యా కుమా
రుడగు పెకహును యుద్ధము చేయవలెనని యెరూష
లేముమీదికి వచ్చిరి గాని అది వారివలన కాకపోయెను।
అప్పుడు — అరామీయులు ఎఫ్రాయిమీయులను 2
తోడు చేసికొనిరని దావీదు వంశస్థులకు తెలుప
బడగా, గాలికి అడవిచెట్లు కదలినట్లు వారి హృదయ
మును వారి జనుల హృదయమును కదలెను.

9 కావున న్యాయము మాకు దూరముగా ఉన్నది
నీతి మమ్మును కలిసికొనుటలేదు
వెలుగుకొరకు మేము కనిపెట్టుకొనుచున్నాము
గాని చీకటియే ప్రాప్తించును
ప్రకాశముకొరకు ఎదురుచూచుచున్నాము గాని
అంధకారములోనే నడుచుచున్నాము
10 గోడ అందని గుడ్డివారివలె తడవులాడుచున్నాము
కన్నులు లేనివారివలె తడవులాడుచున్నాము
సంధ్యచీకటియందువలెనే మధ్యాహ్న కాలమున
కాలుతాకి పడుచున్నాము
బాగుగ బ్రదుకుచున్నవారిలోనుండియు చచ్చిన
వారివలె ఉన్నాము.
11 మేమందరము ఎలుగుబంట్లవలె బొబ్బరించు
చున్నాము
గువ్వలవలె దుఃఖరవము చేయుచున్నాము
న్యాయముకొరకు కాచుకొనుచున్నాము గాని
అది లభించుటలేదు
రక్షణకొరకు కాచుకొనుచున్నాము గాని అది
మాకు దూరముగా ఉన్నది
12 మేము చేసిన తిరుగబాటుక్రియలు నీ యెదుట
విస్తరించియున్నవి
మా పాపములు మామీద సాక్ష్యము పలుకు
చున్నవి
మా తిరుగబాటుక్రియలు మాకు కనబడుచున్నవి
మా దోషములు మాకు తెలిసేయున్నవి.
13 తిరుగబాటు చేయుటయు
యెహోవాను విసర్జించుటయు
మా దేవుని వెంబడింపక వెనుకదీయుటయు
బాధకరమైన మాటలు విధికి వ్యతిరిక్తమైన మాటలు
పచించుటయు
హృదయమున యోచించుకొని అసత్యపుమాటలు
పలుకుటయు
ఇవియే మావలన జరుగుచున్నవి.
14 న్యాయమునకు ఆటంకము కలుగుచున్నది
నీతి దూరమున నిలుచుచున్నది
సత్యము సంతవీధిలో పడియున్నది
ధర్మము లోపల ప్రవేశింపనేరదు.
15 సత్యము లేకపోయెను
చెడుతనము విసర్జించువాడు దోచబడుచున్నాడు
న్యాయము జరుగకపోవుట యెహోవా చూచెను
అది ఆయన దృష్టికి ప్రతికూలమైయుండెను.
16 సంరక్షకుడు లేకపోవుట ఆయన చూచెను
మధ్యవర్తి లేకుండుట చూచి ఆశ్చర్యపడెను.
కాబట్టి ఆయన బాహువు ఆయనకు సహాయము
చేసెను
ఆయన నీతియే ఆయనకు ఆధారమాయెను

నీతిని కవచముగా ఆయన ధరించుకొనెను 17
రక్షణను తలమీద శిరస్త్రాణముగా ధరించుకొనెను
ప్రతిదండనను వస్త్రముగా వేసికొనెను 18
ఆసక్తిని పైవస్త్రముగా ధరించుకొనెను
వారి క్రియలనుబట్టి ఆయన ప్రతిదండన చేయును
తన శత్రువులకు రౌద్రము చూపును
తన విరోధులకు ప్రతికారము చేయును
ద్వీపస్థులకు ప్రతికారము చేయును.
పడమటి దిక్కునను్నవారు యెహోవా నామ 19
మునకు భయపడుదురు
సూర్యోదయ దిక్కుననున్నవారు ఆయన మహి
మకు భయపడుదురు
యెహోవా పుట్టించు గాలికి కొట్టుకొనిపోవు
ప్రవాహజలమువలె ఆయన వచ్చును.
సీయోనునొద్దకును యాకోబులో తిరుగబాటు 20
చేయుటమాని మళ్లుకొనినవారియొద్దకును
విమోచకుడు వచ్చును
ఇదే యెహోవా వాక్కు.
నేను వారితో చేయు నిబంధన యిది 21
—నీ మీదనున్న నా ఆత్మయు
నేను నీ నోటనుంచిన మాటలును
నీ నోటనుండియు నీ పిల్లల నోటనుండియు
నీ పిల్లల పిల్లల నోటనుండియు
ఈ కాలము మొదలుకొని యెల్లప్పుడును తొలగి
పోవు
అని యెహోవా సెలవిచ్చుచున్నాడు.
నీకు వెలుగు వచ్చియున్నది, లెమ్ము, తేజరిల్లుము 60
యెహోవా మహిమ నీమీద ఉదయించెను.
చూడుము భూమిని చీకటి కమ్ముచున్నది 2
కటికచీకటి జనములను కమ్ముచున్నది
యెహోవా నీమీద ఉదయించుచున్నాడు
ఆయన మహిమ నీమీద కనబడుచున్నది
జనములు నీ వెలుగునకు వచ్చెదరు 3
రాజులు నీ ఉదయకాంతికి వచ్చెదరు.
కన్నులెత్తి చుట్టు చూడుము 4
వీరందరు కూడుకొని నీయొద్దకు వచ్చుచున్నారు
నీ కుమారులు దూరమునుండి వచ్చుచున్నారు
నీ కుమార్తెలు చంకనెత్తబడి వచ్చుచున్నారు.
నీవు చూచి ప్రకాశింతువు 5
నీ గుండె కొట్టుకొనుచు ఉప్పొంగును
సముద్రవ్యాపారము నీ వైపు త్రిప్పబడును
జనముల ఐశ్వర్యము నీయొద్దకు వచ్చును.
ఒంటెల సమూహము మిద్యాను ఏయిఫాల లేత 6
ఒంటెలును నీ దేశముమీద వ్యాపించును
వారందరు షేబనుండి వచ్చెదరు
బంగారమును ధూపద్రవ్యమును తీసికొని వచ్చెదరు

యెహోవా స్తోత్రములను ప్రకటించెదరు.
7 నీకొరకు కేదారు గొఱ్ఱెమందలన్నియు కూడు
కొనును
నెబాయోతు పొట్టేళ్లు నీ పరిచర్యకు ఉపయోగ
ములగును
అవి నా బలిపీఠముమీద అంగీకారములగును
నా శృంగార మందిరమును నేను శృంగారించెదను.
8 మేఘమువలెను ఎగయు గువ్వలవలెను గూళ్లకు
ఎగసివచ్చు వీరెవరు?
9 నీ దేవుడైన యెహోవా నామమునుబట్టి
ఆయన నిన్ను శృంగారించినందున
ఇశ్రాయేలు పరిశుద్ధదేవుని నామమునుబట్టి
దూరమునుండి నీ కుమారులను తమ వెండి బంగార
ములను తీసికొని వచ్చుటకు
ద్వీపములు నాకొరకు కనిపెట్టుకొనుచున్నవి
తర్షీషు ఓడలు మొదట వచ్చుచున్నవి.
10 అన్యులు నీ ప్రాకారములను కట్టుదురు
వారి రాజులు నీకు ఉపచారము చేయుదురు
ఏలయనగా నేను కోపపడి నిన్ను కొట్టితినిగాని
కటాక్షించి నీయందు జాలిపడుచున్నాను.
11 నీయొద్దకు జనముల భాగ్యము తేబడునట్లు
వారి రాజులు జయోత్సవముతో రప్పింపబడునట్లు
నీ ద్వారములు రాత్రింబగళ్లు వేయబడక
నిత్యము తెరువబడి యుండును.
12 నిన్ను సేవింపనొల్లని జనమైనను రాజ్యమైనను
నిలువదు
అట్టి జనములు నిర్మూలము చేయబడును.
13 నా పరిశుద్ధాలయపు అలంకారము నిమిత్తమై
లెబానోను శ్రేష్ఠమైన దేవదారు వృక్షములును
సరళవృక్షములును గొంజిచెట్లును నీయొద్దకు
తేబడును
నేను నా పాదస్థలమును మహిమపరచెదను.
4 నిన్ను బాధించినవారి సంతానపువారు
నీ యెదుటికి వచ్చి సాగిలపడెదరు
నిన్ను తృణీకరించినవారందరు వచ్చి నీ పాదముల
మీద పడెదరు.
యెహోవా పట్టణమనియు ఇశ్రాయేలు పరిశుద్ధ
దేవుని సీయోననియు నీకు పేరు పెట్టెదరు.
15 నీవు విసర్జింపబడుటనుబట్టియు ద్వేషింపబడుటను
బట్టియు
ఎవడును నీ మార్గమున దాటిపోవుట లేదు.
నిన్ను శాశ్వత శోభాతిశయముగాను
బహు తరములకు సంతోషకారణముగాను
చేసెదను.
హోవానగు నేను నీ రక్షకుడననియు
బహు పరాక్రమముగల యాకోబు దేవుడనగ
నీ విమోచకుడననియు నీకు తెలియబడునట్లు
నీవు జనముల పాలు కుడిచి రాజుల చంటి పాల
త్రాగెదవు.
నేను ఇత్తడికి ప్రతిగా బంగారమును తెచ్చు
చున్నాను
ఇనుముకు ప్రతిగా వెండిని కఱ్ఱకు ప్రతిగా ఇత్తడి
రాళ్లకు ప్రతిగా ఇనుమును తెచ్చుచున్నాను
సమాధానమును నీకధికారులుగాను
నీతిని నీకు విచారణకర్తలుగాను నియమించ
చున్నాను.
ఇకను నీ దేశమున బలాత్కారమను మాట వి
బడదు
నీ సరిహద్దులలోగా పాడు అను మాటగా
నాశనము అను మాటగాని వినబడదు
రక్షణయే నీకు ప్రాకారములనియు ప్రఖ్యాతియే
నీ గుమ్మములనియు నీవు చెప్పుకొందువు.
ఇకమీదట పగలు సూర్యుని ప్రకాశము నీక
వెలుగుగా ఉండదు
నీకు వెలుగిచ్చుటకై చంద్రుడు ఇకను ప్రక
శింపడు
యెహోవాయే నీకు నిత్యమైన వెలుగవును
నీ దేవుడు నీకు భూషణముగా ఉండును.
నీ సూర్యుడికను అస్తమింపడు
నీ చంద్రుడు క్షీణింపడు
యెహోవాయే నీకు నిత్యమైన వెలుగుగ
ఉండును
నీ దుఃఖదినములు సమాప్తములగును.
నీ జనులందరు నీతిమంతులై యుందురు
నన్ను నేను మహిమపరచుకొనునట్లు
వారు నేను నాటిన కొమ్మగాను నేను చేసిన ప
గాను ఉండి
దేశమును శాశ్వతముగా స్వతంత్రించుకొందురు
వారిలో ఒంటరియైనవాడు వేయిమందియగును
ఎన్నికలేనివాడు బలమైన జనమగును
యెహోవానగు నేను తగినకాలమున ఈ కార్య
మును త్వరపెట్టుదును.
ప్రభువగు యెహోవా ఆత్మ నా మీదికి వచ్చి
యున్నది
దీనులకు సువర్తమానము ప్రకటించుటకి
యెహోవా నన్ను అభిషేకించెను
నలిగిన హృదయముగలవారిని దృఢపరచుటకున
చెరలోనున్నవారికి విడుదలను
బంధింపబడినవారికి విముక్తిని ప్రకటించుటకును
యెహోవా హితవత్సరమును మన దేవుని ప్రతి
దండన దినమును ప్రకటించుటకును

దుఃఖాక్రాంతులనందరిని ఓదార్చుటకును
3 సీయోనులో దుఃఖించువారికి (ఉల్లాస వస్త్రములు)
ధరింపజేయుటకును
బూడిదెకు ప్రతిగా పూదండను
దుఃఖమునకు ప్రతిగా ఆనందతైలమును
భారభరితమైన ఆత్మకు ప్రతిగా స్తుతివస్త్రమును
వారికిచ్చుటకును ఆయన నన్ను పంపియున్నాడు.
యెహోవా తన్ను మహిమపరచుకొనునట్లు
నీతి అను మస్తకివృక్షములనియు
యెహోవా నాటిన చెట్లనియు వారికి పేరు
పెట్టబడును.
4 చాలకాలమునుండి పాడుగానున్న స్థలములను
వారు కట్టుదురు
పూర్వమున పాడైన స్థలములను కట్టుదురు
పాడైన పట్టణములను నూతనముగా స్థాపింతురు
తరతరములనుండి శిథిలములైయున్న పురములను
బాగుచేయుదురు.
5 అన్యులు నిలువబడి మీ మందలను మేపెదరు
పరదేశులు మీకు వ్యవసాయకులును
మీ ద్రాక్షతోట కాపరులును అగుదురు
6 మీరు యెహోవాకు యాజకులనబడుదురు
—వారు మా దేవుని పరిచారకులని మనుష్యులు
మిమ్మునుగూర్చి చెప్పుదురు
జనముల ఐశ్వర్యమును మీరు అనుభవింతురు
వారి ప్రభావమును పొంది అతిశయింతురు
7 మీ యవమానమునకు ప్రతిగా రెట్టింపు (ఘనత)
నొందుదురు
నిందకు ప్రతిగా తాము పొందిన భాగము ననుభ
వించి వారు సంతోషింతురు
వారు తమ దేశములో రెట్టింపు భాగమునకు కర్త
లగుదురు
నిత్యానందము వారికి కలుగును.
8 ఏలయనగా న్యాయముచేయుట యెహోవానగు
నాకిష్టము
ఒకడు అన్యాయముగా ఒకని సొత్తు పట్టుకొనుట
నాకసహ్యము.
సత్యమునుబట్టి వారి క్రియాఫలమును వారి
కిచ్చుచు
వారితో నిత్యనిబంధన చేయుదును.
9 జనములలో వారి సంతతి తెలియబడును
జనముల మధ్యను వారి సంతానము ప్రసిద్ధి
నొందును
—వారు యెహోవా ఆశీర్వదించిన జనమని
వారిని చూచినవారందరు ఒప్పుకొందురు
10 యాజకుల పాగా ధరించుకొనిన పెండ్లికుమారుని
రీతిగాను
ఆభరణములతో అలంకరించుకొనిన పెండ్లికుమార్తె
రీతిగాను
ఆయన రక్షణవస్త్రములను నాకు ధరింపజేసి
యున్నాడు
నీతి అను పైబట్టను నాకు ధరింపజేసియున్నాడు
కాగా యెహోవానుబట్టి మహానందముతో
నేను ఆనందించుచున్నాను
నా దేవునిబట్టి నా ఆత్మ ఉల్లసించుచున్నది
భూమి మొలకను మొలిపించునట్లుగాను 11
తోటలో విత్తబడినవాటిని అది మొలిపించునట్లు
గాను
నిశ్చయముగా సమస్త జనముల యెదుట
ప్రభువగు యెహోవా నీతిని స్తోత్రమును ఉజ్జీ
వింపజేయును.
సీయోను నీతి సూర్యకాంతివలె కనబడువరకు 62
దాని రక్షణ దీపమువలె వెలుగుచుండువరకు
సీయోను పక్షమందు నేను మౌనముగా ఉండను
యెరూషలేము పక్షమందు నేను ఊరకుండను.
జనములు నీ నీతిని కనుగొనును 2
రాజులందరు నీ మహిమను చూచెదరు
యెహోవా నియమింపబోవు క్రొత్తపేరు నీకు
పెట్టబడును.
నీవు యెహోవాచేతిలో భూషణకిరీటముగాను 3
నీ దేవునిచేతిలో రాజకీయ మకుటముగాను
ఉందువు.
విడువబడినదానవని ఇకమీదట నీవనబడవు 4
పాడైనదని ఇకను నీ దేశమునుగూర్చి చెప్పబడదు
నాకిష్టురాలని నీకును పతివ్రతయని నీ భూమికిని
పేళ్లు పెట్టబడును.
యెహోవా నిన్నుగూర్చి ఆనందించుచున్నాడు
నీ దేశము వివాహితమగును.
యౌవనుడు కన్యకను వరించి పెండ్లిచేసికొనునట్లు 5
నీ కుమారులు నిన్ను వరించి పెండ్లిచేసికొనెదరు
పెండ్లికుమారుడు పెండ్లికూతురిని చూచి సంతో
షించునట్లు
నీ దేవుడు నిన్నుగూర్చి సంతోషించును.
యెరూషలేమా, నీ ప్రాకారములమీద నేను 6
కావలికాండ్రను ఉంచియున్నాను
రేయైన పగలైన వారు మౌనముగా ఉండరు.
యెహోవా జ్ఞాపకకర్తలారా, విశ్రమింపకుడి 7
ఆయన యెరూషలేమును స్థాపించువరకు
లోకమంతట దానికి ప్రసిద్ధి కలుగజేయువరకు
ఆయనను విశ్రమింపనియ్యకుడి.
తన దక్షిణ హస్తము తోడనియు బాహుబలము 8
తోడనియు
యెహోవా ఈలాగున ప్రమాణము చేసెను

—నిశ్చయముగా ఇకను నీ ధాన్యమును నీ శత్రు
వులకు ఆహారముగా నేనియ్యను
నీవు ప్రయాసపడి తీసిన ద్రాక్షారసమును
అన్యులు త్రాగరు.
9 ధాన్యము కూర్చినవారే దాని భుజించి యెహో
వాను స్తుతి చెల్లింతురు
పండ్లు కోసినవారే నా పరిశుద్ధాలయమంటప
ములలో దాని త్రాగుదురు.
10 గుమ్మములద్వారా రండి రండి
జనమునకు త్రోవ సిద్ధపరచుడి
రాజమార్గమును చక్కపరచుడి చక్కపరచుడి
రాళ్లను ఏరి పారవేయుడి
జనములు చూచునట్లు ధ్వజమెత్తుడి.
11 ఆలకించుడి, భూదిగంతములవరకు
యెహోవా సమాచారము ప్రకటింపజేసి
యున్నాడు
—ఇదిగో రక్షణ నీయొద్దకు వచ్చుచున్నది
ఇదిగో ఆయన ఇచ్చు బహుమానము ఆయన
యొద్దనే యున్నది
ఆయన ఇచ్చు జీతము ఆయన తీసికొని వచ్చు
చున్నాడని సీయోను నివాసులకు తెలియ
జేయుడి.
12 పరిశుద్ధప్రజలనియు యెహోవా విమోచించిన
వారనియు వారికి పేరు పెట్టబడును.
(యెరూషలేమా,) ఆశింపతగినదాననియు విస
ర్జింపబడని పట్టణమనియు
నీకు పేరు కలుగును (అని సీయోను నివాసులతో
చెప్పుడి.)
63 రక్తవర్ణ వస్త్రములు ధరించి ఎదోమునుండి వచ్చు
చున్న యితడెవడు?
శోభితవస్త్రము ధరించినవాడై గంభీరముగా నడు
చుచు
బొస్రానుండి బలాతిశయముతో వచ్చుచున్న
యితడెవడు?
నీతినిబట్టి మాటలాడుచున్న నేనే
రక్షించుటకు బలాఢ్యుడనైన నేనే.
2 నీ వస్త్రము ఎఱ్ఱగా ఉన్నదేమి?
నీ బట్టలు ద్రాక్షగానుగను త్రొక్కుచుండువాని
బట్టలవలె ఉన్నవేమి?
3 ఒంటరిగా ద్రాక్షగానుగను త్రొక్కితిని, జనము
లలో ఎవడును నాతోకూడ ఉండలేదు
కోపగించుకొని వారిని త్రొక్కితిని
రౌద్రముచేత వారిని అణగద్రొక్కితిని
వారి రక్తము నా వస్త్రములమీద చిందినది, నా
బట్టలన్నియు డాగులే.
పగతీర్చుకొను దినము నా మనస్సుకు వచ్చెను
విముక్తిచేయదగిన సంవత్సరము వచ్చియుండెను
నేను చూచి ఆశ్చర్యపడితిని 5
సహాయముచేయువాడొకడును లేకపోయెను
ఆదరించువాడెవడును లేకపోయెను
కావున నా బాహువు నాకు సహాయము చేసెను
నా ఉగ్రత నాకాధారమాయెను.
కోపముగలిగి జనములను త్రొక్కివేసితిని 6
ఆగ్రహపడి వారిని మత్తిల్లజేసితిని
వారి రక్తమును నేల పోసివేసితిని.
యెహోవా మనకు చేసినవాటన్నిటినిబట్టి 7
యెహోవా కృపాతిశయమును యెహోవా
స్తోత్రములను గానముచేతును.
తన వాత్సల్యమునుబట్టియు కృపాబాహుళ్యమును
బట్టియు
ఇశ్రాయేలుయొక్క వంశస్థులకు ఆయన చూపిన
మహాకనికరమును నేను ప్రకటన చేసెదను.
—వారు నా జనులనియు అబద్ధములాడనేరని 8
పిల్లలనియు
అనుకొని ఆయన వారికి రక్షకుడాయెను.
వారి యావద్బాధలో ఆయన బాధనొందెను 9
ఆయన సన్నిధి దూత వారిని రక్షించెను
ప్రేమచేతను తాలిమిచేతను వారిని విమోచించెను
పూర్వదినములన్నిటను ఆయన వారిని ఎత్తికొనుచు
మోసికొనుచు వచ్చెను.
అయినను వారు తిరుగబాటుచేసి ఆయన పరి 10
శుద్ధాత్మను దుఃఖింపజేయగా ఆయన వారికి
విరోధియాయెను
తానే వారితో యుద్ధము చేసెను.
అప్పుడు ఆయన జనులు మోషేయున్న పూర్వ 11
దినములను జ్ఞాపకముచేసికొనిరి
తన మందకాపరులకు సహకారియై సముద్ర
ములోనుండి తమ్మును తోడుకొని వచ్చిన
వాడేడి?
తమలో తన పరిశుద్ధాత్మను ఉంచినవాడేడి? 12
మోషే కుడిచేతివైపున మహిమగల తన బాహు 13
వును పోనిచ్చినవాడేడి?
తనకు శాశ్వతమైన ప్రఖ్యాతి కలుగజేసికొనుటకు
వారిముందర నీళ్లను విభజించినవాడేడి?
మైదానములో గుఱ్ఱము పడనిరీతిగా
వారు పడకుండ అగాధజలములలో నడిపించిన
వాడేడి? (యనుకొనిరి)
పల్లమునకు దిగు పశువులు విశ్రాంతినొందునట్లు 14
యెహోవా ఆత్మ వారికి విశ్రాంతి కలుగజేసెను
నీకు ఘనమైన పేరు కలుగునట్లు నీవు నీ జనులను
నడిపించితివి
పరమునుండి చూడుము 15

మహిమోన్నతమైన నీ పరిశుద్ధ నివాసస్థలమునుండి
దృష్టించుము
నీ ఆసక్తి యేది? నీ శౌర్యకార్యములేవి?
నాయెడల నీకున్న జాలియు నీ వాత్సల్యతయు
అణగిపోయెనే.
16 నీవే మాకు తండ్రివి; అబ్రాహాము మమ్ము నెరుగక
పోయినను
ఇశ్రాయేలు మమ్మును అంగీకరింపకపోయినను
యెహోవా, నీవే మా తండ్రివి
అనాదికాలమునుండి మా విమోచకుడని నీకు
పేరేగదా.
17 యెహోవా, నీ మార్గములను తప్పి తిరుగునట్లుగా
మమ్మును ఎందుకు తొలగజేసితివి?
నీ భయము విడుచునట్లు
మా హృదయములను నీవెందుకు కఠినపరచితివి?
నీ దాసుల నిమిత్తము
నీ స్వాస్థ్యగోత్రముల నిమిత్తము తిరిగి రమ్ము.
18 నీ పరిశుద్ధజనులు స్వల్పకాలమే దేశమును అనుభ
వించిరి
మా శత్రువులు నీ పరిశుద్ధాలయమును త్రొక్కి
యున్నారు.
19 నీ పరిపాలన నెన్నడును ఎరుగనివారివలెనైతిమి
నీ పేరెన్నడును పెట్టబడనివారివలెనైతిమి.
64 గగనము చీల్చుకొని నీవు దిగివచ్చెదవు గాక
2 నీ సన్నిధిని పర్వతములు తత్తరిల్లు గాక.
3 నీ శత్రువులకు నీ నామమును తెలియజేయుటకై
అగ్ని గచ్చపొదలను కాల్చురీతిగాను
అగ్ని నీళ్లను పొంగజేయురీతిగాను
నీవు దిగివచ్చెదవు గాక.
జరుగునని మేమనుకొనని భయంకరమైన క్రియలు
నీవు చేయగా
అన్యజనులు నీ సన్నిధిని కలవరపడుదురు గాక
నీవు దిగివచ్చెదవు గాక
నీ సన్నిధిని పర్వతములు తత్తరిల్లు గాక.
4 తనకొరకు కనిపెట్టువానివిషయమై నీవు తప్ప
తన కార్యము సఫలముచేయు మరి ఏ దేవునిని
ఎవడు నేకాలమున చూచియుండలేదు
అట్టి దేవుడు కలడన్న సమాచారము మనుష్యు
లకు వినబడలేదు
అట్టి సంగతి వారికి తెలిసియుండలేదు.
5 నీ మార్గములనుబట్టి నిన్ను జ్ఞాపకము చేసికొనుచు
సంతోషముగా నీతి ననుసరించువారిని నీవు
దర్శించుచున్నావు.
చిత్తగించుము నీవు కోపపడితివి, మేము పాపుల
మైతిమి;
బహుకాలమునుండి పాపములలో పడియున్నాము
రక్షణ మాకు కలుగునా?
మేమందరము అపవిత్రులవంటివారమైతిమి 6
మా నీతిక్రియలన్నియు మురికిగుడ్డవలె నాయెను
మేమందరము ఆకువలె వాడిపోతిమి
గాలివాన కొట్టుకొనిపోవునట్లుగా
మా దోషములు మమ్మును కొట్టుకొనిపోయెను
నీ నామమునుబట్టి మొర్రపెట్టువాడొకడును లేక 7
పోయెను
నిన్ను ఆధారము చేసికొనుటకై
తన్నుతాను ప్రోత్సాహపరచుకొనువాడొకడును
లేడు
నీవు మాకు ముఖము చాటు చేసికొంటివి
మా దోషముల (బలము) చేత నీవు మమ్మును
కరిగించియున్నావు.
యెహోవా, నీవే మాకు తండ్రివి 8
మేము జిగటమన్ను నీవు మాకు కుమ్మరివాడవు
మేమందరము నీ చేతిపనియై యున్నాము.
యెహోవా, అత్యధికముగా కోపపడకుము 9
మేము చేసిన దోషమును నిత్యము జ్ఞాపకము చేసి
కొనకుము
చిత్తగించుము, చూడుము, దయచేయుము, మేమంద
రము నీ ప్రజలమే గదా.
నీ పరిశుద్ధ పట్టణములు బీటిభూములాయెను 10
సీయోను బీడాయెను యెరూషలేము పాడాయెను.
మా పితరులు నిన్ను కీర్తించుచుండిన మా పరిశుద్ధ 11
మందిరము
మా శృంగారమైన[1] మందిరము అగ్నిపాలాయెను
మాకు మనోహరములైన వన్నియు నాశనమై
పోయెను.
యెహోవా, వీటిని చూచి ఊరకుందువా! 12
మౌనముగానుందువా?
అత్యధికముగా మమ్మును శ్రమపెట్టుదువా?
నాయొద్ద విచారణచేయనివారిని నా దర్శనము 65
నకు రానిచ్చితిని
నన్ను వెదకనివారికి నేను దొరికితిని.
—నేనున్నాను ఇదిగో నేనున్నాను అని నా పేరు
పెట్టబడని జనముతో చెప్పుచున్నాను.
తమ ఆలోచనల ననుసరించి చెడుమార్గమున 2
నడుచుకొనుచు
లోబడనొల్లని ప్రజలవైపు దినమంతయు నా
చేతులు చాపుచున్నాను.
వారు తోటలలో బల్యర్పణమును అర్పించుచు 3
ఇటికెలమీద ధూపము వేయుదురు

1 లేక, అతిశయాస్పదమైన.

నా భయములేక నాకు నిత్యము కోపము కలుగ
జేయుచున్నారు.
4 వారు సమాధులలో కూర్చుండుచు రహస్య స్థల
ములలో ప్రవేశించుచు పందిమాంసము తిను
చుందురు
అసహ్యపాకములు వారి పాత్రలలో ఉన్నవి
5 వారు—మా దాపునకు రావద్దు ఎడముగా ఉండుము
నీకంటె మేము పరిశుద్ధులమని చెప్పుదురు;
వీరు నా నాసికారంధ్రములకు పొగవలెను
దినమంతయు మండుచుండు అగ్నివలెను ఉన్నారు.
6 యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు
—నా యెదుట గ్రంథములో అది వ్రాయబడి
యున్నది
ప్రతికారముచేయక నేను మౌనముగా నుండను
నిశ్చయముగా వారనుభవించునట్లు నేను వారికి
ప్రతికారము చేసెదను.
7 నిశ్చయముగా మీ దోషములనుబట్టియు మీ పిత
రుల దోషములనుబట్టియు
అనగా పర్వతములమీద ఈ జనులు ధూపము
వేసినదానినిబట్టియు
కొండలమీద నన్ను దూషించినదానినిబట్టియు
మొట్టమొదట వారి ఒడిలోనే
వారికి ప్రతికారము కొలిచి పోయుదును.
8 యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు
—ద్రాక్షగెలలో క్రొత్తరసము కనబడునప్పుడు
జనులు—అది దీవెనకరమైనది దాని కొట్టివేయ
కుము అని చెప్పుదురు గదా.
నా సేవకులనందరిని నేను నశింపజేయకుండునట్లు
వారినిబట్టి నేనాలాగే చేసెదను.
9 యాకోబునుండి సంతానమును యూదానుండి నా
పర్వతములను స్వాధీనపరచుకొనువారిని పుట్టిం
చెదను
నేను ఏర్పరచుకొనినవారు దాని స్వతంత్రించు
కొందురు
నా సేవకులు అక్కడ నివసించెదరు.
10 నన్నుగూర్చి విచారణచేసిన నా ప్రజలనిమిత్తము
షారోను గొఱ్ఱెల మేతభూమియగును
ఆకోరు లోయ పశువులు పరుండు స్థలముగా
ఉండును.
11 యెహోవాను విసర్జించి నా పరిశుద్ధపర్వతమును
మరచి
గాదుకు[1] బల్లను సిద్ధపరచువారలారా,
అదృష్టదేవికి పానీయార్పణము నర్పించువార
లారా,
12 నేను పిలువగా మీరు ఉత్తరమియ్యలేదు
నేను మాటలాడగా మీరు ఆలకింపక నా దృష్టికి
చెడ్డదైనదాని చేసితిరి
నాకిష్టము కానిదాని కోరితిరి
నేను ఖడ్గమును మీకు అదృష్టముగా నియమిం
చుదును
మీరందరు వధకు లోనగుదురు.
మరియు ప్రభువగు యెహోవా ఈలాగు సెల 13
విచ్చుచున్నాడు
—ఆలకించుడి నా సేవకులు భోజనముచేయుదురు
గాని మీరు ఆకలిగొనెదరు
నా సేవకులు పానము చేసెదరు గాని మీరు దప్పి
గొనెదరు.
నా సేవకులు సంతోషించెదరు గాని మీరు సిగ్గు
పడెదరు
నా సేవకులు హృదయానందముచేత కేకలు వేసె 14
దరుగాని
మీరు చింతాక్రాంతులై యేడ్చెదరు
మనోదుఃఖముచేత ప్రలాపించెదరు.
నేనేర్పరచుకొనినవారికి మీ పేరు శాపవచన 15
ముగా చేసిపోయెదరు
ప్రభువగు యెహోవా నిన్ను హతముచేయును
ఆయన తన సేవకులకు వేరొక పేరు పెట్టును.
దేశములో తనకు ఆశీర్వాదము కలుగవలెనని 16
కోరువాడు నమ్మదగిన దేవుడు తన్నాశీర్వదింప
వలెనని కోరుకొనును
దేశములో ప్రమాణము చేయువాడు నమ్మదగిన
దేవునితోడని ప్రమాణము చేయును
పూర్వము కలిగిన బాధలు నా దృష్టికి మరువ
బడును
అవి నా దృష్టికి మరుగవును.
ఇదిగో నేను క్రొత్త ఆకాశమును 17
క్రొత్త భూమిని సృజించుచున్నాను
మునుపటివి మరువబడును జ్ఞాపకమునకు రావు.
నేను సృజించుచున్నదానిగూర్చి మీరు ఎల్లప్పుడు 18
హర్షించి ఆనందించుడి
నిశ్చయముగా నేను యెరూషలేమును ఆనందకర
మైన స్థలముగాను
ఆమె ప్రజలను హర్షించువారినిగాను సృజించు
చున్నాను.
నేను యెరూషలేమునుగూర్చి ఆనందించెదను 19
నా జనులనుగూర్చి హర్షించెదను
రోదనధ్వనియు విలాపధ్వనియు దానిలో ఇకను
వినబడవు.
అక్కడ ఇకను కొద్దిదినములే బ్రదుకు శిశువు 20
లుండరు

[1] లేక, అదృష్టమునకు—ఆది. 30: 2.

కాలమునిండని ముసలివారుండరు
బాలురు నూరు సంవత్సరముల వయస్సుగలవారై చనిపోవుదురు
పాపాత్ముడై శాపగ్రస్తుడగువాడు సహితము నూరు సంవత్సరములు బ్రదుకును
21 జనులు ఇండ్లు కట్టుకొని వాటిలో కాపురముందురు
ద్రాక్షతోటలు నాటించుకొని వాటి ఫలముల ననుభవింతురు.
22 వారు కట్టుకొన్న యిండ్లలో వేరొకరు కాపురముండరు
వారు నాటుకొన్నవాటిని వేరొకరు అనుభవింపరు
నా జనుల ఆయుష్యము వృక్షాయుష్యమంతయగును
నేను ఏర్పరచుకొనినవారు
తాము చేసికొనినదాని ఫలమును పూర్తిగా అనుభవింతురు.
23 వారు వృథాగా ప్రయాసపడరు
ఆకస్మికముగా కలుగు అపాయము నొందుటకై పిల్లలను కనరు
వారు యెహోవాచేత ఆశీర్వదింపబడినవారగుదురు
వారి సంతానపువారు వారియొద్దనే యుందురు.
24 వారికీలాగున జరుగును
వారు వేడుకొనకమునుపు నేను ఉత్తరమిచ్చెదను
వారు మనవి చేయుచుండగా నేను ఆలకించెదను.
25 తోడేళ్లును గొఱ్ఱెపిల్లలును కలిసి మేయును
సింహము ఎద్దువలె గడ్డి తినును
సర్పమునకు మన్ను ఆహారమగును
నా పరిశుద్ధపర్వతములో అవి హానియైనను నాశనమైనను చేయకుండును
అని యెహోవా సెలవిచ్చుచున్నాడు.
66 యెహోవా ఈలాగు ఆజ్ఞ ఇచ్చుచున్నాడు
—ఆకాశము నా సింహాసనము
భూమి నా పాదములకు పీఠము
మీరు నా నిమిత్తము కట్టనుద్దేశించు ఇల్లు ఏపాటిది?
నాకు విశ్రమస్థానముగా మీరు కట్టనుద్దేశించునది ఏపాటిది?
2 అవన్నియు నా హస్తకృత్యములు
అవి నావలన కలిగినవని యెహోవా సెలవిచ్చుచున్నాడు.
ఎవడు దీనుడై నలిగిన హృదయముగలవాడై నా మాట విని వణకుచుండునో
వానినే నేను దృష్టించుచున్నాను.
ఎద్దును వధించువాడు నరుని చంపువాడే 3
గొఱ్ఱెపిల్లను బలిగా అర్పించువాడు కుక్క మెడను విరుచువాడే
నైవేద్యము చేయువాడు పందిరక్తము అర్పించువాడే
ధూపము వేయువాడు బొమ్మను స్తుతించువాడే.
వారు తమకిష్టమైనట్లుగా త్రోవలను ఏర్పరచుకొనిరి
వారి యసహ్యమైన పనులు తమకే యిష్టముగా ఉన్నవి.
నేను పిలిచినప్పుడు ఉత్తరమిచ్చువాడొకడును లేకపోయెను 4
నేను మాటలాడినప్పుడు వినువాడొకడును లేకపోయెను
నా దృష్టికి చెడ్డదైనదాని చేసిరి
నాకిష్టము కానిదాని కోరుకొనిరి
కావున నేనును వారిని మోసములో ముంచుదును
వారు భయపడువాటిని వారిమీదికి రప్పించెదను.
యెహోవా వాక్యమునకు భయపడువారలారా, ఆయన మాట వినుడి 5
మిమ్మును ద్వేషించుచు నా నామమునుబట్టి మిమ్మును త్రోసివేయు మీ స్వజనులు
—మీ సంతోషము మాకు కనబడునట్లు
యెహోవా మహిమనొందు గాక అని చెప్పుదురు
వారే సిగ్గునొందుదురు.
ఆలకించుడి, పట్టణములో అల్లరిధ్వని పుట్టుచున్నది 6
దేవాలయమునుండి శబ్దము వినబడుచున్నది
తన శత్రువులకు ప్రతికారము చేయుచుండు యెహోవా శబ్దము వినబడుచున్నది.
ప్రసవవేదన పడకమునుపు ఆమె పిల్లను కనినది 7
నొప్పులు తగులకమునుపు మగపిల్లను కనినది.
అట్టివార్త యెవరు వినియుండిరి? 8
అట్టి సంగతులు ఎవరు చూచిరి?
ఒక జనమును కనుటకు ఒకనాటి ప్రసవవేదన చాలునా?
ఒక్క నిమిషములో ఒకజనము జన్మించునా?
సీయోనుకు ప్రసవవేదన కలుగగానే ఆమె బిడ్డలను కనెను.
నేను ప్రసవవేదన కలుగజేసి కనిపింపక మానెదనా? 9
అని యెహోవా అడుగుచున్నాడు.
పుట్టించువాడనైన నేను గర్భమును మూసెదనా? అని నీ దేవుడడుగుచున్నాడు.
యెరూషలేమును ప్రేమించువారలారా, 10
మీరందరు ఆమెతో సంతోషించుడి ఆనందించుడి.

ఆమెనుబట్టి దుఃఖించువారలారా,
మీరందరు ఆమెతో ఉత్సహించుడి
11 ఆదరణకరమైన ఆమె స్తన్యమును మీరు కుడిచి
తృప్తినొందెదరు
ఆమె మహిమాతిశయము అనుభవించుచు ఆనందించెదరు.
12 యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు
—ఆలకించుడి, నదివలె సమాధానమును ఆమె
యొద్దకు పారజేయుదును
మీరు జనముల ఐశ్వర్యము అనుభవించునట్లు
ఒడ్డుమీద పొర్లిపారు జలప్రవాహమువలె
మీయొద్దకు దాని రాజేతును
మీరు చంకను ఎత్తికొనబడెదరు
మోకాళ్లమీద ఆడింపబడెదరు.
13 ఒకని తల్లి వానిని ఆదరించునట్లు నేను మిమ్మును
ఆదరించెదను
యెరూషలేములోనే మీరు ఆదరింపబడెదరు.
14 మీరు చూడగా మీ హృదయము ఉల్లసించును
మీ యెముకలు లేతగడ్డివలె బలియును
యెహోవా హస్తబలము ఆయన సేవకులయెడల
కనుపరచబడును
ఆయన తన శత్రువులయెడల కోపము చూపును.
15 ఆలకించుడి, మహాకోపముతో ప్రతికారము
చేయుటకును
అగ్నిజ్వాలలతో గద్దించుటకును
యెహోవా అగ్నిరూపముగా వచ్చుచున్నాడు
ఆయన రథములు తుఫానువలె త్వరపడుచున్నవి.
16 అగ్నిచేతను తన ఖడ్గముచేతను
శరీరులందరితో ఆయన వ్యాజ్యమాడును
యెహోవాచేత అనేకులు హతులవుదురు.
17 తోటలోనికి వెళ్లవలెనని మధ్య నిలుచున్న యొకని
చూచి తమ్ము ప్రతిష్ఠించుకొనుచు పవిత్రపరచు
కొనుచున్నవారై పందిమాంసమును హేయ
వస్తువును పందికొక్కులను తినువారు
ఒకడును తప్పకుండ నశించెదరు
ఇదే యెహోవా వాక్కు.
18 వారి క్రియలు వారి తలంపులు నాకు (తెలిసే
యున్నవి)
అప్పుడు సమస్త జనములును ఆ యా భాషలు
మాటలాడువారును కూడి వచ్చెదరు.
వారు వచ్చి నా మహిమను చూచెదరు.

నేను వారియెదుట ఒక సూచకక్రియను జరిగిం 19
చెదను
వారిలో తప్పించుకొనినవారిని
విలుకాండ్రైన తర్షీషు పూలు లూదు అను జనుల
యొద్దకును
తుబాలు యావాను నివాసులయొద్దకును నేను
పంపెదను
నన్నుగూర్చిన సమాచారము విననట్టియు నా
మహిమను చూడనట్టియు
దూరద్వీపవాసులయొద్దకు వారిని పంపెదను
వారు జనములలో నా మహిమను ప్రకటించెదరు.
ఇశ్రాయేలీయులు పవిత్రమైన పాత్రలో నైవే 20
ద్యమును
యెహోవా మందిరములోనికి తెచ్చునట్లుగా
గుర్రములమీదను రథములమీదను
డోలీలమీదను కంచరగాడిదెలమీదను ఒంటెల
మీదను ఎక్కించి
సర్వజనములలోనుండి నాకు ప్రతిష్ఠిత పర్వతమగు
యెరూషలేముకు
మీ స్వదేశీయులను యెహోవాకు నైవేద్యముగా
వారు తీసికొనివచ్చెదరని యెహోవా సెల
విచ్చుచున్నాడు.
మరియు యాజకులుగాను లేవీయులుగాను ఉండు 21
టకై
నేను వారిలో కొందరిని ఏర్పరచుకొందును
అని యెహోవా సెలవిచ్చుచున్నాడు.
మరియు యెహోవా ఈలాగు సెలవిచ్చు
చున్నాడు—
నేను సృజింపబోవు క్రొత్త ఆకాశమును క్రొత్త 22
భూమియు
లయముకాక నా సన్నిధిని నిలుచునట్లు
నీ సంతతియు నీ నామమును నిలిచియుండును
ఇదే యెహోవా వాక్కు.
ప్రతి అమావాస్యదినమునను ప్రతి విశ్రాంతి 23
దినమునను
నా సన్నిధిని మ్రొక్కుటకై సమస్త శరీరులు వచ్చెదరు
అని యెహోవా సెలవిచ్చుచున్నాడు.
వారు పోయి నామీద తిరుగబాటుచేసినవారి 24
కళేబరములను తేరి చూచెదరు
వాటి పురుగు చావదు వాటి అగ్ని ఆరిపోదు
అవి సమస్త శరీరులకు హేయముగా ఉండును.

# యిర్మీయా

1 బెన్యామీను దేశమందలి అనాతోతులోనుండు యాజకు
2 ములలో ఒకడైన, హిల్కీయా కుమారుడగు
డైన యిర్మీయా వాక్యములు — ఆమోను కుమారుడైన
యోషీయా యూదాకు రాజై యుండగా అతని
యేలుబడి పదుమూడవ సంవత్సరమున యెహోవా
3 వాక్కు యిర్మీయాకు ప్రత్యక్షమాయెను. । మరియు
యోషీయా కుమారుడగు యెహోయాకీము యూదా
వారి రాజై యుండగాను, యోషీయా కుమారుడగు
సిద్కియా యూదాకు రాజై యుండగాను, అతని
యేలుబడి పదకొండవ సంవత్సరాంతము వరకును
ను, అనగా ఆ సంవత్సరమున అయిదవ నెలలో
యెరూషలేము చెరలోనికి పోయిన వరకును
ఆ వాక్కు ప్రత్యక్షమగుచుండెను.

4 యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై యీ
5 లాగు సెలవిచ్చెను—గర్భములో నేను నిన్ను రూపింపక
మును పే నిన్నెరిగితిని, నీవు గర్భమునుండి బయలుపడక
మునుపే నేను నిన్ను ప్రతిష్ఠించితిని, జనములకు
6 ప్రవక్తగా నిన్ను నియమించితిని. । అందుకు—
అయ్యో, ప్రభువా యెహోవా, చిన్నవాడను నేను
గనుక నేను మాటలాడుటకు నాకు శక్తిచాలదని
7 నేననగా । యెహోవా నాకీలాగు సెలవిచ్చెను —
నేను బాలుడననవద్దు; నేను నిన్ను పంపువారందరి
యొద్దకు నీవు పోవలెను, నీకాజ్ఞాపించిన సంగతు
8 లన్నియు చెప్పవలెను. । వారికి భయపడవలదు, నిన్ను
విడిపించుటకు నేను నీకు తోడై యున్నాను; ఇదే
9 యెహోవా వాక్కు. । అప్పుడు యెహోవా చేయి
చాపి నా నోరు ముట్టి యీలాగు సెలవిచ్చెను—ఇదిగో
10 నేను నీ నోట నా మాటలు ఉంచియున్నాను. । పెల్ల
గింపుటకును పడగొట్టుటకును, నశింపజేయుటకును
పడద్రోయుటకును, కట్టుటకును నాటుటకును నేను
ఈ దినమున జనములమీదను రాజ్యములమీదను
నిన్ను నియమించియున్నాను.

11 మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్ష
మై — యిర్మీయా, నీకేమి కనబడుచున్నదని సెల
విచ్చెను. అందుకు — బాదముచెట్టు చువ్వ కనబడు
12 చున్నదని నేననగా । యెహోవా — నీవు బాగుగా
కనిపెట్టితివి; నేను చెప్పిన వాక్యమును నెరవేర్చు
13 టకు నేను ఆతురపడుచున్నానని సెను. । రెండవమారు
యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై — నీకేమి
కనబడుచున్నదని సెలవియ్యగా నేను—మసలుచున్న
బాన నాకు కనబడుచున్నది; దాని ముఖము ఉత్తర
దిక్కువైపు తిరిగియున్నదంటిని. । అందుకు యెహోవా 14
ఈలాగు సెలవిచ్చెను—ఉత్తరదిక్కునుండి కీడు బయలు
దేరి యీ దేశనివాసులందరిమీదికి వచ్చును. । ఇదిగో 15
నేను ఉత్తరదిక్కునున్న రాజ్యముల సర్వవంశస్థులను
పిలిచెదను, వారు వచ్చి ప్రతివాడును యెరూషలేము
గుమ్మములలోగాను, యెరూషలేము చుట్టునున్న
ప్రాకారములన్నిటికి ఎదురుగాను, యూదాపట్టణము
లన్నిటికి ఎదురుగాను తమ సింహాసనములను స్థాపిం
తురు. । అప్పుడు యెరూషలేమువారు నన్ను విడిచి 16
అన్యదేవతలకు ధూపమువేసి, తమ చేతులు రూపించిన
వాటికి నమస్కరించుటయను తమ చెడుతనమంతటిని
బట్టి నేను వారినిగూర్చిన నా తీర్పులు ప్రకటింతును. ।
కాబట్టి నీవు నడుముకట్టుకొని వారియెదుట భయపడ 17
కుండుము. నీవు నిలువబడి నేను నీకాజ్ఞాపించున
దంతయును వారికి ప్రకటనచేయుము; లేదా నేను వారి
యెదుట నీకు భయము పుట్టింతును. । యూదా 18
రాజులయొద్దకు గాని ప్రధానులయొద్దకు గాని యాజ
కులయొద్దకు గాని దేశనివాసులయొద్దకు గాని, యీ
దేశమంతటిలో నీ వెక్కడికి పోయినను, ప్రాకారము
గల పట్టణముగాను ఇనుపస్తంభముగాను ఇత్తడి గోడలు
గాను నీవుండునట్లు ఈ దినమున నిన్ను నియమించి
యున్నాను. । వారు నీతో యుద్ధము చేతురు గాని నిన్ను 19
విడిపించుటకు నేను నీకు తోడై యున్నందున వారు
నీమీద విజయము పొందజాలరు; ఇదే యెహోవా
వాక్కు.

మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్య 2
క్షమై యీలాగు సెలవిచ్చెను ।— నీవు వెళ్లి యెరూష 2
లేము నివాసుల చెవులలో ఈ సమాచారము ప్రక
టింపుము. యెహోవా సెలవిచ్చునదేమనగా—నీవు
అరణ్యములోను, విత్తనములు వేయబడని దేశములోను,
నన్ను వెంబడించుచు నీ యౌవనకాలములో నీవు
చూపిన వాత్సల్యమును నీ వైవాహిక ప్రేమను నేను
జ్ఞాపకము చేసికొనుచున్నాను. । అప్పుడు ఇశ్రాయేలు 3
యెహోవాకు ప్రతిష్ఠితజనమును, ఆయన పచ్చుబడికి
ప్రథమఫలమును ఆయెను, అతని లయపరచువారం
దరు శిక్షకు పాత్రులైరి, వారికి కీడు సంభవించును;
ఇదే యెహోవా వాక్కు.

యాకోబు ఇంటివారలారా, ఇశ్రాయేలు ఇంటి 4
వారలారా, మీరందరు యెహోవా వాక్కు వినుడి. ।
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — నా 5
యందు ఏ దుర్నీతి చూచి మీ పితరులు వ్యర్థమైనదాని

ననుసరించి, తాము వ్యర్థులగునట్లు నాయొద్దనుండి
6 దూరముగా తొలగిపోయిరి? । ఐగుప్తుదేశములోనుండి
మమ్మును రప్పించిన యెహోవా యెక్కడ ఉన్నాడని
అరణ్యములో, అనగా ఎడారులు గోతులుగల దేశ
ములో అనావృష్టియు గాఢాంధకారమును కలిగి,
యెవరును సంచారమైనను నివాసమైనను చేయని
దేశములో మమ్మును నడిపించిన యెహోవా యెక్కడ
7 ఉన్నాడని జనులు అడుగుట లేదు. । దాని ఫలము
లను శ్రేష్ఠపదార్థములను తినునట్లు నేను ఫలవంతమైన
దేశములోకి మిమ్మును రప్పింపగా మీరు ప్రవేశించి,
నా దేశమును అపవిత్రపరచి నా స్వాస్థ్యమును
8 హేయమైనదిగా చేసితిరి. । యెహోవా యెక్కడ
ఉన్నాడని యాజకులడుగరు, ధర్మశాస్త్రోపదేశకులు
నన్నెరుగరు, ఏలికలును నామీద తిరుగబాటు చేయు
దురు. ప్రవక్తలు బయలుపేరట ప్రవచనములు చెప్పు
దురు, నిష్ప్రయోజనమైనవాటిని అనుసరింతురు ।
9 కావున నేనికమీదట మీతోను మీ పిల్లల పిల్లలతోను
10 వ్యాజ్యమాడెదను; ఇది యెహోవా వాక్కు. । కిత్తీ
యుల ద్వీపములకు పోయి చూడుడి, కేదారుకు
దూతలను పంపి బాగుగా విచారించి తెలిసికొనుడి.
(మీలో) జరిగిన ప్రకారము ఎక్కడనైనను జరిగి
11 నదా? । దైవత్వములేని తమ దేవతలను ఏ జనమైనను
ఎప్పుడైనను మార్చుకొనెనా? అయినను నా ప్రజలు
ప్రయోజనము లేనిదానికై తమ మహిమను మార్చు
12 కొనిరి. । ఆకాశమా, దీనిబట్టి విస్మయపడుము, కంపిం
చుము, బొత్తిగా పాడైపొమ్ము; ఇదే యెహోవా
13 వాక్కు. । నా జనులు రెండు నేరములు చేసియున్నారు;
జీవజలముల ఊటనైన నన్ను విడిచియున్నారు, తమ
కొరకు తొట్లను, అనగా బద్దలై నీళ్లు నిలువని తొట్లను
14 తొలిపించుకొనియున్నారు. । ఇశ్రాయేలు (కొన
బడిన) దాసుడా? యింటపుట్టిన దాసుడా? కాడు
15 గదా; అతడేల దోపుడుసొమ్మాయెను? । కొదమ సింహ
ములు వానిపైని బొబ్బలుపెట్టుచు గర్జిల్లుచున్నవి, అవి
అతని దేశమును పాడుచేయుచున్నవి, అతని పట్టణ
16 ములు నివాసులులేక పాడాయెను. । నొపు తహపం
హేసు అను పట్టణములవారు నీ ఉన్నతస్థలములలో
17 తమ మందలను మేపుదురు. । నీ దేవుడైన యెహోవా
నిన్ను మార్గములో నడిపించుచుండగా నీవు ఆయనను
విసర్జించుటవలన నీకు నీవే యీ బాధ కలుగజేసి
18 కొంటివి గదా. । నీవు షీహోరు నీళ్లు త్రాగుటకు
ఐగుప్తు మార్గములో నీకేమి పనియున్నది? ఫరాతునది
నీళ్లు త్రాగుటకు అష్షూరు మార్గములో నీకేమి పని
19 యున్నది? । నీ దేవుడైన యెహోవాను విసర్జించు
టయు, నీకు నాయెడల భయభక్తులు లేకుండుటయు,
...కును శ్రమకును కారణమగునని నీవు తెలిసికొని
చునట్లు నీ చెడుతనము నిన్ను శిక్షించును, నీవు
చేసిన ద్రోహము నిన్ను గద్దించునని ప్రభువును
సైన్యముల కధిపతియునగు యెహోవా సెలవిచ్చు
చున్నాడు. । పూర్వకాలమునుండి నీ కాడిని విరుగ 20
గొట్టి నీ బంధకములను తెంపివేసి—నేను సేవచేయనని
చెప్పుచున్నావు; ఎత్తయిన ప్రతి కొండమీదను పచ్చని
ప్రతి చెట్టుక్రిందను వేశ్యవలె క్రీడించుచున్నావు. ।
శ్రేష్ఠమైన ద్రాక్షావల్లివంటిదానిగా నేను నిన్ను నాటి 21
తిని; కేవలము నిక్కమైన విత్తనమువలని చెట్టువంటి
దానిగా నిన్ను నాటితిని; నాకు జాతిహీనపు ద్రాక్షా
వల్లివలె నీవెట్లు భ్రష్టసంతానమైతివి? । నీవు క్షార 22
ముతో కడుగుకొనినను విస్తారమైన సబ్బు రాచుకొని
నను నీ దోషము మరకవలె నాకు కనబడుచున్నది;
ఇది ప్రభువగు యెహోవా వాక్కు । — నేను అప 23
విత్రత నొందినదానను కాను, బయలు దేవతల ననుస
రించి పోవుదానను కాను అని నీవు ఎట్లనుకొందువు?
లోయలో నీ మార్గమును చూడుము, నీవు చేసినదాని
తెలిసికొనుము, నీవు త్రోవలలో ఇటు అటు తిరుగు
లాడు వడిగల ఒంటెవు, । అరణ్యమునకు అలవాటు 24
పడిన అడవి గాడిదెవు, అది దాని కామాతురతవలన
గాలి పీల్చును, కలిసికొనునప్పుడు దాని త్రిప్పగల
వాడెవడు? దాని వెదకు (గాడిదెలలో) ఏదియు
అలసియుండదు, దాని మాసములో అది కనబడును. ।
జాగ్రత్తపడి నీ పాదములకు చెప్పులు తొడుగు 25
కొనుము, నీ గొంతుక దప్పిగొనకుండునట్లు జాగ్రత్త
పడుము (అని నేను చెప్పినను) నీవు — ఆ మాట
వ్యర్థము, వినను; అన్యులను మోహించితిని, వారి
వెంబడి పోదునని చెప్పుచున్నావు. । దొరికిన దొంగ 26
సిగ్గుపడునట్లు ఇశ్రాయేలు కుటుంబమువారు సిగ్గుపడు
దురు—నీవు మా తండ్రివని మ్రానుతోను — నీవే
నన్ను పుట్టించితివని రాతితోను చెప్పుచు, వారును
వారి రాజులును వారి అధిపతులును వారి యాజకు
లును వారి ప్రవక్తలును అవమానము నొందుదురు. ।
వారు నా తట్టు ముఖము త్రిప్పకొనక వీపునే త్రిప్ప 27
కొనిరి; అయినను ఆపత్కాలములో—లేచి మమ్మును
రక్షింపుమని వారు మనవి చేయుదురు. । నీకు నీవు 28
చేసికొనిన దేవతలు ఎక్కడనున్నవి? అవి నీ ఆపత్కాల
ములో లేచి నిన్ను రక్షించునేమో; యూదా, నీ
పట్టణములెన్నో నీ దేవతలన్నియే గదా.

మీరందరు నామీద తిరుగబాటు చేసినవారు, 29
నాతో ఎందుకు వాదించుదురని యెహోవా అడుగు
చున్నాడు. । నేను మీ పిల్లలను హతముచేయుట 30
వ్యర్థమే; వారు శిక్షకు లోబడరు; నాశనవాంఛగల
సింహమువలె మీ ఖడ్గము మీ ప్రవక్తలను సంహ
రించుచున్నది. । ఈ తరమువారలారా, యెహోవా 31
సెలవిచ్చుమాట లక్ష్యపెట్టుడి — నేను ఇశ్రాయేలుకు
అరణ్యమువలెనైతినా? గాఢాంధకార దేశమువలెనై

[illegible] ; ఇకను
[illegible]మని నా ప్రజలేల చెప్పుచున్నారు! ।
[illegible] మరచునా? పెండ్లికుమారి
[illegible] మరచునా? నా ప్రజలు లెక్కలేని
[illegible] నన్ను మరచియున్నారు. । [illegible]
[illegible]
[illegible]
[illegible] । [illegible]
[illegible]
[illegible] కాదుగాని నీ బట్ట
[illegible]మున్నది. । అయినను నీవు—
[illegible] కోపము
[illegible]చున్నావు.
[illegible]
[illegible] । [illegible]
[illegible]
[illegible]
[illegible] ।
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible]
[illegible] బహుగా [illegible]
[illegible] నీవు [illegible]
[illegible] తిరిగి
[illegible]న్నావు. । [illegible]
[illegible]ము; నీతో
[illegible]న్నారు! ఎవరు
[illegible] నీవు
[illegible]న్నావు; నీ
[illegible] నీవు
[illegible]చున్నావు. । కావున వానలు
[illegible], [illegible]ము లేకపోయి యున్నది,
[illegible] స్త్రీ [illegible]మువంటి [illegible]ము
[illegible] । అయినను ఇప్పుడు
[illegible], నా చిన్నప్పటినుండి నాకు చెలికాడవు
[illegible] నుండునా? । ఆయన
[illegible]పించునా! నిరంతరము కోపము చూపునా!
[illegible]నినను నీవు చేయగలిగిన దుష్కార్యములు
[illegible]నే యున్నావు.
[illegible]యు రాజైన యోషీయా దినములలో
[illegible]వా నాకీలాగు సెలవిచ్చెను—ద్రోహినియగు
[illegible]లు చేయుకార్యము నీవు చూచితివా? ఆమె
[illegible]న ప్రతి కొండమీదికిని పచ్చని ప్రతి చెట్టు

క్రిందికిని పోవుచు అక్కడ వ్యభిచారము చేయు
చున్నది. । ఆమె యీ క్రియలన్నిటిని చేసినను, 7
ఆమెను నాయొద్దకు తిరిగి రమ్మని నేను సెలవియ్యగా
ఆమె తిరిగి రాలేదు. మరియు విశ్వాసఘాతుకురాలగు
ఆమె సహోదరియైన యూదా దాని చూచెను. ।
ద్రోహినియగు ఇశ్రాయేలు వ్యభిచారము చేసిన 8
హేతువుచేతనే నేను ఆమెను విడిచిపెట్టి ఆమెకు పరి
త్యాగపత్రిక ఇయ్యగా, విశ్వాసఘాతుకురాలగు ఆమె
సహోదరియైన యూదా చూచియు తానును భయ
పడక వ్యభిచారముచేయుచు వచ్చుచున్నది. । రాళ్ల 9
తోను మొద్దులతోను వ్యభిచారము చేసెను; ఆమె
నిర్భయముగా వ్యభిచారము చేసి దేశమును అపవిత్ర
పరచెను. । ఇంతగా జరిగినను విశ్వాసఘాతుకురాలగు 10
ఆమె సహోదరియైన యూదా వేషధారణకే గాని
పూర్ణహృదయముతో నాయొద్దకు తిరుగుటలేదని
యెహోవా సెలవిచ్చుచున్నాడు. । కాగానే విశ్వాస 11
ఘాతుకురాలగు యూదా ద్రోహినియగు ఇశ్రా
యేలుకంటె తాను నిర్దోషినియని రుజువుపరచుకొని
యున్నది. । నీవు వెళ్లి ఉత్తరదిక్కున ఈ మాటలు 12
ప్రకటింపుము—ద్రోహినివగు ఇశ్రాయేలూ, తిరిగి
రమ్ము; ఇదే యెహోవా వాక్కు. మీమీద నా కోపము
పడనీయను, నేను కృపగలవాడను గనుక నేనెల్ల
ప్పుడు కోపించువాడను కాను; ఇదే యెహోవా
వాక్కు. । —నీ దేవుడైన యెహోవామీద తిరుగ 13
బాటుచేయుచు, నా మాటను అంగీకరింపక ప్రతి
పచ్చని చెట్టుక్రింద అన్యులతో కలిసికొనుటకు నీవు
ఇటు అటు పోయిన నీ దోషము ఒప్పుకొనుము; ఇదే
యెహోవా వాక్కు. । భ్రష్టులగు పిల్లలారా, తిరిగి 14
రండి, నేను మీ యజమానుడను; ఇదే యెహోవా
వాక్కు. ఒకానొక పట్టణములోనుండి ఒకనిగాను,
ఒకానొక కుటుంబములోనుండి ఇద్దరినిగాను మిమ్మును
తీసికొని సీయోనునకు రప్పించెదను. । నాకిష్టమైన 15
కాపరులను మీకు నియమించెదను, వారు జ్ఞానము
తోను వివేకముతోను మిమ్ము నేలుదురు. । మీరు ఆ 16
దేశములో అభివృద్ధిపొంది విస్తరించు దినములలో
జనులు—యెహోవా నిబంధన మందసమని ఇకను
చెప్పరు, అది వారి మనస్సులోనికి రాదు, దాని జ్ఞాప
కము చేసికొనరు, అది పోయినందుకు చింతపడరు, ఇక
మీదట దాని చేయరు; ఇదే యెహోవా వాక్కు. ।
ఆ కాలమున —యెహోవాయొక్క సింహాసనమని 17
యెరూషలేమునకు పేరు పెట్టెదరు; జనములన్నియు
తమ దుష్టమనస్సులో పుట్టు మూర్ఖత్వముచొప్పున
నడుచుకొనక యెహోవా నామమునుబట్టి యెరూష
లేమునకు గుంపులుగా కూడివచ్చెదరు. । ఆ దినములలో 18
యూదావంశస్థులును ఇశ్రాయేలు వంశస్థులును కలిసి
ఉత్తరదేశములోనుండి ప్రయాణమై, మీ పితరులకు

నేను స్వాస్థ్యముగా ఇచ్చిన దేశమునకు వచ్చెదరు. ।
19 నేను బిడ్డలలో నిన్నెట్లు ఉంచుకొని, రమ్యదేశమును
జనముల స్వాస్థ్యములలో రాజకీయ స్వాస్థ్యమును
నేనెట్లు నీకిచ్చెదననుకొనియుంటిని. నీవు — నా
తండ్రీ అని నాకు మొఱ్ఱపెట్టి నన్ను మానవనుకొంటిని
20 గదా. । అయినను స్త్రీ తన పురుషునికి విశ్వాస
ఘాతుకురాలగునట్టుగా ఇశ్రాయేలు వంశస్థులారా,
నిశ్చయముగా మీరును నాకు విశ్వాసఘాతుకులైతిరి;
21 ఇదే యెహోవా వాక్కు. । ఆలకించుడి, చెట్లులేని
మెట్టలమీద ఒక ధ్వని వినబడుచున్నది; ఆలకించుడి,
తాము దుర్మార్గులై తమ దేవుడైన యెహోవాను
మరచినదానినిబట్టి ఇశ్రాయేలీయులు చేయు రోదన
22 విజ్ఞాపనములు వినబడుచున్నవి. । భ్రష్టులైన బిడ్డ
లారా, తిరిగి రండి; మీ అవిశ్వాసమును నేను బాగు
చేసెదను; నీవే మా దేవుడవైన యెహోవా, నీయొద్దకే
23 మేము వచ్చుచున్నాము. । నిశ్చయముగా కొండల
మీద జరిగినది మోసకరము, పర్వతములమీద చేసిన
ఘోష నిష్ప్రయోజనము, నిశ్చయముగా మా దేవు
డైన యెహోవావలన ఇశ్రాయేలుకు రక్షణ కలు
24 గును. । అయినను మా బాల్యమునుండి లజ్జాకరమైన
(దేవత) మా పితరుల కష్టార్జితమును, వారి గొఱ్ఱెలను
వారి పశువులను వారి కుమారులను వారి కుమార్తెలను
25 మ్రింగివేయుచున్నది. । సిగ్గునొందినవారమై సాగిల
పడుదము రండి, మనము కనబడకుండ అవమానము మన
లను మరుగుచేయునుగాక; మన దేవుడైన యెహోవా
మాట వినక మనమును మన పితరులును మన బాల్యము
నుండి నేటివరకు మన దేవుడైన యెహోవాకు విరో
ధముగా పాపము చేసినవారము.

4 **ఇ**దే యెహోవా వాక్కు—ఇశ్రాయేలూ, నీవు
తిరిగి రానుద్దేశించినయెడల నా యొద్దకే రావలెను,
నీవు ఇటు అటు తిరుగుట మాని నీ హేయక్రియలను
2 నా సన్నిధినుండి తొలగించి । సత్యమునుబట్టియు
న్యాయమునుబట్టియు నీతినిబట్టియు యెహోవా
జీవముతోడని ప్రమాణముచేసినయెడల జనములు
ఆయనయందు తమకు ఆశీర్వాదము కలుగుననుకొం
దురు, ఆయనయందే అతిశయపడుదురు.

3 యూదావారికిని యెరూషలేము నివాసులకును
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—ముళ్ల
పొదలలో విత్తనములు చల్లక మీ బీటిపొలమును
4 దున్నుడి. । అవిధేయులై యుండుట మానుకొని
మీ దుష్ట్రక్రియలనుబట్టి యెవడును ఆర్పివేయలేనంతగా
నా ఉగ్రత అగ్నివలె కాల్చకుండునట్లు యూదా
వారలారా, యెరూషలేము నివాసులారా, యెహో
5 వాకు లోబడియుండుడి. । యూదాలో సమాచారము
ప్రకటించుడి, యెరూషలేములో చాటించుడి, దేశ
ములో బూర ఊదుడి, గట్టిగా హెచ్చరికచేయుడి,
ఎట్లనగా—ప్రాకారములుగల పట్టణములలోకి పోవు
నట్లుగా పోగై రండి. । సీయోను చూచునట్లు ధ్వజము 6
ఎత్తుడి; పారిపోయి తప్పించుకొనుటకు ఆలస్యము
చేయకుడని చెప్పుడి; యెహోవానగు నేను ఉత్తర
దిక్కునుండి కీడును రప్పించుచున్నాను, గొప్ప నాశన
మును రప్పించుచున్నాను. । పొదలలోనుండి సింహము 7
బయలుదేరియున్నది, జనముల వినాశకుడు బయలు
దేరియున్నాడు, నీ దేశమును నాశనముచేయుటకు
అతడు ప్రయాణమై తన నివాసమును విడిచియు
న్నాడు, నీ పట్టణములు పాడై నిర్జనముగా నుండును. ।
ఇందుకై గోనెపట్ట కట్టుకొనుడి, రోదనము చేయుడి, 8
కేకలువేయుడి, యెహోవా కోపాగ్ని మనమీదికి
రాకుండ మానిపోలేదు; । ఇదే యెహోవా వాక్కు. 9
ఆ దినమున రాజును అధిపతులును ఉన్మత్తులగుదురు,
యాజకులు విభ్రాంతి నొందుదురు, ప్రవక్తలు విస్మయ
మొందుదురు. । అప్పుడు నేనిట్లంటిని — కటకటా, 10
యెహోవా ప్రభువా, ఖడ్గము హత్యచేయుచుండగా
నీవు—మీకు క్షేమము కలుగునని చెప్పి నిశ్చయముగా
ఈ ప్రజలను యెరూషలేమును బహుగా మోసపుచ్చి
తివి. । ఆ కాలమున ఈ జనులకును యెరూషలేము 11
కును ఈలాగు చెప్పబడును—అరణ్యమందు చెట్లులేని
మెట్టలమీదనుండి వడగాలి నా జనుల కుమార్తెతట్టు
విసరుచున్నది; అది తూర్పారపట్టుటకైనను శుద్ధి
చేయుటకైనను తగినది కాదు. । అంతకంటె మిక్కుట 12
మైన గాలి నామీద కొట్టుచున్నది. ఇప్పుడు
వారిమీదికి రావలసిన తీర్పులు సెలవిత్తును (అని
యెహోవా చెప్పుచున్నాడు). । మేఘములు కమ్ము 13
నట్లు ఆయన వచ్చుచున్నాడు, ఆయన రథములు సుడి
గాలివలెనున్నవి, ఆయన గుఱ్ఱములు గద్దలకంటె
వేగముగలవి. అయ్యో, మనము దోపుడు సొమ్మయి
తిమి. । యెరూషలేమా, నీవు రక్షింపబడునట్లు నీ 14
హృదయములోనుండి చెడుతనము కడిగివేసికొనుము,
ఎన్నాళ్లవరకు నీ దుష్టాభిప్రాయములు నీకు కలిగి
యుండును? । దాను ప్రదేశమున నొకడు ప్రకటన 15
చేయుచున్నాడు, కీడు వచ్చుచున్నదని ఎఫ్రాయిము
కొండయందొకడు చాటించుచున్నాడు. । ముట్టడి 16
వేయువారు దూరదేశమునుండి వచ్చి యూదాపట్టణ
ములను పట్టుకొందుమని బిగ్గరగా అరచుచున్నారని
యెరూషలేమునుగూర్చి ప్రకటనచేయుడి, జనములకు
తెలియజేయుడి. । ఆమె నామీద తిరుగబాటు చేసెను 17
గనుక వారు చేనికాపరులవలె దాని-చుట్టు ముట్టడి
వేతురు; ఇదే యెహోవా వాక్కు. । నీ ప్రవర్త 18
నయు నీ క్రియలును వీటిని నీమీదికి రప్పించెను. నీ
చెడుతనమే దీనికి కారణము, ఇది చేదుగానున్నది
గదా, నీ హృదయము నంటుచున్నది గదా.
నా కడుపు, నా కడుపు. నా అంతరంగ 19

ములో నాకెంతో వేదనగానున్నది; నా గుండె నర
ములు, నా గుండె కొట్టుకొనుచున్నది, తాళలేను; నా
ప్రాణమా, బాకానాదము వినబడుచున్నది గదా,
20 యుద్ధఘోష నీకు వినబడుచున్నది గదా. । కీడు
వెంట కీడు వచ్చుచున్నది, దేశమంతయు దోచుకొన
బడుచున్నది, నా గుడారములును హఠాత్తుగా కొట్టి
వేయబడియున్నవి, నిమిషములో నా డేరా తెరలును
21 కొట్టివేయబడియున్నవి. । నేను ఎన్నాళ్లు ధ్వజమును
చూచుచుండవలెను? బూరధ్వని నేనెన్నాళ్లు విను
22 చుండవలెను? । నా జనులు అవివేకులు వారు నన్నెరు
గరు, వారు మూఢులైన పిల్లలు వారికి తెలివిలేదు,
కీడుచేయుటకు వారికి తెలియునుగాని మేలుచేయు
టకు వారికి బుద్ధిచాలదు.

23 నేను భూమిని చూడగా అది నిరాకారముగాను
శూన్యముగాను ఉండెను; ఆకాశముతట్టు చూడగా
24 అచ్చట వెలుగులేకపోయెను. । పర్వతములను చూడగా
అవి కంపించుచున్నవి కొండలన్నియు కదులుచు
25 న్నవి. । నేను చూడగా నరుడొకడును లేకపోయెను,
26 ఆకాశపక్షులన్నియు ఎగిరిపోయి యుండెను. । నేను
చూచుచుండగా ఫలవంతమైన భూమి యెడారి
ఆయెను, అందులోని పట్టణములన్నియు యెహోవా
కోపాగ్నికి నిలువలేక ఆయనయెదుట నుండకుండ
27 పడగొట్టబడియుండెను. । యెహోవా ఈలాగు
సెలవిచ్చుచున్నాడు—ఈ దేశమంతయు పాడగును
28 గాని నిశ్శేషముగా దాని నాశనముచేయను. । దానిని
బట్టి భూమి దుఃఖించుచున్నది, పైన ఆకాశము కారు
కమ్మియున్నది, అయితే నేను దాని నిర్ణయించినప్పుడు
మాట ఇచ్చితిని, నేను పశ్చాత్తాపపడుటలేదు రద్దు
29 చేయుటలేదు. । రౌతులును విలుకాండ్రును చేయు
ధ్వని విని పట్టణస్థులందరు పారిపోవుచున్నారు, తుప్ప
లలో దూరుచున్నారు, మెట్టలకు ఎక్కుచున్నారు,
ప్రతి పట్టణము నిర్జనమాయెను వాటిలో నివాసులెవ
30 రును లేరు. । దోచుకొనబడినదానా, నీవేమి చేయు
దువు? రక్తవర్ణవస్త్రములు కట్టుకొని సువర్ణభూషణములు
ధరించి కాటుకచేత నీ కన్నులు పెద్దవిగా చేసికొను
చున్నావే; నిన్ను నీవు అలంకరించుకొనుట వ్యర్థమే;
నీ విటకాండ్రు నిన్ను తృణీకరించుదురు, వారే నీ
31 ప్రాణము తీయ జూచుచున్నారు. । ప్రసవవేదన
పడు స్త్రీ కేకలువేయునట్లు, తొలికానుపు కనుచు
వేదనపడు స్త్రీ కేకలువేయునట్లు సీయోనుకుమార్తె —
అయ్యో, నాకు శ్రమ, నరహంతకులపాలై నేను
మూర్ఛిల్లుచున్నాను అని యెగరోజుచు చేతులార్చుచు
కేకలువేయుట నాకు వినబడుచున్నది.

5 యెరూషలేము వీధులలో నడుచుచు నలుదిక్కుల
తిరుగుచు చూచి తెలిసికొనుడి; దాని రాజవీధు
లలో విచారణచేయుడి; న్యాయము జరిగించుచు
నమ్మకముగానుండ యత్నించుచున్న ఒకడు మీకు
కనబడినయెడల నేను దాని క్షమించుదును. ।
యెహోవా జీవముతోడు అను మాట పలికినను వారు 2
మోసమునకై ప్రమాణము చేయుదురు. । యెహోవా, 3
యథార్థతమీదనే గదా నీవు దృష్టియుంచుచున్నావు.
నీవు వారిని హతముచేయుచున్నావు గాని వారికి
నొప్పి కలుగలేదు; వారిని క్షీణింపజేయుచున్నావు
గాని శిక్షకు లోబడనొల్లకున్నారు. రాతికంటె తమ
ముఖములను కఠినముగా చేసికొనియున్నారు, మళ్లు
టకు సమ్మతింపరు. । నేనిట్లనుకొంటిని—వీరు ఎన్నిక 4
లేనివారై యుండి యెహోవా మార్గమును, తమ
దేవుని న్యాయవిధిని ఎరుగక బుద్ధిహీనులై యున్నా
రు. । ఘనులైనవారియొద్దకు పోయెదను వారితో 5
మాటలాడెదను, వారు యెహోవా మార్గమును, తమ
దేవుని న్యాయవిధిని ఎరిగినవారై యుందురుగదా
అని నేననుకొంటిని. అయితే ఒకడు తప్పకుండ
వారు కాడిని విరిచినవారుగాను కట్లను తెంపుకొనిన
వారుగాను ఉన్నారు. । వారు తిరుగబాటుచేసి 6
బహుగా విశ్వాసఘాతుకులైరి గనుక అరణ్యమునుండి
వచ్చిన సింహము వారిని చంపును, అడవి తోడేలు
వారిని నాశనముచేయును, చిరుతపులి వారి పట్టణ
ములయొద్ద పొంచియుండును, వాటిలోనుండి బయలు
దేరు ప్రతివాడు చీల్చబడును. । నీ పిల్లలు నన్ను 7
విడిచి దైవము కానివాటితోడని ప్రమాణము చేయు
దురు; నేను వారిచేత ప్రమాణము చేయించినను
వారు వ్యభిచారము చేయుచు వేశ్యల ఇండ్లలో గుం
పులు కూడుదురు; నేనెట్లు నిన్ను క్షమించుదును? ।
బాగుగా బలిసిన గుఱ్ఱములవలె ప్రతివాడును ఇటు 8
అటు తిరుగుచు తన పొరుగువాని భార్యవెంబడి
సకిలించును. । అట్టి కార్యములనుబట్టి నేను దండింప 9
కుందునా? అట్టి జనముమీద నా కోపము తీర్చుకొన
కుందునా? యిదే యెహోవా వాక్కు.

దాని ప్రాకారములెక్కి నాశనముచేయుడి, అయి 10
నను నిశ్శేషముగా నాశనముచేయకుడి, దాని శాఖ
లను కొట్టివేయుడి, అవి యెహోవావి కావు. । ఇశ్రా 11
యేలు వంశస్థులును యూదా వంశస్థులును బహుగా
విశ్వాసఘాతుకము చేసియున్నారు; ఇదే యెహోవా
వాక్కు. । వారు—పలుకువాడు యెహోవా కాడ 12
నియు, ఆయన లేడనియు, కీడు మనకు రాదనియు,
ఖడ్గమునైనను కరవునైనను చూడమనియు, । ప్రవ 13
క్తలు గాలి మాటలు పలుకుదురనియు, ఆజ్ఞ ఇచ్చు
వాడు వారిలో లేడనియు, తాము చెప్పినట్లు తమకు
కలుగునవియు చెప్పుదురు. । కావున సైన్యములకధి 14
పతియు దేవుడునగు యెహోవా ఈలాగు సెలవిచ్చు
చున్నాడు—వారు ఈ మాటలు పలికినందున నా వాక్య
ములు వారిని కాల్చునట్లు నీ నోట వాటిని అగ్నిగాను

ఈ జనమును కట్టెలుగాను నేను చేసెదను; ఇదే
15 యెహోవా వాక్కు. । ఇశ్రాయేలు కుటుంబమువార
లారా, ఆలకించుడి, దూరముననుండి మీ మీదికి ఒక
జనమును రప్పించెదను, అది బలమైన జనము పురాతన
మైన జనము; దాని భాష నీకు రానిది, ఆ జనులు పలుకు
16 మాటలు నీకు బోధపడవు. । వారి అమ్ముల పొది తెరచిన
17 సమాధి, వారందరు బలాఢ్యులు, । వారు నీ పంటను నీ
ఆహారమును నాశనముచేయుదురు, నీ కుమారులను నీ
కుమార్తెలను నాశనముచేయుదురు, నీ గొఱ్ఱెలను నీ
పశువులను నాశనముచేయుదురు, నీ ద్రాక్షచెట్ల ఫల
మును నీ అంజూరపుచెట్ల ఫలమును నాశనముచేయు
దురు, నీకు ఆశ్రయముగానున్న ప్రాకారములుగల
18 పట్టణములను వారు కత్తిచేత పాడుచేయుదురు. । అయి
నను ఆ దినములలో నేను మిమ్మును శేషములేకుండ
19 నశింపజేయను; ఇదే యెహోవా వాక్కు. ।—మన దేవు
డైన యెహోవా దేనినిబట్టి ఇవన్నియు మాకు చేసె
నని వారడుగగా నీవు వారితో ఈలాగనుము—మీరు
నన్ను విసర్జించి మీ స్వదేశములో అన్యదేవతలను
కొలిచినందుకు, మీది కాని దేశములో మీరు అన్యు
లను కొలిచెదరు (అని యెహోవా సెలవిచ్చు
చున్నాడు.)

20 యాకోబు వంశస్థులకు ఈ మాట తెలియజేయుడి,
యూదా వంశస్థులకు ఈ సమాచారము చాటించుడి।
21 —కన్నులుండియు చూడకయు చెవులుండియు విన
కయునున్న వివేకములేని మూఢులారా, ఈ మాట
22 వినుడి. । సముద్రము దాటలేకుండునట్లును, దాని
తరంగము లెంత పొర్లినను అవి ప్రబలలేకయు, ఎంత
ఘోషించినను దాని దాటలేకయు ఉండునట్లును నిత్య
నిర్ణయముచేత దానికి ఇసుకను సరిహద్దుగా నియ
మించిన నాకు మీరు భయపడరా? నా సన్నిధిని
23 వణకరా? యిదే యెహోవా వాక్కు. । ఈ జనులు
తిరుగబాటును ద్రోహమును చేయు మనస్సుగల
వారు, వారు తిరుగబాటుచేయుచు తొలగిపోవుచు
4 న్నారు. । వారు—రండి మన దేవుడైన యెహోవా
యందు భయభక్తులు కలిగియుందము, ఆయనే తొల
కరివర్షమును కడవరివర్షమును దాని దాని కాలమున కురి
పించువాడు గదా; నిర్ణయింపబడిన కోతకాలపు వార
ములను ఆయన మనకు రప్పించునని తమ మనస్సులో
25 అనుకొనరు. । మీ దోషములు వాటి క్రమమును
తప్పించెను, మీకు మేలు కలుగకుండుటకు మీ పాప
26 ములే కారణము. । నా జనులలో దుష్టులున్నారు,
పక్షివేటకాండ్లు పొంచియుండునట్లు వారు పొంచి
యుందురు. వారు బోనులు పెట్టుదురు, మనుష్యు
27 లను పట్టుకొందురు. । పంజరము పిట్టలతో నిండి
యుండునట్లు వారి యిండ్లు కపటముతో నిండి
యున్నవి, దానిచేతనే వారు గొప్పవారును ఐశ్వర్య
వంతులును అగుదురు. । వారు క్రొవ్వి బలిసియున్నారు, 28
అంతేకాదు అత్యధికమైన దుష్కార్యములు చేయు
చున్నారు, తండ్రిలేనివారు గెలువకుండునట్లు వారి
వ్యాజ్యమును అన్యాయముగా తీర్చుదురు, దీనుల
వ్యాజ్యమును తీర్పకు రానియ్యరు. । అట్టివాటిని 29
చూచి నేను శిక్షింపక యుందునా? అట్టి జనులకు
నేను ప్రతిదండన చేయకుందునా? యిదే యెహోవా
వాక్కు.

ఘోరమైన భయంకరకార్యము దేశములో జరు 30
గుచున్నది. । ప్రవక్తలు అబద్ధప్రవచనములు పలికె 31
దరు, యాజకులు వారి పక్షమున ఏలుబడి చేసెదరు,
ఆలాగు జరుగుట నా ప్రజలకు ఇష్టము; దాని ఫలము
నొందునప్పుడు మీరేమి చేయుదురు?

బెన్యామీనీయులారా, యెరూషలేములోనుండి 6
పారిపోవుడి, తెకోవలో బూరధ్వని చేయుడి, బేత్
హక్కెరెముమీద ఆనవాలుకై ధ్వజము నిలువబెట్టుడి,
కీడు ఉత్తరదిక్కునుండి వచ్చుచున్నది, గొప్ప వండు
వచ్చుచున్నది. । సుందరియు సుకుమారియునైన 2
సీయోను కుమార్తెను పెళ్లగించుచున్నాను. । గొఱ్ఱెల 3
కాపరులు తమ మందలను మేపుటకై ఆమెయొద్దకు
వచ్చెదరు, ఆమె చుట్టు తమ గుడారములను వేయు
దురు, ప్రతివాడును తనకిష్టమైనచోట మందను
మేపును. । ఆమెతో యుద్ధము ప్రతిష్ఠించుకొనుడి; 4
లెండి మధ్యాహ్నమందు బయలుదేరుదము, అయ్యో,
మనకు శ్రమ, ప్రొద్దు గ్రుంకుచున్నది, సాయంకాలపు
ఛాయలు పొడుగవుచున్నవి. । లెండి ఆమె నగరులను 5
నశింపజేయుటకు రాత్రి బయలుదేరుదము. । సైన్య 6
ములకధిపతియగు యెహోవా ఈలాగు సెలవిచ్చు
చున్నాడు—చెట్లను నరికి యెరూషలేముకు ఎదురుగా
ముట్టడిదిబ్బ కట్టుడి, ఈ పట్టణము కేవలము అన్యా
యమును అనుసరించి నడచునది గనుక శిక్ష నొందవలసి
వచ్చెను. । కోనేటి నీరు ఎప్పుడును ఇంకిపోకుండు 7
నట్లు ఆమె చెడుతనము ఎప్పుడును ఏకరీతిగా ఉన్నది,
బలాత్కారమును దోపుడును దానిలో జరుగుట విన
బడుచున్నది, గాయములును దెబ్బలును నిత్యము నాకు
కనబడుచున్నవి. । యెరూషలేమా, నేను నీయొద్ద 8
నుండి తొలగింపబడకుండునట్లును నేను నిన్ను పాడైన
నిర్మానుష్యప్రదేశముగా చేయకుండునట్లును శిక్షకు
లోబడుము

సైన్యములకధిపతియగు యెహోవా ఈలాగు సెల 9
విచ్చుచున్నాడు — ద్రాక్షచెట్టు ఫలమును ఏరుకొను
నట్లు మనుష్యులు ఏమియు మిగులకుండ ఇశ్రాయేలు
శేషమును ఏరుదురు; ద్రాక్షపండ్లను ఏరువాడు చిన్న
తీగెలను ఏరుటకై తన చెయ్యి మరల వేయునట్లు నీ
చెయ్యి వేయుము. । వినుదురని నేనెవరితో మాట 10
లాడెదను? ఎవరికి సాక్ష్యమిచ్చెదను? వారు వినుటకు

తమ మనస్సు సిద్ధపరచుకొనరు గనుక వినలేకపోయిరి.
ఇదిగో వారు యెహోవా వాక్యమందు సంతోషము
11 లేనివారై దాని తృణీకరింతురు. । కావున నేను
యెహోవా క్రోధముతో నిండియున్నాను, దానిని
అణచుకొని అణచుకొని నేను విసికియున్నాను, ఒకడు
తప్పకుండ వీధిలోనున్న పసిపిల్లలమీదను యౌవనుల
గుంపుమీదను దాని కుమ్మరింపవలసి వచ్చెను, భార్యా
భర్తలును వయస్సుమీరినవారును వృద్ధులును పట్టుకొన
12 బడెదరు. । ఏమియు మిగులకుండ వారి యిండ్లును
వారి పొలములును వారి భార్యలును ఇతరులకు అప్ప
గింపబడుదురు, ఈ దేశనివాసులమీద నేను నా చెయ్యి
13 చాపుచున్నాను; ఇదే యెహోవా వాక్కు । — అల్పు
లేమి ఘనులేమి వారందరు మోసము చేసి దోచుకొను
వారు; ప్రవక్తలేమి యాజకులేమి అందరు వంచకులు. ।
14 సమాధానములేని సమయమున — సమాధానము సమా
ధానమని చెప్పుచు, నా ప్రజలకున్న గాయమును పైపైన
15 మాత్రమే బాగుచేయుదురు. । వారు తాము హేయ
క్రియలు చేయుచున్నందున సిగ్గుపడవలసి వచ్చెను
గాని వారు ఏమాత్రమును సిగ్గుపడరు; అవమానము
నొందితిమని వారికి తోచనేలేదు గనుక పడిపోవు
వారితో వారు పడిపోవుదురు; నేను వారిని విమ
ర్శించు కాలమున వారు తొట్రిల్లుదురని యెహోవా
సెలవిచ్చుచున్నాడు.

16 యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు —
మార్గములలో నిలిచి చూడుడి, పురాతనమార్గములను
గూర్చి విచారించుడి, మేలు కలుగు మార్గమేది అని
యడిగి అందులో నడుచుకొనుడి, అప్పుడు మీకు
నెమ్మది కలుగును. అయితే వారు — మేము అందులో
17 నడుచుకొనమని చెప్పుచున్నారు. । మిమ్మును కాపు
కాయుటకు నేను కావలివారిని ఉంచియున్నాను;
ఆలకించుడి, వారు చేయు బూరధ్వని వినబడు
18 చున్నది. । అయితే మేము వినమని వారనుచున్నారు;
అన్యజనులారా, వినుడి; సంఘమా, వారికి జరిగిన
19 దానిని తెలిసికొనుము. । భూలోకమా, వినుము; ఈ
జనులు నా మాటలు వినకున్నారు, నా ధర్మశాస్త్రమును
విసర్జించుచున్నారు గనుక తమ ఆలోచనలకు ఫలిత
మైన కీడు నేను వారిమీదికి రప్పించుచున్నాను. ।
20 షేబనుండివచ్చు సాంబ్రాణి నాకేల? దూరదేశము
నుండి వచ్చు మధురమైన చెరుకు నాకేల? మీ దహన
బలులు నాకిష్టమైనవి కావు, మీ బలులయందు నాకు
21 సంతోషము లేదు. । కావున యెహోవా ఈలాగు
సెలవిచ్చుచున్నాడు — ఈ జనుల మార్గమున నేను
అడ్డురాళ్లు వేయుదును; తండ్రులేమి కుమారులేమి
అందరును అవి తగిలి కూలుదురు, ఇరుగుపొరుగు
వారును నశించెదరు.

యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — 22
ఉత్తరదేశమునుండి యొక జనము వచ్చుచున్నది,
భూదిగంతములలోనుండి మహా జనము లేచి వచ్చు
చున్నది. । వారు వింటిని ఈటెను వాడ నేర్చినవారు, 23
అది యొక క్రూరజనము, వారు జాలిలేనివారు, వారి
స్వరము సముద్రఘోషవలె నున్నది, వారు గుఱ్ఱము
లెక్కి సవారిచేయువారు; సీయోను కుమారీ, నీతో
యుద్ధము చేయవలెనని వారు యోధులవలె వ్యూహము
తీరియున్నారు. । దానిగూర్చిన వర్తమానము విని మా 24
చేతులు బలహీనమగుచున్నవి, ప్రసవించు స్త్రీ వేదన
పడునట్లు మేము వేదనపడుచున్నాము. । పొలము 25
లోకి పోకుము, మార్గములో నడువకుము, శత్రువులు
కత్తిని ఝుళిపించుచున్నారు, నలుదిక్కుల భయము
తగులుచున్నది. । నా జనమా, పాడుచేయువాడు 26
హఠాత్తుగా మామీదికి వచ్చుచున్నాడు. గోనెపట్ట
కట్టుకొని బూడిదె చల్లుకొనుము; ఏకకుమారునిగూర్చి
దుఃఖించునట్లు దుఃఖము సలుపుము ఘోరమైన
దుఃఖము సలుపుము. । నీవు నా జనుల మార్గమును 27
తెలిసికొని పరీక్షించునట్లు నిన్ను వారికి వన్నె చూచు
వానిగాను వారిని నీకు లోహపు తుంటగాను నేను
నియమించియున్నాను. । వారందరు బహు ద్రోహులు, 28
కొండెగాండ్లు, వారు మట్టిలోహమువంటివారు, వారం
దరు చెరుపువారు. । కొలిమితిత్తి బహుగా బుసలు 29
కొట్టుచున్నది గాని అగ్నిలోకి సీసమే వచ్చుచున్నది;
వ్యర్థముగానే చొక్కము చేయుచు వచ్చెను, దుష్టులు
చొక్కమునకు రారు. । యెహోవా వారిని త్రోసి 30
వేసెను గనుక త్రోసివేయవలసిన వెండియని వారికి
పేరుపెట్టబడును.

యెహోవాయొద్దనుండి యిర్మీయాకు ప్రత్యక్ష 7
మైన వాక్కు । — నీవు యెహోవా మందిర ద్వార 2
మున నిలువబడి ఈ మాట అచ్చటనే ప్రకటింపుము
— యెహోవాకు నమస్కారము చేయుటకై యీ
ద్వారములలో బడి ప్రవేశించు యూదావారలారా,
యెహోవా మాట వినుడి. । సైన్యములకధిపతియు 3
ఇశ్రాయేలుయొక్క దేవుడునగు యెహోవా ఈలాగు
సెలవిచ్చుచున్నాడు — నేను ఈ స్థలమున మిమ్మును నివ
సింపజేయునట్లు మీ మార్గములను మీ క్రియలను
దిద్దుకొనుడి । — ఈ స్థలము యెహోవా ఆలయము, 4
ఈ స్థలము యెహోవా ఆలయము, ఈ స్థలము
యెహోవా ఆలయము అని మీరు చెప్పుకొను
చున్నారే; యీ మోసకరమైన మాటలు ఆధారము
చేసికొనకుడి. । ఆలాగనక, మీ మార్గములను మీ 5
క్రియలను మీరు యథార్థముగా చక్కపరచుకొని,
ప్రతివాడు తన పొరుగువానియెడల తప్పక న్యాయము
జరిగించి । పరదేశులను తండ్రిలేనివారిని విధవరాండ్రను 6
బాధింపకయు, ఈ చోట నిర్దోషిరక్తము చిందింప

కయు, మీకు కీడు కలుగజేయు అన్యదేవతలను అను
7 సరింపకయు నుండినయెడల । ఈ స్థలమున తమకు
నిత్యముగా నుండుటకై పూర్వకాలమున నేను మీ
పితరులకిచ్చిన దేశమున మిమ్మును కాపురముంచుదును. ।
8 ఇదిగో అబద్ధపుమాటలను మీరు నమ్ముకొనుచున్నారు.
9 అవి మీకు నిష్ప్రయోజనములు. । ఇదేమి? మీరు
10 జారచోర క్రియలను నరహత్యను చేయుచు । అబద్ధ
సాక్ష్యము పలుకుచు బయలుకు ధూపమువేయుచు
మీరెరుగని దేవతలను అనుసరించుచున్నారే; అయి
నను నాదని చాటబడిన యీ మందిరములోకి వచ్చి
నా సన్నిధిని నిలుచుచు విడుదలనొందియున్నామని
మీరు చెప్పుదురు; ఈ హేయక్రియలన్నియు జరిగిం
11 చుటకేనా మీరు విడుదలనొందితిరి? । నాదని చాట
బడిన యీ మందిరము మీ దృష్టికి దొంగలగుహాయై
నదా? ఆలోచించుడి, నేనే యీ సంగతి కనుగొను
12 చున్నాను; ఇదే యెహోవా వాక్కు. । పూర్వ
మున నేను నా నామము నిలిపిన షిలోహునందున్న
నా స్థలమునకు పోయి విచారణచేయుడి, ఇశ్రాయేలీ
యులైన నా జనుల దుష్టత్వమునుబట్టి నేను దానికి
చేసిన కార్యము చూడుడి; ఇదే యెహోవా వాక్కు. ।
13 నేను మీతో మాటలాడినను పెందలకడ లేచి మీతో
మాటలాడినను మీరు వినకయు, మిమ్మును పిలిచినను
మీరు ఉత్తరమియ్యకయు నుండినవారై యీ క్రియ
14 లన్నిటిని చేసితిరి గనుక । నేను షిలోహుకు చేసి
నట్లు మీకు ఆశ్రయమై నాదని చాటబడిన యీ
మందిరమునకును మీకును మీ తండ్రులకును నేనిచ్చిన
15 స్థలమునకును నేను ఆలాగే చేయుదును. । ఎఫ్రా
యిము సంతానమగు మీ సహోదరులనందరిని నేను
వెళ్లగొట్టినట్లు మిమ్మును నా సన్నిధినుండి వెళ్లగొట్టు
16 దును. । కాబట్టి నీవు ఈ జనముకొరకు ప్రార్థన
చేయకుము, వారికొరకు మొఱ్ఱయైనను ప్రార్థనయైనను
చేయకుము, నన్ను బతిమాలుకొనకుము, నేను నీ మాట
వినను.

17 యూదాపట్టణములలోను యెరూషలేము వీధుల
లోను వారు చేయుచున్న క్రియలను నీవు చూచు
18 చున్నావు గదా. । నాకు కోపము పుట్టించునట్లు
ఆకాశరాణి దేవతకు పిండివంటలు చేయవలెననియు,
అన్యదేవతలకు పానార్పణములు పోయవలెననియు
పిల్లలు కట్టెలు ఏరుచున్నారు తండ్రులు అగ్ని రాజ
బెట్టుచున్నారు స్త్రీలు పిండి పిసుకుచున్నారు. । —
19 నాకే కోపము పుట్టించునంతగా వారు దాని చేయు
చున్నారా? తమకే అవమానము కలుగునంతగా చేయు
చున్నారు గదా, యిదే యెహోవా వాక్కు. ।
20 అందువలన ప్రభువగు యెహోవా ఈలాగు సెల
విచ్చుచున్నాడు—ఈ స్థలముమీదను నరులమీదను
జంతువులమీదను పొలముల చెట్లమీదను భూమి పంట
మీదను నా కోపమును నా ఉగ్రతను కుమ్మరించెదను,
ఆర్పశక్యము కాకుండ అది మండును.

సైన్యములకధిపతియు ఇశ్రాయేలు దేవుడునగు 21
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — మీ
దహనబలులను మీ బలులను కలిపి మాంసము భక్షిం
చుడి. । నేను ఐగుప్తు దేశములోనుండి మీ పితరులను 22
రప్పించిన దినమున దహనబలులనుగూర్చిగాని బలు
లనుగూర్చిగాని నేను వారితో చెప్పలేదు, అట్టి
వాటినిగూర్చి నేను ఏ ఆజ్ఞయు ఇయ్యలేదు, ఈ
ఆజ్ఞనుమాత్రమే నేను వారికిచ్చితిని । ఏదనగా—నా 23
మాటలు మీరు అంగీకరించినయెడల నేను మీకు
దేవుడనై యుందును మీరు నాకు జనులై యుం
దురు; మీకు క్షేమము కలుగునట్లు నేను మీకాజ్ఞా
పించుచున్న మార్గమంతటియందు మీరు నడుచు
కొనుడి. । అయితే వారు వినకపోయిరి, చెవియొగ్గ 24
కుండిరి, ముందరికి సాగక వెనుకదీయుచు తమ ఆలో
చనలనుబట్టి తమ దుష్ట హృదయకాఠిన్యము ననుసరించి
నడుచుచు వచ్చిరి. । మీ పితరులు ఐగుప్తు దేశములో 25
నుండి బయలుదేరి వచ్చిన దినము మొదలుకొని నేటి
వరకు మీరు వెనుకదీయుచు వచ్చినవారే; నేను అను
దినము పెందలకడ లేచి ప్రవక్తలైన నా సేవకులనం
దరిని మీయొద్దకు పంపుచు వచ్చితిని. । వారు నా 26
మాట వినకయున్నారు చెవియొగ్గకయున్నారు తమ
మెడను వంచక మనస్సును కఠినపరచుకొనుచున్నారు;
వారు తమ పితరులకంటె మరి దుష్టులైరి.

నీవు ఈ మాటలన్నియు వారితో చెప్పినను వారు 27
నీ మాటలంగీకరింపరు, నీవు వారిని పిలిచినను వారు
నీకుత్తరమియ్యరు । గనుక నీవు వారితో ఈలాగు 28
చెప్పుము—వీరు తమ దేవుడైన యెహోవా మాట
విననివారు, శిక్షకు లోబడనొల్లనివారు, కాగా నే
నమ్మకము వారిలోనుండి తొలగిపోయియున్నది, అది
వారినోట నుండకుండ కొట్టివేయబడియున్నది.

తనకు కోపము తెప్పించు తరమువారిని యెహోవా 29
విసర్జించి వెళ్లగొట్టుచున్నాడు; (సీయోనూ) నీ తల
వెండ్రుకలను కత్తిరించుకొనుము, వాటిని పార
వేయుము, చెట్లులేని మెట్టలమీద ప్రలాపవాక్య
మెత్తుము. । యెహోవా ఈలాగు సెలవిచ్చుచు 30
న్నాడు—యూదావారు నా దృష్టికి చెడ్డక్రియలు
చేయుచున్నారు, నాదని చాటబడిన మందిరము అప
విత్రపడునట్లు వారు దానిలో హేయవస్తువులను
ఉంచియున్నారు. । నేనాజ్ఞాపించని క్రియను నాకు 31
తోచని క్రియను వారు చేసియున్నారు, అగ్నిలో
తమ కుమారులను తమ కుమార్తెలను దహించుటకు
బెన్‌హిన్నోము లోయలోనున్న తోఫెతునందు బలి
పీఠములను కట్టుకొనియున్నారు. । కాలము సమీ 32
పించుచున్నది; అప్పుడు అది తోఫెతు అనియైనను

న్నోము లోయ అనియైనను అనబడక వధ
అనబడును; పాతిపెట్టుటకు స్థలము లేకపోవు
తోఫెతులో శవములు పాతిపెట్టబడును; ఇదే
హోవా వాక్కు. । ఈ జనుల శవములు ఆకాశ
సును భూజంతువులకును ఆహారమగును, వాటిని
తోలువాడు లేకపోవును. । ఉల్లాసధ్వనియు
ధ్వనియు పెండ్లికుమారుని స్వరమును పెండ్లి
స్వరమును యూదా పట్టణములలోను
లేము వీధులలోను లేకుండ చేసెదను; ఈ
తప్పక పాడైపోవును.
హోవా వాక్కు,—ఆ కాలమున శత్రువులు
రాజుల యెముకలను అధిపతుల యెముక
యాజకుల యెముకలను ప్రవక్తల యెముకలను
లేము నివాసుల యెముకలను సమాధులలో
వెలుపలికి తీసి । వారు ప్రేమించుచు పూజిం
అనుసరించుచు విచారించుచు నమస్కరిం
వచ్చిన ఆ సూర్య చంద్ర నక్షత్రములయెదుట
పరచెదరు; అవి సమకూర్చబడకయు పాతిపెట్ట
కయు భూమిమీద పెంటవలె పడియుండును. ।
ఈ నేను తోలివేసిన స్థలములన్నిటిలో మిగిలి
యీ దుష్ట వంశములో శేషించినవారందరును
నము కంటె మరణమును కోరుదురు; సైన్య
ధిపతియగు యెహోవా వాక్కు ఇదే.
వేమనగా యెహోవా ఈలాగు సెలవిచ్చుచు
వి వారితో చెప్పుము—మనుష్యులు పడి తిరిగి
లేరా? తొలగిపోయిన తరువాత మనుష్యులు
రారా? । యెరూషలేము ప్రజలు ఏల నిత్యా
సక్తులై నిత్యము ద్రోహము చేయుచున్నారు!
మోసమును ఆశ్రయము చేసికొని తిరిగి రామని
చెప్పుచున్నారు! । నేను చెవియొగ్గి వారి మాటలు
న్నాను, [illegible] మాటలు [illegible]
రు—నేనేమి చేసితినని చెప్పి తన చెడుతనమును
పశ్చాత్తాపపడువాడొకడును లేకపోయెను;
మునకు చొరబడు గుఱ్ఱమువలె ప్రతివాడును
మైన మార్గమునకు తిరుగుచున్నాడు. । ఆకాశ
గురు సంకుబుడి కొంగయైనను తన కాలము
ను, తెల్లగువ్వయు మంగలకత్తిపిట్టయు ఓడకొరు
తాము రావలసిన కాలమును ఎరుగును, అయితే
ప్రజలు యెహోవా న్యాయవిధిని ఎరుగరు. ।
ము జ్ఞానులమనియు, యెహోవా ధర్మశాస్త్రము
యొద్దనున్నదనియు మీరేల అందురు? నిజమే
శాస్త్రుల కల్లకలము అబద్ధముగా దానికి అపా
చేయుచున్నది. । జ్ఞానులు అవమానము నొందిన
, వారు విస్మయమొంది చిక్కున పడియున్నారు,
యెహోవా వాక్యమును నిరాకరించినవారు,
ఏపాటిజ్ఞానముకలదు? । గనుక వారి భార్య

లను అన్యుల కప్పగింతును, వారిని జయించువారికి
వారి పొలములను అప్పగింతును. అల్పులేమి ఘనులేమి
అందరును మోసముచేసి దోచుకొనువారు; ప్రవక్త
లేమి యాజకులేమి అందరును వంచకులు. । సమాధా 11
నము లేనిసమయమున—సమాధానము సమాధానము
అని వారు చెప్పుచు, నా జనుల గాయమును పైపైన
మాత్రమే బాగుచేయుదురు. । తాము హేయమైన 12
క్రియలు చేయుచున్నందున సిగ్గుపడవలసి వచ్చెను గాని
వారేమాత్రమును సిగ్గుపడరు; అవమానము నొందితి
మని వారికి తోచనేలేదు గనుక పడిపోవువారిలో
వారు పడిపోవుదురు; నేను వారిని విమర్శించుకాల
మున వారు తొట్రిల్లుదురని యెహోవా సెలవిచ్చు
చున్నాడు । ద్రాక్షచెట్టున ఫలములు లేకుండునట్లును, 13
అంజూరపుచెట్టున అంజూరపుపండ్లు లేకుండునట్లును,
ఆకులు వాడిపోవునట్లును నేను వారిని బొత్తిగా కొట్టి
వేయుచున్నాను; వారిమీదికి వచ్చువారిని నేనాలా
గున పంపుచున్నాను; ఇదే యెహోవా వాక్కు. ।
మనమేల కూర్చుండియున్నాము! మనము పోగుబడి 14
ప్రాకారములుగల పట్టణములలోనికి పోదము, అక్క
డనే నశించిపోదము రండి; యెహోవాయే మన
లను నాశనము చేయుచున్నాడు, ఆయనకు విరోధ
ముగా మనము పాపముచేసినందున మన దేవుడైన
యెహోవా మనకు విషజలమును త్రాగించుచు
న్నాడు. । మనము సమాధానముకొరకు కనిపెట్టుకొను 15
చున్నాము గాని మేలేమియు రాదాయెను; క్షేమము
కొరకు కనిపెట్టుచున్నాముగాని భీతియే కలుగుచు
న్నది. । దానునుండి వచ్చువారి గుఱ్ఱముల బుసలు 16
వినబడెను, వారి గుఱ్ఱముల సకిలింపు ధ్వనిచేత దేశ
మంతయు కంపించుచున్నది, వారు వచ్చి దేశమును
అందులోనున్న యావత్తును నాశనము చేయుదురు,
పట్టణమును అందులో నివసించువారిని నాశనము
చేయుదురు. । నేను మిడునాగులను మీలోనికి పంపు 17
చున్నాను, అవి మిమ్మును కరచును, వాటికి మంత్రము
లేదు; ఇదే యెహోవా వాక్కు.
నా గుండె నా లోపల సొమ్మసిల్లుచున్నది, నేను 18
దేనిచేత దుఃఖోపశాంతి నొందుదును? । యెహోవా 19
సీయోనులో లేకపోయెనా? ఆమె రాజు ఆమెలో
లేకపోయెనా? అని బహు దూరదేశమునుండి నా
ప్రజల రోదనశబ్దము వినబడుచున్నది; వారి విగ్రహ
ములచేతను అన్యమైన మాయారూపములచేతను
నాకేల కోపము తెప్పించిరి? । కోతకాలము గతించి 20
యున్నది, గ్రీష్మకాలము జరిగిపోయెను, మనము
రక్షణనొందకయే యున్నాము. । నా జనుల వేదనను 21
బట్టి నేను వేదనపడుచున్నాను, వ్యాకులపడుచు
న్నాను, ఘోరభయము నన్ను పట్టియున్నది. । గిలా 22
దులో గుగ్గిలము ఏమియు లేదా? అక్కడ ఏ వైద్యు

డును లేడా? నా జనులకు స్వస్థత ఎందుకు కలుగక
పోవుచున్నది?
9 నా జనులలో హతమైనవారినిగూర్చి నేను దివా
రాత్రము కన్నీరు విడుచునట్లు నా తల జలమయము
గాను నా కన్ను కన్నీళ్ల ఊటగాను ఉండును గాక. ।
2 నా జనులందరు వ్యభిచారులును ద్రోహుల సమూహ
మునై యున్నారు. అహహా, అరణ్యములో బాట
సారుల గుడిసె నాకు దొరికిన ఎంత మేలు? నేను నా
జనులను విడిచి వారియొద్దనుండి తొలగిపోవుదును. ।
3 విండ్లను త్రొక్కి వంచునట్లు అబద్ధమాడుటకై వారు
తమ నాలుకను వంచుదురు; దేశములో తమకున్న
బలమును నమ్మకముగాను ఉపయోగపరచరు. నన్ను
ఎరుగక కీడువెంట కీడు చేయుచు ప్రవర్తించుచున్నారు;
4 ఇదే యెహోవా వాక్కు. । మీలో ప్రతివాడును
తన పొరుగువాని విషయమై జాగ్రత్తగా నుండ
వలెను; ఏ సహోదరునినైనను నమ్మకుడి, నిజముగా
ప్రతి సహోదరుడును తంత్రగొట్టయి తన సహో
దరుని కొంపముంచును; ప్రతి పొరుగువాడును కొండె
5 ములు చెప్పుటకై తిరుగులాడుచున్నాడు. । సత్యము
పలుకక ప్రతివాడును తన పొరుగువానిని వంచించును,
అబద్ధములాడుట తమ నాలుకలకు అభ్యాసముచేసి
యున్నారు, ఎగుటివాని తప్పులు పట్టవలెనని ప్రయాస
6 పడుదురు. । నీ నివాసస్థలము కాపట్యము మధ్యనే
యున్నది, వారు కపటులై నన్ను తెలిసికొననొల్ల
కున్నారు; ఇదే యెహోవా వాక్కు.
7 కావున సైన్యములకధిపతియగు యెహోవా
ఈలాగు సెలవిచ్చుచున్నాడు—ఆలకింపుము, వారిని
చొక్కము చేయునట్లుగా నేను వారిని కరిగించు
చున్నాను, నా జనులనుబట్టి నేను మరేమి చేయు
8 దును? । వారి నాలుక ఘాతుక బాణము, అది కాప
ట్యము పలుకుచున్నది; ఒకడు మనస్సులో వంచనాభి
ప్రాయముంచుకొని, నోట తన పొరుగువానితో
9 సమాధానముగా మాటలాడును. । నేను ఈ సంగతు
లను తెలిసికొని వారిని శిక్షింపకపోదునా? యిట్టి
జనులకు నేను ప్రతిదండన చేయకుందునా? ఇదే
యెహోవా వాక్కు.
10 పర్వతముల విషయమై రోదనమును అంగలార్పును
చేయుదును; అరణ్యములోని మేతస్థలములనుబట్టి
విలాపము చేయుదును; అవి పాడాయెను, సంచా
రము చేయువాడెవడును లేడు, పశువుల అరుపులు
వినబడవు, ఆకాశపక్షులును జంతువులును పారి
పోయి యున్నవి, అవి తొలగిపోయి యున్నవి. ।
11 యెరూషలేమును పాడుదిబ్బలుగాను నక్కలకు చోటు
గాను నేను చేయుచున్నాను, యూదాపట్టణములను
లేని పాడుస్థలముగా చేయుచున్నాను. । ఈ
ని గ్రహింపగల జ్ఞాని యెవడు? దానిని వాడు
తెలియజేయునట్లు యెహోవా నోటి మాట ఎవనికి
వచ్చెను? ఎవడును సంచరింపకుండ ఆ దేశము ఎడారి
వలె ఏల కాలిపోయి పాడాయెను?
అందుకు యెహోవా ఈలాగు సెలవిచ్చుచు 13
న్నాడు—వారు నా మాట వినకయు దాని ననుసరిం
పకయు, నేను వారికి నియమించిన నా ధర్మశాస్త్రమును
విసర్జించి । తమ హృదయమూర్ఖతచొప్పున జరిగించు 14
టకై తమ పితరులు తమకు నేర్పినట్లు బయలుదేవతలను
అనుసరించుచున్నారు గనుకనే వారి దేశము పాడై
పోయెను. । సైన్యములకధిపతియు ఇశ్రాయేలు దేవుడు 15
నగు యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—
నేను ఈ ప్రజలకు చేదుకూరలు తినిపింతును,
విషజలము త్రాగింతును. । తామైనను తమ పితరులై 16
నను ఎరుగని జనములలోకి వారిని చెదరగొట్టుదును,
వారిని నిర్మూలముచేయువరకు వారి వెంబడి ఖడ్గమును
పంపుదును.
సైన్యములకధిపతియగు యెహోవా ఈలాగు 17
సెలవిచ్చుచున్నాడు—ఆలోచింపుడి, రోదనముచేయు
స్త్రీలను కనుగొనుడి వారిని పిలువనంపుడి, తెలివిగల
స్త్రీలను కనుగొనుడి వారిని పిలువనంపుడి. । మన కన్నులు 18
కన్నీళ్లు విడుచునట్లుగాను మన కనురెప్పలనుండి నీళ్లు
ఒలుకునట్లుగాను వారు త్వరపడి మనకు రోదనధ్వని
చేయవలెను. । మనము వలసబోతిమే సిగ్గునొందితిమే, 19
వారు మన నివాసములను పడగొట్టగా మనము దేశము
విడువవలసివచ్చెనే అని సీయోనులో రోదనధ్వని
వినబడుచున్నది. । స్త్రీలారా, యెహోవా మాట 20
వినుడి—మీరు చెవి యొగ్గి ఆయన నోటి మాట ఆల
కించుడి, మీ కుమార్తెలకు రోదనము చేయ నేర్పుడి,
ఒకరికొకరు అంగలార్పు విద్య నేర్పుడి. । వీధులలో 21
పసిపిల్లలు లేకుండను, రాజమార్గములలో యౌవనులు
లేకుండను, వారిని నాశనముచేయుటకై మరణము
మన కిటికీలను ఎక్కుచున్నది, మన నగరులలో ప్రవే
శించుచున్నది. । యెహోవా వాక్కు ఇదే — నీవీ 22
మాట చెప్పుము — చేలమీద పెంటపడునట్లు పంట
కోయువాని వెనుక పిడికిళ్లు పడునట్లు ఎవడును సమ
కూర్చకుండ మనుష్యుల శవములు పడును, వాటిని
కూర్చువాడెవడును లేకపోవును.
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — 23
జ్ఞాని తన జ్ఞానమునుబట్టియు శూరుడు తన శౌర్య
మునుబట్టియు అతిశయింపకూడదు, ఐశ్వర్యవంతుడు
తన ఐశ్వర్యమునుబట్టి అతిశయింపకూడదు. । అతిశ 24
యించువాడు దేనినిబట్టి అతిశయింపవలెననగా,
భూమిమీద కృప చూపుచు నీతి న్యాయములు జరి
గించుచున్న యెహోవాను నేనే యని గ్రహించి
నన్ను పరిశీలనగా తెలిసికొనుటనుబట్టియే అతిశ
యింపవలెను; అట్టివాటిలో నేనానందించువాడనని

...వా సెలవిచ్చుచున్నాడు. । అన్యజనులంద
...న్నతిపొందనివారు గనుక, ఇశ్రాయేలీయు
...హృదయసంబంధమైన సున్నతినొందినవారు
...నుక, రాబోవుదినములలో సున్నతిపొందియు
...నివారివలెనుండు । ఐగుప్తీయులను యూదా
...దోమీయులను అమ్మోనీయులను మోయా
... గడ్డపు ప్రక్కలను కత్తిరించుకొను అరణ్య
...న వారినందరిని నేను శిక్షించెదను; ఇదే
...వా వాక్కు.
...యేలు వంశస్థులారా, యెహోవా మిమ్మును
సెలవిచ్చిన మాట వినుడి. । యెహోవా
...మన్నదేమనగా — జనముల ఆచారముల
...పుడి, ఆకాశమందు అగపడు చిహ్నము
...ములు భయపడును, అయితే మీరు వాటికి
...డి. । జనముల ఆచారములు వ్యర్థములు,
... నొకడు చెట్టు నరకునట్లు అది నరక
... అది పనివాడు గొడ్డలితో చేసినపని. । వెండి
...ములచేత పనివారు దానిని అలంకరింతురు,
...లకయుండునట్లు మేకులు పెట్టి సుత్తెలతో
... దాని నిలుపుదురు. । అవి తరిమెనబెట్టబడిన
...మ్మలవలె ఉన్నవి, అవి పలుకవు నడువనేరవు
...వాటిని మోయవలసివచ్చెను; వాటికి భయ
... అవి హానిచేయనేరవు మేలుచేయుట వాటి
...కాదు. । యెహోవా, నిన్ను పోలినవాడె
... లేడు, నీవు మాహాత్మ్యముగలవాడవు, నీ శౌర్య
... నీ నామము ఘనమైనదాయెను. । జనము
...జా, నీకు భయపడనివాడెవడు? జనముల
...వరిలోను వారి రాజ్యములన్నిటిలోను నీవంటి
...నును లేడు గనుక నరులు నీకు భయపడుట
...మము. । జనులు కేవలము పశుప్రాయులు, అవి
... బొమ్మల పూజవలన వచ్చు జ్ఞానము వ్యర్థము. ।
...నుండి రేకులుగా సాగగొట్టబడిన వెండియు
...నుండి బంగారమును తెత్తురు, అది పనివాని
...గడా; పోతపోయువాడు దాని చేసెను, నీల
... వర్ణములుగల వస్త్రములు వాటికున్నవి, అవన్ని
...నేర్పరులగు పనివారి పనియే. । యెహోవాయే
...న దేవుడు, ఆయనే జీవముగల దేవుడు, సదా
...ము ఆయనే రాజు, ఆయన ఉగ్రతకు భూమి
...దును, జనములు ఆయన కోపమును సహిం
...రు.
...రు వారితో ఈలాగు చెప్పవలెను — ఆకాశ
... భూమిని సృష్టింపని యీ దేవతలు భూమి
... ఉండకుండను ఆకాశముక్రింద ఉండకుండను
...దును.
...యన తన బలముచేత భూమిని సృష్టించెను, తన
...ముచేత ప్రపంచమును స్థాపించెను, తన ప్రజ్ఞ
చేత ఆకాశమును విశాలపరచెను. । ఆయన ఆజ్ఞ 13
ఇయ్యగా జలరాసులు ఆకాశమండలములో పుట్టును,
భూమ్యంత భాగములలోనుండి ఆయన ఆవిరి ఎక్క
జేయును, వర్షము కలుగునట్లుగా ఆయన మెరుపులు
పుట్టించును, తన ధనాగారములలోనుండి గాలిని
రావించును. । తెలివిలేక ప్రతి మనుష్యుడు పశు 14
ప్రాయుడు, పోతపోయు ప్రతివాడును తాను చేసిన
విగ్రహమునుబట్టి అవమానము నొందుచున్నాడు;
అతడు పోతపోసినది మాయారూపము, అందులో
ప్రాణమేమియు లేదు. । అవి ఆశను చెడగొట్టు మాయా 15
కార్యములు, విమర్శకాలములో అవి నశించిపోవును. ।
యాకోబుకు స్వాస్థ్యమగువాడు వాటివంటివాడు 16
కాడు; ఆయన సమస్తమును నిర్మించువాడు, ఇశ్రా
యేలు ఆయనకు స్వాస్థ్యముగానున్న గోత్రము; సైన్య
ములకధిపతియగు యెహోవాయని ఆయనకు పేరు.
నివాసినీ, ముట్టడివేయబడుచున్న దేశము విడిచి 17
వెళ్లుటకై నీ సామగ్రిని కూర్చుకొనుము. । యెహోవా 18
ఈ మాట సెలవిచ్చుచున్నాడు—నేను ఈ వేళను ఈ
దేశనివాసులను విసరివేయుచున్నాను, వారు పట్టబడ
వలెనని వారిని ముట్టడి వేయించుచున్నాను. । కట 19
కటా, నేను గాయపడితిని, నా దెబ్బ నొప్పిపెట్టు
చున్నది, అయితే — ఈ దెబ్బ నాకు తగినదే యను
కొని నేను దాని సహించుదును. । నా గుడారము 20
చినిగిపోయెను, నా త్రాళ్లన్నియు తెగిపోయెను, నా
పిల్లలు నా యొద్దనుండి తొలగిపోయి యున్నారు,
వారు లేకపోయిరి, ఇకమీదట నా గుడారమును
వేయుటకైనను నా తెరల నెత్తుటకైనను ఎవడును
లేడు. । కాపరులు పశుప్రాయులై యెహోవా 21
యొద్ద విచారణచేయరు గనుక వారే వర్ధిల్లకయున్నారు,
వారి మందలన్నియు చెదరిపోవుచున్నవి. । ఆలకిం 22
చుడి, ధ్వని పుట్టుచున్నది, దాని రాక ధ్వని వినబడు
చున్నది, యూదాపట్టణములను పాడైన స్థలముగా
చేయుటకును, నక్కలకు చోటుగా చేయుటకును
ఉత్తరదేశమునుండి వచ్చుచున్న గొప్ప అల్లరి ధ్వని
వినబడుచున్నది. । యెహోవా, తమ మార్గము నేర్ప 23
రచుకొనుట నరులవశములో లేదనియు, మనుష్యులు
తమ ప్రవర్తనయందు సన్మార్గమున ప్రవర్తించుట వారి
వశములో లేదనియు నేనెరుగుదును. । యెహోవా, 24
నీవు నన్ను బొత్తిగా తగ్గింపకుండునట్లు నీ కోపమును
బట్టి నన్ను శిక్షింపక నీ న్యాయవిధినిబట్టి నన్ను శిక్షిం
పుము. । నిన్నెరుగని అన్యజనులమీదను నీ నామ 25
మునుబట్టి ప్రార్థింపని వంశములమీదను నీ ఉగ్రతను
కుమ్మరించుము; వారు యాకోబును మ్రింగివేయు
చున్నారు, నిర్మూలము చేయవలెనని వారు అతని
మ్రింగివేయుచున్నారు, వాని నివాసమును పాడు
చేయుచున్నారు.

11 యెహోవాయొద్దనుండి యిర్మీయాకు ప్రత్యక్ష
2 మైన వాక్కు । — మీరు ఈ నిబంధనవాక్యములను
వినుడి; యూదా మనుష్యులతోను యెరూషలేము
నివాసులతోను నీవీలాగున మాటలాడి తెలియజేయ
3 వలెను । — ఇశ్రాయేలు దేవుడైన యెహోవా సెల
విచ్చినదేమనగా—ఈ నిబంధన వాక్యములను విననొల్లని
4 వాడు శాపగ్రస్తుడగును. । ఐగుప్తుదేశములోనుండి, ఆ
యినుప కొలిమిలోనుండి నేను మీ పితరులను రప్పిం
చిన దినమున నేను ఈ ఆజ్ఞ ఇచ్చితిని—నేడున్నట్లు
గా పాలు తేనెలు ప్రవహించు దేశమును మీ పిత
రుల కిచ్చెదనని వారితో నేను చేసిన ప్రమాణమును
నేను నెరవేర్చునట్లు, మీరు నా వాక్యము విని నేను
మీ కాజ్ఞాపించు విధులన్నిటినిబట్టి యీ నిబంధన
వాక్యముల ననుసరించినయెడల మీరు నాకు జనులై
5 యుందురు నేను మీకు దేవుడనైయుందును. । అం
దుకు—యెహోవా, ఆ మాట నిజమని నేనంటిని.
6 యెహోవా నాతో సెలవిచ్చినదేమనగా—నీవు
యూదాపట్టణములలోను యెరూషలేము వీధులలోను
ఈ మాటలన్నిటిని ప్రకటింపుము—మీరు ఈ నిబం
ధన వాక్యములను విని వాటి ననుసరించి నడుచు
7 కొనుడి. । ఐగుప్తులోనుండి మీ పితరులను రప్పించిన
దినము మొదలుకొని నేటివరకు నేను గట్టిగాను ఖండి
తముగాను చెప్పుచు వచ్చితిని; నా మాట వినుడి అని
8 పెందలకడ లేచి చెప్పుచు వచ్చితిని । అయినను వారు
తమ దుష్టహృదయములో పుట్టు మూర్ఖతచొప్పున
నడుచుచు వినకపోయిరి; చెవియొగ్గినవారు కాకపో
యిరి, వారు అనుసరింపవలెనని నేను వారి కాజ్ఞాపిం
చిన యీ నిబంధన మాటలన్నిటి ననుసరించి నడువ
లేదు గనుక నేను ఆ నిబంధనలోని వాటినన్నిటిని
వారిమీదికి రప్పించుచున్నాను.
9 మరియు యెహోవా నాతో ఈలాగు సెల
విచ్చెను — యూదావారిలోను యెరూషలేము నివా
సులలోను కుట్ర జరుగునట్లుగా కనబడుచున్నది. ।
10 ఏదనగా వారు నా మాటలు విననొల్లకపోయిన తమ
పితరుల దోషచర్యలను జరుప తిరిగియున్నారు;
మరియు వారు అన్యదేవతలను పూజించుటకై వాటిని
అనుసరించుచు, వారి పితరులతో నేను చేసిన నిబంధ
నను ఇశ్రాయేలు వంశస్థులును యూదా వంశస్థు
11 లును భంగముచేసియున్నారు. । కాబట్టి యెహోవా
ఈలాగు సెలవిచ్చుచున్నాడు—తాము తప్పించుకొన
జాలని కీడు వారిమీదికి రప్పింపబోవుచున్నాను, వారు
నాకు మొఱ్ఱపెట్టినను నేను వారి మొఱ్ఱను వినకుం
12 దును. । యూదాపట్టణస్థులును యెరూషలేము నివా
సులును పోయి తాము ధూపార్పణముచేయు దేవతలకు
మొఱ్ఱపెట్టెదరు గాని వారి ఆపత్కాలములో అవి
13 వారిని ఏమాత్రమును రక్షింపజాలవు. । యూదా, నీ
పట్టణముల లెక్కచొప్పున నీకు దేవతలున్నవి గదా?
యెరూషలేము నివాసులారా, బయలుదేవతకు ధూపము
వేయవలెనని మీ వీధుల లెక్కచొప్పున లజ్జాకరమైన
దానిపేరట బలిపీఠములను స్థాపించితిరి. । కావున 14
నీవు ఈ ప్రజలనిమిత్తము ప్రార్థనచేయకుము, వారి
నిమిత్తము మొఱ్ఱపెట్టకుము ప్రార్థనచేయకుము; వారు
తమ కీడునుబట్టి నాకు మొఱ్ఱపెట్టునప్పుడు నేను
వినను.
నా మందిరములో దుర్వ్యాపారము జరిగించుటకు 15
నా ప్రియురాలికి నిమిత్తమేమి? మ్రొక్కుబళ్లచేతను
ప్రతిష్ఠితమాంసము తినుటచేతను నీకు రావలసిన కీడు
నీవు పోగొట్టుకొందువా? అలాగైతే నీవు ఉత్సహించు
దువు. । అది చక్కని ఫలముగల పచ్చని ఒలీవచెట్టని 16
యెహోవా నీకు పేరు పెట్టెను; గొప్ప తుఫాను
ధ్వనితో దానిమీద మంటపెట్టగా దాని కొమ్మలు విరిగి
పోవుచున్నవి. । ఇశ్రాయేలు వంశస్థులును యూదా 17
వంశస్థులును బయలుకు ధూపార్పణముచేసి నాకు
కోపము పుట్టించుటచేత తమంతట తామే చేసిన చెడు
తనమునుబట్టి మిమ్మును నాటిన సైన్యములకధిపతియగు
యెహోవా మీకు కీడుచేయ నిర్ణయించుకొని
యున్నాడు.
ఆ సంగతిని యెహోవా నాకు తెలియజేయగా 18
నేను గ్రహించితిని; ఆయన వారి క్రియలను నాకు
కనుపరచెను. । అయితే నేను వధకు తేబడుచుండు 19
సాధువైన గొఱ్ఱెపిల్లవలె ఉంటిని;—మనము చెట్టును
దాని ఫలమును నశింపజేయుదము రండి, వాని పేరు
ఇకను జ్ఞాపకము చేయబడకపోవునట్లు బ్రదుకువారిలో
నుండకుండ వాని నిర్మూలముచేయుదము రండని వారు
నామీద చేసిన దురాలోచనలను నేనెరుగకయుం
టిని. । నీతినిబట్టి తీర్పుతీర్చుచు హృదయాంతరింద్రి 20
యములను శోధించువాడు సైన్యములకధిపతియగు
యెహోవాయే. (యెహోవా), నా వ్యాజ్యభార
మును నీమీదనే వేయుచున్నాను; వారికి నీవు చేయు
ప్రతిదండనను నేను చూచెదను. । కావున — నీవు 21
మాచేత చావకుండునట్లు యెహోవా నామమున
ప్రవచింపకూడదని చెప్పు అనాతోతు వారినిగూర్చి
యెహోవా ఇట్లని సెలవిచ్చుచున్నాడు । — సైన్య 22
ములకధిపతియగు యెహోవా వారినిగూర్చి సెల
విచ్చునదేమనగా— నేను వారిని శిక్షింపబోవుచున్నాను,
వారి యౌవనస్థులు ఖడ్గముచేత చంపబడెదరు, వారి
కుమారులును కుమార్తెలును క్షామమువలన చచ్చెదరు; ।
వారికి శేషమేమియు లేకపోవును, నేను వారిని 23
దర్శించు సంవత్సరమున అనాతోతు కీడును వారి
మీదికి రప్పింతును.
యెహోవా, నేను నీతో వాదించునప్పుడు నీవు 12
నీతిమంతుడవుగా కనబడుదువు; అయినను న్యాయము

విధించుటనుగూర్చి నేను నీతో మాటలాడుదును;
దుష్టులు తమ మార్గములలో వర్ధిల్లనేల? మహా విశ్వాస
2 ఘాతుకులు సుఖింపనేల? । నీవు వారిని నాటు
చున్నావు, వారు వేరు తన్నుచున్నారు, వారు ఎదిగి
ఫలముల నిచ్చుచున్నారు; వారి నోటికి నీవు సమీప
ముగా ఉన్నావు గాని వారి అంతరింద్రియములకు
3 దూరముగా ఉన్నావు. । యెహోవా, నీవు నన్నెరిగి
యున్నావు నన్ను చూచుచున్నావు; నా హృదయము
నీ పట్ల ఎట్లున్నది నీవు శోధించుచున్నావు; వధకు
ఏర్పడిన గొఱ్ఱెలనువలె వారిని హతముచేయుము, వధ
4 దినమునకు వారిని ప్రతిష్ఠించుము. । భూమి యెన్నాళ్లు
దుఃఖింపవలెను? దేశమంతటిలోని గడ్డి యెన్నాళ్లు
ఎండిపోవలెను? అతడు మన అంతము చూడడని
దుష్టులు చెప్పుకొనుచుండగా దేశములో నివసించు
వారి చెడుతనమువలన జంతువులును పక్షులును నమసి
5 పోవుచున్నవి. । నీవు పాదచారులతో పరుగెత్తగా
వారు నిన్ను అలయగొట్టిరి గదా; నీవు రౌతులతో
ఏలాగు పోరాడుదువు? నెమ్మదిగల స్థలమున నీవు క్షేమ
ముగా ఉన్నావు గదా; యొర్దాను ప్రవాహముగా
6 వచ్చునప్పుడు నీవేమి చేయుదువు? । నీ సహోదరులు
సహితము నీ తండ్రి ఇంటివారు సహితము నీకు
ద్రోహము చేయుచున్నారు; నీ వెంబడి గేలిచేయు
దురు, వారు నీతో దయగా మాటలాడుచున్నను నీవు
వారిని నమ్మకూడదు.

7 నా మందిరమును నేను విడిచియున్నాను, నా
స్వాస్థ్యమును విసర్జించియున్నాను, నా ప్రాణ ప్రియు
రాలిని ఆమె శత్రువులచేతికి అప్పగించియున్నాను. ।
8 నా స్వాస్థ్యము నాకు అడవిలోని సింహమువంటి
దాయెను; ఆమె నామీద గర్జించుచున్నది గనుక నేను
9 ఆమెకు విరోధినైతిని. । నా స్వాస్థ్యము నాకు పొడల
పొడల క్రూరపక్షి ఆయెనా? క్రూరపక్షులు దాని
చుట్టు కూడుచున్నవా? రండి అడవిజంతువులన్నిటిని
పోగుచేయుడి; మ్రింగివేయుటకై అవి రావలెను. ।
10 కాపరులనేకులు నా ద్రాక్షలతోటను చెరిపివేసి
యున్నారు, నా సొత్తును త్రొక్కివేసియున్నారు,
నాకిష్టమైన పొలమును పాడుగాను ఎడారిగాను చేసి
11 యున్నారు. । వారు దాని పాడుచేయగా అది పాడై
నన్ను చూచి దుఃఖించుచున్నది; దానిగూర్చి చింతించు
వాడొకడును లేడు గనుక దేశమంతయు పాడాయెను. ।
12 పాడుచేయువారు అరణ్యమందలి చెట్లులేని మెట్ట
లన్నిటిమీదికి వచ్చుచున్నారు; దేశముయొక్క యీ
కొననుండి ఆ కొనవరకు యెహోవా ఖడ్గము తిరు
గుచు హతముచేయుచున్నది; శరీరులకు క్షేమమే
13 మియు లేదు. । జనులు గోధుమలు చల్లి ముండ్ల పంట
కోయుదురు; వారు అలసటపడుచున్నారు గాని
ప్రయోజనము లేకపోయెను; యెహోవా కోపాగ్ని
వలన కోతకు పంటలేక మీరు సిగ్గుపడుదురు.
నేను నా జనులైన ఇశ్రాయేలుకు స్వాధీనపరచిన 14
స్వాస్థ్యము నాక్రమించుకొను దుష్టులగు నా పొరుగు
వారినిగూర్చి యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నా
డు—నేను వారి దేశములోనుండి వారిని పెల్లగింతును;
మరియు వారి మధ్యనుండి యూదావారిని పెల్లగిం
తును. । వారిని పెల్లగించిన తరువాత నేను మరల 15
వారియెడల జాలిపడుదును; ఒక్కొకని తన స్వాస్థ్య
మునకును ఒక్కొకని తన దేశమునకును వారిని రప్పిం
తును. । బయలుతోడని ప్రమాణముచేయుట వారు 16
నా ప్రజలకు నేర్పినట్లుగా యెహోవా జీవము
తోడని నా నామమునుబట్టి ప్రమాణముచేయుటకై
తాము నా ప్రజలమార్గములను జాగ్రత్తగా నేర్చు
కొనిన పక్షమున వారు నా ప్రజలమధ్య వర్ధిల్లుదురు. ।
అయితే వారు నా మాట విననొల్లని పక్షమున నేను 17
ఆ జనమును వేరుతో పెల్లగించి బొత్తిగా నాశనము
చేతును; ఇదే యెహోవా వాక్కు.
యెహోవా నాతో ఈలాగు సెలవిచ్చెను—నీవు 13
వెళ్లి అవిసెనార నడికట్టు కొని నీ నడుమున దాని
కట్టుకొనుము, నీళ్లలో దాని వేయకుము. । కావున 2
యెహోవా మాటచొప్పున నేను నడికట్టు ఒకటి కొని
నడుమున కట్టుకొంటిని. । రెండవ మారు యెహోవా 3
వాక్కు నాకు ప్రత్యక్షమై । — నీవు కొని నడుమున 4
కట్టుకొనిన నడికట్టును తీసికొని, లేచి ఫరాతునది
యొద్దకు పోయి అక్కడనున్న బండబీటలో దాని
దాచిపెట్టుమనగా । యెహోవా నాకాజ్ఞాపించినట్లు 5
నేను పోయి ఫరాతునదియొద్ద దాని దాచిపెట్టితిని. ।
అనేక దినములైన తరువాత యెహోవా—నీవు లేచి 6
ఫరాతునదియొద్దకు పోయి, నేను అక్కడ దాచిపెట్టు
మని నీకాజ్ఞాపించిన నడికట్టును అక్కడనుండి తీసి
కొనుమని నాతో చెప్పగా । నేను ఫరాతునదియొద్దకు 7
పోయి త్రవ్వి ఆ నడికట్టును దాచిపెట్టినచోటనుండి
దాని తీసికొంటిని; నేను దాని చూడగా ఆ నడికట్టు
చెడిపోయి యుండెను; అది దేనికిని పనికిరానిదా
యెను. । కాగా యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై 8
యీలాగు సెలవిచ్చెను । — యెహోవా ఈ మాట 9
సెలవిచ్చుచున్నాడు—ఈ విధముగానే యూదావారి
గర్వమును యెరూషలేము నివాసుల మహా గర్వమును
నేను భంగపరచుదును. । అన్యదేవతలను పూజించుచు 10
వాటికి నమస్కారము చేయుదుమని వాటి ననుసరిం
చుచు, నా మాటలు విననొల్లక తమ హృదయకాఠి
న్యము చొప్పున నడుచుకొను ఈ ప్రజలు దేనికిని
పనికిరాని యీ నడికట్టువలె అగుదురు. । నాకు కీర్తి 11
స్తోత్రమహిమలు కలుగుటకై వారు నాకు జనముగా
ఉండునట్లు నేను ఇశ్రాయేలు వంశస్థులనందరిని

యూదా వంశస్థులనందరిని, నడికట్టు నరుని నడు
ముకు అంటియున్నరీతిగా నన్ను అంటియుండజేసి
తిని గాని వారు నా మాటలు వినకపోయి యున్నా
12 రని యెహోవా సెలవిచ్చుచున్నాడు. । కాబట్టి నీవు
వారితో చెప్పవలసిన మాట ఏదనగా, ఇశ్రాయేలు
దేవుడైన యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు
—ప్రతి సిద్దెయు ద్రాక్షారసముతో నింపబడును.—
ప్రతి సిద్దెయు ద్రాక్షారసముతో నింపబడునని మాకు
13 తెలియదా అని వారు నీతో అనినయెడల । నీవు
వారితో ఈ మాట చెప్పుము — యెహోవా సెల
విచ్చునదేమనగా—ఈ దేశనివాసులనందరిని, దావీదు
సింహాసనముమీద కూర్చుండు రాజులనేమి యాజకుల
నేమి ప్రవక్తలనేమి యెరూషలేము నివాసులనందరిని
14 నేను మత్తులుగా చేయబోవుచున్నాను. । అప్పుడు
నేను తండ్రులను కుమారులను అందరిని ఏకముగా
ఒకనిమీద ఒకని పడద్రోయుదునని యెహోవా
సెలవిచ్చుచున్నాడు; వారిని కరుణింపను శిక్షింపక
పోను; వారియెడల జాలిపడక నేను వారిని నశింప
జేసెదను.

15 చెవి యొగ్గి వినుడి; యెహోవా ఆజ్ఞ ఇచ్చు
16 చున్నాడు, గర్వపడకుడి. । ఆయన చీకటి కమ్మజేయక
మునుపే, మీ కాళ్లు కాటుకకొండలకు తగలకమునుపే,
వెలుగుకొరకు మీరు కనిపెట్టుచుండగా ఆయన దాని
గాఢాంధకారముగా చేయకమునుపే, మీ దేవుడైన
యెహోవా మహిమగలవాడని ఆయనను కొని
17 యాడుడి. । అయినను మీరు ఆ మాట విననొల్లని
యెడల మీ గర్వమునుబట్టి నేను చాటున ఏడ్చుదును;
యెహోవా మంద చెరపట్టబడినందున నా నేత్రము
బహుగా వలపోయుచు కన్నీరు విడుచుచు నుండును. ।
18 రాజును తల్లియైన రాణిని చూచి ఇట్లనుము — మీ
శిరోభూషణములును తలమీదనున్న మీ సుందరకిరీట
19 మును పడిపోయెను; క్రుంగి కూర్చుండుడి. । దక్షిణ
దేశ పట్టణములు మూయబడియున్నవి; వాటిని తెరువ
గలవాడెవడును లేడు; యూదావారందరు చెరపట్ట
బడిరి ఏమియు లేకుండ సమస్తము కొనిపోబడెను.

20 కన్నులెత్తి ఉత్తరమునుండి వచ్చుచున్నవారిని చూ
డుడి; నీకియ్యబడిన మంద నీ సౌందర్యమైన మంద
21 ఎక్కడనున్నది? । నీవు నీకు స్నేహితులుగా చేసికొనిన
వారిని ఆయన నీమీద అధిపతులుగా నియమించు
నప్పుడు నీవేమి చెప్పెదవు? ప్రసవించు స్త్రీ వేదనవంటి
22 వేదన నిన్ను పట్టును గదా. । నీవు—ఇవి నాకేల సంభ
వించెనని నీ మనస్సులో అనుకొనినయెడల నీవు చేసిన
విస్తారమైన దోషములనుబట్టి నీ బట్టచెంగులు తొలగి
23 పోయెను, నీ మడిమెలు సిగ్గునొందెను. । కూషుదేశ
స్థుడు తన చర్మమును మార్చుకొనగలడా? చిరుతపులి
తన మచ్చలను మార్చుకొనగలదా? మార్చుకొనగలిగిన
యెడల కీడుచేయుటకు అలవాటుపడిన మీరును మేలు
చేయ వల్లపడును. । కాబట్టి అడవిగాలికి పొట్టు ఎగురు 2
నట్లు నేను వారిని చెదరగొట్టెదను. । నీవు అబద్ధమును 2
నమ్ముకొనుచు నన్ను మరచితివి గనుక ఇది నీకు వంతు,
నాచేత నీకు కొలవబడిన భాగమని యెహోవా సెల
విచ్చుచున్నాడు. । కాబట్టి నీ అవమానము కనబడు 2
నట్లు నేను నీ బట్టల చెంగులను నీ ముఖముమీదికి
ఎత్తుచున్నాను. । నీ వ్యభిచారమును నీ సకిలింపును 2
నీ జారకార్యములను కామాతురతను నేనెరుగుదును;
పొలములలోనున్న మెట్టలమీద నీ హేయక్రియలు
నాకు కనబడుచున్నవి; యెరూషలేమా, నీకు శ్రమ,
నిన్ను నీవు పవిత్రపరచుకొననొల్లవు; ఇక నెంతకాలము
ఈలాగు జరుగును?

కరవుకాలమున జరిగినవానిగూర్చి యిర్మీయాకు 14
ప్రత్యక్షమైన యెహోవా వాక్కు । — యూదా 2
దుఃఖించుచున్నది, దాని గుమ్మములు అంగలార్చు
చున్నవి, జనులు విచారగ్రస్తులై నేలకు వంగుదురు,
యెరూషలేము చేయు అంగలార్పు పైకెక్కుచున్నది. ।
వారిలో ప్రధానులు బీదవారిని నీళ్లకు పంపుచున్నారు, 3
వారు చెరువులయొద్దకు రాగా నీళ్లు దొరుకుటలేదు,
వట్టి కుండలు తీసికొని వారు మరల వచ్చుచున్నారు,
సిగ్గును అవమానము నొందినవారై తమ తలలు కప్పు
కొనుచున్నారు. । దేశములో వర్షము కురువక పోయి 4
నందున నేల చీలియున్నది గనుక సేద్యము చేయువారు
సిగ్గుపడి తలలు కప్పుకొనుచున్నారు. । లేళ్లు పొల 5
ములో ఈని గడ్డిలేనందున పిల్లలను విడిచిపెట్టు
చున్నవి. । అడవి గాడిదెలును చెట్లులేని మెట్టలమీద 6
నిలువబడి నక్కలవలె గాలి పీల్చుచున్నవి, మేత
ఏమియు లేనందున వాటి కన్నులు క్షీణించుచున్నవి.

యెహోవా, మా తిరుగబాటులు అనేకములు; 7
నీకు విరోధముగా మేము పాపముచేసితిమి; మా దోష
ములు మా మీద దోషారోపణ చేయుచున్నవి; నీ
నామమునుబట్టి నీవే కార్యము జరిగించుము. । ఇశ్రా 8
యేలుకు ఆశ్రయుడా, కష్టకాలమున వారికి రక్షకుడా,
మా దేశములో నీవేల అన్యునివలెనున్నావు? ఏల
రాత్రివేళను బసచేయుటకు గుడారమువేయు ప్రయా
ణస్థునివలె ఉన్నావు? । భ్రమసియున్నవానివలెను 9
రక్షింపలేని శూరునివలెను నీవేల ఉన్నావు?
యెహోవా, నీవు మామధ్య నున్నావే; నీవారమని
మాకు పేరుపెట్టబడెను గదా; మమ్మును చెయ్యి విడు
వకుము.

యెహోవా ఈ జనులతో ఈ మాట సెలవిచ్చు 10
చున్నాడు — ఈ జనులు తమ కాళ్లకడ్డములేకుండ
తిరుగులాడుటకు ఇచ్ఛగలవారు గనుక యెహోవా
వారిని అంగీకరింపడు; ఇప్పుడు ఆయన వారి అక్రమ
మును జ్ఞాపకము చేసికొనును; వారి పాపములనుబట్టి

11 వారిని శిక్షించుదును. । మరియు యెహోవా నాతో
ఇట్లనెను—వారికి మేలు కలుగునట్లుగా ఈ ప్రజల
12 నిమిత్తము ప్రార్థనచేయకుము. । వారు ఉపవాస
మున్నప్పుడు నేను వారి మొఱ్ఱను వినను; వారు
దహనబలియైనను నైవేద్యమైనను అర్పించునప్పుడు
నేను వాటిని అంగీకరింపను; ఖడ్గమువలనను క్షామము
వలనను తెగులువలనను వారిని నాశముచేసెదను. ।
13 అందుకు నేను—అయ్యో, ప్రభువైన యెహోవా—
మీరు ఖడ్గము చూడరు, మీకు క్షామము కలుగదు,
ఈ చోటును నేను స్థిరమైన సమాధానము మీకిచ్చెద
నని ప్రవక్తలు వారితో చెప్పుచున్నారని నేననగా ।
14 యెహోవా నాతో ఇట్లనెను—ప్రవక్తలు నా నామ
మునుబట్టి అబద్ధములు ప్రకటించుచున్నారు; నేను
వారిని పంపలేదు, వారికి ఆజ్ఞ ఇయ్యలేదు, వారితో
మాటలాడలేదు, వారు అసత్యదర్శనమును శకునమును
మాయతంత్రమును తమ హృదయమున పుట్టిన వంచ
15 నను ప్రకటన చేయుచున్నారు. । కావున నేను
వారిని పంపకపోయినను, నా నామమునుబట్టి ఖడ్గ
మైనను క్షామమైనను ఈ దేశములోనికి రాదని చెప్పుచు
అబద్ధప్రవచనములు ప్రకటించు ప్రవక్తలనుగూర్చి
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — ఆ
ప్రవక్తలు ఖడ్గమువలనను క్షామమువలనను లయమగు
16 దురు । వారెవరితో అట్టి ప్రవచనములు చెప్పుదురో
ఆ జనులు క్షామమునకును ఖడ్గమునకును పాలై
యెరూషలేము వీధులలో పడవేయబడెదరు; నేను
వారి చెడుతనమును వారిమీదికి రప్పించెదను. వారి
నైనను వారి భార్యలనైనను వారి కుమారులనైనను
వారి కుమార్తెలనైనను పాతిపెట్టువాడెవడును లేక
17 పోవును. । నీవు వారితో చెప్పవలసినమాట ఏదనగా
—నా జనుల కన్యక గొప్ప ఉపద్రవమువలన పీడింప
బడుచున్నది, ఘోరమైన గాయము నొందియున్నది;
దివారాత్రము మానక నా కన్నులనుండి కన్నీరు
18 కారుచున్నది. । పొలములోనికి నేను పోగా ఖడ్గము
చేత హతులైనవారు కనబడుదురు, పట్టణములో
ప్రవేశింపగా క్షామపీడితులు అచ్చటనుందురు; ప్రవక్త
లేమి యాజకులేమి తామెరుగని దేశమునకు పోవలె
నని ప్రయాణమై యున్నారు.
19 నీవు యూదాను బొత్తిగా విసర్జించితివా? సీయోను
నీకు అసహ్యమాయెనా? మాకు చికిత్స దొరకకుండు
నంతగా నీవేల మమ్మును కొట్టితివి? మేము సమాధానము
కొరకు కనిపెట్టుచున్నాము గాని మేలేదియు కన
బడుటలేదు; చికిత్స కలుగు కాలముకొరకు కనిపెట్టు
20 చున్నాము గాని భీతి తగిలియున్నది. । యెహోవా,
మా దుర్మార్గతను మా పితరుల దోషమును మేము ఒప్పు
కొనుచున్నాము; నీకు విరోధముగా పాపము చేసి
21 యున్నాము. । నీ నామమునుబట్టి మమ్మును త్రోసి
వేయకుము, ప్రశస్తమైన నీ సింహాసనమును అవమాన
పరచకుము, మాతో నీవు చేసిన నిబంధనను జ్ఞాపకము
చేసికొనుము, దాని భ్రష్టపరచకుమీ. । జనముల 22
వ్యర్థదేవతలలో వర్షము కురిపింపగలవారున్నారా?
ఆకాశము వాననియ్యగలదా? మా దేవుడవైన
యెహోవా, నీవేగదా దాని చేయుచున్నావు: నీవే
యీ క్రియలన్నియు చేయుచున్నావు; నీకొరకే
మేము కనిపెట్టుచున్నాము.

అప్పుడు యెహోవా నాకీలాగు సెలవిచ్చెను— 15
మోషేయు సమూయేలును నాయెదుట నిలువబడినను
ఈ ప్రజలను అంగీకరించుటకు నాకు మనస్సుండదు,
నా సన్నిధి నుండకుండ వారిని వెళ్లగొట్టుము. । మే 2
మెక్కడికి పోదుమని వారు నిన్నడిగినయెడల నీవు
వారితో నిట్లనుము. యెహోవా ఈ మాట సెల
విచ్చుచున్నాడు — చావుకు నియమింపబడినవారు
చావునకును, ఖడ్గమునకు నియమింపబడినవారు ఖడ్గమున
కును, క్షామమునకు నియమింపబడినవారు క్షామమున
కును, చెరకు నియమింపబడినవారు చెరకును పోవ
లెను. । యెహోవా వాక్కు ఇదే — చంపుటకు 3
ఖడ్గము, చీల్చుటకు కుక్కలు, తినివేయుటకును నాశ
నము చేయుటకును ఆకాశపక్షులు భూమృగములు
అను ఈ నాలుగు విధముల బాధలు వారికి నియ
మించియున్నాను. । యూదారాజైన హిజ్కియా 4
కుమారుడగు మనష్షే యెరూషలేములో చేసిన క్రియ
లనుబట్టి భూరాజ్యములన్నిటిలో ఘోరహింస నొందు
నట్లు వారిని అప్పగించుచున్నాను. । యెరూషలేమా, 5
నిన్ను కరుణించువాడెవడు? నీయందు జాలిపడువా
డెవడు? కుశల ప్రశ్నలు అడుగుటకు ఎవడు త్రోవ
విడిచి నీయొద్దకు వచ్చును? । యెహోవా వాక్కు 6
ఇదే — నీవు నన్ను విసర్జించియున్నావు వెనుకతీసి
యున్నావు గనుక నిన్ను నశింపజేయునట్లు నేను నీ
మీదికి నా చేతిని చాచియున్నాను; సంతాపపడి
పడి నేను విసికియున్నాను. । దేశద్వారములలో నేను 7
వారిని చేటతో తూర్పారపట్టుచున్నాను, నా జనులు
తమ మార్గములను విడిచి నాయొద్దకు రారు గనుక
వారిని సంతానహీనులుగా చేయుచున్నాను, నశింప
జేయుచున్నాను. । వారి విధవరాండ్లు సముద్రపు 8
ఇసుకకంటె విస్తారముగా ఉందురు; మధ్యాహ్నకాల
మున యౌవనుల తల్లిమీదికి దోచుకొనువారిని నేను
రప్పింతును; పరితాపమును భయములను అకస్మాత్తుగా
వారిమీదికి రాజేతును. । ఏడుగురిని కనిన స్త్రీ క్షీణించు 9
చున్నది; ఆమె ప్రాణము విడిచియున్నది; పగటి
వేళనే ఆమెకు ప్రొద్దుగ్రుంకియున్నది; ఆమె సిగ్గు
పడి అవమానమునొందియున్నది; వారిలో శేషించిన
వారిని తమ శత్రువులయెదుట కత్తిపాలు చేసెదను;
ఇదే యెహోవా వాక్కు.

10 అయ్యో నాకు శ్రమ; నా తల్లీ, జగడమాడువాని
గాను దేశస్థులందరితో కలహించువానిగాను నీవేల
నన్ను కంటివి? వడ్డికి నేను బదులియ్యలేదు, వారు
నాకు బదులిచ్చినవారు కారు అయినను వారందరు
11 నన్ను శపించుచున్నారు. । అందుకు యెహోవా—
నిశ్చయముగా నీకు మేలుచేయవలెనని నేను నిన్ను
బలపరచుచున్నాను, కీడుకాలమున ఆపత్కాలమున
నీ శత్రువులు నిశ్చయముగా నీకు మొరలిడునట్లు
చేయుదునని సెలవిచ్చెను.

12 ఇనుమునైనను ఉక్కునైనను కంచునైనను ఎవడైన
13 విరువగలడా? । (నా జనులారా) మీ ప్రాంతము
లన్నిటిలో మీరు చేయు సమస్త పాపములనుబట్టి మీ
స్వాస్థ్యమును నిధులను క్రయములేకుండ నేను దోపుడు
14 సొమ్ముగా అప్పగించుచున్నాను. । నీవెరుగని దేశ
ములో నీ శత్రువులకు నిన్ను దాసునిగా చేతును,
నా కోపాగ్ని రగులుకొనుచు నిన్ను దహించును.

15 యెహోవా, (నా శ్రమ) నీకే తెలిసియున్నది;
నన్ను జ్ఞాపకము చేసికొనుము, నన్ను దర్శించుము,
నన్ను హింసించువారికి నాకొరకై ప్రతిదండన
చేయుము, నీవు దీర్ఘశాంతి కలిగినవాడవై నన్ను కొని
పోకుము, నీ నిమిత్తము నాకు నింద వచ్చుచున్నదని
16 తెలిసికొనుము. । నీ మాటలు నాకు దొరకగా నేను
వాటిని భుజించితిని; సైన్యములకధిపతివగు
యెహోవా, దేవా, నీ నామము నాకు పెట్టబడెను
గనుక నీ మాటలు నాకు సంతోషమును నా హృదయ
17 మునకు ఆనందమును కలుగజేయుచున్నవి. । సంతో
షించువారి సమూహములో నేను కూర్చుండలేదు
నేను ఉల్లసింపలేదు. కడుపు మంటతో నీవు నన్ను
నింపియున్నావు గనుక నీ బలమును ఆలోచించుచు
18 ఏకాకినై కూర్చుంటిని. । నా బాధ యేల యెడతెగని
దాయెను? నా గాయము ఏల ఘోరమైనదాయెను?
అది స్వస్థతనొందకపోనేల? నిశ్చయముగా నీవు నాకు
ఎండమావులవలెనైతివి, నిలువని జలములవలెనైతివి.

19 కాబట్టి యెహోవా ఈలాగు సెలవిచ్చెను—
నీవు నాతట్టు తిరిగినయెడల నీవు నా సన్నిధిని నిలుచు
నట్లు నేను నిన్ను తిరిగి రప్పింతును. ఏవి నీచములో
యేవి ఘనములో నీవు గురుతుపట్టినయెడల నీవు నా
నోటివలె ఉందువు; వారు నీతట్టుకు తిరుగుదురు[1]
20 గాని నీవు వారితట్టుకు తిరుగవు.[2] । అప్పుడు నిన్ను
ఈ ప్రజలకు పడగొట్టజాలని యిత్తడి ప్రాకారముగా
నేను నియమించెదను; నిన్ను రక్షించుటకును నిన్ను
విడిపించుటకును నేను నీకు తోడైయుందును గనుక
వారు నీమీద యుద్ధము చేయుదురు గాని నిన్ను
జయింపకపోదురని యెహోవా సెలవిచ్చుచున్నా
డు. । దుష్టుల చేతిలోనుండి నిన్ను విడిపించెదను, 21
బలాత్కారుల చేతిలోనుండి నిన్ను విమోచించెదను.

మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్య 16
క్షమై యీలాగు సెలవిచ్చెను — ఈ స్థలమందు నీకు 2
కుమారులైనను కుమార్తెలైనను పుట్టకుండునట్లు నీవు
వివాహము చేసికొనకూడదు. । ఈ స్థలమందు పుట్టు 3
కుమారులనుగూర్చియు కుమార్తెలనుగూర్చియు, వారిని
కనిన తల్లులనుగూర్చియు, ఈ దేశములో వారిని
కనిన తండ్రులనుగూర్చియు యెహోవా ఈలాగు
సెలవిచ్చుచున్నాడు । —వారు ఘోరమైన మరణము 4
నొందెదరు; వారినిగూర్చి రోదనము చేయబడదు,
వారు పాతిపెట్టబడక భూమిమీద పెంటవలె పడి
యుండెదరు; వారు ఖడ్గముచేతను క్షామముచేతను
నశించెదరు; వారి శవములు ఆకాశపక్షులకును
భూజంతువులకును ఆహారముగా ఉండును. ।
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — నేను 5
ఈ ప్రజలకు నా సమాధానము కలుగనియ్యకయు
వారియెడల నా కృపావాత్సల్యములను చూపకయు
ఉన్నాను గనుక రోదనముచేయు ఇంటిలోకి నీవు
పోకుము, వారినిగూర్చి అంగలార్చుటకు పోకుము,
ఎవరినిని ఓదార్చుటకు వెళ్లకుము; ఇదే యెహోవా
వాక్కు. । ఘనులేమి అల్పులేమి యీ దేశమందున్న 6
వారు చనిపోయి పాతిపెట్టబడరు, వారి నిమిత్తము
ఎవరును అంగలార్చకుందురు, ఎవరును తమ్మును తాము
కోసికొనకుందురు, వారి నిమిత్తము ఎవరును తమ్మును
తాము బోడి చేసికొనకుందురు. । చచ్చినవారినిగూర్చి 7
జనులను ఓదార్చుటకు అంగలార్పు ఆహారము ఎవరును
పంచిపెట్టరు; ఒకని తండ్రియైనను తల్లియైనను చని
పోయెనని యెవరును వారికి ఓదార్పుపాత్రను త్రాగ
నియ్యకుందురు. । వారియొద్ద కూర్చుండి అన్నపాన 8
ములు పుచ్చుకొనుటకు నీవు విందుశాలలో ప్రవేశింప
కూడదు. । సైన్యములకధిపతియు ఇశ్రాయేలు దేవుడు 9
నైన యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—
మీ కన్నుల ఎదుటనే మీ దినములలోనే సంతోష
ధ్వనిని ఆనందధ్వనిని పెండ్లికుమారుని స్వరమును
పెండ్లికుమార్తె స్వరమును ఈ చోట వినబడకుండ
మాన్పించెదను. । నీవు ఈ మాటలన్నియు ఈ ప్రజ 10
లకు తెలియజెప్పిన తరువాత వారు — దేనిబట్టి
యెహోవా మాకు ఈ ఘోరబాధ అంతయు నియ
మించెను? మా దేవుడైన యెహోవాకు విరోధముగా
మా దోషమేమి? మా పాపమేమి? అని నిన్నడుగగా ।
నీవు వారితో ఇట్లనుము—యెహోవా ఈ మాట 11
సెలవిచ్చుచున్నాడు — మీ పితరులు నన్ను విడిచి
అన్యదేవతలను అనుసరించి పూజించి వాటికి నమస్కా
రము చేయుటనుబట్టియే గదా వారు నా ధర్మశాస్త్రమును

1 లేక, తిరుగవలెను.
2 లేక, తిరుగకూడదు.

12 గైకొనక నన్ను విసర్జించిరి. । ఆలకించుడి; మీరందరు
నా మాట వినకుండ కఠినమైన మీ దుష్ట హృదయ
కాఠిన్యము చొప్పున నడుచుకొనుచున్నారు; మీరు
మీ పితరులకంటె విస్తారముగా చెడుతనము చేసి
13 యున్నారు. । కాబట్టి నేను మీయందు ఏమాత్రమును
దయయుంచక, యీ దేశమునుండి మీరైనను మీ
పితరులైనను ఎరుగని దేశమునకు మిమ్మును వెళ్లగొట్టు
చున్నాను; అక్కడ మీరు దివారాత్రము అన్యదేవ
తలను కొలుచుదురు.

14 యెహోవా సెలవిచ్చు మాట ఏదనగా — నేను
15 వారి పితరులకిచ్చిన దేశమునకు వారిని మరల రప్పించె
దను గనుక రాబోవు దినములలో—ఐగుప్తు దేశములో
నుండి ఇశ్రాయేలీయులను రప్పించిన యెహోవా
జీవముతోడని ఇకమీదట అనక — ఉత్తరదేశములో
నుండియు ఆయన వారిని తరిమిన దేశములన్నిటిలో
నుండియు ఇశ్రాయేలీయులను రప్పించిన యెహోవా
జీవముతోడని జనులు ప్రమాణము చేయుదురు. ।
16 ఇదే యెహోవా వాక్కు — వారిని పట్టుకొనుటకు
నేను చాలమంది జాలరులను పిలిపించెదను; తరువాత
ప్రతి పర్వతముమీదనుండియు ప్రతి కొండమీద
నుండియు మెట్టల సందులలోనుండియు వారిని
వేటాడి తోలివేయుటకై అనేకులైన వేటగాండ్లను
17 పిలిపించెదను. । ఏలయనగా వారు పోయిన త్రోవ
లన్నిటిమీద దృష్టి యుంచితిని, ఏదియు నా కన్ను
లకు మరుగుకాలేదు, వారి దోషమును నాకు మరుగై
18 యుండదు. । వారు తమ హేయదేవతల కళేబరముల
చేత నా దేశమును అపవిత్రపరచియున్నారు, తమ
హేయక్రియలతో నా స్వాస్థ్యమును నింపియున్నారు
గనుక నేను మొదట వారి దోషమునుబట్టియు వారి
పాపమునుబట్టియు రెండంతలుగా వారికి ప్రతికారము
19 చేసెదను. । యెహోవా, నా బలమా, నా దుర్గమా,
ఆపత్కాలమందు నా ఆశ్రయమా, భూదిగంతముల
నుండి జనములు వచ్చి—మా పితరులు వ్యర్థమును
మాయారూపమును నిష్ప్రయోజనమునగువాటిని
మాత్రము స్వతంత్రించుకొనిరని చెప్పుదురు. ।
20 నరులు తమకు దేవతలను కల్పించుకొందురా? అయి
21 నను అవి దైవములు కావు. । కాబట్టి నా నామము
యెహోవా అని వారు తెలిసికొనునట్లు నేను ఈ
సారి వారికి అనుభవము కలుగజేతును, నా బలమును
నా శౌర్యమును ఎంతటివో వారికి తెలియజేతును.

17 వారి కుమారులు తాము కట్టిన బలిపీఠములను,
ప్రతి పచ్చని చెట్టుక్రిందనున్న అష్తారోతుదేవి ప్రతిమ
2 లను జ్ఞాపకము చేసికొనుచుండగా । యూదా
పాపము ఇనుపగంటముతో వ్రాయబడియున్నది;
అది కురువిందముతో లిఖింపబడియున్నది; అది వారి
హృదయములనెడి పలకలమీదను చెక్కబడియున్నది;
మీ బలిపీఠముల కొమ్ములమీదను చెక్కబడియున్నది. ।
పొలములోనున్న నా పర్వతమా, నీ ప్రాంతములన్ని 3
టిలో నీవు చేయు నీ పాపమునుబట్టి నీ ఆస్తిని నీ నిధు
లన్నిటిని నీ బలిపీఠములను దోపుడుసొమ్ముగా నేనప్ప
గించుచున్నాను. । మీరు నిత్యము రవులుచుండు 4
కోపము నాకు పుట్టించితిరి గనుక, నేను నీకిచ్చిన
స్వాస్థ్యమును నీ అంతట నీవే విడిచిపెట్టితివి గనుక
నీవెరుగని దేశములో నీ శత్రువులకు నీవు దాసుడ
వగుదువు.

యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు. — 5
నరులను ఆశ్రయించి శరీరులను తనకాధారముగా
చేసికొనుచు తన హృదయమును యెహోవామీద
నుండి తొలగించుకొనువాడు శాపగ్రస్తుడు. । వాడు 6
ఎడారిలోని అరుహావృక్షమువలె ఉండును; మేలు
వచ్చునప్పుడు అది వానికి కనబడదు, వాడు అడవిలో
కాలిన నేలయందును నిర్జనమైన చవిటి భూమియం
దును నివసించును. । యెహోవాను నమ్ముకొనువాడు 7
ధన్యుడు; యెహోవా వానికి ఆశ్రయముగా ఉం
డును. । వాడు జలములయొద్ద నాటబడిన చెట్టువలె 8
నుండును; అది కాలువల ఓరను దాని వేళ్లు తన్నును;
వెట్టకలిగినను దానికి భయపడదు, దాని ఆకు పచ్చగా
నుండును, వర్షములేని సంవత్సరమున చింత నొందదు
కాపు మానదు. । హృదయము అన్నిటికంటె మోస 9
కరమైనది, అది ఘోరమైన వ్యాధికలది, దాని
గ్రహింపగలవాడెవడు? । ఒకని ప్రవర్తనను బట్టి వాని 10
క్రియల ఫలముచొప్పున ప్రతికారము చేయుటకు
యెహోవా అను నేను హృదయమును పరిశోధించు
వాడను, అంతరింద్రియములను పరీక్షించువాడను.
న్యాయవిరోధముగా ఆస్తి సంపాదించుకొనువాడు 11
తాను పెట్టని గుడ్లను పొదుగు కౌజుపిట్టవలె నున్నాడు;
సగము ప్రాయములో వాడు దానిని విడువవలసి
వచ్చును; అట్టివాడు కడాపట వాటిని విడుచుచు
అవివేకిగా కనబడును.

మొదటినుండి ఉన్నతస్థలముననుండు మహిమా, 12
సింహాసనము మా పరిశుద్ధాలయ స్థానము.[1] । ఇశ్రా 13
యేలుకు ఆశ్రయమా, యెహోవా, నిన్ను విసర్జించు
వారందరు సిగ్గునొందుదురు. నాయెడల ద్రోహము
చేయువారు యెహోవా అను జీవజలముల ఊటను
విసర్జించియున్నారు గనుక వారు ఇసుకమీద పేరు
వ్రాయబడినవారుగా ఉందురు. । యెహోవా, నీవు 14
నన్ను స్వస్థపరచినయెడల నేను స్వస్థతనొందుదును,
నన్ను రక్షించినయెడల నేను రక్షింపబడుదును, నేను
నిన్ను స్తోత్రించుటకు నీవే కారణభూతుడవు. । వారు 15
—యెహోవా వాక్కు ఎక్కడనున్నది? దాని రానిమ్మని

1 లేక, మహిమా, సింహాసనమా, మొదటినుండి యున్నతస్థలమా, మా పరిశుద్ధాలయస్థానమా.

16 యనుచున్నారు. । నేను నిన్ను అనుసరించు కాపరినై
యుండుట మానలేదు, ఘోరమైన దినమును చూడ
వలెనని నేను కోరలేదు, నీకే తెలిసియున్నది, నా
నోటనుండి వచ్చిన మాట నీ సన్నిధిలోనున్నది. ।
17 ఆపత్కాలమందు నీవే నా ఆశ్రయము, నాకు
18 అధైర్యము పుట్టింపకుము. । నన్ను సిగ్గుపడనియ్యక
నన్ను తరుమువారిని సిగ్గుపడనిమ్ము, నన్ను దిగులుపడ
నియ్యక వారిని దిగులుపడనిమ్ము, వారిమీదికి ఆపద్దినము
రప్పించుము, రెట్టింపు నాశనముతో వారిని నశింప
జేయుము.

19 యెహోవా నాకీలాగు సెలవిచ్చియున్నాడు—
నీవు వెళ్లి యూదారాజులు వచ్చుచు పోవుచునుండు
జనుల గుమ్మమునను యెరూషలేము గుమ్మములన్నిటను
20 నిలిచి జనులలో దీని ప్రకటన చేయుము ।—యూదా
రాజులారా, యూదావారలారా, యెరూషలేము
నివాసులారా, ఈ గుమ్మములలో ప్రవేశించు సమస్త
మైనవారలారా, యెహోవా మాట వినుడి. ।
21 యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — మీ
విషయములో జాగ్రత్తపడుడి, విశ్రాంతిదినమున ఏ
బరువును మోయకుడి, యెరూషలేము గుమ్మములలో
22 గుండ ఏ బరువును తీసికొని రాకుడి. । విశ్రాంతి
దినమున మీ యిండ్లలోనుండి యే బరువును మోసి
కొని పోకుడి, యే పనియు చేయకుడి, నేను మీ
పితరుల కాజ్ఞాపించినట్లు విశ్రాంతిదినమును ప్రతిష్ఠిత
23 దినముగా ఎంచుకొనుడి. । అయితే వారు వినక
పోయిరి, చెవిని బెట్టకపోయిరి, వినకుండను బోధనొంద
24 కుండను మొండికి తిరిగిరి. । మరియు యెహోవా
ఈ మాట సెలవిచ్చెను—మీరు నామాట జాగ్రత్తగా
విని, విశ్రాంతిదినమున ఏ పనియు చేయక దాని
ప్రతిష్ఠితదినముగా ఎంచి, విశ్రాంతిదినమున ఈ పట్ట
ణపు గుమ్మములలోగుండ ఏ బరువును తీసికొని పోకుం
25 డిన పక్షమున । దావీదు సింహాసనమందు ఆసీనులై, రథ
ములమీదను గుఱ్ఱములమీదను ఎక్కి తిరుగుచుండు
రాజులును అధిపతులును ఈ పట్టణపు గుమ్మములలో
ప్రవేశింతురు. వారును వారి అధిపతులును యూదా
వారును యెరూషలేము నివాసులును ఈ పట్టణపు
గుమ్మములలో ప్రవేశింతురు; మరియు ఈ పట్టణము
26 నిత్యము నిలుచును. । మరియు జనులు దహనబలులను
బలులను నైవేద్యములను ధూపద్రవ్యములను తీసికొని
యూదా పట్టణములలోనుండియు, యెరూషలేము
ప్రాంతములలోనుండియు, బెన్యామీను దేశములో
నుండియు, మైదానపు దేశములోనుండియు, మన్య
ములోనుండియు, దక్షిణదేశములోనుండియు వచ్చె
దరు; యెహోవా మందిరమునకు స్తుతి యాగద్రవ్య
తీసికొని వచ్చెదరు. । అయితే మీరు విశ్రాంతి
తిష్ఠితదినముగా ఎంచి, ఆ దినమున బరు
వులు మోసికొనుచు యెరూషలేము గుమ్మములలో
ప్రవేశింపకూడదని నేను చెప్పిన మాట మీరు వినక
పోతిరి గనుక నేను దాని గుమ్మములలో అగ్ని రగుల
బెట్టెదను, అది యెరూషలేము నగరులను కాల్చివే
యును, దాని ఆర్పుటకు ఎవరికిని సాధ్యము కాక
పోవును.

యెహోవాయొద్దనుండి యిర్మీయాకు ప్రత్యక్ష 18
మైన వాక్కు । — నీవు లేచి కుమ్మరి యింటికి పొమ్ము, 2
అక్కడ నా మాటలు నీకు తెలియజేతును. । నేను 3
కుమ్మరి యింటికి వెళ్లగా వాడు తన సారెమీద పని
చేయుచుండెను. । కుమ్మరివాడు జిగటమంటితో చేయు 4
చున్న కుండ వాని చేతిలో విడిపోగా ఆ జిగటమన్ను
మరల తీసికొని కుమ్మరివాడు తనకు యుక్తమైనట్టుగా
దానితో మరియొక కుండ చేసెను.

అంతట యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై 5
యీలాగు సెలవిచ్చెను । — ఇశ్రాయేలువారలారా, 6
ఈ కుమ్మరివాడు మంటికి చేసినట్లు నేను మీకు
చేయలేనా? యిదే యెహోవా వాక్కు — జిగట
మన్ను కుమ్మరిచేతిలో ఉన్నట్టుగా ఇశ్రాయేలువార
లారా, మీరు నా చేతిలో ఉన్నారు. । దాని పెల్ల 7
గింతుననియు, విరుగగొట్టుదుననియు, నశింపజేయు
దుననియు ఏదోయొక జనమునుగూర్చి గాని రాజ్య
మునుగూర్చి గాని నేను చెప్పియుండగా । ఏ జనమును 8
గూర్చి నేను చెప్పితినో ఆ జనము చెడుతనముచేయుట
మానినయెడల నేను వారికి చేయ నుద్దేశించిన కీడును
గూర్చి సంతాపపడుదును. । మరియు కట్టెదననియు, 9
నాటెదననియు ఒక జనమునుగూర్చి గాని రాజ్య
మునుగూర్చి గాని నేను చెప్పియుండగా । ఆ జనము 10
నా మాట వినకుండ నా దృష్టికి కీడుచేసినయెడల దానికి
చేయదలచిన మేలునుగూర్చి నేను సంతాపపడుదును. ।
కాబట్టి నీవు వెళ్లి యూదావారితోను యెరూషలేము 11
నివాసులతోను ఇట్లనుము—యెహోవా సెలవిచ్చిన
మాట ఏదనగా—మీమీదికి తెచ్చుటకై నేను కీడును
కల్పించుచున్నాను, మీకు విరోధముగా ఒక యోచన
చేయుచున్నాను, మీరందరు మీ మీ దుష్టమార్గము
లను విడిచి మీ మార్గములను మీ క్రియలను చక్క
పరచుకొనుడి. । అయితే వారు — నీ మాట నిష్ 12
ప్రయోజనము; మేము మా ఆలోచనల చొప్పున
నడుచుకొందుము, మేమందరము మా మూర్ఖ హృద
యము చొప్పున ప్రవర్తించుదుము అని యందురు.

కావున యెహోవా ఈలాగు సెలవిచ్చుచు 13
న్నాడు — అన్యజనులను అడిగి తెలిసికొనుడి; ఇట్టి
క్రియలు జరుగుట వారిలో ఎవడైన వినెనా? ఇశ్రా
యేలు కన్యక బహు ఘోరమైన కార్యము చేసి
యున్నది. । లెబానోను హిమము పొలములోని బండ 14
మీద కురియక మానునా! దూరమునుండి పారుచున్న

15 చల్లని జలములు పారక మానునా? । అయితే నా
ప్రజలు నన్ను మరచియున్నారు, మాయకు ధూపము
వేయుచున్నారు, మెరకచేయబడని దారిలో తాము
నడువవలెనని పురాతన మార్గములైన త్రోవలలో
16 తమ్మును తాము తొట్రిల్ల చేసికొనుచున్నారు. । వారు
ఎల్లప్పుడును అపహాస్యాస్పదముగా నుండుటకై తమ
దేశమును పాడుగా చేసికొనియున్నారు, దాని మార్గ
మున నడుచు ప్రతివాడును ఆశ్చర్యపడి తల ఊచును. ।
17 తూర్పుగాలి చెదరగొట్టునట్లు వారి శత్రువులయెదుట
నిలువకుండ వారిని నేను చెదరగొట్టెదను; వారి ఆపద్దిన
మందు వారికి విముఖుడనై వారిని చూడకపోదును.
18 అప్పుడు జనులు—యిర్మీయా విషయమై యుక్తిగల
యోచన చేతము రండి; యాజకుడు ధర్మశాస్త్రము విని
పించక మానడు, జ్ఞాని యోచనలేకుండ నుండడు,
ప్రవక్త వాక్యము చెప్పక మానడు, వాని మాటలలో
నేనిని వినకుండ మాటలతో వాని కొట్టుదము రండి
అని చెప్పుకొనుచుండిరి.
19 యెహోవా, నా మొఱ్ఱ నాలకించుము, నాతో
20 వాదించువారి మాటను వినుము. । వారు నా ప్రాణము
తీయవలెనని గుంట త్రవ్వియున్నారు; చేసిన మేలుకు
ప్రతిగా కీడు చేయవలెనా? వారికి మేలు కలుగవలె
నని వారిమీదనుండి నీ కోపము తప్పించుటకై నీ
సన్నిధిని నిలిచి నేను వారిపక్షముగా మాటలాడిన
21 సంగతి జ్ఞాపకము చేసికొనుము. । వారి కుమారులను
క్షామమునకు అప్పగింపుము, ఖడ్గబలమునకు వారిని
అప్పగింపుము, వారి భార్యలు పిల్లలు లేనివారై విధవ
రాండ్రగుదురు గాక, వారి పురుషులు మరణహతులగు
దురు గాక, వారి యౌవనులు యుద్ధములో ఖడ్గము
22 చేత హతులగుదురు గాక. । నన్ను పట్టుకొనుటకు
వారు గొయ్యి త్రవ్విరి, నా కాళ్లకు ఉరులనొగ్గిరి;
వారిమీదికి నీవు ఆకస్మికముగా దండును రప్పించుట
వలన వారి యిండ్లలోనుండి కేకలు వినబడును గాక. ।
23 యెహోవా, నాకు మరణము రావలెనని వారు నా
మీద చేసిన ఆలోచన అంతయు నీకు తెలిసేయున్నది,
వారి దోషమునకు ప్రాయశ్చిత్తము కలుగనియ్యకుము,
నీ సన్నిధినుండి వారి పాపమును తుడిచివేయకుము;
వారు నీ సన్నిధిని తొట్రిల్లుదురు గాక, నీకు కోపము
పుట్టుకాలమున వారికి (తగినపని) చేయుము.

**19** యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—
2 నీవు వెళ్లి కుమ్మరివాడు చేయు మంటి కూజాను కొని,
జనుల పెద్దలలో కొందరిని యాజకుల పెద్దలలో
కొందరిని పిలుచుకొనిపోయి, హర్సీతు గుమ్మపు ద్వార
మునకు ఎదురుగానున్న బెన్‌హిన్నోము లోయలోకి
పోయి నేను నీతో చెప్పబోవు మాటలు అక్కడ
3 ప్రకటింపుము. । నీవిట్లనుము—యూదా రాజులారా,
యెరూషలేము నివాసులారా, యెహోవా మాట
వినుడి; సైన్యములకధిపతియు ఇశ్రాయేలు దేవుడునగు
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—ఆలకిం
చుడి, దాని సమాచారము వినువారందరికి చెవులు
గింగురుమనునంత కీడును నేను ఈ స్థలముమీదికి
రప్పింపబోవుచున్నాను. । ఏలయనగా వారు నన్ను విస 4
ర్జించి యీ స్థలములో అపచారము చేసియున్నారు,
వారైనను వారి తండ్రులైనను యూదా రాజులైనను
ఎరుగని అన్యదేవతలకు దానిలో ధూపమువేసి నిరప
రాధుల రక్తముచేత ఈ స్థలమును నింపిరి. । నేను 5
విధింపనిదియు సెలవియ్యనిదియు నా మనస్సునకు
తోచనిదియునైన ఆచారము నాచరించిరి; తమ కుమా
రులను దహనబలులుగా కాల్చుటకై బయలుకు బలి
పీఠములను కట్టించిరి. । ఇందునుబట్టి యెహోవా 6
సెలవిచ్చుమాట ఏదనగా—రాబోవు దినములలో ఈ
స్థలము హతిలోయ అనబడును గాని తోఫెతు అని
యైనను బెన్‌హిన్నోము లోయ అనియైనను పేరు
వాడబడదు. । తమ శత్రువులయెదుట ఖడ్గముచేతను, 7
తమ ప్రాణములను తీయ వెదకువారిచేతను వారిని
కూలజేసి, ఆకాశపక్షులకును భూజంతువులకును
ఆహారముగా వారి కళేబరములను ఇచ్చి, ఈ స్థలము
లోనే యూదావారి ఆలోచనను యెరూషలేమువారి
ఆలోచనను నేను వ్యర్థముచేసెదను. । ఆ మార్గమున 8
పోవు ప్రతివాడును ఆశ్చర్యపడి దానికి కలిగిన యిడు
మలన్నిటిని చూచి అపహాస్యము చేయునంతగా ఈ
పట్టణమును పాడుగాను అపహాస్యాస్పదముగాను
నేను చేసెదను. । వారు తమ కుమారుల మాంసమును 9
తమ కుమార్తెల మాంసమును తినునట్లు చేసెదను; తమ
ప్రాణము తీయ వెదకు శత్రువులు తమకు ఇబ్బంది
కలిగించుటకై వేయు ముట్టడినిబట్టియు దానివలన
కలిగిన యిబ్బందినిబట్టియు వారిలో ప్రతివాడు తన
చెలికాని మాంసము తినును. । ఈ మాటలు చెప్పిన 10
తరువాత నీతోకూడ వచ్చిన మనుష్యులు చూచుచుం
డగా నీవు ఆ కూజాను పగులగొట్టి వారితో ఈలా
గనవలెను । —సైన్యములకధిపతియగు యెహోవా 11
ఈలాగు సెలవిచ్చుచున్నాడు — మరల బాగుచేయ
నశక్యమైన కుమ్మరి పాత్రను ఒకడు పగులగొట్టునట్లు
నేను ఈ జనమును ఈ పట్టణమును పగులగొట్టబోవు
చున్నాను; తోఫెతులో పాతిపెట్టుటకు స్థలము లేక
పోవునంతగా వారు అక్కడనే పాతిపెట్టబడుదురు. ।
యెహోవా వాక్కు ఇదే—ఈ పట్టణము తోఫెతు 12
వంటి స్థలముగా నేను చేయుదును, ఈ స్థలమునకును
దాని నివాసులకును నేనాలాగున చేయుదును. ।
యెరూషలేము ఇండ్లును యూదారాజుల నగరులును 13
ఆ తోఫెతు స్థలమువలెనే అపవిత్రములగును, ఏ
యిండ్లమీద జనులు ఆకాశ సమూహమును దేవతలకు
ధూపము వేయుదురో, లేక అన్యదేవతలకు పానా

3 యిర్మీయా వారితో ఇట్లనెను–మీరు సిద్కియాతో ఈ
4 మాట చెప్పుడి। —ఇశ్రాయేలు దేవుడైన యెహోవా
ఈలాగు సెలవిచ్చుచున్నాడు–బాబెలు రాజుమీదను,
మిమ్మును ముట్టడివేయు కల్దీయులమీదను, మీరుపయో
గించుచున్న యుద్ధాయుధములను ప్రాకారముల
బయటనుండి తీసికొని యీ పట్టణములోపలికి వాటిని
5 పోగుచేయించెదను. । కోపమును రౌద్రమును అత్యు
గ్రతయు కలిగినవాడనై, చాపిన హస్తముతోను బల
మైన బాహువుతోను నేనే మీతో యుద్ధము చేసె
6 దను. । మనుష్యులనేమి పశువులనేమి యీ పట్టణపు
నివాసులనందరిని హతముచేసెదను; గొప్ప తెగులు
7 చేత వారు చచ్చెదరు. । అటుతరువాత నేను యూదా
దేశపు రాజైన సిద్కియాను, అతని ఉద్యోగస్థులను,
తెగులును ఖడ్గమును క్షామమును తప్పించుకొని శేషిం
చిన ప్రజలను, బాబెలురాజైన నెబుకద్రెజరు
చేతికి, వారి ప్రాణములను తీయజూచువారి శత్రు
వులచేతికి అప్పగించెదను. అతడు వారియందు అను
గ్రహము చూపకయు, వారిని కరుణింపకయు, వారి
యెడల జాలిపడకయు వారిని కత్తివాత హతము
8 చేయును. । ఈ ప్రజలతో నీవిట్లనుము—యెహోవా
సెలవిచ్చునదేమనగా — జీవమార్గమును మరణమార్గ
9 మును నేను మీయెదుట పెట్టుచున్నాను. । ఈ పట్ట
ణములో నిలుచువారు కత్తివలనగాని క్షామమువలన
గాని తెగులువలనగాని చచ్చెదరు, మేలుచేయుటకు
కాదు కీడుచేయుటకే నేను ఈ పట్టణమునకు అభి
ముఖుడనైతిని గనుక బయటకు వెళ్లి మిమ్మును ముట్టడి
వేయుచున్న కల్దీయులకు లోబడువారు బ్రదుకుదురు;
దోపుడుసొమ్ము దక్కినట్లుగా వారి ప్రాణము వారికి
10 దక్కును. । ఈ పట్టణము బాబెలు రాజుచేతికి అప్ప
గింపబడును, అతడు అగ్నిచేత దాని కాల్చివేయును;
ఇదే యెహోవా వాక్కు.

11 యూదారాజు ఇంటివారలకు ఆజ్ఞ యిదే —
12 యెహోవా మాట వినుడి. । దావీదు వంశస్థులారా,
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — అను
దినము న్యాయముగా తీర్పు తీర్చుడి, దోచుకొనబడిన
వానిని బాధపెట్టువాని చేతిలోనుండి విడిపించుడి,
ఆలాగు చేయనియెడల మీ దుష్టక్రియలనుబట్టి నా
క్రోధము అగ్నివలె బయలువెడలి, యెవడును ఆర్ప
13 లేకుండ మిమ్మును దహించును. । యెహోవా వాక్కు
ఇదే — లోయలో నివసించుదానా, మైదానమందలి
బండవంటిదానా,—మా మీదికి రాగలవాడెవడు, మా
నివాసస్థలములలో ప్రవేశించువాడెవడు? అనుకొను
14 వారలారా, । మీ క్రియల ఫలములనుబట్టి మిమ్మును
దండించెదను, నేను దాని అరణ్యములో అగ్ని రగల
బెట్టెదను, అది దాని చుట్టునున్న ప్రాంతములన్నిటిని
కాల్చివేయును; ఇదే యెహోవా వాక్కు.

యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు— 22
నీవు యూదారాజు నగరుకు పోయి అక్కడ ఈ 2
మాట ప్రకటింపుము — దావీదు సింహాసనముమీద
కూర్చుండు యూదారాజా, నీవును ఈ గుమ్మముల
ద్వారా ప్రవేశించు నీ ఉద్యోగస్థులును నీ జనులును
యెహోవా మాట వినుడని ప్రకటింపుము. ।
యెహోవా ఈలాగు ఆజ్ఞనిచ్చుచున్నాడు — మీరు 3
నీతి న్యాయములననుసరించి నడుచుకొనుడి, దోచు
కొనబడినవానిని బాధపెట్టువాని చేతిలోనుండి విడిపిం
చుడి, పరదేశులనైనను తండ్రిలేనివారినైనను విధవ
రాండ్రనైనను బాధింపకుడి, వారికి ఉపద్రవము కలుగ
జేయకుడి, ఈ స్థలములో నిరపరాధుల రక్తము చిందింప
కుడి. । మీరు నిశ్చయముగా ఈలాగున చేసినయెడల 4
దావీదు సింహాసనముమీద కూర్చుండు రాజులు రథము
లను గుఱ్ఱములను ఎక్కి తిరుగుచు, ఉద్యోగస్థుల సమే
తముగాను జనుల సమేతముగాను ఈ నగరు ద్వారముల
గుండ ప్రవేశింతురు. । మీరు ఈ మాటలు వినకపోయిన 5
పక్షమందు ఈ నగరు పాడైపోవును, నాతోడని ప్రమా
ణము చేయుచున్నాను; ఇదే యెహోవా వాక్కు. ।
యూదారాజు వంశస్థులనుగూర్చి యెహోవా ఈ 6
లాగు సెలవిచ్చుచున్నాడు — నా యెన్నికలో నీవు
గిలాదువలె నున్నావు, లెబానోను శిఖరమువలె
ఉన్నావు; అయినను నిశ్చయముగా ఎడారిగాను
నివాసులులేని పట్టణములుగాను నేను నిన్ను చేయు
దును. । నీమీదికి వచ్చుటకై యొక్కొక్కడు తన 7
ఆయుధములను పట్టుకొను సంహారకులను నేను ప్రతి
ష్ఠించుచున్నాను, వారు నీ దేవదారు చెట్లలో శ్రేష్ఠ
మైనవాటిని నరికి అగ్నిలో పడవేతురు. । అనేక 8
జనులు ఈ పట్టణపు మార్గమున పోవుచు–యెహోవా
యెందు నిమిత్తము ఈ గొప్పపట్టణమును ఈలాగు
చేసెనని యొకని నొకడు అడుగగా । అచ్చటివారు 9
—వీరు తమ దేవుడైన యెహోవా నిబంధనను నిరాక
రించి అన్యదేవతలను పూజించి వాటికి నమస్కారము
చేసినందున ఆయన ఈలాగున చేసియున్నాడని చెప్పు
దురు.

చనిపోయినవానిగూర్చి యేడవవద్దు, వానిగూర్చి 10
అంగలార్చవద్దు; వెళ్లిపోవుచున్నవానిగూర్చి బహు
రోదనముచేయుడి, వాడు ఇకను తిరిగి రాడు, తన జన్మ
భూమిని చూడడు. । తన తండ్రియైన యోషీయాకు 11
ప్రతిగా ఏలినవాడై యీ స్థలములోనుండి వెళ్లిపోయిన
యూదారాజైన యోషీయా కుమారుడగు షల్లూమును
గూర్చి యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—
అతడు ఇక్కడికి తిరిగి రాడు; । ఈ దేశము నిక 12
చూడక వారు అతని తీసికొనిపోయిన స్థలమునందే
అతడు చచ్చును.

నీతి తప్పి తన నగరును స్థాపించువానికి శ్రమ; 13

న్యాయము తప్పి తన మేడగదులను కట్టించుకొనుచు,
జీతమియ్యక తన పొరుగువానిచేత ఊరకయే కొలువు
14 చేయించుకొనువానికి శ్రమ. । వాడు విశాలమైన
మేడగదులుగల గొప్ప మందిరమును కట్టించుకొందు
ననుకొని, విస్తారమైన కిటికీలు చేసికొనుచు, దేవదారు
పలకలను దానికి సరంబీ వేయుచు, ఇంగిలీకముతో
15 రంగువేయుచునున్నాడే; । నీవు అతిశయపడి దేవదారు
పలకల గృహమును కట్టించుకొనుటచేత రాజవగు
దువా? నీ తండ్రి అన్నపానములు కలిగి నీతి న్యాయ
16 ముల ననుసరించుచు క్షేమముగా ఉండలేదా? । అతడు
దీనులకును దరిద్రులకును న్యాయము తీర్చుచు సుఖ
ముగా బ్రదికెను. ఆలాగున చేయుటే నన్ను తెలిసి
17 కొనుట కాదా; యిదే యెహోవా వాక్కు. । అయితే
నీ దృష్టియు నీ కోరికయు అన్యాయముగా లాభము
సంపాదించుకొనుటయందే, నిరపరాధుల రక్తము ఒలి
కించుటయందే (నిలిచియున్నవి.) అందుకొరకే నీవు
జనులను బాధించుచున్నావు, అందుకొరకే బలాత్కా
18 రము చేయుచున్నావు. । కావున యోషీయా కుమారు
డగు యెహోయాకీమను యూదారాజునుగూర్చి
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—జనులు
—అయ్యో నా సహోదరుడా, అయ్యో సహో
దరీ, అని అతనిగూర్చి అంగలార్చరు; అయ్యో,
నా యేలినవాడా, అయ్యో, శోభావంతుడా, అని
19 అతనికొరకు అంగలార్చరు. । అతడు యెరూషలేము
గుమ్మముల అవలికి ఈడువబడి పారవేయబడి గాడిదె
పాతిపెట్టబడురీతిగా పాతిపెట్టబడును.

20 (సీయోను కుమారీ) నీ విటకాండ్రు నాశనమైరి.
లెబానోనును ఎక్కి కేకలువేయుము; బాషానులో బిగ్గ
రగా అరువుము, అబారీమునుండి కేకలువేయుము. ।
21 నీ క్షేమకాలములలో నీతో మాటలాడితిని గాని —
నేను విననని నీవంటివి; నామాట వినకపోవుటే నీ
22 బాల్యమునుండి నీకు వాడుక. । నీ కాపరులందరు
గాలి పీల్చుదురు, నీ విటకాండ్రు చెరలోకి పోవుదురు,
నీ చెడుతనమంతటినిబట్టి నీవు అవమానమునొంది సిగ్గు
23 పడుదువు. । లెబానోను నివాసినీ, దేవదారు వృక్షము
లలో గూడుకట్టుకొనినదానా, ప్రసవించు స్త్రీకికలుగు
వేదనవంటి కష్టము నీకు వచ్చునప్పుడు నీవు బహుగా
24 కేకలువేయుదువు గదా. । యెహోవా సెలవిచ్చిన
దేమనగా—యూదా రాజైన యెహోయాకీము కుమా
రుడగు కొన్యా నా కుడిచేతికి శిఖా ఉంగరముగా ఉం
డినను దానిమీదనుండియు నిన్ను ఊడదీసివేసెదనని
25 నాతోడని ప్రమాణముచేయుచున్నాను. । నీ ప్రాణ
మును ఎవరు తీయజూచుచున్నారో నీవెవరికి భయ
పడుచున్నావో వారి చేతికి, అనగా బాబెలురాజైన
నెబుకద్రెజరు చేతికిని కల్దీయుల చేతికిని నిన్ను
26 అప్పగించుచున్నాను. । నిన్నును నిన్ను కనిన నీ తల్లిని
మీ జన్మభూమికాని పరదేశములోకి విసరివేసెదను,
మీరు అక్కడనే చచ్చెదరు. । వారు తిరిగి రావలెనని 27
బహుగా ఆశపడు దేశమునకు వారు తిరిగి రారు. ।
కొన్యా అను ఇతడు హేయమైన ఓటికుండవంటి 28
వాడా, పనికిమాలిన ఘటమా? అతడును అతని సం
తానమును విసరివేయబడి, తామెరుగని దేశములోకి ఏల
త్రోయబడిరి? । దేశమా దేశమా దేశమా, యెహోవా 29
మాట వినుము. । యెహోవా ఈలాగు సెలవిచ్చు 30
చున్నాడు—సంతానహీనుడనియు, తన దినములలో
వర్ధిల్లనివాడనియు ఈ మనుష్యునిగూర్చి వ్రాయుడి;
అతని సంతానములో ఎవడును వర్ధిల్లడు, వారిలో
ఎవడును దావీదు సింహాసనమందు కూర్చుండడు; ఇక
మీదట ఎవడును యూదాలో రాజుగా ఉండడు.

యెహోవా వాక్కు ఇదే—నా మందలో చేరిన 23
గొఱ్ఱెలను నశింపజేయుచు చెదరగొట్టు కాపరులకు
శ్రమ. । ఇశ్రాయేలు దేవుడైన యెహోవా తన 2
జనులను మేపు కాపరులనుగూర్చి యీలాగున సెల
విచ్చుచున్నాడు—మీరు నా గొఱ్ఱెలనుగూర్చి విచా
రణచేయక, నేను మేపుచున్న గొఱ్ఱెలను చెదరగొట్టి
పారదోలితిరి; ఇదిగో మీ దుష్క్రియలనుబట్టి మిమ్మును
శిక్షింపబోవుచున్నాను; ఇదే యెహోవా వాక్కు. ।
మరియు నేను వాటిని తోలివేసిన దేశములన్నిటిలో 3
నుండి నా గొఱ్ఱెల శేషమును సమకూర్చి తమ దొడ్లకు
వాటిని రప్పించెదను; అవి అభివృద్ధిపొంది విస్తరిం
చును. । నేను వాటిమీద కాపరులను నియమించె 4
దను; ఇకమీదట అవి భయపడకుండను బెదరిపోకుం
డను వాటిలో ఒకటైనను తప్పిపోకుండను వీరు నా
గొఱ్ఱెలను మేపెదరు; ఇదే యెహోవా వాక్కు.

యెహోవా ఈలాగు ఆజ్ఞ ఇచ్చుచున్నాడు— 5
రాబోవు దినములలో నేను దావీదునకు నీతి చిగురును
పుట్టించెదను; అతడు రాజై పరిపాలన చేయును,
అతడు వివేకముగా నడుచుకొనుచు కార్యము జరిగిం
చును, భూమిమీద నీతి న్యాయములను జరిగించును. ।
అతని దినములలో యూదా రక్షణనొందును, ఇశ్రా 6
యేలు నిర్భయముగా నివసించును, మనకు నీతియగు
యెహోవా అని అతనికి పేరు పెట్టుదురు. । కాబట్టి 7
రాబోవు దినములలో జనులు ఇశ్రాయేలీయులను
ఐగుప్తు దేశములోనుండి రప్పించిన యెహోవా జీవము
తోడని యిక ప్రమాణముచేయక । ఉత్తర దేశములో 8
నుండియు, నేను వారిని చెదరగొట్టిన దేశములన్నిటి
లోనుండియు వారిని రప్పించిన యెహోవానగు
నాతోడని ప్రమాణము చేతురని యెహోవా సెల
విచ్చుచున్నాడు; మరియు వారు తమ దేశములో నివ
సింతురు.

ప్రవక్తలనుగూర్చినది. యెహోవానుగూర్చియు 9
ఆయన పరిశుద్ధమైన మాటలను గూర్చియు (నేను తల

ా) ప్రవక్తలనుబట్టి నా గుండె నాలో పగులు
, నా యెముకలన్నియు కదలుచున్నవి, నేను
ానివలెను ద్రాక్షారసవశుడైన బలాఢ్యునివలెను
ు. । దేశము వ్యభిచారులతో నిండియున్నది,
ుడవడి చెడ్డదాయెను, వారి శౌర్యము అన్యా
కుపయోగించుచున్నది గనుక శాపగ్రస్తమై
ుఃఖపడుచున్నది; అడవిబీళ్లు ఎండిపోయెను. ।
మి యాజకులేమి అందరును అపవిత్రులు;
దిరములో వారి చెడుతనము నాకు కనబడెను;
ెహోవా వాక్కు. । వారి దండన సంవత్సర
ారిమీదికి నేను కీడు రప్పించుచున్నాను గనుక
ధకారములో నడుచువానికి జారుడు నేలవలె
ర్గముండును; దానిలో వారు తరుమబడి పడి
ురు; ఇదే యెహోవా వాక్కు. । షోమ్రోను
ు అవివేకక్రియలు చేయగా చూచితిని; వారు
పేరట ప్రవచనము చెప్పి నా జనమైన ఇశ్రా
త్రోవ తప్పించిరి. । యెరూషలేము ప్రవక్తలు
ైన క్రియలు చేయగా నేను చూచితిని, వారు
రులు అసత్యవర్తనులు, ఎవడును తన దుర్మార్గ
ువకుండ దుర్మార్గులచేతులను బలపరచుదురు,
ు నా దృష్టికి సొదొమవలెనైరి, దాని నివా
ొమొఱ్ఱావలెనైరి.
ున సైన్యములకధిపతియగు యెహోవా ఈ
ుగూర్చి సెలవిచ్చునదేమనగా — యెరూష
్రవక్తల అపవిత్రత దేశమంతట వ్యాపించెను
ినుటకు మాచిపత్రియు త్రాగుటకు చేదు
నేను వారికిచ్చుచున్నాను. । సైన్యములకధిపతి
ెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—
ప్రవచనములు ప్రకటించు ప్రవక్తల మాటలను
ుడి, వారు మిమ్మును భ్రమపెట్టుదురు. । వారు
ృణీకరించువారితో—మీకు క్షేమము కలుగు
ెహోవా సెలవిచ్చెననియు; ఒకడు తన
ుమూర్ఖత చొప్పున నడవగా వానితో—మీకు
ునియు చెప్పుచు, యెహోవా ఆజ్ఞనుబట్టి
ుడక తమకు తోచిన దర్శనమునుబట్టి పలుకు
ెహోవా మాట విని గ్రహించునట్లు ఆయన
ిలుచువాడెవడు? నా మాటను గ్రహించునట్లు
ుమ్యము చేసినవాడెవడు? । ఇదిగో యెహోవా
ాగ్రతయను పెనుగాలి బయలువెళ్లుచున్నది;
ుకరమైన పెనుగాలి, అది దుష్టుల తలమీదికి
దిగును. । తన కార్యమును సఫలపరచువర
ున హృదయాలోచనలను నెరవేర్చువరకును
ోవా కోపము చల్లారదు; అంత్యదినములలో
ుతిని మీరు బాగుగా గ్రహించుదురు. । నేను
వక్తలను పంపకుండినను వారు పరుగెత్తివచ్చె
ును వారితో మాటలాడకుండినను వారు ప్రక
టించెదరు. । వారు నా సభలో చేరినవారైన పక్ష 22
మున వారు నా మాటలు నా ప్రజలకు తెలియజేతురు,
దుష్క్రియలు చేయక వారు దుర్మార్గమును విడిచిపెట్టు
నట్లు వారిని త్రిప్పియుందురు; ఇదే యెహోవా
వాక్కు. । — నేను సమీపముననుండి చూచు దేవు 23
డనా? దూరముననుండి చూచు దేవుడను కానా? ।
యెహోవా సెలవిచ్చిన మాట ఏదనగా—నాకు కన 24
బడకుండ రహస్యస్థలములలో దాగగలవాడెవడైన
కలడా? నేను భూమ్యాకాశములయందంతటనున్న
వాడను కానా? యిదే యెహోవా వాక్కు. । —
కలకంటిని కలకంటిని అని చెప్పుచు నా నామమున 25
అబద్ధములు ప్రకటించు ప్రవక్తలు పలికినమాట నేను
వినియున్నాను. । ఇక నెప్పటివరకు ఈలాగున జరుగు 26
చుండును? తమ హృదయకాపట్యమునుబట్టి అబద్ధ
ములు ప్రకటించు ప్రవక్తలు దీని నాలోచింపరా? ।
బయలును పూజింపవలెనని తమ పితరులు నా నామ 27
మును మరచినట్లు, వీరందరు తమ పొరుగువారితో
చెప్పు కలలచేత నా జనులు నా నామమును మరచు
నట్లు చేయవలెనని యోచించుచున్నారా? । కల 28
కనిన ప్రవక్త ఆ కలను చెప్పవలెను; నా వాక్కు
ఎవనికుండునో వాడు సత్యమునుబట్టి నా మాట చెప్ప
వలెను; ధాన్యముతో చెత్తకు ఏమి సంబంధము? ఇదే
యెహోవా వాక్కు. । నా మాట అగ్నివంటిది 29
కాదా? బండను బద్దలుచేయు సుత్తెవంటిది కాదా?
కాబట్టి తమ జతవానియొద్దనుండి నా మాట 30
లను దొంగిలించు ప్రవక్తలకు నేను విరోధిని; ఇదే
యెహోవా వాక్కు. । స్వేచ్ఛగా నాలుకల నాడించు 31
కొనుచు దేవోక్తులను ప్రకటించు ప్రవక్తలకు నేను
విరోధిని; ఇదే యెహోవా వాక్కు. । మాయాస్వప్న 32
ములను ప్రకటించి వాటిని చెప్పుచు, అబద్ధముల
చేతను, మాయాప్రగల్భతచేతను నా ప్రజలను దారి
తొలగించువారికి నేను విరోధినై యున్నాను; ఇదే
యెహోవా వాక్కు. నేను వారిని పంపలేదు, వారికి
ఆజ్ఞ ఇయ్యలేదు, వారు ఈ జనులకు ఏమాత్రమును
ప్రయోజనకారులు కారు; ఇదే యెహోవా వాక్కు. ।
మరియు ఈ జనులలో ఒకడు ప్రవక్తయే గాని యాజ 33
కుడే గాని యెహోవా భారమేమి అని నిన్నడుగు
నప్పుడు నీవు వారితో ఇట్లనుము—మీరే ఆయనకు
భారము; మిమ్మును ఎత్తి పారవేతును; ఇదే యెహోవా
వాక్కు. । మరియు — ప్రవక్తయే గాని యాజకుడే 34
గాని సామాన్యుడేగాని యెహోవా భారమను మాట
ఎత్తువాడెవడైనను, వానిని వాని యింటివారిని నేను
దండించెదను. । అయితే యెహోవా ప్రత్యుత్తర 35
మేది? యెహోవా యేమని చెప్పుచున్నాడు? అని
మీరు మీ పొరుగువారితోను సహోదరులతోను
ప్రశంసించవలెను. । యెహోవా భారమను మాట 36

మీరికమీదట జ్ఞాపకము చేసికొనవద్దు; జీవముగల
మన దేవుని మాటలను, సైన్యములకధిపతియు దేవుడు
నగు యెహోవా మాటలను, మీరు అపార్థముచేసి
తిరి; కాగా ఎవనిమాట వానికే భారమగును. ।
37 యెహోవా నీకేమని ప్రత్యుత్తరమిచ్చుచున్నాడ
నియు, యెహోవా యేమి చెప్పుచున్నాడనియు
మీరు ప్రవక్తను అడుగవలెను గాని యెహోవా భార
38 మను మాట మీరెత్తిన పక్షమున । అందునుగూర్చి
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — మీరు
యెహోవా భారమను మాట యెత్తవద్దని నేను మీకు
ఆజ్ఞ ఇచ్చినను మీరు యెహోవా భారమను మాట
39 యెత్తుచునే యున్నారు । కాగా నేను మిమ్మును ఎత్తి
వేయుచున్నాను, మీకును మీ పితరులకును నేనిచ్చిన
పట్టణమును నా సన్నిధినుండి పారవేయుచున్నాను. ।
40 ఎన్నడును మరువబడని నిత్యాపవాదమును నిత్యావ
మానమును మీమీదికి రప్పించెదను.

**24** బాబెలురాజైన నెబుకద్రెజరు యూదారాజైన
యెహోయాకీము కుమారుడగు యెకోన్యాను
యూదా ప్రధానులను శిల్పకారులను కంసాలులను
యెరూషలేమునుండి చెరపట్టుకొని బాబెలుకు తీసికొని
పోయిన తరువాత యెహోవా నాకు చూపగా
యెహోవా మందిరము ఎదుట ఉంచబడిన రెండు
2 గంపల అంజూరపు పండ్లు నాకు కనబడెను. । ఒక
గంపలో ముందుగా పక్వమైన అంజూరపు పండ్లవంటి
మిక్కిలి మంచి అంజూరపు పండ్లుండెను, రెండవ గం
పలో మిక్కిలి జబ్బైన అంజూరపు పండ్లుండెను; అవి
3 తిన శక్యముకానంతగా జబ్బువి. । యెహోవా —
యిర్మీయా, నీకేమి కనబడుచున్నదని నన్నడుగగా
నేను — అంజూరపుపండ్లు కనబడుచున్నవి, మంచివి
మిక్కిలి మంచివిగాను జబ్బువి మిక్కిలి జబ్బువిగాను,
తినశక్యముకానంత జబ్బువిగాను కనబడుచున్నవంటిని. ।
4 అప్పుడు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
5 యీలాగు సెలవిచ్చెను । — ఇశ్రాయేలు దేవుడైన
యెహోవా ఆజ్ఞ ఇచ్చునదేమనగా — వారికి మేలు
కలుగవలెనని ఈ స్థలమునుండి నేను కల్దీయుల దేశ
మునకు చెరగా పంపు యూదులను, ఒకడు ఈ మంచి
అంజూరపుపండ్లను లక్ష్యపెట్టునట్లు లక్ష్యపెట్టు
6 చున్నాను. । వారికి మేలు కలుగునట్లు నేను వారిమీద
దృష్టియుంచుచు, ఈ దేశమునకు వారిని మరల తీసి
కొనివచ్చి, పడగొట్టక వారిని కట్టెదను, పెల్లగింపక
7 వారిని నాటెదను. । వారు పూర్ణహృదయముతో నా
యొద్దకు తిరిగి రాగా వారు నా జనులగునట్లును నేను
వారి దేవుడనగునట్లును నేను యెహోవానని
8 నన్నెరుగు హృదయమును వారికిచ్చెదను. । మరియు
యూదారాజైన సిద్కియాను అతని ప్రధానులను దేశ
ములో శేషించినవారిని ఐగుప్తుదేశమున నివసించు
వారిని, మిక్కిలి జబ్బైనందున తిన శక్యముకాని ఆ జబ్బు
అంజూరపుపండ్లవలె ఉండజేసెదనని యెహోవా
సెలవిచ్చుచున్నాడు. । మరియు వారికి బాధకలుగు 9
టకై భూరాజ్యములన్నిటిలోను, నేను వారిని తోలి
వేయు స్థలములన్నిటిలోను, వారిని భీతికరముగాను
నిందాస్పదముగాను సామెతగాను అపహాస్యముగాను
శాపాస్పదముగాను ఉండజేసెదను. । నేను వారికిని 10
వారి పితరులకును ఇచ్చిన దేశములో ఉండకుండ వారు
నాశమైపోవువరకు నేను ఖడ్గమును క్షామమును తెగు
లును వారిలోకి పంపెదను.

యోషీయా కుమారుడును యూదారాజునైన **25**
యెహోయాకీము నాలుగవ సంవత్సరమున, అనగా
బాబెలురాజైన నెబుకద్రెజరు మొదటి సంవత్సర
మున యూదా ప్రజలందరినిగూర్చి యిర్మీయాకు
ప్రత్యక్షమైన వాక్కు. । ప్రవక్తయైన యిర్మీయా 2
యూదా ప్రజలందరితోను యెరూషలేము నివాసు
లందరితోను ఆ వాక్కును ప్రకటించెను. । ఆమోను 3
కుమారుడును యూదారాజునైన యోషీయా పదు
మూడవ సంవత్సరము మొదలుకొని నేటివరకు ఈ
యిరువది మూడు సంవత్సరములు యెహోవా వాక్కు
నాకు ప్రత్యక్షమగుచు వచ్చెను; నేను పెందలకడ
లేచి మీకు ఆ మాటలు ప్రకటించుచు వచ్చినను మీరు
వినకపోతిరి. । — మీ చేతి పనులవలన నాకు కోపము 4
పుట్టించకుండునట్లును, నేను మీకు ఏ బాధయు కలుగ 6
జేయకుండునట్లును, అన్యదేవతలను అనుసరించుటయు,
వాటిని పూజించుటయు, వాటికి నమస్కారము చేయు
టయు మాని, మీరందరు మీ చెడ్డమార్గమును మీ
దుష్క్రియలను విడిచిపెట్టి తిరిగినయెడల, యెహోవా
మీకును మీ పితరులకును నిత్యనివాసముగా దయ
చేసిన దేశములో మీరు నివసింతురని చెప్పుటకై,
యెహోవా పెందలకడ లేచి ప్రవక్తలైన తన సేవకుల
నందరిని మీయొద్దకు పంపుచు వచ్చినను మీరు వినక
పోతిరి, వినుటకు మీరు చెవియొగ్గకుంటిరి. । అయితే 7
—మీకు బాధ కలుగుటకై మీ చేతుల పనులవలన
నాకు కోపము పుట్టించి మీరు నా మాట ఆలకింపక
పోతిరని యెహోవా సెలవిచ్చుచున్నాడు. । సైన్య 8
ములకధిపతియగు యెహోవా మరియు ఈలాగు 9
సెలవిచ్చుచున్నాడు—మీరు నా మాటలను ఆలకింపక
పోతిరి గనుక నేను ఉత్తరదేశములోనున్న సర్వజనము
లను, నా సేవకుడైన నెబుకద్రెజరను బాబెలురాజును
పిలువనంపించుచున్నాను; ఈ దేశముమీదికిని దీని
నివాసులమీదికిని చుట్టునున్న యీ జనులందరిమీది
కిని వారిని రప్పించుచున్నాను; ఈ జనులను శాప
గ్రస్తులగాను విస్మయాస్పదముగాను అపహాస్యాస్పద
ముగాను ఎప్పటికిని పాడుగాను ఉండజేసెదను. ।
సంతోషనాదమును ఉల్లాస శబ్దమును, పెండ్లికుమా 10

రుని స్వరమును, పెండ్లికుమార్తె స్వరమును తిరుగటి
రాళ్ల ధ్వనిని దీపకాంతిని వారిలో ఉండకుండ చేసె
11 దను. । ఈ దేశమంతయు పాడుగాను నిర్జనముగాను
ఉండును; ఈ జనులు డెబ్బది సంవత్సరములు బాబెలు
12 రాజుకు దాసులుగా ఉందురు. । యెహోవా వాక్కు
ఇదే—డెబ్బది సంవత్సరములు గడచిన తరువాత వారి
దోషమునుబట్టి నేను బాబెలురాజును ఆ జనులను
కల్దీయుల దేశమును శిక్షింతును; ఆ దేశము ఎప్పుడు
13 పాడుగనుండునట్లు నియమింతును. । నేను ఆ దేశ
మునుగూర్చి సెలవిచ్చిన మాటలన్నియు యిర్మీయా ఈ
జనములన్నిటినిగూర్చి ప్రకటింపగా, ఈ గ్రంథ
ములో వ్రాయబడినదంతయు ఆ దేశముమీదికి రప్పిం
14 చెదను. । ఏలయనగా నేను వారి క్రియలనుబట్టియు
వారి చేతికార్యములనుబట్టియు వారికి ప్రతికారము
చేయునట్లు అనేక జనములును మహారాజులును వారి
చేత సేవచేయించుకొందురు.
15 ఇశ్రాయేలు దేవుడైన యెహోవా నాకీలాగు సెల
విచ్చుచున్నాడు—నీవు ఈ క్రోధపు మద్యపాత్రను
నా చేతిలోనుండి తీసికొని, నేను నిన్ను పంపుచున్న
16 జనములన్నిటికి దాని త్రాగింపుము. । వారు దాని
త్రాగి సొక్కి సోలుచు నేను వారిమీదికి పంపు
17 చున్న ఖడ్గమునుబట్టి వెర్రివాండ్లగుదురు. । అంతట
యెహోవా చేతిలోనుండి నేను ఆ పాత్రను తీసి
కొని, యెహోవా నన్ను పంపిన జనములన్నిటికి
18 దాని త్రాగించితిని. । నేటివలెనే పాడుగాను నిర్జనము
గాను అపహాస్యాస్పదముగాను శాపాస్పదముగాను
చేయుటకు యెరూషలేమునకును యూదా పట్టణముల
కును దాని మహారాజులకును దాని అధిపతులకును
19 త్రాగించితిని. । మరియు ఐగుప్తురాజైన ఫరోయును
అతని దాసులును అతని ప్రధానులును అతని జనులం
20 దరును । సమస్తమైన మిశ్రిత జనులును ఊజుదేశపు
రాజులందరును ఫిలిష్తీయుల దేశపు రాజులందరును
అష్కెలోనును, గాజయును, ఎక్రోనును అష్డోదు
21 శేషపువారును । ఎదోమీయులును మోయాబీయు
22 లును అమ్మోనీయులును । తూరు రాజులందరును
సీదోను రాజులందరును సముద్రమునకు ఆవలి ద్వీపపు
23 రాజులును । దదానీయులును తేమానీయులును బూజీ
యులును గడ్డపుప్రక్కలను కత్తిరించుకొనువారంద
24 రును । అరబిదేశపు రాజులందరును అరణ్యములో
25 నివసించు మిశ్రితజనముల రాజులందరును । జిమ్రీ
రాజులందరును ఏలాము రాజులందరును మాదీయుల
26 రాజులందరును । సమీపమున ఉన్నవారేమి దూర
మున ఉన్నవారేమి యుత్తరదేశముల రాజులందరును
భూమిమీదనున్న రాజ్యములన్నియు దానిలోనిది
త్రాగుదురు; షేషకురాజు వారి తరువాత త్రాగును. ।
27 నీవు వారితో ఈలాగు చెప్పుము—ఇశ్రాయేలు దేవు

డును సైన్యములకధిపతియునైన యెహోవా ఈలాగు
సెలవిచ్చుచున్నాడు — నేను మీమీదికి పంపబోవు
యుద్ధముచేత త్రాగి మత్తిల్లి కక్కుకొనినవారివలెనే
యుండి మీరు మరల లేవకుండ పడుదురు. । — మేము 28
త్రాగమని వారు నీ చేతిలోనుండి ఆ పాత్రను తీసి
కొననొల్లని పక్షమందు నీవు వారితో ఇట్లనుము —
మీరు అవశ్యముగా దాని త్రాగవలెనని సైన్యముల
కధిపతియగు యెహోవా సెలవిచ్చుచున్నాడు. ।
నాదని చాటింపబడిన పట్టణమునకు నేను కీడుచేయ 29
మొదలుపెట్టగా మీకు శిక్షలేకుండ పోవునా? మీరు
శిక్షింపబడకపోరు. భూలోక నివాసులందరిమీదికి
నేను ఖడ్గమును రప్పించుచున్నాను; ఇదే సైన్యముల
కధిపతియగు యెహోవా వాక్కు. । కాబట్టి నీవు 30
ఈ మాటలన్నిటిని వారికి ప్రకటించి ఈలాగు చెప్ప
వలెను—ఉన్నత స్థలములోనుండి యెహోవా గర్జించు
చున్నాడు, తన పరిశుద్ధాలయములోనుండి తన స్వర
మును వినిపించుచున్నాడు, తన మందమేయు స్థలము
నకు విరోధముగా గర్జించుచున్నాడు, ద్రాక్షగాను
గను త్రొక్కువారివలె అరుచుచు ఆయన భూలోక
నివాసులకందరికి విరోధముగా ఆర్భటించుచున్నాడు. ।
భూమ్యంతమువరకు సందడి వినబడును, యెహోవా 31
జనములతో వ్యాజ్యమాడుచున్నాడు, శరీరులందరితో
ఆయన వ్యాజ్యమాడుచున్నాడు, ఆయన దుష్టులను
ఖడ్గమునకు అప్పగించుచున్నాడు; ఇదే యెహోవా
వాక్కు.
సైన్యములకధిపతియగు యెహోవా ఈలాగు సెల 32
విచ్చుచున్నాడు — జనమునుండి జనమునకు కీడు
వ్యాపించుచున్నది, భూదిగంతములనుండి గొప్ప
తుఫాను బయలువెళ్లుచున్నది. । ఆ దినమున యెహో 33
వాచేత హతులైనవారు ఈ దేశముయొక్క యీ దిశ
నుండి ఆ దిశవరకు కనబడుదురు. ఎవరును వారిని
గూర్చి అంగలార్చరు, వారిని సమకూర్చరు, పాతి
పెట్టరు, పెంటవలె వారి శవములు నేలమీద పడియుం
డును. । మందకాపరులారా, గోలలెత్తుడి, మొర్ర 34
పెట్టుడి; మందలోని ప్రధానులారా, బూడిదె చల్లు
కొనుడి. మీరు మరణమునొందుటకై దినములు పూర్తి
యాయెను, నేను మిమ్మును చెదరగొట్టెదను, రమ్య
మైన పాత్రవలె మీరు పడుదురు. । మందకాపరు 35
లకు ఆశ్రయస్థలము లేకపోవును, మందలోని శ్రేష్ఠ
మైనవాటికి రక్షణ దొరకకపోవును. । ఆలకించుడి, 36
మందకాపరుల మొర్ర వినబడుచున్నది, మందలోని
ప్రధానుల గోల వినబడుచున్నది, యెహోవా వారి
మేతభూమిని పాడుచేసియున్నాడు. । నెమ్మదిగల 37
మేతస్థలములు యెహోవా కోపాగ్నిచేత పాడా
యెను; । క్రూరమైన ఖడ్గముచేతను ఆయన కోపాగ్ని 38

చేసెను వారి దేశము పాడుకాగా సింహము తన మరు
గును విడిచినట్టు ఆయన తన మరుగును విడిచెను.

**26** యోషీయా కుమారుడును యూదారాజునగు
యెహోయాకీము ఏలుబడి ఆరంభములో యెహో
వాయొద్దనుండి వాక్కు ప్రత్యక్షమై యీలాగు సెల
2 విచ్చెను । — యెహోవా ఆజ్ఞ ఇచ్చునదేమనగా,
నీవు యెహోవా మందిరావరణములో నిలిచి, నేను
నీకాజ్ఞాపించు మాటలన్నిటిని యెహోవా మందిర
ములో ఆరాధించుటకై వచ్చు యూదా పట్టణస్థులం
దరికి ప్రకటింపుము; వాటిలో ఒక్క మాటైనను
3 చెప్పక విడువకూడదు. । వారి దుర్మార్గమునుబట్టి వారికి
చేయదలచిన కీడును చేయక నేను సంతాపపడునట్లుగా
వారు ఆలకించి తమ దుర్మార్గము విడుచుదురేమో. ।
4 నీవు వారితో ఈ మాట చెప్పవలెను. యెహోవా
5 సెలవిచ్చునదేమనగా । — మీరు నా మాటలు విని
నేను మీకు నియమించిన ధర్మశాస్త్రము ననుసరించి
నడుచుకొనుడనియు, నేను పెందలకడ లేచి పంపు
చున్న నా సేవకులగు ప్రవక్తల మాటలను అంగీకరిం
చుడనియు నేను మీకు ఆజ్ఞ ఇయ్యగా మీరు వినక
6 పోతిరి. । మీరీలాగున చేసినందున నేను షిలోహుకు
చేసినట్లు ఈ మందిరమునకును చేసెదను, ఈ పట్టణ
మును భూమిమీదనున్న సమస్త జనములకు శాపా
7 స్పదముగా చేసెదను. । యిర్మీయా యీ మాటలను
యెహోవా మందిరములో పలుకుచుండగా యాజ
8 కులును ప్రవక్తలును జనులందరును వినిరి. । జనులకం
దరికి ప్రకటింపవలెనని యెహోవా యిర్మీయాకు ఆజ్ఞా
పించిన మాటలన్నిటిని అతడు పలికి చాలించిన తరువాత
యాజకులును ప్రవక్తలును జనులందరును అతని పట్టు
9 కొని—నీవు మరణశిక్ష నొందక తప్పదు. । యెహోవా
నామమునుబట్టి ఈ మందిరము షిలోహువలె నగు
ననియు, ఈ పట్టణము నివాసిలేక పాడైపోవుననియు
నీవేల ప్రకటించుచున్నావు అనుచు, ప్రజలందరు
యెహోవా మందిరములో యిర్మీయాయొద్దకు కూడి
వచ్చిరి.

10 యూదా అధిపతులు ఆ సంగతులు విని రాజు
నగరులోనుండి యెహోవా మందిరమునకు వచ్చి,
యెహోవా మందిరపు క్రొత్త గవిని ద్వారమున
11 కూర్చుండగా । యాజకులును ప్రవక్తలును అధిపతుల
తోను సమస్త ప్రజలతోను ఈలాగనిరి—మీరు చెవు
లార వినియున్న ప్రకారము, ఈ మనుష్యుడు ఈ
పట్టణమునకు విరోధముగా ప్రవచించుచున్నాడు;
12 గనుక ఇతడు మరణమునకు పాత్రుడు. । అప్పుడు
యిర్మీయా అధిపతులందరితోను జనులందరితోను ఈ
మాట చెప్పెను—ఈ మందిరమునకు విరోధముగాను
ఈ పట్టణమునకు విరోధముగాను మీరు వినిన మాట
ప్రకటించుటకు యెహోవాయే నన్ను
పంపియున్నాడు. । కాబట్టి యెహోవా మీకు
చేసెదనని తాను చెప్పిన కీడునుగూర్చి ఆయన సంతాప
పడునట్లు మీరు మీ మార్గములను మీ క్రియలను
చక్కపరచుకొని మీ దేవుడైన యెహోవా మాట
వినుడి. । ఇదిగో నేను మీ వశములోనున్నాను, మీ
దృష్టికేది మంచిదో యేది యుక్తమైనదో అదే నాకు
చేయుడి. । అయితే మీకు చెవులార ఈ మాటలన్ని
టిని చెప్పుటకు నిజముగా యెహోవా మీయొద్దకు
నన్ను పంపియున్నాడు గనుక, మీరు నన్ను చంపిన
యెడల మీరు మీమీదికిని ఈ పట్టణముమీదికిని
దాని నివాసులమీదికిని నిరపరాధి రక్తము తెప్పించు
దురని నిస్సందేహముగా తెలిసికొనుడి. । కాగా అధి
పతులును జనులందరును యాజకులతోను ప్రవక్తల
తోను ఇట్లనిరి — ఈ మనుష్యుడు మన దేవుడైన
యెహోవా నామమునుబట్టి మనకు ఈ సమాచా
రము ప్రకటించుచున్నాడు గనుక ఇతడు మరణము
నకు పాత్రుడు కాడు. । మరియు దేశమందలి పెద్ద
లలో కొందరు లేచి సమాజముగా కూడిన జనులతో
ఈ మాటలు పలికిరి ।—యూదారాజైన హిజ్కియా
దినములలో మోరష్తీయుడైన మీకా ప్రవచించుచుం
డెను. అతడు యూదా జనులందరితో ఇట్లు ప్రకటిం
చుచు వచ్చెను—సైన్యములకధిపతియగు యెహోవా
ఈలాగు సెలవిచ్చుచున్నాడు — పొలము దున్నునట్లు
సీయోను దున్నబడును, యెరూషలేము దిబ్బలుగా
ఉండును, మందిరమున్న కొండ అడవి మెట్టలుగా
ఉండును. । (అట్లు పలికినందున) యూదారాజైన
హిజ్కియాయైనను యూదా జనులందరిలో మరి
ఎవడైనను అతని చంపిరా? యెహోవా వారికి
చేసెదనని తాను చెప్పిన కీడును చేయక సంతాపపడు
నట్లు రాజు యెహోవాయందు భయభక్తులు కలిగి
యెహోవా దయను వేడుకొనెను గదా? మనము ఈ
కార్యము చేసినయెడల మనమీదికే గొప్ప కీడు
తెచ్చుకొందుము. । మరియు కిర్యత్యారీమువాడైన
షెమయా కుమారుడగు ఊరియాయను ఒకడు
యెహోవా నామమునుబట్టి ప్రవచించుచుండెను.
అతడు యిర్మీయా చెప్పిన మాటల రీతిని యీ పట్టణ
మునకు విరోధముగాను ఈ దేశమునకు విరోధము
గాను ప్రవచించెను. । రాజైన యెహోయాకీమును
అతని శూరులందరును ప్రధానులందరును అతని
మాటలు వినినమీదట రాజు అతని చంప జూచు
చుండగా, ఊరియా దాని తెలిసికొని భయపడి పారి
పోయి ఐగుప్తు చేరెను. । అప్పుడు రాజైన యెహోయా
కీము అక్బోరు కుమారుడగు ఎల్నాతానును అతనితో
కొందరిని ఐగుప్తునకు పంపెను; । వారు ఐగుప్తులో
నుండి ఊరియాను తీసికొనివచ్చి రాజైన యెహో
యాకీమునొద్ద చేర్చగా, ఇతడు ఖడ్గముతో అతని

...మాన్యజనుల సమాధిలో అతని కళేబరమును
...ను. ఈలాగు జరుగగా షాఫాను కుమారు
...హీకాము యిర్మీయాకు తోడైయున్నందున
...పుటకు వారు జనుల చేతికి అతనిని అప్ప
...

...యూదారాజైన యోషీయా కుమారుడగు
...యాకీము[1] ఏల నారంభించినప్పుడు
...నాయొద్దనుండి వాక్కు యిర్మీయాకు ప్రత్య
...ాలాగు సెలవిచ్చెను —యెహోవా నాకు
... ఇచ్చుచున్నాడు—నీవు కాడిని పలుపులను
...కొని నీ మెడకు కట్టుకొనుము. మరియు
...ంపెను పలుపులను చేయించి యెరూషలే
...యూదారాజైన సిద్కియాయొద్దకు వచ్చిన
...న ఎదోము రాజునొద్దకును మోయాబు
...ద్దకును అమ్మోనీయుల రాజునొద్దకును తూరు
...ద్దకును సీదోను రాజునొద్దకును పంపుము.
(ఆ దూతలు) తమ యజమానులకు తెలియ
...వని యీ ఆజ్ఞ వారితో చెప్పుము—మీరు
...జమానులకు తెలియజేయవలెనని సైన్యముల
...మైన ఇశ్రాయేలు దేవుడు సెలవిచ్చున
... —అధిక బలముచేతను చాచిన బాహువు
భూమిని భూమిమీదనున్న నరులను జంతువు
...నే సృజించి, ఎవరికిచ్చుట న్యాయమని
...చునో వారికే యిచ్చుచున్నాను. ఇప్పు
...ములన్నిటిని నా దాసుడగు బాబెలురాజైన
...ద్రెజరు వశము చేయుచున్నాను; అతని
...కై భూజంతువులనుకూడ అతనివశము చేయు
...ను. అతని స్వదేశమునకు కాలము వచ్చు
...కు సమస్తజనులు అతనికిని అతని కుమారుని
... కుమారుని కుమారునికిని దాసులైయుందురు;
...ము రాగా బహుజనముల మహారాజులు అతని
...స్యము చేయించుకొందురు. ఏ జనము ఏ
... బాబెలురాజైన నెబుకద్రెజరుకు దాస్యము
...ల్లక బాబెలురాజుయొక్క కాడిని తన మెడ
...ట్టుకొనదో దానిని నేను అతనిచేత బొత్తిగా
...చేయించు పర్యంతము ఆ జనమును ఖడ్గము
...క్షామముచేతను తెగులుచేతను శిక్షించెదను;
...హోవా వాక్కు. కాబట్టి మీ ప్రవక్త
...దెగాండ్లేమి కలలు కనువారేమి కాలజ్ఞాను
...తంత్రజ్ఞులేమి మీరు బాబెలురాజునకు దాసులు
...రని మీతో పలుకునపుడు మీరు వారిని
...కుడి. మీరు మీ భూమిని అనుభవింప
...మిమ్మును దూరముగా తోలివేయునట్లును,
నేను వెళ్లగొట్టునట్లును, మీరు నశించునట్లును
...అబద్ధప్రవచనములు మీకు ప్రకటింతురు.

అయితే ఏ జనులు బాబెలురాజు కాడిక్రిందికి తమ 11
మెడను వంచి అతనికి దాస్యము చేయుదురో ఆ జను
లను తమ దేశములో కాపురముండ నిచ్చెదను, వారు
తమ భూమిని సేద్యపరచుకొందురు, నేను వారికి
నెమ్మది కలుగజేతును; ఇదే యెహోవా వాక్కు.
నేను ఆ మాటలనుబట్టి యూదారాజైన సిద్కి 12
యాతో ఇట్లంటిని — బాబెలురాజుయొక్క కాడిని
మీ మెడమీద పెట్టుకొని, అతనికిని అతని జనులకును
దాసులైనపక్షమున మీరు బ్రదుకుదురు. బాబెలు 13
రాజునకు దాసులు కానొల్లని జనులవిషయమై
యెహోవా ఆజ్ఞ ఇచ్చినట్లు ఖడ్గముచేతనైనను
క్షామముచేతనైనను తెగులుచేతనైనను నీవును నీ ప్రజ
లును చావనేల? కావున—మీరు బాబెలురాజునకు 14
దాసులు కాకుందురని మీతో చెప్పు ప్రవక్తలు అబద్ధమే
ప్రకటించుచున్నారు, నేను వారిని పంపలేదు, వారి
మాటల నంగీకరింపవద్దు, ఇదే యెహోవా వాక్కు.
నేను మిమ్మును తోలివేయునట్లును, మీరును మీతో 15
ప్రవచించు మీ ప్రవక్తలును నశించునట్లును, వారు నా
నామమునుబట్టి అబద్ధముగా ప్రవచించుచున్నారు.
మరియు యాజకులతోను ఈ ప్రజలందరితోను నేను
ఈ మాటలు చెప్పితిని — యెహోవా సెలవిచ్చున 16
దేమనగా —యెహోవా మందిరపు ఉపకరణములు
ఇప్పుడే శీఘ్రముగా బాబెలునుండి మరల తేబడునని
ప్రవచించు మీ ప్రవక్తలు మీతో అబద్ధములు చెప్పు
చున్నారు, వారి మాటలకు చెవియొగ్గకుడి. వారి 17
మాట వినకుడి; బాబెలురాజునకు దాసులైనపక్షమున
మీరు బ్రదుకుదురు; ఈ పట్టణము పాడైపోనేల?
వారు ప్రవక్తలైనయెడల, యెహోవా వాక్కు వారికి 18
తోడైయుండినయెడల, యెహోవా మందిరములోను
యూదారాజు మందిరములోను యెరూషలేములోను
శేషించియుండు ఉపకరణములు బాబెలునకు కొనిపో
బడకుండునట్లు వారు సైన్యములకధిపతియగు యెహో
వాను బ్రతిమాలుకొనుట మేలు. బాబెలురాజైన 19
నెబుకద్రెజరు యెరూషలేములోనుండి యెహో
యాకీము కుమారుడైన యెకొన్యాను యూదా
యెరూషలేముల ప్రధానులనందరిని బాబెలునకు చెరగా
తీసికొనిపోయినప్పుడు అతడు విడిచిపెట్టిన స్తంభ 20
ములనుగూర్చియు సముద్రమునుగూర్చియు గడమంచె
లనుగూర్చియు ఈ పట్టణములో మిగిలిన ఉపకరణము
లనుగూర్చియు సైన్యములకధిపతియగు యెహోవా
ఈలాగు సెలవిచ్చుచున్నాడు. యెహోవా మంది 21
రములోను యూదారాజు నగరులోను యెరూష
లేములోను శేషించిన ఉపకరణములనుగూర్చి
ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతియునైన
యెహోవా ఈలాగుననే సెలవిచ్చుచున్నాడు —

1 కొన్ని ప్రాచీనప్రతులలో సిద్కియా అను పాఠాంతరము.

22 అవి బాబెలునకు తేబడును, నేను ఆ ఉపకరణములను
దర్శించి తెప్పించి యీ స్థలములో వాటిని మరల
నుంచు కాలమువరకు అవి అక్కడ నుండవలెను; ఇదే
యెహోవా వాక్కు.

**28** యూదారాజైన సిద్కియా యేలుబడి ఆరంభమున
నాలవసంవత్సరము అయిదవ నెలలో గిబియోనువాడై
ప్రవక్తగానున్న అజ్జూరు కుమారుడగు హనన్యా యాజ
కులయెదుటను ప్రజలందరియెదుటను యెహోవా
2 మందిరములో నాతో ఈలాగనెను । — ఇశ్రాయేలు
దేవుడును సైన్యములకధిపతియునగు యెహోవా
ఈలాగు సెలవిచ్చుచున్నాడు — నేను బాబెలురాజు
3 కాడిని విరిచియున్నాను. । రెండు సంవత్సరములలోగా
బాబెలురాజైన నెబుకద్రెజరు ఈ స్థలములోనుండి
ఎత్తి బాబెలుకు తీసికొనిపోయిన యెహోవా మంది
రపు ఉపకరణములన్నిటిని ఇచ్చటికి మరల తెప్పించె
4 దను. । బాబెలురాజు కాడిని విరుగగొట్టి యెహో
యాకీము కుమారుడును యూదారాజునైన యెకో
న్యాను, బాబెలుకు చెరగొనిపోయిన యూదులనంద
రిని, యీ స్థలమునకు తిరిగి రప్పించెదను; ఇదే
5 యెహోవా వాక్కు. । అప్పుడు ప్రవక్తయైన యిర్మీయా
యాజకులయెదుటను యెహోవా మందిరములో
నిలుచుచున్న ప్రజలందరియెదుటను ప్రవక్తయైన
6 హనన్యాతో ఇట్లనెను । — ఆలాగున జరుగునుగాక,
యెహోవా ఆలాగుననే చేయునుగాక, యెహోవా
మందిరపు ఉపకరణములన్నిటిని, చెరగొనిపోబడిన
వారినందరిని యెహోవా బాబెలులోనుండి ఈ స్థల
మునకు తెప్పించి, నీవు ప్రకటించిన మాటలను నెర
7 వేర్చునుగాక. । నేను నీ చెవులలోను ఈ ప్రజలందరి
చెవులలోను చెప్పుచున్న మాటను చిత్తగించి వినుము. ।
8 నాకును నీకును ముందుగానున్న ప్రవక్తలు, అనేకదేశ
ములకు మహా రాజ్యములకు విరోధముగా యుద్ధములు
జరుగుననియు, కీడు సంభవించుననియు, తెగులు కలుగు
ననియు పూర్వకాలమందు ప్రకటించుచు వచ్చిరి. ।
9 అయితే క్షేమము కలుగునని ప్రకటించు ప్రవక్త
యున్నాడే, అతని మాట నెరవేరిన పక్షమున
యెహోవా నిజముగా అతని పంపెనని యొప్పుకొన
10 దగునని ప్రవక్తయైన యిర్మీయా చెప్పగా । ప్రవక్త
యైన హనన్యా ప్రవక్తయైన యిర్మీయా మెడమీద
11 నుండి ఆ కాడిని తీసి దాని విరిచి । ప్రజలందరియెదుట
ఇట్లనెను—యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు
— రెండు సంవత్సరములలోగా నేను బాబెలురాజైన
నెబుకద్రెజరు కాడిని సర్వ జనముల మెడమీదనుండి
తొలగించి దాని విరిచివేసెదను. అంతట ప్రవక్తయైన
యిర్మీయా వెళ్లిపోయెను.
2 ప్రవక్తయైన హనన్యా ప్రవక్తయైన యిర్మీయా మెడ
మీదనున్న కాడిని విరిచినతరువాత యెహోవా
వాక్కు యిర్మీయాకు ప్రత్యక్షమై యీలాగు సెల
విచ్చెను । — నీవు పోయి హనన్యాతో ఇట్లనుము— 13
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — నీవు
కొయ్యకాడిని విరిచితివే, దానికి ప్రతిగా ఇనుప
కాడిని చేయించితివి. । ఇశ్రాయేలు దేవుడును సైన్య 14
ములకధిపతియునగు యెహోవా ఈలాగు సెలవిచ్చు
చున్నాడు—ఈ జనులందరును బాబెలురాజైన నెబు
కద్రెజరుకు దాసులు కావలెనని వారి మెడమీద
ఇనుపకాడి యుంచితిని గనుక వారు అతనికి దాసు
లగుదురు, భూజంతువులను కూడ నేను అతని కప్ప
గించియున్నాను. । అంతట ప్రవక్తయైన యిర్మీయా 15
ప్రవక్తయైన హనన్యాతో ఇట్లనెను — హనన్యా
వినుము; యెహోవా నిన్ను పంపలేదు, ఈ ప్రజ
లను అబద్ధమును ఆశ్రయింపజేయుచున్నావు. । కాగా 16
యెహోవా ఈ మాట సెలవిచ్చుచున్నాడు —
భూమిమీదనుండి నేను నిన్ను కొట్టివేయుచున్నాను,
యెహోవామీద తిరుగబాటుచేయుటకై నీవు జను
లను ప్రేరేపించితివి గనుక ఈ సంవత్సరము నీవు
మరణమాదువు. । ఆ సంవత్సరమే యేడవ నెలలో 17
ప్రవక్తయైన హనన్యా మృతినొందెను.

రాజైన యెకోన్యా తల్లియగు రాణియు, రాజ **29**
పరివారమును, యూదాలోను యెరూషలేములో 2
నున్న అధిపతులును, శిల్పకారులును, కంసాలులును 3
యెరూషలేమును విడిచి వెళ్లిన తరువాత ప్రవక్తయైన
యిర్మీయా పత్రికలో లిఖించి, యూదారాజైన సిద్కి
యా బాబెలులోనున్న బాబెలురాజైన నెబుకద్రె
జరునొద్దకు పంపిన షాఫాను కుమారుడైన ఎల్యాశా
చేతను హిల్కీయా కుమారుడైన గెమర్యా చేతను,
యెరూషలేములోనుండి చెరపట్టబడిపోయినవారి పెద్ద
లలో శేషించినవారికిని యాజకులకును ప్రవక్తలకును
యెరూషలేమునుండి బాబెలుకు అతడు చెరగొని
పోయిన జనులకందరికిని పంపించిన మాటలు ఇవే ।
— ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతియునగు 4
యెహోవా తన ప్రేరేపణచేత బాబెలుకు చెరతీసి
కొనిపోబడినవారికందరికి ఈలాగు ఆజ్ఞ ఇచ్చుచు
న్నాడు । — ఇండ్లు కట్టించుకొని వాటిలో నివసిం 5
చుడి, తోటలు నాటి వాటి ఫలములను అనుభవిం
చుడి, । పెండ్లిండ్లు చేసికొని కుమారులను కుమార్తె 6
లను కనుడి, అక్కడ ఏమియు మీకు తక్కువలేకుండ
అభివృద్ధిపొందుటకై వారు కుమారులను కుమార్తెలను
కనునట్లు మీ కుమారులకు పెండ్లిండ్లు చేయుడి, మీ
కుమార్తెలకు పురుషులను సంపాదించుడి. । నేను 7
మిమ్మును చెరగొనిపోయిన పట్టణముయొక్క క్షేమము
కోరి దానికొరకు యెహోవాను ప్రార్థనచేయుడి,
దాని క్షేమము మీ క్షేమమునకు కారణమగును. ।
ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతియునగు 8

యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — మీ
మధ్యనున్న ప్రవక్తలచేతనైనను మంత్రజ్ఞులచేతనైనను
మీరు మోసపోకుడి, మీలో కలలు కనువారి
9 మాటలు వినకుడి. । వారు నా నామమునుబట్టి అబద్ధ
ప్రవచనములను మీతో చెప్పుదురు, నేను వారిని
10 పంపలేదు; ఇదే యెహోవా వాక్కు. । యెహోవా
ఈ ఆజ్ఞ ఇచ్చుచున్నాడు—బాబెలు రాజ్యమునకు
డెబ్బది సంవత్సరములు గతించిన తరువాతనే మిమ్మును
గూర్చి నేను పలికిన శుభవార్త నెరవేర్చి యీ స్థలము
నకు మిమ్మును తిరిగి రప్పించునట్లు నేను మిమ్మును దర్శిం
11 తును. । నేను మిమ్మునుగూర్చి ఉద్దేశించిన సంగతులను
నేనెరుగుదును, రాబోవు కాలమందు నేను మీకు
మేలు చూపునట్లుగా అవి సమాధానకరమైన ఉద్దే
శములేగాని హానికరమైనవి కావు; ఇదే యెహోవా
12 వాక్కు. । మీరు నాకు మొఱ్ఱపెట్టుదురేని మీరు
నాకు ప్రార్థనచేయుచు వత్తురేని నేను మీ మనవి
13 ఆలకింతును. । మీరు నన్ను వెదకినయెడల, పూర్ణ
మనస్సుతో నన్నుగూర్చి విచారణచేయునెడల మీరు
14 నన్ను కనుగొందురు, । నన్ను నేను మీకు కనుపరచు
కొందును; ఇదే యెహోవా వాక్కు. నేను మిమ్మును
చెరలోనుండి రప్పించెదను; నేను మిమ్మును చెరపెట్టి
యే జనులలోనికి ఏ స్థలములలోనికి మిమ్మును తోలివేసి
తినో ఆ జనులందరిలోనుండియు ఆ స్థలములన్నిటి
లోనుండియు మిమ్మును సమకూర్చి రప్పించెదను; ఇదే
యెహోవా వాక్కు. ఎచ్చటనుండి మిమ్మును చెరకు
పంపితినో అచ్చటికే మిమ్మును మరల రప్పింతును. ।
15 బాబెలులో మీకు యెహోవా ప్రవక్తలను నియ
16 మించియున్నాడని మీరు చెప్పుకొంటిరే, । సరే;
దావీదు సింహాసనమందు కూర్చునియున్న రాజును
గూర్చియు, మీతోకూడ చెరలోకిపోక యీ
పట్టణములో నివసించు ప్రజలనుగూర్చియు, మీ
సహోదరులనుగూర్చియు, యెహోవా ఈ మాట
17 సెలవిచ్చుచున్నాడు । — సైన్యములకధిపతియగు
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—నేను
వారిమీదికి ఖడ్గమును క్షామమును తెగులును పంపు
చున్నాను; కుళ్లి కేవలము చెడిపోయి తిన శక్యము
కాని ఆ అంజూరపు పండ్లను (ఒకడు పారవేయునట్లు)
18 నేను వారిని అప్పగించుచున్నాను; । యెహోవా
వాక్కు ఇదే. వారు విననొల్లనివారై, నేను పెందల
కడ లేచి ప్రవక్తలైన నా సేవకులచేత వారియొద్దకు
19 పంపిన నా మాటలను ఆలకింపకపోయిరి । గనుక
నేను ఖడ్గముచేతను క్షామముచేతను తెగులుచేతను
వారిని హింసించుచు భూరాజ్యములన్నిటిలో వారిని
భీతికరముగా చేయుదును; నేను వారిని తోలివేయు
జనులందరిలో శాపాస్పదముగాను విస్మయకారణము
గాను అపహాస్యాస్పదముగాను నిందాస్పదముగాను

ఉండునట్లు వారిని అప్పగించుచున్నానని యెహోవా
సెలవిచ్చుచున్నాడు. । నేను యెరూషలేములోనుండి 20
బాబెలునకు చెరగొనిపోయినవారలారా, మీరందరు
యెహోవా ఆజ్ఞను ఆలకించుడి.

నా నామమునుబట్టి మీకు అబద్ధప్రవచనములు 21
ప్రకటించు కోలాయా కుమారుడైన అహాబునుగూర్చి
యు, మయశేయా కుమారుడైన సిద్కియానుగూర్చి
యు, ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతియు
నగు యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు । —
ఆలకించుడి, వారు ఇశ్రాయేలీయులలో దుర్మార్గము 22
జరిగించుచు, తమ పొరుగువారి భార్యలతో వ్యభిచ
రించుచు, నేను వారికాజ్ఞాపింపని అబద్ధపు మాటలను
నా నామమునుబట్టి ప్రకటింపుచు వచ్చిరి, నేనే యీ
సంగతిని తెలిసికొనినవాడనై సాక్షిగానున్నాను. కాగా
బాబెలు రాజైన నెబుకద్రెజరు చేతికి వారిని అప్ప
గించుచున్నాను, మీరు చూచుచుండగా అతడు వారిని
హతముచేయును; । చెరపట్టబడి బాబెలులోనున్న 23
యూదావారందరును బాబెలు రాజు అగ్నిలో కాల్చిన
సిద్కియావలెను అహాబువలెను యెహోవా నిన్ను
చేయునుగాకని చెప్పుచు వారి పేళ్లను శాపవచనముగా
వాడుకొందురు; ఇదే యెహోవా వాక్కు.

నెహెలామీయుడైన షెమయాకు నీవీమాట 24
తెలియజేయుము । — ఇశ్రాయేలు దేవుడును సైన్య 25
ములకధిపతియునగు యెహోవా ఈలాగు సెలవిచ్చు
చున్నాడు । — వెర్రివారై తమ్మును తామే ప్రవక్త 26
లనుగా ఏర్పరచుకొనువారిని నీవు సంకెళ్లచేత బంధించి
బొండలో వేయించినట్లుగా, యాజకుడైన యెహో
యాదాకు ప్రతిగా యెహోవా మందిర విషయము
లలో పై విచారణకర్తయగు యాజకునిగా యెహోవా
నిన్ను నియమించెనని యెరూషలేములోనున్న ప్రజల
కందరికిని యాజకుడగు మయశేయా కుమారుడగు జెఫ
న్యాకును యాజకులకందరికిని నీవు నీ పేరటనే పత్రి
కలను పంపితివే. । అనాతోతీయుడైన యిర్మీయాను 27
నీవేల గద్దింపకపోతివి? । అతడు తన్ను తాను మీకు 28
ప్రవక్తనుగా చేసికొనెను గదా; అదియుగాక — దీర్ఘ
కాలము మీరు కాపురముందురు, నివసించుటకై
యిండ్లు కట్టించుకొనుడి, ఫలములు తినుటకై తోటలు
నాటుడి, అని బాబెలులోనున్న మాకు అతడు వర్త
మానము పంపియున్నాడు. । అప్పుడు యాజకుడైన 29
జెఫన్యా ప్రవక్తయైన యిర్మీయా వినుచుండగా ఆ పత్రి
కను చదివి వినిపించెను. । అంతట యెహోవా 30
వాక్కు యిర్మీయాకు ప్రత్యక్షమై యీలాగు సెల
విచ్చెను । — చెరలోనున్న వారికందరికి నీవు పంపవల 31
సినవర్తమానమేమనగా యెహోవా నెహెలామీయు
డైన షెమయానుగూర్చి యీలాగు సెలవిచ్చుచున్నాడు
— నేను అతని పంపకపోయినను షెమయా మీకు

ప్రవచించుచు అబద్ధపు మాటలను నమ్మునట్లు చేసెను
గనుక యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు ।
32 —నెహెలామీయుడైన షెమయా యెహోవా
మీద తిరుగబాటు చేయుడమని చాటించెను గనుక
అతనిని అతని సంతానమును నేను శిక్షించుచున్నాను;
ఈ జనులలో కాపురముండువాడొకడును అతనికి
మిగిలియుండడు, నా ప్రజలకు నేను చేయు మేలును
అతడు చూడడు; ఇదే యెహోవా వాక్కు.

**30** యెహోవాయొద్దనుండి వచ్చి యిర్మీయాకు ప్రత్య
2 క్షమైన వాక్కు. । ఇశ్రాయేలు దేవుడగు యెహోవా
3 ఈలాగు సెలవిచ్చుచున్నాడు ।—రాబోవు దినము
లలో నేను ఇశ్రాయేలువారును యూదావారునగు
నా ప్రజలను చెరలోనుండి విడిపించి, వారి పితరులకు
నేనిచ్చిన దేశమును వారు స్వాధీనపరచుకొనునట్లు
వారిని తిరిగి రప్పించెదనని యెహోవా సెలవిచ్చు
చున్నాడు. కావున నేను నీతో చెప్పిన మాటలన్ని
టిని ఒక పుస్తకములో వ్రాసియుంచుకొనుము.

4 యెహోవా ఇశ్రాయేలువారినిగూర్చియు
యూదావారినిగూర్చియు సెలవిచ్చినమాటలివి. ।
5 యెహోవా యిట్లనెను—సమాధానము లేనికాలమున
భీతిచేతను దిగులుచేతను జనులు కేకవేయగా విను
6 చున్నాము. । మీరు విచారించి తెలిసికొనుడి; పురు
షులు ప్రసవించుచు పిల్లలు కందురా? ప్రసవవేదన
పడు స్త్రీలవలె పురుషులందరును నడుముమీద చేతు
లుంచుకొనుటయు, వారి ముఖములు తెల్లబారుటయు
7 నాకు కనబడుచున్నదేమి? । అయ్యో, యెంత భయం
కరమైన దినము; అట్టి దినము మరియొకటి రాదు;
అది యాకోబు సంతతివారికి ఆపద తెచ్చుదినము;
అయినను వారు దానిలో పడకుండ రక్షింపబడుదురు. ।
8 సైన్యములకధిపతియగు యెహోవా ఈలాగు సెల
విచ్చుచున్నాడు—నీకున్న కాడి నీ మెడ నుండకుండ
ఆ దినమున నేను దాని విరిచి నీ కట్లను తెంపెదను; ఇకను
అన్యులు యాకోబు సంతతివారిచేత దాస్యము చేయిం
9 చుకొనరు గాని । వారు తమ దేవుడైన యెహోవా
కును నేను వారిమీద రాజునిగా నియమించు దావీదు
10 కును దాసులగుదురు. । మరియు యెహోవా సెల
విచ్చునదేమనగా—నా సేవకుడవైన యాకోబూ, భయ
పడకుము; ఇశ్రాయేలూ, విస్మయమొందకుము, నేను
దూరముననుండు నిన్నును, చెరలోకి పోయిన దేశమున
మందు నీ సంతానపువారిని రక్షించుచున్నాను; బెద
రించువాడు లేకుండ యాకోబు సంతతి తిరిగి వచ్చి
11 నిమ్మళించి నెమ్మదిపొందును. । యెహోవా వాక్కు
ఇదే—నిన్ను రక్షించుటకు నేను నీకు తోడైయున్నాను,
నిన్ను చెదరగొట్టిన జనములన్నిటిని నేను సమూల
నాశనము చేసెదను గాని నిన్ను సమూలనాశనము
చేయను, అయితే ఏమాత్రమును నిర్దోషినిగా ఎంచ
కుండనే నిన్ను మితముగా శిక్షించుదును.

యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు— 12
నీ వ్యాధి ఘోరమైనది, నీ గాయము బాధకరమైనది; ।
నీ పాపములు విస్తరింపగా శత్రువు కొట్టినట్లు నీ 13
గొప్ప దోషమునుబట్టి నేను నీకు కఠినశిక్షచేసి నిన్ను
గాయపరచియున్నాను; కాగా నీ పక్షమున వ్యాజ్య
మాడువాడెవడును లేడు, నీ గాయములకు చికిత్సచేయ
దగిన మందు నీకు లేదు. । నీ స్నేహితులందరు నిన్ను 14
మరచియున్నారు, వారు నిన్నుగూర్చి విచారింపరు. ।
నీ గాయముచేత నీవు అరచెదవేమి? నీకు కలిగిన నొప్పి 15
నివారణ కాదు; నీ పాపములు విస్తరించినందున నీ
దోషములనుబట్టి నేను నిన్ను ఈలాగు చేయుచున్నా
ను. । నిన్ను మ్రింగువారందరు మ్రింగివేయబడుదురు, 16
నిన్ను బాధించువారందరు ఎవడును తప్పకుండ చెర
లోకి పోవుదురు, నిన్ను దోచుకొనువారు దోపుడు
సొమ్మగుదురు, నిన్ను అపహరించువారినందరిని దోపుడు
సొమ్ముగా అప్పగించెదను. । వారు—ఎవరును లక్ష్య 17
పెట్టని సీయోననియు వెలివేయబడినదనియు నీకు పేరు
పెట్టుచున్నారు; అయితే నేను నీకు ఆరోగ్యము
కలుగజేసెదను నీ గాయములను మాన్పెదను; ఇదే
యెహోవా వాక్కు. । యెహోవా ఈ మాట 18
సెలవిచ్చుచున్నాడు — యాకోబు నివాసస్థలములను
కరుణించి వాని గుడారములను నేను చెరలోనుండి
రప్పింతును; అప్పుడు పట్టణము దాని కొండమీద
కట్టబడును, నగరియు యథాప్రకారము నివాసులు
గలదగును. । వాటిలో కృతజ్ఞతాస్తోత్రములును సం 19
భ్రమపడువారి స్వరమును వినబడును, జనులు తక్కువ
మంది కాకుండ నేను వారిని విస్తరింపజేసెదను, అల్పులు
కాకుండ నేను వారిని ఘనులుగా జేసెదను. । వారి 20
కుమారులు మునుపటివలెనుందురు, వారి సమాజము
నా యెదుట స్థాపింపబడును, వారిని బాధపరచువారి
నందరిని శిక్షించెదను. । వారిలో పుట్టినవాడు వారికి 21
రాజుగా ఉండును, వారి మధ్యను పుట్టినవాడొకడు
వారి నేలును, నా సమీపమునకు వచ్చుటకు ధైర్యము
తెచ్చుకొనువాడెవడును లేడు గనుక వారు నా సన్ని
ధికి వచ్చునట్లుగా నేను వారిని చేరదీసెదను; ఇదే
యెహోవా వాక్కు. । అప్పుడు మీరు నాకు ప్రజ 22
లైయుందురు నేను మీకు దేవుడనై యుందును.

ఇదిగో యెహోవా మహోగ్రతయను పెను 23
గాలి బయలుదేరుచున్నది, అది గిరగిర తిరుగు సుడి
గాలి, అది దుష్టులమీద పెళ్లున దిగును. । తన కార్యము 24
ముగించువరకు తన హృదయాలోచనలను నెరవేర్చు
వరకు యెహోవా కోపాగ్ని చల్లారదు, అంత్యదిన
ములలో మీరీ సంగతిని గ్రహింతురు.

యెహోవా వాక్కు ఇదే—ఆ కాలమున నేను **31**

ఇశ్రాయేలు వంశస్థులకందరికి దేవుడనై యుందును,
వారు నాకు ప్రజలై యుందురు. । యెహోవా
ఈలాగు సెలవిచ్చుచున్నాడు—ఖడ్గమును తప్పించు
కొనినవారై జనులు అరణ్యములో దయనొందిరి గనుక
ఇశ్రాయేలు విశ్రాంతినొందునట్లు నేను వెళ్లుదునను
చున్నాడు. । చాలకాలము క్రిందట యెహోవా
నాకు ప్రత్యక్షమై యిట్లనెను—శాశ్వతమైన ప్రేమతో
నేను నిన్ను ప్రేమించుచున్నాను గనుక విడువక
నీయెడల కృప చూపుచున్నాను. । ఇశ్రాయేలు
కన్యకా, నీవు కట్టబడునట్లు నేనికమీదట నిన్ను కట్టిం
తును; నీవు మరల తంబురలను వాయింతువు, సంభ్రమ
పడువారి నాట్యములలో కలిసెదవు. । నీవు షోమ్రోను
కొండలమీద ద్రాక్షావల్లులను మరల నాటెదవు,
నాటువారు వాటి ఫలములను అనుభవించెదరు. ।
ఎఫ్రాయిము పర్వతములమీద కావలివారు కేకవేసి—
సీయోనుకు మన దేవుడైన యెహోవాయొద్దకు
పోవుదము రండని చెప్పు దినము నిర్ణయమాయెను. ।
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—యాకో
బునుబట్టి సంతోషముగా పాడుడి, రాజ్యములకు
శిరస్సగు జనమునుబట్టి ఉత్సాహధ్వని చేయుడి, ప్రక
టించుడి స్తుతిచేయుడి—యెహోవా ఇశ్రాయేలులో
శేషించిన నీ ప్రజను రక్షింపుమీ అని బతిమాలుడి. ।
ఉత్తరదేశములోనుండి నేను వారిని రప్పించుచున్నాను,
గుడ్డివారినేమి కుంటివారినేమి గర్భిణులనేమి ప్రస
వించు స్త్రీలనేమి భూదిగంతములనుండి అందరిని సమ
కూర్చుచున్నాను, మహా సంఘమై వారిక్కడికి తిరిగి
వచ్చెదరు. । వారు ఏడ్చుచు వచ్చెదరు, వారు నన్ను
ప్రార్థించుచుండగా నేను వారిని నడిపించుదును, వారు
తొట్రిల్లకుండ చక్కగా పోవు బాటను నీళ్లకాలువల
యొద్ద వారిని నడిపింతును. ఇశ్రాయేలుకు నేను
తండ్రినికానా! ఎఫ్రాయిము నా జ్యేష్ఠకుమారుడు
కాడా!

జనులారా, యెహోవా మాట వినుడి; దూర
మైన ద్వీపములలోనివారికి దాని ప్రకటింపుడి—
ఇశ్రాయేలును చెదరగొట్టినవాడు వాని సమకూర్చి,
గొఱ్ఱెలకాపరి తన మందను కాపాడునట్లు కాపాడు
నని తెలియజేయుడి. । యెహోవా యాకోబు వంశ
స్థులను విమోచించుచున్నాడు, వారికంటె బలవంతు
డైన వాని చేతిలోనుండి వారిని విడిపించుచున్నాడు. ।
వారు వచ్చి సీయోను కొండమీద ఉత్సాహధ్వని
చేతురు; యెహోవా చేయు ఉపకారమునుబట్టియు
గోధుమలనుబట్టియు ద్రాక్షారసమునుబట్టియు తైల
మునుబట్టియు, గొఱ్ఱెలకును పశువులకును పుట్టు పిల్ల
లనుబట్టియు సమూహములుగా వచ్చెదరు; వారిక
నెన్నటికిని కృశింపక నీళ్లుపారు తోటవలె నుందురు. ।
వారి దుఃఖమునకు ప్రతిగా సంతోషమిచ్చి వారిని
ఆదరించెదను, విచారము కొట్టివేసి నేను వారికి ఆనం
దము కలుగజేతును గనుక కన్యకలును యౌవనులును
వృద్ధులును కూడి నాట్యమందు సంతోషించెదరు. ।
క్రొవ్వుతో యాజకులను సంతోషపరచెదను, నా 14
జనులు నా ఉపకారములను తెలిసికొని తృప్తినొందు
దురు; ఇదే యెహోవా వాక్కు.

యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—ఆల 15
కించుడి, రామాలో అంగలార్పును మహా రోదన
ధ్వనియు వినబడుచున్నవి; రాహేలు తన పిల్లలను
గూర్చి యేడ్చుచున్నది; ఆమె పిల్లలు లేకపోయినం
దున ఆమె వారినిగూర్చి ఓదార్పు పొందనొల్లకున్నది. ।
యెహోవా ఈ ఆజ్ఞ ఇచ్చుచున్నాడు — ఏడువక 16
ఊరకొనుము, కన్నీళ్లు విడుచుట మానుము; నీ క్రియ
సఫలమై, జనులు శత్రువుని దేశములోనుండి తిరిగి
వచ్చెదరు; ఇదే యెహోవా వాక్కు. । రాబోవు 17
కాలమునందు నీకు మేలు కలుగుననను నమ్మిక యున్నది,
నీ పిల్లలు తిరిగి తమ స్వదేశమునకు వచ్చెదరు; ఇదే
యెహోవా వాక్కు. । నీవు నన్ను శిక్షించితివి, కాడికి 18
అలవాటుకాని కోడె దెబ్బలకు లోబడునట్లుగా నేను
శిక్షకు లోబడుచున్నాను, నీవు నా దేవుడవైన
యెహోవావు, నీవు నా మనస్సును త్రిప్పినయెడల
నేను తిరుగుదును అని ఎఫ్రాయిము అంగలార్చుచుం
డగా నేను ఇప్పుడే వినుచున్నాను. । — నేను తిరిగిన 19
తరువాత పశ్చాత్తాపపడితిని, నేను సంగతి తెలిసికొని
తొడ చరుచుకొంటిని, నా బాల్యకాలమందు కలిగిన
నిందను భరించుచు నేను అవమానము నొంది సిగ్గుపడి
తిని. । ఎఫ్రాయిము నాకిష్టమైన కుమారుడా? నాకు 20
ముద్దుబిడ్డా? నేనతనిగూర్చి మాటలాడునప్పుడెల్ల అతని
జ్ఞాపకము నన్ను విడువకున్నది, అతనిగూర్చి నా కడు
పులో చాలా వేదనగానున్నది, తప్పక నేనతని కరు
ణింతును; ఇదే యెహోవా వాక్కు.

ఇశ్రాయేలు కుమారీ, సరిహద్దురాళ్లను పాతిం 21
చుము, దోవచూపు స్తంభములను నిలువబెట్టుము,
నీవు వెళ్లిన రాజమార్గముతట్టు నీ మనస్సు నిలుపు
కొనుము, తిరుగుము; ఈ నీ పట్టణములకు తిరిగి
రమ్ము. । నీవు ఎన్నాళ్లు ఇటు అటు తిరుగులాడుదువు? 22
విశ్వాసఘాతుకురాలా, యెహోవా నీ దేశములో
నూతనమైన కార్యము జరిగించుచున్నాడు, స్త్రీ పురు
షుని ఆవరించును.

ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతియునగు 23
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—చెరలో
నుండి నేను వారిని తిరిగి రప్పించిన తరువాత యూదా
దేశములోను దాని పట్టణములలోను జనులు—నీతి
క్షేత్రమా, ప్రతిష్ఠిత పర్వతమా, యెహోవా నిన్ను
ఆశీర్వదించును గాక అను మాట ఇకను వాడుకొం
దురు. । అలసియున్నవారి ఆశను తృప్తిపరచుదును, 24

25 కృశించినవారినందరిని నింపుదును. । కావున సేద్యము
చేయువారేమి, మందలతో తిరుగులాడువారేమి,
యూదావారందరును పట్టణస్థులందరును వారి దేశ
26 ములో కాపురముందురు. । అంతలో నేను మేలు
కొని ఆలోచింపగా నా నిద్ర బహు వినోదమాయెను. ।
27 యెహోవా వాక్కు ఇదే—ఇశ్రాయేలు క్షేత్రము
లోను యూదా క్షేత్రములోను నరబీజమును మృగ
బీజమును నేను చల్లు దినములు వచ్చుచున్నవి. ।
28 వారిని పెల్లగించుటకును విరుగగొట్టుటకును పడద్రో
యుటకును నాశనముచేయుటకును హింసించుటకును
నేనేలాగు కనిపెట్టియుంటినో ఆలాగే వారిని స్థాపిం
చుటకును నాటుటకును కనిపెట్టియుందును; ఇదే
29 యెహోవా వాక్కు. । ఆ దినములలో—తండ్రులు
ద్రాక్షకాయలు తినగా పిల్లల పళ్లు పులియుచున్న
30 వను మాట వాడుకొనరు. । ప్రతివాడు తన దోషము
చేతనే మృతినొందును; ఎవడు ద్రాక్షకాయలు తినునో
31 వాని పళ్లే పులియును. । — నేను ఇశ్రాయేలువారి
తోను యూదావారితోను క్రొత్తనిబంధన చేయు
దినములు వచ్చుచున్నవి; ఇదే యెహోవా వాక్కు. ।
32 అది ఐగుప్తులోనుండి వారిని రప్పించుటకై నేను
వారిని చెయ్యి పట్టుకొనిన దినమున, వారి పితరులతో
నేను చేసిన నిబంధనవంటిది కాదు; నేను వారి యజ
మానుడనైనను వారు ఆ నిబంధనను భంగము చేసి
33 కొనిరి; యిదే యెహోవా వాక్కు. । ఈ దినములైన
తరువాత నేను ఇశ్రాయేలువారితోను యూదావారి
తోను చేయబోవు నిబంధన యిదే; వారి మనస్సులలో
నా ధర్మవిధి ఉంచెదను, వారి హృదయముమీద దాని
34 వ్రాసెదను; యెహోవా వాక్కు ఇదే. । నేను వారికి
దేవుడనై యుందును వారు నాకు జనులగుదురు; వారు
మరి ఎన్నడును—యెహోవానుగూర్చి బోధనొందు
దము అని తమ పొరుగువారికిగాని తమ సహోదరు
లకుగాని ఉపదేశము చేయరు; నేను వారి దోషములను
క్షమించి వారి పాపములను ఇక నెన్నడును జ్ఞాపకము
చేసికొనను గనుక అల్పులేమి ఘనులేమి అందరును
35 నన్నెరుగుదురు; ఇదే యెహోవా వాక్కు. । పగటి
వెలుగుకై సూర్యుని రాత్రి వెలుగుకై చంద్రనక్షత్రము
లను నియమించువాడును, దాని తరంగములు ఘోషిం
చునట్లు సముద్రమును రేపువాడునగు యెహోవా
ఆ మాట సెలవిచ్చుచున్నాడు, సైన్యములకధిపతియగు
36 యెహోవా అని ఆయనకు పేరు. । — ఆ నియమ
ములు నా సన్నిధి నుండకుండ పోయినయెడల ఇశ్రా
యేలు సంతతివారు నా సన్నిధిని ఎన్నడును జనముగా
ఉండకుండపోవును; ఇదే యెహోవా వాక్కు. ।
37 యెహోవా సెలవిచ్చునదేమనగా—పైనున్న ఆకాశ
వైశాల్యమును కొలుచుటయు క్రిందనున్న భూమి
పునాదులను పరిశోధించుటయు శక్యమైనయెడల
ఇశ్రాయేలు సంతానముచేసిన సమస్తమునుబట్టి నేను
వారినందరిని తోసివేతును; యెహోవా వాక్కు
ఇదే. । యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు— 3
రాబోవు దినములలో హనన్యేలు గోపురము మొదలు
కొని మూలగుమ్మమువరకు పట్టణము యెహోవా
పేరట కట్టబడును. । కొలనూలు దానికెదురుగా 3
గారేబుకొండవరకు పోవుచు గోయావరకు తిరిగి
సాగును. । శవములును బూడిదెయు వేయబడు లోయ 4
అంతయు కిద్రోను వాగువరకును గుఱ్ఱముల గవిని
వరకును తూర్పుదిశనున్న పొలములన్నియు యెహో
వాకు ప్రతిష్ఠితములగును. అది మరి ఎన్నడును పెల్ల
గింపబడదు, పడద్రోయబడదు.

**యూ**దారాజైన సిద్కియా యేలుబడి పదియవ 32
సంవత్సరమున, అనగా నెబుకద్రెజరు ఏలుబడి పదు
నెనిమిదవ సంవత్సరమున యెహోవాయొద్దనుండి
యిర్మీయాకు ప్రత్యక్షమైన వాక్కు. । ఆ కాలమున 2
బాబెలురాజు దండు యెరూషలేముకు ముట్టడివేయు
చుండగా సిద్కియా యిర్మీయాతో చెప్పినదేమనగా—
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — ఆలో
చించుడి, ఈ పట్టణమును బాబెలురాజుచేతికి నేను
అప్పగించుచున్నాను, అతడు దాని పట్టుకొనును, ।
యూదారాజైన సిద్కియా కల్దీయుల చేతిలోనుండి 3
తప్పించుకొనక బాబెలురాజుచేతికి నిశ్చయముగా
అప్పగింపబడును, సిద్కియా అతనితో ముఖాముఖిగా
మాటలాడును, కన్నులార అతని చూచును, । అతడు 4
సిద్కియాను బాబెలునకు కొనిపోవును, నేను అతని
దర్శించువరకు అతడక్కడనే యుండును; ఇదే
యెహోవా వాక్కు; । మీరు కల్దీయులతో యుద్ధము 5
చేసినను మీరు జయమునొందరు, అను మాటలు నీవేల
ప్రకటించుచున్నావని యిర్మీయాతో చెప్పి అతనిని
చెరలో వేయించియుండెను; కాగా ప్రవక్తయైన
యిర్మీయా యూదారాజు మందిరములోనున్న చెర
సాల అంగణములో ఉంచబడియుండెను.

అంతట యిర్మీయా ఇట్లనెను—యెహోవా వాక్కు 6
నాకు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను । — నీ 7
తండ్రితోడబుట్టిన షల్లూము కుమారుడగు హనమేలు
నీయొద్దకు వచ్చి—అనాతోతులోనున్న నా భూమిని
కొనుటకు విమోచకుని ధర్మము నీదే, దాని కొనుక్కొను
మని చెప్పును. । కావున నా తండ్రి, తోడబుట్టినవాని 8
కుమారుడైన హనమేలు యెహోవా మాటచొప్పున
చెరసాల అంగణములోనున్న నాయొద్దకు వచ్చి —
బెన్యామీను దేశమందలి అనాతోతులోనున్న నా
భూమిని దయచేసి కొనుము, దానికి వారసుడవు నీవే,
దాని విమోచనము నీవలననే జరుగవలెను, దాని కొను
క్కొనుమని నాతో అనగా, అది యెహోవా
వాక్కు అని నేను తెలిసికొని । నా తండ్రి, తోడ 9

బుట్టినవాని కుమారుడగు హనమేలు పొలమును కొని,
పదియేడు తులముల వెండి తూచి అతనికిచ్చితిని. ।
10 నేను క్రయపత్రము వ్రాసి ముద్రవేసి సాక్షులను
11 పిలిపించి త్రాసుతో ఆ వెండి తూచి । క్రయపత్ర
మును, అనగా ముద్రగల విడుదల కైకోలును ఒడం
బడికను ముద్రలేని విడుదల కైకోలును ఒడంబడికను
12 తీసికొంటిని. । అప్పుడు నా తండ్రి తోడబుట్టినవాని
కుమారుడైన హనమేలు ఎదుటను, ఆ క్రయపత్ర
ములో చేవ్రాలుచేసిన సాక్షుల యెదుటను, చెరసాల
అంగణములో కూర్చున్న యూదులందరియెదుటను,
నేను మహసేయా కుమారుడగు నేరీయా కుమారుడైన
బారూకునకు ఆ క్రయపత్రమును అప్పగించి వారి
కన్నులయెదుట బారూకునకు ఈలాగు ఆజ్ఞాపించి
13 తిని. । ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతియు
14 నగు యెహోవా సెలవిచ్చునదేమనగా । — ఈ పత్ర
ములను, అనగా ముద్రగల యీ క్రయపత్రమును
ముద్రలేని క్రయపత్రమును, నీవు తీసికొని అవి బహు
దినములుండునట్లు మంటికుండలో వాటిని దాచి
15 పెట్టుము. । ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతి
యునగు యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు
—ఇండ్లును పొలములును ద్రాక్షతోటలును ఇంక ఈ
దేశములో కొనబడును.

16 నేరీయా కుమారుడైన బారూకుచేతికి ఆ క్రయ
పత్రమును నేనప్పగించిన తరువాత యెహోవాకు
17 ఈలాగున ప్రార్థన చేసితిని । — యెహోవా,
ప్రభువా, సైన్యములకధిపతియగు యెహోవా అను
పేరు వహించువాడా, శూరుడా, మహాదేవా, నీ యధిక
బలముచేతను చాచిన బాహువుచేతను భూమ్యాకాశ
ములను సృజించితివి, నీకు అసాధ్యమైనదేదియు
18 లేదు. । నీవు వేవేలమందికి కృపచూపుచు, తండ్రుల
దోషమును వారి తరువాత వారి పిల్లల ఒడిలో
19 వేయువాడవు. । ఆలోచన విషయములో నీవే గొప్ప
వాడవు, క్రియలు జరిగించు విషయములో శక్తిసం
పన్నుడవు, వారి ప్రవర్తనలనుబట్టియు వారి క్రియా
ఫలమునుబట్టియు అందరికి ప్రతిఫలమిచ్చుటకై నర
పుత్రుల మార్గములన్నిటిని నీవు కన్నులార చూచు
20 చున్నావు. । నీవు ఐగుప్తుదేశములో చేసినట్లు నేటి
వరకు ఇశ్రాయేలువారి మధ్యను (ఇతర) మనుష్యుల
మధ్యను సూచకక్రియలను మహత్కార్యములను
చేయుచు నేటివలె నీకు కీర్తి తెచ్చుకొనుచున్నావు. ।
21 సూచకక్రియలను మహత్కార్యములను జరిగించుచు
మహా బలముకలిగి, బాహువు చాపినవాడవై మహా
భయము పుట్టించి, ఐగుప్తుదేశములోనుండి నీ ప్రజలను
22 రప్పించి । మీకిచ్చెదనని వారి పితరులకు ప్రమాణము
చేసి, పాలు తేనెలు ప్రవహించు ఈ దేశమును వారి
23 కిచ్చితివి. । వారు ప్రవేశించి దాని స్వతంత్రించు

కొనిరి గాని నీ మాట వినకపోయిరి, నీ ధర్మశాస్త్రము నను
సరింపకపోయిరి. వారు చేయవలెనని నీవాజ్ఞాపించిన
వాటిలో దేనిని చేయకపోయిరి గనుక ఈ కీడంతయు
వారిమీదికి రప్పించియున్నావు. । ముట్టడి దిబ్బలను 24
చూడుము, పట్టణమును పట్టుకొనుటకు అవి దానికి
సమీపించుచున్నవి, ఖడ్గము క్షామము తెగులు వచ్చుట
వలన దానిమీద యుద్ధముచేయుచుండు కల్దీయుల
చేతికి ఈ పట్టణము అప్పగింపబడును; నీవు సెలవిచ్చి
నది సంభవించెను, నీవే దాని చూచుచున్నావు గదా. ।
యెహోవా ప్రభువా—ధనమిచ్చి యీ పొలమును 25
కొనుక్కొని సాక్షులను పిలుచుకొనుమని నీవే నాతో
సెలవిచ్చితివి, అయితే ఈ పట్టణము కల్దీయులచేతికి
అప్పగింపబడుచున్నది.

అంతట యెహోవా వాక్కు యిర్మీయాకు ప్రత్య 26
క్షమై యీలాగు సెలవిచ్చెను । — నేను యెహో 27
వాను, సర్వశరీరులకు దేవుడను, నాకు అసాధ్యమైన
దేదైన నుండునా?

కావున యెహోవా ఈ మాట సెలవిచ్చుచు 28
న్నాడు — ఇదిగో నేను ఈ పట్టణమును కల్దీయుల
చేతికిని బాబెలురాజైన నెబుకద్రెజరు చేతికిని అప్ప
గింపబోవుచున్నాను, అతడు దాని పట్టుకొనగా । ఈ 29
పట్టణముమీద యుద్ధముచేయు కల్దీయులు వచ్చి,
యీ పట్టణమునకు అగ్ని ముట్టించి, యే మిద్దెలమీద
జనులు బయలుకు ధూపార్పణచేసి అన్యదేవతలకు
పానార్పణములనర్పించి నాకు కోపము పుట్టించిరో
ఆ మిద్దెలన్నిటిని కాల్చివేసెదరు. । ఏలయనగా ఇశ్రా 30
యేలువారును యూదావారును తమ బాల్యము
మొదలుకొని నాయెదుట చెడుతనమే చేయుచు వచ్చు
చున్నారు, తమ చేతుల క్రియవలన వారు నాకు
కోపమే పుట్టించువారు; ఇదే యెహోవా వాక్కు. ।
నా కోపము రేపుటకు ఇశ్రాయేలువారును యూదా 31
వారును వారి రాజులును వారి ప్రధానులును వారి 32
యాజకులును వారి ప్రవక్తలును యూదా జనులును
యెరూషలేము నివాసులును చూపిన దుష్ప్రవర్తన
అంతటినిబట్టి, నా యెదుటనుండి వారి దుష్ప్రవర్త
నను నేను నివారణచేయ ఉద్దేశించునట్లు, వారు ఈ
పట్టణమును కట్టిన దినము మొదలుకొని ఇదివరకును
అది నాకు కోపము పుట్టించుటకు కారణమాయెను. ।
నేను పెందలకడ లేచి వారికి బోధించినను వారు నా 33
బోధ నంగీకరింపకపోయిరి, వారు నాకు అభిముఖులు
కాక విముఖులైయుండి నా మాట వినకపోయిరి. ।
మరియు నాదని చాటబడిన మందిరమును అపవిత్ర 34
పరచుటకు దానిలో హేయమైనవాటిని పెట్టిరి. ।
వారు మోలెకునకు తమ కుమారులను కుమార్తెలను ప్రతి 35
ష్ఠింపవలెనని బెన్‌హిన్నోము లోయలోనున్న బయ
లుకు బలిపీఠములను కట్టించిరి; ఆలాగు చేయుటకు

ర్షణముల నర్పించుదురో ఆ యిండ్లన్నిటికి ఆలాగే
జరుగును.
14 ఆ ప్రవచనము చెప్పుటకు యెహోవా తన్ను
పంపిన తోఫెతులోనుండి యిర్మీయా వచ్చి యెహోవా
మందిరపు ఆవరణములో నిలిచి జనులందరితో ఈలాగు
15 చెప్పెను । — సైన్యములకధిపతియు ఇశ్రాయేలు
దేవుడునగు యెహోవా ఈ మాట సెలవిచ్చు
చున్నాడు—ఈ జనులు నా మాటలు వినకుండ
మొండికి తిరిగియున్నారు గనుక ఈ పట్టణమును
గూర్చి నేను చెప్పిన కీడంతయు దానిమీదికిని దానితో
సంబంధించిన పట్టణములన్నిటిమీదికిని రప్పించు
చున్నాను.
20 యిర్మీయా ఆ ప్రవచనములను పలుకగా
యెహోవా మందిరములో పెద్ద నాయకుడును
ఇమ్మేరు కుమారుడునగు పషూరను యాజకుడు విని ।
2 ప్రవక్తయైన యిర్మీయాను కొట్టించి, యెహోవా మం
దిరమందున్న బెన్యామీను మీదిగుమ్మమునొద్దనుండు
3 బొండలో అతని వేయించెను. । మరునాడు పషూరు
యిర్మీయాను బొండలోనుండి విడిపింపగా యిర్మీయా
అతనితో ఇట్లనెను — యెహోవా నీకు పషూరను
పేరు పెట్టడు గాని భయాక్రాంతుడని నీకు పేరు
4 పెట్టును. । యెహోవా ఈ మాట సెలవిచ్చుచు
న్నాడు—నీకును నీ స్నేహితులకందరికిని నీవే భయ
కారణముగా నుండునట్లు చేయుచున్నాను; నీవు
చూచుచుండగా వారు తమ శత్రువుల ఖడ్గముచేత
కూలెదరు, మరియు యూదావారినందరిని బాబెలు
రాజుచేతికి అప్పగింతును, అతడు వారిని చెరపట్టి
బాబెలునకు తీసికొనిపోవును, ఖడ్గముచేత వారిని హతము
5 చేయును. । ఈ పట్టణములోని ఐశ్వర్యమంతయు
దానికి వచ్చిన లాభమంతయు దాని అమూల్యవస్తువు
లన్నియు యూదారాజుల నిధులన్నియు నేనప్పగిం
తును, వారి శత్రువులచేతికే వాటి నప్పగింతును,
శత్రువులు వాటిని దోచుకొని పట్టుకొని బాబెలునకు
6 తీసికొనిపోవుదురు. । పషూరూ, నీవును నీ యింట
నివసించువారందరును చెరలోకి పోవుదురు, నీవును
నీవు ప్రవచనములచేత మోసపుచ్చిన నీ స్నేహితులంద
రును బాబెలునకు వచ్చెదరు, అక్కడనే చనిపోయెదరు
అక్కడనే పాతిపెట్టబడెదరు.
7 యెహోవా, నీవు నన్ను ప్రేరేపింపగా నీ ప్రేరే
పణకు లోబడితిని; నీవు బలవంతముచేసి నన్ను గెలిచి
తివి, నేను దినమెల్ల నవ్వులపాలైతిని, అందరు నన్ను
8 ఎగతాళి చేయుదురు. । ఏలయనగా నేను పలుకు
నప్పుడెల్ల బలాత్కారము జరుగుచున్నది, దోపుడు
జరుగుచున్నది అని యెలుగెత్తి చాటింపవలసి వచ్చెను;
దినమెల్ల యెహోవా మాట నాకు అవమానమునకును
9 అపహాస్యమునకును హేతువాయెను. । ఆయన పేరు
నేనెత్తను, ఆయన నామమునుబట్టి ప్రకటింపను, అని
నేననుకొంటినా? అది నా హృదయములో అగ్నివలె
మండుచు నా యెముకలలోనే మూయబడియున్న
ట్లున్నది; నేను ఓర్చి యోర్చి విసికియున్నాను, చెప్పక
మానలేను. । భయాక్రాంతము అని అనేకులు గుసగుస 10
లాడగా వింటిని. వారు—దుర్మార్గుడని మీరు చాటిం
చినయెడల మేమును చాటింతుమందురు; అతడొక
వేళ చిక్కుపడును, అప్పుడు మనమతని పట్టుకొని
అతనిమీద పగతీర్చుకొందమని చెప్పుకొనుచు, నాకు
స్నేహితులైనవారందరు నేను పడిపోగా చూడవలెనని
కనిపెట్టుకొనియున్నారు. । అయితే పరాక్రమముగల 11
శూరునివలె యెహోవా నాకు తోడైయున్నాడు;
నన్ను హింసించువారు నన్ను గెలువక తొట్రిల్లు
దురు; వారు యుక్తిగా జరుపుకొనరు గనుక బహుగా
సిగ్గుపడుదురు, వారెన్నడును మరువబడని నిత్యాని
మానము నొందుదురు. । సైన్యములకధిపతివగు 12
యెహోవా, నీతిమంతులను పరిశోధించువాడవు నీవే;
అంతరింద్రియములను హృదయమును చూచువాడవు
నీవే; నా వ్యాజ్యమును నీకే అప్పగించుచున్నాను.
నీవు వారికి చేయు ప్రతిదండన నేను చూతును గాక ।
యెహోవాను కీర్తించుడి, యెహోవాను స్తుతించుడి, 13
దుష్టుల చేతిలోనుండి దరిద్రుని ప్రాణమును ఆయనే
విడిపించుచున్నాడు.
నేను పుట్టినదినము శపింపబడును గాక; నా తల్లి 14
నన్ను కనిన దినము శుభదినమని అనబడకుండును
గాక; । — నీకు మగపిల్ల పుట్టెనని నా తండ్రికి వర్త 15
మానము తెచ్చి అతనికి అధిక సంతోషము పుట్టించిన
వాడు శాపగ్రస్తుడగును గాక; । నా తల్లి నాకు 16
సమాధిగానుండి ఆమె ఎల్లప్పుడు గర్భవతిగానుండు
నట్లు అతడు గర్భములోనే నన్ను చంపలేదు గనుక ।
యెహోవా యేమాత్రమును సంతాపములేక నశింప 17
జేసిన పట్టణములవలె ఆ మనుష్యుడు ఉండును గాక;
ఉదయమున ఆర్తధ్వనిని మధ్యాహ్నకాలమందు యుద్ధ
ధ్వనిని అతడు వినును గాక । కష్టమును దుఃఖమును 18
చూచుటకై నా దినములు అవమానముతో గతించి
పోవునట్లు నేనేల గర్భములోనుండి వెడలితిని?
రాజైన సిద్కియా మల్కీయా కుమారుడైన 21
పషూరును యాజకుడగు మయశేయా కుమారుడైన 2
జెఫన్యాను పిలిపించి—బాబెలురాజైన నెబుకద్రెజరు
మనమీద యుద్ధముచేయుచున్నాడు; అతడు మన
యొద్దనుండి వెళ్లిపోవునట్లు యెహోవా తన అద్భుత
కార్యములన్నిటిని చూపి మనకు తోడైయుండునో
లేదో దయచేసి మానిమిత్తము యెహోవాచేత నీవు
విచారించుమని చెప్పుటకు యిర్మీయాయొద్దకు వారిని
పంపగా యెహోవాయొద్దనుండి యిర్మీయాకు ప్రత్య
క్షమైన వాక్కు.

నేను వారి కాజ్ఞాపింపలేదు, యూదావారు పాప
ములో పడి, యెవరైన నిట్టి హేయక్రియలు చేయుదు
రన్న మాట నా కెన్నడును తోచలేదు.
36 కావున ఇశ్రాయేలు దేవుడగు యెహోవా ఈ
పట్టణమునుగూర్చి యీ మాట సెలవిచ్చుచున్నాడు—
అది ఖడ్గముచేతను క్షామముచేతను తెగులుచేతను
పీడింపబడినదై బాబెలురాజుచేతికి అప్పగింపబడునని
మీరీ పట్టణమునుగూర్చి చెప్పుచున్నారు గదా. ।
37 ఇదిగో నాకు కలిగిన కోపోద్రేకముచేతను మహా
క్రోధముచేతను నేను వారిని వెళ్లగొట్టిన దేశములన్ని
టిలోనుండి వారిని సమకూర్చి యీ స్థలమునకు తిరిగి
38 రప్పించి వారిని నిర్భయముగా నివసింపజేసెదను. । వారు
నాకు ప్రజలై యుందురు నేను వారికి దేవుడనై
39 యుందును. । మరియు వారికిని వారి తరువాత వారి
కుమారులకును మేలు కలుగుటకై వారు నిత్యము నాకు
భయపడునట్లు నేను వారికి ఏకహృదయమును ఏక
40 మార్గమును దయచేయుదును. । నేను వారికి మేలు
చేయుట మానకుండునట్లు నిత్యమైన నిబంధనను
వారితో చేయుచున్నాను; వారు నన్ను విడువకుండు
నట్లు వారి హృదయములలో నా యెడల భయభక్తులు
41 పుట్టించెదను. । వారికి మేలుచేయుటకు వారియందు
ఆనందించుచున్నాను, నా పూర్ణహృదయముతోను
నా పూర్ణాత్మతోను ఈ దేశములో నిశ్చయముగా
42 వారిని నాటెదను. । యెహోవా ఈలాగు సెల
విచ్చుచున్నాడు—నేను ఈ ప్రజలమీదికి ఇంత గొప్ప
కీడు రప్పించిన రీతినే నేను వారినిగూర్చి చెప్పిన
43 మేలంతటిని వారిమీదికి రప్పింపబోవుచున్నాను. । ఇది
పాడైపోయెను, దానిలో నరులు లేరు, పశువులు
లేవు, ఇది కల్దీయులచేతికి ఇయ్యబడియున్నదని మీరు
చెప్పుచున్న ఈ దేశమున పొలములు విక్రయింప
44 బడును. । నేను వారిలో చెరపోయినవారిని రప్పింప
బోవుచున్నాను గనుక బెన్యామీను దేశములోను
యెరూషలేము ప్రాంతములలోను యూదా పట్టణ
ములలోను మన్యములోని పట్టణములలోను దక్షిణ
దేశపు పట్టణములలోను మనుష్యులు క్రయమిచ్చి
పొలములు కొందురు, క్రయపత్రములు వ్రాయించు
కొందురు, ముద్రవేయుదురు, సాక్షులను పెట్టుదురు;
ఇదే యెహోవా వాక్కు.

**33** మరియు యిర్మీయా చెరసాల ప్రాకారములలో
ఇంక ఉంచబడియుండగా యెహోవా వాక్కు రెం
డవసారి అతనికి ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను ।
2 —మాట నెరవేర్చు యెహోవా, స్థిరపరచవలెనని
దాని నిర్మించు యెహోవా, యెహోవా అను
నామము వహించినవాడే ఈలాగు సెలవిచ్చుచున్నా
—నాకు మొఱ్ఱపెట్టుము నేను నీకు ఉత్తరమిచ్చె
దను, నీవు గ్రహింపలేని గొప్ప సంగతులను గూఢ
మైన సంగతులను నీకు తెలియజేతును. । కల్దీయులతో
యుద్ధముచేసి, వారి చెడుతనమునుబట్టి ఈ పట్టణమునకు
విముఖుడనైన నా మహా కోపముచేత హతులై, తవ
కళేబరములతో కల్దీయులకు సంతృప్తికలిగించుటకై
వారు వచ్చుచుండగా । ముట్టడి దిబ్బల దెబ్బకును ఖడ్గ
మునకును పట్టణములోని యిండ్లన్నియు యూదా
రాజుల నగరులును శిథిలమై పోయెను గదా. వాటిని
గూర్చి ఇశ్రాయేలు దేవుడగు యెహోవా సెలవిచ్చున
దేమనగా । — నేను దానికి ఆరోగ్యమును స్వస్థ
తను మరల రప్పించుచున్నాను, వారిని స్వస్థపరచు
చున్నాను, వారికి సత్యసమాధానములను సమృద్ధిగా
బయలుపరచెదను. । చెరలోనుండిన యూదావారిని
ఇశ్రాయేలువారిని నేను రప్పించుచున్నాను, మొదట
నుండినట్లు వారిని స్థాపించుచున్నాను. । వారు నాకు
విరోధముగా చేసిన పాపదోషము నిలువకుండ వారిని
పవిత్రపరతును, వారు నాకు విరోధముగాచేసిన
దోషములన్నిటిని తిరుగబాటులన్నిటిని క్షమించెదను. ।
భూజనులందరియెదుట వారు నాకిష్టమైన పేరుగాను
స్తోత్రకారణముగాను ఘనతాస్పదముగాను ఉందురు,
నేను వారికి చేయు సకల ఉపకారములనుగూర్చిన
వర్తమానమును జనులు విని నేను వారికి కలుగజేయు
సమస్త క్షేమమునుబట్టియు సమస్తమైన మేలునుబట్టియు
భయపడుచు దిగులు నొందుదురు. । యెహోవా
ఈలాగు సెలవిచ్చుచున్నాడు— ఇది పాడైపోయెను,
దీనిలో నరులు లేరు నివాసులు లేరు, జంతువులు లేవు
అని మీరు చెప్పు ఈ స్థలములోనే, మనుష్యులైనను
నివాసులైనను జంతువులైనను లేక పాడైపోయిన
యూదా పట్టణములలోనే, యెరూషలేము వీధుల
లోనే, సంతోషస్వరమును ఆనందశబ్దమును పెండ్లి
కుమారుని స్వరమును పెండ్లికుమార్తె స్వరమును —
యెహోవా మంచివాడు, ఆయన కృప నిరంతరముం
డును, సైన్యములకధిపతియగు యెహోవాను స్తుతిం
చుడి అని పలుకువారి స్వరమును మరల వినబడును;
యెహోవా మందిరములోకి స్తుతియాగములను తీసి
కొనివచ్చువారి స్వరమును మరల వినబడును; మునుపటి
వలె ఉండుటకై చెరలోనున్న యీ దేశస్థులను నేను
రప్పించుచున్నానని యెహోవా సెలవిచ్చుచున్నా
డు । సైన్యములకధిపతియగు యెహోవా ఈలాగు 12
సెలవిచ్చుచున్నాడు—మనుష్యులైనను జంతువులైనను
లేక పాడైయున్న యీ స్థలములోను దాని పట్టణము
లన్నిటిలోను గొఱ్ఱెల మందలను మేపుచు పరుండ
బెట్టు కాపరులుందురు. । మన్నెపు పట్టణములలోను 13
మైదానపు పట్టణములలోను దక్షిణదేశపు పట్టణముల
లోను బెన్యామీను దేశములోను యెరూషలేము
ప్రాంతస్థలములలోను యూదాపట్టణములలోను మం

డలు లెక్కపెట్టువారిచేత లెక్కింపబడునని యెహోవా
సెలవిచ్చుచున్నాడు.
14 యెహోవా వాక్కు ఇదే—ఇశ్రాయేలు వంశస్థు
లనుగూర్చియు యూదా వంశస్థులనుగూర్చియు
నేను చెప్పిన మంచి మాట నెరవేర్చు దినములు వచ్చు
15 చున్నవి. । ఆ దినములలో ఆ కాలమందే నేను దావీ
దుకు నీతిచిగురును మొలిపించెదను; అతడు భూమి
మీద నీతి న్యాయములను అనుసరించి జరిగించును. ।
16 ఆ దినములలో యూదావారు రక్షింపబడుదురు,
యెరూషలేము నివాసులు సురక్షితముగా నివసింతురు,
యెహోవాయే మనకు నీతియని యెరూషలేముకు
17 పేరుపెట్టబడును. । యెహోవా ఈలాగు సెలవిచ్చు
చున్నాడు — ఇశ్రాయేలువారి సింహాసనముమీద
18 కూర్చుండువాడొకడు దావీదుకుండక మానడు. । ఎడ
తెగక దహనబలులను అర్పించుటకును నైవేద్యముల
నర్పించుటకును బలులను అర్పించుటకును నా సన్నిధిని
యాజకులైన లేవీయులలో ఒకడుండక మానడు. ।
19 మరియు యెహోవా వాక్కు యిర్మీయాకు ప్రత్య
20 క్షమై యీలాగు సెలవిచ్చెను । — యెహోవా ఆజ్ఞ
ఇచ్చునదేమనగా — దివారాత్రములు వాటి సమయ
ములలో ఉండకపోవునట్లు నేను పగటికి చేసిన నిబంధ
నను రాత్రికి చేసిన నిబంధనను మీరు భంగము చేయ
21 కలిగిన పక్షమున । నా సేవకుడైన దావీదు సింహాసన
ముమీద కూర్చుండి రాజ్యపరిపాలనచేయు కుమా
రుడు అతనికి ఉండక మానడని అతనితో నేను చేసిన
నిబంధన వ్యర్థమగును; మరియు నా పరిచారకులైన
లేవీయులగు యాజకులతోను నేను చేసిన నా నిబం
22 ధన వ్యర్థమగును. । ఆకాశనక్షత్రములు లెక్కింప
శక్యముకానట్టుగాను, సముద్రపు ఇసుక రేణువుల
నెంచుట అసాధ్యమైనట్టుగాను, నా సేవకుడైన దావీదు
సంతానమును, నాకు పరిచర్యచేయు లేవీయులను
లెక్కింపలేనంతగా నేను విస్తరింపజేయుదును. ।
23 మరియు యెహోవా వాక్కు యిర్మీయాకు ప్రత్య
24 క్షమై యీలాగు సెలవిచ్చెను. । తాను ఏర్పరచు
కొనిన రెండు కుటుంబములను యెహోవా విసర్జించె
ననియు, నా ప్రజలు ఇకమీదట తమ యెదుట జన
ముగా ఉండరనియు వారిని తృణీకరించుచు ఈ
జనులు చెప్పుకొను మాట నీకు వినబడుచున్నది గదా. ।
25 యెహోవా ఈ మాట సెలవిచ్చుచున్నాడు—పగటిని
గూర్చియు రాత్రినిగూర్చియు నేను చేసిన నిబంధన
26 నిలకడగా ఉండని పక్షమున । భూమ్యాకాశములను
గూర్చిన విధులను నియమించువాడను నేను కానిపక్ష
మున, అబ్రాహాము ఇస్సాకు యాకోబుల సంతాన
మును ఏలుటకు అతని సంతాన సంబంధియైన యేలి
కను ఏర్పరచుకొనక నేను యాకోబు సంతానపు
వాడను నా సేవకుడైన దావీదు సంతానమును విసర్జిం
తును. నిశ్చయముగా నేను వారియెడల జాలిపడి చెర
లోనుండి వారిని రప్పించెదను.

బాబెలురాజైన నెబుకద్రెజరును అతని సమస్త 34
సేనయు అతని అధికారముక్రిందనున్న భూరాజ్య
ములన్నియు జనములన్నియు కూడి యెరూషలేము
మీదను దాని పురములన్నిటిమీదను యుద్ధము చేయు
చుండగా యెహోవాయొద్దనుండి యిర్మీయాకు దర్శన
మైన వాక్కు । — ఇశ్రాయేలు దేవుడగు యెహోవా 2
ఈలాగు ఆజ్ఞ ఇచ్చుచున్నాడు—నీవు వెళ్లి యూదా
రాజైన సిద్కియాతో ఈలాగు చెప్పుము—యెహోవా
సెలవిచ్చునదేమనగా—నేను ఈ పట్టణమును బాబెలు
రాజుచేతికి అప్పగించుచున్నాను, అతడు మంటపెట్టి
దాని కాల్చివేయును. । నీవు అతని చేతిలోనుండి 3
తప్పించుకొనజాలక నిశ్చయముగా పట్టబడి అతనిచేతి
కప్పగింపబడెదవు. బాబెలురాజును నీవు కన్నులార
చూచెదవు, అతడు నీతో ముఖాముఖిగా మాట
లాడును, నీవు బాబెలుకు పోవుదువు. । యూదా 4
రాజవైన సిద్కియా, యెహోవా మాట వినుము—
నిన్నుగూర్చి యెహోవా ఈలాగు సెలవిచ్చుచు
న్నాడు—నీవు ఖడ్గమువలన మృతిబొందక నెమ్మది
గానే మృతిబొందెదవు. । నీకంటె ముందుగానుండిన 5
పూర్వరాజులైన నీ పితరులకొరకు (ధూపద్రవ్యములు)
కాల్చినట్లు—అయ్యో నా యేలినవాడా, అని నిన్ను
గూర్చి అంగలార్చుచు జనులు నీకొరకును (ధూప
ద్రవ్యము) కాల్చుదురు; ఆలాగు కావలెనని ఆజ్ఞ
ఇచ్చినవాడను నేనే అని యెహోవా సెలవిచ్చు
చున్నాడు. । యూదా పట్టణములలో లాకీషును 6
అజేకాయును ప్రాకారములుగల పట్టణములుగా 7
మిగిలియున్నవి, బాబెలురాజు దండు యెరూషలేము
మీదను మిగిలిన యూదా పట్టణములన్నిటిమీదను
యుద్ధము చేయుచుండగా ప్రవక్తయైన యిర్మీయా
యెరూషలేములో యూదా రాజైన సిద్కియాకు
ఈ మాటలన్నిటిని ప్రకటించుచు వచ్చెను.

యూదులచేత యూదులు కొలువుచేయించు 8
కొనక తమ దాస్యములోనున్న హెబ్రీయులను గాని 9
హెబ్రీయురాండ్రను గాని అందరిని విడిపించునట్లు
విడుదల చాటింపవలెనని రాజైన సిద్కియా యెరూష
లేములోనున్న సమస్త ప్రజలతో నిబంధన చేసినతరు
వాత యెహోవాయొద్దనుండి యిర్మీయాకు ప్రత్యక్ష
మైన వాక్కు । — ఆ నిబంధననుబట్టి అందరును తమకు 10
దాసదాసీజనముగా నున్న వారిని విడిపించుదుమనియు,
ఇకమీదట ఎవరును వారిచేత కొలువు చేయించుకొన
మనియు ఒప్పుకొని, ఆ నిబంధనలో చేరిన ప్రధానులం
దరును ప్రజలందరును విధేయులై వారిని విడిపించిరి. ।
అయితే పిమ్మట వారు మనస్సు మార్చుకొని, తాము 11
స్వతంత్రులుగా పోనిచ్చిన దాసదాసీజనులను మరల

నేను వారి కాజ్ఞాపింపలేదు, యూదావారు పాప
ములో పడి, యెవరైన నిట్టి హేయక్రియలు చేయుదు
రన్న మాట నా కెన్నడును తోచలేదు.
36 కావున ఇశ్రాయేలు దేవుడగు యెహోవా ఈ
పట్టణమునుగూర్చి యీ మాట సెలవిచ్చుచున్నాడు—
అది ఖడ్గముచేతను క్షామముచేతను తెగులుచేతను
పీడింపబడినదై బాబెలురాజుచేతికి అప్పగింపబడునని
మీరీ పట్టణమునుగూర్చి చెప్పుచున్నారు గదా. ।
37 ఇదిగో నాకు కలిగిన కోపోద్రేకముచేతను మహా
క్రోధముచేతను నేను వారిని వెళ్లగొట్టిన దేశములన్ని
టిలోనుండి వారిని సమకూర్చి యీ స్థలమునకు తిరిగి
38 రప్పించి వారిని నిర్భయముగా నివసింపజేసెదను. । వారు
నాకు ప్రజలై యుందురు నేను వారికి దేవుడనై
39 యుందును. । మరియు వారికిని వారి తరువాత వారి
కుమారులకును మేలు కలుగుటకై వారు నిత్యము నాకు
భయపడునట్లు నేను వారికి ఏకహృదయమును ఏక
40 మార్గమును దయచేయుదును. । నేను వారికి మేలు
చేయుట మానకుండునట్లు నిత్యమైన నిబంధనను
వారితో చేయుచున్నాను; వారు నన్ను విడువకుండు
నట్లు వారి హృదయములలో నా యెడల భయభక్తులు
41 పుట్టించెదను. । వారికి మేలుచేయుటకు వారియందు
ఆనందించుచున్నాను, నా పూర్ణహృదయముతోను
నా పూర్ణాత్మతోను ఈ దేశములో నిశ్చయముగా
42 వారిని నాటెదను. । యెహోవా ఈలాగు సెల
విచ్చుచున్నాడు—నేను ఈ ప్రజలమీదికి ఇంత గొప్ప
కీడు రప్పించిన రీతినే నేను వారినిగూర్చి చెప్పిన
43 మేలంతటిని వారిమీదికి రప్పింపబోవుచున్నాను. । ఇది
పాడైపోయెను, దానిలో నరులు లేరు, పశువులు
లేవు, ఇది కల్దీయులచేతికి ఇయ్యబడియున్నదని మీరు
చెప్పుచున్న ఈ దేశమున పొలములు విక్రయింప
44 బడును. । నేను వారిలో చెరపోయినవారిని రప్పింప
బోవుచున్నాను గనుక బెన్యామీను దేశములోను
యెరూషలేము ప్రాంతములలోను యూదా పట్టణ
ములలోను మన్యములోని పట్టణములలోను దక్షిణ
దేశపు పట్టణములలోను మనుష్యులు క్రయమిచ్చి
పొలములు కొందురు, క్రయపత్రములు వ్రాయిం
కొందురు, ముద్ర వేయుదురు, సాక్షులను పెట్టు
ఇదే యెహోవా వాక్కు.

33 మరియు యిర్మీయా చెరసాల ప్రా
ఇంక ఉంచబడియుండగా యె
డవసారి అతనికి ప్రత్యక్ష
2 —మాట నె
దాని నిర్మి
నామము
3 నా —

దను, నీవు గ్రహింపలేని గొప్ప సంగతులను గూఢ
మైన సంగతులను నీకు తెలియజేతును. । కల్దీయులతో 4
యుద్ధముచేసి, వారి చెడుతనమునుబట్టి ఈ పట్టణమునకు
విముఖుడనైన నా మహా కోపముచేత హతులై, తమ
కళేబరములతో కల్దీయులకు సంతృప్తికలిగించుటకై
వారు వచ్చుచుండగా । ముట్టడి దిబ్బల దెబ్బకును ఖడ్గ 5
మునకును పట్టణములోని యిండ్లన్నియు యూదా
రాజుల నగరులును శిథిలమై పోయెను గదా. వాటిని
గూర్చి ఇశ్రాయేలు దేవుడగు యెహోవా సెలవిచ్చున
దేమనగా । — నేను దానికి ఆరోగ్యమును స్వస్థ 6
తను మరల రప్పించుచున్నాను, వారిని స్వస్థపరచు
చున్నాను, వారికి సత్యసమాధానములను సమృద్ధిగా
బయలుపరచెదను. । చెరలోనుండిన యూదావారిని 7
ఇశ్రాయేలువారిని నేను రప్పించుచున్నాను, మొదట
నుండినట్లు వారిని స్థాపించుచున్నాను. । వారు నాకు 8
విరోధముగా చేసిన పాపదోషము నిలువకుండ వారిని
పవిత్రపరతును, వారు నాకు విరోధముగాచేసిన
దోషములన్నిటిని తిరుగబాటులన్నిటిని క్షమించెదను. ।
భూజనులందరియెదుట వారు నాకిష్టమైన పేరుగాను 9
స్తోత్రకారణముగాను ఘనతాస్పదముగాను ఉందురు,
నేను వారికి చేయు సకల ఉపకారములనుగూర్చిన
వర్తమానమును జనులు విని నేను వారికి కలుగజేయు
సమస్త క్షేమమునుబట్టియు సమస్తమైన మేలునుబట్టియు
భయపడుచు దిగులు నొందుదురు. । యెహోవా 10
ఈలాగు సెలవిచ్చుచున్నాడు— ఇది పాడైపోయెను, 11
దీనిలో నరులు లేరు నివాసులు లేరు, జంతువులు లేవు
అని మీరు చెప్పు ఈ స్థలములోనే, మనుష్యులైనను
నివాసులైనను జంతువులైనను లేక పాడైపోయిన
యూదా పట్టణములలోనే, యెరూషలేము వీధుల
లోనే, సంతోషస్వరమును ఆనందశబ్దమును పెండ్లి
కుమారుని స్వరమును పెండ్లికుమార్తె స్వరమును —
యెహోవా మంచివాడు, ఆయన కృప నిరంతరముం
డును, సైన్యములకధిపతియగు యెహోవాను స్తుతిం
చుడి అని పలుకువారి స్వరమును మరల వినబడును;
యెహోవా మందిరములోకి స్తుతియాగములను తీసి
కొనివచ్చు ... మును మరల వినబడును; మునుపటి
... లోనున్న యీ దేశస్థులను నేను
... యెహోవా సెలవిచ్చుచున్నా
... పతియగు యెహోవా ఈలాగు 12
... ష్యులైనను జంతువులైనను
... ములోను దాని పట్టణము
... దలను మేపుచు పరుండ
... న్నెపు పట్టణములలోను 13
... దక్షిణదేశపు పట్టణముల
... దేశములోను యెరూషలేము
... యూదాపట్టణములలోను మం

12 దాసులుగాను దాసీలుగాను లోపరచుకొనిరి. । కావున
యెహోవాయొద్దనుండి వాక్కు యిర్మీయాకు ప్రత్య
13 క్షమై యీలాగు సెలవిచ్చెను । — ఇశ్రాయేలు దేవు
డగు యెహోవా ఆజ్ఞ ఇచ్చునదేమనగా — దాసుల
గృహమైన ఐగుప్తుదేశములోనుండి నేను మీ పితరు
లను రప్పించిన దినమున వారితో ఈ నిబంధన చేసి
14 తిని. । — నీకు అమ్మబడి ఆరు సంవత్సరములు కొలువు
చేసిన హెబ్రీయులగు మీ సహోదరులను ఏడు
సంవత్సరములు తీరిన తరువాత మీరు విడిపింపవలెను;
అయితే మీ పితరులు తమ చెవియొగ్గక నా మాట
15 అంగీకరింపకపోయిరి. । మీరైతే ఇప్పుడు మనస్సు
మార్చుకొని, యొక్కొకడు తన పొరుగువానికి విడు
దల చాటింతమని చెప్పి, నా పేరు పెట్టబడిన యీ
మందిరమునందు నా సన్నిధిని నిబంధన చేసితిరి, నా
16 దృష్టికి యుక్తమైనది చేసితిరి. । పిమ్మట మీరు మనస్సు
మార్చుకొని నా నామమును అపవిత్రపరచితిరి; వారి
ఇచ్ఛానుసారముగా తిరుగునట్లు వారిని స్వతంత్రు
లుగా పోనిచ్చిన తరువాత, అందరును తమ దాసదాసీ
లను మరల పట్టుకొని తమకు దాసులుగాను దాసీలు
17 గాను ఉండుటకై వారిని లోపరచుకొంటిరి । కాబట్టి
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—ఒక్కొ
కడు తన సహోదరులకును తన పొరుగువారికిని
విడుదల ప్రకటింపవలెనని నేను చెప్పిన మాట మీరు
వినకపోతిరే; ఆలోచించుడి, విడుదల కావలెనని నేనే
చాటించుచున్నాను, అది ఖడ్గక్షామసంకటముల పాలగు
టకై విడుదలయే; భూరాజ్యములన్నిటిలోను భీతికర
మగు జనముగానుండునట్లు మిమ్ము నప్పగించుచున్నా
18 ను. । మరియు నా సన్నిధిని తాము చేసిన నిబంధన
19 మాటలు నెరవేర్చక దాని నతిక్రమించువారిని, తాము
రెండు భాగములుగా కోసి వాటిమధ్య నడిచిన దూ
డతో సమానులుగా చేయుచున్నాను; అనగా యూదా
అధిపతులను యెరూషలేము అధిపతులను రాజపరి
వారములోనివారిని యాజకులను దేశజనులనందరిని ఆ
దూడయొక్క రెండు భాగముల మధ్య నడచినవారి
నందరిని ఆ దూడతో సమానులుగా చేయుచున్నాను. ।
20 వారి శత్రువుల చేతికిని వారి ప్రాణము తీయజూచు
వారి చేతికిని వారి నప్పగించుచున్నాను, వారి కళేబర
ములు ఆకాశపక్షులకును భూమృగములకును ఆహార
21 ముగా నుండును । యూదారాజైన సిద్కియాను
అతని అధిపతులను వారి శత్రువులచేతికిని వారి
ప్రాణము తీయజూచువారిచేతికిని మీయొద్దనుండి
వెళ్లిపోయిన బాబెలురాజు దండుచేతికిని అప్పగించు
22 చున్నాను. । యెహోవా వాక్కు ఇదే—నేను ఆజ్ఞ
ఇచ్చి యీ పట్టణమునకు వారిని మరల రప్పించు
చున్నాను, వారు దానిమీద యుద్ధముచేసి దాని
పట్టుకొని మంటపెట్టి దాని కాల్చివేసెదరు; మరియు
యూదాపట్టణములను పాడుగాను నిర్జనముగాను
చేయుదును.

యోషీయాకుమారుడును యూదారాజునైన 3
యెహోయాకీము దినములలో యెహోవా
యొద్దనుండి యిర్మీయాకు వాక్కు ప్రత్యక్షమై—నీవు
రేకాబీయులయొద్దకు పోయి వారితో మాటలాడి,
యెహోవా మందిరములోని గదులలో ఒకదాని
లోకి వారిని తోడుకొని వచ్చి, త్రాగుటకు వారికి
ద్రాక్షారసమిమ్మని సెలవియ్యగా । నేను, యిర్మీయా
కుమారుడును యజన్యా కునుమడునైన హబజ్జిన్యాను
అతని సహోదరులను అతని కుమారులనందరిని,
అనగా రేకాబీయుల కుటుంబికులనందరిని, తోడు
కొని వచ్చితిని. । యెహోవా మందిరములో దైవ
జనుడగు యిగ్దల్యా కుమారుడైన హానాను కుమారుల
గదిలోనికి వారిని తీసికొని వచ్చితిని. అది రాజుల
గదికి సమీపమున ద్వారపాలకుడును షల్లూము కుమా
రుడునైన మయశేయా గదికి పైగా ఉండెను. । నేను
రేకాబీయులయెదుట ద్రాక్షారసముతో నిండిన
పాత్రలను గిన్నెలను పెట్టి — ద్రాక్షారసము త్రాగు
డని వారితో చెప్పగా । వారు — మా పితరుడగు
రేకాబు కుమారుడైన యెహోనాదాబు—మీరైనను
మీ సంతతివారైనను ఎప్పుడును ద్రాక్షారసము త్రాగ
కూడదని మాకాజ్ఞాపించెను గనుక మేము ద్రాక్షా
రసము త్రాగము. । మరియు మీరు ఇల్లుకట్టుకొన 7
వద్దు, విత్తనములు విత్తవద్దు, ద్రాక్షతోట నాటవద్దు,
అది మీకుండనేకూడదు; మీరు పరవాసముచేయు
దేశములో దీర్ఘాయుష్మంతులగునట్లు మీ దినములన్ని
యు గుడారములలోనే మీరు నివసింపవలెనని అతడు
మాకాజ్ఞాపించెను. । కావున మా పితరుడైన రేకాబు 8
కుమారుడగు యెహోనాదాబు మాకాజ్ఞాపించిన
సమస్త విషయములలో అతని మాటనుబట్టి మేము
గాని మా భార్యలుగాని మా కుమారులుగాని మా
కుమార్తెలుగాని ద్రాక్షారసము త్రాగుటలేదు । మా 9
తండ్రియైన యెహోనాదాబు మాకాజ్ఞాపించిన
సమస్తమునుబట్టి మేము విధేయులమగునట్లుగా కాపు
రమునకు ఇండ్లు కట్టుకొనుటలేదు, ద్రాక్షావనములు
గాని పొలములుగాని సంపాదించుటలేదు, విత్తనమై
నను చల్లుటలేదు । గుడారములలోనే నివసించుచు 1
న్నాము. । అయితే బాబెలురాజైన నెబుకద్రెజరు 1
ఈ దేశములో ప్రవేశింపగా కల్దీయుల దండుకును
అరామీయుల దండుకును భయపడి, మనము యెరూష
లేముకు పోదము రండని మేము చెప్పుకొంటిమి
గనుక మేము యెరూషలేములో కాపురమున్నామని
చెప్పిరి.

అంతట యెహోవా వాక్కు యిర్మీయాకు ప్రత్య 12
క్షమై యీలాగు సెలవిచ్చెను—ఇశ్రాయేలు దేవుడగు

13 యెహోవా సెలవిచ్చునదేమనగా। — నీవు వెళ్లి
యూదావారికిని యెరూషలేము నివాసులకును ఈ
మాట ప్రకటింపుము—యెహోవా వాక్కు ఇదే—
మీరు శిక్షకు లోబడి నా మాటలను ఆలకింపరా?
14 యిదే యెహోవా వాక్కు. । ద్రాక్షారసము త్రాగ
వద్దని రేకాబు కుమారుడైన యెహోనాదాబు తన
కుమారుల కాజ్ఞాపించిన మాటలు స్థిరముగా ఉన్నవి,
నేటివరకు తమ పితరుని ఆజ్ఞకు విధేయులై వారు
ద్రాక్షారసము త్రాగకున్నారు; అయితే నేను పెం
దలకడ లేచి మీతో బహుశ్రద్ధగా మాటలాడినను
15 మీరు నా మాట వినకున్నారు. । మరియు పెందల
కడ లేచి ప్రవక్తలైన నా సేవకులనందరిని మీయొద్దకు
పంపుచు—ప్రతివాడును తన దుర్మార్గతను విడిచి మీ
క్రియలను చక్కపరచుకొనినయెడలను, అన్యదేవత
లను అనుసరింపకయు వాటిని పూజింపకయు నుండిన
యెడలను, నేను మీకును మీ పితరులకును ఇచ్చిన దేశ
ములో మీరు నివసింతురని నేను ప్రకటించితిని గాని
16 మీరు చెవియొగ్గక నా మాట వినకపోతిరి । రేకాబు
కుమారుడైన యెహోనాదాబు కుమారులు తమ
తండ్రి తమకిచ్చిన ఆజ్ఞను నెరవేర్చిరి గాని యీ
17 ప్రజలు నా మాట వినకయున్నారు. । కాబట్టి
ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతియునగు
యెహోవా ఈ మాట సెలవిచ్చుచున్నాడు—నేను
వారితో మాటలాడితిని గాని వారు వినకపోయిరి,
నేను వారిని పిలిచితిని గాని వారు ప్రత్యుత్తర
మియ్యకపోయిరి గనుక యూదావారిమీదికిని
యెరూషలేము నివాసులందరిమీదికిని రప్పించెదనని
నేను చెప్పిన కీడంతయు వారిమీదికి రప్పించుచు
18 న్నాను. । మరియు యిర్మీయా రేకాబీయులను చూచి
యిట్లనెను — ఇశ్రాయేలు దేవుడును సైన్యముల
కధిపతియునగు యెహోవా ఈలాగు సెలవిచ్చు
చున్నాడు — మీరు మీ తండ్రియైన యెహో
నాదాబు ఆజ్ఞకు విధేయులై అతని విధులన్నిటిని
గైకొని అతడు మీకాజ్ఞాపించిన సమస్తమును అను
19 సరించుచున్నారు. । కాబట్టి ఇశ్రాయేలు దేవుడును
సైన్యములకధిపతియునగు యెహోవా సెలవిచ్చున
దేమనగా — నా సన్నిధిలో నిలుచుటకు రేకాబు
కుమారుడైన యెహోనాదాబుకు సంతతివాడు
ఎన్నడునుండక మానడు.

36 యూదారాజైన యోషీయా కుమారుడగు
యెహోయాకీము నాలుగవ సంవత్సరమున
యెహోవా వాక్కు యిర్మీయాకు ప్రత్యక్షమై
2 యీలాగు సెలవిచ్చెను। — నీవు పుస్తకపుచుట్ట తీసి
కొని నేను నీతో మాటలాడిన దినము మొదలుకొని,
అనగా యోషీయా కాలము మొదలుకొని నేటివరకు
ఇశ్రాయేలువారినిగూర్చియు యూదావారినిగూ
ర్చియు సమస్త జనములనుగూర్చియు నేను నీతో పలి
కిన మాటలన్నిటిని దానిలో వ్రాయుము. । నేను 3
యూదావారికి చేయనుద్దేశించు కీడంతటినిగూర్చి వారు
విని నేను వారి దోషమును వారి పాపమును క్షమించు
నట్లు తమ దుర్మార్గతను విడిచి పశ్చాత్తాపపడుదు
రేమో. । యిర్మీయా నేరీయా కుమారుడైన బారూ 4
కును పిలువనంపగా అతడు యెహోవా యిర్మీయాతో
చెప్పిన మాటలన్నిటిని యిర్మీయా నోటిమాటలనుబట్టి
ఆ పుస్తకములో వ్రాసెను. । యిర్మీయా బారూకుకు 5
ఈలాగు ఆజ్ఞ ఇచ్చెను—నేను యెహోవా మందిర
ములోకి రాకుండ నిర్బంధింపబడితిని. । కాబట్టి నీవు 6
వెళ్లి ఉపవాసదినమున యెహోవా మందిరములో
ప్రజలకు వినబడునట్లు నేను చెప్పగా నీవు పుస్తక
ములో వ్రాసిన యెహోవా మాటలను చదివి విని
పించుము, తమ పట్టణములనుండి వచ్చు యూదా
జనులందరికిని వినబడునట్లుగా వాటిని చదివి వినిపింప
వలెను. । ఒకవేళ వారి విన్నపములు యెహోవా 7
దృష్టికి అనుకూలములగునేమో, ఒకవేళ వారు తమ
చెడుమార్గము విడుతురేమో, నిజముగా ఈ ప్రజల
మీదికి ఉగ్రతయు మహా కోపమును (వచ్చునని)
యెహోవా ప్రకటించియున్నాడు. । ప్రవక్తయైన 8
యిర్మీయా తనకు ఆజ్ఞ ఇచ్చినట్లు నేరీయా కుమారుడైన
బారూకు గ్రంథము చేత పట్టుకొని యెహోవా
మాటలన్నిటిని యెహోవా మందిరములో చదివి
వినిపించెను.

యూదారాజైన యోషీయా కుమారుడగు 9
యెహోయాకీము ఏలుబడియందు అయిదవ సంవత్స
రము తొమ్మిదవ నెలను యెరూషలేములోనున్న ప్రజ
లందరును యూదాపట్టణములలోనుండి యెరూష
లేముకు వచ్చిన ప్రజలందరును యెహోవాపేరట ఉప
వాసము చాటింపగా । బారూకు యెహోవా మంది 10
రములో లేఖికుడైన షాఫాను కుమారుడైన గెమర్యా
గదికి పైగానున్న శాలలో యెహోవా మంది
రపు క్రొత్తద్వారపు ప్రవేశమున ప్రజలందరు విను
నట్లు యిర్మీయా చెప్పిన మాటలను గ్రంథములోనుండి
చదివి వినిపించెను. । షాఫాను కుమారుడైన గెమర్యా 11
కుమారుడగు మీకాయా ఆ గ్రంథములోని
యెహోవా మాటలన్నిటిని విని । రాజనగరులో 12
నున్న లేఖికుని గదిలోకి వెళ్లగా ప్రధానులందరును
లేఖికుడైన ఎలీషామా షెమాయా కుమారుడైన
దెలాయ్యా అక్బోరు కుమారుడైన ఎల్నాతాను షాఫాను
కుమారుడైన గెమర్యా హనన్యా కుమారుడైన సిద్కియా
అనువారును ప్రధానులందరును అక్కడ కూర్చుండి
యుండిరి. । బారూకు ప్రజలందరికి వినబడునట్లు ఆ 13
పుస్తకములోనుండి చదివి వినిపించిన మాటలన్నిటి
మీకాయా వారికి తెలియజెప్పగా । ప్రధానుల

కూషీకి ఇనుమనుమడును షెలెమ్యాకు మనుమడును
నెతన్యాకు కుమారుడునైన యెహూదిని బారూకు
నొద్దకు పంపి—నీవు ప్రజల వినికిడిలో చదివిన పుస్త
కమును చేత పట్టుకొని రమ్మని ఆజ్ఞనియ్యగా నేరీయా
కుమారుడగు బారూకు ఆ గ్రంథమును చేత పట్టు
15 కొని వచ్చెను. । అతడు రాగా వారు—నీవు కూర్చుండి
మాకు వినిపింపుమనగా బారూకు దాని చదివి వినిపిం
16 చెను. । వారు ఆ మాటలన్నిటిని విన్నప్పుడు భయ
పడి యొకరినొకరు చూచుకొని — మేము నిశ్చయ
ముగా ఈ మాటలన్నిటిని రాజునకు తెలియజెప్పెదమని
17 బారూకుతో ననిరి. । మరియు—ఈ మాటలన్నిటిని
ఎవరు చెప్పగా నీవు వ్రాసితివి? అది మాకు తెలియ
18 జెప్పుమని వారడుగగా । బారూకు—అతడు నోట
నుండియే యీ మాటలన్నిటిని పలుకగా నేను పుస్తక
ములో వాటిని సిరాతో వ్రాసితినని వారితో ఉత్తర
19 మిచ్చెను. । నీవును యిర్మీయాయును పోయి దాగి
యుండుడి, మీరున్నచోటు ఎవరికిని తెలియజేయ
20 వద్దని ఆ ప్రధానులు చెప్పి । శాలలోనున్న రాజు
నొద్దకు తామే వెళ్లి ఆ మాటలన్నిటిని రాజుచెవులలో
వినిపించిరి గాని ఆ పుస్తకపుచుట్టను లేఖికుడైన ఎలీ
21 షామా గదిలో దాచిపెట్టిరి. । ఆ గ్రంథమును తెచ్చు
టకు రాజు యెహూదిని పంపగా అతడు లేఖికుడైన
ఎలీషామా గదిలోనుండి దాని తీసికొని వచ్చి రాజు
వినికిడిలోను రాజునొద్ద నిలిచియున్న అధిపతులందరి
22 వినికిడిలోను దాని చదివెను. । తొమ్మిదవ మాసమున
రాజు శీతకాలపు నగరులో కూర్చుండియుండగా
అతని ముందర కుంపటిలో అగ్ని రగులుచుండెను. ।
23 యెహూది మూడు నాలుగు పుటలు చదివిన
తరువాత రాజు చాకుతో దాని కోసి కుంపటిలో
వేయగా ఆ కుంపటిలోనున్న అగ్నిచేత అది బొత్తిగా
24 కాలిపోయెను గాని । రాజైనను, ఈ మాటలన్నిటిని
వినిన యతని సేవకులలో ఎవరైనను భయపడలేదు,
25 తమ బట్టలు చింపుకొనలేదు. । —గ్రంథమును కాల్చ
వద్దని ఎల్నాతానును దెలాయ్యాయును గెమర్యా
యును రాజుతో మనవిచేయగా అతడు వారి విజ్ఞా
26 పనము వినకపోయెను. । లేఖికుడైన బారూకును
ప్రవక్తయైన యిర్మీయాను పట్టుకొనవలెనని రాజవంశస్థు
డగు యెరహ్మెయేలుకును అజ్రీయేలు కుమారుడైన
శెరాయాకును అబ్దెయేలు కుమారుడైన షెలెమ్యాకును
రాజు ఆజ్ఞాపించెను గాని యెహోవా వారిని దాచెను.
27 యిర్మీయా నోటిమాటనుబట్టి బారూకు వ్రాసిన
గ్రంథమును రాజు కాల్చిన తరువాత యెహోవా
వాక్కు యిర్మీయాకు ప్రత్యక్షమై యీలాగు సెల
28 విచ్చెను । — నీవు మరియొక గ్రంథము తీసికొని
యూదారాజైన యెహోయాకీము కాల్చిన మొదటి
గ్రంథములో వ్రాయబడిన మాటలన్నిటిని దానిలో
వ్రాయుము. । మరియు యూదారాజైన యెహో 29
యాకీమునుగూర్చి నీవీమాట చెప్పవలెను—యెహోవా
సెలవిచ్చునదేమనగా — బాబెలురాజు నిశ్చయముగా
వచ్చి యీ దేశమును పాడుచేసి అందులో మనుష్యు
లైనను జంతువులైనను ఉండకుండ చేయునని ఇందులో
నీవేల వ్రాసితివని చెప్పి నీవు ఈ గ్రంథమును కాల్చి
వేసితివే; । అందుచేతను యూదారాజైన యెహో 30
యాకీమునుగూర్చి యెహోవా ఈ మాట సెలవిచ్చు
చున్నాడు—దావీదుయొక్క సింహాసనముమీద ఆసీను
డగుటకు అతనికి ఎవడును లేకపోవును, అతని శవము
పగలు ఎండపాలు రాత్రి మంచుపాలగును. । నేను 31
వారి దోషమునుబట్టి అతనిని అతని సంతతిని అతని
సేవకులను శిక్షించుచున్నాను, నేను వారినిగూర్చి
చెప్పిన కీడంతయు వారిమీదికిని యెరూషలేము
నివాసులమీదికిని యూదా జనులమీదికిని రప్పించు
చున్నాను; అయినను వారు వినినవారుకారు. ।
యిర్మీయా యింకొక గ్రంథమును తీసికొని లేఖికుడగు 32
నేరీయా కుమారుడైన బారూకుచేతికి అప్పగింపగా
అతడు యిర్మీయా నోటిమాటలనుబట్టి యూదారాజైన
యెహోయాకీము అగ్నిలో కాల్చిన గ్రంథపు మాట
లన్నిటిని వ్రాసెను; మరియు ఆ మాటలు గాక అట్టివి
అనేకములు అతడు వాటితో కూర్చెను.

బాబెలురాజైన నెబుకద్రెజరు యూదా దేశ 37
ములో రాజుగా నియమించిన యోషీయా కుమారు
డగు సిద్కియా యెహోయాకీము కుమారుడైన
కొన్యాకు ప్రతిగా రాజ్యముచేయుచుండెను. । అత 2
డైనను అతని సేవకులైనను దేశప్రజలైనను యెహోవా
ప్రవక్తయైన యిర్మీయాచేత సెలవిచ్చిన మాటలను లక్ష్య
పెట్టలేదు.

రాజైన సిద్కియా షెలెమ్యా కుమారుడైన యెహూ 3
కలును యాజకుడైన మయశేయా కుమారుడగు జెఫ
న్యాను ప్రవక్తయైన యిర్మీయాయొద్దకు పంపి—దయ
చేసి మన దేవుడైన యెహోవాకు ప్రార్థన చేయు
మని మనవిచేసెను. । అప్పటికి వారు యిర్మీయాను 4
చెరసాలలో నుంచియుండలేదు; అతడు ప్రజలమధ్య
సంచరించుచుండెను. । ఫరో దండు ఐగుప్తులోనుండి 5
బయలుదేరగా యెరూషలేమును ముట్టడివేయుచున్న
కల్దీయులు సమాచారము విని యెరూషలేము దగ్గర
నుండి బయలుదేరిరి. । అప్పుడు యెహోవా వాక్కు 6
ప్రవక్తయైన యిర్మీయాకు ప్రత్యక్షమై యీలాగు సెల
విచ్చెను । — ఇశ్రాయేలు దేవుడగు యెహోవా 7
ఆజ్ఞ ఇచ్చునదేమనగా — నాయొద్ద విచారించుడని
నిన్ను నాయొద్దకు పంపిన యూదారాజుతో నీ
వీలాగు చెప్పవలెను—మీకు సహాయము చేయుటకై
బయలుదేరి వచ్చుచున్న ఫరోదండు తమ స్వదేశమైన
ఐగుప్తులోకి తిరిగి వెళ్లును. । కల్దీయులు తిరిగి వచ్చి 8

ఈ పట్టణముమీద యుద్ధముచేసి దాని పట్టుకొని
9 అగ్నిచేత కాల్చివేయుదురు. । యెహోవా ఈ
మాట సెలవిచ్చుచున్నాడు—కల్దీయులు నిశ్చయముగా
మాయొద్దనుండి వెళ్లెదరనుకొని మిమ్మును మీరు మోస
10 పుచ్చుకొనకుడి, వారు వెళ్లనే వెళ్లరు. । మీతో
యుద్ధముచేయు కల్దీయుల దండువారినందరిని మీరు
హతముచేసి వారిలో గాయపడిన వారిని మాత్రమే
మిగిలించినను వారే తమ గుడారములలోనుండి వచ్చి
యీ పట్టణమును అగ్నితో కాల్చివేయుదురు.
11 ఫరో దండు బయలుదేరినందున కల్దీయుల దండు
12 యెరూషలేము ఎదుటనుండి వెళ్లిపోగా । యిర్మీయా
బెన్యామీను దేశములో తనవారియొద్ద భాగము తీసి
కొనుటకై యెరూషలేమునుండి బయలుదేరి అక్కడికి
పోయెను. అతడు బెన్యామీను గుమ్మమునొద్దకు రాగా।
13 ఇరీయా అను కావలివారి అధిపతి అక్కడ నుండెను.
అతడు హనన్యా కుమారుడైన షెలెమ్యా కుమారుడు.
అతడు ప్రవక్తయైన యిర్మీయాను పట్టుకొని—నీవు కల్దీ
14 యులలో చేరబోవుచున్నావని చెప్పగా । యిర్మీయా—
అది అబద్ధము, నేను కల్దీయుల పక్షపువాడనుకాన
నెను. అయితే అతడు యిర్మీయా మాట నమ్మనందున
ఇరీయా యిర్మీయాను పట్టుకొని అధిపతులయొద్దకు తీసి
15 కొని వచ్చెను. । అధిపతులు యిర్మీయామీద కోపపడి
అతని కొట్టి, తాము బందీగృహముగా చేసియున్న
లేఖికుడైన యోనాతాను ఇంటిలో అతని వేయించిరి. ।
16 యిర్మీయా చెరసాల గోతిలో వేయబడి అక్కడ అనేక
17 దినములు ఉండెను; పిమ్మట రాజైన సిద్కియా అతని
రప్పించుటకు వర్తమానము పంపి, అతని తన యింటికి
పిలిపించి — యెహోవాయొద్దనుండి ఏ మాటైనను
వచ్చెనా అని యడుగగా యిర్మీయా — నీవు బాబెలు
రాజుచేతికి అప్పగింపబడెదవను మాట వచ్చెననెను. ।
18 మరియు యిర్మీయా రాజైన సిద్కియాతో ఇట్లనెను—
నేను నీకైనను నీ సేవకులకైనను ఈ ప్రజలకైనను ఏ
పాపము చేసినందున నన్ను చెరసాలలో వేసితివి? ।
19 బాబెలురాజు మీమీదికైనను ఈ దేశముమీదికైనను
రాడని మీకు ప్రకటించిన మీ ప్రవక్తలు ఎక్కడ
20 నున్నారు? । రాజా, నా యేలినవాడా, చిత్తగించి
వినుము, చిత్తగించి నా మనవి నీ సన్నిధికి రానిమ్ము,
నేను అక్కడ చనిపోకుండునట్లు లేఖికుడైన యోనా
21 తాను ఇంటికి నన్ను మరల వెళ్లనంపకుము. । కాబట్టి
రాజైన సిద్కియా సెలవియ్యగా (బంటులు) బందీ
గృహశాలలో యిర్మీయాను వేసి, పట్టణములో రొట్టె
లున్నంతవరకు రొట్టెలు కాల్చువారి వీధిలోనుండి అను
దినము ఒక రొట్టె అతనికిచ్చుచువచ్చిరి; ఇట్లు జరు
గగా యిర్మీయా బందీగృహశాలలో నివసించెను.

**38** యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—ఈ
పట్టణములో నిలిచియున్న వారు ఖడ్గముచేతనైనను
క్షామముచేతనైనను తెగులుచేతనైనను చచ్చుదురు గాని
కల్దీయులయొద్దకు బయలువెళ్లువారు బ్రదుకుదురు,
దోపుడుసొమ్ము దక్కించుకొనునట్లు తమ ప్రాణము
దక్కించుకొని వారు బ్రదుకుదురు. । యెహోవా 2
ఈలాగు సెలవిచ్చుచున్నాడు—ఈ పట్టణము నిశ్చయ
ముగా బాబెలురాజు దండుచేతికి అప్పగింపబడును,
అతడు దాని పట్టుకొనును అని యిర్మీయా ప్రజలకంద
రికి ప్రకటింపగా । మత్తాను కుమారుడైన షెఫట్యా 3
యును పషూరు కుమారుడైన గెదల్యాయును షెలెమ్యా 4
కుమారుడైన యూకలును పషూరు కుమారుడైన మల్కీ
యాయును వినిరి గనుక ఆ ప్రధానులు రాజుతో
మనవి చేసినదేమనగా—ఈ మనుష్యుడు ఈ ప్రజలకు
నష్టము కోరువాడేగాని క్షేమము కోరువాడు కాడు.
ఇతడు ఇట్టి సమాచారము వారికి ప్రకటనచేయుట
వలన ఈ పట్టణములో నిలిచియున్న ఆయుధస్థుల
చేతులను ప్రజలందరి చేతులను బలహీనము చేయు
చున్నాడు; చిత్తగించి వానికి మరణశిక్ష విధింపుము. ।
అందుకు రాజైన సిద్కియా — అతడు మీవశమున 5
ఉన్నాడు, రాజు మీకు అడ్డము రాజాలడనగా ।
వారు యిర్మీయాను పట్టుకొని కారాగృహములోనున్న 6
రాజకుమారుడగు మల్కీయా గోతిలోకి దింపిరి. అందు
లోకి యిర్మీయాను త్రాళ్లతో దింపినప్పుడు ఆ గోతిలో
నీళ్లు లేవు, బురదమాత్రమే యుండెను, ఆ బురదలో
యిర్మీయా దిగబడెను. । రాజు బెన్యామీను ద్వార 7
మున కూర్చునియుండగా రాజు ఇంటిలోని కూషీయు 8
డగు ఎబెద్మెలెకను షండుడు, వారు యిర్మీయాను
గోతిలో వేసిరను సంగతి విని, రాజు నగరులోనుండి
బయలువెళ్లి రాజుతో ఈలాగు మనవిచేసెను । —
రాజా, నా యేలినవాడా, ఆ గోతిలో వేయబడిన 9
యిర్మీయా అను ప్రవక్తయెడల ఈ మనుష్యులు చేసి
నది యావత్తును అన్యాయము; అతడున్నచోటను
అతడు ఆకలిచేత చచ్చును, పట్టణములోనైనను ఇం
కను రొట్టెలేమియు లేవు. । అందుకు రాజు — నీవు 10
ఇక్కడనుండి ముప్పదిమంది మనుష్యులను వెంటబెట్టు
కొనిపోయి, ప్రవక్తయైన యిర్మీయా చావకమునుపు ఆ
గోతిలోనుండి అతని తీయించుమని కూషీయుడగు
ఎబెద్మెలెకునకు సెలవియ్యగా । ఎబెద్మెలెకు ఆ మనుష్యు 11
లను వెంటబెట్టుకొని రాజనగరులో ఖజానా క్రింది 12
గదిలోనికి వచ్చి, అచ్చటనుండి పాతవైన చింకిబట్టలను
చిరిగి చీరాకులైన గుడ్డపాతలను తీసికొనిపోయి, ఆ
గోతిలోనున్న యిర్మీయా పట్టుకొనునట్లుగా త్రాళ్ల
చేత వాటిని దింపి—పాతవై చిరిగి చీరాకులైన యీ
బట్టలను త్రాళ్లమీద నీ చంకలక్రింద పెట్టుకొనుమని
అతనితో చెప్పెను. । యిర్మీయా ఆలాగు చేయగా 13
వారు యిర్మీయాను త్రాళ్లతో చేదుకొని ఆ గోతిలో

నుండి వెలుపలికి తీసిరి; అప్పుడు యిర్మీయా బందీగృహ
శాలలో నివసించెను.
14 తరువాత రాజైన సిద్కియా యెహోవా మందిర
ములోనున్న మూడవ ద్వారములోకి ప్రవక్తయైన
యిర్మీయాను పిలువనంపించి అతనితో ఇట్లనెను—నేను
ఒకమాట నిన్నడుగుచున్నాను, నీవు ఏ సంగతిని నాకు
15 మరుగుచేయక దాని చెప్పుమనగా । యిర్మీయా—నేను
ఆ సంగతి నీకు తెలియజెప్పినయెడల నిశ్చయముగా
నీవు నాకు మరణశిక్ష విధింతువు, నేను నీకు ఆలోచన
16 చెప్పినను నీవు నా మాట వినవు. । కావున రాజైన
సిద్కియా—జీవాత్మను మనకనుగ్రహించు యెహోవా
తోడు నేను నీకు మరణము విధింపను, నీ ప్రాణము
తీయ జూచుచున్న యీ మనుష్యుల చేతికి నిన్ను
అప్పగింపను అని యిర్మీయాతో రహస్యముగా ప్రమా
17 ణము చేసెను. । అప్పుడు యిర్మీయా సిద్కియాతో
ఇట్లనెను—దేవుడు, ఇశ్రాయేలు దేవుడును సైన్యముల
కధిపతియునైన యెహోవా ఈలాగు సెలవిచ్చు
చున్నాడు—నీవు బాబెలురాజు అధిపతులయొద్దకు
వెళ్లిన పక్షమందు నీవు బ్రదికెదవు, ఈ పట్టణము
అగ్నిచేత కాల్చబడదు, నీవును నీ యింటివారును బ్రదు
18 కుదురు. । అయితే నీవు బాబెలు అధిపతులయొద్దకు
వెళ్లనియెడల ఈ పట్టణము కల్దీయులచేతికి అప్పగింప
బడును, వారు అగ్నిచేత దాని కాల్చివేసెదరు, మరియు
19 నీవు వారి చేతిలోనుండి తప్పించుకొనజాలవు. । అం
దుకు రాజైన సిద్కియా యిర్మీయాతో ఇట్లనెను—కల్దీ
యుల పక్షముగా ఉండు యూదులకు భయపడు
చున్నాను; ఒకవేళ కల్దీయులు నన్ను వారిచేతికి అప్ప
20 గించినయెడల వారు నన్ను అపహసించెదరు. । అం
దుకు యిర్మీయా—వారు నిన్నప్పగింపరు, నీవు బ్రదికి
బాగుగానుండునట్లు నేను నీతో చెప్పుచున్న సంగతిని
గూర్చి యెహోవా సెలవిచ్చుమాటను చిత్తగించి ఆల
21 కించుము. । నీవు ఒకవేళ బయలువెళ్లకపోయిన పక్ష
మున యెహోవా ఈ మాట నాకు తెలియజేసెను: ।
22 —యూదారాజు నగరులో శేషించియున్న స్త్రీలందరు
బాబెలు అధిపతులయొద్దకు కొనిపోబడెదరు, ఆలాగు
జరుగగా ఆ స్త్రీలు నిన్ను చూచి—నీ ప్రియస్నేహి
తులు నిన్ను మోసపుచ్చి నీ పైని విజయము పొంది
యున్నారు, నీ పాదములు బురదలో దిగబడియుం
23 డగా వారు వెనుకతీసిరని యందురు. । నీ భార్యలంద
రును నీ పిల్లలును కల్దీయులయొద్దకు కొనిపోబడుదురు,
నీవు వారి చేతిలోనుండి తప్పించుకొనజాలక బాబెలు
రాజుచేత పట్టబడెదవు గనుక ఈ పట్టణమును అగ్ని
24 చేత కాల్చుటకు నీవే కారణమగుదువు. । అందుకు
సిద్కియా యిర్మీయాతో ఇట్లనెను—నీవు మరణశిక్ష
నొందకుండునట్లు ఈ సంగతులను ఎవనికిని తెలియ
ము. । నేను నీతో మాటలాడిన సంగతి అధి
పతులు వినినపక్షమున వారు నీయొద్దకు వచ్చి—మేము
నిన్ను చంపకుండునట్లు రాజుతో నీవు చెప్పిన సంగ
తిని రాజు నీతో చెప్పిన సంగతిని మరుగుచేయక
మాకిప్పుడే తెలియజెప్పుమనగా । నీవు—యోనాతాను 26
ఇంటిలో నేను చనిపోకుండ అక్కడికి నన్ను తిరిగి
వెళ్లనంపవద్దని రాజు ఎదుట నేను మనవి చేసికొనబోతి
నని వారితో చెప్పుమని రాజు యిర్మీయాతో అనెను. ।
అంతట అధిపతులందరు యిర్మీయాయొద్దకు వచ్చి యడు 27
గగా అతడు రాజు సెలవిచ్చిన మాటల ప్రకారముగా
వారికుత్తరమిచ్చి ఆ సంగతి వారికి తెలియజేయనందున
వారు అతనితో మాటలాడుట మానిరి. । యెరూష 28
లేము పట్టబడు పర్యంతము యిర్మీయా బందీగృహ
శాలలో ఉండెను.

**యూ**దారాజైన సిద్కియా యేలుబడియందు 39
తొమ్మిదవసంవత్సరము పదియవ నెలలో బాబెలు 2
రాజైన నెబుకద్రెజరు తన సమస్త సైన్యముతో
యెరూషలేముమీదికి వచ్చి దాని ముట్టడివేయగా
సిద్కియా యేలుబడియందు పదకొండవ సంవత్సరము
నాలుగవ నెల తొమ్మిదవ దినమున పట్టణ ప్రాకార
ములు పడగొట్టబడెను. । యెరూషలేము పట్టబడగా 3
అధిపతులందరు, నేర్గల్‌షరేజరు సమ్గర్నెబోపండుల
కధిపతియగు శర్సెకీము, జ్ఞానులకధిపతియగు నేర్గల్‌
షరేజరు మొదలైన బాబెలురాజు అధిపతులందరు
లోపలికి వచ్చి మధ్యగుమ్మములో కూర్చుండిరి. । యూ 4
దుల రాజైన సిద్కియాయు అతని ఆయుధస్థులంద
రును వారిని చూచి పారిపోయి, రాజు తోటమార్గ
మున రెండు గోడల మధ్యనున్న గుమ్మపుమార్గమున
పోయిరి గాని రాజు మైదానపు మార్గమున వెళ్లిపో
యెను. । అయితే కల్దీయుల సేన వారిని తరిమి యెరికో 5
దగ్గరనున్న మైదానములలో సిద్కియాను కలిసికొని
పట్టుకొని, రాజు అతనికి శిక్ష విధింపవలెనని హమాతు
దేశములో రిబ్లాపట్టణము దగ్గరనున్న బాబెలురాజైన
నెబుకద్రెజరునొద్దకు వారు సిద్కియాను తీసికొని
పోయిరి. । బాబెలురాజు రిబ్లాపట్టణములో సిద్కియా 6
కుమారులను అతని కన్నులయెదుట చంపించెను,
మరియు బాబెలురాజు యూదా ప్రధానులందరిని
చంపించెను. । అంతట అతడు సిద్కియా కన్నులు 7
ఊడదీయించి అతని బాబెలుకు తీసికొనిపోవుటకై
సంకెళ్లతో బంధించెను. । కల్దీయులు రాజనగరును 8
ప్రజలయిండ్లను అగ్నిచేత కాల్చివేసి యెరూషలేము
ప్రాకారములను పడగొట్టిరి. । అప్పుడు రాజదేహ 9
సంరక్షకుల కధిపతియగు నెబూజరదాను శేషించి
పట్టణములో నిలిచియున్న ప్రజలను, ద్రోహులై
తమ రాజును విడిచి తనతో చేరినవారిని, శేషించిన
ప్రజలనందరిని బాబెలుకు కొనిపోయెను. । అయితే 10
రాజదేహసంరక్షకుల కధిపతియైన నెబూజరదాను

లేమిగల దరిద్రులను యూదాదేశములో నుండనిచ్చి,
వారికి ద్రాక్షతోటలను పొలములను నియమించెను. ।
11 మరియు యిర్మీయానుగూర్చి బాబెలురాజైన నెబుక
12 ద్రెజరు రాజదేహసంరక్షకులకు అధిపతియగు నెబూ
జరదానుకు ఈ ఆజ్ఞ ఇచ్చెను—నీవు ఇతనికి హాని
చేయక దగ్గరనుంచుకొని పరామర్శించి, ఇతడు నీతో
13 చెప్పునట్లు చేయవలెను. । కావున రాజదేహసంరక్ష
కులకు అధిపతియైన నెబూజరదానును షండులకు అధి
పతియగు నెబూషజ్బానును జ్ఞానులకు అధిపతియగు
నేర్గల్ షరేజరును బాబెలురాజు ప్రధానులందరును
14 దూతలను పంపి । బందీగృహశాలలోనుండి యిర్మీ
యాను తెప్పించి, అతనిని యింటికి తోడుకొనిపోవు
టకు షాఫాను కుమారుడైన అహీకాము కుమారుడగు
గెదల్యాకు అతని నప్పగించిరి, అప్పుడతడు ప్రజల
మధ్య నివాసముచేసెను.
15 యిర్మీయా బందీగృహశాలలోనుండగా యెహోవా
మాట అతనికి ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను ।
16 — నీవు వెళ్లి కూషీయుడగు ఎబెద్మెలెకుతో ఇట్లనుము
—ఇశ్రాయేలు దేవుడును సైన్యముల కధిపతియునగు
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — మేలు
చేయుటకై కాక కీడుచేయుటకై నేను ఈ పట్టణ
మునుగూర్చి చెప్పిన మాటలు నెరవేర్చుచున్నాను;
నీవు చూచుచుండగా ఆ మాటలు ఆ దినమున నెర
17 వేరును. । ఆ దినమున నేను నిన్ను విడిపించెదను, నీవు
భయపడు మనుష్యులచేతికి నీవు అప్పగింపబడవని
18 యెహోవా సెలవిచ్చుచున్నాడు. । నీవు నన్ను నమ్ము
కొంటివి గనుక నిశ్చయముగా నేను నిన్ను తప్పించె
దను, నీవు ఖడ్గముచేత పడవు, దోపుడుసొమ్ము దక్కించు
కొనునట్లు నీ ప్రాణమును నీవు దక్కించుకొందువు;
ఇదే యెహోవా వాక్కు.

40 రాజదేహసంరక్షకుల కధిపతియైన నెబూజర
దాను యెరూషలేములోనుండియు యూదాలోనుండి
యు బాబెలునకు చెరగా కొనిపోబడిన బందీజనులందరి
లోనుండి, సంకెళ్లచేత కట్టబడియున్న యిర్మీయాను
తీసికొని రామాలోనుండి పంపివేయగా, యెహోవా
2 యొద్దనుండి అతనికి ప్రత్యక్షమైన వాక్కు. । రాజ
దేహసంరక్షకుల కధిపతి!యిర్మీయాను అవతలికి తీసికొని
పోయి అతనితో ఈలాగు మాటలాడెను—ఈ స్థలము
నకు నేను ఈ కీడు చేసెదనని నీ దేవుడగు యెహోవా
3 ప్రకటించెను గదా. । తాను చెప్పిన ప్రకారము
యెహోవా దాని రప్పించి చేయించెను, మీరు
యెహోవాకు విరోధముగా పాపముచేసి ఆయన
4 మాటలు వినకపోతిరి గనుక మీకీగతి పట్టినది. । ఆల
కించుము, ఈ దినమున నేను నీ చేతుల సంకెళ్లను తీసి
నిన్ను విడిపించుచున్నాను, నాతోకూడ బాబెలునకు
వచ్చుట మంచిదని నీకు తోచినయెడల రమ్ము, నేను
నిన్ను భద్రముగా కాపాడెదను; అయితే బాబెలునకు
నాతోకూడ వచ్చుట మంచిదికాదని నీకు తోచిన
యెడల రావద్దు, దేశమంతట నీకేమియు అడ్డములేదు,
ఎక్కడికి వెళ్లుట నీ దృష్టికి అనుకూలమో, యెక్కడికి
వెళ్లుట మంచిదని నీకు తోచునో అక్కడికే వెళ్లుము. ।
ఇంకను అతడు తిరిగి వెళ్లక తడవుచేయగా రాజదేహ 5
సంరక్షకుల కధిపతి అతనితో ఈలాగు చెప్పెను —
బాబెలురాజు షాఫాను కుమారుడైన అహీకాము కుమా
రుడగు గెదల్యాను యూదాపట్టణములమీద నియ
మించియున్నాడు, అతనియొద్దకు వెళ్లుము; అతనియొద్ద
నివసించి ప్రజలమధ్యను కాపురముండుము, లేదా
యెక్కడికి వెళ్లుట నీ దృష్టికి అనుకూలమో అక్కడికే
వెళ్లుము. మరియు రాజదేహసంరక్షకుల కధిపతి అత
నికి బత్తెమును బహుమానము ఇచ్చి అతని సాగనం
పగా । యిర్మీయా మిస్పాలోనుండి అహీకాము కుమా 6
రుడైన గెదల్యాయొద్దకు వెళ్లి అతనితోకూడ దేశ
ములో మిగిలిన ప్రజలమధ్య కాపురముండెను.
అయితే అచ్చటచ్చటనుండు సేనల యధిపతులంద 7
రును వారి పటాలపువారును, బాబెలురాజు అహీ
కాము కుమారుడైన గెదల్యాను దేశముమీద అధి
కారిగా నియమించి, బాబెలునకు చెరగొనిపోబడక
నిలిచినవారిలో స్త్రీలను పురుషులను పిల్లలను, దేశము
లోని అతినీరసులైన దరిద్రులను అతనికి అప్పగించెనని
వినిరి. । కాగా నెతన్యా కుమారుడైన ఇష్మాయేలును 8
కారేహ కుమారులైన యోహానాను యోనాతానులును
తన్హుమెతు కుమారుడైన శెరాయాయును నెటోపాతీ
యుడైన ఏపయి కుమారులును మాయకాతీయుడైనవాని
కుమారుడగు యెజన్యాయును వారి పటాలపువారును
మిస్పాలో నుండిన గెదల్యాయొద్దకు వచ్చిరి. । అప్పుడు 9
షాఫాను కుమారుడైన అహీకాము కుమారుడగు గెదల్యా
ప్రమాణముచేసి వారితోను వారి పటాలపువారితోను
ఈలాగు చెప్పెను—మీరు కల్దీయులను సేవించుటకు
భయపడకుడి, దేశములో కాపురముండి బాబెలు
రాజును సేవించినయెడల మీకు మేలు కలుగును. ।
నేనైతేనో నాయొద్దకు వచ్చు కల్దీయులతో మాట 10
లాడుటకై మిస్పాలో కాపురముందును గాని మీరు
ద్రాక్షారసమును వేసవికాల ఫలములను తైలమును
సమకూర్చుకొని, మీ పాత్రలలో వాటిని పోసికొని
మీరు స్వాధీనపరచుకొనిన పట్టణములలో కాపుర
ముండుడి. । మోయాబులోనేమి అమ్మోనీయుల మధ్య 11
నేమి ఎదోములోనేమి యే యే ప్రదేశములలోనేమి
యున్న యూదులందరు బాబెలురాజు యూదాలో
జనశేషమును విడిచెననియు, షాఫాను కుమారుడైన
అహీకాము కుమారుడగు గెదల్యాను వారిమీద నియ
మించెననియు వినినప్పుడు । అందరును తాము తోలి 12
వేయబడిన స్థలములన్నిటిని విడిచి మిస్పాకు గెదల్యా

యొద్దకు వచ్చి బహు విస్తారముగా ద్రాక్షారసమును
వేసవికాలపు పండ్లను సమకూర్చుకొనిరి.
13 మరియు కారేహ కుమారుడైన యోహానానును
అచ్చటచ్చటనున్న సేనల యధిపతులందరును మిస్పా
14 లోనున్న గెదల్యాయొద్దకు వచ్చి। —నిన్ను చంపు
టకు అమ్మోనీయులరాజైన బయలీసు నెతన్యా కుమారు
డైన ఇష్మాయేలును పంపెనని నీకు తెలియదా అని
చెప్పిరి. అయితే అహీకాము కుమారుడైన గెదల్యా
15 వారి మాట నమ్మలేదు. । కారేహ కుమారుడగు యోహా
నాను మిస్పాలో గెదల్యాతో రహస్యముగా ఇట్ల
నెను—నీయొద్దకు కూడివచ్చిన యూదులందరు చెదరి
పోవునట్లును, యూదా జనశేషము నశించునట్లును
నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు నిన్ను చంపనేల?
దయచేసి నన్ను వెళ్లనిమ్ము, ఎవనికి తెలియకుండ నేను
16 వాని చంపెదను. । అందుకు అహీకాము కుమారు
డైన గెదల్యా కారేహ కుమారుడైన యోహానానుతో
—ఇష్మాయేలునుగూర్చి నీవు అబద్ధమాడుచున్నావు,
నీవాకార్యము చేయకూడదనెను.

41 ఏడవ మాసమున ఎలీషామా మనుమడును నెతన్యా
కుమారుడును రాజవంశస్థుడును రాజుయొక్క ప్రధా
నులలో నొకడునగు ఇష్మాయేలనువాడును, అతనితో
పదిమంది మనుష్యులును, మిస్పాలోనున్న అహీకాము
కుమారుడైన గెదల్యాయొద్దకు వచ్చి అక్కడ అతనితో
2 కూడ మిస్పాలో భోజనముచేసిరి. । అప్పుడు నెతన్యా
కుమారుడైన ఇష్మాయేలును అతనితోకూడనున్న ఆ పది
మంది మనుష్యులును లేచి షాఫాను మనుమడును
అహీకాము కుమారుడునైన గెదల్యాను ఖడ్గముచేత
హతముచేసిరి; బాబెలురాజు ఆ దేశముమీద అతని
అధికారినిగా నియమించినందున అతని చంపిరి. ।
3 మరియు మిస్పాలో గెదల్యాయొద్ద ఉండిన యూదుల
నందరిని, అక్కడ దొరికిన యోధులగు కల్దీయులను
4 ఇష్మాయేలు చంపెను. । అతడు గెదల్యాను చంపిన
రెండవనాడు అది ఎవనికిని తెలియబడకమునుపు ।
5 గడ్డములు క్షౌరము చేయించుకొని వస్త్రములు చింపు
కొని వ్యాకులపడుచున్నట్టి యెనుబదిమంది పురుషులు
యెహోవా మందిరమునకు తీసికొనిపోవుటకై నైవే
ద్యములను ధూపద్రవ్యములను చేత పట్టుకొని షెకెము
నుండియు షిలోహునుండియు షోమ్రోనునుండియు
6 రాగా । నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు దారి పొడు
గున ఏడ్చుచు, వారిని ఎదుర్కొనుటకు మిస్పాలో
నుండి బయలువెళ్లి వారిని కలిసికొని వారితో—అహీ
కాము కుమారుడైన గెదల్యాయొద్దకు రండనెను. ।
7 అయితే వారు ఆ పట్టణము మధ్యను ప్రవేశించినప్పుడు
నెతన్యా కుమారుడైన ఇష్మాయేలును అతనితోకూడ
ఉన్నవారును వారిని చంపి గోతిలో పడవేసిరి. ।
8 అయితే వారిలో పదిమంది మనుష్యులు ఇష్మాయేలు
తో—పొలములలో దాచబడిన గోధుమలు యవలు
తైలము తేనె మొదలైన ద్రవ్యములు మాకు కలవు,
మమ్మును చంపకుమని చెప్పుకొనగా అతడు వారి
సహోదరులతోకూడ వారిని చంపకమానెను. । ఇష్మా 9
యేలు గెదల్యాతోకూడ చంపిన మనుష్యుల శవము
లన్నిటిని పడవేసిన గోయి రాజైన ఆసా ఇశ్రాయేలు
రాజైన బయషాకు భయపడి త్రవ్వించిన గొయ్యియే;
నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు చంపబడినవారి
శవములతో దాని నింపెను. । అప్పుడు ఇష్మాయేలు 10
మిస్పాలోనున్న జనశేషమంతటిని రాజుకుమార్తెలనంద
రిని, అనగా రాజదేహసంరక్షకులకధిపతియైన నెబూ
జరదాను అహీకాము కుమారుడైన గెదల్యాకు అప్ప
గించిన జనులందరిని, చెరతీసికొనిపోయెను. నెతన్యా
కుమారుడైన ఇష్మాయేలు వారిని చెరతీసికొనిపోయి
అమ్మోనీయులయొద్దకు చేరవలెనని ప్రయత్నపడు
చుండగా । కారేహ కుమారుడైన యోహానానును 11
అతనితోకూడనున్న సేనాధిపతులందరును నెతన్యా
కుమారుడైన ఇష్మాయేలు చేసిన సమస్త దుష్కార్యము
లనుగూర్చిన వార్త విని । పురుషులనందరిని పిలుచు 12
కొని, నెతన్యా కుమారుడైన ఇష్మాయేలుతో యుద్ధము
చేయబోయి, గిబియోనులోనున్న మహా జలముల
దగ్గర అతని కలిసికొనిరి. । ఇష్మాయేలుతోకూడనున్న 13
ప్రజలందరు కారేహ కుమారుడైన యోహానానును,
అతనితోకూడనున్న సేనాధిపతులనందరిని చూచి
నప్పుడు వారు సంతోషించి । ఇష్మాయేలు మిస్పాలో 14
నుండి చెరగొనిపోయిన ప్రజలందరు అతని విడిచి
కారేహ కుమారుడైన యోహానానుతో కలిసిరి. । అయి 15
నను నెతన్యా కుమారుడైన ఇష్మాయేలును ఎనమండు
గురు మనుష్యులును యోహానాను చేతిలోనుండి
తప్పించుకొని అమ్మోనీయులయొద్దకు పారిపోయిరి. ।
అప్పుడు నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు అహీకాము 16-18
కుమారుడైన గెదల్యాను చంపినతరువాత, కారేహ
కుమారుడైన యోహానానును అతనితోకూడనున్న
సేనల యధిపతులందరును మిస్పాదగ్గరనుండి ఇష్మా
యేలునొద్దనుండి జనశేషమంతటిని, అనగా గిబియోను
దగ్గరనుండి ఇష్మాయేలు కొనిపోయిన యోధులను
స్త్రీలను పిల్లలను రాజపరివారమును మరల రప్పించిరి;
అయితే వారు బాబెలురాజు దేశముమీద అధికారి
నిగా నియమించిన అహీకాము కుమారుడైన గెదల్యాను
నెతన్యా కుమారుడైన ఇష్మాయేలు చంపినందున వారు
కల్దీయులకు భయపడి ఐగుప్తుకు వెళ్లుదమనుకొని బేత్లె
హేముదగ్గరనున్న గెరూతు కింహాములో దిగిరి.

అంతలో సేనాధిపతులందరును కారేహ కుమారు 42
డైన యోహానానును హోషయా కుమారుడైన యెజ
న్యాయును, అల్పులేమి ఘనులేమి ప్రజలందరును
ప్రవక్తయైన యిర్మీయాయొద్దకు వచ్చి అతనితో ఈలాగు

చేసిరి। — మేము ఎంత కొంచెముమంది మిగిలి
నైమో నీవు చూచుచున్నావు గదా; చిత్తగించి
న్న పమును నీ సన్నిధికి రానిచ్చి, శేషించియున్న
యందరినిమిత్తము నీ దేవుడైన యెహోవాకు
నచేయుము. । మేము నడవవలసిన మార్గమును
లసిన కార్యమును నీ దేవుడగు యెహోవా
తెలియజేయునుగాక. । కాగా ప్రవక్తయైన
యా వారికుత్తరమిచ్చినదేమనగా — మీరు చేసిన
నేనంగీకరించుచున్నాను, మీ మాటలనుబట్టి
దేవుడైన యెహోవాను నేను ప్రార్థించుదును,
ను మీకు మరుగుచేయక యెహోవా మిమ్మును
సెలవిచ్చునదంతయు మీకు తెలియజేతును. ।
మ వారు యిర్మీయాతో ఇట్లనిరి — నిన్ను మా
ప పంపి, నీ దేవుడగు యెహోవా సెలవిచ్చిన
టనుబట్టి మరుమాట లేకుండ మేము జరిగించని
ందు యెహోవా మామీద నమ్మకమైన సత్య
గా ఉండునుగాక. । మాకు మేలు కలుగునట్లు
మన దేవుడైన యెహోవా మాట వినువారమై,
ులేగాని కీడేగాని మేము ఆయనయొద్దకు నిన్ను
షయములో మన దేవుడైన యెహోవా సెల
మాటకు విధేయులమగుదుము.
ి దినములైన తరువాత యెహోవా వాక్కు
యాకు ప్రత్యక్షమాయెను గనుక । అతడు కారేహ
రుడైన యోహానానును అతనితోకూడనున్న
యధిపతులనందరిని, అల్పులనేమి ఘనులనేమి
నందరిని పిలిపించి వారితో ఇట్లనెను । — ఇశ్రా
దేవుడైన యెహోవా సన్నిధిని మనవిచేయు
మీరు నన్ను పంపితిరి గదా; ఆయన సెలవిచ్చున
గా । — నేను మీకు చేసిన కీడునుగూర్చి సం
యందియున్నాను, మీరు తొందరపడక యీ
లో కాపురమున్న పక్షమున, పడగొట్టక నేను
ప స్థాపింతును, పెల్లగింపక నాటెదను. । మీరు
ు రాజుకు భయపడుచున్నారే; అతనికి భయ
డి, అతని చేతిలోనుండి మిమ్మును తప్పించి
ు రక్షించుటకు నేను మీకు తోడైయున్నాను,
భయపడకుడి. । మరియు అతడు మీయెడల
డి మీ స్వదేశమునకు మిమ్మును పంపునట్లు మీ
నేనతనికి జాలి పుట్టించెదను. । అయితే మీరు
దేవుడైన యెహోవా మాట విననివారై యీ
ందు కాపురముండక—మనము ఐగుప్తు దేశమునకు
ము, అక్కడ యుద్ధము చూడకయు బూరధ్వని
యు ఆహారపులేమిచేత ఆకలిగొనకయు నుందుము
అక్కడనే కాపురముందమని మీరనుకొనిన
న । యూదావారిలో శేషించినవారలారా,
హోవా మాట ఆలకించుడి; ఇశ్రాయేలు దేవుడును
ులకధిపతియునగు యెహోవా ఈలాగు సెల

విచ్చుచున్నాడు—ఐగుప్తుకు వెళ్లవలెనని నిశ్చయించు
కొని అక్కడనే కాపురముండుటకు మీరు వెళ్లిన
యెడల । మీరు భయపడుచున్న ఖడ్గము అక్కడను 16
ఐగుప్తుదేశముననే మిమ్మును తరిమి పట్టుకొనును; మీకు
భయము కలుగజేయు క్షామము ఐగుప్తులోనే మిమ్మును
తరిమి కలిసికొనును, అక్కడనే మీరు చత్తురు, । నేను 17
వారిమీదికి రప్పించు కీడునుండి వారిలో శేషించు
వాడైనను తప్పించుకొనువాడైనను ఉండడు, ఐగుప్తులో
నివసింపవలెనని అక్కడికి వెళ్ల నిశ్చయించుకొను మను
ష్యులందరు ఖడ్గముచేతను క్షామముచేతను తెగులు
చేతను నిశ్శేషముగా చత్తురు. । ఇశ్రాయేలు దేవుడగు 18
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — నా
కోపమును నా ఉగ్రతయు యెరూషలేము నివాసుల
మీదికి వచ్చినట్లు, మీరు ఐగుప్తుకు వెళ్లినయెడల నా
ఉగ్రత మీమీదికిని వచ్చును; మీరు శాపాస్పదము
గాను భీతి పుట్టించువారుగాను దూషణాస్పదముగాను
తిరస్కరింపబడువారుగాను ఉందురు, ఈ స్థలమును
మరి యెప్పుడును చూడరు. । యూదా శేషులారా, 19
ఐగుప్తుకు వెళ్లకూడదని యెహోవా మీకాజ్ఞనిచ్చి
నట్టు నేడు నేను మీకు సాక్ష్యమిచ్చితినని మీరే
నిశ్చయముగా తెలిసికొనుచున్నారు. । మన దేవుడైన 20
యెహోవాకు మా నిమిత్తము ప్రార్థనచేసి మన దేవు
డైన యెహోవా చెప్పునదంతయు మాకు తెలియ
జెప్పినయెడల మేమాలాగు చేయుదుమని చెప్పుచు
మిమ్మును మీరే మోసపుచ్చుకొనుచున్నారు. । నేడు 21
నేను మీకు దాని తెలియజెప్పుచున్నాను గాని మీ
దేవుడైన యెహోవా మీయొద్దకు నాచేత పంపిన
వర్తమానమును మీరు ఆలకింపకపోతిరి. । కాబట్టి 22
కాపురముండవలెనని మీరు కోరు స్థలములోనే మీరు
ఖడ్గముచేతను క్షామముచేతను తెగులుచేతను చత్తురని
నిశ్చయముగా తెలిసికొనుడి.

అతడు ప్రజలకందరికి ప్రకటింపవలెనని దేవుడైన 43
యెహోవా పంపిన ప్రకారము యిర్మీయా వారి
దేవుడగు యెహోవా సెలవిచ్చిన మాటలన్నిటిని
వారికి ప్రకటించి చాలింపగా । హోషయా కుమారు 2
డైన అజర్యాయును కారేహ కుమారుడైన యోహా
నానును గర్విష్ఠులందరును యిర్మీయాతో ఇట్లనిరి—
నీవు అబద్ధము పలుకుచున్నావు—ఐగుప్తులో కాపుర
ముండుటకు మీరు అక్కడికి వెళ్లకూడదని ప్రకటించు
టకై మన దేవుడైన యెహోవా నిన్ను పంపలేదు. ।
మమ్మును చంపుటకును, బాబెలుకు చెరపట్టుకొని 3
పోవుటకును, కల్దీయులచేతికి మమ్మును అప్పగింపవలె
నని నేరీయా కుమారుడైన బారూకు మాకు విరోధ
ముగా నిన్ను రేపుచున్నాడు. । కాగా కారేహ 4
కుమారుడైన యోహానానును సేనలయధిపతులందరును
ప్రజలందరును యూదాదేశములో కాపురముండ

5 వలెనన్న యెహోవా మాట వినకపోయిరి. । మరి
6 యు కారేహ కుమారుడైన యోహానానును సేనల
యధిపతులందరును యెహోవా మాట విననివారై,
యూదాదేశములో నివసించుటకు తాము తరిమివేయ
బడిన ఆయా ప్రదేశములనుండి తిరిగి వచ్చిన యూ
దుల శేషమును, అనగా రాజదేహసంరక్షకుల కధిపతి
యగు నెబూజరదాను షాఫాను కుమారుడైన అహీ
కాము కుమారుడగు గెదల్యాకు అప్పగించిన పురుషు
లను స్త్రీలను పిల్లలను రాజుకుమార్తెలను ప్రవక్తయగు
యిర్మీయాను నేరీయా కుమారుడగు బారూకును తోడు
7 కొనిపోయి । ఐగుప్తుదేశములో ప్రవేశించిరి. వారు
8 తహపనేసుకు రాగా । — యెహోవా వాక్కు
తహపనేసులో యిర్మీయాకు ప్రత్యక్షమై యీలాగు
9 సెలవిచ్చెను । — నీవు పెద్ద రాళ్లను చేత పట్టుకొని,
యూదా మనుష్యులు చూచుచుండగా తహపనేసు
లోనున్న ఫరో నగరు ద్వారముననున్న శిలావరణము
లోని సున్నములో వాటిని పాతిపెట్టి జనులకీమాట
10 ప్రకటింపుము । — ఇశ్రాయేలు దేవుడును సైన్యముల
కధిపతియునగు యెహోవా సెలవిచ్చునదేమనగా—
ఇదిగో నా దాసుడగు బాబెలురాజైన నెబుకద్రెజ
రును నేను పిలువనంపించి తీసికొనివచ్చి, నేను పాతి
పెట్టిన యీ రాళ్లమీద అతని సింహాసనము ఉంచెదను,
అతడు రత్నకంబళిని వాటిమీదనే వేయించును. ।
11 అతడువచ్చి తెగులుకు నిర్ణయమైనవారిని తెగులుకును,
చెరకు నిర్ణయమైనవారిని చెరకును, ఖడ్గమునకు నిర్ణయ
మైనవారిని ఖడ్గమునకును అప్పగించుచు ఐగుప్తీయు
12 లను హతముచేయును. । ఐగుప్తు దేవతల గుళ్లలో నేను
అగ్ని రాజబెట్టుచున్నాను, వాటిని నెబుకద్రెజరు
కాల్చివేయును, ఆ దేవతలను చెరగొనిపోవును, గొర్రెల
కాపరి తన వస్త్రమును చుట్టుకొనునట్లు అతడు ఐగుప్తు
దేశమును తనకు చుట్టుకొని నిరాటంకముగా అక్కడ
13 నుండి సాగిపోవును. । అతడు ఐగుప్తులోనున్న సూర్య
దేవతాపట్టణములోని సూర్యప్రతిమలను విరుగగొట్టి
ఐగుప్తు దేవతల గుళ్లను అగ్నిచేత కాల్చివేయును.

44 మిగ్దోలులోగాని తహపనేసులోగాని నోపులో
గాని పత్రోసులోగాని ఐగుప్తుదేశవాసముచేయు
చున్న యూదులనందరినిగూర్చి ఇశ్రాయేలు దేవు
డును సైన్యములకధిపతియునగు యెహోవా వాక్కు
యిర్మీయాకు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను । —
2 నేను యెరూషలేముమీదికిని యూదా పట్టణము
లన్నిటిమీదికిని రప్పించిన కీడంతయు మీరు చూచు
3 చునే యున్నారు. । మీరైనను మీ పితరులైనను
ఎరుగని అన్యదేవతలను అనుసరించుచు పూజించుచు
వాటికి ధూపము వేయుచు వచ్చుటవలన వాటి నివా
సులు తాము చేసికొనిన దోషముచేత నాకు కోపము
పుట్టించిరి గనుక నేడు నివాసులులేకుండ అవి పాడు-
పడియున్నవి గదా. । మరియు నేను పెందలకడ 4
లేచి ప్రవక్తలైన నా సేవకులనందరిని మీయొద్దకు
పంపుచు, నాకసహ్యమైన యీ హేయకార్యమును
మీరు చేయకుండుడి అని నేను చెప్పుచువచ్చితిని
గాని । వారు ఆలకింపకపోయిరి, అన్యదేవతలకు 5
ధూపార్పణముచేయుట మానకపోయిరి, తమ దుర్మార్గ
తను విడువకపోయిరి చెవియొగ్గకపోయిరి. । కావున 6
నా ఉగ్రతయు నా కోపమును కుమ్మరింపబడి,
యూదాపట్టణములలోను యెరూషలేము వీధులలోను
రగులుకొనెను, గనుక నేడున్నట్లుగా అవి పాడై
యెడారి ఆయెను. । కాబట్టి ఇశ్రాయేలు దేవుడును 7
సైన్యములకధిపతియునగు యెహోవా ఈలాగు
ఆజ్ఞ ఇచ్చుచున్నాడు — ఏమియు శేషములేకుండ
స్త్రీపురుషులును శిశువులును చంటిబిడ్డలును యూదా
మధ్య ఉండకుండ నిర్మూలముచేయబడునట్లుగా
మీరేల ఈ గొప్ప తప్పితమును మీకు విరోధముగా
చేసికొనుచున్నారు? । మీకు మీరే సమూలనాశ 8
నము తెచ్చుకొనునట్లును, భూమిమీదనున్న జనము
లన్నిటిలో మీరు దూషణపాలై తిరస్కరింపబడు
నట్లును, మీరు కాపురముండుటకు పోయిన ఐగు
ప్తులో అన్యదేవతలకు ధూపార్పణము చేయుదురు.
మీరేల యీలాగున చేయుచు మీ చేతిక్రియలచేత
నాకు కోపము పుట్టించుచున్నారు? । వారు యూదా 9
దేశములోను యెరూషలేము వీధులలోను జరిగించిన
క్రియలను (అనగా) మీ పితరులు చేసిన చెడుతన
మును యూదారాజులు చేసిన చెడుతనమును వారి
భార్యలు చేసిన చెడుతనమును, మీమట్టుకు మీరు
చేసిన చెడుతనమును మీ భార్యలు చేసిన చెడుతన
మును మరచిపోతిరా? । నేటివరకు వారు దీనమనస్సు 10
ధరింపకున్నారు, భయమునొందకున్నారు, నేను
మీకును మీ పితరులకును నియమించిన ధర్మశాస్త్రము
నైనను కట్టడలనైనను అనుసరింపకయే యున్నారు. ।
కాబట్టి ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతియు 11
నగు యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు— 12
మీకు కీడు చేయునట్లు, అనగా యూదావారినందరిని
నిర్మూలము చేయునట్లు నేను మీకు అభిముఖుడనగు
దును; ఐగుప్తుదేశములో కాపురముందుమని అచ్చ
టికి వెళ్ల నిశ్చయించుకొను యూదాశేషులను నేను
తోడుకొని పోవుదును, వారందరు ఐగుప్తుదేశము
లోనే నశించెదరు; అల్పులేమి ఘనులేమి వారందరు
కూలుదురు, ఖడ్గముచేతనైనను క్షామముచేతనైనను
నశింతురు, ఖడ్గముచేతనైనను క్షామముచేతనైనను వారు
చత్తురు, శాపాస్పదముగాను భీతి పుట్టించువారుగాను
దూషణపాలుగాను తిరస్కారము నొందినవారుగాను
ఉందురు. । యెరూషలేము నివాసులను నేనేలాగు 13
శిక్షించితినో ఆలాగే ఐగుప్తుదేశములో నివసించు వీరిని

ఖడ్గముచేతగాని క్షామముచేతగాని తెగులుచేతగాని శిక్షించెదను । కావున తాము మరలి వచ్చి యూదాదేశములో కాపురముండవలెనన్న మక్కువచేత ఐగుప్తులో ఆగుటకై అక్కడికి వెళ్లు యూదాశేషులలో ఎవరును తప్పించుకొనరు, శేషమేమియు ఉండదు, పారిపోవువారు గాక మరి ఎవరును తిరిగి రారు.

అప్పుడు తమ భార్యలు అన్యదేవతలకు ధూపము వేయుదురని యెరిగియున్న పురుషులందరును, అక్కడ నిలిచియున్న స్త్రీలును, మహా సమాజముగా కూడిన వారును, ఐగుప్తుదేశమందలి పత్రోసులో కాపురముండు జనులందరును యిర్మీయాకు ఈలాగు ప్రత్యుత్తరమిచ్చిరి—యెహోవా నామమునుబట్టి నీవు మాకు ప్రకటించు ఈ మాటను మేమంగీకరింపము. । మేము నీతో చెప్పిన సంగతులన్నిటిని నిశ్చయముగా నెరవేర్చబోవుచున్నాము; మేమును మా పితరులును మా రాజులును మా యధిపతులును యూదా పట్టణములలోను యెరూషలేము వీధులలోను చేసినట్లే ఆకాశరాణికి ధూపము వేయుదుము, ఆమెకు పానార్పణములు అర్పింతుము; ఏలయనగా మేము ఆలాగు చేసినప్పుడు మాకు ఆహారము సమృద్ధిగా దొరికెను, మేము క్షేమముగానే యుంటిమి, యే కీడును మాకు కలుగలేదు. । మేము ఆకాశరాణికి ధూపము వేయకయు ఆమెకు పానార్పణములు అర్పింపకయు మానినప్పటి నుండి సమస్తము మాకు తక్కువైనది, మేము ఖడ్గముచేతను క్షామముచేతను సమసిపోవుచున్నాము. । మేము ఆకాశరాణికి ధూపము వేయగాను, ఆమెకు పానార్పణములు అర్పింపగాను, మా పురుషుల సెలవు లేకుండ ఆమెకు పిండివంటలు చేయుచున్నామా? ఆమెకు పానార్పణములు పోయుచున్నామా? అని వారు చెప్పగా । యిర్మీయా ఆ స్త్రీ పురుషులందరితో, అనగా తనకు అట్లు ప్రత్యుత్తరమిచ్చిన ప్రజలందరితో ఇట్లనెను । — యూదా పట్టణములలోను యెరూషలేము వీధులలోను మీరును మీ పితరులును మీ రాజులును మీ యధిపతులును దేశప్రజలును ధూపమువేసిన సంగతి యెహోవా జ్ఞాపకముచేసికొనలేదా? అదేగదా ఆయన మనస్సుకు వచ్చెను. । యెహోవా మీ దుష్టక్రియలను చూచి మీరు చేయు హేయకృత్యములను ఎంచి యికను సహింపలేకపోయెను గనుక నేడున్నట్లుగా మీ దేశము పాడుగాను ఎడారిగాను శాపాస్పదముగాను నిర్జనముగాను ఆయన చేసెను. । యెహోవా మాట వినక, ఆయన ధర్మశాస్త్రమునుబట్టియు కట్టడలనుబట్టియు ఆయన తనకు సాక్ష్యార్థముగా ఇచ్చిన ఆజ్ఞనుబట్టియు నడువక, మీరు ధూపము వేయుచు యెహోవాకు విరోధముగా పాపముచేసితిరి గనుకనే నేడున్నట్లుగా ఈ కీడు మీకు సంభవించెను.

మరియు యిర్మీయా ప్రజలనందరిని స్త్రీలనందరిని 24
చూచి వారితో ఇట్లనెను — ఐగుప్తులోనున్న సమస్త
మైన యూదులారా, యెహోవా మాట వినుడి. ।
ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతియునగు 25
యెహోవా ఈ మాట సెలవిచ్చుచున్నాడు—ఆకాశ
రాణికి ధూపము వేయుదుమనియు, ఆమెకు పానా
ర్పణములు అర్పింతుమనియు, మేము మ్రొక్కు
కొనిన మ్రొక్కుబళ్లను నిశ్చయముగా నెరవేర్చుదు
మనియు మీరును మీ భార్యలును మీ నోటితో
పలికి మీ చేతులతో నెరవేర్చుచున్నారే; నిజము
గానే మీ మ్రొక్కుబళ్లను మీరు మ్రొక్కుదురు,
నిజముగానే మీ మ్రొక్కులను మీరు నెరవేర్తురు. ।
కాబట్టి ఐగుప్తులో నివసించు సమస్త యూదులారా, 26
యెహోవా మాట వినుడి—యెహోవా సెలవిచ్చునదేమనగా—ప్రభువగు యెహోవా అను నేను నా
జీవముతోడు ప్రమాణము చేయుచు, ఐగుప్తులో నివ
సించు యూదులలో ఎవరును ఇకమీదట నా
నామము నోట పలకరని నా ఘనమైన నామముతోడు
నేను ప్రమాణము చేయుచున్నాను. । మేలుచేయు 27
టకుకాక కీడుచేయుటకే నేను వారిని కనిపెట్టుచు
న్నాను; వారు ఖడ్గముచేతనైనను క్షామముచేతనైనను
క్షీణించిపోవుచు, ఐగుప్తుదేశములోనున్న యూదా
వారందరు శేషములేకుండ చత్తురు. । ఖడ్గము తప్పించు 28
కొనువారు కొద్దిమందియై ఐగుప్తుదేశములోనుండి
యూదాదేశమునకు తిరిగి వచ్చెదరు, అప్పుడు ఐగుప్తు
దేశములో కాపురముండుటకు వెళ్లిన యూదాశేషు
లందరు ఎవరి మాట నిలకడగా నుండునో, నాదో
తమదో అది తెలిసికొందురు. । మీకు కీడు సంభ 29
వించునట్లుగా నా మాటలు నిశ్చయముగా నిలుచునని
మీకు తెలియబడుటకును, నేను ఈ స్థలమందు
మిమ్మును శిక్షించుచున్నందుకును ఇది మీకు సూచనగా
నుండును; ఇదే యెహోవా వాక్కు. । అతనికి శత్రువై 30
అతని ప్రాణమును తీయజూచుచుండిన నెబుకద్రెజ
రను బాబెలు రాజుచేతికి నేను యూదారాజైన
సిద్కియాను అప్పగించినట్లు ఐగుప్తురాజైన ఫరోహొ
ప్రను అతనికి శత్రువులై అతని ప్రాణమును తీయ
జూచువారి చేతికి అప్పగించెదను.

**యూ**దారాజును యోషీయా కుమారుడునైన 45
యెహోయాకీము ఏలుబడియందు నాలుగవ సంవత్సర
మున యిర్మీయా నోటిమాటనుబట్టి నేరీయా కుమారు
డగు బారూకు గ్రంథములో ఈ మాటలు వ్రాయు
చున్నప్పుడు ప్రవక్తయైన యిర్మీయా అతనితో చెప్పి
నది । —బారూకూ, ఇశ్రాయేలు దేవుడైన యెహోవా 2
నిన్నుగూర్చి ఈలాగు సెలవిచ్చుచున్నాడు । — కట 3
కటా, నాకు శ్రమ, యెహోవా నాకు పుట్టించిన
నొప్పికి తోడు ఆయన నాకు దుఃఖమును కలుగ

జేయుచున్నాడు, మూలుగుచేత అలసియున్నాను,
నాకు నెమ్మది దొరకదాయెను అని నీవనుకొనుచు
4 న్నావు. । నీవు అతనికి ఈ మాట తెలియజేయుమని
యెహోవా సెలవిచ్చుచున్నాడు — నేను కట్టిన
దానినే నేను పడగొట్టుచున్నాను, నేను నాటిన
దానినే పెల్లగించుచున్నాను; సర్వభూమినిగూర్చి
5 యు ఈ మాట చెప్పుచున్నాను. । నీ నిమిత్తము నీవు
గొప్పవాటిని వెదకుచున్నావా, వెదకవద్దు; నేను సర్వ
శరీరులమీదికి కీడు రప్పించుచున్నాను, అయితే
నీవు వెళ్లు స్థలములన్నిటిలో దోపుడుసొమ్ము దొరికి
నట్టుగా నీ ప్రాణమును నీకిచ్చుచున్నాను; ఇదే
యెహోవా వాక్కు.

**46** అన్యజనులనుగూర్చి ప్రవక్తయైన యిర్మీయాకు
ప్రత్యక్షమైన యెహోవా వాక్కు.

2 ఐగుప్తునుగూర్చిన మాట, అనగా యోషీయా
కుమారుడును యూదారాజునైన యెహోయాకీము
ఏలుబడియందు నాలుగవ సంవత్సరమున నెబుకద్రెజరు
కర్కెమీషులో ఫరాతునదిదగ్గర హతముచేయు
ఫరోనెకో దండునుగూర్చిన మాట.

3 డాలును కేడెమును సిద్ధపరచుకొనుడి యుద్ధము
నకు రండి

4 గుఱ్ఱములను కట్టుడి; రౌతులారా, జీరా తొడిగి
ఎక్కుడి

శిరస్త్రాణములను ధరించుకొనుడి ఈటెలకు పదును
పెట్టుడి కవచములు వేసికొనుడి.

5 నాకేమి కనబడుచున్నది?

వారు ఓడిపోవుచున్నారు వెనుకతీయుచున్నారు
వారి బలాఢ్యులు అపజయము నొందుచున్నారు
తిరిగిచూడక వేగిరముగా పారిపోవుచున్నారు
ఎటుచూచిన భయమే; యెహోవా మాట యిదే.

6 అతివేగులు పారిపోజాలకున్నారు
బలాఢ్యులు తప్పించుకొనజాలకున్నారు
ఉత్తరదిక్కున ఫరాతు నదీతీరమందు వారు
తొట్రిల్లి పడుచున్నారు.

7 నైలునదీప్రవాహమువలె వచ్చు నితడెవడు?
ఇతని జలములు నదులవలె ప్రవహించుచున్నవి

8 ఐగుప్తీయుల దండు నైలునదివలె ప్రవహించు
చున్నది.
దాని జలములు తొనకునట్లుగా అది వచ్చుచున్నది.
—నేనెక్కి భూమిని కప్పెదను
పట్టణమును దాని నివాసులను నాశనము చేసెదను.

9 గుఱ్ఱములారా, యెగురుడి; రథములారా, రేగుడి
బలాఢ్యులారా, బయలుదేరుడి
డాళ్లు పట్టుకొను కూషీయులును పూతీయులును
విలుకాండ్రైన లూదీయులును బయలుదేర
వలెను.

ఇది ప్రభువును సైన్యములకధిపతియునగు 10
యెహోవాకు పగతీర్చు దినము.
ఆయన తన శత్రువులకు ప్రతిదండనచేయును
ఖడ్గము కడుపార తినును, అది తనివితీర రక్తము
త్రాగును.
ఉత్తరదేశములో ఫరాతునదియొద్ద ప్రభువును
సైన్యములకధిపతియునగు యెహోవా వధ
జరిగింపబోవుచున్నాడు.

ఐగుప్తుకుమారీ, కన్యకా, గిలాదుకు వెళ్లి గుగ్గిలము 11
తెచ్చుకొనుము
విస్తారమైన ఔషధములు తెచ్చుకొనుట వ్యర్థమే
నీకు చికిత్స కలుగదు.

నీకు సిగ్గుకలిగిన సంగతి జనములకు వినబడెను 12
నీ రోదనధ్వని దేశమందంతట వినబడుచున్నది
బలాఢ్యులు బలాఢ్యులను తగిలి కూలుచున్నారు
ఒకనిమీద ఒకడు పడి అందరు కూలుదురు.

బాబెలురాజైన నెబుకద్రెజరు బయలుదేరి వచ్చి 13
ఐగుప్తీయులను హతముచేయుటను గూర్చి యిర్మీయాకు
ప్రత్యక్షమైన యెహోవా వాక్కు.

ఐగుప్తులో తెలియజేయుడి మిగ్దోలులో ప్రకటిం 14
పుడి
నోపులోను తహపనేసులోను ప్రకటనచేయుడి
ఏమనగా—ఖడ్గము నీ చుట్టునున్న (ప్రదేశములను)
మ్రింగివేయుచున్నది
మీరు లేచి స్థైర్యము తెచ్చుకొనుడి.

నీలో బలవంతులైనవారేల తుడుపుపెట్టబడు 15
చున్నారు?
యెహోవా వారిని తోలివేయుచున్నాడు
గనుకనే వారు నిలువకున్నారు.

ఆయన అనేకులను తొట్రిల్ల జేయుచున్నాడు 16
వారొకనిమీద ఒకడు కూలుచు
—లెండి, క్రూరమైన ఖడ్గమును తప్పించుకొందము
రండి
మన స్వజనులయొద్దకు మన జన్మభూమికి వెళ్లు
దము రండి అని వారు చెప్పుకొందురు.

ఐగుప్తురాజగు ఫరో యుక్తసమయము పోగొట్టు 17
కొనువాడనియు
సమూలధ్వంసమనియు వారచ్చట చాటించిరి.

పర్వతములలో తాబోరు ఎట్టిదో 18
సముద్రప్రాంతములలో కర్మెలు ఎట్టిదో
నా జీవముతోడు అతడు అట్టివాడై వచ్చును
రాజును సైన్యములకధిపతియునగు యెహోవా
వాక్కు ఇదే.

ఐగుప్తు నివాసులారా, నోపు పాడైపోవును 19
అది నిర్జనమై కాల్చబడును

ప్రయాణమునకు కావలసినవాటిని సిద్ధపరచు
కొనుడి.
20 ఐగుప్తు అందమైన పెయ్య
ఉత్తరదిక్కునుండి కందిరీగ వచ్చుచున్నది వచ్చే
యున్నది.
21 పరదేశులైన ఆమె కూలిసిపాయిలు పెంపుడు
దూడలవలె ఉన్నారు
వారేగదా వెనుకతట్టు తిరిగిరి యొకడును నిలువ
కుండ పారిపోయిరి
వారికి ఆపద్దినము వచ్చియున్నది
శిక్షాదినము వారికాసన్నమాయెను.
22 (శత్రువులు) దండెత్తి వచ్చుచున్నారు
మ్రానులు నరుకువారివలె గొడ్డండ్లు పట్టుకొని దాని
మీదికి వచ్చుచున్నారు
ఆలకించుడి ఆమె ధ్వని ప్రాకిపోవు పాము
చప్పుడువలె వినబడుచున్నది
యెహోవా వాక్కు ఇదే—
23 వారు లెక్కలేనివారై మిడతలకన్న విస్తరింతురు
చొరశక్యముకాని ఆమె అరణ్యమును నరికివేయు
దురు.
24 ఐగుప్తు కుమారి అవమానపరచబడును
ఉత్తరదేశస్థులకు ఆమె అప్పగింపబడును
25 ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతియునగు
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు
—నోలోనుండు ఆమోను దేవతను
ఫరోను ఐగుప్తును దాని దేవతలను దాని రాజులను
ఫరోను అతని నాశ్రయించువారిని నేను దం
డించుచున్నాను.
26 వారి ప్రాణము తీయజూచు బాబెలురాజైన
నెబుకద్రెజరుచేతికిని అతని సేవకులచేతికిని
వారిని అప్పగించుచున్నాను
ఆ తరువాత అది మునుపటివలెనే నివాసస్థల
మగును
ఇదే యెహోవా వాక్కు.
27 నా సేవకుడవైన యాకోబూ, భయపడకుము
ఇశ్రాయేలూ, జడియకుము
దూరములోనుండి నిన్ను రక్షించుచున్నాను
వారున్న చెరలోనుండి నీ సంతతివారిని రక్షించు
చున్నాను
ఎవరి భయమును లేకుండ యాకోబు తిరిగివచ్చును
అతడు నిమ్మళించి నెమ్మదినొందును.
28 నా సేవకుడవైన యాకోబూ, నేను నీకు తోడై
యున్నాను భయపడకుము
నేనెక్కడికి నిన్ను చెదరగొట్టితినో ఆ సమస్త దేశ
ప్రజలను సమూల నాశనముచేసెదను
అయితే నిన్ను సమూల నాశనముచేయను
నిన్ను శిక్షింపక విడువను గాని న్యాయమునుబట్టి
నిన్ను శిక్షించెదను
ఇదే యెహోవా వాక్కు.

ఫరో గాజాను కొట్టకమునుపు ఫిలిష్తీయులను **47**
గూర్చి ప్రవక్తయైన యిర్మీయాకు ప్రత్యక్షమైన
యెహోవా వాక్కు । — యెహోవా ఈలాగు 2
సెలవిచ్చుచున్నాడు — జలములు ఉత్తరదిక్కునుండి
పొర్లి వరదలై మనుష్యులు మొఱ్ఱపెట్టునట్లుగాను దేశ
నివాసులందరు అంగలార్చునట్లుగాను, దేశముమీదను
అందున్న సమస్తముమీదను పట్టణముమీదను దాని
లో నివసించువారిమీదను ప్రవహించును. । వారి బల 3
మైన గుఱ్ఱముల డెక్కలు నేలతన్ను శబ్దమునకును,
అతని రథముల వేగమునకును, అతని చక్రముల ఉరుము
వంటి ధ్వనికిని తండ్రులు భయపడి బలహీనులై తమ
పిల్లలతట్టు తిరిగి చూడరు. । ఫిలిష్తీయులనందరిని లయ 4
పరచుటకును, తూరు సీదోనులకు సహాయపడువాడొకడై
నను నిలువకుండ అందరిని నిర్మూలముచేయుటకును
దినము వచ్చుచున్నది. యెహోవా కఫ్తోరు ద్వీప
శేషులైన ఫిలిష్తీయులను నాశనముచేయును. । గాజా 5
బోడియాయెను, మైదానములో శేషించిన అష్కె
లోను నాశనమాయెను. ఎన్నాళ్లవరకు నిన్ను నీవే
గాయపరచుకొందువు? । యెహోవా ఖడ్గమా, యెంత 6
వరకు విశ్రమింపక యుందువు? నీ వరలోకి దూరి
విశ్రమించి ఊరకుండుము. । అష్కెలోనుమీదికిని 7
సముద్రతీరముమీదికిని పొమ్మని యెహోవా నీకు
ఆజ్ఞ ఇచ్చియున్నాడు గదా; నీవేలాగు విశ్రమించు
దువు?—అచ్చటికే పొమ్మని ఆయన ఖడ్గమునకు ఆజ్ఞ
ఇచ్చియున్నాడు.

మోయాబునుగూర్చినది. **48**
ఇశ్రాయేలు దేవుడగు యెహోవా ఈలాగు సెల
విచ్చుచున్నాడు
—నెబోకు శ్రమ, అది పాడైపోవుచున్నది.
కిర్యతాయిము పట్టబడినదై అవమానము నొందు
చున్నది
ఎత్తయిన కోట పడగొట్టబడినదై అవమానము
నొందుచున్నది
ఇకను మోయాబుకు ప్రసిద్ధియుండదు.
హెష్బోనులో వారు—అది ఇకను జనము కాక 2
పోవునట్లు దాని కొట్టివేయుదము రండని
చెప్పుకొనుచు దానికి కీడు చేయ నుద్దేశించు
చున్నారు
మద్మేనా, నీవును ఏమియు చేయలేకపోతివి.
ఖడ్గము నిన్ను తరుముచున్నది.
ఆలకించుడి, హొరొనయీమునుండి రోదన ధ్వని 3
వినబడుచున్నది

దోపుడు జరుగుచున్నది మహాపజయము సంభ
వించుచున్నది.
4 మోయాబు రాజ్యము లయమై పోయెను
దాని బిడ్డల రోదనధ్వని వినబడుచున్నది.
5 హోరోనయీము దిగుడులలో పరాజితుల రోదన
ధ్వని వినబడుచున్నది
జనులు లూహీతు నెక్కుచు ఏడ్చుచున్నారు
ఏడ్చుచు ఎక్కుచున్నారు.
6 పారిపోవుడి మీ ప్రాణములను దక్కించుకొనుడి
అరణ్యములోని అరుహవృక్షమువలె ఉండుడి.
7 నీవు నీ క్రియలను ఆశ్రయించితివి నీ నిధులను
నమ్ముకొంటివి
నీవును పట్టుకొనబడెదవు, కెమోషుదేవత చెరలోనికి
పోవును
ఒకడు తప్పకుండ వాని యాజకులును అధిపతు
లును చెరలోనికి పోవుదురు.
8 యెహోవా సెలవిచ్చినట్లు
సంహారకుడు ప్రతి పట్టణముమీదికి వచ్చును
ఏ పట్టణమును తప్పించుకొనజాలదు
లోయకూడ నశించును మైదానము పాడైపోవును.
9 మోయాబుకు రెక్కలు పెట్టుడి
అది వేగిరముగా బయలుదేరి పోవలెను
నివాసి యెవడును లేకుండ దాని పట్టణములు
పాడగును.
10 యెహోవా కార్యమును అశ్రద్ధగా చేయువాడు
శాపగ్రస్తుడగును గాక
రక్తము ఓడ్చకుండ ఖడ్గము మాయువాడు శాప
గ్రస్తుడగును గాక.
11 మోయాబు తన బాల్యమునుండి నెమ్మది నొందెను
ఈ కుండలోనుండి ఆ కుండలోనికి కుమ్మరింపబడ
కుండ అది మడ్డిమీద నిలిచెను
అదెన్నడును చెరలోనికి పోయినది కాదు
అందుచేత దాని సారము దానిలో నిలిచియున్నది
దాని వాసన ఎప్పటివలెనే నిలుచుచున్నది.
12 యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు
—రాగల దినములలో నేను దానియొద్దకు కుమ్మ
రించువారిని పంపెదను
వారు దాని కుమ్మరించి దాని పాత్రలను వెలితిచేసి
వారి జాడీలను పగులగొట్టెదరు.
13 ఇశ్రాయేలువారు తామాశ్రయించిన బేతేలును
బట్టి సిగ్గుపడినట్లు
మోయాబీయులును కెమోషునుబట్టి సిగ్గుపడు
చున్నారు
14 —మేము బలాఢ్యులమనియు యుద్ధశూరుల
మనియు
మీరెట్లు చెప్పుకొందురు?

మోయాబు పాడైపోవుచున్నది 15
శత్రువులు దాని పట్టణములలో చొరబడు
చున్నారు
వారి యౌవనులలో శ్రేష్ఠులు వధకు పోవు
చున్నారు
సైన్యములకధిపతియగు యెహోవా అను పేరు
గల రాజు సెలవిచ్చిన మాట యిదే.
మోయాబుకు సమూలనాశనము సమీపించు 16
చున్నది
దానికి సంభవించు దుఃఖము త్వరపడి వచ్చు
చున్నది.
దానిచుట్టునున్న మీరందరు దానిగూర్చి అంగ 17
లార్చుడి
దాని కీర్తినిగూర్చి వినినవారలారా, అంగలార్చుడి
బలమైన రాజదండము ప్రభావముగల రాజ
దండము విరిగిపోయెనే యని చెప్పుకొనుడి.
దీబోనులో ఆసీనురాలై యుండుదానా, 18
మోయాబును పాడుచేసినవాడు నీమీదికి వచ్చు
చున్నాడు
నీ కోటలను నశింపజేయుచున్నాడు.
నీ గొప్పతనము విడిచి దిగిరమ్ము
ఎండిన దేశములో కూర్చుండుము.
అరోయేరు నివాసీ, త్రోవలో నిలిచి కనిపెట్టుము 19
పారిపోవుచున్న వారియొద్ద విచారించుము
తప్పించుకొనిపోవుచున్న వారిని అడుగుము
ఏమి జరిగినదో వారివలన తెలిసికొనుము.
మోయాబు పడగొట్టబడినదై అవమానము నొంది 20
యున్నది
గోలయెత్తి కేకలువేయుము
మోయాబు అపజయము నొందెను.
అర్నోనులో ఈ సంగతి తెలియజెప్పుడి
మైదానములోని దేశమునకు శిక్ష విధింపబడి 21
యున్నది
హోలోనుకును యాహసుకును మేఫాతుకును
దీబోనుకును
నెబోకును బేత్-దిబ్లాతయీముకును కిర్యతాయిము 22
కును బేత్గామూలుకును
బేత్మెయోనుకును కెరీయోతుకును బొస్రాకును 23
దూరమైనట్టియు సమీపమైనట్టియు 24
మోయాబుదేశ పురములన్నిటికిని శిక్ష విధింపబడి
యున్నది.
మోయాబు శృంగము నరికివేయబడియున్నది 25
దాని బాహువు విరువబడియున్నది
యెహోవా వాక్కు ఇదే.
మోయాబు యెహోవాకు విరోధముగా తన్ను 26
తాను గొప్పచేసికొనెను

దాని మత్తిల్లజేయుడి మోయాబు తన వమనములో
పొర్లుచున్నది
అది అపహాస్యమునొందును.
ఇశ్రాయేలును నీవు అపహాస్యాస్పదముగా ఎంచ
లేదా?
అతడు దొంగలలో దొరికినట్లుగా
నీవు అతనిగూర్చి పలుకునప్పుడెల్ల తల ఆడించుచు
న్నావు
మోయాబు నివాసులారా, పట్టణములు విడువుడి
కొండపేటు సందులలో గూడు కట్టుకొను గువ్వల
వలె కొండలలో కాపురముండుడి.
మోయాబీయుల గర్వమునుగూర్చి వింటిమి
వారు బహు గర్విష్ఠులు
వారి అతిశయమునుగూర్చియు గర్వమును
గూర్చియు
అహంకారమునుగూర్చియు పొగరునుగూర్చియు
మనస్సు గర్వము కలదను
వారి రోషమును నిలుకడలేని వారి ప్రగల్భము
లును నాకు తెలిసేయున్నవి
చేయనిదాని ప్రగల్భములు వారు బహుగా చేయు
చున్నారు
ఇదే యెహోవా వాక్కు.
కాబట్టి మోయాబును బట్టి నేను అంగలార్చు
చున్నాను
మోయాబువారందరినిగూర్చి కేకలు వేయుచున్నాను
వారు కీర్హెరెసు జనులు లేకపోయిరని మొర్రపెట్టు
చున్నారు.
సిబ్మా ద్రాక్షావల్లీ, యాజెరునుగూర్చిన యేడ్పును
మించునట్లు
నేను నిన్నుగూర్చి యేడ్చుచున్నాను
నీ తీగెలు సముద్రమును దాటి వ్యాపించెను
అవి యాజెరు సముద్రమువరకు వ్యాపించెను
నీ వేసవికాల ఫలములమీదను ద్రాక్షగెలలమీదను
పాడుచేయువాడు పడెను.
ఫలవంతమైన పొలములోనుండియు
మోయాబు దేశములోనుండియు
ఆనందమును సంతోషమును తొలగిపోయెను
ద్రాక్షగానుగలలో ద్రాక్షారసము లేకుండ చేయు
చున్నాను
జనులు సంతోషించుచు త్రొక్కరు
సంతోషము నిస్సంతోషమాయెను.
నిమ్రీములో నీళ్లు సహితము ఎండిపోయెను
హెష్బోను మొదలుకొని ఏలాలేవరకును యాహసు
వరకును
సోయరు మొదలుకొని హొరొనయీమువరకును
ఎగ్లాత్షెలిషావరకును
జనులు కేకలువేయుచున్నారు.
ఉన్నతస్థలమున బలులు అర్పించువారిని 35
దేవతలకు ధూపమువేయువారిని
మోయాబులో లేకుండజేసెను
ఇదే యెహోవా వాక్కు.
వారు సంపాదించినదానిలో శేషించినది నశించి 36
పోయెను
మోయాబునుగూర్చి నా గుండె పిల్లనగ్రోవివలె
నాదము చేయుచున్నది
కీర్హెరెసువారినిగూర్చి నా గుండె పిల్లనగ్రోవివలె
వాగుచున్నది.
నిశ్చయముగా ప్రతి తల బోడియాయెను 37
ప్రతి గడ్డము గొరిగింపబడెను
చేతులన్నిటిమీద నరుకులును
నడుములమీద గోనెపట్టయు నున్నవి.
మోయాబు ఇంటి పైకప్పులన్నిటిమీదను 38
దాని వీధులలోను అంగలార్పు వినబడుచున్నది
ఒకడు పనికిమాలిన కుండను పగులగొట్టునట్లు
నేను మోయాబును పగులగొట్టుచున్నాను
ఇదే యెహోవా వాక్కు.
అంగలార్చుడి మోయాబు సమూలధ్వంసమాయెను. 39
మోయాబూ, నీవు వెనుకకు తిరిగితివే, సిగ్గుపడుము
మోయాబు తన చుట్టునున్న వారికందరికి
అపహాస్యాస్పదముగాను భయకారణముగాను ఉం
డును.
యెహోవా సెలవిచ్చునదేమనగా 40
—పక్షిరాజు ఎగురునట్లు ఎగిరి అది మోయాబు
మీద తన రెక్కలను చాపుచున్నది.
కోటలు పట్టుకొనబడియున్నవి దుర్గములు పట్టబడి 41
యున్నవి
ఆ దినమున మోయాబు శూరుల హృదయము
ప్రసవించు స్త్రీ హృదయమువలె ఉండును.
మోయాబు యెహోవాకంటె గొప్పవాడనని 42
అతిశయపడెగా
అది జనము కాకుండ నిర్మూలమాయెను.
మోయాబు నివాసీ, భయమును గుంటయు ఉరియు 43
నీమీదికి వచ్చియున్నవి
ఇదే యెహోవా వాక్కు. 44
భయము తప్పించుకొనుటకై పారిపోవువారు
గుంటలో పడుదురు
గుంటలోనుండి తప్పించుకొనువారు ఉరిలో చిక్కు
కొందురు
మోయాబుమీదికి విమర్శ సంవత్సరమును నేను
రప్పించుచున్నాను
ఇదే యెహోవా వాక్కు.

దేశపరిత్యాగులగువారు బలహీనులై హెష్బోను
నీడలో నిలిచియున్నారు.
45 హెష్బోనులోనుండి అగ్నియు
సీహోను మధ్యనుండి జ్వాలలును బయలుదేరి
46 మోయాబు శిరస్సును, సందడిచేయువారి నడినెత్తిని
కాల్చివేయుచున్నవి.
మోయాబూ, నీకు శ్రమ
కెమోషుజనులు నశించియున్నారు
నీ కుమారులు చెరపట్టబడిరి
చెరపట్టబడినవారిలో నీ కుమార్తెలున్నారు.
47 అయితే అంత్యదినములలో చెరపట్టబడిన
మోయాబువారిని నేను తిరిగి రప్పించెదను
ఇదే యెహోవా వాక్కు.
ఇంతటితో మోయాబునుగూర్చిన శిక్షావిధి ముగి
సెను.

**49** అమ్మోనీయులనుగూర్చి యెహోవా ఈలాగు
సెలవిచ్చుచున్నాడు–ఇశ్రాయేలుకు కుమారులు లేరా?
అతనికి వారసుడు లేకపోయెనా? మల్కోము గాదును
ఎందుకు స్వతంత్రించుకొనును? అతని ప్రజలు దాని
2 పట్టణములలో ఎందుకు నివసింతురు? । యెహోవా
ఈలాగు సెలవిచ్చుచున్నాడు — రాగల దినములలో
నేను అమ్మోనీయుల పట్టణమగు రబ్బామీదికి వచ్చు
యుద్ధముయొక్క వాయింపు వినబడజేసెదను; అది
పాడుదిబ్బయగును, దాని ఉపపురములు అగ్నిచేత
కాల్చబడును, దాని వారసులకు ఇశ్రాయేలీయులు
వారసులగుదురని యెహోవా సెలవిచ్చుచున్నాడు. ।
3 హెష్బోనూ, అంగలార్చుము, హాయి పాడాయెను,
మల్కోమును అతని యాజకులును అతని యధిపతు
లును చెరలోకి పోవుచున్నారు; రబ్బానివాసురాం
డ్రారా, కేకలువేయుడి, గోనెపట్ట కట్టుకొనుడి,
మీరు అంగలార్చి కంచెలలో ఇటు అటు తిరుగులా
4 డుడి. । విశ్వాసఘాతుకురాలా–నాయొద్దకు ఎవడును
5 రాలేడని నీ ధనమునే ఆశ్రయముగా చేసికొన్నదానా,
నీ లోయలో జలములు ప్రవహించుచున్నవని, నీవేల
నీ లోయలనుగూర్చి యతిశయించుచున్నావు? ప్రభు
వును సైన్యములకధిపతియునగు యెహోవా ఈలాగు
6 సెలవిచ్చుచున్నాడు । — నేను నీ చుట్టునున్న వారం
దరివలన నీకు భయము పుట్టించుచున్నాను; మీరందరు
శత్రువునికెదురుగా తరుమబడుదురు, పారిపోవు
వారిని కూడదీయువాడొకడును లేకపోవును, అటు
తరువాత చెరలోనున్న అమ్మోనీయులను నేను రప్పిం
చెదను; ఇదే యెహోవా వాక్కు.
7 సైన్యములకధిపతియగు యెహోవా ఎదోమును
ఈలాగు సెలవిచ్చుచున్నాడు—తేమానులో
నేమియులేదా? వివేకులకు ఇక ఆలోచన
వారి జ్ఞానము వ్యర్థమాయెనా । ఏశా
వును విమర్శించుచు నేనతనికి కష్టకాలము రప్పించు
చున్నాను; దదానీయులారా, పారిపోవుడి వెనుకకు
మళ్లుడి బహులోతున దాగుకొనుడి. । ద్రాక్షపండ్లు 9
ఏరువారు నీయొద్దకు వచ్చునప్పుడు వారు పరిగెలను
విడువరు, రాత్రి దొంగలు వచ్చినయెడల తమకు
చాలునంత దొరకువరకు నష్టము చేయుదురు గదా. ।
నేను ఏశావును దిగంబరిగా చేయుచున్నాను, అతడు 10
దాగియుండకుండునట్లు నేనతని మరుగు స్థలములను
బయలుపరచుచున్నాను, అతని సంతానమును అతని
స్వజాతివారును అతని పొరుగువారును నాశనమగు
చున్నారు, అతడును లేకపోవును. । అనాథులగు నీ పిల్ల 11
లను విడువుము, నేను వారిని సంరక్షించెదను, నీ విధవ
రాండ్లు నన్ను ఆశ్రయింపవలెను. । యెహోవా 12
ఈలాగు సెలవిచ్చుచున్నాడు — న్యాయముచేత ఆ
పాత్రలోనిది త్రాగను రానివారు నిశ్చయముగా
దానిలోనిది త్రాగుచున్నారే, నీవుమాత్రము బొత్తిగా
శిక్షనొందక పోవుదువా? శిక్ష తప్పించుకొనక నీవు
నిశ్చయముగా త్రాగుదువు.। బొస్రా పాడుగాను అప 13
హాస్యాస్పదముగాను ఎడారిగాను శాపవచనముగాను
ఉండుననియు, దాని పట్టణములన్నియు ఎన్నటెన్న
టికి పాడుగానుండుననియు నా తోడని ప్రమాణము
చేసియున్నానని యెహోవా సెలవిచ్చుచున్నాడు. ।
యెహోవాయొద్దనుండి నాకు వర్తమానము వచ్చెను; 14
జనములయొద్దకు దూత పంపబడియున్నాడు, కూడు
కొని ఆమెమీదికి రండి యుద్ధమునకు లేచి రండి. ।
జనములలో అల్పునిగాను మనుష్యులలో నీచునిగాను 15
నేను నిన్ను చేయుచున్నాను. । నీవు భీకరుడవు; 16
కొండసందులలో నివసించువాడా, పర్వత శిఖరమును
స్వాధీనపరచుకొనువాడా, నీ హృదయగర్వము నిన్ను
మోసపుచ్చెను, నీవు గద్దవలె నీ గూటిని ఉన్నతస్థల
ములో కట్టుకొనినను అక్కడనుండి నిన్ను పడద్రోసె
దను; ఇదే యెహోవా వాక్కు. । ఎదోము పాడై 17
పోవును, దాని మార్గమున నడుచువారు ఆశ్చర్యపడి
దాని యిడుమలన్నియు చూచి హేళనచేయుదురు... 
చేయుదురు. । సొదొమయు గొమొఱ్ఱాయు వాటి 18
సమీపపట్టణములును పడగొట్టబడిన తరువాత
వాటిలో ఎవడును కాపురముండక పోయినట్లు ఏ
మనుష్యుడును అక్కడ కాపురముండడు, ఏ నరుడును
దానిలో బసచేయడు. । చిరకాలము నిలుచు నివాస 19
మును పట్టుకొనవలెనని శత్రువులు సింహమువలె
యొర్దాను ప్రవాహములోనుండి వచ్చుచున్నారు,
నిమిషములోనే నేను వారిని దానియొద్దనుండి తోలి
వేయుదును, నేనెవని నేర్పరతునో వానిని దాని
మీద నియమించెదను; నన్ను పోలియున్నవాడై
నాకు ఆక్షేపణ కలుగజేయువాడేడి? నన్ను ఎదిరింప
గల కాపరియేడి? । ఎదోమునుగూర్చి యెహోవా 20

ప ఆలోచన వినుడి. తేమాను నివాసులనుగూర్చి
పన ఉద్దేశించినదాని వినుడి. నిశ్చయముగా
దలో అల్పులైనవారిని శత్రువులు లాగుదురు,
యముగా వారి నివాసస్థలము వారినిబట్టి ఆశ్చర్య
ను. । వారు పడిపోగా అఖండమైన ధ్వని పుట్టెను,
మి దానికి వద్దరిల్లుచున్నది, అంగలార్పు ఘోష
ఎర్ర సముద్రముదనుక వినబడెను. । శత్రువు
లె లేచి యెగిరి బొస్రామీద పడవలెనని తన
లు విప్పుకొనుచున్నాడు; ఆ దినమున ఎదోము
ధ్యుల హృదయములు ప్రసవించు స్త్రీ హృద
మువలె ఉండును.
దమస్కును గూర్చిన వాక్కు.
—హమాతును అర్పాదును దుర్వార్త విని సిగ్గు
పడుచున్నవి
అవి పరవశములాయెను
సముద్రముమీద విచారము కలదు
దానికి నెమ్మదిలేదు.
దమస్కు బలహీనమాయెను
పారిపోవలెనని అది వెనుకతీయుచున్నది
వణకు దానిని పట్టెను
ప్రసవించు స్త్రీని పట్టునట్లు ప్రయాసవేదనలు దాని
పట్టెను.
ప్రసిద్ధిగల పట్టణము బొత్తిగా విడువబడెను
నాకు ఆనందమునిచ్చు పట్టణము బొత్తిగా విడువ
బడెను.
ఆమె యౌవనులు ఆమె వీధులలో కూలుదురు
ఆ దినమున యోధులందరు మౌనులైయుందురు
ఇదే సైన్యములకధిపతియగు యెహోవా వాక్కు.
నేను దమస్కు ప్రాకారములో అగ్ని రాజ
బెట్టెదను
అది బెన్హదదు నగరులను కాల్చివేయును.
బాబెలురాజైన నెబుకద్రెజరు కొట్టిన కేదారును
గూర్చియు
హాసోరు రాజ్యములనుగూర్చియు యెహోవా
సెలవిచ్చినమాట
—లేచి కేదారుకు వెళ్లుడి తూర్పుదేశస్థులను దోచు
కొనుడి.
వారి గుడారములను గొఱ్ఱెల మందలను శత్రు
వులు కొనిపోవుదురు
తెరలను ఉపకరణములను ఒంటెలను వారు పట్టు
కొందురు
నఖముఖాల భయమని వారు దానిమీద చాటిం
తురు
హాసోరు నివాసులారా, బాబెలురాజైన నెబుక
ద్రెజరు మీమీదికి రావలెనని ఆలోచన
చేయుచున్నాడు

మీమీద పడవలెనను ఉద్దేశముతో ఉన్నాడు
యెహోవా వాక్కు ఇదే
—పారిపోవుడి బహుదూరముగా వెళ్లుడి
అగాధస్థలములలో దాగుడి
మీరు లేచి ఒంటరిగా నివసించుచు 31
గుమ్మములు పెట్టకయు గడియలు అమర్చకయు
నిశ్చింతగాను క్షేమముగాను నివసించు జనము
మీద పడుడి.
వారి ఒంటెలు దోపుడుసొమ్ముగా ఉండును 32
వారి పశువులమందలు కొల్లసొమ్ముగా ఉండును
గడ్డపు ప్రక్కలను కత్తిరించుకొనువారిని
నఖముఖాల చెదరగొట్టుచున్నాను
నలుదిక్కులనుండి ఉపద్రవమును వారిమీదికి
రప్పించుచున్నాను
ఇదే యెహోవా వాక్కు,
హాసోరు చిరకాలము పాడై నక్కలకు నివాస 33
స్థలముగా ఉండును
అక్కడ ఏ మనుష్యుడును కాపురముండడు
ఏ నరుడును దానిలో బసచేయడు.
యూదారాజైన సిద్కియా యేలుబడి ఆరంభ 34
ములో యెహోవా వాక్కు ప్రవక్తయైన యిర్మీ 35
యాకు ప్రత్యక్షమై ఏలామునుగూర్చి ఈలాగు సెల
విచ్చెను—సైన్యములకధిపతియగు యెహోవా సెల
విచ్చునదేమనగా—నేను ఏలాముయొక్క బలమునకు
ముఖ్యాధారమైన వింటిని విరుచుచున్నాను. । నలు 36
దిశలనుండి నాలుగు వాయువులను ఏలాముమీదికి
రప్పించి, నలుదిక్కులనుండి వచ్చు వాయువులవెంట
వారిని చెదరగొట్టుదును, వెలివేయబడిన ఏలామువారు
ప్రవేశింపని దేశమేదియు నుండదు. । మరియు వారి 37
శత్రువులయెదుటను వారి ప్రాణము తీయజూచు
వారియెదుటను ఏలామును భయపడజేయుదును, నా
కోపాగ్నిచేత కీడును వారిమీదికి నేను రప్పించు
దును, వారిని నిర్మూలము చేయువరకు వారివెంట
ఖడ్గము పంపుచున్నాను; ఇదే యెహోవా వాక్కు. ।
నా సింహాసనమును అచ్చటనే స్థాపించి ఏలాములో 38
నుండి రాజును అధిపతులను నాశనముచేయుదును;
ఇదే యెహోవా వాక్కు. । అయితే కాలాంతమున 39
చెరపట్టబడిన ఏలామువారిని నేను మరల రప్పించెదను;
ఇదే యెహోవా వాక్కు.

బాబెలునుగూర్చియు కల్దీయుల దేశమునుగూర్చి **50**
యు ప్రవక్తయైన యిర్మీయాద్వారా యెహోవా
సెలవిచ్చిన వాక్కు
—జనములలో ప్రకటించుడి సమాచారము తెలియ 2
జేయుడి
ధ్వజమునెత్తి మరుగుచేయక చాటించుడి
బాబెలు పట్టబడును బేలు అవమానము నొందును

మెరోదకు నేల పడవేయబడును
బాబెలు విగ్రహములు అవమానము నొందును
దాని బొమ్మలు బోర్ల ద్రోయబడును
3 ఉత్తరదిక్కునుండి దానిమీదికి ఒక జనము వచ్చు
చున్నది
ఏ నివాసియు లేకుండ అది దాని దేశమును పాడు
చేయును
మనుష్యులేమి పశువులేమి అందరును పారిపోవు
దురు అందరును తర్లిపోవుదురు.
4 ఆ కాలమున ఆనాటికి ఇశ్రాయేలువారును
యూదావారును కూడి వచ్చెదరు
ఏడ్చుచు సాగుచు తమ దేవుడైన యెహోవా
యొద్ద విచారించుటకై వచ్చెదరు.
5 ఎన్నటికిని మరువబడని నిత్యనిబంధన చేసికొని
యెహోవాను కలిసికొందము రండని చెప్పు
కొనుచు
సీయోనుతట్టు అభిముఖులై అచ్చటికి వెళ్లు మార్గము
ఏదని అడుగుచు వచ్చెదరు
ఇదే యెహోవా వాక్కు.
6 నా ప్రజలు త్రోవతప్పిన గొఱ్ఱెలుగా ఉన్నారు
వారి కాపరులు కొండలమీదికి వారిని తోలు
కొనిపోయి వారిని త్రోవ తప్పించిరి
జనులు కొండకొండకు వెళ్లుచు తాము దిగవలసిన
చోటు మరచిపోయిరి.
7 కనుగొనినవారందరు వారిని భక్షించుచు వచ్చిరి
వారి శత్రువులు—మేము అపరాధులము కాము
వీరు న్యాయమునకు నివాసమును తమ పితరులకు
నిరీక్షణాధారమునగు యెహోవామీద
తిరుగబాటు చేసినందున ఇది వారికి సంభవించె
నని చెప్పుదురు.
8 బాబెలులోనుండి పారిపోవుడి
కల్దీయులదేశములోనుండి బయలువెళ్లుడి
మందలకు ముందు మేకపోతులు నడుచునట్లు
ముందర నడువుడి.
9 ఉత్తరదేశమునుండి మహాజనముల సమూహమును
నేను రేపుచున్నాను
బాబెలునకు విరోధముగా దానిని రప్పించు
చున్నాను
ఆ జనులు దానిమీదికి యుద్ధపంక్తులు తీర్చు
చున్నారు
వారి మధ్యనుండియే ఆమె పట్టబడును
ప్రజ్ఞగల బలాఢ్యులు దోపుడుసొమ్ము పట్టుకొనక
మరలనిరీతిగా
వారి బాణములు అమోఘములై తిరిగి రాకుండును.
10 కల్దీయుల దేశము దోపుడుసొమ్మగును దాని దోచు
కొనువారందరు సంతుష్టి నొందెదరు
ఇదే యెహోవా వాక్కు.
నా స్వాస్థ్యమును దోచుకొనువారలారా, 11
సంతోషించుచు ఉత్సహించుచు నురిపిడిచేయుచు
పెయ్యవలె గంతులువేయుచు బలమైన గుఱ్ఱముల
వలె మీరు సకిలించుచున్నారే
మీ తల్లి బహుగా సిగ్గుపడును మిమ్మును కన్నది 12
తెల్లబోవును
ఇదిగో అది జనములన్నిటిలో అతినీచ జనమగును
అది యెడారియు ఎండినభూమియు అడవియు
నగును.
యెహోవా రౌద్రమునుబట్టి అది నిర్జనమగును 13
అది కేవలము పాడైపోవును
బాబెలుమార్గమున పోవువారందరు ఆశ్చర్యపడి
దాని తెగుళ్లన్నియు చూచి — ఆహా నీకీగతి
పట్టినదా అందురు
ఆమె యెహోవాకు విరోధముగా పాపముచేసి 14
నది.
విల్లు త్రొక్కువారలారా,
మీరందరు బాబెలునకు విరోధముగా దానిచుట్టు
యుద్ధపంక్తులు తీర్చుడి
ఎడతెగక దానిమీద బాణములు వేయుడి
చుట్టు కూడి దానిని బట్టి కేకలువేయుడి 15
అది లోబడ నొప్పుకొనుచున్నది
ఆమె బురుజులు పడిపోవుచున్నవి ఆమె ప్రాకా
రములు విరుగగొట్టబడుచున్నవి
ఇది యెహోవా చేయు ప్రతికారము.
ఆమెమీద పగతీర్చుకొనుడి
ఆమె చేసినట్టే ఆమెకు చేయుడి.
బాబెలులోనుండకుండ విత్తువారిని నిర్మూలము 16
చేయుడి
కోతకాలమున కొడవలి పట్టుకొనువారిని నిర్మూ
లము చేయుడి
క్రూరమైన ఖడ్గమునకు భయపడి వారందరు తమ
ప్రజలయొద్దకు వెళ్లుచున్నారు
తమ తమ దేశములకు పారిపోవుచున్నారు.
ఇశ్రాయేలువారు చెదరిపోయిన గొఱ్ఱెలు 17
సింహములు వారిని తోలగొట్టెను
మొదట అష్షూరురాజు వారిని భక్షించెను
కడపట బాబెలురాజైన యీ నెబుకద్రెజరు
వారి యెముకలను నలుగగొట్టుచున్నాడు.
కావున ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతి 18
యునగు యెహోవా ఈలాగు సెలవిచ్చు
చున్నాడు
—అష్షూరు రాజును నేను దండించినట్లు
బాబెలురాజును అతని దేశమును దండించెదను.

ఇశ్రాయేలువారిని తమ మేతస్థలమునకు నేను
తిరిగి రప్పించెదను
వారు కర్మెలుమీదను బాషానుమీదను మేయు
దురు
ఎఫ్రాయిము కొండలమీదను గిలాదులోను
మేయుచు సంతుష్టినొందును.
ఆ కాలమున ఆ నాటికి ఇశ్రాయేలు దోషమును
వెదకినను అది కనబడకుండును
యూదా పాపములు (వెదకినను) అవి దొరకవు
శేషింపజేసినవారిని నేను క్షమించెదను
ఇదే యెహోవా వాక్కు.
దండెత్తి మెరాతయీయుల దేశముమీదికి పొమ్ము
పెకోదీయుల దేశముమీదికి పొమ్ము
వారిని హతముచేయుము
వారు శాపగ్రస్తులని ప్రకటించుము
నేను మీకిచ్చిన ఆజ్ఞ అంతటినిబట్టి చేయుము.
ఆలకించుడి, దేశములో యుద్ధధ్వని వినబడు
చున్నది
అధిక నాశనధ్వని వినబడుచున్నది
సర్వభూమిని కొట్టుచున్న సమ్మెట తెగి బొత్తిగా
విరుగగొట్టబడెను
అన్యజనులలో బాబెలు బొత్తిగా పాడైపోయెను.
బాబెలూ, నిన్ను పట్టుకొనుటకై బోను పెట్టి
యున్నాను
తెలియకయే నీవు పట్టబడియున్నావు
యెహోవాతో నీవు యుద్ధముచేయ బూను
కొంటివి
నీవు చిక్కుపడి పట్టబడియున్నావు.
కల్దీయులదేశములో ప్రభువును సైన్యములకధిపతి
యునగు యెహోవాకు పనియున్నది
యెహోవా తన ఆయుధశాలను తెరచి
కోపముతీర్చు తన ఆయుధములను వెలపలికి తెచ్చు
చున్నాడు.
నలుదిక్కులనుండి వచ్చి దానిమీద పడుడి
దాని ధాన్యపుకొట్లను విప్పుడి
కసవు కుప్పలువేసినట్టు ఆమెను కుప్పలువేయుడి
శేషమేమియు లేకుండ నాశనము చేయుడి
దాని యెడ్లన్నిటిని వధించుడి అవి వధకు పోవలెను
అయ్యో వారికి శ్రమ వారిదినము ఆసన్న
మాయెను
వారి దండనకాలము వచ్చెను.
ఆలకించుడి, పారిపోయి బాబెలుదేశములోనుండి
తప్పించుకొని వచ్చుచున్నవారి శబ్దము విన
బడుచున్నది
మన దేవుడగు యెహోవా చేయు ప్రతికార
సమాచారమును
తన ఆలయము విషయమై ఆయన చేయు ప్రతి
కారసమాచారమును సీయోనులో ప్రకటిం
చుడి. వారు వచ్చుచున్నారు.
బాబెలుకు రండని విలుకాండ్రను పిలువుడి 29
విల్లు త్రొక్కువారలారా, మీరందరు దాని
చుట్టు దిగుడి
అది యెహోవామీద గర్వపడినది
ఇశ్రాయేలు పరిశుద్ధునిమీద గర్వపడినది
దానిలో నొకడును తప్పించుకొనకూడదు
దాని క్రియలనుబట్టి దానికి ప్రతికారము చేయుడి
అది చేసిన పనియంతటినిబట్టి దానికి ప్రతి
కారము చేయుడి.
కావున ఆ దినమున దాని యౌవనస్థులు దాని 30
వీధులలో కూలుదురు
దాని యోధులందరు తుడిచివేయబడుదురు
ఇదే యెహోవా వాక్కు.
ప్రభువును సైన్యములకధిపతియునగు యెహోవా 31
వాక్కు ఇదే
—గర్విష్ఠుడా, నేను నీకు విరోధినై యున్నాను
నీ దినము వచ్చుచున్నది
నేను నిన్ను శిక్షించుకాలము వచ్చుచున్నది.
గర్విష్ఠుడు తొట్రిల్లి కూలును 32
అతని లేవనెత్తువాడెవడును లేకపోవును
నేనతని పురములలో అగ్ని రాజబెట్టెదను
అది అతని చుట్టుపట్లున్నటిని కాల్చివేయును.
సైన్యములకధిపతియగు యెహోవా ఈలాగు 33
సెలవిచ్చుచున్నాడు
— ఒకడును తప్పకుండ ఇశ్రాయేలువారును
యూదావారును బాధింపబడిరి
వారిని చెరపట్టినవారందరు వారిని గట్టిగా పట్టు
కొనుచున్నారు
వారిని పోనిచ్చుటకు సమ్మతింపరు.
వారి విమోచకుడు బలవంతుడు 34
సైన్యములకధిపతియగు యెహోవా అని ఆయ
నకు పేరు
భూమికి విశ్రాంతి కలుగజేయుటకును
బాబెలు నివాసులను కలవరపరచుటకును
ఆయన బాగుగా వాదించి వారి వ్యాజ్యమును కడ
ముట్టించును.
యెహోవా మాట యిదే 35
—కల్దీయులును బాబెలు నివాసులును
దాని అధిపతులును జ్ఞానులును కత్తిపాలగుదురు
ప్రగల్భములు పలుకువారు ఖడ్గవశులై పిచ్చివాం 36
డ్లగుదురు.
బలాఢ్యులు నిర్మూలమగునట్లు ఖడ్గము వారిమీద
పడును

37 ఖడ్గము వారి గుఱ్ఱములమీద పడును వారి రథ
ములమీద పడును
ఖడ్గము వారిమీదికి దిగుటచేత
దానిలోనున్న పరదేశులు స్త్రీలవంటివారగుదురు
అది దాని నిధులమీద పడగా అవి దోచుకొన
బడును.
38 నీళ్లకు ఎద్దడి తగులును అవి ఇంకిపోవును
అది చెక్కబడిన విగ్రహములుగల దేశము
జనులు భీకర ప్రతిమలనుబట్టి పిచ్చిచేష్టలు చేయు
దురు.
39 అందుచేతను అడవిపిల్లులును నక్కలును అక్కడ
నివసించును
నిప్పుకోళ్లును దానిలో నివాసముచేయును
ఇకమీదట అది ఎన్నడును నివాసస్థలము కాక
పోవును
తరతరములు దానిలో ఎవరును కాపురముండరు.
40 యెహోవా వాక్కు ఇదే
—సొదొమను గొమొఱ్ఱాను వాటి సమీపపట్టణ
ములను
దేవుడు నాశనము చేసినప్పుడు జరిగిన రీతిగా
ఎవడును అక్కడ కాపురముండకపోవును
ఏ నరుడును దానిలో బసచేయడు.
41 జనులు ఉత్తరదిక్కునుండి వచ్చుచున్నారు
మహాజనమును అనేక రాజులును
భూదిగంతములనుండి రేపబడెదరు.
42 వారు వింటిని ఈటెను పట్టుకొని వచ్చెదరు
వారు క్రూరులు జాలిపడనివారు
వారి స్వరము సముద్రఘోషవలె ఉన్నది
వారు గుఱ్ఱములను ఎక్కువారు
బాబెలు కుమారీ, ఒకడు యుద్ధపంక్తులు తీర్చురీతిగా
వారందరు నీమీద పంక్తులు తీరుచున్నారు.
43 బాబెలురాజు వారి సమాచారము విని దుర్బలు
డాయెను అతనికి బాధ కలిగెను
ప్రసవస్త్రీ వేదనవంటి వేదన అతనికి సంభవించెను.
44 చిరకాల నివాసమును పట్టుకొనవలెనని
శత్రువులు సింహమువలె యొర్దాను ప్రవాహము
లోనుండి వచ్చుచున్నారు
నిమిషములోనే నేను వారిని దానియొద్దనుండి
తోలివేయుదును
నేనెవని ఏర్పరతునో వానిని దానిమీద నియ
మించెదను
నన్ను పోలియున్నవాడై నన్ను ఆక్షేపణచేయు
వాడేడి?
నన్ను ఎదిరింపగల కాపరి ఏడి?
45 బాబెలునుగూర్చి యెహోవా చేసిన ఆలోచన
వినుడి
కల్దీయులదేశమునుగూర్చి ఆయన ఉద్దేశించినది
వినుడి
నిశ్చయముగా మందలోని అల్పులైనవారిని వారు
లాగుదురు
నిశ్చయముగా వారినిబట్టి వారి నివాసస్థలము
విస్మయమొందును.
బాబెలు పట్టబడుచున్నదను సమాచారము విని 46
భూమి కంపించుచున్నది
జనములలో అంగలార్పు వినబడుచున్నది.

51

యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు
—ఇదిగో నా శత్రువులలో ప్రధానశత్రువగు
బాబెలుమీదికిని దాని నివాసులమీదికిని
ప్రళయము రప్పించు ఒకని మనస్సును నేను రేపు
చున్నాను.
అన్యదేశస్థులను బాబెలుకు పంపుచున్నాను 2
వారు ఆ దేశమును తూర్పారపట్టి దాని వట్టిదిగా
చేయుదురు
ఆపద్దినమున వారు నలుదిక్కులనుండి దానిమీదికి
వచ్చెదరు.
విలుకానిమీదికి విలుకాడు విల్లు త్రొక్కవలెను 3
కవచము వేసికొనువానిమీదికిని విల్లు త్రొక్క
వలెను
కల్దీయులదేశములో జనులు హతులై పడునట్లును
దాని వీధులలో వారు పొడవబడి కూలునట్లును
యౌవనస్థులను కొట్టక మానకుడి 4
దాని సర్వసైన్యమును బొత్తిగా నిర్మూలముచేయుడి.
తమ దేవుడును సైన్యములకధిపతియునగు 5
యెహోవా ఇశ్రాయేలువారిని యూదా
వారిని విసర్జింపలేదుగాని ఇశ్రాయేలు పరిశుద్ధ
దేవునికి విరోధముగా తాము చేసిన అపరాధ
ముతో; వారిదేశము నిండియున్నది.
మీరు దాని దోషములో పడి నశింపకుండునట్లు 6
బాబెలులోనుండి పారిపోవుడి
మీ ప్రాణములు రక్షించుకొనుడి
ఇది యెహోవాకు ప్రతికారకాలము
అది చేసిన క్రియలనుబట్టి ఆయన దానికి ప్రతి
కారము చేయుచున్నాడు.
బాబెలు యెహోవా చేతిలో సర్వభూమికి 7
మత్తుకలిగించు బంగారుపాత్రయై యుండెను
దానిచేతి మద్యమును అన్యజనులు త్రాగి మత్తిల్లి
యున్నారు.
బాబెలు నిమిషమాత్రములోనే కూలి తుత్తునియ 8
లాయెను
ఆమెను చూచి అంగలార్చుడి ఆమె స్వస్థతనొందు
నేమో
దాని నొప్పికొరకు గుగ్గిలము తీసికొని రండి.

9 మనము బాబెలును స్వస్థపరచగోరితిమి
అయితే అది స్వస్థత నొందలేదు దాని విడిచి
పెట్టుడి.
మన మన దేశములకు వెళ్లుదము రండి
ఆమె శిక్ష ఆకాశమంత యెత్తుగా సాగుచున్నది
అది మేఘములంత ఉన్నతముగా ఎక్కుచున్నది
10 యెహోవా మన న్యాయమును రుజువుపరచు
చున్నాడు
రండి సీయోనులో మన దేవుడైన యెహోవా
చేసిన పని మనము వివరించుదము.
11 బాణములు చికిలిచేయుడి కేడెములు పట్టుకొనుడి
బాబెలును నశింపజేయుటకు యెహోవా ఆలో
చించుచున్నాడు
మాదీయుల రాజుల మనస్సును దానిమీదికి రేపు
చున్నాడు
అది యెహోవా చేయు ప్రతిదండన
తన మందిరమునుగూర్చి ఆయన చేయు ప్రతి
దండన.
12 బాబెలు ప్రాకారములమీద పడుటకై ధ్వజము
నిలువబెట్టుడి
కావలి బలముచేయుడి కావలివారిని పెట్టుడి
మాటులను సిద్ధపరచుడి
బాబెలు నివాసులనుగూర్చి తాను సెలవిచ్చిన
దానినిబట్టి యెహోవా తీర్మానముచేసిన పని
తాను జరిగింపబోవుచున్నాడు.
13 విస్తారజలములయొద్ద నివసించుదానా,
నిధుల సమృద్ధిగలదానా, నీ అంతము వచ్చినది
అన్యాయలాభము నీకిక దొరకదు.
14 గొంగళిపురుగులంత విస్తారముగా మనుష్యులతో
నేను నిన్ను నింపినను శత్రువులు నీమీద
కేకలువేయుదురు
15 నా జీవముతోడని సైన్యములకధిపతియగు
యెహోవా ప్రమాణము చేయుచున్నాడు
ఆయన తన బలముచేత భూమిని సృష్టించెను
తన జ్ఞానముచేత ప్రపంచమును స్థాపించెను
తన ప్రజ్ఞచేత ఆకాశమును విశాలపరచెను.
16 ఆయన ఆజ్ఞ ఇయ్యగా జలరాసులు ఆకాశమండల
ములో పుట్టును.
భూమ్యంతభాగములలోనుండి ఆయన ఆవిరి ఎక్క
జేయును
వర్షము కలుగునట్లుగా ఆయన మెరుపులు పుట్టిం
చును
తన ధనాగారములలోనుండి గాలిని రావించును.
17 తెలివిలేక ప్రతి మనుష్యుడు పశుప్రాయుడు
పోతపోయు ప్రతివాడును తాను చేసిన విగ్రహ
ములనుబట్టి అవమానమొందును
అతడు పోతపోసినది మాయారూపము దానిలో
ప్రాణమేమియు లేదు.
అవి ఆశను చెడగొట్టు మాయాకార్యములు 18
విమర్శకాలమున అవి నశించిపోవును.
యాకోబునకు స్వాస్థ్యమగువాడు వాటివంటివాడు 19
కాడు
ఆయన సమస్తమును నిర్మించువాడు
ఇశ్రాయేలు ఆయనకు స్వాస్థ్యముగానున్న
గోత్రము
సైన్యములకధిపతియగు యెహోవా అని ఆయనకు
పేరు.
నీవు నాకు గండ్రగొడ్డలివంటివాడవు 20
యుద్ధాయుధమువంటివాడవు
నీవలన నేను జనములను విరుగగొట్టుచున్నాను
నీవలన రాజ్యములను విరుగగొట్టుచున్నాను.
నీవలన గుఱ్ఱములను రౌతులను విరుగగొట్టు 21
చున్నాను
నీవలన రథములను వాటి నెక్కినవారిని విరుగ
గొట్టుచున్నాను.
నీవలన స్త్రీలను పురుషులను విరుగగొట్టుచున్నాను 22
నీవలన ముసలివారిని బాలురను విరుగగొట్టు
చున్నాను
నీవలన యౌవనులను కన్యకలను విరుగగొట్టు
చున్నాను.
నీవలన గొఱ్ఱెలకాపరులను వారి గొఱ్ఱెలమందలను 23
విరుగగొట్టుచున్నాను
నీవలన దున్నువారిని వారి దుక్కిటెద్దులను విరుగ
గొట్టుచున్నాను
నీవలన పీలికలను అధిపతులను విరుగగొట్టు
చున్నాను.
బాబెలును కల్దీయుల దేశనివాసులును 24
మీ కన్నులయెదుట సీయోనులో చేసిన కీడంతటికి
నేను వారికి ప్రతికారము చేయుచున్నాను, ఇదే
యెహోవా వాక్కు.
—సర్వభూమిని నశింపజేయు నాశనపర్వతమా, 25
నేను నీకు విరోధిని
ఇదే యెహోవా వాక్కు.
నేను నీమీదికి నా చేయి చాపి శిలలపైనుండి
నిన్ను క్రిందికి దొరలించుదును
చిచ్చుపెట్టిన కొండవలె ఉండజేయుదును.
మూలకుగాని పునాదికిగాని 26
నీలోనుండి యెవరును రాళ్లు తీసికొనరు
నీవు చిరకాలము పాడైయుందువు
ఇదే యెహోవా వాక్కు.
దేశములో ధ్వజములనెత్తుడి 27
జనములలో బాకానాదము చేయుడి

దానిమీదికి పోవుటకై జనములను ప్రతిష్ఠించుడి
దానిమీద పడుటకై అరారాతు మిన్నీ అష్కనజు
అను రాజ్యములను పిలిపించుడి
దానిమీదికి జనులను నడిపించుటకై సేనాధిపతిని
నియమించుడి
రోమముగల గొంగళిపురుగులంత విస్తారముగా
గుఱ్ఱములను దానిమీదికి రప్పించుడి.
28 దానిమీదికి పోవుటకై మాదీయుల రాజులను
వారి అధిపతులను వారి యేలికలను
అతడు ఏలుచుండు సర్వదేశమును జనులనందరిని
ప్రతిష్ఠించుడి.
29 భూమి కంపించుచున్నది నొప్పిచేత అది గిజగిజ
లాడుచున్నది
నివాసియు లేకుండ బాబెలుదేశమును పాడుగా
చేయవలెనని
బాబెలునుగూర్చిన యెహోవా ఉద్దేశము స్థిర
మాయెను.
30-32 బాబెలు పరాక్రమవంతులు యుద్ధముచేయక
మానుదురు
వారు తమ కోటలలో నిలుచుచున్నారు
వారి పరాక్రమము బలహీనత ఆయెను
వారును స్త్రీలవంటివారైరి
వారి నివాసస్థలములు కాల్చబడుచున్నవి
వారి అడ్డగడియలు విరిగిపోయెను
అతని పట్టణమంతయు పట్టబడెనని బంట్రౌతు
వెంబడి బంట్రౌతును
దూతవెంబడి దూతయు పరుగెత్తుచు బాబెలు
రాజునకు తెలియజేతురు.
దాని రేవులు శత్రువశమాయెను
కోనేటి దూలములును జమ్మును అగ్నిచేత కాల్చ
బడెను
దాని యోధులు దిగులుపడిరి.
33 ఇశ్రాయేలు దేవుడును సైన్యములకధిపతియునగు
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు-
బాబెలుపురము చదరముచేయబడిన కళ్లమువలె
ఆయెను
ఇంక కొంతసేపటికి దానికి కోతకాలము వచ్చును.
34 బాబెలురాజైన నెబుకద్రెజరు మమ్మును మ్రింగి
వేసెను
మమ్మును నుగ్గుచేసెను, మమ్మును వట్టికుండవలె ఉంచి
యున్నాడు
భుజంగము మ్రింగునట్లు మమ్మును మ్రింగెను
మా శ్రేష్ఠపదార్థములతో తన పొట్ట నింపుకొని
మమ్మును పారవేసియున్నాడు.
35 నాకును నా దేహమునకును చేయబడిన హింస
బాబెలుమీదికి ప్రతికారరూపముగా దిగు
గాక యని సీయోను నివాసి యనుకొనును
నా ఉసురు కల్దీయదేశ నివాసులకు తగులునుగాక అని
యెరూషలేము అనుకొనును.
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు—ఆల 36
కించుము, నీ వ్యాజ్యమును నేను జరిగించు
దును
నీ నిమిత్తము నేనే పగతీర్చుకొందును
దాని సముద్రమును నేనెండబెట్టుదును
దాని ఊటను ఇంకిపోజేయుదును.
బాబెలు నిర్జనమై కసువు దిబ్బలుగా ఉండును 37
నక్కలకు నివాసస్థలమగును
అది పాడై యెగతాళికి కారణముగా ఉండును.
వారు కూడి సింహములవలె బొబ్బరింతురు 38
సింహముల పిల్లలవలె గుఱ్ఱుపెట్టుదురు.
వారు సంతోషించి మేలుకొనక చిరకాల నిద్ర 39
నొందునట్లు
వారు దప్పిగొనగా వారికి మద్యము నిచ్చి వారిని
మత్తిల్లజేసెదను
ఇదే యెహోవా వాక్కు.
గొఱ్ఱెపిల్లలు వధకు పోవునట్లును 40
మేకపోతులును పొట్టేళ్లును వధకు పోవునట్లును
వారిని వధకు రప్పించెదను.
షేషకు పట్టబడెను 41
జగత్ప్రసిద్ధమైన పట్టణము పట్టబడెను
బాబెలు జనములకు విస్మయాస్పదమాయెను.
సముద్రము బాబెలుమీదికి వచ్చెను 42
ఆమె దాని తరంగముల ధ్వనితో నిండుకొనెను.
దాని పట్టణములు పాడుగాను ఎండిన భూమిగాను 43
అరణ్యముగాను నిర్మానుష్యమైన భూమిగాను
ఉండెను
ఏ నరుడును దానిమీదుగా ప్రయాణము చేయడు.
బాబెలులోనే బేలును శిక్షించుచున్నాను 44
వాడు మ్రింగినదానిని వానినోటనుండి కక్కించు
చున్నాను
ఇకమీదట జనములు వానియొద్దకు సమూహ
ములుగా కూడి రావు
బాబెలు ప్రాకారము కూలును.
నా జనులారా, మీరు దానిలోనుండి బయటకు 45
వెళ్లుడి
యెహోవా కోపాగ్నినుండి తప్పించుకొనుడి
మీ ప్రాణములను రక్షించుకొనుడి
ఏటేట వదంతి పుట్టుచువచ్చును 46
దేశములో బలాత్కారము జరుగుచున్నది
ఏలికమీద ఏలిక లేచుచున్నాడు
దేశములో వినబడు వదంతికి భయపడకుడి

మీ హృదయములలో దిగులు పుట్టనియ్యకుడి.
రాబోవు దినములలో నేను బాబెలుయొక్క
చెక్కిన విగ్రహములను శిక్షింతును
ఆమె దేశమంతయు అవమానము నొందును
జనులు హతులై దాని మధ్యను కూలెదరు.
ఆమెను పాడుచేయువారు ఉత్తరదిక్కునుండి
ఆమెయొద్దకు వచ్చుచున్నారని
ఆకాశమును భూమియు వాటిలోని సమస్తమును
బాబెలు గతినిగూర్చి సంతోషించును
ఇదే యెహోవా వాక్కు.
బాబెలు ఇశ్రాయేలులో హతులైనవారిని కూల
జేసినట్లు
సర్వభూమిలో బాబెలు నిమిత్తము హతులైనవారు
కూలుదురు.
ఖడ్గమును తప్పించుకొనినవారలారా,
ఆలస్యముచేయక వెళ్లుడి, దూరమునుండి
మీరు యెహోవాను జ్ఞాపకముచేసికొనుడి
యెరూషలేము మీ జ్ఞాపకమునకు రానియ్యుడి.
మేము దూషణవాక్యము విని సిగ్గుపడియున్నాము
అన్యులు యెహోవా మందిరపు పరిశుద్ధస్థలముల
లోనికి వచ్చియున్నారు
మా ముఖములు తెల్లబోవుచున్నవి
ఇదే యెహోవా వాక్కు
—రాబోవు దినములలో నేను బాబెలుయొక్క
విగ్రహములను శిక్షింతును
ఆమె దేశమందంతటను గాయపరచబడినవారు
మూల్గుదురు.
బాబెలు తన బలమైన ఉన్నతస్థలములను దుర్గ
ములుగా చేసికొని ఆకాశమునకు ఎక్కినను
పాడుచేయువారు నాయొద్దనుండి వచ్చి ఆమె
మీద పడుదురు
ఇదే యెహోవా వాక్కు.
ఆలకించుడి, బాబెలులోనుండి రోదనధ్వని విన
బడుచున్నది
కల్దీయులదేశములో మహా నాశనధ్వని వినబడు
చున్నది.
యెహోవా బాబెలును పాడుచేయుచున్నాడు
దాని మహాఘోషను అణచివేయుచున్నాడు
వారి తరంగములు ప్రవాహజలములవలె ఘోషించు
చున్నవి
వారి ఆర్భాటము వినబడుచున్నది.
బాబెలుమీదికి పాడుచేయువాడు వచ్చుచున్నాడు
ఆమె బలాఢ్యులు పట్టబడియున్నారు
వారి విండ్లు విరిగిపోయినవి
యెహోవా ప్రతికారము చేయు దేవుడు గనుక
నిశ్చయముగా ఆయన క్రియకు ప్రతిక్రియ
చేయును.
ఆమె అధిపతులను జ్ఞానులను అధికారులను సం 57
స్థానాధిపతులను బలాఢ్యులను మత్తిల్లజేసెదను
వారు చిరకాల నిద్రనొంది మేలుకొనకపోదురు
ఇదే రాజు వాక్కు
సైన్యములకధిపతియగు యెహోవా అని ఆయ
నకు పేరు.
సైన్యములకధిపతియగు యెహోవా ఈ మాట 58
సెలవిచ్చుచున్నాడు
—జనములు వృథాగా ప్రయాసపడుచున్నారు
అగ్నిలో పడుటకై ప్రయాసపడుచున్నారు
ప్రజలు చూచి అలయుచున్నారు
విశాలమైన బాబెలు ప్రాకారములు బొత్తిగా
పడగొట్టబడును
దాని ఉన్నతమైన గుమ్మములు అగ్నిచేత కాల్చి
వేయబడును

సిద్కియా యేలుబడియందు నాలుగవ సంవత్సర 59
మున శెరాయా ఒంపు భోజనసామగ్రికి అధికారియై
యుండి సిద్కియాతోకూడ బాబెలుకు వెళ్లినప్పుడు
నేరీయా కుమారుడును మహసేయా మనుమడునైన ఆ
శెరాయాకు యిర్మీయా ఆజ్ఞాపించిన మాట. । యిర్మీయా 60
బాబెలుమీదికివచ్చు అపాయములన్నిటిని, అనగా
బాబెలునుగూర్చి వ్రాయబడిన యీ మాటలన్నిటిని
గ్రంథములో వ్రాసెను. । కాగా యిర్మీయా శెరా 61
యాతో ఇట్లనెను—నీవు బాబెలుకు వచ్చినప్పుడు ఈ
మాటలన్నిటిని చదివి వినిపింపవలెను. । ఈలాగున 62
నీవు ప్రకటింపవలెను—యెహోవా, మనుష్యులైనను
జంతువులైనను మరి ఏదైనను ఈ స్థలమందు నివసింపక
పోవుదురనియు, అది నిత్యము పాడుగా నుండు
ననియు దానిగూర్చి నీవు సెలవిచ్చితివి. । ఈ గ్రంథ 63
మును చదివి చాలించినతరువాత నీవు దానికి రాయి
కట్టి ఫరాతునదిలో దాని వేసి । నేను దానిమీదికి 64
రప్పింపబోవుచున్న అపాయములచేత బాబెలు మరల
పైకి రాలేక ఆలాగే మునిగిపోవును, దాని జనులు
అలసియుందురు అను మాటలు నీవు ప్రకటింపవలెను.
యిర్మీయాయొక్క మాటలు ఇంతటితో ముగిసెను.

సిద్కియా యేలనారంభించినప్పుడు అతడు ఇరు **52**
వదియొక్క సంవత్సరములవాడు. అతడు యెరూష
లేములో పదకొండు సంవత్సరములు ఏలెను, అతని
తల్లిపేరు హమూటలు; ఈమె లిబ్నా ఊరివాడైన
యిర్మీయా కుమార్తె. । యెహోయాకీము నడిచిన చెడ్డ 2
నడత ప్రకారముగా సిద్కియాయు యెహోవా
దృష్టికి చెడ్డనడత నడిచెను. । యెహోవా కోపపడి 3
తనయెదుట నుండకుండ వారిని తోలివేయునంతగా

ఆ చర్య యెరూషలేములోను యూదాలోను జరి
గెను సిద్కియా బాబెలు రాజుమీద తిరుగబాటు
4 చేయగా । అతని యేలుబడియందు తొమ్మిదవ సంవత్స
రము పదియవ నెల పదియవ దినమున బాబెలురాజైన
నెబుకద్రెజరు తన సైన్యమంతటితో యెరూషలేము
మీదికివచ్చి, దానికి ఎదురుగా దండు దిగినప్పుడు
5 పట్టణమునకు చుట్టు కోటలు కట్టిరి. । ఆలాగు జరు
గగా సిద్కియా యేలుబడియందు పదకొండవ సంవ
త్సరమువరకు పట్టణము ముట్టడిలో నుంచబడెను. ।
6 నాలవ నెల తొమ్మిదవ దినమున క్షామము పట్టణములో
హెచ్చుగా నున్నప్పుడు దేశప్రజలకు ఆహారము లేక
7 పోయెను । పట్టణప్రాకారములు పడగొట్టబడగా
రాణువవారందరు పారిపోయి రాజుతోటకు దాపైన
రెండు గోడల మధ్యనున్న ద్వారపు మార్గమున రాత్రి
యందు పట్టణములోనుండి బయలువెళ్లిరి; కల్దీయులు
పట్టణమును చుట్టుకొనియుండగా రాణువులు యొర్దాను
8 నది మార్గముగా తర్లిపోయిరి. । కల్దీయుల దండు
సిద్కియా రాజును తరిమి యెరికో మైదానములో
అతని కలిసికొనగా అతని దండంతయు అతనియొద్ద
9 నుండి చెదరిపోయెను. । వారు రాజును పట్టుకొని
హమాతు దేశమునందలి రిబ్లా పట్టణముననున్న బాబెలు
రాజునొద్దకు అతని తీసికొనిపోగా అతడు అచ్చటనే
10 సిద్కియా రాజుకు శిక్ష విధించెను. । బాబెలురాజు
సిద్కియా కుమారులను అతని కన్నులయెదుట చంపిం
చెను; మరియు అతడు రిబ్లాలో యూదా అధిపతుల
నందరిని చంపించెను. బాబెలురాజు సిద్కియా కన్నులు
11 ఊడదీయించి । రెండు సంకెళ్లతో అతని బంధించి,
బాబెలుకు అతని తీసికొనిపోయి, మరణమగువరకు చెర
సాలలో అతని పెట్టించెను.

12 అయిదవ నెల పదియవ దినమున, అనగా బాబెలు
రాజైన నెబుకద్రెజరు ఏలుబడియందు పందొమ్మిదవ
సంవత్సరమున బాబెలురాజు ఎదుట నిలుచు నెబూ
జరదానను రాజదేహసంరక్షకుల యధిపతి యెరూష
13 లేముకు వచ్చెను. । అతడు యెహోవా మందిరమును
14 రాజునగరును యెరూషలేములోని గొప్పవారి యిండ్ల
నన్నిటిని కాల్చివేసెను. మరియు రాజదేహసంరక్ష
కుల యధిపతితోకూడ నుండిన కల్దీయుల సేనాసం
బంధులందరు యెరూషలేము చుట్టునున్న ప్రాకార
15 ములన్నిటిని పడగొట్టిరి । మరియు రాజదేహసంరక్ష
కుల యధిపతియైన నెబూజరదాను ప్రజలలో కడు
బీదలైన కొందరిని, పట్టణములో శేషించిన కొదువ
ప్రజలను, బాబెలురాజు పక్షము చేరినవారిని, గట్టి
పనివారిలో శేషించినవారిని చెరగొనిపోయెను. ।
16 అయితే రాజదేహసంరక్షకుల యధిపతియైన నెబూ
జరదాను ద్రాక్షావనములను చక్కపరచుటకును
సేద్యము చేయుటకును కడుబీదలలో కొందరిని ఉండ
నిచ్చెను. । మరియు యెహోవా మందిరములో 17
నుండిన ఇత్తడి స్తంభములను మందిరములోనుండిన
మట్లను ఇత్తడి సముద్రమును కల్దీయులు తునకలుగా
కొట్టి ఆ ఇత్తడి అంతయు బాబెలుకు గొనిపోయిరి. ।
అదియుగాక వారు బిందెలను కుండలను కత్తెరలను 18
గిన్నెలను గరిటెలను యాజకులు సేవచేయు ఇత్తడి
ఉపకరణములన్నిటిని గొనిపోయిరి. । మరియు పళ్లె 19
ములను ధూపార్తులను గిన్నెలను పాత్రలను, బంగారు
వాటిని బంగారుకును వెండివాటిని వెండికిని చేర్చు
కొని రాజదేహసంరక్షకుల యధిపతి గొనిపోయెను. ।
రాజైన సొలొమోను యెహోవా మందిరమునకు 20
చేయించిన రెండు స్తంభములను సముద్రమును మట్ల
క్రిందనుండిన పన్నెండు ఇత్తడి వృషభములను గొని
పోయెను. వీటికన్నిటికినున్న ఇత్తడి యెత్తువేయుటకు
అసాధ్యము. । వాటిలో ఒక్కొక్క స్తంభము పదు 21
నెనిమిది మూరల యెత్తుగలది; పన్నెండుమూరల
నూలు దానిచుట్టు తిరుగును, దాని దళసరి నాలుగు
వేళ్లు; అది గుల్లది. । దానిమీద ఇత్తడి పైపీట యుం 22
డెను; ఒక్క పైపీట అయిదేసి మూరల ఎత్తుగలది,
పైపీటకు చుట్టు అల్లిన వల అల్లికయు దానిమ్మపండ్లును
ఉండెను; అవియన్నియు ఇత్తడివి. ఈ స్తంభము
నకును ఆ స్తంభమునకును ఆలాగుననే దానిమ్మపండ్లుం
డెను. । ప్రక్కలయందు తొంబది యారు దానిమ్మ 23
పండ్లుండెను; చుట్టు ఉండిన వల అల్లికమీది దానిమ్మ
పండ్లన్నియు నూరు. । మరియు రాజదేహసంరక్ష 24
కుల యధిపతి ప్రధానయాజకుడైన శెరాయాను రెండవ
యాజకుడైన జెఫన్యాను ముగ్గురు ద్వారపాలకులను
పట్టుకొనెను. । అతడు పట్టణములోనుండి యోధుల 25
మీద నియమింపబడిన యొక ఉద్యోగస్థుని, పట్టణ
ములో దొరికిన రాజసన్నిధిలో నిలుచు ఏడుగురు
మనుష్యులను, దేశసైన్యాధిపతియగువానియొక్క లేఖ
రిని, పట్టణపు మధ్యను దొరికిన అరువదిమంది దేశ
ప్రజలను పట్టుకొనెను. । రాజదేహసంరక్షకుల యధి 26
పతియైన నెబూజరదాను వీరిని పట్టుకొని రిబ్లాలో
నుండిన బాబెలురాజునొద్దకు తీసికొని వచ్చెను. ।
బాబెలురాజు హమాతుదేశమందలి రిబ్లాలో వారిని 27
కొట్టించి చంపించి యూదావారిని తమ దేశములో
నుండి చెరగొనిపోయెను. । నెబుకద్రెజరు తన 28
యేలుబడియందు ఏడవ సంవత్సరమున మూడువేల
ఇరువది ముగ్గురు యూదులను చెరగొనిపోయెను. ।
నెబుకద్రెజరు ఏలుబడియందు పదునెనిమిదవ సం 29
వత్సరమున అతడు యెరూషలేమునుండి ఎనిమ
న్నూట ముప్పది యిద్దరిని చెరగొనిపోయెను. । నెబు 30
కద్రెజరు ఏలుబడియందు ఇరువది మూడవ సంవత్సర
మున రాజదేహసంరక్షకుల యధిపతియగు నెబూజర

[illegible] యయిదుగు
మనుష్యులను [illegible]; ఆ మనుష్యుల
[illegible].
[illegible] చెరపట్టబడిన
[illegible] పన్నెండవ నెల [illegible]
[illegible] బాబెలురాజైన ఎవీల్మెరోదకు
[illegible]
[illegible] బందీగృహ
ములోనుండి అతని తెప్పించి । అతనితో [illegible]
మాటలాడి అతనితోకూడ బాబెలులోనుండు రాజుల
సింహాసనముకంటె ఎత్తయిన సింహాసనము అతనికి
నియమించెను. । మరియు అతడు తన బందీగృహ 33
వస్త్రములు తీసివేసి వేరు వస్త్రములు ధరించి తన జీవిత
కాలమంతయు ఎవీల్మెరోదకు సన్నిధిని భోజనము
చేయుచువచ్చెను. । మరియు అతడు చనిపోవువరకు 34
అతడు బ్రదికిన దినములన్నియు అనుదినము అతని
పోషణకై బాబెలురాజుచేత భోజనపదార్థములు ఇయ్య
బడుచుండెను.

# విలాపవాక్యములు

1 జనభరితమైన పట్టణము ఎట్లు ఏకాకియై దుఃఖాక్రాంతమాయెను?
అది విధవరాలివంటిదాయెను.
అన్యజనులలో ఘనతకెక్కినది
సంస్థానములలో రాచకుమార్తెయైనది
ఎట్లు పన్ను చెల్లించునదైపోయెను?
2 రాత్రియందు అది బహుగా ఏడ్చుచున్నది
కన్నీరు దాని చెంపలమీద కారుచున్నది
దాని విటకాండ్లందరిలో దాని నోదార్చువాడొకడును లేడు
దాని చెలికాండ్లందరు దాని మోసపుచ్చిరి
వారు దానికి శత్రువులైరి.
3 యూదా బాధనొంది దాసురాలై
చెరలోకి పోయియున్నది
అన్యజనులలో నివసించుచున్నది
విశ్రాంతినొందక పోయెను
దాని తరుమువారందరు ఇరుకుచోట్ల దాని కలిసికొందురు.
4 నియామక కూటములకు ఎవరును రారు గనుక
సీయోను మార్గములు ప్రలాపించుచున్నవి
పట్టణపు గుమ్మములన్నియు పాడైపోయెను
యాజకులు నిట్టూర్పు విడుచుచున్నారు
దాని కన్యకలు దుఃఖాక్రాంతులైరి
అదియు వ్యాకులభరితురాలాయెను.
5 దాని విరోధులు అధికారులైరి
దాని శత్రువులు వర్ధిల్లుచున్నారు
దాని అతిక్రమము విస్తారమని యెహోవా దాని శ్రమపరచుచున్నాడు.
విరోధులు దాని పసిపిల్లలను చెరపట్టుకొని పోయిరి
6 సీయోను కుమారి సౌందర్యమంతయు తొలగిపోయెను
దాని యధిపతులు మేతలేని దుప్పులవలె ఉన్నారు
వారు బలహీనులై తరుమువారియెదుట నిలువలేక పారిపోయిరి.
7 యెరూషలేము పూర్వకాలమున తనకు కలిగిన శ్రేయస్సునంతటిని జ్ఞాపకము చేసికొనుచున్నది
దానికి కలిగిన శ్రమానుభవ కాలమునందు సంచార దినములయందు
సహాయము చేయువారెవరును లేక దాని జనము [illegible]వుచేతిలో పడినప్పుడు
విరోధులు దాని చూచి విశ్రాంతిదినములనుబట్టి దాని నపహాస్యము చేసిరి.
యెరూషలేము ఘోరమైన పాపముచేసెను 8
అందుచేతను అది అపవిత్రురాలాయెను
దాని ఘనపరచిన వారందరు దాని మానమును చూచి దాని తృణీకరించుదురు.
అది నిట్టూర్పు విడుచుచు వెనుకకు తిరుగుచున్నది
దాని యపవిత్రత దాని చెంగులమీద నున్నది 9
దాని కడవరి స్థితిని అది జ్ఞాపకము చేసికొనకయుండెను
అది ఎంతో వింతగా హీనదశ చెందినది
దాని నాదరించువాడొకడును లేకపోయెను.
యెహోవా, శత్రువులు అతిశయిల్లుటచేత
నాకు కలిగిన శ్రమను దృష్టించుము.
దాని మనోహరమైన వస్తువులన్నియు శత్రువుల 10
చేతిలో చిక్కెను
నీ సమాజములో ప్రవేశింపకూడదని యెవరిని గూర్చి ఆజ్ఞాపించితివో
ఆ జనములవారు దాని పరిశుద్ధస్థలమున ప్రవేశించియుండుట అది చూచుచునేయున్నది
దాని కాపురస్థులందరు నిట్టూర్పు విడుచుచు 11
ఆహారము వెదకుదురు
తమ ప్రాణసంరక్షణకొరకు
తమ మనోహరమైన వస్తువుల నిచ్చి ఆహారము కొందురు.
యెహోవా, నేను నీచుడనైతిని దృష్టించి చూడుము.
ప్రయాణస్థులారా, ఈలాగు జరుగుట చూడగా 12
మీకు చింతలేదా?
యెహోవా తన ప్రచండకోప దినమున
నాకు కలుగజేసిన శ్రమవంటి శ్రమ
మరి ఎవరికైనను కలిగినదో లేదో మీరు నిదానించి చూడుడి.
పరమునుండి ఆయన నా యెముకలమీదికి అగ్ని 13
ప్రయోగించి యున్నాడు
అది యెడతెగక వాటిని కాల్చుచున్నది
నా పాదములను చిక్కుపరచుటకై వలనొగ్గియున్నాడు
నన్ను వెనుకకు త్రిప్పియున్నాడు
ఆయన నన్ను పాడుచేసి దినమెల్ల నన్ను సొమ్మసిల్లజేసియున్నాడు.

14 కాడి కట్టినట్లుగా తానే నా యపరాధములను నాకు కట్టియున్నాడు
అవి పైన వేయబడినవై నా మెడమీదికెక్కెను
నా బలమును ఆయన బలహీనతగా చేసియున్నాడు
ప్రభువు శత్రువులచేతికి నన్ను అప్పగించియున్నాడు
నేను వారియెదుట లేవలేకపోతిని.
15 నేను చూచుచుండగా ప్రభువు నా బలాఢ్యుల నందరిని కొట్టివేసెను
నా యౌవనస్థులను అణగద్రొక్కవలెనని
ఆయన నామీద నియామక కూటముకూడను చాటించెను.
యెహోవా కన్యకయైన యూదా కుమారిని
ద్రాక్షగానుగలో వేసి త్రొక్కియున్నాడు.
16 వీటినిబట్టి నేను ఏడ్చుచున్నాను
నా కంట నీరు ఒలుకుచున్నది
నా ప్రాణము తెప్పరిల్లజేసి నన్ను ఓదార్చవలసిన వారు నాకు దూరస్థులైరి
శత్రువులు ప్రబలియున్నారు
నా పిల్లలు నాశనమైపోయిరి.
17 ఆదరించువాడు లేక సీయోను చేతులు చాపుచున్నది
యెహోవా యాకోబుకు చుట్టునున్నవారిని
విరోధులైయుండ నియమించియున్నాడు
యెరూషలేము వారికి హేయమైనదాయెను.
18 యెహోవా న్యాయస్థుడు
నేను ఆయన ఆజ్ఞకు తిరుగబాటు చేసితిని
సకల జనములారా, చిత్తగించి ఆలకించుడి
నా శ్రమ చూడుడి
నా కన్యకలును నా యౌవనస్థులును చెరలోకి పోయియున్నారు
19 నా విటకాండ్లను నేను పిలువనంపగా
వారు నన్ను మోసపుచ్చిరి
నా యాజకులును నా పెద్దలును ప్రాణసంరక్షణకై ఆహారము వెదకపోయి
పట్టణములో ప్రాణము విడిచినవారైరి.
20 యెహోవా, దృష్టించుము నాకు ఇబ్బంది కలిగెను
నా అంతరంగము క్షోభిల్లుచున్నది
నేను చేసిన గొప్ప ద్రోహమునుబట్టి
నా గుండె నాలోపల కొట్టుకొనుచున్నది
వీధులలో ఖడ్గము జననష్టము చేయుచున్నది
ఇండ్లలో నానా మరణకర వ్యాధులున్నవి.
21 నేను నిట్టూర్పు విడుచుట విని నన్నాదరించువాడొకడును లేడాయెను
నీవు నాకు ఆపద కలుగజేసితివన్న వార్త
నా విరోధులందరు విని సంతోషించుచున్నారు.
నీవు చాటించిన దినమును నీవు రప్పించుదువు
అప్పుడు వారు నన్ను పోలియుందురు.
వారు చేసిన దుష్కార్యములన్నియు నీ సన్నిధి 22
నుండును
నేను బహుగా నిట్టూర్పులు విడుచుచున్నాను
నా మనస్సు క్రుంగిపోయెను
నేను చేసిన అపరాధములన్నిటినిబట్టి
నీవు నాకు చేసినట్లు వారికి చేయుము.
ప్రభువు కోపపడి సీయోను కుమార్తెను మేఘ **2**
ముతో కప్పియున్నాడు
ఆయన ఇశ్రాయేలు సౌందర్యమును ఆకాశము నుండి భూమిమీదికి పడవేసెను
కోపదినమందు ఆయన తన పాదపీఠమును జ్ఞాపకము చేసికొనకపోయెను.
ఒకటియు విడువక ప్రభువు యాకోబు నివాస 2
స్థలములన్నిటిని నాశముచేసి యున్నాడు
మహోగ్రుడై యూదా కుమార్తె కోటలను పడగొట్టియున్నాడు వాటిని నేలకు కూల్చివేసియున్నాడు
ఆ రాజ్యమును దాని యధిపతులను ఆయన అపవిత్రపరచియున్నాడు.
కోపావేశుడై ఇశ్రాయేలీయులకున్న ప్రతి శృంగ 3
మును
ఆయన విరుగగొట్టియున్నాడు
శత్రువులుండగా తన కుడి చెయ్యి ఆయన వెనుకకు తీసియున్నాడు
నఖముఖాల దహించు అగ్నిజ్వాలలు కాల్చునట్లు
ఆయన యాకోబును కాల్చివేసి యున్నాడు.
శత్రువువలె ఆయన విల్లెక్కుపెట్టి విరోధివలె కుడి 4
చెయ్యి చాపియున్నాడు
కంటికి అందమైన వస్తువులనన్నిటిని నాశనముచేసియున్నాడు
అగ్ని కురియునట్లుగా ఆయన తన ఉగ్రతను
సీయోను కుమార్తె గుడారములమీద కుమ్మరించియున్నాడు.
ప్రభువు శత్రువాయెను 5
ఆయన ఇశ్రాయేలును నిర్మూలము చేసియున్నాడు
దాని నగరులన్నిటిని నాశనముచేసియున్నాడు
దాని కోటలను పాడుచేసియున్నాడు
యూదా కుమారికి అధిక దుఃఖప్రలాపములను
ఆయన కలుగజేసియున్నాడు.
ఒకడు తోటను కొట్టివేయునట్లు 6
తన ఆవరణమును ఆయన క్రూరముగా కొట్టివేసియున్నాడు
తన సమాజస్థలమును నాశనముచేసి యున్నాడు

యెహోవా సీయోనులో నియామక కాలము
విశ్రాంతిదినము
మరువబడునట్లు చేసియున్నాడు
కోపావేశుడై రాజును యాజకునిని త్రోసివేసి
యున్నాడు.
7 ప్రభువు తన బలిపీఠమును విడనాడెను
తన పరిశుద్ధస్థలమునందు అసహ్యించుకొనెను
దాని నగరుల ప్రాకారములను శత్రువులచేతికి
అప్పగించెను
వారు నియామక కాలమున జనులు చేయునట్లు
యెహోవా మందిరమందు ఉత్సాహధ్వని చేసిరి.
8 సీయోను కుమారియొక్క ప్రాకారములను పాడు
చేయుటకు యెహోవా ఉద్దేశించెను
నాశనముచేయుటకు తన చెయ్యి వెనుకతీయక
ఆయన కొలనూలు సాగలాగెను.
ప్రహరియు ప్రాకారమును దీనిగూర్చి మూల్గు
చున్నవి
అవి యేకరీతిగా క్షీణించుచున్నవి.
9 పట్టణపు గవునులు భూమిలోకి క్రుంగిపోయెను
దాని అడ్డగడలను ఆయన తుత్తునియలుగా కొట్టి
పాడుచేసెను
దాని రాజును అధికారులును అన్యజనులలోకి
పోయియున్నారు
అచ్చట వారికి ధర్మశాస్త్రము లేకపోయెను
యెహోవా ప్రత్యక్షత దాని ప్రవక్తలకు కలుగుట
లేదు.
10 సీయోను కుమారి పెద్దలు మౌనులై నేల కూర్చుం
దురు
తలలమీద బుగ్గి పోసికొందురు గోనెపట్ట కట్టు
కొందురు
యెరూషలేము కన్యకలు నేలమట్టుకు తలవంచు
కొందురు.
11 నా జనుల కుమారికి కలిగిన నాశనము చూడగా
నా కన్నులు కన్నీటిచేత క్షీణించుచున్నవి
నా యంతరంగము క్షోభిల్లుచున్నది
నా కాలేజము నేలమీద ఒలుకుచున్నది.
శిశువులును చంటిబిడ్డలును పట్టణపు వీధులలో
మూర్ఛిల్లెదరు.
12 గాయమొందినవారై పట్టణపు వీధులలో మూర్ఛి
ల్లుచు
తల్లుల రొమ్ము నానుకొని—అన్నము ద్రాక్షారసము
ఏదియని తమ తల్లుల నడుగుచు ప్రాణము
విడిచెదరు.
13 యెరూషలేము కుమారీ, ఎట్టిమాటలచేత నిన్ను
హెచ్చరించుదును?
దేనితో నిన్ను సాటిచేయుదును?
సీయోను కుమారీ, కన్యకా,
నిన్ను ఓదార్చుటకు దేనితో నిన్ను పో[illegible]
నీకు కలిగిన నాశనము సముద్రమంత గొ[illegible]
నిన్ను స్వస్థపరచగలవాడెవడు!
నీ ప్రవక్తలు నిరర్థకమైన వ్యర్థదర్శనములు [illegible]
యున్నారు
నీవు చెరలోకి పోకుండ తప్పించుటకై
వారు నీ దోషములను నీకు వెల్లడిచేయలే[illegible]
వారు వ్యర్థమైన ఉపదేశములు పొందినవా[illegible]
త్రోవతప్పించు దర్శనములు చూచినవారైరి.
త్రోవను వెళ్లువారందరు నిన్ను చూచి [illegible]
కొట్టెదరు
వారు యెరూషలేము కుమారిని చూచి
—పరిపూర్ణ సౌందర్యముగల పట్టణమని [illegible]
సర్వభూనివాసులకు ఆనందకరమైన నగరి[illegible]
జనులు ఈ పట్టణమును గూర్చియేనా: [illegible]!
అని యనుకొనుచు గేలిచేసి తల ఊచెదరు
నీ శత్రువులందరు నిన్ను చూచి నోరు తెర[illegible]
వారు ఎగతాళిచేసి పండ్లు కొరుకుచు
—దాని మ్రింగివేసియున్నాము
ఇదేగదా మనము కనిపెట్టినదినము
అది తటస్థించెను, దాని మనము చూచియున్నాము
అని యనుకొనెదరు.
యెహోవా తాను యోచించిన కార్యము [illegible]
యున్నాడు
పూర్వదినములలో తాను విధించినది ఆయన [illegible]
వేర్చియున్నాడు
శేషములేకుండ నిన్ను పాడుచేసియున్నా[illegible]
నిన్నుబట్టి శత్రువులు సంతోషించునట్లు [illegible]
యున్నాడు
నీ పగవారి శృంగమును హెచ్చించియున్నా[illegible]
జనులు హృదయపూర్వకముగా యెహోవా[illegible]
మొఱ్ఱపెట్టుదురు.
సీయోను కుమారి ప్రాకారమా,
నదీప్రవాహమువలె దివారాత్రము కన్నీరు [illegible]
నిమ్ము
విరామము కలుగనియ్యకుము
నీ కంటిపాపను విశ్రమింపనియ్యకుము.
నీవు లేచి రేయి మొదటి జామున మొఱ్ఱపెట్టు[illegible]
నీళ్లు కుమ్మరించునట్లు ప్రభువు సన్నిధిని నీ [illegible]
యమును కుమ్మరించుము
నీ పసిపిల్లల ప్రాణముకొరకు నీ చేతులను ఆ[illegible]
తట్టు ఎత్తుము
ప్రతి వీధి మొగను ఆకలిగొని వారు మూర్ఛిల్లు
చున్నారు.
నీవు ఎవనియెడల ఈ ప్రకారము చేసితివో

యెహోవా, దృష్టించి చూడుము.
మ గర్భఫలమును తాము ఎత్తికొని ఆడించిన పసి
పిల్లలను స్త్రీలు భక్షించుట తగునా?
యాజకుడును ప్రవక్తయు ప్రభువుయొక్క పరి
శుద్ధాలయమునందు హతులగుట తగునా?
యౌవనుడును వృద్ధుడును వీధులలో నేలను పడి
యున్నారు
ా కన్యకలును నా యౌవనులును ఖడ్గముచేత
కూలియున్నారు
ఉగ్రతదినమున నీవు వారిని హతముచేసితివి
యి తలచక వారినందరిని వధించితివి.
త్సవదినమున జనులు వచ్చునట్లుగా
లుదిశలనుండి నీవు నామీదికి భయోత్పాతము
లను రప్పించితివి.
యెహోవా ఉగ్రతదినమున ఎవడును తప్పించు
కొనలేకపోయెను
శేషమేమియు నిలువకపోయెను
నేను చేతులలో ఆడించి సాకినవారిని శత్రువులు
హరించివేసియున్నారు.
నేను ఆయన ఆగ్రహదండముచేత బాధ ననుభ
వించిన నరుడను.
యన కటిక చీకటిలోకి దారి తీసి
ానిలో నన్ను నడిపించుచున్నాడు.
ాటి మాటికి దినమెల్ల
యన నన్ను దెబ్బలు కొట్టుచున్నాడు
యన నా మాంసమును నా చర్మమును క్షీణింప
జేయుచున్నాడు.
ా యెముకలను విరుగగొట్టుచున్నాడు
ాకు అడ్డముగా కంచె వేసియున్నాడు
షమును మాచిపత్రిని నా చుట్టు మొలిపించి
యున్నాడు
ార్వకాలమున చనిపోయినవారు నివసించునట్లు
యన చీకటిగల స్థలములలో నన్ను నివసింపజేసి
యున్నాడు
యన నా చుట్టు కంచె వేసియున్నాడు
ను బయలువెళ్లకుండునట్లు బరువైన సంకెళ్లు
నాకు వేసియున్నాడు
ను బతిమాలి మొరలిడినను
ా ప్రార్థన వినబడకుండ తన చెవి మూసికొని
యున్నాడు.
యన నా మార్గములకు అడ్డముగా
క్కుడు రాళ్లు కట్టియున్నాడు
ను పోజాలకుండ నా త్రోవలను కట్టివేసి
యున్నాడు
ా ప్రాణమునకు ఆయన పొంచియున్న ఎలుగు
బంటివలె ఉన్నాడు

చాటైన చోటులలోనుండు సింహమువలె
ఉన్నాడు
నాకు త్రోవలేకుండచేసి నా యవయవములను విడ 11
దీసియున్నాడు
నాకు దిక్కులేకుండ చేసియున్నాడు
విల్లు ఎక్కుపెట్టి బాణమునకు గురిగా 12
ఆయన నన్ను నిలువబెట్టియున్నాడు
తన అంబులపొదిలోని బాణములన్నియు 13
ఆయన నా ఆంత్రములగుండ దూసిపోజేసెను.
నావారికందరికి నేను అపహాస్యాస్పదముగా 14
ఉన్నాను
దినమెల్ల వారు పాడునట్టి పాటలకు నేను ఆస్ప
దుడనైతిని.
చేదువస్తువులు ఆయన నాకు తినిపించెను 15
మాచిపత్రి ద్రావకముచేత నన్ను మత్తునిగాచేసెను
రాళ్లచేత నా పండ్లు ఊడగొట్టెను 16
బుగ్గిలో నన్ను పొర్లించెను.
నెమ్మదికిని నాకును ఆయన బహు దూరము చేసి 17
యున్నాడు
మేలు ఎట్టిదో నేను మరచియున్నాను.
నాకు బలము ఉడిగెను అనుకొంటిని 18
యెహోవాయందు నాకిక ఆశలు లేవనుకొంటిని.
నా శ్రమను నా దురవస్థను నేను త్రాగిన మాచి 19
పత్రిని చేదును జ్ఞాపకము చేసికొనుము.
ఎడతెగక నా ఆత్మ వాటిని జ్ఞాపకము చేసికొని 20
నాలో క్రుంగియున్నది
అది నీకింకను జ్ఞాపకమున్నది గదా.
నేను దీని జ్ఞాపకము చేసికొనగా 21
నాకు ఆశ పుట్టుచున్నది.
యెహోవా కృపగలవాడు 22
ఆయన వాత్సల్యత యెడతెగక నిలుచునది గనుక
మనము నిర్మూలము కాకున్నవారము.
అనుదినము నూతనముగా ఆయనకు వాత్సల్యత 23
పుట్టుచున్నది
నీవు ఎంతైన నమ్మదగినవాడవు.
యెహోవా నా భాగమని నేననుకొనుచున్నాను 24
ఆయనయందు నేను నమ్మిక యుంచుకొనుచు
న్నాను.
తన్ను ఆశ్రయించువారియెడల యెహోవా 25
దయాళుడు
తన్ను వెదకువారియెడల ఆయన దయచూపు
వాడు.
నరులు ఆశకలిగి యెహోవా అనుగ్రహించు 26
రక్షణకొరకు ఓపికతో కనిపెట్టుట మంచిది.
యౌవనకాలమున కాడి మోయుట నరునికి మేలు. 27
అతనిమీద దాని మోపినవాడు యెహోవాయే 28

గనుక అతడు ఒంటరిగా కూర్చుండి మౌనముగా
ఉండవలెను
29 నిరీక్షణాధారము కలుగునేమో యని
అతడు బూడిదెలో మూతి పెట్టుకొనవలెను.
30 అతడు తన్ను కొట్టువానితట్టు తన చెంపను త్రిప్ప
వలెను.
అతడు నిందతో నింపబడవలెను
31 ప్రభువు సార్వకాలము విడనాడడు.
32 ఆయన బాధపెట్టినను తన కృపాసమృద్ధినిబట్టి
జాలిపడును.
33 హృదయపూర్వకముగా ఆయన నరులకు విచా
రమునైనను బాధనైనను కలుగజేయడు.
34 దేశమునందు చెరపట్టబడినవారినందరిని కాళ్ల
క్రింద త్రొక్కుటయు
35 మహోన్నతుని సన్నిధిని నరులకు న్యాయము
తొలగించుటయు
36 ఒకనితో వ్యాజ్యమాడి వాని పాడుచేయుటయు
ప్రభువు మెచ్చుకార్యములు కావు.
37 ప్రభువు సెలవులేనిది మాట యిచ్చి నెరవేర్చగల
వాడెవడు?
38 మహోన్నతుడైన దేవుని నోటనుండి కీడును
మేలును బయలువెళ్లును గదా?
39 సజీవులేల మూల్గుదురు?
నరులు తమ పాపశిక్షనుబట్టి ఏల మూల్గుదురు?
40 మన మార్గములను పరిశోధించి తెలిసికొని
మనము యెహోవాతట్టు తిరుగుదము.
41 ఆకాశమందున్న దేవునితట్టు
మన హృదయమును మన చేతులను ఎత్తికొందము.
42 మేము తిరుగబాటు చేసినవారము ద్రోహులము
నీవు మమ్మును క్షమింపలేదు.
43 కోపము ధరించుకొనినవాడవై నీవు మమ్మును
తరుముచున్నావు
దయ తలచక మమ్మును చంపుచున్నావు.
44 మా ప్రార్థన నీయొద్ద చేరకుండ నీవు మేఘముచేత
నిన్ను కప్పుకొనియున్నావు.
45 జనముల మధ్య మమ్మును మష్టుగాను చెత్తగాను
పెట్టియున్నావు.
46 మా శత్రువులందరు మమ్మును చూచి యెగతాళి
చేసెదరు.
47 భయమును గుంటయు పాడును నాశనమును మాకు
తటస్థించినవి.
48 నా జనులకు కలిగిన నాశనమును నేను చూడగా
నా కన్నీరు ఏరులై పారుచున్నది.
యెహోవా దృష్టియుంచి ఆకాశమునుండి
చూచుపర్యంతము
నీరు ఎడతెగక కారుచుండును.

నా పట్టణపు కుమార్తెలనందరిని చూచుచు 51
నేను దుఃఖాక్రాంతుడనైతిని.
ఒకడు పక్షిని తరుమునట్లు శత్రువులు నిర్నిమిత్త 52
ముగా నన్ను వెనువెంట తరుముదురు.
వారు చెరసాలలో నా ప్రాణము తీసివేసిరి 53
నాపైన రాయి యుంచిరి
నీళ్లు నా తలమీదుగా పారెను 54
నాశనమైతినని నేననుకొంటిని.
యెహోవా, అగాధమైన బందీగృహములోనుండి 55
నేను నీ నామమునుబట్టి మొరలిడగా
నీవు నా శబ్దము ఆలకించితివి 56
సహాయముకొరకు నేను మొఱ్ఱపెట్టగా
చెవిని మూసికొనకుము.
నేను నీకు మొరలిడిన దినమున నీవు నాయొద్దకు 57
వచ్చితివి
—భయపడకుమి అని నీవు చెప్పితివి.
ప్రభువా, నీవు నా ప్రాణవిషయమైన వ్యాజ్య 58
ములను వాదించితివి
నా జీవమును విమోచించితివి.
యెహోవా, నాకు కలిగిన అన్యాయము నీవు 59
చూచియున్నావు నా వ్యాజ్యము తీర్చుము.
పగతీర్చుకొనవలెనని వారు నామీద చేయు ఆలో 60
చనలన్నియు నీవెరుగుదువు.
యెహోవా, వారి దూషణయు 61
వారు నామీద చేయు ఆలోచనలన్నియును
నామీదికి లేచినవారు పలుకు మాటలును 62
దినమెల్ల వారు నామీద చేయు ఆలోచనయు
నీవు వినియున్నావు.
వారు కూర్చుండుటను వారు లేచుటను నీవు కని 63
పెట్టుము
నేను వారి పాటలకు ఆస్పదమైతిని.
యెహోవా, వారి చేతిక్రియనుబట్టి నీవు వారికి 64
ప్రతికారము చేయుదువు.
వారికి హృదయకాఠిన్యము నిత్తువు 65
వారిని శపించుదువు.
నీవు కోపావేశుడవై వారిని తరిమి 66
యెహోవాయొక్క ఆకాశముక్రింద నుండకుండ
వారిని నశింపజేయుదువు.

4

బంగారము ఎట్లు మందగిలినది?
మేలిమి బంగారము ఎట్లు మార్చబడినది?
ప్రతి వీధి మొగను ప్రతిష్ఠితమైన రాళ్లు పారవేయ
బడియున్నవి.
మేలిమి బంగారముతో పోల్చదగిన సీయోను 2
ప్రియకుమారులు
ఎట్లు కుమ్మరిచేసిన మంటికుండలుగా ఎంచబడు
చున్నారు?

3 నక్కలైనను చన్నిచ్చి తమ పిల్లలకు పాలిచ్చును
నా జనుల కుమారి యెడారిలోని ఉష్ట్రపక్షులవలె
క్రూరురాలాయెను.
4 దప్పిచేత చంటిపిల్ల నాలుక వాని అంగిటికి అంటు
కొనును
పసిపిల్లలు అన్నమడుగుదురు ఎవడును వారికి
పెట్టడు.
5 సుకుమార భోజనము చేయువారు దిక్కులేక వీధు
లలో పడియున్నారు
రక్తవర్ణ వస్త్రములు తొడిగి పెంచబడినవారు పెంట
కుప్పలను కౌగలించుకొనెదరు.
6 నా జనుల కుమారి చేసిన దోషము
సొదొమ పాపముకంటె అధికము
ఎవరును దానిమీద చెయ్యి వేయకుండనే నిమిష
ములో ఆ పట్టణము పాడుచేయబడెను.
7 దాని ఘనులు హిమముకన్న శుద్ధమైనవారు
వారు పాలకంటె తెల్లనివారు
వారి శరీరములు పగడములకంటె ఎఱ్ఱనివి
వారి దేహకాంతి నీలమువంటిది.
8 అట్టివారి ఆకారము బొగ్గుకంటె నలుపాయెను
వారిని వీధులలో చూచువారు వారిని గురుతు
పట్టజాలరు
వారి చర్మము వారి యెముకలకు అంటుకొని
యున్నది
అది యెండి కఱ్ఱవంటిదాయెను.
9 క్షామహతులు భూఫలములు లేక పొడువబడి
క్షీణించిపోయెదరు
ఖడ్గహతులు క్షామహతులకన్న భాగ్యవంతులు.
10 వాత్సల్యముగల స్త్రీల చేతులు తాము కనిన పిల్లలను
వండుకొనెను
నా జనుల కుమారికి వచ్చిన నాశనములో వారి
బిడ్డలు వారికి ఆహారమైరి.
11 యెహోవా తన ఉగ్రతను నెరవేర్చి
తన కోపాగ్నిని కుమ్మరించెను
సీయోనులో ఆయన అగ్ని రాజబెట్టెను
అది దాని పునాదులను కాల్చివేసెను.
12 బాధించువాడుగాని విరోధిగాని
యెరూషలేము గవునులలోనికి వచ్చునని
భూరాజులకైనను లోకనివాసులందరిలో మరి ఎవరి
కైనను తోచియుండలేదు.
13 దానిలో నీతిమంతుల రక్తమును ఓడ్చిన దాని
ప్రవక్తల పాపములనుబట్టియు
దాని యాజకుల దోషమునుబట్టియు
14 జనులు వీధులలో అంధులవలె తిరుగులాడెదరు
వారు రక్తము అంటిన అపవిత్రులు
ఎవరును వారి వస్త్రములను ముట్టకూడదు.

—పొమ్ము అపవిత్రుడా, పొమ్ము పొమ్ము ముట్టవద్దని 15
జనులు వారితో ననిరి.
వారు పారిపోయి తిరుగులాడుచుండగా అన్య
జనులైనవారు
—ఇకను వారిక్కడ కాపురముండకూడదని చెప్పు
కొనిరి
యెహోవా సన్నిధి వారిని చెదరగొట్టెను 16
ఆయన ఇకమీదట వారిని లక్ష్యపెట్టడు
యాజకులయెడల జనులు గౌరవము చూపక
పోయిరి
పెద్దలమీద దయ చూపకపోయిరి.
వ్యర్థసహాయముకొరకు మేము కనిపెట్టుచుండగా 17
మా కన్నులు క్షీణించుచున్నవి
మేము కనిపెట్టుచు రక్షింపలేని జనముకొరకు
ఎదురుచూచుచుంటిమి.
రాజవీధులలో మేము నడువకుండునట్లు విరోధులు 18
మా జాడలనుబట్టి వెంటాడుదురు
మా అంత్యదశ సమీపమాయెను
మా దినములు తీరిపోయినవి మా అంత్యదశ వచ్చే
యున్నది.
మమ్మును తరుమువారు ఆకాశమున ఎగురు పక్షి 19
రాజులకన్న వడిగలవారు
పర్వతములమీద వారు మమ్మును తరుముదురు
అరణ్యమందు మాకొరకు పొంచియుందురు.
మాకు నాసికారంధ్రముల ఊపిరివంటివాడు 20
యెహోవాచేత అభిషేకము నొందినవాడు
వారు త్రవ్విన గుంటలలో పట్టబడెను.
—అతని నీడక్రిందను అన్యజనుల మధ్యను బ్రది 21
కెదమని
మేమనుకొన్నవాడు పట్టబడెను.
ఊజు దేశములో నివసించు ఎదోము కుమారీ,
సంతోషించుము ఉత్సహించుము
ఈ గిన్నెలోనిది త్రాగుట నీ పాలవును
నీవు దానిలోనిది త్రాగి మత్తిల్లి నిన్ను దిగంబరినిగా
చేసికొందువు.
సీయోను కుమారీ, నీ దోషశిక్ష సమాప్తమాయెను 22
ఇకమీదట ఆయన మరెన్నడును నిన్ను చెరలోనికి
కొనిపోడు
ఎదోము కుమారీ, నీ దోషమునకు ఆయన శిక్ష
విధించును
నీ పాపములను ఆయన వెల్లడిపరచును.
యెహోవా, మాకు కలిగిన శ్రమ జ్ఞాపకము 5
చేసికొనుము
దృష్టించి మామీది!
చూడుము.

2 మా స్వాస్థ్యము పరదేశుల వశమాయెను.
మా యిండ్లు అన్యుల స్వాధీనమాయెను.
3 మేము దిక్కులేనివారము తండ్రిలేనివారము
మా తల్లులు విధవరాండ్రైయిరి.
4 ద్రవ్యమిచ్చి నీళ్లు త్రాగితిమి
క్రయమునకు కట్టెలు తెచ్చుకొంటిమి.
5 మమ్ము తరుమువారు మా మెడలమీదికి ఎక్కి యున్నారు
మేము అలసట చెందియున్నాము, విశ్రాంతి యనునది మాకు లేదు.
6 పొట్టకూటికై ఐగుప్తీయులకును అష్షూరీయులకును లోబడియున్నాము.
7 మా తండ్రులు పాపముచేసి గతించిపోయిరి
మేము వారి దోషశిక్షను అనుభవించుచున్నాము.
8 దాసులు మాకు ప్రభువులైరి
వారి వశమునుండి మమ్ము విడిపింపగలవాడెవ డును లేడు.
9 ఎడారిజనుల ఖడ్గభయమువలన ప్రాణమునకు తెగించి మా ధాన్యము తెచ్చుకొనుచున్నాము.
10 మహా క్షామమువలన మా చర్మము పొయ్యివలె నలుపెక్కెను.
11 శత్రువులు సీయోనులో స్త్రీలను చెరిపిరి
యూదాపట్టణములలో కన్యకలను చెరిపిరి.
చేతులు కట్టి అధిపతులను ఉరితీసిరి 12
వారేమాత్రమును పెద్దలను ఘనపరచలేదు.
యౌవనస్థులు తిరుగటిరాయి మోసిరి 13
బాలురు కట్టెలమోపు మోయజాలక తడబడిరి.
పెద్దలు గుమ్మములయొద్ద కూడుట మానిరి 14
యౌవనస్థులు సంగీతము మానిరి.
సంతోషము మా హృదయమును విడిచిపోయెను 15
నాట్యము దుఃఖముగా మార్చబడియున్నది
మా తలమీదనుండి కిరీటము పడిపోయెను 16
మేము పాపము చేసియున్నాము, మాకు శ్రమ.
దీనివలన మాకు ధైర్యము చెడియున్నది. 17
సీయోను పర్వతము పాడైనది
నక్కలు దానిమీద తిరుగులాడుచున్నవి 18
మా కన్నులు దీని చూచి మంచిగిలెను.
యెహోవా, నీవు నిత్యము ఆసీనుడవై యుందువు 19
నీ సింహాసనము తరతరములుండును.
నీవు మమ్ము నెల్లప్పుడును మరచిపోవుట ఏల? 20
మమ్ము నింతకాలము విడిచిపెట్టుట ఏల?
యెహోవా, నీవు మమ్మును నీతట్టు త్రిప్పినయెడల 21
మేము తిరిగెదము.
నీవు మమ్మును బొత్తిగా విసర్జించి యున్నావు 22
నీ మహాగ్రత మామీద వచ్చినది
మా పూర్వస్థితి మరల మాకు కలుగజేయుము.

# యెహెజ్కేలు

ప్పదియవ సంవత్సరము నాలుగవ నెల అయి
వమున నేను కెబారు నదీప్రదేశమున చెరలోని
సధ్య కాపురముంటిని; ఆ కాలమున ఆకాశము
డగా దేవునిగూర్చిన దర్శనములు నాకు కలి
యెహోయాకీను చెరపట్టబడిన అయిదవ
రము ఆ నెలలో అయిదవ దినమున కల్దీయుల
దున్న కెబారు నదీప్రదేశమున యెహోవా
బూజీ కుమారుడును యాజకుడునగు యెహె
స ప్రత్యక్షము కాగా అక్కడనే యెహోవా
అతనిమీదికి వచ్చెను. । నేను చూడగా ఉత్తర
నుండి తుఫాను వచ్చుచుండెను; మరియు గొప్ప
ఘను గోళమువలె గుండ్రముగా ఉన్న అగ్నియు
ను, కాంతి దానిచుట్టు ఆవరించియుండెను;
గ్నిలోనుండి కరగబడినదై ప్రజ్వలించుచున్న
ంచువంటిదొకటి కనబడెను. । దానిలోనుండి
జంతువుల రూపములుగల యొకటి కనబ
నాటి రూపము మానవస్వరూపమువంటిది. ।
క్కదానికి నాలుగు ముఖములును నాలుగే
లను గలవు. । వాటి కాళ్లు చక్కగా నిలువబడి
ాటి అరకాళ్లు పెయ్యకాళ్లవలె ఉండెను, అవి
ాడు అపరంజివలె ఉండెను. । వాటి నాలుగు
ల రెక్కల క్రింద మానవహస్తములవంటి హస్తము
ు, నాలుగింటికిని ముఖములును రెక్కలును
ు. । వాటి రెక్కలు ఒకదానినొకటి కలిసి
, ఏ వైపుకైనను తిరుగక అవన్నియు చక్కగా
కి పోవుచుండెను. । ఆ నాలుగింటి యెదుటి
ూపములు మానవముఖమువంటివి, కుడిపా
రూపములు సింహముఖమువంటివి. యెడమపా
ముఖములు ఎద్దుముఖమువంటివి, నాలుగింటికి
జు ముఖమువంటి ముఖములు కలవు. । వాటి
ములును రెక్కలును వేరువేరుగా ఉండెను,
క జీవి రెక్కలలో ఒక రెక్క రెండవ జతలో
దితో కలిసియుండెను; ఒక్కొక జత రెక్కలు
దేహములను కప్పెను. । అవన్నియు చక్కగా
కి పోవుచుండెను, అవి వెనుకకు తిరుగక ఆత్మ
ైపుకు పోవుచుండునో ఆ వైపుకే పోవుచుం
। ఆ జీవజంతువుల రూపములు మండుచున్న
తోను దివిటీలతోను సమానములు; ఆ అగ్ని
వులమధ్యను ఇటు అటు వ్యాపించెను, ఆ అగ్ని
ంతిగా ఉండెను, అగ్నిలోనుండి మెరుపు

బయలుదేరుచుండెను. । మెరుపుతీగెలు వంకరలుగా కన 14
బడు రీతిగా జంతువులు ఇటు అటు తిరుగుచుండెను. ।
ఈ జంతువులను నేను చూచుచుండగా నేలమీద ఆ 15
నాలుగింటియెదుట ముఖముల ప్రక్కను చక్రము
వంటిదొకటి కనబడెను. । ఆ చక్రములయొక్క రూప 16
మును పనియు రక్తవర్ణపు రాతివలె నుండెను, ఆ నాలు
గును ఒక్క విధముగానే యుండెను, వాటి రూప
మును పనియు చూడగా చక్రములో చక్రమున్న
ట్టుగా ఉండెను. । అవి జరుగునప్పుడు నాలుగు ప్రక్క 17
లకు జరుగుచుండెను, వెనుకకు తిరుగకయే జరుగు
చుండెను. । వాటి కైవారములు మిక్కిలి యెత్తుగలవై 18
భయంకరముగా ఉండెను, ఆ నాలుగు కైవారములు
చుట్టు కండ్లతో నిండియుండెను. । ఆ జంతువులు కద 19
లగా ఆ చక్రములును వాటిప్రక్కను జరిగెను, అవి
నేలనుండి లేచినప్పుడు చక్రములుకూడ లేచెను. ।
ఆత్మ యెక్కడికి పోవునో అక్కడికే, అది పోవలసిన 20
వైపుకే అవియు పోవుచుండెను; జంతువునకున్న ఆత్మ
చక్రములకును ఉండెను గనుక అవి లేవగానే చక్రము
లును లేచుచుండెను. । జంతువునకున్న ఆత్మ చక్రముల 21
కును ఉండెను గనుక జంతువులు జరుగగా చక్రములును
జరుగుచుండెను, అవి నిలువగా ఇవియు నిలిచెను, అవి
నేలనుండి లేవగా ఇవియు వాటితోకూడ లేచెను. ।
మరియు జంతువుల తలలపైన ఆకాశమండలమువంటి 22
విశాలతయున్నట్టుండెను. అది తళతళలాడు స్ఫటిక
ముతో సమానమై వాటి తలలకు పైగా వ్యాపించి
యుండెను. । ఆ మండలమువంటి దాని క్రింది జంతు 23
వుల రెక్కలలో రెండేసి యొకదాని ప్రక్క ఒకటి
పైకి చాపబడియుండెను, రెండేసి వాటి దేహములు
కప్పుచుండెను, ఈ తట్టుననున్న జంతువులకును ఆ
తట్టుననున్న జంతువులకును, అనగా ప్రతిజంతువున
కును ఆలాగున రెక్కలుండెను. । అవి జరుగగా నేను 24
వాటి రెక్కల చప్పుడు వింటిని; అది విస్తారమైన
ఉదకముల ఘోషవలెను సర్వశక్తుడగు దేవుని స్వరము
వలెను దండువారు చేయు ధ్వనివలెను ఉండెను, అవి
నిలుచునప్పుడెల్ల తమ రెక్కలను వాల్చుకొనుచుండెను. ।
అవి నిలిచి రెక్కలను వాల్చునప్పుడెల్ల వాటి తలలకు 25
పైగానున్న ఆ మండలమువంటి దానిలోనుండి శబ్దము
పుట్టెను. । వాటి తలలపైనున్న ఆ మండలముపైన 26
నీలకాంతమయమైన సింహాసనమువంటి దొకటి కన
బడెను; మరియు ఆ సింహాసనమువంటి దానిమీద

27 నరస్వరూపియగు ఒకడు ఆసీనుడై యుండెను. । చుట్టు
దాని లోపట కరుగుచున్న అపరంజియు అగ్నియు
నున్నట్టు నాకు కనబడెను. నడుము మొదలుకొని
మీదికిని నడుము మొదలుకొని దిగువకును ఆయన
అగ్నిస్వరూపముగా నాకు కనబడెను, చుట్టును తేజో
28 మయముగా కనబడెను. । వర్షకాలమున కనబడు ఇంద్ర
ధనుస్సుయొక్క తేజస్సువలె దాని చుట్టునున్న తేజస్సు
కనబడెను. ఇది యెహోవా ప్రభావస్వరూప దర్శ
నము. నేను చూచి సాగిలపడగా నాతో మాట
లాడు ఒకని స్వరము నాకు వినబడెను. ఏమనగా

2 నరపుత్రుడా, నీవు చక్కగా నిలువబడుము నేను
2 నీతో మాటలాడవలెను. । ఆయన నాతో మాటలాడి
నప్పుడు ఆత్మ నాలోకి వచ్చి నన్ను నిలువబెట్టెను;
అప్పుడు నాతో మాటలాడినవాని స్వరము వింటిని. ।
3 ఆయన నాతో ఇట్లనెను — నరపుత్రుడా, నామీద
తిరుగబాటుచేసిన జనులయొద్దకు ఇశ్రాయేలీయుల
యొద్దకు నిన్ను పంపుచున్నాను; వారును వారి పితరు
లును నేటివరకును నామీద తిరుగబాటు చేసిన
4 వారు. । వారు సిగ్గుమాలినవారును కఠినహృదయులునై
యున్నారు, వారియొద్దకు నేను నిన్ను పంపుచున్నాను,
వారు తిరుగబాటు చేయువారు గనుక వారు వినినను
వినకపోయినను తమ మధ్య ప్రవక్త యున్నాడని
వారు తెలిసికొనునట్లు — ప్రభువగు యెహోవా
ఈలాగు సెలవిచ్చుచున్నాడని నీవు వారికి ప్రకటింప
5 వలెను. । నరపుత్రుడా, నీవు బ్రహ్మదండి చెట్లలోను
6 ముండ్లతుప్పలలోను తిరుగుచున్నావు, తేళ్ల మధ్య నివ
సించుచున్నావు; అయినను ఆ జనులకు భయపడకుము,
వారి మాటలకును భయపడకుము; వారు తిరుగబాటు
7 చేయువారు వారికి భయపడకుము. । వారు తిరుగ
బాటు చేయువారు గనుక వారు వినినను వినకపోయి
నను నేను సెలవిచ్చిన మాటను నీవు వారికి తెలియ
8 జేయుము. । నరపుత్రుడా, వారు తిరుగబాటు చేసి
నట్లు నీవు చేయక నేను నీతో చెప్పు మాటను విని
9 నోరు తెరచి నేనిచ్చుదాని భుజించుము. । నేను
చూచుచుండగా గ్రంథమును పట్టుకొనిన యొక చెయ్యి
10 నా యొద్దకు చాపబడెను. । ఆయన దాని నాముందర
విప్పగా అది లోపటను వెలపటను వ్రాయబడినదై
యుండెను; మహా విలాపమును మనోదుఃఖమును రోదన
మును కలుగునని అందులో వ్రాయబడియుండెను.

3 మరియు ఆయన నాతో ఈలాగు సెలవిచ్చెను—
నరపుత్రుడా, నీకు కనబడినదాని భక్షించుము, ఈ
గ్రంథమును భక్షించి ఇశ్రాయేలీయులయొద్దకు పోయి
2 వారికి ప్రకటన చేయుము. । నేను నోరు తెరువగా
3 ఆయన ఆ గ్రంథము నాకు తినిపించి । — నరపు
త్రుడా, నేనిచ్చుచున్న యీ గ్రంథమును ఆహార
ముగా తీసికొని దానితో నీ కడుపు నింపుకొనుమని
నాతో సెలవియ్యగా నేను దాని భక్షించితిని; అది
నా నోటికి తేనెవలె మధురముగా నుండెను.

మరియు ఆయన నాతో ఈలాగు సెలవిచ్చెను— 4
నరపుత్రుడా, నీవు బయలుదేరి ఇశ్రాయేలీయుల
యొద్దకు పోయి నా మాటలు వారికి తెలియజెప్పుము. ।
నీవు గ్రహింపలేని ఏసమాటలు పలుకు జనులయొద్దకు 5
కాదు ఇశ్రాయేలీయులయొద్దకే నిన్ను పంపుచున్నా
ను. । నీవు గ్రహింపలేని ఏసమాటలు పలుకు అన్య 6
జనులయొద్దకు నిన్ను పంపుటలేదు, అట్టివారియొద్దకు
నేను నిన్ను పంపినయెడల వారు నీ మాటలు విందురు. ।
అయితే ఇశ్రాయేలీయులందరు సిగ్గుమాలినవారును 7
కఠినహృదయులునై, నేను చెప్పిన మాటల నాలకింప
నొల్లక యున్నారు గనుక నీ మాటలు విననొల్లరు. ।
ఇదిగో వారి ముఖమువలెనే నీ ముఖమును కఠినమై 8
నదిగా నేను చేసెదను, వారి నుదురువలెనే నీ నుదు
రును కఠినమైనదిగా చేసెదను. । నీ నుదురు చెకుముకి 9
రాతికంటె కఠినముగా ఉండు కురువిందమువలె చేసె
దను; వారికి భయపడకుము, వారందరును తిరుగబాటు
చేయువారైనను వారిని చూచి జడియకుము. । మరియు 10
నరపుత్రుడా, చెవియొగ్గి నేను నీతో చెప్పు మాట
లన్నిటిని చెవులార విని నీ మనస్సులో ఉంచుకొని ।
బయలుదేరి చెరలోనున్న నీ జనులయొద్దకు పోయి 11
యీ మాటలు ప్రకటింపుము, వారు వినినను వినక
పోయినను ప్రభువైన యెహోవా ఈలాగు సెలవిచ్చు
చున్నాడని చెప్పుమని ఆయన నాతో సెలవిచ్చెను.

అంతలో ఆత్మ నన్నెత్తుకొనిపోగా—యెహోవా 12
ప్రభావమునకు స్తోత్రము కలుగునుగాక అను శబ్ద
మొకటి ఆర్భాటముతో ఆయనయున్న స్థలమునుండి
నా వెనుక పలుకుట నేను వింటిని. । మరియు ఆ 13
జంతువుల రెక్కలు ఒకదానికొకటి తగులుటవలన
కలుగు చప్పుడును వాటి ప్రక్కనున్న చక్రముల
ధ్వనియు గొప్ప సందడి జరుగుచున్నట్లుగా నాకు
వినబడెను. । ఆత్మ నన్నెత్తి తోడుకొనిపోగా నా 14
మనస్సుకు కలిగిన రౌద్రాగ్నిచేత బహుగా వ్యాకుల
పడుచు కొట్టుకొనిపోయినప్పుడు, యెహోవా
హస్తము నామీద బలముగా వచ్చెను. । నేను కెబారు 15
నదిదగ్గర తేలాబీబు అను స్థలమందు కాపురముండు
చెరపట్టబడినవారియొద్దకు వచ్చి, వారు కూర్చున్న
స్థలమందు కూర్చుని, యేమియు చెప్పకయు కదల
కయు నున్నవాడనై యేడు దినములు వారి మధ్య
నుంటిని.

ఆ యేడు దినములు జరిగిన తరువాత యెహోవా 16
వాక్కు నాకు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను ।
—నరపుత్రుడా, ఇశ్రాయేలీయులకు కావలిగా నేను 17
నిన్ను నియమించియున్నాను, కాబట్టి నీవు నా నోటి
మాట ఆలకించి నేను చెప్పినదానినిబట్టి వారిని హెచ్చ

యుము. । అవశ్యముగా నీవు మరణమవుదువని
దుర్మార్గునిగూర్చి ఆజ్ఞ ఇయ్యగా నీవు అతనిని
రిక చేయకయు, అతడు జీవించునట్లు తన
ర్తను విడిచిపెట్టవలెనని వానిని హెచ్చరిక
యు నుండిన పక్షమున, ఆ దుర్మార్గుడు తాను
దోషమునుబట్టి మరణమవును గాని అతని ప్రాణ
నిన్ను ఉత్తరవాదిగా ఎంచుదును. । అయితే
ర్మార్గుని హెచ్చరికచేయగా అతడు తన దుర్మార్గ
దుష్క్రియలను విడువకయుండిన పక్షమున
తన దోషమునుబట్టి మరణమవును గాని నీవు
షివై) తప్పించుకొందువు. । మరియు నీతిగల
తన నీతిని విడిచి దుర్నీతిని అనుసరించినందున
మరణమగునట్లు నేను అతనిముందర అభ్యంత
పెట్టగా నీవు అతనిని హెచ్చరికచేయని పక్ష
పూర్వము తాను చేసిన నీతి జ్ఞాపకమునకు
అతడు తన దోషమునుబట్టి మరణమవును,
అతని ప్రాణవిషయములో నిన్ను ఉత్తరవా
ఎంచుదును. । అయితే—పాపము చేయవలదని
వానిని నీవు హెచ్చరికచేయగా అతడు హెచ్చ
పాపముచేయక మానినపక్షమున అతడు
ముగా బ్రదుకును, నీమట్టుకు నీవును (నిర్దోషివై)
ంచుకొందువు.
్కడ యెహోవా హస్తము నామీదికి వచ్చి,—
చి మైదానపు భూమికి వెళ్లుము, అక్కడ నేను
మాటలాడుదునని ఆయన నాకు సెలవిచ్చెను. ।
లేచి మైదానపు భూమికి వెళ్లగా, కెబారు నది
యెహోవా ప్రభావము నాకు ప్రత్యక్షమై
ఆయన ప్రభావము నిలువబడి నాకు ప్రత్యక్ష
ను. । నేను నేలను సాగిలపడగా ఆత్మ నాలో
చి నన్ను చక్కగా నిలువబెట్టిన తరువాత
హోవా నాతో మాటలాడి ఈలాగు సెలవిచ్చెను
పుత్రుడా, వారు నీమీద పాశములు వేసి
నిన్ను బంధింపబోవుదురు గనుక వారియొద్దకు
యింటికిపోయి దాగియుండుము. । వారు
తిరుగబాటు చేయువారు గనుక నీవు మూనివై
గద్దింపక యుండునట్లు నేను నీ నాలుక నీ అంగి
ంటుకొన జేసెదను. । అయితే నేను నీతో మాట
నోరు తెరచెదను, వారు తిరుగబాటు చేయు
గనుక నీవు వారియొద్దకు పోయి — వినువాడు
గాక విననొల్లనివాడు విననొల్లకయుండును గాక
ప్రభువగు యెహోవా సెలవిచ్చుచున్నాడని
చెప్పవలెను.
రపుత్రుడా, పెంకు ఒకటి తీసికొనివచ్చి నీ
ఉంచుకొని యెరూషలేముపట్టణపు రూపము
ద చిత్తరువు వ్రాయుము. । మరియు అది
వేయబడినట్లును దానియెదుట బురుజులను కట్టి

నట్లును దిబ్బ వేసినట్లును దాని చుట్టునున్న ప్రాకా
రములను కూలగొట్టు యంత్రములున్నట్లును నీవు
వ్రాయుము. । మరియు ఇనుపరేకొకటి తెచ్చి, నీకును 3
పట్టణమునకును మధ్య ఇనుపగోడగా దాని నిలువబెట్టి,
నీ ముఖదృష్టిని పట్టణముమీద ఉంచుకొనినయెడల
పట్టణము ముట్టడివేయబడినట్లుగా ఉండును, నీవు
దానిని ముట్టడివేయువాడవుగా ఉందువు; అది ఇశ్రా
యేలీయులకు సూచనగా ఉండును.

మరియు నీ యెడమప్రక్కను పండుకొనియుండి 4
ఇశ్రాయేలువారి దోషమును దానిమీద మోపవలెను;
ఎన్ని దినములు నీవు ఆ తట్టు పండుకొందువో అన్ని
దినములు నీవు వారి దోషమును భరింతువు. । ఇశ్రా 5
యేలువారి దోషమును నీవు భరించునట్లుగా వారు
దోషముచేసిన సంవత్సరముల లెక్కచొప్పున నీకు
మున్నూటతొంబది దినములు నిర్ణయించి యున్నాను. ।
ఆ దినములు గడచిన తరువాత కుడిప్రక్కను పండు 6
కొనియుండి నలువది దినములు యూదావారి దోష
మును భరింపవలెను, సంవత్సరమొకటింటికి ఒక దినము
చొప్పున నేను నిర్ణయించి యున్నాను. । ఈలాగు 7
నీవుండగా యెరూషలేము ముట్టడివేయబడినట్లు తేరి
చూచుచు, చొక్కాయిని తీసివేసిన బాహువు చాపి
దానినిగూర్చి ప్రకటింపవలెను. । పట్టణము ముట్టడి 8
వేయబడినట్లుండు దినములు నీవు రెండవ ప్రక్కను
తిరుగక అదేపాటున ఉండునట్లు నిన్ను కట్లతో బం
ధింతును. । మరియు నీవు గోధుమలును యవలును 9
కాయధాన్యములును చోళ్లును సజ్జలును తెల్ల జిలకరను
తెచ్చుకొని, యొక పాత్రలో ఉంచి, నీవు ఆ ప్రక్క
మీద పండుకొను దినముల లెక్కచొప్పున రొట్టెలు
కాల్చుకొనవలెను, మున్నూట తొంబది దినములు
నీవు ఈలాగున భోజనముచేయుచు రావలెను; । నీవు 10
తూనికెప్రకారము, అనగా దినమొకటింటికి ఇరువది
తులముల యెత్తుచొప్పున భుజింపవలెను, వేళవేళకు
తినవలెను, । నీళ్లు కొలప్రకారము అరపడిచొప్పున 11
ప్రతిదినము త్రాగవలెను, వేళవేళకు త్రాగవలెను; ।
యవల అప్పములు చేసి వారు చూచుచుండగా దానిని 12
మనుష్య మలముతో కాల్చి భుజింపవలెను; । నేను 13
వారిని తోలివేయు జనములలో ఇశ్రాయేలీయులు
ఈ ప్రకారము అపవిత్రమైన ఆహారమును భుజింతు
రని యెహోవా నాకు సెలవిచ్చెను. । అందుకు — 14
అయ్యో, ప్రభువా, యెహోవా, నేనెన్నడును అప
విత్రత నొందినవాడను కానే, బాల్యమునుండి నేటి
వరకును చచ్చినదానినైనను మృగములు చీల్చినదాని
నైనను నేను తినినవాడను కానే, నిషిద్ధమైన మాం
సము నా నోట ఎన్నడును పడలేదే అని నేననగా ।
ఆయన—చూడుము, మనుష్య మలమునకు మారుగా 15
నీకు గోమలము నేను నిర్ణయించి యున్నాను; దీనితో

నీవు నీ భోజనము సిద్ధపరచుకొనుమని సెలవిచ్చి । —
16 నరపుత్రుడా, ఇదిగో యెరూషలేములో రొట్టెయను
ఆధారమును నేను లేకుండచేసినందున వారు తూనికె
ప్రకారముగా బహు చింతతో రొట్టె భుజింతురు,
నీళ్లు కొలచొప్పున త్రాగుచు విస్మయమొందుదురు. ।
17 అన్నపానములు లేకపోయినందున వారు శ్రమనొంది
విభ్రాంతిపడి యొకనినొకడు చూచుచు తాము
కలుగజేసికొనిన దోషమువలన నశించిపోవుదురు.

5 మరియు నరపుత్రుడా, నీవు మంగలకత్తివంటి
వాడిగల కత్తియొకటి తీసికొని నీ తలను గడ్డమును
క్షౌరముచేసికొని, త్రాసు తీసికొని ఆ వెండ్రుకలను
2 తూచి భాగములు చేయుము. । పట్టణమును ముట్టడి
వేసిన దినములు సంపూర్ణమైనప్పుడు నీవు పట్టణములో
వాటి మూడవ భాగమును కాల్చి, రెండవ భాగమును
తీసి ఖడ్గముచేత హతముచేయు రీతిగా దానిని చుట్టు
విసిరికొట్టి మిగిలిన భాగము గాలికి ఎగిరిపోనిమ్ము;
3 నేను ఖడ్గముదూసి వాటిని తరుముదును. । అయితే
వాటిలో కొన్నిటిని తీసికొని నీ చెంగున కట్టుకొనుము;।
4 పిమ్మట వాటిలో కొన్నిటిని మరల తీసి అగ్నిలోవేసి
కాల్చుము; దానినుండి అగ్ని బయలుదేరి ఇశ్రాయేలు
వారినందరిని తగలబెట్టును.
5 మరియు ప్రభువైన యెహోవా ఈలాగు సెల
విచ్చెను—ఇది యెరూషలేమే గదా, అన్యజనులమధ్య
నేను దాని నుంచితిని, దానిచుట్టు రాజ్యములున్నవి. ।
6 అయితే వారు నా విధులను తృణీకరించి, నా కట్టడల
ననుసరింపక దుర్మార్గత ననుసరించుచు, నా విధులను
కట్టడలను త్రోసివేసి తమ చుట్టునున్న అన్యజనుల
కంటెను దేశస్థులకంటెను మరి యధికముగా దుర్మార్గు
7 లైరి । కాబట్టి ప్రభువైన యెహోవా ఈలాగు సెల
విచ్చుచున్నాడు— నా కట్టడల ననుసరింపకయు నా
విధులను గైకొనకయు నుండువారై, మీ చుట్టునున్న
అన్యజనులకు కలిగియున్న విధులనైనను అనుసరింపక,
మీరు మీ చుట్టునున్న దేశస్థులకంటె మరి యధిక
8 ముగా కఠినహృదయులైతిరి. । కావున ప్రభువైన
యెహోవానగు నేను నీకు విరోధినైతిని, అన్య
9 జనులు చూచుచుండగా నీకు శిక్ష విధింతును. । నీ
హేయకృత్యములనుబట్టి పూర్వమందు నేను చేయని
కార్యమును, ఇకమీదట నేను చేయబూనుకొనని
10 కార్యమును నీ మధ్య జరిగింతును । కావున నీ మధ్య
తండ్రులు తమ కుమారులను భక్షింతురు, కుమారులు
తమ తండ్రులను భక్షింతురు, ఈ ప్రకారము నేను
నీకు శిక్ష విధించి నీలో శేషించినవారిని నలుదిశల
11 చెదరగొట్టుదును. । నీ హేయదేవతలన్నిటిని పూజించి
నీవు చేసిన హేయమైన క్రియలన్నిటిచేత నా పరి
శుద్ధస్థలమును అపవిత్రపరచితివి గనుక కరుణాదృష్టి
యైనను జాలియైనను లేక నేను నిన్ను క్షీణింపజేసెద
నని నా జీవముతోడు ప్రమాణము చేయుచున్నాను;
ఇదే ప్రభువగు యెహోవా వాక్కు. । కరవు వచ్చి 12
యుండగా నీలో మూడవ భాగము తెగులుచేత మరణ
మవును, మూడవ భాగము ఖడ్గముచేత నీ చుట్టు
కూలును, నేను కత్తి దూసి మిగిలిన భాగమును నలు
దిశల చెదరగొట్టి తరుముదును. । నా కోపము తీరును, 13
వారిమీద నా ఉగ్రత తీర్చుకొని నన్ను ఓదార్చు
కొందును, నేను వారిమీద నా ఉగ్రత తీర్చుకొను
కాలమున యెహోవానైన నేను ఆసక్తిగలవాడనై
ఆలాగు సెలవిచ్చితినని వారు తెలిసికొందురు ।
ఆలాగు నీ చుట్టునున్న అన్యజనులలో నిన్ను చూచు 14
వారందరి దృష్టికి పాడుగాను నిందాస్పదముగాను
నేను నిన్ను చేయుదును. । కావున నీ పోషణాధారము 15
తీసివేసి, నీమీదికి నేను మహా క్షామము రప్పించి,
నీవారు క్షయమగునట్లుగా వారిని క్షయపరచుచు మహా
క్షామమును పంపించి, కోపముచేతను క్రోధముచేతను
కఠినమైన గద్దింపులచేతను నేను నిన్ను శిక్షింపగా ।
నీ చుట్టునున్న అన్యజనులకు నీవు నిందకును ఎగతాళికిని 16
హెచ్చరికకును విస్మయమునకును ఆస్పదముగా ఉం
దువు; యెహోవానగు నేనే ఆజ్ఞ ఇచ్చియున్నాను. ।
ఈ ప్రకారము నేను నీమీదికి క్షామమును దుష్టమృగ 17
ములను పంపుదును, అవి నీకు పుత్రహీనత కలుగ
జేయును, తెగులును ప్రాణహానియు నీకు కలుగును,
మరియు నీమీదికి ఖడ్గమును రప్పించెదను; యెహో
వానగు నేనే యీలాగు ఆజ్ఞ ఇచ్చుచున్నాను.

యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై యీ 6
లాగు సెలవిచ్చెను । — నరపుత్రుడా, ఇశ్రాయేలీ 2
యుల పర్వతములతట్టు చూచి వాటివిషయమై యీ
మాటలు ప్రకటింపుము । — ఇశ్రాయేలీయుల పర్వ 3
తములారా, ప్రభువైన యెహోవా మాట ఆలకిం
చుడి; పర్వతములతోను కొండలతోను వాగులతోను
లోయలతోను ప్రభువైన యెహోవా ఈలాగు సెల
విచ్చుచున్నాడు—ఇదిగో నేను నిజముగా మీమీదికి
ఖడ్గమును రప్పించి మీ ఉన్నత స్థలములను నాశనము
చేసెదను. । మీ బలిపీఠములు పాడైపోవును, సూర్యదేవ 4
తకు నిలిపిన స్తంభములు ఛిన్నాభిన్నములవును, మీ
బొమ్మల యెదుట మీ జనులను నేను హతముచేసెదను. ।
ఇశ్రాయేలీయుల కళేబరములను వారి బొమ్మలయెదుట 5
పడవేసి, మీ యెముకలను మీ బలిపీఠములచుట్టు పార
వేయుదును. । నేనే యెహోవానై యున్నానని 6
మీరు తెలిసికొనునట్లు మీ బలిపీఠములు విడువబడి
పాడైపోవును, మీ విగ్రహములు ఛిన్నాభిన్నముల
గును, సూర్యదేవతకు మీరు నిలిపిన స్తంభములు పడ
గొట్టబడును, మీ పనులు నాశనమగును, మీ నివాస
స్థలములన్నిటిలోనున్న మీ పట్టణములు పాడైపోవును,
మీ ఉన్నతస్థలములు విడువబడును, । మీ జనులు 7

8 హతులై కూలుదురు. । అయినను మీరు ఆయా దేశము
లలో చెదరిపోవునప్పుడు ఖడ్గమును తప్పించుకొను
కొందరిని నేను మీలో శేషముగా అన్యజనులమధ్య
9 ఉండనిచ్చెదను. । మరియు నన్ను విసర్జించినవారి
విశ్వాసఘాతుకమైన వ్యభిచారమనస్సును, విగ్రహ
ముల ననుసరించిన వ్యభిచారదృష్టిని నేను మార్చి నా
తట్టు తిరుగజేయగా, చెరపట్టబడినవారై శేషించిన
వారు అన్యజనులమధ్య నన్ను జ్ఞాపకము చేసికొని,
తామనుసరించిన హేయకృత్యములన్నిటినిబట్టి తాము
చేసిన దుష్క్రియలను కనుగొని తమ్మునుతామే అసహ్యించు
10 కొనుచు । నేను యెహోవానై యున్నానని వారు
తెలిసికొందురు; ఈ కీడు వారికి చేసెదనని నేను
చెప్పినమాట వ్యర్థము కాదు.

11 ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా —
నీ చేతులు చరిచి నేల తన్ని ఇశ్రాయేలీయుల దుష్ట
మైన హేయకృత్యములనుబట్టి అయ్యో అని అంగ
లార్చుము; ఖడ్గముచేతను క్షామముచేతను తెగులుచేతను
12 వారు కూలుదురు. । దూరముననున్నవారు తెగులుచేత
చత్తురు, దగ్గరనున్నవారు ఖడ్గముచేత కూలుదురు,
శేషించి ముట్టడివేయబడినవారు క్షామముచేత చత్తురు;
ఈ ప్రకారము నేను వారిమీద నా క్రోధము తీర్చు
13 కొందును. । తమ విగ్రహముల మధ్యను తాము కట్టిన
బలిపీఠములచుట్టును ఎత్తయిన కొండలన్నిటిమీదను
సకల పర్వతముల నడికొప్పులమీదను పచ్చని చెట్ల
న్నిటిక్రిందను, పుష్టిపారిన మస్తకివృక్షములన్నిటిక్రిం
దను, తమ విగ్రహములన్నిటికి పరిమళధూపమువేసిన
చోటులన్నిటిలోను పడి వారి జనులు హతులై
యుండు కాలమున నేనే యెహోవానై యున్నా
14 నని మీరు తెలిసికొందురు. । నేను వారికి విరోధినై
వారు నివసించు స్థలములన్నిటిలో వారి దేశమును
దిబ్లాతు అరణ్యముకంటె మరి నిర్జనముగాను పాడు
గాను చేయగా నేనే యెహోవానై యున్నానని
వారు తెలిసికొందురు.

7 మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
2 యీలాగు సెలవిచ్చెను । — నరపుత్రుడా, ప్రకటిం
పుము; ఇశ్రాయేలీయుల దేశమునకు అంతము వచ్చి
యున్నది, నలుదిక్కుల దేశమునకు అంతము వచ్చే
యున్నదని ప్రభువగు యెహోవా సెలవిచ్చుచు
న్నాడు; ఇప్పుడు నీకు అంతము వచ్చేయున్నది. ।
3 నా కోపము నీమీద తెప్పించు నీ ప్రవర్తననుబట్టి నీకు
తీర్పుతీర్చి, నీవు చేసిన సమస్త హేయకృత్యముల ఫలము
4 నీమీదికి రప్పించుచున్నాను. । నీయెడల కటాక్ష
ముంచకయు కనికరము చూపకయు నుందును, నేను
యెహోవానై యున్నానని నీవెరుగునట్లు నీ ప్రవర్తన
ఫలము నీవు అనుభవింపజేసెదను, నీ హేయకృత్య
ములు నీ మధ్యనే యుండనిత్తును.

ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా— 5
దురదృష్టము వింతైన దురదృష్టము సంభవించుచు
న్నది, । అంతము వచ్చుచున్నది, అంతమే వచ్చుచున్నది, 6
అది నీకొరకు కనిపెట్టుచున్నది, ఇదిగో సమీపమాయె
ను. । దేశనివాసులారా, మీమీదికి దుర్దినము వచ్చు 7
చున్నది, సమయము వచ్చుచున్నది, దినము సమీపమా
యెను, ఉత్సాహధ్వని కాదు శ్రమధ్వనియే పర్వత
ములమీద వినబడుచున్నది. । ఇంక కొంతసేపటికి 8
నేను నా క్రోధమును నీమీద కుమ్మరింతును, నీమీద
నా కోపమును నెరవేర్చుచు నీ ప్రవర్తననుబట్టి నీకు తీర్పు
తీర్చి, నీ సమస్త హేయకృత్యముల ఫలము నీమీదికి
రప్పించెదను. । యెహోవానగు నేనే నిన్ను మొత్తు 9
వాడనై యున్నానని నీవెరుగునట్లు నీయెడల కటాక్ష
ముంచకయు కనికరము చూపకయు నుందును, నీ
ప్రవర్తన ఫలము నీవనుభవింపజేసెదను, నీ హేయ
కృత్యములు నీ మధ్యనుండనిత్తును. । ఇదిగో యిదే ఆ 10
దినము, అది వచ్చేయున్నది, ఆ దుర్దినము ఉదయించు
చున్నది, ఆ దండము పూచేయున్నది, ఆ గర్వము
చిగిరించేయున్నది, బలాత్కారము పుట్టి దుష్టులను దండిం
చునదాయెను. । వారిలోనైనను వారి గుంపులోనైనను 11
వారి ఆస్తిలోనైనను వారికున్న ప్రభావములోనైనను
ఏమియు శేషింపదు. । కాలము వచ్చుచున్నది, దినము 12
సమీపమాయెను, వారి సమూహమంతటిమీద ఉగ్రత
నిలిచియున్నది గనుక కొనువానికి సంతోషముండ
పనిలేదు, అమ్మువానికి దుఃఖముండ పనిలేదు. । వారు 13
బ్రదికియున్నను అమ్మువాడు అమ్మినదానికి తిరిగి రాడు,
ఈ దర్శనము వారి సమూహమంతటికి చెందును, అది
తప్పక జరుగును, వారందరు దోషులైరి గనుక తమ
ప్రాణము రక్షించుకొనుటకు వారిలో ఎవరును ధైర్యము
చేయరు. । వారు సర్వసిద్ధులై బాకా నాదము చేయు 14
దురు గాని వారి సమూహమంతటిమీదికి నా ఉగ్రత
వచ్చియున్నది గనుక యుద్ధమునకు పూనుకొను
వాడొకడును ఉండడు. । బయట ఖడ్గమున్నది 15
లోపట తెగులును క్షామమును ఉన్నవి, బయట
నున్నవారు ఖడ్గముచేత చత్తురు, పట్టణములోనున్న
వారిని క్షామమును తెగులును మ్రింగును. । వారిలో 16
ఎవరైనను తప్పించుకొనిన పక్షమున వారందరును
లోయలోని గువ్వలవలె పర్వతములమీదనుండి తమ
దోషములనుబట్టి మూల్గులిడుదురు. । అందరిచేతులు 17
సత్తువ తప్పును, అందరి మోకాళ్లు నీళ్లు పారునట్లు
తత్తరిల్లును. । వారు గోనెపట్ట కట్టుకొందురు, వారికి 18
ఘోరమైన భయము తగులును, అందరు సిగ్గుపడుదురు,
అందరి తలలు బోడియగును. । తమ వెండిని వీధు 19
లలో పారవేయుదురు, తమ బంగారమును నిషిద్ధమని
యెంచుదురు, యెహోవా ఉగ్రత దినమందు వారి
వెండియే గాని బంగారమే గాని వారిని తప్పించ

జాలదు, అది వారి దోషక్రియలు విడువకుండ అభ్యం
తరమాయెను గనుక దానివలన వారు తమ క్షుధను
తీర్చుకొనజాలకపోదురు, తమ ఉదరమును పోషించు
20 కొనజాలకపోదురు. । శృంగారమైన ఆ యాభరణ
మును వారు తమ గర్వమునకు ఆధారముగా ఉప
యోగించిరి, దానితో వారు హేయమైన దేవతల
విగ్రహములు చేసిరి గనుక నేను దానిని వారికి రోతగా
21 చేసెదను, । వారు దాని అపవిత్రపరచునట్లు అన్యుల
చేతికి దోపుడు సొమ్ముగాను దుర్మార్గులైన జనులకు
22 లూటిగాను నేను దానిని అప్పగించెదను. । వారిని
చూడకుండ నా ముఖమును నేను త్రిప్పుకొందును
గనుక శత్రువులు నా నిధిస్థానమును అపవిత్రపరచు
దురు, దొంగలు చొరబడి దానిని అపవిత్రపరచు
23 దురు. । దేశము రక్తముతో నిండియున్నది, పట్టణము
బలాత్కారముతో నిండియున్నది. సంకెళ్లు సిద్ధపరచు
24 ము. । బలాఢ్యుల యతిశయము ఆగిపోవునట్లును వారి
పరిశుద్ధస్థలములు అపవిత్రములగునట్లును అన్యజను
లలో దుష్టులను నేను రప్పించెదను; ఆ దుష్టులు వారి
25 యిండ్లను స్వతంత్రించుకొందురు. । సమూలధ్వంసము
వచ్చేయున్నది, జనులు సమాధానముకొరకు విచా
26 రించుచున్నారుగాని అది వారికి దొరకదు. । నాశ
నము వెంబడి నాశనము కలుగుచున్నది, సమాచారము
వెంబడి సమాచారము వచ్చుచున్నది; వారు ప్రవక్త
యొద్ద దర్శనముకొరకు విచారణచేయుదురుగాని
యాజకులు ధర్మశాస్త్రజ్ఞానులు కాకపోయిరి, పెద్దలు
27 ఆలోచన చేయకయే యున్నారు. । రాజు వ్యాకుల
పడుచున్నాడు, అధికారులు భీతినొందుచున్నారు,
సామాన్యజనులు వణకుచున్నారు; నేను యెహో
వానై యున్నానని వారు తెలిసికొనునట్లు వారి
ప్రవర్తనఫలము నేను వారిమీదికి రప్పింపబోవుచు
న్నాను, వారు చేసిన దోషములనుబట్టి వారికి తీర్పు
తీర్చబోవుచున్నాను.

8 ఆరవ సంవత్సరము ఆరవ నెల అయిదవ దినమున
నేను నా యింట కూర్చునియుండగాను యూదా
పెద్దలు నా యెదుట కూర్చుండియుండగాను ప్రభు
వైన యెహోవా హస్తము నామీదికి వచ్చెను. ।
2 అంతట నేను చూడగా అగ్నిని పోలిన ఆకారము
నాకు కనబడెను, నడుము మొదలుకొని దిగువకు
అగ్నిమయమైనట్టుగాను, నడుము మొదలుకొని పైకి
తేజోమయమైనట్టుగాను, కరుగుచున్న అపరంజివలె
నట్టుగాను ఆయన నాకు కనబడెను. । మరియు చెయ్యి
వంటిది ఒకటి ఆయన చాపి నా తలవెండ్రుకలు పట్టు
కొనగా ఆత్మ భూమ్యాకాశముల మధ్యకు నన్నెత్తి,
నేను దేవుని దర్శనములను చూచుచుండగా యెరూష
లేమునకు ఉత్తరపువైపుననున్న ఆవరణద్వారము
దగ్గర రోషము పుట్టించు విగ్రహస్థానములో నన్ను
దించెను. । అంతట లోయలో నాకు కనబడిన దర్శన 4
రూపముగా ఇశ్రాయేలీయుల దేవుని ప్రభావము
అచ్చట కనబడెను. । — నరపుత్రుడా, ఉత్తరపువైపు 5
తేరి చూడుమని యెహోవా నాకు సెలవియ్యగా
నేను ఉత్తరపువైపు తేరి చూచితిని; ఉత్తరపువైపున
బలిపీఠపు గుమ్మము లోపల రోషము పుట్టించు ఈ
విగ్రహము కనబడెను. । అంతట ఆయన నాతో 6
ఈలాగు సెలవిచ్చెను — నరపుత్రుడా, వారు చేయు
దానిని నీవు చూచుచున్నావు గదా; నా పరిశుద్ధస్థల
మును నేను విడిచిపోవునట్లుగా ఇశ్రాయేలీయులు
ఇక్కడ చేయు అత్యధికమైన హేయకృత్యములు చూచి
తివా? యీ తట్టు తిరిగినయెడల వీటికంటె మరి యధిక
మైన హేయక్రియలు చూచెదవు. । అప్పుడు ఆవరణ 7
ద్వారముదగ్గర నన్ను ఆయన దింపగా గోడలోనున్న
సందు ఒకటి నాకు కనబడెను. । — నరపుత్రుడా, 8
ఆ గోడకు కన్నము త్రవ్వుమని ఆయన నాకు సెల
వియ్యగా నేను గోడకు కన్నము త్రవ్వినంతలో
ద్వారమొకటి కనబడెను. । — నీవు లోపలికి చొచ్చి 9
యిక్కడ వారెట్టి హేయకృత్యములు చేయుచున్నారో
చూడుమని ఆయన నాకు సెలవియ్యగా । నేను 10
లోపలికి పోయి చూచితిని; అప్పుడు ప్రాకెడి సకల
జంతువుల ఆకారములును హేయమైన మృగముల
ఆకారములును, అనగా ఇశ్రాయేలీయుల దేవతల
విగ్రహములన్నియు గోడమీద చుట్టును వ్రాయబడి
యున్నట్టు కనబడెను. । మరియు ఒక్కొకడు తన 11
చేతిలో ధూపార్తి పట్టుకొని ఇశ్రాయేలీయుల పెద్దలు
డెబ్బదిమందియు, వారిమధ్యను షాఫాను కుమారుడైన
యజన్యాయు, ఆ యాకారములకు ఎదురుగా నిలిచి
యుండగా, చిక్కని మేఘమువలె ధూపవాసన ఎక్కు
చుండెను. । అప్పుడాయన నాకు సెలవిచ్చినదేమనగా 12
— నరపుత్రుడా — యెహోవా మమ్మును కానక
యుండును, యెహోవా దేశమును విసర్జించెను అని
యనుకొని, ఇశ్రాయేలీయుల పెద్దలు చీకటిలో తమ
విగ్రహపు గదులలో వారిలో ప్రతివాడు చేయు
దానిని నీవు చూచుచున్నావు గదా. । మరియు 13
ఆయన—నీవు ఈతట్టు తిరుగుము, వీటిని మించిన అతి
హేయకృత్యములు వారు చేయుట చూతువని నాతో
చెప్పి । యెహోవా మందిరపు ఉత్తర ద్వారము 14
దగ్గర నన్ను దింపగా, అక్కడ స్త్రీలు కూర్చుండి
తమ్మూజు దేవతనుగూర్చి యేడ్చుట చూచితిని. । అప్పు 15
డాయన—నరపుత్రుడా, యిది చూచితివి గాని నీవు
తిరిగి చూచినయెడల వీటిని మించిన హేయకృత్య
ములు చూతువని నాతో చెప్పి । యెహోవా మంది 16
రపు లోపలి ఆవరణములో నన్ను దింపగా, అక్కడ
యెహోవా ఆలయద్వారము దగ్గరనున్న ముఖమంట
పమునకును బలిపీఠమునకును మధ్యను ఇంచుమించు

రువది యయిదుగురు మనుష్యులు కనబడిరి. వారి
పులు యెహోవా ఆలయముతట్టును వారి ముఖ
ులు తూర్పుతట్టును తిరిగియుండెను; వారు తూర్పున
ున్న సూర్యునికి నమస్కారము చేయుచుండిరి. । అప్పు
ాయన నాతో ఇట్లనెను—నరపుత్రుడా, నీవు చూచి
వే; యూదావారు ఇక్కడ ఇట్టి హేయకృత్య
ులు జరిగించుట చాలదా? వారు దేశమును బలా
్కారముతో నింపుచు నాకు కోపము పుట్టించుచుదురు,
ద్రాక్ష) తీగె ముక్కునకు పెట్టుచు మరి ఎక్కువగా
ాకు కోపము పుట్టించుచుదురు. । కాబట్టి కటాక్షము
కయు కనికరము చూపకయు నేను నా క్రోధము
ుపరచి, వారు నా చెవులలో ఎంత బిగ్గరగా
ఱ్ఱపెట్టినను నేను ఆలకింపకుందును.

మరియు నేను చెవులార వినునట్లు ఆయన గట్టిగా
ీ మాటలు ప్రకటించెను—ఒక్కొకడు తాను హతము
ేయు ఆయుధమును చేత పట్టుకొని—పట్టణపు కావలి
ారందరును ఇక్కడికి రండి అనెను. । అంతలో
క్కొకడు తాను హతముచేయు ఆయుధమును చేత
ట్టుకొని, ఉత్తర దిక్కుననున్న పై గవిని మార్గముగా
రుగురు మనుష్యులు వచ్చుచుండిరి. వారిలో ఒకడు
విసెనారబట్ట ధరించుకొని నడుముకు లేఖకుని సిరా
ుడ్డి కట్టుకొని యుండెను; వారు ఆలయమున ప్రవే
ంచి యిత్తడి బలిపీఠమునొద్ద నిలిచిరి. । ఇశ్రాయేలీ
ులు దేవుని మహిమ తానున్న కెరూబుపైనుండి దిగి
ందిరపు గడపదగ్గరకు వచ్చి నిలిచి, అవిసెనారబట్ట
రించుకొని లేఖకుని సిరాబుడ్డి నడుముకు కట్టుకొనిన
ానిని పిలువగా । యెహోవా — యెరూషలేమను
పట్టణములో ప్రవేశించి చుట్టు తిరిగి, దానిలో జరి
ు హేయకృత్యములనుగూర్చి మూల్గులిడుచు ప్రలా
ంచుచున్న వారి లలాటములమీద తక్కెడ రూప
ుగా గురుతు వేయుమని వారి కాజ్ఞాపించి । నేను
ుచుండగా వారికీలాగు సెలవిచ్చెను—మీరు పట్టణ
ులో వాని వెంట పోయి నా పరిశుద్ధస్థలము దగ్గర
ుదలుపెట్టి, కటాక్షమైనను కనికరమైనను లేకుండ
ందరిని హతముచేయుడి. । అందరు నశించునట్లు ఎవ
ి విడిచిపెట్టక, పెద్దవారిని చిన్నవారిని కన్యకలను
ల్లలను స్త్రీలను చంపవలెను గాని, ఆ గురుతు ఎవరి
ందునో వారిని ముట్టకూడదు. వారు మందిరము
ుందరసున్న పెద్దలను హతముచేయ మొదలుపెట్ట
ా । ఆయన—మందిరమును అపవిత్రపరచుడి, ఆవర
ుములను హతమైనవారితో నింపుడి, మొదలుపెట్టుడి
ని సెలవిచ్చెను గనుక వారు బయలుదేరి పట్టణము
ోనివారిని హతముచేయసాగిరి. । నేను తప్ప మరి ఎవ
ును శేషింపకుండ వారు హతముచేయుట నేను
ూచి సాష్టాంగపడి వేడుకొని—అయ్యో, ప్రభువా,
యెహోవా, యెరూషలేముమీద నీ క్రోధమును
కుమ్మరించి ఇశ్రాయేలీయులలో శేషించినవారినందరిని
నశింపజేయుదువా? అని మొఱ్ఱపెట్టగా । ఆయన 9
నాకీలాగు సెలవిచ్చెను—ఇశ్రాయేలువారియొక్కయు
యూదావారియొక్కయు దోషము బహు ఘోర
ముగా ఉన్నది; వారు—యెహోవా దేశమును విస
ర్జించెననియు ఆయన మమ్మును కానడనియు ననుకొని,
దేశమును హత్యతోను పట్టణమును తిరుగబాటుతోను
నింపియున్నారు. । కాబట్టి కటాక్షముంచకయు కని 10
కరము చూపకయు నేను వారి ప్రవర్తన ఫలమును
వారనుభవింపజేసెదను. । అప్పుడు అవిసెనారబట్ట 11
ధరించుకొని లేఖకుని సిరాబుడ్డి నడుముకు కట్టుకొనిన
వాడు వచ్చి—నీవు నాకాజ్ఞాపించినట్లు నేను చేసితినని
మనవిచేసెను.

నేను చూచుచుండగా కెరూబులకు పైగానున్న **10**
ఆకాశమండలమువంటిదానిలో నీలకాంతమయమైన
సింహాసనమువంటిదొకటి అగుపడెను. । అప్పుడు 2
అవిసెనారబట్ట ధరించుకొనినవానితో యెహోవా—
కెరూబు క్రిందనున్న చక్రముల మధ్యకు పోయి,
కెరూబుల మధ్యనున్న నిప్పులు చేతులనిండ తీసికొని
పట్టణముమీద చల్లుమని సెలవియ్యగా, నేను చూచు
చుండునంతలో అతడు లోపలికి పోయెను. । అతడు 3
లోపలికి పోగా కెరూబులు మందిరపు కుడిప్రక్కను
నిలిచియుండెను; మరియు మేఘము లోపలి ఆవరణ
మును కమ్మియుండెను. । యెహోవా మహిమ కెరూ 4
బులపైనుండి ఆరోహణమై మందిరపు గడపదగ్గర దిగి
నిలిచెను. మరియు మందిరము మేఘముతో నిండెను,
ఆవరణమును యెహోవా తేజోమహిమతో నిండిన
దాయెను. । దేవుడైన సర్వశక్తుడు పలుకునట్లుగా కెరూ 5
బుల రెక్కల చప్పుడు బయటి ఆవరణమువరకు విన
బడెను. । — కెరూబుల మధ్యనుండు చక్రముల దగ్గర 6
నుండి అగ్ని తీసికొనుమని ఆయన అవిసెనారబట్ట
ధరించుకొనినవానికి ఆజ్ఞ ఇయ్యగా, అతడు లోపలికి
పోయి చక్రముదగ్గర నిలిచెను. । కెరూబులలో ఒకడు 7
కెరూబులమధ్యనున్న అగ్నివైపు చెయ్యి చాపి నిప్పులు
తీసి అవిసెనారబట్ట ధరించుకొనినవాని చేతిలోనుం
చగా అతడు అవి పట్టుకొని బయలుదేరెను; । అం 8
తలో కెరూబుల రెక్కలక్రింద మానవహస్తరూప
మొకటి కనబడెను. । నేను చూచుచుండగా ఒక్కొక 9
కెరూబుదగ్గర ఒక చక్రముచొప్పున నాలుగు చక్ర
ములు కనబడెను; ఆ చక్రములు రక్తవర్ణపు రాతితో
చేయబడినట్లుండెను. । ఆ నాలుగు చక్రములు ఏక 10
రీతిగానుండి యొక్కొక చక్రమునకులోగా మరియొక
చక్రమున్నట్లుగా కనబడెను. । అవి జరుగుచుండగా 11
నాలుగువైపులు జరుగుచున్నట్లుండెను, వెనుకకు తిరు
గక జరుగుచుండెను, తల యేతట్టు తిరుగునో అవి
ఆ తట్టే దానివెంట పోవుచుండెను, వెనుకకు తిరుగక

12 జరుగుచుండెను. । ఆ నాలుగు కెరూబులయొక్క శరీర
ములును వీపులును చేతులును రెక్కలును ఆ చక్రముల
చుట్టును కన్నులతో నిండియుండెను; నాలుగింటికి
13 చక్రములుండెను. । నేను వినుచుండగా— తిరుగుడని
14 చక్రములకు ఆజ్ఞ యియ్యబడెను. । కెరూబులలో
ఒక్కొకదానికి నాలుగు ముఖములుండెను; మొదటిది
కెరూబుముఖము, రెండవది మానవముఖము, మూడవది
15 సింహముఖము, నాల్గవది పక్షిరాజుముఖము. । ఈ
కెరూబులు పైకెక్కెను. కెబారు నదిదగ్గర నాకు
16 కనబడిన జంతువు ఇదే. । కెరూబులు జరుగగా చక్ర
ములును వాటి అంచున జరిగెను, కెరూబులు నేలనుండి
లేవవలెనని రెక్కలు చాచగా ఆ చక్రములు వాటి
17 యొద్దనుండి తొలగలేదు. । జంతువులకున్న ప్రాణము
చక్రములలో ఉండెను గనుక అవి నిలువగా నివియు
18 నిలిచెను, అవి లేవగా ఇవియు లేచెను. । యెహోవా
మహిమ మందిరపు గడపదగ్గరనుండి బయలుదేరి కెరూ
19 బులకు పైగా నిలువగా । కెరూబులు రెక్కలు
చాచి, నేను చూచుచుండగా నేలనుండి పైకి లేచెను.
అవి లేవగా చక్రములు వాటితోకూడ లేచెను, అవి
యెహోవా మందిరపు తూర్పు ద్వారమునకు వచ్చి
దిగి, అక్కడ నిలువగా ఇశ్రాయేలీయుల దేవుని
20 మహిమ వాటికిపైగా నిలిచెను. । కెబారు నదిదగ్గర
ఇశ్రాయేలు దేవుని క్రింద నాకు కనబడిన జంతువు
21 ఇదే; అవి కెరూబులని నేను గుర్తుపట్టితిని. । ఒక్కొక
దానికి నాలుగేసి ముఖములును నాలుగేసి రెక్కలును
ఉండెను. మరియు ఒక్కొకదానికి రెక్కరెక్క క్రిం
22 దను మానవహస్తమువంటిది ఒకటి కనబడెను. । మరియు
వాటి ముఖరూపములు కెబారు నదిదగ్గర నాకు కన
బడిన ముఖరూపములవలె ఉండెను; అవియు వాటి
రూపములును అదేవిధముగా ఉండెను; ఇవియన్నియు
ఆ యా ముఖములవైపుగా జరుగుచుండెను.

11 పిమ్మట ఆత్మ నన్ను ఎత్తి యెహోవా మందిరపు
తూర్పుగుమ్మమునొద్దకు చేర్చి నన్ను దింపగా గుమ్మపు
వాకిట ఇరువదియైదుగురు మనుష్యులు కనబడిరి;
వారిలో జనులకు ప్రధానులైన అజ్జూరు కుమారుడగు
యజన్యాయు బెనాయా కుమారుడగు పెలట్యాయు
2 నాకు కనబడిరి. । అప్పుడాయన నాకీలాగు సెల
విచ్చెను—నరపుత్రుడా—యీ పట్టణము పచనపాత్ర
యనియు, మనము మాంసమనియు, ఇండ్లు కట్టుకొన
3 అవసరములేదనియు చెప్పుకొనుచు । ఈ పట్టణములో
పాపము యోచించి దురాలోచన చేయువారు వీరే. ।
4 కావున వారికి విరోధముగా ప్రవచింపుము; నర
5 పుత్రుడా, ప్రవచింపుము. । అంతట యెహోవా
ఆత్మ నామీదికి వచ్చి ఆజ్ఞ ఇచ్చినదేమనగా — నీవు
ఈ మాట వారికి తెలియజేయుము, యెహోవా
సెలవిచ్చిన మాట యిదే—ఇశ్రాయేలీయులారా, మీ
రీలాగున పలుకుచున్నారే, మీ మనస్సున పుట్టిన అభి
ప్రాయములు నాకు తెలిసేయున్నవి. । ఈ పట్టణ 6
ములో మీరు బహుగా హత్య జరిగించితిరి, మీచేత
హతులైనవారితో వీధులు నిండియున్నవి. । కాబట్టి 7
ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా—మీరు
హతముచేసి పట్టణములో పడవేసిన శవములే మాంస
ము, ఈ పట్టణమే పచనపాత్ర; యీ పట్టణములో
నుండి మిమ్మును వెళ్లగొట్టుదును. । మీరు ఖడ్గమునకు 8
భయపడుచున్నారే, నేనే మీమీదికి ఖడ్గము రప్పించె
దను; ఇదే ప్రభువైన యెహోవా వాక్కు. । మరియు 9
మీకు శిక్ష విధించి పట్టణములోనుండి మిమ్మును వెళ్ల
గొట్టి అన్యులచేతికి మిమ్ము నప్పగింతును. । ఇశ్రా 10
యేలు సరిహద్దులలోగానే మీరు ఖడ్గముచేత కూలు
నట్లు నేను మీకు శిక్ష విధింపగా నేనే యెహోవా
నని మీరు తెలిసికొందురు. । మీరు దానిమధ్య 11
మాంసముగా ఉండునట్లు ఈ పట్టణము మీకు పచన
పాత్రగా ఉండదు; నేను ఇశ్రాయేలు సరిహద్దుల
యొద్దనే మీకు శిక్ష విధింతును. । అప్పుడు మీ 12
చుట్టునున్న అన్యజనుల విధుల నాచరించుటకై మీరు
ఎవని కట్టడల ననుసరింపక మానితిరో యెవని విధు
లను ఆచరింపక పోతిరో, ఆ యెహోవానగు నేనే
ఆయననని మీరు తెలిసికొందురు. । నేను ఆ ప్రకా 13
రము ప్రవచింపుచుండగా బెనాయా కుమారుడైన
పెలట్యా చచ్చెను గనుక నేను సాష్టాంగపడి యెలు
గెత్తి — అయ్యో, ప్రభువా, యెహోవా, ఇశ్రా
యేలీయుల శేషమును నీవు నిర్మూలము చేయుదువా?
అని మొర్రపెట్టితిని.

అప్పుడు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై 14
యీలాగు సెలవిచ్చెను । —నరపుత్రుడా, యెరూష 15
లేము పట్టణపువారు — ఈ దేశము మాకు స్వాస్థ్య
ముగా ఇయ్యబడెను, మీరు యెహోవాకు దూరస్థు
లుగా నుండుడి, అని యెవరితో చెప్పుచున్నారో
వారందరు ఇశ్రాయేలీయులై నీకు సాక్షాద్బంధువు
లును నీచేత బంధుత్వధర్మము నొందవలసినవారునై
యున్నారు. । కాబట్టి వారికి ఈ మాట ప్రకటిం 16
పుము—ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా
దూరముననున్న అన్యజనులలోకి నేను వారిని తోలి
వేసినను, ఆ యా దేశములలో వారిని చెదరగొట్టినను,
వారు వెళ్లిన ఆ యా దేశములలో కొంతకాలము నేను
వారికి పరిశుద్ధాలయముగా ఉందును. । కాగా నీవు 17
ఈ మాట ప్రకటింపుము—ప్రభువైన యెహోవా
సెలవిచ్చునదేమనగా—ఆ యా జనముల మధ్యనుండి
నేను మిమ్మును సమకూర్చి, మీరు చెదరగొట్టబడిన
దేశములలోనుండి మిమ్మును రప్పించి, ఇశ్రాయేలుదేశ
మును మీ వశము చేసెదను. । వారు అక్కడికి వచ్చి 18
అక్కడ తాముంచియున్న విగ్రహములను తీసివేసి,

తాము చేసియున్న హేయక్రియలు చేయుట మాను
19 దురు. । వారు నా కట్టడలను నా విధులను అనుస
రించి నడుచుకొనునట్లు నేను వారి శరీరములలోనుండి రాతి
గుండెను తీసివేసి వారికి మాంసపుగుండెను ఇచ్చి,
వారికి ఏకమనస్సు కలుగజేసి వారియందు నూతన ఆత్మ
20 పుట్టింతును. । అప్పుడు వారు నాకు జనులై యుందురు
21 నేను వారికి దేవుడనై యుందును. । అయితే తమ
విగ్రహములను అనుసరించుచు, తాము చేయుచు
వచ్చిన హేయక్రియలను జరిగింప బూనువారిమీదికి
తమ ప్రవర్తన ఫలము రప్పింతును; ఇదే ప్రభువైన
22 యెహోవా వాక్కు. । కెరూబులు తమ రెక్కలు
చాచెను, చక్రములును వాటియంచున జరుగుచుం
డెను, అంతలో ఇశ్రాయేలీయుల దేవుని మహిమ
23 వాటికి పైనుండెను. । మరియు యెహోవా మహిమ
పట్టణములోనుండి పైకెక్కి పట్టణపు తూర్పుదిశ
24 నున్న కొండకుపైగా నిలిచెను. । తరువాత ఆత్మ నన్ను
ఎత్తి, నేను దైవాత్మవశుడను కాగా, దర్శనములో
నైనట్టు కల్దీయుల దేశమునందు చెరలో ఉన్నవారి
యొద్దకు నన్ను దింపెను. అంతలో నాకు కనబడిన
25 దర్శనము కనబడకుండ పైకెక్కెను. । అప్పుడు
యెహోవా నాకు ప్రత్యక్షపరచిన వాటినన్నిటిని
చెరలో ఉన్నవారికి నేను తెలియజేసితిని.

**2** మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్య
2 క్షమై యీలాగు సెలవిచ్చెను ।—నరపుత్రుడా, తిరుగ
బాటు చేయువారిమధ్య నీవు నివసించుచున్నావు;
వారు ద్రోహులై యుండి, చూచు కన్నులు కలిగియు
చూడక యున్నారు; విను చెవులు కలిగియు వినక
3 యున్నారు. । నరపుత్రుడా, దేశాంతరము పోవు
వానికి తగిన సామగ్రిని మూటకట్టుకొని, పగటివేళ
వారు చూచుచుండగా నీవు ప్రయాణమై, నీవున్న
స్థలమును విడిచి వారు చూచుచుండగా మరియొక
స్థలమునకు పొమ్ము; వారు తిరుగబాటు చేయువారు,
4 అయినను దీని చూచి విచారించుకొందురేమో । దేశాం
తరము పోవువాడు తన సామగ్రిని తీసికొనునట్లు
వారు చూచుచుండగా నీ సామగ్రిని పగటియందు
బయటికి తీసికొనివచ్చి వారు చూచుచుండగా అస్త
మానమున ప్రయాణమై పరదేశమునకు పోవువాని
వలె నీవు బయలుదేరవలెను । వారు చూచుచుండగా
గోడకు కన్నమువేసి నీ సామగ్రిని తీసికొని దాని
ద్వారా బయలుదేరుము । వారు చూచుచుండగా
రాత్రియందు మూట భుజముమీద పెట్టుకొని నేల
కనబడకుండ నీ ముఖము కప్పుకొని దాని కొనిపొమ్ము,
నేను ఇశ్రాయేలీయులకు నిన్ను సూచనగా నిర్ణయిం
చితిని. । ఆయన నాకాజ్ఞాపించినట్లు నేను చేసి
తిని, ఎట్లనగా నేను దేశాంతరము పోవువాడనైనట్టుగా
పగటియందు నా సామగ్రిని బయటికి తెచ్చి అస్తమాన
మున నా చేతితో గోడకు కన్నమువేసి వారు చూచు
చుండగా సామగ్రిని తీసికొని మూట భుజముమీద
పెట్టుకొంటిని । ఉదయమున యెహోవా వాక్కు 8
నాకు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను ।— నర 9
పుత్రుడా నీవు చేయునదేమని తిరుగబాటుచేయు
ఇశ్రాయేలీయులు నిన్ను అడుగుదురు గనుక నీవు
వారితో ఇట్లనుము ।—ప్రభువగు యెహోవా 10
సెలవిచ్చునదేమనగా— ఈ దేవోక్తిభావము యెరూష
లేములోనున్న ప్రధానికిని దానిలోనున్న ఇశ్రాయేలీ
యులకందరికిని చెందును । కాబట్టి వారికీమాట 11
చెప్పుము— నేను మీకు సూచనగా ఉన్నాను, నేను
సూచించినది వారికి కలుగును, వారు చెరలోకి
పోయి దేశాంతర నివాసులగుదురు । మరియు వారిలో 12
ప్రధానుడగువాడు రాత్రియందు సామగ్రిని భుజము
మీద పెట్టుకొని తానే మోసికొనిపోవుటకై తన
సామగ్రిని బయటికి తెచ్చుకొనవలెనని గోడకు
కన్నమువేసి నేల చూడకుండ ముఖము కప్పుకొని
పోవును । అతని పట్టుకొనుటకై నేను నా వలయొగ్గి 13
వాని చిక్కించుకొని కల్దీయుల దేశమైన బాబెలుకు
వాని తెప్పించెదను, అయితే ఆ స్థలమును చూడకయే
అతడు అక్కడ చచ్చును । మరియు వారికి సహా 14
యులై వచ్చినవారినందరిని అతని దండువారినందరిని
నేను నలుదిక్కుల చెదరగొట్టి కత్తి దూసి వారిని తరిమె
దను । నేను వారిని అన్యజనులలో చెదరగొట్టి ఆయా 15
దేశములలో వారిని వెళ్లగొట్టినతరువాత నేనే
యెహోవానై యున్నానని వారు తెలిసికొందురు ।
అయితే నేను యెహోవానై యున్నానని అన్య 16
జనులు తెలిసికొనునట్లు తాము చేరిన అన్యజనులలో
తమ హేయకృత్యములన్నిటిని వారు వివరించి తెలియ
జెప్పుటకై ఖడ్గముచేత కూలకుండను క్షామమునకు
చావకుండను తెగులు తగులకుండను నేను వారిలో
కొందరిని తప్పించెదను.

మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్య 17
క్షమై యీలాగు సెలవిచ్చెను ।— నరపుత్రుడా 18
వణకుచు నీ ఆహారము తిని తల్లడింపును చింతయు కలిగి
నీళ్లు త్రాగి । దేశములోని జనులకీలాగు ప్రకటిం 19
చుము— యెరూషలేము నివాసులనుగూర్చియు ఇశ్రా
యేలు దేశమునుగూర్చియు ప్రభువైన యెహోవా
సెలవిచ్చునదేమనగా—దానిలోనున్న కాపురస్థులంద
రును చేసిన బలాత్కారమునుబట్టి దానిలోని సమస్త
మును పాడైపోవును గనుక చింతతో వారు ఆహారము
తిందురు భయభ్రాంతితో నీళ్లు త్రాగుదురు । నేనే 20
యెహోవానై యున్నానని మీరు తెలిసికొనునట్లు
కాపురపు పట్టణములు నిర్జనములుగా ఉండును,
దేశము పాడగును.

మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై 21

22 యీలాగు సెలవిచ్చెను ।— నరపుత్రుడా దినములు
జరిగి పోవుచున్నవి, ప్రతి దర్శనము నిరర్థకమగు
చున్నది అని ఇశ్రాయేలీయుల దేశములో మీరు
23 చెప్పుకొను సామెత యేమిటి? । కావున నీవు వారికి ఈ
మాట తెలియజేయుము—ప్రభువగు యెహోవా సెల
విచ్చునదేమనగా— ఇకమీదట ఇశ్రాయేలీయులలో
ఎవరును ఈ సామెత పలుకకుండ నేను దానిని నిరర్థ
కము చేసెదను గనుక నీవు వారితో ఇట్లనుము — దిన
ములు వచ్చుచున్నవి, ప్రతిదర్శనము నెరవేరును ।
24 వ్యర్థమైన దర్శనమైనను ఇచ్చకములాడు సోదెగాండ్ల
మాటలైనను ఇశ్రాయేలీయులలో ఇకను ఉండవు. ।
25 యెహోవానైన నేను మాటయిచ్చుచున్నాను, నే
నిచ్చు మాట యికను ఆలస్యము లేక జరుగును. తిరుగ
బాటు చేయువారలారా మీ దినములలో నేను మాట
యిచ్చి దాని నెరవేర్చెదను, ఇదే ప్రభువగు యెహోవా
వాక్కు.

26 మరల యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
27 యీలాగు సెలవిచ్చెను ।— నరపుత్రుడా—వీనికి కన
బడిన దర్శనము నెరవేరుటకు బహు దినములు జరుగ
వలెననియు బహు కాలము జరిగినతరువాత కలుగు
దానిని వీడు ప్రవచించుచున్నాడనియు ఇశ్రాయేలీ
28 యులు చెప్పుకొనుచున్నారు గదా? । కాబట్టి నీవు
వారితో ఇట్లనుము—ఇకను ఆలస్యములేక నేను చెప్పిన
మాటలన్నియు జరుగును, నేను చెప్పిన మాట తప్ప
కుండ జరుగును, ఇదే యెహోవా వాక్కు.

**13** మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
2 యీలాగు సెలవిచ్చెను ।— నరపుత్రుడా ప్రవచించు
చున్న ఇశ్రాయేలీయుల ప్రవక్తలకు విరోధముగా
ప్రవచించి, మనస్సువచ్చినట్టు ప్రవచించువారితో
నీవీలాగు చెప్పుము—యెహోవా మాట ఆలకించుడి. ।
3 ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా—దర్శన
మేమియు కలుగకున్నను స్వబుద్ధి ననుసరించు అవివేక
4 ప్రవక్తలకు శ్రమ. । ఇశ్రాయేలీయులారా, మీ ప్రవ
క్తలు పాడైన స్థలములలోనుండు నక్కలతో సాటిగా
5 ఉన్నారు. । యెహోవా దినమున ఇశ్రాయేలీయులు
యుద్ధమందు స్థిరముగా నిలుచునట్లు మీరు గోడలలో
నున్న బీటలదగ్గర నిలువరు, ప్రాకారమును దిట్టపర
6 చరు. । యెహోవా తమ్మును పంపకపోయినను తాము
చెప్పిన మాట స్థిరమగునని జనులు నమ్మునట్లు — ఇది
యెహోవా వాక్కు అని చెప్పువారు వ్యర్థమైన
దర్శనములు కందురు, వారు నమ్మదగని సోదెగాండ్లయి
7 యున్నారు. । నేను సెలవియ్యకపోయినను — ఇది
యెహోవా వాక్కు అని మీరు చెప్పినయెడల
...గు కనినది వ్యర్థమైన దర్శనము గదా, మీరు నమ్మ
...గాండ్లయితిరి గదా.
ప్రభువైన యెహోవా ఈలాగు సెల
విచ్చుచున్నాడు—మీరు వ్యర్థమైన మాటలు పలుకుచు
నిరర్థకమైన దర్శనములు కనుచున్నారు గనుక నేను
మీకు విరోధిని; ఇదే ప్రభువగు యెహోవా వాక్కు. ।
వ్యర్థమైన దర్శనములు కనుచు, నమ్మదగని సోదెగాండ్ల 9
యిన ప్రవక్తలకు నేను పగవాడను, వారు నా జనుల
సభలోకి రారు, ఇశ్రాయేలీయుల సంఖ్యలో చేరిన
వారు కాకపోదురు, వారు ఇశ్రాయేలీయుల దేశము
లోకి తిరిగి రారు, అప్పుడు నేను ప్రభువైన యెహో
వానని మీరు తెలిసికొందురు. । సమాధానమేమియు 10
లేకపోయినను వారు సమాధానమని చెప్పి నా జను
లను మోసపుచ్చుచున్నారు; నా జనులు మంటిగోడను
కట్టగా వారు వచ్చి దానిమీద గచ్చుపూత పూసె
దరు. । ఇందువలన నే పూయుచున్నవారితో నీ విట్ల 11
నుము—వర్షము ప్రవాహముగా కురియును, గొప్ప వడ
గండ్లు పడును, తుఫాను దాని పడగొట్టగా అది పడి
పోవును. । ఆ గోడ పడగా జనులు మిమ్మును చూచి— 12
మీరు పూసిన పూత యేమాయెనని అడుగుదురు
గదా? । ఇందుకు ప్రభువైన యెహోవా సెలవిచ్చున 13
దేమనగా—నేను రౌద్రము తెచ్చుకొని తుఫానుచేత
దాని పడగొట్టుదును, నా కోపమునుబట్టి వర్షము
ప్రవాహముగా కురియును, నా క్రోధమునుబట్టి
గొప్ప వడగండ్లు పడి దాని లయపరచును. । దాని 14
పునాది కనబడునట్లు మీరు గచ్చుపూత పూసిన గోడను
నేను నేలతో సమముగా కూల్చెదను, అది పడిపోగా
దానిక్రింద మీరును నాశనమగుదురు, అప్పుడు నేను
యెహోవానని మీరు తెలిసికొందురు. । ఈలాగున 15
ఆ గోడమీదను దానిమీద గచ్చుపూత పూసినవారి
మీదను నా కోపము నేను తీర్చుకొని, ఆ గోడయును
దానికి పూతపూసినవారికిని పని తీరెనని మీతో చెప్పు
దును. । యెరూషలేముకు సమాధానము లేకపోయి 16
నను ఆ పూత పూయువారు సమాధానార్థమైన దర్శన
ములు కనుచు ప్రవచించువారు ఇశ్రాయేలీయుల
ప్రవక్తలే; ఇదే ప్రభువగు యెహోవా వాక్కు.
మరియు నరపుత్రుడా, మనస్సుకు వచ్చినట్టు 17
ప్రవచించు నీ జనుల కుమార్తెలమీద కఠినదృష్టియుంచి
వారికి విరోధముగా ఈలాగు ప్రవచింపుము ।—
ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా—మను 18
ష్యులను వేటాడవలెనని చేతుల కీళ్లన్నిటికిని గుడ్డలు
కుట్టి, యెవరి యెత్తుచొప్పున వారి తలలకు ముసుకులు
చేయు స్త్రీలారా, మీకు శ్రమ; మీరు నా జనులను
వేటాడి మిమ్మును రక్షించుకొందురు. । అబద్ధపు మాటల 19
నంగీకరించు నా జనులతో అబద్ధపు మాటలు చెప్పుచు,
చేరెడు యవలకును రొట్టెముక్కలకును ఆశపడి మరణ
మునకు పాత్రులుకానివారిని చంపుచు, బ్రదుకుటకు
అపాత్రులైనవారిని బ్రదికించుచు నా జనులలో
మీరు నన్ను దూషించెదరు. । కావున ప్రభువైన 20

ా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — నేను
) నీతిమంతుని మనస్సును అబద్ధములచేత
ఖింపజేయుదురు, దుర్మార్గులు తమ దుష్
ిచి తమ ప్రాణములను రక్షించుకొనకుండ
ని ధైర్యపరతురు గనుక । మనుష్యులను
ై మీరు కట్టు గుడ్డలకు నేను విరోధినై
పించెదను, మీ కౌగిటిలోనుండి వారిని
మీరు వేటాడు మనుష్యులను నేను
ప్పించుకొననిచ్చెదను. । మరియు నేను
ానని మీరు తెలిసికొనునట్లు మీరు వేసిన
నేను చింపి మీ చేతిలోనుండి నా జను
చెదను, వేటాడుటకు వారికను మీ వశ
రు. । మీరికను వ్యర్థమైన దర్శనములు
రు, సోదె చెప్పకయుందురు; నేను
ానని మీరు తెలిసికొనునట్లు నా జనులను
ండి విడిపించెదను.

ఇశ్రాయేలీయుల పెద్దలలో కొందరు
వచ్చి నా యెదుట కూర్చుండియుండగా ।
ా వాక్కు నాకు ప్రత్యక్షమై యీలాగు
। — నరపుత్రుడా, యీ మనుష్యులు తమ
లల్లో విగ్రహములను నిలుపుకొని దోషము
భ్యంతరమును తమయెదుటనే పెట్టుకొని
వీరు నాయొద్ద ఏమైన విచారణచేయ
కావున నీవు వారికి సంగతి తెలియజేసి
చెప్పుము — ప్రభువైన యెహోవా సెల
వగా — తమ విస్తారమైన విగ్రహములను
మనస్సున విగ్రహములను నిలుపుకొని
ము కలుగజేసికొని తమయెదుట అభ్యం
పెట్టుకొని ప్రవక్తయొద్దకు వచ్చు ఇశ్రా
వరు । తమ విగ్రహములమూలముగా నాకు
నుక నేను వారి హృదయమును లోపరచు
హోవానగు నేనే వారికి ప్రత్యుత్తరమిచ్చు
కాబట్టి ఇశ్రాయేలీయులకు నీవు ఈమాట
ప్రభువగు యెహోవా సెలవిచ్చునదేమ
విగ్రహములను విడిచిపెట్టి మీరు చేయు
్యములన్నిటిని మాని మనస్సు త్రిప్పుకొ
్రాయేలీయులలోను వారి దేశములో నివ
దేశులలోను ఎవరైనను నన్ను అనుసరించక
లై తమ మనస్సున విగ్రహములను నిలుపు
దోషము కలుగజేసికొని అభ్యంతరమును
) పెట్టుకొని తమ నిమిత్తమై నాయొద్ద
రువలెనని ప్రవక్తయొద్దకు వచ్చినయెడల
ానగు నేనే స్వయముగా వారికి ప్రత్యుత్తర
ఆ మనుష్యులకు నేను విరోధినై నేను
ానని వారు తెలిసికొనునట్లు వారిని సూచన
ంతెగాను చేసి నా జనులలోనుండి నేను
వారిని నిర్మూలముచేసెదను । మరియు ప్రవక్త యొకడు 9
మోసపోయి ఒకమాట చెప్పినపక్షమున యెహోవా
నగు నేనే ఆ ప్రవక్తను మోసపుచ్చువాడనై నేనే వానికి
విరోధినై నా జనులైన ఇశ్రాయేలీయులలోనుండి వాని
నిర్మూలముచేసెదను । ఇశ్రాయేలీయులు ఇకను నన్ను 10
విసర్జించి తొలగిపోకుండను తాము చేయు అతిక్రమ
ములన్నిటిచేత తమ్మును అపవిత్రపరచుకొనకుండను నా
జనులగునట్లును నేను వారికి దేవుడనై యుండునట్లును ।
వారు ఆలాగున తమకు కలుగజేసికొనిన దోషమునకు 11
శిక్షనొందుదురు, ప్రవక్తయొద్ద విచారించువాని దోష
మెంతో ప్రవక్త దోషమంతే అగును, ఇదే యెహోవా
వాక్కు.

మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై 12
యీలాగు సెలవిచ్చెను । — నరపుత్రుడా ఏ దేశమైతే 13
విశ్వాసఘాతుకమై నా దృష్టికి పాపముచేసినదో దానికి
నేను విరోధినై ప్రాణాధారమగు ఆహారము లేకుండ
జేసి కరువు పంపించి మనుష్యులను పశువులను నిర్మూ
లముచేయుదును । నోవహును దానియేలును యోబును 14
ఈ ముగ్గురు అట్టిదేశములో నుండినను వారు తమ నీతి
చేత తమ్మునుమాత్రమే రక్షించుకొందురు, ఇదే ప్రభు
వగు యెహోవా వాక్కు. । ఘాటసాపులు సంచ 15
రింపకుండ ఆ దేశము నిర్జనమై పాడగునట్లు నేను దాని
మీదికి దుష్టమృగములను రప్పించగా । ఆ ముగ్గురు 16
దానిలో ఉండినను ఆ దేశము పాడైపోవును, నా జీవము
తోడు వారు తమ్మునుమాత్రమే రక్షించుకొందురుగాని
కుమాళ్లనైనను కుమార్తెలనైనను రక్షింపజాలకుందురు,
ఇదే ప్రభువగు యెహోవా వాక్కు. । నేను అట్టి 17
దేశముమీదికి యుద్ధము రప్పించి ఖడ్గమును పిలిచి—నీవు
ఈ దేశమునందు సంచరించి మనుష్యులను పశువులను
నిర్మూలముచేయుమని ఆజ్ఞ ఇచ్చినయెడల । ఆ ముగ్గు 18
రును దానిలో ఉన్నను నా జీవముతోడు వారు తమ్మును
మాత్రమే రక్షించుకొందురుగాని కుమాళ్లనైనను కుమా
ర్తెలనైనను రక్షింపజాలకుందురు, ఇదే ప్రభువగు
యెహోవా వాక్కు. । అట్టి దేశములోకి తెగులు 19
పంపి మనుష్యులును పశువులును నిర్మూలమగుటకై
ప్రాణహానికరమగునంతగా నేను నా రౌద్రమును కుమ్మ
రించినయెడల । నోవహును దానియేలును యోబును 20
ఈ ముగ్గురు దానిలో ఉన్నను నా జీవముతోడు వారు
తమ నీతిచేత తమ్మునుమాత్రమే రక్షించుకొందురుగాని
కుమారునినైనను కుమార్తెనైనను రక్షింపజాలకుందురు ।
ప్రభువగు యెహోవా ఈ మాట సెలవిచ్చుచున్నాడు 21
—మనుష్యులను పశువులను నిర్మూలముచేయవలెనని
నేను ఖడ్గముచేతను క్షామముచేతను దుష్టమృగముల
చేతను తెగులుచేతను ఈ నాలుగు విధముల యెరూష
లేముమీద తీర్పుతీర్చినపక్షమున అట్టివారుండినను
వారు దాని రక్షింపలేరు । దానిలో కుమాళ్ల శేషము 22

కుమార్తెల శేషము కొంత నిలుచును, వారు బయటికి
రప్పింపబడెదరు, మీరు వారి ప్రవర్తనను వారి క్రియ
లను గుర్తుపట్టునట్లు వారు బయలుదేరి మీయొద్దకు
వచ్చెదరు, దాని గుర్తుపట్టి యెరూషలేముమీదికి నేను
రప్పించిన కీడునుగూర్చియు దానికి నేను సంభవింప
జేసినదంతనుగూర్చియు మీరు ఓదార్పు నొందుదురు।
23 మీరు వారి ప్రవర్తనను క్రియలను చూచి నేను చేసిన
దంతయు నిర్హేతుకముగా చేయలేదని మీరు తెలిసికొని
ఓదార్పు నొందుదురు, ఇదే ప్రభువైన యెహోవా
వాక్కు.

**15** మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
2 యీలాగు సెలవిచ్చెను।—నరపుత్రుడా ద్రాక్ష
చెట్టు కఱ్ఱ అడవిచెట్లలోనున్న ద్రాక్షచెట్టు కఱ్ఱ
3 తక్కినచెట్ల కఱ్ఱకంటెను ఏమైన శ్రేష్ఠమా? । యే పని
కైనను దాని కఱ్ఱను తీసికొందురా? యేయొక ఉప
కరణముగాని తగిలించుటకై యెవరైన దాని కఱ్ఱతో
4 మేకునైనను చేయుదురా? । అది పొయ్యికే సరిపడును
గదా, అగ్ని చేత దాని రెండు కొనలు కాల్చబడి నడుమ
నల్లబడిన తరువాత అది మరి ఏ పనికైనను తగునా? ।
5 కాలక ముందు అది యే పనికిని తగకపోయెనే; అగ్ని
దానియందు రాజి దాని కాల్చిన తరువాత అది పనికి
6 వచ్చునా? । కావున ప్రభువైన యెహోవా ఈలాగు
సెలవిచ్చుచున్నాడు—నేను అగ్ని కప్పగించిన ద్రాక్ష
చెట్టు అడవిచెట్లలో ఏలాటిదో యెరూషలేము కాపు
రస్థులును ఆలాటివారే గనుక నేను వారిని అప్పగింప
7 బోవుచున్నాను. । నేను వారిమీద కఠినదృష్టి నిలుపు
దును, వారు అగ్నిని తప్పించుకొనినను అగ్నియే
వారిని దహించును; వారియెడల నేను కఠినదృష్టిగల
వాడనై యుండగా నేనే యెహోవానని మీరు
8 తెలిసికొందురు. । వారు నా విషయమై విశ్వాసఘా
తుకులైరి గనుక నేను దేశమును పాడుచేసెదను; ఇదే
ప్రభువగు యెహోవా వాక్కు.

**16** మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
2 యీలాగు సెలవిచ్చెను।—నరపుత్రుడా, యెరూష
లేము చేసిన హేయకృత్యములను దానికి తెలియజేసి
3 నీవీలాగు ప్రకటింపుము।—ప్రభువైన యెహోవా
యెరూషలేమునుగూర్చి యీ మాట సెలవిచ్చుచు
న్నాడు—నీ ఉత్పత్తియు నీ జననమును కనానీయుల
దేశసంబంధమైనవి; నీ తండ్రి అమోరీయుడు, నీ తల్లి
4 హిత్తీయురాలు. । నీ జననవిధము చూడగా నీవు పుట్టిన
నాడు నీ నాభిసూత్రము కోయబడలేదు, శుభ్రమగు
టకు నీవు నీళ్లతో కడుగబడను లేదు, వారు నీకు ఉప్పు
5 రాయకపోయిరి బట్టచుట్టకపోయిరి. । ఈ పనులలో
ఒకటైనను నీకు చేయవలెనని యెవరును కటాక్షింప
లేదు, నీయందు జాలిపడినవాడొకడును లేకపోయెను;
నీవు పుట్టిననాడే బయట నేలను పారవేయబడి,
చూడ అసహ్యముగా ఉంటివి. । అయితే నేను నీ 6
యొద్దకు వచ్చి, రక్తములో పొర్లుచున్న నిన్ను చూచి—
నీ రక్తములో పొర్లియున్న నీవు బ్రదుకుమని నీతో
చెప్పితిని, నీవు నీ రక్తములో పొర్లియున్నను బ్రదుకు
మని నీతో చెప్పితిని. । మరియు నేల నాటబడిన చిగురు 7
వృద్ధియగునట్లు నేను నిన్ను వృద్ధిలోకి తేగా నీవు
ఎదిగి పెద్దదానవై ఆభరణభూషితురాలవైతివి; దిగం
బరివై వస్త్రహీనముగానున్న నీకు స్తనము లేర్పడెను
తలవెండ్రుకలు పెరిగెను. । మరియు నేను నీయొద్దకు 8
వచ్చి నిన్ను చూడగా ఇష్టము పుట్టించు ప్రాయము
నీకు వచ్చియుండెను గనుక నీకు అవమానము కలుగ
కుండ నిన్ను పెండ్లిచేసికొని నీతో నిబంధనచేసికొనగా
నీవు నాదానవైతివి; ఇదే ప్రభువైన యెహోవా
వాక్కు. । అప్పుడు నేను నీళ్లతో నిన్ను కడిగి నీ 9
మీదనున్న రక్తమంతయు తుడిచి నిన్ను నూనెతో
అంటి । విచిత్రమైన కుట్టుపనిచేసిన వస్త్రము నీకు 10
ధరింపజేసితిని, సన్నమైన యెఱ్ఱచర్మముతో చేయ
బడిన పాదరక్షలు నీకు తొడిగించితిని, సన్నపు అవిసె
నారబట్ట నీకు వేయించితిని నీకు పట్టుబట్ట ధరింపజేసి
తిని. । మరియు ఆభరణములచేత నిన్ను అలంకరించి 11
నీ చేతులకు కడియములు పెట్టి నీ మెడకు గొలుసు
తగిలించి । నీ చెవులకును ముక్కుకును పోగులను నీ 12
తలకు కిరీటమును పెట్టించితిని. । ఈలాగు బంగారు 13
తోను వెండితోను నేను నిన్ను అలంకరించి, సన్నపు
అవిసెనారయు పట్టును విచిత్రపు కుట్టుపనియుగల
బట్టలును నీకు ధరింపజేసి, గోధుమలును తేనెయు
నూనెయు నీకాహారముగా ఇయ్యగా నీవు మిక్కిలి
సౌందర్యవతివై రాణియగునంతగా అభివృద్ధినొంది
తివి. । నేను నీ కనుగ్రహించిన నా ప్రభావముచేత నీ 14
సౌందర్యము పరిపూర్ణము కాగా అన్యజనులు దాని
చూచి నీ కీర్తి ప్రశంసించుచువచ్చిరి; ఇదే ప్రభువగు
యెహోవా వాక్కు.

అయితే నీ సౌందర్యమును నీవు ఆధారము చేసి 15
కొని, నీకు కీర్తి వచ్చినందున నీవు వేశ్యవై దారినిపోవు
ప్రతివానితో బహుగా వ్యభిచరించుచు వచ్చితివి,
పిలిచినవానితోనెల్ల పోతివి. । మరియు నీ వస్త్రములలో 16
కొన్ని తీసి, చిత్రముగా అలంకరింపబడిన ఉన్నతస్థల
ములను ఏర్పరచి, వాటిమీద పండుకొని వ్యభిచారము
చేసితివి; అట్టి కార్యములు ఎంతమాత్రమును జరుగ
కూడనివి, అట్టివియు నిక జరుగవు. । నేను నీకిచ్చిన 17
బంగారువియు వెండివియునైన ఆభరణములను తీసి
కొని నీవు పురుషరూప విగ్రహములను చేసికొని
వాటితో వ్యభిచరించితివి. । మరియు నీ విచిత్రవస్త్రము 18
లను తీసి వాటికి ధరింపజేసి, నా తైలమును నా ధూప
మును వాటికర్పించితివి. । భోజనమునకై నేనిచ్చిన 19
ఆహారమును గోధుమ పిండిని నూనెను తేనెను తీసికొని

యింపైన సువాసన కలుగునట్లు నీవు ఆ బొమ్మలకు
అర్పించితివి, ఆలాగున జరిగెను గదా; యిదే ప్రభు
20 వగు యెహోవా వాక్కు. । మరియు నీవు నాకు
21 కనిన కుమారులను కుమార్తెలను ఆ బొమ్మలు మ్రింగి
వేయునట్లు వాటి పేరట వారిని వధించితివి, నీ జార
త్వము చాలకపోయెననియా నా పిల్లలను వధించి
22 వాటికి ప్రతిష్ఠించి యప్పగించితివి? । నీ బాల్యకాల
మందు నీవు దిగంబరవై వస్త్రహీనముగానుండి నీ రక్త
ములో నీవు పొర్లుచుండిన సంగతి మనస్సునకు తెచ్చు
కొనక యిన్ని హేయక్రియలను ఇంత జారత్వమును
23 చేయుచు వచ్చితివి. । ఇంతగా చెడుతనము జరిగించి
నందుకు నీకు శ్రమ నీకు శ్రమ; యిదే ప్రభువైన
24 యెహోవా వాక్కు. । నీవు వీధి వీధిని గుళ్లు కట్టితివి,
25 యెత్తయిన బలిపీఠములను ఏర్పరచితివి, । ప్రతి అడ్డ
దోవను నీ బలిపీఠము కట్టి నీ సౌందర్యమును హేయ
క్రియకు వినియోగపరచి నీయొద్దకు వచ్చినవారికందరి
కిని నీ పాదములు తెరచి వారితో బహుగా వ్యభిచ
26 రించితివి. । మరియు నీవు మదించియున్న నీ పొరుగు
వారైన ఐగుప్తీయులతో వ్యభిచరించి నీ జారత్వక్రియ
27 లను పెంపుచేసి నాకు కోపము పుట్టించితివి. । కాబట్టి
నేను నీకు విరోధినై నీ జీవనోపాధిని తక్కువచేసి, నీ
కామవికార చేష్టలకు సిగ్గుపడిన నీ శత్రువులైన ఫిలిష్తీ
28 యుల కుమార్తెలకు నిన్ను అప్పగించుచున్నాను. । అంత
టితో తృప్తినొందక అష్షూరువారితోను నీవు వ్యభిచ
రించితివి, వారితో కూడి జారత్వముచేసినను తృప్తి
29 నొందకపోతివి. । కనానుదేశము మొదలుకొని కల్దీయ
దేశమువరకు నీవు బహుగా వ్యభిచరించినను నీవు
30 తృప్తినొందలేదు. । నీ హృదయమెంత బలహీనమా
యెను, సిగ్గుమాలిన వేశ్యాక్రియలైన వీటినన్నిటిని జరి
31 గించుటకై । నీవు ప్రతి అడ్డదోవను గుళ్లను ప్రతి
రాజవీధిని యొక బలిపీఠమును కట్టుచు, వేశ్యచేయు
నట్లు చేయక, జీతము పుచ్చుకొననొల్లక యుంటివి.
వ్యభిచారిణియగు భార్య తన పురుషుని త్రోసివేసి ।
32 అన్యులను చేర్చుకొనును గదా, పురుషులు వేశ్యలకు
33 పడుపుసొమ్మిచ్చెదరు గదా; నీవిటకాండ్లు నలుదిక్కుల
నుండి వచ్చి నీతో వ్యభిచరించునట్లు వారికందరికి నీవే
సొమ్మిచ్చుచు వచ్చితివి, బహుమానములు నిచ్చుచువచ్చి
34 తివి. । నీ జారత్వమునకును ఇతర స్త్రీల జారత్వమున
కును భేదమేమనగా వ్యభిచరించుటకు ఎవడైనను నీ
వెంట తిరుగుటయు లేదు, నీకు పడుపుసొమ్మిచ్చుటయు
లేదు, నీవే యెదురు జీతమిచ్చితివి, ఇదే నీకును వారి
కిని కలిగిన భేదము; ఇదే యెహోవా వాక్కు.
35 కాబట్టి వేశ్యా, యెహోవా మాట ఆలకింపుము ।
36 —ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా—నీ
విటకాండ్లతో నీవు నీ సొమ్ము వ్యయపరచి నీవు వ్యభి
చారముచేసి నీ మానము నీవు కనుపరచుకొనిన దానిని

బట్టియు, నీ విటకాండ్లనుబట్టియు, హేయవిగ్రహము
లనుబట్టియు, నీవు వాటికప్పగించిన నీ బిడ్డల రక్తమును
బట్టియు, । నీవు సంభోగించిన నీ విటకాండ్లనందరిని 37
నీకిష్టులైనవారినందరిని నీవు ద్వేషించువారినందరిని నేను
పోగుచేయుచున్నాను; వారిని నీ చుట్టు పోగుచేసి
సమకూర్చి వారికి నీ మానము కనబడునట్లు నేను
దాని బయలుపరచెదను. । జారిణులై హత్యలు జరిగించు 38
స్త్రీలకు రావలసిన తీర్పు నీకు విధించి, క్రోధముతోను
రోషముతోను నీకు రక్తము నియమింతును. । వారి 39
చేతికి నిన్ను అప్పగించెదను, నీవు కట్టిన గుళ్లను వారు
పడద్రోసి నీవు నిలువబెట్టిన బలిపీఠములను ఊడబెరికి
నీ బట్టలను తీసివేసి నీ సొగసైన ఆభరణములను పట్టు
కొని నిన్ను దిగంబరగాను వస్త్రహీనురాలుగాను చేయు
దురు. । వారు నీమీదికి సమూహములను రప్పించి 40
నిన్ను రాళ్లతో కొట్టి చంపుదురు, కత్తులచేత నిన్ను
పొడిచివేయుదురు. । వారు నీ యిండ్లను అగ్ని 41
చేత కాల్చుదురు, అనేక స్త్రీలు చూచుచుండగా నీకు
శిక్ష విధింతురు, ఈలాగున నేను నీ వేశ్యాత్వమును
మాన్పింపగా నీవికను పడుపుసొమ్మియ్యక యుందువు; ।
ఈ విధముగా నీమీదనున్న నా క్రోధమును చల్లార్చు 42
కొందును, నా రోషము నీ యెడల మానిపోవును.
ఇకను ఆయాసపడకుండ నేను శాంతము తెచ్చుకొం
దును. । నీ యౌవనదినములను తలంచుకొనక వీటన్నిటి 43
చేత నీవు నన్ను విసికించితివి గనుక నీవు చేసియున్న
హేయక్రియలన్నిటికంటెను ఎక్కువైన మోసకృత్య
ములను నీవు జరిగించకుండునట్లు నీ ప్రవర్తననుబట్టి
నేను నీకు శిక్ష విధింతును; ఇదే ప్రభువగు యెహోవా
వాక్కు.

సామితెలు చెప్పువారందరును — తల్లి యెట్టిదో 44
బిడ్డయు అట్టిదే యని నిన్నుగూర్చి యందురు. । పెనిమి 45
టిని బిడ్డలను విడనాడిన నీ తల్లితో నీవు సాటిదానవు,
పెనిమిటిని బిడ్డలను విడనాడిన నీ అక్కచెల్లెండ్లతో
నీవు సాటిదానవు; నీ తల్లి హిత్తీయురాలు నీ తండ్రి
అమోరీయుడు, । నీ యెడమప్రక్కను నివసించు 46
షోమ్రోనును దాని కుమార్తెలును నీకు అక్కలు, నీ
కుడిప్రక్కను నివసించు సొదొమయు దాని కుమార్తె
లును నీకు చెల్లెండ్లు. । అయితే వారి ప్రవర్తన నను 47
సరించుటయు, వారు చేయు హేయక్రియలు చేయు
టయు స్వల్పకార్యమని యెంచి, వారి నడతలను
మించునట్లుగా నీవు చెడుమార్గములయందు ప్రవర్తించి
తివి. । నీవును నీ కుమార్తెలును చేసినట్లు నీ చెల్లెలైన 48
సొదొమయైనను దాని కుమార్తెలైనను చేసినవారు
కారని నా జీవముతోడు ప్రమాణము చేయుచు
న్నాను; ఇదే ప్రభువగు యెహోవా వాక్కు. । నీ 49
చెల్లెలైన సొదొమ చేసిన దోషమేదనగా, దానికిని దాని
కుమార్తెలకును కలిగిన గర్వమును ఆహార సమృద్ధియు

నిశ్చింతయైన సుఖస్థితియు ననుసరించెను; అది దీనుల
50 కును దరిద్రులకును సహాయము చేయకుండెను. । వారు
అహంకరించి నా దృష్టికి హేయక్రియలు చేసిరి
గనుక నేను దాని చూచి వారిని వెళ్లగొట్టితిని. ।
51 షోమ్రోను నీ పాపములలో సగమైన చేయ
లేదు, అది చేసినవాటికంటె నీవు అత్యధికముగా
హేయక్రియలు చేసితివి; నీవు ఇన్ని హేయక్రియలు
చేసి నీ సహోదరిని నిర్దోషురాలినిగా కనుపరచితివి. ।
52 నీవు వారికంటె అత్యధికముగా హేయక్రియలు
జరిగించినందున నిన్నుబట్టి చూడగా నీ సహోదరీలు
నిర్దోషురాండ్రుగా కనబడుదురు; నీవు వారికి విధిం
చిన అవమానశిక్ష నీకే రావలెను; నిన్నుబట్టి చూడగా
నీ సహోదరీలు నిర్దోషురాండ్రుగా కనబడుదురు
53 గనుక నీవు అవమానపరచబడి సిగ్గునొందుము. । నీవు
చేసినదాని అంతటి విషయమై నీవు బిడియపడి సిగ్గునొంది
54 వారిని ఓదార్చునట్లు । అపాయమునొందిన సొదొమను
దాని కుమార్తెలను షోమ్రోనును దాని కుమార్తెలను వారి
వలెనే అపాయమొందిన నీవారిని మరల స్థాపించె
55 దను. । సొదొమయు దాని కుమార్తెలును తమ పూర్వ
స్థితికి వచ్చెదరు, షోమ్రోనును దాని కుమార్తెలును
తమ పూర్వస్థితికి వచ్చెదరు, నీవును నీ కుమార్తెలును
56 మీ పూర్వస్థితికి వచ్చెదరు. । నీ చుట్టు ఉండి నిన్ను
తృణీకరించిన ఫిలిష్తీయుల కుమార్తెలును అరామీ
57 యుల కుమార్తెలును నిన్ను అవమానపరచగా । నీ
దుర్మార్గము వెల్లడి చేయబడకముందు నీవు గర్వించి
యున్నప్పుడు నీ చెల్లెలగు సొదొమను ప్రస్తాపమెత్తక
58 పోతివి. । నీవు చేసిన మోసమును నీ హేయకృత్య
ములను నీవే భరించితివి; ఇదే యెహోవా వాక్కు. ।
59 ప్రభువైన యెహోవా ఈలాగున సెలవిచ్చుచు
న్నాడు—చేసిన నిబంధనను భంగము చేయవలెనని
ప్రమాణమును తృణీకరించుదానా, నీవు చేసినట్టే
60 నేను నీకు చేయబోవుచున్నాను. । నీ యౌవన దిన
ములయందు నేను నీతో చేసిన నిబంధనను జ్ఞాపకము
నకు తెచ్చుకొని యొక నిత్యనిబంధనను నీతో చేసి
61 దాని స్థిరపరతును. । నీ అక్కచెల్లెండ్రు నీవు చేసిన
నిబంధనలో పాలివారు కాకుండినను నేను వారిని
నీకు కుమార్తెలగా ఇయ్యబోవుచున్నాను. నీవు వారిని
చేర్చుకొనునప్పుడు నీ ప్రవర్తన మనస్సుకు తెచ్చుకొని
62 సిగ్గుపడుదువు. । నేను యెహోవానని నీవు తెలిసి
కొనునట్లు నేను నీతో నా నిబంధనను స్థిరపరచెదను. ।
63 నీవు చేసినది అంతటినిమిత్తము నేను ప్రాయశ్చిత్తము
చేయగా దానిని మనస్సుకు తెచ్చుకొని సిగ్గుపడి సిగ్గు
చేత నోరు మూసికొందువు; ఇదే యెహోవా
వాక్కు.

17 మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్య
2 క్షమై యీలాగు సెలవిచ్చెను । — నరపుత్రుడా,
నీవు ఉపమానరీతిగా విప్పుడు కథ యొకటి ఇశ్రా
యేలీయులకు వేయుము. ఎట్లనగా — ప్రభువగు
యెహోవా సెలవిచ్చునదేమనగా ।—నానావిధములగు 3
విచిత్ర వర్ణములుగల రెక్కలును ఈకెలును పొడు
గైన పెద్ద రెక్కలునుగల యొక గొప్ప పక్షిరాజు
లెబానోను పర్వతమునకు వచ్చి యొక దేవదారు
వృక్షపు పైకొమ్మను పట్టుకొనెను. । అది దాని 4
లేతకొమ్మల చిగుళ్లను త్రుంచి కనాను దేశమునకు
కొంచుపోయి వర్తకులున్న యొక పురమందు దాని
నాటెను. । మరియు అది దేశపు విత్తనములలో కొన్ని 5
తీసికొనిపోయి గన్నేరుచెట్టును నాటినట్లుగా విస్తా
రము పారు నీరు కలిగి బాగుగా సేద్యముచేయబడిన
భూమిలో దాని నాటెను. । అది చిగిర్చి పైకి పెరగక 6
విశాలముగా కొమ్మలతో అల్లుకొని గొప్ప ద్రాక్షా
వల్లి ఆయెను; దాని కొమ్మలు ఆ పక్షిరాజువైపున
అల్లుకొనుచుండెను, దాని వేళ్లు క్రిందికి తన్నుచుం
డెను; ఆలాగున ఆ ద్రాక్షచెట్టు శాఖోపశాఖలుగా
వర్ధిల్లి రెమ్మలువేసెను. । పెద్ద రెక్కలును విస్తారమైన 7
యీకెలునుగల యింకొక గొప్ప పక్షిరాజు కలదు. ఆ
చెట్టు శాఖలను బాగుగా పెంచి, బహుగా ఫలించు
మంచి ద్రాక్షావల్లి యగునట్లుగా అది విస్తార జలము
గల మంచి భూమిలో నాటబడియుండినను ఆ పక్షి
రాజు తనకు నీరు కట్టవలెనని తన పాదులకాలువలో
నుండి అది యీ పక్షితట్టు తన వేళ్లను త్రిప్పి తన
శాఖలను విడిచెను. । కావున నీవీలాగు ప్రకటింపుము 8
—ప్రభువగు యెహోవా సెలవిచ్చునదేమనగా—అట్టి 9
ద్రాక్షావల్లి వృద్ధినొందునా? అది యెండిపోవునట్లు
జనులు దాని వేళ్లను పెరికి దాని పండ్లు కోసివేతురు,
దాని చిగుళ్లు ఎండిపోగా ఎంతమంది సేద్యగాండ్లు
ఎంత కాపు చేసినను దాని వేళ్లు ఇక చిగిరింపవు. ।
అది నాటబడినను వృద్ధిపొందునా? తూర్పుగాలి దాని 10
మీద విసరగా అది బొత్తిగా ఎండిపోవును, అది
నాటబడిన పాదిలోనే యెండిపోవును.

మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై 11
యీలాగు సెలవిచ్చెను ।—తిరుగబాటుచేయు వీరితో 12
ఇట్లనుము — ఈ మాటల భావము మీకు తెలియదా?
యిదిగో బాబెలురాజు యెరూషలేమునకు వచ్చి దాని
రాజును దాని అధిపతులను పట్టుకొని, తనయొద్ద
నుండుటకై బాబెలుపురమునకు వారిని తీసికొని
పోయెను. । మరియు అతడు రాజసంతతిలో ఒకని 13
నేర్పరచి, ఆ రాజ్యము క్షీణించి తిరుగబాటుచేయ 14
లేక యుండునట్లును, తాను చేయించిన నిబంధనను
ఆ రాజు గైకొనుటవలన అది నిలిచియుండునట్లును,
అతనితో నిబంధన చేసి అతనిచేత ప్రమాణము
చేయించి, దేశములోని పరాక్రమవంతులను తీసికొని
పోయెను. । అయితే అతడు తనకు గుర్రములను 15

గొప్ప సైన్యము నిచ్చి సహాయముచేయవలెనని యడు
గుటకై ఐగుప్తుదేశమునకు రాయబారులను పంపి
బాబెలురాజుమీద తిరుగబాటు చేసెను; అతడు
వర్ధిల్లునా? అట్టి క్రియలు చేసినవాడు తప్పించు
కొనునా? నిబంధనను భంగము చేసెను గనుక తప్పించు
16 కొనడు. । ఎవనికి తాను ప్రమాణముచేసి దాని
నిర్లక్ష్యపెట్టెనో, యెవనితో తాను చేసిన నిబంధనను
అతడు భంగముచేసెనో, యెవడు తన్ను రాజుగా
నియమించెనో ఆ రాజునొద్దనే బాబెలుపురములోనే
అతడు మృతినొందునని నా జీవముతోడు ప్రమాణము
చేయుచున్నాను; ఇదే ప్రభువైన యెహోవా
17 వాక్కు. । యుద్ధము జరుగగా అనేక జనులను నిర్మూ
లము చేయవలెనని కల్దీయులు దిబ్బలు వేసి బురు
జులు కట్టిన సమయమున, ఫరో యెంత బలము ఎంత
సమూహము కలిగి బయలుదేరినను అతడు ఆ రాజుకు
18 సహాయము ఎంతమాత్రమును చేయజాలడు. । తన
ప్రమాణము నిర్లక్ష్యపెట్టి తాను చేసిన నిబంధనను
భంగముచేసెను, తన చెయ్యి యిచ్చియు ఇట్టి కార్య
ములను అతడు చేసెనే, అతడు ఎంతమాత్రమును
19 తప్పించుకొనడు. । ఇందుకు ప్రభువైన యెహోవా
ఈలాగున సెలవిచ్చుచున్నాడు — అతడు నిర్లక్ష్య
పెట్టిన ప్రమాణము నేను చేయించినది గదా, అతడు
రద్దుపరచిన నిబంధన నేను చేసినదే గదా, నా జీవము
తోడు ఆ దోషశిక్ష అతని తలమీదనే మోపుదును. ।
20 అతని పట్టుకొనుటకై నేను వలనొగ్గి యతని చిక్కించు
కొని బాబెలుపురమునకు అతని తీసికొనిపోయి,
నామీద అతడు చేసియున్న విశ్వాసఘాతుకమునుబట్టి
21 అక్కడనే అతనితో వ్యాజ్యమాడుదును. । మరియు
యెహోవానగు నేనే ఈ మాట సెలవిచ్చితినని
మీరు తెలిసికొనునట్లు అతని దండువారిలో తప్పించు
కొని పారిపోయినవారందరును ఖడ్గముచేత కూలు
దురు, శేషించినవారు నలుదిక్కుల చెదరిపోవుదురు.
22 మరియు ప్రభువైన యెహోవా ఈ మాట సెల
విచ్చుచున్నాడు—ఎత్తయిన దేవదారువృక్షపు పైకొమ్మ
యొకటి నేను తీసి దాని నాటుదును, పైగా నున్న
దాని శాఖలలో లేతదాని త్రుంచి అత్యున్నత పర్వ
23 తముమీద దాని నాటుదును. । ఇశ్రాయేలు దేశము
లోని యెత్తుగల పర్వతముమీద నేను దాని నాటగా
అది శాఖలు విడిచి బహుగా ఫలించు శ్రేష్ఠమైన దేవ
దారు చెట్టగును, సకలజాతుల పక్షులును దానిలో
24 గూళ్లు కట్టుకొనును. । దాని కొమ్మల నీడను అవి
దాగును; మరియు యెహోవానగు నేనే ఘనమైన
చెట్టును నీచమైనదిగాను నీచమైన చెట్టును ఘనమైనది
గాను చేయువాడననియు, పచ్చని చెట్టు ఎండిపోవు
నట్లును ఎండిన చెట్టు పుష్టి పారునట్లును చేయువా
డననియు భూమియందుండు సకలమైన చెట్లకు తెలియ
బడును. యెహోవానగు నేను ఈ మాట సెలవిచ్చి
తిని, నేనే దాని నెరవేర్చెదను.

మరల యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై 18
యీలాగు సెలవిచ్చెను ! — తండ్రులు ద్రాక్ష 2
కాయలు తినినందుచేత పిల్లల పళ్లు పులిసెనని మీరు
చెప్పుచు వచ్చెదరే; ఇశ్రాయేలీయుల దేశమునుగూర్చి
ఈ సామెతె మీకెందుకు పలికెదరు? । నా జీవము 3
తోడు ఈ సామెతె ఇశ్రాయేలీయులలో మీరిక
పలకరు; ఇదే ప్రభువైన యెహోవా వాక్కు. ।
మనుష్యులందరు నా వశములో ఉన్నారు, తండ్రు 4
లేమి కుమారులేమి అందరును నా వశములో ఉన్నారు;
పాపముచేయువాడెవడో వాడే మరణము నొందును. ।
ఒకడు నీతిపరుడై నీతిన్యాయములను అనుసరించువాడై 5
యుండి । పర్వతములమీద భోజనము చేయకయు, 6
ఇశ్రాయేలీయులు పెట్టుకొనిన విగ్రహములతట్టు
చూడకయు, తన పొరుగువాని భార్యను చెరపకయు,
రజస్వలయైనదానిని కూడకయు, । ఎవనినైనను బాధ 7
పెట్టకయు, ఋణస్థునికి అతని తాకట్టును చెల్లించి
బలాత్కారముచేత ఎవనికైనను నష్టము కలుగజేయ
కయు నుండువాడై, ఆకలిగలవానికి ఆహారమిచ్చి
దిగంబరికి బట్టయిచ్చి । వడ్డికి అప్పియ్యకయు, లాభము 8
చేపట్టకయు, అన్యాయము చేయకయు, నిష్పక్షపాత
ముగా న్యాయముతీర్చి । యథార్థపరుడై నా కట్టడ 9
లను గైకొనుచు నా విధుల ననుసరించుచుండినయెడల
వాడే నిర్దోషియగును, నిజముగా వాడు బ్రదుకును;
ఇదే ప్రభువైన యెహోవా వాక్కు. । అయితే ఆ 10
నీతిపరునికి కుమారుడు పుట్టగా వాడు బలాత్కారము
చేయువాడై ప్రాణహానికరుడై, చేయరాని క్రియ
లలో దేనినైనను చేసి । చేయవలసిన మంచి క్రియ 11
లలో దేనినైనను చేయకయుండినయెడల, అనగా
పర్వతములమీద భోజనము చేయుటయు, తన పొరుగు
వాని భార్యను చెరుపుటయు, । దీనులను దరిద్రులను 12
బాధపెట్టి బలాత్కారముచేత నష్టము కలుగజేయు
టయు, తాకట్టు చెల్లింపకపోవుటయు, విగ్రహముల
తట్టు చూచి హేయకృత్యములు జరిగించుటయు, ।
అప్పిచ్చి వడ్డి పుచ్చుకొనుటయు, లాభము చేపట్టు 13
టయు, ఈ మొదలగు క్రియలు చేసినయెడల వాడు
బ్రదుకునా? బ్రదుకడు, ఈ హేయక్రియలన్ని
చేసెను గనుక అవశ్యముగా వానికి మరణశిక్ష విధింప
బడును, వాడు తన ప్రాణమునకు తానే ఉత్తరవాది
యగును. । అయితే అతనికి కుమారుడు పుట్టగా ఆ 14
కుమారుడు తన తండ్రి చేసిన పాపములన్నిటిని చూచి
ఆలోచించుకొని అట్టి క్రియలు చేయక యుండిన
యెడల, అనగా । పర్వతములమీద భోజనము చేయ 15
కయు, ఇశ్రాయేలీయులు పెట్టుకొనిన విగ్రహముల
తట్టు చూడకయు, తన పొరుగువాని భార్యను చెరప

16 కయు, । ఎవనినైనను బాధపెట్టకయు, తాకట్టు ఉంచు
కొనకయు, బలాత్కారముచేత నష్టపరచకయు, ఆకలి
17 గలవానికి ఆహారమిచ్చి దిగంబరికి బట్టయిచ్చి । బీద
వానిమీద అన్యాయముగా చెయ్యి వేయక లాభము
కొరకు అప్పియ్యకయు, వడ్డి పుచ్చుకొనకయు నుండిన
వాడై, నా విధుల నాచరించుచు నా కట్టడల ననుస
రించుచు నుండినయెడల అతడు తన తండ్రి చేసిన
దోషమునుబట్టి చావడు, అతడు అవశ్యముగా బ్రదు
18 కును. । అతని తండ్రి క్రూరుడై పరులను బాధపెట్టి
బలాత్కారముచేత తన సహోదరులను నష్టపరచి
తన జనులలో తగని క్రియలు చేసెను గనుక అతడే
19 తన దోషమునుబట్టి మరణమునొందును. । అయితే
మీరు—కుమారుడు తన తండ్రియొక్క దోషశిక్షకు
ఏల పాత్రుడు కాడని చెప్పుకొనుచున్నారు. కుమా
రుడు నీతిన్యాయముల ననుసరించి నా కట్టడలన్నిటిని
అనుసరించి నైకొనెను గనుక అతడు అవశ్యముగా
20 బ్రదుకును. । పాపముచేయువాడే మరణమునొందును;
తండ్రియొక్క దోష శిక్షకు కుమారుడు పాత్రుడు
కాడు, కుమారుని దోష శిక్షకు తండ్రి పాత్రుడు
కాడు, నీతిపరుని నీతి ఆ నీతిపరునికే చెందును,
21 దుష్టుని దుష్టత్వము ఆ దుష్టునికే చెందును. । అయితే
దుష్టుడు తాను చేసిన పాపములన్నిటిని విడిచి,
నా కట్టడలన్నిటిని అనుసరించి నీతిని అనుసరించి
న్యాయము జరిగించినయెడల అతడు మరణము
నొందడు, అవశ్యముగా అతడు బ్రదుకును. ।
22 అతడు చేసిన అపరాధములలో ఒకటియు జ్ఞాపకము
లోకి రాదు, అతని నీతినిబట్టి అతడు బ్రదుకును. ।
23 దుష్టులు మరణము నొందుటచేత నాకేమాత్రమైన
సంతోషము కలుగునా? వారు తమ ప్రవర్తనను దిద్దు
కొని బ్రదుకుటయే నాకు సంతోషము; ఇదే ప్రభు
24 వగు యెహోవా వాక్కు. । అయితే నీతిపరుడు తన
నీతిని విడిచి పాపము చేసి, దుష్టులు చేయు హేయ
క్రియలన్నిటిప్రకారము జరిగించినయెడల అతడు
బ్రదుకునా? అతడు చేసిన నీతికార్యములు ఏమాత్ర
మును జ్ఞాపకములోకి రావు, అతడు విశ్వాసఘాతు
కుడై చేసిన పాపమునుబట్టి మరణము నొందును. ।
25 అయితే—యెహోవా మార్గము న్యాయముకాదని
మీరు చెప్పుచున్నారు. ఇశ్రాయేలీయులారా, నా
మాట ఆలకించుడి, నా మార్గము న్యాయమే మీ
26 మార్గమేగదా అన్యాయమైనది? । నీతిపరుడు తన
నీతిని విడిచి పాపము చేసినయెడల అతడు దానినిబట్టి
మరణమునొందును; తాను పాపము చేయుటనుబట్టియే
27 గదా అతడు మరణమునొందును. । మరియు దుష్టుడు
తాను చేయుచువచ్చిన దుష్టత్వమును చేయక నీతి
న్యాయములను జరిగించినయెడల తన ప్రాణము

రక్షించుకొనును.[1] । అతడు ఆలోచించుకొని తాను 28
చేయుచు వచ్చిన అతిక్రమ క్రియలన్నిటిని చేయక
మానెను గనుక అతడు మరణమునొందక అవశ్య
ముగా బ్రదుకును. । అయితే ఇశ్రాయేలీయులు — 29
యెహోవా మార్గము న్యాయముకాదని చెప్పు
చున్నారు. ఇశ్రాయేలీయులారా, నా మార్గము
న్యాయమేగాని మీ మార్గము న్యాయము కాదు. ।
కాబట్టి ఇశ్రాయేలీయులారా, యెవని ప్రవర్తనను బట్టి 30
వానికి శిక్ష విధింతును. మనస్సు త్రిప్పుకొని మీ అక్ర
మములు మీకు శిక్షాకారణములు కాకుండునట్లు
వాటినన్నిటిని విడిచిపెట్టుడి. । మీరు జరిగించిన 31
అక్రమ క్రియలన్నిటిని విడిచి నూతనహృదయమును
నూతనబుద్ధియు తెచ్చుకొనుడి. ఇశ్రాయేలీయులారా,
మీరెందుకు మరణము నొందుదురు? ఇదే ప్రభువగు
యెహోవా వాక్కు. । మరణమునొందువాడు మర 32
ణము నొందుటనుబట్టి నేను సంతోషించువాడను
కాను. కావున మీరు మనస్సుత్రిప్పుకొనుడి అప్పుడు
మీరు బ్రదుకుదురు; ఇదే ప్రభువగు యెహోవా
వాక్కు.

మరియు నీవు ఇశ్రాయేలీయుల అధిపతులను **19**
గూర్చి ప్రలాపవాక్యము నెత్తి ఇట్లు ప్రకటింపుము ।
—నీ తల్లి ఎటువంటిది? ఆడుసింహము (వంటిది), ఆడు 2
సింహములమధ్య పండుకొనెను, కొదమసింహముల
మధ్య తన పిల్లలను పెంచెను; । వాటిలో ఒకదానిని 3
అది పెంచగా అది కొదమసింహమై వేటాడ నేర్చు
కొని మనుష్యులను భక్షించునదాయెను. । అన్యజనులు 4
దాని సంగతి విని తమ గోతిలో దాని చిక్కించుకొని
దాని ముక్కుకు గాలము తగిలించి ఐగుప్తుదేశమునకు
దాని తీసికొనిపోయిరి. । తల్లి దాని కనిపెట్టి తన ఆశ 5
భంగమాయెనని తెలిసికొని, తన పిల్లలలో మరియొక
దాని చేపట్టి దాని పెంచి కొదమసింహముగా చేసెను. ।
ఇదియు కొదమసింహమై కొదమసింహములతో 6
కూడ తిరుగులాడి వేటాడనేర్చుకొని మనుష్యులను
భక్షించునదై । వారి నగరులను[2] అవమానపరచి వారి 7
పట్టణములను పాడుచేసెను; దాని గర్జనధ్వనికి దేశ
మును అందులోనున్న సమస్తమును పాడాయెను. ।
నలుదిక్కులదేశపు జనులందరు దాని పట్టుకొనుటకు 8
పొంచియుండి ఉరినొగ్గగా అది వారి గోతిలో
చిక్కెను. । అప్పుడు వారు దాని ముక్కుకు గాలము 9
తగిలించి దానిని బోనులో పెట్టి బాబెలు రాజు
నొద్దకు తీసికొనిపోయి అతనికి అప్పగించిరి; దాని
గర్జనము ఇశ్రాయేలీయుల పర్వతములమీద ఎన్నటికిని
వినబడకుండునట్లు వారు దానిని గట్టి స్థలమందుంచిరి.
మరియు నీకు క్షేమము కలిగియుండగా నీ తల్లి 10
ఫలభరితమై తీగెలతో నిండియుండి విస్తారమైన జల

1 లేక, అతడు బ్రదుకును.
2 లేక, విధవరాండ్రను.

ముల దగ్గర నాటబడిన ద్రాక్షావల్లివలె నుండెను. ।
11 భూపతులకు దండములైనట్టి గట్టిచువ్వలు దానికి కలిగి
యుండెను, అది మేఘముల నంటునంతగా పెరిగెను,
విస్తారమైన దాని కొమ్మలు బహు ఎత్తుగా కనబడెను. ।
12 అయితే బహు రౌద్రముచేత అది పెరికివేయబడినదై
నేలమీద పడవేయబడెను, తూర్పుగాలి విసరగా
దాని పండ్లు వాడెను. మరియు దాని గట్టిచువ్వలు
13 తెగి వాడిపోయి అగ్నిచేత కాల్చబడెను. । ఇప్పుడు
14 అది అరణ్యములో మిక్కిలి యెండిపోయిన నిర్జల
స్థలములలో నాటబడియున్నది. మరియు దాని కొమ్మల
చువ్వలలోనుండి అగ్ని బయలుదేరుచు దాని పండ్లను
దహించుచున్నది గనుక రాజదండమునకు తగిన గట్టి
చువ్వ యొకటియు విడువబడలేదు. ఇదియే ప్రలాప
వాక్యము, ఇదియే ప్రలాపమునకు కారణమగును.

20 ఏడవ సంవత్సరము అయిదవ నెల పదియవ
దినమున ఇశ్రాయేలీయుల పెద్దలలో కొందరు
యెహోవాయొద్ద విచారణచేయుటకై నాయొద్దకు
2 వచ్చి నాయెదుట కూర్చుండియుండగా। యెహోవా
వాక్కు నాకు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను ।
3 —నరపుత్రుడా, నీవు ఇశ్రాయేలీయుల పెద్దలతో
ఇట్లనుము—ప్రభువగు యెహోవా సెలవిచ్చునదేమ
నగా — నాయొద్ద విచారణచేయుటకు మీరు వచ్చు
చున్నారే. నా జీవముతోడు నావలన ఏ ఆలోచన
యైనను మీకు దొరకదు; ఇదే ప్రభువగు యెహోవా
4 వాక్కు. । వారికి న్యాయము తీర్చుదువా? నర
పుత్రుడా, వారికి న్యాయము తీర్చుదువా? వారి పిత
రులు చేసిన హేయకృత్యములను వారికి తెలియ
5 జేయుము. । ఎట్లనగా ప్రభువైన యెహోవా ఈలాగు
సెలవిచ్చుచున్నాడు— నేను ఇశ్రాయేలును ఏర్పరచు
కొనిన నాడును, యాకోబు సంతతికి ప్రమాణము
చేసిన నాడును, ఐగుప్తుదేశమందు నన్ను వారికి
ప్రత్యక్షపరచుకొని ప్రమాణముచేసి నేను మీ దేవుడ
నైన యెహోవానని నేను ప్రకటించినకాలమున ।
6 వారిని ఐగుప్తుదేశములోనుండి రప్పించి వారికొరకు
నేను విచారించినదియు, పాలు తేనెలు ప్రవహించు
నదియు, సకలదేశములకు ఆభరణమైనదియునైన దేశ
ములోకి తోడుకొనిపోయెదనని చెప్పిన కాలముననే
7 నేను ప్రమాణము చేసితిని. । అప్పుడు — నేను మీ
దేవుడనైన యెహోవాను, మీలో ప్రతివాడు తన
కిష్టమైన హేయకృత్యములను విడిచిపెట్టవలెను, ఐగు
ప్తీయుల విగ్రహములను పూజించుటచేత మిమ్మును
మీరు అపవిత్రపరచుకొనకుండవలెను అని నేను
8 ఆజ్ఞాపించితిని. । అయితే వారు నా మాట విననొల్లక
నామీద తిరుగబాటుచేసి, తమకిష్టమైన హేయకృత్య
ములు చేయుట మానలేదు, ఐగుప్తీయుల విగ్రహ
ములను పూజించుట మానలేదు గనుక వారు ఐగుప్తీ
యులదేశములో ఉండగానే నేను నా రౌద్రము
వారిమీద కుమ్మరించి నా కోపము వారిమీద తీర్చు
కొందునని యనుకొంటిని. । అయితే ఏ అన్యజనుల 9
యెదుట నన్ను నేను బయలుపరచుకొంటినో, ఏ
అన్యజనులమధ్య వారుండిరో ఆ అన్యజనులలో
వారున్న అన్యజనులయెదుట వారికి నన్ను బయలు
పరచుకొంటిని, నా నామమునకు దూషణ కలుగ
కుండుటకై ఆలాగు చేయుటమాని, ఆ జనులు చూచు
చుండగా నా నామఘనతకొరకు నేను వారిని ఐగుప్తు
దేశములోనుండి రప్పించితిని. । వారిని ఐగుప్తుదేశ 10
ములోనుండి రప్పించి అరణ్యములోకి తోడుకొని
వచ్చి । వారికి నా కట్టడలను నియమించి నా విధు 11
లను వారికి తెలియజేసితిని. ఎవడైన వాటి నను
సరించినయెడల వాటినిబట్టి బ్రదుకును. । మరియు 12
యెహోవానగు నేనే వారిని పవిత్రపరచువాడనని
వారు తెలిసికొనునట్లు నాకును వారికిని మధ్య
విశ్రాంతిదినములను వారికి సూచనగా నేను నియ
మించితిని. । అయితే అరణ్యమందు ఇశ్రాయేలీయులు 13
నామీద తిరుగబాటుచేసి నా కట్టడల ననుసరింపక,
తాము అనుసరించి బ్రదుకవలెనని నేనిచ్చిన విధులను
తృణీకరించి, నేను నియమించిన విశ్రాంతిదినములను
అపవిత్రపరచగా, అరణ్యమందు నా రౌద్రాగ్ని
వారిమీద కుమ్మరించి వారిని నిర్మూలము చేయుదునను
కొంటిని. । అయితే నేను వారిని రప్పింపగా ఏ 14
అన్యజనులు చూచిరో యే అన్యజనులలోనుండి నేను
వారిని రప్పించితినో వారియెదుట నా నామమునకు
దూషణ కలుగకుండునట్లు నేననుకొనిన ప్రకారము
చేయక మానితిని. । మరియు తమకిష్టమైన విగ్రహ 15
ముల ననుసరింపవలెనని కోరి, వారు నా విధులను
తృణీకరించి నా కట్టడల ననుసరింపక నేను నియమిం
చిన విశ్రాంతిదినములను అపవిత్రపరచగా । ఇచ్చెద 16
నని నేను సెలవిచ్చినట్టియు, పాలు తేనెలు ప్రవ
హించునట్టియునైన సకల దేశములకు ఆభరణమగు
దేశములోకి వారిని రప్పింపనని వారు అరణ్యములో
ఉండగానే నేను ప్రమాణముచేసితిని. । అయినను 17
వారు నశించిపోకుండునట్లు వారియందు కనికరించి,
అరణ్యములో నేను వారిని నిర్మూలము చేయకపోతిని. ।
వారు అరణ్యములో ఉండగానే వారి పిల్లలతో 18
ఈలాగు సెలవిచ్చితిని—మీరు మీ తండ్రుల ఆచార
ములను అనుసరింపకయు, వారి పద్ధతులనుబట్టి ప్రవ
ర్తింపకయు, వారు పెట్టుకొనిన దేవతలను పూజించి
మిమ్మును మీరు అపవిత్రపరచుకొనకయు నుండుడి. ।
నేనే మీ దేవుడనైన యెహోవాను గనుక నా కట్ట 19
డల ననుసరించి నా విధులను గైకొని నేను నియమిం
చిన విశ్రాంతిదినములను ఆచరించుడి. । నేను మీ 20
దేవుడనైన యెహోవానని మీరు తెలిసికొనునట్లు

ఆ విశ్రాంతిదినములు నాకును మీకును మధ్యను
21 సూచనగా ఉండును. అయినను ఆ జనులు సహా
నా మీద తిరుగబడి, తామనుసరించి బ్రదుకవలెనని
నేనిచ్చిన నా కట్టడలను అనుసరింపకయు, నా విధు
లను గైకొనకయు, నేను నియమించిన విశ్రాంతిదిన
ములను అపవిత్రపరచిరి గనుక, వారు అరణ్యములో
ఉండగానే నేను నా రౌద్రాగ్ని వారిమీద కుమ్మరించి
నా కోపము వారిమీద తీర్చుకొందునని యను
22 కొంటిని. । అయితే నేను ప్రత్యక్షమైన అన్యజనుల
మధ్య నా నామమునకు దూషణ కలుగకుండునట్లు
ఏ జనులలోనుండి వారిని రప్పించితినో ఆ జనులు
చూచుచుండగా నా హస్తము వెనుకకు తీసి నా వాగ్దా
23 నము నెరవేర్చితిని. । మరియు వారు నా విధుల నను
24 సరింపక నా కట్టడలను తృణీకరించి, నేను విధించిన
విశ్రాంతిదినములను అపవిత్రపరచి, తమ పితరులు
పెట్టుకొనిన విగ్రహములను పూజింపగోరగా, అన్య
జనులలో వారిని చెదరగొట్టి సకలదేశములలోకి
25 వారిని వెళ్లగొట్టుదునని ప్రమాణము చేసితిని. । నేను
యెహోవానని వారు తెలిసికొనునట్లు వారిని విస్మ
యము నొందింపవలెనని అనుకూలము కాని కట్టడ
లను తాము బ్రదుకుటకు ప్రయోజనకరములు కాని
26 విధులను వారికిచ్చితిని. । తొలిచూలిని ప్రతిష్ఠించు
టకై బలిదానముల నిచ్చుటచేత తమ్మునుతాము అప
విత్రపరచుకొననిచ్చితిని.
27 కాబట్టి నరపుత్రుడా, ఇశ్రాయేలీయులతో మాట
లాడి ఇట్లు ప్రకటింపుము—ప్రభువగు యెహోవా
సెలవిచ్చునదేమనగా—మీ పితరులు నాయెడల విశ్వాస
28 ఘాతుకులై నన్ను దూషించి । వారికిచ్చెదనని నేను
ప్రమాణపూర్వకముగా చెప్పిన దేశములోకి నేను
వారిని రప్పించిన తరువాత, ఎత్తయిన యొక కొండనే
గాని పచ్చనైన యొక వృక్షమునేగాని తాము చూచి
నప్పుడెల్లను బలులు అర్పించుచు అర్పణలను అర్పిం
చుచు అక్కడనే పరిమళ ధూపము ప్రతిష్ఠించుచు
పానార్పణములు చేయుచు నాకు కోపము పుట్టిం
29 చిరి. । మీరు పోవుచున్న ఉన్నతస్థలము లేమిటని
నేనడిగితిని; అయినను ఉన్నతస్థలమను పేరు నేటి
30 వరకు వాడుకలోనున్నది. । కావున ఇశ్రాయేలీయు
లకు ఈ మాట ప్రకటింపుము—ప్రభువైన యెహోవా
సెలవిచ్చునదేమనగా—మీ పితరుల రీతిని మీరును
అపవిత్రులైతిరే, వారు పెట్టుకొనిన విగ్రహములను
31 అనుసరించుచు మీరును వ్యభిచారులైతిరే; । నేటివర
కును మీరు అర్పణలను అర్పించి మీ కుమారులను
అగ్నిలో ప్రతిష్ఠించునప్పుడు, మీరు పెట్టుకొనిన
విగ్రహములన్నిటికి పూజచేసి అపవిత్రులగుచున్నారే;
ఇశ్రాయేలీయులారా, నాయొద్ద మీరు విచారణ
చేయుదురా? నా జీవముతోడు నావలన ఆలోచన
మీకు దొరుకదు; ఇదే ప్రభువైన యెహోవా
వాక్కు. । —అన్యజనులేమి భూమిమీది యే జను 32
లేమి చేయునట్లు మేమును కొయ్యలకును రాళ్లకును
పూజచేతుమని మీరనుకొనుచున్నారే, మీరు ఇచ్ఛ
యించినదాని ప్రకారమెన్నటికిని జరుగదు. । నా 33
జీవముతోడు నా రౌద్రము కుమ్మరించుచు, భుజబలము
తోను చాచిన బాహువుతోను నేను మీపైన అధి
కారముచేసెదను. । మరియు నేను రౌద్రము కుమ్మ 34
రించుచు, భుజబలముతోను చాచిన బాహువుతోను
మిమ్మును చెదరగొట్టిన ఆ యా దేశములలోనుండియు
జనులలోనుండియు నేను మిమ్మును సమకూర్చి । జనము 35
లున్న అరణ్యములోకి మిమ్మును రప్పించి, అక్కడ
ముఖాముఖిగా మీతో వ్యాజ్యమాడెదను; ఇదే
యెహోవా వాక్కు. । ఐగుప్తీయులదేశపు అరణ్య 36
ములో నేను మీ పితరులతో వ్యాజ్యమాడినట్టు
మీతోను వ్యాజ్యమాడెదను; ఇదే ప్రభువైన
యెహోవా వాక్కు. । చేతి కఱ్ఱక్రింద మిమ్మును 37
దాటించి నిబంధనకు లోపరచెదను. । మరియు నామీద 38
తిరుగబడువారిని దోషము చేయువారిని మీలో
ఉండకుండ ప్రత్యేకించెదను, తాము కాపురమున్న
దేశములోనుండి వారిని రప్పించెదను గాని నేను
యెహోవానని మీరు తెలిసికొనునట్లు వారు ఇశ్రా
యేలు దేశములో ప్రవేశించరు. । ఇశ్రాయేలీయు 39
లారా, మీరు పెట్టుకొనిన విగ్రహములను మీకిష్టమై
నట్టుగా పూజించుకొనుడి, తరువాతికాలమున మీ
అర్పణలచేతను మీ విగ్రహములచేతను నా పరిశుద్ధ
నామమును అపవిత్రపరచక మీరు నా మాట నిశ్చయ
ముగా వినగోరుదురు. । నిజముగా ఇశ్రాయేలీయుల 40
ఉన్నతమైన కొండయగు నా పరిశుద్ధ పర్వతమందు
ఆ యా దేశములలోనున్న ఇశ్రాయేలీయులందరును
నాకు సేవచేయుదురు; ఇదే ప్రభువైన యెహోవా
వాక్కు. అచ్చటనే నేను వారిని అంగీకరించెదను.
అచ్చటనే మీ ప్రతిష్ఠితమైన యర్పణలను, మీ ప్రథమ
ఫలదానములను, ప్రతిష్ఠితములగు మీ కానుకలనన్ని
టిని నేనంగీకరించెదను. । జనములలోనుండి నేను 41
మిమ్మును రప్పించునప్పుడును, మిమ్మును చెదరగొట్టిన
ఆ యా దేశములలోనుండి మిమ్మును సమకూర్చు
నప్పుడును, పరిమళధూపముగా మిమ్మును అంగీకరించె
దను, అన్యజనులయెదుటను మీ మధ్యను నన్ను నేను
పరిశుద్ధపరచుకొందును. । మీ పితరులకిచ్చెదనని నేను 42
ప్రమాణపూర్వకముగా చెప్పిన దేశమునకు, అనగా
ఇశ్రాయేలీయుల దేశమునకు నేను మిమ్మును రప్పించు
నప్పుడు నేనే యెహోవానని మీరు తెలిసికొం
దురు. । అచ్చట చేరి మీ ప్రవర్తనను, మిమ్మును మీరు 43
అపవిత్రపరచుకొనిన మీ క్రియలన్నిటిని మనస్సుకు
తెచ్చుకొని, మీరు చేసిన దుష్క్రియలనుబట్టి మిమ్మును

44 మీరే అసహ్యించుకొందురు. । ఇశ్రాయేలీయులారా,
మీ దుర్మార్గతనుబట్టియు మీ కాని చేష్టలనుబట్టియు
కాక నా నామమునుబట్టియే నేను మీ కీలాగున
చేయగా నేనే యెహోవానని మీరు తెలిసికొం
45 దురు; ఇదే యెహోవా వాక్కు. । మరియు
యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై యీలాగు
46 సెలవిచ్చెను । —నరపుత్రుడా, నీ ముఖము దక్షిణపు
తట్టు త్రిప్పుకొని దక్షిణదేశమునకు ప్రకటింపుము,
దక్షిణదేశపు అరణ్యమునుగూర్చి ప్రవచించి ఇట్లనుము।
47 —దక్షిణదేశమా, యెహోవా మాట ఆలకించుము—
ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా—నేను
నీలో అగ్ని రాజబెట్టెదను, అది నీలోనున్న పచ్చని
చెట్లన్నిటిని ఎండిన చెట్లన్నిటిని దహించును, అది
ఆరిపోకుండ మండును, దక్షిణదిక్కు మొదలుకొని
ఉత్తరదిక్కువరకు భూముఖమంతయు దానిచేత కాల్చ
48 బడును. । అది ఆరిపోకుండ యెహోవానైన నేను
దాని రాజబెట్టితినని సమస్తమైన జనులకు తెలియ
49 బడును. । అయ్యో ప్రభువా యెహోవా—వీడు
గూఢమైన మాటలు పలుకువాడు కాడా అని వారు
నన్నుగూర్చి చెప్పుదురని నేనంటిని.

21 అప్పుడు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
2 యీలాగు సెలవిచ్చెను । —నరపుత్రుడా, యెరూష
లేముతట్టు నీ ముఖము త్రిప్పుకొని, పరిశుద్ధస్థలములను
బట్టి ఇశ్రాయేలీయులదేశమునుగూర్చి ప్రవచించి ఇట్ల
3 నుము । —యెహోవా సెలవిచ్చునదేమనగా—నేను
నీకు విరోధినైతిని. నీతిపరులనేమి దుష్టులనేమి నీలో
ఎవరు నుండకుండ అందరిని నిర్మూలము చేయుటకై నా
4 ఖడ్గము వరదూసియున్నాను. । నీతిపరులేమి దుష్టు
లేమి యెవరును మీలో ఉండకుండ దక్షిణదిక్కు
మొదలుకొని ఉత్తరదిక్కువరకు అందరిని నిర్మూలము
చేయుటకై నా ఖడ్గము దాని వరలోనుండి బయలు
5 దేరియున్నది. । యెహోవానైన నేను నా ఖడ్గము
మరల వరలో పడకుండ దాని దూసియున్నానని జను
6 లందరు తెలిసికొందురు. । కావున నరపుత్రుడా,
నిట్టూర్పు విడువుము, వారు చూచుచుండగా నీ
నడుము బద్దలగునట్లు మనోదుఃఖముతో నిట్టూర్పు
7 విడువుము. । —నీవు నిట్టూర్పు విడిచెదవేమని వారు
నిన్నడుగగా నీవు —శ్రమదినము వచ్చుచున్నదను
దుర్వార్త నాకు వినబడినది, అందరి గుండెలు కరిగి
పోవును, అందరి చేతులు బలహీనమవును, అందరి
మనస్సులు అధైర్యపడును, అందరి మోకాళ్లు నీరవును,
ఇంతగా కీడు వచ్చుచున్నది, అది వచ్చేయున్నది అని
చెప్పుము; ఇదే యెహోవా వాక్కు.
8 మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
9 యీలాగు సెలవిచ్చెను । —నరపుత్రుడా, నీవు ఈ
మాటలు ప్రకటనచేసి ఇట్లనుము—యెహోవా సెల
విచ్చునదేమనగా—అదిగో ఖడ్గము ఖడ్గమే కనబడు
చున్నది, అది పదునుగలదై మెరుగుపెట్టియున్నది. ।
అది గొప్ప వధచేయుటకై పదును పెట్టియున్నది, 10
తళతళలాడునట్లు అది మెరుగుపెట్టియున్నది; ఇట్లుం
డగా నా కుమారుని దండము ఇతర దండములన్నిటిని
తృణీకరించునది అని చెప్పి మనము సంతోషించె
దమా! । మరియు దూయుటకు సిద్ధమగునట్లు అది 11
మెరుగుపెట్టువానియొద్ద నుంచబడియుండెను, హతము
చేయువాడు పట్టుకొనునట్లుగా అది పదునుగలదై
మెరుగుపెట్టబడి యున్నది. । —నరపుత్రుడా అంగ 12
లార్చుము, కేకలు వేయుము, అది నా జనులమీదికిని
ఇశ్రాయేలీయుల ప్రధానులమీదికిని వచ్చుచున్నది,
ఖడ్గభయము నా జనులకు తటస్థించినది గనుక నీ
తొడను చరుచుకొనుము. । శోధనకలిగెను, తృణీ 13
కరించు దండము రాకపోయిననేమి? ఇదే యెహోవా
వాక్కు. । నరపుత్రుడా, చేతులు చరుచుకొనుచు 14
సమాచారము ప్రవచింపుము, ఖడ్గము ముమ్మారు రెట్టింప
బడినదై జనులను హతముచేయునదై యున్నది, అది
గొప్పవాని అంతఃపురము చొచ్చి వాని హతము చేయు
నది. । వారి గుండెలు కరిగిపోవునట్లును, పడద్రోయు 15
అడ్డములు అధికములగునట్లును వారి గుమ్మములలో
నేను ఖడ్గము దూసెదను; అయ్యయ్యో అది తళతళ
లాడుచున్నది, హతముచేయుటకై అది దూయబడి
యున్నది. । ఖడ్గమా, సిద్ధపడియుండుము; కుడివైపు 16
చూడుము, ఎడమవైపు తిరుగుము, ఎక్కడ నీకు పని
యుండునో అక్కడికే తిరుగుము. । నేనుకూడ నా 17
చేతులు చరుచుకొని నా క్రోధము తీర్చుకొందును;
యెహోవానగు నేనే మాట ఇచ్చియున్నాను.
మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై 18
యీలాగు సెలవిచ్చెను । —నరపుత్రుడా, బాబెలు 19
రాజు ఖడ్గమువచ్చుటకు రెండు మార్గములను ఏర్పర
చుము. ఆ రెండు ఖడ్గములు ఒక దేశములోనుండి
వచ్చునట్లు సూచించుటకై యొక హస్తరూపము
గీయుము, పట్టణపు వీధికొనను దాని గీయుము. ।
ఖడ్గమునకు అమ్మోనీయుల పట్టణమగు రబ్బాకు ఒక 20
మార్గమును, యూదాదేశమందున్న ప్రాకారములు
గల పట్టణమగు యెరూషలేముకు ఒక మార్గమును
ఏర్పరచుము. । బాటలు చీలుచోట రెండు మార్గములు 21
చీలు స్థలమున శకునము తెలిసికొనుటకు బాబెలు
రాజు నిలుచుచున్నాడు; అతడు బాణములను ఇటు
అటు ఆడించుచు, విగ్రహములచేత విచారణచేయుచు,
కార్యమునుబట్టి శకునము చూచుచున్నాడు. । —
యెరూషలేము ఎదుట గుమ్మములను పడగొట్టు యంత్ర 22
ములు పెట్టుమనియు, హతముచేయుడనియు, ధ్వని
ఎత్తుమనియు, జయధ్వని బిగ్గరగా ఎత్తుమనియు,
గుమ్మములకు ఎదురుగా పడగొట్టు యంత్రములు

ఉంచుమనియు, దిబ్బలు వేయుమనియు, ముట్టడి
దిబ్బలు కట్టుమనియు తన కుడితట్టున శకునము కన
23 బడెను. । ప్రమాణము నే ఆధారముచేసికొనిన (ఇశ్రా
యేలీయులకు) ఈ శకునము వ్యర్థముగా కనబడును;
అయితే వారు పట్టబడునట్లు వారు చేసికొనిన పాప
మును యెహోవా వారి జ్ఞాపకమునకు తెప్పించును.
24 కాబట్టి ప్రభువైన యెహోవా ఈలాగు సెల
విచ్చుచున్నాడు—మీ అతిక్రమములు బయలుపడుట
వలన మీ సమస్త క్రియలలోనుండు మీ పాపములు
అగుపడునట్లు మీ దోషము మీరు మనస్సుకు తెచ్చు
కొనినందునను, నేను మిమ్మును జ్ఞాపకము చేసికొని
25 నందునను మీరు చెయ్యి చిక్కియున్నారు. । గాయ
పడినవాడా, దుష్టుడా, ఇశ్రాయేలీయులకు అధిపతీ,
దోషసమాప్తికాలమున నీకు తీర్పువచ్చియున్నది. ।
26 ప్రభువైన యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు
—నీ తలాటము తీసివేయబడును నీ కిరీటమును ఎత్త
బడును, ఇది యికను ఇట్లుండను. ఇకమీదట నీచులు
27 ఘనులగుదురు ఘనులు నీచులగుదురు. । నేను దాని
పడద్రోయుదును పడద్రోయుదును పడద్రోయు
దును; దాని స్వాస్థ్యకర్త వచ్చు పర్యంతము అదియు
నిలువదు, అప్పుడు నేను దానిని అతనికిచ్చెదను.
28 మరియు నరపుత్రుడా, నీవు ప్రవచించి ఇట్లనుము
—అమ్మోనీయులనుగూర్చియు, వారు చేయు నిందను
గూర్చియు ప్రభువైన యెహోవా సెలవిచ్చున
దేమనగా — హతము చేయుటకు ఖడ్గము ఖడ్గమే
దూయబడియున్నది, తళతళలాడుచు మెరుగుపెట్టిన
29 ఖడ్గము వధచేయుటకు దూయబడియున్నది. । శకున
గాండ్లు నీకొరకు మాయాదర్శనములు చూచుచుండ
గను, వారు వ్యర్థమైనవాటిని మీకు చెప్పుచుండగను,
దోషసమాప్తికాలమున శిక్షనొంది హతులైన దుర్మార్గుల
30 మెడల ప్రక్కన అది నిన్ను పడవేయును. । ఖడ్గమును
వరలోవేయుము; నీవు సృష్టింపబడిన స్థలములోనే
నీవు పుట్టిన దేశములోనే నేను నీకు శిక్ష విధింతును. ।
31 అప్పుడనే నా రౌద్రమును నీమీద కుమ్మరించెదను,
నా ఉగ్రతాగ్నిని నీమీద రగులబెట్టెదను, నాశనము
చేయుటయందు నేర్పరులైన క్రూరులకు నిన్ను అప్ప
32 గించెదను. । అగ్ని నిన్ను మ్రింగును, నీ రక్తము దేశ
ములో కారును, నీ వెన్నటికిని జ్ఞాపకమునకు రాక
యుందువు; యెహోవానగు నేనే మాట ఇచ్చి
యున్నాను.

22 మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
2 యీలాగు సెలవిచ్చెను । — నరపుత్రుడా, ప్రాణ
హానిచేయు ఈ పట్టణమునకు నీవు తీర్పు తీర్చుదువా?
దానికి నీవు తీర్పు తీర్చునెడల అదిచేయు హేయ
క్రియలన్నిటిని దానికి తెలియజేసి యీలాగున ప్రక
3 టింపవలెను. । — ప్రభువైన యెహోవా సెలవిచ్చున
దేమనగా—నీ కాలము వచ్చునట్లు నరహత్యలు చేయు
పట్టణమా, నిన్ను అపవిత్రపరచుకొనునట్లు విగ్రహ
ములు పెట్టుకొను పట్టణమా, నీవు చేసిన నరహత్యల
చేత నీకు నీవే నేరస్థాపన చేసికొంటివి, నీవు పెట్టుకొనిన
విగ్రహములచేత నిన్ను నీవే అపవిత్రపరచుకొంటివి, ।
నీకు నీవే శిక్ష తెప్పించుకొంటివి, శిక్షా సంవత్సరములు
వచ్చుటకు నీవే కారణమైతివి. కాబట్టి అన్యజనము
లలో నిందాస్పదముగాను, సకల దేశములలో అపహా
స్యాస్పదముగాను నిన్ను నియమించుచున్నాను. ।
సమీపస్థులేమి దూరస్థులేమి అందరును అపకీర్తి పొం
దినదానవనియు అల్లరితో నిండినదానవనియు నిన్ను
అపహసింతురు. । నీలోని ఇశ్రాయేలీయుల ప్రధాను 6
లందరును తమ శక్తికొలది నరహత్య చేయుదురు, ।
నీలో తలిదండ్రులు అవమానమొందుదురు, నీ మధ్య 7
నున్న పరదేశులు దౌర్జన్యము నొందుదురు, నీలో
తండ్రిలేనివారును విధవరాండ్రును హింసింపబడు
దురు, । నాకు ప్రతిష్ఠితములగు వస్తువులను నీవు తృణీ 8
కరించుచున్నావు, నా విశ్రాంతిదినములను నీవు అప
విత్రపరచుచున్నావు. । కొండెములు చెప్పి నరహత్య 9
చేయువారు నీలో కాపురమున్నారు, పర్వతములమీద
భోజనముచేయువారు నీ మధ్య నివసించుచున్నారు,
నీలో కామవికార చేష్టలు జరుగుచున్నవి. । తమ 10
తండ్రి మానాచ్ఛాదనము తీయువారు నీలో నున్నారు,
అశుచియై కడగానున్న స్త్రీని చెరుపువారు నీలో కాపుర
మున్నారు. । ఒకడు తన పొరుగువాని భార్యను కూడి 11
హేయక్రియలు చేయును, మరియొకడు (వావి వరు
సలుతప్పి) కామాతురుడై తన కోడలిని అపవిత్రపర
చును, నీలో జనులు తండ్రి కుమార్తెయగు తమ
సహోదరిని చెరుపుదురు. । నన్ను మరచిపోయి నర 12
హత్యకై లంచము పుచ్చుకొనువారు నీలో నున్నారు,
అప్పిచ్చి వడ్డి పుచ్చుకొని నీ పొరుగువారిని బాధించుచు
నీవు బలవంతముగా వారిని దోచుకొనుచున్నావు;
ఇదే ప్రభువైన యెహోవా వాక్కు. । నీవు పుచ్చు 13
కొనిన అన్యాయలాభమును, నీవు చేసిన నరహత్యలను
నేను చూచి నా చేతులు చరుచుకొనుచున్నాను. ।
నేను నీకు శిక్ష విధింపబోవుకాలమున ఓర్చుకొను 14
టకు చాలినంత ధైర్యము నీ హృదయమునకు కలదా?
సహించునంత బలము నీకుండునా? యెహోవానగు
నేనే మాట ఇచ్చియున్నాను, దానిని నేను నెరవేర్తును,
నీ అపవిత్రతను బొత్తిగా తీసివేయుటకై । అన్యజను 15
లలో నిన్ను చెదరగొట్టుదును, ఇతర దేశములకు నిన్ను
వెళ్లగొట్టుదును. । అప్పుట అన్యజనుల ఎదుటనే నీ 16
అంతట నీవే భ్రష్టుడవై నేను యెహోవానని నీవు
తెలిసికొందువు.

మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై 17
యీలాగు సెలవిచ్చెను । — నరపుత్రుడా, ఇశ్రాయేలీ 18

యులు నా దృష్టికి మష్టువంటివారైరి, అందరును
కొలిమిలోని ఇత్తడియు తగరమును ఇనుమును సీసము
19 నైరి, వారు వెండిమష్టువంటివారైరి. । కావున ప్రభు
వైన యెహోవా సెలవిచ్చునదేమనగా — మీరంద
రును మష్టువంటివారైతిరి. నేను మిమ్మును యెరూష
లేము మధ్యను పోగుచేసెదను, ఒకడు వెండియు ఇత్త
డియు ఇనుమును సీసమును తగరమును పోగుచేసి
కొలిమిలోవేసి దానిమీద అగ్ని ఊది కరిగించినట్లు ।
20 నా కోపముచేతను రౌద్రముచేతను మిమ్మును పోగుచేసి
21 అక్కడ మిమ్మును కరిగింతును. । మిమ్మును పోగుచేసి
నా కోపాగ్నిని మీమీద ఊదగా నిశ్చయముగా
22 మీరు దానిలో కరిగిపోవుదురు. । కొలిమిలో వెండి
కరుగునట్లు మీరు దానిలో కరిగిపోవుదురు, అప్పుడు
యెహోవానైన నేను నా క్రోధమును మీమీద
కుమ్మరించితినని మీరు తెలిసికొందురు.
23 మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
24 యీలాగు సెలవిచ్చెను । — నరపుత్రుడా, యెరూష
లేముకు నీవీమాట ప్రకటింపుము — ఉగ్రత దినమున
నీకు ప్రకాశముండదు, నీకు వర్షము రాదు, అందులో
ప్రవక్తలు కుట్రచేయుదురు, గర్జించుచుండు సింహము
వేటను చీల్చునట్లు వారు మనుష్యులను భక్షిం
25 తురు. । (ఇతరుల) సొత్తులను ద్రవ్యమును వారు పట్టు
కొందురు, దానిలో చాలామందిని వారు విధవరాం
26 డ్లుగా చేయుదురు, । దాని యాజకులు నా ధర్మశాస్త్ర
మును నిరాకరించుదురు, నాకు ప్రతిష్ఠితములగు వస్తు
వులను అపవిత్రపరచుదురు, ప్రతిష్ఠితమైనదానికిని
సాధారణమైనదానికిని భేదమెంచరు, పవిత్రమేదో
అపవిత్రమేదో తెలిసికొనుటకు జనులకు నేర్పరు,
నేను విధించిన విశ్రాంతిదినములను ఆచరింపరు, వారి
27 మధ్య నేను దూషింపబడుచున్నాను. । దానిలో అధి
పతులు లాభము సంపాదించుటకై నరహత్య చేయుట
లోను మనుష్యులను నశింపజేయుటలోను వేటను
28 చీల్చు తోడేళ్లవలె ఉన్నారు. । మరియు దాని ప్రవ
క్తలు వ్యర్థమైన దర్శనములు కనుచు, యెహోవా
ఏమియు సెలవియ్యనప్పుడు—ప్రభువైన యెహోవా
ఈలాగు సెలవిచ్చుచున్నాడని చెప్పుచు, వట్టిసోదె
గాండ్లయి (జనులు కట్టిన మంటిగోడకు) గచ్చుపూత
29 పూయువారై యున్నారు. । మరియు సామాన్యజనులు
బలాత్కారముచేయుచు దొంగిలించుదురు, వారు దీను
లను దరిద్రులను హింసించుదురు, అన్యాయముగా
30 వారు పరదేశులను బాధించుదురు. । నేను దేశమును
పాడుచేయకుండునట్లు ప్రాకారమును దిట్టపరచుట
కును, బద్దలైన సందులలో నిలుచుటకును, తగినవా
డెవడని నేను ఎంత విచారించినను ఒకడైనను కనబడ
31 లేదు. । కావున నేను నా క్రోధమును వారిమీద
కుమ్మరింతును, వారి ప్రవర్తన ఫలము వారిమీదికి రప్పించి
నా ఉగ్రతాగ్నిచేత వారిని దహింతును; ఇదే ప్రభు
వైన యెహోవా వాక్కు.

మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై 23
యీలాగు సెలవిచ్చెను । — నరపుత్రుడా, ఒక తల్లికి 2
పుట్టిన యిద్దరు స్త్రీలుకలరు. । వీరు ఐగుప్తుదేశములో 3
జారత్వము చేసిరి, యౌవనకాలమందే జారత్వము
చేయుచు వచ్చిరి, అక్కడ వారికి ఆలింగనమాయెను,
అక్కడ వారి కన్యాకాలపు చనులను పురుషులు
కౌగలించుకొనిరి. । వారిలో పెద్దదాని పేరు ఒహొలా, 4
ఆమె సహోదరిపేరు ఒహొలీబా. వీరు నాకు పెండ్లి
చేయబడినవారై కుమారులను కుమార్తెలను కనిరి —
ఒహొలా యను పేరు షోమ్రోనుకును, ఒహొలీబా
యను పేరు యెరూషలేముకును చెందుచున్నవి. ।
ఒహొలా నాకు పెండ్లిచేయబడినను వ్యభిచారము 5
చేసి । తన విటకాండ్లమీద మోహముగా ఆశపెట్టుకొని, 6
ధూమ్రవర్ణముగల వస్త్రములు ధరించుకొనిన సైన్యాధి
పతులును అధికారులును అందముగల యౌవనస్థులును
గుఱ్ఱములెక్కు రౌతులును అగు అష్షూరువారిని
మోహించెను. । అది కాముకురాలై బలిగా అష్షూరు 7
వారిలో ముఖ్యులగు వారందరియెడల మోహించుచు,
వారందరితో వ్యభిచరించుచు, వారు పెట్టుకొనిన
విగ్రహములన్నిటిని పూజించుచు అపవిత్రురాలా
యెను. । మరియు ఐగుప్తులో నేర్చుకొనిన జారత్వ 8
మును అది మానకయుండెను, అచ్చటనే దాని యౌవన
మందే పురుషులు దానితో శయనించిరి, దాని చను
లను ఆలింగనము చేసిరి, కాముకులై దానితో విశేష
ముగా వ్యభిచారము చేసిరి. । కావున దాని విటకాం 9
డ్లకు నేను దానిని అప్పగించియున్నాను, అది మోహిం
చిన అష్షూరువారికి దానిని అప్పగించియున్నాను. ।
వీరు దాని మానాచ్ఛాదనము తీసిరి, దాని కుమారులను 10
కుమార్తెలను పట్టుకొని దానిని ఖడ్గముచేత చంపిరి;
ఈలాగున ఆమె స్త్రీలలో అపకీర్తిపాలై శిక్షనొందెను. ।
దాని చెల్లెలైన ఒహొలీబా దాని చూచి కాముక 11
త్వమందు దానిని మించ అక్కచేసిన జారత్వముల
కంటె మరి ఎక్కువగా జారత్వము చేసెను. । ప్రశస్త 12
వస్త్రములు ధరించినవారును సైన్యాధిపతులును అధి
కారులును గుఱ్ఱములెక్కు రౌతులును సౌందర్యము
గల యౌవనస్థులును అగు అష్షూరువారైన తన పొరుగు
వారిని అది మోహించెను. । అది అపవిత్రురాలాయె 13
ననియు, వారిద్దరును ఏకరీతినే ప్రవర్తించుచున్నా
రనియు నాకు తెలిసెను. । మరియు అది యధికముగా 14
వ్యభిచారము చేయవలెనని కోరినదై, మొలలకు నడి
కట్లును తలలమీద చిత్రవర్ణముగల పాగాలును పెట్టు
కొని, రాచకళలుగలవారై । సిందూరముతో పూయ 15
బడి గోడమీద చెక్కబడినవారై, తమ జన్మదేశమైన
కల్దీయులదేశపు బాబెలువారివంటి కల్దీయుల పటము

16 లను చూచి మోహించెను. । అది వారిని చూచిన
వెంటనే మోహించి కల్దీయదేశమునకు వారియొద్దకు
17 దూతలను పంపి వారిని పిలిపించుకొనగా । బాబెలు
వారు సంభోగము కోరివచ్చి జారత్వముచేత దానిని
అపవిత్రపరచిరి; వారిచేత అది అపవిత్రపరచబడిన
తరువాత వారియందు అది ఆశాభగ్నురాలాయెను. ।
18 ఇట్లు అది జారత్వము అధికముగాచేసి తన మానాచ్ఛా
దనము తీసివేసికొనెను గనుక దాని అక్క విషయములో
నేను ఆశాభగ్నుడనైనట్లు దాని విషయములోను ఆశా
19 భగ్నుడనైతిని. । మరియు యౌవనదినములందు ఐగుప్తు
దేశములో తాను జరిగించిన వ్యభిచారము మనస్సుకు
తెచ్చుకొని అది మరి ఎక్కువగా వ్యభిచారము
20 చేయుచు వచ్చెను. । గాడిదెమోహమువంటి మోహ
మును గుఱ్ఱపులింగమువంటి లింగములునుగల తన విట
కాండ్రయందు అది మోహము నిలుపుచుండెను. ।
21 యౌవనకాలమందు నీవు ఐగుప్తీయులచేత నీ చనులను
నలిపించుకొనిన సంగతి జ్ఞాపకము చేసికొని నీ బాల్య
కాలపు దుష్కార్యమును చేయవలెనని నీవు చూచు
చుంటివి.

22 కావున ఒహొలీబా, ప్రభువైన యెహోవా
సెలవిచ్చునదేమనగా—నీ మనస్సుకు ఎడమైపోయిన
నీ విటకాండ్రను రేపి నలుదిక్కులు వారిని నీమీదికి
23 రప్పించెదను. । గుఱ్ఱములనెక్కు బాబెలువారిని కల్దీ
యులను అధిపతులను ప్రధానాధికారులనందరిని
అష్షూరీయులను సౌందర్యముగల శ్రేష్ఠులను అధిపతు
లను అధికారులను శూరులను మంత్రులను అందరిని
24 నీమీదికి నేను రప్పించుచున్నాను. । ఆయుధములు
పట్టుకొని చక్రములుగల రథములతోను గొప్ప సైన్య
ముతోను వారు నీమీదికి వచ్చి, కేడెములను డాళ్లను
పట్టుకొని శిరస్త్రాణములు ధరించుకొని వారు నీమీదికి
వచ్చి నిన్ను చుట్టుకొందురు, వారు తమ మర్యాద
చొప్పున నిన్ను శిక్షించునట్లు నేను నిన్నుగూర్చిన
25 తీర్పు వారికప్పగింతును. । ఉగ్రతతో వారు నిన్ను
శిక్షించునట్లు నా రోషము నీకు చూపుదును, నీ చెవు
లను నీ ముక్కును వారు తెగగోయుదురు, నీలో
శేషించినవారు ఖడ్గముచేత కూలుదురు, నీ కుమారు
లను నీ కుమార్తెలను వారు పట్టుకొందురు, నీలో
26 శేషించినవారు అగ్నిచేత దహింపబడుదురు. । నీ బట్ట
లను లాగివేసి నీ సొగసైన నగలను అపహరించుదురు. ।
27 ఐగుప్తును నీవిక కోరకయు, అచ్చట నీవు చేసిన వ్యభి
చారమిక మనస్సుకు తెచ్చుకొనకయు నుండునట్లు
ఐగుప్తుదేశమందుండి నీవు చేసిన వ్యభిచారమును
...లో నుండకుండ ఈలాగున మాన్పిం
...హోవా సెలవిచ్చునదేమన
నీ మనస్సు ఎడమైన
...న్నాను. । ద్వేషముచేత

వారు నిన్ను బాధింతురు, నీ కష్టార్జితమంతయు పట్టు
కొని నిన్ను వస్త్రహీనముగాను దిగంబరిముగాను విడు
తురు; అప్పుడు నీ వేశ్యాత్వమును నీ దుష్కార్యము
లును నీ జారత్వమును వెల్లడియగును. । నీవు అన్యజను 30
లతో చేసిన వ్యభిచారమునుబట్టియు నీవు వారి విగ్ర
హములను పూజించి నిన్ను అపవిత్రపరచుకొనుటను
బట్టియు నీకు ఇవి సంభవించును; నీ అక్క ప్రవర్తించి
నట్టు నీవును ప్రవర్తించితివి గనుక అది పానముచేసిన
పాత్రను నీ చేతికిచ్చెదను. । ప్రభువైన యెహోవా 31
సెలవిచ్చునదేమనగా—నీ అక్క పానముచేసిన, లోతును 32
వెడల్పునుగల పాత్రలోనిది నీవును పానముచేయ
వలెను. అందులో పానము చేయవలసినది చాలా
యున్నది గనుక ఎగతాళియు అపహాస్యమును నీకు
తటస్థించును. । నీ అక్కయైన షోమ్రోను పాత్ర 33
వినాశోపద్రవములతో నిండినది, నీవు దానిలోనిది
త్రాగి మత్తురాలవై దుఃఖముతో నింపబడుదువు. ।
అడుగుమట్టుకు దాని పానముచేసి పాత్రను చెక్కలు 34
చేసి వాటితో నీ స్తనములను పెరుకుకొందువు; నేనే
మాట యిచ్చియున్నాను; ఇదే ప్రభువైన యెహోవా
వాక్కు. । ప్రభువైన యెహోవా ఈ మాట సెల 35
విచ్చుచున్నాడు—నీవు నన్ను మరచి వెనుకకు త్రోసి
వేసితివి గనుక నీ దుష్కార్యములకును వ్యభిచారమున
కును రావలసిన శిక్షను నీవు భరించెదవు.

మరియు యెహోవా నాకీలాగు సెలవిచ్చెను— 36
నరపుత్రుడా, ఒహొలాకును ఒహొలీబాకును నీవు
తీర్పుతీర్చుదువా? అట్లయితే వారి హేయకృత్యములను
వారికి తెలియజేయుము. । వారు వ్యభిచారిణులును 37
నరహత్యచేయువారునై విగ్రహములతో వ్యభిచరించి,
నాకు కనిన కుమారులను విగ్రహములు మ్రింగు
నట్లు వారిని వాటికి ప్రతిష్ఠించిరి. । వారీలాగున నా 38
యెడల జరిగించుచున్నారు; అదియుగాక ఆ దినమందే,
వారు నా పరిశుద్ధస్థలమును అపవిత్రపరచిన దినమందే,
నేను నియమించిన విశ్రాంతిదినములను సామాన్య
దినములగా ఎంచిరి. । తాము పెట్టుకొనిన విగ్రహ 39
ములపేరట తమ పిల్లలను చంపిననాడే వారు నా పరి
శుద్ధస్థలములో చొచ్చి దాని నపవిత్రపరచిరి, నా
మందిరములోనే వారీలాగున చేసిరి. । మరియు దూర 40
మునున్నవారిని పిలిపించుకొనుటకై వారు దూతను
పంపిరి; వారు రాగా వారికొరకు నీవు స్నానముచేసి
కన్నులకు కాటుకపెట్టుకొని ఆభరణములు ధరించు
కొని । దివ్యమైన మంచముమీద కూర్చుని బల్లను 41
సిద్ధపరచి దానిమీద నా పరిమళ ద్రవ్యమును తైల
మును పెట్టితివి. । ఆలాగున జరుగగా అచ్చటి సందడి 42
అణిగెను, సమూహమునకు చేరిన త్రాగుబోతులు వారి
యొద్దకు ఎడారి మార్గమునుండి వచ్చిరి, వారు ఈ
వేశ్యల చేతులకు కడియములు తొడిగి వారి తలలకు

43 పూసలు చుట్టిరి. । వ్యభిచారము చేయుటచేత బల
హీనురాలైన దీనితో నేనీలాగంటిని—అది మరెన్న
44 టికిని వ్యభిచారముచేయక మానదు. । వేశ్యతో
సాంగత్యముచేయునట్లు వారు దానితో సాంగత్యము
చేయుదురు, ఆలాగుననే వారు కాముకురాండ్రయిన
ఒహొలాతోను ఒహొలీబాతోను సాంగత్యము
45 చేయుచువచ్చిరి. । అయితే వ్యభిచారిణులకును నర
హంతకురాండ్రకును రావలసిన శిక్ష నీతిపరులైనవారు
వీరికి తగినట్టుగా విధింతురు; వారు వ్యభిచారిణులే,
46 నరహత్య చేయ యత్నించుదురు. । ఇందుకు ప్రభు
వైన యెహోవా సెలవిచ్చునదేమనగా—వారిమీదికి
నేను సైన్యమును రప్పింతును, శత్రువులు వారిని
బాధించుటకై దోపుడుసొమ్ముగా వారిని అప్పగిం
47 తును. । ఆ సైనికులు రాళ్లు రువ్వి వారిని చంపుదురు,
ఖడ్గముచేత హతముచేయుదురు, వారి కుమారులను
కుమార్తెలను చంపుదురు, వారి యిండ్లను అగ్నిచేత
48 కాల్చివేయుదురు. । స్త్రీలందరు మీ కామాతురత
చొప్పున చేయకూడదని నేర్చుకొనునట్లు మీ కామా
తురతను దేశములో నుండకుండ మాన్పించుదును. ।
49 నేనే యెహోవానని మీరు తెలిసికొనునట్లు మీ
కామాతురతకు శిక్ష విధింపబడును, విగ్రహములను
పూజించిన పాపమును మీరు భరించుదురు.

24 తొమ్మిదియవ సంవత్సరము పదియవ నెల పది
యవ దినమున యెహోవా వాక్కు నాకు ప్రత్య
2 క్షమై యీలాగు సెలవిచ్చెను ।—నరపుత్రుడా, నేటి
దినమున వ్రాసియుంచుము, నేటిదినముననే వ్రాసి
యుంచుము; ఈ దినము బాబెలు రాజు యెరూష
3 లేము మీదికి వచ్చుచున్నాడు. । మరియు తిరుగ
బాటుచేయు ఈ జనులనుగూర్చి యుపమానరీతిగా
ఇట్లు ప్రకటింపుము—ప్రభువైన యెహోవా సెల
విచ్చునదేమనగా — కుండను తెచ్చి దానిలో నీళ్లు
4 పోసి దానిని పొయ్యిమీద పెట్టుము. । తొడజబ్బ
మొదలగు మంచి మంచి ముక్కలన్నియు చేర్చి అందులో
వేసి, మంచి యెముకలను ఏరి దాని నింపుము. ।
5 మందలో శ్రేష్ఠమైనవాటిని తీసికొనుము, అందున్న
యెముకలు ఉడుకునట్లు చాలా కట్టెలు పోగు
చేయుము, దానిని బాగుగా పొంగించుము, ఎము
కలను చాలునంతగా ఉడికించుము.

6 ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా—
నరహంతకులున్న పట్టణమునకు శ్రమ; మడ్డిగల
కుండా, మానకుండ మడ్డిగలిగియుండు కుండా, నీకు
శ్రమ; చీటి దాని వంతున పడలేదు, వండినదానిని
ముక్కవెంబడి ముక్కగా దానిలోనుండి తీసికొని
7 రమ్ము. । దానిచేత చిందింపబడిన రక్తము దానిలో
కనబడుచున్నది, మట్టితో దాని కప్పివేయునట్లు దాని
నేలమీద కుమ్మరింపక పట్టిబండమీద దాని చిందిం
చెను. । కావున నా క్రోధము రానిచ్చి, నేను ప్రతి 8
కారము చేయునట్లు అది చిందించిన రక్తము కప్ప
బడకుండ దానిని పట్టిబండమీద నేనుండనిచ్చితిని. ।
ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా — నర 9
హంతకులున్న పట్టణమునకు శ్రమ, నేనును విస్తరించి
కట్టెలు పేర్చబోవుచున్నాను. । చాలా కట్టెలు 10
పేర్చుము, అగ్ని రాజబెట్టుము, మాంసమును బాగుగా
ఉడకబెట్టుము. ఏమియు ఉండకుండ ఎముకలు
పూర్తిగా ఉడుకునట్లు చారు చిక్కగా దింపుము. ।
తరువాత దానికి తగిలిన మష్టును మడ్డియు పోవునట్లు 11
అది వేడియై మెరుగు పట్టువరకు వట్టిచట్టి పొయ్యి
మీదనే యుంచుము. । అలసట పుట్టువరకు ఇంతగా 12
శ్రద్ధపుచ్చుకొనినను దాని విస్తారమైన మష్టు పోదా
యెను, మష్టుతోకూడ దాని అగ్నిలో వేయుము, ।
నీకు కలిగిన అపవిత్రత నీ కామాతురతయే; నిన్ను 13
శుభ్రపరచుటకు నేను పూనుకొనినను నీవు శుభ్రపడక
పోతివి, నా క్రోధమును నీమీద తీర్చుకొనువరకు
నీవు శుభ్రపడకయుందువు. । యెహోవానైన నేను 14
మాటయిచ్చియున్నాను, అది జరుగును, నేనే నెర
వేర్చెదను, నేను వెనుకతీయను, కనికరింపను, సంతాప
పడను, నీ ప్రవర్తననుబట్టియు నీ క్రియలనుబట్టియు
నీకు శిక్ష విధింపబడును; ఇదే యెహోవా వాక్కు.
మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్య 15
క్షమై యీలాగు సెలవిచ్చెను ।—నరపుత్రుడా, నీ 16
కన్నుల కింపైన దానిని దైవికముగా నీయొద్దనుండి
తీసివేయబోవుచున్నాను, నీవు అంగలార్చవద్దు ఏడువ
వద్దు కన్నీరు విడువవద్దు. । మృతులకై విలాపముచేయక 17
నిశ్శబ్దముగా నిట్టూర్పు విడువుము, నీ శిరోభూషణ
ములు ధరించుకొని పాదరక్షలు తొడుగుకొనవలెను,
నీ గడ్డము కప్పుకొనవద్దు జనులిచ్చు ఆహారము భుజింప
వద్దు. । ఉదయమందు జనులకు నేను ప్రకటించితిని, 18
సాయంతనమున నా భార్య చనిపోగా ఆయన నాకా
జ్ఞాపించినట్లు మరునాటి ఉదయమున నేను చేసితిని. ।
— నీవు చేసినవాటివలన మేము తెలిసికొనవలసిన 19
సంగతి నీవు మాతో చెప్పవా అని జనులు నన్నడు
గగా । నేను వారితో ఇట్లంటిని — యెహోవా 20
వాక్కు నాకు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను ।
—ఇశ్రాయేలీయులకు నీవీలాగున ప్రకటింపుము — 21
ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా—మీకు
అతిశయాస్పదముగాను, మీ కన్నులకు ముచ్చటగాను,
మీ మనస్సుకు ఇష్టముగాను ఉన్న నా పరిశుద్ధస్థలమును
నేను చెరపబోవుచున్నాను, మీరు వెనుక విడిచిన
మీ కుమారులును కుమార్తెలును అక్కడనే ఖడ్గము
చేత కూలుదురు. । అప్పుడు నేను చేసినట్లు మీరును 22
చేయుదురు, మీ గడ్డములు మీరు కప్పుకొనకయుం
దురు, పెట్టిన ఆహారమును మీరు భుజింపకయుం

23 దురు. మీ శిరోభూషణములను తలలమీదనుండి
తీయకయు, మీ పాదరక్షలను పాదములనుండి
తీయకయు, అంగలార్చకయు, ఏడ్వకయు నుందురు,
ఒకనినొకరు చూచి నిట్టూర్పులు విడుచుచు మీరు
చేసిన దోషములనుబట్టి మీరు క్షీణించిపోవుదురు. ।
24 యెహెజ్కేలు మీకు సూచనగా ఉండును, అతడు
చేసినదంతటిప్రకారము మీరును చేయుదురు, ఇది
సంభవించునప్పుడు నేను ప్రభువైన యెహోవానై
యున్నానని మీరు తెలిసికొందురు.
25 నరపుత్రుడా, వారి ఆశ్రయమును అతిశయా
స్పదమును వారికి కన్నుల కింపైనదానిని వారు ఇచ్ఛ
యించుదానిని, వారి కుమారులను కుమార్తెలను నేను
తీసివేయు దినమునందు నీకు సమాచారము తెలియ
జేయుటకై తప్పించుకొని వచ్చిన యొకడు నీయొద్దకు
26 వచ్చును. । ఆ దినముననే నీవికను మౌనముగా
27 ఉండక, తప్పించుకొని వచ్చినవానితో స్పష్టముగా
మాటలాడుదువు; నేను యెహోవానై యున్నానని
వారు తెలిసికొనునట్లు నీవు ఈ రీతిని వారికి సూచ
నగా ఉందువు.

**25** మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్య
2 క్షమై యీలాగు సెలవిచ్చెను । — నరపుత్రుడా,
అమ్మోనీయులతట్టు ముఖము త్రిప్పుకొని వారిని
3 గూర్చి యీ మాట ప్రవచింపుము । — అమ్మోనీయు
లారా, ప్రభువైన యెహోవా మాట ఆలకించుడి.
ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా — నా
పరిశుద్ధస్థలము అపవిత్రపరచబడినప్పుడు, ఇశ్రా
యేలీయుల దేశము పాడుచేయబడిన కాలమున
యూదావారు చెరలోకి పోయినప్పుడు, మీరు
4 సంతోషమని చెప్పుకొనుచు వచ్చితిరి గనుక । నేను
మిమ్మును తూర్పుననుండు మనుష్యులకు స్వాస్థ్యముగా
అప్పగించెదను, వారు తమ డేరాలను మీ దేశ
ములో వేసి మీ మధ్య కాపురముందురు, వారు మీ
5 పంటను తిందురు మీ పాలు త్రాగుదురు. । నేను
రబ్బాపట్టణమును ఒంటెలసాలగా చేసెదను, అమ్మోనీ
యుల దేశమును గొఱ్ఱెలదొడ్డిగా చేసెదను, అప్పుడు
నేను యెహోవానై యున్నానని మీరు తెలిసి
6 కొందురు. । మరియు ప్రభువైన యెహోవా సెల
విచ్చునదేమనగా — మీరు చేతులు చరుచుకొని
కాళ్లతో నేలతన్ని ఇశ్రాయేలీయులశ్రమను చూచి
మీ మనస్సులోని తిరస్కారముకొలది ఉల్లసించితిరి
గనుక నేను యెహోవానై యున్నానని మీరు తెలిసి
7 కొనునట్లు । నేను మీకు విరోధినై, మిమ్మును జనము
లకు దోపుడుసొమ్ముగా అప్పగింతును, అన్యజనులలో
ఉండకుండ మిమ్మును నిర్మూలముచేతును, జనము
కాకుండ మిమ్మును నశింపజేతును సమూలధ్వంసము
చేతును.

మరియు ప్రభువైన యెహోవా ఈ మాట సెల 8
విచ్చుచున్నాడు — ఇతర జనములన్నిటికిని యూదా
వారికిని భేదమేమి యని మోయాబీయులును శేయీరు
పట్టణపువారును అందురు గనుక । తూర్పుననున్న 9
వారిని రప్పించి, దేశమునకు భూషణముగానున్న
పొలిమేర పురములగు బేత్యేషీమోతును బయల్మె
యోనును కిర్యతాయిమును మోయాబీయుల సరిహద్దు
లోగానున్న పట్టణములనన్నిటిని, అమ్మోనీయుల నంద
రిని వారికి స్వాస్థ్యముగా అప్పగింతును; । జనము 10
లలో అమ్మోనీయులు ఇకను జ్ఞాపకమునకు రారు. ।
నేను యెహోవానై యున్నానని మోయాబీయులు 11
తెలిసికొనునట్లు నేనీలాగున వారికి శిక్ష విధింతును.
మరియు ప్రభువైన యెహోవా ఈ మాట సెల 12
విచ్చుచున్నాడు—ఎదోమీయులు యూదావారిమీద
పగతీర్చుకొనుచున్నారు, తీర్చుకొనుటలో వారు
బహుగా దోషులైరి గనుక ప్రభువైన యెహోవా
సెలవిచ్చునదేమనగా । — ఎదోముమీద నా చెయ్యి 13
చాపి, మనుష్యులేమి పశువులేమి దానిలో నుండకుండ
నేను సమస్తమును నిర్మూలము చేయుదును, తేమాను
పట్టణము మొదలుకొని నేను దాని పాడుచేయుదును,
దదానువరకు జనులందరును ఖడ్గముచేత కూలుదురు. ।
నా జనులైన ఇశ్రాయేలీయులచేత ఎదోమువారిమీద 14
నా పగ తీర్చుకొందును, ఎదోమీయుల విషయమై
నా కోపమునుబట్టియు నా రౌద్రమునుబట్టియు నేను
ఆలోచించినదానిని వారు నెరవేర్చుదురు, ఎదో
మీయులు నా క్రోధము తెలిసికొందురు; ఇదే
యెహోవా వాక్కు.
మరియు ప్రభువగు యెహోవా ఈ మాట సెల 15
విచ్చుచున్నాడు — ఫిలిష్తీయులు పగ తీర్చుకొనుచు
నాశముచేయుచు, మానని క్రోధముగలవారై తిర
స్కారము చేయుచు పగ తీర్చుకొనుచున్నారు గనుక ।
ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా—ఫిలిష్తీ 16
యులమీద నేను చెయ్యి చాపి కెరేతీయులను నిర్మూ
లముచేసెదను. సముద్రతీరమున నివసించు శేషమును
నశింపజేసెదను. । క్రోధముతో వారిని శిక్షించి వారి 17
మీద నా పగ పూర్తిగా తీర్చుకొందును; నేను వారి
మీద నా పగ తీర్చుకొనగా నేను యెహోవానై
యున్నానని వారు తెలిసికొందురు.

మరియు పదకొండవ సంవత్సరము నెల మొదటి **26**
దినమున యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
యీలాగు సెలవిచ్చెను । — నరపుత్రుడా, యెరూష 2
లేమునుగూర్చి — ఆహా జనములకు ద్వారముగానున్న
పట్టణము పడగొట్టబడెను, దాని వ్యాపారము నావశ
మాయెను, అది పాడైపోయినందున నేను పరిపూర్ణము
నొందితిని అని తూరు చెప్పెను గనుక । ప్రభువైన 3
యెహోవా సెలవిచ్చునదేమనగా—తూరుపట్టణమా,

అర్వదు నివాసులును నీకు ఓడకళాసులుగా ఉన్నారు,
నీ స్వజనులకు చేరిన ప్రజ్ఞావంతులు నీకు ఓడ నాయ
9 కులుగా ఉన్నారు. । గెబాలు పనివారిలో పని తెలిసిన
పెద్దలు నీ ఓడలను బాగుచేయువారుగా నున్నారు,
సముద్రమందు నీ సరకులు కొనుటకై సముద్ర
ప్రయాణము చేయు నాయకుల యోడలన్నియు నీ
10 రేవులలో ఉన్నవి. । పారసీక దేశపువారును లూదు
వారును పూతువారును నీ సైన్యములలో చేరి నీకు
సిపాయిలుగా ఉన్నారు, వారు నీ డాళ్లను శిరస్త్రాణము
లను ధరించువారు, వారిచేత నీకు తేజస్సు కలిగెను. ।
11 అర్వదువారు నీ సైన్యములో చేరి చుట్టు నీ ప్రాకా
రములకు డాళ్లు తగిలించి చుట్టు నీ ప్రాకారముల
మీద కావలికాచి నీ సౌందర్యమును సంపూర్ణపర
12 చెదరు. । నానావిధమైన సరకులు నీలో విస్తారముగా
నున్నందున తర్షీషువారు నీలో వర్తకముచేయుచు,
వెండియు ఇనుమును తగరమును సీసమును ఇచ్చి
13 నీ సరకులు కొనుక్కొందురు. । గ్రేకులును తుబాలు
వారును మెషెకువారును నీలో వర్తకవ్యాపారము
చేయుచు, నరులను ఇత్తడి వస్తువులను ఇచ్చి నీ సర
14 కులు కొనుక్కొందురు, । తోగర్మావారు గుఱ్ఱము
లను యుద్ధాశ్వములను కంచరగాడిదెలను ఇచ్చి నీ సర
15 కులు కొనుక్కొందురు; । దదానువారును నీలో వర్తక
వ్యాపారము చేయుదురు, చాలా ద్వీపముల వర్తక
ములు నీ వశమున నున్నవి; వర్తకులు దంతమును కోవి
దారుమ్రానును ఇచ్చి నీ సరకులు కొనుక్కొందురు. ।
16 నీచేత చేయబడిన వివిధవస్తువులను కొనుక్కొనుటకై
అరామీయులు నీతో వర్తకవ్యాపారము చేయుదురు,
వారు పచ్చరాళ్లను ధూమ్రవర్ణముగల నూలుతో కుట్ట
బడిన చీరలను అవిసెనారబట్టలను పగడములను అకీ
కపు రత్నములను ఇచ్చి నీ సరకులు కొనుక్కొందురు. ।
17 మరియు యూదావారును ఇశ్రాయేలు దేశస్థులును
నీలో వర్తకవ్యాపారము చేయుచు, మిన్నీతు గోధు
మలును మిఠాయిలును తేనెయు తైలమును గుగ్గిల
18 మును ఇచ్చి నీ సరకులు కొనుక్కొందురు. । దమ
స్కువారు హెల్బోను ద్రాక్షారసమును తెల్ల
బొచ్చును ఇచ్చి విస్తారమైన నీ సరకులును దినుసులును
19 కొనుక్కొందురు. । వెదానువారును గ్రేకులును నూలు
ఇచ్చి నీ సరకులు కొనుక్కొందురు. ఇనుప పని
ముట్లును కత్సీయా కెనయా అను సుగంధద్రవ్యము
20 లును నీ సరకులకు బదులియ్యబడును. । దదానువారు
విచిత్రమైన పనిగల చౌకపుతుండ్లు తీసికొని అమ్ము
21 దురు. । అరబీయులును కేదారు అధిపతులందరును
నీతో వర్తకము చేయుదురు, వారు గొఱ్ఱెపిల్లలను
పొట్టేళ్లను మేకలను ఇచ్చి నీ సరకులు కొనుక్కొం
దురు, వీటినిచ్చి వారు నీతో వర్తకము చేయుదురు. ।
22 షేబ వర్తకులును రాయమా వర్తకులును నీలో వర్తకము
చేయుదురు, వారు అతి ప్రశస్తమైన గంధవర్గములను
విలువగల నానావిధమైన రత్నములను బంగారమును
ఇచ్చి నీ సరకులు కొనుక్కొందురు. । హారాను 23
వారును కన్నేవారును ఏదెనువారును షేబ వర్తకు
లును అష్షూరు వర్తకులును కిల్మదు వర్తకులును నీతో
వర్తకము చేయుదురు. । వీరు నీలో వర్తకులై సొగసైన 24
వస్త్రములను ధూమ్రవర్ణముగలవియు కుట్టుపనితో
చేయబడినవియునగు బట్టలను విలువగల నూలును
బాగుగాచేయబడిన గట్టి త్రాళ్లను ఇచ్చి నీ సరకులు
కొనుక్కొందురు. । తర్షీషు ఓడలు నీకు బండ్లుగా 25
ఉన్నవి. నీవు పరిపూర్ణమైనదానవై మహాఘనముగా
సముద్రముమీద కూర్చున్నావు. । నీ కోలలు వేయు 26
వారు మహాసముద్రములోకి నిన్ను త్రోయగా తూర్పు
గాలి సముద్రమధ్యమందు నిన్ను బద్దలుచేయును. ।
అప్పుడు నీ ధనమును నీ సరకులును నీవు బదులిచ్చు 27
వస్తువులును నీ నావికులును నీ ఓడనాయకులును నీ
ఓడలు బాగుచేయువారును నీతో వర్తకము చేయు
వారును నీలోనున్న సిపాయిలందరును నీలోనున్న
జనసమూహములన్నియు నీవు కూలు దినమందే
సముద్రమధ్యమందు కూలుదురు. । నీ ఓడనాయకులు 28
వేసిన కేకలవలన నీ ఉపగ్రామములు కంపించును; ।
కోలలు పట్టుకొనువారందరును నావికులును ఓడ 29
నాయకులును తమ ఓడలమీదనుండి దిగి తీరమున
నిలిచి । నిన్నుగూర్చి మహా శోకమెత్తి ప్రలాపించుచు, 30
తమ తలలమీద బుగ్గి పోసికొనుచు, బూడిదెలో
పొర్లుచు । నీకొరకు తలలు బోడిచేసికొని మొలలకు 31
గోనెలు కట్టుకొని మనశ్చింతగలవారై నిన్నుగూర్చి
బహుగా అంగలార్చుదురు. । వారు నిన్నుగూర్చి 32
ప్రలాపవచనమెత్తి—తూరుపట్టణమా, నీతో సాటి
యైన పట్టణమేది? సముద్రములో మునిగి లయమై
పోయిన పట్టణమా, నీకు సమమైన పట్టణమేది? ।
సముద్రముమీద వచ్చిన నీ సరకులను పంపించి చాల 33
జనములను తృప్తిపరచితివి, విస్తారమైన నీ పదార్థ
ములచేతను నీ వర్తకముచేతను భూపతులను ఐశ్వర్య
వంతులగా చేసితివి. । ఇప్పుడు అగాధజలములలో 34
మునిగి సముద్రబలముచేత బద్దలైతివే, నీ వర్తకమును
నీ యావత్సమూహమును నీతోకూడ కూలెనే యని
చెప్పుకొనుచు బహుగా ఏడ్చుదురు. । నిన్ను బట్టి 35
ద్వీపనివాసులందరు విభ్రాంతినొందుదురు, వారి
రాజులు వణకుదురు, వారి ముఖములు చిన్నబోవును. ।
జనులలోని వర్తకులు నిన్ను అపహసించుదురు, భీతికి 36
హేతువగుదువు, నీవు బొత్తిగా నాశనమగుదువు.

మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్య 28
క్షమై యీలాగు సెలవిచ్చెను । —నరపుత్రుడా, 2
తూరు అధిపతితో ఈలాగు ప్రకటింపుము —ప్రభు
వగు యెహోవా సెలవిచ్చునదేమనగా—గర్విష్ఠుడవై

—నేనొక దేవతను, దేవతనైనట్టు సముద్రము మధ్యను
నేను ఆసీనుడనైయున్నాను అని నీవనుకొనుచున్నావు;
నీవు దేవుడవు కాక మానవుడవైయుండియు దేవునికి
తగినంత అభిప్రాయము కలిగియున్నావు, నీవు దాని
3 యేలుకంటె జ్ఞానవంతుడవు, । నీకు మర్మమైనదేదియు
4 లేదు. । నీ జ్ఞానముచేతను నీ వివేకముచేతను ఐశ్వ
ర్యమునొందితివి, నీ ధనాగారములలోకి వెండి బంగా
5 రములను తెచ్చుకొంటివి. । నీకు కలిగిన జ్ఞానాతిశయ
ముచేతను వర్తకముచేతను నీవు విస్తారమైన ఐశ్వర్యము
సంపాదించుకొంటివి, నీకు ఐశ్వర్యము కలిగినదని నీవు
6 గర్వించినవాడవైతివి. । కాగా ప్రభువైన యెహోవా
ఈ మాట సెలవిచ్చుచున్నాడు—దేవునికి తగినంత అభి
7 ప్రాయము కలిగియున్నవాడా, ఆలకించుము; । నేను
పరదేశులను అన్యజనులలో క్రూరులను నీమీదికి
రప్పించుచున్నాను, వారు నీ జ్ఞానశోభను చెరుపు
టకై తమ ఖడ్గములను వరదీసి నీ సౌందర్యమును నీచ
8 పరతురు. । నిన్ను పాతాళములో పడవేతురు, సము
ద్రములో మునిగి చచ్చినవారివలెనే నీవు చత్తువు. ।
9 —నేను దేవుడనని నిన్ను చంపువానియెదుట నీవు
చెప్పుదువా? నిన్ను చంపువానిచేతిలో నీవు మానవు
10 డవే కాని దేవుడవు కావు గదా. । సున్నతిలేని
వారు చంపబడు రీతిగా నీవు పరదేశులచేత చత్తువు,
నేనే మాట యిచ్చియున్నాను; ఇదే ప్రభువగు
యెహోవా వాక్కు.
11 మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
12 యీలాగు సెలవిచ్చెను । —నరపుత్రుడా, తూరు
రాజునుగూర్చి అంగలార్పువచనమెత్తి ఈలాగు ప్రక
టింపుము — ప్రభువైన యెహోవా సెలవిచ్చునదే
మనగా—పూర్ణజ్ఞానమును సంపూర్ణసౌందర్యమునుగల
13 కట్టడమునకు మాదిరివైన తూరూ, । దేవుని తోట
యగు ఏదెనులోనున్నట్టు నీవున్నావు, మాణిక్యము
గోమేధికము సూర్యకాంతమణి రక్తవర్ణపురాయి సులి
మానిరాయి మరకతము నీలము పద్మరాగము మాణిక్యము
అను అమూల్యరత్నములతోను బంగారముతోను నీవు
అలంకరింపబడియున్నావు; నీవు నియమింపబడిన దిన
మున పిల్లనగ్రోవులు వాయించువారును నీకు సిద్ధ
14 మైరి. । అభిషేకము నొందిన కెరూబువై యొక ఆశ్ర
యముగా నీవుంటివి; అందుకే నేను నిన్ను నియమించి
తిని. దేవునికి ప్రతిష్ఠింపబడిన యొక పర్వతముమీద
నీవుంటివి, కాలుచున్న రాళ్లమధ్యను నీవు సంచరించు
15 చుంటివి. । నీవు నియమింపబడిన దినము మొదలుకొని
పాపము నీయందు కనబడు పర్యంతము ప్రవర్తన
విషయములో నీవు యథార్థవంతుడవుగా ఉంటివి. ।
16 అయితే నీకు కలిగిన విస్తారమైన వర్తకముచేత లోలో
పల నీవు అన్యాయము పెంచుకొని పాపముచేయుచు
వచ్చితివి గనుక దేవుని పర్వతముమీద నీవుండకుండ
నేను నిన్ను అపవిత్రపరచెదను; ఆశ్రయముగా ఉన్న
కెరూబూ, కాలుచున్న రాళ్లమధ్యను నీవికను సంచ
రింపవు, నిన్ను నాశనముచేతును. । నీ సౌందర్యము 17
చూచుకొని నీవు గర్వించినవాడవై, నీ తేజస్సు చూచు
కొని నీ జ్ఞానమును చెరుపుకొంటివి, కావున నేను
నిన్ను నేలను పడవేసెదను, రాజులు చూచుచుండగా
నిన్ను హేళనకప్పగించెదను. । నీవు అన్యాయముగా 18
వర్తకము జరిగించి కలుగజేసికొనిన విస్తారదోషముల
చేత నీవు నీ పరిశుద్ధస్థలములను చెరుపుకొంటివి గనుక
నీలోనుండి నేను అగ్ని పుట్టించెదను, అది నిన్ను
కాల్చివేయును, జనులందరు చూచుచుండగా దేశము
మీద నిన్ను బూడిదగా చేసెదను. । జనులలో నిన్ను 19
ఎరిగినవారందరును నిన్నుగూర్చి ఆశ్చర్యపడుదురు.
నీవు బొత్తిగా నాశనమై భీతికి కారణముగా ఉందువు.
మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై 20
యీలాగు సెలవిచ్చెను । —నరపుత్రుడా, నీ ముఖ 21
మును సీదోను పట్టణమువైపు త్రిప్పుకొని దానిగూర్చి
యీ సమాచారము ప్రవచింపుము — ప్రభువగు
యెహోవా సెలవిచ్చునదేమనగా । —సీదోను పట్ట 22
ణమా, నేను నీకు విరోధిని, నీ మధ్యను ఘనతనొందు
దును, నేను దానిమధ్య తీర్పుతీర్చుచు దానినిబట్టి
నన్ను పరిశుద్ధపరచుకొనగా నేను యెహోవానై
యున్నానని వారు తెలిసికొందురు. । నేను 23
యెహోవానని వారు తెలిసికొనునట్లు తెగులును
రక్తమును దాని వీధులలోకి పంపించుదును, నలు
దిక్కుల దానిమీదికివచ్చు ఖడ్గముచేత వారు హతు
లగుదురు, నేను ప్రభువగు యెహోవానని । ఇశ్రా 24
యేలీయులు తెలిసికొనునట్లు వారి చుట్టునుండి వారిని
తిరస్కరించుచు వచ్చినవారిలో ఎవరును ఇక వారికి
గుచ్చుకొను ముండ్లుగానైనను నొప్పించు కంపగా
నైనను ఉండరు.
ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా— 25
జనులలో చెదరిపోయిన ఇశ్రాయేలీయులను నేను
సమకూర్చి, జనుల సమక్షమున వారి మధ్యను నన్ను
నేను పరిశుద్ధపరచుకొందును, అప్పుడు నా సేవకుడైన
యాకోబునకు నేనిచ్చిన తమ దేశములో వారు నివ
సించెదరు. । వారు అందులో నిర్భయముగా నివసించి 26
యిండ్లు కట్టుకొని ద్రాక్షతోటలు నాటుకొందురు,
వారి చుట్టు ఉండి వారిని తిరస్కరించుచు వచ్చిన
వారికందరికి నేను శిక్ష విధించిన తరువాత వారు
నిర్భయముగా నివసించుకాలమున నేను తమ దేవు
డైన యెహోవానై యున్నానని వారు తెలిసి
కొందురు.

**29** పదియవ సంవత్సరము పదియవ నెల పన్నెండవ
దినమున యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
యీలాగు సెలవిచ్చెను । —నరపుత్రుడా, నీ ముఖ

ముగ ఐగుప్తురాజైన ఫరోవైపు త్రిప్పుకొని అతని
గూర్చియు ఐగుప్తుదేశమంతటినిగూర్చియు ఈ సమా
చారమెత్తి ప్రవచింపుము—ప్రభువగు యెహోవా
3 సెలవిచ్చునదేమనగా । — ఐగుప్తు రాజవైన ఫరో,
నైలునదిలో పండుకొనియున్న పెద్దమొసలీ, నేను
నీకు విరోధిని;—నైలునది నాది, నేనే దాని కలుగ
4 జేసితిని అని నీవు చెప్పుకొనుచున్నావే; । నేను నీ
దవడలకు గాలములు తగిలించి, నీ నదులలోనున్న
చేపలను నీ పొలుసులకు అంటజేసి, నైలులోనుండి
నిన్నును నీ పొలుసులకు అంటిన నైలు చేపలన్నిటిని
5 బయటికి లాగెదను । నిన్నును నైలునది చేపలన్నిటిని
అరణ్యములో పారబోసెదను, ఎత్తువాడును కూర్చు
వాడును లేక నీవు తెరపనేలమీద పడుదువు, అడవి
మృగములకును ఆకాశపక్షులకును ఆహారముగా నిన్ని
6 చ్చెదను. । అప్పుడు నేను యెహోవానై యున్నా
నని ఐగుప్తీయులందరు తెలిసికొందురు. ఐగుప్తు ఇశ్రా
యేలీయులకు రెల్లుపుల్లవంటి చేతికఱ్ఱ ఆయెను; ।
7 వారు నిన్ను చేత పట్టుకొనినప్పుడు నీవు విరిగిపోయి
వారి ప్రక్కలలో గుచ్చుకొంటివి, వారు నీమీద
ఆనుకొనగా నీవు విరిగిపోయి వారి నడుములు విరిగి
8 పోవుటకు కారణమైతివి. । కాబట్టి ప్రభువైన
యెహోవా ఈ మాట సెలవిచ్చుచున్నాడు—నేను
నీమీదికి ఖడ్గము రప్పించి, మనుష్యులను పశువులను
9 నీలోనుండి నిర్మూలము చేసెదను, । ఐగుప్తుదేశము
నిర్మానుష్యమై పాడుగా ఉండును, అప్పుడు నేను
యెహోవానై యున్నానని వారు తెలిసికొందురు.
—నైలునది నాది, నేనే దాని కలుగజేసితినని అతడను
10 కొనుచున్నాడు గనుక । నేను నీకును నీ నదికిని
విరోధినైతిని, ఐగుప్తుదేశమును మిగ్దోలు మొదలుకొని
సెవేనేవరకు కూషు సరిహద్దువరకు బొత్తిగా పాడుచేసి
11 యెడారిగా ఉంచెదను. । దానిలో మనుష్యులు సంచ
రించరు, పశువులు తిరుగవు; నలువది సంవత్సరములు
12 అది నిర్నివాసముగా ఉండును. । నిర్మానుష్యముగా
నున్న దేశములమధ్యను ఐగుప్తుదేశమును పాడగు
నట్టుగా చేసెదను, పాడైపోయిన పట్టణములమధ్యను
దాని పట్టణములు నలువది సంవత్సరములు పాడై
యుండును, ఐగుప్తీయులను జనములలోకి చెదరగొట్టు
దును, ఆ యా దేశములకు వారిని వెళ్లగొట్టుదును. ।
13 ప్రభువైన యెహోవా ఈ మాట సెలవిచ్చుచున్నాడు
— నలువది సంవత్సరములు జరిగినతరువాత ఐగుప్తీ
యులు చెదరిపోయిన జనులలోనుండి నేను వారిని
14 సమకూర్చెదను. । చెరలోనుండి వారిని తోడుకొని
పత్రోసు అను వారి స్వదేశములోకి వారిని మరల
రప్పించెదను, అక్కడ వారు హీనమైన యొక రాజ్య
15 ముగా ఉందురు. । వారికను జనములమీద అతిశయ
౦ రాజ్యములన్నిటిలో వారు హీనమైన

రాజ్యముగా ఉందురు, వారు ఇక రాష్ట్రములమీద ప్రభు
త్వము చేయకుండునట్లు నేను వారిని తగ్గించెదను. ।
ఇశ్రాయేలీయులు తాము చేసిన దోషము మనస్సుకు 16
తెచ్చుకొని వారితట్టు తిరిగినయెడల ఐగుప్తీయులు ఇక
వారికి ఆధారముగా ఉండరు, అప్పుడు నేను ప్రభు
వైన యెహోవానై యున్నానని వారు తెలిసికొం
దురు.

ఇరువదియేడవ సంవత్సరము మొదటినెల మొదటి 17
దినమున యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
యీలాగు సెలవిచ్చెను । —నరపుత్రుడా, తూరు 18
పట్టణముమీద బాబెలురాజైన నెబుకద్రెజరు తన
సైన్యముచేత బహు ఆయాసకరమైన పని చేయించెను,
వారందరి తలలు బోడివాయెను, అందరి భుజములు
కొట్టుకొని పోయెను; అయినను తూరుపట్టణముమీద
అతడు చేసిన కష్టమునుబట్టి అతనికైనను, అతని సైన్య
మునకైనను కూలి యెంతమాత్రమును దొరకకపోయె
ను. । కాబట్టి ప్రభువైన యెహోవా సెలవిచ్చున 19
దేమనగా — ఐగుప్తుదేశమును బాబెలురాజైన నెబుక
ద్రెజరుకు నేను అప్పగించుచున్నాను, అతడు దాని
ఆస్తిని పట్టుకొని దాని సొమ్మును దోచుకొని కొల్ల
పెట్టును, అది అతని సైన్యమునకు జీతమగును. ।
తూరుపట్టణముమీద అతడు చేసినది నా నిమిత్తమే 20
చేసెను గనుక అందుకు బహుమానముగా దానిని అప్ప
గించుచున్నాను; ఇదే యెహోవా వాక్కు.

ఆ దినమందు నేను ఇశ్రాయేలీయులకు కొమ్ము 21
చిగిరింపజేసి వారిలో మాటలాడుటకు నీకు ధైర్యము
కలుగజేసెదను, అప్పుడు నేను యెహోవానై
యున్నానని వారు తెలిసికొందురు.

**మ**రియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై **30**
యీలాగు సెలవిచ్చెను । —నరపుత్రుడా, సమా 2
చారమెత్తి ప్రవచింపుము, ప్రభువగు యెహోవా
సెలవిచ్చునదేమనగా — ఆహా శ్రమదినము వచ్చెనే,
అంగలార్చుడి, శ్రమదినము వచ్చెనే. । యెహోవా 3
దినము వచ్చెను, అది దుర్దినము, అన్యజనులు శిక్ష
నొందు దినము. । ఖడ్గము ఐగుప్తుదేశముమీద పడును, 4
ఐగుప్తీయులలో హతులు కూలగా కూషుదేశస్థులు
వ్యాకులపడుదురు, శత్రువులు ఐగుప్తీయుల ఆస్తిని
పట్టుకొని దేశపు పునాదులను పడగొట్టుదురు. ।
కూషీయులును పూతీయులును లూదీయులును కూబీ 5
యులును నిబంధన దేశపువారును మిశ్రితజనులంద
రును ఖడ్గముచేత కూలుదురు.

యెహోవా సెలవిచ్చునదేమనగా — ఐగుప్తును 6
ఉద్ధరించువారు కూలుదురు, దాని బలగర్వము అణగి
పోవును, మిగ్దోలు మొదలుకొని సెవేనేవరకు జనులు
ఖడ్గముచేత కూలుదురు. । పాడైపోయిన దేశముల 7
మధ్య ఐగుప్తీయులు దిక్కులేనివారుగానుందురు, నలు

దిక్కైన పాడైపోయిన పట్టణములమధ్య వారి పట్ట
8 ణములుండును. । ఐగుప్తుదేశములో అగ్ని రగలబెట్టి
నేను దానికి సహాయకులు లేకుండ చేయగా నేను
యెహోవానై యున్నానని వారు తెలిసికొందురు. ।
9 ఆ దినమందు దూతలు నా యెదుటనుండి బయలుదేరి
ఓడలెక్కి నిర్విచారులైన కూషీయులను భయపెట్టు
దురు, ఐగుప్తునకు విమర్శకలిగిన దినమున జరిగినట్టు
వారికి భయభ్రాంతులు పుట్టును, అదిగో అది వచ్చే
యున్నది.
10 ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా—
ఐగుప్తీయులు చేయు అల్లరి బాబెలురాజైన నెబుక
11 ద్రెజరుచేత నేను మాన్పించెదను. । జనములలో భయం
కరులగు తన జనులను తోడుకొని ఆ దేశమును లయ
పరచుటకు అతడు వచ్చును, ఐగుప్తీయులను చంపు
టకై వారు తమ ఖడ్గములను పరదీసి హతమైనవారితో
12 దేశమును నింపెదరు. । నైలునదిని ఎండిపోజేసి నేనా
దేశమును దుర్జనులకు అమ్మివేసెదను, పరదేశులచేత
నేను ఆ దేశమును దానిలోనున్న సమస్తమును పాడు
చేయించెదను, యెహోవానైన నేను మాట యిచ్చి
13 యున్నాను. । యెహోవా ఈలాగు సెలవిచ్చు
చున్నాడు—విగ్రహములను నిర్మూలముచేసి, నోపులో
ఒక బొమ్మలేకుండ చేసెదను, ఇక ఐగుప్తుదేశములో
అధిపతిగా ఉండుట కెవడును లేకపోవును, ఐగుప్తు
14 దేశములో భయము పుట్టించెదను. । పత్రోసును
పాడుచేసెదను, సోయనులో అగ్ని యుంచెదను,
15 నోలో తీర్పులు చేసెదను. । ఐగుప్తునకు కోటగానున్న
సీనుమీద నా క్రోధము కుమ్మరించెదను, నోలోని
16 జనసమూహమును నిర్మూలముచేసెదను । ఐగుప్తుదేశ
ములో నేను అగ్ని యుంచగా సీనుకు మెండుగ
నొప్పిపట్టును, నోపురము పడగొట్టబడును, పగటివేళ
17 శత్రువులు వచ్చి నోపుమీద పడుదురు. । ఓనువారి
లోను పిబేసెతువారిలోను యౌవనులు ఖడ్గముచేత
కూలుదురు, ఆ పట్టణస్థులు చెరలోకి పోవుదురు. ।
18 ఐగుప్తు పెట్టిన కాండ్లను నేను తహపనేసులో విరుచు
దినమున చీకటికమ్మును, ఐగుప్తీయుల బలగర్వము అణచ
బడును, మబ్బు ఐగుప్తును కమ్మును, దాని కుమార్తెలు
19 చెరలోకి పోవుదురు. । నేను ఐగుప్తీయులకు శిక్ష
విధింపగా నేను యెహోవానై యున్నానని వారు
తెలిసికొందురు.
20 పదకొండవ సంవత్సరము మొదటి నెల యేడవ
దినమున యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
21 యీలాగు సెలవిచ్చెను।—నరపుత్రుడా, నేను ఐగుప్తు
రాజైన ఫరో బాహువును విరిచితిని, అది బాగవుటకు
ఎవరును దానికి కట్టుకట్టరు, అది కుదుర్చబడి ఖడ్గము
పట్టుకొనులాగున ఎవరును దానికి బద్దకట్టరు; కావున
22 ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా।—నేను
ఐగుప్తురాజైన ఫరోకు విరోధినైయున్నాను, బాగుగా
ఉన్నదానిని విరిగిపోయినదానిని అతని రెండు చేతు
లను విరిచి, అతని చేతిలోనుండి ఖడ్గము జారిపడజేసె
దను. । ఐగుప్తీయులను జనములలోకి చెదరగొట్టుదును, 23
ఆ యా దేశములకు వారిని వెళ్లగొట్టుదును. । మరియు 24
బాబెలురాజుయొక్క చేతులను బలపరచి నా ఖడ్గము
అతని చేతికిచ్చెదను, ఫరోయొక్క చేతులను నేను
విరిచినందున బాబెలురాజు చూచుచుండగా ఫరో
చావుదెబ్బ తినినవాడై మూల్గులిడును. । బాబెలు 25
రాజుయొక్క చేతులను బలపరచి ఫరో చేతులను ఎత్త
కుండచేసి, ఐగుప్తుదేశముమీద చాపుటకై నేను నా
ఖడ్గమును బాబెలురాజు చేతికియ్యగా నేను యెహో
వానై యున్నానని ఐగుప్తీయులు తెలిసికొందురు. ।
నేనే యెహోవానై యున్నానని వారు తెలిసికొను 26
నట్లు నేను ఐగుప్తీయులను జనములలోకి చెదరగొట్టి
ఆ యా దేశములకు వారిని వెళ్లగొట్టుదును.

మరియు పదకొండవ సంవత్సరము మూడవ నెల **31**
మొదటి దినమున యెహోవా వాక్కు నాకు ప్రత్య
క్షమై యీలాగు సెలవిచ్చెను ।— నరపుత్రుడా, నీవు 2
ఐగుప్తురాజైన ఫరోతోను అతని సమూహముతోను
ఇట్లనుము—ఘనుడవైన నీవు ఎవనితో సమానుడవు? ।
అష్షూరీయులు లెబానోను దేవదారు వృక్షమైనట్టుం 3
డిరి, దాని కొమ్మలు శృంగారములు, దాని గుబురు
విశాలము, దాని కొన బహు ఎత్తయినందున మేఘము
లకు అంటెను. । నీళ్లుండుటవలన అది మిక్కిలి గొప్ప 4
దాయెను, లోతైన నది ఆధారమైనందున అది మిక్కిలి
యెత్తుగా పెరిగెను, అది యుండుచోటున ఆ నది
కాలువలు పారుచు పొలములోను చెట్లన్నిటికిని ప్రవ
హించెను. । కాబట్టి అది ఎదిగి పొలములోని చెట్లన్నిటి 5
కంటె ఎత్తుగలదాయెను, దాని శాఖలు బహు విస్తా
రములాయెను, నీరు సమృద్ధిగా ఉన్నందున దాని
చిగుళ్లు పెద్ద కొమ్మలాయెను. । ఆకాశపక్షులన్నియు 6
దాని శాఖలలో గూళ్లు కట్టుకొనును, భూజంతువు
లన్నియు దాని కొమ్మలక్రింద పిల్లలు పెట్టును, దాని
నీడను సకలమైన గొప్ప జనములు నివసించును. ।
ఈలాగున అది పొడుగైన కొమ్మలు కలిగి దాని వేరు 7
విస్తార జలమున్నచోట పారుటవలన అది మిక్కిలి
గొప్పదై కంటికి అందమైనదాయెను. । దేవుని వనము 8
లోనున్న దేవదారు వృక్షములు దాని మరుగుచేయ
లేకపోయెను, సరళవృక్షములు దాని శాఖలంత
గొప్పవి కావు, అక్షోట వృక్షములు దాని కొమ్మలంత
గొప్పవి కావు, దానికున్న శృంగారము దేవుని వనము
లోనున్న వృక్షములలో దేనికిని లేదు. । విస్తారమైన 9
కొమ్మలతో నేను దాని శృంగారించినందున ఏదెను
అను దేవుని వనములోనున్న వృక్షములన్నియు దాని
సొగసు చూచి దానియందు అసూయపడెను.

10 కావున ప్రభువైన యెహోవా ఈ మాట సెల
విచ్చుచున్నాడు—నీ యెత్తునుబట్టి నీవు అతిశయపడి
తివి, తన కొన మేఘములకంటజేసి తన యెత్తునుబట్టి
11 అతడు గర్వించెను. । కాబట్టి యతని దుష్టత్వమును
బట్టి యతనిని తరిమివేసి, జనములలో బలముగల జన
మునకు నేనతని నప్పగించెదను; ఆ జనము అతనికి
12 తగినపని చేయును. । జనములలో క్రూరులైన పర
దేశులు అతని నరికి పారవేసిరి, కొండలలోను లోయ
లన్నిటిలోను అతని కొమ్మలు పడెను, భూమియందున్న
వాగులలో అతని శాఖలు విరిగి పడెను, భూజనులంద
రును అతని నీడను విడిచి అతని పడియుండనిచ్చిరి. ।
13 పడిపోయిన అతని మోడుమీద ఆకాశపక్షులన్నియు
దిగి వ్రాలెను, అతని కొమ్మలమీద భూజంతువు
14 లన్నియు పడెను. । నీరున్నచోటుననున్న వృక్షము
లన్నిటిలో ఏదియు తన యెత్తునుబట్టి అతిశయపడి,
తన కొనను మేఘముల కంటజేసి, యే వృక్షముగాని
దాని యెత్తునుబట్టి గర్వింపకుండునట్లు, క్రిందిలోక
మునకు పోవు నరులయొద్దకు దిగువారితోకూడ మర
ణము పాలైరి.

15 ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా —
అతడు పాతాళములోకి పోయిన దినమున నేను అంగ
లార్పు కలుగజేసితిని, అగాధజలములు అతని కప్ప
జేసితిని, అనేక జలములను ఆపి అతనినిబట్టి నేను
వాటి ప్రవాహములను బంధించితిని, అతనికొరకు
నేను లెబానోను పర్వతమును గాఢాంధకారము కమ్మ
జేసితిని, ఫలవృక్షములన్నియు అతనిగూర్చి వ్యాకుల
పడెను, పాతాళములోకి నేనతని దింపగా గోతిలోకి
16 పోవువారియొద్దకు అతని పడవేయగా । అతని పాటు
ధ్వనిచేత జనములను వణకజేసితిని, నీరు పీల్చు లెబా
నోను శ్రేష్ఠవృక్షములన్నియు ఏదెను వృక్షములన్ని
యు (అతని గతి చూచి) పాతాళములో తమ్మును
17 తాము ఓదార్చుకొనిరి. । అన్యజనులమధ్య అతని
నీడను నివసించి అతనికి సహాయులగువారు అతనితో
కూడ పాతాళమునకు అతడు హతము చేసినవారి
యొద్దకు దిగిరి.

18 కాబట్టి ఘనముగాను గొప్పగానున్న నీవు ఏదెను
వనములోని వృక్షములలో దేనికి సముడవు? నీవు
పాతాళములోకి త్రోయబడి, ఘనులై అక్కడికి దిగి
పోయిన రాజులయొద్ద ఉందువు; ఖడ్గముచేత హతు
లైనవారియొద్దను సున్నతినొందనివారియొద్దను నీవు
పడియున్నావు. ఫరోకును అతని సమూహమునకును
గాను సంభవించును; ఇదే ప్రభువగు యెహోవా
వాక్కు.

మరియు పన్నెండవ సంవత్సరము పన్నెండవనెల
మొదటి దినమున యెహోవా వాక్కు నాకు ప్రత్య
2 క్షమై యీలాగు సెలవిచ్చెను ।—నరపుత్రుడా,
ఐగుప్తురాజైన ఫరోనుగూర్చి అంగలార్పు వచనమెత్తి
అతనికి ఈ మాట ప్రకటింపుము—జనములలో కొదమ
సింహమువంటివాడవని నీవు ఎంచబడితివి, జలము
లలో మొసలివంటివాడవై నీ నదులలో రేగుచు నీ
కాళ్లతో నీళ్లు కలియబెట్టితివి, వాటి వాగులను బుర
దగా చేసితివి. । ప్రభువైన యెహోవా సెలవిచ్చున 3
దేమనగా—గుంపులు గుంపులుగా జనములను సమ
కూర్చి నేను నా వలను నీమీద వేయగా వారు నా
వలలో చిక్కిన నిన్ను బయటికి లాగెదరు. । నేను 4
నిన్ను నేల పడవేసి తెరపనేలమీద పారవేసెదను,
ఆకాశపక్షులన్నియు నీమీద వ్రాలునట్లు చేసి నీవలన
భూజంతువులన్నిటిని కడుపార తిననిచ్చెదను, । నీ 5
మాంసమును పర్వతములమీద వేసెదను, లోయలన్ని
టిని నీ కళేబరములతో నింపెదను. । మరియు భూమిని 6
నీ రక్తధారచేత పర్వతములవరకు నేను తడుపుదును,
లోయలు నీతో నింపబడును. । నేను నిన్ను ఆర్పివేసి 7
ఆకాశమండలమును మరుగుచేసెదను, నక్షత్రములను
చీకటి కమ్మజేసెదను, సూర్యుని మబ్బుచేత కప్పెదను,
చంద్రుడు వెన్నెల కాయకపోవును. । నిన్నుబట్టి 8
ఆకాశమందు ప్రకాశించు జ్యోతులకన్నిటికిని అంధ
కారము కమ్మజేసెదను, నీ దేశముమీద గాఢాంధకా
రము వ్యాపింపజేసెదను; ఇదే ప్రభువగు యెహోవా
వాక్కు. । నీవు ఎరుగని దేశములలోకి నేను నిన్ను 9
వెళ్లగొట్టి, జనములలో నీకు సమూలధ్వంసము కలుగ
జేసి బహు జనములకు కోపము పుట్టింతును. । నా 10
ఖడ్గమును నేను వారిమీద ఝుళిపించెదను, నిన్నుబట్టి
చాలామంది జనులు కలవరించుదురు, వారి రాజులును
నిన్నుబట్టి భీతులగుదురు, నీవు కూలు దినమున వారంద
రును ఎడతెగక ప్రాణభయముచేత వణకుదురు. ।
ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా—బాబెలు 11
రాజు ఖడ్గము నీమీదికి వచ్చును, । శూరుల ఖడ్గముల 12
చేత నేను నీ సైన్యమును కూల్చెదను, వారందరును
జనములలో భయంకరులు; వారు ఐగుప్తీయుల గర్వము
నణచివేయగా దాని సైన్యమంతయు లయమగును. ।
మరియు గొప్ప ప్రవాహముల దరినున్న పశువుల 13
నన్నిటిని నేను లయపరచెదను, నరుని కాలైనను పశువు
కాలైనను వాటిని కదలింపకయుండును. । అప్పుడు నేను 14
వాటి నీళ్లు తొణకకుండజేసి తైలము పారునట్లు వారి
నదులను పారజేసెదను; ఇదే ప్రభువగు యెహోవా
వాక్కు. । నేను ఐగుప్తు దేశమును పాడుచేసి అందు 15
లోని సమస్తమును నాశనము చేసి దాని నివాసుల
నందరిని నిర్మూలముచేయగా నేను యెహోవానై
యున్నానని వారు తెలిసికొందురు. । ఇది అంగ 16
లార్పువచనము, వారు దాని యెత్తి పాడుదురు, అన్య
జనుల కుమార్తెలు దాని యెత్తి పాడుదురు, ఐగుప్తును
గూర్చియు అందులోని సమూహమునుగూర్చియు

గొట్టి వారు పాడుదురు; ఇదే ప్రభువగు
హోవా వాక్కు.
పండ్రెండవ సంవత్సరము నెల పదిహేనవ దిన
ము యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
ఈ సెలవిచ్చెను | — నరపుత్రుడా, అల్లరిచేయు
ఐగుప్తుల సమూహమునుగూర్చి అంగలార్చుము,
ప్రసిద్ధిచెందిన జనముల కుమార్తెలు భూమిక్రిందికి దిగి
నట్లు భూమిక్రిందికిని పాతాళమునకు పోయిన
వారితోకూడ దానిని పడగొట్టుము. | సౌందర్య
మందు నీవు ఎవనిని మించినవాడవు? దిగి సున్నతి
లేనివారియొద్ద పడియుండుము. | ఖడ్గముచేత హత
మైనవారిమధ్య వారు కూలుదురు, అది కత్తిపా
లాయెను దాని జనులను లాగి వధచేయుడి. |
పాతాళములో నుండి పరాక్రమశాలులలో బలా
ఢ్యులు, సున్నతినొందని వీరు ఖడ్గముచేత
హతులై అక్కడ పడియుండిరే, అని యందురు;
దానినిగూర్చియు దాని సహాయులనుగూర్చియు
పలుకుదురు. | అష్షూరును దాని సమూహమంతయు
అక్కడ నున్నవి, దానిచుట్టును వారి సమాధులున్నవి,
అందరును కత్తిపాలై పడియున్నారు. | దాని సమా
ధులు పాతాళాగాధములో నియమింపబడినవి, దాని
సమూహము దాని సమాధిచుట్టు నున్నది, వారందరు
సజీవుల లోకములో భయంకరులైనవారు, వారు కత్తి
పాలై పడియుండిరి. | అక్కడ ఏలామును దాని
సమూహమును సమాధిచుట్టు నున్నవి; అందరును కత్తి
పాలైరి; వారు సజీవులలోకములో భయంకరు
లైరి, వారు సున్నతిలేనివారై పాతాళములోకి
దిగిరి, గోతిలోకి దిగిపోయినవారితోకూడ
వారు అవమానము నొందుదురు. | హతులైనవారి
మధ్యను దానికిని దాని సమూహమునకును పడకయొకటి
ఏర్పడెను, దాని సమాధులు దానిచుట్టు నున్నవి; వారం
దరు సున్నతిలేనివారై హతులైరి; వారు సజీవుల
లోకములో భయంకరులు గనుక గోతిలోకి దిగి
పోయినవారితోకూడ వారును అవమానమునొందు
దురు; హతులైనవారిమధ్య అది యుంచబడును. |
అక్కడ మెషెకును తుబాలును దాని సమూహమును
ఉన్నవి, దాని సమాధులు దానిచుట్టు నున్నవి,
వారందరు సున్నతిలేనివారు, సజీవులలోకములో
భయంకరులైరి గనుక వారు కత్తిపాలైరి, ఆయు
ధములు చేతపట్టుకొని పాతాళములోకి దిగిపో
యిరి. అయితే వీరు సున్నతిలేనివారిలో పడి
యున్న శూరులదగ్గర పండుకొనరు; వారు తమ
యుద్ధములను చేతపట్టుకొని పాతాళములోకి
దిగిరి, తమ ఖడ్గములను తలలక్రింద ఉంచుకొని
యుందురు; వీరు సజీవులలోకములో భయంకరు
లైరి గనుక వారి దోషము వారి యెముకలకు తగి
లెను. | నీవు సున్నతిలేనివారిమధ్య నాశనమై కత్తి 28
పాలైనవారియొద్ద పండుకొందువు. | అక్కడ ఎదోము 29
మును దాని రాజులును దాని అధిపతులందరును
ఉన్నారు; వారు పరాక్రమవంతులైనను కత్తిపాలైన
వారియొద్ద ఉంచబడిరి; సున్నతిలేనివారియొద్దను పాతా
ళములోకి దిగిపోయినవారియొద్దను వారును పండు
కొనిరి. | అక్కడ ఉత్తరదేశపు అధిపతులందరును 30
సీదోనీయులందరును హతమైనవారితో దిగిపోయి
యున్నారు; వారు పరాక్రమవంతులై భయము
పుట్టించినను అవమానము నొందియున్నారు; సున్నతి
లేనివారై కత్తిపాలైనవారిమధ్య పండుకొనియున్నారు,
గోతిలోకి దిగిపోయినవారితోపాటు వారును అవ
మానమునొందుదురు. | కత్తిపాలైన ఫరోయు అతని 31
వారందరును వారిని చూచి తమ సమూహమంతటిని
గూర్చి ఓదార్పు తెచ్చుకొందురు; ఇదే ప్రభువగు
యెహోవా వాక్కు. | సజీవులలోకములో అతని 32
చేత భయము పుట్టించితిని గనుక ఫరోయు అతనివారం
దరును కత్తిపాలైనవారియొద్ద సున్నతిలేనివారితో
కూడ పండుకొందురు, ఇదే ప్రభువగు యెహోవా
వాక్కు.

మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్య **33**
క్షమై యీలాగు సెలవిచ్చెను | — నరపుత్రుడా, 2
నీవు నీ జనులకు సమాచారము ప్రకటించి వారితో
ఇట్లనుము—నేను ఒకానొక దేశముమీదికి ఖడ్గమును
రప్పింపగా ఆ జనులు తమలో ఒకని ఏర్పరచుకొని
కావలిగా నిర్ణయించినయెడల | అతడు దేశము 3
మీదికి ఖడ్గమువచ్చుట చూచి, బాకా ఊది జనులను
హెచ్చరికచేసిన సమయమున | ఎవడైనను బాకా 4
నాదము వినియును జాగ్రత్తపడనందున, ఖడ్గము
వచ్చి వాని ప్రాణము తీసినపక్షమున వాడు తన
ప్రాణమునకు తానే ఉత్తరవాది. | బాకానాదము 5
వినియును వాడు జాగ్రత్తపడకపోయెను గనుక తన
ప్రాణమునకు తానే ఉత్తరవాది; ఏలయనగా వాడు
జాగ్రత్తపడిన పక్షమున తన ప్రాణమును రక్షించు
కొనును. | అయితే కావలివాడు ఖడ్గము వచ్చుట 6
చూచియు, బాకా ఊదనందుచేత జనులు అజా
గ్రత్తగా ఉండుటయు, ఖడ్గము వచ్చి వారిలో ఒకని
ప్రాణము తీయుటయు తటస్థించినయెడల వాడు తన
దోషమునుబట్టి పట్టబడినను, నేను కావలివానియొద్ద
వాని ప్రాణమునుగూర్చి విచారణచేయుదును. |
నరపుత్రుడా, నేను నిన్ను ఇశ్రాయేలీయులకు కావలి 7
వానిగా నియమించియున్నాను గనుక నీవు నా నోటి
మాటను విని నాకు ప్రతిగా వారిని హెచ్చరికచేయ
వలెను. |—దుర్మార్గుడా, నీవు నిశ్చయముగా మరణము 8
నొందుదువు అని దుర్మార్గునికి నేను సెలవియ్యగా,
అతడు తన దుర్మార్గతను విడిచి జాగ్రత్తపడునట్లు నీవు

ఆ దుర్మార్గునికి నా మాట తెలియజేయని పక్షమున ఆ
దుర్మార్గుడు తన దోషమునుబట్టి మరణము నొందును
గాని అతని ప్రాణమునుగూర్చి నిన్ను విచారణచేయు
9 దును. । అయితే ఆ దుర్మార్గుడు తన దుర్మార్గతను
విడువవలెనని నీవు అతనిని హెచ్చరికచేయగా అతడు
తన దుర్మార్గతను విడువనియెడల అతడు తన దోష
మునుబట్టి మరణము నొందును గాని నీవు నీ ప్రాణము
దక్కించుకొందువు.
10 నరపుత్రుడా, ఇశ్రాయేలీయులకు ఈ మాట ప్రక
టింపుము — మా పాపదోషములు మామీద పడియు
న్నవి, వాటివలన మేము క్షీణించుచున్నాము, మన
మెట్లు బ్రదుకుదుమని మీరు చెప్పుకొనుమాట నిజమే. ।
11 కాగా వారితో ఇట్లనుము—నా జీవముతోడు దుర్మా
ర్గుడు మరణము నొందుటవలన నాకు సంతోషము
లేదు; దుర్మార్గుడు తన దుర్మార్గతను విడిచి బ్రదుకుట
వలన నాకు సంతోషము కలుగును. కాబట్టి ఇశ్రా
యేలీయులారా, మనస్సు త్రిప్పుకొనుడి, మీ దుర్మార్గ
తను విడిచి మనస్సు త్రిప్పుకొనుడి, మీరెందుకు మర
ణము నొందుదురు? ఇదే ప్రభువగు యెహోవా
12 వాక్కు. । మరియు నరపుత్రుడా, నీవు నీ జనులకు ఈ
మాట తెలియజేయుము—నీతిమంతుడు పాపముచేసిన
దినమున అదివరకు అతడు అనుసరించిన నీతి అతని విడి
పింపదు. దుష్టుడు చెడుతనము విడిచి మనస్సు త్రిప్పు
కొనిన దినమున తాను చేసియున్న చెడుతనమునుబట్టి
వాడు పడిపోడు, ఆలాగుననే నీతిమంతుడు పాపము
చేసిన దినమున తన నీతినిబట్టి అతడు బ్రదుకజాలడు. ।
13 నీతిమంతుడు నిజముగా బ్రదుకునని నేను చెప్పినందున
అతడు తన నీతిని ఆధారము చేసికొని పాపముచేసిన
యెడల అతని నీతి క్రియలన్నిటిలో ఏదియు జ్ఞాపక
మునకు తేబడదు, తాను చేసిన పాపమునుబట్టి యతడు
14 మరణమునొందును. । మరియు నిజముగా మరణము
నొందుదువని దుర్మార్గునికి నేను సెలవియ్యగా అతడు
తన పాపము విడిచి, నీతిన్యాయములను అనుసరిం
15 చుచు । కుదువసొమ్మును మరల అప్పగించుచు, తాను
దొంగిలినదానిని మరల ఇచ్చివేసి పాపము జరిగింపక
యుండి, జీవాధారములగు కట్టడలను అనుసరించిన
యెడల అతడు మరణమునొందక అవశ్యముగా బ్రదు
16 కును. । అతడు చేసిన పాపములలో ఏదియు అతని
విషయమై జ్ఞాపకమునకు తేబడదు, అతడు నీతిన్యాయ
ములను అనుసరించెను గనుక నిశ్చయముగా అతడు
17 బ్రదుకును. । అయినను నీ జనులు యెహోవా
మార్గము న్యాయము కాదని యనుకొందురు; అయితే
18 వారి ప్రవర్తనయే గదా అన్యాయమైనది? । నీతి
మంతుడు తన నీతిని విడిచి పాపముచేసిన పక్షమున ఆ
19 పాపమునుబట్టి అతడు మరణమునొందును. । మరియు
దుర్మార్గుడు తన దుర్మార్గతను విడిచి నీతిన్యాయము
లను అనుసరించినయెడల వాటినిబట్టి అతడు బ్రదు
కును. । యెహోవా మార్గము న్యాయము కాదని 20
మీరనుకొనుచున్నారే; ఇశ్రాయేలీయులారా, మీలో
ఎవని ప్రవర్తననుబట్టి వానికి శిక్ష విధించెదను.
మనము చెరలోనికి వచ్చిన పన్నెండవ సంవత్సరము 21
పదియవ నెల అయిదవ దినమున ఒకడు యెరూష
లేములోనుండి తప్పించుకొని నాయొద్దకు వచ్చి పట్ట
ణము కొల్లపెట్టబడెనని తెలియజేసెను. । తప్పించు 22
కొనినవాడు వచ్చిన వెనుకటి సాయంత్రమున
యెహోవా హస్తము నామీదికి వచ్చెను; ఉదయ
మున అతడు నాయొద్దకు రాకమునుపే యెహోవా
నా నోరు తెరవగా పలుకుటకు నాకు శక్తికలిగెను,
అప్పటినుండి నేను మౌనిని కాకయుంటిని. । మరియు 23
యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై యీలాగు
సెలవిచ్చెను । — నరపుత్రుడా, ఇశ్రాయేలు దేశ 24
ములో పాడైపోయిన ఆ యా చోట్లను కాపురమున్న
వారు — అబ్రాహాము ఒంటరిగాయుండి యీ దేశమును
స్వాస్థ్యముగా పొందెను గదా; అనేకులమైన మన
కును ఈ దేశము స్వాస్థ్యముగా ఇయ్యబడెదా అని
అనుకొనుచున్నారు. । కాబట్టి వారికీమాట ప్రకటన 25
చేయుము—ప్రభువగు యెహోవా సెలవిచ్చునదేమ
నగా—రక్తము ఓడ్చివేయక మాంసము భుజించు మీరు,
మీ విగ్రహములవైపు దృష్టియుంచు మీరు, నరహత్య
చేయు మీరు, ఈ దేశమును స్వతంత్రించుకొందురా? ।
మీరు ఖడ్గము నాధారము చేసికొనువారు, హేయ 26
క్రియలు జరిగించువారు, పొరుగువాని భార్యను చెరుపు
వారు; మీవంటివారు దేశమును స్వతంత్రించుకొం
దురా? నీవీలాగున వారికి చెప్పుము — ప్రభువైన
యెహోవా సెలవిచ్చునదేమనగా । —నా జీవముతోడు 27
పాడైపోయిన స్థలములలో ఉండువారు ఖడ్గముచేత
కూలుదురు, బయట పొలములో ఉండువారిని నేను
మృగములకు ఆహారముగా ఇచ్చెదను, కోటలలోని
వారును గుహలలోనివారును తెగులుచేత చచ్చెదరు. ।
ఆ దేశమును నిర్జనముగాను పాడుగాను చేసి దాని 28
బలాతిశయమును మాన్పించెదను, ఎవరును వాటిలో
సంచరింపకుండ ఇశ్రాయేలీయుల పర్వతములు పాడ
వును. । వారు చేసిన హేయక్రియలన్నిటినిబట్టి వారి 29
దేశమును పాడుగాను నిర్జనముగాను నేను చేయగా
నేనే యెహోవానై యున్నానని వారు తెలిసికొం
దురు. । మరియు నరపుత్రుడా, నీ జనులు గోడదగ్గరను 30
ఇంటి ద్వారములందును నిలువబడి నిన్నుగూర్చి మాట
లాడుదురు, ఒకరి నొకరు చూచి — పోదము
రండి, యెహోవాయొద్దనుండి బయలుదేరు మాట
యెట్టిదో చూతము రండి అని చెప్పుకొనుచున్నారు. ।
నా జనులు రాదగిన విధముగా వారు నీయొద్దకు 31
వచ్చి, నా జనులైనట్టుగా నీ యెదుట కూర్చుండి నీ

మాటలు విందురు గాని వాటి ననుసరించి ప్రవర్తింపరు,
వారు నోటితో ఎంతో ప్రేమ కనుపరచుదురు గాని
వారి హృదయము లాభమును అపేక్షించుచున్నది. ।
32 నీవు వారికి వాద్యము బాగుగా వాయించుచు మంచి
స్వరము కలిగిన గాయకుడవుగా ఉన్నావు, వారు నీ
మాటలు విందురు గాని వాటిని అనుసరించి నడుచు
33 కొనరు. । అయినను ఆ మాట నెరవేరును, అది నెర
వేరగా ప్రవక్త యొకడు తమ మధ్యనుండెనని వారు
తెలిసికొందురు.

34 మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
2 యీలాగు సెలవిచ్చెను । — నరపుత్రుడా, ఇశ్రాయే
లీయుల కాపరులనుగూర్చి ఈ మాట ప్రవచింపుము,
ఆ కాపరులతో ఇట్లనుము—ప్రభువగు యెహోవా
సెలవిచ్చునదేమనగా—తమ కడుపు నింపుకొను ఇశ్రా
యేలీయుల కాపరులకు శ్రమ; కాపరులు గొఱ్ఱె
3 లను మేపవలెను గదా. । మీరు క్రొవ్విన గొఱ్ఱెలను
వధించి క్రొవ్వును తిని బొచ్చును కప్పుకొందురుగాని
4 గొఱ్ఱెలను మేపరు, । బలహీనమైనవాటిని మీరు బల
పరచరు, రోగముగలవాటిని స్వస్థపరచరు, గాయ
పడినవాటికి కట్టు కట్టరు, తోలివేసినవాటిని మరల
తోలుకొనిరారు, తప్పిపోయినవాటిని వెదకరు; అది
మాత్రమేగాక మీరు కఠినమనస్కులై బలాత్కార
5 ముతో వాటిని ఏలుదురు. । కాబట్టి కాపరులు లేకయే
అవి చెదరిపోయెను, చెదరిపోయి సకల అడవిమృగ
6 ములకు ఆహారమాయెను. । నా గొఱ్ఱెలు పర్వతము
లన్నిటిమీదను ఎత్తయిన ప్రతి కొండమీదను తిరుగు
లాడుచున్నవి, నా గొఱ్ఱెలు భూమియందంతట చెదరి
పోయినను వాటినిగూర్చి విచారించువాడొకడును
7 లేడు, వెదకువాడొకడును లేడు. । కాబట్టి కాపరు
8 లారా, యెహోవా మాట ఆలకించుడి । — కాప
రులు లేకుండ నా గొఱ్ఱెలు దోపుడుసొమ్మయి సకల
మైన అడవిమృగములకు ఆహారమాయెను; కాపరులు
నా గొఱ్ఱెలను విచారింపరు, తమ కడుపుమాత్రమే
నింపుకొందురు గాని గొఱ్ఱెలను మేపరు; ఇదే ప్రభు
9 వైన యెహోవా వాక్కు. । కాబట్టి కాపరులారా,
10 యెహోవా మాట ఆలకించుడి । — ప్రభువైన
యెహోవా సెలవిచ్చునదేమనగా—నా జీవముతోడు
నేను ఆ కాపరులకు విరోధినైతిని, నా గొఱ్ఱెలను
గూర్చి వారియొద్ద విచారించెదను, వారు గొఱ్ఱెలు
మేపుట మాన్పించెదను, ఇకను కాపరులు తమ కడుపు
నింపుకొనజాలక యుందురు; నా గొఱ్ఱెలు వారికి
తిండికాకుండ వారి నోటనుండి వాటిని తప్పించెదను;
11 ఇదే ప్రభువైన యెహోవా వాక్కు. । ప్రభువైన
యెహోవా సెలవిచ్చునదేమనగా — ఇదిగో నేను
నేనే నా గొఱ్ఱెలనుగూర్చి విచారించి వాటిని కని
12 పెట్టుదును. । తమ గొఱ్ఱెలు చెదరిపోయినప్పుడు
కాపరులు వాటిని వెదకునట్లు నేను నా గొఱ్ఱెలను
వెదకి, చీకటిగల మబ్బుదినమందు ఎక్కడెక్కడికి అవి
చెదరిపోయెనో అక్కడనుండి నేను వాటిని తప్పించి ।
ఆ యా జనులలోనుండి వాటిని తోడుకొని వచ్చి, 13
ఆ యా దేశములలోనుండి వాటిని సమకూర్చి వాటి
స్వదేశములోకి వాటిని తెచ్చి, పర్వతములమీదను
వాగులయొద్దను దేశమందున్న సకలమైన కాపురపు
స్థలములందును వాటిని మేపెదను. । నేను మంచి 14
మేతగలచోట వాటిని మేపెదను, ఇశ్రాయేలుయొక్క
ఉన్నతస్థలములమీద వాటికి దొడ్డి యేర్పడును, అక్కడ
అవి మంచి దొడ్డిలో పండుకొనును, ఇశ్రాయేలు
పర్వతములమీద బలమైన మేతగల స్థలమందు అవి
మేయును, । నేనే నా గొఱ్ఱెలను మేపి పరుండబెట్టు 15
దును; ఇదే ప్రభువగు యెహోవా వాక్కు. । తప్పి 16
పోయినదానిని నేను వెదకుదును, తోలివేసినదానిని
మరల తోలుకొని వచ్చెదను, గాయపడినదానికి కట్టు
కట్టుదును, దుర్బలముగా ఉన్నదానిని బలపరచు
దును; అయితే క్రొవ్వినవాటిని బలముగలవాటిని
శిక్షయను మేతపెట్టి లయపరచెదను. । నా మందా, 17
మీ విషయమై దేవుడనైన యెహోవానగు నేను సెల
విచ్చునదేమనగా — గొఱ్ఱెకును గొఱ్ఱెకును మధ్యను,
గొఱ్ఱెలకును పొట్టేళ్లకును మధ్యను, గొఱ్ఱెలకును మేక
పోతులకును మధ్యను భేదము కనుగొని నేను తీర్పు
తీర్చెదను. । విశేషముగా మేతమేసి మిగిలినదానిని 18
కాళ్లతో త్రొక్కుట మీకు చాలదా? । మీరు 19
స్వచ్ఛమైన నీరుత్రాగి మిగిలినదానిని కాళ్లతో కలకలు
చేయుట మీకు చాలదా? మీరు కాళ్లతో త్రొక్కిన
దానిని నా గొఱ్ఱెలు మేయవలెనా? కాళ్లతో మీరు
బురదగా కలిపినదానిని అవి త్రాగవలెనా?

కాబట్టి ప్రభువైన యెహోవా ఈ మాట సెల 20
విచ్చుచున్నాడు—ఇదిగో నేను నేనే క్రొవ్విన గొఱ్ఱె
లకును చిక్కిపోయిన గొఱ్ఱెలకును మధ్య భేదము
కనుగొని తీర్పు తీర్చుదును. । మీరు భుజముతోను 21
ప్రక్కతోను త్రోసి, కొమ్ములతో రోగముగలవాటి
నన్నిటిని పొడిచి చెదరగొట్టెదరు. । నా గొఱ్ఱెలు 22
ఇక దోపుడు కాకుండ గొఱ్ఱెకును గొఱ్ఱెకును మధ్య
తీర్పుచేసి నేను వాటిని రక్షించెదను. । వాటిని మేపు 23
టకై నేను నా సేవకుడైన దావీదును వాటిమీద
కాపరినిగా నియమించెదను, అతడు వాటికి కాపరిగా
ఉండి వాటిని మేపును. । యెహోవానైన నేను 24
వారికి దేవుడనై యుందును, నా సేవకుడైన దావీదు
వారిమధ్య అధిపతిగా ఉండును, యెహోవానైన
నేను మాటయిచ్చియున్నాను. । మరియు అవి అర 25
ణ్యములో నిర్భయముగా నివసించునట్లును, అడవిలో
నిర్భయముగా పండుకొనునట్లును నేను వారితో
సమాధానార్థ నిబంధన చేయుదును, దుష్టమృగములు

26 దేశములో లేకుండ చేయుదును. । వారిని నా పర్వ
తము చుట్టుపట్ల స్థలములను దీవెనకరముగా చేయు
దును, రుతువుల ప్రకారము వర్షము కురిపించెదను,
27 దీవెనకరమగు వర్షములు కురియును, । ఫలవృక్షములు
ఫలములిచ్చును, భూమి పంట పండును, వారు దేశ
ములో నిర్భయముగా నివసింతురు, నేను వారి కాడి
కట్లను తెంపి వారిని దాసులుగా చేసినవారి చేతిలో
నుండి వారిని విడిపింపగా నేను యెహోవానై
28 యున్నానని వారు తెలిసికొందురు. । ఇక వారు
అన్యజనులకు దోపుడుసొమ్ముగా ఉండరు, దుష్టమృగ
ములు వారినిక భక్షింపవు, ఎవరివలనను భయము
29 లేకుండ వారు సురక్షితముగా నివసించెదరు. । మరియు
వారు ఇక దేశములో కరవు కలిగి నశించిపోకుండను
అన్యజనులవలన వారి కవమానము ప్రాప్తించకుండను
వారి ప్రఖ్యాతికొరకై తోటయొకటి నేనేర్పరచె
30 దను. । అప్పుడు తమ దేవుడనైన యెహోవానగు
నేను తమకు తోడుగా ఉన్నాననియు, ఇశ్రాయేలీ
యులైన తాము నా జనులైయున్నారనియు వారు
తెలిసికొందురు; ఇదే ప్రభువగు యెహోవా వాక్కు. ।
31 నా గొఱ్ఱెలును నేను మేపుచున్న గొఱ్ఱెలునగు మీరు
మనుష్యులు, నేను మీ దేవుడను; ఇదే ప్రభువైన
యెహోవా వాక్కు.

35 మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్య
2 క్షమై యీలాగు సెలవిచ్చెను । — నరపుత్రుడా,
శేయీరు పర్వతమునైపు నీ ముఖము త్రిప్పుకొని ।
3 దానికి మాటయెత్తి ఈలాగు ప్రవచింపుము — ప్రభు
వగు యెహోవా సెలవిచ్చునదేమనగా — శేయీరు
పర్వతమా, నేను నీకు విరోధినైతిని, నా హస్తము
నీమీద చాపి నిన్ను పాడుగాను నిర్జనముగాను చేసె
4 దను. । నీవు నిర్జనముగా ఉండునట్లు నీ పట్టణములను
ఎడారులగా చేసెదను, నీవు పాడవుదువు, అప్పుడు
నేను యెహోవానై యున్నానని నీవు తెలిసి
5 కొందువు. । ఇశ్రాయేలీయులయెడల ఎడతెగని పగ
కలిగి, వారి దోషసమాప్తికాలమున వారికి ఉపద్ర
వము కలిగిన సమయమున నీవు వారిని ఖడ్గమున కప్ప
6 గించితివి గనుక । నా జీవముతోడు నేను నిన్ను రక్త
ముగా చేసెదను, రక్తము నిన్ను తరుమును, రక్తము
నీకిష్టమాయెను గనుక రక్తమే నిన్ను తరుమును; ఇదే
7 ప్రభువగు యెహోవా వాక్కు. । వచ్చువారును
పోవువారును లేకుండ అందరిని నిర్మూలముచేసి నేను
శేయీరు పర్వతమును పాడుగాను నిర్జనముగాను
8 చేయుదును. । అతని పర్వతములను హతమైనవారితో
నింపుదును, నీ కొండలలోను నీ లోయలలోను నీ
వాగులన్నిటిలోను వారు ఖడ్గముచేత హతులై కూలు
9 దురు. । నేను యెహోవానై యున్నానని మీరు
తెలిసికొనునట్లు నీ పట్టణములు మరల కట్టబడకుండ
ఎల్లప్పుడును పాడుగా ఉండజేయుదును. । —
యెహోవా అక్కడనుండినను ఆ రెండు జనము 10
లును ఆ రెండు దేశములును మనవే, మనము వాటిని
స్వాధీనపరచుకొందము రండని నీవనుకొంటివే; । నా 11
జీవముతోడు నీవు వారియెడల పట్టిన పగవలన వారికి
చూపిన అసూయచొప్పునను క్రోధముచొప్పునను
నేను నీకు తగిన పనిచేసి, నిన్ను శిక్షించుటవలన వారికి
నన్ను నేనే తెలియపరచుకొందును. । — అవి పాడై 12
నవి, మనకు ఆహారముగా అప్పగింపబడినవని నీవు
ఇశ్రాయేలు పర్వతములనుగురించి పలికిన దూషణ
మాటలన్నియు యెహోవానగు నాకు వినబడెనని
నీవు తెలిసికొందువు. । పెద్దనోరు చేసికొని మీరు 13
నామీద విస్తారముగా ఆడిన మాటలు నాకు విన
బడెను. । ప్రభువగు యెహోవా సెలవిచ్చునదే 14
మనగా — లోకమంతయు సంతోషించునంత నాశ
నము నేను నీమీదికి రప్పించెదను. । ఇశ్రాయేలీయుల 15
స్వాస్థ్యము పాడైపోవుట చూచి నీవు సంతోషించి
తివి గనుక నీకును ఆ ప్రకారముగానే చేసెదను;
శేయీరు పర్వతమా, నీవు పాడవుదువు, ఎదోము
దేశము యావత్తును పాడైపోవును, అప్పుడు నేను
యెహోవానై యున్నానని వారు తెలిసికొందురు.

మరియు నరపుత్రుడా, నీవు ఇశ్రాయేలు 36
పర్వతములకు ఈ మాట ప్రవచింపుము — ఇశ్రా
యేలు పర్వతములారా, యెహోవా మాట ఆల
కించుడి. । ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమ 2
నగా — ఆహా ప్రాచీనములైన ఉన్నతస్థలములు మా
స్వాస్థ్యములైనవని మిమ్మునుగురించి శత్రువులు చెప్పు
కొనుచున్నారు. । వచనమెత్తి ఈలాగు ప్రవచింపుము 3
— ప్రభువగు యెహోవా సెలవిచ్చునదేమనగా —
శేషించిన అన్యజనులకు మీరు స్వాధీనులగునట్లుగాను,
నిందకులచేత జనులదృష్టికి మీరు అపహాస్యాస్పదమగు
నట్లుగాను, నలుదిక్కుల మీ శత్రువులు మిమ్మును
పట్టుకొన నాశించి మిమ్మును పాడుచేసియున్నారు. ।
కాగా ఇశ్రాయేలు పర్వతములారా, ప్రభువైన 4
యెహోవా మాట ఆలకించుడి. ప్రభువగు
యెహోవా ఈలాగు సెలవిచ్చుచున్నాడు — శేషిం
చిన అన్యజనులకు అపహాస్యాస్పదమై దోపుడు
సొమ్ముగా విడువబడిన పర్వతములతోను కొండలతోను
వాగులతోను లోయలతోను పాడైన స్థలములతోను
నిర్జనమైన పట్టణములతోను । ప్రభువైన యెహోవా 5
సెలవిచ్చునదేమనగా — సంతుష్టహృదయులై నా దేశ
మును హీనముగా చూచి దోపుడు సొమ్ముగా ఉండు
టకై తమకు అది స్వాస్థ్యమని దాని స్వాధీనపరచు
కొనిన ఎదోమీయులనందరినిబట్టియు, శేషించిన
అన్యజనులనుబట్టియు నా రోషాగ్నితో యథార్థ
ముగా మాట ఇచ్చియున్నాను. । కాబట్టి ఇశ్రా 6

యేలు దేశమునుగూర్చి ప్రవచనమెత్తి, పర్వతముల
తోను కొండలతోను వాగులతోను లోయలతోను
ఈ మాట తెలియజెప్పుము—ప్రభువైన యెహోవా
సెలవిచ్చునదేమనగా — మీరు అన్యజనులవలన
అవమానము నొందితిరి గనుక రోషముతోను కోపము
7 తోను నేను మాటలాడుచున్నాను. । ప్రభువైన
యెహోవా సెలవిచ్చునదేమనగా—మీ చుట్టునున్న
అన్యజనులు అవమానము నొందుదురని నేను ప్రమా
8 ణము చేసియున్నాను. । ఇశ్రాయేలు పర్వతములారా,
యిక కొంతకాలమునకు ఇశ్రాయేలీయులగు నా జనులు
వచ్చెదరు, మీరు చిగురుపెట్టి వారికొరకు మీ ఫల
9 ములు ఫలించుదురు. । నేను మీ పక్షమున నున్నాను,
నేను మీతట్టు తిరుగగా మీరు దున్నబడి విత్తబడు
10 దురు. । మీమీద మనుష్యజాతిని, అనగా ఇశ్రాయేలీ
యులనందరిని, విస్తరింపజేసెదను, మీ పట్టణములకు
నివాసులు వత్తురు, పాడైపోయిన పట్టణములు మరల
కట్టబడును. । మీమీద మనుష్యులను పశువులను విస్త
రింపజేసెదను, అవి విస్తరించి అభివృద్ధి నొందును,
పూర్వమున్నట్లు మిమ్మును నివాసస్థలముగా చేసి, మును
పటికంటె అధికమైన మేలు మీకు కలుగజేసెదను,
అప్పుడు నేను యెహోవానై యున్నానని మీరు
తెలిసికొందురు. । మనుష్యులను, అనగా నా జను
లగు ఇశ్రాయేలీయులను నేను మీలో సంచారము
చేయింతును, వారు నిన్ను స్వతంత్రించుకొందురు,
మీరిక మీదట వారిని పుత్రహీనులుగా చేయక
వారికి స్వాస్థ్యమగుదురు. । ప్రభువగు యెహోవా
సెలవిచ్చునదేమనగా — దేశమా, నీవు మనుష్యులను
భక్షించుదానవు, నీ జనులను పుత్రహీనులుగా చేయు
దానవు అని జనులు నిన్నుగూర్చి చెప్పుచున్నారే. ।
నీవు మనుష్యులను భక్షించవు, ఇకను నీ జనులను పుత్ర
హీనులుగా చేయవు; ఇదే ప్రభువగు యెహోవా
వాక్కు. । నిన్నుగూర్చి అన్యజనులు చేయు అప
హాస్యము నీకిక వినబడనియ్యను, జనములవలన
కలుగు అవమానము నీవిక భరించవు, నీవు నీ జనులను
పుత్రహీనులుగా చేయకయుందువు;[1] ఇదే ప్రభువగు
యెహోవా వాక్కు.

మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
యీలాగు సెలవిచ్చెను । —నరపుత్రుడా, ఇశ్రా
యేలీయులు తమ దేశములో నివసించి, దుష్ప్రవర్తన
చేతను దుష్క్రియలచేతను దానిని అపవిత్రపరచిరి,
వారి ప్రవర్తన రజస్వలయొక్క అపవిత్రతవలె నా
దృష్టికి కనబడుచున్నది. । కాబట్టి దేశములో వారు
చేసిన నరహత్య విషయమైయును, విగ్రహములను
పెట్టుకొని వారు దేశమును అపవిత్రపరచినదాని
విషయమైయును నేను నా క్రోధమును వారిమీద
కుమ్మరించి । వారి ప్రవర్తననుబట్టియు వారి క్రియలను 19
బట్టియు వారిని శిక్షించి, నేను అన్యజనులలోనికి వారిని
వెళ్లగొట్టగా వారు ఆ యా దేశములకు చెదరిపోయిరి. ।
వారు తాము వెళ్లిన స్థలములలోని జనులయొద్ద చేరగా 20
ఆ జనులు—వీరు యెహోవా జనులే గదా, ఆయన
దేశములోనుండి వచ్చినవారే గదా, అని చెప్పుటవలన
నా పరిశుద్ధ నామమునకు దూషణ కలుగుటకు ఇశ్రా
యేలీయులు కారణమైరి. । కాగా ఇశ్రాయేలీయులు 21
పోయిన యెల్లచోట్లను నా పరిశుద్ధనామమునకు
దూషణ కలుగగా నేను చూచి నా నామము విష
యమై చింతపడితిని. । కాబట్టి ఇశ్రాయేలీయులకు 22
ఈ మాట ప్రకటనచేయుము—ప్రభువగు యెహోవా
సెలవిచ్చునదేమనగా — ఇశ్రాయేలీయులారా, మీ
నిమిత్తముకాదు గాని అన్యజనులలో మీచేత దూషణ
నొందిన నా పరిశుద్ధనామము నిమిత్తము నేను చేయ
బోవుదాని చేయుదును. । అన్యజనుల మధ్య మీరు 23
దూషించిన నా ఘనమైన నామమును నేను పరిశుద్ధ
పరచుదును, వారియెదుట మీయందు నేను నన్ను
పరిశుద్ధపరచుకొనగా నేను ప్రభువగు యెహోవా
నని వారు తెలిసికొందురు; ఇదే ప్రభువగు యెహోవా
వాక్కు. । నేను అన్యజనులలోనుండి మిమ్మును తోడు 24
కొని, ఆ యా దేశములలోనుండి సమకూర్చి మీ
స్వదేశములోనికి మిమ్మును రప్పించెదను. । మీ అప 25
విత్రత యావత్తు పోవునట్లు నేను మీమీద శుద్ధజలము
చల్లుదును, మీ విగ్రహములవలన మీకు కలిగిన అప
విత్రత అంతయు తీసివేసెదను. । నూతన హృదయము 26
మీకిచ్చెదను, నూతనస్వభావము మీకు కలుగజేసెదను,
రాతిగుండె మీలోనుండి తీసివేసి మాంసపు గుండెను
మీకిచ్చెదను. । నా ఆత్మను మీయందుంచి, నా కట్ట 27
డల ననుసరించువారినిగాను నా విధులను గైకొను
వారినిగాను మిమ్మును చేసెదను. । నేను మీ పితరుల 28
కిచ్చిన దేశములో మీరు నివసించెదరు, మీరు నా
జనులై యుందురు నేను మీ దేవుడనై యుందును. ।
మీ సకలమైన అపవిత్రతను పోగొట్టి నేను మిమ్మును 29
రక్షింతును, మీకు కరవు రానియ్యక ధాన్యమునకు
ఆజ్ఞ ఇచ్చి అభివృద్ధిపరతును. । అన్యజనులలో కరవు 30
వునుగూర్చిన నింద మీరిక నొందక యుండునట్లు
చెట్ల ఫలములను భూమిపంటను నేను విస్తరింపజేసెదను. ।
అప్పుడు మీరు మీ దుష్ప్రవర్తనను మీరు చేసిన 31
దుష్క్రియలను మనస్సునకు తెచ్చుకొని, మీ దోషము
లను బట్టియు హేయక్రియలనుబట్టియు మిమ్మును
మీరు అసహ్యించుకొందురు. । మీ నిమిత్తము నేను 32
ఈలాగున చేయుటలేదని తెలిసికొనుడి; ఇదే ప్రభు
వైన యెహోవా వాక్కు. ఇశ్రాయేలీయులారా,
మీ ప్రవర్తననుగూర్చి చిన్నబోయి సిగ్గుపడుడి. । మీ 33

[1] కూలజేయక యుందువు.

యేలీయులు చెదరిపోయిరో ఆ యా అన్యజనులలో
నుండి వారిని రక్షించి, వారు ఎచ్చటెచ్చట ఉన్నారో
అచ్చటనుండి వారిని సమకూర్చి వారి స్వదేశములోనికి
22 తోడుకొనివచ్చి । వారికమీదట ఎన్నటికిని రెండు జన
ములుగాను రెండు రాజ్యములుగాను ఉండకుండు
నట్లు ఆ దేశములో ఇశ్రాయేలీయుల పర్వతముల
23 మీద । వారిని ఏకజనముగా చేసి, వారికందరికి ఒక
రాజునే నియమించెదను. తమ విగ్రహములవలనగాని
తాము చేసియున్న హేయక్రియలవలనగాని యే
అతిక్రమక్రియలవలనగాని వారికమీదట తమ్మును
అపవిత్రపరచుకొనరు; తాము నివసించిన చోట్లన్ని
టిలో వారు మానక పాపములు ఇక చేయకుండ
వారిని రక్షించి వారిని పవిత్రపరచెదను, అప్పుడు
వారు నా జనులగుదురు, నేను వారి దేవుడనై యుం
24 దును. । నా సేవకుడైన దావీదు వారికి రాజవును,
వారికందరికి కాపరి యొక్కడే యుండును, వారు నా
విధులను అనుసరింతురు, నా కట్టడలను గైకొని ఆచ
25 రింతురు. । మీ పితరులు నివసించునట్లు నా సేవకుడైన
యాకోబుకు నేనిచ్చిన దేశములో వారు నివసింతురు,
వారి పిల్లలును వారి పిల్లల పిల్లలును అక్కడ నిత్యము
నివసింతురు, నా సేవకుడైన దావీదు ఎల్లకాలము
26 వారికి అధిపతియై యుండును. । నేను వారితో
సమాధానార్థమైన నిబంధన చేసెదను, అది నాకును
వారికిని నిత్యనిబంధనగా ఉండును, నేను వారిని స్థిర
పరచెదను, వారిని విస్తరింపజేసి వారిమధ్య నా పరి
27 శుద్ధస్థలమును నిత్యము ఉంచెదను. । నా మందిరము
వారికి పైగానుండును, నేను వారి దేవుడనై యుందును
28 వారు నా జనులై యుందురు. । మరియు వారిమధ్య నా
పరిశుద్ధస్థలము నిత్యము ఉండుటనుబట్టి యెహోవా
నైన నేను ఇశ్రాయేలీయులను పరిశుద్ధపరచువాడనని
అన్యజనులు తెలిసికొందురు.

38 మరియు యెహోవా వాక్కు నాకు ప్రత్యక్షమై
2 యీలాగు సెలవిచ్చెను । —నరపుత్రుడా, మాగోగు
దేశపువాడగు గోగు, అనగా రోషుకును మెషెకుకును
తుబాలుకును అధిపతియైనవానితట్టు అభిముఖుడవై
3 అతనిగూర్చి ఈ మాట యెత్తి ప్రవచింపుము । —ప్రభు
వైన యెహోవా సెలవిచ్చునదేమనగా—రోషుకును
మెషెకుకును తుబాలుకును అధిపతియగు గోగూ,
4 నేను నీకు విరోధినై యున్నాను. । నేను నిన్ను వెను
కకు త్రిప్పి నీ దవుడలకు గాలములు తగిలించి, నిన్నును
నీ సైన్యమంతటిని గుఱ్ఱములను నానావిధములైన
ఆయుధములు ధరించు నీ రౌతులనందరిని, కవచము
లును డాళ్లును ధరించి ఖడ్గములు చేత పట్టుకొనువారి
నందరిని, మహా సైన్యముగా బయలుదేరదీసెదను. ।
5 నీతోకూడిన పారసీకదేశపువారిని కూషీయులను
పూతువారినందరిని, డాళ్లను శిరస్త్రాణములను ధరించు
వారినందరిని నేను బయలుదేరదీసెదను. । గోమెరును 6
అతని సైన్యమంతయును ఉత్తరదిక్కులలోనుండు
తోగర్మాయును అతని సైన్యమును జనములనేకములు
నీతోకూడ వచ్చును. । నీవు సిద్ధముగా ఉండుము, 7
నీవు సిద్ధపడి నీతోకూడ కలిసిన సమూహమంతటిని
సిద్ధపరచుము, వారికి నీవు కావలియై యుండవలెను. ।
చాలాదినములైన తరువాత నీవు శిక్షనొందుదువు; 8
సంవత్సరముల అంతములో నీవు ఖడ్గమునుండి తప్పించు
కొని, ఆ యా జనములలో చెదరిపోయి యెడతెగక
పాడుగా ఉన్న ఇశ్రాయేలీయుల పర్వతములమీద
నివసించుటకై మరల సమకూర్చబడిన జనులయొద్ద
కును, ఆ యా జనులలోనుండి రప్పించబడి నిర్భయ
ముగా నివసించు జనులందరియొద్దకును నీవు వచ్చెదవు. ।
గాలివాన వచ్చినట్లును మేఘము కమ్మినట్లును నీవు 9
దేశముమీదికి వచ్చెదవు, నీవును నీ సైన్యమును నీతో
కూడిన బహు జనమును దేశముమీద వ్యాపింతురు. ।
ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా — ఆ 10
కాలమందు నీ మనస్సులో అభిప్రాయములు పుట్టును, ।
నీవు దురాలోచనచేసి ఇట్లనుకొందువు— నేను ప్రాకా 11
రములులేని గ్రామములుగల దేశముమీదికి పోయె
దను, ప్రాకారములును అడ్డగడెలును గవునులునులేని
దేశముమీదికి పోయెదను, నిమ్మళముగాను నిర్భయము
గాను నివసించువారిమీదికి పోయెదను. । వారిని 12
దోచుకొని కొల్లసొమ్ముగా పట్టుకొనుటకై, పూర్వము
పాడై మరల నివసింపబడిన స్థలములమీదికి తిరిగి పోయె
దను, ఆ యా జనములలోనుండి సమకూర్చబడి,
పశువులును సరుకులును గలిగి, భూమి నట్టనడుమ నివ
సించు జనులమీదికి తిరిగి పోయెదను. । సెబావారును 13
దదానువారును తర్షీషు వర్తకులును కొదమసింహముల
వంటివారైన దానివారందరును నిన్ను చూచి—సొమ్ము
దోచుకొనుటకు వచ్చితివా? దోపు దోచుకొనుటకు
సైన్యము సమకూర్చితివా? బహుగా దోపు దోచు
కొని, వెండి బంగారములను పశువులను సరకులను
పట్టుకొని పోవుటకు చాల దోపుడు దోచుకొనుటకు
వచ్చితివా? అని నిన్నడుగుదురు.

కాగా నరపుత్రుడా, ప్రవచనమెత్తి గోగుతో 14
ఇట్లనుము — ప్రభువగు యెహోవా సెలవిచ్చునదే
మనగా — నా జనులగు ఇశ్రాయేలీయులు నిర్భయ
ముగా నివసించుకాలమున నీవు తెలిసికొందువు గదా? ।
ఉత్తరదిక్కున దూరముననున్న నీ స్థలములలోనుండి 15
నీవును నీతోకూడ జనములనేకములును గుఱ్ఱములెక్కి
బహు విస్తారమైన సైన్యముగా కూడి వచ్చి । మేఘము 16
భూమిని కమ్మినట్లు ఇశ్రాయేలీయులగు నా జనుల
మీద పడెదరు; దినముల అంతమందు అది సంభవిం
చును, అన్యజనులు నన్ను తెలిసికొనునట్లు నిన్నుబట్టి
వారియెదుట నన్ను నేను పరిశుద్ధపరచుకొను సమయ

మున, గోగూ, నేను నా దేశముమీదికి నిన్ను రప్పిం
17 చెదను. । ప్రభువగు యెహోవా సెలవిచ్చునదే
మనగా — నిన్ను వారిమీదికి రప్పించెదనని పూర్వ
మందు ఏటేట ప్రవచించుచు వచ్చిన ఇశ్రాయేలీ
యుల ప్రవక్తలైన నా సేవకులద్వారా నేను సెలవిచ్చిన
18 మాట నిన్ను గూర్చినదే గదా? । ఆ దినమున, గోగు
ఇశ్రాయేలీయుల దేశముమీదికి రాబోవు ఆ దిన
మున, నా కోపము బహుగా రగులుకొనును; ఇదే
19 ప్రభువగు యెహోవా వాక్కు. । కాబట్టి నేను
రోషమును మహా రౌద్రమును గలిగినవాడనై యీ
లాగు ప్రమాణముచేసితిని. ఇశ్రాయేలీయుల దేశ
20 ములో మహాకంపము పుట్టును. । సముద్రపు చేప
లును ఆకాశపక్షులును భూజంతువులును భూమిమీద
ప్రాకు పురుగులన్నియు భూమిమీదనుండు నరులంద
రును నాకు భయపడి వణకుదురు, పర్వతములు నాశన
మగును, కొండపేటులు పడును, గోడలన్నియు నేల
21 పడును. । నా పర్వతములన్నిటిలో అతనిమీదికి
ఖడ్గము రప్పించెదను, ప్రతివాని ఖడ్గము వాని సహో
దరునిమీద పడును; ఇదే ప్రభువగు యెహోవా
22 వాక్కు. । తెగులుపంపి హత్య కలుగజేసి, అతని
మీదను అతని సైన్యపు వారిమీదను అతనితోకూడిన
జనముల నేకములమీదను ప్రళయమైన వానను పెద్ద
వడగండ్లను అగ్ని గంధకములను కురిపించి నేను అత
23 నితో వ్యాజ్యమాడుదును. । నేను యెహోవానై
యున్నానని అన్యజనులు అనేకులు తెలిసికొనునట్లు
నేను ఘనత వహించి నన్ను పరిశుద్ధపరచుకొని వారి
యెదుట నన్ను తెలియపరచుకొందును.

**39** మరియు నరపుత్రుడా, గోగునుగూర్చి ప్రవచన
మెత్తి ఇట్లనుము—ప్రభువగు యెహోవా సెలవిచ్చు
నదేమనగా—రోషుకును మెషెకుకును తుబాలుకును
అధిపతివైన గోగూ, నేను నీకు విరోధినై యున్నాను. ।
2 నిన్ను వెనుకకు త్రిప్పి నడిపించి, ఉత్తరదిక్కున
దూరములో ఉన్న నిన్ను బయలుదేరదీసి ఇశ్రాయేలీ
3 యుల పర్వతములకు రప్పించి । నీ యెడమచేతిలో
నున్న నీ వింటిని క్రిందపడగొట్టెదను, నీ కుడిచేతిలో
4 నున్న బాణములను క్రిందపడవేసెదను. । నీవును నీ
సైన్యమును నీతోనున్న జనులందరును ఇశ్రాయేలు
పర్వతములమీద కూలుదురు, నానావిధమైన క్రూర
పక్షులకును దుష్టమృగములకును ఆహారముగా నిన్ను
5 ఇచ్చెదను. । నీవు పొలముమీద కూలుదువు, నేనే
మాట యిచ్చియున్నాను ఇదే ప్రభువగు యెహోవా
6 వాక్కు. । నేను మాగోగుమీదికిని ద్వీపములలో నిర్వి
చారముగా నివసించువారిమీదికిని అగ్ని పంపెదను,
అప్పుడు నేను యెహోవానై యున్నానని వారు
తెలిసికొందురు. । నేను యెహోవానై యున్నానని
అన్యజనులు తెలిసికొనునట్లు ఇక నా పరిశుద్ధనామ
మునకు దూషణ కలుగనియ్యక, నా జనులగు ఇశ్రా
యేలీయుల మధ్య దాని బయలుపరచెదను. । ఇదిగో 8
అది వచ్చుచున్నది, కలుగబోవుచున్నది, నేను తెలియ
జేసిన సమయమున అది జరుగును; ఇదే ప్రభువగు
యెహోవా వాక్కు. । ఇశ్రాయేలీయుల పట్టణ 9
ములలో నివసించువారు బయలుదేరి, కవచములను
డాళ్లను కేడెములను విండ్లను బాణములను గదలను
ఈటెలను తీసికొని పొయ్యిలో కాల్చుదురు, వాటి
వలన ఏడు సంవత్సరములు అగ్ని మండును. । వారు 10
పొలములో కట్టెలు ఏరుకొనకయు అడవులలో
మ్రానులు నరుకకయునుండి, ఆయుధములు పొయ్యిలో
కాల్చుచుందురు, తమ్మును దోచుకొనినవారిని తామే
దోచుకొందురు, తమ సొమ్ము కొల్లపెట్టినవారి సొమ్ము
తామే కొల్లపెట్టుదురు; ఇదే ప్రభువగు యెహోవా
వాక్కు.

ఆ దినమున గోగువారిని పాతిపెట్టుటకై సముద్ర 11
మునకు తూర్పుగా ప్రయాణస్థులు పోవు లోయలో
ఇశ్రాయేలు దేశమున నేనొక స్థలము ఏర్పరచెదను;
గోగును అతని సైన్యమంతటిని అక్కడి జనులు పాతి
పెట్టగా ప్రయాణస్థులు పోవుటకు వీలులేకుండును,
ఆ లోయకు హామోన్గోగు అను పేరు పెట్టుదురు. ।
దేశమును పవిత్రపరచుచు ఇశ్రాయేలీయులు ఏడు 12
నెలలు వారిని పాతిపెట్టుచుందురు. । నేను ఘనము 13
వహించు దినమున దేశపు జనులందరును వారిని పాతి
పెట్టుదురు; (దానివలన) వారు కీర్తినొందెదరు; ఇదే
యెహోవా వాక్కు. । దేశమును పవిత్రపరచుటకై 14
దానిలోనున్న కళేబరములను పాతిపెట్టువారిని, దేశ
మును సంచరించి చూచుచు వారితోకూడ పోయి
పాతిపెట్టువారిని నియమించెదరు. ఏడు నెలలైన
తరువాత దేశమునందు తనికీచేసెదరు. । దేశమును 15
సంచరించి చూచువారు తిరుగులాడుచుండగా మనుష్య
శల్య మొకటియైనను కనబడినయెడల పాతిపెట్టువారు
హామోన్గోగు లోయలో దాని పాతిపెట్టు పర్యంతము
అక్కడ వారేదైన ఒక ఆనవాలు పెట్టుదురు. ।
మరియు హామోనా అను పేరుగల ఒక పట్టణముం 16
డును. ఈలాగున వారు దేశమును పవిత్రపరచుదురు.

నరపుత్రుడా, ప్రభువైన యెహోవా సెలవిచ్చు 17
నదేమనగా—సకలజాతుల పక్షులకును భూమృగముల
కన్నిటికిని యీ సమాచారము తెలియజేయుము—
నేను మీకొరకు వధించు బలికి నలుదిక్కులనుండి
కూడి రండి; ఇశ్రాయేలీయుల పర్వతములమీద నొక
గొప్ప బలి జరుగును, మీరు మాంసము తిందురు
రక్తము త్రాగుదురు; । బలాఢ్యుల మాంసము తిందురు, 18
భూపతుల రక్తమును, బాషానులో క్రొవ్విన పొట్టేళ్ల
యొక్కయు గొఱ్ఱెపిల్లలయొక్కయు మేకలయొక్కయు
కోడెలయొక్కయు రక్తము త్రాగుదురు. । నేను మీ 19

కొఱకు బలి వధింపబోవుచున్నాను, మీరు కడుపార
క్రొవ్వు తిందురు, మత్తు కలుగునంతగా రక్తము త్రాగు
దురు. । నేనేర్పరచిన పంక్తిని కూర్చుండి గుఱ్ఱములను
రౌతులను బలాఢ్యులను ఆయుధస్థులను మీరు కడు
పార భక్షింతురు; ఇదే ప్రభువగు యెహోవా
వాక్కు. । నా ఘనతను అన్యజనులలో అగుపరచె
దను, నేను చేసిన తీర్పును వారిమీద నేను వేసిన నా
హస్తమును అన్యజనులందరు చూచెదరు. । ఆ దినము
మొదలుకొని నేనే తమ దేవుడనైన యెహోవానై
యున్నానని ఇశ్రాయేలీయులు తెలిసికొందురు. ।
మరియు ఇశ్రాయేలీయులు తమ దోషమునుబట్టి చెర
లోనికి పోయిరనియు, వారు విశ్వాసఘాతుకులైనందున
నేను వారికి పరాఙ్ముఖుడనై వారు ఖడ్గముచేత కూలు
నట్లుగా వారిని బాధించువారికి అప్పగించితిననియు
అన్యజనులు తెలిసికొందురు. । వారి యపవిత్రతను
బట్టియు అతిక్రమక్రియలనుబట్టియు నేను వారికి
పరాఙ్ముఖుడనై వారికి ప్రతికారము చేసితిని.

కాబట్టి ప్రభువగు యెహోవా సెలవిచ్చునదే
మనగా—నా పరిశుద్ధ నామమునుబట్టి రోషముకలిగిన
వాడనై యాకోబు సంతతివారిని చెరలోనుండి రప్పిం
చెదను, ఇశ్రాయేలీయులందరియెడల జాలిపడెదను. ।
వారు నాయెడల తాము చూపిన విశ్వాసఘాతుక
మును తమ అవమానమును తాము భరించుదురు. నేను
అన్యజనులందరిలోనుండి వారిని సమకూర్చి వారి
శత్రువుల దేశములలోనుండి రప్పించిన తరువాత
వారు సురక్షితముగాను నిర్భయముగాను తమ దేశ
ములో నివసించునప్పుడు । వారియందు అన్యజను
లనేకుల యెదుట నన్ను పరిశుద్ధపరచుకొందును. ।
అన్యజనులలోనికి వారిని చెరగా పంపి, వారిలో ఎవరిని
ఇకను అచ్చట ఉండనియ్యక తమ దేశమునకు వారిని
సమకూర్చిన సంగతినిబట్టి నేను తమ దేవుడైన
యెహోవానై యున్నానని వారు తెలిసికొందురు. ।
అప్పుడు ఇశ్రాయేలీయులమీద నేను నా ఆత్మను కుమ్మ
రించెదను గనుక నేనికను వారికి పరాఙ్ముఖుడనై యుం
డను; ఇదే ప్రభువగు యెహోవా వాక్కు.

మనము చెరలోనికి వచ్చిన యిరువదియైదవ సం
వత్సరము మొదటి నెల పదియవ దినమున, అనగా
పట్టణము కొల్లపోయిన పదునాలుగవ సంవత్సరమున
ఆ దినముననే యెహోవా హస్తము నా మీదికి
రాగా ఆయన నన్ను పట్టణమునకు తోడుకొని
పోయెను. । దేవుని దర్శనవశుడనైన నన్ను ఇశ్రాయేలీ
యుల దేశములోనికి తోడుకొనివచ్చి, మిగుల ఉన్నత
మైన పర్వతముమీద ఉంచెను. దానిపైన దక్షిణపు
తట్టున పట్టణమువంటి దొకటి నాకగుపడెను. । అక్క
డికి ఆయన నన్ను తోడుకొని రాగా ఒక మనుష్యు
డుండెను; ఆయన మెరయుచున్న యిత్తడివలె కన
బడెను, దారమును కొలకఱ్ఱయు చేత పట్టుకొని
ద్వారములో ఆయన నిలువబడియుండెను. । ఆ మను 4
ష్యుడు నాతో ఇట్లనెను—నరపుత్రుడా, నేను నీకు
చూపుచున్న వాటినన్నిటిని కన్నులార చూచి చెవు
లార విని మనస్సులో ఉంచుకొనుము; నేను వాటిని
నీకు చూపుటకై నీవిచ్చటికి తేబడితివి, నీకు కనబడు
వాటినన్నిటిని ఇశ్రాయేలీయులకు తెలియజేయుము.

నేను చూడగా నలుదిశల మందిరముచుట్టు 5
ప్రాకారముండెను, మరియు ఆ మనుష్యునిచేతిలో
ఆరు మూరల కొలకఱ్ఱ యుండెను, ప్రతిమూర
మూరెడు బెత్తెడు నిడివిగలది, ఆయన ఆ కట్టడమును
కొలువగా దాని వెడల్పును దాని యెత్తును బారన్నర
తేలెను. । ఆయన తూర్పుతట్టుననున్న గుమ్మమునకు 6
వచ్చి దాని సోపానములమీదికెక్కి గుమ్మపు గడపను
కొలువగా దాని వెడల్పు, అనగా మొదటి గడప
వెడల్పు బారన్నర తేలెను. । మరియు కావలిగది 7
నిడివియు వెడల్పును బారన్నర, కావలి గదులకు
మధ్య అయిదేసి మూరల యెడముండెను. గుమ్మము
యొక్క ద్వారపు ప్రక్కకును మందిరమునకును
బారన్నర యెడము. । గుమ్మపు ద్వారమునకును మందిర 8
మునకును మధ్య కొలువగా బారన్నర తేలెను. ।
గుమ్మపుద్వారము కొలువగా అది యెనిమిది మూరలై 9
యుండెను, దాని స్తంభములు రెండేసి మూరలు;
అవి గుమ్మపు ద్వారము మందిరపుదిక్కుగా చూచు
చుండెను. । తూర్పుగుమ్మపు ద్వారముయొక్క కావలి 10
గదులు ఇటు మూడును అటు మూడును ఉండెను,
మూడు గదులకు కొలత యొకటే. మరియు రెండు
ప్రక్కలనున్న స్తంభములకు కొలత యొకటే. । ఆ 11
యా గుమ్మముల వాకిండ్లు కొలువగా వాటి వెడల్పు
పది మూరలును నిడివి పదుమూడు మూరలును
తేలెను. । కావలిగదులముందర మూరెడు ఎత్తుగల 12
గోడ ఇరుప్రక్కలనుండెను, ఆ ప్రక్కను ఈ
ప్రక్కను మూరెడు ఎత్తుగల గోడ యుండెను; గదు
లైతే ఇరుప్రక్కలను ఆరు మూరల ఎత్తుగలవి. । ఒక 13
గది కప్పునుండి రెండవదాని కప్పువరకు గుమ్మమును
కొలువగా ఇరువది యయిదు మూరల వెడల్పు తేలెను,
రెండు వాకిండ్లమధ్య గోడను అదేకొలత. । అరువ 14
దేసి మూరలు ఎడముగా ఒక్కొక్క స్తంభము నిలువ
బెట్టబడెను. గుమ్మము చుట్టునున్న ఆవరణము స్తంభ
ములవరకు వ్యాపించెను. । బయటిగుమ్మమునొద్దనుండి 15
లోపటిగుమ్మపు ద్వారమువరకు ఏబదిమూరలు. । కావలి 16
గదులకును గుమ్మములకు లోపల వాటికి మధ్యగా
చుట్టునున్న గోడలకును ప్రక్కగదులకును కమ్ములు
పెట్టబడిన కిటికీలుండెను, గోడలోని స్తంభములకును
కిటికీలుండెను; ప్రతి స్తంభముమీదను ఖర్జూరపు
చెట్లు రూపింపబడియుండెను

17 ఆయన బయటి ఆవరణములోనికి నన్ను తీసికొని
రాగా అచ్చట గదులును చప్టాయు కనబడెను. చప్టా
18 మీద ముప్పది చిన్నగదులు ఏర్పడియుండెను. ఈ
చప్టా గుమ్మములవరకుండి వాటి వెడల్పున సాగియుం
19 డెను. అది క్రింది చప్టా ఆయెను. క్రింది గుమ్మము
మొదలుకొని లోపలి ఆవరణమువరకు ఆయన వెడల్పు
కొలువగా ఇది తూర్పునను ఉత్తరమునను నూరు మూర
20 లాయెను. మరియు ఉత్తరపువైపున బయటి ఆవరణము
21 చూచుచుండు గుమ్మపు నిడివిని వెడల్పును దాని
ఇరుప్రక్కలనున్న మూడేసి కావలి గదులను వాటి
స్తంభములను వాటి మధ్యగోడలను అతడు కొలువగా
వాటి కొలత మొదటిగుమ్మపు కొలతప్రకారముగా
కనబడెను, అనగా నిడివి ఏబది మూరలు వెడల్పు
22 ఇరువదియైదు మూరలు కనబడెను. వాటి కిటికీలును
వాటి మధ్యగోడలును ఖర్జూరపుచెట్లవలె రూపింప
బడిన వాటి అలంకారమును తూర్పుద్వారముయొక్క
కొలత ప్రకారముగా కనబడెను మరియు ఎక్కుటకై
యేడు మెట్లుండెను, ఎదుటనుండి దాని మధ్యగోడలు
23 కనబడుచుండెను. ఉత్తరద్వారమున కెదురుగా ఒక
టియు, తూర్పుద్వారమున కెదురుగా ఒకటియు,
లోపటి ఆవరణమునకు పోవు రెండు గుమ్మములుండెను.
ఈ గుమ్మమునకు ఆ గుమ్మమునకు ఎంతైనది అతడు
24 కొలువగా నూరుమూరల యెడము కనబడెను. అతడు
నన్ను దక్షిణపుతట్టుకు తోడుకొనిపోగా దక్షిణపు
తట్టున గుమ్మమొకటి కనబడెను. దాని స్తంభములను
మధ్యగోడలను కొలువగా అదే కొలత కనబడెను.
25 మరియు వాటికున్నట్టుగా దీనికిని దీని మధ్యగోడల
కును చుట్టు కిటికీలుండెను, దాని నిడివి ఏబది మూరలు
26 దాని వెడల్పు ఇరువదియైదు మూరలు. ఎక్కుటకు
ఏడు మెట్లును ఎదురుగా కనబడు మధ్యగోడలును
ఉండెను. మరియు దాని స్తంభముల ఇరుప్రక్కలను
27 ఖర్జూరపుచెట్లను పోలిన అలంకారముండెను. లోపటి
ఆవరణమునకు దక్షిణపు తట్టున గుమ్మమొకటి యుం
డెను, దక్షిణపు తట్టున గుమ్మమునుండి గుమ్మమువరకు
ఆయన కొలువగా నూరు మూరలాయెను.

28 ఆయన దక్షిణమార్గమున లోపటి ఆవరణములోనికి
నన్ను తోడుకొనిపోయి దక్షిణపు గుమ్మమును కొలి
29 చెను; దాని కొలత అదే. మరియు దాని కావలి
గదులును స్తంభములును మధ్యగోడలును పైచెప్పిన
కొలతకు సరిపడెను; దానికిని దాని చుట్టు ఉన్న మధ్య
గోడలకును కిటికీలుండెను; దాని నిడివి ఏబది మూరలు
30 దాని వెడల్పు ఇరువదియైదు మూరలు. చుట్టు మధ్య
గోడల నిడివి ఇరువదియైదు మూరలు వెడల్పు అయిదు
31 మూరలు. దాని మధ్యగోడలు బయటి ఆవరణము
తట్టు చూచుచుండెను; దాని స్తంభములమీద ఖర్జూ
రపుచెట్లనుపోలిన అలంకారముండెను; ఎక్కుటకు
ఎనిమిది మెట్లుండెను. తూర్పుతట్టు లోపటి ఆవరణ 32
ములోనికి నన్ను తోడుకొనిపోయి దాని గుమ్మమును
ఆయన కొలువగా పైచెప్పిన కొలత తేలెను. దాని 33
కావలిగదులకును స్తంభములకును మధ్యగోడలకును
కొలత అదే; దానికిని దాని చుట్టునున్న మధ్యగోడల
కును కిటికీలుండెను; నిడివి యేబది మూరలు వెడల్పు
ఇరువదియైదు మూరలు. దాని మధ్యగోడలు బయటి 34
ఆవరణముతట్టు చూచుచుండెను. ఈ ప్రక్కను ఆ
ప్రక్కను దాని స్తంభములమీద ఖర్జూరపుచెట్లను
పోలిన అలంకారముండెను, ఎక్కుటకు ఎనిమిది మెట్లుం
డెను. ఉత్తరపు గుమ్మమునకు అతడు నన్ను తోడు 35
కొనిపోయి దాని కొలువగా అదే కొలత యాయెను.
దాని కావలిగదులకును స్తంభములకును దాని మధ్య 36
గోడలకును అదే కొలత; దానికిని దాని చుట్టునున్న
మధ్యగోడలకును కిటికీలుండెను; దాని నిడివి యేబది
మూరలు దాని వెడల్పు ఇరువదియైదు మూరలు.
దాని స్తంభములు బయటి ఆవరణముతట్టు చూచుచుం 37
డెను; ఆ స్తంభములమీద ఈ ప్రక్కను ఆ ప్రక్కను
ఖర్జూరపుచెట్లనుపోలిన అలంకారముండెను; ఎక్కు
టకు ఎనిమిది మెట్లుండెను.

గుమ్మముల స్తంభములయొద్ద వాకిలిగల గదియుం 38
డెను; అక్కడ దహనబలి పశువుల మాంసము కడుగు
దురు. మరియు గుమ్మపు మంటపములో ఇరుప్రక్కల 39
రెండేసి బల్లలుంచబడెను; వీటిమీద దహనబలి పశువు
లును పాపపరిహారార్థ బలిపశువులును అపరాధపరి
హారార్థ బలిపశువులును వధింపబడును. గుమ్మము 40
యొక్క వాకిలిదగ్గర ఉత్తరపుదిక్కున మెట్లు ఎక్కు
చోటున ఇరుప్రక్కల రెండేసి బల్లలుండెను, అనగా
గుమ్మపు రెండుప్రక్కల నాలుగేసి బల్లలుండెను. ఇవి
పశువులను వధించుటకై ఉంచబడియుండెను. దహన 41
బలి పశువులు మొదలగు బలిపశువులను వధించుటకై 42
వినియోగించు ఉపకరణములుంచదగిన యెనిమిది బల్లలు
ఈతట్టు నాలుగు ఆతట్టు నాలుగు మెట్లదగ్గర నుం
డెను. అవి మూరెడున్నర నిడివియు మూరెడున్నర
వెడల్పును మూరెడు ఎత్తును గలిగి మలిచిన రాతితో
చేయబడి యుండెను. చుట్టుగోడకు అడుగడుగు 43
పొడుగుగల మేకులు నాటబడియుండెను; అర్పణ
సంబంధమైన మాంసము బల్లలమీద ఉంచుదురు.
లోపటి గుమ్మము బయట లోపటి ఆవరణములో 44
ఉత్తరపు గుమ్మముదగ్గరనుండి దక్షిణముగా చూచు
నొకటియు, తూర్పు గుమ్మముదగ్గరనుండి ఉత్తరముగా
చూచు ఒకటియు రెండు గదులుండెను. అప్పుడతడు 45
నాతో ఇట్లనెను—దక్షిణపుతట్టు చూచు గది మందిర
మునకు కావలివారగు యాజకులది. ఉత్తరపుతట్టు 46
చూచు గది బలిపీఠమునకు కావలివారగు యాజకులది.
వీరు లేవీయులలో సాదోకు సంతతివారై సేవచేయు

టకై యెహోవా సన్నిధికి వచ్చువారు. । అతడు
ఆ ఆవరణమును కొలువగా నిడివియు వెడల్పును నూరు
మూరలై చచ్చౌకముగా ఉండెను. మందిరమునకు
ఎదురుగా బలిపీఠముంచబడెను.

48 ఆయన మందిరముయొక్క మంటపములోనికి నన్ను
తోడుకొని వచ్చి మంటపస్తంభములను ఒక్కొక్క
దాని కొలువగా అది ఇరుప్రక్కల అయిదేసి మూర
లుండెను, గుమ్మము ఇరుప్రక్కల మూడేసి మూరల
49 వెడల్పు. । మంటపమునకు నిడివి యిరువది మూరలు;
ఎక్కుటకై యుంచబడిన మెట్లదగ్గర దాని వెడల్పు
పదకొండు మూరలు, స్తంభములదగ్గర ఇరుప్రక్కల
ఒక్కొక్కటిగా కంబములుంచబడెను.

41 తరువాత ఆయన నన్ను ఆలయమునకు తోడుకొని
వచ్చి దాని స్తంభములను కొలిచెను. ఇరుప్రక్కల
అవి ఆరు మూరలాయెను, ఇది గుడారపు వెడల్పు. ।
2 వాకిలి వెడల్పు పది మూరలు, తలుపు ఇరుప్రక్కల
అయిదేసి మూరలు, దాని నిడివిని కొలువగా నలుబది
3 మూరలు, దాని వెడల్పు ఇరువది మూరలు. । అతడు
లోపలికి పోయి వాకిలి స్తంభమును కొలువగా రెండు
మూరలాయెను, వాకిలి ఆరు మూరలు; వెడల్పు ఏడు
4 మూరలు. । — ఇది అతిపరిశుద్ధస్థలమని చెప్పి దాని
నిడివిని కొలువగా ఇరువది మూరలును ఆలయమున
కును దానికిని మధ్య వెడల్పు ఇరువది మూరలునాయె
5 ను. । తరువాత ఆయన మందిరపు గోడను కొలువగా
ఆరు మూరలాయెను, మందిరపు ప్రక్కలనున్న మేడ
6 గదులను కొలువగా నాలుగేసి మూరలాయెను. । ఈ
మేడగదులు మూడేసి అంతస్థులు గలవి. ఈలాగున
ముప్పది గదులుండెను, ఇవి మేడగదులచోటున మంది
రమునకు చుట్టు కట్టబడిన గోడతో కలిసియుండెను;
ఇవి మందిరపు గోడను ఆనుకొనియున్నట్టుండి ఆను
7 కొనక యుండెను. । ఆ గోడ మేడగదులకు ఎక్కిన
కొలది అవి మరి వెడల్పుగా పెరిగెను, పైకెక్కిన
కొలది మందిరముచుట్టునున్న యీ మేడగదుల అంత
స్థులు మరి వెడల్పగుచుండెను గనుక మందిరపు పై
భాగము మరి వెడల్పుగా ఉండెను; పైకెక్కిన కొలది
8 అంతస్థు మరి వెడల్పుగా ఉండెను. । మరియు నేను
చూడగా మందిరము చుట్టునున్న నేలకట్టు ఎత్తుగా
కనబడెను, ఏలయనగా ఆ మేడగదులకు ఆరు పెద్ద
9 మూరలుగల పునాదియుండెను. । మేడగదులకు బయట
నున్న గోడ అయిదు మూరల వెడల్పు; మరియు మంది
రపు మేడగదుల ప్రక్కలనున్న స్థలము కాలీగ విడువ
10 బడి యుండెను । గదులమధ్య మందిరముచుట్టు నలు
దిశల ఇరువది మూరల వెడల్పున చోటు విడువబడి
11 యుండెను । మేడగదుల వాకిండ్లు కాలీగానున్న
స్థలముతట్టు ఉండెను; ఒక వాకిలి ఉత్తరపుతట్టునను
ఇంకొకవాకిలి దక్షిణపుతట్టునను ఉండెను. కాలీగా
నున్న స్థలముచుట్టు అయిదు మూరల వెడల్పుండెను. ।
ప్రత్యేకింపబడిన చోటుకెదురుగానున్న కట్టడము 12
పడమటితట్టు డెబ్బది మూరల వెడల్పు, దాని గోడ
అయిదు మూరల వెడల్పు; గోడ నిడివి తొంబది
మూరలు. । మందిరముయొక్క నిడివిని ఆయన కొలు 13
వగా నూరు మూరలాయెను, ప్రత్యేకింపబడిన స్థల
మును దాని కెదురుగానున్న కట్టడమును దాని గోడ
లను కొలువగా నూరు మూరలాయెను. । మరియు 14
తూర్పుతట్టు మందిరపు నిడివిని ప్రత్యేకింపబడిన స్థల
మును కొలువగా నూరు మూరలాయెను. । ఈలాగున 15
మందిరపు వెనుకటి భాగమున ప్రత్యేకింపబడిన స్థల
మున కెదురుగానున్న కట్టడమును దాని ఇరుప్రక్కల
నున్న వసారాలను కొలువగా నూరు మూరలాయెను. ।
మరియు గర్భాలయమును ఆవరణపు మంటపములను 16
గడపలను కమ్ములుగల కిటికీలను ఎదుటి మూడు అంత
స్థుల చుట్టునున్న వసారాలను ఆయన కొలిచెను. కిటి
కీలు మరుగుచేయబడెను, గడపల కెదురుగా నేలనుండి
కిటికీలవరకు బల్ల కూర్పుండెను । వాకిండ్లకు పైగా 17
మందిరమునకు బయటను లోపలను ఉన్న గోడ అం
తయు లోగోడయు వెలిగోడయు చుట్టుగోడయు
కొలతప్రకారము కట్టబడియుండెను. । కెరూబులును 18
ఖర్జూరపుచెట్లును ఉండెను; దానికి రెండేసి కెరూబుల
సందున ఖర్జూరపుచెట్టు ఒకటి యుండెను; ఒక్కొక
కెరూబుకు రెండేసి ముఖములుండెను. । ఎట్లనగా ఈ 19
తట్టు ఖర్జూరపుచెట్టువైపున మనుష్యముఖమును ఆ
తట్టు ఖర్జూరపుచెట్టువైపున సింహముఖమును కనబడెను;
ఈ ప్రకారము మందిరమంతటిచుట్టు నుండెను. । నేల 20
మొదలుకొని వాకిలిపైవరకు మందిరపు గోడకు కెరూ
బులును ఖర్జూరపుచెట్లును ఉండెను. । మందిరపు 21
ద్వారబంధములు చచ్చౌకములు, పరిశుద్ధస్థలపు ద్వార
బంధములును అట్టివే. । బలిపీఠము కర్రతో చేయ 22
బడెను, దాని యెత్తు మూడు మూరలు, నిడివి రెండు
మూరలు, దాని పీఠమును మూలలును ప్రక్కలును
మ్రానితో చేయబడినవి; ఇది యెహోవా సముఖ
మందుండు బల్ల అని ఆయన నాతో చెప్పెను । మం 23
దిరమునకును పరిశుద్ధ స్థలమునకును రెండు వాకిండ్లుం
డెను. । ఒక్కొక వాకిలి రెండేసి మడత రెక్కలు 24
గలది. । మరియు గోడలమీద ఉన్నట్లుగా మందిరపు 25
వాకిండ్లమీదను కెరూబులును ఖర్జూరపుచెట్లును చెక్క
బడియుండెను, బయటి మంటపమునకు విచిత్రముగా
చేసిన ఉబుకువాటుపని కనబడెను. । మరియు మంటప 26
మునకును ఇరుప్రక్కల గోడలకును మందిరపు మేడ
గదులకును ఒరపాకులకును ఇరుప్రక్కల కమ్ములు వేసిన
కిటికీలును ఖర్జూరపు చెట్లనుపోలిన అలంకారమును
ఉండెను.

**42** ఆయన ఉత్తరమార్గముగా నన్ను నడిపించి బయటి
ఆవరణములోనికి తోడుకొని వచ్చి కాలీచోటునకును
ఉత్తరముననున్న కట్టడమునకును ఎదురుగానున్న గదుల
2 దగ్గర నిలిపెను. । ఆ కట్టడము నూరు మూరల నిడివి
గలదై ఉత్తరదిక్కున వాకిలికలిగి యేబది మూరల
3 వెడల్పుగలది. । ఇరువది మూరలుగల లోపటి ఆవరణ
మున కెదురుగాను బయటి ఆవరణపు చష్టా కెదురు
గాను మూడవ అంతస్థులోని వసారాలు ఒకదానికొకటి
4 యెదురుగా ఉండెను. । గదులకెదురుగా పది మూరల
వెడల్పుగల విహారస్థలముండెను, లోపటి ఆవరణము
నకు పోవుచు ఉత్తరదిక్కు చూచు వాకిండ్లుగల విహార
స్థలమొకటి యుండెను, అది మూరెడు వెడల్పు. ।
5 వాకిండ్లకు వసారాలుండుటవలన పైగదులు ఎత్తు
తక్కువగాను మధ్యగదులు ఇరుకుగానుండి కురచవా
6 యెను. । మూడవ అంతస్థులో ఉండినవి ఆవరణముల
కున్నవాటివంటి స్తంభములు వాటికి లేవు గనుక అవి
క్రిందిగదులకంటెను మధ్యగదులకంటెను చిన్నవిగా
7 కట్టబడియుండెను. । మరియు గదుల వరుసనుబట్టి
బయటి ఆవరణముతట్టు గదులకెదురుగా ఏబది మూరల
8 నిడివిగల యొక గోడ కట్టబడియుండెను. । బయటి
ఆవరణములోనున్న గదుల నిడివి యేబది మూరలు
గాని మందిరపు గోడ నూరు మూరల నిడివిగలదై
9 యుండెను. । ఈ గదులు గోడక్రిందినుండి లేచి
నట్టుగా కనబడెను, బయటి ఆవరణములోనుండి
వాటిలో ప్రవేశించుటకు తూర్పుదిక్కున మార్గముం
10 డెను. । విడిచోటుకు ఎదురుగాను కట్టడమున కెదురు
గాను ఆవరణపుగోడ మందములో తూర్పుతట్టు కొన్ని
11 గదులుండెను. । మరియు వాటి యెదుటనున్న మార్గము
ఉత్తరపుతట్టునున్న గదుల మార్గమువలె నుండెను, వాటి
నిడివిచొప్పునను వెడల్పుచొప్పునను ఇవియు కట్ట
బడెను; వీటి ద్వారములును ఆ రీతినే కట్టబడి యుం
12 డెను. । మరియు మార్గపుమొగను దక్షిణపుతట్టు గదుల
యొక్క తలుపులవలె వీటికి తలుపులుండెను, ఆ మార్గము
ఆవరణములోనికి పోవు నొకనికి తూర్పుగానున్న
13 గోడయెదుటనే యుండెను. । అప్పుడాయన నాతో
ఇట్లనెను—విడిచోటుకు ఎదురుగానున్న ఉత్తరపుగదు
లును దక్షిణపుగదులును ప్రతిష్ఠితములైనవి, వాటి
లోనే యెహోవా సన్నిధికి వచ్చు యాజకులు అతి
పరిశుద్ధవస్తువులను భుజించెదరు, అక్కడ వారు అతి
పరిశుద్ధవస్తువులను, అనగా నైవేద్యమును పాపపరి
హారార్థ బలిపశుమాంసమును అపరాధపరిహారార్థ
బలిపశుమాంసమును ఉంచెదరు, ఆ స్థలము అతిపరి
14 శుద్ధము. । యాజకులు లోపల ప్రవేశించునప్పుడు
[illegible] స్థలమును విడిచి బయటి ఆవరణములోనికి
[illegible]డనే తాము పరిచర్యచేయు వస్త్రములను
అవి ప్రతిష్ఠితములైనవి గనుక జనుల
సంబంధమైన దేనినైనను వారు ముట్టునప్పుడు వా
వేరుబట్టలు ధరించుకొనవలెను.
ఆయన లోపటి మందిరమును కొలుచుట ముగిం
నన్ను బయటికి తోడుకొని తూర్పుతట్టు చూ
గుమ్మమునకు వచ్చి చుట్టును కొలిచెను. । తూర్పుదిశ
చుట్టును కొలకర్రతో కొలువగా ఏనూరు బారల
యెను. । ఉత్తరదిశను చుట్టును కొలకర్రతో కొ
వగా ఏనూరు బారలును । దక్షిణదిశను కొలకర్రతో
కొలువగా ఏనూరు బారలును, । పశ్చిమదిశకు తి
కొలకర్రతో కొలువగా ఏనూరు బారలును తేలెను
నాలుగుతట్లు అతడు కొలిచెను; ప్రతిష్ఠితమైన స్థ
మును ప్రతిష్ఠితము కాని స్థలమునుండి ప్రత్యేకప
చుటకై దానిచుట్టు నలుదిశల ఏనూరు బారలుగ
చచ్చౌకపు గోడ కట్టబడియుండెను.
తరువాత ఆయన తూర్పుతట్టు చూచు గుమ్మము
నకు నన్ను తోడుకొని రాగా । ఇశ్రాయేలీయు
దేవుని ప్రభావము తూర్పుదిక్కున కనబడెను; వా
నుండి పుట్టిన ధ్వని విస్తారజలముల ధ్వనివలె వి
బడెను, ఆయన ప్రకాశముచేత భూమి ప్రజ్వరిల్లెను
నాకు కనబడు దర్శనము, పట్టణమును నాశముచేయ
టకై నేను రాగా నాకు కనబడిన దర్శనమువ
నుండెను. మరియు కెబారునది దగ్గర నాకు కనబడి
దర్శనమువంటి దర్శనములు నాకు కనబడగా నే
సాగిలపడితిని. । తూర్పుతట్టు చూచు గుమ్మపుమా
మున యెహోవా తేజోమహిమ మందిరములో
ప్రవేశించెను. । ఆత్మ నన్ను ఎత్తి లోపటి ఆవరణవ
లోనికి తీసికొని రాగా యెహోవా తేజోమహి
మతో మందిరము నిండియుండెను. । మందిరముల
నుండి యొకడు నాతో మాటలాడినట్టు నాకు శబ్దమ
వినబడెను. అప్పుడు నాయొద్ద నిలిచినవాడు నాతో
ఇట్లనెను. । — నరపుత్రుడా, యిది నా గద్దె స్థలమ
నా పాదపీఠము; ఇక్కడ నేను ఇశ్రాయేలీయు
మధ్య నిత్యమును నివసించెదను, వారు ఇకను జారత్వవ
చేసి తమ రాజుల కళేబరములకు ఉన్నత స్థలముల
కట్టి, తామైనను తమ రాజులైనను నా పరిశుద్ధనామ
మును అపవిత్రపరచకయుందురు, నాకును వారికి
మధ్య గోడమాత్రముంచి । నా గడపదగ్గర వారి స్థ
ముల గడపలను, నా ద్వారబంధములదగ్గర వా
ద్వారబంధములను కట్టి, తాము చేసిన హేయక్రియ
చేత నా పరిశుద్ధనామమునకు దూషణ కలుగుటకై
వారు హేతువులైరి గనుక నేను కోపావేశుడనై వారి
నాశనము చేసితిని. । వారు జారత్వము మాని, తమ
రాజుల కళేబరములను నాయొద్దనుండి దూరమునకు
కొంచుపోయినయెడల వారిమధ్యను నేనెల్లప్పుడును
నివసింతును.
కాబట్టి నరపుత్రుడా, ఇశ్రాయేలీయులు తామ

క్రియలన్నిటిని ఆధారముచేసికొని నా నిబంధనను
8 భంగపరచిరి. । నేను మీకప్పగించిన నా పరిశుద్ధమైన
వస్తువులను మీరు కాపాడక, వారు కాపాడవలెనని
9 మీకు మారుగా అన్యులను ఉంచితిరి. । కాబట్టి
ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా — అవి
ధేయులై, శరీరమందు సున్నతిలేని అన్యులైయుండి
ఇశ్రాయేలీయులమధ్య నివసించువారిలో ఎవడును
10 నా పరిశుద్ధస్థలములో ప్రవేశింపకూడదు. । మరియు
ఇశ్రాయేలీయులు నన్ను విసర్జించి తమ విగ్రహము
లను అనుసరింపగా, వారితోకూడ నన్ను విసర్జించిన
11 లేవీయులు తమ దోషమును భరించుదురు. । వారు
నా పరిశుద్ధస్థలములో పరిచర్య చేయువారు, నా మంది
రమునకు ద్వారపాలకులై మందిర పరిచర్య జరిగించు
వారు, ప్రజలకు బదులుగా వారే దహనబలి పశువు
లను బలి పశువులను వధించువారు, పరిచర్యచేయుటకై
వారే జనుల సమక్షమున నియమింపబడినవారు. ।
12 అయితే విగ్రహముల ఎదుట జనులకు పరిచారకులై,
ఇశ్రాయేలీయులు తొట్రిల్లి పాపముచేయుటకు వారు
కారకులైరి గనుక నేను వారికి విరోధినైతిని; వారు
తమ దోషమును భరించుదురు; ఇదే ప్రభువైన
13 యెహోవా వాక్కు. । తమ అవమానమును తాము
చేసిన హేయక్రియలకు రావలసిన శిక్షను వారనుభ
వించుదురు; వారు యాజకత్వము జరిగించుటకై నా
సన్నిధికి రాకూడదు, పరిశుద్ధ వస్తువులను గాని అతి
14 పరిశుద్ధ వస్తువులను గాని ముట్టకూడదు. । అయితే
నా మందిర సంబంధమైన పని అంతటిని దానిలో
జరుగు పనులన్నిటిని విచారించుచు దాని కాపాడు
వారినిగా నేను వారిని నియమించుచున్నాను.

15 ఇశ్రాయేలీయులు నన్ను విసర్జింపగా నా పరిశుద్ధ
స్థల సంరక్షణను కనిపెట్టు సాదోకు సంతతివారగు
లేవీయులు పరిచర్య చేయుటకై నా సన్నిధికి వచ్చి
వారే నా సన్నిధిని నిలిచి, క్రొవ్వును రక్తమును నాకు
అర్పించుదురు; ఇదే ప్రభువగు యెహోవా వాక్కు. ।
16 వారే నా పరిశుద్ధస్థలములో ప్రవేశింతురు, పరిచర్య
చేయుటకై వారే నా బల్లయొద్దకు వత్తురు, వారే
నేనప్పగించినదానిని కాపాడుదురు; ఇదే ప్రభువగు
17 యెహోవా వాక్కు. । వారు లోపటి ఆవరణపు
గుమ్మములలోనికి వచ్చునప్పుడు జనుపనారబట్టలు
ధరించుకొనవలెను, లోపటి ఆవరణపు గుమ్మముల
ద్వారా వారు మందిరమున ప్రవేశించి పరిచర్యచేయు
నప్పుడెల్ల బొచ్చుచేత చేసిన బట్టలు వారు ధరింప
18 కూడదు. । అవిసెనార పాగాలు ధరించుకొని నడుము
లకు జనుపనారబట్ట కట్టుకొనవలెను, చెమట పుట్టిం
19 చునదేదైనను వారు ధరింపకూడదు. । బయటి ఆవర
ణములోనికి జనులయొద్దకు వారు వెళ్లునప్పుడు తమ
ప్రతిష్ఠిత వస్త్రములను తీయకపోవుటచేత జనులకు
శాపము తెప్పింపకుండునట్లు, తమ పరిచర్య సంబంధ
మైన వస్త్రములను తీసి ప్రతిష్ఠితములగు గదులలో
వాటిని ఉంచి వేరుబట్టలు ధరింపవలెను. । మరియు
వారు తమ తలలు క్షౌరము చేయించుకొనకూడదు,
తలవెండ్రుకలు పెరుగనియ్యక కత్తెరతో మాత్రము
వాటిని కత్తిరింపవలెను. । లోపటి ఆవరణములో చొచ్చు
నపుడు ఏ యాజకుడును ద్రాక్షారసము పానముచేయ
కూడదు. । వారు విధవరాండ్రనైనను విడువబడినదాని
నైనను పెండ్లిచేసికొనకూడదు గాని ఇశ్రాయేలీయుల
సంతతివారగు కన్యలనైనను, యాజకులకు భార్యలై
విధవరాండ్రుగా నున్నవారినైనను చేసికొనవచ్చును. ।
ప్రతిష్ఠితమైనదేదో ప్రతిష్ఠితముకానిదేదో, పవిత్ర
మైనదేదో అపవిత్రమైనదేదో కనుగొనుటకు వారు
నా జనులకు నేర్పునట్లు । జనులు వ్యాజ్యమాడునప్పుడు
నా విధులనుబట్టి వారికి తీర్పుతీర్చుటకై వారు తీర్పరు
లుగా నియమింపబడుదురు. నేను నియమించిన విధు
లనుబట్టియు కట్టడలనుబట్టియు నా నియామక కాల
ములను జరుపుదురు; నా విశ్రాంతి దినములను ఆచ
రించుదురు. । తండ్రిదియు తల్లిదియు కుమారునిదియు
కుమార్తెదియు సహోదరునిదియు పెండ్లికాని
సహోదరిదియు శవమును ముట్టి అంటుపడవచ్చును,
అయితే మరి ఏ మనుష్యశవమునుగాని ముట్టి అంటు
పడకూడదు. । ఒకడు అంటుపడి శుచిర్భూతుడైన
తరువాత ఏడు దినములు లెక్కించి । పరిశుద్ధస్థల
ములో పరిచర్యచేయుటకై లోపటి ఆవరణములోని
పరిశుద్ధస్థలమునకు వచ్చిననాడు అతడు తనకొరకు
పాపపరిహారార్థబలి అర్పింపవలెను; ఇదే ప్రభువైన
యెహోవా వాక్కు. । వారికి స్వాస్థ్యమేదనగా
నేనే వారికి స్వాస్థ్యము, ఇశ్రాయేలీయులలో వారి
కెంతమాత్రమును స్వాస్థ్యము ఇయ్యకూడదు, నేనే
వారికి స్వాస్థ్యము. । నైవేద్యములును పాపపరిహా
రార్థబలిమాంసమును అపరాధపరిహారార్థబలిమాంస
మును వారికి ఆహారమవును, ఇశ్రాయేలీయులచేత
దేవునికి ప్రతిష్ఠితములగు వస్తువులన్నియు వారివి. ।
మీ ప్రతిష్ఠితార్పణములన్నిటిలోను తొలిచూలు
వాటన్నిటిలోను మొదటివియు, ప్రథమఫలములన్ని
టిలోను మొదటివియు యాజకులవగును; మీ కుటుం
బములకు ఆశీర్వాదము కలుగునట్లు మీరు ముందుగా
పిసికిన పిండిముద్దను యాజకులకియ్యవలెను. । పక్షుల
లోను పశువులలోను తనకుతాను చచ్చినదానినిగాని
చీల్చబడినదానినిగాని యాజకులు భుజింపకూడదు.

మీరు చీట్లువేసి దేశమును విభాగించునప్పుడు 4
భూమిలో ఒక భాగమును ప్రతిష్ఠితార్పణముగా
యెహోవాకు ప్రతిష్ఠింపవలెను. దానికి ఇరువది
యైదువేల (కొలకఱ్ఱల) నిడివియు పదివేల (కొలకఱ్ఱల) వెడ
ల్పును ఉండవలెను, ఈ సరిహద్దులన్నిటిలోగా నున్న

2 భూమి ప్రతిష్ఠితమగును. । దానిలో పరిశుద్ధస్థలమునకు
ఐనూరు బారల చచ్చౌకము ఏర్పడవలెను; దానికి నలు
3 దిశల ఏబది మూరల మైదానముండవలెను, । కొలువ
బడిన యీ స్థలమునుండి ఇరువదియైదువేల బారల
నిడివియు పదివేల బారల వెడల్పునుగల యొకచోటు
కొలిచివేయవలెను. అందులో మహా పరిశుద్ధస్థలముగా
4 ఉన్న పరిశుద్ధస్థలముండును. । యెహోవాకు పరి
చర్యచేయుటకై ఆయన సన్నిధికి వచ్చి పరిచర్యచేయు
చున్న యాజకులకు ఏర్పాటైన ఆ భూమి ప్రతిష్ఠిత
స్థలముగా ఎంచబడును; అది వారి యిండ్లకు నివేశమై
పరిశుద్ధస్థలమునకు ప్రతిష్ఠితముగా ఉండును. మందిర
ములో పరిచర్యచేయుచున్న లేవీయులు ఇండ్లు కట్టు
5 కొని నివసించునట్లు । ఇరువదియైదువేల బారల
నిడివియు పదివేల బారల వెడల్పునుగల యొక ప్రదేశ
మును వారికి స్వాస్థ్యముగా ఇరువది గ్రామములను
6 ఏర్పాటు చేయవలెను. । మరియు పట్టణమునకై
అయిదువేల బారల వెడల్పును ఇరువదియైదువేల
బారల నిడివియుగల యొక ప్రదేశము ఏర్పాటు
చేయవలెను. అది ప్రతిష్ఠితమగు భాగమునకు సరిగా
ఉండవలెను, ఇశ్రాయేలీయులకందరికి అది స్వాస్థ్య
7 ముగా ఉండును. । మరియు ప్రతిష్ఠిత భాగమునకును
పట్టణమునకై యేర్పడిన ప్రదేశమునకును ఎదురుగా
వాటికి పడమటగాను తూర్పుగాను, ప్రతిష్ఠిత భాగ
మునకును పట్టణమునకై యేర్పడిన దేశమునకును ఇరు
ప్రక్కల అధిపతికి భూమి నేర్పాటు చేయవలెను.
పడమటినుండి తూర్పువరకు దాని కొలువగా అది
యొక గోత్రస్థానమునకు సరిపడు నిడివిగలదై యుండ
వలెను. అధిపతి యిక నా జనులను బాధింపక వారి
గోత్రములనుబట్టి భూమి అంతయు ఇశ్రాయేలీయు
8 లకు నియమించునట్లు । అది ఇశ్రాయేలీయులలో అత
నికి భూస్వాస్థ్యముగా ఉండును.

9 మరియు యెహోవా ఈ మాట సెలవిచ్చుచు
న్నాడు — ఇశ్రాయేలీయుల అధిపతులారా, మీరు
జరిగించిన బలాత్కారమును దోచుకొనిన దోపును
చాలును; ఆలాగు చేయుట మాని నా జనుల సొమ్మును
అపహరింపక నీతిన్యాయముల ననుసరించి నడుచు
కొనుడి; ఇదే ప్రభువగు యెహోవా వాక్కు. ।
10 ఖరా త్రాసులను, ఖరా పడిని ఖరా తూమును
ఒక్కటే పడియు ఒక్కటే తూమును మీరుంచు
11 కొనవలెను. । తూము పందుములో పదియవపాలు పట్టు
నదై యుండవలెను; పందుము మీకు పరిమాణముగా
12 నుండవలెను. । తులమొకటింటికి ఇరువది చిన్నముల
యెత్తును, అరవీసె యొకటింటికి ఇరువది తులముల
యెత్తును, ఇరువదియైదు తులముల యెత్తును పదునైదు
13 తులముల యెత్తును ఉండవలెను. । ప్రతిష్ఠితార్పణలు
ఈ ప్రకారముగా చెల్లింపవలెను. నూట ఎనుబదిపళ్లే

గోధుమలలో మూడు పళ్లవంతునను నూట ఎనుబది
పళ్లే యవలలో మూడు పళ్లవంతునను చెల్లింపవలెను. ।
తైలము చెల్లించునదెట్లనగా నూట ఎనుబది పళ్లే 14
నూనెలో పడియు ముప్పాతికవంతున చెల్లింపవలెను.
తూము నూట ఎనుబది పళ్లు పట్టునదగును. । మరియు 15
ఇశ్రాయేలీయుల నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయు
టకై నైవేద్యమునకును దహనబలికిని సమాధానబలికిని
మంచి మేపుతగిలిన గొఱ్ఱెలలో మందకు ఇన్నూరేసిం
టిలో ఒకదానిని తేవలెను. । ఇశ్రాయేలీయులలోని 16
అధిపతికి చెల్లింపవలసిన యీ అర్పణము ఈ ప్రకార
ముగా తెచ్చుటకు దేశమునకు చేరిన జనులందరును
బద్ధులైయుందురు. । పండుగలలోను, అమావాస్య 17
దినములలోను, విశ్రాంతిదినములలోను, ఇశ్రాయేలీ
యులు కూడుకొను నియామకకాలములలోను వాడ
బడు దహనబలులను నైవేద్యములను పానార్పణము
లను సరిచూచుట అధిపతి భారము. అతడు ఇశ్రా
యేలీయుల నిమిత్తము ప్రాయశ్చిత్తము చేయుటకై
పాపపరిహారార్థబలిపశువులను నైవేద్యములను దహన
బలులను సమాధానబలిపశువులను సిద్ధపరచవలెను.

ప్రభువగు యెహోవా సెలవిచ్చునదేమనగా— 18
మొదటి నెల మొదటి దినమున నిర్దోషమైన కోడెను
తీసికొని పరిశుద్ధస్థలము నిమిత్తము పాపపరిహారార్థబలి
నర్పింపవలెను. । ఎట్లనగా యాజకుడు పాపపరి 19
హారార్థబలిపశురక్తము కొంచెము తీసి, మందిరపు
ద్వారబంధములమీదను బలిపీఠపు చూరు నాలుగు
మూలలమీదను లోపటి ఆవరణపు వాకిటి ద్వారబంధ
ములమీదను ప్రోక్షింపవలెను. । తెలియక తప్పి 20
పోయినవారిని విడిపించునట్లుగా మందిరమునకు
ప్రాయశ్చిత్తము చేయుటకై నెల యేడవ దినమందు
ఆలాగు చేయవలెను. । మొదటి నెల పదునాలుగవ 21
దినమున పస్కాపండుగ ఆచరింపవలెను; ఏడు దిన
ములు దాని నాచరింపవలెను. అందులో పులియని
ఆహారము తినవలెను. । ఆ దినమున అధిపతి తనకును 22
దేశమునకు చేరిన జనులందరికిని పాపపరిహారార్థ
బలిగా ఒక యెద్దును అర్పింపవలెను. । మరియు ఏడు 23
దినములు అతడు నిర్దోషమైన యేడు ఎద్లను ఏడు
పొట్టేళ్లను తీసికొని, దినమొకటింటికి ఒక యెద్దును
ఒక పొట్టేలును దహనబలిగా యెహోవాకు అర్పింప
వలెను; మరియు అనుదినము ఒక్కొక్క మేకపిల్లను
పాపపరిహారార్థబలిగా అర్పింపవలెను. । మరియు 24
ఎద్దొకటింటికిని పొట్టేలొకటింటికిని తూము పిండి
పట్టిన నైవేద్యము చేయవలెను. తూము ఒకటింటికి
మూడు పళ్లే నూనె యుండవలెను. । మరియు ఏడవ 25
నెల పదిహేనవ దినమున పండుగ జరుగుచుండగా
యాజకుడు ఏడు దినములు పండుగ ఆచరించుచు
పాపపరిహారార్థబలివిషయములోను దహనబలివిషయ

ములోను నైవేద్యవిషయములోను నూనెవిషయము
లోను ఆ ప్రకారముగానే చేయవలెను.

46 ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా—.
తూర్పుతట్టు చూచు లోపటి ఆవరణపు గుమ్మము,
పనిచేయు ఆరు దినములు మూయబడియుండి,
విశ్రాంతి దినమునను అమావాస్య దినమునను తీయ
2 బడియుండవలెను. । అధిపతి బయటనుండి మంటప
మునకు పోవు మార్గముగా ప్రవేశించి, గుమ్మపు ద్వార
బంధములదగ్గర నిలువబడగా, యాజకులు దహనబలి
పశువులను సమాధానబలిపశువులను అతనికి సిద్ధపరచ
వలెను; అతడు గుమ్మముదగ్గర నిలువబడి ఆరాధన
చేసిన తరువాత వెలపలికి పోవును, అయితే సాయం
కాలము కాకమునుపే గుమ్మము మూయకూడదు. ।
3 మరియు విశ్రాంతిదినములలోను అమావాస్యలలోను
దేశ జనులు ఆ తలుపుదగ్గర నిలువబడి యెహోవాకు
4 ఆరాధన చేయవలెను. । విశ్రాంతిదినమున అధిపతి
యెహోవాకు అర్పింపవలసిన దహనబలి యేదనగా,
నిర్దోషమైన ఆరు గొఱ్ఱెపిల్లలును నిర్దోషమైన యొక
5 పొట్టేలును. । పొట్టేలుతో తూమెడు పిండిగల
నైవేద్యము చేయవలెను, గొఱ్ఱెపిల్లలతోకూడ శక్తి
కొలది నైవేద్యమును, తూము ఒకటింటికి మూడు
6 పళ్ల నూనెయు తేవలెను. । అమావాస్యనాడు నిర్దోష
మైన చిన్న కోడెను నిర్దోషమైన ఆరు గొఱ్ఱెపిల్లలను
నిర్దోషమైన యొక పొట్టేలును అర్పింపవలెను. ।
7 నైవేద్యమును సిద్ధపరచవలెను, ఎద్దుతోను పొట్టేలు
తోను తూమెడు పిండిని గొఱ్ఱెపిల్లలతో శక్తికొలది
పిండిని అర్పింపవలెను, తూము ఒకటింటికి మూడు
8 పళ్ల నూనె నైవేద్యము చేయవలెను. । అధిపతి ప్రవే
శించునప్పుడు గుమ్మపు మంటపమార్గముగా ప్రవేశించి
9 అతడు ఆ మార్గముగానే వెలపలికి పోవలెను. । అయితే
దేశజనులు నియామకకాలములయందు యెహోవా
సన్నిధిని ఆరాధనచేయుటకై వచ్చునప్పుడు ఉత్తరపు
గుమ్మపు మార్గముగా వచ్చినవారు దక్షిణపు గుమ్మపు
మార్గముగా వెళ్లవలెను, దక్షిణపు గుమ్మపు మార్గముగా
వచ్చినవారు ఉత్తరపు గుమ్మపు మార్గముగా వెళ్లవలెను.
తాము వచ్చిన దారినే యెవరును తిరిగిపోక అందరును
10 తిన్నగా వెలపలికి పోవలెను. । అధిపతి వారితో
కలిసి ప్రవేశింపగా వారు ప్రవేశించుదురు, వారు
బయలువెళ్లునప్పుడు అందరును కూడి బయలువెళ్ల
11 వలెను. । పండుగదినములలోను నియామకకాలముల
లోను ఎద్దుతోగాని పొట్టేలుతోగాని తూమెడు
పిండియు, గొఱ్ఱెపిల్లలతో శక్తికొలది పిండియు,
తూము ఒకటింటికి మూడుపళ్ల నూనెయు నైవేద్య
12 ముగా అర్పింపవలెను. । యెహోవాకు స్వేచ్ఛార్పణ
మైన దహనబలినైనను స్వేచ్ఛార్పణమైన సమాధాన
బలినైనను అధిపతి యర్పించునప్పుడు తూర్పుతట్టు
గుమ్మము తీయవలెను; విశ్రాంతిదినమున అర్పించునట్లు
దహనబలిని సమాధానబలిని అర్పించి వెళ్లిపోవలెను;
అతడు వెళ్లిపోయిన తరువాత గుమ్మము మూయబడ
వలెను. । మరియు ప్రతిదినము నిర్దోషమైన యేడాది
మగ గొఱ్ఱెపిల్లను దహనబలిగా అర్పింపవలెను; అను
దినము ఉదయమున దానిని అర్పింపవలెను. మరియు
అనుదినము ఉదయమున దానితో నైవేద్యము చేయ
వలెను. । అది ఎట్లనగా తూమెడు గోధుమపిండిలో
ఆరవపాలును పిండి కలుపుటకు పడి నూనెయు నుండ
వలెను; ఇవి ఎవరును రద్దుపరచలేని నిత్యమైన కట్ట
డలు. । గొఱ్ఱెపిల్లలను నైవేద్యమును నూనెను అను
దినము ఉదయముననే నిత్యదహనబలిగా అర్పింప
వలెను.

ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా—
అధిపతి తన కుమారులలో ఎవనికైనను భూమి ఇచ్చిన
యెడల అది యతని కుమారునికి స్వాస్థ్యమైనందున
తన కుమారులదగును. అది వారసత్వమువలన వచ్చిన
దానివంటి స్వాస్థ్యము. । అయితే అతడు తన పని
వారిలో ఎవనికైనను భూమి ఇచ్చినయెడల విడుదల
సంవత్సరమువరకే అది వాని హక్కు తరువాత అధి
పతికి మరల వచ్చును; అప్పుడు అతని కుమారులు
మాత్రము అతని స్వాస్థ్యమునకు హక్కుదారులగు
దురు. । జనులు తమ స్వాస్థ్యము ననుభవింపకుండ
అధిపతి వారి భూమిని ఆక్రమింపకూడదు; నా
జనులు తమ భూములను విడిచి చెదరిపోకుండునట్లు
అతడు తన భూమిలోనుండి తన కుమారులకు భాగ
ముల నియ్యవలెను.

పిమ్మట ఆయన గుమ్మపు మధ్యగోడమార్గముగా
ఉత్తరదిశ చూచుచున్న యాజకులకు ఏర్పడిన ప్రతి
ష్ఠితమైన గదులలోనికి నన్ను తీసికొనిరాగా అచ్చట
వెనుకతట్టు పశ్చిమదిక్కున స్థలమొకటి కనబడెను. ।
ప్రతిష్ఠితములగు వస్తువులను బయటి ఆవరణములోనికి 2
కొనివచ్చి—యాజకులు జనులకు శాపము తేకుండు
నట్లు వారు అపరాధపరిహారార్థ బలిపశుమాంసమును
పాపపరిహారార్థ బలిపశుమాంసమును వండుచు నైవేద్య
ములను కాల్చుచుండు స్థలమిదియే యని నాతో చెప్పి ।
అతడు బయటి ఆవరణములోనికి నన్ను తీసికొని 2
వచ్చి ఆవరణపు నాలుగు మూలలను నన్ను త్రిప్పగా,
ఆవరణముయొక్క మూలమూలను మరియొక ఆవరణ
మున్నట్టు కనబడెను. । ఆవరణపు మూలమూలను 2
ఆవరింపబడిన ఆవరణమొకటి కనబడెను. ఒక్కొక్కటి
నలువది మూరల నిడివియు ముప్పది మూరల వెడ
ల్పును గలిగి నాలుగును ఏకపరిమాణముగా ఉండెను. ।
మరియు ఆ నాలుగింటిలోను చుట్టుపంక్తిగానున్న 2
అటకలుండెను, చుట్టునున్న అటకలక్రింద పొయి
లుండెను. । —ఇది వంటచేయువారి స్థలము, ఇక్కడ 2

సంస్కారపరిచారకులు జనులు తెచ్చు బలిపశుమాంస
మును వండుదురని ఆయన నాతో చెప్పెను.

ఆయన మందిరపు గుమ్మమునకు నన్ను తోడు
కొని వచ్చెను; మందిరము తూర్పుముఖముగా ఉం
డెను, నేను చూడగా మందిరపు గడపక్రిందనుండి
నీళ్లు ఉబికి తూర్పుగా పారుచుండెను. ఆ నీళ్లు బలిపీఠ
మునకు దక్షిణముగా మందిరపు కుడిప్రక్కను క్రింద
నుండి పారుచుండెను. । పిమ్మట ఆయన ఉత్తరపు
గుమ్మపుమార్గముగా నన్ను నడిపించి చుట్టు త్రిప్పి
తూర్పుకు పోవుదారిని బయటిగుమ్మమునకు తోడు
కొనివచ్చెను. నేను చూడగా అచ్చట గుమ్మపు కుడి
ప్రక్కను నీళ్లు ఉబికి పారుచుండెను. । ఆ మనుష్యుడు
కొలనూలు చేత పట్టుకొని తూర్పుమార్గమున బయలు
వెళ్లి వెయ్యి మూరలు కొలిచి ఆ నీళ్లగుండ నన్ను
నడిపింపగా నీళ్లు చీలమండ లోతుండెను. । ఆయన
మరి వెయ్యి మూరలు కొలిచి నీళ్లగుండ నన్ను నడి
పింపగా నీళ్లు మోకాళ్ల లోతుండెను, ఇంక ఆయన
వెయ్యి మూరలు కొలిచి నీళ్లగుండ నన్ను నడిపింపగా
నీళ్లు మొల లోతుండెను. । ఆయన ఇంకను వెయ్యి
మూరలు కొలువగా నీళ్లు మిక్కిలి లోతై నేను దాట
లేనంత నది కనబడెను, దాట వీలులేకుండ ఈదవలసి
నంత నీరుగల నదియాయెను. । అప్పుడాయన నాతో
ఇట్లనెను — నరపుత్రుడా, నీవు చూచితివిగదా అని
చెప్పి నన్ను మరల నది యిద్దరికి తోడుకొనివచ్చెను. ।
నేను తిరిగిరాగా నదీతీరమున ఇరుప్రక్కల చెట్లు
విస్తారముగా కనబడెను. । అప్పుడాయన నాతో ఇట్ల
నెను—ఈ నీళ్లు ఉబికి తూర్పుగానున్న ప్రదేశమునకు
పారి అరణ్యములోకి దిగి సముద్రములో పడుచు
న్నవి, నీళ్లు నిర్మలముగానుండునట్లు అవి సముద్ర
ములో పడుచున్నవి. । వడిగా పారు ఈ నది వచ్చు
చోట్లనెల్ల జలచరములన్నియు బ్రదుకును, ఈ నీళ్లు
అక్కడికి వచ్చుటవలన ఆ నీరు నిర్మలమగును గనుక
చేపలు బహు విస్తారములగును; ఈ నది యెక్కడికి
పారునో అక్కడ సమస్తమును బ్రదుకును. । మరియు
దానియొద్ద ఏన్గెదీపట్టణము మొదలుకొని ఏనెగ్లా
యీము పట్టణమువరకును చేపలుపట్టువారు దాని
ప్రక్కల నిలిచి వలలు వేయుదురు; మహాసముద్ర
ములోనున్నట్లు సకలజాతి చేపలును దానియందు
బహు విస్తారముగా నుండును. । అయితే ఆ సము
ద్రపు బురదస్థలములును ఊబిస్థలములును ఉప్పుగల
వైయుండి బాగుకాకయుండును. । నదీతీరమున ఇరు
ప్రక్కల ఆహారమిచ్చు సకలజాతి వృక్షములు పెరు
గును, వాటి ఆకులు వాడిపోవు, వాటి కాయలు
ఎప్పటికిని రాలవు. ఈ నదినీరు పరిశుద్ధస్థలములో
నుండి పారుచున్నది గనుక ఆ చెట్లు నెలనెలకు
కాయలు కాయును, వాటి పండ్లు ఆహారమునకును
వాటి ఆకులు ఔషధమునకును వినియోగించును.

ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా— 13
సరిహద్దులనుబట్టి ఇశ్రాయేలీయుల పన్నెండు గోత్ర
ముల ప్రకారము మీరు స్వాస్థ్యముగా పంచుకొన
వలసిన భూమి యిది; యోసేపు సంతతికి రెండు
భాగములియ్యవలెను. । నేను ప్రమాణముచేసి మీ 14
పితరులకు ఈ దేశము ఇచ్చితిని గనుక ఏమియు
భేదములేకుండ మీలో ప్రతివాడును దానిలో
స్వాస్థ్యమునొందును; ఈలాగున అది మీకు స్వాస్థ్య
మగును. । ఉత్తరదిక్కున సెదాదుకు పోవుమార్గమున 15
మహాసముద్రము మొదలుకొని హెత్లోనువరకు దేశ
మునకు సరిహద్దు. । అది హమాతుకును బేరోతాయు 16
కును దమస్కు సరిహద్దుకును హమాతు సరిహద్దుకును
మధ్యనున్న సిబ్రయీముకును హవ్రాను సరిహద్దును
ఆనుకొను మధ్యస్థలమైన హాజేరుకును వ్యాపించును. ।
పడమటి సరిహద్దు హసరేనాను అను దమస్కు 17
సరిహద్దు పట్టణము, ఉత్తరపు సరిహద్దు హమాతు; ఇది
మీకు ఉత్తరపు సరిహద్దు. । తూర్పుదిక్కున హవ్రాను 18
దమస్కు గిలాదులకును ఇశ్రాయేలీయుల దేశము
నకును మధ్య యొర్దానునది సరిహద్దుగా ఉండును;
సరిహద్దు మొదలుకొని తూర్పుసముద్రమువరకు దాని
కొలువవలెను; ఇది మీకు తూర్పు సరిహద్దు. । దక్షిణ 19
దిక్కున తామారు మొదలుకొని కాదేషునొద్దనున్న
మెరీబా ఊటలవరకును నది మార్గమున మహాసముద్ర
మునకు మీ సరిహద్దు పోవును; ఇది మీకు దక్షిణపు
సరిహద్దు. । పశ్చిమదిక్కున సరిహద్దు మొదలు 20
కొని హమాతువరకు మహాసముద్రము సరిహద్దుగా
ఉండును; ఇది మీకు పశ్చిమదిక్కు సరిహద్దు. ।
ఇశ్రాయేలీయుల గోత్రముల ప్రకారము ఈ దేశ 21
మును మీరు పంచుకొనవలెను. । మీరు చీట్లువేసి 22
మీకును మీలో నివసించి పిల్లలు కనిన పరదేశుల
కును స్వాస్థ్యములను విభజించునప్పుడు ఇశ్రాయేలీ
యులలో దేశమందు పుట్టినవారినిగా ఆ పరదేశులను
మీరు ఎంచవలెను, ఇశ్రాయేలు గోత్రికులతోపాటు
తామును స్వాస్థ్యము నొందునట్లు మీవలె వారును
చీట్లు వేయవలెను. । ఏ గోత్రములో పరదేశులు 23
కాపురముందురో ఆ గోత్ర భాగములో మీరు
వారికి స్వాస్థ్యము ఇయ్యవలెను; ఇదే ప్రభువైన
యెహోవా వాక్కు.

గోత్రముల పేరులు ఇవి; దానీయుల కొక 48
భాగము: అది ఉత్తరదిక్కు సరిహద్దునుండి హమాతు
మార్గమున హెత్లోనుకుపోవు సరిహద్దువరకును హస
రేనాను అను దమస్కు సరిహద్దువరకును హమాతు సరి
హద్దుమార్గమున తూర్పుగాను పడమరగాను వ్యాపించు
భూమి. । దానుయొక్క సరిహద్దు నానుకొని తూర్పు 2

3 పడమరలుగా ఆషేరీయులకు ఒకభాగము. । ఆషేరీ
యుల సరిహద్దు ననుకొని తూర్పు పడమరలుగా
4 నఫ్తాలీయులకు ఒకభాగము. । నఫ్తాలి సరిహద్దును ఆను
కొని తూర్పు పడమరలుగా మనష్షేయులకు ఒక
5 భాగము. । మనష్షేయుల సరిహద్దును ఆనుకొని తూర్పు
పడమరలుగా ఎఫ్రాయిమీయులకు ఒకభాగము. ।
6 ఎఫ్రాయిమీయుల సరిహద్దును ఆనుకొని తూర్పు
7 పడమరలుగా రూబేనీయులకు ఒకభాగము. । రూబే
నీయుల సరిహద్దును ఆనుకొని తూర్పు పడమరలుగా
యూదావారికి ఒకభాగము.

8 యూదావారి సరిహద్దును ఆనుకొని తూర్పు పడ
మరలుగా మీరు ప్రతిష్ఠించు ప్రతిష్ఠిత భూమియుం
డును. దాని వెడల్పు ఇరువదియైదు వేల బారలు;
దాని నిడివి తూర్పునుండి పడమరవరకు తక్కినభాగ
ముల నిడివివలెనే యుండును; పరిశుద్ధస్థలము దాని
9 మధ్య నుండవలెను. । యెహోవాకు మీరు ప్రతి
ష్ఠించు ప్రదేశము ఇరువదియైదు వేల బారల నిడి
వియు పదివేల బారల వెడల్పునై యుండవలెను. ।
10 ఈ ప్రతిష్ఠితభూమి యాజకులదగును. అది ఉత్తర
దిక్కున ఇరువదియైదు వేల బారల నిడివియు పడ
మటిదిక్కున పదివేల బారల వెడల్పును తూర్పు
దిక్కున పదివేల బారల వెడల్పును దక్షిణదిక్కున
ఇరువదియైదు వేల బారల నిడివియు ఉండవలెను.
యెహోవా పరిశుద్ధస్థలము దాని మధ్య నుండును. ।
11 ఇది సాదోకు సంతతివారై నాకు ప్రతిష్ఠింపబడి
నేను వారి కప్పగించినదానిని కాపాడు యాజకుల
దగును; ఏలయనగా ఇశ్రాయేలీయులు నన్ను విడిచి
పోగా మిగిలిన లేవీయులు విడిచిపోయినట్లు వారు
12 నన్ను విడిచిపోలేదు. । ప్రతిష్ఠిత భూమియందు
లేవీయుల సరిహద్దుదగ్గర వారికొకచోటు ఏర్పా
13 టగును; అది అతిపరిశుద్ధముగా ఎంచబడును. । యాజ
కుల సరిహద్దును ఆనుకొని లేవీయుల కొకచోటు
నేర్పాటు చేయవలెను, అది ఇరువది యయిదు వేల
బారల నిడివియు పదివేల బారల వెడల్పునై యుం
డును. దాని నిడివియంతయు ఇరువది యయిదు వేల
బారలును వెడల్పంతయు పదివేల బారలును ఉండును. ।
14 అది యెహోవాకు ప్రతిష్ఠితమైన భూమి గనుక
దానిలో ఏమాత్రపు భాగమైనను వారు అమ్మకూడదు,
మారుగా ఇయ్యకూడదు, ఆ భూమియొక్క ప్రథమ
ఫలములను ఇతరులను అనుభవింపనియ్యకూడదు. ।
15 ఇరువది యయిదు వేల బారల భూమిని ఆనుకొని
వెడల్పున మిగిలిన అయిదు వేల బారలుగల చోటు
గ్రామకంఠముగా ఏర్పరచబడినదై, పట్టణములోని
నివేశములకును మైదానములకును అక్కరకువచ్చును;
16 దానిమధ్య పట్టణము కట్టబడును. । దాని పరిమాణ
వివరమేదనగా, ఉత్తరదిక్కున నాలుగు వేల ఏనూరు
బారలు, దక్షిణదిక్కున నాలుగు వేల ఏనూరు బారలు,
తూర్పుదిక్కున నాలుగు వేల ఏనూరు బారలు, పడ
మటిదిక్కున నాలుగు వేల ఏనూరు బారలు. । పట్టణ 17
మునకు చేరిన కాలీస్థలము ఉత్తరపుతట్టున ఇన్నూట
యేబది బారలు, దక్షిణపుతట్టున ఇన్నూట ఏబది
బారలు, తూర్పుతట్టున ఇన్నూట ఏబది బారలు, పడ
మటితట్టున ఇన్నూట ఏబది బారలు ఉండవలెను. ।
ప్రతిష్ఠిత భూమిని ఆనుకొని మిగిలిన భూమి ఫలము 18
పట్టణములో కష్టముచేత జీవించువారికి ఆధారముగా
ఉండును. అది ప్రతిష్ఠితభూమిని యానుకొని తూర్పు
తట్టున పదివేల బారలును పడమటితట్టున పదివేల
బారలును ఉండును. । ఏ గోత్రపువారైనను పట్టణ 19
ములో కష్టముచేసి జీవించువారు దాని ననుభవిం
తురు. । ప్రతిష్ఠిత భూమియంతయు ఇరువది యయిదు 20
వేల బారల చచ్చౌకముగా ఉండును; దానిలో నాలు
గవ భాగము పట్టణమునకు ఏర్పాటు చేయవలెను.

ప్రతిష్ఠితస్థానమునకును పట్టణమునకు ఏర్పాటు 21
చేయబడిన భాగమునకును ఇరుప్రక్కలనున్న భూమిని,
అనగా తూర్పుదిశను ప్రతిష్ఠితస్థానముగా ఏర్పడిన
యిరువదియయిదువేల బారలును పడమటి దిశను గోత్ర
స్థానములుగా ఏర్పడిన యిరువది యయిదువేల బార
లును గల భూమిని యానుకొనుస్థానము అధిపతిదగును.
ప్రతిష్ఠిత స్థానమును, మందిరమునకు ప్రతిష్ఠింప
బడిన స్థానమును దానికి మధ్యగా ఉండును. ।
యూదావారి సరిహద్దుకును బెన్యామీనీయుల సరి 22
హద్దుకును మధ్యగానున్న లేవీయుల స్వాస్థ్యమును
పట్టణమునకు ఏర్పాటైన స్థానమును ఆనుకొను
భూమిలో అధిపతి భూమికి లోగా ఉన్నది అధిపతి
దగును. । తూర్పునుండి పడమటివరకు కొలువగా 23
మిగిలిన గోత్రములకు భాగములు ఏర్పాటగును.
బెన్యామీనీయులకు ఒకభాగము, । బెన్యామీనీయుల 24
సరిహద్దును ఆనుకొని తూర్పు పడమరలుగా షిమ్యో
నీయులకు ఒకభాగము; । షిమ్యోనీయుల సరిహద్దును 25
ఆనుకొని తూర్పు పడమరలుగా ఇశ్శాఖారీయులకు
ఒకభాగము; । ఇశ్శాఖారీయుల సరిహద్దును ఆను 26
కొని తూర్పు పడమరలుగా జెబులూనీయులకు ఒక
భాగము; । జెబులూనీయుల సరిహద్దును ఆనుకొని 27
తూర్పు పడమరలుగా గాదీయులకు ఒకభాగము; ।
దక్షిణదిక్కున తామారునుండి కాదేషులోనున్న 28
మెరీబా ఊటలవరకు నదివెంబడి మహాసముద్రము
వరకు గాదీయులకు సరిహద్దు ఏర్పడును. । మీరు 29
చీట్లువేసి ఇశ్రాయేలీయుల గోత్రములకు విభాగింప
వలసిన దేశము ఇదే. వారివారి భాగములు ఇవే;
యిదే యెహోవా యిచ్చిన ఆజ్ఞ.

పట్టణస్థానవైశాల్యత ఎంతనగా, ఉత్తరమున 30

31 నాలుగు వేల ఏనూరు బారల పరిమాణము. ఇశ్రా
యేలీయుల గోత్రపు పేళ్లనుబట్టి పట్టణపు గుమ్మములకు
పేళ్లు పెట్టవలెను. ఉత్తరపుతట్టున రూబేనుదనియు,
యూదాదనియు, లేవిదనియు మూడు గుమ్మములుండ
32 వలెను. తూర్పుతట్టు నాలుగు వేల ఏనూరు బారల
పరిమాణముగలది. ఆ తట్టున యోసేపుదనియు బెన్యా
మీనుదనియు దానుదనియు మూడు గుమ్మములుండ
33 వలెను. దక్షిణపుతట్టు నాలుగు వేల ఏనూరు బారల
పరిమాణముగలది. ఆ తట్టున షిమ్యోనుదనియు ఇశ్శా
ఖారుదనియు జెబులూనుదనియు మూడు గుమ్మము
లుండవలెను. పడమటితట్టు నాలుగు వేల ఏనూరు 34
బారల పరిమాణముగలది. ఆ తట్టున గాదుదనియు
ఆషేరుదనియు నఫ్తాలిదనియు మూడు గుమ్మములుండ
వలెను. దాని కైవారము పదునెనిమిదివేల బారల 35
పరిమాణము. యెహోవాయుండు స్థలమని వాట
నుండి ఆ పట్టణమునకు పేరు.

# దానియేలు

1 **యూదారాజగు** యెహోయాకీము ఏలుబడిలో
మూడవ సంవత్సరమున బాబెలురాజగు నెబుకద్నె
జరు యెరూషలేముమీదికి వచ్చి దాని ముట్టడి
2 వేయగా । ప్రభువు యూదారాజగు యెహోయా
కీమును, దేవుని మందిరములోని శేషించిన ఉపకరణ
ములను, ఆ రాజుచేతి కప్పగించెను గనుక అతడు ఆ
వస్తువులను షీనారు దేశములోని తన దేవతాలయమ
నకు తీసికొనిపోయి తన దేవతాలయపు బొక్కస
3 ములో ఉంచెను. । రాజు అష్పెనజు అను తన నపుం
4 సకుల యధిపతిని పిలిపించి అతనికీలాగు ఆజ్ఞాపిం
చెను—ఇశ్రాయేలీయుల రాజవంశములలో ముఖ్యులై,
కురూపములేక సౌందర్యమును సకల విద్యాప్రవీణ
తయు జ్ఞానమును గలిగి, తత్వజ్ఞానము తెలిసినవారై
రాజు నగరునందు నిలువదగిన కొందరు బాలురను
రప్పించి, కల్దీయుల విద్యను భాషను వారికి నేర్పుము.।
5 మరియు రాజు తాను భుజించు ఆహారములో
నుండియు తాను పానముచేయు ద్రాక్షారసములో
నుండియు అనుదిన భాగము వారికి నియమించి,
మూడు సంవత్సరములు వారిని పోషించి పిమ్మట
వారిని తన యెదుట నిలువబెట్టునట్లు ఆజ్ఞ ఇచ్చెను. ।
6 యూదులలోనుండి దానియేలు, హనన్యా, మీషా
7 యేలు, అజర్యా అనువారు వీరిలోనుండిరి. । నపుంస
కుల యధిపతి దానియేలుకు బెల్తెషాజరు అనియు,
హనన్యాకు షద్రకనియు, మీషాయేలుకు మేషాక
నియు, అజర్యాకు అబేద్నెగో అనియు పేళ్లు
8 పెట్టెను. । రాజు భుజించు భోజనమును పానము
చేయు ద్రాక్షారసమును పుచ్చుకొని తన్ను అపవిత్ర
పరచుకొనకూడదని దానియేలు ఉద్దేశించి, తాను
అపవిత్రుడు కాకుండునట్లు (వాటిని పుచ్చుకొన
కుండ సెలవిమ్మని) నపుంసకుల యధిపతిని వేడుకొనగా।
9 దేవుడు నపుంసకుల యధిపతి దృష్టికి దానియేలుకు
కృపాకటాక్షమునొంద ననుగ్రహించెను గనుక నపుం
10 సకుల యధిపతి దానియేలుతో ఇట్లనెను । — మీకు
అన్నపానములను నియమించిన రాజగు నా యజ
మానునికి నేను భయపడుచున్నాను; మీ ఈడు
బాలుర ముఖములకంటె మీ ముఖములు కృశించి
నట్లు ఆయనకు కనబడ నేల? అట్లయితే మీరు రాజు
11 చేత నాకు ప్రాణాపాయము కలుగజేతురు. । నపుంస
కుల యధిపతి దానియేలు, హనన్యా, మీషాయేలు,
అజర్యా అనువారిమీద నియమించిన నియామ
12 కునితో దానియేలు ఇట్లనెను । — భోజనమునకు
శాకధాన్యాదులను పానమునకు నీళ్లును నీ దాసుల
మగు మాకిప్పించి, దయచేసి పది దినములవరకు మమ్మును
పరీక్షింపుము. । పిమ్మట మా ముఖములను, రాజు 13
నియమించిన భోజనము భుజించు బాలుర ముఖము
లను చూచి నీకు తోచినట్టుగా నీ దాసులమైన
మాయెడల జరిగింపుము. । అందుకతడు ఈ విషయ 14
ములో వారి మాటకు సమ్మతించి పది దినములవరకు
వారిని పరీక్షించెను. । పది దినములైన పిమ్మట వారి 15
ముఖములు రాజు భోజనము భుజించు బాలురందరి
ముఖములకంటె సౌందర్యముగాను కళగాను కన
బడగా । రాజు వారికి నియమించిన భోజనమును 16
పానముకొరకైన ద్రాక్షారసమును ఆ నియామకుడు
తీసివేసి, వారికి శాకధాన్యాదుల నిచ్చెను. । ఈ నలు 17
గురు బాలుర సంగతి ఏమనగా, దేవుడు వారికి జ్ఞాన
మును సకల శాస్త్రప్రవీణతయు వివేచనయు అనుగ్ర
హించెను. మరియు దానియేలు సకలవిధములగు దర్శన
ములను స్వప్నభావములను గ్రహించు తెలివిగలవాడై
యుండెను. । నెబుకద్నెజరు తన సముఖమునకు 18
వారిని తేవలెనని ఆజ్ఞ ఇచ్చి నియమించిన దినములు
కాగానే నపుంసకుల యధిపతి రాజు సముఖమున
వారిని నిలువబెట్టెను. । రాజు వారితో మాటలాడగా 19
వారందరిలో దానియేలు, హనన్యా, మీషాయేలు,
అజర్యా వంటివారెవరును కనబడలేదు గనుక వారే
రాజు సముఖమున నిలిచిరి. । రాజు వీరియొద్ద విచారణ 20
చేయగా జ్ఞానవివేకముల సంబంధమైన ప్రతివిషయ
ములో వీరు తన రాజ్యమందంతటనుండు శకునగాండ్ల
కంటెను గారడీవిద్యగలవారందరికంటెను పదంతలు
శ్రేష్ఠులని తెలియబడెను. । ఈ దానియేలు రాజగు 21
కోరెషు ఏలుబడిలో మొదటి సంవత్సరమువరకు
జీవించెను.

నెబుకద్నెజరు తన యేలుబడియందు రెండవ 2
సంవత్సరమున కలలు కనెను. అందునుగురించి ఆయన
మనస్సు కలతపడగా ఆయనకు నిద్రపట్టకుండెను. ।
కాగా రాజు తాను కనిన కలలను తనకు తెలియ 2
జెప్పుటకై శకునగాండ్లను గారడీవిద్యగలవారిని
మాంత్రికులను కల్దీయులను పిలువనంపుడని యాజ్ఞ
ఇయ్యగా వారు వచ్చి రాజు సముఖమున నిల
చిరి. । రాజు వారితో — నేనొక కలకంటిని, ఆ కల 3
భావము తెలిసికొనవలెనని నేను మనోవ్యాకుల
మొందియున్నాననగా । కల్దీయులు అరమీయ 4
భాషతో ఇట్లనిరి—రాజు చిరకాలము జీవించుగాక.

తమరి దాసులకు సెలవియ్యుడి; మేము దాని
మును తెలియజేసెదము. । రాజు—నేను దాని మరచి
ని గాని, కలను దాని భావమును మీరు తెలియ
ని పక్షమందు మీరు తుత్తునియలుగా చేయబడు
; మీ యిండ్లు పెంటకుప్పగా చేయబడును. ।
దాని భావమును తెలియజేసినయెడల దానము
బహుమానములును మహా ఘనతయు నా సము
లో నొందుదురు గనుక కలను దాని భావమును
యజేయుడనగా వారు । — రాజు ఆ కలను తమరి
లసైన మాకు చెప్పినయెడల మేము దాని భావ
తెలియజేసెదమని మరల ప్రత్యుత్తరమిచ్చిరి. ।
నకు రాజు ఉత్తరమిచ్చి చెప్పినది ఏమనగా —
మరచియుండుట మీరు చూచి కాలహరణము
వలెనని మీరు కనిపెట్టుచున్నట్లు నేను బాగుగా
గించుచున్నాను. । కాలము ఉపాయముగా గడప
ని అబద్ధమును మోసపుమాటలను నాయెదుట
నుద్దేశించియున్నారు. మీరు కలను చెప్పలేక
యున పక్షమున నేను చెప్పిన మాట ఖండితము
క కలను నాకు చెప్పుడి అప్పుడు దాని భావ
తెలియజేయుటకు మీకు సామర్థ్యము కలదని
తెలిసికొందును. । అందుకు కల్దీయులు ఈలాగు
త్యుత్తరమిచ్చిరి — భూమిమీద ఏ మనుష్యుడును
అడిగిన సంగతి చెప్పజాలడు, ఏ చక్రవర్తియు
కారియు శకునగానియొద్దను గారడీవిద్యగలవాని
ద్దను కల్దీయునియొద్దను ఇట్టి సంగతి విచారింప
. । రాజు విచారించిన సంగతి బహు అసాధారణ
నది; దేవతలుకాక మరెవరును ఈ సంగతి తెలియ
జాలరు; దేవతల నివాసములు శరీరులమధ్య
డవు గదా. । అందుకు రాజు కోపము తెచ్చుకొని
గ్రహము గలవాడై బాబెలులోని జ్ఞానులనంద
సంహరింపవలెనని యాజ్ఞ ఇచ్చెను. । ఇట్టి శాసనము
లుదేరుటవలన జ్ఞానులు చంపబడవలసియుండగా,
రు దానియేలును అతని స్నేహితులను చంప వెద
। అప్పుడు దానియేలు బాబెలులోని జ్ఞానులను
పుటకై బయలుదేరిన రాజదేహసంరక్షకుల యధి
యగు అర్యోకుదగ్గరకుపోయి, జ్ఞానయుక్తముగా
నవిచేసెను । — రాజునొద్దనుండి ఈ యాజ్ఞ యింత
రితముగా వచ్చుట ఏమని దానియేలు రాజుయొక్క
పతియైన అర్యోకు నడుగగా అర్యోకు ఆ సంగతి
నియేలుకు తెలియజెప్పెను. । అప్పుడు దానియేలు
జుసన్నిధికి పోయి స్వప్న భావమును తెలియ
పుటకై తనకు సమయము దయచేయుమని రాజును
మాలెను.

అప్పుడు దానియేలు తన యింటికి పోయి తన
హితులైన హనన్యాకును మిషాయేలుకును అజర్యా
ను సంగతి తెలియజేసి । తానును తన స్నేహితులును

బాబెలులో తక్కిన జ్ఞానులతో కూడ నశింపకుండు
నట్లు ఆ కలయొక్క మర్మవిషయములో పరలోకమం
దున్న దేవునివలన కటాక్షము పొందునిమిత్తమై ఆయ
నను వేడుకొనుడని (వారిని హెచ్చరించెను.) । అం 19
తట రాత్రియందు దర్శనముచేత ఆ మర్మము దానియే
లుకు బయలుపరచబడెను గనుక దానియేలు పరలోక
మందున్న దేవుని స్తుతించెను. । ఎట్లనగా — దేవుడు 20
జ్ఞానబలములు కలవాడు, యుగములన్నిటను దేవుని
నామము స్తుతినొందుగాక. । ఆయన కాలములను 21
సమయములను మార్చువాడైయుండి, రాజులను త్రోసి
వేయుచు నియమించుచు ఉన్నవాడును, వివేకులకు వివే
కమును జ్ఞానులకు జ్ఞానమును అనుగ్రహించువాడునై
యున్నాడు. । ఆయన మరుగుమాటలను మర్మములను 22
బయలుపరచును; అంధకారములోని సంగతులు ఆయ
నకు తెలియును; వెలుగుయొక్క నివాసస్థలము ఆయన
యొద్దనున్నది. । మా పితరుల దేవా, నీవు వివేకమును 23
బలమును నాకనుగ్రహించియున్నావు; మేమడిగిన
యీ సంగతి ఇప్పుడు నాకు తెలియజేసియున్నావు
గనుక నేను నిన్ను స్తుతించుచు ఘనపరుచుచున్నాను;
ఏలయనగా రాజుయొక్క సంగతి నీవే మాకు తెలియ
జేసితివని దానియేలు మరల చెప్పెను. । ఇట్లుండగా 24
దానియేలు బాబెలులోని జ్ఞానులను నశింపజేయుటకు
రాజు నియమించిన అర్యోకునొద్దకు వెళ్లి — బాబెలు
లోని జ్ఞానులను నశింపజేయవద్దు, నన్ను రాజుసముఖ
మునకు తోడుకొనిపొమ్ము, నేను ఆ కల భావమును
రాజుకు తెలియజేసెదననెను.

కావున అర్యోకు—రాజుకు భావము తెలియజెప్ప 25
గల యొక మనుష్యుని చెరపట్టబడిన యూదులలో
నేను కనుగొంటినని రాజుసముఖమున మనవిచేసి, దాని
యేలును త్వరగా రాజుసన్నిధికి తోడుకొనిపోయె
ను. । రాజు—నేను చూచిన కలయు దాని భావమును 26
తెలియజెప్పుట నీకు శక్యమా? అని బెల్తెషాజరు అను
దానియేలును అడుగగా । దానియేలు రాజుసముఖ 27
ములో ఈలాగు ప్రత్యుత్తరమిచ్చెను — రాజడిగిన
యీ మర్మము జ్ఞానులైనను గారడీవిద్యగలవారైనను
శకునగాండ్లయినను జ్యోతిష్కులైనను తెలియజెప్ప
జాలరు. । అయితే మర్మములను బయలుపరచగల దేవు 28
డొకడు పరలోకమందున్నాడు; అంత్యదినముల
యందు కలుగబోవుదానిని ఆయన రాజగు నెబుక
ద్నెజరుకు తెలియజేసెను. తాము పడకమీద పరుం
డగా తమరి మనస్సులో కలిగిన స్వప్నదర్శనములు
ఏవనగా । రాజా, ప్రస్తుతకాలము గడచిన పిమ్మట 29
ఏమి జరుగునో అనుకొని తాము పడకమీద పరుండి
మనోచింతగలవారై యుండగా మర్మములను బయలు
పరచువాడు కలుగబోవుదానిని తమరికి తెలియ
జేసెను. । ఇతర మనుష్యులకందరికంటె నాకు విశేష 30

జ్ఞానముండుటవలన ఈ మర్మము నాకు బయలుపరచ
బడలేదు. రాజుకు దాని భావమును తెలియజేయు
నిమిత్తమును, తమరి మనస్సుయొక్క ఆలోచనలు తాము
తెలిసికొను నిమిత్తమును అది బయలుపరచబడెను. ।
31 రాజా, తాము చూచుచుండగా బ్రహ్మాండమగు ఒక
ప్రతిమ కనబడెను గదా. ఈ గొప్ప ప్రతిమ మహా
ప్రకాశమును, భయంకరమునైన రూపమునుగలదై
32 తమకెదుట నిలిచెను. । ఆ ప్రతిమయొక్క శిరస్సు
మేలిమి బంగారుమయమైనదియు, దాని రొమ్మును భుజ
ములును వెండివియు, దాని ఉదరమును తొడలును ఇత్త
33 డివియు, । దాని మోకాళ్లు ఇనుపవియు, దాని పాద
ములలో ఒక భాగము ఇనుపదియు ఒక భాగము
34 మట్టిదియునై యుండెను. । మరియు చేతిసహాయము
లేక తీయబడిన ఒక రాయి, యినుమును మట్టియు కలిసిన
ఆ ప్రతిమయొక్క పాదములమీద పడి దాని పాద
ములను తుత్తునియలుగా విరుగగొట్టినట్టు తమకు కన
35 బడెను. । అంతట ఇనుమును మట్టియు ఇత్తడియు
వెండియు బంగారమును ఏకముగా దంచబడి కళ్లము
లోని చెత్తవలె కాగా వాటికి స్థలము ఎచ్చటను దొర
కకుండ గాలి వాటిని కొట్టుకొనిపోయెను; ప్రతిమను
విరుగగొట్టిన ఆ రాయి సర్వభూతలమంత మహా పర్వత
36 మాయెను. । తాము కనిన కల యిదే, దాని భావము
37 రాజుసముఖమున నేను తెలియజెప్పెదను. । రాజా,
పరలోకమందున్న దేవుడు రాజ్యమును అధికారమును
బలమును ఘనతయు తమకిచ్చి అనుగ్రహించియున్నాడు;
38 తమరు రాజులకు రాజైయున్నారు. । ఆయన మను
ష్యులు నివసించు ప్రతిస్థలమందును, మనుష్యులనేమి
భూజంతువులనేమి ఆకాశపక్షులనేమి అన్నిటిని
ఆయన తమరి చేతికప్పగించి యున్నాడు, వారందరి
మీద తమరికి ప్రభుత్వము ననుగ్రహించి యున్నాడు;
39 తామే ఆ బంగారపు శిరస్సు. । తాము చనిపోయిన
తరువాత తమరి రాజ్యముకంటె తక్కువైన రాజ్య
మొకటి కలుగును. అటుతరువాత లోకమంత యేలు
నట్టి మూడవ రాజ్యమొకటి కలుగును. అది యిత్తడి
40 వంటిదగును. । పిమ్మట నాలుగవ రాజ్యమొకటి కలు
గును. అది ఇనుమువలె బలముగా ఉండును. ఇనుము
సమస్తమైనవాటిని దంచి విరుగగొట్టునది గదా; ఇనుము
పగులగొట్టునట్లు అది (రాజ్యములన్నిటిని) పగులగొట్టి
41 పొడిచేయును. । కాళ్లును పాదములును కొంతమట్టుకు
కుమ్మరివాని మట్టిదిగాను కొంతమట్టుకు ఇనుపదిగా
నున్నట్టు తమరికి కనబడెను గనుక ఆ రాజ్యములో
భేదములుండును. అయితే ఇనుము బురదతో కలిసి
యున్నట్టు కనబడెను గనుక ఆ రాజ్యములో ఆలా
గుననుండును, ఆ రాజ్యము ఇనుమువంటి బలముగలదై
42 యుండును. । పాదముల వ్రేళ్లు కొంతమట్టుకు ఇను
పవిగాను కొంతమట్టుకు మట్టివిగాను ఉన్నట్లు ఆ

రాజ్యము ఒక విషయములో బలముగాను ఒక విషయ
ములో నీరసముగాను ఉండును. । ఇనుమును బుర 43
దయు మిళితమై యుండుట తమరికి కనబడెను; అటు
వలె మనుష్యజాతులు మిళితములై యినుము మట్టితో
అతకనట్లు వారు ఒకరితో ఒకరు పొసగకయుందురు. ।
ఆ రాజుల కాలములలో పరలోకమందున్న దేవుడు 44
ఒక రాజ్యము స్థాపించును. దానికెన్నటికిని నాశనము
కలుగదు, ఆ రాజ్యము (దాని పొందినవారికిగాక)
మరెవరికిని చెందదు; అది ముందు చెప్పిన రాజ్యము
లన్నిటిని పగులగొట్టి నిర్మూలముచేయునుగాని అది
యుగముల పర్యంతము నిలుచును. । చేతి సహాయము 45
లేక పర్వతమునుండి తియ్యబడిన ఆ రాయి యినుమును
ఇత్తడిని మట్టిని వెండిని బంగారమును పగులగొట్టగా
తమరు చూచితిరే; యిందువలన మహా దేవుడు ముందు
జరుగబోవుదానిని రాజుకు తెలియజేసియున్నాడు;
కల నిశ్చయము, దాని భావము నమ్మదగినది అని దాని
యేలు రాజుతో చెప్పెను. । అంతట రాజగు నెబు 46
కద్నెజరు దానియేలుకు సాష్టాంగనమస్కారము చేసి
అతని పూజించి, నైవేద్య ధూపములు అతనికి సమ
ర్పింప ఆజ్ఞాపించెను. । మరియు రాజు—ఈ మర్మమును 47
బయలుపరచుటకు నీవు సమర్థుడవైతివే; నీ దేవుడు
దేవతలకు దేవుడును రాజులకు ప్రభువును మర్మములు
బయలుపరచువాడునై యున్నాడని దానియేలుకు
ప్రత్యుత్తరమిచ్చెను. । అప్పుడు రాజు దానియేలును 48
బహుగా హెచ్చించి, అనేక గొప్ప దానములనిచ్చి,
అతనిని బాబెలుసంస్థానమంతటిమీద అధిపతినిగాను,
బాబెలు జ్ఞానులందరిలో ప్రధానునిగాను నియమిం
చెను. । అంతట దానియేలు రాజునొద్ద మనవి చేసి 49
కొనగా రాజు షద్రకు మేషాకు అబేద్నెగోయను
వారిని బాబెలుసంస్థానముమీద విచారణకర్తలనుగా
నియమించెను; అయితే దానియేలు రాజుసన్నిధిని
ఉండెను.

రాజగు నెబుకద్నెజరు బంగారు ప్రతిమ 3
యొకటి చేయించి, బాబెలుదేశములోని దూరాయను
మైదానములో దాని నిలువబెట్టించెను. అది అరువది
మూరల ఎత్తును ఆరుమూరల వెడల్పునై యుండెను. ।
రాజగు నెబుకద్నెజరు అధిపతులను సేనాధిపతులను 2
సంస్థానాధిపతులను మంత్రులను ఖజానాదారులను
ధర్మశాస్త్ర విధాయకులను న్యాయాధిపతులను సంస్థాన
ములలో అధిక్యము వహించినవారినందరిని సమ
కూర్చుటకును, రాజగు నెబుకద్నెజరు నిలువబెట్టిం
చిన ప్రతిమయొక్క ప్రతిష్ఠకు రప్పించుటకును దూత
లను పంపించగా । ఆ యధిపతులును సేనాధిపతులును 3
సంస్థానాధిపతులును మంత్రులును ఖజానాదారులును
ధర్మశాస్త్ర విధాయకులును న్యాయాధిపతులును సం
స్థానములలో అధిక్యము వహించినవారందరును

రాజగు నెబుకద్నెజరు నిలువబెట్టించిన ప్రతిమ
యొక్క ప్రతిష్ఠకు కూడివచ్చి, రాజగు నెబుక
ద్నెజరు నిలువబెట్టించిన ప్రతిమయెదుట నిలుచుం
4 డిరి. । ఇట్లుండగా ఒక దూత చాటించినది ఏమనగా
—జనులారా, దేశస్థులారా, ఆ యా భాషలు మాట
5 లాడువారలారా, మీకాజ్ఞ ఇచ్చుచున్నాను. । ఏమ
నగా, బూకా పిల్లంగ్రోవి పెద్దవీణె సుంఫోనీయ వీణె
విపంచిక సకలవిధములగు వాద్యధ్వనులు మీకు విన
బడునప్పుడు రాజగు నెబుకద్నెజరు నిలువబెట్టించిన
బంగారు ప్రతిమయెదుట సాగిలపడి నమస్కరిం
6 చుడి. । సాగిలపడి నమస్కరింపనివాడెవడో వాడు
తత్క్షణమే మండుచున్న అగ్నిగుండములో వేయబడును.।
7 సకల జనులకు బూకా పిల్లంగ్రోవి పెద్దవీణె వీణె
సుంఫోనీయ విపంచిక సకలవిధములగు వాద్యధ్వనులు
వినబడగా ఆ జనులును దేశస్థులును ఆ యా భాషలు
మాటలాడువారును సాగిలపడి, రాజగు నెబుక
ద్నెజరు నిలువబెట్టించిన బంగారు ప్రతిమకు నమస్కా
8 రము చేసిరి. । ఆ సమయమందు కల్దీయులలో కొం
దరు ముఖ్యులు వచ్చి యూదులపైని కొండెములు
9 చెప్పి । రాజగు నెబుకద్నెజరునొద్ద ఈలాగు మనవి
10 చేసిరి—రాజా, చిరకాలము జీవించుగాక. । రాజా,
తాము ఒక కట్టడ నియమించితిరి; ఏదనగా బూకాను
పిల్లంగ్రోవిని పెద్ద వీణెను వీణెను విపంచికను సుంఫో
నీయను సకల విధములగు వాద్యధ్వనులను విను ప్రతి
వాడు సాగిలపడి ఆ బంగారు ప్రతిమకు నమస్కా
11 రము చేయవలెను. । సాగిలపడి నమస్కరింపనివా
డెవడో వాడు మండుచున్న అగ్నిగుండములో వేయ
12 బడును. । రాజా, తాము షద్రకు, మేషాకు, అబే
ద్నెగో అను ముగ్గురు యూదులను బాబెలుదేశము
లోని రాచకార్యములు విచారించుటకు నియమించి
తిరి; ఆ మనుష్యులు తమరి ఆజ్ఞను లక్ష్యపెట్టలేదు,
తమరి దేవతలను పూజించుటలేదు, తమరు నిలువబెట్టిం
చిన బంగారు ప్రతిమకు నమస్కరించుటయే లేదు. ।
13 అందుకు నెబుకద్నెజరు అత్యాగ్రహమును రౌద్ర
మును గలవాడై షద్రకును మేషాకును అబేద్నెగోను
పట్టుకొనిరండని ఆజ్ఞ ఇయ్యగా వారు ఆ మనుష్యు
14 లను పట్టుకొని రాజసన్నిధికి తీసికొని వచ్చిరి. । అం
తట నెబుకద్నెజరు వారితో ఇట్లనెను — షద్రకూ,
మేషాకూ, అబేద్నెగో, మీరు నా దేవతను పూజిం
చుటలేదనియు, నేను నిలువబెట్టించిన బంగారు ప్రతి
మకు నమస్కరించుటలేదనియు (నాకు వినబడినది).
15 అది నిజమా? । బూకాను పిల్లంగ్రోవిని పెద్ద వీణెను
వీణెను సుంఫోనీయను విపంచికను సకలవిధములగు
వాద్యధ్వనులను మీరు విను సమయములో సాగిల
పడి, నేను చేయించిన ప్రతిమకు నమస్కరించుటకు
సిద్ధముగా ఉండినయెడల సరే, మీరు నమస్కరింపని
పక్షమున తత్క్షణమే మండుచున్న వేడిమిగల అగ్ని
గుండములో మీరు వేయబడుదురు; నా చేతిలో
నుండి మిమ్మును విడిపింపగల దేవుడెక్కడ నున్నాడు! ।
షద్రకును, మేషాకును, అబేద్నెగోయు రాజుతో 16
ఈలాగు చెప్పిరి—నెబుకద్నెజరూ, యిందునుగురించి
నీకు ప్రత్యుత్తరమియ్యవలెనన్న చింత మాకు లేదు. ।
మేము సేవించుచున్న దేవుడు మండుచున్న వేడిమిగల 17
యీ అగ్నిగుండములోనుండి మమ్మును తప్పించి రక్షిం
చుటకు సమర్థుడు; మరియు నీ వశమున పడకుండ
ఆయన మమ్మును రక్షించును; ఒకవేళ ఆయన రక్షింపక
పోయినను । రాజా, నీ దేవతలను మేము పూజింప 18
మనియు, నీవు నిలువబెట్టించిన బంగారు ప్రతిమకు
నమస్కరింపమనియు తెలిసికొనుము. । అందుకు 19
నెబుకద్నెజరు అత్యాగ్రహము నొందినందున
షద్రకు, మేషాకు, అబేద్నెగోయను వారి విషయ
ములో ఆయన ముఖము వికారమాయెను గనుక గుం
డము ఎప్పటికన్న ఏడంతలు వేడిమిగా చేయుమని
యాజ్ఞ ఇచ్చెను. । మరియు తన సైన్యములోనుండు 20
బలిష్ఠులలో కొందరిని పిలువనంపించి — షద్రకును,
మేషాకును, అబేద్నెగోను బంధించి వేడిమిగలిగి మండు
చున్న ఆ గుండములో వేయుడని ఆజ్ఞ ఇయ్యగా ।
వారు వారి అంగీలను నిలువుటంగీలను పైవస్త్రములను 21
తక్కిన వస్త్రములను తియ్యకయే, యున్నపాటున
ముగ్గురిని వేడిమిగలిగి మండుచున్న ఆ గుండము
నడుమ పడవేసిరి. । రాజాజ్ఞ తీవ్రమైనందునను గుం 22
డము మిక్కిలి వేడిమిగలదైనందునను షద్రకు, మేషాకు,
అబేద్నెగోలను విసిరివేసిన ఆ మనుష్యులు అగ్ని
జ్వాలలచేత కాల్చబడి చనిపోయిరి. । షద్రకు, మేషాకు, 23
అబేద్నెగోయను ఆ ముగ్గురు మనుష్యులు బంధింప
బడినవారై వేడిమిగలిగి మండుచున్న ఆ గుండములో
పడగా । రాజగు నెబుకద్నెజరు ఆశ్చర్యపడి తీవర 24
ముగ లేచి—మేము ముగ్గురు మనుష్యులను బంధించి
యీ అగ్నిలో వేసితిమిగదా యని తన మంత్రుల
నడిగెను. వారు—రాజా, సత్యమే అని రాజుతో
ప్రత్యుత్తరమిచ్చిరి. । అందుకు రాజు—నేను నలుగురు 25
మనుష్యులు బంధకములులేక అగ్నిలో సంచరించుట
చూచుచున్నాను; వారికి హాని యేమియు కలుగలేదు;
నాల్గవవాని రూపము దేవతల రూపమును బోలినదని
వారికి ప్రత్యుత్తరమిచ్చెను. । అంతట నెబుకద్నెజరు 26
వేడిమిగలిగి మండుచున్న ఆ గుండము వాకిలి దగ్గరకు
వచ్చి—షద్రకు, మేషాకు, అబేద్నెగోయనువారలారా,
మహోన్నతుడగు దేవుని సేవకులారా, బయటికి
వచ్చి నాయొద్దకు రండని పిలువగా, షద్రకు, మేషాకు,
అబేద్నెగో ఆ అగ్నిలోనుండి బయటికి వచ్చిరి. । అధి 27
పతులును సేనాధిపతులును సంస్థానాధిపతులును రాజు
యొక్క ప్రధాన మంత్రులును కూడివచ్చి, ఆ మనుష్యు

లను పరీక్షించి, వారి శరీరములకు అగ్ని యేహాని
చేయకుండుటయు, వారి తలవెండ్రుకలలో ఒకటైనను
నను కాలిపోకుండుటయు, వారి వస్త్రములు చెడిపో
కుండుటయు, అగ్ని వాసనయైనను వారి దేహములకు
28 తగులకుండుటయు చూచిరి. । నెబుకద్నెజరు —
షద్రకు, మేషాకు, అబేద్నెగోయను వీరి దేవుడు
పూజార్హుడు; ఆయన తన దూతనంపి తన్నాశ్రయిం
చిన దాసులను రక్షించెను. వారు తమ దేవునికిగాక
మరి ఏ దేవునికి నమస్కరింపకయు, ఏ దేవుని సేవింప
కయు ఉందుమని తమ దేహములను అప్పగించి రాజు
29 యొక్క ఆజ్ఞను వ్యర్థపరచిరి. । కాగా నేనొక శాస
నము నియమించుచున్నాను; ఏదనగా, ఇవ్విధముగ
రక్షించుటకు సమర్థుడైన దేవుడుగాక మరి ఏ దేవుడును
లేడు. కాగా ఏ జనులలో గాని రాష్ట్రములో గాని
యే భాష మాటలాడువారిలో గాని షద్రకు, మేషాకు,
అబేద్నెగో యనువారి దేవుని ఎవడు దూషించునో
వాడు తుత్తునియలుగా చేయబడును; వాని యిల్లు
30 ఎప్పుడును పెంటకుప్పగా ఉండుననెను. । అంతట
నుండి రాజు షద్రకు, మేషాకు, అబేద్నెగో యను
వారిని బాబెలు సంస్థానములో హెచ్చించెను.

4 రాజగు నెబుకద్నెజరు లోకమంతట నివసించు
సకలజనులకును దేశస్థులకును ఆ యా భాషలు మాట
లాడువారికిని ఈలాగు సెలవిచ్చుచున్నాడు—మీకు
2 క్షేమాభివృద్ధి కలుగుగాక. । మహోన్నతుడగు
దేవుడు నాయెడల చేసిన అద్భుతములను సూచక
క్రియలను మీకు తెలియజేయుటకు నాకు మనస్సు
3 కలిగెను. । ఆయన సూచకక్రియలు ఎంతో బ్రహ్మాండ
మైనవి; ఆయన అద్భుతములు ఎంతో ఘనమైనవి.
ఆయన రాజ్యము శాశ్వత రాజ్యము; ఆయన ఆధి
పత్యము తరతరములు నిలుచుచున్నది.
4–5 నెబుకద్నెజరను నేను నా యింట విశ్రాంతియు
నా నగరమందు క్షేమమును గలవాడనైయుండి యొక
కలకంటిని; అది నాకు భయము కలుగజేసెను. నేను
నా పడకమీద పరుండియుండగా నా మనస్సున
6 పుట్టిన తలంపులు నన్ను కలతపెట్టెను. । కావున ఆ
స్వప్నభావము నాకు తెలియజేయుటకై బాబెలు
జ్ఞానులనందరిని నా యెదుటికి పిలువనంపవలెనని ఆజ్ఞ
7 నేనిచ్చితిని. । శకునగాండ్రును గారడీవిద్యగలవారును
కల్దీయులును జ్యోతిష్కులును నా సన్నిధికి రాగా
నేను కనిన కలను వారితో చెప్పితిని గాని వారు
8 దాని భావమును నాకు తెలుపలేకపోయిరి. । కడపట
బెల్తెషాజరను నా దేవత పేరునుబట్టి బిరుదుపొందిన
దానియేలనువాడు నా యెదుటికి వచ్చెను; పరిశుద్ధ
దేవతల ఆత్మ అతనియందుండెను, కావున నేనతనికి
9 నా కలను చెప్పితిని. । ఎట్లనగా—శకునగాండ్ర అధి
పతియగు బెల్తెషాజరూ, పరిశుద్ధదేవతల ఆత్మ నీయం
దున్నదనియు, ఏ మర్మము నిన్ను కలతపెట్టదనియు
నేనెరుగుదును గనుక నేను కనిన కలయు దాని భావ
మును నాకు తెలియజెప్పుము. । నేను నా పడకమీద 10
పరుండియుండగా నాకు ఈ దర్శనములు కలిగెను;
నేను చూడగా భూమిమధ్యను మిగుల ఎత్తుగల యొక
చెట్టు కనబడెను. । ఆ చెట్టు వృద్ధిపొంది బ్రహ్మాండ 11
మైనదాయెను; దాని పైకొమ్మలు ఆకాశమునకంటు
నంత ఎత్తుగాను దాని ఆకారము భూతలమంత విశాల
ముగాను ఉండెను. । దాని ఆకులు సొగసుగాను దాని 12
పండ్లు విస్తారముగాను కనబడెను. అందులో సమస్త
జీవకోట్లకు చాలునంత ఆహారముండెను; దాని నీడను
అడవిజంతువులు పండుకొనెను, దాని కొమ్మలపైని
ఆకాశపక్షులు కూర్చుండెను; సకల మనుష్యులకు
చాలునంత ఆహారము దానియందుండెను. । మరియు 13
నేను నా పడకమీద పండుకొనియుండి నా మన 14
స్సుకు కలిగిన దర్శనములను చూచుచుండగా, జాగ
రూకుడగు ఒక పరిశుద్ధుడు ఆకాశమునుండి దిగి వచ్చి
ఈలాగు బిగ్గరగా ప్రకటించెను—ఈ చెట్టును నరికి
దాని కొమ్మలను కొట్టి దాని ఆకులను తీసివేసి దాని
పండ్లను పారవేయుడి; పశువులను దాని నీడనుండి
తోలివేయుడి; పక్షులను దాని కొమ్మలనుండి ఎగర
గొట్టుడి. । అయితే అది మంచుకు తడిసి పశువులవలె 15
పచ్చికలో నివసించునట్లు దాని మొద్దును ఇనుము
ఇత్తడి కలిసిన కట్టుతో కట్టించి, పొలములోని గడ్డి
పొలగునట్లు దానిని భూమిలో విడువుడి. । ఏడు 16
కాలములు గడచువరకు వానికున్న మానవమనస్సుకు
బదులుగా పశువుమనస్సు వానికి కలుగును. । ఈ 17
ఆజ్ఞ జాగరూకులగు దేవదూతల ప్రకటన ననుసరించి
జరుగును, నిర్ణయమైన పరిశుద్ధుల ప్రకటన ననుసరించి
సంభవించును. మహోన్నతుడగు దేవుడు మానవుల
రాజ్యముపైని అధికారియైయుండి, తానెవరికి అను
గ్రహింప నిచ్ఛయించునో వారికనుగ్రహించుననియు,
ఆ యా రాజ్యముపైన అత్యల్ప మనుష్యులను ఆయన
నియమించుచున్నాడనియు మనుష్యులందరు తెలిసి
కొనునట్లు ఈలాగు జరుగును. । బెల్తెషాజరూ, నెబుక 18
ద్నెజరను నాకు కలిగిన దర్శనము ఇదే; నీవు తప్ప
నా రాజ్యములో మరి ఏ జ్ఞానియు దాని భావము
నాకు చెప్ప నేరడు. నీయందు పరిశుద్ధదేవతల ఆత్మ
యున్నది గనుక నీవే దానిని చెప్ప సమర్థుడవంటివి.
అందుకు బెల్తెషాజరను దానియేలు ఒక గంటసేపు 19
అతి విస్మయమునొంది మనస్సునందు కలవరపడగా,
రాజు—బెల్తెషాజరూ, యీ దర్శనమువలన గాని దాని
భావమువలన గాని నీవు కలవరపడకుము అనెను.
అంతట బెల్తెషాజరు—నా యేలినవాడా, యీ దర్శన
ఫలము తమరిని ద్వేషించువారికి కలుగుగాక, దాని
భావము తమరి శత్రువులకు చెందుగాక. । తామ 20

చూచిన చెట్టు వృద్ధినొంది బ్రహ్మాండమైనదాయెను,
దాని పైకొమ్మలు ఆకాశమునకంటునంత ఎత్తుగాను
దాని ఆకారము భూతలమంత విశాలముగాను ఉం
డెను. । దాని ఆకులు సొగసుగాను దాని పండ్లు
విస్తారములుగాను కనబడెను, అందులో సమస్త జీవ
కోట్లకు చాలినంత ఆహారముండెను, దాని నీడను
అడవిజంతువులు పండుకొనెను, దాని కొమ్మలపైన
ఆకాశపక్షులు కూర్చుండెనుగదా? । రాజా, ఆ చెట్టు
నిన్ను సూచించుచున్నది; నీవు వృద్ధిపొంది మహా
బలముగలవాడవైతివి; నీ ప్రభావము వృద్ధినొంది
ఆకాశమంత ఎత్తాయెను; నీ ప్రభుత్వము లోకమం
తట వ్యాపించియున్నది. । — చెట్టును నరుకుము,
దాని నాశనముచేయుము గాని దాని మొద్దును
భూమిలో ఉండనిమ్ము; ఇనుము ఇత్తడి కలిసిన కట్టుతో
ఏడు కాలములు గడచువరకు పొలములోని పచ్చి
కలో దాని కట్టించి, ఆకాశపుమంచుకు తడవనిచ్చి
పశువులతో పాలుపొందనిమ్మని జాగరూకుడగు ఒక
పరిశుద్ధుడు పరలోకమునుండి దిగివచ్చి ప్రకటించుట
నీవు వింటివి గదా. । రాజా, యీ దర్శనభావమే
దనగా, సర్వోన్నతుడగు దేవుడు రాజగు నా యేలిన
వానిగూర్చి చేసిన తీర్మానమేదనగా । తమయొద్ద నుండ
కుండ మనుష్యులు నిన్ను తరుముదురు, నీవు అడవి
జంతువుల మధ్య నివాసముచేయుచు పశువులవలె
గడ్డితినెదవు; ఆకాశపుమంచు నీమీద పడి నిన్ను
తడుపును; సర్వోన్నతుడగు దేవుడు మానవుల రాజ్య
ముపైన అధికారియై యున్నాడనియు, తానెవనికి
దాని ననుగ్రహింప నిచ్ఛయించునో వానికి అనుగ్ర
హించుననియు నీవు తెలిసికొనువరకు ఏడు కాలములు
నీకీలాగు జరుగును. చెట్టుయొక్క మొద్దు నుండ
నియ్యుడని వారు చెప్పిరిగదా? దానివలన సర్వోన్న
తుడు అధికారియని నీవు తెలిసికొనినమీదట నీ
రాజ్యము నీకు మరల ఖాయముగ వచ్చునని తెలిసి
కొమ్ము. । రాజా, నా యోచన నీ దృష్టికి అంగీకార
మగును గాక; ఒకవేళ నీవు నీ పాపములు మాని నీతి
న్యాయముల ననుసరించి, నీవు బాధపెట్టినవారియందు
కరుణ చూపినయెడల నీకున్న క్షేమము నీకికమీదట
నుండునని దానియేలు ప్రత్యుత్తరమిచ్చెను. । పైన
జెప్పినదంతయు రాజగు నెబుకద్నెజరుకు సంభవిం
చెను. । పండ్రెండు నెలలు గడచిన పిమ్మట అతడు
తన రాజధానియగు బాబెలులోని నగరునందు సంచ
రించుచుండగా । రాజు—బాబెలను ఈ మహా విశాల
పట్టణము నా బలాధికారమును నా ప్రభావఘనతను
కనుపరచుటకై నా రాజధాని నగరముగా నేను
కట్టించినది కాదా అని తనలో తాననుకొనెను. ।
రాజు నోట ఈ మాట యుండగా ఆకాశమునుండి
యొక శబ్దము వచ్చెను, ఏదనగా—రాజగు నెబుక
ద్నెజరూ, యిదే నీకు ప్రకటన—నీ రాజ్యము నీయొద్ద
నుండి తొలగిపోయెను. । తమయొద్దనుండి మనుష్యులు 32
నిన్ను తరిమెదరు; నీవు అడవిజంతువులమధ్య నివా
సముచేయుచు పశువులవలె గడ్డి మేసెదవు; సర్వో
న్నతుడగు దేవుడు మానవుల రాజ్యముపైన అధి
కారియైయుండి, తానెవనికి దాని అనుగ్రహింప నిచ్ఛ
యించునో వానికి అనుగ్రహించునని నీవు తెలిసికొను
వరకు ఏడు కాలములు నీకీలాగు జరుగునని చెప్పెను. ।
ఆ గడియలోనే ఆలాగున నెబుకద్నెజరుకు సంభ 33
వించెను; మానవులలోనుండి అతని తరిమిరి, అతడు
పశువులవలె గడ్డిమేసెను, ఆకాశపుమంచు అతని
దేహమును తడుపగా అతని తలవెండ్రుకలు పక్షిరాజు
రెక్కల ఈకెలవంటివియు అతని గోళ్లు పక్షుల గోళ్ల
వంటివియు నాయెను. । ఆ కాలము గడచిన పిమ్మట 34
నెబుకద్నెజరను నేను మరల మానవబుద్ధిగలవాడనై
నా కండ్లు ఆకాశముతట్టు ఎత్తి, చిరంజీవియు సర్వో
న్నతుడునగు దేవుని స్తోత్రముచేసి ఘనపరచి స్తుతిం
చితిని; ఆయన ఆధిపత్యము చిరకాలపర్యంతమును
ఆయన రాజ్యము తరతరములకు నున్నవి. । భూని 35
వాసులందరు ఆయన దృష్టికి ఎన్నికకు రానివారు;
ఆయన పరలోక సేనయెడలను భూనివాసులయెడలను
తన చిత్తము చొప్పున జరిగించువాడు; ఆయన చేతిని
పట్టుకొని నీవేమి చేయుచున్నావని ఆయనతో చెప్పు
టకు ఎవడును సమర్థుడుకాడు. । ఆ సమయమందు 36
నా బుద్ధి మరల నాకు వచ్చెను, రాజ్యసంబంధమగు
ప్రభావమును నా ఘనతయు నా తేజస్సును నాకు
కలిగెను; నా మంత్రులును నా క్రిందియధిపతులును
నాయొద్ద ఆలోచన చేయవచ్చిరి. నా రాజ్యము నాకు
స్థిరపడగా నేను మరి ఎక్కువ ఘనత నొందితిని. ।
ఈలాగు నెబుకద్నెజరను నేను పరలోకపు రాజు 37
యొక్క కార్యములన్నియు సత్యములును, ఆయన
మార్గములు న్యాయములునై యున్నవనియు, గర్వ
ముతో నటించువారిని ఆయన అణపశక్తుడనియు,
ఆయనను స్తుతించుచు కొనియాడుచు ఘనపరచుచు
న్నాను.

రాజగు బెల్షాసరు తన యధిపతులలో వెయ్యి 5
మందికి గొప్ప విందుచేయించి, ఆ వెయ్యిమందితో
కలిసికొని ద్రాక్షారసము త్రాగుచుండెను. । బెల్షాసరు 2
ద్రాక్షారసము త్రాగుచుండగా తానును తన యధి
పతులును తన రాణులును తన ఉపపత్నులును
వాటిలో ద్రాక్షారసముపోసి త్రాగునట్లు, తన తండ్రి
యగు నెబుకద్నెజరు యెరూషలేములోని యాలయ
ములోనుండి తెచ్చిన వెండి బంగారు పాత్రలను
తెమ్మని ఆజ్ఞ ఇచ్చెను. । అందుకు వారు యెరూష 3
లేములోని దేవుని నివాసమగు ఆలయములోనుండి
తీసికొన్న సువర్ణోపకరణములను తెచ్చియుంచగా,

రాజును అతని యధిపతులును అతని రాణులును
అతని ఉపపత్నులును వాటిలో ద్రాక్షారసము పోసి
4 త్రాగిరి. । వారు బంగారు వెండి యిత్తడి యినుము
కర్ర రాయి అను వాటితో చేసిన దేవతలను స్తుతిం
5 చుచు ద్రాక్షారసము త్రాగుచుండగా । ఆ గడియ
లోనే మానవహస్తపు వ్రేళ్లు కనబడి, దీపము దగ్గర
రాజుయొక్క నగరు గోడ పూతమీద ఏదోయొక
వ్రాత వ్రాయుచున్నట్టుండెను. రాజు ఆ హస్తము
6 వ్రాయుట చూడగా । అతని ముఖము వికార
మాయెను, అతడు మనస్సునందు కలవరపడగా అతని
నడుము కీళ్లువదలి అతని మోకాళ్లు గడగడ వణకుచు
7 కొట్టుకొనుచుండెను. । రాజు గారడీవిద్యగలవారిని
కల్దీయులను జ్యోతిష్కులను పిలువనంపుడని ఆతుర
ముగా ఆజ్ఞ ఇచ్చి, బాబెలులోని జ్ఞానులు రాగానే
ఇట్లనెను—ఈ వ్రాతను చదివి దీని భావమును నాకు
తెలియజెప్పువాడెవడో వాడు ధూమ్రవస్త్రము కట్టు
కొని తన మెడను సువర్ణమయమైన కంఠభూషణము
ధరింపబడినవాడై రాజ్యములో మూడవ యధిపతిగా
8 ఏలును. । రాజు నియమించిన జ్ఞానులందరు అతని
సముఖమునకు వచ్చిరి గాని ఆ వ్రాత చదువుటకై
నను దాని భావము తెలియజెప్పుటకైనను వారివల్ల
9 కాకపోయెను. । అందుకు రాజగు బెల్షాసరు మిగుల
భయాక్రాంతుడై తన యధిపతులు విస్మయమొందు
10 నట్లుగా ముఖవికారము గలవాడాయెను. । రాజుకును
అతని యధిపతులకును జరిగిన సంగతి రాణి తెలిసి
కొని విందు గృహమునకు వచ్చి ఇట్లనెను — రాజు
చిరకాలము జీవించుగాక, నీ తలంపులు నిన్ను కలవర
పరచనియ్యకుము, నీ మనస్సు నిబ్బరముగా ఉండ
11 నిమ్ము. । నీ రాజ్యములో ఒక మనుష్యుడున్నాడు.
అతడు పరిశుద్ధ దేవతల ఆత్మగలవాడు; నీ తండ్రికాల
ములో అతడు దైవజ్ఞానమువంటి జ్ఞానమును బుద్ధియు
తెలివియుగలవాడై యుండుట నీ తండ్రి కనుగొనెను
గనుక నీ తండ్రియైన రాజగు నెబుకద్నెజరు శకున
గాండ్లకును గారడీవిద్యగలవారికిని కల్దీయులకును
జ్యోతిష్కులకును పైయధిపతిగా అతని నియమిం
12 చెను. । ఈ దానియేలు శ్రేష్ఠమైన బుద్ధిగలవాడై
కలలు తెలియజేయుటకును, మర్మములు బయలుపర
చుటకును, కఠినమైన ప్రశ్నలకుత్తరమిచ్చుటకును జ్ఞాన
మును తెలివియుగలవాడుగా కనబడెను గనుక ఆ
రాజు అతనికి బెల్తెషాజరు అను పేరు పెట్టెను. ఈ
దానియేలును పిలువనంపుము, అతడు దీని భావము
నీకు తెలియజెప్పును.
13 అప్పుడు వారు దానియేలును పిలువనంపించిరి.
అతడు రాగా రాజు ఇట్లనెను—రాజగు నా తండ్రి
యూదయలోనుండి ఇక్కడికి తీసికొనివచ్చిన చెర
సంబంధమగు యూదులలోనుండు దానియేలు నీవే
గదా. । దేవతల ఆత్మయు వివేకమును బుద్ధియు విశేష 14
జ్ఞానమును నీయందున్నవని నిన్నుగూర్చి వింటిని. । ఈ 15
వ్రాత చదివి దాని భావము తెలియజెప్పవలెనని జ్ఞాను
లను గారడీవిద్యగలవారిని పిలిపించితిని గాని వారు
ఈ సంగతియొక్క భావమును తెలుపలేకపోయిరి. ।
అంతర్భావములను బయలుపరచుటకును కఠినమైన 16
ప్రశ్నలకు ఉత్తరమిచ్చుటకును నీవు సమర్థుడవని నిన్ను
గూర్చి వినియున్నాను గనుక ఈ వ్రాతను చదువుట
కును దాని భావమును తెలియజెప్పుటకును నీకు శక్య
మైనయెడల నీవు ధూమ్రవస్త్రము కట్టుకొని మెడను
సువర్ణకంఠభూషణము ధరించుకొని రాజ్యములో
మూడవ యధిపతివిగా ఏలుదువు. । అందుకు దానియేలు 17
ఇట్లనెను—నీ దానములు నీయొద్ద నుంచుకొనుము, నీ
బహుమానములు మరి ఎవనికైన నిమ్ము; అయితే నేను
ఈ వ్రాతను చదివి దాని భావమును రాజుకు తెలియ
జెప్పెదను. । రాజా చిత్తగించుము; మహోన్నతుడగు 18
దేవుడు మహాద్దశను రాజ్యమును ప్రభావమును ఘన
తను నీ తండ్రియగు నెబుకద్నెజరుకు ఇచ్చెను. ।
దేవుడు అతనికిట్టి మహాద్దశ ఇచ్చినందున తానెవరిని 19
చంపగోరెనో వారిని చంపెను; ఎవరిని రక్షింపగోరెనో
వారిని రక్షించెను, ఎవరిని హెచ్చింపగోరెనో వారిని
హెచ్చించెను; ఎవరిని పడవేయగోరెనో వారిని పడ
వేసెను. కాబట్టి సకల రాష్ట్రములును జనులును ఆ యా
భాషలు మాటలాడువారును అతనికి భయపడుచు
అతని యెదుట వణకుచు నుండిరి. । అయితే అతడు 20
మనస్సున అతిశయించి, బలాత్కారము చేయుటకు
అతని హృదయమును కఠినము చేసికొనగా దేవుడు
అతని ప్రభుత్వము నతనియొద్దనుండి తీసివేసి అతని
ఘనతను పోగొట్టెను. । అప్పుడతడు మానవులయొద్ద 21
నుండి తరమబడి పశువులవంటి మనస్సుగలవాడాయెను.
మహోన్నతుడగు దేవుడు మానవుల రాజ్యములలో
ఏలుచు, ఎవరిని స్థాపింపగోరునో వారిని స్థాపించునని
అతడు తెలిసికొనువరకు అతడు అడవి గాడిదెలమధ్య
నివసించుచు పశువులవలె గడ్డి మేయుచు ఆకాశపు
మంచుచేత తడిసిన శరీరము గలవాడాయెను. । బెల్షా 22
సరు అను అతని కుమారుడవగు నీవు ఈ సంగతి 23
యంతయు ఎరిగియుండియు, నీ మనస్సును అణచు
కొనక, పరలోకమందున్న ప్రభువుమీద నిన్ను నీవే
హెచ్చించుకొంటివి. ఎట్లనగా నీవును నీ యధిపతు
లును నీ రాణులును నీ ఉపపత్నులును దేవుని ఆలయ
సంబంధమగు ఉపకరణములలో ద్రాక్షారసము పోసి
త్రాగవలెనని వాటిని తెచ్చియుంచుకొని వాటితో
త్రాగుచు, చూడనైనను విననైనను గ్రహింపనైనను
చేతకాని వెండి బంగారు ఇత్తడి ఇనుము కర్ర రాయి
అను వాటితో చేయబడిన దేవతలను స్తుతించితిరి గాని,
నీ ప్రాణమును నీ సకల మార్గములును ఏ దేవుని వశ

ఉన్నవో ఆయనను నీవు ఘనపరచలేదు. । కావున
న యెదుటనుండి ఈ యరచేయి వచ్చి ఈ వ్రాతను
సెను; వ్రాసిన శాసనమేదనగా, మెనే మెనే
ల్ ఉఫార్సీన్. । ఈ వాక్యభావమేమనగా,
అనగా దేవుడు నీ ప్రభుత్వవిషయములో లెక్క
చి దాని ముగించెను. । టెకేల్ అనగా ఆయన
త్రాసులో తూనగా నీవు తక్కువగా కనబడి
। ఫెరేస్ అనగా నీ రాజ్యము నీయొద్దనుండి తీయ
మాదీయులకును పారసీకులకును ఇయ్యబడును. ।
సరు ఆజ్ఞ ఇయ్యగా వారు దానియేలుకు ధూమ్ర
ు తొడిగించి యతని మెడను బంగారపు హారము
ప్రభుత్వము చేయుటలో నతడు మూడవ యధి
యని చాటించిరి. । ఆ రాత్రియందే కల్దీయుల
గు బెల్షాసరు హతుడాయెను. । మాదీయుడగు
్యావేషు అరువది రెండు సంవత్సరములవాడై సింహా
ు నెక్కెను.
తన రాజ్యమంతటిపైన అధిపతులుగా ఉండు
నూట ఇరువదిమంది యధిపతులను నియమించు
దర్యావేషుకు ఇష్టమాయెను. । వారిపైన ముగ్గు
ప్రధానులగా నియమించెను; ఆ ముగ్గురిలో దాని
ు ముఖ్యుడు. రాజుకు నష్టము కలుగకుండునట్లు
యధిపతులు తప్పకుండ వీరికి లెక్కలు ఒప్పజెప్ప
ని ఆజ్ఞ ఇచ్చెను. । ఈ దానియేలు అతిశ్రేష్ఠ
బుద్ధిగలవాడై ప్రధానులలోను అధిపతులలోను
ఖ్యాతినొంది యుండెను గనుక రాజ్యమంతటి
ద అతని నియమింపవలెనని రాజుద్దేశించెను. ।
నుకా ప్రధానులును అధిపతులును రాజ్యపాలన
యములో దానియేలుమీద ఏదైన ఒక నింద మోప
వని యుండి, తగిన హేతువు కనిపెట్టుచుండిరి
। దానియేలు నమ్మకస్థుడై యే నేరమైనను ఏ తప్ప
నను చేయువాడు కాడు గనుక దానియేలులో
ుయినను లోపమైనను కనుగొనలేకపోయిరి. ।
నుకా మనుష్యులు — అతని దేవుని పద్ధతి విషయ
మేగాని మరి ఏ విషయమందును అతనిలో లోపము
గొనలేమనుకొనిరి. । కాబట్టి ఆ ప్రధానులును అధి
ులును రాజునొద్దకు సందడిగా కూడి వచ్చి ఇట్లని
—రాజగు దర్యావేషూ, చిరంజీవివై యుందువు
క. । రాజ్యపుప్రధానులు సేనాధిపతులు అధిపతులు
ుత్రులు సంస్థానాధిపతులు అందరును కూడి
జొక ఖండితమైన చట్టము స్థిరపరచి దానిని
సనముగా చాటింపజేయునట్లు యోచనచేసిరి. ఎట్లన
గా ముప్పది దినములపర్యంతము నీయొద్ద తప్ప మరి
దేవునియొద్దనైనను మానవునియొద్దనైనను ఎవడును
మనవియు చేయకూడదు; ఎవడైనను చేసినయెడల
డు సింహముల గుహలో; పడద్రోయబడును.
జా, యీ ప్రకారముగా రాజు శాసనము ఒకటి
పుట్టించి । మాదీయులయొక్కయు పారసీకులయొక్క 8
యు పద్ధతి ననుసరించి స్థిరమగు శాసనముగా ఉండు
నట్లు దానిమీద సంతకము చేయుమని మనవిచేసిరి. ।
కాగా రాజగు దర్యావేషు శాసనము వ్రాయించి 9
సంతకము చేసెను. । ఇట్టి శాసనము సంతకము చేయ 10
బడెనని దానియేలు తెలిసికొనినను అతడు తన
యింటికి వెళ్లి, యథాప్రకారముగా అనుదినము
ముమ్మారు మోకాళ్లూని, తన యింటి పైగది కిటికీలు
యెరూషలేముతట్టుకు తెరువబడియుండగా తన దేవు
నికి ప్రార్థనచేయుచు ఆయనను స్తుతించుచునుండెను. ।
ఆ మనుష్యులు గుంపుకూడి వచ్చి దానియేలు తన 11
దేవునికి ప్రార్థన చేయుటయు ఆయనను బతిమాలు
కొనుటయు చూచి । రాజు సముఖమునకు వచ్చి 12
శాసనవిషయమునుబట్టి — రాజా, ముప్పది దినముల
వరకు నీకు తప్ప మరి ఏ దేవునికైనను మానవునికైనను
ఎవడును ప్రార్థన చేయకూడదు; ఎవడైన చేసిన
యెడల వాడు సింహముల గుహలో పడద్రోయబడు
నని నీవు ఆజ్ఞ ఇయ్యలేదా అని మనవిచేయగా
రాజు—మాదీయులయొక్కయు పారసీకులయొక్కయు
పద్ధతిప్రకారము ఆ సంగతి స్థిరము; ఎవడును దాని
రద్దుపరచజాలడనెను. । అందుకు వారు — చెరపట్ట 13
బడిన యూదులలోనున్న ఆ దానియేలు, నిన్నేగాని
నీవు పుట్టించిన శాసనమునేగాని లక్ష్యపెట్టక, అను
దినము ముమ్మారు ప్రార్థనచేయుచు వచ్చుచున్నా
డనిరి. । రాజు ఈ మాట విని బహుగా వ్యాకులపడి, 14
దానియేలును రక్షింపవలెనని తన మనస్సు దృఢము
చేసికొని, సూర్యాస్తమించువరకు అతని విడిపించు
టకు ప్రయత్నముచేసెను. । ఆ మనుష్యులు దీని 15
చూచి రాజసన్నిధికి సందడిగా కూడి వచ్చి—రాజా,
రాజు స్థిరపరచిన యే శాసనము గాని తీర్మానము
గాని యెవడును రద్దుపరచజాలడు; ఇది మాదీయుల
కును పారసీకులకును విధియని తమరు తెలిసికొనవలె
ననిరి. । అంతట రాజు ఆజ్ఞ ఇయ్యగా బంట్రౌతులు 16
దానియేలును పట్టుకొనిపోయి సింహముల గుహలో
పడద్రోసిరి; పడద్రోయగా రాజు—నీవు అనుదినము
తప్పక సేవించుచున్న నీ దేవుడే నిన్ను రక్షించునని
దానియేలుతో చెప్పెను. । వారు ఒక రాయి తీసి 17
కొని వచ్చి ఆ గుహద్వారమున వేసి దాని మూసిరి;
మరియు దానియేలునుగూర్చి రాజుయొక్క తీర్మానము
మారునేమో యని, రాజు ముద్రను అతని యధి
కారుల ముద్రను వేసి దాని ముద్రించిరి. । అంతట 18
రాజు తన నగరునకు వెళ్లి ఆ రాత్రి అంత ఉప
వాసముండి నాట్యవాయిద్యములను జరుగనియ్య
లేదు; అతనికి నిద్రపట్టకపోయెను. । తెల్లవారి 19
జామున రాజు వేగిరమే లేచి సింహముల గుహదగ్గరకు
త్వరపడిపోయెను. । అతడు గుహదగ్గరకు రాగానే, 20

దుఃఖస్వరముతో దానియేలును పిలిచి — జీవముగల
దేవుని సేవకుడవైన దానియేలూ, నిత్యము నీవు
సేవించుచున్న నీ దేవుడు నిన్ను రక్షింపగలిగెనా అని
21 యతనిని అడిగెను. । అందుకు దానియేలు — రాజు
22 చిరకాలము జీవించు గాక. । నేను నా దేవుని దృష్టికి
నిర్దోషినిగా కనబడితిని గనుక ఆయన తన దూత
నంపించి, సింహములు నాకు ఏహానియు చేయకుండ
వాటి నోళ్లు మూయించెను. రాజా, నీ దృష్టికి నేను
23 నేరము చేసినవాడను కాను గదా అనెను. । రాజు
ఇందునుగూర్చి యతి సంతోషభరితుడై దానియేలును
గుహలోనుండి పైకి తీయుడని ఆజ్ఞ ఇయ్యగా బంట్రౌ
తులు దానియేలును బయటికి తీసిరి. అతడు తన
దేవునియందు భక్తిగలవాడైనందున అతనికి ఏహానియు
24 కలుగలేదు. । రాజు ఆజ్ఞ ఇయ్యగా దానియేలుమీద
నిందమోపిన ఆ మనుష్యులను వారు తోడుకొనివచ్చి
సింహముల గుహలో పడద్రోసిరి, వారిని వారి కుమా
రులను వారి భార్యలను పడద్రోసిరి. వారా గుహ
అడుగుకు రాకమునుపే సింహముల పాలైరి, సింహ
ములు వారి యెముకలను సహితము పగులగొరికి పొడి
చేసెను.

25 అప్పుడు రాజగు దర్యావేషు లోకమంతట నివ
సించు సకలజనులకును రాష్ట్రములకును ఆ యా భాషలు
మాటలాడువారికిని ఈలాగు వ్రాయించెను — మీకు
26 క్షేమాభివృద్ధి కలుగు గాక. । నా సముఖమున నియ
మించినదేమనగా — నా రాజ్యములోని సకల ప్రభు
త్వములయందుండు నివాసులు దానియేలుయొక్క
దేవునికి భయపడుచు ఆయన సముఖమున వణకుచుండ
వలెను. ఆయనే జీవముగల దేవుడు, ఆయనే యుగ
యుగములుండువాడు, ఆయన రాజ్యము నాశనము
కానేరదు, ఆయన ఆధిపత్యము తుదమట్టుకుండును. ।
27 ఆయన విడిపించువాడును రక్షించువాడునైయుండి,
పరమందును భూమిమీదను సూచకక్రియలను ఆశ్చ
ర్యకార్యములను చేయువాడు. ఆయనే సింహముల
28 నోటనుండి ఈ దానియేలును రక్షించెను. । ఈ దాని
యేలు దర్యావేషు ప్రభుత్వకాలమందును పారసీకు
డగు కోరెషు ప్రభుత్వకాలమందును వర్ధిల్లెను.

7 బాబెలు రాజగు బెల్షాసరుయొక్క పరిపాలనలో
మొదటి సంవత్సరమున దానియేలుకు దర్శనములు
కలిగెను; అతడు తన పడకమీద పరుండి యొక కల
కని ఆ కల సంగతిని సంక్షేపముగా వివరించి
2 వ్రాసెను. । దానియేలు వివరించి చెప్పినదేమనగా —
రాత్రియందు దర్శనములు కలిగినప్పుడు నేను తేరి
చూచుచుండగా ఆకాశపు నలుదిక్కులనుండి సము
ద్రముమీద గాలి విసరుట నాకు కనబడెను. ।
3 అప్పుడు నాలుగు మిక్కిలి గొప్ప జంతువులు మహా
సముద్రములోనుండి పైకెక్కెను. ఆ జంతువులు ఒక
దానికొకటి భిన్నములై యుండెను. । మొదటిది 4
సింహమును పోలినది గాని దానికి పక్షిరాజు
రెక్కలవంటి రెక్కలుండెను. నేను చూచుచుండగా
దాని రెక్కలు తీయబడినవి గనుక మనుష్యునివలె
అది పాదములు పెట్టుకొని నేలపైన నిలువబడెను.
మరియు మానవమనస్సువంటి మనస్సు దానికియ్య
బడెను. । రెండవ జంతువు ఎలుగుబంటిని పోలినది; 5
అది యొక పార్శ్వముమీద పండుకొని తన నోట
పండ్లమధ్య మూడు ప్రక్కటెముకలను పట్టుకొని
నది. కొందరు — లెమ్ము, విస్తారముగా మాంసము
భక్షించుము అని దానితో చెప్పిరి. । అటుపిమ్మట 6
చిరతపులినిపోలిన మరియొక జంతువును చూచితిని.
దాని వీపున పక్షిరెక్కలవంటి నాలుగు రెక్కలుం
డెను; దానికి నాలుగు తలలుండెను; దానికి ఆధిపత్య
మియ్యబడెను. । పిమ్మట రాత్రియందు నాకు దర్శన 7
ములు కలిగినప్పుడు నేను చూచుచుండగా, ఘోర
మును భయంకరమునగు నాలుగవ జంతువొకటి కన
బడెను. అది తనకు ముందుగా నుండిన యితరజంతు
వులకు భిన్నమైనది; అది మహాబల మాహాత్మ్యములు
గలది; దానికి పెద్ద ఇనుపదంతములును పది కొమ్ములు
నుండెను. అది సమస్తమును భక్షించుచు తుత్తునియ
లుగా చేయుచు మిగిలినదానిని కాళ్లక్రింద అణగ
ద్రొక్కుచుండెను. । నేను ఈ కొమ్ములను కనిపెట్టగా 8
ఒక చిన్న కొమ్ము వాటి మధ్యను లేచెను; దానికి స్థల
మిచ్చుటకై ఆ కొమ్ములలో మూడు పెరికివేయబడి
నవి. ఈ కొమ్మునకు మానవుల కన్నులవంటి కన్నులును
గర్వముగా మాటలాడు నోరును ఉండెను. । ఇంక 9
సింహాసనములను వేయుట చూచితిని; మహావృద్ధు
డొకడు కూర్చుండెను. ఆయన వస్త్రము హిమమువలె
ధవళముగాను, ఆయన తలవెండ్రుకలు శుద్ధమైన
గొఱ్ఱెబొచ్చువలె తెల్లగాను ఉండెను. ఆయన సింహా
సనము అగ్నిజ్వాలలవలె మండుచుండెను; దాని
చక్రములు అగ్నివలె ఉండెను. । అగ్నివంటి ప్రవా 10
హము ఆయనయొద్దనుండి ప్రవహించుచుండెను.
వేవేలకొలది ఆయనకు పరిచారకులుండిరి; కోట్లకొలది
కొలది మనుష్యులు ఆయనయెదుట నిలిచిరి, తీర్పు
తీర్చుటకై గ్రంథములు తెరవబడెను. । అప్పుడు 11
నేను చూచుచుండగా, ఆ కొమ్ము పలుకుచున్న
మహాగర్వపుమాటల నిమిత్తము వారు ఆ జంతువును
చంపినట్టు కనబడెను; తరువాత దాని కళేబరము మండు
చున్న అగ్నిలో వేయబడెను. । మిగిలిన ఆ జంతువుల 12
ప్రభుత్వము తొలగిపోయెను; సమయము వచ్చువరకు
అవి సజీవులమధ్యను ఉండవలెనని యొక సమయము
ఒక కాలము వాటికి ఏర్పాటాయెను. । రాత్రి కలిగిన 13
దర్శనములను నేనింక చూచుచుండగా, ఆకాశమేఘా
రూఢుడై మనుష్యకుమారునిపోలిన యొకడు వచ్చి,

ఆ మహావృద్ధుడగువాని సన్నిధిని ప్రవేశించి, ఆయన
సముఖమునకు తేబడెను. సకల జనులును రాష్ట్రము
లును ఆ యా భాషలు మాటలాడువారును ఆయనను
సేవించునట్లు ప్రభుత్వమును మహిమయు ఆధిపత్య
మును ఆయన కీయబడెను. ఆయన ప్రభుత్వము శాశ్వత
మైనది అది యెన్నటికిని తొలగిపోదు; ఆయన రాజ్యము
ఎప్పటికిని లయముకాదు.

15 నాకు కలిగిన దర్శనములు నన్ను కలవరపరచు
చున్నందున దానియేలను నేను నా దేహములో మనో
16 దుఃఖముగలవాడనైతిని. నేను దగ్గర నిలిచియున్న
వారిలో ఒకనియొద్దకు పోయి—ఇందునుగూర్చిన నిజ
మంతయు నాకు చెప్పుమని అడుగగా, అతడు నాతో
మాటలాడి ఆ సంగతుల భావమును నాకు తెలియ
17 జేసెను. ఎట్లనగా ఈ మహా జంతువులు నాలుగై
యుండి లోకములో ప్రభుత్వముచేయబోవు నలుగురు
18 రాజులను సూచించుచున్నవి. అయితే మహోన్న
తుని పరిశుద్ధులే రాజ్యాధికారము నొందుదురు; వారు
యుగయుగములు యుగయుగాంతములపర్యంతము
19 రాజ్యమేలుదురు. ఇనుపదంతములును ఇత్తడిగోళ్లును
గల ఆ నాలుగవ జంతువు సంగతి ఏమైనదని నేను
తెలిసికొనగోరితిని; అది యన్నిటికి భిన్నమును మిగుల
భయంకరమునై, సమస్తమును పగులగొట్టుచు మ్రిం
గుచు మిగిలినదానిని కాళ్లక్రింద అణగద్రొక్కుచుం
20 డెను. మరియు దాని తలమీదనున్న పది కొమ్ముల సంగ
తియు, వాటి మధ్యనుండి పెరిగి మూడు కొమ్ములను
కొట్టివేసి, కన్నులును గర్వముగా మాటలాడు నోరును
గల ఆ వేరొక కొమ్ము సంగతియు, అనగా దాని కడమ
కొమ్ములకంటె బలము కలిగిన ఆ కొమ్ము సంగతియు
21 విచారించితిని. ఈ కొమ్ము పరిశుద్ధులతో యుద్ధము
22 చేయుచు వారిని గెలుచుచునుండెను. ఆ మహావృద్ధుడు
వచ్చి మహోన్నతుని పరిశుద్ధుల విషయములో తీర్పు
తీర్చువరకు ఆలాగు జరుగును గాని సమయము వచ్చి
నప్పుడు ఆ పరిశుద్ధులు రాజ్యము నేలుదురను సంగతి
23 నేను గ్రహించితిని. నేనడిగినదానికి ఆ పరిచారకుడు
ఈలాగున చెప్పెను—ఆ నాలుగవ జంతువు లోకములో
తక్కిన ఆ మూడు రాజ్యములకు భిన్నమగు నాలుగవ
రాజ్యమును సూచించుచున్నది. అది సమస్తమును
అణగద్రొక్కుచు పగులగొట్టుచు లోకమంతయు భక్షిం
24 చును. ఆ పది కొమ్ములు ఆ రాజ్యమునుండి పుట్ట
బోవు పదిమంది రాజులను సూచించుచున్నవి; కడపట
ముందుగా ఉన్న రాజులకు భిన్నమగు మరియొక రాజు
25 పుట్టి ఆ ముగ్గురు రాజులను పడద్రోయును. ఆ
రాజు మహోన్నతునికి విరోధముగా మాటలాడుచు
మహోన్నతుని భక్తులను నలుగగొట్టును; అతడు పం
డుగకాలములను న్యాయపద్ధతులను నివారణచేయ
బూనుకొనును; వారు ఒక కాలము కాలములు అర్థ
కాలము అతని వశమున నుంచబడుదురు. అతని 26
యధికారము నశింపజేయుటకును నిర్మూలముచేయుట
కును తీర్పు విధింపబడెను గనుక అది కొట్టివేయబడు
ను. ఆకాశమంతటిక్రిందనున్న రాజ్యమును అధి 27
కారమును రాజ్య మాహాత్మ్యమును మహోన్నతుని
భక్తులగు జనులకు చెందును. ఆయన రాజ్యము నిత్యము
నిలుచును, అధికారులందరును దానికి దాసులై విధే
యులగుదురు. ఇంతలో సంగతి సమాప్తమాయెను.
దానియేలను నేను విని మనస్సునందు అధికమైన కలత 28
గలవాడనైతిని; అందుచేత నా ముఖము వికారమా
యెను; అయితే ఆ సంగతి నా మనస్సులో నుంచు
కొంటిని.

రాజగు బెల్షాసరు ప్రభుత్వపు మూడవ సంవత్సర 8
మందు దానియేలను నాకు మొదట కలిగిన దర్శనము
గాక మరియొక దర్శనము కలిగెను. నేను దర్శనము 2
చూచుచుంటిని. చూచుచున్నప్పుడు నేను ఏలామను 3
ప్రదేశ సంబంధమగు షూషనను పట్టణపు నగరులో
ఉండగా దర్శనము నాకు కలిగెను. నేను ఊలయి
యను నదిప్రక్కను ఉన్నట్టు నాకు దర్శనము కలి
గెను. నేను కన్నులెత్తి చూడగా, ఒక పొట్టేలు ఆ
నదిప్రక్కను నిలిచియుండెను; దానికి రెండు కొమ్ములు,
ఆ కొమ్ములు ఎత్తయినవి గాని యొకటి రెండవదాని
కంటె ఎత్తుగా ఉండెను; ఎత్తుగలది దానికి తరువాత
మొలిచినది. ఆ పొట్టేలు కొమ్ముతో పశ్చిమముగాను 4
ఉత్తరముగాను దక్షిణముగాను పొడుచుచుండుట చూచి
తిని. ఇట్లు జరుగగా దాని ఎదిరించుటకైనను, అది
పట్టకుండ దేనిగాని తప్పించుటకైనను ఏ జంతువుకును
శక్తిలేకపోయెను; అది తనకిష్టమైనట్టుగా జరుగుచు
బలము చూపుచు వచ్చెను. నేను ఈ సంగతి ఆలో 5
చించుచుండగా ఒక మేకపోతు పడమటనుండి వచ్చి,
కాళ్లు నేల మోపకుండ భూమియందంతట పరుగు
లెత్తెను; దాని రెండు కన్నులమధ్య నొక ప్రసిద్ధమైన
కొమ్ముండెను. ఈ మేకపోతు నేను నదిప్రక్కను 6
నిలుచుట చూచిన రెండు కొమ్ములుగల పొట్టేలు సమీ
పమునకు వచ్చి, భయంకరమైన కోపముతోను బలము
తోను దానిమీదికి డీకొని వచ్చెను. నేను చూడగా 7
ఆ మేకపోతు పొట్టేలును కలిసికొని, మిక్కిలి రౌద్ర
ముగలదై దానిమీదికి వచ్చి ఆ పొట్టేలును గెలిచి
దాని రెండు కొమ్ములను పగులగొట్టెను. ఆ పొట్టేలు
దాని నెదిరింపలేకపోయినందున ఆ మేకపోతు దానిని
నేలను పడవేసి త్రొక్కుచుండెను; దాని బలమును
అణచి ఆ పొట్టేలును తప్పించుట ఎవరిచేతను కాక
పోయెను. ఆ మేకపోతు అత్యధికముగా బలము 8
చూపుచువచ్చెను; అది బహుగా పుష్టినొందగా దాని
పెద్దకొమ్ము విరిగెను; విరిగినదానికి బదులుగా నాలుగు
ప్రసిద్ధమైన కొమ్ములు ఆకాశపు నలుదిక్కులకు నాలుగు

9 పెరిగెను. । ఈ కొమ్ములలో ఒకదానిలోనుండి యొక
చిన్నకొమ్ము మొలిచెను. అది దక్షిణముగాను తూర్పు
గాను ఆనందకరమైన దిక్కుగాను అత్యధికముగా
10 బలిసెను. । ఆకాశ సైన్యమునంటునంతగా పెరిగి నక్ష
త్రములలో కొన్నిటిని పడవేసి కాళ్లక్రింద అణగ
11 త్రొక్కుచుండెను. । ఆ సైన్యముయొక్క అధిపతికి
విరోధముగా తన్ను హెచ్చించుకొని, అనుదిన బల్యర్
పణమును నివారణచేసి అతని ఆలయమును పడవేసె
12 ను. । అతిక్రమము జరిగినందున అనుదిన బలిని నివా
రణచేయుటకై యొక సేన అతనికియ్యబడెను. ఆ సేన
సత్యమును వ్యర్థపరచి ఇష్టానుసారముగా జరిగించుచు
13 అభివృద్ధి నొందెను. । అప్పుడు పరిశుద్ధులలో ఒకడు
మాటలాడగా వింటిని; అంతలో మాటలాడుచున్న
ఆ పరిశుద్ధునితో మరియొక పరిశుద్ధుడు మాటలాడు
చుండెను. ఏమనగా, అనుదిన బలినిగూర్చియు, అతి
క్రమము జరిగినందున సంభవించు నాశనమునుగూర్చి
యు కలిగిన యీ దర్శనము నెరవేరుటకు ఎన్నాళ్లు
పట్టుననియు, ఈ ఆలయస్థానమును జనసమూహమును
కాళ్లక్రింద త్రొక్కబడుట ఎన్నాళ్లు జరుగునో
14 యనియు మాటలాడుకొనిరి. । అందుకతడు—రెండు
వేల మున్నూరు దినములమట్టుకే యని నాతో చెప్పెను.
అప్పుడు ఆలయపవిత్రతనుగూర్చిన తీర్పుతీర్చబడును.
15 దానియేలను నేను ఈ దర్శనము చూచితిని; దాని
తెలిసికొనవలెనని వివేకము పొందవలెనని యుండగా,
మనుష్యుని రూపముగల యొకడు నాయెదుట నిలి
16 చెను. । అంతట ఊలయి నదీతీరముల మధ్య నిలిచి
పలుకుచున్న యొక మనుష్యుని స్వరము వింటిని; అది
—గబ్రియేలూ, యీ దర్శనభావమును ఇతనికి తెలియ
17 జేయుమని చెప్పెను. । అప్పుడతడు నేను నిలుచున్న
చోటుకు వచ్చెను; అతడు రాగానే నేను మహా భయ
మొంది సాష్టాంగపడితిని; అతడు — నరపుత్రుడా,
యీ దర్శనము అంత్యకాలమునుగూర్చినదని తెలిసి
18 కొనుమనెను. । అతడు నాతో మాటలాడుచుండగా
నేను గాఢనిద్రపట్టినవాడనై నేలను సాష్టాంగపడితిని
గనుక అతడు నన్ను పట్టుకొని లేవనెత్తి నిలువబెట్టె
19 ను. । మరియు అతడు—ఉగ్రత సమాప్తమైన కాల
మందు కలుగబోవునట్టి సంగతులు నీకు తెలియజేయు
20 చున్నాను. నిర్ణయకాలము సమాప్తమవుచున్నది. । నీవు
చూచిన రెండు కొమ్ములుగల ఆ పొట్టేలున్నదే, అది
మాదీయులయొక్కయు పారసీకులయొక్కయు రాజు
21 లను (సూచించుచున్నది.) । బొచ్చుగల ఆ మేకపోతు
గ్రేకులరాజు; దాని రెండు కన్నుల మధ్యనున్న ఆ పెద్ద
కొమ్ము వారి మొదటి రాజును (సూచించుచున్నది.) ।
ఏమనగా దానికి బదులుగా నాలుగు కొమ్ములు
నలుగురు రాజులు ఆ జనములోనుండి
గారు అతనికున్న బలముగలవారుగా
ఉండరు. । వారి ప్రభుత్వముయొక్క అంతములో 23
వారి యతిక్రమములు సంపూర్తియగుచుండగా, క్రూర
ముఖముగలవాడును యుక్తిగలవాడునై యుండి, ఉపా
యము తెలిసికొను ఒక రాజు పుట్టును. । అతడు 24
గెలుచునుగాని తన స్వబలమువలన గెలువడు; ఆశ్చర్య
ముగా శత్రువులను నాశనముచేయుటయందు అభి
వృద్ధి పొందుచు, ఇష్టమైనట్టుగా జరిగించుచు బలవం
తులను, అనగా పరిశుద్ధజనమును నశింపజేయును. ।
మరియు నతడు ఉపాయము కలిగినవాడై మోసము 25
చేసి తనకు లాభము తెచ్చుకొనును; అతడు అతిశయ
పడి తన్నుతాను హెచ్చించుకొనును; క్షేమముగా
నున్న కాలమందు అనేకులను సంహరించును; అతడు
రాజాధిరాజుతో యుద్ధముచేయును గాని కడపట
అతని బలము దైవాధీనమువలన కొట్టివేయబడును. । ఆ 26
దినములనుగూర్చిన దర్శనమును వివరించియున్నాను.
అది వాస్తవము, అది యనేకదినములు జరిగిన పిమ్మట
నెరవేరును; నీవైతే ఈ దర్శనము వెల్లడిచేయక
మనెను. । ఈ దర్శనము కలుగగా దానియేలను నేను 27
మూర్ఛిల్లి కొన్నాళ్లు వ్యాధిగ్రస్తుడనైయుంటిని; పిమ్మట
నేను కుదురై రాజుకొరకు చేయవలసిన పని చేయుచు
వచ్చితిని. ఈ దర్శనమునుగూర్చి విస్మయముగలవాడ
నైతిని గాని దాని సంగతి తెలుపగలవాడెవడును లేక
పోయెను.

మాదీయుడగు అహష్వేరోషుయొక్క కుమారు 9
డైన దర్యావేషు కల్దీయులమీద రాజాయెను. । అతని 2
ఏలుబడిలో మొదటి సంవత్సరమందు దానియేలను
నేను యెహోవా తన ప్రవక్తయగు యిర్మీయాకు సెల
విచ్చి తెలియజేసినట్టు, యెరూషలేము పాడుగా ఉండ
వలసిన డెబ్బది సంవత్సరములు సంపూర్తియాగుచున్న
వని (ఆ ప్రవక్త గ్రంథమును చదివి) గ్రహించితిని. ।
అంతట నేను గోనెపట్ట కట్టుకొని, ధూళి తలపైన వేసి 3
కొని, ఉపవాసముండి, ప్రార్థన విజ్ఞాపనలు చేయు
టకై ప్రభువగు దేవునియెదుట నా మనస్సును నిబ్బ
రము చేసికొంటిని. । నేను నా దేవుడైన యెహోవా 4
యెదుట ప్రార్థనచేసి యొప్పుకొన్నదేమనగా —
ప్రభువా, మాహాత్మ్యము గలిగిన భీకరుడవగు దేవా,
నీ ఆజ్ఞలను అనుసరించి నడుచువారియెడల నీ నిబంధ
నను నీ కృపను జ్ఞాపకముచేయువాడా, । మేమైతే నీ 5
దాసులగు ప్రవక్తలు నీ నామమునుబట్టి మా రాజుల
కును మా యధిపతులకును మా పితరులకును యూదైయ
దేశజనులకందరికిని చెప్పిన మాటలను ఆలకింపక । నీ 6
ఆజ్ఞలను నీ విధులను అనుసరించుట మాని, పాపుల
మును దుష్టులమునై చెడుతనమందు ప్రవర్తించుచు
తిరుగబాటు చేసినవారము. । ప్రభువా, నీవే నీతి 7
మంతుడవు; మేమైతే సిగ్గుచేత ముఖవికారమొందిన
వారము; మేము నీమీద తిరుగబాటు చేసితిమి; దానిని

బట్టి నీవు సకలదేశములకు మమ్మును తరిమితివి; యెరూష
లేములోను యూదాదేశములోను నివసించుచు
స్వదేశవాసులుగా ఉన్నట్టియు, పరదేశవాసులుగా
ఉన్నట్టియు ఇశ్రాయేలీయులందరికిని మాకును ఈ
8 దినమున సిగ్గే తగియున్నది. । ప్రభువా, నీకు విరోధ
ముగా పాపము చేసినందున మాకును మా రాజులకును
మా యధిపతులకును మా పితరులకును ముఖము చిన్న
9 బోవునట్లుగా సిగ్గే తగియున్నది. । మేము మా దేవు
డైన యెహోవాకు విరోధముగా తిరుగబాటు చేసి
తిమి; అయితే ఆయన కృపాక్షమాపణలుగల దేవుడై
10 యున్నాడు. । ఆయన తన దాసులగు ప్రవక్తలద్వారా
మాకు ఆజ్ఞలు ఇచ్చి, వాటిని అనుసరించి నడుచుకొన
వలెనని సెలవిచ్చెను గాని, మేము మా దేవుడైన
11 యెహోవా మాట వినకపోతిమి. । ఇశ్రాయేలీయు
లందరు నీ ధర్మశాస్త్రము నతిక్రమించి నీ మాట వినక
తిరుగబాటుచేసిరి. మేము పాపముచేసితిమి గనుక—
నేను శపించెదనని నీవు నీ దాసుడగు మోషే ధర్మ
శాస్త్రమందు ప్రమాణము చేసియున్నట్లు ఆ శాపమును
12 మామీద కుమ్మరించితివి. । యెరూషలేములో జరిగిన
కీడు మరి ఏ దేశములోను జరుగలేదు; ఆయన మా
మీదికిని, మాకు ఏలికలుగా ఉండు మా న్యాయాధి
పతులమీదికిని ఇంత గొప్ప కీడు రప్పించి, తాను
13 చెప్పిన మాటలు నెరవేర్చెను. । మోషే ధర్మశాస్త్రమందు
వ్రాసిన కీడంతయు మాకు సంభవించినను మేము మా
చెడుతనములను మానకపోతిమి; నీ సత్యమును అనుసరించి
బుద్ధి తెచ్చుకొనునట్లు మా దేవుడైన యెహోవాను
14 సమాధానపరచుకొనకపోతిమి. । మేము మా దేవుడైన
యెహోవా మాట వినలేదు గనుక ఆయన తన సమస్త
కార్యములవిషయమై న్యాయస్థుడైయుండి, సమ
యము కనిపెట్టి, ఈ కీడు మామీదికి రాజేసెను. ।
15 ప్రభువా మా దేవా, నీవు నీ బాహుబలమువలన నీ
జనమును ఐగుప్తులోనుండి రప్పించుటవలన ఇప్పటి
వరకు నీ నామమునకు ఘనత తెచ్చుకొంటివి. మేమైతే
16 పాపముచేసి చెడునడతలు నడిచినవారము. । ప్రభువా,
మా పాపములనుబట్టియు మా పితరుల దోషమును
బట్టియు, యెరూషలేము నీ జనులచుట్టునున్న సకల
ప్రజలయెదుట నిందాస్పదమైనది. యెరూషలేము నీకు
ప్రతిష్ఠితమైన పర్వతము; ఆ పట్టణముమీదికి వచ్చిన
నీ కోపమును నీ రౌద్రమును తొలగనిమ్మని నీ నీతి
కార్యములన్నిటినిబట్టి విజ్ఞాపనము చేసికొనుచున్నా
17 ను. । ఇప్పుడైతే, మా దేవా, దీనినిబట్టి నీ దాసుడు
చేయు ప్రార్థనలను విజ్ఞాపనలను ఆలకించి, ప్రభువు
చిత్తానుసారముగా శిథిలమైపోయిన నీ పరిశుద్ధస్థలము
18 మీదికి నీ ముఖప్రకాశము రానిమ్ము. । నీ గొప్ప
కనికరములనుబట్టియే మేము నిన్ను ప్రార్థించుచు
న్నాము గాని మా స్వనీతికార్యములనుబట్టి నీ సన్ని
ధిని నిలువబడి ప్రార్థించుటలేదు. మా దేవా, చెవి
యొగ్గి ఆలకింపుము; నీ కన్నులు తెరచి, నీ నామము
వహించిన యీ పట్టణముమీదికి వచ్చిన నాశనమును,
నీ నామము వహించిన యీ పట్టణమును దృష్టించి
చూడుము. । ప్రభువా ఆలకింపుము, ప్రభువా క్షమిం 19
పుము; ప్రభువా ఆలస్యముచేయక చెవియొగ్గి నా
మనవి చిత్తగించుము. నా దేవా, యీ పట్టణమును ఈ
జనమును నీ నామము వహించినవే; నీ ఘనతనుబట్టియే
నా ప్రార్థన వినుమని వేడుకొంటిని.

నేను ఇంక పలుకుచు ప్రార్థనచేయుచు, నా 20
దేవుని పవిత్రపర్వతపుదిక్కు చూచి నా దేవుడైన
యెహోవా యెదుట నా పాపమును నా జనము
యొక్క పాపమును ఒప్పుకొనుచు విజ్ఞాపనచేయుచు
నుంటిని. । నేను ఈలాగున మాటలాడుచు ప్రార్థన 21
చేయుచునుండగా, మునుపు నేను దర్శనమందు చూచిన
అతి ప్రకాశమానుడైన గబ్రియేలను ఆ మనుష్యుడు
సాయంత్రపు బలి అర్పించుసమయమున నాకు కనబడి
నన్ను ముట్టెను. । అతడు నాతో మాటలాడి ఆ 22
సంగతి నాకు తెలియజేసి ఇట్లనెను — దానియేలూ,
నీకు గ్రహింపశక్తి ఇచ్చుటకు నేను వచ్చితిని. । నీవు 23
బహు ప్రియుడవు గనుక నీవు విజ్ఞాపనముచేయ నారం
భించినప్పుడు, ఈ సంగతిని నీకు చెప్పుటకై నేను వెళ్ల
వలెనని ఆజ్ఞ బయలుదేరెను; కావున ఈ సంగతిని
తెలిసికొని నీకు కలిగిన దర్శనభావమును గ్రహిం
చుము. । తిరుగబాటును మాన్పుటకును, పాపమును 24
నివారణ చేయుటకును, దోషనిమిత్తము ప్రాయ
శ్చిత్తము చేయుటకును, యుగాంతపర్యంతముండునట్టి
నీతిని బయలుపరచుటకును, దర్శనమును ప్రవచన
మును ముద్రించుటకును, అతిపరిశుద్ధ స్థలమును అభి
షేకించుటకును, నీ జనమునకును పరిశుద్ధపట్టణమున
కును డెబ్బదివారములు విధింపబడెను. । యెరూషలే 25
మును మరల కట్టించవచ్చునని ఆజ్ఞ బయలుదేరిన సమ
యము మొదలుకొని అభిషిక్తుడగు అధిపతి వచ్చు
వరకు ఏడు వారములు పట్టునని స్పష్టముగా గ్రహిం
చుము. అరువదిరెండు వారములు జరుగగా తొందర
గల సమయములందు పట్టణపు రాచవీధులను కందకము
లను మరల కట్టుదురు. । ఈ అరువదిరెండు వార 26
ములు జరిగినపిమ్మట ఏమియు లేకుండ అభిషిక్తుడు
నిర్మూలము చేయబడును. వచ్చునట్టి రాజుయొక్క
ప్రజలు పవిత్రపట్టణమును పరిశుద్ధపట్టణమును నశింప
జేయుదురు, దాని అంతము హఠాత్తుగా వచ్చును.
మరియు యుద్ధకాలాంతమువరకు నాశనము జరుగు
నని నిర్ణయింపబడెను. । అతడు ఒక వారమువరకు 27
అనేకులకు నిబంధనను స్థిరపరచును; అర్ధవారమునకు
బలియు నైవేద్యమును నివారణచేయును. హేయ
మైనది నిలుచుఘరకు పాడుచేయువాడు వచ్చును

పాడైనదానికి రావలెనని నిర్ణయించిన నాశనము
ముగించువరకు ఈలాగున జరుగును.

10 పారసీకరాజగు కోరెషు పరిపాలనకాలములో
మూడవ సంవత్సరమున బెల్తెషాజరు అను దానియేలుకు
ఒక సంగతి బయలుపరచబడెను; గొప్ప యుద్ధము
జరుగునన్న ఆ సంగతి నిజమే; దానియేలు దాని
గ్రహించెను; అది దర్శనమువలన అతనికి తెలిసిన
2 దాయెను. । ఆ దినములయందు దానియేలను నేను
3 మూడు వారములు దుఃఖప్రాప్తుడనైతిని. । మూడు
వారములు గడచువరకు నేను సంతోషముగా భోజ
నము చేయలేకయుంటిని; మాంసము గాని ద్రాక్షా
రసము గాని నా నోటిలోనికి రాలేదు, స్నానాభి
4 షేకములను చేసికొనలేదు. । మొదటి నెల యిరువది
నాలుగవ తేది నేను హిద్దెకెలను గొప్ప నదితీరమున
5 ఉంటిని. । నేను కన్నులెత్తి చూడగా, నారబట్టలు
ధరించుకొన్న యొకడు కనబడెను, అతడు నడుమున
6 మేలిమిబంగారు నడికట్టు కట్టుకొనియుండెను । అతని
శరీరము రక్తవర్ణపు రాతివంటిది, అతని ముఖము
మెరుపువలె ఉండెను, అతని కన్నులు జ్వాలామయ
మైన దీపములను, అతని భుజములును పాదములును
తళతళలాడు ఇత్తడిని పోలియుండెను. అతని మాటల
7 ధ్వని నరసమూహపు కంఠధ్వనివలె ఉండెను. । దాని
యేలను నాకు ఈ దర్శనము కలుగగా నాతోకూడ
నున్న మనుష్యులు దాని చూడలేదు గాని మిగుల
భయాక్రాంతులై దాగుకొనవలెనని పారిపోయిరి. ।
8 నేను ఒంటరినై యీ గొప్ప దర్శనమును చూచితిని;
చూచినందున నాలో బలమేమియు లేకపోయెను,
నా సొగసు వికారమాయెను, బలము నాయందు నిలువ
9 లేదు. । నేను అతని మాటలు వింటిని; అతని మాటలు
విని నేను నేలను సాష్టాంగపడి గాఢనిద్రపొందిన
10 వాడనైతిని. । అప్పుడొకడు చేతితో నన్ను ముట్టి
నా మోకాళ్లను అరిచేతులను నేలను మోపి నన్ను
11 నిలువబెట్టి ।—దానియేలూ, నీవు బహు ప్రియుడవు
గనుక నేను నీయొద్దకు పంపబడితిని; నీవు లేచి నిలువ
బడి నేను నీతో చెప్పుమాటలు తెలిసికొనుమనెను.
అతడీమాటలు నాతో చెప్పగా నేను వణకుచు నిలువ
12 బడితిని. । అప్పుడతడు—దానియేలూ, భయపడకుము,
నీవు తెలిసికొనవలెనని నీ మనస్సును అప్పగించి, దేవుని
యెదుట నిన్ను తగ్గించుకొనిన ఆ మొదటి దినము
మొదలుకొని నీవు చెప్పిన మాటలు వినబడినవి గనుక
13 నీ మాటలనుబట్టి నేను వచ్చితిని. । పారసీకుల రాజ్యాధి
పతి ఇరువది యొక్క దినములు నన్ను ఎదిరించెను.
ఇంక పారసీకుల రాజుల సముఖమున నేను నిలుచు
చుండగా ప్రధానాధిపతులలో మిఖాయేలను ఒకడు
సహాయము చేయవచ్చెను. । ఈ దర్శనపు సంగతి
అనేక దినముల పర్యంతము జరుగదు; అయితే
దినముల అంతమందు నీ జనమునకు సంభవింపబోవు
ఈ సంగతిని నీకు తెలియజేయవచ్చితినని అతడు నాతో
చెప్పెను. । అతడీమాటలు నాతో చెప్పగా నేను నా 15
ముఖము నేలకు వంచుకొని మౌనినైతిని. । అప్పుడు 16
నరస్వరూపియగు ఒకడు నా పెదవులను ముట్టగా
నేను నోరు తెరచి నాయెదుట నిలిచియున్నవానితో
ఇట్లంటిని — నా యేలినవాడా, యీ దర్శనమువలన
నాకు వేదన కలిగినందున నా బలము తొలగిపోయెను. ।
నా యేలినవాని దాసుడనైన నేను నా యేలినవాని 17
యెదుట ఏలాగున మాటలాడుదును? నా బలము
తొలగిపోయెను, ఊపిరి విడువలేకయున్నానని
చెప్పగా । అతడు మరల నన్ను ముట్టి నన్ను బలపరచి 18
—నీవు బహు ప్రియుడవు, భయపడకుము, నీకు శుభ 19
మవుగాక, ధైర్యము తెచ్చుకొమ్ము, ధైర్యము తెచ్చు
కొమ్మని నాతో చెప్పెను. అతడు నాతో ఇట్లనగా
నేను ధైర్యము తెచ్చుకొని—నీవు నన్ను ధైర్యపరచితివి
గనుక నా యేలినవాడవైన నీవు ఆజ్ఞ ఇమ్మని చెప్పి
తిని. । అతడు — నేనెందుకు నీయొద్దకు వచ్చితినో 20
అది నీకు తెలిసినది గదా; నేను పారసీకుడగు అధి
పతితో యుద్ధము చేయుటకు మరల పోయెదను.
నేను బయలుదేరుచుండగానే గ్రేకులదేశముయొక్క
అధిపతి వచ్చును. । అయితే సత్యగ్రంథమందు వ్రాసి 21
నది నీతో చెప్పెదను, మీ యధిపతియగు మిఖాయేలు
గాక యీ సంగతులనుగూర్చి నా పక్షముగా నిలువ
తెగించినవాడొకడును లేడని చెప్పెను.

మాదీయుడగు దర్యావేషు మొదటి సంవత్సర 11
మందు (మిఖాయేలును) స్థిరపరచుటకును బలపరచుట
కును నేను అతనియొద్ద నిలువబడితిని.

ఇప్పుడు సత్యమును నీకు తెలియజేయుచున్నాను; 2
ఏమనగా ఇంక ముగ్గురు రాజులు పారసీకముమీద
రాజ్యముచేసినపిమ్మట అందరికంటె అధికైశ్వర్యము
కలిగిన నాలుగవరాజొకడు వచ్చును. అతడు తన
కున్న సంపత్తుచేత బలవంతుడై అందరిని గ్రేకులరాజ్య
మునకు విరోధముగా రేపును. । అంతలో శూరుడగు 3
ఒక రాజు పుట్టి మహా విశాలమైన రాజ్యము నేలి
యిష్టానుసారముగా జరిగించును. । అతడు రాజైనతరు 4
వాత అతని రాజ్యము శిథిలమై ఆకాశపు నలుదిక్కుల
విభాగింపబడును. అది అతని వంశపువారికి గాని
అతడు ప్రభుత్వము చేసినప్రకారము ప్రభుత్వము
చేయువారికి గాని విభాగింపబడదు, అతని ప్రభుత్వము
వేరుతో పెరికివేయబడును, అతని వంశపువారు దాని
పొందరు గాని అన్యులు పొందుదురు. । అయితే 5
దక్షిణదేశపు రాజును, అతని అధిపతులలో ఒకడును
బలముపొందెదరు గనుక అతడు ధైర్యము తెచ్చుకొని
శూరుడగు ఆ రాజును జయించి యేలును; అతని
ప్రభుత్వము గొప్ప ప్రభుత్వమగును. । కొన్ని సంవత్స 6

రములైన పిమ్మట వారు ఉభయులు కూడుకొనెదరు.
మరియు వారు ఉభయులు సమాధానపడవలెనని
కోరగా దక్షిణదేశపు రాజుకుమార్తె ఉత్తరదేశపు రాజు
నొద్దకు వచ్చును. అయినను ఆమె భుజబలము నిలుపు
కొననేరదు; అతడైనను అతని భుజబలమైనను నిలు
వదు; వారు ఆమెను, ఆమెను తీసికొనివచ్చినవారిని,
ఆమెను కనినవారిని, ఈ కాలమందు ఆమెను బలపరి
7 చినవారిని అప్పగించెదరు. । అతనికి బదులుగా ఆమె
వంశములో ఒకడు సేనకు అధిపతియై ఉత్తరదేశపు
రాజు కోటలో జొరబడి యిష్టానుసారముగా జరి
8 గించుచు వారిని గెలుచును. । మరియు అతడు వారి
దేవతలను సొమ్ములను విలువగల వారి వెండి బంగారు
వస్తువులను సహా చెరపట్టి ఐగుప్తుకు తీసికొనిపోవును.
అతడైతే కొన్ని సంవత్సరములు ఉత్తరదేశపురాజు
ప్రభుత్వముకంటె ఎక్కువ ప్రభుత్వము చేయును. ।
9 అతడు దక్షిణదేశపురాజు దేశములో జొరబడి మరలి
10 తన రాజ్యమునకు వచ్చును. । అతని కుమారులు
యుద్ధము చేయబూని మహా సైన్యముల సమూహమును
సమకూర్చుకొందురు. అతడు వచ్చి యేరువలె ప్రవ
హించి ఉప్పొంగును; యుద్ధము చేయబూని కోట
11 దనుక వచ్చును. । అంతలో దక్షిణదేశపురాజు అత్యా
గ్రహుడై బయలుదేరి ఉత్తరదేశపురాజుతో యుద్ధము
జరిగించును; ఉత్తరదేశపురాజు గొప్ప సైన్యమును సమ
12 కూర్చుకొనినను అది ఓడిపోవును. । ఆ గొప్ప సైన్యము
ఓడిపోయినందున దక్షిణదేశపురాజు మనస్సున అతి
శయపడును; వేలకొలది సైనికులను హతము చేసినను
13 అతనికి జయము కానేరదు. । ఏలయనగా ఉత్తర
దేశపురాజు మొదటి సైన్యముకంటె ఇంక గొప్ప
సైన్యమును సమకూర్చుకొని మరల వచ్చును. ఆ
కాలాంతమున, అనగా కొన్ని సంవత్సరములైన పిమ్మట
అతడు గొప్ప సైన్యమును విశేషమైన సామగ్రిని సమ
14 కూర్చి నిశ్చయముగా వచ్చును. । ఆ కాలములయందు
అనేకులు దక్షిణదేశపు రాజుతో యుద్ధము చేయు
టకు కూడి వచ్చెదరు. నీ జనములోని బందిపోటు
దొంగలు దర్శనమును రుజువుపరచునట్లు కూడుదురు
15 గాని నిలువలేక కూలుదురు. । అంతలో ఉత్తరదేశపు
రాజు వచ్చి వారిని ముట్టడివేయును. దక్షిణదేశపు రాజు
యొక్క బలము నిలువలేకపోయినందునను, అతడు
ఏర్పరచుకొనిన జనము దృఢశౌర్యము పొందక పోయి
నందునను అతడు ప్రాకారములుగల పట్టణమును పట్టు
16 కొనును. । వచ్చినవాని కెదురుగా ఎవరును నిలువలేక
పోయినందున తనకిష్టమువచ్చినట్టు అతడు జరిగించును
గనుక ఆనందముగల ఆ దేశములో అతడుండగా
17 అది అతని బలమువలన పాడైపోవును. । అతడు తన
రాజ్యముయొక్క సమస్త బలమును కూర్చుకొని రావలె
నని ఉద్దేశింపగా అతనితో సంధిచేయబడును; ఏమ
నగా నశింపజేయవచ్చునని యొక కుమార్తెను అతనికిచ్చె
దరు; అయితే ఆమె సమ్మతింపక అతని కలిసికొనదు. ।
అతడు ద్వీపముల జనములతట్టు తన మనస్సును త్రిప్పు 18
కొని యనేకులను పట్టుకొనును. అయితే అతనివలన కలి
గిన యవమానమును ఒక యధికారి నివారణచేయును.
మరియు ఆయన యవమానము అతనిమీదికి మరల
వచ్చునట్లు చేయును, అది అతనికి రాక తప్పదు. ।
అప్పుడతడు తన ముఖమును తన దేశములోని కోటల 19
తట్టు త్రిప్పుకొనును గాని ఆటంకపడి కూలి అగుపడక
పోవును. । అతనికి మారుగా తరుముచున్నవాడు, 20
అనగా రాజ్యమహిమను ఆణచువాడు పుట్టును;
కొన్ని దినములైన పిమ్మట అతడు నాశనమగును గాని
యీ నాశనము ఆగ్రహమువలననైనను యుద్ధమువలన
నైనను కలుగదు. । అతనికి బదులుగా నీచుడగు ఒకడు 21
వచ్చును; అతనికి రాజ్యఘనత నియ్యరుగాని నెమ్మది
కాలమందు అతడు వచ్చి యిచ్చకపు మాటలచేత
రాజ్యమును అపహరించును. । ప్రవాహమువంటి బలము 22
అతనియెదుటనుండి వారిని కొట్టుకొని పోవుటవలన
వారు నాశనమగుదురు; సంధిచేసిన అధిపతి సహా
నాశనమగును. । అతడు సంధిచేసినను మోసపుచ్చును. 23
అతడు స్వల్పజనము గలవాడైనను ఎదురాడి బలము
పొందును. । అతడు సమాధానక్షేమములు గల దేశ 24
మునకు వచ్చి, తన పితరులు గాని తన పితరుల పిత
రులు గాని చేయనిదానిని చేయును; ఏదనగా, అచ్చట
ఆస్తిని దోపుడుసొమ్మును ధనమును విభజించి తనవారికి
పంచిపెట్టును. అంతట కొంతకాలము ప్రాకారములు
తన కాధారములని తన మనస్సును వాటితట్టు త్రిప్పు
కొనును. । అతడు గొప్ప సైన్యమును సమకూర్చుకొని, 25
దక్షిణదేశపురాజుతో యుద్ధము చేయుటకు తన బల
మును సిద్ధపరచి, తన మనస్సును రేపుకొనును గనుక
దక్షిణదేశపురాజు గొప్ప సైన్యమును సమకూర్చుకొని
మహా బలముగలవాడై యుద్ధమునకు సిద్ధపడును.
అతడు దక్షిణదేశపురాజునకు విరోధమైన ఉపాయ
ములు చేయ నుద్దేశించినందున ఆ రాజు నిలువలేక
పోవును. । ఏమనగా, అతని భోజనమును భుజించు 26
వారు అతని పాడుచేసెదరు; మరియు అతని సైన్యము
ఓడిపోవును గనుక అనేకులు హతులవుదురు. । కీడు 27
చేయుటకై ఆ యిద్దరు రాజులు తమ మనస్సులు స్థిర
పరచుకొని, యేకభోజనపంక్తిలో కూర్చుండినను కపట
వాక్యములాడెదరు; నిర్ణయకాలమందు సంగతి జరు
గును గనుక వారి ఆలోచన సఫలము కానేరదు. ।
అతడు మిగుల ద్రవ్యముగలవాడై తన దేశమునకు 28
మరలును. మరియు పరిశుద్ధ నిబంధనకు విరోధియై
యిష్టానుసారముగా జరిగించి తన దేశమునకు తిరిగి
వచ్చును. । నిర్ణయకాలమందు మరలి దక్షిణదిక్కునకు 29
వచ్చును గాని మొదట నున్నట్టుగా కడపటనుండదు. ।

30 అంతట కిత్తీయుల ఓడలు అతనిమీదికి వచ్చుటవలన
అతడు ఓడిపోయి మరలి, పరిశుద్ధ నిబంధనవిషయ
ములో అత్యాగ్రహముగలవాడై, యిష్టానుసారముగా
జరిగించును. అతడు మరలి పరిశుద్ధనిబంధనను నిషే
31 ధించినవారెవరని విచారించును. । అతని పక్షమున
శూరులు లేచి, పరిశుద్ధస్థలపు కోటను అపవిత్రపరచి,
బలి నివారణచేసి, అనుదిన నాశనమును కలుగజేయు
32 హేయమైనదాని నిలువబెట్టుదురు. । అందుకతడు
ఇచ్ఛకపుమాటలు చెప్పి నిబంధన నతిక్రమించువారిని
వశపరచుకొనును; అయితే తమ దేవుని నెరుగువారు
33 బలముకలిగి గొప్ప కార్యములు చేసెదరు. । జనములో
బుద్ధిమంతులు అనేకులకు బోధించుదురు గాని వారు
బహు దినములు ఖడ్గమువలనను అగ్నిజ్వాలలను క్రుంగి
34 చెరపట్టబడి హింసింపబడి దోచబడుదురు. । వారు
క్రుంగిపోవు సమయమందు వారికి స్వల్పసహాయము
దొరుకును, అయితే అనేకులు ఇచ్ఛకపుమాటలు చెప్పి
35 వారిని హత్తుకొందురు గాని । నిర్ణయకాలము ఇంక
రాలేదు గనుక అంత్యకాలమువరకు జనులను పరిశీలిం
చుటకును పవిత్రపరచుటకును బుద్ధిమంతులలో కొం
36 దరు కూలుదురు. । ఆ రాజు ఇష్టానుసారముగా జరి
గించి తన్నుతానే హెచ్చించుకొనుచు అతిశయ
పడుచు, ప్రతి దేవతమీదను దేవాది దేవునిమీదను
గర్వముగా మాటలాడుచు ఉగ్రత సమాప్తియగువరకు
వృద్ధిపొందును; అంతట నిర్ణయించినది జరుగును. ।
37 అతడు అందరికంటె ఎక్కువగా తన్నుతాను హెచ్చిం
చుకొనును గనుక తన పితరుల దేవతలను లక్ష్యపెట్టడు;
మరియు స్త్రీలకాంక్షితాదేవిని గాని యే దేవతను గాని
38 లక్ష్యపెట్టడు. । అతడు తన పితరులెరుగని దేవతను,
అనగా ప్రాకారముల దేవతను వారి దేవతకు మారుగా
ఘనపరచును; బంగారును వెండిని విలువగల రాళ్లను
మనోహరమైన వస్తువులను అర్పించి ఆ దేవతను ఘన
39 పరుచును. । మరియు ఈ క్రొత్తదేవతను ఆధారము
చేసికొని, కోటలకు ప్రాకారములు కట్టించి, నూతన
విధముగా తనవారికి మహాఘనత కలుగజేయును; దేశ
మును క్రయమునకు విభజించి యిచ్చి అనేకులమీద
40 తనవారికి ప్రభుత్వమిచ్చును. । అంత్యకాలమందు
దక్షిణదేశపు రాజు అతనితో యుద్ధము చేయును.
మరియు ఉత్తరదేశపు రాజు రథములను గుఱ్ఱపురౌతు
లను అనేకమైన ఓడలను సమకూర్చుకొని, తుఫాను
వలె అతనిమీద పడి దేశములమీదుగా ప్రవాహము
41 వలె వెళ్లును. । అతడు ఆనంద దేశమున ప్రవేశించుట
వలన అనేకులు కూలుదురు గాని ఎదోమీయులును
మోయాబీయులును అమ్మోనీయులలో ముఖ్యులును
42 అతని చేతిలోనుండి తప్పించుకొనెదరు. । అతడు
(ఇతర) దేశములమీదికి తన సేన నంపించును; ఐగుప్తు
43 సహా తప్పించుకొననేరదు. । అతడు విలువగల సమస్త
బంగారు, వెండి వస్తువులను ఐగుప్తుయొక్క విలువగల
వస్తువులన్నిటిని వశపరచుకొని, లూబీయులను కూషీ
యులను తనకు పాదసేవకులుగా చేయును. । అంతట 44
తూర్పునుండియు ఉత్తరమునుండియు వర్తమానములు
వచ్చి యతని కలతపరచును గనుక అత్యాగ్రహము
కలిగి అనేకులను పాడుచేయుటకును నశింపజేయుట
కును అతడు బయలుదేరును. । కాబట్టి తన నగరు 45
డేరాను సముద్రములకును పరిశుద్ధానందములుగల
పర్వతమునకును మధ్య వేయును; అయితే అతనికి
నాశనము రాకుండుటకై సహాయము చేయువాడెవ
డును లేకపోవును.

ఆ కాలమందు నీ జనుల పక్షమున నిలుచునట్టి 12
మహా అధిపతియగు మిఖాయేలు వచ్చును. అప్పుడు
నీ జనులు రాజ్యముగా కూడిన కాలము మొదలుకొని
యీ కాలపర్యంతము ఎన్నటికిని కలుగనంత ఆపద
కలుగును; అయితే నీ జనులలో గ్రంథమునందు దాఖ
లైనవారెవరో వారు తప్పించుకొందురు. । మరియు 2
సమాధులలో నిద్రించు అనేకులు మేలుకొనెదరు;
కొందరు నిత్యజీవము అనుభవించుటకును, కొందరు
నిందపాలగుటకును నిత్యముగా హేయులగుటకును
మేలుకొందురు. । బుద్ధిమంతులైతే ఆకాశమండలము 3
లోని జ్యోతులను పోలినవారై ప్రకాశించెదరు. నీతి
మార్గము ననుసరించి నడుచుకొనునట్లు ఎవరు అనేకు
లను త్రిప్పుదురో వారు నక్షత్రములవలె నిరంతరమును
ప్రకాశించెదరు. । దానియేలూ, నీవు ఈ మాటలను 4
మరుగుచేసి అంత్యకాలమువరకు ఈ గ్రంథమును
ముద్రింపుము. దీని శ్రద్ధతో చదివిన అనేకులకు
తెలివి అధికమగును (అని నాతో మాటలాడు నతడు
చెప్పెను.)

దానియేలను నేను చూచుచుండగా వేరగు ఇద్దరు 5
మనుష్యులు ఏటి అవతలి యొడ్డున ఒకడును ఏటి
ఇవతలి యొడ్డున ఒకడును నిలిచిరి. । ఆ యిద్దరిలో 6
ఒకడు నారబట్టలు వేసికొన్నవాడై యేటినీళ్లపైన ఆడు
చుండువాని చూచి — ఈ యాశ్చర్యము ఎప్పుడు
సమాప్తమగునని యడుగగా । నారబట్టలు వేసికొని 7
యేటిపైన ఆడుచున్న ఆ మనుష్యుని మాటను నేను
వింటిని; ఏమనగా, అతడు తన కుడిచేతిని ఎడమ
చేతిని ఆకాశమువైపు కెత్తి నిత్యజీవియగు వాని నామ
మున ఒట్టుపెట్టుకొని, ఒక కాలము కాలములు అర్ధ
కాలము పరిశుద్ధజనముయొక్క బలమును కొట్టివేయుట
ముగింపబడగా సకల సంగతులు సమాప్తములగునని చెప్పెను. ।
నేను వింటినిగాని గ్రహింపలేకపోతిని—నా యేలిన 8
వాడా, వీటికి అంతమేమని నేనడుగగా । అతడు— 9
ఈ సంగతులు అంత్యకాలమువరకు మరుగుగా ఉండు
నట్లు ముద్రింపబడినవి గనుక, దానియేలూ, నీవు ఊర

యున్నవని చెప్పెను. । అనేకులు తమ్మును శుద్ధిపరచు
కొని తెల్లగా చేసికొని నిర్మలులగుచు అగుదురు.
దుష్టులు దుష్టకార్యములు చేయుదురు గనుక ఏ దుష్టు
డును ఈ సంగతులను గ్రహింపలేకపోవును గాని
బుద్ధిమంతులు గ్రహించెదరు. । అనుదిన బలి నివారణ
చేయబడిన కాలము మొదలుకొని నాశనము కలుగజేయు
హేయమైనదాని నిలువబెట్టు పర్యంతము వెయ్యిన్ని రెండువందల
తొంబది దినములగును. । వెయ్యిన్ని మూడువందల 12
ముప్పదియైదు దినములు తాళుకొని కని
పెట్టుకొనువాడు ధన్యుడు. । నీవు అంతమువరకు 13
నిలకడగా ఉండినయెడల విశ్రాంతినొంది కాలాంత
మందు నీ వంతులో నిలిచెదవు.

# హోషేయ

1 ఉజ్జియా యోతాము ఆహాజు హిజ్కియా అను
యూదారాజుల దినములలోను, యెహోయాషు
కుమారుడైన యరొబాము అను ఇశ్రాయేలురాజు
దినములలోను బెయేరి కుమారుడైన హోషేయకు
ప్రత్యక్షమైన యెహోవా వాక్కు.
2 మొదట యెహోవా హోషేయద్వారా ఈ
మాట సెలవిచ్చెను—జనులు యెహోవాను విసర్జించి
బహుగా వ్యభిచరించియున్నారు గనుక వ్యభిచారము
చేత పుట్టిన పిల్లలుగల వేశ్యను నీవు పెండ్లిచేసికొనుము
3 అని ఆయన నాకాజ్ఞ ఇచ్చెను. । కాబట్టి ప్రవక్త
యగు హోషేయ దిబ్లయీము కుమార్తెయైన గోమె
రును పెండ్లిచేసికొనెను. ఆమె గర్భవతియై అతని
4 కొక కుమారుని కనగా । యెహోవా అతనితో
ఈలాగు సెలవిచ్చెను— ఇతనికి యెజ్రెయేలని పేరు
పెట్టుము. యెజ్రెయేలులో యెహూ యింటివారు
కలుగజేసికొనిన ప్రాణదోషమునుబట్టి ఇక కొంత
కాలమునకు నేను వారిని శిక్షింతును, ఇశ్రాయేలు
5 వారికి రాజ్యముండకుండ తీసివేతును. । ఆ దినమున
నేను యెజ్రెయేలు లోయలో ఇశ్రాయేలువారి విల్లును
6 విరుతును. । పిమ్మట ఆమె మరల గర్భవతియై కుమా
ర్తెను కనగా యెహోవా అతనికి సెలవిచ్చినదేమన
గా—దీనికి జాలినొందనిది అని పేరు పెట్టుము; ఇక
మీదట నేను ఇశ్రాయేలువారిని క్షమించను, వారి
7 యెడల జాలిపడను. । అయితే యూదావారియెడల
జాలిపడి, విల్లు ఖడ్గము యుద్ధము గుఱ్ఱములు రౌతులు
అను వాటిచేత కాక తమ దేవుడైన యెహోవా
8 చేతనే వారిని రక్షింతును. । జాలినొందనిది పాలువిడి
చిన తరువాత తల్లి గర్భవతియై కుమారుని కనినప్పుడు ।
9 యెహోవా ప్రవక్తకు సెలవిచ్చినదేమనగా— మీరు
నా జనులు కారు, నేను మీకు దేవుడనై యుండను
గనుక నాజనముకాదని యితనికి పేరుపెట్టుము.
10 ఇశ్రాయేలీయుల జనసంఖ్య అమితమై లెక్కలేని
సముద్రపు ఇసుకంత విస్తారమగును; ఏ స్థలమందు—
మీరు నా జనులు కారన్నమాట జనులు వారితో
చెప్పిరో ఆ స్థలముననే— మీరు జీవముగల దేవుని
11 కుమారులైయున్నారని వారితో చెప్పుదురు. । యూదా
వారును ఇశ్రాయేలువారును ఏకముగా కూడుకొని,
తమపైన నొకనినే ప్రధానుని నియమించుకొని తా
మున్న దేశములోనుండి బయలుదేరుదురు; ఆ యెజ్రె
యేలు దినము మహా ప్రభావముగల దినముగానుం
డును.

మీరు నా జనులని మీ సహోదరులతోను, 2
జాలినొందినవారని మీ స్వదేశీయులతోను మీరు
చెప్పుడి. । నేను దాని బట్టలను పెరికివేసి పుట్టిన నాటి 2
వలె దానిని దిగంబరురాలినిగాచేసి, పాడుపెట్టి యెండి
పోయిన భూమివలెను ఉంచి, దప్పిచేత లయపరచ
కుండునట్లు, । మీ తల్లి పోకిరిచూపు మానకయు 3
దాని స్తనములకు పురుషులను చేర్చుకొనకయు నుండు
నట్లు మీరు ఆమెతో వాదించుడి; అది నాకు భార్య
కాదు, నేను దానికి పెనిమిటిని కాను; । దాని పిల్లలు 4
జారసంతతియై యున్నారు, వారి తల్లి వేశ్యాత్వము
చేసి యున్నది, వారిని కన్నది అవమానకరమైన వ్యాపా
రము చేయునది గనుక వారియందు నేను జాలిపడ
ను. । అది—నాకు అన్నపానములను గొఱ్ఱెబొచ్చును 5
జనుపనారయు తైలమును మద్యమును ఇచ్చిన నా
విటగాండ్లను నేను వెంటాడుదుననుకొనుచున్నది. ।
ముండ్లకంచె దాని మార్గములకు అడ్డము వేయుదును; 6
దాని మార్గములు దానికి కనబడకుండ గోడ కట్టు
దును. । అది తన విటకాండ్లను వెంటాడి వారిని ఎదు 7
ర్కొనలేకపోవును; ఎంత వెదకినను వారు దానికి
కనబడకయుందురు. అప్పుడు అది — ఇప్పటికంటె
పూర్వమే నా స్థితి బాగుగ నుండెను గనుక నేను తిరిగి
నా మొదటి పెనిమిటియొద్దకు వెళ్లుదుననుకొనెను. ।
దానికి ధాన్య ద్రాక్షారసతైలములను విస్తారమైన 8
వెండి బంగారములను ఇచ్చినవాడను నేనే యని విచా
రింపక అది వాటిని బయలుదేవతకు ఉపయోగపర
చెను. । కాబట్టి నా ధాన్యమును నా ద్రాక్షారసమును 9
వాటి వాటి కాలములలో ఇయ్యక దీనియొద్దనుండి
తీసివేసెదను. దాని మానసంరక్షణార్థమైన నా గొఱ్ఱె
బొచ్చును జనుపనారయు దానికి దొరకకుండ నేను
ఉంచుకొందును; । దాని విటకాండ్లు చూచుచుండగా 10
నేను దాని పోకిరితనమును బయలుపరతును, నా చేతి
లోనుండి దాని విడిపించువాడొకడును లేకపోవును. ।
దాని ఉత్సవకాలములను పండుగలను అమావాస్యలను 11
విశ్రాంతిదినములను నియామకకాలములను మాన్పిం
తును. । — ఇవి నా విటకాండ్లు నాకిచ్చిన జీతమని 12
అది తన ద్రాక్షచెట్లనుగూర్చియు అంజూరపుచెట్లను
గూర్చియు చెప్పినది గదా. నేను వాటిని లయపర
తును, అడవిజంతువులు వాటిని భక్షించునట్లు వాటిని
అడవివలె చేతును. । అది నన్ను మరచిపోయి నగలు 13
పెట్టుకొని శృంగారించుకొని బయలుదేవతలకు ధూప
మువేసి యుండుటను బట్టియు, దాని విటకాండ్లను

వాడియుండుటనుబట్టియు నేను దాని శిక్షింతును;
యెహోవా వాక్కు. । పిమ్మట దానిని ఆకర్షించి అర
ములోనికి కొనిపోయి అక్కడ దానితో ప్రేమగా
బలాడుదును; । అక్కడనుండి దాని తోడుకొని
దానికి ద్రాక్షచెట్లనిత్తును; శ్రమగల లోయను
ణాధారముగా చేసెదను; బాల్యమున ఐగుప్త
ములోనుండి అది వచ్చినప్పుడు నా మాట విని
। అది ఇచ్చటనుండి నా మాట వినును; నీవు—
లు అను పేరు నాకు పెట్టక — నా పురుషుడవు
పేరు పెట్టుదువు; ఇదే యెహోవా వాక్కు. ।
అది ఇకమీదట బయలుదేవతల పేళ్లను జ్ఞాపకము
తెచ్చుకొనకుండను అవి దానినోట రాకుండను
చేసెదను. । ఆ దినమున నేను నా జనులపక్ష
గా భూజంతువులతోను ఆకాశపక్షులతోను నేలను
కు జంతువులతోను నిబంధన చేయుదును. విల్లును
మును యుద్ధమును దేశములో ఉండకుండ మాన్పించి
రి నిర్భయముగా నివసింపజేయుదును. । నీవు
ము నాకుండునట్లుగా నేను నీతినిబట్టి తీర్పు
టవలనను, దయాదాక్షిణ్యములు చూపుటవల
నిన్ను ప్రధానము చేసికొందును. । నీవు యెహో
ను ఎరుగునట్లు నేను నమ్మకమునుబట్టి నిన్ను ప్రధా
ము చేసికొందును. । ఆ దినమున నేను మనవి ఆల
ను; ఆకాశపు మనవి నేను ఆలకింపగా అది
మియొక్క మనవి ఆలకించును; । భూమి ధాన్య
క్షారసతైలముల మనవి ఆలకింపగా అవి యెజ్రె
లు చేయు మనవి ఆలకించును. । నేను దానిని
మియందు నాకొరకై నాటుదును; జాలినొందని
నియందు నేను జాలిచేసికొందును; నా జనము
నివారితో — మీరే నా జనమని నేను చెప్పగా
రు — నీవే మా దేవుడవు అని యందురు; ఇదే
హోవా వాక్కు

**మ**రియు యెహోవా నాకు సెలవిచ్చినదేమన
—ఇశ్రాయేలీయులు ద్రాక్షపండ్ల అడలను కోరి
తర దేవతలను పూజించినను యెహోవా వారిని
ప్రేమించినట్లు, దాని ప్రియునికి ఇష్టురాలై వ్యభి
రిణియగు దానియొద్దకు నీవు పోయి దానిని ప్రేమిం
ము. । కాగా నేను పదునైదు తులముల వెండియు
కుము యవలును తీసికొని అట్టిదానిని పరిక్రయించి
మెతో ఇట్లంటిని । — చాల దినములు నా పక్షమున
చియుండి యే పురుషుని కూడకయు వ్యభిచారము
యకయు నీవుండవలెను; నీయెడల నేనును ఆలాగున
దును. । నిశ్చయముగా ఇశ్రాయేలీయులు చాల
ములు రాజులేకయు అధిపతిలేకయు బలినర్పింప
ము నుందురు. దేవతాస్తంభమును గాని ఏఫోదును
ని గృహదేవతలను గాని యుంచుకొనకుందురు. ।
రువాత ఇశ్రాయేలీయులు తిరిగి వచ్చి తమ దేవుడైన
యెహోవాయొద్దను తమ రాజైన దావీదునొద్దను
విచారణచేయుదురు. ఈ దినముల అంతమందు వారు
భయభక్తులు కలిగి యెహోవా అనుగ్రహము నొందు
టకై ఆయనయొద్దకు వత్తురు.

**ఇ**శ్రాయేలువారలారా, యెహోవా మాట ఆల 4
కించుడి. సత్యమును కనికరమును దేవునిగూర్చిన జ్ఞాన
మును దేశమందు లేకపోవుట చూచి యెహోవా
దేశనివాసులతో వ్యాజ్యమాడుచున్నాడు. । అబద్ధ 2
సాక్ష్యము పలుకుటయు అబద్ధమాడుటయు హత్య
చేయుటయు దొంగిలించుటయు వ్యభిచరించుటయు
వాడుకయ్యెను; జనులు కన్నము వేసెదరు, మానక
నరహత్య చేసెదరు. । కాబట్టి దేశము ప్రలాపించు 3
చున్నది, దాని పశువులును ఆకాశపక్షులును కాపు
రస్థులందరును క్షీణించుచున్నారు, సముద్ర మత్స్య
ములుకూడ గతించిపోవుచున్నవి. । ఒకడు మరియొక 4
నితో వాదించినను ప్రయోజనము లేదు; ఒకని
గద్దించినను కార్యము కాకపోవును; నీ జనులు యాజ
కునితో జగడమాడువారిని పోలియున్నారు. । కాబట్టి 5
పగలు నీవు కూలుదువు, రాత్రి నీతోకూడ ప్రవక్త
కూలును. నీ తల్లిని నేను నాశనముచేతును. । నా 6
జనులు జ్ఞానములేనివారై నశించుచున్నారు. నీవు జ్ఞాన
మును విసర్జించుచున్నావు గనుక నాకు యాజకుడవు
కాకుండ నేను నిన్ను విసర్జింతును; నీవు నీ దేవుని
ధర్మశాస్త్రము మరచితివి గనుక నేనును నీ కుమారులను
మరతును. । తమకు కలిమి కలిగినకొలది వారు నా 7
యెడల అధికపాపము చేసిరి గనుక వారి ఘనతను
నీచస్థితికి మార్చుదును. । నా జనుల పాపపరిహార బలి 8
మాంసమును (యాజకులు) తిందురు గనుక జనులు
మరి యధికముగా పాపము చేయవలెనని వారు కోరు
దురు. । కాబట్టి జనులకు ఏలాగో యాజకులకును 9
ఆలాగే సంభవించును; వారి ప్రవర్తననుబట్టి నేను
వారిని శిక్షింతును, వారి క్రియలనుబట్టి వారికి ప్రతి
కారము చేతును. । వారు యెహోవాను లక్ష్య 10
పెట్టుట మానిరి గనుక వారు భోజనము చేసినను తృప్తి
పొందక యుందురు, వ్యభిచారముచేసినను అభివృద్ధి
నొందకయుందురు. । వ్యభిచారక్రియలు చేయుట 11
చేతను ద్రాక్షారసము పానము చేయుటచేతను మద్య
పానముచేతను వారు మతిచెడిరి. । నా జనులు తాము 12
పెట్టుకొనిన కఱ్ఱయొద్ద విచారణచేయుదురు, తమ
చేతికఱ్ఱ వారికి సంగతి తెలియజేయును, వ్యభిచార
మనస్సు వారిని త్రోవ తప్పింపగా వారు తమ దేవుని
విసర్జించి వ్యభిచరింతురు. । పర్వతముల శిఖరముల 13
మీద బలులనర్పింతురు, కొండలమీద ధూపమువేయు
దురు, సిందూరవృక్షముల క్రిందను చినారువృక్షముల
క్రిందను మస్తకివృక్షముల క్రిందను నీడ మంచిదని
అచ్చటనే ధూపము వేయుదురు; అందువలననే మీ

ఇశ్రాయేలువారు అష్షూరీయులయొద్దకు పోయిరి;
ఎఫ్రాయిము కానుకలు ఇచ్చి విటకాండ్రను పిలుచు
10 కొనెను. । వారు కానుకలు ఇచ్చి అన్యజనులలో
విటకాండ్రను పిలుచుకొనినను ఇప్పుడే నేను వారిని
సమకూర్చుదును; అధిపతులుగల రాజు పెట్టు భారము
11 చేత వారు త్వరలో తగ్గిపోవుదురు. । ఎఫ్రాయిము
పాపమునకు ఆధారమగు బలిపీఠములను ఎన్నెన్నో
కట్టెను, అతడు పాపము చేయుటకు అవి ఆధారము
12 లాయెను. । నేను అతనికొరకు నా ధర్మశాస్త్రమును పరి
పూర్ణముగా వ్రాయించి నియమించినను వాటిని అతడు
13 అన్యములుగా ఎంచెను. । నా కర్పింపబడిన పశువు
లను వధించి సాధారణమైన మాంసమైనట్టుగా వాటిని
భుజించుదురు; అట్టి బలులయందు యెహోవాకు
ఇష్టములేదు, త్వరలో ఆయన వారి దోషమును జ్ఞాపక
మునకు తెచ్చుకొని వారి పాపములనుబట్టి వారిని
శిక్షించును; వారు మరల ఐగుప్తుకు వెళ్లవలసి వచ్చెను. ।
14 ఇశ్రాయేలువారు తమకే నగరులను కట్టించుకొని తమ
సృష్టికర్తను మరచియున్నారు; యూదావారు ప్రాకా
రములుగల పట్టణములను చాలా కట్టియున్నారు.
అయితే నేను వారి పట్టణములకు అగ్ని తగలబెట్టె
దను, అది వాటి నగరులను కాల్చివేయును.

9 ఇశ్రాయేలూ, అన్యజనులు సంతోషించునట్లు
నీవు సంభ్రమపడి సంతోషింపవద్దు; నీవు నీ దేవుని
విసర్జించి వ్యభిచరించితివి, నీ కళ్లములన్నిటిమీదనున్న
ధాన్యమునుబట్టి నీవు పడుపుకూలిని ఆశించితివి. ।
2 కళ్లములు గాని గానుగలు గాని వారికి ఆహారము
నియ్యవు; క్రొత్త ద్రాక్షారసము లేకపోవును. ।
3 ఎఫ్రాయిమీయులు ఐగుప్తుకు మరలుదురు, అష్షూరు
దేశములో వారు అపవిత్రమైనవాటిని తిందురు,
యెహోవా దేశములో వారు నివసింపకూడదు. ।
4 యెహోవాకు ద్రాక్షారస పానార్పణమును వా
రర్పింపకూడదు; వారర్పించు బలులయందు ఆయన
కిష్టములేదు, వారు ఆహారముగా పుచ్చుకొనునది
ప్రలాపము చేయువారి ఆహారమువలెనగును, దాని
భుజించువారందరు అపవిత్రులగుదురు; తమ ఆహా
రము తమకే సరిపడును గాని అది యెహోవా
5 మందిరములోనికి రాదగదు. । నియామక దినముల
లోను యెహోవా పండుగ దినములలోను మీరేమి
6 చేతురు? । లయము సంభవించినందున జనులు వెళ్లి
పోయి యున్నారు; ఐగుప్తుదేశము వారికి కూడు
స్థలముగా ఉండును; నోపుపట్టణమువారికి శ్మశాన
భూమిగా నుండును; వెండిమయమైన వారి ప్రియ
వస్తువులను దురదగొండ్లు ఆవరించును; ముండ్లకంప
7 వారి నివాసస్థలములలో పెరుగును. । శిక్షాదినములు
వచ్చేయున్నవి; ప్రతికారదినములు వచ్చేయున్నవి;
తాము చేసిన విస్తారమైన దోషమును తాము చూపిన
విశేషమైన పగను ఎరిగినవారై తమ ప్రవక్తలు అవి
వేకులనియు, దురాత్మ ననుసరించినవారు వెర్రివా
రనియు ఇశ్రాయేలువారు తెలిసికొందురు. । ఎఫ్రా 8
యిము నా దేవునియొద్దనుండి వచ్చు దర్శనములను
కనిపెట్టును; ప్రవక్తలు తమ చర్యయంతటిలోను వేట
కాని వలవంటివారై యున్నారు; వారు దేవుని మందిర
ములో శత్రువులుగా ఉన్నారు. । గిబియాలో చెడు 9
కార్యములు జరిగిననాడు జనులు దుర్మార్గులైనట్లు
వారు బహు దుర్మార్గులైరి; యెహోవా వారి దోష
మును జ్ఞాపకము చేసికొనుచున్నాడు, వారి పాప
ములకై ఆయన వారికి శిక్ష విధించును. । అరణ్య 10
ములో ద్రాక్షపండ్లు దొరికినట్లు ఇశ్రాయేలువారు
నాకు దొరికిరి; చిగురుపెట్టుకాలమందు అంజూరపు
చెట్టుమీద తొలి ఫలము దొరికినట్లు మీ పితరులు
నాకు దొరికిరి. అయితే వారు బయల్పెయోరు నొద్దకు
వచ్చి అవమానక్రియలు చేయుటకై తమ్మును తాము
అప్పగించుకొనిరి; తాము మోహించినదానివలెనే వారు
హేయులైరి. । ఎఫ్రాయిముయొక్క కీర్తి పక్షివలె 11
ఎగిరిపోవును; జననమైనను, గర్భముతో ఉండుట
యైనను, గర్భము ధరించుటయైనను వారికుండదు. ।
వారు తమ పిల్లలను పెంచినను వారికి ఎవరును లేకుండ 12
వారిని పుత్రహీనులుగా చేసెదను; నేను వారిని విడిచి
పెట్టగా వారికి శ్రమ కలుగును. । లోయలో స్థాపింప 13
బడిన తూరువంటి స్థానముగా నుండుటకై నేను
ఎఫ్రాయిమును ఏర్పరచుకొంటిని; అయితే నరాంత
కుల కప్పగించుటకై అది దాని పిల్లలను బయటికి
తెచ్చును. । యెహోవా, వారికి ప్రతికారము 14
చేయుము; వారికి నీవేమి ప్రతికారము చేయుదువు?
వారి స్త్రీలను గొడ్రాండ్రనుగాను ఎండురొమ్ములు గల
వారినిగాను చేయుము. । వారి చెడుతనమంతయు 15
గిల్గాలులో కనబడుచున్నది; అచ్చటనే నేను వారికి
విరోధినైతిని, వారి దుష్టక్రియలనుబట్టి వారి నికను
ప్రేమింపక నా మందిరములోనుండి వారిని వెలి
వేతును; వారి యధిపతులందరును తిరుగబాటు చేయు
వారు. । ఎఫ్రాయిము మొత్తబడెను, వారి వేరు ఎండి 16
పోయెను, వారు ఫలమియ్యరు. వారు పిల్లలు కనినను
వారి గర్భనిధిలోనుండివచ్చు సొత్తును నేను నాశనము
చేసెదను. । వారు నా దేవుని మాటల నాలకించలేదు 17
గనుక ఆయన వారిని విసర్జించెను. వారు దేశము
విడిచి అన్యజనులలో తిరుగుదురు.

ఇశ్రాయేలు విస్తారముగా వ్యాపించిన ద్రాక్ష 10
చెట్టుతో సమానము. వారు ఫలము ఫలించిరి. ఫలము
ఫలించినకొలది వారు బలిపీఠములను మరి విశేష
ముగా చేయుచువచ్చిరి; తమ భూమి ఫలవంతమైన
కొలది వారు తమ దేవతాస్తంభములను మరి విశేష
ముగా చేసిరి. । వారి మనస్సు కపటమైనది గనుక 2

వారు త్వరలోనే తమ అపరాధమునకు శిక్ష నొందు
దురు; యెహోవా వారి బలిపీఠములను తుత్తుని
యలుగా చేయును, వారు ప్రతిష్ఠించిన దేవతాస్తంభ
3 ములను పాడుచేయును. । — రాజు మనకు లేడు,
మనము యెహోవాకు భయపడము, రాజు మనకేమి
4 చేయును అని వారిప్పుడు చెప్పుదురు. । అబద్ధప్రమాణ
ములు చేయుదురు, సంధులు చేయుదురు, వట్టిమాటలు
పలుకుదురు, అందువలన భూమి చాళ్లలో విషపు
కూర పెరుగునట్లుగా దేశములో వారి పద్ధతులు
5 బయలుదేరుచున్నవి. । బేతావెనులోనున్న దూడవిష
యమై షోమ్రోను నివాసులు భయపడుదురు, దాని
ప్రభావము తమయొద్దనుండి పోయెనని వారు దాని
గూర్చి దుఃఖింతురు, దాని అర్చకులు వణకుదురు. ।
6 ఎఫ్రాయిము అవమానము నొందుటకు, ఇశ్రాయేలు
వారు తాము చేసిన ఆలోచనవలన సిగ్గు తెచ్చుకొను
టకు, అది అష్షూరు దేశములోకి కొనిపోబడి రాజైన
7 యారేబునకు కానుకగా ఇయ్యబడును. । షోమ్రోను
నాశమగును, దాని రాజు నీళ్లలో కొట్టుకొనిపోవు
8 నురుగుతో సమానుడగును. । ఇశ్రాయేలువారి పాప
స్వరూపమైన ఆవెనులోని ఉన్నతస్థలములు లయ
మగును, ముండ్లచెట్లును కంపయు వారి బలిపీఠముల
మీద పెరుగును, పర్వతములను చూచి — మమ్మును
మరుగుచేయుడనియు, కొండలను చూచి—మామీద
9 పడుడనియు వారు చెప్పుదురు. । ఇశ్రాయేలూ,
గిబియా దినములనుండి నీవు పాపముచేయుచు వచ్చి
తివి; అచ్చట దుర్మార్గులమీద జరిగిన యుద్ధములో
నీవు కలియకయున్నావు; అచ్చటి క్రియలను నీవు
10 చేయక మానవు. । నా యిష్టప్రకారము నేను వారిని
శిక్షింతును; వారు చేసిన రెండు దోషక్రియలకు నేను
వారిని బంధింపగా అన్యజనులు కూడి వారిమీదికి
11 వత్తురు. । ఎఫ్రాయిము నూర్పునందు అభ్యాసము
గలదై కంకులను త్రొక్కగోరు పెయ్యవలె ఉన్నది;
అయితే దాని నున్నని మెడకు నేను కాడి కట్టుదును,
ఎఫ్రాయిముచేత దున్నించుటకు నేనొకని నియమిం
తును, యూదా భూమిని దున్నును, యాకోబు
12 తననుతానే చదును చేసికొనును. । నీతి ఫలించునట్లు
మీరు విత్తనము వేసినయెడల ప్రేమయను కోత మీరు
కోయుదురు; యెహోవాను వెదకుటకు ఇదే సమ
యము గనుక ఆయన ప్రత్యక్షమై మీమీద నీతి
వర్షము కురిపించునట్లు ఇదివరకెన్నడును దున్నని బీడు
13 భూమి దున్నుడి. । నీ ప్రవర్తన నాధారము చేసికొని
నీ బలాఢ్యులను నమ్ముకొని నీవు చెడుతనపు పంటకై
దున్నితివి గనుక మీరు పాపమను కోతకోసి
యున్నారు. అబద్ధమునకు ఫలము పొందియున్నారు. ।
14 నీ జనులమీదికి అల్లరి వచ్చును; షల్మాను యుద్ధము
చేసి బేతర్బేలును పాడుచేసినట్లు ప్రాకారములుగల
నీ పట్టణములన్నియు పాడగును; పిల్లలమీద తల్లులు
నేలను పడవేయబడుదురు. । ఈలాగున మీరు చేసిన 15
ఘోరమైన దుష్టక్రియలనుబట్టి బేతేలు మీకు నాశన
కారణమగును; ఉదయకాలమున ఇశ్రాయేలు రాజు
కొట్టబడి నిర్మూలమగును.

ఇశ్రాయేలు బాలుడైయుండగా నేను అతని **11**
యెడల ప్రేమగలిగి నా కుమారుని ఐగుప్తుదేశములో
నుండి పిలిచితిని. । (ప్రవక్తలు) వారిని పిలిచినను 2
బయలు దేవతలకు వారు బలులనర్పించిరి, విగ్రహము
లకు ధూపము వేసిరి. । ఎఫ్రాయిమును చెయ్యిపట్టు 3
కొని వానికి నడక నేర్పినవాడను నేనే; వారిని కౌగ
లించుకొనినవాడను నేనే; నేనే వారిని స్వస్థపరచిన
వాడనైనను ఆ సంగతి వారికి మనస్సున పట్టలేదు. ।
ఒకడు మనుష్యులను తోడుకొని పోవునట్లుగా స్నేహ 4
బంధములతో నేను వారిని బంధించి ఆకర్షించితిని;
ఒకడు పశువులమీద కాడిని సరిగా కట్టునట్లు నేను
వారియెడల ప్రేమగలిగి వారికి భోజనపదార్థము
తేర్పరచితిని. । ఐగుప్తుదేశమునకు వారు మరల దిగి 5
పోరు గాని నన్ను విసర్జించినందున అష్షూరురాజు
వారిమీద ప్రభుత్వము చేయును. । వారు చేయు 6
చున్న యోచనలనుబట్టి యుద్ధము వారి పట్టణములను
ఆవరించును; అది వారి పట్టణపు గడియలు తీసి వారిని
మ్రింగివేయును. । నన్ను విసర్జించవలెనని నా జనులు 7
తీర్మానము చేసికొనియున్నారు; మహోన్నతునితట్టు
చూడవలెనని (ప్రవక్తలు) పిలిచినను చూచుటకు ఎవ
డును యత్నము చేయడు । ఎఫ్రాయిమూ, నేనెట్లు 8
నిన్ను విడిచిపెట్టుదును? ఇశ్రాయేలూ, నేను నిన్ను
విసర్జింపను; అద్మాను నేను విడిచిపెట్టినట్లు నిన్ను
విడిచిపెట్టను, సెబోయీమును చేసినట్లు నిన్ను
చెయను; నా మనస్సు మారినది, సహింపలేకుండ నా
యంతరంగము మండుచున్నది. । నా ఉగ్రతాగ్నిని 9
బట్టి నాకు కలిగిన యోచనను నేను నెరవేర్చను;
నేను మరల ఎఫ్రాయిమును లయపరచను, నేను మీ
మధ్య పరిశుద్ధదేవుడను గాని మనుష్యుడను కాను,
మిమ్మును దహించునంతగా నేను కోపింపను. । వారు 10
యెహోవా వెంబడి నడచెదరు; సింహము గర్జించు
నట్లు ఆయన ఘోషించును, ఆయన ఘోషింపగా
సముద్రపుదిక్కుననున్న జనులు వణకుదురు. । వారు 11
వణకుచు పక్షులు ఎగురునట్లుగా ఐగుప్తుదేశములో
నుండి వత్తురు; గువ్వలు ఎగురునట్లుగా అష్షూరుదేశ
ములోనుండి ఎగిరి వత్తురు; నేను వారిని తమ నివాస
ములలో కాపురముంతును; ఇదే యెహోవా
వాక్కు.

ఎఫ్రాయిమువారు అబద్ధములతో నన్ను ఆవరించి 12
యున్నారు; ఇశ్రాయేలువారు మోసక్రియలతో
నన్ను ఆవరించియున్నారు; యూదావారు నిరాటంక

ముగా దేవునిమీద తిరుగబాటు చేయుదురు, నమ్మక
మైన పరిశుద్ధ దేవునిమీదను తిరుగబడుదురు.

**12** ఎఫ్రాయిము గాలిని మేయుచున్నాడు; తూర్పు
గాలిని మేయుటకు దాని వెంటాడుచున్నాడు; మానక
దినమెల్ల అబద్ధమాడుచు, బలాత్కారము చేయు
చున్నాడు; జనులు అష్షూరీయులతో సంధిచేసెదరు,
2 ఐగుప్తునకు తైలము పంపించెదరు. । యూదావారిమీద
యెహోవాకు వ్యాజ్యము పుట్టెను; యాకోబు
సంతతివారి ప్రవర్తననుబట్టి ఆయన వారిని శిక్షించును,
వారి క్రియలనుబట్టి వారికి ప్రతికారము చేయును. ।
3 తల్లి గర్భమందు యాకోబు తన సహోదరుని మడి
మెను పట్టుకొనెను, మగసిరి కలవాడై అతడు దేవు
4 నితో పోరాడెను. । అతడు దూతతో పోరాడి జయ
మొందెను, అతడు కన్నీరు విడిచి దేవుని బతిమాలగా
బేతేలులో ఆయన అతనికి ప్రత్యక్షమాయెను, అక్కడ
5 ఆయన మనతో మాటలాడెను; । యెహోవా అని,
సైన్యములకధిపతియగు యెహోవా అని, ఆయనకు
6 జ్ఞాపకార్థకనామము. । కాబట్టి నీవు నీ దేవునితట్టు
తిరుగవలెను; కనికరమును న్యాయమును అనుసరిం
చుచు ఎడతెగక నీ దేవునియందు నమ్మికనుంచుము.
7 అయితే ఎఫ్రాయిమువారు కనానీయులవంటి
వారై అన్యాయపు త్రాసును వాడుకచేసెదరు, బాధ
8 పెట్టవలెనన్న కోరిక వారికి కలదు. । —నేను ఐశ్వర్య
సంపన్నుడనైతిని, నాకు బహు ఆస్తి దొరకెను, నా
కష్టార్జితములో దేనినిబట్టియు శిక్షకు తగిన పాపము
నాలోనున్నట్టు ఎవరును కనుపరచలేరని ఎఫ్రాయిము
9 అనుకొనుచున్నాడు. । అయితే ఐగుప్తుదేశములో
నుండి మీరు వచ్చినది మొదలుకొని యెహోవానగు
నేనే మీకు దేవుడను; నియామక దినములలో మీరు
డేరాలలో కాపురమున్నట్లు నేనికను మిమ్మును డేరా
10 లలో నివసింపజేతును. । ప్రవక్తలతో నేను మాట
లాడియున్నాను, విస్తారమైన దర్శనములను నేనిచ్చి
యున్నాను, ఉపమానరీతిగా అనేక పర్యాయములు
11 ప్రవక్తలద్వారా మాటలాడియున్నాను. । నిజముగా
గిలాదు చెడ్డది, అచ్చటివి వ్యర్థములు, గిల్గాలులో
జనులు ఎద్దులను బలులగా అర్పింతురు, వారి బలిపీఠ
ములు దున్నినచేని గనిమలమీదనున్న రాళ్లకుప్పలవలె
12 ఉన్నవి. । యాకోబు తప్పించుకొని అరాముదేశము
లోనికి పోయెను, భార్య కావలెనని ఇశ్రాయేలు
కొలువుచేసెను, భార్య కావలెనని అతడు గొఱ్ఱెలు
13 కాచెను. । ఒక ప్రవక్తద్వారా యెహోవా ఇశ్రా
యేలీయులను ఐగుప్తుదేశములోనుండి రప్పించెను,
14 ప్రవక్తద్వారా వారిని కాపాడెను. । ఎఫ్రాయిము
బహు ఘోరమైన కోపము పుట్టించెను గనుక అతనిని
ఏలినవాడు అతడు చేసిన నరహత్యకై అతనిమీద
నేరము మోపును; అతడు పరులకు అవమానము కలుగ
జేసినందుకై నేనతని నవమానపరచుదును.

ఎఫ్రాయిము మాటలాడినప్పుడు భయము కలి **13**
గెను; అతడు ఇశ్రాయేలువారిలో తన్ను గొప్ప చేసి
కొనెను; తరువాత బయలు దేవతనుబట్టి అపరాధియై
అతడు నాశనమొందెను. । ఇప్పుడు వారు పాపము 2
పెంపుచేయుదురు, తమకు తోచినట్లు వెండితో
విగ్రహములను పోతపోయుదురు, అవంతయు పని
వారు చేయుపనియే, వాటికి బలులను అర్పించువారు
—దూడలను ముద్దుపెట్టుకొనుడని చెప్పుదురు. । కాబట్టి 3
వారు ఉదయమున కనబడు మేఘమువలెను పెందల
కడ గతించు ప్రాతఃకాలపు మంచువలె నుందురు;
కళ్లములోనుండి గాలి యెగరగొట్టు పొట్టువలెను,
కిటికీలోనుండి పోవు పొగవలె నుందురు. । మీరు 4
ఐగుప్తుదేశములోనుండి వచ్చినది మొదలుకొని
యెహోవానగు నేనే మీ దేవుడను; నన్ను తప్ప
నీవు ఏ దేవునిని ఎరుగవు, నేను తప్ప రక్షకుడును
లేడు. । మహా యెండకు కాలిన అరణ్యములో నిన్ను 5
స్నేహించినవాడను నేనే. । తరువాత వారికి మేత 6
దొరకగా వారు తిని తృప్తిపొందిరి; తృప్తిపొంది
గర్వించి నన్ను మరచిరి. । కాబట్టి నేను వారికి సిం 7
హమువంటివాడనైతిని; చిరుతపులి మార్గమున పొంచి
యున్నట్లు నేను వారిని పట్టుకొన పొంచియున్నాను. ।
పిల్లలు పోయిన యెలుగుబంటి యొకనిమీద పడునట్లు 8
నేను వారిమీద పడి వారి రొమ్మును చీల్చివేయుదును;
ఆడుసింహము ఒకని మ్రింగివేయునట్లు వారిని మ్రింగి
వేతును; దుష్టమృగములు వారిని చీల్చివేయును. ।
ఇశ్రాయేలూ, నీ సహాయకర్తనగు నాకు నీవు విరో 9
ధివై నిన్ను నీవే నిర్మూలము చేసికొనుచున్నావు. । నీ 10
పట్టణములలో దేనియందును నిన్ను సహాయము చేయ
కుండ నీ రాజు ఏమాయెను?—రాజును అధిపతులను
నామీద నియమించుమని నీవు మనవి చేసికొంటివి
గదా; నీ అధిపతులు ఏమైరి? । కాగా కోపము 11
తెచ్చుకొని నీకు రాజును నియమించితిని; క్రోధము
కలిగి అతని కొట్టివేయుచున్నాను. । ఎఫ్రాయిము 12
దోషము (నారొమ్ముద్ద) ఉంచబడియున్నది, అతని
పాపము భద్రము చేయబడియున్నది. । ప్రసూతి 13
వేదనలు కలిగినట్టుగా అతనికి వేదన పుట్టును, పిల్ల
పుట్టు సమయమున బయటికి రాని శిశువైనట్టుగా
అతడు బుద్ధిలేనివాడై వృద్ధికి రాడు. । అయినను 14
పాతాళ వశములోనుండి నేను వారిని విమోచింతును;
మృత్యువునుండి వారిని రక్షింతును. మృత్యువా, నీ
బాధలేమాయెను? పాతాళమా, నీ చేతినాశన మేమా
యెను? పశ్చాత్తాపము నాకు పుట్టదు. । నిజముగా 15
ఎఫ్రాయిము తన సహోదరులలో ఫలాభివృద్ధినొం
దును. అయితే తూర్పు గాలి వచ్చును, యెహోవా

పుట్టించు గాలి అరణ్యములోనుండి లేచును; అది
రాగా అతని నీటిబుగ్గలు ఎండిపోవును, అతని ఊటలు
ఇంకిపోవును, అతని ధననిధులను అతనికి ప్రియమైన
16 వస్తువులన్నిటిని శత్రువు కొల్లపెట్టును. । షోమ్రోను
తన దేవునిమీద తిరుగబాటు చేసెను గనుక అది
శిక్షనొందును, జనులు కత్తిపాలగుదురు, వారి పిల్లలు
రాళ్లకువేసి కొట్టబడుదురు, గర్భిణిస్త్రీల కడుపులు
చీల్చబడును.

14 ఇశ్రాయేలూ, నీ పాపముచేత నీవు కూలితివి
గనుక నీ దేవుడైన యెహోవాతట్టుకు తిరుగుము. ।
2 మాటలు సిద్ధపరచుకొని యెహోవాయొద్దకు తిరు
గుడి; మీరు ఆయనతో చెప్పవలసినదేమనగా—మా
పాపములన్నిటిని పరిహరింపుము; ఎడ్లకు బదులుగా
నీకు మా పెదవుల నర్పించుచున్నాము, నీవంగీకరింప
3 తగినవి (అవే మాకున్నవి.) । అష్షూరీయులచేత రక్షణ
నొందగోరము, మేమిక నీ గుఱ్ఱములను ఎక్కము—
మీరే మాకు దేవుడని మేమిక మీదట మా చేతిపనితో
చెప్పము; తండ్రిలేనివారియెడల వాత్సల్యము చూపు
4 వాడవు నీవే గదా. । వారు విశ్వాసఘాతుకులు
కాకుండ నేను వారిని గుణపరచుదును. వారిమీద
నున్న నా కోపము చల్లారెను, మనస్ఫూర్తిగా వారిని
స్నేహింతును. । చెట్టుకు మంచు ఉన్నట్లు నేనతని 5
కుందును, తామరపుష్పము పెరుగునట్లు అతడు అభి
వృద్ధి నొందును, లెబానోను (పర్వతము) దాని వేళ్లు
తన్నినట్లు వాడు తన వేళ్లు తన్నుగును. । అతని 6
కొమ్మలు విశాలముగా పెరుగును, ఒలీవచెట్టునకు కలిగి
నంత సౌందర్యము అతనికి కలుగును, లెబానోను
కున్నంత సువాసన అతనికుండును. । అతని నీడయందు 7
నివసించువారు మరల ధాన్యము పండించుకొందురు;
లెబానోను ద్రాక్షారసము ప్రసిద్ధమైనట్లు అతడు
ప్రసిద్ధినొందును. । ఎఫ్రాయిమూ — బొమ్మలతో 8
నాకిక నిమిత్తమేమి? నేనే ఆలకించుచున్నాను, నేనే
ఎఫ్రాయిమునుగూర్చి విచారణ చేయుచున్నాను,
నేను చిగురుపెట్టు సరళవృక్షమువంటివాడను, నావల
ననే నీకు ఫలము కలుగును. । జ్ఞానులు ఈ సంగతులు 9
వివేచింతురు, బుద్ధిమంతులు వాటిని గ్రహింతురు;
ఏలయనగా యెహోవా మార్గములు చక్కనివి, నీతి
మంతులు దాని ననుసరించి నడుచుకొందురు గాని
తిరుగబాటు చేయువారి దారిని అది అడ్డము కనుక
వారు తొట్రిల్లుదురు

---

# యోవేలు

1 పెతూయేలు కుమారుడైన యోవేలునకు ప్రత్యక్ష
మైన యెహోవా వాక్కు.
2 పెద్దలారా, ఆలకించుడి
దేశపు కాపురస్థులారా, మీరందరు చెవియొగ్గి
వినుడి
ఈలాటి సంగతి మీ దినములలోగాని
మీ పితరుల దినములలోగాని జరిగినదా!
3 ఈ సంగతి మీ బిడ్డలకు తెలియజేయుడి.
వారు తమ బిడ్డలకును ఆ బిడ్డలు రాబోవు తరము
వారికిని తెలియజేయుదురు.
4 గొంగళిపురుగులు విడిచినదానిని మిడతలు తినివేసి
యున్నవి
మిడతలు విడిచినదానిని పసరుపురుగులు తినివేసి
యున్నవి
పసరుపురుగులు విడిచినదానిని చీడపురుగులు తిని
వేసియున్నవి.
5 మత్తులారా, మేలుకొని కన్నీరు విడువుడి
ద్రాక్షారసపానము చేయువారలారా, రోదనము
చేయుడి.
క్రొత్త ద్రాక్షారసము మీ నోటికి రాకుండ నాశ
మాయెను,
6 లెక్కలేని బలమైన సమూహము నా దేశము
మీదికి వచ్చియున్నది
వాటి పళ్లు సింహపు కోరలవంటివి
వాటి కాటు ఆడుసింహపు కాటువంటిది.
7 అవి నా ద్రాక్షచెట్లను పాడుచేసియున్నవి
నా అంజూరపు చెట్లను తుత్తునియలుగా కొరికి
యున్నవి
బెరడు ఒలిచి వాటిని పారవేయగా చెట్లకొమ్మలు
తెలుపాయెను.
8 పెనిమిటి పోయిన యౌవనురాలు గోనెపట్ట కట్టు
కొని అంగలార్చునట్లు నీవు అంగలార్చుము.
9 నైవేద్యమును పానార్పణమును
యెహోవా మందిరములోనికి రాకుండ నిలిచి
పోయెను
యెహోవాకు పరిచర్యచేయు యాజకులు అంగ
లార్చుచున్నారు.
పొలము పాడైపోయెను
భూమి అంగలార్చుచున్నది ధాన్యము నశించెను
క్రొత్త ద్రాక్షారసము లేకపోయెను తైలవృక్ష
ములు వాడిపోయెను.

భూమిమీది పైరు చెడిపోయెను 11
గోధుమ కర్రలను యవల కర్రలను చూచి సేద్య
గాండ్లారా, సిగ్గునొందుడి.
ద్రాక్షతోట కాపరులారా, రోదనము చేయుడి.
ద్రాక్షచెట్లు చెడిపోయెను అంజూరపుచెట్లు వాడి 12
పోయెను
దానిమ్మచెట్లును ఈతచెట్లును జల్దరుచెట్లును తోట
చెట్లన్నియు వాడిపోయినవి
నరులకు సంతోషమేమియు లేకపోయెను.
యాజకులారా, గోనెపట్ట కట్టుకొని అంగ 13
లార్చుడి.
బలిపీఠమునొద్ద పరిచర్య చేయువారలారా,
రోదనము చేయుడి.
నా దేవుని పరిచారకులారా,
గోనెపట్ట వేసికొని రాత్రి అంతయు గడపుడి.
నైవేద్యమును పానార్పణమును మీ దేవుని మందిర
మునకు రాకుండ నిలిచిపోయెను.
ఉపవాసదినము ప్రతిష్ఠించుడి వ్రతదినము ఏర్పర 14
చుడి.
యెహోవాను బతిమాలుకొనుటకై
పెద్దలను దేశములోని జనులందరిని
మీ దేవుడైన యెహోవా మందిరములో సమ
కూర్చుడి.
ఆహా యెహోవా దినము వచ్చెనే 15
అది ఎంత భయంకరమైన దినము
అది ప్రళయమువలెనే సర్వశక్తునియొద్ద నుండి
వచ్చును.
మనము చూచుచుండగా మన దేవుని మందిర 16
ములో ఇక సంతోషమును ఉత్సవమును నిలిచి
పోయెను
మన ఆహారము నాశనమాయెను.
విత్తనము మంటిబెడ్డలక్రింద కుళ్లిపోవుచున్నది 17
పైరు మాడిపోయినందున ధాన్యపుకొట్లు పాడై
పాయెను
కళ్లపుకొట్లు నేలపడియున్నవి.
మేతలేక పశువులు బహుగా మూల్గుచున్నవి 18
ఎడ్లు మందలుగా కూడి ఆకలికి అల్లాడుచున్నవి
గొఱ్ఱెమందలు చెడిపోవుచున్నవి.
అగ్ని చేత మేతస్థలములు కాలిపోయినవి 19
మంట తోటచెట్లన్నిటిని అర్చివేసెను
యెహోవా, నీకే నేను మొఱ్ఱపెట్టుచున్నాను.

0 నదులు ఎండిపోవుటయు అగ్నిచేత మేతస్థలములు కాలిపోవుటయు చూచి పశువులును నీకు మొఱ్ఱపెట్టుచున్నవి.

2 సీయోను కొండమీద బాకా ఊదుడి
నా పరిశుద్ధ పర్వతముమీద యెహోవా దినము వచ్చుచున్నదనియు
అది సమీపమాయెననియు దేశనివాసులందరు వణకుదురుగాక.
2 బాకా ఊదుడి ఆ దినము అంధకారమయముగా ఉండును మహాంధకారము కమ్మును
మేఘములును గాఢాంధకారమును ఆ దినమున కమ్మును
పర్వతములమీద ఉదయకాంతి కనబడునట్లు (అవి కనబడుచున్నవి.)
అవి బలమైన యొక గొప్ప సమూహము
ఇంతకుముందు అట్టివి పుట్టలేదు
ఇకమీదట తరతరములకు అట్టివి పుట్టవు.
3 వాటిముందర అగ్ని మండుచున్నది
వాటివెనుక మంట కాల్చుచున్నది
అవి రాకముందు భూమి ఏదెనువనమువలె ఉండెను .
అవి వచ్చిపోయిన తరువాత తప్పించుకొనిన దేదియు విడువబడక భూమి యెడారివలె పాడాయెను.
4 వాటి రూపములు గుఱ్ఱముల రూపములవంటివి
రౌతులవలె అవి పరుగెత్తి వచ్చును.
5 పర్వత శిఖరములమీద రథములు ధ్వని చేయునట్లు
కొయ్యకాలు అగ్నిలో కాలుచు ధ్వని చేయునట్లు
యుద్ధమునకు సిద్ధమైన శూరులు ధ్వని చేయునట్లు
అవి గంతులు వేయుచున్నవి.
6 వాటిని చూచి జనములు వేదననొందును అందరి ముఖములు తెల్లబారును.
7 బలాఢ్యులు పరుగెత్తునట్లు అవి పరుగెత్తుచున్నవి
శూరులు ప్రాకారములను ఎక్కునట్లు అవి గోడలు దాటుచున్నవి
ఇటు అటు తిరుగకుండ అవన్నియు చక్కగా పోవుచున్నవి
8 ఒకదానిమీద ఒకటి త్రొక్కులాడక
అవన్నియు చక్కగా పోవుచున్నవి
ఆయుధములమీద పడినను త్రోవ విడువవు.
9 పట్టణములో నఖముఖాల పరుగెత్తుచున్నవి
గోడలమీద ఎక్కి యిండ్లలోనికి చొరబడుచున్నవి
దొంగలు వచ్చినట్లు కిటికీలలోగుండ జొరబడుచున్నవి.

వాటి భయముచేత భూమి కంపించుచున్నది 10
ఆకాశము తత్తరించుచున్నది సూర్యచంద్రులకు తేజోహీనత కలుగుచున్నది
నక్షత్రములకు కాంతి తప్పుచున్నది.
యెహోవా తన సైన్యమును నడిపించుచు 11
ఉరుమువలె గర్జించుచున్నాడు
ఆయన దండు బహు గొప్పదైయున్నది
ఆయన ఆజ్ఞను నెరవేర్చునది బలముగలది
యెహోవా దినము బహు భయంకరము, దానికి తాళగలవాడెవడు?
ఇప్పుడైనను మీరు ఉపవాసముండి 12
కన్నీరు విడుచుచు దుఃఖించుచు మనఃపూర్వకముగా తిరిగి నాయొద్దకు రండి
ఇదే యెహోవా వాక్కు.
మీ దేవుడైన యెహోవా కరుణావాత్సల్యములు 13
గలవాడును, శాంతమూర్తియు, అత్యంతకృపగలవా
డునై యుండి, తాను చేయనుద్దేశించిన కీడును చేయక
పశ్చాత్తాపపడును గనుక మీ వస్త్రములను కాక మీ
హృదయములను చింపుకొని ఆయనతట్టు తిరుగుడి. ।
ఒకవేళ ఆయన మనస్సు త్రిప్పుకొని పశ్చాత్తాపపడి 14
మీ దేవుడైన యెహోవాకు తగిన నైవేద్యమును
పానార్పణమును మీకు దీవెనగా అనుగ్రహించును;
అనుగ్రహింపడని యెవడు చెప్పగలడు?
సీయోనులో బాకా ఊదుడి, ఉపవాసదినము 15
ప్రతిష్ఠించుడి,
వ్రతదినము నియమించి ప్రకటనచేయుడి.
జనులను సమకూర్చుడి, సమాజకూటము ప్రతి 16
ష్ఠించుడి,
పెద్దలను పిలువనంపించుడి, చిన్నవారిని స్తన్యపానముచేయు బిడ్డలను తోడుకొని రండి;
పెండ్లికుమారుడు అంతఃపురములోనుండియు
పెండ్లికుమార్తె గదిలోనుండియు రావలయును.
యెహోవాకు పరిచర్యచేయు యాజకులు మంట 17
పమునకును బలిపీఠమునకును మధ్య నిలువబడి కన్నీరు
విడుచుచు—యెహోవా, నీ జనులయెడల జాలిచేసి
కొని, అన్యజనులు వారిమీద ప్రభుత్వము చేయునట్లు
వారిని అవమానమున కప్పగింపకుము; లేనియెడల
అన్యజనులు — వారి దేవుడు ఏమాయెనందురు గదా
యని వేడుకొనవలెను.
అప్పుడు యెహోవా తన దేశమునుబట్టి రోషము 18
పూని తన జనులయెడల జాలిచేసికొనెను. । మరియు 19
యెహోవా తన జనులకు ఉత్తరమిచ్చి చెప్పినదేమన
గా—ఇకను అన్యజనులలో మిమ్మును అవమానాస్పద
ముగా చేయక, మీరు తృప్తినొందునంతగా నేను
ధాన్యమును క్రొత్త ద్రాక్షారసమును తైలమును మీకు
పంపించెదను. । మరియు ఉత్తరదిక్కునుండి వచ్చువా 20

జనులకు ఆశ్రయ, [illegible], ఇశ్రాయేలీయులకు దుర్గ
17 ముగా నుండును. । అన్యులికమీదట దానిలో సంచ
రింపకుండ యెరూషలేము పరిశుద్ధపట్టణముగా ఉం
డును, మీ దేవుడనైన యెహోవాను నేనే, నాకు
ప్రతిష్ఠితమగు సీయోను పర్వతమందు నివసించుచున్నా
18 నని మీరు తెలిసికొందురు. । ఆ దినమందు పర్వత
ములలోనుండి క్రొత్త ద్రాక్షారసము పారును, కొండ
లలోనుండి పాలు ప్రవహించును, యూదా నదులన్ని
టిలో నీళ్లు పారును, నీటి ఊట యెహోవా మందిర
ములోనుండి ఉబికి పారి షిత్తీము లోయను తడు
పును. । ఐగుప్తీయులును ఎదోమీయులును యూదా 19
వారిమీద బలాత్కారముచేసి తమ తమ దేశములలో
నిర్దోషులగువారికి ప్రాణహాని కలుగజేసిరి గనుక
ఐగుప్తుదేశము పాడగును, ఎదోముదేశము నిర్జనమైన
యెడారిగా ఉండును. । ఈలాగున నేను ఇంతకు 20
ముందు ప్రతికారముచేయని ప్రాణదోషమునకై
ప్రతికారము చేయుదును. । అయితే యూదాదేశ 21
ములో నివాసులు నిత్యముందురు, తరతరములకు
యెరూషలేము నివాసముగా నుండును, యెహోవా
సీయోనులో నివాసిగా ఏసించును.

# ఆ మో సు

1 **యూ**దారాజైన ఉజ్జీయా దినములలోను, ఇశ్రా
యేలు రాజగు యెహోయాషు కుమారుడైన యరో
బాము దినములలోను, భూకంపము కలుగుటకు రెండు
సంవత్సరములు ముందు, ఇశ్రాయేలీయులనుగూర్చి
తెకోవలోని పసులకాపరులలో ఆమోసు అను ఒక
నికి కనబడిన దర్శన వివరము.
2 అతడు ప్రకటించినదేమనగా — యెహోవా
సీయోనులోనుండి గర్జించుచున్నాడు, యెరూషలేము
లోనుండి తన స్వరము వినబడజేయుచున్నాడు; కాప
రులు సంచరించు మేతభూములు దుఃఖించుచున్నవి,
కర్మెలు శిఖరము ఎండిపోవుచున్నది.
3 యెహోవా సెలవిచ్చునదేమనగా — దమస్కు
మూడు సార్లు నాలుగు సార్లు చేసిన దోషములనుబట్టి
నేను తప్పకుండ దాని శిక్షింతును; దాని జనులు పంట
దుళ్లగొట్టు ఇనుపపనిముట్లతో గిలాదును నూర్చిరి. ।
4 నేను హజాయేలు మందిరములో అగ్ని వేసెదను,
అది బెన్హదదుయొక్క నగరులను దహించివేయును; ।
5 దమస్కుయొక్క అడ్డగడియలను విరిచెదను, ఆవెను
లోయలోనున్న నివాసులను నిర్మూలముచేతును, బెతే
దేనులో ఉండకుండ రాజదండము వహించినవానిని
నిర్మూలము చేతును, అరామీయులు చెరపట్టబడి కీరు
దేశమునకు కొనిపోబడుదురని యెహోవా సెలవిచ్చు
చున్నాడు.
6 యెహోవా సెలవిచ్చునదేమనగా—గాజా మూడు
సార్లు నాలుగు సార్లు చేసిన దోషములనుబట్టి నేను
తప్పకుండ దాని శిక్షింతును; ఎదోమువారి కప్పగింప
వలెనని తాము చెరపట్టినవారినందరిని కొనిపోయిరి. ।
7 గాజాయొక్క ప్రాకారముమీద నేను అగ్ని వేసె
8 దను, అది వారి నగరులను దహించి వేయును; । అష్డో
దులో నివాసులుండకుండ నిర్మూలముచేతును, అష్కె
లోనులో రాజదండము వహించిన వాడుండకుండ
నిర్మూలముచేతును, ఇంకను శేషించియున్న ఫిలిష్తీయు
లును క్షయమగునట్లు నేను ఎక్రోనును మొత్తెదనని
ప్రభువగు యెహోవా సెలవిచ్చుచున్నాడు.
9 యెహోవా సెలవిచ్చునదేమనగా — తూరు
మూడు సార్లు నాలుగు సార్లు చేసిన దోషములనుబట్టి
నేను తప్పకుండ దాని శిక్షింతును; దాని జనులు
సహోదర నిబంధనను జ్ఞాపకమునకు తెచ్చుకొనక
పట్టబడినవారినందరిని ఎదోమీయులకు అప్పగించిరి. ।
10 నేను తూరు ప్రాకారములమీద అగ్ని వేసెదను,
అది దాని నగరులను దహించివేయును.

యెహోవా సెలవిచ్చునదేమనగా — ఎదో
మూడు సార్లు నాలుగు సార్లు చేసిన దోషములన
నేను తప్పకుండ వాని శిక్షింతును; వాడు కనిక
చాలించుకొని ఖడ్గము పట్టుకొని యెడతెగని
ముతో తనకు సహోదరులగువారిని మానక చీల్చు
వచ్చెను. । తేమానుమీద అగ్ని వేసెదను, అది బొ
యొక్క నగరులను దహించివేయును.
యెహోవా సెలవిచ్చునదేమనగా — అమ్మో
యులు మూడు సార్లు నాలుగు సార్లు చేసిన దో
ములనుబట్టి నేను తప్పకుండ వారిని శిక్షింతును;
సరిహద్దులను మరి విశాలము చేయదలచి, గిలాదుల
గర్భిణిస్త్రీల కడుపులను చీల్చిరి. । రబ్బాయొక్క ప్రా
రముమీద నేను అగ్ని రాజబెట్టెదను, రణకే
తోను సుడిగాలి వీచునప్పుడు కలుగు ప్రళయ
వలెను అది దాని నగరులమీదికి వచ్చి వాటిని దహిం
వేయును. । వారి రాజును అతని అధిపతులును అ
రును చెరలోకి కొనిపోబడుదురని యెహోవా
విచ్చుచున్నాడు.

**యె**హోవా సెలవిచ్చునదేమనగా—మోయా
మూడు సార్లు నాలుగు సార్లు చేసిన దోషములనుబ
నేను తప్పకుండ దాని శిక్షింతును; వారు ఎదోమురా
ఎముకలను కాల్చి సున్నము చేసిరి. । మోయాబుమీ
నేను అగ్ని వేసెదను, అది కెరీయోతు నగరుల
దహించి వేయును. గొల్లును రణకేకలును బాకానా
మును వినబడుచుండగా మోయాబు చచ్చును.
మోయాబీయులకు న్యాయాధిపతి యుండకుండ వారి
నిర్మూలము చేసెదను, వారితోకూడ వారి అధిపతు
నందరిని నేను సంహరించెదనని యెహోవా సె
విచ్చుచున్నాడు.
యెహోవా సెలవిచ్చునదేమనగా — యూద
మూడు సార్లు నాలుగు సార్లు చేసిన దోషములనుబట్
నేను తప్పకుండ వారిని శిక్షింతును; వారు తమ పి
రులనుసరించిన అబద్ధములను చేపట్టి, మోసపోయి
యెహోవా ధర్మశాస్త్రమును విసర్జించి, ఆయన విధ
లను గైకొనకపోయిరి. । యూదామీద నేను అగ్ని
వేసెదను, అది యెరూషలేము నగరులను దహించి
వేయును.

యెహోవా సెలవిచ్చునదేమనగా—ఇశ్రాయేలు
మూడు సార్లు నాలుగు సార్లు చేసిన దోషములనుబట్టి
నేను తప్పకుండ దాని శిక్షింతును; ద్రవ్యమునకై దాని
జనులు నీతిమంతులను అమ్మివేయుదురు; పాదరక్షల

7 కొరకై బీదవారిని అమ్మివేయుదురు. | దరిద్రుల
నోటిలో మన్ను వేయుటకు బహు ఆశపడుదురు;
దీనుల త్రోవకు అడ్డము వచ్చెదరు; తండ్రియు కుమారు
డును ఒకదానినే కూడి నా పరిశుద్ధనామమును అవ
8 మానపరచుదురు; | తాకట్టుగా ఉంచబడిన బట్టలను
అప్పగింపక వాటిని పరచుకొని బలిపీఠములన్నిటియొద్ద
పండుకొందురు. జుల్మానా సొమ్ముతో కొనిన ద్రాక్షా
రసమును తమ దేవుని మందిరములోనే పానము
9 చేయుదురు. | దేవదారు వృక్షమంత యెత్తయినవారును
సిందూరవృక్షమంత బలముగలవారునగు అమోరీయు
లను వారిముందర నిలువకుండ నేను నాశనము చేసి
తిని గదా; పైన వారి ఫలమును క్రింద వారి మూల
10 మును నేను నాశనము చేసితిని గదా. | మరియు
ఐగుప్తుదేశములోనుండి మిమ్మును రప్పించి, అమో
రీయులదేశమును మీకు స్వాధీనపరచవలెనని నలువది
సంవత్సరములు అరణ్యమందు మిమ్మును నడిపించితిని
11 గదా. | మరియు మీ కుమారులలో కొందరిని ప్రవక్తలు
గాను, మీ యౌవనస్థులలో కొందరిని నాకు నజీరులు
గాను[1] నియమించితిని. ఇశ్రాయేలీయులారా, యీ
మాటలు నిజమైనవి కావా? ఇదే యెహోవా వాక్కు. |
12 అయితే నజీరులకు మీరు ద్రాక్షారసము త్రాగించి
తిరి, ప్రకటింపవద్దని ప్రవక్తలకు ఆజ్ఞ ఇచ్చితిరి. |
13 ఇదిగో; పంటచేని మోపుల నిండుబండి నేలను అణగ
ద్రొక్కునట్లు నేను మిమ్మును అణగద్రొక్కుదును. |
14 అప్పుడు, అతివేగియగు వాడు తప్పించుకొనజాలక
పోవును, పరాక్రమశాలి తన బలమునుబట్టి ధైర్యము
తెచ్చుకొనజాలక పోవును, బలాఢ్యుడు తన ప్రాణము
15 రక్షించుకొనజాలకుండును. | విలుకాడు నిలువజాలక
పోవును, పాదచారి పరుగెత్తువాడు తప్పించుకొనలేక
పోవును, గుర్రము ఎక్కినవాడు తన ప్రాణమును
16 రక్షించుకొనలేక పోవును. | మరియు ఆ దినమందు
బలాఢ్యులలో బహు ధైర్యముగలవాడు దిగంబరియై
పారిపోవును; ఇదే యెహోవా వాక్కు.

3 ఐగుప్తుదేశమునుండి యెహోవా రప్పించిన ఇశ్రా
యేలీయులారా, మిమ్మునుగూర్చియు ఆయన రప్పించిన
మీ కుటుంబమువారినందరినిగూర్చియు ఆయన సెల
2 విచ్చినమాట ఆలకించుడి. అదేమనగా | —భూమి
మీది సకలవంశములలోను మిమ్మును మాత్రమే నేను
ఎరిగియున్నాను గనుక మీరు చేసిన దోషక్రియలన్ని
3 టినిబట్టి మిమ్మును శిక్షింతును. | సమ్మతి పడకుండ ఇద్దరు
కూడి నడుతురా? ఎర దొరకక సింహము అడవిలో
గర్జించునా? ఏమియు పట్టుకొనకుండనే కొదమ సిం
5 హము గుహలోనుండి బొబ్బపెట్టునా? | భూమిమీద
ఒకడును ఎరపెట్టకుండ పక్షి ఉరిలో చిక్కుపడునా?
యేమియు పట్టుబడకుండ ఉరిపెట్టువాడు ఎదలి
తేచునా? | పట్టణమందు బాకానాదము వినబడగా 6
జనులకు భయము పుట్టకుండునా? యెహోవా చేయ
నిది పట్టణములో ఉపద్రవము కలుగునా? | తన 7
సేవకులైన ప్రవక్తలకు తాను సంకల్పించినదానిని
బయలుపరచకుండ ప్రభువైన యెహోవా యేమియు
చేయడు. | సింహము గర్జించెను, భయపడనివాడెవడు? 8
ప్రభువైన యెహోవా ఆజ్ఞ ఇచ్చియున్నాడు, ప్రవ
చింపకుండువాడెవడు?

అష్డోదు నగరులలో ప్రకటనచేయుడి, ఐగుప్తు 9
దేశపు నగరులలో ప్రకటనచేయుడి; ఎట్లనగా —
మీరు షోమ్రోనుకు ఎదురుగానున్న పర్వతముల
మీదికి కూడి వచ్చి అందులో జరుగుచున్న గొప్ప
గల్లంతు చూడుడి; అందులో జనులు పడుచున్న
బాధ కనుగొనుడి. | వారు నీతిక్రియలు చేయ తెలి 10
యక తమ నగరులలో బలాత్కారముచేతను దోపుడు
చేతను సొమ్ము సమకూర్చుకొందురు. | కాబట్టి ప్రభు 11
వైన యెహోవా సెలవిచ్చునదేమనగా — శత్రువు
వచ్చును, అతడు దేశమంతట సంచరించి నీ ప్రభావ
మును కొట్టివేయగా నీ నగరులు పాడగును. |
యెహోవా సెలవిచ్చునదేమనగా—గొల్లవాడు సిం 12
హము నోటనుండి రెండు కాళ్లనైనను చెవి ముక్క
నైనను విడిపించునట్లుగా షోమ్రోనులో మంచముల
మీదను బుట్టాలువేసిన శయ్యలమీదను కూర్చుండు
ఇశ్రాయేలీయులు రక్షింపబడుదురు. | ప్రభువును 13
దేవుడును సైన్యములకధిపతియునగు యెహోవా
సెలవిచ్చునదేమనగా—నా మాట ఆలకించి యాకోబు
ఇంటివారికి దాని రూఢిగా తెలియజేయుడి. | ఇశ్రా 14
యేలువారు చేసిన దోషములనుబట్టి నేను వారిని
శిక్షించు దినమున బేతేలులోని బలిపీఠములను నేను
శిక్షింతును; ఆ బలిపీఠపు కొమ్ములు తెగవేయబడి నేల
రాలును. | చలికాలపు నగరును వేసవికాలపు నగ 15
రును నేను పడగొట్టెదను, దంతపు నగరులును లయ
మగును, బహు నగరులు పాడగును; ఇదే యెహోవా
వాక్కు.

షోమ్రోను పర్వతముననున్న బాషాను ఆవు 4
లారా, దరిద్రులను బాధపెట్టుచు బీదలను నలుగ
గొట్టువారలారా—మాకు పానము తెచ్చి ఇయ్యుడని
మీ యజమానులతో చెప్పువారలారా, యీ మాట
ఆలకించుడి. ప్రభువైన యెహోవా తన పరిశుద్ధత
తోడని చేసిన ప్రమాణమేదనగా | — ఒకకాలము 2
వచ్చుచున్నది, అప్పుడు శత్రువులు మిమ్మును కొంకుల
చేతను, మీలో శేషించినవారిని గాలములచేతను పట్టు
కొని లాగుదురు. | ఇటు అటు తొలగకుండ మీ... 3
దరు ప్రాకారపు గండ్లద్వారా పోవుదురు, ప

1 అనగా వ్రతము పట్టినవారుగాను.

మార్గమున వెళ్లవేయబడుదురు; ఇదే యెహోవా
వాక్కు.
4 బేతేలుకు పోయి తిరుగబాటు చేయుడి, గిల్గా
లుకుపోయి మరి ఎక్కువగా తిరుగబాటు చేయుడి,
ప్రాతఃకాలమున బలులు తెచ్చి మూడేసి దినముల
కొకసారి దశమభాగములను తెచ్చి అర్పించుడి.।
5 పులిసినపిండితో స్తోత్రార్పణ అర్పించుడి, స్వేచ్ఛా
ర్పణనుగూర్చి చాటించి ప్రకటన చేయుడి; ఇశ్రా
యేలీయులారా, యీలాగున చేయుట మీకిష్టమై
యున్నది; ఇదే ప్రభువైన యెహోవా వాక్కు.।
6 మీ పట్టణములన్నిటిలోను నేను మీకు దంతశుద్ధి
కలుగజేసినను, మీరున్న స్థలములన్నిటిలోను మీకు
ఆహారము లేకుండ చేసినను మీరు నాతట్టు తిరిగిన
7 వారు కారు; ఇదే యెహోవా వాక్కు.। మరియు
కోతకాలమునకుముందు మూడునెలలు వానలేకుండ
చేసితిని; ఒక పట్టణముమీద కురిపించి మరియొక
పట్టణముమీద కురిపింపకపోతిని; ఒకచోట వర్షము
8 కురిసెను, వర్షములేనిచోటు ఎండిపోయెను.। రెండు
మూడు పట్టణములవారు నీళ్లు త్రాగుటకు ఒక పట్టణ
మునకే పోగా అచ్చటి నీరు వారికి చాలకపోయెను;
అయినను మీరు నాతట్టు తిరిగినవారు కారు; ఇదే
9 యెహోవా వాక్కు.। మరియు (మీ సస్యములను)
ఎండు తెగులుచేతను కాటుకచేతను నేను పాడుచేసి
తిని, గొంగళిపురుగు వచ్చి మీ విస్తారమైన వనములను
ద్రాక్షతోటలను అంజూరపుచెట్లను ఒలీవచెట్లను తిని
వేసెను, అయినను మీరు నాతట్టు తిరిగినవారు కారు;
10 ఇదే యెహోవా వాక్కు.। మరియు నేను ఐగుప్తీ
యులమీదికి తెగుళ్లు పంపించినట్లు మీమీదికి తెగుళ్లు
పంపించితిని; మీ దండుపేటలో పుట్టిన దుర్గంధము
మీ నాసికారంధ్రములకు ఎక్కునంతగా మీ యౌవన
స్థులను ఖడ్గముచేత హతముచేయించి మీ గుఱ్ఱములను
కొల్లపెట్టించితిని; అయినను మీరు నాతట్టు తిరిగిన
11 వారు కారు; ఇదే యెహోవా వాక్కు.। దేవుడు
సొదొమ గొమొఱ్ఱాలను బోర్లద్రోసి నాశనముచేసి
నట్లు నేను మీలో కొందరిని నాశముచేయగా మీరు
మంటలోనుండి తీయబడిన కొరవులైనట్లు తప్పించు
కొంటిరి; అయినను మీరు నాతట్టు తిరిగినవారు కారు;
12 ఇదే యెహోవా వాక్కు.। కాబట్టి ఇశ్రాయేలీయు
లారా, మీయెడల నేనీలాగునే చేయుదును గనుక
ఇశ్రాయేలీయులారా, మీ దేవుని సన్నిధిని కనబడు
13 టకై సిద్ధపడుడి.। పర్వతములను నిరూపించువాడును
గాలిని పుట్టించువాడును ఆయనే. ఉదయమున చీకటి
కమ్మజేయువాడును మనుష్యుల యోచనలు వారికి
తెలియజేయువాడును ఆయనే; భూమియొక్క ఉన్నత
స్థలములమీద సంచరించు దేవుడును సైన్యములకు అధి
పతియునగు యెహోవా అని ఆయనకు పేరు

ఇశ్రాయేలువారలారా, మిమ్మునుగూర్చి నేనెత్
ఈ అంగలార్పు మాట ఆలకించుడి.। కన్యకయైన
ఇశ్రాయేలు కూలిపోయెను, ఆమె మరెన్నటికిని లేవద
లేవనెత్తువాడొకడును లేక ఆమె భూమిమీద ప
వేయబడియున్నది.। ప్రభువైన యెహోవా సె
విచ్చునదేమనగా—ఇశ్రాయేలు వారిలో వెయ్యిమ
దియై బయలువెళ్లిన పట్టణస్థులలో నూరుమంది తప్పి
చుకొని వత్తురు; నూరుమందియై బయలువెళ్లిన పట్ట
స్థులలో పదిమంది తప్పించుకొని వత్తురు.। ఇశ్ర
యేలీయులతో యెహోవా సెలవిచ్చునదేమనగా—
నన్నాశ్రయించుడి, నన్నాశ్రయించినయెడల మీ
బ్రదుకుదురు.। బేతేలును ఆశ్రయింపకుడి, గిల్గా
లులో ప్రవేశింపకుడి, బెయేర్షెబాకు వెళ్లకుడి; గిల్గా
అవశ్యముగా చెరపట్టబడిపోవును, బేతేలు శూన్య
మగును.। యెహోవాను ఆశ్రయించుడి; అప్పుడ
మీరు బ్రదుకుదురు, ఆశ్రయింపని పక్షమందు బే
లులో ఎవరును ఆర్పివేయ లేకుండ అగ్ని పడినట్ల
ఆయన యోసేపు సంతతిమీద పడి దాని నాశనమ
చేయును.। న్యాయమును అన్యాయమునకు మార్చి
నీతిని నేలను పడవేయువారలారా,। (యెహోవాన
ఆశ్రయించుడి); ఆయన సప్తఋషీ నక్షత్రములన
మృగశీర్ష నక్షత్రమును సృష్టించినవాడు, కారు చీక
టిని ఉదయముగా మార్చువాడు, పగటిని రాత్రి
చీకటివలె మార్పు చేయువాడు, సముద్రజలములన
పిలిచి వాటిని భూమిమీద పొర్లి పారజేయువాడు.
ఆయన పేరు యెహోవా; బలాఢ్యులమీదికి ఆయన
నాశము తెప్పింపగా దుర్గములు పాడగును.। అయితే
గుమ్మములో నిలిచి బుద్ధి చెప్పువారిమీద జనులు పగ
పట్టుదురు; యథార్థముగా మాటలాడువారిని అస
హ్యించుకొందురు.। దోషనివృత్తికి రూకల్లు పుచ్చు
కొని నీతిమంతులను బాధపెట్టుచు, గుమ్మమునకు వచ్చు
బీదవారిని అన్యాయము చేయుటవలన। మీ అపరాధ
ములు విస్తారములైనవనియు, మీ పాపములు ఘోర
మైనవనియు నేనెరుగుదును. దరిద్రులయొద్ద పంట
మోపులను పుచ్చుకొనుచు మీరు వారిని అణగద్రొక్కు
దురు గనుక మలుపురాళ్లతో మీరు ఇండ్లుకట్టుకొని
నను వాటిలో మీరు కాపురముండరు, శృంగారమైన
ద్రాక్షతోటలు మీరు నాటినను ఆ పండ్ల రసము
మీరు త్రాగరు.। ఇది చెడుకాలము గనుక ఈ కాల
మున బుద్ధిమంతుడు ఊరకుండును.। మీరు బ్రదుకు
నట్లు కీడు విడిచి మేలుచేయుడి; ఆలాగు చేసినయెడల
మీరనుకొనుచొప్పున దేవుడును సైన్యములకధిపతియు
నగు యెహోవా మీకు తోడుగా నుండును.। కీడును
ద్వేషించి మేలును ప్రేమించుచు, గుమ్మములలో
న్యాయము స్థిరపరచుడి; ఒకవేళ దేవుడును సైన్యముల
కధిపతియునగు యెహోవా యోసేపు సంతతిలో

16 శేషించినవారియందు కనికరించును. । దేవుడును
సైన్యములకధిపతియునైన ప్రభువగు యెహోవా
సెలవిచ్చునదేమనగా — నేను మీ మధ్య సంచరింప
బోవుచున్నాను గనుక రాజమార్గములన్నిటిలో అంగ
లార్పు వినబడును, వీధులన్నిటిలో జనులు కూడి —
అయ్యో శ్రమ అందురు; అంగలార్చుటకు వారు
సేద్యగాండ్లను పిలుతురు; రోదనముచేయ నేర్పుగల
17 వారిని అంగలార్చుటకు పిలిపింతురు. । ద్రాక్ష
18 తోటలన్నిటిలో రోదనము వినబడును. । యెహోవా
దినము రావలెనని ఆశపెట్టుకొనియున్న వారలారా,
మీకు శ్రమ; యెహోవా దినము వచ్చుటవలన
మీకు ప్రయోజనమేమి? అందులో వెలుగుండదు,
19 చీకటి దాని కమ్మును. । ఒకడు సింహమునొద్దనుండి
తప్పించుకొనగా ఎలుగుబంటి యెదురైనట్టు, వాడు
ఇంటిలోనికి పోయి గోడమీద చెయ్యివేయగా పాము
20 వాని కరచినట్టు ఆ దినముండును. । యెహోవా
దినమున నిజముగా వెలుగైయుండదు, చీకటి దాని
కమ్మును, వెలుగు ఏమాత్రమును లేక అది కారుచీక
21 టిగా ఉండును. । మీ పండుగ దినములను నేను
అసహ్యించుకొనుచున్నాను; వాటిని నీచముగా ఎంచు
చున్నాను; మీ వ్రతదినములలో కలుగు వాసనను
22 నేను అఘ్రాణింప నొల్లను. । నాకు దహనబలులను
నైవేద్యములను మీరర్పించినను నేను వాటిని అంగీ
కరింపను; సమాధానబలులుగా మీరర్పించు క్రొవ్విన
23 పశువులను నేను చూడను. । మీ పాటల ధ్వని నా
యొద్దనుండి తొలగనియ్యుడి, మీ స్వరమండలముల
24 నాదము వినుట నాకు మనస్సులేదు. । నీళ్లు పారి
నట్లుగా న్యాయము జరుగనియ్యుడి, గొప్ప ప్రవా
25 హమువలె నీతిని ప్రవహింపనియ్యుడి. । ఇశ్రాయేలీ
యులారా, అరణ్యమందు నలువది సంవత్సరములు
మీరర్పించిన బలులను నైవేద్యములను నాకే అర్పించి
26 తిరా? । మీకు దేవతగా ఎంచుకొనిన నక్షత్రమైన
మీ రాజుకు చేయబడిన గుడారమును, మీరు పెట్టు
కొనిన విగ్రహముల పీఠమును మీరు మోసికొని
27 వచ్చితిరి గదా. । కాబట్టి నేను దమస్కుపట్టణము అవ
తలికి మిమ్మును చెరగొని పోవుదును అని యెహోవా
సెలవిచ్చుచున్నాడు; ఆయన పేరు సైన్యములకధిపతి
యగు దేవుడు.

6 సీయోనులో నిర్విచారముగా నున్నవారికి శ్రమ;
షోమ్రోను పర్వతములమీద నిశ్చింతగా నివసించు
వారికి శ్రమ; ఇశ్రాయేలువారికి విచారణకర్తలై జన
ములలో ముఖ్య జనమునకు పెద్దలైనవారికి శ్రమ. ।
2 కల్నేకు పోయి విచారించుడి; అక్కడనుండి హమాతు
మహాపురమునకు పోవుడి, ఫిలిష్తీయుల పట్టణమైన
గాతునకు పోవుడి; అవి ఈ రాజ్యములకంటె గొప్పవి
కావు గదా; వాటి సరిహద్దులు మీ సరిహద్దులకంటె
విశాలమైనవి కావు గదా. । ఉపద్రవదినము బహు 3
దూరమున నున్నదనుకొని అన్యాయపు తీర్పు తీర్చు
టకై మీ మధ్య మీరు పీఠములు స్థాపింతురు. ।
దంతపు మంచములమీద పరుండుచు, పాన్పులమీద 4
తమ్మును చాచుకొనుచు, మందలో శ్రేష్ఠమైన గొఱ్ఱె
పిల్లలను సాలలోని క్రొవ్విన దూడలను వధించి భోజ
నము చేయుదురు. । స్వరమండలముతో కలిసి పిచ్చి 5
పాటలు పాడుచు, దావీదువలెనే వాయించు వాద్య
ములను కల్పించుకొందురు. । పాత్రలలో ద్రాక్షా 6
రసముపోసి పానముచేయుచు పరిమళ తైలము పూసి
కొనుచుందురు గాని యోసేపు సంతతివారికి కలిగిన
ఉపద్రవమును గురించి చింతపడరు. । కాబట్టి చెర 7
లోకి ముందుగా పోవువారితో కూడ వీరు చెరలోనికి
పోవుదురు; అప్పుడు సుఖాసక్తులు చేయు ఉత్సవ
ధ్వని గతించును. యాకోబు సంతతివారికున్న గర్వము
నాకసహ్యము; వారి నగరులకు నేను విరోధినైతిని
గనుక వారి పట్టణములను వాటిలోని సమస్తమును
శత్రువుల వశము చేసెదనని । ప్రభువైన యెహోవా 8
తనతోడని ప్రమాణము చేసెను; ఇదే దేవుడును సైన్య
ములకధిపతియునగు యెహోవా వాక్కు. । ఒక 9
కుటుంబమందు పదిమంది మనుష్యులుండినను వారు
చత్తురు. । ఒకని దాయాది కాల్చబోవు వానితోకూడ 10
ఎముకలను ఇంటిలోనుండి బయటికి కొనిపోవుటకై
శవమును ఎత్తినప్పుడు ఇంటి వెనుకటి భాగమున ఒకని
చూచి — యింటిలో మరి ఎవరైన మిగిలియున్నారా
యని అడుగగా అతడు — ఇంకెవరును లేరనును;
అంతట దాయాదిట్లనును — నీవిక నేమియు పలుకక
ఊరకుండుము, యెహోవా నామము స్మరించకూ
డదు; । ఏలయనగా గొప్ప కుటుంబములు పాడగు 11
ననియు, చిన్న కుటుంబములు చీలిపోవుననియు
యెహోవా ఆజ్ఞ ఇచ్చియున్నాడు. । గుఱ్ఱములు 12
బండలమీద పరుగెత్తునా? అట్టిచోట ఎవరైన ఎద్దు
లతో దున్నుదురా? అయినను మా శక్తిచేతనే బలము
తెచ్చుకొందుమని చెప్పుకొను మీరు, వ్యర్థమైనదానిని
బట్టి సంతోషించు మీరు, । న్యాయమును ఘోర 13
మైన అన్యాయముగాను, నీతిఫలమును ఘోర దుర్మా
ర్గముగాను మార్చితిరి. । ఇందుకు దేవుడును సైన్యముల 14
కధిపతియునగు యెహోవా సెలవిచ్చునదేమనగా—
ఇశ్రాయేలీయులారా, నేను మీమీదికి ఒక జనమును
రప్పింతును, వారు హమాతు సరిహద్దు మొదలుకొని
అరణ్యపు నదివరకు మిమ్మును బాధింతురు.

7 కడవరి గడ్డి మొలుచునప్పుడు ప్రభువైన
యెహోవా మిడతలను పుట్టించి దర్శనరీతిగా దానిని
నాకు కనుపరచెను; ఆ గడ్డి రాజుకు రావలసిన కోత
అయిన తరువాత మొలిచినది. । నేలను మొలిచిన
పచ్చికయంతయు ఆ మిడతలు తినివేసినప్పుడు

ప్రభువైన యెహోవా, నీవు దయచేసి క్షమించుము,
యాకోబు కొద్ది జనముగలవాడు, అతడేలాగు నిలు
3 చును? అని నేను మనవిచేయగా । యెహోవా
పశ్చాత్తాపపడి—అది జరుగదని సెలవిచ్చెను.
4 మరియు — అగ్నిచేత దండింపవలెనని అగ్నిని
రప్పించి ప్రభువైన యెహోవా దానిని దర్శనరీతిగా
నాకు కనుపరచెను. అది వచ్చి అగాధమైన మహా
జలమును మ్రింగివేసి స్వాస్థ్యమును మ్రింగ మొదలు
5 పెట్టినప్పుడు । — ప్రభువైన యెహోవా, యాకోబు
కొద్ది జనముగలవాడు, అతడేలాగు నిలుచును? మాని
6 వేయుమని నేను మనవిచేయగా । ప్రభువైన
యెహోవా పశ్చాత్తాపపడి — అదియు జరుగదని
సెలవిచ్చెను.
7 మరియు యెహోవా తాను మట్టపుగుండు చేత
పట్టుకొని గుండు పెట్టి చక్కగా కట్టబడిన యొక
గోడమీద నిలువబడి ఇట్లు దర్శనరీతిగా నాకు కను
8 పరచెను. । యెహోవా—ఆమోసూ, నీకు కనబడు
చున్నదేమని నన్నడుగగా—నాకు మట్టపుగుండు కన
బడుచున్నదని నేనంటిని. అప్పుడు యెహోవా సెల
విచ్చినదేమనగా — నా జనులగు ఇశ్రాయేలీయులను
నేనికను విడువక వారి మధ్యను మట్టపుగుండు వేయ
9 బోవుచున్నాను. । నేను ఖడ్గము చేతపట్టుకొని యరొ
బాము ఇంటివారిమీద పడుదును, ఇస్సాకు సంతతి
వారు పూజించిన ఉన్నతస్థలములు పాడైపోవును,
ఇశ్రాయేలీయుల ప్రతిష్ఠితస్థలములు నాశమగును.
10 అప్పుడు బేతేలులోని యాజకుడైన అమజ్యా
ఇశ్రాయేలురాజైన యరొబాముకు వర్తమానము పంపి
—ఇశ్రాయేలీయులమధ్య ఆమోసు నీ మీద కుట్ర
11 చేయుచున్నాడు; । యరొబాము ఖడ్గముచేత చచ్చు
ననియు, ఇశ్రాయేలీయులు తమ దేశమును విడిచి
చెరలోనికి పోవుదురనియు ప్రకటించుచున్నాడు;
అతని మాటలు దేశము సహింపజాలదు అని తెలియ
12 జేసెను. । మరియు అమజ్యా ఆమోసుతో ఇట్లనెను—
దర్శకుడా, తప్పించుకొని యూదాదేశమునకు, పారి
పొమ్ము; అచ్చటనే నీ వార్త ప్రకటించి బత్తెము సంపా
13 దించుకొనుము; । బేతేలురాజు కట్టిన ప్రతిష్ఠితస్థలము
రాజధాని పట్టణమై యున్నందున నీవికను దానిలో
14 నీ వార్త ప్రకటనచేయకూడదు. । అందుకు ఆమోసు
అమజ్యాతో ఇట్లనెను — నేను ప్రవక్తనైనను ప్రవక్త
యొక్క శిష్యుడనైనను కాను, పసుల కాపరినై మేడి
పండ్లు ఏరుకొని జీవనోపాయము సంపాదించుకొను
15 వాడను. । నా మందలను నేను కాచుకొనుచుండగా
యెహోవా నన్ను పిలిచి—నీవు పోయి నా జనులగు
రాయేలువారికి ప్రవచనము చెప్పుమని నాతో
చ్చెను. । యెహోవా మాట ఆలకించుము —
లీయులనుగూర్చి ప్రవచింపకూడదనియు,
ఇస్సాకు సంతతివారినిగూర్చి బోధింపకూడదనియు
నీవు ఆజ్ఞ ఇచ్చుచున్నావే. । యెహోవా సెలవిచ్చున
దేమనగా—నీ భార్య పట్టణమందు వేశ్యయగును, నీ
కుమారులును కుమార్తెలును ఖడ్గముచేత కూలుదురు,
నీ భూమి నూలుచేత విభాగింపబడును, నీవు అపవిత్ర
మైన దేశమందు చత్తువు; అవశ్యముగా ఇశ్రాయేలీ
యులు తమ దేశము విడిచి చెరగొనబడుదురు.
మరియు ప్రభువైన యెహోవా దర్శనరీతిగా 8
వేసవికాలపు పండ్లగంప యొకటి నాకు కనుపరచి ।
—ఆమోసూ, నీకు కనబడుచున్నదేమని నన్నడుగగా 2
—వేసవికాలపు పండ్లగంప నాకు కనబడుచున్నదని
నేనంటిని, అప్పుడు యెహోవా నాతో సెలవిచ్చిన
దేమనగా—నా జనులగు ఇశ్రాయేలీయులకు అంతము
వచ్చేయున్నది, నేనికను వారిని విచారణచేయక మా
నను. । ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా 3
—మందిరములో వారు పాడు పాటలు ఆ దినమున
ప్రలాపములగును, శవములు లెక్కకు ఎక్కువగును,
ప్రతిస్థలమందును అవి పారవేయబడును. ఊరకుం
డుడి. । దేశమందు బీదలను మ్రింగివేయను దరిద్రులను 4
మాపివేయను కోరువారలారా, । — మనము ధాన్య 5
మును అమ్మునట్లు అమావాస్య యెప్పుడైపోవునో,
మనము తూము చిన్నదిగాను రూపాయి యెక్కువది
గాను చేసి, దొంగత్రాసుచేసి, గోధుమలను అమ్మ
కము చేయునట్లు విశ్రాంతిదినము ఎప్పుడు గతించి
పోవునో యని చెప్పుకొనువారలారా, । దరిద్రులను 6
వెండికి కొనునట్లును పాదరక్షల నిచ్చి బీదవారిని కొను
నట్లును విశ్రాంతిదిన మెప్పుడైపోవునో, వచ్చు ధాన్య
మును మనము అమ్ముదము రండని చెప్పుకొనువార
లారా, ఈ మాట ఆలకించుడి. । యాకోబుయొక్క 7
అతిశయాస్పదముతోడని యెహోవా ప్రమాణము
చేయునదేమనగా — వారి క్రియలను నేనెన్నడును
మరువను. । ఇందునుగూర్చి భూమి కంపించుచున్నది; 8
దాని నివాసులందరును అంగలార్చుచున్నారు. నైలు
నది పొంగునట్లు భూమి అంతయు ఉబుకుచున్నది,
ఐగుప్తుదేశపు నైలునదివలె అది ఉబుకుచున్నది; మిస్ర
యీము దేశపునదివలె అది అణగిపోవుచున్నది. ।
ప్రభువైన యెహోవా సెలవిచ్చునదేమనగా — ఆ 9
దినమున నేను మధ్యాహ్నకాలమందు సూర్యుని అస్త
మింపజేయుదును. పగటివేళను భూమికి చీకటి కమ్మ
జేయుదును. । మీ పండుగ దినములను దుఃఖదిన 10
ములుగాను మీ పాటలను ప్రలాపములుగాను మార్చు
దును, అందరిని మొలలమీద గోనెపట్ట కట్టుకొన
జేయుదును, అందరి తలలు బోడిచేసెదను, ఒకనికి
కలుగు ఏకపుత్ర శోకమువంటి ప్రలాపము నేను
పుట్టింతును; దాని అంత్యదినము ఘోరమైన శ్రమదిన
ముగా ఉండును. । రాబోవు దినములందు దేశములో 11

నేను క్షామము పుట్టింతును; అది అన్నపానములు
లేకపోవుటచేత కలుగు క్షామముకాక యెహోవా
మాటను వినకపోవుటవలన కలుగు క్షామముగా ఉం
డును; ఇదే యెహోవా వాక్కు. । కాబట్టి జనులు
యెహోవా మాట వెదకుటకై యీ సముద్రము
నుండి ఆ సముద్రమువరకును ఉత్తరదిక్కునుండి తూర్పు
దిక్కువరకును సంచరించుదురు గాని అది వారికి దొర
కదు; । ఆ దినమందు చక్కని కన్యలును యౌవన
నులును దప్పిచేత సొమ్మసిల్లుదురు. । షోమ్రోనుయొక్క
దోషమునకు కారణమగు దాని తోడనియు, దానూ,
నీ దేవుని జీవముతోడనియు, బెయేర్షెబా మార్గ జీవము
తోడనియు ప్రమాణము చేయువారు ఇకను లేవకుండ
కూలుదురు.

యెహోవా బలిపీఠమునకు పైగా నిలిచియుం
డుట నేను (దర్శనరీతిగా) చూచితిని. అప్పుడు ఆయన
నా కాజ్ఞ ఇచ్చినదేమనగా — గడపలు కదలిపోవు
నట్లుగా పై కమ్ములను కొట్టి వారందరి తలలమీద
గొట్టిని పడవేసి పగులగొట్టుము; తరువాత వారిలో
ఒకడును తప్పించుకొనకుండను, తప్పించుకొనువారిలో
ఒకడును బ్రదుకకుండను నేను వారినందరిని ఖడ్గము
చేత వధింతును. । వారు పాతాళములో చొచ్చిపోయి
నను అచ్చటనుండి నా హస్తము వారిని బయటికి
లాగును; ఆకాశమునకెక్కిపోయినను అచ్చటనుండి
వారిని దింపి తెచ్చెదను. । వారు కర్మెలు పర్వతశిఖర
మున దాగినను నేను వారిని వెదకి పట్టి అచ్చటనుండి
పట్టుకొని వచ్చెదను; నా కన్నులకు కనబడకుండ వారు
సముద్రములో మునిగినను అచ్చటి సర్పమునకు
నేనాజ్ఞ ఇత్తును, అది వారిని కరచును. । తమ శత్రు
వులచేత వారు చెరపట్టబడినను అచ్చట నేను ఖడ్గమున
కాజ్ఞ ఇత్తును, అది వారిని హతముచేయును; మేలు
చేయుటకు కాదు కీడుచేయుటకే నా దృష్టి వారి
మీద నిలుపుదును. । ఆయన సైన్యములకధిపతియగు
యెహోవా; ఆయన భూమిని మొత్తగా అది కరిగి
పోవును, అందులోని నివాసులందరును ప్రలాపిం
చెదరు, నైలునదివలెనే అదియంతయు ఉబుకుచుం
డును, ఐగుప్తుదేశపు నైలునదివలెనే అది అణగిపోవును. ।
ఆకాశమందు తనకొరకై మేడగదులు కట్టుకొను
వాడును, ఆకాశమండలమునకు భూమియందు పునా
దులు వేయువాడును ఆయనే, సముద్రజలములను
పిలిచి వాటిని భూమిమీద ప్రవహింపజేయువాడును
ఆయనే; ఆయన పేరు యెహోవా. । ఇశ్రాయేలీ 7
యులారా, మీరును కూషీయులును నా దృష్టికి
సమానులు కారా? నేను ఐగుప్తుదేశములోనుండి
ఇశ్రాయేలీయులను, కఫ్తోరు దేశములోనుండి ఫిలిష్తీ
యులను, కీరు దేశములోనుండి అరామీయులను
రప్పించితిని. । ప్రభువైన యెహోవా కన్ను ఈ 8
పాపిష్ఠ రాజ్యముమీదనున్నది, దానిని భూమిమీద
ఉండకుండ నాశనము చేతును. అయితే యాకోబు
సంతతివారిని సర్వనాశముచేయక విడిచిపెట్టుదును;
ఇదే యెహోవా వాక్కు. । నేనాజ్ఞ ఇయ్యగా 9
ఒకడు ధాన్యము జల్లెడతో జల్లించినట్లు ఇశ్రాయేలీ
యులు అన్యజనులందరిలో జల్లింపబడుదురు గాని
యొక చిన్న గింజైన నేల రాలదు. । — ఆ కీడు మనలను 10
తరిమి పట్టదు, మనయొద్దకు రాదు అని నా జనులలో
అనుకొను పాపాత్ములందరును ఖడ్గముచేత చత్తురు.

పడిపోయిన దావీదు గుడారమును ఆ దినమున 11
నేను లేవనెత్తి దాని గోడను బాగుచేసి దాని పోయిన
చోట్లను బాగుచేసి, ఎదోము శేషమును నా నామము
ధరించిన అన్యజనులనందరిని నా జనులు స్వతం
త్రించుకొనునట్లు । పూర్వపురీతిగా దాని మరల కట్టు 12
దును; ఈలాగు జరిగించు యెహోవా వాక్కు ఇదే. ।
రాబోవు దినములలో కోయువారు దున్నువారి 13
వెంటనే వత్తురు; విత్తనము చల్లువారి వెంటనే ద్రాక్ష
పండ్లు త్రొక్కువారు వత్తురు; పర్వతములనుండి
మధురమైన ద్రాక్షారసము ప్రవించును, కొండలన్ని
రసధారలగును; ఇదే యెహోవా వాక్కు. । మరియు 14
శ్రమనొందుచున్న నా జనులగు ఇశ్రాయేలీయులను
నేను చెరలోనుండి రప్పింతును, పాడైన పట్టణములను
మరల కట్టుకొని వారు కాపురముందురు, ద్రాక్ష
తోటలు నాటి వాటి రసమును త్రాగుదురు, వన
ములువేసి వాటి పండ్లను తిందురు. । వారి దేశమందు 15
నేను వారిని నాటుదును, నేను వారికిచ్చిన దేశము
లోనుండి వారు ఇక పెరికివేయబడరని నీ దేవుడైన
యెహోవా సెలవిచ్చుచున్నాడు

# ఓ బ ద్యా

1 ఓబద్యాకు కలిగిన దర్శనము. ఎదోమును గురించి
ప్రభువగు యెహోవా సెలవిచ్చునది. యెహోవా
యొద్దనుండి వచ్చిన సమాచారము మాకు వినబడెను.—
ఎదోముమీద యుద్ధముచేయుదము లెండని అన్య
జనులను రేపుటకై దూత పంపబడియున్నాడు. ।
2 నేను అన్యజనులలో నిన్ను అల్పునిగా చేయుదును,
3 నీవు బహుగా తృణీకరింపబడుదువు. । అత్యున్నత
మైన పర్వతములమీద ఆసీనుడవైయుండి కొండ
సందులలో నివసించువాడా — నన్ను క్రిందికి పడ
ద్రోయగలవాడెవడని అనుకొనువాడా, నీ హృద
4 యపు గర్వముచేత నీవు మోసపోతివి. । పక్షిరాజు
గూడంత యెత్తున నివాసము చేసికొని నక్షత్రము
లలో నీవు దాని కట్టినను అచ్చటనుండియు నేను
నిన్ను క్రిందపడవేతును; ఇదే యెహోవా వాక్కు.।
5 దొంగలే గాని రాత్రి కన్నము వేయువారే గాని నీ
మీదికి వచ్చినయెడల తమకు కావలసినంతమట్టుకు
దోచుకొందురు గదా. ద్రాక్షపండ్లను ఏరువారు
నీయొద్దకు వచ్చినయెడల పరిగె యేరుకొనువారికి
కొంచె ముంచనిత్తురుగదా; నిన్ను చూడగా నీవు
6 బొత్తిగా చెడిపోయి యున్నావు. । ఏశావు సంతతి
వారి సొమ్ము సోదా చూడబడును; వారు దాచిపెట్టిన
7 ధనమంతయు పట్టబడును. । నీతో సంధిచేసినవారు
నిన్ను తమ సరిహద్దువరకు తుంపివేయుదురు; నీతో
సమాధానముగా ఉన్నవారు నిన్ను మోసపుచ్చి నీకు
బలాత్కారము చేయుదురు; వారు నీ యన్నము
తిని నీకొరకు ఉరియొడ్డుదురు; ఎదోముకు వివేచన
8 లేకపోయెను. । ఆ దినమందు ఏశావు పర్వతములలో
వివేచన లేకపోవునట్లు ఎదోములోనుండి జ్ఞానులను
నాశముచేతును; ఇదే యెహోవా వాక్కు. ।
9 తేమానూ, నీ బలాఢ్యులు విస్మయమొందుదురు, అందు
వలన ఏశావుయొక్క పర్వత నివాసులందరు హతులై
10 నిర్మూలమగుదురు. । నీ సహోదరులైన యాకోబు
సంతతికి నీవు చేసిన బలాత్కారమునుబట్టి నీవు అవ
మానము నొందుదువు, ఇకనెన్నటికి లేకుండ నీవు
11 నిర్మూలమగుదువు. । నీవు పగవాడవై నిలిచిన దిన
మందు, పరదేశులు వారి ఆస్తిని పట్టుకొనిపోయిన
దినమందు, అన్యులు వారి గుమ్మములలోకి చొరబడి
యెరూషలేముమీద చీట్లువేసిన దినమందు నీవును
వారిలో నొకడవైతివి గదా? । నీ సహోదరుని
శ్రమానుభవదినము చూచి నీవు ఆనందమొంద
తగదు; యూదావారి నాశనదినమున వారి స్థితిని
చూచి నీవు సంతోషింపతగదు; । నా జనుల ఆప
ద్దినమున నీవు వారి గుమ్మములలోకి చొరబడతగదు;
వారి ఆపద్దినమున నీవు సంతోషపడుచు వారి బాధను
చూడతగదు; వారి ఆపద్దినమున నీవు వారి ఆస్తిని
పట్టుకొనతగదు; । వారిలో తప్పించుకొనినవారిని
సంహరించుటకు అడ్డత్రోవలలో నీవు నిలువతగదు;
శ్రమదినమందు అతనికి శేషించినవారిని (శత్రువుల
చేతికి) అప్పగింపతగదు. । యెహోవాదినము అన్య 15
జనులందరిమీదికి వచ్చుచున్నది. అప్పుడు నీవు చేసి
నట్టే నీకును చేయబడును, నీవు చేసినదే నీ నెత్తిమీదికి
వచ్చును. । మీరు నా పరిశుద్ధమైన కొండమీద 16
త్రాగినట్లు అన్యజనులందరును నిత్యము త్రాగుదురు;
తాము ఇక నెన్నడు నుండనివారైనట్లు వారేమియు
మిగులకుండ త్రాగుదురు. । అయితే సీయోనుకొండ 17
ప్రతిష్ఠితమగును, తప్పించుకొనినవారు దానిమీద
నివసింతురు, యాకోబు సంతతివారు తమ స్వాస్థ్య
ములను స్వతంత్రించుకొందురు. । మరియు యాకోబు 18
సంతతివారు అగ్నియు, యోసేపు సంతతివారు
మంటయు అగుదురు; ఏశావు సంతతివారు
(వారికి) కొయ్యకాలుగా ఉందురు; ఏశావు సంతతి
వారిలో ఎవడును తప్పించుకొనకుండ యోసేపు
సంతతివారు వారిలో మండి వారిని కాల్చుదురు.
యెహోవా మాట యిచ్చియున్నాడు. । దక్షిణ 19
దిక్కున నివసించువారు ఏశావుయొక్క పర్వతమును
స్వతంత్రించుకొందురు; మైదానమందుండువారు ఫిలి
ష్తీయులదేశమును స్వతంత్రించుకొందురు; మరియు
ఎఫ్రాయిమీయుల భూములను షోమ్రోనుకు చేరిన
పొలమును వారు స్వతంత్రించుకొందురు; బెన్యామీ
నీయులు గిలాదుదేశమును స్వతంత్రించుకొందురు ।
మరియు ఇశ్రాయేలీయుల దండు, అనగా వారిలో 20
చెరపట్టబడినవారు సారెపతువరకు కనానీయుల దేశ
మును స్వతంత్రించుకొందురు; యెరూషలేమువారిలో
చెరపట్టబడి సెఫారాదుకు పోయినవారు దక్షిణదేశపు
పట్టణములను స్వతంత్రించుకొందురు. । మరియు 21
ఏశావుయొక్క కొండకు తీర్పు తీర్చుటకై సీయోను
కొండమీద రక్షకులు పుట్టుదురు; అప్పుడు రాజ్యము
యెహోవాది యగును.

# యోనా



1 యెహోవా వాక్కు అమిత్తయి కుమారుడైన
యోనాకు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను. ।—
2 నీనెవెపట్టణస్థుల దోషము నా దృష్టికి ఘోరమాయెను
గనుక నీవు లేచి నీనెవె మహా పట్టణమునకు పోయి
3 దానికి (దుర్గతి కలుగునని) ప్రకటింపుము. । అయితే
యెహోవా సన్నిధిలోనుండి తర్షీషు పట్టణమునకు
పారిపోవలెనని యోనా యొప్పేకు పోయి తర్షీషుకు
పోవు ఒక ఓడను చూచి, ప్రయాణమునకు కేవు
ఇచ్చి, యెహోవా సన్నిధిలో నిలువక ఓడవారితో
4 కూడి తర్షీషుకు పోవుటకు ఓడ ఎక్కెను. । అయితే
యెహోవా సముద్రముమీద పెద్దగాలి పుట్టింపగా
సముద్రమందు గొప్ప తుఫాను రేగి ఓడ బద్దలైపోవు
5 గతి వచ్చెను. । కాబట్టి నావికులు భయపడి, ప్రతి
వాడును తన తన దేవతను ప్రార్థించి, ఓడ చులకన
చేయుటకై అందులోని సరకులను సముద్రములో
పారవేసిరి. అప్పటికి యోనా, ఓడ దిగువభాగమునకు
పోయి పండుకొని గాఢనిద్రపోయియుండెను. ।
6 అప్పుడు ఓడనాయకుడు అతనియొద్దకు వచ్చి—ఓయీ
నిద్రబోతా, నీకేమివచ్చినది? లేచి నీ దేవుని ప్రార్థిం
చుము, మనము చావకుండ ఆ దేవుడు మనయందు
7 కనికరించునేమో అనెను. । అంతలో ఓడవారు—
ఎవనినిబట్టి ఇంత కీడు మనకు సంభవించినది తెలియు
టకై మనము చీట్లు వేతము రండని యొకరితో ఒకరు
చెప్పుకొని చీట్లు వేయగా చీటి యోనామీదికి
8 వచ్చెను. । కాబట్టి వారు అతని చూచి—యెవరినిబట్టి
ఈ కీడు మాకు సంభవించెనో, నీ వ్యాపారమేమిటో,
నీవెక్కడనుండి వచ్చితివో, నీ దేశమేదో, నీ జన
మేదో, యీ సంగతియంతయు మాకు తెలియజేయు
9 మనగా । అతడు వారితో ఇట్లనెను—నేను హెబ్రీ
యుడను; సముద్రమునకును భూమికిని సృష్టికర్తయై
ఆకాశమందుండు దేవుడైయున్న యెహోవాయందు
10 నేను భయభక్తులు గలవాడనై యున్నాను. । తాను
యెహోవా సన్నిధిలోనుండి పారిపోవుచున్నట్టు
అతడు ఆ మనుష్యులకు తెలియజేసియుండెను గనుక
వారా సంగతి తెలిసికొని మరింత భయపడి—నీవు
11 చేసిన పని ఏమని అతని నడిగిరి. । అప్పుడు వారు—
సముద్రము పొంగుచున్నది, తుఫాను అధికమా
చున్నది, సముద్రము మామీదికి రాకుండ నిమ్మళించు
నట్లు మేము నీకేమి చేయవలెనని అతని నడుగగా
12 యోనా । — నన్నుబట్టియే యీ గొప్పతుఫాను
మీమీదికివచ్చెనని నాకు తెలిసియున్నది; నన్ను ఎత్తి
సముద్రములో పడవేయుడి, అప్పుడు సముద్రము
మీమీదికి రాకుండ నిమ్మళించునని అతడు వారితో
చెప్పినను । వారు ఓడను దరికి తెచ్చుటకు తెడ్లను 13
బహు బలముగా వేసిరిగాని గాలి తమకు ఎదురై
తుఫాను బలముచేత సముద్రము పొంగియుండుట
వలన వారి ప్రయత్నము వ్యర్థమాయెను. । కాబట్టి 14
వారు—యెహోవా, నీ చిత్తప్రకారముగా నీవే దీని
చేసితివి; ఈ మనుష్యునిబట్టి మమ్మును లయము చేయ
కుందువు గాక; నిర్దోషిని చంపితిరన్న నేరము మామీద
మోపకుందువు గాక అని యెహోవాకు మనవి చేసి
కొని । యోనాను ఎత్తి సముద్రములో పడవేసిరి; 15
పడవేయగానే సముద్రము పొంగకుండ ఆగెను. ।
ఇది చూడగా ఆ మనుష్యులు యెహోవాకు మిగుల 16
భయపడి, ఆయనకు బలి అర్పించి మ్రొక్కుబళ్లు
చేసిరి. । గొప్ప మత్స్యము ఒకటి యోనాను మ్రింగ 17
వలెనని యెహోవా నియమించియుండగా యోనా
మూడు దినములు ఆ మత్స్యముయొక్క కడుపులో
నుండెను.

ఆ మత్స్యము కడుపులోనుండి యోనా యెహో 2
వాను ఈలాగున ప్రార్థించెను. । —నేను ఉపద్రవ 2
ములో ఉండి యెహోవాకు మనవిచేయగా ఆయన
నాకు ప్రత్యుత్తరమిచ్చెను; పాతాళగర్భములోనుండి
నేను కేకలువేయగా నీవు నా ప్రార్థన నంగీకరించి
యున్నావు. । నీవు నన్ను అగాధమైన సముద్రగర్భ 3
ములో పడవేసియున్నావు, ప్రవాహములు నన్ను
చుట్టుకొనియున్నవి, నీ తరంగములును నీ కరుళ్లును
నన్ను కప్పియున్నవి. । నీ సన్నిధిలోనుండి నేను వెలి 4
వేయబడినను, నీ పరిశుద్ధాలయముతట్టు మరల చూచెద
ననుకొంటిని. । ప్రాణాంతము వచ్చునంతగా జలములు 5
నన్ను చుట్టుకొనియున్నవి, సముద్రాగాధము నన్ను
ఆవరించియున్నది, సముద్రపునాచు నా తలకు చుట్టు
కొనియున్నది. । నేను మరెన్నటికిని ఎక్కిరాకుండ 6
భూమి గడియలు వేయబడియున్నవి; పర్వతముల
పునాదులలోనికి నేను దిగియున్నాను, నా దేవా,
యెహోవా, నీవు నా ప్రాణము కూపములోనుండి
పైకి రప్పించియున్నావు. । కూపములోనుండి నా 7
ప్రాణము నాలో మూర్ఛిల్లగా నేను యెహో
వాను జ్ఞాపకము చేసికొంటిని; నీ పరిశుద్ధాలయము
లోనికి నీయొద్దకు నా మనవి వచ్చెను । అసత్యమై 8

# మీకా



1 యోతాము ఆహాజు హిజ్కియా అను యూదా
రాజుల దినములలో షోమ్రోనును గూర్చియు
యెరూషలేమునుగూర్చియు దర్శనరీతిగా మోరష్తీయు
డైన మీకాకు ప్రత్యక్షమైన యెహోవా వాక్కు.
2 సకల జనులారా, ఆలకించుడి; భూమీ, నీవును
నీలోనున్న సమస్తమును చెవి యొగ్గి వినుడి; ప్రభు
వగు యెహోవా మీమీద సాక్ష్యము పలుకబోవు
చున్నాడు, పరిశుద్ధాలయములోనుండి ప్రభువు మీ
3 మీద సాక్ష్యము పలుకబోవుచున్నాడు. । యెహోవా
తన స్థలమువిడిచి బయలు వెడలుచున్నాడు, ఆయన దిగి
భూమియొక్క ఉన్నతస్థలములమీద నడువబోవు
4 చున్నాడు. । ఆయన నడువగా అగ్నికి మైనము
కరుగునట్లు పర్వతములు కరిగిపోవును, లోయలు విడి
పోవును, వాటిమీద పోసిననీరు పారునట్లు అవి
5 కరిగి పారును. । యాకోబు సంతతి నామీద చేసిన
తిరుగబాటునుబట్టియు, ఇశ్రాయేలు సంతతివారి
పాపములనుబట్టియు ఇదంతయు సంభవించును.
యాకోబు సంతతివారు తిరుగబాటు చేయుటకు
మూలమేది? అది షోమ్రోను కాదా? యూదావారి
ఉన్నతస్థలములు ఎక్కడివి? యెరూషలేములోనివే
6 కావా? । కాబట్టి నేను షోమ్రోనును చేనిలోనున్న
రాళ్లకుప్పవలె చేసెదను, ద్రాక్షచెట్లు నాటదగిన స్థల
ముగా దాని నుంచెదను, దాని పునాదులు బయలు
పడునట్లు దాని కట్టడపు రాళ్లను లోయలో పార
7 బోసెదను, । దాని చెక్కుడు ప్రతిమలు పగులగొట్ట
బడును, దాని కానుకలు అగ్నిచేత కాల్చబడును,
అది పెట్టుకొనిన విగ్రహములను నేను పాడుచేతును,
అది వేశ్యయై సంపాదించుకొనిన జీతముపెట్టి వాటిని
కొనుక్కొనెను గనుక అవి వేశ్యయగుదాని జీతముగా
8 మరల ఇయ్యబడును. । దీని చూచి నేను కేకలు
వేయుచు ప్రలాపించుచున్నాను, ఏమియు లేకుండ
దిగంబరినై నక్కలు అరచునట్లు అరచుచున్నాను
9 నిప్పుకోడి మూల్గునట్లు మూల్గుచున్నాను. । దానికి
తగిలిన గాయములు మానకూడనివి, అవి యూదాకు
తగిలియున్నవి, నా జనుల గుమ్మములవరకు యెరూష
10 లేమువరకు అవి వచ్చియున్నవి. । గాతు పట్టణములో
దీనిని తెలియజెప్పవద్దు; అచ్చట ఎంతమాత్రమును
ఏడ్వవద్దు; బేత్లెయప్రలో నేను ధూళిలో పడి పొర్లి
తిని. । షాపీరు నివాసీ, దిగంబరివై అవమానమునొంది
వెళ్లిపొమ్ము; జయనానువారు బయలుదేరక నిలిచిరి,
ప్రలాపము బేతేజెలులో మొదలుపెట్టి జరుగు
చున్నది. । మారోతువారు (తాము పోగొట్టుకొనిన) 12
మేలునుబట్టి బాధనొందుచున్నారు. । లాకీషు నివాసు 13
లారా, రథములకు యుద్ధపు గుర్రములను కట్టుడి;
ఇశ్రాయేలువారు చేసిన తిరుగబాటు క్రియలు
నీయందు కనబడుటయే నీ పాపమునకు ప్రథమ
కారణముగా ఉండును. । మోరెషెత్గతు విషయములో 14
మీరు విడుదలకై వీడుకోలు ఇయ్యవలసి వచ్చును, అక్జీబు
ఇండ్లు ఇశ్రాయేలు రాజులకు పనికిరానివై యుం
డును. । మారేషా నివాసీ, నీకు హక్కుదారుడగు 15
ఒకని నీయొద్దకు తోడుకొని వత్తును, ఇశ్రాయేలీయుల
లోని ఘనులు అదుల్లాముకు పోవుదురు. । (సీయోనూ) 16
నీకు ప్రియులగువారు నీయొద్ద నుండకుండ పట్టబడి
యున్నారు; నీ తల బోడిచేసికొనుము, బోరువగద్ద
వలె నీ బోడితనము కనుపరచుకొనుము.

మంచములమీద పరుండి మోసపు క్రియలు 2
యోచించుచు దుష్కార్యములు చేయువారికి శ్రమ;
ఆలాగు చేయుట వారి స్వాధీనములో నున్నది గనుక
వారు ప్రొద్దు పొడవగానే చేయుదురు. । వారు 2
భూములు ఆశించి పట్టుకొందురు, ఇండ్లు ఆశించి
ఆక్రమించుకొందురు, ఒక మనిషిని వాని కుటుంబ
మును ఇంటివానిని వాని స్వాస్థ్యమును అన్యాయ
ముగా ఆక్రమింతురు. । కాబట్టి యెహోవా సెల 3
విచ్చునదేమనగా — గొప్ప అపాయకాలము వచ్చు
చున్నది. దాని క్రిందనుండి తమ మెడలను తప్పించు
కొనలేకుండునంతగాను, గర్వముగా నడువ లేకుండు
నంతగాను నేను ఈ వంశమునకు కీడు చేయనుద్దేశించు
చున్నాను. । ఆ దినమున జనులు మిమ్మునుగురించి 4
బహుగా అంగలార్చుచు సామెత నెత్తుదురు. వారు
చెప్పు సామెత ఏదనగా—మనము బొత్తిగా చెడిపోయి
యున్నామనియు, ఆయన నా జనుల స్వాస్థ్యమును
అన్యులకిచ్చియున్నాడనియు, మనయొద్ద నుండకుండ
ఆయన దాని తీసివేసెనే యనియు, మన భూములను
తిరుగబడినవారికి ఆయన విభజించి యున్నాడనియు
ఇశ్రాయేలీయులు అనుకొనుచున్నట్లు జనులు చెప్పు
కొందురు). । చీట్లువేయగా యెహోవా సమాజ 5
ములో మీరు పాలుపొందునట్లు నూలు వేయువా
డొకడును ఉండడు. । మీరు దీని ప్రవచింపవద్దని 6
వారు ప్రకటన చేయుదురు, ప్రవచింపనియెడల
అవమానము కలుగక మానదు. । యాకోబు సంతతి 7
వారని పేరు పెట్టబడినవారలారా, యెహోవా
దీర్ఘశాంతము తగ్గిపోయెనా? యీ క్రియలు ఆయన

చేత జరిగెనా? యథార్థముగా ప్రవర్తించువానికి నా
8 మాటలు క్షేమసాధనములు కావా? । ఇప్పుడేగదా
నా జనులు శత్రువులైరి; నిర్భయముగా సంచరించు
వారిని చూచి వారు కట్టు పంచెలను మాత్రము విడిచి
9 వారి పైవస్త్రములను లాగుకొందురు. । వారికిష్టమైన
యిండ్లలోనుండి నా జనులయొక్క స్త్రీలను మీరు
వెళ్లగొట్టుదురు, వారి బిడ్డల యొద్దనుండి నేనిచ్చిన
ఘనతను ఎన్నడును లేకుండ మీరు ఎత్తికొని పోవు
10 దురు. । ఈ దేశము మీ విశ్రాంతిస్థలముకాదు;
మీరు లేచి వెళ్లిపోవుడి, మీకు నాశనము నిర్మూల
నాశనము కలుగునంతగా మీరు అపవిత్రక్రియలు
11 జరిగించితిరి. । వ్యర్థమైన మాటలు పలుకుచు, అబద్ధి
కుడై ద్రాక్షారసమునుబట్టియు మద్యమునుబట్టియు
నేను మీకు ఉపన్యాసము చేయుదునని అబద్ధము
చెప్పుచు ఒకడు వచ్చినయెడల వాడే ఈ జనులకు
ప్రవక్తయగును.
12 యాకోబు సంతతీ, తప్పక నేను మిమ్మునందరిని
పోగుచేయుదును, ఇశ్రాయేలీయులలో శేషించిన
వారిని తప్పక సమకూర్చుదును. బొస్రా గొఱ్ఱెలు
కూడునట్లు వారిని సమకూర్చుదును, తమ మేతస్థలము
లలో వారిని పోగుచేతును, గొప్ప ధ్వని పుట్టునట్లుగా
13 మనుష్యులు విస్తారముగా కూడుదురు. । ప్రాకార
ములు పడగొట్టువాడు వారికి ముందుగా పోవును,
వారు గుమ్మములు పడగొట్టి దాని ద్వారా దాటిపోవు
దురు, వారి రాజు వారికి ముందుగా నడుచును,
యెహోవా వారికి నాయకుడుగా ఉండును.

**3** నేనీలాగు ప్రకటించితిని — యాకోబు సంతతి
యొక్క ప్రధానులారా, ఇశ్రాయేలీయుల అధిపతు
లారా, ఆలకించుడి; న్యాయము ఎరిగియుండుట మీ
2 ధర్మమే గదా. । అయినను మేలుచేయుటకు మనస్సు
లేనివారై కీడుచేయ నిష్టపడుదురు, నా జనుల చర్మము
ఊడదీసి వారి యెముకలమీది మాంసమును చీల్చు
3 చుందురు. । నా జనుల మాంసమును భుజించుచు
వారి చర్మమును ఒలిచి వారి యెముకలను విరిచి,
ఒకడు కుండలో వేయు మాంసమును ముక్కలు
చేయునట్టు బానలో వేయు మాంసముగా వారిని
4 తుత్తునియలుగా పగులగొట్టియున్నారు. । వారు దుర్మా
ర్గత ననుసరించి నడుచుకొనియున్నారు, గనుక వారు
యెహోవాకు మొఱ్ఱపెట్టినను ఆయన వారి మనవి
అంగీకరింపక ఆ కాలమందు వారికి కనబడకుండ
5 తన్ను మరుగుచేసికొనును. । తమకు దొరికిన ఆహా
రము నములుచు సమాధానమని ప్రకటించువారును,
ఒకడు తమ నోట ఆహారము పెట్టనియెడల అతని
మీద యుద్ధము ప్రకటించువారునై నా జనులను
పోరపెట్టు ప్రవక్తలనుగూర్చి యెహోవా సెలవిచ్చున
6 దేమనగా । —మీకు దర్శనము కలుగకుండ రాత్రి
కమ్మును, సోదెచెప్పకుండ మీకు చీకటి కలుగును;
ఇట్టి ప్రవక్తలకు సూర్యుడు కనబడకుండ అస్తమించును,
పగలు చీకటిపడును । అప్పుడు దర్శకులు సిగ్గునొందు 7
దురు, సోదెగాండ్లు తెల్లబోవుదురు, దేవుడు తమకు
ప్రత్యుత్తరమియ్యకుండుట చూచి నోరు మూసికొం
దురు. । నేనైతే యాకోబు సంతతివారికి తమ దోష 8
మును ఇశ్రాయేలీయులకు తమ పాపమును కనుపరచు
టకై, యెహోవా ఆత్మావేశముచేత బలముతోను
తీర్పు తీర్చు శక్తితోను ధైర్యముతోను నింపబడిన
వాడనై యున్నాను. । యాకోబు సంతతివారి ప్రధాను 9
లారా, ఇశ్రాయేలీయుల యధిపతులారా, న్యాయ
మును తృణీకరించుచు గుర్తిని నీతిగా ఎంచువార
లారా, యీ మాట ఆలకించుడి. । నరహత్య చేయుట 10
చేత సీయోనును మీరు కట్టుదురు. దుష్టత్వము జరి
గించుటచేత యెరూషలేమును మీరు కట్టుదురు. ।
జనుల ప్రధానులు లంచము పుచ్చుకొని తీర్పు తీర్చు 11
దురు, వారి యాజకులు కూలికి బోధింతురు, ప్రవక్తలు
ద్రవ్యముకొరకు సోదె చెప్పుదురు; వారు యెహో
వాను ఆధారము చేసికొని—యెహోవా మన మధ్య
నున్నాడు గదా, యే కీడును మనకు రానేరదని యను
కొందురు. । కాబట్టి మీను దున్నబడునట్లుగా మిమ్మును 12
బట్టి సీయోను దున్నబడును, యెరూషలేము రాళ్ల
కుప్పలగును, మందిరమున్న పర్వతము అరణ్యములోని
ఉన్నతస్థలములవలె అగును.

అంత్యదినములలో యెహోవా మందిరపర్వతము **4**
పర్వతముల శిఖరమున స్థిరపరచబడి కొండలకంటె
ఎత్తుగా ఎత్తబడగా ప్రవాహము వచ్చినట్లు జనులు
దానిలోకి వత్తురు. । కాబట్టి ఆ కాలమున అన్యజను 2
లనేకులు వచ్చి — సీయోనులోనుండి ధర్మశాస్త్రమును,
యెరూషలేములోనుండి యెహోవా వాక్కును
బయలువెళ్లును; యాకోబు దేవుని మందిరమునకు
యెహోవా పర్వతమునకు మనము వెళ్లుదము రండి,
ఆయన తన మార్గములవిషయమై మనకు బోధించును,
మనము ఆయన త్రోవలలో నడుచుకొందము అని
చెప్పుకొందురు. । ఆయన మధ్యవర్తియై అనేక జనము 3
లకు న్యాయము తీర్చును, దూరమున నివసించు బలము
గల అన్యజనులకు తీర్పు తీర్చును, వారు తమ ఖడ్గము
లను నాగటి నక్కులుగాను తమ యీటెలను మచ్చు
కత్తులుగాను సాగకొట్టుదురు, జనముమీదికి జనము
ఖడ్గము ఎత్తక యుండును, యుద్ధముచేయ నేర్చు
కొనుట జనులు ఇక మానివేతురు. । ఎవరి భయము 4
లేకుండ ప్రతివాడును తన ద్రాక్షచెట్టుక్రిందను తన
అంజూరపు చెట్టుక్రిందను కూర్చుండును; సైన్యముల
కధిపతియగు యెహోవా మాట యిచ్చియున్నాడు. ।
సకల జనములు తమ తమ దేవతల నామము స్మరిం 5
చుచు నడుచుకొందురు, మనమైతే మన దేవుడైన

యెహోవా నామము నెల్లప్పుడును స్మరించుకొం
దుము.

ఆ దినమున నేను కుంటివారిని పోగుచేయుదును,
అవతలకు వెళ్లగొట్టబడినవారిని బాధింపబడినవారిని
సమకూర్చుదును; ఇదే యెహోవా వాక్కు. । కుంటి
వారిని శేషముగాను దూరమునకు వెళ్లగొట్టబడినవారిని
బలమైన జనముగాను నేను చేతును, యెహోవా
సీయోను కొండయందు ఇప్పటినుండి శాశ్వతకాల
పర్యంతము వారికి రాజుగా ఉండును. । మందల
గోపురమా, సీయోను కుమార్తె పర్వతమా, మునుపటి
లాగున యెరూషలేము కుమార్తెమీద నీకు ప్రభుత్వము
కలుగును; । నీవెందుకు కేకలువేయుచున్నావు? నీకు
రాజు లేకపోవుటచేతనే, నీ ఆలోచనకర్తలు నశించి
పోవుటచేతనే ప్రసూతి స్త్రీకి వచ్చిన వేదనలు నీకు
వచ్చినవా? । సీయోను కుమారీ, ప్రసూతిస్త్రీవలెనే నీవు
వేదనపడి ప్రసవించుము, నీవు పట్టణము విడిచి
బయట వాసము చేతువు, బాబెలుపురమువరకు నీవు
వెళ్లుదువు, అక్కడనే నీవు రక్షణ నొందుదువు, అక్క
డనే యెహోవా నీ శత్రువులచేతిలోనుండి నిన్ను
విమోచించును. । ఇప్పుడు మనము చూచుచుండగా
—సీయోను అపవిత్రపరచబడు గాక అని చెప్పు
కొనుచు అన్యజనులనేకులు నీమీదికి కూడివచ్చి
యున్నారు. । కళ్లములో ఒకడు పనలు కూర్చునట్టు
యెహోవా వారిని సమకూర్చును, అయితే వారు
ఆయన తలంపులు తెలిసికొనకున్నారు, ఆయన ఆలో
చన వారు గ్రహింపకున్నారు. । సీయోను కుమారీ,
నీ శృంగము ఇనుపదిగాను నీ డెక్కలు ఇత్తడివిగాను
నేను చేయుచున్నాను, లేచి కళ్లము త్రొక్కుము,
అనేక జనములను నీవు అణగద్రొక్కుదువు, వారికి
దొరికిన లాభమును నేను యెహోవాకు ప్రతిష్ఠించు
దును, వారి ఆస్తిని సర్వలోకనాథునికి ప్రతిష్ఠించు
దును.

అయితే సమూహములుగా కూడుదానా, సమూ
హములుగా కూడుము; శత్రువులు మన పట్టణము
ముట్టడి వేయుచున్నారు, వారు ఇశ్రాయేలీయుల
న్యాయాధిపతిని కర్రతో చెంపమీద కొట్టు
చున్నారు.

బేత్లెహేము ఎఫ్రాతా, యూదావారి కుటుంబ
ములలో నీవు స్వల్పగ్రామమైనను నాకొరకు ఇశ్రా
యేలీయులను ఏలబోవువాడు నీలోనుండి వచ్చును;
పురాతనకాలము మొదలుకొని శాశ్వతకాలము
ఆయన ప్రత్యక్షమగుచుండెను. । కాబట్టి ప్రసవమగు
స్త్రీ పిల్లను కనువరకు ఆయన వారిని అప్పగించును,
అప్పుడు అతని సహోదరులలో శేషించినవారును
ఇశ్రాయేలీయులతోకూడ తిరిగి వత్తురు. । అతడు
నిలిచి యెహోవా బలము పొంది తన దేవుడైన
యెహోవా నామ మాహాత్మ్యమునుబట్టి తన మందను
మేపును. కాగా వారు నిలుతురు, అతడు భూమ్యం
తములవరకు ప్రబలుడగును, । అతడు సమాధానము 5
నకు కారకుడగును, అష్షూరు మన దేశములో చొర
బడి మన నగరులలో ప్రవేశింపగా వాని నెదిరించు
టకు మేము ఏడుగురు గొఱ్ఱెకాపరులను ఎనమండు
గురు ప్రధానులను నియమింతుము. । వారు అష్షూరు 6
దేశమును, దాని గుమ్మములవరకు నిమ్రోదుదేశమును
ఖడ్గముచేత మేపుదురు, అష్షూరీయులు మన దేశ
ములో చొరబడి మన సరిహద్దులలో ప్రవేశించి
నప్పుడు అతడీలాగున మనలను రక్షించును. । యాకోబు 7
సంతతిలో శేషించినవారు యెహోవా కురిపించు
మంచువలెను, మనుష్య ప్రయత్నములేకుండను నరుల
యోచన లేకుండను గడ్డిమీద పడు వర్షమువలెను
ఆయా జనములమధ్య నుందురు. । యాకోబు సంత 8
తిలో శేషించినవారు అన్యజనులమధ్యను అనేక జన
ములలోను అడవిమృగములలో సింహమువలెను, ఎవ
డును విడిపింపకుండ లోపలికి చొచ్చి గొఱ్ఱెమంద
లను త్రొక్కి చీల్చు కొదమసింహమువలెను ఉందురు. ।
నీ హస్తము నీ విరోధులమీద ఎత్తబడియుండు గాక, 9
నీ శత్రువులందరు నశింతురు గాక.

ఆ దినమున నేను నీలో గుఱ్ఱములుండకుండ 10
వాటిని బొత్తిగా నాశనము చేతును, నీ రథములను
మాపివేతును, । నీ దేశమందున్న పట్టణములను నాశ 11
నముచేతును, నీ కోటలను పడగొట్టుదును, నీలో
చిల్లంగివారు లేకుండ నిర్మూలముచేతును. । మేఘము 12
లను చూచి మంత్రించువారు ఇక నీలో ఉండరు. । నీ 13
చేతిపనికి నీవు మ్రొక్కకుండునట్లు చెక్కిన విగ్రహ
ములను దేవతాస్తంభములను నీ మధ్య ఉండకుండ
నాశనముచేతును, । నీ మధ్యను దేవతావనములుండ 14
కుండ వాటిని పెల్లగింతును, నీ పట్టణములను పడ
గొట్టుదును. । నేను ఆత్యాగ్రహము తెచ్చుకొని నా 15
మాట ఆలకించని జనములకు ప్రతికారము చేతును;
ఇదే యెహోవా వాక్కు.

యెహోవా సెలవిచ్చు మాట ఆలకించుడి—నీవు 6
వచ్చి పర్వతములను సాక్ష్యముపెట్టి వ్యాజ్యమాడుము,
కొండలకు నీ స్వరము వినబడనిమ్ము. । తన జనులమీద 2
యెహోవాకు వ్యాజ్యము కలదు, ఆయన ఇశ్రా
యేలీయులమీద వ్యాజ్యమాడుచున్నాడు; నిశ్చల
ములై భూమికి పునాదులుగా ఉన్న పర్వతములారా,
యెహోవా ఆడు వ్యాజ్యము ఆలకించుడి. । నా 3
జనులారా, నేను మీకేమి చేసితిని? మిమ్ము నేలాగు
ఆయాసపరచితిని? అది నాతో చెప్పుడి. । ఐగుప్తు 4
దేశములోనుండి నేను మిమ్మును రప్పించితిని, దాస
గృహములోనుండి మిమ్మును విమోచించితిని, మిమ్మును
నడిపించుటకై మోషే అహరోను మిర్యాములను

5 పంపించితిని. । నా జనులారా, యెహోవా నీతి
కార్యములను మీరు గ్రహించునట్లు మోయాబు
రాజైన బాలాకు యోచించినదానిని, షిత్తీము మొదలు
కొని గిల్గాలువరకును (జరిగినవాటిని), బెయోరు
కుమారుడైన బిలాము అతనికి ప్రత్యుత్తరముగా
చెప్పిన మాటలను మనస్సునకు తెచ్చుకొనుడి.
6 ఏమి తీసికొని వచ్చి నేను యెహోవాను దర్శిం
చుదును? ఏమి తీసికొని వచ్చి మహోన్నతుడైన దేవుని
సన్నిధిని నమస్కారము చేతును? దహనబలులను
7 ఏడాది దూడలను అర్పించి దర్శింతునా? । వేలకొలది
పొట్టేళ్లను వేలాది నదులంత విస్తారమైన తైలమును
ఆయనకు సంతోషము కలుగజేయునా? నా అతిక్ర
మమునకై నా జ్యేష్ఠపుత్రుని నేనిత్తునా? నా పాప
8 పరిహారమునకై నా గర్భ ఫలమును నేనిత్తునా? । మను
ష్యుడా, యేది ఉత్తమమో అది నీకు తెలియజేయబడి
యున్నది; న్యాయముగా నడుచుకొనుటయు, కని
కరము చూపగోరుటయు, దీనమనస్సుకలిగి నీ దేవుని
యెదుట ప్రవర్తించుటయు, ఇంతేగదా యెహోవా
నిన్నడుగుచున్నాడు.
9 ఆలకించుడి; యెహోవా పట్టణమునకు ప్రక
టన చేయుచున్నాడు. జ్ఞానముగలవాడు నీ నామ
మును లక్ష్యపెట్టును, శిక్షనుగూర్చిన వార్తను శిక్షను
10 నిర్ణయించినవానిగూర్చిన వార్తను ఆలకించుడి. । అన్యా
యము చేయువారి యిండ్లలో అన్యాయము చేత
సంపాదించిన సొత్తులును, చిన్నదిగా చేయబడిన
11 హేయమైన కొలయు ఉన్నవి గదా. । తప్పుత్రా
సును తప్పురాళ్లుగల సంచియు ఉంచుకొని నేను
12 పవిత్రుడను అగుదునా? । వారిలోని ఐశ్వర్యవంతులు
ఎడతెగక బలాత్కారము చేయుదురు, పట్టణస్థులు
అబద్ధమాడుదురు, వారి నోటిలోని నాలుక కపట
13 ముగా మాటలాడును. । కాబట్టి నీవు బాగుపడకుండ
నేను నీ పాపములనుబట్టి నిన్ను పాడుచేసి మొత్తు
14 దును. । నీవు భోజనము చేసినను నీకు తృప్తికానే
రదు, నీవెప్పుడు పస్తుగానే యుందువు, నీవేమైన తీసి
కొని పోయినను అది నీకుండదు, నీవు భద్రముచేసి
కొని కొంచుపోవుదానిని దోపుడుకు నేనప్పగిం
15 తును. । నీవు విత్తనము విత్తుదువు గాని కొయ్యక
యుందువు, ఒలీవపండ్లను ద్రాక్షపండ్లను త్రొక్కు
దువు గాని తైలము పూసికొనకయు ద్రాక్షారసము
16 పానము చేయకయు ఉందువు. । ఏలయనగా మీరు
ఒమ్రీ నియమించిన కట్టడల నాచరించుచు, అహాబు
ఇంటివారు చేసిన క్రియలన్నిటి ననుసరించుచు వారి
ఆలోచనలనుబట్టి నడుచుచున్నారు గనుక నా జనులకు
సిన అవమానమును మీరు పొందగా మిమ్మును
ు జనులుగాను పట్టణ నివాసులను అప
గాను చేయబోవుచున్నాను.

వేసవికాలపు పండ్లను ఏరుకొనిన తరువాతను, 7
ద్రాక్షపండ్ల పరిగె ఏరుకొనిన తరువాతను ఏలాగుం
డునో నా స్థితి ఆలాగే యున్నది. ద్రాక్షపండ్ల
గెల యొకటియు లేకపోయెను, నా ప్రాణమున
కిష్టమైన యొక క్రొత్త అంజూరపుపండైనను లేక
పోయెను. । భక్తుడు దేశములో లేకపోయెను, జను 2
లలో యథార్థపరుడు ఒకడును లేడు, అందరును
ప్రాణహాని చేయుటకు పొంచియుండువారే; ప్రతి
మనుష్యుడును కిరాతుడై తన సహోదరునికొరకు
వలలను ఒగ్గును. । రెండు చేతులతోను కీడు చేయ 3
పూనుకొందురు, అధిపతులు బహుమానము కోరు
దురు, న్యాయాధిపతులు లంచము పుచ్చుకొందురు,
గొప్పవారు తమ మోసపు కోరికను తెలియజేయు
దురు, ఆలాగున వారు ఏకపట్టుగానుండి దాని ముగిం
తురు. । వారిలో మంచివారు ముండ్లచెట్టువంటి 4
వారు, వారిలో యథార్థవంతులు ముండ్లకంచెకంటెను
ముండ్లుముండ్లుగా నుందురు, నీ కాపరుల దినము నీవు
శిక్షనొందు దినము వచ్చుచున్నది. ఇప్పుడే జనులు
కలవరపడుచున్నారు. । స్నేహితునియందు నమ్మిక 5
యుంచవద్దు, ముఖ్యస్నేహితుని నమ్ముకొనవద్దు, నీ
కౌగిటిలో పండుకొనియున్న దానియెదుట నీ పెద
వుల ద్వారమునకు కాపుపెట్టుము. । కుమారుడు 6
తండ్రిని నిర్లక్ష్యపెట్టుచున్నాడు, కుమార్తె తల్లిమీది
కిని కోడలు అత్తమీదికిని లేచెదరు, ఎవరి ఇంటివారు
వారికే విరోధులగుదురు.

అయినను యెహోవాకొరకు నేను ఎదురు 7
చూచెదను, రక్షణకర్తయగు నా దేవునికొరకు నేను
కనిపెట్టియుందును, నా దేవుడు నా ప్రార్థన నాల
కించును. । నా శత్రువా, నామీద అతిశయింపవద్దు, 8
నేను క్రింద పడినను తిరిగి లేతును; నేను అంధకార
మందు కూర్చున్నను యెహోవా నాకు వెలుగుగా
నుండును. । నేను యెహోవా దృష్టికి పాపము 9
చేసితిని గనుక ఆయన నా పక్షమున వ్యాజ్యమాడి
నా పక్షమున న్యాయము తీర్చుపర్యంతము నేను
ఆయన కోపాగ్నిని సహింతును; ఆయన నన్ను
వెలుగులోకి రప్పించును, ఆయన నీతిని నేను చూచె
దను. । నా శత్రువు దాని చూచును. — నీ దేవుడైన 10
యెహోవా యెక్కడనని నాతో అనినది అవ
మానము నొందును, అది నా కండ్లకు అగపడును,
ఇప్పుడు అది వీధిలోనున్న బురదవలె త్రొక్క
బడును. । నీ గోడలు మరల కట్టించు దినము వచ్చు 11
చున్నది, అప్పుడు నీ సరిహద్దు విశాలపరచబడును. ।
ఆ దినమందు అష్షూరు దేశమునుండియు, ఐగుప్తు 12
దేశపు పట్టణములనుండియు, ఐగుప్తు మొదలుకొని
(ఫరాతు) నదివరకు ఉన్న ప్రదేశమునుండియు, ఆ
యా సముద్రముల మధ్యదేశములనుండియు, ఆ యా

పర్వతముల మధ్యదేశములనుండియు జనులు నీయొద్దకు
13 వత్తురు. । అయితే దేశనివాసులు చేసిన క్రియలను
బట్టి దేశము పాడగును.
14 నీ చేతికఱ్ఱ తీసికొని నీ జనులను కర్మెలుకు చేరిన
అడవిలో ప్రత్యేకముగా నివసించు నీ స్వాస్థ్యపు
వారిని మేపుము. బాషానులోను గిలాదులోను వారు
15 పూర్వకాలమున మేసినట్టు మేయుదురు. । ఐగుప్తు
దేశములోనుండి నీవు వచ్చినప్పుడు జరిగినట్టుగా
16 నేను జనులకు అద్భుతములను కనుపరతును. । అన్య
జనులు అది చూచి తమకు కలిగిన బలమంత కొంచె
మని సిగ్గుపడి నోరు మూసికొందురు, వారి చెవులు
17 చెవుడెక్కిపోవును. । సర్పములాగున వారు మన్ను
నాకుదురు, భూమిమీద ప్రాకు పురుగులవలె తమ
యిరవులలోనుండి వణకుచు ప్రాకి వత్తురు, మన దేవు
డైన యెహోవాయొద్దకు భయపడుచు వత్తురు,
నిన్నుబట్టి భయము నొందుదురు. । తన స్వాస్థ్య 18
ములో శేషించినవారి దోషమును పరిహరించి, వారు
చేసిన అతిక్రమముల విషయమై వారిని క్షమించు
దేవుడవైన నీతో సముడైన దేవుడున్నాడా? ఆయన
కనికరము చూపుటయందు సంతోషించువాడు గనుక
నిరంతరము కోపముంచడు.। ఆయన మరల మనయందు 19
జాలిపడును, మన దోషములను అణచివేయును, వారి
పాపములన్నిటిని సముద్రపు అగాధములలో నీవు పడ
వేతువు. । పూర్వకాలమున నీవు మా పితరులైన 20
అబ్రాహాము యాకోబులకు ప్రమాణము చేసిన సత్య
మును కనికరమును నీవు అనుగ్రహింతువు.

# నహూము

1 నీనెవెనుగూర్చిన దేవోక్తి. ఎల్కోషువాడగు నహూ
మునకు కలిగిన దర్శనమును వివరించు గ్రంథము.
2 యెహోవా రోషముగలవాడై ప్రతికారము
చేయువాడు, యెహోవా ప్రతికారము చేయును;
ఆయన మహా క్రోధముగలవాడు, యెహోవా తన
శత్రువులకు ప్రతికారము చేయును, తనకు విరోధు
3 లైనవారిమీద కోపముంచుకొనును. । యెహోవా
దీర్ఘశాంతుడు, మహా బలముగలవాడు, ఆయన దోషు
లను నిర్దోషులుగా ఎంచడు, యెహోవా తుఫాను
లోను సుడిగాలిలోను వచ్చువాడు; మేఘములు
4 ఆయనకు పాదధూళిగానున్నవి. । ఆయన సముద్ర
మును గద్దించి ఆరిపోజేయును, నదులన్నిటిని ఆయన
యెండిపోజేయును, బాషానును కర్మెలును వాడిపో
5 వును, లెబానోను పుష్పము వాడిపోవును. । ఆయ
నకు భయపడి పర్వతములు కంపించును, కొండలు
కరిగిపోవును, ఆయన యెదుట భూమి కంపించును,
లోకమును అందలి నివాసులందరును వణకుదురు. ।
6 ఆయన ఉగ్రతను సహింపగలవాడెవడు? ఆయన
కోపాగ్ని యెదుట నిలువగలవాడెవడు? ఆయన
కోపము అగ్నివలె పారును, ఆయన కొండలను
7 కొట్టగా అవి బద్దలగును. । యెహోవా ఉత్తముడు,
శ్రమ దినమందు ఆయన ఆశ్రయదుర్గము, తన
యందు నమ్మికయుంచువారిని ఆయన ఎరుగును. ।
8 ప్రళయజలమువలె ఆయన ఆ పురస్థానమును నిర్మూ
లముచేయును, తన శత్రువులు అంధకారములో దిగు
9 వరకు ఆయన వారిని తరుమును. । యెహోవాను
గూర్చి మీ అభిప్రాయమేమి? బాధ రెండవమారు
రాకుండ ఆయన బొత్తిగా దాని నివారణచేయును. ।
10 ముండ్లకంపవలె శత్రువులు కూడినను వారు ద్రాక్షా
రసము త్రాగి మత్తులైనను ఎండిపోయిన చెత్తవలె
11 కాలిపోవుదురు. । (పురమా) యెహోవామీద దురా
లోచన చేసి వ్యర్థమైనవాటిని బోధించినవాడొకడు
12 నీలోనుండి బయలుదేరియున్నాడు. । యెహోవా
సెలవిచ్చునదేమనగా — వారు విస్తారజనమై పూర్ణ
బలము కలిగియున్నను కోతయందైనట్లు వారు కోయ
బడి నిర్మూలమగుదురు; నేను నిన్ను బాధపరచితిన్నే,
13 నేను నిన్నిక బాధపెట్టను. । వారి కాడిమ్రాను నీమీద
మోపకుండ నేను దాని విరుగగొట్టెదను, వారి
నను నేను తెంపుదును. । (పురమా) యెహోవా
న్నుబట్టి ఆజ్ఞ ఇచ్చునదేమనగా — నీ పేరు పెట్టు
నువారు ఇకను పుట్టక యుందురు, నీ దేవతాలయ
ములో చెక్కబడిన విగ్రహమే గాని పోతపోసిన
ప్రతిమయేగాని యొకటియు లేకుండ అన్నిటిని నాశ
నముచేతును. నీవు పనికిమాలినవాడవు గనుక నేను
నీకు సమాధి సిద్ధపరచుచున్నాను. । సువార్త ప్రకటిం 15
చుచు సమాధాన వర్తమానము తెలియజేయువాని
పాదములు పర్వతములమీద కనబడుచున్నవి.
యూదా, నీ పండుగుల నాచరింపుము, నీ మ్రొక్కు
బళ్లను చెల్లింపుము. వ్యర్థుడు నీ మధ్య నిక సంచ
రించడు, వాడు బొత్తిగా నాశనమాయెను.
లయకర్త నీమీదికి వచ్చుచున్నాడు, నీ దుర్గము 2
నకు కావలికాయుము, మార్గములో కావలియుం
డుము, నడుము బిగించుకొని బహు బలముగా ఎదిరిం
చుము, । దోచుకొనువారు వారిని దోపుడుసొమ్ముగా 2
పట్టుకొనినను, వారి ద్రాక్షావల్లులను నరికివేసినను,
అతిశయాస్పదముగా ఇశ్రాయేలీయులకువలె
యెహోవా యాకోబు సంతతికి మరల అతిశయా
స్పదముగా అనుగ్రహించును. । ఆయన బలాఢ్యుల 3
డాళ్లు ఎరుపాయెను, పరాక్రమశాలులు రక్తవర్ణపు
వస్త్రములు ధరించుకొనియున్నారు, ఆయన సైన్యము
వ్యూహపరచిన దినమున రథభూషణములు అగ్నివలె
మెరియుచున్నవి, సరళదారుమయమైన యీటెలు
ఆడుచున్నవి; । వీధులలో రథములు మిక్కిలి తొంద 4
రగా పోవుచున్నవి, రాజమార్గములలో రథములు
ఒకదానిమీదనొకటి పడుచు పరుగెత్తుచున్నవి, అవి
దివిటీలవలె కనబడుచున్నవి, మెరుపులవలె అవి పరు
గెత్తుచున్నవి, । రాజు తన పరాక్రమశాలులను జ్ఞాప 5
కము చేసికొనగా వారు నడుచుచు పడిపోవుదురు,
ప్రాకారమునకు పరుగెత్తి వచ్చి మ్రాను సిద్ధపరచు
దురు. । నదులదగ్గరనున్న గుమ్మములు తెరువబడు 6
చున్నవి, నగరు పడిపోవుచున్నది. । నిర్ణయమాయెను, 7
అది దిగంబరమై కొనిపోబడుచున్నది, గువ్వలు
మూల్గునట్లు దాని దాసీలు రొమ్ము కొట్టుకొనుచు
మూల్గుచున్నారు. । కట్టబడినప్పటినుండి నీనెవె పట్ట 8
ణము నీటి కొలనువలె ఉండెను; దాని జనులు పారి
పోవుచున్నారు; — నిలువుడి నిలువుడి అని పిలిచినను
తిరిగి చూచువాడొకడును లేడు. । వెండి కొల్లపెట్టుడి, 9
బంగారము కొల్లపెట్టుడి, అది సకలవిధములైన విచి
త్రములగు ఉపకరణములతో నిండియున్నది, అవి
లెక్కలేక యున్నవి. । అది పట్టిదిగాను శూన్యము 10
గాను పాడుగాను అగుచున్నది, (జనుల) హృదయము
కరిగిపోవుచున్నది, మోకాళ్లు వణకుచున్నవి, అందరి

నడుములు బహుగా నొచ్చుచున్నవి, అందరి ముఖ
11 ములు తెల్లబోవుచున్నవి. । సింహముల గుహ యే
మాయెను? సింహపుపిల్లల మేతస్థల మేమాయెను? ఎవ
రును బెదరింపకుండ సింహమును ఆడుసింహమును
సింహపు పిల్లలును తిరుగులాడు స్థలమేమాయెను? ।
12 తన పిల్లలకు కావలసినంత చీల్చివేయుచు, ఆడుసింహ
ములకును కావలసినంత గొంతుక నొక్కి పట్టుచు,
తన గుహలను ఎరతోను తన నివాసములను నేటాడి
13 పట్టిన యెరతోను నింపిన సింహమేమాయెను? । నేను
నీకు విరోధినై యున్నాను, వాటి పొగ పైకెక్కు
నట్లుగా నీ రథములను కాల్చివేసెదను, కత్తి నీ కొదమ
సింహములను మ్రింగివేయును, నీకిక దొరకకుండ
భూమిలోనుండి నీవు పట్టుకొనిన యెరను నేను తీసి
వేతును, నీ దూతల శబ్దము ఇక వినబడదు; ఇదే సైన్య
ములకధిపతియగు యెహోవా వాక్కు.

3 నరహత్య చేసిన పట్టణమా, నీకు శ్రమ; అది ఎడ
తెగక యెర పట్టుకొనుచు మోసముతోను బలాత్కా
2 రముతోను నిండియున్నది. । సారథియొక్క చబుకు
ధ్వనియు చక్రములధ్వనియు గుఱ్ఱముల త్రొక్కుడు
ధ్వనియు వడిగా పరుగెత్తు రథములధ్వనియు వినబడు
3 చున్నవి. । రౌతులు వడిగా పరుగెత్తుచున్నారు, ఖడ్గ
ములు తళతళలాడుచున్నవి, ఈటెలు మెరయుచున్నవి,
చాలామంది హతమవుచున్నారు, చచ్చినవారు కుప్పలు
కుప్పలుగా పడియున్నారు, పీనుగులకు లెక్కయే
లేదు, పీనుగులు కాలికి తగిలి జనులు తొట్రిల్లు
4 చున్నారు. । చక్కనిదానవై వేశ్యవై చిల్లంగితనమందు
జ్ఞానముగలదానవై జారత్వముచేసి జనాంగములమీద
చిల్లంగితనము జరిగించి సంసారములను అమ్మివేసిన
5 దానా, । నీవు చేసిన అధిక జారత్వమునుబట్టి సైన్య
ములకు అధిపతియగు యెహోవా వాక్కు ఇదే—
నేను నీకు విరోధినై యున్నాను, నీ చెంగులు నీ
ముఖముమీదికెత్తి జనములకు నీ మానమును రాజ్యము
6 లకు నీ యవమానమును నేను బయలుపరతును. । పది
మంది యెదుట నీమీద మాలిన్యము వేసి నిన్ను అవ
7 మానపరచెదను. । అప్పుడు నిన్ను చూచువారందరు
నీయొద్దనుండి పారిపోయి—నీనెవె పాడైపోయెనే,
దానికొరకు అంగలార్చువారెవరు? నిన్ను ఓదార్చు
వారిని ఎక్కడనుండి పిలుచుకొని వచ్చెదము అందురు. ।

సముద్రమే తనకు ఆపుగాను సముద్రమే తనకు 8
ప్రాకారముగాను చేసికొని, బహు జనములచేత చుట్ట
బడి నైలునది దగ్గరనుండిన నోఅమోను పట్టణముకంటె
నీవు విశేషమైనదానవా? । కూషీయులును ఐగుప్తీయు 9
లును (దాని) శూరులైరి, వారు విస్తార జనముగా నుం
డిరి, పూతువారును లూబీయులును నీకు సహాయులై
యుండిరి । అయినను అది చెరపట్టబడి కొనిపోబడెను, 10
రాజమార్గముల మొగలయందు శత్రువులు దానిలోని
చిన్న పిల్లలను బండలకువేసి కొట్టి చంపిరి, దాని ఘనుల
మీద చీట్లువేసి దాని ప్రధానులనందరిని సంకెళ్లతో
బంధించిరి. । నీవును మత్తురాలవై దాగుకొందువు, 11
శత్రువు వచ్చుట చూచి ఆశ్రయదుర్గము వెదకుదువు. ।
అయితే నీ కోటలన్నియు అకాలపు పండ్లుగల అం 12
జూరపు చెట్లవలె ఉన్నవి; ఒకడు వాటిని కదిలించ
గానే పండ్లు తినవచ్చినవానినోట పడును; । నీ జనులు 13
స్త్రీలవంటివారైరి, నీ శత్రువులు చొచ్చునట్లు నీ దేశపు
గవునుల యడ్డకఱ్ఱలు తీయబడియున్నవి, అగ్ని నీ
అడ్డగడెలను కాల్చుచున్నది. । ముట్టడివేయు కాలము 14
నకు నీళ్లు చేదుకొనుము, నీ కోటలను బలపరచుము,
జిగటమంటిలోకి దిగి యిటుకల బురదను త్రొక్కుము,
ఆవములను సిద్ధపరచుము. । అచ్చటనే అగ్ని నిన్ను 15
కాల్చివేయును, ఖడ్గము నిన్ను నాశనముచేయును,
గొంగళిపురుగు తినివేయురీతిగా అది నిన్ను తినివే
యును, నీవు సంఖ్యకు గొంగళిపురుగులంత విస్తారము
గాను మిడతలంత విస్తారముగాను ఉండుము. । నీ వర్త 16
కులు లెక్కకు ఆకాశనక్షత్రములకంటె ఎక్కువగా
నున్నను గొంగళిపురుగు వచ్చి అంతయు నాకివేసి
యెగిరిపోవును. । నీవు ఏర్పరచిన శూరులు మిడత 17
లంత విస్తారముగా నున్నారు, నీ సైనికులు చలికాల
మందు కంచెలలో దిగిన గొంగళిపురుగులవలె నున్నారు.
ఎండకాయగా అవి యెగిరిపోవును, అవి ఎక్కడ
వాలినది ఎవరికిని తెలియదు. । అష్షూరు రాజా, నీ 18
కాపరులు నిద్రపోయిరి, నీ ప్రధానులు పండుకొనిరి,
నీ జనులు పర్వతములమీద చెదరిపోయిరి, వారిని
సమకూర్చువాడొకడును లేడు. । నీకు తగిలిన దెబ్బ 19
బహు చెడ్డది, నీ గాయమునకు చికిత్స ఎవడును చేయ
జాలడు, జనులందరు ఎడతెగక నీచేత హింసనొందిరి,
నిన్నుగూర్చిన వార్త వినువారందరు నీ విషయమై
చప్పట్లు కొట్టుదురు.

# హబక్కూకు

1 ప్రవక్తయగు హబక్కూకునొద్దకు దర్శనరీతిగా
వచ్చిన దేవోక్తి.
2 యెహోవా, నేను మొఱ్ఱపెట్టినను నీవెన్నాళ్లు
ఆలకింపకుందువు? బలాత్కారము జరుగుచున్నదని
నేను నీకు మొఱ్ఱపెట్టినను నీవు రక్షింపక యున్నావు.।
3 నన్నెందుకు దోషము చూడనిచ్చుచున్నావు? బాధ
నీవేల ఊరకయే చూచుచున్నావు? ఎక్కడ చూచి
నను నాశనమును బలాత్కారమును అగుపడుచున్నవి,
4 జగడమును కలహమును రేగుచున్నవి. । అందువలన
ధర్మశాస్త్రము నిరర్థకమాయెను, న్యాయము ఎన్నడును
జరుగకుండ మానిపోయెను, భక్తిహీనులు వచ్చి నీతిపరు
లను చుట్టుకొందురు, న్యాయము చెడిపోవుచున్నది. ।
5 అన్యజనులలో జరుగునది చూడుడి, ఆలోచించుడి,
కేవలము విస్మయమునొందుడి. మీ దినములలో నేనొక
కార్యము జరిగింతును, ఆలాగు జరుగునని యొకడు
6 మీకు తెలిపినను మీరతని నమ్మకయుందురు. । ఆలకిం
చుడి, తమవికాని ఉనికిపట్టులను ఆక్రమించవలెనని
భూదిగంతములవరకు సంచరించు ఉద్రేకముగల
7 క్రూరులగు కల్దీయులను నేను రేపుచున్నాను. । వారు
ఘోరమైన భీకరజనముగా ఉన్నారు, వారు ప్రభుత్వ
మును విధులను తమ యిచ్ఛవచ్చినట్లు ఏర్పరచుకొం
8 దురు. । వారి గుఱ్ఱములు చిరుతపులులకంటె వేగ
ముగా పరుగులెత్తును, రాత్రియందు తిరుగులాడు
తోడేళ్లకంటెను అవి చురుకైనవి; వారి రౌతులు
దూరమునుండి వచ్చి తటాలున జొరబడుదురు, ఎరను
పట్టుకొనుటకై పక్షిరాజు వడిగా వచ్చునట్లు వారు
9 పరుగులెత్తి వత్తురు. । వెనుక చూడకుండ బలాత్కా
రము చేయుటకై వారు వత్తురు, ఇసుక రేణువులంత
విస్తారముగా వారు జనులను చెరపట్టుకొందురు. ।
10 రాజులను అపహాస్యము చేతురు, అధిపతులను హేళన
చేతురు, ప్రాకారముగల దుర్గములన్నిటిని తృణీ
కరింతురు, మంటిదిబ్బవేసి వాటిని పట్టుకొందురు. ।
11 తమ బలిమునే తమకు దేవతగా భావింతురు, గాలి
కొట్టుకొనిపోవునట్లు వారు కొట్టుకొనిపోవుచు
12 అపరాధులగుదురు. । యెహోవా నా దేవా, నా
పరిశుద్ధ దేవా, ఆదినుండి నీవున్నవాడవు కావా? మేము
మరణమునొందము; యెహోవా, తీర్పు తీర్చుటకు
నీవు వాని నియమించియున్నావు; ఆశ్రయదుర్గమా,
13 మమ్మును దండించుటకు వాని పుట్టించితివి. । నీ కను
దృష్టి దుష్టత్వము చూడలేనంత నిష్కళంకమైనది
గదా; బాధించువారు చేయు బాధను నీవు దృష్టింప
జాలవు గదా; కపటులను నీవు చూచియు, దుర్మార్గులు
తమకంటె ఎక్కువ నీతిపరులను నాశనముచేయగా
నీవు చూచియు ఎందుకు ఊరకున్నావు? । ఏలికలేని 14
చేపలతోను ప్రాకు పురుగులతోను నీవు నరులను
సమానులనుగా చేసితివి. । వాడు గాలము వేసి మాన 15
వులనందరిని గుచ్చి లాగియున్నాడు, ఉరులు ఒగ్గి
చిక్కించుకొనుచున్నాడు, వాడు తన వలతో వారిని
కూర్చుకొని సంతోషపడి గంతులువేయుచున్నాడు. ।
కావున వలవలన మంచిభాగమును పుష్టినిచ్చు భోజన 16
మును తనకు కలుగుచున్నవని వాడు తన వలకు బలుల
నర్పించుచున్నాడు, తన ఉరులకు ధూపము వేయు
చున్నాడు. । వాడు ఎల్లప్పుడును తన వలలోనుండి 17
దిమ్మరించుచుండవలెనా? ఎప్పటికిని మానకుండ వాడు
జనములను హతము చేయుచుండవలెనా?

ఆయన నాకు ఏమి సెలవిచ్చునో, నా వాదము 2
విషయమై నేనేమి చెప్పుదునో చూచుటకై నేను నా
కావలి స్థలముమీదను గోపురముమీదను కనిపెట్టు
కొనియుందుననుకొనగా । యెహోవా నాకీలాగు 2
సెలవిచ్చెను—చదువువాడు పరుగెత్తుచు చదువ వీలగు
నట్లు నీవు ఆ దర్శనవిషయమును పలకమీద స్పష్ట
ముగా వ్రాయుము. । ఆ దర్శనవిషయము నిర్ణయ 3
కాలమున జరుగును, సమాప్తమగుటకై ఆతురపడు
చున్నది, అది తప్పక నెరవేరును, అది ఆలస్యముగా
వచ్చినను దానికొరకు కనిపెట్టుము, అది తప్పక జరు
గును, జాగుచేయక వచ్చును. । వారు యథార్థపరులు 4
కాక తమలో తాము అతిశయపడుదురు; అయితే
నీతిమంతుడు విశ్వాసముచేత[1] బ్రదుకును. । మరియు 5
ద్రాక్షారసము మోసకరము, తననుబట్టి అతిశయించు
వాడు నిలువడు, అట్టివాడు పాతాళమంత విశాల
ముగా ఆశపెట్టును, మరణమంతగా ప్రబలినను
తృప్తినొందక సకలజనములను వశపరచుకొనును, సకల
జనులను సమకూర్చుకొనును. । తనదికాని దాని నాక్ర 6
మించి యభివృద్ధినొందినవానికి శ్రమ; తాకట్టు
సొమ్మును విస్తారముగా పట్టుకొనువానికి శ్రమ;—
వాడు ఎన్నాళ్లు నిలుచును అని చెప్పుకొనుచు వీరం
దరు ఇతనినిబట్టి ఉపమానరీతిగా అపహాస్యపు సామితె
ఎత్తుదురు గదా. । వడ్డికిచ్చువారు హఠాత్తుగా నీమీద 7
పడుదురు, నిన్ను హింసపెట్టబోవువారు జాగ్రత్తగా
వత్తురు, నీవు వారికి దోపుడుసొమ్ముగా ఉందువు. ।

1 లేక, తన విశ్వాస్యతచేత.

బహు జనముల ఆస్తిని నీవు కొల్లపెట్టియున్నావు గనుక శేషించిన జనులు దేశములకును పట్టణములకును వాటిలోని నివాసులకును నీవు చేసిన నరహత్యను బట్టియు బలాత్కారమునుబట్టియు నిన్ను కొల్లపెట్టుదురు.

తనకు అపాయము రాకుండునట్లు తన నివాసమును బలపరచుకొని, తన యింటివారికొరకై అన్యాయముగా లాభము సంపాదించుకొనువానికి శ్రమ. । నీవు చాలామంది జనములను నాశనముచేయుచు నీమీద నీవే నేరస్థాపనచేసియున్నావు, నీ దురాలోచనవలన నీ యింటివారికి అవమానము తెచ్చియున్నావు. । గోడలలోని రాళ్లు మొఱ్ఱపెట్టుచున్నవి, దూలములు వాటికి ప్రత్యుత్తరమిచ్చుచున్నవి.

నరహత్యచేయుటచేత పట్టణమును కట్టించువారికి శ్రమ; దుష్టత్వము జరిగించుటచేత కోటను స్థాపించువారికి శ్రమ. । జనములు ప్రయాసపడుదురు గాని అగ్నిపాలవుదురు; వ్యర్థమైనదానికొరకు కష్టపడి జనులు క్షీణించుదురు; ఇది సైన్యముల కధిపతియగు యెహోవాచేతనే యగును గదా. । ఏలయనగా సముద్రము జలములతో నిండియున్నట్లు భూమి యెహోవా మాహాత్మ్యమునుగూర్చిన జ్ఞానముతో నిండియుండును.

తమ పొరుగువారి మానము చూడవలెనని ఘోరమైన ఉగ్రతను కలిపి వారికి త్రాగనిచ్చి వారిని మత్తులుగా చేయువారికి శ్రమ. । ఘనతకు మారుగా అవమానముతో నిండియున్నావు; నీవును త్రాగి నీ మానము కనుపరచుకొందువు. యెహోవా కుడిచేతిలోని పాత్ర నీకియ్యబడును, అవమానకరమైన వమనము నీ ఘనతమీద పడును. । లెబానోనుకు నీవు చేసిన బలాత్కారము నీమీదికే వచ్చును, పశువులను బెదరించిన బెదరు నీమీదనే పడును. దేశములకును పట్టణములకును వాటిలోని నివాసులకును నీవు చేసిన నరహత్యనుబట్టియు జరిగిన బలాత్కారమునుబట్టియు ఇది సంభవించెను.

చెక్కడపు పనివాడు విగ్రహమును చెక్కుటవలన ప్రయోజనమేమి? పనివాడు మూగబొమ్మను చేసి తాను రూపించినదానియందు నమ్మిక యుంచుటవలన ప్రయోజనమేమి? అబద్ధములు బోధించు పోతవిగ్రహములయందు నమ్మిక యుంచుటవలన ప్రయోజనమేమి? । కఱ్ఱనుచూచి—మేలుకొమ్మనియు, మూగరాతినిచూచి—లెమ్మనియు చెప్పువానికి శ్రమ; అది ఏమైన బోధింపగలదా? అది బంగారముతోను వెండితోను పూతపూయబడెను గాని దానిలో శ్వాసమెంతమాత్రమును లేదు. । అయితే యెహోవా తన పరిశుద్ధాలయములో ఉన్నాడు, ఆయన సన్నిధిని లోకమంతయు మౌనముగా ఉండునుగాక.

ప్రవక్తయగు హబక్కూకు చేసిన ప్రార్థన (వాద్యములతో పాడదగినది) 3

యెహోవా, నిన్నుగూర్చిన వార్త విని నేను భయపడుచున్నాను 2
యెహోవా, సంవత్సరములు జరుగుచుండగా నీ కార్యము నద్ధిల్లజేయుము
సంవత్సరములు జరుగుచుండగా దాని తెలియజేయుము
కోపించుచునే వాత్సల్యమును జ్ఞాపకమునకు తెచ్చుకొనుము.
దేవుడు తేమానులోనుండి బయలుదేరుచున్నాడు 3
పరిశుద్ధదేవుడు పారానులోనుండి వేంచేయుచున్నాడు. (సెలా.)
ఆయన మహిమ ఆకాశమండలమంతటను కనబడుచున్నది
భూమి ఆయన ప్రభావముతో నిండియున్నది.
సూర్యకాంతితో సమానమైన ప్రకాశము కనబడుచున్నది 4
ఆయన ఇరుప్రక్కలనుండి కిరణములు బయలువెళ్లుచున్నవి
అచ్చట ఆయన బలము దాగియున్నది.
ఆయనకు ముందుగా తెగుళ్లు నడుచుచున్నవి 5
ఆయన వెంట మహా వ్యాధి వచ్చుచున్నది
ఆయన నిలువబడగా భూమి కంపించును 6
ఆయన చూడగా జనులందరు ఇటు అటు తొలగుదురు
ఆదికాల పర్వతములు బద్దలైపోవును పురాతన గిరులు అణగును
పూర్వకాలము మొదలుకొని ఆయన ఈలాగు జరిగించువాడు.
కూషీయుల డేరాలలో ఉపద్రవము కలుగగా 7
నేను చూచితిని
మిద్యాను దేశస్థుల డేరాల తెరలు గజగజ వణకెను.
యెహోవా, నదులమీద నీకు కోపము కలిగినందుననా 8
నదులమీద నీకు ఉగ్రత కలిగినందుననా
సముద్రముమీద నీకు ఉగ్రత కలిగినందుననా
నీ గుఱ్ఱములను కట్టుకొని రక్షణార్థమైన రథములమీద ఎక్కి వచ్చుచున్నావు?
విల్లు వరలోనుండి తీయబడియున్నది 9
నీ వాక్కుతోడని ప్రమాణము చేసి నీ బాణములను సిద్ధపరచియున్నావు (సెలా.)
భూమిని బద్దలుచేసి నదులను కలుగజేయుచున్నావు.

10 నిన్ను చూచి పర్వతములు కంపించును
జలములు ప్రవాహములుగా పారును
సముద్రాగాధము ఘోషించుచు తన చేతులు
పైకెత్తును.
11 నీ ఈటెలు తళతళలాడగా
సంచరించు నీ బాణముల కాంతికి భయపడి
సూర్యచంద్రులు తమ నివాసములలో ఆగిపోవు
దురు.
12 బహు రౌద్రముకలిగి నీవు భూమిమీద సంచ
రించుచున్నావు
మహోగ్రుడవై జనములను అణగద్రొక్కు
చున్నావు
13 నీ జనులను రక్షించుటకు నీవు బయలుదేరుచున్నావు
నీవు నియమించిన అభిషిక్తుని రక్షించుటకు బయలు
దేరుచున్నావు
దుష్టుల కుటుంబికులలో ప్రధానుడొకడుండకుండ
వారి తలను మెడను ఖండించి వారిని నిర్మూలము
చేయుచున్నావు. (సెలా.)
14 బీదలను రహస్యముగా మ్రింగివేయవలెనని
ఉప్పొంగుచు నన్ను పొడిచేయుటకై
తుఫానువలె వచ్చు యోధుల తలలలో రాజు
యొక్క ఈటెలను నాటుచున్నావు.
15 నీవు సముద్రమును త్రొక్కుచు సంచరించుచు
నున్నావు
నీ గుఱ్ఱములు మహాసముద్ర జలరాశుల
త్రొక్కును.
నేను వినగా జనులమీదికి వచ్చువారు సమీపిం
వరకు
నేను ఊరకొని శ్రమదినముకొరకు కనిపెట్టవ
యున్నది
నా అంతరంగము కలవరపడుచున్నది
ఆ శబ్దమునకు నా పెదవులు కదలుచున్నవి
నా యెముకలు కుళ్లిపోవుచున్నవి నా కాళ్లు వణ
చున్నవి.
అంజూరపుచెట్లు పూయకుండినను
ద్రాక్షచెట్లు ఫలింపకపోయినను
ఒలీవచెట్లు కాపులేకయుండినను
చేనిలోని పైరు పంటకు రాకపోయినను
గొఱ్ఱెలు దొడ్డిలో లేకపోయినను
సాలలో పశువులు లేకపోయినను
నేను యెహోవాయందు ఆనందించెదను
నా రక్షణకర్తయైన నా దేవునియందు నే
సంతోషించెదను.
ప్రభువగు యెహోవాయే నాకు బలము
ఆయన నా కాళ్లను లేడికాళ్లవలె చేయును
ఉన్నతస్థలములమీద ఆయన నన్ను నడవజేయున
ప్రధానగాయకునికి తంతివాద్యములతో పా
డదగినది.

కాపరులు దిగు మేతస్థలమగును, మందలకు దొడ్లు
7 అచ్చట నుండును. । తమ దేవుడైన యెహోవా
యూదావారిని కటాక్షించి వారిని చెరలోనుండి
రప్పించగా అచ్చట వారిలో శేషించినవారికి ఒక స్థల
ముండును; వారు అచ్చట (తమ మందలను) మేపు
దురు, అస్తమానమున వారు అష్కెలోను ఇండ్లలో
8 పండుకొందురు. । మోయాబువారు చేయు నిందయు,
అమ్మోనువారు పలికిన దూషణమాటలును నాకు విన
బడెను; వారు నా జనుల సరిహద్దులలో ప్రవేశించి
9 అతిశయపడి వారిని దూషించిరి. । నా జీవముతోడు
మోయాబుదేశము సొదొమ పట్టణమువలెను, అమ్మోను
దేశము గొమొఱ్ఱా పట్టణమువలెను అగును. అవి
ముండ్లచెట్లకును ఉప్పుగోతులకును స్థానమై నిత్యము
పాడుగా ఉండును; నా జనులలో శేషించువారు ఆ
దేశములను దోచుకొందురు; నా జనులలో శేషించు
వారు వాటిని స్వతంత్రించుకొందురు. కాబట్టి ఇశ్రా
యేలీయుల దేవుడైన సైన్యములకు అధిపతియగు
10 యెహోవా వాక్కు ఇదే. । వారు అతిశయపడి
సైన్యములకు అధిపతియగు యెహోవా జనులను
దూషించిరి గనుక వారి గర్వమునుబట్టి యిది వారికి
11 సంభవించును. । జనముల ద్వీపములలో నివసించు
వారందరును తమతమ స్థానములనుండి తనకే నమ
స్కారము చేయునట్లు భూమిలోనున్న దేవతలను
ఆయన నిర్మూలముచేయును, యెహోవా వారికి
12 భయంకరుడుగా ఉండును. । కూషీయులారా,
13 మీరును నా ఖడ్గముచేత హతులవుదురు. । ఆయన
ఉత్తరదేశముమీద తన హస్తమును చాపి అష్షూరు
దేశమును నాశనముచేయును; నీనెవె పట్టణమును
పాడుచేసి దానిని ఆరిపోయిన యెడారివలె చేయును. ।
14 దానిలో పసుల మందలు పండుకొనును; సకలజాతి
జంతువులును గుంపులుగా కూడును; గూడబాతులును
తుంబోళ్లును వారి ద్వారముల పైకమ్ములమీద నిలు
చును; పక్షుల శబ్దములును కిటికీలలో వినబడును;
గడపలమీద నాశనము కనుపించును. — వారు చేసి
కొనిన దేవదారు కర్రపని యంతటిని యెహోవా
15 నాశనముచేయును. । నావంటి పట్టణము మరి యొకటి
లేదని మురియుచు ఉత్సాహపడుచు నిర్విచారముగా
ఉండిన పట్టణము ఇదే.—అది పాడైపోయెనే, మృగ
ములు పండుకొను స్థలమాయెనే అని దాని మార్గమున
పోవువారందరు చెప్పుకొనుచు, ఈసడించుచు
పోపొమ్మని చేసైగ చేయుదురు.

మూష్కరమైనదియు భ్రష్టమైనదియు అన్యా
య చేయునదియునగు పట్టణమునకు శ్రమ. । అది
మాట ఆలకించదు, శిక్షకు లోబడదు,
యందు విశ్వాసముంచదు, దాని దేవుని
యొద్దకు రాదు. । దానిమధ్య దాని అధిపతులు గర్జన 3
చేయు సింహములు, దాని న్యాయాధిపతులు రాత్రి
యందు తిరుగులాడుచు తెల్లవారువరకు ఎరలో
ఏమియు మిగులకుండ భక్షించు తోడేళ్లు. । దాని 4
ప్రవక్తలు గప్పాలుకొట్టువారు, విశ్వాసఘాతకులు;
దాని యాజకులు ధర్మశాస్త్రమును నిరాకరించి ప్రతిష్ఠిత
వస్తువులను అపవిత్రపరతురు. । అయితే న్యాయము 5
తీర్చు యెహోవా దానిమధ్య నున్నాడు, ఆయన
అక్రమము చేయువాడు కాడు, అనుదినము తప్ప
కుండ ఆయన న్యాయవిధులను బయలుపరచును,
ఆయనకు రహస్యమైనదేదియు లేదు; అయినను
నీతిహీనులు సిగ్గెరుగరు. । నేను అన్యజనులను నిర్మూ 6
లము చేయగా వారి కోటలును పాడగును; ఒకడైన
సంచరించకుండ వారి వీధులను పాడుచేసియున్నాను,
జనము లేకుండను వాటియందెవరును కాపురముండ
కుండను వారి పట్టణములను లయపరచినవాడను నేనే. ।
దాని విషయమై నా నిర్ణయమంతటిచొప్పున మీ 7
నివాసస్థలము సర్వనాశము కాకుండునట్లు, నాయందు
భయభక్తులు కలిగి శిక్షకు లోబడుదురని నేననుకొంటిని
గాని వారు దుష్క్రియలు చేయుటయందు అత్యాశ
గలవారైరి. । కాబట్టి యెహోవా సెలవిచ్చు వాక్కు 8
ఏదనగా—నాకొరకు కనిపెట్టుడి, నేను లేచి యెర
పట్టుకొను దినముకొరకు కనిపెట్టియుండుడి, నా
ఉగ్రతను నా కోపాగ్ని అంతటిని వారిమీద కుమ్మ
రించుటకై అన్యజనులను పోగుచేయుటకును గుంపులు
గుంపులుగా రాజ్యములను సమకూర్చుటకును నేను
నిశ్చయించుకొంటిని; నా రోషాగ్నిచేత భూమియం
తయు కాలిపోవును. । అప్పుడు జనులందరు 9
యెహోవా నామమునుబట్టి యేకమనస్కులై ఆయ
నను సేవించునట్లు నేను వారికి పవిత్రమైన పెదవుల
నిచ్చెదను. । చెదరిపోయినవారై నాకు ప్రార్థనచేయు 10
నా జనులు కూషుదేశపు నదుల అవతలనుండి నాకు
నైవేద్యముగా తీసికొని రాబడుదురు. । ఆ దినమున 11
నీ గర్వమునుబట్టి సంతోషించువారిని నీలోనుండి
నేను వెళ్లగొట్టుదును గనుక నా పరిశుద్ధమైన కొండ
యందు నీవిక గర్వము చూపవు, నామీద తిరుగబడి
నీవు చేసిన క్రియలవిషయమై నీకు సిగ్గు కలుగదు. ।
దుఃఖితులగు దీనులను యెహోవా నామము నాశ్ర 12
యించు జనశేషముగా నీమధ్య నుండనిత్తును. । ఇశ్రా 13
యేలీయులలో మిగిలినవారు పాపము చేయరు, అబద్ధ
మాడరు, కపటములాడు నాలుక వారి నోటనుండదు;
వారు ఎవరి భయము లేకుండ విశ్రాంతిగలవారై
అన్నపానములు పుచ్చుకొందురు; । సీయోను నివాసు 14
లారా, ఉత్సాహధ్వని చేయుడి; ఇశ్రాయేలీయు
లారా, జయధ్వని చేయుడి; యెరూషలేము నివాసు
లారా, పూర్ణహృదయముతో సంతోషించి గంతులు

15 వేయుము. । తాను మీకు విధించిన శిక్షను యెహోవా
కొట్టివేసియున్నాడు, మీ శత్రువులను ఆయన వెళ్ల
గొట్టియున్నాడు, ఇశ్రాయేలీయుల రాజైన యెహోవా
మీ మధ్య ఉన్నాడు, ఇకమీదట మీకు అపాయము
16 సంభవించదు । ఆ దినమున జనులు మీతో ఇట్లం
దురు యెరూషలేమూ, భయపడకుము, సీయోనూ,
17 ధైర్యము తెచ్చుకొనుము; । నీ దేవుడైన యెహోవా
నీ మధ్య ఉన్నాడు, ఆయన శక్తిమంతుడు, ఆయన
మిమ్మును రక్షించును, ఆయన బహు ఆనందముతో
నీయందు సంతోషించును, నీయందు తనకున్న ప్రేమను
బట్టి శాంతము వహించి నీయందలి సంతోషముచేత
18 ఆయన హర్షించును. । నీ నియామక కాలపు పండు
గలకు రాలేక చింతపడు నీ సంబంధులను నేను సమ
కూర్చెదను, వారు గొప్ప అవమానము పొందినవారు. ।
ఆ కాలమున నిన్ను హింసపెట్టువారినందరిని నేను 19
శిక్షింతును, కుంటుచు నడుచువారిని నేను రక్షింతును,
చెదరగొట్టబడినవారిని సమకూర్చుదును, ఏ యే దేశ
ములలో వారు అవమానము నొందిరో అక్కడనెల్ల
నేను వారికి ఖ్యాతిని మంచి పేరును కలుగజేసెదను. ।
ఆ కాలమున మీరు చూచుచుండగా నేను మిమ్మును 20
చెరలోనుండి రప్పించి, మిమ్మును సమకూర్చిన తరువాత
మిమ్మును నడిపింతును; నిజముగా భూమిమీదనున్న
జనులందరి దృష్టికి నేను మీకు ఖ్యాతిని మంచిపేరును
తెప్పింతును; ఇదే యెహోవా వాక్కు

# హగ్గయి

1 రాజైన దర్యావేషు ఏలుబడియందు రెండవ
సంవత్సరము ఆరవ నెల మొదటి దినమున ప్రవక్తయగు
హగ్గయిద్వారా యూదా దేశముమీద అధికారి
యగు షయల్తీయేలు కుమారుడైన జెరుబ్బాబెలుకును
ప్రధానయాజకుడగు యెహోజాదాకు కుమారుడైన
యెహోషువకును యెహోవా వాక్కు ప్రత్య
క్షమై యీలాగు సెలవిచ్చెను—సైన్యములకధిపతియగు
2 యెహోవా ఆజ్ఞ ఇచ్చునదేమనగా!— సమయమింక
రాలేదు, యెహోవా మందిరమును కట్టించుటకు
సమయమింక రాలేదని యీ జనులు చెప్పుచున్నారే. ।
3 అందుకు యెహోవా వాక్కు ప్రత్యక్షమై ప్రవక్త
4 యగు హగ్గయిద్వారా సెలవిచ్చినదేమనగా ।— ఈ
మందిరము పాడైయుండగా మీరు సరంబీవేసిన యిం
5 డ్లలో నివసించుటకు ఇది సమయమా? ! కాబట్టి సైన్య
ములకధిపతియగు యెహోవా సెలవిచ్చునదేమనగా
6 —మీ ప్రవర్తనను గూర్చి ఆలోచించుకొనుడి. । మీరు
విస్తారముగా విత్తినను మీకు కొంచెమే పండెను,
మీరు భోజనము చేయుచున్నను ఆకలి తీరకయున్నది,
పానము చేయుచున్నను దాహము తీరకయున్నది,
బట్టలు కప్పుకొనుచున్నను చలి ఆగకున్నది, పనివారు
కష్టము చేసి జీతము సంపాదించుకొనినను జీతము చినిగి
7 పోయిన సంచిలో వేసినట్టుగా ఉన్నది. । కాగా
సైన్యములకధిపతియగు యెహోవా సెలవిచ్చునదే
మనగా—మీ ప్రవర్తనను గూర్చి ఆలోచించుకొనుడి. ।
8 పర్వతములెక్కి మ్రాను తీసికొని వచ్చి మీరు ఈ
మందిరమును కట్టించినయెడల దానియందు నేను సం
తోషించి నన్ను ఘనపరచుకొందునని యెహోవా
9 సెలవిచ్చుచున్నాడు. । విస్తారముగా కావలెనని మీరు
ఎదురు చూచితిరి గాని కొంచెముగా పండెను; మీరు
దానిని ఇంటికి తేగా నేను దాని చెదరగొట్టితిని; ఎందు
చేతనని యెహోవా అడుగుచున్నాడు. నా మంది
రము పాడైయుండగా మీరందరు మీ మీ యిండ్లు
10 కట్టుకొనుటకు త్వరపడుటచేతనే గదా. । కాబట్టి
మిమ్మునుబట్టి ఆకాశపుమంచు కురువకయున్నది, భూమి
11 పండకయున్నది. । నేను భూమికిని పర్వతములకును
అనావృష్టి కలుగజేసి, ధాన్యము విషయములోను
ద్రాక్షారసము విషయములోను తైలవిషయములోను
భూమి ఫలించు సమస్తము విషయములోను మను
ష్యుల విషయములోను పశువుల విషయములోను చేతి
పనులన్నిటి విషయములోను క్షామము పుట్టించి
యున్నాను.

షయల్తీయేలు కుమారుడైన జెరుబ్బాబెలును 12
యెహోజాదాకు కుమారుడును ప్రధానయాజకుడు
నగు యెహోషువయు శేషించిన జనులందరును తమ
దేవుడైన యెహోవా మాటలు ఆలకించి, తమ దేవు
డైన యెహోవా ప్రవక్తయైన హగ్గయిని పంపించి,
తెలియజేసిన వార్త విని యెహోవాయందు భయ
భక్తులు పూనిరి. । అప్పుడు యెహోవా దూతయైన 13
హగ్గయి యెహోవా తెలియజేసిన వార్తనుబట్టి జను
లకు ప్రకటించినదేమనగా — నేను మీకు తోడుగా
ఉన్నాను; ఇదే యెహోవా వాక్కు. । యెహోవా 14
యూదాదేశపు అధికారియగు షయల్తీయేలు కుమారు
డైన జెరుబ్బాబెలుయొక్క మనస్సును, ప్రధానయాజ
కుడగు యెహోజాదాకు కుమారుడైన యెహోషువ
మనస్సును, శేషించిన జనులందరి మనస్సును ప్రేరే
పింపగా । వారు కూడివచ్చి, రాజైన దర్యావేషుయొక్క 15
యేలుబడియందు రెండవ సంవత్సరము ఆరవ నెల
యిరువదినాలుగవ దినమున సైన్యములకు అధిపతియగు
తమ దేవుని మందిరపు పనిచేయ మొదలుపెట్టిరి.

ఏడవ నెల యిరువది యొకటవ దినమున 2
యెహోవా వాక్కు ప్రవక్తయగు హగ్గయికి ప్రత్య
క్షమై సెలవిచ్చినదేమనగా ।— నీవు యూదాదేశపు 2
అధికారియగు షయల్తీయేలు కుమారుడైన జెరుబ్బా
బెలుతోను ప్రధానయాజకుడగు యెహోజాదాకు
కుమారుడైన యెహోషువతోను శేషించిన జనుల
తోను ఇట్లనుము ।— పూర్వకాలమున ఈ మందిర 3
మునకు కలిగిన మహిమను చూచినవారు మీలో
ఉన్నారు గదా; అట్టివారికి ఇది ఎట్టిదిగా కనబడు
చున్నది? దానితో ఇది ఎందునను పోలినది కాదని
తోచుచున్నది గదా. । అయినను యెహోవా ఆజ్ఞ 4
ఇచ్చునదేమనగా— జెరుబ్బాబెలూ, ధైర్యము తెచ్చు
కొమ్ము; ప్రధానయాజకుడగు యెహోజాదాకు కుమా
రుడవైన యెహోషువా, ధైర్యము తెచ్చుకొమ్ము;
దేశములోనున్న సమస్తజనులారా, ధైర్యము తెచ్చు
కొని పని జరిగించుడి; నేను మీకు తోడుగా ఉన్నాను;
ఇదే సైన్యములకు అధిపతియగు యెహోవా వాక్కు. ।
మీరు ఐగుప్తుదేశములోనుండి వచ్చినప్పుడు నేను 5
మీతో చేసిన నిబంధన (జ్ఞాపకము చేసికొనుడి); నా
ఆత్మ మీ మధ్యన ఉన్నది గనుక భయపడకుడి. ।
మరియు సైన్యములకు అధిపతియగు యెహోవా సెల 6
విచ్చునదేమనగా—ఇక కొంతకాలము ఇంకొకమారు
ఆకాశమును భూమిని సముద్రమును నేలను నేను

ంపింపజేతును. । నేను అన్యజనులనందరిని కదలింపగా
[illegible] యిష్టవస్తువులు తేబడును;
నేను [illegible] నింపుదును; ఇదే
సైన్యములకు [illegible] యెహోవా వాక్కు. ।
[illegible]; ఇదే సైన్యములకు
అధిపతియగు యెహోవా వాక్కు. । — ఈ కడవరి
మందిరముయొక్క [illegible] మందిరము
యొక్క [illegible] సైన్యములకు అధిపతి
యగు [illegible] మన్నాను. ఈ స్థల
మందు [illegible] నిలుపు ననుగ్రహించె
దను; ఇదే సైన్యములకు అధిపతియగు యెహోవా
వాక్కు.

మరియు [illegible] సం
వత్సరము [illegible] దినమున
యెహోవా వాక్కు [illegible] ప్రత్య
క్షమై [illegible] । — సైన్యములకు అధిపతి
యగు [illegible] యిచ్చుచున్నాడు—
[illegible]. । ఒకడు
ప్రతిష్ఠిత [illegible] కట్టు
కొని, [illegible] కూరనైనను
ద్రాక్షారసమునైనను తైలమునైనను మరి ఏదినాను
[illegible] ముట్టినయెడల, ఆ ముట్టినది
ప్రతిష్ఠితమగునా [illegible] వారు
కాదనిరి. । [illegible] ఒకడు అంటుపడి
[illegible] ముట్టినయెడల తాను ముట్టి
నది అపవిత్రమగునా [illegible] మరల నడుగగా
[illegible] అపవిత్రమగుననిరి. । అప్పుడు
హాగ్గయి [illegible] ప్రత్యుత్తరమిచ్చెను—ఈ ప్రజ
[illegible] నా దృష్టికి ఆలాగుననే యున్నారు;
[illegible] వారిచ్చట అర్పించు
[illegible] నా దృష్టికి అపవిత్రములు; ఇదే
యెహోవా వాక్కు. । — ఈ రాతిమీద రాయి

యుంచి యెహోవా మందిరము కట్టనారంభించినది
మొదలుకొని ఆ వెనుక మీకు సంభవించినదానిని
ఆలోచనచేసికొనుడి. । నాటనుండి యొకడు ఇరువది 16
కుప్పల కంకులు వేయగా పది కుప్పలంత ధాన్యమే
తేలుచున్నది; తీసికొనవలెనని ఏబది కొలల తొట్టి
యొద్దకు ఒకడు రాగా ఇరువది కొలలు మాత్రమే
దొరకును. । వెగులుతోను కాటుకతోను వడగండ్ల 17
తోను మీ కష్టార్జితమంతటిని నేను నాశనముచేసి
యున్నాను; అయినను మీలో ఒకడును తిరిగి నా
యొద్దకు రాలేదు; ఇదే యెహోవా వాక్కు. । మీరు 18
ఆలోచించుకొనుడి. ఇంతకుముందుగా తొమ్మిదవ నెల
యిరువది నాలుగవ దినమునుండి, అనగా యెహోవా
మందిరపు పునాది వేసిన నాటనుండి మీకు సంభ
వించినదానిని ఆలోచించుకొనుడి. । కొట్లలో ధాన్య 19
మున్నదా? ద్రాక్షచెట్లయినను అంజూరపుచెట్లయి
నను దానిమ్మచెట్లయినను ఒలీవచెట్లయినను ఫలింపక
పోయెను గదా. అయితే ఇది మొదలుకొని నేను
మిమ్మును ఆశీర్వదించెదను.

మరియు ఆ నెల యిరువది నాలుగవ దినమున 20
యెహోవా వాక్కు హాగ్గయికి మరల ప్రత్యక్షమై
సెలవిచ్చినదేమనగా । — యూదాదేశపు అధికారి 21
యగు జెరుబ్బాబెలుతో ఇట్లనుము — ఆకాశమును
భూమిని నేను కంపింపజేయుచున్నాను. । రాజ్యముల 22
సింహాసనములను నేను క్రింద పడవేతును; అన్యజనుల
రాజ్యములకు కలిగిన బలమును నాశనముచేతును; రథ
ములను వాటిని ఎక్కినవారిని క్రింద పడవేతును;
గుఱ్ఱములును రౌతులును ఒకరి ఖడ్గముచేత ఒకరు
కూలుదురు. । నా సేవకుడును షయల్తీయేలు కుమా 23
రుడునైన జెరుబ్బాబెలూ, నేను నిన్ను ఏర్పరచుకొని
యున్నాను గనుక ఆ దినమున నేను నిన్ను తీసికొని
ముద్ర యుంగరముగా చేతును; ఇదే సైన్యములకు
అధిపతియగు యెహోవా వాక్కు.

# జెకర్యా

1 దర్యావేషు ఏలుబడియందు రెండవ సంవత్సరము
ఎనిమిదవ నెలలో యెహోవా వాక్కు ప్రవక్తయగు
ఇద్దోకు పుట్టిన బెరక్యా కుమారుడైన జెకర్యాకు ప్రత్య
2 క్షమై సెలవిచ్చినదేమనగా । — యెహోవా మీ
3 పితరులమీద బహుగా కోపించెను. । కాబట్టి నీవు
వారితో ఇట్లనుము — సైన్యములకు అధిపతియగు
యెహోవా సెలవిచ్చునదేమనగా—మీరు నాతట్టు
తిరిగినయెడల నేను మీతట్టు తిరుగుదునని సైన్యము
లకు అధిపతియగు యెహోవా సెలవిచ్చుచున్నాడు;
ఇదే సైన్యములకు అధిపతియగు యెహోవా వాక్కు. ।
4 మీరు మీ పితరులవంటివారైయుండవద్దు; పూర్వికులైన
ప్రవక్తలు—సైన్యములకు అధిపతియగు యెహోవా
సెలవిచ్చునదేమనగా — మీ దుర్మార్గతను మీ దుష్
క్రియలను మాని తిరుగుడని వారికి ప్రకటించినను
వారు వినకపోయిరి, నా మాట ఆలకించకపోయిరి;
5 ఇదే యెహోవా వాక్కు. । మీ పితరులేమైరి?
6 ప్రవక్తలు నిత్యము బ్రదుకుదురా? । అయినను నా
సేవకులైన ప్రవక్తలకు నేను సెలవిచ్చిన మాటలును కట్టడ
లును మీ పితరుల విషయములో నెరవేరలేదా? నెర
వేరగా వారు తిరిగి—మన ప్రవర్తనను బట్టియు క్రియ
లనుబట్టియు యెహోవా మనకు చేయదలచిన ప్రకా
రముగా ఆయన అంతయు మనకు చేసియున్నాడని
చెప్పుకొనిరి.
7 మరియు దర్యావేషు ఏలుబడియందు రెండవ సంవ
త్సరము శెబాటు అను పదకొండవ నెల యిరువది
నాలుగవ దినమున యెహోవా వాక్కు ప్రవక్తయగు
ఇద్దోకు పుట్టిన బెరక్యా కుమారుడైన జెకర్యాకు ప్రత్య
8 క్షమై యీలాగు సెలవిచ్చెను. । — రాత్రి (దర్శన
మందు) ఎఱ్ఱని గుఱ్ఱము నెక్కిన మనుష్యుడొకడు
నాకు కనబడెను; అతడు లోయలోనున్న గొంజి
చెట్లలో నిలువబడియుండగా అతని వెనుక ఎఱ్ఱని
గుఱ్ఱములును చుక్కలుచుక్కలుగల గుఱ్ఱములును
9 తెల్లని గుఱ్ఱములును కనబడెను. । అప్పుడు—నా యేలిన
వాడా, యివి ఏమని నేనడుగగా నాతో మాటలాడు
దూత — ఇవి ఏమియైనది నేను నీకు తెలియజేతు
10 ననెను. । అప్పుడు గొంజిచెట్లలో నిలువబడియున్న
వాడు — ఇవి లోకమంతటను తిరుగులాడుటకు
యెహోవా పంపించిన గుఱ్ఱములని చెప్పెను. ।
11 అవి గొంజిచెట్లమధ్యను నిలువబడిన యెహోవా
దూతను చూచి—మేము లోకమంతట తిరుగులాడి
వచ్చియున్నాము; ఇదిగో లోకులందరు శాంతము
కలిగి నిమ్మళముగా ఉన్నారని చెప్పెను. । అందుకు
యెహోవా దూత — సైన్యములకధిపతియగు
యెహోవా, డెబ్బది సంవత్సరములనుండి నీవు
యెరూషలేముమీదను యూదా పట్టణములమీదను
కోపముంచియున్నావే; యిక ఎన్నాళ్లు కనికరింపక
యుందువు అని మనవిచేయగా । యెహోవా నాతో
మాటలాడిన దూతకు ఆదరణార్థమైన మధుర వచనము
లతో ఉత్తరమిచ్చెను. । కాబట్టి నాతో మాటలాడు 1
చున్న దూత నాతో ఇట్లనెను—నీవు ప్రకటన చేయవల
సినదేమనగా—సైన్యములకు అధిపతియగు యెహోవా
ఈలాగు సెలవిచ్చుచున్నాడు— నేను యెరూషలేము
విషయములోను సీయోను విషయములోను అధికా
సక్తి కలిగియున్నాను; । నిమ్మళముగా ఉన్న అన్యజనుల 1
మీద నేను బహుగా కోపించుచున్నాను; ఏలయనగా
నేను కొంచెము కోపపడగా కీడుచేయవలెనన్న తాత్ప
ర్యముతో వారు సహాయులైరి. । కాబట్టి యెహోవా 1
సెలవిచ్చునదేమనగా — వాత్సల్యముగలవాడనై నేను
యెరూషలేముతట్టు తిరిగియున్నాను; అందులో నా
మందిరము కట్టబడును; యెరూషలేముమీద శిల్పకా
రులు నూలు సాగలాగుదురు; ఇదే సైన్యములకు అధి
పతియగు యెహోవా వాక్కు. । నీవు ఇంకను ప్రక 1
టన చేయవలసినదేమనగా — ఇక నా పట్టణములు
భాగ్యముతో మరి ఎక్కువగా నింపబడును, ఇంకను
యెహోవా సీయోనును ఓదార్చును, యెరూషలే
మును ఆయన ఇకను కోరుకొనును.
అప్పుడు నేను తేరిచూడగా నాలుగు కొమ్ములు 1
కనబడెను. । — ఇవి ఏమిటివని నేను నాతో మాట 1
లాడుచున్న దూతనడుగగా అతడు—ఇవి యూదా
వారిని ఇశ్రాయేలువారిని యెరూషలేము నివాసులను
చెదరగొట్టిన కొమ్ములనెను. । యెహోవా నలుగురు 2
కంసాలులను నాకు కనుపరచగా । — వీరేమి చేయ 2
బోవుచున్నారని నేనడిగినందుకు ఆయన—ఎవడును
తలయెత్తకుండ యూదావారిని చెదరగొట్టిన కొమ్ములు
ఇవే. అయితే వాటిని భయపెట్టుటకును, యూదా
దేశస్థులనందరిని చెదరగొట్టుటకై వారిమీద బలాత్కా
రము జరిగించిన అన్యజనుల కొమ్ములను పడగొట్టుట
కును వీరు వచ్చియున్నారని నాకు సెలవిచ్చెను.
**మరియు** నేను తేరిచూడగా కొలనూలు చేత **2**
పట్టుకొనిన యొకడు నాకు కనబడెను । నీ వెక్కడికి 2
పోవుచున్నావని నేనతని నడుగగా అతడు—యెరూష
లేముయొక్క వెడల్పును పొడుగును ఎంతైనది కొలిచి

యిద్దరికి సమాధానకరమైన యోచనలు కలుగును. ।
14 ఆ కిరీటము యెహోవా ఆలయములో జ్ఞాపకార్థ
ముగా ఉంచబడి, హేలెముకును టోబీయాకును
యెదాయాకును జెఫన్యా కుమారుడైన హేనుకును
15 ఉండును. । దూరముగా ఉన్నవారు వచ్చి యెహోవా
ఆలయమును కట్టుదురు, అప్పుడు యెహోవా నన్ను
మీయొద్దకు పంపెనని మీరు తెలిసికొందురు; మీ
దేవుడైన యెహోవా మాట మీరు జాగ్రత్తగా ఆల
కించినయెడల ఈలాగు జరుగును.

7 రాజైన దర్యావేషు ఏలుబడియందు నాలుగవ
సంవత్సరము కిస్లేవు అను తొమ్మిదవ నెల నాలుగవ
దినమున బేతేలువారు షెరెజెరును రెగెమ్మెలెకును తమ
2 వారిని పంపి । — ఇన్ని సంవత్సరములు మేము
దుఃఖించినట్టు అయిదవ నెలలో ఉపవాసముండి
3 దుఃఖింతుమా అని । యెహోవాను శాంతిపరచుటకై
మందిరమునొద్దనున్న యాజకులను ప్రవక్తలను మనవి
4 చేయగా । సైన్యములకు అధిపతియగు యెహోవా
వాక్కు నాకు ప్రత్యక్షమై సెలవిచ్చినదేమనగా ।
5 — దేశపు జనులందరికిని యాజకులకును నీవీ మాట
తెలియజేయవలెను. ఈ జరిగిన డెబ్బది సంవత్సర
ములు ఏటేట అయిదవ నెలను ఏడవ నెలను మీరు
ఉపవాసముండి దుఃఖము సలుపుచు వచ్చినప్పుడు
6 నాయందు భక్తికలిగియే ఉపవాసముంటిరా? । మరియు
మీరు ఆహారము పుచ్చుకొనునప్పుడు స్వప్రయోజన
మునకేగదా పుచ్చుకొంటిరి; మీరు పానము చేసి
నప్పుడు స్వప్రయోజనమునకేగదా పానము చేసితిరి. ।
7 యెరూషలేములోను దాని చుట్టును పట్టణములలోను
దక్షిణదేశములోను మైదానములోను జనులు విస్త
రించి క్షేమముగా ఉన్నకాలమున పూర్వికులగు ప్రవ
క్తలద్వారా యెహోవా ప్రకటన చేసిన ఆజ్ఞలను
మీరు మనస్సుకు తెచ్చుకొనకుండవచ్చునా?
8 మరియు యెహోవా వాక్కు జెకర్యాకు ప్రత్య
9 క్షమై సెలవిచ్చినదేమనగా । — సైన్యములకధిపతి
యగు యెహోవా ఈలాగు ఆజ్ఞ ఇచ్చియున్నాడు
—సత్యము ననుసరించి తీర్పు తీర్చుడి, ఒకరియందొకరు
10 కరుణావాత్సల్యములు కనుపరచుకొనుడి, । విధవ
రాండ్రను తండ్రిలేనివారిని పరదేశులను దరిద్రులను
బాధపెట్టకుడి, మీ హృదయమందు సహోదరు
11 లలో ఎవరికిని కీడు చేయదలచకుడి. । అయితే వారు
ఆలకింపనొల్లక మూర్ఖులై వినకుండ చెవులు మూసి
12 కొనిరి. । ధర్మశాస్త్రమును, పూర్వికులైన ప్రవక్తలద్వారా
సైన్యములకు అధిపతియగు యెహోవా తన ఆత్మప్రేరే
పణచేత తెలియజేసిన మాటలను, తాము వినకుండు
నట్లు హృదయములను కురువిందమువలె కఠినపరచు
కొనిరి గనుక సైన్యములకు అధిపతియగు యెహోవా
యొద్దనుండి మహోగ్రత వారిమీదికి వచ్చెను. ।
కావున సైన్యములకు అధిపతియగు యెహోవా 13
సెలవిచ్చునదేమనగా—నేను పిలిచినప్పుడు వారు ఆల
కింపకపోయిరి గనుక వారు పిలిచినప్పుడు నేను ఆల
కింపను. । మరియు వారెరుగని అన్యజనులలో నేను 14
వారిని చెదరగొట్టుదును. వారు తమ దేశమును విడి
చినమీదట అందులో ఎవరును సంచరింపకుండ అది
పాడగును; ఈలాగున వారు మనోహరమైన తమ దేశ
మునకు నాశనము కలుగజేసియున్నారు.

మరియు సైన్యములకు అధిపతియగు యెహోవా 8
వాక్కు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను. । —
సైన్యములకు అధిపతియగు యెహోవా ఆజ్ఞ ఇచ్చు 2
నదేమనగా—మిగుల ఆసక్తితో నేను సీయోను విషయ
మందు రోషము వహించియున్నాను. బహు రౌద్ర
ముగలవాడనై దాని విషయమందు నేను రోషము
వహించియున్నాను. । యెహోవా సెలవిచ్చునదేమ 3
నగా—నేను సీయోనునొద్దకు మరల వత్తును, యెరూ
షలేములో నివాసము చేతును, సత్యమును అనుసరించు
పురమనియు, సైన్యములకు అధిపతియగు యెహోవా
పర్వతము పరిశుద్ధ పర్వతమనియు పేర్లు పెట్టబడును. ।
సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చున 4
దేమనగా—అందరును వృద్ధత్వముచేత కఱ్ఱ పట్టుకొని,
వృద్ధులేమి వృద్ధురాండ్రేమి ఇంకను యెరూషలేము వీధు
లలో కూర్చుందురు. । ఆ పట్టణపు వీధులు ఆటలాడు 5
మగపిల్లలతోను ఆడుపిల్లలతోను నిండియుండును. ।
సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చునదే 6
మనగా—ఆ దినములందు శేషించియున్న జనులకిది ఆశ్చ
ర్యమని తోచినను నాకును ఆశ్చర్యమని తోచునా?
యిదే యెహోవా వాక్కు. । సైన్యములకు అధిపతి 7
యగు యెహోవా సెలవిచ్చునదేమనగా — తూర్పు
దేశములోనుండియు పడమటి దేశములోనుండియు
నేను నా జనులను రప్పించి రక్షించి । యెరూషలే 8
ములో నివసించుటకై వారిని తోడుకొని వచ్చెదను,
వారు నా జనులై యుందురు, నేను వారికి దేవుడనై
యుందును; ఇది నీతి సత్యములనుబట్టి జరుగును. ।
సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చున 9
దేమనగా—సైన్యములకు అధిపతియగు యెహోవా
మందిరమును కట్టుటకై దాని పునాదివేసిన దినమున
ప్రవక్తల నోట పలుకబడిన మాటలు ఈ కాలమున
వినువారలారా, ధైర్యము తెచ్చుకొనుడి. । ఆ దిన 10
ములకు ముందు మనుష్యులకు కూలి దొరకక యుండెను,
పశువుల పనికి బాడిగె దొరకకపోయెను, తన పని
మీద పోవువానికి శత్రుభయముచేత నెమ్మది లేక
పోయెను; ఏలయనగా ఒకరిమీదికొకరిని నేను రేపు
చుంటిని. । అయితే పూర్వదినములలో నేను ఈ 11
జనులలో శేషించినవారికి విరోధినైనట్టు ఇప్పుడు
విరోధిగా ఉండను. । సమాధానసూచకమైన ద్రాక్ష 12

చూడ బోవుచున్నాననెను. । అంతట నాతో మాటలాడుచున్న దూత బయలుదేరగా మరియొక దూత యతనిని ఎదుర్కొనవచ్చెను. । రెండవ దూత—పరుగెత్తిపోయి యెరూషలేములో మనుష్యులును పశువులును విస్తారమైనందున అది ప్రాకారములు లేని మైదానముగా ఉండునని ఈ యౌవనస్థునికి తెలియజేయుమని మొదటి దూతకు ఆజ్ఞ ఇచ్చెను. । నేను దానిచుట్టు అగ్ని ప్రాకారముగా ఉందును, నేను దాని మధ్యను నివాసినై మహిమకు కారణముగా ఉందును; ఇదే యెహోవా వాక్కు. । ఉత్తరదేశములో ఉన్నవారలారా, తప్పించుకొని రండి; ఆకాశపు నాలుగు వాయువులంత విశాలముగా నేను మిమ్మును వ్యాపింపజేసియున్నాను; ఇదే యెహోవా వాక్కు. । బాబెలుదేశములో నివాసియగు సీయోనూ, అచ్చటనుండి తప్పించుకొని పొమ్ము; ఇదే యెహోవా వాక్కు. । సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చునదేమనగా—మిమ్మును ముట్టినవాడు తన కనుగుడ్డును ముట్టినవాడని యెంచి తనకు ఘనత తెచ్చుకొనదలచి, మిమ్మును దోచుకొనిన అన్యజనులయొద్దకు ఆయన నన్ను పంపియున్నాడు. । నేను నా చేతిని వారిమీద ఆడించగా వారు తమ దాసులకు దోపుడుసొమ్మగుదురు; అప్పుడు సైన్యములకు అధిపతియగు యెహోవా నన్ను పంపియున్నాడని మీరు తెలిసికొందురు. । సీయోను నివాసులారా, నేను వచ్చి మీ మధ్యను నివాసము చేతును, సంతోషముగానుండి పాటలు పాడుడి; ఇదే యెహోవా వాక్కు. । ఆ దినమున అన్యజనులనేకులు యెహోవాను హత్తుకొని నాకు జనులగుదురు, నేను మీ మధ్య నివాసము చేతును; అప్పుడు యెహోవా నన్ను మీ యొద్దకు పంపియున్నాడని మీరు తెలిసికొందురు. । మరియు తనకు స్వాస్థ్యమని యెహోవా ప్రతిష్ఠితమైన దేశములో యూదావారిని స్వతంత్రించుకొనును, యెరూషలేమును ఆయన ఇకను కోరుకొనును. । సకల జనులారా, యెహోవా తన పరిశుద్ధమైన నివాసము విడిచి వచ్చుచున్నాడు, ఆయన సన్నిధిని మౌనులైయుండుడి.

మరియు యెహోవా దూతయెదుట ప్రధాన యాజకుడైన యెహోషువ నిలువబడుటయు, సాతాను ఫిర్యాదియై అతని కుడిపార్శ్వమున నిలువబడుటయు అతడు నాకు కనుపరచెను. । —సాతానూ, ఇతడు అగ్నిలోనుండి తీసిన కొరవివలెనే యున్నాడు గదా; యెహోవా నిన్ను గద్దించును, యెరూషలేమును కోరుకొను యెహోవా నిన్ను గద్దించును అని యెహోవా దూత సాతానుతో అనెను. । యెహోషువ మలినవస్త్రములు ధరించినవాడై దూత సమ్ముఖములో నిలువబడియుండగా । దూత దగ్గర

నిలిచియున్నవారిని పిలిచి — ఇతని మైలబట్టలు తీసి
వేయుడని ఆజ్ఞాపించి—నేను నీ దోషమును పరిహ
రించి ప్రశస్తమైన వస్త్రములతో నిన్ను అలంకరించు
చున్నాను । అని సెలవిచ్చెను.—అతని తలమీద తెల్లని 5
పాగా పెట్టించుడని నేను మనవిచేయగా వారు అతని
తలమీద తెల్లని పాగా పెట్టి వస్త్రములతో అతనిని
అలంకరించిరి; యెహోవా దూత దగ్గర నిలుచుం
డెను. । అప్పుడు యెహోవా దూత యెహోషు 6
వకు ఈలాగు ఆజ్ఞ ఇచ్చెను । — సైన్యములకు అధి 7
పతియగు యెహోవా సెలవిచ్చునదేమనగా — నా
మార్గములలో నడుచుచు నేను నీ కప్పగించినదానిని
భద్రముగా గైకొనినయెడల, నీవు నా మందిరము
మీద అధికారివై నా ఆవరణములను కాపాడువాడ
వగుదువు; మరియు ఇక్కడ నిలువబడువారికి కలిగి
నట్లు నా సన్నిధిని నిలుచు భాగ్యము నీకిత్తును. ।
ప్రధానయాజకుడవైన యెహోషువా, నీ యెదుట 8
కూర్చుండు నీ సహకారులు సూచనలుగా ఉన్నారు;
నీవును వారును నా మాట ఆలకింపవలెను, ఏడనగా
చిగురు అను నా సేవకుని నేను రప్పింపబోవుచున్నా
ను. । యెహోషువ యెదుట నేనుంచిన రాతిని తేరి 9
చూడుడి, ఆ రాతికి ఏడు నేత్రములున్నవి, దాని
చెక్కడపుపని చేయువాడను నేను. ఇదే సైన్యములకు
అధిపతియగు యెహోవా వాక్కు; మరియు ఒక
దినములోగానే నేను ఈ దేశముయొక్క దోషమును
పరిహరింతును; । ఆ దినమున ద్రాక్షచెట్లక్రిందను 10
అంజూరపుచెట్లక్రిందను కూర్చుండుటకు మీరందరు
ఒకరినొకరు పిలుచుకొని పోవుదురు; ఇదే సైన్యము
లకు అధిపతియగు యెహోవా వాక్కు.

నాతో మాటలాడుచున్న దూత తిరిగి వచ్చి నిద్ర 4
పోయిన యొకని లేపినట్లు నన్ను లేపి । నీకు ఏమి కన 2
బడుచున్నదని యడుగగా నేను — సువర్ణమయమైన
దీపస్తంభమును దానిమీద ఒక ప్రమిదెయును, దీప
స్తంభమునకు ఏడు దీపములును దీపమునకు ఏడేసి
గొట్టములును కనబడుచున్నవి. । మరియు రెండు ఒలీవ 3
చెట్లు దీపస్తంభమునకు కుడిప్రక్క ఒకటియు ఎడమ
ప్రక్క ఒకటియు కనబడుచున్నవని చెప్పి । — నా 4
యేలినవాడా, యిదేమిటియని నాతో మాటలాడు
చున్నదూత నడిగితిని. । నాతో మాటలాడుచున్న 5
దూత—ఇదేమిటో నీకు తెలియదా యని నన్నడుగగా
నేను—నా యేలినవాడా, నాకు తెలియదంటిని. ।
అప్పుడతడు నాతో ఇట్లనెను — జెరుబ్బాబెలుకు 6
ప్రత్యక్షమగు యెహోవా వాక్కు ఇదే; శక్తిచేత 7
నైనను బలముచేతనైనను కాక నా ఆత్మచేతనే (ఇది
జరుగునని) సైన్యములకు అధిపతియగు యెహోవా
సెలవిచ్చెను. గొప్ప పర్వతమా, జెరుబ్బాబెలును అడ్డ
గించుటకు నీవు ఏమాత్రపుదానవు? నీవు సదును భూమి

యొద్దరికి సమాధానకరమైన యోచనలు కలుగును. ।
ఆ కిరీటము యెహోవా ఆలయములో జ్ఞాపకార్థ
ముగా ఉంచబడి, హేలెముకును టోబీయాకును
యెదాయాకును జెఫన్యా కుమారుడైన హేనుకును
ఉండును. । దూరముగా ఉన్నవారు వచ్చి యెహోవా
ఆలయమును కట్టుదురు, అప్పుడు యెహోవా నన్ను
మీయొద్దకు పంపెనని మీరు తెలిసికొందురు; మీ
దేవుడైన యెహోవా మాట మీరు జాగ్రత్తగా ఆల
కించినయెడల ఈలాగు జరుగును.

రాజైన దర్యావేషు ఏలుబడియందు నాలుగవ
సంవత్సరము కిస్లేవు అను తొమ్మిదవ నెల నాలుగవ
దినమున బేతేలువారు షెరెజెరును రెగెమ్మెలెకును తమ
వారిని పంపి । — ఇన్ని సంవత్సరములు మేము
దుఃఖించినట్టు అయిదవ నెలలో ఉపవాసముండి
దుఃఖింతుమా అని । యెహోవాను శాంతిపరచుటకై
మందిరమునొద్దనున్న యాజకులను ప్రవక్తలను మనవి
చేయగా । సైన్యములకు అధిపతియగు యెహోవా
వాక్కు నాకు ప్రత్యక్షమై సెలవిచ్చినదేమనగా ।
— దేశపు జనులందరికిని యాజకులకును నీవీ మాట
తెలియజేయవలెను. ఈ జరిగిన డెబ్బది సంవత్సర
ములు ఏటేట అయిదవ నెలను ఏడవ నెలను మీరు
ఉపవాసముండి - దుఃఖము సలుపుచు వచ్చినప్పుడు
నాయందు భక్తికలిగియే ఉపవాసముంటిరా? । మరియు
మీరు ఆహారము పుచ్చుకొనునప్పుడు స్వప్రయోజన
మునకేగదా పుచ్చుకొంటిరి; మీరు పానము చేసి
నప్పుడు స్వప్రయోజనమునకేగదా పానము చేసితిరి. ।
యెరూషలేములోను దాని చుట్టును పట్టణములలోను
దక్షిణదేశములోను మైదానములోను జనులు విస్త
రించి క్షేమముగా ఉన్నకాలమున పూర్వికులగు ప్రవ
క్తలద్వారా యెహోవా ప్రకటన చేసిన ఆజ్ఞలను
మీరు మనస్సుకు తెచ్చుకొనకుండవచ్చునా?

మరియు యెహోవా వాక్కు జెకర్యాకు ప్రత్య
క్షమై సెలవిచ్చినదేమనగా । — సైన్యములకధిపతి
యగు యెహోవా ఈలాగు ఆజ్ఞ ఇచ్చియున్నాడు
—సత్యము ననుసరించి తీర్పు తీర్చుడి, ఒకరియందొకరు
కరుణావాత్సల్యములు కనుపరచుకొనుడి, । విధవ
రాండ్రను తండ్రిలేనివారిని పరదేశులను దరిద్రులను
బాధపెట్టకుడి, మీ హృదయమందు సహోదరు
లలో ఎవరికిని కీడు చేయదలచకుడి. । అయితే వారు
ఆలకింపనొల్లక మూర్ఖులై వినకుండ చెవులు మూసి
కొనిరి. । ధర్మశాస్త్రమును, పూర్వికులైన ప్రవక్తలద్వారా
సైన్యములకు అధిపతియగు యెహోవా తన ఆత్మప్రేరే
పణచేత తెలియజేసిన మాటలను, తాము వినకుండు
నట్లు హృదయములను కురువిందమువలె కఠినపరచు
కొనిరి గనుక సైన్యములకు అధిపతియగు యెహోవా
యొద్దనుండి మహాగ్రత వారిమీదికి వచ్చెను. ।
కావున సైన్యములకు అధిపతియగు యెహోవా 13
సెలవిచ్చునదేమనగా—నేను పిలిచినప్పుడు వారు ఆల
కింపకపోయిరి గనుక వారు పిలిచినప్పుడు నేను ఆల
కింపను. । మరియు వారెరుగని అన్యజనులలో నేను 14
వారిని చెదరగొట్టుదును. వారు తమ దేశమును విడి
చినమీదట అందులో ఎవరును సంచరింపకుండ అది
పాడగును; ఈలాగున వారు మనోహరమైన తమ దేశ
మునకు నాశనము కలుగజేసియున్నారు.

మరియు సైన్యములకు అధిపతియగు యెహోవా 8
వాక్కు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను. । —
సైన్యములకు అధిపతియగు యెహోవా ఆజ్ఞ ఇచ్చు 2
నదేమనగా—మిగుల ఆసక్తితో నేను సీయోను విషయ
మందు రోషము వహించియున్నాను. బహు రౌద్ర
ముగలవాడనై దాని విషయమందు నేను రోషము
వహించియున్నాను. । యెహోవా సెలవిచ్చునదేమ 3
నగా—నేను సీయోనునొద్దకు మరల వత్తును, యెరూ
షలేములో నివాసము చేతును, సత్యమును అనుసరించు
పురమనియు, సైన్యములకు అధిపతియగు యెహోవా
పర్వతము పరిశుద్ధ పర్వతమనియు పేర్లు పెట్టబడును. ।
సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చున 4
దేమనగా—అందరును వృద్ధత్వముచేత కఱ్ఱ పట్టుకొని,
వృద్ధులేమి వృద్ధురాండ్లేమి ఇంకను యెరూషలేము వీధు
లలో కూర్చుందురు. । ఆ పట్టణపు వీధులు ఆటలాడు 5
మగపిల్లలతోను ఆడుపిల్లలతోను నిండియుండును. ।
సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చునదే 6
మనగా—ఆ దినములందు శేషించియున్న జనులకిది ఆశ్చ
ర్యమని తోచినను నాకును ఆశ్చర్యమని తోచునా?
యిదే యెహోవా వాక్కు. । సైన్యములకు అధిపతి 7
యగు యెహోవా సెలవిచ్చునదేమనగా — తూర్పు
దేశములోనుండియు పడమటి దేశములోనుండియు
నేను నా జనులను రప్పించి రక్షించి । యెరూషలే 8
ములో నివసించుటకై వారిని తోడుకొని వచ్చెదను,
వారు నా జనులై యుందురు, నేను వారికి దేవుడనై
యుందును; ఇది నీతి సత్యములనుబట్టి జరుగును. ।
సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చున 9
దేమనగా—సైన్యములకు అధిపతియగు యెహోవా
మందిరమును కట్టుటకై దాని పునాదివేసిన దినమున
ప్రవక్తల నోట పలుకబడిన మాటలు ఈ కాలమున
వినువారలారా, ధైర్యము తెచ్చుకొనుడి. । ఆ దిన 10
ములకు ముందు మనుష్యులకు కూలి దొరకక యుండెను,
పశువుల పనికి బాడిగె దొరకకపోయెను, తన పని
మీద పోవువానికి శత్రుభయముచేత నెమ్మది లేక
పోయెను; ఏలయనగా ఒకరిమీదికొకరిని నేను రేపు
చుంటిని. । అయితే పూర్వదినములలో నేను ఈ 11
జనులలో శేషించినవారికి విరోధినైనట్టు ఇప్పుడు
విరోధిగా ఉండను. । సమాధానసూచకమైన ద్రాక్ష 12

చెట్లు ఫలమిచ్చును, భూమి పండును, ఆకాశమునుండి
మంచు కురియును, ఈ జనులలో శేషించినవారికి
వీటినన్నిటిని నేను స్వాస్థ్యముగా ఇత్తును; ఇదే సైన్య
13 ములకు అధిపతియగు యెహోవా వాక్కు. । యూదా
వారలారా, ఇశ్రాయేలువారలారా, మీరు అన్యజను
లలో. నేలాగు శాపాస్పదమై యుంటిరో ఆలాగే
మీరు ఆశీర్వాదాస్పదమగునట్లు నేను మిమ్మును రక్షిం
14 తును, భయపడక ధైర్యము తెచ్చుకొనుడి. । సైన్యము
లకు అధిపతియగు యెహోవా సెలవిచ్చునదేమనగా
—మీ పితరులు నాకు కోపము పుట్టింపగా దయ
15 తలచక నేను మీకు కీడుచేయ నుద్దేశించినట్లు । ఈ
కాలమున యెరూషలేమునకును యూదావారికిని మేలు
చేయ నుద్దేశించుచున్నాను గనుక భయపడకుడి. ।
16 మీరు చేయవలసిన కార్యములేవనగా, మీరందరు
ఒకరితోనొకరు యథార్థము పలుకవలెను, సత్యమును
బట్టి సమాధానకరమైన న్యాయమునుబట్టి మీ గుమ్మము
17 లలో తీర్పు తీర్చవలెను. । తన పొరుగువానిమీద ఎవ
డును దుర్యోచన యోచింపకూడదు, అబద్ధప్రమాణ
ముచేయ నిష్టపడకూడదు, ఇట్టివన్నియు నాకు అస
హ్యములు; ఇదే యెహోవా వాక్కు.
18 మరియు సైన్యములకు అధిపతియగు యెహోవా
వాక్కు నాకు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను. ।
19 సైన్యములకు అధిపతియగు యెహోవా ఆజ్ఞ ఇచ్చున
దేమనగా—నాలుగవ నెలలోని ఉపవాసము, అయిదవ
నెలలోని ఉపవాసము, ఏడవ నెలలోని ఉపవాసము,
పదియవ నెలలోని ఉపవాసము యూదా యింటి
వారికి సంతోషమును ఉత్సాహమును పుట్టించు మనో
హరములైన పండుగలగును. కాబట్టి సత్యమును సమా
20 ధానమును ప్రియముగా ఎంచుడి. । సైన్యములకు
అధిపతియగు యెహోవా సెలవిచ్చునదేమనగా —
జనములును అనేక పట్టణముల నివాసులును ఇంకను
21 వత్తురు. । ఒక పట్టణపువారు మరియొక పట్టణపువారి
యొద్దకు వచ్చి — ఆలస్యము చేయక యెహోవాను
శాంతిపరచుటకును, సైన్యములకు అధిపతియగు
యెహోవాను వెదకుటకును మనము పోదము రండి
అని చెప్పగా వారు — మేమును వత్తుమందురు. ।
22 అనేక జనములును బలముగల జనులును యెరూష
లేములో సైన్యములకు అధిపతియగు యెహోవాను
వెదకుటకును, యెహోవాను శాంతిపరచుటకును
23 వత్తురు. । సైన్యములకు అధిపతియగు యెహోవా
సెలవిచ్చునదేమనగా—ఆ దినములలో ఆయా భాషలు
మాటలాడు అన్యజనులలో పదేసిమంది యొక
యూదుని చెంగుపట్టుకొని—దేవుడు మీకు తోడుగా
...డను సంగతి మాకు వినబడినది గనుక మేము
...క వత్తుమని చెప్పుదురు.

దేశమునుగూర్చియు దమస్కు పట్టణ
మునుగూర్చియు వచ్చిన దేవోక్తి. । ఏలయనగా
యెహోవా (సర్వ) నరులను ఇశ్రాయేలీయుల
గోత్రపువారినందరిని లక్ష్యపెట్టువాడు గనుక, దాని
సరిహద్దును ఆనుకొనియున్న హమాతునుగూర్చియు,
జ్ఞానసమృద్ధిగల తూరు సీదోనులనుగూర్చియు అది
వచ్చెను. । తూరు పట్టణపువారు ప్రాకారముగల
కోటను కట్టుకొని, యిసుక రేణువులంత విస్తారముగా
వెండిని, వీధులలోని కసువంత విస్తారముగా సువర్ణ
మును సమకూర్చుకొనిరి. । యెహోవా సముద్ర
మందుండు దాని బలమును నాశనముచేసి దాని ఆస్తిని
పరులచేతి కప్పగించును, అది అగ్నిచేత కాల్చబడును. ।
అష్కెలోను దాని చూచి జడియును, గాజా దాని
చూచి బహుగా వణకును, ఎక్రోనుపట్టణము తాను
నమ్ముకొనినది అవమానము నొందగా చూచి భీతినొం
దును, గాజారాజు లేకుండ పోవును, అష్కెలోను
నిర్జనముగా ఉండును. । అష్డోదులో సంకరజనము
కాపురముండును, ఫిలిష్తీయుల అతిశయాస్పదమును
నేను నాశముచేసెదను. । వారి నోటనుండి (బలిపశు 7
రక్తమును) వారికను తినకుండ హేయమైన బలిమాంస
మును నేను తీసివేసెదను. వారును శేషముగా నుం
దురు, మన దేవునికి వారు యూదావారిలో పెద్దల
వలె నుందురు, ఎక్రోనువారును యెబూసీయులవలె
నుందురు. । నేను కన్నులార చూచితిని గనుక బాధిం 8
చువారు ఇకను సంచరింపకుండను, తిరుగులాడు సైన్య
ములు నా మందిరము మీదికి రాకుండను దాని
కాపాడుకొనుటకై నేనొక దండుపేటను ఏర్పరచెదను.
సీయోను నివాసులారా, బహుగా సంతోషిం 9
చుడి; యెరూషలేము నివాసులారా, ఉల్లాసముగా
ఉండుడి; నీ రాజు నీతిపరుడును రక్షణగలవాడును
దీనుడునై, గార్దభము గార్దభపు పిల్లను ఎక్కి నీయొద్దకు
వచ్చుచున్నాడు. । ఎఫ్రాయిములో రథములుండ 10
కుండ నేను చేసెదను, యెరూషలేములో గుర్రములు
లేకుండ చేసెదను, యుద్ధపువిల్లు లేకుండ పోవును, నీ
రాజు సమాధానవార్త అన్యజనులకు తెలియజేయును,
సముద్రమునుండి సముద్రమువరకు (ఫరాతు) నది
మొదలుకొని భూదిగంతమువరకు అతడు ఏలును. ।
మరియు నీవు చేసిన నిబంధన రక్తమునుబట్టి తాము 11
పడిన నీరులేని గోతిలోనుండి చెరపట్టబడిన నీవారిని
నేను విడిపించెదను. । బంధకములలో పడియుండియు 12
నిరీక్షణగలవారలారా, మీ కోటను మరల ప్రవేశిం
చుడి, రెండంతలుగా మీకు (మేలు) చేసెదనని నేడు
నేను మీకు తెలియజేయుచున్నాను. । యూదా 13
వారిని నాకు విల్లుగా వంచుచున్నాను, ఎఫ్రాయిము
వారిని బాణములుగా చేయుచున్నాను. సీయోనూ,
నీ కుమారులను రేపుచున్నాను, శూరుడు ఖడ్గము
ప్రయోగించునట్లు నేను నిన్ను ప్రయోగింతును.

గ్రేకీయులారా, సీయోను కుమారులను మీమీదికి
రేపుచున్నాను. । యెహోవా వారికి పైగా ప్రత్యక్ష
మగును, ఆయన బాణములు మెరుపువలె విడువబడును,
ప్రభువగు యెహోవా బాకానాదము చేయుచు
దక్షిణదిక్కునుండి వచ్చు గొప్ప సుడిగాలితో బయలు
దేరును. । సైన్యములకు అధిపతియగు యెహోవా
వారిని కాపాడును గనుక వారు (శత్రువులను) భక్షిం
చుచు, వడిసెలరాళ్లను అణగద్రొక్కుచు త్రాగుచు,
ద్రాక్షారసము త్రాగువారివలె బొబ్బలిడుచు, బలిపశు
రక్త పాత్రలును బలిపీఠపు మూలలును (రక్తముతో)
నిండునట్లు (రక్తముతో) నిండియుందురు. । నా జనులు
యెహోవా దేశములో కిరీటమందలి రత్నములవలె
నున్నారు గనుక కాపరి తన మందను రక్షించునట్లు
వారి దేవుడైన యెహోవా ఆ దినమున వారిని రక్షిం
చును. । వారు ఎంతో క్షేమముగా ఉన్నారు, ఎంతో
సొగసుగా ఉన్నారు; ధాన్యముచేత యౌవనులును
క్రొత్త ద్రాక్షారసముచేత యౌవన స్త్రీలును వృద్ధి
నొందుదురు.

10 కడవరి వానకాలమున వర్షము దయచేయుమని
యెహోవాను వేడుకొనుడి. ప్రతివాని చేనిలోను
పైరు మొలుచునట్లు యెహోవా మెరుపులను పుట్టిం
చును, ఆయన వానలు మెండుగా కురిపించును. ।
గృహదేవతలు వ్యర్థమైన మాటలు పలుకును, సోది
గాండ్లకు నిరర్థకమైన దర్శనములు కలుగును, మోస
ముతో కలలకు భావము చెప్పుదురు, మాయగల భావ
ములు చెప్పి ఓదార్చుదురు. కాబట్టి గొఱ్ఱెలమంద
తిరుగులాడునట్లు జనులు తిరుగులాడుదురు, కాపరి
లేక బాధనొందుదురు. । నా కోపాగ్ని మందుచు
కాపరులమీద పడును, (మందకు ముందుగాపోవు)
మేకలను నేను శిక్షించెదను, సైన్యములకు అధిపతి
యగు యెహోవా తన మందయగు యూదావారిని
దర్శించి వారిని తనకు రాజకీయములగు అశ్వముల
వంటివారినిగా చేయును. । వారిలోనుండి మూలరాయి
పుట్టును, మేకును యుద్ధపువిల్లును వారిచేత కలు
గును, బాధించువాడు వారిలోనుండి బయలుదేరును, ।
వారు యుద్ధముచేయుచు వీధుల బురదలో శత్రు
వులను త్రొక్కు పరాక్రమశాలురవలె ఉందురు.
యెహోవా వారికి తోడైయుండును గనుక వారు
యుద్ధముచేయగా గుఱ్ఱములను ఎక్కువారు సిగ్గు
నొందుదురు. । నేను యూదావారిని బలశాలులుగా
చేసెదను, యోసేపు సంతతివారికి రక్షణ కలుగజేసి
వారికి నివాసస్థలము ఇచ్చెదను, నేను వారియెడల జాలి
పడుదును, నేను వారి దేవుడనైన యెహోవాను,
నేను వారి మనవి ఆలకింపగా నేను వారిని విడిచి
పెట్టిన సంగతి వారు మరచిపోవుదురు. । ఎఫ్రా
యిమువారు బలాఢ్యులవంటివారగుదురు, ద్రాక్షారస

పానము చేయువారు సంతోషించునట్లు వారు మన
స్సున ఆనందింతురు, వారి బిడ్డలు దాని చూచి ఆనంద
పడుదురు, యెహోవానుబట్టి వారు హృదయపూర్వ
కముగా ఉల్లసించుదురు. । నేను వారిని విమోచించి 8
యున్నాను గనుక వారిని ఈలవేసి పిలిచి సమకూర్చె
దను, మునుపు విస్తరించినట్లు వారు విస్తరించుదురు. ।
అన్యజనులలో నేను వారిని విత్తగా దూరదేశములలో 9
వారు నన్ను జ్ఞాపకము చేసికొందురు, వారును వారి
బిడ్డలును సజీవులై తిరిగి వత్తురు. । ఐగుప్తుదేశములో 10
నుండి వారిని మరల రప్పించి అష్షూరు దేశములో
నుండి సమకూర్చి, యెక్కడను చోటు చాలనంత
విస్తారముగా గిలాదు దేశములోకిని లెబానోను దేశము
లోకిని వారిని తోడుకొని వచ్చెదను. । (యెహోవా) 11
దుఃఖసముద్రమును దాటి సముద్రతరంగములను అణచి
వేయును, నైలునదియొక్క లోతైన స్థలములను ఆయన
ఎండజేయును, అష్షూరీయుల అతిశయాస్పదము కొట్టి
వేయబడును, ఐగుప్తీయులు రాజదండమును పోగొట్టు
కొందురు. । నేను వారిని యెహోవాయందు బల 12
శాలులుగా చేయుదును, ఆయన నామము స్మరించుచు
వారు వ్యవహరింతురు; ఇదే యెహోవా వాక్కు.

లెబానోనూ, అగ్నివచ్చి నీ దేవదారు వృక్షము 11
లను కాల్చివేయునట్లు నీ ద్వారములను తెరువుము. ।
దేవదారు వృక్షములు కూలెను, వృక్షరాజములు 2
పాడైపోయెను; సరళవృక్షములారా, అంగలార్చుడి,
చిక్కని అడవి నరకబడెను; సిందూరవృక్షములారా,
అంగలార్చుడి. । గొఱ్ఱెబోయల రోదన శబ్దము విన 3
బడుచున్నది, ఏలయనగా వారి అతిశయాస్పదము
లయమాయెను. కొదమ సింహముల గర్జనము వినబడు
చున్నది, ఏలయనగా యొర్దానుయొక్క మహారణ్యము
పాడైపోయెను. । నా దేవుడైన యెహోవా సెల 4
విచ్చునదేమనగా — వధకేర్పడిన గొఱ్ఱెలమందను
మేపుము. । వాటిని కొనువారు వాటిని చంపియు 5
నిరపరాధులమని యనుకొందురు; వాటిని అమ్మినవారు
—మాకు బహు ద్రవ్యము దొరకుచున్నది, యెహో
వాకు స్తోత్రమని చెప్పుకొందురు; వాటిని కాయు
వారు వాటియెడల కనికరము చూపరు. । ఇదే 6
యెహోవా వాక్కు—నేనికను దేశనివాసులను కని
కరింపక ఒకరిచేతికి ఒకరిని, వారి రాజుచేతికి వారి
నందరిని అప్పగింతును, వారు దేశమును నాశనము
చేయగా వారి చేతిలోనుండి నేనెవరిని విడిపింపను. ।
కాబట్టి నేను కటాక్షమనునట్టియు, సమకూర్చుట 7
యనునట్టియు రెండు కఱ్ఱలు చేతపట్టుకొని, వధకేర్ప
డిన గొఱ్ఱెలను (ముఖ్యముగా) వాటిలో మిక్కిలి
బలహీనమైనవాటిని మేపుచువచ్చితిని. । ఒక నెల 8
లోగా కాపరులలో ముగ్గురిని సంహరించితిని; తరు
వాత నేను వారి విషయమై సహనము లేనివాడను

9 కాగా వారు నా విషయమై ఆయాసపడిరి. । కాబట్టి
నేనికను మిమ్మును కాపుకాయను; చచ్చునది చావ
వచ్చును, నశించునది నశింపవచ్చును, మిగిలినవి యొక
10 దాని మాంసము ఒకటి తినవచ్చును అని చెప్పి । కటాక్ష
మను కఱ్ఱను తీసికొని జనులందరితో నేను చేసిన
నిబంధనను భంగము చేయునట్లు దాని విరిచితిని. ।
11 అది విరువబడిన దినమున నేను చెప్పినది యెహోవా
వాక్కు అని మందలో బలహీనములై నన్ను కనిపెట్టు
12 కొనియున్న గొఱ్ఱెలు తెలిసికొనెను. । — మీకు
అనుకూలమైనయెడల నా కూలి నాకియ్యుడి, లేని
యెడల మానివేయుడని నేను వారితో అనగా వారు
నా కూలికై ముప్పది తులముల వెండి తూచి యిచ్చిరి. ।
13 యెహోవా — యెంతో అబ్బురముగా వారు నాకే
ర్పరచిన క్రయధనమును కుమ్మరివానికి పారవేయుమని
నాకు ఆజ్ఞ ఇయ్యగా నేను ఆ ముప్పది తులముల
వెండిని తీసికొని యెహోవా మందిరములో కుమ్మరి
14 వానికి పారవేసితిని. । అప్పుడు సమకూర్చుట యను
నట్టి నా రెండవ కఱ్ఱను తీసికొని యూదావారికిని
ఇశ్రాయేలువారికిని కలిగిన సహోదరబంధమును
భంగము చేయునట్లు దాని విరిచితిని.
15 అప్పుడు యెహోవా నాకు సెలవిచ్చినదేమనగా
—ఇప్పుడు బుద్ధిలేని యొక కాపరి పనిముట్లను తీసి
16 కొమ్ము. । ఏలయనగా దేశమందు నేనొక కాపరిని
నియమింపబోవుచున్నాను; అతడు నశించుచున్న
గొఱ్ఱెలను కనిపెట్టడు, చెదరిపోయినవాటిని వెదకడు,
విరిగిపోయినదాని బాగుచేయడు, పుష్టిగా ఉన్నదాని
కాపుకాయడు గాని క్రొవ్వినవాటి మాంసమును
భక్షించుచు వాటి డెక్కలను తుత్తునియలగా చేయు
17 చుండును. । మందను విడనాడు పనికిమాలిన కాపరికి
శ్రమ; అతని చెయ్యియు కుడికన్నును తెగవేయ
బడును; అతని చెయ్యి బొత్తిగా ఎండిపోవును అతని
కుడికంటికి దృష్టి బొత్తిగా తప్పును.

12 దేవోక్తి ఇశ్రాయేలీయులనుగూర్చి వచ్చిన
యెహోవా వాక్కు. ఆకాశమండలమును విశాల
పరచి భూమికి పునాదివేసి మనుష్యుల అంతరంగ
ములో జీవాత్మను సృజించు యెహోవా సెలవిచ్చున
దేమనగా
2 — నేను యెరూషలేమును చుట్టునున్న జనులకం
దరికి మత్తు పుట్టించు పాత్రగా చేయబోవుచున్నాను;
శత్రువులు యెరూషలేమునకు ముట్టడివేయగా అది
3 యూదామీదికిని వచ్చును. । ఆ దినమందు నేను
యెరూషలేమును సమస్తమైన జనులకు బరువైన రాయి
గా చేతును, దానిని ఎత్తి మోయువారందరు మిక్కిలి
గాయపడుదురు, భూజనులందరును దానికి విరోధులై
4 కూడుదురు. । ఇదే యెహోవా వాక్కు—ఆ దిన
మందు నేను గుఱ్ఱములన్నిటికిని బెదరును, వాటిని
ఎక్కువారికి వెఱ్ఱిని పుట్టింతును, యూదావారిమీద
నా దృష్టియుంచి జనముల గుఱ్ఱములన్నిటికిని అంధ
త్వము కలుగజేతును. । అప్పుడు యెరూషలేములోని
అధికారులు—యెరూషలేము నివాసులు తమ దేవుడైన
యెహోవాను నమ్ముకొనుటవలన మాకు బలము కలుగు
చున్నదని తమ హృదయమందు చెప్పుకొందురు. ।
ఆ దినమున నేను యూదా అధికారులను కట్టెల
క్రింది నిప్పులుగాను పనలక్రింది దివిటీగాను చేతును,
వారు నలుదిక్కులనున్న జనములనందరిని దహించు
దురు. యెరూషలేమువారు ఇంకను తమ స్వస్థలమగు
యెరూషలేములో నివసించుదురు. । మరియు దావీదు
ఇంటివారును యెరూషలేము నివాసులును తమకు కలి
గిన ఘనతనుబట్టి యూదావారిమీద అతిశయపడ
కుండునట్లు యెహోవా యూదావారిని మొదట
రక్షించును. । ఆ కాలమున యెహోవా యెరూష
లేము నివాసులకు సంరక్షకుడుగా నుండును; ఆ కాల
మున వారిలో శక్తిహీనులు దావీదువంటివారుగాను,
దావీదు సంతతివారు దేవునివంటివారుగాను జనుల
దృష్టికి యెహోవా దూతలవంటివారుగాను ఉందు
రు. । ఆ కాలమున యెరూషలేముమీదికి వచ్చు అన్య
జనులనందరిని నేను నశింపజేయ ప్రయత్నించెదను. ।
దావీదు సంతతివారిమీదను యెరూషలేము నివాసుల
మీదను కరుణనొందించు ఆత్మను విజ్ఞాపనచేయు ఆత్మను
నేను కుమ్మరింపగా వారు తాము పొడిచిన నామీద
దృష్టియుంచి, యొకడు తన యేక కుమారుని విష
యమై దుఃఖించునట్లు, తన జ్యేష్ఠపుత్రుని విషయమై
యొకడు ప్రలాపించునట్లు అతని విషయమై దుఃఖిం
చుచు ప్రలాపింతురు. । మెగిద్దోనులోయలో హదద్
రిమ్మోనుదగ్గర జరిగిన ప్రలాపమువలెనే ఆ దినమున
యెరూషలేములో బహుగా ప్రలాపము జరుగును. ।
దేశనివాసులందరు ఏ కుటుంబమునకు ఆ కుటుంబ
ముగా ప్రలాపింతురు, దావీదు కుటుంబికులు ప్రత్యే
కముగాను, వారి భార్యలు ప్రత్యేకముగాను, నాతాను
కుటుంబికులు ప్రత్యేకముగాను, వారి భార్యలు ప్రత్యే
కముగాను, । లేవి కుటుంబికులు ప్రత్యేకముగాను,
వారి భార్యలు ప్రత్యేకముగాను, షిమీ కుటుంబికులు
ప్రత్యేకముగాను, వారి భార్యలు ప్రత్యేకముగాను ।
మిగిలినవారిలో ప్రతి కుటుంబపువారు ప్రత్యేకము
గాను, వారి భార్యలు ప్రత్యేకముగాను ప్రలాపిం
తురు.

ఆ దినమున పాపమును అపవిత్రతను పరిహరిం 1
చుటకై దావీదు సంతతివారికొరకును, యెరూషలేము
నివాసులకొరకును ఊట యొకటి తియ్యబడును. ।
ఇదే సైన్యములకధిపతియగు యెహోవా వాక్కు— 2
ఆ దినమున విగ్రహముల పేళ్లు ఇకను జ్ఞాపకము
రాకుండ దేశములోనుండి నేను వాటిని కొట్టివేతును;

మరియు ప్రవక్తలను అపవిత్రాత్మను దేశములో
3 లేకుండ చేతును. । ఎవడైనను ఇక ప్రవచనము పలుక
బూనుకొనినయెడల వానిని కన్న తలిదండ్రులు—నీవు
యెహోవా నామమున అబద్ధము పలుకుచున్నావే;
నీవికను బ్రదుకతగదని వానితో చెప్పుదురు; వాడు
ప్రవచనము పలుకగా వానిని కన్న తలిదండ్రులే వాని
4 పొడుచుదురు. । ఆ దినమున తాము పలికిన ప్రవచన
ములనుబట్టియు, తమకు కలిగిన దర్శనమునుబట్టియు
ప్రవక్తలు సిగ్గుపడి ఇకను మోసపుచ్చకూడదని కంబళి
5 ధరించుట మానివేయుదురు. । వాడు– నేను ప్రవక్తను
కాను, బాల్యముననే నన్ను కొనిన యొకనియొద్ద
6 సేద్యపుపని చేయువాడనై యున్నాననును. । — నీ
చేతులకు గాయములేమని వారడుగగా వాడు — ఇవి
నన్ను ప్రేమించినవారి యింట నేనుండగా నాకు కలి
గిన గాయములని చెప్పును.

7 ఖడ్గమా, నా గొఱ్ఱెల కాపరిమీదను నా సహ
కారిమీదను పడుము; ఇదే సైన్యములకధిపతియగు
యెహోవా వాక్కు — గొఱ్ఱెలు చెదరిపోవునట్లు
కాపరిని హతముచేయుము, చిన్నవారిమీద నేను నా
హస్తమునుంచుదును; ఇదే యెహోవా వాక్కు. ।
8 దేశమంతట జనులలో రెండుభాగములవారు తెగ
వేయబడి చత్తురు, మూడవ భాగమువారు శేషింతురు. ।
9 ఆ మూడవ భాగమును నేను అగ్నిలోనుండి వెండిని తీసి
శుద్ధపరచినట్లు శుద్ధపరతును. బంగారమును శోధించి
నట్లు వారిని శోధింతును; వారు నా నామమునుబట్టి
మొఱ్ఱపెట్టగా నేను వారి మొఱ్ఱను ఆలకింతును
వీరు నా జనులని నేను చెప్పుదును, యెహోవా మా
దేవుడని వారు చెప్పుదురు.

**14** ఇదిగో యెహోవా (యేర్పాటుచేసిన) దినము
వచ్చుచున్నది, అందు మీయొద్ద దోచబడిన సొమ్ము
2 పట్టణములోనే విభాగింపబడును. । ఏలయనగా
యెరూషలేముమీద యుద్ధముచేయుటకు నేను అన్య
జనులనందరిని సమకూర్చబోవుచున్నాను; పట్టణము
పట్టబడును, ఇండ్లు కొల్లపెట్టబడును, స్త్రీలు చెరుప
బడుదురు, పట్టణములో సగముమంది చెరపట్టబడి
పోవుదురు; అయితే శేషించువారు నిర్మూలముకాకుండ
3 పట్టణములో నిలుతురు. । అప్పుడు యెహోవా
బయలుదేరి తాను యుద్ధకాలమున యుద్ధము చేయు
4 రీతిగా ఆ అన్యజనులతో యుద్ధముచేయును. । ఆ దిన
మున యెరూషలేము ఎదుట తూర్పుతట్టుననున్న ఒలీవ
కొండమీద ఆయన పాదములుంచగా ఒలీవకొండ
తూర్పుతట్టునకును పడమటితట్టునకును నడిమికి విడిపోయి
సగముకొండ ఉత్తరపుతట్టునకును సగముకొండ దక్షి
ణపుతట్టునకును జరుగును గనుక విశాలమైన లోయ
5 యొకటి యేర్పడును. । కొండలమధ్య కనబడు లోయ
ఆజీలువరకు సాగగా మీరు నా కొండలలోయలోనికి
పారిపోవుదురు. యూదారాజైన ఉజ్జియా దినము
లలో కలిగిన భూకంపమునకు మీరు భయపడి పారి
పోయినట్లు మీరు పారిపోవుదురు; అప్పుడు నీతో
కూడ పరిశుద్ధులందరును వచ్చెదరు. నా దేవుడైన
యెహోవా ప్రత్యక్షమగును. । (యెహోవా,) ఆ 6
దినమున ప్రకాశమానమగునవి సంకుచితములు కాగా
వెలుగు లేకపోవును. । ఆ దినము ప్రత్యేకమైనదిగా 7
ఉండును, అది యెహోవాకు తెలియబడిన దినము,
అది పగలుకాదు రాత్రికాదు; అస్తమయకాలమున
వెలుతురు కలుగును. । ఆ దినమున జీవజలములు 8
యెరూషలేములోనుండి పారి సగము తూర్పు సము
ద్రమునకును సగము పడమటి సముద్రమునకును
దిగును. వేసవికాలమందును చలికాలమందును ఆలాగు
ననే జరుగును. । యెహోవా సర్వలోకమునకు 9
రాజైయుండును, ఆ దినమున యెహోవా ఒక్కడే
అనియు, ఆయనకు పేరు ఒక్కటే అనియు తెలియ
బడును. । యెరూషలేము బెన్యామీను గుమ్మమునుండి 10
మూల గుమ్మమువరకును, అనగా మొదటి గుమ్మపు కొన
వరకును, హననేలు గుమ్మమునుండి రాజు గానుగులవర
కును వ్యాపించును. మరియు గెబనుండి యెరూష
లేము దక్షిణపుతట్టుననున్న రిమ్మోనువరకు దేశమంతయు
మైదానముగా ఉండును; । పట్టణము ఎత్తుగా కన 11
బడును, జనులు అక్కడ నివసింతురు, శాపము ఇకను
కలుగదు, యెరూషలేము నివాసులు నిర్భయముగా
నివసింతురు. । మరియు యెహోవా తెగుళ్లు పుట్టించి 12
యెరూషలేముమీద యుద్ధముచేసిన జనములనందరిని
ఈలాగున మొత్తును; వారు నిలిచియున్నపాటుననే
వారి దేహములు కుళ్లిపోవును, వారి కన్నులు కను
తొఱ్ఱలలో ఉండియే కుళ్లిపోవును వారి నాలుకలు
నోళ్లలో ఉండియే కుళ్లిపోవును. । ఆ దినమున 13
యెహోవా వారిలో గొప్ప కల్లోలము పుట్టింపగా
వారందరు ఒకరికొకరు విరోధులై ఒకరిమీద నొకరు
పడుదురు. । యూదావారు యెరూషలేమునొద్ద 14
యుద్ధముచేయుదురు, బంగారును వెండియు వస్త్రము
లును చుట్టునున్న అన్యజనులందరి ఆస్తియంతయు విస్తా
రముగా కూర్చబడును. । ఆలాగుననే గుఱ్ఱములమీ 15
దను కంచరగాడిదెలమీదను ఒంటెలమీదను గార్దభ
ములమీదను దండు పాళెములో ఉన్న పశువులన్నిటి
మీదను తెగుళ్లు పడును. । మరియు యెరూషలేము 16
మీదికి వచ్చిన అన్యజనులలో శేషించినవారందరును
సైన్యములకు అధిపతియగు యెహోవాయను రాజుకు
మ్రొక్కుటకును పర్ణశాలపండుగ ఆచరించుటకును
ఏటేట వత్తురు. । లోకమందుండు కుటుంబములలో 17
సైన్యములకు అధిపతియగు యెహోవాయను రాజుకు
మ్రొక్కుటకై యెరూషలేమునకు రానివారందరిమీద

18 వర్షము కురువకుండును. ఐగుప్తీయుల కుటుంబపువారు
బయలుదేరకయు రాకయు ఉండినయెడల వారికి
వర్షము లేకపోవును, పర్ణశాలపండుగ ఆచరించుటకై
రాని అన్యజనులకు తాను నియమించిన తెగులుతో
19 యెహోవా వారిని మొత్తును. ఐగుప్తీయులకును,
పర్ణశాలపండుగ ఆచరించుటకు రాని అన్యజనులకంద
20 రికిని రాగల శిక్ష యిదే. ఆ దినమున గుర్రముల
యొక్క కళ్లెములమీద — యెహోవాకు ప్రతిష్ఠి
తము అను మాట వ్రాయబడును; యెహోవా మంది
రములోనున్న పాత్రలు బలిపీఠము ఎదుటనున్న
ములవలె (ప్రతిష్ఠితములుగా) ఎంచబడును. యె
లేమునందును యూదాదేశమందును ఉన్న
లన్నియు సైన్యములకు అధిపతియగు యెహో
ప్రతిష్ఠితములగును; బలిపశువులను వధించువా
రును వాటిలో కావలసినవాటిని తీసికొని వా
వండుకొందురు. ఆ దినమున కనానీయుడు
సైన్యములకు అధిపతియగు యెహోవా
ములో ఉండడు.

# మ లా కీ



1 దేవోక్తి. ఇశ్రాయేలీయులనుగూర్చి మలాకీద్వారా
2 పలుకబడిన యెహోవా వాక్కు. । యెహోవా
సెలవిచ్చునదేమనగా — నేను మీయెడల ప్రేమ
చూపియున్నాను, అయితే మీరు—ఏ విషయమందు
నీవు మాయెడల ప్రేమ చూపితివందురు. ఏశావు
యాకోబుకు అన్న కాడా? అయితే నేను యాకో
బును ప్రేమించితిని; ఇదే యెహోవా వాక్కు. ।
3 ఏశావును ద్వేషించి అతని పర్వతములను పాడుచేసి
అతని స్వాస్థ్యమును అరణ్యమందున్న నక్కలపాలు
4 చేసితిని. । మనము నాశనమైతివి, పాడైన మన స్థలము
లను మరల కట్టుకొందము రండని ఎదోమీయులు
అనుకొందురు; అయితే సైన్యములకు అధిపతియగు
యెహోవా సెలవిచ్చునదేమనగా — వారు కట్టు
కొన్నను నేను వాటిని క్రింద పడద్రోయుదును;
లోకులు—వారి దేశము భక్తిహీనుల ప్రదేశమనియు,
వారు యెహోవా నిత్య కోపాగ్నికి పాత్రులనియు
5 పేరుపెట్టుదురు. । కన్నులార దాని చూచి ఇశ్రా
యేలీయుల సరిహద్దులలో యెహోవా బహు ఘను
డుగా ఉన్నాడని మీరందురు.

6 కుమారుడు తన తండ్రిని ఘనపరచును గదా,
దాసుడు తన యజమానుని ఘనపరచును గదా;
నా నామమును నిర్లక్ష్యపెట్టు యాజకులారా, నేను
తండ్రినైతే నాకు రావలసిన ఘనత ఏమాయెను?
నేను యజమానుడనైతే నాకు భయపడువాడెక్కడ
ఉన్నాడు? అని సైన్యములకధిపతియగు యెహోవా
మిమ్ము నడుగగా—ఏమి చేసి నీ నామమును నిర్లక్ష్య
7 పెట్టితిమని మీరందురు. । నా బలిపీఠముమీద అప
విత్రమైన భోజనమును మీరు అర్పించుచు, ఏమి
చేసి నిన్ను అపవిత్రపరచితిమని మీరందురు.
యెహోవా భోజనపుబల్లను నీచపరచినందుచేత నే
8 గదా. । గుడ్డిదానిని తీసికొని బలిగా అర్పించినయెడల
అది దోషము కాదా? కుంటిదానినైనను రోగముగల
దానినైనను అర్పించినయెడల అది దోషముకాదా?
అట్టివాటిని నీ యధికారికి నీవిచ్చినయెడల అతడు నీకు
దయచూపునా, నిన్ను అంగీకరించునా? అని సైన్యము
లకు అధిపతియగు యెహోవా అడుగుచున్నాడు. ।
9 దేవుడు మనకు కటాక్షము చూపునట్లు ఆయనను
శాంతపరచుడి; మీ చేతనేగదా అది జరిగెను. ఆయన
మిమ్మునుబట్టి యెవరినైన అంగీకరించునా? అని సైన్య
ములకు అధిపతియగు యెహోవా అడుగుచున్నా
10 డు. । మీలో ఒకడు నా బలిపీఠముమీద నిరర్థకముగా
అగ్ని రాజబెట్టకుండునట్లు నా మందిరపు వాకిండ్లను
మూయువాడొకడు మీలో ఉండినయెడల మేలు;
మీయందు నాకిష్టములేదు, మీచేత నేను నైవేద్య
మును అంగీకరింపనని సైన్యములకు అధిపతియగు
యెహోవా సెలవిచ్చుచున్నాడు. । తూర్పుదిశ 11
మొదలుకొని పడమటిదిశవరకు అన్యజనులలో నా
నామము ఘనముగా ఎంచబడును, సకల స్థలములలో
ధూపమును పవిత్రమైన యర్పణలును అర్పింప
బడును, అన్య జనులలో నా నామము ఘనముగా
ఎంచబడునని సైన్యములకు అధిపతియగు యెహోవా
సెలవిచ్చుచున్నాడు. । అయితే — యెహోవా 12
భోజనపుబల్ల అపవిత్రమనియు, దానిమీద ఉంచి
యున్న భోజనము నీచమనియు మీరు చెప్పుచు
దాని దూషింతురు. । — అయ్యో యెంత ప్రయాస 13
మని చెప్పి ఆ బల్లను తృణీకరించుచున్నారని ఆయన
సెలవిచ్చుచున్నాడు; ఇదే సైన్యములకు అధిపతియగు
యెహోవా వాక్కు. మరియు దోచబడినదానిని
కుంటిదానిని తెగులుదానిని మీరు తెచ్చుచున్నారు.
ఈలాగుననే మీరు నైవేద్యములు చేయుచున్నారు;
మీచేత నేనిట్టిదానిని అంగీకరింతునా? అని
యెహోవా అడుగుచున్నాడు. । నేను ఘనమైన 14
మహారాజునై యున్నాను; అన్యజనులలో నా
నామము భయంకరమైనదిగా ఎంచబడుచున్నదని
సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చు
చున్నాడు. కాబట్టి తన మందలో మగదియుండగా
యెహోవాకు మ్రొక్కుబడిచేసి చెడిపోయినదానిని
అర్పించు వంచకుడు శాపగ్రస్తుడు.

కావున యాజకులారా, ఈ ఆజ్ఞ మీకియ్యబడి **2**
యున్నది. । సైన్యములకు అధిపతియగు యెహోవా 2
సెలవిచ్చునదేమనగా — మీరు ఆ యాజ్ఞను ఆలకిం
పకయు, నా నామమును ఘనపరచునట్లు మనః
పూర్వకముగా దానిని ఆలోచింపకయు ఉండినయెడల
నేను మీ మీదికి శాపము తెప్పించి మీకు కలిగిన
ఆశీర్వాదఫలమును శపింతును; మీరు దానిని మన
స్సునకు తెచ్చుకొనరైతిరి గనుక ఇంతకు మునుపే నేను
వాటిని శపించి యుంటిని. । మిమ్మునుబట్టి విత్తనములు 3
చెరిపివేతును, మీ ముఖములమీద పేడ వేతును,
పండుగులలో మీరర్పించిన పశువులపేడ వేతును,
పేడ ఊడ్చివేసిన స్థలమునకు మీరు ఊడ్చివేయబడు
దురు. । అందువలన లేవీయులకు నిబంధనగా ఉండు 4
నట్లు ఈ ఆజ్ఞను మీకిచ్చినవాడను నేనేయని

మీరు తెలిసికొందురని సైన్యములకు అధిపతియగు
5 యెహోవా సెలవిచ్చుచున్నాడు. । నేను చేసిన
నిబంధన వారికి జీవమునకును సమాధానమునకును
కారణమాయెను; భయభక్తులు పుట్టించుటకై నేను
వాటిని వారికిచ్చితిని గనుక వారు నాయందు భయ
భక్తులు కలిగి, నా నామ విషయములో భయముగల
6 వారై । సత్యముగల ధర్మశాస్త్రము బోధించుచు దుర్బోధ
నేమాత్రమును చేయక, సమాధానమునుబట్టియు
యథార్థతనుబట్టియు నన్ననుసరించి నడుచుకొనువారై,
7 దోషమునుండి యనేకులను త్రిప్పిరి. । యాజకులు
సైన్యములకు అధిపతియగు యెహోవా దూతలు
గనుక జనులు వారి నోట ధర్మశాస్త్రవిధులను నేర్చు
కొందురు, వారు జ్ఞానమునుబట్టి బోధింపవలెను. ।
8 అయితే మీరు మార్గము తప్పితిరి, ధర్మశాస్త్రవిషయ
ములో మీరు అనేకులను అభ్యంతరపరచి, లేవీయు
లతో చేయబడిన నిబంధనను నిరర్థకము చేసియు
9 న్నారు । నా మార్గములను అనుసరింపక, ధర్మశాస్త్ర
మునుబట్టి విమర్శించుటలో మీరు పక్షపాతులు గనుక
జనులందరి దృష్టికి మిమ్మును తృణీకరింపదగినవారిని
గాను నీచులనుగాను చేసియున్నాను అని సైన్యము
లకు అధిపతియగు యెహోవా సెలవిచ్చుచున్నాడు.
10 మనకందరికి తండ్రియొక్కడే కాడా? ఒక్క
దేవుడే మనలను సృష్టింపలేదా! యీలాగుండగా ఒకరి
యెడల ఒకరము ద్రోహము చేయుచు, మన పితరు
లతో చేయబడిన నిబంధనను మనమెందుకు తృణీ
11 కరించుచున్నాము! । యూదావారు ద్రోహులైరి,
ఇశ్రాయేలీయులమధ్య యెరూషలేములోనే హేయ
క్రియలు జరుగుచున్నవి, యూదావారు యెహో
వాకు ప్రియమైన పరిశుద్ధస్థలమును అపవిత్రపరచి
అన్యదేవతను (అనుసరించు) పిల్లలను పెండ్లిచేసికొనిరి. ।
12 యాకోబు సంతతివారి డేరాలలో ఉండువారెవరును
బ్రదుకకుండునట్లును, సైన్యములకు అధిపతియగు
యెహోవాకు నైవేద్యము చేయకుండునట్లును
యెహోవా ఈలాగు చేయువారిని నిర్మూలము
13 చేయును. । మరియు రెండవసారి మీరాలాగుననే
చేయుదురు; యెహోవా బలిపీఠమును మీరు ఏడ్పు
తోను కన్నీళ్లతోను రోదనముతోను తడుపుదురు.
కాబట్టి ఆయన మీ నైవేద్యమును అంగీకరింపకయు,
తనకు అనుకూలము కాని అర్పణలను మీచేత తీసి
14 కొనకయు నున్నాడు. । అది ఎందుకని మీ రడుగగా,
యౌవనకాలమందు మీరు పెండ్లిచేసికొని అన్యాయ
ముగా విసర్జించిన మీ భార్యల పక్షమున యెహోవా
సాక్షియాయెను, అది నీకు తోటిదై నీవు చేసిన నిబంధ
నకు పాత్రురాలు గదా, నీ పెండ్లి భార్య గదా. ।।
15 కొంచెముగానైనను దైవాత్మనొందినవారిలో ఎవరును
ఈలాగున చేయులేదు; ఒకడు చేసినను ఏమి జరిగెను?

దేవునిచేత సంతతి నొందవలెనని అతడు యత్నము చేసెను! గదా; కాగా మిమ్మును మీరే జాగ్రత్త చేసికొని, యౌవనమున పెండ్లిచేసికొనిన మీ భార్యల విషయములో విశ్వాసఘాతుకులుగా ఉండకుడి. । భార్యను పరిత్యజించుట। నాకు అసహ్యమైన క్రియ యని ఇశ్రాయేలీయుల దేవుడగు యెహోవా సెలవిచ్చుచున్నాడు. మరియు ఒకడు తన వస్త్రములను బలాత్కారముతో నింపుట నా కసహ్యమని సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చుచున్నాడు; కాబట్టి మీ మనస్సులను కాచుకొనుడి, విశ్వాసఘాతుకులుకాకుడి.

మీ మాటలచేత మీరు యెహోవాను ఆయాసపెట్టుచు, దేనిచేత ఆయనను ఆయాసపెట్టుచున్నామని మీరడుగుచున్నారే.—దుర్మార్గులు యెహోవా దృష్టికి మంచివారు, వారియందు ఆయన సంతోషపడును; లేనియెడల న్యాయకర్తయగు దేవుడు ఏమాయెను అని చెప్పుకొనుటచేతనే మీరాయనను ఆయాసపెట్టుచున్నారు.

నాకు ముందుగా మార్గము సిద్ధపరచుటకై నేను నా దూతను పంపుచున్నాను; మీరు వెదకుచున్న ప్రభువు, అనగా మీరు కోరు నిబంధన దూత, తన ఆలయమునకు హఠాత్తుగా వచ్చును; ఇదిగో ఆయన వచ్చుచున్నాడని సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చుచున్నాడు. । అయితే ఆయన వచ్చుదినమును ఎవరు సహింపగలరు? ఆయన అగుపడగా ఎవరు ఓర్వగలరు? ఆయన కంసాలి అగ్నివంటివాడు, చాకలివాని సబ్బువంటివాడు; । వెండిని శోధించి నిర్మలము చేయువాడైనట్లు కూర్చునియుండును. లేవీయులు నీతిని అనుసరించి యెహోవాకు నైవేద్యములు చేయునట్లు వెండి బంగారములను నిర్మలము చేయురీతిని ఆయన వారిని నిర్మలులను చేయును. । అప్పుడు మునుపటి దినములలో ఉండినట్లును, పూర్వపు సంవత్సరములలో ఉండినట్లును, యూదావారును యెరూషలేము నివాసులును చేయు నైవేద్యములు యెహోవాకు ఇంపుగా ఉండును. । తీర్పు తీర్చుటకై నేను మీయొద్దకు రాగా, చిల్లంగివాండ్ల మీదను వ్యభిచారులమీదను అప్రమాణికులమీదను, నాకు భయపడక వారి కూలివిషయములో కూలివారిని విధవరాండ్రను తండ్రిలేనివారిని బాధపెట్టి పరదేశులకు అన్యాయముచేయువారి మీదను దృఢముగా సాక్ష్యము పలుకుదునని సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చుచున్నాడు. । యెహోవానైన నేను మార్పులేనివాడను గనుక యాకోబు సంతతివారైన। మీరు లయముకాలేదు.

మీ పితరులనాటనుండి మీరు నా కట్టడలను గైకొనక వాటిని త్రోసివేసితిరి; అయితే మీరు నా

తట్టు తిరిగినయెడల నేను మీతట్టు తిరుగుదునని సైన్య
ములకు అధిపతియగు యెహోవా సెలవియ్యగా—
మేము దేనివిషయములో తిరుగుదుమని మీరందురు. ।
మానవుడు దేవునియొద్ద దొంగిలునా? అయితే మీరు
నాయొద్ద దొంగిలితిరి; దేనివిషయములో మేము నీ
యొద్ద దొంగిలితిమని మీరందురు. దశమభాగమును
ప్రతిష్ఠితార్పణలను ఇయ్యక దొంగిలితిరి. । ఈ జను
లందరును నాయొద్ద దొంగిలుచునే యున్నారు, మీరు
శాపగ్రస్తులై యున్నారు. । నా మందిరములో ఆహార
ముండునట్లు దశమభాగమంతయు మీరు నా మంది
రపు నిధిలోనికి తీసికొనిరండి; దీని చేసి మీరు నన్ను
శోధించినయెడల నేను ఆకాశపు వాకిండ్లను విప్పి,
పట్టజాలనంత విస్తారముగా దీవెనలు కుమ్మరించెదనని
సైన్యములకు అధిపతియగు యెహోవా సెలవిచ్చు
చున్నాడు. । మీ పంటను తినివేయు పురుగులను
నేను గద్దించెదను, అవి మీ భూమిపంటను నాశనము
చేయవు, మీ ద్రాక్షచెట్లు అకాలఫలములను రాల్పక
యుండునని సైన్యములకు అధిపతియగు యెహోవా
సెలవిచ్చుచున్నాడు । అప్పుడు ఆనందకరమైన దేశ
ములో మీరు నివసింతురు గనుక అన్యజనులందరును
మిమ్మును ధన్యులందురని సైన్యములకు అధిపతియగు
యెహోవా సెలవిచ్చుచున్నాడు.

యెహోవా సెలవిచ్చునదేమనగా—నన్నుగూర్చి
మీరు బహు గర్వపుమాటలు పలికి — నిన్నుగూర్చి
యేమి చెప్పితిమని మీరడుగుదురు. । దేవుని సేవ
చేయుట నిష్ఫలమనియు, ఆయన ఆజ్ఞలను గైకొని
సైన్యములకు అధిపతియగు యెహోవా సన్నిధిని
మనము దుఃఖాక్రాంతులుగా తిరుగుటవలన ప్రయో
జనమేమనియు, । గర్విష్ఠులు ధన్యులగుదురనియు
యెహోవాను శోధించు దుర్మార్గులు వర్ధిల్లుదురనియు,
వారు సంరక్షణ పొందుదురనియు మీరు చెప్పుకొను
చున్నారు. । అప్పుడు, యెహోవాయందు భయ
భక్తులుగలవారు ఒకరితో ఒకరు మాటలాడుకొను
చుండగా యెహోవా చెవియొగ్గి ఆలకించెను.
మరియు యెహోవాయందు భయభక్తులుకలిగి ఆయన
నామమును స్మరించుచు ఉండువారికి జ్ఞాపకార్థముగా
ఒక గ్రంథము ఆయన సముఖమునందు వ్రాయ
బడెను. । నేను నియమింపబోవు దినము రాగా వారు 17
నావారై నా స్వకీయసంపాద్యమై యుందురు; తండ్రి
తన్ను సేవించు కుమారుని కనికరించునట్లు నేను వారిని
కనికరింతునని సైన్యములకు అధిపతియగు యెహోవా
సెలవిచ్చుచున్నాడు. । అప్పుడు నీతిగలవారెవరో 18
దుర్మార్గులెవరో దేవుని సేవించువారెవరో ఆయనను
సేవించనివారెవరో మీరు తిరిగి కనుగొందురు.

ఏలయనగా నియమింపబడిన దినము వచ్చుచున్నది, 4
కొలిమి కాలునట్లు అది కాలును; గర్విష్ఠులందరును
దుర్మార్గులందరును కొయ్యకాలువలె ఉందురు,
వారిలో ఒకనికిని వేరైనను చిగురైనను లేక, రాబోవు
దినము అందరిని కాల్చివేయునని సైన్యములకు అధి
పతియగు యెహోవా సెలవిచ్చుచున్నాడు. ।
అయితే నా నామమందు భయభక్తులుగలవారగు మీకు 2
నీతి సూర్యుడు ఉదయించును; అతని రెక్కలు ఆరో
గ్యము కలుగజేయును గనుక మీరు బయలుదేరి
క్రొవ్విన దూడలు గంతులు వేయునట్లు గంతులు
వేయుదురు. । నేను నియమింపబోవు దినమున దుర్మా 3
ర్గులు మీ పాదములక్రింద ధూళివలె ఉందురు, మీరు
వారిని అణగద్రొక్కుదురని సైన్యములకు అధిపతి
యగు యెహోవా సెలవిచ్చుచున్నాడు.

హోరేబు కొండమీద ఇశ్రాయేలీయులందరి 4
కొరకై నేను నా సేవకుడైన మోషేకు ఆజ్ఞాపించిన
ధర్మశాస్త్రమును దాని కట్టడలను విధులను జ్ఞాపకముచేసి
కొనుడి. । యెహోవా నియమించిన భయంకరమైన 5
ఆ మహాదినము రాకమునుపు నేను ప్రవక్తయగు ఏలీ
యాను మీయొద్దకు పంపుదును. । నేను వచ్చి దేశ 6
మును శపించకుండునట్లు అతడు తండ్రుల హృదయ
ములను పిల్లలతట్టును పిల్లల హృదయములను। తండ్రుల
తట్టును త్రిప్పును.

సమాప్తము.

Printed at the Methodist Publishing House, Madras—1929.

# THE
# NEW TESTAMENT

OF OUR

## LORD AND SAVIOUR JESUS CHRIST

**TRANSLATED INTO TELUGU FROM THE ORIGINAL GREEK**

---

మన ప్రభువును రక్షకుడునైన యేసుక్రీస్తును

గూర్చిన

# క్రొత్త నిబంధన గ్రంథము

ఇది

బ్రిటిష్ అన్డ్ ఫారిన్ బైబిలు సొసైయటీవారి అనుమతిచొప్పున

ఆదిమ గ్రీకు భాషలోనుండి తెనుగు భాషలో తర్జుమా చేయబడినది

---


BRITISH AND FOREIGN BIBLE SOCIETY

MADRAS AUXILIARY

1929

Royal 8vo] [Long Primer

# క్రొత్త నిబంధన గ్రంథములోని పుస్తకములు

## పుస్తకముల నామక్రమము, అధ్యాయముల వెరసి

# మత్తయి సువార్త

1 అబ్రాహాము కుమారుడగు దావీదుయొక్క కుమా
రుడైన యేసుక్రీస్తు[1] వంశావళి.
2 అబ్రాహాము ఇస్సాకును కనెను, ఇస్సాకు యాకో
బును కనెను, యాకోబు యూదాను అతని అన్న
3 దమ్ములను కనెను, । యూదా తామారునందు పెరె
సును జెరహునును కనెను, పెరెసు ఎస్రోమును
4 కనెను, । ఎస్రోము అరామును కనెను, అరాము
అమ్మీనాదాబును కనెను, అమ్మీనాదాబు నయస్సోనును
5 కనెను, । నయస్సోను శల్మానును కనెను, శల్మాను
రాహాబునందు బోయజును కనెను, బోయజు రూతు
నందు ఓబేదును కనెను, ఓబేదు యెష్షయిని కనెను, ।
6 యెష్షయి రాజైన దావీదును కనెను.
దావీదు ఊరియా భార్యయైన ఆమెయందు సొలొ
7 మోనును కనెను, । సొలొమోను రెహబామును
కనెను, రెహబాము అబీయాను కనెను, అబీయా
8 ఆసాను కనెను, । ఆసా యెహోషాపాతును కనెను,
యెహోషాపాతు యెహోరామును కనెను,
9 యెహోరాము ఉజ్జియాను కనెను, । ఉజ్జియా
యోతామును కనెను, యోతాము ఆహాజును కనెను,
10 ఆహాజు హిజ్కియాను కనెను, । హిజ్కియా మనష్షేను
కనెను, మనష్షే ఆమోనును కనెను, ఆమోను యోషీ
11 యాను కనెను, । జనులు బాబెలుకు కొనిపోబడిన
కాలములో యోషీయా యెకొన్యాను అతని సహో
దరులను కనెను.
12 బాబెలుకు కొనిపోబడిన తరువాత యెకొన్యా
షయల్తీయేలును కనెను, షయల్తీయేలు జెరుబ్బాబెలును
13 కనెను, । జెరుబ్బాబెలు అబీహూదును కనెను, అబీ
హూదు ఎల్యాకీమును కనెను, ఎల్యాకీము అజోరును
14 కనెను, । అజోరు సాదోకును కనెను, సాదోకు అకీ
15 మును కనెను, అకీము ఎలీహూదును కనెను, । ఎలీ
హూదు ఎలాజారును కనెను, ఎలాజారు మత్తానును
16 కనెను, మత్తాను యాకోబును కనెను, । యాకోబు
మరియ భర్తయైన యోసేపును కనెను, ఆమెయందు
క్రీస్తు అనబడిన యేసు పుట్టెను.
17 ఇట్లు అబ్రాహాము మొదలుకొని దావీదు పర్యం
తము తరములన్నియు పదునాలుగు తరములు. దావీదు
మొదలుకొని యూదులు బాబెలుకు కొనిపోబడిన
కాలపర్యంతము పదునాలుగు తరములు; బాబెలుకు
కొనిపోబడినది మొదలుకొని క్రీస్తు పర్యంతము పదు
నాలుగు తరములు.

యేసుక్రీస్తు జన్మవిధ మెట్లనగా, ఆయన తల్లియైన 18
మరియ యోసేపుకు ప్రధానము చేయబడిన తరువాత
వారేకము కాకమునుపు ఆమె పరిశుద్ధాత్మవలన గర్భ
వతిగా ఉండెను. । ఆమె భర్తయైన యోసేపు నీతిమం 19
తుడై యుండి ఆమెను అవమానపరచనొల్లక రహస్య
ముగా ఆమెను విడనాడ ఉద్దేశించెను. । అతడు ఈ సంగ 20
తులను గూర్చి ఆలోచించుకొనుచుండగా ప్రభువు
దూత స్వప్నమందు అతనికి ప్రత్యక్షమై — దావీదు
కుమారుడవైన యోసేపూ, నీ భార్యయైన మరియను
చేర్చుకొనుటకు భయపడకుము, ఆమె గర్భము ధరించి
నది పరిశుద్ధాత్మవలన కలిగినది; । ఆమె యొక కుమారుని 21
కనును; తన ప్రజలను వారి పాపములనుండి ఆయనే
రక్షించును గనుక ఆయనకు యేసు[2] అను పేరు పెట్టుదు
వనెను.

ఇదిగో కన్యక గర్భవతియై కుమారుని కనును 22
ఆయనకు ఇమ్మానుయేలను పేరు పెట్టుదురు

అని ప్రభువు తన ప్రవక్తద్వారా[3] పలికిన మాట నెర 23
వేరునట్లు ఇదంతయు జరిగెను. ఇమ్మానుయేలను పేరుకు
భాషాంతరమున దేవుడు మనకు తోడని అర్థము. ।
యోసేపు నిద్రమేలుకొని ప్రభువు దూత తనకు 24
ఆజ్ఞాపించిన ప్రకారము చేసి, తన భార్యను చేర్చు
కొని । ఆమె కుమారుని కనువరకు ఆమెను ఎరుగకుం 25
డెను; అతడా కుమారునికి యేసు అను పేరు పెట్టెను.

రాజైన హేరోదు దినములయందు యూదైయ 2
దేశపు బేత్లెహేములో యేసు పుట్టిన పిమ్మట తూర్పు
దేశపు జ్ఞానులు యెరూషలేముకు వచ్చి । —యూదుల 2
రాజుగా పుట్టినవాడు ఎక్కడున్నాడు? తూర్పు
దిక్కున మేము ఆయన నక్షత్రము చూచి ఆయనను
పూజింప వచ్చితిమని చెప్పిరి । హేరోదు రాజు ఈ 3
సంగతి విన్నప్పుడు అతడును అతనితోకూడ యెరూష
లేమువారందరును కలవరపడిరి. । కాబట్టి రాజు ప్రధాన 4
యాజకులను ప్రజలలోనుండు శాస్త్రులను అందరిని
సమకూర్చి— క్రీస్తు ఎక్కడ పుట్టునని వారి నడిగెను. ।
అందుకు వారు — యూదైయ బేత్లెహేములోనే; 5
యేలయనగా

యూదైయదేశపు బేత్లెహేమా
నీవు యూదా ప్రధానులలో
ఎంతమాత్రమును అల్పమైనదానవు కావు
ఇశ్రాయేలను నా ప్రజలను పరిపాలించు అధిపతి
నీలోనుండి వచ్చును

[1] క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము. [2] యేసు అను శబ్దమునకు రక్షకుడని అర్థము. [3] యెష. 7: 14.

6 అని ప్రవక్తద్వారా[1] వ్రాయబడియున్నదనిరి. । అం
7 తట హేరోదు ఆ జ్ఞానులను రహస్యముగా పిలిపించి,
ఆ నక్షత్రము కనబడిన కాలము వారిచేత పరిష్కార
8 ముగా తెలిసికొని । —మీరు వెళ్లి ఆ శిశువు విషయమై
జాగ్రత్తగా విచారించి తెలిసికొనగానే, నేనును వచ్చి
ఆయనను పూజించునట్లు నాకు వర్తమానము తెండని
9 చెప్పి వారిని బేత్లెహేముకు పంపెను. । వారు రాజు
మాట విని బయలుదేరి పోవుచుండగా, తూర్పుదేశ
మున వారు చూచిన నక్షత్రము ఆ శిశువుండిన
చోటికి మీదుగా వచ్చి నిలుచువరకు వారికి ముందుగా
10 నడిచెను. । వారు ఆ నక్షత్రమును చూచి అత్యానంద
11 భరితులై యింటిలోనికి వచ్చి, తల్లియైన మరియను ఆ
శిశువును చూచి, సాగిలపడి ఆయనను పూజించి, తమ
పెట్టెలు విప్పి బంగారమును సాంబ్రాణిని బోళమును
12 కానుకలుగా ఆయనకు సమర్పించిరి. । తరువాత
హేరోదునొద్దకు వెళ్లవద్దని స్వప్నమందు దేవునిచేత
బోధింపబడినవారై వారు మరియొక మార్గమున తమ
దేశమునకు తిరిగి వెళ్లిరి.
13 వారు వెళ్లినతరువాత ప్రభువు దూత స్వప్న
మందు యోసేపుకు ప్రత్యక్షమై — హేరోదు ఆ
శిశువును సంహరింపవలెనని ఆయనను వెదకబోవుచు
న్నాడు గనుక నీవు లేచి ఆ శిశువును ఆయన తల్లిని
వెంటబెట్టుకొని ఐగుప్తుకు పారిపోయి, నేను నీతో
తెలియజెప్పువరకు అక్కడనే యుండుమని అతనితో
14 చెప్పెను. । అప్పుడతడు లేచి, రాత్రివేళ శిశువును
15 తల్లిని తోడుకొని ఐగుప్తుకు వెళ్లి

ఐగుప్తులోనుండి నా కుమారుని పిలిచితిని

అని ప్రవక్తద్వారా[2] ప్రభువు సెలవిచ్చిన మాట నెర
వేర్చబడునట్లు హేరోదు మరణపర్యంతము అక్కడుం
16 డెను. । ఆ జ్ఞానులు తన్ను అపహసించిరని హేరోదు
గ్రహించి బహు ఆగ్రహము తెచ్చుకొని, తాను
జ్ఞానులవలన వివరముగా తెలిసికొనిన కాలమునుబట్టి
బేత్లెహేములోను దాని సకల ప్రాంతములలోను
రెండు సంవత్సరములు మొదలుకొని తక్కువ వయస్సు
17 గల మగపిల్లలనందరిని వధించెను. । అందువలన

—రామాలో అంగలార్పు వినబడెను
ఏడ్పును మహా రోదనధ్వనియు కలిగెను
18 రాహేలు తన పిల్లలవిషయమై యేడ్చుచు వారు
లేనందున ఓదార్పు పొందనొల్లక యుండెను

అని ప్రవక్తయైన యిర్మీయా ద్వారా[3] చెప్పబడిన
వాక్యము నెరవేరెను.
19 హేరోదు చనిపోయిన తరువాత ప్రభువు దూత
ఐగుప్తులో యోసేపుకు స్వప్నమందు ప్రత్యక్షమై ।
—నీవు లేచి శిశువును తల్లిని తోడుకొని ఇశ్రాయేలు
దేశమునకు వెళ్లుము; । శిశువు ప్రాణము తీయజూచు
చుండినవారు చనిపోయిరని చెప్పెను. అప్పుడతడు
లేచి శిశువును తల్లిని తోడుకొని ఇశ్రాయేలు దేశ
మునకు వచ్చెను. । అయితే అర్కెలాయు తన తండ్రి 21
యైన హేరోదుకు ప్రతిగా యూదయదేశము ఏలు 22
చున్నాడని విని, అక్కడికి వెళ్ల వెరచి, స్వప్నమందు
దేవునిచేత బోధింపబడినవాడై గలిలయ ప్రాంతము
లకు వెళ్లి, నజరేతను ఊరికి వచ్చి అక్కడ కాపురముం
డెను. ఆయన నజరేయుడనబడునని ప్రవక్తలు చెప్పిన
మాట నెరవేరునట్లు (ఈలాగు జరిగెను.)

ఆ దినములయందు బాప్తిస్మమిచ్చు యోహాను 3
వచ్చి । — పరలోకరాజ్యము సమీపించియున్నది, 2
మారుమనస్సు పొందుడని యూదయ అరణ్యములో
ప్రకటించుచుండెను.

ప్రభువు మార్గము సిద్ధపరచుడి 3
ఆయన త్రోవలు సరాళము చేయుడని
అరణ్యములో కేకవేయు ఒకని శబ్దము

అని ప్రవక్తయైన యెషయా ద్వారా[4] చెప్పబడినవా
డితడే. । ఈ యోహాను ఒంటె రోమముల వస్త్రమును 4
మొలచుట్టు తోలుదట్టియు ధరించుకొనువాడు; మిడ
తలును అడవి తేనెయు అతనికి ఆహారమై యుండెను. ।
ఆ సమయమున యెరూషలేమువారును యూదయ 5
వారందరును యొర్దాను నదీప్రాంతముల వారందరును
అతనియొద్దకు వచ్చి । తమ పాపములను ఒప్పుకొనుచు, 6
యొర్దాను నదిలో అతనిచేత బాప్తిస్మము పొందుచుం
డిరి. । అతడు పరిసయ్యులలోను సద్దూకయ్యులలోను 7
అనేకులు బాప్తిస్మము పొందవచ్చుట చూచి — సర్ప
సంతానమా, రాబోవు ఉగ్రతను తప్పించుకొనుటకు
మీకు బుద్ధి చెప్పినవాడెవడు? । మారుమనస్సుకు తగిన 8
ఫలము ఫలించుడి. । — అబ్రాహాము మాకు తండ్రి అని 9
మీలో మీరు చెప్పుకొన తలచవద్దు; దేవుడు ఈ రాళ్ల
వలన అబ్రాహామునకు పిల్లలను పుట్టింపగలడని మీతో
చెప్పుచున్నాను. । ఇప్పుడే గొడ్డలి చెట్లవేరున ఉంచ 10
బడియున్నది గనుక మంచి ఫలము ఫలింపని ప్రతి
చెట్టును నరకబడి అగ్నిలో వేయబడును. । మారు 11
మనస్సునిమిత్తము నేను నీళ్లలో[5] మీకు బాప్తిస్మమిచ్చు
చున్నాను; అయితే నా వెనుక వచ్చుచున్నవాడు
నాకంటె శక్తిమంతుడు; ఆయన చెప్పులు మోయుట
కైన నేను పాత్రుడను కాను; ఆయన పరిశుద్ధాత్మలోను[6]
అగ్నితోను మీకు బాప్తిస్మమిచ్చును. । ఆయన చేట 12
ఆయన చేతిలో ఉన్నది; ఆయన తన కళ్లమును
బాగుగా శుభ్రముచేసి గోధుమలను కొట్టులో పోసి,
ఆరని అగ్నితో పొట్టును కాల్చివేయునని వారితో
చెప్పెను.

ఆ సమయమున యోహానుచేత బాప్తిస్మము పొందు 13
టకు యేసు గలిలయనుండి యొర్దాను దగ్గరనున్న అతని

5: 2. [2] హోషే. 11: 1. [3] యిర్మీ. 31: 15. [4] యెష. 40: 3. [5] లేక—నీళ్లతో. [6] లేక, పరిశుద్ధాత్మతోను.

14 యొద్దకు వచ్చెను. । అందుకు యోహాను—నేను నీచేత
బాప్తిస్మము పొందవలసినవాడనై యుండగా నీవు
నాయొద్దకు వచ్చుచున్నావా? అని ఆయనను నివారింప
15 చూచెను గాని । యేసు — ఇప్పటికి కానిమ్ము; నీతి
యావత్తు ఈలాగు నెరవేర్చుట మనకు తగియున్నదని
అతనికి ఉత్తరమిచ్చెను గనుక అతడాలాగు కానిచ్చెను. ।
16 యేసు బాప్తిస్మము పొందినవెంటనే నీళ్లలోనుండి
ఒడ్డుకు వచ్చెను; అప్పుడు ఆకాశము తెరవబడెను,
దేవుని ఆత్మ పావురమువలె దిగి తనమీదికి వచ్చుట
17 చూచెను. । మరియు—ఈయనే నా ప్రియకుమారుడు,
ఈయనయందు నేను ఆనందించుచున్నానని యొక
శబ్దము ఆకాశమునుండి వచ్చెను.

4 అప్పుడు యేసు అపవాది[1]చేత శోధింపబడుటకు
2 ఆత్మవలన అరణ్యమునకు కొనిపోబడెను. । నలువది
దినములు దివారాత్రులు ఉపవాసముండిన పిమ్మట
3 ఆయన ఆకలిగొనగా । ఆ శోధకుడు ఆయనయొద్దకు
వచ్చి — నీవు దేవుని కుమారుడవైతే ఈ రాళ్లు రొట్టె
4 లగునట్లు ఆజ్ఞాపించుమనెను । అందుకాయన

—మనుష్యుడు రొట్టెవలన మాత్రము కాదుగాని
దేవుని నోటనుండి వచ్చు ప్రతిమాటవలనను
జీవించును

5 అని వ్రాయబడియున్నదనెను.[2] । అంతట అపవాది[1]
పరిశుద్ధ పట్టణమునకు ఆయనను తీసికొనిపోయి, దేవా
6 లయశిఖరమున ఆయనను నిలువబెట్టి । —నీవు దేవుని
కుమారుడవైతే క్రిందికి దుముకుము

—ఆయన నిన్నుగూర్చి తన దూతలకాజ్ఞాపిం
చును, నీ పాదమెప్పుడైనను రాతికి తగలకుండ
వారు నిన్ను చేతులతో ఎత్తికొందురు

అని వ్రాయబడియున్నదని[3] ఆయనతో చెప్పెను. ।
7 అందుకు యేసు

—ప్రభువైన నీ దేవుని నీవు శోధింపవలదని మరియొక
చోట[4] వ్రాయబడియున్నదని వానితో చెప్పెను. ।
8 పిమ్మట అపవాది[1] మిగుల ఎత్తయిన యొక కొండమీదికి
ఆయనను తోడుకొనిపోయి, యీ లోకరాజ్యము
9 లన్నిటిని వాటి మహిమను ఆయనకు చూపి । — నీవు
సాగిలపడి నాకు నమస్కారముచేసినయెడల ఇవన్ని
10 యు నీకిచ్చెదనని ఆయనతో చెప్పగా । యేసు వాని
తో—సాతానా, పొమ్ము

— నీ దేవుడైన ప్రభువునకు నమస్కరించి
ఆయనను మాత్రము సేవింపవలెను

11 అని వ్రాయబడియున్నదనెను.[5] । అంతట అపవాది[1]
ఆయనను విడిచిపోగా దేవదూతలు వచ్చి ఆయనకు
పరిచర్యచేసిరి.

12 యోహాను చెరలో ఉంచబడెనని యేసు విని గలి
లైయకు తిరిగి వెళ్లి । నజరేతు విడిచి జెబులూను నఫ్తాలి 13
యను దేశముల ప్రాంతములలో సముద్రతీరమందలి 16
కపెర్నహూముకు వచ్చి కాపురముండెను.

జెబులూను దేశమును నఫ్తాలిదేశమును యొర్దాను
కావలనున్న సముద్రతీరమున అన్యజనులు
నివసించు గలిలైయయు చీకటిలో కూర్చుండి
యున్న ప్రజలును గొప్ప వెలుగు చూచిరి.
మరణ ప్రదేశములోను మరణచ్ఛాయలోను
కూర్చుండియున్నవారికి వెలుగు ఉదయించెను

అని ప్రవక్తయైన యెషయాద్వారా[6] పలుకబడినది
నెరవేరునట్లు (ఈలాగు జరిగెను.) । అప్పటినుండి 17
యేసు — పరలోకరాజ్యము సమీపించియున్నది
గనుక మారుమనస్సు పొందుడని చెప్పుచు ప్రకటింప
మొదలుబెట్టెను.

యేసు గలిలైయ సముద్రతీరమున నడుచుచుం 18
డగా, పేతురు అనబడిన సీమోను అతని సహోదరు
డైన అంద్రెయ అను ఇద్దరు సహోదరులు సముద్ర
ములో వలవేయుట చూచెను; వారు జాలరులు. ।
ఆయన — నా వెంబడి రండి, నేను మిమ్మును మనుష్యు 19
లను పట్టు జాలరులనుగా చేతునని వారితో చెప్పెను; 20
వెంటనే వారు తమ వలలు విడిచిపెట్టి ఆయనను వెం
బడించిరి. । ఆయన అక్కడనుండి వెళ్లి జెబెదయి 21
కుమారుడైన యాకోబు, అతని సహోదరుడైన
యోహాను అను మరి యిద్దరు సహోదరులు తమ
తండ్రియైన జెబెదయి యొద్ద దోనెలో తమ వలలు
బాగుచేసికొనుచుండగా చూచి వారిని పిలిచెను. ।
వెంటనే వారు తమ దోనెను తమ తండ్రిని విడిచిపెట్టి 22
ఆయనను వెంబడించిరి.

యేసు వారి సమాజమందిరములలో బోధించుచు, 23
(దేవుని) రాజ్యమును గూర్చిన సువార్తను ప్రకటిం
చుచు, ప్రజలలోని ప్రతి వ్యాధిని రోగమును స్వస్థ
పరచుచు గలిలైయయందంతట సంచరించెను. । ఆయన 24
కీర్తి సురియదేశమంతట వ్యాపించెను. నానావిధము
లైన రోగములచేతను వేదనలచేతను పీడింపబడిన వ్యాధి
గ్రస్తులనందరిని, దయ్యముపట్టినవారిని, చాంద్రరోగు
లను, పక్షవాయువుగలవారిని వారు ఆయనయొద్దకు
తీసికొని రాగా ఆయన వారిని స్వస్థపరచెను. । గలిలైయ 25
దెకపొలి యెరూషలేము యూదైయయను ప్రదేశ
ములనుండియు యొర్దానుకు అవతలనుండియు బహు
జనసమూహములు ఆయనను వెంబడించెను.

ఆయన ఆ జనసమూహములను చూచి కొండ 5
యెక్కి కూర్చుండగా ఆయన శిష్యులు ఆయనయొద్దకు
వచ్చిరి. । అప్పుడాయన నోరు తెరచి యీలాగు 2
బోధింపసాగెను—

[1] అనగా, సాతాను. [2] ద్వితీ. 8: 3. [3] కీర్త. 91: 11, 12. [4] ద్వితీ. 6: 16. [5] ద్వితీ. 6: 13. [6] యెష. 9: 1, 2.

పెట్టుకొనవద్దు; ఆకాశము తోడని వద్దు, అది దేవుని
35 సింహాసనము; । భూమి తోడని వద్దు, అది ఆయన
పాదపీఠము; యెరూషలేము తోడని వద్దు, అది మహా
36 రాజు పట్టణము. । నీ తల తోడని ఒట్టు పెట్టుకొన
వద్దు, నీవు ఒక వెండ్రుకనైనను తెలుపుగా గాని నలు
37 పుగా గాని చేయలేవు. । మీ మాట అవునంటే అవును
కాదంటే కాదు అని యుండవలెను; వీటిని మించునది
దుష్టునినుండి[1] పుట్టునది.
38 కంటికి కన్ను పంటికి పల్లు అని చెప్పబడిన మాట
39 మీరు విన్నారు గదా. । నేను మీతో చెప్పునదేమ
నగా దుష్టుని ఎదిరింపక నిన్ను కుడిచెంపమీద కొట్టు
40 వాని వైపుకు ఎడమచెంపకూడ త్రిప్పుము. । ఎవడైన
నీమీద వ్యాజ్యము వేసి నీ అంగీ తీసికొనగోరినయెడల
41 వానికి నీ పైవస్త్రముకూడ ఇచ్చివేయుము. । ఒకడు
ఒక మైలు దూరము రమ్మని నిన్ను బలవంతము చేసిన
యెడల వానితోకూడ రెండు మైళ్లు వెళ్లుము. ।
42 నిన్ను అడుగువానికిమ్ము, నిన్ను అప్పు అడుగ గోరు
వానినుండి నీ ముఖము త్రిప్పుకొనవద్దు.
43 నీ పొరుగువాని ప్రేమించి నీ శత్రువును ద్వేషిం
చుమని చెప్పబడిన మాట మీరు విన్నారు గదా; ।
44 నేను మీతో చెప్పునదేమనగా, మీరు పరలోకమం
దున్న మీ తండ్రికి కుమారులై యుండునట్లు మీ
శత్రువులను ప్రేమించుడి. మిమ్మును హింసించువారి
45 కొరకు ప్రార్థనచేయుడి. । ఆయన చెడ్డవారిమీదను
మంచివారిమీదను తన సూర్యుని ఉదయింపజేసి, నీతి
మంతులమీదను అనీతిమంతులమీదను వర్షము కురి
46 పించుచున్నాడు. । మీరు మిమ్మును ప్రేమించువారినే
ప్రేమించినయెడల మీకేమి ఫలము కలుగును? సుంక
47 రులును ఆలాగు చేయుచున్నారు గదా. । మీ
సహోదరులకు మాత్రము వందనము చేసినయెడల
మీరు ఎక్కువ చేయుచున్నదేమి? అన్యజనులును
48 ఆలాగు చేయుచున్నారు గదా. । మీ పరలోకపు
తండ్రి పరిపూర్ణుడు గనుక మీరును పరిపూర్ణులుగా
ఉండెదరు.

6 మనుష్యులకు కనబడవలెనని వారియెదుట మీ నీతి
కార్యము చేయకుండ జాగ్రత్తపడుడి, లేనియెడల
పరలోకమందున్న మీ తండ్రియొద్ద మీరు ఫలము
పొందరు.
2 కావున నీవు ధర్మము చేయునప్పుడు, మనుష్యుల
వలన ఘనత నొందవలెనని వేషధారులు సమాజమందిర
ములలోను వీధులలోను చేయులాగున నీ ముందర
బూర ఊదింపవద్దు; వారు తమ ఫలము పొందియు
న్నారని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. ।
3 నీవైతే ధర్మము చేయునప్పుడు నీ ధర్మము రహస్యముగా
నుండు నిమిత్తము నీ కుడిచెయ్యి చేయునది నీ యెడమ
చేతికి తెలియక యుండవలెను. । అట్లయితే రహస్య 4
మందు చూచు నీ తండ్రి నీకు ప్రతిఫలమిచ్చును.
మరియు మీరు ప్రార్థనచేయునప్పుడు వేషధా 5
రులవలె ఉండవద్దు; మనుష్యులకు కనబడవలెనని
సమాజమందిరములలోను వీధుల మూలలలోను నిలిచి
ప్రార్థనచేయుట వారికిష్టము; వారు తమ ఫలము
పొందియున్నారని నిశ్చయముగా మీతో చెప్పుచు
న్నాను. । నీవు ప్రార్థనచేయునప్పుడు నీ గదిలోకి 6
వెళ్లి తలుపువేసి, రహస్యమందున్న నీ తండ్రికి ప్రార్థన
చేయుము; అప్పుడు రహస్యమందు చూచు నీ తండ్రి
నీకు ప్రతిఫలమిచ్చును. । మరియు మీరు ప్రార్థన 7
చేయునప్పుడు అన్యజనులవలె వ్యర్థమైన మాటలు
వచింపవద్దు; విస్తరించి మాటలాడుటవలన తమ మనవి
వినబడునని వారు తలంచుచున్నారు; । మీరు వారి 8
వలె ఉండకుడి. మీరు మీ తండ్రిని అడుగకమునుపే
మీకు అక్కరగా ఉన్నవేవో ఆయనకు తెలియును; ।
కాబట్టి మీరీలాగు ప్రార్థనచేయుడి, । — పరలోక 9
మందున్న మా తండ్రీ, నీ నామము పరిశుద్ధపరచబడు 10
గాక; నీ రాజ్యము వచ్చుగాక, నీ చిత్తము పరలోక
మందు నెరవేరుచున్నట్లు భూమియందును నెరవేరును
గాక, । మా అనుదినాహారము నేడు మాకు దయ 11
చేయుము. । మా ఋణస్థులను మేము క్షమించియున్న 12
ప్రకారము మా ఋణములు క్షమించుము. । మమ్మును 13
శోధనలోకి తేక దుష్టునినుండి[1] మమ్మును తప్పిం
చుము.[2] । మనుష్యుల అపరాధములను మీరు క్షమిం 14
చినయెడల మీ పరలోకపు తండ్రియు మీ అపరాధ
ములను క్షమించును. । మీరు మనుష్యుల అపరాధ 15
ములను క్షమింపకపోయినయెడల మీ తండ్రియు
మీ అపరాధములను క్షమింపడు.
మీరు ఉపవాసము చేయునప్పుడు వేషధారులవలె 16
దుఃఖముఖులై యుండకుడి; తాము ఉపవాసము
చేయుచున్నట్టు మనుష్యులకు కనబడవలెనని వారు
తమ ముఖములను వికారము చేసికొందురు; వారు తమ
ఫలము పొందియున్నారని నిశ్చయముగా మీతో
చెప్పుచున్నాను. । ఉపవాసము చేయుచున్నట్టు మను 17
ష్యులకు కనబడవలెనని కాక రహస్యమందున్న నీ
తండ్రికే కనబడవలెనని, నీవు ఉపవాసము చేయు
నప్పుడు నీ తల అంటుకొని నీ ముఖము కడుగు
కొనుము. । అప్పుడు రహస్యమందు చూచుచున్న 18
నీ తండ్రి నీకు ప్రతిఫలమిచ్చును.
భూమిమీద మీకొరకు ధనమును కూర్చుకొనవద్దు; 19
ఇక్కడ చిమ్మెటయు తుప్పును తినివేయును, దొంగలు
కన్నమువేసి దొంగిలెదరు. । పరలోకమందు మీకొరకు 20
ధనమును కూర్చుకొనుడి; అచ్చట చిమ్మెటయైనను
తుప్పైనను దాని తినివేయదు, దొంగలు కన్నమువేసి

1 లేక—కీడునుండి. 2 కొన్ని ప్రాచీన ప్రతులలో -రాజ్యము, బలము మహిమయు నీవైయున్నవి, ఆమేన్, అని కూర్చబడియున్నది.

నా మాటలు విని వాటిచొప్పున చేయు ప్రతివాడు
బండమీద తన యిల్లు కట్టుకొనిన బుద్ధిమంతుని పోలి
25 యుండును. । వాన కురిసెను, వరదలు వచ్చెను, గాలి
విసిరి ఆ యింటిమీద కొట్టెను గాని దాని పునాది
26 బండమీద వేయబడెను గనుక అది పడలేదు. । మరియు
ఈ నా మాటలు విని వాటిచొప్పున చేయని ప్రతివాడు
ఇసుకమీద తన యిల్లు కట్టుకొనిన బుద్ధిహీనుని పోలి
27 యుండును. । వాన కురిసెను, వరదలు వచ్చెను, గాలి
విసిరి ఆ యింటిమీద కొట్టెను, అప్పుడది కూలబ
డెను; దాని పాటు గొప్పదని చెప్పెను.
28 యేసు ఈ మాటలు చెప్పి ముగించినప్పుడు జన
29 సమూహములు ఆయన బోధకు ఆశ్చర్యపడిరి. । ఏల
యనగా ఆయన వారి శాస్త్రులవలె కాక అధికారము
గలవానివలె వారికి బోధించెను.

8 ఆయన ఆ కొండమీదనుండి దిగి వచ్చినప్పుడు
బహు జనసమూహములు ఆయనను వెంబడించెను. ।
2 అప్పుడొక కుష్ఠరోగి వచ్చి ఆయనకు మ్రొక్కి—
ప్రభువా, నీకిష్టమైతే నన్ను శుద్ధునిగా చేయగల
3 వనెను. । అందుకాయన చెయ్యిచాపి వాని ముట్టి—
నాకిష్టమే, నీవు శుద్ధుడవు కమ్మని చెప్పగా తక్షణమే
4 వాని కుష్ఠరోగము శుద్ధి ఆయెను. । అప్పుడు యేసు—
ఎవరితోను చెప్పక నీవు వెళ్లి వారికి సాక్ష్యార్థమై నీ
దేహమును యాజకునికి కనుపరచుకొని, మోషే నియ
మించిన కానుక సమర్పించుమని వానితో చెప్పెను.
5 ఆయన కపెర్నహూములో ప్రవేశించినప్పుడు
6 ఒక శతాధిపతి ఆయనయొద్దకు వచ్చి । — ప్రభువా,
నా దాసుడు పక్షవాయువుతో మిగుల బాధపడుచు
ఇంటిలో పడియున్నాడని చెప్పి ఆయనను వేడుకొ
7 నెను. । యేసు — నేను వచ్చి వాని స్వస్థపరచెదనని
8 అతనితో చెప్పగా । ఆ శతాధిపతి—ప్రభువా, నీవు
నా యింటిలోకి వచ్చుటకు నేను పాత్రుడను కాను;
నీవు మాట మాత్రము సెలవిమ్ము, అప్పుడు నా దాసుడు
9 స్వస్థపరచబడును. । నేను కూడ అధికారమునకు
లోబడినవాడను; నా చేతిక్రింద రాణువవారున్నారు;
నేనొకని పొమ్మంటే పోవును, ఒకని రమ్మంటే వచ్చును,
నా దాసుని ఈ పని చేయుమంటే చేయును అని
10 ఉత్తరమిచ్చెను. । యేసు ఈ మాట విని ఆశ్చర్యపడి,
వెంట వచ్చుచున్నవారిని చూచి — ఇశ్రాయేలులో
నెవనికైనను నేనింత విశ్వాసమున్నట్టు చూడలేదని
11 నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. । అనేకులు
తూర్పునుండియు పడమటనుండియు వచ్చి అబ్రాహా
ముతోకూడను ఇస్సాకుతోకూడను యాకోబుతోకూ
12 డను పరలోకరాజ్యమందు కూర్చుందురుగాని । రాజ్య
సంబంధులు[1] వెలపటి చీకటిలోకి త్రోయబడుదురు;
అక్కడ ఏడ్పును పండ్లు కొరుకుటయు నుండునని
మీతో చెప్పుచున్నాననెను. । అంతట యేసు—ఇక 13
వెళ్లుము; నీవు విశ్వసించిన ప్రకారము నీకు అవునుగాకని
శతాధిపతితో చెప్పెను. ఆ గడియలోనే అతని
దాసుడు స్వస్థతనొందెను.
తరువాత యేసు పేతురు ఇంటిలో ప్రవేశించి, 14
జ్వరముతో పడియున్న అతని అత్తను చూచి । ఆమె 15
చెయ్యి ముట్టగా జ్వరము ఆమెను విడిచెను; అంతట
ఆమె లేచి ఆయనకు ఉపచారము చేయసాగెను. ।
సాయంకాలమైనప్పుడు జనులు దయ్యములు పట్టిన 16
అనేకులను ఆయనయొద్దకు తీసికొని వచ్చిరి. । ఆయన 17
మాటవలన దయ్యములను వెళ్లగొట్టి రోగులనెల్లను
స్వస్థపరచెను. అందువలన—ఆయనే మన బలహీనత
లను వహించుకొని మన రోగములను భరించెనని ప్రవక్త
యైన యెషయాద్వారా చెప్పబడినది నెరవేరెను.[2]
యేసు తన యొద్దనున్న జనసమూహమును చూచి 18
అద్దరికి వెళ్లవలెనని ఆజ్ఞాపించెను. । అంతట ఒక శాస్త్రి 19
వచ్చి — బోధకుడా, నీవెక్కడికి వెళ్లినను నీ వెంట
వచ్చెదనని ఆయనతో చెప్పెను. । అందుకు యేసు— 20
నక్కలకు బొరియలును ఆకాశపక్షులకు నివాసము
లును కలవు గాని మనుష్యకుమారునికి తలవాల్చుటకైన
స్థలము లేదని అతనితో చెప్పెను. । శిష్యులలో మరి 21
యొకడు—ప్రభువా, నేను మొదట వెళ్లి నా తండ్రిని
పాతిపెట్టుటకు నాకు సెలవిమ్మని ఆయనను అడుగగా ।
యేసు అతని చూచి—నన్ను వెంబడించుము; మృతులు 22
తమ మృతులను పాతిపెట్టుకొననిమ్మని చెప్పెను.
ఆయన దోనె యెక్కినప్పుడు ఆయన శిష్యులు ఆయన 23
వెంట వెళ్లిరి. । అంతట సముద్రముమీద తుఫాను 24
లేచినందున ఆ దోనె అలలచేత కప్పబడెను. అప్పు
డాయన నిద్రించుచుండగా । వారు ఆయన యొద్దకు 25
వచ్చి—ప్రభువా, నశించుచున్నాము, మమ్మును రక్షిం
చుమని చెప్పి ఆయనను లేపిరి. । అందుకాయన— 26
అల్పవిశ్వాసులారా, యెందుకు భయపడుచున్నారని
వారితో చెప్పి, లేచి గాలిని సముద్రమును గద్దింపగా
మిక్కిలి నిమ్మళమాయెను. । వారాశ్చర్యపడి—ఈయన 27
ఎట్టివాడో; ఈయనకు గాలియు సముద్రమును
లోబడుచున్నవని చెప్పుకొనిరి.
ఆయన అద్దరినున్న గదరేనీయుల దేశము చేరగా 28
దయ్యములు పట్టిన యిద్దరు మనుష్యులు సమాధులలో
నుండి బయలుదేరి ఆయనకు ఎదురుగా వచ్చిరి. వారు
మిగుల ఉగ్రులైనందున ఎవడును ఆ మార్గమున వెళ్ల
లేకపోయెను. । వారు—దేవుని కుమారుడా, నీతో 29
మాకేమి? కాలము రాకమునుపే మమ్మును బాధించుటకు
ఇక్కడికి వచ్చితివా అని కేకలువేసిరి. । వారికి దూర 30
మున గొప్ప పందుల మంద మేయుచుండగా । ఆ 31
దయ్యములు — నీవు మమ్మును వెళ్లగొట్టినయెడల ఆ

1 మూలభాషలో—రాజ్యకుమారులు. 2 యెష. 53: 4.

యిదా, మీ మధ్యను చేయబడిన అద్భుతములు తూరు
సీదోను పట్టణములలో చేయబడిన పక్షమున ఆ పట్టణ
ములవారు పూర్వమే గోనెపట్ట కట్టుకొని బూడిద
22 వేసికొని మారుమనస్సు పొందియుందురు. । విమర్శ
దినమందు మీ గతికంటె తూరు సీదోను పట్టణముల
వారి గతి ఓర్వతగినదై యుండునని మీతో చెప్పు
23 చున్నాను. । కపెర్నహూమా, ఆకాశమువరకు
హెచ్చింపబడెదవా? నీవు పాతాళమువరకు దిగిపోయె
దవు. నీలో చేయబడిన అద్భుతములు సొదొమలో
చేయబడిన పక్షమున అది నేటివరకు నిలిచియుం
24 డును. । విమర్శదినమందు నీ గతికంటె సొదొమదేశపు
వారి గతి ఓర్వతగినదై యుండునని మీతో చెప్పు
చున్నాననెను.

25 ఆ సమయమున యేసు చెప్పినదేమనగా—తండ్రీ,
ఆకాశమునకును భూమికిని ప్రభువా, నీవు జ్ఞానులకును
వివేకులకును ఈ సంగతులను మరుగుచేసి పసిబాలు
రకు బయలుపరచినావని నిన్ను స్తుతించుచున్నాను. ।
26 అవును తండ్రీ, ఈలాగు చేయుట నీ దృష్టికి అను
27 కూలమాయెను. । సమస్తమును నా తండ్రిచేత నా
కప్పగింపబడియున్నది. తండ్రి గాక యెవడును కుమా
రుని ఎరుగడు; కుమారుడు గాకను, కుమారుడెవనికి
ఆయనను బయలుపరచ నుద్దేశించునో వాడు గాకను
28 మరి ఎవడును తండ్రిని ఎరుగడు. । ప్రయాసపడి
భారము మోసికొనుచున్న సమస్తమైనవారలారా, నా
యొద్దకు రండి; నేను మీకు విశ్రాంతి కలుగజేతును. ।
29 నేను సాత్వికుడను దీనమనస్సుగలవాడను గనుక మీ
మీద నా కాడి ఎత్తికొని నాయొద్ద నేర్చుకొనుడి;
అప్పుడు మీ ప్రాణములకు విశ్రాంతి దొరకును. ।
ఏలయనగా నా కాడి సుళువుగాను నా భారము
తేలికగాను ఉన్నవి.

12 ఆ కాలమందు యేసు విశ్రాంతిదినమున పంట
చేలలో పడి వెళ్లుచుండగా ఆయన శిష్యులు ఆకలి
గొని వెన్నులు త్రుంచి తినసాగిరి. । పరిసయ్యులది
చూచి—ఇదిగో, విశ్రాంతిదినమున చేయకూడనిది నీ
శిష్యులు చేయుచున్నారని ఆయనతో చెప్పగా ।
ఆయన వారితో ఇట్లనెను — తానును తనతోకూడ
నున్నవారును ఆకలిగొనియుండగా దావీదు చేసినదాని
గూర్చి మీరు చదవలేదా? । అతడు దేవుని మందిర
ములో ప్రవేశించి, యాజకులే తప్ప తానైనను తనతో
కూడ ఉన్నవారైనను తినకూడని సముఖపు రొట్టెలు
తినెను. । మరియు యాజకులు విశ్రాంతిదినమున దేవా
లయములో విశ్రాంతిదినమును ఉల్లంఘించియు నిర్దో
షులై యున్నారని మీరు ధర్మశాస్త్రమందు చదవలేదా?।
దేవాలయముకంటె గొప్పవాడిక్కడ నున్నాడని
మీతో చెప్పుచున్నాను. । మరియు — కనికరమునే
కోరుచున్నాను గాని బలిని నేను కోరను[1] అను వాక్య
భావము మీకు తెలిసియుంటే నిర్దోషులను దోషులని
తీర్పు తీర్చకపోదురు. । కాగా మనుష్యకుమారుడు 8
విశ్రాంతిదినమునకు ప్రభువై యున్నాడనెను.

ఆయన అక్కడనుండి వెళ్లి వారి సమాజమందిర 9
ములో ప్రవేశించినప్పుడు, ఊచచెయ్యి గలవాడొకడు
కనబడెను. । వారాయనమీద నేరము మోపవలెనని 10
—విశ్రాంతిదినమున స్వస్థపరచుట న్యాయమా అని
ఆయనను అడిగిరి. । అందుకాయన—మీలో ఏ మను 11
ష్యునికైన నొక గొఱ్ఱె యుండి అది విశ్రాంతిదినమున
గుంటలో పడినయెడల దాని పట్టుకొని పైకి తియ్య
డా? । గొఱ్ఱెకంటె మనుష్యుడెంతో శ్రేష్ఠుడు: 12
కాబట్టి విశ్రాంతిదినమున మేలు చేయుట ధర్మమే అని
చెప్పి । ఆ మనుష్యునితో—నీ చెయ్యి చాపుమనెను. 13
వాడు చెయ్యిచాపగా రెండవదానివలె అది బాగు
పడెను. । అంతట పరిసయ్యులు వెలుపలికిపోయి, ఆయ 14
నను ఏలాగు సంహరింతుమా అని ఆయనకు విరోధ
ముగా ఆలోచనచేసిరి. । యేసు ఆ సంగతి తెలిసికొని 15
అచ్చటనుండి వెళ్లిపోయెను. బహుజనులాయనను వెంబ
డింపగా । ఆయన వారినందరిని స్వస్థపరచి, తన్ను 16
ప్రసిద్ధిచేయవద్దని వారికి ఆజ్ఞాపించెను. । ప్రవక్తయైన 17
యెషయాద్వారా చెప్పినది నెరవేరునట్లు[2] (ఆలాగు
జరిగెను) అదేమనగా—

ఇదిగో ఈయన నా సేవకుడు 18
ఈయనను నేను ఏర్పరచుకొంటిని
ఈయన నా ప్రాణమున కిష్టుడైన నా ప్రియుడు
ఈయనమీద నా ఆత్మ నుంచెదను
ఈయన అన్యజనులకు న్యాయవిధి ప్రచురము
చేయును.

ఈయన జగడమాడడు కేకలువేయడు 19
వీధులలో ఈయన శబ్దమెవనికిని వినబడదు
విజయమొందుటకు 20
న్యాయవిధిని ప్రబలింపజేయువరకు
ఈయన నలిగిన రెల్లును విరువడు
పొగరాజెడు అవిసెనారను ఆర్పడు
ఈయన నామమందు అన్యజనులు నిరీక్షించెదరు 21
అనునదే.

ఒక సమయమున, దయ్యముపట్టిన గుడ్డివాడును 22
మూగవాడునైన యొకడు ఆయనయొద్దకు తేబడెను.
ఆయన వాని స్వస్థపరచినందున ఆ మూగవాడు మాట
లాడు శక్తియు చూపును గలవాడాయెను. । అందుకు 23
ప్రజలందరు విస్మయమొంది—ఈయన దావీదు కుమా
రుడు కాడా అని చెప్పుకొనుచుండిరి. । పరిసయ్యులు 24
ఆ మాట విని — వీడు దయ్యములకు అధిపతియైన
బయల్జెబూలువలన దయ్యములను వెళ్లగొట్టుచున్నాడు

[1] హోషేయ, 6: 6.
[2] యెషయా, 42: 1–4.

25 గాని మరియొకరివలన వెళ్లగొట్టుటలేదనిరి. । ఆయన
వారి తలంపుల నెరిగి వారితో ఇట్లనెను—తనకుతానే
విరోధముగా వేరుపడిన ప్రతి రాజ్యము పాడైపోవును.
తనకుతానే విరోధముగా వేరుపడిన యే పట్టణమైనను
26 ఏ యిల్లయినను నిలువదు. । సాతాను సాతానును వెళ్ల
గొట్టినయెడల తనకుతానే విరోధముగా వేరుపడును;
27 అట్లయితే వాని రాజ్యమేలాగు నిలుచును! । నేను
బయెల్జెబూలువలన దయ్యములను వెళ్లగొట్టుచున్న పక్ష
మున మీ కుమారులు ఎవనివలన వాటిని వెళ్లగొట్టు
చున్నారు! కాబట్టి వారే మీకు తీర్పరులై యుం
28 దురు. । దేవుని ఆత్మవలన నేను దయ్యములను వెళ్లగొట్టు
చున్న పక్షమున నిశ్చయముగా దేవుని రాజ్యము మీ
29 యొద్దకు వచ్చియున్నది. । ఒకడు మొదట బలవంతుని
బంధించితేనే గాని యేలాగు ఆ బలవంతుని యింటిలో
చొచ్చి అతని సామగ్రి దోచుకొనగలడు? అట్లు బం
30 ధించినయెడల వాని యిల్లు దోచుకొనును. । నా పక్ష
మున నుండనివాడు నాకు విరోధి; నాతో కలిసి సమ
31 కూర్చనివాడు చెదరగొట్టువాడు. । కాబట్టి నేను
మీతో చెప్పునదేమనగా — ప్రతి పాపమును దూషణ
యు మనుష్యులకు క్షమింపబడును గాని ఆత్మవిషయ
32 మైన దూషణకు పాపక్షమాపణ లేదు. । మనుష్య
కుమారునికి విరోధముగా మాటలాడువానికి పాప
క్షమాపణ కలదుగాని పరిశుద్ధాత్మకు విరోధముగా
మాటలాడువానికి ఈ యుగమందైనను రాబోవు
33 యుగమందైనను పాపక్షమాపణ కలుగదు. । చెట్టు
మంచిదని యెంచి దాని పండును మంచిదే అని యెం
చుడి; చెట్టు చెడ్డదని యెంచి దాని పండును చెడ్డదే
అని యెంచుడి. చెట్టు దాని పండువలన తెలియబడు
34 ను. । సర్పసంతానమా, మీరు చెడ్డవారైయుండి
ఏలాగు మంచి మాటలు పలుకగలరు? హృదయమందు
నిండియుండు దానినిబట్టి నోరు మాటలాడును గదా. ।
35 సజ్జనుడు తన మంచి ధననిధిలోనుండి సద్విషయము
లను తెచ్చును; దుర్జనుడు తన చెడ్డ ధననిధిలోనుండి
36 దుర్విషయములను తెచ్చును. । నేను మీతో చెప్పున
దేమనగా — మనుష్యులు పలుకు వ్యర్థమైన ప్రతి
మాటనుగూర్చియు విమర్శదినమున లెక్క చెప్పవలసి
37 యుండును. । నీ మాటలనుబట్టి నీతిమంతుడవని తీర్పు
నొందుదువు, నీ మాటలనుబట్టియే అపరాధివని తీర్పు
నొందుదువు.
38 అప్పుడు శాస్త్రులలోను పరిసయ్యులలోను కొం
దరు—బోధకుడా, నీవలన ఒక సూచకక్రియ చూడ
గోరుచున్నామని ఆయనతో చెప్పగా ఆయన ఇట్ల
39 నెను । —వ్యభిచారులైన చెడ్డ తరమువారు సూచక
క్రియ అడుగుచున్నారు. ప్రవక్తయైన యోనాను
గూర్చిన సూచకక్రియయే గాని మరి ఏ సూచకక్రియ
యును గ్రహింపబడదు. । యోనా మూడు
దివారాత్రులు తిమింగలము కడుపులో ఏలాగుండెనో
ఆలాగు మనుష్యకుమారుడు మూడు రాత్రింబగళ్లు
భూగర్భములో ఉండును. । నీనివెవారు యోనా 41
ప్రకటన విని మారుమనస్సు పొందిరి గనుక విమర్శ
సమయమున నీనివెవారు ఈ తరమువారితో నిలువ
బడి వారిమీద నేరస్థాపనచేతురు. ఇదిగో యోనా
కంటె గొప్పవాడు ఇక్కడ ఉన్నాడు. । విమర్శ 42
సమయమున దక్షిణ దేశపురాణి యీ తరమువారితో
నిలువబడి వారిమీద నేరస్థాపనచేయును; ఆమె సొలొ
మోను జ్ఞానము వినుటకు భూదిగంతములనుండివచ్చెను;
అయితే సొలొమోనుకంటె గొప్పవాడు ఇక్కడ
ఉన్నాడు.
అపవిత్రాత్మ ఒక మనుష్యుని వదిలిపోయిన తరు 43
వాత అది విశ్రాంతికోసరమై నీరులేని చోట్ల తిరుగు
చుండును. । విశ్రాంతి దొరకనందున — నేను వదిలి 44
వచ్చిన నా యింటికి తిరిగి వెళ్లుదుననుకొని వచ్చి, ఆ
యింట ఎవరును లేక అది ఊడ్చి అమర్చియుండుట
చూచి, వెళ్లి తనకంటె చెడ్డవైన మరి యేడు దయ్యము
లను వెంటబెట్టుకొని వచ్చును; అవి దానిలో ప్రవే
శించి అక్కడనే కాపురముండును. । అందుచేత ఆ 45
మనుష్యుని కడపటిస్థితి మొదటిస్థితికంటె చెడ్డదగును.
ఆలాగే యీ దుష్టతరమువారికిని సంభవించుననెను.
ఆయన జనసమూహములతో ఇంక మాటలాడు 46
చుండగా ఆయన తల్లియు సహోదరులును ఆయ
నతో మాటలాడగోరుచు వెలుపల నిలిచియుండిరి. ।
అప్పుడొకడు — ఇదిగో నీ తల్లియు నీ సహోదరు 47
లును నీతో మాటలాడవలెనని వెలుపల నిలిచియున్నా
రని ఆయనతో చెప్పెను. । అందుకాయన తనతో ఈ 48
సంగతి చెప్పినవానిని చూచి — నా తల్లి యెవరు? నా
సహోదరులెవరు? అని చెప్పి । తన శిష్యులవైపు 49
చెయ్యి చాపి—ఇదిగో నా తల్లియు నా సహోదరు 50
లును; పరలోకమందున్న నా తండ్రి చిత్తముచొప్పున
చేయువాడే నా సహోదరుడు నా సహోదరి నా
తల్లియునై యున్నాడనెను.
ఆ దినమందు యేసు ఇంటనుండి వెళ్లి సముద్ర 13
తీరమున కూర్చుండెను. । బహు జనసమూహములు 2
తనయొద్దకు కూడివచ్చినందున ఆయన దోనెయెక్కి
కూర్చుండెను. ఆ జనులందరు దరిని నిలిచియుండగా ।
ఆయన వారిని చూచి అనేక సంగతులను ఉపమాన 3
రీతిగా చెప్పెను. ఎట్లనగా—ఇదిగో విత్తువాడు విత్తు
టకు బయలు వెళ్లెను. । వాడు విత్తుచుండగా కొన్ని 4
విత్తనములు త్రోవప్రక్కను పడెను; పక్షులు వచ్చి
వాటిని మ్రింగివేసెను. । కొన్ని చాల మన్నులేని రాతి 5
నేలను పడెను; అక్కడ మన్ను లోతుగా ఉండనం
దున అవి వెంటనే మొలిచెను గాని । సూర్యుడు ఉద 6
యించినప్పుడు అవి మాడి వేరులేనందున ఎండి

పోయెను. । కొన్ని ముండ్లపొదలలో పడెను; ముండ్ల
పొదలు ఎదిగి వాటిని అణచివేసెను. । కొన్ని మంచి
నేలను పడి, ఒకటి నూరంతలుగాను ఒకటి అరువ
దంతలుగాను ఒకటి ముప్పదంతలుగాను ఫలించెను. ।
చెవులుగలవాడు వినునుగాక అనెను.

తరువాత శిష్యులు వచ్చి — నీవు ఉపమానరీతిగా
ఎందుకు వారితో మాటలాడుచున్నావని ఆయనను అడు
గగా ఆయన వారితో ఇట్లనెను । — పరలోకరాజ్య
మర్మములు ఎరుగుట మీకు అనుగ్రహింపబడియున్నది
గాని వారికి అనుగ్రహింపబడలేదు. । కలిగినవానికే
ఇయ్యబడును, వానికి సమృద్ధి కలుగును; లేనివానికి
కలిగినదియు వానియొద్దనుండి తీసివేయబడును. మరి
యు — వారు చూచుచుండియు చూడరు, వినుచుం
డియు వినకయు గ్రహింపకయు నున్నారు. । ఇందు
నిమిత్తము నేను ఉపమానరీతిగా వారికి బోధించు
చున్నాను.

ఈ ప్రజలు కన్నులార చూచి చెవులార విని
హృదయముతో గ్రహించి మనస్సు త్రిప్పు
కొని నావలన స్వస్థతపొందకుండునట్లు వారి
హృదయము క్రొవ్వినది, వారి చెవులు విను
టకు మందములైనవి, వారు తమ కన్నులు
మూసికొనియున్నారు గనుక మీరు వినుట
మట్టుకు విందురుగాని గ్రహింపనే గ్రహిం
పరు, చూచుటమట్టుకు చూతురుగాని యెంత
మాత్రమును తెలిసికొనరు

యెషయా చెప్పిన ప్రవచనము వీరి విషయమై
నెరవేరుచున్నది.[1] । అయితే మీ కన్నులు చూచు
చున్నవి గనుక ధన్యములైనవి, మీ చెవులు విను
చున్నవి గనుక ధన్యములైనవి. । అనేక ప్రవక్తలును
నీతిమంతులును మీరు చూచువాటిని చూడగోరి
చూడకపోయిరి, మీరు వినువాటిని వినగోరి వినక
పోయిరని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. ।
విత్తువానిగూర్చిన ఉపమాన భావము వినుడి. ।
ఎవడును రాజ్యమునుగూర్చిన వాక్యము వినియు
గ్రహింపకయుండగా దుష్టుడు వచ్చి వాని హృదయ
ములో విత్తబడినది యెత్తికొనిపోవును; త్రోవప్రక్కను
విత్తబడినవాడు వీడే. । రాతినేలను విత్తబడినవాడు
వాక్యము విని వెంటనే సంతోషముతో దాని నంగీ
కరించువాడు. । అయితే అతనిలో వేరులేనందున
కొంతకాలము నిలుచును గాని వాక్యము
నిమిత్తము శ్రమయైనను హింసయైనను కలుగగానే
అభ్యంతరపడును. । ముండ్లపొదలలో విత్తబడినవాడు
వాక్యము వినువాడే గాని ఐహిక విచారమును ధనమో
హమును వాక్యమును అణచివేయును గనుక వాడు నిష్ఫ
లుడగును. । మంచినేలను విత్తబడినవాడైతే వాక్యము
విని గ్రహించువాడు; అట్టివారు సఫలులై యొకడు
నూరంతలుగాను ఒకడు అరువదంతలుగాను ఒకడు
ముప్పదంతలుగాను ఫలించుదురనెను.

ఆయన మరియొక ఉపమానము వారితో చెప్పెను, 24
ఏమనగా—పరలోకరాజ్యము, తన పొలములో మంచి
విత్తనము విత్తిన యొక మనుష్యుని పోలియున్నది. ।
మనుష్యులు నిద్రించుచుండగా అతని శత్రువు వచ్చి 25
గోధుమలమధ్యను గురుగులు విత్తిపోయెను. । మొల 26
కలు పెరిగి గింజ పట్టినప్పుడు గురుగులు కూడ అగు
పడెను. । అప్పుడు ఇంటి యజమానుని దాసులు 27
అతని యొద్దకు వచ్చి—అయ్యా, నీవు నీ పొలములో
మంచి విత్తనము విత్తితివి గదా, అందులో గురుగు
లెక్కడనుండి వచ్చెనని అడిగిరి । — ఇది శత్రువు 28
చేసినపని అని అతడు వారితో చెప్పగా ఆ దాసులు
—మేము వెళ్లి వాటిని పెరికి కూర్చుట నీకిష్టమా అని
అతనిని అడిగిరి. । అందుకతడు — వద్దు; గురుగులను 29
పెరుకుచుండగా వాటితోకూడ ఒకవేళ గోధుమలను
పెల్లగింతురు. । కోతకాలమువరకు రెంటిని కలిసి 30
యెదుగనియ్యుడి; కోతకాలమందు గురుగులను ముం
దుగా కూర్చి వాటిని కాల్చివేయుటకు కట్టలు కట్టి,
గోధుమలను నా కొట్టులో చేర్చి పెట్టుడని కోతగాం
డ్రతో చెప్పుదుననెను.

ఆయన మరియొక ఉపమానము వారితో చెప్పెను 31
—పరలోకరాజ్యము, ఒకడు తీసికొని తన పొలములో
విత్తిన ఆవగింజను పోలియున్నది · అది విత్తనములన్ని 32
టిలో చిన్నదేగాని పెరిగినప్పుడు కూరమొక్కలన్ని
టిలో పెద్దదై ఆకాశపక్షులు వచ్చి దాని కొమ్మల
యందు నివసించునంత చెట్టగును.

ఆయన మరియొక ఉపమానము వారితో చెప్పెను 33
—పరలోకరాజ్యము, ఒక స్త్రీ తీసికొని పిండి అం
తయు పులిసి పొంగువరకు మూడు కుంచముల పిం
డిలో దాచిపెట్టిన పుల్లని పిండిని పోలియున్నది.

నేను నా నోరు తెరచి ఉపమానరీతిగా బోధించె 34
దను, లోకము పుట్టినది మొదలుకొని మరుగు
చేయబడిన సంగతులను తెలియజెప్పెదను

అని ప్రవక్త చెప్పినమాట[2] నెరవేరునట్లు యేసు ఈ 35
సంగతులనన్నిటిని జనసమూహములకు ఉపమానరీతిగా
బోధించెను; ఉపమానము లేక వారికేమియు బోధింప
లేదు.

అప్పుడాయన జనసమూహములను పంపివేసి తన 36
యింటిలోకి వెళ్లగా ఆయన శిష్యులాయనయొద్దకు
వచ్చి—పొలములోని గురుగులను గూర్చిన ఉపమాన
భావము మాకు తెలియజెప్పుమనిరి. । అందుకాయన 37
ఇట్లనెను—మంచి విత్తనము విత్తువాడు మనుష్యకుమా
రుడు; । పొలము లోకము; మంచి విత్తనములు రాజ్య 38

[1] యెషయా, 6: 9, 10.
[2] కీర్తన, 78: 2

సంబంధులు[1]; గురుగులు దుష్టుని సంబంధులు[1]; ।
39 వాటిని విత్తిన శత్రువు అపవాది[2]; కోత యుగ
40 సమాప్తి; కోతకోయువారు దేవదూతలు. । గురుగులు
ఏలాగు కూర్చబడి అగ్నిలో కాల్చివేయబడునో
41 ఆలాగే యుగసమాప్తియందు జరుగును. । మనుష్య
కుమారుడు తన దూతలను పంపును; వారాయన
రాజ్యములోనుండి సకలమైన ఆటంకములను దుర్నీతి
చేయువారిని సమకూర్చి అగ్నిగుండములో పడవేయు
42 దురు. । అక్కడ ఏడ్పును పండ్లు కొరుకుటయు
43 ఉండును. । అప్పుడు నీతిమంతులు తమ తండ్రి రాజ్య
ములో సూర్యునివలె తేజరిల్లుదురు. చెవులుగలవాడు
వినునుగాక.

44 పరలోకరాజ్యము, పొలములో దాచబడిన ధన
మును పోలియున్నది. ఒక మనుష్యుడు దాని కనుగొని
దాచిపెట్టి, అది దొరికిన సంతోషముతో వెళ్లి, తనకు
కలిగినదంతయు అమ్మి ఆ పొలమును కొనును.

45 పరలోకరాజ్యము, మంచి ముత్యములను కొన
46 వెదకుచున్న వర్తకుని పోలియున్నది. । అతడు అమూల్య
మైన యొక ముత్యమును కనుగొని, పోయి తనకు కలి
గినదంతయు అమ్మి దాని కొనెను.

47 పరలోకరాజ్యము, సముద్రములో వేయబడి
నానావిధములైన చేపలను పట్టిన వలను పోలియున్నది.।
48 అది నిండినప్పుడు దాని దరికి లాగి, కూర్చుండి, మంచి
వాటిని గంపలలో చేర్చి చెడ్డవాటిని బయట పార
49 వేయుదురు. । ఆ ప్రకారమే యుగసమాప్తియందు
జరుగును. దేవదూతలు వచ్చి నీతిమంతులలోనుండి
50 దుష్టులను వేరుపరచి । వీరిని అగ్నిగుండములో పడ
వేయుదురు. అక్కడ ఏడ్పును పండ్లుకొరుకుటయును
ఉండును.

51 ఇవన్నియు మీరు గ్రహించితిరా అని వారిని అడు
52 గగా వారు—గ్రహించితిమనిరి. । ఆయన — అందు
వలన పరలోకరాజ్యములో శిష్యుడుగాచేరిన ప్రతి
శాస్త్రియు తన ధననిధిలోనుండి క్రొత్త పదార్థములను
పాత పదార్థములను వెలపలికి తెచ్చు ఇంటియజమానుని
పోలియున్నాడని వారితో చెప్పెను.

53 యేసు ఈ ఉపమానములు చెప్పి చాలించిన తరు
వాత ఆయన అక్కడనుండి వెళ్లి స్వదేశమునకు వచ్చి
సమాజమందిరములలో వారికి బోధించుచుండెను. ।
54 అందువలన వారాశ్చర్యపడి — ఈ జ్ఞానమును ఈ
55 అద్భుతములును ఇతనికెక్కడనుండి వచ్చినవి? । ఇతడు
వడ్లవాని కుమారుడు కాడా? ఇతని తల్లిపేరు మరియ
కాదా? యాకోబు యోసేపు సీమోను యూదా యను
56 వారు ఇతని సహోదరులు కారా? । ఇతని అక్క
చెల్లెండ్రందరు మనతోనే యున్నారు గదా; ఇతనికి
ఈ కార్యములన్నియు ఎక్కడనుండి వచ్చెనని చెప్పు
కొని ఆయన విషయమై అభ్యంతరపడిరి. । అయితే 57
యేసు—ప్రవక్త తన దేశములోను తన ఇంటను తప్ప
మరి ఎక్కడనైనను ఘనహీనుడు కాడని వారితో
చెప్పెను. । వారి అవిశ్వాసమునుబట్టి ఆయన అక్కడ 58
అనేకమైన అద్భుతములు చేయలేదు.

ఆ సమయమందు చతుర్థాధిపతియైన హేరోదు 14
యేసునుగూర్చిన సమాచారము విని । —ఇతడు బాప్తిస్మ 2
మిచ్చు యోహాను; అతడు మృతులలోనుండి లేచి
యున్నాడు; అందువలననే అద్భుతములు అతనియందు
క్రియాసాధకములగుచున్నవని తన సేవకులతో చెప్పె
ను. । ఏలయనగా — నీవు నీ తమ్ముడైన ఫిలిప్పు భార్య 3
యగు హేరోదియను చేర్చుకొనుట న్యాయము కాదని 4
యోహాను చెప్పగా, హేరోదు ఆమె నిమిత్తము
యోహానును పట్టుకొని బంధించి చెరసాలలో వేయించి
యుండెను. । అతడు ఇతని చంప నుద్దేశించెను గాని 5
జనసమూహము ఇతనిని ప్రవక్తయని యెంచినందున
వారికి భయపడెను. । అయితే హేరోదు జన్మదినోత్స 6
వము వచ్చినప్పుడు హేరోదియ కుమార్తె వారిమధ్య
నాట్యమాడి హేరోదును సంతోషపరచెను । గనుక 7
—ఆమె ఏమి అడిగిన ఇచ్చెదనని అతడు ప్రమాణ
పూర్వకముగా వాగ్దానము చేసెను. । అప్పుడామె తన 8
తల్లిచేత ప్రేరేపింపబడినదై—బాప్తిస్మమిచ్చు యోహాను
తలను ఇక్కడ పళ్లెములో పెట్టి నాకిప్పించుమని యడి
గెను. । రాజు దుఃఖపడినను తాను చేసిన ప్రమాణము 9
నిమిత్తమును, తనతోకూడ భోజనమునకు కూర్చున్న
వారి నిమిత్తమును ఇయ్య నాజ్ఞాపించి । బంట్రౌతులను 10
పంపి చెరసాలలో యోహాను తల గొట్టించెను. ।
వారతని తల పళ్లెములో పెట్టి తెచ్చి ఆ చిన్నదాని 11
కిచ్చిరి; ఆమె తన తల్లియొద్దకు దాని తీసికొని వచ్చెను.।
అంతట యోహాను శిష్యులు వచ్చి శవమును ఎత్తికొని 12
పోయి పాతిపెట్టి యేసునొద్దకు వచ్చి తెలియజేసిరి.

యేసు ఆ సంగతి విని దోనె యెక్కి అక్కడనుండి 13
అరణ్యప్రదేశమునకు ఏకాంతముగా వెళ్లెను. జన
సమూహములు ఆ సంగతి విని, పట్టణములనుండి కాలి
నడకను ఆయనవెంట వెళ్లిరి. । ఆయన వచ్చి ఆ గొప్ప 14
సమూహమును చూచి వారిమీద కనికరపడి వారిలో
రోగులైనవారిని స్వస్థపరచెను. । సాయంకాలమైన 15
ప్పుడు శిష్యులాయనయొద్దకు వచ్చి — ఇది అరణ్య
ప్రదేశము, ఇప్పటికే ప్రొద్దుపోయెను, ఈ జనులు
గ్రామములలోనికి వెళ్లి తమకు భోజనపదార్థములు
కొనుక్కొనుటకై వారిని పంపివేయుమని చెప్పిరి. ।
యేసు — వారు వెళ్లనక్కరలేదు, మీరే వారికి భోజ 16
నము పెట్టుడని వారితో చెప్పగా । వారు—ఇక్కడ 17
మనయొద్ద అయిదు రొట్టెలును రెండు చేపలును తప్ప 18
మరేమియు లేదని ఆయనతో చెప్పిరి. అందుకాయన

1 మూలభాషలో—కుమారులు

2 అనగా, సాతాను.

యొద్దకు తెండని చెప్పి । — పచ్చికమీద
ండుడని జనులకాజ్ఞాపించి, ఆ అయిదు
డు చేపలను పట్టుకొని ఆకాశమువైపు
స్తుతించి[1] ఆ రొట్టెలు విరిచి శిష్యుల
ు జనులకు వడ్డించిరి. । వారందరు తిని
తరువాత మిగిలిన ముక్కలు పన్నెండు
ఎత్తిరి. । స్త్రీలును పిల్లలును గాక తినిన
ంచు అయిదు వేలమంది పురుషులు.
జనసమూహములను లోను పంపివేయు
శిష్యులు దోనె యెక్కి తనకంటె ముం
వెళ్లవలెనని ఆయన వారిని బలవంతెము
ఏన ఆ జనసమూహములను పంపివేసి,
టకు ఏకాంతముగా కొండయెక్కి
ంకాలమైనప్పుడు అక్కడ ఒంటిగా
ప్పటికి దోనె దరికి దూరమందుండగా
ందున అలలవలన కొట్టబడుచుండెను।
 జామున ఆయన సముద్రముమీద
యొద్దకు వచ్చెను. । ఆయన సముద్రము
 శిష్యులు చూచి తొందరపడి భూత
భయముచేత కేకలువేసిరి. । వెంటనే
ు తెచ్చుకొనుడి; నేనే, భయపడకుడని
 । పేతురు—ప్రభువా, నీవే అయితే
నీయొద్దకు వచ్చుటకు నాకు సెలవిమ్మని
ెను. । ఆయన రమ్మనగానే పేతురు
సునొద్దకు వెళ్లుటకు నీళ్లమీద నడిచెను
చూచి భయపడి మునిగిపోసాగి । —
రక్షించుమని కేకలువేసెను. వెంటనే
ాపి అతని పట్టుకొని — అల్పవిశ్వాసీ,
దేహపడితివని అతనితో చెప్పెను. ।
క్కినప్పుడు గాలి అణిగెను. । అంతట
వారు వచ్చి—నీవు నిజముగా దేవుని
ప్పి ఆయనకు నమస్కారము చేసిరి.
ిటి గెన్నేసరెతు దేశమునకు వచ్చిరి. ।
 ఆయనను గుర్తుపట్టి చుట్టుపట్లనున్న
ికి వర్తమానము పంపి రోగులనందరిని
తెప్పించి । — వీరిని నీ వస్త్రపుచెంగు
నిమ్మని ఆయనను వేడుకొనిరి; ముట్టిన
స్థతపొందిరి.
మున యెరూషలేమునుండి శాస్త్రులును
యేసునొద్దకు వచ్చి । — నీ శిష్యులు
ొనకుండ భోజనము చేయుచున్నారే,
ము పెద్దల పారంపర్యాచారమును అతి
రని అడిగిరి । అందుకాయన — మీ
పర్యాచారము నిమిత్తమై దేవుని ఆజ్ఞను
మించుచున్నారు? । —తలిదండ్రులను

ఘనపరచుమనియు, తండ్రినైనను తల్లినైనను దూషించు
వాడు తప్పక మరణము పొందవలెననియు దేవుడు
సెలవిచ్చెను.[2] । మీరైతే — ఒకడు తన తండ్రినైనను 5
తల్లినైనను చూచి—నావలన నీకేది ప్రయోజనమగునో
అది దేవార్పితమని చెప్పినయెడల అతడు తన తండ్రి
నైనను తల్లినైనను ఘనపరచనక్కరలేదని చెప్పుచున్నా
రు. । మీరు మీ పారంపర్యాచారము నిమిత్తమై 6
దేవుని వాక్యమును నిరర్థకము చేయుచున్నారు. । వేష 7
ధారులారా— 9

ఈ ప్రజలు తమ పెదవులతో నన్ను ఘనపరచు
దురు గాని వారి హృదయము నాకు దూర
ముగా ఉన్నది; మనుష్యులు కల్పించిన పద్ధ
తులు దైవోపదేశములని బోధించుచు వారు
నన్ను వ్యర్థముగా ఆరాధించుచున్నారు

అని యెషయా[3] మిమ్మునుగూర్చి ప్రవచించిన మాట
సరియే అని వారితో చెప్పి । జనసమూహములను 10
పిలిచి — మీరు విని గ్రహించుడి; । నోటపడునది 11
మనుష్యుని అపవిత్రపరచదు గాని నోటనుండి వచ్చు
నదియే మనుష్యుని అపవిత్రపరచునని వారితో
చెప్పెను.

అంతట ఆయన శిష్యులు వచ్చి—పరిసయ్యులు ఆ 12
మాట విని అభ్యంతరపడిరని నీకు తెలియునా అని
ఆయనను అడుగగా । ఆయన—పరలోకమందున్న నా 13
తండ్రి నాటని ప్రతి మొక్కయు పెల్లగింపబడును. ।
వారి జోలికి పోకుడి; వారు గుడ్డివారైయుండి గుడ్డి 14
వారికి త్రోవ చూపువారు. గుడ్డివాడు గుడ్డివానికి
త్రోవ చూపినయెడల వారిద్దరు గుంటలో పడుదురు
గదా అనెను. । అందుకు పేతురు — ఈ ఉపమాన 15
భావము మాకు తెలుపుమని ఆయనను అడుగగా । ఆయన 16
—మీరును ఇంతవరకు అవివేకులై యున్నారా? ।
నోటిలోనికి పోవునదంతయు కడుపులోపడి బహిర్భూ 17
మిలో విడువబడును గాని । నోటనుండి బయటికి 18
వచ్చునవి హృదయములోనుండి వచ్చును; ఇవే మను
ష్యుని అపవిత్రపరచునవని మీరు గ్రహింపరా? ।
దురాలోచనలు నరహత్యలు వ్యభిచారములు వేశ్యాగ 19
మనములు దొంగతనములు అబద్ధసాక్ష్యములు దేవ
దూషణలును హృదయములో నుండియే గదా వచ్చు
ను? । ఇవే మనుష్యుని అపవిత్రపరచును గాని చేతులు 20
కడుగుకొనక భోజనముచేయుట మనుష్యుని అపవిత్ర
పరచదని చెప్పెను.

యేసు అక్కడనుండి బయలుదేరి తూరు సీదోనుల 21
ప్రాంతములకు వెళ్లగా, ఆ ప్రాంతములనుండి కనాను 22
స్త్రీ యొకతె వచ్చి—ప్రభువా, దావీదు కుమారుడా,
నన్ను కరుణింపుము; నా కుమార్తె దయ్యముపట్టి
బహు బాధపడుచున్నదని కేకలువేసెను. । అందు 23

[1] లేక, స్తోత్రముచేసి. [2] నిర్గమ. 20: 12; 21: 17. [3] యెషయా, 29: 13.

కాయన ఆమెతో ఒక్క మాటయైన చెప్పలేదు.
అప్పుడాయన శిష్యులు వచ్చి — ఈమె మన వెంబడి
వచ్చి కేకలు వేయుచున్నది గనుక ఈమెను పంపి
24 వేయుమని ఆయనను వేడుకొనగా । ఆయన—ఇశ్రా
యేలు ఇంటివారై నశించిన గొఱ్ఱెలయొద్దకే నేను పంప
బడితిని గాని మరి ఎవరియొద్దకును పంపబడలేదనెను. ।
25 అయినను ఆమె వచ్చి ఆయనకు మ్రొక్కి—ప్రభువా,
26 నాకు సహాయము చేయుమని అడిగెను. । అందు
కాయన—పిల్లలరొట్టె తీసికొని కుక్కపిల్లలకు వేయుట
27 యుక్తము కాదని చెప్పగా । ఆమె—నిజమె ప్రభువా,
కుక్కపిల్లలుకూడ తమ యజమానుల బల్లమీదనుండి
28 పడు ముక్కలు తినును గదా అని చెప్పెను. । అం
దుకు యేసు — అమ్మా, నీ విశ్వాసము గొప్పది; నీవు
కోరినట్టే నీకు అవును గాక అని ఆమెతో చెప్పెను.
ఆ గడియలోనే ఆమె కుమార్తె స్వస్థతనొందెను.

29 యేసు అక్కడనుండి వెళ్లి గలిలైయ సముద్రతీర
మునకు వచ్చి కొండెక్కి అక్కడ కూర్చుండగా ।
30 బహు జనసమూహములు ఆయనయొద్దకు కుంటివారు
గ్రుడ్డివారు మూగవారు అంగహీనులు మొదలైన అనే
కులను తీసికొనివచ్చి ఆయన పాదములయొద్ద పడవేసిరి;
31 ఆయన వారిని స్వస్థపరచెను. । మూగవారు మాట
లాడుటయు అంగహీనులు బాగుపడుటయు కుంటి
వారు నడుచుటయు గ్రుడ్డివారు చూచుటయు జన
సమూహము చూచి ఆశ్చర్యపడి ఇశ్రాయేలు దేవుని
మహిమపరచిరి.

32 అంతట యేసు తన శిష్యులను పిలిచి—ఈ జనులు
నేటికి మూడు దినములనుండి నాయొద్ద నున్నారు;
వారికి తిననేమియు లేదు గనుక వారిమీద కనికర
పడుచున్నాను; వారు మార్గములో మూర్ఛపోవుదు
రేమో అని వారిని ఉపవాసముతో పంపివేయుటకు
33 నాకు మనస్సులేదని వారితో చెప్పగా । ఆయన
శిష్యులు—ఇంత గొప్ప జనసమూహమును తృప్తిపరచు
టకు కావలసిన రొట్టెలు అరణ్యప్రదేశములో మనకు
34 ఎక్కడనుండి వచ్చునని ఆయనతో అనిరి. । యేసు—
మీయొద్ద ఎన్ని రొట్టెలున్నవని వారినడుగగా వారు
—ఏడు రొట్టెలును కొన్ని చిన్నచేపలును ఉన్నవని
35 చెప్పిరి. । అప్పుడాయన— నేలమీద కూర్చుండుడని
36 జనసమూహమునకు ఆజ్ఞాపించి । ఆ యేడు రొట్టె
లను ఆ చేపలను పట్టుకొని కృతజ్ఞతాస్తుతులు చెల్లించి
వాటిని విరిచి తన శిష్యులకిచ్చెను, శిష్యులు జనసమూ
37 హమునకు వడ్డించిరి. । వారందరు తిని తృప్తిపొందిన
మీదట మిగిలిన ముక్కలు ఏడు గంపల నిండ ఎత్తిరి. ।
38 స్త్రీలును పిల్లలును గాక తినినవారు నాలుగు వేలమంది
39 పురుషులు. । తరువాత ఆయన జనసమూహములను
పంపివేసి దోనె యెక్కి మగదాను ప్రాంతములకు
వచ్చెను.

అప్పుడు పరిసయ్యులును సద్దూకయ్యులును వచ్చి 16
ఆయనను శోధించుటకు ఆకాశమునుండి యొక సూచక
క్రియను తమకు చూపుమని ఆయనను అడుగగా ఆయన
ఇట్లనెను । — సాయంకాలమున మీరు — ఆకాశము 2
ఎఱ్ఱగా ఉన్నది గనుక వర్షము కురువదనియు, । ఉద 3
యమున—ఆకాశము ఎఱ్ఱగాను మబ్బుగాను ఉన్నది
గనుక నేడు గాలివాన వచ్చుననియు చెప్పుదురు గదా.
మీరు ఆకాశవైఖరి వివేచింప నెరుగుదురు గాని యీ
కాలముల సూచనలను వివేచింపలేరు. । వ్యభిచారులైన 4
చెడ్డతరమువారు సూచకక్రియ నడుగుచున్నారు;
అయితే యోనాను గూర్చిన సూచకక్రియయేగాని
మరి ఏ సూచకక్రియయైన వారికనుగ్రహింపబడదని
వారితో చెప్పి వారిని విడిచి వెళ్లిపోయెను.

ఆయన శిష్యులు అద్దరికి వచ్చి రొట్టెలు తెచ్చు 5
టకు మరచిరి. । అప్పుడు యేసు — చూచుకొనుడి, 6
పరిసయ్యులు సద్దూకయ్యులు అనువారి పులిసిన పిండి
నిగూర్చి జాగ్రత్తపడుడని వారితో చెప్పెను. । కాగా 7
వారు — మనము రొట్టెలు తేనందున గదా (యీ
మాట చెప్పెనని) తమలో తాము ఆలోచించుకొను
చుండిరి. । యేసు అది యెరిగి — అల్పవిశ్వాసులారా 8
— మనయొద్ద రొట్టెలు లేవని మీలో మీరెందుకు
ఆలోచించుకొనుచున్నారు? । మీరింక గ్రహింపలేదా? 9
అయిదు రొట్టెలు అయిదు వేలమందికి పంచిపెట్టి
నప్పుడు ఎన్ని గంపెళ్లు ఎత్తితిరో అదియైనను । ఏడు 10
రొట్టెలు నాలుగు వేలమందికి పంచిపెట్టినప్పుడు ఎన్ని
గంపెళ్లు ఎత్తితిరో అదియైనను మీకు జ్ఞాపకములేదా?
నేను రొట్టెలనుగూర్చి మీతో చెప్పలేదని మీరెం 11
దుకు గ్రహింపరు? పరిసయ్యులు సద్దూకయ్యులు
అనువారి పులిసిన పిండినిగూర్చియే జాగ్రత్తపడుడని
చెప్పెను. । అప్పుడు రొట్టెల పులిసిన పిండినిగూర్చి 12
కాదుగాని పరిసయ్యులు సద్దూకయ్యులు అనువారి
బోధనుగూర్చియే జాగ్రత్తపడవలెనని ఆయన తమతో
చెప్పెనని వారు గ్రహించిరి.

యేసు ఫిలిప్పుదైన కైసరయ ప్రాంతములకు వచ్చి 13
—మనుష్యకుమారుడెవడని జనులు చెప్పుకొనుచున్నా
రని తన శిష్యులను అడుగగా । వారు—కొందరు బాప్తిస్మ 14
మిచ్చు యోహాననియు, కొందరు ఏలీయా అనియు,
కొందరు యిర్మీయా అనియు, లేక ప్రవక్తలలో ఒక
డనియు చెప్పుకొనుచున్నారనిరి. । అందుకాయన— 15
మీరైతే నేను ఎవడనని చెప్పుకొనుచున్నారని వారినడి
గెను. । అందుకు సీమోను పేతురు—నీవు సజీవుడగు 16
దేవుని కుమారుడవైన క్రీస్తువని[1] చెప్పెను. । అందుకు 17
యేసు—సీమోను బర్‌యోనా, నీవు ధన్యుడవు, పర

[1] క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము.

లోకమందున్న నా తండ్రి ఈ సంగతి నీకు బయలు
పరచెనేగాని నరులు[1] నీకు బయలుపరచలేదు. ।
18 మరియు నీవు పేతురువు,[2] ఈ బండమీద నా సంఘ
మును కట్టుదును, పాతాళలోకద్వారములు దాని
యెదుట నిలువనేరవని నేను నీతో చెప్పుచున్నాను. ।
19 పరలోకరాజ్యముయొక్క తాళపు చెవులు నీకిచ్చెదను,
నీవు భూలోకమందు దేని బంధించుదువో అది పర
లోకమందును బంధింపబడును, భూలోకమందు దేని
విప్పుదువో అది పరలోకమందును విప్పబడునని అత
20 నితో చెప్పెను. । అటుపిమ్మట తాను క్రీస్తు అని[3]
యెవనితోను చెప్పవద్దని ఆయన తన శిష్యులకు ఖండిత
ముగా ఆజ్ఞాపించెను.
21 అప్పటినుండి, తాను యెరూషలేమునకు వెళ్లి, పెద్దల
చేతను ప్రధాన యాజకులచేతను శాస్త్రులచేతను అనేక
హింసలుపొంది చంపబడి మూడవదినమున లేచుట
అగత్యమని యేసు తన శిష్యులకు తెలియజేయ
22 మొదలుపెట్టగా । పేతురు ఆయనను ఒకవైపుకు తీసి
కొనిపోయి—ప్రభువా, అది నీకు దూరమగుగాక, అది
23 నీకెన్నడును కలుగదని ఆయనను గద్దించెను. । అయితే
ఆయన పేతురు వైపు తిరిగి—సాతానా, నా వెనుకకు
పొమ్ము; నీవు నాకు అభ్యంతరకారణమై యున్నావు;
నీవు మనుష్యుల సంగతులనే మనస్కరించుచున్నావు
గాని దేవుని సంగతులను మనస్కరింపకయున్నావని
24 పేతురుతో చెప్పెను । అప్పుడు యేసు తన శిష్యులను
చూచి — ఎవడైనను నా వెంబడి రాగోరినయెడల
తన్నుతాను ఉపేక్షించుకొని తన సిలువ నెత్తికొని
25 నన్ను వెంబడింపవలెను. । తన ప్రాణమును రక్షించు
కొన గోరువాడు దాని పోగొట్టుకొనును; నా
నిమిత్తము తన ప్రాణమును పోగొట్టుకొనువాడు దాని
26 దక్కించుకొనును. । ఒక మనుష్యుడు లోకమంతయు
సంపాదించుకొని తన ప్రాణమును పోగొట్టుకొంటే
అతనికేమి ప్రయోజనము? ఒక మనుష్యుడు తన
27 ప్రాణమునకు ప్రతిగా నేమి ఇయ్యగలడు? । మనుష్య
కుమారుడు తన తండ్రి మహిమగలవాడై తన దూత
లతోకూడ రాబోవుచున్నాడు. అప్పుడాయన ఎవని
28 క్రియలచొప్పున వానికి ఫలమిచ్చును. । ఇక్కడ నిలిచి
యున్నవారిలో కొందరు, మనుష్యకుమారుడు తన
రాజ్యముతో వచ్చుట చూచుపర్యంతము మరణము
రుచిచూడరని నిశ్చయముగా మీతో చెప్పుచున్నా
ననెను.

17 ఆరు దినములైన తరువాత యేసు పేతురును
యాకోబును అతని సహోదరుడైన యోహానును
వెంటబెట్టుకొని యెత్తయిన యొక కొండమీదికి ఏకాం
తముగా పోయి వారియెదుట రూపాంతరము పొం
2 దెను. । ఆయన ముఖము సూర్యునివలె ప్రకాశించెను;
ఆయన వస్త్రములు సూర్యకాంతివలె తెల్లనివాయెను. ।
మరియు మోషే ఏలీయా అనువారు ఆయనతో మాట 3
లాడుచుండగా వారు చూచిరి. । అప్పుడు పేతురు— 4
ప్రభువా, మనమిక్కడ ఉండుట మంచిది; నీకిష్టమైతే
ఇక్కడ నీకు ఒకటి మోషేకు ఒకటి ఏలీయాకు ఒకటి
మూడు పర్ణశాలలు కట్టుదునని యేసుతో చెప్పెను. ।
అతడు ఇంక మాటలాడుచుండగా ప్రకాశమానమైన 5
యొక మేఘము వారిని కమ్ముకొనెను; అప్పుడు—
ఈయన నా ప్రియకుమారుడు, ఈయనయందు నేనా
నందించుచున్నాను, ఈయన మాట వినుడని యొక
శబ్దము ఆ మేఘములోనుండి పుట్టెను. । శిష్యులు ఈ 6
మాట విని బోర్లబడి మిక్కిలి భయపడగా । యేసు వారి 7
యొద్దకు వచ్చి వారిని ముట్టి — లెండి, భయపడకుడని
చెప్పెను. । వారు కన్నులెత్తి చూడగా యేసు తప్ప 8
మరి ఎవడును వారికి కనబడలేదు.

వారు కొండ దిగి వచ్చుచుండగా—మనుష్యకుమా 9
రుడు మృతులలోనుండి లేచువరకు ఈ దర్శనము
మీరు ఎవరితోను చెప్పకుడని యేసు వారికాజ్ఞాపిం
చెను. । అప్పుడాయన శిష్యులు—ఈలాగైతే ఏలీయా 10
ముందుగా రావలెనని శాస్త్రులెందుకు చెప్పుచున్నారని
ఆయన నడిగిరి. । అందుకాయన — ఏలీయా వచ్చి 11
సమస్తమును చక్కపెట్టుననుమాట నిజమే; । అయి 12
నను ఏలీయా యిదివరకే వచ్చెను, వారతనిని ఎరుగక
తమకిష్టము వచ్చినట్టు అతనికి చేసిరి. మనుష్యకుమా
రుడు కూడ ఆలాగే వారిచేత శ్రమలు పొందబోవు
చున్నాడని మీతో చెప్పుచున్నాననెను. । అప్పుడా 13
యన బాప్తిస్మమిచ్చు యోహానునుగూర్చి తమతో
చెప్పెనని శిష్యులు గ్రహించిరి.

వారు జనసమూహమునొద్దకు వచ్చినప్పుడు ఒకడు 14
ఆయనయొద్దకు వచ్చి ఆయనయెదుట మోకాళ్లూని ।
— ప్రభువా, నా కుమారుని కరుణింపుము; వాడు 15
చాంద్రరోగియై మిక్కిలి బాధపడుచున్నాడు; ఏలా
గనగా అగ్నిలోను నీళ్లలోను తరుచుగా పడుచు
న్నాడు; । నీ శిష్యులయొద్దకు వానిని తీసికొని వచ్చితిని 16
గాని వారు వానిని స్వస్థపరచలేకపోయిరని చెప్పెను. ।
అందుకు యేసు — విశ్వాసములేని మూర్ఖతరమువార 17
లారా, నేనెంతకాలము మీతో ఉందును? ఎంతవరకు
మిమ్మును సహింతును? వాని నాయొద్దకు తీసికొని
రండని చెప్పెను. । అంతట యేసు ఆ దయ్యమును 18
గద్దింపగా అది వాని వదలిపోయెను; ఆ గడియనుండి
ఆ చిన్నవాడు స్వస్థతనొందెను. । తరువాత శిష్యులు 19
ఏకాంతముగా యేసునొద్దకు వచ్చి—మేమెందుచేత
దాని వెళ్లగొట్టలేకపోతిమని అడిగిరి. । అందుకాయన 20
— మీ అల్పవిశ్వాసముచేతనే; ఆవగింజంత విశ్వాసము 21
మీకు కలిగియుండినయెడల ఈ కొండను చూచి—

[1] మూలభాషలో—రక్తమాంసములు. [2] పేతురు అను శబ్దమునకు రాయి అని అర్థము. [3] క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము.

ఇక్కడనుండి అక్కడికి పొమ్మనగానే అది పోవును;
మీకు అసాధ్యమైనది ఏదియు నుండదని నిశ్చయ
ముగా మీతో చెప్పుచున్నానని వారితో అనెను.
22 వారు గలిలైయలో సంచరించుచుండగా యేసు—
మనుష్యకుమారుడు మనుష్యులచేతులకు అప్పగింపబడ
23 బోవుచున్నాడు, । వారాయనను చంపుదురు; మూడవ
దినమున ఆయన లేచునని వారితో చెప్పగా వారు
బహుగా దుఃఖపడిరి
24 వారు కపెర్నహూముకు వచ్చినప్పుడు అరషెకెలు
అను పన్ను వసూలుచేయువారు పేతురునొద్దకు వచ్చి
—మీ బోధకుడు ఈ అరషెకెలు చెల్లింపడా అని
25 యడుగగా — చెల్లించునని యనెను. । అతడు ఇంటిలోకి
వచ్చినప్పుడు అతడు మాటలాడకమునుపే యేసు
ఆ సంగతి యెత్తి—సీమోనా, నీకేమి తోచుచున్నది?
భూరాజులు సుంకమును పన్నును ఎవరియొద్ద వసూలు
చేయుదురు? కుమారులయొద్దనా అన్యులయొద్దనా? అని
26 అడిగెను. । అతడు — అన్యులయొద్దనే అని చెప్పగా
27 యేసు—ఆలాగైతే కుమారులు స్వతంత్రులే. । అయి
నను మనము వారికి అభ్యంతరము కలుగజేయకుండు
నట్లు నీవు సముద్రమునకు పోయి గాలము వేసి మొదట
పైకివచ్చు చేపను పట్టుకొని దాని నోరు తెరచినయెడల
ఒక షెకెలు దొరుకును; దాని తీసికొని నాకొరకును
నీకొరకును వారికిమ్మని అతనితో చెప్పెను.

**18** ఆ కాలమున శిష్యులు యేసునొద్దకు వచ్చి, పర
2 లోకరాజ్యములో ఎవడు గొప్పవాడని అడుగగా,
ఆయన యొక చిన్నబిడ్డను తన యొద్దకు పిలిచి వారి
3 మధ్యను నిలువబెట్టి యిట్లనెను । — మీరు మనస్సు
మార్పునొంది బిడ్డలవంటివారైతేనే గాని పరలోక
రాజ్యములో ప్రవేశింపరని నిశ్చయముగా మీతో
4 చెప్పుచున్నాను. । కాగా ఈ బిడ్డవలె తన్నుతాను
తగ్గించుకొనువాడెవడో వాడే పరలోకరాజ్యములో
5 గొప్పవాడు. । మరియు ఈలాటి యొక బిడ్డను నా
6 పేరట చేర్చుకొనువాడు నన్ను చేర్చుకొనును. । నా
యందు విశ్వాసముంచు ఈ చిన్నవారిలో ఒకనిని
అభ్యంతరపరచువాడెవడో వాడు మెడకు తిరుగటి
రాయి కట్టబడినవాడై మిక్కిలి లోతైన సముద్రములో
7 ముంచివేయబడుట వానికి మేలు. । అభ్యంతరముల
వలన లోకమునకు శ్రమ; అభ్యంతరములు రాక
తప్పదు గాని, యెవనివలన అభ్యంతరము వచ్చునో ఆ
8 మనుష్యునికి శ్రమ. । కాగా నీ చెయ్యియైనను నీ
పాదమైనను నిన్ను అభ్యంతరపరచినయెడల దాని నరికి
నీయొద్దనుండి పారవేయుము, రెండు చేతులైనను రెండు
పాదములైనను కలిగినవాడవై నిత్యాగ్నిలో పడవేయ
బడుటకంటె కుంటివాడవైనను అంగహీనుడవైనను
9 జీవములో ప్రవేశించుట నీకు మేలు. । నీ కన్ను నిన్ను
అభ్యంతరపరచినయెడల దాని పెరికి నీయొద్దనుండి
పారవేయుము; రెండు కన్నులు గలవాడవై అగ్నిగల
నరకములో పడవేయబడుటకంటె ఒంటి కన్నుగల
వాడవై జీవములో ప్రవేశించుట నీకు మేలు. । ఈ
చిన్నవారిలో ఒకనినైనను తృణీకరింపకుండ చూచు
కొనుడి. వీరి దూతలు పరలోకమందున్న నా తండ్రి
ముఖము ఎల్లప్పుడు పరలోకమందు చూచుచుందు
రని మీతో చెప్పుచున్నాను. । [1]మీకేమి తోచును?
ఒక మనుష్యునికి నూరు గొఱ్ఱెలు కలిగియుండగా
వాటిలో ఒకటి తప్పిపోయిన యెడల తొంబదితొమ్మి
దింటిని కొండలమీద విడిచి పోయి తప్పిపోయిన
దానిని వెదకడా? । వాడు దాని కనుగొనుట తటస్థిం
చినయెడల తొంబదితొమ్మిది గొఱ్ఱెలనుగూర్చి సంతో
షించునంతకంటె దానినిగూర్చి యెక్కువగా సంతో
షించునని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. ।
ఆలాగున ఈ చిన్నవారిలో ఒకడైనను నశించుట పర
లోకమందున్న మీ తండ్రి చిత్తము కాదు.

మరియు నీ సహోదరుడు నీయెడల తప్పితము
చేసిన పక్షమున నీవు పోయి, నీవును అతడును ఒంట
రిగా నున్నప్పుడు అతని గద్దించుము; అతడు నీ మాట
వినినయెడల నీ సహోదరుని సంపాదించుకొంటివి. ।
అతడు వినకపోయిన పక్షమున, ఇద్దరు ముగ్గురు
సాక్షులనోట ప్రతిమాట స్థిరపరచబడునట్లు నీవు ఒకరి
నిద్దరిని వెంటబెట్టుకొని పొమ్ము. । అతడు వారి మాటయు
వినకపోయినపక్షమున ఆ సంగతి సంఘమునకు తెలియ
జెప్పుము; అతడు సంఘపు మాట వినకపోయినా
అతని నీకు అన్యునిగాను సుంకరిగాను ఎంచుకొనుము. ।
భూమిమీద మీరు వేటిని బంధింతురో అవి పరలోక
మందును బంధింపబడును; భూమిమీద మీరు వేటిని
విప్పుదురో అవి పరలోకమందును విప్పబడునని నిశ్చ
యముగా మీతో చెప్పుచున్నాను. । మరియు మీలో
ఇద్దరు తాము వేడుకొను ఏ సంగతిని గూర్చియైనను
భూమిమీద ఏకీభవించిన పక్షమున అది పరలోకమం
దున్న నా తండ్రివలన వారికి దొరుకునని మీతో
చెప్పుచున్నాను. । ఏలయనగా ఇద్దరు ముగ్గురు నా
నామమున ఎక్కడ కూడియుందురో అక్కడ నేను
వారి మధ్యన ఉందునని చెప్పెను.

ఆ సమయమున పేతురు ఆయనయొద్దకు వచ్చి—
ప్రభువా, నా సహోదరుడు నాయెడల తప్పితము
చేసినపక్షమున నేనెన్నిమారులు అతని క్షమింపవలెను?
ఏడుమారులమట్టుకా? అని అడిగెను. । అందుకు యేసు
అతనితో ఇట్లనెను — ఏడుమారులమట్టుకే కాదు,
డెబ్బది ఏళ్ల మారులమట్టుకని నీతో చెప్పుచున్నాను. ।
కావున పరలోకరాజ్యము, తన దాసులయొద్ద లెక్క
చూచుకొనగోరిన యొక రాజును పోలియున్నది. ।

1 అనేక ప్రాచీన ప్రతులలో — ఏలయనగా తప్పిపోయినవానిని రక్షించుటకై మనుష్యకుమారుడు వచ్చెను అని కూర్చబడియున్నది.

24 అతడు లెక్క చూచుటకు మొదలుపెట్టినప్పుడు అతనికి
పదివేల తలాంతులు[1] అచ్చియున్న యొకడు అతని
25 యొద్దకు తేబడెను. । అప్పుతీర్చుటకు వానియొద్ద
ఏమియు లేనందున వాని యజమానుడు వానిని వాని
భార్యను పిల్లలను వానికి కలిగినది యావత్తును అమ్మి
26 అప్పు తీర్చవలెనని ఆజ్ఞాపించెను. । కాగా ఆ దాసుడు
అతని యెదుట సాగిలపడి మ్రొక్కి — నాయెడల
ఓర్చుకొనుము, నీకు అంతయు చెల్లింతునని చెప్పగా ।
27 ఆ దాసుని యజమానుడు కనికరపడి వాని విడిచిపెట్టి
28 ఆ అప్పు వానికి క్షమించెను. । అయితే ఆ దాసుడు
బయటికి వెళ్లి తనకు నూరు దేనారములు[2] అచ్చి
యున్న తన తోటిదాసులలో ఒకని చూచి వాని
గొంతుక పట్టి—నీవు అచ్చియున్నది చెల్లింపుమనెను. ।
29 అందుకు వాని తోటిదాసుడు సాగిలపడి—నాయెడల
ఓర్చుకొనుము, నీకు చెల్లించెదనని వానిని వేడుకొనెను
30 గాని । వాడు ఒప్పుకొనపోయి, అచ్చియున్నది చెల్లించు
31 పర్యంతము వానిని చెరసాలలో వేయించెను. । కాగా
వాని తోటిదాసులు జరిగినది చూచి మిక్కిలి దుఃఖ
పడి, వచ్చి జరిగినదంతయు తమ యజమానునికి వివర
32 ముగా తెలిపిరి. । అప్పుడు వాని యజమానుడు వాని
పిలిపించి— చెడ్డదాసుడా, నీవు నన్ను వేడుకొంటివి
33 గనుక ఆ అప్పంతయు నీకు క్షమించితిని; । నేను నిన్ను
కరుణించిన ప్రకారము నీవును నీ తోటిదాసుని కరు
ణింపవలసియుండెను గదా అని వానితో చెప్పెను. ।
34 అందుచేత వాని యజమానుడు కోపపడి, తనకు అచ్చి
యున్నదంతయు చెల్లించుపర్యంతము బాధపరచువారికి
35 వాని నప్పగించెను. । మీలో ప్రతివాడు తన సహోదరుని హృదయపూర్వకముగా క్షమింపనియెడల పర
లోకపు నా తండ్రియు ఈ ప్రకారమే మీయెడల
చేయుననెను.

**19** యేసు ఈ మాటలు చెప్పి చాలించిన తరువాత
గలిలయనుండి యొర్దాను అద్దరినున్న యూదయ
2 ప్రాంతములకు వచ్చెను. । బహు జనసమూహములు
ఆయనను వెంబడింపగా ఆయన వారిని అక్కడ స్వస్థ
పరచెను.

3 పరిసయ్యులు ఆయనను శోధింపవలెనని ఆయన
యొద్దకు వచ్చి—పురుషుడు ఏ హేతువుచేతనైనను తన
భార్యను విడనాడుట న్యాయమా? అని అడుగగా ।
4 ఆయన—సృష్టించినవాడు ఆదినుండి వారిని పురుషుని
5 గాను స్త్రీనిగాను సృష్టించి । — ఇందునిమిత్తము పురు
షుడు తలిదండ్రులను విడిచి తన భార్యను హత్తుకొనును,
వారిద్దరును ఏకశరీరముగా ఉందురని చెప్పెనని[3] మీరు
6 చదువలేదా? । కాబట్టి వారికను ఇద్దరు కాక ఏకశరీర
ముగా ఉన్నారు గనుక దేవుడు జతపరచినవారిని మను
ష్యుడు వేరుపరచకూడదని చెప్పెను. । అందుకు వారు 7
— ఆలాగైతే పరిత్యాగ పత్రికనిచ్చి ఆమెను విడ
నాడుమని మోషే యెందుకు ఆజ్ఞాపించెనని వారా
యనను అడుగగా । ఆయన — మోషే మీ హృదయ 8
కాఠిన్యమునుబట్టి మీ భార్యలను విడనాడ సెలవిచ్చెను
గాని ఆదినుండి ఆలాగు జరుగలేదు. । మరియు వ్యభి 9
చారమునిమిత్తమే తప్ప తన భార్యను విడనాడి మరి
యొకతెను పెండ్లిచేసికొనినవాడు వ్యభిచారము చేయు
చున్నాడనియు, విడనాడబడినదానిని పెండ్లిచేసికొనిన
వాడు వ్యభిచారము చేయుచున్నాడనియు మీతో
చెప్పుచున్నానని వారితో ననెను. । ఆయన శిష్యులు 10
—భార్యాభర్తలకుండు సంబంధము ఇట్టిదైతే పెండ్లిచేసి
కొనుట యుక్తము కాదని ఆయనతో చెప్పిరి. । అందు 11
కాయన — అనుగ్రహము నొందినవారు తప్ప మరి
ఎవరును ఈ మాటను అంగీకరింపనేరరు. । తల్లి గర్భము 12
నుండి నపుంసకులుగా పుట్టినవారు గలరు, మనుష్యుల
వలన నపుంసకులుగా చేయబడిన నపుంసకులును గలరు,
పరలోకరాజ్యము నిమిత్తము తమ్మునుతామే నపుంసకుల
నుగా చేసికొనిన నపుంసకులును గలరు. (ఈ మాటను)
అంగీకరింపగలవాడు అంగీకరించును గాక అని వారితో
చెప్పెను.

అప్పుడు ఆయన వారిమీద చేతులుంచి ప్రార్థన 13
చేయవలెనని కొందరు చిన్నపిల్లలను ఆయనయొద్దకు
తీసికొని వచ్చిరి. । ఆయన శిష్యులు, తీసికొనివచ్చిన 14
వారిని గద్దింపగా యేసు—చిన్నపిల్లలను ఆటంకపరచక
వారిని నాయొద్దకు రానియ్యుడి; పరలోకరాజ్యము
ఈలాటివారిదని వారితో చెప్పి । వారిమీద చేతు 15
లుంచి, అక్కడనుండి లేచిపోయెను.

అంతట ఒకడు వచ్చి — బోధకుడా, నిత్యజీవము 16
పొందుటకు నేను ఏ మంచికార్యము చేయవలెనని
ఆయనను అడిగెను. । అందుకాయన—మంచి కార్య 17
మునుగూర్చి నన్నెందుకు అడుగుచున్నావు? మంచి
వాడొక్కడే. నీవు జీవములో ప్రవేశింప గోరినయెడల
ఆజ్ఞలను గైకొనుమని చెప్పెను. అతడు—ఏ ఆజ్ఞలని
ఆయనను అడుగగా । యేసు—నరహత్య చేయవద్దు, 18
వ్యభిచరింపవద్దు, దొంగిలవద్దు, అబద్ధసాక్ష్యము పలుక
వద్దు, తలిదండ్రులను సన్మానింపుము,। నిన్నువలె నీ పొరు 19
గువాని ప్రేమింపవలెను అనునవియే అని చెప్పెను. ।
అందుకు ఆ యౌవనస్థుడు — ఇవన్నియు అనుస 20
రించుచునే యున్నాను; ఇకను నాకు కొదువ ఏమని
ఆయనను అడిగెను. । అందుకు యేసు — పరిపూర్ణుడ 21
వగుటకు నీవు కోరినయెడల, పోయి నీ ఆస్తిని అమ్మి
బీదలకిమ్ము అప్పుడు పరలోకమందు నీకు ధనము కలు
గును; నీవు వచ్చి నన్ను వెంబడించుమని అతనితో

1 ఒక తలాంతు ఇంచుమించు 3,600 రూపాయిలు కావచ్చును. 2 ఒక దేనారము ఇంచుమించు అర్ధరూపాయి కావచ్చును. 3 ఆది
కాండము, 2: 24.

22 చెప్పెను. । అయితే ఆ యౌవనస్థుడు మిగుల ఆస్తిగల
వాడు గనుక ఆ మాట విని వ్యసనపడుచు వెళ్లి
పోయెను.
23 యేసు తన శిష్యులను చూచి — ధనవంతుడు పర
లోకరాజ్యములో ప్రవేశించుట దుర్లభమని నిశ్చయ
24 ముగా మీతో చెప్పుచున్నాను. । ఇదియుగాక ధన
వంతుడు పరలోకరాజ్యములో ప్రవేశించుటకంటె
సూదిబెజ్జములో ఒంటె దూరుట సులభమని మీతో
25 చెప్పుచున్నాననెను. । శిష్యులు ఈ మాట విని మిక్కిలి
ఆశ్చర్యపడి—ఈలాగైతే ఎవడు రక్షణపొందగలడని
26 అడుగగా । యేసు వారిని చూచి — ఇది మనుష్యు
లకు అసాధ్యమే గాని దేవునికి సమస్తమును సాధ్య
27 మని చెప్పెను. । పేతురు—ఇదిగో మేము సమస్తమును
విడిచిపెట్టి నిన్ను వెంబడించితిమి గనుక మాకేమి దొరు
28 కునని ఆయనను అడుగగా । యేసు వారితో ఇట్లనెను—(ప్రపంచ) పునర్జన్మమందు[1] మనుష్యకుమారుడు
తన మహిమగల సింహాసనముమీద ఆసీనుడై యుం
డునపుడు నన్ను వెంబడించిన మీరును పన్నెండు
సింహాసనములమీద ఆసీనులై ఇశ్రాయేలు పన్నెండు
29 గోత్రములవారికి తీర్పు తీర్చుదురు. । నా నామము
నిమిత్తము అన్నదమ్ములనైనను అక్కచెల్లెండ్లనైనను
తండ్రినైనను తల్లినైనను పిల్లలనైనను భూములనైనను
ఇండ్లనైనను విడిచిపెట్టిన ప్రతివాడు నూరురెట్లు పొం
దును; ఇదియుగాక నిత్యజీవమును స్వతంత్రించు
30 కొనును. । మొదటివారు అనేకులు కడపటివారగు
దురు, కడపటివారు మొదటివారగుదురు.

20 ఏలాగనగా — పరలోకరాజ్యము ఇంటి యజ
మానుడైన యొకని పోలియున్నది. అతడు తన ద్రాక్ష
తోటలో పనివారిని కూలికి పెట్టుకొనుటకు ప్రొద్దున
2 బయలుదేరి । దినమునకు ఒక దేనారము[2] చొప్పున
పనివారితో ఒడబడి తన ద్రాక్షతోటలోకి వారిని
3 పంపెను. । తరువాత అతడు దాదాపు తొమ్మిది గంట
లకు వెళ్లి సంతవీధిలో ఊరక నిలిచియున్న మరి
4 కొందరిని చూచి । —మీరును నా ద్రాక్షతోటలోకి
వెళ్లుడి, యేమి న్యాయమో అది మీకిత్తునని వారితో
5 చెప్పగా వారును వెళ్లిరి. । దాదాపు పన్నెండు గంటల
కును మూడు గంటలకును అతడు మరల వెళ్లి ఆలాగే
6 చేసెను. । తిరిగి దాదాపు అయిదు గంటలకు వెళ్లి మరి
కొందరు నిలిచియుండగా చూచి — ఇక్కడ దినమం
తయు మీరెందుకు ఊరకనే నిలుచుచున్నారని వారిని
7 అడుగగా । వారు—ఎవడును మమ్మును కూలికి పెట్టు
కొనలేదనిరి. అందుకతడు — మీరును నా ద్రాక్ష
8 తోటలోకి వెళ్లుడనెను. । సాయంకాలమైనప్పుడు
ద్రాక్షతోట యజమానుడు తన గృహనిర్వాహకుని
చూచి—పనివారిని పిలిచి, చివర వచ్చినవారు మొదలు
కొని మొదట వచ్చినవారివరకు వారికి కూలి ఇమ్మని
చెప్పెను. । దాదాపు అయిదు గంటలకు కూలికి కుదిరిన 9
వారు వచ్చి ఒక్కొక్క దేనారము చొప్పున తీసికొనిరి. ।
మొదట వచ్చినవారు వచ్చి తమకు ఎక్కువ దొరుకు 10
ననుకొనిరి గాని వారికిని ఒక్కొక్క దేనారము చొప్పు
ననే దొరికెను. । వారది తీసికొని—చివరవచ్చిన వీరు 11
ఒక్కగంట మాత్రమే పని చేసినను, పగలంతయు కష్ట 12
పడి యెండబాధ సహించిన మాతో వారిని సమా
నముచేసితివే అని ఆ యింటి యజమానునిమీద సణుగు
కొనిరి. । అందుకతడు వారిలో ఒకని చూచి—స్నేహి
తుడా, నేను నీకు అన్యాయము చేయలేదే; నీవు
నాయొద్ద ఒక దేనారమునకు ఒడబడలేదా? । నీ సొమ్ము
నీవు తీసికొని పొమ్ము; నీకిచ్చినట్టే కడపట వచ్చిన
వీరికిచ్చుటకు నాకిష్టమైనది; । నాకిష్టము వచ్చినట్టు
నా స్వంత సొమ్ముతో చేయుట న్యాయము కాదా!
నేను మంచివాడనైనందున నీకు కడుపుమంటగా
ఉన్నదా[3] అని చెప్పెను. । ఈ ప్రకారమే కడపటి
వారు మొదటివారగుదురు మొదటివారు కడపటి
వారగుదురనెను.

యేసు యెరూషలేముకు వెళ్లనైయున్నప్పుడు
ఆయన పన్నెండుమంది శిష్యులను ఏకాంతముగా తీసి
కొనిపోయి మార్గమందు వారితో ఇట్లనెను । —ఇదిగో
యెరూషలేముకు వెళ్లుచున్నాము; అక్కడ మనుష్య
కుమారుడు ప్రధానయాజకులకును శాస్త్రులకును అప్ప
గింపబడును; వారాయనకు మరణ శిక్ష విధించి । ఆయ
నను అపహసించుటకును కొరడాలతో కొట్టుటకును
సిలువవేయుటకును అన్యజనులకు ఆయనను అప్పగిం
తురు; మూడవ దినమున ఆయన మరల లేచును.

అప్పుడు జెబెదయి కుమారుల తల్లి తన కుమారులను
వెంటబెట్టుకొని ఆయనయొద్దకు వచ్చి నమస్కారము
చేసి యొక మనవి చేయబోగా । —నీ వేమి కోరుచున్నా
వని ఆయన అడిగెను. అందుకామె—నీ రాజ్యమందు
ఈ నా యిద్దరు కుమారులు నీ కుడివైపున ఒకడును నీ
యెడమవైపున ఒకడును కూర్చుండ సెలవిమ్మని ఆయ
నతో అనెను. । అందుకు యేసు — మీరేమి అడుగు
చున్నారో అది మీకు తెలియదు; నేను త్రాగబోవు
గిన్నెలోనిది మీరు త్రాగగలరా అని అడుగగా వారు
—త్రాగగలమనిరి. । ఆయన — మీరు నా గిన్నెలో
నిది త్రాగుదురు గాని నా కుడివైపునను నా యెడమ
వైపునను కూర్చుండనిచ్చుట నా వశమునలేదు; నా
తండ్రిచేత ఎవరికి సిద్ధపరచబడెనో వారికే దొరుకును
చెప్పెను. । తక్కిన పదిమంది శిష్యులు ఈ మాట
విని ఆ యిద్దరు సహోదరులమీద కోపపడిరి । గనుక
యేసు వారిని పిలిచి — అన్యజనులలో అధికారులు
వారిమీద కఠినముగా ప్రభుత్వము చేయుదురనియు

పునఃస్థితిస్థాపనమందు. [2] ఇది ఇంచుమించు అర్ధరూపాయి. [3] మూలభాషలో—నీ కన్ను చెడినదైయున్నదా.

ప్పవారు వారిమీద కఠినముగా అధికారము
రని మీకు తెలియును. । మీలో ఆలా
రాదు; మీలో ఎవడు గొప్పవాడై యుండ
వాడు మీ పరిచారకుడై యుండవలెను; ।
మీలో ముఖ్యుడై యుండగోరువాడు మీ
డై యుండవలెను. । ఆలాగే మనుష్యకుమారుడు
చేయించుకొనుటకు రాలేదు గాని పరి
చేయుటకును అనేకులకు ప్రతిగా విమోచన
గా తన ప్రాణము నిచ్చుటకును వచ్చెనని

యెరికోనుండి వెళ్లుచుండగా బహు జన
ము ఆయనవెంట వెళ్లెను. । అప్పుడు త్రోవ
కూర్చుండియున్న యిద్దరు గుడ్డివారు యేసు ఆ
వెళ్లుచున్నాడని విని—ప్రభువా, దావీదు
రా, మమ్ము కరుణింపుమని కేకలు వేసిరి. । ఊరక
జనులు వారిని గద్దించిరి గాని వారు —
దావీదు కుమారుడా, మమ్ము కరుణింపుమని
కేకలు వేసిరి. । యేసు నిలిచి వారిని పిలిచి—
కేమి చేయగోరుచున్నారని అడుగగా । వారు
రా, మా కన్నులు తెరువవలెననిరి. । కాబట్టి
కనికరపడి వారి కన్నులు ముట్టెను; వెంటనే
చూపుపొంది ఆయన వెంట వెళ్లిరి.
వారు యెరూషలేమును సమీపించి ఒలీవచెట్ల
కు ఉన్న బేత్పగేకు వచ్చినప్పుడు యేసు తన
యిద్దరిని చూచి । — మీ యెదుటనున్న
మునకు వెళ్లుడి; ప్రవేశింపగానే కట్టబడియున్న
గాడిదయు దానితోనున్న యొక గాడిదపిల్లయు
కబడును. వాటిని విప్పి నాయొద్దకు తోలు
డి । ఎవడైనను మీతో ఏమైనను అనిన
అవి ప్రభువునకు కావలసియున్నవని చెప్పు
వెంటనే అతడు వాటిని తోలిపెట్టునని చెప్పి
పెను. । ప్రవక్తవలన చెప్పబడినది నెరవేరు
జరిగెను,[1] అదేమనగా
ఇదిగో నీ రాజు సాత్వికుడై గాడిదను
భారము మోయు పశువుపిల్లయైన చిన్న గాడిదను ఎక్కి
నీయొద్దకు వచ్చుచున్నాడని
సీయోను కుమారితో చెప్పుడి
శిష్యులు వెళ్లి యేసు తమకాజ్ఞాపించిన
చేసి । ఆ గాడిదను దాని పిల్లను తోలు
వాటిమీద తమ బట్టలు వేయగా ఆయన
కూర్చుండెను. । జనసమూహములోను అనే
లు బట్టలు దారిపొడుగున పరచిరి; కొందరు
కొమ్మలు నరికి దారిపొడుగున పరచిరి. । జనసమూ
ఆయనకు ముందు వెళ్లుచుండినవారును
వెనుక వచ్చుచుండినవారును

—దావీదు కుమారునికి జయము[2]
ప్రభువు పేరట వచ్చువాడు స్తుతింపబడునుగాక
సర్వోన్నతమైన స్థలములలో జయము[2]
అని కేకలువేయుచుండిరి. । ఆయన యెరూషలేము 10
లోనికి వచ్చినప్పుడు పట్టణమంతయు — ఈయన
ఎవరో అని కలవరపడెను. । జనసమూహము—ఈయన 11
గలిలైయలోని నజరేతువాడగు ప్రవక్తయైన యేసు
అని చెప్పిరి.

యేసు దేవాలయములో ప్రవేశించి క్రయవిక్ర 12
యములు చేయువారినందరిని వెళ్లగొట్టి, రూకలు
మార్చువారి బల్లలను గువ్వలమ్మువారి పీఠములను పడ
ద్రోసి—

నా మందిరము ప్రార్థన మందిరమనబడును 13
అని వ్రాయబడియున్నది,[3] అయితే మీరు దానిని
దొంగల గుహగా చేసెడివారనెను. । గుడ్డివారును 14
కుంటివారును దేవాలయములో ఆయనయొద్దకు రాగా
ఆయన వారిని స్వస్థపరచెను. । కాగా ప్రధానయాజ 15
కులును శాస్త్రులును ఆయన చేసిన వింతలను,—దావీదు
కుమారునికి జయము[2] అని దేవాలయములో చిన్న
పిల్లలు కేకలు వేయుటయు చూచి కోపముతో మండి
పడి । — వీరు చెప్పుచున్నది వినుచున్నావా అని 16
ఆయనను అడిగిరి. అందుకు యేసు — వినుచున్నాను;
బాలురయొక్కయు చంటిపిల్లలయొక్కయు నోట
స్తోత్రము సిద్ధింపజేసితివి
అను మాట[4] మీరెన్నడును చదువలేదా అని వారితో
చెప్పి । వారిని విడిచి పట్టణమునుండి బయలుదేరి బేతని 17
యకు వెళ్లి అక్కడ బసచేసెను.

ఉదయమందు పట్టణమునకు మరల వెళ్లుచుండగా 18
ఆయన ఆకలిగొనెను. । అప్పుడు త్రోవప్రక్కను 19
ఒంటిగా ఉన్న యొక అంజూరపుచెట్టును చూచి దాని
యొద్దకు రాగా, దానియందు ఆకులు తప్ప మరే
మియు కనబడలేదు గనుక దాని చూచి—ఇకమీదట
ఎన్నటికిని నీవు కాపు కాయకుందువుగాక అని
చెప్పెను; తక్షణమే ఆ అంజూరపుచెట్టు ఎండిపో
యెను. । శిష్యులది చూచి ఆశ్చర్యపడి—అంజూరపు 20
చెట్టు ఎంత శీఘ్రముగా ఎండిపోయెనని చెప్పుకొనిరి. ।
అందుకు యేసు—మీరు విశ్వాసముగలవారై సందేహ 21
పడకుండినయెడల ఈ అంజూరపుచెట్టుకు జరిగినదాని
చేయుట మాత్రమే కాదు, ఈ కొండను చూచి —
నీవు ఎత్తబడి సముద్రములో పడవేయబడుదువు గాకని
చెప్పినయెడల ఆలాగు జరుగునని నిశ్చయముగా మీతో
చెప్పుచున్నాను. । మరియు మీరు ప్రార్థనచేయు 22
నప్పుడు వేటిని అడుగుదురో అవి (దొరికినవని) నమ్మిన
పక్షమున మీరువాటినన్నిటిని పొందుదురని వారితో
చెప్పెను.

1 జెకర్యా, 9: 9. 2 మూలభాషలో—హోసన్నా. 3 యెషయా, 56: 7. 4 కీర్తన, 8: 2.

23 ఆయన దేవాలయములోనికి వచ్చి బోధించుచుం
డగా ప్రధానయాజకులును ప్రజల పెద్దలును ఆయన
యొద్దకు వచ్చి—ఏ అధికారమువలన నీవు ఈ కార్య
ములు చేయుచున్నావు? ఈ అధికారమెవడు నీకిచ్చె
24 నని అడుగగా । — యేసు — నేనును మిమ్ము నొక
మాట అడుగుదును; అది మీరు నాతో చెప్పినయెడల
నేనును ఏ అధికారమువలన ఈ కార్యములు చేయు
25 చున్నానో అది మీతో చెప్పుదును. । యోహాను
ఇచ్చిన బాప్తిస్మము ఎక్కడనుండి కలిగినది? పరలోకము
నుండి కలిగినదా, మనుష్యులవలన కలిగినదా? అని వారి
నడిగెను. వారు — మనము పరలోకమునుండి అని
చెప్పితిమా, ఆయన — ఆలాగైతే మీరెందుకు అతని
26 నమ్మలేదని మనల నడుగును గదా; । మనుష్యులవలననని
చెప్పితిమా, జనులకు భయపడుచున్నాము; అందరు
యోహానును ప్రవక్త అని యెంచుచున్నారని తమలో
తాము ఆలోచించుకొని—మాకు తెలియదని యేసుకు
27 ఉత్తరమిచ్చిరి । అందుకాయన — ఏ అధికారమువలన
ఈ కార్యములు నేను చేయుచున్నానో అదియు
28 మీతో చెప్పను. । మీకేమి తోచుచున్నది? ఒక మను
ష్యునికి ఇద్దరు కుమారులుండిరి. అతడు మొదటివాని
యొద్దకు వచ్చి — కుమారుడా, నేడు పోయి ద్రాక్ష
29 తోటలో పనిచేయుమని చెప్పగా । వాడు — పోను
అని ఉత్తరమిచ్చెను గాని పిమ్మట మనస్సు మార్చుకొని
30 పోయెను. । అతడు రెండవవాని యొద్దకు వచ్చి ఆ
ప్రకారమే చెప్పగా వాడు — అయ్యా, పోదుననెను
గాని పోలేదు. ఈ యిద్దరిలో ఎవడు తండ్రి యిష్ట
31 ప్రకారము చేసినవాడని వారి నడిగెను. । అందుకు
వారు—మొదటివాడే అనిరి. యేసు—సుంకరులును
వేశ్యలును మీకంటె ముందుగా దేవుని రాజ్యములో
ప్రవేశించుదురని మీతో నిశ్చయముగా చెప్పుచు
32 న్నాను. । యోహాను నీతిమార్గమున మీయొద్దకు
వచ్చెను, మీరతని నమ్మలేదు; అయితే సుంకరులును
వేశ్యలును అతని నమ్మిరి; మీరు అది చూచియు అతని
నమ్మునట్లు పశ్చాత్తాపపడకపోతిరి.

33 మరియొక ఉపమానము వినుడి. ఇంటి యజమాను
డొకడుండెను. అతడు ద్రాక్షతోట నాటించి దాని
చుట్టు కంచెవేయించి అందులో ద్రాక్షలతొట్టి తొలి
పించి గోపురము కట్టించి కాపులకు దాని గుత్తకిచ్చి
34 దేశాంతరము పోయెను. । పండ్లకాలము సమీపించి
నప్పుడు పండ్లలో తన భాగము తీసికొనివచ్చుటకు ఆ
35 కాపులయొద్దకు తన దాసులనంపగా । ఆ కాపులు
అతని దాసులను పట్టుకొని, యొకని కొట్టిరి యొకని
36 చంపిరి మరియొకనిమీద రాళ్లు రువ్విరి. । మరల అతడు
మునుపటికంటె ఎక్కువమంది ఇతర దాసులను పంపగా
6 వీరిని ఆ ప్రకారమే చేసిరి. । తుదకు — నా
కుమారుని సన్మానించెదరనుకొని తన కుమారుని వారి
యొద్దకు పంపెను. । అయినను ఆ కాపులు కుమారుని 38
చూచి—ఇతడు వారసుడు; ఇతని చంపి ఇతని స్వాస్థ్యము
తీసికొందము రండని తమలోతాము చెప్పుకొని । అతని 39
పట్టుకొని ద్రాక్షతోటవెలపట పడవేసి చంపిరి. ।
కాబట్టి ఆ ద్రాక్షతోట యజమానుడు వచ్చినప్పుడు 40
ఆ కాపుల నేమిచేయుననెను. । అందుకు వారు—ఆ 41
దుర్మార్గులను కఠినముగా సంహరించి, వాటివాటి కాల
ములయందు తనకు పండ్లను చెల్లించునట్టి ఇతర కాపు
లకు ఆ ద్రాక్షతోట గుత్తకిచ్చునని ఆయనతో చెప్పిరి.।
మరియు యేసు వారిని చూచి 42

—ఇల్లు కట్టువారు నిషేధించిన రాయి
మూలకు తలరాయి ఆయెను.
ఇది ప్రభువువలననే కలిగెను.
ఇది మన కన్నులకు ఆశ్చర్యముగా ఉన్నది

అను మాట మీరు లేఖనములలో[1] ఎన్నడును చదవ
లేదా?। కాబట్టి దేవుని రాజ్యము మీయొద్దనుండి తొల 43
గింపబడి, దాని ఫలమిచ్చు జనులకియ్యబడునని మీతో
చెప్పుచున్నాను. । మరియు ఈ రాతిమీద పడువాడు 44
తునకలైపోవును గాని అది ఎవనిమీద పడునో వాని
నలిచేయుననెను. । ప్రధానయాజకులును పరిసయ్యు 45
లును ఆయన చెప్పిన ఉపమానములను విని, తమ్మును
గూర్చియే చెప్పెనని గ్రహించి । ఆయనను పట్టు 46
కొన సమయము చూచుచుండిరి గాని జనులందరు
ఆయనను ప్రవక్తయని యెంచిరి గనుక వారికి భయ
పడిరి.

**యేసు** వారికుత్తరమిచ్చుచు తిరిగి ఉపమానరీతిగా **22**
ఇట్లనెను. । పరలోక రాజ్యము, తన కుమారునికి 2
పెండ్లివిందుచేసిన యొక రాజును పోలియున్నది. ।
ఆ పెండ్లివిందుకు పిలువబడినవారిని రప్పించుటకు 3
అతడు తన దాసులను అంపినప్పుడు వారు రానొల్లక
పోయిరి. । కాగా అతడు — ఇదిగో నా విందు సిద్ధ 4
పరచియున్నాను; ఎద్దులును క్రొవ్విన పశువులును
వధింపబడినవి; అంతయు సిద్ధముగా ఉన్నది; పెండ్లి
విందుకు రండని పిలువబడినవారితో చెప్పుడని వేరే
దాసులను పంపెను గాని । వారు లక్ష్యముచేయక, 5
యొకడు తన పొలమునకును మరియొకడు తన వర్తక
మునకును వెళ్లిరి. । తక్కినవారు అతని దాసులను పట్టు 6
కొని అవమానపరచి చంపిరి. । కాబట్టి రాజు కోపపడి 7
తన దండ్లను పంపి ఆ నరహంతకులను సంహరించి
వారి పట్టణము తగలబెట్టించెను. । అప్పుడతడు—పెండ్లి 8
విందు సిద్ధముగా ఉన్నది గాని పిలువబడినవారు
పాత్రులు కారు. । గనుక రాజమార్గములకు పోయి 9
మీకు కనబడువారినందరిని పెండ్లివిందుకు పిలువుడని
తన దాసులతో చెప్పెను. । ఆ దాసులు రాజమార్గ 10

[1] కీర్తన, 118: 22, 23.

**ములకు** పోయి చెడ్డవారినేమి మంచివారినేమి తమకు
కనబడినవారినందరిని పోగు చేసిరి గనుక విందుకు వచ్చిన
వారితో ఆ పెండ్లిశాల నిండెను. । రాజు కూర్చున్న
వారిని చూడ లోపలికి వచ్చి, అక్కడ పెండ్లివస్త్రము
ధరించుకొనని యొకని చూచి । — స్నేహితుడా,
పెండ్లివస్త్రము లేక ఇక్కడికేలాగు వచ్చితివని అడుగగా
వాడు మౌనియై యుండెను. । అంతట రాజు — వీని
కాళ్లు చేతులు కట్టి వెలుపటి చీకటిలోకి త్రోసివేయుడి;
అక్కడ ఏడ్పును పండ్లు కొరుకుటయు ఉండునని
పరిచారకులతో చెప్పెను. । కాగా పిలువబడినవారు
అనేకులు, ఏర్పరచబడినవారు కొందరే అని చెప్పెను.

అప్పుడు పరిసయ్యులు వెళ్లి, మాటలలో ఆయనను
చిక్కుపరచవలెనని ఆలోచన చేయుచు । — బోధ
కుడా, నీవు సత్యవంతుడవై యుండి దేవుని మార్గము
సత్యముగా బోధించుచున్నావనియు, నీవు ఎవనిని
లక్ష్యపెట్టవనియు, మోమాటము లేనివాడవనియు
ఎరుగుదుము. । నీకేమి తోచుచున్నది? కైసరుకు పన్ని
చ్చుట న్యాయమా కాదా! మాతో చెప్పుమని అడుగు
టకు హేరోదీయులతోకూడ తమ శిష్యులను ఆయన
యొద్దకు పంపిరి. । యేసు వారి చెడుతనమెరిగి —
వేషధారులారా, నన్నెందుకు శోధించుచున్నారు? ।
పన్నురూకయొకటి నాకు చూపుడని వారితో చెప్పగా
వారాయనయొద్దకు ఒక దేనారము[1] తెచ్చిరి. । అప్పు
డాయన — ఈ రూపమును పైవ్రాతయు ఎవనివని
వారినడుగగా వారు—కైసరువనిరి. । అందుకాయన—
ఆలాగైతే కైసరువి కైసరుకును దేవునివి దేవునికిని
చెల్లించుడని వారితో చెప్పెను. । వారీమాట విని
ఆశ్చర్యపడి ఆయనను విడిచి వెళ్లిపోయిరి.

పునరుత్థానములేదని చెప్పెడి సద్దూకయ్యులు ఆ
దినమున ఆయనయొద్దకు వచ్చి । —బోధకుడా, ఒకడు
పిల్లలులేక చనిపోయినయెడల అతని సహోదరుడు
అతని భార్యను పెండ్లిచేసికొని తన సహోదరునికి
సంతానము కలుగజేయవలెనని మోషే చెప్పెను;
మంచిది; । మాలో ఏడుగురు సహోదరులుండిరి;
మొదటివాడు పెండ్లిచేసికొని చనిపోయెను; అతనికి
సంతానము లేనందున అతని సహోదరుడు అతని
భార్యను తీసికొనెను. । రెండవవాడును మూడవ
వాడును ఏడవవానివరకు అందరును ఆలాగే జరిగించి
చనిపోయిరి. । అందరివెనుక ఆ స్త్రీయు చనిపోయెను. ।
పునరుత్థానమందు ఈ యేడుగురిలో ఆమె ఎవనికి
భార్యగా ఉండును? ఆమె వీరందరికిని భార్యగా
ఉండెను గదా అని ఆయనను అడిగిరి. । అందుకు
యేసు—మీరు లేఖనములను దేవునిశక్తిని ఎరుగక పొర
బడుచున్నారు. । పునరుత్థానమందు పెండ్లిచేసికొనరు,
పెండ్లికియ్యబడరు; పరలోకమందున్న దూతలవలె[2]
ఉందురు. । మృతుల పునరుత్థానమును గూర్చి—నేను 31
అబ్రాహాము దేవుడను ఇస్సాకు దేవుడను యాకోబు 32
దేవుడనై యున్నానని దేవుడు మీతో చెప్పిన మాట
మీరు చదవలేదా! । ఆయన సజీవులకే దేవుడు గాని 33
మృతులకు దేవుడు కాడని వారితో చెప్పెను. జనులది
విని ఆయన బోధకాశ్చర్యపడిరి.

ఆయన సద్దూకయ్యుల నోరు మూయించెనని పరి 34
సయ్యులు విని కూడివచ్చిరి. । వారిలో ఒక ధర్మ 35
శాస్త్రోపదేశకుడు ఆయనను శోధించుచు । — బోధ 36
కుడా, ధర్మశాస్త్రములో ముఖ్యమైన ఆజ్ఞ ఏదని అడి
గెను. । అందుకాయన — నీ పూర్ణహృదయముతోను 37
నీ పూర్ణాత్మతోను నీ పూర్ణమనస్సుతోను నీ దేవుడైన
ప్రభువును ప్రేమింపవలెననునదియే. । ఇది ముఖ్య 38
మైనదియు మొదటిదియునైన ఆజ్ఞ. । నిన్నువలె నీ 39
పొరుగువాని ప్రేమింపవలెనను రెండవ ఆజ్ఞయు దాని
వంటిదే. । ఈ రెండు ఆజ్ఞలు ధర్మశాస్త్రమంతటికిని ప్రవక్త 40
లకును ఆధారమై యున్నవని అతనితో చెప్పెను.

ఒకప్పుడు పరిసయ్యులు కూడియుండగా యేసు 41
వారిని చూచి । — క్రీస్తునుగూర్చి మీకేమి తోచు 42
చున్నది? ఆయన ఎవని కుమారుడని అడిగెను. వారు
— ఆయన దావీదు కుమారుడని చెప్పిరి. । అందు 43
కాయన—ఆలాగైతే

— నేను నీ శత్రువులను నీ పాదముల క్రింద ఉంచు
వరకు
నీవు నా కుడిపార్శ్వమున కూర్చుండుమని ప్రభువు 44
నా ప్రభువుతో చెప్పెను

అని దావీదు ఆయనను ప్రభువని ఆత్మవలన ఏల చెప్పు
చున్నాడు?[3] । దావీదు ఆయనను ప్రభువని చెప్పిన 45
యెడల ఆయన ఏలాగు అతనికి కుమారుడగునని వారి
నడుగగా । ఎవడును మారుమాట చెప్పలేక పోయెను. 46
మరియు ఆ దినమునుండి ఎవడును ఆయనను ఒక
ప్రశ్నయు అడుగ తెగింపలేదు.

**అ**ప్పుడు యేసు జనసమూహములతోను తన **23**
శిష్యులతోను ఇట్లనెను । — శాస్త్రులును పరిసయ్య 2
లును మోషే పీఠమందు కూర్చుండువారు । గనుక— 3
వారు మీతో చెప్పువాటినన్నిటిని అనుసరించి గైకొ
నుడి, అయినను వారి క్రియలచొప్పున చేయకుడి;
వారు చెప్పుదురే గాని చేయరు. । మోయ శక్యము 4
కాని భారమైన బరువులు కట్టి మనుష్యుల భుజముల
మీద వారు పెట్టుదురేగాని తమ వ్రేలితోనైన
వాటిని కదలింపనొల్లరు. । మనుష్యులకు కనబడు 5
నిమిత్తము తమ క్రియలన్నియు చేయుదురు; తమ
రక్షరేకులు వెడల్పుగాను తమ చెంగులు పెద్దవిగాను
చేయుదురు; । విందులలో అగ్రస్థానములను సమాజ 6
మందిరములలో అగ్రపీఠములను । సంతవీధులలో 7

[1] ఒక దేనారము అర్ధరూపాయి కావచ్చును. [2] అనేక ప్రాచీన ప్రతులలో—దేవుని దూతలవలె, అని పాఠాంతరము. [3] కీర్తన. 110: 1.

నందనములను మనుష్యులచేత బోధకులని పిలువబడు
8 టయు కోరుదురు. । మీరైతే బోధకులని పిలువబడ
వద్దు, ఒక్కడే మీ బోధకుడు మీరందరు సహో
9 దరులు. । మరియు భూమిమీద ఎవనికైనను తండ్రి
అని పేరుపెట్టవద్దు; ఒక్కడే మీ తండ్రి; ఆయన పర
10 లోకమందున్నాడు. । మరియు మీరు గురువులని
11 పిలువబడవద్దు; క్రీస్తు ఒక్కడే మీ గురువు. । మీలో
అందరికంటె గొప్పవాడు మీకు పరిచారకుడై యుండ
12 వలెను. । తన్నుతాను హెచ్చించుకొనువాడు తగ్గింప
బడును; తన్నుతాను తగ్గించుకొనువాడు హెచ్చింప
బడును.

13 అయ్యో, వేషధారులైన శాస్త్రులారా, పరిసయ్యు
లారా, మీరు మనుష్యులయెదుట పరలోకరాజ్య
మును మూయుదురు; మీరందులో ప్రవేశింపరు
ప్రవేశించువారిని ప్రవేశింపనియ్యరు.

15 అయ్యో, వేషధారులైన శాస్త్రులారా, పరిసయ్యు
లారా, ఒకని మీ మతములో కలుపుకొనుటకు మీరు
సముద్రమును భూమిని సంచరింతురు. అతడు కలిసి
నప్పుడు అతని మీకంటె రెండంతలు నరకపాత్రునిగా[1]
చేయుదురు.

16 అయ్యో, అంధులైన మార్గదర్శకులారా, ఒకడు
దేవాలయము తోడని ఒట్టుపెట్టుకొంటే అందులో
ఏమియు లేదుగాని దేవాలయములోని బంగారము
తోడని ఒట్టుపెట్టుకొంటే వాడు దానికి బద్ధుడని
17 మీరు చెప్పుదురు. । అవివేకులారా, అంధులారా,
ఏది గొప్పది? బంగారమా, బంగారమును పరిశుద్ధపరచు
18 దేవాలయమా? । మరియు—బలిపీఠముతోడని యొకడు
ఒట్టుపెట్టుకొంటే అందులో ఏమియు లేదు గాని
దాని పైనుండు అర్పణము తోడని ఒట్టుపెట్టుకొంటే
19 దానికి బద్ధుడని మీరు చెప్పుదురు. । అవివేకులారా,
అంధులారా, ఏది గొప్పది? అర్పణమా, అర్పణమును
20 పరిశుద్ధపరచు బలిపీఠమా? । బలిపీఠముతోడని ఒట్టు
పెట్టుకొనువాడు దాని తోడనియు దాని పైనుండు
వాటన్నిటితోడనియు ఒట్టుపెట్టుకొనుచున్నాడు. ।
21 మరియు దేవాలయము తోడని ఒట్టుపెట్టుకొనువాడు
దాని తోడనియు అందులో నివసించువాని తోడ
22 నియు ఒట్టుపెట్టుకొనుచున్నాడు. । మరియు ఆకా
శము తోడని ఒట్టుపెట్టుకొనువాడు దేవుని సింహాస
నము తోడనియు దానిపైని కూర్చున్నవాని తోడనియు
ఒట్టుపెట్టుకొనుచున్నాడు.

23 అయ్యో, వేషధారులైన శాస్త్రులారా, పరిసయ్యు
లారా, మీరు పుదీనాలోను సోపులోను జీలకర్ర
లోను పదియవవంతు చెల్లించి, ధర్మశాస్త్రములో ప్రధాన
మైన విషయములను, అనగా న్యాయమును కనికర
మును విశ్వాసమును (కనుపరచక) విడిచిపెట్టితిరి;
వాటిని మానక వీటిని చేయవలసియుండెను. । అంధు 24
లైన మార్గదర్శకులారా, దోమలేకుండ వడియగట్టి
ఒంటెను మ్రింగువారు మీరే.

అయ్యో, వేషధారులైన శాస్త్రులారా, పరిసయ్యు 25
లారా, మీరు గిన్నెయు పళ్లెమును వెలపట శుద్ధిచేయు
దురు గాని అవి లోపట దోపుతోను అజితేంద్రి
యత్వముతోను నిండియున్నవి. । గుడ్డిపరిసయ్యుడా, 26
గిన్నెయు పళ్లెమును వెలపట శుద్ధియగునట్టుగా, ముందు
వాటిలోపట శుద్ధిచేయుము.

అయ్యో, వేషధారులైన శాస్త్రులారా, పరిసయ్యు 27
లారా, మీరు సున్నముకొట్టిన సమాధులను పోలి
యున్నారు. అవి వెలుపల శృంగారముగా అగుపడును
గాని లోపల చచ్చినవారి యెముకలతోను సమస్త
మైన కల్మషముతోను నిండియున్నవి. । ఆలాగే మీరు 28
వెలుపల మనుష్యులకు నీతిమంతులుగా నగుపడు
చున్నారు గాని లోపల వేషధారణతోను అక్రమము
తోను నిండియున్నారు.

అయ్యో, వేషధారులైన శాస్త్రులారా, పరిసయ్యు 29
లారా, మీరు ప్రవక్తల సమాధులను కట్టించుచు నీతి
మంతుల గోరీలను శృంగారించుచు । — మనము మన[2] 30
పితరుల దినములలో ఉండినయెడల ప్రవక్తల మరణ
విషయములో[3] వారితో పాలివారమై యుండకపోదు
మని చెప్పుకొందురు. । అందువలననే మీరు ప్రవక్త 31
లను చంపినవారి కుమారులైయున్నారని మీమీద
మీరే సాక్ష్యము చెప్పుకొనుచున్నారు. । మీరును 32
మీ పితరుల పరిమాణము పూర్తిచేయుడి. । సర్పము 33
లారా, సర్పసంతానమా, నరకశిక్షను మీరేలాగు
తప్పించుకొందురు? । అందుచేత నేను మీయొద్దకు 34
ప్రవక్తలను జ్ఞానులను శాస్త్రులను పంపుచున్నాను;
మీరు వారిలో కొందరిని చంపి సిలువ వేయుదురు,
కొందరిని మీ సమాజమందిరములలో కొరడాలతో
కొట్టి పట్టణమునుండి పట్టణమునకు తరుముదురు. ।
నీతిమంతుడైన హేబెలు రక్తము మొదలుకొని బలిపీఠ 35
మునకును గర్భాలయమునకును మధ్య మీరు చంపిన
బరకీయకుమారుడగు జెకర్యా రక్తమువరకు భూమిమీద
చిందింపబడిన నీతిమంతుల రక్తమంతయు మీమీదికి
వచ్చును. । ఇవన్నియు ఈ తరమువారిమీదికి వచ్చు 36
నని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను.

యెరూషలేమా, యెరూషలేమా, ప్రవక్తలను చంపు 37
చును నీయొద్దకు పంపబడినవారిని రాళ్లతో రువ్వు
చును ఉండుదానా, కోడి తన పిల్లలను రెక్కలక్రింది
కేలాగు చేర్చుకొనునో ఆలాగే నేనును నీ పిల్లలను
ఎన్నోమారులు చేర్చుకొనవలెనని యుంటిని గాని
మీరు ఒల్లకపోతిరి. । ఇదిగో మీ యిల్లు మీకు విడువ 38
బడియున్నది. । ఇది మొదలుకొని— ప్రభువు పేరట 39

[1] మూలభాషలో—నరకకుమారునిగా. [2] లేక, మేము మా. [3] మూలభాషలో—రక్తవిషయములో

వచ్చువాడు స్తుతింపబడును గాకని మీరు చెప్పు పర్యం
తము నన్ను చూడరని మీతో చెప్పుచున్నాను.

**4** తరువాత యేసు దేవాలయమునుండి బయలుదేరి
వెళ్లుచుండగా ఆయన శిష్యులు దాని కట్టడములు
ఆయనకు చూపింపవచ్చిరి. । అందుకాయన — మీరు
ఇవన్నియు చూచుచున్నారు గదా; పడద్రోయబడక
రాతిమీద రాయి యొకటియైన ఇక్కడ నిలిచియుండ
దని నిశ్చయముగా మీతో చెప్పుచున్నానని వారితో
అనెను.

ఆయన ఒలీవ కొండమీద కూర్చుండియున్నప్పుడు
శిష్యులాయనయొద్దకు ఏకాంతముగా వచ్చి — ఇవి
ఎప్పుడు జరుగును? నీ ఆగమనమునకును ఈ యుగ
సమాప్తికిని సూచనలేవి? మాతో చెప్పుమనగా । యేసు
వారితో ఇట్లనెను — ఎవడును మిమ్మును మోసపరచ
కుండ చూచుకొనుడి. । అనేకులు నా పేరట వచ్చి
— నేనే క్రీస్తునని చెప్పి పలువురిని మోసపరచెదరు. ।
మరియు మీరు యుద్ధములనుగూర్చియు యుద్ధసమా
చారములనుగూర్చియు వినబోదురు; మీరు కలవర
పడకుండ చూచుకొనుడి. ఇవి జరుగవలసియున్నవి
గాని అంతము వెంటనే రాదు. । జనముమీదికి జన
మును రాజ్యముమీదికి రాజ్యమును లేచును. । అక్క
డక్కడ కరవులును భూకంపములును కలుగును; ఇవ
న్నియు వేదనలకు ప్రారంభము. । అప్పుడు జనులు
మిమ్మును శ్రమల పాలుచేసి చంపెదరు; మీరు నా
నామమునిమిత్తము సకల జనములచేత ద్వేషింపబడు
దురు. । అనేకులు అభ్యంతరపడి యొకనినొకడు
అప్పగించి యొకనినొకడు ద్వేషింతురు. । అనేకులైన
అబద్ధప్రవక్తలు వచ్చి పలువురిని మోసపరచెదరు; ।
అక్రమము విస్తరించుటచేత అనేకుల ప్రేమ చల్లా
రును. । అంతమువరకు సహించినవాడెవడో వాడే
రక్షింపబడును. । మరియు ఈ రాజ్యసువార్త సకల
జనములకు సాక్ష్యార్థమై లోకమందంతటను ప్రకటింప
బడును; అటుతరువాత అంతము వచ్చును.

కాబట్టి ప్రవక్తయైన దానియేలుద్వారా చెప్పబడిన
నాశనకరమైన హేయవస్తువు పరిశుద్ధస్థలమందు నిలు
చుట మీరు చూడగానే — చదువువాడు గ్రహించు
గాక — । యూదయలో ఉండువారు కొండలకు
పారిపోవలెను. । ఇంటిమిద్దెమీద ఉండువాడు తన
యింటిలోనుండి ఏదైనను తీసికొనిపోవుటకు దిగకూ
డదు; । పొలములో ఉండువాడు తన బట్టలు తీసికొని
పోవుటకు ఇంటికి రాకూడదు. । అయ్యో, ఆ దినము
లలో గర్భిణులకును పాలిచ్చువారికిని శ్రమ. । అప్పుడు
మహా శ్రమ కలుగును గనుక మీరు పారిపోవుట
చలికాలమందైనను విశ్రాంతిదినమందైనను సంభవింప
కుండవలెనని ప్రార్థించుడి. । లోకసృష్టిమొదలుకొని
ఇదివరకు అట్టి శ్రమ కలుగలేదు, ఇక ఎప్పుడును
కలుగబోదు. । ఆ దినములు తక్కువ చేయబడక 22
పోయినయెడల ఏ శరీరియు తప్పించుకొనడు. ఏర్ప
రచబడినవారి నిమిత్తము ఆ దినములు తక్కువ చేయ
బడును. । ఆ కాలమందు ఎవడైనను — ఇదిగో క్రీస్తు 23
ఇక్కడ ఉన్నాడు అక్కడ ఉన్నాడు అని చెప్పిన
యెడల నమ్మకుడి. । అబద్ధపు క్రీస్తులును అబద్ధపు 24
ప్రవక్తలును వచ్చి సాధ్యమైతే ఏర్పరచబడినవారిని
సహితము మోసపరచుటకై గొప్ప సూచకక్రియలను
మహత్కార్యములను కనుపరచెదరు. । ఇదిగో ముం 25
దుగా నేను మీతో చెప్పియున్నాను. । కాబట్టి ఎవ 26
రైనను — ఇదిగో అరణ్యములో ఉన్నాడని మీతో
చెప్పినను వెళ్లకుడి — ఇదిగో అంతఃపురములో ఉన్నా
డని చెప్పినను నమ్మకుడి । మెరుపు తూర్పున పుట్టి 27
పడమటివరకు ఏలాగు కనబడునో ఆలాగే మనుష్య
కుమారుని ఆగమనమును ఉండును. । పీనుగ ఎక్కడ 28
నున్నదో అక్కడ గద్దలు పోగవును.

ఆ దినముల శ్రమ ముగిసిన వెంటనే చీకటి 29
సూర్యుని కమ్మును, చంద్రుడు కాంతి ఇయ్యడు, నక్ష
త్రములు ఆకాశమునుండి రాలును, ఆకాశమందలి
శక్తులు కదలింపబడును. । అప్పుడు మనుష్యకుమారుని 30
సూచన ఆకాశమందు కనబడును. అప్పుడు మనుష్య
కుమారుడు ప్రభావముతోను మహా మహిమతోను
ఆకాశ మేఘారూఢుడై వచ్చుట చూచి భూమిమీద
ఉన్న సకల గోత్రములవారు రొమ్ము కొట్టుకొందురు. ।
మరియు ఆయన గొప్ప బూరతో తన దూతలను 31
పంపును. వారు ఆకాశముయొక్క ఈ చివరనుండి
ఆ చివరవరకు నలుదిక్కులనుండి ఆయన ఏర్పరచు
కొనినవారిని పోగుచేతురు.

అంజూరపు చెట్టునుచూచి ఒక ఉపమానము నేర్చు 32
కొనుడి. అంజూరపుకొమ్మ లేతదై చిగిరించునప్పుడు
వసంతకాలము సమీపముగా ఉన్నదని మీకు తెలి
యును. । ఆ ప్రకారమే మీరీ సంగతులన్నియు 33
జరుగుట చూచునప్పుడు అది సమీపముననేద్వారము
దగ్గరనే యున్నదని తెలిసికొనుడి. । ఇవన్నియు జరుగు 34
పర్యంతము ఈ తరము గతింపదని మీతో నిశ్చయ
ముగా చెప్పుచున్నాను. । ఆకాశమును భూమియు 35
గతించును గాని నా మాటలు ఏమాత్రమును గతిం
పవు. । అయితే ఆ దినమునుగూర్చియు ఆ గడియను 36
గూర్చియు తండ్రి మాత్రమే (యెరుగును) గాని యే
మనుష్యుడైనను పరలోకమందలి దూతలైనను కుమారు
డైనను ఎరుగరు. । నోవహు దినములు ఏలాగుండెనో 37
ఆలాగే మనుష్యకుమారుని ఆగమనమును ఉండును. ।
జలప్రళయమునకు ముందటి దినములలో నోవహు 38
ఓడలోనికి వెళ్లిన దినమువరకు వారు తినుచు త్రాగుచు
పెండ్లిచేసికొనుచు పెండ్లికిచ్చుచునుండి । జలప్రళయ 39
మువచ్చి అందరిని కొట్టుకొనిపోవు పర్యంతము ఎరు

గకపోయిరి; ఆలాగుననే మనుష్యకుమారుని ఆగమన
40 మును ఉండును. । ఆ కాలమున ఇద్దరు పొలములో
ఉందురు, ఒకడు తీసికొని పోబడును ఒకడు విడిచి
41 పెట్టబడును. । ఇద్దరు తిరుగలి విసురుచుందురు, ఒకతె
42 తీసికొనిపోబడును ఒకతె విడిచిపెట్టబడును. । కావున
ఏ దినమున మీ ప్రభువు వచ్చునో మీకు తెలియదు
43 గనుక మెళకువగా నుండుడి. । ఏజామున దొంగ
వచ్చునో యని యింటి యజమానునికి తెలిసియుండిన
పక్షమున అతడు మెళకువగా ఉండి తన యింటికి
44 కన్నము వేయనియ్యడని మీరెరుగుదురు. । మీరను
కొనని గడియలో మనుష్యకుమారుడు వచ్చును గను
45 కయే మీరును సిద్ధముగా ఉండుడి. । యజమానుడు
తన యింటివారికి తగినవేళ అన్నముపెట్టుటకు వారి
పైన ఉంచిన నమ్మకమైనవాడును బుద్ధిమంతుడునైన
46 దాసుడెవడు? । యజమానుడు వచ్చినప్పుడు ఎవడీలాగు
చేయుచుండుట కనుగొనునో ఆ దాసుడు ధన్యుడు. ।
47 అతడు తన యావదాస్తిమీద వాని నుంచునని నిశ్చయ
48 ముగా మీతో చెప్పుచున్నాను. । అయితే దుష్టుడైన
యొక దాసుడు—నా యజమానుడు ఆలస్యముచేయు
49 చున్నాడని తన మనస్సులో అనుకొని । తన తోటి
దాసులను కొట్ట మొదలుపెట్టి, త్రాగుబోతులతో
50 కూడ తిని త్రాగుచుండగా । ఆ దాసుడు కనిపెట్టని
దినములోను వాడెనుకొనని గడియలోను వాని యజ
మానుడు వచ్చి వాని నరికించి వేషధారులతోకూడ
51 వాని పాలు నియమించును. । అక్కడ ఏడ్పును పండ్లు
కొరుకుటయు నుండును.

25 పరలోకరాజ్యము, తమ దివిటీలు పట్టుకొని పెండ్లి
కుమారుని ఎదుర్కొనుటకు బయలుదేరిన పదిమంది
2 కన్యకలను పోలియున్నది. । వీరిలో అయిదుగురు బుద్ధి
3 లేనివారు అయిదుగురు బుద్ధిగలవారు. । బుద్ధిలేనివారు
తమ దివిటీలు పట్టుకొని తమతోకూడ నూనె తీసికొని
4 పోలేదు. । బుద్ధిగలవారు తమ దివిటీలతోకూడ సిద్దె
5 లలో నూనె తీసికొనిపోయిరి. । పెండ్లికుమారుడు ఆల
స్యముచేయగా వారందరు కునికి నిద్రించుచుండిరి. ।
6 అర్ధరాత్రివేళ — ఇదిగో పెండ్లికుమారుడు, అతనిని
7 ఎదుర్కొన రండి అను కేక వినబడెను. । అప్పుడు
ఆ కన్యకలందరు లేచి తమ దివిటీలను చక్కపరచిరి
8 గాని । బుద్ధిలేని ఆ కన్యకలు—మా దివిటీలు ఆరిపోవు
చున్నవి గనుక మీ నూనెలో కొంచెము మాకియ్యు
9 డని బుద్ధిగలవారినడిగిరి. । అందుకు బుద్ధిగల కన్యకలు
— మాకును మీకును ఇది చాలదేమో, మీరు అమ్ము
10 వారియొద్దకు పోయి కొనుక్కొనుడని చెప్పిరి. । వారు
కొనబోవుచుండగా పెండ్లికుమారుడు వచ్చెను, అప్పుడు
సిద్ధపడియున్నవారు అతనితోకూడ పెండ్లివిందుకు
11 లోపలికి పోయిరి; । అంతట తలుపు వేయబడెను.

ఆ తరువాత తక్కిన కన్యకలు వచ్చి — అయ్యా
అయ్యా, మాకు తలుపు తీయుమని అడుగగా । అతడు
—మిమ్ము నెరుగనని నిశ్చయముగా మీతో చెప్పుచు
న్నాననెను. । ఆ దినమైనను గడియయైనను మీకు
తెలియదు గనుక మెళకువగా ఉండుడి.

(పరలోకరాజ్యము) ఒక మనుష్యుడు దేశాంతర
మునకు ప్రయాణమై తన దాసులను పిలిచి తన ఆస్తిని
వారి కప్పగించినట్లుండును. । అతడు ఒకనికి అయిదు
తలాంతులను[1] ఒకనికి రెండును ఒకనికి ఒకటియు ఎవని
సామర్థ్యము చొప్పున వానికిచ్చి వెంటనే దేశాంతరము
పోయెను. । అయిదు తలాంతులు తీసికొనినవాడు
వెళ్లి వాటితో వ్యాపారముచేసి మరి అయిదు తలాం
తులు సంపాదించెను. । ఆలాగుననే రెండు తీసికొనిన
వాడు మరి రెండు సంపాదించెను. । అయితే ఒక
తలాంతు తీసికొనినవాడు వెళ్లి భూమి త్రవ్వి తన
యజమానుని సొమ్ము దాచిపెట్టెను. । బహుకాలమైన
తరువాత ఆ దాసుల యజమానుడు వచ్చి వారియొద్ద
లెక్క చూచుకొనెను. । అప్పుడు అయిదు తలాం
తులు తీసికొనినవాడు మరి అయిదు తలాంతులు తెచ్చి
—అయ్యా, నీవు నాకు అయిదు తలాంతులప్పగించి
తివే; అవియుగాక మరి యయిదు తలాంతులు సంపా
దించితినని చెప్పెను. । అతని యజమానుడు — భళా
నమ్మకమైన మంచి దాసుడా, నీవు ఈ కొంచెములో
నమ్మకముగా ఉంటివి, నిన్ను అనేకమైనవాటిమీద
నియమించెదను, నీ యజమానుని సంతోషములో పాలు
పొందుమని[2] అతనితో చెప్పెను. । ఆలాగే రెండు
తలాంతులు తీసికొనినవాడు వచ్చి — అయ్యా, నీవు
నాకు రెండు తలాంతులప్పగించితివే, అవియుగాక మరి
రెండు తలాంతులు సంపాదించితినని చెప్పెను. । అతని
యజమానుడు—భళా నమ్మకమైన మంచి దాసుడా,
నీవు ఈ కొంచెములో నమ్మకముగా ఉంటివి, నిన్ను
అనేకమైనవాటిమీద నియమించెదను, నీ యజమానుని
సంతోషములో పాలు పొందుమని[2] అతనితో చెప్పె
ను. । తరువాత ఒక తలాంతు తీసికొనినవాడును వచ్చి
—అయ్యా, నీవు విత్తనిచోట కోయువాడవును చల్లని
చోట పంట కూర్చుకొనువాడవునైన కఠినుడవని నేనె
రుగుదును । గనుక నేను భయపడి వెళ్లి నీ తలాంతును
భూమిలో దాచిపెట్టితిని; ఇదిగో నీది నీవు తీసికొను
మని చెప్పెను. । అందుకు అతని యజమానుడు వాని
చూచి—సోమరివైన చెడ్డ దాసుడా, నేను విత్తనిచోట
కోయువాడను చల్లనిచోట పంట కూర్చుకొనువాడ
నని నీవు ఎరుగుదువా? । అట్లయితే నీవు నా సొమ్ము
సాహుకారులయొద్ద ఉంచవలసియుండెను; నేను వచ్చి
వడ్డితోకూడ నా సొమ్ము తీసికొందునే అని చెప్పి ।
—ఆ తలాంతును వానియొద్దనుండి తీసివేసి పది తలాం

[1] ఒక తలాంతు ఇంచుమించు 3,600 రూపాయిలు కావచ్చును.

[2] మూలభాషలో—ప్రవేశించుమని.

లు గలవానికియ్యుడి. । కలిగిన ప్రతివానికి ఇయ్య
బును అతనికి సమృద్ధి కలుగును; లేనివానియొద్దనుండి
నికి కలిగినదియు తీసివేయబడును. । మరియు పనికి
లిన ఆ దాసుని వెలపటి చీకటిలోకి త్రోసివేయుడి;
డ ఏడ్పును పండ్లు కొరుకుటయు ఉండుననెను.
తన మహిమతో మనుష్యకుమారుడును ఆయనతో
డ సమస్త దూతలును వచ్చునప్పుడు ఆయన తన
హిమగల సింహాసనముమీద ఆసీనుడై యుండును. ।
ప్పుడు సమస్త జనములు ఆయనయెదుట పోగుచేయ
దురు; గొల్లవాడు మేకలలోనుండి గొఱ్ఱెలను వేరు
చునట్లు ఆయన వారిని వేరుపరచి । తన కుడి
న గొఱ్ఱెలను ఎడమవైపున మేకలను నిలువ
ను. । అప్పుడు రాజు తన కుడివైపున ఉన్నవారిని
చి—నా తండ్రిచేత ఆశీర్వదింపబడినవారలారా,
; లోకము పుట్టినది మొదలుకొని మీకొరకు సిద్ధ
చబడిన రాజ్యమును స్వతంత్రించుకొనుడి. । నేను
లిగొంటిని మీరు నాకు భోజనము పెట్టితిరి; దప్పి
టిని నాకు దాహమిచ్చితిరి; పరదేశినై యుంటిని
చేర్చుకొంటిరి; । దిగంబరినై యుంటిని నాకు
లిచ్చితిరి; రోగినైయుంటిని నన్ను చూడవచ్చితిరి;
సాలలో ఉంటిని నాయొద్దకు వచ్చితిరని చెప్పును. ।
ుకు నీతిమంతులు—ప్రభువా, యెప్పుడు నీవు
లిగొని యుండుట చూచి నీ కాహారమిచ్చితిమి?
దప్పిగొనియుండుట చూచి యెప్పుడు దాహ
చ్చితిమి? । ఎప్పుడు పరదేశివై యుండుట చూచి
చేర్చుకొంటిమి? దిగంబరివై యుండుట చూచి
లిచ్చితిమి? । ఎప్పుడు రోగివై యుండుటయైనను
సాలలో ఉండుటయైనను చూచి నీయొద్దకు వచ్చితి
ఆయనను అడిగెదరు. । అందుకు రాజు—మిక్కిలి
ప్పలైన యీ నా సహోదరులలో ఒకనికి మీరు
తిరి గనుక నాకు చేసితిరని నిశ్చయముగా మీతో
చున్నానని వారితో అనును. । అప్పుడాయన
మవైపున ఉండువారిని చూచి—శపింపబడినవార
, నన్ను విడిచి అపవాదికిని[1] వాని దూతలకును
రచబడిన నిత్యాగ్నిలోకి పోవుడి. । నేను ఆకలి
టిని మీరు నాకు భోజనము పెట్టలేదు; దప్పిగొం
మీరు నాకు దాహమియ్యలేదు; । పరదేశినై
ంటిని మీరు నన్ను చేర్చుకొనలేదు; దిగంబరినై
ంటిని మీరు నాకు బట్టలియ్యలేదు; రోగినై చెర
లో ఉంటిని మీరు నన్ను చూడ రాలేదని
ను । అందుకు వారును—ప్రభువా, మేమెప్పుడు
ఆకలిగొని యుండుటయైనను దప్పిగొని యుం
యైనను పరదేశివై యుండుటయైనను దిగంబరివై
ండుటయైనను రోగివై యుండుటయైనను చెర
లో ఉండుటయైనను చూచి నీకు ఉపచారము
చేయకపోతిమని ఆయనను అడిగెదరు. । అందుకాయన 45
—ఈ మిక్కిలి అల్పులైనవారిలో ఒకనికైనను మీరు
ఈలాగు చేయలేదు గనుక నాకు చేయలేదని నిశ్చయ
ముగా మీతో చెప్పుచున్నానని వారితో అనును. ।
వీరు నిత్యశిక్ష పొందను నీతిమంతులు నిత్యజీవము 46
పొందను పోవుదురు.

యేసు ఈ మాటలన్నియు చెప్పి చాలించిన **26**
తరువాత జరిగినదేమనగా ఆయన తన శిష్యులను
చూచి । —రెండు దినములైన పిమ్మట పస్కాపండుగ 2
వచ్చుననియు, అప్పుడు మనుష్యకుమారుడు సిలువ
వేయబడుటకై అప్పగింపబడుననియు మీకు తెలియు
నని చెప్పెను. । ఆ సమయమున ప్రధానయాజకులును 3
ప్రజల పెద్దలును కయప అను ప్రధానయాజకుని
మందిరములోకి కూడివచ్చి । యేసును మాయోపాయ 4
ముచేత పట్టుకొని చంపవలెనని యేకమై ఆలోచన
చేసిరి. । అయితే ప్రజలలో అల్లరి కలుగకుండునట్లు 5
—పండుగలో వద్దని చెప్పుకొనిరి.

యేసు బేతనియలో కుష్ఠరోగియైన సీమోను ఇంట 6
నున్నప్పుడు ఒక స్త్రీ మిక్కిలి విలువగల అత్తరుబుడ్డి 7
తీసికొని ఆయనయొద్దకు వచ్చి, ఆయన భోజనమునకు
కూర్చుండెగా ఆయన తలమీద దాని పోసెను. ।
శిష్యులు చూచి కోపముతో మండిపడి — ఈ నష్ట 8
మెందుకు? । ఇది గొప్ప వెలకు అమ్మి బీదల కియ్య 9
వచ్చునే అనిరి. । యేసు ఆ సంగతి తెలిసికొని—ఈ 10
స్త్రీ నా విషయమై యొక మంచి కార్యము చేసెను;
ఈమెను మీరేల తొందరపెట్టుచున్నారు? । బీద 11
లెల్లప్పుడు మీతోకూడ ఉన్నారు గాని నేనెల్లప్పుడు
మీతోకూడ ఉండను. । ఈమె యీ అత్తరు నా శరీ 12
రముమీద పోసి నా భూస్థాపన నిమిత్తము ఇది చేసె
ను. । సర్వలోకమందు ఈ సువార్త ఎక్కడ ప్రక 13
టింపబడునో అక్కడ ఈమె చేసినదియు ఈమె
జ్ఞాపకార్థముగా ప్రశంసింపబడునని నిశ్చయముగా
మీతో చెప్పుచున్నానని వారితో అనెను.

అప్పుడు పన్నెండు మందిలో ఇస్కరియోతు 14
యూదా అను నొకడు ప్రధాన యాజకులయొద్దకు
వెళ్లి । —నేనాయనను మీకప్పగించినయెడల నాకేమి 15
ఇత్తురని వారినడిగెను. అందుకు వారు ముప్పది వెండి
నాణెములు వానికి తూచి ఇచ్చిరి. । వాడప్పటినుండి 16
ఆయనను అప్పగించుటకు తగిన సమయము కనిపెట్టు
చుండెను.

పులియని రొట్టెల పండుగలో మొదటి దినమందు 17
శిష్యులు యేసునొద్దకు వచ్చి—పస్కాను భుజించుటకు
మేము నీకొరకు ఎక్కడ సిద్ధపరచ గోరుచున్నావని
అడిగిరి. । అందుకాయన — మీరు పట్టణమందున్న 18
ఫలాని మనుష్యునియొద్దకు వెళ్లి—నా కాలము సమీ

1 అనగా—సాతానుకును.

పమైయున్నది; నా శిష్యులతోకూడ నీ యింట
పస్కాను ఆచరించెదనని బోధకుడు చెప్పుచున్నాడని
19 అతనితో చెప్పుడనెను. । యేసు తమ కాజ్ఞాపించిన
ప్రకారము శిష్యులు చేసి పస్కాను సిద్ధపరచిరి. ।
20 సాయంకాలమైనప్పుడు ఆయన పన్నెండుమంది శిష్యు
21 లతోకూడ భోజనమునకు కూర్చుండెను. । వారు భోజ
నము చేయుచుండగా ఆయన—మీలో ఒకడు నన్ను
అప్పగించునని నిశ్చయముగా మీతో చెప్పుచున్నా
22 ననెను. । అందుకు వారు బహు దుఃఖపడి ప్రతివాడును
23 —ప్రభువా, నేనా? అని ఆయన నడుగగా । ఆయన
— నాతోకూడ పాత్రలో చెయ్యి ముంచినవాడే
24 నన్ను అప్పగించువాడు. । మనుష్యకుమారునిగూర్చి
వ్రాయబడినప్రకారము ఆయన పోవుచున్నాడు గాని
యెవనిచేత మనుష్యకుమారుడు అప్పగింపబడుచున్నా
డో ఆ మనుష్యునికి శ్రమ; ఆ మనుష్యుడు పుట్ట
25 కుంటే వానికి మేలని చెప్పెను. । ఆయనను అప్పగిం
చిన యూదా — బోధకుడా, నేనా? అని అడుగగా
ఆయన—నీవన్నట్టే అనెను.

26 వారు భోజనము చేయుచుండగా యేసు ఒక
రొట్టె పట్టుకొని దాని ఆశీర్వదించి విరిచి తన శిష్యుల
కిచ్చి—మీరు తీసికొని తినుడి; ఇది నా శరీరమని
27 చెప్పెను. । మరియు ఆయన గిన్నె పట్టుకొని కృతజ్ఞ
తాస్తుతులు చెల్లించి వారికిచ్చి—దీనిలోనిది మీరందరు
28 త్రాగుడి. । ఇది నా రక్తము, అనగా పాపక్షమాపణ
నిమిత్తము అనేకులకొరకు చిందింపబడుచున్న నిబంధన[1]
29 రక్తము. । నా తండ్రి రాజ్యములో మీతోకూడ నేను
ఈ ద్రాక్షారసము క్రొత్తదిగా త్రాగుదినమువరకు
ఇకను దాని త్రాగనని మీతో చెప్పుచున్నాననెను. ।
30 అంతట వారు కీర్తన పాడి ఒలీవచెట్ల కొండకు వెళ్లిరి.
31 అప్పుడు యేసు వారిని చూచి—ఈ రాత్రి మీ
రందరు నా విషయమై అభ్యంతరపడెదరు, ఏల
యనగా—

గొర్రెల కాపరిని కొట్టుదును, మందలోని గొర్రెలు
చెదరిపోవును అని వ్రాయబడి యున్నది గదా.[2] ।
32 నేను లేచిన తరువాత మీకంటె ముందుగా గలిలై
33 యకు వెళ్లెదననెను. । అందుకు పేతురు—నీ విషయమై
అందరు అభ్యంతరపడినను నేను ఎప్పుడును అభ్యం
34 తరపడనని ఆయనతో చెప్పగా । యేసు అతని చూచి
—ఈ రాత్రి కోడి కూయకమునుపే నీవు నన్ను ఎరుగ
నని ముమ్మారు చెప్పెదవని నిశ్చయముగా నీతో చెప్పు
35 చున్నాననెను. । పేతు రాయనను చూచి — నేను
నీతోకూడ చావవలసివచ్చినను నిన్ను ఎరుగనని చెప్ప
ననెను; అదేప్రకారము శిష్యులందరు అనిరి.
36 అంతట యేసు వారితోకూడ గెత్సేమనే అనబడిన
చోటికి వచ్చి—నేను అక్కడికి వెళ్లి ప్రార్థనచేసి వచ్చు
వరకు మీరిక్కడ కూర్చుండుడని శిష్యులతో చెప్పి ।
పేతురును జెబెదయి యిద్దరు కుమారులను వెంటపెట్టు 37
కొనిపోయి, దుఃఖపడుటకును చింతాక్రాంతుడగుట
కును మొదలుపెట్టెను. । అప్పుడు యేసు — నా 38
ప్రాణము మరణమగునంతగా బహుదుఃఖము పొందు
చున్నది; మీరు ఇక్కడ నిలిచి నాతోకూడ మెలకు
వగా నుండుడని వారితో చెప్పి । కొంతదూరము వెళ్లి 39
సాగిలపడి — నా తండ్రీ, సాధ్యమైతే ఈ గిన్నె
నాయొద్దనుండి తొలగిపోనిమ్ము; అయినను నా యిష్ట
ప్రకారము కాదు నీ చిత్తప్రకారమే కానిమ్మని ప్రార్థిం
చెను. । ఆయన మరల శిష్యులయొద్దకు వచ్చి వారు 40
నిద్రించుట చూచి—ఒక గడియయైనను నాతోకూడ
మేల్కొని యుండలేరా? । మీరు శోధనలో ప్రవే 41
శించకుండునట్లు మెలకువగా ఉండి ప్రార్థనచేయుడి;
ఆత్మ సిద్ధమేగాని శరీరము బలహీనమని పేతురుతో
చెప్పి । మరల రెండవమారు వెళ్లి— నా తండ్రీ, నేను 42
దీని త్రాగితేనే గాని యిది నాయొద్దనుండి తొలగి
పోవుట అసాధ్యమైతే నీ చిత్తమే సిద్ధించుగాక అని
ప్రార్థించి । తిరిగి వచ్చి వారు మరల నిద్రించుట 43
చూచెను; ఏలయనగా వారి కన్నులు భారముగా ఉం
డెను. । ఆయన వారిని మరల విడిచి వెళ్లి, ఆ మాటనే 44
చెప్పుచు మూడవమారు ప్రార్థనచేసెను. । అప్పు 45
డాయన తన శిష్యులయొద్దకు వచ్చి—ఇకను నిద్రపోయి
అలసట తీర్చుకొనుడి; ఇదిగో సమయము సమీపించి
యున్నది; మనుష్యకుమారుడు పాపులచేతులకు అప్ప
గింపబడుచున్నాడు; । లెండి వెళ్లుదము; ఇదిగో నన్ను 46
అప్పగించువాడు సమీపించి యున్నాడని వారితో
చెప్పెను.

ఆయన ఇంక మాటలాడుచుండగా పన్నెండుమం 47
దిలో ఒకడైన యూదా వచ్చెను. వానితోకూడ బహు
జనసమూహము కత్తులు గుదియలు పట్టుకొని ప్రధాన
యాజకులయొద్దనుండియు ప్రజల పెద్దలయొద్దనుం
డియు వచ్చెను. । ఆయనను అప్పగించువాడు—నేనెవ 48
రిని ముద్దుపెట్టుకొందునో ఆయనే యేసు; ఆయనను
పట్టుకొనుడని వారికి గురుతు చెప్పి । వెంటనే యేసు 49
నొద్దకు వచ్చి—బోధకుడా, నీకు శుభమని చెప్పి ఆయ
నను ముద్దుపెట్టుకొనెను. । యేసు—చెలికాడా, నీవు 50
చేయవచ్చినది చేయుమని అతనితో చెప్పగా వారు
దగ్గరకువచ్చి యేసును బలవంతముగా పట్టుకొనిరి. ।
అంతట యేసుతోకూడ ఉన్నవారిలో ఒకడు చెయ్యి 51
చాచి కత్తి దూసి ప్రధానయాజకుని దాసుని కొట్టి
వాని చెవి తెగనరికెను. । యేసు—నీ కత్తి వరలో తిరిగి 52
పెట్టుము; కత్తి పట్టుకొనువారందరు కత్తిచేతనే నశిం
తురు । ఈ సమయమున నేను నా తండ్రిని వేడు 53
కొనలేననియు, వేడుకొనిన పక్షమున ఆయన పన్నెండు

[1] అనేక ప్రాచీనప్రతులలో—క్రొత్త నిబంధన అని పాఠాంతరము. [2] జెకర్యా, 13: 7.

సైన్య వ్యూహములకంటె[1] ఎక్కువమంది దూతలను
54 నాకు పంపడనియు నీవనుకొనుచున్నావా? । (నేను
వేడుకొనిన పక్షమున)—ఈలాగు జరుగవలెనను లేఖ
55 నము ఏలాగు నెరవేరునని అతనితో చెప్పెను. । ఆ
గడియలోనే యేసు జనసమూహములను చూచి—
బందిపోటు దొంగమీదికి వచ్చినట్టు కత్తులతోను గుది
యలతోను నన్ను పట్టుకొన వచ్చితిరా? నేను అను
దినము దేవాలయములో కూర్చుండి బోధించుచున్న
56 ప్పుడు మీరు నన్ను పట్టుకొనలేదు. । అయితే
ప్రవక్తల లేఖనములు నెరవేరునట్లు ఇదంతయు సంభ
వించెనని చెప్పెను. అప్పుడు శిష్యులందరు ఆయనను
విడిచి పారిపోయిరి.
57 యేసును పట్టుకొనినవారు ప్రధానయాజకుడైన
కయపయొద్దకు ఆయనను తీసికొనిపోగా అక్కడ శాస్త్రు
58 లును పెద్దలును కూడియుండిరి. । పేతురు ప్రధాన
యాజకుని యింటి ముంగిటివరకు ఆయనను దూరము
నుండి వెంబడించి లోపలికి పోయి — దీని అంతమే
మవునో చూడవలెనని బంట్రౌతులతో కూడ కూర్చుం
59 డెను. । ప్రధానయాజకులును మహా సభవారందరును
యేసును చంపవలెనని ఆయనకు విరోధముగా అబద్ధ
60 సాక్ష్యము వెదకుచుండిరి గాని । అబద్ధసాక్షులనేకులు
వచ్చినను సాక్ష్యమేమియు దొరకలేదు. తుదకు ఇద్దరు
61 మనుష్యులు వచ్చి । —వీడు దేవాలయమును పడగొట్టి
మూడు దినములలో దాని కట్టగలనని చెప్పెననిరి. ।
62 ప్రధానయాజకుడు లేచి — నీవు ఉత్తరమేమియు
చెప్పవా? వీరు నీమీద పలుకుచున్న సాక్ష్యమేమని
63 అడుగగా యేసు ఊరకుండెను. । అందుకు ప్రధాన
యాజకుడు ఆయనను చూచి—నీవు దేవుని కుమారుడ
వైన క్రీస్తువైతే ఆ మాట మాతో చెప్పుమని జీవముగల
దేవునితోడని నీకు ఆనబెట్టుచున్నాననెను. అందుకు
64 యేసు—నీవన్నట్టే. । ఇదిమొదలుకొని మనుష్యకుమా
రుడు సర్వశక్తుని కుడిపార్శ్వమున కూర్చుండుటయు,
ఆకాశ మేఘారూఢుడై వచ్చుటయు మీరు చూతు
65 రని చెప్పగా । ప్రధానయాజకుడు తన వస్త్రము చింపు
కొని—వీడు దేవదూషణ చేసెను; మనకిక సాక్షులతో
పని ఏమి? ఇదిగో ఈ దూషణమాట మీరు ఇప్పుడు
66 విన్నారుగదా; । మీకేమి తోచుచున్నదని అడిగెను.
అందుకు వారు — వీడు మరణమునకు పాత్రుడనిరి. ।
67 అప్పుడు వారు ఆయన ముఖము మీద ఉమ్మివేసి ఆయ
68 నను గుద్దిరి; । కొందరు ఆయనను అరచేతులతో కొట్టి
—క్రీస్తూ, నిన్ను కొట్టినవాడెవడు మాతో చెప్పు
మనిరి.
69 పేతురు వెలపటిముంగిట కూర్చుండియుండగా ఒక
చిన్నది అతనియొద్దకు వచ్చి—నీవును గలిలైయుడగు
70 యేసుతో కూడ ఉంటివి గదా అనెను. । అందుకతడు
—నేనుండలేదు; నీవు చెప్పుసంగతి నాకు తెలియదని
అందరియెదుట అనెను । అతడు నడవలోకి వెళ్లిన 71
తరువాత మరియొక చిన్నది అతని చూచి — వీడును
నజరేయుడగు యేసుతోకూడ ఉండెనని అక్కడివారి
తో చెప్పగా । అతడు ఒట్టుపెట్టుకొని—నేనుండలేదు; 72
ఆ మనుష్యుని నేనెరుగనని మరల చెప్పెను. । కొం 73
చెము సేపైన తరువాత అక్కడ నిలిచియున్నవారు
పేతురునొద్దకు వచ్చి—నిజమే నీవును వారిలో ఒక
డవే; నీ పలుకు నిన్నుబట్టి సాక్ష్యమిచ్చుచున్నదని
అతనితో చెప్పిరి. । అందుకు అతడు—ఆ మనుష్యుని 74
నేనెరుగనని చెప్పి శపించుకొనుటకును ఒట్టుపెట్టు
కొనుటకును మొదలుపెట్టెను. వెంటనే కోడి కూసెను।
గనుక — కోడి కూయకమునుపు నీవు నన్నెరుగనని 75
ముమ్మారు చెప్పెదవని యేసు తనతో అనిన మాట
పేతురు జ్ఞాపకము తెచ్చుకొని వెలపలికి పోయి సం
తాపపడి యేడ్చెను.

ఉదయమైనప్పుడు ప్రధానయాజకులును ప్రజల **27**
పెద్దలందరును యేసును చంపింపవలెనని ఆయనకు విరో
ధముగా ఆలోచనచేసి । ఆయనను బంధించి తీసికొని 2
పోయి అధిపతియైన పొంతిపిలాతుకు అప్పగించిరి.
అప్పుడాయనను అప్పగించిన యూదా, ఆయనకు 3
శిక్ష విధింపబడగా చూచి పశ్చాత్తాపపడి, ఆ ముప్పది
వెండి నాణెములు ప్రధానయాజకులయొద్దకును పెద్దల
యొద్దకును మరల తెచ్చి । —నేను నిరపరాధరక్తమును[2] 4
అప్పగించి పాపము చేసితినని చెప్పెను. వారు—అది
మాకేమి? నీవే చూచుకొనుమని చెప్పగా । అతడు ఆ 5
వెండి నాణెములు దేవాలయములో పారవేసి, పోయి
ఉరిపెట్టుకొనెను. । ప్రధానయాజకులు ఆ వెండి 6
నాణెములు తీసికొని — ఇవి రక్తక్రయధనము గనుక
వీటిని కానుకపెట్టెలో వేయతగదని చెప్పుకొనిరి. ।
కాబట్టి వారు ఆలోచనచేసి వాటినిచ్చి పరదేశులను 7
పాతిపెట్టుటకు కుమ్మరివాని పొలము కొనిరి. । అందు 8
వలన నేటివరకు ఆ పొలము రక్తపు పొలమనబడు
చున్నది. । అప్పుడు— 9

విలువ కట్టబడినవాని, అనగా ఇశ్రాయేలీయులలో
కొందరు విలువకట్టినవాని క్రయధనమైన
ముప్పది వెండి నాణెములు తీసికొని । ప్రభువు 10
నాకు నియమించిన ప్రకారము వాటిని కుమ్మర
వాని పొలమున కిచ్చిరి

అని ప్రవక్తయైన యిర్మీయాద్వారా[3] చెప్పబడినమాట
నెరవేరెను.

యేసు అధిపతియెదుట నిలిచెను; అప్పుడు అధి 11
పతి—యూదుల రాజవు నీవేనా? అని ఆయన నడు
గగా యేసు అతని చూచి—నీవన్నట్టే అనెను । ప్రధాన 12
యాజకులును పెద్దలును ఆయనమీద నేరము మోపి

1 వ్యూహమొకటింటికి 6,000 యోధులు. 2 అనేక ప్రాచీన ప్రతులలో—నీతిమంతుని రక్తమును అని పాఠాంతరము. 3 యిర్మీయా, 32: 6–9.

నప్పుడు ఆయన ప్రత్యుత్తరమేమియు ఇయ్యలేదు. ।
13 కాబట్టి పిలాతు — నీమీద వీరెన్ని నేరములు మోపు
చున్నారో నీవు వినలేదా? అని ఆయనను అడిగెను. ।
14 అయితే ఆయన యొక మాటకైనను అతనికి ఉత్తర
మియ్యలేదు గనుక అధిపతి మిక్కిలి ఆశ్చర్యపడెను. ।
15 పండుగలో జనులు కోరుకొనిన యొక ఖయిదీని
వారికి విడుదలచేయుట అధిపతికి వాడుకయై యుం
16 డెను. । ఆ కాలమందు బరబ్బ అను ప్రసిద్ధుడైన యొక
17 ఖయిదీ చెరసాలలో ఉండెను । కాబట్టి జనులు కూడి
18 వచ్చినప్పుడు పిలాతు—నేను మీకెవని విడుదలచేయ
గోరుచున్నారు? బరబ్బనా లేక క్రీస్తనబడిన యేసునా?
అని వారిని అడిగెను. ఏలయనగా వారు అసూయచేత
ఆయనను అప్పగించిరని అతడు ఎరిగియుండెను ।
19 అతడు న్యాయపీఠముమీద కూర్చుండియున్నప్పుడు
అతని భార్య—నీవు ఆ నీతిమంతుని జోలికి పోవద్దు;
ఈ ప్రొద్దు ఆయననుగూర్చి నేను కలలో మిక్కిలి
బాధపడితినని అతనియొద్దకు వర్తమానము పంపెను. ।
20 ప్రధానయాజకులును పెద్దలును బరబ్బను విడిపింప
నడుగుటకును యేసును సంహరించుటకును జనసమూహ
21 ములను ప్రేరేపించిరి. । అధిపతి—నేను ఈ యిద్దరిలో
మీకెవని విడుదలచేయ గోరుచున్నారని వారినడుగగా
22 వారు — బరబ్బనే అనిరి. । అందుకు పిలాతు — ఆలా
గైతే క్రీస్తనబడిన యేసును ఏమిచేతునని వారినడుగగా
23 —సిలువవేయుమని అందరును చెప్పిరి. । అధిపతి—
సరేగాని యితడేమి దుష్కార్యము చేసెనని అడుగగా
వారు–సిలువవేయుమని మరి ఎక్కువగా కేకలువేసిరి. ।
24 పిలాతు అల్లరి ఎక్కువగుచున్నదే గాని తనవలన
ప్రయోజనమేమియు కాలేదని గ్రహించి, నీళ్లు తీసి
కొని జనసమూహము ఎదుట చేతులు కడుగుకొని—
ఈ నీతిమంతుని రక్తమునుగూర్చి నేను నిరపరాధిని,
25 మీరే చూచుకొనుడని చెప్పెను. । అందుకు ప్రజలం
దరు — వాని రక్తము మామీదను మా పిల్లలమీదను
26 ఉండుగాకనిరి. । అప్పుడతడు వారు కోరినట్టు బర
బ్బను వారికి విడుదల చేసి యేసును కొరడాలతో
కొట్టించి సిలువవేయ నప్పగించెను.
27 అప్పుడు అధిపతియొక్క రాణువవారు యేసును
అధికారమందిరములోకి తీసికొనిపోయి, ఆయనయొద్ద
28 తమ స్తోమమంతయు సమకూర్చిరి. । వారు ఆయన
వస్త్రములు తీసివేసి, ఆయనకు ఎర్రని అంగీ తొడి
29 గించి । ముండ్లకిరీటమును అల్లి ఆయన తలకు పెట్టి,
ఒక రెల్లు ఆయన కుడిచేతను ఉంచి, ఆయనయెదుట
మోకాళ్లూని–యూదుల రాజా, నీకు శుభమని ఆయ
30 నను అపహసించి । ఆయనమీద ఉమ్మివేసి, ఆ రెల్లును
31 తీసికొని దానితో ఆయనను తలమీద కొట్టిరి. । ఆయ
నను అపహసించిన తరువాత ఆయనమీదనున్న ఆ

అంగీని తీసివేసి ఆయన వస్త్రము లాయనకు తొడిగించి
సిలువవేయుటకు ఆయనను తీసికొనిపోయిరి.
వారు వెళ్లుచుండగా కురేనీయుడైన సీమోనను
ఒకడు కనబడగా ఆయన సిలువమోయుటకు అతని
బలవంతము చేసిరి. । వారు కపాలస్థలమను అర్థమిచ్చు
గొల్గొతా అనబడిన చోటికి వచ్చి । చేదు కలిపిన
ద్రాక్షారసము ఆయనకు త్రాగనిచ్చిరి గాని ఆయన
దాని రుచి చూచి త్రాగనొల్లకపోయెను. । వారు
ఆయనను సిలువవేసిన పిమ్మట చీట్లువేసి ఆయన వస్త్రములు
పంచుకొనిరి. । అంతట వారక్కడ కూర్చుండి ఆయ
నకు కావలియుండిరి. । — ఇతడు యూదులరాజైన
యేసు అని ఆయనమీద మోపబడిన నేరము వ్రాసి
ఆయన తలకు పైగా ఉంచిరి. । మరియు కుడివైపున
ఒకడును ఎడమవైపున ఒకడును ఇద్దరు బందిపోటు
దొంగలు ఆయనతోకూడ సిలువవేయబడిరి. । ఆ మార్గ
మున వెళ్లుచుండినవారు తలలూచుచు । —దేవాలయ
మును పడగొట్టి మూడు దినములలో కట్టువాడా, నిన్ను
నీవే రక్షించుకొనుము; నీవు దేవుని కుమారుడవైతే
సిలువమీదనుండి దిగుమని చెప్పుచు ఆయనను దూషిం
చిరి. । ఆలాగే శాస్త్రులును పెద్దలును ప్రధానయాజ
కులును కూడ ఆయనను అపహసించుచు । — ఇతరు
లను రక్షించెను; తన్నుతానే రక్షించుకొనలేడు; ఇశ్రా
యేలు రాజు గదా; యిప్పుడు సిలువమీదనుండి దిగిన
యెడల వాని నమ్ముదుము. । వాడు దేవునియందు
విశ్వాసముంచెను, నేను దేవుని కుమారుడనని చెప్పెను
గనుక ఆయన కిష్టుడైతే ఆయన ఇప్పుడు వాని తప్పించు
నని చెప్పిరి. । ఆయనతోకూడ సిలువవేయబడిన బంది
పోటు దొంగలును ఆలాగే ఆయనను నిందించిరి.
మధ్యాహ్నము మొదలుకొని మూడు గంటలవరకు
ఆ దేశమంతటను చీకటికమ్మెను. । ఇంచుమించు మూడు
గంటలప్పుడు యేసు—ఏలీ ఏలీ లామా సబక్తానీ అని
బిగ్గరగా కేకవేసెను. ఆ మాటకు నా దేవా, నా దేవా,
నన్నెందుకు చెయ్యి విడిచితివని అర్థము. । అక్కడ
నిలిచియున్నవారిలో కొందరామాట విని–ఇతడు ఏలీ
యాను పిలుచుచున్నాడనిరి. । వెంటనే వారిలో ఒకడు
పరుగెత్తికొని పోయి స్పంజీ తీసికొని చిరకాలో
ముంచి రెల్లున తగిలించి ఆయనకు త్రాగనిచ్చెను; ।
తక్కినవారు—ఊరకుండుడి, ఏలీయా అతని రక్షింప
వచ్చునేమో చూతమనిరి.[1] । యేసు మరల బిగ్గరగ
కేకవేసి ప్రాణము విడిచెను. । అప్పుడు దేవాలయపు
తెర పైనుండి క్రిందివరకు రెండుగా చినిగెను; భూమి
వణకెను; బండలు బద్దలాయెను; । సమాధులు తెరవ
బడెను; నిద్రించిన అనేకమంది పరిశుద్ధుల శరీరములు
లేచెను. । వారు సమాధులలోనుండి బయటికి వచ్చి
ఆయన లేచినతరువాత పరిశుద్ధపట్టణములో ప్రవేశించి

[1] అనేక ప్రాచీనప్రతులలో–మరియొకడు ఈటె యెత్తికొని ఆయన ప్రక్కను పొడిచెను, వెంటనే రక్తమును నీళ్లును కారెను అని కూర్చబడియున్నది

54 అనేకులకు అగుపడిరి. । శతాధిపతియు అతనితోకూడ
యేసుకు కావలియున్నవారును, భూకంపమును జరిగిన
కార్యములన్నియు చూచి మిక్కిలి భయపడి—నిజ
ముగా ఈయన దేవుని కుమారుడని చెప్పుకొనిరి. ।
55 యేసుకు ఉపచారముచేయుచు గలిలైయనుండి ఆయ
నను వెంబడించిన అనేక స్త్రీలు అక్కడ దూరమునుండి
56 చూచుచుండిరి. । వారిలో మగ్దలేనే మరియయు
యాకోబు యోసే అనువారి తల్లియైన మరియయు
జెబెదయి కుమారుల తల్లియు ఉండిరి.
57 సాయంకాలమైనప్పుడు యేసుకు శిష్యుడుగానున్న
అరిమతయియ యోసేపు అను ఒక ధనవంతుడు వచ్చి ।
58 పిలాతు నొద్దకు వెళ్లి యేసు దేహము (తనకిమ్మని)
అడుగగా, పిలాతు దానిని అతని కప్పగింప నాజ్ఞాపిం
59 చెను. । యోసేపు ఆ దేహమును తీసికొని శుభ్రమైన
60 నారబట్టతో చుట్టి । తాను రాతిలో తొలిపించు
కొనిన క్రొత్త సమాధిలో దానిని ఉంచి, సమాధి
ద్వారమునకు పెద్దరాయి పొర్లించి వెళ్లిపోయెను. ।
61 మగ్దలేనే మరియయు వేరొక మరియయు అక్కడనే
సమాధికి ఎదురుగా కూర్చుండియుండిరి.
62 మరునాడు, అనగా సిద్ధపరచు దినమునకు మరుసటి
దినమున ప్రధానయాజకులును పరిసయ్యులును పిలా
63 తునొద్దకు కూడి వచ్చి । — అయ్యా, ఆ వంచకుడు
సజీవుడై యుండినప్పుడు—మూడు దినములైన తరు
వాత నేను లేచెదనని చెప్పినది మాకు జ్ఞాపకమున్నది. ।
64 కాబట్టి మూడవ దినపర్యంతము సమాధిని భద్రము
చేయ నాజ్ఞాపించుము; వాని శిష్యులు వచ్చి వాని
ఎత్తికొనిపోయి — ఆయన మృతులలోనుండి లేచెనని
ప్రజలతో చెప్పుదురేమో; అప్పుడు మొదటి వంచన
కంటె కడపటిది మరి చెడ్డదై యుండునని చెప్పిరి. ।
65 అందుకు పిలాతు—ఇదిగో కావలి; మీరు వెళ్లి మీ
చేతనైనంతమట్టుకు సమాధిని భద్రముచేయుడని
66 వారితో చెప్పెను. । వారు వెళ్లి కావలివారిని కూడ
ఉంచుకొని రాతికి ముద్రవేసి సమాధిని భద్రము
చేసిరి.

**28** విశ్రాంతిదినము గడచిపోయిన తరువాత ఆది
వారమున తెల్లవారుచుండగా మగ్దలేనే మరియయు
2 వేరొక మరియయు సమాధిని చూడవచ్చిరి. । ప్రభువు
దూత పరలోకమునుండి దిగి వచ్చి రాయి పొర్లించి
దానిమీద కూర్చుండెను; అప్పుడు మహా భూకంపము
3 కలిగెను. । ఆ దూత స్వరూపము మెరుపువలె నుం
డెను, అతని వస్త్రము హిమమంత తెల్లగా ఉండెను. ।
4 అతనికి భయపడుటవలన కావలివారు వణకి చచ్చిన
వారివలె నుండిరి. । దూత ఆ స్త్రీలను చూచి—మీరు 5
భయపడకుడి, సిలువవేయబడిన యేసును మీరు వెదకు
చున్నారని నాకు తెలియును; । ఆయన ఇక్కడ లేడు; 6
తాను చెప్పినట్టే ఆయన లేచియున్నాడు; రండి
ప్రభువు పండుకొనిన స్థలము చూచి । త్వరగా వెళ్లి, 7
ఆయన మృతులలోనుండి లేచియున్నాడని ఆయన
శిష్యులకు తెలియజేయుడి; ఇదిగో ఆయన గలిలైయ
లోకి మీకు ముందుగా వెళ్లుచున్నాడు, అక్కడ
మీరు ఆయనను చూతురు; ఇదిగో మీతో చెప్పితి
ననెను. । వారు భయముతోను మహా ఆనందము 8
తోను సమాధియొద్దనుండి త్వరగా వెళ్లి ఆయన శిష్యు
లకు ఆ వర్తమానము తెలుప పరుగెత్తుచుండగా । యేసు 9
వారిని ఎదుర్కొని—మీకు శుభమని చెప్పెను. వారు
ఆయనయొద్దకు వచ్చి ఆయన పాదములు పట్టి ఆయ
నకు మ్రొక్కగా । యేసు — భయపడకుడి; మీరు 10
వెళ్లి, నా సహోదరులు గలిలైయకు వెళ్లవలెననియు
వారక్కడ నన్ను చూతురనియు వారికి తెలుపుడనెను.
వారు వెళ్లుచుండగా కావలివారిలో కొందరు 11
పట్టణములోకి వచ్చి జరిగిన సంగతులన్నియు ప్రధాన
యాజకులతో చెప్పిరి. । కాబట్టి వారు పెద్దలతో 12
కూడి వచ్చి ఆలోచనచేసి ఆ రాణువవారికి చాల
ద్రవ్యమిచ్చి । — మేము నిద్రపోవుచుండగా అతని 13
శిష్యులు రాత్రివేళ వచ్చి అతనిని ఎత్తికొనిపోయి
రని మీరు చెప్పుడి; । ఇది అధిపతి చెవినిబడినయెడల 14
మేము సమాధానపరచి మీకేమియు భయముతగల
కుండ చేతుమని చెప్పిరి. । అప్పుడు వారు ఆ ద్రవ్యము 15
తీసికొని తమకు బోధింపబడినప్రకారము చేసిరి. ఈ
మాట యూదులలో వ్యాపించి నేటివరకు ప్రసిద్ధమై
యున్నది.
పదకొండుమంది శిష్యులు యేసు తమకు నిర్ణయిం 16
చిన గలిలైయలోని కొండకు వెళ్లిరి. । వారు ఆయనను 17
చూచి ఆయనకు మ్రొక్కిరిగాని కొందరు సందేహిం
చిరి. । అయితే యేసు వారియొద్దకు వచ్చి—పరలోక 18
మందును భూమిమీదను నాకు సర్వాధికారము ఇయ్య
బడియున్నది. । కాబట్టి మీరు వెళ్లి సమస్త జనులను 19
శిష్యులగా చేయుడి; తండ్రియొక్కయు కుమారుని
యొక్కయు పరిశుద్ధాత్మయొక్కయు నామములోకి
వారికి బాప్తిస్మమిచ్చుచు । నేను మీకు ఏయే సంగతు 20
లను ఆజ్ఞాపించితినో వాటన్నిటిని గైకొనవలెనని వారికి
బోధించుడి. ఇదిగో నేను యుగసమాప్తి పర్యంతము
సదాకాలము మీతోకూడ ఉన్నానని వారితో
చెప్పెను.

# మార్కు సువార్త

1 దేవుని కుమారుడైన యేసుక్రీస్తు[1] సువార్త ప్రారం
భము.
2 —ఇదిగో నా దూతను నీకు ముందుగా పంపు
చున్నాను; అతడు నీ మార్గము సిద్ధపరచును. ।
3 ప్రభువు మార్గము సిద్ధపరచుడి, ఆయన
త్రోవలు సరాళము చేయుడని అరణ్యములో
కేకవేయుచున్న ఒకని శబ్దము
అని ప్రవక్తయైన యెషయాచేత వ్రాయబడినట్టు[2] ।
4 బాప్తిస్మమిచ్చు యోహాను అరణ్యములో ఉండి పాప
క్షమాపణనిమిత్తము మారుమనస్సు విషయమైన బాప్తి
5 స్మము ప్రకటించుచు వచ్చెను. । అంతట యూదైయ
దేశస్థులందరును యెరూషలేమువారందరును బయలు
దేరి అతనియొద్దకు వచ్చి తమ పాపములను ఒప్పు
కొనుచు, యొర్దాను నదిలో అతనిచేత బాప్తిస్మము
6 పొందుచుండిరి. । యోహాను ఒంటె రోమముల వస్త్ర
మును మొలచుట్టు తోలుదట్టియు ధరించుకొని, మిడత
7 లను అడవి తేనెను భక్షించువాడు. । మరియు అతడు
—నాకంటె శక్తిమంతుడొకడు నావెనుక వచ్చుచు
న్నాడు; నేను వంగి ఆయన చెప్పులవారును విప్ప
8 పాత్రుడను కాను; । నేను నీళ్లలో[3] మీకు బాప్తిస్మ
మిచ్చితిని గాని ఆయన పరిశుద్ధాత్మలో[4] మీకు బాప్తిస్మ
మిచ్చునని చెప్పి ప్రకటించుచుండెను.
9 ఆ దినములలో యేసు గలిలైయలోని నజరేతు
నుండి వచ్చి యొర్దానులో యోహానుచేత బాప్తిస్మము
10 పొందెను. । వెంటనే ఆయన నీళ్లలోనుండి ఒడ్డునకు
వచ్చుచుండగా ఆకాశము తెరవబడుటయు పరిశుద్ధాత్మ
పావురమువలె తనమీదికి దిగివచ్చుటయు చూచెను. ।
11 మరియు — నీవు నా ప్రియకుమారుడవు, నీయందు
నేనానందించుచున్నానని యొక శబ్దము ఆకాశము
నుండి వచ్చెను.
12 వెంటనే పరిశుద్ధాత్మ ఆయనను అరణ్యములోకి
13 వెళ్లునట్లు ప్రేరేపించెను. । ఆయన సాతానుచేత శోధిం
పబడుచు అరణ్యములో నలుబది దినములు అడవి
మృగములతోకూడ నుండెను; మరియు దేవదూతలు
ఆయనకు పరిచర్య చేయుచుండిరి.
14 యోహాను చెరసాలలో వేయబడిన తరువాత
15 యేసు । — కాలము సంపూర్ణమై యున్నది, దేవుని
రాజ్యము సమీపించి యున్నది; మారుమనస్సు పొంది
సువార్త నమ్ముడని చెప్పుచు దేవుని సువార్త ప్రకటిం
చుచు గలిలైయకు వచ్చెను.

ఆయన గలిలైయ సముద్రతీరమున వెళ్లుచుండగా 16
సీమోనును సీమోను సహోదరుడగు అంద్రెయయు
సముద్రములో వలవేయుట చూచెను; వీరు
వారు జాలరులు. । యేసు—నా వెంబడి రండి, నేను 17
మిమ్మును మనుష్యులను పట్టుజాలరులనుగా చేసెదనని
వారితో చెప్పెను । వెంటనే వారు తమ వలలు విడిచి 18
ఆయనను వెంబడించిరి. । ఆయన ఇంక కొంతదూరము 19
వెళ్లి జెబెదై కుమారుడగు యాకోబును అతని సహో
దరుడగు యోహానును చూచెను; వారు దోనెలో
ఉండి తమ వలలు బాగుచేసికొనుచుండిరి. । వెంటనే 20
ఆయన వారిని పిలువగా వారు తమ తండ్రియైన జెబె
దైని జీతగాండ్లయొద్ద దోనెలో విడిచిపెట్టి ఆయనను
వెంబడించిరి.

అంతట వారు కపెర్నహూములోకి వెళ్లిరి. 21
వెంటనే ఆయన విశ్రాంతిదినమున సమాజమందిరము
లోకి పోయి బోధించెను. । ఆయన శాస్త్రులవలె కాక 22
అధికారము గలవానివలె వారికి బోధించెను గనుక
వారు ఆయన బోధకు ఆశ్చర్యపడిరి. । ఆ సమయమున 23
వారి సమాజమందిరములో అపవిత్రాత్మపట్టిన మను
ష్యుడొకడుండెను. । వాడు — వద్దు నజరేయుడవగు 24
యేసూ, నీతో మాకేమి? మమ్ము నశింపజేయుటకు
వచ్చితివా? నీవెవడవో నాకు తెలియును; నీవు దేవుని
పరిశుద్ధుడవు అని కేకలు వేసెను. । అందుకు యేసు 25
—ఊరకొమ్ము, వాని విడిచిపొమ్మని దాని గద్దింపగా 26
ఆ అపవిత్రాత్మ వాని విలవిలలాడించి పెద్ద కేకవేసి
వాని విడిచిపోయెను. । అందరును విస్మయమొంది— 27
ఇదేమిటో? యిది క్రొత్త బోధగా ఉన్నదే; యీయన
అధికారముతో అపవిత్రాత్మలకును ఆజ్ఞాపింపగా అవి
ఆయనకు లోబడుచున్నవని యొకనితో ఒకడు చెప్పు
కొనిరి. । వెంటనే ఆయననుగూర్చిన సమాచారము 28
త్వరలో గలిలైయ ప్రాంతములందంతట వ్యాపించెను.

అటుతరువాత వారు సమాజమందిరములోనుండి 29
వెళ్లి యాకోబుతోను యోహానుతోను సీమోను అం
ద్రెయ అనువారి యింట ప్రవేశించిరి. । సీమోను 30
అత్త జ్వరముతో పడియుండగా వెంటనే వారామెను
గూర్చి ఆయనతో చెప్పిరి. । ఆయన ఆమెదగ్గరకు 31
వచ్చి చెయ్యిపట్టి ఆమెను లేవనెత్తెను; అంతట జ్వరము
ఆమెను వదిలెను గనుక ఆమె వారికి ఉపచారము
చేయసాగెను.

సాయంకాలము ప్రొద్దు గ్రుంకినప్పుడు జనులు 32

1 క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము. 2 యెషయా, 40: 3. 3 లేక, నీళ్లతో. 4 లేక, పరిశుద్ధాత్మతో.

సకల రోగులను దయ్యములు పట్టినవారిని ఆయన
యొద్దకు తీసికొని వచ్చిరి; । పట్టణమంతయు ఇంటి
వాకిట కూడియుండెను. । ఆయన నానావిధ రోగ
ములచేత పీడింపబడిన అనేకులను స్వస్థపరచి అనేక
మైన దయ్యములను వెళ్లగొట్టెను. అవి తన్ను ఎరిగి
యుండినందున ఆయన ఆ దయ్యములను మాటలాడ
నియ్యలేదు.

ఇంక చాలరాత్రియుండగా ఆయన పెందలకడనే
లేచి బయలుదేరి అరణ్యప్రదేశమునకు వెళ్లి అక్కడ
ప్రార్థనచేయుచుండెను. । సీమోనును అతనితోకూడ
నున్నవారును ఆయనకొరకు వెదకుచు వెళ్లి । ఆయనను కను
గొని—అందరు నిన్ను వెదకుచున్నారని ఆయనతో
చెప్పగా । ఆయన—నేను ఇతరమైన సమీపగ్రామము
లలోను ప్రకటించుటకు వెళ్లుదము రండి; యిందు
నిమిత్తమే గదా నేను బయలుదేరి వచ్చితినని వారితో
చెప్పెను. । ఆయన గలిలయయందంతట వారి సమాజ
మందిరములలో ప్రకటించుచు దయ్యములను వెళ్ల
గొట్టుచునుండెను.

ఒక కుష్ఠరోగి ఆయనయొద్దకు వచ్చి ఆయనయెదుట
మోకాళ్లూని—నీకిష్టమైతే నన్ను శుద్ధునిగాచేయగలవని
ఆయనతో చెప్పి ఆయనను వేడుకొనగా । ఆయన
కనికరపడి చెయ్యి చాపి వాని ముట్టి—నాకిష్టమే; నీవు
శుద్ధుడవు కమ్మని వానితో చెప్పెను. । వెంటనే కుష్ఠ
రోగము వాని విడిచెను గనుక వాడు శుద్ధుడాయెను. ।
అప్పుడాయన—ఎవనితోను ఏమియు చెప్పకుసుమీ; ।
నీవు వెళ్లి వారికి సాక్ష్యార్థమై నీ దేహమును యాజ
కునికి కనుపరచుకొని, నీవు శుద్ధుడవైనందుకు మోషే
నియమించిన కానుకలను సమర్పించుమని వానికి ఖండి
తముగా ఆజ్ఞాపించి వెంటనే వాని పంపివేసెను. ।
అయితే వాడు వెళ్లి అందునుగూర్చి విస్తారముగా
ప్రకటించుటకును, ఆ సంగతి ప్రచురము చేయుట
కును ఆరంభించెను గనుక ఆయన ఇకను పట్టణములో
బహిరంగముగా ప్రవేశింపలేక వెలపట అరణ్యప్రదేశ
ములలో నుండెను; నలుదిక్కులనుండి జనులు ఆయన
యొద్దకు వచ్చుచుండిరి.

2 కొన్నిదినములైన పిమ్మట ఆయన మరల కపెర్న
2 హూములోకి వచ్చెను. । ఆయన యింట ఉన్నాడని
వినవచ్చినప్పుడు అనేకులు కూడివచ్చిరి గనుక వాకిట
నైనను వారికి స్థలము లేకపోయెను. ఆయన వారికి
3 వాక్యము బోధించుచుండగా । కొందరు పక్షవాయువు
గల ఒక మనుష్యుని నలుగురిచేత మోయించుకొని
4 ఆయనయొద్దకు తీసికొని వచ్చిరి. । చాలమంది కూడి
యున్నందున వారాయనయొద్దకు చేరలేక ఆయన
యున్నచోటికి పైగా ఇంటికప్పు విప్పి, సందుచేసి
5 పక్షవాయువుగలవానిని పరుపుతోనే దింపిరి. । యేసు
వారి విశ్వాసము చూచి—కుమారుడా, నీ పాపములు
క్షమింపబడియున్నవని పక్షవాయువుగలవానితో
చెప్పెను. । శాస్త్రులలో కొందరు అక్కడ కూర్చుండి 6
యుండిరి. । వారు—ఇతడిట్లెందుకు చెప్పుచున్నాడు? 7
దేవదూషణ చేయుచున్నాడు గదా; దేవుడొక్కడే
తప్ప పాపములు క్షమింపగలవాడెవడని తమ హృదయ
ములలో ఆలోచించుకొనిరి. । వారు తమలోతాము 8
ఈలాగున ఆలోచించుకొనుట యేసు వెంటనే తన
ఆత్మలో తెలిసికొని—మీరీలాటి సంగతులు మీ హృద
యములలో ఎందుకు ఆలోచించుకొనుచున్నారు? ।
ఈ పక్షవాయువుగలవానితో—నీ పాపములు క్షమింప 9
బడియున్నవని చెప్పుట సులభమా? నీవు లేచి నీ పరు
పెత్తికొని నడువుమని చెప్పుట సులభమా? । అయితే 10
పాపములు క్షమించుటకు భూమిమీద మనుష్యకుమా
రునికి అధికారము కలదని మీరు తెలిసికొనవలెనని
వారితో చెప్పి । పక్షవాయువుగలవానిని చూచి— 11
నీవు లేచి నీ పరుపెత్తికొని యింటికి పొమ్మని నీతో
చెప్పుచున్నాననెను. । తత్క్షణమే వాడు లేచి పరుపెత్తి 12
కొని వారందరియెదుట నడిచిపోయెను గనుక వారం
దరు విభ్రాంతినొంది — మనమీలాటి కార్యములను
ఎన్నడును చూడలేదని చెప్పుకొనుచు దేవుని మహిమ
పరచిరి.

ఆయన సముద్రతీరమున మరల నడచిపోవుచుం 13
డెను. జనులందరును ఆయనయొద్దకు రాగా ఆయన
వారికి బోధించెను. । ఆయన మార్గమున వెళ్లుచు, 14
సుంకపు మెట్టునొద్ద కూర్చున్న అల్ఫయి కుమారుడగు
లేవిని చూచి — నన్ను వెంబడించుమని అతనితో
చెప్పగా అతడు లేచి ఆయనను వెంబడించెను. । అతని 15
యింట ఆయన భోజనమునకు కూర్చుండియుండగా,
సుంకరులును పాపులును అనేకులు యేసుతోను
ఆయన శిష్యులతోను కూర్చుండియుండిరి. ఇట్టివార
నేకులుండిరి; వారాయనను వెంబడించువారైరి. । పరి 16
సయ్యులలోనున్న శాస్త్రులు ఆయన సుంకరులతోను
పాపులతోను భుజించుట చూచి—ఆయన సుంకరుల
తోను పాపులతోను కలిసి భోజనము చేయుచున్నాడే
మని ఆయన శిష్యుల నడుగగా । యేసు ఆ మాట విని 17
—రోగులకేగాని ఆరోగ్యముగలవారికి వైద్యుడక్కర
లేదు; నేను పాపులనే పిలువవచ్చితిని గాని నీతిమం
తులను పిలువరాలేదని వారితో చెప్పెను.

యోహాను శిష్యులును పరిసయ్యులును ఉపవా 18
సము చేయుట కద్దు. కాబట్టి వారు వచ్చి—యోహాను
శిష్యులును పరిసయ్యుల శిష్యులును ఉపవాసము
చేయుదురు గాని నీ శిష్యులు ఉపవాసము చేయరు;
దీనికి హేతువేమని ఆయన నడుగగా । యేసు — 19
పెండ్లికుమారుడు తమతోకూడ ఉన్నకాలమున పెండ్లి
ఇంటివారు ఉపవాసము చేయదగునా? పెండ్లికుమా
రుడు తమతోకూడ ఉన్నంతకాలము ఉపవాసము

20 చేయవగదు గాని । పెండ్లికుమారుడు వారియొద్దనుండి
కొనిపోబడు దినములు వచ్చును. ఆ దినములలోనే
21 వారుపవాసము చేతురు. । ఎవడును పాతబట్టకు క్రొత్త
గుడ్డ మాసిక వేయడు; వేసినయెడల ఆ క్రొత్త మాసిక
పాత బట్టను వెలితిపరచును, చినుగు మరి ఎక్కువగును.।
22 ఎవడును పాత తిత్తులలో క్రొత్త ద్రాక్షారసము
పోయడు; పోసినయెడల ద్రాక్షారసము ఆ తిత్తులను
పిగుల్చును, రసమును తిత్తులును చెడును; అయితే
క్రొత్త ద్రాక్షారసము క్రొత్త తిత్తులలో పోయవలెనని
చెప్పెను.
23 మరియు ఆయన విశ్రాంతిదినమున పంటచేలలో
బడి వెళ్లుచుండగా శిష్యులు మార్గమున సాగిపోవుచు
24 వెన్నులు త్రుంచుచునుండిరి. । అందుకు పరిసయ్యులు
—చూడుము, విశ్రాంతిదినమున చేయకూడనిది వారేల
25 చేయుచున్నారని ఆయన నడిగిరి. । అందుకాయన
వారితో ఇట్లనెను — తానును తనతోకూడ నున్న
వారును ఆకలిగొనినందున దావీదుకు అవసరము వచ్చి
యున్నప్పుడు అతడు చేసినది మీరెన్నడును చదవ
26 లేదా? । అబ్యాతారు ప్రధానయాజకుడై యుండగా
దేవమందిరములోకి వెళ్లి, యాజకులే గాని యితరులు
తినకూడని సముఖపు రొట్టెలు తాను తిని తనతోకూడ
27 ఉన్నవారికిచ్చెను గదా అని చెప్పెను. । మరియు —
విశ్రాంతిదినము మనుష్యులకొరకే నియమింపబడెను
గాని మనుష్యులు విశ్రాంతిదినముకొరకు నియమింప
28 బడలేదు. । అందువలన మనుష్యకుమారుడు విశ్రాంతి
దినమునకును ప్రభువై యున్నాడని వారితో చెప్పెను.
**3** సమాజమందిరములో ఆయన మరల ప్రవేశింపగా
2 అక్కడ ఊచచెయ్యి గలవాడు ఒకడుండెను. । అచ్చటి
వారు ఆయనమీద నేరము మోపవలెననియుండి,
విశ్రాంతిదినమున వాని స్వస్థపరచునేమో అని ఆయ
3 నను కనిపెట్టుచుండిరి. । ఆయన—నీవు లేచి మధ్యను
4 నిలువుమని ఊచచెయ్యిగలవానితో చెప్పి । వారిని
చూచి—విశ్రాంతిదినమున మేలుచేయుట ధర్మమా కీడు
చేయుట ధర్మమా? ప్రాణరక్షణ ధర్మమా ప్రాణహత్య
ధర్మమా? అని అడిగెను; అందుకు వారు ఊరకుండిరి. ।
5 ఆయన వారి హృదయకాఠిన్యమునకు దుఃఖపడి, కోప
ముతో వారిని కలయచూచి—నీ చెయ్యి చాపుమని ఆ
మనుష్యునితో చెప్పెను; వాడు తన చెయ్యి చాపగా
6 అది బాగుపడెను. । పరిసైయులు వెలపలికిపోయి
వెంటనే హేరోదీయులతో కలిసికొని, ఆయన
నేలాగు సంహరింతుమా యని ఆయనకు విరోధముగా
ఆలోచన చేసిరి.
7 యేసు తన శిష్యులతోకూడ సముద్రమునొద్దకు
వెళ్లగా గలిలైయనుండి వచ్చిన గొప్ప జనసమూహము
వెంబడించెను. । మరియు ఆయన ఇంత
ములు చేయుచున్నాడని విని జనులు
యూదైయనుండియు, యెరూషలేమునుండియు
ఇదూమైయనుండియు, యొర్దాను అవతలనుండియు
తూరు సీదోను అనెడి పట్టణప్రాంతములనుండియు
ఆయనయొద్దకు గుంపులు గుంపులుగా వచ్చిరి. । జను
గుంపుకూడగా చూచి, వారు తన్ను ఇరికింపకుండ
నట్లు చిన్నదోనె యొకటి తనకు సిద్ధపరచి యుం
వలెనని ఆయన తన శిష్యులతో చెప్పెను. । ఆయ
అనేకులను స్వస్థపరచెను గనుక రోగపీడితులైనవార
దరు ఆయనను ముట్టుకొనవలెనని ఆయనమీద పడ
చుండిరి. । అపవిత్రాత్మలు (పట్టినవారు) ఆయన
చూడగానే ఆయన యెదుట సాగిలపడి—నీవు దేవు
కుమారుడవని చెప్పుచు కేకలువేసిరి. । ఆయన తన్ను
ప్రసిద్ధిచేయవద్దని వారికి ఖండితముగా ఆజ్ఞాపించెను
తరువాత ఆయన కొండెక్కి తనకిష్టమైనవారి
పిలువగా వారాయనయొద్దకు వచ్చిరి. । వారు తనతో
కూడ ఉండి, దయ్యములను వెళ్లగొట్టు అధికారమ
గలవారై (సువార్త) ప్రకటించుటకు వారిని పంపవ
నని ఆయన పన్నెండుమందిని నియమించెను. । వారె
రనగా — ఆయన పేతురను పేరుపెట్టిన సీమోను
జెబెదై కుమారుడగు యాకోబు, అతని సహోదరు
డగు యోహాను; వీరిద్దరికి ఆయన బోయనేర్గెసను పే
పెట్టెను; బోయనేర్గెసు అనగా ఉరిమెడువార
అర్థము. । అంద్రెయ, ఫిలిప్పు, బర్తొలొమయి, మత్తయి
తోమా, అల్ఫయి కుమారుడగు యాకోబు, తద్దయి
కనానీయుడైన సీమోను, । ఆయనను అప్పగించి
ఇస్కరియోతు యూదా అనువారు.
ఆయన ఇంటిలోకి వచ్చినప్పుడు జనులు మర
గుంపుకూడి వచ్చిరి గనుక భోజనము చేయుటకైన
వారికి వీలులేకపోయెను. । ఆయన ఇంటివారు సంగ
విని, ఆయన మతి చలించియున్నదని చెప్పి ఆయన
పట్టుకొనబోయిరి. । యెరూషలేమునుండి వచ్చి
శాస్త్రులు—ఇతడు బయల్జెబూలు పట్టినవాడై దయ్య
ముల యధిపతిచేత దయ్యములను వెళ్లగొట్టుచున్నా
డని చెప్పిరి. । అప్పుడాయన వారిని తనయొద్దకు పిలి
ఉపమానరీతిగా వారితో ఇట్లనెను—సాతాను సాతా
నేలాగు వెళ్లగొట్టును? । ఒక రాజ్యము తనకుతా
విరోధముగా వేరుపడినయెడల ఆ రాజ్యము నిలు
నేరదు. । ఒక యిల్లు తనకుతానే విరోధముగా వే
పడినయెడల ఆ యిల్లు నిలువనేరదు. । సాతా
తనకుతానే విరోధముగా లేచి వేరుపడినయెడల వాడ
నిలువలేక కడతీరును. । ఒకడు మొదట బలవంతుడై
వాని బంధించితేనే తప్ప ఆ బలవంతుని ఇంటజొచ్చి
వాని సామగ్రి దోచుకొననేరదు; బంధించినయెడ
వాని యిల్లు దోచుకొనవచ్చును. । సమస్త పాపమ
లును మనుష్యులు చేయు దూషణలన్నియు వారి
క్షమింపబడును గాని । పరిశుద్ధాత్మ విషయము దూష

యువాడెప్పుడును క్షమాపణ పొందక నిత్యపాపము
సినవాడై యుండునని నిశ్చయముగా మీతో చెప్పు
న్నానని నెను. । ఎందుకనగా ఆయన అపవిత్రాత్మ
ట్టినవాడని వారు చెప్పిరి.
తరువాత ఆయన సహోదరులును తల్లియు వచ్చి
లుపల నిలిచి ఆయనను పిలువనంపిరి. జనులు గుంపు
ం ఆయనచుట్టు కూర్చుండిరి. । వారు — ఇదిగో
తల్లియు నీ సహోదరులును వెలుపల ఉండి నీకోస
ము వెదకుచున్నారని ఆయనతో చెప్పగా। ఆయన
-నా తల్లి నా సహోదరులు ఎవరని చెప్పి । తన
ట్టు కూర్చున్నవారిని కలయ చూచి — ఇదిగో నా
ల్లియు నా సహోదరులును; । దేవుని చిత్తముచొ
ప్పన జరిగించువాడే నా సహోదరుడును సహో
రియు తల్లియునై యున్నాడని చెప్పెను.
ఆయన సముద్రతీరమున మరల బోధింప నారం
ంపగా బహు జనులాయనయొద్దకు కూడి వచ్చియు
ందున ఆయన సముద్రములో ఒక దోనెయెక్కి
ూర్చుండెను. జనులందరు సముద్రతీరమున నేలమీద
ండిరి. । ఆయన ఉపమానరీతిగా అనేక సంగతులు
ారికి బోధించుచు తన బోధలో వారితో ఇట్లనెను.—।
నుడి; విత్తువాడు విత్తుటకు బయలు వెళ్లెను. । వాడు
త్తుచుండగా కొన్ని విత్తనములు త్రోవప్రక్కను
డెను గనుక పక్షులు వచ్చి వాటిని మ్రింగివేసెను. ।
న్ని చాల మన్నులేని రాతినేలను పడెను; అక్కడ
న్ను లోతుగా ఉండనందున అవి వెంటనే మొలి
ను గాని । సూర్యుడు ఉదయింపగానే అవి మాడి,
రులేనందున ఎండిపోయెను. । కొన్ని ముండ్లపొద
లో పడెను; ముండ్లపొదలు ఎదిగి వాటిని అణచి
సెను గనుక అవి ఫలింపలేదు. । కొన్ని మంచి నేలను
డెను; అవి మొలిచి పెరిగి పైరై ముప్పదంతలుగాను
రువదంతలుగాను నూరంతలుగాను ఫలించెను । —
నుటకు చెవులుగలవాడు వినునుగాక అని చెప్పెను.
ఆయన ఒంటిగా ఉన్నప్పుడు పన్నెండుమంది
ష్యులతోకూడ ఆయనచుట్టు ఉండినవారు ఆ ఉప
ానమునుగూర్చి ఆయన నడిగిరి. । అందుకాయన—
వుని రాజ్యమర్మము (తెలిసికొనుట) మీకు అనుగ్ర
ంపబడియున్నది గాని । వెలుపటనుండువారు ఒక
ళ దేవునివైపు తిరిగి పాపక్షమాపణ పొందుదురని,
ారు చూచుటకైతే చూచియు కనుగొనకను, వినుట
తే వినియు గ్రహింపకయుండుటకును సమస్తము
ారికి ఉపమానరీతిగా బోధింపబడుచున్నదని వారి
ో చెప్పెను. । మరియు — ఈ ఉపమానము మీకు
ెలియలేదా? ఆలాగైతే ఉపమానములన్నియు మీకే
ాగు తెలియుననెను. । విత్తువాడు వాక్యము విత్తు
న్నాడు. । త్రోవప్రక్క నుండువారెవరనగా,
ాక్యము వారిలో విత్తబడును గాని వారు వినినవెం
టనే సాతాను వచ్చి వారిలో విత్తబడిన వాక్యమెత్తి
కొని పోవును. । అటువలె రాతినేలను విత్తబడినవారె 16
వరనగా, వాక్యము విని సంతోషముగా అంగీకరించు
వారు; । అయితే వారిలో వేరు లేనందున కొంత 17
కాలము వారు నిలుతురు గాని వాక్యము నిమిత్తము
శ్రమయైనను హింసయైనను కలుగగానే వారు అభ్యం
తరపడుదురు. । ఇతరులు ముండ్లపొదలలో విత్తబడిన 18
వారు; వీరు వాక్యము విందురు గాని ఐహిక విచార 19
ములును ధనమోసమును మరి ఇతరమైన అపేక్షలును
లోపల చొచ్చి వాక్యమును అణచివేయుటవలన అది
నిష్ఫలమగును. । మంచి నేలను విత్తబడినవారెవరనగా, 20
వాక్యము విని దానిని అంగీకరించి ముప్పదంతలుగాను
అరువదంతలుగాను నూరంతలుగాను ఫలించువారని
చెప్పెను.
మరియు ఆయన వారితో ఇట్లనెను — దీపము 21
దీపస్తంభముమీద నుంచబడుటకే గాని కుంచముక్రింద
నైనను మంచముక్రిందనైన నుంచబడుటకు తేబడదు
గదా. । రహస్యమేదైనను తేటపరచబడకపోదు; 22
బయలుపరచబడుటకే గాని యేదియు మరుగుచేయ
బడలేదు. । వినుటకు చెవులెవనికైన నుండినయెడల 23
వాడు వినునుగాకనెను. । మరియు ఆయన—మీరేమి 24
వినుచున్నారో జాగ్రత్తగా చూచుకొనుడి. మీరెట్టి
కొలతతో కొలుతురో అట్టి కొలతతోనే మీకు
కొలువబడును, మరి ఎక్కువగా మీకియ్యబడును. ।
కలిగినవానికి ఇయ్యబడును, లేనివానికి కలిగినదియు 25
వానియొద్దనుండి తీసివేయబడునని వారితో చెప్పెను.
మరియు ఆయన — ఒక మనుష్యుడు భూమిలో 26
విత్తనము చల్లి, దివారాత్రులు నిద్రపోవుచు మేల్కొను 27
చునుండగా వానికి తెలియని రీతిగా ఆ విత్తనము
మొలిచి పెరిగినట్లే దేవుని రాజ్యమున్నది. । భూమి 28
మొదట మొలకను తరువాత వెన్నును అటుతరువాత
వెన్నులో ముదురు గింజలను తనంతటతానే పుట్టిం
చును. । పంట పండినప్పుడు కోతకాలము వచ్చినదని 29
(సేద్యగాడు) వెంటనే కొడవలి పెట్టి కోయునని
చెప్పెను.
మరియు ఆయన ఇట్లనెను — దేవుని రాజ్యమును 30
ఎట్లు పోల్చెదము? ఏ ఉపమానముతో దానిని ఉప
మించెదము? । అది ఆవగింజను పోలియున్నది. ఆవ 31
గింజ భూమిలో విత్తబడినప్పుడు భూమిమీదనున్న
విత్తనములన్నిటికంటె చిన్నదేగాని । విత్తబడిన తరు 32
వాత అది మొలిచి యెదిగి కూర మొక్కలన్నిటికంటె
పెద్దదై గొప్ప కొమ్మలు వేయును గనుక ఆకాశపక్షులు
దాని నీడను నివసింపగలవనెను.
వారికి వినుటకు శక్తి కలిగినకొలది యీలాటి అనేక 33
మైన ఉపమానములను చెప్పి ఆయన వారికి వాక్యము
బోధించెను. । ఉపమానము లేక వారికి బోధింపలేదు 34

గాని ఒంటరిగా ఉన్నప్పుడు తన శిష్యులకు అన్నిటిని
విశదపరచెను.
35 ఆ దినమందే సాయంకాలమైనప్పుడు ఆయన —
36 అద్దరికి పోవుదమని వారితో చెప్పగా వారు జనులను
పంపివేసి, ఆయనను ఉన్నపాటున చిన్నదోనెలో
తీసికొనిపోయిరి; ఆయనవెంబడి మరికొన్ని దోనెలు
37 వచ్చెను. । అప్పుడు పెద్ద తుఫాను రేగి అలలు ఆయన
యున్న దోనెమీద కొట్టినందున దోనె నిండిపో
38 యెను. । ఆయన దోనె అమరమున తలగడమీద (తల
వాల్చుకొని) నిద్రించుచుండెను. వారాయనను లేపి
— బోధకుడా, మేము నశించిపోవుచున్నాము; నీకు
39 చింతలేదా? అని ఆయనతో అనిరి. । అందుకాయన
లేచి గాలిని గద్దించి—నిశ్శబ్దమై ఊరకొమ్మని సము
ద్రముతో చెప్పగా గాలి అణిగి మిక్కిలి నిమ్మళమా
40 యెను. । అప్పుడాయన — మీరెందుకు భయపడుచు
న్నారు? మీరింకను నమ్మికలేక యున్నారా? అని వారి
41 తో చెప్పెను. । వారు మిక్కిలి భయపడి— ఈయన
ఏలాటివాడో; గాలియు సముద్రమును ఈయనకు
లోబడుచున్నవని యొకనితో ఒకడు చెప్పుకొనిరి.
5 తరువాత వారాసముద్రమునకు అద్దరినున్న గెరా
2 సేనుల దేశమునకు వచ్చిరి. । ఆయన దోనె దిగగానే
అపవిత్రాత్మపట్టినవాడొకడు గోరీలలోనుండి వచ్చి
3 ఆయనకెదురుపడెను. । వాడు గోరీలలో వాసము
చేసెడివాడు, సంకెళ్లతోనైనను ఎవడును వాని బంధింప
4 లేకపోయెను. । పలుమారు వాని కాళ్లకును చేతుల
కును సంకెళ్లు వేసి బంధించినను వాడు ఆ చేతిసంకెళ్లు
తెంపి కాలిసంకెళ్లను తుత్తునియలుగా చేసెను గనుక
5 ఎవడును వానిని సాధుపరచ లేకపోయెను. । వాడు
ఎల్లప్పుడును దివారాత్రులు గోరీలలోను కొండల
లోను కేకలువేయుచు తన్నుతాను రాళ్లతో గాయ
6 పరచుకొనుచు నుండెను. । వాడు దూరమునుండి
యేసును చూచి పరుగెత్తికొని వచ్చి ఆయనకు నమ
7 స్కారముచేసి । — యేసూ, సర్వోన్నతుడైన దేవుని
కుమారుడా, నీతో నాకేమి? నన్ను బాధపరచకుమని
దేవునిపేరట నీకు ఆనపెట్టుచున్నానని బిగ్గరగా కేకలు
8 వేసెను. । ఎందుకనగా ఆయన—అపవిత్రాత్మా, యీ
9 మనుష్యుని విడిచిపొమ్మని వానితో చెప్పెను. । మరియు
ఆయన — నీ పేరేమని వాని నడుగగా వాడు — నా
పేరు సేన, యేలయనగా మేము అనేకులమని చెప్పి ।
10 తమ్మును ఆ దేశములోనుండి తోలివేయవద్దని ఆయనను
11 మిగుల బతిమాలుకొనెను. । అక్కడ కొండదగ్గర
12 పందుల పెద్దమంద మేయుచుండెను । గనుక — ఆ
పందులలో ప్రవేశించునట్లు మమ్మును వాటియొద్దకు
పుమని ఆ దయ్యములు ఆయనను బతిమాలుకొ
యేసు వాటికి సెలవియ్యగా ఆ అపవిత్రాత్మలు
పందులలో ప్రవేశించెను. ప్రవేశింపగా

ఇంచుమించు రెండు వేల సంఖ్యగల ఆ మంద ప్రపా
తమునుండి సముద్రపుదారిని వడిగా పరుగెత్తికొని
పోయి సముద్రములో పడి ఊపిరి తిరుగక చచ్చెను. ।
ఆ పందులు మేపుచున్నవారు పారిపోయి పట్టణము
లోను గ్రామములలోను ఆ సంగతి తెలియజేసిరి. ।
జనులు జరిగినది చూడ వెళ్లి యేసునొద్దకు వచ్చి, సేన
అను దయ్యములు పట్టినవాడు బట్టలు ధరించుకొని
స్వస్థచిత్తుడై కూర్చునియుండుట చూచి భయపడిరి. ।
జరిగినది చూచినవారు దయ్యములు పట్టినవానికి కలిగిన
స్థితియు పందుల సంగతియు ఊరివారికి తెలియజేయ
గా । తమ ప్రాంతములు విడిచిపొమ్మని వారాయనను
బతిమాలుకొనసాగిరి. । ఆయన దోనె యెక్కినప్పుడు
దయ్యములు పట్టినవాడు ఆయనయొద్ద తన్నుండనిమ్మని
ఆయనను బతిమాలుకొనెను గాని । ఆయన వానికి
సెలవియ్యక —నీవు నీ యింటివారియొద్దకు వెళ్లి, ప్రభువు
నీయందు కనికరపడి నీకు చేసిన కార్యములన్నియు
వారికి తెలియజెప్పుమనెను. । వాడు వెళ్లి యేసు తనకు
చేసినవన్నియు దెకపొలిలో ప్రకటింప నారంభింపగా
అందరు ఆశ్చర్యపడిరి.
యేసు మరల దోనె యెక్కి అద్దరికి వెళ్లినప్పుడు
బహు జనసమూహము ఆయనయొద్దకు కూడివచ్చెను. ।
ఆయన సముద్రతీరమున నుండగా సమాజమందిరపు
అధికారులలో యాయీరను నొకడు వచ్చి ఆయనను
చూచి ఆయన పాదములమీద పడి । — నా చిన్న
కుమార్తె చావనైయున్నది; అది బాగుపడి బ్రదుకు
నట్లు నీవు వచ్చి దానిమీద నీ చేతులుంచవలెనని
ఆయనను మిగుల బతిమాలుకొనగా । ఆయన అతనితో
కూడ వెళ్లెను; బహు జనసమూహము ఆయనను వెంబ
డించి ఆయనమీద పడుచుండిరి.
పన్నెండేండ్లనుండి రక్తస్రావ రోగము కలిగిన
యొక స్త్రీ యుండెను. ఆమె అనేక వైద్యులచేత ఎన్నో
తిప్పలుపడి । తనకు కలిగినదంతయు వ్యయముచేసి
కొని, యెంతమాత్రమును ప్రయోజనములేక మరింత
సంకటపడెను. । ఆమె యేసునుగూర్చి విని — నేను
ఆయన వస్త్రములు మాత్రము ముట్టిన బాగుపడుదునను
కొని, జనసమూహములో ఆయన వెనుకకు వచ్చి
ఆయన వస్త్రము ముట్టెను. । వెంటనే ఆమె రక్తధార
కట్టెను గనుక తన శరీరములోని ఆ బాధ నివారణ
మైనదని గ్రహించుకొనెను. । వెంటనే యేసు తనలో
నుండి ప్రభావము బయలువెళ్లెనని తనలోతాను
గ్రహించి, జనసమూహమువైపు తిరిగి—నా వస్త్రములు
ముట్టినదెవరని అడుగగా । ఆయన శిష్యులు — జన
సమూహము నీమీద పడుచుండుట చూచుచున్నావే
నన్ను ముట్టినదెవడని అడుగుచున్నావా? అనిరి. । ఆ
కార్యము చేసిన ఆమెను కనుగొనవలెనని ఆయనచుట్టు
చూచెను. । అప్పుడా స్త్రీ తనకు తటస్థించినది యెరిగి

నదై, భయపడి వణకుచువచ్చి ఆయన ఎదుట సాగిల
పడి, తన సంగతియంతయు ఆయనతో చెప్పెను. ।
34 అందుకాయన — కుమారీ, నీ విశ్వాసము నిన్ను స్వస్థ
పరచెను, సమాధానముగలదానవై పొమ్ము; నీ బాధ
నివారణయై నీవు స్వస్థత కలుగుగాక అని ఆమెతో
చెప్పెను.
35 ఆయన ఇంక మాటలాడుచుండగా సమాజమం
దిరపు అధికారి యింటనుండి కొందరు వచ్చి — నీ
కుమార్తె చనిపోయినది; నీవికను బోధకుని ఎందుకు
36 శ్రమపెట్టుదువనిరి. । యేసు వారు చెప్పిన మాట
లక్ష్యపెట్టక—భయపడకుము, నమ్మికమాత్రముంచుమని
37 సమాజమందిరపు అధికారితో చెప్పి । పేతురు,
యాకోబు, యాకోబు సహోదరుడగు యోహాను
అనువారిని తప్ప మరి ఎవరినైనను తన వెంబడి రాని
38 య్యక । సమాజమందిరపు అధికారి యింటికి వచ్చి,
వారు గొల్లుగానుండి చాల యేడ్చుచు ప్రలాపించుచు
39 నుండుట చూచి । లోపలికిపోయి—మీరేల గొల్లుచేసి
యేడ్చుచున్నారు? ఈ చిన్నది నిద్రించుచున్నదేగాని
40 చనిపోలేదని వారితో చెప్పెను. । అందుకు వారు
ఆయనను అపహసించిరి. అయితే ఆయన వారినంద
రిని బయటకు పంపివేసి, ఆ చిన్నదాని తలిదండ్రులను
తనతో ఉన్నవారిని వెంటబెట్టుకొని, ఆ చిన్నది
41 పరుండియున్న గదిలోకి వెళ్లి । ఆ చిన్నదాని చెయి
పట్టి — తలితాకూమి అని ఆమెతో చెప్పెను. ఆ
మాటకు చిన్నదానా, లెమ్మని నీతో చెప్పుచున్నానని
42 అర్థము. । వెంటనే ఆ చిన్నది లేచి నడవసాగెను;
ఆమె పన్నెండు సంవత్సరముల ప్రాయముగలది.
అప్పుడు వారు మహా విస్మయము నొందినవారైరి. ।
43 జరిగినది ఎవనికి తెలియకూడదని ఆయన వారికి గట్టిగా
నాజ్ఞాపించి, ఆమెకు ఆహారము పెట్టుడని చెప్పెను.

6 ఆయన అక్కడనుండి బయలుదేరి స్వదేశమునకు
రాగా ఆయన శిష్యులు ఆయనను వెంబడించిరి. ।
2 విశ్రాంతిదినము వచ్చినప్పుడు ఆయన సమాజమందిర
ములో బోధింపనారంభించెను. అనేకులు ఆయన
బోధ విని ఆశ్చర్యపడి—ఈ సంగతులు ఇతనికి ఎక్కడ
నుండి వచ్చెను? ఇతనికియ్యబడిన ఈ జ్ఞానమెట్టిది?
ఇతని చేతులవలన ఇట్టి అద్భుతములు చేయబడుచు
3 న్నవి; ఇదేమి? । ఇతడు మరియ కుమారుడు కాడా?
ఇతడు యాకోబు, యోసే, యూదా, సీమోను అను
వారి సహోదరుడగు వడ్లవాడు కాడా? ఇతని
చెల్లెండ్రు ఇక్కడ మనయొద్దనే యున్నారు కారా
అని చెప్పుకొనుచు ఆయన విషయమై అభ్యంతరపడిరి. ।
4 అందుకు యేసు—ప్రవక్త తన దేశములోను తన బంధు
వులలోను తన యింటివారిలోను తప్ప మరి ఎక్కడను
5 ఘనహీనుడు కాడని చెప్పెను. । అందువలన కొద్ది
మంది రోగులమీద చేతులుంచి వారిని స్వస్థపరచుట
తప్ప మరి ఏ అద్భుతమును ఆయన అక్కడ చేయజా
లకపోయెను. ఆయన వారి అవిశ్వాసమునకు ఆశ్చర్య
పడెను.

ఆయన చుట్టుపట్లనున్న గ్రామములు తిరుగుచు 6
బోధించుచుండెను.

ఆయన పన్నెండుగురు శిష్యులను తనయొద్దకు 7
పిలిచి వారిని ఇద్దరిద్దరినిగా పంపుచు, అపవిత్రాత్మల
మీద వారికధికారమిచ్చి । — ప్రయాణముకొరకు 8
చేతికఱ్ఱను తప్ప రొట్టెనైనను జాలెనైనను సంచిలో
సొమ్మునైనను తీసికొనక । చెప్పులు తొడుగుకొనుడ 9
నియు, రెండంగీలు వేసికొనవద్దనియు వారికాజ్ఞాపిం
చెను । మరియు ఆయన వారితో ఇట్లనెను—మీరె 10
క్కడ ఒక యింట ప్రవేశించెదరో అక్కడనుండి
మీరు బయలుదేరువరకు ఆ యింటనే బసచేయుడి. ।
ఏ స్థలమందైనను జనులు మిమ్మును చేర్చుకొని మీ 11
మాటలు వినకుంటే, మీరు అక్కడనుండి బయలుదేరు
నప్పుడు వారిమీద సాక్ష్యముగా ఉండుటకు మీ
పాదముల క్రింది ధూళి దులిపివేయుడి. । కాగా 12
వారు బయలుదేరి, మారుమనస్సు పొందవలెనని ప్రక
టించుచు । దయ్యములు అనేకములను వెళ్లగొట్టుచు 13
రోగులను అనేకులకు నూనె రాచి స్వస్థపరచుచు
నుండిరి.

ఆయన కీర్తి ప్రసిద్ధమాయెను గనుక రాజైన హేరోదు 14
ఆయననుగూర్చి విని—బాప్తిస్మమిచ్చు యోహాను
మృతులలోనుండి లేచియున్నాడు గనుక అతనియందు
అద్భుతములు క్రియాసాధకములగుచున్నవని చెప్పె
ను. । ఇతరులు—ఈయన ఏలీయా అనియు, మరికొం 15
దరు — ఈయన ప్రవక్తయనియు, ప్రవక్తలలో ఒకని
వలె నున్నాడనియు చెప్పుకొనుచుండిరి. । అయితే 16
హేరోదు విని—ఇతడు నేను తలగొట్టించిన యోహానే;
అతడు మృతులలోనుండి లేచియున్నాడని చెప్పెను. ।
హేరోదు తన సహోదరుడగు ఫిలిప్పు భార్యయైన 17
హేరోదియను పెండ్లిచేసికొనినందున యోహాను—నీ
సహోదరుని భార్యను చేర్చుకొనుట నీకు న్యాయము
కాదని హేరోదుతో చెప్పెను గనుక । ఇతడామె 18
నిమిత్తము యోహానును పట్టి తెప్పించి చెరసాలలో
బంధించియుండెను. । హేరోదియ అతనిమీద పగ 19
పట్టి అతని చంపింప నుద్దేశించెను గాని ఆమెచేత కాక 20
పోయెను. ఎందుకనగా యోహాను నీతిమంతుడును
పరిశుద్ధుడునగు మనుష్యుడని హేరోదు ఎరిగి అతనికి
భయపడి అతని కాపాడుచు వచ్చెను. మరియు అతని
మాటలు వినినప్పుడు ఏమిచేయను తోచకపోయినను
సంతోషముతో వినుచుండెను. । అయితే సమయోచిత 21
దినమొకటి వచ్చెను; ఎట్లనగా హేరోదు తన జన్మ
దినోత్సవమందు తన ప్రధానులకును సహస్రాధిపతుల
కును గలిలైయదేశ ప్రముఖులకును విందు చేయిం

22 చెను. । అప్పుడు హేరోదియ కుమార్తె లోపలికివచ్చి
నాట్యమాడి హేరోదును అతనితోకూడ పంక్తిని
కూర్చున్నవారిని సంతోషపరచెను గనుక రాజు—నీకిష్ట
మైనది ఏదైనను నన్నడుగుము, నేను నీకిచ్చెదనని ఆ
23 చిన్నదానితో చెప్పెను. । మరియు—నీవు నా రాజ్య
ములో సగముమట్టుకు ఏమి అడిగినను నీకిచ్చెదనని
24 అతడు ఆమెతో ఒట్టుపెట్టుకొనెను । గనుక ఆమె
వెళ్లి—నేనేమి అడిగెదనని తన తల్లి నడుగగా ఆమె—
25 బాప్తిస్మమిచ్చు యోహాను తల అడుగుమనెను. । వెంటనే
ఆమె త్వరగా రాజునొద్దకు వచ్చి — బాప్తిస్మమిచ్చు
యోహాను తల పళ్లెములో పెట్టి యిప్పుడే నాకిప్పింప
26 గోరుచున్నానని చెప్పెను. । రాజు బహు దుఃఖప
డెను గాని తాను పెట్టుకొనిన ఒట్టు నిమిత్తమును
తనతో కూర్చున్నవారి నిమిత్తమును ఆమెకు ఇయ్యను
27 అనొల్లకపోయెను. । వెంటనే రాజు అతని తల
తెమ్మని ఆజ్ఞాపించి యొక బంటును పంపెను. వాడు
28 వెళ్లి చెరసాలలో అతని తల గొట్టి । పళ్లెములో అతని
తల పెట్టి తెచ్చి ఆ చిన్నదానికిచ్చెను, ఆ చిన్నది తన
29 తల్లికిచ్చెను. । యోహాను శిష్యులు ఈ సంగతి విని,
వచ్చి శవమును ఎత్తికొనిపోయి సమాధిలో ఉంచిరి.
30 అంతట అపొస్తలులు యేసునొద్దకు కూడివచ్చి
తాము చేసినవన్నియు బోధించినవన్నియు ఆయనకు
31 తెలియజేసిరి. । అప్పుడాయన — మీరేకాంతముగా
అరణ్యస్థలమునకు వచ్చి కొంచెముసేపు అలసట తీర్చు
కొనుడని చెప్పెను; ఏలయనగా అనేకులు వచ్చుచు
పోవుచునుండినందున భోజనము చేయుటకైనను వారికి
32 అవకాశము లేకపోయెను. । కాగా వారు దోనె
యెక్కి అరణ్యప్రదేశమునకు ఏకాంతముగా వెళ్లిరి. ।
33 వారు వెళ్లుచుండగా జనులు చూచి, అనేకులాయనను
గుర్తెరిగి, సకల పట్టణములనుండి అక్కడికి కాలినడకను
34 పరుగెత్తి వారికంటె ముందుగా వచ్చిరి । గనుక యేసు
వచ్చి విస్తారమైన ఆ జనసమూహమును చూచి, వారు
కాపరిలేని గొర్రెలవలె ఉన్నందున వారిమీద కనికర
పడి వారికి అనేక సంగతులను బోధింపసాగెను. ।
35 చాల ప్రొద్దుపోయిన తరువాత ఆయన శిష్యులాయన
యొద్దకు వచ్చి—ఇది అరణ్యప్రదేశము, ఇప్పుడు చాల
36 ప్రొద్దుపోయినది; । చుట్టుపట్ల గ్రామములకు వారు
వెళ్లి భోజనమునకేమైనను కొనుక్కొనుటకు వారిని
37 పంపివేయుమని చెప్పిరి. । అందుకాయన — మీరు
వారికి భోజనము పెట్టుడనగా వారు — మేము వెళ్లి
యిన్నూరు దేనారముల[1] రొట్టెలు కొని వారికి పెట్టు
38 దుమా అని ఆయన నడిగిరి. । అందుకాయన — మీ
39 యొద్ద ఎన్ని రొట్టెలున్నవి? పోయి చూడుడని వారి
తో చెప్పెను. వారు చూచి తెలిసికొని — అయిదు
ట్టెలును రెండు చేపలునున్నవనిరి. అప్పుడాయన
—పచ్చికమీద అందరు పంక్తులు పంక్తులుగా కూర్చుండ
వలెనని వారికాజ్ఞాపింపగా । వారు నూరేసిమంది 3
చొప్పునను ఏబదేసిమంది చొప్పునను పంక్తులు తీరి
కూర్చుండిరి. । అంతట ఆయన ఆ అయిదు రొట్టెలను 4
రెండు చేపలను ఎత్తికొని, ఆకాశమువైపు కన్నులెత్తి
వాటిని ఆశీర్వదించి ఆ రొట్టెలు విరిచి వారికి వడ్డిం
చుటకు తన శిష్యులకిచ్చి, ఆ రెండు చేపలను అందరికిని
పంచిపెట్టించెను. । వారందరు తిని తృప్తిపొందినతరు 5
వాత మిగిలిన చేపలును రొట్టె ముక్కలును పన్నెండు
గంపెళ్లు ఎత్తిరి. । ఆ రొట్టెలు తినినవారు అయిదు
వేలమంది పురుషులు.
వెంటనే ఆయన జనసమూహమును పంపివేయు 6
నంతలో తన శిష్యులను దోనె ఎక్కి అద్దరినున్న బేత్స
యిదాకు ముందుగా వెళ్లుడని ఆయన బలవంతము
చేసెను. । ఆయన వారిని వీడుకొలిపి, ప్రార్థనచేయు 7
టకై కొండకు వెళ్లెను. । సాయంకాలమైనప్పుడు ఆ
దోనె సముద్రము మధ్య ఉండెను గాని ఆయన
ఒంటిగా మెట్టననుండెను. । అప్పుడు గాలి వారికి
ఎదురైనందున దోనె నడిపించుటలో వారు మిక్కిలి 8
కష్టపడుచుండగా ఆయన చూచి, ఇంచుమించు రాత్రి
నాలుగవ జామున సముద్రముమీద నడుచుచు వారి 9
యొద్దకు వచ్చి వారిని దాటిపోవలెనని యుండెను. ।
ఆయన సముద్రముమీద నడుచుట వారు చూచి 10
భూతమని తలంచి కేకలువేసిరి. । అందరు ఆయనను
చూచి తొందరపడగా వెంటనే ఆయన వారిని పలక 11
రించి—ధైర్యము తెచ్చుకొనుడి; నేనే, భయపడకుడని 12
చెప్పెను. । తరువాత ఆయన దోనె యెక్కి వారి
యొద్దకు వచ్చినప్పుడు గాలి అణగెను; అందుకు వారు
తమలోతాము మిక్కిలి విభ్రాంతి నొందిరి; । అయి 13
నను వారి హృదయము కఠినమాయెను గనుక వారు
రొట్టెలనుగూర్చిన సంగతి గ్రహింపలేదు.
వారు అవతలకు దాటి గెన్నేసరెతుదగ్గర ఒడ్డుకు 14
వచ్చి దరి పట్టిరి. । వారు దోనె దిగగానే జనులు
ఆయనను గురుతుపట్టి । ఆ ప్రదేశమందంతట పరుగెత్తి 15
కొనిపోయి, ఆయన యున్నాడని వినినచోటుకు రోగు
లను మంచములమీద మోసికొని వచ్చుటకు మొదలు
పెట్టిరి. । గ్రామములలోను పట్టణములలోను పల్లె 17
టూళ్లలోను ఆయన ఎక్కడెక్కడ ప్రవేశించెనో అక్కడి
వారు రోగులను సంతవీధులలో ఉంచి, వారు ఆయన 18
వస్త్రపుచెంగుమాత్రము ముట్టనిమ్మని ఆయనను వేడుకొ
నిరి; ఆయనను ముట్టినవారందరు స్వస్థతనొందిరి.
యెరూషలేమునుండి వచ్చిన పరిసయ్యులును 7
శాస్త్రులలో కొందరును ఆయనయొద్దకు కూడివచ్చి 1 19
ఆయన శిష్యులలో కొందరు అపవిత్రమైన చేతుల 2
తో, అనగా కడుగని చేతులతో భోజనము చేయుట

[1] ఇది ఇంచుమించు 106 రూపాయిలు కావచ్చును. 29

37 ఈయన సమస్తమును బాగుగా చేసియున్నాడు; చెవిటి
వారు విననట్లుగాను మూగవారు మాటలాడునట్లు
గాను చేయుచున్నాడని చెప్పుకొని అపరిమితముగా
ఆశ్చర్యపడిరి.

8 ఆ దినములలో మరియొక సారి బహు జనులు
కూడిరాగా వారికి తిననేమియు లేనందున యేసు తన
2 శిష్యులను తనయొద్దకు పిలిచి । — జనులు నేటికి
మూడు దినములనుండి నాయొద్దనున్నారు; వారికి
భోజనమునకు ఏమియులేనందున నేను వారిమీద కని
3 కరపడుచున్నాను; । నేను వారిని ఉపవాసముతో
తమ ఇండ్లకు పంపివేసినయెడల మార్గములో మూర్ఛ
పోవుదురు; వారిలో కొందరు దూరమునుండి వచ్చి
4 యున్నారని వారితో చెప్పెను. । అందుకాయన
శిష్యులు—ఈ అరణ్యప్రదేశములో ఒకడెక్కడనుండి
రొట్టెలు తెచ్చి వీరిని తృప్తిపరచగలడని ఆయన నడి
5 గిరి. । ఆయన—మీయొద్ద ఎన్ని రొట్టెలున్నవని వారి
6 నడుగగా వారు — ఏడనిరి. । అప్పుడాయన — నేల
మీద కూర్చుండుడని జనులకాజ్ఞాపించి ఆ యేడు
రొట్టెలు ఎత్తికొని కృతజ్ఞతాస్తుతులు చెల్లించి, విరిచి,
వడ్డించుటకై తన శిష్యులకిచ్చెను, వారు జనసమూహ
7 మునకు వడ్డించిరి. । కొన్ని చిన్నచేపలు కూడ వారి
యొద్దనుండగా ఆయన ఆశీర్వదించి వాటినికూడ వడ్డిం
8 చుడని చెప్పెను. । వారు భోజనముచేసి తృప్తిపొందిన
మీదట మిగిలిన ముక్కలు ఏడు గంపలనిండ ఎత్తిరి. ।
9 (భోజనము చేసిన) వారు ఇంచుమించు నాలుగు వేల
10 మంది యుండిరి. వారిని పంపివేసినవెంటనే । ఆయన
తన శిష్యులతోకూడ దోనె యెక్కి దల్మనూతా ప్రాంత
ములకు వచ్చెను.

11 అంతట పరిసయ్యులు వచ్చి ఆయనను శోధించుచు,
ఆకాశములోనుండి యొక సూచకక్రియను చూపు
మని ఆయన నడిగి ఆయనతో తర్కింపసాగిరి. ।
12 ఆయన ఆత్మయందు పెద్ద నిట్టూర్పు విడిచి—ఈ తరము
వారు ఎందుకు సూచకక్రియ నడుగుచున్నారు? ఈ
తరమునకు ఏ సూచకక్రియయు ననుగ్రహింపబడదని
13 నిశ్చయముగా మీతో చెప్పుచున్నానని చెప్పి । వారిని
విడిచి మరల దోనె యెక్కి అద్దరికి పోయెను.

14 వారు భోజనమునకు ఏమైన తెచ్చుటకు మరచిరి;
దోనెలో వారియొద్ద ఒక్క రొట్టె తప్ప మరేమియు
15 నుండలేదు. । ఆయన—చూచుకొనుడి; పరిసయ్యుల
పులిసిన పిండినిగూర్చియు హేరోదు పులిసిన పిండిని
గూర్చియు జాగ్రత్తపడుడని వారిని హెచ్చరింపగా ।
16 వారు—తమయొద్ద రొట్టెలు లేవేయని తమలోతాము
17 ఆలోచించుకొనిరి. । యేసు అది యెరిగి—మనయొద్ద
రొట్టెలు లేవేయని మీరెందుకు ఆలోచించుకొను
చున్నారు? మీరింకను వివేచింపలేదా, గ్రహింప
లేదా? మీరు కఠినమనస్సుగలవారై యున్నారా?
మీకు కన్నులు కలిగియు చూడరా? చెవులు కలిగియు
వినరా?[1] జ్ఞాపకము చేసికొనరా? । నేను ఆ అయిదు
వేలమందికి అయిదు రొట్టెలు విరిచి పంచిపెట్టినప్పుడు
మీరు ముక్కలు ఎన్ని గంపలనిండ ఎత్తితిరని వారి
నడిగెను. వారు—పన్నెండని ఆయనతో చెప్పిరి. । ఆ
నాలుగు వేలమందికి ఏడు రొట్టెలు నేను విరిచి పంచి
పెట్టినప్పుడు ముక్కలు ఎన్ని గంపలనిండ ఎత్తితిరని
ఆయన అడుగగా వారు—ఏడనిరి. । అందుకాయన
— మీరింకను గ్రహింపకున్నారేమని చెప్పెను.

అంతలో వారు బేత్సయిదాకు వచ్చిరి. అప్పుడు
అక్కడివారు ఆయనయొద్దకు ఒక గుడ్డివాని తోడు
కొనివచ్చి వాని ముట్టవలెనని ఆయనను వేడుకొనిరి. ।
ఆయన ఆ గుడ్డివాని చెయ్యిపట్టి ఊరివెలపలికి వాని
తోడుకొనిపోయి వాని కన్నులమీద ఉమ్మివేసి వాని
మీద చేతులుంచి—నీకేమైనను కనబడుచున్నదా అని
వానినడుగగా, । వాడు కన్నులెత్తి — మనుష్యులు
నాకు కనబడుచున్నారు; వారు చెట్లవలెనుండి నడుచు
చున్నట్లుగా నాకు కనబడుచున్నారనెను. । అంతట
ఆయన మరల తన చేతులు వాని కన్నులమీద నుంచగా
వాడు తేరిచూచి కుదర్చబడి సమస్తమును తేటగా
చూడసాగెను. । అప్పుడు యేసు — నీవు ఊరిలోకి
వెళ్లవద్దని చెప్పి వాని యింటికి వానిని పంపివేసెను.

యేసు తన శిష్యులతో ఫిలిప్పుదైన కైసరయతో
చేరిన గ్రామములకు బయలుదేరెను. మార్గములో
నుండగా—నేను ఎవడనని జనులు చెప్పుచున్నారని
తన శిష్యులనడిగెను. । అందుకు వారు — కొందరు
బాప్తిస్మమిచ్చు యోహాను అనియు, కొందరు ఏలీయా
అనియు, మరికొందరు ప్రవక్తలలో ఒకడనియు చెప్పు
కొనుచున్నారనిరి. । అందుకాయన—మీరైతే నేను
ఎవడనని చెప్పుచున్నారని వారినడుగగా పేతురు —
నీవు క్రీస్తువు[2] అని ఆయనతో చెప్పెను. । అప్పుడు తన్ను
గూర్చిన యీ సంగతి ఎవనితోను చెప్పవద్దని ఆయన
వారికి ఖండితముగా చెప్పెను. । మరియు మనుష్య
కుమారుడు అనేక హింసలుపొంది, పెద్దలచేతను
ప్రధానయాజకులచేతను శాస్త్రులచేతను విసర్జింపబడి
చంపబడి, మూడు దినములైన తరువాత లేవవలెనని
ఆయన వారికి బోధింపనారంభించెను. । ఆయన ఈ
మాట స్పష్టముగా చెప్పెను గనుక పేతురు ఆయనన
చేతపట్టుకొని ఆయనను గద్దింపసాగెను. । అంద
కాయన తన శిష్యులవైపు తిరిగి, వారిని చూచి—
సాతానా, నా వెనుకకు పొమ్ము; నీవు మనుష్యు
సంగతులను మనస్కరించుచున్నావు గాని దేవుని సంగ
తులను మనస్కరింపకున్నావని పేతురును గద్దించెను.
అంతట ఆయన తన శిష్యులను జనసమూహమును

[1] యిర్మీయా, 5: 21; యెహెజ్కేలు, 12: 2.
[2] క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడు అని అర్థము.

తనయొద్దకు పిలిచి — నన్ను వెంబడింపగోరువాడు
తన్నుతానే ఉపేక్షించుకొని తన సిలువనెత్తికొని నన్ను
వెంబడింపవలెను. । తన ప్రాణమును రక్షించుకొన
గోరువాడు దాని పోగొట్టుకొనును; నా నిమిత్తమును
సువార్త నిమిత్తమును తన ప్రాణమును పోగొట్టుకొను
వాడు దాని రక్షించుకొనును. । ఒకడు సర్వలోక
మును సంపాదించుకొని తన ప్రాణమును పోగొట్టు
కొనుట వానికేమి ప్రయోజనము? । మనుష్యుడు
తన ప్రాణమునకు ప్రతిగా ఏమి ఇయ్యగలుగును? ।
వ్యభిచారమును పాపమునుచేయు ఈ తరమువారిలో
నన్నుగూర్చియు నా మాటలనుగూర్చియు సిగ్గుపడు
వాడెవడో వానిగూర్చి మనుష్యకుమారుడు తన తండ్రి
మహిమగలవాడై పరిశుద్ధ దూతలతోకూడ వచ్చు
నప్పుడు సిగ్గుపడునని చెప్పెను.

మరియు ఆయన—ఇక్కడ నిలిచియున్నవారిలో
కొందరు దేవునిరాజ్యము బలముతో వచ్చుట చూచు
పర్యంతము మరణము రుచిచూడరని నిశ్చయముగా
మీతో చెప్పుచున్నాననెను.

ఆరు దినములైన తరువాత యేసు పేతురును యాకో
బును యోహానును మాత్రము వెంటబెట్టుకొని, యెత్తై
యున యొక కొండమీదికి ఏకాంతముగా వారిని
తోడుకొనిపోయి వారియెదుట రూపాంతరము పొం
దెను. । అంతలో ఆయన వస్త్రములు ప్రకాశమాన
మైనవియు మిగుల తెల్లనివియు ఆయెను; లోకమందు
ఏ చాకలివాడును అంత తెల్లగా చలువచేయలేడు. ।
మరియు మోషేయు ఏలీయాయు వారికి కనబడి
యేసుతో మాటలాడుచుండిరి. । అప్పుడు పేతురు—
బోధకుడా, మనమిక్కడ ఉండుట మంచిది; మేము
నీకు ఒకటి మోషేకు ఒకటి ఏలీయాకు ఒకటి మూడు
పర్ణశాలలు కట్టుదుమని చెప్పెను; । వారు మిగుల
భయపడిరి గనుక తాను చెప్పవలసినదేమో అతనికి
తెలియలేదు. । మేఘమొకటి వచ్చి వారిని కమ్మగా—
ఈయన నా ప్రియకుమారుడు, ఈయన మాట విను
డని యొక శబ్దము ఆ మేఘములోనుండి పుట్టెను ।
8 వెంటనే వారు చుట్టు చూచినప్పుడు తమయొద్దనున్న
యేసు తప్ప మరి ఎవరును వారికి కనబడలేదు.

9 వారు ఆ కొండ దిగి వచ్చుచుండగా — మనుష్య
కుమారుడు మృతులలోనుండి లేచినప్పుడే గాని అంతకు
ముందు మీరు చూచినవాటిని ఎవనితోను చెప్పవద్దని
10 ఆయన వారికి ఆజ్ఞాపించెను. । మృతులలోనుండి
లేచుట అనగా ఏమిటో అని వారొకనితో ఒకడు
తర్కించుచు ఆ మాట మనస్సున ఉంచుకొనిరి. ।
11 పిమ్మట వారు — ఏలీయా ముందుగా రావలెనని
శాస్త్రులు చెప్పుచున్నారే, యిదేమని ఆయన నడిగిరి. ।
12 అందుకాయన — ఏలీయా ముందుగా వచ్చి సమస్త
మును చక్కపెట్టునను మాట నిజమే; అయినను మను
ష్యకుమారుడు అనేక శ్రమలుపడి తృణీకరింపబడ
వలెనని వ్రాయబడుట ఏమి? । ఏలీయా వచ్చెననియు 13
అతనిగూర్చి వ్రాయబడినప్రకారము వారు తమ
కిష్టమువచ్చినట్టుగా అతనికి చేసిరనియు మీతో చెప్పు
చున్నానని వారితో అనెను.

వారు ఆయన శిష్యులయొద్దకు వచ్చి, వారి చుట్టు 14
బహు జనులు కూడియుండుటయు శాస్త్రులు వారితో
తర్కించుటయు చూచిరి. । వెంటనే జనులందరు ఆయ 15
నను చూచి మిగుల విభ్రాంతినొంది ఆయనయొద్దకు
పరుగెత్తికొనివచ్చి ఆయనకు వందనము చేసిరి. । అప్పు 16
డాయన — మీరు దేనిగూర్చి వారితో తర్కించు
చున్నారని వారినడుగగా । జనసమూహములో ఒకడు 17
—బోధకుడా, మూగదయ్యము[1] పట్టిన నా కుమారుని
నీయొద్దకు తీసికొని వచ్చితిని; । అది ఎక్కడ వాని 18
పట్టునో అక్కడ వాని పడద్రోయును; అప్పుడు
వాడు నురుగు కార్చుకొని పండ్లు కొరుకుకొని మూర్ఛి
ల్లును; దాని వెళ్లగొట్టుడని నీ శిష్యులను అడిగితిని
గాని అది వారివలన కాలేదని ఆయనతో చెప్పెను. ।
అందుకాయన — విశ్వాసములేని తరమువారలారా, 19
నేను మీతో ఎంతకాలముందును? ఎంతవరకు మిమ్మును
సహింతును? వాని నాయొద్దకు తీసికొనిరండని వారితో
చెప్పగా । వారాయనయొద్దకు వాని తీసికొని వచ్చిరి. 20
దయ్యము ఆయనను చూడగానే వాని విలవిలలాడిం
చెను గనుక వాడు నేలపడి నురుగు కార్చుకొనుచు
పొర్లాడుచుండెను. । అప్పుడాయన—ఇది వీనికి సంభ 21
వించి యెంతకాలమైనదని వాని తండ్రి నడుగగా
అతడు—బాల్యమునుండియే; । అది వాని నాశనము 22
చేయవలెనని తరచుగా అగ్నిలోను నీళ్లలోను పడ
ద్రోయును. ఏమైనను నీవలననైతే మామీద కనికర
పడి మాకు సహాయము చేయుమనెను. । అందుకు 23
యేసు—(నమ్ముట) నీవలననైతే, నమ్మువానికి సమస్తమును
సాధ్యమేయని అతనితో చెప్పెను. । వెంటనే ఆ 24
చిన్నవాని తండ్రి — నమ్ముచున్నాను, నాకు అపనమ్మిక
యుండకుండ సహాయము చేయుమని[2] బిగ్గరగా చెప్పె
ను. । జనులు గుంపుకూడి తనయొద్దకు పరుగెత్తికొని 25
వచ్చుట యేసు చూచి—మూగవైన చెవిటి దయ్యమా,
వాని వదిలిపొమ్ము, ఇకను వానిలో ప్రవేశింపవద్దని
నీకు ఆజ్ఞాపించుచున్నానని చెప్పి ఆ అపవిత్రాత్మను
గద్దించెను. । అప్పుడు అది కేకవేసి, వానినెంతో 26
విలవిలలాడించి వదిలిపోయెను. అంతట వాడు చచ్చిన
వానివలె ఉండెను గనుక అనేకులు—వాడు చనిపోయె
ననిరి. । అయితే యేసు వాని చెయ్యి పట్టి వాని లేవ 27
నెత్తగా వాడు నిలువబడెను. । ఆయన ఇంటిలోకి 28
వెళ్లిన తరువాత వారు ఏకాంతమున ఉండగా ఆయన

1 మూలభాషలో—మూగాత్మ.

2 కొన్ని ప్రాచీనప్రతులలో—కన్నీళ్లువిడిచి, అని కూర్చబడియున్నది.

నయొద్దకు పిలిచి — నన్ను వెంబడింపగోరువాడు
న్ను తానే ఉపేక్షించుకొని తన సిలువనెత్తికొని నన్ను
ంబడింపవలెను. । తన ప్రాణమును రక్షించుకొన
గోరువాడు దాని పోగొట్టుకొనును; నా నిమిత్తమును
సువార్త నిమిత్తమును తన ప్రాణమును పోగొట్టుకొను
వాడు దాని రక్షించుకొనును. । ఒకడు సర్వలోక
మును సంపాదించుకొని తన ప్రాణమును పోగొట్టు
కొనుట వాని కేమి ప్రయోజనము? । మనుష్యుడు
న ప్రాణమునకు ప్రతిగా ఏమి ఇయ్యగలుగును? ।
వ్యభిచారమును పాపమునుచేయు ఈ తరమువారిలో
న్నుగూర్చియు నా మాటలనుగూర్చియు సిగ్గుపడు
వాడెవడో వానిగూర్చి మనుష్యకుమారుడు తన తండ్రి
మహిమగలవాడై పరిశుద్ధ దూతలతోకూడ వచ్చు
ప్పుడు సిగ్గుపడునని చెప్పెను.
మరియు ఆయన—ఇక్కడ నిలిచియున్నవారిలో
కొందరు దేవునిరాజ్యము బలముతో వచ్చుట చూచు
పర్యంతము మరణము రుచిచూడరని నిశ్చయముగా
మీతో చెప్పుచున్నానని నెను.
ఆరు దినములైన తరువాత యేసు పేతురును యాకో
బును యోహానును మాత్రము వెంటబెట్టుకొని, యెత్త
యిన యొక కొండమీదికి ఏకాంతముగా వారిని
తోడుకొనిపోయి వారియెదుట రూపాంతరము పొం
దెను. । అంతలో ఆయన వస్త్రములు ప్రకాశమాన
మైనవియు మిగుల తెల్లనివియు ఆయెను; లోకమందు
ఏ చాకలివాడును అంత తెల్లగా చలువచేయలేడు. ।
మరియు మోషేయు ఏలీయాయు వారికి కనబడి
యేసుతో మాటలాడుచుండిరి. । అప్పుడు పేతురు—
బోధకుడా, మనమిక్కడ ఉండుట మంచిది; మేము
నీకు ఒకటి మోషేకు ఒకటి ఏలీయాకు ఒకటి మూడు
పర్ణశాలలు కట్టుదుమని చెప్పెను; । వారు మిగుల
భయపడిరి గనుక తాను చెప్పవలసినదేమో అతనికి
తెలియలేదు. । మేఘమొకటి వచ్చి వారిని కమ్మగా—
ఈయన నా ప్రియకుమారుడు, ఈయన మాట విను
డని యొక శబ్దము ఆ మేఘములోనుండి పుట్టెను ।
వెంటనే వారు చుట్టు చూచినప్పుడు తమయొద్దనున్న
యేసు తప్ప మరి ఎవరును వారికి కనబడలేదు.
వారు ఆ కొండ దిగి వచ్చుచుండగా — మనుష్య
కుమారుడు మృతులలోనుండి లేచినప్పుడే గాని అంతకు
ముందు మీరు చూచినవాటిని ఎవనితోను చెప్పవద్దని
ఆయన వారికి ఆజ్ఞాపించెను. । మృతులలోనుండి
లేచుట అనగా ఏమిటో అని వారొకనితో ఒకడు
తర్కించుచు ఆ మాట మనస్సున ఉంచుకొనిరి. ।
పిమ్మట వారు — ఏలీయా ముందుగా రావలెనని
శాస్త్రులు చెప్పుచున్నారే, యిదేమని ఆయన నడిగిరి. ।
అందుకాయన — ఏలీయా ముందుగా వచ్చి సమస్త
మును చక్కపెట్టునను మాట నిజమే; అయినను మను
ష్యకుమారుడు అనేక శ్రమలుపడి తృణీకరింపబడ
వలెనని వ్రాయబడుట ఏమి? । ఏలీయా వచ్చెననియు 13
అతనిగూర్చి వ్రాయబడినప్రకారము వారు తమ
కిష్టమువచ్చినట్టుగా అతనికి చేసిరనియు మీతో చెప్పు
చున్నానని వారితో అనెను.
వారు ఆయన శిష్యులయొద్దకు వచ్చి, వారి చుట్టు 14
బహు జనులు కూడియుండుటయు శాస్త్రులు వారితో
తర్కించుటయు చూచిరి. । వెంటనే జనులందరు ఆయ 15
నను చూచి మిగుల విభ్రాంతినొంది ఆయనయొద్దకు
పరుగెత్తికొనివచ్చి ఆయనకు వందనము చేసిరి. । అప్పు 16
డాయన — మీరు దేనిగూర్చి వారితో తర్కించు
చున్నారని వారినడుగగా । జనసమూహములో ఒకడు 17
—బోధకుడా, మూగదయ్యము[1] పట్టిన నా కుమారుని
నీయొద్దకు తీసికొని వచ్చితిని; । అది ఎక్కడ వాని 18
పట్టునో అక్కడ వాని పడద్రోయును; అప్పుడు
వాడు నురుగు కార్చుకొని పండ్లు కొరుకుకొని మూర్ఛి
ల్లును; దాని వెళ్లగొట్టుడని నీ శిష్యులను అడిగితిని
గాని అది వారివలన కాలేదని ఆయనతో చెప్పెను. ।
అందుకాయన — విశ్వాసములేని తరమువారలారా, 19
నేను మీతో ఎంతకాలముందును? ఎంతవరకు మిమ్మును
సహింతును? వాని నాయొద్దకు తీసికొనిరండని వారితో
చెప్పగా । వారాయనయొద్దకు వాని తీసికొని వచ్చిరి. 20
దయ్యము ఆయనను చూడగానే వాని విలవిలలాడిం
చెను గనుక వాడు నేలపడి నురుగు కార్చుకొనుచు
పొర్లాడుచుండెను. । అప్పుడాయన—ఇది వీనికి సంభ 21
వించి యెంతకాలమైనదని వాని తండ్రి నడుగగా
అతడు—బాల్యమునుండియే; । అది వాని నాశనము 22
చేయవలెనని తరుచుగా అగ్నిలోను నీళ్లలోను పడ
ద్రోయును. ఏమైనను నీవలననైతే మామీద కనికర
పడి మాకు సహాయము చేయుమనెను. । అందుకు 23
యేసు—(నమ్ముట) నీవలననైతే, నమ్మువానికి సమస్తమును
సాధ్యమేయని అతనితో చెప్పెను. । వెంటనే ఆ 24
చిన్నవాని తండ్రి — నమ్ముచున్నాను, నాకు అపనమ్మక
ముండకుండ సహాయము చేయుమని[2] బిగ్గరగా చెప్పె
ను. । జనులు గుంపుకూడి తనయొద్దకు పరుగెత్తికొని 25
వచ్చుట యేసు చూచి—మూగవైన చెవిటి దయ్యమా,
వాని వదిలిపొమ్ము, ఇకను వానిలో ప్రవేశింపవద్దని
నీకు ఆజ్ఞాపించుచున్నానని చెప్పి ఆ అపవిత్రాత్మను
గద్దించెను. । అప్పుడు అది కేకవేసి, వాని నెంతో 26
విలవిలలాడించి వదిలిపోయెను. అంతట వాడు చచ్చిన
వానివలె ఉండెను గనుక అనేకులు—వాడు చనిపోయె
ననిరి. । అయితే యేసు వాని చెయ్యి పట్టి వాని లేవ 27
నెత్తగా వాడు నిలువబడెను. । ఆయన ఇంటిలోకి 28
వెళ్లిన తరువాత వారు ఏకాంతమున ఉండగా ఆయన

1 మూలభాషలో—మూగాత్మ. 2 కొన్ని ప్రాచీనప్రతులలో—కన్నీళ్లువిడిచి, అని కూర్చబడియున్నది.

3 చూచిరి. । పరిసయ్యులును యూదులందరును పెద్దల
పారంపర్యాచారమునుబట్టి చేతులు కడుగుకొంటేనే
4 గాని భోజనము చేయరు. । మరియు వారు సంత
నుండి వచ్చునప్పుడు స్నానము చేసితేనే గాని భోజ
నము చేయరు. ఇదియుగాక గిన్నెలను కుండలను
ఇత్తడి పాత్రలను[1] నీళ్లలో కడుగుట[2] మొదలగు అనే
5 కాచారములను వారనుసరించుకొనినవారు. । అప్పుడు
పరిసయ్యులును శాస్త్రులును—నీ శిష్యులెందుకు పెద్దల
పారంపర్యాచారముచొప్పున నడుచుకొనక అప
విత్రమైన చేతులతో భోజనము చేయుదురని ఆయన
6 నడిగిరి. । అందుకాయన వారితో ఈలాగు చెప్పెను—

ఈ ప్రజలు పెదవులతో నన్ను ఘనపరచుదురు
గాని వారి హృదయము నాకు దూరముగా
7 ఉన్నది. । వారు మానవులు కల్పించిన పద్ధ
తులు దేవోపదేశములని బోధించుచు నన్ను
వ్యర్థముగా ఆరాధించుదురు

అని వ్రాయబడినట్టు వేషధారులైన మిమ్మునుగూర్చి
8 యెషయా[3] ప్రవచించినది సరియే. । మీరు దేవుని
ఆజ్ఞను విడిచిపెట్టి మనుష్యుల పారంపర్యాచారమును
9 గైకొనుచున్నారు. । మరియు ఆయన—మీరు మీ
పారంపర్యాచారమును గైకొనుటకై దేవుని ఆజ్ఞను
10 బొత్తిగా నిరాకరించుదురు. । —నీ తలిదండ్రులను ఘన
పరచవలెననియు, తండ్రినైనను తల్లినైనను దూషించు
వానికి మరణశిక్ష విధింపవలెననియు మోషే చెప్పెను
11 గదా. । అయినను మీరు — ఒకడు తన తండ్రినైనను
12 తల్లినైనను చూచి—నావలన నీకు ప్రయోజనమగునది
ఏదో అది కొర్బాను, అనగా దేవార్పితమని చెప్పిన
యెడల తన తండ్రికైనను తల్లికైనను వానిని ఏమియు
13 చేయనియ్యక । మీరు నియమించిన మీ పారంపర్యా
చారమువలన దేవుని వాక్యమును నిరర్థకము చేయు
దురు. ఇటువంటివి అనేకములు మీరు చేయుదురని
14 చెప్పెను. । అప్పుడాయన జనసమూహమును మరల
తనయొద్దకు పిలిచి—మీరందరు నా మాట విని గ్రహిం
15 చుడి. । మనుష్యుని వెలుపటనుండి లోపలికి పోయి
వానిని అపవిత్రునిగా చేయగలుగునది ఏదియు లేదు
గాని లోపటనుండి బయలువెళ్లునవే మనుష్యుని అప
17 విత్రునిగా చేయుననెను. । ఆయన జనసమూహమును
విడిచి యింటిలోకి వచ్చినప్పుడు ఆయన శిష్యులు
18 ఈ ఉపమానమునుగూర్చి ఆయన నడుగగా । ఆయన
వారితో ఇట్లనెను — మీరును ఇంత అవివేకులై
యున్నారా? వెలుపటనుండి మనుష్యుని లోపలికి పోవు
నదేదియు వాని నపవిత్రునిగా చేయజాలదని మీరు
19 గ్రహింపకున్నారా? । అది వాని హృదయములో
ప్రవేశింపక కడుపులోనే ప్రవేశించి బహిర్భూమిలో
విడువబడును; ఇట్లు అది భోజనపదార్థములన్నిటిని
పవిత్రపరచును. । మనుష్యుని లోపటనుండి బయలు 20
వెళ్లునది మనుష్యుని అపవిత్రపరచును. । లోపట 21
నుండి, అనగా మనుష్యుల హృదయములోనుండి దురా
లోచనలును జారత్వములును దొంగతనములును । నర 22
హత్యలును వ్యభిచారములును లోభములును చెడుతన
ములును కృత్రిమమును కామవికారమును మత్సర
మును[4] దేవదూషణయు అహంభావమును అవివేకమును
వచ్చును. । ఈ చెడ్డవన్నియు లోపటనుండియే బయలు 23
వెళ్లి మనుష్యుని అపవిత్రపరచునని ఆయన చెప్పెను.

ఆయన అక్కడనుండి లేచి తూరు సీదోనుల 24
ప్రాంతములకు వెళ్లి యొక ఇంట ప్రవేశించి, ఆ
సంగతి ఎవనికిని తెలియకుండవలెనని కోరెను గాని
ఆయన మరుగై యుండలేక పోయెను. । అపవిత్రాత్మ 25
పట్టిన చిన్నకుమార్తెగల యొక స్త్రీ ఆయననుగూర్చి విని,
వచ్చి ఆయన పాదములమీద పడెను. । ఆ స్త్రీ సురో 26
ఫెనికయ వంశమందు పుట్టిన హెల్లేనీయురాలు. ఆమె
తన కుమార్తెలోనుండి ఆ దయ్యమును వెళ్లగొట్టుమని
ఆయనను వేడుకొనెను. । ఆయన ఆమెను చూచి— 27
పిల్లలు మొదట తృప్తిపొందవలెను; పిల్లల భోజనము
తీసికొని కుక్కపిల్లలకు వేయుట యుక్తము కాదనెను. ।
అందుకామె—నిజమే ప్రభువా, అయితే కుక్కపిల్లలు 28
సహితము బల్లక్రింద ఉండి పిల్లలు పడవేయు రొట్టె
ముక్కలు తినును గదా అని ఆయనతో చెప్పెను. ।
అందుకాయన — ఈ మాట చెప్పినందున వెళ్లుము; 29
దయ్యము నీ కుమార్తెను వదలిపోయినదని ఆమెతో
చెప్పెను. । ఆమె యింటికి వచ్చి తన కుమార్తె మంచము 30
మీద పండుకొని యుండుటయు దయ్యము వదలి
పోయి యుండుటయు చూచెను.

ఆయన మరల తూరు ప్రాంతములు విడిచి సీదోను 31
ద్వారా దెకపొలి ప్రాంతములమీదుగా గలిలైయ
సముద్రమునొద్దకు వచ్చెను. । అప్పుడు వారు చెవుడు 32
గల నత్తివాని ఒకని ఆయనయొద్దకు తోడుకొనివచ్చి
వానిమీద చెయ్యి యుంచుమని ఆయనను వేడుకొనిరి. ।
ఆయన సమూహములోనుండి వానిని ఏకాంతమునకు 33
తోడుకొనిపోయి, వాని చెవులలో తన వ్రేళ్లుపెట్టి
ఉమ్మివేసి వాని నాలుక ముట్టి । ఆకాశమువైపు కన్ను 34
లెత్తి నిట్టూర్పువిడిచి—ఎప్ఫతా అని వానితో చెప్పెను;
ఆ మాటకు తెరవబడుమని అర్థము. । అంతట వాని 35
చెవులు తెరవబడెను, వాని నాలుక నరము సడలెను
గనుక వాడు తేటగా మాటలాడెను. । అప్పుడాయన 36
— ఇది ఎవనితోను చెప్పవద్దని వారికాజ్ఞాపించెను;
అయితే ఆయన చెప్పవద్దని వారికాజ్ఞాపించిన కొలది
వారు మరి ఎక్కువగా దాని ప్రసిద్ధిచేయుచు । —

1 అనేక ప్రాచీనప్రతులలో-మంచములను అని కూర్చబడియున్నది. 2 మూలభాషలో-ఇత్తడి పాత్రల బాప్తిస్మములు. 3 యెషయా
29: 13. 4 మూలభాషలో_చెడ్డకండ్లును.

శిష్యులు—మేమెందుకు ఆ దయ్యమును వెళ్లగొట్టలేక
29 పోతిమని ఆయన నడిగిరి. । అందు కాయన—ప్రార్థన
వలననే[1] గాని మరి దేనివలననైనను ఈ విధమైనది
వదిలిపోవుట అసాధ్యమని వారితో చెప్పెను.
30 వారక్కడనుండి బయలుదేరి గలిలైయ మార్గమున
వెళ్లుచుండిరి; అది ఎవనికిని తెలియుట ఆయనకిష్టము
31 లేకపోయెను; । ఏలయనగా ఆయన తన శిష్యులకు
బోధించుచు — మనుష్యకుమారుడు మనుష్యుల చేతికి
అప్పగింపబడుచున్నాడు, వారాయనను చంపెదరు;
మూడు దినములైన తరువాత ఆయన లేచునని వారితో
32 చెప్పెను. । వారు ఆ మాట గ్రహింపలేదు గాని
ఆయన నడుగ వెరచిరి.
33 అంతట వారు కపెర్నహూముకు వచ్చిరి. వారు
— ఎవడు గొప్పవాడని మార్గమున ఒకనితో ఒకడు
34 వాదించిరి గనుక । ఆయన ఇంట ఉన్నప్పుడు—మార్గ
మున మీరు ఒకరితో ఒకరు దేనిగూర్చి తర్కించు
35 చుంటిరని వారినడుగగా । వారు ఊరకుండిరి. అప్పు
డాయన కూర్చుండి పన్నెండుమందిని పిలిచి—ఎవడైన
నను మొదటివాడైయుండ గోరినయెడల వాడందరిలో
కడపటివాడును అందరికి పరిచారకుడునై యుండవలె
36 నని చెప్పి । యొక చిన్న పిల్లను తీసికొని వారి మధ్యను
37 నిలువబెట్టి, వానిని ఎత్తి కౌగలించుకొని । — ఇట్టి
చిన్న పిల్లలలో ఒకని నా పేరట చేర్చుకొనువాడు
నన్ను చేర్చుకొనును; నన్ను చేర్చుకొనువాడు నన్ను
కాక నన్ను పంపినవానిని చేర్చుకొనునని వారితో
చెప్పెను.
38 అంతట యోహాను—బోధకుడా, ఒకడు నీ పేరట
దయ్యములను వెళ్లగొట్టుట చూచితిమి; వాడు మనలను
వెంబడించువాడు కాడు గనుక వానిని ఆటంకపరచితి
39 మని చెప్పెను. । అందుకు యేసు — వానిని ఆటంక
పరచకుడి; నా పేరట అద్భుతము చేసి నన్ను చులక
40 నగా నిందింపగలవాడెవడును లేడు; । మనకు విరోధి
41 కానివాడు మన పక్షముగా నున్నవాడే. । మీరు
క్రీస్తువారని నా పేరట మీకు గిన్నెడు నీళ్లు త్రాగ
నిచ్చువాడు తనకు రావలసిన ఫలము పోగొట్టుకొనడని
42 మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. । నాయందు
విశ్వాసముంచు ఈ చిన్నవారిలో నొకని అభ్యంతర
పరచువాడెవడో వాడు మెడకు పెద్ద తిరుగటిరాయి
కట్టబడి సముద్రములో పడవేయబడుట వానికి
43 మేలు. । నీ చెయ్యి నిన్ను అభ్యంతరపరచినయెడల
దాని నరికివేయుము; నీవు రెండు చేతులు కలిగి నరక
ములోని ఆరని అగ్నిలోకి పోవుటకంటె అంగహీను
45 డవై (నిత్య) జీవములో ప్రవేశించుట మేలు. । నీ
పాదము నిన్ను అభ్యంతరపరచినయెడల దాని నరికి
వేయుము; రెండు పాదములు కలిగి నరకములో పడ
వేయబడుటకంటె కుంటివాడవై (నిత్య) జీవములో
ప్రవేశించుట మేలు. । నీ కన్ను నిన్ను అభ్యంతర 47
పరచినయెడల దాని తీసి పారవేయుము; రెండు
కన్నులు కలిగి నరకములో పడవేయబడుటకంటె
ఒంటికన్ను గలవాడవై దేవుని రాజ్యములో ప్రవేశిం
చుట మేలు. । నరకమున వారి పురుగు చావదు; 48
అగ్ని ఆరదు. । ప్రతివానికి ఉప్పుసారము అగ్నివలన 49
కలుగును. । ఉప్పు మంచిదే గాని ఉప్పు నిస్సారమైన 50
యెడల దేనివలన దానికి సారము కలుగజేతురు? మీలో
మీరు ఉప్పుసారము గలవారై యుండి యొకరితో
ఒకరు సమాధానముగా ఉండుడని చెప్పెను.
ఆయన అక్కడనుండి లేచి యూదైయ ప్రాంత 10
ములకును యొర్దాను అద్దరికిని వచ్చెను. జనసమూహ
ములు తిరిగి ఆయనయొద్దకు కూడివచ్చిరి. ఆయన తన
వాడుకచొప్పున వారికి మరల బోధించుచుండెను. ।
ఆ సమయమున పరిసయ్యులు ఆయనయొద్దకు వచ్చి 2
ఆయనను శోధించుటకై — పురుషుడు తన భార్యను
విడనాడుట న్యాయమా అని ఆయన నడిగిరి. । అందు 3
కాయన — మోషే మీకేమి ఆజ్ఞాపించెనని వారినడి
గెను. । వారు—పరిత్యాగపత్రిక వ్రాయించి ఆమెను 4
విడనాడవలెనని మోషే సెలవిచ్చెనని చెప్పగా । యేసు 5
—మీ హృదయకాఠిన్యమునుబట్టి అతడీ ఆజ్ఞను మీకు
వ్రాసియిచ్చెను గాని । సృష్ట్యాదినుండి (దేవుడు) 6
వారిని పురుషునిగాను స్త్రీనిగాను కలుగజేసెను. । ఈ 7
హేతువుచేత పురుషుడు తన తలిదండ్రులను విడిచి
పెట్టి తన భార్యను హత్తుకొనును; । వారిద్దరు ఏక 8
శరీరమై యుందురు గనుక వారికను ఇద్దరుగా నుండక
యేకశరీరముగా నుందురు. । కాబట్టి దేవుడు జతపర 9
చినదానిని మనుష్యుడు వేరుపరచకూడదని వారితో
చెప్పెను.
ఇంటికి వచ్చి శిష్యులు ఈ సంగతినిగూర్చి ఆయ 10
నను మరల నడిగిరి. । అందుకాయన —తన భార్యను 11
విడనాడి మరియొకతెను పెండ్లిచేసికొనువాడు తాను
విడనాడిన ఆమె విషయమై వ్యభిచరించువాడు. ।
మరియు స్త్రీ తన పురుషుని విడిచి మరియొకని పెండ్లి 12
చేసికొనినయెడల ఆమె వ్యభిచారము చేయునదవునని
వారితో చెప్పెను.
ఆ సమయమున తమ చిన్నపిల్లలను ముట్టవలెనని 13
కొందరాయనయొద్దకు వారిని తీసికొని వచ్చిరి;
అయితే శిష్యులు (వారిని తీసికొనివచ్చిన) వారిని
గద్దించిరి. । యేసు అది చూచి కోపపడి — చిన్న 14
పిల్లలను నాయొద్దకు రానియ్యుడి, వారి నాటంకపరచ
వద్దు; దేవునిరాజ్యము ఈలాటివారిదే. । చిన్నపిల్లవలె 15
దేవునిరాజ్యము నంగీకరింపనివాడు అందులో ప్రవే
శింపడని మీతో నిశ్చయముగా చెప్పుచున్నానని

1 అనేక ప్రాచీన ప్రతులలో—(వలనను) ఉపవాసమువలననే, అని కూర్పబడియున్నది.

ఎత్తి కౌగలించుకొని వారిమీద
ంచెను.
ందేరి మార్గమున పోవుచుండగా
నివచ్చి ఆయనయెదుట మోకా
తా, నిత్యజీవమునకు వారసుడనగు
దునని ఆయన నడిగెను. । యేసు
ండని యేల చెప్పుచున్నావు? దేవు
రి ఎవడును సత్పురుషుడు కాడు. ।
సి, వ్యభిచరింపవద్దు, దొంగిలవద్దు,
లుకవద్దు, మోసపుచ్చవద్దు, నీ తలి
ంపుము అను ఆజ్ఞలు నీకు తెలి
అతనితో చెప్పెను. । అందుకతడు
్యమునుండి ఇవన్నియు అనుసరించు
చెప్పెను. । యేసు అతని చూచి
— నీకు ఒకటి కొదువగానున్నది;
ినవన్నియు అమ్మి బీదలకిమ్ము, పర
నము కలుగును; నీవు వచ్చి నన్ను
ెప్పెను. । అతడు మిగుల ఆస్తిగల
మాటకు ముఖము చిన్నబుచ్చుకొని
ోయెను.
సు చుట్టు చూచి — ఆస్తిగలవారు
ో ప్రవేశించుట ఎంతో దుర్లభమని
ప్పెను. । ఆయన మాటలకు శిష్యులు
అందుకు యేసు తిరిగి వారితో ఇట్లు
, తమ ఆస్తియందు నమ్మికయుంచు
జ్యములో ప్రవేశించుట ఎంతో
ంతుడు దేవుని రాజ్యములో ప్రవే
ొ సూదిబెజ్జములో దూరుట సుల
వారు అత్యధికముగా ఆశ్చర్యపడి
స రక్షణపొందగలడని ఆయన నడి
ి చూచి—ఇది మనుష్యులకు అసా
ునికి అసాధ్యము కాదు; దేవునికి
్యమే అనెను.
ము సమస్తమును విడిచిపెట్టి నిన్ను
ఆయనతో చెప్పసాగెను. । అందుకు
— నా నిమిత్తమును సువార్త నిమిత్త
అన్నదమ్ములనైనను అక్కచెల్లెండ్ల
లనైనను పిల్లలనైనను భూములనైనను
ప్పుడు ఇహమందు హింసలతోకూడ
డ్లను అన్నదమ్ములను అక్కచెల్లెండ్లను
భూములను, రాబోవు లోకమందు
ందునని నిశ్చయముగా మీతో చెప్పు
ుదటివారు అనేకులు కడపటివారగు
రు మొదటివారగుదురు.
ణమై యెరూషలేమునకు వెళ్లుచుం
రికి ముందు నడుచుచుండగా వారు

విస్మయమొందిరి, వెంబడించువారు భయపడిరి. అప్పు
డాయన తిరిగి పన్నెండుగురు శిష్యులను పిలుచుకొని,
తనకు సంభవింపబోవువాటిని వారికి తెలియజెప్ప
నారంభించి । — ఇదిగో మనము యెరూషలేముకు 33
వెళ్లుచున్నాము; మనుష్యకుమారుడు ప్రధానయాజ
కులకును శాస్త్రులకును అప్పగింపబడును; వారాయనకు
మరణశిక్ష విధించి ఆయనను అన్యజనులకప్పగించె
దరు. । వారు ఆయనను అపహసించి, ఆయనమీద 34
ఉమ్మివేసి, కొరడాలతో ఆయనను కొట్టి చంపెదరు;
మూడు దినములైన తరువాత ఆయన తిరిగి లేచునని
చెప్పెను.

జెబెదై కుమారులైన యాకోబును యోహానును 35
ఆయనయొద్దకు వచ్చి—బోధకుడా, మేము అడుగున
దెల్ల నీవు మాకు చేయ గోరుచున్నామని చెప్పగా ।
ఆయన—నేను మీకేమి చేయ గోరుచున్నారని వారి 36
నడిగెను. । వారు—నీ మహిమయందు నీ కుడివైపున 37
ఒకడును నీ యెడమవైపున ఒకడును కూర్చుండునట్లు
మాకు దయచేయుమని చెప్పిరి. । యేసు — మీరేమి 38
అడుగుచున్నారో మీకు తెలియదు; నేను త్రాగు
చున్న గిన్నెలోనిది త్రాగుటకైనను, నేను పొందు
చున్న బాప్తిస్మము పొందుటకైనను మీచేత అగునా
అని వారి నడుగగా వారు — మాచేత అగుననిరి. ।
అప్పుడు యేసు — నేను త్రాగుచున్న గిన్నెలోనిది 39
మీరు త్రాగెదరు; నేను పొందుచున్న బాప్తిస్మము
మీరు పొందెదరు గాని । నా కుడివైపునను ఎడమ 40
వైపునను కూర్చుండనిచ్చుట నా వశములో లేదు; అది
ఎవరికి సిద్ధపరచబడెనో వారికే (దొరుకునని) వారితో
చెప్పెను. । తక్కిన పదిమంది శిష్యులు ఆ మాట విని 41
యాకోబు యోహానులమీద కోపపడసాగిరి. । యేసు 42
వారిని తనయొద్దకు పిలిచి వారితో ఇట్లనెను — అన్య
జనులలో అధికారులని యెంచబడినవారు వారిమీద
కఠినప్రభుత్వము చేయుదురు; వారిలో గొప్పవారు
వారిమీద కఠినముగా అధికారము చేయుదురని మీకు
తెలియును. । మీలో ఆలాగుండకూడదు. మీలో 43
ఎవడైనను గొప్పవాడై యుండగోరినయెడల వాడు
మీకు పరిచారము చేయువాడై యుండవలెను. ।
మీలో ఎవడైనను ప్రముఖుడై యుండగోరినయెడల 44
వాడు అందరికి దాసుడై యుండవలెను. । మనుష్య 45
కుమారుడు పరిచారము చేయించుకొనుటకు రాలేదు
గాని పరిచారము చేయుటకును, అనేకులకు ప్రతిగా
విమోచన క్రయధనముగా తన ప్రాణము ఇచ్చుట
కును వచ్చెననెను.

వారు యెరికోపట్టణమునకు వచ్చిరి. ఆయన తన 46
శిష్యులతోను బహు జనసమూహముతోను యెరికో
నుండి బయలుదేరి వచ్చుచుండగా తిమయి కుమారు
డగు బర్తిమయియను గుడ్డి భిక్షకుడు త్రోవప్రక్కను

47 కూర్చుండెను. । ఈయన నజరేయుడైన యేసు అని
వాడు విని—దావీదు కుమారుడా యేసూ, నన్ను
కరుణింపుమని చెప్పి కేకలువేయ మొదలుపెట్టెను. ।
48 ఊరకొమ్మని అనేకులు వాని గద్దించిరి గాని వాడు—
దావీదు కుమారుడా, నన్ను కరుణింపుమని మరి ఎక్కు
49 వగా కేకలువేసెను. । అప్పుడు యేసు నిలిచి—వాని
పిలువుడని చెప్పగా వారా గుడ్డివాని పిలిచి—ధైర్యము
తెచ్చుకొనుము, ఆయన నిన్ను పిలుచుచున్నాడు,
50 లెమ్మని వానితో చెప్పిరి. । అంతట వాడు బట్టను పార
51 వేసి దిగ్గున లేచి యేసునొద్దకు వచ్చెను. । యేసు —
నేను నీకేమి చేయ గోరుచున్నావని వాని నడుగగా
ఆ గుడ్డివాడు—బోధకుడా, నాకు దృష్టి కలుగజేయు
52 మని ఆయనతో అనెను. । అందుకు యేసు — నీవు
వెళ్లుము; నీ విశ్వాసము నిన్ను స్వస్థపరచెనని చెప్పెను.
వెంటనే వాడు దృష్టిగలవాడై త్రోవను ఆయనవెంట
వెళ్లెను.

11 వారు యెరూషలేముకు సమీపించి ఒలీవల
కొండదగ్గరనున్న బేత్పగే బేతనియ అను గ్రామము
లకు వచ్చినప్పుడు ఆయన తన శిష్యులలో ఇద్దరిని
2 చూచి । —మీ యెదుటనున్న గ్రామమునకు వెళ్లుడి;
అందులో మీరు ప్రవేశింపగానే కట్టబడియున్న
యొక గాడిదెపిల్ల కనబడును; దానిమీద ఏ మనుష్యు
డును ఎప్పుడును కూర్చుండలేదు; దానివిప్పి తోలు
3 కొని రండి. । ఎవడైనను—మీరెందుకు ఈలాగు చేయు
చున్నారని మిమ్ము నడిగినయెడల — అది ప్రభువుకు
కావలసియున్నదని చెప్పుడి. తక్షణమే అతడు దానిని
ఇక్కడికి తోలనంపునని చెప్పి వారిని పంపెను. ।
4-5 వారు పోగా వీధిలో ఇంటికి బయట తలవాకిట కట్ట
బడియున్న గాడిదెపిల్ల యొకటి వారికి కనబడెను;
దాని విప్పుచుండగా అక్కడ నిలిచియున్నవారిలో
కొందరు — మీరేమి చేయుచున్నారు; గాడిదెపిల్లను
6 ఎందుకు విప్పుచున్నారని వారినడిగిరి. । అందుకు
శిష్యులు యేసు ఆజ్ఞాపించినట్టు వారితో చెప్పగా
వారు పోనిచ్చిరి.
7 వారు ఆ గాడిదెపిల్లను యేసునొద్దకు తోలుకొని
వచ్చి తమ బట్టలు దానిమీద వేయగా ఆయన దానిని
8 ఎక్కి కూర్చుండెను. । అనేకులు తమ బట్టలను దారి
పొడుగున పరచిరి, కొందరు తాము పొలములలో
9 నరికిన కొమ్మలను పరచిరి. । మరియు ముందు నడుచు
చుండువారును వెనుక వచ్చుచుండువారును
—జయము[1]
ప్రభువు పేరట వచ్చువాడు స్తుతింపబడును గాక
10 వచ్చుచున్న మన తండ్రియైన దావీదు రాజ్యము
స్తుతింపబడును గాక
సర్వోన్నతమైన స్థలములలో జయము[1]

అని కేకలువేయుచుండిరి.
ఆయన యెరూషలేముకు వచ్చి దేవాలయములో
ప్రవేశించి, చుట్టు సమస్తమును చూచి, సాయంకాలమై
నందున పన్నెండుమందితోకూడ బేతనియకు వెళ్లెను.
మరునాడు వారు బేతనియనుండి వెళ్లుచుండగా
ఆయన ఆకలిగొని । ఆకులుగల ఒక అంజూరపు
చెట్టును దూరమునుండి చూచి, దానిమీద ఏమైనను
దొరుకునేమో అని వచ్చెను. దానియొద్దకు వచ్చి
చూడగా ఆకులు తప్ప మరేమియు కనబడలేదు; ఏల
యనగా అది అంజూరపు పండ్లకాలము కాదు. ।
అందుకాయన — ఇకమీదట ఎన్నటికిని నీ పండ్లు
ఎవరును తినకుందురు గాక అని చెప్పెను; ఇది ఆయన
శిష్యులు వినిరి.
వారు యెరూషలేముకు వచ్చినప్పుడు ఆయన దేవా
లయములో ప్రవేశించి, దేవాలయములో క్రయ
విక్రయములు చేయువారిని వెళ్లగొట్ట నారంభించి,
రూకలు మార్చువారి బల్లలను, గువ్వలమ్మువారి పీటలను
పడద్రోసి । దేవాలయముగుండ ఏ పాత్రయైనను
ఎవనిని తేనియ్యకుండెను. । మరియు ఆయన బోధిం
చుచు
—నా మందిరము సమస్తమైన అన్యజనులకు
ప్రార్థన మందిరమనబడును
అని వ్రాయబడలేదా?[2] అయితే మీరు దానిని దొంగల
గుహగా చేసితిరనెను.
శాస్త్రులును ప్రధానయాజకులును ఆ మాట విని,
జనసమూహమంతయు ఆయన బోధకు బహుగా ఆశ్చ
ర్యపడుట చూచి, ఆయనకు భయపడి, ఆయన నేలాగు
సంహరించుదుమా అని సమయము చూచుచుండిరి.
సాయంకాలమైనప్పుడు ఆయన పట్టణములో
నుండి బయలుదేరెను.
ప్రొద్దున వారు మార్గమున పోవుచుండగా ఆ
అంజూరపుచెట్టు వేళ్లు మొదలుకొని యెండియుండుట
చూచిరి. । అప్పుడు పేతురు ఆ సంగతి జ్ఞాపకము
తెచ్చుకొని—బోధకుడా, యిదిగో నీవు శపించిన అం
జూరపుచెట్టు ఎండిపోయెనని ఆయనతో చెప్పెను.
అందుకు యేసు వారితో ఇట్లనెను — మీరు దేవుని
యందు విశ్వాసముంచుడి. । ఎవడైనను ఈ కొండను
చూచి—నీవు ఎత్తబడి సముద్రములో పడవేయబడు
మని చెప్పి, తన మనస్సులో సందేహింపక తాను
చెప్పినది జరుగునని నమ్మినయెడల వాడు చెప్పినది
జరుగునని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను.
అందుచేతను ప్రార్థన చేయునప్పుడు మీరు అడుగు
చున్న వాటినెల్లను పొందియున్నామని నమ్ముడి
అప్పుడు అవి మీకు కలుగునని మీతో చెప్పుచు
న్నాను.

1 మూలభాషలో—హోసన్నా. 2 యెషయా, 56: 7; యిర్మీయా, 7: 11.

మీకు ఒకనిమీద విరోధ మేమైనను కలిగియున్న
పక్షమందు, మీరు నిలువబడి ప్రార్థనచేయునప్పుడెల్ల
వానిని క్షమించుడి. అప్పుడు పరలోకమందున్న మీ
తండ్రియు మీ పాపములు క్షమించును.[1]
వారు యెరూషలేముకు తిరిగి వచ్చినతరువాత
ఆయన దేవాలయములో తిరుగుచుండగా ప్రధాన
యాజకులును శాస్త్రులును పెద్దలును ఆయనయొద్దకు
వచ్చి। —ఏ అధికారమువలన ఈ కార్యములు చేయు
చున్నావు? వీటిని చేయుటకై యీ అధికార మెవడు
నీకిచ్చెనని అడిగిరి. । అందుకు యేసు—నేను మిమ్మును
ఒక మాట అడిగెదను, నా కుత్తరమియ్యుడి, అప్పుడు
నేను ఏ అధికారమువలన వీటిని చేయుచున్నానో
అది మీతో చెప్పుదును. । యోహాను ఇచ్చిన బాప్తి
స్మము పరలోకమునుండి కలిగినదా మనుష్యులనుండి
కలిగినదా? నాకు ఉత్తరమియ్యుడని చెప్పెను. । అం
దుకు వారు — మనము పరలోకమునుండి కలిగినదని
చెప్పినయెడల ఆయన—ఆలాగైతే మీరు ఎందుకతని
నమ్మలేదని అడుగును; మనుష్యులవలన కలిగినదని చెప్పు
దుమా అని తమలోతాము ఆలోచించుకొనిరి గాని,
అందరు యోహాను నిజముగా ప్రవక్తయని యెంచిరి
గనుక ప్రజలకు భయపడి — ఆ సంగతి మాకు తెలియ
దని యేసుకు ఉత్తరమిచ్చిరి. అందుకు యేసు—ఏ అధి
కారమువలన ఈ కార్యములు చేయుచున్నానో అది
[illegible] నేను మీతో చెప్పననెను.

12 ఆయన ఉపమానరీతిగా వారికి బోధింపనారం
భించెను; ఎట్లనగా—ఒక మనుష్యుడు ద్రాక్షతోట
నాటించి దానిచుట్టు కంచె వేయించి ద్రాక్షలతొట్టి
తొలిపించి గోపురము కట్టించి కాపులకు దాని గుత్త
కిచ్చి దేశాంతరముపోయెను. । పంటకాలమందు ఆ
కాపులచేత ద్రాక్షతోట పండ్లలో తన భాగము తీసి
కొనివచ్చుటకు కాపులయొద్దకు అతడు ఒక దాసుని
పంపగా । వారు వాని పట్టుకొని కొట్టి యేమియు
ఇయ్యక పంపివేసిరి. । మరల అతడు మరియొక దాసుని
వారియొద్దకు పంపగా వారు వాని తల గాయముచేసి
అవమానపరచిరి. । అతడు మరియొకని పంపగా వాని
చంపిరి. అతడింక అనేకులను పంపగా వారు కొందరిని
కొట్టిరి కొందరిని చంపిరి. । ఇంక అతనికి ప్రియకుమా
రుడు ఒకడుండెను గనుక — వారు తన కుమారుని
సన్మానించెదరనుకొని తుదకు వారియొద్దకు అతని పం
పెను. । అయితే ఆ కాపులు — ఇతడు వారసుడు;
ఇతని చంపుదము రండి, అప్పుడు స్వాస్థ్యము మన
8 దగునని తమలోతాము చెప్పుకొని । అతని పట్టుకొని
9 చంపి ద్రాక్షతోట వెలపల పారవేసిరి. । కావున ఆ
ద్రాక్షతోట యజమానుడేమి చేయును? అతడు వచ్చి
ఆ కాపులను సంహరించి యితరులకు ఆ ద్రాక్షతోట
ఇచ్చునుగదా. మరియు

—ఇల్లు కట్టువారు నిరాకరించిన రాయి 10
మూలకు తలరాయి ఆయెను
ఇది ప్రభువువలననే కలిగెను 11
ఇది మన కన్నులకు ఆశ్చర్యము[2]

అను లేఖనము మీరు చదవలేదా అని అడుగగా ।
వారు తమ్మునుగూర్చి ఆ ఉపమానము చెప్పెనని 12
గ్రహించి ఆయనను పట్టుకొన సమయము చూచు
చుండిరి గాని జనసమూహమునకు భయపడి ఆయనను
విడిచిపోయిరి.
తరువాత వారు మాటలలో ఆయనను చిక్కుపరచ 13
వలెనని పరిసయ్యులను హేరోదీయులను కొందరిని
ఆయనయొద్దకు పంపిరి. । వారు వచ్చి—బోధకుడా, 14
నీవు సత్యవంతుడవు; నీవు ఎవనిని లక్ష్యపెట్టనివాడవని
మేమెరుగుదుము; నీవు మోమాటములేనివాడవై దేవుని
మార్గము సత్యముగా బోధించువాడవు. కైసరుకు
పన్నిచ్చుట ధర్మమా కాదా? । ఇచ్చెదమా ఇయ్యకుం 15
దుమా? అని ఆయన నడిగిరి. ఆయన వారి వేషధార
ణను ఎరిగి—మీరు నన్ను ఎందుకు శోధించుచున్నారు?
ఒక దేనారము[3] నాయొద్దకు తెచ్చి చూపుడని వారితో
చెప్పెను. । వారు తెచ్చి చూపగా ఆయన — ఈ 16
రూపమును పై వ్రాతయు ఎవనివని వారి నడుగగా
వారు—కైసరువి అనిరి. । అందుకు యేసు—కైసరువి 17
కైసరుకును దేవునివి దేవునికిని చెల్లించుడని వారితో
చెప్పగా వారాయననుగూర్చి బహుగా ఆశ్చర్యపడిరి.
తరువాత పునరుత్థానము లేదని చెప్పెడి సద్దూ 18
కయ్యులు ఆయనయొద్దకువచ్చి । —బోధకుడా, తన 19
భార్య బ్రదికియుండగా ఒకడు పిల్లలులేక చనిపో
యినయెడల వాని సహోదరుడు వాని భార్యను
పెండ్లిచేసికొని తన సహోదరునికి సంతానము కలుగ
జేయవలెనని మోషే మాకు వ్రాసియిచ్చెను. । ఏడు 20
గురు సహోదరులుండిరి. మొదటివాడు ఒకస్త్రీని
పెండ్లిచేసికొని సంతానములేకయే చనిపోయెను ।
గనుక రెండవవాడు ఆమెను పెండ్లిచేసికొనెను; 21
వాడును సంతానములేక చనిపోయెను; అటువలెనే
మూడవవాడును చనిపోయెను. । ఇట్లు ఏడుగురును 22
సంతానములేకయే చనిపోయిరి. అందరివెనుక ఆ
స్త్రీయు చనిపోయెను. । పునరుత్థానమందు వారిలో 23
ఎవనికి ఆమె భార్యగా ఉండును? ఆమె ఆ యేడుగురికి
భార్య ఆయెను గదా అని అడిగిరి. । అందుకు యేసు 24
— మీరు లేఖనములను దేవుని శక్తిని యెరుగక యుం
డుటవలననే పొరబడుచున్నారు. । వారు మృతులలో 25
నుండి లేచునప్పుడు పెండ్లికియ్యరు పెండ్లికియ్యబడరు

1 అనేక ప్రాచీనప్రతులలో—మీరు క్షమింపనియెడల పరలోకమందున్న మీ తండ్రియు మీ పాపములు క్షమింపడు, అని కూర్చబడియున్నది.
[2] కీర్తన. 118: 22, 23. 3 దేనారము ఇంచుమించు అర్ధరూపాయి కావచ్చును.

26 గాని పరలోకమందున్న దూతలవలె నుందురు. । వారు
లేచెదరని మృతులనుగూర్చిన సంగతి మోషే గ్రంథ
మందలి పొద భాగములో[1] మీరు చదవలేదా? అందు
లో దేవుడు—నేను అబ్రాహాము దేవుడను ఇస్సాకు
దేవుడను యాకోబు దేవుడనని అతనితో చెప్పెను. ।
27 ఆయన సజీవుల దేవుడు గాని మృతుల దేవుడు కాడు.
కావున మీరు బహుగా పొరబడుచున్నారని వారితో
చెప్పెను.
28 శాస్త్రులలో ఒకడు వచ్చి వారు తర్కించుట విని,
ఆయన వారికి బాగుగా ఉత్తరమిచ్చెనని గ్రహించి—
ఆజ్ఞలన్నిటిలో ప్రధానమైనదేదని ఆయన నడిగెను. ।
29 అందుకు యేసు—ప్రధానమైనది ఏదనగా—ఓ ఇశ్రా
యేలూ, వినుము; మన దేవుడైన ప్రభువు అద్వితీయ
30 ప్రభువు. । నీవు నీ పూర్ణహృదయముతోను నీ పూ
ర్ణాత్మతోను నీ పూర్ణవివేకముతోను నీ పూర్ణబలము
తోను నీ దేవుడైన ప్రభువును ప్రేమింపవలెననునది
31 ప్రధానమైన ఆజ్ఞ.[2] । రెండవది, నీవు నిన్నువలె నీ
పొరుగువాని ప్రేమింపవలెననునదియే.[3] వీటికంటె
ముఖ్యమైన ఆజ్ఞ మరేదియు లేదని అతనితో చెప్పెను. ।
32 ఆ శాస్త్రి — బోధకుడా, బాగుగా చెప్పితివి; ఆయన
అద్వితీయుడనియు, ఆయన తప్ప వేరొకడు లేడనియు
33 నీవు చెప్పిన మాట సత్యమే. । పూర్ణహృదయముతోను
పూర్ణవివేకముతోను పూర్ణబలముతోను ఆయనను
ప్రేమించుటయు, ఒకడు తన్నువలె తన పొరుగువాని
ప్రేమించుటయు సర్వాంగ హోమములన్నిటికం
టెను బలులకంటెను అధికమని ఆయనతో చెప్పెను. ।
34 అతడు వివేకముగా నుత్తరమిచ్చెనని యేసు గ్రహించి
— నీవు దేవుని రాజ్యమునకు దూరస్థుడవు కావని
అతనితో చెప్పెను. ఆ తరువాత ఎవడును ఆయనను
ఏ ప్రశ్నయు అడుగ తెగింపలేదు.
35 ఒకప్పుడు యేసు దేవాలయములో బోధించుచుం
డగా — క్రీస్తు దావీదు కుమారుడని శాస్త్రులు చెప్పు
చున్నారేమి?
36 నేను నీ శత్రువులను నీకు పాదపీఠముగా ఉంచు
వరకు
నీవు నా కుడివైపున కూర్చుండుమని
ప్రభువు నా ప్రభువుతో చెప్పెను[4]
37 అని దావీదే పరిశుద్ధాత్మవలన చెప్పెను. । దావీదు
ఆయనను ప్రభువని చెప్పుచున్నాడే, ఆయన ఏలాగు
అతని కుమారుడగునని అడిగెను. సామాన్యజనులు
ఆయన మాటలు సంతోషముతో వినుచుండిరి.
38 మరియు ఆయన వారికి బోధించుచు నిట్లనెను —
శాస్త్రులనుగూర్చి జాగ్రత్తపడుడి. వారు నిలువుటంగీలు
ధరించుకొని తిరుగుటను, సంతవీధులలో వందనము
39 [illegible] సమాజమందిరములలో అగ్రపీఠములను, విందు
లలో అగ్రస్థానములను కోరువారై । విధవరాండ్ర 40
యిండ్లు దిగమ్రింగుచు, మాయవేషముగా దీర్ఘప్రార్థ
నలు చేయుదురు. వీరు మరి విశేషముగా శిక్షావిధి
పొందుదురనెను.
ఆయన కానుకపెట్టె యెదుట కూర్చుండి జన 41
సమూహము ఆ కానుకపెట్టెలో డబ్బులు వేయుట
చూచుచుండెను. ధనవంతులైనవారనేకులు అందులో
విశేషముగా సొమ్ము వేయుచుండిరి. । ఒక బీద విధవ 42
రాలు వచ్చి రెండు కాసులు వేయగా ఆయన తన 43
శిష్యులను పిలిచి — కానుకపెట్టెలో డబ్బులు వేసిన
వారందరికంటె ఈ బీద విధవరాలు ఎక్కువ వేసెనని
మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. । వారందరు 44
తమకు కలిగిన సమృద్ధిలోనుండి వేసిరి గాని, యీమె
తన లేమిలో తనకు కలిగినదంతయు, అనగా తన జీవన
మంతయు వేసెనని చెప్పెను.
ఆయన దేవాలయములోనుండి వెళ్లుచుండగా 13
ఆయన శిష్యులలో ఒకడు—బోధకుడా, యీ రాళ్లే
లాటివో యీ కట్టడములు ఏలాటివో చూడుమని
ఆయనతో అనెను. ; అందుకు యేసు — ఈ గొప్ప 2
కట్టడములు చూచుచున్నావే; పడద్రోయబడక రాతి
మీద రాయి యొకటియైన ఇక్కడ నిలిచియుండదని
అతనితో చెప్పెను.
ఆయన దేవాలయము ఎదుట ఒలీవల కొండమీద 3
కూర్చుండియుండగా పేతురు యాకోబు యోహాను
అంద్రెయ అను వారు ఆయనను చూచి । — ఇవి 4
ఎప్పుడు జరుగును? ఇవన్నియు నెరవేరబోవు కాలము
నకు ఏ గురుతు కలుగును? అది మాతో చెప్పుమని
ఆయనను ఏకాంతమందు అడుగగా । యేసు వారితో 5
ఇట్లు చెప్పసాగెను—ఎవడును మిమ్మును మోసపుచ్చ
కుండ చూచుకొనుడి. । అనేకులు నా పేరట వచ్చి— 6
నేనే ఆయననని చెప్పి అనేకులను మోసపుచ్చెదరు. ।
మీరు యుద్ధములను గూర్చియు యుద్ధసమాచారము 7
లను గూర్చియు వినునప్పుడు కలవరపడకుడి; ఇవి
జరుగవలసియున్నవి గాని అంతము వెంటనే రాదు. ।
జనముమీదికి జనము రాజ్యముమీదికి రాజ్యము 8
లేచును, అక్కడక్కడ భూకంపములు కలుగును, కర
వులు వచ్చును. ఇవే వేదనలకు ప్రారంభము.
మిమ్మునుగూర్చి మీరే జాగ్రత్తపడుడి. వారు 9
మిమ్మును సభలకప్పగించెదరు; మిమ్మును సమాజమంది
రములలో కొట్టించెదరు; మీరు వారికి సాక్ష్యార్థమై
అధిపతుల యెదుటను రాజుల యెదుటను నా నిమి
త్తము నిలువబడెదరు. । సకల జనములకు సువార్త 10
ముందుగా ప్రకటింపబడవలెను. ; వారు మిమ్మును 11
అప్పగించుటకు కొనిపోవునప్పుడు మీరు — ఏమి
చెప్పుదుమా అని ముందుగా చింతింపకుడి; ఆ గడియ

[1] నిర్గ. 3: 2, 6. [2] ద్వితీ. 6: 4. [3] లేవీ. 19: 18. [4] కీర్తన. 110: 1.

మీకేది ఇయ్యబడునో అదే చెప్పుడి; చెప్పు
పరిశుద్ధాత్మయే గాని మీరు కారు. । సహో
సహోదరుని, తండ్రి కుమారుని, మరణమున
తురు; కుమారులు తలిదండ్రులమీద లేచి
చంపింతురు; । నా నామము నిమిత్తము అందరి
రు ద్వేషింపబడుదురు; అంతమువరకు సహిం
డే రక్షణ పొందును.

యు నాశకరమైన హేయవస్తువు నిలువరాని
దు నిలుచుట మీరు చూచునప్పుడు—చదువు
గ్రహించుగాక—యూదైయలో ఉండువారు
కు పారిపోవలెను; । ఇంటి మిద్దెమీద ఉండు
ఇంటిలోనుండి ఏదైనను తీసికొనిపోవుటకై దిగి
కి ప్రవేశింపకూడదు; । పొలములో ఉండు
తన వస్త్రము తీసికొనిపోవుటకు ఇంటిలోకి
కూడదు.

య్యో, ఆ దినములలో గర్భిణులకును పాలిచ్చు
శ్రమ. । అది చలికాలమందు సంభవింపకుండ
ప్రార్థించుడి. । అవి శ్రమగల దినములు;
సృష్టించిన సృష్ట్యాదినుండి ఇదివరకు అంత
కలుగలేదు; ఇక ఎన్నడును కలుగబోదు. ।
ప్రు ఆ దినములను తక్కువచేయనియెడల ఏ
తప్పించుకొనకపోవును; ఏర్పరచబడినవారి
, అనగా తాను ఏర్పరచుకొనినవారినిమిత్తము
ఆ దినములను తక్కువచేసెను. । ఆ కాల
—అబద్ధ క్రీస్తులును అబద్ధపు ప్రవక్తలును వచ్చి,
శైనయెడల ఏర్పరచబడినవారిని మోసపుచ్చు
రా చకక్రియలను మహాత్కార్యములను అగుపర
। కాగా—ఇదిగో క్రీస్తు ఇక్కడనున్నాడు,
అక్కడనున్నాడు అని యెవడైనను మీతో
రియెడల నమ్మకుడి. । మీరు జాగ్రత్తగా ఉం
ఇదిగో సమస్తమును మీతో ముందుగా చెప్పి
ను.

దినములలో ఆ శ్రమతీరిన తరువాత చీకటి
ని కమ్మును, చంద్రుడు తన కాంతిని ఇయ్యడు,
ములు ఆకాశమునుండి రాలును, । ఆకాశ
శక్తులు కదలింపబడును. । అప్పుడు మనుష్య
డు మహా ప్రభావముతోను మహిమతోను
రూఢుడై వచ్చుట చూచెదరు. । అప్పుడాయన
దూతలను పంపి, భూమ్యంతము మొదలుకొని
అంతమువరకు నలుదిక్కులనుండి తాను ఏర్పరచు
వారిని పోగుచేయించును.

అంజూరపుచెట్టును చూచి యొక ఉపమానము
కొనుడి. దాని కొమ్మ యింక లేతదై చిగిరించు
వసంతకాలము సమీపమైనదని మీకు తెలి
గదా. । ఆ ప్రకారమే మీరు ఈ సంగతులు
జరుగుట చూచునప్పుడు ఆయన సమీపమై ద్వారము
నొద్ద ఉన్నాడని తెలిసికొనుడి. । ఇవన్నియు జరుగు 30
పర్యంతము ఈ తరము గతింపదని మీతో నిశ్చయ
ముగా చెప్పుచున్నాను. । ఆకాశమును భూమియు 31
గతించిపోవును గాని నా మాటలు గతింపవు.

ఆ దినమును గూర్చియు ఆ గడియను గూర్చియు 32
తండ్రిమాత్రమే తప్ప ఏ మనుష్యుడైనను, పరలోక
మందలి దూతలైనను, కుమారుడైనను ఎరుగరు. ।
జాగ్రత్తపడుడి; మెళుకువగానుండి ప్రార్థనచేయుడి; 33
ఆ కాలమెప్పుడు వచ్చునో మీకు తెలియదు. । ఒక 34
మనుష్యుడు తన దాసులకు అధికారమిచ్చి, ప్రతివానికి
వాని వాని పని నియమించి—మెళుకువగా నుండుమని
ద్వారపాలకునికి ఆజ్ఞాపించి, యిల్లు విడిచి దేశాంత
రము పోయినట్టే (ఆ కాలము ఉండును.) । ఇంటి 35
యజమానుడు ప్రొద్దుగ్రుంకి వచ్చునో, అర్ధరాత్రి
వచ్చునో, కోడికూయునప్పుడు వచ్చునో, తెల్లవారు
నప్పుడు వచ్చునో, యెప్పుడు వచ్చునో మీకు తెలి
యదు. । ఆయన అకస్మాత్తుగా వచ్చి మీరు నిద్రబోవు 36
చుండుట చూచునేమో గనుక మీరు మెళుకువగా
నుండుడి. । నేను మీతో చెప్పుచున్నది అందరితోను 37
చెప్పుచున్నాను; మెళుకువగా నుండుడనెను.

రెండు దినములైన పిమ్మట పస్కాపండుగ, అనగా **14**
పులియని రొట్టెలపండుగ వచ్చెను. అప్పుడు ప్రధాన
యాజకులును శాస్త్రులును మాయోపాయముచేత ఆయన
నేలాగు పట్టుకొని చంపుదుమని ఆలోచించుకొనుచుం
డిరి గాని । ప్రజలలో అల్లరి కలుగునేమో అని 2
పండుగలో వద్దని చెప్పుకొనిరి.

ఆయన బేతనియలో కుష్ఠరోగియైన సీమోను ఇంట 3
భోజనమునకు కూర్చుండియున్నప్పుడు ఒక స్త్రీ మిక్కిలి
విలువగల అచ్చ జటామాంసి అత్తరుగల శిలాభరణి
తీసికొని వచ్చి, ఆ శిలాభరణి పగులగొట్టి ఆ అత్తరు
ఆయన తలమీద పోసెను. । అయితే కొందరు కోప 4
పడి—ఈ అత్తరు ఈలాగు నష్టపరచనేల? । ఈ అత్తరు 5
మున్నూరు దేనారముల[1] కంటె ఎక్కువ వెలకమ్మి బీదల
కియ్యవచ్చునని చెప్పి ఆమెనుగూర్చి సణుగుకొనిరి. ।
అందుకు యేసు ఇట్లనెను — ఈమె జోలికి పోకుడి; 6
ఈమెను ఎందుకు తొందరపెట్టుచున్నారు? ఈమె
నాయెడల మంచి కార్యము చేసెను. । బీదలు ఎల్లప్పు 7
డును మీతోనే యున్నారు, మీ కిష్టమైనప్పుడెల్ల
వారికి మేలు చేయవచ్చును; నేను ఎల్లప్పుడును
మీతో నుండను. । ఈమె తన శక్తికొలది చేసెను, నా 8
భూస్థాపన నిమిత్తము నా శరీరమును ముందుగా అభి
షేకించెను. । సర్వలోకములో ఎక్కడ ఈ సువార్త
ప్రకటింపబడునో అక్కడ ఈమె చేసినదియు జ్ఞాప

1 ఇది ఇంచుమించు 160 రూపాయిలు కావచ్చును.

కార్థముగా ప్రశంసింపబడునని మీతో నిశ్చయముగా
చెప్పుచున్నాననెను.

10 పన్నెండుమందిలో ఇస్కరియోతు యూదా
అను ఒకడు ప్రధానయాజకులచేతికి ఆయనను అప్ప
11 గింపవలెనని వారియొద్దకు పోగా । వారు విని సంతో
షించి వానికి ద్రవ్యమిత్తుమని వాగ్దానము చేసిరి గనుక
వాడు ఆయనను అప్పగించుటకు తగిన సమయము
కనిపెట్టుచుండెను.

12 పులియని రొట్టెల పండుగలో మొదటి దినమున
వారు పస్కాపశువును వధించునప్పుడు ఆయన
శిష్యులు—నీవు పస్కాను భుజించుటకు మేమెక్కడికి
వెళ్లి సిద్ధపరచ గోరుచున్నావని ఆయన నడుగగా ।
13 ఆయన—మీరు పట్టణములోకి వెళ్లుడి; అక్కడ నీళ్ల
కుండ మోయుచున్న యొక మనుష్యుడు మీకెదురు
14 పడును; । వాని వెంటబోయి వాడు ఎక్కడ ప్రవే
శించునో ఆ యింటి యజమానుని చూచి—నేను నా
శిష్యులతోకూడ పస్కాను భుజించుటకు విడిది గది
యెక్కడని బోధకుడడుగుచున్నాడని చెప్పుడి. ।
15 అతడు సామగ్రితో సిద్ధపరచబడిన గొప్ప మేడగది
మీకు చూపించును, అక్కడ మనకొరకు సిద్ధపరచుడని
16 చెప్పి తన శిష్యులలో ఇద్దరిని పంపెను. । శిష్యులు
వెళ్లి పట్టణములోకి వచ్చి ఆయన వారితో చెప్పినట్టు
కనుగొని పస్కాను సిద్ధపరచిరి.

17 సాయంకాలమైనప్పుడు ఆయన తన పన్నెండు
18 మంది శిష్యులతోకూడ వచ్చెను. । వారు కూర్చుండి
భోజనము చేయుచుండగా యేసు — మీలో ఒకడు,
అనగా నాతో భుజించుచున్నవాడు నన్ను అప్పగిం
చునని నిశ్చయముగా మీతో చెప్పుచున్నానని వారి
19 తో చెప్పగా । వారు దుఃఖపడి—నేనా అని యొకని
20 తరువాత ఒకడు ఆయన నడుగసాగిరి. । అందుకా
యన — పన్నెండుమందిలో ఒకడే, అనగా నాతో
21 కూడ పాత్రలో (చెయ్యి) ముంచువాడే. । నిజముగా
మనుష్యకుమారుడు ఆయననుగూర్చి వ్రాయబడినట్టు
పోవుచున్నాడు; అయితే ఎవనిచేత మనుష్యకుమా
రుడు అప్పగింపబడుచున్నాడో ఆ మనుష్యునికి శ్రమ;
ఆ మనుష్యుడు పుట్టకుండిన వానికి మేలనెను.

22 వారు భోజనము చేయుచుండగా ఆయన యొక
రొట్టెను ఎత్తికొని, ఆశీర్వదించి విరిచి వారికిచ్చి—
23 మీరు తీసికొనుడి; ఇది నా శరీరమనెను. । పిమ్మట
ఆయన గిన్నె పట్టుకొని కృతజ్ఞతాస్తుతులు చెల్లించి
దాని వారికిచ్చెను; వారందరు దానిలోనిది త్రాగిరి. ।
24 అప్పుడాయన — ఇది నిబంధనవిషయమై[1] అనేకుల
25 కొరకు చిందింపబడుచున్న నా రక్తము. । నేను దేవుని
రాజ్యములో ద్రాక్షారసము క్రొత్తదిగా త్రాగు
దినమువరకు ఇకను దాని త్రాగనని మీతో నిశ్చయ
ముగా చెప్పుచున్నాననెను.
అంతట వారు కీర్తన పాడి ఒలీవలకొండకు వెళ్లిరి. । 26
అప్పుడు యేసు వారిని చూచి—మీరందరు అభ్యంతర 27
పడెదరు; గొఱ్ఱెల కాపరిని కొట్టుదును, గొఱ్ఱెలు
చెదరిపోవును అని వ్రాయబడియున్నది గదా.[2] ।
అయితే నేను లేచిన తరువాత మీకంటె ముందుగా 28
గలిలైయలోకి వెళ్లెదననెను. । అందుకు పేతురు — 29
అందరు అభ్యంతరపడినను నేను అభ్యంతరపడనని
ఆయనతో చెప్పగా । యేసు అతని చూచి — నేటి 30
రాత్రి కోడి రెండుమారులు కూయకమునుపే నీవు
నన్ను ఎరుగనని ముమ్మారు చెప్పెదవని నీతో నిశ్చయ
ముగా చెప్పుచున్నాననెను. । అతడు మరి ఖండిత 31
ముగా—నేను నీతోకూడ చావవలసి వచ్చినను నిన్ను
ఎరుగనని చెప్పనే చెప్పననెను. అట్లు వారందరుననిరి.
వారు గెత్సేమనే అనబడిన చోటుకు వచ్చినప్పుడు 32
ఆయన — నేను ప్రార్థనచేసి వచ్చువరకు మీరిక్కడ
కూర్చుండుడని తన శిష్యులతో చెప్పి । పేతురును 33
యాకోబును యోహానును వెంటబెట్టుకొనిపోయి,
మిగుల విభ్రాంతి నొందుటకును చింతాక్రాంతుడగు
టకును ఆరంభించెను. । అప్పుడాయన—నా ప్రాణము 34
మరణమగునంతగా దుఃఖములో మునిగియున్నది; మీ
రిక్కడ ఉండి మెలకువగా నుండుడని వారితో
చెప్పి । కొంతదూరము సాగిపోయి నేలమీద పడి 35
సాధ్యమైతే ఆ గడియ తనయొద్దనుండి తొలగిపోవలె
నని ప్రార్థించుచు । — నాయనా తండ్రీ, నీకు సమ 36
స్తము సాధ్యము; ఈ గిన్నె నా యొద్దనుండి తీసివే
యుము; అయినను నా యిష్టప్రకారము కాదు నీ
చిత్తప్రకారమే కానిమ్ము అనెను.
మరల ఆయన వచ్చి వారు నిద్రించుచుండుట 37
చూచి—సీమోనూ, నీవు నిద్రించుచున్నావా? ఒక్క
గడియయైనను మేలుకొనియుండలేవా? । మీరు శోధ 38
నలో ప్రవేశించకుండునట్లు మెలకువగానుండి ప్రార్థన
చేయుడి; ఆత్మ సిద్ధమే గాని శరీరము బలహీనమని
పేతురుతో చెప్పి । తిరిగి పోయి, యింతకుముందు 39
పలికిన మాటలనే పలుకుచు ప్రార్థించెను. । ఆయన 40
తిరిగివచ్చి చూడగా వారు నిద్రించుచుండిరి; ఏలయ
నగా వారి కన్నులు భారముగా ఉండెను, ఆయనకేమి
ఉత్తరమియ్యవలెనో వారికి తోచలేదు.
ఆయన మూడవ సారి వచ్చి—మీరికను నిద్రపోయి 41
అలసట తీర్చుకొనుడి. ఇక చాలును, గడియ వచ్చినది;
ఇదిగో మనుష్యకుమారుడు పాపులచేతికి అప్పగింప
బడుచున్నాడు; । లెండి పోదము; ఇదిగో నన్ను 42
అప్పగించువాడు వచ్చియున్నాడని చెప్పెను.
వెంటనే, ఆయన ఇంక మాటలాడుచుండగా 43

[1] కొన్ని ప్రాచీనప్రతులలో—క్రొత్తనిబంధన విషయమై అని పాఠాంతరము. [2] జెకర్యా, 13: 7.

పన్నెండుమంది శిష్యులలో ఒకడైన ఇస్కరియోతు యూదా వచ్చెను. వానితోకూడ బహుజనులు కత్తులు గుదియలు పట్టుకొని, ప్రధానయాజకుల యొద్దనుంచియు శాస్త్రులయొద్దనుంచియు పెద్దలయొద్దనుంచియు వచ్చిరి. । ఆయనను అప్పగించువాడు—నేనెవని ముద్దుపెట్టుకొందునో ఆయనే (యేసు); ఆయనను పట్టుకొని భద్రముగా కొనిపోవుడని వారికి గురుతు చెప్పియుండెను. । వాడు వచ్చి వెంటనే ఆయనయొద్దకు పోయి—బోధకుడా అని చెప్పి, ఆయనను ముద్దుపెట్టుకొనగా । వారు బలాత్కారముగా ఆయనమీద పడి ఆయనను పట్టుకొనిరి. । దగ్గర నిలిచియున్నవారిలో ఒకడు కత్తిదూసి ప్రధానయాజకుని దాసుని కొట్టి వాని చెవి తెగనరికెను. । అందుకు యేసు—మీరు బందిపోటు దొంగమీదికి వచ్చినట్టు కత్తులతోను గుదియలతోను నన్ను పట్టుకొన వచ్చితిరా? । నేను ప్రతిదినము దేవాలయములో మీయొద్ద ఉండి బోధించుచుండగా మీరు నన్ను పట్టుకొనలేదు; అయితే లేఖనములు నెరవేరునట్లు (ఈలాగు జరుగుచున్నదని చెప్పెను). । అప్పుడు వారందరు ఆయనను విడిచి పారిపోయిరి.

తన దిగంబర శరీరముమీద నారబట్ట వేసికొనియున్న యొక పడుచువాడు ఆయన వెంట వెళ్లుచుండగా వారతని పట్టుకొనిరి. । అతడు నారబట్ట విడిచి దిగంబరుడై పారిపోయెను.

వారు యేసును ప్రధానయాజకునియొద్దకు తీసికొనిపోయిరి. ప్రధానయాజకులు పెద్దలు శాస్త్రులు అందరును అతనితోకూడవచ్చిరి. । పేతురు ప్రధానయాజకుని యింటిముంగిటివరకు దూరమునుండి ఆయనవెంట పోయి బంట్రౌతులతోకూడ కూర్చుండి, మంటయొద్ద చలి కాచుకొనుచుండెను. । ప్రధానయాజకులును మహాసభవారందరును యేసును చంపింపవలెనని ఆయనమీద సాక్ష్యము వెదకిరిగాని యేమియు వారికి దొరకలేదు. । అనేకులు ఆయనమీద అబద్ధసాక్ష్యము పలికినను వారి సాక్ష్యములు ఒకదానికి ఒకటి సరిపడలేదు. । అప్పుడు కొందరు లేచి—చేతిపనియైన ఈ దేవాలయమును పడగొట్టి మూడు దినములలో చేతిపనికాని మరియొక దేవాలయము నేను కట్టుదునని యితడు చెప్పుచుండగా వింటిమని ఆయనమీద అబద్ధసాక్ష్యము చెప్పిరి గాని ఆలాగైనను వీరి సాక్ష్యమును సరిపడలేదు. । ప్రధానయాజకుడు వారిమధ్యను లేచి నిలిచి—ఉత్తరమేమియు చెప్పవా? వీరు నీమీద పలుకుచున్న సాక్ష్యమేమని యేసు నడిగెను. । అయితే ఆయన ఉత్తరమేమియు చెప్పక ఊరకుండెను. తిరిగి ప్రధానయాజకుడు — శ్రీ భగవంతుని కుమారుడవైన క్రీస్తువు నీవేనా అని ఆయన నడుగగా । యేసు — అవును నేనే; మీరు మనుష్యకుమారుడు సర్వశక్తి



మంతుని కుడిపార్శ్వమున కూర్చుండుటయు, ఆకాశ
మేఘారూఢుడై వచ్చుటయు చూచెదరని చెప్పెను. ।
ప్రధానయాజకుడు తన వస్త్రములు చింపుకొని—మనకు 63
ఇక సాక్షులతో పని ఏమి? । ఈ దేవదూషణ మీరు 64
విన్నారు కారా; మీకేమి తోచుచున్నదని అడుగగా
వారందరు—మరణమునకు పాత్రుడని ఆయనకు నేర
స్థాపనచేసిరి. । కొందరు ఆయనమీద ఉమ్మివేసి 65
ఆయన ముఖమునకు ముసుకువేసి ఆయనను గుద్దుచు
—ప్రవచింపుమని ఆయనతో చెప్పసాగిరి. బంట్రౌ
తులును ఆయనను అరచేతులతో కొట్టి పట్టుకొనిరి.
పేతురు ముంగిటి క్రిందిభాగములో ఉండగా 66
ప్రధానయాజకుని పనికత్తెలలో ఒకతె వచ్చి । పేతురు 67
చలికాచుకొనుచుండుట చూచెను; అతని నిదానించి
చూచి — నీవును నజరేయుడగు ఆ యేసుతోకూడ
ఉండినవాడవు కావా అనెను. । అందుకతడు—ఆయన 68
ఎవడో నేనెరుగను; నీవు చెప్పినది నాకు బోధపడ
లేదని చెప్పి నడవలోకి వెళ్లెను; అంతట కోడి కూసెను.
ఆ పనికత్తె అతని చూచి—వీడు వారిలో ఒకడని 69
దగ్గర నిలిచియున్నవారితో మరల చెప్పసాగెను. ।
అతడు మరల — నేను కాననెను. కొంతసేపైన తరు 70
వాత దగ్గర నిలిచియున్నవారు మరల పేతురును చూచి
—నిజముగా నీవు వారిలో ఒకడవు; నీవు గలిలైయు
డవు గదా అనిరి. । అందుకతడు — మీరు చెప్పు 71
చున్న మనుష్యుని నేనెరుగనని చెప్పి, శపించుకొను
టకును ఒట్టుపెట్టుకొనుటకును మొదలుపెట్టెను. ।
వెంటనే రెండవమారు కోడి కూసెను గనుక — కోడి 72
రెండు మారులు కూయకమునుపు నీవు నన్ను ఎరుగనని
ముమ్మారు చెప్పెదవని యేసు తనతో చెప్పిన మాట
పేతురు జ్ఞాపకమునకు తెచ్చుకొని తలపోయుచు
ఏడ్చెను.

ఉదయము కాగానే ప్రధానయాజకులును పెద్ద **15**
లును శాస్త్రులును మహాసభవారందరును కలిసి ఆలో
చనచేసి యేసును బంధించి తీసికొనిపోయి పిలాతుకు
అప్పగించిరి. । పిలాతు — యూదులరాజవు నీవేనా 2
అని ఆయన నడుగగా ఆయన—నీవన్నట్టే అని అతని
తో చెప్పెను. । ప్రధానయాజకులు ఆయనమీద 3
అనేకమైన నేరములు మోపగా । పిలాతు ఆయనను 4
చూచి మరల—నీవు ఉత్తరమేమియు చెప్పవా? నీమీద
వీరు ఎన్నెన్ని నేరములు మోపుచున్నారో చూడు
మనెను. । అయినను యేసు మరి ఏ ఉత్తరము చెప్ప 5
లేదు గనుక పిలాతు ఆశ్చర్యపడెను.

ఆ పండుగలో వారు కోరుకొనిన యొక ఖయిదీని 6
పిలాతు వారికి విడిపించువాడు. । అధికారుల నెది 7
రించి, కలహములో నరహత్య చేసినవారితోకూడ
బంధించబడియుండిన బరబ్బ అను ఒకడుండెను. ।
జనులు గుంపుగా కూడివచ్చి, అతడు అదివరకు తమకు 8

చేయుచువచ్చిన ప్రకారము చేయవలెనని అడుగగా ।
9 ప్రధానయాజకులు అసూయచేత యేసును అప్పగిం
10 చిరని పిలాతు తెలిసికొని—నేను యూదుల రాజును
మీకు విడుదల చేయగోరుచున్నారా అని అడిగెను. ।
11 అతడు బరబ్బను తమకు విడుదల చేయవలెనని జనులు
అడుగుకొనునట్లు ప్రధానయాజకులు వారిని ప్రేరే
పించిరి.
12 అందుకు పిలాతు—ఆలాగైతే యూదుల రాజని
మీరు చెప్పువాని నేనేమి చేయుదునని మరల వారి
13 నడిగెను. । వారు — వానిని సిలువవేయుమని మరల
14 కేకలువేసిరి. । అందుకు పిలాతు—ఎందుకు? అతడే
దుష్కార్యము చేసెనని వారి నడుగగా వారు—వానిని
సిలువవేయుమని మరి ఎక్కువగా కేకలువేసిరి. ।
15 పిలాతు జనసమూహమును సంతోషపెట్టుటకు మనస్సు
గలవాడై వారికి బరబ్బను విడుదలచేసి యేసును కొర
డాలతో కొట్టించి సిలువవేయ నప్పగించెను.
16 అంతట రాణువవారు ఆయనను ప్రేతోర్యమను
అధికారమందిరములోపలికి తీసికొనిపోయి, స్తోమమం
17 తయు సమకూర్చుకొనినతరువాత । ఆయనకు ఊదా
రంగు వస్త్రము తొడిగించి, ముండ్ల కిరీటమునల్లి ఆయనకు
18 పెట్టి । — యూదుల రాజా, నీకు శుభమని చెప్పి
19 ఆయనకు వందనము చేయసాగిరి. । మరియు రెల్లుతో
ఆయన తలమీద కొట్టి, ఆయనమీద ఉమ్మివేసి, మోకా
20 ళ్లూని ఆయనకు నమస్కారముచేసిరి. । వారు ఆయ
నను అపహసించిన తరువాత ఆయనమీదనున్న ఊదా
రంగు వస్త్రము తీసివేసి, ఆయన బట్టలాయనకు తొడి
గించి, ఆయనను సిలువవేయుటకు తీసికొనిపోయిరి.
21 ఆ సమయమున కురేనీయుడైన సీమోనను ఒకడు
పల్లెటూరినుండి వచ్చి ఆ మార్గమున పోవుచుండగా,
ఆయన సిలువమోయుటకు అతని బలవంతముచేసిరి. ।
22 అతడు అలెక్సంద్రుకును రూపుకును తండ్రి. వారు
గొల్గొతా అనబడిన చోటుకు ఆయనను తీసికొని
వచ్చిరి. గొల్గొతా అనగా కపాల స్థలమని అర్థము. ।
23 అంతట బోళము కలిపిన ద్రాక్షారసము ఆయనకిచ్చిరి
24 గాని ఆయన దాని పుచ్చుకొనలేదు. । వారాయనను
సిలువవేసినతరువాత, ఎవనికిభాగము రావలెనో తెలిసి
కొనుటకై ఆయన వస్త్రములకోసరము చీట్లువేసి వాటిని
25 పంచుకొనిరి. । ఆయనను సిలువవేసినప్పుడు పగలు
26 మూడు గంటలాయెను. । మరియు — యూదులరా
జని ఆయనమీద దోషారోపణగా పైవిలాసము వ్రాసి
27 యుంచిరి. । మరియు కుడివైపున ఒకనిని ఎడమవైపున
ఒకనిని ఇద్దరు బందిపోటు దొంగలను ఆయనతోకూడ
29 సిలువవేసిరి.[1] । అప్పుడు ఆ మార్గమున వెళ్లుచున్న
వారు తమ తలలూచుచు—ఆహా దేవాలయమును పడ
30 గొట్టి మూడు దినములలో కట్టువాడా, । సిలువమీద
నుండి దిగి నిన్ను నీవే రక్షించుకొనుమని చెప్పి ఆయ 1
నను దూషించిరి. । అట్లు శాస్త్రులును ప్రధానయాజ
కులును అపహాస్యము చేయుచు—వీడితరులను రక్షిం 2
చెను, తన్నుతాను రక్షించుకొనలేడు. । ఇశ్రాయేలు
రాజగు క్రీస్తు ఇప్పుడు సిలువమీదనుండి దిగి రావ
చ్చును. అప్పుడు మనము చూచి నమ్ముదమని యొక
రితో ఒకరు చెప్పుకొనిరి. ఆయనతోకూడ సిలువవేయ
బడినవారును ఆయనను నిందించిరి. 4
మధ్యాహ్నము మొదలుకొని మూడు గంటలవరకు
ఆ దేశమంతటను చీకటి కమ్మెను. । మూడు గంటలకు 5
యేసు — ఎలోయి ఎలోయి లామా సబక్తానీ అని
బిగ్గరగా కేకవేసెను; ఆ మాటలకు నా దేవా, నా
దేవా, నన్ను ఎందుకు చెయ్యివిడిచితివని అర్థము. । 6
దగ్గర నిలిచినవారిలో కొందరు ఆ మాటలు విని—
అదిగో ఏలీయాను పిలుచుచున్నాడనిరి. । ఒకడు పరు
గెత్తిపోయి యొక స్పంజీ చిరకాలోముంచి రెల్లున 7
తగిలించి ఆయనకు త్రాగనిచ్చి — తాళుడి; ఏలీయా
వీని దింపవచ్చునేమో చూతమనెను. । అంతట యేసు
గొప్ప కేకవేసి ప్రాణము విడిచెను. । అప్పుడు దేవా
లయపుతెర పైనుండి క్రిందివరకు రెండుగా చినిగెను. । 8
ఆయన కెదురుగా నిలిచియున్న శతాధిపతి ఆయన
ఈలాగు ప్రాణము విడుచుట చూచి — నిజముగా
ఈ మనుష్యుడు దేవుని కుమారుడే అని చెప్పెను.
కొందరు స్త్రీలు దూరమునుండి చూచుచుండిరి. । వారి 9
లో మగ్దలేనే మరియయు, చిన్న యాకోబు యోసే
అనువారి తల్లియైన మరియయు, సలోమేయు ఉం 10
డిరి. । ఆయన గలిలైయలో ఉన్నప్పుడు వీరాయనను 11
వెంబడించి ఆయనకు పరిచారము చేసినవారు. వీరు
కాక ఆయనతో యెరూషలేమునకు వచ్చిన వేరు అనేక
స్త్రీలును వారిలో ఉండిరి.
ఆ దినము సిద్ధపరచు దినము, అనగా విశ్రాంతి
దినమునకు పూర్వదినము । గనుక సాయంకాలమైన
ప్పుడు అరిమతయియ యోసేపు తెగించి, పిలాతు
నొద్దకు వెళ్లి యేసు దేహము (తనకిమ్మని) యడిగెను.
అతడు ఘనతవహించిన యొక సభికుడై, దేవుని రాజ్య
మునకు ఎదురుచూచువాడు. । పిలాతు—ఆయన ఇంత
లోనే చనిపోయెనా అని ఆశ్చర్యపడి యొక శతాధి
పతిని తనయొద్దకు పిలిపించి—ఆయన ఇంతలోనే చని
పోయెనా అని అతని నడిగెను. । శతాధిపతివలన
సంగతి తెలిసికొని యోసేపునకు ఆ శవము నప్పగిం
చెను. । అతడు నారబట్ట కొని ఆయనను దింపి ఆ
బట్టతో చుట్టి, బండలో తొలిపించిన సమాధియందు
ఆయనను పెట్టి, ఆ సమాధి ద్వారమునకు రాయి
పొర్లించెను. । మగ్దలేనే మరియయు యోసే తల్లియైన
మరియయు ఆయన యుంచబడిన చోటు చూచిరి.

[1] అనేక ప్రాచీనప్రతులలో—అప్పుడు ఆయన అక్రమకారులతో నొకడుగా నెంచబడెనని చెప్పు లేఖనము నెరవేరినది, అని కూర్చబడియున్నది.

విశ్రాంతిదినము గడచిపోగానే మగ్దలేనే మరి
యు యాకోబు తల్లియైన మరియయు సలోమేయు
ు ఆయనకు పూయవలెనని సుగంధద్రవ్యములు
ిరి. వారు ఆదివారమున పెందలకడ లేచి బయలు
సూర్యోదయమైనప్పుడు సమాధియొద్దకు వచ్చు
ుడగా — సమాధి ద్వారమునుండి మనకోసరము ఆ
ు యెవడు పొర్లించునని యొకరితో ఒకరు చెప్పు
ుచుండిరి. । వారు వచ్చి కన్నులెత్తి చూడగా రాయి
ర్లింపబడి యుండుట చూచిరి. ఆ రాయి యెంతో
ది. । అప్పుడు వారు సమాధిలో ప్రవేశించి,
ని నిలువుటంగీ ధరించుకొనియున్న యొక యౌవ
డు కుడివైపున కూర్చుండుట చూచి మిగుల
ంతినొందిరి. । అందుకతడు — భయపడకుడి;
వేయబడిన నజరేయుడగు యేసును మీరు వెదకు
్నారు; ఆయన లేచియున్నాడు, ఇక్కడ లేదు;
ఆయనను ఉంచిన స్థలము చూడుడి. । మీరు
ఆయన శిష్యులను పేతురును చూచి, ఆయన
ంటె ముందుగా గలిలైయలోకి వెళ్లుచున్నాడని
, ఆయన మీతో చెప్పినట్టు అక్కడ మీరు ఆయ
చూతురనియు చెప్పుడనెను. । వారు బయటకు
, వణకును విస్మయమును పట్టినవారై, సమాధి
్దనుండి పారిపోయిరి; వారు భయపడినందున ఎవ
ఏమియు చెప్పలేదు.
ఆదివారమున తెల్లవారినప్పుడు యేసు లేచి, తాను
దయ్యములను వెళ్లగొట్టిన మగ్దలేనే మరియకు
టట కనబడెను. । ఆయనతో ఉండినవారు దుఃఖ
యేడ్చుచుండగా ఆమె వెళ్లి ఆ సంగతి వారికి
తెలియజేసెను గాని ఆయన బ్రదికియున్నాడనియు
ఆమెకు కనబడెననియు వారు విని నమ్మకపోయిరి.
ఆ తరువాత వారిలో ఇద్దరు ఒక పల్లెటూరికి 12
నడిచిపోవుచుండగా ఆయన మారురూపముగలవాడై
వారికి ప్రత్యక్షమాయెను. । వారు వెళ్లి తక్కినవారికి 13
ఆ సంగతి తెలియజేసిరి గాని వారు వీరి మాటనైనను
నమ్మకపోయిరి.
ఇంకొక సమయమున పదకొండుమంది శిష్యులు 14
భోజనమునకు కూర్చున్నప్పుడు ఆయన వారికి ప్రత్య
క్షమై, తాను లేచినతరువాత తన్ను చూచినవారి మాట
నమ్మనందున వారి అపనమ్మిక నిమిత్తమును హృదయ
కాఠిన్యము నిమిత్తమును వారిని గద్దించెను. । మరియు 15
— మీరు సర్వలోకమునకు వెళ్లి సర్వసృష్టికి సువార్తను
ప్రకటించుడి. । నమ్మి బాప్తిస్మము పొందినవాడు రక్షింప 16
బడును; నమ్మనివానికి శిక్ష విధింపబడును. । నమ్మిన 17
వారివలన ఈ సూచకక్రియలు కనబడును;[1] ఏవనగా,
నా నామమున దయ్యములను వెళ్లగొట్టుదురు, క్రొత్త
భాషలు మాటలాడుదురు, । పాములను ఎత్తి పట్టు 18
కొందురు, మరణకరమైనదేది త్రాగినను అది వారికి
హానిచేయదు, రోగులమీద చేతులుంచినప్పుడు వారు
స్వస్థత నొందుదురని వారితో చెప్పెను.
ఈలాగు ప్రభువైన యేసు వారితో మాటలాడిన 19
తరువాత పరలోకమునకు చేర్చుకొనబడి, దేవుని కుడి
పార్శ్వమున ఆసీనుడయ్యెను. । వారు బయలుదేరి 20
వాక్యమంతట ప్రకటించిరి. ప్రభువు వారికి సహకా
రుడై యుండి, జరుగుచు వచ్చిన[2] సూచకక్రియలచేత
వాక్యమును స్థిరపరచుచుండెను. ఆమేన్.

[1] మూలభాషలో—నమ్మినవారిని ఈ సూచకక్రియలు వెంబడించును.
[2] మూలభాషలో—వెంబడించుచుండిన.

# లూకా సువార్త

1 ఘనతవహించిన థెయొఫిలా, ఆరంభమునుండి కన్ను
2 లార చూచి వాక్యసేవకులైనవారు మనకు అప్పగించిన
4 ప్రకారము మన మధ్యను నెరవేరిన కార్యములను
గూర్చి వివరముగ వ్రాయుటకు అనేకులు పూను
కొన్నారు గనుక నీకు ఉపదేశింపబడిన సంగతులు
నిశ్చయముగా జరిగినవని నీవు తెలిసికొనుటకై వాటి
నన్నిటిని మొదటనుండి తరచి పరిష్కారముగా తెలిసి
కొనియున్న నేనును నీ పేరట వాటినిగూర్చి వరుసగా
రచించుట యుక్తమని యెంచితిని.
5 యూదైయదేశపు రాజైన హేరోదు దినములలో
అబీయా తరగతిలోనున్న జెకర్యా అను ఒక యాజ
కుడుండెను. అతని భార్య అహరోను కుమార్తెలలో
6 ఒకతె; ఆమె పేరు ఎలీసబెతు. । వీరిద్దరు ప్రభువు
యొక్క సకలమైన ఆజ్ఞలచొప్పునను న్యాయవిధుల
చొప్పునను నిరపరాధులుగా నడుచుకొనుచు దేవుని
7 దృష్టికి నీతిమంతులై యుండిరి. । ఎలీసబెతు గొడ్రా
లైనందున వారికి పిల్లలు లేకపోయిరి; మరియు వారిద్దరు
బహుకాలము గడచిన (వృద్ధులైరి.)
8 జెకర్యా తన తరగతి క్రమముచొప్పున దేవుని
9 యెదుట యాజక ధర్మము జరిగించుచుండగా । యాజక
మర్యాదచొప్పున ప్రభువు ఆలయములోకి వెళ్లి
10 ధూపము వేయుటకు అతనికి వంతు వచ్చెను. । ధూప
సమయమందు ప్రజల సమూహమంతయు వెలపట
11 ప్రార్థనచేయుచుండగా । ప్రభువు దూత ధూపవేదిక
12 కుడివైపున నిలిచి అతనికి కనబడగా । జెకర్యా అతని
13 చూచి తొందరపడి భయపడినవాడాయెను. । అప్పు
డా దూత అతనితో — జెకర్యా భయపడకుము; నీ
ప్రార్థన వినబడినది, నీ భార్యయైన ఎలీసబెతు నీకు
కుమారుని కనును, అతనికి యోహాను అని పేరు పెట్టు
14 దువు. । అతడు ప్రభువు దృష్టికి గొప్పవాడై, ద్రాక్షా
16 రసమైనను మద్యమైనను త్రాగక, తన తల్లిగర్భమున
పుట్టినది మొదలుకొని పరిశుద్ధాత్మతో నిండుకొనిన
వాడై, ఇశ్రాయేలీయులలో అనేకులను ప్రభువైన
17 వారి దేవుని వైపుకు త్రిప్పును. । మరియు అతడు
తండ్రుల హృదయములను పిల్లల తట్టునకును, అవిధే
యులను నీతిమంతుల జ్ఞానము ననుసరించుటకును
త్రిప్పి, ప్రభువుకొరకు ఆయత్తపడియున్న ప్రజలను
సిద్ధపరచుటకై ఏలీయాయొక్క ఆత్మయు శక్తియు గల
వాడై ఆయనకు ముందుగా వెళ్లును గనుక నీకు సంతో
షమును మహా ఆనందమును కలుగును; అతడు పుట్టినం
18 దుకు అనేకులు సంతోషింతురనెను. । జెకర్యా—యిది

నాకేలాగు తెలియును? నేను ముసలివాడను, నా
భార్యయు బహుకాలము గడచినదని ఆ దూతతో
చెప్పగా । దూత—నేను దేవుని సముఖమందు నిలుచు 19
గబ్రియేలును; నీతో మాటలాడుటకును ఈ సువర్తమా
నము నీకు తెలుపుటకును పంపబడితిని. । మరియు నా 20
మాటలు వాటికాలమందు నెరవేరును; నీవు వాటిని
నమ్మలేదు గనుక ఈ సంగతులు జరుగు దినమువరకు
నీవు మాటలాడలేక మౌనివై యుందువని అతనితో
చెప్పెను. । ప్రజలు జెకర్యాకొరకు కనిపెట్టుచుండి, 21
గర్భాలయమునందు అతడు ఆలస్యము చేసినందుకు
ఆశ్చర్యపడిరి. । అతడు వెలపలికి వచ్చినప్పుడు వారి 22
తో మాటలాడలేకపోయినందున, గర్భాలయములో
అతనికి దర్శనము కలిగినదని వారు గ్రహించిరి; అప్పు
డతడు వారికి సంజ్ఞలు చేయుచు మూగవాడై యుం
డెను. । అతడు సేవచేయు దినములు సంపూర్ణమై 23
నప్పుడు తన యింటికి వెళ్లెను.
ఆ దినములైన పిమ్మట అతని భార్య ఎలీసబెతు 24
గర్భవతియై—మనుష్యులలో నాకుండిన అవమానమును
పరిహరించుటకు । నన్ను కటాక్షించిన దినములలో 25
ప్రభువు ఈలాగున చేసెననుకొని అయిదు నెలలు
ఇతరుల కంటబడకుండెను.
ఆరవ నెలలో గబ్రియేలను దేవదూత గలిలైయ 26
లోని నజరేతను ఊరిలో । దావీదు వంశస్థుడైన యోసే 27
పను ఒక పురుషునికి ప్రధానము చేయబడిన కన్యక
యొద్దకు దేవునిచేత పంపబడెను. ఆ కన్యకపేరు
మరియ. । ఆ దూత లోపలికి వచ్చి ఆమెను చూచి— 28
దయాప్రాప్తురాలా నీకు శుభము; ప్రభువు నీకు తోడై
యున్నాడని చెప్పెను. । ఆమె ఆ మాటకు బహుగా 29
తొందరపడి—ఈ శుభవచనమేమిటో అని ఆలోచించు 30
కొనుచుండగా దూత — మరియా, భయపడకుము;
దేవునివలన నీవు కృపపొందితివి. । ఇదిగో నీవు గర్భము 31
ధరించి కుమారుని కని ఆయనకు యేసు అను పేరు
పెట్టుదువు; । ఆయన గొప్పవాడై సర్వోన్నతుని 32
కుమారుడనబడును; ప్రభువైన దేవుడు ఆయన తండ్రి
యైన దావీదు సింహాసనమును ఆయన కిచ్చును. । ఆయన 33
యాకోబు వంశస్థులను యుగయుగముల నేలును;
ఆయన రాజ్యము అంతములేనిదై యుండునని ఆమె
తో చెప్పెను. । అందుకు మరియ—నేను పురుషుని 34
ఎరుగనిదాననే; యిదేలాగు జరుగునని దూతతో
అనగా । దూత — పరిశుద్ధాత్మ నీమీదికి వచ్చును; 35
సర్వోన్నతుని శక్తి నిన్ను కమ్ముకొనును గనుక పుట్టబోవు

శిశువు పరిశుద్ధుడై దేవుని కుమారుడనబడును. ।  మరియు
నీ బంధువురాలు ఎలీసబెతుకూడ తన వృద్ధాప్యమందు
ఒక కుమారుని గర్భము ధరించి యున్నది; గొడ్రాలన
బడిన ఆమెకు ఇది ఆరవమాసము; । దేవుడు చెప్పిన యే
మాటయైనను నిరర్థకము కానేరదని ఆమెతో చెప్పె
ను. । అందుకు మరియ—ఇదిగో ప్రభువు దాసురాలను;
నీ మాటచొప్పున నాకు జరుగును గాక అనెను.
అంతట దూత ఆమెయొద్దనుండి వెళ్లెను.

ఆ దినములయందు మరియ లేచి యూదా ప్రదేశ
ములోని కొండ సీమలోనున్న ఒక ఊరికి త్వరగా
వెళ్లి । జెకర్యా యింటిలో ప్రవేశించి ఎలీసబెతుకు
వందనముచేసెను. । ఎలీసబెతు మరియయొక్క వందన
వచనము వినగానే ఆమె గర్భములో శిశువు గంతులు
వేసెను. అంతట ఎలీసబెతు పరిశుద్ధాత్మతో నిండుకొని
నదై బిగ్గరగా ఇట్లనెను—

స్త్రీలలో నీవు ఆశీర్వదింపబడినదానవు
నీ గర్భఫలమును ఆశీర్వదింపబడును
నా ప్రభువు తల్లి నాయొద్దకు వచ్చుట
నా కేలాగు ప్రాప్తించెను?
ఇదిగో నీ శుభవచనము నా చెవినిపడగానే
నా గర్భములోని శిశువు ఆనందముతో గంతులు
వేసెను.
ప్రభువు ఆమెకు తెలియజేయించిన మాటలు
సిద్ధించును గనుక నమ్మిన ఆమె ధన్యురాలనెను.

అప్పుడు మరియ యిట్లనెను—

నా ప్రాణము ప్రభువును ఘనపరచుచున్నది.
ఆయన తన దాసురాలి దీనస్థితిని కటాక్షించెను
నా ఆత్మ నా రక్షకుడైన దేవునియందు ఆనందించెను.
సర్వశక్తిమంతుడు నాకు గొప్పకార్యములు చేసెను
గనుక ఇది మొదలుకొని అన్నితరములవారు
నన్ను ధన్యురాలని యందురు.
ఆయన నామము పరిశుద్ధము
ఆయనకు భయపడువారిమీద ఆయన కనికరము
తరతరములకుండును.
ఆయన తన బాహువుతో పరాక్రమము చూపెను
వారి హృదయముల ఆలోచన విషయమై గర్విష్ఠు
లను చెదరగొట్టెను
సింహాసనములనుండి బలవంతులను పడద్రోసి
దీనుల నెక్కించెను
ఆకలిగొనినవారిని మంచి పదార్థములతో సంతృప్తి
పరచి ధనవంతులను వట్టిచేతులతో పంపివే
సెను.
అబ్రాహామునకును అతని సంతానమునకును
యుగాంతమువరకు
తన కనికరము చూపి జ్ఞాపకము చేసికొందునని
మన పితరులతో సెలవిచ్చినట్టు
ఆయన తన సేవకుడైన ఇశ్రాయేలుకు సహాయము
చేసెను.

అంతట మరియ యించుమించు మూడు నెలలు 56
ఆమెతోకూడ ఉండి పిమ్మట తన యింటికి తిరిగివెళ్లెను.

ప్రసవకాలము వచ్చినప్పుడు ఎలీసబెతు కుమారుని 57
కనెను. । అప్పుడు ప్రభువు ఆమెమీద మహాకనికర 58
ముంచెనని ఆమె పొరుగువారును బంధువులును విని
ఆమెతోకూడ సంతోషించిరి. । ఎనిమిదవ దినమున 59
వారు ఆ శిశువుకు సున్నతి చేయవచ్చి, తండ్రి పేరును
బట్టి జెకర్యా అను పేరు వానికి పెట్టబోవుచుండగా ।
తల్లి — ఆలాగు వద్దు; వానికి యోహానని పేరు పెట్ట 60
వలెనని చెప్పెను. । అందుకు వారు—నీ బంధువులలో 61
ఆ పేరు గలవాడెవడును లేడే అని ఆమెతో చెప్పి ।
వానికి ఏ పేరు పెట్టగోరుచున్నావని వాని తండ్రికి 62
సంజ్ఞలుచేసి అడిగిరి. । అతడు వ్రాతపలక తెమ్మని— 63
వాని పేరు యోహానని వ్రాసెను; అందుకు వారందరు
ఆశ్చర్యపడిరి. । వెంటనే అతని నోరు తెరవబడి నాలుక 64
సడలి, అతడు దేవుని స్తుతించుచు మాటలాడసాగెను. ।
అందునుబట్టి వారి చుట్టుపట్ల కాపురమున్నవారికం 65
దరికిని భయము కలిగెను. ఆ సంగతులన్నియు
యూదయ కొండసీమలయందంతట ప్రచురమా
యెను. । ప్రభువు హస్తము అతనికి తోడైయుండెను 66
గనుక ఆ సంగతులను గూర్చి వినినవారందరును—ఈ
బిడ్డ యేలాటివాడగునో అని వాటిని మనస్సులో
ఉంచుకొనిరి.

మరియు అతని తండ్రి జెకర్యా పరిశుద్ధాత్మ పూర్ణుడై 67
యిట్లు ప్రవచించెను—

ప్రభువైన ఇశ్రాయేలు దేవుడు స్తుతింపబడుగాక 68
ఆయన తన ప్రజలకు దర్శనమిచ్చి వారికి విమోచన 75
కలుగజేసెను
తన సేవకుడైన దావీదు వంశమునందు మనకొరకు
రక్షణ శృంగమును, అనగా
మన శత్రువులనుండియు మనలను ద్వేషించువారం
దరి చేతినుండియు తప్పించి రక్షణ కలుగజేసెను.
దీనిగూర్చి ఆయన ఆదినుండి తన పరిశుద్ధప్రవక్తల
నోట పలికించెను.
ఆయన మన పితరులను కరుణించుటకును
తన పరిశుద్ధ నిబంధనను, అనగా మన తండ్రియైన
అబ్రాహాముతో తాను చేసిన ప్రమాణమును
జ్ఞాపకము చేసికొనుటకును
మనము శత్రువుల చేతినుండి విడిపింపబడి మన
జీవితకాలమంతయు నిర్భయులమై ఆయన
సన్నిధిని పరిశుద్ధముగాను నీతిగాను ఆయనను
సేవింపను
అనుగ్రహించుటకును ఈ రక్షణ కలుగజేసెను.

76 మరియు ఓ శిశువా, నీవు సర్వోన్నతుని ప్రవక్త
79 వనబడుదువు
మన దేవుని మహా వాత్సల్యమునుబట్టి వారి పాప
ములను క్షమించుటవలన
తన ప్రజలకు రక్షణజ్ఞానము ఆయన అనుగ్రహిం
చునట్లు
ఆయన మార్గములను సిద్ధపరచుటకై నీవు ప్రభువుకు
ముందుగా నడుతువు.
మన పాదములను సమాధాన మార్గములోకి నడి
పించునట్లు
చీకటిలోను మరణచ్ఛాయలోను
కూర్చుండువారికి వెలుగిచ్చుటకై ఆ మహా వాత్స
ల్యమునుబట్టి పైనుండి ఆయన మనకు అరు
ణోదయ దర్శనమనుగ్రహించెను.
80 శిశువు ఎదిగి ఆత్మయందు బలము పొంది ఇశ్రాయే
లుకు ప్రత్యక్షమగు దినమువరకు అరణ్యములో నుం
డెను.

2 ఆ దినములలో సర్వలోకమునకు ప్రజాసంఖ్య
2 వ్రాయవలెనని కైసరాగుస్తువలన ఆజ్ఞ ఆయెను. । ఇది
కురేనియు సురియదేశమునకు అధిపతియై యున్న
3 ప్పుడు జరిగిన మొదటి ప్రజాసంఖ్య. । అందరును ఆ
సంఖ్యలో వ్రాయబడుటకు తమతమ పట్టణములకు
4 వెళ్లిరి. । యోసేపు దావీదు వంశములోను గోత్రము
5 లోను పుట్టినవాడు గనుక, తనకు భార్యగా ప్రధా
నము చేయబడి గర్భవతియై యుండిన మరియతోకూడ
ఆ సంఖ్యలో వ్రాయబడుటకు గలిలైయలోని నజ
రేతు పట్టణములోనుండి యూదైయలోని బేత్లెహే
6 మనబడిన దావీదు ఊరికి వెళ్లెను. । వారక్కడ ఉన్న
7 ప్పుడు ఆమె ప్రసవదినములు నిండెను గనుక । తన
తొలిచూలు కుమారుని కని, పొత్తిగుడ్డలతో చుట్టి,
సత్రములో వారికి స్థలము లేనందున ఆయనను పశు
వుల తొట్టిలో పరుండబెట్టెను.
8 ఆ దేశములో కొందరు గొర్రెల కాపరులు పొల
ములో ఉండి రాత్రివేళ తమ మందను కాచుకొను
9 చుండగా । ప్రభువు దూత వారియొద్దకు వచ్చి
నిలిచెను; ప్రభువు మహిమ వారిచుట్టు ప్రకాశించి
10 నందున వారు మిక్కిలి భయపడిరి. । అయితే ఆ
దూత—భయపడకుడి; ఇదిగో ప్రజలకందరికి కలుగ
బోవు మహా సంతోషకరమైన సువర్తమానము నేను
11 మీకు తెలియజేయుచున్నాను; । దావీదు పట్టణ
మందు నేడు రక్షకుడు మీకు పుట్టియున్నాడు;
12 ఈయన ప్రభువైన క్రీస్తు.[1] । దానికిదే మీకానవాలు;
ఒక శిశువు పొత్తిగుడ్డలతో చుట్టబడి యొక తొట్టిలో
పండుకొనియుండుట మీరు చూచెదరని వారితో
వెంటనే పరలోక సైన్యసమూహము ఆ
దూతతో కూడనుండి । —సర్వోన్నతమైన స్థలముల 14
లో దేవునికి మహిమయు ఆయన కిష్టులైన మనుష్యులకు
భూమిమీద సమాధానమును కలుగుగాక అని దేవుని
స్తోత్రము చేయుచుండెను.
ఆ దూతలు తమయొద్దనుండి పరలోకమునకు వెళ్లిన 15
తరువాత ఆ గొర్రెల కాపరులు—జరిగిన యీ కార్య
మును ప్రభువు మనకు తెలియజేయించియున్నాడు;
మనము బేత్లెహేమువరకు వెళ్లి చూతము రండని
యొకనితో నొకడు చెప్పుకొని । త్వరగా వెళ్లి, మరి 16
యను యోసేపును తొట్టిలో పండుకొనియున్న శిశు
వును చూచిరి. । వారు చూచి యీ శిశువునుగూర్చి 17
తమతో చెప్పబడిన మాటలు ప్రచురముచేసిరి. ।
గొర్రెల కాపరులు తమతో చెప్పిన సంగతులనుగూర్చి 18
విన్నవారందరు మిక్కిలి ఆశ్చర్యపడిరి. । అయితే 19
మరియ ఆ మాటలన్నియు తన హృదయములో తల
పోసికొనుచు భద్రము చేసికొనెను. । అంతట ఆ 20
గొర్రెల కాపరులు తమతో చెప్పబడినట్టుగా తాము
విన్నవాటిని కన్నవాటినన్నిటినిగూర్చి దేవుని మహిమ
పరచుచు స్తోత్రముచేయుచు తిరిగి వెళ్లిరి.
ఆ శిశువుకు సున్నతి చేయవలసిన యెనిమిదవ 21
దినము వచ్చినప్పుడు, గర్భమందాయన పడకమునుపు
దేవదూతచేత పెట్టబడిన యేసు[2] అను పేరు వారు
ఆయనకు పెట్టిరి.
మోషే ధర్మశాస్త్రముచొప్పున వారు తమ్మును శుద్ధి 22
చేసికొను దినములు గడచినప్పుడు 24
—ప్రతి తొలిచూలు మగపిల్ల ప్రభువుకు ప్రతిష్ఠ
చేయబడవలెను
అని ప్రభువు ధర్మశాస్త్రమందు వ్రాయబడినట్టు[3] ఆయ
నను ప్రభువుకు ప్రతిష్ఠించుటకును, ప్రభువు ధర్మ
శాస్త్రమందు చెప్పబడినట్టు[4] గువ్వల జతనైనను రెండు
పావురపు పిల్లలనైనను బలిగా సమర్పించుటకును, వారు
ఆయనను యెరూషలేముకు తీసికొనిపోయిరి. । యెరూ 25
షలేమునందు సుమెయోనను ఒక మనుష్యుడుండెను.
అతడు నీతిమంతుడును భక్తిపరుడునైయుండి, ఇశ్రా
యేలుయొక్క ఆదరణకొరకు కనిపెట్టువాడు; పరి
శుద్ధాత్మ అతనిమీద ఉండెను. । అతడు ప్రభువు 26
యొక్క క్రీస్తుని చూడక మునుపు మరణము పొందడని
అతనికి పరిశుద్ధాత్మచేత బయలుపరచబడియుండెను;
ఆత్మవశుడై అతడు దేవాలయములోకి వచ్చెను. ।
అంతట ధర్మశాస్త్రపద్ధతి చొప్పున ఆయన విషయమై 27
జరిగించుటకు తలిదండ్రులు శిశువైన యేసును దేవా 28
లయములోకి తీసికొనివచ్చినప్పుడు అతడు తన చేతుల
లో ఆయనను ఎత్తికొని దేవుని స్తుతించుచు ఇట్లనెను—
—నాథా, యిప్పుడు నీ మాటచొప్పున సమాధాన 29
ముతో నీ దాసుని పోనిచ్చుచున్నావు; 32

1 అభిషిక్తుడని అర్థము. 2 యేసు అను శబ్దమునకు రక్షకుడని అర్థము. 3 నిర్గమకాండము, 13: 2. 4 లేవీయకాండము, 12: 8.

అన్యజనులకు నిన్ను బయలుపరచుటకు వెలుగు
గాను
నీ ప్రజలైన ఇశ్రాయేలుకు మహిమగాను
నీవు సకల ప్రజలయెదుట సిద్ధపరచిన నీ రక్షణ
నేను కన్నులార చూచితిని.
33 యోసేపును ఆయన తల్లియు ఆయననుగూర్చి చెప్ప
34 బడిన మాటలను విని ఆశ్చర్యపడిరి. । సుమెయోను
వారిని దీవించి — ఇదిగో అనేక హృదయాలోచనలు
బయలుపడునట్లు, ఇశ్రాయేలులో అనేకులు పడుట
కును తిరిగి లేచుటకును వివాదాస్పదమైన గురుతుగా
35 ఈయన నియమింపబడియున్నాడు; । మరియు నీ
హృదయములోకి ఒక ఖడ్గము దూసిపోవునని ఆయన
36 తల్లియైన మరియతో చెప్పెను. । మరియు ఆషేరు
గోత్రికురాలును పనూయేలు కుమార్తెయునైన అన్న
అను ఒక ప్రవక్త్రి యుండెను. ఆమె కన్యాత్వము
మొదలు ఏడేండ్లు పెనిమిటితో సంసారముచేసి బహు
37 కాలము గడచినదై, । యెనుబది నాలుగు సంవత్సర
ములు విధవరాలైయుండి, దేవాలయము విడువక ఉప
వాసప్రార్థనలతో రేయింబగళ్లు సేవచేయుచుండెను. ।
38 ఆమెకూడ ఆ గడియలోనే లోపలికి వచ్చి దేవుని
కొనియాడి, యెరూషలేములో విమోచనకొరకు కని
పెట్టుచున్నవారందరితో ఆయననుగూర్చి మాటలాడు
39 చుండెను. । అంతట వారు ప్రభువు ధర్మశాస్త్రము
చొప్పున సమస్తము తీర్చిన పిమ్మట గలిలైయలోని నజ
రేతను తమ ఊరికి తిరిగి వెళ్లిరి.
40 బాలుడు జ్ఞానముతో నిండుకొనుచు, ఎదిగి బలము
పొందుచుండెను; దేవుని దయ ఆయనమీద నుండెను.
41 పస్కాపండుగప్పుడు ఆయన తలిదండ్రులు ఏటేట
42 యెరూషలేముకు వెళ్లుచుండువారు. । ఆయన పన్నెం
డేండ్లవాడై యున్నప్పుడు ఆ పండుగ ఆచరించుటకై
43 వాడుకచొప్పున వారు యెరూషలేముకు వెళ్లిరి. । ఆ
దినములు తీరినతరువాత వారు తిరిగి వెళ్లుచుండగా
44 బాలుడైన యేసు యెరూషలేములో నిలిచెను. । ఆయన
తలిదండ్రులు ఆ సంగతి ఎరుగక ఆయన సరసలో
ఉన్నాడని తలంచి, యొక దినప్రయాణము సాగి
పోయి, తమ బంధువులలోను నెళవైనవారిలోను ఆయ
45 నను వెదకుచుండిరి. । ఆయన కనబడనందున ఆయనను
46 వెదకుచు యెరూషలేమునకు తిరిగి వచ్చిరి. । మూడు
దినములైన తరువాత ఆయన దేవాలయములో బోధ
కుల మధ్యను కూర్చుండి వారిమాటలను ఆలకించుచు
47 వారిని ప్రశ్నలడుగుచు ఉండగా చూచిరి । ఆయన
మాటలు వినినవారందరు ఆయన ప్రజ్ఞకును ప్రత్యు
48 త్తరములకును విస్మయమొందిరి. । ఆయన తలిదండ్రులు
ఆయనను చూచి మిక్కిలి ఆశ్చర్యపడిరి. ఆయన తల్లి
—కుమారుడా, మమ్మును ఎందుకీలాగు చేసితివి! ఇదిగో
నీ తండ్రియు నేనును దుఃఖపడుచు నిన్ను వెదకుచుంటి
మని ఆయనతో చెప్పగా । ఆయన — మీరేల నన్ను 49
వెదకుచుంటిరి? నేను నా తండ్రి పనులమీద నుండ
వలెనని మీరెరుగరా[1] అని వారితో చెప్పెను; ।
అయితే ఆయన తమతో చెప్పినమాట వారు గ్రహింప 50
లేదు. । అంతట ఆయన వారితోకూడ బయలుదేరి 51
నజరేతుకు వచ్చి వారికి లోబడియుండెను. ఆయన
తల్లి ఈ సంగతులన్నిటిని తన హృదయములో భద్రము
చేసికొనెను. । యేసు జ్ఞానమందును, వయస్సునందును, 52
దేవుని దయయందును, మనుష్యుల దయయందును
వర్ధిల్లుచుండెను.

తిబెరికైసరు ఏలుబడి పదునైదవ సంవత్సరమందు 3
యూదైయకు పొంతిపిలాతు అధిపతిగాను, గలిలై
యకు హేరోదు చతుర్థాధిపతిగాను, ఇతూరయ
త్రకోనీతి దేశములకతని తమ్ముడైన ఫిలిప్పు చతుర్థాధి
పతిగాను, అబిలేనే దేశమునకు లుసానియ అధిపతి
గాను, । అన్నయు కయపయు ప్రధానయాజకులు 2
గాను ఉన్నకాలమున అరణ్యములో జెకర్యా కుమా
రుడైన యోహాను నొద్దకు దేవుని వాక్యము వచ్చెను.
అంతట అతడు వచ్చి, పాపక్షమాపణనిమిత్తము 3
మారుమనస్సు విషయమైన బాప్తిస్మము పొందవలెనని 6
యొర్దానునదీ ప్రదేశమందంతట ప్రకటించుచుండెను.
—ప్రభువు మార్గము సిద్ధపరచుడి
ఆయన త్రోవలను సరాళముచేయుడి
ప్రతి పల్లము పూడ్చబడును
ప్రతి కొండయు మెట్టయు పల్లము చేయబడును
వంకర మార్గములు తిన్ననివగును
కరుకు మార్గములు నున్ననివగును
సకల శరీరులు దేవుని రక్షణ చూతురు
అని అరణ్యములో కేకలువేయుచున్న యొకని
శబ్దము
అని ప్రవక్తయైన యెషయా వాక్యముల గ్రంథమందు
వ్రాయబడినట్టు[2] ఇది జరిగెను. । అతడు తనచేత 7
బాప్తిస్మము పొందవచ్చిన జనసమూహములను చూచి
— సర్పసంతానమా, రాబోవు ఉగ్రతను తప్పించు
కొనుటకు మీకు బుద్ధి చెప్పినవాడెవడు? । మారుమన 8
స్సుకు తగిన ఫలములు ఫలించుడి—అబ్రాహాము మాకు
తండ్రి అని మీలో మీరనుకొన మొదలుపెట్టుకొన
వద్దు; దేవుడు ఈ రాళ్లవలన అబ్రాహాముకు పిల్లలను
పుట్టింపగలడని మీతో చెప్పుచున్నాను. । ఇప్పుడే 9
గొడ్డలి చెట్ల వేరున ఉంచబడియున్నది గనుక మంచి
ఫలము ఫలింపని ప్రతి చెట్టును నరకబడి అగ్నిలో
పడవేయబడునని చెప్పెను. । అందుకు జనులు—ఆలా 10
గైతే మేమేమి చేయవలెనని అతని నడుగగా । అతడు 11
—రెండు అంగీలుగలవాడు ఏమియు లేనివానికియ్య

1 లేక, నేను నా తండ్రి మందిరములో నుండవలెనని మీరెరుగరా. 2 యెషయా, 40: 3–5.

వలెనిచ్చును, ఆహారముగలవాడును అలాగే చేయవలె
12 ననియు వారితో చెప్పెను. । సుంకరులును బాప్తిస్మము
పొందవచ్చి — బోధకుడా, మేమేమి చేయవలెనని
13 అతని నడుగగా । అతడు — మీకు నిర్ణయింపబడిన
దానికంటె ఎక్కువ తీసికొనవద్దని వారితో చెప్పెను. ।
14 సైనికులును — మేమేమి చేయవలెనని అతని నడిగి
నందుకు అతడు — ఎవనిని బాధపెట్టకయు ఎవనిమీ
దను అపనిందవేయకయు మీ జీతములతో తృప్తి
పొందియుండుడని వారితో చెప్పెను.
15 ప్రజలు కనిపెట్టుచు, ఇతడు క్రీస్తయి యుండు
నేమో అని అందరును యోహానునుగూర్చి తమ హృద
16 యములలో ఆలోచించుకొనుచుండగా । యోహాను
— నేను నీళ్లతో మీకు బాప్తిస్మమిచ్చుచున్నాను;
అయితే నాకంటె శక్తిమంతుడొకడు వచ్చుచున్నాడు;
ఆయన చెప్పుల వారునైనను విప్పుటకు నేను పాత్రు
డను కాను; ఆయన పరిశుద్ధాత్మలోను[1] అగ్నితోను
17 మీకు బాప్తిస్మమిచ్చును; । ఆయన చేట ఆయన చేతి
లోనున్నది; ఆయన తన కళ్లమును బాగుగా శుభ్రము
చేసి, తన కొట్టులో గోధుమలు పోసి, ఆరని అగ్నితో
పొట్టు కాల్చివేయునని అందరితో చెప్పెను.
18 ఇదియుగాక అతడింక అనేక సంగతులు చెప్పి
ప్రజలను హెచ్చరించుచు వారికి సువార్త ప్రకటిం
19 చెను. । అయితే చతుర్థాధిపతియైన హేరోదు తన
తమ్ముని భార్యయైన హేరోదియ నిమిత్తమును, తాను
చేసిన సకల దుష్కార్యముల నిమిత్తమును యోహాను
20 తన్ను గద్దించినందుకు । అదివరకు తాను చేసినవన్ని
యు చాలనట్టు యోహానును చెరసాలలో వేయిం
చెను.
21 ప్రజలందరును బాప్తిస్మము పొందినప్పుడు యేసు
కూడ బాప్తిస్మము పొంది ప్రార్థన చేయుచుండగా
22 ఆకాశము తెరవబడి । పరిశుద్ధాత్మ శరీరాకారముగా
పావురమువలె ఆయనమీదికి దిగివచ్చెను. అప్పుడు —
నీవు నా ప్రియకుమారుడవు, నీయందు నేనానందించు
చున్నానని యొక శబ్దము ఆకాశమునుండి వచ్చెను.
23 యేసు (బోధింప) మొదలుపెట్టినప్పుడు ఆయన
దాదాపు ముప్పది ఏండ్ల యీడుగలవాడై యుండెను.
ఆయన యోసేపు కుమారుడని యెంచబడెను. యో
24 సేపు హేలీకి, । హేలీ మత్తతుకు, మత్తతు లేవికి, లేవి
25 మెల్కీకి, । మెల్కీ యన్నకు, యన్న యోసేపుకు,
యోసేపు మత్తతీయకు, మత్తతీయ ఆమోసుకు, ఆమోసు
నాహూముకు, నాహూము ఎస్లికి, ఎస్లి నగ్గయికి, ।
26 నగ్గయి మయతుకు, మయతు మత్తతీయకు, మత్తతీయ
సిమియకు, సిమియ యోశేఖుకు, యోశేఖు యో
దాకు, । యోదా యోహన్నకు, యోహన్న రేసాకు,
రేసా జెరుబ్బాబెలుకు, జెరుబ్బాబెలు షయల్తీయేలుకు,
షయల్తీయేలు నేరికి, । నేరి మెల్కీకి, మెల్కీ అద్దికి, 28
అద్ది కోసాముకు, కోసాము ఎల్మదాముకు, ఎల్మదాము
ఏరుకు, । ఏరు యెహోషువకు, యెహోషువ ఎలీ 29
యెజెరుకు, ఎలీయెజెరు యోరీముకు, యోరీము మత్త
తుకు, మత్తతు లేవికి, । లేవి షిమ్యోనుకు, షిమ్యోను 30
యూదాకు, యూదా యోసేపుకు, యోసేపు యోనా
ముకు, యోనాము ఎల్యాకీముకు, । ఎల్యాకీము మెలె 31
యాకు, మెలెయా మెన్నాకు, మెన్నా మత్తతాకు,
మత్తతా నాతానుకు, నాతాను దావీదుకు, । దావీదు 32
యెష్షయికి, యెష్షయి ఓబేదుకు, ఓబేదు బోయజుకు,
బోయజు శల్మానుకు, శల్మాను నయస్సోనుకు, । నయ 33
స్సోను అమ్మీనాదాబుకు, అమ్మీనాదాబు అరాముకు,
అరాము ఎస్రోముకు, ఎస్రోము పెరెసుకు, । పెరెసు
యూదాకు, । యూదా యాకోబుకు, యాకోబు 34
ఇస్సాకుకు, ఇస్సాకు అబ్రాహాముకు, అబ్రాహాము
తెరహుకు, తెరహు నాహోరుకు, । నాహోరు 35
సెరూగుకు, సెరూగు రయూకు, రయూ పెలెగుకు,
పెలెగు హెబెరుకు, హెబెరు షేలహుకు, । షేలహు 36
కేయినానుకు, కేయినాను అర్పక్షదుకు, అర్పక్షదు
షేముకు, షేము నోవహుకు, నోవహు లెమెకుకు, ।
లెమెకు మెతూషెలకు, మెతూషెల హనోకుకు, 37
హనోకు యెరెదుకు, యెరెదు మహలలేలుకు, మహల
లేలు కేయినానుకు, । కేయినాను ఎనోషుకు, ఎనోషు 38
షేతుకు, షేతు ఆదాముకు, ఆదాము దేవునికి కుమా
రుడై యుండెను.

యేసు పరిశుద్ధాత్మ పూర్ణుడై యొర్దానునదినుండి 4
తిరిగివచ్చి, ఆత్మచేత అరణ్యమునకు కొనిపోబడి ।
నలువది దినములు అపవాదిచేత[2] శోధింపబడుచుం 2
డెను. ఆ దినములలో ఆయన ఏమియు తినలేదు.
అవి తీరిన తరువాత ఆయన ఆకలిగొనగా । అపవాది 3
— నీవు దేవుని కుమారుడవైతే రొట్టె అగునట్లు ఈ
రాతితో చెప్పుమని ఆయనతో చెప్పెను. । అందుకు 4
యేసు

—మనుష్యుడు రొట్టెవలన మాత్రమే జీవించడు

అని వ్రాయబడియున్నదని[3] వానికి ప్రత్యుత్తరమి
చ్చెను. । అప్పుడు అపవాది ఆయనను తీసికొనిపోయి, 5
భూలోక రాజ్యములన్నియు ఒక నిమిషములో ఆయ
నకు చూపించి । —ఈ అధికారమంతయు ఈ రాజ్య 6
ముల మహిమయు నీకిత్తును; అది నాకప్పగింపబడి
యున్నది, అదెవనికి నేను ఇయ్యగోరుదునో వానికి
త్తును; । కాబట్టి నీవు నాకు మ్రొక్కితివా యిదంత 7
యు నీదగునని ఆయనతో చెప్పెను. । అందుకు యేసు 8

— నీ దేవుడైన ప్రభువుకు మ్రొక్కి ఆయనను
మాత్రము సేవింపవలెను

అని వ్రాయబడియున్నదని[4] వానికి ప్రత్యుత్తరమి

1 లేక, పరిశుద్ధాత్మలోను. 2 అనగా, సాతానుచేత. 3 ద్వితీ. 8: 3. 4 ద్వితీ. 6: 13.

చ్చెను. । పిమ్మట ఆయనను యెరూషలేముకు తీసికొని పోయి, దేవాలయ శిఖరమున ఆయనను నిలువబెట్టి— నీవు దేవుని కుమారుడవైతే ఇక్కడనుండి క్రిందికి దుముకుము

నిన్ను కాపాడుటకు నిన్నుగూర్చి తన దూతలకు
ఆజ్ఞాపించును. । నీ పాదమెప్పుడైన రాతికి
తగలకుండ వారు నిన్ను చేతులతో ఎత్తికొం
దురు

అని వ్రాయబడియున్నదని[1] ఆయనతో చెప్పెను. । అందుకు యేసు

—నీ దేవుడైన ప్రభువును శోధింపవద్దు

అని చెప్పబడియున్నదని[2] వానికి ప్రత్యుత్తరమిచ్చెను.। అపవాది ప్రతి శోధన ముగించి, సమయము వచ్చు వరకు ఆయనను విడిచిపోయెను.

అప్పుడు యేసు ఆత్మ బలముగలవాడై గలిలైయకు తిరిగి వెళ్లెను; ఆయననుగూర్చిన సమాచారము ఆ ప్రదేశమందంతట వ్యాపించెను. । ఆయన అందరిచేత ఘనతనొంది వారి సమాజమందిరములలో బోధించుచు వచ్చెను.

తరువాత ఆయన తాను పెరిగిన నజరేతుకు వచ్చెను. తన వాడుకచొప్పున విశ్రాంతిదినమందు సమాజమందిరములోకి వెళ్లి చదువుటకై నిలుచుండగా । ప్రవక్తయైన యెషయా గ్రంథము ఆయన చేతికియ్యబడెను; ఆయన గ్రంథము విప్పగా—

ప్రభువు ఆత్మ నామీద ఉన్నది
బీదలకు సువార్త ప్రకటించుటకై
ఆయన నన్ను అభిషేకించెను
చెరలోనున్నవారికి. విడుదలను
గుడ్డివారికి చూపును (కలుగునని) ప్రకటించుట
కును
నలిగినవారిని విడిపించుటకును
ప్రభువు హితవత్సరము ప్రకటించుటకును
ఆయన నన్ను పంపియున్నాడు

అని వ్రాయబడిన చోటు[3] ఆయనకు దొరికెను. । ఆయన గ్రంథము చుట్టి పరిచారకునికిచ్చి కూర్చుండెను. సమాజమందిరములోనున్న వారందరు ఆయనను తేరిచూడగా ఆయన—నేడు మీ వినికిడిలో ఈ లేఖనము నెరవేరినదని వారితో చెప్పసాగెను. । అప్పుడందరును ఆయననుగూర్చి సాక్ష్యమిచ్చుచు, ఆయన నోటనుండి వచ్చిన దయగల మాటల కాశ్చర్యపడి— ఈయన యోసేపు కుమారుడు కాడా? అని చెప్పుకొనుచుండగా । ఆయన వారిని చూచి—వైద్యుడా, నిన్ను నీవే స్వస్థపరచుకొనుము అను సామెతె చెప్పి, కపెర్నహూములో ఏ కార్యములు నీవు చేసితివని మేము వింటిమో ఆ కార్యములు ఈ నీ స్వదేశమం
దును చేయుమని నిశ్చయముగా మీరు నాతో చెప్పు
దురనెను. । మరియు ఆయన—ఏ ప్రవక్తయు స్వదేశ 24
మందు హితుడుకాడని మీతో నిశ్చయముగా చెప్పు
చున్నాను. । ఏలీయా దినములయందు మూడేండ్ల ఆరు 25
నెలలు ఆకాశము మూయబడి దేశమందంతటను గొప్ప 26
కరవు సంభవించినప్పుడు ఇశ్రాయేలులో అనేక
మంది విధవరాండ్రుండినను, ఏలీయా సీదోనులోని
సారెపతు అను ఊరిలో ఉన్న యొక విధవరాలి
యొద్దకే గాని మరి ఎవరియొద్దకును పంపబడలేదు. ।
మరియు ప్రవక్తయైన ఎలీషా కాలమందు ఇశ్రాయేలు 27
లో అనేకమంది కుష్ఠరోగులుండినను, సురియ దేశస్థు
డైన నయమాను తప్ప మరి ఎవడును శుద్ధినొందలేదని
నేను నిశ్చయముగా మీతో చెప్పుచున్నాననెను. ।
సమాజమందిరములో ఉన్నవారందరు ఆ మాటలు 28
విని । ఆగ్రహముతో నిండుకొని, లేచి ఆయనను 29
పట్టణములోనుండి వెళ్లగొట్టి, ఆయనను తలక్రిందుగా
పడద్రోయవలెనని తమ పట్టణము కట్టబడిన కొండ
పేటువరకు ఆయనను తీసికొనిపోయిరి । అయితే 30
ఆయన వారి మధ్యనుండి దాటి మార్గమున వెళ్లిపో
యెను.

అప్పుడాయన గలిలైయలోని కపెర్నహూము 31
పట్టణమునకు వచ్చి విశ్రాంతిదినమున వారికి బోధించు
చుండెను. । ఆయన వాక్యము అధికారముతో కూడి 32
నదై యుండెను గనుక వారాయన బోధకు ఆశ్చర్య
పడిరి. । ఆ సమాజమందిరములో అపవిత్రమైన 33
దయ్యపు ఆత్మపట్టినవాడొకడుండెను. । వాడు—వద్దు, 34
నజరేయుడవైన యేసూ, నీతో మాకేమి? మమ్ము నశింప
జేయవచ్చితివా? నీ వెవడవో నేనెరుగుదును; నీవు
దేవుని పరిశుద్ధుడవని బిగ్గరగా కేకలువేసెను. । అందుకు 35
యేసు—ఊరకుండుము, ఇతని వదలిపొమ్మని దాని గద్దిం
పగా, దయ్యము వానిని మధ్యను పడద్రోసి వానికి
ఏ హానియు చేయక వదలిపోయెను. । అందుకందరు 36
విస్మయమొంది — ఇది ఎట్టి మాట? ఈయన అధికార
ముతోను బలముతోను అపవిత్రాత్మలకు ఆజ్ఞాపింప
గానే అవి వదలిపోవుచున్నవని యొకనితో నొకడు
చెప్పుకొనిరి. । అంతట ఆయననుగూర్చిన సమాచా 37
రము ఆ ప్రాంతములందంతటను వ్యాపించెను.

ఆయన సమాజమందిరములోనుండి లేచి, సీమోను 38
ఇంటిలోకి వెళ్లెను. సీమోను అత్త కఠినజ్వరముతో
పడియుండెను గనుక ఆమె విషయమై ఆయనయొద్ద
మనవి చేసికొనిరి. । ఆయన ఆమె చెంతను నిలువబడి 39
జ్వరమును గద్దింపగానే అది ఆమెను విడిచెను; వెం
టనే ఆమె లేచి వారికి ఉపచారము చేయసాగెను.

సూర్యుడస్తమించుచుండగా నానావిధ రోగముల 40
చేత పీడింపబడుచున్నవారు ఎవరెవరియొద్దనుండిరో

[1] కీర్తన. 91: 11, 12. [2] ద్వితీ. 6: 16. [3] యెషయా. 61: 1, 2.

వారందరు ఆ రోగులను ఆయనయొద్దకు తీసికొనివచ్చిరి;
అప్పుడాయన వారిలో ప్రతివానిమీద చేతులుంచి
41 వారిని స్వస్థపరచెను. । ఇంతేకాక దయ్యములు—నీవు
దేవుని కుమారుడవని కేకలువేసి అనేకులను వదలిపో
యెను; ఆయన క్రీస్తు అని వాటికి తెలిసియుండెను
గనుక ఆయన వాటిని గద్దించి వాటిని మాటాడనీయ
లేదు.

42 ఉదయమైన తరువాత ఆయన బయలుదేరి అరణ్య
ప్రదేశమునకు వెళ్లెను. జనసమూహము ఆయనను వెద
కుచు ఆయనయొద్దకు వచ్చి, తమ్మును విడిచిపోకుండ
43 ఆపగా । ఆయన—నేనితర పట్టణములలోను దేవుని
రాజ్యసువార్తను ప్రకటింపవలెను; ఇందునిమిత్తమే
గదా నేను పంపబడితినని వారితో చెప్పెను.

44 తరువాత ఆయన యూదైయ సమాజమందిరము
లలో ప్రకటించుచుండెను.

5 జనసమూహము దేవుని వాక్యము వినుచు ఆయన
మీద పడుచుండగా ఆయన గెన్నేసరెతు సరస్సుతీర
2 మున నిలిచి । ఆ సరస్సుతీరముననున్న రెండు దోనె
లను చూచెను; జాలరులు వాటిలోనుండి దిగి తమ
3 వలలు కడుగుచుండిరి. । ఆయన ఆ దోనెలలో సీమోను
దైన యొక దోనె యెక్కి—దరినుండి కొంచెము
త్రోయుమని అతని నడిగి, కూర్చుండి దోనెలోనుండి
4 జనసమూహములకు బోధించుచుండెను. । ఆయన
బోధించుట చాలించిన తరువాత—నీవు దోనెను లో
తుకు నడిపించి చేపలు పట్టుటకు మీ వలలు వేయు
5 డని సీమోనుతో చెప్పగా । సీమోను—ఏలినవాడా,
రాత్రి అంతయు మేము ప్రయాసపడితిమిగాని మాకే
మియు దొరకలేదు; అయినను నీ మాట చొప్పున
6 వలలు వేతునని ఆయనతో చెప్పెను. । వారాలాగు
చేసి విస్తారమైన చేపలు పట్టిరి, అందుచేత వారి వలలు
7 పిగిలిపోవుచుండగా । వారు వేరొక దోనెలోనున్న
తమ పాలివారు వచ్చి తమకు సహాయము చేయవలెనని
వారికి సంజ్ఞలు చేసిరి; వారు వచ్చి రెండు దోనెలు
8 మునుగునట్లు నింపిరి. । సీమోను పేతురు అది చూచి,
యేసు మోకాళ్లయెదుట సాగిలపడి—ప్రభువా, నన్ను
9 విడిచిపొమ్ము, నేను పాపాత్ముడనని చెప్పెను. । ఏల
యనగా వారు పట్టిన చేపల రాశికి అతడును అతని
10 తోకూడ నున్నవారందరును విస్మయమొందిరి. । ఆలా
గున సీమోనుతోకూడ పాలివారైన జెబెదయి కుమా
రులగు యాకోబును యోహానును (విస్మయమొందిరి.)
అందుకు యేసు—భయపడకుము, ఇప్పటినుండి నీవు
మనుష్యులను పట్టువాడవై యుందువని సీమోనుతో
11 చెప్పెను. । వారు దోనెలను దరికి చేర్చినంతట సమస్త
మును విడిచిపెట్టి ఆయనను వెంబడించిరి.

ఆయన యొక పట్టణములో నున్నప్పుడు కుష్ఠరోగ
నిండిన యొక మనుష్యుడుండెను. వాడు
యేసును చూచి సాగిలపడి—ప్రభువా, నీకిష్టమైతే
నన్ను శుద్ధునిగా చేయగలవని ఆయనను వేడుకొనెను. ।
అప్పుడాయన చెయ్యిచాపి వాని ముట్టి—నాకిష్టమే, 13
నీవు శుద్ధుడవు కమ్మని అనగానే కుష్ఠరోగము వాని
విడిచెను. । అప్పుడాయన—నీవు ఎవరితోను చెప్పక 14
వెళ్లి, వారికి సాక్ష్యార్థమై నీ దేహమును యాజకునికి
కనుపరచుకొని, నీవు శుద్ధుడవైనందుకు మోషే నియ
మించినట్టు కానుకలను సమర్పించుమని ఆజ్ఞాపించెను. ।
అయితే ఆయననుగూర్చిన సమాచారము మరి ఎక్కు 15
వగా వ్యాపించెను. బహుజనసమూహములు ఆయన
మాట వినుటకును తమ రోగములను కుదుర్చుకొనుట
కును కూడివచ్చుచుండెను. । ఆయన ప్రార్థనచేయు 16
టకు అరణ్యములోకి వెళ్లుచుండెను.

ఒకనాడాయన బోధించుచుండగా గలిలైయ 17
యూదైయదేశముల ప్రతి గ్రామమునుండియు యె
రూషలేమునుండియు వచ్చిన పరిసయ్యులును ధర్మశా
స్త్రోపదేశకులును కూర్చుండియుండగా ఆయన స్వస్థ
పరచునట్లు ప్రభువు శక్తి ఆయనకుండెను. । అప్పుడు 18
కొందరు మనుష్యులు పక్షవాయువుగల యొక మను
ష్యుని మంచముమీద మోసికొని వాని లోపలికి
తెచ్చి ఆయన యెదుట ఉంచుటకు ప్రయత్నము చేసిరి
గాని । జనులు గుంపుకూడియుండినందున లోపలికి 19
వాని తెచ్చుటకు వల్లపడకపోయెను గనుక, ఇంటి
మీదికెక్కి పెంకులు విప్పి మంచముతోకూడ యేసు
ఎదుట మధ్యను వాని దించిరి. । ఆయన వారి విశ్వా 20
సము చూచి—మనుష్యుడా, నీ పాపములు క్షమింప
బడియున్నవని వానితో చెప్పగా । శాస్త్రులును పరి 21
సయ్యులును—దేవదూషణ చేయుచున్న యితడెవడు?
దేవుడొక్కడే తప్ప మరి ఎవడు పాపములు క్షమింప
గలడని ఆలోచించుకొనసాగిరి. । యేసు వారి ఆలో 22
చన లెరిగి—మీరు మీ హృదయములలో ఏమి ఆలో
చించుచున్నారు? । —నీ పాపములు క్షమింపబడి 23
యున్నవని చెప్పుట సులభమా? —నీవు లేచి నడువు
మని చెప్పుట సులభమా? । అయితే పాపములు క్షమిం 24
చుటకు భూమిమీద మనుష్యకుమారునికి అధికారము
కలదని మీరు తెలిసికొనవలెను అని వారితో చెప్పి,
పక్షవాయువు గలవాని చూచి—నీవు లేచి నీ మంచ
మెత్తికొని నీ యింటికి వెళ్లుమని నీతో చెప్పుచున్నా
ననెను. । వెంటనే వాడు వారియెదుట లేచి తాను 25
పండుకొనియున్న మంచము ఎత్తికొని, దేవుని మహిమ
పరచుచు తన యింటికి వెళ్లెను. । అందరును విస్మయ 26
మొంది—నేడు గొప్ప వింతలు చూచితిమని దేవుని
మహిమపరచుచు భయముతో నిండుకొనిరి.

అటుపిమ్మట ఆయన బయలుదేరి, లేవియను ఒక 27
సుంకరి సుంకపు మెట్టునొద్ద కూర్చుండియుండుట
చూచి—నన్ను వెంబడించుమని అతనితో చెప్పగా ।

24 విధముగా చేసిరి. । అయ్యో ధనవంతులారా, మీరు
25 (కోరిన) ఆదరణ మీరు పొందియున్నారు. । అయ్యో
యిప్పుడు (కడుపు) నిండియున్నవారలారా, మీరా
కలిగొందురు. అయ్యో యిప్పుడు నవ్వుచున్నవార
26 లారా, మీరు దుఃఖించి యేడ్తురు. । మనుష్యులందరు
మిమ్మును కొనియాడునప్పుడు అయ్యో; వారి పితరులు
అబద్ధప్రవక్తలకు అదేవిధముగా చేసిరి.

27 వినుచున్న మీతో నేను చెప్పునదేమనగా —మీ
శత్రువులను ప్రేమించుడి, మిమ్మును ద్వేషించువారికి
28 మేలుచేయుడి, । మిమ్మును శపించువారిని దీవించుడి,
మిమ్మును బాధించువారికొరకు ప్రార్థనచేయుడి. ।
29 నిన్ను ఒక చెంపమీద కొట్టువాని వైపుకు రెండవ
చెంపకూడ త్రిప్పుము. నీ పైబట్ట ఎత్తికొని పోవు
వానిని నీ అంగీనికూడ ఎత్తికొనిపోకుండ అడ్డగింప
30 కుము. । నిన్నడుగు ప్రతివానికి ఇమ్ము; నీ సొత్తు
ఎత్తికొని పోవువానియొద్ద దాని మరల అడుగవద్దు. ।
31 మనుష్యులు మీకేలాగు చేయవలెనని మీరు కోరు
32 దురో ఆలాగు మీరును వారికి చేయుడి. । మిమ్మును
ప్రేమించువారినే మీరు ప్రేమించినయెడల మీకేమి
మెప్పు కలుగును? పాపులును తమ్మును ప్రేమించు
33 వారిని ప్రేమింతురు గదా. । మీకు మేలు చేయు
వారికే మేలుచేసినయెడల మీకేమి మెప్పు కలుగును?
34 పాపులును ఆలాగే చేతురు గదా. । మీరెవరియొద్ద
మరల పుచ్చుకొనవలెనని నిరీక్షింతురో వారికే అప్పు
ఇచ్చిన యెడల మీకేమి మెప్పు కలుగును? పాపులును
ఇచ్చినంత మరల పుచ్చుకొనవలెనని పాపులకు అప్పు
35 ఇచ్చెదరు గదా. । మీరైతే ఎట్టివారిని గూర్చియైనను
నిరాశ చేసికొనక మీ శత్రువులను ప్రేమించుడి,
మేలుచేయుడి, అప్పు ఇయ్యుడి; అప్పుడు మీ ఫలము
గొప్పదై యుండును, మీరు సర్వోన్నతుని కుమారులై
యుందురు. ఆయన కృతజ్ఞత లేనివారియెడలను దుష్టు
36 లయెడలను ఉపకారియై యున్నాడు. । కాబట్టి మీ
తండ్రి కనికరముగలవాడై యున్నట్టు మీరును కని
37 కరముగలవారై యుండుడి. । తీర్పు తీర్చకుడి, అప్పుడు
మిమ్మునుగూర్చి తీర్పు తీర్చబడదు; నేరము మోపకుడి,
38 అప్పుడు మీ మీద నేరము మోపబడదు; । క్షమిం
చుడి, అప్పుడు మీరు క్షమింపబడుదురు; ఇయ్యుడి,
అప్పుడు మీకియ్యబడును; అణచి కుదిలించి దిగజారు
నట్లు నిండు కొలతను మనుష్యులు మీ ఒడిలో కొలు
తురు. మీరు ఏ కొలతతో కొలుతురో ఆ కొలత
తోనే మీకు మరల కొలువబడునని చెప్పెను.

39 మరియు ఆయన వారితో ఈ ఉపమానము
చెప్పెను—గుడ్డివాడు గుడ్డివానికి దారి చూపగలడా?
40 వారిద్దరును గుంటలో పడుదురు గదా. । శిష్యుడు
తన బోధకునికంటె అధికుడు కాడు; సిద్ధుడైన ప్రతి
వాడును తన బోధకునివలె ఉండును. । నీవు నీ 41
కంటిలో ఉన్న దూలము ఎంచక నీ సహోదరుని
కంటిలో ఉన్న నలుసును చూడనేల? । నీ కంటిలో 42
ఉన్న దూలమును చూడక నీ సహోదరునితో—
సహోదరుడా, నీ కంటిలో ఉన్న నలుసును తీసి
వేయనిమ్మని నీవేలాగు చెప్పగలవు? వేషధారీ, మొదట
నీ కంటిలో ఉన్న దూలమును తీసివేయుము అప్పుడు
నీ సహోదరుని కంటిలో ఉన్న నలుసును తీసివేయు
టకు తేటగా చూచెదవు. । ఏ మంచి చెట్టునను పనికి 43
మాలిన ఫలములు ఫలింపవు, పనికిమాలిన చెట్టున
మంచి ఫలములు ఫలింపవు. । ప్రతి చెట్టు తన ఫల 44
ములవలన తెలియబడును. ముండ్లపొదలలో అంజూ
రపుపండ్లు ఏరుకొనరు; కోరిందపొదలో ద్రాక్షపండ్లు
కోయరు. । సజ్జనుడు తన హృదయమను మంచి ధన 45
నిధిలోనుండి సద్విషయములను బయటికి తెచ్చును;
దుర్జనుడు చెడ్డ ధననిధిలోనుండి దుర్విషయములను
బయటికి తెచ్చును. హృదయమందు నిండియుండు
దానినిబట్టి యొకని నోరు మాటలాడును.

నేను చెప్పు మాటలప్రకారము మీరు చేయక— 46
ప్రభువా ప్రభువా, అని నన్ను పిలుచుట ఎందుకు? ।
నాయొద్దకు వచ్చి నా మాటలు విని వాటిచొప్పున 47
చేయు ప్రతివాడును ఎవని పోలియుండునో మీకు
తెలియజేతును. । వాడు ఇల్లు కట్టవలెనని యుండి 48
లోతుగా త్రవ్వి, బండమీద పునాదివేసినవాన్నిపోలి
యుండును. వరదవచ్చి ప్రవాహము ఆ యింటిమీద
వడిగా కొట్టినను అది బాగుగా కట్టబడినందున[1] దాని
కదిలింపలేకపోయెను. । అయితే నా మాటలు వినియు 49
చేయనివాడు పునాదివేయక నేలమీద ఇల్లు కట్టిన
వాని పోలియుండును. ప్రవాహము దానిమీద
వడిగా కొట్టగానే అది కూలిపడెను; ఆ యింటిపాటు
గొప్పదని చెప్పెను.

ఆయన తన మాటలన్నియు ప్రజలకు సంపూర్తిగా 7
వినిపించిన తరువాత కపెర్నహూములోకి వచ్చెను. ।
అప్పుడొక శతాధిపతికి ప్రియుడైన దాసుడొకడు 2
వ్యాధిగ్రస్తుడై చావ సిద్ధమైయుండెను. । శతాధిపతి 3
యేసునుగూర్చి విని, ఆయన వచ్చి తన దాసుని స్వస్థ
పరచవలెనని ఆయనను వేడుకొనుటకు యూదుల
పెద్దలను ఆయనయొద్దకు పంపెను. । వారు యేసు 4
నొద్దకు వచ్చి—నీవలన ఈ మేలు పొందుటకు అతడు
యోగ్యుడు; । అతడు మన జనులను ప్రేమించి 5
మనకు సమాజమందిరము తానే కట్టించెనని ఆయనతో
చెప్పి మిక్కిలి బతిమాలుకొనిరి. । కావున యేసు 6
వారితోకూడ వెళ్లెను. ఆయన ఆ యింటిదగ్గరకు
వచ్చినప్పుడు శతాధిపతి తన స్నేహితులను చూచి—
మీరాయనయొద్దకు వెళ్లి — ప్రభువా, శ్రమ పుచ్చు

1 అనేక ప్రాచీనప్రతులలో—దాని పునాది బండమీద వేయబడెను గనుక అని పాఠాంతరము.

కొనవద్దు; నీవు నా యింటిలోకి వచ్చుటకు నేను
7 పాత్రుడను కాను. । అందుచేత నీయొద్దకు వచ్చు
టకు పాత్రుడనని నేను ఎంచుకొనలేదు; అయితే
మాటమాత్రము సెలవిమ్ము, అప్పుడు నా దాసుడు
స్వస్థపరచబడును, । నేను సహా అధికారమునకు
లోబడినవాడను; నా చేతిక్రిందను రాణువవారు
న్నారు; నేనొకని పొమ్మంటే పోవును, ఒకని రమ్మంటే
వచ్చును, నా దాసుని ఇది చేయుమంటే చేయునని
నేను చెప్పినట్టు ఆయనతో చెప్పుడని వారిని పం
పెను. । యేసు ఈ మాటలు విని అతనిగూర్చి ఆశ్చ
ర్యపడి తన వెంటవచ్చుచున్న జనసమూహము వైపు
తిరిగి—ఇశ్రాయేలులోనైన నేనింత గొప్ప విశ్వాసము
చూడలేదని మీతో చెప్పుచున్నాననెను. । పంపబ
డినవారు ఇంటికి తిరిగి వచ్చినప్పుడు ఆ దాసుడు
స్వస్థుడై యుండుట కనుగొనిరి.

అటుపిమ్మట ఆయన నాయీననను ఒక ఊరికి వెళ్లు
చుండగా ఆయన శిష్యులును బహు జనసమూహమును
ఆయనతోకూడ వెళ్లుచుండిరి. । ఆయన ఆ ఊరి గవిని
యొద్దకు వచ్చినప్పుడు, చనిపోయిన యొకడు వెల
పలికి మోసికొని పోబడుచుండెను; అతని తల్లికి అత
డొక్కడే కుమారుడు, ఆమె విధవరాలు; ఆ ఊరి
జనులు బహుమంది ఆమెతోకూడ ఉండిరి. । ప్రభువు
ఆమెనుచూచి ఆమెయందు కనికరపడి — ఏడువవద్దని
ఆమెతో చెప్పి, దగ్గరకు వచ్చి పాడెను ముట్టగా
మోయుచున్నవారు నిలిచిరి. । ఆయన—చిన్నవాడా,
లెమ్మని నీతో చెప్పుచున్నాననగా । ఆ చనిపోయిన
వాడు లేచి కూర్చుండి మాటలాడసాగెను; ఆయన
అతనిని అతని తల్లికి అప్పగించెను. । అందరు భయా
క్రాంతులై — మనలో గొప్ప ప్రవక్త బయలుదేరి
యున్నాడనియు, దేవుడు తన ప్రజలకు దర్శనమను
గ్రహించి యున్నాడనియు దేవుని మహిమపరచిరి. ।
ఆయననుగూర్చిన యీ సమాచారము యూదయ
యందంతటను చుట్టుపట్ల ప్రదేశమందంతటను వ్యా
పించెను.

యోహాను శిష్యులు ఈ సంగతులన్నియు అతనికి
తెలియజేసిరి. । అంతట యోహాను తన శిష్యులలో
ఇద్దరిని పిలిచి—రాబోవువాడవు నీవేనా? మేము మరి
యొకనికొరకు కనిపెట్టవలెనా? అని అడుగుటకు
వారిని ప్రభువునొద్దకు పంపెను. । ఆ మనుష్యులు
ఆయనయొద్దకు వచ్చి—రాబోవువాడవు నీవేనా? లేక
మరియొకనికొరకు మేము కనిపెట్టవలెనా? అని అడు
గుటకు బాప్తిస్మమిచ్చు యోహాను మమ్మును నీయొద్దకు
పంపెనని చెప్పిరి. । ఆ గడియలోనే ఆయన రోగ
ములను, బాధలును, అపవిత్రాత్మలునుగల అనేకు
లను స్వస్థపరచి, అనేకమంది గుడ్డివారికి చూపు దయ
చేసెను. । అప్పుడాయన—మీరు వెళ్లి, కన్నవాటిని 22
విన్నవాటిని యోహానుకు తెలుపుడి. గుడ్డివారు చూపు
పొందుచున్నారు, కుంటివారు నడుచుచున్నారు,
కుష్ఠరోగులు శుద్ధులగుచున్నారు, చెవిటివారు విను
చున్నారు, చనిపోయినవారు లేపబడుచున్నారు, బీద
లకు సువార్త ప్రకటింపబడుచున్నది; । నా విషయమై 23
అభ్యంతరపడనివాడు ధన్యుడని వారికి ఉత్తరమిచ్చెను.

యోహాను దూతలు వెళ్లిన తరువాత ఆయన 24
యోహానునుగూర్చి జనసమూహములతో ఈలాగు
చెప్పసాగెను—మీరేమి చూచుటకు అరణ్యములోకి
వెళ్లితిరి? గాలికి కదులుచున్న రెల్లునా? । మరేమి 25
చూడ వెళ్లితిరి? సన్నపు బట్టలు ధరించుకొనినవానినా?
ఇదిగో ప్రశస్తవస్త్రములు ధరించుకొని సుఖముగా
జీవించువారు రాజగృహములలో ఉందురు. । అయితే 26
మరేమి చూడవెళ్లితిరి? ప్రవక్తనా? అవునుగాని ప్రవక్త
కంటె గొప్ప వానినని మీతో చెప్పుచున్నాను.

—ఇదిగో నేను నా దూతను నీకు ముందుగా పంపు 27
చున్నాను, అతడు నీ ముందర నీ మార్గము సిద్ధ
పరచును

అని యెవనిగూర్చి వ్రాయబడెనో[1] అతడే యీ
యోహాను. । స్త్రీలు కన్నవారిలో యోహానుకంటె 28
గొప్పవాడెవడును లేడు. అయినను దేవుని రాజ్య
ములో అల్పుడైనవాడు అతనికంటె గొప్పవాడని
మీతో చెప్పుచున్నాను. । ప్రజలందరును సుంకరు 29
లును (యోహాను బోధ) విని, అతడిచ్చిన బాప్తిస్మము
పొందినవారై, దేవుడు న్యాయవంతుడని యొప్పుకొ
నిరి గాని । పరిసయ్యులును ధర్మశాస్త్రోపదేశకులును 30
అతనిచేత బాప్తిస్మము పొందక, తమ విషయమైన
దేవుని సంకల్పమును నిరాకరించిరి. । కాబట్టి యీ 31
తరము మనుష్యులను నేను దేనితో పోల్చుదును,
వారు దేని పోలియున్నారు? । సంతవీధులలో కూ 32
ర్చునియుండి — మీకు పిల్లనగ్రోవి ఊదితిమి గాని
మీరు నాట్యమాడరైతిరి; ప్రలాపించితిమి గాని మీ
రేడ్వరైతిరి అని యొకనితో ఒకడు చెప్పుకొని పిలుపు
లాటలాడుకొను పిల్లకాయలను పోలియున్నారు. ।
బాప్తిస్మమిచ్చు యోహాను రొట్టె తినకయు ద్రాక్షా 33
రసము త్రాగకయు వచ్చెను గనుక—వీడు దయ్యము
పట్టినవాడని మీరనుచున్నారు. । మనుష్యకుమారుడు 34
తినుచు త్రాగుచు వచ్చెను గనుక మీరు—ఇదిగో వీడు
తిండిపోతును మద్యపానియు, సుంకరులకును పాపు
లకును స్నేహితుడును అనుచున్నారు. । అయినను 35
జ్ఞానము జ్ఞానమని దాని సంబంధులందరినిబట్టి[2] తీర్పు
పొందునని.

పరిసయ్యులలో ఒకడు తనతోకూడ భోజనము 36
చేయవలెనని ఆయనను కోరుకొనెను. ఆయన ఆ

[1] మలాకీ, 3: 1. [2] మూలభాషలో—పిల్లలందరినిబట్టి.

పరిసయ్యుని యింటికి వెళ్లి భోజనపంక్తిని కూర్చుం
37 డగా । ఆ ఊరిలో ఉన్న పాపాత్మురాలైన యొక
స్త్రీ, యేసు పరిసయ్యునియింట భోజనమునకు కూర్చు
న్నాడని తెలిసికొని, యొక శిలాభరణిలో అత్తరు తీసి
38 కొనివచ్చి । వెనుకతట్టు ఆయన పాదములయొద్ద నిలు
వబడి, యేడ్చుచు కన్నీళ్లతో ఆయన పాదములను
తడిపి తన తలవెండ్రుకలతో తుడిచి, ఆయన పాద
ములను ముద్దుపెట్టుకొని ఆ అత్తరు వాటికి పూసెను.।
39 ఆయనను పిలిచిన పరిసయ్యుడు అది చూచి—ఈయన
ప్రవక్తయైనయెడల[1] తన్ను ముట్టుకొనిన యీ స్త్రీ
ఎవతెయో ఎటువంటిదో యెరిగియుండును; ఇది
40 పాపాత్మురాలు అని తనలోతాననుకొనెను. । అందుకు
యేసు—సీమోనూ, నీతో ఒక మాట చెప్పవలెనని
యున్నానని అతనితో అనగా అతడు—బోధకుడా,
41 చెప్పుమనెను. । అప్పుడు యేసు—అప్పు ఇచ్చు ఒక
నికి ఇద్దరు ఋణస్థులుండిరి. వారిలో ఒకడు ఐదునూరు
దేనారములును[2] మరియొకడు ఏబది దేనారములును
42 అచ్చియుండిరి. । ఆ అప్పు తీర్చుటకు వారియొద్ద
ఏమియు లేకపోయెను గనుక అతడు వారిద్దరిని
క్షమించెను. కాబట్టి వీరిలో ఎవడు అతని ఎక్కు
43 వగా ప్రేమించునో చెప్పుమని అడిగెను. । అందుకు
సీమోను — అతడెవనికి ఎక్కువ క్షమించెనో వాడే
అని నాకు తోచుచున్నదని చెప్పగా ఆయన—నీవు
44 సరిగా యోచించితివని అతనితో చెప్పి । ఆ స్త్రీవైపు
తిరిగి, సీమోనుతో ఇట్లనెను — ఈ స్త్రీని చూచుచు
న్నావే. నేను నీ యింటిలోకి రాగా నీవు నా పాద
ములకు నీళ్లియ్యలేదు గాని యీమె తన కన్నీళ్లతో
నా పాదములను తడిపి తన తల వెండ్రుకలతో తుడి
45 చెను. । నీవు నన్ను ముద్దుపెట్టుకొనలేదు గాని నేను
లోపలికి వచ్చినప్పటినుండి యీమె నా పాదములు
46 ముద్దుపెట్టుకొనుట మానలేదు. । నీవు నూనెతో నా
తల అంటలేదు గాని ఈమె నా పాదములకు అత్తరు
47 పూసెను. । ఆమె విస్తారముగా ప్రేమించెను గనుక
ఆమెయొక్క విస్తార పాపములు క్షమింపబడెనని
నీతో చెప్పుచున్నాను. ఎవనికి కొంచెముగా క్షమిం
పబడునో వాడు కొంచెముగా ప్రేమించునని చెప్పి ।
48 —నీ పాపములు క్షమింపబడియున్నవి అని ఆమెతో
49 అనెను. । అప్పుడాయనతోకూడ భోజనపంక్తిని కూర్చు
న్నవారు — పాపములు క్షమించుచున్న యితడెవడని
50 తమలోతాము అనుకొనసాగిరి. । అందుకాయన—
నీ విశ్వాసము నిన్ను రక్షించెను, సమాధానము గల
దానవై వెళ్లుమని ఆ స్త్రీతో చెప్పెను.

8 అటుపిమ్మట ఆయన దేవుని రాజ్యసువార్తను తెలు
పుచు ప్రకటించుచు ప్రతి పట్టణములోను ప్రతి
గ్రామములోను సంచారము చేయుచుండగా ।
పన్నెండుమంది శిష్యులును, అపవిత్రాత్మలును వ్యా 2
ధులును పోగొట్టబడిన కొందరు స్త్రీలును, అనగా
ఏడు దయ్యములు వదలిపోయిన మగ్దలేనే అనబడిన
మరియయు, హేరోదుయొక్క గృహనిర్వాహకు
డగు కూజా భార్యయగు యోహన్నయు, సూస
న్నయు ఆయనతోకూడ ఉండిరి. । వీరును ఇతరులనే 3
కులును తమకు కలిగిన ఆస్తితో వారికి ఉపచారము[3]
చేయుచు వచ్చిరి.

బహు జనసమూహము కూడి ప్రతి పట్టణము 4
నుండి ఆయనయొద్దకు వచ్చుచుండగా ఆయన ఉప
మానరీతిగా ఇట్లనెను । —విత్తువాడు తన విత్తనములు 5
విత్తుటకు బయలుదేరెను. అతడు విత్తుచుండగా కొన్ని
విత్తనములు త్రోవప్రక్కను పడి త్రొక్కబడెను
గనుక ఆకాశపక్షులు వాటిని మ్రింగివేసెను. । మరి 6
కొన్ని రాతినేలను పడి మొలిచి చెమ్మలేనందున ఎండి
పోయెను. । మరికొన్ని ముండ్లపొదల నడుమ పడెను; 7
ముండ్లపొదలు వాటితో మొలిచి వాటి నణచివేసెను. ।
మరికొన్ని మంచి నేలను పడెను; అవి మొలిచి నూరం 8
తలుగా ఫలించెననెను. ఈ మాటలు పలుకుచు—
వినుటకు చెవులు గలవాడు వినును గాక అని బిగ్గరగా
చెప్పెను.

ఆయన శిష్యులు — ఈ ఉపమానభావమేమిటని 9
ఆయనను అడుగగా । ఆయన—దేవుని రాజ్యమర్మము 10
లెరుగుట మీకు అనుగ్రహింపబడియున్నది; ఇతరు
లైతే చూచియు చూడకయు, వినియు గ్రహింపకయు
ఉండునట్లు వారికి ఉపమానరీతిగా (బోధింపబడు
చున్నవి.) । ఈ ఉపమానభావమేమనగా, విత్తనము 11
దేవుని వాక్యము. । త్రోవప్రక్కనుండువారు, వారు 12
వినువారుగాని నమ్మి రక్షణపొందకుండునట్లు అపవాది[4]
వచ్చి వారి హృదయములలోనుండి వాక్యమెత్తికొని
పోవును. । రాతినేలనుండువారెవరనగా, వినునప్పుడు 13
వాక్యమును సంతోషముగా అంగీకరించువారు గాని
వారికి వేరు లేనందున కొంచెము కాలము నమ్మి శోధన
కాలమున తొలగిపోవుదురు. । ముండ్లపొదలలో పడిన 14
(విత్తనమును పోలిన) వారెవరనగా, విని కాలము గడ
చినకొలది యీ జీవనసంబంధమైన విచారములచేతను
ధనభోగములచేతను అణచివేయబడి పరిపక్వముగా
ఫలింపనివారు. । మంచి నేలనుండు (విత్తనమును 15
పోలిన) వారెవరనగా యోగ్యమైన మంచి మనస్సుతో
వాక్యము విని దానిని అవలంబించి ఓపికతో ఫలించు
వారు.

ఎవడును దీపము ముట్టించి పాత్రతో కప్పివే 16
యడు, మంచముక్రింద పెట్టడు గాని లోపలికి వచ్చు

1 కొన్ని ప్రాచీనప్రతులలో -ఆ ప్రవక్తయైనయెడల, అని పాఠాంతరము. యోహాను, 1: 22, 25 చూడుము. 2 ఒక దేనారము ఇంచుమించు అర్ధరూపాయి కావచ్చును. 3 అనేక ప్రాచీనప్రతులలో -ఆయనకుపచారము అని పాఠాంతరము. 4 అనగా, సాతాను.

వారికి వెలుగు అగుపడవలెనని దీపస్తంభముమీద దాని
17 పెట్టును. । తేటపరచబడని రహస్యమేదియు లేదు;
తెలియజేయబడకయు బయలుపడకయు నుండు మరు
18 గైనదేదియు లేదు. । కలిగినవానికి ఇయ్యబడును, లేని
వానియొద్దనుండి తనకు కలదని అనుకొనునదికూడ తీసి
వేయబడును గనుక మీరేలాగు వినుచున్నారో చూచు
కొనుడని చెప్పెను.

19 ఆయన తల్లియు సహోదరులును ఆయనయొద్దకు
వచ్చి, జనులు గుంపుగా ఉండుటచేత ఆయనదగ్గరకు
20 రాలేకపోయిరి. । అప్పుడు—నీ తల్లియు నీ సహో
దరులును నిన్ను చూడగోరి వెలపట నిలిచియున్నారని
21 యెవరో ఆయనకు తెలియజేసిరి. । అందుకాయన—
దేవుని వాక్యము విని దాని ప్రకారము జరిగించు వీరే
నా తల్లియు నా సహోదరులునై యున్నారని వారి
తో చెప్పెను.

22 మరియొకనాడు ఆయన తన శిష్యులతోకూడ ఒక
దోనెయెక్కి సరస్సు అద్దరికి పోదమని వారితో
చెప్పగా వారు ఆ దోనెను త్రోసి బయలుదేరిరి. ।
23 వారు వెళ్లుచుండగా ఆయన నిద్రించెను. అంతలో
గాలివాన సరస్సుమీదికి వచ్చి, దోనె నీళ్లతో నిండి
నందున వారు అపాయకరమైన స్థితిలో ఉండిరి ।
24 గనుక ఆయనయొద్దకు వచ్చి—ప్రభూ ప్రభూ, నశించి
పోవుచున్నామని చెప్పి ఆయనను లేపిరి. ఆయన లేచి,
గాలిని నీటిపొంగును గద్దింపగానే అవి అణగి నిమ్మళ
25 మాయెను. । అప్పుడాయన — మీ విశ్వాసమెక్కడ
అని వారితో అనెను. అయితే వారు భయపడి —
ఈయన గాలికిని నీళ్లకును ఆజ్ఞాపింపగా అవి లోబడు
చున్నవే; యీయన యెవరో అని యొకనితోనొకడు
చెప్పుకొని ఆశ్చర్యపడిరి.

26 వారు గలిలైయకు ఎదురుగా ఉండు గెరసీనీయుల
27 దేశమునకు వచ్చిరి. । ఆయన అద్దరి యెక్కినప్పుడు
ఆ ఊరివాడొకడు ఆయనకు ఎదురుగా వచ్చెను.
వాడు దయ్యములుపట్టినవాడై, బహుకాలమునుండి
బట్టలు కట్టుకొనక గోరీలలోనేగాని యింట ఉండు
28 వాడు కాడు. । వాడు యేసును చూచి కేకలువేసి
ఆయనయెదుట సాగిలపడి—యేసూ, సర్వోన్నతుడైన
దేవుని కుమారుడా, నీతో నాకేమి? నన్ను బాధపరచ
కుమని నిన్ను వేడుకొనుచున్నాను అని కేకలువేసి
29 చెప్పెను. । ఏలయనగా ఆయన—ఆ మనుష్యుని విడిచి
వెలుపలికి రమ్మని ఆ అపవిత్రాత్మకు ఆజ్ఞాపించెను.
అది అనేక పర్యాయములు వాని పట్టుచువచ్చెను
గనుక వానిని గొలుసులతోను కాలి సంకెళ్లతోను
కట్టి కావలియందుంచిరి గాని, వాడు బంధకములను
తెంపగా దయ్యము వానిని అడవిలోకి తరుముకొని
పోయెను. । యేసు—నీ పేరేమని వాని నడుగగా, 30
చాల దయ్యములు వానిలో చొచ్చియుండెను గనుక, 31
వాడు తన పేరు సేన అని చెప్పి, పాతాళములోకి
పోవుటకు తమకు ఆజ్ఞాపింపవద్దని ఆయనను వేడుకొ
నెను. । అక్కడ విస్తారమైన పందుల మంద కొండ 32
మీద మేయుచుండెను గనుక, వాటిలో చొచ్చుటకు
తమకు సెలవిమ్మని ఆయనను వేడుకొనగా ఆయన సెల
విచ్చెను. । అప్పుడు దయ్యములు ఆ మనుష్యుని విడిచి 33
పోయి పందులలో చొచ్చెను గనుక, ఆ మంద ప్రపా
తమునుండి సరస్సులోకి వడిగా పరుగెత్తి ఊపిరి తిరుగక
చచ్చెను. । మేపుచున్నవారు జరిగినదానిని చూచి, 34
పారిపోయి ఆ పట్టణములోను గ్రామములలోను ఆ
సంగతి తెలియజేసిరి. । జనులు జరిగినదానిని చూడ 35
వెళ్లి యేసునొద్దకు వచ్చి, దయ్యములు వదలిపోయిన
మనుష్యుడు బట్టలు కట్టుకొని స్వస్థచిత్తుడై యేసు
పాదములయొద్ద కూర్చుండుట చూచి భయపడిరి. ।
అది చూచినవారు దయ్యములు పట్టినవాడేలాగు 36
స్వస్థతపొందెనో జనులకు తెలియజేయగా । గెరసీనీ 37
యుల దేశప్రాంతములలోనుండు జనులందరు బహు 38
భయాక్రాంతులైరి గనుక తమ్మును విడిచిపొమ్మని ఆయ
నను వేడుకొనిరి. ఆయన దోనె యెక్కి తిరిగి వెళ్లు
చుండగా దయ్యములు వదలిపోయిన మనుష్యుడు,
ఆయనతోకూడ తన్ను ఉండనిమ్మని ఆయనను వేడు
కొనెను. । అయితే ఆయన — నీవు నీ యింటికి తిరిగి 39
వెళ్లి, దేవుడు నీకెంత గొప్పకార్యములు చేసెనో
తెలియజేయుమని వానితో చెప్పి వాని పంపివేసెను;
వాడు వెళ్లి యేసు తనకెంత గొప్ప కార్యములు
చేసెనో ఆ పట్టణమందంతటను ప్రకటించెను.

జనసమూహము ఆయనకొరకు ఎదురుచూచుచుం 40
డెను గనుక యేసు తిరిగి వచ్చినప్పుడు వారు ఆయనను
చేర్చుకొనిరి. । అంతట సమాజమందిరపు అధికారి 41
యైన యాయీరు అను ఒకడు వచ్చి యేసు పాద
ములమీద పడి । యించుమించు పన్నెండేండ్ల యీడు 42
గల తన యొక్కతే కుమార్తె చావ సిద్ధముగా ఉన్నది
గనుక తన యింటికి రమ్మని ఆయనను వేడుకొనెను.
ఆయన వెళ్లుచుండగా జనసమూహములు ఆయనమీద
పడుచుండిరి.

అప్పుడు పన్నెండేండ్లనుండి రక్తస్రావరోగముగల 43
యొక స్త్రీ[1] యెవనిచేతను స్వస్థతనొందనిదై ఆయన
వెనుకకు వచ్చి । ఆయన వస్త్రపుచెంగు ముట్టెను, వెంటనే 44
ఆమె రక్తస్రావము నిలిచిపోయెను. । —నన్ను ముట్టి 45
నది ఎవరని యేసు అడుగగా అందరును—మేమెరుగ
మన్నప్పుడు, పేతురు — యేలినవాడా, జనసమూహ
ములు క్రిక్కిరిసి నీమీద పడుచున్నారనగా । యేసు 46
—ఎవడో నన్ను ముట్టెను, ప్రభావము నాలోనుండి

1 కొన్ని ప్రాచీనప్రతులలో—స్త్రీ యుండెను. ఆమె తన జీవనోపాధియంతయు వైద్యులకు వ్యయముచేసి, అని కూర్చబడియున్నది.

47 వెడలిపోయినదని నాకు తెలిసినదనెను. । తాను మరు
గైయుండలేదని ఆ స్త్రీ చూచి, వణకుచు వచ్చి ఆయన
యెదుట సాగిలపడి, తాను ఎందునిమిత్తము ఆయనను
ముట్టెనో వెంటనే తాను ఏలాగు స్వస్థపడెనో ఆ
48 సంగతి ప్రజలందరియెదుట తెలియజెప్పెను. । అందు
కాయన—కుమారీ, నీ విశ్వాసము నిన్ను స్వస్థపరచెను,
సమాధానము గలదానవై పొమ్మని ఆమెతో చెప్పెను.
49 ఆయన ఇంక మాటలాడుచుండగా సమాజమంది
రపు అధికారి యింటనుండి యొకడు వచ్చి—నీ కుమార్తె
చనిపోయినది, బోధకుని శ్రమపెట్టవద్దని అతనితో
50 చెప్పెను.। యేసు ఆ మాట విని — భయపడవద్దు,
నమ్మిక మాత్రముంచుము, ఆమె స్వస్థపరచబడునని
51 అతనితో ఉత్తరమిచ్చి । యింటికి రాగా పేతురు
యోహాను యాకోబు అను వారిని ఆ చిన్నదాని తలి
దండ్రులను తప్ప మరెవరిని ఆయన లోపలికి రానియ్య
52 లేదు. । అందరును ఆమె నిమిత్తమై యేడ్చుచు రొమ్ము
కొట్టుకొనుచుండగా ఆయన వారితో — ఏడ్వవద్దు,
ఆమె నిద్రించుచున్నదే గాని చనిపోలేదని చెప్పెను. ।
53 వారామె చనిపోయెనని యెరిగి ఆయనను అపహసిం
54 చిరి. । అయితే ఆయన ఆమె చెయ్యిపట్టుకొని—చిన్న
55 దానా, లెమ్మని చెప్పగా । ఆమె ప్రాణము తిరిగి
వచ్చెను గనుక వెంటనే ఆమె లేచెను. అప్పుడాయన
56 —ఆమెకు భోజనము పెట్టుడని ఆజ్ఞాపించెను. । ఆమె
తలిదండ్రులు విస్మయము నొందినవారైరి. అంతట
ఆయన—జరిగినది ఎవనితోను చెప్పవద్దని వారికాజ్ఞా
పించెను.

9 ఆయన తన పన్నెండుమంది (శిష్యులను) పిలిచి,
సమస్తమైన దయ్యములమీద శక్తిని అధికారమును,
రోగములు స్వస్థపరచు వరమును వారికనుగ్రహించి ।
2 దేవుని రాజ్యమును ప్రకటించుటకును వ్యాధిగ్రస్తులను
3 స్వస్థపరచుటకును వారి నంపెను. । మరియు ఆయన
—మీరు ప్రయాణముకొరకు కర్రనైనను జాలెనైనను
రొట్టెనైనను వెండినైనను మరి దేనినైనను తీసికొని
4 పోవద్దు; రెండు అంగీలు ఉంచుకొనవద్దు. । మీరు
ఏ యింట ప్రవేశింతురో ఆ యింటనే బసచేసి అక్కడ
5 నుండి బయలుదేరుడి. । మిమ్మును ఎవరు చేర్చుకొనరో
ఆ పట్టణములోనుండి బయలుదేరునప్పుడు వారిమీద
సాక్ష్యముగా ఉండుటకు మీ పాదధూళి దులిపి
6 వేయుడని వారితో చెప్పెను. । వారు బయలుదేరి
అంతటను సువార్త ప్రకటించుచు (రోగులను) స్వస్థ
పరచుచు గ్రామములలో సంచారముచేసిరి.
7 చతుర్థాధిపతియైన హేరోదు జరిగిన కార్యము
లన్నిటిని గూర్చి విని యెటుతోచక యుండెను. ఏల
యనగా కొందరు—యోహాను మృతులలోనుండి లేచె
8 ననియు, । కొందరు—ఏలీయా కనబడెననియు; కొం
దరు — పూర్వకాలపు ప్రవక్త యొకడు లేచెననియు

చెప్పుకొనుచుండిరి. । అప్పుడు హేరోదు — నేను 9
యోహానును తల గొట్టించితిని గదా; యెవనిగూర్చి
యిట్టి సంగతులు వినుచున్నానో అతడెవడో అని
చెప్పి ఆయనను చూడగోరెను.
అపొస్తలులు తిరిగి వచ్చి, తాము చేసినవన్నియు 10
ఆయనకు తెలియజేయగా ఆయన వారిని వెంటబెట్టు
కొని బేత్సయిదా అను ఊరికి ఏకాంతముగా వెళ్లెను. ।
జనసమూహములు అది తెలిసికొని ఆయనను వెంబడిం 11
పగా ఆయన వారిని చేర్చుకొని, దేవుని రాజ్యమును
గూర్చి వారితో మాటలాడుచు, స్వస్థత కావలసిన
వారిని స్వస్థపరచెను. । ప్రొద్దు గ్రుంక నారంభించి 12
నప్పుడు పన్నెండుగురు శిష్యులు వచ్చి — మనమీ
అరణ్యములో ఉన్నాము గనుక చుట్టుపట్లనున్న
గ్రామములకును పల్లెలకును వెళ్లి బస చూచుకొని,
ఆహారము సంపాదించుకొనునట్లు జనసమూహమును
పంపివేయుమని ఆయనతో చెప్పిరి. । ఆయన—మీరే 13
వారికి భోజనము పెట్టుడని వారితో చెప్పగా వారు
— మనయొద్ద అయిదు రొట్టెలును రెండు చేపలును
తప్ప మరేమియు లేదు; మేము వెళ్లి యీ ప్రజలం
దరికొరకు భోజనపదార్థములను కొని తెత్తుమా అని
చెప్పిరి. । వచ్చినవారు రమారమి అయిదువేలమంది 14
పురుషులు. ఆయన—వారిని ఏబదేసిమంది చొప్పున 15
పంక్తులు తీర్చి కూర్చుండబెట్టుడని తన శిష్యులతో
చెప్పగా వారాలాగు చేసి అందరిని కూర్చుండబెట్టిరి. ।
అంతట ఆయన ఆ అయిదు రొట్టెలను రెండు చేపలను 16
ఎత్తికొని, ఆకాశమువైపు కన్నులెత్తి వాటిని ఆశీర్వ
దించి, విరిచి, జనసమూహమునకు వడ్డించుటకై శిష్యుల
కిచ్చెను. । వారందరు తిని తృప్తిపొందిన తరువాత 17
మిగిలిన ముక్కలు పన్నెండు గంపెల్లెత్తిరి.
ఒకప్పుడాయన ఎవరులేని యొక చోటున ప్రార్థన 18
చేయుచుండగా ఆయన శిష్యులు ఆయనయొద్ద ఉండిరి.
—నేనెవడనని జనులు చెప్పుకొనుచున్నారని ఆయన
వారినడుగగా । వారు — బాప్తిస్మమిచ్చు యోహాన 19
నియు, కొందరు — ఏలీయాయనియు, కొందరు —
పూర్వకాలపు ప్రవక్త యొకడు లేచెననియు చెప్పు
కొనుచున్నారనిరి. । అందుకాయన—మీరైతే నేనెవ 20
డనని చెప్పుకొనుచున్నారని వారినడుగగా పేతురు—
నీవు దేవుని క్రీస్తువనెను. । ఆయన—ఇది ఎవనితోను 21
చెప్పవద్దని వారికి ఖండితముగా ఆజ్ఞాపించి, । మనుష్య 22
కుమారుడు బహు శ్రమలు పొంది, పెద్దలచేతను
ప్రధానయాజకులచేతను శాస్త్రులచేతను విసర్జింపబడి,
చంపబడి, మూడవ దినమున లేచుట అగత్యమని చెప్పె
ను. । మరియు ఆయన అందరితో ఇట్లనెను—ఎవడైన 23
నన్ను వెంబడింప గోరినయెడల తన్నుతాను ఉపేక్షిం
చుకొని, ప్రతిదినము తన సిలువను ఎత్తికొని నన్ను
వెంబడింపవలెను. । తన ప్రాణమును రక్షించుకొన 24

గోరువాడు దాని పోగొట్టుకొనును, నా నిమిత్తమై
తన ప్రాణమును పోగొట్టుకొనువాడు దాని రక్షించు
25 కొనును. ॥ ఒకడు లోకమంతయు సంపాదించి తన్ను
తాను పోగొట్టుకొనినయెడల, లేక నష్టపరుచుకొనిన
26 యెడల వానికేమి ప్రయోజనము? ॥ నన్ను గూర్చియు
నా మాటలను గూర్చియు సిగ్గుపడువాడెవడో వాని
గూర్చి మనుష్యకుమారుడు, తనకును తన తండ్రికిని
పరిశుద్ధ దూతలకును కలిగియున్న మహిమతో వచ్చు
27 నప్పుడు సిగ్గుపడును. ॥ ఇక్కడ నిలిచియున్నవారిలో
కొందరు దేవుని రాజ్యమును చూచువరకు మరణము
రుచిచూడరని నేను నిజముగా మీతో చెప్పుచున్నా
ననెను.

28 ఈ మాటలు చెప్పినది మొదలుకొని రమారమి
యెనిమిది దినములైన తరువాత ఆయన పేతురును
యోహానును యాకోబును వెంటబెట్టుకొని ప్రార్థన
29 చేయుటకు ఒక కొండ యెక్కెను. ॥ ఆయన ప్రార్థించు
చుండగా ఆయన ముఖరూపము మారెను; ఆయన
30 వస్త్రములు తెల్లనివై ధగధగ మెరిసెను. ॥ మరియు ఇద్దరు
పురుషులు ఆయనతో మాటలాడుచుండిరి, వారు
31 మోషే ఏలీయా అనువారు. ॥ వారు మహిమతో
అగుపడి, ఆయన యెరూషలేములో నెరవేర్చబోవు
32 నిర్గమమునుగూర్చి మాటలాడుచుండిరి. ॥ పేతురును
అతనితోకూడ ఉన్నవారును నిద్రమత్తుగా ఉండిరి.
వారు మేలుకొనినప్పుడు ఆయన మహిమను ఆయనతో
కూడ నిలిచియున్న యిద్దరు పురుషులను చూచిరి. ॥
33 (ఆ యిద్దరు పురుషులు) ఆయనయొద్దనుండి వెళ్లిపోవు
చుండగా పేతురు యేసుతో — ఏలినవాడా, మన
మిక్కడ ఉండుట మంచిది, నీకు ఒకటియు మోషేకు
ఒకటియు ఏలీయాకు ఒకటియు మూడు పర్ణశాలలు
మేము కట్టుదుమని, తాను చెప్పినది తానెరుగకయే
34 చెప్పెను. ॥ అతడీలాగు మాటలాడుచుండగా మేఘ
మొకటి వచ్చి వారిని కమ్మెను; వారు ఆ మేఘములో
35 ప్రవేశించినప్పుడు శిష్యులు భయపడిరి. ॥ మరియు—
ఈయన నేనేర్పరచుకొనిన నా కుమారుడు;[1] ఈయన
మాట వినుడని యొక శబ్దము ఆ మేఘములోనుండి
36 వచ్చెను. ॥ ఆ శబ్దము వచ్చిన తరువాత యేసు
మాత్రమే అగుపడెను. తాము చూచినవాటిలో ఒక
టియు ఆ దినములలో ఎవరికిని తెలియజేయక వారు
ఊరకుండిరి.

37 మరునాడు వారు ఆ కొండ దిగి వచ్చినప్పుడు
బహు జనసమూహము ఆయనకు ఎదురుగా వచ్చెను. ॥
38 అప్పుడు ఆ సమూహములో ఒకడు — బోధకుడా,
నా కుమారుని కటాక్షించుమని నిన్ను వేడుకొను
39 చున్నాను, వాడు నాకొక్కడే కుమారుడు. ॥ ఇదిగో
ఒక దయ్యము[2] వాని పట్టును, పట్టినప్పుడు వాడు
అకస్మాత్తుగా కేకలు వేయును; నురుగు కారునట్లు అది
వాని విలవిలలాడించుచు గాయపరచుచు వాని వదలి
40 వదలకుండును. ॥ దాని వెళ్లగొట్టవలెనని నీ శిష్యులను
వేడుకొంటిని గాని వారిచేత కాలేదని మొఱ్ఱపెట్టు
41 కొనెను. ॥ అందుకు యేసు—విశ్వాసములేని మూర్ఖ
తరమా, నేనెంతకాలము మీతోకూడ ఉండి మిమ్మును
సహింతును? నీ కుమారుని ఇక్కడికి తీసికొని రమ్మని
42 చెప్పెను. ॥ వాడు వచ్చుచుండగా ఆ దయ్యము వాని
పడద్రోసి విలవిలలాడించెను; యేసు ఆ అపవిత్రా
త్మను గద్దించి బాలుని స్వస్థపరచి వాని తండ్రికప్ప
43 గించెను ॥ గనుక అందరు దేవుని మాహాత్మ్యమును చూచి
ఆశ్చర్యపడిరి.

44 ఆయన చేసినకార్యములన్నిటిని చూచి అందరు
ఆశ్చర్యపడుచుండగా ఆయన—ఈ మాటలు మీ చెవు
లలో నాటనియ్యుడి. మనుష్యకుమారుడు మనుష్యుల
చేతికి అప్పగింపబడబోవుచున్నాడని తన శిష్యులతో
45 చెప్పెను. ॥ అయితే వారామాట గ్రహింపలేదు, అది
వారికి మరుగుచేయబడెను గనుక వారు దాని తెలిసి
కొనలేదు; మరియు ఆ మాటనుగూర్చి వారు ఆయ
నను అడుగ వెరచిరి.

46 తమలో ఎవడు గొప్పవాడో అని వారిలో
47 తర్కము పుట్టగా ॥ యేసు వారి హృదయాలోచన
ఎరిగి, యొక చిన్నపిల్లను తీసికొని తనయొద్ద నిలువ
48 బెట్టి ॥ —ఈ చిన్నపిల్లను నా పేరట చేర్చుకొనువాడు
నన్ను చేర్చుకొనును, నన్ను చేర్చుకొనువాడు నన్ను
పంపినవాని చేర్చుకొనును, మీ అందరిలో ఎవడు
అత్యల్పుడైయుండునో వాడే గొప్పవాడని వారితో
చెప్పెను.

49 యోహాను — ఏలినవాడా, యెవడో యొకడు నీ
పేరట దయ్యములను వెళ్లగొట్టగా మేము చూచితిమి;
వాడు మనలను వెంబడించువాడు కాడు గనుక వాని
50 నభ్యంతరపరచితిమని చెప్పెను. ॥ అందుకు యేసు—
మీరు వాని నభ్యంతరపరచకుడి; మీకు విరోధి కాని
వాడు మీ పక్షముననున్నవాడే అని అతనితో చెప్పెను.

51 ఆయన పరమునకు చేర్చుకొనబడు దినములు పరి
52 పూర్ణమగుచున్నప్పుడు ॥ ఆయన యెరూషలేమునకు
వెళ్లుటకు మనస్సు స్థిరపరచుకొని, తనకంటె ముందుగా
దూతలను పంపెను. వారు వెళ్లి ఆయనకు బస సిద్ధము
చేయవలెనని సమరైయుల యొక గ్రామములో ప్రవే
53 శించిరి గాని ॥ ఆయన యెరూషలేమునకు వెళ్ల నభి
ముఖుడైనందున వారాయనను చేర్చుకొనలేదు. ॥
54 శిష్యులైన యాకోబును యోహానును అది చూచి —
55 ప్రభువా,[3] మేము ఆకాశమునుండి అగ్ని దిగి వీరిని

1 అనేక ప్రాచీనప్రతులలో—నా ప్రియకుమారుడు అని పాఠాంతరము. 2 మూలభాషలో—ఒక ఆత్మ 3 అనేక ప్రాచీనప్రతులలో—ఏలీయా చేసినట్టు—అని కూర్చబడియున్నది.

నాశనముచేయ నాజ్ఞాపించుట నీకిష్టమా అని అడు
గగా ఆయన వారితట్టు తిరిగి వారిని గద్దించెను.[1] ।
56 అంతట వారు మరియొక గ్రామమునకు వెళ్లిరి.
57 వారు మార్గమున వెళ్లుచుండగా ఒకడు—నీవెక్క
డికి వెళ్లినను నీ వెంట వచ్చెదనని ఆయనతో చెప్పెను. ।
58 అందుకు యేసు — నక్కలకు బొరియలును ఆకాశ
పక్షులకు నివాసములును కలవు గాని మనుష్యకుమా
రునికి తలవాల్చుకొనుటకైనను స్థలము లేదని అతనితో
59 చెప్పెను. । ఆయన మరియొకని చూచి — నా వెంట
రమ్మని చెప్పగా అతడు — నేను వెళ్లి మొదట నా
తండ్రిని పాతిపెట్టి వచ్చుటకు సెలవిమ్మని మనవిచేయ
60 గా । ఆయన—మృతులు తమ మృతులను పాతిపెట్టు
కొననిమ్ము; నీవు వెళ్లి దేవుని రాజ్యమును ప్రకటించు
61 మని వానితో చెప్పెను. । మరియొకడు — ప్రభువా,
నీ వెంట వచ్చెదను గాని నా యింట నున్నవారియొద్ద
సెలవు తీసికొని వచ్చుటకు మొదట నాకు సెలవిమ్మని
62 అడుగగా । యేసు—నాగటిమీద చెయ్యిపెట్టి వెనుక
తట్టు చూచువాడెవడును దేవుని రాజ్యమునకు అర్హుడు
కాడని వానితో చెప్పెను.

**10** అటుతరువాత ప్రభువు డెబ్బదిమంది యితరులను
నియమించి, తాను వెళ్లబోవు ప్రతి ఊరికిని ప్రతి
చోటికిని తనకంటె ముందు ఇద్దరిద్దరినిగా పంపెను. ।
2 పంపినప్పుడాయన వారితో ఇట్లనెను—కోత విస్తార
ముగా ఉన్నది గాని పనివారు కొద్దిమందియే; కాబట్టి
కోత యజమానుని తన కోతకు పనివారిని పంప వేడు
3 కొనుడి. । మీరు వెళ్లుడి; ఇదిగో తోడేళ్లమధ్యకు
గొఱ్ఱెపిల్లలను పంపినట్టు నేను మిమ్మును పంపుచున్నా
4 ను. । మీరు సంచినైనను జాలెనైనను చెప్పులనైనను
5 తీసికొనిపోవద్దు; । త్రోవలో ఎవనినైనను కుశల ప్రశ్న
లడుగవద్దు; మీరు ఏ యింటనైనను ప్రవేశించునప్పు
డు—ఈ యింటికి సమాధానమగు గాక అని మొదట
6 చెప్పుడి. । సమాధానపాత్రుడు[2] అక్కడ నుండిన
యెడల మీ సమాధానము అతనిమీద నిలుచును;
7 లేనియెడల అది మీకు తిరిగివచ్చును. । వారు మీకిచ్చు
పదార్థములను తినుచు త్రాగుచు ఆ యింటిలోనే
యుండుడి, పనివాడు తన జీతమునకు పాత్రుడు.
8 ఇంటింటికి తిరుగవద్దు. । మరియు మీరు ఏ పట్టణము
లోనైన ప్రవేశించునప్పుడు వారు మిమ్మును చేర్చు
9 కొంటే మీ ముందర పెట్టునవి తినుడి. । అందులో
నున్న రోగులను స్వస్థపరచుడి—దేవుని రాజ్యము మీ
10 దగ్గరకు వచ్చియున్నదని వారితో చెప్పుడి. । మీరు
ఏ పట్టణములోనైన ప్రవేశించునప్పుడు వారు మిమ్మును
11 చేర్చుకొనకపోయినయెడల । మీరు దాని వీధులలోకి
పోయి — మా పాదములకు అంటిన మీ పట్టణపు
ధూళిని సహితము మీ యెదుటనే దులిపి వేయుచు
న్నాము; అయినను దేవుని రాజ్యము సమీపించియు
న్నదని తెలిసికొనుడని చెప్పుడి. । ఆ పట్టణపు గతి 12
కంటె సొదొమపట్టణపు గతి ఆ దినమున ఓర్వదగినదై
యుండునని మీతో చెప్పుచున్నాను.
అయ్యో కొరాజీనా, అయ్యో బేత్సయిదా, మీ 13
మధ్యను చేయబడిన అద్భుతములు తూరు సీదోను
పట్టణములలో చేయబడిన పక్షమున ఆ పట్టణముల
వారు పూర్వమే గోనెపట్ట కట్టుకొని బూడిదె వేసి
కొని కూర్చుండి మారుమనస్సు పొందియుందురు. ।
అయినను విమర్శకాలమునందు మీ గతికంటె తూరు 14
సీదోను పట్టణములవారి గతి ఓర్వదగినదై యుండును. ।
ఓ కపెర్నహూమా, ఆకాశమువరకు హెచ్చింప 15
బడెదవా? నీవు పాతాళమువరకు దిగిపోయెదవు. ।
మీ మాట వినువాడు నా మాట వినును, మిమ్మును 16
నిరాకరించువాడు నన్ను నిరాకరించును, నన్ను నిరా
కరించువాడు నన్ను పంపినవాని నిరాకరించుననెను.
ఆ డెబ్బదిమంది శిష్యులు సంతోషముతో తిరిగి 17
వచ్చి—ప్రభువా, దయ్యములు సహితము నీ నామము
వలన మాకు లోబడుచున్నవని చెప్పగా । ఆయన— 18
సాతాను మెరుపువలె ఆకాశమునుండి పడుట చూచి
తిని. । ఇదిగో పాములను తేళ్లను త్రొక్కుటకును 19
శత్రువు బలమంతటిమీదను మీకు అధికారము అను
గ్రహించియున్నాను; ఏదియు మీకెంతమాత్రమును
హానిచేయదు. । అయినను దయ్యములు మీకు లోబడు 20
చున్నవని సంతోషింపక మీ పేరులు పరలోకమందు
వ్రాయబడియున్నవని సంతోషించుడని వారితో
చెప్పెను.
ఆ గడియలోనే యేసు పరిశుద్ధాత్మయందు బహు 21
గా ఆనందించి — తండ్రీ ఆకాశమునకును భూమికిని
ప్రభువా, నీవు జ్ఞానులకును వివేకులకును ఈ సంగతు
లను మరుగుచేసి పసిబాలురకు బయలుపరచినావని
నిన్ను స్తుతించుచున్నాను; అవును తండ్రీ, ఆలాగు
నీ దృష్టికి అనుకూలమాయెను. । సమస్తమును నా 22
తండ్రిచేత నాకు అప్పగింపబడియున్నది; కుమారు
డెవడో తండ్రి తప్ప మరెవడును ఎరుగడు; తండ్రి
యెవడో కుమారుడును కుమారుడెవనికి ఆయనను
బయలుపరచగోరునో వాడును తప్ప మరెవడును ఎరు
గడని చెప్పెను. । అప్పుడాయన తన శిష్యులవైపు 23
తిరిగి — మీరు చూచుచున్న కార్యములను చూచు
కన్నులు ధన్యములైనవి; । అనేకమంది ప్రవక్తలును 24
రాజులును మీరు చూచుచున్నవి చూడగోరి చూడ
కయు, వినగోరి వినకయు ఉండిరని మీతో చెప్పు
చున్నానని యేకాంతమందు వారితో అనెను.

1 ప్రాచీనప్రతులలో—మీరు ఎట్టి ఆత్మగలవారో మీరెరుగరు; మనుష్యకుమారుడు మనుష్యుల ఆత్మను రక్షించుటకేకాని నశింపజేయుటకు రాబడియున్నది.
2 మూలభాషలో—సమాధాన కుమారుడు.

25 ఒకప్పుడు ధర్మశాస్త్రోపదేశకుడొకడు లేచి—బోధ
కుడా, నిత్యజీవమునకు వారసుడనగుటకు నేనేమి చేయ
26 వలెనని ఆయనను శోధించుచు అడిగెను. । అందుకా
యన—ధర్మశాస్త్రమందేమి వ్రాయబడియున్నది? నీవేమి
27 చదువుచున్నావని అతని నడుగగా । అతడు—నీ దేవు
డైన ప్రభువును నీ పూర్ణహృదయముతోను, నీ పూర్ణ
మనస్సుతోను, నీ పూర్ణశక్తితోను, నీ పూర్ణవివేకము
తోను ప్రేమింపవలెననియు, నిన్నువలె నీ పొరుగు
వాని ప్రేమింపవలెననియు, వ్రాయబడియున్నదని[1]
28 చెప్పెను. । అందుకాయన—నీవు సరిగా ఉత్తరమిచ్చి
తివి; ఆలాగు చేయుము అప్పుడు జీవించెదవని అత
29 నితో చెప్పెను. । అయితే తాను నీతిమంతుడైనట్టు
కనుపరచుకొనగోరి అతడు—అవునుగాని నా పొరుగు
30 వాడెవడని యేసునడిగెను. । అందుకు యేసు ఇట్లనెను
— ఒక మనుష్యుడు యెరూషలేమునుండి యెరికో
పట్టణమునకు వెళ్లుచు దొంగలచేతిలో చిక్కెను, వారు
అతని బట్టలు దోచుకొని అతని కొట్టి కొరప్రాణము
31 తో విడిచిపోయిరి. । ఆ సమయమందొక యాజకుడు
ఆ త్రోవను వెళ్లుచు అతని చూచి ప్రక్కగా పోయె
32 ను. । ఆలాగుననే లేవీయుడొకడు ఆ చోటికి వచ్చి
33 చూచి ప్రక్కగా పోయెను. । అయితే ఒక సమరై
యుడు ప్రయాణమై పోవుచు, అతడు పడియున్న
34 చోటికి వచ్చి । అతని చూచి, అతనిమీద జాలిపడి
దగ్గరకుపోయి, నూనెయు ద్రాక్షారసమును పోసి
అతని గాయములను కట్టి, తన వాహనముమీద ఎక్కించి
యొక పూటకూళ్లవాని యింటికి తీసికొనిపోయి అతని
35 పరామర్శించెను. । మరునాడతడు రెండు దేనార
ములు[2] తీసి ఆ పూటకూళ్లవానికిచ్చి — ఇతని పరా
మర్శించుము, నీవింకేమైనను ఖర్చుచేసినపక్షమున నేను
మరల వచ్చునప్పుడు అది నీకు తీర్చెదనని అతనితో
36 చెప్పిపోయెను. । కాగా దొంగలచేతిలో చిక్కిన
వానికి ఈ ముగ్గురిలో ఎవడు పొరుగువాడని నీకు
తోచునని యేసు అడుగగా అతడు — అతనిమీద
37 జాలిపడినవాడే అనెను. । అందుకు యేసు — నీవును
వెళ్లి ఆలాగు చేయుమని యతనితో చెప్పెను.
38 అంతట వారు ప్రయాణమై పోవుచుండగా ఆయన
యొక గ్రామములో ప్రవేశించెను. మార్త అను ఒక
39 స్త్రీ ఆయనను తన యింట చేర్చుకొనెను. । ఆమెకు
మరియ అను సహోదరి యుండెను. ఈమె యేసు
పాదములయొద్ద కూర్చుండి ఆయన బోధ వినుచుం
40 డెను. । మార్త విస్తారమైన పని పెట్టుకొనుటచేత
తొందరపడి ఆయనయొద్దకు వచ్చి — ప్రభువా, నేను
ఒంటిగా పనిచేయుటకు నా సహోదరి నన్ను విడిచి
పెట్టినందున నీకు చింతలేదా? నాకు సహాయముచేయు
41 మని ఆమెతో చెప్పుమనెను. । అందుకు ప్రభువు—
మార్తా మార్తా, నీవనేకమైన పనులనుగూర్చి విచారము
కలిగి తొందరపడుచున్నావు గాని అవసరమైనది
యొక్కటే.[3] । మరియ ఉత్తమమైన దానిని ఏర్పరచు 42
కొనెను, అది ఆమెయొద్దనుండి తీసివేయబడదని ఆమె
తో చెప్పెను.

ఆయన యొక చోట ప్రార్థన చేయుచుండెను. 11
ప్రార్థన చాలించిన తరువాత ఆయన శిష్యులలో
ఒకడు — ప్రభువా, యోహాను తన శిష్యులకు నేర్పి
నట్టుగా మాకు ప్రార్థనచేయ నేర్పుమని ఆయన నడి
గెను. । అందుకాయన — మీరు ప్రార్థన చేయున 2
ప్పుడు — తండ్రీ, నీ నామము పరిశుద్ధపరచబడును
గాక, నీ రాజ్యము వచ్చునుగాక, । మాకు కావలసిన 3
అనుదినాహారము దినదినము మాకు దయచేయుము; ।
మేము మాకచ్చియున్న ప్రతివాని క్షమించుచున్నాము 4
గనుక మా పాపములను క్షమించుము; మమ్మును శోధన
లోకి తేకుము అని పలుకుడని వారితో చెప్పెను.
మరియు ఆయన వారితో ఇట్లనెను — ఎవనికైన 5
ఒక స్నేహితుడుండగా అతడు అర్ధరాత్రివేళ ఆ
స్నేహితునియొద్దకు వెళ్లి—స్నేహితుడా, నాకు మూడు
రొట్టెలు బదులిమ్ము; । నా స్నేహితుడు ప్రయాణము 6
చేయుచు మార్గములో నాయొద్దకు వచ్చియున్నాడు;
అతనికి పెట్టుటకు నాయొద్ద ఏమియు లేదని అతనితో
చెప్పినయెడల । అతడు లోపటనేయుండి — నన్ను 7
తొందరపెట్టవద్దు; తలుపు వేసియున్నది, నా చిన్న
పిల్లలు నాతోకూడ పండుకొనియున్నారు, నేను లేచి
ఇయ్యలేనని చెప్పునా? । అతడు తన స్నేహితుడైనం 8
దున లేచి ఇయ్యకపోయినను, అతడు సిగ్గుమాలి మాటి
మాటికి అడుగుటవలననైనను లేచి అతనికి కావలసిన
వన్నియు ఇచ్చును అని మీతో చెప్పుచున్నాను. ।
అటువలె మీరును అడుగుడి, మీకియ్యబడును; వెద 9
కుడి, మీకు దొరకును; తట్టుడి, మీకు తీయబడును. ।
అడుగు ప్రతివానికియ్యబడును, వెదకువానికి దొరు 10
కును, తట్టువానికి తీయబడునని మీతో చెప్పుచు
న్నాను. । మీలో తండ్రియైనవాడు తన కుమారుడు 11
చేప అడిగితే చేపకు ప్రతిగా పాము ఇచ్చునా? గుడ్డు
అడిగితే తేలు ఇచ్చునా? । కాబట్టి మీరు చెడ్డవారై 12
యుండియు మీ పిల్లలకు మంచి యీవులనియ్య నెరిగి
యుండగా । పరలోకమందున్న మీ తండ్రి తన్ను 13
అడుగువారికి ఎంతో నిశ్చయముగా పరిశుద్ధాత్మను
అనుగ్రహించుననెను.

ఒకప్పుడాయన మూగదయ్యమును వెళ్లగొట్టుచుం 14
డెను. ఆ దయ్యము వదలిపోయిన తరువాత మూగ
వాడు మాటలాడెను గనుక జనసమూహములు ఆశ్చ
ర్యపడెను. । అయితే వారిలో కొందరు — వీడు 15
దయ్యములకు అధిపతియైన బయల్జెబూలువలన దయ్యా

[1] ద్వితీ. 6: 5. [2] ఇది ఇంచుమించు ఒక రూపాయి కావచ్చును. [3] అనేక ప్రాచీనప్రతులలో—అవసరమైనవి కొన్నియే లని పాఠాంతరము.

16 ములను వెళ్లగొట్టుచున్నాడని చెప్పుకొనిరి. । మరి
కొందరు ఆయనను శోధించుచు — పరలోకమునుండి
యొక సూచకక్రియను చూపుమని ఆయన నడిగిరి. ।
17 ఆయన వారి ఆలోచనల నెరిగి వారితో ఇట్లనెను —
తనకు తానే వ్యతిరేకముగా వేరుపడిన ప్రతి రాజ్యము
పాడైపోవును; ఇంటికి విరోధమైన యిల్లు కూలిపో
18 వును. । సాతానును తనకు వ్యతిరేకముగా తానే వేరు
పడినపక్షమున వాని రాజ్యమేలాగు నిలుచును? నేను
బయల్జెబూలువలన దయ్యములను వెళ్లగొట్టుచున్నానని
19 మీరు చెప్పుచున్నారే. । నేను బయల్జెబూలువలన
దయ్యములను వెళ్లగొట్టుచున్న పక్షమున మీ కుమా
రులు ఎవనివలన వెళ్లగొట్టుచున్నారు? అందుచేత వారే
20 మీకు తీర్పరులై యుందురు. । అయితే నేను దేవుని
వ్రేలితో దయ్యములను వెళ్లగొట్టుచున్న పక్షమున
నిశ్చయముగా దేవుని రాజ్యము మీయొద్దకు వచ్చి
21 యున్నది. । బలవంతుడు ఆయుధములు ధరించుకొని
తన ఆవరణమును కాచుకొనునప్పుడు అతని సొత్తు
22 భద్రముగా ఉండును. । అయితే అతనికంటె బల
వంతుడైన యొకడు అతని పైబడి జయించునప్పుడు,
అతడు నమ్ముకొనిన ఆయుధములన్నిటిని లాగుకొని
23 అతని ఆస్తిని పంచిపెట్టును. । నా పక్షమున ఉండని
వాడు నాకు విరోధి; నాతో సమకూర్చనివాడు చెదర
24 గొట్టువాడు. । అపవిత్రాత్మ యొక మనుష్యుని వదలి
పోయిన తరువాత అది విశ్రాంతి వెదకుచు నీరులేని
చోట్ల తిరుగుచుండును. విశ్రాంతి దొరకనందున —
నేను విడిచి వచ్చిన నా యింటికి తిరిగి వెళ్లుదునను
25 కొని । వచ్చి, ఆ యిల్లు ఊడ్చి అమర్చియుండుట
26 చూచి । వెళ్లి తనకంటె చెడ్డవైన మరి యేడు (అప
విత్ర) ఆత్మలను వెంటబెట్టుకొని వచ్చును; అవి అందు
లో ప్రవేశించి అక్కడనే కాపురముండును; అందు
చేత ఆ మనుష్యుని కడపటి స్థితి మొదటిదానికంటె
చెడ్డదగునని చెప్పెను.

27 ఆయన ఈ మాటలు చెప్పుచుండగా ఆ సమూహ
ములోనున్న యొక స్త్రీ ఆయనను చూచి — నిన్ను
మోసిన గర్భమును నీవు కుడిచిన స్తనములును ధన్యము
28 లైనవని కేకలువేసి చెప్పగా । ఆయన — అవునుగాని
దేవుని వాక్యము విని దాని గైకొనువారు మరి ధన్యులని
చెప్పెను.

29 మరియు జనులు గుంపులుగా కూడినప్పుడు ఆయన
ఈలాగు చెప్పసాగెను—ఈ తరమువారు దుష్టతరము
వారైయుండి సూచకక్రియ నడుగుచున్నారు.
అయితే యోనానుగూర్చిన సూచకక్రియయే గాని
మరి ఏ సూచకక్రియయు వీరికి అనుగ్రహింపబడదు. ।
—నా నీనెవె పట్టణస్థులకు ఏలాగు సూచకముగా
—నో ఆలాగే మనుష్యకుమారుడును ఈ తరము
నకు సూచకముగా ఉండును. । దక్షిణదేశపు రాణి
విమర్శకాలమున ఈ తరమువారితోకూడ లేచి వారి
మీద నేరస్థాపనచేయును. ఆమె సొలొమోను
జ్ఞానము వినుటకు భూదిగంతములనుండి వచ్చెను,
ఇదిగో సొలొమోనుకంటె గొప్పవాడిక్కడ ఉన్నా
డు. । నీనెవె మనుష్యులు విమర్శకాలమున ఈ తరము 32
వారితోకూడ నిలువబడి వారిమీద నేరస్థాపనచేయు
దురు. వారు యోనా ప్రకటన విని మారుమనస్సు
పొందిరి; ఇదిగో యోనాకంటె గొప్పవాడిక్కడ
ఉన్నాడు.

ఎవడును దీపము వెలిగించి చాటుచోటనైనను 33
కుంచముక్రిందనైనను పెట్టడు గాని, లోపలికి వచ్చు
వారికి వెలుగు కనబడుటకు దీపస్తంభముమీదనే పెట్టు
ను. । నీ దేహమునకు దీపము నీ కన్నే గనుక నీ కన్ను 34
తేటగానుంటే నీ దేహమంతయు వెలుగుమయమై
యుండును; అది చెడినదైతే నీ దేహమును చీకటి
మయమైయుండును. । కాబట్టి నీలోనుండు వెలుగు 35
చీకటియైయుండకుండ చూచుకొనుము. । ఏ భాగమై 36
నను చీకటికాక నీ దేహమంతయు వెలుగుమయమైతే,
దీపము తన కాంతివలన నీకు వెలుగిచ్చునప్పుడు ఏలా
గుండునో ఆలాగు దేహమంతయు వెలుగుమయమై
యుండునని చెప్పెను.

ఆయన బోధించుచుండగా ఒక పరిసయ్యుడు తన 37
తోకూడ భోజనము చేయుమని ఆయనను పిలువగా
ఆయన లోపలికి వెళ్లి భోజనపంక్తిని కూర్చుండెను. ।
ఆయన భోజనమునకు ముందుగా స్నానము చేయ 38
లేదని ఆ పరిసయ్యుడు చూచి ఆశ్చర్యపడెను. । అం 39
దుకు ప్రభువిట్లనెను— పరిసయ్యులైన మీరు గిన్నెయు
పళ్లెమును వెలుపట శుద్ధిచేయుదురు గాని మీ అంత
రంగము దోపుతోను చెడుతనముతోను నిండియు
న్నది. । అవివేకులారా, వెలుపటి భాగమును చేసిన 40
వాడు లోపటి భాగమును చేయలేదా? । కాగా మీకు 41
కలిగినవి ధర్మముచేయుడి, అప్పుడు మీకన్నియు శుద్ధి
గా ఉండును.

అయ్యో పరిసయ్యులారా, మీరు పుదీనా సదాప 42
మొదలైన ప్రతి కూరలోను పదియవ వంతు చెల్లించు
చున్నారే గాని న్యాయమును దేవుని ప్రేమను విడిచి
పెట్టుచున్నారు. వాటిని మానక వీటిని చేయవలసి
యున్నది. । అయ్యో పరిసయ్యులారా, మీరు సమాజ 43
మందిరములలో అగ్రపీఠములను సంతవీధులలో వంద
నములను కోరుచున్నారు. । అయ్యో, మీరు కన 44
బడని సమాధులవలె ఉన్నారు; వాటిమీద నడుచు
మనుష్యులు (అవి సమాధులని) యెరుగరనెను.

అప్పుడు ధర్మశాస్త్రోపదేశకుడొకడు—బోధకుడా, 45
యీలాగు చెప్పి మమ్మునుకూడ నిందించుచున్నావని
ఆయనతో చెప్పగా । ఆయన—అయ్యో ధర్మశాస్త్రోప 46
దేశకులారా, మోయ శక్యముకాని బరువులను మీరు

మనుష్యులమీద మోపుదురు గాని మీరు ఒక వ్రేలి
47 తోనైనను ఆ బరువులను ముట్టరు. । అయ్యో, మీ
పితరులు చంపిన ప్రవక్తల గోరీలను మీరు కట్టించు
48 చున్నారు. । కావున మీరు సాక్షులై మీ పితరుల
కార్యములకు సమ్మతించుచున్నారు; వారు ప్రవక్తలను
49 చంపిరి, మీరు వారి గోరీలు కట్టించుదురు. । అందు
చేత దేవుని జ్ఞానము చెప్పినదేమనగా—నేను వారి
50 యొద్దకు ప్రవక్తలను అపొస్తలులను పంపుదును. । వారు
51 కొందరిని చంపుదురు కొందరిని హింసింతురు. । కాబట్టి
లోకము పుట్టినది మొదలుకొని, అనగా హేబెలు
రక్తము మొదలుకొని బలిపీఠమునకును మందిరమున
కును మధ్యను నశించిన జెకర్యా రక్తమువరకు[1] చిందింప
బడిన ప్రవక్తలందరి రక్తము నిమిత్తము ఈ తరమువారు
విచారింపబడుదురు; నిశ్చయముగా ఈ తరమువారు
ఆ రక్తము నిమిత్తము విచారింపబడుదురని మీతో
52 చెప్పుచున్నాను. । అయ్యో ధర్మశాస్త్రోపదేశకులారా,
మీరు జ్ఞానమను తాళపుచెవిని ఎత్తికొనిపోతిరి; మీ
రును లోపల ప్రవేశింపరు, ప్రవేశించువారిని అడ్డ
గింతురని చెప్పెను.
53 ఆయన అక్కడనుండి వెళ్లినప్పుడు శాస్త్రులును
54 పరిసయ్యులును ఆయన మీద నిండ పగపట్టి ఆయన
మీద నేరము మోపవలెనని యుండి, ఆయన నోట
నుండి వచ్చినది ఏదైనను పట్టుకొనుటకై పొంచి వెద
కుచు, అనేక సంగతులనుగూర్చి ఆయనను మాట
లాడింపసాగిరి.

12 అంతలో ఒకనినొకడు త్రొక్కుకొనునట్లు వేల
కొలది జనులు కూడినప్పుడు ఆయన తన శిష్యులతో
మొదట ఇట్లని చెప్పసాగెను—పరిసయ్యుల వేషధారణ
2 అను పులిసిన పిండినిగూర్చి జాగ్రత్తపడుడి. । మరు
గైనదేదియు బయలుపరచబడకపోదు; రహస్యమైన
3 దేదియు తెలియబడకపోదు. । అందుచేత మీరు చీక
టిలో మాటలాడుకొనునవి వెలుగులో వినబడును,
మీరు గదులయందు చెవిలో చెప్పుకొనునది మిద్దెల
4 మీద చాటింపబడును. । నా స్నేహితులైన మీతో
నేను చెప్పునదేమనగా—దేహమును చంపిన తరువాత
5 మరేమియు చేయనేరనివారికి భయపడకుడి. । ఎవనికి
మీరు భయపడవలెనో మీకు తెలియజేయుదును; చం
పిన తరువాత నరకములో పడద్రోయ శక్తిగలవానికి
భయపడుడి, ఆయనకే భయపడుడని మీతో చెప్పు
6 చున్నాను. । అయిదు పిచ్చుకలు రెండు కాసులకు
అమ్మబడును గదా; అయినను వాటిలో ఒకటైనను
7 దేవునియెదుట మరువబడదు. । మీ తలవెండ్రుక
లన్నియు లెక్కింపబడియున్నవి. భయపడకుడి; మీరు
8 అనేకమైన పిచ్చుకలకంటె శ్రేష్ఠులు కారా? । మరియు
నేను మీతో చెప్పునదేమనగా, నన్ను మనుష్యుల

యెదుట ఒప్పుకొనువాడెవడో, మనుష్యకుమారుడు
దేవుని దూతలయెదుట వానిని ఒప్పుకొనును. । మను 9
ష్యులయెదుట నన్ను ఎరుగననువానిని నేను ఎరుగనని
దేవుని దూతలయెదుట చెప్పుదును. । మనుష్యకుమా 10
రునిమీద వ్యతిరేకముగా ఒకమాట పలుకువానికి పాప
క్షమాపణ కలుగునుగాని పరిశుద్ధాత్మను దూషించు
వానికి క్షమాపణ లేదు. । వారు సమాజమందిరముల 11
పెద్దలయొద్దకును అధిపతులయొద్దకును అధికారుల
యొద్దకును మిమ్మును తీసికొనిపోవునప్పుడు మీరు—
ఏలాగు ఏమి ఉత్తరమిచ్చెదమా, యేమి మాటలాడు
దుమా అని చింతింపకుడి; । మీరేమి చెప్పవలసినది 12
పరిశుద్ధాత్మ ఆ గడియలోనే మీకు నేర్పునని చెప్పెను.
ఆ జనసమూహములో ఒకడు — బోధకుడా, 13
పిత్రార్జితములో నాకు పాలుపంచిపెట్టవలెనని నా
సహోదరునితో చెప్పుమని ఆయన నడుగగా ।
ఆయన—ఓయీ, మీమీద తీర్పరినిగానైన పంచిపెట్టు 14
వానిగానైన నన్నెవడు నియమించెనని అతనితో చెప్పె
ను. । మరియు ఆయన వారితో—మీరు ఏవిధమైన 15
లోభమునకు ఎడమియ్యక జాగ్రత్తపడుడి; ఒకనికి
కలిమి విస్తరించుటవలన అది వాని జీవమునకు మూలము
కాదనెను. । మరియు ఆయన వారితో ఈ ఉపమా 16
నము చెప్పెను — ఒక ధనవంతుని భూమి సమృద్ధిగా
పండెను. । అప్పుడతడు—నా పంట సమకూర్చుకొనుట 17
టకు నాకు స్థలము చాలదు గనుక నేనేమి చేతునని
తనలో తానాలోచించుకొని — నేనీలాగు చేతును; ।
నా కొట్లు విప్పి వాటికంటె గొప్పవాటిని కట్టించి, 18
అందులో నా ధాన్యమంతటిని నా ఆస్తిని సమకూర్చు
కొని । నా ప్రాణముతో—ప్రాణమా, అనేక సంవ 19
త్సరములకు విస్తారమైన ఆస్తి నీకు సమకూర్చబడియు
న్నది; సుఖించుము, తినుము, త్రాగుము, సంతో
షించుమని చెప్పుకొందుననుకొనెను. । అయితే దేవుడు 20
—వెర్రివాడా, యీ రాత్రి నీ ప్రాణము నడుగు
చున్నారు; నీవు సిద్ధపరచినవి ఎవనివగునని అతనితో
చెప్పెను. । దేవునియెడల ధనవంతుడు కాక తన 21
కొరకే సమకూర్చుకొనువాడు ఆలాగుననే యుండు
నని చెప్పెను.
అంతట ఆయన తన శిష్యులతో ఇట్లనెను—ఈ 22
హేతువుచేత మీరు—ఏమి తిందుమో అని మీ ప్రాణ
మును గూర్చియైనను, ఏమి ధరించుకొందుమో అని
మీ దేహమును గూర్చియైనను చింతింపకుడి. । ఆహా 23
రముకంటె ప్రాణమును వస్త్రముకంటె దేహమును
గొప్పవి కావా? । కాకుల సంగతి విచారించి చూడుడి. 24
అవి విత్తవు, కోయవు, వాటికి గరిసె లేదు, కొట్టు లేదు;
అయినను దేవుడు వాటిని పోషించుచున్నాడు; మీరు
పక్షులకంటె ఎంతో శ్రేష్ఠులు. । మరియు మీలో 25

1 ఆది 4: 8; 2 దిన. 24: 20, 21.

ఎవడు చింతించుటవలన తన యెత్తును మూరెడెక్కువ
26 చేసికొనగలడు? । కాబట్టి అన్నిటికంటె తక్కువైనవి
మీచేత కాకపోతే తక్కిన వాటినిగూర్చి మీరు చిం
27 తింపనేల? । పువ్వులేలాగు ఎదుగుచున్నవో ఆలో
చించుడి. అవి కష్టపడవు, ఒడకవు; అయినను తన
సమస్త వైభవముతో కూడిన సొలొమోను సహితము
వీటిలో ఒకదానివలెనైన అలంకరింపబడలేదని మీతో
28 చెప్పుచున్నాను. । నేడు పొలములో ఉండి రేపు
పొయిలో వేయబడు అడవి గడ్డిని దేవుడీలాగు అలంక
రించినయెడల, అల్పవిశ్వాసులారా, మీకు మరి ఎంతో
29 నిశ్చయముగా వస్త్రములనిచ్చును. । ఏమి తిందుమో
యేమి త్రాగుదుమో అని విచారింపకుడి, అనుమానము
30 కలిగియుండకుడి. । ఈ లోకపు జనులు వీటినన్నిటిని
వెదకుదురు; ఇవి మీకు కావలసియున్నవని మీ
31 తండ్రికి తెలియును. । మీరైతే ఆయన రాజ్యమును[1]
వెదకుడి; దీనితోకూడ ఇవి మీ కనుగ్రహింపబడును. ।
32 చిన్న మందా భయపడకుడి, మీకు రాజ్యము అనుగ్ర
33 హించుటకు మీ తండ్రికి ఇష్టమైయున్నది । మీకు
కలిగినవాటిని అమ్మి ధర్మముచేయుడి, పాతగిలని సంచు
లను పరలోకమందు అక్షయమైన ధనమును సంపా
దించుకొనుడి; అక్కడికి దొంగ రాడు చిమ్మెట
34 కొట్టదు । మీ ధనమెక్కడ ఉండునో అక్కడనే మీ
హృదయము ఉండును.

35 మీ నడుములు కట్టుకొనియుండుడి, మీ దీపములు
36 వెలుగుచుండనియ్యుడి. । తమ ప్రభువు పెండ్లివిందు
నుండి వచ్చి తట్టగానే అతనికి తలుపుతీయుటకు అత
డెప్పుడు వచ్చునో అని అతనికొరకు ఎదురుచూచు
37 మనుష్యులవలె ఉండుడి. । ప్రభువు వచ్చి యే దాసులు
మెలకువగా ఉండుట కనుగొనునో ఆ దాసులు
ధన్యులు; అతడు నడుము కట్టుకొని వారిని భోజన
పంక్తిని కూర్చుండబెట్టి, తానే వచ్చి వారికి ఉపచారము
చేయునని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. ।
38 మరియు అతడు రెండవ జామున వచ్చినను మూడవ
జామున వచ్చినను (ఏ దాసులు) మెలకువగా ఉండుట
39 కనుగొనునో ఆ దాసులు ధన్యులు. । దొంగ యే గడి
యను వచ్చునో యింటి యజమానునికి తెలిసిన పక్ష
మున అతడు మెలకువగా ఉండి తన యింటికి కన్నము
40 వేయనియ్యడని తెలిసికొనుడి. । మీరు అనుకొనని
గడియలో మనుష్యకుమారుడు వచ్చును గనుక మీరును
సిద్ధముగా ఉండుడని చెప్పెను.

41 అప్పుడు పేతురు—ప్రభువా, యీ ఉపమానము
మాతోనే చెప్పుచున్నావా అందరితోను చెప్పుచు
42 న్నావా? అని ఆయన నడుగగా । ప్రభువు ఇట్లనెను—
తగిన కాలమున ప్రతివానికి ఆహారము పెట్టుటకు యజ
మానుడు తన యింటివారిమీద నియమించునట్టి నమ్మక
మైన బుద్ధిగల గృహనిర్వాహకుడెవడు? । ఎవని ప్రభువు 43
వచ్చి వాడు ఆలాగు చేయుచుండుట కనుగొనునో ఆ
దాసుడు ధన్యుడు. । అతడు తనకు కలిగినది అంతటి 44
మీద వాని ఉంచునని మీతో నిజముగా చెప్పుచు
న్నాను. । అయితే ఆ దాసుడు—నా యజమానుడు 45
వచ్చుట కాలస్యము చేయుచున్నాడని తన మనస్సులో
అనుకొని, దాసులను దాసీలనుకొట్టి, తిని త్రాగి
మత్తుగా ఉండసాగితే । వాడు కనిపెట్టని దినము 46
లోను ఎరుగని గడియలోను ఆ దాసుని యజమానుడు
వచ్చి వాని నరికించి అపనమ్మకస్థులతో వానికి పాలు
నియమించును. । తన యజమానుని చిత్తమెరిగియుం 47
డియు సిద్ధపడకయు అతని చిత్తముచొప్పున జరిగింప
కయు ఉండు దాసునికి అనేకమైన దెబ్బలు తగులును. ।
అయితే తెలియక దెబ్బలకు తగిన పనులు చేసినవానికి 48
కొద్ది దెబ్బలే తగులును. ఎవనికి ఎక్కువగా ఇయ్య
బడెనో వానియొద్ద ఎక్కువగా తీయజూతురు; మను
ష్యులు ఎవనికి ఎక్కువగా అప్పగింతురో వానియొద్ద
ఎక్కువగా అడుగుదురు గదా.

నేను భూమిమీద అగ్ని వేయ వచ్చితిని; అది ఇది 49
వరకే రగులుకొని మండవలెనని యెంతో కోరుచున్నా
ను. । అయితే నేను పొందవలసిన బాప్తిస్మమున్నది; 50
అది నెరవేరువరకు నేనెంతో ఇబ్బందిపడుచున్నాను. ।
నేను భూమిమీద సమాధానము కలుగజేయ వచ్చితి 51
నని మీరు తలంచుచున్నారా? సమాధానమును కాదు
భేదమునే కలుగజేయ వచ్చితినని మీతో చెప్పుచున్నా
ను. । ఇప్పటినుండి ఒక ఇంటిలో అయిదుగురు వేరు 52
పడి ఇద్దరికి విరోధముగా ముగ్గురును ముగ్గురికి విరోధ
ముగా ఇద్దరును ఉందురు. । తండ్రి కుమారునికిని 53
కుమారుడు తండ్రికిని తల్లి కుమార్తెకును కుమార్తె తల్లికిని
అత్త కోడలికిని కోడలు అత్తకును విరోధులుగా ఉందు
రని చెప్పెను.

మరియు ఆయన జనసమూహములతో ఇట్లనెను 54
—మీరు పడమటనుండి మబ్బు పైకి వచ్చుట చూచు
నప్పుడు—వాన వచ్చుచున్నదని వెంటనే చెప్పుదురు;
ఆలాగే జరుగును. । దక్షిణపు గాలి విసరుట చూచు 55
నప్పుడు వడగాలి కొట్టునని చెప్పుదురు; ఆలాగే జరు
గును. । వేషధారులారా, మీరు భూమ్యాకాశముల 56
వైఖరి గుర్తింప నెరుగుదురు; ఈ కాలమును మీరు
గుర్తింప నెరుగరేల? । ఏది న్యాయమో మీ అంతట 57
మీరు విమర్శింపరేల? । వాదించువానితోకూడ అధి 58
కారియొద్దకు నీవు వెళ్లుచుండగా అతని చేతినుండి
తప్పించుకొనుటకు త్రోవలోనే ప్రయత్నము చేయు
ము; లేదా, అతడొకవేళ నిన్ను న్యాయాధిపతియొద్దకు
ఈడ్చుకొని పోవును, న్యాయాధిపతి నిన్ను బంట్రౌ
తుకు అప్పగించును, బంట్రౌతు నిన్ను చెరసాలలో

[1] అనేక ప్రాచీన ప్రతులలో—దేవుని రాజ్యమును అని పాఠాంతరము.

వేయుదురు. । నీవు కడపటికాసు చెల్లించువరకు వెలపలికి
రానే రావని నీతో చెప్పుచున్నాననెను.
3 పిలాతు గలిలైయులైన కొందరి రక్తము వారి బలు
లతో కలిపియుండెను. ఆ కాలమున అక్కడనున్న
కొందరు ఆ సంగతి యేసుతో చెప్పగా । ఆయన
వారితో ఇట్లనెను—ఈ గలిలైయులు అట్టి హింసలు
పొందినందున వారు గలిలైయులందరికంటె పాపులని
మీరు తలంచుచున్నారా? । కారని మీతో చెప్పు
చున్నాను; మీరు మారుమనస్సు పొందని పక్షమున
మీరందరును ఆలాగే నశింతురు. । మరియు సిలో
యములోని గోపురము పడి చచ్చిన ఆ పదునెనిమిది
మంది యెరూషలేములో కాపురమున్న వారందరికంటె
అపరాధులని తలంచుచున్నారా? । కారని మీతో
చెప్పుచున్నాను; మీరు మారుమనస్సు పొందని పక్ష
మున మీరందరును ఆలాగే నశింతురు.

మరియు ఆయన వారితో ఈ ఉపమానము చెప్పెను
— ఒక మనుష్యుని ద్రాక్షతోటలో అంజూరపు
చెట్టొకటి నాటబడి యుండెను. అతడు దాని పండ్లు
వెదక వచ్చినప్పుడు ఏమియు దొరకలేదు । గనుక
అతడు—ఇదిగో మూడేండ్లనుండి నేను ఈ అంజూరపు
చెట్టున పండ్లు వెదకవచ్చుచున్నాను గాని యేమియు
దొరకలేదు; దీని నరికివేయుము, దీనివలన ఈ భూమి
యు ఏల వ్యర్థమై పోవలెనని ద్రాక్షతోటమాలితో
చెప్పెను. । అయితే వాడు — అయ్యా, నేను దాని
చుట్టు త్రవ్వి యెరువు వేయుమట్టుకు ఈ సంవత్స
రముకూడ ఉండనిమ్ము; । అది ఫలించిన సరి, లేని
యెడల నరికించివేయుమని అతనితో చెప్పెను.

విశ్రాంతిదినమున ఆయన యొక సమాజమందిర
ములో బోధించుచున్నప్పుడు । పదునెనిమిది ఏండ్ల
నుండి బలహీనపరచు దయ్యము[1] పట్టిన యొక స్త్రీ
అచ్చట నుండెను. ఆమె నడుము వంగిపోయి యెంత
మాత్రమును చక్కగా నిలువబడలేకుండెను. । యేసు
ఆమెను చూచి, రమ్మని పిలిచి — అమ్మా, నీ బలహీనత
నుండి విడుదల పొందియున్నావని ఆమెతో చెప్పి ।
ఆమెమీద చేతులుంచగానే ఆమె చక్కగా నిలువ
బడి దేవుని మహిమపరచెను. । యేసు విశ్రాంతి దిన
మున స్వస్థపరచినందున ఆ సమాజమందిరపు అధికారి
కోపముతో మండిపడి, జనసమూహమును చూచి—
పనిచేయదగిన ఆరు దినములు కలవు గనుక ఆ దినముల
లోనే వచ్చి స్వస్థతపొందుడి; విశ్రాంతిదినమందు
రావద్దని చెప్పెను. । అందుకు ప్రభువు—వేషధారు
లారా, మీలో ప్రతివాడును విశ్రాంతిదినమున తన
యెద్దునైనను గాడిదనైనను గాడియొద్దనుండి విప్పి
తోలుకొనిపోయి నీళ్లు పెట్టును గదా. । ఇదిగో పదు
నెనిమిది ఏండ్లనుండి సాతాను బంధించిన అబ్రాహాము
కుమార్తెయైన యీమెను విశ్రాంతిదినమందు ఈ కట్లు
నుండి విడిపింపదగదా? అని అతనితో చెప్పెను. ।
ఆయన ఈ మాటలు చెప్పినప్పుడు ఆయన నెదిరించిన 17
వారందరు సిగ్గుపడిరి; అయితే జనసమూహమంతయు
ఆయన చేసిన ఘనకార్యములన్నిటిని చూచి సంతో
షించెను.

ఆయన — దేవుని రాజ్యము దేని పోలియున్నది, 18
దేనితో దాని పోల్తును? । ఒక మనుష్యుడు తీసికొని 19
పోయి తన తోటలో వేసిన ఆవగింజను పోలియున్నది.
అది పెరిగి వృక్షమాయెను; ఆకాశపక్షులు దాని
కొమ్మలయందు నివసించెననెను. । మరల ఆయన— 20
దేవుని రాజ్యము దేనితో పోల్తును? । ఒక స్త్రీ తీసి 21
కొని, అంతయు పులిసి పొంగువరకు మూడు కుంచ
ముల పిండిలో దాచిపెట్టిన పుల్లని పిండిని పోలియున్న
దని చెప్పెను.

ఆయన యెరూషలేముకు ప్రయాణమై పోవుచు 22
బోధించుచు పట్టణములలోను గ్రామములలోను సం
చారము చేయుచుండెను. । ఒకడు—ప్రభువా, రక్షణ 23
పొందువారు కొద్దిమందేనా? అని ఆయన నడుగగా ।
ఆయన వారిని చూచి—ఇరుకు ద్వారమున ప్రవేశింప 24
పోరాడుడి; అనేకులు ప్రవేశింప చూతురు గాని వారి
వలన కాదని మీతో చెప్పుచున్నాను. । ఇంటి యజ 25
మానుడు లేచి తలుపు వేసిన తరువాత మీరు వెలపల
నిలిచి తలుపు తట్టి — అయ్యా, మాకు తలుపు తీయు
మని చెప్ప నారంభించినప్పుడు । ఆయన—మీరెక్కడి 26
వారో మిమ్మును ఎరుగనని ఉత్తరము మీతో చెప్పును.
అందుకు మీరు—నీ సముఖమందు మేము తిని త్రాగు
చుంటిమే; నీవు మా వీధులలో బోధించితివే అని చెప్ప
సాగుదురు. । అప్పుడాయన — మీరెక్కడివారో 27
మిమ్మును ఎరుగనని మీతో చెప్పుచున్నాను; అక్ర
మముచేయు మీరందరు నాయొద్దనుండి తొలగిపొండని
చెప్పును. । అబ్రాహాము ఇస్సాకు యాకోబులును 28
సకల ప్రవక్తలును దేవుని రాజ్యములో నుండుటయు,
మీరు వెలపలికి త్రోయబడుటయు, మీరు చూచు
నప్పుడు మీరు ఏడ్చుచు పండ్లు కొరుకుదురు. । మరి 29
యు జనులు తూర్పునుండియు పడమటనుండియు
ఉత్తరమునుండియు దక్షిణమునుండియు వచ్చి దేవుని
రాజ్యమందు కూర్చుందురు. । ఇదిగో కడపటివారిలో 30
కొందరు మొదటివారగుదురు, మొదటివారిలో కొం
దరు కడపటివారగుదురని చెప్పెను.

ఆ గడియలోనే కొందరు పరిసయ్యులు వచ్చి— 31
నీవిక్కడనుండి బయలుదేరి పొమ్ము; హేరోదు నిన్ను
చంపగోరుచున్నాడని ఆయనతో చెప్పగా । ఆయన 32
వారిని చూచి — మీరు వెళ్లి ఆ నక్కతో ఈలాగు
చెప్పుడి—ఇదిగో నేడును రేపును నేను దయ్యము

1 మూలభాషలో—ఆత్మ.

లను వెళ్లగొట్టుచు (రోగులను) స్వస్థపరచుచునుండి
33 మూడవదినమున పూర్ణసిద్ధి పొందెదను । అయినను
నేడు రేపు ఎల్లుండి నా త్రోవను నేను పోవుచుండ
వలెను; ప్రవక్త యెరూషలేమునకు వెలుపల నశింప వల్ల
34 పడదు. । యెరూషలేమా యెరూషలేమా, ప్రవక్తలను
చంపుచు నీయొద్దకు పంపబడినవారిని రాళ్లతో కొట్టుచు
ఉండుదానా, కోడి తన పిల్లలను తన రెక్కలక్రింద
ఏలాగు చేర్చుకొనునో ఆలాగే ఎన్నోమారులు నేను
నీ పిల్లలను చేర్చుకొనవలెనని యుంటిని గాని మీరొల్లక
35 పోతిరి. । ఇదిగో మీ యిల్లు మీకు పాడుగా విడువ
బడుచున్నది—ప్రభువు పేరట వచ్చువాడు స్తుతింప
బడుగాకని మీరు చెప్పు పర్యంతము మీరు నన్ను
చూడరని మీతో చెప్పుచున్నాననెను.

**14** విశ్రాంతిదినమున ఆయన భోజనము చేయుటకు
పరిసయ్యుల అధికారులలో ఒకని యింటిలోకి వెళ్లి
నప్పుడు, ఆయన ఏమి చేయునో అని వారాయనను
2 కనిపెట్టుచుండిరి. । అప్పుడు జలోదరరోగముగల
3 యొకడు ఆయనయెదుట ఉండెను. । యేసు—విశ్రాం
4 తిదినమున స్వస్థపరచుట న్యాయమా కాదా? అని
ధర్మశాస్త్రోపదేశకులను పరిసయ్యులను అడుగగా వా
రూరకుండిరి. అప్పుడాయన వాని చేరదీసి స్వస్థపరచి
5 పంపివేసి । —మీలో ఎవని గాడిదయైనను[1] ఎద్దయి
నను గుంటలో పడినయెడల విశ్రాంతిదినమున దాని
6 పైకి తీయడా? అని వారినడిగెను. । ఈ మాటలకు
వారు ఉత్తరము చెప్పలేకపోయిరి.
7 పిలువబడినవారు భోజనపంక్తిని అగ్రపీఠములు ఏర్ప
రచుకొనుట చూచి ఆయన వారితో ఈ ఉపమానము
8 చెప్పెను । —నిన్నెవరైనను పెండ్లివిందుకు పిలిచి
నప్పుడు అగ్రపీఠముమీద కూర్చుండవద్దు; ఒకవేళ
9 నీకంటె ఘనుడు అతనిచేత పిలువబడగా । నిన్నును
అతనిని పిలిచినవాడు వచ్చి—ఇతనికి చోటిమ్మని నీతో
చెప్పును, అప్పుడు నీవు సిగ్గుపడి కడపటి చోటున
10 కూర్చుండసాగుదువు. । అయితే నీవు పిలువబడు
నప్పుడు, నిన్ను పిలిచినవాడు వచ్చి—స్నేహితుడా,
పైచోటికి పొమ్మని నీతో చెప్పులాగున నీవు పోయి
కడపటి చోటున కూర్చుండుము; అప్పుడు నీతో
కూడ కూర్చుండువారందరియెదుట నీకు ఘనత కలు
11 గును. । తన్నుతాను హెచ్చించుకొను ప్రతివాడును
తగ్గింపబడును; తన్నుతాను తగ్గించుకొనువాడు హె
చ్చింపబడునని చెప్పెను.
12 మరియు ఆయన తన్ను పిలిచినవానితో ఇట్లనెను
—నీవు పగటి విందైనను రాత్రి విందైనను చేయు
నప్పుడు, నీ స్నేహితులనైనను నీ సహోదరులనైనను
నీ బంధువులనైనను ధనవంతులగు నీ పొరుగువారినైనను
పిలువవద్దు; వారు ఒకవేళ నిన్ను మరల పిలుతురు
గనుక నీకు ప్రత్యుపకారము కలుగును. । అయితే నీవు 13
విందు చేయునప్పుడు బీదలను అంగహీనులను కుంటి
వాండ్లను గుడ్డివాండ్లను పిలువుము. । నీకు ప్రత్యుప 14
కారము చేయుటకు వారికేమియు లేదు గనుక నీవు
ధన్యుడవగుదువు; నీతిమంతుల పునరుత్థానమందు నీవు
ప్రత్యుపకారము పొందుదువని చెప్పెను.
ఆయనతోకూడ భోజనపంక్తిని కూర్చుండినవారిలో 15
ఒకడు ఈ మాటలు విని—దేవుని రాజ్యములో భోజ
నముచేయువాడు ధన్యుడని ఆయనతో చెప్పగా ।
ఆయన అతనితో నిట్లనెను — ఒక మనుష్యుడు గొప్ప 16
విందు చేయించి అనేకులను పిలిచెను. । విందుకాల 17
మందు అతడు—ఇప్పుడు సిద్ధమై యున్నది, రండని
పిలువబడినవారితో చెప్పుటకై తన దాసుని పంపెను. ।
అయితే వారందరు ఏకమనస్సుతో నెపములు చెప్ప 18
సాగిరి. మొదటివాడు — నేనొక పొలము కొనియు
న్నాను, అవశ్యముగా వెళ్లి దాని చూడవలెను, నన్ను
క్షమింపవలెనని నిన్ను వేడుకొనుచున్నాననెను. ।
మరియొకడు— నేను అయిదు జతల యెడ్లను కొని 19
యున్నాను, వాటిని పరీక్షింప వెళ్లుచున్నాను, నన్ను
క్షమింపవలెనని వేడుకొనుచున్నాననెను. । మరి 20
యొకడు — నేనొక స్త్రీని వివాహము చేసికొన్నాను;
అందుచేత నేను రాలేననెను. । అప్పుడా దాసుడు 21
తిరిగి వచ్చి యీ మాటలు తన యజమానునికి తెలియ
జేయగా ఆ యింటి యజమానుడు కోపపడి—నీవు
త్వరగా పట్టణపు వీధులలోకిని సందులలోకిని వెళ్లి,
బీదలను అంగహీనులను కుంటివారిని గుడ్డివారిని ఇక్క
డికి తోడుకొని రమ్మని ఆ దాసునితో చెప్పెను. । అం 22
తట దాసుడు—ప్రభువా, నీవాజ్ఞాపించినట్టు చేసితిని
గాని యింకను చోటున్నదని చెప్పెను. । అందుకు 23
యజమానుడు — నా యిల్లు నిండునట్లు నీవు రాజ
మార్గములలోకిని కంచెలలోకిని వెళ్లి అక్కడి వారిని
లోపలికి వచ్చుటకు బలవంతము చేయుము; । ఏల 24
యనగా పిలువబడిన ఆ మనుష్యులలో ఒకడును నా
విందు రుచిచూడడని మీతో చెప్పుచున్నాననెను.
బహు జనసమూహములు ఆయనతోకూడ వెళ్లు 25
చున్నప్పుడు ఆయన వారితట్టు తిరిగి—ఎవడైనను నా 26
యొద్దకు వచ్చి తన తండ్రిని తల్లిని భార్యను పిల్లలను
అన్నదమ్ములను అక్కచెల్లెండ్రను తన ప్రాణమును
సహా ద్వేషింపకుంటే వాడు నా శిష్యుడు కానే
రడు. । మరియు తన సిలువను మోసికొని నన్ను 27
వెంబడింపనివాడు నా శిష్యుడు కానేరడు. । మీలో 28
ఎవడైనను ఒక గోపురము కట్టింపవలెనని యుంటే దాని
కొనసాగించుటకు కావలసినది తనయొద్ద ఉన్నదో
లేదో అని మొదట కూర్చుండి తగులుబడి లెక్క
చూచుకొనడా? । చూచుకొననిపక్షమున అతడు 29

[1] కొన్ని ప్రాచీనప్రతులలో—ఎవని కుమారుడైనను అని పాఠాంతరము.

దాని పునాదివేసి, ఒకవేళ దాని కొనసాగింపలేక
30 పోయినందున । చూచువారందరు—ఈ మనుష్యుడు
కట్ట మొదలుపెట్టెను గాని కొనసాగింపలేకపోయె
31 నని అతని చూచి యెగతాళి చేయసాగుదురు. । మరియు
ఏ రాజైనను మరియొక రాజుతో యుద్ధము చేయ
బోవునప్పుడు తనమీదికి ఇరువదివేలమందితో వచ్చు
వానిని పదివేలమందితో ఎదిరింప శక్తి తనకు కలదో
32 లేదో అని మొదట కూర్చుండి ఆలోచింపడా? । శక్తి
లేనియెడల అతడింకను దూరముగా ఉన్నప్పుడే రాయ
బారము పంపి సమాధానము చేసికొన చూచును
33 గదా. । ఆ ప్రకారమే మీలో తనకు కలిగినదంతయు
34 విడిచిపెట్టనివాడు నా శిష్యుడు కానేరడు. । ఉప్పు
మంచిదే గాని ఉప్పు నిస్సారమైతే దేనివలన దానికి
35 సారము కలుగును? । అది భూమికైనను ఎరువుకైనను
పనికిరాదు గనుక దాని బయట పారవేయుదురు.
వినుటకు చెవులుగలవాడు వినునుగాక అని వారితో
చెప్పెను.

15 ఒకప్పుడు సమస్తమైన సుంకరులును పాపులును
ఆయన బోధ వినుటకు ఆయన దగ్గరకు వచ్చుచుం
2 డగా । పరిసయ్యులును శాస్త్రులును అది చూచి—
ఇతడు పాపులను చేర్చుకొని వారితోకూడ భోజనము
చేయుచున్నాడని చాల సణుగుకొనిరి.
3 అందుకాయన వారితో ఈ ఉపమానము
4 చెప్పెను । — మీలో ఏ మనుష్యునికైనను నూరు
గొఱ్ఱెలు కలిగియుండగా వాటిలో ఒకటి తప్పిపోయిన
యెడల అతడు తొంబది తొమ్మిదింటిని అడవిలో
విడిచిపెట్టి తప్పిపోయినది దొరకువరకు దాని వెదక
5 వెళ్లడా? । అది దొరికినప్పుడు సంతోషముతో దానిని
తన భుజములమీద వేసికొని యింటికి వచ్చి తన
6 స్నేహితులను పొరుగువారిని పిలిచి । — మీరు నాతో
కూడ సంతోషించుడి; తప్పిపోయిన నా గొఱ్ఱె దొరికి
7 నదని వారితో చెప్పును గదా. । అటువలె మారు
మనస్సు అక్కరలేని తొంబది తొమ్మిదిమంది నీతిమం
తుల విషయమై కలుగు సంతోషముకంటె మారు
మనస్సుపొందు ఒక్క పాపివిషయమై పరలోకమందు
ఎక్కువ సంతోషము కలుగును.
8 ఏ స్త్రీకైనను పది వెండి నాణెములు కలిగియుండగా
వాటిలో ఒక నాణెము పోగొట్టుకొంటే ఆమె దీపము
వెలిగించి యిల్లు ఊడ్చి అది దొరుకువరకు జాగ్రత్తగా
9 వెదకదా? । అది దొరికినప్పుడు తన చెలికత్తెలను
పొరుగువారిని పిలిచి — నాతోకూడ సంతోషించుడి,
నేను పోగొట్టుకొనిన నాణెము దొరికినదని వారితో
10 చెప్పును గదా. । అటువలె మారుమనస్సు పొందు
ఒక పాపి విషయమై దేవుని దూతలయెదుట సంతో
షము కలుగునని మీతో చెప్పుచున్నాననెను.
11 మరియు ఆయన ఇట్లనెను — ఒక మనుష్యునికి
ఇద్దరు కుమారులుండిరి. । వారిలో చిన్నవాడు—తండ్రీ, 12
ఆస్తిలో నాకువచ్చు భాగమిమ్మని తన తండ్రి నడుగగా
అతడు వారికి తన ఆస్తిని పంచిపెట్టెను. । కొన్ని 13
దినములైన తరువాత ఆ చిన్న కుమారుడు సమస్తమును
కూర్చుకొని దూరదేశమునకు ప్రయాణమై పోయి,
అచ్చట తన ఆస్తిని దుర్వ్యాపారమువలన పాడు
చేసెను. । అదంతయు కర్చుచేసిన తరువాత ఆ దేశ 14
మందు గొప్ప కరవు సంభవింపగా వాడు ఇబ్బంది 15
పడసాగి, వెళ్లి ఆ దేశస్థులలో ఒకనిచెంత చేరెను.
అతడు పందులను మేపుటకు తన పొలములలోకి వాని
పంపెను. । వాడు పందులు తిను పొట్టుతో తన కడుపు 16
నింపుకొన ఆశపడెను గాని యెవడును వానికేమియు
ఇయ్యలేదు. । అయితే బుద్ధి వచ్చినప్పుడు వాడు— 17
నా తండ్రియొద్ద ఎంతోమంది కూలివాండ్లకు అన్నము
సమృద్ధిగా ఉన్నది, నేనైతే ఇక్కడ ఆకలికి చచ్చి
పోవుచున్నాను. । నేను లేచి నా తండ్రియొద్దకు 18
వెళ్లి — తండ్రీ, నేను పరలోకమునకు విరోధముగాను
నీ యెదుటను పాపము చేసితిని; । ఇకమీదట నీ కుమా 19
రుడ ననిపించుకొనుటకు యోగ్యుడను కాను; నన్ను
నీ కూలివాండ్లలో ఒకనిగా పెట్టుకొనుమని అతనితో
చెప్పుదుననుకొని, లేచి తండ్రియొద్దకు వచ్చెను. ।
వాడింక దూరముగా ఉన్నప్పుడు తండ్రి వాని చూచి 20
కనికరపడి, పరుగెత్తి వాని మెడమీదపడి ముద్దుపెట్టు
కొనెను. । అప్పుడు ఆ కుమారుడు అతనితో — 21
తండ్రీ, నేను పరలోకమునకు విరోధముగాను నీ
యెదుటను పాపము చేసితిని; ఇకమీదట నీ కుమారుడ
ననిపించుకొనుటకు యోగ్యుడను కాననెను. । అయితే 22
తండ్రి తన దాసులను చూచి-ప్రశస్త వస్త్రము త్వరగా
తెచ్చి వీనికి కట్టి వీని చేతికి ఉంగరము పెట్టి పాదము
లకు చెప్పులు తొడిగించుడి; । క్రొవ్విన దూడను 23
తెచ్చి వధించుడి, మనము తిని సంతోషపడుదము; ।
ఈ నా కుమారుడు చనిపోయి మరల బ్రదికెను, తప్పి 24
పోయి దొరికెనని చెప్పెను; అంతట వారు సంతోష
పడసాగిరి. । అప్పుడు అతని పెద్ద కుమారుడు పొల 25
ములో ఉండెను. వాడు (పొలమునుండి) వచ్చుచు
ఇంటిదగ్గరకు రాగా, వాద్యములును నాట్యమును
జరుగుట విని । దాసులలో ఒకని పిలిచి—ఇవి ఏమి 26
టని అడుగగా । ఆ దాసుడు అతనితో—నీ తమ్ముడు 27
వచ్చియున్నాడు; అతడు తన యొద్దకు సురక్షిత
ముగా వచ్చినందున నీ తండ్రి క్రొవ్వినదూడను వధిం
చెననెను. । అయితే అతడు కోపపడి లోపలికి వెళ్ల 28
నొల్లకపోయెను గనుక అతని తండ్రి వెలుపలికి వచ్చి
(లోపలికి రమ్మని) బతిమాలుకొనెను. । అందుకతడు 29
తన తండ్రితో — ఇదిగో యిన్నియేండ్లనుండి నిన్ను
సేవించుచున్నానే, నీ ఆజ్ఞను నేనెన్నడును మీరలేదే;
అయినను నా స్నేహితులతో సంతోషపడునట్లు నీవు

30 నాకెన్నడును ఒక మేకపిల్లనైన ఇయ్యలేదు. । అయితే
నీ ఆస్తిని వేశ్యలతో తినివేసిన యీ నీ కుమారుడు
రాగానే వీనికొరకు క్రొవ్విన దూడను వధించితివని
31 చెప్పెను. । అందుకతడు—కుమారుడా, నీవెల్లప్పుడును
32 నాతోకూడ ఉన్నావు; నావన్నియు నీవి; । మనము
సంతోషపడి ఆనందించుట **యుక్తమే**; ఈ నీ తమ్ముడు
చనిపోయి తిరిగి బ్రదికెను, **తప్పిపోయి** దొరికెనని
అతనితో చెప్పెను.

**16** మరియు ఆయన తన శిష్యులతో ఇట్లనెను—ఒక
ధనవంతునియొద్ద ఒక గృహనిర్వాహకుడుండెను.
వాడతని ఆస్తిని పాడుచేయుచున్నాడని అతనియొద్ద
2 వానిమీద నేరము మోపబడగా । అతడు వాని పిలి
పించి — నిన్నుగూర్చి నేను వినుచున్న యీ మాట
ఏమిటి? నీ గృహనిర్వాహకత్వపు లెక్క అప్పగిం
చుము; నీవు ఇకమీదట గృహనిర్వాహకుడవై యుండ
3 వల్లకాదని వానితో చెప్పెను. । ఆ గృహనిర్వాహ
కుడు తనలోతాను — నా యజమానుడు ఈ గృహ
నిర్వాహకత్వపు పనిలోనుండి నన్ను తీసివేయును
గనుక నేనేమి చేతును? త్రవ్వలేను, భిక్షమెత్త సిగ్గు
4 పడుచున్నాను. । నన్ను ఈ గృహనిర్వాహకత్వపు
పనినుండి తొలగించునప్పుడు వారు నన్ను తమ యిండ్ల
లోకి చేర్చుకొనునట్లు ఏమి చేయవలెనో నాకు తెలియు
5 ననుకొని, । తన యజమానుని ఋణస్థులలో ఒక్కొ
క్కని పిలిపించి—నీవు నా యజమానునికి ఎంత అచ్చి
6 యున్నావని మొదటివాని నడిగెను. । వాడు—నూరు
మణుగుల నూనె అని చెప్పగా—నీవు నీ చీటి తీసికొని
త్వరగా కూర్చుండి యేబది మణుగులని వ్రాసికొమ్మని
7 వానితో చెప్పెను. । తరువాత వాడు—నీవెంత అచ్చి
యున్నావని మరియొకని నడుగగా వాడు — నూరు
తూముల గోధుమలని చెప్పినప్పుడు వానితో — నీవు
నీ చీటి తీసికొని యెనుబది తూములని వ్రాసికొమ్మని
8 చెప్పెను. । అన్యాయస్థుడైన ఆ గృహనిర్వాహకుడు
యుక్తిగా నడుచుకొనెనని వాని యజమానుడు వాని
మెచ్చుకొనెను. వెలుగు సంబంధులకంటె[1] ఈ లోక
సంబంధులు[2] తమ తరమునుబట్టి చూడగా యుక్తిమం
9 తులై యున్నారు. । అన్యాయపు సిరివలన మీకు
స్నేహితులను సంపాదించుకొనుడి; ఎందుకనగా ఆ
సిరి మిమ్మును విడిచిపోవునప్పుడు వారు నిత్యమైన
నివాసములలో మిమ్మును చేర్చుకొందురని మీతో
10 చెప్పుచున్నాను. । మిక్కిలి కొంచెములో నమ్మకముగా
ఉండువాడు ఎక్కువలోను నమ్మకముగా ఉండును;
మిక్కిలి కొంచెములో అన్యాయముగా ఉండువాడు
11 ఎక్కువలోను అన్యాయముగా ఉండును. । కాబట్టి
మీరు అన్యాయపు సిరి విషయములో నమ్మకముగా
ఉండనియెడల సత్యమైన ధనమును ఎవడు మీ వశము
చేయును. । మీరు పరుల సొమ్ము విషయములో నమ్మక 12
ముగా ఉండనియెడల మీ స్వంతమైనది మీకు ఎవ
డిచ్చును? । ఏ సేవకుడును ఇద్దరు యజమానులను 13
సేవింపలేడు; వాడొకని ద్వేషించి యొకని ప్రేమిం
చును, లేక యొకని అనుసరించి యొకని తృణీకరిం
చును; మీరు దేవునిని సిరినిని సేవింపలేరని చెప్పెను.

ధనాపేక్షగల పరిసయ్యులు ఈ మాటలన్నియు 14
విని ఆయన నపహసించుచుండగా । ఆయన—మీరు 15
మనుష్యులయెదుట నీతిమంతులని అనిపించుకొనువారు
గాని దేవుడు మీ హృదయములను ఎరుగును. మను
ష్యులలో ఘనముగా ఎంచబడునది దేవుని దృష్టికి
అసహ్యము. । యోహాను కాలపర్యంతము ధర్మశాస్త్రమును 16
ప్రవక్తలును ఉండిరి; అప్పటినుండి దేవుని రాజ్య
సువార్త ప్రకటింపబడుచున్నది; ప్రతివాడును ఆ
రాజ్యములో బలవంతముగా జొరబడుచున్నాడు. ।
ధర్మశాస్త్రములో ఒక పొల్లయిన తప్పిపోవుటకంటె ఆకా 17
శమును భూమియు గతించిపోవుట సులభము. । తన 18
భార్యను విడనాడి మరియొకతెను వివాహము చేసి
కొను ప్రతివాడు వ్యభిచరించుచున్నాడు; భర్తను విడి
చినదానిని వివాహము చేసికొనువాడు వ్యభిచరించు
చున్నాడు.

ధనవంతుడొకడుండెను. అతడు ఊదారంగు బట్ట 19
లును సన్నపు నార వస్త్రములును ధరించుకొని ప్రతి
దినము బహుగా సుఖపడుచుండువాడు. । లాజరు 20
అను ఒక దరిద్రుడుండెను. వాడు కురుపులతో నిండిన
వాడై ధనవంతునియింటి వాకిట పడియుండి । అతని 21
బల్లమీదనుండి పడు రొట్టెముక్కలతో ఆకలితీర్చు
కొన గోరెను; అంతేకాక కుక్కలు వచ్చి వాని కురు
పులు నాకెను. । ఆ దరిద్రుడు చనిపోయి దేవదూతల 22
చేత అబ్రాహాము రొమ్మున (ఆనుకొనుటకు) కొనిపో
బడెను. ధనవంతుడుకూడ చనిపోయి పాతిపెట్టబడె
ను. । అప్పుడతడు పాతాళములో బాధపడుచు, కన్ను 23
లెత్తి దూరమునుండి అబ్రాహామును అతని రొమ్మున
(ఆనుకొనియున్న) లాజరును చూచి । —తండ్రివైన 24
అబ్రాహామా, నాయందు కనికరపడి, తన వ్రేలికొనను
నీళ్లలోముంచి నా నాలుకను చల్లార్చుటకు లాజరును
పంపుము; నేను ఈ అగ్నిజ్వాలలో యాతనపడు
చున్నానని కేకలువేసి చెప్పెను. । అందుకు అబ్రా 25
హాము—కుమారుడా, నీవు నీ జీవితకాలమందు నీకిష్ట
మైనట్టు సుఖమును అనుభవించితివి, ఆలాగుననే
లాజరు కష్టమును అనుభవించెనని జ్ఞాపకము చేసి
కొనుము; ఇప్పుడైతే వాడిక్కడ నెమ్మది పొందుచున్నా
డు, నీవు యాతనపడుచున్నావు. । ఇంతేకాక ఇక్కడ 26
నుండి మీ యొద్దకు దాట గోరువారు దాటి పోజాల
కుండునట్లును, అక్కడివారు మాయొద్దకు దాటి రాజాల

[1] మూలభాషలో—వెలుగు కుమారులకంటె.

[2] మూలభాషలో—ఈ యుగకుమారులు.

కుండునట్లును, నాకును మీకును మధ్య మహా అగాధ
27 ముంచబడియున్నదని చెప్పెను. । అప్పుడతడు—తండ్రీ,
ఆలాగైతే నాకయిదుగురు సహోదరులున్నారు. ।
28 వారును ఈ వేదనకరమైన స్థలమునకు రాకుండ వారికి
సాక్ష్యమిచ్చుటకై నా తండ్రి యింటికి వాని పంప
29 వలెనని నిన్ను వేడుకొనుచున్నాననెను. । అందుకు
అబ్రాహాము — వారియొద్ద మోషేయు ప్రవక్తలును
ఉన్నారు; వారి మాటలు వినవలెనని అతనితో
30 చెప్పగా । అతడు—తండ్రివైన అబ్రాహామా, ఆలాగు
అనవద్దు, మృతులలోనుండి యొకడు వారియొద్దకు
వెళ్లిన పక్షమున వారు మారుమనస్సు పొందుదురని
31 చెప్పెను. । అందుకతడు — మోషేయు ప్రవక్తలును
(చెప్పిన మాటలు) వారు విననియెడల మృతులలో
నుండి యొకడు లేచినను వారు నమ్మరని అతనితో
చెప్పెననెను

**17** మరి యొకప్పుడు ఆయన తన శిష్యులతో ఇట్ల
నెను—అభ్యంతరములు రాకపోవుట అసాధ్యముకాని
2 అవి ఎవనివలన వచ్చునో వానికి శ్రమ. । వాడీ చిన్న
వారిలో ఒకనికి అభ్యంతరము కలుగజేయుటకంటె
వాని మెడకు తిరుగటిరాయి కట్టబడి సముద్రములో
3 పడద్రోయబడుట వానికి మేలు. । మీ విషయమై
మీరే జాగ్రత్తగా ఉండుడి. నీ సహోదరుడు తప్పి
తము చేసినయెడల అతని గద్దించుము; అతడు మారు
మనస్సు పొందిన పక్షమున అతని క్షమించుము. ।
4 అతడు ఒక దినమున ఏడు మారులు నీకు తప్పితము
చేసి యేడు మారులు నీ వైపు తిరిగి — మారుమనస్సు
పొందితినని నినయెడల అతని క్షమింపవలెననెను.

5 అపొస్తలులు—మా విశ్వాసము వృద్ధిపొందించుమని
6 ప్రభువుతో చెప్పగా । ప్రభువు—మీరు ఆవగింజంత
విశ్వాసము గలవారైతే ఈ కంబళిచెట్టును చూచి—
నీవు వేళ్లతోకూడ పెల్లగింపబడి సముద్రములో నాట
బడుమని చెప్పినప్పుడు అది మీకు లోబడును. ।
7 దున్నువాడు గాని మేపువాడు గాని మీలో ఎవనికైన
ఒక దాసుడుండగా వాడు పొలములోనుండి వచ్చి
నప్పుడు — నీవు ఇప్పుడే వెళ్లి భోజనము చేయుమని
8 వానితో చెప్పునా! చెప్పడు. । అంతేకాక—నేను
భోజనము చేయుటకేమైనను సిద్ధపరచి, నడుముకట్టు
కొని నేను అన్నపానములు పుచ్చుకొనువరకు నాకు
పరిచారము చేయుము; అటుతరువాత నీవు అన్నపాన
ములు పుచ్చుకొనవచ్చునని వానితో చెప్పును గాని ।
9 ఆ దాసుడు ఆజ్ఞాపింపబడిన పనులు చేసినందుకు వాడు
10 దయచూపెనని వాని మెచ్చునా? । అటువలె మీరును
మీకు ఆజ్ఞాపింపబడినవన్నియు చేసినతరువాత —
మేము నిష్ప్రయోజకులమైన దాసులము, మేము
చేయవలసినవాటినే చేసియున్నామని చెప్పుడనెను.
11 ఆయన యెరూషలేమునకు ప్రయాణమై పోవుచు
సమరైయ గలిలైయల మధ్యగా వెళ్లుచుండెను. ।
ఆయన యొక గ్రామములోకి వెళ్లుచుండగా పదిమంది 12
కుష్ఠరోగులు ఆయనకు ఎదురుగా వచ్చి దూరమున
నిలిచి । —యేసుప్రభూ, మమ్ము కరుణించుమని కేకలు 13
వేసిరి. । ఆయన వారిని చూచి—మీరు వెళ్లి మిమ్మును 14
యాజకులకు కనుపరచుకొనుడని వారితో చెప్పెను.
వారు వెళ్లుచుండగా శుద్ధులైరి. । వారిలో ఒకడు తనకు 15
స్వస్థత కలుగుట చూచి । గొప్ప శబ్దముతో దేవుని 16
మహిమపరచుచు, తిరిగి వచ్చి ఆయనకు కృతజ్ఞతాస్తు
తులు చెల్లించుచు, ఆయన పాదములయొద్ద సాగిల
పడెను; వాడు సమరైయుడు. । అందుకు యేసు—పది 17
మంది శుద్ధులైరి కారా; ఆ తొమ్మండుగురు ఎక్కడ? ।
ఈ అన్యుడు తప్ప దేవుని మహిమపరచుటకు తిరిగి 18
వచ్చినవాడెవడును అగుపడలేదా అని చెప్పి । —నీవు 19
లేచిపొమ్ము, నీ విశ్వాసము నిన్ను స్వస్థపరచెనని
వానితో చెప్పెను.

దేవుని రాజ్యమెప్పుడు వచ్చునని పరిసయ్యులు 20
ఆయన నడిగినప్పుడు ఆయన—దేవుని రాజ్యము ప్రత్య
క్షముగా రాదు. । ఇదిగో దేవుని రాజ్యము మీ 21
మధ్యనే యున్నది గనుక, ఇదిగో ఇక్కడనని అదిగో
అక్కడనని చెప్ప వీలుపడదని వారికి ఉత్తరమిచ్చెను.

మరియు ఆయన తన శిష్యులతో ఇట్లనెను—మను 22
ష్యకుమారుని దినములలో ఒకదినము చూడవలెనని
మీరు కోరుదినములు వచ్చునుగాని మీరాదినమును
చూడరు. । వారు—ఇదిగో ఇక్కడనని అదిగో అక్క 23
డనని మీతో చెప్పినయెడల వెళ్లకుడి, వెంబడింపకుడి. ।
ఆకాశముక్రింద ఒక దిక్కునుండి మెరుపు మెరిసి ఆకా 24
శముక్రింద మరియొక దిక్కున కేలాగున ప్రకాశిం
చునో ఆలాగున మనుష్యకుమారుడు తన దినమున ఉం
డును. । అయితే ముందుగా ఆయన అనేక హింసలు 25
పొంది యీ తరమువారిచేత ఉపేక్షింపబడవలెను.

నోవహు దినములలో జరిగినట్టు మనుష్యకుమా 26
రుని దినములలోను జరుగును. । నోవహు ఓడలోకి 27
వెళ్లిన దినమువరకు జనులు తినుచు త్రాగుచు పెం
డ్లాడుచు పెండ్లికియ్యబడుచు నుండిరి; అంతలో జల
ప్రళయము వచ్చి వారినందరిని నాశనముచేసెను. ।
లోతు దినములలో జరిగినట్టును జరుగును. జనులు 28
తినుచు త్రాగుచు కొనుచు అమ్ముచు నారు నాటుచు
ఇండ్లు కట్టుచునుండిరి. । అయితే లోతు సొదొమ 29
విడిచిపోయిన దినమున ఆకాశమునుండి అగ్ని గంధక
ములు కురిసి వారినందరిని నాశనముచేసెను. । ఆ 30
ప్రకారమే మనుష్యకుమారుడు ప్రత్యక్షమగు దినమున
జరుగును. । ఆ దినమున ఇంటి మిద్దెమీద ఉండు 31
వాడు ఇంట ఉండు తన సామగ్రిని తీసికొనిపోవు
టకు దిగకూడదు; ఆలాగే పొలములో ఉండువాడును
తాను విడిచిపెట్టి వచ్చినవాటికోసరము తిరిగి రాకూ

32 డదు. । లోతు భార్యను జ్ఞాపకము చేసికొనుడి. ।
33 తన ప్రాణమును రక్షించుకొన గోరువాడు దాని
పోగొట్టుకొనును, దాని పోగొట్టుకొనువాడు దాని
34 సజీవముగా కాపాడుకొనును. । ఆ రాత్రి యిద్ద
రొక్క మంచముమీద ఉందురు; వారిలో ఒకడు
35 కొనిపోబడును ఒకడు విడిచిపెట్టబడును. । ఇద్దరు
స్త్రీలు ఒక్క తిరగలి విసురుచుందురు; ఒకతె కొనిపో
37 బడును ఒకతె విడిచిపెట్టబడునని చెను. । శిష్యులు—
ప్రభువా, యిది ఎక్కడ (జరుగు)నని ఆయన నడిగి
నందుకాయన — పీనుగ ఎక్కడ ఉన్నదో అక్కడ
గద్దలును పోగవునని వారితో చెప్పెను.

18 వారు విసుకక నిత్యము ప్రార్థనచేయవలెనని
2 ఆయన వారితో ఈ ఉపమానము చెప్పెను । —దేవు
నికి భయపడకయు మనుష్యులను లక్ష్యపెట్టకయు
నుండు ఒక న్యాయాధిపతి యొక పట్టణములో ఉం
3 డెను. । ఆ పట్టణములో ఒక విధవరాలును ఉండెను.
ఆమె అతనియొద్దకు తరుచుగా వచ్చి — నా ప్రతి
వాదికిని నాకును న్యాయము తీర్చుమని అడుగుచు
4 వచ్చెను గాని । అతడు కొంతకాలము ఒప్పకపోయెను.
తరువాత అతడు — నేను దేవునికి భయపడకయు
5 మనుష్యులను లక్ష్యపెట్టకయు ఉండినను । ఈ విధవ
రాలు నన్ను తొందరపెట్టుచున్నది గనుక ఆమె మాటి
మాటికి వచ్చి గోజాడకుండునట్లు ఆమెకు న్యాయము
6 తీర్తునని తనలోతాననుకొనెను. । మరియు ప్రభువిట్ల
నెను — అన్యాయస్థుడైన ఆ న్యాయాధిపతి చెప్పిన
7 మాట వినుడి. । దేవుడు తాను ఏర్పరచుకొనినవారు
దివారాత్రులు తన్నుగూర్చి మొఱ్ఱపెట్టుకొనుచుం
8 డగా వారికి న్యాయము తీర్చడా? । ఆయన వారికి
త్వరగా న్యాయము తీర్చును; వారివిషయమే గదా
ఆయన ఆలస్యము చేయుచున్నాడని[1] మీతో చెప్పు
చున్నాను. అయినను మనుష్యకుమారుడు వచ్చునప్పు
డు ఆయన భూమిమీద విశ్వాసముండ కనుగొనునా!
9 తామే నీతిమంతులని తమ్ము నమ్ముకొని యితరులను
తృణీకరించు కొందరితో ఆయన ఈ ఉపమానము
10 చెప్పెను । —ప్రార్థనచేయుటకై యిద్దరు మనుష్యులు
దేవాలయమునకు వెళ్లిరి. వారిలో ఒకడు పరిసయ్యుడు
11 ఒకడు సుంకరి. । పరిసయ్యుడు నిలువబడి — దేవా,
నేను చోరులును అన్యాయస్థులును వ్యభిచారులునైన
యితర మనుష్యులవలెనైనను, ఈ సుంకరివలెనైన నుండ
నందుకు నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాను. ।
12 వారమునకు రెండు మారులుపవాసము చేయుచు నా
సంపాదిన అంతటిలో పదియవవంతు చెల్లించుచున్నా
13 నని తనలోతాను ప్రార్థించుచుండెను. । అయితే సుం
కరి దూరముగా నిలుచుండి, ఆకాశమువైపు కన్ను
లెత్తుటకైనను ధైర్యముచాలక రొమ్ము కొట్టుకొనుచు
—దేవా, పాపినైన నన్ను కరుణించుమని పలికెను. ।
అతనికంటె ఇతడు నీతిమంతుడుగా తీర్చబడి తన యిం 14
టికి వెళ్లెనని మీతో చెప్పుచున్నాను. తన్నుతాను
హెచ్చించుకొనువాడు తగ్గింపబడుననియు తన్నుతాను
తగ్గించుకొనువాడు హెచ్చింపబడుననియు చెప్పెను.

తమ శిశువులను ముట్టవలెనని కొందరు ఆయన 15
యొద్దకు వారిని తీసికొనిరాగా ఆయన శిష్యులు అది
చూచి (తీసికొనివచ్చిన) వారిని గద్దించిరి. । అయితే 16
యేసు వారిని తనయొద్దకు పిలిచి — చిన్న పిల్లలను
ఆటంకపరచక వారిని నాయొద్దకు రానియ్యుడి, దేవుని
రాజ్యము ఈలాటివారిది. । చిన్నపిల్లవలె దేవుని 17
రాజ్యము అంగీకరింపనివాడు దానిలో నెంతమాత్ర
మును ప్రవేశింపడని నిశ్చయముగా మీతో చెప్పు
చున్నాననెను.

ఒక అధికారి ఆయనను చూచి—సద్బోధకుడా, 18
నిత్యజీవమునకు వారసుడనగుటకు నేనేమి చేయవలె
నని ఆయన నడిగెను. । అందుకు యేసు — నేను 19
సత్పురుషుడనని యేల చెప్పుచున్నావు? దేవుడొక్కడే
తప్ప మరి ఎవడును సత్పురుషుడు కాడు । వ్యభిచరింప 20
వద్దు, నరహత్య చేయవద్దు, దొంగిలవద్దు, అబద్ధ
సాక్ష్యము పలుకవద్దు, నీ తలిదండ్రులను సన్మానింపు
మను ఆజ్ఞలను ఎరుగుదువు గదా అని అతనితో చెప్పె
ను. । అందుకతడు — బాల్యమునుండి వీటినన్నిటిని 21
అనుసరించుచునే యున్నాననెను. । యేసు విని — 22
నీకింక ఒకటి కొదువగా నున్నది; నీకు కలిగినవన్నియు
అమ్మి బీదలకిమ్ము, అప్పుడు పరలోకమందు నీకు ధనము
కలుగును; నీవు వచ్చి నన్ను వెంబడింపుమని అతనితో
చెప్పెను. । అతడు మిక్కిలి ధనవంతుడు గనుక ఈ 23
మాటలు విని మిక్కిలి వ్యసనపడగా । యేసు అతని 24
చూచి — ఆస్తిగలవారు దేవుని రాజ్యములో ప్రవేశిం
చుట ఎంతో దుర్లభము. । ధనవంతుడు దేవుని రాజ్య 25
ములో ప్రవేశించుటకంటె సూదిబెజ్జములో ఒంటె
దూరుట సులభమని చెప్పెను. । ఇది వినినవారు — 26
ఆలాగైతే ఎవడు రక్షణపొందగలడని అడుగగా ।
ఆయన — మనుష్యులకు అసాధ్యములైనవి దేవునికి 27
సాధ్యములని చెప్పెను. । పేతురు — ఇదిగో మేము 28
మాకు కలిగినవి విడిచిపెట్టి నిన్ను వెంబడించితిమనగా ।
ఆయన — దేవుని రాజ్యము నిమిత్తమై యింటినైనను 29
భార్యనైనను అన్నదమ్ములనైనను తలిదండ్రులనైనను 30
పిల్లలనైనను విడిచిపెట్టినవాడెవడును, ఇహమందు చాల
రెట్లును పరమందు నిత్యజీవమును పొందకపోడని
నిశ్చయముగా మీతో చెప్పుచున్నానని వారితో
అనెను.

తరువాత ఆయన తన పన్నెండుమంది శిష్యులను 31
పిలిచి — ఇదిగో యెరూషలేముకు వెళ్లుచున్నాము;

1 లేక, దీర్ఘశాంతము చూపుచున్నాడని.

మనుష్యకుమారునిగూర్చి ప్రవక్తలచేత వ్రాయబడిన
32 మాటలన్నియు నెరవేర్చబడును. । ఆయన అన్యజనుల
కప్పగింపబడును; వారాయనను అపహసించి, అవ
33 మానపరచి, ఆయనమీద ఉమ్మివేసి, । ఆయనను కొర
డాలతో కొట్టి చంపుదురు; మూడవ దినమున ఆయన
34 మరల లేచునని చెప్పెను. । వారు ఈ మాటలలో ఒక
టైనను గ్రహింపలేదు; ఈ సంగతి వారికి మరుగు
చేయబడెను గనుక ఆయన చెప్పిన సంగతులు వారికి
బోధపడలేదు.

35 తరువాత ఆయన యెరికో పట్టణమునకు సమీపించి
నప్పుడు ఒక గుడ్డివాడు త్రోవప్రక్కను కూర్చుండి
36 భిక్షమడుగుకొనుచుండెను. । జనసమూహము దాటి
పోవుచున్నట్లు వాడు నప్పుడు విని—ఇది ఏమని అడు
37 గగా । వారు—నజరేయుడైన యేసు ఈ మార్గమున
38 వెళ్లుచున్నాడని వానితో చెప్పిరి. । అప్పుడు వాడు
—యేసూ, దావీదు కుమారుడా, నన్ను కరుణించు
39 మని కేకలువేయగా । —ఊరకుండుమని ముందర
నడుచుచుండినవారు వాని గద్దించిరి గాని వాడు మరి
ఎక్కువగా—దావీదు కుమారుడా, నన్ను కరుణించు
40 మని కేకలువేసెను. । అంతట యేసు నిలిచి, వానిని తన
41 యొద్దకు తీసికొని రమ్మనెను. । వాడు దగ్గరకు వచ్చి
నప్పుడు ఆయన — నేను నీకేమి చేయ గోరుచున్నా
వని అడుగగా వాడు — ప్రభువా, చూపు పొంద
42 గోరుచున్నాననెను. । యేసు—చూపుపొందుము, నీ
విశ్వాసము నిన్ను స్వస్థపరచెనని వానితో చెప్పెను; ।
43 వెంటనే వాడు చూపుపొంది దేవుని మహిమపరచుచు
ఆయనను వెంబడించెను. ప్రజలందరు అది చూచి
దేవుని స్తోత్రముచేసిరి.

**19** ఆయన సంచరించుచు యెరికో పట్టణములో
2 ప్రవేశించెను. । సుంకపు గుత్తదారుడును ధనవంతుడు
3 నైన జక్కయ్య అను పేరుగల ఒకడు । యేసు ఎవడని
చూడగోరెనుగాని, పొట్టివాడైనందున జనులు గుంపు
4 కూడి యుండుటవలన చూడలేకపోయెను. । అప్పుడు
యేసు ఆ త్రోవను రానైయుండెను గనుక అతడు
ముందుగా పరుగెత్తి ఆయనను చూచుటకు ఒక మేడి
5 చెట్టెక్కెను. । యేసు ఆ చోటికి వచ్చినప్పుడు కన్ను
లెత్తి చూచి—జక్కయ్యా త్వరగా దిగుము, నేడు నేను
నీ యింట నుండవలసియున్నదని అతనితో చెప్పగా ।
6 అతడు త్వరగా దిగి సంతోషముతో ఆయనను చేర్చు
7 కొనెను. ; అందరు అది చూచి—ఈయన పాపియైన
మనుష్యునియొద్ద బసచేయ వెళ్లెనని చాల సణుగు
8 కొనిరి. । జక్కయ్య నిలువబడి — ఇదిగో ప్రభువా,
నా ఆస్తిలో సగము బీదలకిచ్చుచున్నాను; నేనెవని
యొద్దనైనను అన్యాయముగా దేనినైనను తీసికొనిన
పక్షమున అతనికి నాలుగంతలు మరల చెల్లింతునని
ప్రభువుతో చెప్పెను. । అందుకు యేసు — ఇతడును 9
అబ్రాహాము కుమారుడు గనుక నేడు ఈ యింటికి
రక్షణ వచ్చియున్నది. । నశించినదానిని వెదకి రక్షించు 10
టకు మనుష్యకుమారుడు వచ్చెనని అతనితో చెప్పెను.

వారు ఈ మాటలు వినుచుండగా తాను యెరూష 11
లేమునకు సమీపమున ఉండుటవలనను, దేవుని రా
జ్యము వెంటనే అగుపడునని వారు తలంచుటవలనను,
ఆయన మరియొక ఉపమానము చెప్పెను. ఏమనగా, ।
రాజకుమారుడొకడు రాజ్యము సంపాదించుకొని మరల 12
రావలెనని దూరదేశమునకు ప్రయాణమై । తన దాసు 13
లను పదిమందిని పిలిచి వారికి పది మినాల నిచ్చి[1]—
నేను వచ్చువరకు వ్యాపారము చేయుడని వారితో
చెప్పెను. । అయితే అతని పట్టణస్థులతని ద్వేషించి 14
—ఇతడు మమ్ము నేలుట మాకిష్టములేదని అతని వెనుక
రాయబారము పంపిరి. । అతడా రాజ్యము సంపాదించు 15
కొని తిరిగి వచ్చినప్పుడు, ప్రతివాడును వ్యాపారము
వలన ఏమేమి సంపాదించెనో తెలిసికొనుటకై తాను
సొమ్మిచ్చిన దాసులను తనయొద్దకు పిలువుమని ఆజ్ఞా
పించెను. । మొదటివాడాయన యెదుటికి వచ్చి — 16
అయ్యా, నీ మినావలన పది మినాలు లభించెనని చెప్ప
గా । అతడు — భళా మంచి దాసుడా, నీవు ఈ 17
కొంచెములో నమ్మకముగా ఉంటివి గనుక పది పట్టణ
ములమీద అధికారివై యుండుమని వానితో చెప్పె
ను. । అంతట రెండవవాడు వచ్చి—అయ్యా, నీ మినా 18
వలన అయిదు మినాలు లభించెననగా । అతడు— 19
నీవును అయిదు పట్టణములమీద ఉండుమని అతనితో
చెప్పెను. । అంతట మరియొకడు వచ్చి — అయ్యా, 20
యిదిగో నీ మినా; । నీవు పెట్టనిదాని ఎత్తుకొనువా 21
డవును, విత్తనిదానిని కోయువాడవునైన కఠినుడవు
గనుక, నీకు భయపడి దీనిని రుమాలున కట్టియుంచితి
నని చెప్పెను. । అందుకతడు — చెడ్డ దాసుడా, నీ 22
నోటి మాటనుబట్టియే నీకు తీర్పు తీర్చుదును; నేను
పెట్టనిదాని ఎత్తువాడను, విత్తనిదానిని కోయువాడను
నైన కఠినుడనని నీకు తెలిసేయుండెగా । నీవెందుకు నా 23
సొమ్ము సాహుకారులయొద్ద నుంచలేదు? అట్లయితే
నేను వచ్చి వడ్డితో దాని తీసికొందునే అని వానితో
చెప్పి । — వీనియొద్దనుండి ఆ మినా తీసివేసి పది 24
మినాలు గలవాని కియ్యుడని దగ్గర నిలిచినవారితో
చెప్పెను. । వారు — అయ్యా, వానికి పది మినాలు 25
కలవే అనిరి. । అందుకతడు — కలిగిన ప్రతివానికి 26
ఇయ్యబడును, లేనివానియొద్దనుండి వానికి కలిగినదియు
తీసివేయబడునని మీతో చెప్పుచున్నాను. । మరియు 27
నేను తమ్మును ఏలుటకు ఇష్టములేని నా శత్రువులను
ఇక్కడికి తీసికొనివచ్చి నాయెదుట *సంహరించుడని
చెప్పెను.

1 మినా యించుమించు 50 రూపాయిల విలువ

28 యేసు ఈ మాటలు చెప్పి యెరూషలేముకు వెళ్ల
వలెనని ముందు సాగిపోయెను.
29 ఆయన ఒలీవలకొండదగ్గరనున్న బేత్పగే బేతనియ
అను గ్రామముల సమీపమునకు వచ్చినప్పుడు, తన
30 శిష్యుల నిద్దరిని పిలిచి। —మీరు ఎదుటనున్న గ్రామ
మునకు వెళ్లుడి; అందులో మీరు ప్రవేశింపగానే
కట్టబడియున్న యొక గాడిదెపిల్ల మీకు కనబడును;
దానిమీద ఏ మనుష్యుడును ఎన్నడు కూర్చుండలేదు;
31 దాని విప్పి తోలుకొని రండి. । ఎవడైనను—మీరెం
దుకు దీని విప్పుచున్నారని మిమ్ము నడిగినయెడల—ఇది
ప్రభువుకు కావలసియున్నదని అతనితో చెప్పుడని
32 చెప్పి వారిని పంపెను. । పంపబడినవారు వెళ్లి, ఆయన
33 తమతో చెప్పినట్టే కనుగొని । ఆ గాడిదెపిల్లను విప్పు
చుండగా దాని యజమానులు—మీరు గాడిదెపిల్లను
34 ఎందుకు విప్పుచున్నారని వారినడిగిరి. । అందుకు
35 వారు—ఇది ప్రభువుకు కావలసియున్నదనిరి. । తరు
వాత వారు యేసునొద్దకు దాని తోలుకొని వచ్చి, ఆ
గాడిదెపిల్లమీద తమ బట్టలు వేసి, యేసును దానిమీద
36 ఎక్కించి, । ఆయన వెళ్లుచుండగా తమ బట్టలు దారి
37 పొడుగున పరచిరి. । ఒలీవలకొండనుండి దిగుచోటికి
ఆయన సమీపించుచున్నప్పుడు శిష్యుల సమూహ
మంతయు సంతోషించుచు
38 —ప్రభువు పేరట వచ్చు రాజు స్తుతింపబడునుగాక
పరలోకమందు సమాధానమును సర్వోన్నతమైన
స్థలములలో మహిమయు ఉండునుగాక[1]
అని తాము చూచిన అద్భుతములన్నిటినిగూర్చి మహా
39 శబ్దముతో దేవుని స్తోత్రము చేయసాగిరి. । ఆ సమూ
హములో ఉన్న కొందరు పరిసయ్యులు—బోధకుడా,
40 నీ శిష్యులను గద్దింపుమని ఆయనతో చెప్పగా । ఆయన
వారిని చూచి — వీరు ఊరకుండినయెడల ఈ రాళ్లు
కేకలు వేయునని మీతో చెప్పుచున్నాననెను.
41 ఆయన పట్టణమునకు సమీపించినప్పుడు దాని
42 చూచి దాని విషయమై యేడ్చి । —నీవును ఈ నీ దిన
మందైనను సమాధానసంబంధమైన సంగతులను తెలిసి
కొనినయెడల నీకెంతో మేలు; గాని యిప్పుడవి నీ
43 కన్నులకు మరుగుచేయబడియున్నవి. । (ప్రభువు)
నిన్ను దర్శించినకాలము నీవు ఎరుగకుంటివి గనుక నీ
శత్రువులు నీ చుట్టు గట్టు కట్టి ముట్టడివేసి, అన్ని
ప్రక్కలను నిన్ను అరికట్టి, నీలోనున్న నీ పిల్లలతో
44 కూడ నిన్ను నేల కలిపి । నీలో రాతిమీద రాయి
నిలిచియుండనియ్యని దినములు వచ్చునని చెప్పెను.
45 తరువాత ఆయన దేవాలయములో ప్రవేశించి అం
46 దులో విక్రయము చేయువారిని చూచి
—నా మందిరము ప్రార్థన మందిరము[2]
అని వ్రాయబడియున్నది.
అయితే మీరు దాని దొంగల గుహగా చేసితిరని
చెప్పి వారిని వెళ్లగొట్ట నారంభించెను.
ఆయన ప్రతిదినమును దేవాలయములో బోధించు 47
చున్నప్పుడు ప్రధానయాజకులును శాస్త్రులును ప్రజ
లలో ప్రధానులును ఆయనను నాశనముచేయ జూచు
చుండిరి గాని । ప్రజలందరు ఆయన వాక్యమును విను 48
టకు ఆయనను హత్తుకొని యుండిరి గనుక ఏమి చేయ
వలెనో వారికి తోచలేదు.

ఆ దినములలో ఒకనాడు ఆయన దేవాలయ 20
ములో ప్రజలకు బోధించుచు సువార్తను ప్రకటించు
చున్నప్పుడు ప్రధానయాజకులును శాస్త్రులును పెద్ద
లతోకూడ ఆయనమీదికి వచ్చి । —నీవు ఏ అధికారము 2
వలన ఈ కార్యము చేయుచున్నావో, యీ అధి
కారము నీకెవడు ఇచ్చెనో మాతో చెప్పుమని ఆయ
నను అడిగిరి. । అందుకాయన—నేనును మిమ్మును ఒక 3
మాట అడుగుదును, అది నాతో చెప్పుడి. । యోహాను 4
ఇచ్చిన బాప్తిస్మము పరలోకమునుండి కలిగినదా మను
ష్యులనుండి కలిగినదా? అని వారి నడుగగా । వారు 5
—మనము పరలోకమునుండి కలిగినదని చెప్పినయెడల
—ఆలాగైతే మీరెందుకతని నమ్మలేదని ఆయన మన
లను అడుగును. । మనుష్యులవలన కలిగినదని చెప్పిన 6
యెడల ప్రజలందరు మనలను రాళ్లతో కొట్టుదురు;
ఏలయనగా యోహాను ప్రవక్త అని అందరును రూఢిగా
నమ్ముచున్నారని తమలో తాము ఆలోచించుకొని—
అది ఎక్కడనుండి కలిగినదో మాకు తెలియదని ఆయ 7
నకు ఉత్తరమిచ్చిరి. । అందుకు యేసు—ఏ అధికారము 8
వలన ఈ కార్యములు చేయుచున్నానో నేనును
మీతో చెప్పనని వారితో ననెను.
అంతట ఆయన ప్రజలతో ఈ ఉపమానము 9
చెప్పెను—ఒక మనుష్యుడు ద్రాక్షతోట నాటించి
కాపులకు గుత్తకిచ్చి దేశాంతరముపోయి బహుకాల
ముండెను. । పంటకాలమందు అతడు ఆ ద్రాక్ష 10
తోట పంటలో తనభాగమిమ్మని ఆ కాపులయొద్దకు ఒక
దాసుని పంపగా ఆ కాపులు వాని కొట్టి వట్టిచేతు
లతో పంపివేసిరి. । మరల అతడు మరియొక దాసుని 11
పంపగా వారు వాని కొట్టి అవమానపరచి వట్టిచేతు
లతో పంపివేసిరి. । మరల నతడు మూడవవాని పం 12
పగా వారు వాని గాయపరచి వెలపలికి తోసివేసిరి.।
అప్పుడా ద్రాక్షతోట యజమానుడు — నేనేమి 13
చేతును? నా ప్రియకుమారుని పంపుదును; ఒకవేళ
వారు అతని సన్మానించెదరనుకొనెను. । అయినను ఆ 14
కాపులు కుమారుని చూచి—ఇతడు వారసుడు; ఈ
స్వాస్థ్యము మనదగునట్లు ఇతని చంపుదము రండని
యొకరితో నొకరు ఆలోచించుకొని । అతనిని ద్రాక్ష 15
తోట వెలపటికి త్రోసివేసి చంపిరి. కాబట్టి ఆ ద్రాక్ష

[1] కీర్తన. 118. 26. [2] యెషయా. 56: 7.

16 తోట యజమానుడు వారికేమి చేయును? । అతడు
వచ్చి ఆ కాపులను సంహరించి తన ద్రాక్షతోటను
ఇతరులకు ఇచ్చునని ఆయన చెప్పగా వారు విని—
17 అట్లు కాకపోవును గాకనిరి. । ఆయన వారిని చూచి
—ఆలాగైతే

ఇల్లు కట్టువారు నిషేధించిన రాయి
మూలకు తలరాయి ఆయెను[1]

18 అని వ్రాయబడిన మాట ఏమిటి? ఈ రాతిమీద పడు
ప్రతివాడును తునకలై పోవును అయితే అది ఎవని
మీద పడునో వాని నలిచేయుననెను.
19 ప్రధానయాజకులును శాస్త్రులును తమ్మునుగూర్చి ఆ
ఉపమానము ఆయన చెప్పెనని గ్రహించి, ఆ గడియ
లోనే ఆయనను బలాత్కారముగా పట్టుకొన సమ
20 యము చూచిరి గాని జనులకు భయపడిరి. । వారాయ
నను కనిపెట్టుచు, అధిపతి వశమునకును అధికార
మునకును ఆయనను అప్పగించుటకై ఆయన మాటల
యందు తప్పు పట్టవలెనని, తాము నీతిమంతులని అని
21 పించుకొను చారులను ఆయనయొద్దకు పంపిరి. । వారు
వచ్చి—బోధకుడా, నీవు న్యాయముగా మాటలాడు
చును బోధించుచున్నావు; నీవెవనియందును పక్ష
పాతములేక సత్యముగానే దేవుని మార్గమును బోధిం
22 చుచున్నావని యెరుగుదుము. । మనము కైసరుకు పన్ని
చ్చుట న్యాయమా కాదా అని ఆయన నడిగిరి. ।
23 ఆయన వారి కుయుక్తిని గుర్తెరిగి । — ఒక దేనారము[2]
24 నాకు చూపుడి. దీనిమీది రూపమును పైవ్రాతయు
25 ఎవనివని అడుగగా వారు—కైసరువనిరి. । అందు
కాయన — ఆలాగైతే కైసరువి కైసరుకును దేవునివి
26 దేవునికిని చెల్లించుడని వారితో చెప్పెను. । వారు
ప్రజలయెదుట ఈ మాటలో తప్పు పట్టనేరక ఆయన
ప్రత్యుత్తరమునకు ఆశ్చర్యపడి ఊరకుండిరి.
27 తరువాత పునరుత్థానము లేదని చెప్పు సద్దూ
కయ్యులు కొందరు ఆయనయొద్దకు వచ్చి ఆయనను
28 ఇట్లడిగిరి । — బోధకుడా, భార్య బ్రదికియుండగా
ఒకని సహోదరుడు సంతానములేక చనిపోయిన
యెడల, అతని సహోదరు డతని భార్యను పెండ్లి
చేసికొని తన సహోదరునికి సంతానము కలుగజేయ
29 వలెనని మోషే మనకు వ్రాసి యిచ్చెను.[3] । మంచిది;
యేడుగురు సహోదరులుండిరి. మొదటివాడొక స్త్రీని
30 పెండ్లిచేసికొని సంతానములేక చనిపోయెను. । రెండవ
వాడును మూడవవాడును ఆమెను పెండ్లిచేసికొనిరి. ।
31 ఆ ప్రకారమే యేడుగురును ఆమెను పెండ్లాడి సం
32 తానములేకయే చనిపోయిరి. । పిమ్మట ఆ స్త్రీయు చని
33 పోయెను. । కాబట్టి పునరుత్థానమందు ఆమె వారిలో
ఎవనికి భార్యగా ఉండును? ఆ యేడుగురికిని ఆమె
భార్యగా ఉండెను గదా అనిరి. । అందుకు యేసు— 34
ఈ లోకజనులు[4] పెండ్లి చేసికొందురు పెండ్లికియ్య
బడుదురు గాని । పరమును మృతుల పునరుత్థానమును 35
పొందుటకు యోగ్యులని యెంచబడినవారు పెండ్లిచేసి
కొనరు పెండ్లికియ్యబడరు. । వారు పునరుత్థానములో 36
పాలివారైయుండి,[5] దేవదూత సమానులును దేవుని
కుమారులునై యుందురు గనుక వారికను చావనేరరు. ।
పొదభాగములో[6] — ప్రభువు అబ్రాహాముయొక్క 37
దేవుడనియు ఇస్సాకుయొక్క దేవుడనియు యాకో 38
బుయొక్క దేవుడనియు చెప్పుచు, మృతులు లేతురని
మోషే సూచించెను; ఆయన సజీవులకే దేవుడుకాని
మృతులకు దేవుడు కాడు; ఆయన దృష్టికి అందరును
జీవించుచున్నారని వారికి ఉత్తరమిచ్చెను. । తరువాత 39
వారాయనను మరేమియు అడుగ తెగింపలేదు గనుక 40
శాస్త్రులలో కొందరు—బోధకుడా, నీవు యుక్తముగా
చెప్పితివనిరి.

అంతట ఆయన వారిని చూచి—క్రీస్తు దావీదు 41
కుమారుడని మీరేలాగు చెప్పుచున్నారు—

నేను నీ శత్రువులను నీ పాదములకు పాదపీఠ 42
ముగా ఉంచువరకు నీవు నా కుడిపార్శ్వమున 43
కూర్చుండుమని ప్రభువు నా ప్రభువుతో
చెప్పెను.

అని కీర్తనల గ్రంథములో దావీదే చెప్పుచున్నాడు.[7] ।
దావీదు ఆయనను ప్రభువని చెప్పినయెడల ఆయన 44
ఏలాగు అతని కుమారుడగునని చెప్పెను.

ప్రజలందరు వినుచుండగా ఆయన ఇట్లనెను— 45
శాస్త్రులనుగూర్చి జాగ్రత్తపడుడి. వారు నిలువుటం
గీలు ధరించుకొని తిరుగ గోరుచు । సంతవీధులలో 46
వందనములను, సమాజమందిరములలో అగ్రపీఠములను,
విందులలో అగ్రస్థానములను కోరుదురు. । వారు 47
విధవరాండ్ర యిండ్లను దిగమ్రింగుచు, మాయవేష
ముగా దీర్ఘప్రార్థనలు చేయుదురు. వారు మరి విశేష
ముగా శిక్ష పొందుదురని తన శిష్యులతో చెప్పెను.

ఆయన తమ కానుకలను కానుకపెట్టెలో వేయు **21**
చుండు ధనవంతులను పారజూచెను. । ఒక బీద విధవ 2
రాలు రెండు కాసులు అందులో వేయుచుండగా
చూచి । —ఈ బీద విధవరాలు అందరికంటె ఎక్కువ 3
వేసెనని మీతో నిజముగా చెప్పుచున్నాను. । వారం 4
దరు తమకు కలిగిన సమృద్ధిలోనుండి కానుకలు వేసిరి
గాని యీమె తన లేమిలో తనకు కలిగిన జీవనమం
తయు వేసెనని వారితో చెప్పెను.

తరువాత కొందరు—ఇది అందమైన రాళ్లతోను 5
అర్పితములతోను శృంగారింపబడియున్నదని దేవా
లయమునుగూర్చి మాటలాడుచుండగా । ఆయన—ఈ 6

1 కీర్తన, 118: 22. 2 దేనారము ఇంచుమించు అర్ధరూపాయి కావచ్చును. 3 ద్వితీ. 25: 3. 4 మూలభాషలో—ఈ యుగపు కుమారులు. 5 మూలభాషలో—పునరుత్థానపు కుమారులైయుండి. 6 నిర్గమ. 3: 2, 6. 7 కీర్తన, 110: 1.

కట్టడములు మీరు చూచుచున్నారే; వాటిలో రాతి
మీద రాయి యుండకుండ అవి పడద్రోయబడు దిన
7 ములు వచ్చుచున్నవని చెప్పెను. । అప్పుడు వారు—
బోధకుడా, ఆలాగైతే ఇవి యెప్పుడు జరుగును? ఇవి
జరుగబోవునని సూచన ఏమని ఆయన నడుగగా ।
8 ఆయన—మీరు మోసపోకుండ చూచుకొనుడి. అనే
కులు నా పేరట వచ్చి—నేనే ఆయననినియు, కాలము
సమీపించెననియు చెప్పుదురు; మీరు వారి వెంబడి
9 పోకుడి. । మీరు యుద్ధములను గూర్చియు కలహము
లను గూర్చియు వినునప్పుడు జడియకుడి; ఇవి మొదట
జరగవలసియున్నవి గాని అంతము వెంటనే రాదని
చెప్పెను.
10 మరియు ఆయన వారితో ఇట్లనెను—జనముమీదికి
జనమును రాజ్యముమీదికి రాజ్యమును లేచును; ।
11 అక్కడక్కడ గొప్ప భూకంపములు కలుగును, తెగు
ళ్లును కరవులును తటస్థించును, ఆకాశమునుండి మహా
భయోత్పాతములును గొప్ప సూచకములును పుట్టును.।
12 ఇవన్నియు జరుగకమునుపు వారు మిమ్మును బలా
త్కారముగా పట్టి, నా నామము నిమిత్తము మిమ్మును
రాజులయొద్దకును అధిపతులయొద్దకును తీసికొనిపోయి,
సమాజ మందిరములకును చెరసాలలకును అప్పగించి
13 హింసింతురు. । ఇది సాక్ష్యార్థమై మీకు సంభవిం
14 చును. । కాబట్టి మేమేమి సమాధానము చెప్పుదుమా
అని ముందుగా చింతింపకుందుమని మీ మనస్సులో
15 నిశ్చయించుకొనుడి. । మీ విరోధులందరు ఎదు
రాడుటకును, కాదనుటకును వీలుకాని వాక్కును
16 జ్ఞానమును నేను మీకు అనుగ్రహింతును. । తలిదం
డ్రులచేతను సహోదరులచేతను బంధువులచేతను
స్నేహితులచేతను మీరు అప్పగింపబడుదురు; వారు
17 మీలో కొందరిని చంపింతురు; । నా నామము నిమి
త్తము మీరు మనుష్యులందరిచేత ద్వేషింపబడుదురు. ।
18 గాని మీ తలవెండ్రుకలలో ఒకటైనను నశింపదు. ।
19 మీరు మీ యోర్పుచేత మీ ప్రాణములను దక్కించు
కొందురు.
20 యెరూషలేము దండ్లచేత చుట్టబడుట మీరు
చూచునప్పుడు దాని నాశనము సమీపమైయున్నదని
21 తెలిసికొనుడి. । అప్పుడు యూదైయలో ఉండు
వారు కొండలకు పారిపోవలెను; దాని మధ్యనుండు
వారు వెలపలికి పోవలెను; పల్లెటూళ్లలోనివారు
22 దానిలో ప్రవేశింపకూడదు. । వ్రాయబడినవన్నియు
23 నెరవేరుటకై అవి ప్రతి దండన దినములు. । ఆ దిన
ములలో గర్భిణులకును పాలిచ్చువారికిని శ్రమ.
భూమిమీద మిక్కిలి యిబ్బందియు ఈ ప్రజలమీద
24 కోపమును వచ్చును । వారు కత్తివాత కూలుదురు;
చెరపట్టబడినవారై సమస్తమైన అన్యజనముల మధ్యకు
పోవుదురు; అన్యజనముల కాలములు సంపూర్ణమగు
వరకు యెరూషలేము అన్యజనములచేత త్రొక్క
బడును. । మరియు సూర్య చంద్ర నక్షత్రములలో 25
సూచకములును, భూమిమీద సముద్రతరంగముల
ఘోషవలన కలవరపడిన జనములకు శ్రమయు కలు
గును. । ఆకాశమందలి శక్తులు కదిలింపబడును గనుక 26
లోకముమీదికి రాబోవుచున్న వాటివిషయమై భయము
కలిగి, మనుష్యులు ఎదురుచూచుచు ధైర్యముచెడి కూలు
దురు. । అప్పుడు మనుష్యకుమారుడు ప్రభావము 27
తోను మహా మహిమతోను మేఘారూఢుడై వచ్చుట
చూతురు. । ఇవి జరుగనారంభించినప్పుడు మీరు 28
ధైర్యము తెచ్చుకొని మీ తలలెత్తికొనుడి, మీ విడుదల
సమీపించుచున్నదనెను.
మరియు ఆయన వారితో ఈ ఉపమానము చెప్పెను 29
—అంజూరపు వృక్షమును సమస్త వృక్షములనేమి
చూడుడి. । అవి చిగిరించుట చూచి వసంతకాలమప్పుడే 30
సమీపమాయెనని మీ అంతట మీరు తెలిసికొందురు
గదా? । అటువలె మీరు ఈ సంగతులు జరుగుట 31
చూచినప్పుడు దేవుని రాజ్యము సమీపమాయెనని
తెలిసికొనుడి. । అవన్నియు సంభవించువరకు ఈ తరము 32
గతింపదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. ।
భూమ్యాకాశములు గతించునుగాని నా మాటలేమాత్ర 33
మును గతింపవు.
మీ హృదయములు ఒకవేళ తిండివలనను మత్తు 34
వలనను ఐహిక విచారములవలనను మందముగా ఉన్నం
దున ఆ దినములు అకస్మాత్తుగా మీ మీదికి ఉరివచ్చి
నట్టు రాకుండ మీ విషయమై మీరు జాగ్రత్తగా
ఉండుడి. । ఆ దినము భూమియందంతట నివసించు 35
వారందరిమీదికి అకస్మాత్తుగా వచ్చును. । కాబట్టి మీరు 36
జరగబోవు వీటినెల్లను తప్పించుకొని, మనుష్యకుమా
రుని యెదుట నిలువబడుటకు శక్తిగలవారగునట్లు[1]
ఎల్లప్పుడును ప్రార్థనచేయుచు మెలకువగా ఉండుడని
చెప్పెను.
ఆయన ప్రతిదినము పగటియందు దేవాలయములో 37
బోధించుచు రాత్రివేళ ఒలీవలకొండకు వెళ్లుచు
కాలము గడుపుచుండెను. । ప్రజలందరు ఆయన 38
మాట వినుటకు దేవాలయములో ఆయనయొద్దకు పెం
దలకడ వచ్చుచుండిరి.
పస్కా అనబడిన పులియని రొట్టెల పండుగ 22
సమీపించెను. । ప్రధానయాజకులును శాస్త్రులును ప్రజ 2
లకు భయపడిరి గనుక ఆయనను ఏలాగు చంపింతుమని
ఉపాయము వెదకుచుండిరి.
అంతట పన్నెండుమంది శిష్యుల సంఖ్యలో చేరిన 3
ఇస్కరియోతు యూదాలో సాతాను ప్రవేశించెను ।
గనుక వాడు వెళ్లి, ఆయనను వారికేలాగు అప్పగింప 4

1 కొన్ని ప్రాచీనప్రతులలో—పాత్రులని యెంచబడునట్లు అని పాఠాంతరము.

వచ్చునో దానిగూర్చి ప్రధానయాజకులతోను అధి
5 పతులతోను మాటలాడెను. । అందుకు వారు సంతో
6 షించి వానికి ద్రవ్యమియ్య సమ్మతించిరి. । వాడు అం
దుకు ఒప్పుకొని జనసమూహము లేనప్పుడు ఆయనను
వారికి అప్పగించుటకు తగిన సమయము వెదకుచుం
డెను.

7 పస్కాను వధింపవలసిన పులియని రొట్టెల దినము
8 రాగా । యేసు పేతురును యోహానును చూచి—మీరు
వెళ్లి మనము పస్కాను భుజించుటకై మనకొరకు సిద్ధ
9 పరచుడని వారిని పంపెను. । వారు — మేమెక్కడ
10 సిద్ధపరచగోరుచున్నావని ఆయనను అడుగగా । ఆయన
—ఇదిగో మీరు పట్టణములో ప్రవేశించినప్పుడు నీళ్ల
కుండ మోసికొనిపోవుచున్న యొకడు మీకు ఎదు
రుగా వచ్చును; అతడు ప్రవేశించు ఇంటిలోకి అతని
11 వెంట వెళ్లి । — నేను నా శిష్యులతోకూడ పస్కాను
భుజించుటకు విడిది గది యెక్కడనని బోధకుడు
నిన్నడుగుచున్నాడని యింటి యజమానునితో చెప్పు
12 డి. । అతడు సామగ్రిగల యొక గొప్ప మేడగది
మీకు చూపించును; అక్కడ సిద్ధపరచుడని వారితో
13 చెప్పెను. । వారు వెళ్లి ఆయన తమతో చెప్పినట్టు
కనుగొని పస్కాను సిద్ధపరచిరి.

14 ఆ గడియ వచ్చినప్పుడు ఆయనయు ఆయనతో
15 కూడ అపొస్తలులును పంక్తిని కూర్చుండిరి. । అప్పుడా
యన— నేను శ్రమపడకమునుపు మీతోకూడ ఈ
16 పస్కాను భుజింపవలెనని మిక్కిలి ఆశపడితిని. । అది
దేవుని రాజ్యములో నెరవేరువరకు ఇక ఎన్నడును
దాని భుజింపనని మీతో చెప్పుచున్నానని వారితో
17 చెప్పి । ఆయన గిన్నె ఎత్తికొని కృతజ్ఞతాస్తుతులు
చెల్లించి — మీరు దీని తీసికొని మీలో పంచు
18 కొనుడి; । ఇకమీదట దేవుని రాజ్యము వచ్చువరకు
నేను ద్రాక్షారసము త్రాగనని మీతో చెప్పుచున్నా
19 ననెను. । పిమ్మట ఆయన యొక రొట్టె పట్టుకొని కృత
జ్ఞతాస్తుతులు చెల్లించి దాని విరిచి, వారికిచ్చి—ఇది
మీకొరకు ఇయ్యబడుచున్న నా శరీరము; నన్ను
జ్ఞాపకము చేసికొనుటకు ఇది చేయుడని చెప్పెను. ।
20 ఆ ప్రకారమే భోజనమైన తరువాత ఆయన గిన్నెయు
పట్టుకొని — ఈ గిన్నె మీకొరకు చిందింపబడు
21 చున్న నా రక్తమువలననైన క్రొత్తనిబంధన. । ఇదిగో
నన్ను అప్పగించువాని చెయ్యి నాతోకూడ ఈ బల్ల
22 మీద ఉన్నది. । నిర్ణయింపబడిన ప్రకారము మనుష్య
కుమారుడు పోవుచున్నాడు గాని ఆయన ఎవనిచేత
అప్పగింపబడుచున్నాడో ఆ మనుష్యునికి శ్రమయని
23 చెప్పెను. । వారు — ఈ పని చేయబోవువాడెవడో
అని తమలోతాము అడుగుకొనసాగిరి.

24 తమలో ఎవడు గొప్పవాడుగా ఎంచబడునో అను
వివాదము వారికి పుట్టగా । ఆయన వారితో ఇట్ల 25
నెను — అన్యజనములలో రాజులు వారిమీద ప్రభు
త్వము చేయుదురు, వారిమీద అధికారము చేయు
వారు ఉపకారులనబడుదురు. । మీరైతే ఆలాగు 26
ఉండరాదు, మీలో గొప్పవాడు చిన్నవానివలెను,
అధిపతి పరిచారకునివలెను ఉండవలెను. । గొప్పవాడె 27
వడు? భోజనపంక్తిని కూర్చుండువాడా పరిచర్య చేయు
వాడా? పంక్తిని కూర్చుండువాడే గదా? అయినను
నేను మీ మధ్య పరిచర్య చేయువానివలె ఉన్నాను. ।
నా శ్రమలలో[1] నాతోకూడ నిలిచియున్నవారు 28
మీరే; । గనుక నా తండ్రి నాకు రాజ్యమును నియ 29
మించినట్టుగా నా రాజ్యములో నా బల్లయొద్ద అన్న 30
పానములు పుచ్చుకొని సింహాసనములమీద కూర్చుండి
ఇశ్రాయేలు పన్నెండు గోత్రములవారికి మీరు తీర్పు
తీర్చుటకై నేనును మీకు రాజ్యమును నియమించు
చున్నాను. । సీమోనూ సీమోనూ, ఇదిగో సాతాను 31
మిమ్మును పట్టి గోధుమలవలె జల్లించుటకు మిమ్మును
కోరుకొనెను గాని । నీ నమ్మిక తప్పిపోకుండునట్లు 32
నేను నీకొరకు వేడుకొంటిని; నీ మనసు తిరిగిన తరు
వాత నీ సహోదరులను స్థిరపరచుమని చెప్పెను. ।
అయితే అతడు — ప్రభువా, నీతోకూడ చెరలోకిని 33
మరణమునకును వెళ్లుటకు సిద్ధముగా ఉన్నానని ఆయ
నతో అనగా । ఆయన — పేతురూ, నీవు నన్నెరుగ 34
నని ముమ్మారు చెప్పువరకు నేడు కోడి కూయదని నీతో
చెప్పుచున్నాననెను.

మరియు ఆయన — నేను మిమ్మును, సంచియు 35
జాలెయు చెప్పులును లేకుండ పంపినప్పుడు, మీకు
ఏమైనను తక్కువాయెనా అని వారినడిగినప్పుడు
వారు—ఏమియు తక్కువ కాలేదనిరి. । అందుకాయన 36
—ఇప్పుడైతే సంచిగలవాడు సంచియు జాలెయు తీసి
కొని పోవలెను, కత్తిలేనివాడు తన బట్టనమ్మి కత్తి
కొనుక్కొనవలెను;

— ఆయన అక్రమకారులలో ఒకడుగా ఎంచ 37
బడెను అని వ్రాయబడిన మాట[2] నాయందు నెరవేర
వలసియున్నది; ఏలయనగా నన్నుగూర్చిన సంగతి
సమాప్తమవుచున్నదని మీతో చెప్పుచున్నాననెను. ।
వారు — ప్రభువా, ఇదిగో ఇక్కడ రెండు కత్తులున్న 38
వనగా—చాలునని ఆయన వారితో చెప్పెను.

తరువాత ఆయన బయలుదేరి తన వాడుకచొప్పున 39
ఒలీవలకొండకు వెళ్లగా శిష్యులును ఆయన వెంట వెళ్లిరి. ।
ఆ చోటు చేరి ఆయన వారితో — మీరు శోధనలో 40
ప్రవేశించకుండునట్లు ప్రార్థనచేయుడని చెప్పి । వారి 41
యొద్దనుండి రాతివేత దూరము వెళ్లి మోకాళ్లూని ।
— తండ్రీ, యీ గిన్నె నాయొద్దనుండి (తొలగించు 42
టకు) నీ చిత్తమైతే తొలగించుము; అయినను నా

1 మూలభాషలో—శోధనలలో. 2 యెషయా. 53: 12.

యిష్టము కాదు; నీ చిత్తమే సిద్ధించుగాక అని ప్రార్థిం
43 చెను. । అప్పుడు పరలోకమునుండి యొకదూత ఆయ
44 నకు కనబడి ఆయనను బలపరచెను. । ఆయన వేదన
పడి మరింత ఆతురముగా ప్రార్థనచేయగా ఆయన
చెమట, నేల పడుచున్న గొప్ప రక్త బిందువులవలె
45 ఆయెను. । ఆయన ప్రార్థన చాలించుకొని లేచి తన
శిష్యులయొద్దకు వచ్చి, వారు దుఃఖముచేత నిద్రించుట
46 చూచి । — మీరెందుకు నిద్రించుచున్నారు? శోధ
నలో ప్రవేశించకుండునట్లు లేచి ప్రార్థనచేయుడని
వారితో చెప్పెను.

47 ఆయన ఇంక మాటలాడుచుండగా, ఇదిగో జనులు
గుంపుగా వచ్చిరి. పన్నెండుమందిలో యూదా అన
బడినవాడు వారికంటె ముందుగా నడిచి, యేసును
48 ముద్దుపెట్టుకొనుటకు ఆయనయొద్దకు రాగా । యేసు
— యూదా, నీవు ముద్దుపెట్టుకొని మనుష్యకుమారుని
49 అప్పగించుచున్నావా అని వానితో అనగా । ఆయన
చుట్టు ఉన్నవారు జరుగబోవుదాని చూచి—ప్రభువా,
50 కత్తితో నరుకుదుమా అని ఆయనను అడిగిరి. । అం
తలో వారిలో ఒకడు ప్రధానయాజకుని దాసుని
51 కొట్టి వాని కుడి చెవి తెగనరికెను. । అయితే యేసు—
ఈమట్టుకు తాళుడని చెప్పి, వాని చెవి ముట్టి బాగు
52 చేసెను. । యేసు తన్ను పట్టుకొనవచ్చిన ప్రధానయాజ
కులతోను దేవాలయపు అధిపతులతోను పెద్దలతోను
—మీరు బందిపోటు దొంగమీదికి వచ్చినట్టు కత్తుల
53 తోను గుదియలతోను బయలుదేరి వచ్చితిరా? । నేను
అనుదినము మీచెంత దేవాలయములో ఉన్నప్పుడు
మీరు నన్ను పట్టుకొనలేదు; అయితే ఇది మీ గడి
యయు అంధకార సంబంధమైన అధికారమును
ఆనెను.

54 వారాయనను పట్టి యీడ్చుకొనిపోయి ప్రధాన
యాజకుని యింటిలోకి తీసికొనిపోయిరి. పేతురు
55 దూరముగా వారి వెనుక వచ్చుచుండెను. । అంతట
కొందరు నడుముంగిట మంటవేసి చుట్టు కూర్చుండి
నప్పుడు, పేతురును వారి మధ్యను కూర్చుండెను. ।
56 అప్పుడొక చిన్నది ఆ మంట వెలుతురులో అతడు
కూర్చుండుట చూచి అతని తేరిచూచి — వీడును
57 అతనితోకూడ ఉండెనని చెప్పెను. । అందుకు పేతురు
58 —అమ్మో, నేనతని నెరుగననెను. । మరి కొంతసేపటికి
మరియొకడు అతని చూచి — నీవును వారిలో ఒకడ
59 వనగా పేతురు — ఓయీ, నేను కాననెను. । ఇంచు
మించు ఒక గడియయైన తరువాత మరియొకడు—
నిజముగా వీడును అతనితోకూడ ఉండెను, వీడు గలి
60 లైయుడని దృఢముగా చెప్పెను. । అందుకు పేతురు
— ఓయీ, నీవు చెప్పినది నాకు తెలియదనెను. అత
క మాటలాడుచుండగా వెంటనే కోడి కూసెను. ।
ు ప్రభువు తిరిగి పేతురువైపు చూచెను గనుక
పేతురు— నేడు కోడి కూయకమునుపు నీవు ముమ్మారు
నన్ను ఎరుగనందువని ప్రభువు తనతో చెప్పిన మాట
జ్ఞాపకము చేసికొని । వెలుపలికిపోయి సంతాపపడి 62
యేడ్చెను.

యేసును పట్టుకొనిన మనుష్యులు ఆయనను అప 63
హసించి కొట్టి, ఆయన ముఖము కప్పి, । —నిన్ను 64
కొట్టినవాడెవడు ప్రవచింపుమని ఆయనను అడిగి ।
ఆయనకు విరోధముగా ఇంక అనేక దూషణ మాట 65
లాడిరి.

ఉదయము కాగానే ప్రజల పెద్దలును ప్రధాన 66
యాజకులును శాస్త్రులును సభకూడి, ఆయనను తమ
మహాసభలోకి తీసికొనిపోయి । — నీవు క్రీస్తువైతే 67
మాతో చెప్పుమనిరి. అందుకాయన— నేను మీతో
చెప్పినయెడల మీరు నమ్మరు. । అదియుగాక నేను 68
మిమ్మును అడిగినయెడల మీరు నాకు ఉత్తరము
చెప్పరు. । ఇది మొదలుకొని మనుష్యకుమారుడు 69
మహాత్మ్యముగల దేవుని కుడిపార్శ్వమున ఆసీనుడగు
నని వారితో చెప్పెను. । అందుకు వారందరు—అట్ల 70
యితే నీవు దేవుని కుమారుడవా అని అడుగగా ఆయన
—మీరన్నట్టు నేనే ఆయనను అని వారితో చెప్పెను. ।
అందుకు వారు — మనకిక సాక్షులతో పని ఏమి? 71
మనము అతని నోటిమాట వింటిమిగదా అని చెప్పిరి.

అంతట వారందరును లేచి ఆయనను పిలాతు **23**
నొద్దకు తీసికొనిపోయి । — ఇతడు మా జనమును 2
తిరుగబడ ప్రేరేపించుచు, కైసరుకు పన్నియ్యవద్ద
నియు, తానే క్రీస్తను ఒక రాజననియు చెప్పగా
మేము వింటిమని ఆయనమీద నేరము మోపసాగిరి. ।
పిలాతు—నీవు యూదుల రాజవా అని ఆయనను అడు 3
గగా ఆయన—నీవన్నట్టే అని అతనితో చెప్పెను. ।
పిలాతు ప్రధానయాజకులతోను జనసమూహముల 4
తోను—ఈ మనుష్యునియందు నాకు ఏ నేరమును కన
బడలేదనెను. । అయితే వారు—ఇతడు గలిలైయదేశము 5
మొదలుకొని ఇంతవరకును యూదైయదేశమందంతట
ఉపదేశించుచు ప్రజలను రేపుచున్నాడని మరింత
పట్టుదలగా చెప్పిరి. । పిలాతు ఈ మాట విని—ఈ 6
మనుష్యుడు గలిలైయుడా అని అడిగి । ఆయన 7
హేరోదు అధికారము క్రింద ఉన్న ప్రదేశపువాడని
తెలిసికొని హేరోదునొద్దకు ఆయనను పంపెను.
హేరోదు ఆ దినములలో యెరూషలేములో ఉం
డెను.

హేరోదు యేసును చూచి మిక్కిలి సంతోషిం 8
చెను. ఆయననుగూర్చి అనేక సంగతులు విన్నందున
ఆయన ఏదైన ఒక సూచకక్రియ చేయగా చూడ నిరీ
క్షించి, బహుకాలమునుండి ఆయనను చూడగోరెను. ।
ఆయనను చూచినప్పుడు చాల ప్రశ్నలువేసినను 9
ఆయన అతనికి ఉత్తరమేమియు ఇయ్యలేదు. । ప్రధాన 10

యాజకులును శాస్త్రులును నిలువబడి ఆయనమీద తీక్షణ
11 ముగా నేరముమోపిరి. । హేరోదు తన రాణువ
వారితో కలిసి, ఆయనను తృణీకరించి అపహసించి,
ఆయనకు ప్రశస్తమైన వస్త్రములు తొడిగించి పిలాతు
12 నొద్దకు మరల పంపెను. । అంతకుముందు హేరో
దును పిలాతును ఒకనికొకడు శత్రువులైయుండి ఆ
దినముననే యొకనికొకడు మిత్రులైరి.

13 అంతట పిలాతు ప్రధానయాజకులను అధికారు
14 లను ప్రజలను పిలిపించి । — ప్రజలు తిరుగబడునట్లు
చేయుచున్నాడని మీరీమనుష్యుని నాయొద్దకు తెచ్చి
తిరే. అయితే నేను మీయెదుట ఇతని విమర్శింపగా
మీరితనిమీద మోపిన నేరములలో ఒక్కటైన నాకు
15 కనబడలేదు; । హేరోదుకు కూడ కనబడలేదు.
హేరోదు అతని మాయొద్దకు తిరిగి పంపెను గదా;
ఇదిగో మరణమునకు తగినదేదియు ఇతడు చేయ
16 లేదు. । కాబట్టి నేనితని శిక్షించి విడుదల చేయుదు
18 నని వారితో చెప్పగా । వారందరు—వీని చంపివేసి
మాకు బరబ్బను విడుదల చేయుమని ఏకగ్రీవముగా
19 కేకలువేసిరి. । వీడు పట్టణములో జరిగించిన యొక
అల్లరి నిమిత్తమును నరహత్య నిమిత్తమును చెరసాలలో
20 వేయబడినవాడు. । పిలాతు యేసును విడుదల చేయ
21 గోరి వారితో తిరిగి మాటలాడినను । వారు — వీని
సిలువవేయుము సిలువవేయుము అని కేకలువేసిరి. ।
22 మూడవ మారు అతడు—ఎందుకు? ఇతడు ఏ దుష్కా
ర్యము చేసెను? ఇతనియందు మరణమునకు తగిన నేర
మేమియు నాకు అగుపడలేదు గనుక ఇతని శిక్షించి
23 విడుదల చేతునని వారితో చెప్పెను. । అయితే
వారొకేపట్టుగా పెద్దకేకలువేసి, వీని సిలువవేయుమని
24 అడుగగా వారి కేకలే గెలిచెను. । కాగా వారడిగి
25 నట్టే జరుగవలెనని పిలాతు తీర్పు తీర్చి । అల్లరి నిమిత్త
మును నరహత్య నిమిత్తమును చెరసాలలో వేయబడి
యుండినవానిని వారడిగినట్టు వారికి విడుదలచేసి,
యేసును వారికిష్టము వచ్చినట్టు చేయుటకు అప్ప
గించెను.

26 వారాయనను తీసికొనిపోవుచుండగా పల్లెటూరి
నుండి వచ్చుచున్న కురేనీయుడైన సీమోనను ఒకని
పట్టుకొని, యేసువెంట సిలువను మోయుటకు అతని
మీద దాని పెట్టిరి.

27 గొప్ప జనసమూహమును, ఆయననుగూర్చి రొమ్ము
కొట్టుకొనుచు దుఃఖించుచునున్న బహుమంది స్త్రీలును
28 ఆయనను వెంబడించిరి. । యేసు వారివైపు తిరిగి —
యెరూషలేము కుమార్తెలారా, నా నిమిత్తము ఏడ్వకుడి;
మీ నిమిత్తమును మీ పిల్లల నిమిత్తమును ఏడ్వుడి. ।
29 ఇదిగో—గొడ్రాండ్రును కనని గర్భములును పాలియ్యని
స్తనములును ధన్యములైనవని చెప్పు దినములు వచ్చు
చున్నవి. । అప్పుడు—మా మీద పడుడని పర్వతముల 30
తోను, మమ్ము కప్పుడని కొండలతోను జనులు చెప్ప
సాగుదురు. । వారు పచ్చిమ్రానుకే ఈలాగు చేసి 31
నప్పుడు ఎండినదానికేమి చేయుదురో అని చెప్పెను.

మరిద్దరు ఆయనతోకూడ చంపబడుటకు తేబడిరి; 32
వారు నేరము చేసినవారు.

వారు కపాలమనబడిన స్థలమునకు వచ్చినప్పుడు 33
అక్కడ కుడివైపున ఒకనిని ఎడమవైపున ఒకనిని ఆ
నేరస్థులను ఆయనతోకూడ సిలువవేసిరి. । యేసు — 34
తండ్రీ, వీరేమి చేయుచున్నారో వీరెరుగరు గనుక వీరిని
క్షమించుమని చెప్పెను. వారు ఆయన వస్త్రములు పంచు
కొనుటకై చీట్లు వేసిరి. । ప్రజలు నిలువబడి చూచు 35
చుండిరి; అధికారులును—వీడు ఇతరులను రక్షించెను;
వీడు దేవుడేర్పరచుకొనిన క్రీస్తు అయినయెడల తన్ను
తాను రక్షించుకొనునని అపహసించిరి. । అంతట 36
రాణువవారును ఆయనయొద్దకు వచ్చి ఆయనకు చిరక
నిచ్చి । —నీవు యూదుల రాజవైతే నిన్ను నీవే రక్షిం 37
చుకొనుమని ఆయనను అపహసించిరి. । — ఇతడు 38
యూదులరాజని పైవిలాసముకూడ ఆయనకు పైగా
వ్రాయబడెను.

వ్రేలాడవేయబడిన ఆ నేరస్థులలో ఒకడు ఆయ 39
నను దూషించుచు — నీవు క్రీస్తువుగదా? నిన్ను నీవు
రక్షించుకొనుము, మమ్మునుకూడ రక్షించుమని చెప్పెను. ।
అయితే రెండవవాడు వాని గద్దించి—నీవు అదే శిక్షా 40
విధిలో ఉన్నావు గనుక దేవునికి భయపడవా? । మన 41
కైతే ఇది న్యాయమే; మనము చేసినవాటికి తగిన
ఫలము పొందుచున్నాము గాని యీయన ఏ తప్పిత
మును చేయలేదని చెప్పి । ఆయనను చూచి—యేసూ, 42
నీవు నీ రాజ్యముతో[1] వచ్చునప్పుడు నన్ను జ్ఞాపకము
చేసికొనుమనెను. । అందుకాయన వానితో—నేడు 43
నీవు నాతోకూడ పరదైసులో ఉందువని నిశ్చయ
ముగా నీతో చెప్పుచున్నాననెను.

అప్పుడు రమారమి మధ్యాహ్నమాయెను. అది 44
మొదలుకొని మూడు గంటలవరకు ఆ దేశమంతటి
మీద చీకటి కమ్మెను; । సూర్యుడు అదృశ్యుడాయెను; 45
గర్భాలయపు తెర నడిమికి చినిగెను. । అప్పుడు యేసు 46
గొప్ప శబ్దముతో కేకవేసి — తండ్రీ, నీ చేతికి నా
ఆత్మను అప్పగించుకొనుచున్నాననెను. ఆయన ఈలాగు
చెప్పి ప్రాణము విడిచెను. । శతాధిపతి జరిగినది 47
చూచి — ఈ మనుష్యుడు నిజముగా నీతిమంతుడై
యుండెనని చెప్పి దేవుని మహిమపరచెను. । చూచు 48
టకై కూడివచ్చిన ప్రజలందరు జరిగిన కార్యములు
చూచి రొమ్ము కొట్టుకొనుచు తిరిగి వెళ్లిరి. । ఆయనకు 49
నెళవైనవారందరును, గలిలైయనుండి ఆయనను వెంబ

1 కొన్ని ప్రాచీనప్రతులలో—నీ రాజ్యములోనికి అని పాఠాంతరము.

డించిన స్త్రీలును దూరముగా నిలుచుండి వీటిని చూచు
చుండిరి.
50 అరిమతయియ అను యూదుల పట్టణపు సభికు
51 డైన యోసేపు అను ఒకడుండెను. । అతడు సజ్జను
డును నీతిమంతుడునై యుండి వారి ఆలోచనకును
వారు చేసిన పనికిని సమ్మతింపక దేవుని రాజ్యము
52 కొరకు కనిపెట్టుచుండినవాడు. । అతడు పిలాతు
నొద్దకు వెళ్లి, యేసు దేహము (తనకిమ్మని) అడుగుకొని ।
53 దానిని క్రిందికి దించి, సన్నపు నారబట్టతో చుట్టి,
తొలిచిన రాతి సమాధిలో ఉంచెను. అందులో ఎవ
54 డును అంతకు మునుపెప్పుడు ఉంచబడలేదు. । ఆ
దినము సిద్ధపరచుదినము; విశ్రాంతి దినారంభము
55 కావచ్చెను. । అప్పుడు గలిలైయనుండి ఆయనతో
కూడ వచ్చిన స్త్రీలు వెంట వెళ్లి ఆ సమాధిని, ఆయన
56 దేహము ఏలాగుంచబడెనో దానిని చూచి । తిరిగి వెళ్లి,
సుగంధ ద్రవ్యములను పరిమళతైలములను సిద్ధపరచి,
ఆజ్ఞచొప్పున విశ్రాంతిదినమున తీరికగా ఉండిరి.

**24** ఆదివారమున తెల్లవారగా తాము సిద్ధపరచిన
సుగంధద్రవ్యములను తీసికొని సమాధియొద్దకు వచ్చి।
2 సమాధిముందర ఉండిన రాయి దొరలింపబడి యుం
3 డుట చూచి లోపలికి వెళ్లిరి గాని । ప్రభువైన యేసు
4 దేహము వారికి కనబడలేదు. । ఇందునుగూర్చి వారి
కేమియు తోచకయుండగా, ప్రకాశమానమైన
వస్త్రములు ధరించిన యిద్దరు మనుష్యులు వారియొద్ద
5 నిలువబడిరి. । వారు భయపడి ముఖములు నేలను
మోపియుండగా వీరు—సజీవుడైనవానిని మీ రెందుకు
6 మృతులలో వెదకుచున్నారు? । ఆయన ఇక్కడ లేడు,
ఆయన లేచియున్నాడు; ఆయన ఇంక గలిలైయలో
7 ఉన్నప్పుడు । — మనుష్యకుమారుడు పాపిష్ఠులైన
మనుష్యులచేతికి అప్పగింపబడి, సిలువవేయబడి, మూ
డవ దినమందు లేవవలసియున్నదని ఆయన మీతో
చెప్పిన మాట జ్ఞాపకము చేసికొనుడని వారితో అనిరి.।
8 అప్పుడు వారాయన మాటలు జ్ఞాపకము చేసికొని ।
9 సమాధియొద్దనుండి తిరిగి వెళ్లి, యీ సంగతులన్నియు
పదకొండుగురు శిష్యులకును తక్కినవారికందరికిని
10 తెలియజేసిరి. । ఈ సంగతులు అపొస్తలులతో చెప్పిన
వారెవరనగా—మగ్దలేనే మరియయు యోహన్నయు
యాకోబు తల్లియైన మరియయు వారితోకూడ ఉన్న
11 యితర స్త్రీలును. । అయితే వారి మాటలు వీరి దృష్టికి
వెర్రిమాటలుగా కనబడెను గనుక వీరు వారి మాటలు
12 నమ్మలేదు. । అయితే పేతురు లేచి, సమాధియొద్దకు
పరుగెత్తిపోయి వంగిచూడగా, నారబట్టలు మాత్రము
విడిగా కనబడెను. అతడు జరిగినదానిని చూచి ఆశ్చ
ర్యపడుచు ఇంటికి వెళ్లెను.
13 ఆ దినమందే వారిలో ఇద్దరు యెరూషలేముకు
ఆమడ దూరమున ఉన్న ఎమ్మాయు అను ఒక గ్రామ
మునకు వెళ్లుచు । సంభవించిన ఈ సంగతులన్నిటిని 14
గూర్చి యొకనితోనొకడు సంభాషించుచుండిరి. ।
వారు సంభాషించుచు ఆలోచించుకొనుచుండగా, 15
యేసు తానే దగ్గరకు వచ్చి వారితోకూడ నడిచెను; ।
అయితే వారాయనను గుర్తుపట్టలేకుండ వారి కన్నులు 16
మూయబడెను. । ఆయన—మీరు నడుచుచు ఒకనితో 17
ఒకడు చెప్పుకొనుచున్న యీ మాట లేమని అడు
గగా వారు దుఃఖముఖులై నిలిచిరి. । వారిలో క్లెయొప 18
అను ఒకడు — యెరూషలేములో బసచేయుచుండి
యీ దినములలో అక్కడ జరిగిన సంగతులు నీవొక
డవే యెరుగవా అని ఆయనను అడిగెను. । ఆయన— 19
అవి ఏవని వారిని అడిగినప్పుడు వారు — నజరేయు
డైన యేసునుగూర్చిన సంగతులే; ఆయన దేవునియెదు
టను ప్రజలందరియెదుటను క్రియలోను వాక్యము
లోను శక్తిగల ప్రవక్తయై యుండెను. । మన ప్రధాన 20
యాజకులును అధికారులును ఆయనను ఏలాగు మరణ
శిక్షకు అప్పగించి ఆయనను సిలువవేయించిరో నీకు
తెలియదా? । ఇశ్రాయేలును విమోచింపబోవువాడు 21
ఈయనే అని మేము నిరీక్షించియుంటిమి; ఇదియు
గాక యీ సంగతులు జరిగి నేటికి మూడు దినము
లాయెను. । అయితే మాలో కొందరు స్త్రీలు తెల్ల 22
వారగానే సమాధియొద్దకు వెళ్లి, ఆయన దేహమును
కానక వచ్చి । —కొందరు దేవదూతలు తమకు కనబడి 23
ఆయన బ్రదికియున్నాడని చెప్పిరని మాతో చెప్పి
మాకు విస్మయము కలుగజేసిరి. । మాతోకూడ నున్న 24
వారిలో కొందరు సమాధియొద్దకు వెళ్లి ఆ స్త్రీలు చెప్పి
నట్టు కనుగొనిరి గాని, ఆయనను చూడలేదని ఆయ
నతో చెప్పిరి. । అందుకాయన — అవివేకులారా, 25
ప్రవక్తలు చెప్పిన మాటలన్నియు నమ్మని మందమతు
లారా, । క్రీస్తు ఈలాగు శ్రమపడి తన మహిమలో 26
ప్రవేశించుట అగత్యము కాదా అని వారితో చెప్పి ।
మోషేయు సమస్త ప్రవక్తలును మొదలుకొని లేఖన 27
ములన్నిటిలో తన్నుగూర్చిన వచనముల భావము వారికి
తెలిపెను. । ఇంతలో తాము వెళ్లుచున్న గ్రామము 28
దగ్గరకు వచ్చినప్పుడు ఆయన ఇంక కొంతదూరము
వెళ్లునట్లు అగుపడగా । వారు — సాయంకాలము 29
కావచ్చినది, ప్రొద్దుగ్రుంకినది, మాతోకూడ ఉండు
మని చెప్పి, ఆయనను బలవంతముచేసిరి గనుక ఆయన
వారితోకూడ ఉండుటకు లోపలికి వెళ్లెను. । ఆయన 30
వారితోకూడ భోజనమునకు కూర్చున్నప్పుడు, ఒక
రొట్టెను పట్టుకొని స్తోత్రముచేసి దాని విరిచి వారికి
పంచిపెట్టగా । వారి కన్నులు తెరవబడి ఆయనను 31
గుర్తుపట్టిరి; అంతట ఆయన వారికి అదృశ్యుడాయె
ను. । అప్పుడు వారు — ఆయన త్రోవలో మనతో 32
మాటలాడుచు లేఖనములను మనకు బోధపరచుచున్న
ప్పుడు మన హృదయము మనలో మండుచుండలేదా

అని యొకనితో ఒకడు చెప్పుకొనిరి. । ఆ గడియ
లోనే వారు లేచి యెరూషలేముకు తిరిగి వెళ్లగా,
పదకొండుగురు శిష్యులును వారితోకూడ ఉన్నవా
రును కూడివచ్చి ।—ప్రభువు నిజముగా లేచి సీమోనుకు
కనబడెనని చెప్పుకొనుచుండిరి. వారది విని । త్రోవలో
జరిగిన సంగతులును, ఆయన రొట్టె విరుచుటవలన
తమకేలాగు తెలియబడెనో అదియు తెలియజేసిరి.

వారు ఈలాగు మాటలాడుచుండగా ఆయన వారి
మధ్యను నిలిచి—మీకు సమాధానమవుగాకని వారితో
అనెను. । అయితే వారు దిగులుపడి భయాక్రాం
తులై, భూతము[1] తమకు కనబడెనని తలంచిరి. । అప్పు
డాయన — మీరెందుకు కలవరపడుచున్నారు? మీ
హృదయములలో సందేహములు పుట్టనేల? । నేనే
ఆయనను అనుటకు నా చేతులను నా పాదములను
చూడుడి; నన్ను పట్టి చూడుడి, నాకున్నట్టుగా మీరు
చూచుచున్న యెముకలును మాంసమును భూతమున
కుండవని చెప్పి । తన చేతులను పాదములను వారికి
చూపెను. । అయితే వారు సంతోషముచేత ఇంక
నమ్మక ఆశ్చర్యపడుచుండగా ఆయన—ఇక్కడ మీ
యొద్ద ఏమైన ఆహారము కలదా అని వారినడిగెను. ।
వారు కాల్చిన చేపముక్కను ఆయన కిచ్చిరి. ।
ఆయన దాని తీసికొని వారియెదుట భుజించెను.

అంతట ఆయన—మోషే ధర్మశాస్త్రములోను ప్రవక్తల 44
గ్రంథములలోను కీర్తనలలోను నన్నుగూర్చి వ్రాయ
బడినవన్నియు నెరవేరవలెనని నేను మీయొద్ద ఉండి
నప్పుడు మీతో చెప్పిన మాటలు నెరవేరినవని వారితో
చెప్పెను. । అప్పుడు వారు లేఖనములు గ్రహించు 45
నట్లుగా ఆయన వారి మనస్సును తెరచి । — క్రీస్తు 46
శ్రమపడి మూడవ దినమున మృతులలోనుండి లేచు
ననియు । యెరూషలేము మొదలుకొని సమస్త జన 47
ములలో ఆయన పేరట మారుమనస్సును పాపక్షమా
పణయు ప్రకటింపబడుననియు వ్రాయబడియున్నది. ।
ఈ సంగతులకు మీరే సాక్షులు. । ఇదిగో నా తండ్రి 48
వాగ్దానము చేసినది మీ మీదికి పంపుచున్నాను; 49
మీరు పైనుండి శక్తి పొందువరకు పట్టణములో నిలిచి
యుండుడని వారితో చెప్పెను.

తరువాత ఆయన బేతనియవరకు వారిని తీసికొని 50
పోయి చేతులెత్తి వారిని ఆశీర్వదించెను. । వారిని ఆశీర్వ 51
దించుచుండగా ఆయన వారిలోనుండి ప్రత్యేకింపబడి
పరలోకమునకు ఆరోహణుడాయెను. । వారు ఆయ 52
నకు నమస్కారముచేసి మహా ఆనందముతో యెరూ
షలేముకు తిరిగి వెళ్లి । యెడతెగక దేవాలయములో 53
ఉండి దేవుని స్తోత్రము చేయుచుండిరి.

1 గ్రీకుభాషలో—ఆత్మ.

# యోహాను సువార్త

1 ఆదియందు వాక్యముండెను, వాక్యము దేవుని
యొద్ద ఉండెను, వాక్యము దేవుడై యుండెను. ।
2 ఆయన ఆదియందు దేవునియొద్ద ఉండెను. సమస్తమును
3 ఆయన మూలముగా కలిగెను, । కలిగియున్న దేదియు
4 ఆయన లేకుండ కలుగలేదు. । ఆయనలో జీవముం
డెను; ఆ జీవము మనుష్యులకు వెలుగై యుండెను. ।
5 ఆ వెలుగు చీకటిలో ప్రకాశించుచున్నది గాని చీకటి
దాని గ్రహింపకుండెను.
6 దేవునియొద్దనుండి పంపబడిన యొక మనుష్యుడుం
7 డెను; అతని పేరు యోహాను. । అతని మూలముగా
అందరు విశ్వసించునట్లు అతడు ఆ వెలుగునుగూర్చి
8 సాక్ష్యమిచ్చుటకు సాక్షిగా వచ్చెను. । అతడు ఆ
వెలుగై యుండలేదు గాని ఆ వెలుగునుగూర్చి సాక్ష్య
9 మిచ్చుటకు అతడు వచ్చెను. । నిజమైన వెలుగుండెను;
అది లోకములోకి వచ్చుచు ప్రతి మనుష్యుని వెలి
10 గించుచున్నది. । ఆయన లోకములో ఉండెను; లోక
మాయన మూలముగా కలిగెను గాని లోకమాయనను
11 తెలిసికొనలేదు. । ఆయన తన స్వకీయులయొద్దకు
వచ్చెను; ఆయన స్వకీయులు ఆయనను అంగీకరింప
12 లేదు. । తన్ను ఎందరంగీకరించిరో వారికందరికి, అనగా
తన నామమునందు విశ్వాసముంచినవారికి, దేవుని
పిల్లలగుటకు ఆయన అధికారము అనుగ్రహించెను. ।
13 వారు దేవునివలన పుట్టినవారే గాని, రక్తమువలన
నైనను శరీరేచ్ఛవలననైనను మానుష్యేచ్ఛవలననైనను
14 పుట్టినవారు కారు. । ఆ వాక్యము శరీరధారియై, కృపా
సత్య సంపూర్ణుడుగా మనమధ్య నివసించెను; తండ్రి
వలన కలిగిన అద్వితీయకుమారుని[1] మహిమవలె మనము
15 ఆయన మహిమను కనుగొంటిమి. । యోహాను ఆయ
ననుగూర్చి సాక్ష్యమిచ్చుచు—నా వెనుక వచ్చువాడు
నాకంటె ప్రముఖుడు గనుక ఆయన నాకంటె ముం
దటివాడాయెననియు, నేను చెప్పినవాడు ఈయనే
16 యనియు యెలుగెత్తి చెప్పెను. । ఆయన పరిపూర్ణత
లోనుండి మనమందరము కృప వెంబడి కృపను పొంది
17 తిమి. । ధర్మశాస్త్రము మోషేద్వారా అనుగ్రహింప
బడెను; కృపయు సత్యమును యేసుక్రీస్తు ద్వారా
18 కలిగెను. । ఎవడును ఎప్పుడైనను దేవుని చూడలేదు;
తండ్రి రొమ్ముననున్న అద్వితీయకుమారుడే[2] ఆయనను
బయలుపరచెను.
19 —నీవెవడవని అడుగుటకు యూదులు యెరూష
లేమునుండి యాజకులను లేవీయులను యోహాను
నొద్దకు పంపినప్పుడు అతడిచ్చిన సాక్ష్యమిదే. । అతడు 20
ఎరుగననక ఒప్పుకొనెను;—క్రీస్తును[3] కానని యొప్పు
కొనెను. । కాగా వారు—మరి నీవెవడవు, నీవు ఏలీ 21
యావా అని అడుగగా అతడు—కాననెను. । —నీవు 22
ఆ ప్రవక్తవా అని అడుగగా—కానని ఉత్తరమిచ్చెను.
కాబట్టి వారు—నీవెవడవు? మమ్ము పంపినవారికి మేము
ఉత్తరమియ్యవలెను గనుక నిన్నుగూర్చి నీవేమి చెప్పు
కొనుచున్నావని అతని నడిగిరి. । అందుకతడు — 23
ప్రవక్తయైన యెషయా[4] చెప్పినట్టు నేను

ప్రభువు త్రోవ సరాళముచేయుడి అని అరణ్య
ములో ఎలుగెత్తి చెప్పు ఒకని శబ్దము

అని చెప్పెను. । పంపబడినవారు పరిసయ్యుల 24
వారు. । వారు — నీవు క్రీస్తువైనను ఏలీయావైనను 25
ఆ ప్రవక్తవైనను కాకుండినయెడల ఎందుకు బాప్తిస్మ
మిచ్చుచున్నావని అతనిని అడుగగా । యోహాను— 26
నేను నీళ్లలో[5] బాప్తిస్మమిచ్చుచున్నాను గాని నా 27
వెనుక వచ్చుచున్నవాడు మీ మధ్య ఉన్నాడు;
మీరాయన నెరుగరు, ఆయన చెప్పులవారును విప్పుట
కైనను నేను యోగ్యుడను కానని వారితో చెప్పెను. ।
యోహాను బాప్తిస్మమిచ్చుచున్న యొర్దానునదికి అవల 28
నున్న బేతనియలో ఈ సంగతులు జరిగెను.
మరునాడు యోహాను యేసు తనయొద్దకు రాగా 29
చూచి — ఇదిగో లోకపాపమును మోసికొనిపోవు
దేవుని గొఱ్ఱెపిల్ల. । నా వెనుక ఒక మనుష్యుడు 30
వచ్చుచున్నాడు; ఆయన నాకంటె ప్రముఖుడు గనుక
నాకంటె ముందటివాడాయెనని నేనెవనిగూర్చి చెప్పి
తినో ఆయనే యీయన. । నేను ఆయనను ఎరుగ 31
నైతిని గాని ఆయన ఇశ్రాయేలుకు ప్రత్యక్షమగుటకు
నేను నీళ్లలో[5] బాప్తిస్మమిచ్చుచు వచ్చితినని చెప్పెను. ।
మరియు యోహాను సాక్ష్యమిచ్చుచు — ఆత్మ పావు 32
రమువలె ఆకాశమునుండి దిగివచ్చుట చూచితిని; ఆ
ఆత్మ ఆయనమీద నిలిచెను. । నేను ఆయనను ఎరుగ 33
నైతిని గాని నీళ్లలో[5] బాప్తిస్మమిచ్చుటకు నన్ను పంపిన
వాడు—నీవెవనిమీద ఆత్మ దిగి వచ్చి నిలుచుట చూ
తువో ఆయనే పరిశుద్ధాత్మలో[6] బాప్తిస్మమిచ్చువాడని
నాతో చెప్పెను. । ఈయనే దేవుని కుమారుడని నేను 34
తెలిసికొని సాక్ష్యమిచ్చితిననెను.
మరునాడు మరల యోహానును అతని శిష్యులలో 35

1 లేక, జనితైకకుమారుని 2 లేక, జనితైకకుమారుడే. అనేక ప్రాచీనప్రతులలో—అద్వితీయ దేవుడే అని పాఠాంతరము. 3 క్రీస్తు అను [illegible] ...క్తుడని అర్థము. 4 యెషయా, 40: 3. 5 లేక, నీళ్లతో. 6 లేక, పరిశుద్ధాత్మతో.

36 ఇద్దరును నిలుచుండగా । అతడు నడుచుచున్న యేసు
వైపు చూచి—ఇదిగో దేవుని గొఱ్ఱెపిల్ల అని చెప్పెను. ।
37 అతడు చెప్పిన మాట ఆ యిద్దరు శిష్యులు విని యేసును
38 వెంబడించిరి. । యేసు వెనుకకు తిరిగి వారు తన్ను
వెంబడించుట చూచి — మీరేమి వెదకుచున్నారని
వారినడుగగా వారు — రబ్బీ, నీవు ఎక్కడ కాపుర
మున్నావని ఆయనను అడిగిరి. రబ్బియను మాటకు
39 బోధకుడని అర్థము. । — వచ్చి చూడుడని ఆయన
వారితో చెప్పగా వారు వెళ్లి, ఆయన కాపురమున్న
స్థలము చూచి ఆ దినమున ఆయనయొద్ద బసచేసిరి.
అప్పుడు పగలు రమారమి నాలుగు గంటల వేళ
40 ఆయెను. । యోహాను మాట విని ఆయనను వెంబ
డించిన యిద్దరిలో ఒకడు సీమోను పేతురుయొక్క
41 సహోదరుడైన అంద్రెయ. । ఇతడు మొదట తన
సహోదరుడైన సీమోనును చూచి — మేము మెస్సీ
42 యను కనుగొంటిమని అతనితో చెప్పి । యేసునొద్దకు
అతని తోడుకొనివచ్చెను. మెస్సీయ అను మాటకు
అభిషిక్తుడని[1] అర్థము. యేసు అతనివైపు చూచి —
నీవు యోహాను కుమారుడవైన సీమోనువు; నీవు కేఫా
అనబడుదువని చెప్పెను. కేఫా అను మాటకు రాయి
అని అర్థము.

43 మరునాడు ఆయన గలిలయకు వెళ్లగోరి ఫిలిప్పును
కనుగొని—నన్ను వెంబడించుమని అతనితో చెప్పెను. ।
44 ఫిలిప్పు బేత్సయిదావాడు, అనగా అంద్రెయ పేతురు
45 అనువారి పట్టణపు కాపురస్థుడు. । ఫిలిప్పు నతనయే
లును కనుగొని — ధర్మశాస్త్రములో మోషేయు ప్రవక్త
లును ఎవనిగూర్చి వ్రాసిరో ఆయనను కనుగొంటిమి;
ఆయన యోసేపు కుమారుడైన నజరేయుడగు యేసు[2]
46 అని అతనితో చెప్పెను. । అందుకు నతనయేలు—నజ
రేతులోనుండి మంచిదేదైన రాగలదా అని అతని నడు
గగా—వచ్చి చూడుమని ఫిలిప్పు అతనితో అనెను. ।
47 యేసు నతనయేలు తనయొద్దకు వచ్చుట చూచి —
ఇదిగో యితడు నిజముగా ఇశ్రాయేలీయుడు, ఇతని
యందు ఏ కపటమును లేదని అతనిగూర్చి చెప్పెను. ।
48 —నన్ను నీవు ఏలాగు ఎరుగుదువని నతనయేలు ఆయ
నను అడుగగా యేసు — ఫిలిప్పు నిన్ను పిలువక
మునుపే, నీవు ఆ అంజూరపు చెట్టుక్రింద ఉన్నప్పుడు
49 నిన్ను చూచితినని అతనితో చెప్పెను. । నతనయేలు
—బోధకుడా, నీవు దేవుని కుమారుడవు, ఇశ్రాయేలు
50 రాజవు అని ఆయనకు ఉత్తరమిచ్చెను. । అందుకు
యేసు—ఆ అంజూరపు చెట్టుక్రింద నిన్ను చూచితినని
నేను చెప్పినందువలన నీవు నమ్ముచున్నావా? వీటికంటె
గొప్పకార్యములు చూతువని అతనితో చెప్పెను. ।
51 మరియు ఆయన—మీరు ఆకాశము తెరవబడుటయు,
దేవుని దూతలు మనుష్యకుమారునిపైగా ఎక్కుట
యును దిగుటయును చూతురని మీతో నిశ్చయ
ముగా చెప్పుచున్నాననెను.

మూడవ దినమున గలిలైయలోని కానా అను 2
ఊరిలో ఒక వివాహము జరిగెను. । యేసు తల్లి 2
అక్కడ ఉండెను; యేసును ఆయన శిష్యులును ఆ
వివాహమునకు పిలువబడిరి. । ద్రాక్షారసమైపోయి 3
నప్పుడు యేసు తల్లి — వారికి ద్రాక్షారసము లేదని
ఆయనతో చెప్పగా । యేసు ఆమెతో—అమ్మా, నీతో 4
నాకేమి (పని)? నా సమయమింక రాలేదనెను. ।
ఆయన తల్లి పరిచారకులను చూచి—ఆయన మీతో 5
చెప్పునది చేయుడనెను. । యూదుల శుద్ధీకరణాచార 6
ప్రకారము రెండేసి మూడేసి తూములు పట్టు ఆరు
రాతిబానలు అక్కడ ఉంచబడియుండెను.। యేసు—ఆ 7
బానలు నీళ్లతో నింపుడని వారితో చెప్పగా వారు
వాటిని అంచులమట్టుకు నింపిరి. । అప్పుడాయన వారి 8
తో—మీరిప్పుడు ముంచి, విందు ప్రధానియొద్దకు
తీసికొనిపొండని చెప్పగా వారు తీసికొనిపోయిరి. ।
ఆ ద్రాక్షారసము ఎక్కడనుండి వచ్చెనో ఆ నీళ్లు 9
ముంచి తీసికొనిపోయిన పరిచారకులకే తెలిసినదిగాని
విందు ప్రధానికి తెలియకపోయెను గనుక ద్రాక్షా
రసమైన ఆ నీళ్లు రుచిచూచినప్పుడు ఆ విందు ప్రధాని
పెండ్లికుమారుని పిలిచి । — ప్రతివాడును మొదట 10
మంచి ద్రాక్షారసమును పోసి, జనులు మత్తుగా ఉన్న
ప్పుడు జబ్బురసము పోయును; నీవైతే ఇదివరకును
మంచి ద్రాక్షారసమును ఉంచుకొని యున్నావని
అతనితో చెప్పెను. । గలిలైయలోని కానాలో యేసు 11
ఈ మొదటి సూచకక్రియనుచేసి తన మహిమను
బయలుపరిచెను; అందువలన ఆయన శిష్యులు ఆయన
యందు విశ్వాసముంచిరి.

అటుతరువాత ఆయనయు ఆయన తల్లియు ఆయన 12
సహోదరులును ఆయన శిష్యులును కపెర్నహూ
మునకు వెళ్లి అక్కడ కొన్ని దినములుండిరి.

యూదుల పస్కాపండుగ సమీపింపగా యేసు 13
యెరూషలేమునకు వెళ్లి । దేవాలయములో ఎడ్లను గొఱ్ఱె 14
లను పావురములను అమ్మువారును రూకలు మార్చు
వారును కూర్చుండుట చూచి । త్రాళ్లతో కొరడాలు 15
చేసి, గొఱ్ఱెలను ఎడ్లనన్నిటిని దేవాలయములోనుండి
తోలివేసి, రూకలు మార్చువారి రూకలు చల్లివేసి,
వారి బల్లలు పడద్రోసి । పావురములు అమ్మువారితో 16
—వీటిని ఇక్కడనుండి తీసికొనిపొండి; నా తండ్రి
యిల్లు వ్యాపారపుటిల్లుగా చేయకుడని చెప్పెను. ।
ఆయన శిష్యులు— 17

నీ యింటినిగూర్చిన ఆసక్తి నన్ను భక్షించునని[3]
వ్రాయబడియున్నట్టు జ్ఞాపకము చేసికొనిరి. । కాబట్టి 18
యూదులు — నీవీ కార్యములు చేయుచున్నావే;

[1] మూలభాషలో—క్రీస్తు. [2] యేసు అను శబ్దమునకు రక్షకుడని అర్థము. [3] కీర్తన, 69: 9.

యే సూచకక్రియను మాకు చూపెదవని ఆయనను
19 అడుగగా । యేసు—ఈ దేవాలయమును పడగొట్టుడి,
మూడు దినములలో దాని లేపుదునని వారితో
20 చెప్పెను. । యూదులు—ఈ దేవాలయము నలుబది
యారు సంవత్సరములు కట్టిరే, నీవు మూడు దినము
21 లలో దాని లేపుదువా అనిరి. । అయితే ఆయన తన
శరీరమను దేవాలయమునుగూర్చి యీ మాట చెప్పెను. ।
22 ఆయన మృతులలోనుండి లేచిన తరువాత ఆయన ఈ
మాట చెప్పెనని ఆయన శిష్యులు జ్ఞాపకము చేసికొని,
లేఖనమును యేసు చెప్పిన మాటను నమ్మిరి.
23 ఆయన పస్కా (పండుగ) సమయమున యెరూష
లేములో ఉండగా, ఆ పండుగలో అనేకులు ఆయన
చేసిన సూచకక్రియలను చూచి ఆయన నామమందు
24 విశ్వాసముంచిరి. । అయితే యేసు అందరిని ఎరిగిన
వాడు గనుక ఆయన తన్ను వారి వశము చేసికొన
లేదు. ఆయన మనుష్యుని ఆంతర్యమును ఎరిగిన
25 వాడు । గనుక ఎవడును మనుష్యునిగూర్చి ఆయనకు
సాక్ష్యమియ్య నక్కరలేదు.

3 యూదుల అధికారియైన నికొదేమను పరిసయ్యు
2 డొకడుండెను. । అతడు రాత్రియందు ఆయనయొద్దకు
వచ్చి—బోధకుడా, నీవు దేవునియొద్దనుండి వచ్చిన
బోధకుడవని మేమెరుగుదుము; దేవుడతనికి తోడై
యుంటేనే కాని నీవు చేయుచున్న సూచకక్రియ
3 లను ఎవడును చేయలేడని ఆయనతో చెప్పెను. । అం
దుకు యేసు అతనితో — ఒకడు క్రొత్తగా[1] జన్మించి
తేనే కాని అతడు దేవునిరాజ్యమును చూడలేడని
4 నీతో నిశ్చయముగా చెప్పుచున్నాననెను. । అందుకు
నికొదేము — ముసలివాడైన మనుష్యుడేలాగు జన్మింప
గలడు? రెండవమారు తల్లి గర్భమందు ప్రవేశించి
5 జన్మింపగలడా అని ఆయనను అడుగగా । యేసు ఇట్ల
నెను—ఒకడు నీటిమూలముగాను ఆత్మమూలముగాను
జన్మించితేనే కాని దేవునిరాజ్యములో ప్రవేశింపలేడని
6 నీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. । శరీరమూల
ముగా జన్మించినది శరీరమును ఆత్మమూలముగా జన్మించి
7 నది ఆత్మయునై యున్నది. । మీరు క్రొత్తగా జన్మింప
వలెనని నేను నీతో చెప్పినందుకు ఆశ్చర్యపడవద్దు. ।
8 గాలి తన కిష్టమైన చోటను విసురును; నీవు దాని
శబ్దము విందువే గాని అది ఎక్కడనుండి వచ్చునో
యెక్కడికి పోవునో నీకు తెలియదు. ఆత్మమూలముగా
జన్మించిన ప్రతివాడును ఆలాగే యున్నాడనెను. ।
9 అందుకు నికొదేము—ఈ సంగతులేలాగు సాధ్యము
10 లని ఆయనను అడుగగా । యేసు ఇట్లనెను — నీవు
ఇశ్రాయేలుకు బోధకుడవై యుండి వీటిని ఎరుగవా? ।
11 మేము ఎరిగిన సంగతియే చెప్పుచున్నాము, చూచిన
దానికే సాక్ష్యమిచ్చుచున్నాము, మా సాక్ష్యము మీ
రంగీకరింపరని నీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. ।
భూసంబంధమైన సంగతులు నేను మీతో చెప్పితే 12
మీరు నమ్మకున్నప్పుడు, పరలోకసంబంధమైనవి
మీతో చెప్పినయెడల ఏలాగు నమ్ముదురు? । మరియు 13
పరలోకమునుండి దిగివచ్చినవాడే, అనగా పరలోక
ములో ఉండు[2] మనుష్యకుమారుడే తప్ప పరలోకము
నకు ఎక్కిపోయినవాడెవడును లేడు. । అరణ్యములో 14
మోషే సర్పమును ఏలాగు ఎత్తెనో ఆలాగే విశ్వసించు 15
ప్రతివాడును నశింపక ఆయన ద్వారా నిత్యజీవము
పొందునట్లు మనుష్యకుమారుడు ఎత్తబడవలెను.
దేవుడు లోకమును ఎంతో ప్రేమించెను. కాగా 16
ఆయన తన అద్వితీయకుమారుడుగా[3] పుట్టిన వాని
యందు విశ్వాసముంచు ప్రతివాడును నశింపక నిత్య
జీవము పొందునట్లు ఆయనను అనుగ్రహించెను. ।
లోకము తన కుమారుని ద్వారా రక్షణ పొందుటకే 17
గాని లోకమునకు తీర్పు తీర్చుటకు దేవుడాయనను
లోకములోకి పంపలేదు. । ఆయనయందు విశ్వాస 18
ముంచువానికి తీర్పు తీర్చబడదు; విశ్వసింపనివాడు
దేవుని అద్వితీయకుమారుని నామమందు విశ్వాస
ముంచలేదు గనుక వానికి ఇంతకు మునుపే తీర్పు
తీర్చబడెను. । ఆ తీర్పు ఇదే; వెలుగు లోకములోకి 19
వచ్చెను గాని తమ క్రియలు చెడ్డవైనందున మనుష్యులు
వెలుగును ప్రేమింపక చీకటినే ప్రేమించిరి. । దుష్కా 20
ర్యముచేయు[4] ప్రతివాడు వెలుగును ద్వేషించును,
తన క్రియలు దుష్క్రియలుగా కనబడకుండునట్లు[5]
వెలుగునొద్దకు రాడు. । సత్యవర్తనుడైతే తన క్రియలు 21
దేవుని మూలముగా చేయబడియున్నవని ప్రత్యక్ష
పరచబడునట్లు వెలుగునొద్దకు వచ్చుననెను.
అటుతరువాత యేసు తన శిష్యులతోకూడ యూ 22
దైయదేశమునకు వచ్చి, అక్కడ వారితో కాలము
గడుపుచు బాప్తిస్మమిచ్చుచుండెను. । సలీము దగ్గర 23
నున్న ఐనోనను స్థలమున నీళ్లు విస్తారముగా ఉండెను
గనుక యోహానుకూడ అక్కడ బాప్తిస్మమిచ్చుచుం
డెను; జనులు వచ్చి బాప్తిస్మము పొందిరి. । యోహాను 24
ఇంక చెరసాలలో వేయబడియుండలేదు. । శుద్ధీకరణా 25
చారమునుగూర్చి యోహాను శిష్యులకు ఒక యూదు
నితో వివాదము పుట్టెను । గనుక వారు యోహాను 26
నొద్దకు వచ్చి—బోధకుడా, యెవడు యొర్దానుకు అవ
తల నీతోకూడ ఉండెనో, నీవెవనిగూర్చి సాక్ష్యమిచ్చి
తివో, యిదిగో ఆయన బాప్తిస్మమిచ్చుచున్నాడు;
అందరు ఆయనయొద్దకు వచ్చుచున్నారని అతనితో
చెప్పిరి. । అందుకు యోహాను ఇట్లనెను — తనకు 27
పరలోకమునుండి అనుగ్రహింపబడితేనేగాని యెవ

1 లేక, పైనుండి. 2 అనేక ప్రాచీనప్రతులలో—పరలోకములోనుండు అను మాట విడిచిపెట్టబడియున్నది. 3 లేక, అనితైకకుమారుడుగా.
4 లేక, అభ్యసించు. 5 మూలభాషలో—తన క్రియలు గద్దింపబడకుండునట్లు.

డును ఏమియు పొందనేరడు. । నేను క్రీస్తును కాన
నియు, ఆయనకంటె ముందుగా పంపబడినవాడనే
అనియు చెప్పినట్టు మీరే నాకు సాక్షులు. । పెండ్లి
కుమార్తెగలవాడు పెండ్లికుమారుడు; అయితే నిలువ
బడి పెండ్లికుమారుని స్వరము వినెడి స్నేహితుడు ఆ
పెండ్లికుమారుని స్వరము విని మిక్కిలి సంతోషించును;
ఈ నా సంతోషము పరిపూర్ణమైయున్నది. । ఆయన
హెచ్చవలసియున్నది నేను తగ్గవలసియున్నది.

పైనుండి వచ్చువాడు అందరికి పైనున్నవాడు;
భూమినుండి వచ్చువాడు భూసంబంధియై భూసంబంధ
మైన సంగతులనుగూర్చి మాటలాడును; పరలోకము
నుండి వచ్చువాడు అందరికి పైగానుండి । తాను
కన్నవాటినిగూర్చియు విన్నవాటినిగూర్చియు సాక్ష్య
మిచ్చును; ఆయన సాక్ష్యము ఎవడును అంగీకరిం
పడు. । ఆయన సాక్ష్యము అంగీకరించినవాడు దేవుడు
సత్యవంతుడను మాటకు ముద్ర వేసియున్నాడు. ఏల
యనగా దేవుడు తాను పంపినవానికి కొలతలేకుండ
ఆత్మ ననుగ్రహించును గనుక ఆయన దేవుని మాటలే
పలుకును. । తండ్రి కుమారుని ప్రేమించుచున్నాడు
గనుక ఆయనచేతికి సమస్తము అప్పగించి యున్నాడు. ।
కుమారునియందు విశ్వాసముంచువాడే నిత్యజీవము
గలవాడు; కుమారునికి విధేయుడు కానివాడు జీవము
చూడడు గాని దేవుని ఉగ్రత వానిమీద నిలిచి
యుండును.

యోహానుకంటె యేసు ఎక్కువమందిని శిష్యుల
నుగా చేసికొని వారికి బాప్తిస్మమిచ్చుచున్న సంగతి
పరిసయ్యులు వినిరని ప్రభువుకు తెలిసినప్పుడు । ఆయన
యూదయదేశమును విడిచి గలిలైయదేశమునకు తిరిగి
వెళ్లెను. । అయినను యేసే బాప్తిస్మమియ్యలేదుగాని
ఆయన శిష్యులిచ్చుచుండిరి. । ఆయన సమరైయమార్గ
మున వెళ్లవలసివచ్చెను గనుక । యాకోబు తన కుమారు
డైన యోసేపుకిచ్చిన భూమి దగ్గరనున్న సమరైయ
లోని సుఖారను ఒక ఊరికి వచ్చెను. । అక్కడ
యాకోబు బావి యుండెను గనుక యేసు ప్రయా
ణమువలన అలసియున్న రీతినే ఆ బావియొద్ద కూర్చుం
డెను; అప్పటికి ఇంచుమించు ఆరుగంటలాయెను. ।
సమరైయ స్త్రీ యొకతె నీళ్లు చేదుకొనుటకు అక్కడికి
రాగా యేసు—నాకు దాహమునకిమ్మని ఆమెనడిగెను. ।
ఆయన శిష్యులు ఆహారము కొనుటకు ఊరిలోకి వెళ్లి
యుండిరి. । ఆ సమరైయ స్త్రీ—యూదుడవైన నీవు
సమరైయ స్త్రీనైన నన్ను దాహమునకిమ్మని యేలాగు
అడుగుచున్నావని ఆయనతో చెప్పెను. ఏలయనగా
యూదులు సమరైయులతో సాంగత్యము చేయరు. ।
అందుకు యేసు—నీవు దేవుని వరమును—నాకు దాహ
మునకిమ్మని నిన్ను అడుగుచున్నవాడెవడో అదియు
ఎరిగియుంటే నీవు ఆయనను అడుగుదువు, ఆయన
నీకు జీవజలమిచ్చునని ఆమెతో చెప్పెను. । అప్పుడా 11
స్త్రీ—అయ్యా, యీ బావి లోతైనది, చేదుకొను
టకు నీకేమియు లేదే; ఆ జీవజలము ఏలాగు నీకు
దొరకును? । తన కుమాళ్లతోను పశ్వాదులతోను తాను 12
కూడ దీని నీళ్లు త్రాగి యీ బావి మాకిచ్చిన మన
తండ్రియైన యాకోబుకంటె నీవు గొప్పవాడవా అని
ఆయనను అడిగెను. । అందుకు యేసు—ఈ నీళ్లు 13
త్రాగు ప్రతివాడును మరల దప్పిగొనును; । నేనిచ్చు 14
నీళ్లు త్రాగువాడెప్పుడును దప్పిగొనడు; నేను వాని
కిచ్చు నీళ్లు నిత్యజీవము కలుగుటకై వానిలో ఊరెడి
నీటిబుగ్గగా ఉండునని ఆమెతో చెప్పెను. । ఆ స్త్రీ 15
ఆయనను చూచి—అయ్యా, నేను దప్పిగొనకుండు
నట్లును, చేదుకొనుట కింతదూరము రాకుండునట్లును
ఆ నీళ్లు నాకు దయచేయుమని అడుగగా । యేసు— 16
నీవు వెళ్లి నీ పెనిమిటిని పిలుచుకొని యిక్కడికి రమ్మని
ఆమెతో చెప్పెను. । ఆ స్త్రీ—నాకు పెనిమిటి లేడనగా, 17
యేసు ఆమెతో—నాకు పెనిమిటి లేడని నీవు చెప్పిన
మాట సరియే; । నీకు అయిదుగురు పెనిమిట్లుండిరి, 18
ఇప్పుడు నీ కున్నవాడు నీ పెనిమిటి కాడు; సత్యమే
చెప్పితివనెను. । అప్పుడా స్త్రీ—అయ్యా, నీవు ప్రవక్త 19
వని గ్రహించుచున్నాను. । మా పితరులు ఈ పర్వత 20
మందు ఆరాధించిరి గాని ఆరాధింపవలసిన స్థలము
యెరూషలేములో ఉన్నదని మీరు చెప్పుదురని ఆయ
నతో అనగా యేసు ఆమెతో ఇట్లనెను । —అమ్మా, 21
ఒక కాలము వచ్చుచున్నది; ఆ కాలమందు ఈ పర్వత
ములోనైనను యెరూషలేములోనైనను మీరు తండ్రిని
ఆరాధింపరు. నా మాట నమ్ముము; । మీరు మీకు 22
తెలియనిదానిని ఆరాధించువారు, మేము మాకు తెలి
సినదానిని ఆరాధించువారము; రక్షణ యూదులలో
నుండియే కలుగుచున్నది. । అయితే యథార్థముగా 23
ఆరాధించువారు ఆత్మతోను సత్యముతోను తండ్రిని
ఆరాధించు కాలము వచ్చుచున్నది; అది ఇప్పుడును
వచ్చేయున్నది; తన్ను ఆరాధించువారు అట్టివారే
కావలెనని తండ్రి కోరుచున్నాడు.[1] । దేవుడు ఆత్మ 24
గనుక ఆయనను ఆరాధించువారు ఆత్మతోను సత్యము
తోను ఆరాధింపవలెననెను. । ఆ స్త్రీ ఆయనతో— 25
క్రీస్తనబడిన మెస్సీయ వచ్చునని నేనెరుగుదును;
ఆయన వచ్చినప్పుడు మాకు సమస్తమును తెలియజేయు
నని చెప్పగా । యేసు—నీతో మాటలాడుచున్న 26
నేనే ఆయనని ఆమెతో చెప్పెను.

ఇంతలో ఆయన శిష్యులు వచ్చి ఆయన స్త్రీతో 27
మాటలాడుట చూచి ఆశ్చర్యపడిరి గాని—నీకేమి
కావలెననియైనను, ఈమెతో ఎందుకు మాటలాడు
చున్నావనియైనను ఎవడును అడుగలేదు. । ఆ స్త్రీ 28

1 మూలభాషలో—వెదకుచున్నాడు.

29 తన కుండ విడిచిపెట్టి ఊరిలోకి వెళ్లి । —మీరు వచ్చి,
నేను చేసినవన్నియు నాతో చెప్పిన మనుష్యుని
చూడుడి; ఈయన క్రీస్తుకాడా అని ఆ ఊరివారితో
30 చెప్పగా । వారు ఊరిలోనుండి బయలుదేరి ఆయన
31 యొద్దకు వచ్చిరి. । ఆలోగా శిష్యులు—బోధకుడా,
32 భోజనము చేయుమని ఆయనను వేడుకొనిరి. । అందు
కాయన —భుజించుటకు మీకు తెలియని ఆహారము
33 నాకు ఉన్నదని వారితో చెప్పగా । శిష్యులు–ఆయన
భుజించుటకు ఎవడైన నేమైనను తెచ్చెనేమో అని
34 యొకనితో ఒకడు చెప్పుకొనిరి. । యేసు వారిని
చూచి—నన్ను పంపినవాని చిత్తము నెరవేర్చుటయు,
ఆయన పని తుదముట్టించుటయు నాకు ఆహారమై
35 యున్నది. । ఇంక నాలుగు నెలలైన తరువాత కోత
కాలము వచ్చునని మీరు చెప్పుదురు గదా. యిదిగో
మీ కన్నులెత్తి పొలములను చూడుడి; అవి ఇప్పుడే
తెల్లబారి కోతకు వచ్చియున్నవని మీతో చెప్పుచు
36 న్నాను. । విత్తువాడును కోయువాడును కూడ సంతో
షించునట్లు కోయువాడు జీతము పుచ్చుకొని నిత్య
37 జీవార్థమైన ఫలము సమకూర్చుకొనుచున్నాడు. । విత్తు
వాడొకడు కోయువాడొకడను మాట యీ విషయ
38 ములో సత్యమే. । మీరు దేనిగూర్చి కష్టపడలేదో
దాని కోయుటకు మిమ్మును పంపితిని; ఇతరులు కష్ట
పడిరి మీరు వారి కష్టఫలములో ప్రవేశించియున్నా
రని చెప్పెను.

39 —నేను చేసినవన్నియు నాతో చెప్పెనని సాక్ష్య
మిచ్చిన స్త్రీయొక్క మాటనుబట్టి ఆ ఊరిలోని సమ
రైయులలో అనేకులు ఆయనయందు విశ్వాసముం
40 చిరి. । ఆ సమరైయులు ఆయనయొద్దకు వచ్చి, తమ
యొద్ద ఉండుమని ఆయనను వేడుకొనిరి గనుక ఆయన
41 అక్కడ రెండు దినములుండెను. । ఆయన మాటలు
వినినందున ఇంక అనేకులు నమ్మి ఆ స్త్రీని చూచి —
42 ఇకమీదట నీవు చెప్పిన మాటనుబట్టి నమ్మము; । మా
మట్టుకు మేము విని, యీయన నిజముగా లోకరక్షకు
డని తెలిసికొన్నామనిరి.

43 ఆ రెండు దినములైన తరువాత ఆయన అక్కడ
44 నుండి బయలుదేరి గలిలైయకు వెళ్లెను. । ఎందుకనగా
ప్రవక్త స్వదేశములో ఘనత పొందడని యేసు సాక్ష్య
45 మిచ్చెను. । గలిలైయులుకూడ ఆ పండుగకు వెళ్లువారు
గనుక యెరూషలేములో పండుగ సమయమున ఆయన
చేసిన కార్యములన్నియు వారు చూచినందున ఆయన
గలిలైయకు వచ్చినప్పుడు వారు ఆయనను చేర్చుకొనిరి.

46 తాను నీళ్లు ద్రాక్షారసముగా చేసిన గలిలైయలోని
కానాకు ఆయన తిరిగి వచ్చెను. అప్పుడు కపెర్న
హూములో ఒక ప్రధాని కుమారుడు రోగియై యుం
యేసు యూదైయనుండి గలిలైయకు వచ్చెనని
ఆయనయొద్దకు వెళ్లి, తన కుమారుడు
చావ సిద్ధమైయుండెను గనుక ఆయన వచ్చి అతని
స్వస్థపరచవలెనని వేడుకొనెను. । యేసు — సూచక 48
క్రియలను మహత్కార్యములను చూడకుంటే మీరెంత
మాత్రమును నమ్మరని అతనితో చెప్పెను. । అందుకా 49
ప్రధాని—ప్రభువా, నా కుమారుడు చావకమునుపే
రమ్మని ఆయనను వేడుకొనెను. । యేసు–నీవు వెళ్లుము, 50
నీ కుమారుడు బ్రదికియున్నాడని అతనితో చెప్పగా
ఆ మనుష్యుడు యేసు తనతో చెప్పినమాట నమ్మి వెళ్లి
పోయెను. । అతడింక వెళ్లుచుండగా అతని దాసులు 51
అతనికి ఎదురుగావచ్చి అతని కుమారుడు బ్రదికి
యున్నాడని తెలియజెప్పిరి. । ఏ గంటకు వాడు బాగు 52
పడసాగెనని వారిని అడిగినప్పుడు వారు—నిన్న ఒంటి
గంటకు జ్వరము వాని విడిచెనని అతనితో చెప్పిరి. ।
— నీ కుమారుడు బ్రదికియున్నాడని యేసు తనతో 53
చెప్పిన గంట అదే అని తండ్రి తెలిసికొనెను గనుక
అతడును అతని యింటివారందరును నమ్మిరి. । యేసు 54
యూదైయనుండి గలిలైయకు వచ్చి చేసిన సూచక
క్రియలలో ఇది రెండవది.

అటుతరువాత యూదుల పండుగ యొకటి 5
వచ్చెను గనుక యేసు యెరూషలేముకు వెళ్లెను.

యెరూషలేములో గొర్రెల ద్వారము దగ్గర, 2
హెబ్రీభాషలో బేతెస్ద అనబడిన యొక కోనేరుం
డెను, దానికి అయిదు మంటపములు కలవు. । ఆ యా 3
సమయములకు దేవదూత కోనేటిలో దిగి నీళ్లు కద 4
లించుట కలదు. నీరు కదలింపబడిన పిమ్మట మొదట
ఎవడు దిగునో వాడు ఎట్టి వ్యాధిగలవాడైనను బాగు
పడును, గనుక ఆ మంటపములలో వ్యాధిగ్రస్తులు,
గుడ్డివారు, కుంటివారు, ఊచకాలుచేతులు గలవారు,
గుంపులుగా పడియుండిరి. । అక్కడ ముప్పది యెని 5
మిది ఏండ్లనుండి వ్యాధిగల యొక మనుష్యుడుండెను. ।
యేసు వాడు పడియుండుట చూచి, వాడిప్పటికి 6
బహుకాలమునుండి ఆ స్థితిలోనున్నాడని యెరిగి—
స్వస్థపడ గోరుచున్నావా అని వాని నడుగగా । ఆ 7
వ్యాధిగ్రస్తుడు—అయ్యా, నీళ్లు కదలింపబడినప్పుడు
నన్ను కోనేటిలోకి దించుటకు నాకు ఎవడును లేడు
గనుక నేను వచ్చునంతలో మరియొకడు నాకంటె
ముందుగా దిగునని ఆయనకు ఉత్తరమిచ్చెను. । యేసు 8
— నీవు లేచి నీ పరుపెత్తికొని నడువుమని వానితో
చెప్పగా । వెంటనే వాడు స్వస్థతనొంది తన పరు 9
పెత్తికొని నడిచెను.

ఆ దినము విశ్రాంతిదినము గనుక యూదులు— 10
ఇది విశ్రాంతిదినము గదా; నీవు నీ పరుపెత్తికొన
తగదే అని స్వస్థత నొందినవానితో చెప్పిరి. । అం 11
దుకు వాడు—నన్ను స్వస్థపరచినవాడు—నీ పరుపెత్తి
కొని నడువుమని నాతో చెప్పెననెను. । వారు —నీ 12
పరుపెత్తికొని నడువుమని నీతో చెప్పినవాడెవడని

13 వానిని అడిగిరి. । ఆయన ఎవడో స్వస్థతనొందినవానికి
తెలియలేదు; ఆ చోటను గుంపుకూడి యుండెను
14 గనుక యేసు తప్పించుకొనిపోయెను. । అటుతరువాత
యేసు దేవాలయములో వాని చూచి—ఇదిగో నీవు
స్వస్థతనొందితివి; మరి ఎక్కువ కీడు నీకు కలుగకుండు
15 నట్లు ఇకను పాపము చేయకుమని చెప్పగా । వాడు
వెళ్లి తన్ను స్వస్థపరచినవాడు యేసు అని యూదులకు
16 తెలియజెప్పెను. । ఈ కార్యములను విశ్రాంతిదినమున
చేసినందున యూదులు యేసును హింసించిరి. ।
17 అయితే యేసు—నా తండ్రి యిదివరకు పనిచేయు
చున్నాడు, నేనును చేయుచున్నానని వారికి ఉత్తర
18 మిచ్చెను. । ఆయన విశ్రాంతి దినాచారమును మీరుట
మాత్రమే గాక, దేవుడు తన స్వంత తండ్రి అని చెప్పి,
తన్ను దేవునితో సమానునిగా చేసికొనెను గనుక
ఇందునిమిత్తమును యూదులు ఆయనను చంపవలెనని
మరి ఎక్కువగా ప్రయత్నముచేసిరి.

19 కాబట్టి యేసు వారికి ఇట్లు ప్రత్యుత్తరమిచ్చెను—
తండ్రి యేది చేయుట కుమారుడు చూచునో అదే
కాని తనంతట తాను ఏదియు చేయనేరడు; ఆయన
వేటిని చేయునో వాటినే కుమారుడును ఆలాగే
20 చేయును. । తండ్రి కుమారుని ప్రేమించుచు, తాను
చేయువాటినెల్లను ఆయనకు అగుపరచుచున్నాడని
మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. మరియు
మీరు ఆశ్చర్యపడునట్లు వీటికంటె ఘనమైన కార్య
21 ములను ఆయనకు అగుపరచును. । తండ్రి మృతులను
ఏలాగు లేపి బ్రదికించునో ఆలాగే కుమారుడును తన
22 కిష్టము వచ్చినవారిని బ్రదికించును. । తండ్రి యెవని
23 కిని తీర్పు తీర్చడు గాని । తండ్రిని ఘనపరచునట్లుగా
అందరును కుమారుని ఘనపరచవలెనని తీర్పు తీర్చుటకు
సర్వాధికారము కుమారునికి అప్పగించి యున్నాడు;
కుమారుని ఘనపరచనివాడు ఆయనను పంపిన తండ్రిని
24 ఘనపరచడు. । నా మాట విని నన్ను పంపినవాని
యందు విశ్వాసముంచువాడు నిత్యజీవము గలవాడై
యున్నాడు; వాడు తీర్పులోకి రాక మరణములో
నుండి జీవములోకి దాటియున్నాడని మీతో నిశ్చయ
25 ముగా చెప్పుచున్నాను. । మృతులు దేవుని కుమారుని
శబ్దము విను గడియ వచ్చుచున్నది, ఇప్పుడే వచ్చి
యున్నది; దాని వినువారు జీవింతురని మీతో నిశ్చ
26 యముగా చెప్పుచున్నాను. । తండ్రి యేలాగు తనం
తట తానే జీవముగలవాడై యున్నాడో ఆలాగే
కుమారుడును తనంతట తానే జీవముగలవాడై యుం
డుటకు కుమారునికి అధికారము అనుగ్రహించెను. ।
27 మరియు ఆయన మనుష్యకుమారుడు గనుక తీర్పు
తీర్చుటకును (తండ్రి) ఆయనకు అధికారము అను
28 గ్రహించెను. । దీనికి ఆశ్చర్యపడకుడి ఒక కాలము
వచ్చుచున్నది; ఆ కాలమున సమాధులలో నున్నవా
రందరు ఆయన శబ్దము విని । మేలుచేసినవారు జీవ 29
పునరుత్థానమునకును కీడుచేసినవారు తీర్పు పునరు
త్థానమునకును బయటికి వచ్చెదరు.

నా యంతట నేనే ఏమియు చేయలేను; నేను విను 30
నట్లుగా తీర్పు తీర్చుచున్నాను. నన్ను పంపినవాని
చిత్తప్రకారమే చేయ గోరుదును గాని నా యిష్ట
ప్రకారము చేయగోరను గనుక నా తీర్పు న్యాయ
మైనది. । నన్నుగూర్చి నేను సాక్ష్యము చెప్పుకొనిన 31
పక్షమున నా సాక్ష్యము సత్యము కాదు. । నన్ను 32
గూర్చి సాక్ష్యమిచ్చు వేరొకడు కలడు; ఆయన నన్ను
గూర్చి ఇచ్చు సాక్ష్యము సత్యమని యెరుగుదును. ।
మీరు యోహాను నొద్దకు (కొందరిని) పంపితిరి; అతడు 33
సత్యమునకు సాక్ష్యమిచ్చెను. । నేను మనుష్యులవలన 34
సాక్ష్యమంగీకరింపను గాని మీరు రక్షింపబడవలెనని
యీ మాటలు చెప్పుచున్నాను. । అతడు ప్రజ్వలిం 35
చుచు ప్రకాశించుచున్న దీపమై యుండెను, మీరతని
వెలుగులో ఉండి కొంతకాలము ఆనందించుటకు ఇష్ట
పడితిరి. । అయితే యోహాను సాక్ష్యముకంటె నా 36
కెక్కువైన సాక్ష్యము కలదు; అదేమనిన, నేను నెర
వేర్చుటకై తండ్రి యే క్రియలను నాకిచ్చియున్నాడో
నేను చేయుచున్న ఆ క్రియలే తండ్రి నన్ను పంపి
యున్నాడని నన్నుగూర్చి సాక్ష్యమిచ్చుచున్నవి. ।
మరియు నన్ను పంపిన తండ్రియే నన్నుగూర్చి సాక్ష్య 37
మిచ్చుచున్నాడు; మీరు ఏ కాలమందైనను ఆయన
శబ్దము వినలేదు ఆయన స్వరూపము చూడలేదు. ।
ఆయన ఎవని పంపెనో ఆయనను మీరు నమ్మలేదు 38
గనుక మీలో ఆయన వాక్యము నిలిచియుండలేదు. ।
లేఖనములయందు మీకు నిత్యజీవము కలదని తలం 39
చుచు వాటిని పరిశోధించుచున్నారు;[1] అవే నన్ను
గూర్చి సాక్ష్యమిచ్చుచున్నవి. । అయితే మీకు జీవము 40
కలుగునట్లు మీరు నాయొద్దకు రానొల్లరు. । నేను మను 41
ష్యులవలన మహిమ పొందువాడనుకాను. । నేను 42
మిమ్మును ఎరుగుదును; దేవుని ప్రేమ మీలో లేదు. ।
నేను నా తండ్రి నామమున వచ్చియున్నాను; మీరు 43
నన్ను అంగీకరింపరు; మరియొకడు తన నామమున
వచ్చిన పక్షమున వానిని అంగీకరింతురు. । అద్వి 44
తీయ దేవునివలన వచ్చు మెప్పును కోరక యొకని
వలన ఒకడు మెప్పుపొందుచున్న మీరు ఏలాగు నమ్మ
గలరు? నేను తండ్రియొద్ద మీమీద నేరము మోపుదు
నని తలంచకుడి; । మీరాశ్రయించుచున్న మోషే 45
మీమీద నేరము మోపువాడు. । అతడు నన్నుగూర్చి 46
వ్రాసెను గనుక మీరు మోషేను నమ్మినట్టయిన
నన్నును నమ్ముదురు. । మీరతని లేఖనములను నమ్మని 47
యెడల నా మాటలు ఏలాగు నమ్ముదురనెను.

1 లేక, పరిశోధించుడి.

6 అటుతరువాత యేసు తిబెరియ సముద్రము,
అనగా గలిలైయ సముద్రము దాటి అద్దరికి వెళ్లెను. ।
2 రోగులయెడల ఆయన చేసిన సూచకక్రియలను చూచి
3 బహు జనులు ఆయనను వెంబడించిరి. । యేసు కొం
డెక్కి అక్కడ తన శిష్యులతోకూడ కూర్చుండెను. ।
4 అప్పుడు పస్కా అను యూదుల పండుగ సమీపిం
5 చెను. । కాబట్టి యేసు కన్నులెత్తి బహు జనులు తన
యొద్దకు వచ్చుట చూచి—వీరు భుజించుటకు ఎక్కడ
నుండి రొట్టెలు కొని తెప్పించుదుమని ఫిలిప్పు నడిగెను
6 గాని । యేమి చేయనై యుండెనో తానే యెరిగి
7 యుండి అతని శోధించుటకు ఆలాగడిగెను. । అందుకు
ఫిలిప్పు—వారిలో ప్రతివాడును కొంచెము కొంచెము
పుచ్చుకొనుటకైనను ఇన్నూరు దేనారముల[1] రొట్టెలు
8 చాలవని ఆయనతో చెప్పెను । ఆయన శిష్యులలో
ఒకడు, అనగా సీమోను పేతురు సహోదరుడైన
9 అంద్రెయ । — ఇక్కడ ఉన్న యొక చిన్నవానియొద్ద
అయిదు యవల రొట్టెలును రెండు చిన్న చేపలును
ఉన్నవిగాని,యింతమందికిఇవిఏమాత్రమని ఆయనతో
10 అనగా । యేసు జనులను కూర్చుండబెట్టుడని చెప్పెను.
ఆ చోట చాల పచ్చిక యుండెను గనుక లెక్కకు
ఇంచుమించు అయిదు వేల పురుషులు కూర్చుండిరి. ।
11 యేసు ఆ రొట్టెలు పట్టుకొని కృతజ్ఞతాస్తుతులు
చెల్లించి కూర్చున్నవారికి వడ్డించెను; ఆలాగున చేపలు
12 కూడ వారికిష్టమైనంత మట్టుకు వడ్డించెను. । వారు
తృప్తిగా తినిన తరువాత ఏమియు నష్టపడకుండ
మిగిలిన ముక్కలు పోగుచేయుడని తన శిష్యులతో
13 చెప్పెను. । కాబట్టి వారు భుజించిన తరువాత వారి
యొద్ద మిగిలిన అయిదు యవల రొట్టెల ముక్కలు
14 పోగుచేసి పన్నెండు గంపెల్లు నింపిరి. । ఆ మనుష్యులు
యేసు చేసిన సూచకక్రియను చూచి—నిజముగా
ఈ లోకమునకు రాబోవు ప్రవక్త ఈయనే అని చెప్పు
కొనిరి.

15 రాజుగా చేయుటకు వారు వచ్చి తన్ను బలవంత
ముగా పట్టుకొనబోవుచున్నారని యేసు ఎరిగి, మరల
కొండకు ఒంటరిగా వెళ్లెను.

16 సాయంకాలమైనప్పుడు ఆయన శిష్యులు సము
ద్రమునొద్దకు వెళ్లి దోనె ఎక్కి సముద్రపు అద్దరికి
17 కపెర్నహూముకు పోవుచుండిరి. । అంతలో చీక
టాయెను గాని యేసు వారియొద్దకు ఇంక రాలేదు. ।
18 అప్పుడు పెద్ద గాలి విసరగా సముద్రము పొంగు
19 చుండెను. । వారు ఇంచుమించు రెండు కోసుల
దూరము దోనెను నడిపించిన తరువాత, యేసు సము
ద్రముమీద నడుచుచు తమ దోనెదగ్గరకు వచ్చుట
చూచి భయపడిరి; । అయితే ఆయన—నేనే, భయపడ
కుడని వారితో చెప్పెను. । అంతట ఆయనను దోనె
మీద ఎక్కించుకొనుటకు వారికిష్టమాయెను. వెంటనే
ఆ దోనె వారు వెళ్లుచున్న దేశమునకు చేరెను.

మరునాడు సముద్రపు అద్దరిని నిలిచియున్న జన 22
సమూహము వచ్చి చూడగా, ఒక చిన్నదోనె తప్ప
అక్కడ మరియొకటి లేదనియు, యేసు తన శిష్యులతో
కూడ దోనె ఎక్కలేదు గాని ఆయన శిష్యులుమాత్రమే
వెళ్లిరనియు తెలిసికొనిరి. । అయితే ప్రభువు కృతజ్ఞతా 23
స్తుతులు చెల్లించినప్పుడు వారు రొట్టె భుజించిన
చోటుకు దగ్గరనున్న తిబెరియనుండి వేరే చిన్న
దోనెలు వచ్చెను. । కాబట్టి యేసును ఆయన శిష్య 24
లును అక్కడ లేకపోవుట జనసమూహము చూచి
నప్పుడు వారా చిన్న దోనెలెక్కి యేసును వెదకుచు
కపెర్నహూముకు వచ్చిరి. । సముద్రపు అద్దరిని ఆయ 25
నను కనుగొని — బోధకుడా, నీవెప్పుడు ఇక్కడికి
వచ్చితివని అడుగగా । యేసు—మీరు సూచకక్రియ 26
లను చూచుటవలన కాదు, రొట్టెలు భుజించి తృప్తి
పొందుటవలననే నన్ను వెదకుచున్నారని మీతో నిశ్చ
యముగా చెప్పుచున్నాను. । క్షయమైన ఆహారము 27
కొరకు కష్టపడకుడి గాని నిత్యజీవము కలుగజేయు
అక్షయమైన ఆహారముకొరకే కష్టపడుడి; మనుష్య
కుమారుడు దాని మీకిచ్చును, ఇందుకై తండ్రియైన
దేవుడు ఆయనకు ముద్రవేసియున్నాడని చెప్పెను. ।
వారు — మేము దేవుని క్రియలు జరిగించుటకు ఏమి 28
చేయవలెనని ఆయనను అడుగగా । యేసు — ఆయన 29
పంపినవానియందు మీరు విశ్వాసముంచుటయే దేవుని
క్రియయని వారితో చెప్పెను. । వారు—అట్లయితే 30
మేము చూచి నిన్ను విశ్వసించుటకు నీవు ఏ సూచక
క్రియ చేయుచున్నావు? ఏమి జరిగించుచున్నావు? ।
భుజించుటకు పరలోకమునుండి ఆయన ఆహారము 31
వారికి అనుగ్రహించెను అని[2] వ్రాయబడినట్టు మన
పితరులు అరణ్యములో మన్నాను భుజించిరని ఆయ
నతో చెప్పిరి. । కాబట్టి యేసు — పరలోకమునుండి 32
వచ్చు ఆహారము మోషే మీకియ్యలేదు, నా తండ్రియే
పరలోకమునుండి వచ్చు నిజమైన ఆహారము మీకను
గ్రహించుచున్నాడు. । పరలోకమునుండి దిగి వచ్చి, 33
లోకమునకు జీవము నిచ్చునది దేవుడనుగ్రహించు
ఆహారమై యున్నదని మీతో నిశ్చయముగా చెప్పు
చున్నానని వారితో చెప్పెను. । కావున వారు — 34
ప్రభువా, యీ ఆహారము ఎల్లప్పుడు మాకు అను
గ్రహించుమనిరి. । అందుకు యేసు వారితో ఇట్లనెను 35
— జీవాహారము నేనే; నాయొద్దకు వచ్చువాడు ఏ
మాత్రమును ఆకలిగొనడు, నాయందు విశ్వాసముంచు
వాడు ఎప్పుడును దప్పిగొనడు. । మీరు నన్ను చూచి 36
యుండియు విశ్వసింపక యున్నారని మీతో చెప్పి
తిని. । తండ్రి నాకు అనుగ్రహించువారందరును నా 37

[1] ఒక దేనారము ఇంచుమించు అర్ధరూపాయి కావచ్చును. [2] కీర్తన, 78: 24.

కు వత్తురు; నాయొద్దకు వచ్చువాని నేనెంతమాత్ర
బయటికి త్రోసివేయను. । నా యిష్టమును నెర
కొనుటకు నేను రాలేదు; నన్ను పంపినవాని
ం నెరవేర్చుటకే పరలోకమునుండి దిగివచ్చితిని. ।
నాకు అనుగ్రహించిన యావత్తులో నేనే
పోగొట్టుకొనక, అంత్యదినమున దాని లేపు
నన్ను పంపినవాని చిత్తమై యున్నది. । కుమా
చూచి ఆయనయందు విశ్వాసముంచు ప్రతి
ను నిత్యజీవము పొందుటయే నా తండ్రి చిత్తము;
దినమున నేను వాని లేపుదును.
నను పరలోకమునుండి దిగి వచ్చిన ఆహారమని
చెప్పినందున యూదులు ఆయననుగూర్చి
సకొనుచు — ఈయన యోసేపు కుమారుడైన
కాడా? । ఈయన తలిదండ్రులను మన మెరుగు
గదా? — నేను పరలోకమునుండి దిగి వచ్చి
నని ఈయన ఏలాగు చెప్పుచున్నాడనిరి. ।
కు యేసు — మీలో మీరు సణుగుకొనకుడి; ।
పంపిన తండ్రి వానిని ఆకర్షించితేనే గాని యెవ
నాయొద్దకు రాలేదు; అంత్యదినమున నేను వాని
ను. । — వారందరును దేవునిచేత బోధింప
రు అని ప్రవక్తల లేఖనములలో[1] వ్రాయబడి
ది గనుక తండ్రివలన విని నేర్చుకొనిన ప్రతి
ను నాయొద్దకు వచ్చును. । దేవుని యొద్దనుండి
వాడు తప్ప మరి ఎవడును తండ్రిని చూచి
లేదు; ఈయనే తండ్రిని చూచియున్నవాడు. ।
ంచువాడే నిత్యజీవము గలవాడు. । జీవాహారము
। మీ పితరులు అరణ్యములో మన్నాను తిని
చనిపోయిరి. । ప్రతివాడును తిని చావకుండు
పరలోకమునుండి దిగి వచ్చిన ఆహారమిదే. । పర
మునుండి దిగి వచ్చిన జీవాహారము నేనే. ఎవడై
ఈ ఆహారము భుజించితే వాడెల్లప్పుడును జీవిం
మరియు నేనిచ్చు ఆహారము లోకమునకు జీవము
న నా శరీరమే అని మీతో నిశ్చయముగా
చున్నాననెను.
యూదులు — ఈయన తన శరీరమును ఏలాగు తిన
గలడని యొకనితో ఒకడు వాదించిరి. । కావున
ఇట్లనెను — మీరు మనుష్యకుమారుని శరీరము
ఆయన రక్తము త్రాగితేనే కాని మీలో మీరు
గలవారు కారు. । నా శరీరము తిని నా రక్తము
వాడే నిత్యజీవము గలవాడు; అంత్యదినమున
వాని లేపుదును. । నా శరీరము నిజమైన ఆహార
నా రక్తము నిజమైన పానమునై యున్నది. ।
రీరము తిని నా రక్తము త్రాగువాడు నాయం
నేను వానియందును నిలిచియుందుము. । జీవము
ండ్రి నన్ను పంపెను గనుక నేను తండ్రిమూల
ముగా జీవించుచున్నట్టే నన్ను తినువాడును నా మూల
ముగా జీవించును. । ఇదే పరలోకమునుండి దిగివచ్చిన 58
ఆహారము; పితరులు (మన్నాను) తినియు చనిపోయి
నట్టుకాదు; ఈ ఆహారము తినువాడు ఎల్లప్పుడును
జీవించునని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను.
ఆయన కపెర్నహూములో బోధించుచు సమాజ 59
మందిరములో ఈ మాటలు చెప్పెను.

ఆయన శిష్యులలో అనేకులు ఈ మాట విని— 60
యిది కఠినమైన మాట, యిది ఎవడు వినగలడని చెప్పు
కొనిరి. । యేసు తన శిష్యులు దీనిగూర్చి సణుగుకొను 61
చున్నారని తనకుతానే యెరిగి వారితో ఇట్లనెను—
దీనివలన మీరు అభ్యంతరపడుచున్నారా? । ఆలాగైతే 62
మీరు మనుష్యకుమారుడు మునుపున్న చోటుకు
ఎక్కుట చూచినయెడల ఏమందురు? । ఆత్మయే జీవింప 63
చేయుచున్నది; శరీరము కేవలము నిష్ప్రయోజనము.
నేను మీతో చెప్పియున్నమాటలు ఆత్మయు జీవమునై
యున్నవి గాని । మీలో విశ్వసించనివారు కొంద 64
రున్నారని వారితో చెప్పెను. విశ్వసించనివారెవరో,
తన్ను అప్పగింపబోవువాడెవడో, మొదటినుండి
యేసుకు తెలియును. । మరియు ఆయన—తండ్రిచేత 65
వానికి కృప అనుగ్రహింపబడకుంటే ఎవడును నా
యొద్దకు రాలేడని యీ హేతువునుబట్టి మీతో
చెప్పితిననెను.

అప్పటినుండి ఆయన శిష్యులలో అనేకులు వెనుక 66
తీసి, మరి ఎన్నడును ఆయనను వెంబడింపలేదు. ।
కాబట్టి యేసు — మీరు కూడ వెళ్లిపోవలెనని 67
యున్నారా అని పన్నెండుమందిని అడుగగా ।
సీమోను పేతురు—ప్రభువా, యెవనియొద్దకు వెళ్లు 68
దుము? నీవే నిత్యజీవపు మాటలు గలవాడవు; । నీవే 69
దేవుని పరిశుద్ధుడవని మేము విశ్వసించి యెరిగియున్నా
మని ఆయనతో చెప్పెను. । అందుకు యేసు — నేను 70
పన్నెండుగురైన మిమ్మును ఏర్పరచుకొనలేదా? మీలో
ఒకడు అపవాది[2] అని వారితో చెప్పెను. । సీమోను 71
కుమారుడైన ఇస్కరియోతు యూదా పన్నెండుమం
దిలో ఒకడైయుండి ఆయన నప్పగింపబోవుచుండెను
గనుక వానిగూర్చియే. ఆయన ఈ మాట చెప్పెను.

ఆటుతరువాత యూదులు ఆయనను చంప 7
యత్నించినందున యేసు యూదైయలో సంచరించ
నొల్లక గలిలైయలో సంచరించుచుండెను. । యూ 2
దుల పండుగైన పర్ణశాలలపండుగ సమీపించెను గనుక ।
ఆయన సహోదరులు ఆయనను చూచి—నీవు చేయు 3
చున్న క్రియలు నీ శిష్యులును చూచునట్లు ఈ స్థలము
విడిచి యూదైయకు వెళ్లుము. । బహిరంగమున అంగీ 4
కరింపబడ గోరువాడెవడును తన పని రహస్యమున
జరిగింపడు. నీవు ఈ కార్యములు చేయుచున్నయెడల

[1] యెషయా, 54: 13; యిర్మీయా, 31: 33, 34. [2] అనగా—సాతాను.

నిన్ను నీవే లోకమునకు కనుపరచుకొనుమని చెప్పిరి. ।
5 ఆయన సహోదరులైనను ఆయనయందు విశ్వాస
6 ముంచలేదు. । యేసు—నా సమయమింకను రాలేదు;
మీ సమయమెల్లప్పుడును సిద్ధముగానే యున్నది. ।
7 లోకము మిమ్మును ద్వేషింపనేరదు గాని, దాని క్రియలు
చెడ్డవని నేను దానిగూర్చి సాక్ష్యమిచ్చుచున్నాను
8 గనుక అది నన్ను ద్వేషించుచున్నది. । మీరు పండు
గకు వెళ్లుడి; నా సమయమింకను పరిపూర్ణము కాలేదు
గనుక నేను ఈ పండుగకు ఇంకను వెళ్లనని వారితో
9 చెప్పెను. । ఆయన వారితో ఈలాగున చెప్పి గలి
లైయలో నిలిచిపోయెను.

10 అయితే ఆయన సహోదరులు పండుగకు వెళ్లి
పోయిన తరువాత ఆయనకూడ బహిరంగముగా వెళ్లక
11 రహస్యముగా వెళ్లెను. । పండుగలో యూదులు—
12 ఆయన ఎక్కడనని ఆయనను వెదకుచుండిరి. । మరియు
జనసమూహములలో ఆయననుగూర్చి గొప్ప సణుగు
పుట్టెను; కొందరాయన మంచివాడనిరి; మరికొందరు
— కాదు, ఆయన జనులను మోసపుచ్చువాడనిరి; ।
13 అయితే యూదులకు భయపడి ఆయననుగూర్చి యెవ
డును బహిరంగముగా మాటలాడలేదు.

14 సగము పండుగైనప్పుడు యేసు దేవాలయములోకి
15 వెళ్లి బోధించుచుండెను. । యూదులు అందుకు ఆశ్చ
ర్యపడి — చదువుకొనని ఇతనికి ఈ పాండిత్యమెట్లు
16 వచ్చెనని చెప్పుకొనిరి. । అందుకు యేసు—నేను చేయు
17 బోధ నాది కాదు నన్ను పంపినవానిదే. । ఎవడైన
ఆయన చిత్తముచొప్పున చేయగోరినయెడల, ఆ బోధ
దేవునివలన కలిగినదో లేక నా యంతట నేనే బోధించు
18 చున్నానో వాడు తెలిసికొనును. । తనంతట తానే
బోధించువాడు స్వకీయ మహిమను వెదకును గాని
తన్ను పంపినవాని మహిమను వెదకువాడు సత్యవం
19 తుడు, ఆయనయందు ఏ దుర్నీతియు లేదు. । మోషే
మీకు ధర్మశాస్త్రము ఇయ్యలేదా? అయినను మీలో
ఎవడును ఆ ధర్మశాస్త్రమును గైకొనడు; మీరెందుకు
నన్ను చంప జూచుచున్నారని వారితో చెప్పెను. ।
20 అందుకు జనసమూహము — నీవు దయ్యము పట్టిన
వాడవు, ఎవడు నిన్ను చంప జూచుచున్నాడని అడు
21 గగా । యేసు వారిని చూచి — నేను ఒక కార్యము
చేసితిని; అందుకు మీరందరు ఆశ్చర్యపడుచున్నారు.।
22 మోషే మీకు సున్నతి సంస్కారమును నియమించెను,
ఈ సంస్కారము మోషేవలన కలిగినది కాదు, పిత
రులవలననే కలిగినది. అయినను విశ్రాంతిదినమున
23 మీరు మనుష్యునికి సున్నతి చేయుచున్నారు. । మోషే
ధర్మశాస్త్రము మీరకుండునట్లు ఒక మనుష్యుడు విశ్రాంతి
దినమున సున్నతిపొందును గదా. ఇట్లుండగా నేను
విశ్రాంతిదినమున ఒక మనుష్యుని పూర్ణస్వస్థతగల
వానిగా చేసినందుకు మీరు నామీద ఆగ్రహపడు
చున్నారేమి? । వెలిచూపునుబట్టి తీర్పు తీర్చక న్యాయ 24
మైన తీర్పు తీర్చుడనెను.

యెరూషలేమువారిలో కొందరు — వారు చంప 25
యత్నించువాడు ఈయనే కాడా? । ఇదిగో ఈ 26
యన బహిరంగముగా మాటలాడుచున్నను ఈయనను
ఏమనరు; ఈయన క్రీస్తని అధికారులు నిజముగా
తెలిసికొనియుందురా? । అయినను ఈయన ఎక్కడి 27
వాడో యెరుగుదుము; క్రీస్తు వచ్చునప్పుడు ఆయన
ఎక్కడివాడో యెవడును ఎరుగడని చెప్పుచుండిరి. ।
కాగా యేసు దేవాలయములో బోధించుచు — మీరు 28
నన్నెరుగుదురు; నేనెక్కడివాడనో యెరుగుదురు;
నాయంతట నేనే రాలేదు, నన్ను పంపినవాడు సత్య
వంతుడు, ఆయనను మీరెరుగరు. । నేను ఆయనయొద్ద 29
నుండి వచ్చితిని; ఆయన నన్ను పంపెను గనుక నేను
ఆయనను ఎరుగుదునని బిగ్గరగా చెప్పెను. । అందుకు 30
వారాయనను పట్టుకొన యత్నముచేసిరి గాని ఆయన
గడియ యింక రాలేదు గనుక ఎవడును ఆయనను
పట్టుకొనలేదు.[1] । మరియు జనసమూహములో అనే 31
కులు ఆయనయందు విశ్వాసముంచి — క్రీస్తు వచ్చు
నప్పుడు ఈయన చేసినవాటికంటె ఎక్కువైన సూచక
క్రియలు చేయునా అని చెప్పుకొనిరి. । జనసమూ 32
హము ఆయననుగూర్చి యీలాగు సణుగుకొనుట పరి
సయ్యులు వినినప్పుడు, ప్రధానయాజకులును పరి
సయ్యులును ఆయనను పట్టుకొనుటకు బంట్రౌతులను
పంపిరి. । యేసు — ఇంక కొంతకాలము నేను మీతో 33
కూడ నుందును; తరువాత నన్ను పంపినవానియొద్దకు
వెళ్లుదును; । మీరు నన్ను వెదకుదురు గాని నన్ను 34
కనుగొనరు, నేనెక్కడ ఉందునో అక్కడికి మీరు
రాలేరనెను. । అందుకు యూదులు — మనము ఈయ 35
నను కనుగొనకుండునట్లు ఈయన ఎక్కడికి వెళ్లబోవు
చున్నాడు? హెల్లేనీయులలో చెదరిపోయిన వారి
యొద్దకు వెళ్లి హెల్లేనీయులకు బోధింప బోవుచు
న్నాడా? । — నన్ను వెదకుదురు గాని కనుగొనరు, 36
నేనెక్కడ ఉందునో అక్కడికి మీరు రాలేరని ఆయన
చెప్పిన యీ మాట ఏమిటో అని తమలోతాము చెప్పు
కొనుచుండిరి.

ఆ పండుగలో మహాదినమైన అంత్యదినమున 37
యేసు నిలిచి—ఎవడైన దప్పిగొనిన యెడల నాయొద్దకు
వచ్చి దప్పి తీర్చుకొనవలెను. । నాయందు విశ్వాస 38
ముంచువాడెవడో లేఖనము చెప్పినట్టు[2] వాని కడుపు
లోనుండి జీవజలనదులు పారునని బిగ్గరగా చెప్పెను. ।
తనయందు విశ్వాసముంచువారు పొందబోవు ఆత్మను 39
గూర్చి ఆయన ఈ మాట చెప్పెను. యేసు ఇంక
మహిమపరచబడలేదు గనుక ఆత్మ ఇంకను అను

[1] మూలభాషలో—ఆయనమీద చేతులు వేయలేదు. [2] యెషయా, 44: 3; 58: 11; జెకర్యా, 14: 8; యోవేలు, 3: 18 కూడ చూడుము.

40 గ్రహింపబడియుండలేదు. । జనసమూహములో కొం
దరు ఈ మాటలు విని- నిజముగా ఈయన ఆ ప్రవక్తయే
41 అనిరి; । మరికొందరు — ఈయన క్రీస్తే అనిరి; మరి
కొందరు — ఏమి? క్రీస్తు గలిలైయలోనుండి వచ్చు
42 నా? । క్రీస్తు దావీదు సంతానములో పుట్టి దావీదు
ఉండిన బేత్లెహేము గ్రామములోనుండి వచ్చునని
43 లేఖనము చెప్పుటలేదా అనిరి. । కాబట్టి ఆయననుగూర్చి
44 జనసమూహములో భేదము పుట్టెను. । వారిలో కొం
దరు ఆయనను పట్టుకొనదలచిరి గాని యెవడును
ఆయనను పట్టుకొనలేదు.
45 ఆ బంట్రౌతులు ప్రధానయాజకులయొద్దకును పరి
సయ్యులయొద్దకును వచ్చినప్పుడు వారు — ఎందుకు
46 మీరాయనను తీసికొని రాలేదని అడుగగా । ఆ బం
ట్రౌతులు—ఆ మనుష్యుడు మాటలాడినట్లు ఎవడును
47 ఎన్నడును మాటలాడలేదనిరి. । అందుకు పరిసయ్యులు
48 — మీరుకూడ మోసపోతిరా? । అధికారులలోగాని
పరిసయ్యులలోగాని యెవడైనను ఆయనయందు
49 విశ్వాసముంచెనా? । అయితే ధర్మశాస్త్రమెరుగని యీ
జనసమూహము శాపగ్రస్తమైనదని వారితో అనిరి. ।
50 ఆయనయొద్దకు వచ్చిన నీకొదేము వారిలో ఒకడై
51 యుండెను. । అతడు—ఒక మనుష్యుని మాట వినక
మునుపును, వాడు చేసినది తెలిసికొనకమునుపును, మన
ధర్మశాస్త్రము వానికి తీర్పు తీర్చునా అని అడుగగా ।
52 వారు—నీవును గలిలైయుడవా? విచారించి చూడుము,
గలిలైయలో ఏ ప్రవక్తయు పుట్టడనిరి.

8 [అంతట ఎవరి యింటికి వారు వెళ్లిరి గాని యేసు
2 ఒలీవలకొండకు వెళ్లెను. । తెల్లవారగానే యేసు తిరిగి
దేవాలయములోకి రాగా ప్రజలందరు ఆయనయొద్దకు
వచ్చిరి గనుక ఆయన కూర్చుండి వారికి బోధించుచుం
3 డెను. । శాస్త్రులును పరిసయ్యులును, వ్యభిచారమందు
పట్టబడిన యొక స్త్రీని తోడుకొనివచ్చి ఆమెను మధ్య
4 నిలువబెట్టి । — బోధకుడా, యీ స్త్రీ వ్యభిచారము
5 చేయుచుండగా పట్టబడెను; । అట్టివారిని రాళ్లు రువ్వి
చంపవలెనని ధర్మశాస్త్రములో మోషే మన కాజ్ఞాపిం
చెను గదా; అయినను నీవేమి చెప్పుచున్నావని ఆయన
6 నడిగిరి । ఆయనమీద నేరము మోపవలెనని ఆయనను
శోధించుచు ఈలాగున అడిగిరి. అయితే యేసు
వంగి, నేలమీద వ్రేలితో (ఏమో) వ్రాయుచుం
7 డెను. । వారాయనను పట్టువదలక అడుగుచుండగా
ఆయన తలయెత్తి చూచి—మీలో పాపము లేనివాడు
మొట్టమొదట ఆమెమీద రాయి వేయవచ్చునని
8 వారితో చెప్పి । మరల వంగి నేలమీద వ్రాయుచుం
9 డెను. । వారామాట విని,[1] పెద్దవారు మొదలుకొని
చిన్నవారివరకు ఒకనివెంట ఒకడు బయటికి వెళ్లిరి.
యేసు ఒక్కడే మిగిలెను; ఆ స్త్రీ మధ్యను నిలువబడి
యుండెను. । యేసు తలయెత్తి చూచి—అమ్మా, వారె 10
క్కడనున్నారు?[2] ఎవడును నీకు శిక్ష విధింపలేదా?
అని అడిగినప్పుడు । ఆమె — లేదు ప్రభువా అనెను. 11
అందుకు యేసు — నేనును నీకు శిక్ష విధింపను, నీవు
వెళ్లి ఇకను పాపము చేయకుమని ఆమెతో చెప్పెను.]
మరియు యేసు — నేను లోకమునకు వెలుగునై 12
యున్నాను; నన్ను వెంబడించువాడు చీకటిలో నడు
వక జీవపు వెలుగుగలవాడై యుండునని వారితో
చెప్పెను. । కాబట్టి పరిసయ్యులు — నిన్నుగూర్చి నీవే 13
సాక్ష్యము చెప్పుకొనుచున్నావు; నీ సాక్ష్యము
సత్యము కాదని ఆయనతో అనగా । యేసు — నేను 14
ఎక్కడనుండి వచ్చితినో యెక్కడికి వెళ్లుదునో నేనెరు
గుదును గనుక నన్నుగూర్చి నేను సాక్ష్యము చెప్పు
కొనినను నా సాక్ష్యము సత్యమే, నేను ఎక్కడనుండి
వచ్చుచున్నానో యెక్కడికి వెళ్లుచున్నానో మీరు ఎరు
గరు. । మీరు శరీరమునుబట్టి తీర్పు తీర్చుచున్నారు; 15
నేనెవనికిని తీర్పు తీర్చను. । నేను ఒక్కడనైయుండక, 16
నేనును నన్ను పంపిన తండ్రియు కూడ నున్నాము గనుక
నేను తీర్పు తీర్చినను నా తీర్పు సత్యమే. । మరియు 17
ఇద్దరు మనుష్యుల సాక్ష్యము సత్యమని మీ ధర్మ
శాస్త్రములో వ్రాయబడియున్నది గదా. । నన్ను 18
గూర్చి నేను సాక్ష్యము చెప్పుకొనువాడను; నన్ను
పంపిన తండ్రియు నన్నుగూర్చి సాక్ష్యమిచ్చుచున్నా
డని చెప్పెను. । వారు — నీ తండ్రి యెక్కడనున్నా 19
డని ఆయనను అడుగగా యేసు — మీరు నన్నైనను
నా తండ్రినైనను ఎరుగరు; నన్ను ఎరిగియుంటిరా నా
తండ్రినికూడ ఎరిగియుందురని వారితో చెప్పెను. ।
ఆయన దేవాలయములో బోధించుచుండగా కానుక 20
పెట్టె యున్నచోట ఈ మాటలు చెప్పెను. ఆయన
గడియ యింక రాలేదు గనుక ఎవడును ఆయనను
పట్టుకొనలేదు.
మరియొకప్పుడు ఆయన — నేను వెళ్లిపోవుచు 21
న్నాను; మీరు నన్ను వెదకుదురు గాని మీ పాప
ములోనేయుండి చనిపోవుదురు; నేను వెళ్లుచోటికి
మీరు రాలేరని వారితో చెప్పెను. । అందుకు యూ 22
దులు—నేను వెళ్లుచోటికి మీరు రాలేరని యీయన
చెప్పుచున్నాడే; తన్నుతానే చంపుకొనునా అని
చెప్పుకొనుచుండిరి. । అప్పుడాయన — మీరు క్రింది 23
వారు, నేను పైనుండువాడను, మీరు ఈ లోకసంబం
ధులు, నేను ఈ లోకసంబంధుడను కాను. । కాగా 24
మీ పాపములలోనేయుండి మీరు చనిపోవుదురని
మీతో చెప్పితిని. నేను ఆయనని మీరు విశ్వసిం
చనియెడల మీరు మీ పాపములలోనేయుండి చని

1 కొన్ని ప్రాచీనప్రతులలో—మనస్సాక్షిచేత గద్దింపబడినవారై అని కూర్చబడియున్నది. 2 కొన్ని ప్రాచీనప్రతులలో—నీమీద నేరము మోపినవా రెక్కడనున్నారు అని పాఠాంతరము

25 పోవుదురని వారితో చెప్పెను. | కాబట్టి వారు —
నీవెవడవని ఆయన నడుగగా యేసు వారితో — మొదట
నుండి నేను మీతో ఎవడనని చెప్పుచుంటినో వాడనే. |
26 మిమ్మునుగూర్చి చెప్పుటకును తీర్పు తీర్చుటకును అనేక
సంగతులు నాకు కలవు గాని నన్ను పంపినవాడు
సత్యవంతుడు; నేను ఆయనయొద్ద వినిన సంగతులే
27 లోకమునకు బోధించుచున్నానని చెప్పెను. | తండ్రిని
గూర్చి తమతో ఆయన చెప్పెనని వారు గ్రహింపక
28 పోయిరి. | కావున యేసు — మీరు మనుష్యకుమా
రుని పైకెత్తినప్పుడు నేనే ఆయనననియు, నా అంతట
నేనే యేమియు చేయక, తండ్రి నాకు నేర్పినట్టు ఈ
సంగతులు మాటలాడుచున్నాననియు మీరు గ్రహిం
29 చెదరు. | నన్ను పంపినవాడు నాకు తోడైయున్నాడు;
ఆయన కిష్టమైన కార్యము నేనెల్లప్పుడును చేయు
వాడను గనుక ఆయన నన్ను ఒంటిగా విడిచి పెట్టలేదని
30 చెప్పెను. | ఆయన యీ సంగతులు మాటలాడు
చుండగా అనేకు లాయనయందు విశ్వాసముంచిరి.

31 కాబట్టి యేసు తనయందు విశ్వాసముంచిన యూ
దులతో — మీరు నా వాక్యమందు నిలిచినవారైతే
నిజముగా నాకు శిష్యులైయుండి సత్యమును గ్రహించె
32 దరు; | అప్పుడు సత్యము మిమ్మును స్వతంత్రులనుగా
33 చేయునని చెప్పగా | వారు — మేము అబ్రాహాము
సంతానము, మేము ఎన్నడును ఎవనికిని దాసులమై
యుండలేదే; మీరు స్వతంత్రులుగా చేయబడుదురని
34 యేల చెప్పుచున్నావని ఆయనతో అనిరి. | అందుకు
యేసు — పాపము చేయు ప్రతివాడును పాపమునకు
దాసుడని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. |
35 దాసుడెల్లప్పుడును ఇంటిలో నివాసముచేయడు;
36 కుమారుడెల్లప్పుడును నివాసముచేయును. | కుమారుడు
మిమ్మును స్వతంత్రులనుగా చేసినయెడల మీరు నిజ
37 ముగా స్వతంత్రులై యుందురు. | మీరు అబ్రా
హాము సంతానమని నాకు తెలియును; అయినను
మీలో నా వాక్యమునకు చోటులేదు గనుక నన్ను
38 చంప వెదకుచున్నారు. | నేను నా తండ్రియొద్ద
చూచిన సంగతులే బోధించుచున్నాను; ఆ ప్రకా
రమే మీరు మీ తండ్రియొద్ద వినినవాటినే జరిగించు
39 చున్నారని వారితో చెప్పెను. | అందుకు వారు ఆయ
నతో — మా తండ్రి అబ్రాహామనిరి; యేసు — మీరు
అబ్రాహాము పిల్లలైతే అబ్రాహాము చేసిన క్రియలు
40 చేతురు. | దేవునివలన వినిన సత్యము మీతో చెప్పిన
వాడనైన నన్ను మీరిప్పుడు చంప వెదకుచున్నారే;
41 అబ్రాహాము అట్లు చేయలేదు. | మీరు మీ తండ్రి
క్రియలే చేయుచున్నారని వారితో చెప్పెను; అం
దుకు వారు — మేము వ్యభిచారమువలన పుట్టినవారము
కాము, దేవుడొక్కడే మాకు తండ్రి అని చెప్పగా |

యేసు వారితో ఇట్లనెను — దేవుడు మీ తండ్రియైన 42
యెడల మీరు నన్ను ప్రేమింతురు; నేను దేవునియొద్ద
నుండి బయలుదేరి వచ్చియున్నాను, నా అంతట నేనే
వచ్చియుండలేదు, ఆయనే నన్ను పంపెను. | మీరేల 43
నా మాటలు గ్రహింపకున్నారు? మీరు నా బోధ
విననేరకయుండుటవలననే గదా! | మీరు మీ తండ్రి 44
యగు అపవాది[1] సంబంధులు, మీ తండ్రి దురాశలు
నెరవేర్ప గోరుచున్నారు. ఆదినుండి వాడు నరహంత
కుడైయుండి సత్యమందు నిలిచినవాడు కాడు; వాని
యందు సత్యమేలేదు, వాడు అబద్ధమాడునప్పుడు
తన స్వభావము అనుసరించియే మాటలాడును; వాడు
అబద్ధికుడును అబద్ధమునకు జనకుడునై[2] యున్నాడు. |
నేను సత్యము చెప్పుచున్నాను గనుక మీరు నన్ను 45
నమ్మరు. | నాయందు పాపమున్నదని మీలో ఎవడు 46
స్థాపించును? నేను సత్యము చెప్పుచున్నయెడల మీ
రెందుకు నన్ను నమ్మరు? | దేవుని సంబంధియైనవాడు 47
దేవుని మాటలు వినును. మీరు దేవుని సంబంధులు
కారు గనుకనే మీరు వినరని చెప్పెను. | అందుకు 48
యూదులు — నీవు సమరయుడవును దయ్యము పట్టిన
వాడవునై యున్నావని మేము చెప్పుమాట సరియే
గదా అని ఆయనతో చెప్పగా | యేసు — నేను 49
దయ్యము పట్టినవాడను కాను, నా తండ్రిని ఘనపరచు
వాడను; మీరు నన్ను అవమానపరచుచున్నారు. |
నేను నా మహిమను వెదకుటలేదు, వెదకుచు తీర్పు 50
తీర్చుచు ఒకడు కలడు. | ఒకడు నా మాట 51
గైకొనినయెడల వాడెన్నడును మరణము పొందడని[3]
మీతో నిశ్చయముగా చెప్పుచున్నానని ఉత్తర
మిచ్చెను. | అందుకు యూదులు — నీవు దయ్యము 52
పట్టినవాడవని యిప్పుడెరుగుదుము; అబ్రాహామును
ప్రవక్తలును చనిపోయిరి; అయినను — ఒకడు నా మాట
గైకొనినయెడల వాడు ఎన్నడును మరణము రుచిచూడ
డని నీవు చెప్పుచున్నావు. | మన తండ్రియైన అబ్రా 53
హాము చనిపోయెను గదా; నీవతనికంటె గొప్పవా
డవా? ప్రవక్తలును చనిపోయిరి; నిన్ను నీ వెవడవని
చెప్పుకొనుచున్నావని ఆయన నడిగిరి. | అందుకు 54
యేసు — నన్ను నేనే మహిమపరచుకొనినయెడల
నా మహిమ వట్టిది; — మా దేవుడని మీ రెవనిగూర్చి
చెప్పుదురో ఆ నా తండ్రియే నన్ను మహిమపరచు
చున్నాడు. | మీరు ఆయనను ఎరుగరు, నేనాయ 55
నను ఎరుగుదును; ఆయనను ఎరుగనని నేను చెప్పిన
యెడల మీవలె నేనును అబద్ధికుడనై యుందును గాని,
నేనాయనను ఎరుగుదును, ఆయన మాట గైకొను
చున్నాను. | మీ తండ్రియైన అబ్రాహాము నా దినము
చూతునని మిగుల ఆనందించెను; అది చూచి సంతో
షించెను అనెను. | అందుకు యూదులు — నీకింక

1 అనగా, సాతాను 2 లేక, అబద్ధికునికి జనకుడునై 3 మూలభాషలో—మరణము చూడడని.

ఏబది సంవత్సరములైన లేవే, నీవు అబ్రాహామును
58 చూచితివా అని ఆయనతో చెప్పగా, । యేసు—
అబ్రాహాము పుట్టకమునుపే నేను ఉన్నానని మీతో
59 నిశ్చయముగా చెప్పుచున్నాననెను. । కాబట్టి వారు
ఆయనమీద రువ్వుటకు రాళ్లను ఎత్తిరి గాని యేసు
దాగి దేవాలయములోనుండి బయటికి వెళ్లిపోయెను.

ఆయన మార్గమున పోవుచుండగా పుట్టు గుడ్డి
2 యైన యొక మనుష్యుడు కనబడెను. । ఆయన శిష్యులు
—బోధకుడా, వీడు గుడ్డివాడై పుట్టుటకు ఎవడు
పాపము చేసెను? వీడా, వీని కన్నవారా? అని ఆయ
3 నను అడుగగా । యేసు—వీడైనను వీని కన్నవారైనను
పాపము చేయలేదు గాని, దేవుని క్రియలు వీని
యందు ప్రత్యక్షపరచబడుటకే వీడు గుడ్డివాడుగా
4 పుట్టెను. । పగలున్నంతవరకు నన్ను పంపినవాని
క్రియలు మనము చేయుచుండవలెను; రాత్రి వచ్చు
5 చున్నది, అప్పుడెవడును పనిచేయలేడు. । నేను ఈ
లోకములో ఉన్నప్పుడు లోకమునకు వెలుగై యున్నా
6 నని చెప్పెను. । ఆయన ఇట్లు చెప్పి నేలమీద ఉమ్మి
వేసి, ఉమ్మితో బురదచేసి, వాని కన్నులమీద ఆ బురద
7 పూసి ।—నీవు సిలోయము కోనేటికి వెళ్లి అందులో
కడుగుకొనుమని చెప్పెను. సిలోయమను మాటకు
పంపబడినవాడని అర్థము. వాడు వెళ్లి కడుగుకొని
8 చూపు గలవాడై వచ్చెను. । కాబట్టి పొరుగువారును,
వాడు భిక్షకుడని అంతకుముందు చూచినవారును—
వీడు కూర్చుండి భిక్షమెత్తుకొనువాడు కాడా అనిరి. ।
9 వీడే అని కొందరును; వీడు కాడు, వీని పోలియున్న
యొకడని మరికొందరును అనిరి; వాడైతే—నేనే
10 యనెను. । వారు—నీ కన్నులేలాగు తెరవబడెనని వాని
11 నడుగగా । వాడు—యేసు అను నొక మనుష్యుడు
బురద చేసి నా కన్నులమీద పూసి—నీవు సిలోయ
మను కోనేటికి వెళ్లి కడుగుకొనుమని నాతో చెప్పెను;
12 నేను వెళ్లి కడుగుకొని చూపు పొందితిననెను. । వారు
—ఆయన ఎక్కడనని అడుగగా వాడు—నేనెరుగ
ననెను.

13 అంతకుముందు గుడ్డియై యుండినవానిని వారు
14 పరిసయ్యులయొద్దకు తీసికొనిపోయిరి. । యేసు బురద
చేసి వాని కన్నులు తెరచిన దినము విశ్రాంతిదినము ।
15 వాడేలాగు చూపుపొందెనో దానిగూర్చి పరిసయ్యులు
కూడ వానిని మరల అడుగగా వాడు—నా కన్నుల
మీద ఆయన బురద ఉంచగా నేను కడుగుకొని
16 చూపు పొందితినని వారితో చెప్పెను. । కాగా పరి
సయ్యులలో కొందరు—ఈ మనుష్యుడు విశ్రాంతి
దినము నాచరించుటలేదు గనుక దేవుని యొద్దనుండి
వచ్చినవాడు కాడనిరి. మరికొందరు—పాపియైన
మనుష్యుడు ఈలాటి సూచకక్రియలేలాగు చేయగల
17 డనిరి; ఇట్లు వారిలో భేదము పుట్టెను. । కాబట్టి వారు
మరల ఆ గుడ్డివాని పిలిచి—అతడు నీ కన్నులు తెరచి
నందుకు నీవతనిగూర్చి యేమనుకొనుచున్నావని
యడుగగా వాడు—ఆయన ఒక ప్రవక్త అనెను. ।
యూదులు వాడు గుడ్డివాడైయుండి చూపు పొందెనని 18
నమ్మక, చూపు పొందినవాని తలిదండ్రులను పిలి
పించి ।—గుడ్డివాడై పుట్టెనని మీరు చెప్పు మీ కుమా 19
రుడు వీడేనా? ఆలాగైతే ఇప్పుడు వీడేలాగు చూచు
చున్నాడని వారిని అడిగిరి. । అందుకు వాని తలిదం 20
డ్రులు—వీడు మా కుమారుడనియు వీడు గుడ్డివాడుగా
పుట్టెననియు మేమెరుగుదుము. । ఇప్పుడు వీడేలాగు 21
చూచుచున్నాడో యెరుగము; ఎవడు వీని కన్నులు
తెరచెనో అదియు మేమెరుగము; వీడు వయస్సు
వచ్చినవాడు, వీనినే అడుగుడి; తన సంగతి తానే
చెప్పుకొనగలడని వారితో అనిరి. । వాని తలిదండ్రులు 22
యూదులకు భయపడి ఆలాగు చెప్పిరి; యెందు
కనిన ఆయన క్రీస్తు అని యెవడైనను ఒప్పుకొనిన
యెడల వానిని సమాజమందిరములోనుండి వెలివేతు
మని యూదులు అంతకుమునుపు నిర్ణయించుకొని
యుండిరి. । కావున వాని తలిదండ్రులు—వాడు 23
వయస్సు వచ్చినవాడు; వానిని అడుగుడనిరి. । కాబట్టి 24
వారు గుడ్డివాడైయుండిన మనుష్యుని రెండవ మారు
పిలిపించి—దేవుని మహిమపరచుము; ఈ మనుష్యుడు
పాపి యని మేమెరుగుదుమని వానితో చెప్పగా ।
వాడు—ఆయన పాపియో కాడో నేనెరుగను; 25
ఒకటి మాత్రము నేనెరుగుదును; నేను గుడ్డివాడనై
యుండి ఇప్పుడు చూచుచున్నాననెను. । అందుకు 26
వారు—ఆయన నీకేమి చేసెను? నీ కన్నులు ఏలాగు
తెరచెనని మరల వానిని అడుగగా । వాడు—ఇందాక 27
మీతో చెప్పితినే గాని మీరు వినకపోతిరి; మీ
రెందుకు మరల వినగోరుచున్నారు? మీరును ఆయన
శిష్యులగుటకు కోరుచున్నారా యేమి అని వారితో
అనెను. । అందుకు వారు—నీవే వాని శిష్యుడవు, మేము 28
మోషే శిష్యులము; । దేవుడు మోషేతో మాటలాడెనని 29
యెరుగుదుము గాని వీడెక్కడనుండి వచ్చెనో యెరుగ
మని చెప్పి వాని దూషించిరి. । అందుకు ఆ మనుష్యుడు 30
—ఆయన ఎక్కడనుండి వచ్చెనో మీరెరుగకపోవుట
ఆశ్చర్యమే; అయినను ఆయన నా కన్నులు తెరచెను. ।
దేవుడు పాపుల మనవి ఆలకింపడని యెరుగుదుము; 31
ఎవడైన దేవభక్తుడై యుండి ఆయన చిత్తముచొప్పున
జరిగించినయెడల ఆయన వాని మనవి ఆలకించును. ।
పుట్టు గుడ్డివాని కన్నులెవడైన తెరచినట్టు లోకము 32
పుట్టినప్పటినుండి వినబడలేదు. । ఈయన దేవునియొద్ద 33
నుండి వచ్చినవాడు కానిపక్షమున ఏమియు చేయనేర
డని వారితో చెప్పెను. । అందుకు వారు—నీవు కేవ 34
లము పాపివై పుట్టినవాడవు, నీవు మాకు బోధింప
వచ్చితివా అని వానితో చెప్పి వాని వెలివేసిరి.

35 (పరిసయ్యులు) వాని వెలివేసిరని యేసు విని వాని
కనుగొని — నీవు దేవుని కుమారునియందు[1] విశ్వాస
36 ముంచుచున్నావా అని అడిగెను. । అందుకు వాడు
— ప్రభువా, నేను ఆయనయందు విశ్వాసముంచుటకు
37 ఆయన ఎవడని అడుగగా । యేసు — నీవాయనను
చూచుచున్నావు; నీతో మాటలాడుచున్నవాడు
38 ఆయనే అనెను. । అంతట వాడు — ప్రభువా, నేను
విశ్వసించుచున్నానని చెప్పి ఆయనకు నమస్కారము
39 చేసెను. । అప్పుడు యేసు — చూడనివారు చూడవలె
ననియు, చూచువారు గుడ్డివారు కావలెననియు, తీర్పు
తీర్చుటకై నేనీలోకమునకు వచ్చితినని చెప్పెను. ।
40 ఆయనయొద్దనున్న పరిసయ్యులలో కొందరు ఈ
మాట విని — మేమును గుడ్డివారమా అని అడిగిరి. ।
41 అందుకు యేసు—మీరు గుడ్డివారైతే మీకు పాపము
లేకపోవునుగాని — చూచుచున్నామని మీరిప్పుడు
చెప్పుకొనుచున్నారు గనుక మీ పాపము నిలిచి
యున్నదని చెప్పెను.

**10** గొర్రెల దొడ్డిలో ద్వారమున ప్రవేశింపక వేరొక
మార్గమున ఎక్కువాడు దొంగయు దోచుకొనువాడునై
2 యున్నాడు. । ద్వారమున ప్రవేశించువాడు గొర్రెల
3 కాపరి. । అతనికి ద్వారపాలకుడు తలుపు తీయును,
గొర్రెలు అతని శబ్దము వినును, అతడు స్వకీయమైన
గొర్రెలను పేరుపెట్టి పిలిచి వాటిని వెలపలికి నడిపిం
4 చును. । మరియు అతడు స్వకీయమైన గొర్రెలనన్ని
టిని వెలపలికి నడిపించునప్పుడెల్ల వాటికి ముందుగా
నడుచును; గొర్రెలు అతని శబ్దమెరుగును గనుక అవి
5 అతని వెంబడించును. । అన్యుల శబ్దము అవి యెరు
గవు గనుక అన్యుని ఎంతమాత్రమును వెంబడింపక
వానియొద్దనుండి పారిపోవునని మీతో నిశ్చయముగా
6 చెప్పుచున్నానని వారితో అనెను. । ఈ సాదృశ్యము
యేసు వారితో చెప్పెను గాని ఆయన తమతో చెప్పిన
సంగతులెట్టివో వారు గ్రహించుకొనలేదు.
7 కాబట్టి యేసు మరల వారితో ఇట్లనెను । —
8 గొర్రెలు పోవు ద్వారమును నేనే; నాకు ముందు
వచ్చినవారందరు దొంగలును దోచుకొనువారునై
9 యున్నారు; గొర్రెలు వారి శబ్దము వినలేదు. । నేనే
ద్వారమును; నా ద్వారా ఎవడైన లోపల ప్రవేశించిన
యెడల వాడు రక్షింపబడినవాడై, లోపలికి పోవుచు
10 బయటికి వచ్చుచు మేత మేయుచునుండును. । దొంగ
దొంగతనమును హత్యను నాశనమును చేయుటకు
వచ్చును గాని మరి దేనికిని రాడు; గొర్రెలకు జీవము
కలుగుటకును అది సమృద్ధిగా కలుగుటకును నేను
వచ్చితినని మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. ।
నేను గొర్రెలకు మంచికాపరిని; మంచి కాపరి గొర్రెల
కొరకు తన ప్రాణము పెట్టును. । జీతగాడు గొర్రెల
కాపరికాడు గనుక గొర్రెలు తనవికానందున తోడేలు
వచ్చుట చూచి గొర్రెలను విడిచిపెట్టి పారిపోవును;
తోడేలు ఆ గొర్రెలను పట్టి చెదరగొట్టును. । జీతగాడు 13
జీతగాడే గనుక గొర్రెలనుగూర్చి లక్ష్యముచేయక
పారిపోవును. । నేను గొర్రెల మంచి కాపరిని. । తండ్రి 14
నన్ను ఏలాగున ఎరుగునో నేను తండ్రిని ఏలాగు ఎరు 15
గుదునో ఆలాగే నేను నా గొర్రెలను ఎరుగుదును,
నా గొర్రెలు నన్ను ఎరుగును. మరియు గొర్రెలకొరకు
నా ప్రాణము పెట్టుచున్నాను. । ఈ దొడ్డివికాని 16
వేరే గొర్రెలును నాకు కలవు; వాటినికూడ నేను
తోడుకొని రావలెను, అవి నా శబ్దము వినును, అప్పుడు
మంద యొక్కటియు గొర్రెల కాపరి యొక్కడును
అగును. । నేను దాని మరల తీసికొనునట్లు నా ప్రాణము 17
పెట్టుచున్నాను; ఇందువలననే నా తండ్రి నన్ను
ప్రేమించుచున్నాడు. । ఎవడును నా ప్రాణము తీసి 18
కొనడు; నా అంతట నేనే దాని పెట్టుచున్నాను; దాని
పెట్టుటకు నాకు అధికారము కలదు, దాని తిరిగి తీసి
కొనుటకును నాకు అధికారము కలదు; నా తండ్రి
వలన ఈ ఆజ్ఞ పొందితిననెను.

ఈ మాటలనుబట్టి యూదులలో మరల భేదము 19
పుట్టెను. । వారిలో అనేకులు—వాడు దయ్యము పట్టిన 20
వాడు వెర్రివాడు; వాని మాట ఎందుకు వినుచున్నా
రనిరి. । మరికొందరు — ఇవి దయ్యము పట్టినవాని 21
మాటలుకావు; దయ్యము గుడ్డివారి కన్నులు తెరవ
గలదా అని చెప్పిరి.

ఆలయ ప్రతిష్ఠితపండుగ యెరూషలేములో జరుగు 22
చుండెను. । అది శీతకాలము. అప్పుడు యేసు దేవా 23
లయములో సొలొమోను మంటపమున తిరుగుచుం
డగా । యూదులు ఆయనచుట్టు పోగై — యెంత 24
కాలము మమ్మును సందేహపెట్టుదువు? నీవు క్రీస్తువైతే
మాతో స్పష్టముగా చెప్పుమనిరి. । అందుకు యేసు— 25
మీతో చెప్పితిని గాని మీరు నమ్మరు; నేను నా తండ్రి
నామమందు చేయుచున్న క్రియలు నన్నుగూర్చి
సాక్ష్యమిచ్చుచున్నవి. । అయితే మీరు నా గొర్రె 26
లలో చేరినవారు కారు గనుక మీరు నమ్మరు. । నా 27
గొర్రెలు నా శబ్దము వినును, నేను వాటి నెరుగుదును,
అవి నన్ను వెంబడించును. । నేను వాటికి నిత్యజీవము 28
నిచ్చుచున్నాను గనుక అవి ఎన్నటికిని నశింపవు, ఎవ
డును వాటిని నా చేతిలోనుండి అపహరింపడు. ।
వాటిని నాకిచ్చిన నా తండ్రి అందరికంటె గొప్పవాడు 29
గనుక నా తండ్రిచేతిలోనుండి యెవడును వాటిని అప
హరింపలేడు; । నేనును తండ్రియును ఏకమై యున్నా 30
మని వారితో చెప్పెను. । యూదులు ఆయనను కొట్ట 31
వలెనని మరల రాళ్లు చేత పట్టుకొనగా । యేసు — 32
తండ్రి యొద్దనుండి అనేకమైన మంచి క్రియలను

1 అనేక ప్రాచీనప్రతులలో—మనుష్యకుమారునియందు అని పాఠాంతరము.

మీకు చూపితిని; వాటిలో ఏ క్రియ నిమిత్తము నన్ను
రాళ్లతో కొట్టుదురని వారినడిగెను. । అందుకు
యూదులు—నీవు మనుష్యుడవైయుండి దేవుడనని చెప్పు
కొనుచున్నావు గనుక దేవదూషణ చేసినందుకే నిన్ను
రాళ్లతో కొట్టుదుము గాని మంచి క్రియ చేసినందుకు
కాదని ఆయనతో చెప్పిరి. । అందుకు యేసు—మీరు
దైవములని నేనంటినని మీ ధర్మశాస్త్రములో వ్రాయబడి
యుండలేదా?[1] । లేఖనము నిరర్థకము కానేరదు గదా;
దేవుని వాక్యమెవరికి వచ్చెనో వారే దైవములని చెప్పిన
యెడల—నేను దేవుని కుమారుడనని చెప్పినందుకు, ।
6 తండ్రి ప్రతిష్ఠచేసి యీ లోకములోకి పంపినవానితో
—నీవు దేవదూషణ చేయుచున్నావని చెప్పుదురా? ।
7 నేను నా తండ్రి క్రియలు చేయనియెడల నన్ను నమ్మ
8 కుడి, । చేసినయెడల నన్ను నమ్మకున్నను, తండ్రి నా
యందును నేను తండ్రియందును ఉన్నామని మీరు
గ్రహించి తెలిసికొనునట్లు ఆ క్రియలను నమ్ముడని
9 వారితో చెప్పెను. । వారు మరల ఆయనను పట్టుకొన
చూచిరిగాని ఆయన వారి చేతినుండి తప్పించుకొని
పోయెను.

10 యొర్దాను అద్దరిని యోహాను మొదట బాప్తిస్మ
మిచ్చుచుండిన స్థలమునకు ఆయన తిరిగి వెళ్లి అక్కడ
41 నుండెను. । అనేకులు ఆయనయొద్దకు వచ్చి—యోహాను
ఏ సూచకక్రియను చేయలేదు గాని యీయనను
గూర్చి యోహాను చెప్పిన సంగతులన్నియు సత్యమైన
42 వనిరి. । అక్కడ అనేకులు ఆయనయందు విశ్వాస
ముంచిరి.

**11** మరియ, ఆమె సహోదరియైన మార్త, అనువారి
గ్రామమైన బేతనియలోనున్న లాజరు అను ఒకడు
2 రోగియాయెను. । ఈ లాజరు ప్రభువుకు అత్తరు పూసి
తలవెండ్రుకలతో ఆయన పాదములు తుడిచిన మరి
3 యకు సహోదరుడు. । అతని అక్కచెల్లెండ్లు —
ప్రభువా, యిదిగో నీవు ప్రేమించువాడు రోగియై
యున్నాడని ఆయనయొద్దకు వర్తమానము పంపిరి. ।
4 యేసు అది విని—యీ వ్యాధి మరణార్థమై వచ్చినది
కాదు గాని దేవుని కుమారుడు దానివలన మహిమ
పరచబడునట్లు దేవుని మహిమార్థమై వచ్చినదనెను. ।
5 యేసు మార్తను ఆమె సహోదరిని లాజరును ప్రేమిం
6 చెను. । అతడు రోగియైయున్నాడని యేసు విని
నప్పుడు తానున్నచోటనే యింక రెండుదినములు నిలి
7 చెను. । అటుపిమ్మట ఆయన—మనము యూదైయకు
8 తిరిగి వెళ్లుదమని తన శిష్యులతో చెప్పగా । ఆయన
శిష్యులు—బోధకుడా, యిప్పుడే యూదులు నిన్ను
రాళ్లతో కొట్ట చూచుచుండిరే; అక్కడికి తిరిగి వెళ్లు
9 దువా అని ఆయన నడిగిరి. । అందుకు యేసు—పగలు
పన్నెండు గంటలున్నవి గదా; ఒకడు పగటివేళ నడి
చినయెడల ఈ లోకపు వెలుగును చూచును గనుక
తొట్రుపడడు. । అయితే రాత్రివేళ ఒకడు నడిచిన 10
యెడల వానియందు వెలుగులేదు గనుక వాడు తొట్రు
పడునని చెప్పెను. । ఆయన ఈ మాటలు చెప్పిన 11
తరువాత — మన స్నేహితుడైన లాజరు నిద్రించు
చున్నాడు; అతని మేలుకొలుప వెళ్లుచున్నానని
వారితో చెప్పగా । శిష్యులు — ప్రభువా, అతడు 12
నిద్రించినయెడల బాగుపడుననిరి. । యేసు అతని మరణ 13
మును గూర్చి ఆ మాట చెప్పెను గాని వారు ఆయన
నిద్ర విశ్రాంతిని గూర్చి చెప్పెననుకొనిరి. । కావున 14
యేసు — లాజరు చనిపోయెను, మీరు నమ్మునట్లు 15
నేనక్కడ ఉండలేదని మీ నిమిత్తము సంతోషించు
చున్నాను; అయినను అతనియొద్దకు మనము వెళ్లుదము
రండని స్పష్టముగా వారితో చెప్పెను. । అందుకు 16
దిదుమ అనబడిన తోమా—ఆయనతోకూడ చనిపోవు
టకు మనమును వెళ్లుదమని తనతోటి శిష్యులతో
చెప్పెను.

యేసు వచ్చి అదివరకే అతడు నాలుగు దినములు 17
సమాధిలో ఉండెనని తెలిసికొనెను. । బేతనియ 18
యెరూషలేమునకు సమీపమై యుండెను; దానికి ఇంచు
మించు కోసెడు దూరము । గనుక యూదులలో 19
అనేకులు వారి సహోదరునిగూర్చి మార్తను మరియను
పరామర్శించుటకై వారియొద్దకు వచ్చియుండిరి. ।
మార్త యేసు వచ్చుచున్నాడని విని ఆయనను ఎదు 20
ర్కొన వెళ్లెను గాని మరియ యింటిలో కూర్చుండి
యుండెను. । మార్త యేసును చూచి — ప్రభువా, 21
నీవిక్కడ ఉండినయెడల నా సహోదరుడు చావ
కుండును. । ఇప్పుడైనను నీవు దేవుని ఏమడిగినను దేవుడు 22
నీకనుగ్రహించునని యెరుగుదుననెను. । యేసు — నీ 23
సహోదరుడు మరల లేచునని ఆమెతో చెప్పగా ।
మార్త ఆయనను చూచి—అంత్యదినమున పునరుత్థాన 24
మందు లేచునని యెరుగుదుననెను. । అందుకు యేసు— 25
నేనే పునరుత్థానమును జీవమునై యున్నాను; నా
యందు విశ్వాసముంచువాడు చనిపోయినను బ్రదు
కును; । బ్రదికి నాయందు విశ్వాసముంచు ప్రతివాడు 26
ఎన్నటికిని చనిపోడు. ఈ మాట నమ్ముచున్నావా అని
ఆమె నడిగెను. । ఆమె — అవును ప్రభువా, నీవు 27
లోకమునకు రావలసిన దేవుని కుమారుడవైన క్రీస్తువని
నమ్ముచున్నానని ఆయనతో చెప్పెను. । ఆమె యీ 28
మాట చెప్పి వెళ్లి—బోధకుడు వచ్చి నిన్ను పిలుచు
చున్నాడని చెప్పి తన సహోదరియైన మరియను
రహస్యముగా పిలిచెను. । ఆమె విని త్వరగా లేచి 29
ఆయనయొద్దకు వచ్చెను. । యేసు ఇంక ఆ గ్రామము 30
లోకి రాక, మార్త ఆయనను కలిసికొనిన చోటనే
యుండెను । గనుక యింటిలో మరియతో కూడనుండి 31

[1] కీర్తన, 82: 6.

ఆమెను పరామర్శించుచుండిన యూదులు మరియ
త్వరగా లేచి వెళ్లుట చూచి, ఆమె సమాధియొద్ద ఏడ్చు
టకు అక్కడికి వెళ్లుచున్నదనుకొని ఆమె వెంట
32 వెళ్లిరి. । అంతట మరియ యేసు ఉన్నచోటికి వచ్చి
ఆయనను చూచి ఆయన పాదములమీద పడి—
ప్రభువా, నీవిక్కడ ఉండినయెడల నా సహోదరుడు
33 చావకుండుననెను. । ఆమె యేడ్చుటయు, ఆమెతో
కూడ వచ్చిన యూదులు ఏడ్చుటయు యేసు చూచి
కలవరపడి ఆత్మలో మూలుగుచు—అతని నెక్కడ
34 నుంచితిరని అడుగగా, । వారు—ప్రభువా, వచ్చి
35 చూడుమని ఆయనతో చెప్పిరి. । యేసు కన్నీళ్లు విడి
36 చెను. । కాబట్టి యూదులు—అతనిని ఏలాగు ప్రేమిం
37 చెనో చూడుడని చెప్పుకొనిరి. । వారిలో కొందరు—
ఆ గుడ్డివాని కన్నులు తెరచినవాడైన యీయన యిత
38 నిని చావకుండ చేయలేడా అని చెప్పిరి. । యేసు మరల
తనలో మూలుగుచు సమాధియొద్దకు వచ్చెను. అది
యొక గుహ, దానిమీద ఒక రాయి పెట్టియుండెను. ।
39 యేసు—రాయి తీసివేయుడని చెప్పగా చనిపోయిన
వాని సహోదరియైన మార్త—ప్రభువా, అతడు చని
పోయి నాలుగు దినములైనది గనుక ఇప్పటికి వాసన
40 కొట్టునని ఆయనతో చెప్పెను. । అందుకు యేసు—
నీవు నమ్మినయెడల దేవుని మహిమ చూతువని నేను
41 నీతో చెప్పలేదా అని ఆమెతో అనెను; । అంతట
వారు ఆ రాయి తీసివేసిరి. యేసు కన్నులు పైకెత్తి—
తండ్రీ, నీవు నా మనవి వినినందున నీకు కృతజ్ఞతా
42 స్తుతులు చెల్లించుచున్నాను. । నీవు ఎల్లప్పుడును నా
మనవి వినుచున్నావని నేనెరుగుదును గాని నీవు నన్ను
పంపితివని చుట్టు నిలిచియున్న యీ జనసమూహము
నమ్మునట్లు వారినిమిత్తమై యీ మాట చెప్పితిననెను. ।
43 ఆయన ఆలాగు చెప్పి—లాజరూ, బయటికి రమ్మని
44 బిగ్గరగా చెప్పగా । చనిపోయినవాడు కాళ్లు చేతులు
ప్రేతవస్త్రములతో కట్టబడినవాడై వెలుపలికి వచ్చెను;
అతని ముఖమునకు రుమాలు కట్టియుండెను. అంతట
యేసు—మీరు అతని కట్లు విప్పి పోనియ్యుడని
వారితో చెప్పెను.

45 మరియయొద్దకు వచ్చి ఆయన చేసిన కార్యమును
చూచిన యూదులలో అనేకులు ఆయనయందు
46 విశ్వాసముంచిరికాని । వారిలో కొందరు పరిసయ్యుల
యొద్దకు వెళ్లి యేసుచేసిన కార్యములనుగూర్చి వారితో
చెప్పిరి.

47 కాబట్టి ప్రధానయాజకులును పరిసయ్యులును
మహా సభను సమకూర్చి—మనమేమి చేయుచున్నాము?
ఈ మనుష్యుడు అనేకమైన సూచకక్రియలు చేయు
48 చున్నాడే ; మన మాయనను ఈలాగు చూచుచు
ఊరకుండినయెడల అందరు ఆయనయందు విశ్వాస
ముంచెదరు; అప్పుడు రోమీయులువచ్చి మన స్థల
మును మన జనమును ఆక్రమించుకొందురని చెప్పిరి. ।
అయితే వారిలో కయప అను ఒకడు ఆ సంవత్సరము 49
ప్రధాన యాజకుడై యుండి—మీకేమియు తెలి
యదు. । (మన) జనమంతయు నశింపకుండునట్లు ఒక 50
మనుష్యుడు ప్రజలకొరకు చనిపోవుట మీకు ఉప
యుక్తమని మీరు ఆలోచించుకొనరు అని వారితో
చెప్పెను. । తనంతటతానే యీలాగు చెప్పలేదు గాని 51
ఆ సంవత్సరము ప్రధానయాజకుడై యుండెను గనుక ।
యేసు ఆ జనముకొరకును, ఆ జనముకొరకుమాత్రమే 52
గాక చెదరిపోయిన దేవుని పిల్లలను ఏకముగా సమ
కూర్చుటకును, చావనైయున్నాడని ప్రవచించెను. ।
కాగా ఆ దినమునుండి వారు ఆయనను చంప నాలో 53
చించుచుండిరి.

కాబట్టి యేసు అప్పటినుండి యూదులలో బహి 54
రంగముగా సంచరింపక, అక్కడనుండి అరణ్యమునకు
సమీపప్రదేశములోనున్న ఎఫ్రాయిమను ఊరికి వెళ్లి
అక్కడ తన శిష్యులతోకూడ నుండెను. । మరియు 55
యూదుల పస్కాపండుగ సమీపమై యుండెను
గనుక అనేకులు తమ్మునుతాము శుద్ధిచేసికొనుటకై
పస్కా రాకమునుపే పల్లెటూళ్లలోనుండి యెరూష
లేముకు వచ్చిరి. । వారు యేసును వెదకుచు దేవాలయ 56
ములో నిలువబడి—మీకేమి తోచుచున్నది? ఆయన
పండుగకు రాడా యేమి? అని యొకనితో నొకడు
చెప్పుకొనిరి. । ప్రధానయాజకులును పరిసయ్యులును 57
ఆయన ఎక్కడ ఉన్నది ఎవనికైనను తెలిసియున్న
పక్షమున తాము ఆయనను పట్టుకొనగలందులకై
తమకు తెలియజేయవలెనని ఆజ్ఞాపించి యుండిరి.

మృతులలోనుండి యేసుచేత లేపబడిన లాజరు 12
ఉన్న బేతనియకు యేసు పస్కాపండుగకు ఆరు దిన
ములు ముందుగా వచ్చెను. అక్కడ వారు ఆయన
కొరకు విందు చేసిరి. । మార్త ఉపచారము చేసెను; 2
లాజరు ఆయనతోకూడ భోజనమునకు కూర్చున్న
వారిలో ఒకడు. । అప్పుడు మరియ మిక్కిలి విలువగల 3
అచ్చ జటామాంసి అత్తరు ఒక సేరున్నర యెత్తు తీసి
కొని, యేసు పాదములకు పూసి తన తలవెండ్రుకలతో
ఆయన పాదములు తుడిచెను; ఇల్లు ఆ అత్తరు వాసనతో
నిండెను. । ఆయన శిష్యులలో ఒకడు, అనగా ఆయ 4
నను అప్పగింపనైయున్న ఇస్కరియోతు యూదా ।
—యీ అత్తరెందుకు మున్నూరు దేనారములకు 5
అమ్మి[1] బీదలకు ఇయ్యలేదనెను. । వాడీలాగు చెప్పినది 6
బీదలమీద శ్రద్ధకలిగి కాదుగాని వాడు దొంగయై
యుండి, తన దగ్గిర డబ్బు సంచి యుంచుకొని అం
దులో వేయబడినది ఎత్తికొని పోవుచువచ్చెను గనుక
ఆలాగు చెప్పెను. । కాబట్టి యేసు—నన్ను పాతి 7

1 ఇది ఇంచుమించు 150 రూపాయిలు కావచ్చును.

పెట్టు దినమునకు ఆమెను దీని నుంచుకొననియ్యుడి; ।
8 బీదలు ఎల్లప్పుడును మీతోకూడ ఉందురుగాని
నేనెల్లప్పుడు మీతో ఉండనని చెప్పెను.

9 యూదులలో సామాన్యజనులు ఆయన అక్కడ
ఉన్నాడని తెలిసికొని, యేసును చూచుటకు మాత్రమే
గాక మృతులలోనుండి ఆయన లేపిన లాజరునుకూడ
10 చూడవచ్చిరి. । అతని చూచిన యూదులలో అనే
11 కులు తమవారిని విడిచి యేసునందు విశ్వాసముంచిరి
గనుక ప్రధానయాజకులు లాజరునుకూడ చంప నాలో
చనచేసిరి.

12 మరునాడు ఆ పండుగకు వచ్చిన బహు జనసమూ
హము యేసు యెరూషలేముకు వచ్చుచున్నాడని విని ।
13 ఖర్జూరపుమట్టలు పట్టుకొని ఆయనను ఎదుర్కొన
బోయి — జయము, ప్రభువు పేరట వచ్చుచున్న
ఇశ్రాయేలు రాజు స్తుతింపబడుగాక అని కేకలువేసిరి.
14 —సీయోను కుమారీ భయపడకుము, ఇదిగో నీ రాజు
15 గాడిదె పిల్లమీద ఆసీనుడై వచ్చుచున్నాడు[1]
అని వ్రాయబడిన ప్రకారము యేసు ఒక చిన్న గాడి
16 దెను కనుగొని దానిమీద కూర్చుండెను. । ఆయన
శిష్యులు ఈ మాటలు మొదట గ్రహింపలేదు గాని
యేసు మహిమపరచబడినప్పుడు అవి ఆయననుగూర్చి
వ్రాయబడెననియు, వారాయనకు వాటిని చేసిరనియు
17 జ్ఞాపకమునకు తెచ్చుకొనిరి. । ఆయన లాజరును
సమాధిలోనుండి పిలిచి మృతులలోనుండి అతని లేపి
నప్పుడు ఆయనతోకూడ ఉండిన జనులు సాక్ష్య
18 మిచ్చిరి. । అందుచేత ఆయన ఆ సూచకక్రియ చేసె
నని జనులు విని ఆయనను ఎదుర్కొనబోయిరి. ।
19 కావున పరిసయ్యులు ఒకరితో ఒకరు—మన ప్రయ
త్నములెట్లు నిష్ప్రయోజనమై పోయినవో చూడుడి.
ఇదిగో లోకము ఆయనవెంట పోయినదని చెప్పు
కొనిరి.

20 ఆ పండుగలో ఆరాధింపవచ్చినవారిలో కొందరు
21 హెల్లేనీయులుండిరి. । వారు గలిలైయలోని బేత్స
యిదావాడైన ఫిలిప్పునొద్దకు వచ్చి—అయ్యా, మేము
యేసును చూడగోరుచున్నామని అతనితో చెప్పగా ।
22 ఫిలిప్పు వచ్చి అంద్రెయతో చెప్పెను, అంద్రెయయు
23 ఫిలిప్పును వచ్చి యేసుతో చెప్పిరి. । అందుకు యేసు
వారితో ఇట్లనెను — మనుష్యకుమారుడు మహిమ
24 పొందవలసిన గడియ వచ్చియున్నది. । గోధుమగింజ
భూమిలో పడి చావకుండినయెడల అది ఒంటిగానే
యుండును; అది చచ్చినయెడల విస్తారముగా ఫలిం
25 చును. । తన ప్రాణమును ప్రేమించువాడు దాని
నశింపజేయువాడు; ఈ లోకములో తన ప్రాణమును
ద్వేషించువాడు నిత్యజీవార్థమై దాని కాపాడువాడని
26 మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. । ఒకడు
నన్ను సేవించినయెడల నన్ను వెంబడింపవలెను;
అప్పుడు నేను ఎక్కడ ఉందునో అక్కడ నా సేవ
కుడును ఉండును; ఒకడు నన్ను సేవించినయెడల నా
తండ్రి అతని ఘనపరచును. । ఇప్పుడు నా ప్రాణము 27
కలవరపడుచున్నది; నేనేమందును? — తండ్రీ, యీ
గడియ నాకు తటస్థింపకుండ నన్ను తప్పించుము; అయి
నను ఇందుకోసరమే నేను ఈ గడియకు వచ్చితిని; ।
తండ్రీ, నీ నామము మహిమపరచుమని చెప్పెను. 28
అంతట— నేను దాని మహిమపరచితిని, మరల మహిమ
పరతును అను నొక శబ్దము ఆకాశమునుండి వచ్చెను. ।
కాబట్టి అక్కడ నిలుచుండి వినిన జనసమూహము — 29
ఉరిమెను అనిరి. మరికొందరు— దేవదూత యొకడు
ఆయనతో మాటలాడెననిరి. । అందుకు యేసు — ఈ 30
శబ్దము నాకొరకు రాలేదు మీకొరకే వచ్చెను. ।
ఇప్పుడు ఈ లోకమునకు తీర్పు జరుగుచున్నది; 31
ఇప్పుడు ఈ లోకాధికారి బయటకు తోసివేయ
బడును; । నేను భూమిమీదనుండి పైకెత్తబడినప్పుడు 32
అందరిని నాయొద్దకు ఆకర్షించుకొందునని చెప్పెను. ।
తాను ఏవిధముగా మరణము పొందవలసి యుండెనో 33
సూచించుచు ఆయన ఈ మాట చెప్పెను. । జనసమూ 34
హము — క్రీస్తు ఎల్లప్పుడు ఉండునని ధర్మశాస్త్రము
చెప్పుట వింటిమి.— మనుష్యకుమారుడు పైకెత్తబడవలె
నని నీవు చెప్పుచున్న సంగతి ఏమిటి? మనుష్యకుమా
రుడగు ఈయన ఎవడని ఆయన నడిగిరి. । అందుకు 35
యేసు — ఇంక కొంతకాలము వెలుగు మీమధ్య ఉం
డును; చీకటి మిమ్మును కమ్ముకొనకుండునట్లు మీకు
కలిగియున్న వెలుగు కొలది నడువుడి; చీకటిలో
నడుచువాడు తాను ఎక్కడికి పోవుచున్నాడో యెరు
గడు. । మీరు వెలుగు సంబంధులగునట్లు[2] మీకు కలిగి 36
యున్న వెలుగు కొలది వెలుగునందు విశ్వాసముంచు
డని వారితో చెప్పెను.

యేసు ఈ మాటలు చెప్పి వెళ్లి వారికి కనబడకుండ 37
దాగియుండెను. ఆయన వారియెదుట ఇన్ని సూచక
క్రియలుచేసినను వారాయనయందు విశ్వాసముంచ
రైరి.

— ప్రభువా, మా వర్తమానము నమ్మినవాడెవడు? 38
ప్రభువుయొక్క బాహువు ఎవనికి బయలు
పరచబడెను?[3]

అని ప్రవక్తయైన యెషయా చెప్పిన వాక్యము నెర
వేరునట్లు ఇది జరిగెను. । ఇందుచేత వారు నమ్మలేక 39
పోయిరి, ఏలయనగా— 40

వారు కన్నులతో చూచి హృదయముతో గ్రహించి
మనస్సు మార్చుకొని నావలన స్వస్థపరచబడ
కుండునట్లు ఆయన వారి కన్నులకు అంధత్వము
కలుగజేసి వారి హృదయము కఠినపరచెను

1 జెకర్యా, 9: 9. 2 మూలభాషలో—వెలుగు కుమారులగునట్లు. 3 యెషయా, 53: 1.

41 అని యెషయా మరియొక చోట చెప్పెను.[1] యెషయా
ఆయన మహిమను చూచినందున[2] ఆయననుగూర్చి
42 బోధించుచు ఈ మాటలు చెప్పెను. । అధికారులలో
అనేకులు ఆయనయందు విశ్వాసముంచిరి గాని సమా
జములోనుండి వెలివేయబడుదుమేమో యని పరి
43 సయ్యులకు భయపడి వారు ఒప్పుకొనలేదు. । వారు
దేవుని మెప్పుకంటె మనుష్యుల మెప్పును ఎక్కువగా
అపేక్షించిరి.

44 అంతట యేసు బిగ్గరగా ఇట్లనెను—నాయందు
విశ్వాసముంచువాడు నాయందు కాదు నన్ను పంపిన
45 వానియందే విశ్వాసముంచుచున్నాడు. । నన్ను చూచు
వాడు నన్ను పంపినవానినే చూచుచున్నాడు. ।
46 నాయందు విశ్వాసముంచు ప్రతివాడు చీకటిలో
నిలిచియుండకుండునట్లు నేను ఈ లోకమునకు వెలు
47 గుగా వచ్చియున్నాను. । ఎవడైనను నా మాటలు
వినియు వాటిని గైకొనకుండిన పక్షమున నేనతనికి
తీర్పు తీర్చను; నేను లోకమును రక్షించుటకే వచ్చి
తినిగాని లోకమునకు తీర్పు తీర్చుటకు రాలేదు. ।
48 నన్ను నిరాకరించి నా మాటలను అంగీకరింపనివానికి
తీర్పు తీర్చువాడొకడు కలడు; నేను చెప్పిన మాటయే
49 అంత్యదినమందు వానికి తీర్పు తీర్చును. । ఏలయనగా
నాయంతట నేనే మాటలాడలేదు; నేను ఏమన
వలెనో యేమి మాటలాడవలెనో దానిగూర్చి నన్ను
50 పంపిన తండ్రియే నాకాజ్ఞ ఇచ్చియున్నాడు. । మరి
యు ఆయన ఆజ్ఞ నిత్యజీవమని నేనెరుగుదును గనుక
నేను చెప్పు సంగతులను తండ్రి నాతో చెప్పిన
ప్రకారము చెప్పుచున్నాననెను.

13 తాను ఈ లోకమునుండి తండ్రియొద్దకు వెళ్ల
వలసిన గడియ వచ్చెనని యేసు పస్కాపండుగకు
ముందే యెరిగినవాడై, లోకములోనున్న తనవారిని
ప్రేమించి వారిని సంపూర్ణముగా[3] ప్రేమించెను. ।
2 వారు భోజనము చేయుచుండగా ఆయనను అప్పగింప
వలెనని సీమోను కుమారుడగు ఇస్కరియోతు యూదా
హృదయములో అపవాది[4] యింతకుముందు ఆలో
3 చన పుట్టించి యుండెను గనుక । తండ్రి తన చేతికి
సమస్తము అప్పగించెననియు, తాను దేవునియొద్ద
నుండి బయలుదేరి వచ్చెననియు, దేవునియొద్దకు వెళ్ల
4 వలసియున్నదనియు యేసు ఎరిగి । భోజనపంక్తిలో
నుండి లేచి తన పైవస్త్రము అవతల పెట్టివేసి, యొక
5 తువాలు తీసికొని నడుముకు కట్టుకొనెను. । అంతట
పళ్లెములో నీళ్లుపోసి శిష్యుల పాదములు కడుగుట
కును, తాను కట్టుకొనియున్న తువాలుతో తుడు
6 చుటకును మొదలుపెట్టెను. । ఇట్లు చేయుచు ఆయన
సీమోను పేతురునొద్దకు వచ్చినప్పుడు అతడు —
ప్రభువా, నీవు నా పాదములు కడుగుదువా అని

ఆయనతో అనెను. । అందుకు యేసు—నేను చేయు 7
చున్నది ఇప్పుడు నీకు తెలియదుగాని యికమీదట
తెలిసికొందువని అతనితో! చెప్పగా । పేతురు — 8
నీవెన్నడును నా పాదములు కడుగరాదని ఆయనతో
అనెను. అందుకు యేసు — నేను నిన్ను కడుగని
యెడల నాతో నీకు పాలు లేదనెను. । సీమోను 9
పేతురు—ప్రభువా, నా పాదములు మాత్రమే గాక
నా చేతులు నా తలకూడ కడుగుమని ఆయనతో
చెప్పెను. । యేసు అతని చూచి — స్నానము చేసిన 10
వాడు పాదములు తప్ప మరేమియు కడుగుకొన
నక్కరలేదు, అతడు కేవలము పవిత్రుడయ్యెను.
మీరును పవిత్రులు కాని మీలో అందరు పవి
త్రులు కారనెను. । తన్ను అప్పగించువానిని ఎరి 11
గెను గనుక — మీలో అందరు పవిత్రులు కారని
ఆయన చెప్పెను.

వారి పాదములు కడిగి తన పైవస్త్రము వేసికొనిన 12
తరువాత ఆయన మరల కూర్చుండి — నేను మీకు
చేసిన పని మీకు తెలిసినదా? । బోధకుడనియు ప్రభు 13
వనియు మీరు నన్ను పిలుచుచున్నారు; నేను మీకు
బోధకుడను ప్రభువును గనుక మీరిట్లు పిలుచుట
న్యాయమే. । కాబట్టి ప్రభువును బోధకుడనైన నేను 14
మీ పాదములు కడిగినయెడల మీరు ఒకరి పాదము
లను ఒకరు కడుగవలసినదే. । నేను మీకు చేసిన 15
ప్రకారము మీరును చేయవలెనని మీకు మాదిరిగా
ఈలాగు చేసితిని. । దాసుడు తన యజమానునికంటె 16
గొప్పవాడు కాడు, అపొస్తలుడు[5] తన్ను పంపినవాని
కంటె గొప్పవాడు కాడని మీతో నిశ్చయముగా
చెప్పుచున్నాను. । ఈ సంగతులు మీరు ఎరుగుదురు 17
గనుక వీటిని చేసినయెడల మీరు ధన్యులగుదురు. ।
మిమ్ము నందరినిగూర్చి నేను చెప్పలేదు; నేను ఏర్ప 18
రచుకొనినవారిని ఎరుగుదును గాని

— నాతోకూడ భోజనముచేయువాడు నాకు
విరోధముగా తన మడమ ఎత్తెను[6]

అను లేఖనము నెరవేరుటకై (యీలాగు జరుగును.) ।
జరిగినప్పుడు నేనే ఆయనని మీరు నమ్మునట్లు అది 19
జరుగకమునుపు మీతో చెప్పుచున్నాను. । నేనెవని 20
పంపుదునో వాని చేర్చుకొనువాడు నన్ను చేర్చు
కొనువాడగును; నన్ను చేర్చుకొనువాడు నన్ను పంపిన
వాని చేర్చుకొనువాడగునని మీతో నిశ్చయముగా
చెప్పుచున్నానని వారితో అనెను.

యేసు ఈ మాటలు పలికిన తరువాత ఆత్మలో కల 21
వరపడి—మీలో ఒకడు నన్ను అప్పగించునని మీతో
నిశ్చయముగా చెప్పుచున్నానని రూఢిగా చెప్పెను ।
ఆయన ఎవనిగూర్చి యీలాగు చెప్పెనో అని శిష్యులు 22
సందేహపడుచు ఒకరితట్టు ఒకరు చూచుకొనుచుం

1 యెషయా, 6: 10. 2 యెషయా, 6: 1. 3 లేక, అంతమువరకు. 4 అనగా, సాతాను. 5 అనగా, పంపబడినవాడు. 6 కీర్త, 41: 9

డగా । ఆయన శిష్యులలో యేసు ప్రేమించిన యొ
కడు యేసు రొమ్మున ఆనుకొనుచుండెను । గనుక ఎవని
గూర్చి ఆయన చెప్పెనో అది తమకు చెప్పుమని
సీమోను పేతురు అతనికి సైగ చేసెను. । అతడు యేసు
రొమ్మున ఆనుకొనుచు—ప్రభువా, వాడెవడని ఆయనను
అడిగెను. । అందుకు యేసు—నేనొక ముక్క ముంచి
యెవని కిచ్చెదనో వాడే అని చెప్పి, యొక ముక్క
ముంచి సీమోను కుమారుడగు ఇస్కరియోతు యూదా
కిచ్చెను; । వాడు ఆ ముక్క పుచ్చుకొనగానే
సాతాను వానిలో ప్రవేశించెను. యేసు—నీవు చేయు
చున్నది త్వరగా చేయుమని వానితో చెప్పగా ।
ఆయన ఎందునిమిత్తము అతనితో ఆలాగు చెప్పెనో
అది భోజనమునకు కూర్చుండినవారిలో ఎవనికిని
తెలియలేదు. । డబ్బుసంచి యూదాయొద్ద ఉండెను
గనుక పండుగకు తమకు కావలసినవాటిని కొనుమని
గాయినను, బీదలకేమైన ఇమ్మనియైనను యేసు వానితో
చెప్పినట్టు కొందరనుకొనిరి. । వాడు ఆ ముక్క పుచ్చు
కొని వెంటనే బయటికి వెళ్లెను; అప్పుడు రాత్రివేళ.
వాడు వెళ్లిన తరువాత యేసు ఇట్లనెను—ఇప్పుడు
మనుష్యకుమారుడు మహిమపరచబడి యున్నాడు;
దేవుడును ఆయనయందు మహిమపరచబడి యున్నా
డు. । దేవుడు ఆయనయందు మహిమపరచబడిన
యెడల దేవుడు తనయందు ఆయనను మహిమపర
చును; వెంటనే ఆయనను మహిమపరచును. । పిల్ల
లారా, యింక కొంతకాలము మీతోకూడ ఉందును;
మీరు నన్ను వెదకుదురు, నేనెక్కడికి వెళ్లుదునో
అక్కడికి మీరు రాలేరని నేను యూదులతో
చెప్పినప్రకారము ఇప్పుడు మీతోను చెప్పుచున్నా
ను. । మీరు ఒకనినొకడు ప్రేమింపవలెనని మీకు
క్రొత్త ఆజ్ఞ ఇచ్చుచున్నాను; నేను మిమ్మును ప్రేమించి
నట్టే మీరును ఒకనినొకడు ప్రేమింపవలెను. । మీరు
ఒకనియెడల ఒకడు ప్రేమగలవారైనయెడల దీనిబట్టి
మీరు నా శిష్యులని అందరును తెలిసికొందురనెను.
సీమోను పేతురు — ప్రభువా, నీవెక్కడికి వెళ్లు
చున్నావని ఆయనను అడుగగా యేసు—నేను వెళ్లు
చున్నచోటికి నీవిప్పుడు నా వెంట రాలేవుగాని యిటు
తరువాత వచ్చెదవని అతనితో చెప్పెను. । అందుకు
పేతురు — ప్రభువా, నేనెందుకు ఇప్పుడు నీ వెంట
రాలేను? నీకొరకు నా ప్రాణము పెట్టుదునని ఆయ
నతో చెప్పగా । యేసు—నాకొరకు నీ ప్రాణము
పెట్టుదువా? ఆయనను ఎరుగనని నీవు ముమ్మారు
చెప్పకముందు కోడికూయదని నీతో నిశ్చయముగా
చెప్పుచున్నాననెను.

4 మీ హృదయమును కలవరపడనియ్యకుడి; దేవుని
యందు విశ్వాసముంచుచున్నారు[1] నాయందును విశ్వా
సముంచుడి. । నా తండ్రి యింట అనేక నివాసములు 2
కలవు, లేనియెడల మీతో చెప్పుదును; మీకు స్థలము
సిద్ధపరచ వెళ్లుచున్నాను. । నేను వెళ్లి మీకు స్థలము 3
సిద్ధపరచినప్పుడు, నేనుండు స్థలములో మీరును ఉండు
లాగున మరల వచ్చి నాయొద్ద నుండుటకు మిమ్మును
తీసికొని పోవుదును. । నేను వెళ్లుచున్న స్థలమునకు 4
మార్గము ఏదో మీకు తెలియునని చెప్పెను. । అం 5
దుకు తోమా—ప్రభువా, యెక్కడికి వెళ్లుచున్నావో
మాకు తెలియదు; ఆ మార్గమేలాగు తెలియుననని ఆయన
నడుగగా । యేసు — నేనే మార్గమును సత్యమును 6
జీవమునై యున్నాను; నా ద్వారానే తప్ప ఎవడును
తండ్రియొద్దకు రాడు. । మీరు నన్ను ఎరిగియుంటే 7
నా తండ్రిని ఎరిగియుందురు; ఇప్పటినుండి మీరాయ
నను ఎరుగుదురు, ఆయనను చూచియున్నారని చెప్పె
ను. । అప్పుడు ఫిలిప్పు—ప్రభువా, తండ్రిని మాకు 8
కనుపరచుము, మాకంతే చాలునని ఆయనతో చెప్ప
గా । యేసు — ఫిలిప్పూ, నేనింతకాలము మీ యొద్ద 9
ఉండినను నీవు నన్ను ఎరుగవా? నన్ను చూచిన
వాడు తండ్రిని చూచియున్నాడు గనుక తండ్రిని
మాకు కనుపరచుమని యేల చెప్పుచున్నావు? । తండ్రి 10
యందు నేనును నాయందు తండ్రియు ఉన్నామని
నీవు నమ్ముటలేదా? నేను మీతో చెప్పుచున్న మాటలు
నా అంతట నేనే చెప్పుట లేదు; తండ్రి నాయందు
నివసించుచు తన క్రియలు చేయుచున్నాడు. । తండ్రి 11
యందు నేనును నాయందు తండ్రియు ఉన్నామని
నమ్ముడి; లేదా యీ క్రియల నిమిత్తమైనను నన్ను
నమ్ముడి. । నేను తండ్రియొద్దకు వెళ్లుచున్నాను గనుక
నేను చేయు క్రియలు నాయందు విశ్వాసముంచు
వాడును చేయును, వాటికంటె మరి గొప్పవియు
అతడు చేయునని మీతో నిశ్చయముగా చెప్పుచు
న్నాను. । మీరు నా నామమునుబట్టి దేని నడుగుదురో
తండ్రి కుమారునియందు మహిమపరచబడుటకై దాని
చేతును. । నా నామమునుబట్టి మీరు నన్నేమి అడిగి 1
నను నేను చేతును. । మీరు నన్ను ప్రేమించినయెడల 15
నా ఆజ్ఞలను గైకొందురు. । నేను తండ్రిని వేడు 16
కొందును, మీయొద్ద ఎల్లప్పుడు ఉండుటకై ఆయన
వేరొక ఆదరణకర్తను,[2] అనగా సత్యస్వరూపియగు
ఆత్మను మీకనుగ్రహించును. । లోకము ఆయనను 17
చూడదు, ఆయనను ఎరుగదు గనుక ఆయనను పొంద
నేరదు; మీరు ఆయనను ఎరుగుదురు. ఆయన మీతో
కూడ నివసించును, మీలో ఉండును. । మిమ్మును 18
అనాథలనుగా విడువను, మీ యొద్దకు వత్తును. కొంత
కాలమైన తరువాత లోకము నన్ను మరి ఎన్నడును
చూడదు; । అయితే మీరు నన్ను చూతురు. నేను 19
బ్రదుకుచున్నాను గనుక మీరును బ్రదుకుదురు. ।

1 లేక, దేవునియందు విశ్వాసముంచుడి. 2 లేక, ఉత్తరవాది.

20 నేను నా తండ్రియందును, మీరు నాయందును,
నేను మీయందును ఉన్నామని ఆ దినమున మీరెరు
21 గుదురు. । నా ఆజ్ఞలను అంగీకరించి వాటిని గైకొను
వాడే నన్ను ప్రేమించువాడు; నన్ను ప్రేమించు
వాడు నా తండ్రివలన ప్రేమింపబడును; నేనును వాని
ప్రేమించి వానికి నన్ను ప్రత్యక్షపరచుకొందునని
22 చెప్పెను. । ఇస్కరియోతు కాని యూదా—ప్రభువా,
నీవు లోకమునకు కాక మాకు మాత్రమే నిన్ను నీవు
ప్రత్యక్షపరచుకొనుటకేమి సంభవించెనని అడుగగా ।
23 యేసు—ఒకడు నన్ను ప్రేమించువాడైతే నా మాట
గైకొనును, అప్పుడు నా తండ్రి వాని ప్రేమించును,
మేము వాని యొద్దకు వచ్చి వానియొద్ద నివాసము
24 చేతుము. । నన్ను ప్రేమింపనివాడు నా మాటలు
గైకొనడు; మీరు వినుచున్న మాట నా మాటకాదు,
నన్ను పంపిన తండ్రిదే.
25 నేను మీయొద్ద ఉండగానే యీ మాటలు మీతో
26 చెప్పితిని. । ఆదరణకర్త, అనగా తండ్రి నా నామమున
పంపబోవు పరిశుద్ధాత్మ[1] సమస్తమును మీకు బోధించి
నేను మీతో చెప్పిన సంగతులన్నిటిని మీకు జ్ఞాప
27 కము చేయును. । సమాధానము మీకనుగ్రహించి
వెళ్లుచున్నాను; నా సమాధానమే మీకనుగ్రహించు
చున్నాను; లోకమిచ్చునట్టుగా నేను మీకనుగ్రహిం
చుటలేదు; మీ హృదయమును కలవరపడనియ్యకుడి,
28 వెరవనియ్యకుడి. । నేను వెళ్లి మీయొద్దకు వచ్చెదనని
మీతో చెప్పిన మాట మీరు వింటిరి గదా. తండ్రి
నాకంటె గొప్పవాడు గనుక మీరు నన్ను ప్రేమించిన
యెడల నేను తండ్రియొద్దకు వెళ్లుచున్నానని మీరు
29 సంతోషింతురు. । ఈ సంగతి సంభవించినప్పుడు,
మీరు నమ్మవలెనని అది సంభవింపకమునుపే మీతో
30 చెప్పుచున్నాను. । ఇకను మీతో విస్తరించి మాట
లాడను; ఈ లోకాధికారి వచ్చుచున్నాడు, నాతో
31 వానికి సంబంధమేమియు లేదు. । అయినను నేను
తండ్రిని ప్రేమించుచున్నానని లోకము తెలిసికొను
నట్లు తండ్రి నాకు ఆజ్ఞాపించినది నెరవేర్చుటకు నేనీ
లాగు చేయుచున్నాను. లెండి యిక్కడనుండి వెళ్లు
దము.

15 నేను నిజమైన ద్రాక్షావల్లిని, నా తండ్రి వ్యవ
2 సాయకుడు. । నాలో ఫలింపని ప్రతి తీగెను ఆయన
తీసి పారవేయును; ఫలించు ప్రతి తీగె మరి ఎక్కు
వగా ఫలింపవలెనని దానిలోని (పనికిరాని) తీగెలను
3 తీసివేయును. । నేను మీతో చెప్పిన మాటనుబట్టి మీ
4 రిప్పుడు పవిత్రులై యున్నారు. । నాయందు నిలిచి
యుండుడి, మీయందు నేనును నిలిచియుందును.
తీగె ద్రాక్షావల్లిలో నిలిచియుంటేనేగాని తనంతట
తానే యేలాగు ఫలింపదో ఆలాగే నాయందు నిలిచి
యుంటేనేకాని మీరును ఫలింపరు. । ద్రాక్షావల్లిని 5
నేను, తీగెలు మీరు. ఎవడు నాయందు నిలిచియుం
డునో నేను ఎవనియందు నిలిచియుందునో వాడు
బహుగా ఫలించును; నాకు వేరుగా ఉండి మీరేమి
యు చేయలేరు. । ఎవడైనను నాయందు నిలిచియుం 6
డని పక్షమున వాడు తీగెవలె బయట పారవేయబడి
యెండిపోవును; మనుష్యులు అట్టివాటిని పోగుచేసి
అగ్నిలో పారవేతురు, అవి కాలిపోవును. । నా 7
యందు మీరును మీయందు నా మాటలును నిలిచి
యుండినయెడల మీకేది యిష్టమో అడుగుడి, అది
మీకు అనుగ్రహింపబడును. । మీరు బహుగా ఫలిం 8
చుటవలన నా తండ్రి మహిమపరచబడును; ఇటు
వలెనే మీరు నా శిష్యులగుదురు. । తండ్రి నన్ను 9
ఏలాగు ప్రేమించెనో నేనును మిమ్మును ఆలాగు ప్రే
మించితిని; నా ప్రేమయందు నిలిచియుండుడి. ।
నేను నా తండ్రి ఆజ్ఞలు గైకొని ఆయన ప్రేమ 10
యందు నిలిచియున్న ప్రకారము మీరును నా ఆజ్ఞలు
గైకొనినయెడల నా ప్రేమయందు నిలిచియుందురు. ।
మీయందు నా సంతోషము ఉండవలెననియు, మీ 11
సంతోషము పరిపూర్ణము కావలెననియు, ఈ సంగ
తులు మీతో చెప్పుచున్నాను. । నేను మిమ్మును 12
ప్రేమించిన ప్రకారము మీరొకనినొకడు ప్రేమింప
వలెననుటయే నా ఆజ్ఞ. । తన స్నేహితులకొరకు తన 13
ప్రాణము పెట్టువానికంటె ఎక్కువైన ప్రేమగల
వాడెవడును లేడు. । నేను మీకాజ్ఞాపించువాటిని 14
చేసినయెడల మీరు నా స్నేహితులై యుందురు. ।
దాసుడు తన యజమానుడు చేయుదాని ఎరుగడు 15
గనుక ఇకను మిమ్మును దాసులని పిలువక స్నేహితులని
పిలుచుచున్నాను, ఎందుకనగా నేను నా తండ్రివలన
వినిన సంగతులన్నియు మీకు తెలియజేసితిని. । మీరు 16
నన్ను ఏర్పరచుకొనలేదు; మీరు నా పేరట తండ్రిని
ఏమి అడుగుదురో అది ఆయన మీకనుగ్రహించునట్లు
మీరు వెళ్లి ఫలించుటకును, మీ ఫలము నిలిచియుండు
టకును నేను మిమ్మును ఏర్పరచుకొని నియమించితిని. ।
మీరు ఒకనినొకడు ప్రేమింపవలెనని యీ సంగతు 17
లను మీకు ఆజ్ఞాపించుచున్నాను. । లోకము మిమ్మును 18
ద్వేషించినయెడల మీకంటె ముందుగా నన్ను ద్వేషిం
చెనని మీరెరుగుదురు. । మీరు లోకసంబంధులైన 19
యెడల లోకము తనవారిని స్నేహించును; అయితే
మీరు లోకసంబంధులు కారు; నేను మిమ్మును లోక
ములోనుండి ఏర్పరచుకొంటిని; అందుచేతనే లోకము
మిమ్మును ద్వేషించుచున్నది. । — దాసుడు తన యజ 20
మానునికంటె గొప్పవాడు కాడని నేను మీతో చెప్పిన
మాట జ్ఞాపకముచేసికొనుడి. లోకులు నన్ను హింసిం
చినయెడల మిమ్మునుకూడ హింసింతురు; నా మాట

1 లేక, ఉత్తరవాది.

21 గైకొనినయెడల మీ మాటకూడ గైకొందురు. । అయితే
వారు నన్ను పంపినవానిని ఎరుగరు గనుక నా నామము
22 నిమిత్తము ఇవన్నియు మీకు చేయుదురు. । నేను
వచ్చి వారికి బోధింపకుండినయెడల వారికి పాపము
లేకపోవును; ఇప్పుడైతే వారి పాపమునకు మిషలేదు. ।
23 నన్ను ద్వేషించువాడు నా తండ్రినికూడ ద్వేషించు
24 చున్నాడు. । ఎవడును చేయని క్రియలు నేను వారి
మధ్యను చేయకుండినయెడల వారికి పాపము లేక
పోవును; ఇప్పుడైతే వారు నన్నును నా తండ్రిని
25 చూచి ద్వేషించియున్నారు. । అయితే

—నన్ను నిర్హేతుకముగా ద్వేషించిరి[1]

అని వారి ధర్మశాస్త్రములో వ్రాయబడిన వాక్యము
26 నెరవేరునట్లు ఈలాగు జరిగెను. । తండ్రియొద్దనుండి
మీయొద్దకు నేను పంపబోవు ఆదరణకర్త,[2] అనగా
తండ్రియొద్దనుండి బయలుదేరు సత్యస్వరూపియైన
ఆత్మ వచ్చినప్పుడు ఆయన నన్నుగూర్చి సాక్ష్యమిచ్చు
27 ను. । మీరు మొదటనుండి నాయొద్ద ఉన్నవారు
గనుక మీరును సాక్ష్యమిత్తురు.

16 మీరు అభ్యంతరపడకుండవలెనని యీ మాటలు
2 మీతో చెప్పుచున్నాను. । వారు మిమ్మును సమాజమం
దిరములలోనుండి వెలివేయుదురు; మిమ్మును చంపు
ప్రతివాడు తాను దేవునికి సేవచేయుచున్నాడని అను
3 కొను కాలము వచ్చుచున్నది. । వారు తండ్రిని
నన్నును తెలిసికొనలేదు గనుక ఈలాగు చేయుదురు. ।
4 అవి జరుగుకాలము వచ్చినప్పుడు నేను వాటినిగూర్చి
మీతో చెప్పితినని మీరు జ్ఞాపకము చేసికొనులాగున
ఈ సంగతులు మీతో చెప్పుచున్నాను; నేను మీతో
కూడ ఉంటిని గనుక మొదటనే వీటిని మీతో చెప్ప
5 లేదు. । ఇప్పుడు నన్ను పంపినవానియొద్దకు వెళ్లు
చున్నాను—నీవు ఎక్కడికి వెళ్లుచున్నావని మీలో
6 ఎవడును నన్నడుగుటలేదు గాని । నేను ఈ సంగ
తులు మీతో చెప్పినందున మీ హృదయము దుఃఖ
7 ముతో నిండియున్నది. । అయితే నేను మీతో
సత్యము చెప్పుచున్నాను, నేను వెళ్లిపోవుట మీకు
ప్రయోజనకరము; నేను వెళ్లనియెడల ఆదరణకర్త[2]
మీయొద్దకు రాడు; నేను వెళ్లినయెడల ఆయనను మీ
8 యొద్దకు పంపుదును. । ఆయన వచ్చి పాపమును
గూర్చియు నీతిని గూర్చియు తీర్పును గూర్చియు
9 లోకము ఒప్పుకొనజేయును. । లోకులు నాయందు
11 విశ్వాసముంచలేదు గనుక పాపమును గూర్చియు,
నేను తండ్రియొద్దకు వెళ్లుటవలన మీరికను నన్ను
చూడరు గనుక నీతిని గూర్చియు, ఈ లోకాధికారి
తీర్పుపొందియున్నాడు గనుక తీర్పును గూర్చియు,
12 ఒప్పుకొనజేయును. । నేను మీతో చెప్పవలసినవి
ఇంక అనేక సంగతులు కలవు గాని యిప్పుడు మీరు

వాటిని సహింపలేరు. । అయితే ఆయన, అనగా సత్య 13
స్వరూపియైన ఆత్మ వచ్చినప్పుడు మీరు సత్యమంతయు
గ్రహించునట్లు[3] ఆయన మిమ్మును నడిపించును; ఆయన
తనంతట తానే యేమియు బోధింపక, వేటిని వినునో
వాటిని బోధించి, సంభవింపబోవు సంగతులను మీకు
తెలియజేయును. । ఆయన నావాటిలోనివి తీసికొని 14
మీకు తెలియజేయును గనుక నన్ను మహిమపరచును. ।
తండ్రికి కలిగినవన్నియు నావి, అందుచేత ఆయన 15
నావాటిలోనివి తీసికొని మీకు తెలియజేయునని
నేను చెప్పితిని. । కొంచెము కాలమైన తరువాత 16
మీరిక నన్ను చూడరు; మరి కొంచెము కాలమునకు
నన్ను చూతురని చెప్పెను. । కాబట్టి ఆయన శిష్యు 17
లలో కొందరు—కొంచెము కాలమైన తరువాత నన్ను
చూడరు, మరి కొంచెము కాలమునకు నన్ను చూతు
రనియు, నేను తండ్రియొద్దకు వెళ్లుచున్నాననియు,
ఆయన మనతో చెప్పుచున్నమాట ఏమిటని యొక
నితో ఒకడు చెప్పుకొనిరి. । —కొంచెము కాలమని 18
ఆయన చెప్పుచున్నదేమిటి? ఆయన చెప్పుచున్న సం
గతి మనకు తెలియదని చెప్పుకొనిరి. । వారు తన్ను 19
అడుగ గోరుచుండిరని యేసు ఎరిగి వారితో ఇట్ల
నెను—కొంచెము కాలమైన తరువాత మీరు నన్ను
చూడరు, మరి కొంచెము కాలమునకు నన్ను చూచెద
రని నేను చెప్పిన మాటనుగూర్చి మీరు ఒకనితో ఒకడు
ఆలోచించుకొనుచున్నారా? । మీరు ఏడ్చి ప్రలా 20
పింతురు గాని లోకము సంతోషించును; మీరు
దుఃఖింతురు గాని మీ దుఃఖము సంతోషమగునని
మీతో నిశ్చయముగా చెప్పుచున్నాను. । స్త్రీ ప్రస 21
వించునప్పుడు ఆమె గడియ వచ్చెను గనుక ఆమె
వేదనపడును; అయితే శిశువు పుట్టగానే లోకమందు
నరుడొకడు పుట్టెనను సంతోషముచేత ఆమె ఆ వేదన
మరి జ్ఞాపకము చేసికొనదు. । అటువలె మీరును 22
ఇప్పుడు దుఃఖపడుచున్నారు గాని మిమ్మును మరల
చూచెదను, అప్పుడు మీ హృదయము సంతోషిం
చును, మీ సంతోషమును ఎవడును మీయొద్దనుండి
తీసివేయడు. । ఆ దినమున మీరు దేని గూర్చియు 23
నన్ను అడుగరు; మీరు తండ్రిని నా పేరట ఏమి
అడిగినను ఆయన మీకు అనుగ్రహించునని మీతో
నిశ్చయముగా చెప్పుచున్నాను. । ఇదివరకు మీరేమి 24
యు నా పేరట అడుగలేదు; మీ సంతోషము పరి
పూర్ణమగునట్లు అడుగుడి, మీకు దొరకును.

ఈ సంగతులు గూఢార్థముగా మీతో చెప్పితిని; 25
అయితే నేనిక ఎన్నడును గూఢార్థముగా మీతో
మాటలాడక తండ్రినిగూర్చి మీకు స్పష్టముగా తెలియ
జెప్పు గడియ వచ్చుచున్నది. । ఆ దినమందు మీరు 26
నా పేరట ప్రార్థనచేతురు గాని మీ విషయమై నేను

1 కీర్తన, 69: 4. 2 లేక, ఉత్తరవాది. 3 మూలభాషలో—సర్వసత్యములోనికి.

తండ్రిని వేడుకొందునని మీతో చెప్పుటలేదు. ।
27 మీరు నన్ను ప్రేమించి, నేను దేవునియొద్దనుండి
బయలుదేరి వచ్చితినని నమ్మితిరి గనుక తండ్రి తానే
28 మిమ్మును ప్రేమించుచున్నాడు. । నేను తండ్రియొద్ద
నుండి బయలుదేరి లోకమునకు వచ్చియున్నాను;
మరియు లోకమును విడిచి తండ్రియొద్దకు వెళ్లు
చున్నానని వారితో చెప్పెను.
29 ఆయన శిష్యులు—ఇదిగో ఇప్పుడు నీవు గూఢార్థ
ముగా ఏమియు చెప్పక స్పష్టముగా మాటలాడు
30 చున్నావు. । సమస్తము ఎరిగినవాడవనియు, ఎవడును
నీకు ప్రశ్న వేయ నగత్యము లేదనియు, ఇప్పుడెరుగు
దుము; దేవునియొద్దనుండి నీవు బయలుదేరి వచ్చితివని
31 దీనివలన నమ్ముచున్నామని చెప్పగా । యేసు వారిని
32 చూచి — మీరిప్పుడు నమ్ముచున్నారా! । యిదిగో
మీలో ప్రతివాడును ఎవడు వాని యింటికి చెదరి
పోయి నన్ను ఒంటరిగా విడిచిపెట్టు గడియ వచ్చు
చున్నది, వచ్చేయున్నది; అయితే తండ్రి నాతో
33 ఉన్నాడు గనుక నేను ఒంటరిగా లేను. । నాయందు
మీకు సమాధానము కలుగునట్లు ఈ మాటలు మీతో
చెప్పుచున్నాను. లోకములో మీకు శ్రమ కలు
గును; అయినను ధైర్యము తెచ్చుకొనుడి, నేను లోక
మును జయించి యున్నాననెను.

17 యేసు ఈ మాటలు చెప్పి ఆకాశమువైపు కన్ను
లెత్తి యిట్లనెను—తండ్రీ, నా గడియ వచ్చియున్నది. ।
2 నీ కుమారుడు నిన్ను మహిమపరచునట్లు నీ కుమారుని
మహిమపరచుము. నీవు నీ కుమారునికిచ్చిన వారికం
దరికిని ఆయన నిత్యజీవము అనుగ్రహించునట్లు సర్వ
3 శరీరులమీదను ఆయనకు అధికారమిచ్చితివి. । అద్వి
తీయ సత్యదేవుడవైన నిన్నును, నీవు పంపిన యేసు
4 క్రీస్తును ఎరుగుటయే నిత్యజీవము. । చేయుటకు నీవు
నాకిచ్చిన పని నేను సంపూర్ణముగా నెరవేర్చి భూమి
5 మీద నిన్ను మహిమపరచితిని. । తండ్రీ, లోకము
పుట్టకమునుపు నీయొద్ద నాకు ఏ మహిమ యుండెనో
ఆ మహిమతో నన్ను ఇప్పుడు నీయొద్ద మహిమపర
6 చుము. । లోకములోనుండి నీవు నాకు అనుగ్రహిం
చిన మనుష్యులకు నీ నామమును ప్రత్యక్షపరచితిని.
వారు నీవారై యుండిరి, నీవు వారిని నాకనుగ్రహించి
7 తివి; వారు నీ వాక్యము గైకొనియున్నారు. । నీవు
నాకు అనుగ్రహించిన మాటలు నేను వారికిచ్చి
యున్నాను; వారామాటలను అంగీకరించి, నేను నీ
యొద్దనుండి బయలుదేరి వచ్చితినని నిజముగా ఎరిగి,
8 నీవు నన్ను పంపితివని నమ్మిరి గనుక । నీవు నాకు అను
గ్రహించినవన్నియు నీవలననే కలిగినవని వారిప్పుడు
9 ఎరిగియున్నారు. । నేను వారికొరకు ప్రార్థనచేయు
చున్నాను; లోకముకొరకు ప్రార్థనచేయుటలేదు,
నీవు నాకు అనుగ్రహించి యున్నవారు నీవారై
నందున వారికొరకే ప్రార్థనచేయుచున్నాను. । నావ 10
న్నియు నీవి, నీవియు నావి; వారియందు నేను
మహిమపరచబడియున్నాను. । నేనికను లోకములో 11
ఉండను గాని వీరు లోకములో ఉన్నారు; నేను నీ
యొద్దకు వచ్చుచున్నాను. పరిశుద్ధుడవైన తండ్రీ,
మనము ఏకమైయున్నలాగున వారును ఏకమై యుం
డునట్లు నీవు నాకు అనుగ్రహించిన నీ నామమందు
వారిని కాపాడుము. । నేను వారియొద్ద ఉండగా 12
నీవు నాకు అనుగ్రహించినవారిని నీ నామమందు
కాపాడితిని; నేను వారిని భద్రపరచితిని గనుక లేఖ
నము నెరవేరునట్లు నాశనపాత్రుడు[1] తప్ప వారిలో
మరి ఎవడును నశింపలేదు. । ఇప్పుడు నేను నీయొద్దకు 13
వచ్చుచున్నాను; నా సంతోషము వారియందు పరి
పూర్ణమగునట్లు లోకమందు ఈ మాట చెప్పుచున్నా
ను. । వారికి నీ వాక్యమిచ్చి యున్నాను. నేను లోక 14
సంబంధిని కానట్టు వారును లోకసంబంధులు కారు
గనుక లోకము వారిని ద్వేషించును. । నీవు లోక 15
ములోనుండి వారిని తీసికొనిపొమ్మని నేను ప్రార్థిం
చుటలేదు గాని దుష్టునినుండి[2] వారిని కాపాడుమని
ప్రార్థించుచున్నాను. । నేను లోకసంబంధిని కానట్టు 16
వారును లోకసంబంధులు కారు. । సత్యమువలన[3] 17
వారిని ప్రతిష్ఠచేయుము; నీ వాక్యమే సత్యము. ।
నీవు నన్ను లోకమునకు పంపిన ప్రకారము నేనును 18
వారిని లోకమునకు పంపితిని. । వారును సత్యము 19
వలన[3] ప్రతిష్ఠచేయబడునట్లు వారికొరకై నన్ను ప్రతిష్ఠ
చేసికొనుచున్నాను. । మరియు నీవు నన్ను పంపితివని 20
లోకము నమ్మునట్లు, తండ్రీ, నాయందు నీవును నీ 21
యందు నేనును ఉన్నలాగున, వారును మనయందు
ఏకమై యుండవలెనని వారికొరకు మాత్రము నేను
ప్రార్థించుటలేదు; వారి వాక్యమువలన నాయందు
విశ్వాసముంచువారందరును ఏకమై యుండవలెనని
వారికొరకును ప్రార్థించుచున్నాను. । మనము ఏకమై 22
యున్నలాగున వారును ఏకమై యుండవలెనని నీవు
నాకు అనుగ్రహించిన మహిమను నేను వారికిచ్చితిని. ।
వారియందు నేనును నాయందు నీవును ఉండుటవలన 23
వారు సంపూర్ణులుగా చేయబడి యేకముగా ఉన్నం
దున నీవు నన్ను పంపితివనియు, నీవు నన్ను ప్రేమించి
నట్టే వారినికూడ ప్రేమించితివనియు, లోకము తెలిసి
కొనునట్లు (నాకు అనుగ్రహించిన మహిమను వారి
కిచ్చితిని.) । తండ్రీ, నేనెక్కడ ఉందునో అక్కడ 24
నీవు నాకు అనుగ్రహించినవారును నాతోకూడ
ఉండవలెననియు, నీవు నాకు అనుగ్రహించిన నా
మహిమను వారు చూడవలెననియు కోరుచున్నాను.
జగత్తు పునాది వేయబడకమునుపే నీవు నన్ను ప్రేమిం

1 మూలభాషలో—పుత్రుడు. 2 లేక, కీడునుండి. 3 మూలభా.—సత్యమందు.

అందువలన యేసు తాను ఎట్టిమరణము పొందబోవునో
అది సూచించి చెప్పిన మాట నెరవేరెను.
33 పిలాతు తిరిగి అధికారమందిరములో ప్రవేశించి
యేసును పిలిపించి — నీవు యూదుల రాజువా అని
34 ఆయన నడుగగా । యేసు — నీ అంతట నీవే యీ
మాట అనుచున్నావా? లేక యితరులు నీతో నన్ను
35 గూర్చి యిది చెప్పిరా అని అడిగెను. । అందుకు
పిలాతు — నేను యూదుడనా యేమి? నీ స్వజనమును
ప్రధానయాజకులును నిన్ను నాకు అప్పగించిరి గదా;
36 నీవేమి చేసితివని అడుగగా । యేసు — నా రాజ్యము
ఈ లోకసంబంధమైనది కాదు; నా రాజ్యము ఈ
లోకసంబంధమైనదైతే నేను యూదులకు అప్పగింప
బడకుండునట్లు నా సేవకులు పోరాడుదురు గాని నా
37 రాజ్యము ఇహసంబంధమైనది కాదనెను. । అందుకు
38 పిలాతు — నీవు రాజువా అని ఆయనను అడుగగా
యేసు—నీవన్నట్టు నేను రాజునే; సత్యమునుగూర్చి
సాక్ష్యమిచ్చుటకు నేను పుట్టితిని; ఇందు నిమిత్తమే
యీ లోకమునకు వచ్చితిని; సత్యసంబంధియైన ప్రతి
వాడును నా మాట వినుననెను. అందుకు పిలాతు—
సత్యమేమిటో అని ఆయనతో చెప్పెను.

అతడు ఈ మాట చెప్పి బయటనున్న యూదుల
యొద్దకు తిరిగి వెళ్లి — అతనియందు ఏ దోషమును
39 నాకు కనబడలేదు; । అయినను పస్కాపండుగలో
నేనొకని మీకు విడుదల చేయు మామూలు కలదు గదా;
నేను యూదుల రాజును విడుదల చేయుట మీకిష్టమా
40 అని వారి నడిగెను. । అయితే వారు—వీనిని వద్దు,
బరబ్బను విడుదల చేయుమని మరల కేకలు వేసిరి. ఈ
బరబ్బ బందిపోటుదొంగ.

19 అప్పుడు పిలాతు యేసును పట్టుకొని ఆయనను
2 కొరడాలతో కొట్టించెను. । సైనికులు ముండ్లతో
3 కిరీటము అల్లి ఆయన తలమీద పెట్టి । ఊదారంగు
వస్త్రము ఆయనకు తొడిగించి ఆయనయొద్దకు వచ్చి—
యూదుల రాజా, శుభమని చెప్పి ఆయనను అరచేతు
4 లతో కొట్టిరి. । పిలాతు మరల వెలుపలికి వచ్చి—
ఇదిగో ఈయనయందు ఏ దోషమును నాకు కనబడ
లేదని మీకు తెలియగలందులకు ఈయనను మీయొద్దకు
వెలుపలికి తీసికొని వచ్చుచున్నానని వారితో అనెను. ।
5 ఆ ముండ్ల కిరీటమును ఊదారంగు వస్త్రమును ధరించిన
వాడై, యేసు వెలుపలికి రాగా పిలాతు—ఇదిగో ఈ
6 మనుష్యుడు అని వారితో చెప్పెను. । ప్రధాన
యాజకులును బంట్రౌతులును ఆయనను చూచి—
సిలువవేయుడి సిలువవేయుడి అని కేకలువేయగా
పిలాతు—ఆయనయందు ఏ దోషమును నాకు కనబడ
లేదు గనుక మీరే ఆయనను తీసికొనిపోయి సిలువ
వేయుడని వారితో చెప్పెను. । అందుకు యూదులు
—మాకొక నియమము కలదు; తాను దేవుని కుమా
రుడనని యితడు చెప్పుకొనెను గనుక ఆ నియమము
చొప్పున ఇతడు చావవలెనని అతనితో చెప్పిరి. ।
పిలాతు ఆ మాట విని మరి ఎక్కువగా భయపడి, 8
తిరిగి అధికారమందిరములో ప్రవేశించి ।—నీ వెక్కడ 9
నుండి వచ్చితివని యేసును అడిగెను; అయితే యేసు
అతనికి ఏ ఉత్తరము ఇయ్యలేదు । గనుక పిలాతు— 10
నాతో మాటలాడవా? నిన్ను విడుదలచేయుటకు
నాకు అధికారము కలదనియు, నిన్ను సిలువవేయు
టకు నాకు అధికారము కలదనియు నీ వెరుగవా అని
ఆయనతో అనెను. । అందుకు యేసు—పైనుండి నీకు 11
ఇయ్యబడియుండకపోయిన యెడల నామీద నీకు ఏ అధికా
రము ఉండదు; అందుచేత నన్ను నీకు అప్పగించిన
వానికి ఎక్కువ పాపము కలదనెను. । ఈ మాటను 12
బట్టి పిలాతు ఆయనను విడుదలచేయుటకు యత్నము
చేసెను గాని యూదులు—నీవు ఇతని విడుదలచేసి
నయెడల కైసరునకు స్నేహితుడవు కావు; తాను రాజునని
చెప్పుకొను ప్రతివాడును కైసరునకు విరోధముగా
మాటలాడుచున్నాడని కేకలు వేసిరి. । పిలాతు 13
ఈ మాటలు విని, యేసును బయటికి తీసికొనివచ్చి,
రాళ్లు పరచిన స్థలమునకు న్యాయపీఠముమీద కూర్చుం
డెను. హెబ్రీభాషలో ఆ స్థలమునకు గబ్బతా అని
పేరు. । ఆ దినము పస్కాను సిద్ధపరచు దినము; 14
అప్పుడు మధ్యాహ్నము కావచ్చెను. అతడు—ఇదిగో
మీ రాజు అని యూదులతో చెప్పగా । అందుకు 15
వారు — ఇతని సంహరించుము, సంహరించుము,
సిలువవేయుము అని కేకలు వేసిరి. పిలాతు — మీ
రాజును సిలువవేయుదునా అని వారిని అడుగగా
ప్రధానయాజకులు — కైసరు తప్ప మాకు వేరొక
రాజు లేడనిరి. । అప్పుడు సిలువవేయబడుటకై అత 16
డాయనను వారికి అప్పగించెను.

వారు యేసును తీసికొనిపోయిరి. ఆయన తన 17
సిలువ మోసికొని కపాలస్థలమను చోటికి వెళ్లెను.
హెబ్రీ భాషలో దానికి గొల్గొతా అని పేరు. ।
అక్కడ ఈ వైపున ఒకనిని ఆ వైపున ఒకనిని మధ్యను 18
యేసును ఉంచి, ఆయనతోకూడ ఇద్దరిని సిలువవేసిరి. ।
మరియు పిలాతు — యూదులరాజైన నజరేయుడగు 19
యేసు అను పైవిలాసము వ్రాయించి సిలువమీద
పెట్టించెను. । యేసు సిలువవేయబడిన స్థలము పట్టణ 20
మునకు సమీపమైయుండెను, అది హెబ్రీ లాటిను
గ్రీకు భాషలలో వ్రాయబడెను గనుక యూదు
లలో అనేకులు దానిని చదివిరి. । — నేను యూదుల 21
రాజునని వాడు చెప్పినట్టు వ్రాయుము గాని—యూ
దులరాజు అని వ్రాయవద్దని యూదుల ప్రధాన
యాజకులు పిలాతుతో చెప్పగా । పిలాతు — నేను 22
వ్రాసినదేమో వ్రాసితిననెను.

23 రాణువవారు యేసును సిలువవేసిన తరువాత
ఆయన వస్త్రములు తీసికొని, యొక్కొక్క రాణువవానికి
ఒక్కొక్క భాగము వచ్చునట్లు వాటిని నాలుగు భాగ
ములు చేసిరి. ఆయన అంగీనికూడ తీసికొని, ఆ అంగీ
కుట్టులేక పైనుండి యేకత్తు నేయబడినది గనుక ।
24 వారు—దాని చింపక అది ఎవనికి వచ్చునో అని దాని
కోసరము చీట్లు వేయుదమని యొకరితో ఒకరు
చెప్పుకొనిరి.

వారు నా వస్త్రములను తమలో పంచుకొని నా
అంగీకోసరము చీట్లు వేసిరి

అను లేఖనము[1] నెరవేరునట్లు ఇది జరిగెను; ఇందుకే
25 రాణువవారు ఈలాగు చేసిరి. । ఆయన తల్లియు,
ఆయన తల్లి సహోదరియు క్లోపా భార్యయునైన
మరియయు, మగ్దలేనే మరియయు యేసు సిలువయొద్ద
26 నిలుచుండిరి. । యేసు తన తల్లియు తాను ప్రేమించిన
శిష్యుడును దగ్గర నిలుచుండుట చూచి—అమ్మా,
యిదిగో నీ కుమారుడు అని తన తల్లితో చెప్పెను; ।
27 తరువాత శిష్యుని చూచి — యిదిగో నీ తల్లి అని
చెప్పెను. ఆ గడియనుండి ఆ శిష్యుడు ఆమెను తన
యింట చేర్చుకొనెను.
28 అటుతరువాత సమస్తమును అప్పటికి సమాప్తమైన
దని యేసు ఎరిగి లేఖనము నెరవేరునట్లు—నేను దప్పి
29 గొనుచున్నాననెను. । చిరకతో నిండియున్న యొక
పాత్ర అక్కడ పెట్టి యుండెను గనుక వారు ఒక
స్పంజీ చిరకతో నింపి హిస్సోపు పుడకకు తగిలించి
30 ఆయన నోటికి అందిచ్చిరి. । యేసు ఆ చిరక పుచ్చుకొని
—సమాప్తమైనదని చెప్పి తల వంచి ఆత్మను అప్పగించెను.
31 ఆ దినము సిద్ధపరచుదినము; మరుసటి విశ్రాంతి
దినము మహాదినము గనుక ఆ దేహములు విశ్రాంతి
దినమున సిలువమీద ఉండకుండునట్లు వారి కాళ్లు
విరుగగొట్టించి వారిని తీసివేయించుమని యూదులు
32 పిలాతును అడిగిరి. । కాబట్టి రాణువవారు వచ్చి
ఆయనతోకూడ సిలువవేయబడిన మొదటివాని కాళ్లను
33 రెండవవాని కాళ్లను విరుగగొట్టిరి. । వారు యేసు
నొద్దకు వచ్చి, అంతకుముందే ఆయన మృతిపొంది
యుండుట చూచి ఆయన కాళ్లు విరుగగొట్టలేదు
34 గాని । రాణువవారిలో ఒకడు ఈటెతో ఆయన
ప్రక్కను పొడిచెను, వెంటనే రక్తమును నీళ్లును
35 కారెను. । ఇది చూచినవాడు సాక్ష్యమిచ్చుచున్నాడు;
అతని సాక్ష్యము సత్యమే. మీరు నమ్మునట్లు తాను
సత్యమే చెప్పుచున్నానని అతడెరుగును.
36 —అతని యెముకలలో ఒకటైనను విరువబడదు
37 అను లేఖనము[2] నెరవేరునట్లు ఇవి జరిగెను. । మరియు
—తాము పొడిచినవానితట్టు చూతురు
అని మరియొక లేఖనము[3] చెప్పుచున్నది.

అటుతరువాత యూదుల భయమువలన రహస్య 38
ముగా యేసు శిష్యుడైన అరిమతయియ యోసేపు
తాను యేసు దేహమును తీసికొనిపోవుటకు పిలాతు
నొద్ద సెలవడుగగా పిలాతు సెలవిచ్చెను గనుక అతడు
వచ్చి యేసు దేహమును తీసికొనిపోయెను. । మునుపు 39
రాత్రివేళ ఆయనయొద్దకు వచ్చిన నీకొదేముకూడ
బోళముతో కలిపిన అగరు రమారమి నూట ఏబది సేర్ల
యెత్తు తెచ్చెను. । అంతట వారు యేసు దేహమును 40
ఎత్తికొని వచ్చి, యూదులు పాతిపెట్టు మర్యాద
చొప్పున ఆ సుగంధద్రవ్యములు దానికి పూసి నార
బట్టలు చుట్టిరి. । ఆయనను సిలువవేసిన స్థలములో 41
ఒక తోట యుండెను; ఆ తోటలో ఎవడు ఎప్పుడును
ఉంచబడని క్రొత్త సమాధి యొకటి యుండెను. ।
ఆ సమాధి సమీపములో ఉండెను గనుక ఆ దినము 42
యూదులు సిద్ధపరచు దినమైనందున వారు అందులో
యేసును పెట్టిరి.

ఆదివారమున ఇంక చీకటిగా ఉన్నప్పుడు మగ్ద 20
లేనే మరియ పెందలకడలేచి సమాధియొద్దకు వచ్చి,
సమాధిమీద ఉండిన రాయి తీయబడియుండుట
చూచెను । గనుక ఆమె పరుగెత్తికొని సీమోను పేతురు 2
నొద్దకును యేసు ప్రేమించిన ఆ మరియొక శిష్యుని
యొద్దకును వచ్చి—ప్రభువును సమాధిలోనుండి యెత్తి
కొనిపోయిరి, ఆయనను ఎక్కడ ఉంచిరో యెరుగ
మని చెప్పెను. । కాబట్టి పేతురును ఆ శిష్యుడును 3
బయలుదేరి సమాధియొద్దకు వచ్చిరి. । వారిద్దరును కూడి 4
పరుగెత్తుచుండగా ఆ శిష్యుడు పేతురుకంటె త్వరగా
పరుగెత్తి ముందుగా సమాధియొద్దకు వచ్చి । వంగి 5
నారబట్టలు పడియుండుట చూచెను గాని అతడు
సమాధిలో ప్రవేశింపలేదు. । అంతట సీమోను పేతురు 6
అతని వెంబడి వచ్చి సమాధిలో ప్రవేశించి । నార 7
బట్టలు పడియుండుటయు, ఆయన తల రుమాలు నార
బట్టలయొద్ద ఉండక వేరుగా ఒకచోట మడతపెట్టి
యుండుటయు చూచెను. । అప్పుడు మొదట సమాధి 8
యొద్దకు వచ్చిన ఆ శిష్యుడు లోపలికి పోయి చూచి
నమ్మెను. । ఆయన మృతులలోనుండి లేచుట అగత్య 9
మను లేఖనము వారింకను గ్రహింపకుండిరి. । అంతట 10
ఆ శిష్యులు తిరిగి తమ వారియొద్దకు వెళ్లిపోయిరి.

అయితే మరియ సమాధి బయట నిలిచి యేడ్చు 11
చుండెను. ఆమె యేడ్చుచు సమాధిలోనికి వంగి చూడగా ।
తెల్లని వస్త్రములు ధరించిన యిద్దరు దేవదూతలు యేసు 12
దేహము ఉంచబడిన స్థలములో తలవైపున ఒకడును
కాళ్లవైపున ఒకడును కూర్చుండుట కనబడెను. । వారు 13
—అమ్మా, యెందుకు యేడ్చుచున్నావని ఆమెను అడు
గగా ఆమె — నా ప్రభువును ఎవరో యెత్తికొనిపో
యిరి; ఆయనను ఎక్కడ ఉంచిరో నాకు తెలియలేదని

1 కీర్తన, 22: 19. 2 నిర్గమ. 12: 46; కీర్తన. 34. 20. 3 జెకర్యా, 12: 10.

14 చెప్పెను. । ఆమె యీ మాట చెప్పి వెనుకతట్టు తిరిగి
యేసు నిలిచియుండుట చూచెను గాని ఆయన యేసు
15 అని గుర్తుపట్టలేదు. । యేసు—అమ్మా యెందుకు ఏడ్చు
చున్నావు, ఎవని వెదకుచున్నావు అని ఆమెను అడు
గగా ఆమె ఆయన తోటవాడనుకొని—అయ్యా, నీవు
ఆయనను మోసికొని పోయినయెడల ఆయనను ఎక్కడ
ఉంచితివో నాతో చెప్పుము, నేను ఆయనను ఎత్తి
16 కొని పోదునని చెప్పెను. । యేసు ఆమెను చూచి
— మరియా అని పిలిచెను. ఆమె ఆయనవైపు తిరిగి
ఆయనను చూచి, హెబ్రీభాషతో రబ్బూనీ అని
17 పిలిచెను. ఆ మాటకు బోధకుడని అర్థము. । యేసు
ఆమెను చూచి — నేను ఇంక తండ్రియొద్దకు ఎక్కి
పోలేదు గనుక నన్ను ముట్టుకొనవద్దు; అయితే నా
సహోదరులయొద్దకు వెళ్లి — నా తండ్రియు మీ
తండ్రియు, నా దేవుడును మీ దేవుడునైన వాని
యొద్దకు ఎక్కిపోవుచున్నానని వారితో చెప్పు
18 మనెను. । మగ్దలేనే మరియ వచ్చి — నేను ప్రభువును
చూచితిని, ఆయన నాతో ఈ మాటలు చెప్పెనని
శిష్యులకు తెలియజేసెను.

19 ఆదివారము సాయంకాలమున శిష్యులు యూదు
లకు భయపడి, తాము కూడియున్న యింటి తలుపులు
మూసికొనియుండగా యేసు వచ్చి మధ్యను నిలిచి
— మీకు సమాధానము కలుగుగాక అని వారితో
20 చెప్పెను. । ఆయన ఆలాగు చెప్పి వారికి తన చేతులను
ప్రక్కను చూపగా శిష్యులు ప్రభువును చూచి
21 సంతోషించిరి. । అప్పుడు యేసు — మీకు సమా
ధానము కలుగుగాక; తండ్రి నన్ను పంపినప్రకారము
నేనును మిమ్మును పంపుచున్నానని మరల వారితో
22 చెప్పెను. । ఆయన ఈ మాట చెప్పి వారిమీద ఊది
23 —పరిశుద్ధాత్మను పొందుడి. । మీరు ఎవరి పాపములు
క్షమింతురో అవి వారికి క్షమింపబడును; ఎవరి పాప
ములు మీరు నిలిచియుండనిత్తురో అవి నిలిచియుండు
నని వారితో చెప్పెను.

24 యేసు వచ్చినప్పుడు, పన్నెండుమందిలో ఒకడైన
దిదుము అనబడిన తోమా వారితో లేకపోయెను ।
25 గనుక తక్కిన శిష్యులు—మేము ప్రభువును చూచితి
మని అతనితో చెప్పగా అతడు — నేనాయన చేతు
లలో మేకుల గురుతును చూచి నా వ్రేలు ఆ మేకుల
గురుతులో పెట్టి, నా చెయ్యి ఆయన ప్రక్కలో
ఉంచితేనే గాని నమ్మనని వారితో చెప్పెను.

26 ఎనిమిది దినములైన తరువాత ఆయన శిష్యులు
మరల లోపట ఉన్నప్పుడు తోమా వారితోకూడ ఉం
డెను. తలుపులు మూయబడియుండగా యేసు వచ్చి
మధ్యను నిలిచి — మీకు సమాధానము కలుగుగాక
। తరువాత తోమాను చూచి—నీ వ్రేలు ఇటు
— చేతులు చూడుము; నీ చెయ్యి చాచి నా
ప్రక్కలో ఉంచి, అవిశ్వాసివి కాక విశ్వాసివై
యుండుమనెను. । అందుకు తోమా — నా ప్రభువా 28
నా దేవా అనెను. । యేసు—నీవు నన్ను చూచి నమ్మి 29
తివి, చూడక నమ్మినవారు ధన్యులని అతనితో చెప్పెను.
మరియు వేరు అనేకమైన సూచకక్రియలను యేసు 30
తన శిష్యుల యెదుట చేసెను; అవి యీ గ్రంథమందు
వ్రాయబడియుండలేదు గాని । యేసు దేవుని కుమారు 31
డైన క్రీస్తు అని మీరు నమ్మునట్లును, నమ్మి ఆయన
నామమందు జీవము పొందునట్లును ఇవి వ్రాయ
బడెను.

అటుతరువాత యేసు తిబెరియ సముద్రతీరమున 21
శిష్యులకు మరల తన్ను ప్రత్యక్షపరచుకొనెను. ఆయన
తన్ను ప్రత్యక్షపరచుకొనిన విధమేదనగా । సీమోను 2
పేతురును, దిదుము అనబడిన తోమాయు, గలిలైయ
లోని కానా ఊరి నతనయేలును, జెబెదయి కుమా
ళ్లును, ఆయన శిష్యులలో మరి ఇద్దరును కూడి యుం
డిరి. । సీమోను పేతురు — నేను చేపలు పట్టబోదు 3
నని వారితో అనగా వారు — మేమును నీతోకూడ
వచ్చెదమనిరి. వారు వెళ్లి దోనె ఎక్కిరి కాని ఆ
రాత్రి యేమియు పట్టలేదు. । సూర్యోదయమగుచుం 4
డగా యేసు దరిని నిలిచెను, అయితే ఆయన యేసు
అని శిష్యులు గుర్తుపట్టలేదు. । యేసు— పిల్లలారా, 5
భోజనమునకు మీయొద్ద ఏమైన ఉన్నదా అని వారిని
అడుగగా, । లేదని వారాయనతో చెప్పిరి. అప్పు 6
డాయన — దోనె కుడిప్రక్కను వల వేయుడి మీకు
దొరుకునని చెప్పెను గనుక వారాలాగు వేయగా
చేపలు విస్తారముగా పడినందున వల లాగలేకపోయిరి. ।
కాబట్టి యేసు ప్రేమించిన శిష్యుడు—ఆయన ప్రభువు 7
సుమీ అని పేతురుతో చెప్పెను. ఆయన ప్రభువని
సీమోను పేతురు విని, వస్త్రహీనుడై యున్నందున
పైబట్ట వేసికొని సముద్రములో దుమికెను. । దరి 8
యించుమించు ఇన్నూరుమూరల దూరమున్నందున
తక్కిన శిష్యులు చేపలుగల వల లాగుచు ఆ చిన్న
దోనెలో వచ్చిరి. । వారు దిగి దరికి రాగానే అక్కడ 9
నిప్పులును వాటిమీద ఉంచబడిన చేపలును రొట్టెయు
కనబడెను. । యేసు — మీరిప్పుడు పట్టిన చేపలలో 10
కొన్ని తీసికొని రండని వారితో చెప్పగా । సీమోను 11
పేతురు దోనె ఎక్కి వలను దరికి లాగెను; అది నూట
ఏబది మూడు గొప్పచేపలతో నిండియుండెను; ।
చేపలు అంత విస్తారముగా పడినను వల పిగలలేదు. 12
యేసు—రండి భోజనము చేయుడని వారితో అనెను.
ఆయన ప్రభువని వారికి తెలిసినందున — నీవెవడవని
శిష్యులలో ఎవడును ఆయనను అడుగ తెగింపలేదు. ।
యేసు వచ్చి ఆ రొట్టెయు చేపలును కూడ తీసికొని 13
వారికి పంచిపెట్టెను. । యేసు మృతులలోనుండి లేచిన 14
తరువాత శిష్యులకు ప్రత్యక్షమైనది ఇది మూడవసారి.

15 వారు భోజనముచేసిన తరువాత యేసు సీమోను
పేతురును చూచి—యోహాను కుమారుడవైన సీమో
నూ, వీరికంటె నీవు నన్ను ఎక్కువగా ప్రేమించు
చున్నావా అని అడుగగా అతడు—అవును ప్రభువా,
నేను నిన్ను ప్రేమించుచున్నానని నీవే యెరుగుదువని
ఆయనతో చెప్పెను; యేసు—నా గొఱ్ఱెపిల్లలను
16 మేపుమని అతనితో చెప్పెను. । మరల ఆయన—
యోహాను కుమారుడవైన సీమోనూ, నన్ను ప్రేమించు
చున్నావా అని రెండవసారి అతనిని అడుగగా అతడు
—అవును ప్రభువా, నేను నిన్ను ప్రేమించుచున్నా
నని నీవే యెరుగుదువని ఆయనతో చెప్పెను; ఆయన
17 —నా గొఱ్ఱెలను కాయుమని చెప్పెను. । మూడవ
సారి ఆయన—యోహాను కుమారుడవైన సీమోనూ,
నన్ను ప్రేమించుచున్నావా అని అతనిని అడిగెను.—
నన్ను ప్రేమించుచున్నావా అని మూడవసారి తన్ను
అడిగినందుకు పేతురు వ్యసనపడి—ప్రభువా, నీవు
సమస్తము ఎరిగినవాడవు, నిన్ను ప్రేమించుచున్నానని
18 నీవే యెరుగుదువని ఆయనతో చెప్పెను. । యేసు—
నా గొఱ్ఱెలను మేపుము. నీవు యౌవనస్థుడవై యుండి
నప్పుడు నీయంతట నీవే నడుము కట్టుకొని నీకిష్ట
మైనచోటికి వెళ్లుచుంటివి; నీవు ముసలివాడవైనప్పుడు
నీ చేతులు నీవు చాచుదువు, వేరొకడు నీ నడుము
కట్టి నీకిష్టము కాని చోటికి నిన్ను మోసికొని పోవు
నని నీతో నిశ్చయముగా చెప్పుచున్నానని అతనితో
చెప్పెను. । అతడు ఎట్టి మరణమువలన దేవుని మహిమ 19
పరచునో దాని సూచించి ఆయన ఈ మాట చెప్పెను.
ఇట్లు చెప్పి—నన్ను వెంబడించుమని అతనితో అనెను. ।
పేతురు వెనుకకు తిరిగి, యేసు ప్రేమించినవాడును, 20
భోజనపంక్తిని ఆయన రొమ్మున ఆనుకొని—ప్రభువా,
నిన్ను అప్పగించువాడెవడని అడిగినవాడునైన శిష్యుడు
తమ వెంట వచ్చుట చూచెను. । పేతురు అతని 21
చూచి—ప్రభువా, యితని సంగతి ఏమగునని యేసును
అడిగెను. । యేసు—నేను వచ్చువరకు అతడుండుట 22
నాకిష్టమైతే అది నీకేమి? నీవు నన్ను వెంబడించు
మనెను. । కాబట్టి ఆ శిష్యుడు చావడను మాట 23
సహోదరులలో ప్రచురమాయెను. అయితే చావ
డని యేసు అతనితో చెప్పలేదు గాని—నేను వచ్చు
వరకు అతడుండుట నాకిష్టమైతే అది నీకేమని
చెప్పెను.

ఈ సంగతులనుగూర్చి సాక్ష్యమిచ్చుచు ఇవి 24
వ్రాసిన శిష్యుడు ఇతడే; ఇతని సాక్ష్యము సత్య
మని యెరుగుదుము.

యేసు చేసిన కార్యములు ఇంక అనేకములు కలవు. 25
వాటిలో ప్రతిదానిని వివరించి వ్రాసినపక్షమున
అట్లు వ్రాయబడిన గ్రంథములకు భూలోకమైనను
చాలదని నాకు తోచుచున్నది.

# అపొస్తలుల కార్యములు

1 ఓ థెయొఫిలా, యేసు తాను ఏర్పరచుకొనిన
2 అపొస్తలులకు పరిశుద్ధాత్మద్వారా ఆజ్ఞాపించిన తరు
వాత ఆయన పరమునకు చేర్చుకొనబడిన దినమువరకు
ఆయన చేయుటకును బోధించుటకును ఆరంభించిన
వాటినన్నిటినిగూర్చి నా మొదటి గ్రంథమును రచించి
3 తిని. । ఆయన శ్రమపడిన తరువాత నలువది దినముల
పర్యంతము వారికగుపడుచు, దేవుని రాజ్యవిషయ
ములనుగూర్చి బోధించుచు, అనేక ప్రమాణములను[1]
చూపి వారికి తన్నుతాను సజీవునిగా కనుపరచు
4 కొనెను. । ఆయన వారిని కలిసికొని యీలాగు ఆజ్ఞా
పించెను—మీరు యెరూషలేమునుండి వెళ్లక, నావ
లన వినిన తండ్రియొక్క వాగ్దానముకొరకు కనిపెట్టుడి;।
5 యోహాను నీళ్లతో బాప్తిస్మము ఇచ్చెను గాని కొద్ది
దినములలోగా మీరు పరిశుద్ధాత్మలో[2] బాప్తిస్మము
పొందెదరనెను.

6 కాబట్టి వారు కూడివచ్చినప్పుడు — ప్రభువా,
యీ కాలమందు ఇశ్రాయేలుకు రాజ్యమును మరల
అనుగ్రహించెదవా అని ఆయనను అడుగగా ఆయన।
7 —కాలములను సమయములను తండ్రి తన స్వాధీన
మందుంచుకొనియున్నాడు; వాటిని తెలిసికొనుట
8 మీ పనికాదు. । అయినను పరిశుద్ధాత్మ మీ మీదికి
వచ్చునప్పుడు మీరు శక్తినొందెదరు గనుక మీరు
యెరూషలేములోను, యూదైయ సమరైయ దేశముల
యందంతటను భూదిగంతములవరకును, నాకు సాక్షులై
9 యుందురని వారితో చెప్పెను. । ఈ మాటలు చెప్పి,
వారు చూచుచుండగా ఆయన ఆరోహణమాయెను;
అప్పుడు ఒక మేఘము వచ్చి వారి కన్నులకు కనబడ
10 కుండ ఆయనను కొనిపోయెను. । ఆయన వెళ్లు
చుండగా వారు ఆకాశమువైపు తేరి చూచుచుండిరి.
అప్పుడు తెల్లని వస్త్రములు ధరించుకొనిన యిద్దరు మను
11 ష్యులు వారియొద్ద నిలిచి । —గలిలైయ మనుష్యు
లారా, మీరెందుకు నిలిచి ఆకాశమువైపు చూచు
చున్నారు? మీ యొద్దనుండి పరలోకమునకు చేర్చు
కొనబడిన యీ యేసే యే రీతిగా పరలోకమునకు
వెళ్లుట మీరు చూచితిరో ఆ రీతిగానే ఆయన తిరిగి
వచ్చునని వారితో చెప్పిరి.

12 అప్పుడు వారు ఒలీవల వనమనబడిన కొండనుండి
యెరూషలేముకు తిరిగి వెళ్లిరి. ఆ కొండ యెరూష
ముకు విశ్రాంతిదినమున నడవదగినంత సమీపమున
. । వారు (పట్టణములో) ప్రవేశించి తాము
బసచేయుచుండిన మేడగదిలోకి ఎక్కిపోయిరి. వారెవ
రనగా పేతురు, యోహాను, యాకోబు, అంద్రెయ,
ఫిలిప్పు, తోమా, బర్తొలొమయి, మత్తయి, అల్ఫయి
కుమారుడగు యాకోబు, మతాభిమానియను సీమోను,
యాకోబు కుమారుడగు[3] యూదా అనువారు. । వీరం 14
దరును, వీరితోకూడ కొందరు స్త్రీలును యేసు తల్లి
యైన మరియయు ఆయన సహోదరులును, ఏకభావ
ముగా ఎడతెగక ప్రార్థన చేయుచుండిరి.

ఆ కాలమందు ఇంచుమించు నూట ఇరువదిమంది 15
సహోదరులు కూడియుండగా పేతురు వారి మధ్య
నిలిచి యిట్లనెను । — సహోదరులారా, యేసును 16
పట్టుకొనినవారికి త్రోవ చూపిన యూదానుగూర్చి
పరిశుద్ధాత్మ దావీదుద్వారా పూర్వము పలికిన లేఖనము
నెరవేరవలసి యుండెను. । అతడు మనలో ఒకడుగా 17
ఎంచబడినవాడై యీ పరిచర్యలో పాలుపొందెను. ।
ఈ యూదా ద్రోహమువలన సంపాదించిన రూకల 18
నిచ్చి యొక పొలము కొనెను. అతడు తలక్రిందుగా
పడి నడిమికి బద్దలైనందున అతని పేగులన్నియు బయ
టికి వచ్చెను. । ఈ సంగతి యెరూషలేములో కాపుర 19
మున్నవారికందరికి తెలియవచ్చెను గనుక వారి
భాషలో ఆ పొలము అకెల్దమ అనబడియున్నది;
దానికి రక్తభూమి అని అర్థము. ఇందుకు ప్రమాణ
ముగా

—అతని యిల్లు పాడైపోవుగాక 20
దానిలో ఎవడును కాపురముండక పోవుగాక
అతని యుద్యోగము వేరొకడు తీసికొనునుగాక

అని కీర్తనల గ్రంథములో వ్రాయబడియున్నది.[4] ।
కాబట్టి యోహాను బాప్తిస్మమిచ్చినది మొదలుకొని 21
ప్రభువైన యేసు మనయొద్దనుండి పరమునకు చేర్చు 22
కొనబడిన దినమువరకు, ఆయన మనమధ్య సంచరించు
చుండిన కాలమంతయు మనతో కలిసియున్న వీరిలో
ఒకడు, మనతోకూడ ఆయన పునరుత్థానమునుగూర్చి
సాక్షియై యుండుట అవశ్యమని చెప్పెను. । అప్పుడు 23
వారు యూస్తు అను మారుపేరుగల బర్సబ్బా అన
బడిన యోసేపు, మత్తీయ అను ఇద్దరిని నిలువబెట్టి ।
ఇట్లని ప్రార్థనచేసిరి—అందరి హృదయములను ఎరిగి 24
యున్న ప్రభువా, । తనచోటికి పోవుటకు యూదా 25
తప్పిపోయి పోగొట్టుకొనిన యీ పరిచర్యలోను
అపొస్తలత్వములోను పాలుపొందుటకు వీరిద్దరిలో నీవు
ఏర్పరచుకొనినవానిని కనుపరచుమనిరి. । అంతట 26

1 లేక, రుజువులను. 2 లేక, పరిశుద్ధాత్మతో. 3 లేక, సహోదరుడగు. 4 కీర్తన, 69: 25; 109: 8.

నొందిన వీరిని గూర్చి చీట్లువేయగా మత్తీయ పేరట చీటి
వచ్చెను గనుక అతడు పదకొండుమంది అపొస్తలు
లతో కూడ లెక్కింపబడెను.

2 పెంతెకొస్తను పండుగదినము వచ్చినప్పుడు అందరు
2 ఒకచోట కూడియుండిరి. । అప్పుడు వేగముగా వీచు
బలమైన గాలివంటి యొకధ్వని ఆకాశమునుండి అక
స్మాత్తుగా కలిగి, వారు కూర్చుండియున్న యిల్లంతయు
3 వ్యాపించెను. । మరియు అగ్నిజ్వాలలవంటి నాలుకలు
విభాగింపబడినట్టుగా వారికి కనబడి వారిలో ఒక్కొ
4 కనిమీద వ్రాలగా । అందరు పరిశుద్ధాత్మతో నిండిన
వారై ఆ ఆత్మ వారికి వాక్శక్తి అనుగ్రహించినకొలది
అన్యభాషలతో మాటలాడసాగిరి.
5 ఆ కాలమున ఆకాశము క్రిందనుండు ప్రతి జన
ములోనుండి వచ్చిన భక్తిగల యూదులు యెరూష
6 లేములో కాపురముండిరి. । ఈ శబ్దము కలుగగా
జనులు గుంపులుగా కూడివచ్చి, ప్రతి మనుష్యుడు
తన తన స్వభాషతో వారు మాటలాడుట విని కలవర
7 పడిరి. । అంతట అందరు విభ్రాంతినొంది ఆశ్చర్య
పడి—ఇదిగో మాటలాడుచున్న వీరందరు గలిలై
8 యులు కారా? । మనలో ప్రతివాడు తాను పుట్టిన
దేశపుభాషతో వీరు మాటలాడుట మనము వినుచు
9 న్నామే; ఇదేమి? । పార్తీయులు మాదీయులు
ఏలామీయులు మెసొపొతమియ యూదైయ కపదొ
కియ పొంతు ఆసియ ఫ్రుగియ పంఫులియ ఐగుప్తు అను
10 దేశములయందలివారు, । కురేనేదగ్గర లిబియ ప్రాంత
ములయందు కాపురమున్నవారు, రోమానుండి పర
వాసులుగా వచ్చియున్న యూదులు, యూదమత
11 ప్రవిష్టులు, । క్రేతీయులు అరబీయులు మొదలైన
మనమందరమును వీరు మన భాషలతో దేవుని గొప్ప
కార్యములను వివరించుట వినుచున్నామని చెప్పు
12 కొనిరి. । అందరు విభ్రాంతినొంది యెటుతోచక ఇదే
13 మగునో అని యొకనితో ఒకడు చెప్పుకొనిరి. । కొంద
రైతే—వీరు క్రొత్త మద్యముతో నిండియున్నారని
అపహాస్యము చేసిరి.
14 అయితే పేతురు ఆ పదునొకరితోకూడ లేచి
నిలిచి బిగ్గరగా వారితో ఇట్లనెను—యూదైయ మను
ష్యులారా, యెరూషలేములో కాపురమున్న సమస్త
జనులారా, యిది మీకు తెలియుగాక, చెవియొగ్గి నా
15 మాటలు వినుడి. । మీరు ఊహించునట్టు వీరు మత్తులు
16 కారు, ప్రొద్దుపొడిచి జామయిన కాలేదు. । యోవేలు
ప్రవక్తద్వారా చెప్పబడిన సంగతి యిదే, ఏమనగా
17 —అంత్యదినములయందు నేను
మనుష్యులందరిమీద నా ఆత్మను కుమ్మరించెదను
మీ కుమారులును మీ కుమార్తెలును ప్రవచించెదరు
మీ యౌవనులకు దర్శనములు కలుగును
మీ వృద్ధులు కలలు కందురు.
ఆ దినములలో నా దాసులమీదను నా దాసు 18
రాండ్రమీదను
నా ఆత్మను కుమ్మరించెదను గనుక వారు ప్రవ
చించెదరు
పైన ఆకాశమందు మహత్కార్యములను 19
క్రింద భూమిమీద సూచకక్రియలను
రక్తమును అగ్నిని పొగ ఆవిరిని కలుగజేసెదను.
ప్రభువు ప్రత్యక్షమగు ఆ మహాదినము రాక 20
మునుపు
సూర్యుడు చీకటిగాను చంద్రుడు రక్తముగాను
మారుదురు.
అప్పుడు ప్రభువు నామమునుబట్టి ప్రార్థనచేయు 21
వారందరును రక్షణపొందుదురు[1]
అని దేవుడు చెప్పుచున్నాడు.
ఇశ్రాయేలువారలారా, యీ మాటలు వినుడి. 22
దేవుడు నజరేయుడగు యేసుచేత అద్భుతములను
మహత్కార్యములను సూచకక్రియలను మీ మధ్యను
చేయించి, ఆయనను తనవలన మెప్పుపొందినవానిగా
మీకు కనుపరచెను; ఇది మీరే యెరుగుదురు. ।
దేవుడు నిశ్చయించిన సంకల్పమును ఆయన భవిష్యద్ 23
జ్ఞానమును అనుసరించి అప్పగింపబడిన యీయనను
మీరు దుష్టులచేత[2] సిలువవేయించి చంపితిరి. । మర 24
ణము ఆయనను బంధించియుండుట అసాధ్యము గనుక
దేవుడు మరణవేదనలు నివారణచేసి ఆయనను లేపెను.
ఆయనను గూర్చి దావీదు ఇట్లనెను 25
—నేనెల్లప్పుడు నా యెదుట ప్రభువును చూచు
చుంటిని
ఆయన నా కుడిపార్శ్వమున నున్నాడు గనుక నేను
కదల్చబడను.
కావున నా హృదయము ఉల్లసించెను; నా నాలుక 26
ఆనందించెను
మరియు నా శరీరము కూడ నిరీక్షణ కలిగి నిలకు
డగా ఉండును.
నీవు నా ఆత్మను పాతాళములో విడిచిపెట్టవు 27
నీ పరిశుద్ధుని కుళ్లుపట్టనియ్యవు.
నాకు జీవమార్గములు తెలిపితివి 28
నీ దర్శన మనుగ్రహించి నన్ను ఉల్లాసముతో
నింపెదవు.[3]
సహోదరులారా, మూలపురుషుడగు దావీదును 29
గూర్చి మీతో నేను ధారాళముగ మాటలాడవచ్చును.
అతడు చనిపోయి సమాధి చేయబడెను; అతని గోరీ
నేటివరకు మనమధ్య ఉన్నది. । అతడు ప్రవక్తయై 30
యుండెను గనుక

1 యోవేలు, 2: 28-32. 2 లేక, అక్రమకారులచేత. 3 కీర్తన, 16: 8-11.

—అతని గర్భఫలములోనుండి అతని సింహాసనము
మీద ఒకని కూర్చుండబెట్టుదును

అని[1] దేవుడు తనతో ప్రమాణపూర్వకముగా ఒట్టు
31 పెట్టుకొనిన సంగతి అతడెరిగి। క్రీస్తు[2] పాతాళములో
విడువబడలేదనియు, ఆయన శరీరము కుళ్లిపోలేదనియు
దావీదు ముందుగా తెలిసికొని ఆయన పునరుత్థాన
32 మునుగూర్చి చెప్పెను. । ఈ యేసును దేవుడు లేపెను;
33 దీనికి[3] మేమందరము సాక్షులము. । కాగా ఆయన
దేవుని కుడిపార్శ్వమునకు హెచ్చింపబడి, పరిశుద్ధాత్మను
గూర్చిన వాగ్దానమును తండ్రివలన పొంది, మీరు
చూచుచు వినుచునున్న దీని కుమ్మరించియున్నాడు. ।
34 దావీదు పరలోకమునకు ఎక్కిపోలేదు; అయితే అత
డిట్లనెను—

35 నేను నీ శత్రువులను నీ పాదములక్రింద పాదపీఠ
ముగా ఉంచుపర్యంతము
నీవు నా కుడిపార్శ్వమున కూర్చుండుమని
ప్రభువు నా ప్రభువుతో చెప్పెను.[4]

36 మీరు సిలువవేసిన యీ యేసునే దేవుడు ప్రభువు
గాను క్రీస్తుగాను నియమించెను. ఇది ఇశ్రాయేలు
వంశమంతయు రూఢిగా తెలిసికొనవలెనని చెప్పెను.
37 వారు ఈ మాట విని హృదయములో నొచ్చు
కొని[5]—సహోదరులారా, మేమేమి చేతుమని పేతు
38 రును కడమ అపొస్తలులను అడుగగా । పేతురు—
మీరు మారుమనస్సుపొంది, పాపక్షమాపణనిమిత్తము
ప్రతివాడు యేసుక్రీస్తు నామమున బాప్తిస్మము పొం
దుడి; అప్పుడు మీరు పరిశుద్ధాత్మ అను వరము పొందు
39 దురు. । ఈ వాగ్దానము మీకును మీ పిల్లలకును
దూరస్థులందరికిని, అనగా ప్రభువైన మన దేవుడు
తనయొద్దకు పిలిచిన వారికందరికిని చెందునని వారితో
40 చెప్పెను. । మరియు ఇంక అనేకవిధములైన మాట
లతో సాక్ష్యమిచ్చి—మీరు మూర్ఖులగు[6] ఈ తరము
వారికి వేరై రక్షణ పొందుడని వారిని హెచ్చరించెను. ।
41 కాబట్టి అతని వాక్యము అంగీకరించినవారు బాప్తి
స్మము పొందిరి; ఆ దినమందు ఇంచుమించు మూడు
42 వేలమంది చేర్చబడిరి. । వీరు అపొస్తలుల బోధయం
దును, సహవాసమందును, రొట్టె విరుచుటయందును,
ప్రార్థన చేయుటయందును ఎడతెగక యుండిరి.
43 అప్పుడు ప్రతివానికిని భయము కలిగెను. మరియు
అనేక మహాత్కార్యములును సూచకక్రియలును
44 అపొస్తలుల ద్వారా జరిగెను. । విశ్వసించినవారందరు
ఏకముగా కూడి తమకు కలిగినదంతయు సమష్టిగా
45 ఉంచుకొనిరి. । ఇదియుగాక వారు తమ చరస్థిరాస్తు
లను అమ్మి, అందరికిని వారి వారి అక్కరకొలది పంచి
46 పెట్టిరి. । మరియు వారేకమనస్కులై ప్రతిదినము
దేవాలయములో తప్పక కూడుకొనుచు, ఇంటింట
రొట్టె విరుచుచు, దేవుని స్తుతించుచు, ప్రజలందరి
వలన దయపొందినవారై । ఆనందముతోను నిష్కపట 47
మైన హృదయముతోను ఆహారము పుచ్చుకొనుచుం
డిరి. మరియు ప్రభువు రక్షణ పొందుచున్నవారిని
అనుదినము వారితో చేర్చుచుండెను.

పగలు మూడు గంటలకు ప్రార్థనకాలమున పేతు
రును యోహానును దేవాలయమునకు వెళ్లుచుండగా, ।
పుట్టినది మొదలుకొని కుంటివాడైన యొక మను 2
ష్యుడు మోసికొనిపోబడుచుండెను. వాడు దేవాల
యములోకి వెళ్లువారిని భిక్షమడుగుటకు కొందరు
ప్రతిదినము వానిని శృంగారమను దేవాలయపు ద్వా
రమునొద్ద ఉంచుచు వచ్చిరి. । పేతురును యోహా 3
నును దేవాలయములో ప్రవేశింపబోవుచున్నప్పుడు వాడు
చూచి భిక్షమడుగగా । పేతురును యోహానును వాని 4
తేరి చూచి—మాతట్టు చూడుమనిరి. । వాడు వారి 5
యొద్ద ఏమైన దొరుకునని కనిపెట్టుచు వారియందు
లక్ష్యముంచెను. । అంతట పేతురు—వెండి బంగార 6
ములు నాయొద్ద లేవు గాని నాకు కలిగినదే నీకిచ్చు
చున్నాను; నజరేయుడైన యేసుక్రీస్తు నామమున
నడువుమని చెప్పి । వాని కుడిచెయ్యి పట్టుకొని లేవ 7
నెత్తెను; వెంటనే వాని పాదములును చీలమండలును
బలము పొందెను. । వాడు దిగ్గున లేచి నిలిచి నడి 8
చెను; నడుచుచు గంతులు వేయుచు దేవుని స్తుతిం
చుచు వారితోకూడ దేవాలయములోకి వెళ్లెను. ।
వాడు నడుచుచు దేవుని స్తుతించుట ప్రజలందరు 9
చూచి । శృంగారమను దేవాలయపు ద్వారమునొద్ద 10
భిక్షముకొరకు కూర్చుండినవాడు వీడే అని గుర్తెరిగి,
వానికి జరిగినదాని చూచి విస్మయముతో నిండినవారై
పరవశులైరి.

వాడు పేతురును యోహానును పట్టుకొని యుం 11
డగా ప్రజలందరు విస్మయమొంది, సొలొమోనుదను
మంటపములో ఉన్న వారియొద్దకు గుంపుగా పరు
గెత్తివచ్చిరి. । పేతురు దీని చూచి ప్రజలతో ఇట్లనెను 12
—ఇశ్రాయేలీయులారా, మీరు వీని విషయమై యెం
దుకు ఆశ్చర్యపడుచున్నారు? మా స్వశక్తిచేతనైనను
భక్తిచేతనైనను నడువను వీనికి బలమిచ్చినట్టుగా మీ
రెందుకు మాతట్టు తేరి చూచుచున్నారు? । అబ్రా 13
హాము ఇస్సాకు యాకోబు అనువారి దేవుడు, అనగా
మన పితరుల దేవుడు తన సేవకుడైన యేసును మహిమ
పరచియున్నాడు; మీరాయనను అప్పగించితిరి,
పిలాతు ఆయనను విడుదల చేయుటకు నిశ్చయించి
నప్పుడు మీరు అతనియెదుట ఆయనను నిరాకరించి
తిరి. । మీరు పరిశుద్ధుడును నీతిమంతుడునైన వాని 14

1 కీర్తన, 132: 10, 11. 2 క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము. 3 లేక, ఈయనకు. 4 కీర్తన, 110: 1. 5 మూలభాషలో.. పొడువబడి. 6 మూలభా.—వంకరైన.

నిరాకరించి, నరహంతకుడైన మనుష్యుని మీకు అను
15 గ్రహింపుమని అడిగితిరి. । మీరు జీవాధిపతిని చంపి
తిరి గాని దేవుడు ఆయనను మృతులలోనుండి **లేపెను;**
16 అందుకు[1] మేము సాక్షులము. । ఆయన నామమందలి
విశ్వాసముమూలముగా ఆయన నామమే మీరు **చూచి**
యెరిగియున్న వీనిని బలపరచెను, ఆయనవలన **కలిగిన**
విశ్వాసమే మీ అందరియెదుట వీనికి ఈ సర్వాంగ
17 పుష్టి కలుగజేసెను. । సహోదరులారా, మీరును
మీ అధికారులును తెలియక చేసితిరని నాకు తెలి
18 యును. । అయితే దేవుడు తన క్రీస్తు శ్రమపడునని
సమస్త ప్రవక్తలనోట ముందుగా ప్రచురపరచిన విషయ
19 ములను ఈలాగు నెరవేర్చెను. । ప్రభువు సముఖము
20 నుండి విశ్రాంతి కాలములు వచ్చునట్లును । మీకొరకు
నియమించిన క్రీస్తుయేసును ఆయన పంపునట్లును
మీ పాపములు తుడిచివేయబడు నిమిత్తమును మారు
21 మనస్సు నొంది తిరుగుడి. । అన్నిటికి కుదురుబాటు
కాలములు వచ్చునని దేవుడు ఆదినుండి తన పరిశుద్ధ
ప్రవక్తలనోట పలికించెను. అంతపర్యంతము యేసు
22 పరలోక నివాసియైయుండుట ఆవశ్యకము. । మోషే
యిట్లనెను[2].— ప్రభువైన దేవుడు నావంటి యొక
ప్రవక్తను మీ సహోదరులలోనుండి మీకొరకు పుట్టిం
చును; ఆయన మీతో ఏమిచెప్పినను అన్నివిషయము
23 లలో మీరాయన మాట వినవలెను.[3] । ఆ ప్రవక్త
మాట వినని వాడు ప్రజలలో ఉండకుండ సర్వనాశన
24 మగునని నెను. । మరియు సమూయేలు **మొదలుకొని**
యెందరు ప్రవక్తలు ప్రవచించిరో వారందరు **ఈ దిన**
25 ములనుగూర్చి ప్రకటించిరి. । ఆ ప్రవక్తలకును, **దేవుడు**
అబ్రాహాముతో—నీ సంతానమందు భూలోకవంశ
ములన్నియు ఆశీర్వదింపబడునని చెప్పి మీ పితరులతో
చేసిన నిబంధనకును, మీరు వారసులై[4] యున్నారు. ।
26 దేవుడు తన సేవకుని పుట్టించి,[5] మీలో ప్రతివానిని
వాని దుష్టత్వమునుండి మళ్లించుటవలన మిమ్ము నాశీర్వ
దించుటకు ఆయనను మొదట మీయొద్దకు పంపెనని
చెప్పెను.

4 వారు ప్రజలతో మాటలాడుచుండగా యాజకు
2 లును దేవాలయపు అధిపతియు సద్దూకయ్యులును
వారు ప్రజలకు బోధించుటయు, యేసునుబట్టి మృతు
లలోనుండి పునరుత్థానము కలుగునని ప్రకటించు
3 టయు చూచి కలవరపడి వారిమీదికివచ్చి । వారిని
బలాత్కారముగా పట్టుకొని, సాయంకాలమైనందున
4 మరునాటివరకు వారిని కావలిలో ఉంచిరి. । వాక్యము
వినినవారిలో అనేకులు నమ్మిరి. వారిలో పురుషుల
సంఖ్య యించుమించు అయిదు వేలు ఆయెను.
5 మరునాడు వారి అధికారులును పెద్దలును శాస్త్రు
లును యెరూషలేములో కూడుకొనిరి. । ప్రధాన 6
యాజకుడైన అన్నయు కయపయు, యోహానును
అలెక్సంద్రును ప్రధానయాజకుని బంధువులందరును
వారితోకూడ ఉండిరి. । వారు పేతురును యోహా 7
నును మధ్యను నిలువబెట్టి—మీరు ఏ బలముచేత ఏ
నామమునుబట్టి దీని చేసితిరని అడుగగా । పేతురు పరి 8
శుద్ధాత్మతో నిండినవాడై యిట్లనెను — ప్రజల అధి
కారులారా, పెద్దలారా, । ఆ దుర్బలునికి చేయబడిన 9
ఉపకారమునుగూర్చి వాడు దేనివలన స్వస్థత పొందె
నని నేడు మమ్మును విమర్శించుచున్నారు గనుక ।
మీరందరును ఇశ్రాయేలు ప్రజలందరును తెలిసికొన 10
వలసినదేమనగా, మీరు సిలువవేసినట్టియు, మృతుల
లోనుండి దేవుడు లేపినట్టియునైన నజరేయుడైన యేసు
క్రీస్తు నామముననే వీడు స్వస్థతపొందినవాడై మీ
యెదుట నిలుచుచున్నాడు. । ఇల్లు కట్టువారైన మీరు 11
తృణీకరించిన రాయి ఆయనే; ఆ రాయి మూలకు
తలరాయి ఆయెను.[6] । మరి ఎవనివలనను రక్షణ కలు 12
గదు; ఈ నామముననే మనము రక్షణ పొందవలెను
గాని, ఆకాశముక్రింద మనుష్యులలో ఇయ్యబడిన
మరి ఏ నామమున రక్షణ పొందలేము.

వారు పేతురు యోహానుల ధైర్యమును చూచి 13
నప్పుడు వారు విద్యలేని పామరులని[7] గ్రహించి
ఆశ్చర్యపడి, వారు యేసుతోకూడ ఉండినవారని
గుర్తెరిగిరి. । స్వస్థతపొందిన ఆ మనుష్యుడు వారితో 14
కూడ నిలిచియుండుట చూచి యేమియు ఎదురు
చెప్పలేకపోయిరి. । అప్పుడు—సభ వెలుపలికి పొండని 15
వారి కాజ్ఞాపించి తమలోతాము ఆలోచన చేసి । —
ఈ మనుష్యులను మనమేమి చేయుదుము? వారిచేత 16
ప్రసిద్ధమైన సూచకక్రియ చేయబడియున్నదని
యెరూషలేములో కాపురమున్న వారికందరికి ప్రత్య
క్షమే; అది జరుగలేదని చెప్పజాలము. । అయినను ఇది 17
ప్రజలలో ఇంక వ్యాపింపకుండుటకై — ఇకమీదట
ఈ నామమునుబట్టి యే మనుష్యునితోనైనను మాట
లాడకూడదని మనము వారిని బెదరుపెట్టవలెనని చెప్పు
కొనిరి. । అప్పుడు వారిని పిలిపించి — మీరు యేసు 18
నామమునుబట్టి యెంతమాత్రమును మాటలాడకూడదు,
బోధింపను కూడదని వారికాజ్ఞాపించిరి. । అందుకు 19
పేతురును యోహానును వారిని చూచి—దేవుని మాట
వినుటకంటె మీ మాట వినుట దేవుని దృష్టికి న్యాయ
మా? మీరే చెప్పుడి; । మేము కన్నవాటిని విన్న 20
వాటిని చెప్పక యుండలేమని వారికి ఉత్తరమిచ్చిరి. ।
ప్రజలందరు జరిగినదానిగూర్చి దేవుని మహిమపరచు 21
చుండిరి గనుక సభవారు ప్రజలకు భయపడి, వీరిని
శిక్షించు విధమేమియు కనుగొనలేక వీరిని గట్టిగా బెద

1 లేక, అయినను 2 ద్వితీ. 18: 16–18. 3 లేక, వినుడు. 4 మూలభాషలో—కుమారులై. 5 లేక, లేపి. 6 కీర్తన, 118: 22.
7 లేక, సామాన్యులని.

22 రించి విడుదలచేసిరి. । స్వస్థపరచుట అను ఆ సూచక
క్రియ యెవని విషయములో చేయబడెనో వాడు
నలువది ఏండ్లకంటె ఎక్కువ వయస్సుగలవాడు.

23 వారు విడుదల నొంది తమ స్వజనులయొద్దకు వచ్చి,
ప్రధానయాజకులును పెద్దలును తమతో చెప్పిన మాట
24 లన్నిటిని వారికి తెలిపిరి. । వారు విని, యేకమన
స్సుతో దేవునికిట్లు బిగ్గరగా మొరపెట్టిరి. — నాథా,
నీవు ఆకాశమును భూమిని సముద్రమును వాటిలోని
సమస్తమును కలుగజేసినవాడవు.

25 —అన్యజనులు ఏల గల్లత్తు చేసిరి
26 ప్రజలెందుకు వ్యర్థమైన ఆలోచనలు పెట్టుకొనిరి
ప్రభువుమీదను ఆయన క్రీస్తుమీదను[1] భూరా
జులు లేచిరి, అధికారులును ఏకముగా కూడు
కొనిరి

అని నీవు పరిశుద్ధాత్మ ద్వారా మా తండ్రియు నీ సేవ
27 కుడునైన దావీదు నోట పలికించితివి.[2] । ఏవి జరుగవలె
28 నని నీ హస్తమును నీ సంకల్పమును ముందు నిర్ణయిం
చెనో వాటినన్నిటిని చేయుటకై నీవు అభిషేకించిన
నీ పరిశుద్ధ సేవకుడైన యేసుకు విరోధముగా హేరో
దును పొంతిపిలాతును అన్యజనులతోను ఇశ్రాయేలు
ప్రజలతోను ఈ పట్టణమందు నిజముగా కూడు
29 కొనిరి. । ప్రభువా, ఈ సమయమునందు వారి బెద
30 రింపులు చూచి । రోగులను స్వస్థపరచుటకును, నీ
పరిశుద్ధ సేవకుడైన యేసు నామము ద్వారా సూచక
క్రియలను మహాత్కార్యములను చేయుటకును నీ
చెయ్యి చాచియుండగా, నీ దాసులు బహు ధైర్య
ముగా నీ వాక్యమును బోధించునట్లు అనుగ్రహిం
31 చుము. । వారు ప్రార్థనచేయగానే వారు కూడి
యున్నచోటు కంపించెను; అప్పుడు వారందరు పరి
శుద్ధాత్మతో నిండినవారై దేవుని వాక్యమును ధైర్య
ముగా బోధించిరి.

32 విశ్వసించినవారందరును ఏకహృదయమును ఏ
కాత్మయు గలవారై యుండిరి. ఎవడును తనకు కలిగిన
వాటిలో ఏదియు తనదని అనుకొనలేదు; వారికి కలిగిన
33 దంతయు వారికి సమష్టిగా ఉండెను. । ఇదియుగాక
అపొస్తలులు బహు బలముగా ప్రభువైన యేసు[3]
పునరుత్థానమునకు సాక్ష్యమిచ్చిరి. దైవకృప అందరి
34 యందు అధికముగా ఉండెను. । భూములైనను ఇండ్లయి
నను కలిగినవారందరు వాటిని అమ్మి, అమ్మినవాటి వెల
తెచ్చి అపొస్తలుల పాదములయొద్ద పెట్టుచువచ్చిరి. ।
35 వారు ప్రతివానికి వానివాని అక్కరకొలది పంచి
పెట్టిరి గనుక వారిలో ఎవనికిని కొదువలేకపోయెను.
36 కుప్రలో పుట్టిన లేవీయుడగు యోసేపు అను
ఒకడుండెను. ఇతనికి అపొస్తలులు, హెచ్చరిక చేయు
వాడని అర్థమిచ్చు బర్నబా అను పేరు పెట్టియుం
డిరి. ఇతడు భూమిగలవాడై యుండి దానిని అమ్మి ।
దాని వెల తెచ్చి అపొస్తలుల పాదములయొద్ద పెట్టెను. 37

అననీయ అను ఒక మనుష్యుడు తన భార్యయైన 5
సప్పీరాతో ఏకమై పొలమమ్మెను. । భార్య యెరుకయే 2
వాడు దాని వెలలో కొంత దాచుకొని కొంత తెచ్చి
అపొస్తలుల పాదములయొద్ద పెట్టెను. । అప్పుడు 3
పేతురు—అననీయా, నీ భూమి వెలలో కొంత దాచు
కొని పరిశుద్ధాత్మను మోసపుచ్చుటకు సాతాను ఎందుకు
నీ హృదయమును ప్రేరేపించెను? । అది నీయొద్ద 4
నున్నప్పుడు నీదేగదా? అమ్మిన పిమ్మట అది నీ వశమై
యుండలేదా? యెందుకు ఈ సంగతి నీ హృదయ
ములో ఉద్దేశించుకొన్నావు? నీవు మనుష్యులతో
కాదు దేవునితోనేఅబద్ధమాడితివని వానితో చెప్పెను.।
అననీయ యీ మాటలు వినుచునే పడి ప్రాణము 5
విడువగా విన్నవారికందరికిని మిగుల భయము కలి
గెను; । అప్పుడు యౌవనస్థులు లేచి వానిని బట్టతో 6
చుట్టి మోసికొనిపోయి పాతిపెట్టిరి.

ఇంచుమించు మూడు గంటల సేపటికి వాని 7
భార్య జరిగినది ఎరుగక లోపలికి వచ్చెను. । అప్పుడు 8
పేతురు—మీరు ఆ భూమిని ఇంతకే అమ్మితిరా నాతో
చెప్పుమని ఆమెను అడిగెను. అందుకామె—అవును
ఇంతకే అని చెప్పెను. । అందుకు పేతురు—ప్రభువు 9
యొక్క ఆత్మను శోధించుటకు మీరెందుకు ఏకీభవించి
తిరి? ఇదిగో నీ పెనిమిటిని పాతిపెట్టినవారి పాద
ములు వాకిటనే యున్నవి; వారు నిన్నును మోసికొని
పోవుదురని ఆమెతో చెప్పెను. । వెంటనే ఆమె అతని 10
పాదములయొద్ద పడి ప్రాణము విడిచెను. ఆ యౌవన
స్థులు లోపలికి వచ్చి ఆమె చనిపోయినది చూచి
ఆమెను మోసికొనిపోయి, ఆమె పెనిమిటియొద్ద పాతి
పెట్టిరి. । సంఘమంతటికిని, ఈ సంగతులు వినిన 11
వారికందరికిని మిగుల భయము కలిగెను.

ప్రజలమధ్య అనేకమైన సూచకక్రియలును మహా 12
త్కార్యములును అపొస్తలులచేత చేయబడుచుండెను.
మరియు వారందరు ఏకమనస్కులై సొలొమోను
మంటపములో ఉండిరి. । కడమవారిలో ఎవడును 13
వారితో కలిసికొనుటకు తెగింపలేదు గాని । ప్రజలు 14
వారిని ఘనపరచుచుండిరి. పురుషులును స్త్రీలును అనే
కులు మరి ఎక్కువగ విశ్వాసులై ప్రభువు పక్షమున
చేర్చబడిరి. । అందుచేత పేతురు వచ్చుచుండగా జనులు 15
రోగులను వీధులలోకి తెచ్చి, వారిలో ఎవనిమీద
నైనను అతని నీడయైనను పడవలెనని మంచముల
మీదను పరుపులమీదను వారిని ఉంచిరి. । మరియు 16
యెరూషలేము చుట్టునుండు పట్టణముల జనులు రోగు
లను అపవిత్రాత్మలచేత పీడింపబడినవారిని మోసికొని
కూడివచ్చిరి. వారందరు స్వస్థతపొందిరి.

1 అనగా, అభిషిక్తునిమీదను. 2 కీర్తన, 2: 1, 2. 3 కొన్ని ప్రాచీనప్రతులలో–క్రీస్తు అని కూర్చబడియున్నది.

17 ప్రధానయాజకుడును అతనితోకూడ ఉన్నవారం
దరును, అనగా సద్దూకైయుల తెగవారు లేచి మత్సర
18 ముతో నిండుకొని । అపొస్తలులను బలాత్కారముగా
19 పట్టుకొని పట్టణపు చెరసాలలో ఉంచిరి. । అయితే
ప్రభువు దూత రాత్రివేళ ఆ చెరసాల తలుపులు
తీసి వారిని వెలపలికి తీసికొని వచ్చి — మీరు వెళ్లి
20 దేవాలయములో నిలువబడి । ఈ జీవమునుగూర్చిన
మాటలన్నియు ప్రజలతో చెప్పుడని వారితో అనెను. ।
21 వారామాట విని, తెల్లవారగానే దేవాలయములోకి
వెళ్లి బోధించుచుండిరి. ప్రధానయాజకుడును అత
నితోకూడ నున్నవారును వచ్చి, మహా సభవారిని
ఇశ్రాయేలీయుల పెద్దలనందరిని పిలువనంపించి —
వారిని తోడుకొని రండని బంట్రౌతులను బందీగృహ
22 మునకు పంపిరి. । బంట్రౌతులు అక్కడికి వెళ్లినప్పుడు
23 వారు చెరసాలలో కనబడనందున తిరిగివచ్చి । — బందీ
గృహము బహు భద్రముగా మూసియుండుటయు,
కావలివారు తలుపులముందర నిలిచియుండుటయు
చూచితిమి గాని తలుపులు తీసినప్పుడు లోపల మా
24 కొకడైనను కనబడలేదని వారికి తెలిపిరి. । అంతట
దేవాలయపు అధిపతియు ప్రధానయాజకులును ఆ
మాటలు విని — ఇది యేమవునో అని వారివిషయమై
25 యెటుతోచక యుండిరి. । అప్పుడొకడు వచ్చి —
ఇదిగో మీరు చెరసాలలో వేయించిన మనుష్యులు
దేవాలయములో నిలిచి ప్రజలకు బోధించుచున్నారని
26 వారికి తెలుపగా । అధిపతి బంట్రౌతులతోకూడ
పోయి, ప్రజలు రాళ్లతో కొట్టుదురేమో అని భయ
పడి, బలాత్కారము చేయకయే వారిని తీసికొని
27 వచ్చెను. । వారిని తీసికొనివచ్చి సభలో నిలువబెట్టగా ;
28 ప్రధానయాజకుడు వారిని చూచి—మీరు ఈ నామ
మునుబట్టి బోధింపకూడదని మేము మీకు ఖండిత
ముగా ఆజ్ఞాపింపలేదా? ఇదిగో మీరు యెరూషలే
మును మీ బోధతో నింపి, యీ మనుష్యుని హత్య[1]
మామీదికి తేవలెనని ఉద్దేశించుచున్నారని చెప్పెను. ।
29 అందుకు పేతురును అపొస్తలులును — మనుష్యులకు
30 కాదు దేవునికే మేము లోబడవలెను గదా. । మీరు
మ్రానున వ్రేలాడవేసి సంహరించిన యేసును మన పిత
31 రుల దేవుడు లేపెను. । ఇశ్రాయేలుకు మారుమనస్సును
పాపక్షమాపణను దయచేయుటకై దేవుడాయనను అధి
పతినిగాను రక్షకునిగాను తన దక్షిణహస్తబలముచేత
32 హెచ్చించి యున్నాడు. । మేమును, దేవుడు తనకు
విధేయులైనవారికి అనుగ్రహించిన పరిశుద్ధాత్మయు,
ఈ సంగతులకు సాక్షులమై యున్నామని చెప్పిరి.
33 వారు ఈ మాట విని అత్యాగ్రహము తెచ్చు
34 కొని[2] వీరిని చంప నుద్దేశించగా । సమస్త ప్రజలవలన
ఘనతనొందినవాడును ధర్మశాస్త్రోపదేశకుడునైన గమలీ
యేలను ఒక పరిసయ్యుడు మహా సభలో లేచి—ఈ
మనుష్యులను కొంతసేపు వెలుపల ఉంచుడని ఆజ్ఞా
పించి వారితో ఇట్లనెను । — ఇశ్రాయేలీయులారా, 35
యీ మనుష్యుల విషయమై మీరేమి చేయబోవు
చున్నారో జాగ్రత్త సుమండి. । ఈ దినములకు 36
మునుపు థూదా లేచి తానొక గొప్పవాడనని చెప్పు
కొనెను; ఇంచుమించు నన్నూరుమంది మనుష్యులు
వానితో కలిసికొనిరి, వాడు చంపబడెను, వానికి
లోబడినవారందరును చెదరి వ్యర్థులైరి. । వానికి తరు 37
వాత జనసంఖ్యదినములలో గలిలైయుడైన యూదా
అను ఒకడు వచ్చి ప్రజలను తనతోకూడ తిరుగబాటు
చేయ ప్రేరేపించెను; వాడుకూడ నశించెను, వానికి
లోబడినవారందరును చెదరిపోయిరి. । కాబట్టి నేను 38
మీతో చెప్పునదేమనగా—ఈ మనుష్యుల జోలికి పోక
వారిని విడిచిపెట్టుడి. ఈ ఆలోచనయైనను ఈ కార్య
మైనను మనుష్యులవలన కలిగినదాయెనా అది వ్యర్థ
మగును. । దేవునివలన కలిగినదాయెనా మీరు వారిని 39
వ్యర్థపరచలేరు; మీరొకవేళ దేవునితో పోరాడు
వారవుదురు సుమీ. । వారతని మాటకు సమ్మతించి, 40
అపొస్తలులను పిలిపించి కొట్టించి—యేసు నామమును
బట్టి బోధింపకూడదని ఆజ్ఞాపించి వారిని విడుదల
చేసిరి. । ఆ నామము కొరకు అవమానము పొందు 41
టకు పాత్రులని యెంచబడుటవలన వారు సంతో
షించుచు మహా సభయెదుటనుండి వెళ్లిపోయి । ప్రతి 42
దినము దేవాలయములోను ఇంటింటను మానక బోధిం
చుచు, యేసే క్రీస్తని ప్రకటించుచుండిరి.

ఆ దినములలో శిష్యుల సంఖ్య విస్తరించుచున్న 6
ప్పుడు అనుదిన పరిచర్యలో తమలోని విధవరాండ్రను
చిన్నచూపు చూచిరని హెబ్రీయులమీద హెల్లేని
స్తులు సణగసాగిరి. । అప్పుడు పన్నెండుగురు అపొస్త 2
లులు రమ యొద్దకు శిష్యుల సమూహమును పిలిచి—
మేము దేవుని వాక్యము బోధించుట మాని ధనము
పంచి పెట్టుట[3] యుక్తముకాదు. । కాబట్టి సహో 3
దరులారా, ఆత్మతోను జ్ఞానముతోను నిండుకొని
మంచిపేరు పొందిన యేడుగురు మనుష్యులను మీలో
ఏర్పరచుకొనుడి. మేము వారిని ఈ పనికి నియమిం
తుము; । అయితే మేము ప్రార్థనయందును వాక్యపరి 4
చర్యయందును ఎడతెగక యుందుమని చెప్పిరి. । ఈ 5
మాట యావన్మందికి ఇష్టమైనందున వారు, విశ్వాసము
తోను పరిశుద్ధాత్మతోను నిండుకొనినవాడైన స్తెఫనును,
ఫిలిప్పు, ప్రొకొరు, నికానోరు, తీమోను, పర్మెనాను,
యూదుల మతప్రవిష్టుడగు అంతియొకైయ నికొలాను
అనువారిని ఏర్పరచుకొని । వారిని అపొస్తలులయెదుట 6
నిలువబెట్టిరి; వీరు ప్రార్థనచేసి వారిమీద చేతులుం
చిరి

1 మూలభాషలో—రక్తము. మత్త. 27: 25 చూడుము. 2 మూలభా.—(హృదయమందు) కోయబడినవారై 3 మూలభా.—బల్లలయొద్ద పరిచర్యచేయుట.

7 దేవుని వాక్యము ప్రబలమై శిష్యుల సంఖ్య
యెరూషలేములో బహుగా విస్తరించెను; మరియు
యాజకులలో అనేకులు విశ్వాసమునకు లోబడిరి.
8 స్తెఫను కృపతోను బలముతోను నిండినవాడై
ప్రజలమధ్య మహత్కార్యములను గొప్ప సూచక
9 క్రియలను చేయుచుండెను. అప్పుడు లిబెర్తీనులదన
బడిన సమాజములోను, కురేనీయుల సమాజములోను,
అలెక్సంద్రియుల సమాజములోను, కిలికియనుండియు
ఆసియనుండియు వచ్చినవారిలోను, కొందరు వచ్చి
10 స్తెఫనుతో తర్కించిరి గాని మాటలాడుటయందు
అతడు అగుపరచిన జ్ఞానమును అతని ప్రేరేపించిన
11 ఆత్మను వారెదిరింపలేకపోయిరి. అప్పుడు వారు —
వీడు మోషేమీదను దేవునిమీదను దూషణవాక్య
ములు పలుకగా మేము వింటిమని చెప్పుటకు మనుష్యు
12 లను కుదుర్చుకొని ప్రజలను పెద్దలను శాస్త్రులను రేపి
13 అతనిమీదికి వచ్చి అతని పట్టుకొని మహా సభ
యొద్దకు తీసికొనిపోయి అబద్ధపు సాక్షులను నిలువ
బెట్టిరి. వారు—ఈ మనుష్యుడెప్పుడును ఈ పరిశుద్ధ
స్థలమునకును మన ధర్మశాస్త్రమునకును విరోధముగా
14 మాటలాడుచున్నాడు. ఈ నజరేయుడైన యేసు
ఈ చోటును పాడుచేసి, మోషే మనకిచ్చిన ఆచార
ములను మార్చునని వీడు చెప్పగా మేము వింటిమనిరి.
15 సభలో కూర్చున్నవారందరు అతనివైపు తేరిచూడగా
అతని ముఖము దేవదూత ముఖమువలె వారికి కన
బడెను.

7 ప్రధానయాజకుడు — ఈ మాటలు నిజమేనా
2 అని అడిగెను. అందుకు స్తెఫను చెప్పినదేమనగా —
సహోదరులారా తండ్రులారా వినుడి. మన పితరు
డైన అబ్రాహాము హారానులో కాపురముండక
మునుపు మెసొపొతమియలో ఉన్నప్పుడు మహిమ
3 గల దేవుడు అతనికి ప్రత్యక్షమై — నీవు నీ దేశ
మును నీ స్వజనమును విడిచి బయలుదేరి, నేను నీకు
చూపింపబోవు దేశమునకు రమ్మని అతనితో చెప్పెను.[1]
4 అప్పుడతడు కల్దీయులదేశమును విడిచిపోయి హారా
నులో కాపురముండెను. అతని తండ్రి చనిపోయిన
తరువాత అక్కడనుండి మీరిప్పుడు కాపురమున్న
యీ దేశమందు నివసించుటకై దేవుడతని తీసికొని
5 వచ్చెను. ఆయన ఇందులో అతనికి పాదము పట్టు
నంత భూమినైనను స్వాస్థ్యముగా ఇయ్యక, అతనికి
కుమారుడు లేనప్పుడు అతనికిని, అతని తరువాత అతని
సంతానమునకును దీనిని స్వాధీనపరతునని అతనికి
6 వాగ్దానముచేసెను.[2] అయితే దేవుడు — అతని సం
తానము అన్యదేశమందు పరవాసులగుదురనియు, ఆ
దేశస్థులు నన్నూరు సంవత్సరములమట్టుకు వారిని
దాస్యమునకు లోపరచుకొని బాధపెట్టుదురనియు
చెప్పెను. మరియు దేవుడు — ఏ జనమునకు వారు 7
దాసులై యుందురో ఆ జనమును నేను విమర్శచేయు
దుననియు, ఆ తరువాత వారు వచ్చి ఈ చోట నన్ను
సేవింతురనియు చెప్పెను. మరియు ఆయన సున్నతి 8
విషయమైన నిబంధన అతని కనుగ్రహించెను.[3] అతడు
ఇస్సాకును కని ఆ నిబంధన చొప్పున ఎనిమిదవ దిన
మందు అతనికి సున్నతిచేసెను; ఇస్సాకు యాకోబును
యాకోబు పన్నిద్దరు గోత్రకర్తలను కని వారికి సున్నతి
చేసిరి. ఆ గోత్రకర్తలు మత్సరపడి యోసేపును 9
ఐగుప్తులోకి పోవుటకు అమ్మివేసిరిగాని దేవుడతనికి
తోడైయుండి అతని శ్రమలన్నిటిలోనుండి తప్పించి
దయను జ్ఞానమును ఐగుప్తురాజైన ఫరోయెదుట అత 10
నికి అనుగ్రహించినందున ఫరో ఐగుప్తుకును తన యింటి
కంతటికిని అతనిని అధిపతిగా నియమించెను. తరు 11
వాత ఐగుప్తు దేశమంతటికిని కనాను దేశమంతటికిని
కరవును బహు శ్రమయు వచ్చెను గనుక మన పితరు
లకు ఆహారము లేకపోయెను. ఐగుప్తులో ధాన్యము 12
కలదని యాకోబు విని మన పితరులను అక్కడికి
మొదటిసారి పంపెను. వారు రెండవసారి వచ్చి 13
నప్పుడు యోసేపు తన అన్నదమ్ములకు తన్ను తెలియ
జేసికొనెను; అప్పుడు యోసేపుయొక్క వంశము
ఫరోకు తెలియనాయెను. యోసేపు తన తండ్రియైన 14
యాకోబును తన స్వజనులందరిని పిలువనంపెను, వారు
డెబ్బది యయిదుగురై యుండిరి. యాకోబు ఐగుప్తునకు 15
వెళ్లెను; అక్కడ అతడును మన పితరులును చని
పోయి అక్కడనుండి షెకెముకు తేబడి, షెకెములోని 16
హమోరు కుమారులయొద్ద అబ్రాహాము వెలయిచ్చి
కొనిన సమాధిలో ఉంచబడిరి. అయితే దేవుడు 17
అబ్రాహామునకు అనుగ్రహించిన వాగ్దాన కాలము
సమీపించినకొలది ప్రజలు ఐగుప్తులో విస్తారముగా
వృద్ధిపొందిరి. తుదకు యోసేపును ఎరుగని వేరొక
రాజు ఐగుప్తును ఏల నారంభించెను. ఇతడు మన 18
వంశస్థులయెడల కపటముగా ప్రవర్తించి తమ శిశువులు 19
బ్రదుకకుండ వారిని బయట పారవేయవలెనని మన
పితరులను బాధపెట్టెను. ఆ కాలమందు మోషే 20
పుట్టెను. అతడు దివ్యసుందరుడై తన తండ్రి యింట
మూడు నెలలు పెంచబడెను. తరువాత అతడు బయట 21
పారవేయబడినప్పుడు ఫరో కుమార్తె అతని తీసికొని
తన కుమారునిగా పెంచుకొనెను. మోషే ఐగుప్తీ 22
యుల సకల విద్యలను అభ్యసించి, మాటలయందును
కార్యములయందును ప్రవీణుడై యుండెను. అతనికి 23
నలువది ఏండ్లు నిండవచ్చినప్పుడు ఇశ్రాయేలీయులైన
తన సహోదరులను చూడవలెనన్న బుద్ధి పుట్టెను.
అప్పుడు వారిలో ఒకడు అన్యాయము ననుభవించుట 24
అతడు చూచి వాని రక్షించి బాధపడినవాని పక్ష

[1] ఆది. 12: 1. [2] ఆది. 12: 7. [3] ఆది. 17: 10. 21: 4.

25 మున ఐగుప్తీయుని చంపి ప్రతికారముచేసెను. । తన
ద్వారా తన సహోదరులకు దేవుడు రక్షణ దయ
చేయుచున్న సంగతి వారు గ్రహింతురని అతడు
26 తలంచెను గాని వారు గ్రహింపరైరి. । మరునాడు
ఇద్దరు పోట్లాడుచుండగా అతడు వారిని చూచి—
అయ్యలారా, మీరు సహోదరులు; మీరెందుకు
ఒకనికొకడు అన్యాయము చేసికొనుచున్నారని చెప్పి
27 వారిని సమాధానపరచ జూచెను. । అయినను తన
పొరుగువానికి అన్యాయము చేసినవాడు—మా మీద
అధికారినిగాను తీర్పరినిగాను నిన్ను నియమించిన
28 వాడెవడు? । నీవు నిన్న ఐగుప్తీయుని చంపినట్టు
నన్నును చంప దలచియున్నావా అని చెప్పి అతని
29 త్రోసివేసెను. । మోషే ఆ మాట విని పారిపోయి
మిద్యాను దేశములో పరవాసియైయుండి, అక్కడ
30 ఇద్దరు కుమారులను కనెను. । నలువది ఏండ్లయిన పిమ్మట
సీనాయి పర్వతారణ్యమందు ఒక పొదలోని అగ్ని
31 జ్వాలలో ఒక దేవదూత అతనికగుపడెను. । మోషే
చూచి ఆ దర్శనమునకు ఆశ్చర్యపడి దాని నిదానించి
32 చూచుటకు దగ్గరకు రాగా ।— నేను నీ పితరుల దేవు
డను, అబ్రాహాము ఇస్సాకు యాకోబుల దేవుడను
అని ప్రభువు వాక్కు[1] వినబడెను గనుక మోషే
33 వణకి, నిదానించి చూచుటకు తెగింపలేదు. । అందుకు
ప్రభువు—నీ చెప్పులు విడువుము; నీవు నిలిచియున్న
34 చోట్లు పరిశుద్ధభూమి । ఐగుప్తులోనున్న నా ప్రజల
దురవస్థను నేను నిదానించి చూచితిని; వారి మూలుగు
వింటిని, వారిని విడిపించుటకు దిగివచ్చియున్నాను;
రమ్ము, నేనిప్పుడు నిన్ను ఐగుప్తుకు పంపుదునని అత
35 నితో చెప్పెను.[2] ।— అధికారినిగాను తీర్పరినిగాను
నిన్ను నియమించినవాడెవడని వారు నిరాకరించిన యీ
మోషేను అతనికి పొదలో కనబడిన దేవదూత ద్వారా
దేవుడు అధికారినిగాను విమోచకునిగాను నియమించి
పంపెను.

36 ఇతడు ఐగుప్తులోను ఎఱ్ఱసముద్రములోను నలు
వది యేండ్లు అరణ్యములోను మహత్కార్యములను
సూచకక్రియలను చేసి వారిని తోడుకొని వచ్చెను.

37 —నావంటి యొక ప్రవక్తను దేవుడు మీ సహో
దరులలో మీకు పుట్టించును

అని ఇశ్రాయేలీయులతో చెప్పిన మోషే యితడే.[3] ।
38 సీనాయి పర్వతముమీద తనతో మాటలాడిన దేవ
దూతతోను మన పితరులతోను అరణ్యములోని సంఘ
ములో ఉండి మనకిచ్చుటకు జీవవాక్యములను తీసి
39 కొనినవాడితడే. । ఇతనికి మన పితరులు లోబడనొల్లక
యితని త్రోసివేసి, తమ హృదయములలో ఐగుప్తుకు
40 పోగోరినవారై ।— మాకు ముందు నడుచునట్టి దేవ
తలను మాకు చేయుము; ఐగుప్తుదేశములోనుండి మన
లను తోడుకొనివచ్చిన యీ మోషే యేమాయెనో
మాకు తెలియదని అహరోనుతో అనిరి. । ఆ దినము 41
లలో వారొక దూడను చేసికొని ఆ విగ్రహమునకు
బలి సమర్పించి, తమ చేతులతో నిర్మించిన వాటియందు
ఉల్లసించిరి. । అందుకు దేవుడు వారికి పరాఙ్ముఖుడై 42
ఆకాశసైన్యమును సేవించుటకు వారిని విడిచిపెట్టెను.
ఇందుకు ప్రమాణముగా ప్రవక్తల గ్రంథమందు
ఈలాగు వ్రాయబడియున్నది.[4]

—ఇశ్రాయేలు ఇంటివారలారా
మీరు అరణ్యములో నలువది యేండ్లు
బలి పశువులను అర్పణములను నాకు అర్పించితిరా?
మీరు పూజించుటకు చేసికొనిన ప్రతిమలైన 43
మొలెకు గుడారమును
రొంఫాయను దేవతయొక్క నక్షత్రమును మోసి
కొని పోతిరి

గనుక బాబెలు ఆవలికి మిమ్మును కొనిపోయెదను.
అతడు చూచిన మాదిరిచొప్పున దాని చేయవలెనని 44
మోషేతో చెప్పినవాడు ఆజ్ఞాపించిన ప్రకారము
సాక్ష్యపు గుడారము అరణ్యములో మన పితరుల
యొద్ద ఉండెను. । మన పితరులు (తమ పెద్దలచేత) 45
దాని తీసికొనినవారై, దేవుడు తమ యెదుటనుండి
వెళ్లగొట్టిన జనములను వారు స్వాధీనపరచుకొన్న
ప్పుడు, యెహోషువతోకూడ ఈ దేశములోకి దాని
తీసికొనివచ్చిరి. అది దావీదు దినములవరకు ఉండెను. ।
అతడు దేవుని దయపొంది యాకోబుయొక్క దేవునికి 46
నివాసస్థలము కట్టగోరెను. । అయితే సొలొమోను 47
ఆయనకొరకు మందిరము కట్టించెను. । అయినను 50

— ఆకాశము నా సింహాసనము
భూమి నా పాదపీఠము
మీరు నాకొరకు ఏలాటి మందిరము కట్టుదురు?
నా విశ్రాంతి స్థలమేది?
ఇవన్నియు నా హస్తకృతములు కావా?
అని ప్రభువు చెప్పుచున్నాడు

అని ప్రవక్త పలికిన ప్రకారము[5] సర్వోన్నతుడు హస్త
కృతాలయములలో నివసింపడు.

ముష్కరులారా, హృదయములను చెవులను దేవుని 51
వాక్యమునకు లోపరచనొల్లనివారలారా,[6] మీ పితరుల
వలె మీరును ఎల్లప్పుడు పరిశుద్ధాత్మను ఎదిరించు
చున్నారు. । మీ పితరులు ప్రవక్తలలో ఎవని హిం 52
సింపక యుండిరి? ఆ నీతిమంతుని రాకనుగూర్చి ముందు
తెలిపినవారిని చంపిరి. ఆయనను మీరు ఇప్పుడు అప్ప
గించి హత్యచేసినవారైతిరి. మీర్లు దేవదూతల 53

[1] నిర్గ. 3: 6. [2] నిర్గ. 3: 7–10 [3] ద్వితీ 18: 16, 18. [4] ఆమోసు 5: 25–27 [5] యెషయా, 66: 1, 2

[6] మూలభాషలో—వంచని మెడగలవారలారా, హృదయములయందును చెవులయందును సున్నతి పొందనివారలారా

ద్వారా నియమింపబడిన ధర్మశాస్త్రమును పొందితిరి గాని
దాని గైకొనలేదని చెప్పెను.
54 వారు ఈ మాటలు విని అత్యాగ్రహము తెచ్చు
55 కొని[1] అతని చూచి పండ్లుకొరికిరి. । అయితే అతడు
పరిశుద్ధాత్మతో నిండుకొనినవాడై ఆకాశమువైపు తేరి
చూచి, దేవుని మహిమను యేసు దేవుని కుడిపార్శ్వ
56 మందు నిలిచియుండుటను చూచి । — ఆకాశము
తెరవబడుటయు, మనుష్యకుమారుడు దేవుని కుడి
పార్శ్వమందు నిలిచియుండుటయు చూచుచున్నా
57 నని చెప్పెను. । అప్పుడు వారు పెద్ద కేకలువేసి చెవులు
58 మూసికొని యేకముగా అతనిమీద పడి । పట్టణపు
వెలపలికి అతని వెళ్లగొట్టి రాళ్లు రువ్వి చంపిరి. సాక్షులు
సౌలు అను ఒక యౌవనస్థుని పాదములయొద్ద తమ
59 వస్త్రములు పెట్టిరి. । ప్రభువునుగూర్చి మొరపెట్టుచు
—యేసు ప్రభువా, నా ఆత్మను చేర్చుకొనుమని స్తెఫను
పలుకుచుండగా వారు అతనిని రాళ్లతో కొట్టిరి. ।
60 అతడు మోకాళ్లూని — ప్రభువా, వారిమీద ఈ
పాపము మోపకుమని గొప్ప శబ్దముతో పలికెను;
ఈ మాట పలికి నిద్రించెను. సౌలు అతని చావుకు
సమ్మతించినవాడాయెను.

8 ఆ కాలమందు యెరూషలేములోని సంఘమునకు
గొప్ప హింస కలిగినందున అపొస్తలులు తప్ప అందరు
యూదైయ సమరైయ దేశములయందు చెదరిపోయిరి.।
2 భక్తిగల మనుష్యులు స్తెఫనును సమాధిచేసి అతనిగూర్చి
3 బహుగా ప్రలాపించిరి. । సౌలయితే ఇంటింట జొచ్చి
పురుషులను స్త్రీలను ఈడ్చుకొనిపోయి చెరసాలలో
వేయించి సంఘమును పాడుచేయుచుండెను.
4 కాబట్టి చెదరిపోయినవారు సువార్త వాక్యమును
5 ప్రకటించుచు సంచారముచేసిరి. । అప్పుడు ఫిలిప్పు
సమరైయ పట్టణమువరకును వెళ్లి క్రీస్తును వారికి ప్రక
6 టించుచుండెను. । జనసమూహములు విని ఫిలిప్పుచేసిన
సూచకక్రియలను చూచినందున అతడు చెప్పిన మాటల
7 యందు ఏకమనస్సుతో లక్ష్యముంచగా । అనేకులను
పట్టిన అపవిత్రాత్మలు పెద్ద కేకలువేసి వారిని వదలి
పోయెను; పక్షవాయువుగలవారును కుంటివారును
8 అనేకులు స్వస్థతపొందిరి. । అందుకు ఆ పట్టణములో
మిగుల సంతోషము కలిగెను.
9 సీమోనను ఒక మనుష్యుడు లోగడ ఆ పట్టణ
ములో గారడీచేయుచు, తానెవడో యొక గొప్పవా
డని చెప్పుకొనుచు, సమరైయ జనులను విభ్రాంతి
10 పరచుచుండెను. । కొద్దివాడు మొదలుకొని గొప్ప
వానిమట్టుకు అందరు — దేవుని మహాశక్తి యనబడిన
వాడు ఇతడే అని చెప్పుకొనుచు అతని లక్ష్యపెట్టిరి. ।
11 అతడు బహుకాలము గారడీలుచేయుచు వారిని
12 విభ్రాంతిపరచినందున వారతని లక్ష్యపెట్టిరి. । అయితే
ఫిలిప్పు దేవుని రాజ్యమునుగూర్చియు యేసుక్రీస్తు
నామమునుగూర్చియు సువార్త ప్రకటించుచుండగా
వారతని నమ్మి, పురుషులును స్త్రీలును బాప్తిస్మము పొం
దిరి. । అప్పుడు సీమోనుకూడ నమ్మి బాప్తిస్మముపొంది, 13
ఫిలిప్పును ఎడబాయకుండి, సూచకక్రియలును గొప్ప
అద్భుతములును జరుగుట చూచి విభ్రాంతినొందెను.
సమరైయవారు దేవుని వాక్యము అంగీకరించిరని 14
యెరూషలేములోని అపొస్తలులు విని పేతురును
యోహానును వారియొద్దకు పంపిరి. । వీరు వచ్చి వారు 15
పరిశుద్ధాత్మను పొందవలెనని వారికొరకు ప్రార్థన
చేసిరి. । అంతకుముందు వారిలో ఎవనిమీదను ఆయన 16
దిగియుండలేదు, వారు ప్రభువైన యేసు నామమున
బాప్తిస్మము మాత్రము పొందినవారై యుండిరి.
అప్పుడు పేతురును యోహానును వారిమీద చేతు 17
లుంచగా వారు పరిశుద్ధాత్మను పొందిరి. । అపొస్తలులు 18
చేతులుంచుటవలన పరిశుద్ధాత్మ అనుగ్రహింపబడెనని
సీమోను చూచి । వారియెదుట ద్రవ్యము పెట్టి — 19
నేనెవనిమీద చేతులుంచుదునో వాడు పరిశుద్ధాత్మను
పొందునట్లు ఈ అధికారము నాకియ్యుడని అడి
గెను. । అందుకు పేతురు — నీవు ద్రవ్యమిచ్చి దేవుని 20
వరము సంపాదించుకొందునని తలంచుకొనినందున్న నీ
వెండి నీతోకూడ నశించుగాక. । నీ హృదయము దేవుని 21
యెదుట సరియైనది కాదు గనుక యీ కార్యమందు
నీకు పాలుపంపులు లేవు. । కాబట్టి యీ నీ చెడు 22
తనము మానుకొని మారుమనస్సునొంది ప్రభువును
వేడుకొనుము; ఒకవేళ నీ హృదయాలోచన క్షమింప
బడవచ్చును; । నీవు ఘోరదుష్టత్వములోను[2] దుర్నీతి 23
బంధకములోను ఉన్నట్టు నాకు కనబడుచున్నదని
చెప్పెను. । అందుకు సీమోను—మీరు చెప్పినవాటిలో 24
ఏదియు నా మీదికి రాకుండ మీరే నాకొరకు ప్రభు
వును వేడుకొనుడని చెప్పెను.
అంతట వారు సాక్ష్యమిచ్చుచు ప్రభువు వాక్యము 25
బోధించి యెరూషలేముకు తిరిగి వెళ్లుచు, సమరై
యుల అనేక గ్రామములలో సువార్త ప్రకటించుచు
వచ్చిరి.
ప్రభువు దూత — నీవు లేచి దక్షిణముగా వెళ్లి 26
యెరూషలేమునుండి గాజాకుపోవు అరణ్యమార్గమును
కలిసికొమ్మని ఫిలిప్పుతో చెప్పగా అతడు లేచి వెళ్లెను. ।
అప్పుడు ఐతియొపీయుల రాణియైన కందాకే క్రింద 27
మంత్రియై ఆమెయొక్క ధనాగారమంతటిమీదనున్న
ఐతియొపీయుడైన నపుంసకుడు ఆరాధించుటకు
యెరూషలేముకు వచ్చియుండెను. । అతడు తిరిగి 28
వెళ్లుచు, తన రథముమీద కూర్చుండి ప్రవక్తయైన
యెషయా గ్రంథము చదువుచుండెను. । అప్పుడు 29
ఆత్మ ఫిలిప్పుతో — నీవు ఆ రథము దగ్గరకు పోయి

[1] మూలభావము.—తమ హృదయములయందు నరుకబడినవారై. [2] మూలభా.—చేదైన పైత్యములోను.

30 దాని కలిసికొనుమని చెప్పెను. । ఫిలిప్పు దగ్గరకు పరు
గెత్తికొనిపోయి అతడు ప్రవక్తయైన యెషయా గ్రం
థము చదువుచుండగా విని — నీవు చదువుచున్నది
31 గ్రహించుచున్నావా అని అడుగగా । అతడు—నా
కెవడైనను త్రోవ చూపకుంటే ఏలాగు గ్రహింపగల
నని చెప్పి, రథమెక్కి తనతో కూర్చుండుమని ఫిలిప్పును
32 వేడుకొనెను. । అతడు లేఖనమందు చదువుచున్న
భాగమేదనగా[1]—

ఆయన గొఱ్ఱెవలె వధకు తేబడెను
బొచ్చు కత్తిరించువాని యెదుట
గొఱ్ఱెపిల్ల ఏలాగు మౌనముగా ఉండునో
ఆలాగే ఆయన నోరు తెరవకుండెను.
33 ఆయన దీనత్వమునుబట్టి ఆయనకు న్యాయవిమర్శ
దొరకకపోయెను
ఆయన సంతానము ఎవరు వివరింతురు?
ఆయన జీవము భూమిమీదనుండి తీసివేయబడినది.

34 అప్పుడు నపుంసకుడు — ప్రవక్త యెవనిగూర్చి
యీలాగు చెప్పుచున్నాడు? తన్నుగూర్చియా, వేరొకని
గూర్చియా? దయచేసి నాకు తెలుపుమని ఫిలిప్పు
35 నడిగెను. । అందుకు ఫిలిప్పు నోరు తెరచి ఆ లేఖనమును
అనుసరించి అతనికి యేసునుగూర్చిన సువార్త ప్రక
36 టించెను. । వారు త్రోవలో వెళ్లుచుండగా నీళ్లున్న
38 యొక చోటికి వచ్చినప్పుడు నపుంసకుడు — ఇదిగో
నీళ్లు; నాకు బాప్తిస్మమిచ్చుటకు ఆటంకమేమని అడిగి
రథము నిలుపుమని ఆజ్ఞాపించెను.[2] ఫిలిప్పు నపుంస
కుడు ఇద్దరును నీళ్లలోకి దిగిరి. అంతట ఫిలిప్పు అతనికి
39 బాప్తిస్మమిచ్చెను. । వారు నీళ్లలోనుండి వెడలి వచ్చి
నప్పుడు ప్రభువు ఆత్మ ఫిలిప్పును కొనిపోయెను,
నపుంసకుడు సంతోషించుచు తన త్రోవను వెళ్లెను;
40 అతడు ఫిలిప్పును మరి యెన్నడును చూడలేదు. । అయితే
ఫిలిప్పు అజోతులో కనబడెను. అక్కడనుండి కైస
రైయకు వచ్చువరకు అతడు పట్టణములన్నిటిలో సంచ
రించుచు సువార్త ప్రకటించుచు వచ్చెను.

9 సౌలు ఇంక ప్రభువుయొక్క శిష్యులను బెదరిం
చుటయును హత్యచేయుటయును తనకు ప్రాణాధార
2 మైనట్టు ప్రధానయాజకునియొద్దకు వెళ్లి । యీ మార్గ
మందున్న పురుషులనైనను స్త్రీలనైనను కనుగొనిన
యెడల వారిని బంధించి యెరూషలేముకు తీసికొని
వచ్చుటకు దమస్కులోని సమాజములవారికి పత్రిక
3 లిమ్మని అడిగెను. । అతడు ప్రయాణముచేయుచు
దమస్కు దగ్గరకు వచ్చినప్పుడు, అకస్మాత్తుగా ఆకాశ
మునుండి యొక వెలుగు అతనిచుట్టు ప్రకాశించెను. ।
4 అప్పుడతడు నేలపడి—సౌలా సౌలా, నీవేల నన్ను
హింసించుచున్నావని తనతో ఒక శబ్దము పలుకుట
వినెను. ।—ప్రభువా, నీవెవడవని అతడడుగగా ఆయన 5
—నేను నీవు హింసించుచున్న యేసును; । లేచి పట్టణ 6
ములోకి వెళ్లుము, అక్కడ నీవు ఏమి చేయవలెనో అది
నీకు తెలుపబడునని చెప్పెను. । అతనితో ప్రయా 7
ణము చేసిన మనుష్యులు ఆ స్వరము వినిరి గాని
యెవనిని చూడక మౌనులై నిలువబడిరి. । సౌలు నేల 8
మీదనుండి లేచి కన్నులు తెరచినను ఏమియు చూడ
లేకపోయెను గనుక వారతని చెయ్యి పట్టుకొని దమ
స్కులోకి నడిపించిరి. । అతడు మూడు దినములు 9
దృష్టిలేనివాడై అన్నపానములేమియు పుచ్చుకొన
కుండెను.

దమస్కులో అననీయ అను ఒక శిష్యుడుండెను. 10
ప్రభువు దర్శనమందు—అననీయా, అని అతని పిలు
వగా । అతడు—ప్రభువా, యిదిగో నేనున్నాననెను. 11
అందుకు ప్రభువు—నీవు లేచి, తిన్ననిదనబడిన వీధికి
వెళ్లి, యూదా అనువాని యింట తార్సువాడైన
సౌలు అనువానికొరకు విచారించుము; ఇదిగో అతడు
ప్రార్థనచేయుచున్నాడు. । అతడు అననీయ అను 12
నొక మనుష్యుడు లోపలికి వచ్చి, తాను దృష్టిపొందు
నట్లు తనమీద చేతులుంచుట చూచియున్నాడని
చెప్పెను. । అందుకు అననీయ — ప్రభువా, యీ 13
మనుష్యుడు యెరూషలేములో నీ పరిశుద్ధులకు ఎంతో
కీడు చేసియున్నాడని అతనిగూర్చి అనేకులవలన విం
టిని. । ఇక్కడను నీ నామమునుబట్టి ప్రార్థనచేయు 14
వారినందరిని బంధించుటకు అతడు ప్రధానయాజకుల
వలన అధికారము పొందియున్నాడని ఉత్తరమిచ్చెను. ।
అందుకు ప్రభువు—నీవు వెళ్లుము, అన్యజనుల యెదు 15
టను రాజుల యెదుటను ఇశ్రాయేలీయుల యెదుటను
నా నామము భరించుటకు ఇతడు నేను ఏర్పరచు
కొనిన సాధనమైయున్నాడు.[3] । ఇతడు నా నామము 16
కొరకు ఎన్ని శ్రమలను అనుభవింపవలెనో నేను ఇత
నికి చూపుదునని అతనితో చెప్పెను. । అననీయ వెళ్లి 17
ఆ యింట ప్రవేశించి అతనిమీద చేతులుంచి—సౌలా
సహోదరుడా, నీవు వచ్చిన మార్గములో నీకు కన
బడిన ప్రభువైన యేసు, నీవు దృష్టిపొంది పరిశుద్ధాత్మతో
నింపబడునట్లు నన్ను పంపియున్నాడని చెప్పెను. ।
అప్పుడే అతని కన్నులనుండి పొరలవంటివి రాలగా 18
దృష్టి కలిగి, లేచి బాప్తిస్మము పొందెను; తరువాత
ఆహారము పుచ్చుకొని బలపడెను.

పిమ్మట అతడు దమస్కులోనున్న శిష్యులతోకూడ 19
కొన్ని దినములుండెను. । వెంటనే సమాజమందిరము 20
లలో — యేసే దేవుని కుమారుడని ఆయననుగూర్చి
ప్రకటించుచు వచ్చెను. । వినినవారందరు విభ్రాంతి 21
నొంది, యెరూషలేములో ఈ నామమునుబట్టి ప్రార్థన

1 యెషయా, 53: 7, 8. 2 కొన్ని ప్రాచీనప్రతులలో—ఫిలిప్పు — నీవు పూర్ణహృదయముతో విశ్వసించినయెడల పొందవచ్చునని చెప్పెను. అతడు—యేసుక్రీస్తు దేవుని కుమారుడని విశ్వసించుచున్నానని యుత్తరమిచ్చెను—అని కూర్చబడియున్నది. 3 మూలభాషలో—పాత్రయైయున్నాడు.

చేయువారిని నాశనము చేసినవాడితడే కాడా? వారిని
బంధించి ప్రధానయాజకులయొద్దకు కొనిపోవుటకు
22 ఇక్కడికికూడవచ్చియున్నాడని చెప్పుకొనిరి.। అయితే
సౌలు మరి ఎక్కువగా బలపడి—ఈయనే క్రీస్తు అని
రుజువుపరచుచు దమస్కులో కాపురమున్న యూదు
లను కలవరపరచెను.

23 అనేక దినములు గతించిన పిమ్మట యూదులు
24 అతని చంప నాలోచింపగా। వారి ఆలోచన సౌలుకు
తెలియవచ్చెను. వారు అతని చంపవలెనని దివా
రాత్రులు ద్వారములయొద్ద కాచుకొనుచుండిరి।
25 గనుక అతని శిష్యులు రాత్రివేళ అతని తీసికొనిపోయి
గంపలో ఉంచి గోడగుండ అతనిని క్రిందికి దింపిరి.
26 అతడు యెరూషలేములోకి వచ్చి శిష్యులతో
కలిసికొనుటకు యత్నముచేసెను గాని అతడు శిష్యు
27 డని నమ్మక అందరును అతనికి భయపడిరి.। అయితే
బర్నబా అతనిని దగ్గరతీసి అపొస్తలులయొద్దకు తోడు
కొనివచ్చి — అతడు త్రోవలో ప్రభువును చూచె
ననియు, ప్రభువు అతనితో మాటలాడెననియు,
అతడు దమస్కులో యేసు నామమునుబట్టి ధైర్య
ముగా బోధించెననియు, వారికి వివరముగా తెలియ
28 పరచెను.। అతడు యెరూషలేములో వారితోకూడ
29 వచ్చుచు పోవుచు, ప్రభువు నామమునుబట్టి ధైర్య
ముగా బోధించుచు, హెల్లేనిస్తులతో మాటలాడుచు
తర్కించుచునుండెను. వారు అతని చంప ప్రయత్నము
30 చేసిరి గాని। సహోదరులు దీని తెలిసికొని అతని
కైసరైయకు తోడుకొనివచ్చి తార్సుకు పంపిరి.

31 కావున యూదైయ గలిలైయ సమరైయ దేశ
ములయందంతట సంఘము క్షేమాభివృద్ధినొందుచు[1]
సమాధానము కలిగియుండెను; మరియు ప్రభువునందు
భయమును పరిశుద్ధాత్మ ఆదరణయు కలిగి నడుచు
కొనుచు విస్తరించుచుండెను.

32 ఆ తరువాత పేతురు సకల ప్రదేశములలో సం
చారముచేయుచు, లుద్దలో కాపురమున్న పరిశుద్ధుల
33 యొద్దకు వచ్చెను.। అక్కడ పక్షవాయువు కలిగి
యెనిమిది ఏండ్లనుండి మంచము పట్టియుండిన ఐనెయ
34 అను ఒక మనుష్యుని చూచి। పేతురు — ఐనెయా,
యేసుక్రీస్తు నిన్ను స్వస్థపరచుచున్నాడు, నీవు లేచి
నీ పరుపు నీవే పరుచుకొనుమని అతనితో చెప్పగా।
35 వెంటనే అతడు లేచెను. లుద్దలోను సారోనులోను
కాపురమున్నవారందరు అతని చూచి ప్రభువుతట్టు
తిరిగిరి.

36 మరియు యొప్పేలో తబితా అను ఒక శిష్యు
రాలు ఉండెను; ఆమెకు భాషాంతరమున దొర్కా[2]
అని పేరు. ఆమె సత్క్రియలను ధర్మకార్యములను
37 బహుగా చేసియుండెను. । ఆ దినములయందామె
కాయిలాపడి చనిపోగా, వారు శవమును కడిగి మేడ
గదిలో పరుండబెట్టిరి. । లుద్ద యొప్పేకు దగ్గరగా 38
ఉండుటచేత పేతురు అక్కడ ఉన్నాడని శిష్యులు
విని, అతడు తడవుచేయక తమయొద్దకు రావలెనని
వేడుకొనుటకు ఇద్దరు మనుష్యులను అతనియొద్దకు
పంపిరి. । పేతురు లేచి వారితోకూడ వెళ్లి అక్కడ 39
చేరినప్పుడు, వారు మేడగదిలోకి అతని తీసికొనివచ్చిరి;
విధవరాండ్రందరు వచ్చి యేడ్చుచు, దొర్కా తమతో
కూడ ఉన్నప్పుడు కుట్టిన అంగీలును వస్త్రములును
చూపుచు అతనియెదుట నిలిచిరి. । పేతురు అందరిని 40
వెలపలికి పంపి మోకాళ్లూని ప్రార్థనచేసి శవమువైపు
తిరిగి—తబితా, లెమ్మనగా ఆమె కన్నులు తెరచి పేతు
రును చూచి లేచి కూర్చుండెను. । అతడామెకు చెయ్యి 41
యిచ్చి లేవనెత్తి, పరిశుద్ధులను విధవరాండ్రను పిలిచి
ఆమెను సజీవురాలనుగా వారికి అప్పగించెను. । ఇది 42
యొప్పేయందంతట తెలిసినప్పుడు అనేకులు ప్రభువు
నందు విశ్వాసముంచిరి. । పేతురు యొప్పేలో సీమో 43
నను ఒక చర్మకారునియొద్ద బహుదినములు నివసిం
చెను.

ఇతలియ పటాలమనబడిన పటాలములో శతాధి 10
పతియైన కొర్నేలి అను భక్తిపరుడొకడు కైసరైయలో
ఉండెను. । అతడు తన యింటివారందరితోకూడ 2
దేవునియందు భయభక్తులు గలవాడైయుండి, ప్రజలకు
బహు ధర్మము చేయుచు ఎల్లప్పుడును దేవునికి ప్రార్థన
చేయువాడు. । పగలు ఇంచుమించు మూడు గంటల 3
వేళ దేవునిదూత అతనియొద్దకు వచ్చి—కొర్నేలీ, అని
పిలుచుట దర్శనమందు తేటగా అతనికి కనబడెను. ।
అతడు దూతవైపు తేరి చూచి భయపడి — ప్రభువా, 4
యేమని అడిగెను. అందుకు దూత — నీ ప్రార్థనలును
నీ ధర్మకార్యములును దేవుని సన్నిధికి జ్ఞాపకార్థముగా
చేరినవి. । ఇప్పుడు నీవు యొప్పేకు మనుష్యులను పంపి, 5
పేతురు అను మారుపేరుగల సీమోనును పిలిపించుము; ।
అతడు సముద్రపు దరినున్న సీమోనను ఒక చర్మకారుని 6
యింట దిగియున్నాడని అతనితో చెప్పెను. । అత 7
నితో మాటలాడిన దూత వెళ్లిన పిమ్మట అతడు తన
యింటి పనివారిలో ఇద్దరిని, తనయొద్ద ఎల్లప్పుడు కని
పెట్టుకొని యుండువారిలో భక్తిపరుడగు ఒక సైనికు
వానిని పిలిచి । వారికి ఈ సంగతులన్నియు వివరించి 8
వారిని యొప్పేకు పంపెను.

మరునాడు వారు ప్రయాణమైపోయి పట్టణము 9
నకు సమీపించినప్పుడు పగలు ఇంచుమించు పన్నెండు
గంటలకు పేతురు ప్రార్థనచేయుటకు మిద్దెమీది
కెక్కెను. । అతడు మిక్కిలి ఆకలిగొని భోజనము 10
చేయగోరెను; ఇంటివారు సిద్ధము చేయుచుండగా
అతడు పరవశుడై । ఆకాశము తెరవబడుటయు, 11

1 మూలభాషలో—కట్టబడుచు. 2 అనగా, లేడి.

క్షమాపణ పొందునని ప్రవక్తలందరు ఆయననుగూర్చి
సాక్ష్యమిచ్చుచున్నారనెను.
44 పేతురు ఈ మాటలు ఇంక చెప్పుచుండగా అతని
45 బోధవిన్నవారందరిమీదికి పరిశుద్ధాత్మ దిగెను. సున్నతి
46 పొందినవారిలో పేతురుతోకూడ వచ్చిన విశ్వాసు
లందరు, పరిశుద్ధాత్మ వరము అన్యజనులమీద సహి
తము కుమ్మరింపబడుట చూచి విభ్రాంతినొందిరి. ఏల
యనగా వారు భాషలతో మాటలాడుచు దేవుని
47 ఘనపరచుచునుండగా వినిరి. అందుకు పేతురు—
మనవలె పరిశుద్ధాత్మను పొందిన వీరు బాప్తిస్మము పొంద
కుండ ఎవడైనను నీళ్లకు ఆటంకము చేయగలడా అని
48 చెప్పి యేసుక్రీస్తు నామమందు వారు బాప్తిస్మము
పొందవలెనని ఆజ్ఞాపించెను. తరువాత కొన్ని దిన
ములు తమయొద్ద ఉండుమని వారతని వేడుకొనిరి.

11 అన్యజనులును దేవుని వాక్యమంగీకరించిరని
అపొస్తలులును యూదైయయందంతటనున్న సహో
2 దరులును వినిరి. పేతురు యెరూషలేముకు వచ్చి
3 నప్పుడు సున్నతి పొందినవారు— నీవు సున్నతి
పొందనివారియొద్దకు పోయి వారితోకూడ భోజనము
చేసితివని అతనితో వాదము పెట్టుకొనిరి.
4 అందుకు పేతురు మొదటనుండి వరుసగా వారికి
5 ఆ సంగతి ఈలాగు వివరించి చెప్పెను — నేను
యొప్పేపట్టణములో ప్రార్థనచేయుచుండగా పరవ
శుడనైతిని; అప్పుడొక దర్శనము నాకు కలిగెను; అది
ఏదనగా నాలుగు చెంగులు పట్టి దింపబడిన పెద్ద
దుప్పటివంటి యొక విధమైన పాత్ర ఆకాశమునుండి
6 దిగి నాయొద్దకు వచ్చెను. దానిపైపు నేను తేరి
చూచి పరీక్షింపగా భూమియందుండు చతుష్పాద
జంతువులును అడవి మృగములును ప్రాకెడు పురుగు
7 లును ఆకాశపక్షులును నాకు కనబడెను. అప్పుడు
—పేతురూ, నీవు లేచి చంపుకొని తినుమని యొక
8 శబ్దము నాతో చెప్పుట వింటిని. అందుకు నేను—
వద్దు ప్రభువా, నిషిద్ధమైనది అపవిత్రమైనది ఏదియు
9 నా నోట ఎన్నడును పడలేదని చెప్పగా రెండవ
మారు ఆ శబ్దము ఆకాశమునుండి—దేవుడు పవిత్రము
చేసినవి నీవు నిషిద్ధమైనవిగా ఎంచవద్దని ఉత్తరమిచ్చెను.
10 ఈలాగు ముమ్మారు జరిగెను; తరువాత అదంతయు
11 ఆకాశమునకు తిరిగి తీసికొనిపోబడెను. వెంటనే
కైసరయనుండి నాయొద్దకు పంపబడిన ముగ్గురు మను
ష్యులు మేమున్న యింటియొద్ద నిలిచియుండిరి.
12 అప్పుడు ఆత్మ—నీవు భేదమేమియు చేయక వారితో
కూడ వెళ్లుమని నాకు సెలవిచ్చెను. ఈ ఆరుగురు
సహోదరులు నాతోకూడ వచ్చిరి; మేము కొర్నేలి
ప్రవేశించితిమి. అప్పుడతడు—నీవు యొప్పేకు
ం పంపి పేతురు అను మారుపేరుగల
సీమోనును పిలిపించుము; నీవును నీ యింటివారంద 14
రును ఏ మాటలవలన రక్షణ పొందుదురో ఆ మాటలు
అతడు నీతో చెప్పునని, తన యింట నిలిచి తనతో
చెప్పిన యొక దేవదూతను చూచిన సంగతి మాకు
తెలిపెను. నేను మాటలాడ నారంభించినప్పుడు పరి 15
శుద్ధాత్మ మొదట మనమీదికి దిగిన ప్రకారము వారి
మీదికిని దిగెను. అప్పుడు —యోహాను నీళ్లతో 16
బాప్తిస్మమిచ్చెను గాని మీరు పరిశుద్ధాత్మలో[1] బాప్తి
స్మము పొందుదురని ప్రభువు చెప్పిన మాట నేను
జ్ఞాపకము చేసికొంటిని. కాబట్టి ప్రభువైన యేసు 17
క్రీస్తునందు విశ్వాసముంచిన మనకు అనుగ్రహించి
నట్టు దేవుడు వారికికూడ సమానవరము అనుగ్ర
హించియుండగా దేవుని అడ్డగించుటకు నేను ఏపాటి
వాడనని చెప్పెను. వారు ఈ మాటలు విని మరేమి 18
అడ్డము చెప్పక—అట్లయితే అన్యజనులకును దేవుడు
జీవార్థమైన మారుమనస్సు దయచేసి యున్నాడని
చెప్పుకొనుచు దేవుని మహిమపరచిరి.
స్తెఫను విషయములో కలిగిన శ్రమనుబట్టి చెదరి 19
పోయినవారు యూదులకు తప్ప మరి ఎవనికిని
వాక్యము బోధింపక, ఫేనీకే, కుప్ర, అంతియొకైయ
ప్రదేశములవరకు సంచరించిరి. కుప్రీయులు కొంద 20
రును కురేనీయులు కొందరును వారిలో ఉండిరి. వీరు
అంతియొకైయకు వచ్చి హెల్లేనీయులతో మాటలా
డుచు ప్రభువైన యేసునుగూర్చిన సువార్త ప్రకటిం
చిరి; ప్రభువు హస్తము వారికి తోడైయుండెను 21
గనుక నమ్మినవారనేకులు ప్రభువుతట్టు తిరిగిరి వారిని 22
గూర్చిన సమాచారము యెరూషలేములోనున్న సం
ఘపువారు విని బర్నబాను అంతియొకైయవరకు పం
పిరి. అతడు వచ్చి దేవుని కృపను చూచి సంతో 23
షించి, ప్రభువును స్థిరహృదయముతో హత్తుకొన
వలెనని అందరిని హెచ్చరించెను. అతడు పరిశుద్ధాత్మ 24
తోను విశ్వాసముతోను నిండుకొనిన సత్పురుషుడు;
బహు జనులు ప్రభువు పక్షమున చేరిరి. అంతట 25
అతడు సౌలును వెదకుటకు తార్సుకు వెళ్లి అతని కను
గొని అంతియొకైయకు తోడుకొని వచ్చెను. వారు 26
కలిసి యొక సంవత్సరమంతయు సంఘములో ఉండి
బహు జనులకు (వాక్యమును) బోధించిరి. మొట్ట
మొదట అంతియొకైయలో శిష్యులు క్రైస్తవులనబడిరి.
ఆ దినములయందు ప్రవక్తలు యెరూషలేమునుండి 27
అంతియొకైయకు వచ్చిరి. వారిలో అగబు అను ఒకడు 28
నిలువబడి, భూలోకమంతట గొప్ప కరవు రాబోవు
చున్నదని ఆత్మ ద్వారా సూచించెను. అది క్లౌదియ
చక్రవర్తి కాలమందు సంభవించెను. అప్పుడు శిష్యు 29
లలో ప్రతివాడును తన తన శక్తికొలది యూదైయలో
కాపురమున్న సహోదరులకు సహాయార్థముగా

1 లేక—పరిశుద్ధాత్మతో

30 సొమ్ము[1] పంపుటకు నిశ్చయించుకొనెను. । ఆలాగున
చేసి బర్నబా సౌలు అను వారిచేత పెద్దలయొద్దకు దాని
పంపిరి.

12 ఆ కాలమందు రాజైన హేరోదు సంఘపు
వారిలో కొందరిని బాధపెట్టుటకు బలాత్కారముగా
2 పట్టుకొని ; యోహాను సహోదరుడైన యాకోబును
3 ఖడ్గముతో చంపించెను. । ఇది యూదులకు ఇష్టమైన
కార్యమని తెలిసికొని పేతురును కూడ పట్టుకొనెను.
ఆ దినములు పులియని రొట్టెల పండుగ దినములు. ।
4 అతని పట్టుకొని చెరసాలలో వేయించి, పస్కాపండు
గైన పిమ్మట ప్రజలయొద్దకు అతని తేవలెనని ఉద్దేశించి,
అతనికి కావలియుండుటకు నాలుగు చతుష్టయముల
5 రాణువవారికి అతనిని అప్పగించెను. । పేతురు చెర
సాలలో ఉంచబడెను, అయితే సంఘము అతని
కొరకు అత్యాసక్తిగా దేవునికి ప్రార్థనచేయుచుండెను. ।
6 హేరోదు అతనిని వెలుపలికి తీసికొని రావలెనని
యుండగా, ఆ రాత్రియే పేతురు రెండు సంకెళ్లతో
బంధింపబడి యిద్దరు రాణువవారి మధ్య నిద్రించు
చుండెను; మరియు కావలివారు తలుపు ఎదుట చెర
7 సాల కాచుకొనుచుండిరి. । ఇదిగో ప్రభువు దూత
అతనిదగ్గర నిలిచెను; అతడుండిన అరలో వెలుగు
ప్రకాశించెను. దూత పేతురు ప్రక్కను తట్టి —
త్వరగా లెమ్మని చెప్పి అతని లేపగా సంకెళ్లు అతని
8 చేతులనుండి ఊడి పడెను. । అప్పుడు దూత అత
నితో — నీవు నడుము కట్టుకొని చెప్పులు తొడుగు
కొనుమనెను. అతడాలాగు చేసిన తరువాత దూత—
నీ వస్త్రము పైన వేసికొని నా వెంబడి రమ్మని అతనితో
9 చెప్పెను. । అతడు వెలుపలికి వచ్చి దూత వెంబడి వెళ్లి,
దూతవలన జరిగినది నిజముగా జరిగెనని గ్రహింపక,
10 తనకు దర్శనము కలిగెనని తలంచెను. । మొదటి కావ
లిని రెండవ కావలిని దాటి పట్టణమునకు పోవు ఇనుప
గవినియొద్దకు వచ్చినప్పుడు దానంతట అదే వారికి
తెరచుకొనెను. వారు బయలుదేరి యొక వీధి దాటిన
వెంటనే దూత అతని విడిచిపోయెను.

11 పేతురునకు తెలివివచ్చి — ప్రభువు తన దూతను
పంపి హేరోదు చేతిలోనుండియు, యూదులను
ప్రజలు నాకు చేయ నుద్దేశించిన వాటన్నిటినుండియు
నన్ను తప్పించియున్నాడని యిప్పుడు నాకు నిజ
12 ముగా తెలియుననని అనుకొనెను. । ఇట్లు ఆలోచించు
కొని అతడు మార్కు అను మారుపేరుగల యోహాను
తల్లియైన మరియ యింటికి వచ్చెను; అక్కడ అనే
13 కులు కూడి ప్రార్థనచేయుచుండిరి. । అతడు తల
వాకిటి తలుపు తట్టుచుండగా రొదే అను ఒక చిన్నది
14 ఆలకించుటకు వచ్చెను. । ఆమె పేతురు స్వరము గుర్తు
పట్టి సంతోషముచేత తలుపు తీయక లోపలికి పరు
గెత్తికొనిపోయి — పేతురు తలుపు దగ్గిర నిలుచున్నా
డని తెలిపెను. । అందుకు వారు — నీవు పిచ్చిదాన 15
వనిరి; అయితే తాను చెప్పినదే నిజమని ఆమె దృఢ
ముగా చెప్పినప్పుడు వారు — అతని దూత అనిరి. ।
పేతురు ఇంకను తట్టుచున్నందున వారు తలుపు తీసి 16
అతని చూచి విభ్రాంతి నొందిరి. । అతడు — ఊర 17
కుండుడని వారికి చేసైగచేసి, ప్రభువు తన్ను చెరసాల
లోనుండి యేలాగు తీసికొనివచ్చెనో వారికి వివరించి—
యాకోబుకును సహోదరులకును ఈ సంగతులు
తెలియజేయుడని చెప్పి బయలుదేరి వేరొక చోటికి
వెళ్లెను. । తెల్లవారగానే పేతురు ఏమాయెనో అని 18
రాణువవారిలో కలిగిన గలిబిలి యింతంతకాదు. ।
హేరోదు అతనికోసరము వెదకినప్పుడు అతడు కన 19
బడనందున కావలివారిని విమర్శించి వారిని చంప
నాజ్ఞాపించెను. అటుతరువాత హేరోదు యూదైయ
నుండి కైసరయకు వెళ్లి అక్కడ నివసించెను.

తూరీయులమీదను సీదోనీయులమీదను అతనికి 20
అత్యాగ్రహము కలిగినందున వారేకమనస్సుతో రాజు
నొద్దకు వచ్చి అంతఃపురమునకు పైవిచారణకర్తయగు
బ్లాస్తును తమ పక్షముగా చేసికొని సమాధానపడవలె
నని వేడుకొనిరి; ఎందుకనగా రాజుయొక్క దేశము
నుండి వారి దేశమునకు గ్రాసము వచ్చుచుండెను. ।
నియమింపబడిన దినమందు హేరోదు రాజవస్త్రములు 21
ధరించుకొని న్యాయపీఠముమీద కూర్చుండి వారి
యెదుట ఉపన్యాసముచేయగా । జనులు — ఇది దైవ 22
స్వరమేకాని మానవస్వరము కాదని కేకలువేసిరి. ।
అతడు దేవుని మహిమపరచనందున వెంటనే ప్రభువు 23
దూత అతని మొత్తెను గనుక పురుగులుపడి ప్రాణము
విడిచెను.

దేవుని వాక్యము ప్రబలమై వ్యాపించుచుండెను. 24
బర్నబాయు సౌలును తమ పరిచర్య నెరవేర్చిన 25
తరువాత మార్కు అను మారుపేరుగల యోహానును
వెంటబెట్టుకొని యెరూషలేమునుండి తిరిగి వచ్చిరి.

అంతియొకయలోనున్న సంఘములో బర్నబా, 13
నీగెరనబడిన సుమెయోను, కురేనీయుడైన లూకియ,
చతుర్థాధిపతియైన హేరోదుతోకూడ పెంచబడిన
మనయేను, సౌలు అను ప్రవక్తలును బోధకులును ఉం
డిరి. । వారు ప్రభువును సేవించుచు ఉపవాసము 2
చేయుచుండగా పరిశుద్ధాత్మ—నేను బర్నబాను సౌలును
పిలిచిన పనికొరకు వారిని నాకు ప్రత్యేకపరచుడని
వారితో చెప్పెను. । అంతట వారు ఉపవాసముండి 3
ప్రార్థనచేసి వారిమీద చేతులుంచి వారిని పంపిరి.
కాబట్టి వీరు పరిశుద్ధాత్మచేత పంపబడినవారై 4
సెలూకియకు వచ్చి అక్కడనుండి ఓడనెక్కి కుప్రకు
వెళ్లిరి. । వారు సలమీలో ఉండగా యూదుల 5

[1] మూలభాషలో—పరిచర్య.

నాలుగు చెంగులు పట్టి దింపబడిన పెద్ద దుప్పటివంటి
యొకవిధమైన పాత్ర భూమిమీదికి దిగివచ్చుటయు
12 చూచెను. । అందులో భూమియందుండు సకల విధము
లైన చతుష్పాద జంతువులును, ప్రాకు పురుగులును,
13 ఆకాశపక్షులును ఉండెను. । అప్పుడు — పేతురూ,
నీవు లేచి చంపుకొని తినుమని ఒక శబ్దమతనికి విన
14 బడెను. । అయితే పేతురు — వద్దు ప్రభువా, నిషిద్ధ
మైనది అపవిత్రమైనది ఏదైనను నేనెన్నడును తిన
15 లేదని చెప్పగా । — దేవుడు పవిత్రము చేసినవి నీవు
నిషిద్ధమైనవిగా ఎంచవద్దని మరల రెండవమారు ఆ
16 శబ్దము అతనికి వినబడెను. । ఈలాగు ముమ్మారు జరి
గెను. వెంటనే ఆ పాత్ర ఆకాశమునకెత్తబడెను.
17 పేతురు తనకు కలిగిన దర్శనమేమై యుండునో
అని తనలో తనకు ఎటుతోచక యుండగా, కొర్నేలి
పంపిన మనుష్యులు సీమోను ఇల్లు ఏదని విచారించి
తెలిసికొని, వాకిట నిలిచి యింటివారిని పిలిచి । —
18 పేతురు అను మారుపేరుగల సీమోను ఇక్కడ దిగి
19 యున్నాడా అని అడిగిరి । పేతురు ఆ దర్శనమును
గూర్చి యోచించుచుండగా ఆత్మ — ఇదిగో ముగ్గురు
20 మనుష్యులు నిన్ను వెదకుచున్నారు. । నీవు లేచి క్రిం
దికి దిగి సందేహింపక వారితోకూడ వెళ్లుము; నేను
21 వారిని పంపియున్నానని అతనితో చెప్పెను. । పేతురు
ఆ మనుష్యులయొద్దకు దిగివచ్చి — ఇదిగో మీరు వెదకు
వాడను నేనే; మీరు వచ్చిన కారణమేమని అడిగెను. ।
22 అందుకు వారు — నీతిమంతుడును, దేవునికి భయ
పడువాడును, యూద జనులందరివలన మంచి పేరు
పొందినవాడునైన శతాధిపతియగు కొర్నేలియను ఒక
మనుష్యుడున్నాడు; అతడు నిన్ను తన యింటికి
పిలువనంపించి నీవు చెప్పు మాటలు వినవలెనని పరిశుద్ధ
దూతవలన బోధింపబడెనని చెప్పిరి, అప్పుడు అతడు
వారిని లోపలికి పిలిచి ఆతిథ్యమిచ్చెను.
23 మరునాడు అతడు లేచి వారితోకూడ బయలు
దేరెను, యొప్పేవారైన కొందరు సహోదరులును
24 వారితోకూడ వెళ్లిరి; । మరునాడు వారు కైసరయలో
ప్రవేశించిరి. అప్పుడు కొర్నేలి తన బంధువులను
ముఖ్య స్నేహితులను పిలిపించి వారికొరకు కనిపెట్టు
25 కొని యుండెను. । పేతురు లోపలికి రాగా కొర్నేలి
అతనిని ఎదుర్కొని అతని పాదములమీద పడి నమ
26 స్కారము చేసెను. । అందుకు పేతురు — నీవు లేచి
నిలువుము, నేనుకూడ నరుడనే అని చెప్పి అతని లేవ
27 నెత్తి । అతనితో మాటలాడుచు లోపలికి వచ్చి, అనే
28 కులు కూడియుండుట చూచెను. । అప్పుడతడు —
అన్యజాతివానితో సహవాసము చేయుటయైనను,
అట్టివానిని ముట్టుకొనుటయైనను యూదునికి ధర్మము
కాదని మీకు తెలియును. అయితే ఏ మనుష్యుడును
నిషేధింపదగినవాడనియైనను అపవిత్రుడనియైనను
చెప్పకూడదని దేవుడు నాకు చూపించియున్నాడు. ।
కాబట్టి నన్ను పిలిచినప్పుడు అడ్డమేమియు చెప్పక వచ్చి 29
తిని గనుక, ఎందునిమిత్తము నన్ను పిలువనంపితిరో
దానిగూర్చి అడుగుచున్నానని వారితో చెప్పెను. ।
అందుకు కొర్నేలి — నాలుగు దినముల క్రిందట 30
పగలు మూడు గంటలు మొదలుకొని యీ వేళవరకు
నేను ఇంట ప్రార్థన చేయుచుండగా ప్రకాశమాన
మైన వస్త్రములు ధరించిన వాడొకడు నా యెదుట
నిలిచి । — కొర్నేలీ, నీ ప్రార్థన వినబడెను; నీ ధర్మ 31
కార్యములు దేవుని సముఖమందు జ్ఞాపకముంచబడి
యున్నవి గనుక నీవు యొప్పేకు వర్తమానము పంపి ।
పేతురు అను మారుపేరుగల సీమోనును పిలిపించుము; 32
అతడు సముద్రపు దరినున్న చర్మకారుడైన సీమోను
ఇంట దిగియున్నాడని నాతో చెప్పెను. । వెంటనే 33
నిన్ను పిలిపించితిని; నీవు వచ్చినది మంచిది. ప్రభువు
నీకు ఆజ్ఞాపించినవన్నియు వినుటకై యిప్పుడు మేమంద
రము దేవునియెదుట ఇక్కడ కూడియున్నామని
చెప్పెను. అందుకు పేతురు నోరు తెరచి ఇట్లనెను ।
— దేవుడు పక్షపాతి కాడని నిజముగా గ్రహించి 34
యున్నాను. । ప్రతి జనములోను ఆయనకు భయపడి 35
నీతిగా నడుచుకొనువానిని ఆయన అంగీకరించును. ।
యేసుక్రీస్తు అందరికి ప్రభువు. ఆయనద్వారా దేవుడు 36
సమాధానకరమైన సువార్తను ప్రకటించి ఇశ్రాయేలీ
యులకు పంపిన వర్తమానము మీరెరుగుదురు. ।
యోహాను బాప్తిస్మము ప్రకటించిన తరువాత గలిలైయ 37
మొదలుకొని యూదైయయందంతట ప్రసిద్ధమైన
సంగతి మీకు తెలియును. । అదేదనగా, దేవుడు నజ 38
రేయుడైన యేసును పరిశుద్ధాత్మతోను శక్తితోను అభి
షేకించెననునదియే. దేవుడాయనకు తోడైయుండెను
గనుక ఆయన మేలుచేయుచు, అపవాదిచేత[1] పీడింప
బడినవారినందరిని స్వస్థపరచుచు సంచరించుచుండెను. ।
ఆయన యూదులదేశమందును యెరూషలేమునం 39
దును చేసినవాటికన్నిటికిని మేము సాక్షులము. ఆయ
నను వారు మ్రానున వ్రేలాడదీసి చంపిరి. । దేవు 40
డాయనను మూడవ దినమున లేపి । ప్రజలకందరికి 41
కాక దేవునిచేత ముందుగా ఏర్పరచబడిన సాక్షులకే,
అనగా ఆయన మృతులలోనుండి లేచిన తరువాత
ఆయనతోకూడ అన్నపానములు పుచ్చుకొనిన మాకే,
ఆయన ప్రత్యక్షముగా కనబడునట్లు అనుగ్రహిం
చెను. । ఇదియుగాక దేవుడు సజీవులకును మృతుల 42
కును న్యాయాధిపతినిగా నియమించినవాడు ఈయనే
అని ప్రజలకు ప్రకటించి దృఢసాక్ష్యమియ్యవలెనని
మాకు ఆజ్ఞాపించెను. । ఆయనయందు విశ్వాసముంచు 43
వాడెవడో వాడు ఆయన నామమూలముగా పాప

1 అనగా—సాతానుచే

25 చితివి. । నీతిస్వరూపుడవగు తండ్రీ, లోకము నిన్ను
ఎరుగలేదు; నేను నిన్ను ఎరుగుదును; నీవు నన్ను పంపి
26 తివని వీరెరిగియున్నారు. । నీవు నాయందు ఉంచిన
ప్రేమ వారియందు ఉండునట్లును, నేను వారియందు
ఉండునట్లును, వారికి నీ నామమును తెలియజేసితిని,
ఇంకను తెలియజేసెదనని చెప్పెను.

**18** యేసు ఈ మాటలు చెప్పి తన శిష్యులతోకూడ
కెద్రోను వాగు దాటి పోయెను. అక్కడ ఒక తోట
యుండెను, దానిలోకి ఆయన తన శిష్యులతోకూడ
2 వెళ్లెను. । యేసు తన శిష్యులతో పలుమారు అక్కడికి
వెళ్లుచుండువాడు గనుక ఆయనను అప్పగించు యూదా
3 కును ఆ స్థలము తెలిసియుండెను. । కావున యూదా
రాణువవారిని, ప్రధానయాజకులును పరిసయ్యులును
పంపిన బంట్రౌతులను వెంటబెట్టుకొని, దివిటీలతోను
దీపములతోను ఆయుధములతోను అక్కడికి వచ్చెను. ।
4 యేసు తనకు సంభవింపబోవునవన్నియు ఎరిగినవాడై
వారియొద్దకు వెళ్లి—మీరెవని వెదకుచున్నారని వారిని
5 అడిగెను. । వారు—నజరేయుడైన యేసునని ఆయనకు
ఉత్తరమియ్యగా యేసు — నేనే ఆయనననని వారితో
చెప్పెను; ఆయనను అప్పగించిన యూదాయు వారి
6 యొద్ద నిలుచుండెను. । ఆయన — నేనే ఆయనననని
వారితో చెప్పగా వారు వెనుకకు తగ్గి నేల పడిరి. ।
7 రెండవసారి ఆయన — మీరు ఎవని వెదకుచున్నారని
వారిని అడిగెను; అందుకు వారు — నజరేయుడైన
8 యేసునని చెప్పగా । యేసు వారితో—నేనే ఆయనననని
మీతో చెప్పితిని గనుక మీరు నన్ను వెదకుచున్న
9 యెడల వీరిని పోనియ్యుడని చెప్పెను. । — నీవు నాకు
అనుగ్రహించినవారిలో ఒకనినైనను నేను పోగొట్టు
కొనలేదని ఆయన చెప్పిన మాట నెరవేరునట్లు ఈలాగు
10 చెప్పెను. । సీమోను పేతురునొద్ద కత్తియుండినందున
అతడు దాని దూసి ప్రధానయాజకుని దాసుని కొట్టి
11 అతని కుడిచెవి తెగనరికెను. । ఆ దాసుని పేరు మల్కు.
యేసు అది చూచి — కత్తి ఒరలో ఉంచుము; తండ్రి
నాకు అనుగ్రహించిన గిన్నెలోనిది నేను త్రాగకుం
దునా అని పేతురుతో అనెను.

12 అంతట రాణువవారును, సహస్రాధిపతియు,
యూదుల బంట్రౌతులును యేసును పట్టుకొని ఆయ
నను బంధించి, మొదట అన్నయొద్దకు ఆయనను తీసి
13 కొనిపోయిరి. । అతడు ఆ సంవత్సరము ప్రధానయాజ
14 కుడైన కయపకు మామ. । కయప—ఒక మనుష్యుడు
ప్రజలకొరకు చనిపోవుట ప్రయోజనకరమని యూదు
లకు ఆలోచన చెప్పినవాడు.

15 సీమోను పేతురును మరియొక శిష్యుడును యేసు
వెంబడి పోవుచుండిరి. ఆ శిష్యుడు ప్రధానయాజకునికి
నెళవైనవాడు గనుక అతడు ప్రధానయాజకుని యింటి
16 ముంగిటిలోకి యేసుతోకూడ వెళ్లెను. । పేతురు ద్వా
రమునొద్ద బయట నిలుచుండెను గనుక ప్రధానయాజ
కునికి నెళవైన ఆ శిష్యుడు బయటికి వచ్చి ద్వార
పాలకురాలితో మాటలాడి పేతురును లోపలికి తోడు
కొనిపోయెను. । ద్వారమునొద్ద కావలియున్న యొక 17
చిన్నది పేతురును చూచి — నీవును ఈ మనుష్యుని
శిష్యులలో ఒకడవు కావా అని చెప్పగా అతడు—
కాననెను. । అప్పుడు చలివేయుచున్నందున దాసు 18
లును బంట్రౌతులును మంటవేసి చలికాచుకొనుచు
నిలుచుండగా పేతురును వారితో నిలువబడి చలికాచు
కొనుచుండెను.

ప్రధానయాజకుడు ఆయన శిష్యులను గూర్చియు 19
ఆయన బోధను గూర్చియు యేసును అడుగగా । యేసు 20
— నేను బాహాటముగా లోకము ఎదుట మాటలాడి
తిని; యూదులందరు కూడివచ్చు సమాజమందిరము
లలోను దేవాలయములోను ఎల్లప్పుడును బోధించి
తిని; రహస్యముగా నేనేమియు మాటలాడలేదు. ।
నీవు నన్ను అడుగనేల? నేను వారికేమి బోధించినది 21
విన్నవారిని అడుగుము; ఇదిగో నేను చెప్పినది వీరెరు
గుదురని అతనితో అనెను. । ఆయన ఈ మాటలు 22
చెప్పినప్పుడు దగ్గర నిలిచియున్న బంట్రౌతులలో
ఒకడు — ప్రధానయాజకునికి ఈలాగు ఉత్తరమిచ్చు
చున్నావా అని చెప్పి యేసును అరచేతులతో కొట్టె
ను. । అందుకు యేసు—నేను కానిమాట ఆడిన పక్ష 23
మున ఆ కానిమాట ఏదో చెప్పుము; మంచిమాట
ఆడిన పక్షమున నన్నేల కొట్టుచున్నావనెను. । అం 24
తట అన్న యేసును బంధింపబడియున్నట్టుగానే
ప్రధానయాజకుడైన కయపయొద్దకు పంపెను.

సీమోను పేతురు నిలువబడి చలి కాచుకొనుచుం 25
డగా వారతని చూచి—నీవును ఆయన శిష్యులలో ఒక
డవు కావా అని చెప్పగా అతడు — నేను కాను,
నేనెరుగననెను. । పేతురు ఎవని చెవి తెగనరికెనో 26
వానికి బంధువును ప్రధానయాజకుని దాసులలో ఒక
డును—నీవు తోటలో అతనితోకూడ ఉండగా నేను
చూడలేదా అని చెప్పినందుకు । పేతురు నేనెరుగనని 27
మరియొకసారి చెప్పెను; వెంటనే కోడికూసెను.

వారు కయపయొద్దనుండి అధికారమందిరమునకు 28
యేసును తీసికొనిపోయిరి. అప్పుడు ఉదయమాయెను
గనుక వారు మైలపడకుండ పస్కాను భుజింపవలెనని
అధికారమందిరములోకి వెళ్లలేదు. । కావున పిలాతు 29
బయట ఉన్నవారియొద్దకు వచ్చి — ఈ మనుష్యుని
మీద మీరు ఏ నేరము మోపుచున్నారనెను. । అందుకు 30
వారు—వీడు దుర్మార్గుడు కానియెడల వీని నీకు అప్ప
గింపకుందుమని అతనితో చెప్పిరి. । పిలాతు—మీరతని 31
తీసికొనిపోయి మీ ధర్మశాస్త్రముచొప్పున అతనికి తీర్పు
తీర్చుడనగా । యూదులు—ఎవనికిని మరణశిక్ష విధిం 32
చుటకు మాకు అధికారములేదని అతనితో చెప్పిరి.

సమాజమందిరములలో దేవుని వాక్యము ప్రచురించు
చుండిరి. యోహాను వారికి ఉపచారము చేయువాడై
6 యుండెను. । వారు ఆ ద్వీపమంతట సంచరించి
పాఫు అను ఊరికి వచ్చినప్పుడు గారడీవాడును అబద్ధ
ప్రవక్తయునైన బర్ యేసు అను ఒక యూదుని చూ
7 చిరి. । ఇతడు వివేకముగలవాడైన సెర్గియ పౌలు అను
అధిపతియొద్దనుండెను; అతడు బర్నబాను సౌలును
8 పిలిపించి దేవుని వాక్యము వినగోరెను. । అయితే
ఎలుమ ఆ అధిపతిని విశ్వాసమునుండి తొలగింపవలె
నని యత్నముచేసి వారిని ఎదిరించెను. ఎలుమ అను
9 పేరుకు గారడీవాడని అర్థము. । అందుకు పౌలు
10 అనబడిన సౌలు పరిశుద్ధాత్మతో నిండినవాడై । అతని
తేరి చూచి—సమస్త కపటముతోను సమస్త దుర్మార్గము
తోను నిండినవాడా, అపవాది[1] కుమారుడా, సమస్త
నీతికి విరోధీ, నీవు ప్రభువుయొక్క తిన్నని మార్గములు
11 చెడగొట్టుట మానవా? । ఇదిగో ప్రభువు తన చెయ్యి
నీమీద ఎత్తియున్నాడు; నీవు కొంతకాలము గుడ్డి
వాడవై సూర్యుని చూడకుందువని చెప్పెను. వెంటనే
మబ్బును చీకటియు అతని కమ్మెను గనుక అతడు తిరు
గుచు ఎవరైన చెయ్యి పట్టుకొని నడిపింతురా అని
12 వెదకుచుండెను. । అంతట ఆ అధిపతి జరిగినదాని
చూచి ప్రభువు బోధకు ఆశ్చర్యపడి విశ్వసించెను.
13 తరువాత పౌలును అతనితోకూడ ఉన్నవారును
ఓడ ఎక్కి పాఫునుండి బయలుదేరి పంఫులియలో
నున్న పెర్గేకు వచ్చిరి. అచ్చట యోహాను వారిని
14 విడిచిపెట్టి యెరూషలేముకు తిరిగి వెళ్లెను. । అప్పుడు
వారు పెర్గేనుండి బయలుదేరి పిసిదియలోనున్న అంతి
యొకైయకు వచ్చి విశ్రాంతిదినమందు సమాజమంది
15 రములోకి వెళ్లి కూర్చుండిరి. । ధర్మశాస్త్రమును ప్రవక్తల
లేఖనములను చదివిన తరువాత సమాజమందిరపు అధి
కారులు—సహోదరులారా, ప్రజలకు మీరు ఏదైన
బోధవాక్యము చెప్పవలెనని యున్నయెడల చెప్పుడని
16 వారికి వర్తమానము చేసిరి. । అప్పుడు పౌలు నిలువబడి
చేసైగ చేసి ఇట్లనెను—
17 ఇశ్రాయేలీయులారా దేవునికి భయపడువార
లారా, వినుడి. ఇశ్రాయేలను ఈ ప్రజల దేవుడు
మన పితరులను ఏర్పరచుకొని, వారు ఐగుప్తు దేశ
మందు పరవాసులైయున్నప్పుడు ఆ ప్రజలను హె
చ్చించి, తన భుజబలముచేత వారి నక్కడనుండి తీసి
18 కొని వచ్చి । యించుమించు నలువది ఏండ్లమట్టుకు
19 అరణ్యములో వారి చేష్టలను సహించెను. । మరియు
కనాను దేశములో ఏడు జాతులవారిని నాశనముచేసి
వారి దేశములను వీరికి స్వాస్థ్యముగా పంచి యిచ్చె
20 ను. । ఇంచుమించు నన్నూట ఏబది సంవత్సరములు
జరిగెను. అటుతరువాత ప్రవక్తయైన సమూ
యేలువరకు ఆయన వారికి న్యాయాధిపతుల...
చేసెను. । ఆ తరువాత వారు రాజు కావలెనని
దేవుడు బెన్యామీను గోత్రీయుడును కీషు కు...
నైన సౌలును వారికి నలువది ఏండ్ల పర్యంతము...
చేసెను. । తరువాత అతని తొలగించి
వారికి రాజుగా ఏర్పరచెను. మరియు ఆయ...
యెష్షయి కుమారుడైన దావీదు నా యిష్టాను...
మనుష్యుడు, అతడు నా ఉద్దేశములన్నియు
నని కనుగొంటినని చెప్పి అతనిగూర్చి సాక్ష్య...
అతని సంతానమునుండి దేవుడు తన వా...
చొప్పున ఇశ్రాయేలుకొరకు రక్షకుడగు
పుట్టించెను. । ఆయన రాకముందు యోహా...
యేలు ప్రజలకందరికి మారుమనస్సు విషయ...
స్నము ప్రకటించెను. । యోహాను తన పనిని
చుండగా — నేనెవడనని మీరు ఊహించుచు...
నేను ఆయనను కాను; ఇదిగో నా వెనుక ఒక...
చున్నాడు, ఆయన కాళ్ల చెప్పులు విప్పుట...
పాత్రుడను కానని చెప్పెను.
సహోదరులారా, అబ్రాహాము వంశ...
దేవునికి భయపడువారలారా, యీ రక్షణ...
మనయొద్దకు పంపబడియున్నది. । యెరూష...
కాపురముండువారును, వారి అధికారులును...
నైనను, ప్రతి విశ్రాంతిదినమున చదువ...
ప్రవక్తల వచనములనైనను గ్రహింపక, ఆయ...
విధించుటచేత ఆ వచనములను నెరవేర్చిరి. ।
యందు మరణమునకు తగిన హేతువేదియు...
పోయినను ఆయనను చంపించవలెనని వారు...
వేడుకొనిరి. । వారు ఆయననుగూర్చి వ్రా...
విన్నియు నెరవేర్చిన తరువాత ఆయనను...
మీదనుండి దింపి సమాధిలో పెట్టిరి. । అయితే...
మృతులలోనుండి ఆయనను లేపెను. । ఆయ...
లైయనుండి యెరూషలేముకు తనతోకూడ...
వారికి అనేక దినములు కనబడెను; వారిప్పుడు...
యెదుట ఆయనకు సాక్షులైయున్నారు. ।
యేసును లేపి, పితరులకు చేసిన వాగ్దానము...
పిల్లలకు నెరవేర్చియున్నాడని మేమును మీకు...
ప్రకటించుచున్నాము. ఆలాగే
—నీవు నా కుమారుడవు నేడు నేను నిన్ను...
అని రెండవ కీర్తనయందు వ్రాయబడియున్న...
మరియు ఇకను కుళ్లుపట్టకుండ ఆయనను మృతులలో...
నుండి లేపుటనుబట్టి — దావీదుకు అనుగ్రహించి...
పవిత్రమైన వరములను మీకనుగ్రహింతును, అ...
నమ్మకములైనవని చెప్పెను. । కాబట్టి వేరొక...
యందు[3] — నీ పరిశుద్ధుని కుళ్లుపట్టనియ్యవని...

[1] అనగా—సాతాను. [2] కీర్తన, 2: 7. [3] కీర్తన, 16: 9.

6 చున్నాడు. । దావీదు దేవుని సంకల్పముచొప్పున తన
7 తరమువారికి సేవచేసి నిద్రించి తన పితరులయొద్దకు
చేర్చబడి కుళ్లిపోయెను గాని దేవుడు లేపినవాడు
8 కుళ్లుపట్టలేదు. । కాబట్టి సహోదరులారా, మీకు
ఈయన ద్వారానే పాపక్షమాపణ ప్రచురమగుచున్న
9 దనియు, । మీరు మోషే ధర్మశాస్త్రమువలన ఏ విషయ
ములలో నీతిమంతులుగా తీర్చబడలేకపోతిరో ఆ విష
యములన్నిటిలో, విశ్వసించు ప్రతివాడును ఈయన
వలననే నీతిమంతుడుగా తీర్చబడుననియు మీకు తెలి
0 యును గాక. । ప్రవక్తల గ్రంథమందు[1] చెప్పబడినది
మీమీదికి రాకుండ చూచుకొనుడి; అదేమనగా—

1 ఇదిగో తిరస్కరించువారలారా, ఆశ్చర్యపడుడి
నశించుడి
మీ దినములలో నేనొక కార్యము చేసెదను
ఆ కార్యము ఒకడు మీకు వివరించినను మీరెంత
మాత్రమును నమ్మరు.

2 వారు సమాజమందిరములోనుండి వెళ్లుచుండగా
ఈ మాటలను మరుసటి విశ్రాంతిదినమున తమతో
3 చెప్పవలెనని జనులు వేడుకొనిరి. । సమాజమందిరము
లోనివారు లేచిన తరువాత అనేకులు యూదులును
భక్తిపరులైన యూదమతప్రవిష్టులును పౌలును బర్న
బాను వెంబడించిరి. వీరు వారితో మాటలాడుచు,
దేవుని కృపయందు నిలుకడగా నుండవలెనని వారిని
హెచ్చరించిరి.

4 మరుసటి విశ్రాంతిదినమున దాదాపుగ ఆ పట్టణ
మంతయు దేవుని వాక్యము వినుటకు కూడివచ్చెను. ।
5 యూదులు జనసమూహములను చూచి మత్సరముతో
నిండుకొని దూషించుచు, పౌలు చెప్పినవాటికి అడ్డము
6 చెప్పిరి. । అప్పుడు పౌలును బర్నబాయు ధైర్యముగా
ఇట్లనిరి — దేవుని వాక్యము మొదట మీకు చెప్పుట
అవశ్యమే; అయినను మీరు దాని త్రోసివేసి, మిమ్మును
మీరే నిత్యజీవమునకు అపాత్రులుగా ఎంచుకొను
చున్నారు గనుక ఇదిగో మేము అన్యజనులయొద్దకు
7 వెళ్లుచున్నాము; । ఏలయనగా

— నీవు భూదిగంతములవరకు రక్షణార్థముగా
ఉండునట్లు
నిన్ను అన్యజనులకు వెలుగుగా ఉంచియున్నాను

8 అని ప్రభువు మాకాజ్ఞాపించెననిరి.[2] । అన్యజనులు ఆ
మాట విని సంతోషించి దేవుని వాక్యమును మహిమ
పరచిరి; మరియు నిత్యజీవమునకు నిర్ణయింపబడిన
9 వారందరు విశ్వసించిరి. । ప్రభువు వాక్యము ఆ ప్రదేశ
0 మందంతట వ్యాపించెను గాని యూదులు భక్తమర్యా
దలుగల స్త్రీలను ఆ పట్టణపు ప్రముఖులను రేపి పౌలు
కును బర్నబాకును హింస కలుగజేసి, వారిని తమ
1 ప్రాంతములనుండి వెళ్లగొట్టిరి. । వీరు తమ పాద
ధూళిని వారితట్టు దులిపివేసి ఈకొనియకు వచ్చిరి. ।
అయితే శిష్యులు ఆనందభరితులై పరిశుద్ధాత్మతో నిం 52
డినవారైరి.

ఈకొనియలో జరిగినదేమనగా, వారు కూడి 14
యూదుల సమాజమందిరములో ప్రవేశించి తేటగా
బోధించినందున అనేకులు యూదులును హెల్లే
నీయులును విశ్వసించిరి.[3] । అయితే అవిధేయులైన 2
యూదులు అన్యజనులను పురికొలిపి వారి మనస్సు
లలో సహోదరులమీద పగ పుట్టించిరి. । కాబట్టి 3
వారు ప్రభువును ఆనుకొని ధైర్యముగా మాటలాడుచు
అక్కడ బహుకాలము గడపిరి. ప్రభువు వారిచేత
సూచక క్రియలను మహత్కార్యములను చేయించి తన
కృపావాక్యమునకు సాక్ష్యమిచ్చుచుండెను. । ఆ పట్ట 4
ణపు జనసమూహములో భేదములు పుట్టగా కొందరు
యూదుల పక్షముగాను కొందరు అపొస్తలుల పక్షము
గాను ఉండిరి. । మరియు అన్యజనులును యూదు 5
లును తమ అధికారులతో కలిసి వారిమీద పడి వారిని
అవమానపరచి రాళ్లు రువ్వి చంపవలెనని యుండిరి. ।
వారాసంగతి తెలిసికొని లుకయోనియలోని పట్టణము 6
లగు లుస్త్రకును దెర్బేకును చుట్టుపట్లనున్న ప్రదేశమున
కును పారిపోయి అక్కడ సువార్త ప్రకటించుచుండిరి.

లుస్త్రలో బలహీన పాదములుగల యొకడుండెను. 7
అతడు పుట్టినది మొదలుకొని కుంటివాడై యెన్న 8
డును నడవలేక కూర్చుండియుండువాడు. । అతడు 9
పౌలు మాటలాడుట వినెను. పౌలు అతనివైపు తేరి
చూచి, స్వస్థత పొందుటకు అతనికి విశ్వాసముండెనని
గ్రహించి । — నీ పాదములు మోపి సరిగా నిలువు 10
మని బిగ్గరగా చెప్పినప్పుడు అతడు గంతులువేసి నడువ
సాగెను. । జనసమూహములు పౌలు చేసినదాని చూచి, 11
లుకయోనియ భాషలో—దేవతలు మనుష్యరూపము 12
తాల్చి మనయొద్దకు దిగి వచ్చియున్నారని కేకలువేసి,
బర్నబాకు ద్యుపతి అనియు, పౌలు ముఖ్యప్రసంగి
యైనందున అతనికి హెర్మే అనియు పేరు పెట్టిరి. ।
పట్టణమునకు ఎదురుగా ఉన్న ద్యుపతియొక్క పూ 13
జారి యెడ్లను పూదండలను ద్వారముల యొద్దకు తీసి
కొనివచ్చి సమూహముతో కలిసి, బలి అర్పింపవలెనని
యుండెను. । అపొస్తలులైన బర్నబాయు పౌలును 14
ఈ సంగతి విని, తమ వస్త్రములు చించుకొని సమూ
హములోనికి చొరబడి । — అయ్యలారా, మీరెందు 15
కీలాగు చేయుచున్నారు? మేము కూడ మీ స్వభా
వమువంటి స్వభావముగల నరులమే. మీరు ఈ వ్యర్థ
మైనవాటిని విడిచిపెట్టి, ఆకాశమును భూమిని సము
ద్రమును వాటిలో ఉండు సమస్తమును సృజించిన
జీవముగల దేవునివైపు తిరుగవలెనని మీకు సువార్త
ప్రకటించుచున్నాము. । ఆయన గతకాలములలో 16

[1] హం. 1: 5. [2] యెషయా, 42: 6, 7. [3] లేక—అనేకులు యూదులును హెల్లేనీయులును విశ్వసించులాగున బోధించిరి.

సమస్త జనులను తమ తమ మార్గములయందు నడువ
17 నిచ్చెను. । అయినను ఆయన ఆకాశమునుండి మీకు
వర్షమును ఫలవంతములైన రుతువులును దయచేయుచు,
ఆహారము అనుగ్రహించుచు, ఉల్లాసముతో మీ
హృదయములను నింపుచు, మేలు చేయుటచేత తన్ను
గూర్చి సాక్ష్యములేకుండ చేయలేదని బిగ్గరగా చెప్పిరి.।
18 వారీలాగు చెప్పి తమకు బలి అర్పింపకుండ సమూహ
ములను ఆపుట బహు ప్రయాసమాయెను.
19 అంతియొకైయనుండియు ఈకొనియనుండియు
యూదులు వచ్చి జనసమూహములను తమ పక్ష
ముగా చేసికొని, పౌలుమీద రాళ్లు రువ్వి అతడు చని
పోయెనని అనుకొని పట్టణము వెలపలికి అతనిని
20 ఈడ్చిరి. । అయితే శిష్యులు అతనిచుట్టు నిలిచియుం
డగా అతడు లేచి పట్టణములో ప్రవేశించి, మరునాడు
బర్నబాతోకూడ దెర్బేకు బయలుదేరిపోయెను. ।
21 వారు ఆ పట్టణములో సువార్త ప్రకటించి అనేకులను
శిష్యులనుగా చేసిన తరువాత లుస్త్రకును ఈకొనియకును
22 అంతియొకైయకును తిరిగి వచ్చి । శిష్యుల మనస్సులను
దృఢపరచి—విశ్వాసమందు నిలుకడగా ఉండవలెనని
యు, అనేక శ్రమలను అనుభవించి మనము దేవుని
రాజ్యములో ప్రవేశింపవలెననియు వారిని హెచ్చ
23 రించిరి. । మరియు ప్రతి సంఘములో వారికి పెద్ద
లను ఏర్పరచి ఉపవాసముండి ప్రార్థనచేసి, వారు
24 నమ్మిన ప్రభువుకు వారిని అప్పగించిరి. । తరువాత
పిసిదియదేశమంతట సంచరించి పంఫులియకు వచ్చిరి.।
25 మరియు పెర్గేలో వాక్యము బోధించి అత్తాలియకు
26 వెళ్లిరి. । అక్కడనుండి ఓడయెక్కి తాము నెరవేర్చిన
పని నిమిత్తము దేవునికృపకు అప్పగింపబడినవారై,
మొదట బయలుదేరిన అంతియొకైయకు తిరిగి వచ్చిరి.।
27 వారు వచ్చి సంఘమును సమకూర్చి, దేవుడు తమకు
తోడైయుండి చేసిన కార్యములన్నియు, అన్యజనులు
విశ్వసించుటకు ఆయన ద్వారము తెరచిన సంగతియు
28 వివరించిరి. । పిమ్మట వారు శిష్యులయొద్ద బహు
కాలము గడపిరి.

**15** కొందరు యూదైయనుండి వచ్చి—మీరు మోషే
నియమించిన ఆచారము చొప్పున సున్నతిపొందితేనే
గాని రక్షణ పొందలేరని సహోదరులకు బోధిం
2 చిరి. । పౌలుకును బర్నబాకును వారితో విశేష వివాద
మును తర్కమును కలిగినప్పుడు, ఈ అంశము విష
యమై పౌలును బర్నబాయు తమలో మరికొందరును
యెరూషలేముకు అపొస్తలులయొద్దకును పెద్దలయొద్ద
కును వెళ్లవలెనని సహోదరులు నిశ్చయించిరి. ।
3 కాబట్టి వారు సంఘమువలన సాగనంపబడి, ఫేనీకే
సమరైయ దేశములద్వారా వెళ్లుచు, అన్యజనులు
దేవునివైపు తిరిగిన సంగతి తెలియపరచి సహోదరుల
కందరికిని మహా సంతోషము కలుగజేసిరి. । వారు 4
యెరూషలేముకు రాగా సంఘపువారును అపొస్త
లులును పెద్దలును వారిని చేర్చుకొనిరి; వారు తమకు
దేవుడు తోడైయుండి చేసినవన్నియు వివరించిరి. ।
పరిసయ్యుల తెగలో విశ్వాసులైన కొందరు లేచి, 5
అన్యజనులకు సున్నతి చేయింపవలెననియు, మోషే
ధర్మశాస్త్రమును గైకొనుడని వారికి ఆజ్ఞాపింపవలెననియు
చెప్పిరి.

అప్పుడు అపొస్తలులును పెద్దలును ఈ సంగతిని 6
గూర్చి ఆలోచించుటకు కూడి వచ్చిరి. బహు తర్కము
జరిగిన తరువాత పేతురు లేచి వారితో ఇట్లనెను—

సహోదరులారా, ఆరంభమందు అన్యజనులు నా 7
నోట సువార్త వాక్యము విని విశ్వసించులాగున మీలో
నన్ను దేవుడు ఏర్పరచుకొనెనని మీకు తెలియును. ।
మరియు హృదయములను ఎరిగిన దేవుడు మనకు అను 8
గ్రహించినట్టుగానే వారికిని పరిశుద్ధాత్మను అను
గ్రహించి వారినిగూర్చి సాక్ష్యమిచ్చెను. । వారి హృద 9
యములను విశ్వాసమువలన పవిత్రపరచి మనకును
వారికిని ఏ భేదమైనను కనుపరచలేదు । గనుక మన 10
పితరులైనను మనమైనను మోయలేని కాడిని శిష్యుల
మెడమీద పెట్టి మీరెందుకు దేవుని శోధించుచు
న్నారు? । ప్రభువైన యేసు కృపచేత మనము రక్షణ 11
పొందుదుమని నమ్ముచున్నాము గదా? ఆలాగే వారును
రక్షణ పొందుదురు.

అప్పుడు ఆ సమూహమంతయు ఊరకుండి, బర్న 12
బాయు పౌలును తమ ద్వారా దేవుడు అన్యజనులలో
చేసిన సూచకక్రియలను మహత్కార్యములను వివరిం
చగా ఆలకించెను. । వారు చాలించిన తరువాత 13
యాకోబు ఇట్లనెను—సహోదరులారా, నా మాట
ఆలకించుడి. । అన్యజనులలోనుండి దేవుడు తన 14
నామముకొరకు ఒక జనమును ఏర్పరచుకొనుటకు
వారిని ఏలాగు మొదట కటాక్షించెనో సుమెయోను
వివరించియున్నాడు. । ఇందుకు ప్రవక్తల వాక్యములు 15
సరిపడియున్నవి, ఎట్లనగా[1]—

ఆ తరువాత నేను తిరిగి వచ్చెదను; 16
మనుష్యులలో కడమవారును
నా నామము ఎవరికి పెట్టబడెనో
ఆ సమస్తమైన అన్యజనులును ప్రభువును వెదకు
నట్లు
పడిపోయిన దావీదు గుడారమును తిరిగి కట్టెదను 17
దాని పాడైనవాటిని తిరిగి కట్టి దాని నిలువబెట్టెద
నని
అనాదికాలమునుండి ఈ సంగతులను తెలియపరచిన 18
ప్రభువు సెలవిచ్చుచున్నాడు

అని వ్రాయబడియున్నది. । కాబట్టి అన్యజనులలో 19

[1] ఆమోసు, 9: 11, 12.

నుండి దేవునివైపు తిరుగుచున్నవారిని మనము కష్ట
20 పెట్టక । విగ్రహాసంబంధముచేత కలుగు అపవిత్రతను,
జారత్వమును, గొంతుపిసికి చంపినదానిని, రక్తమును
విసర్జించుటకని వారికి పత్రిక వ్రాసి పంపవలెనని నా
21 అభిప్రాయము. । ఏలయనగా సమాజమందిరములలో
ప్రతి విశ్రాంతిదినమున మోషే లేఖనములు చదువుట
వలన మునుపటి తరములనుండి అతని (నియమమును)
ప్రకటించువారు ప్రతి పట్టణములో ఉన్నారని
చెప్పెను.

22 అప్పుడు సహోదరులలో ముఖ్యులైన బర్సబ్బా
అను మారుపేరుగల యూదాను సీలను తమలో ఏర్ప
రచుకొని, పౌలుతోను బర్నబాతోను అంతియొ
కయకు పంపుట యుక్తమని అపొస్తలులకును పెద్దల
23 కును సంఘమంతటికిని తోచెను. । వీరు వ్రాసి
వారిచేత పంపినదేమనగా — అపొస్తలులును పెద్దలైన
సహోదరులును అంతియొకయలోను, సురియలోను,
కిలికియలోను నివసించుచు అన్యజనులుగానుండిన
24 సహోదరులకు శుభము. । కొందరు మాయొద్దనుండి
వెళ్లి తమ బోధచేత మిమ్మును కలవరపరచి మీ మన
స్సులను చెరుపుచున్నారని వింటిమి. వారికి మేమాజ్ఞ
25 యిచ్చి యుండలేదు । గనుక మనుష్యులను ఏర్పరచి,
26 మన ప్రభువైన యేసుక్రీస్తు పేరుకొరకు తమ్మును తాము
అప్పగించుకొనిన బర్నబా పౌలు అను మన ప్రియు
లతోకూడ మీయొద్దకు పంపుట యుక్తమని మాకందర
27 కిని ఏకాభిప్రాయము కలిగెను. । కాగా యూదాను
సీలను పంపియున్నాము; వారును నోటిమాటతో ఈ
28 సంగతులు మీకు తెలియజేతురు. । విగ్రహార్పితము
29 లైనవాటిని, రక్తమును, గొంతు పిసికి చంపినదానిని,
జారత్వమును విసర్జింపవలెను. ఈ అవశ్యమైన వాటి
కంటె ఎక్కువైన యే భారమును మీ మీద మోప
కూడదని పరిశుద్ధాత్మకును మాకును తోచెను. వీటికి
దూరముగా ఉండుటకు జాగ్రత్తపడితిరా అది మీకు
మేలు. మీకు క్షేమము కలుగు గాక.

30 అంతట వారు సెలవు పుచ్చుకొని అంతియొకయకు
31 వచ్చి శిష్యులను సమకూర్చి ఆ పత్రిక ఇచ్చిరి. । వారు
దాని చదువుకొని అందువలన ఆదరణ కలిగి సంతో
32 షించిరి. । మరియు యూదాయు సీలయు కూడ
ప్రవక్తలై యుండినందున పెక్కుమాటలతో సహో
33 దరుల నాదరించి స్థిరపరచిరి. । వారు అక్కడ కొంత
34 కాలము గడపి సహోదరులయొద్దనుండి తమ్మును పం
పినవారియొద్దకు వెళ్లుటకు సమాధానముతో సెలవు
35 పుచ్చుకొనిరి. । అయితే పౌలును బర్నబాయు అంతి
యొకయలో నిలిచి, యింక అనేకులతోకూడ ప్రభువు
వాక్యము బోధించుచు ప్రకటించుచు నుండిరి.

36 కొన్ని దినములైన తరువాత పౌలు—ఏ యే పట్టణ
ములలో ప్రభువు వాక్యము ప్రచురపరచితిమో ఆ యా
ప్రతి పట్టణములో ఉన్న సహోదరులయొద్దకు
మనము తిరిగి వెళ్లి వారేలాగున్నారో చూతమని
బర్నబాతో అనెను. । అప్పుడు మార్కు అను మారు 37
పేరుగల యోహానును వెంటబెట్టుకొని పోవుటకు
బర్నబా యిష్టపడెను । అయితే పౌలు, పంఫులియలో 38
పనికొరకు తమతోకూడ రాకపోయి తమ్మును విడిచిన
వానిని వెంటబెట్టుకొని పోవుట యుక్తము కాదని
తలంచెను. । వారిలో తీక్షణమైన వాదము కలిగినందున 39
వారు ఒకని ఒకడు విడిచి వేరైపోయిరి. బర్నబా
మార్కును వెంటబెట్టుకొని ఓడ ఎక్కి కుప్రకు వెళ్లెను;।
పౌలు సీలను ఏర్పరచుకొని, సహోదరులచేత ప్రభువు 40
కృపకు అప్పగింపబడినవాడై బయలుదేరి, సంఘము 41
లను స్థిరపరచుచు సురియ కిలికియ దేశముల ద్వారా
సంచారము చేయుచుండెను.

తరువాత పౌలు దెర్బేకును లుస్త్రకును వచ్చెను. 16
అక్కడ తిమోథెయు అను ఒక శిష్యుడుండెను. అతడు
విశ్వసించిన యొక యూదురాలి కుమారుడు, అతని
తండ్రి హెల్లేనీయుడు. । అతడు లుస్త్రలోను ఈకొని 2
యలోను ఉన్న సహోదరులవలన మంచిపేరు పొం
దినవాడు । అతడు తనతోకూడ బయలుదేరి రావలె 3
నని పౌలు కోరి, అతని తండ్రి హెల్లేనీయుడని ఆ
ప్రదేశములోని యూదులకందరికి తెలియును గనుక
వారినిబట్టి అతని తీసికొని సున్నతి చేయించెను. ।
వారు ఆ యా పట్టణములద్వారా వెళ్లుచు, యెరూష 4
లేములోనున్న అపొస్తలులును పెద్దలును నిర్ణయించిన
విధులను గైకొనుటకు వాటిని వారికి అప్పగించిరి. ।
గనుక సంఘములు విశ్వాసమందు స్థిరపడి అనుదినము 5
లెక్కకు విస్తరించుచుండెను

ఆసియలో వాక్యము చెప్పకూడదని పరిశుద్ధాత్మ 6
వారి నాటంకపరచినందున వారు ఫ్రుగియ గలతీయ
ప్రదేశములద్వారా వెళ్లిరి. ముసియ దగ్గరకు వచ్చి
బితునియకు వెళ్లుటకు ప్రయత్నము చేసిరి గాని । యేసు 7
యొక్క ఆత్మ వారిని వెళ్లనియ్యలేదు. । అంతట వారు 8
ముసియను దాటిపోయి త్రోయకు వచ్చిరి. । అప్పుడు 9
మకెదోనియ దేశస్థుడైన యొకడు నిలిచి—నీవు మకె
దోనియకు వచ్చి మాకు సహాయము చేయుమని అతని
వేడుకొనుచున్నట్టు రాత్రివేళ పౌలునకు దర్శనము కలి
గెను. । అతనికి ఆ దర్శనము కలిగినప్పుడు వారికి 10
సువార్త ప్రకటించుటకు దేవుడు మమ్మును పిలిచి
యున్నాడని మేము నిశ్చయించుకొని వెంటనే మకె
దోనియకు బయలుదేరుటకు యత్నము చేసితిమి.

కాబట్టి మేము త్రోయను విడిచి ఓడ ఎక్కి 11
తిన్నగా సమొత్రాకెకును, మరునాడు నెయపొలికిని,
అక్కడనుండి ఫిలిప్పియకిని వచ్చితిమి. । మకెదోనియ 12
దేశములో ఆ ప్రాంతమునకు అది ముఖ్యపట్టణమును
రోమీయుల ప్రవాసస్థానమునై యున్నది. మేము

13 కొన్ని దినములు ఆ పట్టణములో ఉంటిమి. । విశ్రాంతి
దినమున గవిని దాటి నదీతీరమున ప్రార్థన జరుగునను
కొని అక్కడికి వచ్చి కూర్చుండి, కూడివచ్చిన స్త్రీలతో
14 మాటలాడుచుంటిమి. । అప్పుడు లుదియయను దైవ
భక్తిగల యొక స్త్రీ వినుచుండెను. ఆమె ధూమ్రవర్ణ
చూర్ణమును అమ్ము తుయతైర పట్టణస్థురాలు. ప్రభువు
ఆమె హృదయము తెరచెను గనుక పౌలు చెప్పిన
15 మాటలయందు లక్ష్యముంచెను. । ఆమెయు ఆమె
యింటివారును బాప్తిస్మము పొందినప్పుడు ఆమె—
మీరు నేను ప్రభువునందు విశ్వాసము గలదాననని
యెంచితే నా యింటికి వచ్చియుండుడని వేడుకొని
మమ్మును బలవంతము చేసెను.
16 (మరియొక సమయమున) మేము ప్రార్థనాస్థలము
నకు వెళ్లుచుండగా పుతోను అను దయ్యముపట్టినదై,
సోదెచెప్పుటచేత తన యజమానులకు బహు లాభము
సంపాదించుచున్న యొక చిన్నది మాకు ఎదురుగా
17 వచ్చెను. । ఆమె పౌలును మమ్మును వెంబడించి—ఈ
మనుష్యులు సర్వోన్నతుడైన దేవుని దాసులు; వీరు
మీకు రక్షణమార్గము ప్రచురించువారై యున్నారని
18 కేకలువేసి చెప్పెను. । ఆమె ఈలాగు అనేక దినములు
చేయుచుండెను గనుక పౌలు వ్యాకులపడి దానివైపు
తిరిగి—నీవు ఈమెను వదలిపొమ్మని యేసుక్రీస్తు నామ
మున ఆజ్ఞాపించుచున్నానని ఆ దయ్యముతో చెప్పెను;
తత్క్షణమే అది ఆమెను వదలిపోయెను.
19 ఆమె యజమానులు తమ లాభసాధనము పోయె
నని చూచి, పౌలును సీలను పట్టుకొని గ్రామపు
చావడిలోకి అధికారులయొద్దకు ఈడ్చుకొని పోయిరి.।
20 అంతట న్యాయాధిపతులయొద్దకు వారిని తీసికొనివచ్చి
21 —ఈ మనుష్యులు యూదులై యుండి । రోమీ
యులమైన మనము అంగీకరించుటకైనను చేయుటకైనను
కూడని ఆచారములు ప్రచురించుచు, మన పట్టణము
22 గలిబిలి చేయుచున్నారని చెప్పిరి. । అప్పుడు జనసమూ
హము వారిమీదికి దొమ్మిగా వచ్చెను. న్యాయాధిపతు
లును వారి వస్త్రములు లాగివేసి వారిని బెత్తములతో
23 కొట్టవలెనని ఆజ్ఞాపించిరి. । వారు చాల దెబ్బలు కొట్టి
వారిని చెరసాలలో వేసి భద్రముగా కనిపెట్టవలెనని
24 చెరసాల నాయకునికాజ్ఞాపించిరి. । అతడు అట్టి ఆజ్ఞను
పొంది, వారిని లోపలి చెరసాలలోకి త్రోసి, వారి
25 కాళ్లకు బొండవేసి బిగించెను. । అయితే మధ్యరాత్రి
వేళ పౌలును సీలయు దేవునిగూర్చి ప్రార్థించుచు
కీర్తనలు పాడుచునుండిరి; ఖయిదీలు వారు పాడుట
26 వినుచుండిరి. । అప్పుడు అకస్మాత్తుగా మహా భూకం
పము కలిగెను, చెరసాల పునాదులు అదరెను, వెం
టనే తలుపులన్నియు తెరచుకొనెను, అందరి బంధక
27 ములు ఊడెను. । అంతలో చెరసాల నాయకుడు
మేలుకొని, చెరసాల తలుపులన్నియు తెరచియుం
డుట చూచి, ఖయిదీలు పారిపోయిరనుకొని, కత్తిదూసి
తన్నుతాను చంపుకొనబోయెను. । అప్పుడు పౌలు 28
—నీకు నీవు ఏ హానియు చేసికొనవద్దు, మేమందరము
ఇక్కడనే యున్నామని బిగ్గరగా చెప్పెను. । అతడు 29
దీపము తెమ్మని చెప్పి లోపలికి దుమికివచ్చి, వణకుచు
పౌలుకును సీలకును సాగిలపడి । వారిని వెలపలికి తీసి 30
కొని వచ్చి—అయ్యలారా, రక్షణపొందుటకు నేనేమి
చేయవలెననెను. । అందుకు వారు—ప్రభువైన యేసు 31
నందు విశ్వాసముంచుము, అప్పుడు నీవును నీ యింటి
వారును రక్షణ పొందుదురని చెప్పి । అతనికిని అతని 32
ఇంటనున్నవారికందరికిని దేవుని వాక్యము బోధిం
చిరి. । రాత్రి ఆ గడియలోనే అతడు వారిని తీసికొని 33
వచ్చి వారి దెబ్బల గాయములు కడిగెను; వెంటనే
అతడును అతని ఇంటివారందరును బాప్తిస్మము పొం
దిరి. । మరియు అతడు వారిని ఇంటికి తోడుకొని 34
వచ్చి భోజనము పెట్టి, దేవునియందు విశ్వాసముంచిన
వాడై తన ఇంటివారందరితో కూడ ఆనందించెను.
ఉదయమైనప్పుడు న్యాయాధిపతులు—ఆ మను 35
ష్యులను విడుదలచేయుమని చెప్పుటకు వేత్రధరులను
పంపిరి. । చెరసాల నాయకుడీమాటలు పౌలుకు తెలిపి 36
—మిమ్మును విడుదలచేయుమని న్యాయాధిపతులు వర్త
మానము పంపియున్నారు గనుక మీరిప్పుడు బయలు
దేరి సుఖముగా పొండని చెప్పెను. । అయితే, పౌలు 37
—వారు న్యాయము విచారింపకయే రోమీయుల
మైన మమ్మును బహిరంగముగా కొట్టించి చెరసాలలో
వేయించి, యిప్పుడు మమ్మును రహస్యముగా వెళ్ల
గొట్టుదురా? మేము ఒప్పము; వారే వచ్చి మమ్మును
వెలపలికి తీసికొని పోవలెనని చెప్పెను. । ఆ వేత్ర 38
ధరులు ఈ మాటలు న్యాయాధిపతులకు తెలపగా,
వీరు రోమీయులన్నవార్త వారు విని భయపడి వచ్చి ।
వారిని బ్రతిమాలుకొని వెలపలికి తీసికొనిపోయి— 39
పట్టణము విడిచిపొండని వారిని వేడుకొనిరి. । వారు 40
చెరసాలలోనుండి వెలపలికి వచ్చి లుదియ యింటికి
వెళ్లిరి; అక్కడి సహోదరులను చూచి ఆదరించి
బయలుదేరి పోయిరి.

వారు అంఫిపొలి అపొల్లోనియ పట్టణముల 17
మీదుగా వెళ్లి థెస్సలొనీకకు వచ్చిరి. అక్కడ యూదుల
సమాజమందిరమొకటి యుండెను । గనుక పౌలు తన 2
వాడుకచొప్పున సమాజపు వారియొద్దకు వెళ్లి—క్రీస్తు 3
శ్రమపడి మృతులలోనుండి లేచుట అవశ్యమనియు,
నేను మీకు ప్రచురముచేయు యేసే క్రీస్తయియున్నా
డనియు లేఖనములలోనుండి దృష్టాంతములనెత్తి విప్పి
చెప్పుచు, వారితో మూడు విశ్రాంతిదినములు[1] తర్కిం
చుచుండెను. । వారిలో కొందరును, భక్తిపరులగు 4

[1] లేక, మూడువారములు

హెల్లేనీయులలో చాలమందియు, స్థితిగల[1] స్త్రీలలో
అనేకులును (ఆ మాటలను) ఒప్పుకొని పౌలుతోను
5 సీలతోను కలిసికొనిరి. । అయితే యూదులు మత్సర
పడి, పనిపాటులు లేక తిరుగు కొందరు దుష్టు
లను వెంటబెట్టుకొని గుంపుకూర్చి పట్టణమెల్ల అల్లరి
చేయుచు, యాసోను ఇంటిమీదపడి వారిని జనుల
సభయెదుటికి తీసికొని వచ్చుటకు యత్నముచేసిరి. ।
6 అయితే వారు కనబడనందున యాసోనును కొందరు
సహోదరులను ఆ పట్టణపు అధికారులయొద్దకు
ఈడ్చుకొనిపోయి—భూలోకమును తలక్రిందుచేసిన
వీరు ఇక్కడికి కూడ వచ్చియున్నారు; యాసోను వీరిని
7 చేర్చుకొనియున్నాడు. । వీరందరు యేసు అను వేరొక
రాజున్నాడని చెప్పి కైసరు చట్టములకు విరోధముగా
8 నడుచుకొనువారు అని కేకలువేసిరి. । జనసమూహ
మును పట్టణపు అధికారులును ఈ మాటలు విని కల
9 వరపడిరి. । వారు యాసోనునొద్దను కడమవారియొద్దను
జామీను తీసికొని వారిని విడుదలచేసిరి.
10 వెంటనే సహోదరులు రాత్రివేళ పౌలును సీలను
బెరైయకు పంపించిరి. వారు వచ్చి యూదుల సమాజ
11 మందిరములో ప్రవేశించిరి. । వీరు థెస్సలొనీకలో
ఉన్నవారికంటె యోగ్యులైయుండిరి గనుక సంపూర్ణ
సిద్ధమనస్సుతో వాక్యమును అంగీకరించి, పౌలును సీల
యును చెప్పిన సంగతులు ఆలాగున్నవో లేవో అని
ప్రతిదినమును లేఖనములు పరిశోధించుచు వచ్చిరి. ।
12 అందుచేత వారిలో అనేకులును, ఘనతగల హెల్లేనీయ
స్త్రీలలోను పురుషులలోను చాలమందియు విశ్వసిం
13 చిరి. । అయితే బెరైయలో కూడ పౌలు దేవుని
వాక్యము ప్రచురించుచున్నాడని థెస్సలొనీకలో
ఉండు యూదులు తెలిసికొని అక్కడికిని వచ్చి జన
14 సమూహములను రేపి కలవరపరచిరి. । వెంటనే సహో
దరులు పౌలును సముద్రము దనుక వెళ్లుమని పంపిరి;
అయితే సీలయు తిమోతియును అక్కడనే నిలిచి
15 పోయిరి. । పౌలును సాగనంప వెళ్లినవారు అతనిని
అతేనైపట్టణమువరకు తోడుకొని వచ్చి, సీలయు
తిమోతియును సాధ్యమైనంత శీఘ్రముగా అతని
యొద్దకు రావలెనని ఆజ్ఞపొంది బయలుదేరి పోయిరి.
16 పౌలు అతేనైలో వారికొరకు కనిపెట్టుకొని యుం
డగా, ఆ పట్టణము విగ్రహములతో నిండియుండుట
చూచినందున అతని ఆత్మ పరితాపము పట్టలేకపో
17 యెను. । కాబట్టి సమాజమందిరములో యూదుల
తోను భక్తిపరులైనవారితోను ప్రతిదినమున సంత
వీధిలో తన్ను కలిసికొనువారితోను తర్కించుచు
18 వచ్చెను. । ఎపికూరీయులలోను స్తోయికులలోను ఉన్న
కొందరు తత్వజ్ఞులు అతనితో వాదించిరి. కొందరు
—ఈ వదురుబోతు చెప్పునది ఏమిటని చెప్పుకొనిరి.
అతడు యేసునుగూర్చియు పునరుత్థానమునుగూర్చియు
ప్రకటించెను గనుక మరికొందరు—వీడు అపూర్వమైన
దేవతలను[2] ప్రచురించుచున్నాడని చెప్పుకొనిరి. ।
అంతట వారు అతని వెంటబెట్టుకొని అరేయొపాగు 19
అను సభయొద్దకు తీసికొనిపోయి—నీవు చేయుచున్న
యీ నూతనబోధ యెట్టిదో మేము తెలిసికొన
వచ్చునా? । కొన్ని అపూర్వమైన సంగతులు మా 20
చెవులకు వినిపించుచున్నావు గనుక వీటి భావమేమో
మేము తెలిసికొనగోరుచున్నామని చెప్పిరి. । అతేనై 21
యులందరును అక్కడ నివసించు పరదేశస్థులును
ఏదో యొక క్రొత్త సంగతి చెప్పుటయందును వినుట
యందును మాత్రమే తమ కాలము గడుపుచుండు
వారు. । పౌలు అరేయొపాగు మధ్య నిలిచి చెప్పిన 22
దేమనగా

—అతేనైయులారా, మీరు సమస్త విషయము
లలో అతిదేవతాభక్తిగలవారై యున్నట్టు నాకు కన
బడుచున్నది. । నేను సంచరించుచు మీ దేవతాప్రతి 23
మలను చూచుచుండగా ఒక బలిపీఠము నాకు కన
బడెను. దానిమీద—తెలియబడని దేవునికి అని వ్రాయ
బడియున్నది. కాబట్టి మీరు తెలియక దేనియందు
భక్తి కలిగియున్నారో దానినే నేను మీకు ప్రచుర
పరచుచున్నాను. । జగత్తును అందులోని సమస్తమును 24
నిర్మించిన దేవుడు తానే ఆకాశమునకును భూమికిని
ప్రభువైయున్నందున హస్తకృతములైన ఆలయములలో
నివసింపడు. । ఆయన అందరికిని జీవమును ఊపిరిని 25
సమస్తమును దయచేయువాడు గనుక తనకు ఏదైనను
కొదువయున్నట్టు మనుష్యుల చేతులతో సేవింపబడు
వాడు కాడు. । మరియు యావద్భూమిమీద కాపుర 26
ముండుటకు ఆయన యొకనినుండి ప్రతి జాతిమనుష్యు 27
లను సృష్టించి, వారు ఒకవేళ దేవుని తడువులాడి కను
గొందురేమో యని తన్ను వెదకునిమిత్తము నిర్ణయకాల
ములను వారి నివాసస్థలముయొక్క పొలిమేరలను
ఏర్పరచెను. ఆయన మనలో ఎవనికిని దూరముగా
ఉండువాడు కాడు. । మనమాయనయందు బ్రదుకు 28
చున్నాము, చలించుచున్నాము, ఉనికి కలిగియు
న్నాము. అటువలె—మనమాయన సంతానమని మీ
కవీశ్వరులలో కొందరును చెప్పుచున్నారు. । కాబట్టి
మనము దేవుని సంతానమై యుండి, మనుష్యుల చమ
త్కార కల్పనలవలన మల్చబడిన బంగారమునైనను
వెండినైనను రాతినైనను దేవత్వము పోలియున్నదని
తలంపకూడదు. । ఆ అజ్ఞానకాలములను దేవుడు 30
చూచి చూడనట్టుగా ఉండెను; ఇప్పుడైతే అంతటను
అందరును మారుమనస్సు పొందవలెనని మనుష్యులకు
ఆజ్ఞాపించుచున్నాడు. । ఎందుకనగా తాను నియ 31
మించిన మనుష్యునిచేత నీతిననుసరించి భూలోకము

[1] మూలభాషలో—ప్రముఖులగు. [2] మూలభాషలో—దయ్యములను.

నకు తీర్పు తీర్చబోయెడి యొక దినమును నిర్ణయించి
యున్నాడు. మృతులలోనుండి ఆయనను లేపినందున
దీని నమ్ముటకు అందరికిని ఆధారము కలుగజేసియు
న్నాడు.
32 మృతుల పునరుత్థానమునుగూర్చి వారు వినినప్పుడు
కొందరు అపహాస్యముచేసిరి; మరికొందరు—దీనిగూర్చి
33 నీవు చెప్పునది ఇంకొకసారి విందుమని చెప్పిరి. । ఆలా
గుండగా పౌలు వారి మధ్యనుండి వెళ్లిపోయెను. ।
34 అయితే కొందరు మనుష్యులు అతని హత్తుకొని విశ్వ
సించిరి. వారిలో అరెయొపాగీతుడైన దియొనుసియు,
దామరి అను ఒక స్త్రీయు, వీరితోకూడ మరికొందరు
నుండిరి.

18 అటుతరువాత పౌలు ఏథేన్సునుండి బయలుదేరి
కొరింథుకు వచ్చి, పొంతులో పుట్టిన అకుల అను ఒక
యూదుని అతని భార్యయైన ప్రిస్కిల్లను కనుగొని
2 వారియొద్దకు వెళ్లెను. । యూదులందరు రోమా విడిచి
వెళ్లిపోవలెనని క్లౌదియ చక్రవర్తి ఆజ్ఞాపించినందున
3 వారు ఇతలియనుండి క్రొత్తగా వచ్చినవారు. । వారు
వృత్తికి డేరాలు కుట్టువారు. పౌలు అదే వృత్తిగల
వాడు గనుక వారితో కాపురముండెను; వారు కలిసి
4 పని చేయుచుండిరి. । అతడు ప్రతి విశ్రాంతిదినమున
సమాజమందిరములో తర్కించుచు, యూదులను
హెల్లేనీయులను ఒప్పించుచునుండెను.
5 సీలయు తిమోతియు మకెదోనియనుండి వచ్చి
నప్పుడు పౌలు వాక్యము బోధించుటయందు ఆతురత
గలవాడై, యేసే క్రీస్తని యూదులకు దృఢముగా
6 సాక్ష్యమిచ్చుచుండెను. । వారు ఎదురాడి దూషించి
నప్పుడు అతడు తన వస్త్రములు దులుపుకొని — మీ
నాశనమునకు మీరే ఉత్తరవాదులు.[1] నేను నిర్దోషిని;
యికమీదట అన్యజనులయొద్దకు పోవుదునని వారితో
7 చెప్పి । అక్కడనుండి వెళ్లి, దేవునియందు భక్తిగల
తీతియు యూస్తు అను ఒకని యింటికి వచ్చెను. అతని
8 యిల్లు సమాజమందిరమును ఆనుకొనియుండెను. । ఆ
సమాజమందిరపు అధికారియైన క్రిస్పు తన యింటి
వారందరితోకూడ ప్రభువునందు విశ్వాసముంచెను.
మరియు కొరింథీయులలో అనేకులు విని విశ్వసించి
9 బాప్తిస్మము పొందిరి. । ప్రభువు రాత్రివేళ దర్శన
మందు—నీవు భయపడక మాటలాడుము, మౌనముగా
10 ఉండకుము । నేను నీకు తోడైయున్నాను, నీకు హాని
చేయుటకు నీమీదికి ఎవడును రాడు; ఈ పట్టణములో
నాకు బహు జనమున్నదని పౌలుతో చెప్పగా ।
11 అతడు వారిమధ్య దేవుని వాక్యము బోధించుచు, ఒక
సంవత్సరము మీద ఆరునెలలు అక్కడ నివసించెను.
12 గల్లియోను అకైయకు అధిపతిగా ఉన్నప్పుడు
దులు ఏకీభవించి పౌలుమీదికి లేచి న్యాయ
పీఠము ఎదుటకు అతని తీసికొనివచ్చి । — వీడు ధర్మ 13
శాస్త్రమునకు వ్యతిరిక్తముగా దేవుని ఆరాధించుటకు
జనులను ప్రేరేపించుచున్నాడని చెప్పిరి. । పౌలు నోరు 14
తెరచి మాటలాడబోగా గల్లియోను—యూదులారా,
యిదియొక అన్యాయము గాని చెడ్డ నేరము గాని
యైనయెడల నేను మీ మాట సహనముగా వినుట
న్యాయమే. । ఇది యేదోయొక ఉపదేశమును గూర్చి 15
యునైనను, పేళ్లను గూర్చియునైనను, మీ ధర్మశాస్త్ర
మును గూర్చియునైనను వాదమైతే మీరే దాని చూచు
కొనుడి; ఈలాటి సంగతులనుగూర్చి విమర్శచేయుటకు
నాకు మనస్సులేదని యూదులతో చెప్పి । వారిని 16
న్యాయపీఠము ఎదుటనుండి తోలివేసెను. । అప్పు 17
డందరు సమాజమందిరపు అధికారియైన సొస్తెనేసును
పట్టుకొని న్యాయపీఠము ఎదుట కొట్టసాగిరి. అయితే
గల్లియోను వీటిలో ఏ సంగతిని గూర్చియు లక్ష్యపెట్ట
లేదు.

పౌలు ఇంకను బహుదినములక్కడ ఉండిన తరు 18
వాత సహోదరులయొద్ద సెలవు పుచ్చుకొని, తనకు
మ్రొక్కుబడి యున్నందున కెంక్రేయలో తలవెండ్రు
కలు కత్తిరించుకొని ఓడ యెక్కి సురియకు బయలు
దేరెను. ప్రిస్కిల్ల అకుల అనువారు అతనితోకూడ
వెళ్లిరి. । వారు ఎఫెసుకు వచ్చినప్పుడు అతడు వారి 19
నక్కడ విడిచిపెట్టి, తానుమాత్రము సమాజమందిర
ములో ప్రవేశించి యూదులతో తర్కించుచుండెను. ।
వారింక కొంతకాలముండుమని అతని వేడుకొనగా । 20
అతడు ఒప్పక — దేవుని చిత్తమైతే మీయొద్దకు తిరిగి 21
వత్తునని చెప్పి, వారియొద్ద సెలవు పుచ్చుకొని ఓడ
యెక్కి ఎఫెసునుండి బయలుదేరెను. । తరువాత కైస 22
రైయ రేవున దిగి వెళ్లి సంఘపువారిని కుశలమడిగి
అంతియొకైయకు వచ్చెను. । అక్కడ కొంతకాలముం 23
డిన తరువాత బయలుదేరి వరుసగా గలతీయప్రాంత
మందును ఫ్రుగియయందును సంచరించుచు శిష్యుల
నందరిని స్థిరపరచెను.

అలెక్సంద్రియలో పుట్టిన అపొల్లో అను ఒక 24
యూదుడు ఎఫెసుకు వచ్చెను. అతడు విద్వాంసు
డును లేఖనములయందు ప్రవీణుడునై యుండెను. ।
అతడు ప్రభువుమార్గము విషయమై ఉపదేశముపొంది 25
తన ఆత్మయందు తీవ్రపడి, యోహాను బాప్తిస్మము
మాత్రమే తెలిసికొనినవాడైనను, యేసునుగూర్చిన
సంగతులు వివరముగా చెప్పి బోధించుచు సమాజ
మందిరములో ధైర్యముగా మాటలాడ నారంభించెను. ।
ప్రిస్కిల్ల అకులయు విని, అతని చేర్చుకొని దేవుని 26
మార్గము మరి పూర్తిగా అతనికి విశదపరచిరి. । తరు 27
వాత అతడు అకైయకు పోదలచినప్పుడు సహోద
రులు అతని చేర్చుకొనవలెనని ప్రోత్సాహపరచుచు

[1] మూలభాషలో—మీ రక్తము మీ తలమీదనే యుండును

అక్కడి శిష్యులకు వ్రాసిరి. అతడక్కడికి వచ్చి (దైవ)
కృపచేత విశ్వసించినవారికి చాల సహాయముచేసెను. ।
28 యేసే క్రీస్తు అని లేఖనములద్వారా అతడు దృష్టాంత
పరచి, బహిరంగమందు యూదులవాదమును గట్టిగా
ఖండించుచు వచ్చెను.

19 అపొల్లో కొరింథులో నున్నప్పుడు జరిగినదే
మనగా, పౌలు మైప్రదేశములలో సంచరించి ఎఫెసుకు
వచ్చి కొందరు శిష్యులను చూచి—మీరు విశ్వసించి
నప్పుడు పరిశుద్ధాత్మను పొందితిరా అని వారినడు
2 గగా । వారు—పరిశుద్ధాత్మ యున్నాడన్న సంగతియే
3 మేము వినలేదని చెప్పిరి. । అప్పుడతడు — ఆలాగైతే
మీరు దేనిబట్టి బాప్తిస్మము పొందితిరని అడుగగా
వారు—యోహాను బాప్తిస్మమునుబట్టియే అని చెప్పిరి. ।
4 అందుకు పౌలు — యోహాను తనవెనుక వచ్చువాని
యందు, అనగా యేసునందు విశ్వాసముంచవలెనని
ప్రజలతో చెప్పుచు, మారుమనస్సు విషయమైన
5 బాప్తిస్మమిచ్చెనని చెప్పెను. । వారు ఆ మాటలు విని
ప్రభువైన యేసు నామమున బాప్తిస్మము పొందిరి. ।
6 తరువాత పౌలు వారిమీద చేతులుంచగా పరిశుద్ధాత్మ
వారిమీదికి వచ్చెను. అప్పుడు వారు భాషలతో మాట
7 లాడ్లను ప్రవచింపను మొదలుపెట్టిరి. । వారందరు
ఇంచుమించు పన్నెండుగురు పురుషులు.

8 తరువాత అతడు సమాజమందిరములోనికి వెళ్లి ప్రసం
గించుచు, దేవుని రాజ్యమునుగూర్చి తర్కించుచు,
ఒప్పించుచు, ధైర్యముగా మాటలాడుచు మూడునెలలు
9 గడిపెను. । అయితే కొందరు తమ హృదయములను
కఠినపరచుకొని యొప్పుకొనక, జనసమూహము ఎదుట
ఈ మార్గమును దూషించుచున్నందున అతడు వారిని
విడిచి, శిష్యులను ప్రత్యేకపరచుకొని ప్రతిదినము
తురన్ను అను ఒకని విద్యాశాలలో తర్కించుచు
10 వచ్చెను. । రెండేండ్ల పర్యంతము ఈలాగున జరిగెను
గనుక యూదులేమి హెల్లేనీయులేమి ఆసియలో
కాపురమున్న వారందరును ప్రభువు వాక్యము వినిరి. ।
11 మరియు దేవుడు పౌలుచేత విశేషమైన అద్భుతములను
12 చేయించెను; । అతని శరీరమునకు తగిలిన చేతిగుడ్డలై
నను నడికట్లయినను రోగులయొద్దకు తెచ్చినప్పుడు
రోగములు వారిని విడిచెను, దుష్టాత్మలు కూడ వదలి
13 పోయెను. । అప్పుడు దేశసంచారులును మాంత్రికులు
నైన కొందరు యూదులు—పౌలు ప్రకటించు యేసు
తోడు మిమ్మును ఉచ్చాటన చేయుచున్నానను మాట
చెప్పి, దుష్టాత్మలు పట్టినవారిమీద ప్రభువైన యేసు
14 నామమును ఉచ్చరించుటకు పూనుకొనిరి. । యూదు
డైన స్కెవయను ఒక ప్రధానయాజకుని కుమారులు
15 ఏడుగురు ఆలాగు చేయుచుండిరి. । అందుకు ఆ
దుష్టాత్మ—నేను యేసును గుర్తెరుగుదును, పౌలునుకూడ
16 ఎరుగుదును గాని మీరెవరని అడుగగా । ఆ దుష్టాత్మ
పట్టినవాడు ఎగిరి వారిమీద పడి వారిని ఇద్దరిని
లొంగదీసి గెలిచెను; అందుచేత వారు దిగంబరులై
గాయము తగిలి ఆ యింటనుండి పారిపోయిరి. । ఈ 17
సంగతి ఎఫెసులో కాపురమున్న సమస్తమైన యూదు
లకును హెల్లేనీయులకును తెలియవచ్చినప్పుడు వా
రందరికి భయము కలిగెను గనుక ప్రభువైన యేసు
నామము ఘనపరచబడెను. । విశ్వసించినవారు అనే 18
కులు వచ్చి, తమ చేష్టలను తెలియజేసి యొప్పుకొనిరి. ।
మరియు మాంత్రికవిద్య అభ్యసించినవారు అనేకులు 19
తమ పుస్తకములు తెచ్చి అందరియెదుట వాటిని కాల్చి
వేసిరి. వారు లెక్క చూడగా వాటివెల యేబదివేల
వెండి రూకలాయెను. । ఇంత ప్రభావముతో ప్రభువు 20
వాక్యము ప్రబలమై వ్యాపించెను.

ఈలాగు జరిగిన తరువాత పౌలు మకెదోనియ 21
అకయ దేశముల మార్గమున వచ్చి యెరూషలేముకు
వెళ్లవలెనని మనస్సులో ఉద్దేశించి—నేనక్కడికి వెళ్లిన
తరువాత రోమాకూడ చూడవలెనని అనుకొనెను. ।
అప్పుడు తనకు పరిచర్యచేయువారిలో తిమోతియు 22
ఎరస్తు అను వారి నిద్దరిని మకెదోనియకు పంపి తాను
ఆసియలో కొంతకాలము నిలిచియుండెను.

ఆ కాలమందు (క్రీస్తు) మార్గమునుగూర్చి చాల 23
అల్లరి కలిగెను. । ఏలాగనగా — దేమేత్రియను ఒక 24
కంసాలి అర్తెమిదేవికి వెండి గుళ్లను చేయించుటవలన
ఆ పనివారికి మిగుల లాభము కలుగజేయుచుండెను. ।
అతడు వారిని అట్టి పనిచేయు ఇతరులను గుంపుకూర్చి 25
—అయ్యలారా, యీ పనివలన మనకు జీవనము బహు
బాగుగా జరుగుచున్నదని మీకు తెలియును. । అయితే 26
చేతులతో చేయబడినవి దేవతలు కావని యీ పౌలు
చెప్పి, ఎఫెసులో మాత్రము కాదు, దాదాపు ఆసియ
యందంతట బహు జనమును ఒప్పించి త్రిప్పియున్న
సంగతి మీరు చూచియు వినియునున్నారు. । మరియు 27
ఈ మన వృత్తియందు లక్ష్యము తప్పిపోవుటయే గాక,
మహా దేవియైన అర్తెమిదేవియొక్క గుడి కూడ తృణీ
కరింపబడి, ఆసియయందంతటను భూలోకమందును
పూజింపబడుచున్న యీమెయొక్క మాహాత్మ్యము
తొలగిపోవునని భయము తోచుచున్నదని వారితో
చెప్పెను. । వారు విని రౌద్రముతో నిండినవారై— 28
ఎఫెసీయుల అర్తెమిదేవి మహాదేవి అని కేకలువేసిరి; ।
పట్టణము బహు గలిబిలిగా ఉండెను. మరియు వారు 29
పౌలుతో ప్రయాణమై వచ్చిన మకెదోనియవారైన
గాయియును అరిస్తార్కును పట్టుకొని దొమ్మిగా
నాటకశాలలో చొరబడిరి. । పౌలు జనుల సభయొద్దకు 30
వెళ్లదలచెను గాని శిష్యులు వెళ్లనియ్యలేదు. । మరియు 31
ఆసియ దేశాధికారులలో కొందరు అతనికి స్నేహి
తులైయుండి అతనియొద్దకు వర్తమానము పంపి—నీవు
నాటకశాలలోనికి వెళ్లవద్దని అతని వేడుకొనిరి. । ఆ సభ 32

గలిబిలిగా ఉండెను గనుక కొందరీలాగున కొంద
రాలాగున కేకలువేసిరి; తామెందు నిమిత్తము కూడు
33 కొనిరో చాలమందికి తెలియలేదు. । అప్పుడు యూ
దులు అలెక్సంద్రును ముందుకు త్రోయగా కొందరు
సమూహములోనుండి అతనిని ఎదుటికి తెచ్చిరి. అలె
క్సంద్రు సైగచేసి జనులతో సమాధానము చెప్పుకొన
34 వలెనని యుండెను. । అయితే అతడు యూదుడని
వారు తెలిసికొనినప్పుడు అందరును ఏకశబ్దముతో
రెండు గంటలసేపు—ఎఫెసీయుల ఆర్తెమిదేవి మహా
35 దేవి అని కేకలువేసిరి. । అంతట కరణము సమూహ
మును సముదాయించి—ఎఫెసీయులారా, ఎఫెసీ
యుల పట్టణము ఆర్తెమి మహాదేవికిని ద్యుపతియొద్ద
నుండి పడిన మూర్తికిని దాసియై యున్నదని తెలియని
36 వాడెవడు? । ఈ సంగతులు నిరాక్షేపమైనవి గనుక
మీరు శాంతము కలిగి ఏదియు ఆతురపడి చేయకుం
37 డుట ఆవశ్యకము. : మీరు ఈ మనుష్యులను తీసికొని
వచ్చితిరి. వీరు గుడి దోచినవారు కారు, మన దేవతను
38 దూషింపను లేదు. । దేమేత్రికిని అతనితోకూడనున్న
కంసాలులకును ఎవనిమీదనైనను వ్యవహారమేదైన ఉన్న
యెడల న్యాయసభలు జరుగుచున్నవి, అధిపతులు
ఉన్నారు గనుక వారు ఒకరితో ఒకరు వ్యాజ్య
39 మాడవచ్చును. । అయితే మీరు ఇతర సంగతులను
గూర్చి యేమైనను విచారణ చేయవలెననియుంటే అది
40 క్రమమైన సభలో పరిష్కారమగును. । మనము ఈ
గలిబిలినిగూర్చి చెప్పదగిన హేతువేమియు లేనందున,
నేడు జరిగిన అల్లరినిగూర్చి మనలను విచారణలోకి
తెత్తురేమో అని భయమవుచున్నది. ఇట్లు గుంపుకూడి
నందుకు తగిన కారణము చెప్పజాలమని వారితో
41 అనెను. । అతడీలాగు చెప్పి సభను ముగింపు చేసెను.
**20** ఆ అల్లరి అణగిన తరువాత పౌలు శిష్యులను తన
యొద్దకు పిలువనంపించి హెచ్చరించినమీదట వారి
యొద్ద సెలవు పుచ్చుకొని మకెదోనియకు వెళ్లుటకు
2 బయలుదేరెను. । ఆ ప్రదేశములయందు సంచరించి,
పెక్కుమాటలతో వారిని హెచ్చరించి హెల్లాసుకు
3 వచ్చెను. । అతడు అక్కడ మూడు నెలలు గడిపి
ఓడయెక్కి సురియకు వెళ్లవలెనని యుండగా అతని
విషయమై యూదులు కుట్రచేయుచున్నందున మకె
దోనియమీదుగా తిరిగి రావలెనని నిశ్చయించు
4 కొనెను. । మరియు పుర్రు కుమారుడును బెరైయదేశ
స్థుడునైన సోపత్రును, థెస్సలొనీకైయులలో అరిస్తా
ర్కును, సెకుందును, దెర్బే పట్టణస్థుడైన గాయియును,
తిమొథెయును, ఆసియ దేశస్థులైన తుకికును, త్రోఫి
5 మును అతనితోకూడ వచ్చిరి. । వీరు ముందుగా వెళ్లి
6 త్రోయలో మాకొరకు కనిపెట్టుకొనియుండిరి. । పులి
యని రొట్టెల దినములైన తరువాత మేము ఓడ ఎక్కి
ఫిలిప్పుయి విడిచి అయిదు దినములలో త్రోయకు
వచ్చి అచ్చట వారియొద్ద ఏడు దినములు గడిపితిమి.
ఆదివారమున మేము రొట్టె విరుచుటకు కూడి 7
నప్పుడు, పౌలు మరునాడు వెళ్లనైయుండి వారితో
ప్రసంగించుచు అర్ధరాత్రివరకు విస్తరించి మాటలాడు
చుండెను. । మేము కూడియున్న మేడగదిలో అనేక 8
దీపములుండెను. । అప్పుడు ఐతుకు అను నొక యౌవన 9
స్థుడు కిటికీలో కూర్చుండి గాఢనిద్రపోయి, పౌలు
చాలసేపు ప్రసంగించుచుండగా నిద్రాభారమువలన
జోగి మూడవ అంతస్తునుండి క్రిందపడి చనిపోయిన
వాడై యెత్తబడెను. । అంతట పౌలు క్రిందికి వెళ్లి 10
అతనిమీద పడి కౌగిలించుకొని—మీరు తొందరపడ
కుడి, అతని ప్రాణమతనిలో నున్నదని వారితో
చెప్పెను. । అతడు మరల పైకి వచ్చి రొట్టె విరిచి 11
పుచ్చుకొని తెల్లవారువరకు విస్తారముగా సంభాషించి
బయలుదేరెను. । వారు బ్రదికిన ఆ చిన్నవాని తీసి 12
కొని వచ్చినప్పుడు వారికి విశేషమైన ఆదరణ కలిగెను.
మేము ముందుగా ఓడ ఎక్కి అస్సులో పౌలును 13
ఎక్కించుకొనవలెనని అక్కడికి వెళ్లితిమి. తాను కాలి
నడకను వెళ్లవలెనని అతడా ప్రకారముగా మాకు
నియమించియుండెను. । అస్సులో అతడు మాతో 14
కలిసికొనినప్పుడు మేమతని ఎక్కించుకొని మితులేనేకు
వచ్చితిమి. । అచ్చటనుండి వెళ్లి మరునాడు కీయొసుకు 15
ఎదురుగా వచ్చితిమి. మరునాడు సామొసుకు చేరి
ఆ మరునాడు మిలేతుకు వచ్చితిమి. । సాధ్యమైతే 16
పెంతెకొస్తు దినమున యెరూషలేములో ఉండవలెనని
పౌలు త్వరపడుచుండెను గనుక అతడు ఆసియలో
కాలహరణము చేయకుండ ఎఫెసును దాటి పోవలెనని
నిశ్చయించుకొని యుండెను.
అతడు మిలేతునుండి ఎఫెసుకు వర్తమానము పంపి 17
సంఘపు పెద్దలను పిలిపించెను. । వారు తనయొద్దకు 18
వచ్చినప్పుడతడు వారితో ఇట్లనెను—
నేను ఆసియలో కాలుపెట్టిన దినమునుండి సర్వ
కాలము మీ మధ్య ఏలాగు నడుచుకొంటినో మీకే
యెరుగుదురు. । యూదుల కుట్రలవలన నాకు శోధ 19
నలు సంభవించినను, కన్నీళ్లు విడుచుచు పూర్ణమైన
వినయభావముతో నేనేలాగున ప్రభువును సేవించు
చుంటినో మీకే తెలియును. । మరియు ప్రయోజన 20
కరమైనది ఏదియు దాచుకొనక బహిరంగముగాను 21
ఇంటింటను మీకు తెలియజేయుచు బోధించుచు, దేవుని
విషయమై మారుమనస్సుపొంది మన ప్రభువైన యేసు
క్రీస్తునందు విశ్వాసముంచవలెనని యూదులకును
హెల్లేనీయులకును ఏలాగు సాక్ష్యమిచ్చుచుంటినో
యిదంతయు మీకు తెలియును. । ఇదిగో నేనిప్పుడు 22
ఆత్మయందు నిర్బంధముగలవాడనై యెరూషలేముకు
వెళ్లుచున్నాను, అక్కడ నాకు ఏమేమి సంభవించునో

23 తెలియదుగాని, । బంధకములును శ్రమలును నా
కొరకు కాచుకొనియున్నవని పరిశుద్ధాత్మ ప్రతి పట్టణ
ములో నాకు సాక్ష్యమిచ్చుచున్నాడని తెలియును. ।
24 అయితే దేవుని కృపాసువార్తనుగూర్చి సాక్ష్యమిచ్చుట
యందు నా పరుగును, నేను ప్రభువైన యేసువలన
పొందిన పరిచర్యను తుదముట్టింపవలెనని నా ప్రాణము
నాకెంతమాత్రమును ప్రియమైనదిగా ఎంచుకొనుట
25 లేదు. । ఇదిగో (దేవుని) రాజ్యమునుగూర్చి ప్రకటిం
చుచు నేను మీ మధ్యను సంచరించుచుంటిని గదా?
మీలో ఎవరును ఇకమీదట నా ముఖము చూడరని
26 నాకిప్పుడు తెలియును. । కాబట్టి మీలో ఎవరి నాశ
నము విషయమైనను[1] నేను దోషిని కానని నేడు
27 మిమ్మును సాక్ష్యము పెట్టుచున్నాను.[2] । దేవుని సంకల్ప
మంతయు మీకు తెలుపకుండ నేనేమియు దాచుకొన
28 లేదు. । దేవుడు[3] తన స్వరక్తమిచ్చి సంపాదించిన తన
సంఘమును కాయుటకు పరిశుద్ధాత్మ మిమ్మును దేని
యందు అధ్యక్షులగా ఉంచెనో ఆ యావత్తు మందను
గూర్చియు, మీ మట్టుకు మిమ్మునుగూర్చియు జాగ్ర
29 త్తగా ఉండుడి. । నేను వెళ్లిపోయిన తరువాత క్రూర
మైన తోడేళ్లు మీలో ప్రవేశించునని నాకు తెలి
30 యును; వారు మందను కనికరింపరు. । మరియు శిష్యు
లను తమవెంట ఈడ్చుకొని పోవలెనని ప్రతికూలవచన
ములు పలుకు మనుష్యులు మీలోనే బయలుదేరు
31 దురు. । కావున నేను మూడు సంవత్సరములు దివా
రాత్రులు కన్నీళ్లు విడుచుచు ప్రతి మనుష్యునికి
మానక బుద్ధి చెప్పితినని మీరు జ్ఞాపకము చేసికొని
32 మెలకువగా ఉండుడి. । ఇప్పుడు దేవునికిని ఆయన
కృపావాక్యమునకును మిమ్మును అప్పగించుచున్నాను.
ఆయన మీకు క్షేమాభివృద్ధి కలుగజేయుటకును, పరి
శుద్ధపరచబడినవారందరిలో స్వాస్థ్యమనుగ్రహించుట
33 కును శక్తిమంతుడు. । ఎవని వెండినైనను బంగారము
34 నైనను వస్త్రములనైనను నేను ఆశింపలేదు; । నా అవసర
ముల నిమిత్తమును నాతో ఉన్నవారి నిమిత్తమును ఈ
35 నా చేతులు కష్టపడినవని మీకే తెలియును. । మీరును
ఈలాగు ప్రయాసపడి బలహీనులను సంరక్షింపవలె
ననియు—

పుచ్చుకొనుటకంటె ఇచ్చుట ధన్యత

అని ప్రభువైన యేసు చెప్పిన మాటలు జ్ఞాపకము చేసి
కొనవలెననియు అన్నివిషయములలో మీకు మాదిరి
చూపితినని చెప్పెను.
36 అతడీలాగు చెప్పి మోకాళ్లూని వారందరితో
37 ప్రార్థనచేసెను. । అప్పుడు వారందరు బహుగా ఏడ్చిరి.
మీరు ఇకమీదట నా ముఖము చూడరని అతడు
38 చెప్పిన మాటకు విశేషముగా దుఃఖించుచు । పౌలు
మెడమీద పడి అతని ముద్దుపెట్టుకొని వారు ఓడ
దనుక అతని సాగనంపిరి.

మేము వారిని విడిచిపెట్టి ఓడ యెక్కి తిన్నగా 21
వెళ్లి కోసుకును, మరునాడు రొదుకును, అక్కడనుండి
పతరకును వచ్చితిమి. । అప్పుడు ఫేనీకేకు వెళ్లబోవు 2
చున్న ఒక ఓడను చూచి అది యెక్కి బయలుదేరి
తిమి. । కుప్రను ఎదురుగా వచ్చి, దానిని ఎడమతట్టున 3
విడిచి సురియవైపుగా వెళ్లి, తూరులో దిగితిమి;
అక్కడ ఓడ సరుకు దిగుమతి చేయవలసియుండెను. ।
మేమక్కడనున్న శిష్యులను కనుగొని యేడుదినము 4
లక్కడ ఉంటిమి. వారు — నీవు యెరూషలేములో
కాలు పెట్టవద్దని ఆత్మద్వారా పౌలుతో చెప్పిరి. । ఆ 5
దినములు గడిపిన తరువాత ప్రయాణమై పోవుచుం
డగా, భార్యలతోను పిల్లలతోను వారందరు మమ్మును
పట్టణము వెలపలి వరకు సాగనంపవచ్చిరి. వారును
మేమును సముద్రతీరమున మోకాళ్లూని ప్రార్థనచేసి
యొకరియొద్ద ఒకరము సెలవు పుచ్చుకొంటిమి. । అం 6
తట మేము ఓడ ఎక్కితిమి, వారు తమ తమ యిండ్లకు
తిరిగి వెళ్లిరి.

మేము తూరునుండి చేసిన ప్రయాణము ముగించి, 7
తొలెమాయికి వచ్చి, సహోదరులను కుశలమడిగి
వారియొద్ద ఒక దినముంటిమి. । మరునాడు మేము 8
బయలుదేరి కైసరైయకు వచ్చి, యేడుగురిలో సువార్తికు
డైన ఫిలిప్పు యింట ప్రవేశించి అతనియొద్ద ఉంటిమి. ।
కన్యకలుగా ఉన్న నలుగురు కుమార్తెలు అతనికుండిరి, 9
వారు ప్రవచించువారు. । మేమనేక దినములక్కడ 10
ఉండగా, అగబు అను ఒక ప్రవక్త యూదైయనుండి
వచ్చెను. । అతడు మాయొద్దకు వచ్చి పౌలు నడికట్టు 11
తీసికొని, తన చేతులను కాళ్లను కట్టుకొని—యెరూష
లేములోని యూదులు ఈ నడికట్టుగల మనుష్యుని
ఈలాగు బంధించి అన్యజనులచేతికి అప్పగింతురని పరి
శుద్ధాత్మ చెప్పుచున్నాడనెను. । ఈ మాట వినినప్పుడు 12
మేమును అక్కడివారును — యెరూషలేముకు వెళ్ల
వద్దని అతని బతిమాలుకొంటిమి గాని । పౌలు—ఇదేం 13
దుకు? మీరు ఏడ్చి నా గుండె బద్దలు చేసెదరేల?
నేనైతే ప్రభువైన యేసు నామము నిమిత్తము యెరూష
లేములో బంధింపబడుటకు మాత్రమే గాక చని
పోవుటకును సిద్ధముగా ఉన్నానని చెప్పెను. । అతడు 14
ఒప్పుకొననందున మేము—ప్రభువు చిత్తము జరుగు
గాక అని ఊరకుంటిమి.

ఆ దినములైన తరువాత మాకు కావలసిన సామగ్రి 15
తీసికొని యెరూషలేముకు తర్లిపోతిమి. । మరియు 16
కైసరైయనుండి కొందరు శిష్యులు, మొదటనుండి శిష్యు
డుగా ఉండిన కుప్రీయుడైన మ్నాసోను ఇంట మేము

1 మూలభాషలో—అందరి రక్తము విషయమై నేను నిర్దోషిని. 2 లేక—మీకు సాక్ష్యమిచ్చుచున్నాను. 3 అనేక ప్రాచీనప్రతులలో—ప్రభువు అని
పాఠాంతరము.

దిగవలెనను ఉద్దేశముతో అతని వెంటబెట్టుకొని
మాతోకూడ వచ్చిరి.
17 మేము యెరూషలేమునకు వచ్చినప్పుడు సహో
18 దరులు మమ్మును సంతోషముతో చేర్చుకొనిరి. । మరు
నాడు పెద్దలందరు అక్కడికి వచ్చియుండగా పౌలు
19 మాతోకూడ యాకోబునొద్దకు వచ్చెను. । అతడు వారిని
కుశలమడిగి, తన పరిచర్యవలన దేవుడు అన్యజనులలో
20 జరిగించినవాటిని వివరముగా తెలియజెప్పెను. । వారు
విని దేవుని మహిమపరచి అతని చూచి—సహో
దరుడా, యూదులలో విశ్వాసులైనవారు ఎన్నివేల
మంది యున్నారో చూచుచున్నావు గదా? వారందరు
21 ధర్మశాస్త్రమందు ఆసక్తిగలవారు. । అన్యజనులలో ఉన్న
యూదులు తమ పిల్లలకు సున్నతి చేయకూడదనియు,
మన ఆచారములచొప్పున నడవకూడదనియు నీవు
చెప్పుటవలన వారందరు మోషేను విడిచిపెట్టవలెనని
నీవు బోధించుచున్నట్టు వీరు నిన్నుగూర్చి వర్తమానము
22 వినియున్నారు. । కావున మనమేమి చేయుదుము?
23 నీవు వచ్చిన సంగతి వారు తప్పక విందురు. । కాబట్టి
మేము నీకు చెప్పినట్టు చేయుము. మ్రొక్కుబడి
యున్న నలుగురు మనుష్యులు మాయొద్ద ఉన్నారు. ।
24 నీవు వారిని వెంటబెట్టుకొనిపోయి వారితోకూడ శుద్ధి
చేసికొని, వారు తలక్షౌరము చేయించుకొనుటకు వారి
కయ్యెడి తగులుబడి పెట్టుకొనుము; అప్పుడు తాము
నిన్నుగూర్చి వినిన వర్తమానము నిజము కాదనియు,
నీవును ధర్మశాస్త్రమును గైకొని యథావిధిగా నడుచు
25 కొనుచున్నావనియు తెలిసికొందురు । అయితే విశ్వ
సించిన అన్యజనులను గూర్చి—వారు విగ్రహార్పితమైన
వాటిని రక్తమును గొంతు పిసికి చంపినదానిని జారత్వ
మును మానవలసినదని నిర్ణయించి వారికి వ్రాసి
26 యున్నామని చెప్పిరి. । అంతట పౌలు మరునాడు ఆ
మనుష్యులను వెంటబెట్టుకొని పోయి వారితోకూడ
శుద్ధిచేసికొని దేవాలయములో ప్రవేశించి, వారిలో
ప్రతివానికొరకు కానుక అర్పించువరకు శుద్ధి దినములు
నెరవేర్చుదుమని తెలిపెను.
27 ఏడు దినములు కావచ్చినప్పుడు ఆసియనుండివచ్చిన
యూదులు దేవాలయములో అతని చూచి, సమూహ
మంతటిని కలవరపరచి అతని బలాత్కారముగా
28 పట్టుకొని । — ఇశ్రాయేలీయులారా, సహాయము
చేయ రండి; ప్రజలకును ధర్మశాస్త్రమునకును ఈ స్థల
మునకును విరోధముగా అందరికిని అంతటను బోధించు
చున్నవాడు వీడే. మరియు వీడు హెల్లేనీయులను
దేవాలయములోకి తీసికొనివచ్చి యీ పరిశుద్ధ స్థల
29 మును అపవిత్రపరచియున్నాడని కేకలువేసిరి. । ఏల
యనగా ఎఫెసీయుడైన త్రోఫిమును అతనితోకూడ
పట్టణములో అంతకుముందు వారు చూచియున్నం
దున పౌలు దేవాలయములోనికి అతని తీసికొని
వచ్చెనని ఊహించిరి. । పట్టణమంతయు గలిబిలిగా 30
ఉండెను. జనులు గుంపులు గుంపులుగా పరుగెత్తివచ్చి
పౌలును పట్టుకొని దేవాలయములోనుండి అతని వెలు
పలికి ఈడ్చిరి; వెంటనే తలుపులు మూయబడెను. ।
వారతని చంపవలెనని యత్నించుచుండగా యెరూష 31
లేమంతయు గలిబిలిగా ఉన్నదని పటాలపు సహ
స్రాధిపతికి వర్తమానము వచ్చెను; । వెంటనే అతడు 32
రాణువవారిని శతాధిపతులను వెంటబెట్టుకొని వారి
యొద్దకు పరుగెత్తివచ్చెను; వారు సహస్రాధిపతిని
రాణువవారిని చూచి పౌలును కొట్టుట మానిరి. । సహ 33
స్రాధిపతి దగ్గరకు వచ్చి అతని పట్టుకొని, రెండు
సంకెళ్లతో బంధించుమని ఆజ్ఞాపించి — ఇతడెవడు,
ఏమి చేసెనని అడుగగా, । సమూహములో కొంద 34
రీలాగు కొందరాలాగు కేకలువేయుచున్నప్పుడు అల్లరి
చేత అతడు నిజము తెలిసికొనలేక కోటలోకి అతని
తీసికొనిపొమ్మని ఆజ్ఞాపించెను. । పౌలు మెట్లమీదికి 35
వచ్చినప్పుడు జనులు గుంపుకూడి బలాత్కారము
చేయుచున్నందున రాణువవారు అతని మోసికొని
పోవలసి వచ్చెను. । ఏలయనగా — వాని చంపుమని 36
జనసమూహము కేకలువేయుచు వెంబడించెను.
వారు పౌలును కోటలోకి తీసికొనిపోనై యుండ 37
గా అతడు సహస్రాధిపతిని చూచి — నేను నీతో
ఒకమాట చెప్పవచ్చునా అని అడిగెను. అందుకతడు
— హెల్లేనీయ భాష నీకు తెలియునా? । ఈ దినము 38
లకు మునుపు రాజద్రోహమునకు రేపి, నరహంతకు
లైన నాలుగువేలమంది మనుష్యులను అరణ్యమునకు
వెంటబెట్టుకొని పోయిన ఐగుప్తీయుడవు నీవు కావా
అని అడిగెను. । అందుకు పౌలు— నేను కిలికియలోని 39
తార్సువాడనైన యూదుడను; ఆ ప్రసిద్ధపట్టణపు
పౌరత్వము నాకు కలదు. జనులతో మాటలాడుటకు
నాకు సెలవిమ్మని వేడుకొనుచున్నానని చెప్పెను. ।
అతడు సెలవిచ్చిన తరువాత పౌలు మెట్లమీద నిలువ 40
బడి జనులకు చేసైగ చేసెను. వారు నిశ్శబ్దముగా ఉన్న
ప్పుడు అతడు హెబ్రీభాషలో ఇట్లనెను—
సహోదరులారా తండ్రులారా, నేనిప్పుడు **22**
మీయెదుట చెప్పు సమాధానము నాలకించుడి.
అతడు హెబ్రీభాషలో మాటలాడుట వారు 2
విని మరి నిశ్శబ్దముగా ఉండిరి. అప్పుడతడు ఈలాగు
చెప్పసాగెను
—నేను కిలికియలోని తార్సులో పుట్టిన యూదు 3
డను. అయితే ఈ పట్టణములో గమలీయేలు పాద
ములయొద్ద పెరిగి, మన పితరుల ధర్మశాస్త్రసంబంధమగు
నిష్ఠయందు శిక్షితుడనై, మీరందరు నేడు ఉన్న
ప్రకారము దేవునిగూర్చి ఆసక్తుడనై యుండి । ఈ 4
మార్గములోనున్న పురుషులను స్త్రీలను బంధించి చెర
సాలలో వేయించుచు మరణపర్యంతమును హింసించి

5 తిని. । ఇందునుగూర్చి ప్రధానయాజకుడును పెద్ద
లందరును నాకు సాక్షులైయున్నారు. నేను వారివలన
సహోదరులయొద్దకు పత్రికలు తీసికొని, దమస్కు
లోనివారిని కూడ బంధించి దండించుటకై యెరూష
6 లేమునకు తేవలెనని అక్కడికి వెళ్లితిని. । నేను ప్రయా
ణము చేయుచు దమస్కునకు సమీపించినప్పుడు
మధ్యాహ్నకాలమందు ఆకాశమునుండి గొప్ప వెలుగు
7 అకస్మాత్తుగా నా చుట్టు ప్రకాశించెను. । నేను నేల
పడి — సౌలా సౌలా, నీవెందుకు నన్ను హింసించు
చున్నావని నాతో ఒక శబ్దము పలుకుట వింటిని. ।
8 అందుకు నేను—ప్రభువా, నీవెవడవని అడిగినప్పుడు
ఆయన—నేను నీవు హింసించుచున్న నజరేయుడనగు
9 యేసును అని నాతో చెప్పెను. । నాతోకూడ నున్న
వారు ఆ వెలుగు చూచిరి గాని నాతో మాటలాడిన
10 వాని స్వరము వారు వినలేదు. । అప్పుడు నేను—
ప్రభువా, నేనేమి చేయవలెనని అడుగగా ప్రభువు
— నీవు లేచి దమస్కులోనికి వెళ్లుము; అక్కడ నీవు
చేయుటకు నియమింపబడినవన్నియు నీకు చెప్పబడు
11 నని నాతో అనెను. । ఆ వెలుగుయొక్క ప్రభావము
వలన నేను చూడలేక పోయినందున నాతోకూడ
ఉన్నవారు నన్ను నడిపింపగా దమస్కులోనికి వచ్చి
12 తిని. । అంతట ధర్మశాస్త్రముచొప్పున భక్తిపరుడును,
అక్కడ కాపురమున్న యూదులందరిచేత మంచిపేరు
పొందినవాడునైన అననీయ అను ఒకడు నాయొద్దకు
13 వచ్చి నిలిచి । — సౌలా సహోదరా, దృష్టి పొందు
మని నాతో చెప్పగా ఆ గడియలోనే నేను దృష్టి
14 పొంది అతని చూచితిని. । అప్పుడతడు — మన పిత
రుల దేవుడు తన చిత్తమును తెలిసికొనుటకును, ఆ నీతి
మంతుని చూచుటకును, ఆయన నోటిమాట వినుట
15 కును నిన్ను నియమించియున్నాడు; । నీవు కన్న
వాటిని గూర్చియు విన్నవాటిని గూర్చియు సకల
మనుష్యులయెదుట ఆయనకు సాక్షివైయుందువు ।
16 గనుక నీవు తడవుచేయుట ఎందుకు? లేచి ఆయన
నామమునుబట్టి ప్రార్థనచేసి బాప్తిస్మముపొంది నీ
17 పాపములను కడిగివేసికొనుమని చెప్పెను. । అంతట
నేను యెరూషలేమునకు తిరిగి వచ్చి దేవాలయములో
ప్రార్థనచేయుచుండగా పరవశుడనై ప్రభువును చూచి
18 తిని. । అప్పుడాయన — నీవు త్వరపడి యెరూషలేము
విడిచి శీఘ్రముగా వెళ్లుము. నన్నుగూర్చి నీవిచ్చు
19 సాక్ష్యము వారంగీకరింపరని నాతో చెప్పెను. । అం
దుకు నేను — ప్రభువా, ప్రతి సమాజమందిరములో
నీయందు విశ్వాసముంచువారిని నేను చెరసాలలో
వేయుచు కొట్టుచునుంటినని వారికి బాగుగా తెలి
20 యును. । మరియు నీ సాక్షియైన స్తెఫను రక్తము చిం
దింపబడినప్పుడు నేనుకూడ దగ్గర నిలిచి అందుకు
సమ్మతించి అతని చంపినవారి వస్త్రములకు కావలియుంటి
నని చెప్పితిని. । అందుకు ఆయన — వెళ్లుము, నేను 21
దూరముగా అన్యజనులయొద్దకు నిన్ను పంపుదునని
నాతో చెప్పెను.

ఈ మాటవరకు వారతడు చెప్పినది ఆలకించుచుం 22
డిరి. పిమ్మట—ఇటువంటివాడు బ్రదుకతగడు, భూమి
మీద ఉండకుండ వాని చంపివేయుడని కేకలువేసిరి. ।
వారు కేకలువేయుచు తమ బట్టలు విదుల్చుకొని 23
ఆకాశముతట్టు దుమ్మెత్తి పోయుచుండగా । వారతనికి 24
విరోధముగా ఈలాగు కేకలువేసిన హేతువేమో
తెలిసికొనుటకై, సహస్రాధిపతి కొరడాలతో అతని
కొట్టి విమర్శింపవలెనని చెప్పి, కోటలోనికి తీసికొని
పొండని ఆజ్ఞాపించెను. । వారు పౌలును వారులతో 25
కట్టుచున్నప్పుడు అతడు తనదగ్గర నిలిచియున్న శతాధి
పతిని చూచి — శిక్ష విధింపకయే రోమీయుడైన
మనుష్యుని కొరడాలతో కొట్టుటకు మీకు అధికార
మున్నదా అని యడిగెను. । శతాధిపతి ఆ మాట విని 26
సహస్రాధిపతియొద్దకు వచ్చి — నీవేమిచేయబోవు
చున్నావు? ఈ మనుష్యుడు రోమీయుడు సుమీ
అనెను. । అప్పుడు సహస్రాధిపతి వచ్చి అతని చూచి 27
—నీవు రోమీయుడవా? అది నాతో చెప్పుమనగా ।
అతడు — అవునని చెప్పెను. సహస్రాధిపతి — నేను 28
బహు ద్రవ్యమిచ్చి యీ పౌరత్వము సంపాదించు
కొంటిననెను; అందుకు పౌలు—నేనైతే పుట్టుకతోనే
రోమీయుడననెను. । కాబట్టి అతని విమర్శింపబోయిన 29
వారు వెంటనే అతని విడిచిపెట్టిరి. మరియు అతడు
రోమీయుడని తెలిసికొన్నప్పుడు అతని బంధించినం
దుకు సహస్రాధిపతికూడ భయపడెను.

మరునాడు, యూదులతనిమీద మోపిన నేర 30
మేమో తాను నిశ్చయముగా తెలిసికొనగోరి, సహ
స్రాధిపతి అతని విడిపించి, ప్రధానయాజకులును
మహా సభవారందరును కూడి రావలెనని ఆజ్ఞాపించి,
పౌలును తీసికొనివచ్చి వారియెదుట నిలువబెట్టెను.

పౌలు మహా సభవారిని తేరిచూచి — సహో **23**
దరులారా, నేను నేటివరకు కేవలము మంచి మన
స్సాక్షిగలవాడనై దేవునియెదుట నడుచుకొనుచుంటి
నని చెప్పెను. । అందుకు ప్రధానయాజకుడైన అన 2
నీయ—అతని నోటిమీద కొట్టుడని దగ్గర నిలిచియున్న
వారికి ఆజ్ఞాపింపగా । పౌలు అతని చూచి—సున్నము 3
కొట్టిన గోడా, దేవుడు నిన్ను కొట్టును; నీవు ధర్మ 4
శాస్త్రముచొప్పున నన్ను విమర్శింప కూర్చుండి, ధర్మ
శాస్త్రమునకు వ్యతిరిక్తముగా నన్ను కొట్ట నాజ్ఞాపించు
చున్నావా అనెను. దగ్గర నిలిచియున్నవారు—నీవు
దేవుని ప్రధానయాజకుని దూషించెదవా అని అడిగిరి. ।
అందుకు పౌలు సహోదరులారా, యితడు ప్రధాన 5
యాజకుడని నాకు తెలియలేదు—

నీ ప్రజల అధికారిని నిందింపవద్దు

6 అని వ్రాయబడి యున్నదనెను.[1] వారిలో ఒక
భాగము సద్దూకయ్యులును మరియొక భాగము పరి
సయ్యులునై యున్నట్టు పౌలు గ్రహించి—సహో
దరులారా, నేను పరిసయ్యుడను పరిసయ్యుల సంతతి
వాడను; (మనకున్న) నిరీక్షణనుగూర్చియు, మృతుల
పునరుత్థానమునుగూర్చియు నేను విమర్శింపబడుచు
7 న్నానని సభలో బిగ్గరగా చెప్పెను. అతడాలాగు
చెప్పినప్పుడు పరిసయ్యులకును సద్దూకయ్యులకును
కలహము పుట్టినందున ఆ సమూహము రెండు పక్ష
8 ములు ఆయెను. సద్దూకయ్యులు పునరుత్థానము
లేదనియు, దేవదూతయైనను ఆత్మయైనను లేదనియు
చెప్పుదురు గాని పరిసయ్యులు రెండును కలవని
9 యొప్పుకొందురు. అప్పుడు పెద్దగొల్లు పుట్టెను;
పరిసయ్యుల పక్షముగా ఉన్న శాస్త్రులలో కొందరు
లేచి—ఈ మనుష్యునియందు ఏ దోషమును మాకు
కనబడలేదు; ఒక ఆత్మయైనను దేవదూతయైనను అత
నితో మాటలాడియుంటే మాటలాడి యుండవచ్చు
10 నని చెప్పుచు జగడమాడిరి. కలహ మెక్కువైనప్పుడు
వారు పౌలును చీల్చివేయుదురేమో అని సహస్రాధి
పతి భయపడి—మీరు వెళ్లి వారి మధ్యనుండి అతనిని
బలవంతముగా పట్టుకొని కోటలోకి తీసికొనిరండని
రాణువవారికి ఆజ్ఞాపించెను.
11 ఆ రాత్రి ప్రభువు అతనియొద్ద నిలుచుండి—
ధైర్యముగా ఉండుము; యెరూషలేములో నీవు నన్ను
గూర్చి యేలాగు సాక్ష్యమిచ్చితివో ఆలాగున రోమా
లోకూడ సాక్ష్యమియ్యవలసియున్నదని చెప్పెను.
12 ఉదయమైనప్పుడు యూదులు కట్టుకట్టి, తాము
పౌలును చంపువరకు అన్నపానములు పుచ్చుకొనమని
13 శపథము చేసికొనిరి. ఈ కుట్రలో చేరినవారు
14 నలుబదిమందికంటె ఎక్కువైనవారు. వారు ప్రధాన
యాజకులయొద్దకును పెద్దలయొద్దకును వచ్చి—మేము
పౌలును చంపువరకు ఏమియు రుచి చూడమని కఠిన
15 మైన శపథము చేసికొనియున్నాము. కాబట్టి మీరు
మహా సభతో కలిసి, అతనిగూర్చి మరి పూర్తిగా
విచారించి తెలిసికొనబోవునట్టు అతని మీయొద్దకు
తీసికొనిరమ్మని సహస్రాధిపతితో మనవిచేయుడి;
అతడు దగ్గరకు రాకమునుపే మేమతని చంపుటకు
16 సిద్ధపడియున్నామని చెప్పిరి. అయితే పౌలు మేన
ల్లుడు వారు పొంచియున్నారని విని వచ్చి కోటలో
17 ప్రవేశించి పౌలుకు ఆ సంగతి తెలిపెను. అప్పుడు
పౌలు శతాధిపతులలో నొకని తనయొద్దకు పిలిచి—
ఈ చిన్నవానిని సహస్రాధిపతియొద్దకు తోడుకొని
పొమ్ము, ఇతడు అతనితో ఒకమాట చెప్పుకొనవలె
18 నని యున్నాడనెను. శతాధిపతి సహస్రాధిపతి
యొద్దకతని తోడుకొనిపోయి—ఖయిదీయైన పౌలు
నన్ను పిలిచి—నీతో ఒక మాట చెప్పుకొనవలెనని
యున్న యీ చిన్నవాని నీయొద్దకు తీసికొనిపొమ్మని
నన్ను అడిగెనని చెప్పెను. సహస్రాధిపతి అతని 19
చెయ్యి పట్టుకొని అవతలకు తీసికొనిపోయి — నీవు
నాతో చెప్పుకొనవలెనని యున్నదేమని యొంటరిగా
అడిగెను. అందుకతడు—నీవు పౌలునుగూర్చి మరి 20
పూర్తిగా విచారింపబోవునట్టు అతని రేపు మహాసభ
యొద్దకు తీసికొని రావలెనని నిన్ను వేడుకొనుటకు
యూదులు కట్టుకట్టి యున్నారు. వారి మాటకు 21
నీవు సమ్మతింపవద్దు; వారిలో నలుబదిమందికంటె
ఎక్కువ మనుష్యులు అతనికొరకు పొంచియున్నారు.
వారు అతని చంపువరకు అన్నపానములు పుచ్చుకొన
మని శపథముచేసికొని యున్నారు; ఇప్పుడు నీ
యొద్ద మాట తీసికొనవలెనని కనిపెట్టుకొని సిద్ధముగా
ఉన్నారని చెప్పెను. అందుకు సహస్రాధిపతి — 22
నీవు ఈ సంగతి నాకు తెలిపితివని యెవనితోను
చెప్పవద్దని ఆజ్ఞాపించి ఆ చిన్నవాని పంపివేసెను.
తరువాత అతడు శతాధిపతులలో ఇద్దరిని తన 23
యొద్దకు పిలిచి—కైసరయదాక వెళ్లుటకు ఇన్నూరు
మంది రాణువవారిని డెబ్బదిమంది గుర్రపురౌతులను
ఇన్నూరుమంది యీటెలవారిని రాత్రి తొమ్మిది గంట
లకు సిద్ధపరచి పౌలును ఎక్కించి—అధిపతియైన 24
ఫేలిక్సునొద్దకు భద్రముగా తీసికొని పోవుటకు గుర్ర
ములను సిద్ధపరచుడని చెప్పెను. మరియు ఈ ప్రకా 25
రముగా ఒక పత్రిక వ్రాసెను—
మహా ఘనతవహించిన అధిపతియైన ఫేలిక్సుకు 26
క్లౌదియ లూసియ వందనములు. యూదులు ఈ 27
మనుష్యుని పట్టుకొని చంపబోయినప్పుడు, అతడు
రోమీయుడని నేను విని, రాణువతో వచ్చి అతని
తప్పించితిని. వారు అతనిమీద మోపిన నేరమేమో 28
తెలిసికొనగోరి నేను వారి మహాసభయొద్దకు అతని
తీసికొని వచ్చితిని. వారు తమ ధర్మశాస్త్రవాదములను 29
గూర్చి అతనిమీద దోషారోపణ చేసిరే గాని మరణ
మునకైనను బంధకములకైనను తగిన నేరము అతని
యందేమియు కనుపరచలేదు. అయితే వారు ఈ 30
మనుష్యునిమీద కుట్రచేయనై యున్నారని నాకు
తెలియవచ్చినందున, వెంటనే అతని నీయొద్దకు పం
పించితిని. నేరము మోపినవారు కూడ అతనిమీద
చెప్పవలెననియున్న సంగతి నీయెదుట చెప్పుకొన
నాజ్ఞాపించితిని.
కాబట్టి అతడు వారికాజ్ఞాపించిన ప్రకారము 31
రాణువవారు పౌలును రాత్రివేళ అంతిపత్రికి తీసి
కొని పోయిరి. మరునాడు వారతనితో కూడ 32
గుర్రపు రౌతులను వెళ్లనిచ్చి తాము కోటకు తిరిగి
వచ్చిరి. వారు కైసరయకు వచ్చి అధిపతికి ఆ పత్రిక 33

[1] నిర్గమ. 22: 28.

అప్పగించి పౌలునుకూడ అతనియెదుట నిలువబెట్టిరి. ।
4 అధిపతి ఆ పత్రిక చదివినప్పుడు — ఇతడు ఏ ప్రదే
శపువాడని అడిగి, అతడు కిలికియవాడని తెలిసికొని ।
5 —నీమీద నేరము మోపువారు కూడ వచ్చినప్పుడు నీ
సంగతి పూర్ణముగా విచారింతునని చెప్పి, హేరోదు
అధికారమందిరములో అతని కావలియందుంచవలెనని
ఆజ్ఞాపించెను.

24 అయిదు దినములైనతరువాత ప్రధానయాజకు
డైన అననీయయు, కొందరు పెద్దలును, తెర్తుల్లు అను
ఒక వక్తయు (కైసరయకు) వచ్చి, పౌలుమీద తెచ్చిన
2 ఫిర్యాదు అధిపతికి తెలియజేసిరి. । పౌలు రప్పింపబడి
నప్పుడు తెర్తుల్లు అతనిమీద నేరముమోప నారంభించి
యిట్లనెను—

3 మహా ఘనతవహించిన ఫేలిక్సా, మేము తమవలన
ఎంతో నెమ్మది అనుభవించుచున్నామనియు, ఈ దేశ
జనమునకు సంభవించిన అనేకమైన కీడులు తమ
పరామర్శచేత దిద్దుబాటవుచున్నవనియు ఒప్పుకొని,
మేము సకలవిధములను సకలస్థలములలోను పూర్ణ
4 కృతజ్ఞతతో అంగీకరించుచున్నాము. । నేను తమకు
విశేషమైన ఆయాసము కలుగజేయకుండ మేము సం
క్షేపముగా చెప్పుకొనుదానిని తమరు ఎప్పటివలె శాంత
5 ముగా వినవలెనని వేడుకొనుచున్నాను. । ఈ మను
ష్యుడు పీడవంటివాడును, భూలోకమందున్న సకల
మైన యూదులను కలహమునకు రేపువాడును, నజ
రేయుల మతభేదమునకు నాయకుడునై యున్నట్టు
6 మేము కనుగొంటిమి. । మరియు ఇతడు దేవాలయ
మును అపవిత్రము చేయుటకు యత్నపడెను గనుక
8 మేము అతని పట్టుకొంటిమి.[1] । తమరు విమర్శించిన
యెడల మేము ఇతనిమీద మోపుచున్న నేరములన్ని
9 యును తమకే తెలియవచ్చునని చెప్పెను. । యూదు
లందుకు సమ్మతించి యీ మాటలు నిజమే అని
చెప్పిరి.

10 అప్పుడు అధిపతి—మాటలాడుమని పౌలుకు సైగ
చేయగా అతడిట్లనెను—

తమరు బహు సంవత్సరములనుండి యీ జనము
నకు న్యాయాధిపతులై యున్నారని యెరిగి నేను ధైర్య
11 ముతో సమాధానము చెప్పుకొనుచున్నాను. । యెరూ
షలేములో ఆరాధించుటకు నేను వెళ్లిననాటనుండి
పన్నెండు దినములు మాత్రమే అయినదని తమరు
12 విచారించి తెలిసికొనవచ్చును. । దేవాలయములో
నేమి సమాజమందిరములలోనేమి పట్టణములోనేమి
నేను ఎవనితోను తర్కించుటయైనను, జనులను గుమి
13 కూర్చుటయైనను వారు చూడలేదు. । మరియు వారు
ఇప్పుడు నామీద మోపు నేరములను తమరికి రుజువు
పరచలేరు. । ధర్మశాస్త్రమందును ప్రవక్తల గ్రంథముల 14
యందును వ్రాయబడియున్నవన్నియు నమ్మి, నీతి 15
మంతులకును అనీతిమంతులకును పునరుత్థానము కలుగ
బోవుచున్నదని వీరు నిరీక్షించుచున్నట్టు నేనుకూడ
దేవునియందు నిరీక్షణయుంచి, వారు మతభేదమని
పేరుపెట్టు ఈ మార్గముచొప్పున నా పితరుల దేవుని
సేవించుచున్నానని తమరియెదుట ఒప్పుకొనుచున్నా
ను. । ఈ విధమున నేనును దేవునియెడలను మను 16
ష్యులయెడలను ఎల్లప్పుడు నా మనస్సాక్షి నిర్దోష
మైనదిగా ఉండునట్లు అభ్యాసము చేసికొనుచున్నా
ను. । కొన్ని సంవత్సరములైన తరువాత నేను నా 17
స్వజనులకు ధర్మద్రవ్యమును కానుకలును అప్పగించు
టకు వచ్చితిని. । నేను శుద్ధిచేసికొనినవాడనై యీలాగు 18
అప్పగించుచుండగా వారు దేవాలయములో నన్ను
చూచిరి. నేను గుంపుకూర్చి యుండలేదు, నావలన
అల్లరి కాలేదు. ఆసియనుండి వచ్చిన కొందరు యూ
దులు ఉండిరి; । నామీద వారికేమైన ఉన్నయెడల 19
వారే తమరి సన్నిధికి వచ్చి నామీద నేరము మోప
వలసియుండెను. । లేదా, నేను మహాసభయెదుట 20
నిలిచియున్నప్పుడు, మృతుల పునరుత్థానమునుగూర్చి 21
నేడు వారియెదుట విమర్శింపబడుచున్నానని వారి
మధ్య నిలువబడి నేను బిగ్గరగా చెప్పిన యీ యొక్క
మాట విషయమై తప్ప నాయందు మరి యే నేరమై
నను వీరు కనుగొనియుంటే వీరైన చెప్పవచ్చుననెను.

ఫేలిక్సు ఈ మార్గమువిషయమైన సంగతులు బా 22
గుగా ఎరిగినవాడై—సహస్రాధిపతియైన లూసియ వచ్చి
నప్పుడు మీ సంగతి నేను విచారించి తెలిసికొందు
నని చెప్పి విమర్శ నిలుపుచేసెను. । మరియు అతని 23
విడిగా కావలిలో ఉంచి, అతనికి పరిచారము చేయు
టకు అతని స్వజనులలో ఎవరిని ఆటంకపరచకూడ
దని శతాధిపతికి ఆజ్ఞాపించెను.

కొన్ని దినములైన తరువాత ఫేలిక్సు యూదు 24
రాలైన ద్రుసిల్ల అను తన భార్యతోకూడ వచ్చి పౌలును
పిలిపించి, క్రీస్తుయేసునందలి విశ్వాసమునుగూర్చి
అతడు బోధింపగా వినెను. । అప్పుడతడు నీతిని 25
గూర్చియు ఆశానిగ్రహమునుగూర్చియు రాబోవు
విమర్శనుగూర్చియు ప్రసంగించుచుండగా ఫేలిక్సు
మిగుల భయపడి—ఇప్పటికి వెళ్లుము, నాకు సమయమై
నప్పుడు నిన్ను పిలువనంపింతునని చెప్పెను. । తరు 26
వాత పౌలువలన తనకు ద్రవ్యము దొరకునని ఆశించి,
మాటిమాటికి అతని పిలిపించి అతనితో సంభాషణ
చేయుచుండెను. । రెండు సంవత్సరములైన తరువాత 27
ఫేలిక్సుకు ప్రతిగా పోర్కియు ఫేస్తు వచ్చెను. అప్పుడు
ఫేలిక్సు యూదులచేత మంచివాడనిపించుకొనవలె

1 కొన్ని ప్రాచీన ప్రతులలో—మా ధర్మశాస్త్రముచొప్పున తీర్పు తీర్చవలెనని యుంటిమిగాని, సహస్రాధిపతియైన లూసియ వచ్చి, చాల బలాత్కారముతో మా చేతులలోనుండి ఇతని తీసికొనిపోయి, యితనిమీద నేరము మోపువారిని తమయొద్దకు రావలెనని ఆజ్ఞాపించెను—అని కూర్చబడియున్నది.

నని కోరి, పౌలును బంధకములలోనే విడిచిపెట్టి
పోయెను.

25 ఫేస్తు ఆ దేశాధికారమునకు వచ్చి మూడు దినము
లైన తరువాత కైసరయనుండి యెరూషలేముకు వెళ్లె
2 ను. । అప్పుడు ప్రధానయాజకులును యూదులలో
ముఖ్యులును పౌలుమీద తాము తెచ్చిన ఫిర్యాదు
3 సంగతి అతనికి తెలియజేసిరి. । మరియు త్రోవలో
అతని చంపుటకు పొంచియుండి — మీరు దయచేసి
అతని యెరూషలేముకు పిలువనంపించుడని అతని
4 మీద ఫేస్తునొద్ద మనవిచేసిరి. । అందుకు ఫేస్తు—
పౌలు కైసరయలో కావలిలో ఉన్నాడు; నేను
5 శీఘ్రముగా అక్కడికి వెళ్లబోవుచున్నాను । గనుక
మీలో సమర్థులైనవారు నాతోకూడ వచ్చి, ఆ మను
ష్యునియందు తప్పితమేదైన ఉంటే అతనిమీద మోప
వచ్చునని ఉత్తరమిచ్చెను.

6 అతడు వారియొద్ద ఎనిమిది పది దినములు గడిపి
కైసరయకు వెళ్లి మరునాడు న్యాయపీఠముమీద
కూర్చుండి పౌలును తీసికొని రమ్మని ఆజ్ఞాపించెను. ।
7 పౌలు వచ్చినప్పుడు యెరూషలేమునుండి వచ్చిన
యూదులు అతని చుట్టు నిలిచి, భారమైన అనేక
నేరములను మోపిరి గాని వాటిని రుజువు చేయలేక
8 పోయిరి. । అందుకు పౌలు—యూదుల ధర్మశాస్త్ర
మునుగూర్చి గాని, దేవాలయమునుగూర్చి గాని, కైస
రునుగూర్చి గాని నేనెంతమాత్రమును తప్పితముచేయ
9 లేదని సమాధానము చెప్పెను. । అయితే ఫేస్తు యూ
దులచేత మంచివాడనిపించుకొనవలెనని — యెరూష
లేముకు వచ్చి అక్కడ నా యెదుట ఈ సంగతులను
గూర్చి విమర్శింపబడుట నీకిష్టమా అని పౌలును అడి
10 గెను. । అందుకు పౌలు — కైసరు న్యాయపీఠము
ఎదుట నిలువబడియున్నాను; నేను విమర్శింపబడవల
సిన స్థలమిదే; యూదులకు నేను అన్యాయమేమియు
11 చేయలేదని తమరికి బాగుగా తెలియును. । నేను
న్యాయము తప్పి మరణమునకు తగినదేదైనను చేసిన
యెడల మరణమునకు వెనుకతీయను; వీరు నా
మీద మోపుచున్న నేరములలో ఏదియు నిజముకాని
యెడల నన్ను వారికి అప్పగించుటకు ఎవరి తరము
12 కాదు; కైసరు ఎదుటనే చెప్పుకొందుననెను. । అప్పుడు
ఫేస్తు తన సభవారితో ఆలోచనచేసిన తరువాత—
కైసరు ఎదుట చెప్పుకొందువా? కైసరునొద్దకే పోవు
దువని ఉత్తరమిచ్చెను.

13 కొన్ని దినములైన తరువాత రాజైన అగ్రిప్పయు
బెర్నీకేయు ఫేస్తు దర్శనము చేసికొనుటకు కైసరయకు
14 వచ్చిరి. । వారక్కడ అనేకదినములుండగా ఫేస్తు
పౌలు సంగతి రాజుకు తెలియజెప్పెను; ఏమనగా—
ఫేలిక్సు విడిచిపెట్టి పోయిన యొక ఖైదీ యున్నాడు. ।
15 నేను యెరూషలేములో ఉన్నప్పుడు ప్రధానయాజ
కులును యూదుల పెద్దలును అతనిమీద తెచ్చిన
ఫిర్యాదు సంగతి తెలియజేసి అతనికి శిక్ష విధింపవలె
నని వేడుకొనిరి. । అందుకు నేను—నేరము మోప 16
బడినవాడు నేరము మోపినవారికి ముఖాముఖిగా
వచ్చి, తనమీద మోపబడిన నేరమునుగూర్చి సమా
ధానము చెప్పుకొనుటకు అవకాశమియ్యకమునుపు ఏ
మనుష్యునినైనను (శిక్షకు) అప్పగించుట రోమీయుల
ఆచారము కాదని ఉత్తరమిచ్చితిని. । కాబట్టి వారి 17
క్కడికి కూడి వచ్చినప్పుడు నేను ఆలస్యమేమియు
చేయక, మరునాడు న్యాయపీఠముమీద కూర్చుండి
ఆ మనుష్యుని తీసికొని రమ్మని ఆజ్ఞాపించితిని. । నేరము 18
మోపినవారు నిలిచినప్పుడు, నేననుకొనిన నేరములలో
ఒకటియైనను అతనిమీద మోపినవారు కారు. ।
అయితే తమ మతమును గూర్చియు, చనిపోయిన 19
యేసు అను ఒకనిగూర్చియు ఇతనితో వారికి కొన్ని
వివాదములున్నట్టు కనబడెను; । ఆ యేసు బ్రదికి 20
యున్నాడని పౌలు చెప్పెను. నేనట్టి వాదముల
విషయమై యేలాగున విచారింపవలెనో యేమియు
తోచక, యెరూషలేముకు వెళ్లి అక్కడ వీటినిగూర్చి
విమర్శింపబడుటకు అతని కిష్టమవునేమో అని అడిగి
తిని. । అయితే పౌలు, చక్రవర్తి విమర్శకు తన్ను నిలిపి 21
యుంచవలెనని చెప్పుకొనినందున నేనతనిని కైసరు
నొద్దకు పంపించువరకు నిలిపియుంచవలెనని ఆజ్ఞా
పించితిననెను. । అందుకు అగ్రిప్ప—ఆ మనుష్యుడు 22
చెప్పుకొనునది నేనును వినగోరుచున్నానని ఫేస్తుతో
అనగా అతడు—రేపు వినవచ్చునని చెప్పెను.

కాబట్టి మరునాడు అగ్రిప్పయు బెర్నీకేయు 23
మిక్కిలి ఆడంబరముతో వచ్చి, సహస్రాధిపతుల
తోను పట్టణమందలి ప్రముఖులతోను అధికారమందిర
ములో ప్రవేశించిన తరువాత ఫేస్తు ఆజ్ఞనియ్యగా
పౌలు తేబడెను. । అప్పుడు ఫేస్తు—అగ్రిప్పరాజా, 24
యిక్కడ మాతో ఉన్న సమస్త జనులారా, మీరు
ఈ మనుష్యుని చూచుచున్నారు. యెరూషలేము
లోను ఇక్కడను యూదులందరు—వీడు ఇక బ్రదుక
తగడని కేకలువేయుచు అతనిమీద నాతో మనవి
చేసికొనిరి. । ఇతడు మరణమునకు తగినది ఏమియు 25
చేయలేదని నేను గ్రహించి, యితడు చక్రవర్తియెదుట
చెప్పుకొందునని అనినందున ఇతని పంప నిశ్చయించి
యున్నాను. । ఇతనిగూర్చి మన యేలినవారిపేర 26
వ్రాయుటకు నాకు నిశ్చయమైనది ఏమియు కనబడ
లేదు గనుక విచారణయైన తరువాత వ్రాయుటకు
ఏమైనను నాకు దొరకవచ్చునని మీ అందరియెదుటి
కిని, అగ్రిప్పరాజా, ముఖ్యముగా మీ యెదుటికిని,
ఇతని రప్పించి యున్నాను. । ఖయిదీమీద మోప 27
బడిన నేరములను వివరింపకుండ అతని పంపుట
యుక్తముకాదని నాకు తోచుచున్నదని చెప్పెను.

**26** అగ్రిప్ప పౌలును చూచి—నీ పక్షమున చెప్పు
కొనుటకు నీకు సెలవైనదనెను. అప్పుడు పౌలు చేయి
చాచి యీలాగు సమాధానము చెప్పసాగెను—
2 అగ్రిప్పరాజా, తమరు యూదులలో ఉండు
సమస్తమైన ఆచారములను వివాదములను విశేషముగా
3 ఎరిగినవారు గనుక । యూదులు నామీద మోపిన
నేరములన్నిటినిగూర్చి నేడు తమరియెదుట సమా
ధానము చెప్పుకొనబోవుచున్నందుకు నేను ధన్యు
డనని యనుకొనుచున్నాను; తాలిమితో నా మనవి విన
4 వలెనని వేడుకొనుచున్నాను. । మొదటనుండి యెరూష
లేములో నా జనము మధ్యను బాల్యమునుండి నేను
బ్రదికిన బ్రదుకు ఏలాటిదో యూదులందరు ఎరుగు
5 దురు. । వారు మొదటనుండి నన్ను ఎరిగినవారు గనుక
సాక్ష్యమిచ్చుటకు వారికిష్టమైతే నేను మన మతము
లోని బహు నిష్ఠగల తెగను అనుసరించి, పరిసయ్యుడ
6 నుగా ప్రవర్తించినట్లు (చెప్పగలరు). । ఇప్పుడైతే
దేవుడు మన పితరులకు చేసిన వాగ్దానమువిషయమైన
నిరీక్షణనుగూర్చి నేను విమర్శింపబడుటకు నిలిచియు
7 న్నాను. । మన పన్నెండు గోత్రములవారు ఎడతెగక
దివారాత్రములు దేవుని సేవించుచు ఆ వాగ్దానము పొం
దుదుమని నిరీక్షించుచున్నారు. ఓ రాజా, యీ నిరీ
క్షణ విషయమే యూదులు నామీద నేరము మోపి
8 యున్నారు. । దేవుడు మృతులను లేపునను సంగతి
9 నమ్మతగనిదని మీరేల యెంచుచున్నారు? । నజరే
యుడైన యేసు నామమునకు విరోధముగా అనేక
10 కార్యములు చేయవలెనని నేననుకొంటిని; । యెరూష
లేములో నేనాలాగు చేసితిని. నేను ప్రధానయాజ
కులవలన అధికారము పొంది, పరిశుద్ధులను అనేకులను
చెరసాలలలో వేసి, వారిని చంపినప్పుడు సమ్మతించి
11 తిని; । అనేకపర్యాయములు సమాజమందిరములన్ని
టిలో వారిని దండించి వారు దేవదూషణచేయునట్లు
బలవంతపెట్ట చూచితిని. మరియు వారిమీద మిక్కిలి
క్రోధము గలవాడనై యితర పట్టణములకును వెళ్లి
12 వారిని హింసించుచుంటిని. । అందు నిమిత్తము నేను
ప్రధానయాజకులచేత అధికారమును ఆజ్ఞయు పొంది
13 దమస్కునకు పోవుచుండగా । రాజా, మధ్యాహ్న
మందు నా చుట్టును నాతోకూడ వచ్చినవారి చుట్టును
ఆకాశమునుండి సూర్యతేజస్సుకంటె మిక్కిలి ప్రకా
శమానమైన యొక వెలుగు త్రోవలో ప్రకాశించుట
14 చూచితిని. । మేమందరమును నేలపడినప్పుడు—సౌలా
సౌలా, నన్నెందుకు హింసించుచున్నావు? మునికోల
లకు ఎదురు తన్నుట నీకు కష్టమని హెబ్రీభాషలో
15 ఒక స్వరము నాతో పలుకుట వింటిని. । అప్పుడు
నేను — ప్రభువా, నీవు ఎవడవని అడుగగా ప్రభువు
16 నేను—నీవు హింసించుచున్న యేసును. । నీవు నన్ను
18 చూచియున్న సంగతినిగూర్చియు నేను నీకు కనబడ
బోవు సంగతినిగూర్చియు నిన్ను పరిచారకునిగాను
సాక్షినిగాను నియమించుటకై కనబడియున్నాను. నీవు
లేచి నీ పాదములు మోపి నిలువుము; నేను ఈ ప్రజల
వలనను అన్యజనులవలనను హాని కలుగకుండ నిన్ను
కాపాడెదను; వారు చీకటిలోనుండి వెలుగులోనికిని
సాతాను అధికారమునుండి దేవుని వైపునకు తిరిగి,
నాయందలి విశ్వాసముచేత పాపక్షమాపణను, పరిశుద్ధ
పరచబడినవారిలో స్వాస్థ్యమును పొందునట్లు వారి
కన్నులు తెరచుటకై నేను నిన్ను వారియొద్దకు పంపె
దనని చెప్పెను. । కాబట్టి అగ్రిప్పరాజా, ఆకాశము 19
నుండి కలిగిన ఆ దర్శనమునకు నేను అవిధేయుడను
కాక । మొదట దమస్కులోనివారికిని, యెరూష 20
లేములోను యూదైయ దేశమంతటను, తరువాత
అన్యజనులకును, వారు మారుమనస్సు పొంది దేవుని
తట్టు తిరిగి మారుమనస్సుకు తగిన క్రియలు చేయ
వలెనని ప్రకటించుచుంటిని. । ఈ హేతువుచేత 21
యూదులు దేవాలయములో నన్ను పట్టుకొని చంపు
టకు ప్రయత్నము చేసిరి; । అయినను నేను దేవుని 22
వలననైన సహాయము పొంది నేటివరకు నిలిచియుండి
—క్రీస్తు శ్రమపడి మృతుల పునరుత్థానము (పొందు
వారి)లో మొదటివాడగుటచేత, ఈ ప్రజలకును అన్య
జనులకును వెలుగు ప్రచురింపబోవునని ప్రవక్తలును 23
మోషేయు ముందుగా చెప్పినవి కాక మరి ఏమియు
చెప్పక, అల్పులకును ఘనులకును సాక్ష్యమిచ్చుచుం
టిని.

అతడు ఈలాగు సమాధానము చెప్పుకొనుచుం 24
డగా ఫేస్తు—పౌలా, నీవు వెఱ్ఱివాడవు, అతి విద్య
వలన నీకు వెఱ్ఱిపట్టినదని గొప్ప శబ్దముతో చెప్పెను.।
అందుకు పౌలు ఇట్లనెను—మహా ఘనత వహించిన 25
ఫేస్తూ, నేను వెఱ్ఱివాడను కానుగాని సత్యమును
స్వస్థబుద్ధియుగల మాటలనే చెప్పుచున్నాను. । రాజు 26
గారు ఈ సంగతులెరుగుదురు గనుక అతనియెదుట
నేను ధైర్యముగా మాటలాడుచున్నాను; వాటిలో
ఒకటియు అతనికి మరుగై యుండలేదని రూఢిగా
నమ్ముచున్నాను; ఇది యొక మూలను జరిగిన కార్యము
కాదు. । అగ్రిప్ప రాజా, తమరు ప్రవక్తలను నమ్ము 27
చున్నారా? నమ్ముచున్నారని నేనెరుగుదును. । అం 28
దుకు అగ్రిప్ప—ఇంత సులభముగా నన్ను క్రైస్తవుని
చేయ జూచుచున్నావే అని పౌలుతో చెప్పెను. ।
అందుకు పౌలు—సులభముగానో దుర్లభముగానో, 29
తమరు మాత్రము కాదు, నేడు నా మాట వినువారం
దరును ఈ బంధకములు తప్ప నావలె ఉండునట్లు
దేవుడనుగ్రహించుగాక అనెను.

అంతట రాజును అధిపతియు బెర్నీకేయు వారి 30
తోకూడ కూర్చుండినవారును లేచి అవతలకు పోయి ।
— ఈ మనుష్యుడు మరణమునకైనను బంధకముల 31

కైనను తగినదేమియు చేయలేదని తమలో తాము మాట
32 లాడుకొనిరి. । అందుకు అగ్రిప్ప—ఈ మనుష్యుడు
—కైసరు ఎదుట చెప్పుకొందునని అననియెడల ఇతని
విడుదలచేయనచ్చునని ఫేస్తుతో చెప్పెను.

**27** మేము ఓడ యెక్కి ఇతలియకు వెళ్లవలెనని
నిర్ణయమైనప్పుడు వారు పౌలును మరికొందరు ఖైదీ
లను ఔగుస్తు పటాలములో శతాధిపతియైన యూలి
2 అనువానికి అప్పగించిరి. । ఆసియ దరి వెంబడినున్న
పట్టణములకు ప్రయాణము చేయబోవు అద్రముత్తియ
పట్టణపు ఓడ మేమెక్కి బయలుదేరితిమి; మాకెదోనీ
యుడును థెస్సలొనీకే పట్టణస్థుడునైన అరిస్తార్కు
3 మాతోకూడ ఉండెను. । మరునాడు సీదోనుకు వచ్చి
తిమి. అప్పుడు యూలి పౌలుమీద దయగా ఉండి,
అతడు తన స్నేహితులయొద్దకు వెళ్లి పరామర్శ పొందు
4 టకు అతనికి సెలవిచ్చెను. । అక్కడనుండి బయలు
దేరిన తరువాత ఎదురుగాలి కొట్టుచున్నందున కుప్ర
5 చాటున ఓడ నడిపించితిమి. । మరియు కిలికియకును
పంపులియకును ఎదురుగా ఉన్న సముద్రము దాటి
6 లుకియలో ఉన్న మూరకు చేరితిమి. । అక్కడ శతాధి
పతి ఇతలియకు వెళ్లనైయున్న అలెక్సంద్రియ పట్ట
ణపు ఓడ కనుగొని అందులో మమ్మును ఎక్కించెను. ।
7 అనేక దినములు మెల్లగా నడచి, యెంతో కష్టపడి
క్నీదుకు ఎదురుగా వచ్చినప్పుడు గాలి మమ్మును
పోనియ్యకున్నందున క్రేతు చాటున సల్మోనె దరిని
8 ఓడ నడిపించితిమి. । బహు కష్టపడి దాని దాటి
మంచిరేవులు అను ఒక స్థలమునకు చేరితిమి. దాని
దగ్గర లసైయ పట్టణముండెను.

9 చాల కాలమైన తరువాత ఉపవాసదినముకూడ
అప్పటికి గడచినందున ప్రయాణముచేయుట
10 అపాయకరమై యుండెను. । అప్పుడు పౌలు—అయ్య
లారా, యీ ప్రయాణమువలన సరకులకును ఓడకును
మాత్రమేకాక మన ప్రాణములకుకూడ హానియు
బహు నష్టమును కలుగునట్లు నాకు తోచుచున్నదని
11 చెప్పి వారిని హెచ్చరించెను. । అయినను శతాధిపతి
పౌలు చెప్పినది నమ్మక నావికుడును ఓడ యజమాను
12 డును చెప్పినదే నమ్మెను. । మరియు శీతకాలము గడుపు
టకు ఆ రేవు ఉపయుక్తము కానిదైనందున అక్కడ
నుండి బయలుదేరి యొకవేళ శక్యమైతే ఫీనిక్సుకు చేరి
అక్కడ శీతకాలము గడపవలెనని యెక్కువమంది
ఆలోచన చెప్పిరి. అది నైరృతి వాయవ్యదిక్కుల
13 తట్టుననున్న క్రేతు రేవై యున్నది. । మరియు దక్షి
ణపుగాలి మెల్లగా విసరుచుండగా వారు తమ ఆలో
చన సమకూడినదని తలంచి లంగరెత్తి క్రేతు దరిని
14 ఓడ నడిపించిరి. । కొంతసేపైన తరువాత ఊరకులో
15 నను పెనుగాలి క్రేతుమీదనుండి విసరెను. । దానిలో
ఓడ చిక్కుకొని గాలికి ఎదురు నడువలేక పోయినం
దున ఎదురు నడిపించుట మాని గాలికి కొట్టుకొని
పోతిమి. । తరువాత కౌద అనబడిన యొక చిన్న 16
ద్వీపము చాటున దాని నడిపింపగా ఫడవను భద్ర
పరచుకొనుట బహు కష్టతరమాయెను. । దానిని 17
పైకెత్తి కట్టిన తరువాత త్రాళ్లు మొదలైనవి తీసికొని
ఓడచుట్టు బిగించి కట్టిరి. మరియు సూర్తిసను ఇసుక
తిప్పమీద పడుదుమేమో అని భయపడి ఓడచాపలు
దింపివేసి కొట్టుకొనిపోయిరి. । మిక్కిలి పెద్దగాలి 18
కొట్టుచున్నందున మరునాడు సరకులు పారవేయ
సాగిరి. । మూడవ దినమందు తమ చేతులార ఓడ 19
సామగ్రి పారవేసిరి. । కొన్ని దినములు సూర్యుడై 20
నను నక్షత్రములైనను కనబడక పెద్దగాలి మామీద 21
కొట్టినందున ప్రాణములతో తప్పించుకొందుమను ఆశ
బొత్తిగ పోయెను. వారు బహుకాలము భోజనము
లేకయున్నందున పౌలు వారి మధ్యను నిలిచి—అయ్య
లారా, మీరు నా మాట విని క్రేతునుండి బయలు
దేరకయే యుండవలసినది, అప్పుడీ హానియు నష్ట
మును కలుగకపోవును. । ఇప్పుడైనను ధైర్యము తెచ్చు 22
కొనుడని మిమ్మును వేడుకొనుచున్నాను; ఓడకే గాని
మీలో ఎవని ప్రాణమునకును హాని కలుగదు. । నేను 23
ఎవనివాడనో, యెవని సేవించుచున్నానో, ఆ దేవుని
దూత గడచినరాత్రి నాయొద్ద నిలిచి—పౌలా, భయ
పడకుము; । నీవు కైసరు ఎదుట నిలువవలసియున్నది; 24
ఇదిగో నీతోకూడ ఓడలో ప్రయాణమై పోవుచున్న
వారందరిని దేవుడు నీకు అనుగ్రహించి యున్నాడని
నాతో చెప్పెను. । కాబట్టి అయ్యలారా, ధైర్యము 25
తెచ్చుకొనుడి; నాతో దూత చెప్పిన ప్రకారము
జరుగునని నేను దేవుని నమ్ముచున్నాను. । అయినను 26
మనము కొట్టుకొనిపోయి యేదైన ఒక ద్వీపముమీద
పడవలసియుండునని చెప్పెను.

పదునాలుగవ రాత్రి వచ్చినప్పుడు మేము అద్రియ 27
సముద్రములో ఇటు అటు కొట్టుకొని పోవుచుండగా
అర్ధరాత్రివేళ ఓడవారు ఏదో యొక దేశము దగ్గర
పడుచున్నదని ఊహించి । బుడుదు వేసి చూచి యిరు 28
వది బారల లోతని తెలిసికొనిరి. ఇంక కొంతదూరము
వెళ్లిన తరువాత మరల బుడుదు వేసి చూచి పదునయిదు
బారల లోతని తెలిసికొనిరి. । అప్పుడు రాతి తిప్పలు 29
గల చోట్ల పడుదుమేమో అని భయపడి, వారు ఓడ
అమరములోనుండి నాలుగు లంగరులు వేసి యెప్పుడు
తెల్లవారునా అని కాచుకొనియుండిరి. । అయితే 30
ఓడవారు ఓడ విడిచి పారిపోవలెనని చూచి, తాము
అనివిలోనుండి లంగరులు వేయబోవునట్లుగా సముద్ర
ములో పడవ దింపివేసిరి. । అందుకు పౌలు—వీరు 31
ఓడలో ఉంటేనేగాని మీరు తప్పించుకొనలేరని
శతాధిపతితోను రాణువవారితోను చెప్పెను. । వెం 32
టనే రాణువవారు పడవ త్రాళ్లు కోసి దాని కొట్టు

పోనిచ్చిరి. । తెల్లవారుచుండగా పౌలు — పదు
గు దినములనుండి మీరేమియు పుచ్చుకొనక
హారులై కనిపెట్టుకొని యున్నారు గనుక ఆహా
పుచ్చుకొనుడని మిమ్మును వేడుకొనుచున్నాను;
మీ ప్రాణరక్షణకు సహాయమగును. మీలో
తలనుండియు ఒక వెండ్రుకయైనను నశింపదని
చు, ఆహారము పుచ్చుకొనుడని అందరిని బతి
లెను. । ఈ మాటలు చెప్పి యొక రొట్టె పట్టు
అందరియెదుట దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించి
విరిచి తినసాగెను. । అప్పుడందరు ధైర్యము
చ్చుకొని ఆహారము పుచ్చుకొనిరి. । ఓడలో ఉన్న
మందరము ఇన్నూట డెబ్బది ఆరుగురమై యుం
. । వారు తిని తృప్తిపొందిన తరువాత, గోధుమ
సముద్రములో పారబోసి ఓడ తేలికచేసిరి. ।
యమైనప్పుడు అది ఏ దేశమో వారు గుర్తుపట్ట
గాని, దరిగల యొక సముద్రపు పాయను చూచి,
మైనయెడల అందులోకి ఓడను త్రోయవలెనని
చించిరి । గనుక లంగరుల త్రాళ్లు కోసి వాటిని
ద్రములో విడిచిపెట్టి చుక్కానుల కట్లు విప్పి
టకి తెరచాప గాలికెత్తి సరిగా దరికి నడిపించిరి
। రెండు ప్రవాహములు కలిసిన[1] స్థలమందు
కొని ఓడను మెట్ట పట్టించిరి. అందువలన అనివి
కొనిపోయి కదలక యుండెను, అమరము అ
బద్ధలై పోసాగెను. । ఖైదీలలో ఎవడును ఈదు
పారిపోకుండునట్లు వారిని చంపవలెనని రాణువ
కి ఆలోచన పుట్టెను గాని । శతాధిపతి పౌలును
ప నుద్దేశించి వారి ఆలోచన కొనసాగనియ్యక,
దట ఈదగలవారు సముద్రములో దుమికి దరికి
వలెననియు । కడమవారిలో కొందరు పలకల
దను కొందరు ఓడ చెక్కలమీదను పోవలెననియు
పించెను. ఈలాగు అందరు తప్పించుకొని దరి
రి.

మేము తప్పించుకొనిన తరువాత ఆ ద్వీపము
తే అని తెలిసికొంటిమి. । అనాగరికులగు ఆ
వాసులు మాకు చేసిన ఉపచార మింతంతకాదు.
గనగా, అప్పుడు వర్షము కురియుచు చలిగా
ందున వారు నిప్పురాజబెట్టి మమ్మును అందరిని
చ్చుకొనిరి. । అప్పుడు పౌలు మోపెడు పుల్లలేరి
లమీద వేయగా ఒక సర్పము కాకకు బయ
వచ్చి అతని చెయ్యి కరచి పట్టెను. । ఆ ద్వీప
సులు ఆ జంతువతని చేతిని వ్రేలాడుట చూచి
డు — నిశ్చయముగా ఈ మనుష్యుడు నరహంతె
ఇతడు సముద్రమునుండి తప్పించుకొనినను
దేవత ఇతని బ్రదుకనియ్యదని తమలోతాము చెప్పు
రి. । అతడైతే ఆ విషజంతువును అగ్నిలో జాడించి
వేసి యే హానియు పొందలేదు. । వారతని శరీరము 6
వాచునో లేక అతడు అకస్మాత్తుగా పడి చచ్చునో
అని కనిపెట్టుచుండిరి. చాలసేపు కనిపెట్టుచుండిన
తరువాత అతనికి ఏ హానియు కలుగకుండుట చూచి
ఆ తాత్పర్యము మాని — ఇతడొక దేవత అని చెప్ప
సాగిరి.

పొప్లియ అను ఒకడు ఆ ద్వీపములో ముఖ్యుడు. 7
అతనికి ఆ ప్రాంతములలో భూములుండెను. అతడు
మమ్మును చేర్చుకొని మూడు దినములు స్నేహభావ
ముతో ఆతిథ్యమిచ్చెను. । అప్పుడు పొప్లియయొక్క 8
తండ్రి జ్వరముచేతను రక్తభేదిచేతను బాధపడుచు
పండుకొనియుండెను. పౌలు అతనియొద్దకు వెళ్లి
ప్రార్థన చేసి, అతనిమీద చేతులుంచి స్వస్థపరచెను. ।
ఇది చూచి ఆ ద్వీపములో ఉన్న కడమ రోగులు 9
కూడ వచ్చి స్వస్థతపొందిరి. । మరియు వారు అనేక 10
సత్కారములతో మమ్మును మర్యాద చేసి, మేము ఓడ
ఎక్కి వెళ్లినప్పుడు మాకు కావలసిన వస్తువులు తెచ్చి
ఓడలో ఉంచిరి.

మూడు నెలలైన తరువాత ఆ ద్వీపమందు శీత 11
కాలమంతయు గడపిన అశ్వినీ చిహ్నముగల అలెక్సం
ద్రియ పట్టణపు ఓడ ఎక్కి బయలుదేరి । సురకూసైకి 12
వచ్చి అక్కడ మూడు దినములుంటిమి. । అక్కడ 13
నుండి చుట్టు తిరిగి రేగియుకు వచ్చి యొక దినమైన
తరువాత దక్షిణపుగాలి విసరుటవలన మరునాడు
పొతియొలీకి వచ్చితివిు. । అక్కడ సహోదరులను 14
మేము చూచినప్పుడు వారు తమయొద్ద ఏడు దినము
లుండవలెనని మమ్మును వేడుకొనిరి. ఆ మీదట రోమాకు
వచ్చితిమి. । అక్కడనుండి సహోదరులు మా సంగతి 15
విని అప్పీయ సంతపేటవరకును త్రిసత్రములవరకును
మమ్మును ఎదుర్కొనుటకు వచ్చిరి. పౌలు వారిని
చూచి దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించి ధైర్యము
తెచ్చుకొనెను.

మేము రోమాకు వచ్చినప్పుడు పౌలు తనకు కావలి 16
యున్న రాణువవానితోకూడ ప్రత్యేకముగా ఉండు
టకు సెలవు పొందెను

మూడు దినములైన తరువాత అతడు యూదులలో 17
ముఖ్యులైనవారిని తనయొద్దకు పిలిపించెను. వారు
కూడివచ్చినప్పుడతడు—సహోదరులారా, నేను మన
ప్రజలకైనను పితరుల ఆచారములకైనను ప్రతికూల
మైనది ఏదియు చేయకపోయినను, యెరూషలేములో
నుండి రోమీయులచేతికి నేను ఖయిదీగా అప్పగించ
బడితిని. । వీరు నన్ను విమర్శచేసి నాయందు మరణ 18
మునకు తగిన హేతువేదియు లేనందున నన్ను విడు
దల చేయగోరిరి గాని । యూదులు అడ్డము చెప్పి 19
నందున నేను కైసరు ఎదుట చెప్పుకొందునవలసి

1 మూలభాషలో—రెండు సముద్రములు కలిసిన.

వచ్చెను. అయినను ఇందువలన నా స్వజనముమీద
నేరమేమియు మోపవలెనని నా తాత్పర్యము కాదు;।
20 ఈ హేతువుచేతనే మిమ్మును చూచి మాటలాడ
వలెనని పిలిపించితిని; ఇశ్రాయేలుయొక్క నిరీక్షణ
కోసరము ఈ గొలుసుతో కట్టబడియున్నానని వారితో
21 చెప్పెను. । అందుకు వారు—యూదైయనుండి నిన్ను
గూర్చి పత్రికలు మాకు రాలేదు; ఇక్కడికి వచ్చిన
సహోదరులలో ఒక్కడైనను నిన్నుగూర్చి చెడు
సంగతి ఏదియు మాకు తెలియపరచను లేదు, మరియు
22 ఎవరును చెప్పుకొనను లేదు. । అయినను ఈ విషయమై
నీ అభిప్రాయము నీవలన వినగోరుచున్నాము; ఈ
మతభేదమునుగూర్చి అంతట ఆక్షేపణచేయుచున్నా
రని (యింతమట్టుకు) మాకు తెలియుననిరి.

23 అతనికి ఒక దినము నియమించి, అతని బసలోకి
అతనియొద్దకు అనేకులు వచ్చిరి. ఉదయమునుండి
సాయంకాలమువరకు అతడు దేవుని రాజ్యమునుగూర్చి
పూర్తిగా సాక్ష్యమిచ్చుచు, మోషే ధర్మశాస్త్రములో
నుండియు ప్రవక్తలలోనుండియు సంగతులెత్తి యేసును
గూర్చి వివరముగా బోధించుచు వారిని ఒప్పించు
చుండెను.

24 అతడు చెప్పిన సంగతులు కొందరు నమ్మిరి కొం
25 దరు నమ్మకపోయిరి. । వారిలో విభేదమైన అభిప్రాయ
ములు కలిగినందున పౌలు వారితో ఒక మాట చెప్పిన
తరువాత వారు వెళ్లిపోయిరి. అదేదనగా

—మీరు వినుట మట్టుకు విందురు గాని గ్రహిం 26
పనే గ్రహింపరు; చూచుట మట్టుకు చూతురు
గాని కాననే కానరని యీ ప్రజలయొద్దకు
వెళ్లి చెప్పుము. । ఈ ప్రజలు కన్నులార చూచి 27
చెవులార విని మనస్సార గ్రహించి నా వైపు
తిరిగి నావలన స్వస్థత పొందకుండునట్లు వారి
హృదయము క్రొవ్వియున్నది. వారు చెవు
లతో మందముగా విని కన్నులు మూసికొని
యున్నారు

అని పరిశుద్ధాత్మ యెషయా[1] ప్రవక్తద్వారా మీ పిత
రులతో చెప్పిన మాట సరియే. । కాబట్టి దేవునివలన 28
నైన యీ రక్షణ అన్యజనులయొద్దకు పంపబడియున్న
దని మీరు తెలిసికొందురు గాక, వారు దాని విం
దురు.[2]

పౌలు రెండు సంవత్సరములు పూర్తిగా తన అద్దె 30
యింట కాపురముండి, తనయొద్దకు వచ్చువారినందరిని
సమ్మానముచేసి । ఏ ఆటంకమును లేక పూర్ణధైర్యముతో 31
దేవుని రాజ్యమునుగూర్చి ప్రకటించుచు, ప్రభువైన
యేసుక్రీస్తునుగూర్చిన సంగతులు బోధించుచు నుం
డెను.

[1] యెషయా, 6: 9, 10. [2] కొన్ని ప్రాచీన ప్రతులలో—అతడీసంగతులు చెప్పిన తరువాత యూదులు తమలోతాము బహు తర్కించుకొనుచు వెళ్లిపోయిరి, అని కూర్చబడియున్నది

## అపొస్తలుడైన పౌలు

# రోమీయులకు వ్రాసిన పత్రిక

యేసు క్రీస్తు[1] దాసుడును అపొస్తలుడుగా నుండు
పిలువబడినవాడును, దేవుని సువార్తనిమిత్తము
త్యేకింపబడినవాడునైన పౌలు రోమాలో ఉన్న
ని ప్రియులకందరికి, అనగా పరిశుద్ధులుగా ఉం
టకు పిలువబడినవారికందరికి (శుభమని చెప్పి)
యునది. మన తండ్రియైన దేవునినుండియు,
భువైన యేసుక్రీస్తునుండియు, కృపాసమాధాన
లు మీకు కలుగుగాక. దేవుడు తన కుమారుడును
ప్రభువునైన యేసుక్రీస్తు విషయమైన ఆ సువా
పరిశుద్ధ లేఖనములయందు తన ప్రవక్తలద్వారా
దము వాగ్దానముచేసెను. యేసుక్రీస్తు, శరీరమును
దావీదు సంతానముగాను, మృతులలోనుండి
రుత్థానుడైనందున పరిశుద్ధమైన ఆత్మనుబట్టి ప్రభా
చేత దేవుని కుమారుడుగాను నిరూపింపబడిన
డాయెను. ఈయన నామము నిమిత్తము సమస్త
లు విశ్వాసమునకు విధేయులగునట్లు ఈయన
రా మేము కృపను అపొస్తలత్వమును పొందితిమి.
సు వారిలో ఉన్నవారై యేసుక్రీస్తువారుగా
డుటకు పిలువబడియున్నారు.
మీ విశ్వాసము సర్వలోకమున ప్రచురము చేయ
చుండుట చూచి, మొదట మీ యందరినిమిత్తము
సుక్రీస్తుద్వారా నా దేవునికి కృతజ్ఞతాస్తుతులు
ంచుచున్నాను. । ఇప్పుడేలాగైనను ఆటంకము
ండక మీయొద్దకు వచ్చుటకు దేవుని చిత్తమువలన
వీలు కలుగునేమో అని, నా ప్రార్థనలయందు
ప్పుడు ఆయనను బతిమాలుకొనుచు, మిమ్మునుగూర్చి
తెగక జ్ఞాపకము చేసికొనుచున్నాను. ఇందుకు
యన కుమారుని సువార్తవిషయమై నేను నా ఆత్మ
దు సేవించుచున్న దేవుడే నాకు సాక్షి. । మీరు
పడవలెనని, అనగా మీకును నాకును కలిగియున్న
సముచేత, అనగా మనము ఒకరి విశ్వాసముచేత
రము ఆదరణపొందవలెనని । ఆత్మసంబంధమైన
వరమేదైనను మీకిచ్చుటకు మిమ్మును చూడను
అపేక్షించుచున్నాను. । సహోదరులారా,
ఇతరులైన అన్యజనులలో ఫలము పొందినట్లు
కూడ ఫలమేదైనను పొందవలెనని అనేకపర్యా
యులు మీయొద్దకు రానుద్దేశించితిని గాని యిది
ఆటంకపరచబడితిని; ఇది మీరు తెలిసికొన
చున్నాను. । హెల్లేనీయులకును హెల్లేనీయులు
కానివారికిని, జ్ఞానులకును మూఢులకును నేను
ఋణస్థుడను. । కాగా నావలననైనంతమట్టుకు రోమా 15
లోని మీకును సువార్త ప్రకటించుటకు సిద్ధముగా
ఉన్నాను. । సువార్తనుగూర్చి నేను సిగ్గుపడువాడను 16
కాను. ఏలయనగా నమ్ము ప్రతివానికి, మొదట యూదు
నికి హెల్లేనీయునికికూడ రక్షణ కలుగజేయుటకు
అది దేవుని శక్తియై యున్నది. । ఎందుకనిన—నీతి 17
మంతుడు విశ్వాసమూలముగా జీవించునని వ్రాయ
బడిన ప్రకారము[2] విశ్వాసమూలముగా అంతకంతకు
విశ్వాసము కలుగునట్లు దేవుని నీతి దానియందు
బయలుపరచబడుచున్నది.
దుర్నీతిచేత సత్యమును అడ్డగించు మనుష్యులయొక్క 18
సమస్త భక్తిహీనతమీదను దుర్నీతిమీదను దేవుని కోపము
పరలోకమునుండి బయలుపరచబడుచున్నది. । ఎందు 19
కనగా దేవునిగూర్చి తెలియ శక్యమైనదేదో అది వారి
మధ్య విశదమైయున్నది; దేవుడు అది వారికి విశద
పరచెను. । ఆయన అదృశ్యలక్షణములు, అనగా 20
ఆయన నిత్యశక్తియు దేవత్వమును, జగదుత్పత్తి మొదలు
కొని సృష్టింపబడిన వస్తువులను ఆలోచించుటవలన
తేటపడుచున్నవి గనుక వారు నిరుత్తరులై యున్నా
రు. । మరియు వారు దేవుని నెరిగియు ఆయనను 21
దేవునిగా మహిమపరచలేదు, కృతజ్ఞతాస్తుతులు చెల్లిం
పనులేదు గాని తమ వాదములయందు వ్యర్థులైరి. ।
వారి అవివేకహృదయము అంధకారమయమాయెను; 22
తాము జ్ఞానులమని చెప్పుకొనుచు బుద్ధిహీనులైరి. ।
వారు అక్షయుడగు దేవుని మహిమను క్షయమగు 23
మనుష్యులయొక్కయు, పక్షులయొక్కయు, చతు
ష్పాద జంతువులయొక్కయు, పురుగులయొక్కయు,
ప్రతిమాస్వరూపముగా మార్చిరి.
ఈ హేతువుచేత వారు తమ హృదయముల 24
దురాశలను అనుసరించి, తమ శరీరములను పరస్పరము
అవమానపరచుకొనునట్లు దేవుడు వారిని అపవిత్రతకు
అప్పగించెను. । అట్టివారు దేవుని సత్యమును అసత్య 25
మునకు మార్చి, సృష్టికర్తకు ప్రతిగా సృష్టమును
పూజించి సేవించిరి. యుగముల పర్యంతము ఆయన
స్తోత్రార్హుడై యున్నాడు, ఆమేన్.
అందువలన దేవుడు తుచ్ఛమైన అభిలాషలకు 26
వారిని అప్పగించెను. వారి స్త్రీలు సహజ స్వాభావిక
మైన ధర్మమును విడిచి స్వాభావిక విరుద్ధమైన ధర్మమును

1 క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము. 2 హబక్కూకు, 2: 4.

మునుబట్టి సున్నతి లేనివాడు ధర్మశాస్త్రమును నెరవేర్చిన
యెడల, లేఖనమును సున్నతియు గలవాడవై ధర్మశాస్త్ర
28 మును అతిక్రమించు నీకు తీర్పు తీర్చడా? । బాహ్య
మునకు యూదుడైనవాడు యూదుడు కాడు; శరీర
29 మందు బాహ్యమైన సున్నతి సున్నతి కాదు. । అయితే
అంతరంగమందు యూదుడైనవాడే యూదుడు. మరి
యు సున్నతి హృదయసంబంధమైనదై ఆత్మయందు
జరుగునదే గాని లేఖనమువలన కలుగునది కాదు. అట్టి
వానికి మెప్పు మనుష్యులవలన కలుగదు దేవునివలననే
కలుగును.

3 అట్లయితే యూదునికి కలిగిన ఆధిక్యమేమి?
2 సున్నతివలన ప్రయోజనమేమి? । ప్రతి విషయమందు
అధికమే. మొదటిది, దేవోక్తులు యూదుల పరము
3 చేయబడెను. । కొందరు అవిశ్వాసులైన నేమి? వారు
అవిశ్వాసులైనందున దేవుడు నమ్మతగినవాడు కాక
పోవునా?[1] అట్లనరాదు

4 నీ మాటలలో నీవు నీతిమంతుడవుగా తీర్చబడు
నట్లును నీవు వ్యాజ్యమాడునప్పుడు గెలుచు
నట్లును

అని వ్రాయబడిన ప్రకారము[2] ప్రతి మనుష్యుడు
అబద్ధికుడగును గాని దేవుడు సత్యవంతుడు కాక తీరడు. ।
5 మన దుర్నీతి దేవుని నీతికి ప్రసిద్ధి కలుగజేసినయెడల
ఏమందుము? ఉగ్రతను చూపించు దేవుడు అన్యాయస్థు
డగునా? నేను మనుష్యరీతిగా మాటలాడుచున్నాను; ।
6 అట్లనరాదు. అట్లయినపక్షమున దేవుడు లోకమునకు
7 ఎట్లు తీర్పు తీర్చును? । దేవునికి మహిమ కలుగునట్లు
నా అసత్యమువలన దేవుని సత్యము ప్రబలించినయెడల
8 నేనికను పాపినైనట్లు తీర్పు పొందనేల? । మేలు కలు
గుటకు కీడుచేయుదమని మేము చెప్పుచున్నామని,
కొందరు మమ్మును దూషించి చెప్పు ప్రకారము
మేమెందుకు చెప్పరాదు? అట్టివారికి కలుగు శిక్షావిధి
న్యాయమే.

9 ఆలాగైన ఏమందుము? మేము వారికంటె శ్రేష్ఠు
లమా? ఎంతమాత్రమును కాము. యూదులేమి హెల్లే
నీయులేమి అందరును పాపమునకు లోనైయున్నా
రని యింతకుముందు దోషారోపణ చేసియున్నాము. ।
10 ఇందుకు (ప్రమాణముగా) వ్రాయబడినదేమనగా —
11 నీతిమంతుడు లేడు ఒక్కడును లేడు
గ్రహించువాడెవడును లేడు
దేవుని వెదకువాడెవడును లేడు
12 అందరును త్రోవ తప్పి యేకముగా పనికిమాలిన
వారైరి
మేలుచేయువాడు లేడు, ఒక్కడైనను లేడు.[3]

వారి గొంతుక తెరచిన సమాధి; తమ నాలుకతో 13
మోసము చేయుదురు;
వారి పెదవులక్రింద సర్పవిషమున్నది[4]
వారి నోటినిండ శపించుటయు పగయు ఉన్నవి.[5] 14
రక్తము చిందించుటకు వారి పాదములు పరుగెత్తు 15
చున్నవి.
నాశనమును కష్టమును వారి మార్గములలో ఉన్నవి. 16
శాంతిమార్గము వారెరుగరు.[6] 17
వారి దృష్టియెదుట దేవుని భయములేదు.[7] 18

ప్రతి నోరు మూయబడునట్లును, సర్వలోకము 19
దేవునియెదుట శిక్షకు పాత్రమగునట్లును, ధర్మశాస్త్రము
చెప్పుచున్నవాటినన్నిటిని ధర్మశాస్త్రమునకు లోనైన
వారితో చెప్పుచున్నదని యెరుగుదుము. । ఏలయనగా 20
ధర్మశాస్త్ర సంబంధమైన క్రియలమూలముగా ఏ మను
ష్యుడును ఆయన దృష్టికి నీతిమంతుడని తీర్చబడడు;
ధర్మశాస్త్రమువలన పాపమనగా ఎట్టిదో తెలియబడు
చున్నది. । ఇట్లుండగా ధర్మశాస్త్రమునకు వేరుగా దేవుని 21
నీతి ప్రత్యక్షమగుచున్నది; దానికి ధర్మశాస్త్రమును
ప్రవక్తలును సాక్ష్యమిచ్చుచున్నారు. । అది యేసు 22
క్రీస్తునందలి విశ్వాసమూలమైనదై, నమ్మువారికందరికి
కలుగు దేవుని నీతియైయున్నది. । ఏ భేదమును లేదు; 23
అందరును పాపముచేసి దేవుడు అనుగ్రహించు
మహిమను పొందలేక పోవుచున్నారు. । కాబట్టి 24
(నమ్మువారు) ఆయన కృపచేతనే, క్రీస్తుయేసునందలి
విమోచనముద్వారా, నిర్హేతుకముగా[8] నీతిమంతులని
తీర్చబడుచున్నారు. । పూర్వము చేయబడిన పాపము 25
లను దేవుడు తన ఓరిమివలన ఉపేక్షించినందున,
ఆయన తన నీతిని కనుపరచవలెనని । క్రీస్తుయేసు 26
రక్తమునందలి విశ్వాసముద్వారా ఆయనను కరుణా
ధారముగా బయలుపరచెను. దేవుడిప్పటికాలమందు
తన నీతిని కనుపరచునిమిత్తము, తాను నీతిమంతుడును
యేసునందు విశ్వాసముగలవానిని నీతిమంతునిగా
తీర్చువాడునై యుండుటకు ఆయన ఆలాగు చేసెను. ।
కాబట్టి అతిశయాస్పదమెక్కడ? అది కొట్టివేయ 27
బడెను. ఎట్టి న్యాయమునుబట్టి అది కొట్టివేయబడెను?
క్రియాన్యాయమును బట్టియా? కాదు, విశ్వాసన్యాయ
మును బట్టియే. । కాగా ధర్మశాస్త్ర సంబంధమైన 28
క్రియలు లేకుండ విశ్వాసమువలననే మనుష్యులు నీతి
మంతులుగా తీర్చబడుచున్నారని యెంచుచున్నాము. ।
దేవుడు యూదులకు మాత్రమే దేవుడా, అన్యజనుల 29
కును దేవుడు కాడా? అవును, అన్యజనులకును దేవుడే. ।
దేవుడు ఒకడే గనుక, ఆయన సున్నతి గలవారిని 30
విశ్వాసమూలముగాను, సున్నతి లేనివారిని విశ్వాసము
ద్వారాను, నీతిమంతులనుగా తీర్చును. । విశ్వాసము 31

1 లేక, వారి అవిశ్వాసము దేవుని విశ్వాస్యతను వ్యర్థముచేయునా? 2 కీర్తన, 51: 4. 3 కీర్తన, 14: 18. 4 కీర్తన, 5: 9; 140: 3.
5 కీర్తన, 10: 7. 6 యెషయా 59 7, 8 7 కీర్తన, 36: 1 8 లేక ఉచితముగా.

ద్వారా ధర్మశాస్త్రమును నిరర్థకము చేయుచున్నామా?
అట్లనరాదు, ధర్మశాస్త్రమును స్థిరపరచుచున్నాము.
4 కాబట్టి శరీరము విషయమై మన మూలపురుషు
2 డగు అబ్రాహాముకేమి దొరికెనని అందుము? । అబ్రా
హాము క్రియల మూలముగా నీతిమంతుడని తీర్చబడిన
యెడల అతనికి అతిశయాస్పదము కలుగును గాని అది
3 దేవునియెదుట కలుగదు. । లేఖనమేమి చెప్పుచున్నది?
అబ్రాహాము దేవుని నమ్మెను, అది అతనికి నీతిగా
4 ఎంచబడెను.[1] । పనిచేయువానికి జీతము రుణమే గాని
5 దానమని యెంచబడదు. । పనిచేయక భక్తిహీనుని
నీతిమంతునిగా తీర్చువానియందు విశ్వాసముంచు
వానికి వాని విశ్వాసము నీతిగా ఎంచబడుచున్నది. ।
6 ఆ ప్రకారమే క్రియలు లేకుండ దేవుడెవనిని నీతి
మంతుడుగా ఎంచునో ఆ మనుష్యుడు ధన్యుడని
7 దావీదుకూడ చెప్పుచున్నాడు. । ఏలాగనగా—
ఎవరి అక్రమములు క్షమించబడెనో
ఎవరి పాపములు కప్పివేయబడెనో వారు ధన్యులు.
8 ప్రభువు ఏ మనుష్యునిగూర్చి పాపమును
ఎంచడో వాడు ధన్యుడు.[2]
9 ఈ శుభవచనము సున్నతిగలవారినిగూర్చి చెప్పినదా
సున్నతిలేనివారినిగూర్చికూడ చెప్పినదా? అబ్రా
హాముయొక్క విశ్వాస మతనికి నీతి అని యెంచబడె
10 ననుచున్నాము గదా! । మంచిది; అది ఏ స్థితియందు
ఎంచబడెను? సున్నతి కలిగి యుండినప్పుడా సున్నతి
లేనప్పుడా? సున్నతి కలిగి యుండినప్పుడు కాదు
11 సున్నతి లేనప్పుడే. । మరియు సున్నతి లేనివారైనను,
నమ్మినవారికందరికి అతడు తండ్రియగుటవలన వారికి
నీతి ఆరోపించుటకై, అతడు సున్నతి పొందకమునుపు,
తనకు కలిగిన విశ్వాసమువలననైన నీతికి ముద్రగా,
12 సున్నతి అను గురుతు పొందెను । మరియు సున్నతి
గలవారికిని తండ్రియగుటకు, అనగా సున్నతిమాత్రము
పొందినవారు గాక, మన తండ్రియైన అబ్రాహాము
సున్నతి పొందకమునుపు అతనికి కలిగిన విశ్వాసము
యొక్క అడుగుజాడలనుబట్టి నడుచుకొనినవారికి
తండ్రి అగుటకు, (అతడు ఆ గురుతు పొందెను.) ।
13 అతడు లోకమునకు వారసుడగునను వాగ్దానము
అబ్రాహాముకైనను అతని సంతానమునకైనను ధర్మ
శాస్త్రమూలముగా కలుగలేదు గాని విశ్వాసమువలననైన
14 నీతిమూలముగానే కలిగెను. । ధర్మశాస్త్రసంబంధులు వార
సులైనపక్షమున విశ్వాసము వ్యర్థమగును, వాగ్దానమును
15 నిరర్థకమగును. । ఏలయనగా ధర్మశాస్త్రము ఉగ్రతను
పుట్టించును; ధర్మశాస్త్రము లేనిపక్షమున అతిక్రమమును
16 లేకపోవును. । ఈ హేతువుచేతను ఆ వాగ్దానము
యావత్సంతతికి, అనగా ధర్మశాస్త్రముగలవారికి మాత్రము
కాక అబ్రాహాముకున్నట్టి విశ్వాసముగలవారికి కూడ
దృఢము కావలెనని, కృప ననుసరించినదై యుండు
నట్లు, అది విశ్వాసమూలమైనదాయెను. । తాను 17
విశ్వసించిన దేవునియెదుట, అనగా మృతులను సజీ
వులనుగా చేయువాడును లేనివాటిని ఉన్నట్టుగానే
పిలుచువాడునైన దేవునియెదుట, అతడు మనకందరికి
తండ్రియై యున్నాడు.
—నిన్ను అనేక జనములకు తండ్రినిగా నియ
మించితిని[3]
అని అందుకు (ప్రమాణముగా) వ్రాయబడి
యున్నది. । —నీ సంతానము ఈలాగు ఉండునని[4] 18
చెప్పినదానిబట్టి తాననేక జనములకు తండ్రియగు
నట్లు, నిరీక్షణకు ఆధారము లేనప్పుడు అతడు నిరీ
క్షణ కలిగి నమ్మెను. । మరియు అతడు విశ్వాసము 19
నందు బలహీనుడు కాక, రమారమి నూరేండ్ల యీడు
గలవాడై యుండి, అప్పటికి తన శరీరము మృతతుల్య
మైనట్టును, శారాగర్భమును మృతతుల్యమైనట్టును
ఆలోచించెను గాని, । అవిశ్వాసమువలన దేవుని 20
వాగ్దానమునుగూర్చి సందేహింపక । దేవుని మహిమ 21
పరచి, ఆయన వాగ్దానము చేసినదానిని నెరవేర్చు
టకు సమర్థుడని రూఢిగా విశ్వసించి విశ్వాసమువలన
బలమునొందెను. । అందుచేత అది అతనికి నీతిగా 22
ఎంచబడెను. । అది అతనికి ఎంచబడెనని అతని నిమిత్తము 23
మాత్రమే కాదు, । మన ప్రభువైన యేసును మృతు 24
లలోనుండి లేపినవానియందు విశ్వాసముంచిన మనకు
ఎంచబడునని మన నిమిత్తము కూడ వ్రాయబడెను. ।
ఆయన మన అపరాధముల నిమిత్తము అప్పగింపబడి, 25
మనము నీతిమంతులముగా తీర్చబడుటకై లేపబడెను.
కాబట్టి విశ్వాసమూలమున మనము నీతిమంతుల 5
ముగా తీర్చబడి, మన ప్రభువైన యేసుక్రీస్తుద్వారా
దేవునితో సమాధానము కలిగియుందము.[5] । మరియు 2
ఆయన ద్వారా మనము విశ్వాసమువలన ఈ కృప
యందు ప్రవేశముగలవారమై, అందులో నిలిచి
యుండి, దేవుని మహిమనుగూర్చిన నిరీక్షణనుబట్టి
అతిశయపడుచున్నాము. । అంతేకాదు; శ్రమ 3
ఓర్పును, ఓర్పు పరీక్షను, పరీక్ష నిరీక్షణను కలుగజేయు 4
నని యెరిగి శ్రమలయందును అతిశయపడుదము. ।
మనకు అనుగ్రహింపబడిన పరిశుద్ధాత్మద్వారా దేవుని 5
ప్రేమ మన హృదయములలో కుమ్మరింపబడియున్నది
గనుక ఈ నిరీక్షణ మనలను సిగ్గుపరచదు. । ఏలయనగా 6
మనమింక బలహీనులమై యుండగా, క్రీస్తు యుక్త
కాలమున భక్తిహీనులకొరకు చనిపోయెను. । నీతిమం 7
తునికొరకు సహితము ఒకడు చనిపోవుట అరుదు;
మంచివానికొరకు ఎవడైన ఒకవేళ చనిపోవ తెగింప

[1] ఆదికాండము, 15: 6 [2] కీర్తన, 32: 1. [3] ఆదికాండము, 17: 5. [4] ఆదికాండము, 15: 5. [5] కొన్ని ప్రాచీన ప్రతులలో— కలిగియున్నాము అని పాఠాంతరము

8 వచ్చును. । అయితే దేవుడు మనయెడల తన ప్రేమను
వెల్లడిపరుచుచున్నాడు; ఎట్లనగా మనమింక పాపులమై
9 యుండగానే క్రీస్తు మనకొరకు చనిపోయెను. । కాబట్టి
ఆయన రక్తమువలన ఇప్పుడు నీతిమంతులముగా తీర్చ
బడి, మరింత నిశ్చయముగా ఆయనద్వారా ఉగ్రత
10 నుండి రక్షింపబడుదుము. । ఏలయనగా శత్రువులమై
యుండగా, ఆయన కుమారుని మరణముద్వారా మనము
దేవునితో సమాధానపరచబడిన పక్షమున, సమాధాన
పరచబడినవారమై, ఆయన జీవించుటచేత మరి నిశ్చ
11 యముగా రక్షింపబడుదుము. । అంతేకాదు; మన
ప్రభువైన యేసుక్రీస్తుద్వారా మనము దేవునియందు
అతిశయపడుచున్నాము; ఆయన ద్వారానే మనము
ఇప్పుడు సమాధానస్థితి పొందియున్నాము.

12 ఇట్లుండగా ఒక మనుష్యునిద్వారా పాపమును,
పాపముద్వారా మరణమును లోకములో ఏలాగు
ప్రవేశించెనో, మనుష్యులందరు పాపము చేసినందున
అలాగుననే మరణము అందరికిని సంప్రాప్తమాయెను.[1]।
13 ఏలయనగా ధర్మశాస్త్రము వచ్చినదనుక పాపము లోక
ములో ఉండెను గాని ధర్మశాస్త్రము లేనప్పుడు పాపము
14 ఆరోపింపబడదు. । అయినను ఆదాముచేసిన అతి
క్రమమును బోలి పాపముచేయని వారిమీదకూడ,
ఆదాము మొదలుకొని మోషే పర్యంతము మరణ
మేలెను; ఆదాము రాబోవువానికి గురుతై యుం
15 డెను. । అయితే అపరాధము కలిగినట్టు కృపావర
మును కలుగలేదు. ఎట్లనగా ఒకని అపరాధమువలన
అనేకులు చనిపోయిన పక్షమున, మరి నిశ్చయముగా
దేవుని కృపయు, యేసుక్రీస్తను ఒక మనుష్యుని కృప
చేతనైన దానమును, అనేకులకు కలుగునట్లు అవి విస్త
16 రించెను. । మరియు పాపముచేసిన యొకనివలన (శిక్షా
విధి) కలిగినట్టు ఆ దానము కలుగలేదు. ఏలయనగా
తీర్పు ఒక్క అపరాధమూలముగా వచ్చినదై శిక్షావిధికి
కారణమాయెను; కృపావరమైతే అనేకమైన అప
రాధముల మూలముగా వచ్చినదై (మనుష్యులు) నీతి
17 మంతులుగా తీర్చబడుటకు కారణమాయెను. । మర
ణము ఒకని అపరాధమూలమున వచ్చినదై ఆ యొకని
ద్వారానే యేలినపక్షమున, కృపాబాహుళ్యమును నీతి
దానమును పొందువారు జీవముగలవారై, మరి నిశ్చయ
ముగా యేసుక్రీస్తను ఒకనిద్వారానే యేలుదురు. ।
18 కాబట్టి తీర్పు ఒక్క అపరాధమూలమున వచ్చినదై,
మనుష్యులకందరికి శిక్షావిధి కలుగుటకు ఏలాగు కారణ
మాయెనో, ఆలాగే ఒక్క పుణ్యకార్యమువలన కృపా
దానము మనుష్యులకందరికి జీవప్రదమైన నీతి విధింప
19 బడుటకు కారణమాయెను. । ఏలయనగా ఒక మను
ష్యుని అవిధేయతవలన అనేకులు పాపులుగా ఏలాగు
చేయబడిరో, ఆలాగే ఒకని విధేయతవలన అనేకులు
నీతిమంతులుగా చేయబడుదురు. । మరియు అప 20
రాధము విస్తరించునట్లు ధర్మశాస్త్రము ప్రవేశించెను. 21
అయినను పాపము మరణమును ఆధారముచేసికొని
యేలాగు ఏలెనో, ఆలాగే నిత్యజీవము కలుగుటకై,
నీతిద్వారా కృపయు మన ప్రభువైన యేసుక్రీస్తు
మూలముగా ఏలునిమిత్తము పాపమెక్కడ విస్తరించెనో
అక్కడ కృప అపరిమితముగా విస్తరించెను.

ఆలాగైన ఏమందుము? కృప విస్తరింపవలెనని పాప 6
మందు నిలిచియుందుమా? । అట్లనరాదు. పాపము 2
విషయమై చనిపోయిన మనము ఇకమీదట ఏలాగు
దానిలో జీవించుదుము? । క్రీస్తు యేసులోనికి బాప్తి 3
స్మము పొందిన మనమందరము ఆయన మరణములోనికి
బాప్తిస్మము పొందితిమని మీరెరుగరా? । కాబట్టి 4
తండ్రి మహిమవలన క్రీస్తు మృతులలోనుండి యేలాగు
లేపబడెనో, ఆలాగే మనమును నూతనజీవము పొందిన
వారమై నడుచుకొనునట్లు, మనము బాప్తిస్మమువలన
మరణములో (పాలుపొందుటకై) ఆయనతోకూడ
పాతిపెట్టబడితిమి । మరియు ఆయన మరణముయొక్క 5
సాదృశ్యమందు ఆయనతో సంయుక్తులమైన[2] యెడల,
ఆయన పునరుత్థానముయొక్క సాదృశ్యమందును
ఆయనతో సంయుక్తులమై యుందుము. । ఏమనగా 6
మనమికను పాపమునకు దాసులము కాకుండుటకు
పాపశరీరము నిరర్థకమగునట్లు, మన ప్రాచీనస్వభా
వము[3] ఆయనతోకూడ సిలువవేయబడెనని యెరుగు
దుము. । చనిపోయినవాడు పాపవిముక్తుడని తీర్పు 7
పొంది యున్నాడు. । మనము క్రీస్తుతోకూడ చని 8
పోయిన యెడల, మృతులలోనుండి లేచిన క్రీస్తు 9
ఇకను చనిపోడనియు, మరణమునకు ఇకను ఆయన
మీద ప్రభుత్వము లేదనియు ఎరిగి ఆయనతోకూడ
జీవించుదుమని నమ్ముచున్నాము. । ఏలయనగా ఆయన 10
చనిపోవుట చూడగా, పాపము విషయమై ఒక్క
మారే చనిపోయెను గాని ఆయన జీవించుట చూడగా,
దేవుని విషయమై జీవించుచున్నాడు. । అటువలె 11
మీరును పాపము విషయమై మృతులుగాను, దేవుని
విషయమై క్రీస్తుయేసునందు జీవితులుగాను మిమ్మును
మీరే యెంచుకొనుడి.

కాబట్టి శరీర దురాశలకు లోబడునట్లుగా చావునకు 12
లోనైన మీ శరీరమందు పాపమును ఏలనియ్యకుడి. ।
మరియు మీ అవయవములను దుర్నీతి సాధనములుగా[4] 13
పాపమునకు అప్పగింపకుడి, అయితే మృతులలో
నుండి జీవితులమనుకొని, మిమ్మును మీరే దేవునికి అప్ప
గించుకొనుడి, మీ అవయవములను నీతి సాధనము
లుగా[4] దేవునికి అప్పగించుడి. । మీరు కృపకే గాని 14
ధర్మశాస్త్రమునకు లోనైనవారు కారు గనుక పాపము
మీ మీద ప్రభుత్వము చేయదు.

1 మూలభాషలో—అందరిద్వారా వ్యాపించెను. 2 లేక, ఐక్యముగలవారమైన. 3 మూలభా.—ప్రాచీన పురుషుడు 4 లేక, ఆయుధములుగా.

15 అట్లయినయెడల కృపకే గాని ధర్మశాస్త్రమునకు
లోనగువారము కామని పాపము చేయుదుమా? అదె
16 న్నటికి కూడదు. । లోబడుటకు దేనికి మిమ్మును మీరు
దాసులగా అప్పగించుకొందురో, అది మరణార్థముగా
పాపమునకే గాని, నీత్యర్థముగా విధేయతకే గాని
దేనికి మీరు లోబడుదురో దానికే దాసులగుదురని
17 మీరెరుగరా? । మీరు పాపమునకు దాసులై యుం
టిరి గాని యే ఉపదేశక్రమమునకు మీరు అప్పగింప
బడితిరో, దానికి హృదయపూర్వకముగా లోబడిన
18 వారై, । పాపమునుండి విమోచింపబడి నీతికి దాసు
19 లైతిరి; ఇందుకు దేవునికి స్తోత్రము. । మీ శరీర బల
హీనతనుబట్టి మనుష్యరీతిగా మాటలాడుచున్నాను;
ఏమనగా అక్రమము చేయుటకై, అపవిత్రతకును
అక్రమమునకును మీ అవయవములను దాసులుగా
ఏలాగు అప్పగించితిరో, ఆలాగే పరిశుద్ధత కలుగుటకై
యిప్పుడు మీ అవయవములను నీతికి దాసులుగా
20 అప్పగించుడి. । మీరు పాపమునకు దాసులై యున్న
ప్పుడు నీతివిషయమై నిర్బంధము లేనివారై యుం
21 టిరి. । అప్పటి క్రియలవలన మీకేమి ఫలము కలిగెను?
వాటినిగురించి మీరిప్పుడు సిగ్గుపడుచున్నారు కారా?
22 వాటి అంతము మరణమే. । అయినను ఇప్పుడు
పాపమునుండి విమోచింపబడి దేవునికి దాసులైనందున
పరిశుద్ధత కలుగుటయే మీకు ఫలము; దాని అంతము
23 నిత్యజీవము. । ఏలయనగా పాపమువలన వచ్చు జీతము
మరణము, అయితే దేవుని కృపావరము మన ప్రభు
వైన క్రీస్తుయేసునందు నిత్యజీవము.

7 సహోదరులారా, మనుష్యుడు బ్రదికినంత
కాలమే ధర్మశాస్త్రమతనిమీద ప్రభుత్వము చేయుచున్న
దని మీకు తెలియదా? ధర్మశాస్త్రము ఎరిగిన మీతో
2 మాటలాడుచున్నాను. । భర్తగల స్త్రీ భర్త బ్రదికి
యున్నంతవరకే ధర్మశాస్త్రమువలన అతనికి బద్ధురాలు
గాని, భర్త చనిపోయినయెడల భర్త విషయమైన ధర్మ
3 శాస్త్రమునుండి ఆమె విడుదలపొందును. । కాబట్టి భర్త
బ్రదికియుండగా ఆమె వేరొక పురుషుని చేరినయెడల
వ్యభిచారిణియనబడును గాని, ఆమె భర్త చనిపోయిన
యెడల ధర్మశాస్త్రమునుండి విడుదల పొందెను గనుక
వేరొక పురుషుని చేరినను వ్యభిచారిణి కాకపోవును. ।
4 కావున నా సహోదరులారా, మనము దేవునికొరకు
ఫలమును ఫలించునట్లు మృతులలోనుండి లేపబడిన
క్రీస్తు అను వేరొకని చేరుటకై మీరును ఆయన శరీ
రముద్వారా ధర్మశాస్త్రము విషయమై మృతులైతిరి. ।
5 ఏలయనగా మనము శరీర సంబంధులమై యుండి
నప్పుడు మరణార్థమైన ఫలమును ఫలించుటకై, ధర్మ
శాస్త్రమువలననైన పాపేచ్ఛలు మన అవయవములలో
కార్యసాధకములై యుండెను. । ఇప్పుడైతే దేనిచేత
నిర్బంధింపబడితిమో దానివిషయమై చనిపోయిన
వారమై, ధర్మశాస్త్రమునుండి విడుదలపొందితిమి గనుక
మనము అక్షరానుసారమైన ప్రాచీనస్థితి గలవారము
కాక ఆత్మానుసారమైన నవీనస్థితి గలవారమై సేవ
చేయుచున్నాము.

కాబట్టి యేమందుము? ధర్మశాస్త్రము పాపమాయెనా? 7
అట్లనరాదు. ధర్మశాస్త్రమువలననే గాని పాపమనగా
ఎట్టిదో నాకు తెలియకపోవును. ఆశింపవద్దని ధర్మ
శాస్త్రము చెప్పనియెడల దురాశయన ఎట్టిదో నాకు
తెలియకపోవును. । అయితే పాపము ఆజ్ఞను హేతువు 8
చేసికొని[1] సకలవిధమైన దురాశను నాయందు పుట్టిం
చెను. ధర్మశాస్త్రము లేనప్పుడు పాపము మృతము. ।
ఒకప్పుడు నేను ధర్మశాస్త్రములేకుండ జీవించుచుంటిని 9
గాని, ఆజ్ఞ వచ్చినప్పుడు పాపమునకు మరల జీవము
వచ్చెను; నేనైతే చనిపోతిని. । అప్పుడు జీవార్థమైన 10
ఆజ్ఞ నాకు మరణార్థమైనట్టు కనబడెను. । ఏలయనగా 11
పాపము ఆజ్ఞను హేతువు చేసికొని[1] నన్ను మోస
పుచ్చి దానిచేత నన్ను చంపెను. । కాబట్టి ధర్మశాస్త్రము 12
పరిశుద్ధమైనది, ఆజ్ఞకూడ పరిశుద్ధమైనదియు నీతిగల
దియు ఉత్తమమైనదియునై యున్నది. । ఉత్తమమైనది 13
నాకు మరణకరమాయెనా? అట్లనరాదు. అయితే
పాపము ఉత్తమమైనదాని మూలముగా నాకు మర
ణము కలుగజేయుచు, పాపము పాపమైనట్టు అగుపడు
నిమిత్తము, అనగా పాపము ఆజ్ఞమూలముగా అత్యధిక
పాపమగు నిమిత్తము, (అది నాకు మరణకరమాయెను.) ।
ధర్మశాస్త్రము ఆత్మసంబంధమైనదని యెరుగుదుము; 14
అయితే నేను పాపమునకు అమ్మబడి శరీరసంబంధినై
యున్నాను. । ఏలయనగా నేను చేయునది నేనెరు 15
గను; నేను (చేయ) నిచ్ఛయించునది చేయక ద్వేషించు
నదియే చేయుచున్నాను. । ఇచ్ఛయింపనిది నేను చేసిన 16
యెడల ధర్మశాస్త్రము శ్రేష్ఠమైనదైనట్టు ఒప్పుకొను
చున్నాను. । కావున ఇకను దాని చేయునది నాయందు 17
నివసించు పాపమే గాని నేను కాను. । నాయందు, 18
అనగా నా శరీరమందు మంచిది ఏదియు నివసింపదని
నేనెరుగుదును. మేలైనది చేయవలెనను ఇచ్ఛ నాకు
తటస్థమై యున్నది గాని, దాని చేయుట నాకు తట
స్థముకాదు. । నేను చేయ నిచ్ఛయించు మేలుచేయక 19
యిచ్ఛయింపని కీడు చేయుచున్నాను. । నేను ఇచ్ఛ 20
యింపనిదానిని చేసినయెడల, అది చేయునది నా
యందు నివసించు పాపమేగాని యికను నేను కాను. ।
కాబట్టి మేలుచేయ నిచ్ఛయించు నాకు కీడు తటస్థమై 21
యున్నదను ఒక నియమము నాకు కనబడుచున్నది. ।
అంతరంగపురుషునిబట్టి దేవుని ధర్మశాస్త్రమునందు నేను 22
ఆనందించుచున్నాను గాని । వేరొక నియమము నా 23
అవయవములలో ఉన్నట్టు నాకు కనబడుచున్నది.

[1] లేక, ఆజ్ఞద్వారా.

అది నా మనస్సునందున్న ధర్మశాస్త్రముతో పోరాడుచు
నా అవయవములలోనున్న పాపనియమమునకు నన్ను
24 చెరపట్టి లోపరచుకొనుచున్నది. । అయ్యో నేనెంత
దౌర్భాగ్యుడను; ఇట్టి మరణమునకు లోనగు శరీరము
25 నుండి నన్నెవడు విడిపించును? । మన ప్రభువైన
యేసుక్రీస్తుద్వారా దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించు
చున్నాను. కాగా మనస్సువిషయములో నేను దైవ
నియమమునకును, శరీరవిషయములో పాపనియమ
మునకును దాసుడనై యున్నాను.

8 కాబట్టి యిప్పుడు క్రీస్తుయేసునందున్నవారికి ఏ
2 శిక్షావిధియు లేదు. । క్రీస్తుయేసునందు జీవమునిచ్చు
ఆత్మయొక్క నియమము పాపమరణముల నియమము
3 నుండి నన్ను విడిపించెను. । శరీరము ననుసరింపక ఆత్మ
4 ననుసరించియే నడుచుకొను మనయందు ధర్మశాస్త్ర
సంబంధమైన నీతి విధి నెరవేర్చబడవలెనని పాప (పరి
హారము) నిమిత్తము దేవుడు తన స్వకీయకుమారుని
పాపశరీరాకారముతో పంపి, ఆయన శరీరమందు
పాపమునకు శిక్ష విధించెను. ఏలయనగా శరీరస్వ
భావమును బట్టి ధర్మశాస్త్రము బలహీనమాయెను గనుక
5 అది దానికి అసాధ్యమాయెను. । శరీరానుసారులు
శరీరవిషయములను మనస్కరింతురు; ఆత్మానుసారులు
6 ఆత్మ విషయములను మనస్కరింతురు. । శరీరానుసార
మైన మనస్సు మరణము; ఆత్మానుసారమైన మనస్సు
7 జీవమును సమాధానమునై యున్నది. । ఏలయనగా
శరీరానుసారమైన మనస్సు దేవునికి విరోధమైయు
న్నది; అది దేవుని ధర్మశాస్త్రమునకు లోబడదు, ఏమాత్ర
8 మును లోబడనేరదు. । కాగా శరీరస్వభావముగల
9 వారు దేవుని సంతోషపరచనేరరు. । దేవుని ఆత్మ
మీలో నివసించియున్న పక్షమున మీరు ఆత్మస్వభా
వము గలవారే గాని శరీర స్వభావముగలవారు
కారు.[1] ఎవడైనను క్రీస్తు ఆత్మలేనివాడైతే వాడాయన
10 వాడు కాడు. । క్రీస్తు మీలోనున్నయెడల మీ శరీ
రము పాపవిషయమై మృతమైనది గాని మీ ఆత్మ
11 నీతివిషయమై జీవయుక్తమైనది. । మృతులలోనుండి
యేసును లేపినవాని ఆత్మ మీలో నివసించినయెడల,
మృతులలోనుండి క్రీస్తుయేసును లేపినవాడు చావుకు
లోనైన మీ శరీరములను కూడ మీలో నివసించుచున్న
తన ఆత్మ ద్వారా జీవింపచేయును.

12 కాబట్టి సహోదరులారా, శరీరానుసారముగా
ప్రవర్తించుటకు మనము శరీరమునకు ఋణస్థులము
13 కాము. । మీరు శరీరానుసారముగా ప్రవర్తించిన
యెడల చావవలసినవారై యుందురు గాని ఆత్మచేత
14 శారీరక్రియలను చంపినయెడల జీవించెదరు. । దేవుని
ఆత్మచేత ఎందరు నడిపింపబడుదురో వారందరు దేవుని
కుమారులై యుందురు. । ఏలయనగా మరల భయ 15
పడుటకు మీరు దాస్యపు ఆత్మను పొందలేదుగాని
స్వీకృతపుత్రాత్మను[2] పొందితిరి. ఆ ఆత్మ కలిగినవారమై
మనము — నాయనా తండ్రీ అని మొఱ్ఱపెట్టుచు
న్నాము. । మనము దేవుని పిల్లలమని ఆత్మ తానే 16
మన ఆత్మతోకూడ సాక్ష్యమిచ్చుచున్నాడు. । మనము 17
పిల్లలమైతే వారసులము, అనగా దేవుని వారసులము;
క్రీస్తుతోకూడ మహిమపొందుటకు ఆయనతో శ్రమ
పడినయెడల, క్రీస్తుతోటి వారసులము.

మనయెడల ప్రత్యక్షము కాబోవు మహిమ 18
యెదుట ఇప్పటి కాలపు శ్రమలు ఎన్నతగినవి కావని
యెంచుచున్నాను. । దేవుని కుమారుల ప్రత్యక్షత 19
కొరకు సృష్టి మిగుల ఆశతో తేరి చూచుచు కనిపెట్టు
చున్నది. । ఏలయనగా సృష్టి క్షయాధీనదాస్యములో 20
నుండి విడిపింపబడి, దేవుని పిల్లలు పొందబోవు మహి 21
మగల స్వాతంత్ర్యము పొందుదునను నిరీక్షణకలదై,
స్వేచ్ఛగా కాక దానిని లోపరచినవాని మూలముగా
మాయకు లోపరచబడెను. । సృష్టి యావత్తు ఇదివరకు 22
ఏకగ్రీవముగా మూలుగుచు ప్రసవవేదనపడుచున్న
దని యెరుగుదుము. । అంతేకాదు, ఆత్మయొక్క ప్రథమ 23
ఫలముల నొందిన మనముకూడ స్వీకృతపుత్రత్వము
కొరకు, అనగా మన దేహముయొక్క విమోచనము
కొరకు కనిపెట్టుచు మనలో మనము మూలుగుచు
న్నాము. । ఏలయనగా మనము నిరీక్షణ కలిగినవారమై 24
రక్షింపబడితిమి. నిరీక్షింపబడునది కనబడునప్పుడు
నిరీక్షణ (తో పని) యుండదు; తాను చూచుచున్న
దానికొరకు ఎవడు నిరీక్షించును? । మనము చూడని 25
దానికొరకు నిరీక్షించినయెడల ఓపికతో దానికొరకు
కనిపెట్టుదుము.

అటువలె ఆత్మయు మన దౌర్బల్యమును చూచి 26
సహాయము చేయుచున్నాడు. ఏలయనగా మనము
యుక్తముగా ఏలాగు ప్రార్థన చేయవలెనో మనకు తెలి
యదు గాని, ఉచ్చరింప శక్యముకాని మూలుగులతో
ఆ ఆత్మ తానే మన పక్షముగా విజ్ఞాపనము చేయు
చున్నాడు. । మరియు హృదయములను పరిశోధించు 27
వాడు ఆత్మయొక్క మనస్సు ఏదో యెరుగును;
ఏలయనగా ఆయన దేవుని చిత్తప్రకారము పరిశు
ద్ధులకొరకు విజ్ఞాపనము చేయుచున్నాడు. । దేవుని 28
ప్రేమించువారికి, అనగా ఆయన సంకల్పముచొప్పున
పిలువబడినవారికి, మేలు కలుగుటకై సమస్తమును సమ
కూడి జరుగుచున్నవని[3] యెరుగుదుము. । ఎందుకనగా 29
తన కుమారుడు అనేక సహోదరులలో జ్యేష్ఠుడగు
నట్లు, దేవుడెవరిని ముందు ఎరిగెనో, వారు తన కుమా
రునితో సారూప్యము గలవారవుటకు, వారిని ముం

1 మూలభాషలో—ఆత్మయందున్నవారేకాని శరీరమందున్నవారుకారు. 2 లేక—దత్తపుత్రాత్మను. 3 కొన్ని ప్రాచీనప్రతులలో—మేలు కలుగుటకై దేవుడు సమస్తమును సమకూర్చి జరిగించుచున్నాడని, పాఠాంతరము.

27 అనుసరించిరి. । అటువలె పురుషులు కూడ స్త్రీయొక్క
స్వాభావికమైన ధర్మమును విడిచి పురుషులతో పురు
షులు అవాచ్యమైనది చేయుచు, తమ తప్పితమునకు
తగిన ప్రతిఫలమును పొందుచు ఒకరియెడల ఒకరు
కామాతప్తులైరి.
28 మరియు వారు తమ మనస్సులో దేవునికి చోటియ్య
నొల్లకపోయిరి గనుక చేయరాని కార్యములు చేయు
టకు దేవుడు భ్రష్ట మనస్సుకు వారినప్పగించెను. ।
29 అట్టివారు సమస్తమైన దుర్నీతిచేతను, దుష్టత్వముచేతను,
లోభముచేతను, ఈర్ష్యచేతను నిండుకొని, మత్సరము
నరహత్య కలహము కపటము వైరమను వాటితో
30 నిండినవారై । కొండెగాండ్రును అపవాదకులును దేవ
ద్వేషులును హింసకులును అహంకారులును బింకము
లాడువారును చెడ్డవాటిని కల్పించువారును తలిదం
31 డ్రుల కవిధేయులును అవివేకులును । మాట తప్పువా
32 రును అనురాగరహితులును నిర్దయులునైరి. । ఇట్టి
కార్యములను అభ్యసించువారు మరణమునకు తగిన
వారు అను దేవుని న్యాయవిధిని వారు బాగుగ
ఎరిగియుండియు, వాటిని చేయుచున్నారు. ఇది
మాత్రమే గాక వాటిని అభ్యసించువారితో సంతోష
ముగా సమ్మతించుచున్నారు.

2 కాబట్టి తీర్పు తీర్చు మనుష్యుడా, నీ వెవడవైనను
సరే నిరుత్తరుడవై యున్నావు. దేనివిషయములో
ఎదుటివానికి తీర్పు తీర్చుచున్నావో దాని విషయ
ములో నీవే నేరస్థుడవని తీర్పు తీర్చుకొనుచున్నావు;
ఏలయనగా తీర్పు తీర్చు నీవు అట్టి కార్యములనే
2 చేయుచున్నావు కావా? । అట్టి కార్యములు చేయు
వారిమీద దేవుని తీర్పు సత్యమును అనుసరించినదే
3 అని యెరుగుదుము. । అట్టి కార్యములు చేయువారికి
తీర్పు తీర్చుచు వాటినే చేయుచున్న మనుష్యుడా,
నీవు దేవుని తీర్పు తప్పించుకొందువని అనుకొందువా? ।
4 లేదా, దేవుని అనుగ్రహము మారుమనస్సు పొందు
టకు నిన్ను ప్రేరేపించుచున్నదని యెరుగక, ఆయన
అనుగ్రహైశ్వర్యమును సహనమును దీర్ఘశాంతమును
5 తృణీకరించుదువా? । నీ కాఠిన్యమును, మార్పు పొం
దని నీ హృదయమును అనుసరించి, ఉగ్రతదినమందు,
అనగా దేవుని న్యాయమైన తీర్పు బయలుపరచబడు
దినమందు నీకు నీవే ఉగ్రతను సమకూర్చుకొనుచు
6 న్నావు. । ఆయన ప్రతివానికి వాని వాని క్రియల
7 చొప్పున ప్రతిఫలమిచ్చును. । సత్క్రియను ఓపికగా
చేయుచు, మహిమను ఘనతను అక్షయతను వెదకు
8 వారికి నిత్యజీవము నిచ్చును. । అయితే భేదములు
9 పుట్టించి, సత్యమునకు లోబడక దుర్నీతికి లోబడువారి
మీదికి ఆయన ఉగ్రతను రౌద్రమును (కలుగును.)
దుష్కార్యము చేయు ప్రతి మనుష్యుని ఆత్మకు,
మొదట యూదునికి హెల్లేనీయునికికూడ, శ్రమయు
వేదనయు కలుగును. । సత్క్రియ చేయు ప్రతి 10
వానికి, మొదట యూదునికి హెల్లేనీయునికికూడ,
మహిమయు ఘనతయు సమాధానమును కలుగును. ।
దేవునికి పక్షపాతములేదు. ధర్మశాస్త్రములేక పాపము 11
చేసినవారందరు ధర్మశాస్త్రము లేకయే నశించెదరు; ధర్మ 12
శాస్త్రము కలిగినవారై పాపముచేసినవారందరు ధర్మ
శాస్త్రానుసారముగా తీర్పు నొందుదురు. । ధర్మశాస్త్రము 13
వినువారు దేవుని దృష్టికి నీతిమంతులు కారు గాని
ధర్మశాస్త్రమును అనుసరించి ప్రవర్తించువారే నీతిమంతు
లుగా ఎంచబడుదురు. । ధర్మశాస్త్రము లేని అన్యజనులు 14
స్వాభావికముగా ధర్మశాస్త్రసంబంధమైన క్రియలను
చేసిన పక్షమున, వారు ధర్మశాస్త్రము లేనివారైనను,
తమకుతామే ధర్మశాస్త్రమైనట్టున్నారు. । అట్టివారి మన 15
స్సాక్షికూడ సాక్ష్యమిచ్చుచుండగను, వారి తలంపులు
ఒకదానిమీద ఒకటి తప్పు మోపుచు లేక తప్పులేదని
చెప్పుచుండగను, ధర్మశాస్త్రసారము తమ హృదయముల
యందు వ్రాయబడినట్టు చూపుచున్నారు. । దేవుడు 16
నా సువార్త ప్రకారము యేసుక్రీస్తుద్వారా మను
ష్యుల రహస్యములను విమర్శించు దినమందు (ఈలాగు
జరుగును.)

నీవు యూదుడవని పేరు పెట్టుకొని ధర్మశాస్త్రమును 17
ఆశ్రయించి దేవునియందు అతిశయించుచున్నావు
కావా? । ఆయన చిత్తమెరిగి ధర్మశాస్త్రమందు ఉపదేశము 18
పొందినవాడవై శ్రేష్ఠమైనవాటిని మెచ్చుకొనుచు
న్నావు కావా? । జ్ఞానసత్యస్వరూపమైన ధర్మశాస్త్రము 19
గలవాడవై యుండి—నేను గ్రుడ్డివారికి త్రోవచూపు
వాడను, । చీకటిలో ఉండువారికి వెలుగును, బుద్ధి 20
హీనులకు శిక్షకుడను, బాలురకు ఉపాధ్యాయుడనై
యున్నానని నీయంతట నీవే ధైర్యము వహించుకొను
చున్నావు కావా? । ఎదుటివానికి బోధించు నీవు 21
నీకు నీవే బోధించుకొనవా? దొంగిలవద్దని ప్రకటించు
నీవు దొంగిలెదవా? । వ్యభిచరింపవద్దని చెప్పు నీవు 22
వ్యభిచరించెదవా? విగ్రహములను అసహ్యించుకొను
నీవు గుళ్లను దోచెదవా? । ధర్మశాస్త్రమందు అతిశ 23
యించు నీవు ధర్మశాస్త్రము మీరుటవలన దేవుని అవమాన
పరచెదవా? । వ్రాయబడిన ప్రకారము మిమ్మును 24
బట్టియే గదా దేవుని నామము అన్యజనుల మధ్యను
దూషింపబడుచున్నది?[1] । నీవు ధర్మశాస్త్రమును అనుస 25
రించి ప్రవర్తించువాడవైతివా, సున్నతి ప్రయోజనకర
మగును గాని ధర్మశాస్త్రమును అతిక్రమించువాడవైతివా,
నీ సున్నతి సున్నతి కాకపోవును. । కాబట్టి సున్నతి 26
లేనివాడు ధర్మశాస్త్రపు నీతివిధులను గైకొనిన పక్షమున
అతడు సున్నతి లేనివాడైయుండియు సున్నతిగల
వాడుగా ఎంచబడును గదా? । మరియు స్వభావ 27

[1] యెషయా, 52: 5; యెహెజ్కేలు, 36: 20.

30 రుగా నిర్ణయించెను. । మరియు ఎవరిని ముందుగా
నిర్ణయించెనో వారిని పిలిచెను; ఎవరిని పిలిచెనో వారిని
నీతిమంతులుగా తీర్చెను; ఎవరిని నీతిమంతులుగా
తీర్చెనో వారిని మహిమపరచెను.
31 ఇట్లుండగా ఏమందుము? దేవుడు మనపక్షమున
32 నుండగా మనకు విరోధియెవడు? । తన స్వకీయకుమా
రుని అనుగ్రహించుటకు వెనుకతీయక మన అందరి
కొరకు ఆయనను అప్పగించినవాడు ఆయనతోపాటు
33 సమస్తమును మనకెందుకు అనుగ్రహింపడు? । దేవుని
చేత ఏర్పరచబడినవారిమీద నేరము మోపువాడె
34 వడు? నీతిమంతులుగా తీర్చువాడు దేవుడే; । శిక్ష
విధించువాడెవడు? చనిపోయినవాడు క్రీస్తుయేసే;
అంతేకాదు, మృతులలోనుండి లేచినవాడు ఆయనే;
ఆయన దేవుని కుడిపార్శ్వమున ఉన్నవాడై, మన
35 కొరకు విజ్ఞాపనముకూడ చేయుచున్నాడు. । క్రీస్తు
ప్రేమనుండి మనలను ఎడబాపువాడెవడు? శ్రమయై
నను బాధయైనను హింసయైనను కరవైనను వస్త్రహీనత
యైనను ఉపద్రవమైనను ఖడ్గమైనను మనలను ఎడ
36 బాపునా? । ఇందుకు ప్రమాణముగా వ్రాయబడిన
దేమనగా—

మేము నీ నిమిత్తము దినమెల్ల చంపబడుచున్నాము;
వధకైన గొఱ్ఱెలగా ఎంచబడుచున్నాము.[1]

37 అయినను మనలను ప్రేమించినవాని ద్వారా మనము
వీటన్నిటిలో అత్యధిక విజయము పొందుచున్నాము. ।
38 మరణమైనను జీవమైనను దేవదూతలైనను ప్రధాను
39 లైనను ఉన్నవియైనను రాబోవునవియైనను అధికారు
లైనను ఎత్తయినను లోతైనను సృష్టింపబడిన మరి ఏదై
నను, మన ప్రభువైన క్రీస్తుయేసుద్వారా కనపరచ
బడియున్న దేవుని ప్రేమనుండి మనలను ఎడబాప
నేరవని రూఢిగా నమ్ముచున్నాను.

9 నాకు బహు దుఃఖము కలిగినది, నా హృదయ
2 ములో మానని వేదనయున్నది, । క్రీస్తునందు నిజమే
3 చెప్పుచున్నాను, అబద్ధమాడుట లేదు. । పరిశుద్ధాత్మ
యందు నా మనస్సాక్షి నాతోకూడ సాక్ష్యమిచ్చు
చున్నది. సాధ్యమైనయెడల, దేహసంబంధులైన నా
సహోదరులకొరకు నేను క్రీస్తునుండి వేరై శాప
4 గ్రస్తుడనై యుండగోరుదును. । వీరు ఇశ్రాయేలీ
యులు; స్వీకృతపుత్రత్వమును మహిమయు నిబంధన
లును ధర్మశాస్త్ర ప్రదానమును అర్చనాచారాదులును
5 వాగ్దానములును వీరివి. । పితరులు వీరివారు; శరీర
మునుబట్టి క్రీస్తు వీరిలో పుట్టెను. ఈయన సర్వాధి
కారియైన దేవుడైయుండి నిరంతరము స్తోత్రార్హుడై
6 యున్నాడు. ఆమేన్. । అయితే దేవుని మాట తప్పి
పోయినట్టు కాదు; ఇశ్రాయేలు సంబంధులందరు
ఇశ్రాయేలీయులు కారు. । అబ్రాహాము సంతాన 7
మైనంతమాత్రముచేత అందరు పిల్లలు కారు గాని

ఇస్సాకువలననైనది నీ సంతానము[2]

అనబడును, అనగా శరీరసంబంధులైన పిల్లలు దేవుని 8
పిల్లలు కారు గాని వాగ్దాన సంబంధులైన పిల్లలు
సంతానమని యెంచబడుదురు. । వాగ్దానరూపమైన 9
వాక్యమిదే—

మీదటికి ఈ సమయమునకు వచ్చెదను; అప్పుడు
శారాకు కుమారుడు కలుగును.[3]

అంతేకాదు; రిబ్కా మన తండ్రియైన ఇస్సాకు అను 10
ఒకనివలన గర్భవతియైనప్పుడు, ఏర్పాటును అనుసరిం 12
చిన దేవుని సంకల్పము, క్రియల మూలముగా కాక
పిలుచువాని మూలముగానే నిలకడగా ఉండు నిమి
త్తము, పిల్లలింక పుట్టి మేలైనను కీడైనను చేయకముందే

పెద్దవాడు చిన్నవానికి దాసుడగును[4]

అని ఆమెతో చెప్పబడెను. । ఇందుకు ప్రమాణ 13
ముగా—

నేను యాకోబును ప్రేమించితిని, ఏశావును
ద్వేషించితిని[5]

అని వ్రాయబడియున్నది.

కాబట్టి యేమందుము? దేవునియందు అన్యాయము 14
కలదా? అట్లనరాదు. । అందుకు మోషేతో ఈలాగు 15
చెప్పుచున్నాడు—

ఎవని కరుణింతునో వాని కరుణింతును; ఎవని
యెడల జాలి చూపుదునో వానియెడల జాలి
చూపుదును.[6]

కాగా (పొంద) నిచ్ఛయించువానివలననైనను, ప్రయా 16
సపడువాని[7] వలననైనను కాదు గాని కరుణించు
దేవునివలననే అగును. । మరియు లేఖనము ఫరోతో 17
ఈలాగు చెప్పెను—

నేను నీయందు నా బలము చూపుటకును, నా
నామము భూలోకమందంతట ప్రచురమగు
టకును, అందు నిమిత్తమే నిన్ను నియమించి
తిని.[8]

కావున ఆయన ఎవని కనికరింప నిచ్ఛయించునో 18
వాని కనికరించును; ఎవని కఠినపరచ నిచ్ఛయించునో
వాని కఠినపరచును. । అట్లయితే ఆయన చిత్తమును 19
ఎదిరించినవాడెవడు? ఆయన ఇకను నేరముమోపనేల
అని నీవు నాతో చెప్పుదువు. । అవును గాని ఓ మను 20
ష్యుడా, దేవునికి ఎదురుచెప్పు నీవెవడవు? నన్నెందు
కీలాగు చేసితివని రూపింపబడినది రూపించినవానితో
చెప్పునా? । ఒక ముద్దలోనుండియే యొక ఘటము 21
ఘనతకును ఒకటి ఘనహీనతకును చేయుటకు మంటి
మీద కుమ్మరవానికి అధికారము లేదా? । ఆలాగు 22

[1] కీర్తన, 44: 22. [2] ఆది. 21: 12. [3] ఆది. 18: 10. [4] ఆది. 25: 13. [5] మలాకీ. 1: 2. [6] నిర్గమ. 33: 19.
[7] మూలభాషలో—పరుగెత్తువాని. [8] నిర్గమ. 9: 16.

దేవుడు తన ఉగ్రతను అగుపరచుటకును, తన ప్రభా
వమును చూపుటకును ఇచ్ఛయించినవాడై, నాశనము
నకు సిద్ధపడి ఉగ్రతాపాత్రమైన ఘటములను ఆయన
23 బహు దీర్ఘశాంతముతో సహించిన నేమి? । మరియు
24 మహిమ పొందుటకు ఆయన ముందుగా సిద్ధపరచిన
కరుణాపాత్ర ఘటములయెడల, అనగా యూదు
లలోనుండి మాత్రము కాక అన్యజనములలో నుండి
యు ఆయన పిలిచిన మనయెడల, తన మహిమైశ్వ
ర్యము కనుపరచవలెననియున్న నేమి?

25 ఆ ప్రకారము—

నా ప్రజలు కానివారికి నా ప్రజలనియు, ప్రియు
రాలు కానిదానికి ప్రియురాలనియు, పేరు
26 పెట్టుదును. । మరియు జరుగునదేమనగా,
మీరు నా ప్రజలు కారని యేచోటను
వారితో చెప్పబడెనో, ఆ చోటనే జీవముగల
దేవుని కుమారులని వారికి పేరుపెట్టబడును

అని హోషేయలో ఆయన చెప్పుచున్నాడు.[1]

27 మరియు ప్రభువు తన మాట సమాప్తము చేసి
క్లుప్తపరచి భూలోకమునందు దాని నెరవేర్చును గనుక
ఇశ్రాయేలు కుమారుల సంఖ్య సముద్రపు ఇసుకవలె
28 ఉండినను శేషమే రక్షింపబడునని । యెషయాయు
ఇశ్రాయేలునుగూర్చి బిగ్గరగా పలుకుచున్నాడు.

29 మరియు యెషయా ముందు చెప్పినప్రకారము—
సైన్యములకు అధిపతియగు ప్రభువు మనకు సంతా
నము శేషింపచేయకపోయినయెడల సొదొమ
వలె నగుదుము, గొమొఱ్ఱాను పోలియుం
దుము.[2]

30 అట్లయితే మన మేమందుము? నీతిని వెంటాడని
31 అన్యజనులు నీతిని, అనగా విశ్వాసమూలమైన నీతిని
పొందిరి; అయితే ఇశ్రాయేలు నీతికారణమైన నియ
మమును వెంటాడినను ఆ నియమమును అందుకొన
32 లేదు. । వారెందుకు అందుకొనలేదు? వారు విశ్వాస
మూలముగా కాక క్రియల మూలముగానైనట్టు దాని
వెంటాడిరి.

33 —ఇదిగో నేను అడ్డురాతిని అడ్డుబండను సీయో
నులో స్థాపించుచున్నాను; ఆయనయందు
విశ్వాసముంచువాడు సిగ్గుపరచబడడు[3]

అని వ్రాయబడిన ప్రకారము వారు అడ్డురాయి
తగిలి తొట్రుపడిరి.

**10** సహోదరులారా, (ఇశ్రాయేలీయులు) రక్షణ
పొందవలెనని నా హృదయాభిలాషయు, వారి విష
యమై నేను దేవునికి చేయు ప్రార్థనయునై యు
న్నవి. । వారు దేవునియందు ఆసక్తిగలవారని వారిని 2
గూర్చి సాక్ష్యమిచ్చుచున్నాను; అయినను వారి ఆసక్తి
జ్ఞానానుసారమైనది కాదు. । ఏలయనగా వారు 3
దేవుని నీతినెరుగక తమ స్వనీతిని స్థాపింప బూను
కొనుచు దేవుని నీతికి లోబడలేదు. । విశ్వసించు ప్రతి 4
వానికి నీతి కలుగుటకై క్రీస్తు ధర్మశాస్త్రమునకు సమా
ప్తియైయున్నాడు. । ధర్మశాస్త్రమూలమగు నీతిని నెర 5
వేర్చువాడు దానివలననే జీవించునని మోషే వ్రాయు
చున్నాడు.[4] । అయితే విశ్వాసమూలమగు నీతి యీ 6
లాగు చెప్పుచున్నది—ఎవడు పరలోకములోకి ఎక్కి 7
పోవును?[5] అనగా క్రీస్తును క్రిందికి తెచ్చుటకు; లేక—
ఎవడు అగాధములోకి దిగిపోవును?[6] అనగా క్రీస్తును
మృతులలోనుండి పైకి తెచ్చుటకు అని నీవు నీ హృద
యములో అనుకొనవద్దు. । అదేమని చెప్పుచున్నది?— 8
వాక్యము నీయొద్దను నీ నోటను నీ హృదయములోను
ఉన్నది;[7] అది మేము ప్రకటించు విశ్వాసవాక్య
మే. । అదేమనగా—యేసు ప్రభువని నీ నోటితో 9
ఒప్పుకొని, దేవుడు మృతులలోనుండి ఆయనను లేపె
నని నీ హృదయమందు విశ్వసించినయెడల, నీవు
రక్షింపబడుదువు. । ఏలయనగా నీతి కలుగునట్లు మను 10
ష్యుడు హృదయములో విశ్వసించును, రక్షణ కలు
గునట్లు నోటితో ఒప్పుకొనును. । ఏమనగా ఆయన 11
యందు విశ్వాసముంచు ప్రతివాడు సిగ్గుపడడని లేఖ
నము చెప్పుచున్నది.[8] । యూదుడని హెల్లేనీయుడని 12
భేదములేదు; ఒక్క ప్రభువే అందరికి ప్రభువైయుండి,
తనకు ప్రార్థనచేయువారందరియెడల (కృపచూపు
టకు) ఐశ్వర్యవంతుడై యున్నాడు. । ఎందుకనగా— 13
ప్రభువు నామమునుబట్టి ప్రార్థనచేయువాడె
వడో వాడు రక్షింపబడును.[9]

వారు విశ్వసింపనివానికి ఎట్లు ప్రార్థన చేయు 14
దురు? విననివానిని ఎట్లు విశ్వసించుదురు? ప్రకటించు
వాడు లేకుండ వారెట్లు విందురు? । (ప్రకటించు 15
వారు) పంపబడనియెడల ఎట్లు ప్రకటించుదురు?
ఇందు విషయమై—

ఉత్తమమైన వాటినిగూర్చిన సువార్త ప్రకటించు
వారి పాదములెంతో చక్కనివి

అని వ్రాయబడి యున్నది[10]

అయినను అందరు సువార్తకు లోబడలేదు— 16

ప్రభువా, మా వర్తమానమెవడు విశ్వసించెను?

అని యెషయా చెప్పుచున్నాడు గదా?[11] । కాగా 17
వినుటవలన విశ్వాసము కలుగును; వినుట క్రీస్తును
గూర్చిన మాటవలన కలుగును. । అయినను నేను 18
చెప్పునదేమనగా, వారు వినలేదా? విన్నారు గదా?

[1] హోషేయ, 2: 23; 1: 10. [2] యెషయా, 1: 9; 10: 22, 23. [3] యెషయా, 8: 14; 28: 16. [4] లేవీ. 18: 5.
[5] ద్వితీ. 30: 12. [6] ద్వితీ. 30: 13. [7] ద్వితీ. 30: 14. [8] యెషయా, 28: 16. [9] యోవేలు, 2: 32. [10] యెషయా, 52: 7.
[11] యెషయా, 53: 1.

వారి స్వరము భూలోకమందంతటికిని, వారి మాటలు
భూదిగంతములవరకును బయలువెళ్లెను.[1]

19 మరియు నేను చెప్పునదేమనగా ఇశ్రాయేలుకు
తెలియకుండెనా?

జనము కానివారివలన మీకు రోషము పుట్టిం
చెదను, అవివేకమైన జనమువలన మీకు ఆగ్ర
హము కలుగజేతును[2]

అని మొదట మోషే చెప్పుచున్నాడు.

20 మరియు యెషయా తెగించి
21 —నన్ను వెదకనివారికి నేను దొరికితిని; నన్ను
విచారింపనివారికి ప్రత్యక్షమైతిని[3]

అని చెప్పుచున్నాడు. ఇశ్రాయేలు విషయమైతే—

అవిధేయులై యెదురాడు ప్రజలకు నేను దిన
మంతయు నా చేతులు చాచితిని

అని చెప్పుచున్నాడు.[4]

11 ఆలాగైనయెడల నేనడుగునదేమనగా, దేవుడు
తన ప్రజలను విసర్జించెనా? అట్లనరాదు. నేనుకూడ
ఇశ్రాయేలీయుడను, అబ్రాహాము సంతానమందలి
2 బెన్యామీను గోత్రమునందు పుట్టినవాడను. । తాను
ముందెరిగిన తన ప్రజలను దేవుడు విసర్జింపలేదు.
ఏలీయానుగూర్చిన భాగములో లేఖనము చెప్పునది
మీరెరుగరా?

3 ప్రభువా, వారు నీ ప్రవక్తలను చంపిరి, నీ బలి
పీఠములను పడగొట్టిరి, నేనొక్కడనే మిగిలి
యున్నాను, నా ప్రాణము తీయ జూచు
చున్నారు

అని ఇశ్రాయేలుకు విపక్షముగా దేవుని యెదుట
4 అతడు విజ్ఞాపనము చేయుచున్నాడు. । అయితే
దేవోక్తి అతనితో ఏమి చెప్పుచున్నది?

బయలుకు మోకాళ్లూనని యేడువేల మంది పురుషు
లను నేను శేషముగా నుంచుకొనియున్నాను.[5]

5 ఆలాగుననే ఇప్పటికాలమందు సహితము కృపయొక్క
6 యేర్పాటుచొప్పున శేషము మిగిలి యున్నది. । అది
కృపచేతనైన పక్షమున ఇకను క్రియల మూలమైనది
కాదు; కానిపక్షమున కృప ఇకను కృప కాక
7 పోవును. । ఆలాగైన ఏమగును? ఇశ్రాయేలు వెదకు
నది ఏదో అది వారికి దొరకలేదు, ఏర్పాటు నొందిన
వారికి అది దొరికెను; తక్కినవారు కఠినచిత్తులైరి. ।
8 ఇందువిషయమై—

నేటివరకు దేవుడు వారికి నిద్రమత్తుగల మన
స్సును చూడలేని కన్నులను వినలేని చెవులను
ఇచ్చియున్నాడని వ్రాయబడియున్నది.

మరియు— 9

వారి భోజనము వారికి ఉరిగాను బోనుగాను
ఆటంకముగాను వారి క్రియలకు ప్రతి ఫలము
గాను ఉండుగాక. । వారు చూడకుండునట్లు 10
వారి కన్నులకు చీకటి కమ్ముగాక. వారి వీపును
ఎల్లప్పుడు వంగిపోవునట్లు చేయుము[7]

అని దావీదు చెప్పుచున్నాడు. । కాబట్టి నేనడుగు 11
నది ఏమనగా, పడిపోవునట్లుగా తొట్రిల్లిరా? అట్లన
రాదు. వారికి రోషము పుట్టించుటకై వారి తొట్రు
పాటువలన అన్యజనులకు రక్షణకలిగెను. । వారి 12
తొట్రుపాటు లోకమునకు ఐశ్వర్యమును, వారి క్షీణ
దశ అన్యజనులకు ఐశ్వర్యమును అయినయెడల వారి
పరిపూర్ణత యెంత యెక్కువగా ఐశ్వర్యకరమగును.

అన్యజనులగు మీతో నేను మాటలాడుచున్నాను. 13
నేను అన్యజనులకు అపొస్తలుడనై యున్నాను గనుక 14
ఏ విధముననైనను నా రక్తసంబంధులకు రోషము
పుట్టించి వారిలో కొందరినైనను రక్షింపవలెనని నా
పరిచర్యను ఘనపరచుచున్నాను. । వారిని విసర్జిం 15
చుట లోకమును సమాధానపరచనయ్యెనా, వారిని
చేర్చుకొనుట యేమగును? మృతులు సజీవులైనట్టే
గదా? । ముద్దలో మొదటి పిడికెడు పరిశుద్ధమైనదైతే 16
ముద్దంతయు పరిశుద్ధమే; వేరు పరిశుద్ధమైనదైతే కొమ్మ
లును పరిశుద్ధములే. । అయితే కొమ్మలలో కొన్ని 17
విరిచివేయబడి అడవి ఒలీవ కొమ్మవైయున్న నీవు వాటి
మధ్యన అంటు కట్టబడి, ఒలీవచెట్టుయొక్క సార
వంతమైన వేరులో వాటితో కలిసి పాలు పొందిన
యెడల, ఆ కొమ్మలపైని నీవు అతిశయింపకుము. ।
నీవు అతిశయించితివా, వేరు నిన్ను భరించుచున్నది 18
గాని నీవు వేరును భరించుటలేదు. । అందుకు—నేను 19
అంటు కట్టబడు నిమిత్తము కొమ్మలు విరిచివేయబడిన
వని నీవు చెప్పుదువు. । మంచిది; వారు అవిశ్వాస 20
మునుబట్టి విరిచివేయబడిరి, నీవైతే విశ్వాసమునుబట్టి
నిలిచియున్నావు; గర్వింపక భయపడుము; । దేవుడు 21
స్వాభావికమైన కొమ్మలను విడిచిపెట్టని పక్షమున
నిన్నును విడిచిపెట్టడు. । దేవుని అనుగ్రహమును 22
కాఠిన్యమును, అనగా పడిపోయిన వారిమీద కాఠిన్య
మును, నీవు ఆ అనుగ్రహప్రాప్తుడవై నిలిచియున్న
యెడల నీమీద దేవుని అనుగ్రహమును చూడుము;
నిలువకపోయినయెడల నీవును నరికివేయబడుదువు. ।
వారును తమ అవిశ్వాసములో నిలువకపోయినయెడల 23
అంటు కట్టబడుదురు; దేవుడు వారిని మరల అంటు
కట్టుటకు శక్తిగలవాడు. । ఎట్లనగా నీవు స్వాభావిక 24
మైన అడవి ఒలీవచెట్టునుండి కోయబడి స్వభావ
విరుద్ధముగా మంచి ఒలీవచెట్టున అంటు కట్టబడిన పక్ష

[1] కీర్తన, 19: 4. [2] ద్వితీ. 32: 21. [3] యెషయా, 65: 1. [4] యెషయా, 65: 2. [5] 1 రాజు. 19: 10–14, 18.
[6] యెషయా, 29: 10; 6: 9. [7] కీర్తన, 69: 22, 23.

మున, స్వాభావికమైన కొమ్మలగువారు మరి నిశ్చయ
ముగా తమ స్వకీయమైన ఒలీవచెట్టున అంటు కట్టబడు
దురు కారా?

25 సహోదరులారా, మీ దృష్టికి మీరే బుద్ధిమంతుల
మని అనుకొనకుండునట్లు ఈ మర్మము మీరు తెలిసి
కొన గోరుచున్నాను. అదేమనగా అన్యజనులు సం
పూర్ణముగా ప్రవేశించువరకు ఇశ్రాయేలునకు కఠిన
26 మనస్సు కొంతమట్టుకు కలిగెను. । వారు ప్రవేశించు
27 నప్పుడు—

విమోచకుడు సీయోనులోనుండి వచ్చి యాకో
బులోనుండి భక్తిహీనతను తొలగించును; నేను
వారి పాపములను పరిహరించినప్పుడు నా
వలన వారికి కలుగు నిబంధన ఇదియే[1]

అని వ్రాయబడినట్టు ఇశ్రాయేలు జనులందరును
రక్షింపబడుదురు.

28 సువార్త విషయమైతే వారు మిమ్మునుబట్టి శత్రు
వులుగాని యేర్పాటువిషయమైతే పితరులనుబట్టి
29 ప్రియులై యున్నారు. । ఏలయనగా దేవుడు తన
కృపావరముల విషయములోను పిలుపు విషయము
30 లోను పశ్చాత్తాపపడడు. । మీరు గతకాలమందు
31 దేవునికి అవిధేయులైయుండి, యిప్పుడు వారి అవి
ధేయతనుబట్టి కరుణింపబడితిరి. అటువలెనే మీ
యెడల చూపబడిన కరుణనుబట్టి వారును ఇప్పుడు
కరుణపొందు నిమిత్తము, ఇప్పుడు వారు అవిధేయులై
32 యున్నారు. । అందరియెడల కరుణ చూపవలెనని
దేవుడు అందరిని అవిధేయతాస్థితిలో మూసివేసి యు
న్నాడు.

33 ఆహా, దేవుని బుద్ధి జ్ఞానముల బాహుళ్యము
ఎంతో గంభీరము; ఆయన తీర్పులు శోధింప నెంతో
అశక్యములు; ఆయన మార్గములెంతో అగమ్యములు.[2] ।
34 ప్రభువు మనస్సును ఎరిగినవాడెవడు? ఆయనకు ఆలో
35 చన చెప్పినవాడెవడు? । ముందుగా ఆయనకిచ్చి
36 ప్రతిఫలము పొందగలవాడెవడు? । ఆయన మూలము
గను ఆయన ద్వారాను ఆయన నిమిత్తమును సమస్తము
కలిగియున్నవి. యుగముల పర్యంతము ఆయనకు
మహిమ కలుగును గాక. ఆమేన్.

12 కాబట్టి సహోదరులారా, పరిశుద్ధమును దేవునికి
అనుకూలమునైన సజీవ యాగముగా మీ శరీరములను
ఆయనకు సమర్పించుకొనుడని దేవుని వాత్సల్యతనుబట్టి
మిమ్మును బతిమాలుకొనుచున్నాను. ఇట్టి సేవ మీకు
2 యుక్తమైనది. । మీరు ఈ లోక[3] మర్యాదను అను
సరింపక, ఉత్తమమును, అనుకూలమును, సంపూర్ణమునై
యున్న దేవుని చిత్తమేదో పరీక్షించి తెలిసికొనునట్లు
మీ మనస్సు మారి నూతనమగుటవలన రూపాంతరము
పొందుడి.

తన్నుతాను ఎంచుకొనతగినదానికంటె ఎక్కువగా 3
ఎంచుకొనక, దేవుడు ఒక్కొకనికి విభజించి యిచ్చిన
విశ్వాస పరిమాణప్రకారము, తాను స్వస్థబుద్ధిగల
వాడగుటకై తగినరీతిగా తన్ను ఎంచుకొనవలెనని,
నాకు అనుగ్రహింపబడిన కృపనుబట్టి మీలోనున్న
ప్రతివానితోను చెప్పుచున్నాను. । ఒక్క శరీరములో 4
మనకు అనేక అవయవములుండినను ఈ అవయవము 5
లన్నిటికి ఒక్కటే పని యేలాగు ఉండదో, ఆలాగే
అనేకులమైన మనము క్రీస్తులో ఒక శరీరముగా
ఉండి ఒకనికొకరము ప్రత్యేకముగా అవయవములమై
యున్నాము. । మన కనుగ్రహింపబడిన కృపచొప్పున 6
వెవ్వేరు కృపావరములు కలిగినవారమై యున్నాము 7
గనుక, ప్రవచన వరమైతే విశ్వాస పరిమాణముచొప్పున
ప్రవచింతము; పరిచర్యయైతే పరిచర్యలోను, ।
బోధించువాడైతే బోధించుటలోను, హెచ్చరించు 8
వాడైతే హెచ్చరించుటలోను పనికలిగి యుందము.
పంచిపెట్టువాడు శుద్ధమనస్సుతోను, పైవిచారణ
చేయువాడు జాగ్రత్తతోను, కరుణించువాడు సం
తోషముతోను పని జరిగింపవలెను. । మీ ప్రేమ 9
నిష్కపటమైనదై యుండవలెను. చెడ్డదాని నసహ్యించు
కొని మంచిదాని హత్తుకొని యుండుడి. । సహో 10
దరప్రేమ విషయములో ఒకనియందొకడు అను
రాగముగలవారై, ఘనతవిషయములో ఒకనినొకడు
గొప్పగా ఎంచుకొనుడి. । ఆసక్తి విషయములో మం 11
దులు కాక, ఆత్మయందు తీవ్రతగలవారై ప్రభువును
సేవించుడి. । నిరీక్షణగలవారై సంతోషించుచు, శ్రమ 12
యందు ఓర్పుగలవారై, ప్రార్థనయందు పట్టుదల
కలిగియుండుడి. । పరిశుద్ధుల అవసరములలో పాలు 13
పొందుచు, ఆతిథ్యము శ్రద్ధగా ఇచ్చుచుండుడి. ।
మిమ్మును హింసించువారిని దీవించుడి; దీవించుడి గాని 14
శపింపవద్దు. । సంతోషించువారితో సంతోషించుడి; । 15
ఏడ్చువారితో ఏడువుడి; ఒకనితో నొకడు మనస్సు 16
కలిసి యుండుడి. హెచ్చువాటియందు మనస్సుంచక
తగ్గువాటియందు ఆసక్తులైయుండుడి. మీకు మీరే
బుద్ధిమంతులమని అనుకొనవద్దు. । కీడుకు ప్రతి కీడెవని 17
కిని చేయవద్దు; మనుష్యులందరి దృష్టికి యోగ్యమైన
వాటినిగూర్చి[4] ఆలోచన కలిగి యుండుడి. । శక్య 18
మైతే సమస్త మనుష్యులతో మీ చేతనైనంతమట్టుకు
సమాధానముగా ఉండుడి. । ప్రియులారా, మీకు 19
మీరే పగతీర్చుకొనక ఉగ్రతకు చోటియ్యుడి.—పగ
తీర్చుట నా పని, నేనే ప్రతిఫలము నిత్తును[5] అని
ప్రభువు చెప్పుచున్నాడని వ్రాయబడియున్నది. ।

[1] యెషయా, 27: 9; 59: 20, 21. [2] మూలభాషలో—అడుగుజాడలుపట్ట నశక్యములు. [3] లేక—ఈ యుగ. [4] లేక, నేలైనవాటిని.
[5] ద్వితీ. 32: 35.

కుందము. ఇదియుగాక సహోదరునికి అడ్డమైనను
ఆటంకమైనను కలుగజేయకుందుమని మీరు నిశ్చ
14 యించుకొనుడి. । సహజముగా ఏదియు నిషిద్ధము
కాదని నేను ప్రభువైన యేసునందున్నవాడనై యెరిగి
రూఢిగా నమ్ముచున్నాను. అయితే ఏదైనను నిషిద్ధ
15 మని యెంచుకొనువానికి అది నిషిద్ధమే. । నీ సహో
దరుడు నీ భోజన మూలముగా దుఃఖించినయెడల
నీవికను ప్రేమకలిగి నడుచుకొనువాడవు కావు. ఎవని
కొరకు క్రీస్తు చనిపోయెనో వానిని నీ భోజనముచేత
16 పాడుచేయకుము. । మీకున్న మేలైనది దూషణపాలు
17 కానియ్యకుడి. । దేవుని రాజ్యము భోజనమును పాన
మును కాదు గాని నీతియు సమాధానమును పరిశుద్ధాత్మ
18 యందలి ఆనందమునై యున్నది. । ఈ విషయమందు
క్రీస్తుకు దాసుడైనవాడు దేవునికి ఇష్టుడును మనుష్యుల
19 దృష్టికి యోగ్యుడునై యున్నాడు. । కాబట్టి సమా
ధానమును, పరస్పర క్షేమాభివృద్ధిని కలుగజేయు
20 వాటినే ఆసక్తితో అనుసరింతము.[1] । భోజనము
నిమిత్తము దేవుని పని పాడుచేయకుడి; సమస్త పదార్థ
ములు పవిత్రములేగాని అనుమానముతో తినువానికి
21 అది దోషము. । మాంసభక్షణ గాని ద్రాక్షారస
పానము గాని నీ సహోదరుని కడ్డము కలుగజేయు
22 నది మరేదియు గాని మానివేయుట మంచిది. । నీలో
ఉన్న విశ్వాసము దేవునియెదుట నీమట్టుకు నీవే
యుంచుకొనుము; తాను సమ్మతించిన విషయములో
తనకు తానే తీర్పు తీర్చుకొననివాడు ధన్యుడు. ।
23 అనుమానించువాడు తినిన పక్షమున విశ్వాసము
లేకుండ తినును గనుక దోషియని తీర్పునొందును.
విశ్వాసమూలము కానిది ఏదో అది పాపము.

**15** కాగా బలవంతులమైన మనము మనలను మనమే
సంతోషపరచుకొనక, బలహీనుల దౌర్బల్యములను
2 భరించుటకు బద్ధులమై యున్నాము. । తన పొరుగు
వానికి క్షేమాభివృద్ధి కలుగునట్లు మనలో ప్రతివాడు
మేలైనదానియందు అతని సంతోషపరచవలెను. ।
3 క్రీస్తుకూడ తన్ను తాను సంతోషపరచుకొనలేదు
గాని—

నిన్ను నిందించువారి నిందలు నా మీద పడెను[2]

అని వ్రాయబడియున్నట్లు (ఆయనకు సంభవించెను.) ।
4 ఏలయనగా ఓర్పువలనను, లేఖనములవలని ఆదరణ
వలనను మనకు నిరీక్షణ కలుగుటకై పూర్వమందు
వ్రాయబడినవన్నియు మనకు బోధ కలుగునట్లు
5 వ్రాయబడియున్నవి. । మీరేకభావము గలవారై
6 యేకగ్రీవముగా[3] మన ప్రభువైన యేసుక్రీస్తు తండ్రి
యగు దేవుని మహిమపరచు నిమిత్తము, క్రీస్తుయేసు
చిత్తప్రకారము ఒకనితో నొకడు మనస్సు కలిసిన
వారై యుండునట్లు ఓర్పునకును ఆదరణకును కర్తయగు
దేవుడు మీకు అనుగ్రహించుగాక. । కాబట్టి క్రీస్తు 7
మిమ్మును[4] చేర్చుకొనిన ప్రకారము దేవునికి మహిమ
కలుగునట్లు మీరును ఒకనినొకడు చేర్చుకొనుడి. ।
నేను చెప్పునదేమనగా, పితరులకు చేయబడిన వాగ్దాన 8
ముల విషయములో దేవుడు సత్యవంతుడని స్థాపించుట 9
కును, అన్యజనులు ఆయన కనికరమునుగూర్చి దేవుని
మహిమపరచుటకును క్రీస్తు సున్నతిగలవారికి పరి
చారకుడాయెను. అందువిషయమై—

ఈ హేతువుచేతను అన్యజనులలో నేను నిన్ను
స్తుతింతును; నీ నామసంకీర్తనము చేయుదును[5]

అని వ్రాయబడియున్నది.
మరియు 10

అన్యజనులారా, ఆయన ప్రజలతో సంతోషిం
చుడి అనియు[6] 11

మరియు

సకలమైన అన్యజనులారా, ప్రభువును స్తుతిం
చుడి[7]

సకల ప్రజలు ఆయనను కొనియాడుదురు గాక
అనియు చెప్పియున్నది.
మరియు యెషయా యీలాగు చెప్పుచున్నాడు— 12

యెష్షయిలోనుండి వేరు చిగురు, అనగా అన్య
జనుల నేలుటకు పుట్టువాడు వచ్చును; ఆయన
యందు అన్యజనులు నిరీక్షణ యుంచు
దురు.[8]

కాగా మీరు పరిశుద్ధాత్మ శక్తి పొంది విస్తారముగా 13
నిరీక్షణగలవారగుటకు నిరీక్షణకర్తయగు దేవుడు విశ్వా
సముద్వారా సమస్తానందముతోను సమాధానము
తోను మిమ్మును నింపునుగాక.

నా సహోదరులారా, మీరు కేవలము మంచి 14
వారును, సమస్త జ్ఞాన సంపూర్ణులును, ఒకరికి ఒకరు
బుద్ధిచెప్ప సమర్థులునై యున్నారని నామట్టుకు నేనును
మిమ్మునుగూర్చి రూఢిగా నమ్ముచున్నాను. । అయినను 15
అన్యజనులు అను అర్పణ పరిశుద్ధాత్మవలన పరిశుద్ధ 16
పరచబడి ప్రీతికరమగునట్లు, నేను సువార్తవిషయమై
యాజకధర్మము జరిగించుచు, దేవునిచేత నాకు అను
గ్రహింపబడిన కృపనుబట్టి అన్యజనులనిమిత్తము యేసు
క్రీస్తు పరిచారకుడనైతిని. ఇది హేతువు చేసికొని
మీకు జ్ఞాపకము చేయవలెనని యుండి యెక్కువ
ధైర్యము కలిగి సంక్షేపముగా మీకు వ్రాయు
చున్నాను. । కాగా క్రీస్తుయేసునుబట్టి దేవుని విషయ 17
మైన సంగతులలో నాకు అతిశయాస్పదము కలదు. ।
ఏలాగనగా అన్యజనులు విధేయులగునట్లు, వాక్యము 18
చేతను క్రియచేతను గురుతుల బలముచేతను మహ 19

1 మూలభాషలో—వెంటాడుదము. 2 కీర్తన, 69: 19. 3 మూలభా.—ఒక్క నోటితో. 4 కొన్ని ప్రాచీనప్రతులలో—మనలను అని
పాఠాంతరము. 5 కీర్తన, 18: 19. 6 ద్వితీయో. 32: 43. 7 కీర్తన. 117: 1. 8 యెషయా, 11: 10.

త్కార్యముల బలముచేతను పరిశుద్ధాత్మ బలముచేతను
క్రీస్తు (నా ద్వారా చేయించినవాటిని గూర్చియే
గాని) చేయింపనివాటిలో దేనినిగూర్చియు మాటలాడ
తెగింపను. కాబట్టి యెరూషలేము మొదలుకొని
చుట్టుపట్లనున్న ప్రదేశములందు ఇల్లూరికు ప్రాంత
పర్యంతము, క్రీస్తు సువార్తను పూర్ణముగా ప్రకటించి
20 యున్నాను. । నేనైతే మరియొకని పునాదిమీద కట్ట
21 కుండు నిమిత్తము

ఆయననుగూర్చిన సమాచారమెవరికి తెలియజేయ
బడలేదో వారు చూతురనియు, విననివారు
గ్రహింతురనియు,

వ్రాయబడిన ప్రకారము[1] క్రీస్తు నామమెరుగనిచో
ట్లను సువార్తను ప్రకటింపవలెనని మిక్కిలి ఆశగల
వాడనై యుండి ఆలాగున ప్రకటించితిని.
22 ఈ హేతువుచేతను మీయొద్దకు రాకుండ నాకు
23 అనేక పర్యాయములు ఆటంకము కలిగెను. । ఇప్పుడైతే
24 ఈ ప్రదేశములలో నేనిక (సంచరింపవలసిన) భాగము
లేదు గనుక, అనేక సంవత్సరములనుండి మీయొద్దకు
రావలెనని మిక్కిలి అపేక్షకలిగి, నేను స్పానియాకు
వెళ్లునప్పుడు మార్గములో మిమ్మును చూచి, మొదట
మీ సహవాసమువలన కొంతమట్టుకు సంతృప్తిపొంది,
మీచేత అక్కడికి సాగనంపబడుదునని నిరీక్షించు
25 చున్నాను. । అయితే ఇప్పుడు పరిశుద్ధులకొరకు పరి
చర్య చేయుచు యెరూషలేముకు వెళ్లుచున్నాను. ।
26 ఏలయనగా యెరూషలేములో ఉన్న పరిశుద్ధులలో
బీదలైనవారి నిమిత్తము మకెదోనియవారును అకైయ
27 వారును కొంత సొమ్ము చందావేయ నిష్టపడిరి. । అవును
వారిష్టపడి దాని చేసిరి; వారు వీరికి ఋణస్థులు; ఎట్ల
నగా అన్యజనులు వీరి ఆత్మసంబంధమైన విషయము
లలో పాలివారై యున్నారు గనుక శరీరసంబంధమైన
విషయములలో వీరికి సహాయముచేయ బద్ధులైయు
28 న్నారు. । ఈ పని ముగించి యీ ఫలమును వారి
కప్పగించి,[2] నేను మీ పట్టణముమీదుగా స్పానియాకు
29 ప్రయాణము చేతును. । నేను మీయొద్దకు వచ్చు
నప్పుడు క్రీస్తుయొక్క ఆశీర్వాద పరిపూర్ణుడనై వత్తు
నని యెరుగుదును.

30 సహోదరులారా, నేను యూదైయలో నున్న
32 అవిధేయుల చేతులలోనుండి తప్పింపబడి యెరూష
లేములో చేయవలసియున్న యీ పరిచర్య పరిశుద్ధు
లకు ప్రీతికరమగునట్లును, నేను దేవుని చిత్తమువలన
సంతోషముతో మీయొద్దకు వచ్చి మీతో కలిసి
విశ్రాంతి పొందునట్లును, మీరు నాకొరకు దేవునికి
చేయు ప్రార్థనలయందు నాతో కలిసి పోరాడవలె
నని, మన ప్రభువైన యేసుక్రీస్తును బట్టియు, ఆత్మ
వలని ప్రేమను బట్టియు మిమ్మును బతిమాలుకొను
చున్నాను. । సమాధానకర్తయగు దేవుడు మీకందరికి 33
తోడై యుండుగాక. ఆమేన్.

కెంక్రెయలో ఉన్న సంఘపరిచారకురాలగు ఫీబే 16
అను మన సహోదరిని పరిశుద్ధులకు తగినట్టుగా 2
ప్రభువునందు చేర్చుకొని, ఆమెకు మీవలన కావల
సినది ఏదైన ఉన్నయెడల సహాయము చేయవలెనని
ఆమెనుగూర్చి మీకు సిఫారసు చేయుచున్నాను; ఆమె
అనేకులకును నాకును సహాయురాలై యుండెను.

క్రీస్తు యేసునందు నా జత పనివారైన ప్రిస్కిల్ల 3
కును అకులకును నా వందనములు చెప్పుడి. । వారు 4
నా ప్రాణముకొరకు తమ ప్రాణములను ఇచ్చుటకైన
తెగించిరి. మరియు వారి యింట ఉన్న సంఘమున
కును వందనములు చెప్పుడి; నేను మాత్రము కాదు
అన్యజనులలోని సంఘములవారందరు వీరికి కృతజ్ఞులై
యున్నారు. । ఆసియాలో క్రీస్తుకు ప్రథమఫలమై 5
యున్న నా ప్రియుడగు ఎపైనెటుకు వందనములు. ।
మీకొరకు బహుగా ప్రయాసపడిన మరియకు వందన 6
ములు. । నాకు బంధువులును నాతోటి ఖైదీలునైన 7
అంద్రోనికుకును యూనీయకును వందనములు; వీరు
అపొస్తలులలో ప్రసిద్ధికెక్కినవారై, నాకంటె ముం
దుగా క్రీస్తునందున్నవారు. । ప్రభువునందు నాకు 8
ప్రియుడగు అంప్లీయాతుకు వందనములు. । క్రీస్తు 9
నందు మన జతపనివాడగు ఊర్బానుకును నా ప్రియు
డగు స్టాకుకును వందనములు. । క్రీస్తునందు యోగ్యు 10
డైన అపెల్లెకు వందనములు. అరిస్టొబులు ఇంటివారికి
వందనములు. । నా బంధువుడగు హెరోదియోనుకు 11
వందనములు. నార్కిస్సు ఇంటివారిలో ప్రభువునం
దున్నవారికి వందనములు. । ప్రభువునందు ప్రయాస 12
పడు త్రుపైనాకును త్రుఫోసాకును వందనములు.
ప్రియురాలగు పెర్సిసికి వందనములు; ఆమె ప్రభువు
నందు బహుగా ప్రయాసపడెను. । ప్రభువునందు 13
ఏర్పరచబడిన రూఫుకు వందనములు; అతని తల్లికి వం
దనములు; ఆమె నాకును తల్లి. । అసుంక్రితుకును, 14
ప్లెగోనుకును, హెర్మేకును, పత్రొబకును, హెర్మాకును
వారితోకూడనున్న సహోదరులకును వందనములు. ।
పిలొలోగుకును, యూలియాకును, నేరియకును, అతని 15
సహోదరికిని, ఒలుంపాకును వారితోకూడ ఉన్న
పరిశుద్ధులకందరికిని వందనములు. । పవిత్రమైన ముద్దు 16
పెట్టుకొని యొకనికొకడు వందనములు చేయుడి.
క్రీస్తు సంఘములన్నియు మీకు వందనములు చెప్పు
చున్నవి.

సహోదరులారా, మీరు నేర్చుకొనిన బోధకు 17
వ్యతిరేకముగా భేదములను ఆటంకములను కలుగజేయు
వారిని కనిపెట్టియుండుడని మిమ్మును బతిమాలుకొను
చున్నాను. వారిలోనుండి తొలగిపోవుడి. । అట్టి 18

[1] యెషయా, 52: 15. [2] మూలభాషలో—ముద్రించి.

వారు మన ప్రభువైన క్రీస్తుకు కాక తమ కడుపుకే
దాసులు, వారు ఇంపైన మాటలవలనను ఇచ్చకముల
వలనను నిష్కపటుల మనస్సులను మోసపుచ్చుదురు. ।
19 మీ విధేయత అందరికిని ప్రచురమైనది గనుక మిమ్మును
గూర్చి సంతోషించుచున్నాను. మీరు మేలు విష
యమై జ్ఞానులును, కీడు విషయమై నిష్కపటులునై
20 యుండవలెనని కోరుచున్నాను. । సమాధాన కర్తయగు
దేవుడు సాతానును మీ కాళ్లక్రింద శీఘ్రముగా
చితక త్రొక్కించును.

మన ప్రభువైన యేసుక్రీస్తు కృప మీకు తోడై
యుండుగాక.

21 నా జతపనివాడగు తిమొథెయు, నా బంధువు
లగు లూకియ, యాసోను, సోసిపత్రు అనువారును
22 మీకు వందనములు చెప్పుచున్నారు. । ఈ పత్రిక
వ్రాసిన తెర్తియు అను నేను ప్రభువునందు మీకు
వందనములు చేయుచున్నాను. । నాకును యావత్సంఘ 23
మునకును ఆతిథ్యముచేయు గాయియు మీకు వందన
ములు చెప్పుచున్నాడు. ఈ పట్టణపు ఖజానాదారు
డగు ఎరస్తును సహోదరుడగు క్వర్తును మీకు వందన
ములు చెప్పుచున్నారు.

అనాదినుండి సమస్తమైన అన్యజనులు విశ్వాసము 25
నకు విధేయులగునట్లు, రహస్యముగా ఉంచబడి 27
యిప్పుడు ప్రత్యక్షపరచబడిన మర్మము, నిత్యదేవుని
ఆజ్ఞప్రకారము ప్రవక్తల లేఖనములద్వారా వారికి
తెలుపబడియున్నది. ఈ మర్మమును అనుసరించియున్న
నా సువార్తప్రకారముగాను, యేసుక్రీస్తునుగూర్చిన
ప్రకటనప్రకారముగాను, మిమ్మును స్థిరపరచుటకు
శక్తిమంతుడును అద్వితీయ జ్ఞానవంతుడునైన దేవునికి,
యేసుక్రీస్తుద్వారా నిరంతరము మహిమ కలుగును
గాక. ఆమేన్.

## అపొస్తలుడైన పౌలు

# కొరింథీయులకు వ్రాసిన మొదటి పత్రిక

1 దేవుని చిత్తమువలన యేసు క్రీస్తు[1]యొక్క అపొస్త
లుడుగా నుండుటకు పిలువబడిన పౌలును సహోదరు
2 డైన సొస్తెనేసును । కొరింథులోనున్న దేవుని సంఘ
మునకు, అనగా క్రీస్తుయేసునందు పరిశుద్ధపరచబడిన
వారై పరిశుద్ధులుగా ఉండుటకు పిలువబడినవారికిని,
వారికిని మనకును ప్రభువుగా ఉన్న మన ప్రభువైన
యేసుక్రీస్తు నామమున ప్రతిస్థలములో ప్రార్థించు
3 వారికందరికిని (శుభమని చెప్పి) వ్రాయునది. । మన
తండ్రియైన దేవునినుండియు, ప్రభువైన యేసుక్రీస్తు
నుండియు కృపాసమాధానములు మీకు కలుగును గాక.
4 క్రీస్తుయేసునందు మీకు అనుగ్రహింపబడిన
దేవుని కృపను చూచి మీ విషయమై నా దేవునికి
ఎల్లప్పుడును కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాను. ।
5 క్రీస్తును గూర్చిన సాక్ష్యము మీలో స్థిరపరచబడి
6 నందున ఆయనయందు మీరు ప్రతి విషయములోను,
అనగా సమస్తోపదేశములోను సమస్త జ్ఞానములోను
7 సంపూర్ణులైతిరి; । గనుక ఏ కృపావరమునందును
లోపములేక మీరు మన ప్రభువైన యేసుక్రీస్తు
8 ప్రత్యక్షతకొరకు ఎదురుచూచుచున్నారు. । మన
ప్రభువైన యేసుక్రీస్తు దినమందు మీరు నిరపరాధులై
యుండునట్లు అంతమువరకు ఆయన మిమ్మును స్థిర
9 పరచును. । మన ప్రభువైన యేసుక్రీస్తను తన కుమా
రుని సహవాసమునకు మిమ్మును పిలిచిన దేవుడు నమ్మ
తగినవాడు.

10 సహోదరులారా, మీరందరు ఏకభావముతో
మాటలాడవలెననియు, మీలో కక్షలు లేక యేక
మనస్సుతోను ఏకతాత్పర్యముతోను మీరు సన్నద్ధులై
యుండవలెననియు, మన ప్రభువైన యేసుక్రీస్తుపేరట
11 మిమ్మును వేడుకొనుచున్నాను. । నా సహోదరు
లారా, మీలో కలహములు కలవని మిమ్మునుగూర్చి
క్లోయె యింటివారివలన నాకు తెలియవచ్చెను. ।
12 మీలో ఒకడు—నేను పౌలువాడను, ఒకడు — నేను
అపొల్లోవాడను, మరియొకడు — నేను కేఫావాడను,
ఇంకొకడు—నేను క్రీస్తువాడనని చెప్పుకొనుచున్నా
రని నా తాత్పర్యము.

13 క్రీస్తు విభజింపబడి యున్నాడా? పౌలు మీ
కొరకు సిలువ వేయబడెనా? పౌలు నామమున మీరు
14 బాప్తిస్మముపొందితిరా? । నా నామమున మీరు బాప్తి
15 స్మము పొందితిరని యెవరైనను చెప్పకుండునట్లు,

క్రిస్పుకును గాయియుకును తప్ప మరి ఎవరికిని నే
బాప్తిస్మమియ్యలేదు; అందుకై దేవునికి కృతజ్ఞతా
స్తుతులు చెల్లించుచున్నాను. । స్తెఫను ఇంటివారికి
బాప్తిస్మమిచ్చితిని; వీరికి తప్ప మరి ఎవరికైనను బాప్తి
మిచ్చితినేమో నేనెరుగను. । బాప్తిస్మమిచ్చుటకు క్రీ
నన్ను పంపలేదు గాని, క్రీస్తుయొక్క సిలువ వ్యర్థ
కాకుండునట్లు, వాక్చాతుర్యము లేకుండ సువా
ప్రకటించుటకే ఆయన నన్ను పంపెను. । సిలువ
గూర్చిన వార్త నశించుచున్నవారికి వెర్రితనముగా
రక్షింపబడుచున్న మనకు దేవుని శక్తి. । ఇందు వి
యమై

జ్ఞానుల జ్ఞానమును నాశనము చేతును, వివేక
వివేకమును శూన్యపరతును

అని వ్రాయబడియున్నది.[2]

జ్ఞాని యేమయ్యెను? శాస్త్రి యేమయ్యెను? ఈ
లోకపు[3] తర్కవాది యేమయ్యెను? ఈ లోక జ్ఞా
మును దేవుడు వెర్రితనముగా చేసియున్నాడు గదా?
దేవుని జ్ఞానానుసారముగా లోకము తన జ్ఞానవ
చేత దేవునిని ఎరుగకుండినందున, సువార్త ప్రకట
యను వెర్రితనముచేత నమ్మువారిని రక్షించుట దేవు
దయాపూర్వక సంకల్పమాయెను. । యూదులు సూచ
క్రియలు చేయుమని అడుగుచున్నారు, హెల్లే
యులు జ్ఞానము వెదకుచున్నారు. । అయితే మేమ
సిలువవేయబడిన క్రీస్తును ప్రకటించుచున్నాము.
ఆయన యూదులకు ఆటంకముగాను అన్యజనులకి
వెర్రితనముగాను ఉన్నాడుగాని యూదులకేమి
హెల్లేనీయులకేమి, పిలువబడినవారికే క్రీస్తు దేవు
శక్తియును దేవుని జ్ఞానమునై యున్నాడు. । దేవు
వెర్రితనము మనుష్యజ్ఞానముకంటె జ్ఞానముగల
దేవుని బలహీనత మనుష్యుల బలముకంటె బలమైన

సహోదరులారా, మిమ్మును పిలిచిన పిలుపు
చూడుడి. మీలో లోకరీతిని[4] జ్ఞానులైనను ఘనులైన
కులీనులైనను అనేకులు పిలువబడలేదు గాని ।
శరీరియు దేవునియెదుట అతిశయింపకుండునట్లు జ్ఞాన
లను సిగ్గుపరచుటకు లోకములోనుండు వెర్రివారి
దేవుడు ఏర్పరచుకొని యున్నాడు. బలవంతులై
వారిని సిగ్గుపరచుటకు లోకములో బలహీనులైనవారి
దేవుడు ఏర్పరచుకొనియున్నాడు. ఎన్నికైనవారి
వ్యర్థముచేయుటకు లోకములో నీచులైనవారిని, తృ

[1] క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము. [2] యెషయా, 29: 14. [3] మూలభాషలో—ఈ యుగపు. [4] మూలభా.—శరీరరీతిని

కరింపబడినవారిని, ఎన్నికలేనివారిని దేవుడు ఏర్పరచు
30 కొని యున్నాడు. । అయితే ఆయన మూలముగా
మీరు క్రీస్తుయేసునందున్నారు.
31 —అతిశయించువాడు ప్రభువునందే అతిశయింప
వలెను అని వ్రాయబడినది నెరవేరునట్లు[1] దేవుని
మూలముగా ఆయన మనకు జ్ఞానమును నీతియు పరి
శుద్ధతయు విమోచనమునాయెను.
2 సహోదరులారా, నేను మీయొద్దకు వచ్చి
నప్పుడు వాక్చాతుర్యముతోగాని జ్ఞానాతిశయము
తోగాని దేవుని మర్మమును మీకు ప్రకటించుచు వచ్చిన
2 వాడను కాను. । నేను యేసుక్రీస్తును, అనగా సిలువ
వేయబడిన యేసుక్రీస్తును తప్ప మరిదేనిని మీమధ్య
3 నెరుగకుందునని నిశ్చయించుకొంటిని. । మరియు బల
హీనతతోను భయముతోను ఎంతో వణకుతోను మీ
4 యొద్ద నుంటిని. । మీ విశ్వాసము మనుష్యుల జ్ఞానమును
5 ఆధారము చేసికొనక దేవుని శక్తిని ఆధారము చేసికొని
యుండవలెనని, నేను మాటలాడినను (సువార్త) ప్రక
టించినను, జ్ఞానయుక్తమైన తియ్యని మాటలను విని
యోగింపక, పరిశుద్ధాత్మయు దేవుని శక్తియు కనుపరచు
6 దృష్టాంతములనే వినియోగించితిని. । పరిపూర్ణులైన
వారి మధ్య జ్ఞానమును బోధించుచున్నాము, అది
యీ లోక[2] జ్ఞానము కాదు, నిరర్థకులై పోవుచున్న
7 యీ లోకాధికారుల జ్ఞానమును కాదు గాని । దేవుని
జ్ఞానము మర్మమైనట్టుగా బోధించుచున్నాము; ఈ
జ్ఞానము మరుగైయుండెను. జగదుత్పత్తికి ముందుగానే
దీనిని దేవుడు మన మహిమ నిమిత్తము నియమించెను. ।
8 అది లోకాధికారులలో ఎవనికిని తెలియదు; అది
వారికి తెలిసియుండినయెడల మహిమాస్వరూపియగు
9 ప్రభువును సిలువవేయక పోయియుందురు. । ఇందును
గూర్చి
—దేవుడు తన్ను ప్రేమించువారికొరకు ఏవి సిద్ధ
పరచెనో అవి కంటికి కనబడలేదు, చెవికి విన
బడలేదు, మనుష్య హృదయమునకు గోచరము
కాలేదు
10 అని వ్రాయబడియున్నది.[3] । మనకైతే దేవుడు వాటిని
తన ఆత్మవలన బయలుపరచి యున్నాడు; ఆ ఆత్మ
అన్నిటిని దేవుని మర్మములను కూడ పరిశోధించుచు
11 న్నాడు. । ఒక మనుష్యుని సంగతులు అతనిలోనున్న
మనుష్యాత్మకే గాని మనుష్యులలో మరి ఎవనికి తెలి
యును? అలాగే దేవుని సంగతులు దేవుని ఆత్మకే
12 గాని మరి ఎవనికిని తెలియవు. । దేవునివలన మనకు
దయచేయబడినవాటిని తెలిసికొనుటకై మనము లౌకి
కాత్మను కాక దేవునియొద్దనుండి వచ్చు ఆత్మను పొంది
13 యున్నాము. । మనుష్యజ్ఞానము నేర్పు మాటలతో
గాక ఆత్మసంబంధమైన సంగతులను ఆత్మసంబంధమైన
సంగతులతో సరిచూచుచు, ఆత్మ నేర్పు మాటలతో
వీటినిగూర్చియే మేము బోధించుచున్నాము. । ప్రకృతి 14
సంబంధియైన మనుష్యుడు దేవుని ఆత్మ విషయములను
అంగీకరింపడు, అవి అతనికి వెర్రితనముగా ఉన్నవి;
అవి ఆత్మానుభవముచేతనే వివేచింపదగును గనుక
అతడు వాటిని గ్రహింపజాలడు. । ఆత్మసంబంధియైన 15
వాడు అన్నిటిని వివేచించును గాని అతడెవనిచేత
నైనను వివేచింపబడడు. । ప్రభువు మనస్సును ఎరిగి 16
ఆయనకు బోధింపగల వాడెవడు? మనమైతే క్రీస్తు
మనస్సు కలిగినవారము.
సహోదరులారా, ఆత్మసంబంధులైన మనుష్యు 3
లతో మాటలాడినట్లు నేను మీతో మాటలాడలేక
పోతిని. శరీరసంబంధులైన మనుష్యులే అనియు, క్రీస్తు
నందు పసిబిడ్డలే అనియు, మీతో మాటలాడవలసి
వచ్చెను. । అప్పటిలో మీకు బలము చాలకపోయినం 2
దున పాలతోనే మిమ్మును పెంచితినిగాని అన్నముతో
మిమ్మును పెంచలేదు. మీరింకను శరీరసంబంధులై యుం
డుటవలన ఇప్పుడును మీరు బలహీనులై యున్నారు
కారా? । మీలో అసూయయు కలహమును ఉం 3
డగా మీరు శరీరసంబంధులై మనుష్యరీతిగా నడుచు
కొనువారు కారా? । ఒకడు — నేను పౌలువాడను, 4
మరియొకడు — నేను అపొల్లోవాడను, అని చెప్పు
నప్పుడు మీరు (ప్రకృతిసంబంధులైన) మనుష్యులు
కారా? । అపొల్లో ఎవడు? పౌలెవడు? పరిచారకులే 5
గదా. ఒక్కొక్కరికి ప్రభువనుగ్రహించిన ప్రకారము
వారి ద్వారా మీరు విశ్వసించితిరి । నేను నాటితిని, 6
అపొల్లో నీళ్లుపోసెను, వృద్ధికలుగజేసినవాడు దేవుడే ।
కాబట్టి వృద్ధి కలుగజేయు దేవునిలోనేగాని, నాటు 7
వానిలోనైనను నీళ్లుపోయువానిలోనైనను ఏమియు
లేదు. । నాటువాడును నీళ్లుపోయువాడును ఒక్కటే. 8
ప్రతివాడు తాను చేసిన కష్టముకొలది జీతము పుచ్చు
కొనును. । మేము దేవుని జతపనివారమై యున్నాము; 9
మీరు దేవుని వ్యవసాయమును దేవుడు (కట్టు) గృహ
మునై యున్నారు.
దేవుడు నాకనుగ్రహించిన కృపచొప్పున నేను 10
నేర్పరియైన శిల్పకారునివలె పునాది వేసితిని, మరి
యొకడు దానిమీద కట్టుచున్నాడు; ప్రతివాడు దాని
మీద ఏలాగు కట్టుచున్నాడో జాగ్రత్తగా చూచు
కొనవలెను. । వేయబడినది తప్ప మరియొక పునాది 11
ఎవడును వేయనేరడు; ఈ పునాది యేసుక్రీస్తే. ।
ఎవడైనను ఈ పునాదిమీద బంగారము వెండి వెలగల 12
రాళ్లు కఱ్ఱ గడ్డి కొయ్యకాలు మొదలైనవాటితో 13
కట్టినయెడల, వాని వాని పని కనబడును, ఆ దినము
దానిని తేటపరచును, అది అగ్నిచేత బయలుపరచ
బడును. మరియు వాని వాని పని యెట్టిదో దానిని

[1] యిర్మీయా, 9: 23, 24. [2] మూలభాషలో—ఈ యుగ. [3] యెషయా, 64: 4.

14 అగ్నియే పరీక్షించును. । పునాదిమీద ఒకడు కట్టిన
పని నిలిచినయెడల వాడు జీతము పుచ్చుకొనును. ।
15 ఒకని పని కాల్చివేయబడినయెడల వానికి నష్టము
కలుగును; అతడు తనమట్టుకు రక్షింపబడును గాని
అగ్నిలోనుండి తప్పించుకొన్నట్టు రక్షింపబడును.
16 మీరు దేవుని ఆలయమై యున్నారనియు, దేవుని
ఆత్మ మీలో నివసించుచున్నాడనియు మీరెరుగరా? ।
17 ఎవడైనను దేవుని ఆలయమును పాడుచేసినయెడల
దేవుడు వాని పాడుచేయును. దేవుని ఆలయము పరి
శుద్ధమైయున్నది; మీరును పరిశుద్ధులై యున్నారు.[1]
18 ఎవడును తన్నుతాను మోసపరచుకొనకూడదు.
మీలో ఎవడైనను ఈ లోకమందు తాను జ్ఞానినని
అనుకొనినయెడల జ్ఞాని అగునట్టు వెఱ్ఱివాడు కావ
19 లెను. । ఈ లోక జ్ఞానము దేవుని దృష్టికి వెఱ్ఱితనమే.
20 — జ్ఞానులను వారి కుయుక్తిలో ఆయన పట్టు
కొనును;[2] మరియు
— జ్ఞానుల యోచనలు వ్యర్థములని ప్రభువుకు తెలి
యును[3]
21 అని వ్రాయబడియున్నది. । కాబట్టి యెవడును మను
ష్యులయందు అతిశయింపకూడదు; సమస్తమును
22 మీవి. । పౌలైనను అపొల్లోయైనను కేఫాయైనను లోక
మైనను జీవమైనను మరణమైనను ప్రస్తుతమందున్నవి
యైనను రాబోవునవియైనను సమస్తమును మీవే. ।
23 మీరు క్రీస్తువారు; క్రీస్తు దేవునివాడు.

4 ఈలాగున క్రీస్తు సేవకులమనియు, దేవుని మర్మ
ముల విషయములో గృహనిర్వాహకులమనియు ప్రతి
2 మనుష్యుడు మమ్మును భావింపవలెను. । మరియు గృహ
నిర్వాహకులలో ప్రతివాడును నమ్మకమైనవాడై యుం
3 డుట అవశ్యము. । మీ చేతనైనను ఏ మనుష్యునిచేత
నైనను[4] నేను విమర్శింపబడుట నాకు మిక్కిలి అల్ప
4 మైన సంగతి; నన్ను నేనే విమర్శించుకొనను. । నా
యందు నాకు ఏ దోషమును కానరాదు; అయినను
ఇందువలన నీతిమంతుడనుగా ఎంచబడను, నన్ను విమ
5 ర్శించువాడు ప్రభువే. । కాబట్టి సమయము రాక
మునుపు, అనగా ప్రభువు వచ్చు పర్యంతము, దేని
గూర్చియు తీర్పు తీర్చకుడి. ఆయన అంధకారమందలి
రహస్యములను వెలుగులోకి తెచ్చి హృదయముల
లోని ఆలోచనలను బయలుపరచునప్పుడు, ప్రతివాని
కిని తగిన మెప్పు దేవునివలన కలుగును.

6 సహోదరులారా, మీరు మమ్మును చూచి, లేఖన
ములయందు వ్రాసియున్న సంగతులను అతిక్రమింప
కూడదని నేర్చుకొని, మీరొకని పక్షమున మరియొకని
మీద ఉప్పొంగకుండునట్లు, ఈ మాటలు మీ నిమిత్తమై
నామీదను అపొల్లోమీదను పెట్టుకొని సాదృశ్య
7 రూపముగా చెప్పియున్నాను. । ఎందుకనగా నీకు
ఆధిక్యము కలుగజేయువాడెవడు? నీకు కలిగినవాటిలో
పరునివలన నీవు పొందనిది ఏది? పొందియుండియు
పొందనట్టు నీవు అతిశయింపనేల? । ఇదివరకే మీ 8
రేమియు కొదువలేక తృప్తులైతిరి, ఇదివరకే ఐశ్వర్య
వంతులైతిరి, మమ్మును విడిచిపెట్టి మీరు రాజులైతిరి;
అవును, మీరు రాజులైతే నాకు సంతోషమే; అప్పుడు
మేమును మీతోకూడ రాజులమగుదుము గదా! ।
మరణదండనకు విధింపబడినవారమైనట్టు దేవుడు 9
అపొస్తలులమైన మమ్మును అందరికంటె కడపట ఉంచి
యున్నాడని నాకు తోచుచున్నది. మేము లోకమున
కును దేవదూతలకును మనుష్యులకును వేడుకగా
నున్నాము. । మేము క్రీస్తు నిమిత్తము వెఱ్ఱివారము, 10
మీరు క్రీస్తునందు బుద్ధిమంతులు; మేము బలహీను
లము, మీరు బలవంతులు; మీరు ఘనులు, మేము ఘన
హీనులము. । ఈ గడియవరకు ఆకలిదప్పులు గల 11
వారము, దిగంబరులము; పిడిగుద్దులు తినుచున్నాము;
నిలువరమైన నివాసములేక యున్నాము; । స్వహస్త 12
ములతో పని చేసి కష్టపడుచున్నాము. నిందింపబడియు
దీవించుచున్నాము; హింసింపబడియు ఓర్చుకొను
చున్నాము; । దూషింపబడియు బతిమాలుకొనుచు 13
న్నాము. లోకమునకు మురికిగాను అందరికి పెంట
గాను ఇదివరకు ఎంచబడియున్నాము.

మిమ్మును సిగ్గుపరచవలెనని కాదు గాని నా ప్రియ 14
మైన పిల్లలని మీకు బుద్ధిచెప్పుట కీమాటలు వ్రాయు
చున్నాను. । క్రీస్తునందు మీకు ఉపదేశకులు పదివేల 15
మంది యున్నను తండ్రులు అనేకులు లేరు. క్రీస్తు 16
యేసునందు సువార్త ద్వారా నేను మిమ్మును కంటిని
గనుక మీరు నన్ను పోలి నడుచుకొనువారై యుండ
వలెనని మిమ్మును బతిమాలుకొనుచున్నాను. । ఇందు 17
నిమిత్తము ప్రభువునందు నాకు ప్రియుడును నమ్మక
మైన నా కుమారుడునగు తిమోతెయును మీయొద్దకు
పంపియున్నాను. అతడు క్రీస్తునందు నేను నడుచు
కొను విధమును, అనగా ప్రతి స్థలములోను ప్రతి
సంఘములోను నేను బోధించు విధమును, మీకు
జ్ఞాపకము చేయును. । నేను మీయొద్దకు రానని అను 18
కొని కొందరుప్పొంగుచున్నారు. । ప్రభువు చిత్తమైతే 19
త్వరలోనే మీయొద్దకు వచ్చి ఉప్పొంగుచున్నవారి
మాటలను కాదు వారి శక్తినే తెలిసికొందును. । దేవుని 20
రాజ్యము మాటలతో కాదు శక్తితోనే యున్నది. ।
మీరేది కోరుచున్నారు? బెత్తముతో నేను మీయొద్దకు 21
రావలెనా? ప్రేమతోను సాత్వికమైన మనస్సుతోను
రావలెనా?

మీలో జారత్వమున్నదని వదంతి కలదు. మీలో 5
ఒకడు తన తండ్రి భార్యను ఉంచుకొన్నాడట. అట్టి
జారత్వము అన్యజనులలోనైనను జరుగదు. । ఇట్లుం 2

[1] లేక, మీరు ఆ ఆలయమై యున్నారు. [2] యోబు, 5: 13. [3] కీర్తన, 97: 7. [4] మూలభాషలో--మనుష్యదినముననైనను.

డియు, మీరుప్పొంగుచున్నారే గాని మీరెంతమా
త్రము దుఃఖపడి యీలాటి కార్యము చేసినవానిని
3 మీలోనుండి వెలివేసినవారు కారు. । నేను దేహ
విషయమై దూరముగా ఉన్నను ఆత్మవిషయమై
సమీపముగా ఉండి, మీతోకూడ ఉండినట్టుగానే
యిట్టి కార్యము ఈలాగు చేసినవానిగూర్చి యిదివరకే
4 తీర్పు తీర్చియున్నాను. । ఏమనగా, ప్రభువైన యేసు
5 దినమందు వాని ఆత్మ రక్షింపబడునట్లు శరీరేచ్ఛలు
నశించుటకై,[1] మన ప్రభువైన యేసుక్రీస్తు నామమున
మీరును నా ఆత్మయు మన ప్రభువైన యేసుక్రీస్తు
బలముతో కూడి వచ్చినప్పుడు, అట్టివానిని సాతానుకు
6 అప్పగింపవలెను. । మీరు అతిశయపడుట మంచిది
కాదు. పులిసిన పిండి కొంచెమైనను ముద్దంతయు
7 పులియజేయునని మీరెరుగరా? । మీరు పులిపిండి లేని
వారు గనుక క్రొత్తముద్ద అవుటకై ఆ పాతదైన పులి
పిండిని తీసి పారవేయుడి. ఇంతేకాక క్రీస్తు అను
8 మన పస్కాపశువు వధింపబడెను । గనుక పాతదైన
పులిపిండితోనైనను దుర్మార్గతయు దుష్టత్వమునను పులి
పిండితోనైనను కాకుండ, నిష్కాపట్యమును సత్యము
నను పులియనిరొట్టెతో పండుగ ఆచరింతము.

9 జారులతో సాంగత్యము చేయవద్దని నా పత్రి
10 కలో మీకు వ్రాసియుంటిని. । అయితే ఈ లోకపు
జారులతోనైనను లోభులతోనైనను దోచుకొను
వారితోనైనను విగ్రహారాధకులతోనైనను ఏమాత్ర
మును సాంగత్యము చేయవద్దని కాదు; అలాగైతే
మీరు లోకములోనుండి వెళ్లిపోవలసివచ్చును గదా? ।
11 ఇప్పుడైతే, సహోదరుడనబడిన వాడెవడైనను జారుడు
గాని లోభిగాని విగ్రహారాధకుడుగాని తిట్టుబోతు
గాని త్రాగుబోతుగాని దోచుకొనువాడుగాని అయి
యున్నయెడల, అట్టివానితో సాంగత్యము చేయ
కూడదు భుజింపనుకూడదని మీకు వ్రాయుచు
12 న్నాను. । వెలుపటివారికి తీర్పు తీర్చుట నాకేల? వెల
13 పటివారికి దేవుడే తీర్పు తీర్చును గాని । మీరు లోపటి
వారికి తీర్పు తీర్చువారు గనుక ఆ దుర్మార్గుని మీలో
నుండి వెలివేయుడి.

**6** మీలో ఒకనికి మరియొకనిమీద వ్యాజ్యమున్న
ప్పుడు వాడు పరిశుద్ధులయెదుట గాక అనీతిమంతుల
యెదుట వ్యాజ్యమాడుటకు తెగించుచున్నాడా? ।
2 పరిశుద్ధులు లోకమునకు తీర్పు తీర్చుదురని మీరెరు
గరా? మీవలన లోకమునకు తీర్పు జరుగవలసియుం
డగా, మిక్కిలి అల్పమైన సంగతులనుగూర్చి తీర్పు
3 తీర్చుటకు మీకు యోగ్యత లేదా? । మనము దేవదూత
లకు తీర్పు తీర్చుదుమని యెరుగరా? ఈ జీవన సంబంధ
మైన సంగతులనుగూర్చి మరి ముఖ్యముగా తీర్పు తీర్చ
4 వచ్చును గదా? । కాబట్టి యీ జీవన సంబంధమైన

వ్యాజ్యములు మీకు కలిగినయెడల వాటిని తీర్చుటకు
సంఘములో తృణీకరింపబడినవారిని కూర్చుండబెట్టు
దురా?[2] । మీకు సిగ్గురావలెనని చెప్పుచున్నాను. ఏమి? 5
తన సహోదరుల మధ్యను వ్యాజ్యము తీర్చగల బుద్ధి
మంతుడు మీలో ఒక్కడైనను లేడా? । అయితే 6
సహోదరుడు సహోదరునిమీద వ్యాజ్యమాడు
చున్నాడు, మరి అవిశ్వాసుల యెదుటనే వ్యాజ్య
మాడుచున్నాడు. । ఒకనిమీద ఒకడు వ్యాజ్యమాడుట 7
మీలో ఇప్పటికే కేవలము లోపము. అంతకంటె
అన్యాయము సహించుట మేలు కాదా? దానికంటె
మీ సొత్తుల నపహరింపబడనిచ్చుట మేలు కాదా? ।
అయితే మీరే అన్యాయము చేయుచున్నారు, అపహ 8
రించుచున్నారు, మీ సహోదరులకే యీలాగు
చేయుచున్నారు. । అన్యాయస్థులు దేవుని రాజ్యము 9
నకు వారసులు కానేరరని మీకు తెలియదా? మోస
పోకుడి; జారులైనను విగ్రహారాధకులైనను వ్యభిచారు
లైనను ఆడంగితనముగలవారైనను పురుషసంయోగు
లైనను । దొంగలైనను లోభులైనను త్రాగుబోతు 10
లైనను దూషకులైనను దోచుకొనువారైనను దేవుని
రాజ్యమునకు వారసులు కానేరరు. । మీలో కొం 11
దరు అట్టివారై యుంటిరి గాని ప్రభువైన యేసుక్రీస్తు
నామమునను మన దేవుని ఆత్మయందును మీరు కడుగ
బడి, పరిశుద్ధపరచబడినవారై నీతిమంతులుగా తీర్చ
బడితిరి.

అన్నిటియందు నాకు స్వాతంత్ర్యము కలదుగాని 12
అన్నియు చేయదగినవి కావు. అన్నిటియందు నాకు
స్వాతంత్ర్యము కలదుగాని నేను దేనిచేతను లోప
రచుకొనబడనొల్లను. । భోజనపదార్థములు కడుపునకును 13
కడుపు భోజనపదార్థములకును నియమింపబడియు
న్నవి; దేవుడు దానిని వాటిని నాశనము చేయును.
దేహము జారత్వము నిమిత్తము కాదు ప్రభువు నిమి
త్తమే; ప్రభువు దేహము నిమిత్తమే. । దేవుడు ప్రభు 14
వును లేపెను; మనలనుకూడ తన శక్తివలన లేపును. ।
మీ దేహములు క్రీస్తునకు అవయవములై యున్నవని 15
మీరెరుగరా? నేను క్రీస్తుయొక్క అవయవములను
తీసికొని వేశ్యయొక్క అవయవములుగా చేయుదునా?
అదెంతమాత్రమును తగదు. । వేశ్యతో కలిసికొను 16
వాడు దానితో ఏకదేహమై యున్నాడని మీరెరు
గరా?

—వారిద్దరు ఏకశరీరమై యుందురు[3]

అని (మోషే) చెప్పుచున్నాడు గదా? । అటువలె 17
ప్రభువుతో కలిసికొనువాడు ఆయనతో ఏకాత్మయై
యున్నాడు. । జారత్వమునకు దూరముగా పారి 18
పోవుడి. మనుష్యుడు చేయు ప్రతి పాపము దేహము
నకు వెలుపట ఉన్నది గాని జారత్వము చేయువాడు

[1] మూలభాషలో—శరీరము నశించుటకై. [2] లేక, కూర్చుండబెట్టుడి. [3] ఆదికాండము, 2: 24.

తన స్వంత శరీరమునకు హానికరముగా పాపము
19 చేయుచున్నాడు. । మీ దేహము దేవునివలన మీకు
అనుగ్రహింపబడి, మీలోనున్న పరిశుద్ధాత్మకు ఆల
యమై యున్నదని మీరెరుగరా? మీరు మీ సొత్తు
20 కారు, । విలువపెట్టి కొనబడినవారు గనుక మీ
దేహముతో దేవుని మహిమపరచుడి.

7 మీరు వ్రాసినవాటి విషయమై నేను చెప్పునదే
మనగా—స్త్రీని ముట్టకుండుట పురుషునికి మేలు. ।
2 అయినను జారత్వములు జరుగుచున్నందున ప్రతి
వానికి స్వభార్య యుండవలెను, ప్రతి స్త్రీకి స్వభర్త
3 యుండవలెను. । భర్త భార్యకును ఆలాగుననే భార్య
4 భర్తకును వారి వారి ధర్మములు నడుపవలెను. । భర్తకే
గాని భార్యకు తన దేహముపైని అధికారములేదు;
ఆలాగున భార్యకేగాని భర్తకు తన దేహముపైని అధి
5 కారములేదు. । ప్రార్థనచేయుటకు మీకు సావ
కాశము కలుగునట్లు కొంతకాలమువరకు ఉభయుల
సమ్మతిచొప్పుననే తప్ప, ఒకరినొకరు ఎడబాయకుడి;
మీరు మనస్సు నిలుపలేకపోయినప్పుడు సాతాను
6 మిమ్మును శోధింపకుండునట్లు తిరిగి కలిసికొనుడి. । ఇది
7 నా హితోపదేశమేగాని[1] ఆజ్ఞ కాదు; మనుష్యు
లందరు నావలె ఉండ గోరుచున్నాను. అయినను
ఒకడొక విధమునను మరియొకడు మరియొక విధము
నను ప్రతి మనుష్యుడు తనకున్న కృపావరమును దేవుని
వలన పొందియున్నాడు.

8 నావలెనుండుట వారికి మేలని పెండ్లికానివారి
9 తోను విధవరాండ్లతోను చెప్పుచున్నాను. । అయితే
మనస్సు నిలుపలేనియెడల పెండ్లిచేసికొనవచ్చును;
కామతప్తులగుటకంటె పెండ్లిచేసికొనుట మేలు. ।
10 మరియు పెండ్లియైనవారికి నేను కాదు ప్రభువే ఆజ్ఞా
పించునదేమనగా, భార్య భర్తను ఎడబాయకూడదు. ।
11 ఎడబాసినయెడల పెండ్లిచేసికొనకుండవలెను; లేదా,
తన భర్తతో సమాధానపడవలెను. మరియు భర్త తన
12 భార్యను పరిత్యజింపకూడదు. । ప్రభువు కాదు నేనే
తక్కినవారితో చెప్పునదేమనగా—ఏ సహోదరుని
కైనను అవిశ్వాసురాలైన భార్య కలిగియుండి, ఆమె
అతనితో కాపురము చేయ నిష్టపడినయెడల, అతడు
13 ఆమెను పరిత్యజింపకూడదు. । మరియు ఏ స్త్రీకైనను
అవిశ్వాసియైన భర్త కలిగియుండి, ఆమెతో కాపురము
చేయ నిష్టపడినయెడల, ఆమె అతని పరిత్యజింపకూ
14 డదు. । అవిశ్వాసియైన భర్త భార్యనుబట్టి పరిశుద్ధపరచ
బడును; అవిశ్వాసురాలైన భార్య విశ్వాసియైన భర్తను
బట్టి[2] పరిశుద్ధపరచబడును. లేనియెడల మీ పిల్లలు అప
విత్రులై యుందురు, ఇప్పుడైతే వారు పవిత్రులు. ।
15 అయితే అవిశ్వాసియైనవాడు ఎడబాసిన ఎడబాయ
వచ్చును; అట్టి సందర్భములలో సహోదరునికైనను
సహోదరికైనను నిర్బంధము లేదు. సమాధానముగా
ఉండుటకు దేవుడు మనలను[3] పిలిచియున్నాడు. । ఓ 16
స్త్రీ, నీకేమి తెలియును? నీ భర్తను రక్షించెదవేమో.
పురుషుడా, నీకేమి తెలియును? నీ భార్యను రక్షించెద
వేమో । అయితే ప్రభువు ప్రతివానికి ఏ స్థితి నియ 17
మించెనో, దేవుడు ప్రతివానిని ఏ స్థితియందు పిలి
చెనో, ఆ స్థితియందే నడుచుకొనవలెను; ఈ ప్రకా
రమే సంఘములన్నిటిలో నియమించుచున్నాను. ।
సున్నతి పొందినవాడెవడైనను పిలువబడెనా? అతడు 18
సున్నతి పోగొట్టుకొనవలదు; సున్నతి పొందనివా
డెవడైనను పిలువబడెనా? సున్నతి పొందవలదు. ।
దేవుని ఆజ్ఞలను అనుసరించుటయే (ముఖ్యముగాని) 19
సున్నతి పొందుటయందు ఏమియు లేదు, సున్నతి
పొందకపోవుటయందు ఏమియు లేదు. । ప్రతివాడు 20
ఏ స్థితిలో పిలువబడెనో ఆ స్థితిలోనే యుండవలెను. ।
దాసుడవై యుండగా పిలువబడితివా? చింతపడవద్దు 21
గాని స్వతంత్రుడవగుటకు శక్తి కలిగినయెడల, స్వతం
త్రుడవగుట మరి మంచిది.[4] । ప్రభువునందు పిలువ 22
బడిన దాసుడు ప్రభువువలన స్వాతంత్ర్యము పొందిన
వాడు. ఆ ప్రకారమే స్వతంత్రుడైయుండి పిలువ
బడినవాడు క్రీస్తు దాసుడు. । మీరు విలువపెట్టి 23
కొనబడినవారు గనుక మనుష్యులకు దాసులు కాకుడి. ।
సహోదరులారా, ప్రతి మనుష్యుడును ఏ స్థితిలో 24
పిలువబడునో ఆ స్థితిలోనే దేవునితో (సహవాసము
కలిగి) ఉండవలెను.

కన్యకల విషయమై ప్రభువుయొక్క ఆజ్ఞ నేను 25
పొందలేదు గాని నమ్మకమైనవాడనై యుండుటకు
ప్రభువువలన కనికరము పొందినవాడనై నా తాత్ప
ర్యము చెప్పుచున్నాను. । ఇప్పటి ఇబ్బందినిబట్టి పురు 26
షుడు తానున్న స్థితిలోనే యుండుట మేలని తలంచు
చున్నాను. । భార్యకు బద్ధుడవై యుంటివా? విడుదల 27
కోరవద్దు. భార్యలేక విడిగానుంటివా? వివాహము
కోరవద్దు. । అయినను నీవు పెండ్లిచేసికొనినను పాపము 28
లేదు, కన్యక పెండ్లిచేసికొనినను ఆమెకు పాపము
లేదు; అయితే అట్టివారికి శరీరసంబంధమైన శ్రమలు
కలుగును; అవి మీకు కలుగకుండవలెనని కోరుచు
న్నాను. । సహోదరులారా, నేను చెప్పునదేమ 29
నగా, కాలము సంకుచితమై యున్నది గనుక ఇక
మీదట భార్యలు కలిగినవారు భార్యలు లేనట్టును ।
ఏడ్చువారు ఏడ్వనట్టును సంతోషపడువారు సంతోష 30
పడనట్టును కొనువారు తాము కొనినది తమది కానట్టును ।
ఈ లోకము అనుభవించువారు అమితముగా 31
అనుభవింపనట్టును ఉండవలెను; ఏలయనగా ఈ

1 లేక, సెలవేగాని. 2 మూలభాషలో—సహోదరునిబట్టి. 3 అనేక ప్రాచీనప్రతులలో—మిమ్మును అని పాఠాంతరము. 4 లేక—అంతేకాదు
స్వతంత్రుడవగుటకు శక్తి కలిగినను దాసుడవై యుండుటకే చూడుము.

32 లోకవు నటన గతించుచున్నది. । మీరు చింతలేని
వారై యుండవలెనని కోరుచున్నాను. పెండ్లికాని
వాడు ప్రభువును ఏలాగు సంతోషపెట్టగలనని
ప్రభువు విషయమైన కార్యములనుగూర్చి చింతించు
33 చున్నాడు. । పెండ్లియైనవాడు భార్యను ఏలాగు సం
తోషపెట్టగలనని లోకవిషయమైనవాటినిగూర్చి చిం
34 తించుచున్నాడు. । అటువలెనే పెండ్లికాని స్త్రీయు
కన్యకయు తాము శరీరమందును ఆత్మయందును పవి
త్రురాండ్లయి యుండుటకు ప్రభువు విషయమైన
కార్యములనుగూర్చి చింతించుచుందురు గాని పెండ్లి
యైనది భర్తను ఏలాగు సంతోషపెట్టగలనని లోకవిష
35 యమైనవాటినిగూర్చి చింతించుచున్నది. । మీకు ఉరి
యొడ్డవలెనని కాదుగాని మీరు యోగ్య ప్రవర్తనులై,
తొందర యేమియు లేక ప్రభువు సన్నిధానవర్తనులై
యుండవలెనని యిది మీ ప్రయోజనము నిమిత్తమే
36 చెప్పుచున్నాను. । అయితే ఒకని కుమార్తెకు[1] ఈడు
మించిపోయిన పక్షమందును, ఆమెకు వివాహము
చేయవలసివచ్చిన పక్షమందును, ఆమెకు వివాహము
చేయకపోవుట యోగ్యమైనది కాదని ఒకడు తలంచిన
యెడల, అతడు తన యిష్టముచొప్పున చేయవచ్చును;
అందులో పాపము లేదు, పెండ్లిచేసికొనవచ్చును
37 గాని । యెవడైనను తన కుమార్తెకు[1] పెండ్లిచేయ
నవసరములేక యుండి అతడు స్థిరచిత్తుడును, తన
ఇష్టప్రకారము జరుప శక్తిగలవాడునై, ఆమెను
వివాహము లేకుండ ఉంచవలెనని తన మనస్సులో
నిశ్చయించుకొనినయెడల బాగుగా ప్రవర్తించుచున్నా
38 డు. । కాబట్టి తన కుమార్తెకు[1] పెండ్లిచేయువాడు
బాగుగా ప్రవర్తించుచున్నాడు, పెండ్లిచేయనివాడు
39 మరి బాగుగా ప్రవర్తించుచున్నాడు. । భార్య తన
భర్త బ్రదికియున్నంతకాలము బద్ధురాలై యుండును,
భర్త మృతిపొందినయెడల ఆమెకిష్టమైనవాని పెండ్లిచేసి
కొనుటకు స్వతంత్రురాలై యుండును గాని ప్రభువు
40 నందు మాత్రమే పెండ్లిచేసికొనవలెను. । అయితే
ఆమె విధవరాలుగా ఉండినట్టయిన మరి ధన్యురాలని
నా అభిప్రాయము. దేవుని ఆత్మ నాకును కలిగియు
న్నదని తలంచుకొనుచున్నాను.

8 విగ్రహములకు బలిగా అర్పించినవాటి విషయమై
నేను చెప్పునదేమనగా—మనమందరము జ్ఞానము గల
వారమని యెరుగుదుము. జ్ఞానము ఉప్పొంగజేయును
2 గాని ప్రేమ క్షేమాభివృద్ధి కలుగజేయును. । ఒకడు
తనకేమైనను తెలియుననుకొనియుంటే తాను తెలిసి
కొనవలసినట్టు ఇంక ఏమియు తెలిసికొనినవాడు
3 కాడు. । ఒకడు దేవుని ప్రేమించినయెడల అతడు
4 దేవునికి ఎరుకైనవాడే. । కాబట్టి విగ్రహములకు బలిగా
అర్పించినవాటిని తినుట విషయమై (నేను చెప్పున
దేమనగా)—లోకమందు విగ్రహము వట్టిదనియు,
ఒక్కడే దేవుడు తప్ప వేరొక దేవుడు లేడనియు
ఎరుగుదుము. । దేవతలనబడినవారును ప్రభువులన 5
బడినవారును అనేకులున్నారు. ఆకాశమందైనను 6
భూమిమీదనైనను దేవతలనబడినవి యున్నను, మనకు
ఒకే దేవుడున్నాడు. ఆయన తండ్రి; ఆయన మూల
ముగా సమస్తమును కలిగెను; ఆయన నిమిత్తము మన
మున్నాము. మరియు మనకు ప్రభువు ఒక్కడే;
ఆయన యేసుక్రీస్తు; ఆయనద్వారా సమస్తమును కలి
గెను; మనము ఆయనద్వారా కలిగినవారము. ।
అయితే అందరియందు ఈ జ్ఞానము లేదు. కొంద 7
రిదివరకును విగ్రహమును ఆరాధించినవారు గనుక
(తాము భుజించుపదార్థములు) విగ్రహమునకు బలి
యియ్యబడినవని యెంచి భుజించుదురు; ఇందువలన
వారి మనస్సాక్షి బలహీనమైనదై అపవిత్రమగుచు
న్నది. । భోజనమునుబట్టి దేవునియెదుట మనము 8
మెప్పుపొందము; తినకపోయినందున మనకు తక్కువ
లేదు, తినినందున మనకు ఎక్కువలేదు. । అయినను 9
మీకు కలిగియున్న యీ స్వాతంత్ర్యమువలన బల
హీనులకు అభ్యంతరము కలుగకుండ చూచుకొనుడి. ।
ఏలయనగా జ్ఞానముగల నీవు విగ్రహాలయమందు 10
భోజనపంక్తిని కూర్చుండగా ఒకడు చూచినయెడల,
బలహీనమైన మనస్సాక్షిగల అతడు విగ్రహములకు
బలి యియ్యబడిన పదార్థములను తినుటకు ధైర్యము
తెచ్చుకొనును గదా? । అందువలన ఎవనికొరకు 11
క్రీస్తు చనిపోయెనో ఆ బలహీనుడైన నీ సహో
దరుడు నీ జ్ఞానమునుబట్టి నశించును. । ఈలాగు సహో 12
దరులకు విరోధముగా పాపము చేయుటవలనను,
వారి బలహీనమైన మనస్సాక్షిని నొప్పించుటవలనను,[2]
మీరు క్రీస్తుకు విరోధముగా పాపము చేయువారగు
చున్నారు. । కాబట్టి భోజనపదార్థమువలన నా 13
సహోదరునికి అభ్యంతరము కలిగినయెడల, నా
సహోదరునికి అభ్యంతరము కలుగజేయకుండుటకై
నేనెన్నటికిని మాంసము తినను.

నేను స్వతంత్రుడను కానా? నేను అపొస్తలు 9
డను కానా? మన ప్రభువైన యేసును నేను చూడ
లేదా? ప్రభువునందు నాపనికి ఫలము మీరు కారా? ।
ఇతరులకు నేను అపొస్తలుడను కాకపోయినను మీ 2
మట్టుకైనను అపొస్తలుడనై యున్నాను. ప్రభువు
నందు నా అపొస్తలత్వమునకు ముద్రగా ఉన్నవారు
మీరే కారా? । నన్ను విమర్శించువారికి నేను చెప్పు 3
సమాధానమిదే. । తినుటకును త్రాగుటకును మాకు 4
అధికారము లేదా? । తక్కిన అపొస్తలులవలెను, 5
ప్రభువుయొక్క సహోదరులవలెను, కేఫావలెను
విశ్వాసురాలైన భార్యను వెంటబెట్టుకొని తిరుగుటకు

[1] మూలభాషలో--కన్యకు.
[3] మూలభా.—గాయపరచుటవలనను.

6 మాకు అధికారము లేదా? । మరియు పని చేయకుండు
టకు నేనును బర్నబాయు మాత్రమే అధికారము
7 లేనివారమా? । ఎవడైనను తన స్వంత ఖర్చు పెట్టుకొని
దండుకొలువు చేయునా? ద్రాక్షతోట వేసి దాని
ఫలము తిననివాడెవడు? మందను కాచి మంద పాలు
8 త్రాగనివాడెవడు? । ఈ మాటలు లోకాచారమును
బట్టి[1] చెప్పుచున్నానా? ధర్మశాస్త్రముకూడ వీటిని చెప్పు
చున్నది గదా?
9 —కళ్లము త్రొక్కుచున్న యెద్దు మూతికి చిక్కము
పెట్టవద్దు
10 అని మోషే ధర్మశాస్త్రములో వ్రాయబడియున్నది.[2]
దేవుడు ఎడ్లకొరకు విచారించుచున్నాడా? కేవలము
మనకొరకు దీని చెప్పుచున్నాడా? అవును, మన
కొరకే గదా యీ మాట వ్రాయబడెను. ఏలయనగా,
దున్నువాడు (పాలుపొందుదునను) ఆశతో దున్న
వలెను, కళ్లము త్రొక్కించువాడు పంటలో పాలు
11 పొందుదునను ఆశతో త్రొక్కింపవలెను. । మీ
కొరకు ఆత్మసంబంధమైనవి మేము విత్తియుండగా మీ
వలన శరీరసంబంధమైన ఫలములు కోసికొనుట గొప్ప
12 కార్యమా? । ఇతరులకు మీ పైని యీ అధికార
ములో పాలు కలిగినయెడల మాకు ఎక్కువ కలదు
గదా? అయితే మేము ఈ అధికారమును వినియో
గించుకొనలేదు; క్రీస్తుసువార్తకు ఏ అభ్యంతరమైనను
కలుగజేయకుండుటకై అన్నిటిని సహించుచున్నా
13 ము. । ఆలయకృత్యములు జరిగించువారు ఆలయము
వలన జీవనము చేయుచున్నారనియు, బలిపీఠమునొద్ద
కనిపెట్టుకొని యుండువారు బలిపీఠముతో పాలివారై
14 యున్నారనియు మీరెరుగరా? । ఆలాగున సువార్త
ప్రచురించువారు సువార్తవలన జీవింపవలెనని ప్రభువు
15 నియమించియున్నాడు. । నేనైతే వీటిలో దేనినైనను
వినియోగించుకొనలేదు; మీరు నాయెడల ఈలాగున
జరుపవలెనని ఈ సంగతులు వ్రాయనులేదు. ఎవడై
నను నా అతిశయమును నిరర్థకము చేయుటకంటె
16 నాకు మరణమే మేలు. । నేను సువార్తను ప్రకటించు
చున్నను నాకు అతిశయకారణము లేదు. (సువా
ర్తను ప్రకటింపవలసిన) భారము నామీద మోపబడి
యున్నది. అయ్యో, నేను సువార్తను ప్రకటింపక
17 పోయినయెడల నాకు శ్రమ. । ఇది నేనిష్టపడి చేసిన
యెడల నాకు జీతము కలుగును. ఇష్టపడకపోయి
నను గృహనిర్వాహకత్వము నాకు అప్పగింపబడెను. ।
18 అట్లయితే నాకు జీతమేమి? నేను సువార్తను ప్రక
టించునప్పుడు సువార్తయందు నాకున్న అధికార
మును పూర్ణముగా వినియోగపరచుకొనకుండ సువా
ఉచితముగా ప్రకటించుటయే (నాకున్న జీత
నేను అందరి విషయము స్వతంత్రుడనై
యున్నను ఎక్కువమందిని సంపాదించికొనుటకై
అందరికిని నన్ను నేనే దాసునిగా చేసికొంటిని. ।
యూదులను సంపాదించికొనుటకు యూదులకు 20
యూదునివలె ఉంటిని. ధర్మశాస్త్రమునకు లోబడిన
వారిని సంపాదించికొనుటకు నేను ధర్మశాస్త్రమునకు
లోబడినవాడను కాకపోయినను ధర్మశాస్త్రమునకు
లోబడినవానివలె ఉంటిని. । దేవునివిషయమై ధర్మ 21
శాస్త్రము లేనివాడను కాను గాని క్రీస్తువిషయమై
ధర్మశాస్త్రమునకు లోబడినవాడను. అయినను ధర్మ
శాస్త్రము లేనివారిని సంపాదించికొనుటకు ధర్మశాస్త్రము
లేనివారికి ధర్మశాస్త్రము లేనివానివలె ఉంటిని. । బల 22
హీనులను సంపాదించికొనుటకు బలహీనులకు బల
హీనుడనైతిని. ఏ విధముచేతనైనను కొందరిని రక్షిం
పవలెనని అందరికి అన్నివిధములవాడనై యున్నాను. ।
మరియు నేను సువార్తలో వారితో పాలివాడనగు 23
టకై దానికొరకే సమస్తమును చేయుచున్నాను. ।
పందెపు రంగమందు పరుగెత్తువారందరు పరుగెత్తు 24
దురు గాని యొక్కడే బహుమానము పొందునని
మీకు తెలియదా? అటువలె మీరు బహుమానము
పొందునట్లుగా పరుగెత్తుడి. । మరియు పందెమందు 25
పోరాడు ప్రతివాడు అన్ని విషయములయందు మిత
ముగా ఉండును. వారు క్షయమగు కిరీటమును పొందు
టకును, మనమైతే అక్షయమగు కిరీటమును పొందు
టకును (మితముగా ఉన్నాము.) । కాబట్టి నేను గురి 26
చూడనివానివలె పరుగెత్తువాడను కాను, । గాలిని 27
కొట్టినట్టు నేను పోట్లాడుట లేదు గాని ఒకవేళ ఇతరు
లకు ప్రకటించిన తరువాత నేనే భ్రష్టుడనై పోదు
నేమో అని నా శరీరమును నలగగొట్టి దాని లోపరచు
కొనుచున్నాను.

సహోదరులారా, యీ సంగతి మీకు తెలి 10
యకుండుట నాకిష్టము లేదు. అదేదనగా, మన పిత
రులందరు మేఘముక్రింద నుండిరి. వారందరును
సముద్రములో నడిచిపోయిరి; । అందరును మోషేను 2
బట్టి మేఘములోను సముద్రములోను బాప్తిస్మము
పొందిరి; । అందరు ఆత్మసంబంధమైన ఒక్క ఆహార 3
మునే భుజించిరి; । అందరు ఆత్మసంబంధమైన ఒక్క 4
పానీయమునే పానము చేసిరి. ఏలయనగా తమ్మును
వెంబడించిన ఆత్మసంబంధమైన బండలోనిది త్రాగిరి;
ఆ బండ క్రీస్తే. । అయితే వారిలో ఎక్కువమంది 5
దేవునికిష్టులుగా ఉండకపోయిరి గనుక అరణ్య
ములో సంహరింపబడిరి. । వారు ఆశించిన ప్రకా 6
రము మనము చెడ్డవాటిని ఆశించకుండునట్లు ఈ సంగ
తులు మనకు దృష్టాంతములుగా ఉన్నవి.
—జనులు తినుటకును త్రాగుటకును కూర్చుండి 7
ఆడుటకు లేచిరి

[1] మూలభాషలో—మనుష్యరీతిగా. [2] ద్వితీ. 25: 4.

అని వ్రాయబడినట్లు[1] వారిలో కొందరివలె మీరు
8 విగ్రహారాధకులై యుండకుడి. । మరియు వారివలె
మనము వ్యభిచరింపక యుందము; వారిలో కొందరు
వ్యభిచరించినందున ఒక్క దినముననే యిరువది మూడు
9 వేలమంది కూలిరి. । మనము ప్రభువును[2] శోధింపక
యుందము; వారిలో కొందరు శోధించి సర్పముల
10 వలన నశించిరి. । మీరు సణుగకుడి; వారిలో కొం
11 దరు సణిగి సంహారకునిచేత నశించిరి. । ఈ సంగతులు
దృష్టాంతరూపకములుగా వారికి సంభవించి, యు
గాంతమందున్న మనకు బుద్ధి కలుగుటకై వ్రాయ
12 బడెను. । తాను నిలుచుచున్నానని తలంచుకొనువాడు
పడకుండునట్లు జాగ్రత్తగా చూచుకొనవలెను. ।
13 సాధారణముగా మనుష్యులకు కలుగు శోధనతప్ప
మరి ఏదియు మీకు సంభవింపలేదు. దేవుడు నమ్మదగిన
వాడు; మీరు సహింపగలిగినంతకంటె ఎక్కువగా
ఆయన మిమ్మును శోధింపబడనియ్యడు. అంతేకాదు,
సహింపగలుగుటకు ఆయన శోధనతోకూడ తప్పించు
కొను మార్గమును కలుగజేయును.
14 కాబట్టి నా ప్రియులారా, విగ్రహారాధనకు
15 దూరముగా పారిపొండి. । బుద్ధిమంతులతో మాట
లాడినట్లు మీతో మాటలాడుచున్నాను; నేను చెప్పు
16 సంగతిని మీరే ఆలోచించుడి । మనము దీవించు
ఆశీర్వచనపు పాత్రలోనిది[3] (త్రాగుట) క్రీస్తు రక్త
ములో పాలుపుచ్చుకొనుటయే. మనము విరుచు
రొట్టె (తినుట) క్రీస్తు శరీరములో పాలుపుచ్చు
17 కొనుటయే. । మనమందరము ఆ యొకటే రొట్టెలో
పాలుపుచ్చుకొనుచున్నాము; రొట్టె యొక్కటే గనుక
అనేకులమైన మనము ఒక్క శరీరమైయున్నాము. ।
18 శరీరప్రకారమైన ఇశ్రాయేలును చూడుడి. బలి
అర్పించినవాటిని తినువారు బలిపీఠముతో పాలివారు
19 కారా? । ఇక నేను చెప్పునదేమి? విగ్రహార్పితములో
ఏమైన ఉన్నదనియైనను విగ్రహములలో ఏమైన
20 ఉన్నదనియైనను చెప్పెదనా? । లేదుగాని అన్యజనుల
ర్పించు బలులు దేవునికి కాదు దయ్యములకే అర్పించు
చున్నారని చెప్పుచున్నాను. మీరు దయ్యములతో
21 పాలివారవుట నాకిష్టము లేదు. । మీరు ప్రభువు
పాత్రలోనిది దయ్యముల పాత్రలోనిది కూడ త్రాగ
నేరరు; ప్రభువు బల్లమీద ఉన్న దానిలోను దయ్య
ముల బల్లమీద ఉన్న దానిలోను కూడ పాలుపొంద
22 నేరరు. । ప్రభువుకు రోషము పుట్టించెదమా? ఆయన
కంటె మనము బలవంతులమా?
23 అన్ని విషయములయందు నాకు స్వాతంత్ర్యము
కలదు గాని అన్నియు చేయదగినవి కావు. అన్నిటి
యందు నాకు స్వాతంత్ర్యము కలదు గాని అన్నియు
క్షేమాభివృద్ధి కలుగజేయవు. । ఎవడును తనకొరకే 24
కాదు ఎదుటివానికొరకు మేలుచేయ చూచుకొన
వలెను. । మనస్సాక్షి నిమిత్తము ఏ విచారణయు 25
చేయక కటికవాని అంగడిలో అమ్మునదేదో దాని తిన
వచ్చును.

—భూమియు దాని పరిపూర్ణతయు ప్రభునివై 26
యున్నవి.[4]

అవిశ్వాసులలో ఒకడు మిమ్మును విందుకు పిలిచి 27
నపుడు వెళ్లుటకు మీకు మనస్సుండినయెడల మీకు
వడ్డించినది ఏదో దానిగూర్చి మనస్సాక్షి నిమిత్తము
ఏ విచారణయు చేయక తినుడి. । అయితే ఎవడైనను 28
మీతో — ఇది బలి అర్పింపబడినదని చెప్పినయెడల
అట్లు తెలిపినవాని నిమిత్తమును మనస్సాక్షి నిమిత్త
మును తినకుడి. । మనస్సాక్షి నిమిత్తమనగా నీ స్వంత 29
మనస్సాక్షి నిమిత్తము కాదు ఎదుటివాని మనస్సాక్షి
నిమిత్తమే యీలాగు చెప్పుచున్నాను. ఎందుకనగా
వేరొకని మనస్సాక్షినిబట్టి నా స్వాతంత్ర్య విషయ
ములో తీర్పు తీర్చబడనేల? । నేను కృతజ్ఞతతో పుచ్చు 30
కొనినయెడల నేను దేనినిమిత్తము కృతజ్ఞతాస్తుతులు
చెల్లించుచున్నానో దానినిమిత్తము నేను దూషింప
బడనేల? । కాబట్టి మీరు భోజనము చేసినను పానము 31
చేసినను మీరేమి చేసినను సమస్తమును దేవుని మహిమ
కొరకు చేయుడి. । యూదులకైనను, హెల్లేనీయుల 32
కైనను, దేవుని సంఘమునకైనను అభ్యంతరము కలుగ
జేయకుడి. । ఈలాగు నేను కూడ స్వప్రయోజనమును 33
కోరక అనేకులు రక్షింపబడవలెనని వారి ప్రయో
జనమును కోరుచు అన్నివిషయములలో అందరిని
సంతోషపెట్టుచున్నాను. **నేను** క్రీస్తును పోలి **11**
నడుచుకొనుచున్న ప్రకారము మీరును నన్ను పోలి
నడుచుకొనుడి.

మీరు అన్నివిషయములలో నన్ను జ్ఞాపకము 2
చేసికొనుచు, నేను మీకు అప్పగించిన ప్రకారము
కట్టడలను[5] గైకొనుచున్నారని మిమ్మును మెచ్చుకొను
చున్నాను. । ప్రతి పురుషునికి శిరస్సు క్రీస్తనియు, 3
స్త్రీకి శిరస్సు పురుషుడనియు, క్రీస్తుకు శిరస్సు దేవు
డనియు మీరు తెలిసికొనవలెనని కోరుచున్నాను. ।
ఏ పురుషుడు తలమీద ముసుకు వేసికొని ప్రార్థన 4
చేయునో లేక ప్రవచించునో, ఆ పురుషుడు తన
తలను అవమానపరచును. । ఏ స్త్రీ తలమీద ముసుకు 5
వేసికొనక ప్రార్థనచేయునో లేక ప్రవచించునో,
ఆ స్త్రీ తన తలను అవమానపరచును; ఏలయనగా
ఆమెకు క్షౌరము చేయబడినట్టుగానే యుండును. ।
స్త్రీ ముసుకు వేసికొననియెడల ఆమె తల వెండ్రుకలు 6
కత్తిరించుకొనవలెను. కత్తిరించుకొనుటయైనను క్షౌరము

1 నిర్గమ. 32: 6. 2 కొన్ని ప్రాచీనప్రతులలో—క్రీస్తును అని పాఠాంతరము. 3 లేక—మనము స్తుతించు స్తుతి పాత్రలోనిది.
4 కీర్తన. 24: 1. 5 లేక, పారంపర్యములను.

చేయించుకొనుటయైనను స్త్రీ కవమానమైతే ముసుకు
7 వేసికొనవలెను. । పురుషుడైతే దేవుని పోలికయు
మహిమయునై యున్నాడు గనుక తలమీద ముసుకు
వేసికొనకూడదు గాని స్త్రీ పురుషుని మహిమయై
8 యున్నది. । ఏలయనగా స్త్రీ పురుషునినుండి కలిగెనే
9 గాని పురుషుడు స్త్రీనుండి కలుగలేదు. । మరియు
స్త్రీ పురుషునికొరకే గాని పురుషుడు స్త్రీకొరకు
10 సృష్టింపబడలేదు.[1] । ఇందువలన దేవదూతలనుబట్టి
(భర్త) అధికార సూచనగా స్త్రీకి తలమీద ముసుకు
11 ఉండవలెను. । అయితే ప్రభువునందు స్త్రీకి వేరుగా
పురుషుడు లేడు పురుషునికి వేరుగా స్త్రీ లేదు. ।
12 స్త్రీ పురుషుని మూలముగా ఏలాగు కలిగెనో ఆలాగే
పురుషుడు స్త్రీనుండి కలిగెనుగాని సమస్తమైనవి దేవుని
13 మూలముగా కలిగియున్నవి. । మీలో మీరే యో
చించుకొనుడి; స్త్రీ ముసుకులేనిదై దేవుని ప్రార్థించుట
14 తగునా? । పురుషుడు తలవెండ్రుకలు పెంచుకొనుట
అతనికి అవమానమని స్వభావసిద్ధముగా మీకు
15 తోచునుగదా? । స్త్రీకి తలవెండ్రుకలు పైటచెంగుగా
ఇయ్యబడెను గనుక ఆమె తలవెండ్రుకలు పెంచు
16 కొనుట ఆమెకు ఘనము. । ఎవడైనను కలహ
ప్రియుడుగా కనబడినయెడల మాలోనైనను దేవుని
సంఘములలోనైనను ఇట్టి ఆచారములేదని (వాడు
తెలిసికొనవలెను.)

17 మీకు ఈ విధి నియమించుచు మిమ్మును మెచ్చు
కొనను. మీరు కూడివచ్చుట యెక్కువ కీడుకేగాని
18 యెక్కువ మేలుకు కాదు. । మొదటి సంగతి యేమ
నగా, మీరు సంఘమందు కూడియున్నప్పుడు మీలో
కక్షలు కలవని వినుచున్నాను. కొంతమట్టుకు ఇది
19 నిజమని నమ్ముచున్నాను. । మీలో యోగ్యులైనవా
రెవరో కనబడునట్లు మీలో భిన్నాభిప్రాయములుం
20 డక విధిలేదు. । మీరందరు కూడి వచ్చుచుండగా
మీరు ప్రభువు రాత్రిభోజనము చేయుట సాధ్యము
21 కాదు. । ఏలయనగా మీరు ఆ భోజనము చేయు
నప్పుడు ఒకనికంటె ఒకడు ముందుగా తనమట్టుకు
తాను భోజనము చేయుచున్నాడు; ఇందువలన
ఒకడు ఆకలిగొనును మరియొకడు మత్తుడవును. ।
22 ఇదేమి? అన్నపానములు పుచ్చుకొనుటకు మీకు
ఇండ్లు లేవా? దేవుని సంఘమును తిరస్కరించి పేద
లను సిగ్గుపరచుదురా? మీతో ఏమి చెప్పుదును? దీని
23 గూర్చి మిమ్మును మెచ్చుదునా? మెచ్చను. । నేను
ఈ విషయమై మీకు అప్పగించిన దానిని ప్రభువు
వలన పొందితిని. ప్రభువైన యేసు తాను అప్పగింప
బడిన రాత్రి యొక రొట్టెను ఎత్తికొని కృతజ్ఞతాస్తు
24 తులు చెల్లించి । దాని విరిచి—యిది మీ కొరకైన[2] నా
శరీరము; నన్ను జ్ఞాపకము చేసికొనుటకై దీని చేయు
డని చెప్పెను. । ఆ ప్రకారమే భోజనమైన పిమ్మట 25
ఆయన పాత్రను ఎత్తికొని—యీ పాత్ర నా రక్తము
వలననైన క్రొత్తనిబంధన; మీరు దీనిలోనిది త్రాగు
నప్పుడెల్ల నన్ను జ్ఞాపకముచేసికొనుటకై దీని చేయు
డని చెప్పెను. । మీరు ఈ రొట్టెను తిని యీ 26
పాత్రలోనిది త్రాగునప్పుడెల్ల ప్రభువు వచ్చు పర్యం
తము ఆయన మరణమును ప్రచురించుదురు. । కాబట్టి 27
యెవడు అయోగ్యముగా ప్రభువుయొక్క రొట్టెను
తినునో, లేక ఆయన పాత్రలోనిది త్రాగునో, వాడు
ప్రభువుయొక్క శరీరమును గూర్చియు రక్తమును
గూర్చియు అపరాధియగును. । కాబట్టి ప్రతి మను 28
ష్యుడు తన్ను తాను పరీక్షించుకొనవలెను; ఆలాగు
చేసి ఆ రొట్టెను తిని ఆ పాత్రలోనిది త్రాగ
వలెను. । ప్రభువు శరీరమని వివేచింపక తిని త్రాగు 29
వాడు తనకు శిక్షావిధి కలుగుటకే తిని త్రాగుచున్నా
డు. । ఇందువలననే మీలో అనేకులు బలహీనులును 30
రోగులునై యున్నారు; చాలమంది నిద్రించుచు
న్నారు. । అయితే మనలను మనమే విమర్శించుకొనిన 31
యెడల తీర్పు పొందక పోదుము. । మనము తీర్పు 32
పొందినయెడల లోకముతోపాటు మనకు శిక్షావిధి
కలుగకుండునట్లు ప్రభువుచేత శిక్షింపబడుచున్నా
ము. । కాబట్టి నా సహోదరులారా, భోజనము 33
చేయుటకు మీరు కూడి వచ్చునప్పుడు ఒకనికొరకు
ఒకడు కనిపెట్టుకొని యుండుడి. । మీరు కూడి 34
వచ్చుట శిక్షావిధికి కారణము కాకుండునట్లు, ఎవ
డైన ఆకలిగొనినయెడల తన యింటనే భోజనము
చేయవలెను. నేను వచ్చినప్పుడు మిగిలిన సంగతులను
క్రమపరతును.

మరియు సహోదరులారా, ఆత్మసంబంధమైన 12
వరములనుగూర్చి మీకు తెలియకుండుట నాకిష్టము
లేదు. । మీరు అన్యజనులై యున్నప్పుడు మూగ 2
విగ్రహములను ఆరాధించుటకు ఎటుపడిన అటు నడి
పింపబడితిరని మీకు తెలియును. । ఇందుచేత దేవుని 3
ఆత్మవలన మాటలాడువాడెవడును యేసు శాపగ్రస్తు
డని చెప్పడనియు, పరిశుద్ధాత్మవలన తప్ప ఎవడును
యేసు ప్రభువని చెప్పలేడనియు నేను మీకు తెలియ
జేయుచున్నాను.

కృపావరములు నానావిధములుగా ఉన్నవి గాని 4
ఆత్మ యొక్కడే. । మరియు పరిచర్యలు నానావిధము 5
లుగా ఉన్నవి గాని ప్రభువు ఒక్కడే. । నానావిధ 6
ములైన కార్యములు కలవు గాని అందరిలో అన్నిటిని
జరిగించు దేవుడు ఒక్కడే. । అయినను (అందరి) 7
ప్రయోజనముకొరకు ప్రతివానికి ఆత్మ ప్రత్యక్షత
అనుగ్రహింపబడుచున్నది. । ఏలాగనగా, ఒకనికి 8
ఆత్మమూలముగా జ్ఞానవాక్యమును, మరియొకనికి ఆ

[1] ఆదికాండము, 2: 18–21.   [2] అనేక ప్రాచీనప్రతులలో—మీకొరకు విరువబడిన అని పాఠాంతరము.

9 ఆత్మ ననుసరించిన బుద్ధివాక్యమును, । మరియొకనికి ఆ
ఆత్మవలననే విశ్వాసమును, మరియొకనికి ఆ ఒక్క
10 ఆత్మవలననే స్వస్థపరచు వరములును । మరియొకనికి
అద్భుతకార్యములను చేయు శక్తియు, మరియొకనికి
ప్రవచన వరమును, మరియొకనికి ఆత్మల వివేచనయు,
మరియొకనికి నానావిధ భాషలును, మరియొకనికి
భాషల అర్థము చెప్పు శక్తియు అనుగ్రహింపబడి
11 యున్నవి. । అయినను వీటినన్నిటిని ఆ ఆత్మ యొకడే
తన చిత్తముచొప్పున ప్రతివానికి ప్రత్యేకముగా పంచి
యిచ్చుచు కార్యసిద్ధి కలుగజేయుచున్నాడు.
12 ఏలాగు శరీరము ఏకమై యున్నను అనేకమైన
అవయవములు కలిగియున్నదో, యేలాగు శరీరము
యొక్క అవయవములన్నియు అనేకములై యున్నను
ఒక్క శరీరమై యున్నవో, ఆలాగే క్రీస్తు ఉన్నా
13 డు. । ఏలాగనగా, యూదులమైనను హెల్లేనీయుల
మైనను, దాసులమైనను స్వతంత్రులమైనను, మనమం
దరము ఒక్క శరీరముగా ఉండుటకు[1] ఒక్క ఆత్మ
యందే బాప్తిస్మము పొందితిమి. మనమందరము ఒక్క
14 ఆత్మను పానముచేసినవారమైతిమి. । శరీరమొక్కటే
అవయవముగా ఉండక అనేకమైన అవయవములుగా
15 ఉన్నది. ।—నేను చెయ్యి కాను గనుక శరీరములోని
దానను కానని పాదము చెప్పినంతమాత్రమున శరీరము
16 లోనిది కాకపోలేదు. । మరియు—నేను కన్ను కాను
గనుక శరీరములోనిదానను కానని చెవి చెప్పినంత
17 మాత్రమున శరీరములోనిది కాకపోలేదు. । శరీర
మంతయు కన్నయితే వినుట ఎక్కడ? అంతయు
18 వినుటయైతే వాసనచూచుట ఎక్కడ? । అయితే
దేవుడు అవయవములలో ప్రతిదానిని తన చిత్తప్రకా
19 రము శరీరములో నుంచెను. । అవన్నియు ఒక్క
20 అవయవమైతే శరీరమెక్కడ? । అవయవములు అనేక
21 ములైనను శరీరమొక్కటే । గనుక కన్ను చేతితో—
నీవు నాకక్కరలేదని చెప్పజాలదు; తల పాదము
22 లతో—మీరు నాకక్కరలేదని చెప్పజాలదు. । అంతే
కాదు. శరీరముయొక్క అవయవములలో ఏవి మరి
బలహీనములుగా కనబడునో అవి మరి అవశ్యములే. ।
23 శరీరములో ఏ అవయవములు ఘనతలేనివని తలంతుమో
ఆ అవయవములను మరి ఎక్కువగా ఘనపరచుచు
న్నాము. సుందరములుకాని మన అవయవములకు
24 ఎక్కువైన సౌందర్యము కలుగును. । సుందరములైన
25 మన అవయవములకు ఎక్కువ సౌందర్యమక్కరలేదు.
అయితే శరీరములో వివాదములేక, అవయవములు
ఒకదానినొకటి యేకముగా పరామర్శించులాగున,
దేవుడు తక్కువదానికే యెక్కువ ఘనత కలుగజేసి
26 శరీరమును అమర్చియున్నాడు. । కాగా ఒక అవయ
వము శ్రమపడునప్పుడు అవయవములన్నియు దానితో
కూడ శ్రమపడును; ఒక అవయవము ఘనత పొందు
నప్పుడు అవయవములన్నియు దానితోకూడ సంతో
షించును. । అటువలె మీరు క్రీస్తుయొక్క శరీరమై 27
యుండి వేరువేరుగా అవయవములై యున్నారు. ।
మరియు దేవుడు సంఘములో మొదట కొందరిని 28
అపొస్తలులగాను, పిమ్మట కొందరిని ప్రవక్తలగాను,
పిమ్మట కొందరిని బోధకులగాను, అటుపిమ్మట కొంద
రిని అద్భుతములు చేయువారినిగాను, తరువాత కొంద
రిని స్వస్థపరచు కృపావరములు గలవారినిగాను, కొంద
రిని ఉపకారములు చేయువారినిగాను, కొందరిని
ప్రభుత్వములు చేయువారినిగాను, కొందరిని నానా
భాషలు మాటలాడువారినిగాను నియమించెను. । అం 29
దరు అపొస్తలులా? అందరు ప్రవక్తలా? అందరు
బోధకులా? అందరు అద్భుతములు చేయువారా? ।
అందరు స్వస్థపరచు కృపావరములు గలవారా? అం 30
దరు భాషలతో మాటలాడుచున్నారా? అందరు ఆ
భాషల అర్థము చెప్పుచున్నారా? । కృపావరము 31
లలో శ్రేష్ఠమైనవాటిని ఆసక్తితో అపేక్షించుడి. ఇది
యుగాక సర్వోత్తమమైన మార్గమును మీకు చూపు
చున్నాను.

**13** మనుష్యుల భాషలతోను దేవదూతల భాషల
తోను నేను మాటలాడినను, ప్రేమలేనివాడనైతే
మ్రోగెడు కంచును గణగణలాడు తాళమునై యుం
దును. । ప్రవచించు కృపావరము కలిగి, మర్మములన్ని 2
యు జ్ఞానమంతయు ఎరిగినవాడనైనను, కొండలను
పెకలింపగల పరిపూర్ణ విశ్వాసముగలవాడనైనను,
ప్రేమలేనివాడనైతే నేను వ్యర్థుడను. । (బీదల) 3
పోషణకొరకు నా ఆస్తి అంతయు ఇచ్చినను, కాల్చ
బడుటకు[2] నా శరీరమును అప్పగించినను, ప్రేమలేని
వాడనైతే నాకు ప్రయోజనమేమియు లేదు. । ప్రేమ 4
దీర్ఘకాలము సహించును, దయ చూపించును. ప్రేమ
మత్సరపడదు; ప్రేమ డంబముగా ప్రవర్తింపదు; అది
ఉప్పొంగదు; । అమర్యాదగా నడువదు; స్వప్రయో 5
జనమును విచారించుకొనదు; త్వరగా కోపపడదు;
అపకారమును మనస్సులో ఉంచుకొనదు. । దుర్నీతి 6
విషయమై సంతోషపడక సత్యమునందు సంతోషిం
చును. । అన్నిటికి తాళుకొనును;[3] అన్నిటిని నమ్మును; 7
అన్నిటిని నిరీక్షించును; అన్నిటిని ఓర్చును. । ప్రేమ 8
శాశ్వతకాలముండును. ప్రవచనములైనను నిరర్థకము
లగును, భాషలైనను నిలిచిపోవును; జ్ఞానమైనను నిరర్థక
మగును. । మనము కొంతమట్టుకు ఎరుగుదుము, 9
కొంతమట్టుకు ప్రవచించుచున్నాము గాని । పూర్ణ 10
మైనది వచ్చినప్పుడు అపూర్ణమైనది నిరర్థకమగును. ।
నేను పిల్లవాడనై యున్నప్పుడు పిల్లవానివలె మాట 11
లాడితిని, పిల్లవానివలె తలంచితిని, పిల్లవానివలె

[1] లేక, ఒక్క శరీరములోనికి. [2] అనేక ప్రాచీనప్రతులలో—అతిశయించు నిమిత్తము అని పాఠాంతరము [3] లేక, అన్నిటిని కప్పును.

యోచించితిని. ఇప్పుడు పెద్దవాడనై పిల్లవాని చేష్టలు
12 మానివేసితిని. । ఇప్పుడు అద్దములో చూచినట్టు
సూచనగా చూచుచున్నాము; అప్పుడు ముఖాము
ఖిగా చూతుము. ఇప్పుడు కొంతమట్టుకే యెరిగి
యున్నాను; అప్పుడు నేను పూర్తిగా ఎరుగబడిన
13 ప్రకారము పూర్తిగా ఎరుగుదును. । కాగా విశ్వా
సము, నిరీక్షణ, ప్రేమ యీ మూడును నిలుచును;
వీటిలో శ్రేష్ఠమైనది ప్రేమే.

**14** ప్రేమ కలిగియుండుటకు ప్రయత్నించుడి.[1] ఆత్మ
సంబంధమైన వరములను ఆసక్తితో అపేక్షించుడి; విశే
2 షముగా మీరు ప్రవచనవరము అపేక్షించుడి. । ఎందు
కనగా భాషతో మాటలాడువాడు మనుష్యులతో
కాదు దేవునితో మాటలాడుచున్నాడు; మనుష్యు
డెవడును గ్రహింపడుగాని వాడు ఆత్మవలన మర్మము
3 లను పలుకుచున్నాడు. । క్షేమాభివృద్ధియు హెచ్చ
రికయు ఆదరణయు కలుగునట్లు, ప్రవచించువాడు
4 మనుష్యులతో మాటలాడుచున్నాడు. । భాషతో
మాటలాడువాడు తనకే క్షేమాభివృద్ధి కలుగజేసి
కొనును గాని ప్రవచించువాడు సంఘమునకు క్షేమా
5 భివృద్ధి కలుగజేయును. । మీరందరు భాషలతో
మాటలాడవలెనని కోరుచున్నాను గాని మీరు ప్రవ
చింపవలెనని మరి విశేషముగా కోరుచున్నాను. సం
ఘము క్షేమాభివృద్ధి పొందునిమిత్తము భాషలతో
మాటలాడువాడు అర్థము చెప్పితేనేగాని వానికంటె
6 ప్రవచించువాడే శ్రేష్ఠుడు. । సహోదరులారా,
ఆలోచించుడి, భాషలతో మాటలాడుచు నేను మీ
యొద్దకు వచ్చి (సత్యమును) బయలుపరచవలెనని
యైనను జ్ఞానోపదేశము చేయవలెననియైనను ప్రవ
చింపవలెననియైనను బోధింపవలెననియైనను మీతో
మాటలాడకపోయినయెడల, నావలన మీకు ప్రయో
7 జనమేమి? । పిల్లనగ్రోవి గాని వీణె గాని, నిర్జీవ వస్తు
వులు నాదమిచ్చునప్పుడు, స్వరములలో భేదము కలుగ
జేయనియెడల, ఊదినదేమి మీటినదేమి యని యేలాగు
8 తెలియును? । మరియు బూర స్పష్టముకాని ధ్వని
9 ఇచ్చునప్పుడు యుద్ధమునకెవడు సిద్ధపడును? । ఆలాగే
మీరు స్పష్టమైన మాటలు నాలుకతో పలికితేనేగాని
పలికినది ఏలాగు తెలియును? మీరు గాలితో మాట
10 లాడుచున్నట్టుందురు. । లోకమందు ఎన్నో విధము
లగు భాషలున్నను వాటిలో ఒకటైనను స్పష్టము
11 కానిదై యుండదు. । మాటల అర్థము నాకు తెలియ
కుండినయెడల మాటలాడువానికి నేను పరదేశినిగా
ఉందును, మాటలాడువాడు నాకు పరదేశిగా ఉం
12 డును. । మీరు ఆత్మసంబంధమైన వరముల విషయమై
ఆసక్తిగలవారు గనుక సంఘమునకు క్షేమాభివృద్ధి
కలుగునిమిత్తము అవి మీకు విస్తరించునట్లు ప్రయ
త్నముచేయుడి. । భాషతో మాటలాడువాడు అర్థము 13
చెప్పు శక్తికలుగుటకై ప్రార్థనచేయవలెను. । నేను 14
భాషతో ప్రార్థనచేసినయెడల నా ఆత్మ ప్రార్థన
చేయును గాని నా మనస్సు ఫలవంతముగా ఉండదు. ।
కాబట్టి ఆత్మతో ప్రార్థనచేతును మనస్సుతోను 15
ప్రార్థన చేతును; ఆత్మతో పాడుదును, మనస్సుతోను
పాడుదును. । లేనియెడల నీవు ఆత్మతో స్తోత్రము 16
చేసినప్పుడు ఉపదేశము పొందనివాడు నీవు చెప్పు
దాని గ్రహింపలేడు గనుక, నీవు కృతజ్ఞతాస్తుతులు
చెల్లించినప్పుడు—ఆమేన్ అని వాడేలాగు పలుకును? ।
నీవైతే బాగుగానే కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచు 17
న్నావు గాని యెదుటివాడు క్షేమాభివృద్ధి పొందడు. ।
నేను మీ యందరికంటె ఎక్కువగా భాషలతో మాట 18
లాడుచున్నాను; అందుకు దేవుని స్తుతించెదను. ।
అయినను సంఘములో భాషతో పదివేల మాటలు 19
పలుకుటకంటె ఇతరులకు బోధ కలుగునట్లు నా మన
స్సుతో అయిదు మాటలు పలుకుట మేలు.

సహోదరులారా, మీరు బుద్ధివిషయమై పసి 20
పిల్లలుకాక దుష్టత్వము విషయమై శిశువులుగా ఉం
డుడి; బుద్ధివిషయమై పెద్దవారలై యుండుడి.

—అన్యభాషలు మాటలాడు జనులద్వారాను, పర 21
జనుల పెదవులద్వారాను, ఈ జనులతో మాట
లాడుదును; అప్పటికైనను వారు నా మాట
వినకపోదురు.

అని ప్రభువు చెప్పుచున్నాడని ధర్మశాస్త్రములో
వ్రాయబడియున్నది.[2] । కాబట్టి భాషలు విశ్వాసు 22
లకు కాదు అవిశ్వాసులకే సూచకమైయున్నవి.
ప్రవచించుట అవిశ్వాసులకు కాదు విశ్వాసులకే
(సూచకమైయున్నది.) । సంఘమంతయు ఏకముగా 23
కూడి అందరు భాషలతో మాటలాడుచుండగా, ఉప
దేశము పొందనివారైనను అవిశ్వాసులైనను లోపలికి
వచ్చినయెడల మీరు వెర్రిమాటలాడుచున్నారని అను
కొందురు కదా? । అయితే అందరు ప్రవచించు 24
చుండగా అవిశ్వాసియైనను ఉపదేశము పొందనివాడై
నను లోపలికి వచ్చినయెడల, అందరి బోధవలన తాను
పాపినని గ్రహించి అందరివలన విమర్శింపబడును. ।
అప్పుడతని హృదయ రహస్యములు బయలుపడును. 25
ఇందువలన దేవుడు నిజముగా మీలో ఉన్నాడని
ప్రచురముచేయుచు అతడు సాగిలపడి దేవునికి నమ
స్కారముచేయును.

సహోదరులారా, యిప్పుడు మీలో ఏమి జరుగు 26
చున్నది? మీరు కూడి వచ్చునప్పుడు ఒకడు ఒక కీర్తన
పాడవలెనని యున్నాడు; మరి ఒకడు బోధింపవలె
నని యున్నాడు; మరి ఒకడు తనకు బయలుపరచ
బడినది ప్రకటనపరచవలెనని యున్నాడు; మరి ఒకడు

[1] మూలభాషలో—ప్రేమను వెంటాడుడి.
[2] యెషయా, 28: 11, 12.

భాషతో మాటలాడవలెనని యున్నాడు; మరి ఒకడు
అర్థము చెప్పవలెనని యున్నాడు. సరే; సమస్తమును
27 క్షేమాభివృద్ధి కలుగుటకై జరుగనియ్యుడి. । భాషతో
ఎవడైనను మాటలాడితే, ఇద్దరు, అవసరమైనయెడల
ముగ్గురికి మించకుండ, వంతులచొప్పున మాటలాడ
28 వలెను, ఒకడు అర్థము చెప్పవలెను. । అర్థము చెప్పు
వాడు లేనియెడల అతడు సంఘములో మౌనముగా
ఉండవలెను గాని తనతోను దేవునితోను మాటలాడు
29 కొనవచ్చును. । ప్రవక్తలు ఇద్దరు ముగ్గురు మాటలాడ
30 వచ్చును; తక్కినవారు వివేచింపవలెను. । అయితే
కూర్చున్న మరి యొకనికి ఏదైనను బయలుపరచబడిన
యెడల మొదటివాడు మౌనముగా ఉండవలెను. ।
31 అందరు నేర్చుకొనునట్లును అందరు హెచ్చరిక పొందు
నట్లును మీరందరు ఒకని తరువాత ఒకడు ప్రవచింప
32 వచ్చును. । మరియు ప్రవక్తల ఆత్మలు ప్రవక్తల స్వాధీ
33 నములో ఉన్నవి. । ఆలాగే పరిశుద్ధుల సంఘములన్ని
టిలో దేవుడు సమాధానమునకే కర్త గాని అల్లరికి కర్త
కాడు.

34 స్త్రీలు సంఘములలో మౌనముగా ఉండవలెను;
వారు లోబడియుండవలసినదే గాని మాటలాడుటకు
వారికి సెలవులేదు. ఈలాగు ధర్మశాస్త్రమును చెప్పు
35 చున్నది.[1] । వారు ఏమైనను నేర్చుకొనగోరినయెడల
ఇంట తమ తమ భర్తల నడుగవలెను; సంఘములో స్త్రీ
36 మాటలాడుట అవమానము. । దేవుని వాక్యము మీ
యొద్ద నుండియే బయలువెళ్లెనా? మీయొద్దకు
మాత్రమే వచ్చెనా?

37 ఎవడైనను తాను ప్రవక్తననియైనను ఆత్మసంబంధినని
యైనను తలంచుకొనినయెడల, నేను మీకు వ్రాయు
చున్నవి ప్రభువుయొక్క ఆజ్ఞలని అతడు దృఢముగా
38 తెలిసికొనవలెను. । ఎవడైనను తెలియనివాడైతే తెలి
యనివాడుగానే యుండనిమ్ము[2].

39 కాబట్టి నా సహోదరులారా, ప్రవచించుట
40 ఆసక్తితో అపేక్షించుడి, భాషలతో మాటలాడుట
ఆటంకపరచకుడి గాని సమస్తమును మర్యాదగాను
క్రమముగాను జరుగనియ్యుడి.

15 మరియు సహోదరులారా, నేను మీకు ప్రక
2 టించిన సువార్తను మీకు తెలుపుచున్నాను. మీరు
దాని అంగీకరించితిరి, దానియందే నిలిచియున్నారు.
మీ విశ్వాసము వ్యర్థమైతేనే గాని నేను ఏ ఉప
దేశరూపకముగా సువార్త మీకు ప్రకటించితినో ఆ
ఉపదేశమును మీరు గట్టిగా పట్టుకొనియున్న పక్ష
మందు ఆ సువార్తవలననే మీరు రక్షణ పొందువారై
3 యుందురు. । నాకియ్యబడిన ఉపదేశమును ముఖ్య
మైనదిగా ఎంచి మీకు అప్పగించితిని. అదేమనగా,
లేఖనముల ప్రకారము క్రీస్తు మన పాపములనిమిత్తము
మృతిపొందెను, సమాధిచేయబడెను, । లేఖనముల 4
ప్రకారము మూడవదినమున లేపబడెను. । ఆయన 5
కేఫాకును తరువాత పన్నెండుగురికిని కనబడెను. । అటు 6
పిమ్మట ఐనూటికి ఎక్కువైన సహోదరులకు ఒక్క
సమయమందే కనబడెను. వీరిలో అనేకులు ఇప్పటి
వరకు నిలిచియున్నారు, కొందరు నిద్రించిరి. । తరు 7
వాత ఆయన యాకోబుకును, అటుతరువాత అపొస్త
లులకందరికిని కనబడెను. । అందరికి కడపట అకాల 8
మందు పుట్టినట్టున్న నాకును కనబడెను; । ఏలయనగా 9
నేను అపొస్తలులందరిలో తక్కువైనవాడను. దేవుని
సంఘమును హింసించినందున అపొస్తలుడనబడుటకు
యోగ్యుడనుకాను. । అయినను నేనేమైయున్నానో 10
అది దేవుని కృపవలననే అయియున్నాను. మరియు
నాకు అనుగ్రహింపబడిన ఆయన కృప నిష్ఫలము
కాలేదు గాని వారందరికంటె నేనెక్కువగా ప్రయాస
పడితిని. ప్రయాసపడినది నేను కాను, నాకు తోడై
యున్న దేవుని కృపయే. । నేనైననేమి వారైననేమి, 11
ఆలాగుననే మేము ప్రకటించుచున్నాము, ఆలాగు
ననే మీరును విశ్వసించితిరి.

క్రీస్తు మృతులలోనుండి లేపబడియున్నాడని 12
ప్రకటింపబడుచుండగా మీలో కొందరు—మృతుల
పునరుత్థానము లేదని యెట్లు చెప్పుచున్నారు? । మృ 13
తుల పునరుత్థానము లేనియెడల క్రీస్తుకూడ లేపబడి
యుండలేదు. । మరియు క్రీస్తు లేపబడియుండని 14
యెడల మేము చేయు ప్రకటన వ్యర్థమే, మీ విశ్వా
సమును వ్యర్థమే. । ఆయన క్రీస్తును లేపెనని దేవుని 15
గూర్చి మేము సాక్ష్యము చెప్పియున్నాము గదా;
మృతులు లేపబడని పక్షమందు దేవుడాయనను లేప
లేదు గనుక మేమును దేవుని విషయమై అబద్ధపు
సాక్షులముగా అగుపడుచున్నాము. । మృతులు 16
లేపబడనియెడల క్రీస్తుకూడ లేపబడలేదు. । క్రీస్తు 17
లేపబడనియెడల మీ విశ్వాసము వ్యర్థమే, మీరింకను
మీ పాపములలోనే యున్నారు. । అంతేకాదు, 18
క్రీస్తునందు నిద్రించినవారును నశించిరి. । ఈ జీవిత 19
కాలముమట్టుకే మనము క్రీస్తునందు నిరీక్షించువార
మైనయెడల మనుష్యులందరికంటె దౌర్భాగ్యులమై
యుందుము.

ఇప్పుడైతే నిద్రించినవారిలో ప్రథమఫలముగా 20
క్రీస్తు మృతులలోనుండి లేపబడియున్నాడు. । మను 21
ష్యుని ద్వారా మరణము వచ్చెను గనుక మనుష్యుని
ద్వారానే మృతుల పునరుత్థానమును కలిగెను. ।
ఆదామునందు అందరు ఏలాగు మృతిపొందుచున్నారో 22
ఆలాగుననే క్రీస్తునందు అందరును బ్రదికింపబడు
దురు. । ప్రతివాడును తన తన వరుసలోనే బ్రదికిం 23
పబడును; ప్రథమఫలము క్రీస్తు; తరువాత క్రీస్తు

[1] ఆదికాండము, 3: 16. [2] అనేక ప్రాచీనప్రతులలో—వాడు తెలియబడినవాడుకాడు అని పాఠాంతరము.

వచ్చినపుడు[1] ఆయనవారు బ్రదికింపబడుదురు. ।
24 అటుతరువాత ఆయన సమస్తమైన ఆధిపత్యమును
సమస్తమైన అధికారమును బలమును కొట్టివేసి తన
తండ్రియైన దేవునికి రాజ్యము అప్పగించును;
25 అప్పుడు అంతము వచ్చును. । ఎందుకనగా తన శత్రు
వులనందరిని తన పాదములక్రింద ఉంచు పర్యంతము
26 ఆయన రాజ్యపరిపాలన చేయుచుండవలెను. । కడ
27 పట నశింపజేయబడు శత్రువు మరణము. । దేవుడు
సమస్తమును క్రీస్తు పాదములక్రింద లోపరచియుం
చెను.[2] సమస్తమును లోపరచబడియున్నదని చెప్పి
నప్పుడు ఆయనకు సమస్తమును లోపరచినవాడు తప్ప
సమస్తమును లోపరచబడియున్నదను సంగతి విశ
28 దమే. । మరియు సమస్తమును ఆయనకు లోపరచ
బడినప్పుడు దేవుడు సమస్తములో సర్వమగు నిమి
త్తము కుమారుడు తనకు సమస్తమును లోపరచిన
దేవునికి తానే లోబడును.

29 ఇట్లు కానియెడల మృతులకొరకై బాప్తిస్మము
పొందువారేమి చేతురు? మృతులేమాత్రమును లేప
బడనియెడల మృతులకొరకు వారు బాప్తిస్మము పొంద
30 నేల? । మరియు మేము గడియగడియకు ప్రాణ
31 భయముతో నుండ నేల? । సహోదరులారా, మన
ప్రభువైన క్రీస్తుయేసునందు మిమ్మునుగూర్చి నాకు
కలిగియున్న అతిశయముతోడు నేను దినదినము
32 చనిపోవుచున్నాను (అని చెప్పుదును.) । మనుష్య
రీతిగా నేను ఎఫెసులో మృగములతో పోరాడితిని;
నాకు లాభమేమి? మృతులు లేపబడని పక్షమందు—
రేపు చనిపోదుము గనుక తిందము త్రాగుదము. ।
33 మోసపోకుడి. దుష్టసాంగత్యములు మంచి నడవడిని
34 చెరుపును. । నీతిప్రవర్తనగలవారై మేల్కొని, పాపము
చేయకుడి; దేవునిగూర్చిన జ్ఞానము కొందరికి లేదు.
మీకు సిగ్గు కలుగుటకై యిట్లు చెప్పుచున్నాను.

35 అయితే మృతులేలాగు లేతురు? వారెట్టి శరీర
36 ముతో వత్తురని యొకడు అడుగును. । ఓ అవివేకీ,
నీవు విత్తునది చచ్చితేనే గాని బ్రదికింపబడదు గదా. ।
37 నీవు విత్తుదానిని చూడగా అది గోధుమగింజయైనను
సరే, మరి ఏ గింజయైనను సరే, వట్టి గింజనే విత్తుచు
న్నావు గాని పుట్టబోవు శరీరమును విత్తుటలేదు. ।
38 అయితే దేవుడే తన చిత్తప్రకారము నీవు విత్తిన
దానికి శరీరము ఇచ్చును. మరియు ప్రతి విత్తనమున
కును దాని దాని శరీరము ఇచ్చుచున్నాడు. మాంస
39 మంతయు ఒక విధమైనది కాదు. । మనుష్యమాంసము
వేరు, మృగమాంసము వేరు, పక్షి మాంసము వేరు,
40 చేప మాంసము వేరు. । మరియు ఆకాశవస్తురూప
ములు కలవు, భూవస్తురూపములు కలవు; ఆకాశ
వస్తురూపముల మహిమ వేరు, భూవస్తురూపముల
మహిమ వేరు. । సూర్యుని మహిమ వేరు, చంద్రుని 41
మహిమ వేరు, నక్షత్రముల మహిమ వేరు. మహిమను
బట్టి యొక నక్షత్రమునకును మరియొక నక్షత్రమునకు
భేదము కలదు గదా? । మృతుల పునరుత్థానమును 42
ఆలాగే. (శరీరము) క్షయమైనదిగా విత్తబడి అక్షయ
మైనదిగా లేపబడును; । ఘనహీనమైనదిగా విత్తబడి 43
మహిమగలదిగా లేపబడును; బలహీనమైనదిగా విత్త
బడి బలమైనదిగా లేపబడును; । ప్రకృతిసంబంధ 44
శరీరముగా విత్తబడి ఆత్మసంబంధ శరీరముగా లేప
బడును. ప్రకృతిసంబంధ శరీరమున్నది గనుక ఆత్మ
సంబంధ శరీరముకూడ ఉన్నది. । ఇందువిషయమై 45
—ఆదాము మొదటి మనుష్యుడు జీవించు ప్రాణి
ఆయెనని వ్రాయబడియున్నది.[3] కడపటి ఆదాము
జీవింపచేయు ఆత్మ ఆయెను. । ఆత్మసంబంధమైనది 46
మొదట కలిగినది కాదు ప్రకృతిసంబంధమైనదే
మొదట కలిగినది; తరువాత ఆత్మసంబంధమైనది. ।
మొదటి మనుష్యుడు భూసంబంధియై మంటినుండి 47
పుట్టినవాడు, రెండవ మనుష్యుడు పరలోకమునుండి
వచ్చినవాడు. । మంటినుండి పుట్టినవాడెట్టివాడో 48
మంటినుండి పుట్టినవారును అట్టివారే; పరలోకసం
బంధి యెట్టివాడో పరలోకసంబంధులును అట్టివారే. ।
మరియు మనము మంటినుండి పుట్టినవాని పోలికను 49
ధరించినప్రకారము పరలోకసంబంధి పోలికయు
ధరింతుము.

సహోదరులారా, నేను చెప్పునది ఏమనగా 50
రక్తమాంసములు దేవుని రాజ్యమును స్వతంత్రించు
కొననేరవు; క్షయత అక్షయతను స్వతంత్రించు
కొనదు. । ఇదిగో మీకు ఒక మర్మము తెలుపుచు 51
న్నాను; మనమందరము నిద్రించము గాని నిమిష 52
ములో, ఒక రెప్పపాటున, కడబూర మ్రోగగానే
మనమందరము మార్పు పొందుదుము. బూర మ్రో
గును; అప్పుడు మృతులు అక్షయులుగా లేపబడు
దురు, మనము మార్పుపొందుదుము. । క్షయమైన 53
యీ శరీరము అక్షయతను ధరించుకొనవలసియు
న్నది; మర్త్యమైన యీ శరీరము అమర్త్యతను ధరించు
కొనవలసియున్నది. । ఈ క్షయమైనది అక్షయతను 54
ధరించుకొనినప్పుడు, ఈ మర్త్యమైనది అమర్త్యతను
ధరించుకొనినప్పుడు,—

విజయము కలుగునట్లుగా మరణము మ్రింగబడెను
అని వ్రాయబడిన వాక్యము నెరవేరును.[4] । ఓ మర 55
ణమా, నీ విజయమెక్కడ? ఓ మరణమా, నీ ముల్లె
క్కడ? । మరణపుముల్లు పాపము; పాపమునకున్న 56
బలము ధర్మశాస్త్రమే. । అయినను మన ప్రభువైన 57
యేసుక్రీస్తు మూలముగా మనకు జయము అనుగ్ర
హించుచున్న దేవునికి స్తోత్రము కలుగుగాక. । కాగా 58

1 లేక, ఆగమనమునందు. 2 కీర్తన, 8: 6. 3 ఆదికాండము, 2: 7. 4 యెషయా, 25: 8; హోషేయ, 13: 14.

నా ప్రియ సహోదరులారా, మీ ప్రయాసము
ప్రభువునందు వ్యర్థముకాదని యెరిగి, స్థిరులును,
కదలనివారును, ప్రభువు కార్యాభివృద్ధియందు ఎప్ప
టికిని ఆసక్తులునై యుండుడి.

16 పరిశుద్ధులకొరకైన చందావిషయమైతే నేను గల
తీయ సంఘములకు నియమించిన ప్రకారము మీరును
2 చేయుడి. । నేను వచ్చినప్పుడు చందా పోగుచేయ
కుండ ప్రతి ఆదివారమున మీలో ప్రతివాడును తాను
వర్ధిల్లినకొలది తనయొద్ద కొంత సొమ్ము నిలువచేయ
3 వలెను. । నేను వచ్చినప్పుడు మీరెవరిని యోగ్యులని
యెంచి పత్రికలిత్తురో వారిచేత మీ ఉపకార ద్రవ్య
4 మును యెరూషలేమునకు పంపుదును. । నేనుకూడ
వెళ్లుట యుక్తమైనయెడల వారు నాతోకూడ వత్తురు.।
5 అయితే మకెదోనియలో సంచారమునకు వెళ్ల నుద్దే
శించుచున్నాను గనుక మకెదోనియలో సంచారము
6 నకు వెళ్లినప్పుడు మీయొద్దకు వచ్చెదను. । అయితే
మీయొద్ద కొంతకాలము ఆగవచ్చును, ఒకవేళ శీత
కాలమంతయు గడుపుదును. అప్పుడు నేను వెళ్లెడి
స్థలమునకు మీరు నన్ను సాగనంపవచ్చును.
7 ప్రభువు సెలవైతే మీయొద్ద కొంతకాలముండ
8 నిరీక్షించుచున్నాను గనుక ఇప్పుడు మార్గములో
9 మిమ్మును చూచుటకు నాకు మనస్సులేదు. । కార్యాను
కూలమైన మంచి సమయము నాకు ప్రాప్తించియు
న్నది;[1] మరియు ఎదిరించువారు అనేకులున్నారు
గనుక పెంతెకొస్తువరకు ఎఫెసులో నిలిచియుందును.
10 తిమోతియు వచ్చినయెడల అతడు మీయొద్ద నిర్భ
యుడై యుండునట్లు చూచుకొనుడి. నావలెనే అతడు
11 ప్రభువు పనిచేయుచున్నాడు । గనుక ఎవడైన అతని
తృణీకరింపవద్దు. నాయొద్దకు వచ్చుటకు అతని సమా
ధానముతో సాగనంపుడి; అతడు సహోదరులతో
12 కూడ వచ్చునని యెదురు చూచుచున్నాను. । సహో
దరుడైన అపొల్లోనుగూర్చిన సంగతి ఏమనగా, అతడీ
సహోదరులతోకూడ మీయొద్దకు వెళ్లవలెనని నేనతని
చాల బతిమాలుకొంటిని గాని, యిప్పుడు వచ్చుటకు
అతనికి ఎంతమాత్రమును మనస్సులేదు, వీలైనప్పు
డతడు వచ్చును.

మెలకువగా ఉండుడి, విశ్వాసమందు నిలుకడగా 13
ఉండుడి, పౌరుషముగలవారై యుండుడి, బలవంతులై
యుండుడి; । మీరు చేయు కార్యములన్నియు 14
ప్రేమతో చేయుడి.

స్తెఫను ఇంటివారు అకైయయొక్క ప్రథమఫలమై 15
యున్నారనియు, వారు పరిశుద్ధులకు పరిచర్యచేయు
టకు తమ్మును తాము అప్పగించుకొని యున్నారనియు
మీకు తెలియును. । కాబట్టి సహోదరులారా, అట్టి 16
వారికిని, పనిలో సహాయముచేయుచు ప్రయాస
పడుచు ఉండువారికందరికిని మీరు విధేయులై యుండ
వలెనని మిమ్మును బతిమాలుకొనుచున్నాను. । స్తెఫను, 17
ఫొర్తునాతు, అకాయికు అనువారు వచ్చినందున సంతో 18
షించుచున్నాను. మీరులేని వెలితిని వీరు నాకు
సంపూర్తిచేసి, నా ఆత్మకును మీ ఆత్మకును సుఖము
కలుగజేసిరి గనుక అట్టివారిని సన్మానించుడి.

ఆసియలోని సంఘములవారు మీకు వందనములు 19
చెప్పుచున్నారు. అకుల ప్రిస్కిల్ల అనువారును వారి
యింటనున్న సంఘమును ప్రభువునందు మీకు అనేక
వందనములు చెప్పుచున్నారు. । సహోదరులందరు 20
మీకు వందనములు చెప్పుచున్నారు. పవిత్రమైన
ముద్దుపెట్టుకొని మీరు ఒకరికి ఒకరు వందనములు
చేసికొనుడి.

పౌలను నేను నా చేతితోనే వందనవచనము 21
వ్రాయుచున్నాను. । ఎవడైనను ప్రభువును ప్రేమింప 22
కుంటే వాడు శపింపబడును గాక; ప్రభువు వచ్చియు
న్నాడు.[2] । ప్రభువైన యేసుక్రీస్తు కృప మీకు తోడై 23
యుండును గాక. । క్రీస్తుయేసునందలి నా ప్రేమ 24
మీయందరితో ఉండునుగాక. ఆమేన్.

1 మూలభాషలో—గొప్ప ద్వారము నాకు తెరువబడియున్నది. 2 లేక, మన ప్రభువు వచ్చుచున్నాడు.

# అపొస్తలుడైన పౌలు
# కొరింథీయులకు వ్రాసిన రెండవ పత్రిక

1 దేవుని చిత్తమువలన క్రీస్తు[1] యేసుయొక్క అపొ
స్తలుడైన పౌలును, మన సహోదరుడైన తిమోథి
యును, కొరింథులోనున్న దేవుని సంఘమునకును,
అకైయయందంతటనున్న పరిశుద్ధులకందరికిని (శుభమని
2 చెప్పి) వ్రాయునది. । మన తండ్రియైన దేవునినుం
డియు ప్రభువైన యేసుక్రీస్తునుండియు కృపయు
సమాధానమును మీకు కలుగుగాక.

3 కనికరము చూపు తండ్రి, సమస్తమైన ఆదరణను
అనుగ్రహించు దేవుడు, మన ప్రభువైన యేసుక్రీస్తు
4 తండ్రియునైన దేవుడు, స్తుతింపబడుగాక. । దేవుడు
మమ్మును ఏ ఆదరణతో ఆదరించుచున్నాడో ఆ ఆద
రణతో ఎట్టి శ్రమలలో ఉన్నవారినైన ఆదరించుటకు
శక్తిగలవారమగునట్లు, ఆయన మా శ్రమ అంతటిలో
5 మమ్మును ఆదరించుచున్నాడు. । క్రీస్తుయొక్క శ్రమలు
మాయందేలాగు విస్తరించుచున్నవో ఆలాగే క్రీస్తు
6 ద్వారా ఆదరణయు మాకు విస్తరించుచున్నది. । మేము
శ్రమ పొందినను మీ ఆదరణకొరకును రక్షణకొరకును
పొందుదుము; మేమాదరణ పొందినను మీ ఆదరణ
కొరకై పొందుదుము. ఈ ఆదరణ మేముకూడ
పొందుచున్నట్టి ఆ శ్రమలను ఓపికతో సహించుటకు
7 కార్యసాధకమై యున్నది. । మీరు శ్రమలలో
ఏలాగు పాలివారైయున్నారో ఆలాగే ఆదరణలోను
పాలివారై యున్నారని యెరుగుదుము గనుక మిమ్మును
8 గూర్చిన మా నిరీక్షణ స్థిరమైయున్నది. । సహోదరు
లారా, ఆసియలో మాకు తటస్థించిన శ్రమనుగూర్చి
మీకు తెలియకుండుట మాకిష్టములేదు; అదేమనగా
మేము బ్రదుకుదుమను నమ్మకములేక యుండునట్లుగా,
మా శక్తికి మించిన అత్యధిక భారమువలన క్రుంగి
9 పోతిమి. । మరియు మృతులను లేపు దేవునియందే
గాని మాయందే మేము నమ్మిక యుంచకుండునట్లు
మరణమగుదుమను నిశ్చయము మామట్టుకు మాకు కలిగి
10 యుండెను. । ఆయన అట్టి గొప్ప మరణమునుండి
మమ్మును తప్పించెను, ఇక ముందుకును తప్పించును.
మరియు మాకొరకు ప్రార్థనచేయుటవలన మీరు కూడ
సహాయము చేయుచుండగా, ఆయన ఇక ముందుకును
మమ్మును తప్పించునని ఆయనయందు నిరీక్షణగలవారమై
11 యున్నాము. । అందువలన అనేకుల ప్రార్థనద్వారా,
మాకు కలిగిన కృపావరముకొరకు అనేకులచేత మా
విషయమై కృతజ్ఞతాస్తుతులు చెల్లింపబడును.

మా అతిశయమేదనగా లౌకికజ్ఞానము ననుసరింపక, 12
దేవుడనుగ్రహించు పరిశుద్ధతతోను నిష్కాపట్యము
తోను దేవుని కృపనే అనుసరించి లోకములో నడుచు
కొంటిమనియు, విశేషముగా మీయెడలను నడుచు
కొంటిమనియు, మా మనస్సాక్షి సాక్ష్యమిచ్చుచు
న్నది. । మీరు చదువుకొని పూర్తిగా గ్రహించిన సంగ 13
తులు తప్ప మరేవియు మీకు వ్రాయుట లేదు; కడ
వరకు వీటిని ఒప్పుకొందురని నిరీక్షించుచున్నాము. ।
మరియు మన ప్రభువైన యేసుయొక్క దినమందు 14
మీరు మాకేలాగో, ఆలాగే మేము మీకును అతిశ
యాస్పదమై యుందుమని, మీలో కొందరు మమ్మును
ఒప్పుకొనియున్నారు.

మరియు ఈ నమ్మికగలవాడనై మీకు రెండవ కృపా 15
వరము లభించునట్లు మొదట మీయొద్దకు వచ్చి, మీ 16
యొద్దనుండి మకెదోనియకు వెళ్లి మకెదోనియనుండి
మరల మీయొద్దకు వచ్చి, మీచేత యూదైయకు సాగ
నంపబడవలెనని ఉద్దేశించితిని. । కావున నేనీలాగు 17
ఉద్దేశించి చపలచిత్తుడనుగా నడుచుకొంటినా? అవును
అవునని చెప్పుచు, కాదు కాదనునట్టు ప్రవర్తింపవలె
నని నా యోచనలను శరీరానుసారముగా యోచించు
చున్నానా? । దేవుడు నమ్మదగినవాడు గనుక మేము 18
మీకు చెప్పిన వాక్యము అవునని చెప్పి కాదనునట్టుగా
ఉండలేదు. । మాచేత, అనగా నా చేతను సిల్వాను 19
చేతను తిమోథియుచేతను, మీలో ప్రకటింపబడిన
దేవుని కుమారుడగు యేసుక్రీస్తు అవునని చెప్పి కాదను
వాడై యుండలేదు గాని ఆయన అవుననువాడై యు
న్నాడు. । దేవుని వాగ్దానములు ఎన్నియైనను అన్నియు 20
క్రీస్తునందు అవునన్నట్టుగానే యున్నవి గనుక మన
ద్వారా దేవునికి మహిమ కలుగుటకై అవి ఆయనవలన
నిశ్చయములై యున్నవి.[2] । మీతోకూడ క్రీస్తునందు 21
నిలిచియుండునట్లుగా మమ్మును స్థిరపరచి అభిషేకించిన
వాడు దేవుడే. । ఆయన మనకు ముద్రవేసి మన 22
హృదయములలో మనకు ఆత్మ అను సంచకరువును
అనుగ్రహించియున్నాడు.

మీయందు కనికరము కలిగి నేను మరల కొరింథుకు 23
రాలేదు. నా ప్రాణముతోడు ఇందుకు దేవుని సాక్షిగా
పెట్టుచున్నాను. । మీ విశ్వాసముమీద మేము ప్రభు 24
వులమని (యీలాగు చెప్పుటలేదు) గాని మీ ఆనంద
మునకు సహకారులమై యున్నాము; విశ్వాసముచేతనే

[1] క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము.

[2] మూలభాషలో—ఆమేన్ అని యునవి.

2 మీరు నిలకడగా ఉన్నారు. । మరియు నేను దుఃఖ
ముతో మీయొద్దకు తిరిగి రానని నామట్టుకు నేను
2 నిశ్చయించుకొంటిని.' । నేను మిమ్మును దుఃఖపరచు
నెడల నాచేత దుఃఖపరచబడినవాడు తప్ప మరి ఎవడు
3 నన్ను సంతోషపరచును? । నేను వచ్చినప్పుడు ఎవరి
వలన నేను సంతోషము పొందతగినదో, వారివలన
నాకు దుఃఖము కలుగకుండవలెనని యీ సంగతి మీకు
వ్రాసితిని. మరియు నా సంతోషము మీ అందరి
సంతోషముగా (మీరు భావించుచున్నారని) మీ
అందరియందు నమ్మకము కలిగి యీలాగు వ్రాసితిని. ।
4 మీకు దుఃఖము కలుగవలెనని కాదు గాని మీయెడల
నాకు కలిగియున్న అత్యధికమైన ప్రేమను మీరు
తెలిసికొనవలెనని, నిండు శ్రమతోను మనోవేదన
తోను ఎంతో కన్నీరు విడుచుచు మీకు వ్రాసితిని.
5 ఎవడైనను దుఃఖము కలుగజేసి యుండినయెడల,
నాకు (మాత్రము) కాదు కొంతమట్టుకు మీకందరికిని
దుఃఖము కలుగజేసియున్నాడు. నేను విశేష భారము
వానిమీద మోపకోరక (యీ మాట చెప్పుచున్నాను.)।
6 అట్టివానికి మీలో ఎక్కువమందివలన కలిగిన యీ
7 శిక్షయే చాలును । గనుక మీరిక వాని శిక్షింపక
క్షమించి ఆదరించుట మంచిది. లేనియెడల ఒకవేళ
వాడు అత్యధికమైన దుఃఖములో మునిగిపోవును. ।
8 కావున వాని యెడల మీ ప్రేమను స్థిరపరచవలెనని
9 మిమ్మును బతిమాలుకొనుచున్నాను. । మీరన్ని విషయ
ములందు విధేయులై యున్నారేమో అని మీయోగ్యత
10 తెలిసికొనుటకే గదా (పూర్వము) వ్రాసితిని. । మీరు
11 దేనిగూర్చియైనను ఎవని క్షమించుచున్నారో నేనును
వాని క్షమించుచున్నాను; నేనేమైనను క్షమించి
యుంటే సాతాను మనలను మోసపరచకుండునట్లు,
మీ నిమిత్తము, క్రీస్తు సముఖమునందు క్షమించియు
న్నాను; వాని తంత్రములను మనము ఎరుగనివారము
కాము.
12 క్రీస్తు సువార్త ప్రకటించుటకు నేను త్రోయకు
వచ్చినప్పుడు ప్రభువునందు నాకు మంచి సమయము
ప్రాప్తించియుండగా,[1] సహోదరుడైన తీతు నాకు
13 కనబడనందున । నా మనస్సులో నెమ్మది లేక వారి
యొద్ద సెలవు తీసికొని అక్కడనుండి మకెదోనియకు
14 బయలుదేరితిని. । క్రీస్తునందు మమ్మును ఎల్లప్పుడు విజ
యోత్సవముతో ఊరేగించుచు, మా ద్వారా ప్రతి
స్థలమందు ఆయననుగూర్చిన జ్ఞానముయొక్క సువాస
15 నను కనుపరచుచున్న దేవునికి స్తోత్రము. । రక్షింపబడు
వారి పట్లను నశించువారి పట్లను మేము దేవునికి
16 క్రీస్తు సువాసనయై యున్నాము. । నశించువారికి మర
ణార్థమైన మరణపు వాసనగాను రక్షింపబడువారికి
17 జీవార్థమైన జీవపు వాసనగాను ఉన్నాము. । కావున
ఇట్టి సంగతులకు చాలినవాడెవడు? మేము దేవుని వాక్య
మును కలిపి చెరిపెడు అనేకులవలె ఉండక, నిష్కా
పట్యముగలవారమును దేవునివలన (నియమింపబడిన)
వారమునై యుండి, క్రీస్తునందు దేవునియెదుట బోధిం
చుచున్నాము.

3 మమ్మును మేమే తిరిగి మెప్పించుకొన మొదలు
పెట్టుచున్నామా? కొందరికి కావలసినట్టు మీయొద్ద
కైనను మీయొద్దనుండియైనను సిఫారసు పత్రికలు మాకు
అవసరమా? । మా హృదయములమీద వ్రాయబడి 2
యుండి, మనుష్యులందరు తెలిసికొనుచు చదువు
కొనుచు ఉన్న మా పత్రిక మీరే కారా? । రాతి 3
పలకలమీద సిరాతో వ్రాయబడక, మెత్తని హృదయ
ములు అను పలకలమీద జీవముగల దేవుని ఆత్మతో,
మా పరిచర్యమూలముగా వ్రాయబడిన క్రీస్తు పత్రి
కయై యున్నారని మీరు తేటపరచబడుచున్నారు. ।
క్రీస్తుద్వారా దేవునియెడల మాకిట్టి నమ్మకము కలదు.। 4
మావలన ఏదైన అయినట్టుగా ఆలోచించుటకు మా 5
యంతట మేమే సమర్థులమని కాదు; మా సామర్థ్యము
దేవునివలననే కలిగియున్నది. । ఆయనే మమ్మును క్రొత్త 6
నిబంధనకు, అనగా అక్షరమునకు కాదు గాని ఆత్మకే
పరిచారకులమవుటకు మాకు సామర్థ్యము కలిగించి
యున్నాడు. అక్షరము చంపును గాని ఆత్మ జీవింప
చేయును. । మరణకారణమగు పరిచర్య, రాళ్లమీద 7
చెక్కబడిన అక్షరములతో సంబంధించినదైనను, మహి 8
మతో కూడినదాయెను. అందుకే మోషే ముఖముమీద
ప్రకాశించుచుండిన ఆ మహిమ తగ్గిపోవునదైనను,
ఇశ్రాయేలీయులు అతని ముఖము తేరిచూడలేకపో
యిరి. ఇట్లుండగా ఆత్మసంబంధమైన పరిచర్య యెంత
మహిమగలదై యుండును! । శిక్షావిధికి కారణమైన 9
పరిచర్యయే మహిమ కలిగినదైతే నీతికి కారణమైన
పరిచర్య యెంతో అధికమైన మహిమకలదగును. ।
అత్యధికమైన మహిమ దీనికుండుటవలన (ఇంతకు 10
మునుపు) మహిమ కలదిగా చేయబడినది యీ విషయ
ములో మహిమలేనిదాయెను. । తగ్గిపోవునదే[2] మహిమ 11
గలదై యుండినయెడల, నిలుచునది మరి యెక్కువ
మహిమగలదై యుండును గదా?

తగ్గిపోవుచున్న[2] (మహిమ) అంతమును ఇశ్రాయేలీ 12
యులు తేరిచూడకుండునట్లు మోషే తన ముఖము 13
మీద ముసుకు వేసికొనెను. మేమట్లు చేయక, యిట్టి
నిరీక్షణగలవారమై బహు ధైర్యముగా మాటలాడు
చున్నాము. । మరియు వారి మనస్సులు కఠినము 14
లాయెను గనుక నేటివరకును పాతనిబంధన చదువ
బడునప్పుడు, అది క్రీస్తునందు కొట్టివేయబడెనని
వారికి తేటపరచబడక, ఆ ముసుకే నిలిచియున్నది. ।
నేటివరకును మోషే గ్రంథము వారు చదువునప్పుడెల్ల 15

1 మూలభాషలో– ద్వారము తెరువబడియుండగా. 2 లేక– కొట్టివేయబడు.

ముసుకు వారి హృదయముల మీదనున్నది గాని ।
16 వారి హృదయము ప్రభువువైపుకు ఎప్పుడు తిరుగునో
17 అప్పుడు ముసుకు తీసివేయబడును. । ప్రభువే ఆత్మ.
ప్రభువుయొక్క ఆత్మ యెక్కడనుండునో అక్కడ
18 స్వాతంత్ర్యము నుండును. । మనమందరమును ముసుకు
లేని ముఖముతో ప్రభువుయొక్క మహిమను అద్దము
వలె ప్రతిఫలింపజేయుచు, మహిమనుండి అధిక
మహిమ పొందుచు, ప్రభువగు ఆత్మచేత[1] ఆ పోలిక
గానే మార్చబడుచున్నాము.
4 ఈ పరిచర్య పొందినవారమై కరుణింపబడినం
2 దున అధైర్యపడము. । అయితే కుయుక్తిగా నడుచు
కొనకయు, దేవుని వాక్యమును వంచనగా బోధింప
కయు, సత్యమును ప్రత్యక్షపరచుటవలన ప్రతి మను
ష్యుని మనస్సాక్షియెదుట మమ్మును మేమే దేవుని
సముఖమందు మెప్పించుకొనుచు, అవమానకరమైన
3 రహస్యకార్యములను విసర్జించియున్నాము. । మా
సువార్త మరుగుచేయబడినయెడల నశించుచున్నవారి
4 విషయములోనే మరుగుచేయబడియున్నది. । దేవుని
స్వరూపియైయున్న క్రీస్తు మహిమను కనుపరచు
సువార్త ప్రకాశము వారికి ప్రకాశింపకుండునిమిత్తము,
ఈ యుగ సంబంధమైన దేవత అవిశ్వాసులైనవారి
మనోనేత్రములకు గుడ్డితనము కలుగజేసి యున్నాడు. ।
5 —అంధకారములోనుండి వెలుగు ప్రకాశించు గాక[2]
6 అని పలికిన దేవుడే తన మహిమనుగూర్చిన జ్ఞానము
యేసుక్రీస్తునందు వెల్లడిపరచుటకు మా హృదయము
లలో ప్రకాశించెను. మేము మమ్మునుగూర్చి ప్రక
టించుకొనుటలేదు గాని క్రీస్తుయేసునుగూర్చి ఆయన
ప్రభువనియు, మమ్మునుగూర్చి, యేసు నిమిత్తము మేము
మీ పరిచారకులమనియు ప్రకటించుచున్నాము.
7 అయినను ఆ బలాధిక్యము మా మూలమైనది కాక
దేవునిదై యుండునట్లు మంటి ఘటములలో ఈ ఐశ్వ
8 ర్యము మాకు కలిగియున్నది. । ఎటుబోయినను శ్రమ
పడుచున్నను ఇరికింపబడువారము కాము; అపాయ
ములోనున్నను కేవలము ఉపాయము లేనివారము
9 కాము; । తరుమబడుచున్నను దిక్కులేనివారము
కాము; పడద్రోయబడినను నశించువారము కాము. ।
10 యేసుయొక్క జీవము మా శరీరమందు ప్రత్యక్షపరచ
బడుటకై యేసుయొక్క మరణానుభవమును మా శరీర
మందు ఎల్లప్పుడును వహించుకొని పోవుచున్నాము. ।
11 ఏలయనగా యేసుయొక్క జీవముకూడ మా మర్త్య
శరీరమునందు ప్రత్యక్షపరచబడునట్లు, సజీవులమైన
మేము ఎల్లప్పుడు యేసు నిమిత్తము మరణమునకు అప్ప
12 గింపబడుచున్నాము. । కావున మాలో మరణమును
13 మీలో జీవమును కార్యసాధకమగుచున్నవి. । కృప
యెక్కువమంది ద్వారా ప్రబలించి దేవుని మహిమ
నిమిత్తము కృతజ్ఞతాస్తుతులు విస్తరింపజేయులాగున,
సమస్తమైనవి మీకొరకై యున్నవి. కాగా
—విశ్వసించితిని గనుక మాటలాడితిని[3] 14
అని వ్రాయబడిన ప్రకారము అట్టి విశ్వాసముతో 15
కూడిన ఆత్మ కలవారమై, ప్రభువైన యేసును లేపిన
వాడు యేసుతో మమ్మునుకూడ లేపి మీతోకూడ
తనయెదుట నిలువబెట్టునని యెరిగి, మేమును విశ్వ
సించుచున్నాము గనుక మాటలాడుచున్నాము.
కావున మేము అధైర్యపడము; మా బాహ్యపురు 16
షుడు కృశించుచున్నను, ఆంతర్యపురుషుడు దినదినము
నూతనపరచబడుచున్నాడు. । మేము దృశ్యమైన 17
వాటిని చూడక అదృశ్యమైనవాటినే నిదానించి చూచు
చున్నాము గనుక । క్షణమాత్రముండు మా చులకని 18
శ్రమ మాకొరకు అంతకంతకు ఎక్కువగా నిత్యమైన
మహిమ భారమును కలుగజేయుచున్నది. ఏలయనగా
దృశ్యమైనవి అనిత్యములు; అదృశ్యమైనవి నిత్యములు.
భూమిమీద మన గుడారమైన యీ నివాసము 5
శిథిలమైపోయినను, చేతిపనికాక దేవునిచేత కట్టబడి
నదియు నిత్యమైనదియునైన నివాసము పరలోక
మందు మనకున్నదని యెరుగుదుము. । మనము దిగం 2
బరులము కాక వస్త్రము ధరించుకొనినవారముగా కన
బడుదుము. కాబట్టి పరలోకమునుండివచ్చు మన
నివాసము దీనిపైని ధరించుకొన నపేక్షించుచు దీనిలో
మూల్గుచున్నాము. । ఈ గుడారములోనున్న మనము 3
భారము మోసికొని మూల్గుచున్నాము. ఇది తీసివేయ 4
వలెనని కాదు గాని మర్త్యమైనది జీవముచేత మ్రింగి
వేయబడునట్లు, ఆ నివాసమును దీనిపైని ధరించుకొన
గోరుచున్నాము. । దీనినిమిత్తము మనలను సిద్ధపరచిన 5
వాడు దేవుడే; మరియు ఆయన తన ఆత్మ అను సంచ
కరువును మన కనుగ్రహించియున్నాడు. । వెలి చూపు 6
వలన కాక విశ్వాసమువలననే నడుచుకొనుచున్నాము।
గనుక ఈ దేహములో నివసించుచున్నంత కాలము 7
ప్రభువునకు దూరముగా ఉన్నామని యెరిగియుండి
యు, ఎల్లప్పుడును ధైర్యముకలవారమై యున్నాము.।
ఇట్లు ధైర్యము కలిగి యీ దేహమును విడిచిపెట్టి 8
ప్రభువునొద్ద నివసించుటకు ఇష్టపడుచున్నాము. ।
కావున దేహమందున్నను దేహమును విడిచినను, 9
ఆయనకు ఇష్టులమై యుండవలెనని మిగుల అపేక్షించు
చున్నాము. । ఎందుకనగా తాను జరిగించిన క్రియల 10
చొప్పున, అవి మంచివైనను సరే చెడ్డవైనను సరే,
దేహముతో జరిగించినవాటి ఫలమును ప్రతివాడును
పొందునట్లు మనమందరమును క్రీస్తు న్యాయపీఠము
ఎదుట ప్రత్యక్షము కావలయును.
కావున మేము ప్రభువు విషయమైన భయము 11
నెరిగి మనుష్యులను ప్రేరేపించుచున్నాము. మేము

1 లేక, ఆత్మయగు ప్రభువుచేత. 2 ఆదికాండము, 1: 3. 3 కీర్తన. 116: 10.

దేవునికి ప్రత్యక్షపరచబడినవారము; మీ మనస్సాక్షు
లకు కూడ ప్రత్యక్షపరచబడియున్నామని నమ్ము
12 చున్నాను. । మమ్మును మేమే మీ యెదుట తిరిగి
మెప్పించుకొనుటలేదు గాని హృదయమునందు అతి
శయపడక పైరూపమునందే అతిశయపడువారికి
ప్రత్యుత్తరమిచ్చుటకు మీకు ఆధారము కలుగవలెనని
మా విషయమై మీకు అతిశయాస్పదము కలిగించు
13 చున్నాము. । ఏలయనగా మేము వెఱ్ఱివారమైతిమా
దేవుని నిమిత్తమే; స్వస్థబుద్ధిగలవారమైతిమా మీ నిమి
14 త్తమే. । క్రీస్తు ప్రేమ మమ్మును బలవంతము చేయు
చున్నది; ఏలాగనగా అందరికొరకు ఒకడు మృతి
పొందెను గనుక అందరును మృతిపొందిరనియు, ।
15 జీవించువారికమీదట తమకొరకు కాక తమ నిమి
త్తము మృతిపొంది తిరిగి లేచినవానికొరకే జీవించు
టకు ఆయన అందరికొరకు మృతిపొందెననియు నిశ్చ
16 యించుకొనుచున్నాము. । కావున ఇకమీదట మేము
శరీరరీతిగా ఎవనినైనను ఎరుగము; మేము క్రీస్తును
శరీరరీతిగా ఎరిగియుండినను ఇకమీదట ఆయనను
17 ఆలాగు ఎరుగము. । కాగా ఎవడైనను క్రీస్తునందున్న
యెడల వాడు నూతన సృష్టి; పాతవి గతించెను,
18 ఇదిగో క్రొత్తవాయెను; । సమస్తమును దేవునివలననైనవి;
ఆయన మనలను క్రీస్తుద్వారా తనతో సమాధాన
పరచుకొని, ఆ సమాధాన విషయమైన పరిచర్యను
19 మాకు అనుగ్రహించెను. । అదేమనగా దేవుడు వారి
అపరాధములను వారిమీద మోపక, క్రీస్తునందు
లోకమును తనతో సమాధానపరచుకొనుచు, ఆ సమా
ధానవాక్యమును (ప్రచురించుటకు) మాకు అప్పగించెను.
20 కావున దేవుడు మా ద్వారా వేడుకొనినట్టు
మేము క్రీస్తుకు రాయబారులమై—దేవునితో సమా
ధానపడుడని క్రీస్తు పక్షముగా మిమ్మును బతిమాలు
21 కొనుచున్నాము. । ఎందుకనగా మనమాయనయందు
దేవుని నీతి అగునట్లు పాపమెరుగని ఆయనను మన
6 కొరకు పాపముగా చేసెను. । కాగా మేమాయన
తోటిపనివారమై మీరు పొందిన దేవుని కృపను
వ్యర్థము చేసికొనవద్దని మిమ్మును వేడుకొనుచున్నాము.
2 — అనుకూల సమయమందు నీ మనవి ఆలకించి
తిని; రక్షణ దినమందు నిన్ను ఆదుకొంటిని
అని ఆయన చెప్పుచున్నాడు గదా?[1] ఇదిగో ఇప్పుడే
మిక్కిలి అనుకూలమైన సమయము, ఇదిగో ఇదే
3 రక్షణదినము. । మా పరిచర్య నిందింపబడకుండు నిమి
త్తము ఏ విషయములోనైనను అభ్యంతరమేమియు
4 కలుగజేయక । శ్రమలయందును ఇబ్బందులయందును
5 ఇరుకులయందును । దెబ్బలయందును చెరసాలలలోను
అల్లరులలోను ప్రయాసములలోను జాగరములలోను
ఉపవాసములలోను మిగుల ఓర్పుగలవారమై, । పవి 6
త్రతతోను జ్ఞానముతోను దీర్ఘశాంతముతోను దయ
తోను పరిశుద్ధాత్మవలనను నిష్కపటమైన ప్రేమతోను ।
సత్యవాక్యము చెప్పుటవలనను దేవుని బలమువలనను 7
కుడి యెడమల నీతి ఆయుధములు కలిగి, । ఘనతా 8
ఘనతలవలనను సుకీర్తి దుష్కీర్తులవలనను దేవుని పరి 10
చారకులమై యున్నామని అన్ని స్థితులలో మమ్మును
మేమే మెప్పించుకొనుచున్నాము. మేము మోస
గాండ్లమైనట్లుండియు సత్యవంతులము; తెలియబడని
వారమైనట్లుండియు బాగుగ తెలియబడినవారము;
చనిపోవుచున్నవారమైనట్లుండియు ఇదిగో బ్రదుకు
చున్నవారము; శిక్షింపబడినవారమైనట్లుండియు చంప
బడనివారము; దుఃఖపడినవారమైనట్లుండియు ఎల్ల
ప్పుడు సంతోషించువారము; దరిద్రులమైనట్లుం
డియు అనేకులకు ఐశ్వర్యము కలిగించువారము;
ఏమియు లేనివారమైనట్లుండియు సమస్తమును కలిగిన
వారము.

ఓ కొరింథీయులారా అరమర లేకుండ మీతో 11
మాటలాడుచున్నాను;[2] మా హృదయము విశాలపరచ
బడియున్నది. । మీయెడల మా అంతఃకరణము సంకు 12
చితమై యుండలేదు గాని మీ అంతఃకరణమే సంకు
చితమై యున్నది. । మీయెడల మాకున్న అంతఃకరణ 13
మునకు ప్రతిఫలముగా మీరును మీ హృదయము
లను విశాలపరచుకొనుడి; మీరు నా పిల్లలని మీతో
ఈలాగు చెప్పుచున్నాను.

మీరు అవిశ్వాసులతో విజ్జోడుగా ఉండకుడి. 14
నీతికి దుర్నీతితో ఏమి సాంగత్యము? వెలుగునకు చీక
టితో ఏమి పొత్తు? । క్రీస్తుకు బెలియాలుతో ఏమి 15
సందర్భము? అవిశ్వాసితో విశ్వాసికి పాలెక్కడిది? ।
దేవుని ఆలయమునకు విగ్రహములతో ఏమి పొందిక? 16
మనము జీవముగల దేవుని ఆలయమై యున్నాము; 18
అందుకు దేవుడీలాగు సెలవిచ్చుచున్నాడు[3]

--నేను వారిలో నివసించి సంచరింతును, నేను
వారి దేవుడనై యుందును వారు నా ప్రజలై
యుందురు. — కావున మీరు వారి మధ్య
నుండి బయలువెడలి ప్రత్యేకముగా ఉండుడి;
అపవిత్రమైనదాని ముట్టకుడని ప్రభువు చెప్పు
చున్నాడు.— మరియు నేను మిమ్మును చేర్చు
కొందును, మీకు తండ్రినై యుందును,
మీరు నాకు కుమారులును కుమార్తెలునై
యుందురని సర్వశక్తిగల ప్రభువు చెప్పు
చున్నాడు.

ప్రియులారా, మనకు ఈ వాగ్దానములు కలిగి 7
యున్నవి గనుక దేవుని భయముతో, పరిశుద్ధతను

[1] యెషయా. 49: 8. [2] [illegible] విప్పబడియున్నది. [3] లేవీయ. 26: 12. యెషయా, 52: 11; [illegible], 20: 34, 41.

సంపూర్తి చేసికొనుచు, శరీరమునకును ఆత్మకును కలిగిన
సమస్త కల్మషమునుండి మనలను పవిత్రులనుగా చేసి
కొందము.
2 మమ్మును మీ హృదయములలో చేర్చుకొనుడి;
మేమెవనికిని అన్యాయము చేయలేదు, ఎవనిని చెరుప
3 లేదు, ఎవనిని మోసముచేయలేదు. । మీకు శిక్షావిధి
కలుగవలెనని నేనీలాగు చెప్పలేదు. చనిపోయిన
గాని జీవించినగాని మీరును మేమును కూడ ఉండ
వలెనని మీరు మా హృదయములలో ఉన్నారని నేను
4 లోగడ చెప్పితిని గదా? । మీయెడల నేను బహు
ధైర్యముగా మాటలాడుచున్నాను, మిమ్మునుగూర్చి
నాకు చాల అతిశయము కలదు, ఆదరణతో నిండు
కొనియున్నాను, మా శ్రమ యంతటికి మించిన అత్య
ధికమైన ఆనందముతో ఉప్పొంగుచున్నాను
5 మేము మకెదోనియకు వచ్చినప్పుడును మా శరీ
రము ఏమాత్రమును విశ్రాంతి పొందలేదు. ఎటు
బోయినను మాకు శ్రమయే కలిగెను; వెలుపట పోరా
6 టములు లోపట భయములు ఉండెను. । అయినను
దీనులను ఆదరించు దేవుడు తీతు రాకవలన మమ్మును
7 ఆదరించెను. । తీతు రాకవలనమాత్రమే కాకుండ,
అతడు మీ అత్యభిలాషను మీ అంగలార్పును నా
విషయమై మీకు కలిగిన అత్యాసక్తిని మాకు తెలు
పుచు, తాను మీ విషయమై పొందిన ఆదరణవలన
కూడ మమ్మును ఆదరించెను గనుక నేను మరి ఎక్కు
8 వగా సంతోషించితిని. । నేను వ్రాసిన పత్రికవలన
మిమ్మును దుఃఖపెట్టినందున విచారపడను; నాకు
విచారము కలిగినను ఆ పత్రిక మిమ్మును స్వల్పకాలము
9 మట్టుకే దుఃఖపెట్టెనని తెలిసికొనియున్నాను. । మీరు
దుఃఖపడితిరని సంతోషించుట లేదు; మీరు దుఃఖ
పడి మారుమనస్సు పొందితిరని యిప్పుడు సంతో
షించుచున్నాను. ఏలయనగా ఏ విషయములోనైనను
మావలన మీరు నష్టము పొందకుండుటకై, దైవ
10 చిత్తానుసారముగా దుఃఖపడితిరి. । దైవచిత్తానుసార
మైన దుఃఖము రక్షణార్థమైన మారుమనస్సును కలుగ
జేయును; (ఈ మారుమనస్సు) పశ్చాత్తాపము పుట్టిం
చదు. అయితే లోకసంబంధమైన దుఃఖము మరణ
11 మును కలుగజేయును. । మీరు దేవుని చిత్తప్రకారము
పొందిన యీ దుఃఖము ఎట్టి జాగ్రతను ఎట్టి (దోష
నివారణకైన) ప్రతివాదమును ఎట్టి ఆగ్రహమును
ఎట్టి భయమును ఎట్టి అభిలాషను ఎట్టి ఆసక్తిని ఎట్టి
ప్రతిదండనను మీలో పుట్టించెనో చూడుడి. ఆ
కార్యమునుగూర్చి సమస్త విషయములలోను మీరు
12 నిర్దోషులై యున్నారని రుజువుపరచుకొంటిరి. । నేను
మీకు వ్రాసినను ఆ దుష్కార్యము చేసిన వాని
నిమిత్తము వ్రాయలేదు; వానివలన అన్యాయము
పొందినవాని నిమిత్తమైనను వ్రాయలేదు; మాయెడల

మీకున్న ఆసక్తి దేవునియెదుట మీ మధ్య బాహాట
మగుటకే వ్రాసితిని. । ఇందుచేత మేము ఆదరింప
బడితిమి. అంతేకాదు, మాకు ఈ ఆదరణ కలిగి
నప్పుడు తీతుయొక్క ఆత్మ మీ అందరివలన విశ్రాంతి
పొందినందున అతని సంతోషమును చూచి మరి
యెక్కువగా మేము సంతోషించితిమి. । ఏలయనగా
నేనతని యెదుట మీ విషయమై అతిశయపు మాటలు
చెప్పినను నేను సిగ్గుపరచబడలేదు. మేమేలాగు అన్ని
టిని మీతో నిజముగా చెప్పితిమో ఆలాగే మేము
తీతు ఎదుట మీ విషయమై చెప్పిన అతిశయపు
మాటలు నిజమని కనబడెను. । మరియు మీరు భయ
ముతోను వణకుతోను తన్ను చేర్చుకొంటిరని అతడు
మీయందరి విధేయతను జ్ఞాపకముచేసికొనుచుండగా,
అతని అంతఃకరణము మరి ఎక్కువగా మీయెడల
ఉన్నది. । ప్రతి విషయములోను మీవలన నాకు
ధైర్యము కలుగుచున్నది గనుక సంతోషించుచున్నాను.

సహోదరులారా, మకెదోనియ సంఘములకు
అనుగ్రహింపబడియున్న దేవుని కృపనుగూర్చి మీకు
తెలియజేయుచున్నాము. । ఏలాగనగా వారు బహు
శ్రమవలన పరీక్షింపబడగా అత్యధికముగా సంతో
షించిరి. మరియు వారు నిరుపేదలైనను గొప్ప దాతృ
త్వము బహుగా విస్తరించెను. । ఈ కృప విషయము
లోను, పరిశుద్ధులకొరకైన పరిచర్యలో పాలుపొందు
విషయములోను, మనఃపూర్వకముగా మమ్మును వేడు
కొనుచు, వారు తమ సామర్థ్యము కొలదియే గాక
సామర్థ్యముకంటె ఎక్కువగాను తమంతట తామే
యిచ్చిరని మీకు సాక్ష్యమిచ్చుచున్నాను. । ఇదియు
గాక మొదట ప్రభువుకును, దేవుని చిత్తమువలన
మాకును తమ్మును తామే అప్పగించుకొనిరి; యింతగా
చేయుదురని మేమనుకొనలేదు. । కావున తీతు ఈ
కృపను ఏలాగు పూర్వము మొదలుపెట్టెనో ఆలా
గున దానిని మీలో సంపూర్ణము చేయుమని మేము
తని వేడుకొంటిమి. । మీరు ప్రతివిషయములో,
అనగా విశ్వాసమందును ఉపదేశమందును జ్ఞాన
మందును సమస్త జాగ్రతయందును మీకు మాయెడల
నున్న ప్రేమయందును ఏలాగు అభివృద్ధిపొందు
చున్నారో ఆలాగే మీరు ఈ కృపయందుకూడ
అభివృద్ధిపొందునట్లు చూచుకొనుడి. । ఆజ్ఞాపూర్వక
ముగా మీతో చెప్పుటలేదు; ఇతరుల జాగ్రతను
మీకు చూపుటచేత మీ ప్రేమ యెంత యథార్థ
మైనదో పరీక్షింపవలెనని చెప్పుచున్నాను. । మీరు
మన ప్రభువైన యేసుక్రీస్తు కృపను ఎరుగుదురు
గదా? ఆయన ధనవంతుడై యుండినను, మీరు తన
దారిద్ర్యమువలన ధనవంతులు కావలెనని, మీనిమి
త్తము దరిద్రుడాయెను. । ఇందునుగూర్చి నా తాత్ప
ర్యము చెప్పుచున్నాను; సంవత్సరము క్రిందట నే

యీ కార్యము చేయుటయందే గాక చేయ తల
పెట్టుటయందు కూడ మొదటివారై యుండిన మీకు
11 అది చాలును. । కావున తలపెట్టుటకు సిద్ధమైన
మనస్సు మీలో ఏలాగు కలిగెనో, ఆలాగే మీ
కలిమికొలది సంపూర్తియగునట్లు మీరు ఆ కార్య
12 మును ఇప్పుడు నెరవేర్చుడి. । మొదట ఒకడు సిద్ధ
మైన మనస్సు కలిగియుంటే శక్తికి మించి కాదు గాని
13 కలిమికొలదియే యిచ్చినది ప్రీతికరమవును. । ఇతరు
లకు సుఖమును మీకు కష్టమును కలుగవలెనని యిది
చెప్పుటలేదు గాని
14 —నిండుగా కూర్చుకొనినవానికి ఎక్కువ మిగుల
15 లేదనియు కొంచెముగా కూర్చుకొనినవానికి
తక్కువ కాలేదనియు[1]
వ్రాయబడిన ప్రకారము అందరికి సమానముగా
ఉండు నిమిత్తము, ప్రస్తుతమందు మీ సమృద్ధి వారి
అక్కరకును (మరియొకప్పుడు) వారి సమృద్ధి మీ
యక్కరకును సహాయమై యుండవలెనని ఈలాగు
చెప్పుచున్నాను.
16 మీ విషయమై నాకు కలిగిన యీ ఆసక్తినే తీతు
హృదయములో పుట్టించిన దేవునికి స్తోత్రము. ।
17 అతడు నా హెచ్చరికను అంగీకరించెను గాని అతనికే
విశేషాసక్తి కలిగినందున తన యిష్టముచొప్పుననే మీ
18 యొద్దకు బయలుదేరి వచ్చుచున్నాడు. । మరియు
సువార్త విషయము సంఘములన్నిటిలో ప్రసిద్ధిచెందిన
సహోదరుని అతనితోకూడ పంపుచున్నాము. ।
19 అంతేకాక మన ప్రభువుకు మహిమ కలుగు నిమిత్త
మును మా సిద్ధమైన మనస్సు కనుపరచు నిమిత్తమును
ఈ ఉపకారద్రవ్యము విషయమై పరిచారకులమైన
మాతోకూడ అతడు ప్రయాణము చేయవలెనని
20 సంఘములవారతని ఏర్పరచుకొనిరి. । మరియు
మేమింత విస్తారమైన ధర్మము విషయమై పరిచారకులమై
యున్నాము గనుక దానిగూర్చి మామీద ఎవడును
తప్పు మోపకుండ మేము జాగ్రత్తగా చూచుకొనుచు
21 (అతని పంపుచున్నాము.) । ఏలయనగా ప్రభువు
దృష్టియందు మాత్రమే గాక మనుష్యుల దృష్టియం
దును యోగ్యమైనవాటిని గూర్చి శ్రద్ధగా ఆలోచించు
22 కొనుచున్నాము. । మరియు వారితోకూడ మేము
మా సహోదరుని పంపుచున్నాము. అనేక సంగతు
లలో అనేక పర్యాయములు అతని పరీక్షించి అతడు
ఆసక్తిగలవాడనియు, ఇప్పుడును మీయెడల అతనికి
కలిగిన విశేషమైన నమ్మికవలన మరి యెక్కువైన
23 ఆసక్తిగలవాడనియు తెలిసికొనియున్నాము. । —తీతు
ఎవడని (యెవరైన అడిగినయెడల)—అతడు నా పాలి
వాడును మీ విషయములో నా జత పనివాడునై
యున్నాడనియు;—మన సహోదరులెవరని (అడి
గినయెడల)—వారు సంఘముల దూతలును[2] క్రీస్తు
మహిమయునై యున్నారనియు నేను చెప్పుచున్నా
ను. । కాబట్టి మీ ప్రేమ యథార్థమైనదనియు మీ 24
విషయమైన మా అతిశయము వ్యర్థముకాదనియు
వారికి[3] సంఘములయెదుట కనుపరచుడి.

పరిశుద్ధులకొరకైన యీ పరిచర్యనుగూర్చి మీ 9
పేర వ్రాయుటకు నాకగత్యములేదు. । మీ మనస్సు 2
సిద్ధమై యున్నదని నేనెరుగుదును. అందువలన
—సంవత్సరమునుండి అకైయ సిద్ధపడియున్నదని చెప్పి
నేను మిమ్మునుగూర్చి మకెదొనియవారియెదుట అతి
శయపడుచున్నాను; మీ ఆసక్తిని చూచి అనేకులు
ప్రేరేపింపబడిరి. । అయితే మిమ్మునుగూర్చిన మా అతి 3
శయము ఈ విషయములో వ్యర్థముకాకుండునట్లు
నేను చెప్పినప్రకారము మీరు సిద్ధముగా ఉండు
టకై యీ సహోదరులను పంపితిని. । మీరు 4
సిద్ధపడనిపక్షమున ఒకవేళ మకెదొనియవారెవరైనను
నాతోకూడ వచ్చి మీరు సిద్ధముగా ఉండకపోవుట
చూచినయెడల, ఈ నమ్మిక కలిగియున్నందుకు మేము
సిగ్గుపరచబడుదుము; మీరు సిగ్గుపరచబడుదురని యిక
చెప్పనేల? । కావున లోగడ ఇచ్చెదమని మీరు 5
చెప్పిన ధర్మము పిసినితనముగా ఇయ్యక ధారాళముగా
ఇయ్యవలెనని చెప్పి సహోదరులు మీ యొద్దకు
ముందుగా వచ్చి దాని జమచేయుటకై వారిని హెచ్చ
రించుట అవసరమని తలంచితిని. । కొంచెముగా విత్తు 6
వాడు కొంచెముగా పంటకోయును, సమృద్ధిగా[4]
విత్తువాడు సమృద్ధిగా[4] పంటకోయును అని యీ
విషయమై చెప్పవచ్చును. । సణుగుకొనకను బలవంత 7
ముగా కాకను ప్రతివాడును తన హృదయములో
నిశ్చయించుకొనిన ప్రకారము ఇయ్యవలెను; దేవుడు
ఉత్సాహముగా ఇచ్చువానిని ప్రేమించును. । మరియు 8
అన్నిటియందు ఎల్లప్పుడును మీలో మీరు సర్వ
సమృద్ధిగలవారై ఉత్తమమైన ప్రతికార్యము చేయు
టకు దేవుడు మీయెడల సమస్తవిధములైన కృపను విస్త
రింపచేయగలడు. । ఇందు విషయమై 9

అతడు వెదజల్లి దరిద్రులకిచ్చెను
అతని నీతి నిరంతరము నిలుచును

అని వ్రాయబడియున్నది.[5] । విత్తువానికి విత్తనమును 10
తినుటకు ఆహారమును దయచేయు (దేవుడు) మీకు
విత్తనము దయచేసి విస్తరింపచేసి మీరు ప్రతి విషయ
ములో పూర్ణౌదార్య భాగ్యముగలవారగునట్లు, మీ
నీతిఫలములు వృద్ధిపొందించును. । ఇట్టి ఔదార్యము 11
వలన మా ద్వారా దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లింప
బడును. । ఏలయనగా ఈ సేవనుగూర్చిన పరిచర్య 12

[1] నిర్గమ. 16: 18. [2] మూలభాషలో—అపొస్తలులును. [3] మూలభా.—మీ ప్రేమయొక్కయు మీ విషయమైన మా అతిశయముయొక్కయు రుజువును వారికి. [4] మూలభా.—దీవనలతో. [5] కీర్తన, 112: 9.

పరిశుద్ధుల అక్కరలకు సహాయము కలుగజేయుట
మాత్రము కాకుండ, అనేకులు దేవునికి చెల్లించు
కృతజ్ఞతాస్తుతుల మూలముగా విస్తరించుచున్నది. ।
13 ఏలాగనగా క్రీస్తు సువార్తను అంగీకరింతుమని ఒప్పు
కొనుటయందు మీరు విధేయులైనందుచేతను, వారి
విషయమును అందరి విషయమును ఇంత ఔదార్య
ముగా ధర్మము చేసినందుచేతను, ఈ పరిచర్య మూల
ముగా మీ యోగ్యత కనబడినందున వారు దేవుని
14 మహిమపరచుచున్నారు. । మరియు మీయెడల
దేవుడు కనుపరచిన అత్యధికమైన కృపను చూచి
వారు మీ నిమిత్తమై ప్రార్థనచేయుచు, మిమ్మును
చూడవలెనని విశేషాపేక్షగలవారై యున్నారు. ।
15 చెప్ప శక్యము కాని ఆయన వరమునుగూర్చి దేవునికి
స్తోత్రము.

10 యేసుక్రీస్తుయొక్క సాత్వికమును మృదుత్వ
మును బట్టి పౌలను నేను మిమ్మును వేడుకొనుచున్నాను.
నేను మీ యెదుట నున్నప్పుడు మీలో అణుకువగల
వాడను, ఎదుటలేనప్పుడు మీయెడల ధైర్యముగల
2 వాడను. । శరీరప్రకారము నడుచుకొనువారమని
మమ్మునుగూర్చి కొందరనుకొనుచున్నారు కారా? అట్టి
వారియెడల నేను తెగించి కాఠిన్యము చూపవలెనని
తలంచుకొనుచున్నాను గాని నేను వచ్చినప్పుడు అట్లు
కాఠిన్యమును చూపకుండునట్లు చేయుడని నేను
3 మిమ్మును బతిమాలుకొనుచున్నాను. । మేము శరీర
ధారులమై నడుచుకొనుచున్నను శరీరప్రకారము యు
4 ద్ధము చేయము. । మా యుద్ధోపకరణములు శరీరసం
బంధమైనవి కావుగాని దేవునియెదుట దుర్గములను
5 పడద్రోయజాలిన బలముకలవై యున్నవి. । మేము
వితర్కములను, దేవునిగూర్చిన జ్ఞానమును అడ్డగించు
ప్రతి ఆటంకమును పడద్రోసి, ప్రతి ఆలోచనను
6 క్రీస్తుకు లోబడునట్లు చెరపట్టి । మీరు సంపూర్ణ
విధేయతను కనుపరచినప్పుడు సమస్తమైన అవిధేయ
7 తకు ప్రతిదండన చేయ సిద్ధపడి యున్నాము. । సంగ
తులను పైపైననే మీరు చూచుచున్నారు. ఎవడైనను
తాను క్రీస్తువాడని నమ్ముకొనిన పక్షమున అతడేలాగు
క్రీస్తువాడో ఆలాగే మేమును క్రీస్తువారమని తన
8 మనస్సులో తాను తిరిగి ఆలోచించుకొనవలెను. । పడ
ద్రోయుటకు కాక మిమ్మును కట్టుటకే ప్రభువు మాకు
అనుగ్రహించిన అధికారమునుగూర్చి నేనొకవేళ
కొంచెము అధికముగా అతిశయపడినను నేను సిగ్గు
9 పరచబడను. । నేను వ్రాయు పత్రికలవలన మిమ్మును
భయపెట్టవలెనని యున్నట్టు కనబడకుండ (ఈ మాట
10 చెప్పుచున్నాను.) । —అతని పత్రికలు ఘనమైనవియు
బలీయమైనవియునై యున్నవి గాని అతడు శరీర
రూపమునకు బలహీనుడు, అతని ప్రసంగము కొర
11 గానిదని యొకడు అనును. । మేమెదుట లేనప్పుడు
పత్రికలద్వారా మాటలయందెట్టివారమై యున్నా
మో, యెదుట ఉన్నప్పుడు క్రియయందు అట్టివారమై
యుందుమని అట్లనువాడు తలంచుకొనవలెను. ।
తమ్మునుతామే మెచ్చుకొను కొందరితో జతపరచు 1
కొనుటకైనను వారితో సరిచూచుకొనుటకైనను మేము
తెగింపజాలము గాని, వారు తమలోనే యొకరిని బట్టి
యొకరు ఎన్నికచేసికొని యొకరితోనొకరు సరిచూచు
కొనుచున్నందున, గ్రహింపులేక యున్నారు. ।
మేమైతే మేరకు మించి అతిశయపడముగాని మీరున్న 1
స్థలమువరకును రావలెనని దేవుడు మాకు కొలిచి
యిచ్చిన మేరకు లోబడియుండి అతిశయించుచున్నా
ము. । మేము క్రీస్తు సువార్త ప్రకటించుచు, మీవర 1
కును వచ్చియుంటిమి గనుక మీయొద్దకు రానివార
మైనట్టు మేము మా మేర దాటి వెళ్లుచున్నవారము
కాము. । మేము మేరకు మించి యితరుల ప్రయాస 1
ఫలములలో భాగస్థులమనుకొని అతిశయపడము. మీ
విశ్వాసము అభివృద్ధియైనకొలది మాకనుగ్రహింప
బడిన మేరలకు లోపలనే సువార్త మరి విశేషముగా
వ్యాపింపజేయుచు, । మీ ఆవలి ప్రదేశములలో కూడ 1
సువార్త ప్రకటించునట్లుగా, మేము మీ మూలముగా
ఘనపరచబడుదుమని నిరీక్షించుచున్నామే గాని, మరి
యొకని మేరలో చేరి సిద్ధమైయున్నవి మావియైనట్టు
అతిశయింపగోరము. । అతిశయించువాడు ప్రభువు 1
నందే అతిశయింపవలెను. । ప్రభువు మెచ్చుకొను 1
వాడే యోగ్యుడు గాని తన్నుతానే మెచ్చుకొనువాడు
యోగ్యుడుకాడు.

కొంచెమవివేకముగా నేను మాటలాడినను సహిం 11
పవలెనని కోరుచున్నాను, నన్నుగూర్చి మీరేలాగై
నను సహించుడి. । దేవాసక్తితో మీ యెడల ఆసక్తి 2
కలిగి యున్నాను; ఎందుకనగా పవిత్రురాలైన కన్య
కనుగా ఒక్కడే పురుషునికి, అనగా క్రీస్తుకు సమ
ర్పింపవలెనని, మిమ్మును ప్రధానము చేసితిని గాని, ।
సర్పము తన కుయుక్తిచేత హవ్వను మోసపరచినట్లు 3
మీ మనస్సులును చెరుపబడి, క్రీస్తుయెడలనున్న
సరళతనుండియు పవిత్రతనుండియు ఎట్లయిన తొలగి
పోవునేమో అని భయపడుచున్నాను. । ఏలయనగా 4
వచ్చినవాడెవడైనను మేము ప్రకటింపని మరియొక
యేసును ప్రకటించినను, లేక మీరు పొందని మరి
యొక ఆత్మను మీరు పొందినను, మీరు అంగీకరింపని
మరియొక సువార్త మీరు అంగీకరించినను, మీరు వాని
గూర్చి సహించుట యుక్తమే. । నేనైతే మిక్కిలి 5
శ్రేష్ఠులైన యీ అపొస్తలులకంటె లేశమాత్రమును
తక్కువవాడను కానని తలంచుకొనుచున్నాను. ।
మాటలయందు నేను నేర్పులేనివాడనైనను జ్ఞాన 6
మందు నేర్పులేనివాడను కాను. ప్రతి సంగతిలోను
అందరి మధ్యను మీ నిమిత్తము మేము (ఆ జ్ఞాన

7 మును) కనుపరచియున్నాము. । మిమ్మును హెచ్చింప
వలెనని మీకు దేవుని సువార్తను ఉచితముగా ప్రకటిం
చుచు నన్ను నేనే తగ్గించుకొనినందున పాపము
8 చేసితినా? । మీకు పరిచర్య చేయుటకై నేనితర సంఘ
ములవలన జీతము పుచ్చుకొని వారి ధనము దోంగిలిన
9 వాడనైతిని. । మరియు నేను మీయొద్దనున్నప్పుడు
నాకక్కర కలిగియుండగా నేనెవనిమీదను భారము
మోపలేదు; మకెదోనియనుండి సహోదరులు వచ్చి
నా అక్కర తీర్చిరి. ప్రతి విషయములోను నేను
మీకు భారముగా ఉండకుండ జాగ్రతపడితిని, ఇక
10 ముందుకును జాగ్రతపడుదును । క్రీస్తు సత్యము నా
యందు ఉండుటవలన అకైయ ప్రాంతములయందు
నేనీలాగు అతిశయపడకుండ, నన్ను ఆటంక పరచుటకు
11 ఎవరి తరముకాదు. । ఎందువలన? నేను మిమ్మును
12 ప్రేమింపనందువలననా? దేవునికే తెలియును. । అతి
శయకారణము వెదకువారు ఏ విషయములో అతిశ
యించుచున్నారో ఆ విషయములో వారును మావ
లెనే యున్నారని కనబడునిమిత్తము వారికి కారణము
దొరుకకుండ కొట్టివేయుటకు, నేను చేయుచున్న
13 ప్రకారమే యిక ముందుకును చేతును. । ఏలయనగా
అట్టివారు క్రీస్తుయొక్క అపొస్తలుల వేషము ధరించు
కొనువారైయుండి, దొంగ అపొస్తలులును మోస
14 గాండ్లగు పనివారునై యున్నారు. । ఇది ఆశ్చర్యము
కాదు; సాతాను తానే వెలుగు దూత వేషము ధరించు
15 కొనుచున్నాడు । గనుక వాని పరిచారకులును నీతి
పరిచారకుల వేషము ధరించుకొనుట గొప్ప సంగతి
కాదు. వారి క్రియలచొప్పున వారి కంతము కలు
గును.

16 నేను మరల చెప్పుచున్నాను. నేను అవివేకినని
యెవడును తలంచవద్దు. అట్లు తలంచినయెడల నేను
కొంచెము అతిశయపడునట్లు నన్ను అవివేకినైనట్టు
17 గానే చేర్చుకొనుడి. । నేను చెప్పుచున్నది ప్రభువు
చిత్తప్రకారము చెప్పుటలేదు; అవివేకివలె చెప్పుచు
న్నాను. ఇట్లు అతిశయపడుటకు ఆధారముకలిగి
18 చెప్పుచున్నాను. । అనేకులు శరీర విషయములో
అతిశయపడుచున్నారు గనుక నేనును ఆలాగే అతి
19 శయపడుదును. । మీరు వివేకులైయుండి సంతోష
20 ముతో అవివేకులను సహించుచున్నారు. । ఒకడు
మిమ్మును దాస్యమునకు లోపరచినను, ఒకడు మిమ్ము
మ్రింగివేసినను, ఒకడు మిమ్ము వశపరచుకొనినను,
ఒకడు తన్ను గొప్పచేసికొనినను, ఒకడు ముఖము
మీద మిమ్ము కొట్టినను మీరు సహించుచున్నారు. ।
21 మేము బలహీనులమై యున్నట్టు అవమానముగా
మాటలాడుచున్నాను: ఏ విషయమందు ఎవడైన
ధైర్యము కలిగియున్నాడో ఆ విషయమందు నేను
కూడ ధైర్యము కలిగినవాడను; అవివేకముగా మాట
లాడుచున్నాను సుమా. । వారు హెబ్రీయులా? 22
నేనును హెబ్రీయుడనే. వారు ఇశ్రాయేలీయులా?
నేనును ఇశ్రాయేలీయుడనే. వారు అబ్రాహాము
సంతానమా? నేనును అట్టివాడనే. । వారు క్రీస్తు 23
పరిచారకులా? వెర్రివానివలె మాటలాడుచున్నాను,
నేనును మరి యెక్కువగా క్రీస్తు పరిచారకుడను.
మరి విశేషముగా ప్రయాసపడితిని, మరి అనేక
పర్యాయములు చెరసాలలలో ఉంటిని; అపరిమిత
ముగా దెబ్బలు తింటిని, అనేకమారులు ప్రాణాపా
యములలో ఉంటిని. । యూదులచేత అయిదు 24
మారులు ఒకటి తక్కువ నలువది దెబ్బలు[1] తింటిని; ।
ముమ్మారు బెత్తములతో కొట్టబడితిని; ఒకసారి రాళ్లతో 25
కొట్టబడితిని; ముమ్మారు ఓడ పగిలి శ్రమపడితిని;
ఒక దివారాత్రము సముద్రములో గడిపితిని. ।
అనేక పర్యాయములు ప్రయాణములలోను, నదుల 26
వలననైన ఆపదలలోను, దొంగలవలననైన ఆపదల
లోను, నా స్వజనులవలననైన ఆపదలలోను, అన్య
జనులవలననైన ఆపదలలోను, పట్టణములో ఆపదల
లోను, అరణ్యములో ఆపదలలోను, సముద్రములో
ఆపదలలోను, కపట సహోదరులవలని ఆపదలలోను
ఉంటిని. । ప్రయాసతోను, కష్టములతోను, తరు 27
చుగా జాగరణములతోను, ఆకలిదప్పులతోను, తరు
చుగా ఉపవాసములతోను, చలితోను, దిగంబర
త్వముతోను ఉంటిని. ఇంకను చెప్పవలసినవి అనేకము
లున్నవి. । ఇవియుగాక సంఘములన్నిటినిగూర్చిన 28
చింతయు కలదు. ఈ భారము దినదినము నాకు
కలుగుచున్నది. । ఎవడైన బలహీనుడాయెనా? నేనును 29
బలహీనుడను కానా? ఎవడైన తొట్రుపడెనా?
నాకును మంట కలుగదా? । అతిశయపడవలసియుంటే 30
నేను నా బలహీనత విషయమైన సంగతులను
గూర్చియే అతిశయపడుదును. । నేనబద్ధమాడుట 31
లేదని నిరంతరము స్తుతింపబడుచున్న మన ప్రభువగు
యేసుయొక్క తండ్రియైన దేవుడు ఎరుగును. । దమ 32
స్కులో అరెత అను రాజుక్రింద ఉన్న అధిపతి
నన్ను పట్టగోరి కావలియుంచి దమస్కీయుల పట్టణ
మును భద్రముచేసెను. । అప్పుడు నేను కిటికీగుండ 33
గోడమీదనుండి గంపలో దింపబడి అతని చేతిలో
నుండి తప్పించుకొనిపోతిని.

అతిశయపడుట నాకు తగదు గాని అతిశయపడ **12**
వలసివచ్చినది. ప్రభువు (దయచేసిన) దర్శనములను
గూర్చియు ప్రత్యక్షతలను గూర్చియు చెప్పుదును. ।
క్రీస్తునందున్న యొక మనుష్యుని నేనెరుగుదును. 2
అతడు పదునాలుగు సంవత్సరములక్రిందట మూడవ
ఆకాశమునకు కొనిపోబడెను; అతడు శరీరముతో

1 ద్వితీయోపదేశకాండము, 25: 3 చూడుము.

కొనిపోబడెనో నేనెరుగను, శరీరములేక కొనిపో
3 బడెనో నేనెరుగను, అది దేవునికే తెలియును. । అట్టి
4 మనుష్యుని నేనెరుగుదును. అతడు పరదైసులోనికి కొని
పోబడి, పలుకశక్యము కాని మాటలు వినెను; ఆ
మాటలు మనుష్యుడు పలుకకూడదు. అతడు శరీర
ముతో కొనిపోబడెనో శరీరములేక కొనిపోబడెనో
5 నేనెరుగను, అది దేవునికే తెలియును. । అట్టివాని
గూర్చి అతిశయింతును; నా విషయమైతేనో నా బల
హీనతయందే గాక వేరువిధముగా అతిశయింపను. ।
6 అతిశయపడుటకు ఇచ్ఛయించినను నేను సత్యమే
పలుకుదును గనుక అవివేకిని కాకపోదును గాని
నాయందు ఎవడైనను చూచినదానికన్నను నావలన
వినినదానికన్నను నన్ను ఎక్కువ ఘనముగా ఎంచు
నేమో అని అతిశయించుట మానుకొనుచున్నాను. ।
7 నాకు కలిగిన ప్రత్యక్షతలు బహు విశేషముగా ఉన్నం
దున నేను అత్యధికముగా హెచ్చిపోకుండు నిమిత్తము
నాకు శరీరములో ఒక ముల్లు, నేను అత్యధికముగా
హెచ్చిపోకుండు నిమిత్తము, నన్ను నలగగొట్టుటకు
8 సాతానుయొక్క దూతగా, ఉంచబడెను. । అది నా
యొద్దనుండి తొలగిపోవలెనని దాని విషయమై ముమ్మారు
9 ప్రభువును వేడుకొంటిని. । అందుకు—నా కృప నీకు
చాలును, బలహీనతయందు నా శక్తి పరిపూర్ణమగు
చున్నదని ఆయన నాతో చెప్పెను. కాగా క్రీస్తు శక్తి
నామీద నిలిచియుండు నిమిత్తము,[1] విశేషముగా నా
బలహీనతలయందే బహు సంతోషముగా అతిశయ
10 పడుదును. । నేనెప్పుడు బలహీనుడనో అప్పుడే బల
వంతుడను గనుక క్రీస్తు నిమిత్తము (నాకు కలిగిన) బల
హీనతలలోను నిందలలోను ఇబ్బందులలోను హింసల
లోను ఉపద్రవములలోను నేను సంతోషించు
చున్నాను.
11 నేనవివేకినైతిని, మీరే నన్ను బలవంతము చేసితిరి.
నేను మీచేత మెప్పు పొందవలసినవాడను, ఏలయనగా
నేను ఏమాత్రపువాడను కాకపోయినను మిక్కిలి
శ్రేష్ఠులైన యీ అపొస్తలులకంటె నేను ఏ విషయము
12 లోను తక్కువవాడను కాను. । సూచకక్రియలను
అద్భుతములను మహత్కార్యములను చేయుటవలన,
అపొస్తలునియొక్క చిహ్నములు పూర్ణమైన ఓరిమితో
13 మీ మధ్యను నిజముగా కనుపరచితిని. । నేను మీకు
భారముగా ఉండకపోతినను విషయములో తప్ప మరి
ఏ విషయములో మీరితర సంఘములకంటె తక్కువ
వారైతిరి? నేను చేసిన యీ అన్యాయమును క్షమిం
చుడి.
14 ఇదిగో యీ మూడవ సారి మీయొద్దకు వచ్చుటకు
సిద్ధముగా ఉన్నాను; వచ్చినప్పుడు మీకు భారముగా
నుండను. మీ సొత్తును కాదు మిమ్మునే కోరుచున్నా
ను.[2] పిల్లలు తలిదండ్రులకొరకు కాదు తలిదండ్రులే
పిల్లలకొరకు ఆస్తి కూర్చతగినది గదా? । కాబట్టి (నాకు 15
కలిగినది యావత్తు) మీ ఆత్మలకొరకు బహు సంతోష
ముగా వ్యయపరచెదను; నన్ను నేనును వ్యయపరచు
కొందును. నేను మిమ్మును ఎంత యెక్కువగా ప్రేమిం
చుచున్నానో అంత తక్కువగా మీరు నన్ను ప్రేమిం
తురా? । అది ఆలాగుండనియ్యుడి. నేను మీకు భార 16
ముగా ఉండలేదు గాని యుక్తిగలవాడనై మిమ్మును
తంత్రముచేత పట్టుకొంటిని (అని చెప్పుదురేమో.) ।
నేను మీయొద్దకు పంపినవారిలో ఎవనివలననైనను 17
మిమ్మును మోసపుచ్చి ఆర్జించుకొంటినా? । (మీయొద్దకు 18
వెళ్లుటకు) తీతును హెచ్చరించి అతనితోకూడ ఒక
సహోదరుని పంపితిని. తీతు మిమ్మును మోసపుచ్చి
యేమైన ఆర్జించుకొనెనా? మేమొక్క ఆత్మవలననే
యొక్క అడుగు జాడలయందే నడుచుకొనలేదా?
మేమింతవరకు (మా విషయమై) మీకు సమా 19
ధానము చెప్పుకొనుచున్నామని మీకు తోచునేమో.
దేవునియెదుట నే క్రీస్తునందు మాటలాడుచున్నాము;
ప్రియులారా, మీ క్షేమాభివృద్ధికొరకు ఇవన్నియు
చెప్పుచున్నాము. । ఎందుకనగా ఒకవేళ నేను వచ్చి 20
నప్పుడు మీరు నాకిష్టులుగా ఉండరేమో అనియు, 21
నేను మీకిష్టుడనుగా ఉండనేమో అనియు, ఒకవేళ
కలహమును అసూయయు క్రోధములును కక్షలును
కొండెములును గుసగుసలాడుటలును ఉప్పొంగుట
లును అల్లరులును ఉండునేమో అనియు, నేను మరల
వచ్చినప్పుడు నా దేవుడు మీ మధ్య నన్ను చిన్న
బుచ్చునేమో అనియు, మునుపు పాపముచేసి తాము
జరిగించిన అపవిత్రత జారత్వము పోకిరిచేష్టలకొరకు
మారుమనస్సు పొందని అనేకులనుగూర్చి దుఃఖపడ
వలసివచ్చునేమో అనియు భయపడుచున్నాను.

ఈ మూడవ సారి నేను మీయొద్దకు వచ్చు 13
చున్నాను. ఇద్దరు ముగ్గురు సాక్షుల నోట ప్రతి
మాటయు స్థిరపరచబడవలెను.[3] । నేను మునుపు చెప్పి 2
తిని; నేనిప్పుడు మీయొద్ద లేకున్నను రెండవసారి
మీయొద్దనున్నట్టుగానే, మునుపటినుండి పాపము
చేయుచుండినవారికిని మిగిలినవారికందరికిని ముందుగా
తెలియజేయునదేమనగా, నేను తిరిగి వచ్చినయెడల
శిక్షింపక విడువను. । క్రీస్తు నాయందు పలుకుచున్నా 3
డని రుజువు కోరుచున్నారా? ఆయన మీయెడల బల
హీనుడు కాడు గాని మీయందు శక్తిమంతుడైయు
న్నాడు. । బలహీనతనుబట్టి ఆయన సిలువవేయబడెను 4
గాని దేవుని శక్తినిబట్టి జీవించుచున్నాడు. మేమును
ఆయనయందుండి[4] బలహీనులమై యున్నాము గాని

[1] లేక, నన్ను కప్పునిమిత్తము. [2] మూలభాషలో—వెదకుచున్నాను. [3] ద్వితీ. 19:15. [4] అనేక ప్రాచీనప్రతులలో—ఆయనతో కూడ అని పాఠాంతరము.

మీయెడల, దేవుని శక్తినిబట్టి, ఆయనతోకూడ జీవము
౫ గలవారము. । మీరు విశ్వాసముగలవారై యున్నారో
లేదో మిమ్మును మీరే శోధించికొని చూచుకొనుడి;
మిమ్మును మీరే పరీక్షించుకొనుడి; మీరు భ్రష్టులు
కానియెడల యేసుక్రీస్తు మీలో నున్నాడని మిమ్మును
6 గూర్చి మీరే యెరుగరా! । మేము భ్రష్టులము కామని
7 మీరు తెలిసికొందురని నిరీక్షించుచున్నాను. । మీరు
ఏ దుష్కార్యమైనను చేయకుండవలెనని దేవుని ప్రార్థిం
చుచున్నాము; మేము యోగ్యులమైనట్టు కనబడవలె
నని కాదు గాని మేము భ్రష్టులమైనట్టు కనబడినను
మీరు మేలైనదే చేయవలెనని ప్రార్థించుచున్నాము. ।
8 మేము సత్యమునకు వ్యతిరేకముగా ఏమియు చేయ
నేరము గాని సత్యము నిమిత్తమే సమస్తమును చేయు
9 చున్నాము. । మేము బలహీనులమై యున్నను మీరు
బలవంతులై యుండినయెడల సంతోషించెదము. దీని
[illegible]యే, అనగా మీరు సంపూర్ణులు కావలెననియే,
ప్రార్థించుచున్నాము. । కాబట్టి నేను మీయొద్దకు 10
వచ్చినప్పుడు పడద్రోయుటకు కాక మిమ్మును కట్టుటకే
ప్రభువు నాకు అనుగ్రహించిన అధికారముచొప్పున
కాఠిన్యము కనపరచకుండునట్లు దూరముగా ఉండ
గానే యీ సంగతులు వ్రాయుచున్నాను.

తుదకు సహోదరులారా, సంతోషించుడి, సం 11
పూర్ణులై యుండుడి, ఆదరణ కలిగియుండుడి, ఏక
మనస్సుగలవారై యుండుడి, సమాధానముగా ఉం
డుడి; ప్రేమ సమాధానములకు కర్తయగు దేవుడు
మీకు తోడైయుండును. । పవిత్రమైన ముద్దుపెట్టు 12
కొని యొకరికి ఒకరు వందనములు చేసికొనుడి.

పరిశుద్ధులందరు మీకు వందనములు చెప్పుచు 13
న్నారు.

ప్రభువైన యేసుక్రీస్తు కృపయు దేవుని ప్రేమయు 14
పరిశుద్ధాత్మ సహవాసమును మీకందరికిని తోడైయుం
డును గాక.

## అపొస్తలుడైన పౌలు

# గలతీయులకు వ్రాసిన పత్రిక

1 మనుష్యుల మూలముగానైనను ఏ మనుష్యునివలన
నైనను కాక యేసుక్రీస్తు[1]వలనను, ఆయనను మృతు
లలోనుండి లేపిన తండ్రియైన దేవునివలనను అపొస్త
2 లుడుగా నియమింపబడిన పౌలును, । నాతోకూడ
నున్న సహోదరులందరును, గలతీయలోనున్న సంఘ
3 ములకు (శుభమని చెప్పి) వ్రాయునది. । తండ్రియైన
దేవునినుండియు మన ప్రభువైన యేసుక్రీస్తునుండియు
4 మీకు కృపయు సమాధానమును కలుగును గాక. మన
తండ్రియైన దేవుని చిత్తప్రకారము ఆయన మనలను
ప్రస్తుతపు దుష్టకాలములోనుండి[2] విమోచింపవలెనని
మన పాపముల నిమిత్తము తన్నుతాను అప్పగించు
5 కొనెను. । ఆ దేవునికి యుగయుగములకు మహిమ
కలుగును గాక. ఆమేన్.

6 క్రీస్తు కృపనుబట్టి మిమ్మును పిలిచినవానిని విడిచి
భిన్నమైన సువార్తతట్టుకు మీరింత త్వరగా తిరిగి
7 పోవుట చూడగా నాకాశ్చర్యమగుచున్నది. । అది
మరియొక సువార్త కాదుగాని క్రీస్తు సువార్తను చెరుప
గోరి మిమ్మును కలవరపరచువారు కొందరున్నారు. ।
8 మేము మీకు ప్రకటించిన సువార్తగాక మరియొక
సువార్తను మేమైనను పరలోకమునుండి వచ్చిన యొక
దూతయైనను మీకు ప్రకటించినయెడల అతడు శాప
9 గ్రస్తుడవును గాక. । మేమిదివరకు చెప్పినప్రకార
మిప్పుడును మరల చెప్పుచున్నాము; మీరు అంగీకరిం
చిన సువార్తగాక మరియొకటి యెవడైనను మీకు ప్రక
టించినపక్షమందు వాడు శాపగ్రస్తుడవునుగాక. ।
10 ఇప్పుడు నేను మనుష్యుల దయను సంపాదించుకొన
జూచుచున్నానా దేవుని దయను సంపాదించుకొన
జూచుచున్నానా? నేను మనుష్యులను సంతోషపెట్ట
గోరుచున్నానా? నేనిప్పటికిని మనుష్యులను సంతోష
పెట్టువాడనైతే క్రీస్తుదాసుడను కాకయేపోవుదును.

11 సహోదరులారా, నేను ప్రకటించిన సువార్త
మనుష్యుని యోచనప్రకారమైనది కాదని మీకు
12 తెలియజెప్పుచున్నాను. । మనుష్యునివలన దాని నేను
పొందలేదు, నాకెవడును దాని బోధింపనులేదు గాని
యేసుక్రీస్తు బయలుపరచుటవలననే (అది నాకు సం
13 ప్రాప్తమైనది.) । పూర్వమందు యూదమతస్థుడనై
యున్నప్పుడు నేను దేవుని సంఘమును అపరిమిత
ముగా హింసించి పాడుచేయుచు । నా పితరుల 14
పారంపర్యాచారమందు విశేషాసక్తి గలవాడనై, నా
స్వజాతీయులలో నా సమానవయస్కులైన అనేకుల
కంటె యూదుల మతములో ఆధిక్యతనొందితినని నా
నడవడినిగూర్చి మీరు వింటిరి. । అయినను తల్లి 15
గర్భమునందు పడినది మొదలుకొని నన్ను ప్రత్యేక
పరచి తన కృపచేత నన్ను పిలిచిన దేవుడు నేను అన్య
జనులలో తన కుమారుని ప్రకటింపవలెనని । ఆయ 16
నను నాయందు బయలుపరప ననుగ్రహించినప్పుడు
మనుష్యమాత్రులతో[3] నేను సంప్రదింపలేదు. । నా 17
కంటె ముందుగా అపొస్తలులైనవారియొద్దకు యెరూష
లేమునకైనను వెళ్లనులేదు గాని వెంటనే అరబిదేశము
లోకి వెళ్లితిని; పిమ్మట దమస్కు పట్టణమునకు తిరిగి
వచ్చితిని.

అటుపైని మూడు సంవత్సరములైన తరువాత 18
కేఫాను పరిచయము చేసికొనవలెనని యెరూషలేముకు
వచ్చి అతనితోకూడ పదునయిదు దినములుంటిని. ।
అతని తప్ప అపొస్తలులలో మరి ఎవనిని నేను చూడ 19
లేదు గాని ప్రభువుయొక్క సహోదరుడైన యాకో
బును మాత్రము చూచితిని. । నేను మీకు వ్రాయు 20
చున్న యీ సంగతుల విషయమై, యిదిగో దేవుని
యెదుట నేను అబద్ధమాడుటలేదు. । తరువాత సిరియ, 21
కిలికియ ప్రాంతములలోకి వచ్చితిని. । క్రీస్తునందున్న 22
యూదైయసంఘములవారికి నా ముఖపరిచయము
లేకుండెను గాని । — మునుపు మనలను హింసపెట్టిన 23
వాడు తాను పూర్వమందు నాశముచేయుచువచ్చిన 24
మతమును[4] ప్రకటించుచున్నాడను సంగతి మాత్రమే
విని వారు నన్నుబట్టి దేవుని మహిమపరచిరి.

అటుపిమ్మట పదునాలుగు సంవత్సరములైన తరు 2
వాత నేను తీతును వెంటబెట్టుకొని బర్నబాతోకూడ
యెరూషలేముకు తిరిగి వెళ్లితిని. । దేవదర్శన ప్రకా 2
రమే వెళ్లితిని. మరియు నా పరుగు[5] వ్యర్థమవునేమో,
లేక వ్యర్థమైపోయినదేమో, అని నేను అన్యజనులలో
ప్రకటించుచున్న సువార్తను వారికిని, ప్రత్యేకముగా
ఎన్నికైనవారికిని విశదపరచితిని. । అయినను నాతో 3
కూడనున్న తీతు హెల్లేనీయుడైనను అతడు సున్నతి
పొందుటకు బలవంతపెట్టబడలేదు. । మనలను దాసు 4

[1] క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము. [2] మూలభాషలో—దుష్టయుగమునుండి. [3] మూలభా.—రక్తమాంసములతో. [4] లేక,
విశ్వాసమును. [5] లేక, కష్టము.

లుగా చేసికొనవలెనని క్రీస్తుయేసువలన మనకు కలిగిన
మన స్వాతంత్ర్యమును వేగుచూచుటకు, రహస్య
ముగా తేబడి దొంగతనముగా ప్రవేశించిన కపట
సహోదరులవలన (ఆ ప్రయత్నమైనను) జరిగినది. ।
5 సువార్త సత్యము మీ మధ్యను నిలుచునట్లు మేము
వారికి ఒక్క గడియయైనను లోబడుటకు ఒప్పుకొన
6 లేదు. । ఎన్నికైనవారుగా ఎంచబడినవారియొద్ద నే
నేమియు నేర్చుకొనలేదు; వారెంతటివారైనను నాకు
లక్ష్యములేదు, దేవుడు నరునివేషము చూడడు.[1] ఆ
యెన్నికైనవారు నాకేమియు ఉపదేశింపలేదు. ।
7 అయితే సున్నతి పొందినవారికి బోధించుటకై సువార్త
పేతురుకేలాగు అప్పగింపబడెనో ఆలాగు సున్నతి
పొందనివారికి బోధించుటకై నాకప్పగింపబడెనని
8 వారు చూచినప్పుడు, । అనగా సున్నతి పొందిన
9 వారికి అపొస్తలుడవుటకు పేతురుకు సామర్థ్యము
కలుగజేసినవాడే అన్యజనులకు అపొస్తలుడనవుటకు
నాకును సామర్థ్యము కలుగజేసెనని వారు గ్రహించి
నప్పుడు, స్తంభములుగా ఎంచబడిన యాకోబు కేఫా
యోహాను అను వారు నాకు అనుగ్రహింపబడిన
కృపను కనుగొని, మేము అన్యజనులకును తాము
సున్నతిపొందినవారికిని అపొస్తలులుగా ఉండవలెనని
చెప్పి, తమతో పాలివారమనుటకు (సూచనగా)
10 నాకును బర్నబాకును కుడిచేతిని ఇచ్చిరి. । మేము బీద
లను జ్ఞాపకము చేసికొనవలెననిమాత్రమే వారు కోరిరి;
ఆలాగు చేయుటకు నేనును ఆసక్తి కలిగియుంటిని.
11 తరువాత కేఫా అంతియొకయకు వచ్చినప్పుడు
12 అతడు అపరాధిగా తీర్చబడెను గనుక నేను ముఖా
ముఖిగా అతనిని ఎదిరించితిని; ఏలయనగా యాకోబు
నొద్దనుండి కొందరు రాకమునుపు అతడు అన్యజను
లతో భోజనము చేయుచుండెను గాని వారు రాగానే
సున్నతి పొందినవారికి భయపడి వెనుకతీసి వేరై
13 పోయెను. । తక్కిన యూదులును అతనితో కలిసి
మాయవేషము వేసికొనిరి గనుక బర్నబాకూడ వారి
14 వేషధారణముచేత మోసపోయెను. । వారు సువార్త
సత్యము చొప్పున క్రమముగా నడుచుకొనకపోవుట
నేను చూచినప్పుడు అందరి యెదుట కేఫాతో నేను
చెప్పినదేమనగా — నీవు యూదుడవై యుండియు
యూదులవలె కాక అన్యజనులవలెనే ప్రవర్తించు
చుండగా, అన్యజనులు యూదులవలె ప్రవర్తింపవలె
నని యెందుకు బలవంతము చేయుచున్నావు? ।
15 మనము జన్మమువలన యూదులమే గాని అన్యజను
16 లలో చేరిన పాపులము కాము. మనుష్యుడు యేసు
క్రీస్తునందలి విశ్వాసమువలననే గాని ధర్మశాస్త్రసంబంధ
మైన క్రియలమూలమున నీతిమంతుడుగా తీర్చబడ
డని యెరిగి మనమును ధర్మశాస్త్రసంబంధమైన క్రియల
మూలమున గాక క్రీస్తునందలి విశ్వాసమువలననే నీతి
మంతులమని తీర్చబడుటకై యేసుక్రీస్తునందు విశ్వాస
ముంచియున్నాము, ధర్మశాస్త్రసంబంధ క్రియలమూల
మున ఏ శరీరియు నీతిమంతుడని తీర్చబడడు గదా ।
కాగా మనము క్రీస్తునందు నీతిమంతులమని తీర్చబడ 17
వెదకుచుండగా మనము పాపులముగా కనబడిన
యెడల, ఆ పక్షమందు క్రీస్తు పాపమునకు పరిచారకు
డాయెనా? అట్లనరాదు. । నేను పడగొట్టినవాటిని 18
మరల కట్టినయెడల నన్ను నేనే అపరాధినిగా కను
పరచుకొందును గదా. । నేనైతే దేవునివిషయమై 19
జీవించు నిమిత్తము ధర్మశాస్త్రమువలన ధర్మశాస్త్రము విష
యమై చచ్చినవాడనైతిని. । నేను క్రీస్తుతోకూడ 20
సిలువవేయబడియున్నాను; ఇకను జీవించువాడను
నేను కాను క్రీస్తే నాయందు జీవించుచున్నాడు.
నేనిప్పుడు శరీరమందు జీవించుచున్న జీవనము,
నన్ను ప్రేమించి నాకొరకు తన్నుతాను అప్పగించు
కొనిన దేవుని కుమారునియందలి విశ్వాసమువలన
జీవించుచున్నాను. । నేను దేవుని కృపను నిరర్థకము 21
చేయను; నీతి ధర్మశాస్త్రమువలననైతే ఆ పక్షమందు
క్రీస్తు చనిపోయినది నిష్ప్రయోజనమే గదా.
ఓ అవివేకులైన గలతీయులారా, మిమ్మును ఎవడు 3
భ్రమపెట్టెను? సిలువవేయబడినవాడైనట్టుగా యేసు
క్రీస్తు మీ కన్నులయెదుట వర్ణింపబడెనుగదా. । ఇది 2
మాత్రమే మీవలన తెలిసికొన గోరుచున్నాను; ధర్మ
శాస్త్రసంబంధ క్రియలవలన ఆత్మను పొందితిరా లేక
విశ్వాసముతో వినుటవలన పొందితిరా? । మీరింత 3
అవివేకులైతిరా? మొదట ఆత్మానుసారముగా ఆరం
భించి యిప్పుడు శరీరానుసారముగా పరిపూర్ణులగు
దురా? । వ్యర్థముగానే యిన్ని కష్టములు అనుభ 4
వించితిరా? అది నిజముగా వ్యర్థమగునా? । ఆత్మను 5
మీకు అనుగ్రహించి మీలో అద్భుతములు చేయించు
వాడు ధర్మశాస్త్రసంబంధ క్రియలవలననా లేక విశ్వాస
ముతో వినుటవలననా (చేయించుచున్నాడు?) ।
అబ్రాహాము దేవుని నమ్మినందున అది అతనికి నీతియని 6
యెంచబడెను.[2] । కాబట్టి విశ్వాస సంబంధులే అబ్రా 7
హాము కుమారులని మీరు తెలిసికొనుడి. । దేవుడు 8
విశ్వాసమూలముగా అన్యజనులను నీతిమంతులగా
తీర్చునని లేఖనము దూరము చూచి—

నీయందు అన్యజనులందరును ఆశీర్వదింపబడు
దురు[3]

అని అబ్రాహాముకు సువార్తను ముందుగా ప్రకటిం
చెను. । కాబట్టి విశ్వాససంబంధులే విశ్వాసముగల 9
అబ్రాహాముతో కూడ ఆశీర్వదింపబడుదురు. । ధర్మ 10
శాస్త్రోక్తక్రియా సంబంధులందరు శాపమునకు లోనై
యున్నారు. ఎందుకనగా—

1 మూలభావలో—నరుని ముఖము నంగీకరింపడు.

2 ఆది. 15: 6.  3 ఆది. 12: 3; 18: 18.

ధర్మశాస్త్రగ్రంథమందు వ్రాయబడిన విధులన్నియు
చేయుటయందు నిలుకడగా ఉండని ప్రతి
వాడును శాపగ్రస్తుడు
11 అని వ్రాయబడియున్నది.[1] । ధర్మశాస్త్రముచేత ఎవడును
దేవునియెదుట నీతిమంతుడని తీర్చబడడను సంగతి
స్పష్టమే. ఏలయనగా—
నీతిమంతుడు విశ్వాసమూలముగా జీవించును.[2] ।
12 ధర్మశాస్త్రము విశ్వాససంబంధమైనది కాదు గాని దాని
(విధులను) ఆచరించువాడు వాటివలననే జీవించును. ।
13 ఆత్మనుగూర్చిన వాగ్దానము విశ్వాసమువలన మనకు
14 లభించునట్లు, అబ్రాహాము పొందిన ఆశీర్వచనము
క్రీస్తుయేసుద్వారా అన్యజనులకు కలుగుటకై, క్రీస్తు
మనకుగాను శాపగ్రాహియై[3] మనలను ధర్మశాస్త్రము
యొక్క శాపమునుండి విమోచించెను; ఇందును
గూర్చి—
మ్రానుమీద వ్రేలాడిన ప్రతివాడును శాప
గ్రస్తుడు
అని వ్రాయబడియున్నది.[4]
15 సహోదరులారా, మనుష్య రీతిగా మాటలాడు
చున్నాను; మనుష్యుడు చేసిన ఒడంబడికయైనను
స్థిరపడిన తరువాత ఎవడును దాని కొట్టివేయడు,
16 దానితో మరేమియు కలుపడు. । అబ్రాహామునకును
అతని సంతానమునకును వాగ్దానములు చేయబడెను;
ఆయన అనేకులనుగూర్చి అన్నట్టు — సంతానము
లకును అని చెప్పక ఒకనిగూర్చి అన్నట్టే—నీ సం
తానమునకును అనెను; ఆ సంతానము క్రీస్తు. ।
17 నేను చెప్పునదేమనగా—నన్నూట ముప్పది సంవత్స
రములైన తరువాత వచ్చిన ధర్మశాస్త్రము వాగ్దానమును
నిరర్థకము చేయునంతగా పూర్వమందు దేవునిచేత
18 స్థిరపరచబడిన నిబంధనను కొట్టివేయదు. । ఆ స్వా
స్థ్యము ధర్మశాస్త్రమూలముగా కలిగినపక్షమందు ఇకను
వాగ్దానమూలముగా కలిగినది కాదు. అయితే దేవుడు
అబ్రాహామునకు వాగ్దానమువలననే దానిని అనుగ్ర
19 హించెను. । ఆలాగైతే ధర్మశాస్త్రమెందుకు? ఎవనికి ఆ
వాగ్దానము చేయబడెనో ఆ సంతానము వచ్చు
పర్యంతము అది అతిక్రమములనుబట్టి దానికి తరు
వాత ఇయ్యబడెను; అది మధ్యవర్తిచేత దేవదూతల
20 ద్వారా నియమింపబడెను. । మధ్యవర్తి యొకనికి మధ్య
21 వర్తి కాడు గాని దేవుడొక్కడే. । ధర్మశాస్త్రము దేవుని
వాగ్దానములకు విరోధమైనదా? అట్లనరాదు. జీవింప
చేయ శక్తిగల ధర్మశాస్త్రము ఇయ్యబడియున్నయెడల
వాస్తవముగా నీతి ధర్మశాస్త్రమూలముగానే కలుగును
22 గాని । యేసుక్రీస్తునందలి విశ్వాసమూలముగా కలి
వాగ్దానము విశ్వసించువారికి అనుగ్రహింపబడు
నట్లు లేఖనము అందరిని పాపమునకు లోనైనవారినిగా
ంచెను.
విశ్వాస (మార్గ)ము వెల్లడికాకమునుపు[5] ఇకముం 23
దుకు బయలుపరచబడబోవు విశ్వాసమార్గమవలంబింప
వలసినవారముగా[6] చెరలో ఉంచబడినట్టు మనము
ధర్మశాస్త్రమునకు లోనైనవారమైతిమి. । కాబట్టి మనము 24
విశ్వాసమూలమున నీతిమంతులమని తీర్చబడునట్లు
క్రీస్తు విషయమై ధర్మశాస్త్రము మనకు బాలశిక్షకు
డాయెను. । అయితే విశ్వాసమార్గము వెల్లడియాయెను 25
గనుక ఇకను బాలశిక్షకుని క్రింద ఉండము. । యేసు 26
క్రీస్తునందు మీరందరు విశ్వాసమువలన దేవుని కుమా
రులై యున్నారు. । క్రీస్తులోకి బాప్తిస్మము పొందిన 27
మీరందరు క్రీస్తును ధరించుకొన్నారు. । ఇందులో 28
యూదుడని హెల్లేనీయుడని లేదు, దాసుడని స్వతం
త్రుడని లేదు, పురుషుడని స్త్రీ అని లేదు; యేసు
క్రీస్తునందు మీరందరును ఏకముగా ఉన్నారు. ।
మీరు క్రీస్తుసంబంధులైతే[7] ఆ పక్షమందు అబ్రా 29
హాముయొక్క సంతానమైయుండి వాగ్దానప్రకా
రము వారసులైయున్నారు.
మరియు నేను చెప్పునదేమనగా వారసుడు అన్ని 4
టికిని కర్తయైయున్నను బాలుడైయున్నంతకాలము
అతనికిని దాసునికిని ఏ భేదమును లేదు. । తండ్రిచేత 2
నిర్ణయింపబడిన దినము వచ్చుపర్యంతము అతడు సం
రక్షకులయొక్కయు గృహనిర్వాహకులయొక్కయు
అధీనములో ఉండును. । అటువలె మనమును బాలు 3
రమైయున్నప్పుడు లోకసంబంధమైన మూలపాఠము
లకు లోబడి దాసులమై యుంటిమి; । అయితే కాలము 4
పరిపూర్ణమైనప్పుడు దేవుడు తన కుమారుని పంపెను; 5
ఆయన స్త్రీయందు పుట్టి మనము స్వీకృతపుత్రులము[8]
కావలెనని ధర్మశాస్త్రమునకు లోబడియున్నవారిని విమో
చించుటకై ధర్మశాస్త్రమునకు లోబడినవాడాయెను. ।
మరియు మీరు కుమారులైయున్నందున—నాయనా 6
తండ్రీ, అని మొఱ్ఱపెట్టు తన కుమారుని ఆత్మను
దేవుడు మన హృదయములలోకి పంపెను. । కాబట్టి 7
నీవికను దాసుడవు కావు కుమారుడవే. కుమారుడవైతే
దేవునిద్వారా వారసుడవై యున్నావు.
ఆ కాలమందైతే మీరు దేవుని ఎరుగనివారై, 8
నిజమునకు దేవుళ్లు కానివారికి దాసులై యుంటిరి
గాని । యిప్పుడు మీరు దేవుని ఎరిగినవారును, మరి 9
విశేషముగా దేవునిచేత ఎరుగబడినవారునై యు
న్నారు గనుక, బలహీనమైనవియు నిష్ప్రయోజన
మైనవియునైన మూలపాఠములతట్టు మరల తిరుగనేల?
మునుపటివలె మరల వాటికి దాసులైయుండ గోర
నేల? । మీరు దినములను మాసములను ఉత్సవకాలము 10

[1] ...ా. 27: 26. [2] హబ. 2: 4. [3] మూలభాషలో—శాపమై. [4] ద్వితీయో. 21: 23. [5] మూలభా.—విశ్వాసము రాకమునుపు. [6] ...విశ్వాసమువలంబింప. [7] మూలభా.—క్రీస్తువారైతే. [8] లేక, దత్తపుత్రులము.

11 లను సంవత్సరములను ఆచరించుచున్నారు. | మీ
విషయమై నేను పడిన కష్టము వ్యర్థమైపోవునేమో
అని మిమ్మునుగూర్చి భయపడుచున్నాను.
12 సహోదరులారా, నేను మీవంటివాడనైతిని
గనుక మీరును నావంటివారు కావలెనని మిమ్మును
13 వేడుకొనుచున్నాను. | మీరు నాకు అన్యాయము
చేయలేదు. మొదటిసారి శరీరదౌర్బల్యము కలిగిన
వాడనై నేను సువార్త మీకు ప్రకటించితినని మీ
14 ఎరుగుదురు. | అప్పుడు నా శరీరములో మీకు శోధ
నగా ఉండినదానిబట్టి నన్ను మీరు తృణీకరింపలేదు,
నిరాకరింపనైనను లేదుగాని దేవుని దూతనువలెను
15 క్రీస్తుయేసునువలెను నన్ను అంగీకరించితిరి. | మీరు
చెప్పుకొనిన ధన్యత ఏమైనది? శక్యమైతే మీ కన్నులు
ఊడపెరికి నాకిచ్చివేసియుందురని మీ పక్షమున
16 సాక్ష్యము పలుకుచున్నాను. | నేను మీతో నిజ
17 మాడినందున మీకు శత్రువునైతినా? | వారు మీ
మేలు కోరి మిమ్మును ఆసక్తితో ఆశ్రయించుచున్న
వారు కారు; మీరే తమ్ము నాశ్రయింపవలెనని మిమ్మును
18 ప్రత్యేకపరచ[1] గోరుచున్నారు. | నేను మీయొద్ద
ఉన్నప్పుడు మాత్రమే గాక యెల్లప్పుడును మంచి
19 విషయములలో ఆసక్తిగానుండుట యుక్తమే. | నా
పిల్లలారా, క్రీస్తు స్వరూపము మీయందేర్పడు పర్యం
తము మీ విషయమై మరల నాకు ప్రసవవేదన కలుగు
20 చున్నది. | మిమ్మునుగూర్చి యెటుతోచక యున్నాను;
నేనిప్పుడే మీ మధ్యకు వచ్చి మరియొక విధముగా
మీతో మాటలాడ గోరుచున్నాను.
21 ధర్మశాస్త్రమునకు లోబడియుండ గోరువారలారా,
మీరు ధర్మశాస్త్రము వినుటలేదా? నాతో చెప్పుడి. |
22 దాసివలన ఒకడును స్వతంత్రురాలివలన ఒకడును
ఇద్దరు కుమారులు అబ్రాహామునకు కలిగిరని వ్రాయ
23 బడియున్నది గదా? | అయినను దాసివలన పుట్టిన
వాడు శరీరప్రకారము పుట్టెను, స్వతంత్రురాలి
24 వలన పుట్టినవాడు వాగ్దానమునుబట్టి పుట్టెను. | ఈ
సంగతులు అలంకార రూపకముగా చెప్పబడియు
న్నవి. ఈ స్త్రీలు రెండు నిబంధనలై యున్నారు;
వాటిలో ఒకటి సీనాయి కొండసంబంధమైనదై
దాస్యములో ఉండుటకు పిల్లలు కనును; ఇది హాగరు. |
25 ఈ హాగరు అనునది అరబిదేశములో ఉన్న సీనాయి
కొండయే. ప్రస్తుతమందున్న యెరూషలేము దాని
పిల్లలతోకూడ దాస్యమందున్నది గనుక ఆ నిబం
26 ధన దానికి దీటయి యున్నది. | అయితే పైనున్న
యెరూషలేము స్వతంత్రముగా ఉన్నది; అది మనకు
27 తల్లి. | ఇందుకు—
కనని గొడ్రాలా సంతోషించుము, ప్రసవవేదన
పడనిదానా, బిగ్గరగా కేకలువేయుము; ఏల
యనగా పెనిమిటిగలదాని పిల్లలకంటె పెని
మిటి లేనిదాని పిల్లలు బహు విస్తారముగా
ఉన్నారు
అని వ్రాయబడియున్నది.[2] |. సహోదరులారా, 28
మనమును ఇస్సాకువలె వాగ్దానమునుబట్టి (పుట్టిన)
కుమారులమై యున్నాము. | అప్పుడు శరీరమును 29
బట్టి (పుట్టిన)వాడు ఆత్మనుబట్టి (పుట్టిన)వానిని ఏలాగు
హింసపెట్టెనో యిప్పుడును ఆలాగే జరుగుచున్నది. |
ఇందునుగూర్చి లేఖనమేమి చెప్పుచున్నది?[3]— 30
దాసిని దాని కుమారుని వెళ్లగొట్టుము, దాసి
కుమారుడు స్వతంత్రురాలి కుమారునితో
పాటు వారసుడై యుండడు.
కాగా సహోదరులారా, మనము స్వతంత్రురాలి 31
కుమారులమే గాని దాసి కుమారులము కాము. | ఈ 5
స్వాతంత్ర్యము అనుగ్రహించి క్రీస్తు మనలను స్వతం
త్రులనుగా చేసియున్నాడు. కాబట్టి మీరు స్థిర
ముగా నిలిచి మరల దాస్యమను కాడిక్రింద చిక్కు
కొనకుడి.
చూడుడి; మీరు సున్నతి పొందినయెడల క్రీస్తు 2
వలన మీకు ప్రయోజనమేమియు కలుగదని పౌలను
నేను మీతో చెప్పుచున్నాను. | ధర్మశాస్త్రము యావత్తు 3
ఆచరింప బద్ధుడై యున్నాడని సున్నతిపొందిన ప్రతి
మనుష్యునికి నేను మరల మీతో దృఢముగ చెప్పు
చున్నాను. | మీలో ధర్మశాస్త్రమువలన నీతిమంతులని 4
తీర్చబడువారెవరో వారు క్రీస్తులోనుండి బొత్తిగా
వేరుచేయబడియున్నారు, కృపలోనుండితొలగిపోయి
యున్నారు. | ఏలయనగా మనము విశ్వాసముగల 5
వారమై నీతి కలుగునను నిరీక్షణ సఫలమగునని ఆత్మ
ద్వారా ఎదురుచూచుచున్నాము. | యేసుక్రీస్తునం 6
దుండువారికి సున్నతిపొందుటయందేమియు లేదు,
పొందకపోవుటయందేమియు లేదు గాని ప్రేమవలన
కార్యసాధకమగు విశ్వాసమే ప్రయోజనకరమగును. |
మీరు బాగుగా పరుగెత్తుచుంటిరి; సత్యమునకు విధే 7
యులు కాకుండ మిమ్మును ఎవడు అడ్డగించెను? | ఈ 8
ప్రేరేపణ మిమ్మును పిలుచుచున్నవానివలన కలుగ
లేదు. | పులిసిన పిండి కొంచెమైనను ముద్ద అంతయు 9
పులియచేయును గదా? | మీరెంతమాత్రమును వేరుగా 10
ఆలోచింపరని ప్రభువునందు మిమ్మునుగూర్చి నేను
రూఢిగా నమ్ముకొనుచున్నాను. మిమ్మును కలవర
పెట్టుచున్నవాడు ఎవడైనను వాడు తగిన శిక్షను
భరించును. | సహోదరులారా, సున్నతి పొందవలె 11
నని నేనింకను ప్రకటించుచున్నయెడల ఇప్పటికిని
హింసింపబడ నేల? ఆ పక్షమున సిలువ విషయమైన
అభ్యంతరము తీసివేయబడును గదా? | మిమ్మును కల 12
వరపెట్టువారు తమ్మును తాము ఛేదించుకొనుట మేలు.

1 మూలభాషలో—మూసివేయ. 2 యెషయా, 54: 1. 3 ఆది. 21: 10.

13 సహోదరులారా, మీరు స్వతంత్రులుగా ఉండు
టకు పిలువబడితిరి. అయితే ఒక మాట, ఆ స్వా
తంత్ర్యమును శారీరక్రియలకు హేతువు చేసికొనక,
ప్రేమకలిగినవారై యొకనికొకడు దాసులైయుం
14 డుడి. ధర్మశాస్త్రమంతయు—

నీవలె నీ పొరుగువాని ప్రేమించుము[1]

అను ఒక్క మాటలో సంపూర్ణమైయున్నది.
15 అయితే మీరు ఒకనినొకడు కరచుకొని భక్షించిన
యెడల మీరు ఒకనివలన ఒకడు బొత్తిగా నశించి
పోదురేమో చూచుకొనుడి.

16 నేను చెప్పునదేమనగా ఆత్మానుసారముగా
నడుచుకొనుడి, అప్పుడు మీరు శరీరేచ్ఛను నెర
17 వేర్చరు. శరీరము ఆత్మకును ఆత్మ శరీరమునకును
విరోధముగా అపేక్షించును. ఇవి యొకదానికొకటి
వ్యతిరేకముగా ఉన్నవి గనుక మీరేవిచేయ నిచ్ఛ
18 యింతురో వాటిని చేయకుందురు. మీరు ఆత్మచేత
నడిపింపబడినయెడల ధర్మశాస్త్రమునకు లోనైనవారు
19 కారు. శరీరకార్యములు స్పష్టమైయున్నవి; అవే
వనగా, జారత్వము, అపవిత్రత, కాముకత్వము,
20 విగ్రహారాధన, అభిచారము, ద్వేషములు, కలహము,
21 మత్సరములు, క్రోధములు, కక్షలు, భేదములు,
విమతములు, అసూయలు, మత్తతలు, అల్లరితోకూడిన
ఆటపాటలు మొదలైనవి. వీటినిగూర్చి నేను మునుపు
చెప్పినప్రకారము ఇట్టివాటిని చేయువారు దేవుని
రాజ్యమును స్వతంత్రించుకొనరని మీతో స్పష్ట
22 ముగా చెప్పుచున్నాను. అయితే ఆత్మ ఫలమేమనగా,
ప్రేమ, సంతోషము, సమాధానము, దీర్ఘశాంతము,
దయాళుత్వము, మంచితనము, విశ్వాసము, సాత్త్వి
23 కము, ఆశానిగ్రహము. ఇట్టివాటికి విరోధమైన
24 నియమమేదియు లేదు. క్రీస్తుయేసు సంబంధులు
శరీరమును దాని యిచ్ఛలతోను దురాశలతోను సిలువ
వేసియున్నారు.

25 మనము ఆత్మ ననుసరించి జీవించువారమైతిమా
ఆత్మను అనుసరించి క్రమముగా నడుచుకొందము.
26 ఒకరినొకరము వివాదమునకు రేపకను, ఒకరియం
దొకరము అసూయపడకను వృథాగా అతిశయపడ
కను ఉందము.

6 సహోదరులారా, ఒకడు ఏ తప్పితములో
నైనను చిక్కుకొనినయెడల ఆత్మసంబంధులైన మీలో
ప్రతివాడు తానును శోధింపబడుదునేమో అని తన
విషయమై చూచుకొనుచు, సాత్త్వికమైన మనస్సుతో
2 అట్టివానిని మంచిదారికి తీసికొని రావలెను. ఒకని
భారములనొకడు భరించి యీలాగు క్రీస్తు నియమ
మును పూర్తిగా నెరవేర్చుడి. ఎవడైనను ఏమియు లేనివాడై 3
యుండి తాను ఎన్నికైనవాడనని యెంచుకొనిన
యెడల తన్నుతానే మోసపరచుకొనును. ప్రతి 4
వాడును తాను చేయుపనిని పరీక్షించి చూచుకొన
వలెను; అప్పుడు ఇతరునిబట్టి కాక తననుబట్టియే అత
నికి అతిశయము కలుగును. ప్రతివాడును తన బరువు 5
తానే భరించుకొనవలెను గదా?

వాక్యోపదేశము పొందువాడు ఉపదేశించువానికి 6
మంచి పదార్థములన్నిటిలో భాగమియ్యవలెను.[2]
మోసపోకుడి, దేవుడు వెక్కిరింపబడడు; మనుష్యుడు 7
ఏమి విత్తునో ఆ పంటనే కోయును. ఏలాగనగా 8
తన శరీరేచ్ఛలనుబట్టి విత్తువాడు తన శరీరమునుండి
క్షయమనుపంట కోయును, ఆత్మనుబట్టి విత్తువాడు
ఆత్మనుండి నిత్యజీవమను పంట కోయును. మనము 9
మేలుచేయుటయందు విసుకక యుందము. మనము
అలయక మేలుచేసితిమేని తగినకాలమందు పంట
కోతుము. కాబట్టి మనకు సమయము దొరికినకొలది 10
అందరియెడలను, విశేషముగా విశ్వాసగృహమునకు
చేరినవారియెడలను మేలుచేయుదము.

నా స్వహస్తముతో మీకెంత పెద్ద అక్షరములతో 11
వ్రాయుచున్నానో చూడుడి. శరీరవిషయమందు 12
చక్కగా అగుపడగోరువారెవరో వారు తాము క్రీస్తు
యొక్క సిలువవిషయమై హింసపొందకుండుటకు
మాత్రమే సున్నతి పొందవలెనని మిమ్మును బలవంతము
చేయుచున్నారు. అయితే వారు సున్నతిపొందిన 13
వారైనను ధర్మశాస్త్రము ఆచరింపరు; తాము మీ శరీర
విషయమందు అతిశయించునిమిత్తము మీరు సున్నతి
పొందవలెనని కోరుచున్నారు. అయితే మన ప్రభు 14
వైన యేసుక్రీస్తు సిలువయందు తప్ప మరి దేనియం
దును అతిశయించుట నాకు దూరమవును గాక; దాని
వలన నాకు లోకమును లోకమునకు నేనును సిలువ
వేయబడి యున్నాము. క్రొత్తసృష్టి (పొందుటయే) 15
గాని సున్నతిపొందుటయందేమియు లేదు, పొందక
పోవుటయందేమియు లేదు. ఈ పద్ధతిచొప్పున 16
నడుచుకొనువారికందరికి, అనగా దేవుని ఇశ్రాయేలుకు
సమాధానమును కృపయు కలుగును గాక.

నేను యేసుయొక్క ముద్రలు నా శరీరమందు 17
ధరించియున్నాను, ఇకమీదట ఎవడును నన్ను
శ్రమపెట్టవద్దు.

సహోదరులారా, మన ప్రభువైన యేసుక్రీస్తు 18
కృప మీ ఆత్మతో ఉండును గాక. ఆమేన్.

1 లేవి. 19: 18. 2 లేక, వాక్యోపదేశము పొందువాడు సమస్త సద్విషయములలో బోధించువానితో పాలివాడై యుండవలెను.

# అపొస్తలుడైన పౌలు
# ఎఫెసీయులకు వ్రాసిన పత్రిక

1 దేవుని చిత్తమువలన క్రీస్తుయేసు అపొస్తలుడైన
పౌలు ఎఫెసులోనున్న పరిశుద్ధులును క్రీస్తుయేసు
నందు విశ్వాసులునైనవారికి (శుభమని చెప్పి) వ్రాయు
2 నది । మన తండ్రియైన దేవునినుండియు ప్రభువైన
యేసుక్రీస్తు[1] నుండియు మీకు కృపయు సమాధాన
మును కలుగును గాక.

3 మన ప్రభువైన యేసుక్రీస్తుయొక్క తండ్రియగు
దేవుడు స్తుతింపబడును గాక. ఆయన క్రీస్తునందు పర
లోకవిషయములలో ఆత్మసంబంధమైన ప్రతి ఆశీ
4 ర్వాదమును మనకనుగ్రహించెను. । ఎట్లనగా తన
6 ప్రియునియందు తాను ఉచితముగా మనకనుగ్రహిం
చిన తన కృపామహిమకు కీర్తి కలుగునట్లు, తన చిత్త
ప్రకారమైన దయాసంకల్పముచొప్పున యేసుక్రీస్తు
ద్వారా తనకు కుమారులనుగా స్వీకరించుటకై, మన
లను ముందుగా తనకోసరము నిర్ణయించుకొని, మనము
తనయెదుట పరిశుద్ధులమును నిర్దోషులమునై యుండ
వలెనని జగత్తుపునాది వేయబడకమునుపే, ప్రేమ
చేత ఆయన క్రీస్తులో మనలను ఏర్పరచుకొనెను. ।
7 దేవుని కృపామహదైశ్వర్యమునుబట్టి ఆ ప్రియుని
యందు ఆయన రక్తమువలన మనకు విమోచనము,
అనగా మన అపరాధములకు క్షమాపణ మనకు కలిగి
8 యున్నది. । కాలము సంపూర్ణమైనప్పుడు జరుగవల
9 సిన యేర్పాటునుబట్టి, ఆయన తన దయాసంకల్పము
చొప్పున తన చిత్తమునుగూర్చిన మర్మమును మనకు
తెలియజేసి మనకు సంపూర్ణమైన జ్ఞానవివేచన కలుగు
10 టకు ఆ కృపను మనయెడల విస్తరింపజేసెను. । ఈ
సంకల్పమునుబట్టి ఆయన పరలోకములో ఉన్నవేగాని
భూమిమీద ఉన్నవేగాని సమస్తమును క్రీస్తునందు
ఏకముగా సమకూర్చవలెనని తనలోతాను నిర్ణయించు
11 కొనెను. । మరియు క్రీస్తునందు ముందుగా నిరీక్షిం
12 చిన మనము తన మహిమకు కీర్తి కలుగజేయవలెనని,
దేవుడు తన చిత్తప్రకారమైన సంకల్పమునుబట్టి మన
లను ముందుగా నిర్ణయించి, ఆయనయందు స్వాస్థ్య
ముగా ఏర్పరచెను.[2] ఆయన తన చిత్తానుసారముగా
చేసిన నిర్ణయముచొప్పున సమస్త కార్యములను జరి
13 గించుచున్నాడు. । మీరును సత్యవాక్యమును, అనగా
మీ రక్షణ సువార్తను విని, క్రీస్తునందు విశ్వాస
ముంచి వాగ్దానముచేయబడిన ఆత్మచేత ముద్రింపబడి
తిరి. । దేవుని మహిమకు కీర్తి కలుగుటకై ఆయన సం 14
పాదించుకొనిన ప్రజలకు విమోచనము కలుగు నిమి
త్తము ఈ ఆత్మ మన స్వాస్థ్యమునకు సంచకరువుగా
ఉన్నాడు.

ఈ హేతువుచేత ప్రభువైన యేసునందు మీ 15
రుంచుకొనిన విశ్వాసమునుగూర్చియు, పరిశుద్ధులందరి
యెడల మీరు చూపుచున్న విశ్వాసమును[3] గూర్చియు
నేను వినినప్పటినుండి । మీ విషయమై మానక దేవు 16
నికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాను. । మరియు 17
మీ మనోనేత్రము వెలిగింపబడినందున, ఆయన 19
మిమ్మును పిలిచిన పిలుపువల్లనైన నిరీక్షణ యెట్టిదో, పరి
శుద్ధులలో ఆయన స్వాస్థ్యముయొక్క మహిమైశ్వర్య
మెట్టిదో, ఆయన క్రీస్తునందు వినియోగపరచిన
బలాతిశయమునుబట్టి విశ్వసించు మనయందు ఆయన
చూపుచున్న తన శక్తియొక్క అపరిమితమైన మాహాత్మ్య
మెట్టిదో, మీరు తెలిసికొనవలెనని, మన ప్రభువైన
యేసుక్రీస్తుయొక్క దేవుడైన మహిమాస్వరూపియగు
తండ్రి తన్ను తెలిసికొనుటయందు మీకు జ్ఞానమును
ప్రత్యక్షతయునుగల మనస్సు అనుగ్రహించునట్లు,
నేను నా ప్రార్థనలయందు మిమ్మునుగూర్చి విజ్ఞాపన
చేయుచున్నాను. । ఆయన ఆ బలాతిశయముచేత 20
క్రీస్తును మృతులలోనుండి లేపి సమస్తమైన ఆధి 21
పత్యముకంటెను అధికారముకంటెను శక్తికంటెను
ప్రభుత్వముకంటెను, ఈ యుగమునందుమాత్రమే
గాక రాబోవు యుగమునందును పేరుపొందిన ప్రతి
నామముకంటెను, ఎంతో హెచ్చుగా పరలోకము
నందు ఆయనను తన కుడిపార్శ్వమున కూర్చుండ
బెట్టుకొని యున్నాడు. । మరియు సమస్తమును 22
ఆయన పాదములక్రింద ఉంచి, సమస్తముపైని సంఘ
మునకు ఆయనను శిరస్సుగా నియమించెను. । (ఆ సం 23
ఘము) ఆయన శరీరము; అది సమస్తమైనవాటిలో
ఉండి సమస్తమైనవాటిని నింపుచున్న వానితో నింప
బడినదై యున్నది.

మీ అపరాధములచేతను పాపములచేతను మీరు 2
చచ్చినవారై యుండగా, ఆయన మిమ్మును క్రీస్తుతో
కూడ బ్రదికించెను. । మీరు వాటిని చేయుచు, 2

1 యేసుక్రీస్తు అను శబ్దమునకు రక్షకుడగు అభిషిక్తుడని అర్థము. 2 లేక, మనకొక స్వాస్థ్యమునేర్పరచెను. 3 అనేక ప్రాచీనప్రతులలో
ప్రేమను అని పాఠాంతరము.

13 ననుబట్టి మనకు కలిగియున్నవి. । కాబట్టి మీ నిమి
త్తమై నాకు వచ్చిన శ్రమలను చూచి మీరు అధైర్య
పడవద్దని వేడుకొనుచున్నాను; ఇవి మీకు మహిమ
కరములై యున్నవి.
14 ఈ హేతువుచేత పరలోకమునందును భూమి
మీదను ఉన్న ప్రతి కుటుంబము ఏ తండ్రినిబట్టి
కుటుంబమని పిలువబడుచున్నదో ఆ తండ్రియెదుట
15 నేను మోకాళ్లూని । మీరు అంతరంగపురుషునియందు
18 శక్తికలిగి ఆయన ఆత్మవలన బలపరచబడునట్లుగాను,
క్రీస్తు మీ హృదయములలో విశ్వాసముద్వారా నివ
సించునట్లుగాను, తన మహిమైశ్వర్యముచొప్పున
మీకు దయచేయవలెననియు, మీరు దేవుని సం
పూర్ణతయందు పూర్ణులగునట్లుగా, ప్రేమయందు వేరు
పారి స్థిరపడి, సమస్త పరిశుద్ధులతోకూడ దాని వెడల్పు
పొడుగు లోతు ఎత్తును ఎంతో గ్రహించుకొనుట
19 కును, । జ్ఞానమునకు మించిన క్రీస్తు ప్రేమను తెలిసి
కొనుటకును తగిన శక్తిగలవారు కావలెననియు ప్రార్థిం
20 చుచున్నాను. । మనలో కార్యసాధకమైన తన
21 శక్తిచొప్పున మనము అడుగువాటన్నిటికంటెను,
ఊహించువాటన్నిటికంటెను అత్యధికముగా చేయ
శక్తిగల దేవునికి క్రీస్తుయేసు మూలముగా సంఘ
ములో తరతరములు సదాకాలము మహిమ కలుగును
గాక. ఆమేన్.

4 కాబట్టి మీరు సమాధానమను బంధముచేత ఆత్మ
2 కలిగించు ఐక్యమును కాపాడుకొనుటయందు శ్రద్ధ
3 కలిగినవారై, ప్రేమతో ఒకని నొకడు సహించుచు,
మీరు పిలువబడిన పిలుపునకు తగినట్లుగా దీర్ఘశాంత
ముతోకూడిన సంపూర్ణవినయముతోను సాత్వికము
తోను నడుచుకొనవలెనని ప్రభువునుబట్టి ఖైదినైన
4 నేను మిమ్మును బతిమాలుకొనుచున్నాను. । శరీర
మొక్కటే, ఆత్మయు ఒక్కడే; ఆ ప్రకారమే మీ
పిలుపువిషయమై యొక్కటే నిరీక్షణగలవారై యుండు
5 టకు పిలువబడితిరి. । ప్రభువు ఒక్కడే, విశ్వాస
6 మొక్కటే, బాప్తిస్మమొక్కటే, । అందరికి తండ్రి
యైన దేవుడు ఒక్కడే. ఆయన అందరికిపైగా ఉన్న
వాడై అందరిలోను వ్యాపించి[1] అందరిలో ఉన్నాడు. ।
7 అయితే మనలో ప్రతివానికిని క్రీస్తు అనుగ్రహించు
వరముయొక్క పరిమాణముచొప్పున కృప యియ్య
8 బడెను. । అందుచేత ఆయన ఆరోహణమైనప్పుడు
చెరను చెరగా పట్టుకొనిపోయి మనుష్యులకు ఈవు
లను అనుగ్రహించెనని (ప్రవక్త) చెప్పియున్నాడు.[2] ।
9 ఆరోహణమాయెననగా ఆయన భూమియొక్క క్రింది
భాగములకు[3] దిగెననియు అర్థమిచ్చుచున్నది గదా. ।
10 దిగినవాడు తానే సమస్తమును నింపునట్లు ఆకాశ
మండలములన్నిటికంటె మరి పైకి ఆరోహణమైన
వాడునై యున్నాడు. । పరిశుద్ధులు సంపూర్ణులగునట్లు 11
క్రీస్తు శరీరము క్షేమాభివృద్ధి చెందుటకును, పరిచర్యా 12
ధర్మము జరుగుటకును, ఆయన కొందరిని అపొస్తలుల
గాను, కొందరిని ప్రవక్తలగాను, కొందరిని సువార్తికుల
గాను, కొందరిని కాపరులగాను ఉపదేశకులగాను
నియమించెను. । మనమందరము విశ్వాసవిషయము 13
లోను దేవుని కుమారునిగూర్చిన జ్ఞానవిషయములోను
ఏకత్వముపొంది సంపూర్ణపురుషులమగువరకు, అనగా
క్రీస్తుకు కలిగిన సంపూర్ణమైన పురుషత్వమునకు
సమానమైన పురుషత్వము కలవారమగువరకు, ఆయన
ఈలాగు నియమించెను. । అందువలన మనమికమీదట 14
పసిపిల్లలమైయుండి, మనుష్యుల మాయోపాయముల
చేత వంచనతోను, తప్పుమార్గమునకు లాగు కుయుక్తి
తోను, గాలికి కొట్టుకొనిపోవునట్లు, కల్పింపబడిన
ప్రతి ఉపదేశమునకు ఇటు అటు కొట్టుకొనిపోవుచు
అలలచేత ఎగరగొట్టబడినవారమైనట్లుండక, । ప్రేమ 15
గలిగి సత్యము చెప్పుచు క్రీస్తువలె ఉండుటకు, మన
మన్ని విషయములలో ఎదుగుదము. । ఆయన శిర 16
స్సయియున్నాడు, ఆయననుండి సర్వశరీరము చక్కగా
అమర్చబడి, తనలోనున్న ప్రతి అవయవము తన తన
పరిమాణముచొప్పున పనిచేయుచుండగా ప్రతి కీలు
వలన గలిగిన బలముచేత అతుకబడి, ప్రేమయందు
తనకు క్షేమాభివృద్ధి కలుగునట్లు శరీరమునకు అభివృద్ధి
కలుగజేసికొనుచున్నది.

కాబట్టి అన్యజనులు నడుచుకొనునట్లు మీరిక 17
మీదట నడుచుకొనవలదని ప్రభువునందు సాక్ష్య
మిచ్చుచున్నాను. । వారైతే అంధమైన మనస్సుగల 18
వారై, తమ హృదయకాఠిన్యమువలన తమలోనున్న
అజ్ఞానముచేత దేవునివలన కలుగు జీవములోనుండి వేరు
పరచబడినవారై, తమ మనస్సుకు కలిగిన మాయను
అనుసరించి నడుచుకొనుచున్నారు. । వారు సిగ్గులేని 19
వారైయుండి నానావిధమైన అపవిత్రతను అత్యా
శతో జరిగించుటకు తమ్మునుతామే కాముకత్వమునకు
అప్పగించుకొనిరి. । అయితే మీరు యేసునుగూర్చి 20
విని ఆయనయందలి సత్యము ఉన్నది ఉన్నట్టుగానే 21
ఆయనయందు ఉపదేశింపబడినవారైనయెడల మీ
రాలాగు క్రీస్తును (గూర్చి) నేర్చుకొన్నవారుకారు. ।
కావున మునుపటి ప్రవర్తన విషయములోనైతే మోస 22
కరమైన దురాశలవలన చెడిపోవు మీ ప్రాచీనస్వ
భావమును[4] వదులుకొని । మీ చిత్తవృత్తియందు 23
నూతనపరచబడినవారై, । నీతియు యథార్థమైన భక్తి 24
యుగలవారై, దేవుని పోలికగా సృష్టింపబడిన నవీన
స్వభావమును[5] ధరించుకొనవలెను.

1 మూలభాషలో—అందరిద్వారాను. 2 కీర్తన, 68: 18. 3 కొన్ని ప్రాచీనప్రతులలో—మొదట, అని కూర్చబడియున్నది. 4 మూలభా.—ప్రాచీనపురుషుని. 5 మూలభా.—నవీనపురుషుని.

25 మనము ఒకరికొకరము అవయవములమై యు
న్నాము గనుక మీరు అబద్ధమాడుట మాని ప్రతి
వాడును తన పొరుగువానితో సత్యమే మాటలాడ
26 వలెను. । కోపపడుడి గాని పాపము చేయకుడి;
సూర్యుడస్తమించినపిమ్మట మీ కోపము నిలిచియుండ
27 కూడదు. । అపవాదికి[1] చోటియ్యకుడి; దొంగిలు
28 వాడు ఇకమీదట దొంగిలక అక్కరగలవానికి పంచి
పెట్టుటకు వీలుకలుగు నిమిత్తము తన చేతులతో
29 మంచి పనిచేయుచు కష్టపడవలెను. । వినువారికి మేలు
కలుగునట్లు అవసరమునుబట్టి క్షేమాభివృద్ధికరమైన
అనుకూలవచనమే పలుకుడి గాని దుర్భాష యేదైనను
30 మీ నోట రానియ్యకుడి. । దేవుని పరిశుద్ధాత్మను
దుఃఖపరచకుడి; విమోచనదినమువరకు ఆయనయందు
31 మీరు ముద్రింపబడియున్నారు. । సమస్తమైన ద్వే
షము, కోపము, క్రోధము, అల్లరి, దూషణ, సకల
32 మైన దుష్టత్వము మీరు విసర్జించుడి. । ఒకనియెడల
ఒకడు దయగలిగి కరుణాహృదయులై క్రీస్తునందు
దేవుడు మిమ్మును క్షమించినప్రకారము మీరును ఒకరి
నొకరు క్షమించుడి.

5 కావున మీరు ప్రియులైన పిల్లలవలె దేవునిపోలి
2 నడుచుకొనుడి. । క్రీస్తు మిమ్మును ప్రేమించి, పరి
మళవాసనగా ఉండుటకు మనకొరకు తన్నుతాను
దేవునికి అర్పణముగాను బలిగాను అప్పగించుకొనెను;
ఆలాగుననే మీరును ప్రేమగలిగి నడుచుకొనుడి. ।
3 మీలో జారత్వమే గాని, యే విధమైన అపవిత్ర
తయే గాని, లోభత్వమే గాని, వీటి పేరైనను ఎత్త
4 కూడదు, ఇదే పరిశుద్ధులకు తగినది. । మరియు కృత
జ్ఞతావచనమే మీరుచ్చరింపవచ్చును గాని, బూతు
లైనను, పోకిరిమాటలైనను,[2] సరసోక్తులైనను ఉచ్చరింప
5 కూడదు; ఇవి మీకు తగవు. । వ్యభిచారియైనను,
అపవిత్రుడైనను, విగ్రహారాధికుడైయున్న లోభి
యైనను క్రీస్తుయొక్కయు దేవునియొక్కయు రాజ్య
మునకు హక్కుదారుడు కాడను సంగతి మీకు నిశ్చ
6 యముగా తెలియును. । వ్యర్థమైన మాటలవలన ఎవ
7 డును మిమ్మును మోసపరచనియ్యకుడి; ఇట్టి క్రియల
వలన దేవుని ఉగ్రత అవిధేయులైనవారిమీదికి[3]
వచ్చును గనుక మీరు అట్టివారితో పాలివారై యుండ
8 కుడి. । మీరు పూర్వమందు చీకటియై యుంటిరి,
9 ఇప్పుడైతే ప్రభువునందు వెలుగైయున్నారు. । వెలుగు
ఫలము సమస్తవిధములైన మంచితనము, నీతి, సత్య
10 మనువాటిలో కనబడుచున్నది । గనుక ప్రభువుకేది
ప్రీతికరమైనదో దాని పరీక్షించుచు, వెలుగు సంబం
11 ధులవలె[4] నడుచుకొనుడి. । నిష్ఫలమైన అంధకార
క్రియలలో పాలివారైయుండక వాటిని ఖండించుడి. ।
ఏలయనగా అట్టి క్రియలు చేయువారు రహస్య 12
మందు జరిగించు పనులనుగూర్చి మాటలాడుటయైనను
అవమానకరమై యున్నది. । సమస్తమును ఖండింప 13
బడి వెలుగుచేత ప్రత్యక్షపరచబడును; ప్రత్యక్షపర
చునది ఏదో అది వెలుగేగదా? । అందుచేతను— 14
నిద్రించుచున్న నీవు మేల్కొని మృతులలోనుండి
లెమ్ము, క్రీస్తు నీమీద ప్రకాశించునని ఆయన చెప్పు
చున్నాడు.[5]

దినములు చెడ్డవి గనుక మీరు సమయమును 15
పోనియ్యక ఉపయోగము చేసికొనుచు, అజ్ఞానులవలె 16
కాక జ్ఞానులవలె నడుచుకొనునట్లు జాగ్రత్తగా
చూచుకొనుడి. । ఇందునిమిత్తము మీరు అవివేకులు 17
కాక ప్రభువుయొక్క చిత్తమేమిటో గ్రహించు
కొనుడి. । మరియు మద్యముతో మత్తులైయుండకుడి, 18
దానిలో దుర్వ్యాపారము కలదు; అయితే ఆత్మ
పూర్ణులైయుండుడి. । ఒకనినొకడు కీర్తనలతోను సం 19
గీతములతోను ఆత్మసంబంధమైన పాటలతోను హెచ్చ
రించుచు, మీ హృదయములలో ప్రభువునుగూర్చి
పాడుచు కీర్తించుచు, । మన ప్రభువైన యేసుక్రీస్తు 20
పేరట సమస్తమునుగూర్చి తండ్రియైన దేవునికి ఎల్లప్పు
డును కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచు, । క్రీస్తునందలి 21
భయముతో ఒకనికొకడు లోబడియుండుడి.

స్త్రీలారా, ప్రభువునకువలె మీ స్వపురుషులకు 22
లోబడియుండుడి. । క్రీస్తు సంఘమునకు శిరస్సై 23
యున్నలాగున పురుషుడు భార్యకు శిరస్సైయు
న్నాడు. క్రీస్తే శరీరమునకు రక్షకుడై యున్నాడు. ।
సంఘము క్రీస్తుకు లోబడినట్టుగా భార్యలుకూడ ప్రతి 24
విషయములోను తమ పురుషులకు లోబడవలెను. ।
పురుషులారా, మీరును మీ భార్యలను ప్రేమించుడి. 25
అటువలె క్రీస్తుకూడ సంఘమును ప్రేమించి, అది 27
కళంకమైనను ముడతయైనను అట్టిది మరి ఏదైనను
లేక, పరిశుద్ధమైనదిగాను నిర్దోషమైనదిగాను మహిమ
గల సంఘముగాను ఆయన తనయెదుట దాని నిలువ
బెట్టుకొనవలెనని, వాక్యముతో ఉదకస్నానముచేత
దాని పవిత్రపరచి పరిశుద్ధపరచుటకై దానికొరకు
తన్నుతాను అప్పగించుకొనెను. । అటువలెనే పురు 28
షులుకూడ తమ స్వశరీరములనువలె తమ భార్యలను
ప్రేమింప బద్ధులైయున్నారు. తన భార్యను ప్రేమించు
వాడు తన్ను ప్రేమించుకొనుచున్నాడు. । తన శరీర 29
మును ద్వేషించినవాడెవడును లేడు గాని ప్రతివాడు 30
దానిని పోషించి సంరక్షించుకొనును. మనము క్రీస్తు
శరీరమునకు అవయవములమై యున్నాము గనుక
ఆలాగే క్రీస్తును సంఘమును పోషించి సంరక్షించు
చున్నాడు. । ఈ హేతువుచేతను పురుషుడు తన 31

1 అనగా, సాతానుకు. 2 లేక, వెర్రిమాటలైనను. 3 మూలభాషలో—అవిధేయత కుమారులమీదికి. 4 మూలభాషా.—వెలుగు పిల్లలవలె
5 యెషయా, 26: 19; 60: 1.

తండ్రిని తల్లిని విడిచి తన భార్యతో హత్తుకొనును;
32 వారిద్దరును ఒక్క శరీరమగుదురు.[1] । ఈ మర్మము
గొప్పది; అయితే నేను క్రీస్తునుగూర్చియు సంఘ
33 మునుగూర్చియు చెప్పుచున్నాను. । మెట్టుకు మీలో
ప్రతి పురుషుడును తనను వలె తన భార్యను ప్రేమింప
వలెను, భార్యయైతే తన భర్తయందు భయము కలిగి
యుండునట్లు చూచుకొనవలెను.

6 పిల్లలారా, ప్రభువునందు మీ తలిదండ్రులకు
విధేయులైయుండుడి; ఇది ధర్మమే.

2 నీకు మేలు కలుగునట్లు నీ తండ్రిని తల్లిని సన్మా
3 నింపుము, అప్పుడు నీవు భూమిమీద దీర్ఘా
యుష్మంతుడవగుదువు,[2]

ఇది వాగ్దానముతో కూడిన ఆజ్ఞలలో మొదటిది.

4 తండ్రులారా, మీ పిల్లలకు కోపము రేపక
ప్రభువుయొక్క శిక్షలోను బోధలోను వారిని పెంచుడి.
5 దాసులారా, శుద్ధాంతఃకరణగలవారై భయము
తోను వణకుతోను క్రీస్తుకువలె, శరీరవిషయమై మీ
6 యజమానులైనవారికి విధేయులైయుండుడి. । మను
ష్యులను సంతోషపెట్టువారు చేయునట్లు, కంటికి
కనబడుటకే కాక, క్రీస్తు దాసులమని యెరిగి దేవుని
7 చిత్తమును మనఃపూర్వకముగా జరిగించుచు, । మను
ష్యులకు చేసినట్టు కాక ప్రభువుకు చేసినట్టే యిష్ట
8 పూర్వకముగా సేవచేయుడి. । దాసుడైనను స్వతంత్రు
డైనను మీలో ప్రతివాడును ఏ సత్కార్యము చేయునో
దాని ఫలము ప్రభువువలన పొందునని మీ రెరుగు
9 దురు. । యజమానులారా, మీకును వారికిని యజ
మానుడైనవాడు పరలోకమందున్నాడనియు, ఆయ
నకు పక్షపాతము లేదనియు ఎరిగినవారై వారిని బెద
రించుట మాని ఆ ప్రకారమే వారియెడల ప్రవ
ర్తించుడి.
10 తుదకు ప్రభువుయొక్క మహా శక్తినిబట్టి ఆయన
11 యందు బలవంతులై యుండుడి. । మీరు అపవాది[3]
తంత్రములను ఎదిరించుటకు శక్తిమంతులగునట్లు దేవు
12 డిచ్చు సర్వాంగకవచమును ధరించుకొనుడి. । ఏల
యనగా మనము పోరాడునది శరీరులతో[4] కాదు,
ప్రధానులతోను, అధికారులతోను, ప్రస్తుత అంధ
కార సంబంధులగు లోకనాథులతోను, ఆకాశమండల
మందున్న దురాత్మల సమూహములతోను పోరాడు
చున్నాము. । అందుచేతను మీరు ఆపద్దినమందు వారిని 13
ఎదిరించుటకును, సమస్తము నెరవేర్చినవారై నిలువ
బడుటకును శక్తిమంతులగునట్లు, దేవుడిచ్చు[5] సర్వాంగ
కవచమును ధరించుకొనుడి. । ఏలాగనగా మీ నడు 14
ముకు సత్యమను దట్టి కట్టుకొని నీతియను మైమరువు
తొడుగుకొని । పాదములకు సమాధాన సువార్తవలన 15
నైన సిద్ధమనస్సను జోడు తొడుగుకొని నిలువబడుడి. ।
ఇవన్నియుగాక విశ్వాసమను డాలు పట్టుకొనుడి; 16
దానితో మీరు దుష్టుని అగ్నిబాణములన్నిటిని ఆర్పు
టకు శక్తిమంతులవుదురు. । మరియు రక్షణయను శిర 17
స్త్రాణమును, దేవుని వాక్యమను ఆత్మ ఖడ్గమును ధరించు
కొనుడి. । ఆత్మవలన ప్రతి సమయమునందును ప్రతి 18
విధమైన ప్రార్థనను విజ్ఞాపనను చేయుచు, ఆ విష
యమై సమస్త పరిశుద్ధుల నిమిత్తమును పూర్ణమైన పట్టు
దలతో విజ్ఞాపనచేయుచు మెలకువగా ఉండుడి. ।
మరియు నేను దేనినిమిత్తము రాయబారినై సంకెళ్లలో 19
ఉన్నానో, ఆ సువార్త మర్మమును ధైర్యముగా తెలియ
జేయుటకు నేను మాటలాడ మొదలుపెట్టునప్పుడు[6] ।
దానిగూర్చి నేను మాటలాడవలసినట్టుగా ధైర్యముతో 20
మాటలాడుటకై వాక్శక్తి నాకు అనుగ్రహింపబడు
నట్లు నా నిమిత్తమును (పూర్ణమైన పట్టుదలతో విజ్ఞా
పనచేయుచు మెలకువగా ఉండుడి.)

మీరును నా క్షేమసమాచారమంతయు తెలిసి 21
కొనుటకు ప్రియసహోదరుడును ప్రభువునందు
నమ్మకమైన పరిచారకుడునైన తుకికు నా సంగతు
లన్నియు మీకు తెలియజేయును. । మీరు మా సమా 22
చారము తెలిసికొనుటకును అతడు మీ హృదయము
లను ఓదార్చుటకును అతని మీయొద్దకు పంపితిని.
తండ్రియైన దేవునినుండియు ప్రభువైన యేసు 23
క్రీస్తునుండియు సమాధానమును విశ్వాసముతో
కూడిన ప్రేమయు సహోదరులకు కలుగును గాక. ।
మన ప్రభువైన యేసుక్రీస్తును శాశ్వతమైన ప్రేమతో 24
ప్రేమించువారికందరికిని కృప కలుగును గాక.

1 ఆదికాండము, 2: 24. 2 నిర్గమకాండము, 20: 12. 3 అనగా, సాతాను. 4 మూలభాషలో—రక్తమాంసములతో. 5 దేవుని
6 మూలభా.—నా నోరు తెరచునప్పుడు.

## అపొస్తలుడైన పౌలు

# ఫిలిప్పీయులకు వ్రాసిన పత్రిక

1 ఫిలిప్పీయిలో ఉన్న క్రీస్తు[1]యేసునందలి సకల
పరిశుద్ధులకును అధ్యక్షులకును పరిచారకులకును క్రీస్తు
యేసు దాసులైన పౌలును తిమోథెయును (శుభమని
2 చెప్పి) వ్రాయునది. । మన తండ్రియగు దేవుని
నుండియు ప్రభువగు యేసుక్రీస్తునుండియు మీకు
కృపయు సమాధానమును కలుగును గాక.
3 మొదటి దినమునుండి ఇదివరకు సువార్త విషయ
6 ములో మీరు నాతో పాలివారై యుండుట చూచి,
మీలో ఈ సత్క్రియ నారంభించినవాడు యేసు
క్రీస్తు దినమువరకు దాని కొనసాగించునని రూఢిగా
నమ్ముచున్నాను గనుక మీ అందరి నిమిత్తము నేను
చేయు ప్రతి ప్రార్థనలో ఎల్లప్పుడును సంతోష
ముతో ప్రార్థనచేయుచు, నేను మిమ్మును జ్ఞాపకము
చేసికొనినప్పుడెల్లను నా దేవునికి కృతజ్ఞతాస్తుతులు
7 చెల్లించుచున్నాను. । నా బంధకములయందును, నేను
సువార్తపక్షమున వాదించుటయందును, దాని స్థిర
పరచుటయందును, మీరందరు ఈ కృపలో నాతో
కూడ పాలివారై యున్నారు గనుక నేను మిమ్మును
నా హృదయములో ఉంచుకొని యున్నాను. ఇందు
చేత మిమ్మునందరినిగూర్చి యీలాగు భావించుట నాకు
8 ధర్మమే. । క్రీస్తుయేసుయొక్క దయారసమునుబట్టి
మీ అందరిమీద నేనెంత అపేక్ష కలిగియున్నానో
9 దేవుడే నాకు సాక్షి. । మీరు శ్రేష్ఠమైన కార్యములను
1. వివేచింపగలవారగుటకు మీ ప్రేమ, తెలివితోను
సకలవిధములైన అనుభవజ్ఞానముతోను కూడినదై, అంత
కంతకు అభివృద్ధి పొందవలెననియు, ఇందువలన దేవు
నికి మహిమయు స్తోత్రమును కలుగునట్లు మీరు
యేసుక్రీస్తువలననైన నీతిఫలములతో నిండికొనిన
వారై క్రీస్తు దినమునకు నిష్కపటులును నిర్దోషు
లును కావలెననియు ప్రార్థించుచున్నాను.
12 సహోదరులారా, నాకు సంభవించినవి సువార్త
మరి యెక్కువగా ప్రబలమగుటకే పరిణమించెనని
13 మీరు తెలిసికొనగోరుచున్నాను. । ఏలాగనగా నా
బంధకములు క్రీస్తునిమిత్తమే కలిగినవని ప్రేతోర్య
మను సేనలోనివారికందరికిని తక్కినవారికందరికిని
14 స్పష్టమాయెను. । మరియు సహోదరులైనవారిలో
ఎక్కువమంది నా బంధకములమూలముగా ప్రభువు
నందు స్థిరవిశ్వాసము గలవారై, నిర్భయముగా దేవుని
వాక్యము బోధించుటకు మరి విశేషధైర్యము తెచ్చు
కొనిరి. । కొందరు అసూయచేతను కలహబుద్ధిచేతను, 15
మరి కొందరు మంచిబుద్ధిచేతను క్రీస్తును ప్రకటించు 17
చున్నారు. వారైతే నా బంధకములతో కూడ నాకు
శ్రమ తోడుచేయవలెనని తలంచుకొని శుద్ధమనస్సుతో
కాక కక్షతో క్రీస్తును ప్రకటించుచున్నారు; వీరైతే
నేను సువార్తపక్షమున వాదించుటకు నియమింపబడి
యున్నానని యెరిగి ప్రేమతో ప్రకటించుచున్నారు.।
అయిననేమి? మిషచేతనేగాని సత్యముచేతనేగాని, 18
యేవిధముచేతనైనను క్రీస్తు ప్రకటింపబడుచున్నాడు.
అందుకు నేను సంతోషించుచున్నాను, ఇక ముం
దును సంతోషింతును. । మరియు నేను ఏ విషయము 19
లోను సిగ్గుపడక యెప్పటివలెనే యిప్పుడును పూర్ణ
ధైర్యముతో బోధించుటవలన నా బ్రదుకు మూల
ముగానైన సరే చావు మూలముగానైన సరే, క్రీస్తు
నా శరీరమందు ఘనపరచబడునని । నేను మిగుల అపే 20
క్షించుచు నిరీక్షించుచున్న ప్రకారముగా మీ ప్రార్థన
వలనను, యేసుక్రీస్తుయొక్క ఆత్మ నాకు సమృద్ధిగా
కలుగుటవలనను, ఆ ప్రకటన నాకు రక్షణార్థముగా
పరిణమించునని నేనెరుగుదును. । నామట్టుకైతే బ్రదు 21
కుట క్రీస్తే, చావైతే లాభము. । అయినను శరీరముతో 22
నేను జీవించుటయే నాకున్న పనికి ఫలసాధనమైన
యెడల నేనేమి కోరుకొందునో నాకు తోచలేదు. ।
ఈ రెంటి మధ్యను ఇరుకునబడియున్నాను. నేను 23
వెడలిపోయి క్రీస్తుతోకూడ నుండవలెనని నాకు ఆశ
యున్నది, అది నాకు మరి మేలు. । అయినను నేను 24
శరీరమునందు నిలిచియుండుట మిమ్మునుబట్టి మరి అవ
సరమైయున్నది. । మరియు ఇట్టి నమ్మకము కలిగి 25
నేను మరల మీతో కలిసియుండుటచేత నన్నుగూర్చి 26
క్రీస్తుయేసునందు మీకున్న అతిశయము అధికమగు
నట్లు, మీరు విశ్వాసమునందు అభివృద్ధియు ఆనంద
మును పొందు నిమిత్తము, నేను జీవించి మీ అందరితో
కూడ కలిసియుందునని నాకు తెలియును. । నేను 27
వచ్చి మిమ్మును! చూచినను రాకపోయినను మీరు ఏ 28
విషయములోను ఎదిరించువారికి బెదరక, అందరును
ఒక్క భావముతో సువార్త విశ్వాసపక్షమున పోరా
డుచు, ఏకమనస్సుగలవారై నిలిచియున్నారని నేను
మిమ్మునుగూర్చి వినులాగున, మీరు క్రీస్తు సువార్తకు

[1] క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము.

తగినట్లుగా ప్రవర్తించుడి. (అట్లు మీరు బెదరకుండుట),
వారికి నాశనమును ,మీకు రక్షణయును కలుగునను
టకు సూచనయై యున్నది. ఇది దేవునివలన కలుగు
29 నదే. । ఏలయనగా మీరు నాయందు చూచినట్టియు,
నాయందున్నదని మీరిప్పుడు వినుచున్నట్టియు పోరా
30 టము మీకును కలిగియున్నందున । క్రీస్తునందు విశ్వాస
ముంచుటమాత్రమేగాక ఆయన పక్షమున శ్రమపడు
టయు ఆయన పక్షమున మీకు అనుగ్రహింపబడెను.

2 కావున క్రీస్తునందు ఏ హెచ్చరికయైనను, ప్రేమ
వలన ఏ దుఃఖోపశమనమైనను, ఆత్మయందు ఏ సహ
వాసమైనను, ఏ దయారసవాత్సల్యములైనను ఉన్న
2 యెడల । మీరు ఏకమనస్కులగునట్లుగా ఏకప్రేమ
కలిగి, యేకభావముగలవారుగా ఉండి, ఒక్కదానినే
మనస్కరించుచు నా సంతోషమును సంపూర్ణము
3 చేయుడి. । కక్షచేతనైనను వృథాతిశయముచేతనైనను
ఏమియు చేయక, వినయమైన మనస్సుగలవారై యొకని
4 నొకడు తనకంటె యోగ్యుడని యెంచుచు । మీలో
ప్రతివాడును తన స్వకార్యములనుమాత్రమేగాక యిత
5 రుల కార్యములనుకూడ చూడవలెను. । క్రీస్తుయేసుకు
కలిగిన యీ మనస్సు మీరును కలిగియుండుడి. ।
6 ఆయన దేవుని స్వరూపము కలిగినవాడైయుండి, దేవు
నితో సమానముగా ఉండుట విడిచిపెట్టకూడని భాగ్య
7 మని యెంచుకొనలేదు గాని । మనుష్యుల పోలికగా
పుట్టి, దాసుని స్వరూపమును ధరించుకొని, తన్ను తానే
8 రిక్తునిగా చేసికొనెను. । మరియు ఆయన ఆకారమందు
మనుష్యుడుగా కనబడి, మరణము పొందునంతగా,
అనగా సిలువమరణము పొందునంతగా విధేయత
9 చూపినవాడై, తన్ను తాను తగ్గించుకొనెను. । అందు
10 చేతను పరలోకమందున్నవారిలో గాని, భూమిమీద
ఉన్నవారిలో గాని, భూమిక్రింద ఉన్నవారిలో
గాని, ప్రతివాని మోకాలును యేసు నామమున
11 వంగునట్లును, । ప్రతివాని నాలుకయు తండ్రియైన
దేవుని మహిమార్థమై యేసుక్రీస్తు ప్రభువని ఒప్పుకొను
నట్లును, దేవుడు ఆయనను అధికముగా హెచ్చించి,
ప్రతి నామమునకు పైనామమును ఆయనకు అను
గ్రహించెను.

12 కాగా నా ప్రియులారా, మీరెల్లప్పుడును విధే
యులై యున్నప్రకారము, నాయెదుట ఉన్నప్పుడు
మాత్రమే గాక మరి యెక్కువగా నేను మీతో లేని
యీ కాలమందును, భయముతోను వణకుతోను మీ
13 స్వరక్షణను కొనసాగించుకొనుడి. । ఈ విషయములో
మీరు ఇచ్ఛయించుటకును కార్యసిద్ధి కలుగజేసికొనుట
కును, తన దయాసంకల్పము నెరవేరుటకై మీలో
14 కార్యసిద్ధి కలుగజేయువాడు దేవుడే. । మీరు మూర్ఖ
15 మైన వక్రజనము మధ్య, నిరపరాధులును నిష్కళం
కులును అనింద్యులునైన దేవుని కుమారులగునట్లు, సణు
గులును సంశయములును మాని సమస్త కార్యములను
చేయుడి. । అట్టి జనము మధ్యను మీరు జీవవాక్య 16
మును చేత పట్టుకొని లోకమందు జ్యోతులవలె కన
బడుచున్నారు. ఇందువలన నేను వ్యర్థముగా పరు
గెత్తలేదనియు, నేను పడిన కష్టము నిష్ప్రయోజనము
కాలేదనియు క్రీస్తుదినమున నాకు అతిశయకారణము
కలుగును. । మరియు మీ విశ్వాసయాగములోను దాని 17
సంబంధమైన సేవలోను నేను పానార్పణముగా పోయ
బడినను, నేనానందించి మీ యందరితోకూడ సంతో
షింతును. । ఇటువలెనే మీరును ఆనందించి నాతో 18
కూడ సంతోషించుడి.

నేనును మీ క్షేమము తెలిసికొని ధైర్యము తెచ్చు 19
కొను నిమిత్తము తిమోథెయును శీఘ్రముగా మీ
యొద్దకు పంపుటకు ప్రభువైన యేసునందు నిరీక్షించు
చున్నాను. । మీ క్షేమవిషయమై నిజముగా చిం 20
తించువాడు అతనివంటివాడెవడును నాయొద్ద లేడు. ।
అందరును తమ స్వకార్యములనే చూచుకొనుచున్నారు 21
గాని యేసుక్రీస్తు కార్యములను చూడరు. । అతని 22
యోగ్యత మీరెరుగుదురు. తండ్రికి కుమారుడేలాగు
సేవచేయునో ఆలాగే అతడు నాతోకూడ సువార్త
వ్యాపకము నిమిత్తము సేవచేసెను. । కాబట్టి నాకేమి 23
సంభవింపనైయున్నదో చూచినవెంటనే అతని పంప
వలెనని అనుకొనుచున్నాను. । నేనును శీఘ్రముగా 24
వచ్చెదనని ప్రభువునుబట్టి నమ్ముచున్నాను. । మరియు 25
నా సహోదరుడును, జతపనివాడును, నాతోటి
యోధుడును, మీ దూతయు, నా అవసరమునకు ఉప
చరించినవాడునైన ఎపఫ్రొదితును మీయొద్దకు పం
పుట అగత్యమని అనుకొంటిని. । తాను రోగియాయె 26
నని మీరు వింటిరి గనుక అతడు మిమ్మునందరిని (చూడ)
మిగుల అపేక్షగలవాడై విచారపడుచుండెను. । నిజ 27
ముగా అతడు రోగియై చావుకు సిద్ధమై యుండెను
గాని దేవుడతని కనికరించెను; అతనిమాత్రమే గాక
నాకు దుఃఖముమీద దుఃఖము కలుగకుండుటకై
నన్నును కనికరించెను. । కాబట్టి మీరు అతని చూచి 28
మరల సంతోషించునిమిత్తమును నాకున్న దుఃఖము
తగ్గునిమిత్తమును అతని మరి శీఘ్రముగా పంపితిని. ।
అతడు నాయెడల మీ ఉపచర్యలో ఉన్న కొదువను 29
తీర్చుటకై తన ప్రాణమునైనను లక్ష్యపెట్టక క్రీస్తు 30
యొక్క[1] పనినిమిత్తము చావుకు సిద్ధమైయుండెను
గనుక పూర్ణానందముతో ప్రభువునందు అతని చేర్చు
కొని అట్టివారిని ఘనపరచుడి.

పైట్టుకు నా సహోదరులారా, ప్రభువునందు 3
ఆనందించుడి. అదేసంగతులను మీకు వ్రాయుట
నాకు కష్టమైనది కాదు, మీకు అది క్షేమకరము. ।

1 అనేక ప్రాచీన ప్రతులలో—ప్రభువుయొక్క— అని పాఠాంతరము.

2 కుక్కలవిషయమై జాగ్రత్తగా ఉండుడి, దుష్టులైన
పనివారివిషయమై జాగ్రత్తగా ఉండుడి, ఈ ఛేదన
3 నాచరించువారివిషయమై జాగ్రత్తగా ఉండుడి. । శరీ
రమును ఆస్పదము చేసికొనక దేవునియొక్క ఆత్మవలన
ఆరాధించుచు, క్రీస్తుయేసునందు అతిశయపడుచున్న
4 మనమే సున్నతి (ఆచరించువారము.) । కావలయు
నంటే నేను శరీరమును ఆస్పదము చేసికొనవచ్చును;
మరి ఎవడైనను శరీరమును ఆస్పదము చేసికొన దలచిన
యెడల నేను మరి యెక్కువగా చేసికొనవచ్చును. ।
5 ఎనిమిదవదినమున సున్నతిపొందితిని, ఇశ్రాయేలు
వంశపువాడనై, బెన్యామీను గోత్రములో పుట్టి
హెబ్రీయుల సంతానమైన హెబ్రీయుడనై, ధర్మ
6 శాస్త్రవిషయము పరిసయ్యుడనై, । ఆసక్తివిషయము
సంఘమును హింసించువాడనై, ధర్మశాస్త్రమువలని నీతి
7 విషయము అనింద్యుడనై యుంటిని. । అయినను ఏవేవి
నాకు లాభకరములై యుండెనో వాటిని క్రీస్తునిమిత్తము
8 నష్టముగా ఎంచుకొంటిని. । నిశ్చయముగా నా ప్రభు
వైన యేసుక్రీస్తునుగూర్చిన అతిశ్రేష్ఠమైన జ్ఞానము
నిమిత్తమై సమస్తమును నష్టముగా ఎంచుకొనుచు
9 న్నాను. । క్రీస్తును సంపాదించుకొని, ధర్మశాస్త్రమూల
మైన నా నీతికాక క్రీస్తునందలి విశ్వాసమువలననైన
నీతి, అనగా విశ్వాసమునుబట్టి దేవుడు అనుగ్రహించు
నీతిగలవాడనై ఆయనయందు అగపడునిమిత్తమును, ।
10 ఏ విధముచేతనైనను మృతులలోనుండి నాకు పునరు
11 త్థానము కలుగవలెనని, ఆయన మరణవిషయములో
సమానానుభవముగలవాడనై, ఆయనను ఆయన పునరు
త్థానబలమును ఎరుగు నిమిత్తమును, ఆయన శ్రమలలో
పాలివాడనగుట యెట్టిదో యెరుగునిమిత్తమును, సమస్త
మును నష్టపరుచుకొని వాటిని పెంటతో సమానముగా
12 ఎంచుకొనుచున్నాను. । ఇదివరకే నేను గెలిచితినని
యైనను, ఇదివరకే సంపూర్ణసిద్ధి పొందితిననియైనను
నేను అనుకొనుటలేదు గాని, నేను దేనినిమిత్తము
క్రీస్తుయేసుచేత పట్టబడితినో దాని పట్టుకొనవలెనని
13 పరుగెత్తుచున్నాను. । సహోదరులారా, నేనిదివరకే
పట్టుకొనియున్నానని తలంచుకొనను. అయితే ఒకటి
(చేయుచున్నాను), వెనుక ఉన్నవి లక్ష్యపెట్టక[1]
14 ముందట ఉన్నవాటికొరకై వేగిరపడుచు । క్రీస్తు
యేసునందు దేవుని పరసంబంధమైన పిలుపునకు కలుగు
బహుమానమును పొందవలెనని, గురియొద్దకే పరు
15 గెత్తుచున్నాను. । కాబట్టి మనలో సంపూర్ణులమైన
వారమందరము ఈ తాత్పర్యమే కలిగియుందము.
అప్పుడు దేనిగూర్చియైనను మీకు వేరు తాత్పర్యము
కలిగియున్నయెడల అదియు దేవుడు మీకు బయలు
16 పరచును. । అయినను ఇప్పటివరకు మనకు లభించిన
దానినిబట్టియే క్రమముగా నడుచుకొందము.

సహోదరులారా, మీరు నన్ను పోలి నడుచు 17
కొనుడి; మేము మీకు మాదిరియైయున్న ప్రకారము
నడుచుకొనువారిని గురిపెట్టి చూడుడి. । అనేకులు 18
క్రీస్తు సిలువకు శత్రువులుగా నడుచుకొనుచున్నారు;
వీరినిగూర్చి మీతో అనేక పర్యాయములు చెప్పి
యిప్పుడును ఏడ్చుచు చెప్పుచున్నాను. । నాశనమే 19
వారి అంతము, వారి కడుపే వారికి దేవుడు; వారు
తాము సిగ్గుపడవలసిన సంగతులయందు అతిశయ
పడుచున్నారు, భూసంబంధమైనవాటినే మనస్క
రించుచున్నారు. । మన పౌరస్థితి పరలోకమునందు 20
న్నది; అక్కడనుండి ప్రభువైన యేసుక్రీస్తు అను
రక్షకుని నిమిత్తము కనిపెట్టుకొనియున్నాము. । సమస్త 21
మును తనకు లోపరచుకొనజాలిన శక్తినిబట్టి ఆయన
మన దీనశరీరమును తన మహిమగల శరీరమునకు సమ
రూపము గలదానిగా మార్చును.

కావున నేనపేక్షించు నా ప్రియ సహోదరు 4
లారా, నా ఆనందమును నా కిరీటమునైయున్న
నా ప్రియులారా, యిట్లు ప్రభువునందు స్థిరులై
యుండుడి.

ప్రభువునందు ఏకమనస్సుగలవారై యుండుడని 2
యువొదియను, సుంటుకేను బతిమాలుకొనుచున్నాను.।
అవును, నిజమైన సహకారీ, ఆ స్త్రీలు క్లెమెంతుతోను 3
నా యితర సహకారులతోను సువార్తపనిలో నాతో
కూడ ప్రయాసపడినవారు గనుక వారికి సహాయము
చేయుమని నిన్ను వేడుకొనుచున్నాను. వారి పేరులు
జీవగ్రంథమందు వ్రాయబడియున్నవి.

ఎల్లప్పుడును ప్రభువునందు ఆనందించుడి, మరల 4
చెప్పుదును, ఆనందించుడి. । మీ సహనమును[2] సకల 5
జనులకు తెలియబడనియ్యుడి. ప్రభువు సమీపముగా
ఉన్నాడు. । దేనిగూర్చియు చింతపడకుడి గాని ప్రతి 6
విషయములోను ప్రార్థన విజ్ఞాపనములచేత కృతజ్ఞతా
పూర్వకముగా మీ విన్నపములు దేవునికి తెలియ
జేయుడి. । అప్పుడు సమస్త జ్ఞానమునకు మించిన దేవుని 7
సమాధానము యేసుక్రీస్తువలన మీ హృదయముల
కును మీ తలంపులకును కావలియుండును.

మెట్టుకు సహోదరులారా, యే యోగ్యతయైనను 8
మెప్పైనను ఉండినయెడల, ఏవి సత్యమైనవో, ఏవి
మాన్యమైనవో, ఏవి న్యాయమైనవో, ఏవి పవిత్ర
మైనవో, ఏవి రమ్యమైనవో, ఏవి ఖ్యాతిగలవో,
వాటిమీద ధ్యానముంచుకొనుడి. । మరియు మీరు 9
నావలన ఏవి నేర్చుకొని అంగీకరించితిరో, నాయం
దున్నట్టుగా ఏవి వింటిరో ఏవి చూచితిరో, అట్టి
వాటిని చేయుడి; అప్పుడు సమాధానకర్తయగు దేవుడు
మీకు తోడైయుండును.

[1] మూలభాషలో – మరచిపోయి. [2] శేక, మృదుత్వమును.

10 నన్నుగూర్చి మీరిన్నాళ్లకు మరల యోచన చేయ్య
సాగితిరని ప్రభువునందు మిక్కిలి సంతోషించితిని.
ఆ విషయములో మీరు యోచనచేసియుంటిరి గాని
11 తగిన సమయము దొరకకపోయెను. । నాకు కొదువ
కలిగినందున నేనీలాగు చెప్పుటలేదు; నేనేస్థితిలో
ఉన్నను ఆ స్థితిలో సంతృప్తి కలిగియుండ నేర్చుకొని
12 యున్నాను. । దీనస్థితిలో ఉండ నెరుగుదును, సంపన్న
స్థితిలో ఉండ నెరుగుదును; ప్రతివిషయములోను
అన్నికార్యములలోను కడుపు నిండియుండుటకును
ఆకలిగొనుటకును, సమృద్ధి కలిగియుండుటకును లేమిలో
13 ఉండుటకును నేర్చుకొని యున్నాను. । నన్ను బల
పరచువానిబట్టియే[1] నేను సమస్తమును చేయగలను. ।
14 అయినను నా శ్రమలో మీరు పాలుపుచ్చుకొని
15 నది మంచిపని. । ఫిలిప్పీయులారా, సువార్తను నేను
బోధింపనారంభించి మకెదోనియలోనుండి వచ్చి
నప్పుడు ఇచ్చు విషయములోను పుచ్చుకొను విష
యములోను మీరు తప్ప మరి ఏ సంఘపువారును
16 నాతో పాలివారు కాలేదని మీకే తెలియును. । ఏల
యనగా థెస్సలొనీకలోకూడ మీరు మాటిమాటికి నా
అవసరము తీర్చుటకు సహాయము చేసితిరి. । నేను మీ 17
యీవిని అపేక్షించి యీలాగు చెప్పుటలేదు గాని మీ
లెక్కకు విస్తారఫలము రావలెనని అపేక్షించి చెప్పు
చున్నాను. । నాకు సమస్తమును సమృద్ధిగా కలిగి 18
యున్నది. మీరు పంపిన వస్తువులు ఎపఫ్రొదితువలన
పుచ్చుకొని యేమియు తక్కువలేక యున్నాను; అవి
మనోహరమైన సువాసనయు, దేవునికి ప్రీతికరమును
ఇష్టమునైన యాగమునైయున్నవి. । కాగా నా దేవుడు 19
తన ఐశ్వర్యముచొప్పున క్రీస్తుయేసునందు మహి
మలో మీ ప్రతి అవసరమును తీర్చును. । మన తండ్రి 20
యైన దేవునికి యుగయుగములకు మహిమ కలుగును
గాక. ఆమేన్.

ప్రతి పరిశుద్ధునికి క్రీస్తుయేసునందు వందనములు 21
చెప్పుడి. । నాతోకూడ ఉన్న సహోదరులందరు 22
మీకు వందనములు చెప్పుచున్నారు. పరిశుద్ధులందరును
ముఖ్యముగా కైసరు ఇంటివారిలో ఉన్న పరిశుద్ధు
లును మీకు వందనములు చెప్పుచున్నారు.

ప్రభువైన యేసుక్రీస్తు కృప మీ ఆత్మతో ఉం 23
డును గాక.

అపొస్తలుడైన పౌలు

# కొలొస్సయులకు వ్రాసిన పత్రిక

1 కొలొస్సైలో ఉన్న పరిశుద్ధులకు అనగా క్రీస్తు
2 నందు[1] విశ్వాసులైన సహోదరులకు, దేవుని చిత్తము
వలన క్రీస్తుయేసు అపొస్తలుడైన పౌలును సహోదరు
డైన తిమోథెయును (శుభమని చెప్పి) వ్రాయునది.
మన తండ్రియైన దేవునినుండి కృపయు సమాధాన
మును మీకు కలుగును గాక.

3 పరలోకమందు మీకొరకు ఉంచబడిన నిరీక్షిత
4 పదవినిబట్టి క్రీస్తుయేసునందు మీకు కలిగియున్న
విశ్వాసమునుగూర్చియు, పరిశుద్ధులందరిమీద మీకున్న
ప్రేమనుగూర్చియు, మేము విని యెల్లప్పుడు మీ
నిమిత్తము ప్రార్థనచేయుచు, మన ప్రభువగు యేసు
క్రీస్తుయొక్క తండ్రియైన దేవునికి కృతజ్ఞతాస్తుతులు
5 చెల్లించుచున్నాము. । మీయొద్దకు వచ్చిన సువార్త
సత్యమునుగూర్చిన బోధవలన (ఆ నిరీక్షిత పదవిని
6 గూర్చి) మీరు ఇంతకుముందు వింటిరి. । ఈ సువార్త
సర్వలోకములో ఫలించుచు వ్యాపించుచున్నట్టుగా
మీరు దేవుని కృపనుగూర్చి విని సత్యముగా గ్రహిం
చిన నాటనుండి మీలో సహితము (ఫలించుచు వ్యాపిం
7 చుచు)న్నది. । ఎపఫ్రా అను మా ప్రియుడైన తోటి
దాసునివలన మీరు ఈ సంగతులను నేర్చుకొంటిరి. ।
8 అతడు మా విషయములో[2] నమ్మకమైన క్రీస్తు పరిచార
కుడు; అతడు ఆత్మయందలి మీ ప్రేమను మాకు తెలి
పినవాడు.

9 అందుచేత ఈ సంగతి వినిననాటనుండి మేమును
12 మీ నిమిత్తము ప్రార్థన చేయుట మానక, మీరు సం
పూర్ణ జ్ఞానమును ఆత్మ సంబంధమైన వివేకమును గల
వారును, ఆయన చిత్తమును పూర్ణముగా గ్రహించిన
వారునై ప్రతి సత్కార్యములో సఫలులగుచు, దేవుని
విషయమైన జ్ఞానమందు అభివృద్ధి పొందుచు, అన్ని
విషయములలో ప్రభువును సంతోషపెట్టునట్లు ఆయ
నకు తగినట్టుగా నడుచుకొనవలెననియు, ఆనంద
ముతోకూడిన పూర్ణ ఓర్పును దీర్ఘశాంతమును కను
పరచునట్లు ఆయన మహిమ శక్తినిబట్టి సంపూర్ణ బల
ముతో బలపరచబడవలెననియు, తేజోవాసులైన పరి
శుద్ధుల స్వాస్థ్యములో పాలివారమగుటకు మనలను[3]
పాత్రులనుగాచేసిన తండ్రికి మీరు కృతజ్ఞతాస్తుతులు
చెల్లింపవలెననియు (దేవుని) బతిమాలుచున్నాము. ।
ఆయన మనలను అంధకారసంబంధమైన అధికార 13
ములోనుండి విడుదలచేసి, తాను ప్రేమించిన తన కుమా
రుని[4] రాజ్యనివాసులనుగా చేసెను. । ఆ కుమారుని 14
యందు మనకు విమోచనము, అనగా పాపక్షమాపణ
కలుగుచున్నది. । ఆయన అదృశ్యదేవుని స్వరూపియై 15
సర్వసృష్టికి ఆదిసంభూతుడై యున్నాడు. । ఏల 16
యనగా ఆకాశమందున్నవియు భూమియందున్న
వియు, దృశ్యమైనవి గాని అదృశ్యమైనవి గాని, అవి
సింహాసనములైనను ప్రభుత్వములైనను ప్రధానులైనను
అధికారములైనను, సర్వమును ఆయనయందు సృజింప
బడెను, సర్వమును ఆయనద్వారాను ఆయననుబట్టియు
సృజింపబడెను. । ఆయన అన్నిటికంటె ముందుగా 17
ఉన్నవాడు; ఆయనే సమస్తమునకు ఆధారభూతుడు. ।
సంఘము అను శరీరమునకు ఆయనే శిరస్సు; ఆయ 18
నకు అన్నిటిలో ప్రాముఖ్యత కలుగునిమిత్తము, ఆయన
ఆదియైయుండి మృతులలోనుండి లేచుట (విషయము)
లోను ఆదిసంభూతుడుగా లేచినవాడు. । ఆయన 19
యందు సర్వసంపూర్ణత నివసింపవలెననియు, ఆయన 20
సిలువ రక్తముచేత సంధిచేసి ఆయనద్వారా సమస్త
మును, అవి భూలోకమందున్నవైనను పరలోకమం
దున్నవైనను, వాటినన్నిటిని ఆయనద్వారా తనతో
సమాధానపరచుకొనవలెననియు (తండ్రి)కి అభీష్టమా
యెను. । మరియు గతకాలమందు దేవునికి దూరస్థు 21
లును, మీ దుష్క్రియలవలన మీ మనస్సులో విరోధ
భావముగలవారునై యుండిన మిమ్మునుకూడ । తన 22
సన్నిధిని పరిశుద్ధులగాను నిర్దోషులగాను నిరపరాధుల
గాను నిలువబెట్టుటకు ఆయన మాంసయుక్తమైన దేహ
మందు మరణమువలన ఇప్పుడు మిమ్మును సమాధాన
పరచెను. । పునాదిమీద కట్టబడినవారై స్థిరముగా 23
ఉండి, మీరు విన్నట్టియు, ఆకాశముక్రింద ఉన్న
సమస్త సృష్టికి ప్రకటింపబడినట్టియు ఈ సువార్తవలన
కలుగు నిరీక్షణనుండి తొలగిపోక విశ్వాసమందు నిలిచి
యుండినయెడల (ఇది మీకు కలుగును.) పౌలను నేను
ఆ సువార్తకు పరిచారకుడనైతిని.

ఇప్పుడు మీకొరకు నేను అనుభవించుచున్న 24
శ్రమలయందు సంతోషించుచు, సంఘము అను
ఆయన శరీరముకొరకు క్రీస్తు పడినపాట్లలో కొదువైన

[1] శబ్దమునకు అభిషిక్తుడని అర్థము. [2] అనేక ప్రాచీనప్రతులలో—మీ విషయములో, అని పాఠాంతరము. [3] అనేక ప్రాచీనప్రతు
పాఠాంతరము. [4] మూలభాషలో—తన ప్రేమ కుమారుని.

వాటియందు నా వంతు నా శరీరమందు సంపూర్ణము
25 చేయుచున్నాను. । దేవుని వాక్యమును, అనగా యుగ
26 ములలోను తరములలోను మరుగుచేయబడియున్న మర్మ
మును సంపూర్ణముగా ప్రకటించుటకు, మీ నిమిత్తము
నాకు అప్పగింపబడిన దేవుని యేర్పాటు[1] ప్రకారము,
27 నేను ఆ సంఘమునకు పరిచారకుడనైతిని. । అన్యజను
లలో ఈ మర్మముయొక్క మహిమైశ్వర్యము ఎట్టిదో
అది, అనగా మీయందున్న క్రీస్తు, మహిమ నిరీక్ష
ణకు కారణమైయున్నాడను[2] సంగతి దేవుడు తన
పరిశుద్ధులకు తెలియపరచగోరి యిప్పుడు ఆ మర్మమును
28 వారికి బయలుపరచెను. । ప్రతి మనుష్యుని క్రీస్తు
నందు సంపూర్ణునిగా చేసి ఆయనయెదుట నిలువబెట్ట
వలెనని, సమస్తవిధములైన జ్ఞానముతో మేము ప్రతి
మనుష్యునికి బుద్ధిచెప్పుచు, ప్రతి మనుష్యునికి బోధిం
29 చుచు, ఆయనను ప్రకటించుచున్నాము. । అందు
నిమిత్తము నాలో బలముగా కార్యసిద్ధికలుగజేయు
ఆయన క్రియాశక్తినిబట్టి నేను పోరాడుచు ప్రయాస
పడుచున్నాను.

**2** మీరును, లవొదికైయవారును, శరీరరీతిగా నా
2 ముఖము చూడనివారందరును ప్రేమయందు అతుక
బడి, గ్రహించుచున్నామను సంపూర్ణ భాగ్యము కలి
గినవారై, దేవుని మర్మమైయున్న క్రీస్తును స్పష్టముగా
తెలిసికొన్నవారై, మీ హృదయములు ఆదరణపొంద
వలెనని మీ అందరికొరకు నేను ఎంతగా పోరాడు
3 చున్నానో మీరు తెలిసికొన గోరుచున్నాను. । బుద్ధి
విజ్ఞానముల సర్వసంపదలు ఆయనయందే గుప్తములై
4 యున్నవి. । ఎవడైనను చక్కనిమాటలచేత మిమ్మును
మోసపరచకుండునట్లు ఈ సంగతిని చెప్పుచున్నాను. ।
5 నేను శరీరవిషయములో దూరముగా ఉన్నను ఆత్మ
విషయములో మీతోకూడ ఉండి మీ యోగ్యమైన
ప్రవర్తనను[3] క్రీస్తునందలి మీ స్థిరవిశ్వాసమును చూచి
ఆనందించుచున్నాను.

6–7 కావున మీరు ప్రభువైన క్రీస్తుయేసును అంగీ
కరించిన విధముగా ఆయనయందు వేరుపారినవారై,
(యింటివలె) కట్టబడుచు, మీరు నేర్చుకొనినప్రకార
ముగా విశ్వాసమందు స్థిరపరచబడుచు, కృతజ్ఞతాస్తు
తులు చెల్లించుటయందు విస్తరించుచు, ఆయనయందుండి
నడుచుకొనుడి.

ఆయనను అనుసరింపక మనుష్యుల పారంపర్యా
చారమును, అనగా ఈ లోకసంబంధమైన మూల
పాఠములను అనుసరించి మోసకరములైన నిరర్థక తత్వ
జ్ఞానముచేత మిమ్మును చెరపట్టుకొని పోవువాడెవడైన
9 ఉండునేమో అని జాగ్రత్తగా ఉండుడి. । ఏలయనగా
దేవత్వముయొక్క సర్వపరిపూర్ణత శరీరాకారముగా
క్రీస్తునందు నివసించుచున్నది; । మరియు ఆయన 10
యందు మీరును సంపూర్ణులైయున్నారు; ఆయన
సమస్త ప్రధానులకును అధికారులకును శిరస్సైయు
న్నాడు; । మీరును బాప్తిస్మమందు ఆయనతోకూడ 11–12
పాతిపెట్టబడినవారై ఆయనయందు సున్నతిపొందితిరి;
ఆ సున్నతి చేతులతో చేయబడునది కాదుగాని శరీ
రేచ్ఛాయుక్తమైన స్వభావమును విసర్జించుటయను
క్రీస్తుకు(అనుకూలమైన) సున్నతియే. ఆయనను మృతు
లలోనుండి లేపిన దేవుడు కనుపరచిన ప్రభావమందు
విశ్వాసముంచుటచేత ఆ బాప్తిస్మమువలన ఆయనతో
కూడ లేచితిరి. । మరియు అపరాధములవలనను, శరీర 13–15
మందు సున్నతిపొందకయుండుటవలనను, మీరు
మృతులైయుండగా దేవుడు విధిరూపకమైన ఆజ్ఞల
వలన మనమీద ఋణముగాను మనకు విరోధముగా
నుండిన పత్రమును మేకులతో సిలువకు కొట్టి, దాని
మీది చేవ్రాతను తుడిచివేసి, మనకు అడ్డములేకుండ
దానిని ఎత్తివేసి, మన అపరాధములన్నిటిని క్షమించి
ఆయనతోకూడ మిమ్మును జీవింపచేసెను; ఆయన
ప్రధానులను అధికారులను నిరాయుధులనుగా చేసి,
సిలువచేత జయోత్సవముతో వారిని పట్టి తెచ్చి
బాహాటముగా (వేడుకకు) కనుపరచెను.

కాబట్టి అన్నపానముల విషయములోనైనను, పం 16
డుగ అమావాస్య విశ్రాంతిదినము అనువాటి విషయ
ములోనైనను, మీకు తీర్పు తీర్చ నెవనికిని అవకాశ
మియ్యకుడి. । ఇవి రాబోవువాటి ఛాయయేగాని నిజ 17
స్వరూపము[4] క్రీస్తులో ఉన్నది. । అతి వినయాసక్తుడై 18–19
దేవదూతారాధనయందు ఇచ్ఛకలిగి, తాను చూచిన
వాటినిగూర్చి[5] గొప్పగా చెప్పుకొనుచు, తన శరీరసం
బంధమైన మనస్సువలన ఊరకె ఉప్పొంగుచు, శిర
స్సును హత్తుకొననివాడెవడును మీ బహుమానమును
అపహరింపనియ్యకుడి; ఆ శిరస్సుమూలముగా సర్వ
శరీరము కీళ్లచేతను నరములచేతను పోషింపబడి అతుక
బడినదై దేవునివలన కలుగు వృద్ధితో అభివృద్ధి పొందు
చున్నది.

మీరు క్రీస్తుతోకూడ లోకముయొక్క మూల 20–22
పాఠముల విషయమై మృతిపొందినవారైతే లోక
ములో బ్రదుకుచున్నట్టుగా మనుష్యుల ఆజ్ఞలను పద్ధ
తులను అనుసరించి—చేత పట్టుకొనవద్దు, రుచిచూడ
వద్దు, ముట్టవద్దు అను విధులకు మీరు లోబడనేల?
అవన్నియు వాడుకొనుటచేత నశించిపోవును. । అట్టివి 23
స్వేచ్ఛారాధన విషయములోను, వినయ విషయము
లోను దేహశిక్ష విషయములోను జ్ఞానరూపకమైనవని
యెంచబడుచున్నవేగాని, శరీరేచ్ఛానిగ్రహవిషయ
ములో ఏమాత్రమును ఎన్నికచేయదగినవి కావు.

1 మూలభాషలో—గృహనిర్వాహకత్వము. 2 మూలభా.—మహిమ నిరీక్షణమై యున్నాడను. 3 మూలభా.—యుద్ధసన్నద్ధులై నిలుచుటను.
4 మూలభా.—శరీరము. 5 అనేక ప్రాచీనప్రతులలో—చూడనివాటినిగూర్చి అని పాఠాంతరము

**3** మీరు క్రీస్తుతోకూడ లేపబడినవారైతే పైనున్న
వాటినే వెదకుడి, అక్కడ క్రీస్తు దేవుని కుడిపార్శ్వ
2 మున కూర్చుండియున్నాడు. । పైనున్న వాటిమీదనే
3 గాని భూసంబంధమైనవాటిమీద మనస్సు పెట్టుకొనకుడి;
ఏలయనగా మీరు మృతిపొందితిరి, మీ జీవము
క్రీస్తుతోకూడ దేవునియందు దాచబడియున్నది. ।
4 మనకు జీవమైయున్న క్రీస్తు ప్రత్యక్షమైనప్పుడు
మీరును ఆయనతో కూడ మహిమయందు ప్రత్యక్ష
పరచబడుదురు.

5 కావున భూమిమీదనున్న మీ అవయవములను,
అనగా జారత్వమును, అపవిత్రతను, కామాతురతను,
దురాశను, విగ్రహారాధనయైన ధనాపేక్షను[1] చంపి
6 వేయుడి. । వాటివలన దేవుని ఉగ్రత అవిధేయుల
7 మీదికి[2] వచ్చును. । పూర్వము వారి మధ్య జీవించి
నప్పుడు మీరును వీటిని అనుసరించి నడుచుకొంటిరి. ।
8 ఇప్పుడైతే మీరు, కోపము, ఆగ్రహము, దుష్టత్వము,
దూషణ, మీనోట బూతులు అను వీటినన్నిటిని విస
9 ర్జించుడి. । ఒకనితో ఒకడు అబద్ధమాడకుడి; ఏల
10 యనగా ప్రాచీనస్వభావమును[3] దాని క్రియలతో
కూడ మీరు పరిత్యజించి, జ్ఞానము కలుగునిమిత్తము
దాని సృష్టించినవాని పోలికచొప్పున నూతనపరచ
బడుచున్న నవీనస్వభావమును ధరించుకొనియు
11 న్నారు. । ఇట్టివారిలో హెల్లేనీయుడని యూదుడని
భేదము లేదు; సున్నతి పొందుటయని సున్నతి పొం
దకపోవుటయని భేదము లేదు; పరదేశియని స్కుథు
యుడని[4] దాసుడని స్వతంత్రుడని లేదు గాని క్రీస్తే
సర్వమును అందరిలో ఉన్నవాడునై యున్నాడు.

12 కాగా దేవునిచేత ఏర్పరచబడినవారును పరిశుద్ధు
లును ప్రియులునైనవారికి తగినట్లు మీరు జాలిగల
మనస్సును, దయాళుత్వమును, వినయమును, సాత్వీక
13 మును, దీర్ఘశాంతమును ధరించుకొనుడి. । ఎవడైనను
తనకు హాని చేసెనని యొకడనుకొనినయెడల ఒకని
ఒకడు సహించుచు ఒకని ఒకడు క్షమించుడి, ప్రభువు[5]
మిమ్మును క్షమించినలాగున మీరును క్షమించుడి. ।
14 వీటన్నిటిపైని పరిపూర్ణతకు అనుబంధమైన ప్రేమను
15 ధరించుకొనుడి। క్రీస్తు (అనుగ్రహించు) సమాధానము
మీ హృదయములలో ఏలుచుండనియ్యుడి; ఇందు
కొరకే మీరొక్క శరీరముగా పిలువబడితిరి; మరియు
16 కృతజ్ఞులై యుండుడి. । సంగీతములతోను కీర్తనల
తోను ఆత్మసంబంధమైన పద్యములతోను ఒకనికి ఒకడు
బోధించుచు బుద్ధిచెప్పుచు కృపాసహితముగా మీ
హృదయములలో దేవునిగూర్చి గానముచేయుచు,
సమస్తవిధములైన జ్ఞానముతో క్రీస్తు వాక్యము మీలో
17 సమృద్ధిగా నివసింపనియ్యుడి. । మరియు మాటచేత
గాని క్రియచేత గాని మీరేమి చేసినను ప్రభువైన
యేసుద్వారా తండ్రియైన దేవునికి కృతజ్ఞతాస్తుతులు
చెల్లించుచు, సమస్తమును ఆయనపేరట చేయుడి.

భార్యలారా, మీ భర్తలకు విధేయులై యుండుడి; 18
ఇది ప్రభువునుబట్టి యుక్తమైయున్నది. । భర్తలారా, 19
మీ భార్యలను ప్రేమించుడి, వారిని నిష్ఠురపెట్టకుడి. ।
పిల్లలారా, అన్నివిషయములలో మీ తలిదండ్రుల 20
మాట వినుడి; ఇది ప్రభువునుబట్టి మెచ్చుకొనతగినది.
తండ్రులారా, మీ పిల్లల మనస్సు క్రుంగకుండునట్లు 21
వారికి కోపము పుట్టింపకుడి. । దాసులారా, మనుష్యు 22
లను సంతోషపెట్టువారైనట్టు కంటికి కనబడవలెనని
కాక, ప్రభువుకు భయపడుచు శుద్ధాంతఃకరణగలవారై,
శరీరమునుబట్టి మీ యజమానులైనవారికి అన్నివిషయ
ములలో విధేయులై యుండుడి. । ప్రభువువలన 23
స్వాస్థ్యమును ప్రతిఫలముగా పొందుదుమని యెరుగు 24
దురు గనుక మీరేమిచేసినను అది మనుష్యుల నిమిత్తము
కాక ప్రభువు నిమిత్తమని మనస్ఫూర్తిగా చేయుడి;
మీరు ప్రభువైన క్రీస్తుకు దాసులై యున్నారు. ।
అన్యాయము చేసినవానికి తాను చేసిన అన్యాయము 25
కొలది మరల లభించును, పక్షపాతముండదు. । యజ **4**
మానులారా, పరలోకములో మీకును యజమాను
డున్నాడని యెరిగి న్యాయమైనదియు ధర్మానుసార
మైనదియు మీ దాసులయెడల చేయుడి.

ప్రార్థనయందు నిలుకడగా ఉండి కృతజ్ఞతగల 2
వారై దానియందు మెలకువగా ఉండుడి. మరియు 4
నేను బంధకములలో ఉంచబడుటకు కారణమైన
క్రీస్తు మర్మమునుగూర్చి నేను బోధింపవలసిన విధము
గానే ఆ మర్మమును వెల్లడిపరచునట్లు వాక్యము చెప్పు
టకు అనుకూలమైన సమయము దేవుడు దయచేయవలె
నని[6] మాకొరకు ప్రార్థించుడి. । సమయము పోనియ్యక 5
సద్వినియోగము చేసికొనుచు, (సంఘమునకు) వెలపటి
వారియెడల జ్ఞానము కలిగి నడుచుకొనుడి. । ప్రతి 6
మనుష్యునికి ఏలాగు ప్రత్యుత్తరమియ్యవలెనో అది
మీరు తెలిసికొనుటకై మీ సంభాషణ ఉప్పు వేసి
నట్టు ఎల్లప్పుడు రుచిగలదిగాను కృపాసహితముగాను
ఉండనియ్యుడి.

ప్రియసహోదరుడును, ప్రభువునందు నమ్మకమైన 7
పరిచారకుడును, నా జతసేవకుడునైన తుకికు నన్ను
గూర్చిన సంగతులన్నియు మీకు తెలియజేయును. ।
మీరు మా స్థితి తెలిసికొనునట్లును మీ హృదయ 8
ములను అతడు ఆదరించునట్లును అతనిని అతనితో 9
కూడ నమ్మకమైన ప్రియసహోదరుడైన ఒనేసిమును
మీయొద్దకు పంపుచున్నాను; ఇతడు మీయొద్దనుండి

[1] లేక, లోభత్వమును. [2] మూలభాషలో—అవిధేయత కుమారులమీదికి. [3] మూలభా.—ప్రాచీనపురుషుని. [4] అనాగరికమైన ఒక జనము.
[5] అనేక ప్రాచీనప్రతులలో—క్రీస్తు, అని పాఠాంతరము. [6] మూలభా.—వాక్యమునకు ప్రవేశద్వారము తెరువవలెనని.

వచ్చినవాడే; వీరిక్కడి సంగతులన్నియు మీకు తెలియ
జేతురు.
10 నాతోకూడ చెరలో ఉన్న అరిస్తార్కును, బర్న
బాకు సమీపజ్ఞాతియైన మార్కును మీకు వందనములు
చెప్పుచున్నారు; ఈ మార్కునుగూర్చి మీరు ఆజ్ఞలు
పొందితిరి, ఇతడు మీయొద్దకు వచ్చినయెడల ఇతని
11 చేర్చుకొనుడి. । మరియు యూస్తు అను యేసుకూడ
మీకు వందనములు చెప్పుచున్నాడు. వీరు సున్నతి
పొందినవారిలో చేరినవారు, వీరుమాత్రమే దేవుని
రాజ్యము నిమిత్తము నా జతపనివారై యున్నారు,
12 వీరివలన నాకు ఆదరణ కలిగెను. । మీలో ఒకడును
క్రీస్తుయేసు దాసుడునైన ఎపఫ్రా మీకు వందన
ములు చెప్పుచున్నాడు; మీరు సంపూర్ణులును, ప్రతి
విషయములో దేవుని చిత్తమునుగూర్చి సంపూర్ణాత్మ
నిశ్చయతగలవారునై నిలుకడగా ఉండవలెనని యిత
డెల్లప్పుడును మీకొరకు తన ప్రార్థనలలో పోరాడు
చున్నాడు. । ఇతడు మీకొరకును, లవొదికైయ 13
వారికొరకును, హియెరపొలివారికొరకును బహు
ప్రయాసపడుచున్నాడని యితనిగూర్చి సాక్ష్యమిచ్చు
చున్నాను. । లూకా అను ప్రియుడైన వైద్యుడును, 14
దేమాయు మీకు వందనములు చెప్పుచున్నారు. ।
లవొదికైయలో ఉన్న సహోదరులకును, నుంఫా 15
కును, వారి యింట ఉన్న సంఘమునకును వందనములు
చెప్పుడి. । ఈ పత్రిక మీరు చదివించుకొనిన తరు 16
వాత లవొదికైయ వారి సంఘములోను చదివించుడి;
లవొదికైయకు వ్రాసి పంపిన పత్రికను మీరును
చదివించుకొనుడి. । మరియు — ప్రభువునందు నీకు 17
అప్పగింపబడిన పరిచర్యను నెరవేర్చుటకు దానిగూర్చి
జాగ్రత్తపడుమని అర్ఖిప్పుతో చెప్పుడి.
పౌలను నేను స్వహస్తముతో నా వందనములు 18
వ్రాయుచున్నాను; నా బంధకములను జ్ఞాపకము
చేసికొనుడి. కృప మీకు తోడైయుండును గాక.

### అపొస్తలుడైన పౌలు

# థెస్సలొనీకైయులకు వ్రాసిన మొదటి పత్రిక

1 తండ్రియైన దేవునియందును ప్రభువైన యేసు
క్రీస్తునందును ఉన్న థెస్సలొనీకైయుల సంఘమునకు
పౌలును, సిల్వానును, తిమోథెయును (శుభమని చెప్పి)
వ్రాయునది. కృపయు సమాధానమును మీకు కలు
గును గాక.

2 విశ్వాసపూర్వకమైన మీ పనిని, ప్రేమపూర్వక
3 మైన మీ ప్రయాసమును, మన ప్రభువైన యేసు
క్రీస్తునందలి నిరీక్షణ పూర్వకమైన మీ ఓర్పును,
మేము మన తండ్రియైన దేవునియెదుట మానక జ్ఞాప
కముచేసికొనుచు, మా ప్రార్థనలయందు మీ విష
యమై విజ్ఞాపనము చేయుచు, మీ అందరి నిమిత్తము
ఎల్లప్పుడును దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించు
4 చున్నాము. । ఏలయనగా దేవునివలన ప్రేమింపబడిన
5 సహోదరులారా, మీరు ఏర్పరచబడిన సంగతి,
అనగా మా సువార్త, మాటతో మాత్రముగాక శక్తి
తోను, పరిశుద్ధాత్మతోను, సంపూర్ణ నిశ్చయతతోను
మీయొద్దకు వచ్చియున్న సంగతి మాకు తెలియును.
మీ నిమిత్తము మేము మీయెడల ఎట్టివారమై యుం
6 టిమో మీరెరుగుదురు. । పరిశుద్ధాత్మవలన కలుగు ఆనం
దముతో మిక్కిలి ఉపద్రవమందు మీరు వాక్యము
నంగీకరించి, మమ్మును ప్రభువును పోలి నడుచుకొనిన
7 వారైతిరి. । కాబట్టి మకెదొనియలోను అకైయలోను
8 విశ్వాసులందరికిని మాదిరియైతిరి; మీయొద్దనుండి
ప్రభువు వాక్యము మకెదొనియలోను అకైయలోను
మ్రోగెను; అక్కడమాత్రమేగాక ప్రతి స్థలమందును
దేవుని యెడల ఉన్న మీ విశ్వాసము వెల్లడాయెను
9 గనుక మేమేమియు చెప్పవలసిన అవశ్యములేదు. । మీ
10 యొద్ద మాకెట్టి ప్రవేశము కలిగెనో అక్కడి జనులు
మమ్మునుగూర్చి తెలియజెప్పుచున్నారు. మరియు మీరు
విగ్రహములను విడిచిపెట్టి, జీవముగలవాడును సత్య
వంతుడునగు దేవునికి దాసులగుటకును, దేవుడు మృతు
లలోనుండి లేపిన యేసు, అనగా రాబోవు ఉగ్రత
నుండి మనలను తప్పించుచున్న ఆయన కుమారుడైన
యేసు పరలోకమునుండి వచ్చునని యెదురు చూచుట
కును, మీరేలాగు దేవునివైపుకు తిరిగితిరో ఆ సంగతి
వారే తెలియజేయుచున్నారు.

2 సహోదరులారా, మీయొద్ద మా ప్రవేశము
2 వ్యర్థముకాలేదు. గాని । మీరెరిగినట్టే మేము ఫిలిప్పి
యిలో ముందు శ్రమపడి అవమానముపొంది, యెంతో
పోరాటముతో దేవుని సువార్తను మీకు బోధించు
టకై మన దేవునియందు ధైర్యము తెచ్చుకొంటిమని
మీకు తెలియును. । ఏలయనగా మా బోధ కపటమైన 3
నది కాదు, అపవిత్రమైనది కాదు, మోసయుక్తమైన
నది కాదు గాని । సువార్తను మాకు అప్పగించుటకు 4
యోగ్యులని దేవునివలన ఎంచబడినవారమై, మనుష్యు
లను సంతోషపెట్టువారము కాక మన హృదయములను
పరీక్షించు దేవునినే సంతోషపెట్టువారమై బోధించు
చున్నాము. । మీరెరిగియున్నట్టు మేము ఇచ్చకపు 5
మాటలనైనను, ధనాపేక్షను[1] కప్పిపెట్టు వేషమునైనను
ఎన్నడును వినియోగింపలేదు; ఇందుకు దేవుడే
సాక్షి. । మరియు మేము క్రీస్తుయొక్క అపొస్తలులమై 6
యున్నందున అధికారము చేయుటకు సమర్థులమై
యున్నను, మీవలననే గాని యితరులవలననే గాని
మనుష్యులవలన కలుగు ఘనతను మేము కోరలేదు. ।
అయితే స్తన్యమిచ్చు తల్లి తన స్వంత బిడ్డలను గారా 7
వించునట్లుగా మేము మీ మధ్యను సాధువులమై[2]
యుంటిమి. । మీరు మాకు బహు ప్రియులైయుంటిరి 8
గనుక మీయందు విశేషాపేక్షగలవారమై దేవుని
సువార్తను మాత్రము గాక మా ప్రాణములనుకూడ
మీకిచ్చుటకు సిద్ధపడియుంటిమి. । అవును సహో 9
దరులారా, మా ప్రయాసమును కష్టమును మీకు
జ్ఞాపకమున్నది గదా. మేము మీలో ఎవనికైనను భార
ముగా ఉండకూడదని దివారాత్రము కష్టముచేసి జీవ
నముచేయుచు మీకు దేవుని సువార్త ప్రకటించితిమి. ।
మేము విశ్వాసులైన మీయెదుట ఎంత భక్తిగాను, నీతి 10
గాను, అనింద్యముగాను ప్రవర్తించితిమో దానికి మీరు
సాక్షులు, దేవుడును సాక్షి । తన రాజ్యమునకును 11
మహిమకును మిమ్మును పిలుచుచున్న దేవునికి తగి 12
నట్టుగా మీరు నడుచుకొనవలెనని మేము మీలో
ప్రతివాని హెచ్చరించుచు, ధైర్యము తెలుపుచు,
సాక్ష్యమిచ్చుచు, తండ్రి తన బిడ్డలయెడల నడుచు
కొనురీతిగా మీలో ప్రతివానియెడల మేము నడుచు
కొంటిమని మీకు తెలియును.

ఆ హేతువుచేతను మీరు దేవునిగూర్చిన వర్తమాన 13
వాక్యము మావలన అంగీకరించినప్పుడు, మనుష్యుల
వాక్యమని యెంచక అది నిజముగా ఉన్నట్టు దేవుని

1 లేక, లోభత్వమును. 2 అనేక ప్రాచీనప్రతులలో—శిశువులమైయుంటిమి, అని పాఠాంతరము.

వాయుమండల సంబంధమైన అధిపతిని, అనగా అవి
ధేయులైనవారిని ఇప్పుడు ప్రేరేపించు శక్తికి అధి
పతిని అనుసరించి, యీ ప్రపంచ ధర్మముచొప్పున[1]
3 మునుపు నడుచుకొంటిరి. ; వారితో కలిసి మన మందర
మును శరీరముయొక్కయు మనస్సుయొక్కయు ఇచ్ఛ
లను నెరవేర్చుకొనుచు, మన శరీరాశలను అనుసరించి
మునుపు ప్రవర్తించుచు, కడమవారివలెనే స్వభావ
సిద్ధముగా దైవోగ్రతకు పాత్రులమై[2] యుంటిమి. ।
4 అయినను దేవుడు కరుణాసంపన్నుడైయుండి, మనము
5 మన అపరాధములచేత చచ్చినవారమై యుండి
నప్పుడు సహా, మనయెడల చూపిన తన మహాప్రేమ
చేత మనలను క్రీస్తుతోకూడ బ్రదికించెను. కృప
6 చేతనే మీరు రక్షింపబడియున్నారు. । క్రీస్తుయేసు
నందు ఆయన మనకుచేసిన ఉపకారముద్వారా అత్య
ధికమైన తన కృపా మహదైశ్వర్యమును రాబోవు
7 యుగములలో కనుపరచునిమిత్తము, । క్రీస్తుయేసు
నందు మనలను ఆయనతోకూడ లేపి, పరలోకమందు
8 ఆయనతోకూడ కూర్చుండబెట్టెను. । మీరు విశ్వ
సించినవారై కృపచేత రక్షింపబడియున్నారు; ఇది
9 మీవలన కలిగినది కాదు, దేవుని వరమే. । అది క్రియల
వలన కలిగినది కాదు గనుక ఎవడును అతిశయపడ
10 వీలులేదు. । మరియు వాటియందు మనము నడుచు
కొనవలెనని దేవుడు ముందుగా సిద్ధపరచిన సత్
క్రియలు చేయుటకై, మనము క్రీస్తుయేసునందు
సృష్టింపబడినవారమై ఆయన చేసిన పనియై యు
న్నాము.
11 కాబట్టి మునుపు శరీర విషయములో అన్యజనులై
యుండి, శరీరమందు చేతితో చేయబడిన సున్నతి
గలవారు అనబడినవారిచేత సున్నతిలేనివారనబడిన
12 మీరు । ఆ కాలమందు ఇశ్రాయేలుతో సహ
పౌరులుకాక, పరదేశులును, వాగ్దాన నిబంధనలు
లేని పరజనులును, నిరీక్షణలేనివారును, లోకమందు
నిర్దేవులునైయుండి, క్రీస్తుకు దూరస్థులై యుంటిరని
13 మీరు జ్ఞాపకము చేసికొనుడి. । అయినను మునుపు
దూరస్థులైన మీరు ఇప్పుడు క్రీస్తుయేసునందు క్రీస్తు
14 రక్తమువలన సమీపస్థులై యున్నారు. । ఆయన మీకును
మాకును ఉండిన ద్వేషమును, అనగా విధిరూపక
మైన ఆజ్ఞలుగల ధర్మశాస్త్రమును, తన శరీరమందు కొట్టి
వేయుటచేత మధ్యగోడను పడగొట్టి, మన ఉభ
15 యులను ఏకముచేసెను. । ఇట్లు సంధిచేయుచు, ఈ
యిద్దరిని తనయందు ఒక్క నూతన పురుషునిగా
16 సృష్టించి, । తన సిలువవలన ఆ ద్వేషమును సంహరించి,
దాని ద్వారా వీరిద్దరిని ఏకశరీరముగా చేసి దేవు
నితో సమాధానపరచవలెనని యీలాగు చేసెను గనుక
ఆయనయే మనకు సమాధానకారకుడై యున్నాడు.[3] ।
మరియు ఆయన వచ్చి దూరస్థులైన మీకును సమీప 17
స్థులైనవారికిని సమాధాన సువార్తను ప్రకటించెను. ।
ఆయనద్వారానే మనము ఉభయులము ఒక్క ఆత్మ 18
యందు తండ్రిసన్నిధికి చేరగలిగియున్నాము. । కాబట్టి 19
మీరికమీదట పరజనులును పరదేశులునై యుండక
పరిశుద్ధులతో ఏకపట్టణస్థులును దేవుని యింటివారునై
యున్నారు. । క్రీస్తుయేసే ముఖ్యమైన మూలరాయియై 20
యుండగా అపొస్తలులును ప్రవక్తలును వేసిన పునాది
మీద మీరు కట్టబడియున్నారు. । ప్రతి కట్టడమును 21
ఆయనలో చక్కగా అమర్చబడి, ప్రభువునందు పరి
శుద్ధమైన దేవాలయమగుటకు వృద్ధిపొందుచున్నది. ।
ఆయనలో మీరు కూడ ఆత్మమూలముగా దేవునికి 22
నివాసస్థలమై యుండుటకు కట్టబడుచున్నారు.

ఈ హేతువుచేత అన్యజనులైన మీనిమిత్తము 3
క్రీస్తుయేసుయొక్క ఖైదినైన పౌలను నేను (ప్రార్థిం
చుచున్నాను.) । మీకొరకు నాకనుగ్రహింపబడిన 2
దేవుని కృపవిషయమైన యేర్పాటును[4] గూర్చి మీరు
వినియున్నారు. । ఎట్లనగా (క్రీస్తు) మర్మము దేవ 3
దర్శనమువలన నాకు తెలియపరచబడినదను సంగతిని
గూర్చి మునుపు సంక్షేపముగా వ్రాసితిని. । మీరు 4
దాని చదివినయెడల దానినిబట్టి ఆ క్రీస్తు మర్మమును
గూర్చి నాకు కలిగిన ప్రాజ్ఞతను గ్రహించుకొనన
గలరు. । ఈ మర్మమిప్పుడు ఆత్మమూలముగా దేవుని 5
పరిశుద్ధులగు అపొస్తలులకును ప్రవక్తలకును బయలు
పరచబడియున్నట్టుగా పూర్వకాలములయందు మను
ష్యులకు తెలియపరచబడలేదు. । ఈ మర్మమేదనగా 6
—అన్యజనులు సువార్తవలన, క్రీస్తుయేసునందు, యూ
దులతోపాటు సమానవారసులును, ఒక శరీరమందలి
సాటి అవయవములును, వాగ్దానములో పాలివార
లునై యున్నారనునదియే. । దేవుడు కార్యకారి 7
యగు తన శక్తినిబట్టి నాకు అనుగ్రహించిన కృపావ
రముచొప్పున నేను ఆ సువార్తకు పరిచారకుడనైతిని. ।
దేవుడు మన ప్రభువైన క్రీస్తుయేసునందు చేసిన నిత్య 8
సంకల్పము చొప్పున, పరలోకములో ప్రధానులకును 11
అధికారులకును, సంఘముద్వారా తనయొక్క నానా
విధమైన జ్ఞానము ఇప్పుడు తెలియబడవలెనని ఉద్దే
శించి, శోధింపశక్యము కాని[5] క్రీస్తు ఐశ్వర్యమును
అన్యజనులలో ప్రకటించుటకును, సమస్తమును సృష్టిం
చిన దేవునియందు పూర్వకాలమునుండి మరుగైయున్న
ఆ మర్మమునుగూర్చిన యేర్పాటు[4] ఎట్టిదో అందరికిని
తేటపరచుటకును, పరిశుద్ధులందరిలో అత్యల్పుడనైన
నాకు కృప అనుగ్రహించెను. । ఆయనయందలి విశ్వా 12
సముచేత ధైర్యమును నిర్భయమైన ప్రవేశమును ఆయ

1 మూలభాషలో—యుగముచొప్పున. 2 మూలభా.—ఉగ్రత పిల్లలమై. 3 మూలభా.—మన సమాధానమైయున్నాడు. 4 లేక, గృహ
నిర్వాహకత్వము. 5 మూలభా.—అడుగుజాడలుపట్ట శక్యముకాని.

వాక్యమని దానిని అంగీకరించితిరి గనుక మేమును
మానక దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచున్నాము.
ఆ వాక్యమే విశ్వాసులైన మీలో కార్యసిద్ధి కలుగ
14 జేయుచున్నది. । అవును సహోదరులారా, మీరు
యూదైయలో క్రీస్తుయేసునందున్న దేవుని సంఘము
లను పోలి నడుచుకొనినవారైతిరి. వారు యూదుల
వలన అనుభవించినట్టి శ్రమలే మీరును మీ స్వదేశ
15 స్థులవలన అనుభవించితిరి. । ఆ యూదులు తమ పాప
16 ములను ఎల్లప్పుడు సంపూర్తిచేయుటకై ప్రభువైన
యేసును ప్రవక్తలను చంపి మమ్మును హింసించి, అన్య
జనులు రక్షణపొందుటకై వారితో మేము మాటలాడ
కుండ మమ్మును ఆటంకపరచుచు, దేవునికి ఇష్టులుకాని
వారును మనుష్యులకందరికి విరోధులునై యున్నారు;
దేవుని ఉగ్రత తుదముట్ట వారిమీదికి వచ్చెను.

17 సహోదరులారా, మేము శరీరమునుబట్టి కొద్ది
కాలము మిమ్మును ఎడబాసియున్నను, మనస్సునుబట్టి
మీ దగ్గర ఉండి మిగుల అపేక్షతో మీ ముఖము
చూడవలెనని మరి ఎక్కువగా ప్రయత్నముచేసితిమి. ।
18 కాబట్టి మేము మీయొద్దకు రావలెనని యుంటిమి;
పౌలను నేను పలుమారు రావలెనని యుంటిని గాని
19 సాతాను మమ్మును అభ్యంతరపరచెను. । ఏలయనగా
మా నిరీక్షణయైనను ఆనందమైనను అతిశయకిరీట
మైనను ఏది? మన ప్రభువైన యేసు ఆగమన సమయ
20 మున ఆయన యెదుట మీరే గదా. । నిశ్చయముగా
మీరే మా మహిమయు ఆనందమునై యున్నారు.

3 కాబట్టి ఇకను సహింపజాలక అతేనైలో మేమొం
2 టిగానైనను ఉండుట మంచిదని యెంచి, యీ శ్రమల
4 వలన ఎవడును కదిలింపబడకుండునట్లు మిమ్మును స్థిర
పరచుటకును, మీ విశ్వాసవిషయమై మిమ్మును హెచ్చ
రించుటకును, మన సహోదరుడును క్రీస్తు సువార్త
విషయములో దేవుని పరిచారకుడునైన తిమోథెయును
పంపితిమి. మేము మీయొద్ద ఉన్నప్పుడు, మనము
శ్రమను అనుభవింపవలసియున్నదని మీతో ముం
దుగా చెప్పితిమి గదా? ఆలాగే జరిగినది. ఇది మీకును
తెలియును; అట్టి శ్రమలను అనుభవించుటకు మనము
5 నియమింపబడినవారమని మీరెరుగుదురు. । ఇందుచేత
నేనును ఇకను సహింపజాలక, శోధకుడు మిమ్మును
ఒకవేళ శోధించెనేమో అనియు, మా ప్రయాసము
వ్యర్థమైపోయెనేమో అనియు, మీ విశ్వాసమును
6 తెలిసికొనవలెనని అతని పంపితిని. । తిమోథెయు
ఇప్పుడు మీయొద్దనుండి మాయొద్దకు వచ్చి, మేము
మిమ్మును ఏలాగు చూడ నపేక్షించుచున్నామో ఆలాగే
మీరును మమ్మును చూడ నపేక్షించుచు, ఎల్లప్పుడును
మమ్మును ప్రేమతో జ్ఞాపకముచేసికొనుచున్నారని,
మీ విశ్వాసమును గూర్చియు మీ ప్రేమనుగూర్చియు
సంతోషకరమైన సమాచారమును మాకు తెచ్చెను. ।

అందుచేత సహోదరులారా, మా యిబ్బంది అంతటి 7
లోను శ్రమ అంతటిలోను మీ విశ్వాసమును చూచి
మీ విషయములో ఆదరణపొందితిమి. । ఏలయనగా 8
మీరు ప్రభువునందు స్థిరముగా నిలిచితిరా మేమును
బ్రదికినట్టేయున్నది. । మేము మీ ముఖము చూచి 9
మీ విశ్వాసములో ఉన్న లోపమును తీర్చునట్లు అను 10
గ్రహించుమని దివారాత్రము అత్యధికముగా దేవుని
వేడుకొనుచుండగా, మన దేవునియెదుట మిమ్మునుబట్టి
మేము పొందుచున్న యావత్తు ఆనందము నిమిత్తము
దేవునికి తగినట్టుగా కృతజ్ఞతాస్తుతులు ఏలాగు చెల్లింప
గలము?

మన తండ్రియైన దేవుడును మన ప్రభువైన 11
యేసును మమ్మును నిరాటంకముగా మీయొద్దకు తీసి
కొని వచ్చునుగాక. । మరియు మన ప్రభువైన యేసు 12
తన పరిశుద్ధులందరితో వచ్చినప్పుడు మన తండ్రియైన 13
దేవునియెదుట మీ హృదయములను పరిశుద్ధతవిష
యమై అనింద్యమైనవిగా ఆయన స్థిరపరచుటకై,
మేము మీయెడల ఏలాగు ప్రేమలో అభివృద్ధి
పొంది వర్ధిల్లుచున్నామో ఆలాగే మీరును ఒకని
యెడల ఒకడును మనుష్యులందరియెడలను ప్రేమలో
అభివృద్ధిపొంది వర్ధిల్లునట్లు ప్రభువు దయచేయును
గాక.

మెట్టుకు సహోదరులారా, మేము ప్రభువైన 4
యేసుద్వారా మీకిచ్చిన ఆజ్ఞను మీరెరుగుదురు. కాగా 2
మీరేలాగు నడుచుకొని దేవుని సంతోషపరచవలెనో
మావలన నేర్చుకొనిన ప్రకారముగా మీరు నడుచు
కొనుచున్నారు. ఈ విషయములో మీరు అంతకం
తకు అభివృద్ధి నొందవలెనని మిమ్మును వేడుకొని ప్రభు
వైన యేసునందు హెచ్చరించుచున్నాము. । మీరు 3
పరిశుద్ధులగుటయే, అనగా మీరు జారత్వమునకు దూర
ముగా ఉండుటయే దేవుని చిత్తము. । మీలో ప్రతి 4
వాడును, దేవుని ఎరుగని అన్యజనులవలె కామాభి 5
లాషయందు కాక, పరిశుద్ధతయందును ఘనతయం
దును తన తన ఘటమును ఎట్లు కాపాడుకొనవలెనో
అది యెరిగియుండుటయే (దేవుని చిత్తము.) । ఈ 6
విషయమందెవడును అతిక్రమించి తన సహోదరు
నికి మోసముచేయకుండవలెను; ఎందుకనగా మేము
పూర్వము మీతో చెప్పి సాక్ష్యమిచ్చిన ప్రకారము
ప్రభువు వీటన్నిటి విషయమై ప్రతి దండన చేయు
వాడు. । పరిశుద్ధులగుటకే దేవుడు మనలను పిలిచెను 7
గాని అపవిత్రులుగా ఉండుటకు పిలువలేదు. । కాబట్టి 8
ఉపేక్షించువాడు మనుష్యుని ఉపేక్షింపడు గాని
మీకు తన పరిశుద్ధాత్మను అనుగ్రహించిన దేవునినే
ఉపేక్షించుచున్నాడు.

సహోదరప్రేమనుగూర్చి నేను మీకు వ్రాయ 9
నక్కరలేదు; మీరు ఒకని నొకడు ప్రేమించుటకు

10 దేవునిచేతనే నేర్పబడితిరి. । అలాగుననే మకెదోనియ
12 యందంతట ఉన్న సహోదరులందరిని మీరు
ప్రేమించుచున్నారు. సహోదరులారా, మీరు
ప్రేమయందు మరి ఎక్కువగా అభివృద్ధి నొందుచుండ
వలెననియు, (సంఘమునకు) వెలపటివారియెడల
మర్యాదగా నడుచుకొనుచు, మీకేమియు కొదువ
లేకుండునట్లు మేము మీకు ఆజ్ఞాపించినప్రకారము
మీరు పరులజోలికి పోక మీ స్వంతకార్యములను
జరుపుకొనుటయందును మీ చేతులతో పనిచేయుట
యందును ఆశకలిగి యుండవలెననియు, మిమ్మును
హెచ్చరించుచున్నాము.

13 సహోదరులారా, నిరీక్షణలేని యితరులవలె
మీరు దుఃఖపడకుండు నిమిత్తము, నిద్రించుచున్న
వారినిగూర్చి మీకు తెలియకుండుట మాకిష్టములేదు. ।
14 యేసు మృతిపొంది తిరిగి లేచెనని మనము నమ్మినయెడల
అదేప్రకారము యేసునందు నిద్రించినవారిని దేవు
15 డాయనతోకూడ వెంటబెట్టుకొని వచ్చును. । మేము
ప్రభువు మాటనుబట్టి మీతో చెప్పునదేమనగా,
ప్రభువు ఆగమనపర్యంతము సజీవులమై నిలిచియుండు
మనము నిద్రించినవారికంటె ముందుగా (ఆయన
16 సన్నిధి) చేరము. । ఆర్భాటముతోను, ప్రధానదూత
శబ్దముతోను, దేవుని బూరతోను పరలోకమునుండి
ప్రభువు దిగివచ్చును; క్రీస్తునందుండి మృతులైనవారు
17 మొదట లేతురు. । ఆమీదట సజీవులమై నిలిచియుండు
మనము వారితోకూడ ఏకముగా ప్రభువును ఎదు
ర్కొనుటకు ఆకాశమండలమునకు మేఘములమీద[1]
కొనిపోబడుదుము. కాగా మనము సదాకాలము
18 ప్రభువుతోకూడ ఉందుము. । కాబట్టి మీరు ఈ
మాటలచేత ఒకనినొకడు ఆదరించుకొనుడి.

5 సహోదరులారా, ఆ కాలములనుగూర్చియు ఆ
సమయములనుగూర్చియు మీకు వ్రాయనక్కరలేదు. ।
2 రాత్రివేళ దొంగ ఏలాగు వచ్చునో ఆలాగే ప్రభువు
దినము వచ్చునని మీకు బాగుగా తెలియును. ।
3 లోకులు — నెమ్మదిగా ఉన్నది, భయమేమియులేదని
చెప్పుకొనుచుండగా, గర్భిణిస్త్రీకి ప్రసవవేదన వచ్చు
నట్లు వారికి ఆకస్మికముగా నాశనము తటస్థించునుగనుక
4 వారెంతమాత్రమును తప్పించుకొనలేరు । సహోదరు
లారా, ఆ దినము దొంగవలె మీమీదికి వచ్చుటకు
5 మీరు చీకటిలో ఉన్నవారు కారు. । మీరందరు
వెలుగు సంబంధులును పగటి సంబంధులునై యు
న్నారు;[2] మనము రాత్రివారము కాము, చీకటివారము
6 కాము. । కావున ఇతరులవలె నిద్రపోక మెలకువగా
7 ఉండి మత్తులముకాక యుందము. । నిద్రపోవువారు
రాత్రివేళ నిద్రపోవుదురు, మత్తుగా ఉండువారు
రాత్రివేళ మత్తుగా ఉందురు. । మనము పగటివారమై 8
యున్నాము గనుక మత్తులమైయుండక, విశ్వాసప్రేమ
లను మైమరువును, రక్షణనిరీక్షణయను శిరస్త్రాణమును
ధరించుకొందము. । ఎందుకనగా మన ప్రభువైన 9
యేసుక్రీస్తుద్వారా రక్షణపొందుటకే దేవుడు మన
లను నియమించెను గాని ఉగ్రతపాలగుటకు నియ
మింపలేదు. । మనము మేలుకొని యున్నను నిద్రపోవు 10
చున్నను తనతోకూడ జీవించునిమిత్తము ఆయన మన
కొరకు మృతిపొందెను. । కాబట్టి మీరిప్పుడు చేయు 11
చున్నట్టుగానే యొకనినొకడు ఆదరించి యొకని
కొకడు క్షేమాభివృద్ధి కలుగజేయుడి.

మరియు సహోదరులారా, మీలో ప్రయాస 12
పడుచు ప్రభువునందు మీకు పైవారై యుండి మీకు
బుద్ధి చెప్పువారిని మన్ననచేసి । వారి పనినిబట్టి వారిని 13
ప్రేమతో మిక్కిలి ఘనముగా ఎంచవలెనని వేడుకొను
చున్నాము; మరియు ఒకనితో నొకడు సమాధాన
ముగా ఉండుడి. । సహోదరులారా, మేము మీకు 14
బోధించునది ఏమనగా—అక్రమముగా నడుచుకొను
వారికి బుద్ధిచెప్పుడి, ధైర్యము చెడినవారిని ధైర్యపర
చుడి, బలహీనులకు ఊత ఇయ్యుడి, అందరియెడల
దీర్ఘశాంతము గలవారై యుండుడి. । ఎవడైనను కీడుకు 15
ప్రతికీడు ఎవనికైనను చేయకుండ చూచుకొనుడి;
మీరు ఒకనియెడల ఒకడును మనుష్యులందరి యెడలను
ఎల్లప్పుడు మేలైనదానిని అనుసరించి నడుచుకొనుడి.[3] ।
ఎల్లప్పుడును సంతోషముగా ఉండుడి; । యెడతెగక 16
ప్రార్థనచేయుడి; । ప్రతి విషయమునందు కృతజ్ఞతా 18
స్తుతులు చెల్లించుడి. ఈలాగు చేయుట యేసుక్రీస్తు
నందు మీ విషయములో దేవుని చిత్తము. । ఆత్మను 19
ఆర్పకుడి. । ప్రవచించుటను నిర్లక్ష్యము చేయకుడి. । 20
సమస్తమును పరీక్షించి మేలైనదాని చేపట్టుడి. । ప్రతి 21
విధమైన కీడుకు[4] దూరముగా ఉండుడి. 22

సమాధానకర్తయగు దేవుడే మిమ్మును సంపూర్ణముగా 23
పరిశుద్ధపరచును గాక. మీ ఆత్మయు, జీవమును, శరీర
మును మన ప్రభువైన యేసుక్రీస్తు ఆగమనమందు
నిందారహితముగాను, సంపూర్ణముగాను ఉండునట్లు
కాపాడబడును గాక. । మిమ్మును పిలుచువాడు నమ్మక 24
మైనవాడు గనుక ఆలాగు చేయును.

సహోదరులారా, మాకొరకు ప్రార్థనచేయుడి. 25

పవిత్రమైన ముద్దుపెట్టుకొని సహోదరులకందరి 26
కిని వందనములు చేయుడి. । సహోదరులకందరికిని 27
యీ పత్రిక చదివి వినిపింపవలెనని ప్రభువుపేర మీకు
ఆనబెట్టుచున్నాను.

మన ప్రభువైన యేసుక్రీస్తు కృప మీకు తోడై 28
యుండును గాక.

[1] లేక, మేఘములయందు. [2] మూలభాషలో—వెలుగు కుమారులును పగలు కుమారులునై యున్నారు. [3] మూలభా.—మేలైనదాని వెంటాడుడి. [4] లేక, కీడుగా కనబడు ప్రతిదానికి.

# అపొస్తలుడైన పౌలు

# థెస్సలొనీకైయులకు వ్రాసిన రెండవ పత్రిక

1 మన తండ్రియైన దేవునియందును ప్రభువైన యేసు
క్రీస్తునందును ఉన్న థెస్సలొనీకైయుల సంఘమునకు
పౌలును, సిల్వానును, తిమోతియును (శుభమని చెప్పి)
2 వ్రాయునది. । తండ్రియైన దేవునినుండియు ప్రభు
వైన యేసుక్రీస్తునుండియు కృపయు సమాధానమును
మీకు కలుగును గాక.
3 సహోదరులారా, మేమెల్లప్పుడును మిమ్మును
గూర్చి దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుటకు బద్ధు
లమైయున్నాము. ఇది యుక్తమే; ఏలయనగా మీ
విశ్వాసము బహుగా అభివృద్ధిపొందుచున్నది. మీ
అందరిలో ప్రతివాడు ఎదుటివానియెడల చూపు
4 ప్రేమ విస్తరించుచున్నది. । అందువలన మీ హింస
లన్నిటిలోను, మీరు సహించుచున్న శ్రమలలోను,
మీ ఓర్పును విశ్వాసమును చూచి మేము దేవుని సంఘ
5 ములలో మీయందు అతిశయపడుచున్నాము. । దేని
కొరకు మీరు శ్రమపడుచున్నారో ఆ దేవునిరాజ్య
మునకు మీరు యోగ్యులని యెంచబడు నిమిత్తము
మీరిట్లు ఓర్చుకొనుట దేవుని న్యాయమైన తీర్పునకు
6 స్పష్టమైన సూచనయై యున్నది. । ప్రభువైన యేసు
8 తన ప్రభావమును కనుపరచు దూతలతోకూడ పర
లోకమునుండి అగ్నిజ్వాలలలో ప్రత్యక్షమై, దేవుని
ఎరుగనివారికిని, మన ప్రభువైన యేసు సువార్తకు లోబ
డనివారికిని ప్రతిదండన చేయునప్పుడు, మిమ్మును
శ్రమపరచువారికి శ్రమయు, శ్రమపొందుచున్న
మీకు మాతోకూడ విశ్రాంతియు అనుగ్రహించుట
9 దేవునికి న్యాయమే. । ఆ దినమున తన పరిశుద్ధుల
10 యందు మహిమపరచబడుటకును, విశ్వసించినవారం
దరియందు ప్రశంసింపబడుటకును, ప్రభువు వచ్చి
నప్పుడు అట్టివారు ఆయన సముఖమునుండియు ఆయన
ప్రభావమందలి మహిమనుండియు పారదోలబడి
నిత్యనాశనమను దండన పొందుదురు. ఏలయనగా
11 మేము మీకిచ్చిన సాక్ష్యము మీరు నమ్మితిరి. । అందు
12 వలన మన దేవునియొక్కయు ప్రభువైన యేసుక్రీస్తు
యొక్కయు కృపచొప్పున మీయందు మన ప్రభువైన
యేసు నామమును, ఆయనయందు మీరును మహిమ
నొందునట్లు, మేలు చేయవలెనని మీలో కలుగు ప్రతి
యాలోచనను, విశ్వాసయుక్తమైన ప్రతి కార్యమును
బలముతో సంపూర్ణముచేయుచు, మన దేవుడు తన
పిలుపునకు మిమ్మును యోగ్యులుగా ఎంచునట్లు మీ
కొరకు ఎల్లప్పుడును ప్రార్థించుచున్నాము.
2 సహోదరులారా, ప్రభువుదినమిప్పుడే వచ్చి
యున్నట్టుగా ఆత్మవలననైనను, మాటవలననైనను, మా 2
యొద్దనుండి వచ్చినదని చెప్పిన పత్రికవలననైనను,
(ఎవడైన చెప్పినయెడల) మీరు త్వరపడి చంచలమన
స్కులు కాకుండవలెననియు, బెదరకుండవలెననియు,
మన ప్రభువైన యేసుక్రీస్తు ఆగమనమునుబట్టియు,
మనము ఆయనయొద్ద కూడుకొనుటనుబట్టియు మిమ్మును
వేడుకొనుచున్నాము. । మొదట భ్రష్టత్వము సంభ 3
వించి నాశనపాత్రుడగు[1] పాపపురుషుడు[2] బయలు
పడితేనేగాని ఆ దినము రాదు. । ఏది దేవుడనబడునో, 4
ఏది పూజింపబడునో, దానినంతటిని ఎదిరించుచు, దాని
కంతటికిపైగా తన్నుతానే హెచ్చించుకొనుచు, తాను
దేవుడని తన్ను కనుపరచుకొనుచు, దేవుని ఆలయ
ములో కూర్చుండును గనుక ఏవిధముగానైనను ఎవనిని
మిమ్మును మోసపరచనియ్యకుడి. । నేనింక మీయొద్ద 5
ఉన్నప్పుడు ఈ సంగతులను మీతో చెప్పినది మీకు
జ్ఞాపకములేదా? । కాగా వాడు తన స్వకాలమందు 6
బయలుపరచబడవలెనని (వానిని) అడ్డగించునది ఏదో
అది మీరెరుగుదురు. । ధర్మవిరోధసంబంధమైన మర్మము 7
ఇప్పటికే క్రియచేయుచున్నదిగాని యిదివరకు అడ్డ
గించుచున్నవాడు మధ్యనుండి తీసివేయబడు పర్యం
తమే అడ్డగించును. । అప్పుడా ధర్మవిరోధి బయలు 8
పరచబడును. ప్రభువైన యేసు తన ముఖశ్వాసము
చేత వాని సంహరించి తన ఆగమనప్రకాశముచేత
నాశనముచేయును. । నశించుచున్నవారు తాము 9
రక్షింపబడుటకై సత్యవిషయమైన ప్రేమను అవలం
బింపకపోయిరి గనుక వాని రాక అబద్ధవిషయమైన
సమస్త బలముతోను, నానావిధములైన సూచకక్రియల
తోను, మహత్కార్యములతోను । దుర్నీతిని పుట్టించు 10
సమస్త మోసముతోను, నశించుచున్నవారిలో సాతాను
కనుపరచు బలమును అనుసరించియుండును । ఇందుచేత 11
సత్యమును నమ్మక దుర్నీతియందు అభిలాషగలవారంద 12
రును శిక్షావిధి పొందుటకై, అబద్ధమును నమ్మునట్లు
మోసముచేయు శక్తిని దేవుడు వారికి పంపుచున్నాడు.
ప్రభువువలన ప్రేమింపబడిన సహోదరులారా, 13
ఆత్మ మిమ్మును పరిశుద్ధపరచుటవలనను, మీరు సత్య

1 మూలభాషలో —నాశనపుత్రుడగు.

2 అనేక ప్రాచీనప్రతులలో —ధర్మవిరుద్ధపురుషుడు అని పాఠాంతరము

మును నమ్ముటవలనను, రక్షణపొందుటకు దేవుడు ఆది
నుండి మిమ్ము[1]ను ఏర్పరచుకొనెను గనుక మేము మిమ్మును
బట్టి యెల్లప్పుడు దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లింప
14 బద్ధులమై యున్నాము. । మీరీలాగున రక్షింపబడి
మన ప్రభువైన యేసుక్రీస్తుయొక్క మహిమను పొంద
వలెనని ఆయన మా సువార్తవలన మిమ్మును పిలిచెను. ।
15 కాబట్టి సహోదరులారా, నిలుకడగా ఉండి మా
నోటిమాటవలననైనను మా పత్రికవలననైనను మీకు
బోధింపబడిన విధులను[2] చేపట్టుడి.
16 మన ప్రభువైన యేసుక్రీస్తును, మనలను ప్రేమించి,
17 కృపచేత నిత్యమైన ఆదరణయు శుభ నిరీక్షణయు అను
గ్రహించిన మన తండ్రియైన దేవుడును, మీ హృద
యములను ఆదరించి, ప్రతి సత్కార్యమందును ప్రతి
సద్వాక్యమందును మిమ్మును స్థిరపరచును గాక.
3 తుదకు సహోదరులారా, మీలో జరుగుచున్న
ప్రకారము ప్రభువువాక్యము శీఘ్రముగా వ్యాపించి[3]
2 మహిమపరచబడు నిమిత్తమును, । మేము మూర్ఖులైన
దుష్టమనుష్యుల చేతిలోనుండి తప్పింపబడు నిమిత్త
మును, మాకొరకు ప్రార్థించుడి; విశ్వాసము అందరికి
3 లేదు. । అయితే ప్రభువు నమ్మతగినవాడు; ఆయన
మిమ్మును స్థిరపరచి దుష్టత్వమునుండి[4] కాపాడును. ।
4 మేము మీకు ఆజ్ఞాపించువాటిని మీరు చేయుచున్నా
రనియు, ఇక చేయుదురనియు ప్రభువునందు మిమ్మును
5 గూర్చి నమ్మకము కలిగియున్నాము. । దేవునియందలి
ప్రేమయు క్రీస్తు చూపిన ఓర్పును మీకు కలుగునట్లు
ప్రభువు మీ హృదయములను ప్రేరేపించును గాక.
6 సహోదరులారా, మావలన పొందిన బోధన[5]
ప్రకారముకాక అక్రమముగా నడుచుకొను ప్రతి
సహోదరునియొద్దనుండి తొలగిపోవలెనని మన ప్రభు
వైన యేసుక్రీస్తుపేరట మీకు ఆజ్ఞాపించుచున్నాము. ।
7 ఏలాగు మమ్మును పోలి నడుచుకొనవలెనో మీకే తెలి
యును. మేము మీ మధ్యను అక్రమముగా నడుచు
కొనలేదు; । ఎవనియొద్దను ఉచితముగా ఆహారము 8
పుచ్చుకొనలేదు; మేము మీలో ఎవనికిని భారముగా
ఉండకూడదని ప్రయాసముతోను కష్టముతోను దివా
రాత్రము పనిచేయుచు (జీవనము చేసితిమి.) । మీరు 9
మమ్మును పోలి నడుచుకొనవలెనని మమ్మును మేము మాది
రిగా కనుపరచుకొనుటకే యీలాగు చేసితిమిగాని,
మాకు అధికారములేదని చేయలేదు. । మరియు మేము 10
మీయొద్ద ఉన్నప్పుడు — ఎవడైనను పనిచేయనొల్లని
యెడల వాడు భోజనము చేయకూడదని మీకు ఆజ్ఞా
పించితిమి గదా. । మీలో కొందరు ఏ పనియుచేయక 11
పరులజోలికి పోవుచు, అక్రమముగా నడుచుకొను
చున్నారని వినుచున్నాము. । అట్టివారు నెమ్మదిగా 12
పనిచేయుచు, స్వంతముగా సంపాదించుకొనిన ఆహా
రము భుజింపవలెనని మన ప్రభువైన యేసుక్రీస్తుపేరట
వారిని ఆజ్ఞాపూర్వకముగా హెచ్చరించుచున్నాము. ।
సహోదరులారా, మీరైతే యోగ్యమైన కార్యములు 13
చేయుటలో[6] విసుకవద్దు. । ఈ పత్రికమూలముగా 14
మేము చెప్పిన మాటకు ఎవడైనను లోబడనియెడల
అతని కనిపెట్టి అతడు సిగ్గుపడు నిమిత్తము అతనితో
సాంగత్యము చేయకుడి. । అయినను అతని శత్రువు 15
నిగా భావింపక సహోదరునిగా భావించి బుద్ధి
చెప్పుడి.
సమాధానకర్తయగు ప్రభువు తానే యెల్లప్పుడును 16
ప్రతివిధముచేతను మీకు సమాధానము అనుగ్రహిం
చును గాక. ప్రభువు మీకందరికి తోడైయుండును
గాక.
పౌలను నేను నా చేవ్రాతతో వందనమని వ్రాయు 17
చున్నాను; ప్రతి పత్రికయందును అదే గురుతు, నేను
వ్రాయుట ఈలాగే. మన ప్రభువైన యేసుక్రీస్తు
కృప మీకందరికి తోడైయుండును గాక.

1 అనేక ప్రాచీనప్రతులలో—ప్రథమ ఫలముగా, అని కూర్చబడియున్నది. 2 లేక, పారంపర్యములను. 3 మూలభాషలో—పరుగెత్తి. 4 లేక, దుష్టునినుండి. 5 లేక, పారంపర్యము. 6 లేక, మేలుచేయుటలో.

## అపొస్తలుడైన పౌలు

# తిమోథెయునకు వ్రాసిన మొదటి పత్రిక

1 మన రక్షకుడైన దేవునియొక్కయు మన నిరీక్షణ
యైన క్రీస్తుయేసుయొక్కయు ఆజ్ఞప్రకారము క్రీస్తు
2 యేసుయొక్క అపొస్తలుడైన పౌలు, । విశ్వాసమును
బట్టి నా నిజమైన కుమారుడగు తిమోథెయునకు (శుభ
మని చెప్పి) వ్రాయునది. తండ్రియైన దేవునినుండియు
మన ప్రభువైన క్రీస్తుయేసునుండియు కృపయు కని
కరమును సమాధానమును నీకు కలుగును గాక.
3 నేను మకెదోనియకు వెళ్లుచుండగా (సత్యమునకు)
4 భిన్నమైన బోధ చేయవద్దనియు, కల్పనాకథలును
మితములేని వంశావళులును, విశ్వాససంబంధమైన దేవుని
యేర్పాటుతో[1] కాక వివాదములతోనే సంబంధము
కలిగియున్నవి గనుక వాటిని లక్ష్యపెట్టవద్దనియు,
కొందరికి ఆజ్ఞాపించుటకు నీవు ఎఫెసులో నిలిచి
యుండవలెనని నిన్ను హెచ్చరించినప్రకారము (ఇప్పు
5 డును హెచ్చరించుచున్నాను.) । ఉపదేశసారమే
దనగా, పవిత్ర హృదయమునుండియు, మంచి మన
స్సాక్షినుండియు, నిష్కపటమైన విశ్వాసమునుండియు
6 కలుగు ప్రేమయే. । కొందరు వీటిని మానుకొని తొలగి
7 పోయి, తాము చెప్పువాటినైనను, నిశ్చయమైనట్టు
రూఢిగా పలుకువాటినైనను గ్రహింపక పోయినను
ధర్మశాస్త్రోపదేశకులై యుండగోరి నిష్ప్రయోజనమైన
8 ముచ్చటలకు తిరిగిరి. । అయినను శ్రీమంతుడగు దేవుడు
11 నాకు అప్పగించిన ఆయన మహిమగల సువార్తప్రకా
రము, ధర్మశాస్త్రము ధర్మవిరోధులకును అవిధేయులకును
భక్తిహీనులకును పాపిష్ఠులకును అపవిత్రులకును మత
దూషకులకును[2] పితృహంతకులకును మాతృహంత
కులకును నరహంతకులకును వ్యభిచారులకును పురుష
సంయోగులకును మనుష్యచోరులకును అబద్ధికులకును
అప్రమాణికులకును హితబోధకు[3] విరోధియైనవాడు
మరి ఎవడైన ఉండినయెడల అట్టివానికిని నియమింప
బడెను గాని నీతిమంతునికి నియమింపబడలేదని యెవ
డైనను ఎరిగి, ధర్మానుకూలముగా దానిని ఉపయో
గించినయెడల ధర్మశాస్త్రము మేలైనదని మనమెరుగు
దుము.
12 పూర్వము దూషకుడను హింసకుడను హానికరుడ
13 నైన నన్ను తన పరిచర్యకు నియమించి నమ్మకమైన
వానిగా ఎంచినందుకు నన్ను బలపరచిన మన ప్రభు
వైన క్రీస్తుయేసుకు కృతజ్ఞుడనై యున్నాను. తెలియక
అవిశ్వాసమువలన చేసితిని గనుక కనికరింపబడితిని. ।
మరియు మన ప్రభువుయొక్క కృపయు, క్రీస్తు 14
యేసునందున్న విశ్వాసమును ప్రేమయు, అత్యధిక
ముగా విస్తరించెను. । పాపులను రక్షించుటకు క్రీస్తు 15
యేసు లోకమునకు వచ్చెనను వాక్యము నమ్మతగిన
దియు పూర్ణాంగీకారమునకు యోగ్యమైనదియునై
యున్నది. అట్టి వారిలో నేను ప్రధానుడను. । అయి 16
నను నిత్యజీవము నిమిత్తము తనను విశ్వసింపబోవు
వారికి నేను మాదిరిగా ఉండులాగున యేసుక్రీస్తు
తన పూర్ణమైన దీర్ఘశాంతమును ఆ ప్రధాన పాపినైన
నాయందు కనుపరచునట్లు నేను కనికరింపబడితిని. ।
(సకల) యుగములలో రాజైయుండి, అక్షయుడును 17
అదృశ్యుడునగు అద్వితీయ దేవునికి ఘనతయు మహి
మయు యుగయుగములు కలుగును గాక. ఆమేన్.
నా కుమారుడవైన[4] తిమోథెయూ, నీవు విశ్వాస 18
మును మంచి మనస్సాక్షియు కలిగినవాడవై, నిన్ను
గూర్చి ముందుగా చెప్పబడిన ప్రవచనముల చొప్పున
ఈ సద్యుద్ధము జరిగింపవలెనని వాటినిబట్టి యీ
ఆజ్ఞను నీకు అప్పగించుచున్నాను. । అట్టి మనస్సాక్షిని 19
కొందరు త్రోసివేసి, విశ్వాసవిషయమై ఓడ బద్దలై
పోయినవారివలె చెడియున్నారు. । వారిలో హుమెనై 20
యును అలెక్సంద్రును ఉన్నారు; వీరు దూషింపకుండ
శిక్షింపబడుటకై వీరిని సాతానుకు అప్పగించితిని.
మనము సంపూర్ణభక్తియు మాన్యతయు కలిగి, 2
నెమ్మదిగాను సుఖముగాను బ్రదుకు నిమిత్తము, అన్నిటి 2
కంటె ముఖ్యముగా మనుష్యులందరికొరకును రాజుల
కొరకును అధికారులందరికొరకును విజ్ఞాపనములును
ప్రార్థనలును యాచనలును కృతజ్ఞతాస్తుతులును చేయ
వలెనని హెచ్చరించుచున్నాను. । ఇది మంచిదియు 3
మన రక్షకుడగు దేవుని దృష్టికి అనుకూలమైనదియునై
యున్నది. । ఆయన, మనుష్యులందరు రక్షణపొంది 4
సత్యమునుగూర్చిన అనుభవజ్ఞానముగలవారై యుండ
వలెనని యిచ్ఛయించుచున్నాడు. । దేవుడొక్కడే, 5
దేవునికిని నరులకును మధ్యవర్తియు ఒక్కడే; ఆయన
క్రీస్తుయేసను నరుడు. । ఈయన అందరికొరకు విమో 6
చనక్రయధనముగా తన్నుతానే సమర్పించుకొనెను.
దీనిగూర్చిన సాక్ష్యము యుక్తకాలములయందు ఇయ్య
బడును. । (ఈ సాక్ష్యమిచ్చుటకై) నేను ప్రకటించు 7

1 మూలభాషలో—గృహనిర్వాహకత్వముతో. 2 లేక, భ్రష్టులకును. 3 మూలభా.—ఆరోగ్యకరమైన బోధకు. 4 మూలభా.—పిల్లవైన.

వాడనుగాను, **అపొస్తలుడనుగాను, విశ్వాససత్యము**ల
విషయములో అన్యజనులకు బోధకుడనుగాను నియ
మింపబడితిని. నేను సత్యమే చెప్పుచున్నాను, అబద్ధ
మాడుటలేదు.
8 కావున ప్రతిస్థలమందు పురుషులు కోపమును సం
శయమును లేనివారై, పవిత్రమైన చేతులెత్తి ప్రార్థన
9 చేయవలెనని కోరుచున్నాను. । మరియు స్త్రీలును అణు
కువయు స్వస్థబుద్ధియు గలవారై యుండి, తగు
మాత్రపు వస్త్రములచేతనేగాని జడలతోనైనను బంగార
ముతోనైనను ముత్యములతోనైనను మిగుల వెలగల
10 వస్త్రములతోనైనను అలంకరించుకొనక, । దైవభక్తిగల
వారమని చెప్పుకొను స్త్రీలకు తగినట్టుగా సత్క్రియల
11 చేత తమ్మును తాము అలంకరించుకొనవలెను. । స్త్రీలు
మౌనముగా ఉండి సంపూర్ణవిధేయతతో నేర్చుకొన
12 వలెను. । స్త్రీ మౌనముగా ఉండవలసినదేగాని ఉప
దేశించుటకైనను, పురుషునిమీద అధికారముచేయుట
13 కైనను ఆమెకు సెలవియ్యను. । మొదట ఆదామును
14 తరువాత హవ్వయును నిర్మింపబడిరి కారా? । మరియు
ఆదాము మోసపరచబడలేదు గాని స్త్రీ మోసపరచబడి
15 అపరాధములో పడెను. । అయినను వారు స్వస్థబుద్ధి
కలిగి, విశ్వాస ప్రేమ పరిశుద్ధతలయందు నిలుకడగా
ఉండినయెడల శిశుప్రసూతిద్వారా ఆమె రక్షింప
బడును.

**3** ఎవడైనను అధ్యక్షత నాశించినయెడల అట్టివాడు
దొడ్డపనిని అపేక్షించుచున్నాడను మాట నమ్మదగినది.
2 అధ్యక్షుడగువాడు నిందారహితుడును, ఏకపత్నీ పురు
3 షుడును, మితానుభవుడును, స్వస్థబుద్ధిగలవాడును,
మర్యాదస్థుడును, అతిథిప్రియుడును, బోధింపతగిన
వాడునైయుండి, మద్యపానియు కొట్టువాడునుకాక,
సాత్వికుడును, జగడమాడనివాడును, ధనాపేక్షలేని
4 వాడునై, । సంపూర్ణమాన్యత కలిగి తన పిల్లలను స్వాధీన
పరచుకొనుచు, తన యింటివారిని బాగుగా ఏలు
5 వాడునై యుండవలెను. । ఎవడైనను తన యింటివారిని
ఏలనేరకపోయినయెడల అతడు దేవుని సంఘమును
6 ఏలాగు పాలించును? । అతడు గర్వాంధుడై అపవా
దికి[1] (కలిగిన) శిక్షావిధికి లోబడకుండునట్లు క్రొత్తగా
7 చేరినవాడై యుండకూడదు. । మరియు అతడు నింద
పాలై అపవాది[1] ఉరిలో పడిపోకుండునట్లు (సంఘము
నకు) వెలపటివారిచేత మంచి సాక్ష్యము పొందినవాడై
8 యుండవలెను. । ఆలాగుననే పరిచారకులు మాన్యులై
యుండి, ద్విమనస్కులును[2] మిగుల మద్యపానాసక్తు
లును, దుర్లాభము నపేక్షించువారునైయుండక ।
9 విశ్వాసమర్మమును పవిత్రమైన మనస్సాక్షితో గైకొను
10 వారై యుండవలెను. । మరియు వారు మొదట పరీ
క్షింపబడవలెను; తరువాత వారు అనింద్యులైతే పరి
చారకులుగా ఉండవచ్చును. । అటువలె (పరిచర్య 11
చేయు) స్త్రీలును మాన్యులై, కొండెములుచెప్పనివా
రును,[3] మితానుభవముగలవారును, అన్ని విషయము
లలో నమ్మకమైనవారునై యుండవలెను. । పరిచారకులు 12
ఏకపత్నీ పురుషులును, తమ పిల్లలను తమ యింటివారిని
బాగుగా ఏలువారునై యుండవలెను. । పరిచారకు 13
లైయుండి ఆ పని బాగుగా నెరవేర్చినవారు మంచి పద
విని సంపాదించుకొని క్రీస్తుయేసునందలి విశ్వాస
మందు బహు ధైర్యము గలవారగుదురు.
శీఘ్రముగా నీయొద్దకు వత్తునని నిరీక్షించుచు 14
న్నాను; । అయినను నేను ఆలస్యముచేసిన పక్షమందు 15
దేవుని మందిరములో, అనగా జీవముగల దేవుని సంఘ
ములో, జనులేలాగు[4] ప్రవర్తింపవలెనో అది నీకు తెలియ
వలెనని యీ సంగతులను నీకు వ్రాయుచున్నాను.
ఆ సంఘము సత్యమునకు స్తంభమును ఆధారమునై
యున్నది. । నిరాక్షేపముగా దైవభక్తినిగూర్చిన **మర్మము**[5] 16
గొప్పదై యున్నది;

ఆయన సశరీరుడుగా ప్రత్యక్షుడయ్యెను
ఆత్మవిషయమున నీతిపరుడని తీర్పునొందెను
దేవదూతలకు కనబడెను
(రక్షకుడని) జనములయందు ప్రకటింపబడెను
లోకమందు నమ్మబడెను
ఆరోహణుడై తేజోమయుడయ్యెను.

అయితే కడవరి దినములలో కొందరు అబద్ధికుల **4**
వేషధారణవలన మోసపరచు ఆత్మలయందును దయ్య 2
ముల బోధయందును లక్ష్యముంచి, విశ్వాస భ్రష్టులగు
దురని ఆత్మ తేటగా చెప్పుచున్నాడు. । ఆ అబద్ధికులు, 3
వాతవేయబడిన మనస్సాక్షిగలవారై, వివాహమును
నిషేధించుచు, సత్యవిషయమై అనుభవజ్ఞానముగల
విశ్వాసులు కృతజ్ఞతాస్తుతులు చెల్లించి పుచ్చుకొను
నిమిత్తము దేవుడు సృజించిన ఆహారవస్తువులను కొన్ని
(తినక) మానవలెనని చెప్పుచుందురు. । దేవుడు సృష్టిం 4
చిన ప్రతి వస్తువు మంచిది. కృతజ్ఞతాస్తుతులు చెల్లించి
పుచ్చుకొనినయెడల ఏదియు నిషేధింపతగినది కాదు; ।
ఏలయనగా అది దేవుని వాక్యమువలనను ప్రార్థనవల 5
నను పవిత్రపరచబడుచున్నది.
ఈ సంగతులను సహోదరులకు వివరించినయెడల 6
నీవు అనుసరించుచు వచ్చిన విశ్వాస సుబోధ సంబంధ
మైన వాక్యములచేత పెంపారుచు క్రీస్తుయేసుకు
మంచి పరిచారకుడవై యుందువు. । అపవిత్రములైన 7
ముసలమ్మ ముచ్చటలను విసర్జించి, దేవభక్తి విషయ
ములో నీకు నీవే సాధకము చేసికొనుము. । శరీరసం 8
బంధమైన సాధకము కొంచెముమట్టుకే ప్రయోజన
కరమవును గాని దైవభక్తి యిప్పటి జీవము విషయము
లోను రాబోవు జీవము విషయములోను వాగ్దాన

1 అనగా, సాతానుకు. 2 లేక, ద్విజిహ్వులును. 3 మూలభాషలో—అపవాదులును. 4 లేక, నీవేలాగు. 5 కొలొస్సై. 1: 27 చూడుము.

ముతో కూడినదైనందున అది అన్నివిషయములలో
9 ప్రయోజనకరమవును. । ఈ వాక్యము నమ్మదగినదియు
10 పూర్ణాంగీకారమునకు యోగ్యమునై యున్నది. । మను
ష్యులకందరికి రక్షకుడును, మరి విశేషముగా విశ్వాసు
లకు రక్షకుడునైన జీవముగల దేవునియందు మనము
నిరీక్షణ నుంచియున్నాము గనుక ఇందునిమిత్తము
ప్రయాసముతో పాటుపడుచున్నాము.
11 ఈ సంగతుల నాజ్ఞాపించి బోధించుము. । నీ యౌవన
12 మునుబట్టి నిన్నెవనిని తృణీకరింపనియ్యకుము గాని
మాటలోను, ప్రవర్తనలోను, ప్రేమలోను, విశ్వాసము
లోను, పవిత్రతలోను, విశ్వాసులకు మాదిరిగా ఉం
13 డుము. । నేను వచ్చు పర్యంతము చదువుటయందును,
హెచ్చరించుటయందును, బోధించుటయందును జాగ్ర
14 త్తగా ఉండుము. । పెద్దలు హస్తనిక్షేపణము చేయగా
ప్రవచనమూలమున నీకు అనుగ్రహింపబడి నీలో
15 ఉన్న వరమును అలక్ష్యము చేయకుము. । నీ అభివృద్ధి
అందరికి తేటగా కనబడునిమిత్తము వీటిని మనస్కరిం
16 చుము, వీటియందే సాధకము చేసికొనుము. । నిన్ను
గూర్చియు నీ బోధనుగూర్చియు జాగ్రత్త కలిగి
యుండుము, వీటిలో నిలుకడగా ఉండుము; నీవీలాగు
చేసి నిన్నును నీ బోధ వినువారిని రక్షించుకొందువు.

**5** **వృ**ద్ధుని గద్దింపక తండ్రిగా భావించి అతని
2 హెచ్చరించుము. అన్నదమ్ములని యౌవనస్థులను, తల్లు
లని వృద్ధస్త్రీలను అక్కచెల్లెండ్లని పూర్ణపవిత్రతతో
3 యౌవనస్త్రీలను హెచ్చరించుము. । నిజముగా అనాథ
4 లైన విధవరాండ్రను సన్మానింపుము. । అయితే ఏ విధవ
రాలికైనను పిల్లలు గాని మనమలు గాని యుండిన
యెడల, వీరు మొదట తమ యింటివారియెడల భక్తి
కనుపరచుటకును, తమ తలిదండ్రులకు ప్రత్యుప
కారము చేయుటకును నేర్చుకొనవలెను; ఇది దేవుని
5 దృష్టికనుకూలమైయున్నది. । అయితే నిజముగా
అనాథయైన విధవరాలు ఏకాకియైయుండి, దేవుని
మీదనే తన నిరీక్షణనుంచుకొని, విజ్ఞాపనలయందును
ప్రార్థనలయందును రేయింబగలు నిలుకడగా ఉం
6 డును. । సుఖభోగములయందు ప్రవర్తించునది బ్రదుకు
7 చుండియు చచ్చినదైయుండును. । వారు నిందారహి
8 తులై యుండునట్లు ఈలాగు ఆజ్ఞాపించుము. । ఎవడై
నను స్వకీయులను, విశేషముగా తన యింటివారిని,
సంరక్షింపకపోయినయెడల వాడు విశ్వాసత్యాగము
చేసినవాడై అవిశ్వాసికన్న చెడ్డవాడై యుండును. ।
9 అరువది ఏండ్లకంటె తక్కువ వయస్సులేకుండి, ఒక్క
10 పురుషునికే భార్యయై, । సత్క్రియలకు పేరుపొందిన
విధవరాలు పిల్లలు పెంచి, పరదేశులకు ఆతిథ్యముచేసి,
పరిశుద్ధుల పాదములు కడిగి, శ్రమపడువారికి సహా
యముచేసి, ప్రతి సత్కార్యముచేయ బూనుకొనిన
దైతే ఆమెను విధవరాండ్ర లెక్కలో చేర్చవచ్చును. ।
యౌవనస్థులైన విధవరాండ్రను లెక్కలో చేర్చవద్దు; 11
వారు క్రీస్తుకు విరోధముగా నిరంకుశలైనప్పుడు తమ 12
మొదటి విశ్వాసమును వదలుకొనిరను తీర్పుపొందిన
వారై పెండ్లాడగోరుదురు. । మరియు వారు ఇంటింట 13
తిరుగులాడుచు, బద్ధకురాండ్రగుటకు మాత్రమేగాక,
ఆడరాని మాటలాడుచు, వదరుబోతులును పరుల
జోలికి పోవువారునగుటకును నేర్చుకొందురు. । కాబట్టి 14
యౌవనస్త్రీలు వివాహము చేసికొని, పిల్లలు కని గృహ
పరిపాలన జరిగించుచు, నిందించుటకు విరోధికి అవ
కాశమియ్యకుండవలెనని కోరుచున్నాను. । ఇంతకు 15
ముందే కొందరు త్రోవనుండి తొలగిపోయి సాతా
నును వెంబడించినవారైరి. । విశ్వాసురాలైన యే స్త్రీ 16
యింటనైనను విధవరాండ్రుండినయెడల, సంఘము నిజ
ముగా అనాథలైన విధవరాండ్రకు సహాయముచేయు
టకై దానిమీద భారములేకుండ ఆమెయే వీరికి సహా
యము చేయవలెను.

బాగుగా పాలనచేయు పెద్దలను, విశేషముగా 17
వాక్యమందును ఉపదేశమందును ప్రయాసపడువారిని,
రెట్టింపు సన్మానమునకు పాత్రులనుగా ఎంచవలెను. ।
ఇందుకు— 18

నూర్చెడి యెద్దుమూతికి చిక్కము వేయవద్దు
అనియు

పనివాడు తన జీతమునకు పాత్రుడు

అనియు లేఖనము చెప్పుచున్నది.[1] । ఇద్దరు ముగ్గురు 19
సాక్షులుంటేనే గాని పెద్దమీద దోషారోపణ అంగీ
కరింపకుము. । ఇతరులు భయపడునిమిత్తము పాపము 20
చేయువారిని అందరియెదుట గద్దింపుము. । విరోధ 21
బుద్ధితోనైనను పక్షపాతముతోనైనను ఏమియుచేయక
(నేను చెప్పిన) ఈ సంగతులను గైకొనవలెనని దేవుని
యెదుటను, క్రీస్తుయేసు ఎదుటను, ఏర్పరచబడిన
దేవదూతలయెదుటను నీకు ఆనబెట్టుచున్నాను.[2] । త్వర 22
పడి యెవనిమీదనైనను హస్తనిక్షేపణము చేయకుము.
పరుల పాపములలో పాలివాడవై యుండకుము. నీవు
పవిత్రుడవుగా ఉండునట్లు చూచుకొనుము. । ఇక 23
మీదట నీళ్లే త్రాగక నీ కడుపు జబ్బుకును తరుచుగా
వచ్చు బలహీనతలకొరకును ద్రాక్షారసము కొంచె
ముగా పుచ్చుకొనుము. । కొందరి పాపములు తేటగా 24
బయలుపడి న్యాయపుతీర్పునకు ముందుగా నడుచు
చున్నవి, మరికొందరి పాపములు వారి వెంట వెళ్లు
చున్నవి. । అటువలె మంచి కార్యములు తేటగా 25
బయలుపడుచున్నవి, బయలుపడనివి దాచబడనేరవు.

**దే**వుని నామమును ఆయన బోధయు దూషింప **6**
బడకుండునట్లు దాసత్వమను కాడిక్రింద ఉన్నవారం
దరును తమ యజమానులు పూర్ణమైన ఘనతకు పాత్రు

[1] ద్వితీ. 25: 4; 24: 15.

[2] లేక, సాక్ష్యమిచ్చుచున్నాను.

అపొస్తలుడైన పౌలు

# తిమోథెయుకు వ్రాసిన రెండవ పత్రిక

1 క్రీస్తు[1]యేసునందున్న జీవమునుగూర్చిన వాగ్దాన
మునుబట్టి దేవుని చిత్తమువలన క్రీస్తుయేసు అపొస్తలు
డైన పౌలు ప్రియకుమారుడగు[2] తిమోథెయుకు (శుభ
2 మని చెప్పి) వ్రాయునది. । తండ్రియైన దేవునినుం
డియు మన ప్రభువైన క్రీస్తుయేసునుండియు కృపయు
కనికరమును సమాధానమును కలుగును గాక.
3 నా ప్రార్థనలయందు ఎడతెగక నిన్ను జ్ఞాపకము
–5 చేసికొనుచు, నీ కన్నీళ్లను తలచుకొని, నాకు సంపూ
ర్ణానందము కలుగుటకై నిన్ను చూడవలెనని రేయిం
బగలు అపేక్షించుచు, నీయందున్న నిష్కపటమైన
విశ్వాసమును జ్ఞాపకము చేసికొని, నా పితురాచార
ప్రకారము నిర్మలమైన మనస్సాక్షితో నేను సేవించు
చున్న దేవునియెడల కృతజ్ఞుడనై యున్నాను. ఆ విశ్వా
సము మొదట నీ అవ్వయైన లోయిలోను నీ తల్లియైన
యూనీకేలోను వసించెను, అది నీయందు సహ వసించు
6 చున్నదని నేను రూఢిగా నమ్ముచున్నాను. । ఆ హేతువు
చేత నా హస్తనిక్షేపణమువలన నీకు కలిగిన దేవుని
కృపావరము ప్రజ్వలింప చేయవలెనని నీకు జ్ఞాపకము
7 చేయుచున్నాను. । దేవుడు మనకు శక్తియు ప్రేమయు
ఇంద్రియనిగ్రహమునుగల ఆత్మభావమునే[3] యిచ్చెను
గాని పిరికితనముగల ఆత్మభావము[4] నియ్యలేదు. ।
8 కాబట్టి నీవు మన ప్రభువు విషయమైన సాక్ష్యమును
గూర్చియైనను, ఆయన ఖైదినైన నన్నుగూర్చియైనను
సిగ్గుపడక, దేవుని శక్తినిబట్టి సువార్తనిమిత్తమైన శ్రమాను
9 భవములో పాలివాడవై యుండుము. । మన క్రియ
–10 లనుబట్టి కాక తన స్వకీయ సంకల్పమునుబట్టియు,
అనాదికాలముననే క్రీస్తుయేసునందు మనకు అను
గ్రహింపబడినదియు, క్రీస్తుయేసను మన రక్షకుని
ప్రత్యక్షతవలన బయలుపరచబడినదియునైన తన
కృపనుబట్టియు, మనలను రక్షించి పరిశుద్ధమైన పిలు
పులో (పాలుపొందుటకు) ఆయన మనలను పిలిచెను.
ఆ క్రీస్తుయేసు, మరణమును నిరర్థకము చేసి జీవమును
అక్షయతను సువార్తవలన వెలుగులోకి తెచ్చెను. ।
11 ఆ సువార్తవిషయములో నేను ప్రకటించువాడను
గాను అపొస్తలుడనుగాను బోధకుడనుగాను నియమింప
12 బడితిని. । ఆ హేతువుచేత ఈ శ్రమలను అనుభ
వించుచున్నాను గాని, నేను నమ్మినవాని ఎరుగుదును
గనుక సిగ్గుపడను; నేను ఆయనకు అప్పగించినదానిని
(రాబోవుచున్న) ఆ దినమువరకు ఆయన కాపాడగల
డని రూఢిగా నమ్ముకొనుచున్నాను. । క్రీస్తుయేసునం 13
దుంచవలసిన విశ్వాసప్రేమలు కలిగినవాడవై, నీవు
నావలన వినిన హితవాక్య[5] ప్రమాణమును గైకొనుము; ।
నీకు అప్పగింపబడిన ఆ మంచి పదార్థమును మనలో 14
నివసించు పరిశుద్ధాత్మవలన కాపాడుము.
ఆసియలోనివారందరు నన్ను విడిచిపోయిరను 15
సంగతి నీవెరుగుదువు; వారిలో ఫుగెల్లు హెర్మొగెనే
అనువారున్నారు. । ప్రభువు ఒనేసిఫోరు ఇంటివారి 16
యందు కనికరము చూపునుగాక. అతడు రోమాకు –17
వచ్చినప్పుడు నా సంకెళ్లనుగూర్చి సిగ్గుపడక శ్రద్ధగా
నన్ను వెదకి కనుగొని అనేకపర్యాయములు ఆదరిం
చెను. । మరియు అతడు ఎఫెసులో ఎంతగా ఉపచా 18
రము చేసెనో అది నీవు బాగుగా ఎరుగుదువు. ఆ దిన
మునందు అతడు ప్రభువువలన కనికరము పొందునట్లు
ప్రభువు అనుగ్రహించును గాక.

**నా** కుమారుడా, క్రీస్తుయేసునందున్న కృపచేత 2
బలవంతుడవు కమ్ము. । నీవు అనేక సాక్షులయెదుట 2
నావలన వినిన సంగతులను ఇతరులకును బోధించుటకు
సామర్థ్యముగల నమ్మకమైన మనుష్యులకు అప్పగిం
పుము. । క్రీస్తుయేసుయొక్క మంచి సైనికునివలె 3
నాతోకూడ శ్రమను అనుభవించుము. । సైనికుడైనవా 4
డెవడును యుద్ధమునకు పోవునప్పుడు తన్ను దండులో
చేర్చుకొనినవానిని సంతోషపెట్టవలెనని యీ జీవన
వ్యాపారములలో చిక్కుకొనడు. । మరియు జెట్టి 5
యైనవాడు పోరాడునప్పుడు నియమప్రకారము
పోరాడకుంటే వానికి కిరీటము దొరకదు. । పాటు 6
పడిన వ్యవసాయకుడే మొదట ఫలములో పాలు
పుచ్చుకొనవలసినవాడు. । నేను చెప్పుమాటలు ఆలో 7
చించుకొనుము; అన్ని విషయములయందు ప్రభువు
నీకు వివేకమనుగ్రహించును. । నా సువార్తప్రకా 8
రము, దావీదు సంతానములో పుట్టి మృతులలో
నుండి లేచిన యేసుక్రీస్తును జ్ఞాపకముచేసికొనుము. ।
నేను నేరస్థుడనై యున్నట్టు ఆ సువార్తవిషయమై 9
సంకెళ్లతో బంధింపబడి శ్రమపడుచున్నాను, అయి
నను దేవుని వాక్యము బంధింపబడి యుండలేదు. ।

1 క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము  2 మూలభాషలో–ప్రియ పిల్లయగు.  3 లేక, స్వస్థబుద్ధియుగల ఆత్మనే.  4 లేక, ఆత్మను.
5 మూలభా –ఆరోగ్యముగల వాక్య.

10 అందుచేత ఏర్పరచబడినవారు నిత్యమైన మహిమతో
కూడ క్రీస్తుయేసునందలి రక్షణ పొందవలెనని నేను
11 వారికొరకు సమస్తము ఓర్చుకొనుచున్నాను. । ఈ
మాట నమ్మదగినది, ఏదనగా — మనమాయనతోకూడ
చనిపోయినవారమైతే ఆయనతోకూడ బ్రదుకు
12 దుము. । సహించినవారమైతే ఆయనతోకూడ ఏలు
దుము. ఆయనను ఎరుగమంటే మనలను ఆయన యెరు
13 గననును. । మనము నమ్మదగనివారమైనను[1] ఆయన
నమ్మదగినవాడుగా ఉండును; ఆయన తన స్వభావము
నకు విరోధముగా ఏదియు చేయలేడు.[2]

14 వినువారిని చెరుపుటకే గాని మరి దేనికిని పనికి
రానిమాటలనుగూర్చి వాదము పెట్టుకొనవద్దని ప్రభువు
ఎదుట వారికి సాక్ష్యమిచ్చుచు ఈ సంగతులను వారికి
15 జ్ఞాపకముచేయుము. । దేవునియెదుట యోగ్యునిగాను,
సిగ్గుపడనక్కరలేని పనివానిగాను, సత్యవాక్యమును
సరిగా ఉపదేశించువానిగాను[3] నిన్ను నీవే దేవునికి
16 కనుపరచుకొనుటకు జాగ్రత్తపడుము. । అపవిత్ర
మైన వట్టి మాటలకు విముఖుడవై యుండుము. అట్టి
(మాటలాడు)వారు మరి ఎక్కువగా భక్తిహీనులగు
17 దురు. । కొరుకుపుండు ప్రాకినట్టు వారి మాటలు
18 ప్రాకును, వారిలో హుమెనైయును ఫిలేతును
ఉన్నారు; వారు—పునరుత్థానము గతించెనని చెప్పుచు
సత్యము విషయము తప్పిపోయి, కొందరి విశ్వాస
19 మును చెరుపుచున్నారు. । అయినను దేవునియొక్క
స్థిరమైన పునాది నిలుకడగా ఉన్నది.

—ప్రభువు తనవారిని ఎరుగును[4]

అనునదియు

—ప్రభువు నామమును ఒప్పుకొను ప్రతివాడును
దుర్నీతినుండి తొలగిపోవలెను

20 అనునదియు దానికి ముద్రగా ఉన్నది. । గొప్ప యిం
టిలో వెండి పాత్రలును బంగారు పాత్రలును మాత్రమే
గాక కఱ్ఱవి మంటివి కూడ ఉండును. వాటిలో కొన్ని
ఘనతకును కొన్ని ఘనహీనతకును వినియోగింప
21 బడును. । ఎవడైనను వీటిలో చేరక తన్నుతాను పవిత్ర
పరచుకొనినయెడల వాడు పరిశుద్ధపరచబడి, యజ
మానుడు వాడుకొనుటకు అర్హమై ప్రతి సత్కార్యము
నకు సిద్ధపరచబడి, ఘనత నిమిత్తమైన పాత్రయై యుం
22 డును. । నీవు యౌవనేచ్ఛలను విసర్జించి,[5] పవిత్ర
హృదయులై ప్రభువుకు ప్రార్థన చేయువారితోకూడ
నీతిని విశ్వాసమును ప్రేమను సమాధానమును సంపా
23 దించుకొనుటకు ప్రయాసపడుము.[6] । నేర్పులేని మూ
ఢుల వితర్కములు జగడములు పుట్టించునని యెరిగి
24 అట్టివాటిని విసర్జించుము. । సత్యవిషయమైన అనుభవ
6 జ్ఞానము వారికి కలుగుటకై దేవుడొకవేళ ఎదురాడు
వారికి మారుమనస్సు దయచేయును; అందువలన
సాతాను తన యిష్టము నెరవేర్చుటకై చెరపట్టిన వీరు
వాని యురిలోనుండి తప్పించుకొని మేలుకొనెద
రేమో అని ప్రభువుయొక్క దాసుడు అట్టివారిని
సాత్వికముతో శిక్షించుచు, జగడమాడక అందరియెడల
సాధువుగాను బోధింప సమర్థుడుగాను కీడు సహించు
వాడుగాను ఉండవలెను.

అంత్యదినములలో అపాయకరమైన కాలములు 3
వచ్చునని తెలిసికొనుము. ఏలాగనగా మనుష్యులు 2
స్వార్థప్రియులు ధనాపేక్షులు బింకములాడువారు
అహంకారులు దూషకులు తలిదండ్రులకు అవిధే
యులు కృతజ్ఞతలేనివారు అపవిత్రులు । అనురాగరహి 3
తులు అతిద్వేషులు అపవాదకులు అజితేంద్రియులు
క్రూరులు సజ్జనద్వేషులు । ద్రోహులు మూర్ఖులు 4
గర్వాంధులు దేవునికంటె సుఖానుభవమును ఎక్కువగా
ప్రేమించువారు, । పైకి భక్తిగలవారివలె ఉండియు 5
దాని శక్తిని ఆశ్రయించనివారునై యుందురు. ఇట్టి
వారికి విముఖుడవై యుండుము. । పాపభరితులై నానా 6
విధములైన దురాశలవలన నడిపింపబడి, యెల్లప్పుడును 7
నేర్చుకొనుచున్నను, సత్యవిషయమైన అనుభవజ్ఞానము
ఎప్పుడును పొందలేని అవివేక స్త్రీలయొక్క యిండ్లలో
చొచ్చి వారిని చెరపట్టుకొని పోవువారు వీరిలో చేరిన
వారు. । యన్నే, యంబ్రే అనువారు మోషేను ఎది 8
రించినట్టు వీరును చెడిన మనస్సుకలిగి విశ్వాసవిషయ
ములో భ్రష్టులై సత్యమును ఎదిరింతురు. । అయినను 9
వారి అవివేకమేలాగు తేటపడెనో ఆలాగే వీరిదికూడ
అందరికి తేటపడును గనుక వీరు ఇకను ముందుకు
సాగరు. । అయితే నీవు నా బోధను నా ప్రవర్తనను 10
నా ఉద్దేశమును నా విశ్వాసమును నా దీర్ఘశాంత
మును నా ప్రేమను నా ఓర్పును, । అంతియొకయ 11
ఈకొనియ లుస్త్ర అను పట్టణములలో నాకు కలిగినట్టి
హింసలను ఉపద్రవములను, తెలిసికొనినవాడవై నన్ను
వెంబడించితివి. అట్టి హింసలను సహించితిని గాని
వాటన్నిటిలోనుండి ప్రభువు నన్ను తప్పించెను. । క్రీస్తు 12
యేసునందు సద్భక్తితో బ్రదుక నుద్దేశించువారందరు
హింస పొందుదురు. । అయితే దుర్జనులును వంచకు 13
లును (ఇతరులను) మోసపరచుచు తామును మోస
పోవుచు అంతకంతకు చెడిపోవుదురు. । క్రీస్తు యేసు 14
నందుంచవలసిన విశ్వాసముద్వారా రక్షణార్థమైన 15
జ్ఞానము నీకు కలిగించుటకు శక్తిగల పరిశుద్ధలేఖనము
లను బాల్యమునుండి నీవెరుగుదువు గనుక, నీవు నేర్చు
కొని రూఢియని తెలిసికొన్నవి యెవరివలన నేర్చు
కొంటివో ఆ సంగతి తెలిసికొని వాటియందు నిలు

[1] లేక, నమ్మకపోయినను. [2] మూలభాషలో—ఆయన తన్నుతానెరుగననలేడు. [3] మూలభా.—సరిగా విభజించువానిగాను. [4] సంఖ్యా. 16: 5.
[5] మూలభా.—విడిచి పారిపొమ్ము. [6] మూలభా.—వెంటాడుము.

16 కడగా ఉండుము. । దైవజనుడు సన్నద్ధుడై ప్రతి
17 సత్కార్యమునకు పూర్ణముగా సిద్ధపడియుండునట్లు
దైవావేశమువలన కలిగిన ప్రతి లేఖనము,[1] ఉపదేశిం
చుటకును, ఖండించుటకును, తప్పు దిద్దుటకును, నీతి
యందు శిక్షచేయుటకును ప్రయోజనకరమై యున్నది.

4 దేవుని యెదుటను సజీవులకును మృతులకును తీర్పు
తీర్చు క్రీస్తుయేసు ఎదుటను, ఆయన ప్రత్యక్షత
తోడు ఆయన రాజ్యముతోడు, నేను ఆనబెట్టి చెప్పున
2 దేమనగా । వాక్యమును ప్రకటించుము; సమయ
మందును అసమయమందును ప్రయాసపడుము, సం
పూర్ణమైన, దీర్ఘశాంతముతో ఉపదేశించుచు ఖండిం
3 చుము గద్దించుము బుద్ధి చెప్పుము. । ఎందుకనగా
జనులు హితబోధను[2] సహింపక దురద చెవులుగల
వారై తమ స్వకీయ దురాశలకు అనుకూలమైన బోధ
4 కులను తమకొరకు పోగుచేసికొని, । సత్యమునకు చెవి
నియ్యక కల్పనాకథలవైపుకు తిరుగుకాలము వచ్చును. ।
5 అయితే నీవు అన్నివిషయములలో మితముగా ఉం
డుము, శ్రమపడుము, సువార్తికుని పనిచేయుము, నీ
6 పరిచర్యను సంపూర్ణముగా జరిగించుము. । నేనిప్పుడే
పానార్పణముగా పోయబడుచున్నాను, నా నిర్యాణ
7 కాలము సమీపమై యున్నది. । మంచి పోరాటము
పోరాడితిని, నా పరుగు కడముట్టించితిని, విశ్వాసము
8 కాపాడుకొంటిని. । ఇకమీదట నాకొరకు నీతికిరీట
ముంచబడియున్నది. ఆ దినమందు నీతిగల న్యాయాధి
పతియైన ప్రభువు అది నాకును, నాకుమాత్రమే
కాకుండ తన ప్రత్యక్షతను అపేక్షించువారికందరికిని
అనుగ్రహించును.

9 నాయొద్దకు త్వరగా వచ్చుటకు ప్రయత్నము
10 చేయుము. । దేమా యిహలోకమును స్నేహించి నన్ను
విడిచి థెస్సలొనీకకు వెళ్లెను, క్రేస్కే గలతీయకును
తీతు దల్మతియకును వెళ్లిరి; । లూకామాత్రమే నాయొద్ద 11
ఉన్నాడు. మార్కును వెంటబెట్టుకొని రమ్ము,
అతడు పరిచారము నిమిత్తము నాకు ప్రయోజనకరమైన
వాడు. । తుకికును ఎఫెసుకు పంపితిని. । నీవు వచ్చు 12
నప్పుడు నేను త్రోయలో కర్పునొద్ద ఉంచి వచ్చిన 13
అంగీని పుస్తకములను, ముఖ్యముగా చర్మపు కాగిత
ములను తీసికొని రమ్ము. । అలెక్సంద్రు అను కంచరి 14
వాడు నాకు చాల కీడుచేసెను, అతని క్రియలచొప్పున
ప్రభువతనికి ప్రతిఫలమిచ్చును; । అతని విషయమై 15
నీవును జాగ్రత్తగా ఉండుము, అతడు మా మాటలను
బహుగా ఎదిరించెను. । నేను మొదట సమాధానము 16
చెప్పినప్పుడు ఎవడును నా పక్షముగా నిలువలేదు,
అందరు నన్ను విడిచి పోయిరి; యిది వారికి నేరముగా
ఎంచబడకుండును గాక. । అయితే నా ద్వారా 17
సువార్త పూర్ణముగా ప్రకటింపబడు నిమిత్తమును, అన్య
జనులందరును దాని విను నిమిత్తమును, ప్రభువు నా
పక్షమున ఉండి[4] నన్ను బలపరచెను గనుక నేను
సింహము నోటనుండి తప్పింపబడితిని. । ప్రభువు ప్రతి 18
దుష్కార్యమునుండి నన్ను తప్పించి తన పరలోకరాజ్య
మునకు చేరునట్లు నన్ను రక్షించును. యుగయుగ
ములు ఆయనకు మహిమ కలుగునుగాక. ఆమేన్.

ప్రిస్కకును అకులకును ఒనేసిఫోరు ఇంటివారి 19
కిని నా వందనములు. । ఎరస్తు కొరింథులో నిలిచి 20
పోయెను. త్రోఫిము రోగియైనందున అతని మిలేతు
లో విడిచివచ్చితిని. । శీతకాలము రాకమునుపు నీవు 21
వచ్చుటకు ప్రయత్నముచేయుము. యుబూలు, పుదే,
లీను క్లౌదియయు సహోదరులందరును నీకు వందన
ములు చెప్పుచున్నారు.

ప్రభువు నీ ఆత్మకు తోడైయుండును గాక. కృప 22
మీకు తోడై యుండును గాక.

1 లేక, ప్రతి లేఖనము దైవావేశమువలన కలిగి. 2 మూలభాషలో—ఆరోగ్యకరమైన బోధను. 3 లేక, నేను వెడలిపోవుకాలము. 4 మూలభా.—నా ప్రక్కను నిలిచి.

### అపొస్తలుడైన పౌలు

# తీతుకు వ్రాసిన పత్రిక

1 దేవుడు ఏర్పరచుకొనినవారి విశ్వాసము నిమిత్త
2 మును, నిత్యజీవ నిరీక్షణతో కూడిన భక్తికి ఆధారమగు
4 సత్యవిషయమైన అనుభవజ్ఞానము నిమిత్తమును, దేవుని
దాసుడును యేసుక్రీస్తు అపొస్తలుడునైన పౌలు, మన
అందరికైన విశ్వాస విషయములో నా నిజమైన కుమా
రుడగు తీతుకు (శుభమని చెప్పి) వ్రాయునది. ఆ నిత్య
జీవమును అబద్ధమాడనేరని దేవుడు అనాదికాలమందే
వాగ్దానముచేసెనుగాని, యిప్పుడు మన రక్షకుడైన
దేవుని ఆజ్ఞప్రకారము నాకు అప్పగింపబడిన సువార్త
ప్రకటనవలన తన వాక్యమును యుక్తకాలములయందు
బయలుపరచెను. తండ్రియైన దేవునినుండియు మన
రక్షకుడైన క్రీస్తుయేసునుండియు కృపయు కనికర
మును సమాధానమును నీకు కలుగును గాక.

5 నేను నీకాజ్ఞాపించిన ప్రకారము నీవు లోపముగా
ఉన్నవాటిని దిద్ది, ప్రతి పట్టణములో పెద్దలను నియ
మించు నిమిత్తమే నేను క్రేతులో నిన్ను విడిచి వచ్చి
6 తిని. । ఎవడైనను నిందారహితుడును, ఏకపత్నీ పురు
షుడును, దుర్వ్యాపారవిషయము నెపము పెట్టబడని
వారై అవిధేయులు కాక విశ్వాసులైన పిల్లలుగల
వాడునై యుండినయెడల (అట్టివానిని పెద్దగా నియ
7 మింపవచ్చును.) । కావున అధ్యక్షుడు దేవుని గృహ
నిర్వాహకునివలె నిందారహితుడై యుండవలెను.
అతడు స్వేచ్ఛాపరుడును, ముక్కోపియు, మద్యపాని
యు, కొట్టువాడును, దుర్లాభము అపేక్షించువాడును
8 కాక, । అతిథిప్రియుడును, సజ్జనప్రియుడును,[1] స్వస్థ
బుద్ధిగలవాడును, నీతిమంతుడును, పవిత్రుడును,
9 ఆశానిగ్రహముగలవాడునైయుండి, । తాను హితబోధ
విషయమై[2] జనులను హెచ్చరించుటకును, ఎదురాడు
వారి మాట ఖండించుటకును శక్తిగలవాడగునట్లు ఉప
దేశమును అనుసరించి నమ్మదగినబోధను గట్టిగా చేపట్టు
కొనువాడునై యుండవలెను.

10 అనేకులు, విశేషముగా సున్నతి సంబంధులు,
అవిధేయులును ఎదురుబోతులును మోసపుచ్చువా
11 రునై యున్నారు. । వారి నోళ్లు మూయింపవలెను.
అట్టివారు ఉపదేశింపకూడనివాటిని దుర్లాభముకొరకు
ఉపదేశించుచు, కుటుంబములకు కుటుంబములనే పాడు
2 చేయుదురు. । వారిలో ఒకడు, అనగా వారి స్వంత
ప్రవక్తలలో ఒకడు ఇట్లనెను—క్రేతీయులు ఎల్లప్పుడు
అబద్ధికులును దుష్టమృగములును సోమరి తిండిపోతు
లునై యున్నారు. । ఈ సాక్ష్యము నిజమే. ఈ 13
హేతువుచేత వారు యూదుల కల్పనాకథలను, సత్య 14
మునుండి తొలగిపోవునట్టి మనుష్యుల కట్టడలను
లక్ష్యపెట్టక, విశ్వాసమందు స్వస్థులగునిమిత్తము వారిని
కఠినముగా గద్దింపుము. । పవిత్రులకు అన్నియు 15
పవిత్రములే గాని అపవిత్రులకును అవిశ్వాసులకును
ఏదియు పవిత్రమైనది కాదు; వారి మనస్సును వారి
మనస్సాక్షియు అపవిత్రపరచబడి యున్నవి. । దేవుని 16
ఎరుగుదుమని వారు చెప్పుకొందురు గాని అసహ్యు
లును అవిధేయులును ప్రతి సత్కార్యము విషయము
భ్రష్టులునైయుండి, తమ క్రియలవలన ఆయనను ఎరుగ
మన్నట్టున్నారు.[3]

నీవు హితబోధకనుకూలమైన సంగతులను బోధిం 2
చుము. । ఏలాగనగా వృద్ధులు మితానుభవముగల 2
వారును, మాన్యులును స్వస్థబుద్ధిగలవారును, విశ్వాస
ప్రేమ సహనములయందు లోపములేనివారునై[4]
యుండవలెననియు; । ఆలాగుననే వృద్ధస్త్రీలు కొండె 3
కత్తెలును,[5] మిగుల మద్యపానాసక్తులునై[6] యుండక, 5
ప్రవర్తనయందు భయభక్తులుగలవారై యుండవలె
ననియు; దేవునివాక్యము దూషింపబడకుండునట్లు,
యౌవనస్త్రీలు తమ భర్తలకు లోబడుచు, పతిప్రియ
లును శిశుప్రియలును స్వస్థబుద్ధిగలవారును పవిత్రలును
ఇంట ఉండి పనిచేసికొనువారును మంచివారునై
యుండవలెనని బుద్ధిచెప్పుచు, మంచి ఉపదేశము చేయు
వారునై యుండవలెననియు బోధించుము. । అటువలెనే 6
స్వస్థబుద్ధిగలవారై యుండవలెనని యౌవన పురుషు
లను హెచ్చరించుము. । పరపక్షమందుండువాడు మన 7
లనుగూర్చి చెడుమాట యేదియు చెప్పనేరక సిగ్గుపడు 8
నట్లు అన్నిటియందు నిన్ను నీవే సత్కార్యములవిష
యమై మాదిరిగా కనుపరచుకొనుము. నీ ఉపదేశము
మోసములేనిదిగాను మాన్యమైనదిగాను నిరాక్షేప
మైన హితవాక్యముతో[7] కూడినదిగాను ఉండవలెను. ।
దాసులైనవారు అన్ని విషయములయందు మన రక్షకు 9
డగు దేవుని ఉపదేశమును అలంకరించునట్లు, తమ 10
యజమానులకు ఎదురుమాట చెప్పక, యేమియు అప

[1] లేక, సద్విషయప్రియుడును. [2] మూలభాషలో—ఆరోగ్యకరమైన బోధవిషయమై. [3] మూలభా.—ఆయన నెరుగమనువారు. [4] మూలభా.—ఆరోగ్యముగలవారునై. [5] మూలభా.—అపవాదులును. [6] లేక, మద్యపానమువలన వశపరచుకొనబడనివారునై. [7] మూలభా.—ఆరోగ్యకరమైన వాక్యముతో.

హరింపక సంపూర్ణమైన మంచి నమ్మకమును కనుపర్చుచు, అన్ని కార్యములయందు వారిని సంతోషపెట్టుచు, వారికి లోబడియుండవలెనని వారిని హెచ్చరింపుము. ఏలయనగా సమస్త మనుష్యులకు రక్షణకరమైన దేవుని కృప ప్రత్యక్షమై మనము భక్తిహీనతను ఇహలోక సంబంధమైన దురాశలను విసర్జించి, శుభప్రదమైన నిరీక్షణ నిమిత్తము, అనగా మహా దేవుడును మన రక్షకుడునైన యేసుక్రీస్తు మహిమయొక్క ప్రత్యక్షత నిమిత్తము ఎదురుచూచుచు, ఈ లోకములో స్వస్థబుద్ధితోను, నీతితోను, భక్తితోను బ్రదుకుచుండవలెనని మనకు బోధించుచున్నది. ఆయన సమస్తమైన దుర్నీతినుండి మనలను విమోచించి, సత్క్రియలయందాసక్తిగల ప్రజలను తనకోసరమై పవిత్రపరచుకొని తన సొత్తుగా చేసికొనుటకు తన్నుతానే మనకొరకు అర్పించుకొనెను.

వీటినిగూర్చి బోధించుచు హెచ్చరించుచు సంపూర్ణాధికారముతో (దుర్బోధను) ఖండించుచునుండుము. నిన్నెవనిని తృణీకరింపనీయకుము.

అధిపతులకును అధికారులకును లోబడి విధేయులుగా ఉండవలెననియు, ప్రతి సత్కార్యము చేయుటకు సిద్ధపడియుండవలెననియు, మనుష్యులందరి యెడల సంపూర్ణమైన సాత్వికమును కనుపరచుచు, ఎవనిని దూషింపక, జగడమాడనివారును శాంతులునై యుండవలెననియు, వారికి జ్ఞాపకముచేయుము. ఎందుకనగా మనము కూడ మునుపు అవివేకులమును అవిధేయులమును మోసపోయినవారమును నానావిధములైన దురాశలకును భోగములకును దాసులమునైయుండి, దుష్టత్వమునందును అసూయయందును కాలముగడుపుచు, అసహ్యులమై యొకనినొకడు ద్వేషించుచు ఉంటిమి గాని మన రక్షకుడైన దేవునియొక్క దయయు, మానవులయెడల ఆయనకున్న ప్రేమయు ప్రత్యక్షమైనప్పుడు, మనము నీతిని అనుసరించి చేసిన క్రియలమూలముగా కాక, తన కనికరము చొప్పుననే పునర్జన్మసంబంధమైన[1] స్నానము ద్వారాను, పరిశుద్ధాత్మ మనకు నూతన స్వభావము కలుగజేయుట ద్వారాను మనలను రక్షించెను. మనమాయన కృప 6
వలన నీతిమంతులమని తీర్చబడి, నిత్యజీవమునుగూర్చిన 7
నిరీక్షణనుబట్టి దానికి వారసులమగుటకై ఆ పరిశు
ద్ధాత్మను మన రక్షకుడైన యేసుక్రీస్తు ద్వారా ఆయన
మనమీద సమృద్ధిగా కుమ్మరించెను. ఈ మాట నమ్మ 8
దగినది గనుక దేవునియందు విశ్వాసముంచినవారు
సత్క్రియలను శ్రద్ధగా చేయుటయందు మనస్సుంచు
నట్లు నీవీసంగతులనుగూర్చి దృఢముగా చెప్పుచుండ
వలెనని కోరుచున్నాను. ఇవి మంచివియు మనుష్యు
లకు ప్రయోజనకరమైనవియునై యున్నవి గాని,
అవివేకతర్కములును వంశావళులును కలహములును 9
ధర్మశాస్త్రమునుగూర్చిన వివాదములును నిష్ప్రయో
జనమును వ్యర్థమునై యున్నవి గనుక వాటికి దూర
ముగా ఉండుము. మతభేదములు కలిగించు మను 10
ష్యునికి ఒకటి రెండుమారులు బుద్ధిచెప్పినతరువాత వాని
విసర్జించుము. అట్టివాడు మార్గము తప్పి తనకు తానే 11
శిక్ష విధించుకొనినవాడై పాపము చేయుచున్నాడని
నీవెరుగుదువు.

నికొపొలిలో శీతకాలము గడపవలెనని నేను నిర్ణ 12
యించుకొన్నాను గనుక నేను అర్తెమానైనను తుకికు
నైనను నీయొద్దకు పంపినప్పుడు అక్కడికి నాయొద్దకు
వచ్చుటకై ప్రయత్నము చేయుము. ధర్మశాస్త్రవేది 13
యైన జేనను అపొల్లోనును శీఘ్రముగా సాగనం
పుము; వారికేమియు తక్కువ లేకుండ చూడుము.
మనవారును నిష్ఫలులు కాకుండునిమిత్తము అవసర 14
మునుబట్టి సమయోచితముగా సత్క్రియలను శ్రద్ధగా
చేయుటకు నేర్చుకొనవలెను.

నాయొద్ద ఉన్నవారందరు నీకు వందనములు చెప్పు 15
చున్నారు. విశ్వాసమునుబట్టి మమ్మును ప్రేమించు
వారికి మా వందనములు చెప్పుము.

కృప మీ అందరికి తోడై యుండును గాక.

1 లేక, పునఃస్థితిస్థాపన సంబంధమైన.

అపొస్తలుడైన పౌలు

# ఫిలేమోనుకు వ్రాసిన పత్రిక

1 క్రీస్తుయేసు ఖైదియైన పౌలును, సహోదరుడైన
తిమోథెయును మా ప్రియుడును జతపనివాడునైన ఫిలే
2 మోనుకును । మన సహోదరియైన అప్ఫియకును,
తోటియోధుడైన అర్ఖిప్పుకును, నీ యింట ఉన్న
3 సంఘమునకును (శుభమని చెప్పి) వ్రాయునది. । మన
తండ్రియైన దేవునినుండియు ప్రభువైన యేసుక్రీస్తు
నుండియు కృపయు సమాధానమును మీకు కలుగును
గాక.

4 నీ ప్రేమనుగూర్చియు, ప్రభువైన యేసు ఎడలను
6 సమస్త పరిశుద్ధులయెడలను నీకు కలిగియున్న విశ్వాస
మునుగూర్చియు నేను విని నా ప్రార్థనలయందు నీ
నిమిత్తము విజ్ఞాపనముచేయుచు, ఎల్లప్పుడు నా దేవు
నికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచు, క్రీస్తునుబట్టి మీ
యందున్న ప్రతి శ్రేష్ఠమైన వరము విషయమై నీవు
అనుభవపూర్వకముగా ఎరుగుటవలన ఇతరులు నీ
విశ్వాసమందు పాలివారగుట అనునది కార్యకారి
7 కావలయునని వేడుకొనుచున్నాను. । సహోదరుడా,
పరిశుద్ధుల హృదయములు నీ మూలముగా విశ్రాంతి
పొందినందున నీ ప్రేమనుబట్టి నాకు విశేషమైన ఆనంద
మును ఆదరణయు కలిగెను.

8 కావున యుక్తమైనదానిగూర్చి నీకాజ్ఞాపించుటకు
10 క్రీస్తునందు నాకు బహు ధైర్యము కలిగియున్నను,
వృద్ధుడను,[1] ఇప్పుడు క్రీస్తుయేసు ఖైదినైయున్న
పౌలను నేను ప్రేమనుబట్టి వేడుకొనుట మరి మంచి
దనుకొని, నా బంధకములలో నేను కనిన నా కుమా
రుడగు[2] ఒనేసిము[3] కొరకు నిన్ను వేడుకొను
11 చున్నాను. । అతడు మునుపు నీకు నిష్ప్రయోజన
మైనవాడే గాని యిప్పుడు నీకును నాకును ప్రయోజన
12 కరమైనవాడాయెను. । నా ప్రాణమువంటివాడైన
13 అతని[4] నీయొద్దకు తిరిగి పంపియున్నాను. । నేను
సువార్తకొరకు బంధకములలో ఉండగా నీకు ప్రతిగా
అతడు నాకు పరిచారముచేయు నిమిత్తము నాయొద్ద
అతని యుంచుకొనవలెనని యుంటిని గాని । నీ ఉప 14
కారము బలవంతముచేతనైనట్టు కాక స్వేచ్ఛాపూర్వక
మైనదిగా ఉండవలెనని, నీ సమ్మతిలేక యేమియు
చేయుటకు నాకిష్టములేదు. । అతడిక మీదట దాసు 15
డుగా ఉండక దాసునికంటె ఎక్కువవాడుగాను, 16
ప్రియసహోదరుడుగాను, విశేషముగా నాకును,
శరీరవిషయమును ప్రభువువిషయమును మరి విశేష
ముగా నీకును, ప్రియ సహోదరుడుగాను, నీయొద్ద
ఎల్లప్పుడు ఉండుటకే కాబోలు అతడు కొద్దికాలము
నిన్ను ఎడబాసి యుండెను. । కాబట్టి నీవు నన్ను 17
నీతో పాలివానిగా ఎంచిన పక్షమున నన్ను చేర్చు
కొన్నట్టు అతని చేర్చుకొనుము. । అతడు నీకు ఏ నష్ట 18
మైనను కలుగజేసినయెడలను, నీకు ఏమైన ఋణమున్న
యెడలను, అది నా లెక్కలో చేర్చుము; । పౌలను 19
నేను నా స్వహస్తముతో ఈ మాట వ్రాసితిని; అది
నేనే తీర్తును. నీ ఆత్మవిషయములో నీవే నాకు ఋణపడి
యున్నావని నేను చెప్పనేల? । అవును సహోద 20
రుడా, ప్రభువునందు నీవలన నాకు ఆనందము[5] కలుగ
నిమ్ము, క్రీస్తునందు నా హృదయమునకు విశ్రాంతి
కలుగజేయుము. । నేను చెప్పినదానికంటె నీవు ఎక్కు 21
వగా చేతువని యెరిగి నా మాట విందువని నమ్మి నీకు
వ్రాయుచున్నాను. । అంతేకాదు, నీ ప్రార్థనల మూల 22
ముగా నేను నీకు అనుగ్రహింపబడుదునని నిరీక్షించు
చున్నాను గనుక నా నిమిత్తము బస సిద్ధముచేయుము.
క్రీస్తుయేసునందు నాతోటి ఖైదియైన ఎపఫ్రా 23
యు, నా జతపనివారైన మార్కు, అరిస్తార్కు, దేమా, 24
లూకాయు వందనములు చెప్పుచున్నారు.
మన ప్రభువైన యేసుక్రీస్తు కృప మీ ఆత్మకు 25
తోడై యుండును గాక. ఆమేన్.

[1] లేక, రాయబారి. [2] మూలభాషలో—నా పిల్లయగు. [3] ఒనేసిము అను పేరునకు, సహాయకరమైన, అని అర్థము. [4] మూలభా.—నా ప్రాణమైన అతని. [5] లేక, సహాయము.

## అపొస్తలుడైన పౌలు

# హెబ్రీయులకు వ్రాసిన పత్రిక

1 పూర్వకాలమందు నానాసమయములలోను[1]
నానావిధములుగాను ప్రవక్తలద్వారా మన పితరులతో
2 మాటలాడిన దేవుడు । ఈ దినముల అంతమందు కుమా
రునిద్వారా మనతో మాటలాడెను. ఆయన (ఆ కుమా
రుని) సమస్తమునకును వారసునిగా నియమించెను.
3 ఆయనద్వారా ప్రపంచములను[2] నిర్మించెను. । ఆయన
4 దేవుని మహిమయొక్క తేజస్సును,[3] ఆయన తత్వము
యొక్క మూర్తిమంతమునైయుండి, తన మహత్తుగల
మాటచేత సమస్తమును నిర్వహించుచు, పాపముల
విషయములో శుద్ధీకరణము తానే చేసి, దేవదూతల
కంటె ఎంత శ్రేష్ఠమైన నామము పొందెనో వారి
కంటె అంత శ్రేష్ఠుడై, ఉన్నతలోకమందు మహా
మహాత్ముడగు (దేవుని) కుడిపార్శ్వమున కూర్చుండెను. ।
5 ఏలయనగా

—నీవు నా కుమారుడవు, నేను నేడు నిన్ను కంటిని
అనియు; ఇదియుగాక

—నేను ఆయనకు తండ్రిని, ఆయన నాకు కుమా
రుడు[4]

అనియు ఆ దూతలలో ఎవనితోనైన ఎప్పుడైనను
చెప్పెనా?

6 మరియు ఆయన భూలోకమునకు ఆదిసంభూతుని
మరల రప్పించినప్పుడు దేవుని దూతలందరు ఆయనకు
నమస్కారము చేయవలెనని[5] చెప్పుచున్నాడు.

7 —తన దూతలను వాయువులుగాను[6] తన సేవకు
8 లను అగ్నిజ్వాలలుగాను చేసికొనువాడు[7]

అని తన దూతలనుగూర్చి చెప్పుచున్నాడు గాని తన
కుమారునిగూర్చియైతే

—దేవా, నీ సింహాసనము నిరంతరము నిలుచునది;
నీ రాజ్యదండము
న్యాయార్థమై యున్నది
9 నీవు నీతిని ప్రేమించితివి
దుర్నీతిని ద్వేషించితివి
అందుచేత దేవుడు నీ దేవుడు నీతోటివారికంటె
నిన్ను ఎక్కువగా ఆనందతైలముతో అభిషేకిం
చెను.[8]

మరియు 10

—ప్రభువా, నీవు ఆదియందు భూమికి పునాది
వేసితివి
ఆకాశమండలము నీ చేతిపనియైయున్నది
అవి నశించును గాని నీవు శాశ్వతముగా ఉందువు 11
అవన్నియు వస్త్రమువలె పాతగిలిపోవును
ఉత్తరీయమువలె వాటిని మడిచివేతువు 12
అవి వస్త్రమువలె మార్చబడును గాని
నీవు ఏకరీతిగానే యున్నావు
నీ సంవత్సరములు తరుగవు[9]

అని చెప్పుచున్నాడు. అయితే 13

—నేను నీ శత్రువులను నీ పాదములకు
పాదపీఠముగా చేయు పర్యంతము
నా కుడిపార్శ్వమున కూర్చుండుము[10]

అని దూతలలో ఎవనిగూర్చియైన యెప్పుడైన
చెప్పెనా? । వీరందరు రక్షణయను స్వాస్థ్యము పొంద 14
బోవువారికి పరిచారముచేయుటకై పంపబడిన సేవకు
లైన ఆత్మలు కారా?

కావున మనము వినిన సంగతులను విడిచిపెట్టి 2
కొట్టుకొనిపోకుండునట్లు వాటియందు మరి విశేష
జాగ్రత్త కలిగియుండవలెను. । ఎందుకనగా దేవ 2
దూతల ద్వారా పలుకబడిన వాక్యము స్థిరపరచబడి
నందున ప్రతి అతిక్రమమును అవిధేయతయు న్యాయ
మైన ప్రతిఫలము పొందియుండగా। ఇంత గొప్ప 3
రక్షణను మనము నిర్లక్ష్యముచేసినయెడల ఏలాగు 4
తప్పించుకొందుము? అట్టి రక్షణ ప్రభువు బోధించుట
చేత ఆరంభమై, దేవుడు తన చిత్తానుసారముగా సూచక
క్రియలచేతను మహత్కార్యములచేతను నానావిధము
లైన అద్భుతములచేతను వివిధములైన పరిశుద్ధాత్మ వర
ములను అనుగ్రహించుటచేతను వారితోకూడ సాక్ష్య
మిచ్చుచుండగా వినినవారిచేత మనకు దృఢపరచబడెను.
మనము మాటలాడుచున్న ఆ రాబోవు లోకమును 5
ఆయన దేవదూతలకు లోపరచలేదు. । అయితే ఒకడు 6
ఒకచోట ఈలాగున దృఢముగా సాక్ష్యమిచ్చు
చున్నాడు[11]

1 మూలభాషలో—నానాభాగములుగాను  2 మూలభా.—యుగములను.  3 లేక, ప్రతిబింబమును.  4 కీర్తన, 2: 7; 2 సమూ. 7: 14.
5 కీర్తన, 97: 7.  6 లేక, ఆత్మలుగాను.  7 కీర్తన, 104: 4.  8 కీర్తన, 45: 6, 7.  9 కీర్తన, 102: 25–27.  10 కీర్తన, 110: 1.
11 కీర్తన, 8: 4–6

—నీవు మనుష్యుని జ్ఞాపకము చేసికొనుటకు వాడే
పాటివాడు?
నీవు నరపుత్రుని దర్శించుటకు వాడేపాటివాడు?
7 నీవు దేవదూతలకంటె వానిని కొంచెము తక్కువ
వానిగా చేసితివి
మహిమాప్రభావములతో వానికి కిరీటము ధరింప
జేసితివి
నీ చేతి పనులమీద వానికధికారము అనుగ్రహిం
చితివి
8 వాని పాదములక్రింద సమస్తమును ఉంచితివి.
ఆయన సమస్తమును వానికి లోపరచినప్పుడు వానికి
లోపరచకుండ దేనిని విడిచిపెట్టలేదు. ప్రస్తుతమందు
మనము సమస్తమును వానికి లోపరచబడుట ఇంకను
9 చూడలేదు గాని । దేవుని కృపవలన ఆయన ప్రతి
మనుష్యునికొరకు మరణము అనుభవించునట్లు,[1] దూతల
కంటె కొంచెము తక్కువవాడుగా చేయబడిన యేసు
మరణము పొందినందున, మహిమాప్రభావములతో కిరీ
టము ధరించినవానిగా ఆయనను చూచుచున్నాము. ।
10 ఎవని నిమిత్తము సమస్తమును ఉన్నవో, యెవనివలన
సమస్తమును కలుగుచున్నవో, ఆయన అనేకులైన కుమా
రులను మహిమకు తెచ్చుచుండగా వారి రక్షణకర్తను
శ్రమలద్వారా సంపూర్ణునిగా చేయుట ఆయనకు
11 తగును. । పరిశుద్ధపరచువానికిని పరిశుద్ధపరచబడు
12 వారికిని అందరికి ఒక్కటే[2] మూలము. ఈ హేతువు
చేతను వారిని సహోదరులని పిలుచుటకు ఆయన
సిగ్గుపడక
—నీ నామమును నా సహోదరులకు ప్రచురపర
తును, సమాజముమధ్య[3] నీ కీర్తిని గానము
చేతును[4]
13 అనెను. మరియు
—నేనాయనను నమ్ముకొనియుందును
అనియు
—ఇదిగో నేనును దేవుడు నాకిచ్చిన పిల్లలును
14 అనియు చెప్పుచున్నాడు.[5] । కాబట్టి ఆ పిల్లలు రక్త
15 మాంసములుగలవారైనందున ఆ ప్రకారమే మరణము
యొక్క బలముగలవానిని, అనగా అపవాదిని[6] మర
ణముద్వారా నశింపజేయుటకును, జీవితకాలమంతయు
మరణభయముచేత దాస్యమునకు లోబడినవారిని విడి
పించుటకును, ఆయనకూడ రక్తమాంసములలో పాలి
16 వాడాయెను. । ఏలయనగా ఆయన ఎంతమాత్రమును
దేవదూతల స్వభావమును ధరించుకొనక, అబ్రాహాము
సంతాన స్వభావమును ధరించుకొనియున్నాడు. ।
17 కావున ప్రజల పాపములకు నివృత్తి కలుగజేయుటకై
దేవుని సంబంధమైన కార్యములలో కనికరమును
నమ్మకమునుగల ప్రధానయాజకుడగు నిమిత్తము అన్ని
విషయములలో ఆయన తన సహోదరులవంటివాడు
కావలసివచ్చెను. । తాను శోధింపబడి శ్రమపొందెను 18
గనుక శోధింపబడువారికిని సహాయము చేయగలవాడై
యున్నాడు.

ఇందువలన, పరలోకసంబంధమైన పిలుపులో 3
పాలుపొందిన పరిశుద్ధ సహోదరులారా, మనము
ఒప్పుకొనినదానికి అపొస్తలుడును ప్రధానయాజకుడు
నైన యేసుమీద లక్ష్యముంచుడి. । దేవుని యిల్లంత 2
టిలో మోషే నమ్మకముగా ఉండినట్లు, ఈయనకూడ
తన్ను నియమించినవానికి నమ్మకముగా ఉండెను. ।
ప్రతి యిల్లును ఎవడైన ఒకనిచేత కట్టబడును;[7] సమస్త 3
మును కట్టినవాడు[8] దేవుడే. ఇంటికంటె దాని కట్టిన 4
వాడెక్కువ ఘనత పొందినట్టు, ఈయన మోషేకంటె
ఎక్కువ మహిమకు అర్హుడుగా ఎంచబడెను. । ముందు 5
చెప్పబోవు సంగతులకు సాక్ష్యార్థముగా మోషే పరి
చారకుడైయుండి దేవుని యిల్లంతటిలో నమ్మకముగా
ఉండెను.[9] । అయితే క్రీస్తు, కుమారుడైయుండి, 6
ఆయన యింటిమీద నమ్మకముగా ఉన్నాడు; ధైర్య
మును నిరీక్షణవలని ఉత్సాహమును తుదమట్టుకు స్థిర
ముగా చేపట్టినయెడల మనమే ఆయన యిల్లు. । మరియు 7
పరిశుద్ధాత్మ యిట్లు చెప్పుచున్నాడు
—నేడు మీరాయన శబ్దమును వినినయెడల అరణ్య 8
ములో శోధన దినమందు
కోపము పుట్టించినప్పటివలె
మీ హృదయములను కఠినపరచుకొనకుడి.
నలువది సంవత్సరములు నా కార్యములను చూచి 9
మీ పితరులు నన్ను పరీక్షించి శోధించిరి.
కావున నేను ఆ తరమువారిమీద కోపగించి 10
—వీరెల్లప్పుడును తమ హృదయాలోచనలలో
తప్పిపోవుచున్నారు
నా మార్గములను తెలిసికొనలేదు
గనుక నేను కోపముతో ప్రమాణము చేసినట్లు 11
వారు నా విశ్రాంతిలో ప్రవేశింపరని చెప్పితిని.[10]
సహోదరులారా, జీవముగల దేవుని విడిచిపోవు 12
నట్టి విశ్వాసములేని దుష్టహృదయము మీలో ఎవని
యందైనను ఒకవేళ ఉండునేమో అని జాగ్రత్తగా
చూచుకొనుడి. । నేడు మీరాయన శబ్దమును వినిన 13
యెడల కోపము పుట్టించినప్పటివలె మీ హృదయ 15
ములను కఠినపరచుకొనకుడని ఆయన చెప్పెను గనుక,
పాపమువలన కలుగు భ్రమచేత మీలో ఎవడును కఠిన
పరచబడకుండునట్లు—నేడు అని చెప్పబడిన సమయ
ముండగానే ప్రతిదినమును ఒకనికొకడు బుద్ధిచెప్పు
కొనుడి. ఏలయనగా మొదటనుండి మనకున్న దృఢ

1 మూలభాషలో—రుచిచూచునట్లు. 2 లేక, ఒక్కడే. 3 లేక, సంఘముమధ్య. 4 కీర్తన, 22: 22. 5 యెషయా, 8: 17, 18. 6 అనగా—సాతాను. 7 లేక, స్థాపింపబడును. 8 లేక, స్థాపించినవాడు. 9 సంఖ్యా. 12: 8. 10 కీర్తన, 95: 7–11.

విశ్వాసము అంతముమట్టుకు గట్టిగా చేపట్టినయెడలనే
16 క్రీస్తులో పాలివారమై యుందుము. । విని కోపము
పుట్టించినవారెవరు? మోషేచేత నడిపింపబడి ఐగుప్తులో
17 నుండి బయలు దేరి వచ్చినవారందరే గదా? । ఎవరిమీద
నలువది ఏండ్లు ఆయన కోపగించెను? పాపముచేసిన
వారిమీదనే గదా? వారి శవములు[1] అరణ్యములో
18 రాలిపోయెను.[2] । తన విశ్రాంతిలో ప్రవేశింపరని
యెవరినిగూర్చి ప్రమాణము చేసెను? అవిధేయులైన
19 వారిని గూర్చియే గదా? । కాగా అవిశ్వాసముచేతనే
వారు ప్రవేశింపలేకపోయిరని గ్రహించుచున్నాము.

4 ఆయనయొక్క విశ్రాంతిలో ప్రవేశించుదుమను
వాగ్దానము ఇంక నిలిచియుండగా, మీలో ఎవడైన ఒక
వేళ ఆ వాగ్దానము పొందకుండ తప్పిపోవునేమో
2 అని భయము కలిగియుందము. । వారికి ప్రకటింప
బడినట్లు మనకును సువార్త ప్రకటింపబడెను గాని
వారు వినినవారితో విశ్వాసముగలవారై కలిసియుండ
లేదు గనుక వినబడిన వాక్యము వారికి నిష్ప్రయో
3 జనమైనదాయెను. । కాగా జగత్పునాది వేయబడి
నప్పుడే ఆయన కార్యములన్నియు సంపూర్తియై
యున్నను ఈ విశ్రాంతినిగూర్చి

—నేను కోపముతో ప్రమాణముచేసినట్టు[3]
వారు నా విశ్రాంతిలో ప్రవేశింపరు

అని ఆయన చెప్పిన మాట అనుసరించి, విశ్వాసుల
మైన మనము ఆ విశ్రాంతిలో ప్రవేశించుచున్నాము. ।
4 మరియు

—దేవుడు ఏడవ దినమందు తన కార్యములన్నిటిని
ముగించి విశ్రమించెను[4]

అని యేడవ దినమునుగూర్చి ఆయన యొకచోట చెప్పి
5 యున్నాడు. । ఇదియుగాక ఈ చోటుననే

—వారు నా విశ్రాంతిలో ప్రవేశింపరు

అని చెప్పియున్నాడు.
6 కాగా ఎవరో కొందరు విశ్రాంతిలో ప్రవేశించు
7 దురను మాట నిశ్చయము గనుకను, ముందు సువార్త
వినినవారు అవిధేయతచేత ప్రవేశింపలేదు గనుకను,
నేడు మీరాయన మాట వినినయెడల మీ హృదయ
ములను కఠినపరచుకొనకుడని వెనుక చెప్పబడిన ప్రకా
రము, ఇంతకాలమైన తరువాత దావీదు గ్రంథములో[5]
—నేడని యొక దినమును నిర్ణయించుచున్నాడు. ।
8 యెహోషువ వారికి విశ్రాంతి కలుగజేసినయెడల
ఆ తరువాత మరియొక దినమునుగూర్చి ఆయన చెప్పక
9 పోవును. । కాబట్టి దేవుని ప్రజలకు విశ్రాంతి నిలిచి
10 యున్నది. । ఎందుకనగా దేవుడు తన కార్యములను
ముగించి విశ్రమించిన ప్రకారము ఆయనయొక్క
విశ్రాంతిలో ప్రవేశించినవాడు కూడ తన కార్య
ములను ముగించి విశ్రమించును. । కాబట్టి అవిధేయత 11
వలన వారు పడిపోయినట్లుగా మనలో ఎవడును పడి
పోకుండ ఆ విశ్రాంతిలో ప్రవేశించుటకు జాగ్రత్త
పడుదము. । ఎందుకనగా దేవుని వాక్యము సజీవమై 12
బలముగలదై రెండంచులుగల యెటువంటి ఖడ్గము
కంటెను వాడిగా ఉండి, ప్రాణాత్మలను కీళ్లను మూలు
గను విభజించునంతమట్టుకు దూరుచు, హృదయము
యొక్క తలంపులను ఆలోచనలను శోధించుచున్నది. ।
మరియు ఆయన దృష్టికి కనబడని సృష్టము ఏదియు 13
లేదు. మనమెవనికి లెక్క యొప్పచెప్పవలసియున్నదో
ఆ దేవుని కన్నులకు సమస్తమును మరుగు లేక తేటగా
ఉన్నది.

ఆకాశమండలముగుండ వెళ్లిన దేవుని కుమారుడైన 14
యేసు అను గొప్ప ప్రధానయాజకుడు మనకు కలిగి
యున్నాడు గనుక మనము ఒప్పుకొనినదానిని గట్టిగా
చేపట్టుదము. । మన ప్రధానయాజకుడు మన బల 15
హీనతలయందు మనతో సహానుభవము లేనివాడు
కాడు గాని సమస్త విషయములలోను మనవలెనే
శోధింపబడినను ఆయన పాపము లేనివాడుగా ఉం
డెను. । గనుక మనము కనికరింపబడి సమయోచిత 16
మైన సహాయముకొరకు కృపపొందునట్లు ధైర్యముతో
కృపాసనమునొద్దకు చేరుదము.

ప్రతి ప్రధానయాజకుడును మనుష్యులలోనుండి 5
యేర్పరచబడినవాడై, పాపములకొరకు అర్పణలను
బలులను అర్పించుటకు దేవుని విషయమైన కార్య
ములు జరిగించుటకై మనుష్యులనిమిత్తము నియమింప
బడును. । తానుకూడ బలహీనతచేత ఆవరింపబడియు 2
న్నందున అతడు ఏమి తెలియనివారియెడలను త్రోవ
తప్పినవారియెడలను తాలిమి చూపగలవాడై యున్నా
డు. । ఆ హేతువుచేత ప్రజలకొరకేలాగో ఆలాగే 3
తనకొరకును పాపములనిమిత్తము అర్పణము చేయ
వలసినవాడై యున్నాడు. । మరియు ఎవడును ఈ 4
ఘనత తనకుతానే వహించుకొనడు గాని అహరోను
పిలువబడినట్టుగా దేవునిచేత పిలువబడినవాడై యీ
ఘనత పొందును. । అటువలె క్రీస్తుకూడ ప్రధాన 5
యాజకుడగుటకు తన్నుతానే మహిమపరచుకొనలేదు
గాని

—నీవు నా కుమారుడవు, నేడు నిన్ను కంటినని[6]

అని ఆయనతో చెప్పినవాడే ఆయనను మహిమపర
చెను. । ఆ ప్రకారమే 6

—నీవు నిరంతరము మెల్కీసెదెకుయొక్క క్రమ
ములో చేరిన యాజకుడవై యున్నావు[7]

అని మరియొకచోట చెప్పుచున్నాడు. । శరీరధారియై 7
యున్న దినములలో మహా రోదనముతోను కన్నీళ్లతో

[1] లేక, అవయవములు [2] సంఖ్యా 14: 29. [3] కీర్తన, 95: 11. [4] ఆదికాం. 2: 3. [5] కీర్తన, 95: 8, 9. [6] కీర్తన, 2: 7.
[7] కీర్తన, 110: 4.

తోను, తన్ను మరణమునుండి రక్షింపగలవానికి ప్రార్థ
నలను యాచనలను సమర్పించి భయభక్తులు కలిగియు
8 న్నందున ఆయన అంగీకరింపబడెను. । ఆయన, కుమా
రుడైయుండియు తాను పొందిన శ్రమలవలన విధే
9 యతను నేర్చుకొనెను. । మరియు ఆయన సంపూర్ణసిద్ధి
10 పొందినవాడై, మెల్కీసెదెకుయొక్క క్రమములో
చేరిన ప్రధానయాజకుడని దేవునిచేత పిలువబడి, తనకు
విధేయులైన వారికందరికిని నిత్యరక్షణకు కారకు
డాయెను.

11 ఇందునుగూర్చి[1] మేము చెప్పవలసినవి అనేక సం
గతులున్నవి గాని మీరు వినుటకు మందులైనందున
12 వాటిని విశదపరచుట దుష్కరము. । కాలమునుబట్టి
చూచితే మీరు బోధకులుగా ఉండవలసినవారై యుం
డగా, దేవోక్తులలో మొదటి మూలపాఠములను ఒకడు
మీకు మరల బోధింపవలసి వచ్చెను. మీరు పాలు
• త్రాగవలసినవారే గాని బలమైన ఆహారము తినగల
13 వారుకారు. । మరియు పాలుత్రాగు ప్రతివాడును
శిశువే గనుక నీతి వాక్యవిషయములో అనుభవములేని
14 వాడై యున్నాడు. । ఐయస్సువచ్చినవారు[2] అభ్యా
సముచేత మేలు కీడులను వివేచించుటకు సాధకము
చేయబడిన జ్ఞానేంద్రియములు కలిగియున్నారు గనుక
బలమైన ఆహారము వారికే తగును.

6 కాబట్టి నిర్జీవక్రియలను విడిచి, మారుమనస్సు
పొందుటయు, దేవునియందలి విశ్వాసమును, బాప్తి
2 స్మములనుగూర్చిన బోధయు, హస్తనిక్షేపణమును,
మృతుల పునరుత్థానమును, నిత్యమైనతీర్పును అను
పునాది మరల వేయక, క్రీస్తునుగూర్చిన మూలోప
దేశము మాని, సంపూర్ణులమగుటకు సాగిపోదము. ।
3 దేవుడు సెలవిచ్చినయెడల మనమాలాగు చేయుదము. ।
4 ఒకసారి వెలిగింపబడి, పరలోకసంబంధమైన వరమును
5 రుచిచూచి, పరిశుద్ధాత్మలో పాలివారై । దేవుని దివ్య
వాక్యమును రాబోవు యుగసంబంధమైన శక్తుల
6 (ప్రభావమును) అనుభవించిన[3] తరువాత । తప్పి
పోయినవారు తమ విషయములో దేవుని కుమారుని
మరల సిలువవేయుచు, బాహాటముగా అవమానపరచు
చున్నారు గనుక మారుమనస్సు పొందునట్లు అట్టి
7 వారిని మరల నూతనపరచుట అసాధ్యము. । ఎట్ల
నగా, భూమి తనమీద తరుచుగా కురియు వర్షమును
త్రాగి యెవరికొరకు వ్యవసాయము చేయబడునో
వారికనుకూలమైన పైరులను ఫలించుచు దేవుని ఆశీర్వా
8 దమును పొందును. । అయితే ముండ్లతుప్పలును గచ్చ
తీగెలును దానిమీద పెరిగినయెడల అది పనికిరానిదని
విసర్జింపబడి శాపము పొందతగినదగును. తుదకది
కాల్చివేయబడును.

9 అయితే ప్రియులారా, మేమీలాగు చెప్పుచు
న్నను, మీరింతకంటె మంచిదియు రక్షణకరమైనది
యునైన స్థితిలోనే యున్నారని రూఢిగా నమ్ము
చున్నాము. । మీరు చేసిన కార్యమును, మీరు పరి 10
శుద్ధులకు ఉపచారముచేసి యింకను ఉపచారము
చేయుచుండుటచేత తన నామమునుబట్టి చూపిన
ప్రేమను మరచుటకు దేవుడు అన్యాయస్థుడు కాడు. ।
మీరు మందులు కాక, విశ్వాసముచేతను ఓర్పుచేతను 11
వాగ్దానములను స్వతంత్రించుకొనువారిని పోలి 12
నడుచుకొనునట్లుగా మీలో ప్రతివాడును మీ నిరీ
క్షణ పరిపూర్ణమగు నిమిత్తము మీరిదివరకు కనుపరచిన
ఆసక్తిని తుదమట్టుకు కనుపరచవలెనని అపేక్షించు
చున్నాము.

దేవుడు అబ్రాహామునకు వాగ్దానము చేసినప్పుడు 13
తనకంటె ఏ గొప్పవానితోడు అని ప్రమాణము
చేయలేక పోయెను గనుక । తనతోడు అని ప్రమా 14
ణముచేసి

—నిశ్చయముగా నేను నిన్ను ఆశీర్వదింతును
నిశ్చయముగా నిన్ను అభివృద్ధి పొందింతును

అని[4] చెప్పెను. । (ఆ మాట నమ్మి) అతడు ఓర్పుతో 15
సహించి ఆ వాగ్దానఫలము పొందెను. । మనుష్యులు 16
తమకంటె గొప్పవానితోడు అని ప్రమాణము చేతురు;
వారి ప్రతి వివాదములలో వివాదాంశమును పరిష్కా
రము చేయునది ప్రమాణమే. । ఈ విధముగా దేవుడు 17
తన సంకల్పము నిశ్చలమైనదని ఆ వాగ్దానమునకు 18
వారసులైనవారికి మరి నిశ్చయముగా కనుపరచవలె
నని ఉద్దేశించినవాడై, తాను అబద్ధమాడజాలని నిశ్చల
మైన రెండు సంగతులనుబట్టి, మనయెదుట ఉంచబడిన
నిరీక్షణను చేపట్టుటకు శరణాగతులమైన మనకు బల
మైన ధైర్యము కలుగునట్లు ప్రమాణముచేసి వాగ్దాన
మును దృఢపరచెను. । ఈ నిరీక్షణ మన ఆత్మకు 19
నిశ్చలమును, స్థిరమును, తెరలోపల ప్రవేశించునది
యునైయున్న లంగరువలె ఉన్నది. । నిరంతరము 20
మెల్కీసెదెకు క్రమములో చేరిన ప్రధానయాజకుడై
యేసు మనకంటె ముందుగా మన పక్షము ఆ తెరలో
ప్రవేశించెను.

రాజులను సంహారముచేసి[5] తిరిగి వచ్చుచున్న 7
అబ్రాహామును ఎవడు కలిసికొని అతనిని ఆశీర్వ 2
దించెనో, యెవనికి అబ్రాహాము అన్నిటిలో దశ 3
మాంశము ఇచ్చెనో, ఆ షాలేమురాజును మహోన్న
తుడగు దేవుని యాజకుడునైన మెల్కీసెదెకు నిరం
తరము యాజకుడుగా ఉన్నాడు. అతని పేరుకు
మొదట నీతికి రాజనియు, తరువాత సమాధానపు
రాజనియు అర్థమిచ్చునట్టి షాలేమురాజని అర్థము.
అతడు తండ్రిలేనివాడును తల్లిలేనివాడును వంశావళి

[1] లేక, ఇతనిగూర్చి. [2] లేక, పరిపూర్ణులు [3] మూలభాషలో-రుచిచూచిన. [4] ఆదికాం. 22: 16, 17. [5] ఆదికాం. 14: 18-20.

లేనివాడును, జీవితకాలమునకు[1] ఆదియైనను జీవనము
నకు అంతమైనను లేనివాడునైయుండి దేవుని కుమా
రుని పోలియున్నాడు.
4 ఇతడెంత ఘనుడో చూడుడి. మూలపురుషుడైన
అబ్రాహాము అతనికి కొల్లగొన్న శ్రేష్ఠమైన వస్తువు
5 లలో దశమాంశము ఇచ్చెను. । మరియు లేవి కుమా
ళ్లలోనుండి యాజకత్వము పొందువారు, తమ సహో
దరులు అబ్రాహాము గర్భవాసమునుండి పుట్టినను,
ధర్మశాస్త్రముచొప్పున వారియొద్ద, అనగా ప్రజలయొద్ద
దశమాంశమును పుచ్చుకొనుటకు ఆజ్ఞను పొందియు
6 న్నారు గాని । వారితో సంబంధించిన వంశావళి లేని
వాడైన మెల్కీసెదెకు అబ్రాహామునొద్ద దశమాంశ
మును పుచ్చుకొని వాగ్దానములను పొందినవానిని
7 ఆశీర్వదించెను. । తక్కువవాడు ఎక్కువవానిచేత
ఆశీర్వదింపబడునను మాట కేవలము నిరాక్షేపమై
8 యున్నది. । మరియు (లేవి క్రమము చూడగా)
చావుకులోనైనవారు దశమాంశములను పుచ్చుకొను
చున్నారు. అయితే ఈ క్రమము చూడగా, జీవించు
చున్నాడని సాక్ష్యము పొందినవాడు పుచ్చుకొను
9 చున్నాడు. । అంతేకాక ఒక విధమున చెప్పినయెడల
దశమాంశములను పుచ్చుకొను లేవియు అబ్రాహాము
10 ద్వారా దశమాంశములను ఇచ్చెను. । ఏలాగనగా
మెల్కీసెదెకు అతని (పితరుని) కలిసికొనినప్పుడు లేవి
తన పితరుని గర్భములో ఉండెను.
11 ఆ లేవీయులు యాజకులైయుండగా ప్రజలకు
ధర్మశాస్త్రమియ్యబడెను గనుక ఆ యాజకులవలన సం
పూర్ణసిద్ధి కలిగినపక్షమందు అహరోను క్రమములో
చేరినవాడని చెప్పబడక మెల్కీసెదెకు క్రమములో
చేరి వేరొక యాజకుడు రావలసిన అవసరమేమి? ।
12 ఇదియుగాక యాజకులు మార్చబడిన పక్షమున అవశ్య
13 ముగా (యాజక) ధర్మము సహా మార్చబడును. । ఎవని
గూర్చి యీ సంగతులు చెప్పబడెనో ఆయన వేరొక
గోత్రములో పుట్టెను; ఆ గోత్రములోనివాడెవడును
14 బలిపీఠమునొద్ద పరిచర్యచేయలేదు. । మన ప్రభువు
యూదా సంతానమందు జన్మించెననుట స్పష్టమే; ఆ
గోత్రవిషయములో యాజకులనుగూర్చి మోషే
15 యేమియు చెప్పలేదు. । మరియు శరీరానుసారముగా
16 నెరవేర్చబడు ఆజ్ఞగల ధర్మశాస్త్రమునుబట్టి కాక నాశన
ములేని జీవమునకున్న శక్తినిబట్టి నియమింపబడి మెల్కీ
సెదెకును పోలినవాడైన వేరొక యాజకుడు వచ్చి
యున్నాడు. కావున మేము చెప్పిన సంగతి మరింత
17 విశదమైయున్నది. । ఏలయనగా

—నీవు నిరంతరము మెల్కీసెదెకు క్రమములో
చేరిన యాజకుడవై యున్నావు

అని ఆయనవిషయమై సాక్ష్యము చెప్పబడెను.[2] । ఆ 18
ధర్మశాస్త్రము దేనికిని సంపూర్ణసిద్ధి కలుగజేయలేదు గనుక 19
ముందియ్యబడిన ఆజ్ఞ బలహీనమైనందునను నిష్
ప్రయోజనమైనందునను అది నివారణచేయబడి యు
న్నది; అంతకంటె శ్రేష్ఠమైన నిరీక్షణ దానివెంట
ప్రవేశపెట్టబడెను. దీనిద్వారా దేవునియొద్దకు మనము
చేరుచున్నాము. । మరియు ప్రమాణములేకుండ యేసు 20
యాజకుడు కాలేదు గనుక ఆయన మరి శ్రేష్ఠమైన 22
నిబంధనకు పూటకాపాయెను. వారైతే ప్రమాణము
లేకుండ యాజకులవుదురు గాని యీయన

— నీవు నిరంతరము యాజకుడవై యున్నావని
ప్రభువు ప్రమాణము చేసెను; ఆయన పశ్చా
త్తాపపడడు

అని యీయనతో చెప్పినవానివలన ప్రమాణపూర్వక
ముగా యాజకుడాయెను. । మరియు ఆ యాజకులు 23
మరణము పొందుటచేత ఎల్లప్పుడు ఉండ సాధ్యము
కానందున అనేకులైరి గాని । ఈయన నిరంతరము 24
ఉన్నవాడు గనుక మార్పులేని యాజకత్వము కలిగిన
వాడాయెను. । ఈయన తనద్వారా దేవునియొద్దకు 25
వచ్చువారిపక్షము విజ్ఞాపనముచేయుటకు నిరంతరము
జీవించుచున్నాడు గనుక వారిని సంపూర్ణముగా రక్షిం
చుటకు శక్తిమంతుడై యున్నాడు.
పవిత్రుడును, నిర్దోషియు, నిష్కల్మషుడును, పాపు 26
లలో చేరక ప్రత్యేకముగా ఉన్నవాడును, ఆకాశ
మండలముకంటె మిక్కిలి హెచ్చయినవాడునైన యిట్టి
ప్రధానయాజకుడు మనకు సరిపోయినవాడు.[3] । ధర్మ 27
శాస్త్రము బలహీనతగల మనుష్యులను యాజకులగా 28
నియమించును గాని ధర్మశాస్త్రమునకు తర్వాత వచ్చిన
ప్రమాణపూర్వకమైన వాక్యము నిరంతరమును సం
పూర్ణసిద్ధిపొందిన కుమారుని నియమించెను గనుక,
ఈయన ఆ ప్రధానయాజకులవలె మొదట తన
స్వంత పాపములకొరకును తరువాత ప్రజల పాపముల
కొరకును దినదినము బలులను అర్పింపవలసిన అవ
సరముగలవాడు కాడు; తన్నుతాను అర్పించుకొన్న
ప్పుడు ఒక్కసారే యీ పనిచేసి ముగించెను.
మేము వివరించుచున్న సంగతులలో సారాంశ 8
మేదనగా, మనకు అట్టి ప్రధానయాజకుడు ఒక
డున్నాడు. ఆయన పరిశుద్ధాలయమునకు,[4] అనగా 2
మనుష్యుడుకాక ప్రభువే స్థాపించిన నిజమైన గుడార
మునకు పరిచారకుడైయుండి, పరలోకమందు మహా
మహుని[5] సింహాసనమునకు కుడిపార్శ్వమున ఆసీను
డాయెను. । ప్రతి ప్రధానయాజకుడు అర్పణలను 3
బలులను అర్పించుటకు నియమింపబడును. అందుచేత
అర్పించుటకు ఈయనకు ఏమైన ఉండుట అవశ్యము. ।

1 మూలభాషలో—దినములకు. 2 కీర్తన, 110: 4. 3 లేక, తగినవాడు. 4 మూలభా.—పరిశుద్ధ వస్తువులకు. 5 మూలభా.—మహాత్మ్యముయొక్క.

4 ధర్మశాస్త్రప్రకారము అర్పణలు అర్పించువారున్నారు
గనుక ఈయన భూమిమీద ఉన్న పక్షమున యాజ
5 కుడైయుండడు. । మోషే గుడారము అమర్చబోయి
నప్పుడు

—కొండమీద నీకు చూపబడిన మాదిరిచొప్పున
సమస్తమును చేయుటకు జాగ్రత్తపడుము[1]

అని దేవునిచేత హెచ్చరింపబడిన ప్రకారము ఈ
యాజకులు పరలోకసంబంధమగు వస్తువుల ఛాయా
రూపకమైన గుడారమునందు సేవచేయుదురు. ।
6 ఈయనయైతే ఇప్పుడు మరి యెక్కువైన వాగ్దానము
లనుబట్టి నియమింపబడిన మరి యెక్కువైన నిబంధనకు
మధ్యవర్తియై యున్నాడు గనుక మరి శ్రేష్ఠమైన సేవ
7 కత్వము పొందియున్నాడు. । ఏలయనగా ఆ మొదటి
నిబంధన లోపములేనిదైతే రెండవదానికి అవకాశ
8 ముండ నేరదు. । అయితే ఆయన ఆక్షేపించి వారితో
ఈలాగు చెప్పుచున్నాడు[2]

—ప్రభువు ఇట్లనెను—ఇదిగో యొక కాలము
వచ్చుచున్నది.
అప్పటిలో ఇశ్రాయేలు ఇంటివారితోను
యూదా ఇంటివారితోను
నేను క్రొత్తనిబంధన చేయుదును.
9 అది నేను ఐగుప్తుదేశములోనుండి
వీరి పితరులను వెలుపలికి తీసికొని వచ్చుటకు
వారిని చెయ్యి పట్టుకొనిన దినమున
వారితో నేను చేసిన నిబంధనవంటిది కాదు.
ఏమనగా వారు నా నిబంధనలో నిలువలేదు
గనుక నేను వారిని అలక్ష్యము చేసితినని
ప్రభువు చెప్పుచున్నాడు.
10 ఆ దినములైన తరువాత
ఇశ్రాయేలు ఇంటివారితో
నేను చేయబోవు నిబంధన యేదనగా
నా ధర్మవిధులను వారి మనస్సులో ఉంచి
వారి హృదయములమీద వాటిని వ్రాయుదును
నేను వారికి దేవుడనై యుందును
వారు నాకు ప్రజలై యుందురు.
11 వారిలో ఎవడును
—ప్రభువును తెలిసికొనుడని
తన పట్టణస్థునికైనను తన సహోదరునికైనను
బోధింపడు
వారిలో చిన్నలు మొదలుకొని పెద్దల పర్యంతము
అందరును నన్ను తెలిసికొందురు.
12 నేను వారి అక్రమముల విషయమై దయగలిగి
వారి పాపములను ఇకను ఎన్నడును జ్ఞాపకము
చేసికొనననని

ప్రభువు సెలవిచ్చుచున్నాడు.
ఆయన క్రొత్తనిబంధన అని చెప్పుటచేత మొదటిది 13
పాతదిగా చేసియున్నాడు. ఏది పాతగిలి ఉడిగి
పోవునో అది నివర్తనమగుటకు[3] సిద్ధముగా ఉన్నది.

9

మొదటి (నిబంధనకైతే) సేవానియమములును
ఈ లోకసంబంధమైన పరిశుద్ధస్థలమును ఉండెను. ।
ఏలాగనగా మొదట ఒక గుడారమేర్పరచబడెను. 2
అందులో దీపస్తంభమును, బల్లయు, (దానిమీద) ఉంచ
బడిన రొట్టెలును ఉండెను, దానికి పరిశుద్ధస్థలమని
పేరు. । రెండవ తెరకావల అతిపరిశుద్ధస్థలమను 3
గుడారముండెను. । అందులో సువర్ణధూపార్తియు, 4
అంతటను బంగారురేకులతో తాపబడిన నిబంధనమంద
సమును ఉండెను. ఆ మందసములో మన్నాగల
బంగారు పాత్రయు, చిగిరించిన అహరోను చేతి
కర్రయు, నిబంధన పలకలును ఉండెను. । దానిపైని 5
కరుణాపీఠమును కమ్ముకొనుచున్న మహిమగల కెరూబు
లుండెను. వీటినిగూర్చి యిప్పుడు వివరముగా చెప్పు
వల్లపడదు. । ఇవి ఈలాగు ఏర్పరచబడినప్పుడు యాజ 6
కులు సేవచేయుచు, నిత్యమును ఈ మొదటి గుడారము
లోకి వెళ్లుదురు గాని । సంవత్సరమునకు ఒక్కసారి 7
మాత్రమే ప్రధానయాజకుడొక్కడే రక్తము చేత
పట్టుకొనుచు రెండవ గుడారములోకి ప్రవేశించును.
ఆ రక్తము తనకొరకును ప్రజల అజ్ఞానకృతములకొరకు
కును అతడర్పించును. । దీనినిబట్టి ఆ మొదటి గుడార 8
మింక నిలుచుచుండగా అతిపరిశుద్ధస్థలములో ప్రవే
శించు మార్గము బయలుపరచబడలేదని పరిశుద్ధాత్మ
తెలియజేయుచున్నాడు. । ఆ గుడారము ప్రస్తుత 9
కాలమునకు ఉపమానముగా ఉన్నది. ఈ ఉపమానా
ర్థమునుబట్టి మనస్సాక్షి విషయములో ఆరాధకునికి
సంపూర్ణసిద్ధి కలుగజేయలేని అర్పణలును బలులును
అర్పింపబడుచున్నవి. । ఇవి దిద్దుబాటు జరుగు కాలము 10
వచ్చువరకు విధింపబడి, అన్నపానములతోను నానా
విధములైన ప్రక్షాళనములతోను[4] సంబంధించిన శరీరా
చారములు మాత్రమై యున్నవి.
అయితే క్రీస్తు రాబోవుచున్న[5] మేలులవిషయమై
ప్రధానయాజకుడుగా వచ్చి తానే నిత్యమైన విమో
చన సంపాదించి, హస్తకృతము కానిది, అనగా ఈ
సృష్టి సంబంధము కానిదియు, మరి ఘనమైనదియు,
పరిపూర్ణమైనదియునైన గుడారముద్వారా, । మేకల 12
యొక్కయు కోడెలయొక్కయు రక్తముతో కాక,
తన స్వరక్తముతో ఒక్కసారే పరిశుద్ధస్థలములో
ప్రవేశించెను. । ఏలయనగా మేకలయొక్కయు ఎడ్ల 13
యొక్కయు రక్తమును, మైలపడినవారిమీద ఆవుదూడ
బూడిదె చల్లుటయు, శరీరశుద్ధి కలుగునట్లు వారిని

1 నిర్గమకాం. 25: 40. 2 యిర్మీ. 31: 31–34. 3 మూలభాషలో—అదృశ్యమగుటకు. 4 మూలభా.—బాప్తిస్మములతోను. 5 [illegible] ప్రాచీనప్రతులలో—కలిగియున్న, అని పాఠాంతరము.

14 పరిశుద్ధపరచినయెడల, । నిత్యుడగు ఆత్మద్వారా తన్ను
తాను దేవునికి నిర్దోషినిగా అర్పించుకొనిన క్రీస్తు
యొక్క రక్తము, నిర్జీవక్రియలను విడిచి జీవముగల
దేవుని సేవించుటకు మీ[1] మనస్సాక్షిని ఎంతో యెక్కు
15 వగా శుద్ధిచేయును. । ఈ హేతువుచేత మొదటి
నిబంధనకాలములో జరిగిన అపరాధములనుండి విమో
చనము కలుగుటకై ఆయన మరణము పొందినందున,
పిలువబడినవారు నిత్యమైన స్వాస్థ్యమును గూర్చిన
వాగ్దానమును పొందు నిమిత్తము ఆయన క్రొత్తనిబంధ
16 నకు మధ్యవర్తియై యున్నాడు. । మరణశాసనమెక్కడ
ఉండునో అక్కడ మరణశాసనము వ్రాసినవాని మర
17 ణము రుజువుపరచుట అవశ్యము. । ఆ శాసనమును
వ్రాసినవాడు మరణము పొందితేనే అది చెల్లును; అది
వ్రాసినవాడు జీవించుచుండగా అది ఎప్పుడైన చెల్లు
18 నా? । ఇందుచేత మొదటి నిబంధనకూడ రక్తములేకుండ
19 ప్రతిష్ఠింపబడలేదు. । ధర్మశాస్త్రప్రకారము మోషే
20 ప్రతియాజ్ఞను ప్రజలతో చెప్పినతరువాత, ఆయన
నీళ్లతోను, రక్తవర్ణముగల గొఱ్ఱెబొచ్చుతోను, హిస్సో
పుతోను, కోడెలయొక్కయు మేకలయొక్కయు రక్త
మును తీసికొని—దేవుడు మీకొరకు విధించిన నిబంధన
రక్తమిదే అని చెప్పుచు, గ్రంథముమీదను ప్రజలందరి
21 మీదను ప్రోక్షించెను.[2] । అదేవిధముగా గుడారము
మీదను సేవాపాత్రలన్నిటిమీదను ఆ రక్తమును
22 ప్రోక్షించెను. । మరియు ధర్మశాస్త్రప్రకారము సమస్త
వస్తువులును రక్తముచేత శుద్ధిచేయబడుననియు, రక్తము
చిందింపకుండ పాపక్షమాపణ కలుగదనియు సామాన్య
ముగా చెప్పవచ్చును.

23 పరలోకమందున్నవాటిని పోలిన వస్తువులు ఇట్టి
బలులవలన శుద్ధిచేయబడవలసియుండెను గాని పరలోక
సంబంధమైనవి వీటికంటె శ్రేష్ఠమైన బలులవలన శుద్ధి
24 చేయబడవలసియుండెను. । అందువలన నిజమైన పరి
శుద్ధస్థలమును పోలి హస్తకృతమైన పరిశుద్ధస్థలములలో
క్రీస్తు ప్రవేశింపలేదు గాని, యిప్పుడు మనకొరకు
దేవుని సముఖమందు కనబడుటకు పరలోకమందే
25 ప్రవేశించెను. । అంతేకాదు, ప్రధానయాజకుడు ప్రతి
సంవత్సరము తనదికాని రక్తము తీసికొని పరిశుద్ధస్థలము
లోకి ప్రవేశించినట్లు, ఆయన అనేక పర్యాయములు
తన్నుతాను అర్పించుకొనుటకు ప్రవేశింపలేదు. ।
26 అట్లయినయెడల జగత్తు పునాదివేయబడినది మొదలు
కొని ఆయన అనేక పర్యాయములు శ్రమపడవలసి
వచ్చును. అయితే ఆయన యుగముల సమాప్తియందు
తన్నుతానే బలిగా అర్పించుకొనుటవలన పాపనివారణ
చేయుటకై యొక్కసారే ప్రత్యక్షపరచబడెను. ।
27 మనుష్యులొక్కసారే మృతిపొందవలెనని నియమింప
28 బడెను; ఆ తరువాత తీర్పు జరుగును. । ఆలాగుననే
క్రీస్తుకూడ అనేకుల పాపములను భరించుటకు ఒక్క
సారే అర్పింపబడి, తనకొరకు కనిపెట్టుకొని యుండు
వారి రక్షణ నిమిత్తము పాప (సంబంధ)ము లేకుండ
రెండవసారి ప్రత్యక్షమగును.

ధర్మశాస్త్రము రాబోవుచున్న మేలుల ఛాయగల 10
దియే గాని ఆ వస్తువుల నిజస్వరూపము గలదికాదు
గనుక ఆ యాజకులు ఏటేట ఎడతెగకుండ అర్పించు
ఒక్కటే విధమైన బలులు వాటిని తెచ్చువారికి ఎన్న
డును సంపూర్ణసిద్ధి కలుగజేయనేరవు. । ఆలాగు చేయ 2
గలిగిన పక్షమందు సేవించువారొక్కసారే శుద్ధపరచ
బడిన తరువాత వారి మనస్సాక్షికి పాపజ్ఞప్తి ఇకను
ఉండదు గనుక వాటిని అర్పించుట మానుదురు గదా. ।
అయితే ఆ బలులు అర్పించుటచేత ఏటేట పాపములు 3
జ్ఞాపకమునకు వచ్చుచున్నవి । ఏలయనగా ఎడ్ల 4
యొక్కయు మేకలయొక్కయు రక్తము పాపములను
తీసివేయుట అసాధ్యము. । కాబట్టి ఆయన ఈ లోక 5
మందు ప్రవేశించునప్పుడు ఈలాగు చెప్పుచున్నాడు[3]

—బలియు అర్పణయు నీవు కోరలేదుగాని
నాకొక శరీరమును అమర్చితివి.
పూర్ణహోమములను 6
పాపపరిహారార్థబలులును నీకిష్టమైనవికావు.
అప్పుడు నేను—గ్రంథపుచుట్టలో నన్నుగూర్చి 7
వ్రాయబడినప్రకారము, దేవా, నీ చిత్తము
నెరవేర్చుటకు ఇదిగో నేను వచ్చియున్నానంటిని.

—బలులు అర్పణలు పూర్ణహోమములు పాపపరి 8
హారార్థబలులును నీవు కోరలేదనియు, అవి నీకిష్టమైనవి
కావనియు పైని చెప్పిన తరువాత । ఆయన — నీ 9
చిత్తము నెరవేర్చుటకు ఇదిగో నేను వచ్చియున్నానని
చెప్పుచున్నాడు. ఇవన్నియు ధర్మశాస్త్రముచొప్పున
అర్పింపబడుచున్నవి. ఆ రెండవదాని స్థిరపరచుటకు
మొదటిదాని కొట్టివేయుచున్నాడు. । యేసుక్రీస్తు 10
యొక్క శరీరము ఒక్కసారియే అర్పింపబడుటచేత ఆ
చిత్తమునుబట్టి మనము పరిశుద్ధపరచబడియున్నాము. ।
మరియు ప్రతి యాజకుడు దినదినము సేవచేయుచు, 11
పాపములను ఎన్నటికిని తీసివేయలేని ఆ బలులనే
మాటిమాటికి అర్పించుచు ఉండును. । ఈయనయైతే 12
పాపములనిమిత్తమై సదాకాలము నిలుచు ఒక్క బలిని 13
అర్పించి, అప్పటినుండి తన శత్రువులు తన పాదము
లకు పాదపీఠముగా చేయబడు పర్యంతము కనిపెట్టుచు
దేవుని కుడిపార్శ్వమున ఆసీనుడాయెను. । ఒక్క 14
అర్పణచేత ఈయన పరిశుద్ధపరచబడువారిని సదాకాల
మునకు సంపూర్ణులనుగా చేసియున్నాడు. । ఈ విష 15
యమై పరిశుద్ధాత్మకూడ మనకు సాక్ష్యమిచ్చుచున్నా
డు. । ఏలాగనగా 16

1 మన, అని పాఠాంతరము. 2 నిర్గమ. 24: 8. 3 కీర్తన, 40: 6–8.

—ఆ దినములైన తరువాత నేను వారికి నియ
మింపబోవు నిబంధన ఏదనగా, నా ధర్మవిధు
లను వారి హృదయమునందుంచి వారి మనస్సు
మీద వాటిని వ్రాయుదును

అని చెప్పిన తరువాత[1]

17 —వారి పాపములను వారి అక్రమములను ఇకను
ఎన్నటికిని జ్ఞాపకముచేసికొనను

అని ప్రభువు చెప్పుచున్నాడు.
18 వీటి క్షమాపణ ఎక్కడ కలుగునో అక్కడ పాపపరి
హారార్థబలి యికను ఎన్నడును ఉండదు.
19 సహోదరులారా, యేసు మనకొరకు ప్రతిష్ఠిం
20 చిన మార్గమున, అనగా నూతనమైనదియు, జీవము
గలదియు, ఆయన శరీరము అను తెరద్వారా యేర్ప
రచబడినదియునైన మార్గమున, ఆయన రక్తమువలన
పరిశుద్ధస్థలమునందు ప్రవేశించుటకు మనకు ధైర్యము
21 కలిగియున్నది గనుకను, । దేవుని యింటిపైన మనకు
22 గొప్ప యాజకుడున్నాడు గనుకను, । మనస్సాక్షికి
కల్మషము తోచకుండునట్లు ప్రోక్షింపబడిన హృదయ
ములు గలవారమును, నిర్మలమైన ఉదకముతో స్నానము
చేసిన శరీరములు గలవారమునైయుండి, విశ్వాసవిషయ
ములో[2] ఆత్మ నిశ్చయత కలిగి, యథార్థమైన హృదయ
ముతో మనము దేవుని సన్నిధానమునకు చేరుదము. ।
23 వాగ్దానము చేసినవాడు నమ్మదగినవాడు గనుక మన
నిరీక్షణ విషయమై మనమొప్పుకొనినది నిశ్చలముగా
24 పట్టుకొందము. । కొందరు మానుకొనుచున్నట్టుగా
25 సమాజముగా కూడుట మానక, ఒకనినొకడు హెచ్చ
రించుచు, ఆ దినము సమీపించుట మీరు చూచిన
కొలది మరి ఎక్కువగా ఆలాగు చేయుచు, ప్రేమ
చూపుటకును సత్కార్యములు చేయుటకును ఒకని
నొకడు పురికొల్పవలెనని[3] ఆలోచింతము.

26 మనము సత్యమునుగూర్చి అనుభవజ్ఞానము పొందిన
తరువాత బుద్ధిపూర్వకముగా పాపము చేసినయెడల
27 పాపములకు బలి యికను ఉండదు గాని । న్యాయపు
తీర్పుకు భయముతో ఎదురుచూచుటయు, విరోధు
లను దహింపబోవు తీక్షణమైన అగ్నియు నికను
28 ఉండును. । ఎవడైనను మోషే ధర్మశాస్త్రమును నిరా
కరించినయెడల ఇద్దరు ముగ్గురు సాక్షుల మాటమీద,
29 కనికరింపకుండ వాని చంపించుదురు. । ఇట్లుండగా
దేవుని కుమారుని, పాదములతో త్రొక్కి, తాను పరి
శుద్ధపరచబడుటకు సాధనమైన నిబంధన రక్తమును
అపవిత్రమైనదిగా ఎంచి, కృపకు మూలమగు ఆత్మను
తిరస్కరించినవాడు ఎంత ఎక్కువైన దండనకు పాత్రు
డుగా ఎంచబడునని మీకు తోచును?

—పగతీర్చుట నా పని, నేనే ప్రతిఫలమిత్తుననియు[4] 30
మరియు

—ప్రభువు తన ప్రజలకు తీర్పు తీర్చును అనియు
చెప్పినవానిని ఎరుగుదుము గదా. । జీవముగల దేవుని 31
చేతిలో పడుట భయంకరము.

అయితే మీరు వెలిగింపబడినమీదట, శ్రమలతో 32
కూడిన గొప్ప పోరాటము సహించిన పూర్వపుదిన
ములు జ్ఞాపకము తెచ్చుకొనుడి. । ఒక విధముగా 33
చూచితే, మీరు నిందలను బాధలను అనుభవించుట
చేత పదిమందిలో ఆరడిపడితిరి; మరియొక విధముగా
చూచితే, వాటి ననుభవించినవారితో పాలివారలైతిరి.।
ఏలాగనగా మీరు ఖైదులో ఉన్నవారిని కరుణించి, 34
మీకు మరి శ్రేష్ఠమైనదియు స్థిరమైనదియునైన స్వాస్థ్య
మున్నదని యెరిగి, మీ ఆస్తి కోలుపోవుటకు సంతోష
ముగా ఒప్పుకొంటిరి. । కాబట్టి మీ ధైర్యమును విడిచి 35
పెట్టకుడి; దానికి ప్రతిఫలముగా గొప్ప బహుమానము
కలుగును. । మీరు దేవుని చిత్తమును నెరవేర్చినవారై 36
వాగ్దానముపొందు నిమిత్తము మీకు ఓరిమి కలిగియుం
డుట అవసరమై యున్నది.

—ఇక కాలము బహు కొంచెముగా ఉన్నది, 37
వచ్చుచున్నవాడు ఆలస్యముచేయక వచ్చును.।
నా యెదుట నీతిమంతుడైనవాడు విశ్వాస 38
మూలముగా జీవించును గాని అతడు వెనుక
తీసినయెడల అతనియందు నా ఆత్మకు సంతోష
ముండదు.[5]

అయితే మనము నశించుటకు వెనుకతీయువారము 39
కాము గాని ఆత్మను రక్షించుకొనుటకు[6] విశ్వాసము
కలిగినవారమై యున్నాము.

విశ్వాసమనునది నిరీక్షింపబడువాటియొక్క నిజ **11**
స్వరూపమును, అదృశ్యమైనవి యున్నవనుటకు రుజు
వునై యున్నది. । దానినిబట్టియే పెద్దలు సాక్ష్యము 2
పొందిరి. । ప్రపంచములు[7] దేవుని వాక్యమువలన 3
నిర్మాణమైనవనియు, అందునుబట్టి దృశ్యమైనది కన
బడెడు పదార్థములచే నిర్మింపబడలేదనియు విశ్వాసము
చేత గ్రహించుకొనుచున్నాము. । విశ్వాసమునుబట్టి 4
హేబెలు కయీనుకంటె శ్రేష్ఠమైన బలి దేవునికి
అర్పించెను. దేవుడతని అర్పణలనుగూర్చి సాక్ష్యమిచ్చి
నప్పుడు అతడు ఆ విశ్వాసమునుబట్టి నీతిమంతుడని
సాక్ష్యము పొందెను. అతడు మృతినొందియు ఆ
విశ్వాసముద్వారా మాటలాడుచున్నాడు. । విశ్వాస 5
మునుబట్టి హనోకు మరణము చూడకుండునట్లు కొని
పోబడెను; అతడు కొనిపోబడకమునుపు దేవునికి
ఇష్టుడైయుండెనని సాక్ష్యము పొందెను; కాగా దేవు
డతని కొనిపోయెను గనుక అతడు కనబడలేదు. ।

1 యిర్మీయా, 31: 34. 2 లేక, విశ్వాసముయొక్క. 3 మూలభాషలో—రేపవలెనని. 4 ద్వితీ. 32: 35. 5 హబక్కూకు, 2: 3, 4.
6 లేక, సంపాదించుకొనుటకు. 7 లేక, యుగములు.

6 విశ్వాసములేకుండ దేవునికి ఇష్టుడైయుండుట అసా
ధ్యము; దేవునియొద్దకు వచ్చువాడు ఆయన యున్నా
డనియు, తన్ను వెదకువారికి ఫలము దయచేయు
7 వాడనియు నమ్మవలెను గదా. । విశ్వాసమునుబట్టి
నోవహు అదివరకు చూడని సంగతులనుగూర్చి దేవుని
చేత హెచ్చరింపబడి భయభక్తులు గలవాడై, తన
యింటివారి రక్షణకొరకు ఒక ఓడను సిద్ధముచేసెను;
అందువలన అతడు లోకముమీద నేరస్థాపనచేసి
విశ్వాసమునుబట్టి కలుగు నీతికి వారసుడాయెను. ।
8 అబ్రాహాము పిలువబడినప్పుడు విశ్వాసమునుబట్టి ఆ
పిలుపునకు లోబడి, తాను స్వాస్థ్యముగా పొందనై
యున్న ప్రదేశమునకు బయలువెళ్లెను. మరియు ఎక్క
9 డికి వెళ్లవలెనో అది ఎరుగక బయలువెళ్లెను. । విశ్వాస
మునుబట్టి అతడును, అతనితో ఆ వాగ్దానమునకు
సమానవారసులైన ఇస్సాకు యాకోబు అనువారును,
గుడారములలో నివసించుచు, అన్యుల దేశములో
10 ఉన్నట్టుగా వాగ్దత్తదేశములో పరవాసులైరి. । ఏల
యనగా దేవుడు దేనికి శిల్పియు నిర్మాణకుడునై
యున్నాడో, పునాదులుగల ఆ పట్టణముకొరకు
11 అబ్రాహాము ఎదురుచూచుచుండెను. । విశ్వాస
మునుబట్టి శారాయు వాగ్దానము చేసినవాడు నమ్మదగిన
వాడని యెంచుకొనెను గనుక తాను వయస్సు గతిం
చినదైనను గర్భము ధరించుటకు శక్తి పొందెను. ।
12 అందుచేత మృతతుల్యుడైన ఆ యొకనినుండి, సంఖ్యకు
ఆకాశ నక్షత్రములవలెను, సముద్రతీరమందలి లెక్కింప
శక్యముకాని యిసుకవలెను సంతానము కలిగెను.
13 వీరందరు ఆ వాగ్దానముల ఫలము అనుభవింపక
పోయినను, దూరమునుండి చూచి వందనముచేసి,
తాము భూమిమీద పరదేశులును యాత్రికులునై
యున్నామని ఒప్పుకొని, విశ్వాసముగలవారై మృతి
14 నొందిరి. । ఈలాగు చెప్పువారు తమ స్వదేశమును
వెదకుచున్నామని విశదపరచుచున్నారు కారా? ।
15 వారు ఏ దేశమునుండి వచ్చిరో ఆ దేశమును జ్ఞాపకమం
దుంచుకొన్నపక్షమున మరల వెళ్లుటకు వారికి వీలు
16 కలిగియుండును. । అయితే వారు మరి శ్రేష్ఠమైన
దేశమును, అనగా పరలోకసంబంధమైన దేశమును
కోరుచున్నారు. అందుచేత తాను వారి దేవుడని అని
పించుకొనుటకు దేవుడు వారినిగూర్చి సిగ్గుపడడు;
ఏలయనగా ఆయన వారికొరకు ఒక పట్టణము సిద్ధ
పరచియున్నాడు.
17 అబ్రాహాము శోధింపబడి విశ్వాసమునుబట్టి ఇస్సా
19 కును బలిగా అర్పించెను. ఎవడు ఆ వాగ్దానములు
సంతోషముతో అంగీకరించెనో,
—ఇస్సాకువలననైనది నీ సంతానమనబడును[1]
అని యెవనితో చెప్పబడెనో, ఆ అబ్రాహాము
మృతులను సహితము లేపుటకు దేవుడు శక్తిమంతుడని
యెంచినవాడై, తన యేకకుమారుని అర్పించి, ఉప
మానరూపకముగా అతని మృతులలోనుండి మరల
పొందెను. । విశ్వాసమునుబట్టి ఇస్సాకు జరుగబోవు 20
సంగతులవిషయమై యాకోబును ఏశావును ఆశీర్వదిం
చెను. । విశ్వాసమునుబట్టి యాకోబు అవసానకాల 21
మందు[2] యోసేపు కుమారులలో ఒక్కొక్కని ఆశీర్వ
దించి తన చేతికఱ్ఱ మొదలుమీద ఆనుకొని దేవునికి
నమస్కారము చేసెను. । యోసేపు తనకు అవసాన 22
కాలము సమీపించినప్పుడు విశ్వాసమునుబట్టి ఇశ్రా
యేలు కుమారుల నిర్గమనమునుగూర్చి ప్రశంసించి తన
శల్యములనుగూర్చి వారికి ఆజ్ఞాపించెను. । మోషే పుట్టి 23
నప్పుడు అతని తలిదండ్రులు ఆ శిశువు సుందరుడై
యుండుట చూచి, విశ్వాసమునుబట్టి రాజాజ్ఞకు భయ
పడక, మూడు మాసములు అతని దాచిపెట్టిరి. ।
మోషే పెద్దవాడైనప్పుడు విశ్వాసమునుబట్టి ఐగుప్తు 24
ధనముకంటె క్రీస్తువిషయమైన నిందగొప్ప భాగ్యమని 26
యెంచుకొని, అల్పకాలము పాపభోగము అనుభ
వించుటకంటె దేవుని ప్రజలతో శ్రమ అనుభవించుట
మేలని యోచించి, ఫరో కుమార్తెయొక్క కుమారుడని
అనిపించుకొనుటకు ఒప్పుకొనలేదు; ఏలయనగా
అతడు ప్రతిఫలముగా కలుగబోవు బహుమానమందు
దృష్టియుంచెను. । విశ్వాసమునుబట్టి అతడు అదృశ్యు 27
డైనవాని చూచుచున్నట్టు స్థిరబుద్ధిగలవాడై, రాజా
గ్రహమునకు భయపడక ఐగుప్తును విడిచిపోయెను. ।
తొలిచూలి పిల్లలను నాశనముచేయువాడు ఇశ్రా 28
యేలీయులను ముట్టకుండు నిమిత్తము అతడు విశ్వాస
మునుబట్టి పస్కాను, రక్తప్రోక్షణ (ఆచారము)ను
ఆచరించెను. । విశ్వాసమునుబట్టి వారు పొడినేలమీద 29
నడిచినట్లు ఎఱ్ఱసముద్రములో బడి నడిచిపోయిరి.
ఐగుప్తీయులు ఆలాగు చేయజూచి మునిగిపోయిరి. ।
విశ్వాసమునుబట్టి యేడు దినములవరకు ప్రదక్షిణము 30
చేయబడిన తరువాత యెరికో గోడలు కూలెను. ।
విశ్వాసమునుబట్టి రాహాబను వేశ్య వేగులవారిని సమా 31
ధానముగా చేర్చుకొనినందున అవిధేయులతోపాటు
నశింపకపోయెను. । ఇకను ఏమి చెప్పుదును? గిద్యోను, 32
బారాకు, సమ్సోను, యెఫ్తా, దావీదు, సమూయేలను
వారినిగూర్చియు, ప్రవక్తలనుగూర్చియు వివరించుటకు
సమయము చాలదు. । వారు విశ్వాసముద్వారా 33
రాజ్యములను జయించిరి; నీతికార్యములను జరిగించిరి;
వాగ్దానములను పొందిరి; సింహముల నోళ్లను మూసిరి; ।
అగ్నిబలమును చల్లార్చిరి; ఖడ్గధారను తప్పించుకొనిరి; 34
బలహీనులుగా ఉండి బలపరచబడిరి; యుద్ధములో
పరాక్రమశాలులైరి; అన్యుల సేనలను పారదోలిరి. ।
స్త్రీలు మృతులైన తమ వారిని పునరుత్థానమువలన మరల 35

1 ఆదికాం. 21: 12.
2 లేక, మరణకాలమందు.

బ్రదికించుకొనిరి. కొందరైతే మరి శ్రేష్ఠమైన పునరు
త్థానము పొందగోరి విడుదల పొందనొల్లక యాతన
36 పెట్టబడిరి. । మరికొందరు తిరస్కారములను కొరడా
దెబ్బలను, మరి బంధకములను ఖైదును అనుభవించిరి. ।
37 రాళ్లతో కొట్టబడిరి, రంపములతో కోయబడిరి,
38 శోధింపబడిరి, ఖడ్గముతో చంపబడిరి, గొఱ్ఱెచర్మ
ములను మేకచర్మములను వేసికొని, దరిద్రులైయుండి
శ్రమపడి హింసపొందుచు, అడవులలోను కొండల
మీదను గుహలలోను సొరంగములలోను తిరుగు
లాడుచు సంచరించిరి. అట్టివారికి ఈ లోకము
39 యోగ్యమైనది కాదు. । వీరందరు తమ విశ్వాసము
40 ద్వారా సాక్ష్యము పొందినవారైనను, మనము లేకుండ
సంపూర్ణులుకాకుండు నిమిత్తము, దేవుడు మనకొరకు
మరి శ్రేష్ఠమైనదానిని ముందుగా సిద్ధపరచెను గనుక
వీరు వాగ్దానఫలము అనుభవింపలేదు.

**12** ఇంత గొప్ప సాక్షి సమూహము మేఘమువలె
2 మనలను ఆవరించియున్నందున మనముకూడ ప్రతి
భారమును, సుళువుగా చిక్కులబెట్టు పాపమును విడిచి
పెట్టి, విశ్వాసమునకు కర్తయు[1] దాని కొనసాగించు
వాడునైన యేసువైపు చూచుచు, మనయెదుట ఉంచ
బడిన పందెములో ఓపికతో పరుగెత్తుదము. ఆయన
తనయెదుట ఉంచబడిన ఆనందముకొరకై అవమాన
మును నిర్లక్ష్యపెట్టి, సిలువను సహించి, దేవుని సింహా
సనముయొక్క కుడిపార్శ్వమున ఆసీనుడైయున్నాడు. ।
3 మీరు అలసటపడకయు మీ ప్రాణములు విసుకకయు
ఉండునట్లు, పాపాత్ములు తమ స్వంత హానికే[2] చేసిన
తిరస్కారమంతయు ఓర్చుకొనిన ఆయనను తలంచు
4 కొనుడి. । మీరు పాపముతో పోరాడుటలో రక్తము
5 కారునంతగా ఇంక దానిని ఎదిరింపలేదు. । మరియు
6 —నా కుమారుడా, ప్రభువు చేయు శిక్షను
నిర్లక్ష్యపెట్టకుము
ఆయన నిన్ను గద్దించినప్పుడు విసుకకుము
ప్రభువు తాను ప్రేమించువానిని శిక్షించి తాను
స్వీకరించు ప్రతి కుమారుని దండించును
అని కుమారులతో సంభాషించినట్లు మీతో సంభా
షించు ఆయన హెచ్చరికను మరచితిరి.[3]
7 శిక్షాఫలము పొందుటకై మీరు సహించుచున్నారు;
దేవుడు కుమారులనుగా మిమ్మును చూచుచున్నాడు.
8 తండ్రి శిక్షింపని కుమారుడెవడు? । కుమాళ్లయినవారం
దరు శిక్షలో పాలుపొందుచున్నారు, మీరు పొందని
9 యెడల దుర్బీజులేగాని కుమారులుకారు. । మరియు
శరీరసంబంధులైన తండ్రులు మనకు శిక్షకులై యుండిరి.
వారియందు భయభక్తులు కలిగియుంటిమి; అట్లయితే
ఆత్మలకు తండ్రియైనవానికి మరి ఎక్కువగా లోబడి
బ్రదుకవలెనుగదా? । వారు కొన్ని దినములమట్టుకు 10
తమ కిష్టమువచ్చినట్టు మనలను శిక్షించిరిగాని మనము
తన పరిశుద్ధతలో పాలుపొందవలెనని మన మేలు
కొరకే ఆయన శిక్షించుచున్నాడు. । మరియు ప్రస్తుత 11
మందు సమస్తశిక్షయు దుఃఖకరముగా కనబడునేగాని
సంతోషకరముగా కనబడదు. అయినను దానియందు
అభ్యాసము కలిగినవారికి అది నీతియను సమాధానకర
మైన ఫలమిచ్చును. । కాబట్టి వడలిన చేతులను సడలిన 12
మోకాళ్లను చాపుడి. । మరియు కుంటికాలు బెణకక 13
బాగుపడునిమిత్తము మీ పాదములకు మార్గములను
సరళము చేసికొనుడి.[4]

అందరితో సమాధానమును పరిశుద్ధతయు కలిగి 14
యుండుటకు ప్రయత్నించుడి. పరిశుద్ధతలేకుండ ఎవ
డును ప్రభువును చూడడు. । మీలో ఎవడైనను దేవుని 15
కృపను పొందకుండ తప్పిపోవునేమో అనియు, చేదైన
వేరు ఏదైనను మొలిచి కలవరపరచుటవలన అనేకులు
అపవిత్రులై పోవుదురేమో అనియు, । ఒకపూట 16
కూటికొరకు తన జ్యేష్ఠత్వపు హక్కును అమ్మివేసిన
ఏశావువంటి భ్రష్టుడైనను వ్యభిచారియైనను ఉండు
నేమో అనియు, జాగ్రత్తగా చూచుకొనుడి. । ఏశావు 17
ఆ తరువాత ఆశీర్వాదము పొందగోరి కన్నీళ్లు విడు
చుచు దానికోసరము శ్రద్ధతో వెదకినను, మారు
మనస్సుపొంద నవకాశము దొరకక విసర్జింపబడెనని
మీ రెరుగుదురు.[5]

స్పృశించి తెలిసికొనదగినట్టియు, మండుచున్న 18
ట్టియు (కొండకును), అగ్నికిని, కారు మేఘమునకును,
గాఢాంధకారమునకును, తుఫానుకును, । బూరధ్వని 19
కిని, మాటల ధ్వనికిని మీరు వచ్చియుండలేదు. ఒక 20
జంతువైనను ఆ కొండను తాకినయెడల రాళ్లతో
కొట్టబడవలెనని ఆజ్ఞాపించిన మాటకు వారు తాళలేక,
ఆ ధ్వని వినినవారు మరి ఏ మాటయు తమతో చెప్ప
వలదని బతిమాలుకొనిరి. । మరియు ఆ దర్శనమెంతో 21
భయంకరముగా ఉన్నందున మోషే—నేను మిక్కిలి
భయపడి వణకుచున్నాననెను. । ఇప్పుడైతే సీయోనను 22
కొండకును జీవముగల దేవుని పట్టణమునకు, అనగా
పరలోకపు యెరూషలేమునకును, వేవేలకొలది దేవ
దూతలయొద్దకును, । పరలోకమందు వ్రాయబడి 23
యున్న జ్యేష్ఠుల సంఘమునకును, వారి మహోత్సవ
మునకును, అందరి న్యాయాధిపతియైన దేవునియొద్ద
కును, సంపూర్ణసిద్ధి పొందిన నీతిమంతుల ఆత్మలయొద్ద
కును, । క్రొత్తనిబంధనకు మధ్యవర్తియైన యేసునొద్ద 24
కును, హేబెలుకంటె మరి శ్రేష్ఠముగ పలుకు ప్రోక్షణ
రక్తమునకును మీరు వచ్చియున్నారు. । మీకు బుద్ధి 25
చెప్పుచున్నవానిని నిరాకరింపకుండునట్లు చూచు

[1] మూలభాషలో—సేనాధిపతియు. [2] కొన్ని ప్రాచీన ప్రతులలో—తనకు వ్యతిరేకముగా అని పాఠాంతరము. [3] సామె. 3: 11, 12.
[4] యెషయా, 35: 3; సామె. 4: 26. [5] ఆదికాం. 27: 30-40.

కొనుడి. వారు భూమిమీదనుండి బుద్ధిచెప్పినవానిని
నిరాకరించినప్పుడు తప్పించుకొనకపోయినయెడల,
పరలోకమునుండి బుద్ధిచెప్పుచున్నవానిని విసర్జించు
మనము తప్పించుకొనకపోవుట మరి నిశ్చయము గదా.।
అప్పుడాయన శబ్దము భూమిని చలింపచేసెను గాని
యిప్పుడు

—నేనింకొకసారి భూమిని మాత్రమేకాక ఆకాశ
మును కూడ కంపింపచేతును

అని మాట యిచ్చియున్నాడు.[1] । —ఇంకొకసారి అను
మాట చలింపచేయబడనివి నిలుకడగా ఉండునిమిత్తము
అవి సృష్టింపబడినవన్నట్టు చలింపచేయబడినవి
బొత్తుగా తీసివేయబడునని అర్థమిచ్చుచున్నది. ।
మనము నిశ్చలమైన రాజ్యమును పొందియున్నాము
గనుక (దైవ) కృప కలిగియుందము. ఆ కృప కలిగి
వినయభయభక్తులతో దేవునికి ప్రీతికరమైన సేవచేయు
దము; మన దేవుడు దహించు అగ్నియై యున్నాడు.[2]

సహోదరప్రేమ నిలువరముగా ఉండవలెను.
ఆతిథ్యము చేయ మరవకుడి; దానివలన కొందరు ఎరు
గకయే దేవదూతలకు ఆతిథ్యముచేసిరి.[3] । మీరు
వారితోకూడ బంధింపబడినట్టు బంధింపబడినవారిని
జ్ఞాపకము చేసికొనుడి. మీరును శరీరముతో ఉన్నారు
గనుక బాధపడువారిని జ్ఞాపకము చేసికొనుడి. ।
వివాహము అన్నివిషయములలో[4] ఘనమైనదిగాను,
పానుపు నిష్కల్మషమైనదిగాను, ఉండవలెను; వేశ్యా
సంగులకును వ్యభిచారులకును దేవుడు తీర్పు తీర్చును. ।
ధనాపేక్షలేని మనస్సుగలవారై మీకు కలిగినవాటితో
తృప్తిపొంది యుండుడి.

—నిన్ను ఏమాత్రమును విడువను, నిన్ను ఎన్నడును
ఎడబాయను అని ఆయనయే చెప్పెను గదా.[5] । కాబట్టి

—ప్రభువు నాకు సహాయుడు, నేను భయపడను,
నరమాత్రుడు నాకేమి చేయగలడు?[6]

అని మంచి ధైర్యముతో చెప్పగలవారమై యున్నాము.

మీకు దేవుని వాక్యము బోధించి మీపైని నాయ
కులుగా ఉండినవారిని జ్ఞాపకముచేసికొని, వారి
ప్రవర్తన ఫలమును[7] శ్రద్ధగా తలంచుకొనుచు, వారి
విశ్వాసము అనుసరించుడి. । యేసుక్రీస్తు నిన్న, నేడు,
ఒక్కటేరీతిగా ఉన్నాడు; అవును యుగయుగములకు
ఒక్కటేరీతిగా ఉండును. । నానావిధములైన అన్య
బోధలచేత త్రిప్పబడకుడి. భోజనపదార్థములనుబట్టి
కాక కృపనుబట్టియే హృదయము స్థిరపరచుకొనుట
మంచిది; భోజనములనుబట్టి ప్రవర్తించినవారికి ఏమియు
ప్రయోజనము కలుగలేదు. । మనకొక బలిపీఠమున్నది;
దానిసంబంధమైనవాటిని తినుటకు గుడారములో సేవ
చేయువారికి **అధికారము లేదు.** । వేటిరక్తము పాప 11
పరిహారార్థముగ పరిశుద్ధస్థలములోకి ప్రధానయాజ
కునిచేత తేబడునో ఆ జంతువుల కళేబరములు శిబిర
మునకు వెలపట దహింపబడును.[8] । కావున యేసు 12
కూడ తన స్వరక్తముచేత ప్రజలను పరిశుద్ధపరచుటకై
గవిని వెలపట శ్రమపొందెను. । కాబట్టి మనమాయన 13
నిందను భరించుచు శిబిరము వెలపలికి ఆయనయొద్దకు
వెళ్లుదము. । నిలువరమైన పట్టణము మనకిక్కడ లేదు 14
గాని యుండబోవుచున్నదాని కొరకు ఎదురుచూచు
చున్నాము.[9] । కాబట్టి ఆయనద్వారా మనము దేవునికి 15
ఎల్లప్పుడును స్తుతియాగము చేయుదము, అనగా
ఆయన నామమును ఒప్పుకొనుచు జిహ్వాఫలము
అర్పించుదము. । ఉపకారమును ధర్మమును చేయ 16
మరచిపోకుడి, అట్టి యాగములు దేవునికిష్టమైనవి. ।
మీపైని నాయకులుగా ఉన్నవారు లెక్క ఒప్పచెప్ప 17
వలసినవారివలె మీ ఆత్మలను కాయుచున్నారు; వారు
దుఃఖముతో ఆ పని చేసినయెడల మీకు నిష్ప్రయో
జనము గనుక దుఃఖముతో కాక ఆనందముతో చేయు
నట్లు వారి మాట విని వారికి లోబడియుండుడి.

మా నిమిత్తము ప్రార్థనచేయుడి; మేమన్నివిషయ 18
ములలోను యోగ్యముగా ప్రవర్తింప గోరుచు మంచి
మనస్సాక్షి కలిగియున్నామని నమ్ముకొనుచున్నాము. ।
మరియు నేను మరి త్వరగా మీయొద్దకు మరల వచ్చు 19
నట్లు ఈలాగు చేయవలెనని మరి ఎక్కువగా మిమ్మును
బతిమాలుకొనుచున్నాను.

గొఱ్ఱెల గొప్ప కాపరియైన యేసు అను మన 20-
ప్రభువును నిత్యమైన నిబంధన సంబంధమగు రక్తమును 21
బట్టి మృతులలోనుండి లేపిన సమాధానకర్తయగు
దేవుడు, యేసుక్రీస్తుద్వారా తన దృష్టికి అనుకూలమైన
దానిని మనలో[10] జరిగించుచు, ప్రతి మంచి విషయము
లోను తన చిత్తప్రకారము చేయుటకు మిమ్మును సిద్ధ
పరచును గాక. యేసుక్రీస్తుకు యుగయుగములకు
మహిమ కలుగునుగాక. ఆమేన్.

సహోదరులారా, మీకు సంక్షేపముగా వ్రాసి 22
యున్నాను గనుక ఈ హెచ్చరికమాటను సహించుడని
మిమ్మును వేడుకొనుచున్నాను. । మన సహోదరుడైన 23
తిమోథెయుకు విడుదల కలిగినదని తెలిసికొనుడి.
అతడు శీఘ్రముగా వచ్చినయెడల అతనితోకూడ
వచ్చి మిమ్మును చూచెదను.

మీపైని నాయకులైనవారికందరికిని పరిశుద్ధులకందరి 24
కిని నా వందనములు చెప్పుడి. ఇతలియవారు మీకు
వందనములు చెప్పుచున్నారు.

కృప మీ అందరికి తోడైయుండును గాక. ఆమేన్. 25

1 హగ్గయి, 2: 6. 2 ద్వితీ. 4: 24. 3 ఆదికాం. 18: 3; 19: 2, 3. 4 లేక, అందరిలో. 5 ద్వితీ. 31: 6; యెహో. 1: 6.
ర, 118: 6. 7 లేక, వారు అంతమువరకు నడుచుకొనిన రీతిని. 8 లేవీయకాండము, 16: 27. 9 మూలభాషలో—వెదకుచున్నాము.
నేక ప్రాచీనప్రతులలో—మీలో అని పాఠాంతరము.

# యాకోబు భక్తకోటికి వ్రాసిన పత్రిక

1 దేవునియొక్కయు ప్రభువైన యేసుక్రీస్తు[1]యొక్క-
యు దాసుడైన యాకోబు అన్యదేశములయందు చెదిరి
యున్న పన్నెండుగోత్రములవారికి (శుభమని చెప్పి)
వ్రాయునది.
2 నా సహోదరులారా, మీ విశ్వాసమునకు కలుగు
3 పరీక్ష ఓర్పును పుట్టించునని యెరిగి, మీరు నానా
విధములైన శోధనలలో పడునప్పుడు అది మహానంద
4 మని యెంచుకొనుడి. । మీరు సంపూర్ణులును, అనూ
నాంగులును, ఏ విషయములోనైనను కొదువలేని
వారునై యుండునట్లు ఓర్పు తన క్రియను కొనసాగింప
వలెను.
5 మీలో ఎవనికైనను జ్ఞానము కొదువగా ఉన్న
యెడల అతడు దేవుని అడుగవలెను, అప్పుడది అతనికి
అనుగ్రహింపబడును. ఆయన ఎవనిని గద్దింపక అంద
6 రికిని ధారాళముగ దయచేయువాడు. । అయితే అతడు
ఏమాత్రమును సందేహింపక విశ్వాసముతో అడుగ
వలెను; సందేహించువాడు గాలిచేత రేపబడి యెగిరి
7 పడు సముద్రతరంగమును పోలియుండును. । అట్టి
8 మనుష్యుడు ద్విమనస్కుడై, తన సమస్త మార్గముల
యందు అస్థిరుడు గనుక ప్రభువువలన తనకేమైనను
దొరుకునని తలంచుకొనరాదు.
9 దీనుడైన సహోదరుడు తనకు కలిగిన ఉన్నతదశ
యందు అతిశయింపవలెను, ధనవంతుడైన సహో
దరుడు తనకు కలిగిన దీనదశయందు అతిశయింప
10 వలెను. । ఏలయనగా ఇతడు గడ్డిపువ్వువలె గతించి
11 పోవును. । సూర్యుడుదయించి వడగాలి కొట్టి గడ్డిని
మాడ్చివేయగా దాని పువ్వు రాలును, దాని స్వరూప
సౌందర్యమును నశించును; ఆలాగే ధనవంతుడును తన
ప్రయత్నములలో[2] వాడిపోవును.
12 శోధన సహించువాడు ధన్యుడు; అతడు శోధనకు
నిలిచినవాడై ప్రభువు తన్ను ప్రేమించువారికి వాగ్దా
13 నముచేసిన జీవకిరీటము పొందును. । దేవుడు కీడువిష
యమై శోధింపబడనేరడు; ఆయన ఎవనిని శోధింపడు
గనుక ఎవడైనను శోధింపబడినప్పుడు—నేను దేవుని
14 చేత శోధింపబడుచున్నానని అనకూడదు. । ప్రతి
వాడును తన స్వకీయమైన దురాశచేత ఈడ్వబడి
15 మరలుకొల్పబడినవాడై శోధింపబడును. । దురాశ
గర్భము ధరించినదై పాపమును కనగా, పాపము పరి
పక్వమై మరణమును కనును. । నా ప్రియ సహో

దరులారా, మోసపోకుడి. । శ్రేష్ఠమైన ప్రతి
ఈవియు సంపూర్ణమైన ప్రతి వరమును పరసంబంధ
మైనదై, జ్యోతిర్మయుడగు తండ్రియొద్దనుండి వచ్చును.
ఆయనయందు ఏ చంచలత్వమైనను గమనాగమన
వలన కలుగు ఏ ఛాయయైనను లేదు. । తాను సృష్టి
చినవాటిలో మనము ప్రథమఫలముగా ఉండు
సత్యవాక్యమువలన మనలను తన సంకల్పప్రకారము
కనెను.

నా ప్రియ సహోదరులారా, మీరీసంగతి ఎరు
దురు గనుక ప్రతి మనుష్యుడు వినుటకు వేగిర
వాడును, మాటలాడుటకు నిదానించువాడును,
చుటకు నిదానించువాడునై యుండవలెను. । ఎ
కనగా నరుని కోపము దేవుని నీతిని నెరవేర్చదు. ।
అందుచేత సమస్త కల్మషమును విర్రవీగుచున్న దు
మును మాని, లోపట నాటబడి మీ ఆత్మలను రక్షిం
టకు శక్తిగల వాక్యమును సాత్వికముతో అంగీక
చుడి. । మీరు వినువారు మాత్రమైయుండి మి
మీరు మోసపుచ్చుకొనకుండ, వాక్యప్రకా
ప్రవర్తించువారునై యుండుడి. । ఎవడైనను వా
మును వినువాడైయుండి దానిప్రకారము ప్రవర్తిం
వాడైతే, వాడు అద్దములో తన సహజముఖము
చూచుకొను మనుష్యుని పోలియున్నాడు. । వా
తన్ను చూచుకొని అవతలకుపోయి తానెట్టివా
వెంటనే మరచిపోవును గదా? । అయితే స్వా
త్ర్యము ఇచ్చు సంపూర్ణమైన నియమములో
చూచి నిలుకడగా ఉండువాడెవడో వాడు
మరచువాడు కాక, క్రియను చేయువాడైయుం
తన క్రియలో ధన్యుడవును. । ఎవడైనను
కళ్లెము పెట్టుకొనక తన హృదయమును మోసపర
కొనుచు భక్తిగలవాడనని అనుకొనిన పక్షమున వా
భక్తి వ్యర్థమే. । తండ్రియైన దేవునియెదుట పవిత్ర
నిష్కళంకమునైన భక్తి యేదనగా, దిక్కులేని
లను విధవరాండ్రను వారి యిబ్బందిలో పరామర్శిం
టయు, ఇహలోకమాలిన్యము తనకంటకుండ తన్ను
తాను కాపాడుకొనుటయు నే.

నా సహోదరులారా, మహిమాస్వరూపియగు
మన ప్రభువైన యేసుక్రీస్తునుగూర్చిన విశ్వాస
యములో పక్షపాతముగలవారై యుండకుడి. । ఏల
గనగా బంగారు ఉంగరము పెట్టుకొని ప్రశస్తవస్త్రము

1 క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము. 2 లేక, నడకలలో.

ధరించుకొనిన యొకడు మీ సమాజమందిరములోనికి
వచ్చినప్పుడు, మురికి బట్టలు కట్టుకొనిన దరిద్రుడును
3 లోపలికి వచ్చినయెడల । మీరు ప్రశస్తవస్త్రములు
ధరించుకొనినవానిని చూచి సన్మానించి—నీవిక్కడ
మంచి స్థలమందు కూర్చుండుమని చెప్పి, ఆ దరిద్రు
నితో—నీవక్కడ నిలువుము, లేక ఇక్కడ నా పాద
పీఠమునకు దిగువను కూర్చుండుమని చెప్పినపక్ష
4 మందు, । మీ మనస్సులలో భేదములు పెట్టుకొని
మీరు దురాలోచనతో విమర్శ చేసినవారగుదురు
5 కారా? । నా ప్రియ సహోదరులారా, ఆలకించుడి;
ఈ లోకవిషయములో దరిద్రులైనవారిని విశ్వాస
మందు భాగ్యవంతులుగాను, తన్ను ప్రేమించువారికి
తాను వాగ్దానముచేసిన రాజ్యమునకు వారసులుగాను
6 ఉండుటకు దేవుడేర్పరచుకొనలేదా? । అయితే మీరు
దరిద్రులను అవమానపరచుదురు. ధనవంతులు మీ
మీద కఠినముగా అధికారము చూపుదురు; మిమ్మును
7 న్యాయసభలకు ఈడ్చుచున్నవారు వీరే గదా. । మీకు
పెట్టబడిన శ్రేష్ఠమైన నామమును దూషించువారు వీరే
8 గదా? । మెట్టుకు నీవలె నీ పొరుగువాని ప్రేమించు
మను లేఖనములో ఉన్నట్టి ప్రాముఖ్యమైన యీ
ఆజ్ఞను మీరు నెరవేర్చినయెడల బాగుగనే ప్రవర్తించు
9 వారగుదురు. । మీరు పక్షపాతముగలవారైతే ధర్మ
శాస్త్రమువలన అపరాధులని తీర్చబడి పాపము చేయు
10 వారగుదురు. । ఎవడైనను ధర్మశాస్త్రమంతయు గైకొని
యు, ఒక ఆజ్ఞవిషయములో తప్పిపోయినయెడల,[1]
11 ఆజ్ఞలన్నిటి విషయములో అపరాధియగును; । వ్యభి
చరింపవద్దని చెప్పినవాడు నరహత్యచేయవద్దనియు
చెప్పెను గనుక నీవు వ్యభిచరింపకపోయినను నరహత్య
చేసినయెడల ధర్మశాస్త్రవిషయములో నపరాధివైతివి. ।
12 స్వాతంత్ర్యము ఇచ్చు నియమముచొప్పున తీర్పు
పొందబోవువారికి తగినట్టుగా మాటలాడుడి; ఆలాగు
13 ననే ప్రవర్తించుడి. । కనికరము చూపనివాడు కనికర
ములేని తీర్పు పొందును; కనికరము తీర్పును మించి
అతిశయపడును.

14 నా సహోదరులారా, క్రియలు లేనప్పుడు ఎవ
డైనను తనకు విశ్వాసము కలదని చెప్పినయెడల ఏమి
ప్రయోజనము? అట్టి విశ్వాసమతని రక్షింపగలదా? ।
15 ఒక సహోదరుడైనను సహోదరియైనను దిగం
బరులై ఆ నాటికి భోజనములేక యున్నప్పుడు, ।
16 మీలో ఎవడైనను శరీరమునకు కావలసినవాటిని
ఇయ్యక—సమాధానముగా వెళ్లుడి, చలికాచుకొనుడి,
తృప్తిపొందుడని చెప్పినయెడల ఏమి ప్రయోజనము? ।
17 ఆలాగే విశ్వాసము క్రియలులేనిదైతే అది ఒంటిగా
18 ఉండి మృతమైనదగును. । అయితే ఒకడు — నీకు
విశ్వాసమున్నది, నాకు క్రియలున్నవి; క్రియలు
లేకుండ నీ విశ్వాసము నాకు కనుపరచుము, నేను
నా క్రియలచేత నా విశ్వాసము నీకు కనుపరతునని
చెప్పును. । దేవుడొక్కడే అని నీవు నమ్ముచున్నావు. 19
ఆలాగు నమ్ముట మంచిదే; దయ్యములును నమ్మి వణకు
చున్నవి. । వ్యర్థుడా, క్రియలులేని విశ్వాసము నిష్ఫల 20
మైనదని తెలిసికొనగోరుచున్నావా? । మన పితరు 21
డైన అబ్రాహాము తన కుమారుడైన ఇస్సాకును బలి
పీఠముమీద అర్పించినప్పుడు అతడు క్రియలవలన
నీతిమంతుడని తీర్పు పొందలేదా? । విశ్వాసము అతని 22
క్రియలతో కూడి కార్యసిద్ధి కలుగజేసెననియు,
క్రియలమూలముగా అతని విశ్వాసము పరిపూర్ణమైన
దనియు గ్రహించుచున్నావు గదా! । కాబట్టి 23
—అబ్రాహాము దేవుని నమ్మెను అది అతనికి నీతిగా
ఎంచబడెను?[2]
అను లేఖనము నెరవేర్చబడెను. మరియు దేవుని స్నేహి
తుడని అతనికి పేరుకలిగెను. । మనుష్యుడు విశ్వాస 24
మూలమున మాత్రముకాక క్రియలమూలమునను నీతి
మంతుడని యెంచబడునని, మీరు (దీనివలన) గ్రహిం
చితిరి. । అటువలెనే రాహాబను వేశ్యకూడ దూతలను 25
చేర్చుకొని వేరొకమార్గమున వారిని వెలపలికి పంపివేసి
నప్పుడు క్రియలమూలముగా నీతిమంతురాలని యెంచ
బడెను గదా? । ప్రాణములేని శరీరమేలాగు మృతమో 26
ఆలాగే క్రియలులేని విశ్వాసమును మృతము.

**నా** సహోదరులారా, బోధకులమైన మనము 3
మరి కఠినమైన తీర్పు పొందుదుమని తెలిసికొని
మీలో అనేకులు బోధకులు కాకుండుడి. । అనేక విష 2
యములలో మనమందరము తప్పిపోవుచున్నాము.[3]
ఎవడైనను మాటయందు తప్పనియెడల అట్టివాడు
లోపములేనివాడై, తన సర్వశరీరమును స్వాధీనమం
దుంచుకొన[4] శక్తిగలవాడగును. । గుర్రములు మనకు 3
లోబడుటకై నోటికి కళ్లెము పెట్టి వాటి శరీరమంత
యు త్రిప్పుదుము గదా? । ఓడలనుకూడ చూడుడి; 4
అవి ఎంతో గొప్పవై పెనుగాలికి కొట్టుకొనిపోబడి
నను, ఓడ నడుపువాని ఉద్దేశముచొప్పున మిక్కిలి
చిన్నదగు చుక్కానిచేత త్రిప్పబడును. । ఆలాగుననే 5
నాలుకకూడ చిన్న అవయవమైనను బహుగా అదిరి
పడును.[5] ఎంత కొంచెము నిప్పు ఎంత విస్తారమైన
అడవిని తగలబెట్టును. । నాలుక అగ్నియే; నాలుక 6
మన అవయవములలో ఉంచబడిన పాపప్రపంచమై
సర్వశరీరమునకు మాలిన్యము కలుగజేయుచు, జనన
చక్రమునకు చిచ్చుపెట్టును; అది నరకముచేత చిచ్చు
పెట్టబడును. । మృగ పక్షి సర్ప జలచరములలో ప్రతి 7
జాతియు నరజాతిచేత సాదుకాజాలును, సాదు
ఆయెను గాని । యే నరుడును నాలుకను సాదుచేయ 8
నేరడు; అది మరణకరమైన విషముతో నిండినది, అది

1 లేక, తొట్రిల్లినయెడల. 2 ఆది. 15: 6. 3 లేక, తొట్రిల్లుచున్నాము. 4 మూలభాషలో—కళ్లెముపెట్టుకొన. 5 లేక, అతిశయపడును.

9 నిరర్గళమైన దుష్టత్వమే. । దీనితో తండ్రియైన ప్రభు
వును స్తుతింతుము, దీనితోనే దేవుని పోలికెగా పుట్టిన
10 మనుష్యులను శపింతుము. । ఒక్క నోటనుండియే
ఆశీర్వచనమును శాపవచనమును బయలువెళ్లును; నా
11 సహోదరులారా, యీలాగుండకూడదు. । నీటి
బుగ్గలో ఒక్క జెలనుండియే తియ్యని నీరును చేదు
12 నీరును ఊరునా? । నా సహోదరులారా, అంజూ
రపుచెట్టున ఒలీవ పండ్లయినను ద్రాక్షతీగెను అంజూ
రపు పండ్లయినను కాయునా? అటువలెనే ఉప్పు
నీళ్లలోనుండి తియ్యనినీళ్లును ఊరవు.

13 మీలో జ్ఞాన వివేకములు గలవాడెవడు? వాడు
జ్ఞానముతోకూడిన సాత్వికముగలవాడై తన యోగ్య
ప్రవర్తనవలన తన క్రియలను కనుపరచవలెను. ।
14 అయితే మీ హృదయములలో సహింపనలవికాని[1]
మత్సరమును వివాదమును ఉంచుకొనినవారైతే అతి
శయపడవద్దు, సత్యమునకు విరోధముగా అబద్ధమాడ
15 వద్దు. । ఈ జ్ఞానము పైనుండి దిగివచ్చునదికాక భూ
సంబంధమైనదియు ప్రకృతిసంబంధమైనదియు దయ్య
16 ముల (జ్ఞానము) వంటిదియునై యున్నది. । ఏల
యనగా మత్సరమును వివాదమును ఎక్కడ ఉండునో
అక్కడ అల్లరియు ప్రతి నీచకార్యమును ఉండును. ।
17 అయితే పైనుండివచ్చు జ్ఞానము మొట్టమొదట
పవిత్రమైనది, తరువాత సమాధానకరమైనది, మృదు
వైనది, సులభముగా లోబడునది, కనికరముతోను
మంచి ఫలములతోను నిండుకొనినది, పక్షపాతమైనను
18 వేషధారణమైనను లేనిదియునై యున్నది. । నీతి
ఫలము సమాధానము చేయువారికి సమాధానమందు
విత్తబడును.

4 మీలో యుద్ధములును పోరాటములును దేనినుండి
కలుగుచున్నవి? మీ అవయవములలో పోరాడు మీ
2 భోగేచ్ఛలనుండియే గదా? । మీరాశించుచున్నారు గాని
మీకు దొరుకుటలేదు; నరహత్యచేయుదురు మత్సర
పడుదురు గాని సంపాదించుకొనలేరు; పోట్లాడు
దురు యుద్ధము చేయుదురు గాని (దేవుని) అడుగ
3 నందున మీకేమియు దొరుకదు. । మీరడిగినను మీ
భోగములనిమిత్తము వినియోగించుటకై దురుద్దేశముతో
అడుగుదురు గనుక మీకేమియు దొరుకుట లేదు. ।
4 వ్యభిచారిణులారా, యీ లోకస్నేహము దేవునితో
వైరమని మీరెరుగరా? కాబట్టి యెవడు ఈ లోక
ముతో స్నేహము చేయగోరునో వాడు దేవునికి శత్రు
5 వగును. । —ఆయన మనయందు నివసింపజేసిన ఆత్మ
మత్సరపడునంతగా అపేక్షించునా అను లేఖనము
6 చెప్పునది వ్యర్థమని అనుకొనుచున్నారా? । కాదు
కున ఎక్కువ కృప నిచ్చును; అందుచేత—
హంకారులను ఎదిరించి దీనులకు కృప అను
గ్రహించును అని లేఖనము చెప్పుచున్నది.[2] । కాబట్టి 7
దేవునికి లోబడియుండుడి, అపవాది[3]ని ఎదిరించుడి,
అప్పుడు వాడు మీయొద్దనుండి పారిపోవును. । దేవుని 8
యొద్దకు రండి, అప్పుడాయన మీయొద్దకు వచ్చును.
పాపులారా, మీ చేతులను శుభ్రముచేసికొనుడి;
ద్విమనస్కులారా, మీ హృదయములను పరిశుద్ధపరచు
కొనుడి. । వ్యాకులపడుడి దుఃఖపడుడి యేడువుడి, 9
మీ నవ్వు దుఃఖమునకును మీ ఆనందము చింతకును
మార్చుకొనుడి. । ప్రభువు దృష్టికి మిమ్మును మీరు 10
తగ్గించుకొనుడి అప్పుడాయన మిమ్మును హెచ్చించును.

సహోదరులారా, యొకనికి విరోధముగా ఒకడు 11
మాటలాడకుడి. తన సహోదరునికి విరోధముగా
మాటలాడి తన సహోదరునికి తీర్పు తీర్చువాడు ధర్మ
శాస్త్రమునకు వ్యతిరేకముగా మాటలాడి ధర్మశాస్త్రమునకు
తీర్పు తీర్చుచున్నాడు. నీవు ధర్మశాస్త్రమునకు తీర్పు
తీర్చినయెడల ధర్మశాస్త్రమును నెరవేర్చువాడవు కాక
న్యాయము విధించువాడవైతివి.[4] । ఒక్కడే ధర్మశాస్త్ర 12
మును నియమించి న్యాయము విధించువాడు;[5] ఆయనే
రక్షించుటకును నశింపజేయుటకును శక్తిమంతుడై యు
న్నాడు; పరునికి తీర్పు తీర్చుటకు నీవెవడవు?

— నేడైనను రేపైనను ఒకానొక పట్టణమునకు 13
వెళ్లి అక్కడ ఒక సంవత్సరముండి వ్యాపారముచేసి
లాభము సంపాదింతము రండని చెప్పుకొనువార
లారా, । రేపేమి సంభవించునో మీకు తెలియదు. 14
మీ జీవమేపాటిది? మీరు కొంతసేపు కనబడి అం
తలో మాయమైపోవు ఆవిరి(వంటివారే)కారా. ।
మీరాలాగనక — ప్రభువు చిత్తమైతే మనము బ్రదికి 15
యుండి ఇది అది చేతమని చెప్పుకొనవలెను. । ఇప్పు 16
డైతే మీరు మీ డంబములయందు అతిశయపడుచు
న్నారు. ఇట్టి అతిశయమంతయు చెడ్డది. । కాబట్టి 17
మేలైనదిచేయ నెరిగియు ఆలాగు చేయనివానికి
పాపము కలుగును.

ఇదిగో ధనవంతులారా, మీమీదికి వచ్చెడి ఉప 5
ద్రవములను గూర్చి ప్రలాపించి యేడువుడి. । మీ 2
ధనము చెడిపోయెను; మీ వస్త్రములు చిమ్మటలు కొట్టిన
వాయెను. । మీ బంగారమును మీ వెండియు తుప్పు 3
పట్టినవి; వాటి తుప్పు మీమీద సాక్ష్యముగా ఉండి
అగ్నివలె మీ శరీరములను తినివేయును; అంత్యదిన
ములయందు ధనము కూర్చుకొంటిరి. । ఇదిగో మీ 4
చేలు కోసిన పనివారికియ్యక మీరు మోసముగా బిగ
పట్టిన కూలి మొఱ్ఱపెట్టుచున్నది. మీ కోతవారి
కేకలు సైన్యములకు అధిపతియగు ప్రభువుయొక్క
చెవులలో చొచ్చియున్నవి. । మీరు భూమిమీద 5
సుఖముగా జీవించి భోగాసక్తులై వధదినమునందు
మీ హృదయములను పోషించుకొంటిరి. । మీరు నీతి 6

1 మూలభాషలో—చేదైన. 2 సామెతలు, 3:34. 3 అనగా—సాతాను. 4 లేక, తీర్పరివైతివి. 5 లేక, తీర్పరి.

మంతుడైనవానికి శిక్ష విధించి చంపుదురు, అతడు
మిమ్మును ఎదిరింపడు.
సహోదరులారా, ప్రభువు ఆగమనపర్యంతము
ఓపిక కలిగియుండుడి; చూడుడి; వ్యవసాయకుడు
తొలకరి వర్షమును కడవరి వర్షమును సమకూడు పర్యం
తము, విలువైన భూఫలము నిమిత్తము ఓపికతో కాచు
కొనుచు దానికొరకు కనిపెట్టును గదా? । ప్రభువు
ఆగమనము సమీపించుచున్నది గనుక మీరును ఓపిక
కలిగి యుండుడి, మీ హృదయములను స్థిరపరచు
కొనుడి. । సహోదరులారా, మీరు తీర్పు పొంద
కుండు నిమిత్తము ఒకనిమీదనొకడు సణగకుడి; ఇదిగో
న్యాయాధిపతి వాకిట నిలిచియున్నాడు. । నా
సహోదరులారా, ప్రభువు నామమున బోధించిన
ప్రవక్తలను శ్రమానుభవమునకును ఓపికకును మాదిరిగా
పెట్టుకొనుడి. । సహించినవారిని ధన్యులనుకొనుచు
న్నాము గదా? మీరు యోబుయొక్క సహనమును
గూర్చి వింటిరి. కడకు ప్రభువు అతనికి చేసినదానిని
బట్టి ఆయన ఎంతో జాలియు కనికరమునుగలవాడని
మీరు తెలిసికొనియున్నారు.
నా సహోదరులారా, ముఖ్యమైన సంగతి ఏద
నగా, ఆకాశముతోడనిగాని భూమితోడనిగాని మరి
దేనితోడనిగాని ఒట్టు పెట్టుకొనక, మీరు తీర్పుపాలు
కాకుండునట్లు అవునంటే అవునన్నట్టును కాదంటే
కాదన్నట్టును ఉండవలెను.

మీలో ఎవనికైనను శ్రమ సంభవించెనా? అతడు 13
ప్రార్థనచేయవలెను; ఎవనికైనను సంతోషము కలి
గెనా? అతడు కీర్తనలు పాడవలెను. । మీలో ఎవ 14
డైనను రోగియైయున్నాడా? అతడు సంఘపు పెద్ద
లను పిలిపింపవలెను; వారు ప్రభువు నామమున అత
నికి నూనె రాచి అతనికొరకు ప్రార్థనచేయవలెను. ।
విశ్వాససహితమైన ప్రార్థన ఆ రోగిని స్వస్థపరచును, 15
ప్రభువు అతని లేపును; అతడు పాపములు చేసిన
వాడైతే పాపక్షమాపణ నొందును. । మీ పాపము 16
లను ఒకనితో నొకడు ఒప్పుకొనుడి; మీరు స్వస్థత
పొందునట్లు ఒకనికొరకు ఒకడు ప్రార్థనచేయుడి.
నీతిమంతుని విజ్ఞాపన మనఃపూర్వకమైనదై బహు
బలముగలదై యుండును. । ఏలీయా మనవంటి స్వభా 17
వముగల మనుష్యుడే; వర్షింపకుండునట్లు అతడు
ఆసక్తితో ప్రార్థనచేయగా మూడున్నర సంవత్సరముల
పర్యంతము భూమిమీద వర్షింపలేదు. । అతడు మరల 18
ప్రార్థనచేయగా ఆకాశము వర్షమిచ్చెను, భూమి తన
ఫలము ఇచ్చెను.
నా సహోదరులారా, మీలో ఎవడైనను సత్యము 19
నుండి తొలగిపోయినప్పుడు మరియొకడు అతనిని సత్య
మునకు మళ్లించినయెడల । పాపిని వాని తప్పుమార్గము 20
నుండి మళ్లించువాడు మరణమునుండి యొక ఆత్మను
రక్షించి అనేక పాపములను కప్పివేయునని తాను
తెలిసికొనవలెను.

# పేతురు భక్తకోటికి వ్రాసిన మొదటి పత్రిక

1 యేసుక్రీస్తు[1] అపొస్తలుడైన పేతురు, తండ్రి
యైన దేవుని భవిష్యద్ జ్ఞానమునుబట్టి, ఆత్మవలని
2 పరిశుద్ధత పొందినవారై విధేయులగుటకును, యేసు
క్రీస్తు రక్తమువలన ప్రోక్షింపబడుటకును ఏర్పరచ
బడినవారికి, అనగా పొంతు, గలతీయ, కపదొకియ,
ఆసియ, బితునియ అను దేశములయందు చెదరిన
వారిలో చేరిన యాత్రికులకు (శుభమని చెప్పి)
వ్రాయునది. మీకు కృపయు సమాధానమును విస్త
రిల్లునుగాక.
3 మన ప్రభువగు యేసుక్రీస్తు తండ్రియైన దేవుడు
4 స్తుతింపబడునుగాక. మృతులలోనుండి యేసుక్రీస్తు
తిరిగి లేచుటవలన జీవముతో కూడిన[2] నిరీక్షణ మనకు
కలుగునట్లు, అనగా అక్షయమైనదియు, నిర్మలమై
నదియు, వాడబారనిదియునైన స్వాస్థ్యము మనకు
కలుగునట్లు, ఆయన తన విశేష కనికరముచొప్పున
5 మనలను మరల జన్మింపజేసెను. । కడవరి కాలమందు
బయలుపరచబడుటకు సిద్ధముగానున్న రక్షణ మీకు
కలుగునట్లు, విశ్వాసముద్వారా దేవుని శక్తిచేత కాపాడ
బడు మీకొరకు, ఆ స్వాస్థ్యము పరలోకమందు
6 భద్రపరచబడియున్నది. । ఇందువలన మీరు మిక్కిలి
ఆనందించుచున్నారు గాని అవసరమునుబట్టి నానా
విధములైన శోధనలచేత, ప్రస్తుతమున కొంచెము
7 కాలము మీకు దుఃఖము కలుగుచున్నది. । నశించి
పోవు సువర్ణము అగ్ని పరీక్షవలన శుద్ధపరచబడు
చున్నది గదా? దానికంటె అమూల్యమైన మీ విశ్వా
సము ఈ శోధనలచేత పరీక్షకు నిలిచినదై, యేసు
క్రీస్తు ప్రత్యక్షమైనప్పుడు మీకు మెప్పును మహి
8 మయు ఘనతయు కలుగుటకు కారణమగును. । మీ
9 రాయనను చూడకపోయినను ఆయనను ప్రేమించు
చున్నారు; ఇప్పుడు ఆయనను కన్నులార చూడ
కయే విశ్వసించుచు, మీ విశ్వాసమునకు ఫలమును,
అనగా ఆత్మరక్షణను పొందుచు, చెప్పనశక్యమును
మహిమాయుక్తమునైన సంతోషముగలవారై ఆనం
10 దించుచున్నారు. । మీకు కలుగు ఆ కృపనుగూర్చి
11 ప్రవచించిన ప్రవక్తలు ఈ రక్షణనుగూర్చి పరిశీలిం
చుచు, తమయందున్న క్రీస్తు ఆత్మ క్రీస్తు విషయ
మైన శ్రమలనుగూర్చియు, వాటితరువాత కలుగబోవు
మహిమలనుగూర్చియు ముందుగా సాక్ష్యమిచ్చు
నప్పుడు, ఆ ఆత్మ, యే కాలమును ఎట్టి కాలమును
సూచించుచువచ్చెనో దానిని విచారించి పరిశోధిం
చిరి. । పరలోకమునుండి పంపబడిన పరిశుద్ధాత్మవలన 12
మీకు సువార్త ప్రకటించినవారిద్వారా మీకిప్పుడు
తెలుపబడిన యీ సంగతుల విషయమై, తమకొరకు
కాదు గాని మీకొరకే తాము పరిచర్యచేసిరను సం
గతి వారికి బయలుపరచబడెను; దేవదూతలు ఈ
కార్యములను తొంగిచూడ గోరుచున్నారు.
కాబట్టి మీ మనస్సు నడుముకట్టుకొని నిబ్బరమైన 13
బుద్ధిగలవారై, యేసుక్రీస్తు ప్రత్యక్షమైనప్పుడు మీకు
తేబడు కృపవిషయమై సంపూర్ణనిరీక్షణ కలిగియుం
డుడి. ।—నేను పరిశుద్ధుడనైయున్నాను గనుక మీరును 14
పరిశుద్ధులై యుండుడని వ్రాయబడియున్నది.[3] కాగా 16
మీరు విధేయులగు పిల్లలై, మీ పూర్వపు అజ్ఞాన
దశలో మీకుండిన ఆశలననుసరించి ప్రవర్తింపక,
మిమ్మును పిలిచినవాడు పరిశుద్ధుడైయున్న ప్రకారము
మీరును సమస్త ప్రవర్తనయందు పరిశుద్ధులై యుం
డుడి. । పక్షపాతములేకుండ క్రియలనుబట్టి ప్రతి 17
వానిని తీర్పు తీర్చువాడు తండ్రి అని మీరాయనకు
ప్రార్థనచేయుచున్నారు గనుక మీరు పరదేశులై
యున్నంతకాలము భయముతో గడుపుడి. । పితృ 18
పారంపర్యమైన మీ వ్యర్థప్రవర్తనను విడిచిపెట్టు
నట్లుగా వెండి బంగారములవంటి క్షయవస్తువులచేత
మీరు విమోచింపబడలేదు గాని । అమూల్యమైన 19
రక్తముచేత, అనగా నిర్దోషమును నిష్కళంకమునగు
గొఱ్ఱెపిల్లవంటి క్రీస్తు రక్తముచేత, విమోచింపబడితిరని
మీరెరుగుదురు గదా? । ఆయన జగత్తుపునాది వేయ 20
బడక మునుపే నియమింపబడెను గాని తన్ను మృతు 21
లలోనుండి లేపి తనకు మహిమనిచ్చిన దేవునియెడల
తన ద్వారా విశ్వాసులైన మీనిమిత్తము, కడవరి కాల
ములయందు ఆయన ప్రత్యక్షపరచబడెను. కాగా
మీ విశ్వాసమును నిరీక్షణయు దేవునియందు ఉంచ
బడియున్నవి. । మీరు క్షయబీజమునుండి కాక, 22
శాశ్వతమగు జీవముగల దేవునివాక్య మూలముగా 23
అక్షయబీజమునుండి పుట్టింపబడినవారు గనుక నిష్క
పటమైన సహోదరప్రేమ కలుగునట్లు, మీరు సత్య
మునకు విధేయులవుటచేత మీ మనస్సులను పవిత్ర
పరచుకొనినవారైయుండి, యొకనినొకడు హృదయ
పూర్వకముగాను మిక్కుటముగాను ప్రేమించుడి. ఏల
యనగా

1 క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము. 2 లేక, జీవముగల. 3 లేవీ. 11: 44; 19: 2.

4 —సర్వశరీరులు గడ్డిని పోలినవారు, వారి అంద
మంతయు గడ్డిపువ్వువలె ఉన్నది; గడ్డి వాడును
దాని పువ్వును రాలును, అయితే ప్రభువు
వాక్యము ఎల్లప్పుడును నిలుచును.[1]
మీకు ప్రకటింపబడిన సువార్త యీ వాక్యమే.

2 ప్రభువు దయాళుడని మీరు రుచిచూచియున్న
యెడల సమస్తమైన దుష్టత్వమును, సమస్తమైన కపట
2 మును, వేషధారణను, అసూయను, సమస్త దూషణ
3 మాటలను మాని, క్రొత్తగా జన్మించిన శిశువులను పోలిన
వారై, నిర్మలమైన వాక్యమను పాలవలన[2] రక్షణవిషయ
ములో ఎదుగునిమిత్తము, ఆ పాలను అపేక్షించుడి. ।
4 మనుష్యులచేత విసర్జింపబడినను, దేవుని దృష్టికి
ఏర్పరచబడినదియు అమూల్యమును సజీవమునైన
5 రాయియగు ప్రభువునొద్దకు వచ్చినవారై, । యేసు
క్రీస్తుద్వారా దేవునికి అనుకూలములగు ఆత్మసంబంధ
మైన బలులనర్పించుటకు పరిశుద్ధయాజకులుగా ఉండు
నట్లు, మీరును సజీవమైన రాళ్లవలెనుండి ఆత్మసంబంధ
6 మైన మందిరముగా కట్టబడుచున్నారు. । ఏలయనగా
—ఇదిగో నేను ముఖ్యమును ఏర్పరచబడినదియు
అమూల్యమునగు మూలరాతిని సీయోనులో
స్థాపించుచున్నాను; ఆయనయందు విశ్వాస
ముంచువాడు ఏమాత్రమును సిగ్గుపడడు
అను మాట లేఖనమందు వ్రాయబడియున్నది.[3] ।
7 విశ్వసించుచున్న మీకు ఈ ఘనత కలదు; విశ్వసింపని
వారికైతే
—ఇల్లు కట్టువారు ఏ రాతిని నిషేధించిరో అదే
మూలకు తలరాయి ఆయెను.[4]
మరియు అది అడ్డురాయియు అడ్డుబండయు
8 ఆయెను.[5] । కట్టువారు వాక్యమునకు అవిధేయులై
తొట్రిల్లుచున్నారు, దానికే వారు నియమింపబడిరి. ।
9 అయితే మీరు చీకటిలోనుండి ఆశ్చర్యకరమైన తన
వెలుగులోనికి మిమ్మును పిలిచినవాని గుణాతిశయములను
ప్రచురముచేయు నిమిత్తము, ఏర్పరచబడిన వంశమును,
రాజులైన యాజకసమూహమును, పరిశుద్ధజనమును,
10 దేవుని సొత్తయిన ప్రజలునై యున్నారు.[6] । ఒకప్పుడు
ప్రజగా ఉండక యిప్పుడు దేవుని ప్రజయైతిరి; ఒక
ప్పుడు కనికరింపబడక యిప్పుడు కనికరింపబడిన
వారైతిరి.[7]

11 ప్రియులారా, మీరు పరదేశులును యాత్రి
కులునైయున్నారు గనుక ఆత్మకు విరోధముగా
12 పోరాడు శరీరాశలను విసర్జించి, । అన్యజనులు
మిమ్మును ఏ విషయములో దుర్మార్గులని దూషింతురో
ఆ విషయములో వారు మీ సత్క్రియలను చూచి,
వాటినిబట్టి దర్శనదినమున దేవుని మహిమపరచునట్లు,
వారి మధ్యను మంచి ప్రవర్తనగలవారై యుండవలెనని
మిమ్మును బతిమాలుకొనుచున్నాను.

మనుష్యులు (నియమించు) ప్రతి కట్టడకును 13
ప్రభువు నిమిత్తమై లోబడియుండుడి. । రాజు అం 14
దరికిని అధిపతియనియు, నాయకులు దుర్మార్గులకు
ప్రతిదండన చేయుటకును సన్మార్గులకు మెప్పు కలుగుట
కును రాజువలన పంపబడినవారనియు వారికి లోబడి
యుండుడి. । ఏలయనగా మీరిట్లు యుక్తప్రవర్తన 15
గలవారై,[8] అజ్ఞానముగా మాటలాడు మూర్ఖుల నోరు
మూయుట దేవుని చిత్తము. । స్వతంత్రులైయుండి 16
యు దుష్టత్వమును కప్పిపెట్టుటకు మీ స్వాతంత్ర్య
మును వినియోగపరచక, దేవునికి దాసులమని (లోబడి
యుండుడి.) । అందరిని సన్మానించుడి, సహోదరు 17
లను ప్రేమించుడి, దేవునికి భయపడుడి, రాజును
సన్మానించుడి.

పనివారలారా, మంచివారును సాత్వికులునైన 18
వారికి మాత్రము కాక ముష్కరులైన మీ యజమాను
లకును పూర్ణభయముతో లోబడియుండుడి. । ఎవడై 19
నను అన్యాయముగా శ్రమపొందుచు, దేవుడు చూచు
చున్నాడని యెరిగి, దుఃఖము సహించినయెడల అది
హితమగును. । తప్పితమునకై దెబ్బలు తినినప్పుడు 20
మీరు సహించినయెడల మీకేమి ఘనము? మేలుచేసి
బాధపడునప్పుడు మీరు సహించినయెడల అది దేవు
నికి హితమగును; ఇందుకు మీరు పిలువబడితిరి. ।
క్రీస్తుకూడ మీకొరకు బాధపడి, మీరు తన అడుగు 21
జాడలనుబట్టి నడుచుకొనునట్లు మీకు మాదిరి యుంచి
పోయెను. । ఆయన పాపముచేయలేదు; ఆయన 22
నోటను ఏ కపటమును కనబడలేదు. । ఆయన దూషింప 23
బడియు బదులు దూషింపలేదు; ఆయన శ్రమపెట్ట
బడియు బెదరింపక, న్యాయముగా తీర్పు తీర్చు (దేవు
నికి) తన్నుతాను అప్పగించుకొనెను. । మనము పాప 24
ముల విషయమై చనిపోయి నీతివిషయమై జీవించు
నట్లు ఆయన తానే తన శరీరమందు మన పాపములను
మ్రానుమీద మోసికొనెను. ఆయన పొందిన గాయ
ములచేత మీరు స్వస్థత నొందితిరి. । మీరు గొఱ్ఱెల 25
వలె దారితప్పిపోతిరి గాని యిప్పుడు మీ ఆత్మల
కాపరియు అధ్యక్షుడునైన ఆయనవైపునకు మళ్లి
యున్నారు.

అటువలె స్త్రీలారా, మీరు మీ స్వపురుషులకు 3
లోబడియుండుడి; అందువలన వారిలో ఎవరైనను 2
వాక్యమునకు అవిధేయులైతే, వారు భయముతో
కూడిన మీ పవిత్రప్రవర్తన చూచి, వాక్యము లేకుం
డనే తమ భార్యల నడవడివలన రాబట్టబడవచ్చును. ।
జడలు అల్లుకొనుటయు, బంగారునగలు పెట్టుకొను 3

1 యెషయా, 40: 6–8. 2 లేక, నిర్మలమైన ఆత్మసంబంధమగు పాలవలన. 3 యెషయా, 28: 16. 4 కీర్తన, 118: 22
5 యెషయా, 8: 14. 6 నిర్గ. 19: 6. 7 హోషే. 2: 23. 8 లేక, మేలుచేయువారై.

టయు, వస్త్రములు ధరించుకొనుటయునను వెలపటి
అలంకారము మీకు అలంకారముగా ఉండక, ।
4 సాధువైనట్టియు, మృదువైనట్టియునైన గుణమను అక్ష
యాలంకారముగల మీ హృదయపు అంతరంగస్వభా
వము[1] మీకు అలంకారముగా ఉండవలెను; అది
5 దేవుని దృష్టికి మిగుల విలువగలది. । అటువలె పూర్వము
దేవుని ఆశ్రయించిన పరిశుద్ధ స్త్రీలును తమ స్వపురుషు
లకు లోబడియుండుటచేత తమ్మును తాము అలంక
6 రించుకొనిరి. । ఆ ప్రకారము శారా అబ్రాహామును
యజమానుడని పిలుచుచు అతనికి లోబడియుండెను.
మీరును యోగ్యముగా నడుచుకొనుచు,[2] ఏ భయము
నకు బెదరకయున్నయెడల ఆమెకు పిల్లలగుదురు.
7 అటువలెనే పురుషులారా, జీవమను కృపావర
ములో మీ భార్యలు మీతో పాలివారైయున్నారని
యెరిగి, యెక్కువ బలహీనమైన ఘటమని భార్యను
సన్మానించి, మీ ప్రార్థనలకు అభ్యంతరము కలుగ
కుండునట్లు, జ్ఞానముచొప్పున వారితో కాపురము
చేయుడి.
8 తుదకు మీరందరు ఏకమనస్కులై యొకరి సుఖ
దుఃఖములయందు ఒకరు పాలుపడి, సహోదర
ప్రేమగలవారును, కరుణాచిత్తులును, వినయమనస్కు
9 లునై యుండుడి. । ఆశీర్వాదమునకు వారసులవుటకు
మీరు పిలువబడితిరి గనుక కీడుకు ప్రతికీడైనను దూష
ణకు ప్రతి దూషణయైనను చేయక దీవించుడి.
10 —జీవమును ప్రేమించి మంచి దినములు చూడ
గోరువాడు చెడ్డదాని పలుకకుండ తన నాలు
కను, కపటవాక్యము చెప్పకుండ తన పెదవు
11 లను కాచుకొనవలెను. । అతడు కీడునుండి
తొలగి మేలు చేయవలెను, సమాధానమును
12 వెదకి దాని అనుసరింపవలెను.[3] । ప్రభువు
కన్నులు నీతిమంతులమీదను, ఆయన చెవులు
వారి ప్రార్థనలవైపునను ఉన్నవి గాని ప్రభువు
ముఖము కీడు చేయువారికి విరోధముగా
ఉన్నది.[4]
13 మీరు మంచివిషయములో ఆసక్తిగలవారైతే మీకు
14 హానిచేయువాడెవడు? । మీరొకవేళ నీతినిమిత్తము
శ్రమపడినను మీరు ధన్యులే; వారి బెదరింపుకు భయ
15 పడకుడి కలవరపడకుడి; । నిర్మలమైన మనస్సాక్షి కలి
16 గినవారై, మీలో ఉన్న నిరీక్షణనుగూర్చి మిమ్మును
హేతువు అడుగు ప్రతివానికిని సాత్వికముతోను
భయముతోను సమాధానము చెప్పుటకు ఎల్లప్పుడు సిద్ధ
ముగా ఉండి, మీ హృదయములయందు క్రీస్తును
ప్రభువుగా ప్రతిష్ఠించుడి; అప్పుడు మీరు దేనివిష
యమై దుర్మార్గులని దూషింపబడుదురో దాని విష
యమై క్రీస్తునందున్న మీ సత్ప్రవర్తనమీద అపనింద
వేయువారు సిగ్గుపడుదురు. । దేవుని చిత్తమాలాగున్న 17
యెడల కీడుచేసి శ్రమపడుటకంటె మేలుచేసి శ్రమ
పడుటయే బహు మంచిది. । ఏలయనగా మనలను 18
దేవునియొద్దకు తెచ్చుటకు, అనీతిమంతులకొరకు నీతి
మంతుడైన క్రీస్తు శరీరవిషయములో చంపబడియు,
ఆత్మవిషయములో బ్రదికింపబడి, పాపముల విషయ
ములో ఒక్కసారే శ్రమపడెను. । దేవుని దీర్ఘశాంతము 19
ఇంక కనిపెట్టుచుండినప్పుడు పూర్వము నోవహు దిన 20
ములలో ఓడ సిద్ధపరచబడుచుండగా, అవిధేయులైన
వారియొద్దకు, అనగా చెరలో ఉన్న ఆత్మలయొద్దకు,
ఆయన ఆత్మరూపిగానే వెళ్లి వారికి ప్రకటించెను. ఆ
ఓడలో కొందరు, అనగా ఎనిమిదిమంది నీటిద్వారా
రక్షణపొందిరి. । దానికి సాదృశ్యమైన బాప్తిస్మము 21
ఇప్పుడు మిమ్మును రక్షించుచున్నది; అదేదనగా శరీర
మాలిన్యము తీసివేయుట కాదుగాని యేసుక్రీస్తు
పునరుత్థాన మూలముగా దేవునివిషయమై నిర్మలమైన
మనస్సాక్షి కలిగియుండుటకు పూనుకొనుటయే. ।
ఆయన పరలోకమునకు వెళ్లి దూతలమీదను అధి 22
కారులమీదను శక్తులమీదను అధికారము పొందిన
వాడై దేవుని కుడిపార్శ్వమున ఉన్నాడు.
క్రీస్తు శరీరవిషయములో[5] శ్రమపడెను గనుక 4
మీరును అట్టి మనస్సును ఆయుధముగా ధరించు 2
కొనుడి. శరీరవిషయములో[5] శ్రమపడినవాడు శరీర
మందు జీవించు మిగిలినకాలము ఇకమీదట మనుజాశ
లను అనుసరించి నడుచుకొనక, దేవుని ఇష్టానుసారము
గానే నడుచుకొనునట్లు పాపముతో జోలి యిక
నేమియు లేక యుండును. । మనము పోకిరిచేష్టలు, 3
దురాశలు, మద్యపానము, అల్లరితోకూడిన ఆట
పాటలు, త్రాగుబోతుల విందులు, చేయదగని విగ్రహ
పూజలు మొదలైనవాటియందు నడుచుకొనుచు, అన్య
జనుల యిష్టము నెరవేర్చుచుండుటకు గతించినకాలమే
చాలును. । అపరిమితమైన ఆ దుర్వ్యాపారమునందు 4
తమతోకూడ మీరు పరుగెత్తకపోయినందుకు వారు
ఆశ్చర్యపడుచు మిమ్మును దూషించుచున్నారు. । సజీవు 5
లకును మృతులకును తీర్పు తీర్చుటకు సిద్ధముగా ఉన్న
వానికి వారుత్తరవాదులై యున్నారు. । మృతులు 6
శరీరవిషయములో మానవరీత్యా తీర్పు పొందునట్లును
ఆత్మవిషయములో దేవునిబట్టి జీవించునట్లును వారికి
కూడ సువార్త ప్రకటింపబడెను.
అయితే అన్నిటి అంతము సమీపమైయున్నది. 7
కాగా మీరు స్వస్థబుద్ధిగలవారై, ప్రార్థనకు (వీలగు
నట్లు) మెలకువగా ఉండుడి. । ప్రేమ అనేక పాపము 8
లను కప్పును గనుక అన్నిటికంటె ముఖ్యముగా ఒకని
యెడల ఒకడు మిక్కుటమైన ప్రేమగలవారై యుం
డుడి. । సణుగుకొనకుండ ఒకనియెడల ఒకడు అతి 9

[1] మూలభాషలో—అంతరంగపురుషుడు. [2] లేక, మేలుచేయుచు. [3] మూలభా.—వెంటాడవలెను. [4] కీర్తన, 34: 12–16. [5] లేక, శరీరమందు

10 ఖ్యము చేయుడి. । దేవుని నానావిధమైన కృపవిష
యమై మంచి గృహనిర్వాహకులైయుండి, యొక్కొకడు
కృపావరము పొందినకొలది యొకనికొకడు ఉప
11 చారము చేయుడి. । ఒకడు బోధించినయెడల దైవోక్తు
లను బోధించునట్టు బోధింపవలెను; ఒకడు ఉప
చారము చేసినయెడల దేవుడు అనుగ్రహించు సామ
ర్థ్యమునొంది చేయవలెను. ఇందువలన దేవుడు అన్నిటి
లోను యేసుక్రీస్తుద్వారా మహిమపరచబడును. యుగ
యుగములు మహిమయు ప్రభావమును ఆయన
కుండును గాక, ఆమేన్.
12 ప్రియులారా, మిమ్మును శోధించుటకు మీకు
కలుగుచున్న అగ్నివంటి మహాశ్రమనుగూర్చి మీకేదో
13 యొక వింత సంభవించునట్లు ఆశ్చర్యపడకుడి. । క్రీస్తు
మహిమ బయలుపరచబడునప్పుడు మీరు మహానంద
ముతో సంతోషించు నిమిత్తము, క్రీస్తు శ్రమలలో
మీరు పాలివారైయున్నంతగా సంతోషించుడి. ।
14 క్రీస్తు నామము నిమిత్తము మీరు నిందపాలైనయెడల
మహిమాస్వరూపియైన ఆత్మ, అనగా దేవుని ఆత్మ,
మీమీద నిలుచుచున్నాడు గనుక మీరు ధన్యులు. ।
15 మీలో ఎవడును నరహంతకుడుగా గాని దొంగగా
గాని దుర్మార్గుడుగా గాని పరులజోలికి పోవువాడుగా
16 గాని బాధ అనుభవింప తగదు. । ఎవడైనను క్రైస్తవుడై
నందుకు బాధ అనుభవించినయెడల అతడు సిగ్గుపడక,
17 ఆ పేరును బట్టియే దేవుని మహిమపరచవలెను. । తీర్పు
దేవుని ఇంటియొద్ద ఆరంభమగు కాలము వచ్చియు
న్నది; అది మనయొద్దనే ఆరంభమైతే దేవుని సువార్తకు
18 అవిధేయులైన వారి గతి యేమవును? । మరియు నీతి
మంతుడే రక్షింపబడుట దుర్లభమైతే భక్తిహీనుడును
19 పాపియు ఎక్కడ నిలుతురు? । కాబట్టి దేవుని చిత్త
ప్రకారము బాధపడువారు సత్ప్రవర్తనగలవారై,
నమ్మకమైన సృష్టికర్తకు తమ ఆత్మలను అప్పగించుకొన
వలెను.

5 తోటిపెద్దను, క్రీస్తు శ్రమలనుగూర్చిన సాక్షిని,
బయలుపరచబడబోవు మహిమలో పాలివాడనునైన
నేను మీలోని పెద్దలను హెచ్చరించుచున్నాను. ।
2 బలిమిచేతకాక దేవుని చిత్తప్రకారము ఇష్టపూర్వకము
గాను, దుర్లాభాపేక్షతో కాక సిద్ధమనస్సుతోను,
మీ మధ్యనున్న దేవుని మందను పైవిచారణచేయుచు
దాని కాయుడి. । మీకు అప్పగింపబడిన వారిపైన 3
ప్రభువులైనట్టుండక మందకు మాదిరులుగా ఉండుడి; ।
ప్రధానకాపరి ప్రత్యక్షమైనప్పుడు మీరు వాడ 4
బారని మహిమకిరీటము పొందుదురు. । చిన్నలారా, 5
మీరు పెద్దలకు లోబడియుండుడి; మీరందరు ఎదుటి
వానియెడల దీనమనస్సు అను వస్త్రము ధరించుకొని
మిమ్మును అలంకరించుకొనుడి; దేవుడు అహంకారులను
ఎదిరించి దీనులకు కృప అనుగ్రహించును. । దేవుడు 6
తగిన సమయమందు మిమ్మును హెచ్చించునట్లు ఆయన
బలిష్ఠమైన చేతిక్రింద దీనమనస్కులై యుండుడి. ।
ఆయన మిమ్మునుగూర్చి చింతించుచున్నాడు[1] గనుక 7
మీ చింత యావత్తు ఆయనమీద వేయుడి. । నిబ్బర 8
మైన బుద్ధిగలవారై మెలకువగా ఉండుడి; మీ విరోధి
యైన అపవాది[2] గర్జించు సింహమువలె ఎవరిని మ్రింగు
దునా అని వెదకుచు తిరుగుచున్నాడు. । లోకమం 9
దున్న మీ సహోదరులయందు ఈ విధమైన శ్రమలే
నెరవేరుచున్నవని యెరిగి, విశ్వాసమందు స్థిరులై
వానిని ఎదిరించుడి. । తన నిత్యమహిమకు క్రీస్తునందు 10
మిమ్మును పిలిచిన సర్వకృపానిధియగు దేవుడు, కొం
చెము కాలము మీరు శ్రమపడిన పిమ్మట, తానే
మిమ్మును పూర్ణులనుగా చేసి స్థిరపరచి బలపరచును. ।
యుగయుగములకు ప్రభావమాయనకు కలుగునుగాక. 11
ఆమేన్.

మిమ్మును హెచ్చరించుచు, ఇదియే దేవుని సత్య 12
మైన కృప అని సాక్ష్యము చెప్పుచు సంక్షేపముగా
వ్రాసి, మీకు నమ్మకమైన సహోదరుడని నేనెంచిన
సిల్వానుచేత దీని పంపుచున్నాను. ఈ సత్యకృపలో
నిలుకడగా ఉండుడి. । బాబెలులో మీవలె నేర్పరచ 13
బడిన ఆమెయు, నా కుమారుడైన మార్కును, మీకు
వందనములు చెప్పుచున్నారు. ప్రేమగల ముద్దుతో
ఒకనికి ఒకడు వందనములు చేయుడి.

క్రీస్తునందున్న మీకందరికిని సమాధానము కలు
గునుగాక. ఆమేన్.

1 లేక, లక్ష్యముచేయుచున్నాడు. 2 అనగా—సాతాను.

# పేతురు భక్తకోటికి వ్రాసిన రెండవ పత్రిక

1 యేసుక్రీస్తు[1] దాసుడును అపొస్తలుడునైన సీమోను
పేతురు, మన దేవునియొక్కయు రక్షకుడైన యేసు
క్రీస్తుయొక్కయు నీతినిబట్టి, మావలెనే అమూల్య
మైన విశ్వాసము పొందినవారికి (శుభమని చెప్పి)
2 వ్రాయునది. । తన మహిమనుబట్టియు, గుణాతిశయ
3 మునుబట్టియు, మనలను పిలిచినవానిగూర్చిన అను
భవజ్ఞానమూలముగా ఆయన దైవశక్తి, జీవమునకును
భక్తికిని కావలసినవాటినన్నిటిని మనకు దయచేయు
చున్నందున, దేవునిగూర్చినట్టియు మన ప్రభువైన
యేసునుగూర్చినట్టియునైన అనుభవజ్ఞానమువలన మీకు
4 కృపయు సమాధానమును విస్తరించును గాక. । ఆ
మహిమ గుణాతిశయములనుబట్టి ఆయన మనకు
అమూల్యములును అత్యధికములునైన వాగ్దానములను
అనుగ్రహించి యున్నాడు. దురాశను అనుసరించుట
వలన లోకమందున్న భ్రష్టత్వమును ఈ వాగ్దానముల
మూలముగా మీరు తప్పించుకొని, దేవస్వభావము
నందు పాలివారగునట్లు వాటిని అనుగ్రహించెను. ।
5 ఆ హేతువుచేతనే మీమట్టుకు మీరు పూర్ణజాగ్రత్త
గలవారై, మీ విశ్వాసమునందు సద్గుణమును, సద్గు
6 ణమునందు జ్ఞానమును, । జ్ఞానమునందు ఆశానిగ్రహ
మును, ఆశానిగ్రహమునందు సహనమును, సహనము
7 నందు భక్తిని, । భక్తియందు సహోదరప్రేమను,
సహోదరప్రేమయందు దయను[2] అమర్చుకొనుడి. ।
8 ఇవి మీకు కలిగి విస్తరించినయెడల మన ప్రభువైన
యేసుక్రీస్తునుగూర్చిన అనుభవజ్ఞానవిషయములో
మిమ్మును సోమరులైనను నిష్ఫలులైనను కాకుండ చేయు
9 ను. । ఇవి ఎవనికి లేకపోవునో వాడు తన పూర్వ
పాపములకు శుద్ధి కలిగిన సంగతి మరచిపోయి, గుడ్డి
10 వాడును దూరదృష్టిలేనివాడునగును. । అందువలన
సహోదరులారా, మీ పిలుపును ఏర్పాటును నిశ్చ
11 యము చేసికొనుటకు మరి జాగ్రత్తపడుడి. । మీరిట్టి
క్రియలు చేయువారైతే ఎప్పుడును తొట్రిల్లరు.
ఆలాగున మన ప్రభువును రక్షకుడునైన యేసుక్రీస్తు
యొక్క నిత్యరాజ్యములో ప్రవేశము మీకు సమృ
ద్ధిగా అనుగ్రహింపబడును.
12 కాబట్టి మీరు ఈ సంగతులను తెలిసికొని మీరం
గీకరించిన సత్యమందు స్థిరపరచబడియున్నను, వీటిని
గూర్చి ఎల్లప్పుడును మీకు జ్ఞాపకము చేయుటకు
13 సిద్ధముగా ఉన్నాను. । మరియు మన ప్రభువైన యేసు
14 క్రీస్తు నాకు సూచించినప్రకారము నా గుడారమును
త్వరగా విడిచిపెట్టవలసివచ్చునని యెరిగి, నేను ఈ
గుడారములో ఉన్నంతకాలము ఈ సంగతులను జ్ఞాప
కముచేసి మిమ్మును రేపుట న్యాయమని యెంచుకొను
చున్నాను. । నేను మృతిపొందిన తరువాత[3] కూడ 15
మీరు నిత్యము వీటిని జ్ఞాపకముచేసికొనునట్లు జాగ్రత్త
చేతును. । ఏలయనగా చమత్కారముగా కల్పించిన 16
కథలను అనుసరించి మన ప్రభువైన యేసుక్రీస్తు
యొక్క శక్తిని ఆయన ఆగమనమును మేము మీకు
తెలుపలేదు గాని ! ఆయన మాహాత్మ్యమును మేము 17
కన్నులార చూచినవారమై తెలిపితిమి

ఈయన నా ప్రియకుమారుడు ఈయనయందు
నేను ఆనందించుచున్నాను

అను శబ్దము మహాదివ్యమహిమనుండి ఆయనయొద్దకు
వచ్చినప్పుడు,[4] తండ్రియైన దేవునివలన ఘనతయు
మహిమయు ఆయన పొందగా । మేము ఆ పరిశుద్ధ 18
పర్వతముమీద ఆయనతోకూడ ఉండినవారమై, ఆ
శబ్దము ఆకాశమునుండి రాగా వింటిమి. । మరియు 19
ఇంతకంటె స్థిరమైన ప్రవచనవాక్యము మనకున్నది.
తెల్లవారి వేకువచుక్క మీ హృదయములలో ఉద
యించువరకు ఆ వాక్యము చీకటిగల చోటున
వెలుగిచ్చు దీపమైనట్టున్నది; దానియందు మీరు లక్ష్య
ముంచినయెడల మీకు మేలు. । ఒకడు తన ఊహను 20
బట్టి చెప్పుటవలన లేఖనములో ఏ ప్రవచనమును పుట్ట
దని మొదట గ్రహించుకొనవలెను. । ఏలయనగా 21
ప్రవచనము ఎప్పుడును మనుష్యుని ఇచ్ఛనుబట్టి కలుగ
లేదు గాని మనుష్యులు పరిశుద్ధాత్మవలన ప్రేరేపింప
బడినవారై దేవుని (సహాయము) చేత పలికిరి.

మరియు అబద్ధికులైన ప్రవక్తలు ప్రజలలో ఉం 2
డిరి. అటువలెనే మీలోను అబద్ధికులైన బోధకులుం
దురు; వీరు తమ్మును కొనిన నాథునికూడ విసర్జించుచు,
తమకు తామే శీఘ్రముగా నాశనము కలుగజేసి
కొనుచు, నాశనకరమగు భిన్నాభిప్రాయములను రహ
స్యముగా బోధించుదురు. । మరియు అనేకులు వారి 2
పోకిరిచేష్టలను అనుసరించి నడుతురు; వీరినిబట్టి సత్య
మార్గము దూషింపబడును. । వారు అధిక లోభులై, 3
కల్పనావాక్యములు చెప్పుచు, మీవలన లాభము సంపా
దించుకొందురు; వారికి పూర్వమునుండి విధింపబడిన
తీర్పు ఆలస్యము చేయదు, వారి నాశనము కునికి
నిద్రపోదు. । దేవదూతలు పాపము చేసినప్పుడు 4
దేవుడు వారిని విడిచిపెట్టక, పాతాళలోకమందలి

[1] క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము. [2] మూలభాషలో—ప్రేమను. [3] మూలభా.—నా నిర్గమమునకు తరువాత. [4] మత్తయి, 17: 5.

కటికచీకటిగల బిలములలోకి త్రోసి, తీర్పుకు కావలిలో,
5 ఉంచబడుటకు వారిని అప్పగించెను. । మరియు ఆయన
పూర్వకాలమందున్న లోకమును విడిచిపెట్టక, భక్తి
హీనుల సమూహముమీదికి[1] జలప్రళయమును రప్పిం
చినప్పుడు, నీతిని ప్రకటించిన నోవహును మరి యేడు
6 గురిని కాపాడెను. । మరియు ఆయన సొదొమ గొమొ
ఱ్ఱాలను పట్టణములను భస్మముచేసి, ముందుకు భక్తి
హీనులగువారికి వాటిని దృష్టాంతముగా ఉంచుటకై
7 వాటికి నాశనము విధించి, । దుర్మార్గుల కామవికార
యుక్తమైన నడవడిచేత బహు బాధపడిన నీతిమంతు
8 డగు లోతును తప్పించెను. । ఆ నీతిమంతుడు వారి
మధ్యను కాపురముండి, తాను చూచినవాటినిబట్టియు
వినినవాటినిబట్టియు, వారి అక్రమమైన క్రియల
విషయములో దినదినము నీతిగల తన మనస్సును
9 నొప్పించుకొనుచు వచ్చెను. । భక్తులను శోధనలో
10 నుండి తప్పించుటకును, దుర్నీతిపరులను, ముఖ్యముగా
మలినమైన దురాశకలిగి శరీరానుసారముగా నడుచు
కొనుచు, ప్రభుత్వమును నిరాకరించుచు, శిక్షలో
ఉంచబడినవారిని తీర్పుదినమువరకు కావలిలో ఉంచు
టకును, ప్రభువు సమర్థుడు. వీరు తెగువగలవారును
స్వేచ్ఛాపరులునై మహాత్ములను[2] దూషింప వెరువక
11 యున్నారు. । దేవదూతలు వారికంటె మరి అధికమైన
బలమును శక్తియు గలవారైనను, ప్రభువు ఎదుట
వారిని దూషించి వారిమీద నేరముమోప వెరతురు. ।
12 వారైతే పట్టబడి చంపబడుటకే స్వభావసిద్ధముగా
పుట్టిన వివేకశూన్యములగు మృగములవలె ఉండి,
తమకు తెలియని విషయములనుగూర్చి దూషించుచు,
తమ దుష్ప్రవర్తనకు ప్రతిఫలముగా హాని అనుభ
వించుచు, తాము చేయు నాశనములోనే తామే
13 నాశనము పొందుదురు; । ఒకనాటి సుఖానుభవము
సంతోషమని యెంచుకొందురు. వారు కళంకములును
నిందాస్పదములునై తమ ప్రేమవిందులలో మీతో
కూడ అన్నపానములు పుచ్చుకొనుచు తమ భోగముల
14 యందు సుఖించుదురు. । వ్యభిచారిణిని చూచి ఆశిం
చుచు పాపము మానలేని కన్నులు గలవారును, అస్థిర
లైనవారి మనస్సులను మరులుకొల్పుచు లోభిత్వమందు
సాధకము చేయబడిన హృదయము గలవారును, శాప
15 గ్రస్తులునైయుండి, । తిన్ననిమార్గమును విడిచి బెయోరు
కుమారుడైన బిలాము పోయిన మార్గమునుబట్టి త్రోవ
16 తప్పిపోయిరి. । ఆ బిలాము దుర్నీతివలన కలుగు ఫల
మును ప్రేమించెను; అయితే తాను చేసిన అతిక్రమము
నిమిత్తము అతడు గద్దింపబడెను; ఎట్లనగా నోరులేని
గార్దభము మానవస్వరముతో మాటలాడి ఆ ప్రవక్త
17 యొక్క వెఱ్ఱితనము అడ్డగించెను. । వీరు నీళ్లులేని
బావులును, పెనుగాలికి కొట్టుకొనిపోవు మేఘములునై
యున్నారు. వీరికొరకు గాఢాంధకారము భద్రము
చేయబడియున్నది. । వీరు వ్యర్థమైన డంబపుమాటలు 18
పలుకుచు, తామే శరీరసంబంధమైన దురాశలుగల
వారై, తప్పుమార్గమందు నడుచువారిలోనుండి అప్పుడే
తప్పించుకొనినవారిని పోకిరి చేష్టలచేత మరులుకొల్పు
చున్నారు. । తామే భ్రష్టత్వమునకు దాసులై యుం 19
డియు, అట్టివారికి స్వాతంత్ర్యము ఇత్తుమని చెప్పు
దురు. ఒకడు దేనివలన జయింపబడునో దానికి దాసు
డగును గదా? । వారు ప్రభువును రక్షకుడునైన యేసు 20
క్రీస్తు విషయమైన అనుభవజ్ఞానముచేత ఈ లోకమాలి
న్యములను తప్పించుకొనిన తరువాత మరల వాటిలో
చిక్కుబడి వాటిచేత జయింపబడినయెడల, వారి కడ
వరి స్థితి మొదటి స్థితికంటె మరి చెడ్డదగును. । వారు 21
నీతిమార్గమును అనుభవపూర్వకముగా తెలిసికొని,
తమకు అప్పగింపబడిన పరిశుద్ధమైన ఆజ్ఞనుండి తొలగి
పోవుటకంటె ఆ మార్గము అనుభవపూర్వకముగా
తెలియకయుండుటయే వారికి మేలు. । కుక్క తన 22
వాంతికి తిరిగినట్టును, కడుగబడిన పంది బురదలో
దొర్లుటకు మళ్లినట్టును అను నిజమైన సామెతచొప్పున
వీరికి సంభవించెను.

ప్రియులారా, యీ రెండవ పత్రిక మీకిప్పుడు 3
వ్రాయుచున్నాను । పరిశుద్ధ ప్రవక్తలచేత పూర్వ 2
మందు పలుకబడిన మాటలను, ప్రభువైన రక్షకుడు
మీ అపొస్తలులద్వారా ఇచ్చిన ఆజ్ఞను మీరు జ్ఞాప
కము చేసికొనవలెనను విషయమును (ఈ రెండు పత్రి
కలవలన) మీకు జ్ఞాపకముచేసి, నిర్మలమైన మీ మనస్సు
లను రేపుచున్నాను. । అంత్యదినములలో అపహాస 3
కులు అపహసించుచువచ్చి, తమ స్వకీయ దురాశల
చొప్పున నడుచుకొనుచు, । — ఆయన ఆగమనమును 4
గూర్చిన వాగ్దానమేమాయెను? పితరులు నిద్రించినది
మొదలుకొని సమస్తమును సృష్టి ఆరంభముననున్నట్టే
నిలిచియున్నదే అని చెప్పుదురని మొదట మీరు తెలిసి
కొనవలెను. । ఏలయనగా పూర్వమునుండి ఆకాశ 5
ముండెననియు, నీళ్లలోనుండియు నీళ్లవలనను సమ
కూర్చబడిన భూమియు దేవుని వాక్యమువలన కలిగె
ననియు వారు బుద్ధిపూర్వకముగా మరతురు. । ఆ 6
నీళ్లవలన అప్పుడున్నలోకము నీటివరదలో మునిగి
నశించెను. । అయితే ఇప్పుడున్న ఆకాశమును భూమి 7
యు భక్తిహీనుల తీర్పును నాశనమును జరుగు దినము
వరకు అగ్నికొరకు నిలువచేయబడినవై, అదే వాక్యము
వలన భద్రముచేయబడియున్నవి.

ప్రియులారా, ఒక సంగతి మరచిపోకుడి. ఏమనగా 8
ప్రభువు దృష్టికి ఒక దినము వెయ్యిసంవత్సరముల
వలెను వెయ్యిసంవత్సరములు ఒక దినమువలెను
ఉన్నవి. । కొందరు ఆలస్యమని యెంచుకొనునట్లు 9

1 మూలభాషలో—లోకమునుమీదికి.
2 మూలభా.—మహిమలను.

ప్రభువు తన వాగ్దానమునుగూర్చి ఆలస్యము చేయు
వాడు కాడు గాని యెవడును నశింపవలెనని యిచ్ఛ
యింపక, అందరు మారుమనస్సు పొందవలెనని
కోరుచు, మీ యెడల దీర్ఘశాంతముగలవాడై యు
10 న్నాడు. । అయితే ప్రభువు దినము దొంగవచ్చినట్లు
వచ్చును. ఆ దినమున ఆకాశములు మహా ధ్వనితో
గతించిపోవును, భూతములు మిక్కుటమైన వేండ్ర
ముతో లయమైపోవును, భూమియు దానిమీద
11 నున్న కృత్యములును కాలిపోవును. । ఇవన్నియు ఇట్లు
12 లయమైపోవునవి గనుక, ఆకాశములు రవులుకొని
లయమైపోవునట్టియు, భూతములు మహా వేండ్ర
ముతో కరిగిపోవునట్టియు, దేవుని దినపు ఆగమనము
కొరకు కనిపెట్టుచు, దానిని ఆశతో అపేక్షించుచు,[1]
మీరు పరిశుద్ధమైన ప్రవర్తనతోను భక్తితోను ఎంతో
13 జాగ్రత్తగలవారై యుండవలెను. । అయినను మన
మాయన వాగ్దానమునుబట్టి క్రొత్త ఆకాశములకొర
కును క్రొత్త భూమికొరకును కనిపెట్టుచున్నాము;
వాటియందు నీతి నివసించును.
14 ప్రియులారా, వీటికొరకు మీరు కనిపెట్టువారు
గనుక శాంతముగలవారై, ఆయన దృష్టికి నిష్కళంకులు
గాను నిందారహితులుగాను కనబడునట్లు జాగ్రత్త
పడుడి. । మరియు మన ప్రభువుయొక్క దీర్ఘశాంతము 15
రక్షణార్థమైనదని యెంచుకొనుడి. ఆలాగు మన ప్రియ
సహోదరుడైన పౌలుకూడ తనకు అనుగ్రహింప
బడిన జ్ఞానముచొప్పున మీకు వ్రాసియున్నాడు. ।
వీటినిగూర్చి తన పత్రికలన్నిటిలోను బోధించు 16
చున్నాడు; అయితే వాటిలో కొన్ని సంగతులు
గ్రహించుటకు కష్టమైనవి. వీటిని విద్యావిహీనులును
అస్థిరులైనవారును, తక్కిన లేఖనములను అపార్థము
చేసినట్లు, తమ స్వకీయనాశనమునకు అపార్థము చేయు
దురు.[2] । ప్రియులారా, మీరు ఈ సంగతులు ముం 17
దుగా తెలిసికొనియున్నారు గనుక మీరు నీతివిరో
ధుల తప్పుబోధవలన తొలగింపబడి, మీకు కలిగిన
స్థిరమనస్సును విడిచి పడిపోకుండ కాచుకొనియుం
డుడి. । మన ప్రభువును రక్షకుడునైన యేసుక్రీస్తు 18
అనుగ్రహించు కృపయందును జ్ఞానమందును అభివృద్ధి
పొందుడి. ఆయనకు ఇప్పుడును యుగాంతదినమువర
కును మహిమ కలుగునుగాక. ఆమేన్.

1 మూలభాషలో—త్వరపెట్టుచు. 2 మూలభా.—వక్రముగా త్రిప్పుదురు.

# యోహాను భక్తకోటికి వ్రాసిన మొదటి పత్రిక

1 జీవవాక్యమునుగూర్చినది ఆదినుండి ఏదియుం
డెనో, మేమేది వింటిమో, కన్నులార ఏది చూచితిమో,
ఏది నిదానించి కనుగొంటిమో, మా చేతులు దేని తాకి
చూచెనో, (అది మీకు తెలియజేయుచున్నాము.) ।
2 ఆ జీవము ప్రత్యక్షమాయెను; తండ్రియొద్ద ఉండి
మాకు ప్రత్యక్షమైన ఆ నిత్యజీవమును మేము చూచి,
ఆ జీవమునుగూర్చి సాక్ష్యమిచ్చుచు, దానిని మీకు
3 తెలియపరచుచున్నాము. । మాతోకూడ మీకును సహ
వాసము కలుగునట్లు మేము చూచినదానిని వినిన
దానిని మీకును తెలియజేయుచున్నాము. మన సహ
వాసమైతే తండ్రితోకూడను ఆయన కుమారుడైన
4 యేసుక్రీస్తుతోకూడను[1] ఉన్నది. । మన[2] సంతోషము
పరిపూర్ణమవుటకై మేమీసంగతులను వ్రాయు
చున్నాము.
5 మేమాయనవలన విని మీకు ప్రకటించు వర్తమాన
మేమనగా — దేవుడు వెలుగై యున్నాడు; ఆయన
6 యందు చీకటి ఎంతమాత్రమును లేదు. । ఆయనతో
కూడ సహవాసముగలవారమని చెప్పుకొని చీకటిలో
నడిచినయెడల మనమబద్ధమాడుచు సత్యమును జరిగింప
7 కుందుము. । అయితే ఆయన వెలుగులోనున్న ప్రకా
రము మనమును వెలుగులో నడిచినయెడల మనము
అన్యోన్యసహవాసము గలవారమై యుందుము;
అప్పుడు ఆయన కుమారుడైన యేసు రక్తము ప్రతి
పాపమునుండి మనలను పవిత్రులనుగా చేయును. ।
8 మనము పాపములేనివారమని చెప్పుకొనినయెడల మన
లను మనమే మోసపుచ్చుకొందుము; మరియు మనలో
9 సత్యముండదు. । మన పాపములను మనము ఒప్పు
కొనినయెడల, ఆయన నమ్మదగినవాడును నీతిమంతు
డును గనుక ఆయన మన పాపములను క్షమించి
సమస్త దుర్నీతినుండి మనలను పవిత్రులనుగా చేయు
10 ను. । మనము పాపము చేయలేదని చెప్పుకొనిన
యెడల ఆయనను అబద్ధికునిగా చేయువారమగుదుము;
మరియు ఆయన వాక్యము మనలో ఉండదు.

2 నా చిన్న పిల్లలారా, మీరు పాపము చేయకుం
డుటకై యీ సంగతులను మీకు వ్రాయుచున్నాను.
ఎవడైనను పాపము చేసినయెడల నీతిమంతుడైన యేసు
క్రీస్తు అను ఉత్తరవాది[3] తండ్రియొద్ద మనకున్నాడు. ।
2 ఆయనే మన పాపములకు శాంతికరమై యున్నాడు;
మన పాపములకు మాత్రమేకాదు సర్వలోకమునకును
3 శాంతికరమై యున్నాడు. । మరియు మనమాయన
ఆజ్ఞలను గైకొనినయెడల, దీనివలననే ఆయనను ఎరిగి
యున్నామని తెలిసికొందుము. । ఆయనను ఎరిగి 4
యున్నానని చెప్పుకొనుచు, ఆయన ఆజ్ఞలను గైకొనని
వాడు అబద్ధికుడు; వానిలో సత్యములేదు. । ఆయన 5
వాక్యము ఎవడు గైకొనునో వానిలో దేవుని ప్రేమ 6
నిజముగా పరిపూర్ణమాయెను; ఆయనయందు నిలిచి
యున్నవాడనని చెప్పుకొనువాడు ఆయన ఏలాగు
నడుచుకొనెనో ఆలాగే తానును నడుచుకొన బద్ధుడై
యున్నాడు. మనమాయనయందున్నామని దీనివలన
తెలిసికొనుచున్నాము.
ప్రియులారా, మొదటనుండి మీకున్న పూర్వపు 7
ఆజ్ఞనే గాని క్రొత్త ఆజ్ఞను నేను మీకు వ్రాయుట
లేదు; ఈ పూర్వపు ఆజ్ఞ మీరు వినిన వాక్యమే. ।
మరియు క్రొత్త ఆజ్ఞను మీకు వ్రాయుచున్నాను. 8
చీకటి గతించుచున్నది, సత్యమైన వెలుగు ఇప్పుడు
ప్రకాశించుచున్నది గనుక అది ఆయనయందును మీ
యందును సత్యమే. । వెలుగులో ఉన్నానని చెప్పు 9
కొనుచు, తన సహోదరుని ద్వేషించువాడు ఇప్పటి
వరకును చీకటిలోనే యున్నాడు. । తన సహో 10
దరుని ప్రేమించువాడు వెలుగులో ఉన్నవాడు;
అతనియందు అభ్యంతరకారణమేదియు లేదు । తన 11
సహోదరుని ద్వేషించువాడు చీకటిలో ఉండి, చీక
టిలో నడుచుచున్నాడు; చీకటి అతని కన్నులకు
అంధత్వము కలుగజేసెను గనుక తానెక్కడికి పోవు
చున్నాడో అతనికి తెలియదు.
చిన్న పిల్లలారా, ఆయన నామమునుబట్టి మీ పాప 12
ములు క్షమింపబడినవి గనుక మీకు వ్రాయుచు
న్నాను. । తండ్రులారా, మీరు ఆదినుండి యున్నవానిని 13
ఎరిగియున్నారు గనుక మీకు వ్రాయుచున్నాను.
యౌవనస్థులారా, మీరు దుష్టుని జయించియున్నారు
గనుక మీకు వ్రాయుచున్నాను. । చిన్న పిల్లలారా, 14
మీరు తండ్రిని ఎరిగియున్నారు గనుక మీకు వ్రాయు
చున్నాను. తండ్రులారా, మీరు ఆదినుండి యున్న
వానిని ఎరిగియున్నారు గనుక మీకు వ్రాయుచు
న్నాను. యౌవనస్థులారా, మీరు బలవంతులు, దేవుని
వాక్యము మీయందు నిలుచుచున్నది; మీరు దుష్టుని
జయించియున్నారు గనుక మీకు వ్రాయుచు
న్నాను. । ఈ లోకమునైనను లోకములో ఉన్నవాటి 15
నైనను ప్రేమింపకుడి. ఎవడైనను లోకమును ప్రేమిం
చినయెడల తండ్రి ప్రేమ వానిలోనుండదు. । లోక 16

1 క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము. 2 అనేక ప్రాచీనప్రతులలో—మీ అని పాఠాంతరము. 3 లేక, ఆదరణకర్త.

ములో ఉన్నదంతయు, అనగా శరీరాశయు నేత్రా
శయు జీవపు డంబమును తండ్రివలన పుట్టినవి కావు;
17 అవి లోకసంబంధమైనవే. । లోకమును దాని ఆశయు
గతించిపోవుచున్నవి గాని దేవుని చిత్తమును జరిగించు
వాడు నిరంతరమును నిలుచును.
18 చిన్న పిల్లలారా, యిది కడవరి గడియ. క్రీస్తు
విరోధి వచ్చునని వింటిరి గదా? ఇప్పుడును అనేకులైన
క్రీస్తు విరోధులు బయలుదేరియున్నారు; ఇది కడవరి
19 గడియ అని దీనిచేత తెలిసికొనుచున్నాము. । వారు
మనలోనుండి బయలువెళ్లిరి గాని వారు మన సంబం
ధులు కారు; వారు మన సంబంధులైతే మనతోకూడ
నిలిచియుందురు; అయితే వారందరు మన సంబంధులు
కారని ప్రత్యక్షపరచబడునట్లు వారు బయలువెళ్లిరి. ।
20 అయితే మీరు పరిశుద్ధునివలన అభిషేకము పొందిన
21 వారు గనుక సమస్తమును ఎరుగుదురు. । మీరు సత్య
మెరుగరని నేను వ్రాయలేదు గాని మీరు దానిని ఎరిగి
యున్నందునను, ఏ అబద్ధమును సత్యసంబంధమైనది
కాదని యెరిగియున్నందునను మీకు వ్రాయుచు
22 న్నాను. । యేసు, క్రీస్తు కాడని చెప్పువాడు తప్ప
ఎవడబద్ధికుడు? తండ్రిని కుమారుని ఒప్పుకొనని వీడే
23 క్రీస్తువిరోధి. । కుమారుని ఒప్పుకొనని ప్రతివాడును
తండ్రిని అంగీకరించువాడు[1] కాడు; కుమారుని ఒప్పు
24 కొనువాడు తండ్రిని అంగీకరించువాడు. । అయితే
మీరు మొదటనుండి దేని వింటిరో అది మీలో నిలువ
నియ్యుడి; మీరు మొదటనుండి వినినది మీలో నిలి
చినయెడల మీరుకూడ కుమారునియందును తండ్రి
25 యందును నిలుతురు. । నిత్యజీవము అనుగ్రహింతు
ననునదియే ఆయన తానే మనకు చేసిన వాగ్దానము. ।
26 మిమ్మును మోసపరచువారినిబట్టి యీ సంగతులు మీకు
27 వ్రాసియున్నాను. । అయితే ఆయనవలన మీరు పొం
దిన అభిషేకము మీలో నిలుచుచున్నది గనుక ఎవ
డును మీకు బోధింపనక్కరలేదు; ఆయన (ఇచ్చిన)
అభిషేకము సత్యమే గాని అబద్ధము కాదు; అది
అన్నిటినిగూర్చి మీకు బోధించుచున్న ప్రకారము
గాను, ఆయన మీకు బోధించినప్రకారముగాను,
28 ఆయనలో మీరు నిలుచుచున్నారు.[2] । కాబట్టి చిన్న
పిల్లలారా, ఆయన ప్రత్యక్షమగునప్పుడు ఆయన ఆగ
మనమందు మనము ఆయనయెదుట సిగ్గుపడక ధైర్యము
కలిగియుండునట్లు మీరాయనయందు నిలిచియుం
29 డుడి. । ఆయన నీతిమంతుడని మీరెరిగియున్నయెడల
నీతిని జరిగించు ప్రతివాడును ఆయన మూలముగా
పుట్టియున్నాడని యెరుగుదురు.

ని పిలువబడుటయందు
చూపెనో[3] చూడుడి;
హేతువుచేత లోకము
మనలను ఎరుగదు, ఏలయనగా అది ఆయనను ఎరుగ
లేదు. । ప్రియులారా, యిప్పుడు మనము దేవుని 2
పిల్లలమై యున్నాము. మనమిక ఏమవుదుమో అది
ఇంక ప్రత్యక్షపరచబడలేదు గాని ఆయన ప్రత్యక్షమై
నప్పుడు ఆయన యున్నట్టుగానే ఆయనను చూతుము
గనుక ఆయనను పోలియుందుమని యెరుగుదుము. ।
ఆయనయందు ఈ నిరీక్షణ పెట్టుకొనిన ప్రతివాడును 3
ఆయన పవిత్రుడైయున్నట్టుగా తన్ను పవిత్రునిగా
చేసికొనును. । పాపముచేయు ప్రతివాడును ఆజ్ఞను 4
అతిక్రమించును; ఆజ్ఞాతిక్రమమే పాపము. । పాప 5
ములను తీసివేయుటకై ఆయన ప్రత్యక్షమాయెనని
మీకు తెలియును; ఆయనయందు పాపమేమియు
లేదు. । ఆయనయందు నిలిచియుండువాడెవడును 6
పాపము చేయడు; పాపము చేయువాడెవడును
ఆయనను చూడనులేదు ఎరుగనులేదు. । చిన్నపిల్లలారా, 7
యెవనిని మిమ్మును మోసపరచనీయకుడి. ఆయన
నీతిమంతుడైనట్టు నీతిని జరిగించు ప్రతివాడును నీతి
మంతుడు. । అపవాది[4] మొదటనుండి పాపము చేయు 8
చున్నాడు గనుక పాపము చేయువాడు అపవాది
సంబంధి; అపవాదియొక్క[4] క్రియలను లయపరచు
టకే దేవుని కుమారుడు ప్రత్యక్షమాయెను. । దేవుని 9
మూలముగా పుట్టిన ప్రతివానిలో ఆయన బీజము
నిలుచును గనుక వాడు పాపముచేయడు; వాడు
దేవుని మూలముగా పుట్టినవాడు గనుక పాపము చేయ
జాలడు. । దీనినిబట్టి దేవుని పిల్లలెవరో అపవాది[4] 10
పిల్లలెవరో తేటపడును. నీతిని జరిగించని ప్రతివా
డును, తన సహోదరుని ప్రేమింపని ప్రతివాడును
దేవుని సంబంధులు కారు. । మనమొకనినొకడు 11
ప్రేమింపవలెననునది మొదటనుండి మీరు వినిన వర్త
మానమేగదా? । మనము కయీనువంటివారమై యుండ 12
రాదు. వాడు దుష్టుని సంబంధియై తన సహో
దరుని చంపెను; వాడతనిని ఎందుకు చంపెను? తన
క్రియలు చెడ్డవియు తన సహోదరుని క్రియలు
నీతిగలవియునై యుండెను గనుకనే గదా?
సహోదరులారా, లోకము మిమ్మును ద్వేషించిన 13
యెడల ఆశ్చర్యపడకుడి. । మనము సహోదరులను 14
ప్రేమించుచున్నాము గనుక మరణములోనుండి జీవ
ములోకి దాటియున్నామని యెరుగుదుము. ప్రేమ
లేనివాడు మరణమందు నిలిచియున్నాడు. । తన 15
సహోదరుని ద్వేషించువాడు నరహంతకుడు; ఏ
నరహంతకునియందును నిత్యజీవముండదని మీరెరు
గుదురు. । ఆయన మననిమిత్తము తన ప్రాణము 16
పెట్టెను గనుక దీనివలన ప్రేమ యెట్టిదని తెలిసికొను
చున్నాము. మనముకూడ సహోదరులనిమిత్తము మన
ప్రాణములను పెట్ట బద్ధులమై యున్నాము. । ఈ 17

[2] లేక, నిలిచియుండుడి. [3] లేక, మనకెట్టిప్రేమ ననుగ్రహించెనో. [4] అనగా—సాతాను.

లోకపు జీవనోపాధిగలవాడైయుండి, తన సహో
దరునికి లేమి కలుగుట చూచియు, అతనియెడల ఎంత
మాత్రమును కనికరము చూపనివానియందు దేవుని
18 ప్రేమ యేలాగు నిలుచును? । చిన్న పిల్లలారా, మాట
తోను నాలుకతోను కాక క్రియతోను సత్యముతోను
19 ప్రేమింతము. । ఇందువలన మనము సత్యసంబంధుల
20 మని యెరుగుదుము. దేవుడు మన హృదయముకంటె
అధికుడై సమస్తమును ఎరిగియున్నవాడు గనుక మన
హృదయము ఏ యే విషయములలో మనయందు
దోషారోపణ చేయునో ఆయా విషయములలో ఆయన
యెదుట మన హృదయములను సమ్మతిపరచుకొంద
21 ము. । ప్రియులారా, మన హృదయము మనయందు
దోషారోపణ చేయనియెడల దేవునియెదుట ధైర్యము
22 గలవారమగుదుము. । మరియు మనమాయన ఆజ్ఞలను
గైకొనుచు ఆయన దృష్టికి ఇష్టమైనవి చేయుచున్నాము
గనుక మనమేమి అడిగినను అది ఆయనవలన మనకు
23 దొరుకును. । ఆయన ఆజ్ఞ యేదనగా—ఆయన కుమారు
డైన యేసుక్రీస్తు నామమును నమ్ముకొని, ఆయన మనకు
ఆజ్ఞనిచ్చిన ప్రకారముగా ఒకనినొకడు ప్రేమింప
24 వలెననునదియే. । ఆయన ఆజ్ఞలను గైకొనువాడు ఆయన
యందు నిలిచియుండును, ఆయన వానియందు నిలిచి
యుండును; ఆయన మనయందు నిలిచియున్నాడని
ఆయన మనకనుగ్రహించిన ఆత్మమూలముగా తెలిసి
కొనుచున్నాము.

4 ప్రియులారా, అనేకులైన అబద్ధ ప్రవక్తలు లోకము
లోకి బయలు వెళ్లియున్నారు గనుక ప్రతి ఆత్మను
నమ్మక, ఆ యా ఆత్మలు దేవుని సంబంధమైనవో కావో
2 పరీక్షించుడి. । యేసుక్రీస్తు శరీరధారియై వచ్చెనని
3 యే ఆత్మ ఒప్పుకొనునో అది దేవుని సంబంధమైనది;
యే ఆత్మ యేసును ఒప్పుకొనదో అది దేవుని సంబంధ
మైనది కాదు; దీనినిబట్టియే దేవుని ఆత్మను మీరె
రుగుదురు. క్రీస్తువిరోధి ఆత్మ వచ్చునని మీరు వినిన
సంగతి ఇదే; యిదివరకే అది లోకములో ఉన్నది ।
4 చిన్న పిల్లలారా, మీరు దేవుని సంబంధులు; మీలో
ఉన్నవాడు లోకములో ఉన్నవానికంటె గొప్పవాడు
5 గనుక మీరు వారిని జయించియున్నారు. । వారు
లోకసంబంధులు గనుక లోకసంబంధులైనట్టు మాట
6 లాడుదురు, లోకము వారి మాట వినును. । మనము
దేవుని సంబంధులము; దేవుని ఎరిగినవాడు మన మాట
వినును, దేవుని సంబంధి కానివాడు మన మాట వినడు.
ఇందువలన మనము సత్యస్వరూపమైన ఆత్మ యేదో
భ్రమపరచు ఆత్మ యేదో తెలిసికొనుచున్నాము.
7 ప్రియులారా, మనము ఒకనినొకడు ప్రేమింతము;
ఏలయనగా ప్రేమ దేవునిమూలముగా కలుగుచున్నది;
ప్రేమించు ప్రతివాడును దేవుని మూలముగా పుట్టిన
వాడై దేవుని ఎరుగును. । దేవుడు ప్రేమాస్వరూపి;[1] 8
ప్రేమలేనివాడు దేవుని ఎరుగడు. । మనము ఆయన 9
ద్వారా జీవించునట్లు దేవుడు తన అద్వితీయ[2] కుమా
రుని లోకములోనికి పంపెను; దీనివలన దేవుడు మన
యందుంచిన ప్రేమ ప్రత్యక్షపరచబడెను. । మనము 10
దేవుని ప్రేమించితిమని కాదు, తానే మనలను
ప్రేమించి మన పాపములకు శాంతికరమై యుండు
టకు తన కుమారుని పంపెను; ఇందులో ప్రేమ
యున్నది. । ప్రియులారా, దేవుడు మనలను ఈలాగు 11
ప్రేమింపగా మనమొకనినొకడు ప్రేమింప బద్ధులమై
యున్నాము. । ఏ మానవుడును దేవుని ఎప్పుడును 12
చూచియుండలేదు; మనమొకనినొకడు ప్రేమించిన
యెడల దేవుడు మనయందు నిలిచియుండును; ఆయన
ప్రేమ మనయందు సంపూర్ణమగును. । దీనివలన 13
మనము ఆయనయందు నిలిచియున్నామనియు ఆయన
మనయందున్నాడనియు తెలిసికొనుచున్నాము; ఏల
యనగా ఆయన మనకు తన ఆత్మలో పాలు దయ
చేసియున్నాడు. । మరియు తండ్రి తన కుమారుని 14
లోకరక్షకుడుగా ఉండుటకు పంపియుండుట మేము
చూచి సాక్ష్యమిచ్చుచున్నాము. । యేసు దేవుని 15
కుమారుడని యెవడు ఒప్పుకొనునో వానిలో దేవుడు
నిలిచియున్నాడు, వాడు దేవునియందున్నాడు. ।
మనయెడల దేవునికి ఉన్న ప్రేమను మనమెరిగిన 16
వారమై దాని నమ్ముకొనియున్నాము; దేవుడు ప్రేమా
స్వరూపియై యున్నాడు[1]; ప్రేమయందు నిలిచి
యుండువాడు దేవునియందు నిలిచియున్నాడు,
దేవుడు వానియందు నిలిచియున్నాడు. । తీర్పుదిన 17
మందు మనకు ధైర్యము కలుగునట్లు దీనివలన ప్రేమ
మనలో పరిపూర్ణముచేయబడి యున్నది; ఏలయనగా
ఆయన ఎట్టివాడై యున్నాడో మనముకూడ ఈ
లోకములో అట్టివారమై యున్నాము. । ప్రేమలో 18
భయముండదు; అంతేకాదు; పరిపూర్ణప్రేమ భయ
మును వెళ్లగొట్టును; భయము దండనతో కూడినది;
భయపడువాడు ప్రేమయందు పరిపూర్ణము చేయ
బడినవాడు కాడు. । ఆయనే మొదట మనలను 19
ప్రేమించెను గనుక మనము ప్రేమించుచున్నాము. ।
ఎవడైనను—నేను దేవుని ప్రేమించుచున్నానని చెప్పి 20
తన సహోదరుని ద్వేషించినయెడల అతడు అబద్ధి
కుడగును; తాను చూచిన తన సహోదరుని ప్రేమిం
పనివాడు తాను చూడని దేవుని ప్రేమింపలేడు.[3] ।
దేవుని ప్రేమించువాడు తన సహోదరునికూడ 21
ప్రేమింపవలెనను ఆజ్ఞను మనమాయనవలన పొందియు
న్నాము.

1 మూలభాషలో—దేవుడు ప్రేమయైయున్నాడు. 2 లేక, జనితైక. 3 అనేక ప్రాచీనప్రతులలో—యెట్లు ప్రేమింపగలడు? అని పాఠాంతరము.

5 యేసే క్రీస్తయి యున్నాడని నమ్ము ప్రతివాడును
దేవునిమూలముగా పుట్టియున్నాడు. పుట్టించినవానిని
ప్రేమించు ప్రతివాడును ఆయన మూలముగా పుట్టిన
2 వానిని ప్రేమించును. । మనము దేవుని ప్రేమిం
చుచు ఆయన ఆజ్ఞలను నెరవేర్చువారమైతిమా దేవుని
పిల్లలను ప్రేమించుచున్నామని దానివలననే యెరుగు
3 దుము. । మనమాయన ఆజ్ఞలను గైకొనుటయే దేవుని
ప్రేమించుట; ఆయన ఆజ్ఞలు భారమైనవి కావు. ।
4 దేవునిమూలముగా పుట్టినవారందరును[1] లోకమును
జయించుదురు; మన విశ్వాసమే లోకమును జయిం
5 చిన విజయము. । యేసు దేవునికుమారుడని నమ్మువాడు
6 తప్ప లోకమును జయించువాడు మరి ఎవడు? । నీళ్ల
ద్వారాను రక్తముద్వారాను వచ్చినవాడు ఈయనే,
అనగా యేసుక్రీస్తే. ఈయన నీళ్లతో[2] మాత్రమే
గాక నీళ్లతో[2]ను రక్తముతో[2]ను వచ్చెను. ఆత్మ సత్య
స్వరూపి[3] గనుక సాక్ష్యమిచ్చువాడు ఆత్మయే. ।
7 సాక్ష్యమిచ్చువారు ముగ్గురు, అనగా ఆత్మయు నీళ్లును
9 రక్తమును, ఈ ముగ్గురు ఏకీభవించియున్నారు. । మనము
మనుష్యుల సాక్ష్యము అంగీకరించుచున్నాము గదా?
దేవుని సాక్ష్యము మరి బలమైనది. దేవుని సాక్ష్యము
10 ఆయన తన కుమారునిగూర్చి యిచ్చినదే. । దేవుని
కుమారునియందు విశ్వాసముంచువాడు తనలోనే యీ
సాక్ష్యము కలిగియున్నాడు; దేవుని నమ్మనివాడు
ఆయన తన కుమారునిగూర్చి యిచ్చిన సాక్ష్యమును
నమ్మలేదు గనుక అతడు దేవుని అబద్ధికునిగా చేసిన
11 వాడే. । ఆ సాక్ష్యమేమనగా—దేవుడు మనకు నిత్య
జీవమును దయచేసెను; ఈ జీవము ఆయన కుమారుని
12 యందున్నది. । దేవుని కుమారుని అంగీకరించువాడు
జీవముగలవాడు; దేవుని కుమారుని అంగీకరింపనివాడు
జీవములేనివాడే.

దేవుని కుమారుని నామమందు విశ్వాసముంచు 13
మీరు నిత్యజీవముగలవారని తెలిసికొనునట్లు నేను
ఈ సంగతులను మీకు వ్రాయుచున్నాను. । ఆయ 14
నను బట్టి మనకు కలిగిన ధైర్యమేదనగా, ఆయన
చిత్తానుసారముగా మనమేది అడిగినను ఆయన మన
మనవి ఆలకించుననునదియే. । మనమేమి అడిగినను 15
ఆయన మన మనవి ఆలకించునని మనమెరిగినయెడల
మనమాయనను వేడుకొనినవి మనకు కలిగినవని
యెరుగుదుము. । తన సహోదరుడు మరణకరము 16
కాని పాపము చేయగా ఎవడైనను చూచినయెడల
అతడు వేడుకొనును; అతనిబట్టి దేవుడు మరణకరము
కాని పాపము చేసినవారికి జీవము దయచేయును.
మరణకరమైన పాపము కలదు. అట్టిదానిగూర్చి వేడు
కొనవలెనని నేను చెప్పుటలేదు. । సకల దుర్నీతియు 17
పాపము; అయితే మరణకరముకాని పాపము కలదు.
దేవుని మూలముగా పుట్టియున్నవాడెవడును 18
పాపముచేయడని యెరుగుదుము. దేవునిమూలముగా
పుట్టినవాడు తన్ను భద్రముచేసికొనును గనుక దుష్టుడు
వాని ముట్టడు. । మనము దేవుని సంబంధులమనియు, 19
లోకమంతయు దుష్టునికి లోబడియున్నదనియు[4]
ఎరుగుదుము. । మనము సత్యవంతుడైనవానిని ఎరుగ 20
వలెనని దేవుని కుమారుడు వచ్చి మనకు వివేకమును
అనుగ్రహించియున్నాడని యెరుగుదుము. మనము దేవుని
కుమారుడైన యేసుక్రీస్తునందున్నవారమై సత్యవంతుని
యందున్నాము. ఆయనే నిజమైన దేవుడును నిత్యజీవ
మునై యున్నాడు. । చిన్న పిల్లలారా, విగ్రహముల 21
జోలికి పోకుండ జాగ్రత్తగా ఉండుడి.

1 మూలభాషలో—పుట్టినదంతయు లోకమును జయించును. 2 లేక, లో. 3 మూలభా.—సత్యము. 4 మూలభా.—దుష్టునియందు పడియున్నదనియు.

# యోహాను వ్రాసిన రెండవ పత్రిక

పెద్దనైన నేను, ఏర్పరచబడినదైన అమ్మగారికిని
2 ఆమె పిల్లలకును (శుభమని చెప్పి) వ్రాయునది. నేనును
నేను మాత్రమే గాక సత్యము ఎరిగినవారందరును,
మనలో నిలుచుచు మనతో ఎల్లప్పుడు ఉండు సత్య
మునుబట్టి మిమ్మును నిజముగా ప్రేమించుచున్నాము. ।
3 సత్యప్రేమలు మనయందుండగా తండ్రియైన దేవుని
యొద్దనుండియు, తండ్రియొక్క కుమారుడగు యేసు
క్రీస్తుయొద్దనుండియు కృపయు కనికరమును సమా
ధానమును మనకు తోడగును.
4 తండ్రివలన మనము ఆజ్ఞను పొందినప్రకారము
నీ పిల్లలలో కొందరు సత్యమును అనుసరించి[1] నడుచు
చుండుట కనుగొని బహుగా సంతోషించుచున్నాను. ।
5 కాగా అమ్మా, క్రొత్త ఆజ్ఞ నీకు వ్రాసినట్టు కాదు
గాని మొదటనుండి మనకు కలిగిన ఆజ్ఞనే వ్రాయుచు,
మనము ఒకరినొకరము ప్రేమింపవలెనని నిన్ను వేడు
6 కొనుచున్నాను. । మనమాయన ఆజ్ఞలప్రకారము నడు
చుటయే ప్రేమ; మీరు మొదటనుండి వినినప్రకారము
ప్రేమలో నడుచుకొనవలెను అన్నదియే ఆ ఆజ్ఞ. ।
7 యేసుక్రీస్తు శరీరధారియై వచ్చెనని యొప్పుకొనని
అనేక వంచకులు (మనలోనుండి) వెళ్లిపోయి లోక
మందున్నారు. । అట్టివాడే వంచకుడును క్రీస్తువిరోధి 8
యునై యున్నాడు. మేము (మీ మధ్యను) నెర
వేర్చిన కార్యములను చెడగొట్టుకొనక మీరు పూర్ణ
ఫలము పొందునట్లు జాగ్రత్తగా చూచుకొనుడి. ।
క్రీస్తు బోధయందు నిలిచియుండక దాని విడిచిపెట్టు 9
ప్రతివాడును దేవుని అంగీకరింపనివాడు; ఆ బోధ
యందు నిలిచియుండువాడు తండ్రిని కుమారుని అంగీ
కరించువాడై[2] యున్నాడు. । ఎవడైనను ఈ బోధను 10
తేక మీయొద్దకు వచ్చినయెడల వాని మీ యింట
చేర్చుకొనవద్దు; శుభమని వానితో చెప్పనువద్దు. ।
శుభమని వానితో చెప్పువాడు వాని దుష్టక్రియలలో 11
పాలివాడగును.
అనేక సంగతులు మీకు వ్రాయవలసియుండియు 12
సిరాతోను కాగితముతోను వ్రాయ మనస్సులేక
మీ సంతోషము పరిపూర్ణమవునట్లు మిమ్మును కలిసి
కొని ముఖాముఖిగా మాటలాడ నిరీక్షించుచున్నా
ను. । ఏర్పరచబడిన నీ సహోదరి పిల్లలు నీకు వందన 13
ములు చెప్పుచున్నారు.

# యోహాను వ్రాసిన మూడవ పత్రిక

పెద్దనైన నేను సత్యమునుబట్టి ప్రేమించు ప్రియు
డైన గాయియుకు (శుభమని చెప్పి) వ్రాయునది.
2 ప్రియుడా, నీ ఆత్మ వర్ధిల్లుచున్నప్రకారము నీవు
అన్ని విషయములలోను వర్ధిల్లుచు సౌఖ్యముగా ఉండ
3 వలెనని ప్రార్థించుచున్నాను. । నీవు సత్యమును అను
సరించి[1] నడుచుకొనుచున్నావు గనుక సహోదరులు
వచ్చి నీ సత్యప్రవర్తననుగూర్చి సాక్ష్యము చెప్పగా
4 విని బహుగా సంతోషించితిని. । నా పిల్లలు సత్యమును
అనుసరించి[1] నడుచుకొనుచున్నారని వినుటకంటె
నాకు ఎక్కువైన సంతోషము లేదు.
5 ప్రియుడా, వారు పరదేశులైనను సహోదరు
లుగా ఉన్నవారికి నీవు చేసినదెల్ల విశ్వాసికి తగి
నట్టుగా చేయుచున్నావు. । వారు నీ ప్రేమనుగూర్చి 6
సంఘము ఎదుట సాక్ష్యమిచ్చిరి. వారు అన్యజనుల 7
వలన ఏమియు తీసికొనక ఆయన నామము నిమిత్తము
బయలుదేరిరి గనుక దేవునికి తగినట్టుగా నీవు వారిని
సాగనంపిన పక్షమున నీకు యుక్తముగా ఉండును. ।
మనము సత్యమునకు సహాయకులమవునట్లు[3] అట్టివారికి 8
ఉపకారముచేయ బద్ధులమై యున్నాము.
నేను సంఘమునకు ఒక సంగతి వ్రాసితిని. అయితే 9
వారిలో ప్రధానత్వము కోరుచున్న దియొత్రెఫే
మమ్మును అంగీకరించుటలేదు. । వాడు మమ్మునుగూర్చి 10

1 మూలభాషలో—సత్యములో. 2 మూలభా.—కలిగియున్నవాడై. 3 మూలభా.—జతపనివారమవునట్లు.

చెడ్డ మాటలు వదరుచు, అది చాలనట్టుగా, సహో
దరులను తానే చేర్చుకొనక, వారిని చేర్చుకొన మనస్సు
గలవారిని కూడ ఆటంకపరచుచు సంఘములోనుండి
వారిని వెలివేయుచున్నాడు; అందుచేత నేను వచ్చి
నప్పుడు వాడు చేయుచున్న క్రియలను జ్ఞాపకము
11 చేసికొందును. । ప్రియుడా, చెడుకార్యమును కాక
మంచికార్యము ననుసరించి నడుచుకొనుము. మేలు
చేయువాడు దేవుని సంబంధి, కీడుచేయువాడు దేవుని
12 చూచినవాడుకాడు. । దేమేత్రియు అందరివలనను
సత్యమువలనను మంచి సాక్ష్యము పొందినవాడు,
మేముకూడ అతనికి సాక్ష్యమిచ్చుచున్నాము; మా
సాక్ష్యము సత్యమైనదని నీవెరుగుదువు.
అనేక సంగతులు నీకు వ్రాయవలసియున్నది 13
గాని సిరాతోను కలముతోను నీకు వ్రాయ నాకిష్టము
లేదు; । శీఘ్రముగా నిన్ను చూడ నిరీక్షించుచు 14
న్నాను; అప్పుడు ముఖాముఖిగా మాటలాడుకొనె
దము. నీకు సమాధానము కలుగును గాక. మన స్నేహి
తులు నీకు వందనములు చెప్పుచున్నారు. (నీ యొద్ద
నున్న) స్నేహితులకు పేరు పేరు వరుసను వందనములు
చెప్పుము.

---

# యూదా భక్తకోటికి వ్రాసిన పత్రిక

**యే**సుక్రీస్తు[1] దాసుడును యాకోబు సహో
దరుడునైన యూదా, తండ్రియైన దేవునియందు
ప్రేమింపబడి, యేసుక్రీస్తునందు భద్రము చేయ
బడి పిలువబడినవారికి (శుభమని చెప్పి) వ్రాయునది. ।
2 మీకు కనికరమును సమాధానమును ప్రేమయు విస్త
రించును గాక.
3 ప్రియులారా, మనకందరికి కలిగెడు రక్షణను
గూర్చి మీకు వ్రాయవలెనని విశేషాసక్తిగలవాడనై
ప్రయత్నపడుచుండగా, పరిశుద్ధులకు ఒక్కసారే
అప్పగింపబడిన బోధనిమిత్తము మీరు పోరాడవలెనని
మిమ్మును వేడుకొనుచు మీకు వ్రాయవలసివచ్చెను. ।
4 ఏలయనగా కొందరు రహస్యముగా (మనలో) జొర
బడియున్నారు. వారు భక్తిహీనులై మన దేవుని
కృపను కామాతురత్వమునకు దుర్వినియోగపరచుచు,
మన అద్వితీయనాథుడును ప్రభువునైన యేసుక్రీస్తును
విసర్జించుచున్నారు; ఈ తీర్పుపొందుటకు వారు
పూర్వమందే సూచింపబడినవారు.[2]
5 ఈ సంగతులన్నియు మీరు ముందటనే యెరిగి
యున్నను, నేను మీకు జ్ఞాపకము చేయగోరుచున్న
దేమనగా, ప్రభువు ఐగుప్తులోనుండి ప్రజలను రక్షించి
నను, వారిలో నమ్మకపోయినవారిని తరువాత నాశ
6 నము చేసెను. । మరియు తమ ప్రధానత్వమును నిలు
పుకొనక, తమ నివాసస్థలమును విడిచిన దేవదూతలను,
మహాదినమున జరుగు తీర్పువరకు కటికచీకటిలో నిత్య
పాశములతో ఆయన బంధించి భద్రముచేసెను. ।
ఆ ప్రకారముగానే సొదొమ గొమొఱ్ఱాలును వాటి 7
చుట్టుపట్లనున్న పట్టణములును వీరివలెనే వ్యభిచారము
చేయుచు, పరశరీరానుసారులైనందున నిత్యాగ్ని దండన
అనుభవించుచు దృష్టాంతముగా ఉంచబడెను. । అటు 8
వలెనే వీరును కలలు కనుచు, శరీరమును అపవిత్రపర్చు
కొనుచు, ప్రభుత్వమును నిరాకరించుచు, మహాత్ము
లను[3] దూషించుచు ఉన్నారు. । అయితే ప్రధాన 9
దూతయైన మిఖాయేలు అపవాదితో[4] వాదించుచు
మోషేయొక్క శరీరమునుగూర్చి తర్కించినప్పుడు,
దూషించి తీర్పుతీర్చ తెగింపక— ప్రభువు నిన్ను
గద్దించును గాక అనెను. । వీరైతే తాము గ్రహింపని 10
విషయములనుగూర్చి దూషించువారై, వివేకశూన్య
ములగు మృగములవలె వేటిని స్వాభావికముగా ఎరుగు
దురో వాటివలన తమ్మునుతాము చెరుపుకొనుచు
న్నారు. । అయ్యో వారికి శ్రమ. వారు కయీను 11
నడిచిన మార్గమున నడిచిరి, బహుమానము పొంద
వలెనని బిలాము నడిచిన తప్పుత్రోవలో ఆతురముగా
పరుగెత్తిరి, కోరహు చేసినట్టు తిరస్కారముచేసి నశిం
చిరి. । వీరు నిర్భయముగా మీతో సుభోజనము 12
చేయుచు, తమ్మునుతాము నిర్భయముగా పోషించు
కొనుచు,[5] మీ ప్రేమావిందులలో దొంగ మెట్టలుగా
ఉన్నారు. వీరు గాలిచేత ఇటు అటు కొట్టుకొనిపోవు
నిర్జల మేఘములుగాను, కాయలురాలి ఫలములు లేక,
రెండు మారులు చచ్చి వేళ్లతో పెల్లగింపబడిన చెట్లు
గాను, । తమ అవమానమను నురుగు వెళ్లగ్రక్కు 13

[1] క్రీస్తు అను శబ్దమునకు అభిషిక్తుడని అర్థము. [2] మూలభాషలో—వ్రాయబడినవారు. [3] మూలభా.—మహిమలను. [4] అనగా—సాతానుతో
[5] మూలభా.—మేపుకొనుచు.

వారై, సముద్రముయొక్క ప్రచండమైన అలలు
గాను, మార్గముతప్పితిరుగు చుక్కలుగాను ఉన్నారు;
వారికొరకు గాఢాంధకారము నిరంతరము భద్రము
14 చేయబడి యున్నది. । ఆదాము మొదలుకొని యేడవ
15 వాడైన హనోకుకూడ వీరినిగూర్చి ప్రవచించి యిట్లనెను—ఇదిగో అందరికిని తీర్పు తీర్చుటకును, వారిలో
భక్తిహీనులందరును భక్తిహీనముగా చేసిన వారి భక్తిహీన
క్రియలన్నిటినిగూర్చియు, భక్తిహీనులైన పాపులు
తనకు విరోధముగాచెప్పిన కఠినమైన మాటలన్నిటిని
గూర్చియు వారిని ఒప్పించుటకును, ప్రభువు తన వేవేల
16 పరిశుద్ధుల పరివారముతో వచ్చెను. । వారు తమ
దురాశలచొప్పున నడుచుచు, లాభము నిమిత్తము
మనుష్యులను కొనియాడుచు,[1] సణుగువారును తమ
గతినిగూర్చి నిందించువారునై యున్నారు; వారి నోరు
డంబమైన మాటలు పలుకును.
17 అయితే ప్రియులారా, అంత్యకాలమునందు తమ
18 భక్తిహీనమైన దురాశలచొప్పున నడుచు పరిహాస
కులుందురని మన ప్రభువైన యేసుక్రీస్తు అపొస్తలులు
ఇదివరలో మీతో చెప్పిన మాటలను జ్ఞాపకముచేసి
కొనుడి. । అట్టివారు ప్రకృతి సంబంధులును ఆత్మ 19
లేనివారునైయుండి భేదములు కలుగజేయుచున్నారు. ।
ప్రియులారా, మీరు విశ్వసించు అతిపరిశుద్ధమైన 20
దానిమీద మిమ్మును మీరు కట్టుకొనుచు, పరిశుద్ధాత్మలో 21
ప్రార్థనచేయుచు, నిత్యజీవార్థమైన మన ప్రభువగు
యేసుక్రీస్తు కనికరముకొరకు కనిపెట్టుచు, దేవుని
ప్రేమలో నిలుచునట్లు కాచుకొనియుండుడి. । సం 22
దేహపడువారిమీద కనికరము చూపుడి. । అగ్నిలో 23
నుండి లాగినట్టు కొందరిని రక్షించుడి, శరీరసంబంధ
మైనవారి అపవిత్రప్రవర్తనకు ఏమాత్రము నొప్ప
కొనక దానిని[2] అసహ్యించుకొనుచు భయముతో కొం
దరిని కరుణించుడి.

తొట్రిల్లకుండ మిమ్మును కాపాడుటకును, తన 24
మహిమయెదుట ఆనందముతో మిమ్మును నిర్దోషులగా 25
నిలువబెట్టుటకును శక్తిగల మన రక్షకుడైన అద్వితీయ
దేవునికి, మన ప్రభువైన యేసుక్రీస్తుద్వారా, మహిమ
యు మాహాత్మ్యమును ఆధిపత్యమును అధికారమును
యుగములకు పూర్వమును ఇప్పుడును సర్వయుగ
ములును కలుగునుగాక. ఆమేన్.

1 లేక, ముఖస్తుతి చేయుచు. 2 [illegible] కాసుపడిన అంగీని.

# పరమార్థజ్ఞానియగు యోహాను వ్రాసిన
# ప్రకటన గ్రంథము

1 యేసుక్రీస్తు[1] తన దాసులకు కనుపరచుటకు దేవు
డాయనకు అనుగ్రహించిన ప్రకటన.[2] ఈ సంగ
తులు త్వరలో సంభవింపనైయున్నవి; ఆయన తన
దూతద్వారా వర్తమానము పంపి తన దాసుడైన యోహా
2 నుకు వాటిని సూచించెను. । అతడు దేవుని వాక్య
మునుగూర్చియు యేసుక్రీస్తు సాక్ష్యమునుగూర్చియు
3 తాను చూచినంతమట్టుకు[3] సాక్ష్యమిచ్చెను. । సమ
యము సమీపించినది గనుక ఈ ప్రవచనవాక్యములు
చదువువాడును, వాటిని విని యిందులో వ్రాయ
బడిన సంగతులను గైకొనువారును ధన్యులు.
4 యోహాను ఆసియలో ఉన్న యేడు సంఘములకు
(శుభమని చెప్పి) వ్రాయునది. వర్తమాన భూత భవిష్య
త్కాలములలో ఉండుచున్నవానినుండియు, ఆయన
సింహాసనము ఎదుటనున్న యేడు ఆత్మలనుండియు, ।
5 నమ్మకమైన సాక్షియు, మృతులలోనుండి ఆదిసం
భూతుడుగా లేచినవాడును, భూపతులకు అధిపతి
యునైన యేసుక్రీస్తునుండియు, కృపాసమాధాన
6 ములు మీకు కలుగును గాక. । మనలను ప్రేమించుచు
తన రక్తమువలన మన పాపములనుండి మనలను విడి
పించినవానికి[4] మహిమయు ప్రభావమును యుగ
యుగములు కలుగును గాక, ఆమేన్. ఆయన మనలను
తన తండ్రియగు దేవునికి ఒక రాజ్యముగాను యాజ
7 కులుగాను కలుగజేసెను. । ఇదిగో ఆయన మేఘా
రూఢుడై వచ్చుచున్నాడు, ప్రతి నేత్రము ఆయనను
చూచును, ఆయనను పొడిచినవారును చూచెదరు;
భూజనులందరు ఆయనను చూచి రొమ్ము కొట్టుకొం
దురు; అవును ఆమేన్.
8 అల్ఫాయు ఓమెగయు నేనే.[5] వర్తమాన భూత
భవిష్యత్కాలములలో ఉండువాడను నేనే అని సర్వాధి
కారియు దేవుడునగు ప్రభువు సెలవిచ్చుచున్నాడు
9 మీ సహోదరుడను, యేసునుబట్టి కలుగు శ్రమ
లోను రాజ్యములోను సహనములోను పాలివాడను
నైన యోహానను నేను దేవుని వాక్యము బోధించి
నందుకును, యేసునుగూర్చి సాక్ష్యమిచ్చినందుకును,
10 పత్మాసు ద్వీపమున పరవాసినైతిని. । ప్రభువు దినమందు
11 ఆత్మవశుడనై యుండగా బూరధ్వనివంటి గొప్ప
స్వరము—నీవు చూచుచున్నది పుస్తకములో వ్రాసి,
ఎఫెసు, స్ముర్న, పెర్గము, తుయతైర, సార్దీస్, ఫిల
దెల్ఫియ, లవొదికైయ అను ఏడు సంఘములకు పంపు
మని చెప్పుట నా వెనుక వింటిని. । ఇది వినగా నాతో 12
మాటలాడుచున్న స్వరమేమిటో అని చూడ తిరిగితిని. ।
తిరుగగా ఏడు సువర్ణ దీపస్తంభములను, ఆ దీపస్తంభ 13
ములమధ్యను మనుష్యకుమారుని పోలిన యొకనిని
చూచితిని. ఆయన తన పాదములమట్టుకు దిగుచున్న
వస్త్రము ధరించుకొని రొమ్మునకు బంగారుదట్టి కట్టుకొని
యుండెను. । ఆయన తలయు తలవెండ్రుకలును 14
తెల్లని ఉన్నిని పోలినవై హిమమంత ధవళముగా
ఉండెను. ఆయన నేత్రములు అగ్నిజ్వాలవలె ఉం
డెను; । ఆయన పాదములు కొలిమిలో పుటము వేయ 15
బడి మెరయుచున్న అపరంజితో సమానమైయుం
డెను; ఆయన కంఠస్వరము విస్తార జలప్రవాహముల
ధ్వనివలె ఉండెను. । ఆయన తన కుడిచేత ఏడు నక్షత్ర 16
ములు పట్టుకొనియుండెను; ఆయన నోటనుండి రెం
డంచులుగల వాడియైన ఖడ్గమొకటి బయలు వెడలు
చుండెను; ఆయన ముఖము మహా తేజస్సుతో ప్రకా
శించుచున్న సూర్యునివలె ఉండెను. । నేనాయనను 17
చూడగానే చచ్చినవానివలె ఆయన పాదములయొద్ద
పడితిని. ఆయన తన కుడిచేతిని నా మీద ఉంచి
నాతో ఇట్లనెను — భయపడకుము; । నేను మొదటి 18
వాడను కడపటివాడను జీవించువాడను; మృతుడ
నైతిని గాని ఇదిగో యుగయుగములు సజీవుడనై
యున్నాను. మరియు మరణముయొక్కయు మృతుల
లోకముయొక్కయు తాళపుచెవులు నా స్వాధీన
ములో ఉన్నవి. । కాగా నీవు చూచినవాటిని, ఉన్న 19
వాటిని, వీటివెంట కలుగబోవువాటిని, అనగా నా 20
కుడిచేతిలో నీవు చూచిన యేడు నక్షత్రములను
గూర్చిన మర్మమును, ఆ యేడు సువర్ణ దీపస్తంభముల
సంగతియు వ్రాయుము. ఆ యేడు నక్షత్రములు
ఏడు సంఘములకు దూతలు. ఆ యేడు దీపస్తంభ
ములు ఏడు సంఘములు.

ఎఫెసులో ఉన్న సంఘపు దూతకు ఈలాగు 2
వ్రాయుము—

ఏడు నక్షత్రములు తన కుడిచేత పట్టుకొని యేడు
దీపస్తంభములమధ్య సంచరించువాడు చెప్పు సంగతు

...ను శిబ్దము నకు అభిషిక్తుడని అర్థము. [2] లేక, ప్రత్యక్షత. [3] లేక - చూచినదంతటిని (గూర్చియు.) [4] అనేక ప్రాచీనప్రతులలో...
...పాఠాంతరము [5] అనగా - ఆదియు అంతమును నేనే.

లేవనగా । — నీ క్రియలును నీ కష్టమును నీ సహన
మును నేనెరుగుదును; నీవు దుష్టులను సహింపలేవని
యు, అపొస్తలులు కాకయే తాము అపొస్తలులమని
చెప్పుకొనువారిని పరీక్షించి వారు అబద్ధికులని నీవు
కనుగొంటివనియు, । నీవు సహనముకలిగి నా నామము
నిమిత్తము (భారము) భరించి అలయలేదనియు నేనెరు
గుదును. । అయినను మొదట నీకుండిన ప్రేమను నీవు
వదలితివని నేను నీమీద తప్పు ఒకటి మోపవలసియు
న్నది. । నీవు ఏ స్థితిలోనుండి పడితివో అది జ్ఞాప
కము చేసికొని మారుమనస్సు పొంది ఆ మొదటి
క్రియలను చేయుము. అట్లు చేసి నీవు మారుమనస్సు
పొందితేనే సరి; లేనియెడల నేను నీయొద్దకు వచ్చి
నీ దీపస్తంభమును దాని చోటనుండి తీసివేతును. ।
అయితే ఈ యొకటి నీలో ఉన్నది, నికొలాయితుల
క్రియలు నీవు ద్వేషించుచున్నావు; నేనుకూడ వీటిని
ద్వేషించుచున్నాను. । చెవిగలవాడు ఆత్మ సంఘము
లతో చెప్పుచున్నమాట వినునుగాక. జయించువానికి
దేవుని పరదైసులో ఉన్న జీవవృక్షఫలములు భుజింప
నిత్తును.

8 స్ముర్నలో ఉన్న సంఘపు దూతకు ఈలాగు
వ్రాయుము—

మొదటివాడును కడపటివాడునై యుండి,
మృతుడై (మరల) బ్రదికినవాడు చెప్పు సంగతులే
9 వనగా ।—నీ శ్రమను దరిద్రతను నేనెరుగుదును, అయి
నను నీవు ధనవంతుడవే; తాము యూదులమని చెప్పు
కొనుచు, యూదులు కాక సాతాను సమాజపువారి
చేత నీకు కలుగు దూషణ నేనెరుగుదును. నీవు పొంద
10 బోవు శ్రమలకు భయపడకుము. । ఇదిగో మీరు
శోధింపబడునట్లు అపవాది[1] మీలో కొందరిని చెరలో
వేయింపబోవుచున్నాడు; పది దినములు శ్రమ కలు
గును; ప్రాణాపాయము వచ్చినను[2] నమ్మకముగా ఉం
11 డుము; నేను నీకు జీవకిరీటమిచ్చెదను. । చెవిగలవాడు
ఆత్మ సంఘములతో చెప్పుచున్నమాట వినునుగాక.
జయించువాడు రెండవ మరణమువలన ఏ హానియు
చెందడు.

12 పెర్గములోని సంఘపు దూతకు ఈలాగు
వ్రాయుము—

వాడియైన రెండంచులుగల ఖడ్గముగలవాడు చెప్పు
13 సంగతులేవనగా । — సాతాను సింహాసనమున్న స్థల
ములో నీవు కాపురమున్నావని నేనెరుగుదును. మరి
యు సాతాను కాపురమున్న ఆ స్థలములో, నాయందు
విశ్వాసియైయుండి నన్నుగూర్చి సాక్షియైన అంతి
పయనువాడు మీ మధ్యను చంపబడిన దినములలో
నీవు నా నామము గట్టిగా చేపట్టి నాయందలి విశ్వా
14 సమును విసర్జింపలేదని నేనెరుగుదును. । అయినను
నేను నీమీద కొన్ని తప్పితములు మోపవలసి యున్నది.
అవేవనగా, విగ్రహములకు బలియిచ్చినవాటిని తిను
నట్లును, జారత్వము చేయునట్లును, ఇశ్రాయేలీయు
లకు ఉరి యొడ్డుమని బాలాకుకు నేర్పిన బిలాముబోధను
అనుసరించువారు నీలో ఉన్నారు. । అటువలెనే 15
నికొలాయితుల బోధ ననుసరించువారును నీలో
ఉన్నారు. । కావున మారుమనస్సు పొందుము; లేని 16
యెడల నేను నీయొద్దకు త్వరగా వచ్చి నా నోటనుండి
వచ్చు ఖడ్గముచేత వీరితో యుద్ధముచేసెదను. । చెవి 17
గలవాడు ఆత్మ సంఘములతో చెప్పుచున్నమాట
వినునుగాక. జయించువానికి మరుగైయున్న మన్నాను
భుజింపనిత్తును. మరియు అతనికి తెల్లరాతినిత్తును; ఆ
రాతిమీద చెక్కబడిన యొక క్రొత్తపేరుండును; పొం
దినవానికే గాని అది మరి ఎవనికిని తెలియదు.

తుయతైరలో ఉన్న సంఘపు దూతకు ఈలాగు 18
వ్రాయుము—

అగ్నిజ్వాలవంటి కన్నులును అపరంజినిపోలిన
పాదములునుగల దేవుని కుమారుడు చెప్పు సంగతు
లేవనగా । — నీ క్రియలను, నీ ప్రేమను, నీ విశ్వా 19
సమును, నీ పరిచర్యను, నీ సహనమును నేనెరుగుదును;
నీ మొదటి క్రియలకన్న నీ కడపటి క్రియలు మరి
యెక్కువైనవని యెరుగుదును. । అయినను నీమీద 20
తప్పు ఒకటి నేను మోపవలసి యున్నది; ఏమనగా,
తాను ప్రవక్త్రినని చెప్పుకొనుచున్న యెజెబెలను స్త్రీని
నీవుండనిచ్చుచున్నావు. జారత్వము చేయుటకును,
విగ్రహములకు బలియిచ్చినవాటిని తినుటకును అది
నా దాసులకు బోధించుచు వారిని మోసపరచు
చున్నది. । మారుమనస్సు పొందుటకు నేను దానికి 21
సమయమిచ్చితినిగాని అది తన జారత్వము విడిచి
పెట్టి మారుమనస్సు పొందనొల్లదు. । ఇదిగో నేను 22
దానిని మంచము పట్టించి దానితోకూడ వ్యభిచరించు
వారు దాని[3] క్రియలవిషయమై మారుమనస్సు పొంది
తేనే గాని వారిని బహు శ్రమలపాలు చేతును, ।
దాని పిల్లలను నిశ్చయముగా చంపెదను. అందువలన 23
అంతరింద్రియములను హృదయములను పరీక్షించు
వాడను నేనే అని సంఘములన్నియు తెలిసికొనును.
మరియు మీలో ప్రతివానికి వాని వాని క్రియల
చొప్పున (ప్రతిఫలము) ఇచ్చెదను. । అయితే తుయ 24
తైరలో కడమవారైన మీతో, అనగా ఈ బోధను
అంగీకరింపక సాతానుయొక్క గూఢమైన సంగతు
లను[4] ఎరుగమని చెప్పుకొనువారందరితో నేను చెప్పు
చున్నదేమనగా—మీపైని మరి ఏ భారమును పెట్టను. ।
నేను వచ్చు పర్యంతము మీకు కలిగియున్నదానిని 25
గట్టిగా పట్టుకొనుడి. । నేను నా తండ్రివలన అధి 26
కారము పొందినట్లు జయించుచు, అంతమువరకు నా 27

1 అనగా—సాతాను. 2 లేక, మరణపర్యంతము. 3 అనేక ప్రాచీనప్రతులలో—తమ అని పాఠాంతరము. 4 మూలభాషలో—సాతానుయొక్క లోతైనవాటిని

క్రియలు జాగ్రత్తగా చేయువానికి[1] జనులమీద అధి
కారము ఇచ్చెదను. అతడు ఇనుపదండముతో వారిని
ఏలును; వారు కుమ్మరవాని పాత్రలవలె పగులగొట్ట
28 బడుదురు; । మరియు అతనికి వేకువచుక్క ఇచ్చె
29 దను. । చెవిగలవాడు ఆత్మ సంఘములతో చెప్పు
చున్నమాట వినునుగాక.

3 సార్దిస్‌లో ఉన్న సంఘపు దూతకు ఈలాగు
వ్రాయుము—
ఏడు నక్షత్రములును దేవుని యేడాత్మలును గల
వాడు చెప్పు సంగతులేవనగా—నీ క్రియలను నేనెరు
గుదును. ఏమనగా, జీవించుచున్నావన్న పేరుమాత్ర
2 మున్నది గాని నీవు మృతుడవే । నీ క్రియలు నా
దేవునియెదుట సంపూర్ణమైనవిగా నాకు కనబడలేదు
గనుక జాగరూకుడవై, చావనైయున్న మిగిలినవాటిని
3 బలపరచుము.[2] । నీవేలాగు (ఉపదేశము) పొందితివో
యేలాగు వింటివో జ్ఞాపకము చేసికొని దాని గైకొనుచు
మారుమనస్సు పొందుము. నీవు జాగరూకుడవై యుం
డనియెడల నేను దొంగవలె వచ్చెదను; ఏ గడియను
నీ మీదికి వచ్చెదనో నీకు తెలియనే తెలియదు. ।
4 అయితే తమ వస్త్రములను అపవిత్రపరచుకొనని కొం
దరు సార్దిస్‌లో నీయొద్ద ఉన్నారు. వారు అర్హులు
గనుక తెల్లని వస్త్రములు ధరించుకొని నాతోకూడ సంచ
5 రించెదరు. । జయించువాడు ఆలాగున తెల్లని వస్త్రములు
ధరించుకొనును; జీవగ్రంథములోనుండి అతని పేరెంత
మాత్రమును తుడుపుపెట్టక, నా తండ్రి యెదుటను
ఆయన దూతల యెదుటను అతని పేరు ఒప్పుకొం
6 దును. । చెవిగలవాడు ఆత్మ సంఘములతో చెప్పు
చున్నమాట వినునుగాక.

7 ఫిలదెల్ఫియలో ఉన్న సంఘపు దూతకు ఈలాగు
వ్రాయుము—
దావీదు తాళపుచెవి కలిగి, యెవడును వేయలేకుండ
తీయువాడును, ఎవడును తీయలేకుండ వేయువాడు
నైన సత్యస్వరూపియగు పరిశుద్ధుడు చెప్పు సంగతు
8 లేవనగా ।—నీ క్రియలను నేనెరుగుదును; నీకున్న
శక్తి కొంచెమైయుండినను నీవు నా వాక్యమును గైకొని
నా నామము ఎరుగననలేదు. ఇదిగో తలుపు నీయెదుట
తీసియుంచియున్నాను; దానిని ఎవడును వేయనేరడు.।
9 యూదులు కాకయే తాము యూదులమని చెప్పు
కొని అబద్ధమాడు సాతాను సమాజపువారిని రప్పించె
దను; వారు వచ్చి నీ పాదములయెదుట పడి నమ
స్కారముచేసి, ఇదిగో, నేను నిన్ను ప్రేమించితినని
10 తెలిసికొనునట్లు చేసెదను. । నీవు నా ఓర్పువిషయ
మైన వాక్యమును గైకొంటివి గనుక భూనివాసులను
శోధించుటకు లోకమంతటిమీదికి రాబోవు శోధన
11 కాలములో[3] నేనును నిన్ను కాపాడెదను. । నేను
త్వరగా వచ్చుచున్నాను; ఎవడును నీ కిరీటము నపహ
రింపకుండునట్లు నీకు కలిగినదానిని గట్టిగా పట్టుకొను
ము. । జయించువానిని నా దేవుని ఆలయములో 12
ఒక స్తంభముగా చేసెదను; అందులోనుండి వాడు
ఇకమీదట ఎన్నటికిని వెలపలికిపోడు. మరియు నా
దేవుని పేరును, పరలోకములో. నా దేవుని యొద్ద
నుండి దిగి వచ్చుచున్న నూతనమైన యెరూషలేమను
నా దేవుని పట్టణపు పేరును, నా క్రొత్త పేరును
వానిమీద వ్రాసెదను. । చెవిగలవాడు ఆత్మ సంఘ 13
ములతో చెప్పుచున్నమాట వినునుగాక.

లవొదికైయలో ఉన్న సంఘపు దూతకు ఈలాగు 14
వ్రాయుము—
ఆమేన్ అనువాడును నమ్మకమైన సత్యసాక్షియు
దేవుని సృష్టికి ఆదియునైనవాడు చెప్పు సంగతులే
వనగా ।—నీ క్రియలను నేనెరుగుదును, నీవు చల్లగా 15
నైనను వెచ్చగానైనను లేవు; నీవు చల్లగానైనను
వెచ్చగానైనను ఉండిన మేలు. । నీవు వెచ్చగానైనను 16
చల్లగానైనను ఉండక, నులివెచ్చనగా ఉన్నావు గనుక
నేను నిన్ను నా నోటనుండి ఉమ్మివేయ నుద్దేశించు
చున్నాను. । నీవు దౌర్భాగ్యుడవును దిక్కుమాలిన 17
వాడవును దరిద్రుడవును గుడ్డివాడవును దిగంబరు
డవునై యున్నావని యెరుగక — నేను ధనవంతుడను
ధనవృద్ధి చేసికొనియున్నాను, నాకేమియు కొదువలే
దని చెప్పుకొనుచున్నావు. । నీవు ధనవృద్ధి చేసికొను 18
నట్లు అగ్నిలో పుటమువేయబడిన బంగారమును, నీ
దిసమొలసిగ్గు కనబడకుండునట్లు ధరించుకొనుటకు
తెల్లని వస్త్రములను, నీకు దృష్టికలుగునట్లు నీ కన్నులకు
కాటుకను నాయొద్ద కొనుమని నీకు బుద్ధి చెప్పు
చున్నాను. । నేను ప్రేమించువారినందరిని గద్దించి 19
శిక్షించుచున్నాను గనుక నీవు ఆసక్తి కలిగి మారు
మనస్సు పొందుము. । ఇదిగో నేను తలుపునొద్ద నిలు 20
చుండి తట్టుచున్నాను. ఎవడైనను నా స్వరము విని
తలుపుతీసినయెడల నేను అతనియొద్దకు వచ్చి అతనితో
నేనును నాతోకూడ అతడును భోజనము చేయు
దుము. । నేను జయించి నా తండ్రితోకూడ ఆయన 21
సింహాసనమునందు కూర్చుండియున్న ప్రకారము
జయించువానిని నాతోకూడ నా సింహాసనమునందు
కూర్చుండనిచ్చెదను. । చెవిగలవాడు ఆత్మ సంఘము 22
లతో చెప్పుచున్నమాట వినునుగాక.

ఈ సంగతులు జరిగిన తరువాత నేను చూడగా, 4
అదిగో పరలోకమందు ఒక తలుపు తెరువబడి యుం
డెను. మరియు నేను మొదట వినిన స్వరము బూర
ధ్వనివలె నాతో మాటలాడగా వింటిని. ఆ మాట
లాడినవాడు — ఇక్కడికి ఎక్కిరమ్ము; ఇకమీదట
జరగవలసినవాటిని నీకు కనుపరచెదననెను । వెంటనే 2

1 లేక, గైకొనువానికి. 2 లేక, స్థిరపరచుము 3 మూలభాషలో—శోధనగడియలో.

నేను ఆత్మవశుడనైతిని. అదిగో పరలోకమందు ఒక్క
సింహాసనము వేయబడి యుండెను; ఆ సింహాసనము
నందు ఒకడు ఆసీనుడైయుండెను. । ఆసీనుడైయుండు
వాడు దృష్టికి సూర్యకాంత పద్మరాగములను పోలిన
వాడు; మరకతమువలె ప్రకాశించు ఇంద్రధనుస్సు
4 సింహాసనమును ఆవరించి యుండెను. । సింహాసనము
చుట్టు ఇరువదినాలుగు సింహాసనములుండెను; ఈ
సింహాసనములందు ఇరువదినలుగురు పెద్దలు తెల్లని
వస్త్రములు ధరించుకొని, తమ తలలమీద సువర్ణ కిరీట
5 ములు పెట్టుకొన్నవారై కూర్చుండిరి. । ఆ సింహాస
నములోనుండి మెరుపులును ధ్వనులును ఉరుములును
బయలుదేరుచున్నవి మరియు ఆ సింహాసనము ఎదుట
ఏడు దీపములు ప్రజ్వలించుచున్నవి; అవి దేవుని
6 యేడు ఆత్మలు । మరియు ఆ సింహాసనము ఎదుట
స్ఫటికమును పోలిన గాజువంటి సముద్రమున్నట్టుం
డెను. ఆ సింహాసనమునకు మధ్యను సింహాసనము
చుట్టును, ముందు వెనుక కన్నులతో నిండిన నాలుగు
7 జీవులుండెను. । మొదటి జీవి సింహమువంటిది; రెం
డవ జీవి దూడవంటిది; మూడవ జీవి మనుష్యుని
ముఖమువంటి ముఖముగలది; నాలుగవ జీవి యెగురు
8 చున్న పక్షిరాజువంటిది. । ఈ నాలుగు జీవులలో
ప్రతి జీవికి ఆరేసి రెక్కలుండెను, అవి చుట్టును
రెక్కలలోపటను కన్నులతో నిండియున్నవి. అవి
భూత వర్తమాన భవిష్యత్కాలములలో ఉండు
సర్వాధికారియు దేవుడునగు ప్రభువు పరిశుద్ధుడు,
పరిశుద్ధుడు, పరిశుద్ధుడు, అని మానక దివారాత్రము
9 చెప్పుచుండును. । ఆ సింహాసనమునందు ఆసీనుడై
యుండి యుగయుగములు జీవించుచున్నవానికి
మహిమయు ఘనతయు కృతజ్ఞతాస్తుతులును కలుగు
10 గాకని ఆ జీవులు కీర్తించుచుండగా । ఆ యిరువది
నలుగురు పెద్దలు సింహాసనమునందు ఆసీనుడై యుండు
వానియెదుట సాగిలపడి, యుగయుగములు జీవించు
చున్నవానికి నమస్కారము చేయుచు — ప్రభువా,
మా దేవా, నీవు సమస్తమును సృష్టించితివి; నీ చిత్త
మునుబట్టి అవి యుండెను; దానినిబట్టియే సృష్టింప
బడెను గనుక నీవే మహిమ ఘనత ప్రభావములు
పొంద నర్హుడవని చెప్పుచు, తమ కిరీటములను ఆ
సింహాసనము ఎదుట వేసిరి.

5 మరియు లోపటను వెలుపటను వ్రాతకలిగి యేడు
ముద్రలు గట్టిగా వేసియున్న యొక గ్రంథము సింహా
సనమునందు ఆసీనుడైయుండువాని కుడిచేత చూచి
2 తిని. । మరియు దాని ముద్రలు తీసి ఆ గ్రంథము
విప్పుటకు యోగ్యుడైనవాడెవడని బలిష్ఠుడైన యొక
దేవదూత బిగ్గరగా ప్రచురింపగా చూచితిని. ।
3 అయితే పరలోకమందుగాని భూమిమీదగాని భూమి
క్రిందగాని ఆ గ్రంథము విప్పుటకైనను చూచుట
కైనను ఎవనికిని శక్తిలేకపోయెను. । ఆ గ్రంథము 4
విప్పుటకైనను చూచుటకైనను యోగ్యుడెవడును కన
బడనందున నేను బహుగా ఏడ్చుచుండగా । ఆ పెద్ద 5
లలో ఒకడు—ఏడువకుము; ఇదిగో దావీదుకు చిగు
రైన[1] యూదాగోత్రపు సింహము ఏడు ముద్రలను
తీసి ఆ గ్రంథమును విప్పుటకై జయముపొందెనని
నాతో చెప్పెను. । మరియు సింహాసనమునకును ఆ 6
నాలుగు జీవులకును పెద్దలకును మధ్యను, వధింపబడి
నట్లుండిన గొఱ్ఱెపిల్ల నిలిచియుండుట చూచితిని.
దానికి ఏడు కొమ్ములును ఏడు కన్నులునుండెను. ఆ
కన్నులు భూమియందంతటికి పంపబడిన దేవుని యేడు
ఆత్మలు. । ఆయన వచ్చి సింహాసనమునందు ఆసీనుడై 7
యుండువాని కుడిచేతిలోనుండి ఆ గ్రంథమును తీసి
కొనెను. । ఆయన దాని తీసికొనినప్పుడు ఆ నాలుగు 8
జీవులును, వీణెలును, ధూపద్రవ్యములతో నిండిన
సువర్ణపాత్రలును పట్టుకొనియున్న ఆ యిరువదినలు
గురు పెద్దలును, ఆ గొఱ్ఱెపిల్లయెదుట సాగిలపడిరి.
ఈ పాత్రలు పరిశుద్ధుల ప్రార్థనలు. । ఆ పెద్దలు— 9
నీవు ఆ గ్రంథమును తీసికొని దాని ముద్రలను విప్పు 10
టకు యోగ్యుడవు, నీవు వధింపబడినవాడవై నీ రక్త
మిచ్చి,[2] ప్రతి వంశములోను, ఆ యా భాషలు
మాటలాడువారిలోను, ప్రతి ప్రజలోను, ప్రతి జనము
లోను, దేవునికొరకు మనుష్యులను కొని, మా దేవునికి
వారిని ఒక రాజ్యముగాను యాజకులగాను చేసితివి;
గనుక వారు భూలోకమందు ఏలుదురని క్రొత్తపాట
పాడుదురు. । మరియు నేను చూడగా సింహాసన 11
మును, జీవులను, పెద్దలను ఆవరించియున్న అనేక
దూతల స్వరము వినబడెను, వారి లెక్క కోట్లకొల
దిగా ఉండెను. । వారు — వధింపబడిన గొఱ్ఱెపిల్ల, 12
శక్తియు ఐశ్వర్యమును జ్ఞానమును బలమును ఘనతయు
మహిమయు స్తోత్రమును పొంద నర్హుడని గొప్ప స్వర
ముతో చెప్పుచుండిరి. । అంతట పరలోకమందును 13
భూలోకమందును భూమిక్రిందను సముద్రములోను
ఉన్న ప్రతి సృష్టము, అనగా వాటిలోనున్న సర్వ
మును — సింహాసనాసీనుడైయున్నవానికిని గొఱ్ఱెపిల్ల
కును స్తోత్రమును ఘనతయు మహిమయు ప్రభావ
మును యుగయుగములు కలుగునుగాకని చెప్పుట
వింటిని. । ఆ నాలుగు జీవులు—ఆమేన్ అని చెప్పగా 14
ఆ పెద్దలు సాగిలపడి నమస్కారముచేసిరి.

ఆ గొఱ్ఱెపిల్ల ఆ యేడు ముద్రలలో మొదటి 6
దానిని విప్పినప్పుడు నేను చూడగా ఆ నాలుగు జీవు
లలో ఒకటి — రమ్మని[3] ఉరుమువంటి స్వరముతో
చెప్పుట వింటిని. । మరియు నేను చూడగా, ఇదిగో 2
ఒక తెల్లని గుఱ్ఱము కనబడెను; దానిమీద ఒకడు

1 లేక, వేరైన. 2 లేక—రక్తముతో. 3 కొన్ని ప్రాచీనప్రతులలో—వచ్చి చూడుము అని పాఠాంతరము

విల్లు పట్టుకొని కూర్చుండియుండెను. ఆయనకు ఒక
కిరీటమియ్యబడెను; ఆయన జయించువాడైనను ఉద్దేశ
ముతో జయశాలిగా బయలువెళ్లెను.[1]
3 ఆయన రెండవ ముద్రను విప్పినప్పుడు — రమ్మని[2]
4 రెండవ జీవి చెప్పుట వింటిని. । అప్పుడు ఎఱ్ఱనిదైన
వేరొక గుఱ్ఱము బయలువెళ్లెను; మనుష్యులు ఒకని
ఒకడు చంపుకొనునట్లు భూలోకములో సమాధానము
లేకుండ చేయుటకు ఈ గుఱ్ఱముమీద కూర్చున్న
వానికి అధికారమియ్యబడెను, మరియు ఆయనకు
ఒక పెద్ద ఖడ్గమియ్యబడెను.
5 ఆయన మూడవ ముద్రను విప్పినప్పుడు—రమ్మని[2]
మూడవ జీవి చెప్పుట వింటిని. నేను చూడగా,
ఇదిగో ఒక నల్లని గుఱ్ఱము కనబడెను; దానిమీద
ఒకడు త్రాసు చేత పట్టుకొని కూర్చుండి యుండెను. ।
6 మరియు—దేనారమునకు[3] ఒక సేరు గోధుమలనియు,
దేనారమునకు మూడు సేర్ల యవలనియు, నూనెను
ద్రాక్షారసమును పాడుచేయవద్దనియు, ఆ నాలుగు
జీవులమధ్య ఒక స్వరము పలికినట్టు నాకు వినబడెను
7 ఆయన నాలుగవ ముద్రను విప్పినప్పుడు—రమ్మని[2]
8 నాలుగవ జీవి చెప్పుట వింటిని । అప్పుడు నేను
చూడగా, ఇదిగో పాండుర వర్ణముగల ఒక గుఱ్ఱము
కనబడెను; దానిమీద కూర్చున్నవాని పేరు మృత్యువు,
మృతుల లోకము వాని వెంబడించెను. ఖడ్గమువలనను
కరవువలనను మరణమువలనను[4] భూమిలోనుండు
క్రూరమృగములవలనను (భూనివాసులను) చంపుటకు
భూమియొక్క నాలుగవ భాగముపైన అధికారము
వారికియ్యబడెను.
9 ఆయన అయిదవ ముద్రను విప్పినప్పుడు, దేవుని
వాక్యము నిమిత్తమును, తాము ఇచ్చిన సాక్ష్యము నిమిత్త
మును వధింపబడినవారి ఆత్మలను బలిపీఠము క్రింద
10 చూచితిని. । వారు — నాధా, సత్యస్వరూపీ, పరి
శుద్ధుడా, యెందాక తీర్పు తీర్చకయు, మా రక్తము
నిమిత్తము భూనివాసులకు ప్రతిదండన చేయకయు
11 ఉందువని బిగ్గరగా కేకలువేసిరి. । తెల్లని వస్త్రము
వారిలో ప్రతివానికియ్యబడెను; మరియు—వారి
వలెనే చంపబడబోవువారి సహదాసులయొక్కయు
సహోదరులయొక్కయు లెక్క పూర్తియగు పర్యం
తము, ఇంక కొంచెము కాలము విశ్రమింపవలెనని
వారితో చెప్పబడెను.
12 ఆయన ఆరవ ముద్రను విప్పినప్పుడు నేను చూడగా
పెద్ద భూకంపము కలిగెను. సూర్యుడు కంబళివలె
నలుపాయెను, చంద్రబింబమంతయు రక్తవర్ణమాయెను,।
13 పెద్దగాలిచేత ఊగులాడు అంజూరపు చెట్టునుండి
అకాలపు కాయలు రాలినట్టు ఆకాశనక్షత్రములు
భూమిమీద రాలెను. । మరియు ఆకాశమండలము 1
చుట్టబడిన గ్రంథమువలెనై తొలగిపోయెను. ప్రతి
కొండయు ప్రతి ద్వీపమును వాటివాటి స్థానములు
తప్పెను. । భూరాజులును, ఘనులును, సహస్రాధి 1
పతులును, ధనికులును, బలిష్ఠులును, ప్రతి దాసు 1
డును, ప్రతి స్వతంత్రుడును కొండగుహలలోను
బండల సందులలోను దాగుకొని—సింహాసనాసీనుడై
యున్నవానియొక్కయు గొఱ్ఱెపిల్లయొక్కయు ఉగ్రత
మహాదినము వచ్చెను; దానికి తాళజాలినవాడెవడు?
మీరు మామీద పడి ఆయన సన్నిధికిని గొఱ్ఱెపిల్ల
ఉగ్రతకును మమ్మును మరుగుచేయుడి అని పర్వతముల
తోను బండలతోను చెప్పుచున్నారు.

7 అటుతరువాత భూమియొక్క నాలుగు దిక్కు
లలో నలుగురు దేవదూతలు నిలిచియుండి, భూమి
మీదనైనను సముద్రముమీదనైనను ఏ చెట్టుమీద
నైనను గాలి వీచకుండునట్లు భూమియొక్క నాలుగు
దిక్కుల వాయువులను పట్టుకొనియుండగా చూచి
తిని. । మరియు సజీవుడగు దేవుని ముద్రగల వేరొక 2
దూత సూర్యోదయ దిశనుండి పైకి వచ్చుట చూచి
తిని. భూమికిని సముద్రమునకును హాని కలుగజేయు
టకై అధికారముపొందిన ఆ నలుగురు దూతలతో ।
ఈ దూత—మేము మా దేవుని దాసులను వారి నొసళ్ల 3
యందు ముద్రించుపర్యంతము భూమికైనను సముద్ర
మునకైనను చెట్లకైనను హాని చేయవద్దని బిగ్గరగా
చెప్పెను. । మరియు ముద్రింపబడినవారి లెక్క 4
చెప్పగా వింటిని. ఇశ్రాయేలీయుల గోత్రములన్ని
టిలో ముద్రింపబడినవారు లక్ష నలుబది నాలుగు
వేలమంది. । యూదా గోత్రములో ముద్రింపబడిన 5
వారు పన్నెండు వేలమంది. రూబేను గోత్రములో
పన్నెండు వేలమంది, గాదు గోత్రములో పన్నెండు
వేలమంది, । ఆషేరు గోత్రములో పన్నెండు వేల 6
మంది, నఫ్తాలి గోత్రములో పన్నెండు వేలమంది,
మనష్షే గోత్రములో పన్నెండు వేలమంది, ।
షిమ్యోను గోత్రములో పన్నెండు వేలమంది, లేవి 7
గోత్రములో పన్నెండు వేలమంది, ఇశ్శాఖారు
గోత్రములో పన్నెండు వేలమంది, । జెబులూను 8
గోత్రములో పన్నెండు వేలమంది, యోసేపు గోత్ర
ములో పన్నెండు వేలమంది, బెన్యామీను గోత్ర
ములో పన్నెండు వేలమంది ముద్రింపబడిరి. । అటు 9
తరువాత నేను చూడగా, ఇదిగో ప్రతి జనములో
నుండియు ప్రతి వంశములోనుండియు ప్రజలలో
నుండియు ఆ యా భాషలు మాటలాడువారిలో
నుండియు వచ్చి, యెవడును లెక్కింపజాలని యొక
గొప్ప సమూహము కనబడెను. వారు తెల్లని వస్త్రములు

[1] లేక, జయించువాడును జయించుటకును బయలువెళ్లెను. [2] కొన్ని ప్రాచీనప్రతులలో—వచ్చి చూడుము అని పాఠాంతరము. [3] ఇది ఇం
మించు అర్థరూపాయి కావచ్చును. [4] లేక, తెగులువలనను.

ధరించుకొన్నవారై, ఖర్జూరపుమట్టలు చేతపట్టుకొని
సింహాసనము ఎదుటను గొఱ్ఱెపిల్లయెదుటను నిలు
10 వబడి ।— సింహాసనాసీనుడైన మా దేవునికిని గొఱ్ఱె
పిల్లకును మా రక్షణకై స్తోత్రమని మహాశబ్దముతో
11 ఎలుగెత్తి చెప్పిరి. । దేవదూతలందరును సింహాసనము
12 చుట్టును పెద్దలచుట్టును ఆ నాలుగు జీవులచుట్టును
నిలువబడియుండిరి. వారు సింహాసనము ఎదుట
సాష్టాంగపడి—ఆమేన్; యుగయుగముల పర్యంతము
మా దేవునికి స్తోత్రమును మహిమయు జ్ఞానమును
కృతజ్ఞతాస్తుతియు ఘనతయు శక్తియు బలమును
కలుగు గాకని చెప్పుచు దేవునికి నమస్కారము చేసిరి.
13 ఆమేన్. । పెద్దలలో ఒకడు — తెల్లనివస్త్రములు
ధరించుకొనియున్న వీరెవరు? ఎక్కడనుండి వచ్చిరని
14 నన్ను అడిగెను. । అందుకు నేను — అయ్యా, నీకే
తెలియుననగా అతడు ఈలాగు నాతో చెప్పెను—
వీరు మహాశ్రమ అనుభవించి వచ్చినవారు, గొఱ్ఱె
పిల్ల రక్తములో తమ వస్త్రములను ఉదుకుకొని వాటిని
15 తెలుపుచేసికొనిరి. । అందువలన వారు దేవుని సింహా
సనము ఎదుట ఉండి దివారాత్రము ఆయన ఆలయ
ములో ఆయనను సేవించుచున్నారు. సింహాసనాసీను
డైనవాడు తానే తన గుడారము వారిమీద కప్పును; ।
16 వారికి ఇకమీదట ఆకలియైనను దాహమైనను ఉం
డదు, సూర్యుని యెండయైనను ఏ వడగాలియైనను
17 వారికి తగలదు, । ఏలయనగా సింహాసనమధ్యమం
దుండు గొఱ్ఱెపిల్ల వారికి కాపరియై, జీవజలముల
బుగ్గలయొద్దకు వారిని నడిపించును, దేవుడే వారి కన్నుల
నుండి ప్రతి బాష్పబిందువును తుడిచివేయును.

**8** ఆయన యేడవ ముద్రను విప్పినప్పుడు పరలోక
మందు ఇంచుమించు అరగంటసేపు నిశ్శబ్దముగా ఉం
2 డెను. । అంతట నేను దేవునియెదుట నిలుచు ఏడు
గురు దూతలను చూచితిని, వారికి ఏడు బూరలియ్య
బడెను.
3 మరియు సువర్ణధూపార్తి చేత పట్టుకొనియున్న
వేరొక దూతవచ్చి బలిపీఠము ఎదుట నిలువగా సింహా
సనము ఎదుట ఉన్న సువర్ణబలిపీఠముపైన పరిశుద్ధు
లందరి ప్రార్థనలతో కలుపుటకై[1] అతనికి బహు
4 ధూపద్రవ్యములు ఇయ్యబడెను. । అప్పుడా ధూప
ద్రవ్యముల పొగ పరిశుద్ధుల ప్రార్థనలతో కలిసి
దూత చేతిలోనుండి పైకి లేచి దేవుని సన్నిధిని
5 చేరెను. । ఆ దూత ధూపార్తిని తీసికొని, బలిపీఠము
పైనున్న నిప్పులతో దాని నింపి, భూమిమీద పడ
వేయగా ఉరుములు ధ్వనులు మెరుపులు భూకంప
మును కలిగెను.
6 అంతట ఏడు బూరలు పట్టుకొనియున్న ఆ
యేడుగురు దూతలు ఊదుటకు సిద్ధపడిరి.

మొదటి దూత బూర ఊదినప్పుడు రక్తముతో 7
మిళితమైన వడగండ్లును అగ్నియు పుట్టి భూమిపైన
పడవేయబడెను; అందువలన భూమిలో మూడవ
భాగము కాలిపోయెను, చెట్లలో మూడవ భాగమును
కాలిపోయెను, పచ్చగడ్డియంతయు కాలిపోయెను.
రెండవ దూత బూర ఊదినప్పుడు అగ్నిచేత 8
మండుచున్న పెద్ద కొండవంటిది ఒకటి సముద్ర
ములో పడవేయబడెను. అందువలన సముద్రములో
మూడవ భాగము రక్తమాయెను, । సముద్రములోని 9
ప్రాణముగల జంతువులలో మూడవ భాగము చచ్చెను,
ఓడలలో మూడవ భాగము నాశనమాయెను.
మూడవ దూత బూర ఊదినప్పుడు దివిటీవలె 10
మండుచున్న యొక పెద్ద నక్షత్రము ఆకాశమునుండి
రాలి నదుల మూడవ భాగముమీదను నీటిబుగ్గల
మీదను పడెను. । ఆ నక్షత్రమునకు మాచిపత్రియని 11
పేరు. అందువలన నీళ్లలో మూడవ భాగము మాచి
పత్రి యాయెను; నీళ్లు చేదైపోయినందున వాటివలన
మనుష్యులలో అనేకులు చచ్చిరి.
నాలుగవ దూత బూర ఊదినప్పుడు సూర్య చంద్ర 12
నక్షత్రములలో మూడవ భాగము చీకటి కమ్మునట్లును,
పగటిలో మూడవ భాగమున సూర్యుడు ప్రకాశింప
కుండునట్లును, రాత్రిలో మూడవ భాగమున చంద్ర
నక్షత్రములు ప్రకాశింపకుండునట్లును వాటిలో
మూడవ భాగము కొట్టబడెను.
మరియు నేను చూడగా ఆకాశమధ్యమున ఒక 13
పక్షిరాజు ఎగురుచు — బూరలు ఊదబోవుచున్న
ముగ్గురు దూతల బూరల శబ్దములనుబట్టి భూనివాసు
లకు అయ్యో, అయ్యో, అయ్యో, అని గొప్ప స్వర
ముతో చెప్పుట వింటిని.

అయిదవ దూత బూర ఊదినప్పుడు ఆకాశము **9**
నుండి భూమిమీద రాలిన యొక నక్షత్రమును చూచి
తిని. పాతాళగుండముయొక్క తాళపుచెవి అతనికి
ఇయ్యబడెను. । అతడు పాతాళగుండము తెరవగా 2
పెద్ద కొలిమిలోనుండి లేచు పొగవంటి పొగ ఆ
గుండములోనుండి లేచెను; ఆ గుండపు పొగచేత
సూర్యునిని ఆకాశమును చీకటి కమ్మెను. । ఆ పొగలో 3
నుండి మిడతలు భూమిమీదికి వచ్చెను, భూమిలో
ఉండు తేళ్లకు బలమున్నట్టు వాటికి బలము ఇయ్య
బడెను. । మరియు నొసళ్లయందు దేవుని ముద్రలేని 4
మనుష్యులకే తప్ప భూమిపైనున్న గడ్డికైనను ఏ
మొక్కలకైనను మరి ఏ వృక్షమునకైనను హాని కలుగ
జేయకూడదని వాటికి ఆజ్ఞ ఇయ్యబడెను. । మరియు 5
వారిని చంపుటకు అధికారము ఇయ్యబడలేదు గాని
అయిదు నెలలవరకు బాధించుటకు, వాటికి అధి
కారము ఇయ్యబడెను. వాటివలన కలుగు బాధ,

1 మూలభాషలో - ఇచ్చుటకై

తేలు మనుష్యుని కుట్టినప్పుడుండు బాధవలె ఉండును. ।
6 ఆ దినములలో మనుష్యులు మరణమును వెదకుదురు
గాని అది వారికి దొరకనే దొరకదు; చావవలెనని
ఆశపడుదురు గాని మరణము వారియొద్దనుండి పారి
7 పోవును. । ఆ మిడతల రూపములు యుద్ధమునకు
సిద్ధపరచబడిన గుఱ్ఱములను పోలియున్నవి. బంగా
రమువలె మెరియు కిరీటములవంటివి వాటి తలలమీద
ఉండెను; వాటి ముఖములు మనుష్యముఖముల
8 వంటివి, । స్త్రీల తలవెండ్రుకలవంటి వెండ్రుకలు వాటి
కుండెను, వాటి పండ్లు సింహపు కోరలవలె ఉండెను, ।
9 ఇనుప మైమరువులవంటి మైమరువులు వాటికుండెను.
వాటి రెక్కలధ్వని యుద్ధమునకు పరుగెత్తునట్టి విస్తార
10 మైన గుఱ్ఱపు రథముల ధ్వనివలె ఉండెను. । తేళ్ల
తోకలవంటి తోకలును కొండ్లును వాటికుండెను.
అయిదు నెలలవరకు వాటి తోకలచేత మనుష్యులకు
11 హానిచేయుటకు వాటికి అధికారముండెను. । పాతా
ళపు దూత వాటిపైన రాజుగా ఉన్నాడు; హెబ్రీ
భాషలో వానికి అబద్దోనని పేరు, హెల్లేని భాషలో
వానిపేరు అపొల్లుయోను.[1]
12 మొదటి శ్రమ గతించెను; ఇదిగో మరి రెండు
శ్రమలు ఇటుతరువాత వచ్చును.
13 ఆరవ దూత బూర ఊదినప్పుడు దేవునియెదుట
14 ఉన్న సువర్ణ బలిపీఠముయొక్క కొమ్ములనుండి యొక
స్వరము—యూఫ్రటీసు అను మహానదియొద్ద బంధింపబడి
యున్న నలుగురు దూతలను వదిలిపెట్టుమని బూర
పట్టుకొనియున్న ఆ యారవ దూతతో చెప్పుట
15 వింటిని. । మనుష్యులలో మూడవ భాగమును సంహ
రింపవలెనని అదే సంవత్సరమున అదే నెలలో అదే దిన
మున అదే గంటకు సిద్ధపరచబడియుండిన ఆ నలుగురు
16 దూతలు వదిలిపెట్టబడిరి. । గుఱ్ఱపురౌతుల సైన్యముల
లెక్క యిరువది కోట్లు; వారి లెక్క యింత అని నేను
17 వింటిని. । మరియు నాకు కలిగిన దర్శనమందు ఈలాగు
చూచితిని. ఆ గుఱ్ఱములకును వాటిమీద కూర్చుండి
యున్నవారికిని మైమరువులుండెను. (వాటిలో కొన్ని)
నిప్పువలె ఎరుపువర్ణముగాను, కొన్ని నీలవర్ణముగాను,
కొన్ని గంధకవర్ణముగాను ఉండెను. ఆ గుఱ్ఱముల
తలలు సింహపు తలలవంటివి, వాటి నోళ్లలోనుండి
18 అగ్నిధూమగంధకములు బయలువెడలుచుండెను. । ఈ
మూడు దెబ్బలచేత, అనగా వీటి నోళ్లలోనుండి
బయలువెడలుచున్న అగ్నిధూమగంధకములచేత, మను
19 ష్యులలో మూడవ భాగము చంపబడెను. । ఆ గుఱ్ఱ
ముల బలము వాటి నోళ్లయందును వాటి తోకల
యందును ఉన్నది, వాటి తోకలు తలలు కలిగినవై
లవలె ఉన్నందున వాటిచేత అవి హానిచేయును. ।
బ్బలచేత చావక మిగిలిన జనులు, దయ్యము
లను, చూడను వినను నడువను శక్తిలేనివై, బంగారు
వెండి కంచు రాయి కఱ్ఱలతో చేయబడిన తమ హస్త
కృతములైన విగ్రహములను పూజింపకుండ విడిచి
పెట్టునట్లు మారుమనస్సు పొందలేదు. । మరియు 21
తాము చేయుచున్న నరహత్యలును మాయమంత్రము
లును జారచోరత్వములును చేయకుండునట్లు వారు
మారుమనస్సు పొందినవారు కారు.

**బలిష్ఠుడైన** వేరొక దూత పరలోకమునుండి దిగి **10**
వచ్చుట చూచితిని. ఆయన మేఘము ధరించుకొని
యుండెను, ఆయన శిరస్సుమీద ఇంద్రధనుస్సుండెను;
ఆయన ముఖము సూర్యబింబమువలెను ఆయన పాద
ములు అగ్నిస్తంభములవలెను ఉండెను. । ఆయన చేతిలో 2
విప్పబడియున్న యొక చిన్న పుస్తకముండెను. ఆయన
తన కుడిపాదము సముద్రముమీదను ఎడమపాదము
భూమిమీదను మోపి, । సింహము గర్జించునట్లు గొప్ప 3
శబ్దముతో ఆర్భటించెను. ఆయన ఆర్భటించినప్పుడు
ఏడు ఉరుములు వాటివాటి శబ్దములు పలికెను. ।
ఆ యేడు ఉరుములు పలికినప్పుడు నేను వ్రాయబోవు 4
చుండగా — ఏడు ఉరుములు పలికిన సంగతులకు
ముద్రవేయుము, వాటిని వ్రాయవద్దని పరలోకము
నుండి యొక స్వరము పలుకుట వింటిని. । మరియు 5
సముద్రముమీదను భూమిమీదను నిలిచియుండగా
నేను చూచిన ఆ దూత తన కుడిచెయ్యి ఆకాశము
తట్టు ఎత్తి । —పరలోకమును అందులో ఉన్నవాటిని, 6
భూమిని అందులో ఉన్నవాటిని, సముద్రమును
అందులో ఉన్నవాటిని సృష్టించి, యుగయుగములు
జీవించుచున్నవానితోడు ఒట్టుపెట్టుకొని—ఇక ఆలస్య
ముండదు గాని । యేడవ దూత పలుకు దినములలో 7
అతడు బూర ఊదబోవుచుండగా, దేవుడు తన దాసు
లగు ప్రవక్తలకు తెలిపిన సువార్తప్రకారము దేవుని
(గూర్చిన) మర్మము సమాప్తమగునని చెప్పెను. । అం 8
తట పరలోకమునుండి నేను వినిన స్వరము మరల
నాతో మాటలాడుచు—నీవు వెళ్లి సముద్రముమీదను
భూమిమీదను నిలిచియున్న ఆ దూత చేతిలో విప్ప
బడియున్న ఆ చిన్న పుస్తకము తీసికొనుమని చెప్పుట
వింటిని. । నేను ఆ దూతయొద్దకు వెళ్లి — ఈ చిన్న 9
పుస్తకము నాకిమ్మని అడుగగా ఆయన—దాని తీసికొని
తినివేయుము, అది నీ కడుపుకు చేదగును గాని నీ
నోటికి తేనెవలె మధురముగా ఉండునని నాతో
చెప్పెను. । అంతట నేను ఆ చిన్న పుస్తకమును దూత 10
చేతిలోనుండి తీసికొని దాని తినివేసితిని; అది నా
నోటికి తేనెవలె మధురముగా ఉండెను గాని నేను
దాని తినివేసిన తరువాత నా కడుపుకు చేదాయెను. ।
అప్పుడు వారు — నీవు ప్రజలనుగూర్చియు, జనము 11
లనుగూర్చియు, ఆ యా భాషలు మాటలాడువారిని

1 అనగా—నాశనముచేయువాడు.

గూర్చియు, అనేక రాజులనుగూర్చియు మరల ప్రవ
చింప నగత్యమని నాతో చెప్పిరి.
**మ**రియు ఒకడు చేతికఱ్ఱవంటి కొలకఱ్ఱ నాకిచ్చి
— నీవు లేచి దేవుని ఆలయమును బలిపీఠమును కొలత
వేసి, ఆలయములో పూజించువారిని లెక్కపెట్టుము.[1]
ఆలయమునకు వెలపటి ఆవరణమును కొలతవేయక
విడిచిపెట్టుము; అది అన్యులకియ్యబడెను, వారు నలు
వది రెండు నెలలు పరిశుద్ధపట్టణమును కాలితో
త్రొక్కుదురు. నేను నా యిద్దరు సాక్షులకు (అధి
కారము) ఇచ్చెదను; వారు గోనెపట్ట ధరించుకొని
వెయ్యిన్ని యిన్నూట అరువది దినములు ప్రవచింతురు.
వీరు భూలోకమునకు ప్రభువైనవానియెదుట నిలుచు
చున్న రెండు ఒలీవచెట్లును దీపస్తంభములునై యు
న్నారు. ఎవడైనను వారికి హానిచేయ నుద్దేశించిన
యెడల వారి నోటనుండి అగ్ని బయలువెడలి వారి
శత్రువులను దహించివేయును గనుక ఎవడైనను వారికి
హానిచేయ నుద్దేశించినయెడల ఆలాగున వాడు చంప
బడవలెను. తాము ప్రవచించు దినములు వర్షము
కురువకుండ ఆకాశమును మూయుటకు వారికి అధి
కారము కలదు. మరియు వారికిష్టమైనప్పుడెల్ల నీళ్లు
రక్తముగాచేయుటకును, నానావిధములైన తెగుళ్లతో
భూమిని బాధించుటకును వారికి అధికారము కలదు.
వారు సాక్ష్యము చెప్పుట ముగింపగానే పాతాళ
ములోనుండి వచ్చు క్రూరమృగము వారితో యుద్ధ
ము చేసి జయించి వారిని చంపును. వారి శవములు
ఆ మహాపట్టణపు సంతవీధిలో పడియుండును; దానికి
ఉపమానరూపకముగా[2] సొదొమ అనియు ఐగుప్తు
అనియు పేరు; అచ్చట వారి ప్రభువుకూడ సిలువ
వేయబడెను. మరియు ప్రజలకును, వంశములకును,
ఆ యా భాషలు మాటలాడువారికిని, జనములకును
సంబంధించినవారు మూడుదినములనర వారి శవము
లను చూచుచు వారి శవములను సమాధిలో పెట్ట
10 నియ్యరు. ఈ యిద్దరు ప్రవక్తలు భూనివాసులను
బాధించినందున భూనివాసులు వారి గతి చూచి
సంతోషించుచు, ఉత్సహించుచు, ఒకనికొకడు కట్న
11 ములు పంపుకొందురు. అయితే ఆ మూడుదినముల
నరయైన పిమ్మట దేవునియొద్దనుండి జీవాత్మ వచ్చి
వారిలో ప్రవేశించెను గనుక వారు పాదములు ఊని
నిలిచిరి; వారిని చూచినవారికి మిగుల భయము కలి
12 గెను. అప్పుడు—ఇక్కడికి ఎక్కిరండని పరలోకము
నుండి గొప్ప స్వరము తమతో చెప్పుట వారు విని,
మేఘారూఢులై పరలోకమునకు ఆరోహణమైరి;
వారు పోవుచుండగా వారి శత్రువులు వారిని చూ
13 చిరి. ఆ గడియలో గొప్ప భూకంపము కలిగి
నందున ఆ పట్టణములో పదియవ భాగము కూలి
పోయెను. ఆ భూకంపమువలన ఏడువేలమంది చచ్చిరి.
మిగిలినవారు భయాక్రాంతులై పరలోకపు దేవుని
మహిమపరచిరి.
రెండవ శ్రమ గతించెను; ఇదిగో మూడవ శ్రమ 14
త్వరగా వచ్చుచున్నది.
ఏడవ దూత బూర ఊదినప్పుడు పరలోకములో 15
గొప్ప శబ్దములు పుట్టెను. ఆ శబ్దములు—ఈ లోక
రాజ్యము మన ప్రభువు రాజ్యమును ఆయన క్రీస్తు
రాజ్యమునాయెను; ఆయన యుగయుగముల పర్యం
తము ఏలునని యెను. అంతట దేవునియెదుట సింహాస 16
నాసీనులగు ఆ యిరువది నలుగురు పెద్దలు సాష్టాంగ
పడి దేవునికి నమస్కారముచేసి — వర్తమానభూత 17
కాలములలో ఉండు దేవుడవైన ప్రభువా, సర్వాధి
కారీ, నీవు నీ మహాబలమును స్వీకరించి యేలుచు
న్నావు గనుక మేము నీకు కృతజ్ఞతాస్తుతులు చెల్లించు
చున్నాము. జనములు కోపగించినందున నీకు కోపము 18
వచ్చెను. మృతులు తీర్పుపొందుటకును, నీ దాసులగు
ప్రవక్తలకును పరిశుద్ధులకును నీ నామమునకు భయ
పడువారికిని తగిన ఫలమునిచ్చుటకును, గొప్పవారేమి
కొద్దివారేమి భూమిని నశింపజేయువారిని నశింప
జేయుటకును సమయము వచ్చియున్నదని చెప్పిరి.
మరియు పరలోకమందు దేవుని ఆలయము తెరవ 19
బడగా దేవుని నిబంధనమందసము ఆయన ఆలయ
ములో కనబడెను. అప్పుడు మెరుపులును ధ్వను
లును ఉరుములును భూకంపమును గొప్ప వడగండ్లును
పుట్టెను.
**అ**ప్పుడు పరలోకమందు ఒక గొప్ప సూచన **12**
కనబడెను. అదేదనగా సూర్యుని ధరించుకొనిన యొక
స్త్రీ. ఆమె పాదములక్రింద చంద్రుడును శిరస్సు
మీద పన్నెండు నక్షత్రముల కిరీటమును ఉండెను.
ఆమె గర్భిణియై ప్రసవవేదనపడుచు ఆ నొప్పులకు 2
కేకలువేయుచుండెను. అంతట పరలోకమందు ఇం 3
కొక సూచన కనబడెను. ఇదిగో యెఱ్ఱని మహాఘట
సర్పము; దానికి ఏడు తలలును పది కొమ్ములును ఉం
డెను; దాని తలలమీద ఏడు కిరీటములుండెను.
దాని తోక ఆకాశ నక్షత్రములలో మూడవ భాగము 4
నీడ్చి వాటిని భూమిమీద పడవేసెను. కనవైయున్న
ఆ స్త్రీ కనగానే, ఆమె శిశువును మ్రింగివేయవలెనని
ఆ ఘటసర్పము స్త్రీ యెదుట నిలుచుండెను. సమస్త 5
జనములను ఇనుపదండముతో ఏలనైయున్న యొక
మగశిశువును ఆమె కనగా, ఆమె శిశువు దేవునియొద్ద
కును ఆయన సింహాసనమునొద్దకును కొనిపోబడెను.
ఆ స్త్రీ అరణ్యమునకు పారిపోయెను; అచ్చట వారు 6
వెయ్యిన్ని యిన్నూట అరువది దినములు ఆమెను పోషింప
వలెనని దేవుడామెకు ఒక స్థలము సిద్ధపరచియుంచెను.

1 మూలభాషలో—దేవుని ఆలయమును బలిపీఠమును అందులో పూజించువారిని కొలతవేయుము.
2 లేక—ఆత్మసూచకముగా.

7 అంతట పరలోకమందు యుద్ధము జరిగెను. మిఖా
యేలును అతని దూతలును ఆ ఘటసర్పముతో యు
8 ద్ధము చేయవలెనని యుండగా । ఆ ఘటసర్పమును
దాని దూతలును యుద్ధము చేసిరి గాని గెలువలేక
పోయిరి గనుక పరలోకమందు వారికిక స్థలములేక
9 పోయెను. । కాగా సర్వలోకమును మోసపుచ్చుచు,
అపవాదియనియు సాతానానియు పేరుగల ఆదిసర్ప
మైన ఆ మహా ఘటసర్పము పడద్రోయబడెను. అది
భూమిమీద పడద్రోయబడెను; దాని దూతలును
10 దానితోకూడ పడద్రోయబడిరి. । మరియు ఒక
గొప్ప స్వరము పరలోకమందు ఈలాగు చెప్పుట
వింటిని — దివారాత్రము మన దేవునియెదుట మన
సహోదరులమీద నేరము మోపువాడైన అపవాది[1]
పడద్రోయబడియున్నాడు గనుక ఇప్పుడు రక్షణ
యు శక్తియు రాజ్యమును మన దేవునివాయెను;
11 ఇప్పుడు అధికారము ఆయన క్రీస్తుదాయెను. । వారు
గొర్రెపిల్ల రక్తమునుబట్టియు, తామిచ్చిన సాక్ష్యమును
బట్టియు వాని జయించియున్నారు గాని, ప్రాణా
పాయము వచ్చినను[2] తమ ప్రాణములను ప్రేమించిన
12 వారు కారు. । అందుచేత పరలోకమా, పరలోక
నివాసులారా, ఉత్సహించుడి; భూమీ, సముద్రమా,
మీకు శ్రమ; అపవాది[1] తనకు సమయము కొంచెమే
అని తెలిసికొని బహు క్రోధముగలవాడై మీ
యొద్దకు దిగి వచ్చియున్నాడని చెప్పెను.
13 ఆ ఘటసర్పము తాను భూమిమీద పడద్రోయ
బడియుండుట చూచి, ఆ మగశిశువును కనిన స్త్రీని
14 హింసించెను; । అందువలన ఆమె అరణ్యములో ఉన్న
తన చోటికి ఎగురునట్లు గొప్ప పక్షిరాజు రెక్కలు
రెండు ఆమెకు ఇయ్యబడెను. అచ్చట ఆ సర్పముఖ
మును చూడకుండ ఆమె ఒకకాలము కాలములు అర్ధ
15 కాలము పోషింపబడును. । కావున ఆ స్త్రీ ప్రవాహ
మునకు కొట్టుకొనిపోవలెనని ఆ సర్పము తన నోట
నుండి నీళ్లు నదీప్రవాహముగా ఆమె వెనుక వెళ్ల
16 గ్రక్కెనుగాని । భూమి ఆ స్త్రీకి సహకారియై తన
నోరు తెరచి ఆ ఘటసర్పము తన నోటనుండి గ్రక్కిన
17 ప్రవాహమును మ్రింగివేసెను. । అందుచేత ఆ ఘట
సర్పము ఆగ్రహముతెచ్చుకొని, దేవుని ఆజ్ఞలు గైకొ
నుచు యేసునుగూర్చి సాక్ష్యమిచ్చుచు ఉన్నవారైన
ఆమె సంతానములో శేషించినవారితో యుద్ధము
చేయుటకై బయలువెడలి సముద్రతీరమున నిలిచెను.

13 మరియు పది కొమ్ములును ఏడు తలలును గల
యొక క్రూరమృగము సముద్రములోనుండి పైకి
వచ్చుట చూచితిని. దాని కొమ్ములమీద పది కిరీట
ములును దాని తలలమీద దేవదూషణకరమైన పేళ్లును
2 ఉండెను. । నేను చూచిన ఆ మృగము చిరుతపులిని
పోలియుండెను. దాని పాదములు ఎలుగుబంటి పాద
ములవంటివి, దాని నోరు సింహపునోరువంటిది, దానికి
ఆ ఘటసర్పము తన బలమును తన సింహాసనమును
గొప్ప అధికారమును ఇచ్చెను. । దాని తలలలో 3
ఒకదానికి చావుదెబ్బ తగిలినట్టుండెను; అయితే ఆ
చావుదెబ్బ మానిపోయెను గనుక భూజనులందరు
ఆశ్చర్యపడుచు మృగము వెంట వెళ్లిరి. । ఆ మృగము 4
నకు అధికారమిచ్చినందున వారు ఘటసర్పమునకు
నమస్కారముచేసిరి. మరియు వారు—ఈ మృగ
ముతో సాటి యెవడు? దానితో యుద్ధము చేయ
సాటివాడెవడు? అని చెప్పుకొనుచు ఆ మృగమునకు
నమస్కారముచేసిరి. । డంబపు మాటలను దేవదూషణ 5
లను పలుకు ఒక నోరు దానికి ఇయ్యబడెను. మరియు
నలువదిరెండు నెలలు (తన కార్యము) జరుప నధి
కారము దానికి ఏర్పాటాయెను[3] । గనుక దేవుని 6
దూషించుటకును, ఆయన నామమును, ఆయన గుడార
మును, పరలోక నివాసులను దూషించుటకును అది
తన నోరు తెరచెను. । మరియు పరిశుద్ధులతో యు 7
ద్ధముచేయను వారిని జయింపను దానికి అధికార
మియ్యబడెను. ప్రతి వంశముమీదను ప్రతి ప్రజ
మీదను ఆ యా భాషలు మాటలాడువారిమీదను
ప్రతి జనముమీదను అధికారము దానికీయ్యబడెను. ।
భూనివాసులందరును, అనగా జగదుత్పత్తి మొదలు 8
కొని వధింపబడియున్న గొర్రెపిల్లయొక్క జీవగ్రంథ
మందు ఎవరి పేరు వ్రాయబడలేదో వారు, ఆ
మృగమునకు నమస్కారము చేయుదురు. । ఎవడైన 9
చెవిగలవాడైతే వినునుగాక; । ఎవడైనను చెరపట్ట 10
వలెనని యున్నయెడల వాడు చెరలోకి పోవును,
ఎవడైనను ఖడ్గముచేత చంపినయెడల వాడు ఖడ్గము
చేత చంపబడవలెను; ఈ విషయములో పరిశుద్ధుల
ఓర్పును విశ్వాసమును కనబడును.
మరియు భూమిలోనుండి మరియొక క్రూర 11
మృగము పైకివచ్చుట చూచితిని. గొర్రెపిల్ల కొమ్మ
వంటి రెండు కొమ్ములు దానికుండెను; అది ఘట
సర్పమువలె మాటలాడుచుండెను; । అది ఆ మొదటి 12
క్రూరమృగమునకున్న అధికారపుచేష్టలన్నియు దాని
యెదుట చేయుచున్నది; మరియు చావుదెబ్బతగిలి
బాగుపడియున్న ఆ మొదటి మృగమునకు భూమి
యు దానిలో నివసించువారును నమస్కారముచేయు
నట్లు అది (బలవంతము) చేయుచున్నది. । అది ఆకా 13
శమునుండి భూమికి మనుష్యులయెదుట అగ్ని దిగి
వచ్చునట్టుగా గొప్ప సూచనలు చేయుచున్నది. ।
కత్తిదెబ్బ తినియు బ్రదికిన యీ క్రూరమృగము 14
నకు ప్రతిమను చేయవలెనని అది భూనివాసులతో
చెప్పుచు, ఆ మృగము ఎదుట చేయుటకు తనకియ్య

1 అనగా, సాతాను. 2 లేక, మరణపర్యంతము. 3 లేక, నలువదిరెండు నెలలు ఉండుటకు దాని కధికారమియ్యబడెను

బడిన సూచనలవలన భూనివాసులను మోసపుచ్చు
15 చున్నది. । మరియు ఆ మృగముయొక్క ప్రతిమ
మాటలాడునట్లును, ఆ మృగముయొక్క ప్రతిమకు
నమస్కారముచేయనివారిని హతముచేయునట్లును, ఆ
మృగముయొక్క ప్రతిమకు ప్రాణమిచ్చుటకై దానికి
16 అధికారము ఇయ్యబడెను. । కాగా కొద్దివారు గాని
17 గొప్పవారు గాని ధనికులు గాని దరిద్రులు గాని
స్వతంత్రులు గాని దాసులు గాని అందరును తమ
కుడిచేతిమీదనైనను తమ నొసటియందైనను ముద్ర
వేయించుకొనునట్లును, ఆ ముద్ర, అనగా ఆ మృగము
పేరైనను దాని పేరిటి సంఖ్యయైనను, గలవాడు తప్ప,
క్రయవిక్రయములు చేయుటకు మరి యెవనికిని అధి
కారము లేకుండునట్లును అది వారిని (బలవంతము)
18 చేయుచున్నది. । బుద్ధిగలవాడు మృగముయొక్క సం
ఖ్యను లెక్కింపనిమ్ము; అది యొక మనుష్యుని సం
ఖ్యయే; ఆ సంఖ్య ఆర్నూట అరువది యారు,[1]
ఇందులో జ్ఞానము కలదు.

14 మరియు నేను చూడగా, ఇదిగో ఆ గొఱ్ఱెపిల్ల
సీయోను పర్వతముమీద నిలువబడియుండెను. ఆయన
నామమును ఆయన తండ్రి నామమును నొసళ్లయందు
లిఖింపబడియున్న నూట నలువది నాలుగు వేలమంది
2 ఆయనతోకూడ ఉండిరి. । మరియు విస్తారమైన జల
ముల ధ్వనితోను గొప్ప ఉరుము ధ్వనితోను సమాన
మైన యొక శబ్దము పరలోకములోనుండి రాగా విం
టిని. నేను వినిన ఆ శబ్దము వీణెలు వాయించుచున్న
3 వైణికుల నాదమును పోలినది. । వారు సింహాసనము
ఎదుటను, ఆ నాలుగు జీవులయెదుటను, పెద్దలయెదు
టను ఒక క్రొత్త కీర్తన పాడుచున్నారు; భూలోక
ములోనుండి కొనబడిన ఆ నూట నలువది నాలుగు వేల
మంది తప్ప మరి ఎవరును ఆ కీర్తన నేర్చుకొనజాలరు. ।
4 వీరు స్త్రీ సాంగత్యమున అపవిత్రులు కానివారును,
స్త్రీ సాంగత్యము ఎరుగనివారునైయుండి, గొఱ్ఱెపిల్ల
ఎక్కడికి పోవునో అక్కడికెల్ల ఆయనను వెంబడిం
తురు; వీరు దేవునికొరకును గొఱ్ఱెపిల్లకొరకును ప్రథ
మఫలముగా ఉండుటకై మనుష్యులలోనుండి కొన
5 బడినవారు. । వీరినోట ఏ అబద్ధమును కనబడలేదు;
వీరు అనింద్యులు.

6 అప్పుడు మరియొక దూతను చూచితిని. అతడు
భూనివాసులకు, అనగా ప్రతి జనమునకును ప్రతి
వంశమునకును ఆ యా భాషలు మాటలాడువారికిని
ప్రతి ప్రజకును ప్రకటించునట్లు నిత్యసువార్త తీసికొని
7 ఆకాశమధ్యమున ఎగురుచుండెను. । అతడు—మీరు
దేవునికి భయపడి ఆయనను మహిమపరచుడి; ఆయన
తీర్పుతీర్చు గడియ వచ్చెను గనుక ఆకాశమును
భూమిని సముద్రమును జలధారలను కలుగజేసిన
వానికే నమస్కారముచేయుడి అని గొప్ప స్వరముతో
చెప్పెను.

వేరొక దూత, అనగా రెండవ దూత అతని వెంబడి 8
వచ్చి — మోహోద్రేకముతో కూడిన తన వ్యభిచార
మద్యమును సమస్త జనములకు త్రాగించిన యీ మహా
బాబెలు కూలిపోయెను కూలిపోయెను అని చెప్పెను.

మరియు వేరొక దూత, అనగా మూడవదూత 9
వీరి వెంబడి వచ్చి గొప్ప స్వరముతో ఈలాగు చెప్పెను
—ఆ క్రూరమృగమునకు గాని దాని ప్రతిమకు గాని
యెవడైనను నమస్కారముచేసి, తన నొసటియందేమి
చేతిమీదనేమి ఆ ముద్ర వేయించుకొనినయెడల ।
ఏమియు కలపబడకుండ దేవుని ఉగ్రతపాత్రలో 10
పోయబడిన దేవుని కోపమను మద్యమును వాడు
త్రాగును. పరిశుద్ధ దూతల యెదుటను గొఱ్ఱెపిల్ల
యెదుటను అగ్నిగంధకములచేత వాడు బాధింప
బడును. । వారి బాధసంబంధమైన పొగ యుగయుగ 11
ములు లేచును; ఆ క్రూరమృగమునకు గాని దాని
ప్రతిమకు గాని నమస్కారముచేయువారును, దాని
పేరుగల ముద్ర ఎవడైనను వేయించుకొనినయెడల
వాడును దివారాత్రము నెమ్మదిలేనివారై యుందురు. ।
దేవుని ఆజ్ఞలను యేసునుగూర్చిన విశ్వాసమును గైకొను 12
చున్న పరిశుద్ధుల ఓర్పు ఇందులో కనబడును.

అంతట—ఇప్పటినుండి ప్రభువునందు మృతినొందు 13
మృతులు ధన్యులని వ్రాయుమని పరలోకమునుండి
యొక స్వరము చెప్పగా వింటిని. నిజమే; వారు తమ
ప్రయాసములు మాని విశ్రాంతి పొందుదురు; వారి
క్రియలు వారి వెంట పోవునని ఆత్మ చెప్పుచున్నాడు.

మరియు నేను చూడగా, ఇదిగో తెల్లని మేఘము 14
కనబడెను. మనుష్యకుమారుని పోలిన యొకడు ఆ
మేఘముమీద ఆసీనుడైయుండెను. ఆయన శిరస్సు
మీద సువర్ణకిరీటమును, చేతిలో వాడిగల కొడ
వలియు ఉండెను. । అప్పుడు మరియొక దూత దేవా 15
లయములోనుండి వెడలివచ్చి — భూమి పైరుపండి
యున్నది,[2] కోతకాలము వచ్చినది, నీ కొడవలిపెట్టి
కోయుమని గొప్ప స్వరముతో ఆ మేఘముమీద
ఆసీనుడైయున్నవానితో చెప్పెను. । మేఘముమీద 16
ఆసీనుడై యున్నవాడు తన కొడవలి భూమిమీద
వేయగా భూమి పైరు కోయబడెను.

ఇంకొక దూత పరలోకమునందున్న ఆలయములో 17
నుండి వెడలివచ్చెను. ఇతనియొద్దను వాడిగల కొడవలి
యుండెను. । మరియొక దూత బలిపీఠమునుండి వెడలి 18
వచ్చెను; ఇతడు అగ్నిమీద అధికారము నొందిన
వాడు; ఇతడు వాడియైన కొడవలిగలవానిని గొప్ప
స్వరముతో పిలిచి—భూమిమీద ఉన్న ద్రాక్షపండ్లు
పరిపక్వమైనవి; వాడియైన నీ కొడవలిపెట్టి దాని

1 కొన్ని ప్రాచీనప్రతులలో—ఆర్నూట పదునారు, అని పాఠాంతరము.

2 మూలభాషలో—యెండిపోయియున్నది.

19 గెలలు కోయుమని చెప్పెను. । కాగా ఆ దూత తన
కొడవలి భూమిమీద వేసి భూమిమీదనున్న ద్రాక్ష
పండ్లను కోసి, దేవుని కోపమను ద్రాక్షల పెద్ద
20 తొట్టిలో వేసెను. । ఆ ద్రాక్షలతొట్టి పట్టణమునకు
వెలపట త్రొక్కబడెను; నూరు కోసుల దూరము
గుర్రముల కళ్లెముమట్టుకు ద్రాక్షల తొట్టిలోనుండి
రక్తము ప్రవహించెను.

**15** మరియు ఆశ్చర్యమైన మరియొక గొప్ప సూచన
పరలోకమందు చూచితిని. అదేమనగా, ఏడు తెగుళ్లు
(చేత) పట్టుకొనియున్న యేడుగురు దూతలు. ఇవే కడ
వరి తెగుళ్లు; వీటితో దేవుని కోపము సమాప్తమాయెను.
2 మరియు అగ్నితో కలిసియున్న స్ఫటికపు సము
ద్రమువంటిది ఒకటి నేను చూచితిని. ఆ క్రూర
మృగమునకును దాని ప్రతిమకును దాని పేరుగల
సంఖ్యకును లోబడక వాటిని జయించినవారు దేవుని
సేవార్థమైన వీణెలుగలవారై,[1] ఆ స్ఫటికపు సము
3 ద్రమునొద్ద నిలిచియుండుట చూచితిని. । వారు—
4 ప్రభువా, దేవా, సర్వాధికారీ, నీ క్రియలు ఘన
మైనవి, ఆశ్చర్యమైనవి; యుగములకు[2] రాజా, నీ
మార్గములు న్యాయములును సత్యములునై యున్నవి;
ప్రభువా, నీవుమాత్రము పవిత్రుడవు, నీకు భయ
పడనివాడెవడు? నీ నామమును మహిమపరచనివాడె
వడు? నీ న్యాయవిధులు ప్రత్యక్షపరచబడినవి గనుక
జనములందరు వచ్చి నీ సన్నిధిని నమస్కారముచేసె
దరని చెప్పుచు, దేవునిదాసుడగు మోషే కీర్తనయు
గొఱ్ఱెపిల్ల కీర్తనయు పాడుచున్నారు.
5 అటుతరువాత నేను చూడగా, సాక్ష్యపు గుడార
సంబంధమైన గర్భాలయము పరలోకమందు తెరవ
6 బడెను. । ఏడు తెగుళ్లు (చేత) పట్టుకొనియున్న ఆ
యేడుగురు దూతలు, నిర్మలమును ప్రకాశమానమునైన
రాతిని[3] ధరించుకొని, రొమ్ములమీద బంగారు దట్టీలు
కట్టుకొనినవారై ఆ గర్భాలయములోనుండి వెలపలికి
7 వచ్చిరి. । అప్పుడా నాలుగు జీవులలో ఒక జీవి,
యుగయుగములు జీవించు దేవుని కోపముతో నిండి
యున్న యేడు బంగారు పాత్రలను ఆ యేడుగురు
8 దూతలకిచ్చెను. । అంతట దేవుని మహిమనుండియు
ఆయన శక్తినుండియు వచ్చిన పొగతో గర్భాలయము
నింపబడినందున ఆ యేడుగురు దూతలయొద్ద ఉన్న
యేడు తెగుళ్లు సమాప్తియగువరకు గర్భాలయమందు
ఎవడును ప్రవేశింపజాలకపోయెను.

**16** మరియు—మీరు పోయి దేవుని కోపముతో
నిండిన ఆ యేడు పాత్రలను భూమిమీద కుమ్మరించు
డని గర్భాలయములోనుండి గొప్ప స్వరము ఆ యేడు
గురు దేవదూతలతో చెప్పగా వింటిని.

అంతట మొదటి దూత వెలపలికి వచ్చి తన 2
పాత్రను భూమిమీద కుమ్మరింపగా ఆ క్రూరమృగము
యొక్క ముద్రగలవారికిని దాని ప్రతిమకు నమస్కారము
చేయువారికిని బాధకరమైన చెడ్డ పుండుపుట్టెను.

రెండవ దూత తన పాత్రను సముద్రములో 3
కుమ్మరింపగా సముద్రము పీనుగ రక్తమువంటిదాయెను.
అందువలన సముద్రములో ఉన్న జీవజంతువులన్నియు
చచ్చెను.

మూడవ దూత తన పాత్రను నదులలోను జల 4
ధారలలోను కుమ్మరింపగా అవి రక్తమాయెను. ।
అప్పుడు — వర్తమాన భూతకాలములలో ఉండు పవి 5
త్రుడా, పరిశుద్ధుల రక్తమును ప్రవక్తల రక్తమును వారు
కార్చినందుకు తీర్పుతీర్చి వారికి రక్తము త్రాగనిచ్చి
తివి; । దీనికి వారు పాత్రులే. నీవు ఈలాగు తీర్పు 6
తీర్చితివి గనుక నీవు న్యాయవంతుడవని జలముల
దేవదూత చెప్పగా వింటిని. । అందుకు — అవును 7
ప్రభువా, దేవా, సర్వాధికారీ, నీ తీర్పులు సత్యము
లును న్యాయములునై యున్నవని బలిపీఠము చెప్పుట
వింటిని.

నాలుగవ దూత తన పాత్రను సూర్యునిమీద కుమ్మ 8
రింపగా మనుష్యులను అగ్నితో కాల్చుటకు సూర్యు
నికి (అధికారము) ఇయ్యబడెను. । కాగా మనుష్యులు 9
తీవ్రమైన వేడిమితో కాలిపోయి, యీ తెగుళ్లమీద
అధికారముగల దేవుని నామమును దూషించిరి గాని
ఆయనను మహిమపరచునట్లు వారు మారుమనస్సు
పొందినవారు కారు.

అయిదవ దూత తన పాత్రను ఆ క్రూరమృగము 10
యొక్క సింహాసనముమీద కుమ్మరింపగా దాని రాజ్యము
చీకటి కమ్మెను; మనుష్యులు తమకు కలిగిన వేదనను
బట్టి తమ నాలుకలు కరచుకొనుచుండిరి; । తమకు కలి 11
గిన వేదనలను బట్టియు పుండ్లను బట్టియు పరలోక
మందున్న దేవుని దూషించిరి గాని తమ క్రియలను
మాని మారుమనస్సు పొందినవారు కారు.

ఆరవ దూత తన పాత్రను యూఫ్రటీసు అను మహా 12
నదిమీద కుమ్మరింపగా తూర్పునుండి వచ్చు రాజు
లకు మార్గము సిద్ధపరచబడునట్లు దాని నీళ్లు ఎండి
పోయెను. । మరియు ఆ ఘటసర్పము నోటనుండియు 13
క్రూరమృగము నోటనుండియు అబద్ధప్రవక్త నోట
నుండియు కప్పలవంటి మూడు అపవిత్రాత్మలు
బయలువెడలగా చూచితిని. । అవి సూచనలు చేయు 14
నట్టి దయ్యముల ఆత్మలే; అవి సర్వాధికారియైన దేవుని
మహాదినమున జరుగు యుద్ధమునకు లోకమంతట
ఉన్న రాజులను పోగుచేయవలెనని వారియొద్దకు

1 మూలభాషలో—దేవుని వీణెలుగలవారై. 2 అనేక ప్రాచీనప్రతులలో—జనములకు అని పాఠాంతరము. 3 అనేక ప్రాచీనప్రతులలో—నారబట్టను అని పాఠాంతరము.

15 బయలువెళ్లి, | హెబ్రీభాషలో హార్మగెదోనను చోటునకు
16 వారిని పోగుచేసెను. ఇదిగో నేను దొంగవలె వచ్చు
చున్నాను; తాను దిగంబరుడుగా సంచరించుచున్నం
దున జనులు తన దిసమొలను చూతురేమో అని
మెలకువగా ఉండి తన వస్త్రము కాపాడుకొనువాడు
ధన్యుడు.
17 ఏడవ దూత తన పాత్రను వాయుమండలముమీద
కుమ్మరింపగా — సమాప్తమైనదని చెప్పుచున్న యొక
గొప్ప స్వరము గర్భాలయములో ఉన్న సింహా
18 సనమునుండి వచ్చెను. | అప్పుడు మెరుపులును ధ్వను
లును ఉరుములును పుట్టెను, పెద్ద భూకంపమును
కలిగెను. మనుష్యులు భూమిమీద పుట్టినది మొదలు
కొని అట్టి మహా భూకంపము కలుగలేదు, అది అంత
19 గొప్పది. | ప్రసిద్ధమైన మహాపట్టణము మూడు భాగము
లాయెను, అన్యజనుల పట్టణములు కూలిపోయెను,
తన తీక్ష్ణమైన ఉగ్రతయను మద్యముగల పాత్రను
మహా బాబెలుకు ఇయ్యవలెనని దానిని దేవుని సముఖ
20 మందు జ్ఞాపకము చేసిరి. | ప్రతి ద్వీపము పారి
21 పోయెను, పర్వతములు అదృశ్యములాయెను.[1] | అయి
దేసి మణుగుల బరువుగల పెద్ద వడగండ్లు ఆకాశము
నుండి మనుష్యులమీద పడెను, ఆ వడగండ్ల దెబ్బ
మిక్కిలి గొప్పదైనందున మనుష్యులు ఆ దెబ్బనుబట్టి
దేవుని దూషించిరి.

17 ఆ యేడు పాత్రలను పట్టుకొనియున్న యేడు
గురు దేవదూతలలో ఒకడు వచ్చి నాతో మాట
లాడుచు ఈలాగు చెప్పెను. — నీవిక్కడికి రమ్ము,
విస్తార జలములమీద కూర్చున్న మహా వేశ్యకు చేయ
2 బడు తీర్పు నీకు కనుపరచెదను; | భూరాజులు ఆమెతో
వ్యభిచరించిరి, భూనివాసులు ఆమెతో వ్యభిచరించి
3 మత్తులైరి. | అప్పుడతడు ఆత్మవశుడనైన నన్ను అర
ణ్యమునకు కొనిపోగా, దేవదూషణ నామములతో
నిండుకొని,[2] యేడు తలలును పది కొమ్ములునుగల
ఎఱ్ఱని మృగముమీద కూర్చుండిన యొక స్త్రీని చూచి
4 తిని. | ఆ స్త్రీ ధూమ్రరక్తవర్ణముగల వస్త్రము ధరించు
కొని, బంగారముతోను రత్నములతోను ముత్యముల
తోను అలంకరింపబడినదై, ఏహ్యమైన కార్యముల
తోను తాను చేయుచున్న వ్యభిచారసంబంధమైన
అపవిత్రకార్యములతోను నిండిన యొక సువర్ణ
5 పాత్రను తనచేత పట్టుకొనియుండెను. | దాని నొసట
దానిపేరు ఈలాగు వ్రాయబడియుండెను—మర్మము,
వేశ్యలకును భూమిలోని ఏహ్యమైనవాటికిని తల్లియైన
6 మహా బాబెలు. | మరియు ఆ స్త్రీ పరిశుద్ధుల రక్తము
చేతను, యేసుయొక్క హతసాక్షుల రక్తముచేతను
మత్తిల్లియుండుట చూచితిని. నేను దాని చూచి
7 బహుగా ఆశ్చర్యపడగా | ఆ దూత నాతో ఇట్లనెను—
నీవేల ఆశ్చర్యపడితివి? యీ స్త్రీనిగూర్చిన మర్మమును,
ఏడు తలలును పది కొమ్ములును గలిగి దాని మోయు
చున్న క్రూరమృగమునుగూర్చిన మర్మమును నేను నీకు
తెలిపెదను. | నీవు చూచిన ఆ మృగము ఉండెను గాని 8
యిప్పుడు లేదు, అయితే అది పాతాళములోనుండి
పైకి వచ్చుటకును నాశనమునకు పోవుటకును సిద్ధముగా
ఉన్నది. భూనివాసులలో జగదుత్పత్తి మొదలుకొని
జీవగ్రంథమందు ఎవరి పేరు వ్రాయబడలేదో వారు,
ఆ మృగముండెను గాని యిప్పుడు లేదు అయితే
ముందుకు వచ్చునన్న సంగతి తెలిసికొని ఆశ్చర్యపడు
దురు. | ఇందులో జ్ఞానముగల మనస్సు కనబడును. 9
ఆ యేడు తలలు ఆ స్త్రీ కూర్చున్న యేడు కొండలు; |
మరియు ఏడుగురు రాజులు కలరు; అయిదుగురు 10
కూలిపోయిరి, ఒకడున్నాడు, కడమవాడు ఇంకను
రాలేదు, వచ్చినప్పుడు అతడు కొంచెము కాలముండ
వలెను. | ఉండినదియు ఇప్పుడు లేనిదియునైన యీ 11
క్రూరమృగము ఆ యేడుగురితోపాటు ఒకడునై
యుండి, తానే యెనిమిదవ రాజగుచు నాశనమునకు
పోవును. | నీవు చూచిన ఆ పది కొమ్ములు పదిమంది 12
రాజులు. వారిదివరకు రాజ్యమును పొందలేదు గాని
యొక గడియ క్రూరమృగముతోకూడ రాజులవలె
అధికారము పొందుదురు. | వీరు ఏకాభిప్రాయము 13
గలవారై తమ బలమును అధికారమును ఆ మృగము
నకు అప్పగింతురు. | వీరు గొఱ్ఱెపిల్లతో యుద్ధము 14
చేతురు గాని, గొఱ్ఱెపిల్ల ప్రభువులకు ప్రభువును
రాజులకు రాజునై యున్నందునను, తనతోకూడ
ఉండినవారు పిలువబడినవారై, యేర్పరచబడినవారై,
నమ్మకమైనవారై యున్నందునను, ఆయన ఆ రాజులను
జయించును. | మరియు (ఆ దూత) నాతో ఈలాగు 15
చెప్పెను — ఆ వేశ్య కూర్చున్నచోట నీవు చూచిన
జలములు ప్రజలను, జనసమూహములను, జనములను,
ఆ యా భాషలు మాటలాడువారిని (సూచించును.) |
నీవు ఆ పది కొమ్ములును ఆ మృగమును చూచితివే; 16
వారు ఆ వేశ్యను ద్వేషించి, దానిని దిక్కులేనిదాని
గాను దిగంబరిగాను చేసి, దాని మాంసము భక్షించి
అగ్నిచేత దానిని బొత్తుగా కాల్చివేతురు. | దేవుని 17
మాటలు నెరవేరుపర్యంతము వారు ఏకాభిప్రాయము
గలవారై తమ రాజ్యమును ఆ మృగమునకు అప్పగిం
చుటవలన తన సంకల్పము కొనసాగించునట్లు దేవుడు
వారికి బుద్ధి పుట్టించెను. | మరియు నీవు చూచిన ఆ 18
స్త్రీ భూరాజులనేలు ఆ మహాపట్టణమే.

అటుతరువాత మహాధికారముగల వేరొక దూత 18
పరలోకమునుండి దిగివచ్చుట చూచితిని. అతని
మహిమచేత భూమి ప్రకాశించెను. | అతడు గొప్ప 2
స్వరముతో ఆర్భటించి యిట్లనెను — మహాబాబెలు

[1] మూలభాషలో — కనబడక పోయెను. [2] లేక, దేవదూషణతో నిండుకొనిన నామములు (గలదై).

కూలిపోయెను కూలిపోయెను. అది దయ్యములకు
నివాసస్థలమును, ప్రతి అపవిత్రాత్మకు ఉనికిపట్టును,
అపవిత్రమును అసహ్యమునైన ప్రతి పక్షికి ఉనికి
3 పట్టును ఆయెను. । ఏలయనగా సమస్తమైన జనములు
మోహోద్రేకముతో కూడిన దాని వ్యభిచారమద్య
మును త్రాగి పడిపోయిరి, భూరాజులు దానితో
వ్యభిచరించిరి, భూలోకమందలి వర్తకులు దాని సుఖ
భోగములవలన ధనవంతులైరి.

4 మరియు ఇంకొక స్వరము పరలోకములోనుండి
ఈలాగు చెప్పగా వింటిని — నా ప్రజలారా, మీరు
దాని పాపములలో పాలివారు కాకుండునట్లును,
దాని తెగుళ్లలో ఏదియు మీకు ప్రాప్తింపకుండు
5 నట్లును దాని విడిచిరండి । దాని పాపములు ఆకాశము
నంటుచున్నవి, దాని నేరములను దేవుడు జ్ఞాపకము
6 చేసికొనియున్నాడు. । అది యిచ్చిన ప్రకారము దానికి
ఇయ్యుడి; దాని క్రియలచొప్పున దానికి రెట్టింపు
చేయుడి; అది కలిపిన పాత్రలో దానికొరకు రెండం
7 తలు కలిపి పెట్టుడి. । అది — నేను రాణిగా కూర్చుండు
దానను, నేను విధవరాలను కాను, దుఃఖము చూడనే
చూడనని తన మనస్సులో అనుకొనెను గనుక, అది
తన్నుతాను ఎంతగా గొప్పచేసికొని సుఖభోగములను
అనుభవించెనో అంతగా వేదనను దుఃఖమును దానికి
8 కలుగజేయుడి । అందుచేత ఒక దినముననే దాని
తెగుళ్లు,[1] అనగా మరణమును దుఃఖమును కరవును
వచ్చును; దానికి తీర్పు తీర్చుచున్న దేవుడైన ప్రభువు
బలిష్ఠుడు గనుక అది అగ్నిచేత బొత్తుగా కాల్చివేయ
9 బడును. । దానితో వ్యభిచారముచేసి సుఖభోగము
10 లను అనుభవించిన భూరాజులు దాని బాధ చూచి
భయాక్రాంతులై దూరమున నిలువబడి దాని దహన
ధూమమును చూచునప్పుడు దానివిషయమై రొమ్ము
కొట్టుకొనుచు ఏడ్చుచు — అయ్యో, అయ్యో, బాబెలు
మహాపట్టణమా, బలమైన పట్టణమా, ఒక గడియలోనే
నీకు తీర్పువచ్చెను గదా అని చెప్పుకొందురు. ।
11 లోకములోని వర్తకులును ఆ పట్టణమును చూచి
14 యేడ్చుచు, తమ సరకులను, అనగా బంగారు వెండి
రత్నములు ముత్యములు సన్నపు నారబట్టలు ఊదా
రంగుబట్టలు పట్టుబట్టలు రక్తవర్ణపుబట్టలు మొదలైన
సరకులను, ప్రతివిధమైన దబ్బమ్రానును ప్రతివిధమైన
దంతపు వస్తువులను, మిక్కిలి విలువగల కర్ర, యిత్తడి
యినుము చలువరాళ్లు మొదలైనవాటితో చేయబడిన
ప్రతివిధమైన వస్తువులను, దాల్చినిచెక్క ఓమము ధూప
ద్రవ్యములు అత్తరు సాంబ్రాణి ద్రాక్షారసము నూనె
మెత్తనిపిండి గోధుమలు పశువులు గొఱ్ఱెలు మొదలగు
వాటిని, గుఱ్ఱములను రథములను దాసులను[2] మను
ష్యుల ప్రాణములను ఇకమీదట ఎవడును కొనడు;
నీ ప్రాణమునకు ఇష్టమైన ఫలములు నిన్ను విడిచి
పోయెను, రుచ్యమైనవన్నియు దివ్యమైనవన్నియు
నీకు దొరకకుండ నశించిపోయినవి, అవి యికమీదట
కనబడనే కనబడవని చెప్పుకొనుచు, దానిగూర్చి దుఃఖ
పడుదురు. । ఆ పట్టణముచేత ధనవంతులైన యీ 15
సరకుల వర్తకులు ఏడ్చుచు దుఃఖపడుచు — అయ్యో, 16
అయ్యో, సన్నపు నారబట్టలను ధూమ్రరక్తవర్ణపు
వస్త్రములను ధరించుకొని, బంగారముతోను రత్నముల
తోను ముత్యములతోను అలంకరింపబడిన మహాపట్ట
ణమా, యింత ఐశ్వర్యము ఒక్క గడియలోనే పాడై
పోయెనే అని చెప్పుకొనుచు, దాని బాధను చూచి
భయాక్రాంతులై దూరముగా నిలుచుందురు. । ప్రతి 17
నావికుడును, ఎక్కడికైనను సబురుచేయు ప్రతి
వాడును, ఓడవారును, సముద్రముమీద పనిచేసి
జీవనముచేయువారందరును దూరముగా నిలిచి దాని
దహనధూమమును చూచి । — ఈ మహాపట్టణముతో 18
సమానమైనదేది అని చెప్పుకొనుచు కేకలువేసి ; తమ 19
తలలమీద దుమ్ముపోసికొని యేడ్చుచు దుఃఖించుచు
— అయ్యో, అయ్యో, ఆ మహాపట్టణము; అందులో
సముద్రముమీద ఓడలుగలవారందరు, దానియందలి
అధిక వ్యయముచేత ధనవంతులైరి; అది ఒక్క గడి
యలో పాడైపోయెనే అని చెప్పుకొనుచు కేకలు
వేయుచుండిరి. । పరలోకమా, పరిశుద్ధులారా, అపొ 20
స్తలులారా, ప్రవక్తలారా, దానిగూర్చి ఆనందించుడి,
ఏలయనగా ఆమెచేత మీకు కలిగిన తీర్పునకు ప్రతిగా
దేవుడు ఆ పట్టణమునకు తీర్పు తీర్చియున్నాడు.

తరువాత బలిష్ఠుడైన యొక దూత గొప్ప తిరుగటి 21
రాతివంటి రాయి యెత్తి సముద్రములో పడవేసి —
ఈలాగు మహాపట్టణమైన బాబెలు వేగముగా పడ
ద్రోయబడి ఇక ఎన్నటికిని కనబడకపోవును. । నీ వర్త 22
కులు భూమిమీద గొప్ప ప్రభువులై యుండిరి; జనము 23
లన్నియు నీ మాయమంత్రములచేత మోసపోయిరి.
కావున వైణికులయొక్కయు గాయకులయొక్కయు
పిల్లనగ్రోవి ఊదువారియొక్కయు బూరలు ఊదు
వారియొక్కయు శబ్దము ఇక ఎన్నడును నీలో విన
బడదు. మరి ఏ శిల్పమైన చేయు శిల్పి యెవడును
నీలో ఎంతమాత్రమును కనబడడు, తిరుగటిధ్వని యిక
ఎన్నడును నీలో వినబడదు, దీపపు వెలుగు నీలో
ఇకను ప్రకాశింపనే ప్రకాశింపదు, పెండ్లికుమారుని
స్వరమును పెండ్లికుమార్తె స్వరమును నీలో ఇక ఎన్న
డును వినబడవు అని చెప్పెను. । మరియు ప్రవక్తల 24
యొక్కయు, పరిశుద్ధులయొక్కయు, భూమిమీద
వధింపబడినవారందరియొక్కయు రక్తము ఆ పట్టణ
ములో కనబడెనను

[1] లేక, దెబ్బలు. [2] మూలభాషలో — శరీరములను.

1 అటుతరువాత బహు జనులశబ్దమువంటి గొప్ప
స్వరము పరలోకమందు ఈలాగు చెప్పగా వింటిని.
—ప్రభువును స్తుతించుడి,[1] రక్షణ మహిమ ప్రభావ
ములు మన దేవునికే చెల్లును; ఆయన తీర్పులు సత్య
ములును న్యాయములునై యున్నవి; తన వ్యభిచార
ముతో భూలోకమును చెరిపిన గొప్ప వేశ్యకు ఆయన
తీర్పుతీర్చి తన దాసుల రక్తమునుబట్టి దానికి ప్రతి
దండన చేసెను; మరి రెండవసారి వారు—ప్రభువును
స్తుతించుడి[1] అనిరి. ఆ పట్టణపు పొగ యుగయుగ
ములు పైకి లేచుచున్నది. అప్పుడు ఆ యిరువది
నలుగురు పెద్దలును నాలుగు జీవులును సాగిలపడి—
ఆమేన్, ప్రభువును స్తుతించుడి[1] అని చెప్పుచు
సింహాసనాసీనుడగు దేవునికి నమస్కారముచేసిరి.
మరియు—మన దేవుని దాసులారా, ఆయనకు భయ
పడువారలారా, కొద్దివారేమి గొప్పవారేమి మీరం
దరు ఆయనను స్తుతించుడి అని చెప్పుచున్న యొక
స్వరము సింహాసనమునొద్దనుండి వచ్చెను. అప్పుడు
గొప్ప జనసమూహపు శబ్దమును, విస్తారమైన జలముల
శబ్దమును, బలమైన ఉరుముల శబ్దమును పోలిన యొక
స్వరము—సర్వాధికారియు ప్రభువునగు మన దేవుడు
ఏలుచున్నాడు; ఆయనను స్తుతించుడి,[1] గొఱ్ఱెపిల్ల
వివాహోత్సవ సమయము వచ్చినది; ఆయన భార్య
తన్నుతాను సిద్ధపరచుకొనియున్నది; గనుక మనము
సంతోషపడి ఉత్సహించి ఆయనను మహిమపరచెద
మని చెప్పగా వింటిని. మరియు ఆమె ధరించు
కొనుటకు ప్రకాశములును నిర్మలములునైన సన్నపు
నారబట్టలు ఆమెకియ్యబడెను; అవి పరిశుద్ధుల నీతి
క్రియలు. మరియు అతడు నాతో ఈలాగు చెప్పెను
—గొఱ్ఱెపిల్ల పెండ్లివిందుకు పిలువబడినవారు ధన్యులని
వ్రాయుము; మరియు ఈ మాటలు దేవుని యథార్థ
మైన మాటలని నాతో చెప్పెను. అందుకు నేను
అతనికి నమస్కారము చేయుటకై అతని పాదముల
యెదుట సాగిలపడగా అతడు—వద్దు సుమీ. నేను
నీతోను, యేసునుగూర్చిన సాక్ష్యము చెప్పు నీ సహో
దరులతోను సహదాసుడను; దేవునికే నమస్కారము
చేయుము. యేసునుగూర్చిన సాక్ష్యము ప్రవచనసార
మని[2] నాతో చెప్పెను.
మరియు పరలోకము తెరువబడియుండుట చూచి
తిని. అప్పుడిదిగో, తెల్లని గుఱ్ఱమొకటి కనబడెను.
దానిమీద కూర్చుండియున్నవాడు నమ్మకమైనవాడును
సత్యవంతుడును అను నామము గలవాడు. ఆయన
నీతినిబట్టి విమర్శ చేయుచు యుద్ధము జరిగించుచున్నా
డు. ఆయన నేత్రములు అగ్నిజ్వాల (వంటివి,)
ఆయన శిరస్సుమీద అనేక కిరీటములుండెను. వ్రాయ
బడిన యొక నామము ఆయనకు కలదు, అది ఆయనకే
గాని మరి ఎవనికిని తెలియదు; రక్తము చిలకరించిన[3] 13
వస్త్రము ఆయన ధరించుకొనియుండెను. మరియు దేవుని
వాక్యము అను నామము ఆయనకు పెట్టబడియున్నది.
పరలోకమందున్న సేనలు శుభ్రమైన తెల్లని నార 14
బట్టలు ధరించుకొని తెల్లని గుఱ్ఱములెక్కి ఆయనను
వెంబడించుచుండిరి. జనములను కొట్టుటకై ఆయన 15
నోటనుండి వాడిగల ఖడ్గము బయలు వెడలుచున్నది.
ఆయన యినుపదండముతో వారిని ఏలును; ఆయనే
సర్వాధికారియగు దేవుని తీక్ష్ణమైన ఉగ్రత అను
మద్యపుతొట్టి త్రొక్కును. —రాజులకు రాజును 16
ప్రభువులకు ప్రభువును అను నామము ఆయన వస్త్రము
మీదను తొడమీదను వ్రాయబడియున్నది.

మరియు ఒక దూత సూర్యబింబములో[4] నిలిచి 17
యుండుట చూచితిని. అతడు గొప్ప శబ్దముతో ఆర్భ 18
టించి—రండి, రాజుల మాంసమును సహస్రాధిపతుల
మాంసమును బలిష్ఠుల మాంసమును గుఱ్ఱముల మాంస
మును వాటిమీద కూర్చుండువారి మాంసమును,
స్వతంత్రులదేమి దాసులదేమి కొద్దివారిదేమి గొప్ప
వారిదేని, అందరియొక్క మాంసమును తినుటకై దేవుని
గొప్ప విందుకు కూడి రండని ఆకాశమధ్యమందు
ఎగురుచున్న సమస్త పక్షులను పిలిచెను.

మరియు ఆ గుఱ్ఱముమీద కూర్చున్నవానితోను 19
ఆయన సేనతోను యుద్ధముచేయుటకై ఆ క్రూరమృగ
మును భూరాజులును వారి సేనలును కూడియుండగా
చూచితిని. అప్పుడా మృగమును, దానియెదుట 20
సూచకక్రియలు చేసి దాని ముద్రను వేయించుకొనిన
వారిని ఆ మృగపు ప్రతిమకు నమస్కరించినవారిని మోస
పరచిన ఆ అబద్ధప్రవక్తయు, పట్టబడి వారిద్దరు గంధక
ముతో మండు అగ్నిగుండములో ప్రాణముతోనే
వేయబడిరి. కడమవారు గుఱ్ఱముమీద కూర్చున్న 21
వాని నోటనుండి వచ్చిన ఖడ్గముచేత వధింపబడిరి;
వారి మాంసమును పక్షులన్నియు కడుపార తినెను.

20 మరియు పెద్దసంకెళ్లను చేత పట్టుకొని పాతా
ళముయొక్క తాళపుచెవిగల యొక దేవదూత పర
లోకమునుండి దిగివచ్చుట చూచితిని. అతడు ఆది 2
సర్పమును, అనగా అపవాదియు సాతానును అను ఆ
ఘటసర్పమును పట్టుకొని వెయ్యి సంవత్సరములు వాని
బంధించి పాతాళములో పడవేసి, ఆ వెయ్యి 3
సంవత్సరములు గడచుపర్యంతము ఇక జనములను
మోసపరచకుండునట్లు పాతాళమును మూసి దానికి
ముద్ర వేసెను; అటుపిమ్మట వాడు కొంచెము కాలము
విడిచిపెట్టబడవలెను.

అంతట సింహాసనములను చూచితిని; వాటిమీద 4

1 మూలభాషలో—అల్లెలూయా. 2 మూలభా.—ప్రవచన ఆత్మయని 3 కొన్ని ప్రాచీనప్రతులలో—రక్తములో ముంచబడిన, అని పాఠాంతరము 4 మూలభా—సూర్యునిలో.

ఆసీనులై యుండువారికి విమర్శచేయుటకు అధి
కారము ఇయ్యబడెను. మరియు క్రూరమృగమునకై
నను దాని ప్రతిమకైనను నమస్కారముచేయక, తమ
నొసళ్లయందు గాని చేతులయందు గాని దాని ముద్ర
వేయించుకొననివారిని, యేసు విషయమై (తామిచ్చిన)
సాక్ష్యము నిమిత్తమును దేవుని వాక్యము నిమిత్తమును
శిరచ్ఛేదనము చేయబడినవారి ఆత్మలను చూచితిని
వారు బ్రదికినవారై, వెయ్యి సంవత్సరములు క్రీస్తుతో
5 కూడ రాజ్యము చేసిరి. । ఆ వెయ్యి సంవత్సరములు
గడచువరకు కడమ మృతులు బ్రదుకలేదు; ఇదియే
6 మొదటి పునరుత్థానము. । ఈ మొదటి పునరుత్థాన
ములో పాలుగలవారు ధన్యులును పరిశుద్ధులునై యుం
దురు. ఇట్టివారిమీద రెండవ మరణమునకు అధికా
రములేదు; వీరు దేవునికిని క్రీస్తుకును యాజకులై
క్రీస్తుతోకూడ వెయ్యి సంవత్సరములు రాజ్యము
చేయుదురు.

7 వెయ్యి సంవత్సరములు గడచిన తరువాత సాతాను
8 తానున్న చెరలోనుండి విడిపింపబడును. । భూమి
నలుదిశలయందుండు జనములను, లెక్కకు సముద్రపు
ఇసుకవలె ఉన్న గోగు మాగోగు అనువారిని మోస
పరచి వారిని యుద్ధమునకు పోగుచేయుటకై వాడు
9 బయలుదేరును. । వారు భూమియందంతట వ్యాపించి,
పరిశుద్ధుల శిబిరమును ప్రియమైన పట్టణమును ముట్టడి
వేయగా పరలోకములోనుండి[1] అగ్ని దిగివచ్చి వారిని
10 దహించెను. । వారిని మోసపరచిన అపవాది అగ్ని
గంధకములుగల గుండములో పడవేయబడెను. అచ్చట
ఆ క్రూరమృగమును అబద్ధప్రవక్తయు ఉన్నారు;
వారు యుగయుగములు దివారాత్రము బాధింప
బడుదురు.

11 మరియు ధవళమైన మహా సింహాసనమును దాని
యందు ఆసీనుడైయున్న యొకనిని చూచితిని; భూమ్యా
కాశములు ఆయన సముఖమునుండి పారిపోయెను;
12 వాటికి (నిలువ) చోటు కనబడకపోయెను. । మరియు
గొప్పవారేమి కొద్దివారేమి మృతులైనవారందరు ఆ
సింహాసనము ఎదుట నిలువబడియుండుట చూచితిని.
అప్పుడు గ్రంథములు విప్పబడెను; మరియు జీవగ్రంథ
మను వేరొకగ్రంథము విప్పబడెను; ఆ గ్రంథముల
యందు వ్రాయబడియున్నవాటినిబట్టి తమ క్రియల
13 చొప్పున మృతులు తీర్పుపొందిరి. । సముద్రము తనలో
ఉన్న మృతులను అప్పగించెను; మరణమును మృతుల
లోకమును వాటి వశముననున్న మృతుల నప్పగించెను;
వారిలో ప్రతివాడు తన క్రియల చొప్పున తీర్పు
14 పొందెను. । మరణమును మృతుల లోకమును అగ్ని
గుండములో పడవేయబడెను; ఈ అగ్నిగుండము
రెండవ మరణము. । ఎవని పేరైనను[2] జీవగ్రంథమందు
వ్రాయబడినట్టు కనబడనియెడల వాడు అగ్నిగుండ
ములో పడవేయబడెను.

అంతట నేను క్రొత్త ఆకాశమును క్రొత్త 2
భూమిని[3] చూచితిని. మొదటి ఆకాశమును మొదటి
భూమియు గతించిపోయెను. సముద్రమును ఇకను
లేదు. । మరియు నేను నూతనమైన యెరూషలేము
అను ఆ పరిశుద్ధపట్టణము తన భర్తకొరకు అలంకరింప
బడిన పెండ్లికుమార్తెవలె సిద్ధపడి పరలోకమందున్న
దేవునియొద్దనుండి దిగివచ్చుట చూచితిని. । అప్పుడు
—ఇదిగో దేవుని నివాసము మనుష్యులతో కూడ
ఉన్నది, ఆయన వారితో కాపురముండును, వారా
యన ప్రజలైయుందురు, దేవుడు తానే వారి దేవుడై
యుండి వారికి తోడైయుండును. । ఆయన వారి
కన్నుల ప్రతి బాష్పబిందువును తుడిచివేయును, మర
ణము ఇక ఉండదు, దుఃఖమైనను ఏడ్పైనను వేదన
గాని ఇక ఉండదు; మొదటి సంగతులు గతించి
పోయెనని సింహాసనములోనుండి వచ్చిన గొప్ప స్వరము
చెప్పుట వింటిని. । అప్పుడు సింహాసనాసీనుడైయున్న
వాడు—ఇదిగో సమస్తమును నూతనమైనవిగా చేయు
చున్నానని చెప్పెను; మరియు—ఈ మాటలు నమ్మక
మును నిజమునై యున్నవి గనుక వ్రాయుమని ఆయన
(నాతో) చెప్పుచున్నాడు. । మరియు ఆయన నాతో
ఇట్లనెను — సమాప్తమైనవి; నేనే అల్ఫయు, ఓమె
గయు, అనగా ఆదియు అంతమునై యున్నవాడను;
దప్పిగొనువానికి జీవజలముల బుగ్గలోని జలమును
నేను ఉచితముగా అనుగ్రహింతును. । జయించువాడు
వీటిని స్వతంత్రించుకొనును; నేనతనికి దేవుడనైయుం
దును అతడు నాకు కుమారుడై యుండును. । పిరికి
వారును, అవిశ్వాసులును, అసహ్యులును, నరహంతకు
లును, వ్యభిచారులును, మాంత్రికులును, విగ్రహారాధ
కులును, అబద్ధికులందరును అగ్నిగంధకములతో మండు
గుండములో పాలుపొందుదురు; ఇది రెండవ మరణము.

అంతట ఆ కడపటి యేడు తెగుళ్లతో నిండిన
యేడు పాత్రలను పట్టుకొనియున్న యేడుగురు దేవ
దూతలలో ఒకడు వచ్చి—ఇటు రమ్ము, పెండ్లికుమార్తెను,
అనగా గొఱ్ఱెపిల్లయొక్క భార్యను నీకు చూపెదనని
నాతో చెప్పి, । ఆత్మవశుడనైయున్న నన్ను ఎత్తయిన
గొప్ప పర్వతముమీదికి కొనిపోయి, యెరూషలేము
అను పరిశుద్ధపట్టణము దేవుని మహిమగలదై పరలోక
మందున్న దేవునియొద్దనుండి దిగివచ్చుట నాకు చూ
పెను. । దానియందలి వెలుగు ధగధగ మెరియు సూర్య
కాంతమువంటి అమూల్యరత్నమును పోలియున్నది. ।
ఆ పట్టణమునకు ఎత్తయిన గొప్ప ప్రాకారమును

1 కొన్ని ప్రాచీనప్రతులలో—దేవునియొద్దనుండి, అని కూర్చబడియున్నది. 2 మూలభాషలో—ఎవడైనను. 3 యెషయా, 65: 1
2 పేతురు 3: 13.

పన్నెండు గుమ్మములు ఉండెను; ఆ గుమ్మములయొద్ద
పన్నిద్దరు దేవదూతలుండిరి, ఇశ్రాయేలీయుల పన్నెండు
గోత్రముల నామములు ఆ గుమ్మములమీద వ్రాయ
13 బడియున్నవి. । తూర్పువైపున మూడు గుమ్మములు,
ఉత్తరపువైపున మూడు గుమ్మములు, దక్షిణపువైపున
మూడు గుమ్మములు, పశ్చిమపువైపున మూడు గుమ్మము
14 లుండెను. । ఆ పట్టణపు ప్రాకారము పన్నెండు పునా
దులుగలది, ఆ పునాదులపైన గొఱ్ఱెపిల్లయొక్క పన్ని
ద్దరు అపొస్తలుల పన్నెండు పేళ్లు కనబడుచున్నవి. ।
15 ఆ పట్టణమును దాని గుమ్మములను ప్రాకారమును
కొలుచుటకై నాతో మాటలాడువానియొద్ద బంగారు
16 కొలకఱ్ఱ యుండెను. । ఆ పట్టణము చచ్చౌకమైనది;
దాని పొడుగును దాని వెడల్పుతో సమానము. అతడు
ఆ కొలకఱ్ఱతో పట్టణమును కొలువగా దాని కొలత
పండ్రెండువేల కోసులైనది; దాని పొడుగును
17 ఎత్తును వెడల్పును సమముగా ఉన్నది. । మరియు
అతడు ప్రాకారమును కొలువగా అది మనుష్యుని
కొలతచొప్పున నూట నలుబదినాలుగు మూరలైనది;
18 ఆ కొలత దూత కొలతయే. । ఆ పట్టణపు ప్రాకా
రము సూర్యకాంతములతో కట్టబడెను; పట్టణము
స్వచ్ఛమగు స్ఫటికముతో సమానమైన శుద్ధసువర్ణముగా
19 ఉన్నది. । ఆ పట్టణపు ప్రాకారపు పునాదులు
అమూల్యమైన నానావిధ రత్నములతో అలంకరింప
బడియుండెను. మొదటి పునాది సూర్యకాంతపు
రాయి, రెండవది నీలము, మూడవది యమునారాయి,
20 నాలుగవది పచ్చ, । అయిదవది వైఢూర్యము, ఆరవది
కెంపు, ఏడవది సువర్ణరత్నము, ఎనిమిదవది గోమేధి
కము, తొమ్మిదవది పుష్యరాగము, పదియవది సువర్ణల
శునీయము, పదకొండవది పద్మరాగము, పన్నెండవది
21 సుగంధము. । దాని పన్నెండు గుమ్మములు పన్నెండు
ముత్యములు; ఒక్కొక గుమ్మము ఒక్కొక ముత్య
ముతో కట్టబడియున్నది. పట్టణపు రాజవీధి శుద్ధసువర్ణ
మయమై స్వచ్ఛమైన స్ఫటికమును పోలియున్నది. ।
22 దానిలో ఏ దేవాలయమును నాకు కనబడలేదు. సర్వాధి
కారియైన దేవుడగు ప్రభువును గొఱ్ఱెపిల్లయు దానికి
23 దేవాలయమైయున్నారు. । ఆ పట్టణములో ప్రకా
శించుటకై సూర్యుడైనను చంద్రుడైనను దానికక్కర
లేదు; దేవుని మహిమయే దానిలో ప్రకాశించు
24 చున్నది; గొఱ్ఱెపిల్లయే దానికి దీపము. । జనములు
దాని వెలుగునందు సంచరింతురు; భూరాజులు తమ
25 మహిమను దానిలోకి తీసికొనివత్తురు. । అక్కడ రాత్రి
లేనందున దాని గుమ్మములు పగటివేళ ఏమాత్రమును
26 వేయబడవు. । జనములు తమ మహిమను ఘనతను దాని
27 లోనికి తీసికొనివచ్చెదరు. । గొఱ్ఱెపిల్లయొక్క జీవ
గ్రంథమందు వ్రాయబడినవారే దానిలో ప్రవేశిం
తురు గాని నిషిద్ధమైనదేదైనను, అసహ్యమైనదానిని
అబద్ధమైనదానిని జరిగించువాడైనను దానిలోనికి ప్రవే
శింపనే ప్రవేశింపరు.

22 మరియు స్ఫటికమువలె మెరియునట్టి జీవజలముల
2 నది దేవునియొక్కయు గొఱ్ఱెపిల్లయొక్కయు సింహాస
నమునొద్దనుండి ఆ పట్టణపు రాజవీధిమధ్యను ప్రవహిం
చుట[1] ఆ దూత నాకు చూపెను. ఆ నదియొక్క ఈవ
లను ఆవలను జీవవృక్షముండెను; అది నెలనెలకు ఫలిం
చుచు పన్నెండు కాపులు కాయును. ఆ వృక్షము
యొక్క ఆకులు జనములను స్వస్థపరచుటకై (విని
3 యోగించును.) । ఇకమీదట శాపగ్రస్తమైనదేదియు
(దానిలో) ఉండదు, దేవునియొక్కయు గొఱ్ఱెపిల్ల
4 యొక్కయు సింహాసనము దానిలో ఉండును. । ఆయన
దాసులు ఆయనను సేవించుచు ఆయన ముఖదర్శనము
చేయుచుందురు; ఆయన నామము వారి నొసళ్లయం
5 దుండును. । రాత్రి యికనెన్నడు ఉండదు; దీప
కాంతియైనను సూర్యకాంతియైనను వారికక్కరలేదు;
దేవుడైన ప్రభువే వారిమీద ప్రకాశించును. వారు
యుగయుగములు రాజ్యము చేయుదురు.

6 మరియు ఆ దూత యీలాగు నాతో చెప్పెను—
ఈ మాటలు నమ్మకములును సత్యములునై యున్నవి;
ప్రవక్తల ఆత్మలకు దేవుడగు ప్రభువు, త్వరలో సంభ
వింపవలసినవాటిని తన దాసులకు చూపుటకై తన
7 దూతను పంపెను. । ఇదిగో నేను త్వరగా వచ్చు
చున్నాను, ఈ గ్రంథములోని ప్రవచనవాక్యములను
గైకొనువాడు ధన్యుడు.

8 యోహానను నేను ఈ సంగతులను వినినవాడను
చూచినవాడను; నేను విని చూచినప్పుడు వాటిని
నాకు చూపుచున్న దూతపాదముల యెదుట నమ
9 స్కారము చేయుటకు సాగిలపడగా, । అతడు — వద్దు
సుమీ. నేను నీతోను, ప్రవక్తలైన నీ సహోదరుల
తోను, ఈ గ్రంథమందున్న వాక్యములను గైకొను
వారితోను సహ దాసుడను; దేవునికే నమస్కారము
చేయుమని చెప్పెను.

10 మరియు అతడు నాతో ఈలాగు చెప్పెను—ఈ
గ్రంథమందున్న ప్రవచనవాక్యములకు ముద్రవేయ
11 వలదు; కాలము సమీపమైయున్నది; । అన్యాయము
చేయువాడు ఇంకను అన్యాయమే చేయును,[2] అప
విత్రుడైనవాడు ఇంకను అపవిత్రుడుగానే యుం
డును,[3] నీతిమంతుడు ఇంకను నీతిమంతుడుగానే యుం
డును,[3] పరిశుద్ధుడు ఇంకను పరిశుద్ధుడుగానే యుం
12 డును.[3] । ఇదిగో త్వరగా వచ్చుచున్నాను. వానివాని
క్రియచొప్పున ప్రతివానికిచ్చుటకు నేను (సిద్ధపరచిన)
13 జీతము నాయొద్ద ఉన్నది. । నేనే అల్ఫాయు ఓమె
గయు, మొదటివాడను కడపటివాడను, ఆదియు అంత

1 లేక, బయలువెడలుట  2 లేక, చేయనిమ్ము.  3 లేక, యుండనిమ్ము.

14 మునై యున్నాను. । జీవవృక్షమునకు హక్కుగల
వారై, గుమ్మములగుండ ఆ పట్టణములోకి ప్రవేశించు
నట్లు తమ వస్త్రములను ఉదుకుకొనువారు ధన్యులు. ।
15 కుక్కలును మాంత్రికులును వ్యభిచారులును నరహంత
కులును విగ్రహారాధకులును అబద్ధమును ప్రేమించి
జరిగించు ప్రతివాడును వెలపటనుందురు.
16 సంఘములకొరకు[1] ఈ సంగతులనుగూర్చి మీకు
సాక్ష్యమిచ్చుటకు యేసు అను నేను నా దూతను పంపి
యున్నాను. నేను దావీదు వేరు చిగురును సంతానమును,
ప్రకాశమానమైన వేకువ చుక్కయునై యున్నాను.
17 ఆత్మయు పెండ్లి కుమార్తెయు రమ్మని చెప్పుచు
న్నారు; వినువాడు రమ్మని చెప్పవలెను; దప్పిగొను
వాడు రావచ్చును; ఇచ్ఛయించువాడు జీవజలమును
ఉచితముగా పుచ్చుకొనవచ్చును.

ఈ గ్రంథమందున్న ప్రవచనవాక్యములను విను
ప్రతివానికి నేను సాక్ష్యమిచ్చునది ఏమనగా—ఎవడై
నను వీటితో మరి ఏదైనను కలిపినయెడల ఈ గ్రంథ
ములో వ్రాయబడిన తెగుళ్లు దేవుడు వానికి కలుగ
జేయును; । ఎవడైనను ఈ ప్రవచన గ్రంథమందున్న
వాక్యములలో ఏదైనను తీసివేసినయెడల దేవుడు ఈ
గ్రంథములో వ్రాయబడిన జీవవృక్షములోను పరి
శుద్ధపట్టణములోను వానికి పాలులేకుండ చేయు
ఈ సంగతులనుగూర్చి సాక్ష్యమి
అవును, త్వరగా వచ్చుచున్నానని చెప్పుచు
ఆమేన్; ప్రభువైన యేసూ, రమ్ము.
ప్రభువైన యేసు కృప పరిశుద్ధులకు[2] తోడై యుం
డును గాక. ఆమేన్.

[1] మూలభాషలో—సంఘములమీద. [2] కొన్ని ప్రాచీన ప్రతులలో—పరిశుద్ధులకందరికి అని పాఠాంతరము.